


మొదటి సంపుటము

(పరిష్కృతము)

## చరిత్ర - రాజనీతి





# తెలుగు భాషా సమితి

హైదరాబాదు :: మద్రాసు

# విజ్ఞాన సర్వస్వము

మొదటి సంపుటము

(పరిష్కృతము)

## చరిత్ర - రాజనీతి

సంపాదకులు

(మొదటి ముద్రణ)


శ్రీ [illegible] రిసర్వోత్తమరావు, ఎమ్. ఏ.

డాక్టరు గిడుగు [illegible] బి. ఏ., ఎల్. టి., డి. లిట్.

ఆచా [illegible] రామమూర్తి, ఎమ్. ఏ.


సంపాదకుడు

(రెండవ ముద్రణ)


శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్య, ఎమ్. ఏ.


సంగ్రాహకుడు


శ్రీ చీమకుర్తి శేషగిరిరావు



1967

# తెలుగు భాషా సమితి

హైదరాబాదు ❋ మద్రాసు





ముద్రణ :
హిందీ ప్రచార ప్రెస్
మద్రాసు - 17




ప్రతులకు :
తెలుగు భాషా సమితి
ఉస్మానియా యూనివర్సిటీ
కాంపస్
హైదరాబాదు (ఆం. ప్ర)

## CHARITRA & RAJANEETI

(History & Politics)

(Revised)

1st Volume of VIJNANA SARVASVAMU (Encyclopaedia)

Published in Telugu in 16 Volumes by Telugu Bhasha Samiti ◉ Hyderabad ◉ Madras.

De luxe edition
(in India)
Overseas
Library edition
Popular edition

*For copies:*

**Telugu Bhasha Samiti**
Osmania University Campus
Hyderabad
Andhra Pradesh

# ప్రకాశకుల విజ్ఞప్తి

## (ద్వితీయ ముద్రణము)

ఆంధ్ర మహాజనుల ఆదరాభిమానములవలన తెలుగు విజ్ఞాన సర్వస్వ ప్రథమ సంపుటపు తొలి ముద్రణ ప్రతులు అచిరకాలముననే చెల్లిపోయినవి. అందువలన రెండవ ముద్రణమునకు తెలుగు భాషా సమితి పూనుకొన్నది. ఆ కృషి ఫలితమే నేడు ఈ రూపమున పాఠకలోకమునకు అందజేయ బడుచున్నది.

ఈ సంపుటపు తొలి ముద్రణ 1954 లో జరిగినది. తదాదిగ ప్రపంచ చరిత్రలో విప్లవకర సంఘటనలు అనేకములు జరిగినవి. తత్ఫలితముగ ప్రపంచ రాజకీయ పటము పలు మార్పులను పొందినది. ఆసియా, ఆఫ్రికాలలో పెక్కు దేశములు స్వతంత్రతను ఆర్జించి, ప్రపంచేతిహాసగతిలో సమర్థతతో పాల్గొనగలుగుచున్నవి. దీనికి తోడ్తోడుగ పెక్కు రంగములందు భావ విప్లవమును అతి త్వరితగతిలో కొనసాగినది. అందువలన పరివర్తనలను అన్నింటిని ప్రతిబింబించు రీతిగ ' చరిత్ర - రాజనీతి ' సంపుటమును సంస్కరించవలసిన ఆవశ్యకత కలిగినది. ఈ సంస్కరణకై సంపాదకత్వ భారమును వహించవలసినదిగ ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్యగారిని తెలుగు భాషా సమితి అభ్యర్థించగ వారు, వార్ధక్యముచేత సంపాదకత్వభారమును పూర్తిగ వహింపలేకున్నను, శ్రద్ధ వహించి సంస్కరణకు మార్గదర్శినియగు చక్కని ప్రణాళికను తయారుచేసి ఇచ్చుటయేగాక, ఆ ప్రణాళికను అనుసరించి సంపుటమునకు రూపకల్పన చేయుటకు కార్యాలయ కార్యకర్తలు చేయు కృషిని ఎడనెడ పర్యాలోకించి, సంపుటమునకు సమగ్రత కల్పించిరి. వారికి మా కృతజ్ఞతా పూర్వక అభివందనములు.

ఇటుల పూర్వసంపుటముల పరిష్కృత పునర్ముద్రణతో పాటుగ స్వీయ ప్రణాళికను అనుస రించి క్రొంగ్రొత్త సంపుటముల ప్రచురణ కార్యక్రమమునుకూడ యథారీతిగ తెలుగు భాషా సమితి నిరంతరాయముగ సాగించుచున్నది. ఆ ప్రణాళికానుసారముగ 1965 నకు పది సంపుటముల ప్రచు రణము పూర్తియైనది. తక్కిన ఆరు సంపుటముల వ్యాస సంగ్రహణ కార్యక్రమము త్వరితగతిలో సాగుచున్నది.

విజ్ఞాన సర్వస్వ నిర్మాణము బహు వ్యయ ప్రయాసలతో కూడిన పని. దాతలనుండి చేకూరిన మొత్తము నేటికి రు. 2,50,000 లు. ప్రత్యేక ఆంధ్రరాష్ట్రము ఏర్పడకమునుపు ఉమ్మడి మద్రాసు ప్రభుత్వమువారు సంవత్సరమునకు లక్షరూపాయలు చొప్పున అయిదు సంవత్సరములకు అయిదు లక్షలు ఇచ్చుటకు వాగ్దానముచేసిన విరాళములో 1963 - 64 వ సంవత్సరాంతమునకు మద్రాసు, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రప్రభుత్వములు ఇచ్చిన మొత్తము రూ. 4,99,964 · 87 లు. మార్చి, 1967 నాటికి కేంద్రప్రభుత్వ విద్యా (శాస్త్ర పరిశోధన, సాంస్కృతిక వ్యవహారాల మంత్రిత్వ) శాఖ రూ. 4,07,000/-లు గ్రాంటుగ ఇచ్చినది. వీరందరికిని, సమితి భవన నిర్మాణానికై దీర్ఘకాల కౌలుపద్ధతి మీద ఎ. 1 50 సెంట్లు (0 606 హెక్టేరులు) భూమిని తమ ప్రాంగణమున కేటాయించి ఇచ్చిన ఉస్మానియా యూనివర్సిటీ వైస్ ఛాన్సలర్ డాక్టరు డి. ఎస్. రెడ్డిగారికిని, మద్రాసు యూనివర్సిటీ భవనములందు తెలుగు భాషా సమితి కార్యస్థానము నెలకొల్పుకొనుటకు అవకాశము కల్పించి, అనేక విధములగు సౌకర్యములు కలుగజేసిన వైస్‌ఛాన్సలర్ డాక్టరు సర్ ఆర్కాటు లక్ష్మణస్వామి మొదలియార్ గారికిని, వాల్తేరులో శాఖాకార్యాలయము ఉన్నంతకాలము

(1963 వరకు) తమ భవనములో ఉచితముగ స్థలము ఇచ్చిన ఆంధ్రాయూనివర్సిటీ మాజీ అధికారులకు, తమ అధీనమునందు గల చిత్రములను పునర్ముద్రించు కొనుటకు అనుమతి నొసగిన వివిధ సంస్థల వారికిని మా కృతజ్ఞతాభివందనములు.

ఈ సంపుటమును సాధ్యమైనంత నిర్దుష్టముగను, అందముగను, ఆకర్షకముగను ముద్రించిన హిందీ ప్రచార ప్రెస్ కార్యకర్తలకు మా ధన్యవాదములు.

శక 1889 శ్రావణ 23 సోమవారము
1967, ఆగస్టు 14

మోటూరి సత్యనారాయణ
దండా వేంకట సుబ్బారెడ్డి
కార్యదర్శులు
తెలుగు భాషా సమితి

బెజవాడ గోపాలరెడ్డి
అధ్యక్షులు
తెలుగు భాషా సమితి

# సంపాదకీయ భూమిక

## (ద్వితీయ ముద్రణము)

తెలుగుభాషాసమితి పూనుకొనిన విజ్ఞాన సర్వస్వ ప్రచురణలో తొలుతటిదియగు "చరిత్ర - రాజనీతి" సంపుటము 1954 సంవత్సరమున సుగృహీత నామధేయులు, స్థిత ప్రజ్ఞులు అగు కీర్తిశేషులు రాష్ట్రపతి బాబు రాజేంద్రప్రసాద్‌చే హైదరాబాదున విడుదలచేయబడినది.

1954 మొదలుగ ఇప్పటికి గడచిన కాలము పదమూడు సంవత్సరములు మాత్రము అయినను, ఈ కాలమునకు ప్రపంచేతిహాసమున ఒక ప్రత్యేక విశిష్టత కలదు. కని విని ఎరుగని ద్రుతగతితో ప్రపంచచరిత్ర ఈ కాలమున పరువులిడినది. ఒక యుగము అంతరించి వేరొక యుగము మొదలైనది. ప్రపంచమున అత్యధిక భాగమును లోగొనిన సామ్రాజ్యములు అంతరించి, నూతన స్వతంత్రరాజ్యములు ప్రపంచేతి హాసములో పాల్గొను అవకాశము కలిగినది. ఈ పరివర్తనలకు అనుగుణముగ 'చరిత్ర - రాజనీతి' సంపుటమును సంస్కరించు విషయమున, తెలుగు భాషా సమితి అభ్యర్థనపై నేను సంపాదకత్వమునకు అంగీకరించి, తొలుతగ అందుకు అనువుగ మార్గదర్శినియగు ఒక ప్రణాళికను తయారుచేసి ఇచ్చితిని.

నూతన పరిస్థితులకు అనుగుణముగ రూపొందించిన ఈ ప్రణాళికను అనుసరించి, అకారాదిలో నూతనముగ అనేక దేశముల చరిత్రకు తావు కల్పింపవలసి వచ్చినది. ప్రపంచ రాజ్యములు అన్నింటికిని ఈ అకారాదియందు ప్రతిపత్తి కల్పించుటవలన పూర్వముద్రణమందలి కొన్ని విషయములను సంక్షిప్తపరచుటయు లేదా నూతన విషయములతో మిశ్రితమొనర్చుటయు ఆవశ్యకమైనది. ఇక సమీక్ష విషయమున సైతము ఒక నూతన విధానమును అవలంబించి, కొన్ని మార్పులను చేయవలసి వచ్చినది. రాజనీతి శాస్త్రపు సమీక్ష పాఠకులకు సుబోధ్యమగు రీతిలో తిరిగి వ్రాయబడినది. ఇక చరిత్ర సమీక్షను ప్రపంచచరిత్రగ రూపొందింప సంకల్పించి ఒక నూతన రూపురేఖను తయారు చేయవలసివచ్చినది. ఆ చరిత్రలో వ్యక్తులకును, యుద్ధాది సంఘటనలకును ప్రముఖతను కల్పింపక మానవ ప్రగతి చరిత్రకు - అనగా సామాజిక, ధార్మిక, కళాకౌశల రంగములందు మానవుడు పలు ఒడుదొడుకులను ఎదుర్కొని సాధించుచున్న ప్రగతిని వివరించు విశ్వమానవ చరిత్రకు - ప్రాధాన్యము కల్పింప కృషి జరిగినది. కాని, ఈ రూపురేఖను అనుసరించిన విషయసేకరణాది కార్యక్రమమునకు కార్యాంతర లగ్నతవలనను, వార్ధక్యాది కారణములవలనను, నాకు తీరికలేనందువల్లను సమితి సంగ్రాహకుడు శ్రీ చీమకుర్తి శేషగిరిరావు పూనిక వహించిరి. ఈ కార్యనిర్వహణయందు శ్రీ శేషగిరిరావు దీక్షవహించి విషయ సంగ్రహణచేసి, ఆయనకున్న అనుభవజ్ఞానముతో సమ్మిళితము చేసి సంపుటమునందలి సమీక్షాభాగమును వినూత్న ఫక్కిలో రూపొందించిరి. మానవ చరిత్రతోబాటు ప్రపంచ చరిత్రను స్థూలముగా పరిచయము చేయుటకును, అది అందరికీ అంగీకారముగా ఉండునట్లు చేయుటకును శ్రీ శేషగిరిరావు పలు గ్రంథములు కూలంకషముగా పరిశీలించి ముసాయిదా ప్రణాళికను రూపొందించి నాతో సంప్రదించి మార్పులు, చేర్పులు చేసినపిమ్మట పైన చెప్పినటుల ప్రస్తుత సమీక్షా భాగమును రచించిరి. తదుపరి అకారాది శీర్షికల విషయములోకూడ ప్రపంచ రాజ్యములకు సంబంధించిన నూతన సామగ్రిని సంపాదించి పొందుపరచిరి. ఇట్టి విషయ సేకరణయు, రచనయు తగు బాధ్యతతో నిర్వర్తింపబడినవనియే నా ఆశయము. ఇటుల ఈ బాధ్యతను వహించిన సంగ్రాహకునకు నేను ఎంతయు కృతజ్ఞుడను.

ఇటుల సాగించిన ఈ కార్యక్రమము పేరునకు పునస్సంశోధనయే యైనను, నూతన సామగ్రిని ఎక్కువగ చేర్చవలసి వచ్చుటచేత క్రొత్తగ కొందరు రచయితల సాయమును పొందవలసి వచ్చినది. ఆ రచయితల పట్టిక వేరొకచోట ఈయబడినది. వారికి అందరికిని నా కృతజ్ఞతను ఇందుమూలమున తెలుపుచున్నాను.

ఈ సంపాదనభారమును వహించి నిర్వహించుటలో నాకు అన్నివిధముల ప్రోత్సాహ మొసగిన సమితి కార్యదర్శులు పద్మభూషణ శ్రీ మోటూరి సత్యనారాయణ, డాక్టరు దండా వేంకటసుబ్బారెడ్డి గారలకు నేను కృతజ్ఞుడను.

ఈ ద్వితీయ ప్రచురణ ముద్రణమందు ఎల్లవిధములా తోడ్పడిన సమితి కార్యకర్తలకు అందరికిని నా కృతజ్ఞతను, శుభాకాంక్షలను అర్పించుచున్నాను.

అనన్య సాధ్య సాంకేతిక నిపుణతతో ఈ సంపుటమును సర్వాంగసుందరముగ ముద్రించిన హిందీప్రచార ప్రెస్ వారికి నా హృదయపూర్వక ధన్యవాదములు.

హైదరాబాదు
14 ఆగస్టు, 1967

మామిడిపూడి వెంకటరంగయ్య
సంపాదకుడు

# రచయితలు

**అ. వెం.** — వెంకటాచలము, ఆలమూరు, బి. ఎస్. సి.,

సహాయ సంగ్రాహకుడు, తెలుగుభాషాసమితి, యూనివర్సిటీ భవనములు, మద్రాసు - 5.

ఇందిరాగాంధి; కాంప్‌బెల్, హెన్రీ; కాస్ట్రో, ఫిడల్; కృపలానీ, జె. బి.; కృశ్చేవ్, నికితా; కెనడీ, జె. ఎఫ్.; కెన్యెట్టా, జోమో; కోసిగిన్; క్రుగర్ పాల్; ఖరఖ - I (జెర్‌జెస్): గిబ్బన్, ఎడ్వర్డ్; గోఖలే, గోపాలకృష్ణ; చిత్తరంజన్‌దాస్; చియాంగ్ - కై - షేక్; చూ‌ఏ; చెంఘిజ్‌ఖాన్; చౌ-ఎన్-లై; జకీర్‌హుసేన్; జదునాథ సర్కార్; జఫర్‌సన్, థామస్; జయప్రకాశ్‌నారాయణ్; జాన్సన్, లిండన్; జిన్నా, మహమ్మదాలీ; ఝాన్సీ లక్ష్మీబాయ్; టాయన్‌బీ, ఆర్నాల్డ్; డీవెలరా, ఎమన్; డూబ్రియల్; దక్షిణాపథము; నెపోలియన్, లూయీ-III; నెహ్రూ, జవాహర్‌లాల్; పవిత్ర రాజ్య మైత్రి; పెనిన్సులర్ యుద్ధము; ఫిషర్, హెర్బర్ట్ ఆల్బర్ట్ లారెన్స్; ఫెబియన్ సొసైటీ; ఫెరిష్టా; ఫ్రాంకో-ప్రష్యన్ యుద్ధము; ఫ్రాన్సిస్, జోసఫ్; బానిస వ్యాపారము; బాబిలన్ నగరము; బెంటింక్, విలియమ్; బెనిస్, ఎడ్వార్డ్; మాక్సిమిలియన్-I; మాలటోవ్, వ్యాచిస్లావ్ మైకేలోవిచ్; మాలిక్, కాపూర్; మావ్-సే-టుంగ్; మిరాబు, గేబ్రియల్ రికెటి; మెకియవెల్లి, నికోలో; మెజారిన్, జూలెస్; మెజెల్లాన్, ఫెర్డినాండ్; మెటర్‌నిఖ్; క్లెమెన్స్; మేనర్‌హిమ్; కార్ల్ గస్టావ్ ఎమిల్; మ్యూనిక్ ఒడంబడిక; రంజిత్‌సింగ్, మహారాజా; రాణాప్రతాపసింగ్; రాబ్స్, పియెరీ; రాయ్. ఎమ్. ఎన్.; రాస్‌పుటిన్, గ్రెగరీ; రిప్పన్‌ప్రభువు; విల్సన్, వుడ్రో; వెలెస్లీ; వెస్ట్ ఫేలియా సంధి; వైక్లివ్, జాన్; సావర్కర్, వినాయక్‌దామోదర్; సెయింట్ జర్మెయిన్ సంధి; స్పానిష్ అంతర్యుద్ధము; స్పానిష్ వారసత్వ సంగ్రామము; హానిబాల్; హేస్టింగ్స్, వారెన్.

**ఎస్. హ.** — హనుమంతరావు, ఎస్.; ఎమ్. ఏ., ఎల్. టి.,

మాజీ చరిత్ర ప్రొఫెసర్, నిజామ్ కళాశాల, హైదరాబాదు.

సిక్కులు.

**ఏ. ఎస్. గుప్త** — సుబ్బరాయగుప్త, ఏ.; విద్వాన్, ఎమ్. ఏ., బి. ఓ. ఎల్.; బి. ఇడి.

రిటైర్డ్ చరిత్ర లెక్చరర్, వి. ఆర్. కాలేజి, నెల్లూరు.

టాసిటస్; కార్నీలియస్; టిప్పుసుల్తాను; ఫ్రాంక్లిన్, బెంజమిన్; ఫ్రాన్స్ (ప్రథమ భాగము); ఫ్రెడరిక్-II; బర్క్, ఎడ్మండ్; స్విజర్లండ్ (ద్వితీయ భాగము); హైదరాలీ.

**ఓ. ఎస్. ఎన్. మూర్తి** — సత్యనారాయణమూర్తి, ఓరుగంటి; ఎమ్. ఏ., ఎల్. టి.

చరిత్ర లెక్చరర్, హిందూ కాలేజి, గుంటూరు.

అక్బర్ చక్రవర్తి; అల్లాఉద్దీన్ ఖిల్జీ; ఇల్టుమిష్; గజనీమహమూద్; గ్లాడ్‌స్టన్; ఘోరీమహమ్మద్; భారతదేశము అను వ్యాసమున ఢిల్లీ సుల్తానులు మొదలు కడవరకు.

**కం. శ్రీ. రా.** — శ్రీనివాసరామానుజమ్, తిరుక్కండియూర్, విద్వాన్,

కంపైలర్‌కు అసిస్టెంట్, తెలుగుభాషాసమితి, యూనివర్సిటీ భవనములు, మద్రాసు - 5.

ఎలిజబెత్-II; రాజగోపాలాచారి, చక్రవర్తి; లాల్‌బహదూర్ శాస్త్రి.

**కుం. ఈ. దత్తు** — ఈశ్వరదత్తు, కుందూరు, బి. ఏ.,

రిటైర్డ్ డిస్ట్రిక్ట్ ఇన్‌స్పెక్టర్ ఆవ్ అకౌంట్స్, గాంధీ నగర్, కాకినాడ - 1.

కుమారగుప్తుడు-I; కుమారగుప్తుడు-II; గుప్తవంశ రాజులు; చంద్రగుప్త-I; చంద్రగుప్త-II; నరసింహగుప్తుడు; పురగుప్తుడు; బుధగుప్తుడు; సముద్రగుప్తుడు; స్కందగుప్తుడు.

**కే. ఏ. ఎన్. శాస్త్రి** — నీలకంఠశాస్త్రి, కే. ఏ., బి. ఏ.,

రిటైర్డ్ ప్రొఫెసర్, చరిత్రశాఖ, మద్రాసు యూనివర్సిటీ, మద్రాసు - 5.

ఋతము; చరిత్ర అనగా ఏమి (చరిత్ర సమీక్ష); చరిత్ర రచన; భారతదేశ రాజనీతి చరిత్ర; విశాల భారతము; సంకీర్ణ ప్రభుత్వము.

గా. హ. — కీ. శే. హరిసర్వోత్తమరావు, గాడిచర్ల, ఎమ్. ఏ.;

ఆలిగ్జాండ్రియా గ్రంథాలయము; జనవాక్యము (ప్లెబిసైట్).

గి. వేం. సీ. — వేంకటసీతాపతి, గిడుగు, బి. ఏ., ఎల్. టి., డి. లిట్.;

రిటైర్డ్ ఛీఫ్ కంపైలర్, హైదరాబాదు.

అబ్దుర్ రజాక్; అబ్బాసీయ కలీఫాలు; అరిస్టయిడీస్; అశోకుడు; అసీరియన్ సామ్రాజ్యము; ఆంటోనైనస్ పయస్; ఆరిస్టాటిల్; ఆర్యులు; ఆస్టిన్, జాన్; ఆస్ట్రియా; ఇన్‌కాలు; ఈజిప్టు; ఎట్రస్కన్‌లు; ఎతియోపియా; ఎరిట్రియా; ఎలిజబెత్–I; ఐర్లాండ్; ఓటో–I; కాల్డియన్ సామ్రాజ్యము; కుతుబుద్దీన్; కెనడా (ప్రథమ భాగము); కేథరిన్–II; కొరియా; కొలంబస్, క్రిస్టఫర్; చర్చిల్, విన్‌స్టన్ లియోనార్డ్ స్పెన్సర్; చార్లెస్–I; చార్లెస్–V; చీనా ప్రజాగణ రాజ్యము (ప్రథమ భాగము); జపాన్ (ప్రథమ భాగము); జిబ్రాల్టర్; జోన్ ఆవ్ ఆర్క్; డల్‌హౌసీ; డిజ్‌రేలీ, బెంజమిన్; డూప్లే, జోజెఫ్‌సోయ్; డెమొస్తనీస్; డ్రేక్, ఫ్రాన్సిస్; తక్షశిల; దీపవంసము–మహావంసము; నగర రాజ్యములు; నాక్స్, జాన్; నానాఫడ్నవీస్; నార్వే (ప్రథమ భాగము); పాండ్యరాజ్యము; పాంపే; పార్తియా; పార్నెల్; ఫిజారో, ఫ్రాన్సిస్కో; పీటర్; పృథ్వీరాజు; పెన్, విలియమ్; బొలీవర్, సైమన్; మిల్, జాన్ స్టువార్ట్; మిల్, జేమ్స్; మీడియా; ముప్పది సంవత్సరముల యుద్ధము; యునైటెడ్ కింగ్‌డమ్ (ప్రథమ భాగము); పార్లమేన్; సోక్రటీస్; స్పెయిన్ (ప్రథమ భాగము); హూణులు; హెన్రీ–VIII.

గు. రా. — రామకృష్ణ, గుత్తా,

పి. ఎస్. జి. కాలేజి, కోయంబత్తూరు,

బ్రిటిష్ ఈస్ట్ ఇండియా కంపెనీ; భూస్వామ్య విధానము; విక్టోరియా; విఠల్‌భాయ్ పటేల్; విజయలక్ష్మిపండిట్; శతవర్ష సంగ్రామము, శ్యామప్రసాద్‌ముఖర్జీ; సరోజినీనాయుడు; హుయాన్ స్యాంగ్.

గు. వెం. — వెంకటరావు, గుర్తి, ఎమ్. ఏ., ఎల్. ఎల్. బి.

చరిత్ర ప్రొఫెసర్, ఆంధ్ర విశ్వకళాపరిషత్, వాల్తేరు,

ఖిల్జీ వంశము; ఢిల్లీసుల్తానులు; తుఘ్లుక్ వంశము; బానిస రాజవంశము; లోడీ వంశము; సయ్యద్ వంశము.

చి. బా. శా. — బాలకృష్ణశాస్త్రి, చిట్టా, ఎమ్. ఏ., ఎల్. టి.,

చరిత్ర చీఫ్ లెక్చరర్, హిందూకళాశాల, బందరు.

క్రూసేడ్‌లు; పోప్‌లు.

చీ. శే. రా. — శేషగిరిరావు, చీమకుర్తి,

సంగ్రాహకుడు, తెలుగుభాషాసమితి, యూనివర్సిటీ కాంపస్. హైదరాబాదు.

అంకారవాట్; అంటార్కటికా; అక్కన్నమాదన్నలు; అక్బర్‌నామా; అన్‌గోలా, అప్పర్‌వోల్టా; అమెరికాఖండము; అల్‌బెరూనీ, ఆగ్స్‌బర్గ్ ఒడంబడిక; ఆగస్టు ఉద్యమము; ఆన్‌డొర్రా; ఆఫ్ఘన్‌యుద్ధములు; ఆఫ్ఘనిస్థాన్; ఆఫ్రికా; ఆరబ్ లీగ్; ఆర్జెంటీనా; ఆర్యావర్తము; ఆల్‌జీరియా; ఆల్‌బేనియా; ఆలిగ్జాండ్రియా; ఆసియా; ఆసియామైనర్; ఇండో–చీనా; ఇండోనీషియా; ఇస్రాయెల్; ఇటలీ; ఇబ్నబతూతా; ఇరాక్; ఇరాన్; ఈక్వడార్; ఉగాండా; ఉరుగ్వే; ఎల్‌సాల్వడార్; ఏకపట్టికావిధానము; ఏడెన్; ఐక్యరాజ్యయుగము (చరిత్ర–సమీక్ష); ఐ లా షాపెల్ శాంతి సంధులు; ఐవరీకోస్ట్; ఐస్‌లాండ్; కనిష్కుడు; కలీఫాలు; కల్హణుడు; కాంగో; కాంగో (బ్రజ్జవిల్లీ); కాంగో (లియోపాల్డ్‌విల్లి); కాంబోడియా; కాఫీఖాన్; కామన్‌వెల్త్; కామెరూన్; కాశ్మీర్‌సమస్య; కువాయిట్; కుషాన్‌లు; కొమొరోద్వీపజాలము; కొరియా, ఉత్తర; కొరియా, దక్షిణ; కొలంబియా; కొలంబో ప్రణాళిక; కోస్టారికా; క్యూబా; క్రీట్; ఖిలాఫత్ ఉద్యమము; గినీ; గినీ, పోర్చుగీస్; గెబన్; గోవింద, గురు; గ్రీన్‌లాండ్; గ్రీస్ (ద్వితీయ భాగము); గ్రెనడా; గ్వాటెమాలా; ఘానా; చంద్రగుప్తుడు, మౌర్య; చరిత్ర–పూర్వ యుగము (చరిత్ర–సమీక్ష); చాద్; చానెల్‌దీవులు; చిలీ; చీనా ప్రజా గణరాజ్యము (ద్వితీయ భాగము); జపాన్ (ద్వితీయ భాగము); జమైకా; జరతుష్ట్ర; జర్మనీ, తూర్పు; జర్మనీ, పశ్చిమ;

చీ. శే. రా. (తరువాయి)

జలియన్‌వాలాబాగ్ దురంతములు; జెకోస్లొవాకియా; జెనీవా ఒడంబడిక; జోర్డాన్; టర్కీ (ద్వితీయ భాగము); టాంగన్యికా; టాంజేనియా; టిబెట్ (తిబెత్తు); టూనీషియా; టోంగా; టోగో; ట్యూటానిక్ జాతులు; ట్రినిడాడ్ అండ్ టొబాగో; డురాండ్ రేఖ; డెన్మార్క్; డొమినికన్ రిపబ్లిక్; ఢిల్లీ; తటస్థ రాజ్యముల సమావేశము; తాయిలాండ్; తైవాన్ (చీనా); దక్షిణ ఆఫ్రికా గణరాజ్యము; దహోమీ; నార్వే (ద్వితీయ భాగము); నికరాగ్వా; నిరాయుధీకరణ; నెదర్‌లండ్స్ (ద్వితీయ భాగము); నేపాల్; నైజర్; నైజీరియా, నైరృతి ఆఫ్రికా; న్యూజీలండ్; పంచశీల; పనామా; పరాగ్వే; పాకిస్తాన్; పాపువా; పారసీక సింధుశాఖ తీరమందలి షేకు రాజ్యములు; పెరూ; పోర్చుగల్ (ద్వితీయ భాగము); పోర్టో రికో; పోలండ్ (ద్వితీయ భాగము); ప్రపంచ యుద్ధము, ప్రథమ; ప్రపంచ యుద్ధము, ద్వితీయ; ప్రాచీన యుగము (చరిత్ర – సమీక్ష); ఫిజీదీవులు; ఫిన్లాండ్; ఫిలిప్పీన్స్ దీవులు; ఫ్రాన్స్ (ద్వితీయ భాగము); ఫ్రెంచి కమ్యూనిటీ; బర్మా; బర్మా యుద్ధములు; బల్గేరియా; బహామాదీవులు; బురుండీ; బెర్మ్యూడా; బెల్జియమ్ (ద్వితీయ భాగము); బొలీవియా; బోత్స్వానా; బోయర్ యుద్ధములు; బ్రూనీ; బ్రెజిల్; భావవికసనయుగము (చరిత్ర – సమీక్ష); భూటాన్; మంగోలియా; మతరాజ్య యుగము (చరిత్ర – సమీక్ష); మధ్య ప్రాచ్య రక్షణ సంధి; మలగాసీ; మలయా; మలావీ (న్యాసాలాండ్); మలేసియా; మస్కట్ అండ్ ఓమన్; మారిటేనియా; మారిషస్; మార్టినిక్; మాల్‌దీవులు; మాలీ. మాల్టా; మెక్సికో; మొజాంబిక్; మొనాకో; మొరాకో; యుక్రెయిన్; యుగోస్లావియా; యునైటెడ్ కింగ్‌డమ్ (ద్వితీయ భాగము); యునైటెడ్ స్టేట్స్; యూరప్; యెమెన్; రష్యావిప్లవము – అంతర్యుద్ధము; రాజనీతితత్త్వశాస్త్రచరిత్ర (రాజనీతి–సమీక్ష–ఉత్తరభాగము); రియూనియన్; రుమేనియా; రువండా; రొడీషియా, ఉత్తర, రొడీషియా, దక్షిణ; లక్జెంబర్గ్; లాట్వియా; లావోస్; లిక్టెన్‌స్టీన్; లిథూనియా; లిబియా; లుముంబా, పాట్రిస్; లెబనాన్; లెసోతో; లైబీరియా; వాటికన్ నగరరాజ్యము; వార్సా ఒడంబడిక; విప్లవములు (1848); విప్లవము (1905); వియెత్నామ్; వియెత్నామ్, ఉత్తర; వియెత్నామ్, దక్షిణ; వీటో; వెనిజ్యులా; వెస్ట్ ఇండీస్; వోటు; శకములు; శాసనవిద్య; సాగరఖండము; సాన్‌మారినో; సామ్రాజ్యయుగము (చరిత్ర–సమీక్ష); సింగపూర్; సింధునాగరకత; సింహళము; సిక్కిమ్; సిరియా; సుడాన్; సెంట్రల్ ఆఫ్రికన్ రిపబ్లిక్; సైప్రస్; సోమాలియా; సోవియట్ సోషలిస్ట్ గణరాజ్య సమితి; సౌదీ అరేబియా; స్పెయిన్ (ద్వితీయ భాగము); స్వాజీలాండ్; స్విజర్లండ్ (ప్రథమ భాగము); స్వీడెన్ (ద్వితీయభాగము); హంగేరి; హో చిమిన్.

జి. ఎన్. శర్మ. నాగభూషణ శర్మ, గొల్లపల్లి., ఎమ్. ఏ.,
చరిత్ర లెక్చరర్, ఓ. ఏ. వి. కాలేజి, షోలాపూర్.
ఐక్యరాజ్యసమితి; జహంగిర్; జాతి – జాతీయత; పోర్చుగల్ (ప్రథమ భాగము); పోలండ్ (ప్రథమభాగము).

నా. ర. నాగరత్నమ్మ, కె., ఎమ్. ఏ.,
లెక్చరర్, వివేకవర్ధనీ కళాశాల, హైదరాబాదు.
కమ్యూనిజమ్.

పి. ఆర్. పి. రామప్రసాద్, పి.
నెం. 8; నాలుగవ లైను, అభిరామపురము, మద్రాసు – 18.
అట్లీ, క్లెమెంట్ రిఛర్డ్; ఆంగ్‌సాన్; ఆడమ్స్, జాన్; ఆయూబ్‌ఖాన్, మహమ్మద్; ఐసెన్‌హోవర్.

పో. ల. నా. లక్ష్మీనారాయణరావు, పొట్లూరి, బి. ఏ.,
సహాయ సంగ్రాహకుడు, తెలుగుభాషాసమితి, యూనివర్సిటీభవనములు, మద్రాసు – 5.
టామ్‌ఖండ్ ప్రకటన; టిటో, యోసిప్ బ్రాజ్; ట్రాట్‌స్కీ; ట్రూమన్, హారీ ఎస్.; డీగాలీ, చార్లెస్; తాంతియా తోపీ; తిలక్, బాలగంగాధర్; దేశాన్వేషకులు; నానాసాహెబ్; నాసర్, జమాల్ అబ్దుల్; నికలస్ – II; న్క్రుమా, క్వామీ; నౌరోజీ, దాదాభాయి; పియర్సన్, లెస్టర్ బౌల్స్; ప్రపంచ రాజ్యములు; ఫ్రాంకో – రష్యన్ సంధి; బండారనాయకే,

పా. ల. నా. (తరువాయి)

సాలమన్; బాల్కన్ యుద్ధములు; బాల్డ్విన్, స్టాన్లీ; బ్రెజ్నెవ్, లియోనిడ్; లజపతిరాయ్, లాలా; లీ ట్రిగ్వీ, హోల్వడాన్; వాషింగ్టన్, జార్జి; వాస్కో డ గామా; వినోబా భావే; హూవర్, హెర్బర్ట్; హెన్రీ ది నావిగేటర్.

ప్ర. రా. కే. శే. రామమూర్తి, ప్రతాపగిరి, ఎమ్. ఏ.,

అండమాన్, నికోబార్ దీవులు; అంతర్జాతీయవాదము; అంతస్సంగ్రామము; అక్టోబరు విప్లవము; అగస్టస్, గయస్ జూలియస్ సీజర్ ఆక్టేవియస్; అగ్నిమిత్రుడు; అగ్రరాజ్యములు; అజంటా విహారములు; అట్లాంటిక్ చార్టర్; అప్రత్యక్ష ఎన్నిక; ఆయవ్యయ పట్టిక; ఆస్ట్రేలియా (ప్రథమ భాగము); ఎడ్వర్డ్ – VII; ఎడ్వర్డ్ – VIII; ఎల్లోరా గుహలు; ఏథెన్స్; ఒడంబడికలు; ఔరంగజేబ్; కర్జన్, జార్జ్ నథేనియల్; కర్ణాటకయుద్ధములు; కర్షకుల తిరుగుబాటు; కాంగ్రెస్, భారతజాతీయ; కాన్స్టాంటైన్; గరిబాల్డీ, జూజెపే; గస్టావస్, అడాల్ఫస్; గాంధీ, మోహనదాస్ కరంచంద్; గాత్‌లు; గెరిల్లా; జర్మనీ; జార్జి – V; జార్జి – VI; టర్కీ (ప్రథమ భాగము); తాజ్‌మహల్: తాటస్థ్యము; దండన విమోచనము, సర్వక్షమ; దోస్త్ మహమ్మద్; ద్వంద్వ ప్రభుత్వము; నడిమి ఎన్నిక; నాజీ వాదము; నానాజాతిసమితి; నియంతృత్వము; నియోజక క్షేత్రము; నిరంకుశ ప్రభుత్వ విధానము; నీరో; నెల్సన్, హొరేషియో వైకౌంట్; నైటింగేల్, ఫ్లారెన్స్; పరాక్రమ బాహువు; ప్యూరిటనులు; ప్రజా సత్తాక గణరాజ్యము; ప్రజాస్వామిక రాజ్యవాదము; ప్రష్యా; ప్రౌడాన్, పియోరీ జోసెఫ్; ప్లూటార్క్; ప్లేటో; ఫాసిజమ్; ఫొనీషియన్‌లు; బిస్మార్క్, ఆటోఫాన్; బెల్జియమ్ (ప్రథమభాగము); బైజాంటైన్ సామ్రాజ్యము; బోల్షివిజమ్; మహమ్మదు ప్రవక్త; మహారాష్ట్రపరిపాలనావిధానము; మహారాష్ట్రులు; మాంటెస్క్యూ, చార్లెస్ లూయీ ద సెకండెత్; మాజినీ, జూజెప్పె; మాడిసన్, జేమ్స్; మార్కస్ అరీలియస్ ఆంటోనైనస్; ముస్తాఫా కెమాల్; మేరియా, తెరెసా; రాజనీతి తత్త్వశాస్త్ర చరిత్ర (రాజనీతి సమీక్ష – ప్రథమ భాగము); శ్రామిక వర్గ నియంతృత్వము; శ్రామిక వర్గము; సామ్రాజ్యతత్త్వము; సీజర్, గయస్ జూలియస్; సుభాష్ చంద్ర బోస్; సుమేరియన్ నాగరకత; స్వాతంత్ర్యము.

ప్ర. రా. సు. రామసుబ్బయ్య, ప్రతాప,

జర్నలిస్ట్, హైదరాబాదు – 7.

అమెరికా రాజ్యముల కూటమి; ఆగ్నేయ ఆసియా రక్షణవ్యవస్థ; ఆఫ్రేసియా రాజ్యముల సమావేశము; ఉత్తర అట్లాంటిక్ రక్షణ వ్యవస్థ (నాటో కూటమి); ఎస్తోనియా; ఏంగెల్స్, ఫ్రెడ్రిక్; కెన్యా; రాధాకృష్ణ, సర్వేపల్లి; రోమ్; వల్లభ్‌భాయి జవేరీభాయి పటేల్; సన్‌యత్‌సేన్; సామోవ్, అమెరికన్; సామోవ్, పశ్చిమ; సియెర్రా లియోనీ; సెనెగల్; సేనానాయకే, డడ్లీ షెలన్; సైక్లెస్ (సెషెల్జ్); హాయిటీ; హాంగ్ కాంగ్; హామర్‌షెల్డ్; హొండూరాస్; హొండూరాస్, బ్రిటిష్.

బి. ఆర్. రవికుమార్, బి., ఎమ్. ఏ.,

రిసర్చ్ అండ్ ఫీల్డ్ అసిస్టంట్, స్టేట్ గెజెటీర్స్ ఆఫీసు, హైదరాబాదు.

ఉట్రెక్ట్ సంధి; కమ్యూనిస్ట్ పార్టీలు, భారత – చీనా సరిహద్దు సమస్య.

బొ. శ్రీ. శ్రీనివాసాచార్యులు, బొమ్మకంటి, బి. ఏ.,

అసిస్టెంటు ఎడిటర్, ఇంగ్లీషు – తెలుగు డిక్షనరీ (శ్రీ వేంకటేశ్వర యూనివర్సిటీ, తిరుపతి.

అబుల్ కలామ్ ఆజాద్, మౌలానా; అసఫ్ అలీ; ఇస్తాంబుల్ (కాన్‌స్టాంటినోపుల్); కార్టెజ్, హెర్నాండో.

భ. హ. హనుమంతరావు, భట్టిప్రోలు, ఎమ్. ఏ., *

లెక్చరర్, చరిత్రశాఖ, హిందూ కాలేజి, గుంటూరు.

భారతదేశము అను వ్యాసమున తొలుత నుండి 'ఢిల్లీ సుల్తానులు' వరకు.

---

* శోచనీయమగు ఒక పొరపాటువలన ఈ రచయిత యొక్క సంకేతాక్షరములు వారి వ్యాసము దిగువను ఈయబడలేదు.

మ. ఆ. శ. వీరభద్ర నాగ ఆదిత్యశర్మ, మల్లంపల్లి, ఎమ్. ఏ.,
ఎపిగ్రాఫిస్ట్, ఆర్కియాలజీ డిపార్ట్ మెంట్ ; ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము, హైదరాబాదు.
కుక్, జేమ్స్ ; కుబ్లయిఖాన్ ; కురుష్ ; కేమన్‌దీవులు ; క్లైవ్, రాబర్ట్ ; గయానా ; గయానా, డచ్చి ; గయానా, ఫ్రెంచి ; గయానా, బ్రిటిష్ ; గాంబియా ; గ్వాడలోప్ ; జాంజిబార్ ; టర్క్స్ అండ్ కైకోస్ దీవులు ; దుర్యాష ; నోబెల్ బహుమానములు ; న్యూ కెలెడోనియా ; న్యూ హెబ్రిడిస్ ; పోలో, మార్కో ; ప్రచ్ఛన్నయుద్ధము ; ఫాక్‌లాండ్ దీవులు ; బాల్కన్ రాజ్యములు ; బాల్టిక్ రాజ్యములు ; రొసెట్టాశిల ; లెనిన్ ; శివాజీ ; స్టాలిన్.

మా. వెం. రం. వెంకటరంగయ్య, మామిడిపూడి, ఎమ్. ఏ.,
(రిటైర్డ్ ప్రొఫెసర్, బొంబాయి యూనివర్సిటీ), 80, మారేడిపల్లి, సికందరాబాదు.
అంతర్జాతీయ సంస్థలు ; అధికసంఖ్యాక సూత్రము ; అధికార వికేంద్రీకరణము (రాజనీతి – సమీక్ష) ; అధికార విభజన ; అధ్యక్ష ప్రభుత్వము ; అరాజకతా వాదము ; అల్ప, అధిక సంఖ్యాక ప్రభుత్వములు ; ఉద్యోగివర్గము ; ఎన్నిక ; ఐక్యరాజ్య సమితి అనుబంధ సంస్థలు ; కార్యనిర్వాహక వర్గము (రాజనీతి సమీక్ష) నియోజక వర్గము (రాజనీతి – సమీక్ష) ; న్యాయశాఖ (రాజనీతి – సమీక్ష) ; న్యాయశాఖ ; పాశ్చాత్య రాజ్యాంగ వ్యవస్థావిధానము ; ప్రజాస్వామిక రాజ్యము (రాజనీతి – సమీక్ష) ; ప్రభుత్వ ధర్మములు (రాజనీతి – సమీక్ష) ; ప్రభుత్వముపై పలుకుబడి గలిగిన అనధికార సంస్థలు (రాజనీతి–సమీక్ష) ; ప్రభుత్వోద్యోగులు (రాజనీతి–సమీక్ష) ; ప్రాథమిక హక్కులు (రాజనీతి–సమీక్ష) ; భారత రాజ్యాంగము ; మొగల్ పరిపాలనా విధానము ; మొగల్ సామ్రాజ్యము ; రాజకీయపక్షములు (రాజనీతి–సమీక్ష) ; రాజనీతి అనగా ఏమి (రాజనీతి–సమీక్ష) ; రాజ్యాధికారము (రాజనీతి–సమీక్ష) ; రాజ్యోత్పత్తి (రాజనీతి–సమీక్ష) ; వివిధ ప్రభుత్వములు (రాజనీతి–సమీక్ష) ; శాసనసభ (రాజనీతి–సమీక్ష) ;

వ. లిం. లింగమూర్తి, వజ్ఝల, ఎమ్. ఏ., బి. ఇడి.,
చరిత్ర లెక్చరర్, ఆర్ట్స్ కాలేజి, విజయనగరము.
రాజేంద్ర ప్రసాద్, బాబు.

వసంతలక్ష్మి వసంతలక్ష్మి, బి.
ప్రిన్సిపాల్, ఆదర్శ విద్యాలయ, మద్రాస్ - 14.
ఇట్సింగ్.

వి. ఆర్. రామచంద్రన్, వి., ఎమ్. ఏ.,
చరిత్ర లెక్చరర్, గవర్నమెంట్ ఆర్ట్స్‌కాలేజి, అనంతపురము.
ఆస్ట్రేలియా (రాజ్యాంగము) ; కెనడా (ద్వితీయ భాగము) ; యాదవులు ; స్వీడెన్ (ప్రథమ భాగము) ; హర్షవర్ధనుడు ; హొయిసలులు.

వి. నా. నారాయణరావు, వి., ఎమ్. ఏ., ఎల్. టి.,
చరిత్ర చీఫ్ లెక్చరర్, గవర్నమెంట్ పి. ఆర్. కాలేజి, కాకినాడ.
అమెనోతప్ ; ఆల్‌ఫ్రెడ్ ; ఆలిగ్జాండర్ ; ఈజియన్ నాగరకత ; కార్తేజ్ ; క్రామ్‌వెల్, ఆలివర్ ; క్రొపాట్కిన్, క్రోసస్ ; క్లాడియస్ ; క్లియోపాత్రా ; గోల్కొండ ; టాలమీలు ; టెల్, విలియమ్ ; ట్రేజన్ ; డచ్చి ఈస్ట్ ఇండియా కంపెనీ ; డఫ్రిన్ ; తూర్పు ఇండియా వర్తక సంఘము ; తైమూర్ ; తోడరమల్లు, రాజా ; నెదర్‌లండ్స్ (ప్రథమ భాగము) ; నెపోలియన్ - I ; పిట్, విలియమ్ (చిన్న) ; పిట్, విలియమ్ (చేతమ్ ప్రభువు) ; పిరమిడ్‌లు ; పెరిక్లీస్ ; యూదులు ; హిక్సాసులు ; హిట్టైట్‌లు ; హిట్లర్, అడాల్ఫ్.

వే. జ. జగన్నాథము, వేదుల, ఎమ్. ఏ., బి. ఎల్., ఎమ్. లిట్.,
'చరిత్ర - రాజనీతి' ప్రొఫెసర్, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు, వాల్తేరు.
సమానత్వము.

షెర్వానీ — షెర్వానీ, ఎచ్. కె., ఎమ్. ఏ., (ఆక్సన్)
రిటైర్డు ప్రొఫెసర్, ఉస్మానియా యూనివర్సిటీ, హైదరాబాదు.
ఖ్వాజా, మహమ్మద్ గవాన్; చాంద్ బీబీ; మాలిక్ అంబర్.

స్వ. వెం. — వెంకటేశ్వర్లు, స్వర్ణ, విద్వాన్, బి. ఏ.,
(మాజీ తెలుగు పండితుడు, చీరాల కాలేజి), హైదరాబాదు.
ఆంగ్లో - ఫ్రెంచిమైత్రి; ఆంగ్లో - రష్యన్‌మైత్రి; ఆల్సేస్ - లారైన్; ఇంటర్నేషనల్; కనగవా సంధి; కర్జన్ రేఖ; కాన్‌స్టాంటినోపుల్ ఒడంబడిక; కెల్లాగ్ ఒప్పందము; కోమింగ్‌టాంగ్; క్రిమియా సమావేశము; క్లెమెన్ స్యూ, జార్జెస్: టెహరాన్ సమావేశము; నాన్ కింగ్ సంధి; పనామా కాలువ; పవిత్ర రోమన్ సామ్రాజ్యము; పారిస్ కాంగ్రెస్; పారిస్ శాంతి సమావేశము; పోట్స్‌డామ్ సమావేశము; పోర్ట్స్‌మత్ సంధి; బాస్టీల్ దుర్గపతనము; బెర్లిన్ కాంగ్రెస్; బెర్లిన్ సమావేశము; బ్రెస్ట్ - లిటోవస్క్ సంధి; మన్రో సిద్ధాంతము; మాంట్రూ ఒప్పుదల; మానవ స్వత్వప్రకటన; ముక్దెన్ సంఘటన; రపల్లో ఒడంబడికలు; రష్యా - జపాన్ యుద్ధము; రూర్; రైన్‌లాండ్; రోమన్ సమస్య; లండను సంధి; లాయిడ్ జార్జి, డేవిడ్; లానన్నీ సంధి పత్రములు; లోకార్నో సంధులు; వాటర్లూ సంగ్రామము; వాషింగ్‌టన్ సమావేశము; వియెన్నా కాంగ్రెస్; వెర్సెయిల్స్ సంధి; శాన్ ఫ్రాన్సిస్కో సమావేశము; షిమోనోసెకీ సంధి; సార్ మండలము; సూయజ్ కాలువ; సైక్స్ - పికోట్ ఒడంబడిక; స్టాలిన్‌గ్రాడ్ సంగ్రామము; స్పానిష్ - అమెరికా యుద్ధము; హేగ్ సమావేశము.

* * * ఈ గుర్తు గల వ్యాసములు కార్యాలయమందలి వారిచేత వ్రాయబడినవి.





# చరిత్ర సమీక్ష

## చరిత్ర అనగా ఏమి?

మానవసంఘపు జీవనపరిణామ వృత్తాంత సంగ్రహమే 'చరిత్ర'. మానవులు సాధించిన వివిధ ఘనకార్యములు, వారి ఆశయములు, జీవిత విధానములు, నాగరకత, సంస్కృతి మొదలగునవి అన్నియు చరిత్రలో చేర వలసిన విషయములే. ప్రభుత్వసంస్థ నిర్మాణ స్వరూపము, కార్యకలాపములు, రాజనీతి సిద్ధాంతములు, మత విధానములు, ఆధ్యాత్మిక భావనలు, వివిధ వస్తువుల ఉత్పత్తి వినిమయములు, యాన వాహన సౌకర్యములు, సంగీత, సాహిత్య, శిల్ప, నాట్య, చిత్రకళాది లలిత కళలు, తదితర కళాకౌశలములు, ఆహార విహార వినోదములు, ఆచార వ్యవహారములు మొదలగునవి అన్నియు మానవుని కృషితో ముడివడి ఉండుటవలన వానికి అన్నిటికిని చరిత్ర యందు సముచితమగు రీతిలో స్థానము కల్పించవలసియే ఉండును. చరిత్రలో ఉండదగిన ఇట్టి విషయబాహుళ్యమును గమనించియే క్రీస్తు పూర్వము నాలుగవ శతాబ్ది నాటి గ్రీక్ తత్త్వవేత్త అరిస్టాటిల్ [చూ.] 'మానవసంఘ జీవితమునకు సంబంధించిన సకల విషయములను కథగా కూర్చి సాగించిన రచనయే చరిత్ర' అని అభిప్రాయపడెను.

### చరిత్ర - ఆధారములు

కాని, స్వకపోలకల్పిత కథలతో కూడిన నవల, నాటక, కావ్య, ప్రబంధాది సాహిత్యరచనలకును, చరిత్ర రచనకును ఒక ముఖ్య విషయమున వ్యత్యాసము కలదు. వాస్తవముగ జరిగిన కథలు, ముచ్చటలు, ప్రసంగములు, యథార్థములని నిరూపితములైన మానవ సంస్కృతి విశేషములు మాత్రమే చరిత్రకు కావలసినవి; కల్పిత కథలకు అందు స్థానమే ఉండదు. చరిత్ర రచయిత వివరించు ప్రతి విషయమునకును ఏదియైన ఒక ప్రత్యక్షాధారము ఉండవలెను. ఆ ఆధారము లిఖిత రూపముననే ఉండవలసిన పని లేదు; తదితర రూపమున సైతము ఉండవచ్చును. ఈ విధముగ ప్రాచీనులు వ్రాసిపెట్టి ఉంచిన గ్రంథములు, శాసనములు మొదలగునవియే కాక, ఆ యా కాలములందలి మానవ సంస్కృతికి సంబంధించిన పనిముట్లు, ఆయుధములు, కట్టడములు, బొమ్మలు, నాణెములు మొదలగునవి సైతము ఆ యా యుగముల చరిత్రను రచించుటకు ఉపకరించుచున్నవి [చూ. తెలుగు సంస్కృతి - ౧ : పు. 58].

### చరిత్ర - రచన

చరిత్రలో ఉండదగిన విషయబాహుళ్యమునకు పరిమితి లేకున్నను, సంగ్రాహకులకు లభ్యములగు చారిత్రకాధారముల పరిమితినిబట్టి చరిత్ర విషయము పరిమితము కాక తప్పదు. లభ్యములగు ఆధారములను సంగ్రహించి విమర్శనాదృష్టితో పరిశీలించిన తరువాత, యథార్థములని నిరూపింపదగిన అంశములను మాత్రమే తీసికొని సుశిక్షితమగు చారిత్రక దృష్టితో ఆ అంశములను వివరించి, వ్యాఖ్యానించి రచయిత రచన సాగింపవలయును. ఐతే, వాస్తవములైన వృత్తాంతములను గ్రహించుటలోను, వానిని వివరించి వ్యాఖ్యానించుటలోను చరిత్ర రచయితల కృషిఫలితము వారి వారి శక్తిసామర్థ్యములనుబట్టియు, రుచిభేదములను అనుసరించియు వేర్వేరు తీరులుగ ఉండక తప్పదు. అందుచేత గణితము, భౌతిక శాస్త్రము, రాసాయనిక శాస్త్రము మొదలగు శాస్త్రరచనలలో ఉండు నిరహంకార విచక్షణ చరిత్రరచనలో అంత సమగ్రముగ కన్పట్టదు. అంతేకాక, తగు విచక్షణతో యథార్థమును గ్రహింపవలెనన్న దీక్షతో చరిత్రను రచించుటకు పూనుకొనిన రచయితకు సైతము దొరకిన చారిత్రకాధారములు సరియైనవి కాకపోవచ్చును. అందుచేత చారిత్రక వృత్తాం

తములు జరిగినవి జరిగినటుల సరిగ వర్ణించి చెప్ప వలయునను ఆశయము చరిత్ర రచనలో సంపూర్తిగ నెరవేరుట అసాధ్యమని భావింపక తప్పదు.

ఐనను అన్వేషకుల నిరంతర పరిశోధనకు ఫలితముగ చారిత్రకాధారములు పెక్కు వెలువడుచుండుటవలన చరిత్ర రచయితల పని కాలక్రమమున కొంత సుగమము అగుచున్నది. ఇందులకు తోడుగ ఉద్దిష్టమైన ఒక ప్రాదేశిక చరిత్రకుగాని, నిర్దిష్టమైన ఒక యుగ విభాగమునకుగాని సంబంధించిన చారిత్రకాధారముల విలువను సమగ్రముగ పరిశీలించుటయే తమ ధ్యేయముగ ఇడుకొని కృషి చేసి, అందు ప్రామాణికతను ఆర్జించిన పలువురు పండితులును నేడు కలరు. వీరు సమదృష్టితో చారిత్రకాధారముల వస్తుపరిశీలన చేసి, ఉపలబ్ధములగు సత్యములను ఇతర వస్తుపరిశీలన వలన తేలిన విషయములతో సమన్వయము చేసి సమగ్రచరిత్ర రచనకు సాయపడుచున్నారు. కనుక సత్యమునకు సన్నిహితమగు చరిత్రను రచించుట ఆధునిక యుగమున కొంతవరకు సాధ్యమగుచున్నది. ఇట ఒక విషయమును మరువకూడదు. సత్యనిర్ణయమనునది ఒక క్లేశకర సమస్య. ఉపలబ్ధములగు కొన్ని ఆధారములను ఆస్కారముగ గ్రహించి, రచయిత తన బుద్ధిని ఉపయోగించి సత్యమని ఒక విషయమును నిర్ణయించిన తరువాత, కాలక్రమమున కొన్ని అదనపు ఆధారముల వలన ఆ నిర్ణీత విషయము అసత్యమని రుజువగుటకును అవకాశము కలదు. అయినను దొరకిన ఆధారముల వలన ఎప్పటికేది రుజువు కాగలదో అప్పటికదే సత్యమని - దానిని ఖండించు వేరొక ఆధారము లభించువరకు - విశ్వసింపక తప్పదు. ఈ లోటు ఒక చరిత్రరచనయందే కాదు; ప్రయోగ జన్య జ్ఞానముచే అతినిశితముగ సత్యమును అన్వేషించుటకు ఆస్కారముగల భౌతిక శాస్త్రము మొదలగు వాని యందును. ఈ లోపము కన్పట్టుచునే ఉన్నది. ఆ శాస్త్రములందు పూర్వపండితులు నిర్ణయించిన సిద్ధాంతములు అనేకములు సత్యదూరములని ఆధునిక పండితులు నిర్ణయించుట ఎల్లరు ఎరిగియే ఉన్నారు.

## చరిత్ర - శాస్త్రము

చరిత్ర కూడ శాస్త్రమే అని కొందరి అభిప్రాయము; అందు కొంత సత్యము లేకపోలేదు. చరిత్రరచన కేవలము చారిత్రకవిషయ విజ్ఞానమును ఒక సక్రమ పద్ధతిలో నివేదించుటతో తృప్తిపొంది ఊరకొనక, సాంఘిక శాస్త్రముగ పరిణమించి నేడు 'విజ్ఞాన శాస్త్రము' (సైన్స్) అను పేరుతో వ్యవహృతమగు దానితో సమముగ శాస్త్ర సమయములను పాటించి, పరిశోధనలను కావించుచు, పరిశోధన ఫలితములను సప్రమాణవిషయములతో సరిచూచి సమన్వయించుచు ముందునకు సాగుచున్నది. అయినను, సూక్ష్మదృష్టితో పరిశీలించినప్పుడు చరిత్రకును, విజ్ఞానశాస్త్రమునకును మధ్య ఉన్న ఒక ముఖ్య వ్యత్యాసము స్పష్టము కాగలదు. విజ్ఞాన శాస్త్రమున ప్రయోగములు చేసి ఫలితములను పరిశీలించుటకును కొన్ని నిర్దిష్ట నియమములకు లోబడిన శక్తుల ప్రవృత్తి ఎటులుండునో పరీక్షించుటకును, అట్లు చేయుటవలన తేలిన ఫలితములను అనుసరించి ఒక సిద్ధాంతమును రూపొందించుటకును అవకాశము కలదు. చరిత్ర విషయమున అట్టి అవకాశము మృగ్యము. అంతేకాదు, చారిత్రకాధారములను విమర్శించి సత్యాసత్యముల నిర్ణయించి, సమదృష్టితో ఉన్నది ఉన్నటుల, శాస్త్ర సిద్ధాంతములవలె చరిత్రను రచించుట కొంతవరకు సాధ్యమే అయినను, ఈ పరిశోధనాఫలితములను మనస్సునకు ఎక్కు రీతిగ తెలుపవలసి వచ్చినపుడు వానికి ఒక కథారూపమును ఒసగి తన కళా నైపుణ్యమును రచయిత ప్రదర్శింపక తప్పదు.

## చరిత్ర - కళ

పై కారణములచేత చరిత్రకును, కళకును గల సంబంధమును పరిశీలింపవలసి ఉన్నది. చరిత్రలో మానవుల జీవిత కథలు, వర్ణనలు ఉండుటవలన చరిత్రరచనకు కళతో కొంత సాదృశ్యము ఉన్నను, దానిని కళయని మాత్రము నిర్ద్వంద్వముగ వర్గీకరింప జాలము. కళా ప్రధానములగు కావ్యాదులలో వాస్తవికతను అంతగ పాటింపవలసిన అవసరమే లేదు. కాని, చరిత్రరచనకు తెలిసినంతవరకు సత్యములగు విషయములే కావలెను. కల్పితకథలు కల రచనలలో అచ్చటచ్చట చారిత్రక విషయములు ఉన్నను, ఆ రచనలు చరిత్రలుగ అంగీకరింపబడజాలవు. ఇటుల కళతో చరిత్రరచనకు కల సంబంధము చాల తక్కువ అని విదితమగుచున్నది.

అందువలన అచ్చముగ విజ్ఞానశాస్త్ర వర్గమునకు చెందక పోయినను చరిత్రరచన శాస్త్రప్రాయమగునది అని అంగీకరించుట సముచితము.

## రచనా విధానము

ఇట్టి శాస్త్ర ప్రాయమైన చరిత్రరచన సాగించు విధానములలో ప్రశస్తమైన విధానమును 'ఫస్టెల్ డా కూలేజ్' అను ఒక ఫ్రెంచి పండితుడు సూచించెను.

చరిత్రరచనలో తాను పాటించిన మూడు ప్రధాన సూత్రములను ఆయన క్రింది విధముగ వివరించెను:

1. దొరకిన చారిత్రకాధార రచనలను, తదితర వస్తు సామగ్రిని ఆమూలాగ్రము – అన్ని విషయములను, అన్ని అంశములను – జాగ్రతగ పరిశీలింపవలెను;

2. ఇతర అభిప్రాయములతో ముడిపెట్టక అవి ఏయే విషయములను, అంశములను స్వయముగ రుజువుచేయు చున్నవో ఆ యా విషయములను, అంశములను మాత్రమే విశ్వసింపవలెను;

3. ప్రాచీన చారిత్రక విషయములను వ్యాఖ్యానించి నపుడు ఆధునిక దృష్టితో వానిని పరిశీలించుట సముచితము కాదు; అందువలన కలుగు ప్రయోజనము శూన్యము.

పై సూత్రములలో మూడవ దానిని పెక్కురు ఆధునిక రచయితలు గమనించుట లేదని పేర్కొనుచు, ఆ ఫ్రెంచి పండితుడు పెక్కు నిదర్శనలను చూపెను. ప్రాచీన చరిత్రను వ్యాఖ్యానించుటలో ఆధునిక రచయితలు – వారు ఫ్రెంచివారు కానిండు, జర్మనీవారు కానిండు లేదా తదితరులు కానిండు – తమ వర్తమాన రాజకీయాది పక్షావేశమును కనబరచుచు, తమ తమ జాతీయాభిమానములను ప్రాచీన కాలమునకు సైతము అన్వయింపజేసి యథార్థమును మరుగుపరచు దోషమునకు పాల్పడు చున్నారని ఆ పండితుడు నుడివెను.

## చరిత్ర - రచనా పరిణామము

శాస్త్రీయమైన చరిత్రను నిర్మించుటకు వాస్తవిక నిరూపణము ప్రధానమను ఆశయము 19 వ శతాబ్ది ఆరంభము నుండియు ఆదరణ ఆర్జించినది. అంతకు పూర్వము చరిత్రలుగ వ్యవహరింపబడిన వానిని రచించిన వారిలో అత్యధిక సంఖ్యాకులు తమ తమ రాజకీయ వాదముల ప్రాబల్యమునకు చరిత్రను సాధనముగ గ్రహించి, అందుకు ఉచితమగు రీతిని దానిని తారుమారుచేసిరి. ప్రాచీన గ్రీక్ చరిత్రరచయితలలో ప్రసిద్ధుడగు తూసిడైడీస్ (క్రీ. పూ. 464 - 404 ర.), భారతదేశమున ముస్లిమ్ పరిపాలనా కాలపు చరిత్రను రచించిన కాఫీఖాన్‌వంటి ఏ కొలదిమందియో తమ రచనలందు యథార్థమునకే మన్నన కల్పించుటకు యత్నించిరనుట నిజమే అయినను, తక్కిన వారికి ఆ ఆశయము ఉన్నటుల కన్పట్టదు [చూ. చరిత్ర - రచన - పు. 1].

## చరిత్ర - ప్రయోజనము

భావికాలము వారికి మార్గదర్శకముగ సాయపడుటకు గతచరిత్ర పఠనము ఏ తీరుగనైన ఉపకరింపగలదా? అను ప్రశ్నకు మేధావంతులగు పలువురు రచయితలు పలురీతుల తమ అభిప్రాయములను వెలువరించిరి. వానియందు ఏదియు సర్వసమ్మతము కాలేకున్నది. చారిత్రక సన్నివేశములలో కొన్నిటికి సదృశములైన సన్నివేశములు నేటి సంఘ జీవితమున ఎడనెడ బాహ్యదృష్టికి కన్పట్టవచ్చును లేదా ఒక దేశమందుగాని, యుగమందుగాని జరిగిన సంఘటనలకును, మరియొక దేశమందుగాని, యుగమందు గాని జరిగిన సంఘటనలకును స్థూలదృష్టికి సామ్యము కన్పట్టవచ్చును. కాని, సూక్ష్మముగ పరిశీలించినపుడు సాదృశ్యములుగ భావింపబడు వీనియందు సాదృశ్యములతోపాటుగ విభేదములును పెక్కు ఉన్నటుల స్పష్టము కాగలదు. ఇందువలన చరిత్ర సంఘటనలు నడచిన రీతినే మరల నడచుటకు అవకాశమే లేదని విదితమగుచున్నది. అంతేకాదు, అందుకు భిన్నముగనే నడచునని చెప్పుటకు కూడ ఎక్కువ అవకాశము కనబడుచున్నది.

అటుకాక, నేటి రాజకీయాది సమస్యలను పరిష్కరించుకొనుటకు కావలసిన తోడ్పాటు గతించిన దేశచరిత్రనుండి పొందగలుగుట సాధ్యమా అనిన అదియును కన్పట్టుట లేదు. కాని, చరిత్రజ్ఞానము ఏమియు లేనివారికంటె, చరిత్ర లెస్సగ చదువుకొని, సంఘజీవులగు మానవులకు సహజములగు చైతన్యలక్షణములలో ప్రధాన లక్షణములను గుర్తించిన మేధావంతులు తమనాటి సంఘ సమస్యలను పరిష్కరించుటకు ఎక్కువ సమర్థులు కాగలరని మాత్రము చెప్పక తప్పదు. ఇది చరిత్రయొక్క బాహ్య ప్రయోజనము. ఇక చరిత్ర పరిణామమందలి వివిధ దశల నిరూపించుటకును, సమగ్రతను ఆశించి కృషిచేయు మానవ సాంఘికజీవనము అనుసరించు విధానముల హేతువాద బుద్ధితో పరిశీలించుటకును యత్నించిన హెగెల్, కాన్ట్‌వంటి దార్శనికులు చరిత్రకు క్రింద ఉదాహరించిన కొన్ని ఉద్దిష్టములైన ఉదాత్త ప్రయోజనములు కలవని సూచించిరి:

1. సంయుక్తికము, సువిశాలము అయిన దృష్టి; 2. స్వాతంత్ర్య విస్తృతి; 3. సాంఘికాత్మ యొక్క సాక్షాత్కారము.

పరిసరములను అతిక్రమించుటకు మానవుడు చేసిన కృషి ఫలితమే సంస్కృతి అనియు, అట్టి సంస్కృతుల ఉదయాభ్యుదయపతనముల గుర్తెరుగుట చరిత్రవలన లభించుచున్నదనియు, అట్టి గతానుభవముల పరిజ్ఞానము మానవ జాతికి ముందడుగు వేయుటలో సాయపడగలదనియు కొందరు ఆధునిక పండితుల అభిప్రాయము. వీరిలో ప్రముఖుడు టాయన్‌బీ [చూ]. ఇతడు దేశ,

కాల క్రమమును అనుసరించి ప్రపంచ మందలి వివిధ సంస్కృతులను వింగడించెను. అందులకు అనుగుణముగ మానవచరిత్రను కూడ క్రమరీతిన విభజించి, మానవుడు తనను ఎదిరించిన పరిసరములను లొంగదీసికొనుటకు తాను చేసిన కృషిమూలముననే ప్రతి సంస్కృతియు ఉదయించినదని రుజువుచేసెను. అట్లు ఉదయించి వృద్ధిపొందిన సంస్కృతికి కల లక్షణములను వివరించి వ్యాఖ్యానించుటయేకాక వాని పతనకారణములను కూడ ఆయన వివరించెను.

టాయన్‌బీ తెలిపిన అభిప్రాయములను వ్యతిరేకించిన ప్రసిద్ధ పండితులును లేకపోలేదు. అట్టివారిలో ముఖ్యుడు ఎచ్. ఏ. ఎల్. ఫిషర్. ఇతడు తన అభిప్రాయమును ఈ రీతిగ వెలువరించెను: 'వైజ్ఞానిక విషయమున ఉద్రేకముతో తొందరపడి నిర్ణయము చేయు స్వభావము నాకు అలవడ లేదు. నాకంటె ఎక్కువ బుద్ధిమంతులును, విజ్ఞులును అయినవారు కొందరు విశిష్టమైన ఒక నిర్దిష్ట కల్పనను, క్రమగతి సంచలనమును, పురానిర్ణీత సంవిధానమును చరిత్రలో దర్శించినారు. ఇట్టి సామరస్యము నాకు ఏమాత్రము గోచరము కాలేదు. తరంగము వెంబడి తరంగమువలె తప్పనిసరియైన సంఘటనలు ఒకటి తర్వాత వేరొకటి ఘటిల్లినటుల మాత్రమే నాకు కన్పట్టుచున్నది. ఇది ఒక అసాధారణ విషయము కనుక దీనిని బట్టి సాధారణ విషయ సూత్రీకరణ చేయుటకు వలనుపడదు. కావున ఈ విషయమున చరిత్ర రచయితకు క్షేమకరమైన సూత్రము ఒకటే ఉన్నది. మానవ భాగధేయముల పరిణామ క్రమములో కన్పించునట్టి అదృష్టము, అతర్కితము అయిన ఏదో ఒక అనిర్వచనీయశక్తి ప్రభావమును చరిత్రరచయిత గుర్తింపక తప్పదు'. ఫిషర్ తెలిపిన అభిప్రాయమునకు అనుగుణముగనే వ్రాయుచు ఏక్టన్ '19 వ శతాబ్దములో 25 సార్లు హత్యల వలననో, హత్యా ప్రయత్నముల వలననో చరిత్ర యథాక్రమ గతికి విచలనము కలిగినది' అని తెలిపెను.

చరిత్ర పఠనము వలన నైతిక ప్రయోజనము లభింప గలదని కొందరు విశ్వసింతురు. అశోకు [చూ.] ని వంటి కొందరు మహాపురుషుల జీవిత విషయములు ఇందులకు ఉపకరించవచ్చును. కాని, చరిత్రయొక్క ధ్యేయవస్తువు నీతిబోధన కానేరదు. నైతిక ప్రయోజనము సిద్ధింప వలయునను ఉద్దేశముతో చరిత్రాంశములను మార్చ రాదనుట సర్వసమ్మతమగు విషయము.

తక్కిన విజ్ఞాన శాస్త్రముల వలెనే చరిత్రయు ఒక సత్యాన్వేషణ. దానివలన ప్రయోజనములు ఏవియైన ఉండునెడల అవి అన్నియును ఆనుషంగికములే; కాని, అవి చరిత్రకు ధ్యేయవిషయములు కావు. చారిత్రక విజ్ఞానమునకు, చరిత్రరచనకు ఒక జాతీయ ప్రయోజనమును ముడివెట్టదలచి కొన్ని దేశములు చేసిన కృషియొక్క దుష్పరిణామముల ఫలితములను ఈ 20 వ శతాబ్దపు పూర్వార్ధమున ప్రపంచము చవిచూచినది. అట్టి కృషి చేసిన దేశములలో తొలుతగ పేర్కొనదగినది జర్మనీ. ఆ దేశమందు చిన్న బడులలోను, యూనివర్సిటీలలోను స్వార్థపరత్వముతో రచించిన చరిత్రను విద్యార్థులకు నేర్పినందు వలన జర్మనుల చిత్తప్రవృత్తులు ఎట్లు తయారైనవో ప్రపంచ ప్రజలకు సువిదితము. ప్రపంచము జర్మనీ సామ్రాజ్యమున చేరుటయే తప్పక జరిగి తీరగల దనియు, జర్మనులకు చరిత్రయే అట్టి అధికారము ఇచ్చె ననియు, జర్మనీ నాయకులు తమ దేశ ప్రజలను నమ్మించి వారిని యుద్ధములలోనికి దింపినపుడు ఆ ప్రజలు వారి మాటలను నమ్మి గ్రుడ్డిగ వారిని అనుసరించుటకు ఆ చిత్తప్రవృత్తియే ముఖ్యకారణము. తన్మూలమున యూరప్ ఖండమే కాక, దూర దేశములు సైతము పలునష్టములకు గురియైనవి.

ఆర్థిక దృష్టితో చరిత్రను వ్యాఖ్యానించు వారును కొందరు కలరు [చూ. కమ్యూనిజమ్]. వీరి వాదములో కొంత భాగము మాత్రమే సర్వజనామోదితము; తక్కినది స్వపక్షాభినివేశ ఫలితములగు అత్యుక్తులతో నిండి ఉన్నది.

కావున ఒక పక్షమువారి మతమును, ఆశయములను బోధించి వ్యాపింపజేయు ఉద్దేశముతోగాక, ఎట్టి ప్రయోజనమును ధ్యేయముగ ఇడుకొనక, లభించినంతవరకు ప్రామాణికములైన చారిత్రకాధారముల సాహాయ్యముతో సత్యాన్వేషణము చేసి, విషయములను గ్రంథస్థము చేయుటయే చరిత్రరచయిత కర్తవ్యము.

## విస్తృతి

చరిత్ర అనునది మానవ సంఘమునకు సంబంధించినది అగుటచే ఆ యా మానవసంఘములు ప్రత్యేకతను ఆర్జించి నివసించిన ప్రదేశములనుబట్టి భారత దేశచరిత్ర, గ్రేట్ బ్రిటన్ చరిత్ర అను ఇట్టి పేరులతో దేశచరిత్రలు మెండుగ రచింపబడుచున్నవి. కాని, దేశముల అన్యోన్యాశ్రయత్వమును, అన్యోన్య సన్నిహితత్వమును గ్రహించి, సమష్టి దృష్టితో ప్రపంచ చరిత్రను సైతము విజ్ఞులు రచించుచున్నారు. ప్రస్తుత పఠనీయ వస్తువగు విజ్ఞాన సర్వస్వమున సమీక్షా భాగము ఇట్టిదియే. కే. వి. ఎస్. శాస్త్రి

# చరిత్ర - పూర్వయుగము

( ? ... క్రీ. పూ. 3500 వరకు)

## మానవోదయ పరిణామములు

**మానవుని** నివాసమగు ఈ భూగోళము రూపొందిన రీతిని గురించియు, అందు మానవుడు సృజనమొంది పరిణమించినవిధానమును గురించియు ప్రాచీనకాలము నుండియు వివిధ వాదములు వ్యాప్తి పొందినవి. ప్రాచీన ఈజిప్టు వాసులు తొలుత సృష్టి అంతయు ఏకజలరాశిగ ఉండెననియు, దానిని తన నివాసముగ ఇడుకొనిన మహాస్రష్ట తొలుత సూర్యుని సృష్టించెననియు, సూర్యుని ఆదేశములను అనుసరించి భూమ్యాకాశములు ఉదయించెననియు, ఈ తీరుగ క్రమమున ప్రపంచము సృజింపబడెననియు విశ్వసించిరి. ప్రాచీన ఈజిప్టునకు సమకాలికమని భావింపదగు బాబిలోనియాయందలి ధీమంతులు పరమేశ్వరుడగు బేల్ మెరొడోక్ తన శత్రువును, జలాధిదేవతయు నగు తియామత్‌ను వధించి, దాని కళేబరమున ఒక సగముచే ఆకాశమును, కడమ సగముచే భూమిని రూపొందించి, అంతట క్రమముగ సూర్య, చంద్ర, నక్షత్రాదులను, తుదకు మానవుని సృజించి వ్యవస్థిత ప్రపంచమును ఏర్పరచెనని చాటిరి. వైదిక సారస్వతమందును సృష్టిక్రమమును గురించి ఇట్టివే కొన్ని గాథలు కలవు. పురుషమేధ మొనర్చి దేవతలు ఈ ప్రపంచమును సృజించిరని అందు ఒకచోట చెప్పబడినది. దాదాపుగ ఇట్టి భావనయే యూరప్‌నందలి ప్రాచీన ఆర్యజాతిలోని ఒక శాఖ వారగు ట్యూటన్‌లలో వ్యాప్తియందుండెను. యమర్ అను తామస పురుషుని దేవతలు వధింపగ అతని కపాలము ఆకాశముగను, అతని ఎముకలు కొండలుగను, అతని నెత్తురు సముద్రముగను ఆయెనని వారు విశ్వసించిరి. ఈ గాథనే పోలినది ప్రాచీన చీనాలోను వ్యాప్తి పొందినది. ఇక హిందూమత సారస్వతమందలి వివిధ పురాణములందును, యూద, క్రైస్తవ, ఇస్లామ్ మత ప్రమాణ గ్రంథములందును సృష్టిక్రమమును గురించిన వివరములు ఆ యా సంప్రదాయములను అనుసరించి వివరింపబడినవి. వీని అన్నింటను సృష్టికి కారణము భగవానుని సంకల్పమే అనియు, ఆతని సంకల్పమాత్రమున వివిధ ద్రవ్యములును, జీవములును రూపొందెననియు భావించుట మూలసూత్రముగ కన్పట్టుచున్నది.

పైన తెలుపబడిన ప్రాచీన భావనలు హేతువాద రీతిలో రూపొందినవి కావనుట సుస్పష్టము. ఇట్టి పురాణ గాథలను నేటి వైజ్ఞానికులు అంగీకరింపజాలరు. కార్య కారణ సంబంధమును వివరింపగల మూల సూత్రములను కనుగొని ద్రవ్య స్వభావమును వివరించుట విజ్ఞాని కర్తవ్యము. ఈ దృష్టితో సృష్టిరహస్యమును, భూమి ఉదయించిన తీరును, మానవుడు రూపొందిన పద్ధతిని కనుగొనుటకు దాదాపు 200 ఏండ్లనుండియు వైజ్ఞానికులు కృషిచేయుచున్నారు. ఇట్టి కృషిలో గ్రహమండలమును గురించి వైజ్ఞానిక సంప్రదాయరీతిలో వివరించుటకు తొలుతగ యత్నించినవాడు బఫన్ (1708 - 1788). యాదృచ్ఛికముగ సూర్యగోళముతో ఒక నక్షత్రము ఢీకొనుట వలన ఈ గ్రహమండలము రూపొందెనని ఆతడు ఒక సిద్ధాంతమును వెలువరచెను. ఈ వాదమును లాప్‌లాస్ [చూ. గణిత, ఖగోళశాస్త్ర సంపుటము - పు. 489] అను వేరొక పండితుడు ఖండించి, సూర్యగోళమున జరిగిన ఒక ఆంతరంగిక ప్రస్ఫోటనము వలన ఉష్ణవాయు రాశి కోటానుకోట్ల యోజనముల దూరము వరకు చెల్లాచెదరుగ విసరి వేయబడెననియు, సూర్యునినుండి విడివడిన ఆ వాయురాశియందలి వేర్వేరు భాగములు క్రమముగ ఘనీభవించి, గోళరూపములతో సూర్యునిచుట్టు పరిభ్రమించుచున్నవనియు వేరొక సిద్ధాంతమును సోపపత్తికముగ రూపొందించెను. కాని, గణిత శాస్త్ర పరీక్షకు ఈ సిద్ధాంతము నిలువలేక పోయినది. అంతటినుండి క్రమముగ ఒకరివెనుక ఒకరుగ వైజ్ఞానికులు గ్రహమండలపు పుట్టుకను గురించి తమ తమ సిద్ధాంతములను ప్రవచించిరి. కాని, వీనిలో ఏదియు ఇప్పటికి పండితలోకముచే సర్వత్ర ఆమోదితము కాలేదు. ఇటుల గ్రహముల పుట్టుకను గురించి నిర్ధారితాభిప్రాయము లేకున్నను ఈ భూగోళము ఒక ప్రత్యేక గ్రహముగ రూపొందిన ప్రప్రథమ దశలో ఒక ఉష్ణవాయు రాశిగ మాత్రమే ఉండి, పరిభ్రమించుచుండెడిదను విషయమున మాత్రము పండితులు దాదాపుగ ఏకాభిప్రాయమును కలిగి ఉన్నారు. ఆ వాయురాశి క్రమముగ ద్రవరూపము పొంద మొదలిడి తుదకు ఘనీభవనమొందెను. అటులనుట వలన ఈ గోళమంతయు ఘనరూపమొందెనని భావింపదగదు. భూమ్యంతర్భాగము ఇంకను ఆ స్థితికి రాలేదని పండితుల అభిప్రాయము. ఘనీభవించుటలో వెలువరింపబడిన ఆవిరియే తొలుతగ మేఘాకృతిని పొందెననియు, తత్పరిణామముగ వర్షములు పడి సముద్రములు, నదులు మొదలగు జలావరణము ఏర్పడి, జీవ నివాస యోగ్యముగ భూమి పరిణమించెననియు వారనెదరు.

**జీవోత్పత్తి :** విజ్ఞానుల అభిప్రాయమున జీవమనునది స్వయం జనకము. భూమిపై వర్షము పడి, భూమియందలి పదార్థములతో అది మిళితమై పంకరూపము చెందినంతట, ఆ పంకముపై సూర్యకాంతి ప్రసరింపగనే, ఒక విధమగు రాసాయనిక ప్రక్రియ ద్రవ్యస్వభావమును అనుసరించి ఘటిల్లెననియు, తత్ఫలితముగ కార్బన్, నైట్రోజన్ యౌగికములు రూపొంది వానినుండి జీవకము(ఆర్గానిజమ్)లు ఉత్పత్తి అయ్యెననియు జీవరాసాయనిక శాస్త్ర పండితులు నిర్ధారించిరి. ఈ జీవకములే రాసాయనిక పరిణతిని పొంది జీవోత్పత్తికి దారితీసెననియు, ఇట్టి పరిణామము తొలుతగ భూమిమీద దాదాపు 30 కోట్ల ఏండ్ల క్రితము మొదలిడెననియు వారనెదరు. సిద్ధాంతరీత్యా ఇటుల భావించుటకు వారికి అవకాశమున్నను, జడపదార్థము చైతన్యమయ జీవకముగ పరిణమించు తెరగును వారిప్పటికిని ప్రాయోగికముగ రుజువుచేయుటలో కృతకృత్యులు కాకున్నారు. అయినను జీవ సృష్టి రహస్యమును కనుగొనుటలో జీవ రాసాయనిక శాస్త్ర వేత్తలు చాల వరకు ఇప్పటికి పురోగమింపగలిగిరని అంగీకరింపక తప్పదు.

జడపదార్థమయముగ ఉన్న సృష్టియందు జీవపరిణామము జరిగిన విస్తృత కాలమును సౌకర్యార్థము శాస్త్రవేత్తలు వివిధ యుగములుగ విభజించిరి. (1) అజీవక (అజోయిక్) యుగము: ఈ యుగమున జీవోత్పత్తికి అవకాశమే లేదు; (2) ఉత్తరాజీవక (ప్రోటిరోజోయిక్) యుగము: ఇందు కొన్ని సూక్ష్మ జీవకములు ఇదివరలో తెలుపబడినరీతిగ రూపొందుటకు అవకాశములు ఏర్పడెను. కాని, వీనికి నిర్దిష్టావయవ సహిత రూపము లేకపోవుటచే వీని అవశేషములు మనకు లభింపకున్నవి; (3) ప్రాచీనజీవక (పేలియోజోయిక్) యుగము: సముద్ర వృశ్చికముల కోవకు చెందిన కొన్ని జలచరములు ఈయుగమున రూపొందినవి. ఈ యుగముననే క్రమముగ మత్స్యజాతులు కొన్నియు, ఉభయచరములు (నేలయందును, నీటియందును తిరుగునవి) కొన్నియు రూపు గొనినవి; (4) మధ్యమ జీవక (మెసజోయిక్) యుగము: ఇందు ప్రకృతి పరిణామము ఒక వింతమార్గమును త్రొక్కి, తత్ఫలితముగ సరీసృప జాతికి చెందిన మహాకాయములు గల డైనాసరస్‌వంటి విచిత్ర జంతువులు ప్రపంచమంతట వేలకొలది ఏండ్లు విశృంఖల విహారము సల్పినవి. వీనియందు కొన్ని 24 మీటరుల పొడవున కూడ ఉండెడివి. ఈ జంతుసంతతి ఆ యుగాంతమున అంతరించినది. వానికి తగు ఆహార వసతులు క్రమముగ లోపించుట చేతనో లేదా భూమ్యుపరితలమున సంఘటిల్లిన కొన్ని మార్పుల వలననో ఈ విచిత్రజాతి అంతరించి ఉండును. ఇచ్చట ఒక విషయమును గుర్తింపవలసి ఉన్నది. సృష్టియందు జీవ పరిణామము జరుగుచుండిన ఈ వివిధ యుగములందును, భూమ్యుపరితలము ఒకేతీరుగ ఉండలేదు. భూమియందలి అంతరంగిక సంక్షోభముల వలననో లేదా ఉపరితలమున జరుగు జలప్రళయాదుల వలననో కొన్ని చోటుల భూమి క్రుంగిపోవుటయు, పైన వేరొక పొర ఏర్పడుటయు, నీటినుండి కొంతభూమి పైకి లేచుటయు మొదలుగా గల విచిత్ర సంఘటనలు జరుగుచుండెడివి. ఇటుల భూమిపై వేరొక పొర ఏర్పడినపుడు తొలుత అందుండిన వృక్ష, జీవ సంతతియు అంతరించెడిది. అటుల మరుగుపడిన వృక్ష సంతతులు పై పొరల ఒత్తిడి మొదలగు కారణముల వలన నేల బొగ్గు గనులుగ మారినవి. మృగాదులందలి మృదు భాగములు నశించినను అస్థి, దంతమువంటి గట్టి భాగములు నశింపక శిలారూపమొందిన ఆ తొలుతటి పొరలో ఇమిడి ఉండును. ఇట్టి వానిని శిలాస్థు (ఫాసిల్)లు అని శాస్త్రజ్ఞులు వ్యవహరింతురు. ఇట్టి శిలల పొరలను సవిమర్శముగ పరిశీలించిన పండితులు ఆ శిలాస్థుల సాయమున ఆ యా యుగములందు వసించిన జంతువుల పరిమాణాదులను లెక్కింపగలిగిరి. ఈ విధముగనే మధ్యమజీవక యుగపు సరీసృపముల పరిమాణములను వాని అవశేషముల సాయమున పండితులు నిర్ణయించి, ఆ యా జంతువుల రూపరేఖాదులను అనుసరించి వానికి విచిత్ర నామములు మహాగౌళి (డైనాసరస్), అశనిఘోషా గౌళి (బ్రాంటాసరస్), కవచధారిగౌళి (స్టెగోసరస్) మొదలగునవి కల్పించిరి.

మధ్యమజీవక యుగాంతమున సస్తనజాతి జీవముల (పాలిచ్చి బిడ్డలను పెంచు జీవుల) కోవకు చెందిన మహాగజము (మేమత్)లు రూపొందినవి. ఆ యుగాంతమున విచిత్ర సరీసృపజాతి అంతరించినను, ఈ మహా గజ జాతి అంతరింపక నిలిచి, వర్తమానకాలపు (5) నవజీవక (సీనోజోయిక్) యుగమున క్రమపరిణతిచెంది నేటి ఏనుగుగ రూపొందినది. ఈ నవజీవక యుగమున రూపొందిన తక్కిన సస్తన జాతులలో అత్యుత్కృష్ట పరిణామ ఫలితముగ మానవజాతి రూపొందినది. ఇట్టి పరిణామగతిలో వానరుని నుండి క్రమదశలో మానవుడు రూపొందెనని పలువురు పండితుల అభిప్రాయము. ఈ పరిణామ వాదమునకు ఉపపత్తి బలమును చేకూర్చి, శాస్త్రీయ రూపమును సమకూర్చినవాడు ఛార్లెస్ డార్విన్ పండితుడు.

**మానవుడు - పరిణామము :** ఇటుల మానవాకృతి గల జీవులు రూపొందుట ఆరంభమై దాదాపు 550 వేల ఏండ్లు అయి ఉండునని కొందరు శాస్త్రజ్ఞుల అభిప్రాయము. ఈ కాల పరిగణనమును, ఇదివరలో తెలుపబడినవియును దాదాపు అంచనాలు మాత్రమే. ఆ యా జీవముల అవశేషములు లభ్యములగు భూమిపొరలు ఏర్పడిన కాలమును స్థూలముగ నిర్ణయించుటకు కొన్ని శాస్త్రీయ మార్గములు కలవు. వాని సాయమున ఈ కాల నిర్ణయమును శాస్త్రజ్ఞులు స్థూలరీతిగ చేయగలుగుచున్నారు. మానవ సదృశ జీవులు (హెమనాయిడ్‌లు) ఈ భూమిపై రూపొందిన తరువాత సైతము భూమ్యుపరితలమున పెక్కు మార్పులు జరిగినవి. తదాదిగ ఈ భూమియందు కొంతభాగము నాలుగు హిమప్రళయము (గ్లేషియల్) లకును, మరి కొంత భాగము నాలుగు జలప్రళయము (ప్లూవియల్) లకును లోనైనది. ఆ హిమ, జల ప్రళయములతో అప్పటికి ఉండిన జీవరాశియందు అత్యధిక భాగము అంతరించి, బహు సమర్థ సంతతి మాత్రమే కొన్ని తావులందు మిగిలి, ప్రళయానంతరము వచ్చెడి సంధికాలమున వేర్వేరు జీవ సంతతులుగ పరిణమించుటయు జరిగెడిది. అందువలన, చరిత్ర పూర్వయుగమగు అట్టి కాలమున మానవ సదృశ జీవుల పరిణామమును గ్రహించుటకు భూతత్త్వశాస్త్రము, జీవశాస్త్రము, పురాతత్త్వశాస్త్రము, మానవశాస్త్రము అను శాస్త్రములపై చరిత్ర ఆధారపడవలసి ఉన్నది. లిఖితాధారములు మృగ్యములై, పైన చెప్పబడిన శాస్త్రములవలన మాత్రమే మనకు తెలియగల ఆ కాలమును 'చరిత్ర - పూర్వయుగము' అని వ్యవహరించుట చారిత్రకులకు పరిపాటియైనది.

వానరుని నుండి తొలుతగ పరిణమించిన జీవిని 'మానవ సదృశజీవి' అని పైన వ్యవహరించితిమి ; అది సముచితమే. అతనిని మనకు నేడు వ్యక్తమగు మానవ రూపరేఖలతో పోల్చిచూచినపుడు మానవుడని అనుటకే వలనుపడదు. మానవుని వలె చక్కగ నిటారుగ నిలువబడి నడచుటకు అతడప్పటికి అలవాటుపడలేదు. ఇట్టి మానవ సదృశ జీవులలో ఒకదాని కపాలము జావాదీవిలో ఉపలబ్ధమైనది. దొరకిన స్థలమును బట్టి ఈ కపాలమును కలిగిన మానవసదృశ జీవికి 'జావా మానవుడు' అని శాస్త్రజ్ఞులు పేరిడిరి (ఇటులే ఆ తరువాత అస్థిశేషములు దొరకిన స్థలములనుబట్టి వేర్వేరు మానవ సదృశజీవులకు శాస్త్రజ్ఞులు పేరిడిరి). ఇతడు మొరటు రాతిపరికరములను వాడెడివాడు. ఇట్టి మానవసదృశుడు రాతి పరికరములకు ముందుగ ఎముకలనే పరికరములుగ ఉపయోగించి ఉండుననియు, ఇట్టి మానవ సదృశ జీవుల శిథిలాస్థులు దక్షిణ, ఆగ్నేయ ఆఫ్రికా ప్రాంతములలో లభ్యములగుటకు అవకాశములు కలవనియు కొందరు పండితుల అభిప్రాయము. జావా మానవునికన్న కొంత ఉన్నతస్థాయికి చెందినవాడు పెకినీజ్ మానవుడు (చీనాయందలి పెకింగ్‌వద్ద ఇతని కపాలము దొరకినది). ఇతడు నిప్పు చేయగలిగెననుటకు నిదర్శనములు కలవు. కాని, ఇతడును మానవ సదృశుడే. తరువాతి యుగమునకు చెందిన నియాండర్తల్ మానవుడును (నియాండర్తల్ అనునది పశ్చిమ జర్మనీయందలి ఒక ప్రదేశము), రొడీషియా (రొడీషియా అనునది ఆఫ్రికాఖండమందలి ఒక దేశము) మానవుడును పూర్వపు మానవ సదృశుల కంటె కొంత రూపపరిణతి పొందినను, మానవరూప సమగ్రతను పొందకుండిరి. వీరికి చాలకాలము తరువాతి వారని భావింపదగు గ్రిమాల్డీ మానవుడును (గ్రిమాల్డీ యనునది పశ్చిమ యూరప్‌నందలి ఒక ప్రదేశము), క్రో-మాగ్నన్ మానవుడును (క్రో-మాగ్నన్ అనునది ఫ్రాన్స్‌నందలి ఒక ప్రదేశము) నిశ్చితముగ మానవజాతికి చెందినటుల పరిగణింపదగినవారు. ఈ మానవజాతి కట్టకడపటి హిమప్రళయానంతరమున - ఇప్పటికి దాదాపుగ 25,000 ఏండ్ల క్రిందట - రూపొందెనని నిర్ణయింపబడినది. ఈ క్రో-మాగ్నన్, గ్రిమాల్డీ మానవజాతి అవశేషములు దక్షిణ ఆఫ్రికా మొదలుగ పశ్చిమ ఆసియా, దక్షిణ ఫ్రాన్స్ వరకు కాననగుచున్నవి. ఆఫ్రికా నుండియే తక్కిన తావులకు వీరు పయనించి ఉందురని పండితులలో కొందరి అభిప్రాయము [చూ. సాంఘిక శాస్త్రముల సంపుటము ఆదిమానవ వర్గములు - పు. 188; మానవ పరిణామము - పు. 603; వానరులు - పు. 673].

పైన పేర్కొనబడిన మానవ సదృశులును, మానవులును వారి అస్థి శిథిలావశేషములు కనబడినచోట మాత్రమే వసించి ఉండిరనియు, తక్కిన చోటులందు లేకుండిరనియు భావించుట తగదు. ఉదాహరణకు : పెకినీజ్ మానవుని గ్రహింతము. ఇతని కపాలమును, ఇతడు వాడిన శిలా పరికరములును చీనాయందు కనుగొనబడుట వాస్తవమే అయినను, ఇట్టి పరికరములకు సదృశములగునవి భారత దేశమందలి నర్మదానదిలోయలోను, పశ్చిమ పాకిస్తాన్ లోను లభించుచున్నవి. కావున అట్టి మానవసదృశ జాతులు ప్రపంచమున విస్తృత ప్రదేశములందు వ్యాపించి ఆకాలమున ఉండెనని భావించుట సముచితము.

ఇట్టి మానవసదృశులును, వారినుండి పరిణామ క్రమమున రూపొందిన తొలుతటి మానవులును జంతువుల వలనే ఆహార సేకరణార్థము తిరుగు జీవులుగనే

ఆనాడు ఉండిరి. కాని, జంతువులకు వేటాడి ఆహారమును గ్రహించుటకును, స్వీయరక్షణ చేసికొనుటకును వాడియగు నఖములును, దంష్ట్రలును ఉండగా, మానవునికి అట్టివి లేకుండెను. కావున ఆనాటి మానవుడు సహజముగ పరిసరములందు సులభముగ లభ్యములగుచుండిన రాయి రప్పలనే పరికరములుగ ఉపయోగించుకొనెడివాడు. తొలుత కందమూలములు మొదలగు వానిని త్రవ్వుటకు కర్రలు కూడ అతడు వాడి ఉండవచ్చును. కాని, ఆ కర్రలు త్వరలో నశించునవి కావున వాని అవశేషములు మనకు లభించుట లేదు. ఆనాడు మానవులు వసించినవిగ గుర్తింపగలిగిన భూమి పొరలందును, గుహలందును మనకు లభ్యమగునవి రాతి పరికరములు. ఇవి తొలుత చాల మోటుగ ఉండెడివి. కాని, అభ్యసనము, ఆవశ్యకత మొదలగు వానివలన క్రమగతిలో కొన్ని వేల ఏండ్లకు మానవుడు ఈ రాతి పరికరములనే కుశలతతో వివిధ రీతుల తన అవసరములకు తగినటుల నిర్మింప నేర్చెను. ఇటుల రాతిపరికరములను మాత్రమే వాడుచు పురోగమించిన విస్తృత కాలమును 'శిలాయుగము' అని పురాతత్త్వవేత్తలు వ్యవహరింతురు. అందును ఆ పరికరములలో మోటుగ ఉండినవి వాడబడిన కాలమును 'ప్రాచీన శిలాయుగ' మనియు, ఆ పరికరముల నిర్మాణమున కుశలత సాధించి వాడిన కాలమును 'నవీన శిలాయుగ' మనియు వారు సౌకర్యార్థము విభజించిరి [చూ. సాంఘిక శాస్త్రముల సంపుటము - సమీక్ష పుట. 21 - 40].

## ప్రాచీన శిలాయుగము

ప్రాచీన శిలాయుగమున మానవుడు మృగము వలెనే నైసర్గిక పరిస్థితులకు బానిసయై ఉండెను. మానవుడు ఆనాడుండిన దశనే 'మృగయాదశ' అని శాస్త్రజ్ఞులు వ్యవహరింతురు. చుట్టుప్రక్కల నుండు ఆకలములు, కందమూలములు, తాను వేటాడి చంపిన జంతువుల మాంసము అతని ఆహార పదార్థములు. చాల కాలము ఈ ఆహారమునైనను, అపక్వమైన దానినే తినుచుండెను. ఈ స్థితిలో గృహ నిర్మాణమును గురించి అతనికేమియు తెలియకుండెను. మృగములవలె గుహలలోనో, చెట్ల తొర్రలలోనో, పక్షులవలె చెట్లమీదనో అప్పటివారు వసించుచుండిరి. ఆహార సేకరణకై ప్రకృతిమీద సంపూర్ణముగ ఆధారపడిన వారికి, ఆహారపదార్థములు తాము వసించిన చోట కరవైనంతనే ఇతర స్థలములకు వెళ్లక తప్పదు. దీనిచే వీరికి నిలుకడయనునది లేక ఒకచోటినుండి మరియొక చోటికి పోవుచుండుటవలన ఇండ్లుగాని, పాత్రసామగ్రిగాని లేకుండెను. అహర్నిశము ఆహారమునకై శ్రమపడుచుండు వారు అగుటచే కొన్ని వందల తరములు మారినను, వీరి అభివృద్ధి బహు స్వల్పముగనే ఉండెను. ఆ దశలో మానవునికి దుస్తుల ఆవశ్యకత అంతగ ఉండినటుల తోచదు. 'లజ్జ' అను దానిని మానవుడు అప్పటికి గుర్తించి ఉండడు. ఆనాటి మానవులు శరీరమును చలినుండి కాపాడుకొనుటకై చర్మమునో, చెట్టు పట్టనో కప్పుకొనెడివారు. ఆ ప్రాచీన శిలాయుగపు అంతమున ఇదివరలో పేర్కొనబడిన గ్రిమాల్డీ, క్రో-మాగ్నన్ మానవ జాతులు పరిణమించెనని శాస్త్రజ్ఞుల అభిప్రాయము.

## నవీన శిలాయుగము

అచ్చముగ మానవులని చెప్పదగు గ్రిమాల్డీ, క్రో-మాగ్నన్ మానవ జాతులు రూపొందిన వెనుక మానవుడు త్వరితముగ పురోగమింపగలిగి నవీన శిలాయుగమున కాలిడెను. తాను ఉపయోగించు శిలాపరికరములను సున్నితముగ చేయుట అతడు క్రమముగ నేర్చెను. పరికరములను చేయుటకు కొన్ని మూలపరికరములను నిర్మించుట గూడ అతడు నేర్చెను. అంతియేకాదు; అరణ్యమునందలి కొన్ని పశువులను వశపరచుకొని, మచ్చికచేసి, పెంచుటకును అతడు మొదలిడెను. మానవ పరిణామగతిలోని ఈ దశను 'పశుపాలనదశ' అని చరిత్ర రచయితలు వ్యవహరింతురు. ఈ దశయందు మానవుడు కొంతవరకు స్థిరజీవనమును ఏర్పరచుకొనుటకు యత్నించినటుల కానవచ్చును. వేటాడుటకై పోయినప్పుడు తాత్కాలికముగ ఆలుబిడ్డలను ఒకచోట విడిచివెళ్లి వేట పూర్తియైనంతనే అచ్చటికి తిరిగి వచ్చుటలో ఆ స్థిర జీవనాంకురము వ్యక్తమగుచున్నది. ఈ దశయందు జంతువులను పెంచుటతో పాటుగ కొలది ధాన్యమును పండించుటకు కూడ మానవుడు అలవాటుపడెను. అయినను తొలుత కొంతకాలము మృగయాదశయందలి మానవునివలె అనుదినము మాంసాహారమునకై తిరిగెడి పనియును ఉండెడిది. తాము మచ్చికచేసి పెంచిన పశుగణమునకు మేత ఎచ్చట సమృద్ధిగ ఉండునో ఆ ప్రదేశములందు కొంతకాలము నివసించి, అది తరగిపోయినంతనే మరియొకచోటికి ఆనాటి మానవులు పోవుచుండిరి. ఈ దశలో జంతువుల వేటాడుటకంటె పశుపాలనమే వారి ముఖ్యాలంబనము. పశువులను పోషించుటను, పంటలు పండించుటను నేర్చినంతనే మానవుడు తన సంరక్షణకును, తన పశువుల సంరక్షణమునకును క్రమముగ ఒక అనుకూల వసతిని చూచుకొనవలసి వచ్చినది.

నవీనశిలాయుగమున ప్రపంచ మానవుడు ఏనాడు కాలిడగలిగెననుటకు నిశ్చితమగు సమాధానము లభ్యము కాజాలదు, గ్రిమాల్డీ, క్రో - మాగ్నన్ మానవులు ఈ యుగపు దశకు క్రీ. పూ. 10,000 ఏండ్ల క్రిందటనే రాగలిగిరనియు, పశ్చిమ ఆసియా, దక్షిణ ఆసియా, ఉత్తర ఆఫ్రికా ప్రాంతములందు అంతకు పూర్వమే మానవజాతి ఈ నవీన శిలాయుగ దశకు వచ్చి ఉండెననియు పండితుల అభిప్రాయము. ఇటుల ప్రపంచమున వేర్వేరు ప్రాంతములందు అచ్చటి పరిసరముల ప్రభావమును అనుసరించి మానవుడు వేర్వేరు కాలములందు నవీన శిలాయుగ సంస్కృతిని అందుకొనగలిగెను. కొన్ని తావులందు - ఆస్ట్రేలియాకు దక్షిణమున ఉన్న టాస్‌మేనియా దీవి మొదలగు ప్రాంతములందు ఉన్న రీతిగ - మానవుడు నవీన శిలాయుగమున సరిగ కాలిడని పరిస్థితిలోనే ఈనాడును ఉన్నాడు.

ప్రాచీన, నవీన శిలాయుగముల నాటి మానవుల జీవిత విధానమును గురించి మనకు తెలియజేయు వానిలో ముఖ్యాధారములు వారి శిలాపరికరములు. ఈ పరికరములందలి పెక్కురకములు ఒకే స్థలమున కనబడినచో వానికి ‘పరిశ్రమలు’ అనియు, ఇట్టి పరిశ్రమల వర్గములు విస్తృతముగ అటనట విశాల భూఖండమున ఒకే ఒక కాలస్థాయికి చెందు రీతిగా లభ్యమగు నెడల ఆ భూఖండమునందు అంతట ఒకే ఒక ‘సంస్కృతి’ వ్యాపించి ఉండెననియు పురాతత్వ మానవశాస్త్రవేత్తలు పారిభాషికరీతిలో పేర్కొనెదరు. ఇటుల సంస్కృతుల వింగడించి మానవ పురోగతిని శాస్త్రజ్ఞులు నిర్ణయించుచున్నారు. ఇందులకు తోడుగ ప్రాచీన, నవీన శిలాయుగ దశలనుండి వెలువడని స్థితిలో ప్రపంచమున అటనట కన్పట్టు మానవ వర్గముల జీవన విధానము ననుసరించి వారి మనోవృత్తిని గుర్తెరిగిన పండితులు తమ కృషి మూలమున దాదాపు ఇట్టి స్థాయిలో ఉండిన ఆ ప్రాచీన, నవీన శిలాయుగపు మానవుల కృషి, ధార్మిక భావనా వ్యవస్థలను గురించిన వివరములను తెలియజేయగలిగిరి. వానిని సంగ్రహముగ మాత్రమే ఇచ్చట తెలుప వీలగును.

**శిలా యుగము - కళా కౌశలములు :** శిలాయుగమందలి మానవుల కృషికి ముఖ్య సాధనములగు శిలా పరికరముల పరిణామ రీతి వారి నిపుణతయందు కలిగిన క్రమాభివృద్ధిని ద్యోతకము చేయుచున్నది. నవీన శిలాయుగము ఆరంభమగునాటికి మానవుడు రాతితోపాటుగ కర్ర, ఎముక, ఏనుగు దంతములతో కూడ పరికరములను నిర్మింపగలిగెను. వస్తువులను అరగదీసి, చెక్కి, నునుపుచేయుట, కొన్ని పరికరములకు కర్ర మొదలగు వానిని జోడించుటకు రంధ్రములు వేయుట అతడు సాధింపగలిగెను. ఈ నేర్పు క్రమముగ రెండు మూడు వస్తువుల సంధానించి ఒక నూతన పరికరమును నిర్మించుటకు దారితీసెను. ఇంతటితో మానవుడు నిర్మాణవిద్యయందు మొదటి పాఠమును నేర్వగలిగెనని చెప్పవచ్చును. చర్మములు మొదలగు వానితో దుస్తులను నిర్మించుకొనుటకుగాను ఒక రకపు సూదిని కూడ అతడు రూపొందించెను. ప్రాచీన శిలాయుగాంతమున వేటాడుటకు వలయు బల్లెములను, ఆభరణార్థమై చిల్లుల గవ్వలదండలను, దంతపు ముక్కుపుడకలను నాటి మానవుడు తయారుచేసెను. ఆ కాలముననే మానవావాసములును నిర్మితములు కాదొడగెను. సైబీరియా యందును, దక్షిణ రష్యాయందును నాటి మానవుల నివాసములు కొన్ని కనుగొనబడినవి. ఒక పెద్ద బొరియ త్రవ్వి కొన్ని వాసముల నిలువబెట్టి పైన చర్మములనుకప్పి ఆనాటి వారు నివాసములను తొలుతగ ఏర్పరచుకొనిరి. నిప్పుచేయుటను ప్రాచీన శిలాయుగముననే మానవుడు నేర్వ గలిగెను. నవీన శిలాయుగమున స్థిరనివాసమును ప్రోత్సహించు పరిస్థితులు ఏర్పడినంతనే తమకు అప్పుడున్న సాధనసంపత్తితోనే నూతన పరికరములను మానవుడు నిర్మింపసాగెను. కర్రతో త్రవ్వి విత్తనముల విత్తుటతో అతడు వ్యవసాయమును మొదలిడి ఉండును. క్రమగతిలో వివిధాహార ధాన్యములను కనుగొనుట అతనికి సాధ్యమయ్యెను. నాటి నాగలి అచ్చముగ కర్రతో చేయబడి ఉండెడిది. చెకుముకిరాతి ముక్కలను పండ్లవలె వంకర కర్ర చట్రమున ఇమిడ్చి కొడవలిగ నవీన శిలాయుగ మానవులు వాడెడివారు. గొర్రెలను, మేకలను, ఆవులను, పందులను వారు పెంపకము చేసెడివారు. యూరప్‌నందలి నవీనశిలాయుగ సంఘములలో పై వానికి తోడుగ కుక్క సైతము ఉండెడిదని తెలియవచ్చుచున్నది. బరువులు మోయుటకు గాడిదలను ఎక్కువగ వాడెడివారు. క్రమముగ దుస్తుల వాడకము పెరిగి బొచ్చుతోను, చర్మములతోను వానిని తయారుచేయుట సాధ్యమైనది. దక్షిణ అరేబియా, సింధు నదీ తీర ప్రాంతములందలి నవీనశిలాయుగ మానవ సంఘములలో ప్రత్తినుండి దారమును తీయుట అప్పటికే మొదలిడబడి ఉండునని కొందరి తలంపు. మానవావాసముల నిర్మాణము కర్రతోనే ఆ నాడును చేయబడినను, నవీన శిలాయుగాంతమునకు వానియందు వైవిధ్యము, నిర్మాణ చతురత ఎక్కువగ కుదురుకొనినవి. బుట్టల అల్లిక, కుండలు చేయుట ఆ కాలముననే చాల పరిణతిని ఆర్జించినవి. కుమ్మరి సారెను

ఆనాటి సంఘము కనుగొని దానిని చక్కగ వినియోగింప నేర్చెను. బుట్టల అల్లికకును, గుడ్డల నేతకును కల సంబంధము అతిసన్నిహితము. కావున ఈ బుట్టల అల్లికలోని కుశలతయే నవీన శిలాయుగ మానవునికి నేత పనిలో చతురతను కల్పించుటకు తోడ్పడియుండును [చూ. సాంఘిక శాస్త్రముల సంపుటము - కుమ్మరి పరిశ్రమ; చక్రము; బుట్టల అల్లకము].

**శిలాయుగము - ధార్మిక భావన :** శిలాయుగము నందలి మానవులకు భగవంతుని అస్తిత్వము మొదలగు వాని ఎడ ఉండిన భావనలు మనకు నిర్దిష్టముగ తెలియ వచ్చుటలేదు. కాని, పరలోకమున వారికి నమ్మకము ఉండెనని మాత్రము విశ్వసించుటకు ఆధారములు కలవు. నియాండర్తల్ మానవులు చనిపోయిన వానిని కుండలో ఆసీనునిగచేసి పూడ్చిపెట్టి, ఆ గోతిలోనే మృతుని ఉపయోగార్థము ఆహారాదులను ఉంచెడివారు. అంతియే కాక కొన్ని లౌకికాతీత విషయములయెడ కూడ వారికి విశ్వాసము ఉండెడిదని తెలియవచ్చినది. ఆనాటి మానవులు గుహలందు లిఖించిన చిత్రములు కొన్ని మనకు లభించుచున్నవి. వీనిలో కొన్ని తాంత్రిక చిత్రములను పోలి ఉన్నవి. ఇట్టివాని ఆరాధనవలన సంతతియు, సంపదయు వర్ధిల్లునని వారు విశ్వసించి ఉందురు. చిత్ర విచిత్ర వేషములతో మానవులు నాట్యమాడుటయు అందు చిత్రింపబడినది. ఈ నాట్యము సైతము ఆరాధనలో ఒక అంతర్భాగమై ఉండును. ఇట్టి నాట్యములను మనము ఈనాడును కొన్ని ఆటవికజాతులందు చూచుచున్నాము. ప్రాచీన శిలాయుగము అంతమగునాటికి మానవులలో మృతులను గురించిన అభిప్రాయములందు కొలది మార్పు కలిగెను. అదివరలో తాము న్న గుహలలోనే తమ మధ్యనే మృతుని వారు పాతిపెట్టెడివారు. కాని, క్రమముగ ఈ అలవాటునకు స్వస్తిచెప్పి, కళేబరములను దూరముగ పూడ్చిపెట్టి గోరీలను పోలువానిని శిలలతో నిర్మించుట ఆరంభమయ్యెను. నవీన శిలాయుగకాలమున ప్రకృతి పరిశీలనవలన మానవునియందు సృష్టిని గురించిన నూతన భావములు మొలకెత్త మొదలిడెను. సంవత్సరాంతమున కనుమరుగైపోయిన ప్రకృతి శోభ నూతన సంవత్సరమున పునరుత్పత్తిని చెందుటను గమనించిన మానవుడు ఒక దైవశక్తి తిరోహితమై, మరల నూతన శోభతో తన కడకు వచ్చుటగ దానిని సంభావించి ఉండును. అట్టి దివ్యశక్తిని ఉదయమున, అస్తమయమున తగు కర్మకాండతో అర్చించి సంతృప్తిపరచుటయే తన విధిగ అతడు భావించి బలినొసగి దానిని ఆరాధించుట ఆరంభించెను. ఇది జంతుబలిగ మాత్రమే కాక నరబలిగ సైతము ఉండెడిది. ఈ విధముగనే పితృదేవతారాధన, మంత్ర, యంత్ర, తంత్రము లందు గాఢ విశ్వాసములు విస్తరించినవి. క్రమముగ ఈ ఆరాధనలయందును, మంత్ర తంత్రములందును సమధిగతుడుగ కన్పట్టువాడు లౌకికాతీత శక్తికలవాడను అంధవిశ్వాసమును, దానితోపాటుగ అట్టి వానిపై భక్తియు నెలకొన మొదలిడినవి [చూ. సాంఘికశాస్త్రముల సంపుటము - నరబలి - పు. 443; పితృపూజ - పు. 496].

**శిలాయుగము - సంఘ వ్యవస్థ :** శిలాయుగము నందలి మానవ వ్యవస్థా పరిణామమును గురించి పరిశీలించిన మానవ, సాంఘిక విజ్ఞానవేత్తలు పెక్కు విషయములను తెలియజేయగలిగిరి. ప్రాచీన శిలాయుగమున మృగయాదశలో ఉన్నప్పుడు జన్య జనక సంబంధమే తక్కిన సంబంధములకన్న గాఢతరమై ఉండుటవలన తెగ ఆధారముగ సంఘము రూపొందినదని వీరిలో పలువురి అభిప్రాయము. దీనిని అంగీకరింపని శాస్త్రజ్ఞులును కొందరు కలరు. జాతి - అనగా వివిధ తెగల సమూహమే - సంఘస్థితికి ఆనాడు ఆధారమై ఉండునని వారనెదరు. ఒకవేళ తెగయే తొలుతటి రూపమైనను నవీన శిలాయుగమున మానవులు స్వీయరక్షణకై ఎక్కువ కృషి చేయవలసి వచ్చినందున ఆనాటికి తెగలు జాతియందు అంతర్భాగములుగ పరిణమించి ఉండవచ్చును. జాతి కానిండు; తెగ కానిండు; దాని పురోగతి అంతయు దాని నాయకులపై ఆధారపడి ఉండెడిది. చక్కగ నడపి, తన అధీనముననున్న మానవులను ముందుకు కొనిపోయిన ఈ నాయకుని లేదా నాయకుల అధికారము ఇంకను పటుతరమగుచు ఉండెడిది. వారికి లౌకికాతీత శక్తులను వారి అనుచరులు అంటగట్టెడివారు. ఇట్టి నాయకులే పలు సంఘములందు పురాణ పురుషుల స్థాయిని అందుకొనగలిగిరి. ఇచట మరొక విషయము కూడ గమనింపవలసి ఉన్నది. తొలుత మానవులందు కుటుంబము మాతృక్రమానుగతమై ఉండెనని కొందరి శాస్త్రజ్ఞుల అభిప్రాయము. ఈ సిద్ధాంతమునకు కొందరి దృష్టిలో అపవాదములు కలవు. కాని, నవీన శిలాయుగమునాటికి వ్యవసాయ పశుపాలనాదులందు పురుషునికి గల ప్రాముఖ్యమును అనుసరించి కుటుంబము పితృక్రమానుగతముగ రూపొందక తప్పలేదు [చూ. సాంఘికశాస్త్రముల సంపుటము - పితృక్రమానుగత సంప్రదాయము - పు. 496; మాతృక్రమానుగత సంప్రదాయము - పు. 603]. ఇక మానవులందు భాషయనునది ఏనాడు రూపొంద మొదలిడెనను విషయమున ఇప్పటికి ఎవరును ఎట్టి నిర్దిష్టాభిప్రాయమును వెలువరింప

లేదు. కాని, మానవ వ్యవస్థకు అంకురార్పణ జరిగిన కాలమున విధి నిషేధములను తెలియజేయు అవసరము కలిగి అందువలన భాష రూపొంది ఉండునని పలువురు విశ్వసింతురు [చూ. సంపుటము 6 : పు. 5].

పైన ఉదాహరింపబడిన ప్రాచీన శిలాయుగ, నవీన శిలాయుగ పరిణామములు ప్రపంచమునందు ఎల్లెడల కన్పట్టుచున్నను, ఆ పరిణామ గతిలో కాల భేదములు ద్యోతకములు అగుచున్నవి. పశ్చిమ ఆసియా, ఉత్తర ఆఫ్రికా, సింధు ప్రాంతము మొదలగు వానియందు నవీన శిలాయుగము దాదాపు క్రీ. పూ. 12,000 లో ఆరంభమై, క్రీ. పూ. 5,000 కు పూర్వముననే అంతమైనది. కాని, క్రీ. పూ. 2,000 ప్రాంతమున కూడ చీనాయందు నవీన శిలాయుగ లక్షణములు కన్పట్టుచుండినవి. ఇండో-చీనాలో ఒక సంస్కృతి ఇటీవల కనుగొనబడినది. దీనిని పరిసర ప్రదేశములనుబట్టి సోమ్రాంగ్-సెన్ సంస్కృతి అని వ్యవహరింతురు. క్రీ. పూ. 2,000 కంటె ఈ సంస్కృతికి ప్రాచీనత ఉండదని పండితుల అభిప్రాయము. పశ్చిమ ఆసియాయందు నవీన శిలాయుగము అంతరించిన తరువాత చాలకాలము వరకు యూరప్‌వాసులు నవీన శిలాయుగముననే ఉండిరి. ఆ యుగమున స్విజర్లండ్‌లో వసించిన మానవులు సరోవరములలో నీటి మధ్యను పాతిన కర్రలపై కర్రతడికను కట్టి దానిమీద గుడిసెలు కట్టుకొనెడివారు.

ప్రపంచమున ఒక్కొక్కప్పుడు ఒక్కొక్క రీతిగ జరిగిన ఇట్టి పరిణామముల మూలముననే రూప, వర్ణములందు వైవిధ్యముకల వివిధ మానవజాతులు ఉదయించినవి. కాని, ఈ జాతులు ఏవియు కలకాలము ఒక దానినుండి ఒకటి వైదొలగి ఉండలేదు. నవీన శిలాయుగము ముగియుటకు పూర్వముననే ఆఫ్రికాయందలి గోధుమవన్నె జాతులును, నల్లజాతులును సంకరమొందినవి. అటులే పశ్చిమ ఆసియా, దక్షిణ ఆసియాలలోకూడ ఆ కాలముననే జరిగినది. తూర్పు ఆసియాలోని మానవజాతి కొంత కాలము తక్కిన జాతులకు విడివడి ఉండెను. కాని, అచటి నవీన శిలాయుగమున అందలి కొన్ని వర్గములు ఉత్తర అమెరికాకును, అటనుండి దక్షిణ అమెరికాకును పోయినవి. ఆసియా, ఉత్తర అమెరికాల మధ్య నేడున్న బేరింగ్ జలసంధి ఆనాడు భూసంధిగ ఉండుటవలన ఇట్టి రాకపోకలు జరుగుటకు వసతి ఉండినది. నవీన శిలాయుగ కాలముననే ఈ తూర్పు ఆసియా జాతులును తక్కిన ఆసియా జాతులతో సాన్నిహిత్యమును ఆర్జించుకొనినవి.

ప్రపంచమున తక్కిన నవీన శిలాయుగ సంస్కృతుల కంటె ముందుగ పురోగమింప గలిగిన దక్షిణ, పశ్చిమ ఆసియా వాసులును, ఉత్తర ఆఫ్రికా వాసులును క్రమముగ ధాతువుల వాడుకను గుర్తెరింగిరి. దాదాపు క్రీ. పూ. 5,000 లో ఇది సంఘటిల్లి ఉండునని పండితుల అభిప్రాయము. అటనుండి 'ధాతు యుగము' అని శాస్త్రజ్ఞులు వ్యవహరింతురు. ఈ ధాతువులలో తొలుత కంచు కనుగొనబడెనని కొందరి అభిప్రాయము. అటులగాక రాగియే తొలుత కనుగొనబడెనని మరికొందరు అభిప్రాయపడిరి. ఇది ఎటులున్నను, క్రీ. పూ. 3,500 నాటికి దక్షిణ మెసపొటేమియా [చూ. ఇరాక్] లో రాగి వాడబడుచుండెననుట సువిదితము. అచటనుండి త్వరితగతిలో ధాతు పరికరములు ఆ ప్రాంతములందు సర్వత్ర వాడుకకు వచ్చినవి. రాగితోపాటుగ వెండి, బంగారము కనుగొనబడినవి. కాని, వానికి ఆ తరువాత అబ్బిన ఘనత ఆనాటికి ప్రాప్తింపలేదు. ఈ ధాతువులు ఏ కొన్ని ప్రదేశములలోనో లభ్యమగునవి అగుటవలన వానిని దూర ప్రాంతములనుండి కొనివచ్చుటకై రాకపోకల సాధనములు అభివృద్ధి చెందెను. చక్రములుకల బండియు అంతట రూపొందెను. అంతియేకాదు; తీరమును ఆశ్రయించి దూరదేశములకు పోవుటకు అనువగు చిన్న నౌకలును నిర్మితములు కాదొడగెను. క్రమముగ తమ ఆకాంక్షలను పరస్పరము తెలియజేసికొనుటకు ఆవశ్యకత ఏర్పడుటతో లిపి రూపొందెను. అంతటితో చరిత్ర పూర్వయుగము కడచని చారిత్రక కాలమున ప్రాచీనయుగము ఉదయమయ్యెను.

చీ. శే. రా.

# ప్రాచీన యుగము

(క్రీ. పూ. 3500 ర - క్రీ. పూ. 525)

నవీనశిలాయుగమునందలి మానవ నివాసములు క్రమ పరిణామమంది ధాతువుల వాడుకకు అలవడినంతట మానవ నాగరకతా వికాసమునకు శ్రీకారము చుట్టబడినదనవచ్చును. దాదాపు క్రీ. పూ. 3500 లో మొదలిడిన ఈ మార్పు క్రీ. పూ. 3000 నాటికి కొంత పరిణతిని ఆర్జించినది. ఈ పరిణతియు ప్రపంచమునందు ఎల్లెడల రూపొందలేదు. స్వాభావిక భౌగోళిక పరిస్థితులు అందులకు అనుకూలముగ ఉండి, అధిక శ్రమ లేకుండ మానవులు తమకు కావలసిన ఆహారాదులను పొంద వీలయిన కొన్ని నదీ తటములందు మాత్రమే అది సంఘటిల్లినది.




ప్రాచీన నాగరకతా కేంద్రములు

## ప్రాచీన నాగరకతా కేంద్రములు

పశ్చిమమున ఉత్తర ఆఫ్రికా యందలి సహారా ఎడారి తూర్పు సరిహద్దు మొదలుకొని తూర్పున భారతదేశము నందలి ఆరావళీపర్వతములవరకు ఉన్న విస్తృత ప్రదేశమున అటనట వివిధ కేంద్రములందు ఈ నాగరకతా వికసనము తొలుత రూపొందినటుల భావింపవచ్చును. ఈ ప్రదేశమునకు ఉత్తరమున కాకసస్, ఎల్‌బర్జ్, హిందూకుష్ పర్వతములును, దక్షిణమున కర్కటక రేఖయు సరిహద్దులుగ ఉండెనని పరిగణింపదగును. ఇందు మూడు విభిన్న మండలములు: (1) నైలునదీ తటభూమి; (2) యూఫ్రటీస్ - టైగ్రిస్ నదుల మధ్య భూమి; (3) సింధు నదీ పరిసర భూమి అనునవి ఆనాటి నాగరకతలకు ఆలవాలములుగ ఉండినవి. ఆ నాగరకతలను క్రమముగ ఈజిప్టు నాగరకత, సుమేర్ - బాబిలోనియా నాగరకత, సింధు నాగరకత అని చారిత్రకులు వ్యవహరింతురు.

ఈ ప్రాచీననాగరకతలను గురించిన వివరములను అనేకములను చారిత్రకులు తమ నిరంతర కృషి మూలమున వెలువరింపగలిగిరి. ఇంకను ఆ ప్రాచీన కాలపు విశేషములు అనేకములు తెలియవలసి ఉన్నవి. అట్టి పరిశోధన కొరకై తమ జీవితములను అంకితములనొనర్చిన పండితులు పలువురు ఈ నాటికిని కృషి చేయుటవలన నానాట ఆ ప్రాచీన నాగరకతను గురించిన మన పరిజ్ఞానము విపులతర మగుచున్నది. వీనిలో ఈజిప్టునాగరకతను గురించిన కొన్ని విషయములు తొలుతటి నుండియు గ్రీక్ రచయితల వ్రాతలవలన యూరప్‌వాసులకు సుపరిచితములై ఉండినవి. క్రీ. పూ. 3 వ శతాబ్దమున ఈజిప్టులో వసించిన 'మెనెతో' అను పండితుడు అప్పటికి తనకు లభ్యములుగ ఉండిన ప్రాచీన ఈజిప్టు భాషాగ్రంథముల సహాయమున ఆ దేశపు ప్రాచీన పాలకుల వంశావళిని గ్రీక్ భాషయందు రచించెను. అయినను, తరువాతి కాలము వారికి ఆ గ్రంథము ఖిల రూపమున మాత్రమే లభ్యమగుటవలన ఈజిప్టు ప్రాచీన చరిత్రను గురించిన వివరములు రేఖామాత్రముగనే యూరప్ వాసులగు పండితులకు 18 వ శతాబ్ది అంతము వరకు పరిచితములైనవి. ఈజిప్టునందు అటనట చెదరి ఉండిన ప్రాచీన నిర్మాణావశేషములందు చిత్రలిపిలో వ్రాయబడి ఉన్న ప్రాచీన శాసనములను వారెవరును చదువలేక పోవుటచే ఈజిప్టు ప్రాచీన చరిత్రను గురించిన పరిజ్ఞానము అప్పటివరకు ఈ రీతిగ అసమగ్రముగ మాత్రమే ఉండెను. తరువాత ప్రాచీన ఈజిప్టు లిపులతోపాటుగ గ్రీక్ లిపియును కల రొసెట్టాశిల [చూ.] పండితులకు లభ్యమైనందున (1798) అందలి సుపరిచిత గ్రీక్ లిపి మూలమున ప్రాచీన ఈజిప్టునందలి చిత్రలిపి స్వరూపమును వారు సాధింపగలిగి, దేశమున కన్పట్టు ప్రాచీన శాసనములను, ప్రాచీన రాజుల సమాధు [చూ. పిరమిడ్] లందు కన్పట్టు లేఖనములను పఠించి తమకు ఇదివరకే సుపరిచితములుగ ఉండిన మెనెతో వ్రాతలతో వానికి సమన్వయము కుదిర్చి, ఈజిప్టు ప్రాచీన చరిత్రయందలి వివిధ విషయములను చాల వరకు వెలువరింపగలిగిరి.

ఇక సుమేర్ - బాబిలోనియా నాగరకతను గురించిన వివరములు 19 వ శతాబ్ది మధ్యభాగము నుండియు పండితులు సాగించిన కృషివలన చాలవరకు లభించినవి; ఇంకను లభించుచున్నవి. ఈ నాగరకతకు ఆలవాలమగు మెసపొటేమియా ప్రాచీన నాగరకతకు నిలయమని గ్రీక్, రోమన్ చారిత్రకులును, వారి మూలమున యూరప్‌లోని పండితులును తొలుతనుండియు ఎరిగి ఉండిరి. కాని, దానిని గురించి నిర్దిష్ట పరిజ్ఞానముమాత్రము లేకుండెను. 1843 లో నేటి మొసూల్‌నగర పరిసరములందు సాగించిన త్రవ్వకములవలన ఆ నాగరకత యొక్క ప్రాచీన తమ స్వరూపము కొంతవరకు విదితమయ్యెను. నాటినుండియు శాస్త్రీయరీతిలో అన్వేషకులు సాగించిన త్రవ్వకముల ఫలితముగ వివిధ కాలములందు అట క్రమపరిణతిని పొందిన చరిత్రను గురించిన విషయములు తెలియవచ్చినవి. ఈ చరిత్రను వెలువరించుటలో ఎక్కువగ తోడ్పడినవి అందలి లిఖిత మృణ్మయ ఫలకములు. కాని, వీనియందలి లిపి చాలకాలమువరకు దురవగాహముగ ఉండినది. బాణములు లేదా మేకులవలె ఉండు సన్నని గీరలతో ఈ లిపియందలి అక్షరములు రూపొందింపబడ ఉండుటవలన ఈ లిపికి పరిశోధకులు కీల (క్యూనిఫారమ్) లిపి అని పేరిడిరి. ఈ లిపి రహస్యమును కనుగొనుటకు మార్గమును సుగమముచేసిన ఖ్యాతి హెన్రీ రాలిన్‌సన్‌కు దక్కినది. బేస్తూన్ (ఇరాన్) వద్ద మూడు భాషలలో కీల లిపియందు లిఖింపబడి ఉండిన ఒక ప్రాచీనశాసనము ఈ పరిశోధనయందు ఆతనికి సాయపడినది. ఆ శాసన భాషలలో ఒకటియగు ప్రాచీన పారసీక భాషతో అతనికి కల పరిచితి వలన అతడు ఈ కీల లిపి రహస్యమును బాగుగ గుర్తింపగలిగెను. అంతటినుండియు ఆ ప్రాచీన లిపిలో ఉన్న వివిధ ఫలకములను పండితులు పఠించి సుమేర్ - బాబిలోనియా సంస్కృతియందలి పెక్కు విషయములను ప్రపంచమునకు వెల్లడిచేసిరి. ఈజిప్టు నాగరకత కంటెను ఈ నాగరకత ప్రాచీనతరమని పండితుల అభిప్రాయము.

సింధు నాగరకత పై రెండింటికన్నను ప్రాచీనతయందు మిన్న అని కొందరి తలంపు. కాని, ఆ నాగరకతయొక్క అస్తిత్వమును గురించి ప్రపంచము 1922 వరకు ఏమియును ఎరుగదు. ఆ నాగరకతకు ఆలవాలమగు భారతదేశమున వసించు వారికి సైతము దీనిని గురించిన సంస్మృతియే లేకుండెను. 1922-23 లో ఆర్. డి. బెనర్జీ అను చారిత్ర కాన్వేషకుడు (నేటి పాకిస్తాన్‌లోని) సింధురాష్ట్రమందలి మొహెంజొదారో వద్ద ఒక శిథిల బౌద్ధ విహారమున త్రవ్వకములు సాగించుచుండగ ఒకవిధమగు చిత్రలిపిలో వ్రాతలను కలిగి ఉన్న కొన్ని ముద్రికలు (మొహరులు) వెలువడెను. ఇట్టి ముద్రికలే పంజాబ్‌నందలి హరప్పా యందును లభించెను. తరువాత ఆ యా ప్రాంతములందు శాస్త్రీయరీతిలో త్రవ్వకములు సాగింపగ, ఆనాటి ప్రాచీన జనావాసములును, నగరావశేషములును వెలువడినవి. ఈ సింధునాగరకత సింధు, పంజాబ్ రాష్ట్రములందే గాక, గుజరాత్ రాష్ట్రమునను, గంగానదీ లోయలో కొంత భాగమునకును, తీరము వెంబడిగా బెలూచిస్తాన్ వరకును వ్యాపించి ఉండినటుల విశ్వసించుటకు ఆధారములు కన్పట్టుచున్నవి. కాని, ఇట త్రవ్వకములందు కన్పించిన ముద్రికలందలి లిపి ఈనాటికిని దురవగాహముగ ఉండుట వలన ఆ నాగరకతా విశేషములు వివరముగ పేర్కొను టకు వలనుపడకున్నది. ఐనను అందు లభించిన పరికరాదుల వలన మాత్రము అప్పటి నాగరకతా స్థాయిని గురించి పండితులు కొన్ని నిర్ణయములను చేయగలిగిరి.

**ఈజిప్టు నాగరకత (క్రీ. పూ. 1790 వరకు):** ఈజిప్టునందు నైలునదీ ప్రాంతమున నాగరకతను పాదు కొల్పి పోషించిన మానవజాతి అచ్చటి దేశీయ జాతియే అగునా? అను విషయమున పండితులలో భేదాభిప్రాయ ములు కలవు. త్రవ్వకములను అనుసరించి చూడ ఈజిప్టు నందును తక్కిన ఆఫ్రికాయందు వలెనే నల్లని నీగ్రో జాతులు క్రీ. పూ. 4000 క్రిందట నవీనశిలాయుగ సంస్కృతిని అందుకొని వసించినటుల కన్పట్టుచున్నది. అయినను నైలునది ప్రాంతమున నాగరకతను పోషించినవారు గోధుమవన్నె జాతివారు. శరీరపు ఛాయయందును, రూప రేఖలందును వీరికిని, నీగ్రోలకును ఎట్టి సామ్యమును లేదు. అందువలన ఈ జాతివారు ఆఫ్రికాఖండమునకు తూర్పున సిరియాయందు ఆనాడు ఉండిన వేరొక (బహుశః సెమి టిక్) జాతివారై ఉందురనియు కొందరు పండితులు ఊహించిరి (సెమిటిక్ జాతినుండియే అరబ్బీ, హిబ్రూ భాషలు మాట్లాడు నేటి పశ్చిమ ఆసియా వాసులలో పలు వురు రూపొందిరి). కాని, ప్రాచీన ఈజిప్టు వాసుల భాష యందు సెమిటిక్ భాషా లక్షణములు చాల తక్కువగ ఉండుటచే వీరు వేరొక జాతివారై ఉందురని వేరొక వర్గపు పండితుల తలంపు. మెసపొటేమియాయందలి నాగరకతకు కారకులగు సుమేరియన్‌లకును, వీరికిని సంబం ధము ఉండునని కొందరు ఊహించిరి. ఆఫ్రికాలోనే నీగ్రో జాతితో పాటుగ గోధుమవన్నె మానవ జాతి ఒకటి తొలుత నుండియు వర్ధిల్లెననియు, ఆ రెండు జాతుల సమష్టి కృషి ఫలితమే నైలునదీ తటపు నాగరకత అనియు నవీనులలో కొందరి అభిప్రాయము. ఇవి అన్నియు దాదాపుగ ఊహలే. సరియగు ఉపపత్తి లభించువరకును, వీనిలో దేనికిని చారిత్రక యాథార్థ్యమును అంటగట్టుటకు వలనుపడదు.

ప్రాచీన ఈజిప్టునందు ప్రచారమునందుండిన పురాణ గాథలను బట్టి ఆ దేశమున తొలుతటి రాజవంశపు మూల పురుషుడు 'మెనెస్'. అతని కాలమునకు పూర్వమున నైలునదీ ప్రవాహమును అనుసరించి ఆ ప్రాంతము ఎగువ రాజ్యము, దిగువ రాజ్యము అను రెండు వేర్వేరు రాజ్యములుగ ఉండెను. వానిని రెండింటిని ఒక రాజ్య ముగ మెనెస్ రూపొందించెను. ఇతడు స్థాపించిన రాజ వంశమును అంతరింపచేసి వేరొక రాజవంశము అధికార మును ఆ తరువాత గ్రహించెనని పురాణములు పేర్కొను చున్నవి. ఈ రాజవంశమును గురించిన వివరములు అంతగ తెలియవచ్చుట లేదు. అనంతరము రాజ్యపాలనను గ్రహించిన మూడవ రాజవంశము మొదలుకొని చారిత్రక విశేషములు తెలియవచ్చుచున్నవి. మూడవ వంశమున రెండవ రాజగు తసర్త్రిస్ (జోసర్) కాలమున శిల్పాది కళలు అపూర్వ వికాసము పొందినవి. ఈ కృషియందు ఈ రాజునకు ప్రోత్సాహము కల్పించినవాడు అతని మంత్రియగు యెమ్‌హత్పి (ఇంహొతెప్). ఇతడొక అసమాన మేధావి. ప్రపంచమున నేటికిని ఆశ్చర్య జనకములుగ కన్పట్టు పిరమిడ్‌ల నిర్మాణము ఈ కాలము ననే ఆరంభమైనది. ఈ రాజవంశము అంతరించిన తరు వాత క్రమముగ పరిపాలించిన రాజవంశములలో ఆరవ రాజవంశము వరకు కళాభ్యున్నతి ఈ విధముగనే ఉండెను. ఆరవ రాజవంశపు కాలమున (క్రీ. పూ. 2,500 ప్రాంతము) పరిపాలనా యంత్రమున పటుత్వము సన్నగిల్లి, దానితో పాటుగ కళాపోషణయు అంతరించెను. తరువాత పన్రెం డవ రాజవంశపు కాలము వరకు నామమాత్రపు రాజ వంశములు పాలించినను, దేశము దాదాపు అరాచక దశలోనే ఉండెను. 12 వ రాజవంశపు మూలపురుషుడగు 'అమెనేమెత్' కాలమున ఈ రాజ్యము మరల తన పూర్వ వైభవమును సంతరించుకొనెను. తరువాత అధికారమునకు

వచ్చిన 13 వ రాజవంశమును అంతరింపజేసి 'హిక్సాస్' అను ఆసియావాసయోధజాతి ఈజిప్టును ఆక్రమించినది (క్రీ. పూ. 1790).

**సుమేర్ - బాబిలోనియా నాగరకత** (క్రీ. పూ. 1686 వరకు): ఈజిప్టు నాగరతకు మూలమగు మానవ జాతిని గురించి వివిధాభిప్రాయములు ఉన్నటులనే, సుమేర్ - బాబిలోనియా నాగరకతకు మూలకారణమగు సుమేర్ జాతిని గురించి కూడ పండితులలో అభిప్రాయభేదములు కలవు. ఈ నాగరకతకు ఆలంబనమగు మెసపొటేమియాయందు నవీనశిలాయుగమున వసించిన జాతులు సెమిటిక్ మానవశాఖకు చెందినవిగ తెలియవచ్చుచున్నవి. వీనికి తోడుగ అచ్చటచ్చట నీగ్రో సన్నిహిత జాతులు కూడ అచట ఉండినటుల నిదర్శనములు కలవు. కాని, సుమేరియన్‌లు మాత్రము ఈ రెండు జాతులకును చెందని వారుగ వారి భాషను బట్టియేకాక, అందలి మానవావశేషములనుబట్టియు రుజువగుచున్నది. వారు కుదిమట్టపు ఎత్తుగ ఉండెడివారు; విశాల కపాలము, వెడల్పు ముక్కు వారి సహజ రూపలక్షణములు. నేటి మానవ జాతులలో ఎవరికి వీరు సన్నిహితులై ఉందురను విషయమున వివిధ వివాదములు చెలరేగినవి. వీరిని భారత దేశమందలి ద్రావిడులకు సన్నిహితులుగ ఉందురని భావించినవారును కొందరు కలరు. కాని, వీరి భాషను అనుసరించి మాత్రము వీరి తొలుతటి నివాసమును గురించిన ఒక విషయము స్పష్టముగ తెలియవచ్చుచున్న దని కొందరు విజ్ఞుల భావన. వీరి భాషలో భూమికిని, కొండకును ఒకే ఒక పదము వాడబడుచున్నది. అందువలన తొలుత కొండలయందు వసించి తరువాత సారవంతమగు యూఫ్రటీస్ - టైగ్రిస్ నదీ మధ్యభూమికి వలస వచ్చి ఉందురని వారనెదరు. ఆ ప్రాచీనదేశమున ప్రచారమున ఉండిన ఒక పురాణగాథవలన కూడ తొలుత అట విజ్ఞానమును ప్రసాదించినవారు విదేశీయులనియే తెలియవచ్చుచున్నది. ఏది ఎటులున్నను వీరు ఎటనుండి వచ్చిరి అనునది మాత్రము ఇప్పటికిని తేలని విషయము.

సుమేర్‌లోని తొలుతటి నగర 'సంస్కృతులు' దాదాపు క్రీ: పూ. 3000 ప్రాంతమునకు చెందినవి. మొదట ఇట్టి నగరములు దక్షిణ దేశముననే స్థాపితములైనవి. ఈ నగరములలో ఉరుకా, ఉర్, లాగాష్, యుమ్మా నగరములు అతి ప్రాచీనములు. ఎరిడు, లర్గస నగరములు దాదాపు వానికి సమకాలీనములే అని కొందరి భావన. ఈ నగరముల మూలమున ఈ సంస్కృతి క్రమముగ ఉత్తర ప్రాంతమునకు వ్యాపించి, అట సురుప్పకా, అదబా, నిప్పుర్ నగరములు రూపొందుటకు కారణభూతమైనది. ఇంకను వీనికి ఉత్తరమున కిష్, అక్షక్ నగరములు ఉండినవి.

ఈ నగరములు తొలుత వేనికవి స్వతంత్రములుగ ఉండి వేర్వేరు రాజవంశముల పాలనలో ఉండినవి. ఆ పాలకులు నగరవాసులకు మతపీఠాధిపతులుగ తొలుత ఉండి, క్రమముగ ఆర్థిక రాజకీయాధికారముల సమకూర్చుకొని కడకు రాజత్వమును పొందిన వారలే. ఈ వివిధ నగరముల పాలకుల మధ్య యుద్ధములు నిరంతరము తొలుత జరుగుచుండెడివి. విజయము పలుమారు చేతులు మారుచుండుటచే ఆ యా పరిస్థితులను అనుసరించి ఒక్కొక్కప్పుడు ఒక నగరము కొన్ని పరిసర నగరములపై ఆధిపత్యము వహింపగలిగెడిది. ఇటుల క్రీ. పూ. 2,600 వరకును ఈ దేశము సుమేరియన్‌ల వశముననే ఉండెను. అంతట సార్గన్ అను అక్కడియన్ ప్రభువు ఈ నగరములతో సహా దేశమునంతటిని తన ఆధిపత్యములోనికి కొనివచ్చెను. ఈ అక్కడియన్‌లు సుమేర్‌కు ఉత్తరమున ఉండిన 'అక్కడ్' ప్రాంత వాసులు. వీరి భాష సెమిటిక్ భాషాకుటుంబమునకు చెందినది. అయినను, వీరు సుమేరియన్‌ల లిపి, మత, సంస్కృతులను అవలంబించి వానినే కొనసాగించిరి. సుమేర్ భాషతోపాటుగ అక్కడియన్ భాషయు వీరి పోషణను పొందినది. క్రీ. పూ. 2500 నాటికి అక్కడియన్ ప్రభు వంశపు ప్రతిష్ఠ సన్నగిలి, దక్షిణ నగరములు మరల స్వతంత్రములయ్యెను. ఇటుల పరిస్థితులు కొంతకాలము హీనస్థితిలో కొనసాగిన తరువాత 'అముర్' అను సెమిటిక్ ప్రాంతవాసులు ఈ దేశమును వశపరచుకొనిరి. వీరును అక్కడియన్ భాషను వ్యవహారభాషగను, సుమేర్ (సుమేరియన్) భాషను మత, దేవతారాధనలయందు ఉపయోగించు భాషగను స్వీకరించి, సుమేరియన్‌ల మత సంస్కృతులనే అవలంబించిరి. ఈ అముర్రీయులలో సుప్రసిద్ధతను ఆర్జించినవాడు హమ్మురబీ (క్రీ. పూ. 1728-1686 ర). ఇతడు బాబెల్ (బాబిలన్) నగరమును రాజకీయ కేంద్రముగ అభివృద్ధిపరచెను. అంతటినుండి ఈసంస్కృతికి 'బాబిలోనియన్' అనియు, దేశమునకు 'బాబిలోనియా' అనియు వ్యవహారము కలిగినది.

**సింధు నాగరకత** (క్రీ. పూ. 2000 వరకు): పైన వివరించిన ఈజిప్టు నాగరకత, సుమేర్ - బాబిలోనియా నాగరకతలకన్నను సింధునాగరకత ప్రాచీనతరమని కొందరు తలంతురు. కాని, సమకాలికమని పలువురి అభిప్రాయము. ఇచ్చటి ముఖ్యకేంద్రములు మొహెంజొదారో (సింధు), హరప్పా (పంజాబ్) అనునవి (ఈ పేరులు

ఇప్పటివి. వీనికి ప్రాచీన కాలమున ఉండిన పేరులు మనకు తెలియవు. ఇచ్చటి లిపి ఇప్పటికిని దురవగాహముగ ఉండుటవలన ఈ విషయములను మనము ఎరుగకున్నాము). వీనిలో తొలుతటిది ఆరుసార్లు తిరుగ కట్టబడినదని అచ్చటి త్రవ్వకములవలన తెలియవచ్చినది. అందులో తొలుతటి నగరము క్రీ. పూ. 3750 ప్రాంతమున నిర్మింపబడి ఉండునని భూమి పొరల లెక్కనుబట్టి అంచనా వేయబడినది. హరప్పాయందు జరిగిన త్రవ్వకములవలన ఈ నాగరకత ఇంతకన్నను ప్రాచీనమని తెలియవచ్చినది. ఈ నాగరకత యందు గమనీయమగు ఒక ప్రత్యేక విలక్షణత గోచరించుచున్నది. తొలుతటి నగరము నిర్మితమగునప్పటికే అచ్చట ప్రజలు నగర నిర్మాణ నైపుణ్యమునను, నాగరక జీవనమునను అత్యుచ్చస్థాయిని అంది ఉన్నటుల తెలియవచ్చినది. ఇట్టి ఉచ్చస్థాయిని చేరుటకు పూర్వము ఈ సింధు మానవ జాతి ఎట్టి చారిత్రక పరిణామములను పొందినదియు మనకు తెలియవచ్చుటలేదు. ఎచ్చట వీరు తొలుత వసించిరి? ఏ మార్గమున ఇచ్చటకు వచ్చిరి లేదా ఇచ్చటనే తొలుతటి నుండియు వసించిరా? అను ప్రశ్నలకు చారిత్రకులు ఇంతవరకు ఇదమిత్థమని సమాధానములను ఈయజాలకున్నారు. కాని, వీరికిని, సుమేర్ వాసులకును కల కొన్ని సామ్యములను బట్టి ఈ రెండు జాతులును ఒకే మూలజాతి నుండి విడివడి ఉండెనని కొందరు తలంచిరి. వీరు భారత దేశపు ద్రావిడులకు సన్నిహితులై ఉందురని కొందరు విజ్ఞులు ఊహించిరి. కాని, ఈ విషయమును గురించిన నిశ్చితాభిప్రాయము ఏదియు ఇప్పటికి వెలువరింపబడలేదు. ఎప్పుడు ఈ నాగరకత అంతరించినది? దీనిని అంతరింపజేసినవారు ఎవరు? అను విషయములను గురించియు అభిప్రాయభేదములు కలవు. క్రీ. పూ. 2500-2000 మధ్య కాలమున ఈ సింధు నాగరకత అంతరించి ఉండుననియు, భారతదేశమున నేటి నాగరకతకు మూల కారణముగ భావింపబడు ఆర్యజాతి అటకు క్రీ. పూ. 1500 ప్రాంతమున వచ్చి ఉండుననియు సాధారణముగ పండితులు విశ్వసించుచున్నారు కనుక సింధునాగరకతను ఆర్యులు అంతరింపజేసి ఉందరనియు, ఆ నాగరకత అంతరించుటకు వేరు కారణములు ఉండి ఉండుననియు కొందరు చారిత్రకులు అభిప్రాయపడిరి. సింధు నాగరకత అంతరించిన కాలమును గురించి కాని, ఆర్యులు భారతదేశమున నెలకొన నారంభించిన సమయమును గురించి కాని సోపపత్తికములు, సంశయరహితములు అయిన నిర్ణయములు ఇప్పటికి జరుగక పోవుటవలన, ఈ విషయమున ఇంకను పరిశోధన జరుగవలసిన ఆవశ్యకత కలదని మాత్రమే ఇట చెప్పగలము.

**మరికొన్ని సంస్కృతులు (క్రీ. పూ. 800 వరకు):** పైన పేర్కొనిన విషయములను బట్టి ఈజిప్టు, సుమేర్, సింధు ప్రాంతములందలి ప్రాచీనజాతులను లోగొన శక్తిగల హిక్సాస్‌లు, ఆర్యులు మొదలగు కొన్ని జాతులు క్రీ. పూ. 2000 తరువాత అటనట బయలుదేరినటుల సువిదితమగుచున్నది. వీరితోపాటుగ ఆ కాలమున చరిత్రగతిలో పాల్గొనగలిగిన తక్కిన జాతులలో పేర్కొనదగినవారు ఫొనీషియన్‌లు [చూ], హిబ్రూలు, సబేయన్‌లు, క్రీట్ వాసులు, హిట్టైట్‌లు, చీనీయులు. హిక్సాస్‌లు ఈజిప్టును జయించిన విషయము ఇదివరలో చెప్పబడినది [చూ. పు. 13]. వీరు సెమిటిక్ జాతివారు. సిరియా ప్రాంత వాసులు యుద్ధ విద్యయందు అతి కుశలురు అగుటవలననే వీరు ఈజిప్టు ప్రభువులను జయింపగలిగినను తక్కిన రంగములందు వీరు అంతగ అభివృద్ధిని పొందినవారు కారు. కావున ఈజిప్టు దేశీయుల సంస్కృతినే వీరు స్వీయము చేసికొనిరి. ఫొనీషియన్‌లు ఫొనీషియా దేశవాసులు. ఈ దేశము మధ్యధరా సముద్రమునకు తూర్పున ఆసియా మైనర్‌లో సముద్రమునకును, లెబనాన్ పర్వతములకును నడుమ ఉండెడిది. సెమిటిక్ జాతికి చెందిన ఈ ఫొనీషియన్‌లు వాణిజ్యమున విరివిగ ప్రసిద్ధిని ఆర్జించిరి. వారి నగరములలో ముఖ్యములు టైర్, సైడన్ అనునవి. వారికి ఒక ప్రత్యేక స్వతంత్ర సంస్కృతి లేకపోయినను ఈజిప్టు, బాబిలోనియా సంస్కృతి బీజములు వీరి మూలముగనే వీరి ఓడలు పోవుచుండిన స్థలములన్నింటికి వ్యాపించెను. హిబ్రూలు (యూదులు) ఒక ప్రత్యేక వ్యక్తిత్వము కలవారు. రాజకీయములందుకంటె ధార్మిక భావనయందు వారి పలుకుబడి తరువాతి కాలమున విరివిగ విస్తృతి చెందినది [చూ. యూదులు]. సబేయన్‌లు దక్షిణ అరేబియా వాసులగు సెమిటిక్ జాతివారు. వీరును ఫొనీషియన్‌లవలెనే రాజకీయములందుకంటె వాణిజ్య రంగముననే ఎక్కువ ప్రఖ్యాతిని ఆర్జించిరి.

క్రీట్ వాసుల సంస్కృతియు, చీనీయుల సంస్కృతియు ఈజిప్టు, బాబిలోనియా, సింధు సంస్కృతులయంత ప్రాచీనములు కాకపోయినను, హిక్సాస్‌లు మొదలగువారి సంస్కృతికంటె సనాతనములని అంగీకరింపక తప్పదు. క్రీట్ ద్వీపము మధ్యధరాసముద్ర పరివృతమై ఉన్నది. ఈజిప్టుదేశీయులే ఇట క్రీ. పూ. 3000 ప్రాంతమున వలసలను ఏర్పరచుకొని, క్రమముగ ప్రత్యేక వ్యక్తిత్వమును ఆర్జించిరని కొందరి అభిప్రాయము. గ్రీక్ పురాణములను బట్టి ఈ దేశమున తొలుత మినోస్ అను రాజును, అతని అనంతరము క్రమముగ అతని వంశీయులును పరిపాలించిరని

చెప్పబడుటచే ఇచ్చటి ప్రాచీన నాగరకతను 'మినోవా నాగరకత' అనియు వ్యవహరింతురు. ఆ ద్వీప రాజ్యమునకు నాసస్ నగరము రాజధానిగ ఉండెను. ఆనాటి ఈజిప్టు, బాబిలోనియాలలోని ప్రముఖ నగరములతోబాటు క్రీట్ ద్వీపములోని నగరములు కూడ తులతూగ గలిగి ఉండెను. చీనాయందు ఈ కాలముననే హోయాంగ్‌హోనదీ పరిసరములందు ఒక నూతన నాగరకత రూపొందగలిగెను. సమకాలికములగు తక్కిన ప్రాచీన నాగరకతలకు దీనితో గల సంబంధము చాల తక్కువ. క్రీ. పూ. 1600 ప్రాంతమున చీనాలో షాంగ్ - యిన్ రాజవంశము పరిపాలన నెరపి, నేటి అన్యాంగ్ నగర పరిసరమున తమ రాజధానిని కలిగి ఉండినటుల తెలియవచ్చుచున్నది.

హిటైట్‌లు [చూ.] ఆర్య జాతివారు (ఆర్యజాతిని గురించి ముమ్ముందు విశదీకరింపబడును). నేటి టర్కీయందలి బోగజ్ - కాయ్ పరిసరములందు వీరి రాజధాని ఉండెడిది. క్రీ. పూ. 1500 ప్రాంతమున అచ్చట చేరి వీరు బాబిలోనియన్‌లతో సాన్నిహిత్యమును అవలంబించి వారి లిపి, భాషా సంస్కృతులు గ్రహించిరి. ఇటుల చీనీయులు తప్ప తక్కిన పై జాతుల వారందరును ఈజిప్టు, బాబిలోనియా పాలకులతో మైత్రి వలన కానిండు లేదా విరోధము వలన కానిండు సంబంధము కలిగి క్రీ. పూ. 1800 తరువాత ఆ ప్రాచీన నాగరకతల పురోగతిలో పాల్గొనిరి. ఈజిప్టుపై హిక్సాస్‌లు దండయాత్ర చేసి, ఆక్రమించుకొనుటతో అయ్యది ఆరంభమైనది.

**ఈజిప్టు నాగరకత** (క్రీ. పూ. 1790-1000): ఈజిప్టును ఆక్రమించిన హిక్సాస్ జాతివారిలో క్రమముగ నాలుగు రాజవంశములు ఆ దేశమును పాలించెను. ఇవియే ఆ ప్రాచీన దేశపు చరిత్రలో 14, 15, 16, 17 రాజవంశములుగ లెక్కింపబడుచున్నవి. హిక్సాస్‌ల కాలమున ఈజిప్టు వాసులకు బాబిలోనియాతోను, ఆ కాలముననే చారిత్రక ప్రశస్తిని ఆర్జింపగలిగిన ఫొనీషియన్‌లు మొదలగు వారితోను గాఢ పరిచితి కలిగెను. క్రమముగ ఈజిప్టు దేశీయులు హిక్సాస్‌లను పారద్రోలి స్వీయరాజవంశమును ఒకదానిని ఆధిపత్యమునకు కొనివచ్చిరి (క్రీ. పూ. 1580). ఇదియే 18వ రాజవంశము. ఈ రాజవంశమునకు చెందిన థుత్మసిస్-III, అమెనోతప్-III ప్రభువులు తమ దేశమునకు ఆర్థిక సుస్థిరతను చేకూర్చుటయే కాక, తమ ఎల్లలను అతిక్రమించి యూఫ్రెటీస్ నదీ పశ్చిమతటము వరకు తమ సామ్రాజ్యమును విస్తరింపజేసిరి. చరిత్రకు తెలిసినంత వరకు ఇదియే ప్రపంచమున తొలుతటి సామ్రాజ్యము. ఈ 18వ వంశమునందలి అమెనోతప్ - IV (క్రీ. పూ. 1380-1362 ప) మహామేధావి. ఇతడు తన ప్రజలలో వ్యాప్తియందున్న అంధవిశ్వాసములను, బహుదేవతారాధనను అరికట్టుటకై మతసంస్కరణను కొనసాగింప యత్నించెను. 'అతన్' అను పేరుగల ఏకైక పరమేశ్వరుని ఉపాసించుటయే ధర్మమని అతడు బోధించి దానిని ఆచరణలోనికి కొనివచ్చుటకై కృషిచేసెను. కాని, పాత విశ్వాసములను అంటిపెట్టుకొనియున్న అతని సామంతులు ఇందువలన అతనికి విరోధులై తిరుగుబాటులు జరుపుటవలన సామ్రాజ్యము క్రమముగ అంతరించి, ఈజిప్టున 19 వ రాజవంశము స్థాపితమయ్యెను (క్రీ. పూ. 1345). ఈ రాజవంశపు రాజులు క్రీ. పూ. 1205 వరకు పరిపాలన నెరపిరి. వీరి కాలమున ఈజిప్టు సేనలు మరల ప్రాగ్దేశములను జయింపగలిగెను. హిటైట్‌లు ఈజిప్టు ప్రభువులను కొంతవరకు అరికట్టినను, కడకు వారితో సమాధానపడి మనగలిగిరి. తరువాతి రాజవంశముల కాలములలో ఈజిప్టు ప్రతిష్ఠ క్రమముగ సన్నగిలి, సామ్రాజ్యము అంతరించుటయే కాక, క్రీ. పూ. 1000 తరువాత ఈజిప్టు సయితము పలుమారులు బాబిలోనియా ప్రభువుల ఆక్రమణకు లోను కావలసివచ్చెను.

**బాబిలోనియా నాగరకత** (క్రీ. పూ. 1686-525): బాబిలోనియాయందు క్రీ. పూ. 18 వ శతాబ్దమున హమ్మురబీ పాలించుచుండిన విషయము ఇదివరకే ప్రసక్తమైనది [చూ. పు. 14]. ఇతడు తన దేశమునగల సాంప్రదాయిక శాసనములను సంస్కరించి, సువ్యవస్థిత పరిపాలన కొరకై వానిని క్రోడీకరించెను. ఇతనికి పూర్వులగు బిలలామా, ఉర్‌నమ్మూ ప్రభువులు చేసియుండిన కృషి ఈ క్రోడీకరణమున ఎక్కువగ ఇతనికి సాయపడి ఉండును. శమస్ (సూర్యభగవానుడు) ఈ శాసన సంహితను హమ్మురబీకి ప్రసాదించినటుల ఉన్న ఆనాటి శిలాఫలకము ఒకటి అన్వేషకులకు ఉపలబ్ధమైనది. అందు ఆ సంహితయందలి వివిధ నిబంధనలును కీల లిపిలో చెక్కబడి ఉన్నవి. హమ్మురబీ అనంతరమున బాబిలోనియాను పాలించిన ప్రభువులు హిటైట్‌లు, కాసీయులు, మిత్తానీలు, అసీరియన్‌లు అను పలు తెగల జాతులతో క్రమముగ సంఘర్షణకు లోనుకావలసి వచ్చెను. తత్ఫలితముగ విజయము పలుమారు చేతులు మారినది [చూ. మెసపొటేమియా]. వీరిలో కాసీయులు ఈ దేశమును దాదాపు ఆరు శతాబ్దముల కాలము పాలించిరి. అంతట అసీరియన్‌లు విజృంభించి క్రీ. పూ. 1100 మొదలుగ ఆ దేశముపై పలుమారులు దండయాత్ర సలిపి, తుదకు క్రీ. పూ. 8 వ శతాబ్ది మధ్యభాగమున తమ ఆధిపత్యమును అచ్చట దృఢముగ నెలకొల్పగలిగిరి. వీరు యుద్ధ

తంత్రమున కడు నిపుణులగుటవలన త్వరలోనే పశ్చిమమున ఈజిప్టువరకు తమ సామ్రాజ్యమును విస్తరింపజేయగలిగిరి. తమ అధీనమున ఉండిన కడమ జాతులను అణగద్రొక్కి, వారి స్వత్వములను హరించి వీరు నిర్దాక్షిణ్యాముగ పాలించుటచే, ఆ యా దళిత జాతుల సాయముతో కాల్డియన్‌లను వేరొక సెమిటిక్ జాతివారు వీరిని ఓడించి (క్రీ. పూ. 606) బాబిలోనియాయందు నూతన రాజ్యమును నెలకొలిపిరి. వీరి ఆధ్వర్యవమున దేశమున నాగరక పరిపాలన నెలకొనెను. బాబిలోనియాయందు ఇటుల ఇన్ని రాజవంశములు మారినను ఆ దేశపు ప్రాచీన లిపి, భాషా, మత, సంస్కృతులే వారికి అందరికిని ఆదరణీయములయ్యెను. ఇంతలో ఆర్యజాతియందు ఒక శాఖకు చెందిన పారసీకులు కురుష్ (సైరస్) అనువాని నాయకత్వమున సుసంఘటితులై విజృంభించి కాల్డియన్ సామ్రాజ్యమును అంతరింపజేసి, ఒక నూతన సామ్రాజ్యమునకు, అందుతోపాటుగ ఒక నూతనయుగమునకు నాందీప్రస్తావన చేసిరి. కురుష్ రాజు కుమారుడు కాంభోజ (కాంబిసిస్) చక్రవర్తి క్రీ. పూ. 525 లో ఈజిప్టుదేశమును జయించి, దానిని తన సామ్రాజ్యమున అంతర్గతము కావించుకొనెను.

ఇంతకు పూర్వమే క్రీ. పూ. 1,100 ప్రాంతమున క్రీట్ ద్వీపమునందలి మినోవానాగరకతను అంతమొందించి డోరియన్‌లు అను ఆర్యజాతి వారు ఆ ద్వీపమును ఆక్రమించిరి. నేటి గ్రీస్, ఆసియామైనర్ అందలి తీర ప్రాంతములను కూడ ఆనాడే వారు ఆక్రమించిరి. తరువాత అయోనియన్‌లు అను వేరొక ఆర్యజాతి డోరియన్‌లను ఓడించి ఆసియామైనర్ తీరప్రాంతములందు స్థావరముల నెలకొల్పెను. గ్రీస్‌నందును క్రీ. పూ. 600 నాటికే ఇట్టి వివిధ ఆర్యజాతులు నగరరాజ్యములు స్థాపించుకొనగలిగినవి.

**ఆర్య నాగరకత**: ఈ ఆర్యజాతియందలి వేరొక శాఖ భారతదేశపు వాయవ్య ప్రాంతమున క్రీ. పూ. 1500 కు పూర్వమే కాలిడి, అటనుండి విస్తరింప మొదలిడినది. ఇచట ఆర్యులను గురించి కొలది విషయములు ప్రస్తావింపదగి ఉన్నవి. ప్రపంచమందలి ప్రముఖ భాషలలో పెక్కు - యూరప్‌నందు మాట్లాడబడు ప్రముఖ భాషలలో ఫిన్నిష్ తప్ప మిగిలినవియు, పశ్చిమ ఆసియాయందలి పారసీక భాషయును, తత్సన్నిహితములగు తదితర భాషలును, భారత దేశమున మాటాడబడు ప్రముఖ భాషలలో హిందీ మొదలగు ఔత్తరాహ భాషలును - పదముల తీరు తెన్నులను పరిశీలించి చూడ అవి అన్నియు ఏక మాతృకనుండియే పరిణమించి ఉండుట నిశ్చితమని పండితులు నిర్ణయింపగలిగిరి. పై వానిలో భారతీయ భాషలకు మూల ప్రకృతియగు ప్రాచీన గీర్వాణ భాషలోని వేదములందును, ప్రాచీన పారసీక భాషయందును ప్రసక్తితమగు ఒక నామమును అనుసరించి, ఈ భాషలన్నిటికి మాతృకయగు మూల భాషను మాట్లాడిన వారిని ఆర్యులని చారిత్రకులు వ్యవహరించిరి. ఈ ఆర్యజాతి యందలి వేర్వేరు శాఖలు ఒక మూలస్థానమునుండి వివిధ కాలములందు బయలుదేరి యూరప్, ఆసియా ఖండములలోని వివిధ ప్రాంతములకు వ్యాపించిరని ఆ పండితుల అభిప్రాయము. కాని, ఆ మూలస్థానమేది ? అను విషయము మాత్రము వివాదాస్పదమైన సమస్యగ పరిణమించినది. మధ్య యూరప్ మొదలుకొని పామీర్ పీఠభూమివరకు కల వేర్వేరు ప్రాంతములను వేర్వేరు పండితులు ఆర్యుల మూలస్థానములుగ పరిగణించిరి. భారతీయ పండితులలో కొందరు భారతదేశపు వాయవ్య ప్రాంతమే ఆర్యుల తొలి నివాస స్థానమగునని అభిప్రాయపడిరి. కాని, వీనిలో ఏదియు సర్వజనామోదితము కాలేదు. ఆర్యుల తొలుతటి నివాసము ఎచటనుండినను, భారతీయార్య జాతులును పశ్చిమ ఆసియాలో తొలుతగ వ్యాపించిన హిటైట్, మిత్తాణీ, మీడు, పారసీకాది ఆర్యజాతులును పామీర్ పీఠభూమి ప్రాంతమున ఉండిన ఒకే మూలకేంద్రమున నుండి విడివడినటుల విశ్వసించుటకు ఎక్కువ ఆధారములు కలవు.

భారతదేశమున ఆర్యులు ఎపుడు కాలిడిరను విషయమున సైతము అభిప్రాయ భేదములు కలవు. కాని, క్రీ. పూ. 1500 నాటికి ఆర్యులు వాయవ్య ప్రాంతమున స్థావరములను ఏర్పరచుకొనిరనుట సునిశ్చితము. వీరి క్రమ పురోగతిని గురించి తెలిసికొనుటకు ముఖ్యసాధనము వైదిక సారస్వతము; అందును ముఖ్యమైనది ఋగ్వేదము. ఆర్యులు తమ ప్రార్థనాదులందును, యజ్ఞయాగాది కర్మకాండల సమయమునను, పూర్వ రాజన్యుల చరిత్రల సంస్మరించిన పట్టునను, దానము లొసగిన మహారాజుల సంస్తుతించుటకును, సృష్టియొక్క మూల తత్త్వమును గురించి విచారించు సందర్భమునను ఆలపించిన గీతముల సంకలిత రూపమే వేదము. ఇట్టి వేదములకు నేడు ఉపలబ్ధములగు రూపము వీనికి క్రీ. పూ. 1000 ప్రాంతమున ప్రాప్తించినదనుట యథార్థమే అయినను, ఇందలి గీతములు సనాతములు అనుట నిర్వివాదాంశము. ఈ గీతములు ఋక్కులని వ్యవహరింపబడును; ఇవి అన్నియు ఒకే పర్యాయము రచింపబడినవి కావు. ఆ యా సందర్భములందు వేర్వేరు ప్రముఖులచే అవి వెలువరింపబడి తరువాత సంకలితములైనవి. ఋక్, యజు, సామ, అధర్వములు అను నాలుగు వేదములును, బ్రాహ్మణములును, ఆరణ్యకము

లును, కొన్ని ప్రముఖ ఉపనిషత్తులును ఈ వైదిక సారస్వత ముగ పరిగణింపబడుచున్నవి. ఆర్యులు భారతదేశమున స్థావరములు ఏర్పరచుకొనినది మొదలుగ క్రీ. పూ. 600 వరకు గల మధ్యకాలమున ఇవి క్రమానుగతిలో రూపొంది నవి. వీనివలన భారతీయార్యుల చారిత్రక పరిణామగతిని తెలిసికొన వీలగుచున్నది. ఋగ్వేదకాలము నాటికి (క్రీ. పూ. 1500) ఆర్యులు నేటి పంజాబ్, రాజపుత్ర స్థానములను మాత్రమే ఆక్రమింపగలిగిరి. ఆ సందర్భమున వారు దేశమునందలి తొలుతటి జాతుల ప్రతిరోధమును ఎదుర్కొనవలసి వచ్చినదనుట ఋగ్వేదమునందలి కొన్ని ఋక్కులవలన సుస్పష్టమగుచున్నది. ఈ ఆదిమ జాతులలో కొందరు దుర్భేద్యములగు కోటలను నిర్మించుకొని నాగరకులై ఉండినటుల తెలియవచ్చినది. ఆర్యులు యుద్ధములలో ఎదుర్కొనినది సింధునాగరకతకు చెందిన వారినే అని కొందరి మతము. కాని, ఇది వివాదగ్రస్తమగు విషయము. క్రమముగ క్రీ. పూ. 800 నాటికి కోసల, విదేహ రాజ్యములును (నేటి బీహార్ వరకును) ఆర్యాక్ర మితములు అయినవి. క్రీ. పూ. 600 నాటికి ఆర్య సంస్కృతి దక్షిణమున అశ్మకము (నేటి ఆంధ్రప్రదేశ్ వాయవ్యప్రాంతము) వరకును, తూర్పున గంగానదీ ముఖ ద్వారమువరకును విస్తరించెను.

ఋగ్వేదకాలముననే ఆర్యజాతులందు కొందరు సుప్ర సిద్ధ రాజులు ఉండిరని తెలియవచ్చుచున్నది. వీరిలో ప్రముఖుడు భరతవంశమునకు చెందిన సుదాసుడు. ఇతడు తనకు ప్రతిస్పర్ధులగు ఆర్యులను, ఆర్యేతరులను ఓడించి రాజ్యమును విస్తరింపజేసెను. ఇట్టులే పలువురు రాజుల పేరులు ఆ యా సందర్భములందు కననగుచున్నవి. ఇట్టి చిన్న రాజ్యములను అన్నింటిని ఏకమొనర్చు ఒక సామ్రాట్ యొక్క ఆవశ్యకతయు పెక్కు చోటుల తెలుపబడినది. కాని, ఈ 'చక్రవర్తి' భావన ఎంతవరకు కార్యరూపము చెందినదియు తెలియబరచు నిదర్శనములు మృగ్యములు.

ఆర్యుల వ్యాప్తిని తొలుత భారతదేశమునందలి ఆదిమ వాసులు ప్రతిఘటించినను, క్రమముగ ఈ ఉభయ జాతుల మధ్య ఒక సమన్వయత సాధ్యమైనది; దేశమునందలి ప్రాచీన సంస్కృతితో ఆర్యసంస్కృతి మేళనమొంది ఒక నూతన రూపము పొందగలిగి, ఒక ప్రత్యేక వ్యక్తిత్వమును ఆర్జించినది.

**చీనా నాగరకత** (క్రీ. పూ. 1000 - క్రీ. పూ. 546): ఆర్యులు భారతదేశమున కాలిడిన కాలముననే చీనా యందును ఒక నాగరక రాజ్యము వర్ధిల్లుచుండెనను విషయము ఇదివరకే ప్రసక్తమైనది [చూ. పు. 15-16]. క్రీ. పూ. 1000 ప్రాంతమున 'చౌ' రాజవంశము అచ్చట కుదురుకొని 'వై' నదీ లోయయందలి హావ్ నగరము రాజధానిగ దీర్ఘకాలము పరిపాలన నెరపినది. ఈ రాజ వంశము కాలక్రమమున రెండు శాఖలుగ చీలగా అందలి పశ్చిమశాఖ క్రీ. పూ. 771 లో అంతరించినది; కాని, ప్రాచ్య శాఖమాత్రము క్రీ. పూ. 3 వ శతాబ్దివరకు ఆ దేశమును పాలింపగలిగెను. అయినను ఆ కాలమున సామంత ప్రభువులు బహుబలసంపన్నులు అగుటవలన దేశమున బలమగు కేంద్రప్రభుత్వము ఏర్పడుటకు అవకాశము తొలుత లభింపకుండెను. కడకు అట్టి పదునాలుగు సామంత రాజ్యములను శ్యాంగ్ శూ అను ధీమంతుని ఉపదేశములను మన్నించి క్రీ. పూ. 546 లో ఒక ఒడంబడికను కుదుర్చు కొనుటవలన దేశమున ఒక విధమగు సుస్థిర ప్రభుత్వము రూపొందగలిగినది. ఈ సామంతుల కాలమున, వారి కృషి మూలమున చీనీయ సంస్కృతి తూర్పున పసిఫిక్ మహా సముద్రము వరకును, దక్షిణమున యాంగ్‌సీ నదీ తటము వరకును వ్యాపింపగలిగినది.

## కళా కౌశలములు

**ధాతు పరిశ్రమ:** క్రీ. పూ. 3500 మొదలుగ దాదాపు మూడువేల సంవత్సరముల కాలము ఇటుల నడచిన మాన వుని చారిత్రక గతిలో సహకరించిన వివిధ సాధనములందు తొలుతగ పేర్కొనదగినవి ధాతువులు. వీనిలో రాగితో పరిచితి మానవునికి తొలుత కలిగినదను విషయము ఇదివరకే ప్రసక్తమైనది. దాదాపు క్రీ. పూ. 1500 వరకు ప్రాచీన నాగరకతలలో దేనికిని ఇనుముతో పరిచయము ఏర్పడ లేదు. కాని, రాగితోను, రాగి కలిపిన ధాతు మిశ్రము తోను నిర్మింపబడిన పరికరములతోనే మానవుడు అప్పుడు పురోగమింపగలిగినాడు. ఆ కాలముననే ఈజిప్టునందలి పిరమిడ్‌లును, బాబిలోనియాయందలి ఉన్నత దేవాలయ ములును, సింధునాగరకతకు చెందిన ప్రాచీన నగర ములును నిర్మితములైనవి. కాని, తన పురోగతికి రాగికన్న పటిష్ఠమగు ధాతువును కనుగొనవలసిన ఆవశ్యకత క్రమ ముగ ఆనాటి మానవునికి కలిగినది. అట్టి ధాతువగు ఇనుమును తొలుతగ కనుగొనినవారు హిట్టైట్‌లని చరిత్ర రచయితల అభిప్రాయము. ఈ హిట్టైట్‌లు ఇనుమును క్రీ. పూ. 1400 కు పూర్వముననే కనుగొనినను, దాదాపు 200 సంవత్సరముల వరకు దానిని ఇతరులకు వెలివరచక గుప్తముగ ఉంచిరి. కాని, క్రమముగ తక్కిన సమకాలిక నాగరకదేశములకు అన్నింటికిని ఈ ధాతు విద్యతో పరిచితి లభించినది. అయినను, సింధునాగరకత మాత్రము అప్పటికే అంతరించినది. అందువలననే ఆ

నాగరకతకు చెందిన ప్రాచీన నగరావశేషములందు రాగి పరికరములే కాని ఇనుప పరికరములు లభింపకున్నవి. ఆ నాగరకత అంతరించిన తరువాత భారతదేశమున తమ సంస్కృతిని వ్యాపింపజేసిన వైదికార్యులకు మాత్రము ఇనుముతో కూడ పరిచితి ఏర్పడినది. వారు రాగిని 'లోహాయస' (ఎర్రని అయస) మనియును, ఇనుమును 'కార్ష్ణాయస' (నల్లని అయస) మనియును వాని రంగులను బట్టి వ్యవహరించిరి. ఆ కాలముననే చీనీయులకును ఆ ధాతువుతో పరిచయము ఏర్పడెను. ఇనుముకన్న ముందుగనే వెండి, బంగారములకు ఆ ప్రాచీన నాగరకతలయందు వ్యాప్తి కలిగినది. క్రమముగ ఆ రెండు ధాతువులును అలంకారాదులకు ఉపయోగింపబడి వానికి తక్కిన వానిని మించిన అమూల్యత చేకూరినది.

చౌకగను, విరివిగను లభించుచు, పటిష్ఠ పరికరముల నిర్మించుటకు అనువగు ఇనుము లభించినప్పటినుండియు వ్యవసాయము మొదలగు వానియందు పూర్వముకన్న మిన్నగ ఉత్పత్తి ఎక్కువయ్యెను. ఇనుప కర్రు కలిగిన నాగలివలన సేద్యము సులభతరమయ్యెను; అడవులను నిర్మూలించి, పొలములుగ మార్చుట సుసాధ్యముగ పరిణమించెను. కాలువలు త్రవ్వుట, నీళ్లు పారించుట మొదలగు పనులందు బాబిలోనియన్‌లును, వైదికార్యులును సుపరిచితులైనటుల వారి వ్రాతలవలన తెలియవచ్చుచున్నది. భూములకు మంచి ఎరువువేసి పంటను అధికతరముచేయు రహస్యమును భారతీయార్యులు ఎరిగి ఉండుట ఋక్కుల వలన సువిదితము. ఈ ప్రాచీన నాగరకతాకేంద్రములందు చీనా తప్ప తక్కిన అన్నింట ఆహార ధాన్యములలో గోధుమయే విరివిగ పండింపబడినది. చీనీయులు వరిని పండించిరి. వైదికార్యులు ప్రాచ్యభారతదేశమునకు వ్యాపించిన తదుపరిని వరిపంటతో వారికి పరిచితి ఏర్పడెను.

ఉత్పత్తితోపాటుగ శ్రమ విభజనయు విస్తరిల్లి వేర్వేరు వృత్తులవారు ఏర్పడిరి. పటిష్ఠములగు పరికరములవలన వడ్రంగము, శిల్పము, భవన నిర్మాణము మొదలగు విద్యలందును మానవుడు క్రమ పురోగతిని సాధింపగలిగెను. ఈజిప్టునందలి 'కర్ణక్' దేవాలయము, అసీరియన్ ప్రభువులు నిర్మించిన ప్రాసాదములు ఇందులకు నిదర్శనములు. వైదికార్యులు నిర్మించిన మహాభవనములు నేడు లభించుట లేదు. కాని, ఋగ్వేదమునను, తరువాతి సారస్వతమునను రాజప్రాసాదములయు, శతభుజముల (నూరు గోడల) దుర్గములయు ప్రసక్తి కలదు.

**వర్తక వ్యాపారములు :** ఉత్పత్తి విరివిగ వృద్ధియైనంతట సహజముగ భోగలాలసత హెచ్చును. తమకు అలభ్యములయి, ఇతర దేశములందు లభ్యములగు వస్తువులకొరకై యత్నము జరుగును; అదియే ఆనాడును సంఘటిల్లినది. ఇందువలన వివిధ నాగరకతాకేంద్రముల మధ్య వ్యాపారము విస్తరించినది. ఈ వ్యాపారమును సముద్రమార్గమున నిర్వహించుటలో పశ్చిమమున ఎక్కువగ ప్రముఖ పాత్ర వహించినవారు ఫొనీషియన్‌లు. సముద్రమునకు కొంత దూరముగ ఉన్న వైదికార్యులకును ఈ సముద్ర వ్యాపారముతో పరిచితి ఉన్నటుల కొన్ని ఋక్కులవలన తెలియవచ్చుచున్నది. భూమిపైన ఇట్టి వ్యాపారము సార్థముల (బిడారుల) మూలమున జరుగుచుండెడిది. పశ్చిమ ఆసియా, ఉత్తర ఆఫ్రికా ప్రాంతములలోని వివిధ ప్రాచీన నాగరకతా కేంద్రములతోను బాబిలోనియాయందలి ప్రముఖ నగరములకు ఇట్టి రాకపోకల సంబంధములు ఉండెడివి. వైదికార్య నాగరకతాకేంద్రములతో బాబిలోనియాకు కల వ్యాపార సంబంధమును గురించి విస్పష్టములగు నిదర్శనములు లేకున్నను, అట్టివి కలవని విశ్వసించుటకు కొంత ఆధారము కలదు.

వర్తక, వ్యాపారముల అభివృద్ధితో ఆ కాలమున కొలతలయు, తూనికలయు ఆవశ్యకత కలిగినది. ప్రాచీన కీలలిపి గ్రంథములవలన బాబిలోనియాయందు అమలులో ఉండిన కొలతలను గురించియు, తూకములను గురించియు కొంత పరిజ్ఞానము మనకు లభించుచున్నది. బాబిలోనియన్ తూకములకు మూలము 'మనా' అనబడు ప్రామాణికపు తూకము; వైదికార్యులలోను 'మనా' అనబడు ఒక ప్రామాణికపు తూకము అమలునందు ఉండినటుల వైదిక సారస్వతమువలన తెలియవచ్చుచున్నది. అంగుళము మొదలుకొని యోజనమువరకు కల పలు కొలమానములును, శరావము, స్థివి మొదలగు ఆయతన మానములును ఆ సారస్వతము వలననే మనకు వేద్యములు. తదితరములగు చీనీయాది ప్రాచీన నాగరకతల యందును ఆ కాలముననే ఇట్టి కొల, తూకపు మానములు వ్యాప్తిలోనికి వచ్చి వర్తక, వ్యాపారములకు విరివిగా తోడ్పడినవి.

ఆనాటి వ్యాపారము సాధారణముగ వస్తువినిమయ రూపముననే జరిగెడిది. కాని, క్రమముగ ఒక నిర్దిష్టపు తూకము కల బంగారపు బిళ్ల లేదా నగ ఒక విధమగు నాణెముగ వాడుకలోనికి వచ్చినది. వైదిక సారస్వతమున పేర్కొనబడిన 'నిష్కము' ఇట్టిదియే. ఆ సారస్వతముననే శతమానము అను వేరొక నాణెపు ప్రసక్తి కలదు. నూరు గురిగింజల తూకపు బంగారపు బిళ్లయే ఇది కాదగునని పండితుల అభిప్రాయము. ఇటులే వర్తక సంఘములును తమ చిహ్నములతో కొన్ని బిళ్లలను చెలామణీ

చేయుచుండెడివి. కాని, నాణెముల ముద్రణ మాత్రము ఆ ప్రాచీనయుగమున కడపటి భాగము వరకు జరుగలేదు. ఆసియామైనర్ నందలి లిడియా అను ప్రాచీన ప్రాంతమును పాలించిన ప్రభువులు తొలుతగ క్రీ. పూ. 7 వ శతాబ్దిలో నాణెములను బంగారును వెండియు కలిసిన ఎలెక్ట్రమ్ (తెల్ల బంగారము) అను ధాతు మిశ్రమున ముద్రించిరి. ఆ తరువాత ఆ ప్రాంతమును పాలించిన క్రోసస్ రాజు (క్రీ. పూ. 546 ప) బంగారు, వెండి నాణెములు తొలుతగ ముద్రింపజేసెను.

**గణిత, ఖగోళశాస్త్రములు:** ఇటులకృషి, వర్తక, వ్యాపారాదులందు మానవుడు పురోగమించుటతో గణితమునకు ఆవశ్యకత కలిగి తొలుతగ ఈజిప్టు, బాబిలోనియా దేశములలో వికసనము పొందగలిగినది. నైలునదివరదలచే మునిగిపోయి, సరిహద్దులను కోల్పోయి బయలుపడిన క్షేత్రముల సరిహద్దుల నిర్ణయించు ఆవశ్యకత మూలముననే ఈజిప్టునందు క్షేత్రగణితము తొలుతగ రూపొంది ఉండునని కొందరి తలంపు. ఇది ఎటులున్నను, క్రీ. పూ. 1800 కు పూర్వమే ఈజిప్టు వాసులకును, బాబిలోనియన్‌లకును సంఖ్యాపరిగణనముతోను, వాని రూపకల్పనతోను, కొన్ని విధముల భిన్నములతోను పరిచితి ఏర్పడెను. కాని, సంఖ్యారూపకల్పనమున 'శూన్య'మునకు కల విలువను వారు గుర్తింపజాలక పోవుటచే దశ, శత, సహస్రాదులలో ఒక్కొక్క దానికి ఒక్కొక్క రూపమును కల్పించిరి. ఇందువలన గణితపరికర్మలందు, అందును ముఖ్యముగ గుణకార, భాగహారములందు వారు ఎక్కువగ శ్రమింపవలసి వచ్చినది. ఇట్టి గణిత సాహాయ్యముననే ఖగోళ శాస్త్రమునను వారు కొంతవరకు పురోగమింప గలిగిరి. ఈజిప్టు వాసులు సంవత్సరమును 365 దినములు కలదానినిగ నిర్ణయింప గలిగిరి, కాని, యథార్థపు విలువకు దాదాపు $\frac{1}{4}$ దినము ఇది తగ్గుటచే తరువాత ఈ లెక్క కొన్ని చిక్కులకు దారి తీసినది. బాబిలోనియన్ పండితులు చంద్రుని గతిని అనుసరించి తొలుతగ కాలనిర్ణయమునకు పూనుకొని సంవత్సరమును 12 చాంద్రమానపు మాసములుగ విభజించిరి. తరువాత సౌరగతితో దీనిని ముడిపెట్టుటకై అంతటంతట ఒక అధికమాసమును కలుపుచుండెడివారు. చంద్ర సంచార మండలమును 360 భాగములుగ విభజించుట వీరితోనే ఆరంభితమైనది. వీరు తమ లెక్కలకు సంఖ్యా పరిగణనమున అరువది (60)ని ఆధారముగ గ్రహించిరి. ఈ భావనయే గంటల, నిమిషముల, డిగ్రీల విభజనలో నవీన కాలమున నిలచియున్నది [చూ. గణిత, ఖగోళశాస్త్ర సంపుటము - పు. 67].

కుజ, బుధ, గురు, శుక్ర, శని అను ఐదు గ్రహముల ఉనికిని బాబిలోనియన్ ఖగోళ శాస్త్రవేత్తలు కనుగొని, వాని సంచార రీతిని గురించి స్థూల నిర్ణయములను చేయగలిగిరి. వైదికార్యులలో సంఖ్యా పరిగణనము అత్యుచ్చ స్థాయిని అందుకొనినది. వివిధాకారములుగల హోమ గుండముల నిర్మించుటవలన క్షేత్రగణితపు పరిజ్ఞానమును విస్తరిల్లినది. వారు సంవత్సరమున 12 మాసములును, అందు 360 దినములును ఉన్నటుల లెక్కించిరి. కాని, అటనట 13 వ మాసపు ప్రసక్తియు కన్పట్టుటచే యథార్థపు సౌర సంవత్సరముతో దీనికి సమన్వయత కుదుర్చుటకు అంతటంతట ఒక అధికమాసము కలుపబడినదని ఊహింప అవకాశము కలదు. దినమును ముప్పది ముహూర్తములుగ వారు విభజించిరి. చంద్ర సంచారమండలమును కృత్తికాదిగ ఇరువది ఎనిమిది నక్షత్రములుగ వారు విభజించి లెక్కించిరని అథర్వవేదమువలన మనకు తెలియవచ్చుచున్నది. ఆ కాలపు చీనీయులును చాంద్రమానమునే అనుసరించిరి.

**యుద్ధ విద్య :** ఇనుమును కనుగొనుటవలన - ఒక విధముగ అన్నింటికన్న మిన్నగ - లాభమొందినది యుద్ధ విద్య. హిటైట్‌లు ఈ ధాతువును తొలుతగ కనుగొనుట వలన ఈజిప్టు సామ్రాట్‌ల ధిక్కరించి రాజ్యాధిపత్యమును నిర్వహింపగలిగిరి. ఆ తరువాత ఇనుప ఆయుధములను విరివిగ వాడి సమకాలిక రాజ్యములను లోగొనిన వారు అసీరియన్‌లు. ఇనుముతోచేసిన కవచము, డాలు, కత్తి, గద వారు విరివిగ వ్యాప్తిలోనికి తొలుతగ తెచ్చి, తక్కిన రాజ్యములను సులభముగ జయింపగలిగిరి. ఇందులకు తోడుగ వ్యూహారచనయు వీరికి ఎక్కువగ తోడ్పడినది. దుర్గవ్యూహము అను దానిని వీరు తొలుతగ యుద్ధ విద్యయందు ఆవిష్కరింపజేసిరి. డాలును అడ్డముగ ఇడుకొనిన, సశస్త్ర కవచులగు యోధులు ఒకరి ప్రక్కన ఒకరు దుర్భేద్యమగు దుర్గప్రాకారమువలె నిలువబడి ఈ వ్యూహమున ఒక్కపెట్టున పురోగమింతురు. భారత దేశమునందలి తొలుతటి నాగరక జాతులను ఓడించుటలో ఆర్యులు ఈ దేశమునకు తొలుతగ కొనివచ్చిన అశ్వికదళమే కాక, ఇనుప పరికరములును ఎక్కువగ తోడ్పడినవి. యుద్ధములందు కొన్ని ఎడల వారు ఉపయోగించిన 'పురచరిష్ణు' (నడచెడి కోట) అనునది బహుశః దుర్గవ్యూహమే అని భావింపదగును. కొందరు ఈ సాధనమును నేటి 'టాంక్' ను బోలి గుర్రములచే లాగబడెడి ఒక విధమగు శకటముగ ఊహించిరి; ఆ శకటము లోపలనుండి యోధులు బాణములు ప్రయోగించిఉందురని వారి తలంపు.

వాస్తు విద్య: నాటి నాగరకతలో పేర్కొనదగిన ఇంకొక విషయము అప్పటి నగరనిర్మాణ కుశలత. ముఖ్యముగ సింధునదీ తటమున ఇది పరాకాష్ఠను అందు కొనినది. అచటి త్రవ్వకములందు వెలువడిన నగరములు ఒక ప్రణాళికను అనుసరించి రూపొందింపబడినటుల స్పష్టముగ గోచరించుచున్నది. ఆధునికయుగపు నగరము లందువలెనే ఇండ్లనుండియు, వీథులనుండియు మురుగు నీరు నగరము వెలుపలికి పోవుటకు భూగర్భపు కాలువలు నిర్మింపబడినవి. శౌచవిధికి అవసరములగు వసతులు ఇండ్లలో ఏర్పరుపబడుటయేకాక, నగరవాసులకు స్నానాగారములు ప్రత్యేకముగ కొలనుల ప్రక్కన నిర్మింప బడినవి. ఆ కాలపు క్రీట్ ద్వీపపు నగరములందును నగర నిర్మాణము ఈ తీరుననే సాగినది.

వైద్యము: శరీరశాస్త్రము, రోగనిదానము, చికిత్సా విధి మొదలగు వానియందును ఆ ప్రాచీనులు కొంత పరిణ తిని ఆర్జించిరి. దేవతలకు అర్పించు బలులు మొదలగు వాని వలన శరీరములందలి వివిధాంగములతో వారికి పరిచితి ఏర్పడెను. ఈజిప్టునందలి ప్రాచీన గ్రంథములందును, బాబిలోనియన్ కీలలిపి గ్రంథములందును శరీర శాస్త్ర విషయములు కొన్ని ప్రసక్తింపబడినవి. శరీరమునందలి వివిధ భాగములలోని ఎముకలు మొదలగు వానిని గురించిన లెక్కల వివరములు వైదిక సారస్వతమున కలవు. వివిధ రోగములను, వానికై ఈయవలసిన ఔషధ ములను గురించిన గ్రంథములు బాబిలోనియన్ త్రవ్వకము లందు వెలువడినవి. కొన్ని ఎడల ఈ గ్రంథములలో ఒక్కొక్కటి ఒక్కొక్క శరీరాంగమునకో లేదా విష చికిత్సవంటి ఒక ప్రత్యేక విధమైన చికిత్సకో ప్రత్యేకింప బడినది. ఈజిప్టునందు లభించిన ఒక 'పపైరస్' వ్రాతప్రతి వలన ఆనాటి ఔషధ పరిజ్ఞానము సువిదితము అగు చున్నది. అథర్వవేదమున పలు రోగములు పేర్కొన బడుటయేకాక, వాని చికిత్సకు ఉపయోగించు ఓషధు లును పేర్కొనబడినవి. కొన్ని ఎడల శస్త్ర చికిత్సయు ప్రసక్తమైనది. కాని, ఇటుల ఈ వివిధ ప్రాచీన దేశము లందు లభించు వైద్య సంబంధ రచనలలో ఓషధులు పేర్కొనబడినను వానితోపాటుగ మంత్ర తంత్రములును పేర్కొనబడి వానికే అధికతర ప్రాముఖ్యము ఇచ్చుట జరిగినది.

భాషా లిపులు: విజ్ఞానమునకు బహుముఖ వ్యాప్తి కలి గించుటలో తోడ్పడిన ముఖ్య సాధనము లిపి. ఈజిప్టునందలి తొలుతటి చిత్రలిపి వ్యవహార సౌకర్యార్థమై క్రమముగ పరి ణామమొంది సులభముగ వ్రాయుటకు అనువుగ వేరొక రూపమును సంతరించుకొనినది. దీనినే పరిశోధకులు వ్యవ హార (డెమోటిక్) లిపి అని వ్యవహరించుచున్నారు. కాని, ప్రభుత్వ శాసనములు మొదలగునవి మాత్రము చిత్రలిపి లోనే చెక్కబడుచుండెడివి. అందువలన ఈజిప్టునందలి లిపి ఎక్కువగ పరిణతిని ఆర్జింపలేకపోయినది. ఆ కారణము వలననే, ఈజిప్టు పరిసర దేశముల వారు ఎవరును ఆ దేశపు లిపిని స్వీకరింపకుండిరి. బాబిలోనియా యందలి చిత్రలిపి మాత్రము లేఖనపు సౌకర్యము కొరకై క్రమముగ పరిణతి చెంది కీలలిపిగ పరిణమించినది. ఈ కీలలిపి అచ్చ ముగ ధ్వన్యాత్మకము కాకపోయినను చిత్రలిపి కన్న సులభతరము. అందువలననే హిటైట్‌లు, మిత్తానీలు, ఎలామైట్‌లు మొదలగు తదితర దేశీయులును ఈ కీలలిపిని గ్రహించి స్వీయము చేసికొనిరి. రేవడిమన్ను ఫలకములపై అవి పచ్చిగ ఉన్నప్పుడు ఈ కీలలిపిలో ఒక కర్ర ముక్క సాయమున అక్షరములను లిఖించెడివారు. ఆ మన్ను ఆర గనే గట్టిపడిన ఆ ఫలకమున అక్షరములు స్థిరముగ నిలిచి ఉండెడివి. క్రీ. పూ. 1300 కు పూర్వమున పశ్చిమ ఆసియా యందును కీలలిపియే దాదాపుగ సర్వజనామోదితమైనది.

కాని, ఈ కీలలిపి అచ్చముగ ధ్వన్యాత్మకము కాక పోవుటవలన దానిని నేర్చుకొనుట సులభముగ ఉండెడిది కాదు. ఈ అవరోధమును అతిక్రమించి తొలుతటి ధ్వన్యాత్మక లిపిని రూపొందించినవారు ఫొనీషియన్‌లు. క్రీ. పూ. 1300 నాటికే ఫొనీషియన్ వర్తకులు ఒక విధమగు ధ్వన్యాత్మక లిపిని రూపొందించిరి. ఇందు ఇరువదిరెండు ధ్వనులు మాత్రమే ఉండెడివి. క్రీ. పూ. 900 నుండి ఈ లిపికి తక్కిన జాతులవారి ఆదరణయు చేకూరినది. ఈ లిపినుండి పరిణతి పొందిన అరామిక్ లిపి క్రీ. పూ. ఆరవ శతాబ్దినుండి పారసీక చక్రవర్తుల ఆదరణ మూలమున సింధునది పశ్చిమ తటమువరకు వ్యాపింపగలిగినది. ఫొనీషి యన్ లిపియే హిబ్రూ, గ్రీక్ లిపులకు మాతృక అయినది. గ్రీక్ లిపినుండియే తక్కిన యూరపియన్ భాషా లిపులును ఆ తరువాతి కాలమున దేశ కాలోచితములగు మార్పులతో రూపొందినవి.

సింధు నాగరకతయందలి లిపియు కొంతవరకు చిత్ర లిపియే. చిత్రములను ఆశ్రయించి కొన్ని ప్రత్యేక ధ్వని సంకేతములును అందు కలవని పండితుల ఊహ. అయినను, ఆ లిపిని గురించిన పరిజ్ఞానము ఇప్పటికి ఎవరికిని లభింప కున్నందున దీనిని ఇదమిత్థమని నిర్ణయింపజాలము. సింధు నాగరకత అంతరించిన తరువాత భారతదేశమున క్రీ. పూ. 5 వ శతాబ్దివరకు వాడుకలో ఉండిన లిపిని గురించిన నిదర్శనములు మనకు కన్పట్టుటలేదు. క్రీ. పూ. 5 వ

శతాబ్దినుండి మాత్రము బ్రాహ్మీలిపి అని వ్యవహరింపబడు ధ్వన్యాత్మక లిపి వాడుకలో ఉన్నటుల శాసనముల వలన తెలియవచ్చుచున్నది. ఇక ఈ మధ్యకాలమున - అనగా సింధు నాగరకత అంతమొందినది మొదలుగ క్రీ. పూ. 5 వ శతాబ్దివరకు - భారత దేశమున జరిగిన లిపి పరిణామమును గురించి పండితుల మధ్య విభిన్నాభిప్రాయములు కలవు. పాశ్చాత్య పండితులు పలువురు వైదిక యుగమునందలి ఆర్యులకు లిపి పరిజ్ఞానమే లేకుండెననియు, ప్రవచనము (ముఖతః బోధించుట) వలననే వైదిక వాఙ్మయము పరంపరాగతముగ మనగలిగెననియు, క్రీ. పూ. 800 తరువాత అరామిక్ లిపితో వారికి పరిచితి ఏర్పడి, దానిని మూలముగ గ్రహించి, అందుండి బ్రాహ్మీలిపిని వారు రూపొందించిరనియు అభిప్రాయపడిరి. కాని, ఈ వాదమున దోషములును, లోపములును సుస్పష్టములు. ఫొనీషియన్ లిపి నుండి ఉత్పన్నములైన అరామిక్, గ్రీక్ మొదలగు లిపులందలి ధ్వనుల సంఖ్య ఏ నాడును 26 ను మించలేదు. వానియందలి అచ్చుల సంఖ్యయు అతి పరిమితము. బ్రాహ్మీలిపియందు అటులకాక 46 అక్షరములు ఉండుటయేకాక, అచ్చులకు అన్నిటికిని అందు తావుండెను. ఇదియును కాక క్రీ. పూ. 1,000 నాటివని భావింపనగు బ్రాహ్మణములందును వర్ణముల, అక్షరముల ప్రసక్తి కన్పట్టుచున్నది. వ్యుత్పత్త్యర్థములను అనుసరించిచూడ రంగులతో వ్రాయబడి ఉండుట వలనను, వాడియగు పరికరముతో చెక్కబడుట వలనను క్రమముగ ఈ పద రూపములు ఏర్పడి ఉండును. కావున భారతదేశీయార్యులకు లిపితో పరిచయము ఆనాటికే ఏర్పడి ఉండెనని భావింపవచ్చును. ప్రాచీన సింధునాగరకతా లిపియే క్రమపరిణామము పొంది, బ్రాహ్మీలిపిగ పరిణమించి ఉండుననియు, ఆ పరిణామ కాలమున వెలువడిన భూర్జ పత్రగ్రంథములు నశించి ఉండుటవలన, ఆ పరిణామపు తీరును తెలుపు నిదర్శనములు మృగ్యములైనవనియు కొందరి తలంపు. ఇటుల బ్రాహ్మీలిపి వ్యుత్పత్తి క్రమము బహు వివాదములకు ఆస్పదమైనది. ఈ బ్రాహ్మీ లిపియే భారత భాషలలో ఉర్దూగాక తక్కినవాని లిపులకును, బర్మా, థాయిలాండ్, సిలోన్ మొదలగు దేశభాషల లిపులకును మాతృక.

చీనాయందలి చిత్రలిపి క్రమముగ కొన్ని మార్పుల నందినను, ధ్వన్యాత్మక లిపిగ మాత్రము పరిణమించక చాలవరకు చిత్రలిపిగనే నిలిచినది.

బంగారు, వెండి మొదలగు ధాతువులతో నగలను చేయుటను, రత్నములు మొదలగువానిని ఉపయోగించుటను ఆ యుగపు ప్రజలెరిగియుండిరి. రాసాయనిక శాస్త్రమునను వారు కొంత కుశలతను ఆర్జించిరి. శవములను తగు రాసాయనిక పదార్థముల సాయమున కుళ్లకుండ (మమ్మీ రూపమున) భద్రపరచుటలో ఈజిప్టువాసులు అత్యధిక ప్రావీణ్యమును సంపాదించిరి.

## ధార్మిక భావన

ఆ యుగమునందలి వివిధ సంస్కృతీ కేంద్రములలో వ్యాప్తియందుండిన మత విశ్వాసములను గురించియు ఆ కాలపు గ్రంథముల సాయమున పెక్కు విషయములు విదితములగుచున్నవి. ఈజిప్టున తొలుత వివిధ ప్రాంతములందు వసించు ఆ యా తెగల వారికి వారి వారి సంప్రదాయములను అనుసరించి ఒక్కొక్క తెగకు ఒక్కొక్క అధిదేవత ఉండెడిది. కాని, కాలక్రమమున ఈ తెగలన్నియు ఒక రాజరికపు పాలనలోనికి వచ్చిన వెనుక ఈ అధిదేవతలు కలగాపులగముగ కలుపబడి ఒక దేవగణము నిర్మింపబడెను. ఈ దేవగణమున అత్యధిక సంఖ్యాకులు హిందూ పురాణములందు పేర్కొనబడు కిన్నరుల కోవకు చెందినవారు. అనగా సగము నరశరీరము, తక్కిన సగము మృగశరీరము లేదా పక్షిశరీరముగ ఉండువారు. ఇట్టి ఈ దేవతా జాతిలో కొందరికి ఊర్ధ్వ భాగము మానవశరీరముగను, మరి కొందరియందు అధో భాగము మాత్రమే మానవశరీరమును పోలియు ఉండెడిది. నేటి ఈజిప్టులో 'గాజా' మొదలగు చోటుల కన్పట్టు 'స్ఫింక్స్' (యాళి) విగ్రహము ఇట్టిదియే. ఈ దేవతా విగ్రహపు ముఖము స్త్రీ ముఖము; తక్కిన భాగము సింహరూపము. ఇట్టి కిన్నర దేవతలే కాక కొన్ని జంతు రూపములును దైవములుగ ఆరాధింపబడెడివి. వానిలో గో, వానర, మార్జాలములు ముఖ్యములు. కొన్ని ప్రకృతి దేవతలును ప్రతీకరూపమున అర్చింపబడెడివారు. అట్టి వానిలో 'ర ఈ' అనబడు సూర్యదేవుడు ముఖ్యుడు. ఈ దేవుని ప్రతీకము గరుడపక్షి.

ఈ వివిధ దేవతలు, వారి పుట్టుపూర్వోత్తరములు, వారికి గల పరస్పర సంబంధములు మొదలగు వానిని గురించిన పౌరాణిక వాఙ్మయమును క్రమముగ ప్రాచీన ఈజిప్టున విరివిగ వృద్ధిచెందెను.

బాబిలోనియాయందును వివిధ దేవతలకు రూపకల్పన ఇటులనే జరిగినది. తొలుత వీరిలో ఒక్కొక్కరు ఒక్కొక్క నగరమునకో, జనపదమునకో అధిదేవతగ ఉండెడివారు. ఆ నగరము పొందిన వైభవోన్నతులను బట్టి ఆ దేవతకు ప్రాశస్త్యము కల్గెడిది. కాని, ఈ దేవతలలో దాదాపుగ

అందరును మానవ మూర్తులనే కలిగి, కొన్ని అలౌకిక లక్షణములతో ఒప్పుచుండెడివారు. ఈజిప్టునందలి ప్రజా నీకపు జీవితమున సమైక్యమును నైలునది చేకూర్చుటచే, అచటి వివిధ జనపదములు అనతి కాలముననే ఒక రాజు ఆధిపత్యమును అంగీకరించుటయు, తన్మూలమున దేవతా గణమునకు స్థిరరూపము ఏర్పడి సూర్యదేవునకు ఆధిక్యము లభించుటయు సమకూరినది. కాని, బాబిలోనియా యందలి పరిస్థితులు వేరుగ ఉండుటవలన దేవతా గణమున ఒక ప్రత్యేక దేవతకు ప్రాముఖ్యము లభించుటకు అతి దీర్ఘకాలము పట్టినది. కాని, తొలుతటినుండియు అచటి దేవతా గణమున నలువురు దేవతలకు - అను, ఎన్‌లిల్, ఈ, నింతుర అను వారికి - సర్వజనాదరము లభించెనని స్థూలముగ చెప్పవచ్చును. వీరిలో మొదటి మువ్వురును ప్రపంచమును పాలించు త్రిమూర్తులుగ పాటింపబడెడి వారు, వీరు క్రమముగ ఆకాశమునకు, భూమికి, జలము నకు అధిదేవతలు. కడపటి దేవతయగు నింతుర సృజనశక్తి. ఈమె అవివాహిత ; ఈమెకే మఖ యని వేరొక ప్రసిద్ధ నామము ఉండెడిది. వీరుకాక 'శమస్' అనుపేర సూర్యు డును, 'సిన్' అను పేర చంద్రుడును, 'నిర్భృత' అను పేర యుద్ధాధిదేవతయు ఆరాధింపబడెడివారు. వీరిలో ఒక్కొక్క దేవుడు ఒక్కొక్క నగరమున ప్రత్యేకారాధన లను పొందెడి వారు. భూమ్యధిదేవతయగు ఎన్‌లిల్ నకు చెందిన దివ్యక్షేత్రము నిప్పుర్ నగరము ; పారసీక సింధుశాఖతీరమున ఉండిన ఎరిడ్ నగరము జలాధిదేవత యగు 'ఈ'కు సంబంధించిన పుణ్యక్షేత్రము. ఇటుల దాదాపు అందరు దేవతలకు పుణ్యక్షేత్రములు ఉండెడివి. ఈ దేవతల సంఖ్య రమారమిన నాలుగు వేల వరకు ఉండి నది. కడకు బాబిలన్ నగరము దేశమున ఆధిక్యమును ఆర్జించినంతట ఆ నగరాధిష్ఠానదేవతయగు 'మర్దుక' దేవుడు పరదేవతగ దేశమున పరిగణనపొందెను. ఆ దేశపు పురాణములను అనుసరించి చూడ ఈ మర్దుక దేవుడు జలాధిదేవతయొక్క కుమారుడు. మర్దుక దేవుని ఆధిక్యమును గుర్తించని కొన్ని సంప్రదాయములును అప్పుడుండెడివి. కాని, వానికి తగినంత ప్రజాదరణ లేకుండెను.

ఈజిప్టు, బాబిలోనియా దేశముల రెండింట విగ్రహా రాధనయందు ఇటుల ప్రబలతర విశ్వాసము ఉండుటవలన, దేవతార్చనా విధి ఒక ప్రత్యేకశాస్త్రముగ ఆ దేశము లందు ఆ యుగమున పరిణతిని పొందెను. దేవాలయ వాస్తువు కూడ ఒక ప్రత్యేకతను సంతరించుకొనినది. ఈజిప్టునందలి దేవాలయముల ప్రాకారముఖద్వారముల గోపురములు (గాలి గోపురములు) పలు అంతస్తులతో అత్యున్నతములుగ పెద్ద పాషాణములచే నిర్మింపబడెడివి. అటనుండి క్రమముగ లోపలవైపున అంతరాళము, ముఖమండపము, గర్భాలయము ఉండెడివి. ప్రాకార కుడ్యమును ఆశ్రయించి, పెక్కు చతుశ్శాలలును, అల్ప దేవతల ఆలయములును లోపలి వైపున ఉండెడివి. ఈ దేవ మందిరములకును, మండపములకును, చతుశ్శాల లకును ఆధారములుగా శిల్ప చిత్రితములగు ఉన్నత స్తంభములు ఉండెడివి. ఈ స్తంభములపై శిలాఫలకము లను పరచుటచే ఈ భవనములు రూపొందెడివి. ఈ స్తంభము లందలి శిల్పములలో సర్వసామాన్యముగ కననగునది కమలము ; బాబిలోనియాయందలి దేవాలయములు ఉన్నతములగు వేదికలపై నిర్మింపబడెడివి. ఈ నిర్మాణము ఇటుకలతో సాగెడిది. దేవాలయపు గోపురము (విమా నము)లు పలు అంతస్తులతో నిర్మింపబడెడివి. ఈ దేవా లయములలో కమాను (ఆర్చి)ల నిర్మాణము ఒక విశిష్టత. అట్టి కమానులు ఈజిప్టునందలి దేవళములలో కననయ్యెడివి కావు. బాబిలోనియా దేవాలయ స్తంభ, కుడ్య చిత్రములందు సామాన్యముగ కననగునది సింహము.

దేవాలయములందలి నిత్యపూజావిధిలో స్నాన, అలం కరణ, అర్చన, నైవేద్యములు ముఖ్యభాగములుగ ఉండె డివి. బాబిలోనియాయందలి త్రవ్వకములలో ఇందులకు సంబంధించిన సారస్వతము విరివిగ లబ్ధమైనది. ఈ నిత్య పూజయే కాక, కొన్ని కొన్ని ప్రత్యేకదినములందును, పర్వదినములందును విశేష విధితో అర్చనలు నిర్వహింప బడెడివి. ఇవికాక భక్తకోటి తాము చేసిన పాపముల పరిహారమునకై చేయించెడి వివిధ పూజలును ఉండెడివి. ఈ విధులను నిర్వహించుటకు అర్చకగణము అట వసించె డిది. దేవాలయములందు నామసంకీర్తనతో పాటుగ గాన, నృత్యములును ఉండెడివి. వీనిని నిర్వహించుటకు దేవాలయములను ఆశ్రయించి దేవదాసీగణము ఉండెడిది. దేవాలయములను ఆశ్రయించియే 'బరూ'లు అనబడు గణాచారులు ఉండెడివారు. వీరు భూత భవిష్యత్తులను ఎరిగిన వారని ప్రతీతి ఉండుటచే వారి సాహాయ్యమును ప్రజలు అర్థించెడివారు. ఇందుతోపాటుగ ఆ దేవమందిర ములు ఆనాడు సుసంపన్నములై, బహు విద్యాసంస్థలను పోషింపగలిగి ఉండుటచే, ఛాత్రగణము అట గురువులతో వసించి ఆ కాలమున పేరుగనిన విద్యలను అచట అభ్య సించెడివారు. ఇటుల ఆనాటి నాగరకతకు ముఖ్యాలంబ నముగ దేవాలయము విలసిల్లినది.

ఇటుల ఈ విగ్రహారాధనము ప్రజానీకపు మనములను విరివిగ ఆకర్షించి దీర్ఘకాలము మనగలిగినను, ఈ దేవతల ఉనికిని గురించియు, సామర్థ్యమును గురించియు సందేహములను వెలువరించినవారు ఆనాడును లేకపోలేదు. ఈజిప్టునందు ఈ విగ్రహారాధన ఒక ప్రత్యేక కళగ వికసనము పొందిన కాలముననే ప్రపంచ సృష్టి స్థితి లయములను గురించి హేతుబద్ధమగు ఒక సిద్ధాంతమును కనుగొన యత్నించిన పండిత సంప్రదాయము కూడ వర్ధిల్లినది. ప్రపంచ గతి ఒక ప్రత్యేక నియమమును అనుసరించి నడచుచున్నదని వారు భావించిరి. దానినే వారు 'మావత్' అని వ్యవహరించిరి. సూర్య చంద్ర నక్షత్రాదుల స్థితికిని, వర్తనమునకును, సృష్టికిని 'మావత్' అను ధర్మమే మూలకారణము అగునని వారు నిర్ణయించిరి ఈ మావత్ స్వభావమును గుర్తించి మానవ జీవితమును అందునకు అనువర్తించు రీతిలో నడపుటయే మానవుని ధర్మమని వారు విశ్వసించిరి. కాని, ఈ భావన కొలది పండితులకు మాత్రమే పర్యాప్తమై ఉండెను. అట్టులే బహు దేవతారాధనను అంతరింపజేసి, ఏకేశ్వరోపాసనను ప్రవేశపెట్టుటకై నాలుగవ అమెనోతప్ అను విజ్ఞ ప్రభువు ఈజిప్టు దేశమున కావించిన కృషి, పూర్వాచార పరాయణుల తీవ్ర ప్రతిఘటనమువలన విఫలతను పొందిన విషయము ఇదివరకే వేరొకయెడ ప్రసక్తమైనది [చూ. పు. 16].

బాబిలోనియాయందును విగ్రహారాధనవలన కలుగు ప్రయోజనములు శూన్యమని వాదించు అల్పసంఖ్యాక వర్గము ఒకటి ఆనాడు ఉండెను. వారు రచించిన గ్రంథములు కొన్ని త్రవ్వకములందు వెలువడినవి. ఇట్టి గ్రంథములు ఆనాడు ప్రచారములో ఉండుటవలన మత విషయమున ఒక విధమగు స్వేచ్ఛకు ఆనాడును తావుండెనని మనము విశ్వసింపవచ్చును. అయినను, ఇట్టి సంస్కరణవాదులు అల్ప సంఖ్యాకులగుటవలనను, వారికి రాజాదరణ లేక పోవుటవలనను వారి నూతనభావములకు వ్యాప్తి తగినంతగ లభించినది కాదు. కాలక్రమమున వీరి భావనల ప్రభావము మాత్రము విగ్రహారాధనను విశ్వసించు పండితులపై కొంత కన్పట్టసాగినది. ఆ పండితులు విగ్రహ దేవతలకు అంతరార్థములను కల్పించి, మతమునకు ఒక విధమగు దార్శనిక రూపమును కల్పింప యత్నించిరి. ఈ దర్శన శాస్త్ర సాహాయ్యమున సృష్టిక్రమమును వివరింప వారు కృషి చేసిరి. వారి వాదమును అనుసరించి తొలుత సృష్టియంతయు జలమయమై ఉండెను. ఈ జలమునుండి 'ముమ్మూ' అను ఒక శబ్దము ఉత్పన్నమయ్యెను. ఈ శబ్దము సృజనశక్తి కలది. దాని నుండియే క్రమమున చరాచర సృష్టి అంతయు రూపొందెను. ఇట్టి దార్శనిక భావన పండిత వర్గమున మాత్రమే వ్యాప్తమై ఉండినది. సామాన్య ప్రజానీకము మాత్రము తమ పురాణములను యథాతథముగ విశ్వసించి, తమ దేవతలను శ్రద్ధతో ఆరాధించుచు ఉండెడివారు. ప్రతి బాబిలోనియన్ బాలునికి ఒక నిర్ణీత వయఃకాలము ప్రాప్తింపగనే ధర్మావలంబన విధి ఒకటి నిర్వర్తింపబడెడిది. అపుడు అతనికి గురువు ఒక ఇష్టదేవతను గురించిన మంత్రమును ఉపదేశించెడివాడు. ఆనాడు మొదలుకొని ఆ ఇష్టదేవత ఎడ అవ్యాజ భక్తిశ్రద్ధలు కలిగి, ఆ దేవతా విగ్రమును ఆరాధించుచు, సంప్రదాయరీతితో మనుటయే బాబిలోనియన్ పౌరుని విధిగ ఉండెడిది.

దాదాపుగ పశ్చిమ ఆసియా, ఉత్తర ఆఫ్రికా ప్రాంతములందు ఇట్టి బహు దేవతారాధనయే ఆనాడు వ్యాప్తియందు ఉండెడిది. కాని, ఇందులకు అపవాదము యూదులు [చూ]. వీరు పాలస్తీనాలో తొలుత వసించెడివారు. కాని, అల్పసంఖ్యాక వర్గమగుటవలన ప్రభువుల దురాగతములకు లోనై వెట్టి చాకిరికొరకు వీరు ఈజిప్టునకు తరలింపబడి, తరువాత మోషే అను వాని నాయకత్వమున ఈజిప్టునుండి వెలువడి స్వదేశమునకు చేరగలిగిరి. ఈ మోషే (క్రీ. పూ. 13 వ శతాబ్ది) వలననే వీరి యందలి బహుదేవతారాధన అంతరింపజేయబడి, ఏకేశ్వరోపాసనకు తావు కల్పింపబడెను. వ్యక్తి జీవితమును సుసంస్కరితము చేయుటకై అతడు దశవిధులను ప్రవచించెను. అతనికి ఈ మార్గమును భగవానుడే స్వయముగ సూచించెనని ఆ సంప్రదాయానుయాయుల విశ్వాసము. ఇటుల ప్రప్రథమముగ నైతిక నియమములపై ఆధారపడి, ఏకేశ్వరోపాసనను విశ్వసించు ఒక మతమును పశ్చిమ ఆసియాయందు నెలకొల్పిన ఖ్యాతి యూదులకు దక్కినది. కాని, వీరి ఏకేశ్వరభావన వారి వర్గమునకు మాత్రమే పరిమితమైనదిగ వారు భావించిరి. భగవానుడగు యెహోవాకు ప్రియతమమైన జాతి యూదజాతి ఒకటియే అని వారి తలంపు; అందువలన విశ్వజనీనత అందు లోపించినది.

ఈజిప్టు, బాబిలోనియా నాగరకతలకు ప్రాచీనతయందు వెనుదీయని సింధు నాగరకతయందలి మత భావనలను గురించి మనకు ఇప్పటికి తెలియవచ్చినది చాల స్వల్పము. అచ్చటి త్రవ్వకములందు వెలువడిన ముద్రికలపై ఉన్న లిపి రహస్యమును గుర్తించువరకు సింధువాసులను గురించిన మన పరిజ్ఞానము ఈ స్థాయిలో ఉండక తప్పదు. కాని,

ఆ ముద్రికలందును, వేరుగను కానవచ్చిన కొన్ని చిత్రములను, విగ్రహములను బట్టి ఆ నాగరకతాకాలపు మత భావనలను అర్థముచేసికొనుటకు కొందరు పండితులు యత్నించిరి. వీరి వాదములనుబట్టి చూడ ఒక విధమగు పశుపతిమూర్తియు, లింగమును, మాతృదేవతయు ఆనాడు ఆరాధనీయములుగ ఉండెడివి. భారతదేశమున నేడు వ్యాప్తియందున్న శివలింగారాధనకు తొలుతటి రూపము ఈ సింధు నాగరకతయందే కననగునని ఆ పండితుల అభిప్రాయము. వైదికార్యులు ఎదుర్కొనిన ప్రతి స్పర్ధులలో 'శిశ్నదేవు' లను ఒక తెగవారు ఉండినటుల వేదములవలన తెలియవచ్చుచున్నది. సింధు నాగరకతా సంప్రదాయములను అనుసరించి శివలింగమును ఆరాధించిన వారినే వైదికార్యులు ఇటుల పేర్కొని ఉందురని కొందరి ఊహ.

ఇక వైదికార్యుల మతవిశ్వాసముల వివరించు ప్రామాణిక విషయ సామగ్రి మనకు విరివిగ ఉపలబ్ధమగుచున్నది. ఈ వైదికార్యులు ప్రకృతి దేవతారాధకులని వైదిక వాఙ్మయము వలన సుస్పష్టముగ తెలియవచ్చుచున్నది. భారతదేశీయార్యులయందే కాక, ప్రపంచమున పలు తావుల వ్యాప్తినందిన ఆర్యలోకమందు తొలుత ఇట్టి ప్రకృతి దేవతారాధనయే వ్యాప్తియందు ఉండెనని భావించుటకు ఆస్కారము కలదు. వేదములందు పేర్కొనబడిన దేవతలలో పలువురు హిటైట్‌లు, పారసీకులు మొదలగు తక్కిన ఆర్యజాతుల వారికిని ఆరాధ్యులుగ ఉండినటుల నిదర్శనములు లభించుచున్నవి. ఈ ప్రకృతి దేవతల భావనలో ఆర్యజాతి అనుసరించిన నిర్దిష్ట విధానము ఏదియైన కలదా అను విషయమున జిజ్ఞాసువులు పలువురు కృషిచేసిరి. ఆ కృషి యాస్కుని కాలము (దాదాపు క్రీ. పూ. 9వ శతాబ్ది) నుండియు జరుగుచున్నది. అతడు ఈ దేవతలను పృథ్వీ స్థానకములు (భూమికి సంబంధించినవి), మధ్యమ స్థానకములు (వాయు మండలమునకు చెందినవి), ద్యుస్థానకములు (ఆకాశమునకు చెందినవి) అను మూడు వర్గములకు చెందిన వానినిగ విభజించెను. పృథ్వి, అగ్ని, సోముడు, బృహస్పతి, నదీదేవతలు మొదటి వర్గమునకు చెందినవారు. ఇంద్ర, అపాంనపాత్, రుద్ర, వాయు - వాత, పర్జన్య, అప, మాతరిశ్వులు రెండవ వర్గమునకు చెందినవారు. ద్యౌ, వరుణ, మిత్ర, సూర్య, సవితృ, పూషన్, విష్ణు దేవులును, ఆదిత్యులును, ఉషోశ్వినులును మూడవ వర్గపువారు. ఇట్టి వర్గీకరణ దోషరహితము కాదనియు, కొందరు దేవతల వర్ణనాదులనుబట్టి వారు ఏ ఒక ప్రత్యేక వర్గమునను ఇముడక ఉన్నారనియు భావించి, కొందరు ఆధునికులు వేరు విధముగ వర్గీకరించుటకు కృషిచేసిరి. కాని, ఆ కృషి ఫలితము సంతృప్తిజనకముగ లేదు.

ఈ దేవతల సంఖ్య ముప్పదిమూడని వేదములందు పేర్కొనబడినది. ఆ యా దేవతలకు సంబంధించిన మంత్రములందు కొన్ని యెడల వారును జన్మనందినవారే అనియు, అయినను అమర్త్యులనియు పేర్కొనబడినది. అభిరుచులను బట్టియు, ఆ యా సందర్భములనుబట్టియు ఇందలి ప్రతి దేవతయు సర్వశక్తివంతముగనే పేర్కొనబడినది. కాని, కాలక్రమమున ఇంద్ర, వరుణ, అగ్ని, సోములకు ఆధిక్యము లభించినటుల స్పష్టమగుచున్నది. మంత్రములందలి వర్ణనలనుబట్టి ప్రాచీనార్యులు ఈ దేవతలకు రూపకల్పనము చేసినటుల భావించుటకు అవకాశము కలదు. కాని, ఆ భావన విగ్రహారాధనకు దారితీయకుండుట గమనీయమగు విశిష్ట విషయము. దేవతా ప్రశంస, ప్రస్తుతి, హవనక్రియ అనునవి వైదికార్యుల ఆరాధనయందలి భాగములు. తమకు ఇంపగు భోజన పదార్థములనే అగ్నియందు వేల్చి ఇష్టదేవతలకు అందజేయుట వారననుసరించిన పూజావిధి. వారి దేవతలందరు - అందును ముఖ్యముగ ఇంద్రుడు - సోమపానమున ఆసక్తి కలవారు; అందువలన వారును సోమపాన మొనర్చుట ఒక ధార్మిక విధిగ గ్రహించిరి.

ఇటుల బహుదేవతారాధన వైదికార్యులయందు వ్యాప్తియందున్నను, కాలక్రమమున ఆ వైదిక ఋషులందు ఆ యా దేవతలు ఒకే ఒక దివ్య శక్తియొక్క వివిధ రూప విశేషములు అను భావన కలిగినది. ఋగ్వేదకాలముననే ఈ భావనకు బీజములు ఉండినటుల వేదములవలన తెలియవచ్చుచున్నది. సమకాలీనములగు పశ్చిమ ఆసియా, ఉత్తర ఆఫ్రికా, చీనా దేశములయందలి నాగరకతలకన్న ఈ విషయమున వైదిక నాగరకత ముందంజ వేయగలిగినది. దేశకాలాతీతము, అనిర్వచనీయము నగు మూలశక్తి ఒకటి కలదను ఈ భావన క్రమముగ ఉపనిషత్కాలమునకు పరిణతిని ఆర్జించినది. యూదుల దైవమువలె ఈ ఏకశక్తి ఏ ఒక ప్రత్యేక జాతి ఎడలనో శ్రద్ధవహించునది కాక, విశ్వ సృష్టి స్థితులకు బాధ్యత వహించుట అందలి ప్రశంసనీయమగు విశిష్టత. ఈ భావముతోపాటుగ నైతిక సూత్రములు స్పష్టరూపమును చెంది వ్యక్తి జీవనము స్వచ్ఛతరము అగుటకు దోహదము చేసినవి [చూ. ఉపనిషత్తులు - విశ్వసాహితీ సంపుటము : పు. 579; దర్శనములు, మతములు సంపుటము : పు. 325].

ఈ పరిణామములతోపాటుగ వైదికార్యులందు పెంపొందిన 'ఋత' భావన కూడ ఇట పేర్కొనదగి ఉన్నది. ప్రపంచ స్థితియందు కనబడు నియమమును ఋతమని

వారు పేర్కొనిరి. ఈ ఋతము వలననే సూర్యచంద్రాదులును, దేవతలును, కాలమును నడచుచున్నవని వారి విశ్వాసము. ఋతమును అనుసరించి జీవిత విధానమును తీర్చిదిద్దుకొనుట మానవుని కర్తవ్యమని వారి ఆశయము [చూ. ఋతము].

ఈ భావనలను ఆధారముగ గ్రహించి, దార్శనిక శాస్త్రమును నిర్మించుటకు కొందరు విజ్ఞులు ఆనాడే యత్నములను చేయసాగిరని తలంప అవకాశము కలదు. ఉపనిషత్కాలమున ఈ దర్శనశాస్త్రము సర్వతో ముఖ వికసనము పొందినది. సృష్టితత్త్వమును గుర్తెరుగుటకు వివిధ సంప్రదాయములును ఆనాడు కృషిచేసినవి. ఈ కృషిలో దాదాపుగ అందరును 'ఓమ్' (ॐ) అను శబ్దమునకు అనితరప్రాముఖ్యము కల్గించిరి. సర్వసృష్టికి మూలము ఈ శబ్దమే అని వారు విశ్వసించిరి. నేటికిని హిందూ మత సంప్రదాయములలో ప్రణవము అనుపేర ఈ ఓంకారమునకు అసామాన్యమగు మన్నన కలదు.

సమకాలిక చీనాయందును మతము ఆ కాలమున ప్రకృతి దేవతలను ఆశ్రయించియే పరిణామము పొందినది. కాని, ఆ దేశీయులందు పితృదేవతారాధన ఇతర దేశములందు కన్న ఎక్కువ ప్రాముఖ్యమును ఆర్జించినది. ఇందులకు తోడుగ చీనీయ తత్త్వవేత్తలును ప్రపంచ గతి నియమమును అన్వేషించి, సృష్టికి మూలమగు సనాతన నియమమును 'టావ్' అని పేర్కొనిరి. కాని, ఈ 'టావ్' భావనకు ప్రజల మతమున ప్రముఖ స్థానము క్రీ. పూ. 5 వ శతాబ్ది అంతము వరకు చేకూరలేదు.

మృత్యనంతర స్థితిని గురించియు ఆ ప్రాచీనులు కొన్ని భావనలను కలిగి ఉండిరి. మరణానంతరమున వేరు విధమగు జీవితము ప్రతివానికిని కలదనుట వీనియందు సామాన్యముగ కననగు విషయము. మృతుడు తన జీవిత కాలమున చేసిన సత్కృత్యముల వలననే కాక, మృతుని మరణానంతరపు పరలోకస్థితికి అనువుగ వసతుల చేకూర్పుటవలన కూడ పరలోక నివాసము ఎక్కువ సుఖప్రదము కాగలదని వారు విశ్వసించిరి. ఈ విశ్వాసము ఈజిప్టునందు ప్రగాఢముగ ఉండినది. పరలోక నివాసమునకు సైతము ఐహిక జీవితపు భౌతిక కాయమే ముఖ్య సాధనమని వారు తలచుటచే, మృత శరీరమును తగు రాసాయనిక చర్యలచే భద్రపరచుట మృతిచెందినవాని సన్నిహితులకు ముఖ్యకర్తవ్యము అయ్యెను. కాని, ఇటుల భద్రపరచుట అత్యంతవ్యయమూలకము. అందువలన పేదలగు సామాన్య జనులకు ఈ పరలోక సౌఖ్యము అందరాని దయ్యెను. కులీనులు, సంపన్నులగు వారి శరీరములకు మాత్రమే ఈ 'అదృష్టము' లభించెడిది. అందును చక్రవర్తుల విషయమున ఎక్కువ శ్రద్ధ వహింపబడెడిది. తాము జీవించిన కాలమున ప్రజల యోగక్షేమముల ఎడ శ్రద్ధ వహించిన రీతిగనే చనిపోయిన అనంతరమున సైతము తమ ప్రజల యోగక్షేమముల ఎడ బాధ్యత వహించవలసిన విధి ఆ చక్రవర్తులకు ఉండెడిది. పరలోక దేవతలకును, ఈజిప్టు ప్రజలకును మధ్య ఇట్టి మృతరాజులు సంధాతలుగ వ్యవహరించి, ప్రజలకు ఐహిక, పారలౌకిక సౌఖ్యములను చేకూర్చెడివారని ప్రాచీన ఈజిప్టువాసుల నమ్మకము. అందువలన పరలోక దేవతలు తమ రాజు ఘనతను గుర్తించు రీతిగ ఆ రాజు మృతశరీరమును భద్రపరచు నిర్మాణమును అత్యున్నతము, రమణీయము అగు తీరుగ వారు నిర్మించెడివారు. ఆ నిర్మాణములే నేడు పిరమిడ్ [చూ.] లు అని వ్యవహరింపబడుచున్నవి. అందు ఆ రాజుయొక్క భోగవస్తువులు భద్రపరుపబడెడివి. మనసును ఉల్లసింపజేయు చిత్తరువులు, పౌరాణిక గాథలు, రాజు జీవిత విశేషములు అందు చిత్రింపబడెడివి. ఇటుల ఒక రాజు శరీరము భద్రపరుపబడిన పిరమిడ్ ఆ రాజు కాలపు కళా వికసనమునకు మచ్చుతునకగ ఉండినది. తరువాతి కాలమున తస్కరులు ఈ పిరమిడ్‌లందలి ధనరాశిని కొల్లకొట్టి, కళా ఖండముల నశింపజేసినను, తుతెన్ - ఖామేన్ అను ఈజిప్టు సార్వభౌముని పిరమిడ్ మాత్రము ఆ దుర్గతికి పాల్పడక తప్పించుకొనెను. ఆ పిరమిడ్ నందలి త్రవ్వకముల వలన పురాతత్త్వవేత్తలు అపూర్వ కళా ఖండములను సేకరించి, ప్రాచీన ఈజిప్టు నాగరకత అందుకొనిన అత్యుచ్చస్థాయిని ప్రపంచ ప్రజలు తెలియునటుల చేయగలిగిరి.

ఇట్టి మత విశ్వాసములే కాక, దైనిక జీవితమున అడుగడుగున జోక్యము వహించు కొన్ని అంధ విశ్వాసములును ఆనాటి ప్రజలందు వ్యాప్తములై ఉండెను. వానిలో సర్వసామాన్యముగ కననగునది భూతములందలి విశ్వాసము. రోగములు దుష్టదేవతల ఆగ్రహమునకు ఫలితము అని వారు విశ్వసించిరి. వీనికి తోడుగ శకునముల మీద విశ్వాసము ప్రతివానికిని ఉండెడిది. భూతములను ఉచ్చాటనము చేయుట విధిగ ఇడుకొనిన మాంత్రికులు ఆనాడు విరివిగ ఉండెడివారు. అటులే పక్షి రుతము, గౌళి పలుకు, కాకి మొదలగు పశులయు, కొన్ని జంతువులయు సవ్యాపసవ్య గమన రీతులు మొదలగు వానినిబట్టియు ఫలాఫలములను ముందుగ గుర్తెరుగు వారును ఉండెడివారు. నీటిలో నూనెబొట్టును వేసి, ఆ బొట్టు వహించు రూపమునుబట్టి కార్యపు పోగాములు చెప్పుటయు ఉండెడిది. ఈ వివిధ

విషయములను గురించియు ప్రశ్నశాస్త్రము, జ్యోతిషము (జాతక భాగము) మొదలగు వానిని గురించియు విపుల గ్రంథములు ఆనాడు ఉండినటుల బాబిలోనియాలోని త్రవ్వకముల వలన తెలియవచ్చినది.

## సంఘ వ్యవస్థ

మానవ సామాజిక వ్యవస్థా నిర్మాణమునకు సమకాలీన మత విశ్వాసములతోడను, సంపదుత్పత్తి సాధనముల తోడను సన్నిహిత సంబంధము కలదనుట ఆ ప్రాచీన యుగము నుండియు కననగుచున్నది. అంతియే కాదు; ఆ ప్రాచీన సంస్కృతులందు, అందును ముఖ్యముగ బాబిలోనియా, ఈజిప్టు దేశములందు మానవ సామాజిక వ్యవస్థ దేవాలయమును ఆశ్రయించి రూపొంది క్రమ వికసనము పొందినదని చెప్పవచ్చును. క్రీ. పూ. 4000 ప్రాంతమున రూపొందిన ఆ దేశములందలి ప్రాచీన జనావాసములకు చెందిన ప్రజానీకమును, పాలకులును, అర్చకగణము (పురోహితగణము) ను ఆ జనావాసమందలి దేవాలయపు సేవకులుగ పరిగణింపబడెడివారు. భూమియు, మానవ కృషివలన ఉత్పన్నమగు సంపదయు దేవాలయపు ఆస్తిగ పరిగణింపబడెడిది. ఆరంభకాలమున ఈ దేవస్వపు నిర్వహణ బాధ్యత అగ్రపురోహితునిపై ఉండెడిది. కాని, చారిత్రక యుగారంభమున ఏర్పడిన నూతన పరిస్థితుల వలన ఈ ఏర్పాటునందు కొన్ని మార్పులు జరుగక తప్పదయ్యెను. జనసంఖ్య హెచ్చుగుటయు, దాని ఫలితముగ చిన్న జనావాసములు కొన్ని కలిసి ఉత్పత్తి సౌలభ్యము కొరకై ఒక నగరముగ రూపొందుటయు, ఆ నగరమున మేళనము చెందిన వివిధ జనావాసముల అధిదేవతలలో ఒకనికి ఆ నగరాధిపత్యము లభించి, ఆ దేవుని ఆలయ పురోహితునికి ప్రథమ స్థానము లభించుటయు ఇందువలన తటస్థించినది. జనసంఖ్యతోపాటుగ వృత్తి విభజనయు అతిశయిల్లెను. ఈ ఆర్థిక వ్యవహారమును పర్యవేక్షించి, దేవాలయపు ఆదాయము ఎక్కువగు నటుల చేయుటకై అగ్రపురోహితుడు ఒక అధికారి వర్గమును సోపాన క్రమమున నెలకొల్పవలసి వచ్చెను. భూముల సాగుబడియందు కుతూహలమును, ఆసక్తిని రేకెత్తించుటకై కృషీవలులకు సొంత సేద్యమునకై కొంత భూమిని ప్రత్యేకింపవలసిన స్థితి ఏర్పడెను. అందువలననే చారిత్రక యుగారంభమునకు ఈ నగర భూములు మూడు తరగతులుగ విభజింపబడి ఉంపినవి. అందు మొదటిది దేవస్వము: ఇందలి ఆదాయము దేవాలయమునకే చెందుచుండెడిది. రెండవది భటవృత్తి భూమి: దేవాలయ వ్యవహార నిర్వహణలో పాల్గొను పురోహితులకును, ఉద్యోగులకును వారి వారి వృత్తి ప్రాముఖ్యమునకు తగినటుల క్షేత్రములు ఇందుండి ప్రత్యేకింపబడెడివి; తమ సేవకు ప్రతి ఫలముగ ఇందలి ఆదాయమును వారే అనుభవించెడివారు. ఇక మూడవది రైతువారీ భూమి: రైతులకు సర్వహక్కులతో చెంద చేయబడిన భూములు ఈ వర్గమునకు చెందెడివి; ఈ రైతులు తమ ఫలసాయమునుండి ఒక నిర్ణీత భాగమును దేవాలయమునకు చెల్లించెడివారు. ఇటుల దేవాలయములు సుసంపన్నములు అగుటవలన తక్కిన వృత్తులలో అనేకములకు పెట్టుబడిని దేవాలయమే ఈయవలసివచ్చి, కాలక్రమమున పరిశ్రమలపైన దేవాలయమునకే అధికారము సంక్రమించెను. ఉత్పత్తియగు ధాన్యమును, వస్తువులను నిల్వజేయుటకై గిడ్డంగులను దేవాలయాధికారులు నిర్మించి, క్రమముగ వ్యాపారముపై కూడ ఆధిపత్యము వహించిరి. ఇటుల మత విశ్వాసముల వలనను, ఆర్థికపు పెత్తనము వలనను, ప్రజలను అగ్రపురోహితుడు లోగొని, సాంఘిక వ్యవహారములను తన చరమ నిర్ణయమునకు లోనగు నటుల చేయుటతో మత విషయికముగను, రాజకీయముగను అతడు నగర ప్రజలకు అధినేత కాగలిగెను. చాల కాలమువరకు ఇటుల ఈ రెండు అధికారములు ఒకే వ్యక్తియందు ఉండినవి. కాని, కాలక్రమమున సౌలభ్యము నిమిత్తమై రాజరికపు అధికారములను మాత్రము తాను నిలుపుకొని, అధినేత మతాధికారములను తనకు సన్నిహితుడు, విశ్వాసపాత్రుడు అగు వేరొకనికి చెంద జేయుట ఆరంభమైనది. ఇట్టి అధికార విభజన సుమేర్‌లో క్రీ. పూ. 2500 ప్రాంతముననుు, ఈజిప్టునందు అంతకు కొలది కాలము పూర్వముననుు జరిగినటుల తెలియుచున్నది. ఈ విభజనకు పూర్వము దేవాలయ ప్రాంగణముననే వసించుచుండిన అధినేత అంతట రాజ బిరుదము వహించి, వేరుగ ఒక మహాభవనమును నిర్మించుకొని నివసించుట ఆరంభమయ్యెను. ఈజిప్టు ప్రభువులకు కల 'ఫారో' బిరుదము పేరో అను పదపు వికృతి; పేరో (పేర్ + ఓ) అనగ మహాభవనము అని అర్థము.

ఈ విభజన జరిగిన తరువాత సైతము మత విషయములందు చరమ నిర్ణయాధికారము రాజునందే చాలకాలము ఉండెను. రాజులు బలహీనులయినపుడు మాత్రము పురోహితులు మతవిషయికముగ సర్వాధికారములను వహించి దేవాలయపు ఆర్థికబలమును ఊతగ గొని రాజకీయములపై కూడ తమ ప్రభావమును నెరపెడివారు.

ఈజిప్టు దేశపు పరిపాలనా విధమును గురించియు మనకు కొన్ని విషయములు తెలియనగుచున్నవి. రాజునకు బాధ్యత

వహించి, పరిపాలన నెరపుటకు ఒక ప్రధానీ ఉండెడివాడు. ఇతడు- పరిపాలనాధ్యక్షుడుగనే కాక న్యాయాధీశుడుగ సైతము వ్యవహరించెడివాడు. ఆర్థిక విషయములందు కోశాధికారి సర్వాధిపత్యము వహించి, రాజునకు లోబడి వ్యవహరించెడివాడు. ఈ ఇరువురు ప్రముఖోద్యోగుల పర్యవేక్షణకు లోనై దేశమున పరిపాలన సాగెడిది. పరిపాలనా సౌకర్యార్థము దేశము మండలములుగ విభజింపబడి, ఒక్కొక్క మండలము ఒక పాలకుని అధీనమున ఉంచబడెడిది. మండల పాలకులు తమ మండల పరిపాలనా విషయములందును, ఆర్థిక విషయములందును - రాజాధిపత్యమునకు లోబడి - సర్వాధికారములను వహించెడివారు. ప్రజా శ్రేయస్సును అపేక్షించి వారు నీటి పారుదల సౌకర్యములను తగు శ్రద్ధతో అభివృద్ధిచేసి, శాంతి భద్రతలను కట్టుదిట్టముగ కాపాడెడివారు. వారి అధీనమున ప్రాంతీయ సేనయు, దానికి వలయు ఆయుధ సామగ్రియు ఎల్లపుడు సమాయత్తముగ ఉంచబడెడివి.

ఈజిప్టు, బాబిలోనియా దేశములయందు రెండింట సంపదుత్పత్తిసాధనములు ప్రభువుల అధీనముననే ఉండిన విషయము ఇదివరకే తెలుపబడినది [చూ. పు. 28]. కాని, ఈజిప్టుదేశము ముడిపదార్థముల విషయమున దాదాపుగ స్వయంసమృద్ధమై ఉండెడిది. కలప, రాగి మొదలగు కొన్ని వస్తువులు మాత్రము ఆ దేశమునకు కొరవగ ఉండెడివి. అట్టి వానికొరకై ఆ దేశ ప్రభువులు లెబనాన్ మొదలగు దేశములపై దండయాత్రలుచేసి, ఆ వస్తువులను సంగ్రహించెడివారు. అట్టి వస్తు సంగ్రహణాశతోడనే వారు తమ దక్షిణపు సరిహద్దులను అతిక్రమించి నేటి సోమాలీలాండ్, ఎతియోపియా ప్రాంతములలోని కొన్ని భాగములను ఆక్రమించిరి. ఈజిప్టు దేశపు ప్రాచీన చరిత్రలో ఆఫ్రికా ఖండమును ఆ దేశపు నావికులు చుట్టివచ్చినటుల కలదు. క్రీ. పూ. 1500 ప్రాంతమున ఇది జరిగి ఉండునని కొందరి అభిప్రాయము. ఈ ఆఫ్రికా తీర భూప్రదక్షిణము సైతము ముడిపదార్థముల సేకరణ కొరకై జరిగిన యత్నముల ఫలితమే కాదగునని కొందరు చారిత్రకుల అభిప్రాయము.

సుమేర్ - బాబిలోనియా దేశము ముడి పదార్థములకు సంబంధించినంతవరకు లోటు దేశముగ ఉండెడిది. ఈ పదార్థముల సంగ్రహణమునకు వ్యాపారమును ముఖ్య సాధనముగ అవలంబించి, ఆ దేశపు ప్రభువులు ప్రోత్సహించిరి. సుమేరియన్‌లును, బాబిలోనియన్‌లును ఈ వర్తక వ్యాపారముల అభివృద్ధికై రహదారులను అభివృద్ధి చేసిరి. తీరమును అనుసరించిన నౌకావ్యాపారమును కూడ వారు ప్రోత్సహించిరి. రాగిని, మంచిరకపు రాతిని అరేబియా ద్వీపకల్పపు ఆగ్నేయపు మూలనున్న ఓమన్ నుండి వారు దిగుమతి చేసికొనెడివారు. అట్టులే తూర్పు ఇరాన్ నుండి తగరమును, సిరియా నుండి కలపయు, ముత్యపు చిప్పలు దక్షిణ భారత తీర నగరముల నుండియు బాబిలోనియాకు ఎగుమతి అయ్యెడివి. ఈజిప్టు దేశమునకు సంబంధించినంతవరకు నైలు నదియే ఆ దేశమున ముఖ్యమగు రహదారిగ ఉండెను. ఉత్తరమునకు పోవునపుడు ప్రవాహ వేగమునను, దక్షిణమునకు పయనించునపుడు గాలి వాలునను అందు పడవలు పయనించెడివి. దూర దేశములతో వ్యాపార సంబంధముల నెలకొల్పుకొనిన బాబిలోనియన్‌లు చక్కని బాటలను తమ దేశమునుండి ఇతర దేశములకు నిర్మించి అందులకు వసతి కల్పించిరి. బాబిలోనియా నుండి ఇరాన్ పీఠభూమి, బెలూచిస్తాన్‌ల ద్వారా మొహెంజొదారోకు బిడారులు పయనించుటకు ఉపకరించిన ప్రాచీన మార్గమును తన అన్వేషణాఫలితముగ కనుగొనగలిగితినని ఆరెల్‌స్టీన్ అను చారిత్రక పరిశోధకుడు పేర్కొనెను.

వర్తక వ్యాపారముల అభివృద్ధివలన, వానినే తమ వృత్తిగ గ్రహించిన వర్తకసంఘములు కొన్ని నగరములను నిర్మించుకొని అందు పరిమితాధికారములతో స్వతంత్ర పరిపాలన నిర్వహించుకొనసాగెను. ఇటుల క్రమముగ రాజులును, పురోహితులును, వ్యాపారులును సంఘమున ఆధిక్యమును ఆర్జించిరి. వీరితో పాటుగ ఆ ప్రాచీన దేశముల రెండింట లేఖక వృత్తిని అవలంబించు వారికిని ఆధిక్యము లభించెను. పరిపాలన, వ్యాపారము మొదలగు వానియందు వ్రాతకు గల ప్రాముఖ్యమును అనుసరించి, సంఘము సువ్యవస్థీకృతమగు కొలదియు, లేఖక వృత్తికి ఘనత పెచ్చుపెరుగ సాగెను.

ఇటుల పైతరగతుల వారి ఆధిపత్యము హెచ్చుగుకొలది దేశీయాదాయమున అత్యధిక భాగము వారికే చెందుట వలన రైతులు మొదలగు వారు క్రమముగ హీనస్థితికి రాదొడగిరి. వివిధ వృత్తుల వారు ధనవంతుని ఎవనినో ఒకనిని లేదా దేవాలయాగ్ర పురోహితుని ఆశ్రయించి శ్రమించి బ్రతికెడివారు. వీనికి తోడుగ బానిసత్వము ఆనాడు ఆ రెండు దేశములందును విరివిగ ఉండెడిది. యుద్ధమున పరాజితులైన వారిలో దృఢ శరీరులను విజయము పొందిన దేశపు ప్రభువు బానిసలుగ గ్రహించెడివాడు. వీరేకాక దారిద్ర్యము వలన బిడ్డలను అమ్మెడి వారును ఉండెడివారు.

సంఘము ఇటుల తర తమ భేదములతోడను, ధనిక దరిద్ర వివక్షతలతోడను రూపొందినపుడు హక్కులు కల

వారి రక్షణ నిమిత్తము ఒక విధమగు న్యాయసంహితను రూపొందించు ఆవశ్యకత కలిగెను. పరంపరాగత సంప్రదాయపు భావనలను ఆధారముగ గ్రహించి పండితుల సాయమున ఈజిప్టులోని న్యాయాధీశులు ఈ విషయములను పరిష్కరించెడివారు. క్లిష్టసమస్యల సందర్భమున రాజు నిర్ణయమే తుది నిర్ణయముగ ఉండెడిది. పరంపరాగత భావనలను న్యాయసంహితగ క్రోడీకరించి లిఖితరూపమును కల్పించుట సమంజసమను అభిప్రాయము ప్రపంచమునందు తొలుతగ బాబిలోనియా దేశపు ప్రభువులకు తట్టినది. హమ్మురబీ కాలమున ఈ సంహిత సమగ్రరూపమును పొందిన విషయము ఇదివరకే ప్రసక్తిమైనది [చూ.పు. 17]. ఈ న్యాయ సంహితయందు 285 చట్టములు కలవు. ఈ చట్టములు ప్రత్యేక శీర్షికల క్రింద వర్గీకరింపబడినవి. న్యాయవ్యవహార, స్వత్వ, సైనిక, వ్యావసాయిక, వ్యాపార, ఋణవ్యవహార, దాయభాగ, దత్తస్వీకార, స్త్రీధన, శ్రమ మూల్యములకు సంబంధించిన విధులే కాక శిక్షాస్మృతియు, బానిసలపై కల హక్కులను నిర్వచించు విధులును ఇందు కలవు. ఈ సంహితాకారుల న్యాయబుద్ధి ఆ కాలపు పరిస్థితులనుబట్టి చూడ కొంత ఉదాత్తమైనదిగనే భావింపదగి ఉన్నను, అందలి శిక్షాస్మృతి మాత్రము అతి కఠోరముగను, కొన్ని ఎడల పరిహాసాస్పదముగను కన్పట్టును. శిక్షను విధించుటలో ప్రతీకార వాంఛయే ముఖ్య సూత్రముగ గ్రహింపబడెడిది. ఒకని చేతిని తెగగొట్టిన ముద్దాయిని విచారించునపుడు న్యాయాధీశుడు ముద్దాయియొక్క చేతిని తెగగొట్టించుటయే ఈ సంహిత ప్రకారము తగిన దండనముగ భావించి విధించెడివాడు. ఈ ప్రతీకార సూత్రము కొన్ని పట్టుల కొన్ని అసందర్భములకును దారితీసెడిది. ఒకని కుమార్తెను చంపినటుల ముద్దాయిపై నేరమారోపింపబడి రుజువయినపుడు న్యాయాధీశుడు ముద్దాయిని శిక్షింపక, ముద్దాయికి ఆ నేరపు తీవ్రత తెలియవచ్చుటకు ముద్దాయియొక్క కూతురును చంపింప ఉత్తరువును ఇచ్చెడివాడు. ఈ శిక్షల విధింపులో ఆర్థిక వర్గములనుబట్టి విచక్షణయు ఉండెడిది. ఒక నేరమునకు రాజు, పురోహితులు, ఉద్యోగులు మొదలగు వారికి విధించు శిక్ష కన్న, అదే నేరమునకు సామాన్య రైతునకు విధించు శిక్ష తీవ్రతరముగ ఉండెడిది; ఇక బానిస విషయమున అది అత్యంత కఠోరముగ ఉండెడిది.

ఇటుల అవకతవకలు ఉన్నను సాంఘికముగ కొన్ని ప్రయోజనములు ఆ సంహితవలన చేకూరి ఉండెనని విశ్వసించుటకు ఆధారములు కలవు. వస్తువుల ధరలకు అందు అవధులు ఏర్పరుపబడెను. అట్టులే వివిధ వృత్తుల పనివారలకు చెల్లింపదగు దిన భత్యములును అందు నిర్ణయింపబడెను. ఆస్తియందు వ్యక్తికిగల స్వత్వమును రక్షించుటకు ఆ శాసన సంహిత ఎక్కువ శ్రద్ధ వహించెను. మృతిచెందిన వాని ఆస్తి వాని మగబిడ్డలకు సమానముగ చెందుచుండెడిది. దొంగతనము జరిగి, దొంగ చిక్కినపుడు వానికి మరణశిక్ష విధింపబడి సొమ్ము సొంతదారునకు చేర్చబడెడిది. అటుల చిక్కకున్నచో సొమ్ము పోగొట్టుకొనిన వాడు దేవుని ఎదుట ప్రమాణ పూర్వకముగ తనకు ఆ దొంగతనమువలన కలిగిన నష్టపు మొత్తమును పేర్కొనెడువాడు. అంతట దొంగతనము జరిగిన ప్రదేశమున అధికారమును నెరపుచున్న పాలకుడు స్వీయ ధనమునుండి సొంతదారునకు నష్టమునకు సరిపోవు పరిహారమును చెల్లించెడివాడు.

క్రీ. పూ. 1500 తరువాత పశ్చిమ ఆసియాయందు బాబిలోనియా కాక ఇంకను మరికొన్ని రాజ్యములు నెలకొనిన విషయము ఇదివరలో తెలుపబడినది [చూ. పు. 16]. ఇటుల నాగరక రాజ్యములు పెక్కు రూపొందిన ఫలితముగ ఒక విధమగు అధికార తౌల్యమును నెలకొల్పుటకు కొంత కృషి జరిగినది. తత్ఫలితముగ బలవత్తర రాజ్యములగు ఈజిప్టు, బాబిలోనియాలలో ఏదియు సర్వంసహాధిపత్యము వహింపకుండ జాగ్రత్త వహించుట తటస్థ రాజ్యములు తమ నీతిగ ఇదుకొనినవి. ఇట్టి నీతిని అవలంబించియే తటస్థ రాజ్యముల అండతో హిటైట్ ప్రభువగు మువాతల్లిష్ బలవంతుడగు ఈజిప్టు సార్వభౌము (రామిసెస్ - II) ని క్రీ. పూ 1287 లో ఓడించెను. ఆ యుద్ధానంతరమున ఆ ప్రభువులు ఇరువురును ఒక సంధి కుదుర్చుకొని, లిఖితముగ ఒడంబడికకు రాగలిగిరి. ప్రపంచ చరిత్రలో మొదటి అంతర్జాతీయపు ఒడంబడిక ఇదియే అని చెప్పదగును. రాజకీయ సామరస్యమును ఆశించి వివిధ దేశముల రాజకుటుంబములు వైవాహిక సంబంధ బాంధవ్యములను నెలకొల్పుకొనుటయు అపుడే ఆరంభమయ్యెను. ఈ ఒడంబడికలు, రాజకుటుంబముల బాంధవ్యములు, వర్తక వ్యాపారములు సమష్టిగ ఈ దేశముల మధ్య కొంత సాన్నిహిత్యమును చేకూర్చుటకు తోడ్పడెను. అందుతో పాటుగ కొన్ని అంతర్జాతీయ మర్యాదలును రూపొందెను. ఏ దేశపు వర్తకుడైనను, ఒక విదేశమున మరణించిన ఎడల ఆతని ఆస్తిని ఆ విదేశ ప్రభుత్వము భద్రమొనర్చి, మృతిచెందిన వాని స్వదేశమునందలి అతని వారసులకు అందజేయుటకు శ్రద్ధవహించు సంప్రదాయము ఇటుల ఏర్పడినది. విదేశ ప్రభుత్వపు రాయబారులు సమ్మాననీయులను సంప్ర

దాయము కూడ ఏర్పడెను. క్రీ. పూ. 1110 లో చీనా ప్రభుపు వద్దనుండి రాయబారి వర్గము ఈజిప్టు రాజు ఆస్థానమునకు వచ్చెనని ఈజిప్టు దేశపు ప్రాచీన గ్రంథము లందు కలదు. నడుమనున్న వివిధ దేశములను దాటి ఈజిప్టు దేశమును ఈ రాయబారులు సురక్షితముగ చేరి రన్నచో అందులకు రాయబారులు సర్వత్ర సమ్మాన నీయులను అంతర్జాతీయ మర్యాద ఆనాడు ఏర్పడుటయే కారణమై ఉండును. ఇటుల అంతర్జాతీయ న్యాయ శాస్త్రమునకును ఆ కాలముననే అంకురార్పణ జరిగినది.

ఆనాటి ఈజిప్టు సామ్రాజ్యము చాలవరకు ఆర్థికము. సామ్రాజ్యమందలి వివిధ దేశములలోని సంప్రదాయ పరిపాలన యథాపూర్వకముగ ఉండెడిది. సామ్రాట్‌నకు అతని ప్రతినిధుల ద్వారా కప్పమును మాత్రము ఆ దేశములు చెల్లించెడివి. కాని, అసీరియన్ సామ్రాజ్యము మాత్రము ఇందులకు అచ్చముగ విరుద్ధము. సైనిక యంత్రము వారి సామ్రాజ్యమునకు ముఖ్యాధారము. వారు తమకు తోచిన రీతిగ వివిధ జాతీయులను స్వదేశ ములనుండి ఎడబాపి వేరు ప్రాంతములకు తరలించిరి. పరిపాలితులలో భయమును నెలకొల్పి, తన్మూలమున పరిపాలనా యంత్రమును పటిష్ఠతరము చేయుటను వారు తమ ముఖ్యవిధిగ పాటించిరి. ఏది ఎటులున్నను, ప్రాంతీయ పరిపాలనకొరకై వీరు ఏర్పరచిన యంత్రాంగము అత్యంత సమర్థవంతము అగుటచే, దానినే తరువాతి తక్కిన సామ్రాజ్య నిర్మాతలు, అందును ముఖ్యముగ పారసీక సామ్రాట్‌లు ఒరవడిగ గ్రహించి అవలంబించిరి.

ఇక సింధునాగరకతా భూమియందు ఆనాడు ఉండిన వ్యవస్థను గురించి ఏమియు తెలియవచ్చుటలేదు. అవి రాజ పరిపాలితములా ? పురోహిత పరిపాలితములా ? లేదా గణరాజ్యములా ? అను విషయములు ఇప్పటికినీ అవిదిత ములు. కాని, ఆ నగరముల ఏర్పాటునుబట్టి చూడ అచటి సంఘము సువ్యవస్థీకృతమై ఉండినటుల స్పష్టమగుచున్నది. అందలి ధాన్యాగారముల విరివినిబట్టి చూడ శుల్క రూపముననో, మరే విధముననో జాతీయాదాయమున నియమిత భాగమును సంగ్రహించు కేంద్ర పరిపాలనా వ్యవస్థ ప్రతి నగరమున ఒకటి ఉండెనని విదితమగుచున్నది. అటులే అందలి త్రవ్వకములందు లభ్యములైన వస్తువులను బట్టి ఆ నగరములందు వివిధ నాగరక వృత్తులును సమధిక పరిణతిని ఆర్జించినవనియు, అందులకు అనువగు సామాజిక పరిస్థితులు అపుడు ఉండెననియు ఊహించ దగును. సింధునాగరకతకు చెందిన ముద్రికల వంటివే సమకాలికపు బాబిలోనియా యందును వ్యాప్తిలో ఉండి నటుల త్రవ్వకములవలన తెలియవచ్చుటచే బాబిలోని యాతో ఈ నగరములకు వర్తక సంబంధము కలదని మాత్రమే ప్రస్తుతమునకు పేర్కొనదగి ఉన్నది. ఈ సింధు నాగరకతయందలి వ్యవస్థయందు మతమునకు కల ప్రసక్తియు తెలియవచ్చుటలేదు.

వైదికార్యులయందలి సామాజిక వ్యవస్థను గురించిన పెక్కు వివరములు వేద వాఙ్మయమువలన తెలియవచ్చు చున్నవి. ఈ సంఘమున దేవాలయముల ప్రసక్తియే కనబడదు. వేరొక ప్రత్యేకతయు ఇట కనబడుచున్నది. ఈజిప్టు, బాబిలోనియాలయందలి ఆర్థిక రంగమున దేవా లయ పురోహితుల ప్రాబల్యము విరివిగ ఉండెను. అందు చేత వారు భోగలాలస జీవనమునకు అలవాటుపడి ఉండిరి. వైదిక నాగరకతయందు పురోహితుడు పలుకుబడి కలవాడగుట వాస్తవమే అయినను, భౌతిక సంపదను అతడు ఆశించినటుల కనపడదు. మతమునకు ఈ వ్యవస్థ యందును ప్రాముఖ్యము ఉండెడిది. వైదిక దేవతల కొరకై జరుపు హవనాదులు పురోహితుని ఆధ్వర్యవము ననే జరుపబడెడివి. కాలక్రమమున ఈ యజ్ఞయాగములకు సంబంధించిన కర్మకాండ విరివిగ పెంచబడినది. అందు ఏ లోపము జరిగినను దేవతల ఆగ్రహమునకు గురికావలసి వచ్చునను భయము ఏర్పడుటచే, ఈ కర్మకాండను గుర్తెరింగిన పురోహితుల ఎడ గౌరవ మర్యాదలు సంఘ మున ఎక్కువ కాదొడగినవి.

వర్ణ వ్యవస్థ : వైదికార్యులయందలి ప్రత్యేక విశిష్టత వర్ణవ్యవస్థ. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు అను నాలుగు వర్ణములు - వేదకాలముననే - భారతదేశమున ఏర్పడినవి. ఇవి తొలుత దాదాపుగ వృత్తిని ఆశ్ర యించియే ఏర్పడినవి. పురోహిత వర్గము బ్రాహ్మణ వర్గముగను, రాజు, యోధవర్గము, క్షత్రియ వర్గముగను సంఘమున ఉన్నత స్థానములను ఆర్జించినవి. ఇక ఆర్య విజితులగు దస్యులకు ఆర్యసమాజమున స్థానము కల్పింపగ ఏర్పడినదియే నాలుగవ వర్ణమని పలువురి తలంపు. కృషి, వాణిజ్యములు మూడవ వర్ణమువారి వృత్తులుగ ఉండెను. కాని, ఈ విభజన తరువాతి కాలమున ఉండినంత కట్టు దిట్టములతో వేదకాలమున అమలుజరుపబడినటుల లేదు. ఒక వర్ణము వాడు వేరొక వర్ణమును తన సామర్థ్యమును అనుసరించి గ్రహించుటకు అవకాశములు ఆనాడు ఉండి నటుల తెలియవచ్చుచున్నది. వేదములందు ప్రశంసలను పొందిన మహాదాతలగు రాజులలో 'బలవూత' అను దస్యు జాతికి చెందిన రాజును కలడు. అటులే రండా పుత్రుడగు సత్యకాముడు తన నీతి బలము వలన బ్రాహ్మ

ణుడుగ అంగీకరింపబడెను. కాని, కాలక్రమమున పై వర్ణములవారు తమ ప్రయోజనముల రక్షణ కొరకై చేసిన కృషి మూలమున ఈ వర్ణవిభజన జన్మను బట్టి స్థిరత్వముచెందుట ఆనాడే మొదలైనది. అయినను, అనులోమ వివాహములు (పై వర్ణముల పురుషులు దిగువ వర్ణములవారి కన్యలను వివాహమాడుట) ఆ తరువాత చాలకాలము వరకు అమలులో ఉండినవి.

తొలుత ఆర్య సంఘము తెగలుగ చీలి ఉండినను, ఈ తెగలు స్వరక్షణకొరకై సంఘటీకృతములై ఏకనాయకత్వము కలవి అగుటతో రాజరికము రూపొంది ఉండినటుల పండితుల అభిప్రాయము. ఈ రాజులు తొలుత సాధారణముగ యుద్ధములందు మాత్రమే నాయకత్వము వహించెడివారు. తక్కిన అన్ని విషయములందును తెగయందలి పెద్దలే సంప్రదాయమును అనుసరించి వ్యవహారములను పరిష్కరించెడివారు. కాని, రాజు తన యోధవర్గపు సాయమున సంఘమునకు చేసెడి సేవకు ప్రత్యామ్నాయముగ అతనికి తమ ఆదాయము నుండి బ్రాహ్మణులు తప్ప తక్కినవారు ఒక నిర్ణీత భాగమును చెల్లించెడివారు. కాలక్రమమున ఒక తెగకుచెందిన రాజు బలవంతుడై తక్కిన తెగలపై కూడ నాయకత్వము వహించుటతో అతని అధికారము విస్తృతము కాజొచ్చినది. అయినను అతడు సంప్రదాయమును పాటించి, బ్రాహ్మణుల సాయమున దేశమును పాలించెడివాడు.

రాజునకు పరిపాలనయందు సాయ మొనర్చుటకు సభ, సమితి అను రెండు సంస్థలు ఉండెడివి. పౌరులలో పూజనీయులగు పెద్దలు ఈ సంస్థలందు సభ్యులుగ ఉండెడివారు. వీనిలో సభకు న్యాయ నిర్వహణాధికారమును ఉండెడిది. సంప్రదాయమును అనుసరించి న్యాయ విచారణ జరుపబడెడిది. శిక్షలు చాల తీవ్రముగ ఉండెడివి. చేసిన నేరమునకు ప్రతీకార భావనతో శిక్ష విధింపబడెడిది. దోషి పై వర్ణములకు చెందిన వాడయిన - అందును బ్రాహ్మణుడయిన ఎడల - శిక్ష తక్కువగ ఉండెడిది.

జలపరీక్ష, అగ్నిపరీక్షల వలన కూడ నేరము నిర్ణయింపబడుట నిజమే అయినను, ఇది చాల అరుదుగ జరిగెడిది. సాధారణముగ నేరము జరిగినపుడు చూచినటుల చెప్పెడు సాక్ష్యమునుబట్టియే నేరము నిర్ణయింపబడెడిది. నేరములకు పరిహారముగ శిక్షకు బదులుగ ధన రూపమున ముద్దాయి నుండి కొంత మొత్తమును వసూలు చేయుటయు ఉండెడిది. వ్యక్తిగతమగు ఆస్తికి రక్షణ ఉండెడిది. భూమియందు స్వత్వము దానిని సేద్యము చేయువానిదే. రాజునకు దానిపై ఆదాయమున వసూలు చేయబడు రాజభాగమున మాత్రమే అధికారముండెడిది. మృతుని ఆస్తి అతని కుమారులకు లభించెడిది. ఔరసులు లేనపుడు దత్త పుత్రుడును పుత్రుడుగనే అంగీకరింప బడెడివాడు.

రాజరికము వైదికార్య సంఘమునందు పెక్కు ప్రాంతములందు క్రమశః నెలకొనినను, రాజరికమును ఎరుగక స్వతంత్రములుగ మనిన సంఘములును ఆనాడుండెడివి. అట్టులే పలువురు రాజులను జయించి, ఏక రాట్‌లు లేదా సామ్రాట్‌లుగ ఉండినవారును ఆకాలమున ఉండిరి. ఐతరేయ బ్రాహ్మణము ఈ విషయమై తెలుపుచు ప్రాచ్య దేశపు అధిపతులు సామ్రాట్‌లనియు, దక్షిణదేశపు వారు భోజులనియు, ఉత్తరదేశమునందలి వారు విరాట్‌లనియు, మధ్యదేశపు వారు రాజన్యులనియు పిలువబడుచున్నారని నుడివెను. దీనిని బట్టి చూడ ఆనాటికే ప్రాచ్యభారతదేశమున ఒకసామ్రాజ్యము ఏర్పడినటుల తెలియవచ్చుచున్నది. విరాట్ అనునది గణరాజ్యాధ్యక్షపదవిని సూచించవచ్చునని భావించుటకు అవకాశము కలదు. వంశ పరంపరాగతముగ రాజపదవి సామాన్యముగ లభించుచున్నను, అందులకు పౌరుల ఆమోదము ఆ కాలమున పొందబడుచుండెడిదని వేదములవలన తెలియ వచ్చుచున్నది. కొన్ని ఎడల ప్రజలే రాజును ఎన్నుకొనినటుల నిదర్శనములు కలవు. అట్టి సందర్భములందు సాధారణముగ రాజ కులమునకు చెందిన వారిలో, తమకు నచ్చిన వానిని ప్రజలు ఎన్నుకొనుట జరిగెడిదని పండితుల అభిప్రాయము. అరుదుగ కొన్ని సమయములందు రాజు దుష్టుడైనపుడు ప్రజానీకము అతనిని తొలగించి వేరొకనిని రాజుగ ఎన్నుకొనుటయు జరిగెడిది.

సమకాలికమగు బాబిలోనియా నాగరకతయందువలెనే వైదికార్య సంఘమునందును వివిధములగు పరిశ్రమలును పరిణతిని ఆర్జించుట వలన, అందునను పలువృత్తుల వారు ఏర్పడిరి. ఈ వృత్తుల వారికి పని చూపించు నగరములును, వ్యాపారసంఘములును క్రమముగ వృద్ధి అయినవి. కాని, లేఖకవృత్తి మాత్రము వైదిక సంఘమున అంతగ మాననీయతను ఆర్జించినటుల కన్పట్టదు. వైదికార్యుల విద్యావిధానమున లేఖనము కన్న ప్రవచనమునకే ఎక్కువ విలువ ఒసగబడినది. ఇంతేకాక ప్రాతిపదిక విషయమునందు సైతము భారతదేశీయార్య నాగరకత ఆ నాటి ఈజిప్టు, బాబిలోనియా నారగకతలనుండి విభిన్నత కలిగి ఉండినది. నగరరాజ్య వ్యవస్థను ఆశ్రయముగ గ్రహించి వర్ధిల్లిన ఈజిప్టు, బాబిలోనియా నాగరకతలవలెకాక భారతీయార్య నాగరకత జానపద సాంఘిక వ్యవస్థను ఆధారముగ ఇడుకొని వికసించినది [చూ. భారతదేశము].




## ప్రపంచమున నాగరకతా వ్యాప్తి

- నాగరకతా వ్యాప్తి నాలుగు ఆదిమ కేంద్రములనుండి (క్రీ. పూ. 4,000 నుండి)
- గ్రీస్‌నుండి (క్రీ. పూ. 600)
- రోమ్‌నుండి పశ్చిమ యూరప్ ద్వారా (క్రీ. పూ. 200)
- ఇస్తాంబుల్ నుండి (క్రీ. శ. 800)
- క్రీ. శ. 622 నుండి ప్రాక్ పశ్చిమములకు ముస్లిమ్ నాగరకతా వ్యాప్తి

ఆ కాలపు చీనా దేశమునందును సాంఘిక వ్యవస్థలో దేవాలయములు ప్రముఖ స్థానము వహింపలేదు. అయినను సంప్రదాయానుగతములగు దేవతారాధనను, పితృదేవతల పూజను, అందులకు సంబంధించిన కర్మకాండను స్వచ్ఛముగ ఉండునటుల పరిరక్షించుట రాజుల కర్తవ్యముగ ఉండెను. అచటి సమాజమునందును ప్రభువులయు, పండితులయు ఆధిక్యము క్రమముగ ఎక్కువై, సంపద వారి హస్తగతము కాజొచ్చెను.

ఇటుల ఆ ప్రాచీన సంఘములందు అన్నింట ఉన్నత వర్గములు, నిమ్న వర్గములు అను రీతులుగ ప్రజలు రెండు తరగతులుగ చీల్చబడిరి. న్యాయ శాస్త్రము సైతము ఉన్నతవర్గముల ఎడ అభిమానము వహించి వ్యవహరించుచుండెడిది. స్త్రీలు అటనట కొన్ని ప్రముఖ స్థానములను అలంకరించినను, మొత్తము మీద సంఘమునందు స్త్రీకి తగిన గౌరవ స్థానము ఉండెడిదికాదు. కాలక్రమమున స్త్రీ భోగసాధనముగ మాత్రమే లెక్కింపబడి ఎట్టి స్వాతంత్ర్యమునకును తగనిదిగ పరిగణింపబడినది.

మానవుని పురోగతికి అతని శారీరక, మానసిక శక్తులే కాక, భౌతిక పరిసరములును దోహదకారులు. పరిసరములచే ప్రభావితుడగు మానవుడు, తన అభివృద్ధికి అనుకూలముగ ఆ భౌతిక పరిసరములనే మార్చుకొనుటకు యత్నించును. ఇట్టి పరస్పర ప్రభావము వలననే చరిత్ర ముందునకు నడచినది ; నడచుచున్నది. ప్రాచీనయుగమున వివిధ నాగరకతా కేంద్రములందు మానవుని విభిన్న పరిసరములు ఎదుర్కొనినవి ; తత్ఫలితముగ ఆ యా కేంద్రములందలి మానవులు విభిన్నరీతుల తమ సంస్కృతులను రూపొందించుకొనిరి. ఆ సంస్కృతులలో ప్రతి ఒక దానికి ఒక ప్రత్యేక విశిష్టత కలదు. ఆ యా సంస్కృతి వికసించిన దేశకాలముల ప్రభావము ఆ ప్రత్యేకతకు మూలకారణము. అయినను, ఈ సంస్కృతులందు కొన్ని సామ్యములును కలవు. అట్టివానిలో ప్రపంచ సృష్టి స్థితి వ్యవహారములకు మూలమగు నియమమును గురించి ఆ యా ప్రాచీనజాతులకు కల భావన ప్రత్యేకముగ పేర్కొన దగినది. ఇట్టి నియమము ఒకటి కలదని ఈజిప్టు వాసులును, వైదికార్యులును, చీనీయులును విశ్వసించి దానిని మావత్, ఋతము, టావో, అని క్రమముగ పేర్కొనిరి. ఇట్టిదే సృష్టికి మూలమగు శబ్దము ఒకటి కలదనుట ; బాబిలోనియన్‌లు ఇట్టి మూల శబ్దమును 'ముమ్మూ' అని వ్యవహరింపగ, వైదికార్యులు దానిని 'ఓమ్' (ఓం) అని వ్యవహరించిరి. ఇట్టులే ఆ యా సంస్కృతులందు కననగు సామ్యములు మరికొన్ని కలవు. ఇట్టివి యాదృచ్ఛికములా ? కాక వీనిని ఒక సంస్కృతి నుండి మరియొక సంస్కృతి గ్రహించినదా? అను ప్రశ్నలకు సూటియగు సమాధానములను ఇచ్చుట ప్రస్తుతమునకు అసాధ్యము. ఈ నాగరకతలు చాల వరకు సమకాలీనములే. అయినను వీనిలో వైదికార్యులకు గాని, చీనీయులకు గాని తక్కిన ఆ నాటి నాగరకతలతో గాఢ సంబంధము ఉండెనని భావించుటకు ఆస్కారము కన్పట్టుటలేదు. కావున ఈ ప్రశ్నలు భావి చరిత్రపరిశోధకుని సమాధానముల కై వేచి ఉండవలసినవని మాత్రమే ప్రస్తుతమునకు తలంప దగును.

ఆ ప్రాచీన సంఘములందు కన్పట్టు వేరొక సామాన్య లక్షణము అన్నింటికన్న ఎక్కువగ గమనార్హము. చరిత్ర పూర్వయుగమందలి మానవుడు తన జీవితమును భయముతో గడపెను. క్రూర మృగములు, శీతాతపములు, ప్రకృతి శక్తులు అతని జీవితమును భయావహముచేసినవి. ఆ యుగమున నుండి ప్రాచీన యుగమున కాలిడు నాటికి మానవుడు ఉత్పత్తి సాధనముల నిర్మాణమున కుశలతను ఆర్జించెను. వృత్తి విభజన మొదలగు వాని వలన ఆ ఉత్పత్తిని అధికతరము చేసెను ; నగరముల నిర్మించెను. కాని, చరిత్ర పూర్వయుగమునందలి మానవుని వలెనే ఇతని జీవితము సైతము అడుగడుగున భయమును ఎదుర్కొనవలసి వచ్చెను. ఆనాటి సంఘ వ్యవస్థ భయము పైననే ఆధారపడి ఉండెను. దేవతల వలని భయముచేత మతము రూపొందెను ; భాగ్యవంతుని ధనమును, దానిచే కలుగు అధికారమును గనునించి భయముతో పేదవాడు అతనికి లొంగెడివాడు ; పేదలు తిరుగబడుదురని భయముతో వారిని దాస్యములో ఉంచుటకు ధనికులతో కలసి ప్రభువులు యత్నించెడు వారు.

సంఘము ఇటుల భయముపైన గాక సౌభ్రాతృత్వ ప్రేమలపైన ఆధారపడి ఉండునపుడు మాత్రమే దానికి స్థైర్యము చేకూరునని ఆనాడును కొందరు విశ్వసించిరి ; సర్వమానవ సౌభ్రాతృత్వమును వారు ప్రవచించిరి. ఉపనిషత్తుల వెలువరించిన ఋషులును, చీనీయ తత్త్వవేత్తలును, ఈజిప్టునందలి అమెనోతప్-IV ప్రభువును, బాబిలోనియా యందు విగ్రహారాధనను నిరసించిన అజ్ఞాత పండితులును ఇట్టివారలే. కాని, వారి భావములు తొలుతగ సంఘమునందు విరివిగ మార్పులను కొని వచ్చినవి కావు. అయినను సామాన్య వ్యక్తియందు ఈ సౌభ్రాతృత్వ భావనను రేకెత్తించి తద్వారా సంఘమున ఒక నూతన చైతన్యమును కల్పింపగల మహాపురుషులు కొందరు కాలక్రమమున ఆ ప్రాచీన నాగరకతా కేంద్రములందు అన్నింట జన్మించిరి. ఆ మహాపురుషులలో పలువురు క్రీ. పూ. 6 వ శతాబ్ది ప్రాంతమున ప్రపంచమున వేర్వేరు దేశములలో

జన్మించుట వివరింపరాని ఒక అద్భుత సంఘటన. వారి కృషి మూలమున మానవచరిత్ర ఒక నూతన మార్గమును అనుసరించుటతో భావ వికసన యుగము అవతరించెను. చీ. శే. రా.

# భావ వికసన యుగము

(క్రీ. పూ. 525 - క్రీ. శ. 622)

క్రీ. పూ. 6 వ శతాబ్ది ప్రపంచ చరిత్రలో బహు సంఘటనాత్మక కాలములందు ఒకటిగ పేరుగనినది. అంతవరకు ప్రపంచ చరిత్రయందు ప్రాముఖ్యము గడించిన ఆర్యేతరజాతుల సామ్రాజ్యములు అంతటితో పశ్చిమ ఆసియా, ఆఫ్రికా ప్రాంతములందు అంతరించి వాని స్థానమున, ఆర్యజాతికి చెందిన పారసీకుల సామ్రాజ్యము ఆ 6 వ శతాబ్ది అంతమున స్థిరముగ నెలకొనగలిగిన విషయము ఇదివరకే ప్రసక్తిమైనది [చూ. పు. 18].

## ఆర్యజాతుల వ్యాప్తి

అంతకు పూర్వమే దాదాపు క్రీ. పూ. 1,500 మొదలుగ ఆర్యజాతివారగు గ్రీక్‌లు ఆసియామైనర్ నందును, క్రీట్ ద్వీపమునందును, గ్రీస్ దేశమునను స్థావరముల నెలకొల్పుకొని, అచ్చటి ప్రాచీనసభ్యతలను అంతరింపజేసి, వానియందలి ఉత్తమలక్షణములను స్వీయముల చేసికొనిరి. ఈజియన్ సముద్ర తీరభూములందును, ఆ సముద్రమునందలి వివిధ ద్వీపములందును వారు వలసలను ఏర్పరచుకొనుటయే కాక, వర్తకవ్యాపారములందు ఫొనీషియన్‌లతో స్పర్ధ వహించి, కాలక్రమమున క్రీ. పూ. 800 నాటికే నల్లసముద్రపు తీరభూములను, మధ్యధరాసముద్రమునందలి సిసిలీని, ఇటలీ దేశపు దక్షిణప్రాంతమును ఆక్రమించిరి. ఇక దక్షిణ ఆసియాయందలి భారత దేశమున ఆర్యజాతులు క్రమముగ క్రీ. పూ. 6 వ శతాబ్ది అంతమునకు ఉత్తర భారతదేశమును లోగొని, దక్షిణమున చాలభాగమువరకు తమ ఆధిపత్యమును వ్యాపింపజేసినవి.

పారసీకచక్రవర్తియగు కురుష్ బాబిలోనియా సామ్రాజ్యమును అంతముచేయుటయు, అతని కుమారుడు కాంభోజ (కాంబిసిస్) చక్రవర్తి ఈజిప్టును క్రీ. పూ. 525 లో జయించుటయు వెనుకటి అధ్యాయమున పేర్కొనబడినవి [చూ. పు. 18]. ఇటుల ఆ నాటి నాగరక ప్రపంచమున చీనాదేశము తప్ప దాదాపుగ తక్కినది అంతయు క్రీ. పూ. 6 వ శతాబ్ది అంతమునకు ఆర్యాక్రమితము అయినది. ఉత్తర ఆఫ్రికా తీర భూమియందు మాత్రము కొన్ని నగరముల నిర్మించుకొని, ఆర్యేతరములగు ఫొనీషియన్ జాతులు సముద్రవ్యాపారమును ముఖ్యవృత్తిగ గ్రహించి స్వేచ్ఛతో అటనట మన గలిగినవి. కాని, ఇటుల ఈ ఆర్యజాతులు తదితరజాతుల ప్రాభవమును అడచి వారి రాజ్యములను ఆక్రమించినను, ఆ ప్రాక్తనజాతుల నాగరకతాసంపత్తియందలి ఉత్తమ సామగ్రిని తమదిగ చేసికొనినవి. అందువలననే గ్రీక్ జాతుల సంస్కృతియందు ప్రాచీన మినోవా, మైసీనియా [చూ.] నాగరకతలును, పారసీక సభ్యతయందు ప్రాచీన బాబిలోనియన్, ఈజిప్టు సంస్కృతులును, భారతీయ ఆర్యుల సంస్కృతియందు పురాతన సింధునాగరకతయు మేళనముచెంది, తదనంతరపు సభ్యతా వికసనమునకు తోడ్పడగలిగినవి.

ఇట్టి ఆర్యనాగరకతలలో స్థాన ప్రాముఖ్యమును బట్టి తొలుతగ పేర్కొనదగినది పారసీకసభ్యత. ఆ సభ్యతా వికసనమునకు కుదురగు పారసీకసామ్రాజ్యమునకు సంస్థాపకుడుగ పేర్కొనబడిన కురుష్ హఖమనీషి (అకమీనియన్) వంశజుడు. ఈ వంశజులు దాదాపు రెండు శతాబ్దముల కాలము ఆ సామ్రాజ్యమును ప్రాభవముతో పాలింపగలిగిరి. ఈ వంశపువారిలో మూడవవాడగు మొదటి దుర్యాష (డరయస్ - I ; క్రీ. పూ. 521-485 ప) ప్రభువు గ్రీస్‌నందలి థ్రేస్ పర్వతములవరకు, మధ్య ఆసియాలోని కొంత భాగమును తన సామ్రాజ్యమున అంతర్గతము కావించెను. తూర్పువైపున ఆఫ్ఘనిస్తాన్, బెలూచిస్తాన్, సింధులోయ ప్రాంతములకు కూడ ఈ ప్రభువే తన సామ్రాజ్యమును విస్తరింప జేసెను. ఇటుల అత్యుచ్చస్థితిని పొందిన కాలమున పారసీక సామ్రాజ్యము పశ్చిమమున లిబియా మొదలుకొని తూర్పున సింధునది పశ్చిమతటము వరకు విస్తరిల్లినది.

ఆ కాలమున ఉత్తర భారతదేశమున వివిధ ఆర్యరాజ్యములు నెలకొని ఉండినవి. సమకాలికములగు రచనలబట్టి ఆనాడు ఈ ప్రాంతము పదునారు ప్రముఖ రాజ్యములుగ విభక్తమై ఉండినటుల తెలియవచ్చుచున్నది. వీనిఅన్నింట క్రమముగ అవంతి, వత్స, కోసల, మగధ రాజ్యములు నాలుగును ప్రాముఖ్యమును ఆర్జించినటులను, సార్వభౌమతకొరకై వానిలో ప్రతి ఒక్క రాజ్యమును తక్కినవానితో ఘర్షణ చెందుచుండినటులను ఆ రచనలనుబట్టియే మనకు విశదమగుచున్నది. కాని, ఈ భారత దేశీయ రాజ్యములకు సమకాలిక పారసీక సామ్రాజ్యముతో హితమునగాని, వైరమునగాని సంబంధము ఎక్కువగ ఉండినటుల నిదర్శనములు లేవు. చౌ రాజవంశపు పాలనలో నామమాత్రముగ ఆనాడు ఉండి, నిరంతరము సామంత

రాజుల అంతఃకలహములతో సతమతము అగుచుండిన సమకాలిక చీనాతో సైతము పారసీకసామ్రాజ్యమునకు సన్నిహిత సంబంధము ఉండినటుల కన్పట్టదు. ఇటుల తూర్పున భారత, చీనా దేశముల వలన ఏ బెడదయు లేక పోయినను, వాయవ్యమున ఉండిన గ్రీక్ రాజ్యములతో మాత్రము పారసీకసామ్రాట్‌లు నిరంతరము ఘర్షణ పడవలసి వచ్చినది. కడకు ఈ ఘర్షణల ఫలితముగ పారసీక సామ్రాజ్యమునే గ్రీక్‌లు అలిగ్జాండర్ [చూ.] నాయకత్వమున అంతరింపజేసిరి (క్రీ. పూ. 331).

## గ్రీక్ - పారసీక సమరములు

పైన పేర్కొనబడిన గ్రీక్-పారసీక సమరములకు ప్రపంచ చరిత్రలో ఒక ప్రముఖస్థానము కలదు. అల్పసంఖ్యాకము అయినను సుసంఘటితమగు ఒక జాతి ఒక మహాసామ్రాజ్యశక్తిని ఎదుర్కొని పోరాడి, తన స్వాతంత్ర్యమును నిలుపుకొనగలదను విషయమును ఈ సమరములు తొలుతగ చరిత్రలో రుజువుచేసినవి. ఇందులకు తోడుగ ఇంకొక విషయము కూడ ఇచట ముఖ్యముగ గుర్తింపవలసి ఉన్నది. పారసీక సామ్రాజ్యమును ఎదుర్కొను నాటికి గ్రీక్‌లు ఏ ఒక కేంద్రాధికారము గల రాజ్యమునను చేరి ఉండలేదు. ఆనాటి గ్రీక్ నగరరాజ్యములు వేనికవి స్వతంత్రరాజ్యములుగ వ్యవహరించుచు ఉండినవి. వర్తక వ్యాపారములలో ఈ నగరరాజ్యముల మధ్య స్పర్ధలు తరచుగ ఏర్పడి కలహములకు సైతము దారి తీయుచుండెడివి. కాని, ఒకే ఒక సామాన్యభాషయు, సంస్కృతియు ఈ నగర రాజ్యములందు వ్యాపించి, వీరియందు ఐక్యభావనను కల్గించినవి. ఇటుల రాజకీయముగ వేరయ్యును, సాంస్కృతికముగ ఏకతను కలిగి ఉన్న ఈ జాతి 'హెలీన్స్' అను పేర ఆనాడు వ్యవహరింపబడినది. క్రీ. పూ. 9వ శతాబ్దికి పూర్వము వాస్తవమగు గ్రీస్‌చరిత్ర ఆరంభితము కాలేదు. ఆ శతాబ్దికి పూర్వపు చరిత్రగ గ్రీక్ ఇతిహాసములందు పేర్కొనబడునది పురాణగాథలతోడను, కట్టుకథలతోడను నిండి ఉన్నది. చరిత్ర యుగారంభమునాటికి ఈ హెలీన్స్ జాతివారు అయోనియన్, ఇయోలియన్, డోరియన్ అను మూడు తెగలుగ చీలి ఉండినటుల తెలియవచ్చుచున్నది. వీరిలో అయోనియన్‌లతోనే తొలుతగ పారసీకులకును, వారి మూలమున భారతీయులకును పరిచితి ఏర్పడినది. కావుననే హెలీన్స్‌జాతికి పర్యాయపదముగ పారసీకులు 'యూనానీ' అను దానిని, భారతీయులు 'యవన' అను పదమును ఉపయోగించిరి.

హెలీన్స్‌జాతి ప్రాభవమునకు మూలకందములగు వివిధ నగరరాజ్యములందు చరిత్రదృష్టిలో క్రమానుగతముగ ప్రాముఖ్యమును వహించినవి ఏతెన్స్, స్పార్టా, కొరిన్త్, తీబ్స్ నగరరాజ్యములు. ఈ నగరరాజ్యములకు ఆసియా మైనర్ నందలి గ్రీక్ వలసలతోడను, లిడియా రాజ్యముతోడను సన్నిహితసంబంధములు ఉండినవి. లిడియా రాజ్యము అచ్చముగ గ్రీక్ రాజ్యము కాకపోయినను, గ్రీక్ సంస్కృతితో సన్నిహితసంబంధమును కలిగి ఉండుటవలన వారికి ఆదరణీయమై ఉండినది. క్రీ. పూ. 546లో కురుష్ చక్రవర్తి లిడియారాజగు క్రోసస్ [చూ.]ను ఓడించి, ఆ రాజ్యమును ఆక్రమించుటతో గ్రీక్ జాతి తనకు రానున్న ముప్పును గ్రహించి, తన స్వాతంత్ర్యరక్షణకై కృతనిశ్చయత వహించినది. ఆ తరువాత కొలదికాలముననే ఆసియా మైనర్ నందలి గ్రీక్ నగరరాజ్యములను పారసీకసామ్రాజ్యము తనలో లీనముచేసికొనినది. కాని, ఆ నగరరాజ్యములు క్రీ. పూ. 499లో పారసీకసామ్రాట్‌ను ధిక్కరించి తిరుగుబాటుచేయగ, సామ్రాజ్యమునకు వెలుపల ఉండిన గ్రీక్ నగరరాజ్యమగు ఏతెన్స్ ఆ రాజ్యములకు సాయము చేసినది. ఈ తిరుగుబాటును కట్టకడకు పారసీకసామ్రాజ్యసేనలు క్రీ. పూ. 494కు అడచివేయగలిగినవి. అంతట ఆ తిరుగుబాటు సందర్భమున సాయముచేసిన ఏతెన్స్‌కు గుణపాఠమును బోధించు సంకల్పముతో ఆనాటి పారసీకచక్రవర్తి మొదటి దుర్యాష్ప్రభువు విపుల సేనావాహినులను, నౌకా సైన్యమును ఏతెన్స్‌పైకి పంపెను (క్రీ. పూ. 492). కాని, ఆతని ప్రయత్నము విఫలమయ్యెను. ఆతని తరువాత, సింహాసనము అధిరోహించిన క్షరక్ష (జెర్‌జెస్) (క్రీ. పూ. 486-465 ప.) ప్రభువు ఈ దండయాత్రలను కొనసాగించెను. తొలుత ఏతెన్స్ నగరము మాత్రమే ఈ దండయాత్రలను ఎదుర్కొని నిలచినను, కడకు స్పార్టా మొదలగు రాజ్యములును ఏతెన్స్‌నకు సాయపడినవి. ఈ యుద్ధముల సందర్భమున ఏతెన్స్‌నగరము శత్రుసేనల వశమై దగ్ధమైనది. కాని, గ్రీక్ సేనలు లొంగక స్వాతంత్ర్యసమరమును సాగించినవి [చూ. గ్రీస్]. కడకు పారసీక సేనలు సంపూర్ణముగ పరాజితములై గ్రీస్‌నుండి వైదొలగినవి (క్రీ. పూ. 479). ఈ స్వాతంత్ర్యసమర ఫలితముగ ఏతెన్స్ నగరరాజ్యమునకు గ్రీక్ ప్రపంచమునందు ప్రతిష్ఠ పరాకాష్ఠను అందుకొనినది. జాతిరక్షణకొరకై అంతట ఏతెన్స్ నగరరాజ్యపు ఆధ్వర్యవమున వివిధ నగరరాజ్యముల కూటమి ఏర్పడినది. ఈ కూటమియే గ్రీస్‌దేశ చరిత్రయందు 'డెల్లాస్‌సమాఖ్య' అని వ్యవహరింపబడినది.

ఏథెన్స్‌కు సామ్రాజ్యాధిపత్యము లభించుటకు ఈ సమాఖ్యయే ప్రాతిపదిక అయినది. క్రీ. పూ. 460 లో పెరిక్లీస్ [చూ.] ఏథెన్స్ నగరరాజ్యమునకు అధిపతిగ ఎన్నుకొనబడుటతో ఈ సామ్రాజ్యాధిపత్యమునకు బలము చేకూరెను. ఈ పెరిక్లీస్ ప్రజల మన్ననను ఆర్జించిన ఫలితముగ మరణపర్యంతము ఆ పదవియందే ఉండగలిగెను. అతని పరిపాలనకాలమున ఏథెన్స్ నగరరాజ్యము సారస్వతాది వివిధ రంగములందు సాధించిన అభివృద్ధిని బట్టి దానిని ఆ నగరరాజ్యపు స్వర్ణయుగముగ ఆ దేశపు చరిత్రకారులు పేర్కొనెదరు. కాని, ఈ యుగముననే గ్రీక్ నగరరాజ్యముల అవనతికి బీజములును చల్లబడినవి. పారంపర్యముగ స్వాతంత్ర్యమునకు అలవడిన వివిధ గ్రీక్ నగరరాజ్యములు ఏథెన్స్ ఆధిపత్యమున అడగి ఉండుటకు అంగీకరించినవి కావు. తత్ఫలితముగ తిరుగుబాటులును, అంతర్యుద్ధములును చెలరేగినవి. ఈ అంతర్యుద్ధమునకే 'పెలొపొనీసియన్ పోరాటము' ని పేరు కలిగినది (గ్రీస్ దేశపు దక్షిణభాగమగు పెలొపొనీస్ ఈ తిరుగుబాటులకు నెలవగుటచే ఆ యుద్ధములకు ఆ పేరు కలిగినది). ఇందు తొలుతగ ఏథెన్స్‌ను ధిక్కరించి పోరాటమునకు పూనుకొనినది కొరింత్ నగరరాజ్యమే అయినను, దాని పక్షమున స్పార్టాయును చేరుటతో కడకు ఏథెన్స్, స్పార్టాలమధ్య పోరాటముగ ఇది పరిణమించినది. క్రీ.,పూ. 431 నుండి 404 వరకు ఈ అంతర్యుద్ధము కొనసాగి ఏథెన్స్ నగరపు లొంగుబాటుతో అంతమయ్యెను. అంతట తన ఆధ్వర్యవమున స్పార్టా ఒక నగరరాజ్యకూటమిని ఏర్పరచినను, అది ప్రజల మన్ననను ఆర్జింపలేకపోయినది. అనతి కాలముననే ఆసియామైనర్‌నందలి గ్రీక్‌నగర రాజ్యములు పారసీకుల వశమయ్యెను. గ్రీక్‌లు పలువురు పారసీక ప్రభువుల కొలువులో చేరసాగిరి. స్పార్టానగరపు ప్రతిభ సన్నగిల్లిన తరువాత దాని స్థానమును థీబ్స్ కొంత కాలము ఆక్రమించెను. కాని, గ్రీక్‌జాతి తన పూర్వ ప్రతిష్ఠను మరల ఆర్జించుకొనలేకపోయినది.

ఈ పరిస్థితులలో గ్రీస్‌లోని నగరరాజ్యములపై సర్వాధిపత్యమును మేసిడోనియా ప్రభువగు ఫిలిప్ ఆర్జింపగలిగెను (క్రీ. పూ. 338). ఈ మేసిడోనియా రాజ్యము గ్రీస్ దేశమునకు ఈశాన్యమున కలదు. ఇందలి ప్రజలు అచ్చముగ హెలీన్స్ కాకున్నను, హెలీన్స్ భాషా సంస్కృతుల ప్రభావమునకు ఎక్కువగ లోనైనవారు. వారి ప్రభువు ఫిలిప్ గ్రీక్ సంస్కృతి ఎడ అభిమానము కలవాడు. గ్రీక్ రాజ్యముల ఏకీకరణమును తన సంకల్పముగ ఇడుకొని అతడు కృతకృత్యుడయ్యెను. అతని కుమారుడగు అలెగ్జాండర్ ప్రపంచఖ్యాతి చెందిన విజేతయై, మహనీయుడు అను ఉపనామమును ఆర్జించెను. సింహాసనమును అధిరోహించునాటికి అతనికి ఇరువది ఏండ్లయిన నిండలేదు. గ్రీస్ దేశమునందు తన ఆధిపత్యమును తొలుతగ స్థిరము చేసికొని, తరువాత క్రీ. పూ. 334 వసంతఋతువున అత్యంత శక్తివంతమగు గ్రీక్ సైన్యముతో పారసీకసామ్రాజ్యముపై దండయాత్ర ఆరంభించి, క్రమమున ఆసియామైనర్, సిరియా, ఈజిప్టులను వశపరచుకొని, అంతట పారసీకుల రాజధాని పైకి అతడు సేనలను నడపెను. నాటి పారసీక చక్రవర్తి దుర్యాష - III చక్రవర్తి మహాసైన్యముతో అలెగ్జాండర్‌ను ఎదుర్కొని పోరాడెను. కాని, కడకు విజితుడై, దుర్మరణము పాలయ్యెను (క్రీ. పూ. 331). అంతటితో ఆగక అలెగ్జాండర్ పురోగమించి క్రీ. పూ. 329 - 328 లో భారతదేశ వాయవ్యభాగమున ఉన్న బాక్ట్రియా, సోగ్డియానా ప్రాంతములను జయించి, భారతదేశమున ప్రవేశించి, అచట అంతఃకలహములతో సతమతమగుచున్న అల్పరాజ్యములను జయించెను. అచట అతడు ఎదుర్కొనిన వారిలో పూరువు (పోరస్) ముఖ్యుడు. జీలంనది ఒడ్డున జరిగిన ఒక ఘోరయుద్ధమున పూరువును అలెగ్జాండర్ ఓడింపగలిగెను. కాని, విజితుని పౌరుషాభిమానములచే ఆకర్షితుడై అతనితో సంధి చేసికొనెను. అంతట గంగానదీతీరప్రాంతమునకు తన జైత్రయాత్రల విస్తరింపజేయ అతడు సమకట్టెను. కాని, ఉత్తర భారతదేశమున అప్పటికే ఒక మహాసామ్రాజ్యము నెలకొని ఉండినదను వార్తను ఆలకించిన అతని సైనికులు యుద్ధములతో విసుగెత్తి స్వదేశమునకు మరలవలెనని పట్టుపట్టుటచే చేయునదిలేక అలెగ్జాండర్ వెనుకకు మరలెను. మార్గమధ్యమున బాబిలన్‌నగరమునందు ఆ మహావిజేత క్రీ. పూ. 323 లో తన ముప్పదిమూడవ ఏట మరణించెను. అతడు మరణించునాటికి అతని సామ్రాజ్యము ఆసియా, ఆఫ్రికా, యూరప్ ఖండముల మూడింట పలుప్రాంతముల లోగొనినది. కాని, అతని మరణానంతరమున అతని సామ్రాజ్యమును విభజించుకొనుటకై అతని సేనానాయకులు దీర్ఘకాలము ఒకరితో మరియొకరు పోరాటముల సలిపిరి. కడకు ఆ సామ్రాజ్యమున ఈజిప్టుదేశము టాలెమీ అను సేనానికిని, తక్కిన ధానియందలి ప్రాచ్యభాగము సెల్యూకస్ అను వేరొక సేనానికిని దక్కెను. మాతృదేశమగు మేసిడోనియారాజ్యము ఆంటిగోనస్ అను వానికి లభించెను. వీరిలో టాలెమీవంశజులు దాదాపు మూడుశతాబ్దములు ఈజిప్టును పాలించిరి. వారి పరిపా

లనాఁ కాలమున ఈజిప్టులోని అలెగ్జాండ్రియానగరము విజ్ఞానకేంద్రముగ గణనకెక్కెను. కడకు ఈ రాజ్యమును క్రీ. పూ. 31 లో రోమన్ చక్రవర్తి అగస్టస్ జయించి రోమన్‌సామ్రాజ్యమున అంతర్భాగముగ చేసెను.

అలెగ్జాండర్ సామ్రాజ్యమున సెల్యూకస్ భాగమునకు లబ్ధమైన ప్రాచ్యరాజ్యమునందు తూర్పుకొనన ఉన్న భారతదేశ భూభాగమును క్రీ. పూ. 317 లో భారతీయ సామ్రాట్ మౌర్యచంద్రగుప్తుడు జయించి గ్రీక్ సేనలను అటనుండి తరిమివైచెను. మరల గ్రీక్‌రాజ్యమును అట నెలకొల్పుటకై సెల్యూకస్ యత్నించెను. కాని, తత్సం దర్భమున జరిగిన పోరాటమున అతడు పరాజితుడై చంద్రగుప్తునితో సంధి కుదుర్చుకొనెను. తక్కిన ప్రాచ్య రాజ్యమును సెల్యూకస్‌వంశజులు కొంతకాలము తమ అధీనములో ఉంచుకొనగలిగిరి. కాని, వారు అనవరతము సామంతుల తిరుగుబాటులతో సతమతము కావలసి వచ్చెను. ఈ తిరుగుబాటుల ఫలితముగ క్రీ. పూ. 240 లో పార్థవులు (పార్థియన్‌లు) అనబడు ప్రాచ్యజాతివారు మీడియా అను పారసీక ప్రాంతమునకును, బాబిలోనియా కును ప్రభువులైరి. అంతట సిరియారాజ్యము మాత్రమే సెల్యూకస్‌వంశజుల వశమున కొంతకాలము నిలచెను. కడకు క్రీ. పూ. 64 లో ఈ ప్రభువుల ఆధిపత్యమును రోమన్‌లు పూర్తిగ అంతరింపజేసిరి.

ఇక అలెగ్జాండర్ సామ్రాజ్యమున మేసిడోనియా ప్రాంతమును తన భాగముగ గ్రహించిన అంటిగోనస్ నకును పరిస్థితులు కలసిరాలేదు. గ్రీక్ నగరములను తమ అధీనమునకు కొనిరావలెనని అతడును, అతని వంశజు లును చేసిన కృషి విఫలమయ్యెను. కడకు క్రీ. పూ. 168 న ఈ ప్రాంతము రోమన్‌సామ్రాజ్యమున అంతర్లీన మయ్యెను.

## భారతదేశ పరిస్థితి

(క్రీ. పూ. 6 వ శతాబ్ది - క్రీ. పూ. 78)

అలెగ్జాండర్ తన జైత్రయాత్ర మూలమున ఆర్జించిన మహాసామ్రాజ్యమున తూర్పు కొనన ఉన్న భారతీయ భూభాగమునకు దాస్యవిమోచనము చేకూర్చి గ్రీక్ సేనలను పరాజితముల చేసినవాడు మౌర్యచంద్రగుప్తు డను విషయము పైన పేర్కొనబడినది. ఈ చంద్ర గుప్తుని గురించిన విషయముల గ్రహించుటకు మన దృష్టిని ఇప్పుడు భారతదేశము వైపునకు మరలింపవలసి ఉన్నది. పారసీకసామ్రాజ్య సంస్థాపనకాలపు భారతదేశపు పరిస్థితిని పేర్కొనుచు, ఆనాడు అచట నెలకొనిన వివిధ రాజ్యములలో అవంతి, వత్స, కోసల, మగధ రాజ్యములు సార్వభౌమత్వముకొరకై పెనగులాడుచు ఉండినవని ఇది వరలో తెలుపబడినది [చూ. పు. 34]. ఆ రాజ్యములలో మగధరాజ్యము క్రమముగ ముందునకు రాగలిగెను. ఈ రాజ్యమును క్రీ. పూ. 6 వ శతాబ్దిలో హర్యంకవంశీయుడగు బింబిసారుడు పాలించెను. ఈతనికాలమున మగధరాజ్యము మహావైభవోపేతమై, శాంతి సుస్థిరతలకు నెలవగుటచే విజ్ఞానవేత్తలను పలువురను ఆకర్షింపగలిగెను. జైనమత వ్యాపకుడగు మహావీరుడును, బౌద్ధమత సంస్థాపకుడగు బుద్ధుడును ఇతని సమకాలికులు. వీరిరువురి మతములకును ఆశ్రయ మొసంగిన తొలుతటి ప్రాంతములలో మగధ రాజ్యము ముఖ్యముగ పేర్కొనదగినది. కాలక్రమమున ఈ మగధరాజ్యము క్షత్రియేతరులగు నందవంశీయుల అధీనమయ్యెను. ఈ వంశపువాడగు మహాపద్ముడు మహా సైనికనివహములతో పృథ్విని అంతటిని జయించెనని పురాణములు పేర్కొనుచున్నవి. అతని తరువాత అతని కుమారులు ఎనిమిదిమంది క్రమముగ పరిపాలించిరనియు, వారిలో కడపటి వానిని అంతమొందించి, మౌర్యచంద్ర గుప్తుడు మగధసామ్రాజ్యమును వశపరచుకొనెననియు పురాణములును, బౌద్ధగాథలును, జైనగ్రంథములును తెలుపుచున్నవి. ఈ చంద్రగుప్తుని రాజ్యలబ్ధికి కౌటిల్యు డను బ్రాహ్మణుని సాయము ముఖ్యకారణము అయ్యెనని భారతీయ సారస్వతమున పేర్కొనబడినది. ఈ కౌటిల్యుడే చాణక్యుడు అనియు వ్యవహరింపబడెను. మౌర్యచంద్ర గుప్తునికిని, నందులకును కల బంధుత్వమును గురించి పలు గాథలు ప్రచారమున కలవు. వీనికి చారిత్రకముగ ప్రతి పత్తి ఇప్పటికి చేకూరలేదు. అంతియేకాక చంద్రగుప్తుడు నందరాజ్యమును ఆక్రమించిన కాలమును గురించియు సునిశ్చితాభిప్రాయము రూపొందలేదు. కాని, సెల్యూ కస్‌తో చంద్రగుప్తునికి కల సమకాలీనతను ఆధారముగ గ్రహించి ఇతడు క్రీ. పూ. 322 లో మగధరాజ్యమును ఆక్రమించినటుల ప్రముఖ చరిత్ర రచయితలు నిర్ణయిం చిరి. ఇతని సామ్రాజ్యము హిమాలయములు మొదలు కొని దక్షిణమున మైసూరురాష్ట్రమువరకు భారత దేశమున వ్యాపించెనని కొన్ని జైనమతగ్రంథములవలన తెలియవచ్చుచున్నది. ఇదివరలో పేర్కొనబడినటుల సెల్యూకస్‌ను ఓడించి వాయవ్య భారతదేశప్రాంతమును కూడ తన సామ్రాజ్యమున ఇతడు చేర్చుకొనిన తరువాత కుదిరిన సంధికి పర్యవసానముగ మెగస్తనిస్ అను యవన రాయబారి చంద్రగుప్తుని ఆస్థానమున కొంతకాలము వసించి, మౌర్యసామ్రాజ్య పరిస్థితిని తెలుపు గ్రంథమును

ఒకదానిని రచించెను. ఆ గ్రంథము ఇప్పుడు లభ్యము కాకున్నను, దానినుండి అటనట ఉద్ధృతములైన కొన్ని విషయములు చరిత్రరచయితలకు ఎక్కువగ ఉపకరించినవి. చంద్రగుప్తుని మనుమడగు అశోకుడు (క్రీ. పూ. 273 - 286 ప) [చూ.] ప్రపంచ చరిత్రలో సుప్రసిద్ధుడు. నేటి భారతదేశము, నేపాల్, పాకిస్తాన్, ఆఫ్ఘనిస్తాన్ దేశములతో కూడిన భూఖండమున దక్షిణపు కొనన ఉన్న చోళ, పాండ్య రాజ్యములు తప్ప తక్కిన విశాలరాజ్యమును అంతటిని అతడు ధర్మయుతముగ పాలించెను. బౌద్ధ ధర్మావలంబియగు ఆ చక్రవర్తి పరమతముల ఎడ అసమాన సహిష్ణుతను ప్రదర్శించి ఆదరించెను. బుద్ధుడు తలపెట్టిన ధర్మచక్రప్రవర్తనము విశృంఖలముగ కొనసాగి, మౌర్యసామ్రాజ్యమేకాక, తక్కిన సమకాలిక నాగరక ప్రపంచమున అధికభాగము దానిచే ప్రభావితమగుటకు ఆ సామ్రాట్ కారణభూతుడయ్యెను. నిరంతర విజయశీలియగు చక్రవర్తి తనంతతానుగ రణభేరిఘోషను నిరసించి 'ధర్మఘోష' ను ఆదరించి, 'ధర్మ విజయము' నే ముఖ్యాదర్శముగ గ్రహించి ఆచరణలో ఇడుట అతనియందు తప్ప, మరి వేరొకనియందు ఎచ్చటను విశ్వేతిహాసమున కన్పట్టదు.

అశోకుని అనంతరమున ఆ విపులసామ్రాజ్యము శక్తిహీనమయ్యెను. ఆ అదను ఉపయోగించుకొని మధ్య ఆసియాయందలి గ్రీక్ రాజ్యసేనలు భారతదేశముపై దండయాత్రల జరపినవి. ఇట్టి పరిస్థితులలో మౌర్యవంశమును అంతమొందించి క్రమముగ వివిధ రాజవంశములు మగధ సింహాసనమును ఆక్రమించినవి. వీనిలో శుంగ వంశీయులు గ్రీక్‌లను తరిమివైచి రాజ్యమునకు కొంత సుస్థిరత చేకూర్చగలిగిరి. కాని, ఆ సామ్రాజ్యము తిరిగి తన పూర్వ ప్రతిష్ఠను అందుకొనలేదు. వీరితరువాత ఆ రాజ్యమును ఆక్రమించిన కాణ్వాయనులను అంతమొందించి క్రీ. పూ. 23 న సాతవాహనవంశజులు తమ సామ్రాజ్యమును స్థాపించిరి. దక్షిణ భారతమును, మధ్య భారతమున అధికభాగమును వీరి సామ్రాజ్యమున చేరి ఉండినవి. తక్కినదేశము వివిధ పాలకుల వశమున ఉండినది. దాదాపు రెండువందల సంవత్సరములపై కాలము ఈ సాతవాహనరాజ్యము మనగలిగి, తరువాత పశ్చిమోత్తర భారతమునుండి వచ్చిన శకులధాటికి ఆగజాలక అంతరించెను. ఉత్తర భారతమున వాయవ్యభాగము కొంతకాలమువరకు కొందరు గ్రీక్ రాజుల వశమున ఉండి, తరువాత శకులకును, కుషానులకును వశమయ్యెను. ఈ కుషానులలో పేరుగనినవాడు కనిష్కుడు. శాలివాహనశకమని వ్యవహరింపబడునది క్రీ. పూ. 78 లో ఈ కనిష్కుడు రాజ్యాధిపత్యమును గ్రహించుటతో ఆరంభితమయ్యెనని కొందరి వాదము. ఈ కనిష్కునికాలమునకు దరిదాపులనుండియు చీనాదేశమునకు భారతదేశముతో ఎక్కువ పరిచితి ఏర్పడెను.

## చీనా

(క్రీ. పూ. 6 వ శతాబ్ది - క్రీ. పూ. 87)

క్రీ. పూ. ఆరవ శతాబ్దియందు చీనాదేశము వివిధ రాజ్యములుగ విభక్తమై, సాంస్కృతికముగ ఏకత్వమును ఆర్జించియు ఆ యా పాలకులమధ్య జరుగు పోరాటముల వలన కల్లోలితమై ఉండెనని ఇదివరలో చెప్పబడినది [చూ. పు. 19]. ఆ అంతఃకల్లోలముల కాలముననే ఆ దేశమున పలువురు దార్శనికులు ఉద్భవించిరి. వారిలో ప్రముఖుడు కుంగ్-పూ-చీ (క్రీ. పూ. 551 - 479). ఇతనినే కన్‌ఫ్యూషియస్ అని పాశ్చాత్యులు పేర్కొనెదరు. సాంఘిక సుస్థిరతకు ప్రజల నైతికవర్తనయే మూలాధారమనియు, దానిని పరిపోషించుటయే ప్రభువుల ముఖ్యకర్తవ్యమనియు అతడు విశ్వసించి తదనుగుణమగు ఆచారకాండను బోధించెను. దాదాపుగ అతనికాలము వాడనియే కొందరిచే భావింపబడు టావోచే-చింగ్ టావోమతమును ప్రవచించెను. ప్రపంచస్థితికి మూలకారణముగ 'టావ్' అను సనాతన ధర్మము కలదనియు, దానికి అనుగుణముగ మానవజీవితమును తీర్చిదిద్దుకొనవలసి ఉన్నదనియు అతడు బోధించెను. వీరిరువురి బోధనలును చీనీయ ప్రజాజీవితముపై సమధిక ప్రభావముల నెరపినవి. ఇటుల అంతఃకల్లోలముల కాలమున జరిగిన వైజ్ఞానిక విప్లవమువలన, చీనీయులలో ఐక్యభావన దృఢతరమై కడకు రాజకీయైక్యమునకు క్రీ. పూ. 3 వ శతాబ్దియందు దారితీసినది. ఈ ఐక్యమును చేకూర్చి, చీనాదేశమును ఒకే ఒక కేంద్రాధికారపు పాలనలోనికి కొనివచ్చినవాడు షిహ్ హ్వాంగ్-టీ (క్రీ. పూ. 247 - 210 ప). ఇతడు దేశమును ముప్పది ఆరు రాష్ట్రములుగ విభజించి వానిని పాలించుటకై వేతనముల గ్రహించు పాలకుల నియమించి సుస్థిరపరిపాలనను రూపొందించెను. ఉత్తరమునునుండి వచ్చు తార్తారుల దండయాత్రల బారినుండి దేశమును రక్షించుటకు ఇతడు దేశపు ఉత్తరపు సరిహద్దున, తూర్పున పసిఫిక్ సముద్రపు తీరము మొదలుకొని పశ్చిమమున ఎడారిప్రాంతము వరకు 1400 మైళ్ల (సుమారు 2,253 కిలోమీటరుల) పొడవున ఒక కోటగోడను కట్టించెను. ఇదియే సుప్రసిద్ధమగు చీనా మహాకుడ్యము. ఈ ప్రథమ చీనాచక్రవర్తి అనంతరమున చీనాసామ్రాజ్యమును హాన్ వంశీయుడగు లియూపాంగ్ వశపరచుకొనెను (క్రీ. పూ.

202). ఈ వంశీయుడగు వూటీప్రభువు (క్రీ. పూ. 140 - 87) చీనాదేశపు పశ్చిమ ప్రాంతముల జయించి వానిని తన దేశమున చేర్చెను. అతని అనంతరపు హాన్ రాజులు పశ్చిమపు ఎడారుల వశపరచుకొని, పామీరు పీఠభూమిని చేరుటకు మార్గములను ఏర్పరచిరి. ఇందుమూలమున భారతీయ నాగరకతతోను, తక్కిన సమకాలీన పాశ్చాత్య రాజ్యములతోను చీనాప్రభువులకు సన్నిహితపరిచితి సులభ సాధ్యమయ్యెను. పశ్చిమమున కాస్పియన్ సముద్రము మొదలుకొని తూర్పున కొరియాకును, ఉత్తరమున మంచూరియానుండి దక్షిణమున అన్నామ్ (వియెత్నామ్) వరకును హాన్ రాజుల పరిపాలనాకాలమున చీనాసామ్రాజ్యము విస్తరించి ఉండెను. క్రీ. శ. 220 వరకు ఈ హాన్ వంశీయులు చీనాను పాలించిరి.

## పారసీకము

(క్రీ. పూ. 240 - క్రీ. శ. 224)

చీనాదేశమున హాన్ సామ్రాజ్యము ఏర్పడిన కాలముననే ఏర్పడి, దాదాపు ఆ సామ్రాజ్యము మనినంతకాలము మని అంతరించిన వేరొక సామ్రాజ్యము ఇట పేర్కొనబడ వలసి ఉన్నది. ఇదియే పార్థియన్ సామ్రాజ్యము (క్రీ. పూ. 240 - క్రీ. శ. 224). సెల్యూకస్‌కు లబ్ధమైన గ్రీక్ సామ్రాజ్యమున కొంత భాగమును పార్థవులు (పార్థియన్‌లు) వశ పరచుకొనిన విషయము ఇదివరకే వేరొకచోట ప్రసక్తము [చూ. పు. 37]. ఈ సామ్రాజ్యమునకు సంస్థాపకుడుగ అర్షక (అర్ సేసిస్) అనువాడు పేర్కొనబడుచున్నాడు. కాని, ఇతని తమ్ముడగు తిరిదేతి (తిరిదేతిస్) కాలమున మాత్రమే దీనికి ఒక సుస్థిర రూపము చేకూరినది. ఈ సామ్రాజ్యము తన అత్యున్నత స్థితిలో సైతము తూర్పు పడమరల కాందహార్ మొదలుకొని యూఫ్రటిస్ నది వరకును, ఉత్తరదక్షిణములందు కాస్పియన్ సముద్రము మొదలుగ హిందూమహాసముద్రతీరము వరకును మాత్రమే విస్తరింపగలిగినది. ఇటుల విస్తృతియందు తక్కిన సమకాలిక సామ్రాజ్యములకన్న ఇది చాల చిన్నదియే ఐనను, దాని ఉనికినిబట్టి దానికి ఆనాడు ఒక ప్రత్యేక ఘనత అబ్బినది. తూర్పున ఉన్న చీనా, భారత దేశములనుండి పశ్చిమ రాజ్యములకు పోవు బిడారు మార్గములన్నియు ఈ దేశము ద్వారా పోవుచుండుట వలన .ఆ మార్గముల వెంబడి ఈ రాజ్యమున సుప్రసిద్ధ సుసంపన్న నగరములు రూపొంది, ఈ ప్రాంతమునకు ఘనతను చేకూర్చినవి. ఈ పార్థియన్‌లు నిజముగ పారసీకులు కాకపోయినను, పారసీక మతసంస్కృతులను అవలంబించిరి. అంతియేకాక, ప్రాచీన పారసీక సామ్రాట్‌లగు హాఖమనీషీవంశజుల సంతతికే తాము చెందినవారమని ఈ పార్థవరాజులు పేర్కొనిరి. చారిత్రకముగ ఇందు సత్యము లేకున్నను, ఇందువలన పారసీకప్రజల ఆదరణను ఆర్జించి, వారిని గ్రీక్‌ప్రభువుల దాస్యమునుండి విముక్తులను చేసినవారుగ కొంతమందిచే పార్థియన్‌లు భావింపబడిరి. అయినను పారసీకచారిత్రకులు వీరిని అచ్చపు పారసీకులుగ పరిగణింపలేదు. అష్కానియన్‌లను ఒక ప్రత్యేకజాతికి చెందినవారుగ వీరు ఆ చారిత్రకులచే లెక్కింపబడిరి. ఈ పార్థియన్‌లు రాజకీయ సుస్థిరతను దృష్టిలో ఉంచుకొని ఇటుల పారసీక మత సంస్కృతులను అవలంబించినను, ఆనాడు తమప్రాంతములందు విశ్వజనీనతను ఆర్జించిన గ్రీక్‌ల భాషా సంస్కృతులను తిరస్కరింపక, వాని బాహ్యలక్షణములను గ్రహించిరి. ఈ రాజవంశపు ప్రభువులు ముప్పది మంది ఈ సామ్రాజ్యమును క్రమమున పాలించినటుల తెలియవచ్చుచున్నది. వీరిలో పలువురు గ్రీక్ భాషా పండితులు ; గ్రీక్ సాహిత్య విజ్ఞాన శాస్త్రములు వీరి ఆస్థానములందు పోషణను ఆర్జించినవి. ప్రాచీన పారసీకభాష వీరికాలమున నూతన రూపమును సంతరించుకొని వికృతిచెంది 'పహ్లవీ' అను పేరును పొందినది. పార్థియన్ వీరులకు 'పహ్లవ' అను ఉపనామము ఉండెడిది. దీనినిబట్టియే ఆ భాషకు ఆ పేరు కలిగినది. ఆనాడు రూపొందిన నవ్య పారసీకలిపికిని 'పహ్లవీ' అను పేరు ఏర్పడినది. ఈ క్రొత్తలిపితోటి పహ్లవీభాషయే పారసీక (ఇరాన్) దేశము ముస్లిమ్‌ల వశమగువరకు ఆ దేశమున వ్యాప్తిలో ఉండినది.

ఇటుల ప్రాచ్య, ప్రతీచీ సంస్కృతుల కూడలిగ ఈ సామ్రాజ్యము దాదాపు నాలుగు శతాబ్దముల కాలము మనగలిగినను, నిరంతరము తూర్పు పడమరలనుండి వచ్చు దండయాత్రలను ఎదుర్కొని కాలు నిలువద్రొక్కుకొనుటకే ఎక్కువ కాలమును వినియోగించినది. తూర్పున శకులు, హూణులు సముద్రతరంగములవలె ఎడనెడ ఈ సామ్రాజ్యముపై వచ్చిపడి ఈ సామ్రాజ్యపు సీమాంత నగరముల దోచుకొనెడివారు. వీరిని నిరోధించుటకు ఈ సామ్రాజ్య ప్రభువులు ఆ ప్రాంతములందు విధిగ అనవరతము సేనలను సుసన్నద్ధములుగ ఉంచెడివారు. ఇక పడమటనుండి గ్రీక్ రాజన్యుల బెడద చాలకాలము ఈ రాజ్యమును వేధించినది. గ్రీక్ రాజ్యములను రోమన్‌సామ్రాజ్యము గ్రసించిన తరువాత క్రీ. పూ. 69 మొదలుగ రోమన్‌సేనలు ఈ రాజ్యమును ఆక్రమింప యత్నించినవి. ఈ యత్నములను పార్థియన్‌లు నిరోధింపగలిగినను విపరీతమగు నష్టమునకు

లో నైరి. కడకు క్రీ. శ. 165 లో రోమన్‌లతో పార్థియన్‌లకు సంధి కుదిరినను, ఈ సామ్రాజ్యము క్రీ. శ. 226 లో ససానియన్‌లను పారసీకజాతివారి వశమగువరకు ఎడనెడ రోమన్‌లతో స్వల్పసంఘర్షణలు తప్పినవి కావు.

## రోమన్ సామ్రాజ్యము

(క్రీ. పూ. 700 - క్రీ. శ. 337)

ఇక ఇటుల గ్రీక్‌రాజ్యముల గ్రసించి, పారసీక దేశము వరకు తన ప్రభావమును నెరపిన రోమన్ సామ్రాజ్యపు ఉత్పత్తి, విస్తరణల గురించి తెలిసికొనుట ఈ సందర్భమున అత్యంతావశ్యకము. యూరప్ ఖండపు ప్రజల సంస్కృతికి గ్రీక్, రోమన్ సభ్యతలే మూలస్రోతస్సులు. యూరపియన్ నాగరకతకు గ్రీక్ విజ్ఞానమును ఆత్మగను, రోమన్ వ్యవస్థాకుశలతను శరీరముగను భావింపదగును. ఈ రోమన్ సామ్రాజ్యమునకు మూలస్థానము రోమ్‌నగరము. ఆ ప్రాచీన నగరము నేటి ఇటలీదేశమునకు రాజధానిగ ఉన్నది. క్రీ. పూ. 1000 పూర్వముననే ప్రాచీనకాలమున ఎట్రస్కన్‌లను ఆర్యేతర జాతులయు, లాటిన్‌లను ఆర్య జాతులయు సమ్మేళనమువలన రూపొందిన ప్రజానీకముచే రోమ్ నగరరాజ్యము నిర్మించబడినటుల ఆ ప్రజల పురాణ గాథలవలన విదితమగుచున్నది. క్రీ. పూ. 700 నాటికి ఈ నగరరాజ్యము, ఇటలీయందున్న తక్కిన లాటిన్ నగర రాజ్యములందు అన్నింట కొంత ప్రముఖతను ఆర్జించినను, ఇటలీ ఉత్తర భాగమును పాలించు ఎట్రస్కన్ ప్రభువుల వశమైనది. క్రీ. పూ. 500 లో రోమన్‌లు (రోమ్ నగర ప్రజలు) ఎట్రస్కన్ జాతీయుడగు ప్రభువును తరిమివైచి, గణ రాజ్యము (రిపబ్లిక్) ను స్థాపించుకొనిరి. ప్రజలచే ఎన్నుకొనబడిన సంఘముఖ్యు (కన్సల్) లు అంతట రోమ్ నగరరాజ్యమును పాలించుట ఆరంభమయ్యెను. అయినను క్రీ. పూ. 500 నుండి 323 వరకు ఆ రాజ్యము స్వస్థతను ఎరుగక నిరంతరము కెల్ట్‌లు, గాల్‌లు మొదలగు సంచార జాతుల దండయాత్రలచే కల్లోలితమై స్వరక్షణకొరకై పోరాడుచుండినది. ఈ సంఘర్షణలే రోమ్‌నగరపు సైనిక పాటవమునకును, ఔన్నత్యమునకును దారితీసినవి. సంచార జాతి ప్రజలను తరిమివైచి వశపరచుకొనిన ప్రాంతములలో లాటిన్‌ప్రజల వలసల నెలకొల్పి, క్రమముగ ఇటలీయందు రోమ్‌నగరరాజ్యము పలుకుబడిని ఆర్జించినది. క్రీ. పూ. 275 నాటికి ఇటలీ దక్షిణభాగమున ఉన్న గ్రీక్‌ల వలస రాజ్యములు సైతము రోమ్‌నకు వశమైనవి. ఇటుల చేజిక్కిన ప్రాంతములకు రోమన్‌లు చక్కని రోడ్లను ఏర్పరచి, రాకపోకల సదుపాయములను నెలకొల్పిరి. జయింపబడిన ప్రజలను ఉదారబుద్ధితో రోమన్ విజేతలు ఆదరించిరి. ఈ సామంతరాజ్యములు రోమ్‌నకు సైనిక దళములను లేదా నౌకాదళములను అవసరమైనప్పుడు చేకూర్చుచుండెడివి. అంతియేకాని వేరుగ కప్పమేమియు చెల్లించెడివి కావు. ఆంతరంగిక వ్యవహార నిర్వహణము ఆ యా సామంతరాజ్యముల అధీనముననే ఉండెడిది. ఆ రాజ్యములలోని ప్రముఖులకు రోమ్‌నగర పౌరతయు ఒసగబడెడిది. అందువలన ఆ ప్రజలకు రోమ్ నగరపాలనమందు భాగస్వామ్యమును, తత్ఫలితముగ ఆ రాజ్య ప్రతిపత్తి యందు శ్రద్ధాసక్తులును కలిగెడివి.

క్రీ. శ. 270 నాటికి దాదాపుగ ఇటలీ ద్వీపకల్పమునందు అంతటను రోమ్ అధికారము సుప్రతిష్ఠితమయ్యెను. కాని, ఆ రాజ్యమునకు అప్పటికి సమకాలిక ప్రపంచరాజకీయము లందు ప్రతిష్ఠ ఏర్పడలేదు. ఆ తరువాత కార్తేజ్ [చూ.] తో రోమ్ సాగించిన పోరాటము వలన ఆ రాజ్యమునకు మధ్యధరాసముద్రతీరస్థ రాజ్యములందు ఒక ప్రతిపత్తి చేకూరినది.

ఈ కార్తేజ్ అనునది ఉత్తర ఆఫ్రికాలోని ఒక నగర రాజ్యము. క్రీ. పూ. 1000 ప్రాంతమున ఫొనీషియన్ వర్తకుల వలసగ ఇది తొలుత నిర్మితమై, అది మొదలుగ క్రమముగ వ్యాపారమూలమున సుసంపన్నతను ఆర్జించెను. ఇటలీలోని ప్రాచ్య, దక్షిణ తీరములందును, ఇటలీకి దక్షిణమున మధ్యధరాసముద్ర పరివృతమై ఉన్న సిసిలీ దీవి యందును వలస నగరరాజ్యముల నిర్మించుకొని ఉండిన గ్రీక్‌వర్తక సంఘములతో వ్యాపార విషయముగ కార్తేజ్ స్పర్ధవహించి ఉండినది. ఇటలీ తీరపు గ్రీక్ వలసలు రోమన్‌ల వశమగుటతో ఆ వలసల పక్షము వహించి, రోమన్‌లు సిసిలీయందు కార్తేజ్‌కి కల ప్రతిపత్తికి భంగకరముగ ప్రవర్తింపవలసి వచ్చినది.

ఇటుల బయలుదేరిన వివాదము క్రమముగ యుద్ధముగ పరిణమించినది. అంతవరకు భూతలయుద్ధమునకు మాత్రమే అలవడిన రోమన్‌సేనలు అంతటినుండి ఈ యుద్ధము మూలమున నౌకాయుద్ధమున పాల్గొనుట మొదలిడి క్రమముగ అందు పరిణతిని ఆర్జించెను. ఈ యుద్ధముల ఫలితముగ క్రీ. పూ. 241 లో సిసిలీయందు అధికభాగమును కార్తేజ్‌పాలకులు రోమ్‌నకు దత్తము చేసిరి. కాని, ఈ విరోధము అంతటితో సమయలేదు. క్రీ. పూ. 218 లో మరల సంఘర్షణలు మొదలిడినవి. ఆనాటికి స్పెయిన్‌నందు అధికభాగమును కార్తేజ్ ఆక్రమించి బలవత్తర రాజ్యము కాగలిగెను. అందులకు తోడుగ కార్తేజ్‌సేనలకు అప్పుడు హేనిబల్ అను పేరుగల ప్రముఖసేనాని నాయకత్వము




క్రీ. శ. రెండవ శతాబ్దిలో ప్రాచీన ప్రపంచము




క్రీ. పూ. 240 ప్రాంతమున వివిధ సమకాలీన సామ్రాజ్యములు

లభించెను. స్పెయిన్ నుండి భూతలమార్గమున ఆ సేనాని ఇటలీపై దండెత్తి, పలుకష్టములకు లోనయ్యు ఇటలీ చేరి రోమన్ సేనలను పలుమారులు ఓడించి, ఇటలీయందు అధిక భాగమును ఆక్రమింపగలిగెను. రోమ్ నగరమును, ఆ నగరముతో సన్నిహితమైత్రిని అవలంబించిన దక్షిణ ఇటలీ యందలి కొన్ని ప్రాంతములును మాత్రమే ఆనాడు హేనిబల్‌కు లొంగక నిలువగలిగెను. ఈ విషమసమయమున తనకున్న సముద్రాధిపత్యము వలన రోమ్ రాజ్యము కార్తేజ్ నుండి హేనిబల్‌కు సైనికావసర సామగ్రులు అందకుండ నిరోధించుటయేకాక కడకు కార్తేజ్, స్పెయిన్ దేశముల మీదకు ఎదురు దండయాత్రలను జరుపగలిగెను. అంతట కార్తేజ్ నగర రక్షణకొరకై ఇటలీవదలి హేనిబల్ ఉత్తర ఆఫ్రికాకు పోవలసివచ్చెను. తుదకు క్రీ. పూ. 202 లో కార్తేజ్ సమీపమున జరిగిన యుద్ధమున హేనిబల్ సేనలను రోమన్‌లు ఓడించి సర్వనాశనము చేసిరి. తత్ఫలితముగ రోమ్ రాజ్యము విధించిన నియమములకు లోబడి కార్తేజ్ సంధి కుదుర్చుకొనెను.

హేనిబల్‌పై రోమ్ సాధించిన విజయము వలన మధ్యధరా సముద్రప్రాంతపు దేశములలో అత్యుత్తమ సైనిక నౌకాబల పటిమగల ప్రముఖరాజ్యముగ ఆ దేశమునకు ప్రతిష్ఠ కలిగెను. తదాదిగ రెండువందల ఏండ్లలో రోమన్ సేనలు మధ్యధరాసముద్రప్రాంతములను అన్నింటిని ఆక్రమింపగలిగినవి. క్రీ. పూ. 31 నాటికి గ్రీస్, స్పెయిన్, ఫ్రాన్స్, సిరియా, ఈజిప్టు, పశ్చిమోత్తర ఆఫ్రికా దేశములు రోమన్ సామ్రాజ్యాంతర్గతములు అయినవి. అంతటితో మధ్యధరాసముద్రప్రాంతమున గ్రీక్ ప్రాబల్యము అంతరించి రోమన్ సామ్రాజ్య ప్రాబల్యము ఆరంభమయ్యెను.

ఈ సామ్రాజ్యార్జనకాలమున రోమన్ రాజ్యవ్యవస్థయు పలుమార్పులను పొందినది. ఇటలీదేశమున తక్కిన నగర రాజ్యములను లోబరచుకొనినప్పుడు రోమ్‌రాజ్యము విజితులను తనతో సమానముగ ఆదరించి, వానిని మిత్ర రాజ్యములుగ పరిగణించి, అందలి ప్రముఖులకు రోమ్ నగరరాజ్యమున పౌరస్వత్వము కలిగించినది. కాని, ఇటలీ వెలుపల ఉన్న రాజ్యముల ఎడ మాత్రము ఇందులకు విభిన్నమగు వైఖరి అవలంబింపబడినది. ఆ పరరాజ్యములు సామంతరాజ్యములుగ భావింపబడి, వాని పరిపాలన కొరకై ఒక్కొక్కదానికి ఒక్కొక్క సామంతపాలకుడు (ప్రో-కన్సల్) నియమింపబడెడివాడు. పూర్వపు అసీరియన్, గ్రీక్ సామ్రాజ్యములలోవలెనే ఈ సామంతపాలకులును తమ రాష్ట్రపు ఆంతరంగిక పాలనకు సంబంధించినంతవరకు నిరంకుశులుగ వర్తించి, అమితముగ ధనమును ఆర్జించెడివారు. రాష్ట్రములనుండి కప్పము మాత్రము విధిగ రోమ్‌నకు చేరుచుండెడిది. ఈ విధముగ రోమ్‌నందలి పైతరగతుల వారు సంపన్నులై దిగువతరగతుల రైతుల భూములను కొనివేయ మొదలిడిరి. పైగా యుద్ధములవలన పరదేశీయులను పెక్కురను రోమన్ ప్రభువులు బానిసలుగ కొనివచ్చి తమ క్షేత్రములందు పనికి నియమించుకొనుటవలన రోమ్ పౌరులలో దిగువ తరగతులకు వృత్తియే దొరకక పేదరికము పెచ్చుపెరిగెను. ఈ కాలమున కూడ రోమ్ నగరము మాత్రము ఎన్నుకొనబడిన సంఘముఖ్యులచే పాలింపబడు గణరాజ్యముగ ఉండినమాట నిజమే అయినను, పౌరులలో అధికసంఖ్యాకుల పేదరికమువలన ఈ ఎన్నికలు అర్థరహితములైనవి. ధనికులగు పైతరగతులవారు తమ ధనబలమును ఉపయోగించి వోట్లను కొనివైచి, రోమ్ నగర రాజ్యమున సంఘముఖ్యులై, తన్మూలమున సామ్రాజ్యమునకు అధిపతులు కాగలుగుచుండిరి. ఈ సామ్రాజ్యార్జన వలన సైనికవ్యవస్థయందును మార్పుకలిగెను. హేనిబల్‌ను ఎదుర్కొన్ననాడు రోమన్ సైన్యము దేశభక్త్యుత్సాహ ప్రేరితులగు కర్షకులు మొదలగు వారితో నిండి ఉండెను. ఆనాడు యుద్ధానంతరమున సైనికులలో అత్యధిక సంఖ్యాకులు మరల తమ పూర్వవృత్తులకు మరలెడివారు. సామ్రాజ్యము ఏర్పడినకొలదీ ఈ పరిస్థితి మారి, దేశరక్షణకై ఒక మూలబలమును నిర్మించుకొనవలసిన ఆవశ్యకత కలుగుటవలన సైనిక జీవితమే వృత్తిగాగల వర్గములు రూపొందెను. అట్టి సైనికులకు తమకు లభించు వేతనము, యుద్ధమువలన లభించు దోపిడిధనము, బహుమానములు మొదలగు వానియందు మాత్రమే శ్రద్ధకలిగి క్రమముగ దేశభక్తియు, ఉత్సాహమును సడలినవి. తమకు వేతనాదులను ఎక్కువగ ఇచ్చి యుద్ధముల వలన లాభముల సమకూర్చ గలుగు సంఘముఖ్యుల ఎడ వారికి అధికాదరము ఉండెడిది. ఇటుల అస్తవ్యస్తత ఏర్పడి రోమన్ సంఘవ్యవస్థయొక్క ప్రాత పునాదులు సడలుటవలన గణరాజ్యపు మూలసూత్రములయెడ ఆదరణ సన్నగిలి సమర్థుడగు ఒక వ్యక్తి నిరంకుశాధికారమును నెలకొల్పుటకు అవకాశము లభించెను. ఈ అవకాశమును చక్కగ వినియోగించుకొని తన నియంతృత్వమును ఏర్పరచినవాడు జూలియస్ సీజర్ [చూ].

క్రాసస్ అను ధనికుడును, పాంపీ అను సేనానియు సాయముచేయుటవలన జూలియస్ సీజర్ క్రీ. పూ. 59 లో సంఘముఖ్యుడుగ ఎన్నికయ్యెను. ఈ పలుకుబడిని ఉపయోగించుకొని ఇతడు తనకు సాయముచేసిన క్రాసస్, పాంపీ

అను వారిని సామంతరాష్ట్రములకు పాలకులుగ నియమింపబడునటుల చేయుటయేకాక, తానును ఇటలీకి ఉత్తరమున ఉన్న గాల్ రాష్ట్రమునకు పాలకుడు కాగలిగెను. అతడు ఆ పదవియందు పది ఏండ్ల కాలము ఉండి, ఆ కాలమున గాల్ పరిసరప్రాంతములను జయించి నేటి ఫ్రాన్సునందు ఆనాడు వసించిన కెల్ట్‌లను, రైన్ నదీతీరమున వసించు జర్మన్ జాతులను రోమన్‌ల ఆధిపత్యమును అంగీకరించునటుల చేయగలిగెను. ఇటుల ఇతడు రోమన్ సామ్రాజ్యపు ఉత్తర సరిహద్దును ఉత్తర సముద్రమువరకు విస్తరింప జేసెను. అతని నాయకత్వమున నడచిన రోమన్ సైనికులు అతని ఎడల అమేయ శ్రద్ధాసక్తులు కల యుద్ధనిపుణులు. వీరి సాయమున ఇతడు సాధించిన విజయములవలన రోమన్‌సామ్రాజ్య ప్రజానీకమునకు సీజర్ ఆరాధ్యమూర్తి అయ్యెను. తత్ఫలితముగ అతనిని వారు తమ నియంత (డిక్టేటర్) గ పలుమారులు వరుసగ ఎన్నుకొనిరి. ఇట్టి నియంతృత్వ విధానమును నిరోధించి, పూర్వపు వ్యవస్థను నెలకొల్పుటకు కృషిచేసిన పాంపీ మొదలగు తన పూర్వసహచరులను సీజర్ తన సైన్యసహాయమున అంతమొందించెను. కాని, అతని సన్నిహిత సహచరులలోనే కొందరికి సీజర్ నియంత అగుట రోమన్‌జాతి అభ్యుదయమునకు భంగకారి అను అభిప్రాయము ఏర్పడినది. అట్టివారు బ్రూటస్ అనువాని నాయకత్వమున క్రీ. పూ. 44, మార్చి 15 న సీజర్‌ను నిండుసభలో హత్యకావించిరి. చనిపోవునప్పటికి సీజర్ నాలుగేండ్లు మాత్రమే రోమ్‌ను పాలించెను.

సీజర్ అనంతరమున అతని దత్తపుత్రుడు ఆక్టేవియస్ అగస్టస్ [చూ.] కొన్ని ఆంతరంగిక కల్లోలముల తరువాత నియంతృత్వాధికారములను వహింపగలిగెను. సీజర్‌నందు శ్రద్ధాభక్తులు కలిగి ఉండిన సైన్యము ఆతని దత్తపుత్రుని అభిమానించుటచే, తక్కిన ప్రతిస్పర్ధుల ప్రతిఘటన త్వరలోనే అంతమయ్యెను. తొలుత అగస్టస్‌తో సహకరించిన మార్క్ ఆంటోనీ అను ప్రముఖుడును కడకు అతనికి విరోధియై ఎదురు తిరిగెను. జగదేకసుందరిగ సమకాలిక ప్రపంచమున పేరు కనిన క్లియోపాత్రా అను ఈజిప్టు రాణిని ఈ ఆంటోనీ వలచి, ఆమెకు వశుడై, ఆమె సహాయసంపత్తులతో అగస్టస్‌ను ఎదుర్కొనెను. ఆక్టియమ్ అను చోట జరిగిన నౌకాయుద్ధమున ఆంటోనీ పరాజితుడయ్యెను. ఆ అవమానమును ఓర్వజాలక ఆంటోనీయు, క్లియోపాత్రాయు ఆత్మహత్యకు పాలయిరి. అంతటితో ఈజిప్టు రోమన్ సామ్రాజ్యమున ఒక రాష్ట్రమయ్యెను (క్రీ. పూ. 31).

ఇటుల ప్రతిస్పర్ధులను అంతమొందించి అగస్టస్ సామ్రాజ్యాధిపత్యమును వహించిన తరువాత సామ్రాట్ అను పేరునుమాత్రము వహింపక దాదాపుగ నిరంకుశాధికారములతో క్రీ. పూ. 27 నుండి క్రీ. శ. 17 వరకు పాలించెను. ప్రజాహితమును ఆకాంక్షించి, పరిపాలనయందు అమలుపరచిన సంస్కరణల మూలమున ప్రజాహృదయములను అతడు ఆకర్షించుటచే, ప్రజలలో అతడు దేవాంశసంభూతుడను ప్రథ కలిగెను. ఇటుల ప్రాచీన ప్రాచ్యసామ్రాజ్యములందు వలెనే రోమన్‌లందును సామ్రాట్‌లను దైవమూర్తులుగ భావించుట పరిపాటియై వంశానుగతమగు సామ్రాట్‌ల పాలనకు దారితీసెను. తత్ఫలితముగ అగస్టస్ వంశజులే క్రమముగ సామ్రాట్‌లైరి. అంతటితో రోమన్ చరిత్రయందు గణరాజ్యయుగము అంతరించి, సామ్రాట్‌ల యుగము మొదలిడెను. క్రీ. పూ. 31 మొదలుగ క్రీ. శ. 300 వరకు నడచిన ఈ యుగమున సామ్రాట్‌లే సర్వాధికారములను కలిగి ఉండినను, పూర్వపు గణరాజ్యకాలమున ఏర్పడిన ప్రభుత్వాదర్శములలో పెక్కు దాదాపు రెండు వందల సంవత్సరముల కాలము చెక్కుచెదరక నిలువ గలిగినవి.

అగస్టస్ తరువాత అతనివంశీయులగు సామ్రాట్‌లలో అతనియంత సమర్థుడు మరల ఉదయించలేదు. కాని, అతడేర్పరచిన పరిపాలనాయంత్రపు సామర్థ్యమువలన రోమన్‌సామ్రాజ్యము చాలకాలము వరకు సుస్థిర శాంతిని అనుభవింపగలిగెను. ఆ సామ్రాట్‌లలో ఒకడగు నీరో [చూ.] దుష్పరిపాలనకు పేరొందినవాడు. ప్రజలు అతని దుశ్చర్యలకు కుపితులై తిరుగుబాటుచేయగ సైన్యము ప్రజలపక్షము వహించి అతనిని పదభ్రష్టుని చేసెను. తరువాత క్రీ. శ. 96 లో సైన్యపు ఆదరణను ఆర్జించిన నేర్వా అనువానిని సామ్రాట్‌గ ప్రజాప్రతినిధిసభ నియమించెను. అతడును, అతని తరువాత క్రమముగ రాజ్యాధిపత్యము వహించిన తద్వంశీయులు నలువురును కలసి 'పంచ సచ్చక్రవర్తులు' అను పేరున ఆ సామ్రాజ్య చరిత్రలో పేరొందిరి. ఆ అయిదుగురిలో కడపటివాడగు మార్కస్ అరీలియస్ [చూ.] క్రీ. శ. 161 మొదలు 180 వరకు రోమన్ సామ్రాజ్యమును పాలించెను. ఇతడు తక్కిన అందరికన్న ఎక్కువ ప్రసిద్ధి వహించిన వాడు. మహాయోధుడుగను, పాలనాదక్షుడుగను మాత్రమే కాక తత్త్వవేత్తగను, రచయితగను ఇతడు ప్రసిద్ధివహించెను.

రోమన్‌సామ్రాజ్యమున శాంతిభద్రతల సుస్థిర మొనర్చుటయందే అగస్టస్ అనంతరపు తొలుతటి పాలకులు ఎక్కువగ శ్రద్ధవహించిరి. ఎడనెడ సరిహద్దులకు వెలుపల

నుండి సంచారజాతులు దేశముపై దండయాత్రలు జరిపినపుడు మాత్రమే కొన్ని పోరాటములు తప్పనిసరి అయ్యెడివి. కాని, క్లాడియస్ (క్రీ. పూ. 10 - క్రీ. శ. 54) కాలమున రోమన్‌సామ్రాజ్య విస్తరణకు కొంత యత్నము జరిగి, తత్ఫలితముగ బ్రిటన్ దీవియందలి దక్షిణభాగము (నేటి ఇంగ్లండు, వేల్స్ దేశములు) సామ్రాజ్యమున అంతర్భాగమయ్యెను. తరువాత ట్రేజన్ (క్రీ. శ. 98-117 ప) చక్రవర్తి కాలమున ఈ జిగీష అతిశయిల్లినది. మహావిజేతయగు అలెగ్జాండర్‌ను అనుకరించి ఈ ట్రేజన్ ప్రాచ్య, పాశ్చాత్యములను ఏకసామ్రాజ్యమున చేర్చుటకై కృషిసల్పెను. డాన్యూబ్‌నది ఆవలిప్రదేశముల జయించి, అచ్చట అతడు రోమన్‌ల వలసల నెలకొల్పెను. ఇక తూర్పున అతడు పార్థియన్ సామ్రాజ్యముపై దండెత్తి దానిని నిర్మూలించుటకు యత్నించెను. అందు కృతకృత్యుడు కాకపోయినను పార్థియన్‌లకు చెందిన యూఫ్రటీస్ నదికి ఆవల ఉండిన ఆర్మీనియా, మెసపొటేమియా, అసీరియాలను జయించి, తన సామ్రాజ్యమున అతడు కలుపుగొనగలిగెను. ట్రేజన్ అనంతరము చక్రవర్తి అయిన హాడ్రియన్ ఈ సామ్రాజ్య విస్తరణ విధానమునకు స్వస్తిచెప్పెను. సామ్రాజ్యము దూరప్రాంతములకు విస్తరించినకొలది దాని రక్షణ ఎక్కువ క్లేశదాయకము కాగలదని అతడు గ్రహించి, యూఫ్రటీస్ నదికి ఆవల ఉండిన మూడు రాష్ట్రములను మరల పార్థియన్‌లకే వదలివేసి, తక్కిన సామ్రాజ్యపు సరిహద్దులను కట్టుదిట్టము చేయుటలో కృషిచేసెను. రైన్, డాన్యూబ్ నదుల మధ్యభాగమున రోమన్‌సామ్రాజ్యపు సరిహద్దునకు తగు భద్రత లేకుండుటచే అతడట వరుసగ దుర్గముల నిర్మింపజేసెను. అటులే సంచారజాతుల బెడదను నివారించి, ఇంగ్లండును రక్షించుటకై ఆ దేశమునకు ఉత్తరమున స్కాట్‌లాండ్‌నుండి దానిని వేరుపరచు కోటగోడను హాడ్రియన్ కట్టించెను.

మార్కస్ అరీలియస్ అనంతరము చక్రవర్తిత్వము వహించిన కమోడస్ (క్రీ. శ. 180-192 ప) దుర్వ్యసనలోలుడయి, అంతఃకల్లోలముల ఫలితముగ దుర్మరణము పాలుకాగా, అధికారమును సైన్యము స్వీకరించినది. అంతటినుండి చక్రవర్తిని నియమించుటయందును, పదవీభ్రష్టుని చేయుటయందును సైన్యమే ప్రముఖ పాత్ర వహించినది. సైన్యమును సంతృప్తి పరుపజాలని చక్రవర్తి అనతికాలముననే దుర్మరణము పాలుకాక తప్పెడిది కాదు. ఈ పరిస్థితులవలన క్రీ. శ. 235 నుండి 285 వరకు ఇరువది ఆరుగురు చక్రవర్తులు వరుసగ ఆ సామ్రాజ్యమును పాలించిరి. వీరిలో ఒకడుమాత్రమే ప్రకృతి సహజముగ మరణించు భాగ్యమును పొందగలిగెను. క్రీ. శ. 285 లో సైన్యసాహాయ్యమున చక్రవర్తి కాగలిగిన డయొక్లీటియన్ సామ్రాజ్యమునకు ఇట్టి పరిస్థితులవలన రానున్న దుర్గతిని గ్రహించి దానిని అరికట్టుటకై చక్రవర్తి పదవి సంక్రమించు పద్ధతియందు కొన్ని మార్పులను ప్రవేశపెట్టెను. సామ్రాజ్యమును అతడు ప్రాచ్య సామ్రాజ్యము, పశ్చిమసామ్రాజ్యము అను రెండు భాగములుగ విభజించి తాను పశ్చిమభాగమునకును, తూర్పుభాగమునకు మాక్సిమియన్ అను వాడును అధిపతులుగ ఉండునటుల ఏర్పాటు చేసెను. ఈ ఇరువురును సమానాధికారములు కలిగి చక్రవర్తి బిరుదమునకు బదులుగ అగస్టస్ బిరుదము అందు ప్రతి ఒక్కరును కలిగి ఉండునటులను, పరిపాలనలో తనకు సాయపడుటకై ఈ అగస్టస్ బిరుదాంకితులలో ప్రతి ఒకడును తన కన్న చిన్నవాడును, సమర్థుడును అగు యువకుని ఒకనిని సీజర్ అను బిరుదముతో నియమించునటులను, అగస్టస్ పదవిలో ఉన్నవాడు మరణింపగనే, అతనికి సహాయకుడుగ ఉన్న సీజర్ అగస్టస్ పదవిలోనికి వచ్చునటులను డయొక్లీటియన్ ఒక పద్ధతిని ఏర్పరచెను. ఇందువలన సైన్యము చేతిలో కీలుబొమ్మలుగ ఉండు అసమర్థులు కాక, పరిపాలనయందు సామర్థ్యమును, ప్రతిష్ఠయు కలిగినవారు పాలకులుగ రాగలుగుదురని ఆ ప్రభువు ఆశించెను. కాని, అతని మరణానంతరమున ఆ విధానము ఎక్కువకాలము అమలులో ఉండలేదు. ప్రాచ్య సామ్రాజ్యమున మాక్సిమియన్ అనుమతితో అగస్టస్ పదవిని సక్రమముగ పొందిన కాన్‌స్టాంటినస్ క్రీ. శ. 306 లో మరణించునాటికి అతడు సీజర్‌గ ఎవరిని నియమింపలేదు. కాని, అతని కుమారుడగు కాన్‌స్టాన్‌టెయిన్ తన తండ్రి మరణానంతరమున సైన్యబలమును అండగాగొని తన్నుతానే సీజర్‌గ ప్రకటించుకొని, అధికారమును వశపరచుకొనెను. దీనిని తక్కిన రోమన్ నాయకులలో పలువురు అంగీకరింపకపోవుటచే అంతఃకల్లోలములు పొడమెను. కడకు తన ప్రతిస్పర్ధులను అడచి కాన్‌స్టాన్‌టెయిన్ ప్రాచ్య, పశ్చిమ సామ్రాజ్యముల రెండింటికి చక్రవర్తి కాగలిగెను (క్రీ. శ. 324). పశ్చిమ సామ్రాజ్యము హీనస్థితిలో ఉండుటవలన యావత్సామ్రాజ్యమునకు రాజధానిగ రోమ్‌నగరమునకు బదులుగ వేరొక ప్రాచ్యనగరము ఉండుట భావ్యమని అతడు తలపెట్టి ఆసియామైనర్ నందు కాన్‌స్టాంటినోపుల్ (నేటి ఇస్తాంబుల్) నగరమును నిర్మింపజేసి, అచటికి రాజధానిని మార్చెను (క్రీ. శ. 330). ఇతడు క్రైస్తవమత

మును ఆదరించి, రోమన్ సామ్రాజ్యమున దాని వ్యాప్తికి అడ్డుతగిలిన నిరోధములను తొలగించెను. కాని, చాల కాలమువరకు తాను క్రైస్తవమతమును అవలంబింపలేదు; కడకు మరణమునకు సన్నిహిత పూర్వకాలమున క్రీ. శ. 337 లో ఇతడు క్రైస్తవమతమును స్వీకరించెను.

అగస్టస్ చక్రవర్తి మొదలుకొని కాన్‌స్టాన్‌టెయిన్ వరకు నడచిన ఈ దీర్ఘకాలమున తొలుతటి రెండు శతాబ్దములును రోమన్‌సామ్రాజ్య చరిత్రయందు స్వర్ణ యుగముగ పరిగణింపబడుచున్నవి. ఆనాడు గ్రీక్ సంస్కృతిని స్వీయముచేసికొని, రోమన్ సంస్కృతి నూతన రూపమును సంతరించుకొనినది. పరిపాలనావ్యవస్థ కట్టుదిట్టము చేయబడుటచే దేశమున కళలును, వర్తకవ్యాపారములును అత్యుచ్చస్థాయిని అందుకొనినవి. ఆ కాలమున భారతదేశము, చీనా మొదలగు ప్రాచ్యదేశములతో సైతము ఆ సామ్రాజ్యము దౌత్య, వ్యాపార సంబంధముల నెలకొల్పుకొనినది. సముద్రమార్గమున దక్షిణభారత దేశముతో ఈ సామ్రాజ్యమునకు అతి సన్నిహిత సంబంధము ఉండినటుల సమకాలికపు వ్రాతలవలనను, దక్షిణ భారతమున అటనట త్రవ్వకములందు నేటికిని కననగు రోమన్‌నాణెములవలనను విశదమగుచున్నది.

## భారతదేశము

— (క్రీ. పూ. 28 - క్రీ. శ. 647)

రోమన్ సామ్రాజ్యపు స్వర్ణయుగకాలమున దక్షిణ భారతదేశమున అత్యధికభాగము సాతవాహనుల వశమున ఉండెను. కాని, అందు దక్షిణపుకొనన ఉన్న ద్రావిడ ప్రాంతము మాత్రము చోళ, పాండ్య, కేరళములు అను మూడు చిన్న రాజ్యములుగ విభక్తమై ఉండినది. ఇందు పాండ్య రాజ్యపు ప్రభువు ఒకడు అగస్టస్ చక్రవర్తి వద్దకు ఒక దౌత్యవర్గమును పంపెనని రోమన్‌ల చరిత్ర వలన తెలియవచ్చుచున్నది. సాతవాహనప్రభువుల అధీనమున ఉండిన దేశమునకు రోమన్ సామ్రాజ్యముతో వర్తక రీత్యా సంబంధము ఉండెననియు తెలియుచున్నది. క్రీ. శ. రెండవ శతాబ్ది అంతమునకు సాతవాహనసామ్రాజ్యము విచ్ఛిన్నమై, అందు నాసిక్ ప్రాంతము ఆభీరులకును, బీరార్ ప్రాంతము వాకాటకులకును, పశ్చిమపు కర్ణాటక ప్రాంతము చూటుశాతకర్ణులు అనబడు రాజవంశము వారికిని వశమైనది. తక్కిన తూర్పు ప్రాంతము ఇక్ష్వాకులు, బృహత్ఫలాయనులు, విష్ణుకుండినులు అను వారికి క్రమముగ లోనైనది. ఇంతలో దక్షిణమున కంచి (కాంచీపురము)ని రాజధానిగ ఇడుకొనిన పల్లవులు బలవంతులై కృష్ణానది వరకు తమ అధికారమును వ్యాపింపజేసిరి.

ఉత్తర భారతదేశము వివిధ అల్పరాజ్యములుగ ఆ కాలమున విభక్తమై ఉండినది. అందు పశ్చిమభాగము శకులకును, కుషానులకును వశమైనదను విషయము ఇదివరలో ప్రసక్తమైనది [చూ. పు. 38]. ఈ కుషానుల అధికారము క్రీ. శ. 230 ప్రాంతమునకూడ ఉచ్చస్థాయిలోనే మనగలిగినది. ఇట్లు ఛిన్నాభిన్నమై, పరాక్రమితమై ఉన్న ఉత్తర భారతదేశమునకు విముక్తిని చేకూర్చిన వారు గుప్తవంశపు రాజులు. ఈ వంశపు రాజులలో మూడవవాడును, వారిలో ప్రప్రథమముగ మహారాజాధిరాజ బిరుదము వహించినవాడును అగు చంద్రగుప్తుడు-I యమునానది మొదలుగ సోన్‌నది వరకును ఉత్తర భారతదేశమున తన అధికారమును నెలకొల్పెను. ఇతని కుమారుడు సముద్రగుప్తుడు ఉత్తర, దక్షిణ భారతదేశ రాజులను అందరిని తన జైత్రయాత్రాకాలమున పరాజితుల కావించెను. కాని, తన రాజ్యాధికారమున ఉత్తర భారతదేశమును మాత్రమే నిలుపుకొనెను. ఇతని తరువాత రాజ్యాధికారము వహించిన ఇతని కుమారుడు చంద్రగుప్తుడు-II (క్రీ.శ. 380-413 ప) శకుల దర్పమడచి 'సాహసాంక', 'శకారి', 'విక్రమాదిత్య' అను బిరుదములను ఆర్జించెను. తన కాలమున దక్షిణ భారతదేశమున బలవత్తరులై ఉండిన వాకాటక రాజులతో ఇతడు సంబంధబాంధవ్యములను ఏర్పరచుకొని, తన రాజ్యమునకు సుస్థిరత చేకూర్చుకొనెను. ఇటుల భారతదేశము గుప్తరాజులకాలమున కొంత పరిపాలనా స్థైర్యమును ఆర్జించుకొనగలిగినను, కడకు అయిదవ శతాబ్ది ఉత్తరార్ధమున హూణుల [చూ.] దండయాత్రలను ఎదుర్కొనవలసి వచ్చినది. వాయవ్య భారతదేశపు సరిహద్దులను అతిక్రమించి మిడుతల దండులవలె తెరలు తెరలుగా వచ్చిపడిన హూణులమూకలను అరికట్టుటలో తొలుతగ గుప్తరాజులు కొంతవరకు జయమును ఆర్జించినను, కడకు పశ్చిమప్రాంతము హూణుల వశమయ్యెను. తూర్పు ప్రాంతమున మాత్రము గుప్తవంశపు కడపటి రాజులు క్రీ. శ. 544 వరకు అధికారము వహించి అంతరించిరి. హూణుల వశమైన పశ్చిమభాగము మాండలికుల దేశభక్తి మూలమున క్రీ. శ. 534 కు విమోచనమును ఆర్జించినను, సుస్థిరపరిపాలనను తిరిగి పొందలేకపోయెను. ఈ క్లిష్టపరిస్థితులలో వివిధ మాండలిక రాజవంశముల వారు దేశాధిపత్యమునకై కృషిచేసిరి. కడకు స్థానేశ్వర ప్రభువగు హర్షుడు (క్రీ. శ. 606-647 ప) ఇందు కృతకృత్యతను పొందగలిగెను. హిమాలయములు మొదలు

కొని నర్మద వరకును, స్థానేశ్వరము మొదలుకొని కామ రూపము (అస్సామ్) వరకును కల ఉత్తరభారతదేశము ఆ సామ్రాట్ పాలనలో ఆనాడు ఉండినది. అతని రాజ్యమున చేరక స్వతంత్రముగ మనిన కాశ్మీర్, సింధు ప్రాంతముల పాలకులును అతని ఎడ గౌరవము వహించి వర్తించిరి. కాని, దక్షిణభారత దేశమును జయించుటయందు హర్షుడు విఫలుడయ్యెను. దక్షిణాపథపాలకుడగు చాళుక్యరాజు పులకేసి-II అతనిని నిరోధించగలిగెను. హర్ష సార్వభౌముని కాలముననే హుయాన్‌స్యాంగ్ అను చీనా దేశపు బౌద్ధ యాత్రికుడు భారతదేశమును దర్శించి, తన అనుభవ ములకు లిఖితరూపమును కల్పించెను.

సాతవాహనుల కాలము మొదలుకొని హర్షుని వరకును నడచిన ఈ చారిత్రకకాలమున భారతదేశమునకు దూర ప్రాచ్యరాజ్యములతో సన్నిహితసంబంధములు ఏర్పడెను. సింహళము (నేటి సిలోన్)తో భారతదేశమునకు పరిచితి క్రీ. పూ. 3 వ శతాబ్దికి పూర్వమునుండియు ఉండినటుల నిదర్శనములు కలవు. పశ్చిమ, ప్రాచ్య భారతదేశముల నుండి ఆర్య క్షత్రియ కుటుంబములు అనేకములు ఆ కాల మున సింహళమున చేరి ఆర్యసంస్కృతిని వ్యాపింపజేసినవి. క్రీ. పూ. 3 వ శతాబ్దిలో భారతదేశీయ బౌద్ధమత ప్రచార కులు బౌద్ధమతమును అచట వ్యాపింపజేసిరి. అశోకుని సమకాలికుడగు దేవానాంపియతిస్స అను ప్రభువు ఆ రాజ్య మును పాలించు కాలమున మహేంద్ర, సంఘమిత్ర అను ప్రచారకుల మూలమున ఆ దేశమున బౌద్ధమతప్రచారము మొదలిడెనని ఆదేశపు సాంప్రదాయిక చరిత్ర నుడువు చున్నది. దక్షిణభారత దేశమునుండి తమిళులు ఆ దేశమున ఆ కాలముననే చేర మొదలిడిరనియు, తమిళులతో సింహళ ప్రభువులు సాగించుచుండిన యుద్ధములందు విజయము పలు మారు చేతులు మారుచుండెడిదనియు ఆ గాథలవలననే తెలియవచ్చుచున్నది. ఈ యుద్ధములందు కొన్ని పర్యాయ ములు దక్షిణ భారతదేశ చోళప్రభువులు సింహళముపై దండెత్తుటయు, అటులే సింహళప్రభువులు దక్షిణ భారత దేశముపై దండెత్తుటయు జరిగినది. ఈ విరోధములు ఎటు లున్నను, సింహళము సాంస్కృతికముగ భారతదేశపు ప్రభావమునకు సంపూర్ణముగ లోనైనదని చెప్పనగును.

భారతదేశ సంస్కృతి ఇటుల అతి సమీపమున ఉన్న సింహళమునకే కాక కాలక్రమమున ఆగ్నేయ ఆసియా యందలి బర్మా, సయామ్, ఇండో-చీనాలకును, ఇండో నీషియా యందలి వివిధ దీవులకును వ్యాపించినది. క్రీ. పూ. రెండవ శతాబ్దమున రూపొందినటుల భావింపదగు వాల్మీకి రామాయణమున సముద్రమునకు ఆవల ఉన్న ఈ ప్రాచ్య దేశములలో యవ (జావా) ద్వీపమును గురించి ప్రస్తావన ఉండుటవలన ఆ కాలపువారికి ఈ దేశములను గురించిన పరిజ్ఞానము ఏ కొలదిగనో ఉండినటుల ఊహించదగి ఉన్నది. ఆ యా దేశములందు ఆ ప్రాచీనకాలముననే భారతీయుల వలసలు ఏర్పడినను, వానిని గురించిన చారిత్రక విశేష ములు క్రీ. శ. మూడవ శతాబ్దివరకు మనకు తెలియ వచ్చుటలేదు. ఆ తరువాతనైనను, సమకాలిక చీనీయ చరిత్ర వలన మాత్రమే మనకు కొన్ని విషయములు తెలియ వచ్చుచున్నవి. భారతీయుల అట్టి వలసదేశములలో ఇండో-చీనాయందలి ఫూనాన్, లిన్-ఇ రాజ్యములు ప్రముఖ ములు. వీనిలో రెండవది చంపారాజ్యమని తరువాత వ్యవహృతమైనది. జావాయందు లంకాశూక అను పేరుగల వలస రాజ్యము క్రీ. శ. రెండవ శతాబ్దియందు స్థాపితమ య్యెనని చీనాచరిత్ర వలననే తెలియవచ్చుచున్నది. బౌద్ధగ్రంథములందును ఈ లంకాశూకమును గురించిన ప్రస్తావన కలదు. ఈ రాజ్యములలో భారతీయ రాజవంశీ యులు తమ అధికారమును నెలకొలిపి, భారతదేశముతో వర్తక వ్యాపారసంబంధముల దృఢతరముల చేయుటయే కాక బ్రాహ్మణ, బౌద్ధమతముల వ్యాప్తికి తోడ్పడిరి.

పై వాని అన్నింటికన్న ముఖ్యముగ పేర్కొనదగినది ఈ కాలమున భారతీయుల కృషిచే చీనాయందు జరిగిన బౌద్ధమతవ్యాపన, చీనాతో సముద్రతీరమును అనుసరించి నౌకావ్యాపారసంబంధము భారతదేశమునకు క్రీస్తు శకా రంభమునకు పూర్వము నుండియే ఉండినను, ఈ బౌద్ధమత వ్యాపనము తొలుతగ భూమార్గమును అనుసరించియే మధ్య ఆసియా ద్వారా జరిగినటుల తెలియవచ్చుచున్నది. కాశ్మీరమునుండి బౌద్ధమతము తొలుతగ మధ్య ఆసియా యందు వ్యాపించి, అటనుండి చీనాకు వ్యాపించినటుల బౌద్ధమతగ్రంథములు నుడువుచున్నవి. మధ్య ఆసియా యందు ఆనాడు భారతీయ సంస్కృతి ఎల్లెడల తన ప్రభా వమును నెరపినది [చూ. విశాల భారతము].

## చీనా

(క్రీ. శ. 229 - క్రీ. శ. 650)

ఒక కుషాన్ ప్రభువు క్రీ. పూ. 2 లో దౌత్యవర్గముతో పాటుగ కొన్ని బౌద్ధమతగ్రంథములను, ధాత్వవశేషము లను చీనాసామ్రాట్‌కు పంపెనని చీనీయచరిత్రలు తెలుపు చున్నవి. ఆ తరువాత బౌద్ధమతప్రచారకులు ఆ దేశమున ఏకాలమున తమ మతప్రచారమును మొదలిడిరను విష యము చారిత్రకముగ సునిశ్చితము కాలేదు. కాని, హాన్ వంశీయుడగు మింగ్‌చక్రవర్తి క్రీ. శ. 68 లో బౌద్ధమత

మునకు చీనాదేశమున పరిగణన ఇచ్చుటవలన అంతకు పూర్వముననే ఆ మతప్రచారము ఆ దేశమున మొదలిడెనని భావింపదగును. దక్షిణ, ప్రాచ్య భారత దేశములనుండి సముద్రమార్గమున వచ్చిన బౌద్ధభిక్షుకులును దక్షిణ చీనాయందు ఈ మతవ్యాపనమునకు తోడ్పడిరి.

చీనాయందు హాన్ వంశపు పాలన క్రీ. శ. 229 లో అంతమయ్యెను. అంతట అంతఃకల్లోలముల ఫలితముగ ఆ దేశము మూడు వేర్వేరు రాజ్యములుగ విభక్తమై వివిధ రాజవంశముల పాలనకు లోనయ్యెను. అంతటినుండి క్రీ. శ. 589 వరకు దేశము ఈ స్థితిలోనే ఉండి, మంగోల్‌లు, హూణులు, తుర్కులు చేయు దండయాత్రలకు లోనై, వివిధప్రాంతములు ఆ యా అన్యజాతీయుల వశమగుటయు జరిగెను. కాని, ఇటుల దేశమున ఆధిపత్యమును నెలకొల్పిన ఆ విజాతీయులు చీనీయభాషాసంస్కృతిని అవలంబించి, క్రమముగ చీనీయులుగ పరిగణన పొందిరి. ఈ కాలముననే బౌద్ధమతము విరివిగ ప్రజాదరణను ఆర్జింపగలిగినది. తత్ఫలితముగ బౌద్ధమతప్రామాణిక గ్రంథముల సేకరించుటకును, బౌద్ధ క్షేత్రముల దర్శించుటకును యాత్రికులు పలువురు చీనానుండి భారత దేశమునకు పోయి వచ్చుట పరిపాటి అయ్యెను. ఇట్టి యాత్రికులలో చారిత్రకముగ పేరుపొందిన వారిలో తొలుతగ పేర్కొనదగినవాడు ఫాహియాన్. కడకు క్రీ. శ. 589 లో సుయీ రాజవంశపు పాలనలో దేశమున ఏకైక కేంద్రప్రభుత్వము నెలకొని, అరాజకత అంతరించు నాటికి చీనీయ జాతీయజీవనమున విశిష్టపాత్రను నిర్వహించునదిగ బౌద్ధమతము గణనపొందగలిగినది. ఇటుల సుయీ రాజవంశము ఆ దేశమున ఐక్యతను నెలకొల్పగలిగినను, దానిని అనతికాలముననే అంతరింపజేసి, టాంగ్ రాజవంశపు వారు క్రీ. శ. 618 లో సామ్రాజ్యాధిపత్యమును వహించిరి. ఈ రాజవంశపాలకులలో రెండవవాడగు టాయ్ చుంగ్ (క్రీ. శ. 627 - 650 ప) కాలమున చీనా సామ్రాజ్యము విస్తృతిని ఆర్జించి, సమకాలీన సామ్రాజ్యములలో మిన్నగ రాణింపగలిగెను. చీనీయ సేనాపతులు ఆ కాలమున కొరియా, తుర్కిస్తాన్, పామీర్ పీఠభూమి, టిబెట్ దేశములపై జైత్రయాత్రల సాగించి, చీనాచక్రవర్తి సార్వభౌమతకు ఆ దేశములు లొంగునటుల చేసిరి.

## ససానియన్ సామ్రాజ్యము

(క్రీ. శ. 224 - 641)

చీనాదేశమున హాన్ సామ్రాజ్యము అంతరించిన కాలముననే ఇరాన్ దేశమున ఒక నూతన సామ్రాజ్యము రూపొందినది. ఆ రాజ్యమును పాలించిన రాజుల వంశనామమును అనుసరించి దానిని 'ససానియన్' సామ్రాజ్యము అని చరిత్రకారులు పేర్కొందురు. దానికే 'నవ పారసీక' సామ్రాజ్యము అను వేరొక పేరుకూడ వ్యవహారమున కలదు. క్రీ. శ. 224 లో పార్థవుల అధికారమును అంతమొందించి అర్దాశిర్-I అను వాడు ఈ సామ్రాజ్యమును నెలకొల్పెను. క్రీ. శ. 641 వరకు ఇది మనగలిగెను. ఏవియో కొలది ఘట్టములందు తప్ప తక్కిన కాలమునందు అంతట ఈ సామ్రాజ్యపు విస్తృతి ఇరాన్ సరిహద్దులను అతిక్రమింపజాలక పోయెను. పరిసరములలో ఉన్న ఆర్మీనియా మొదలగు రాష్ట్రముల స్వామ్యము కొరకై రోమన్ సామ్రాట్‌లతో ఈ రాజవంశపు ప్రభువులు అతి దీర్ఘకాలము యుద్ధము సాగించిరి. ఈ ప్రభువులు తాము ప్రాచీన పారసీక చక్రవర్తులు జన్మించిన హాఖమనీషి వంశమునకు చెందినవారమని చెప్పుకొని, ఆ చక్రవర్తులవలెనే జరతుష్ట్రి (జొరాష్ట్రియన్) మతమును ఆదరించి పరిపోషించిరి. ఈ ససానియన్ ప్రభువులలో పలువురు జరతుష్ట్రిమతమును మాత్రమే జాతీయమతముగ చేయ సంకల్పించి మతాంధతతో వర్తించి తక్కిన మతములను - ముఖ్యముగ క్రైస్తవ మతమును - నిర్మూలింప యత్నించిరి. అయినను, ఆ రాజవంశమున మతసహనమునకు పేరొందిన రాజులును కొంతమంది జన్మించకపోలేదు. వారిలో ముఖ్యముగ పేర్కొనదగినవాడు యజదగర్ద-I (క్రీ. శ. 399 - 420 ప). రాజకీయ వ్యవహారములందు పలుకుబడి కలిగి, రాజులను సయితము ధిక్కరించి వర్తించగలిగిన సర్దారుల దౌష్ట్యములను అడచుటయేకాక, సర్వమతములవారిని సమానముగ ఈ సామ్రాట్ ఆదరించెను. ఖుస్రూ-I (క్రీ. శ. 531 - 579 ప) యూదులకును, క్రైస్తవులకును స్వత్వముల పునరుద్ధరించుటయేకాక, పన్నులవిధానమును సువ్యవస్థీకరించెను. ఈ విధానమునే ఆతరువాత ససానియన్ సామ్రాజ్యమును అంతమొందించిన అరబ్బులును స్వీకరించి అనుసరించిరి. ప్రాచ్య, పాశ్చాత్య సంస్కృతుల కూడలిగ ఈ ససానియన్ సామ్రాజ్యము వ్యవహరించెను. ఈ రాజుల ఆస్థానములందు, అందును ముఖ్యముగ ఖుస్రూ ఆస్థానమున గ్రీస్, సిరియా దేశముల పండితవర్గముతో పాటు భారతీయపండితులును ఆదరణను పొందిరనియు, గ్రీక్‌ల జ్యోతిశ్శాస్త్రాదుల పరిజ్ఞానము భారతీయ పండితులందు వ్యాపించుటకు ఇది ఒక విధముగ కారణభూతము అయ్యెననియు చారిత్రకులలో కొందరి అభిప్రాయము.

ఈ సామ్రాజ్యమునకు రోమన్ సామ్రాజ్యముతో సాగిన యుద్ధము కవథ్ అను పారసీక చక్రవర్తి క్రీ. శ. 527 లో

రోమన్ సామ్రాట్ జస్టీనియన్‌పై సాగించిన దండయాత్రతో ఆరంభమై ఎడనెడ విజృంభించుచు దాదాపు వంద సంవత్సరములు సాగెను. ఈ నిరంతరయుద్ధముల వలన ఈ రెండు సామ్రాజ్యములును బలహీనములై కడకు ఇస్లామ్ మతావేశితములగు అరబ్బీ సేనావాహినులు నవపారసీకసామ్రాజ్యమును అంతము చేయుటకు సుగమము చేసినవి.

## రోమన్ సామ్రాజ్యము

(క్రీ. శ. 395 - 627)

ససానియన్ సామ్రాజ్యముతో పైన పేర్కొనబడిన నిరంతర యుద్ధములను సాగించునాటికి రోమన్ సామ్రాజ్యము ప్రాచ్య, పశ్చిమ సామ్రాజ్యములను రెండు విస్పష్ట ఖండములుగ సువిభక్తమై ఉండెను. కాన్‌స్టాంటెయిన్ కాలమున రోమన్ సామ్రాజ్యముఖ్యనగరము కాన్‌స్టాంటినోపుల్‌కు తరలింపబడిన తరువాత క్రీ. శ. 395 లో ఈ రెండు ఖండములు సంపూర్ణముగ విడివడెను. అంతటినుండి పశ్చిమ సామ్రాజ్యమునకు అవసానదశ ఆరంభమైనది. ఆ సామ్రాజ్యపు పాలకులందును, ప్రజలందును చిరకాల శాంతియుత జీవితమువలన ఏర్పడిన భోగలాలసతకు జర్మానిక్ తెగలును, హూణులును సాగించిన దండయాత్రలు తోడై ఆ సామ్రాజ్యమును అంతము చేసినవి.

ఈ జర్మానిక్ తెగలవారు బాల్టిక్ సముద్రతీరప్రాంతపు అడవులందు తొలుత వసించెడివారు. వీరును ఆర్యజాతిలో ఒక శాఖకు చెందినవారు. తొలుత సంచార ప్రజలుగ ఉండి వ్యవసాయమనునది ఎరుగక, పశుపోషణనేముఖ్యవృత్తిగ ఇడుకొని చరించెడివారు. వీరు క్రమముగ ఉత్తర యూరప్‌న పలుప్రాంతములను ఆక్రమించి కడకు క్రీ. శ. 30 నాటికి రోమన్ సామ్రాజ్యపు ఉత్తరపు సరిహద్దుచెంత చేరగలిగిరి. తదాదిగ వీరి బెడదనుండి సామ్రాజ్యమును కాపాడుటకై రోమన్‌పాలకులు రైన్, డాన్యూబ్ నదీ ముఖద్వారముల మధ్య తమ సరిహద్దును దుర్గనిర్మాణాదుల వలన పరిరక్షితము చేయుటకు సదా శ్రద్ధవహించిరి. కాలక్రమమున సరిహద్దునకు చేరువనున్న జర్మన్‌జాతులవారు రోమన్‌ల పరిచితి వలన కొంత నాగరకతాస్థాయిని అందుకొనగలిగి, యుద్ధవ్యవహారములందు కుశలతను ఆర్జించిరి. దాదాపు నాలుగు శతాబ్దములపాటు ఇటుల జరిగినంతట క్రీ. శ. 375 లో ప్రాచ్య భూములనుండి హూణులు [చూ.] దండెత్తివచ్చి జర్మానిక్ తెగల భూములను ఆక్రమించి తరుమగ, గత్యంతరము లేక జర్మానిక్ తెగలు రోమన్ సామ్రాజ్యమున చొరబడినవి. వీరిలో కొన్ని తెగలవారు రోమన్‌సామ్రాట్ నామమాత్రపు అనుమతిని పొంది, అటనట కొన్ని మండలములందు స్థావరముల నెలకొల్పుకొనిరి; మరికొందరు అట్టి అనుమతి ఏదియు లేకుండగనే విశాలభూములను ఆక్రమించిరి. ఈ తెగలవారిని నిరోధించుటకుగాని, అదుపులో ఉంచుటకుగాని రోమన్‌సేనలు అసమర్థములై ఉండెను. కడకు హూణుల దండయాత్రల మూలమున రోమన్‌లు జర్మానిక్ తెగలతో సామరస్యము వహించి, వారి సాయమున హూణులను ఎదుర్కొనిరి. ఈ ఉభయజాతుల కృషి వలన హూణుల దండయాత్ర అరికట్టబడెను (క్రీ. శ. 453). కాని, ఇటుల జరుగుటకు దాదాపు నూరేండ్ల వ్యవధి పట్టెను. ఈ వ్యవధిలో హూణులు యూరప్‌ను అల్లకల్లోలితము చేసిరి. వారు కాలిడిన ప్రాంతము అంతయు సర్వనాశనము అయ్యెను. వారి నాయకులలో ముఖ్యముగ పేర్కొనతగినవాడు అత్తిల; ఈతని సర్వాధిపత్యమునకులోనై హూణమాండలిక ప్రభువులు యూరల్ పర్వతములు మొదలుకొని నేటి ఫ్రాన్స్‌వరకు కల విశాల ప్రాంతమున అధికారమును నిర్వహించిరి. రోమన్ ప్రభువులు ఆ నాడు సాలీనా కొంతపరిహారమును చెల్లించి, తమ స్వాతంత్ర్యమును కాపాడుకొనుటకు తొలుత అంగీకరించిరి. కాని, ఈ ఏర్పాటు భగ్నమైనంతనే గాల్ రాష్ట్రముపై అత్తిల దండయాత్ర సాగించి అందు పరాజితుడయ్యెను. అయినను అతడు ఊరకుండక ఇటలీలోనికి చొరబడి, రోమన్ సామ్రాజ్య మూలస్థావరమునకే ముప్పుతెచ్చెను. రోమ్‌నగరము సర్వనాశనము కాగలదన్న భయముతో అప్పటి క్రైస్తవమతాధిపతి [చూ. పోప్] లియో - I స్వయముగ అత్తిలను దర్శించి, అనునయవాక్యములచేతను, కానుకలవలనను సామరస్యమును సాధించి అతడు వెనుకకు మరలునటుల చేసెను.

హూణులను ఎదుర్కొను విషయమున రోమన్‌లతో జర్మానిక్ తెగలవారు సహకరించినను, ఈ సామరస్యము తక్కిన సందర్భములలో అతుకుల బొంతగనే ఉండినది. రోమన్ సైనిక దుర్బలత గుర్తెరిగిన జర్మానిక్ తెగల నాయకులు ఆ సామ్రాజ్యమును కైవస మొనర్చుకొనుటకు యత్నముల సల్పిరి. ఇటుల కృషిసల్పిన ఆ తెగలలో గాత్‌లు, వేండల్‌లు అను రెండు వేర్వేరు తెగలవారు రోమన్‌సామ్రాజ్య నిర్మూలనమున ప్రముఖపాత్రల నిర్వహించిరి. ఈ గాత్‌లలో విజిగాత్‌లు (పడమటి గాత్‌లు), ఆస్ట్రగాత్‌లు (తూర్పు గాత్‌లు) అను శాఖాభేదములు ఉండినవి. విజిగాత్‌ల నాయకుడగు అలరిక్ పశ్చిమ రోమన్ సామ్రాట్‌ను ధిక్కరించి గ్రీస్ మొదలగు ప్రాంతములను

ఆక్రమించి, క్రీ. శ. 401 లో ఇటలీపైకి దండెత్తెను. అదే సమయమున ఆస్ట్రొగాత్‌లును ఆ దేశముపైననే వేరొక వైపునుండి దండయాత్రల నడపిరి. కాని, ఆ కాలపు పశ్చిమరోమన్ సామ్రాట్‌నకు కుడిభుజముగ వేండల్ తెగకు చెందిన స్టిలిక్కో అను సేనాని ఉండెను. అతడు గాత్‌లను తిరుగగొట్టగలిగెను. కాని, అలరిక్ తన పట్టుదల వదలక మరలమరల దండయాత్రల నడపి, కడకు క్రీ. శ. 401 లో రోమ్‌నగరమును కైవసము చేసికొనెను. అప్పటికి వేయి ఏండ్లనుండియు పరాజయమును ఎరుగక సంపదలరాశిగ పేరొందిన ఆ మహానగరమును గాత్‌లు మూడుదినములు కొల్లగొట్టిరి. ఈ కాలముననే వేండల్‌లు రోమన్‌సామ్రాజ్యములోని స్పెయిన్‌ను వశపరచుకొని, అటనుండి విజిగాత్‌లచే తరుమబడి, ఉత్తర ఆఫ్రికాకు చేరి, అచటి రోమన్‌సామ్రాజ్య ప్రాంతములను వశపరచుకొనిరి (క్రీ.శ. 439). క్రీ. శ. 455 లో వేండల్‌ల నాయకుడు గైసెరిక్ రోమ్‌పై దండెత్తి వశపరచుకొని, ఆ నగరమును కొల్లగొట్టెను. క్రీ. శ. 449 నాటికి బ్రిటన్‌దీవి జర్మానిక్ తెగలకు చెందిన ఆంగ్లోశాగ్జన్‌లచే ఆక్రమితమయ్యెను. క్రీ. శ. 476 లో రోమ్యులస్ అగస్టస్ చక్రవర్తిని గాత్ నాయకుడు ఒడోసర్ పదభ్రష్టునిచేసి రోమ్‌ను ఆక్రమించుటతో పశ్చిమ సామ్రాజ్యము అంతరించినది అనియే భావింపదగును. కడకు తియోడోరిక్ అను ఆస్ట్రొగాత్ నాయకుడు ఇటలీని ఆక్రమించి రాజరికమును నెలకొల్పెను (క్రీ. శ. 493).

ఇటుల క్షీణదశపొందిన పశ్చిమసామ్రాజ్యమును పునరుద్ధరించుటకు ప్రాచ్య రోమన్‌సామ్రాట్ జస్టీనియన్ (క్రీ. శ. 527 - 565 ప) కొంత కృషిచేసి ఆస్ట్రొగాత్‌లను తరిమివైచెను (క్రీ. శ. 554). అనంతరమున ఇటలీయందలి రవెన్నా అను నగరము రాజధానిగ మారిస్ అనునతడు పశ్చిమసామ్రాజ్యమునకు చక్రవర్తి కాగలిగెను. కాని, ఆ సామ్రాజ్యము తన పూర్వపు శోభను సంతరించుకొనలేకపోయినది. పశ్చిమసామ్రాజ్య పతనకాలముననేయూరప్‌న ఫ్రాంక్‌లు అను వేరొక తెగవారు ప్రాముఖ్యమును గడించిరి. వీరును జర్మానిక్ తెగలలోని వారలే. తొలుత రోమన్‌ల సేనలో సైనికులుగ జీవించిన వీరు క్రమముగ సుసంఘటితులై క్లొవిస్ (క్రీ. శ. 481 - 511 ప) అను వాని నాయకత్వమున రైన్‌నది ఉభయతటముల భూమిని ఆక్రమించిరి. ఈ క్లొవిస్ క్రీ. శ. 496 లో క్రైస్తవమతమును స్వీకరించెను. అంతటనుండి రోమ్‌నందలి క్రైస్తవమత పీఠాధిపతు (పోప్) ల అండదండలును అతనికి లభించెను. అందువలన క్రైస్తవేతరులగు తక్కిన జర్మానిక్ తెగల ఆక్రమణలో ఉన్న ప్రాంతముల జయించుట అతనికి సులభమయ్యెను. క్రమముగ పిరనీజ్ పర్వతములకు ఉత్తరమున ఉన్న ప్రాంతమున అత్యధిక భాగము అతనికి అనతికాలమున వశమయ్యెను. క్లొవిస్ రాజును, అతని వంశీయులును నామమాత్రముగ పశ్చిమసామ్రాజ్యపు చక్రవర్తి ఆధిపత్యమును అంగీకరించిరి. క్రీ. శ. 568 లో పశ్చిమ సామ్రాట్ అధికారమును అంతమొందించి, ఇటలీలో అత్యధిక భాగమును లొంబార్డులు అను యోధజాతివారు ఆక్రమించిరి. రోమన్‌ల మతసంప్రదాయములను, పరిపాలనా విధానమును వీరు అనుసరించి క్రమముగ దేశీయులతో మిశ్రితమైరి.

పశ్చిమసామ్రాజ్యము ఇటుల క్షీణస్థితినిపొందిన కాలముననే వేరొకవిధముగ రోమ్‌నకు అధికతర ప్రాముఖ్యము కల్గుటకు క్రైస్తవమతము మూలకారణమైనది. క్రైస్తవమత పీఠాధిపతి (పోప్) ఆ నగరమున వసించుటవలన ఆ నగరము యూరప్‌పై తన ప్రభావమును నెరపగలిగినది. అట్టి ఆ కాలపు పోప్‌లలో ముఖ్యుడుగ పేర్కొనదగినవాడు గ్రెగరీ (క్రీ. శ. 590 - 604 ప). ఈతడు సమర్థుడు. క్రైస్తవ మతమునకు మానవ జీవితరంగమున అంతటను పశ్చిమ యూరప్‌న అతడు సర్వాధిపత్యమును చేకూర్చెను. బ్రిటన్‌లో క్రైస్తవమత వ్యాప్తికిని, గాల్, ఇటలీ, సిసిలీ దేశములలో క్రైస్తవేతర మతముల పలుకుబడిని అడచుటకును ఇతడు కృషిచేసెను. సమకాలీన ప్రాచ్యరోమన్ సామ్రాజ్యపు చక్రవర్తులు తమ రాజ్యములందు ఆధిపత్యము వహించిన రీతిగనే పశ్చిమ యూరప్‌న గ్రెగరీ - తన మతాధికార మూలమున - లౌకిక విషయములందును సర్వాధిపత్యమును నిర్వహింపగలిగెను.

పశ్చిమసామ్రాజ్యము ఇటుల క్రమముగ అంతరించుచుండిన కాలమున ప్రాచ్యరోమన్‌సామ్రాజ్యము మాత్రము హూణులు, స్లావ్‌లు మొదలగువారి దాడినుండి ఎట్టులో అతిశ్రమపై స్వరక్షణము చేసికొని దీర్ఘకాలము మనగలిగినది. ఈ ప్రాచ్య రోమన్‌సామ్రాజ్యమునకు బైజాంటైన్ సామ్రాజ్యము [చూ.] అనియు పర్యాయనామము కలదు. అత్యంత ప్రాచీనకాలమున మహావైభవమును అనుభవించి అంతరించిన బైజాంటియమ్ అను గ్రీక్‌నగరపు శిథిలావశేషములపై ఈ సామ్రాజ్యపు ముఖ్యనగరమగు కాన్‌స్టాంటినోపుల్ నిర్మింపబడుటవలన ఆ పేరు దీనికి కలిగినది. పేరునకు ఇది రోమన్‌సామ్రాజ్యమే అయినను, యథార్థమున రోమన్, గ్రీక్ సంస్కృతులు రెండును ఆదరింపబడి, అందు రెండవదానికే ఇందు ఎక్కువ ప్రాముఖ్యము కలిగినది. తూర్పు మధ్యధరాసముద్ర

తీరప్రాంతములకు మాత్రమే ఈ సామ్రాజ్యాధికారము విస్తృతమై, అందలి ప్రజలలో గ్రీక్ భాషా సంస్కృతులకే ఎక్కువ ప్రచారము ఉండుటవలన ఈ సామ్రాజ్యపాలకులు గ్రీక్ సంస్కృతిపై ఎక్కువ మక్కువ చూపవలసివచ్చినది. అటులని వారు రోమన్ సంప్రదాయములలో అత్యుత్తమములగు వానిని విడనాడలేదు. ఈ సామ్రాజ్యపాలకులలో ప్రముఖుడుగ పరిగణింపబడు జస్టీనియన్ కాలమున రోమన్ న్యాయసంహితకు సువ్యవస్థితరూపము కల్పింపబడినది. ఆ సంహితయే తరువాత యూరప్ దేశములందును, ఆ దేశముల సంస్కృతి వ్యాపించిన పలుతావులందును ఆదరణను ఆర్జించి, వివిధదేశముల న్యాయసంహితలకు మాతృక అయినది. న్యాయసంహిత నిర్మాతగనే కాక మహా యోధుడుగ సైతము జస్టీనియన్ ఖ్యాతిని ఆర్జించెను. అతడు ప్రాచీన రోమన్‌సామ్రాజ్యమును పునరుద్ధరించుటకై కృషిచేయుటయు, అందు విఫలుడగుటయు ఇదివరలో ప్రసక్తింపబడినది. తూర్పున తన సామ్రాజ్యమునకు పొరుగున ఉన్న ససానియన్ సామ్రాట్‌లతోడను, ఉత్తరము నుండి వచ్చి పడుచుండిన అవరులు అను హూణజాతీయులతోడను, ఆర్యజాతీయులగు స్లావ్‌లతోడను నిరంతరము ఆత్మరక్షణకై ఇతడు యుద్ధములు సాగింపవలసి వచ్చుట పశ్చిమమున రోమన్‌సామ్రాజ్య పునరుద్ధరణ కృషియందు అతడు విఫలత చెందుటకు ముఖ్యకారణము అయ్యెను. ససానియన్‌లతో ఆ ప్రభువుకాలమున మొదలిడబడిన యుద్ధము అతి దీర్ఘకాలము, అతని అనంతరమున సైతము, సాగి నినేవేవద్ద పారసీకులు ఘోరపరాజయము పొందుటతో అంతమైనది (క్రీ. శ. 627).

## ఇస్లామ్ అవతరణము

ఇటుల 7వ శతాబ్ది ప్రథమపాదాంతమునకు ప్రపంచమున తమ ప్రభావము నెరపుచుండిన సామ్రాజ్యములు నాలుగు మాత్రమే మనగలిగినవి. ఇవియే చీనా, బైజాంటైన్, ససానియన్, హర్ష సామ్రాజ్యములు. పశ్చిమ యూరప్‌నందు రోమన్ సామ్రాజ్యము అంతరించినను, దాని స్థానమున నెలకొనిన జర్మానిక్ జాతుల రాజ్యములు గ్రీక్ - రోమన్ సంప్రదాయములను కొనసాగించుచుండినవి. మధ్య ఆసియా, ఆగ్నేయ ఆసియా, సింహళ దేశములు భారతసంస్కృతికి లోనైనవి. ఇట్టి పరిస్థితులను స్థూలదృష్టితో గమనించగలిగిన జిజ్ఞాసువు ఆనాడు ఒకడు ఉండియుండునేని చారిత్రకగతిని మరుసటి ఘట్టమునకు కొనిపోవు నూతన శక్తులు ఏవియైనను ఈ చీనా, రోమన్, పారసీక, భారత సంస్కృతులు నెలకొనిన ప్రాంతములనుండియే బయలుదేరగలవని నిశ్చయముగ అతడు భావించి ఉండును. కాని, మానవజాతి చరిత్రను నడపించు సునిశిత శక్తులు అంత సులభముగ స్థూలదృష్టిచే చేయు నిర్ణయముల వలన గ్రహింప వీలగునవి కావను విషయమును కాలపురుషుడు అపుడు రుజువు చేసెను. పైన తెలుపబడిన సామ్రాజ్యములలో దేని పలుకుబడియు పరిగణనీయమగు రీతిగ వ్యాపింపని ఒక మారుమూల ప్రదేశమునుండి ఒక నూతనశక్తి ఉద్భవించి చరిత్రగతిని అంతట నూత్నమార్గమును పట్టించినది. ఇదియే అరేబియానుండి వెలువడిన ఇస్లామిక మత విజృంభణము. నూతన మతోత్సాహపూరితులగు అరబ్బుల ధాటికి ససానియన్ సామ్రాజ్యము ఒక్కపెట్టున కూలిపోయి (641) అనంతరకాలమున అట్లాంటిక్ మహాసముద్రము మొదలుకొని భారత, చీనా దేశములవరకు ఇస్లామ్ సంస్కృతి వ్యాపించుటకు మార్గము సుగమము చేసినది. ఈ అరబ్బుల విజృంభణముతో భావ వికసన యుగము అంతరించి మత రాజ్యయుగము అవతరించినది.

## కళా కౌశలములు

క్రీ. పూ. 525 మొదలుగ దాదాపు 12 శతాబ్దులకాలపు విస్తృతి వహించిన ఈ భావ వికసన యుగమున తొమ్మిది సామ్రాజ్యములు ప్రపంచమున అవతరించి మానవ సాంఘిక జీవితముపై వివిధరంగములందు జరిగిన పరిణామములకు దోహదకారులై, మని, అంతరించినవి. కాని, వీని అన్నింట ఒక సామాన్యలక్షణము కన్పించుచున్నది. ప్రాచీనయుగమున మానవునియందు బీజప్రాయముగ రూపొందిన కళా, వైజ్ఞానిక, ధార్మిక భావనలకు వికసనవ్యాప్తులను కలిగించుటకు మాత్రమే ఇవి కృషిచేయుటను ఈ సామాన్య లక్షణముగ పేర్కొనవచ్చును. అటులని ఈ భావ వికసన యుగపు మానవునియందు సృజనశక్తియు, మౌలికతయు సన్నగిల్లినవని అనజాలము. ప్రాచీన యుగమున బీజప్రాయముగ ఉన్న భావములకు అతడు ఒక నూతన రూపమును, దృఢతను సమకూర్చెను.

శాస్త్రవిజ్ఞాన ప్రగతి : బాబిలోనియన్‌లనుండియు, ఈజిప్టువాసులనుండియు గ్రీక్‌లు గ్రహించిన గణిత, ఖగోళ శాస్త్రముల విషయములను ఇందులకు లక్ష్యములుగ మనము తీసికొనవచ్చును. బాబిలోనియన్‌లు ఖగోళ శాస్త్రమున కృషిచేసినను, వారు దానియందు జాతక, ముహూర్త భాగములకే ప్రాధాన్యము ఇచ్చి, వైజ్ఞానిక విషయములకు ఎక్కువ విలువను ఈయకుండిరి; గ్రీక్ పండితులు జ్యోతిశ్శాస్త్రమున సిద్ధాంతభాగమునకు ఎక్కువ

ప్రాముఖ్యము ఇచ్చి, ఆ శాస్త్ర వికసనమునకు అవకాశము కల్పించిరి. జ్యామితి (క్షేత్రగణితమును) ని గ్రీకులు ఈజిప్టునుండి గ్రహించినను, దానికి శాస్త్రరూపమును కల్పించుటలో వారు అనన్యమగు కృషి చేసిరి. అట్టి కృషి చేసినవారిలో యూక్లిడ్ (ర. క్రీ. పూ. 300) చారిత్రక ఖ్యాతిని ఆర్జించినవాడు. నిగమనరీతిలో జ్యామితి సిద్ధాంతములకు ఉపపత్తిని సాధించి, అతడు గణితశాస్త్ర చరిత్రయందు ఒక నూతనాధ్యాయమునకు శ్రీకారము చుట్టెను. కాని, అంకగణితమున గ్రీకులు తగినంతగ పురోగమింపలేకపోయిరి. అంకెలను తమ వర్ణమాల యందలి అక్షరములవలన మాత్రమే వారు సూచించు చుండిరి. అందువలన సంకలన, వ్యవకలన, గుణకార, భాగహారాది గణిత పరికర్మలు సామాన్యులకు సుసాధ్యములు కాకుండెను. ఈ అంకగణిత విషయమున తక్కిన సమకాలికజాతులకన్న భారతీయులు ఎక్కువగ ముందునకు పోగలిగిరి. అక్షరములవలన సంఖ్యాగణనముచేయుట వారియందును తొలుత వ్యాప్తిలో ఉండినను, కాలక్రమమున సంఖ్యలను ప్రత్యేక సంజ్ఞలచే సూచించుటను వారు క్రీస్తుశకారంభకాలమునకు చాలపూర్వముననే నేర్చిరి. శూన్యమునకు 'O' అను ఒక సంజ్ఞను ఏర్పరచి తన్మూలమున అంకెలకు స్థానపువిలువను కల్పించినదియు ఈ యుగపు భారతీయ పండితులే. భారతదేశమున జ్యామితి సైతము ఈ కాలమున కొంత అభివృద్ధిచెందినను, గ్రీక్ పండితులు దానికి చేకూర్చినస్థాయిని అది అందుకొనలేక పోయినది. సంప్రదాయముగ భారతదేశమున అభివృద్ధిచెందిన గణితశాస్త్రపు స్వరూపము ఆర్యభటుని (క్రీ. శ. 476 జ.) గ్రంథము వలన తెలియనగుచున్నది. ఈ గ్రంథమున గణితము, కాలక్రియ, గోళము అను మూడుపాదములు కలవు. ఇందు తొలుతటిది అంకగణితమును, రెండవది గ్రహగతులను, మూడవది ఖగోళ కల్పనాదికములతో కూడిన యంత్రనిర్మాణములను వివరించును. గ్రీక్ పండితులు ఆవిష్కరించి ఉండిన జ్యోతిశ్శాస్త్ర సిద్ధాంతములతో ఇతనికి పరిచితి ఉండెనని కొందరి భావన. భూభ్రమణ విధానమును ఇతడు ఆదరించినను గ్రీక్ పండితులవలెనే జ్యోతిర్గణితమున భూకేంద్ర విధానమునే అవలంబించెను. ఈ భూకేంద్ర విధానమునకు ఒక సుస్థిరరూపమును కల్పించినవాడు టాలెమీ (క్రీ. శ. 2 వ శతాబ్దము) అను గ్రీక్ పండితుడు. తక్కిన గ్రహాదులు భూమిచుట్టును కొన్ని నియమములను అనుసరించి పరిభ్రమించునను ఊహపై ఈ గణితము ఆధారపడి ఉండినది. అయినను గ్రీక్ పండితులలోను, భారతీయ పండితులలోను పలువురు ఆ యుగముననే సూర్యునిచుట్టును గ్రహములు పరిభ్రమించునని విశ్వసించుటకు అవకాశములు కలవనియే తలంచిరి. జ్యోతిశ్శాస్త్రపు అభివృద్ధి వలన సౌరసంవత్సరపు విస్తృతి 365¼ దినములను నిర్ణయము ఆకాలముననే జరిగినది. తదనుగుణమగు కాలపరిగణన తొలుత క్రీ. పూ. 238 లో ఈజిప్టున అమలులోనికి తేబడినది. గ్రీక్ పండితులు సాధించిన జ్యోతిశ్శాస్త్రాభివృద్ధి ఆ యుగపు భారతీయపండితులకు సుపరిచిత మనుట వరాహమిహిరుని (క్రీ. శ. 6 వ శతాబ్ది) వ్రాతల వలన తెలియవచ్చుచున్నది. ఈతడు వివరించిన అయిదు జ్యోతిస్సిద్ధాంతములలో మూడు సిద్ధాంతములు గ్రీక్ పండితులచే ప్రతిపాదింప బడినవియే అని విజ్ఞుల అభిప్రాయము.

నౌకా వాణిజ్యము: జ్యోతిశ్శాస్త్రపు అభివృద్ధి వలన దూరదేశములకు నౌకాయానము చేయుట సులభతరమై, తత్ఫలితముగ నూతన విషయములు అనేకములు కనుగొనబడినవి. పిథియస్ అను గ్రీక్ పండితుడు ఉత్తర యూరప్ భూముల ఉనికిని కనుగొని, ఉత్తరమునకు పోవుకొలది ధ్రువనక్షత్రము పైపైకి ఒక నిర్ణీతక్రమమును అనుసరించి పోవుచుండుట గమనించెను. సాహసికులగు నావికులు ఆ కాలమున నక్షత్రముల ఉనికినిబట్టి దూరదేశములకు పయనింప నేర్చిరి. అట్టి వారిలో భారతీయ నావికులు - క్రీ. పూ. రెండవ శతాబ్దియందే - తక్కిన వారిని మించి ప్రశస్తిని ఆర్జించిరి. క్రీ. పూ. 145 నుండి 116 వరకు ఈజిప్టును పాలించిన యూర్గితస్ - II కాలమున అరేబియా సింధుశాఖతీరమున శల్యావశిష్టుడై తన ఓడతో పాటుగ ఒడ్డునకు చేరిన భారతీయనావికుని ఒకనిని తీర రక్షకులు తమ ప్రభువువద్దకు చేర్చిరనియు, అతడు రాజు సహాయముచే తిరిగి ఆరోగ్యమునుపొంది, గ్రీక్ భాషను అభ్యసించి, భారతదేశ తీరమున తాను ఎటనుండి ఎటుల నౌకాయాత్ర చేసినదియు, దారితప్పి ఎటుల ఈజిప్టు తీరమును చేరినదియు వివరముగ తెలిపి, సాహసికులు ఎవరైన తనతోపాటు ఓడలో రాగలుగుదురేని వారికి భారతదేశమును సముద్రమార్గమున చేరుత్రోవను చూపెదనని చెప్పగ, రాజు వానితో కొందరిని పంపెనని ప్రాచీన చారిత్రకుల వ్రాతలవలన తెలియుచున్నది. అటుల పంపబడినవారిలో ఒకడగు యుడాక్షస్ అమూల్య సుగంధ ద్రవ్యములతోడను, రత్నములతోడను ఈజిప్టునకు తిరిగి చేరెను. ఇట్టి నౌకాయానసందర్భమున కొందరు భారతీయ నావికులు దారితప్పి జర్మనీతీరమును సైతము చేరిరని రోమన్ చరిత్ర వలన తెలియవచ్చుచున్నది.

ఇట్టి విదేశవ్యాపారమును ఆనాటి రాజులును ప్రోత్సహించిరి. నౌకానిర్మాణ విషయమున రాజులే కొన్ని

యెడల చౌరవతీసికొని నిర్మింపజేసెడివారు. మౌర్య ప్రభుత్వము తాము నిర్మింపజేసిన నౌకలను వ్యాపారులకు అద్దెకిచ్చెడిది. నౌకానిర్మాణమున అభ్యాసవశమున ఈ కాలపువారు కొంత కుశలతను ఆర్జింపగలిగిరి. నౌక నడపుటకు తెడ్డులేకాక తెరచాపలను క్రమరీతిలో వినియోగింపబడినవి. సుమారు 250 మెట్రిక్ టన్నుల సరకును కొనిపోగల పెద్ద నౌకలును ఆ యుగమున నిర్మితములైనవి. రాజులకు ఆకాలమున భూములనుండి వచ్చు పన్ను మొదలగునవియే ముఖ్యములగు ఆదాయమార్గములైనను, ఎగుమతి దిగుమతుల వలన వచ్చు సుంకముకూడ ఒక గణనీయమగు ఆదాయమార్గముగ ఉండినది. విదేశీయ వ్యాపారులకు వసతులను చేకూర్చి విదేశ వ్యాపారమును ప్రోత్సహించుటను ఆనాటి వివిధదేశముల రాజులును తమ ముఖ్యవిధానముగ అవలంబించిరి. పాటలీపుత్రమున ఇట్టి వ్యాపార పరిరక్షణమునకు ఒక పంచాయతీ సంఘము ఉండెడిదని మెగస్తనిస్ వ్రాతలవలన తెలియవచ్చుచున్నది. క్రీ. శ. ఒకటవ శతాబ్దిలో హిప్పాలస్ అను నావికుడు ఋతుపవనముల గమనమును అనుసరించి పయనించుతీరును కనుగొనిన తరువాత యూరప్ ఖండముతో భారతదేశము జరుపు వ్యాపారమునకు ఉపయోగించిన నౌకలు తీరమునంటి పయనించుటకు బదులుగ సముద్రములపై సూటిదారిన నడువ నేర్చినవి. చీనా-భారతదేశముల మధ్యను, దూరప్రాచ్య రోమన్ సామ్రాజ్యముల మధ్యను కూడ ఆ కాలమున నౌకావ్యాపారము సాగినది. అరుణసముద్రయాత్ర (పెరిప్లస్ మారిస్ ఎరిత్రే) అను అర్థమొసగు పేరు కలిగి, రోమన్ స్వర్ణయుగ కాలమున దాదాపు క్రీ. శ. ద్వితీయ శతాబ్దిలో ఒక రోమన్ సామ్రాజ్య పౌరునిచే రచింపబడినదిగ భావింపబడుచు నేటికిని ఉపలబ్ధమగుచున్న ఒక గ్రంథమువలన ఆనాడు రోమన్‌సామ్రాజ్యపు నౌకా వ్యాపారులకు ఎర్ర సముద్రము, పారసీక సింధుశాఖ, భారతదేశపు పశ్చిమ తీరము, ఆఫ్రికా తూర్పుతీరములలో పరిచితములై ఉండిన రేవుపట్టణములు, అచట లభ్యములగు సరకులు మాత్రమే కాక మెట్టదారిన జరుగు వ్యాపారమునకు ఉపకరించిన మార్గముల వివరములును తెలియనగుచున్నవి. ఆనాడు ఇటుల ప్రాచ్య పశ్చిమదేశముల మధ్య జరిగిన వ్యాపారమున ఎక్కువ గిరాకీ కలిగినవానిలో బానిసలు, గుర్రములు, దంతము, దూది, కొమ్ములు, పగడములు, లక్కవస్తువులు, ముత్యములు, వనస్పతి ద్రవ్యములు, కలప, బంగారము, వెండి, తగరము, సీసము, ఇత్తడి, ఇనుము, ఇనుప వస్తువులు, రాగి, వజ్రములు, రత్నములు, ముతక రకపుగాజు, పట్టుదారము, జవుళీసరకులు ముఖ్యముగ పేర్కొనదగినవి. భారతదేశము ఆనాడు విదేశములకు ఎగుమతి చేసినవానిలో జవుళీసరకులును, సుగంధ ద్రవ్యములును క్రమముగ ప్రాముఖ్యమును వహించినవి. ప్రాచ్య భారతమునుండి ఎగుమతియగు సన్నని వస్త్రములపై సంపన్నులగు రోమన్‌లు ఎక్కువ మక్కువ చూపెడివారు. ఈ వస్త్రముల కొనుగోలునకై భారతదేశమునకు బంగారు నాణెముల రూపమున తరలింపబడు ధనరాశిని గురించి ప్లినీ అను సమకాలిక రచయిత విచారమును వెలువరించినాడు. భారతదేశము పశ్చిమదేశములనుండి దిగుమతి చేసికొనువానిలో బంగారు నాణెములు, వెండి-బంగారముల వస్తువులు, ద్రాక్షసారాయము, రాజాస్థానములందు పరిచర్యకు పనికివచ్చు బాలురు, చక్కని దాసీజనము ముఖ్యముగ పేర్కొనదగినవి. మెట్టమార్గములందును ఆ కాలమున విరివిగ వ్యాపారము సాగినది. దూరప్రాచ్యమున ఉన్న చీనానుండి మెట్టమార్గముల పట్టుదారము, పట్టుసరకులు రోమ్‌నకు చేరెడివి. అటులనే దక్షిణభారతమునుండియు సార్థవాహులు మసాలాద్రవ్యములను రోమ్‌నకు చేర్చెడివారు. ఈ మెట్టదారులకు సువ్యవస్థిత రూపములను ఏర్పరచుటకు ప్రాచీన పారసీకరాజులును, అశోకుడును, రోమన్‌లును శ్రద్ధ వహించిరి. అశోకుడు ఉత్తరభారతదేశమున ప్రాక్పశ్చిమముల సంధించు ఒక రాజపథముతో పాటుగ, వేర్వేరు ప్రముఖపట్టణములను కలుపు మార్గములను సైతము నిర్మింపజేసి, ప్రక్కన నీడనొసగు వృక్షములను, పట్టణముల దూరములను తెలుపు అంకెల ఫలకములను, అచ్చటచ్చట యాత్రికుల విశ్రాంతికి అనువుగ వసతులను ఏర్పరచెను. రోమన్ సామ్రాజ్యమునందు ప్రభుత్వము నిర్మింపజేసిన రోడ్లనిడివి మొత్తము దాదాపు ఒకలక్ష కిలోమీటరుల వరకు ఉండినదని తెలియవచ్చుచున్నది. చీనాయందు ఇటుల రోడ్లుకాకుండ షిహ్‌వ్యాంగ్-టీ కాలమున బండిచక్రములు సులభముగ నడచుటకు అనువగు లేదెములు నిర్మింపబడినవి. అందువలననే ఆ సార్వభౌముడు తన సామ్రాజ్యమునందలి శకటముల ఇరుసులకు ఒక నిర్దిష్టమగు ప్రమాణమును నిర్ణయించుచు ఒక శాసనము చేసెను.

**నాణెముల ఆవిర్భావము :** పైన పేర్కొనిన విధానమున రహదారులవలన వ్యాపారము విరివిగ సాగుటతో నాణెముల ఆవశ్యకత పెచ్చుపెరిగినది. ప్రాచీనయుగమున అన్ని నాగరక ప్రాంతములందును ఏదియో ఒక విధముగ అమూల్య ధాతువులు వినిమయ సాధనములుగ ఉండి, ఆ యుగాంతమున లిడియాయందు నాణెముల రూపమును

ఆర్జించెనని ఇదివరలో తెలుపబడినది [చూ. పు. 21]. ఈ యుగమున ప్రాచీన పారసీకరాజులు లిడియాను ఆక్రమించిన తరువాత నాణెములను వారు విరివిగ వాడుకలోనికి తెచ్చిరి. దుర్యాష - I చక్రవర్తి 'దరిక' అని వ్యవహృతమైన బంగారు నాణెమును అమలులోనికి తెచ్చెను. దీని తూకము 8·41 గ్రాములు. గ్రీస్‌లో క్రీ. పూ. 500 ప్రాంతముననూ, రోమ్‌లో క్రీ. పూ. 338 లోను ముద్రితమలగు నాణెములు అమలులోనికి వచ్చినవి. భారతదేశమున మౌర్యుల పరిపాలనా కాలమునకు పూర్వముననే నిష్కములు అను సువర్ణ ఖండములు వినిమయసాధనములుగ వ్యాప్తిలో ఉండినవి. కాని, ఇవి అచ్చమగు నాణెములుగ పరిగణింపదగినవి కావు. క్రీ. పూ. రెండవ శతాబ్దికి దరిదాపుల రూపొందినదిగ భావింపబడు మానవధర్మశాస్త్రము (మనుస్మృతి) లో పురాణము లేదా ధరణ అను పేర వ్యవహరింపబడి ముప్పదిరెండు రతుల (58·56 గ్రాముల) తూకముగల వెండి నాణెము ప్రసక్తింపబడినది. అట్టులే ఆ కాలమున 'కార్షాపణ' అను పేరు కలిగి 80 రతుల (164·6 గ్రా.) తూకముగల రాగి నాణెముకూడ అమలులో ఉండినది. ఈ కార్షాపణమను పేరు దక్షిణభారత దేశమున కొన్ని వెండి, బంగారు నాణెములకును వాడబడినది. కాకణి అను పేరుతో చిల్లర నాణెములు, రాగితో చేయబడినవియు వ్యాప్తి కలిగి ఉండెడివి. సమానపు తూకముగల బంగారు, వెండి నాణెముల విలువల మధ్య నిష్పత్తి ఆనాటి నాగరక ప్రపంచమున దాదాపు ఒకటికి పది చొప్పున ఉండెడిది. నాణెముల ముద్రణ, ప్రచారము విరివిగ సాగుటతో పెట్టుబడికి అవకాశము ఏర్పడెను. క్రీ. పూ. 4 వ శతాబ్దికి పూర్వమున జీవించి ఉండెనని అందరిచే అంగీకరింపబడు పాణిని తన అష్టాధ్యాయి అను గ్రంథమున వర్తకాదులందు వాడుకలో ఉండు పదములను ఇచ్చుచు, ధనమును పెట్టుబడి పెట్టువారిని, ఆ ధనమును ఉపయోగించి వస్తువులను కొని వ్యాపారము చేయువారిని వేరువేరుగ పేర్కొనెను. ఇందువలన ఒక విధమగు పెట్టుబడిదారీవర్గము ఆ ప్రాచీన కాలముననే నాగరక ప్రపంచమున రూపొందుటకు అవకాశము కలిగెనని భావింపవచ్చును. ఈ వర్గమువారే క్రమముగ ఒక విధమగు ద్రవ్యవినిమయకులుగ ఉపయోగపడిరి. క్రీ. శ. నాలుగవ శతాబ్దికి ఇట్టి వారు ప్రపంచ ప్రసిద్ధములగు నగరములందును, రేవుపట్టణములందును వ్యవస్థితరీతిలో హుండీలు, బరాతము మొదలగువాని రూపమున వ్యాపారమునకు తోడ్పడిరి. కొన్ని ఎడల వస్తువుల ఉత్పత్తికి తగినటులకాకుండ అధికముగ నాణెములు చెలామణిలోనికి వచ్చుటవలన ద్రవ్యోల్బణము ఏర్పడి, ధరలు పెరిగి, క్లిష్టపరిస్థితులు సంఘటిల్లుటయు జరిగెడిది. క్రీ. శ. 65 లో రోమ్‌నగరము ఇట్టి దురవస్థకు లోనైనది.

పరిశ్రమలు : స్థానికావసరములకును, ఎగుమతికిని కూడ వస్తూత్పత్తి ఆ కాలమున సాధారణముగ కుటీర పరిశ్రమగనే జరిగెడిది. అట్టిది సాధ్యముకాని ఖనిజ సాధన మొదలగునవి కొన్ని వ్యాపారసంఘముల పెట్టుబడి మూలమున జరుపబడెడివి. ఒకే ఒక వృత్తిచే జీవించువారు ఒక శ్రేణిగ ఏర్పడి పనిచేయుటయు ఆ యుగముననే ఆరంభమైనది. ఇట్టి శ్రేణులు భారతదేశమున కుల వ్యవస్థను అనుసరించి చాలవరకు ఏర్పడెడివి. వీనిలో కొన్ని వ్యాపార సంఘములుగ నిగమములను పేరున వర్తించి చాల సంపన్నములై ఉండి, ప్రజలు తమ ధనమును నిల్వ ఉంచుకొని, కావలసినపుడు వడ్డీతో కూడ గ్రహించుటకు నేటి బ్యాంక్‌లవలె ఉపకరించెడివి. క్రీ. శ. ఒకటవ శతాబ్దమున ఒక శకరాజు ఒక నిగమమునకు ఇటుల ధనమిచ్చి, దాని ఆదాయమును ఒక ధర్మకార్యమునకు ఇచ్చుటకు కట్టడి చేసెను. సాతవాహన కాలపు శాసనములందు నేత పనివారు, ఇత్తడి పనివారు, తేలీలు, వెదురు పనివారు, ధాన్య వర్తకులు, జలయంత్ర నిర్మాతలు స్థాపించుకొనిన ఆయా శ్రేణుల ప్రసక్తి కలదు. సమకాలిక నాగరకప్రపంచమునందు అంతటను ఆనాడు ఇట్టి శ్రేణులే పని చేసినవి.

ఆనాటి భారీపరిశ్రమలలో ముఖ్యముగ పేర్కొనదగినది ఖనిజసాధన. భోగలాలసత హెచ్చుపెరిగి, రత్నములు, వజ్రములు వంటి అమూల్య ధాతువుల వాడుక అతిశయిల్లి ఈ పరిశ్రమకు ప్రోత్సాహము చేకూర్చెను. ఈ యుగమున ఖనిజములను శుద్ధిచేయు మార్గములు కనిపెట్టబడినవి. ఢిల్లీయందు నేటికిని కననగు ఇనుపస్తంభము ఈ యుగమునకు చెందినదియే. దాదాపు రెండువేల సంవత్సరముల పైకాలమునుండి శీతాతపవర్షములకు గురియైనను త్రుప్పు పట్టక ఉన్న ఆ స్తంభము ఆ యుగమున ధాతువిద్యలో ప్రాచీనులు సాధించిన ప్రగతికి ఒక నిదర్శనము. ఈజిప్టునకు దక్షిణముననుండి ఆ దేశపు నాగరకతా సంపత్తిని కొంతవరకు స్వీయముచేసికొని ప్రాముఖ్యమును ఆర్జించిన కుష్ రాజ్యమందు (నేటి సుడాన్‌నందు) మేరో నగర ప్రాంతమున నేడు కననగు ఇనుపచిట్టెపు రాశులు ఆ యుగమున అచటి ఇనుప పనివారు ఖనిజ సాధనకై చేసిన మహత్తర కృషిని మన గురుతునకు తెచ్చుచున్నవి. సైస్ అను అన్వేషకుడు ఈ విషయమై వ్రాయుచు మేరో నగర

ప్రాంతమున కొండలవలె వ్యాపించి ఉన్న ఈ చిట్టెపు రాశులను త్రవ్వి చూడగ ఇనుమును కరగించుటకు ఆ ప్రాచీనులు ఉపయోగించిన కొలుములు వెలువడినవని తెలిపెను.

విద్య : విద్యాభివృద్ధియు ఆనాడు విరివిగ జరిగినది. ఈ యుగారంభమున ఈజిప్షియన్, గ్రీక్, ఫొనీషియన్, పారసీక, చీనీయ, సంస్కృత భాషలకే ఎక్కువ వ్యాప్తి ఆ యా ప్రదేశములందు ఉండినది. కాని, క్రీ. పూ. 3 వ శతాబ్దికి తక్కినవానికి ప్రాచుర్యము క్షీణించి ఇందు గ్రీక్, సంస్కృత, చీనీయ భాషలకే ప్రాముఖ్యము లభించినది. ఈజిప్టు మొదలుకొని సింధునది తటమువరకును గ్రీక్ భాషా సంస్కృతులు ఆ కాలము మొదలుగ ససానియన్ రాజ్యారంభము వరకు తమ ప్రభావమును నెరపినవి. కాని, పశ్చిమమున రోమన్ రాజ్యము ప్రశస్తి వహించిన తరువాత (దాదాపు క్రీస్తు శకారంభము) నుండియు లాటిన్ భాష గ్రీస్‌నకు పశ్చిమమున ఉన్న తక్కిన యూరప్‌నకు ముందునకు రాగలిగినది. భారతదేశమున గీర్వాణ (సంస్కృత) భాష ఈ యుగమున పై తరగతుల వారివరకు మాత్రమే వ్యాప్తి కలిగి ఉండినది. ఈ ప్రాచీనభాషకు విపులవ్యాప్తివలన చేకూరిన విభిన్నతల సమన్వయముచేసి, సంస్కరించుటచే ఆ కాలముననే ఆ భాషకు సంస్కృతము అను పేరు సిద్ధించినది. సామాన్య ప్రజలందు తద్భవములగు పాళీ మొదలగు ప్రాకృతభాషలు విరివిగ వాప్తిలోనికి వచ్చి, అందు కొన్ని సాహిత్యరూపములను కూడ పొందగలిగినవి. దక్షిణ భారతదేశమున తమిళ భాషయు ఈ యుగమున సంస్కృత, ప్రాకృతభాషల ప్రభావమునకు లోనైనది.

ఆనాటి లిపులలో గ్రీక్, అరామిక్, బ్రాహ్మి, ఖరోష్ఠి, చీనీయ లిపులు విపుల వ్యాప్తిని పొందగలిగినవి. లాటిన్ భాష కొలది మార్పులతో గ్రీక్ లిపినే స్వీకరించినది. కీల లిపి ప్రాచీన పారసీక రాజ్యకాలమున కొంతవరకు వ్యాప్తియందు ఉండినను క్రమముగ లుప్తమైనది.

భాష, దాని ఉత్పత్తి, స్వరూపము మొదలగు వానిని గురించి తెలిసికొనుటకు ప్రాచీనులలో గ్రీకులును, భారతీయులును కృషిచేసిరి. అందు భారతీయులు గ్రీకులవలె గాక, శాస్త్రీయమార్గములను అవలంబించి సత్ఫలితముల సాధించిరి. యాస్కుడు మొదలగు పూర్వులు ఈ విషయమున మొదలిడిన కృషిని పాణిని (చూ. సం. 6 పు. 732) పరాకాష్ఠకు కొనిపోయెను. ధాతువుల నుండి పదములు రూపొందురీతిని తెలియజేయుచు, అష్టాధ్యాయి అను గ్రంథమును ఇతడు రచించెను. ఈ పాణిని కాలమును గురించి అభిప్రాయభేదములు ఉన్నను, క్రీ. పూ. నాలుగవ శతాబ్దికి ఈవలివాడు కాడను విషయమున మాత్రము సంశయము లేదు. ఈతని గ్రంథము సూత్రరూపమున ఉన్నది. సూత్రము అనునది అనల్పార్థమును అల్పాక్షరములతో బోధించుటకు అనువుగ భారతీయ పండితులు రూపొందించిన ఒక సంవిధానము. అష్టాధ్యాయిలోని సూత్రార్థముల విపులీకరించుచు కాత్యాయనుడు (వరరుచి) వార్తికములను, పతంజలి (ర. క్రీ. పూ. రెండవ శతాబ్ది) మహాభాష్యమును క్రమముగ రచించిరి. వర్ణోచ్చారణా, భాషాస్వరూప, పదవృత్తుల వివరించు శిక్షా, వ్యాకరణ, నిరుక్తములను వేదాంగములుగ పరిగణించుట వైదికార్యులకు ఈ శాస్త్రవిభాగమునెడ ఉన్న ఆదరాభిమానములకు నిదర్శనము.

సాహిత్యము : సంస్కృత సాహిత్యము ఈ యుగపు తొలుతటి భాగమున ఎక్కువగ అభివృద్ధి చెందినటుల కన్పట్టదు. కాని, సంస్కృతమున ప్రథమేతిహాసము, ఆది కావ్యము అని కీర్తింపబడు 'రామాయణము' క్రీ. పూ. రెండవ శతాబ్ది ప్రాంతముననే రూపొంది ఉండునని తద్‌జ్ఞుల భావన. దాని తరువాత 'పంచమవేదము' అని ప్రసిద్ధిచెందిన ఇతిహాసము 'మహాభారతము' సంగ్రథితమయినది. ఈ రెండు గ్రంథములకును క్రమముగ వాల్మీకి, వ్యాసుడు (కృష్ణద్వైపాయనుడు) రచయితలుగ పేర్కొనబడుచున్నారు. కాని, ఇవి - అందును ముఖ్యముగ మహాభారతము-సంప్రదాయముగ వచ్చు కొన్ని చారిత్రక అంశములను ఊతగగొని పలువురు రచయితలు రచించిన వివిధ ఘట్టముల సంకలితరూపములని కొందరి అభిప్రాయము. ఇట్టి ఇతిహాసకావ్యములు సంస్కృతముననే కాదు, గ్రీక్ భాషయందును వెలసినవి. ఇలియడ్, ఒడిస్సీ అను పేరులు గల గ్రీక్ ఇతిహాసకావ్యములను హోమర్ కవి రచించెను. హోమర్ అను కవి చారిత్రకముగ ఉండెనా అను విషయము సంశయాస్పదము. క్రీ. పూ. 6 వ శతాబ్ది మొదలుగ వివిధ గ్రీక్ రచయితలు గేయ ఫక్కిలో రచించిన వీరగాథలే ఈ ఇలియడ్, ఒడిస్సీ గ్రంథములుగ రూపొందెనని పలువురి అభిప్రాయము. చీనాయందును ఇట్టి గ్రంథములు ఆనాడు రచింపబడెను కాని, షిహ్ హ్వాంగ్-టీ ఆ ప్రాచీన సాహిత్యమున అత్యధిక భాగమును తగులబెట్టించెను. చరిత్రరచనకును ఈ కాలముననే అంకురార్పణ జరిగినది. ఆ రచనకు ఉపక్రమించినవారిలో తెలియవచ్చినంతకు ప్రథముడు హెరొడోటస్ (క్రీ. పూ. 495 - 424) అను గ్రీక్ రచయిత. అతని తరువాత సిరీన్ వాసి అగు ఎఫోరస్ (కీ. పూ. 400 - 358) ప్రపంచ చరిత్రను గ్రీక్ భాషలో రచించెను. క్రీ. పూ. మూడవ శతాబ్దియందు ఈజిప్టుదేశీయుడగు మెనెతోయును, బాబిలన్‌కు చెందిన

బెరోసస్ పండితుడును తమ తమ దేశముల ప్రాచీన చరిత్రలను రచించిరి. క్రీ. పూ. ఒకటవ శతాబ్దిలో సూమాచీన్ అను పండితుడు శాస్త్రీయవైఖరిలో తగు చారిత్రకాధారముల ఉపపత్తిని ఆస్కారముగ ఇడుకొని ప్రప్రథమ చీనీయచరిత్రను రచించెను. లాటిన్‌నందలి తొలుతటి సారస్వతము గ్రీక్‌సారస్వతమునకు ఎక్కువగ ఋణపడి ఉన్నది. క్రమముగ అందు ప్రసిద్ధమౌలికరచనలును వెలువడినవి. ఆ కాలపు లాటిన్‌రచయితలలో క్వింతుస్ ఎన్నియుస్ (క్రీ. పూ. 239 - 169), ఈనియడ్ అను మహా కావ్యమును రచించిన వర్జిల్ (క్రీ. పూ. 70 - 19) సుప్రసిద్ధులు.

నాటకరచనయు ఆనాడు విరివిగ సాగినది. గ్రీస్‌నందు యేస్కిలిస్ (క్రీ. పూ. 525 - 455), సోఫాక్లీస్ (క్రీ. పూ. ? 496 - ? 406), యూరిపిడిస్ (క్రీ. పూ. 485 - 406) అను ప్రసిద్ధరచయితలు నాటకములను రచించిరి. భారత దేశమున క్రీ. పూ. 3 వ శతాబ్దికి చెందిన భాసుడు సంస్కృత భాషలో మనకు తెలియవచ్చినంతవరకు తొలుతటి నాటక రచయిత. గ్రీస్‌దేశ పండితులు తమ శిల్పమునందు వలెనే ప్రకృతిసహజతను ఆశించి దుఃఖాంతనాటకములను కూడ రచించగ, భారతీయులు జీవితాదర్శమగు శాంతిసాధనయే తమ ధ్యేయముగ ఇడుకొని సుఖాంత నాటకములు మాత్రమే విశ్వశ్రేయస్కరములని భావించి దుఃఖాంతములను త్యజించిరి.

భాసుని తరువాత కాలక్రమరీతిలో సంస్కృత సాహిత్యమున మహారచయితగ పరిగణింపదగినవాడు అశ్వఘోషుడను బౌద్ధపండితుడు. ఇతడు కనిష్కునికి సమకాలికుడని ప్రసిద్ధి; బుద్ధచరిత, సౌందరనందములను కావ్యములనే కాక, ఈతడు మూడు దృశ్యకావ్యములను సైతము రచించెను. ఈ నాటకములు మధ్య ఆసియాయందలి తుర్‌ఫాన్ ప్రాంతమున జరిపిన అన్వేషణలో ఉపలభ్యములైనవి. వీనియందు సారిపుత్త ప్రకరణము అత్యుత్తమము. ఈ అశ్వఘోషుడు రచనారీతిలో కాళిదాసునకు ఒరవడి ఇడెనని కొందరు పండితుల అభిప్రాయము. కాళిదాసుని కాలమును గురించి అభిప్రాయభేదములు కలవు. అతడు గుప్తులకాలమునకు చెందినవాడని పలువురు విశ్వసింతురు. అతని కావ్యత్రయమును, నాటకత్రయమును సంస్కృత భాషావేత్తలకు విడనాడరాని రసనిధానములు. అందునను అభిజ్ఞానశాకుంతలము బహుభాషలలోనికి అనూదితమై ప్రపంచఖ్యాతిని ఆర్జించినది.

గీర్వాణభాషాజన్యమగు పాళీయందు ఆ యుగమున పలుగ్రంథములు రచింపబడినను, దాదాపుగ అవి అన్నియు బౌద్ధమతమునకు సంబంధించినవియే. కాని, కొన్ని బౌద్ధ జాతకకథలు అచ్చముగ సాహిత్యపు కోవకు చెందక పోయినను వానిలో ఎడనెడ రసవత్తర రచనలందు ఉత్తమసాహిత్యపు పోకడలు కన్పట్టుచున్నవి. మహావంసము, దీపవంసము అను చారిత్రకగ్రంథములు కావ్యరీతిలో పాళీయందు క్రీ. శ. 4, 6 శతాబ్దములమధ్య సింహళ పండితులచే రచింపబడెను. తక్కిన ప్రాకృత భాషలలో పైశాచియందు వెలువడిన బృహత్కథ విపుల ప్రశస్తిని ఆర్జించినది. సాతవాహనుల ఆస్థానమున మంత్రిగ ఉండిన గుణాఢ్యుడు ఈ గ్రంథమును రచించెను. కాని, అది ఈ నాడు అనుపలబ్ధము. మహారాష్ట్రిప్రాకృతమున సాతవాహన చక్రవర్తి హాలునిచే రూపొందింపబడిన ఒక సంకలనగ్రంథము 'గాథా సప్తశతి' వలన ఆనాడు ప్రాకృతమున విపులసాహిత్యము ప్రచురితమై ఉండెనని విశదమగుచున్నది. తమిళమందు సాహిత్యము తొలుతగ ఆ యుగమున నే రూపుగొన ఆరంభించినది. అట్టి సాహిత్యరచనలలో మనకు ఉపలబ్ధములగువానియందు సెంగుట్టువన్ రచించిన మణిమేఖలై; ఇళంగో అడిగళ్ కృతమగు సిలప్పదికారమ్ (క్రీ. శ. 2 వ శతాబ్ది) పేర్కొనదగినవి.

విద్యావ్యాప్తికి ఈ యుగమున ఎక్కువకృషి జరిగినది. గ్రీక్‌ల విద్యావ్యాసంగ కేంద్రములలో ముఖ్యముగ పేర్కొనతగినవి అకాడమీలు. ప్లేటో (క్రీ. పూ. ర. 428 - 348) అను గ్రీక్ తత్త్వవేత్త తొలుతగ ఇట్టి అకాడమీని క్రీ. పూ. 387 లో స్థాపించి, పలువురు యువకులకు విద్యాదానమును చేసెను. ప్రపంచ ప్రసిద్ధ గ్రీక్‌దార్శనికుడు ఆరిస్టాటిల్ వేరొక అకాడమీని ప్లేటో మరణానంతరమున క్రీ. పూ. 334 లో స్థాపించి విద్యావ్యాపనమునకు కృషి చేసెను. ఈ అకాడమీలకు తోడుగ సంప్రదాయ రీతిలో శిష్యులకు విద్యాబోధనము సల్పెడు పండితులును గ్రీస్ దేశమున పలువురు ఆనాడు వసించిరి. గ్రీక్ సామ్రాజ్యము విస్తరించిన తరువాత ఈజిప్టునందలి అలెగ్జాండ్రియా నగరము గ్రీక్‌భాషా సంస్కృతుల పోషణకు ముఖ్య కేంద్రముగ విలసిల్లెను. ఆ విద్యాకేంద్రమున కృషిచేసిన ప్రపంచప్రసిద్ధ పండితులలో యాంత్రిక శాస్త్రవేత్త ఆర్కిమీడీజ్ (క్రీ. పూ. 285-212), గణితశాస్త్రవిదుడు యూక్లిడ్, భూమి చుట్టుకొలతను తొలుతగ కనుగొని, తొలుతటి ప్రపంచపటమును రచించిన ఎరాటోస్తెనీజ్ (క్రీ. పూ. 276 ? - 196 ?), విజ్ఞాత ప్రపంచపు వివరముల తెలుపు యాత్రా గ్రంథమును రచించిన జ్యోతిశ్శాస్త్రవిదుడు టాలెమీయు పరిగణనీయులు. కాలక్రమమున ఈ యుగాంతమున ఈ విద్యాకేంద్రమునందు వైజ్ఞానిక విషయములకు

ప్రాముఖ్యము అంతరించి, వాని స్థానమును మత దర్శన శాస్త్రములు ఆక్రమించినవి. అలెగ్జాండ్రియాలోని మ్యూజియమ్ గ్రంథాలయమే ప్రపంచమున తొలుతటి ప్రముఖ గ్రంథాలయమని కొందరు పండితుల అభిప్రాయము. రోమన్‌లు గ్రీక్‌ల విద్యాబోధనా సంప్రదాయమునే అవలంబించిరి. ప్రసిద్ధ గ్రంథములకు ప్రతులను రచించుట రోమన్‌ల కాలమున బాగుగ కొనసాగెను. క్రీ. శ. 10 లో రోమ్‌నందు తొలుతగ సార్వజనిక గ్రంథాలయము స్థాపింపబడినది. తరువాత రోమన్ సామ్రాజ్య మందలి ప్రముఖపట్టణములందును అట్టి గ్రంథాలయములు వెలసినవి. చీనాయందు ఈ యుగమున హాన్ ప్రభువుల ప్రోత్సాహమువలన అనేక విద్యాకేంద్రములు స్థాపింపబడినవి. వాని అన్నింట క్రీ. పూ. 124 లో స్థాపింపబడిన హీన్ - యాంగ్ విద్యాపీఠము ప్రామాణికతను ఆర్జించినది.

సంప్రదాయమును అనుసరించి విద్యాబోధనము చేయు గురుకులములే కాక కొన్ని విద్యాపీఠములును భారత దేశమున ఆనాడు వెలసినవి. వానిలో అత్యంత ప్రాచీనము తక్షశిలావిద్యాపీఠము. మత, దార్శనిక విషయములే కాక ధనుర్విద్య, వైద్యశాస్త్రము మొదలగు లౌకిక విద్యలును అచట బోధింపబడెడివి. బుద్ధుని కాలముననే ఈ విద్యాపీఠము భారత దేశములో ప్రసిద్ధ విద్యాకేంద్రముగ ఉండెనని తెలియవచ్చుచున్నది. కాలక్రమమున వారణాసి, నలంద, వలభి అను విద్యాకేంద్రములు ప్రసిద్ధికెక్కి, సమకాలిక విదేశయాత్రికుల ప్రశంసలను ఆర్జించినవి.

**వైద్యము :** బాబిలోనియన్‌ల కాలమున మంత్ర, తంత్ర ప్రయోగములతో ముడివడి ఉండిన వైద్యశాస్త్రము ఈ యుగమున కొంత శాస్త్రీయతను ఆర్జించినది. గ్రీక్‌లలో ఈ విషయమున సమధిక కృషి సల్పినవాడు హిపోక్రటీజ్ అని సాంప్రదాయిక గాథ ఒకటి కలదు. ఇతనివని చెప్పబడు గ్రంథములు క్రీ. పూ. 450 - 350 మధ్యకాలమున రచింపబడినటుల తెలియవచ్చుచున్నది. కాని, ఈ గ్రంథములందు మంత్ర, తంత్రాదులతో నిమిత్తములేని స్వచ్ఛమగు వైద్యశాస్త్రమును రూపొందించుటకు కొంత కృషి జరిగినదని అంగీకరింపక తప్పదు. రోగనిదానము మొదలగువాని యందును, ఔషధ నిర్ణయమునందును కొన్ని సముచితములగు పద్ధతులు ఆ గ్రంథములలో కలవు. హిపోక్రటీజ్ తరువాత గ్రీక్ ప్రపంచమున వైద్యశాస్త్రమున ప్రసిద్ధిని ఆర్జించినవాడు గెలెన్ (క్రీ. శ. 129 - 200 ర). శవములను ఇతడు ఛేదనముచేసి తన్మూలమున శారీరక శాస్త్రము (ఫిజియాలజీ), శరీర రచనాశాస్త్రము (అనాటమీ) లందు నూతన విషయములను కనుగొనగలిగెను. కాని, ఇతడు అధిభౌతిక దర్శనవేత్త అగుటవలన వైద్యశాస్త్రమును ఆ దర్శనముతో ముడివైచి, దాని స్వచ్ఛతను రూపుమాపెను.

భారతదేశమున వైద్యశాస్త్రము 'ఆయుర్వేదము' అను పేరున వికసనము పొందెను. జీవకారుణ్యతకు పేరొందిన బౌద్ధమతము ఈ శాస్త్రాభివృద్ధికి ఎక్కువ దోహదకారి అయ్యెనని విశ్వసించుటకు ఆధారములు కలవు. బౌద్ధమత ప్రాచీన ప్రామాణిక గ్రంథములలో ఒకటి అగు 'వినయపిటకము'న జీవకుడు అను సుప్రసిద్ధ వైద్యుని ప్రసక్తి కలదు. తక్షశిలయందు ఏడు సంవత్సరములు వైద్యవిద్యను అభ్యసించి, అతడు కుశలతను ఆర్జించి, మగధసామ్రాట్ అగు బిందుసారునికి ఆస్థాన వైద్యుడు కాగలిగెననియు, ఆ రాజుచే నియుక్తుడై బుద్ధదేవునకు అతడు వైద్యపరిచర్య జరిపెననియు, కపాలమునకు శస్త్రచికిత్స చేయుటయందును అతడు కుశలుడు అయ్యెననియు ఆ గ్రంథమువలన తెలియుచున్నది. గ్రీక్ ప్రపంచమున ఒక వైద్యసంహిత అలెగ్జాండ్రియా విద్యాపీఠమున క్రీ. పూ. 275 లో సంగ్రథితమైనది. ఆ కాలమున భారతదేశమున రచితములైన వైద్యగ్రంథములు ఏవియు మనకు లభింపలేదు. కాని, రామాయణాది కావ్యములందు ప్రయోగింపబడిన కొన్ని ఉపమాలంకారముల వలన వైద్యశాస్త్రము ఆనాటికి చాల అభివృద్ధి చెందినదని భావింప అవకాశములు కలవు. నేడు ఉపలబ్ధములగు ఆయుర్వేద గ్రంథములలో అతి ప్రాచీనముగ భావింపబడునది 'చరకసంహిత'. దీని కర్తయగు చరకుడు కనిష్కుని ఆస్థానమున ఉండెనని చీనీయ రచనల వలన విదితమగుచున్నది. కాని, నేడు మనకు దొరకు చరకసంహిత ఇతని రచన కాదనియు, తరువాత చాల కాలమునకు అతని సంప్రదాయాను యాయులచే సంగ్రథితమైనదనియు విజ్ఞుల అభిప్రాయము. ఆయుర్వేద ప్రపంచమున చరకసంహితతో పాటుగ గౌరవమును ఆర్జించిన సుశ్రుతసంహితను రచించిన సుశ్రుతుడు క్రీ. శ. మూడు, నాలుగు శతాబ్దములవాడు కానగునని పండితుల అభిప్రాయము. సాధారణ వైద్యశాస్త్ర విషయములతో పాటుగ శస్త్రచికిత్సకును ఈతడు తన గ్రంథమున ప్రముఖతను కల్పించి, సునిశితములగు శస్త్రచికిత్సా పరికరముల పెక్కింటిని పేర్కొనెను. సుశ్రుతకాలమునకు తరువాతిదిగ పరిగణింపదగు 'నవనీతకము' అను వేరొక ఆయుర్వేదగ్రంథము మధ్యఆసియాయందలి కాష్‌గర్‌నందు కనుగొనబడినది. అచటనే వేరొక వైద్యశాస్త్రగ్రంథము చర్మముపై లిఖింపబడి లభ్యమైనది. వ్రాతనుబట్టి క్రీ. పూ. 200 ప్రాంతమున అది రచింపబడినటుల కన్పట్టుచున్నది.

ఇటుల బౌద్ధపండితుల మూలమున ఆయుర్వేదము విదేశము లకు సైతము ఆనాడు పయనించినది. భారతీయ సంస్కృతి వ్యాపించినచోట నెల్ల, ఆగ్నేయ ఆసియా, సిలోన్, మధ్య ఆసియా దేశములలో ఇటుల వ్యాపించిన ఆయుర్వేదము, ఆ యా స్థానికపరిస్థితులను అనుసరించి నూతన విషయములను తనలో ఇముడ్చుకొనినది. ప్రాచీనకాలము నుండియు వైద్యశాస్త్రమున కొంత కృషిచేసిన చీనా దేశము సైతము ఆయుర్వేద ప్రభావమునకు ఆ యుగమున లోనైనది. సమకాలిక గ్రీక్ రచయితలు భారతీయ వైద్యుల విజ్ఞాన సంపత్తికి, అందును అగదతంత్రమున (విష వైద్యమున) వారికి గల ప్రజ్ఞకు అచ్చెరువును వెలిబుచ్చిన నిదర్శనములు కలవు. వైద్యశాస్త్రాభివృద్ధితో పాటు వైద్యశాలలను నెలకొల్పుటయు ఆ ప్రాచీన యుగముననే వివిధ దేశములందును ఆరంభితమయినది. అశోక చక్రవర్తి ఇట్టి వైద్యశాలలను మానవులకొరకే కాక పశువుల కొరకు సైతము నెలకొల్పుటకై శ్రద్ధవహించి, వానియందు ఉపయోగింపదగు ఔషధ, మూల, ఫలాదులకు తరుగు లేకుండుటకు ఓషధీవనముల నెలకొల్పుటయే కాక, తన దేశమున అలభ్యములగు వానిని ఇతర దేశముల నుండి తెప్పించి వానిని సమకూర్చుటకు జాగరూకత వహించెనని అతని శాసనముల వలన తెలియవచ్చుచున్నది.

**వాస్తు శిల్పశాస్త్రము :** మానవజీవితమును సుఖమయము చేయు తక్కిన శాస్త్రములందును ఆనాడు కృషి జరిగినది. అందు వాస్తుశిల్పశాస్త్రము పేర్కొనదగినది. రాతితో పెద్ద భవనములను నిర్మించుట ప్రాచీన నాగరకతలందు-అందును ఈజిప్టున - అన్నింటికన్న మిన్నగ కన్పట్టుచున్నను ఈయుగమున ఆ విద్య నాగరక ప్రపంచమునందుఅంతట మన్ననను ఆర్జించినది. ఏథెన్స్, పార్సా (పెర్సిపోలిస్) మున్నగు సుందర నగరములను క్రమముగ నిర్మించిన గ్రీక్‌లును, పారసీకులును ప్రాచీనులకు ఎంతయో ఋణపడి ఉండిరి. ప్రాచీన ఈజిప్టునందలి స్తంభశిల్పమునకు పారసీకులును, గ్రీక్‌లును రమణీయతను సమకూర్చిరి. బాబిలోనియన్‌లు ఆదరించిన కమాను (ఆర్చి) ల నిర్మాణమునకు ఈ ఉభయ జాతులును ఎక్కువ ప్రోత్సాహము ఇచ్చినటుల కన్పట్టదు. కాని, రోమన్‌లు మాత్రము స్తంభములకు కమానుల రమణీయతను జోడింపజేసి, ఒక నూతన వాస్తువునకు దారితీసిరి. ప్రాచ్య సామ్రాజ్యముల రాజధానులను తన రాజధాని అధిగమింపవలెనను ఆకాంక్షతో అగస్టస్ చక్రవర్తి రోమ్ నగరమున సుందర మహోన్నత భవనముల నిర్మాణమును విరివిగ సాగించెను. రోమ్‌నందలి ఇటికరాతి కొంపలను చలువరాతి మందిరములుగ మార్చితినని అతడు సగర్వముగ చెప్పుకొనెను. సున్నపుటడుసు (కాంక్రీట్)తో భవన నిర్మాణమును, నగిషీపనిని తొలుతగ సాగించిన వారు రోమన్‌లే అని పండితుల అభిప్రాయము. సున్నని చలువ రాయి విరివిగ వారికి దొరకకపోవుటయే వారు ఈ విధానమును అవలంబించుటకు ముఖ్యకారణము అయ్యెనని వాస్తుశాస్త్ర చారిత్రకుల ఊహ. విశాలములగు చతుశ్శాలల నిర్మాణమునకూడ రోమన్‌లు కుశలతను ఆర్జించిరి. వీనిని వారు 'బసిలికా' లు అని వ్యవహరించెడివారు. విస్తృత సంఖ్యలో ప్రజలు సమావేశము కావలసి ఉండు న్యాయస్థానముల కొరకు ఇట్టి వానిని ఆకాలమున వారు నిర్మించిరి. రోమన్‌ల వాస్తువిద్యా ప్రజ్ఞకు వేరొక నిదర్శనము వారి క్రీడామందిరపు నిర్మాణము. 'కలోసియమ్' అని వ్యవహృతమై, రోమ్‌లో నేటికిని కననగు క్రీడామందిరము దీర్ఘవృత్తాకారమున ఉండి, సోపానసరళిలో నిర్మితములగు వేదికలపైనుండి వేలకొలది ప్రేక్షకులు క్రీడలను ఆలోకించుటకు అనువుగ ఆనాడు నిర్మింపబడినది.

భారతదేశమున ఈ యుగమున భవననిర్మాణవిద్య కుశలతను ఆర్జించి రాణించినది. కాని, ఇచ్చట వాస్తుశాస్త్ర చరిత్రకారుని ఒక క్లిష్టసమస్య ఎదుర్కొనుచున్నది. సింధు నాగరకతా కాలమునకు తరువాత మౌర్యయుగమునకు పూర్వపు నిర్మాణములు ఏవియు ఈ నాటివరకు మనకు లభ్యములు కాలేదు. కాని, మౌర్యనాగరకతా కాలమున మాత్రము భవననిర్మాణవిద్య అత్యుచ్చస్థాయిని అందుకొనినదని భావించుటకు నిదర్శనములు కలవు. ఇట్టి అకస్మాద్వికసనము ఎటుల సాధ్యమైనది అను విషయమున అభిప్రాయభేదములు కలవు. సింధునాగరకతా కాలము తరువాత ఆ సంప్రదాయపు వాస్తువే దారునిర్మితభవనములందు పారంపర్యముగ అభివృద్ధిచెందినదనియు, మౌర్యుల కాలమున అది శిలానిర్మిత రూపమును ఆశ్రయించినదనియు, తొలుతటి దారునిర్మిత భవనములు శీతాతప వర్షములవలనను, అగ్నివలనను అంతరించి పోవుటచేత, మౌర్యవాస్తువునకును, శిల్పమునకును దారితీసిన వివిధ ఘట్టములు చరిత్రనుండి లుప్తములైనవనియు కొందరి అభిప్రాయము. మరికొందరు వాస్తువిద్యను పారసీకుల నుండి మౌర్యులు గ్రహించిరని భావించిరి. ఇది ఎటులున్నను మౌర్యులకు పూర్వమున దారువుతోను, లక్కతోను భవనములు నిర్మింపబడుచుండెడివని విశ్వసించుటకు ఆధారములు కలవు. మౌర్యులకాలమున ఈ వాస్తువు స్తంభశిల్పమును ఆశ్రయముగ గ్రహించి మహోన్నతస్థితిని అందుకొనినది. దాదాపు ఏడుశతాబ్దముల తరువాత పాటలీపుత్రమును (నేటి పాట్నా) దర్శించిన ఫాహియాన్ అశోకుని రాజ

భవనమును దర్శించి ముగ్ధుడై ఆ మహోన్నత సుందరభవనము దేవనిర్మితమై ఉండుననియు, అట్టిదానిని మానవులు నిర్మింపజాలరనియు నుడివెను. అశోకుడు 84,000 స్తూపముల నిర్మింపజేసెనను ప్రసిద్ధి కలదు. ఆ స్తూపములు కొండలంత ఎత్తుగ ఉండినవని 'దివ్యావదాన' మను బౌద్ధమత గ్రంథము పేర్కొనుచున్నది. ఇది ఎటులున్నను, సాంచియందు నేడు కననగు ఉన్నత స్తూపమునకు తొలుతటిరూపమును కల్పించినవాడు అశోకుడే అనుట నిర్వివాదాంశము. అశోకుని కాలమున వికసనముపొందిన గుహాశిల్పము నేటి శిల్పశాస్త్ర విదులను తబ్బిబ్బుచేసినది. బరాబర్, నాగార్జున కొండల గుహలందలి నిర్మాణములు అట్టి వికసనమునకు నిదర్శనములు.

లలిత కళలు : శిల్ప, చిత్రలేఖనాది లలితకళలును ఆనాడు సమగ్ర వికసనము పొందినవి. ప్రకృతిసహజతను ఆశించిన విగ్రహ శిల్పము గ్రీస్‌దేశమున క్రీ. పూ. 3 వ శతాబ్దికి పూర్వముననే పరాకాష్ఠను అందుకొనినది. రోమన్‌లు దానిని అనుకరించిరి. భారతీయ శిల్పులు జంతువుల రూపచిత్రణమున సాధించిన అభివృద్ధికి అశోకుని కాలపు స్తంభ మకుటములందు కన్పట్టు సింహ, వృషభాదులు నిదర్శనములు. మానవరూప చిత్రణమున గ్రీక్‌లు సాధించినంత ప్రకృతి సహజతను భారతీయ శిల్పులు తొలుత సాధింపజాలక పోయినను క్రమముగ అట్టి శిల్పకళయు వికసనము పొందినది.

ఆ ప్రాచీనయుగమున వికసించిన చిత్రలేఖన విద్యకు అజంటాయందలి చిత్రములు ముఖ్యనిదర్శనములు. క్రీ.పూ. 2 వ శతాబ్ది మొదలుగ ఇచటి గుహలందలి చిత్తరువుల రచన సాగినది [చూ. అజంటా - సం. 4. పు. 704]. ఈ చిత్రలేఖన విద్యయే బౌద్ధభిక్షువుల సాయమున సింహళమున 'సిగిరియ' చిత్తరువులందును, చీనాదేశమునందలి తున్‌హ్వాంగ్ కొండగుహల చిత్తరువులందును ప్రతిఫలనము పొందినది. చీనాదేశమునందు ఆ కాలమున రూపొందిన గుహాదేవళములందలి విగ్రహశిల్పము భారతీయ సంప్రదాయమునకు ఎంతయో ఋణపడినది.

సంగీతము, నాట్యము, అలంకరణ మొదలగు తక్కిన లలితకళలకును ఆనాడు ప్రోత్సాహము లభించినది. అలెగ్జాండ్రియా యందలి స్త్రీల కేశాలంకరణ రీతిలో పొట్టి వెండ్రుకల (బాబ్డ్ హెయిర్) కుదుర్పునకు అత్యాదరము ఆనాడే చేకూరినది. అజంటా చిత్తరువులలోని స్త్రీల కేశపాశవైఖరులు ఆనాటి సౌందర్య లాలసతకు చక్కని ఉదాహరణములు. సంగీతమునకు కల మైమరపించు శక్తిని ఆ ప్రాచీనులును గుర్తించిరి. గ్రీక్ పురాణములలోని ఆర్ఫియస్, భారతీయ పురాణములందలి నారద, తుంబురులును సంగీతపు ప్రాశస్త్యమును గురించి ఆ ప్రాచీనులకు కల భావములకు ఆదర్శమూర్తులు. సముద్రగుప్త సార్వభౌముడు జంత్రవాద్యముతో కల తన చిత్తరువును తన నాణెములపై ముద్రింపజేయుట ఆనాడు గానకళ ఎడ కల ఆదరాభిమానములకు ఒక సాక్ష్యము. మనోగత భావములకు అంగవిన్యాస, భ్రూ విక్షేపాదుల వలన రూపకల్పనచేయ యత్నించు మానవుని సహజౌత్సుక్యపు ఫలితముగ తొలుతనుండియు మానవసంఘమున వివిధ పరిణామావస్థలను పొందిన నాట్యమునకు ఒక శాస్త్రీయ రూపమును కల్పించుటకు భారతదేశమున ఆనాడు కృషి జరిగినది. దాని ప్రతిఫలమే భరతముని నాట్యశాస్త్రము.

యంత్రములు : పైవానిలోననే కాక ఇంకను పెక్కు విజ్ఞానశాఖ లందు ఆనాటి మానవుడు వివిధ నాగరక దేశములందును కృషిచేసెను. ప్రకృతి పరిశీలనము, సృష్టి రహస్యములు మొదలగునవి ఆనాటి పండితుల దృష్టిని ఆకర్షించినవి. ఆవిరికి గల శక్తిని గురించి అలెగ్జాండ్రియా యందలి హీరో అను పండితుడు (క్రీ. శ. రెండవ శతాబ్ది) కొన్ని రహస్యములను గుర్తించెను. స్వచ్ఛ శాస్త్రీయ విజ్ఞానమే ముఖ్యముగ ఆనాటివారి లక్ష్యమై ఉండెను. దానికి వినియుక్తరూపమును ఇచ్చుటకు వారు అంతగ శ్రద్ధవహింపలేదు. బాబిలోనియన్ పండితులు రూపొందించిన నీటిగడియారమునే ఈ యుగపు వారును కాలనిర్ణయమునకు ఎక్కువగ ఉపయోగించిరి. ఆనాడు విశ్వవ్యాప్తముగ ఈ యంత్రము వాడుకలో ఉండెను. కాలక్రమమున సికతాకాచమును, ఛాయా ఘటికయు (గ్నోమన్) వాడుకకు ఆనాడే వచ్చినను వానికి విరివిగ వ్యాప్తిరాలేదు. ఆనాడు వెలువడి వ్యాప్తిలోనికి వచ్చిన నూతన యంత్ర సాధనములలో నీటిమట్టము, మూలమట్టము, బిగము, కొలిమితిత్తులు, జలతరంగిణి, జలసారిణి, చక్రపుమోట లేదా రహట్, నీటిశక్తిచే తిరుగు పిండిమరలు, పోతమూసలు ముఖ్యముగ పేర్కొనదగినవి. ఇట్టి నూతన సాధనములను కనిపెట్టుటలో ఆనాటి చీనీయులు తక్కినవారికన్న ముందడుగు వేసిరని చెప్పవచ్చును. కాని, వారు ఆవిష్కరించిన నూతన విషయములు తక్కిన ప్రపంచపు దృష్టికి అప్పటిలో రాకుండుటవలన వానికి విశ్వజనీనత ఆ కాలమున లభింపలేదు. అట్టి చీనీయసాధనములలో నూర్పిడియంత్రము, పట్టునేతపరికరములు, సానబట్టు చక్రము, నీటిశక్తిచే నడుచు సమ్మెట యంత్రము, బరమా ముఖ్యముగ పేర్కొనదగినవి. క్రీ. పూ. 105 లో

చాయ్-లున్ అను చీనీయుడు కాగితము చేయుపద్ధతిని తొలుతగ కనుగొనెను.

**యుద్ధ విద్య :** ఆర్కిమీడీజ్ అను గ్రీక్ విజ్ఞాని ఉచ్చాలక దండమును (లీవర్) గురించియు, దానివలన లభించు యంత్ర సౌలభ్యమును గురించియు, చాక్షుషశాస్త్రము (ఆప్టిక్స్) ను గురించియు, జలస్థితి శాస్త్ర (హైడ్రో స్టాటిక్స్) విషయములను గురించియు పెక్కు రహస్యములను కనుగొనెను. పెద్ద పెద్ద రాతి స్తంభములను తరలించుట యందు ఈ శాస్త్రవిషయముల పరిచితివలననో లేదా అనుభవజన్య జ్ఞానమువలననో పసిఫిక్, మహాసముద్రము మొదలుగ అట్లాంటిక్ వరకు గల నాగరక దేశములందు అంతట లీవర్‌ను, బరువుగల రాతి స్తంభములను లేపుట యందు కప్పీలును విరివిగ ఆ కాలమున వాడబడినవి.

మానవవిజ్ఞానము, తక్కిన రంగములందుకన్న, ముందుగ యుద్ధవిద్యయందు వినియుక్తమగుటచరిత్రయందు ఎల్లెడల కాననగు విషయము; ఆనాడును ఇట్టిదే జరిగినది. చాక్షుష శాస్త్రమునందు కుశలుడగు ఆర్కిమీడీజ్ స్వ నగరమగు సిరక్యూస్ రక్షణకై తన విజ్ఞానమును ఉపయోగించి, భూత అద్దముపై బడిన సూర్యకిరణముల పరావర్తనము మూలమున రోమన్‌ల నౌకలను దగ్ధమొనర్చెనని ఒక సాంప్రదాయిక గాథ కలదు. అటులే ఆనాటి వారిలో అనేకులు యుద్ధసాధనములందు మార్పులను తెచ్చి, శత్రు నిర్మూలనకు సులభతరమార్గములను అన్వేషించుటలో కృషి చేసిరి. దీని ఫలితముగ వ్యూహరచనయందును, సాధనములందును అనేకములగు మార్పులు వచ్చినవి. యుద్ధ విద్యా రహస్యముల బోధించు గ్రంథములలో మనకు తెలిసినవరకు తొలుతటి దానిని క్రీ. పూ. 500 ప్రాంతమున సున్-ఝా అను చీనీయపండితుడు రచించెను. చాణక్య అను మరొక పేరు గల కౌటిల్యునిచే రచితమగు అర్థశాస్త్రమున యుద్ధ తంత్రము వివరింపబడినది. మహాభారతమున పేర్కొనబడిన వ్యూహరచనారీతులును ఆనాటి యుద్ధవిషయక జ్ఞానమును విశదము చేయుచున్నవి. యాంత్రిక సౌలభ్యమును సమకూర్చు యంత్రములచే పెద్ద పెద్ద శిలలను దూరమునకు విసరివైచుట ఆ నాటి వారు నేర్చిరి. కాని, యుద్ధములందు కడపటి నిర్ణయము మాత్రము కాల్బంటుల సామర్థ్యముపైననే ఆధారపడి ఉండినది.

## ధార్మిక భావనలు

వస్తూత్పత్తి, వినిమయ, వాణిజ్యాది వివిధ రంగములందు పై విధముగ ఆ యుగవాసులు సాధించిన దానిని అధిగమించినది ఆ కాలమున జరిగిన ఆధ్యాత్మిక భావ వికసనము. ప్రాచీనయుగపు ఆధ్యాత్మిక భావములకు పరిణామములుగనో లేదా సంస్కరణములుగనో ఈ యుగమున నూతనభావనలు అనేక ప్రదేశములలో ఉదయించి వ్యాప్తి ఆర్జించినవి. ఈ భావనలను మత భావనలు, దార్శనిక భావనలు అని స్థూలముగ రెండు వర్గములకు చెందినవానినిగ మనము విభజింపవచ్చును. ఆ నాటికి దార్శనిక భావన మతమునుండి స్పష్టముగ వేరు పడక పోవుటచే ఇట్టి విభజన సులభసాధ్యము కాకపోవుట కొంతవరకు యథార్థమే. అయినను ఆనాటి ఆధ్యాత్మిక భావనలను అర్థము చేసికొనుటకు ఇట్టి స్థూల విభజనతప్ప వేరు గత్యంతరము లేదు.

**మతము :** మత భావనలు అని మనము పేర్కొనదగు వానిలో ఆ యుగమున రూపొందిన జరతుష్ట్రి, బౌద్ధ, జైన, భాగవత, పాశుపత, మిత్ర, మాని, క్రైస్తవ మతములు ప్రముఖముగ పేర్కొనదగినవి (ఇస్లామ్‌మతము ఈ యుగపు చరమకాలమున రూపొందినది కావున దానిని గురించి రాబోవు అధ్యాయమున ప్రస్తావితము). దార్శనిక భావనలలో భారతదేశమునందలి ఔపనిషదిక భావనయు, గ్రీక్ దార్శనికుల రచనలును ముఖ్యముగ పేర్కొనదగినవి. ఈ ఉభయవర్గములలో అచ్చముగ దేనికి చెందక రెండింటితోను కొంత సంబంధము కలిగినవిగ చెప్పదగినవి చీనాయందలి కన్‌ఫ్యూషియన్, టావో మతములు. వీనికి సన్నిహితములైనవియే పశ్చిమదేశములందు ఆనాడు వర్ధిల్లిన స్టాయిక్, ఎపిక్యూరియన్ వాదములు.

ఈ పైన పేర్కొనబడిన వివిధ భావనల గురించిన సారస్వతము నేటికిని విరివిగ లభించుచున్నది [చూ. సం. 7 లోని ఆ యా శీర్షికలు]. ఆ భావనల క్రమపరిణామము, వాని ప్రభావము, వాని విస్తృతి మొదలగు వాని సమగ్ర వివరణము ఈ సమీక్షయందలి ధ్యేయవిషయము కాదు. కాలగతిని అనుసరించి పూర్వాపరముల క్రమమున వానిని స్థూలరీతిలో వివరించుటకును ఇట అవకాశము లేదు. కాని, ప్రపంచ సంస్కృతిపై తమ ప్రభావము నెరపి, చరిత్రయందు చెరగిపోవని స్థానములను ఆక్రమించిన ఆ ప్రముఖ భావనలు దిగ్దర్శనముగ మాత్రమే ఇట పేర్కొనబడుచున్నవి.

ఆనాటి మతభావనలలో జరతుష్ట్రి, బౌద్ధ, క్రైస్తవ మతములు విశాల వ్యాప్తిని ఆర్జించి, ప్రజల జీవిత విధానములపై తమ ప్రభావముల నెరపినవి. చీనాయందు బౌద్ధమతము వ్యాపించువరకు కన్‌ఫ్యూషియస్, టావో వాదములు ప్రజల జీవిత విధానమును తీర్చిదిద్దినవి. అనంతరమున అవి బౌద్ధమతములో మిశ్రితము

లయ్యెను, చీనీయ జాతీయ జీవనమున ప్రముఖ పాత్ర వహించినవి.

జరతుష్ట్ర మతము : పై వానిలో జరతుష్ట్రి మతమునకు స్థాపకుడుగ పేర్కొనబడు జరతుష్ట్రుని కాలమును గురించి విభిన్నాభిప్రాయములు కలవు. అందు క్రీ. పూ. 7 వ శతాబ్దివాడు ఇతడనుట పలువురు పండితులకు ఆమోదనీయము అయినటుల కన్పట్టుచున్నది. ఇటుల ఈతడు ఈ యుగమునకు పూర్వుడే అయినను, ఇతనిచే ప్రవచితమగు మతము మాత్రము ఈ యుగముననే విపుల వ్యాప్తిని ఆర్జించినది. జరతుష్ట్రుడు ఇరాన్ దేశవాసి. తొలుత ఇతని మతము ఇరాన్ ప్రజల జాతీయ మతమై ఉండినది. ఇరాన్ దేశీయుడగు కురుష్ సామ్రాజ్యమును నెలకొల్పినది మొదలుగ ఈ మతమునకు ప్రాముఖ్యము చేకూరినది. హఖమనీషి రాజవంశీయులును, అర్షకులును, ససానియన్‌లును ఈ మతమును ఆదరించి పరిపోషించిరి. ఈ జరతుష్ట్రి మతమును ప్రత్యేకమతము అనుటకన్న వైదికమతమునకు జరిగిన ఒక సంస్కరణగ పేర్కొనుట సమంజసము. భారతీయార్యులవలెనే ఇరాన్ ఆర్యులయందు తొలుత ప్రకృతిదేవతాత్మకమగు బహు దేవతారాధన అమలులో ఉండెడిది. ఇది అనేకేశ్వరారాధనగ పరిణమించి అంధవిశ్వాసములకు దారితీయునని జరతుష్ట్రుడు భావించెను. అందువలన బహుదేవతారాధనకు బదులుగ అహురమర్ద్గా అను ఏకైకేశ్వరుని ఆరాధనను అతడు ప్రతిపాదించెను. రక్తదూషితములగు బలులను, మాదక పానీయమగు సోమరసమును అతడు నిషేధించెను. ఆచారమాత్రమగు సన్యాసమును అతడు నిరసించి మనస్సన్యాసమునకు ప్రాముఖ్యమును కల్పించెను. ఏకైక పరమేశ్వరుడగు అహురమర్ద్గాను అతడు సకలసద్గుణరాశిగ వర్ణించెను. ప్రపంచము మాత్రము దుష్ట, శిష్ట శక్తుల రణరంగమని జరతుష్ట్రుడు భావించి, అది అటులుండుట భగవత్సంకల్పమని తలంచెను. ఈ సంగ్రామమున శిష్టశక్తులతో సహకరించుటవలన మానవునికి అహురమర్ద్గా అనుగ్రహము లభించును. జరతుష్ట్రుని మతమున జీవితము ప్రారబ్ధలబ్ధముకాదు. పుణ్యావిత్త సముపార్జనకై పరమేశ్వరుడు ఇచ్చిన వరప్రసాదమే జీవితము. జీవితము మిథ్యయని అతడు భావింపలేదు. జీవితము ఒక అవకాశము. జీవితమునచేయు సత్కర్మ, దుష్కర్మల ఫలితములను మానవుడు మరణానంతరమున అనుభవించును. సన్మార్గగామి స్వర్గమును, దుశ్చరితుడు ఘోరనరకమును పొందెదరు. జీవిత లక్ష్యము సర్వత్వ, అమృతత్వముల సాధన. ధర్మాధర్మములకు ప్రపంచమున జరుగుచున్న ఈ నిరంతర సంగ్రామమున కడకు ధర్మమే జయించి ధర్మరాజ్యము ఏర్పడుననియు, ధర్మచరితుల ప్రోత్సహించుటకై అహురమర్ద్గా అంతటంతట ప్రవక్తలను పంపుననియు జరతుష్ట్రుడు పేర్కొనెను. సమకాలిక యూదమతము పైనను, అనంతరకాలపు క్రైస్తవ, ఇస్లామ్ మతముల పైనను జరతుష్ట్రుని ఈ భావనలు ప్రభావము నెరపి ఉండెనని కొందరు పండితుల అభిప్రాయము.

ఏకైక పరమేశ్వరుని ఆరాధనలో ఒక ముఖ్యాంగముగ అగ్న్యారాధన జరతుష్ట్రునిచేత ఆదరింపబడినది. అన్ని ప్రాచీన ఆర్యశాఖలలో అగ్ని ఆరాధనీయదేవతగ జరతుష్ట్రునికి పూర్వముననే ఉండినది. జరతుష్ట్రుడు ఈ సంప్రదాయమునే యథాతథముగ ఉంచినను, అగ్నిని ఒక ప్రత్యేక దేవతగ కాక, అహురమర్ద్గా శక్తిని, స్వచ్ఛతను వ్యక్తముచేయు సంకేతముగ గ్రహించెను. జరతుష్ట్రుని మత గ్రంథము 'అవెస్తా' అనునది 21 సంపుటములుగ తొలుత ఉండెను. కాని, అందలి పెక్కుభాగములు లుప్తములైనవి. అందు ఆరు (6) సంపుటములు మాత్రమే - అందును కొన్ని ఖిలరూపమున - నేడు ఉపలబ్ధములు. ససానియన్ రాజుల కాలమున అవెస్తా సారస్వతమును పహ్లావీ భాషలో రూపొందించుటకు కొంత కృషి జరిగినది. పహ్లావీలోని ఆ సారస్వతమున నేడు ఉపలబ్ధమగు దిన్‌కర్ద్ అను గ్రంథము జరతుష్ట్రిమత విజ్ఞానసర్వస్వము. క్రీ. శ. 7 వ శతాబ్దిలో ఇరాన్‌దేశమును ఇస్లామ్ సేనావాహినులు లోగొనిన తరువాత జరతుష్ట్రిమతము అచ్చట క్రమముగ అంతరించి, కొన్ని మారుమూల ప్రాంతములందు మాత్రము నిలువగలిగినది. ఆ కాలముననే స్వమతప్రియులగు కొందరు జరతుష్ట్రిమతానుయాయులు, ఉపలబ్ధములగు అవశిష్ట మత గ్రంథములతో ఇరాన్‌నుండి సముద్రమార్గమున పశ్చిమ భారతదేశమునకు వలసవచ్చి అట స్థిరవాసులైరి. వారి కోవకు చెందినవారలే భారతదేశమందలి నేటి పార్సీలు.

విగ్రహారాధన : ఇటుల తొలుతనుండి కడవరకు ఇరాన్ దేశపు జాతీయమతముగనే విలసిల్లినను, ఇరాన్ జాతీయులగు చక్రవర్తుల పరిపాలనాకాలములందు వారి దిగ్విజయ యాత్రలతోపాటుగ ఈ మతము తక్కిన దేశములకును విస్తరించినది. ఇటుల వ్యాపించుటలో అది పలు రూపాంతరములను పొందినది. పారసీక రాజ్యప్రతిష్ఠకు తొలుతటి నెలవగు పశ్చిమ ఆసియాయందు జరతుష్ట్రిమతము వ్యాపించుటకు పూర్వమున విగ్రహారాధన విరివిగ వ్యాప్తియందు ఉండెడిది. ఆ ప్రాంతములందలి వివిధ దేశములలో మాతృదేవతారూపమున సృజనశక్తియు, సర్వ

శక్తిమంతుడగు పురుషుని రూపమున ప్రపంచ స్రష్టయు విగ్రహరూపములతో, వివిధ నామములతో పూజింపబడెడి వారు. ఇట్టి పూజలకు అలవడిన ప్రజలకు ప్రతీక రహిత మగు అహురమర్ద్భూ ఆరాధన ఆకర్షణీయము కాకపోవు టచే అచటి ప్రజల అభిరుచులనుబట్టి జరతుష్ట్రమతము రూపాంతరములను పొందినది. అహురమర్ద్భూ దయకు పాత్రులయిన వారలుగ అవెస్తాయందు పేర్కొనబడిన మిత్రుడును, అనాహితాయును అంతటినుండి ప్రాముఖ్య మునకు రాదొడగిరి. వీరిలో తొలుతటి దేవుడు పురుషుడు; రెండవది స్త్రీ. పశ్చిమ ఆసియాయందు అంతకు పూర్వము పూజింపబడు ప్రముఖ స్త్రీ - పురుష దేవతలకు ప్రత్యామ్నాయములుగ అనాహితా, మిత్రులు అంతటినుండి వ్యాప్తిలోనికి వచ్చిరి. వారి విగ్రహముల ఆరాధనమే జరతుష్ట్రమతముగ పెక్కు ప్రాంతములందు వ్యాప్తి కాంచెను.

కాని, క్రమముగ అనాహితా, మిత్రులలో మిత్రుని పూజకు ఎక్కువ ఆదరము లభించుటయేకాక, మిత్ర మతము అనునది వేరొకటి రూపొందుటకు కూడ అవ కాశము కలిగెను. మిత్రుడు వేదములందువలెనే అవెస్తా యందును ప్రశంసితుడు. సూర్యుడు ఈతని రూప విశేషము. భారతదేశమున సైతము మిత్రునికి ఒక ప్రత్యేకత అబ్బినను, దానికి పారసీకరాజ్యమందలి మిత్ర మతముతో సంబంధము ఉండినటుల కన్పట్టదు. ఈ మిత్ర మతము క్రమముగ క్రీస్తుశకారంభమునకు పశ్చిమ ఆసి యాలో సర్వత్ర వ్యాపించి, రోమన్ సామ్రాజ్యమున సైతము కాలూనగలిగినది. ఆసియాతో రోమన్ల పరిచితి గాఢమగుకొలది, మిత్రమతమునెడల రోమన్ల ఆదర మును వృద్ధియైనది. క్రీస్తుశకము రెండవశతాబ్దికి రోమన్ల లోని ప్రముఖవర్గముల వారికి ఈ మతము ఆదరణీయ మయ్యెను. రోమ్‌నగరమే అంతట మిత్రమతమునకు ముఖ్య కేంద్రమయ్యెను.

ఈ మిత్రమతమున సూర్యుడు ప్రధానదేవత; గ్రహ ములు ఉపదేవతలు. తక్కిన అన్ని విషయములందును దాదాపుగ ఇది జరతుష్ట్రమతముననే అనుసరించినది. కాని, ఈ మిత్రమతము అలౌకిక సిద్ధశక్తుల సాధన సాధ్యమని పేర్కొని, అందులకు అనువుగ కొన్ని సాధనలను ఏర్పరచి నది. ఈ శక్తులను ఆర్జించు పేరాసతో పండితులు పలువురు ఈ మతమును ఆశ్రయించిరి. రాజులు ఈ మతమును ఆద రించుటకు వేరొక ప్రముఖ కారణమును ఉండినది. జర తుష్ట్రని మతమును అనుసరించి ప్రజానీకమును పాలించు ప్రభువునందు అహురమర్ద్భూ తన తేజోంశమును ఉంచును.

ఈ సిద్ధాంతమును బలపరచి పారసీకరాజులు తమకు గల ప్రత్యేకతను ప్రజలు గుర్తించునటుల చేయగలిగిరి. మిత్రమతము సైతము ఈ విషయమున జరతుష్ట్రనే అనుసరించి, పరిపాలకుడు మిత్రతేజమున రూపొందునని నుడివెను. ప్రజలచే దైవములుగ తాము అర్చింపబడవలె నని ఆశించి కృషిచేసి, ఆ ఆచారమును అమలులోనికి తెచ్చిన రోమన్ చక్రవర్తులకు మిత్రమతమందలి ఈ సిద్ధాం తము బాగుగ ఉపకరించుటవలన ఈ మతమును వారు ప్రోత్సహించిరి. కాని, ఈ మతమునందలి రహస్యసాధనలు మొదలగు వానివలన క్రమముగ ఇది సామాన్యప్రజలకు దూరమయ్యెను. ఆ అవకాశమును ఊతగ గ్రహించి క్రీ. శ. 275 మొదలుగ క్రైస్తవమతము ప్రజల మన్ననను పొంది, క్రమముగ రోమన్ సామ్రాట్ల ఆదరణను ఆర్జించి, మిత్రమతమును అనతికాలమున అంతమొందించినది.

**బౌద్ధ మతము:** కురుష్ ప్రభువు పారసీకసామ్రాజ్యమును నెలకొలిపి, జరతుష్ట్రమతమునకు ప్రముఖతను కల్పించు కాలముననే భారతదేశమున బౌద్ధమతము రూపుగొనెను. ఈ మతసంస్థాపకుడు గౌతమబుద్ధుడు [చూ. భారతదేశ చరిత్ర]. ఈతని కాలమును గురించి అభిప్రాయభేదములు ఉన్నను, క్రీ. పూ. 560 లో బుద్ధుడు జనించి, క్రీ. పూ. 480 లో నిర్యాణమొందెనను విషయమున పలువురు ఏకాభి ప్రాయులై ఉన్నారు. చారిత్రకముగ ఇతనిని గురించియు, ఇతని సమకాలికులగు రాజులను గురించియు వివరములు బౌద్ధగ్రంథములవలన తెలియవచ్చుచున్నవి. వైదికధర్మ మున గల లోపములను ఖండించి, ప్రజలకు ఒక నూతన మార్గమును బుద్ధుడు ఈ మతము మూలమున ప్రవచించెను. యజ్ఞాదులందలి జంతుబలిని, ఆచారకాండను ఇతడు నిరసించెను. భగవదస్తిత్వమును గురించిన తర్జనభర్జనలలో అతడు జోక్యము వహింపక మానవ జీవితమునకు పరమ శాంతిని చేకూర్చు ఆర్యమార్గమును ప్రవచించెను. తక్కిన అన్నివిషయములందును, అనగా పునర్జన్మ, కర్మఫలాను భవము, వివిధ దేవతాగణములు మొదలగువాని సందర్భ మున, సంప్రదాయానుగతముగ వైదికార్యులలో ప్రచలిత ములుగ ఉండిన భావములనే అతడు స్వీకరించినను, అహింసా ధర్మమునకు అతడు అనితర ప్రాముఖ్యమును కల్పించెను. అత్యంత క్లేశకారకమగు జప, తప, నియమ, వ్రతానుష్ఠాన ముతో పాటుగ దేహాత్మవాదులు ఆశించు నీతిదూరమగు భోగలాలస జీవితమును కూడ అతడు నిరసించి మధ్య మార్గమును చేపట్టెను. మానవ జీవితధ్యేయము నిర్వాణ మని అతడు పేర్కొనెను. కాని, ఆ నిర్వాణము అనుభవ మాత్రవేద్యమని అతడు నిర్వచించి, దుఃఖమయమగు

సంసారచక్రమునుండి విడివడుటకు సర్వజనసాధ్యమగు ఆర్యాష్టాంగ మార్గమును బోధించెను. సమ్యగ్దృష్టి, సమ్యక్సంకల్పము, సమ్యగ్వాక్కు, సమ్యక్కర్మము, సమ్యగాజీవము, సమ్యగ్వ్యాయామము, సమ్యగ్విచారము, సమ్యక్సమాధి అను ఎనిమిది అంగములు గల ఈ మార్గమును అనుసరించి ఏ మానవుడైనను, జాతి వర్ణ విచక్షణలతో నిమిత్తము లేకుండ నిర్వాణము పొందగలడని బుద్ధుని సందేశము. ఈ సందేశమును లోకమున వ్యాపింపజేయుట ధర్మచక్రప్రవర్తనమునకు తోడ్పడుట అగునని అతడు ఉపదేశించి, అందులకై సుశిక్షితులగు శిష్యులను సంఘముగ రూపొందించెను. ఇటుల ఈ ప్రచారభారమును వహించిన వారికి భిక్షుకులను వ్యవహారము కలిగినది. ప్రపంచమున తొలుతగ మతప్రచారమునకై సంఘముల నిర్మించినది గౌతమబుద్ధుడే. స్త్రీలు క్రమముగ భిక్షుణీసంఘములుగ ప్రత్యేకముగ ఏర్పాటై, బౌద్ధధర్మప్రచారము చేయుటకు బుద్ధుడు అనుమతించెను.

బుద్ధుని జీవితకాలమున అతని ఉపదేశములకు సంకలిత రూపము ఏర్పడలేదు. అతని పరినిర్వాణానంతరమున రాజగృహమందు బౌద్ధభిక్షువుల 'సంగీతి' (సమావేశము) జరిగినది. ఇదియే బౌద్ధచరిత్రలో ప్రసిద్ధివహించిన ప్రథమ సంగీతి. ఇచ్చట కొన్ని నిర్ణయములు జరిగి బుద్ధుని ఉపదేశములకు ఒక సంకలితరూపము ఏర్పడినది. కాని, ఆ తరువాత వందఏండ్లయినను ముగియక మునుపే బుద్ధుని ఉపదేశముల వివరణ విషయమున అభిప్రాయభేదములు ఏర్పడి సామరస్యసాధనకై కొందరు భిక్షుకుల ఆధ్వర్యవమున వైశాలిలో ద్వితీయ సంగీతి జరిగినది. కాని, బౌద్ధమతమందు చీలికలు కలుగుటను ఇది ఆపలేక పోయినది. తరువాత అశోకుని కాలమున వేరొక సంగీతి జరిగినది. ఈ సంగీతిలో బుద్ధుని ఉపదేశములకు ప్రామాణిక రూపమును ఏర్పరచుటకు కృషి జరుగుటయేకాక, విదేశములందును బౌద్ధమత ప్రచారము జరుప నిర్ణయము జరిగినది. అశోకుని కృషిమూలమున భారతదేశమున నలుదిక్కుల బౌద్ధమతము వ్యాపింపగలిగినది. కాలక్రమమున సింహళములోను ఈ మతము వ్యాప్తిని పొందినది. తరువాత పూర్వపు మూడు సంగీతులలో ప్రామాణికములుగ నిర్ణయింపబడిన ఉపదేశములును, ఆచార్యపరంపరాయత్తములై మౌఖికముగ నాటివరకు వచ్చిన ఇతర ఉపదేశములును తొలుతగ సింహళములో లిపిబద్ధములు చేయబడినవి. ఇదియే పాళిభాషలోని 'త్రిపిటకము'.

మౌర్యవంశ పతనానంతరమున బ్రాహ్మణమతము మరల భారతదేశమున విజృంభించినను బౌద్ధమతమునకు ప్రజలలో ఆదరణతగ్గలేదు. తరువాత యవన (గ్రెకో-బాక్ట్రియన్) రాజులు వాయవ్యభారతదేశమును ఆక్రమించిన కాలమున వారి ఆదరణము బౌద్ధమతమునకు చేకూరినది. వారిలో ముఖ్యుడు మిళిందుడని సంస్కృతమున వ్యవహరింపబడిన మినాండర్. యవనుల తరువాత ఆ ప్రాంతమును పాలించిన కుషానులును బౌద్ధమతమును ఆదరించిరి. కుషాను ప్రభువులలో ప్రముఖుడగు కనిష్కుని ప్రోత్సాహఫలితముగ నాలుగవ సంగీతి సమావిష్టమైనది. ఈ కాలముననే 'మహాయానము' అను ప్రత్యేక బౌద్ధమతవాదము దక్షిణభారతదేశమున రూపొంది క్రమముగ ఉత్తర భారతదేశమున వ్యాపించెను. ప్రాచీన సంప్రదాయమునకు అంతటినుండి 'హీనయానము' అను వ్యవహారము కలిగినది. ఈ విభజన క్రీ. శ. రెండవశతాబ్దిలో మొదలిడెనని భావించుటకు అవకాశములు కలవు. ప్రతిప్రాణిలోను బుద్ధాంకురము ఉన్నదనియు, ప్రతిజీవి బుద్ధుడు కాగలడనియు, అటుల ప్రతిజీవికిని బుద్ధత్వము చేకూరువరకు సాధకుడు తన వ్యక్తిగత మోక్షాదులను సైతము ఉపేక్షించి లోకచర్యాసాధనలోను, పరోపకార సాధనలోను మునిగి ఉండవలెననియు మహాయానము చాటెను. కాని, ఈ లక్ష్యసాధనకై వినయ (భిక్షు నియమముల) పాలనమును మహాయానము కొంత సడలించెను. దీనికి తోడుగ ఆ కాలముననే బుద్ధవిగ్రహారాధనయు ఆరంభమయ్యెను. తొలుతటి బౌద్ధమతమున ధర్మసంకేతముల ఆరాధనమే కాని బుద్ధుని విగ్రహ పూజకు తావేలేకుండెను. మహాయానమున బుద్ధవిగ్రహములతో పాటుగ తక్కిన అల్పదేవతలకును, బుద్ధత్వస్థాయికి సన్నిహితులుగ భావింపబడు బోధిసత్త్వులకును విగ్రహము లేర్పడి, పూజాదులు జరుగుట మొదలిడెను.

బౌద్ధమతము ఇటుల భారతదేశమున వివిధరూపముల పరిణతి చెందుచుండిన కాలమున బ్రాహ్మణుల ఆధ్వర్యవమున వైదికమతము సైతము పలుమార్పులను పొందెను. తొలుత యజ్ఞయాగాదులకు గల ప్రాశస్త్యము అంతటినుండి అంతరించి క్రమముగ భక్త్యారాధనలవలన పరమేశ్వరుని చేరుటకు మార్గము కలదను భావము బలపడసాగెను. ఆరాధనకు సులభసాధనముగ భగవానునికి మూర్తికల్పనము ఆదరణీయమయ్యెను. ఇటుల మూర్త్యారాధనమును ప్రోత్సహించిన వారిలో తొలుతటివారు భాగవతమతానుయాయులని కొందరి అభిప్రాయము. క్రీ. పూ. రెండవ శతాబ్దినాటికే 'పాంచరాత్రాగమము' అను ప్రామాణికగ్రంథము ఆధారముగ భాగవతమతము ఉత్తర భారతదేశమున ప్రచారమున ఉండెను. బేస్‌నగర్ వద్ద కనుగొనబడిన ఒక శాసనమును అనుసరించి క్రీ. పూ.

రెండవ శతాబ్ది చరమపాదమున వాసుదేవ ప్రీత్యర్థమై, హెలియోదరస్ అను పేరు కలిగిన భాగవతమతాను యాయి గరుడధ్వజస్తంభమును విదిశానగరమున ప్రతిష్ఠి తము చేసెనని తెలియవచ్చుటవలన భాగవతమతము ఆనాడు భారత దేశమునకు వలసవచ్చిన గ్రీక్ లందు సైతము వ్యాపించెనని భావించుటకు అవకాశము కలదు. ఇటులే శివునికి ప్రాముఖ్యమును ఇచ్చు పాశుపతాదులును ఆ కాలముననే రూపుగొని దేశమున వ్యాపించినవి. వీని అన్నింటి సంకలితరూపమే పౌరాణికమగు హిందూ మతము. ఈ మతము ఆనాటి బ్రాహ్మణుల కృషివలన భారత దేశముననేకాక ప్రాచ్య ఆసియాలోని భారతీయుల వలసలందు బర్మా మొదలుగ ఇండో - చీనావరకు వ్యాపించి నది. పౌరాణిక హిందూమతము చూపించిన ఒరవడిని అనుసరించి బౌద్ధమత మహాయానశాఖయు ఆ దేశములకు ఆనాడు కాలక్రమమున వ్యాపించినది.

క్రీ. శ. రెండవశతాబ్ది మొదలుగ ఏడవ శతాబ్దివరకు భారత దేశమున మహాయాన బౌద్ధమతము సుప్రతిష్ఠితమై ఉండినది. కాని, ఆ కాలముననే పౌరాణిక హిందూమతము కూడ భారత దేశమున గుప్తాది రాజవంశముల ఆదరణమున వ్యాప్తిని పొందినది. ఈ రెండును మూర్త్యారాధననే ఆశ్రయించుటవలన క్రమముగ వీనియందలి భేదముల ప్రాముఖ్యము సామాన్యుల దృష్టిలోనే కాక పండితుల దృష్టిలో సైతము అంతరింపసాగినది. క్రీ. శ. ఏడవ శతాబ్దిలో హుయాన్‌స్యాంగ్ భారత దేశమును దర్శించిన కాలమున బౌద్ధమతాభిమాని అగు హర్ష చక్రవర్తి సైతము బుద్ధవిగ్రహాదులతోపాటుగ హిందూ పౌరాణిక దేవతలను అర్చించుట అతడు కనుగొనెను.

ఇటుల భారతదేశమున క్రమముగ బౌద్ధము తన ప్రత్యేకతను కోల్పోవుచున్న సమయముననే తక్కిన దేశములందు అది బలపడసాగినది. మౌర్యచక్రవర్తి అశోకుని కాలముననే విదేశములలో బౌద్ధమతప్రచారము మొదలిడబడినటుల సంప్రదాయ గ్రంథములు పేర్కొను చున్నను, సింహళమునతప్ప తక్కినదేశములందు ఎచ్చటను అది అంతగ తొలుతలో ఫలప్రదమైనటుల కన్పట్టదు. కాని, క్రైస్తవ శకారంభకాలము మొదలుగ మహాయాన బౌద్ధ మతము మధ్య ఆసియాకును, అటనుండి చీనాదేశమునకే కాక సముద్రమార్గమున దూరప్రాచ్య భూములకును వ్యాపించెను. ఈ మతప్రచార కృషియందు కాశ్మీరము ప్రముఖస్థానమును ఆక్రమించినది. కాశ్మీర దేశమున విద్యను అభ్యసించిన కుమారజీవుడు (మ. క్రీ. శ. 412) సంస్కృత బౌద్ధగ్రంథములను పెక్కింటిని చీనీయభాషలోనికి అనువ దించెను. కాశ్మీరరాజ వంశికుడై, భిక్షుకధర్మమును ఆశ్ర యించిన గుణవర్మ (క్రీ. శ. 5 వ శతాబ్ది) జావాద్వీపమున మహాయాన బౌద్ధమతమును వ్యాపింపజేసెను. చీనాయందు స్థావరమును ఏర్పరచుకొనిన బౌద్ధమతము క్రమముగ అటనుంచి ఈ యుగముననే కొరియాకును, జపాన్‌నకును వ్యాపించెను. ఇటుల మహాయానము ఆసియాయందు అంతటను వ్యాపించుచుండినను, సింహళము మాత్రము హీనయానముచే అవలంబించి బౌద్ధమత ప్రాచీనరూపమును కొంతవరకు కాపాడగలిగినది.

చీనాయందు బౌద్ధమతము వ్యాపించుటకు ముందుగ ఆదేశమున కన్‌ఫ్యూషియస్, టావో మతములు విపుల వ్యాప్తిని పొంది ఉండినవి. వీనిని రెంటిని మతములని అనుటకన్న జాతీయ జీవనవిధానములని అనుటయే సము చితము. వీనిలో తొలుతటి దానిని నెలకొల్పిన కన్‌ ఫ్యూషియస్ (కుంగ్ ఫూ - చీ ర. 551 - 479 క్రీ. పూ.) దృష్టిలో మానవుడు సంఘసుస్థిరతకై నిర్వర్తించవలసిన విధులే అనితర ప్రాముఖ్యమును పొందినవి. జన్మ, మృత్యు రహస్యములను గురించి కాని, ఈశ్వర స్వరూపమును గురించి కాని అతడు చర్చింపలేదు. సరియైన పరిపాలకుని వలన సంఘమున సుస్థిరతయు, మానవ పురోగతియు సాధ్యములు కాగలవని అతడు విశ్వసించెను. పరస్పర శ్రేయోభిలాషులై మానవులు సంఘమున మనగలుగుట ధ్యేయముగ గ్రహించి అతడు మానవులు అవలంబింప వలసిన విధులను నిర్వచించెను. దాదాపుగ ఇతనికి సమ కాలికుడగు లావ్ - చీ, టావో మతమును నెలకొల్పెను. ఇతని మతమున మానవుడు సర్వస్వతంత్రుడు; సంఘము, రాజరికము అను వానికి మానవుని స్వేచ్ఛను అరికట్టుటకు అధికారము లేదు; సృష్టివ్యవస్థా నియమములకు ఆధార మగు మూలధర్మము (టావో)ను గుర్తించి తదను సార ముగ జీవితమును తీర్చిదిద్దుకొనుట వలననే శాంతిని, పరి పూర్ణతను మానవుడు పొందుగలుగునని లావ్ - చీ బోధిం చెను. ఈ విధముగ కన్‌ఫ్యూషియస్ సంఘబద్ధ జీవితమును, అందుకు విరుద్ధముగ లావ్ - చీ ఏకాంత, స్వయంతుష్ట జీవితమును తమ ధ్యేయములుగ పేర్కొనినను, ఈ రెండు సిద్ధాంతములకును చీనీయప్రజల ఆదరణ లభించినది. కాని, బౌద్ధమతము ప్రవేశించిన తరువాత ఆ మతమునందలి సరళతయు, పూజావిధానమును చీనీయుల హృదయము లను లోగొనగలిగినవి. జాతీయమతముల ప్రతిపత్తికి భంగము కలిగించిన బౌద్ధమును దేశమునుండి తరిమివేయు టకు కొందరు ప్రభువులు యత్నించినను, ఈ ప్రతిరోధము లను ఎదుర్కొని చీనాదేశమున ఆ మతము కాలు నిలువ

ద్రొక్కుకొనుటయే కాక, తన సహన వైఖరి వలన కన్‌ఫ్యూషియన్, టావో మతములను తనలో చాల వరకు లీనము చేసికొనినది. కొన్ని ఎడల కన్‌ఫ్యూషియన్, టావో మతములు బౌద్ధమతాచారముల గ్రహించినవి. కడకు కన్‌ఫ్యూషియన్, టావో మతములతో కలసి మెలసి, చీనీయ జాతీయజీవనమున బౌద్ధమతము స్థానమును ఏర్పరచు కొనినది.

జైన మతము : భారతదేశమున బౌద్ధమతము ఉద్భవించిన కాలముననే జైనమతమును రూపొందినది. ఈ జైనమతము అతి ప్రాచీనమనియు, పౌరాణిక పురుషుడగు ఋషభునితో అది మొదలయ్యెననియు ఆ మతానుయాయులు చెప్పుచున్నారు. చారిత్రకముగ దాని ఉనికి మహావీరుని (క్రీ. పూ. 540 ? - 468 ?) కాలమునుండి మాత్రమే తెలియనగుచున్నది. అహింసా ధర్మబోధన మహావీరుని ముఖ్య లక్ష్యము. కర్మసిద్ధాంతమును ఇతడును అంగీకరించెను. జీవము, అజీవము అను రెండు తత్త్వముల సమ్మేళనమే ప్రపంచమని అతడు నుడివెను. ఈ మతము భారత దేశమున పలుప్రాంతములందు కొలది మార్పులతో వ్యాప్తినొంది, ఈ యుగాంతమున పశ్చిమ భారతదేశమునను, దక్షిణ భారతదేశమున కర్ణాటకప్రాంతముననువిరివిగ వ్యాప్తిలో ఉండినది. అయినను భారతదేశావధులను అతిక్రమించి ఈ మతము ఏనాడును వ్యాప్తిని పొందలేదు.

క్రైస్తవ మతము : పైన పేర్కొనిన మతములు రూపొందిన తరువాత చాలకాలమునకు క్రైస్తవమతము రూపొందినను, ఆ మత స్థాపకుడగు జీసస్ క్రీస్తు (క్రీ. పూ. 4 ర - క్రీ. శ. 30) ను గురించిన చారిత్రక విశేషములు బాగుగ తెలియవచ్చుటలేదు. యూదజాతికి చెందిన ఒక కుటుంబమున అతడు జన్మించెను. యూదమతము ఏకేశ్వరారాధనను అవలంబించిన ప్రాచీన మతమను విషయము ఇదివరకే ప్రసక్తితమైనది [చూ. పు. 25]. కాని, ఆ ఏకేశ్వరునికి ప్రియతమమైనది తమ యూదజాతియే అని వారు భావించి, తన్మూలమున తక్కిన జాతుల ప్రజలతో సామరస్యమున మెలగజాలక విరోధమును కొనితెచ్చికొనిరి. అందువలననే తరతరములుగ - ఈజిప్టుసామ్రాట్‌లు మొదలుగ - తమ సన్నిహిత రాజ్యముల ప్రభువులచే వారు పీడింపబడి, పలు దురాగతముల పాలైరి. క్రీస్తు జనించునాటికి యూదులు రోమన్‌ల పాలనలో ఉండి, బానిసత్వమునుండి తమకు విముక్తిని చేకూర్చు ప్రవక్తకై ఎదురు చూచుచుండిరి. అట్టి చారిత్రక పరిసరములలో జీసస్ క్రీస్తు ప్రవచించిన మార్గము ఒక నూతనమగు ధర్మ రాజ్యమునకు త్రోవతీయగలుగునని కొందరు విశ్వసించుటయు, అట్టి భావనయే కొందరు యూదమతపు పెద్దలకు క్రోధకారణము అగుటయు, తన్మూలమున రాజద్రోహ నేరము ఆరోపింపబడి, క్రీస్తు శిలువపై మరణశిక్షకు పాలగుటయు సహజపరిణామములుగనే కన్పట్టును. కాని, క్రీస్తు ప్రవచించిన మార్గము ప్రత్యేకముగ యూదజాతి విశిష్టత కొరకు ఉద్దేశింపబడినదియే కాక, విశ్వజనీనమగు శ్రేయమును ఆకాంక్షించునది అగుటవలన దానికి ఒక ప్రత్యేక ప్రాధాన్యము సిద్ధించినది. యూదులందు సంప్రదాయముగ వచ్చు ఆచారములలో ఉచితములగు వానిని అతడు త్రోసిపుచ్చలేదు; వారి పౌరాణిక గాథలను సైతము అతడు నిరాకరింపలేదు. కాని, వానిని అన్నింటిని అధిగమించినది అతని నైతిక సందేశము. అతని బోధనలలో అత్యంత రమణీయమై, ఉత్కృష్టతమ స్థానమొందినది పర్వతోపదేశము (సెర్మన్ ఆన్ ది మౌంట్). అందు అతడు తన ఆదర్శప్రపంచపు రూపురేఖలను చిత్రించెను. దీనులదే స్వర్గరాజ్యమనియు, శోకోపహత జీవులకు దిక్కుచూపు ఆశాజ్యోతి ఒకటి కలదనియు, ధర్మజిజ్ఞాసువులై తపించువారి ఆకాంక్షలు సఫలీకృతములు తప్పక కాగలవనియు, కరుణాయుత జీవనుడే భగవత్కృపాపాత్రుడనియు, పవిత్రహృదయులు మాత్రమే భగవానుని దర్శింపగలరనియు, ప్రపంచ శాంతిసంధాతలే పరమేశ్వరుని అనుంగు బిడ్డలనియు, ధర్మరక్షణ కొరకై బాధలను పొందువారలదే స్వర్గరాజ్యమనియు అతడు ఆ ఉపదేశమున వివరించెను. ఈ ఉపదేశము ఆనాటి అతని పరిసరములలోని దళిత ప్రజలకు అందరికిని ఒక నూతనమైన ఆశను రేకెత్తించెను. శత్రువులను ప్రేమించి, ద్వేషమును ప్రేమతో ఎదుర్కొనవలెనని అతడు విధించిన నైతికమార్గము ఆచరణయందు కష్టసాధ్యమే అయినను, నిస్సహాయులగు వారికి ఏకైక ఆచరణసాధ్య మార్గముగ కన్పట్టినది. తొలుత ఈ మతము యూదులందు మాత్రమే వ్యాప్తియందు ఉండినది. క్రీ. శ. 66 లో రోమన్ చక్రవర్తిపై యూదులు తిరుగుబాటును లేవదీసిన ఫలితముగ యూదజాతి అడచివేయబడి వారి పవిత్రనగరమగు జెరూసెలెమ్ నిర్మూలింప బడుటతో తక్కిన యూదులవలనే క్రైస్తవులును పాలకుల ఆగ్రహమునకు గురియై మనవలసి వచ్చినది. ఇట్టి పరిస్థితులలో గ్రీక్ జాతీయుడగు పాల్ ఈ మతమును అవలంబించి, తన కృషిమూలమున యూదేతరులను పలువురను ఆ మతమున చేర్చెను. కాని, ఆ తరువాత చాలకాలమువరకును రోమన్ సామ్రాజ్యమున క్రైస్తవులు అత్యల్పసంఖ్యాకులుగనే ఉండిరి. చక్రవర్తి ఆరాధన మొదలగు విషయములను కొన్నిటిని వారు అంగీకరింపకపోవుటచే రోమన్

పాలకులు క్రైస్తవమత బోధకులను తీవ్ర శిక్షల పాలు చేయుటయు ఆనాడు జరుగుచుండెడిది. కాని, క్రీస్తు అనంతరమున మూడు శతాబ్దములలో తమ పట్టుదలవలనను, తమ ఆదర్శయుత జీవనమువలనను క్రైస్తవమత ప్రచారకులు రోమన్ సామ్రాజ్యమున సామాన్య ప్రజలలో పలువురయందు తమ మతమును వ్యాపింపజేసి, సామ్రాజ్యమున దానిని ఒక ముఖ్యమతముగ పరిగణనకు తేగలిగిరి. మొత్తపు ప్రజానీకమున అప్పటి క్రైస్తవులసంఖ్య నూటికి పదిని మించకపోయినను, క్రైస్తవవర్గము ఆనాడు సుసంఘటితమై ఉండినది. అట్టి పరిస్థితులలో సామ్రాజ్య స్థిరత్వమునకై కృషిచేయుచున్న కాన్‌స్టాన్‌టైన్ చక్రవర్తి ఈ సుసంఘటితవర్గపు ఆదరణను ఆర్జించుటకై క్రైస్తవ మతమును ఆదరించెను (క్రీ. శ. 312). తదాదిగ రాజాదరణ వలన ఈ మతము సామ్రాజ్యములోని తక్కినమతములను ఆవలకు నెట్టి ఆ సామ్రాజ్యమున ఏకైకమతముగ వన్నెకు రాగలిగెను.

ఇటుల రాజాదరణను ఆర్జించి ప్రజానీకమున త్వరిత గతిలో ఈ మతము వ్యాపించెడు కాలముననే, మత మూలభావముల వివరణమున మతబోధకులలో కలిగిన అభిప్రాయభేదములవలన క్రైస్తవమతమునందు ద్వివిధ శాఖలు ఉదయించినవి. వీనిలో అరియస్ అను నతడు ఒక శాఖకు ప్రచారకుడు. రెండవదానికి అతనేసియస్ అను నతడు పెద్ద. క్రైస్తవమతమునకు ప్రమాణగ్రంథముగ బైబిల్‌నే వీరు ఇరువురును అంగీకరించినను, క్రీస్తుయొక్క ప్రతిపత్తినిగురించి వీరిరువురకు అభిప్రాయభేదములు ఏర్పడినవి. ఈశ్వరుని విభూతి త్రివిధమూర్తులందు ప్రతిష్ఠితము అయినదనియు, అవియే క్రమముగ పితృరూప పరమేశ్వరుడు (గాడ్ ది ఫాదర్), పుత్రరూప పరమేశ్వరుడు (గాడ్ ది సన్), పవిత్రాత్మరూప పరమేశ్వరుడు (గాడ్ ది హోలీ ఘోస్ట్) అని వ్యవహరింపబడుచున్నవని క్రైస్తవులు అందరును అంగీకరింతురు. వీరిలో పుత్రరూపక పరమేశ్వరుడే జీసస్ క్రీస్తు. ఈ మూర్తిత్రయములోని ప్రతి ఒకరును సమాన ప్రతిపత్తిని కలిగి ఉన్నారని అతనేసియస్ వాదము. అట్టివాదము లోపపూరిత మనియు, పితృరూప పరమేశ్వరునికి కల ఆధిక్యము జీసస్ క్రీస్తునకు లేదనియు అరియస్ బోధించెను. ఈ తగవును పరిష్కరించుటకై క్రీ. శ. 325 లో ఆసియామైనర్‌లోని నిశీ నగరమున కాన్‌స్టాన్‌టైన్ చక్రవర్తి క్రైస్తవ మత పండితుల సమావేశమును జరిపెను. అందు అరియస్‌వాదము నిరాకరింపబడి, అతనేసియస్‌వాదము పరిగృహీతము అయ్యెను. అంతటినుండి రాజశాసన మూలమున అతనేసియస్ వాదపు క్రైస్తవమతమే ఆదరింపబడి తద్విరుద్ధమగు వాదమునకు తావు లేకుండ చేయబడెను.

రోమన్ సామ్రాజ్యము వ్యాపించు కాలముననే క్రైస్తవమతము పారసీకము, ఆర్మీనియా మొదలగు ప్రాచ్యభూములందును వ్యాపించినది. భారతదేశపు తీర భూములందును కొందరు క్రైస్తవమత ప్రచారకులు ఆ యుగమున తమ మతమును కొలదిగ వ్యాపింపజేయ గలిగిరి. పారసీకములోని జరతుష్ట్రమతానుయాయులగు ప్రభువులు అచ్చటి క్రైస్తవుల ఎడ అవలంబించిన ద్వేషమే రోమన్‌లకు ససానియన్‌లతో జరిగిన యుద్ధములకు ఒక విధమగు కారణముగ నైతము పరిణమించెను. కాని, తుదకు ఈ సామ్రాజ్యములు రెండును మతసహిష్ణతయే ప్రపంచ శాంతికి మూలమని గ్రహించి ఆ మత యుద్ధములకు స్వస్తి చెప్పినవి.

రోమన్‌సామ్రాట్‌ల పోషణమును ఆర్జించి పురోగమించిన క్రైస్తవమతము క్రమముగ తన పూర్వపు సాధు జీవితమునుండి దూరము కాదొడగినది. ఇట్టి పరిస్థితులలో దానిని సంస్కరించుటకై సాధుజీవనులగు కొందరు క్రైస్తవులు యత్నించిరి. ఇట్టివారిలో ముఖ్యుడు బెనెడిక్ట్ (క్రీ. శ. 480 ? - 543 ?) అను రోమన్ జాతీయుడు. అతడు సంపన్నుడయ్యును, సంపదలను త్యజించి, సాధు జీవనమును అవలంబించి, పర్వతారామమున వసించి, క్రైస్తవమత మూలాధారమగు విశుద్ధవర్తనను బోధింప సాగెను. ఇతనిచే ఆకర్షితులై పలువురు విద్యావంతులు ఈతనిని అనుసరించిరి. వీరికి 'మంక్‌లు' అను వ్యవహారము కలిగెను. బౌద్ధమతపు భిక్షుకులవలెనే వీరును ధర్మావలంబన, ప్రచారములనే తమ లక్ష్యములుగ గ్రహించిరి. మంక్‌ల సంఘముల ఆవాసములకు మొనాస్టరీ (మఠము)లు అను వ్యవహారము కలిగెను. ఈ మంక్‌ల సంఘముల ఆచారరీతిని నియమించుచు బెనెడిక్ట్ ఒక క్రమశిక్షణను లిఖితరూపమున విధించెను. దినమున దాదాపు ఏడు గంటలకాలము ఈ మంక్‌లు కాయకష్టము చేయవలసి ఉండెడిది. తక్కినకాలమున దాదాపు సగము పఠన పాఠనములకును, ప్రార్థనలకును వినియుక్తము అయ్యెడిది. బెనెడిక్ట్ సూచించిన ఒరవడిని అనుసరించి క్రైస్తవ ప్రపంచమునందు అంతటను క్రమముగ ఇట్టి మొనాస్టరీలు పెక్కు స్థలములందు వెలసినవి. మంక్‌లవలెనే ధర్మయుత జీవనమును అవలంబింపదలచిన స్త్రీలకు 'కాన్‌వెంట్‌లు' అను పేర సంస్థలు వెలసినవి. ఆనాటి విద్యాప్రచారమునకు ఈ మొనాస్టరీలే కాలక్రమమున ముఖ్యకేంద్రములుగ పరిణమించినవి. ప్రాచీన సారస్వతమున అత్యధిక భాగము

ఈ మొనాస్టరీల గ్రంథాలయములందు భద్రపరుపబడుట వలననే తరువాతి తరములవారికి అది ఉపలబ్ధము కాగలిగినది. మతప్రచార విషయమున ఈ మొనాస్టరీలు చాల కృషిచేసినవి. ఉత్తర యూరప్‌లోని దుర్గమ భూములకు పయనించి పలువురు మంక్‌లు క్రైస్తవమత వ్యాప్తికి ఆకాలమున నిరంతర కృషిచేయుటవలననే, కాలక్రమమున యూరప్‌నందు అంతటను క్రైస్తవ మతము వ్యాపింపగలిగినది.

ప్రభుత్వ వ్యవస్థాబలముచే క్రైస్తవమతము వ్యాపించిన కొలది ప్రభుత్వ వ్యవస్థవలెనే సోపానసరళిలో మతాధికార వ్యవస్థయు ఆ మతమున రూపొందినది. ఈ వ్యవస్థకు అంతకును కాలక్రమమున రోమ్‌లోని మత పీఠాధిపతి 'పోప్' అను సాధికార బిరుదముతో పెద్దరికమును వహింపగలిగెను. ఈ పోప్ పీఠమును ఆకాలమున అధిష్ఠించిన వారిలో గ్రెగరీ - I (క్రీ. శ. 540?-604) ప్రశంసనీయుడు. ఇతడు తొలుత మంక్‌లలో ఒకడుగ ఉండి తన ప్రతిభా విశేషమున పోప్ కాగలిగెను. రోమన్ సామ్రాజ్యప్రతిష్ఠ సన్నగిలిన కాలమున ఆనాటి సాంఘిక వ్యవస్థా భద్రతకొరకై ఈ గ్రెగరీ చేసిన కృషి ఇదివరలో ప్రసక్తము [చూ. పు. 48]. ఇతడు తన శీల సంపద వలనను, నిర్విరామ కృషివలనను క్రైస్తవమత వ్యవస్థయందేకాక రాజకీయ వ్యవస్థయందు సైతము పోప్‌నకు పలుకుబడి లభించు నటుల చేయగలిగెను.

**మాని మతము:** క్రైస్తవ మతము రూపొందియు, అంతగ వ్యాప్తిని పొందని కాలమున 'మాని' మతము అనునది రోమ్ మొదలుకొని పామీర్ పీఠభూమివరకు అటనట ఎక్కువగ వ్యాప్తిని కాంచి కొంతకాలము వర్ధిల్లినది. మని లేదా మనీష్ అని వ్యవహరింపబడువాడు ఈ మాని మతమును నెలకొల్పెను. ఇతడు క్రీ. శ. 215-216 న జన్మించెనని తెలియుచున్నది; ఇతడు బాబిలోనియా వాసి. క్రైస్తవ, బౌద్ధ, జరతుష్ట్రి మతములలోని ఉత్తమ లక్షణములను మిళితమొనర్చి ఈ మతమును ఇతడు రూపొందించెనని తద్‌జ్ఞుల భావన. భగవత్ సాక్షాత్కారము తనకు కలిగెననియు, ప్రవక్తలగు జరతుష్ట్రి, బుద్ధ, జీసస్ క్రీస్తు కోవలో తాను కడపటి ప్రవక్తననియు ఇతడు చెప్పుకొనెను. సామాన్య గృహస్థులకు ఒక విధమగు ఆచార కాండను, పండితులై ఇతరులకు మార్గదర్శకులుగ ఉండవలయు ఆచార్యులకు వేరొక కఠినతరమగు శిక్షణావిధిని ఇతడు ఏర్పరచెను. ఇరాన్ పాలకుడగు షాపూర్ - I చక్రవర్తి పట్టాభిషేక కాలమున (క్రీ. శ. 241-242) ఇతడు తొలుతగ తన మతధర్మముల వెలువరించెను. కాని, ఆదినుండియు జరతుష్ట్రి మతాచార్యులవలనను, క్రైస్తవ మత బోధకులవలనను ప్రతిరోధమును ఇతడు ఎదుర్కొనవలసి వచ్చెను. కడకు పారసీక ప్రభువు ఇతనిని జరతుష్ట్రి మతాచార్యులకు ఒప్పగింపగ అతనిని వారు శిలువవేసి, చర్మమును ఒలిపించి వధింపజేసిరి. అయినను, ఈ మతము సమకాలిక పారసీక, రోమన్ సామ్రాజ్యములలోని పండిత లోకమున పలువురను ఆకర్షింపగలిగినది. క్రీ. శ. 280 ప్రాంతమున ఈ మతము రోమన్ సామ్రాజ్యమున కాలూనగలిగి, 330 తరువాత త్వరితగతిలో వ్యాపించినది. కాని, క్రైస్తవ మతమునకు రాజాదరణ లభించిన ఫలితముగ, ప్రాచ్య, పశ్చిమ రోమన్‌సామ్రాజ్య పాలకులు ఈ మతమును నిషేధించుచు తీవ్రశాసనములను చేయుటచే క్రీ. శ. 6వ శతాబ్దిలో రోమన్ సామ్రాజ్యమున ఇది అంతరించినది. అయినను ఇస్లామ్‌మతము విజృంభించువరకు మధ్య ఆసియాలో ఈ మతము మనగలిగినది.

ఇటుల ఇన్ని మతములు ఆనాడు రూపొంది వికసనము పొందినను, ప్రపంచ చరిత్రపై ఎక్కువ ప్రభావమును నెరపగలిగినవి - వీనిలో - జరతుష్ట్రి, బౌద్ధ, పౌరాణిక హిందూమత, క్రైస్తవములనుట నిర్వివాదాంశము. ఈ యుగాంతమునకు, అనగా - క్రీ. శ. 7వ శతాబ్దినాటికి - సమకాలిక నాగరక ప్రపంచమందు అంతటను తక్కిన మతములను అంతరింపజేసియో, లీనముల చేసికొనియో లేదా బలహీనములను చేసియో కడకు ఈ నాలుగు మతములే నిలువగలిగినవి.

**ఉపనిషత్తులు:** పైన పేర్కొనబడిన మత వికసనము ఆనాటి ఆధ్యాత్మిక భావ వికాసమునందు ఒక అంశముగ మాత్రమే పరిగణింపదగును. ఈ భావవికసనమున వేరొక ప్రముఖ భాగముగ పేర్కొనదగినది ఉపనిషత్తుల అవతరణము. బౌద్ధమతము రూపొందుటకు పూర్వమే భారత దేశమున కొన్ని ప్రముఖోపనిషత్తులు రూపొందిన విషయము వెనుకటి అధ్యాయమున తెలుపబడినది [చూ. పు. 17]. ఈ యుగమునను పలువురు దార్శనికుల కృషి మూలమున కొన్ని ఉపనిషత్తులు రూపొందినవి. వైదిక మత సారస్వతమున ఇవి భాగములుగ పరిగణింపబడుచున్నను, వీని లక్ష్యము విశ్వజనీనత. కేవల తాత్కాలిక ఫలదములగు వైదిక కర్మకాండల ప్రాముఖ్యమును సడలింపజేసి మానవుని అంతర్ముఖుని చేయుటలో అవి కృతకృత్యతను ఆర్జించినవి.

**భగవద్గీత:** ఇట్టి ఉదాత్త భావ వివరణముతోపాటుగ ఉపనిషత్కారులు ప్రకృతిపదార్థపు తత్త్వమును గురించియు వివేచన సల్పిరి. ప్రపంచము పృథివ్యాపస్తేజోవాయువు

ఆకాశములు అను పంచభూతములచే రూపొందినదను విషయము తొలుతగ ఉపనిషత్తులందే ప్రతిపాదితము. సాంఖ్య, యోగములను శాస్త్రములకును మూలభావములు ఆ ఉపనిషత్తులందుననే కననగుచున్నవి. ఆ మూలభావములను ప్రాపుగ గ్రహించి సాంఖ్య, యోగశాస్త్రములు వికసనము పొందినవి. సాంఖ్య, యోగాది శాస్త్రముల కృషిని మానవ జీవిత వ్యవస్థకు అనువర్తింపజేయుటకును, వానికి సమన్వయత చేకూర్చుటకును జరిగిన యత్నము మహాభారతేతిహాసములోని 'భగవద్గీత' యందు ప్రతిబింబితము అయినది [చూ. సం. 7 - పు. 581].

ఇట్టి దార్శనికచర్చ ఆనాడు భారతదేశముననే కాక తక్కిన దేశములందును పండితలోకమున విరివిగ వికసనము పొందినది. నాటి చీనీయచరిత్రయందు శత సంప్రదాయములు (చూ చూ - పై - చ్యా) అని పేర్కొనబడినవి ఇట్టివియే. కాని, వీనిలో కన్‌ఫ్యూషియస్, టావో, మో, ఫా చ్యా, ఇన్ యాంగ్ చ్యా, మింగ్ చ్యా అను ఆరింటికి మాత్రమే ఎక్కువ ప్రచారము లభించినది.

గ్రీక్‌లందును ఈ దార్శనికచింతన బాగుగ వికసించినది. కాని, ఉపనిషత్కారులవలె అలౌకికానుభూతికి గ్రీక్ దార్శనికులు ప్రాముఖ్యమును కల్పింపక, తార్కిక రీతిని అందగ గ్రహించి కృషిచేసిరి. వీరిలో సోక్రటీస్ (క్రీ. పూ. 470 - 399) నకు పూర్వులను గురించి మనకు తెలియవచ్చినది చాల స్వల్పము. ఇట్టి పూర్వదార్శనికుల వాదములను అన్నింటిని మరుగుపరచి, స్వీయప్రతిభచే ప్రాశ్చాత్య దార్శనిక ప్రపంచమున అజరామర పదవిని ఆర్జించినవాడు సోక్రటీస్. ఈతడు రచించిన గ్రంథమేదియు లేకున్నను, ప్లేటో (క్రీ. పూ. 428 - 348) అను పండితుని రచనలవలన సోక్రటీస్‌చే నిర్దేశింపబడిన దార్శనిక జీవితస్వరూపము మనకు విశదమగుచున్నది. గ్రీక్ దేవతల ఎడ తిరస్కార భావము చూపుటయే కాక, యువకుల మనములను కలుషితములు చేయుచుండెనను నేరము ఇతనిపై ఆరోపింపబడి, తత్ఫలితముగ ఏథెన్స్‌నగరమున ఇతడు మరణశిక్షకు గురి అయ్యెను. సోక్రటీస్‌ను అనుసరించిన ప్లేటో పండితుడు సర్వవిషయములకు సమన్వయ భావమును చేకూర్చగల ఒక ద్వంద్వాత్మక తార్కిక పద్ధతి (డైలెక్టిక్స్) ఉపయోగించి, సర్వవ్యాపక తత్త్వమును ఒకదానిని అంగీకరించెను. ఈ వాదమే అరిస్టాటిల్ (క్రీ. పూ. 384 - 322) పండితుని చేతిలో విశిష్టతను పొంది అధిభౌతికశాస్త్రముతో జోడింపబడినది. అరిస్టాటిల్ అనంతరమున గ్రీక్ దర్శనశాస్త్రము క్షీణదశను పొందినది [చూ. సం. 7 - పు. 379].

చార్వాక మతము : ఆధ్యాత్మిక భావ వికసనమును గురించిన ఈ సంక్షిప్త కథనమును ముగించుటకు ముందుగ ఈ భావములతో సామరస్యమూలమున సంబంధము ఏమియు లేకున్నను, వానితోకల వైరుధ్యబలముననైనను ఇట చర్చింపదగినది ఆనాడు జరిగిన నాస్తికమత వికసనము. లోకమును గ్రహించుటకు లోకాతీతవస్తువు సాయమును దేనిని గ్రహింప అవసరములేదను అభిప్రాయము దీనికి మూలము. ప్రాచీనయుగమందును ఈ నాస్తికత ఏదియో ఒక తీరున ప్రచారమునందు ఉండినదని విశ్వసించుటకు ఆధారములు కలవు. గ్రీక్ దార్శనికులలో ప్రాచీనులగు భౌతికవాదుల మతములందు దీని ఛాయలు కలవు. కాని, ఈ వాదమునకు ఒక సమగ్రసారస్వతము భారతదేశమున ఈ యుగమందు చార్వాకమత ప్రవర్తకుల వలన రూపొందినది. ఋగ్వేద మంత్రములలోనే ఈ మతమునకు బీజములు కలవని కొందరి అభిప్రాయము. చార్వాకమత సారస్వతము ఇపుడు అనుపలబ్ధము. కాని, తన్మతఖండనకై ప్రతిస్పర్థులచే ఉద్ధృతములగు తన్మత మూలసూత్రముల వలన దానిని గురించి నేడు తెలియనగుచున్నది. భౌతిక పదార్థముల సమ్మేళనమువలననే ప్రాణము ఏర్పడుచున్నదనియు, దేవతల సహాయము అపేక్షింపకనే ప్రకృతి తనంతట తానే అన్నిటిని సృజించుచున్నదనియు, ఈశ్వర, పరలోకముల అస్తిత్వమందలి నమ్మిక సత్యవంచనమనియు, సంపదయు, భోగమును మానవజీవిత లక్ష్యములనియు, మరణము సమస్తమును అంతమొందించుననియు ఈ చార్వాకమతము బోధించినది. ఈ మతస్థాపకుడగు చార్వాకుని గురించిన చారిత్రకాంశములు ఏవియు తెలియవు. కాని, క్రీ. పూ. రెండవ శతాబ్దికి ఈతడు పూర్వుడని భావించుటకు అవకాశములు కలవు. చార్వాకమతమునకే 'లోకాయత' మనియు పేరు కలదు. ససానియన్‌ల కాలమున పారసీకమున ఉండిన మజ్దక్ అను పండితుడును లోకాయత మతముతో అన్ని విధముల సామ్యము వహించు మతమును ఒకదానిని బోధించెను. కాని, ఇట్టి నాస్తికవాదములు అన్నియు ఆనాటి జరతుష్ట్రాది ప్రముఖ ఆస్తిక మతములకు పాలకులందు లభించిన ఆదరణవలన ఆ యుగము ముగియునాటికి నిశ్శేషముగ అంతరించినవి [చూ. సం. 7 - చార్వాకులు పు. 397].

## సంఘ వ్యవస్థ

ప్రాచీన యుగమున మతవ్యవస్థయు, సాంఘిక వ్యవస్థయు విడదీయరాని రీతిలో పరిణామము పొంది ఉండుట వెనుకటి అధ్యాయమున తెలుపబడినది [చూ. పు. 28].

కాని, ఈ యుగమున పైన తెలుపబడిన వివిధ మత, దార్శనిక భావనల ఆవిర్భావము వలన సంప్రదాయ వ్యవస్థలను యథాతథముగ అంగీకరించుటకు వైముఖ్యము ప్రజలందు అతిశయిల్లెను. తత్ఫలితముగ మానవుడు యుక్తాయుక్త విషయముల నిర్ణయమున తానే బాధ్యత వహించి ముందునకు పోవ ఉత్సహించెను. ఇందు వలన సాంఘిక వ్యవస్థ మతమునుండి కొంతవరకు వేరుపడుట తప్పనిసరి అయ్యెను. కాని, ఇటుల వేరుపడిన మతవ్యవస్థా నియమములను తమ ప్రతిపత్తికి దోహదకారులుగ వినియోగించుకొనదలచిన ప్రభువులును ఆనాడు కొందరు ఉండిరి. అందువలన మతదురభిమానముకూడ అటనట రూపొందుటకు ఆ యుగమున అనువగు పరిస్థితులు ఏర్పడినవి. ఈ క్రమ పరిణామమును అర్థము చేసికొనుటకు ప్రాతిపదికగ ఆ యుగమున జరిగిన రాజకీయ, సాంఘిక వ్యవస్థా పరిణామముల పరికించవలసి ఉన్నది.

నగర రాజ్యములు: ఈ యుగమున తొలుతగ ఒక మహాసామ్రాజ్యము పారసీకుల ఆధ్వర్యవమున రూపొందినదను విషయము ఇదివరలో తెలుపబడినది [చూ. పు. 39]. అనంతరమున గ్రీక్, మౌర్య, చీనీయ, రోమన్ సామ్రాజ్యములును ఈ యుగముననే అవతరించినవి. ఇటుల చరిత్రలో మహాసామ్రాజ్య వ్యవస్థలు ఏర్పడి తత్ఫలితముగ సాంఘిక వ్యవస్థలో మార్పులను కలిగించు కాలముననే స్వయం పరిపాలన కలిగిన నగర రాజ్యములును ఆనాడు కొన్ని మనగలిగినవి. ఇట్టివి ఆనాటి నాగరకప్రపంచమున భారత దేశాదులందును, యూరప్, ఉత్తర ఆఫ్రికా తీరములందును అటనట నెలకొని ఉండినవని తెలియుచున్నను, వీనిలో యూరప్‌నందలి గ్రీస్‌లోని నగరరాజ్యములను, అందును ఏథెన్స్‌నగర రాజ్యమును గురించిన వివరములు మాత్రమే సమగ్రముగ లభించుచున్నవి [చూ. పాశ్చాత్య రాజ్యాంగ వ్యవస్థ].

ఇట్టి నగర రాజ్యముల మనుగడ పరిసర భౌగోళిక పరిస్థితులమీదనే కాక ఆనాటి చారిత్రక పరిస్థితులమీదను ఎక్కువగ ఆధారపడి ఉండును. ఒక ప్రత్యేక రాజ్యముగ ఒక నగరము మనవలయుననిన, అందలి పౌరులకు కావలసిన జీవితావసరముల విషయమున అయ్యది స్వయం పోషకమై ఉండి తీరవలయును. కాని, ఏ నగర రాజ్యమును ఈ సమస్యను సంతృప్తికరముగ పరిష్కరింపలేకపోయినది. అందువలన ఇట్టి రాజ్యముల కలయిక తప్పక జరిగి తీరవలసిన సాంఘికావశ్యకత ఏర్పడెను. అట్టి పరిస్థితులను ఆధారముగ గ్రహించి బలిమియే సాధనముగ సామ్రాజ్యములు రూపుగొనినవి.

సామ్రాజ్య వ్యవస్థ: సామ్రాజ్యము బలవంతుల లేదా బలయుతమగు ఒక జాతియొక్క దురాశకును, అధికార వాంఛకును ప్రతిరూపమని అనుటలో అతిశయోక్తి లేకున్నను, అది ఆ కాలమున ఒక సాంఘికావసరమును తీర్చుటకు అవతరించినదని చరిత్ర రుజువుచేయుచున్నది. వివిధ మానవ వర్గములను సన్నిహితములనుచేసి, జీవితావసరముల ఉత్పత్తియందేకాక, సంస్కృతి సారస్వతాదుల వికసమునకును సామ్రాజ్యములు దోహదముచేసెను. సరియగు పరిపాలనాపద్ధతులు, రాకపోకల సాధనములు, ప్రజాశ్రేయస్సాధన మొదలగువానివలన ప్రజానీకమున సామ్రాజ్యము యెడల భక్తిశ్రద్ధల కలిగించుటకు సమర్థుడగు ప్రతి సామ్రాట్‌ను కృషిచేయుట ఆ సామ్రాజ్యచరిత్రలందు కననగును. అందువలన సామ్రాట్ సమర్థుడైనపుడు మాత్రమే సామ్రాజ్యము ఫలదాయకమై మనెడిది; అట్టి సమర్థుడు లేనపుడు అది అంతరించెడిది. ఈ యుగమున రూపొంది అంతరించిన సామ్రాజ్యముల చరిత్రలందు కననగు సామాన్య లక్షణము ఇదియే.

విశాల సామ్రాజ్యము ఏర్పడినపుడు దానిని పరిపాలించుటకు ఒక సమర్థమగు యంత్రాంగము ఉండవలెను. హాఖమనీషి వంశజుడగు దుర్యావుష చక్రవర్తి తన సామ్రాజ్యమును ఇరువది రాష్ట్రములు (క్షత్రములు) గ విభజించెను. వీనికి 'క్షత్రపవను' లు లేదా 'క్షత్రపు' లని వ్యవహరింపబడు ఉద్యోగులను నియమించెను. ఒక్కొక్క రాష్ట్రమునకు ఇట్టి ఉద్యోగులు ముగ్గురు ఉండెడివారు. వీరిలో ఒకడు పరిపాలనాబాధ్యతను వహించు పాలకుడు; రెండవవాడు సేనాపతి; మూడవవాడు రక్షకభటాధ్యక్షుడు. వీరు ముగ్గురును సమానప్రతిపత్తి కలిగి సార్వభౌమునికి బాధ్యతవహించి వర్తించెడువారు. ఇటుల సమానాధికారములు కల వీరు ఒకరిపై వేరొకరు గూఢచారిగ వ్యవహరించి దోషములను సార్వభౌముని గుర్తునకు తెచ్చెడివారు. ఇందులకు తోడుగ సార్వభౌమునికి ఒక చారశాఖ ఉండెడిది. ఇది రాజునకు కన్నువలె వ్యవహరించెడిదని ఆనాటి చరిత్ర రచయితలు పేర్కొనిరి. ఈ చారులు దేశమున పర్యటించి, అధికారుల చర్యలను గురించిన నివేదికలను సార్వభౌమునకు అందజేసెడివారు. మూడు ఖండములలో వివిధప్రాంతములను ఆవరించిన ఆ విశాల సామ్రాజ్యపు మారుమూలల నుండియు గుర్రపురౌతులు అంచెలవారీగా నివేదికలను సార్వభౌమునకు అందజేయుటకు అనువుగ సామ్రాజ్యమున ఒక కొననుండి మరియొక కొనకు రహదారులు ఆ యుగమున నిర్మింపబడినవి. రాజశాసనములు సామ్రాజ్యమునందలి ఇరానియన్, బాబి

లోనియన్, అరామిక్ వంటి ప్రముఖ భాషలతోపాటుగ స్థానిక భాషలలోకూడ ప్రకటితములు అయ్యెడివి. సామ్రాజ్యమునందలి వివిధజాతుల ప్రజలనుండియు ఉద్యోగులు నియమింపబడెడి వారు. సామ్రాజ్యమంతయు ఇటుల సామ్రాట్ యొక్క ప్రత్యక్షపాలనలో ఉన్నను, సార్వభౌముని సర్వాధిపత్యమును అంగీకరించి కప్పము చెల్లించుచు, ప్రముఖ నగరములు కొన్ని స్థానిక స్వపరిపాలనము కలిగి ఉండినవి.

పారసీక సామ్రాజ్యము నిర్వహింపబడిన తీరుననే దాదాపు తక్కిన సామ్రాజ్యములు ఆనాడు తమ వ్యవహారములను నిర్వహించినవి. పారసీక సామ్రాజ్యమును అంతమొందించి అలెగ్జాండర్ గ్రీక్ సామ్రాజ్యమును నెలకొల్పిన తరువాత, అతడును పారసీకుల పరిపాలనా పద్ధతులనే అవలంబించెను. మౌర్యచక్రవర్తుల పరిపాలనా విధానమును గురించి తెలిసికొనుటకు మెగస్తనీస్ వ్రాతలును, కౌటిల్యుని అర్థశాస్త్రమును మనకు ఉపకరించుచున్నవి. పాటలీపుత్ర నగరపాలనా విధానమును గురించి మెగస్తనీస్ వ్రాసిన విషయములు భారతచరిత్ర పాఠకులకు సుపరిచితములు. ఇట్టి నగరములందు అన్నింట దాదాపుగ అట్టి పరిపాలనా విధానమే ఆనాటి సామ్రాజ్యములలో అమలున ఉండెనని మనము ఊహింపదగును.

చీనీయ ప్రథమ సార్వభౌముడగు షిహ్ హ్వాంగ్-టీ యు తన సామ్రాజ్యమును పలు రాష్ట్రములుగ విభజించి, అందు సర్దారులకు బదులుగ వేతనమును గ్రహించు ఉద్యోగులను అధిపతులుగ నియమించెను. ఈ ఉద్యోగులను ఎన్నుకొని శిక్షణను ఇచ్చుటకు ప్రత్యేక వసతులను అతడు కల్పించెను. అతని తరువాత సామ్రాజ్యమును వశపరచుకొనిన హాన్ వంశీయులు ఈ ఉద్యోగులను పోటీపరీక్షలవలన ఎన్నుకొను విధానమును తొలుతగ ప్రవేశపెట్టిరి. ఇందువలన విద్యావేత్తలు అధికారమును గ్రహించి సువ్యవస్థిత పరిపాలనను నెలకొల్పుటకు అవకాశము కలిగెను. చీనీయ సామ్రాజ్యము ఎన్ని ఒడుదొడుకులకు లోనైనను, ఈ యుగాంతమువరకు ఇట్టి పరిపాలనయే కొనసాగినది.

సామ్రాజ్యములు రూపొందుకొలది అందలి జనసంఘమును వ్యవస్థీకరింపవలసిన ఆవశ్యకత ఏర్పడినది. ఇటుల వ్యవస్థీకరించుటలో ఆ యా ప్రాంతములందు స్థానికముగ ఉన్న వ్యవస్థానియమములను యథాతథముగ ఉంచుచు, సామ్రాజ్యభద్రతకు అవసరమైనంతవరకు మాత్రమే అందు మార్పులు చేయబడెడివి. ఏవియో కొన్ని అపవాదములు ఉన్నను, మొత్తముమీద ఈ యుగపు తొలుతటి భాగమున విజయమందిన జాతివారు ఓడిపోయినవారి విశ్వాసములను అంతరింపజేయుటకు బదులుగ వానిని తమ మత భావనలలో సంలీనమొనర్చుకొనుటకుకాని లేదా అట్టిది సాధ్యముకాని యూదమతము మొదలగు వానియెడల సహనభావము వహించి ఉండుటకాని జరిగినది. ఇటులే భారతదేశమున ఆర్యజాతి తక్కిన జాతులను క్రమముగ లోగొనినప్పుడు, వారి మతాచార విశ్వాసముల నేర్పుతో తనలో సంలీనము చేసికొనినది. సమకాలిక చీనాదేశమునను ఇట్టులే జరిగినది.

అయినను, ఈ పరిస్థితి చాలకాలము కొనసాగజాలక పోయెననియు, సామ్రాజ్యమునందు అంతటను ఒకే ఒక మతము వ్యాపింపజేయుట వలన సామ్రాజ్యమునకు భద్రత చేకూరగలదనియు భావించి ఒక్కొక్క సామ్రాట్ ఒక్కొక్క మతమును ఆదరించి, దానిని ప్రజానీకపు మతముగ చేయుటకు ఆకాలముననే అంకురార్పణ జరిగెననియు, ఇందులకు ఉదాహరణములుగ జరతుష్ట్రమతమును అభిమానించి తన శాసనములందు దానిని ప్రశంసించిన దుర్యొష-I చక్రవర్తిని, అటులే బౌద్ధధర్మమును కీర్తించిన అశోకుని పేర్కొనవచ్చుననియు కొందరు రచయితలు అభిప్రాయపడిరి. కాని, ఆ వాదమునకు తగిన ఉపపత్తి ఉన్నటుల కన్పట్టదు. వీరిలో అశోకుని శాసనములందు బోధింపబడినది సర్వమత సమ్మాననీయము; వైదిక మతానుయాయులకు సైతము అవిరుద్ధమునగు జీవితవిధానమే కాని పరమత విద్వేషముకాదు. పైగా ఆ ప్రభువు సమన్వయభావమే సర్వత్ర సాధుమార్గమగునని విశదముగ పేర్కొనెను. బౌద్ధమతమును ఆదరింపని అజీవకులకును అతడు సౌకర్యములను చేకూర్చెను. కావున అశోకుని కృషిని అతిమాత్రపు మతాభినివేశముగ పేర్కొనుట సమంజసము కానేరదు. ఇక దుర్యొష-I వంటి పారసీక సామ్రాట్‌లు తమ శాసనములందు అహురమర్దూ ఆధిక్యమును ప్రతిపాదించుచు, తాము ఆ దేవుని అనుగ్రహపాత్రుల మైతిమని పేర్కొనుట వారి మత దురభిమానమునకు ఒక చిహ్నముగ భావించుట దుస్సాహసమే అగును. చారిత్రకదృష్టితో పరికించినపుడు పారసీక సామ్రాట్‌లు ప్రోత్సహించిన చక్రవర్త్యారాధనకు ఇది ఒక మారువేషముగ పరిగణింపదగి ఉన్నది. ప్రాచీనయుగపు నాగరకతలందు తొలుత అగ్రపురోహితుడుగ ఉండినవాడు క్రమముగ రాజరికమును ఆర్జించిన కాలమునుండియు పాలకుడు తక్కిన ప్రజలకన్న దైవమునకు ఎక్కువ సన్నిహితుడను భావము క్రమముగ వేరులు పాదుకొనమొదలిడినది. ఈజిప్టునందు ఫారోను దైవాంశసంభూతుడుగ అర్చించు ఆచారము తొలుతటినుండియు ఉండెను. పారసీకులు ఈజిప్టు, బాబిలోనియా రాజ్యముల రెండింటిని వశపరచుకొనిన తరువాత ఈ ఆచారమును ప్రోత్స

హించుట సామ్రాజ్య భద్రతాదృష్టిలో వారికి సముచిత ముగ కన్పట్టి ఉండును. ఇందులకు స్వమతమగు జరతుష్ట్రి మతము కూడ వారికి తోడ్పడినది.

చక్రవర్తి వ్యవస్థ: చక్రవర్తి దైవాంశసంభూతుడు లేదా చక్రవర్తియే ఆరాధనీయుడను భావమును పారసీకులేకాక తక్కిన సామ్రాట్‌లును ఈ యుగమున ప్రోత్సహించిరి. అశోకాదులు వాడుకొనిన 'దేవానాంప్రియ' అను బిరుదమును, నాటి భారతీయ స్మృతులందు 'రాజు విష్ణ్వంశసంభూతు' డని పేర్కొనబడుటయు ఈ విషయమునే కొంతవరకు రుజువుచేయుచున్నవి. చీనాయందు ఆనాటి షిహ్ హ్వాంగ్ - టీ చక్రవర్తి చక్రవర్త్యారాధనకు ఆ దేశమున తొలుతగ అంకురార్పణము చేసెను. ఈ వాదమునకు విరుద్ధములుగ కన్పట్టిన ప్రాచీన రాజనీతి గ్రంథములలో లభ్యములైన వానిని అతడు తగులబెట్టించుటయే కాక, ఈ వాదమును ఖండించిన 400 మంది పండితులను క్రీ. పూ. 213 లో చిత్రవధకు పాలుచేసెను. గ్రీక్ విజేత యగు అలిగ్జాండర్‌ను ఈ చక్రవర్త్యారాధన బాగుగ ఆకర్షింపగలిగినది. తాను దేవుని పుత్రుడను విశ్వాసము ప్రజలందు వ్యాపించుటకు అతడు శ్రద్ధవహించెను. ఈ చక్రవర్త్యారాధనచే రోమన్ సామ్రాట్‌లును ఆకర్షితులైరి. ఆ సామ్రాజ్యమునందు ఈ ఆరాధన పరాకాష్ఠను అందుకొనగలిగినది. ఆ సామ్రాజ్య చరిత్రలోని స్వర్ణయుగపు కాలమున సామ్రాట్‌ల విగ్రహములకు దేవళముల నిర్మించి, ధూపదీపాదులచే ఆ విగ్రహములను ఆరాధించుట పరిపాటి అయినది. క్రైస్తవమతము వ్యాపించువరకు ఈ విగ్రహారాధన ఆ రాజ్యమున అమలులో ఉండెను.

సామ్రాజ్యమందలి వివిధజాతులను ఏకజాతిగ రూపొందించుటకు పైవిధముగనే కాక, ఇంకను వేరు రీతులను కొందరు సామ్రాట్‌లు యత్నములు చేసిరి. తన సామ్రాజ్యమందలి ప్రాచ్య, పాశ్చాత్యజాతులను ఐక్యము చేయుటకై ఆలిగ్జాండర్ చక్రవర్తి తన సేనయందలి గ్రీక్ యువకులను ప్రోత్సహించి వారిలో పలువురు పారసీక కన్యలను వివాహమాడునటుల చేయుటయే కాక, తానును ఒక పారసీకరాజకన్యను పెండ్లాడెను. రోమన్‌లు తమ సామ్రాజ్యమునందలి విజాతీయులలో ప్రముఖులగు వారికి రోమన్ పౌరస్వత్వమును ఇచ్చి, సామ్రాజ్యస్థైర్యమునకు వారు కృషి చేయునటుల చేయయత్నించిరి.

పై వివిధ చర్యలవలన ఆ యా సామ్రాజ్యములందు స్థైర్యము ఎంతవరకు నెలకొనగలిగినదను విషయమును చర్చించుటకు ముందుగ ఆ నాటి సామ్రాజ్యములందలి మానవసంఘములలోని వివిధవర్గముల పరిస్థితిని పరికింపవలసి ఉన్నది. సైనికవృత్తికి ఆ రాజ్యములలో అన్నింట ఆ కాలమున ఆదరము ఉండెడిదనుట నిర్వివాదాంశము. ఇందుకు తోడుగ పండితవర్గము సైతము సంఘమున ఉన్నతస్థానమునే ఆనాడు ఆర్జింపగలిగినది. మతము, దేవతలు మొదలగు వానిని గురించియు, లేఖనము మొదలగు దైనందిన వ్యవహారసాధనములను గురించియు పండితులు మాత్రమే ఆనాడు గుర్తెరింగి ఉండుట వలన, వారిని కాదని తమ పరిపాలనను సాగించుటకు రాజులకు వలనుపడెడిదికాదు. ఇక వర్తక, వాణిజ్యములను ఆశ్రయించు వర్గమునకు తొలుత సంఘమున ఎక్కువ పలుకుబడి ఉన్నటుల కన్పట్టదు. ఉత్తర ఆఫ్రికాతీరమునందలి ఫొనీషియన్ నగరరాజ్యములును, భారత దేశమునందలి సార్థవాహ సంఘములును మాత్రము ఇందులకు అపవాదములుగ ఆ నాడు ఉండినవి. గ్రీక్ నగరరాజ్యములందేమి లేదా పారసీక, చీనాసామ్రాజ్యములందేమి పారిశ్రామిక వస్తూత్పత్తికిని, సంపదల అభివృద్ధికిని వర్తకవర్గము ఎంతగ తోడ్పడినను, వారికి రాజకీయముగ పలుకుబడి చాల స్వల్పముగ ఉండెడిది. కాని, పారసీక సామ్రాజ్యమును అంతమొందించి, ఆలిగ్జాండర్ గ్రీక్‌ల ఆధిపత్యమున నెలకొల్పిన విశాలసామ్రాజ్యము ఆ తరువాత మూడు చీలికలైనను, సాంస్కృతికముగ ఏకత వహించి ఉండుటవలన వర్తక వాణిజ్యాదికముల విస్తృతికిని, వర్తకవర్గపు పలుకుబడికిని అవకాశము కలిగించినది. ఆ గ్రీక్ సామ్రాజ్య కాలమున వస్తూత్పత్తి కుటీరములను ఆశ్రయించి మాత్రమే జరుగక, కార్ఖానాలయందును జరిగినది. దాదాపు ముప్పది, నలుబదికి మించిన సంఖ్య గల కార్మికుల చేత పనిగొను కార్ఖానాలును అపుడు ఉండెడివి. రోమన్ సామ్రాజ్య కాలమున వీని సంఖ్య ఇంకను వృద్ధి అయినది. ఇట్టి పారిశ్రామికశాలలలో కూలిమీద పనిచేయు వారికన్న బానిసలు ఎక్కుగ ఉండెడివారు.

బానిస వ్యవస్థ: బానిసతనము ఆనాడు ఏహ్యమగు విషయముగ పరిగణింపబడలేదు. సహజముగ మానవ సంఘ నిర్మాణమున దీనికి తావు కలదని ఆనాటి విజ్ఞులును తలచిరి. యుద్ధములలో విజితులైనవారిని కొనిపోయి బానిసలుగ గ్రహించుటయో లేదా బానిసలుగ అమ్ముటయో ఆ కాలమున జరుగుచుండెడిది. ఇట్టి బానిసలను కొనుగోలు చేసిన వారు వారిచేత కార్ఖానాలందు పని చేయించుటవలననే ఆనాటి పారిశ్రామిక వస్తూత్పత్తి విరివిగ జరుగుటకు కొంత అవకాశము కలిగినది. అందువలన వస్తువ్యాపారముననేకాక బానిస వ్యాపారమువలన సైతము ఆకాలమున అనేకులు ధనికులు కాగలుగు

చుండిరి. క్రీ. పూ. రెండవ శతాబ్దిలో ఆసియామైనర్ సమీపమందలి డెలాస్ దీవి బానిసవ్యాపారపు కేంద్రము లలో ప్రముఖతను ఆర్జించి ఉండినదనియు, అచ్చట రోజు నకు దాదాపు పదివేలమంది బానిసలు వేలము వేయ బడెడివారనియు ఒక రచయిత వ్రాసెను.

వ్యవసాయ వ్యవస్థ: వ్యవసాయముచే జీవించువారి పనియు ఆనాడు సుఖకరముగ ఉండెడిది కాదు. గ్రీక్, రోమన్ సామ్రాజ్య కాలములందు సైన్యమున చేరినవారు విపరీతముగ ధనమును ఆర్జింపగలుగుటవలన, వారు తమకు సమీపమున ఉన్న పేదరైతుల భూములను కొనుగోలుచేసి, వానియందు బానిసలచే పనిచేయించుట మొదలిడుటచే స్వతంత్రులగు కర్షకులకు బ్రతుకుతెరువే క్రమముగ అంతర్హితము కాజొచ్చినది. చీనాయందు హాన్ ప్రభువులు భూములపై జమీందారులకు కల వారసత్వపు హక్కులను రద్దుచేసి, కర్షకులకు స్వామ్యమును కల్పించినను, ప్రభుత్వపు పన్నుల బెడద దుర్భరమగుటవలన రైతులు పల్లెలను విడిచి, పట్టణములలోని కార్ఖానాలందు పనులను ఆశించి అటకు చేరుటయు, అందువలన కరవుకాటకములు ఏర్పడు టయు తరచు జరిగెడివి.

ఈ విధముగ నాటి ప్రపంచమున అత్యధిక భాగమున వ్యావసాయికుల తిరుగుబాటులు జరుగుటయు, వానిని ప్రభుత్వము దమననీతితో అడచుటయు పరిపాటిగ ఉండెడివి. ఇట్టి వర్గకలహములలో క్రీ. పూ. 73-71 న రోమ్‌నందు స్పార్టకస్ అనువాని ఆధ్వర్యవమున జరిగిన బానిసల తిరుగు బాటును, క్రీ. పూ. 133-121 వరకు ఆ నగరముననే పేద ప్రజలు భాగ్యవంతులపై జరిపిన తిరుగుబాటును చరిత్ర యందు పేరొందినవి. వీనిలో రెండవదానికి టైబీరియస్, గయస్ అను ఇరువురు సోదరులు నాయకత్వము వహించిరి. వీరు సంపన్నులయ్యును, పేదప్రజల పక్షము వహించి, భూ సంస్కరణల కొరకై ఆందోళనజరిపి, భాగ్యవంతులవద్ద ఉన్న అదనపు భూమిని పేదరైతులకు ఉచితముగ పంచ వలసినదని పట్టుబట్టిరి. అందులకు భాగ్యవంతులు అంగీక రింపకుండుటచే రోమ్‌నగరమున ఉభయవర్గముల మధ్య పోరాటము చెలరేగి, ఆ పోరాటమున టైబీరియస్ మర ణించెను. తరువాత అతని సోదరుడు గయస్ రోమ్ పాలకసభకు ప్రతినిధి (ట్రిబ్యూన్) గ ఎన్నికై, తన సోదరుడు తలపెట్టిన సంస్కరణలను అమలులోనికి తెచ్చు టకు యత్నింపగ, మరల అంతర్యుద్ధము చెలరేగెను. కడకు తనపక్షము ఓడిపోవు స్థితికి వచ్చుటచేత గయస్ ఆత్మహత్యకు లోనయ్యెను. తక్కిన సామ్రాజ్యములందును ఆనాడు ఇట్టి పరిస్థితులే ఉండినవి. ససానియన్ ప్రభువులలో ఒకడగు కవధ్ చక్రవర్తి కాలమున నాస్తిక మతావలంబియగు మజ్దక్ భూమి మొదలగు ఉత్పత్తిసాధనములు అన్నింటి సంఘముననే సర్వస్వామ్యములు ఉండవలయునను వాద మును ప్రచారములోనికి తెచ్చెను (క్రీ. శ. 502). తలకు మించిన సంపదలతో తులతూగు సర్దారుల బెడదవలన బాధపడుచున్న కవధ్ చక్రవర్తికి ఇది బాగుగ నచ్చినది. సర్దారుల భూములను హరించి వారిని బలహీనులుగచేసి, తన పదవికి స్థైర్యమును చేకూర్చుకొనుటకు ఆ చక్రవర్తి ఈ వాదమును అమలులోనికి తెచ్చి హరింపబడిన భూమిని పేదరైతుల పరముచేసెను. కాని, సంఘమున పలుకుబడి కలిగిన మతాచార్యులు మొదలగు వారికి ఇది గిట్టినదికాదు. కవధ్ అనంతరమున అతని కుమారుడు మతాచార్యుల బోధనలను అనుసరించి తండ్రిచేసిన సంస్కరణల రద్దుచేసి, యథాపూర్వపు స్థితిని పునరుద్ధరించెను.

భారతదేశము-వర్ణవ్యవస్థ: ఇట్టి వర్గకలహములు ఆనాడు అన్ని రాజ్యములందునను సర్వసాధారణములే అయినను భారతదేశము మాత్రము కొంతవరకు ఈ సమస్యను పరిష్కరింపజాలినది. అటులని బానిసలును, దళితప్రజలును ఆ దేశమున, ఆ యుగమున లేకుండిరని భావింపజనదు. భారతదేశమున బానిసతనము వేదకాలము నుండియు ఏదియో ఒక తీరున అమలులోనే ఉండినదని పండితుల అభిప్రాయము. బౌద్ధ, జైన గ్రంథముల వలన మనకు ఈ యుగమందలి బానిసలలోని వివిధవర్గములను గురించిన వివరములు పెక్కు తెలియవచ్చుచున్నవి. ఈ యుగమున వెలువడిన స్మృతులలో తక్కినవానిని మించి ఎక్కువ ప్రచారమును వహించిన మనుస్మృతియందు ఏడు విధముల బానిసలు కలరని పేర్కొనబడి, వారి వివరములు ఈయ బడినవి. కాని, ఈ బానిసతనము పాశ్చాత్య సామ్రాజ్య ములలో ఆనాడు ఉండినంత విరివిగ భారతదేశమున అమలునందు ఉండినటుల కన్పట్టదు (అందువలననే మెగస్తనీస్ రాయబారి భారతదేశమున బానిసతనము లేదని వ్రాసెను). ఇందులకు ముఖ్యకారణము దేశమున సర్వసామాన్యముగ ఆమోదితమై ఆ యుగమున ప్రచా రములోనికి వచ్చిన వర్ణ వ్యవస్థ. చారిత్రకముగ కొన్ని కారణముల వలన తొలుత రూపొందిన ఈ వర్ణవ్యవస్థ ప్రతి వానికిని సంఘమున జన్మతః ఒక వృత్తిని కలుగజేయుట వలన వర్గకలహములు విరివిగ వ్యాపింపకుండుటకు అది చక్కగ ఉపకరించినది. భారతదేశీయులగు వారికేకాక, ఈ దేశమున స్థిరావాసము ఏర్పరచుకొనిన యవన, శక, కుషాణాదులకుకూడ వృత్తులను అనుసరించి ఈ వ్యవస్థ తావొసగినది. చారిత్రక కారణముల వలన ఇట రూపొందిన

ఈ వ్యవస్థకు బ్రాహ్మణమతము మతధర్మపు ముద్ర వైచినది. బౌద్ధాది వైదికేతరమతములు వర్ణవ్యవస్థకు ఆరోపింపబడిన మత పవిత్రతను ఎంతగ నిరసించినను, సాంఘికముగ దాని వలన చేకూరిన భద్రతను గుర్తించి, దానిని సమూలముగ నిర్మూలించుటకు మాత్రము యత్నించినవి కావు. కాని, ఇట్టి వ్యవస్థవలన తనయందు గుప్తముగ ఉండు శక్తులను అన్నింటిని వెలికి తెచ్చుటకు మానవునికి సహజముగ ఉండ వలసిన అవకాశము రద్దొనర్పబడెనని మాత్రము గుర్తింపక తప్పదు. ఆ యుగపు గ్రీస్ దేశమున శిల్పి కొడుకు అగు సోక్రటీస్ తత్త్వవేత్త కాగలిగెను; జెరూసెలెమ్‌న వడ్రంగి కొడుకు (జీసస్ క్రీస్తు) ఒక మహా మతప్రవక్త కాగలిగెను. భారతదేశమున మాత్రము ఆ యుగముననే అట్టి సంఘటన లకు వీలగు పరిస్థితులు ఉండెడివికావు. ఇందువలననే ఈ వర్ణవ్యవస్థలోని పై మెట్టునకు పోవుటకు క్రింది వర్ణముల వారు యత్నించెడివారు. ఇట్టి యత్నములైనను క్షత్రియ, వైశ్యవర్ణములలోని ప్రతిభావంతుల వలన మాత్రమే జరిగినవి. అందువలననే ఈ యుగమునందు క్షత్రియ, బ్రాహ్మణ వర్ణముల మధ్య ప్రాముఖ్యమునకై కలతలు చెలరేగినటుల నిదర్శనములు కలవు. బౌద్ధ, జైన గ్రంథ ములలో క్షత్రియవర్ణము బ్రాహ్మణవర్ణముకన్న మిన్న యని పేర్కొనబడుటకు ఇట్టికలతయే కారణమై ఉండును. క్రమముగ క్షత్రియజాతుల ప్రాముఖ్యముఅంతరించగ, వారి స్థానమును కొన్ని అనులోమ జాతులవారు ఆక్రమించు టయు ఈ అభిప్రాయభేదముల ఫలితముగనే జరిగినది. కాని, ఇట్టిమార్పులు ఉపరితలమున ఎన్నిజరిగినను, మొత్తము మీద సాంఘిక జీవనమును కొంతవరకు ప్రశాంతమయముగ చేయుటకు ఆ నాటి పరిస్థితులలో వర్ణవ్యవస్థ కొంతవరకు ఉపకరించినది. తండ్రివృత్తినే కుమారుడును అవలంబించి నపుడు సాంఘికముగ కొంతవరకు భద్రత చేకూరి, వర్గ కలహములు అంతరించునను విషయమును ఆ యుగముననే కొందరు భారతీయేతరులును గుర్తించిరి. వారిలో ముఖ్య ముగ పేర్కొనదగిన వాడు రోమన్ సార్వభౌముడు డయొక్లీషియన్. రోమన్ సామ్రాజ్యమున చెలరేగిన ఆర్థిక, సాంఘిక కల్లోలములను అడచివేయుటకై అతడు ఏ మనుజుడును తాను అవలంబించిన వృత్తిని విడిచి వేరొక వృత్తిని స్వీకరింప కూడదనియు, తండ్రి అవలంబించిన వృత్తినే కుమారుడును అవలంబింపవలయుననియు శాసిం చెను (క్రీ. శ. 301). కాని, తగు చారిత్రక పరిణామ ములు అనుకూలించని పరిసరములందు శాసననిర్మాణము మాత్రమే నూతన సాంఘికవ్యవస్థను రూపొందింపజాలదు; కావున అతని ప్రయత్నము విఫలమయ్యెను.

ప్రభుత్వ బాధ్యత : వర్గకలహములు తీవ్రరూపముదాల్చి సంఘర్షణలకు ఎల్లెడల దారితీసినను, తీయకపోయినను పేదరికము, నిరుద్యోగము ఆనాడు నాగరకప్రపంచమున విరివిగ ఉండెడివి. ఇవియే కడకు రాజ్యముల సుస్థిరతకు భంగకారులను విషయమును ఆనాటి పాలకవర్గములును గుర్తించినవి. అందువలనఆ అభాగ్యజీవులను ఎటులో అటుల సంతృప్తిపరచుటకును వారు యత్నించిరి. కాని, ఇట్టి యత్నమంతయు, రాజధానినగరమునను, జనసంఖ్యలో దాదాపుగ దానికి దీటగు తక్కిన నగరములందును జరిగె డిది. తత్ఫలితముగ ఆ నగరములందు పేదప్రజలకు పాలక వర్గములవారు ఉచితముగ ఆహారధాన్యములనో, ఆహార మునో ఒసగెడివారు. క్రీ. పూ. ప్రథమశతాబ్ది అంతమున రోమ్‌నందు ప్రభుత్వమువలన ప్రతిదినము ఇట్టి సహాయ మును పొందు అగతికులసంఖ్య దాదాపు 2 లక్షల 50 వేలు ఉండెడిదని తెలియవచ్చుచున్నది. వీరందరికిని ఆహార ముసేకాక, వస్త్రములను సైతము ప్రభుత్వము ఇచ్చెడిది. భారతదేశమును ఆ యుగమున పాలించిన సామ్రాట్‌లును ప్రతిదినము ఇటుల అగతికులకు భోజన, వస్త్ర సౌకర్య ములను కల్పించెడివారు. తన అంతఃపురపు వంటశాల యందు భోజనపదార్థములకొరకై ప్రతిదినము వేలకొలది జంతువులు వధింపబడెడివని అశోకుడు పేర్కొని ఉండుట గమనించినచో, వేలకొలది ప్రజల ఆహారవిషయమున ప్రభువులు ఆనాడు శ్రద్ధవహించెడివారని విశ్వసింపనగును. అంతియేకాదు, దైన్యయుత జీవితములందలి క్లేశము లను సామాన్యప్రజలు మరచిపోవుటకు అనువుగ ఉచిత ముగ మల్లయుద్ధములను, కత్తిసాముల ప్రదర్శనములను, ముష్టియుద్ధములను అతి విశాల రంగములందు ఏర్పరచి, ప్రజలందరు వానిని చూచు సౌకర్యమును రోమన్ పాలకులు కలిగించెడివారు. కత్తిసాములలోను, ముష్టి యుద్ధములందును జరుగు రక్తపాతమును, మానవవధను ప్రత్యక్షముగ దర్శింపగలుగు ప్రజలు మానవతనే మరచి పోయి, పశువులవలె పాలకవర్గపు చేతి కీలుబొమ్మలుగ వర్తించెడివారు.

న్యాయ వ్యవస్థ : ఇటుల నాగరకప్రపంచము అంతయు ఆనాడు ఇట్టి వివిధ వర్గములచే నిర్మితమగుటవలన, వీని పరస్పరసంబంధమును నిర్వచించుచు సంఘవ్యవస్థకు దృఢ తను కల్పనచేయు న్యాయసంహితకు క్రమముగ ఆవశ్యకత కలిగినది. ఇట్టి న్యాయసంహితకు బీజావాపనము ప్రాచీన యుగముననే జరిగినదను విషయము ఇదివరలో చెప్పబడి నది [చూ. పు. 32]. తక్కిన ప్రాచీనజాతులందువలెనే గ్రీక్ లందును క్రీ. పూ. 621 లో ఒక న్యాయసంహిత డ్రాకో అను

వానిచే రూపొందింపబడెను. ఆ తరువాత కాలానుసారముగ క్రమముగ అందు మార్పులు జరిగి, క్రీ. పూ. 308 లో ఏథెన్స్ నగరపాలకులు నిర్మించిన శాసనసంహితయందు అది తుదిరూపమును పొందినది. రోమ్ నగర రాజ్యమున క్రీ. పూ. 5 వ శతాబ్దిలో తొలుతగ అచటి సంప్రదాయ శాసనములకు లిఖితరూపము ఈయబడినది. ఆ శాసనములు 12 కొయ్యపలకలపై లిఖింపబడి, ప్రజలందరికి వానితో పరిచితి ఏర్పడుటకై ప్రదర్శితములగుటవలన వానికి 'ద్వాదశ ఫలకములు' అను పేరు కలిగినది. నగర పౌరస్వత్వముకల వారందరికి తరతమ విభేదము లేకుండ ఒకే విధమగు శాసనమును వర్తింపజేయుట ఇందలి విశిష్టత.

రోమన్‌ల న్యాయసంహిత క్రమరీతిలో విస్తరింపగ, దానికి ఒక సుపరిష్కృతరూపమును కల్పించుటకు కృషిచేసి సఫలతను ఆర్జించినవాడు జస్టీనియన్ చక్రవర్తి అను విషయము ఇదివరలో చెప్పబడినది [చూ. పు. 47]. తొలుత ప్రకటింపబడిన ద్వాదశ ఫలకములందలి శాసనములు, సామ్రాజ్యము విస్తరించినకొలది ఉత్పన్నములైన నూతన సమస్యల పరిష్కారమునకు అంతగ ఉపకరింపకపోవుటచే, ఆ యా కాలములందలి రోమన్ సామ్రాట్‌లు అంతటంతట కొన్ని నూతనశాసనముల చేసిరి. జస్టీనియన్ కాలమునకు ఇట్టి నూతనశాసనముల సంఖ్య విపరీతముగ పెరిగిపోవుటయే కాక ఇందు కొన్ని చర్వితచర్వణములుగను, కొన్ని పరస్పర విరుద్ధములుగను ఉండినవి. వీనిని పరిశీలించి, సమన్వయత చేకూర్చి వానిని ఒక న్యాయసంహితగ రూపొందించుటకై న్యాయవేత్తల సంఘమును జస్టీనియన్ నియమించెను. ఈ సంఘము చేసిన కృషిమూలమున రోమన్ న్యాయశాసనములకు ఒక సుసంఘటిత సంహితారూపము కలిగెను (క్రీ. శ. 529). ఆ తరువాత కొన్ని క్లిష్టవివాదముల తీర్పులలో న్యాయశాసనములను వ్యాఖ్యానించిన తీరుతెన్నులను స్పష్టము చేయుటకు అట్టి తీర్పుల సంకలనము జరిగెను. ఈ సంకలిత గ్రంథమునకు 'న్యాయసారము' (డైజెస్ట్) అను పేరు కలిగినది. పై రెండు కార్యక్రమములందును పాల్గొనిన త్రయిబోనియన్ అను న్యాయశాస్త్రవేత్త న్యాయవాదుల సౌకర్యముకొరకై శాసనముల సంగ్రహరూపములను తెలియజేయు వేరొక గ్రంథమును రచించెను. ఈ విధముగ రూపొందిన సంహితయు, దానితో వెలువడిన తక్కిన గ్రంథములును న్యాయనిర్వహణను సుసంస్కరితము చేయగలిగినవి. క్రమముగ ఈ గ్రంథములు తరువాత రూపొందిన పాశ్చాత్యరాజ్యములకు అన్నింటికిని న్యాయశాస్త్రనిర్మాణమున మార్గదర్శకములు అయినవి. ఈ యుగమునందే భారతదేశమున ధర్మసూత్రములకును, స్మృతులకును నేడు మనకు ఉపలబ్ధములగుచున్న రూపములు ఘటిల్లినవి. చీనాదేశమునందును హాన్ చక్రవర్తుల కాలమున న్యాయసంహిత సుసంస్కరితము అయినది. వివిధ దేశములలో ఇటుల శాసనములకు క్రమబద్ధరూపము ఇచ్చుటకు జరిగిన ఈ కృషియందు స్థానిక, చారిత్రక కారణములను అనుసరించిన విభేదములు ఎన్ని ఉన్నను, కొన్ని సామాన్యలక్షణములును కన్పట్టుచున్నవి. న్యాయ దృష్టియందు అందరు మానవులును సమానులే అను మూలసిద్ధాంత బీజములు అచట ఉన్నను, సంఘవ్యవస్థలోని ఉత్తమాధమ వర్గముల స్థాయీ భేదములను అనుసరించియే దండనాదులు మారుచుండెడివి. భారతీయ ధర్మశాస్త్రములందు వర్ణక్రమమును అనుసరించి శిక్షతీవ్రత మార్పు పొందెడిది. తక్కిన దేశములందు స్వతంత్రుడు, దానిస అను విభేదమును అనుసరించి శిక్షయు మారెడిది.

స్త్రీల ప్రతిపత్తి: ఇక స్త్రీల సాంఘిక ప్రతిపత్తియు ఈ యుగమున, ఈ దేశములందు క్రమముగ క్షీణస్థితికి వచ్చినది. మత, రాజకీయాది రంగములందు స్త్రీలు ఆనాడు అచటచట ప్రముఖతను ఆర్జించిన నిదర్శనములు ఉన్నను మొత్తముమీద స్వాతంత్ర్యమునకు స్త్రీ అనర్హురాలను అభిప్రాయము ఈ యుగాంతమునకు అన్ని దేశములందును రూఢతను ఆర్జించినది.

వైజ్ఞానికముగ, ధార్మికముగ భావ వికసనము ఈరీతిగ జరిగిన ఈ యుగమున స్థానిక జాతులమధ్య వైరుధ్యముల సడలించి, ఏకజాతిగ ప్రజానీకమును రూపొందించుటకు సామ్రాజ్యవ్యవస్థ తన క్షేమమును ఆసించి కొంత కృషిచేయుట తప్పనిసరి అయ్యెనను విషయము ఇదివరలో చెప్పబడినది [చూ. పు. 67]. ఆనాటి సామ్రాజ్యములలో అన్నింటను ఈ యత్నము ఏదియో ఒకతీరుగ జరిగినదని చరిత్రవలన మనకు స్పష్టమగుచున్నది. కాని, ఈ కృషియందు పారసీక సామ్రాజ్యమును, దానిని అనుసరించిన గ్రీక్ సామ్రాజ్యమును విఫలత చెందినవి. ఆ సామ్రాజ్యములు అంతరించినంతటనే అందలి వివిధప్రదేశముల ముడివెట్టు ఐక్యభావనయు మటుమాయమైనది. పై రెండింటితో పోల్చి చూచినపుడు రోమన్ సామ్రాజ్యము పటుతర స్థైర్యము కలదియే అని చెప్పదగి ఉన్నను ఆ సామ్రాజ్యము క్రీ. శ. 4 వ శతాబ్దమున రెండుగ చీలుటతో అందు లాటిన్ గ్రీక్ జాతుల మధ్య ఉండిన సమన్వయతారాహిత్యము తేటతెల్లమైనది. ఆ తరువాత పశ్చిమ సామ్రాజ్యమున ఏదియైన ఐక్యభావన ఉన్నయెడల అది క్రైస్తవ మతమూలమున ప్రాప్తమైనదిగ మాత్రమే చెప్పదగి ఉన్నది. తూర్పు

సామ్రాజ్యము ఆ తరువాత ఎక్కువ కాలము మనగలిగినను, అందలి జాతులలో ఐక్యము శూన్యమను విషయము ఆ సామ్రాజ్యము, ఆ తరువాత అంతరించిన తీరు విశదము చేయుచున్నది.

కాని, సామ్రాజ్యములోని వివిధజాతుల ప్రజలను, వివిధ నాగరకతాస్థాయీ భేదములుగల వారిని ఏక మహాజాతిగ రూపొందించు విషయమున చీనా, భారత దేశములు ఆనాడు సఫలతను ఆర్జించినవని అంగీకరింపక తప్పదు. హిమాలయము మొదలుగ దక్షిణమున సముద్రమువరకు వ్యాపించిన భూతలమునకు 'భారతమ్' అను పేరు కలదనియు, అందు వసించు సంతతికి భారతి అని వ్యవహారము కలదనియు విష్ణుపురాణమున పేర్కొనబడుట ఈ విషయమును రుజువు చేయుచున్నది. ఈ పురాణము క్రీస్తు శకారంభకాలమున రూపొందినదని పండితుల అభిప్రాయము. ఒక నిర్దిష్టప్రదేశమును స్వీయముగనెంచు ఒక మహాజాతిగ తమ్ముతాము భావించుకొనుట భారతదేశమున ఆ యుగమున ఇటుల మొదలయ్యెను. తరువాత ఎన్ని సామ్రాజ్యములు అంతరించినను, ఈ భావనమాత్రము నిలువగలిగినది. చీనాదేశములోని ప్రజలందును ఆ కాలమున ఇట్టిభావనయే క్రమముగ పరిణతిని పొందినది. హాన్ ప్రభువులు ఈ భావనకు ఎక్కువ దోహదము చేసిరి. అందువలననే ప్రజలందరును తాము హాన్ సంతతి వారమనియు, నిర్దిష్టవ్యాప్తికల చీనాదేశము తమ మాతృదేశమనియు భావించుట మొదలయ్యెను. వారి భావనలో ఉండిన చీనాదేశమున టిబెట్, సింకియాంగ్, మంగోలియా, మంచూరియా మొదలగు వెలుపలి ప్రాంతములు ఆనాటికి చేరలేదు.

సాంఘిక వ్యవస్థను గురించిన పై విషయములను గమనించినపుడు, మతప్రమేయము ఉండినపుడే సంఘమునకు స్థైర్యము చేకూరగలదను భావన ఒకటి ఆ యుగాంతమున రూపుగొనినదనుట సుస్పష్టము. ఇట్టి భావన తుదకు ఇస్లామ్‌న ఒక సువ్యవస్థిత రూపమును సంతరించుకొనినది. అట్టి ఇస్లామ్ మతము ఆవిర్భవించుటతో, ప్రపంచచరిత్రయందు ఒక నూతనాధ్యాయమునకు నాందీప్రస్తావన జరిగినది.

చీ. శే. రా.

# మతరాజ్యయుగము

(క్రీ. శ. 622 – క్రీ. శ. 1522)

ఇస్లామ్‌మత సంస్థాపకుడగు మహమ్మద్ [చూ.] అరేబియాయందు క్రీ. శ. 570 లో జన్మించెను. ఈయనను గురించిన చారిత్రక విషయములు పెక్కు మనకు తెలియ వచ్చుచున్నవి. నిరుపేద కుటుంబమున జన్మించి, చిన్నతనముననే తలిదండ్రులను పోగొట్టుకొనిన మహమ్మద్ స్వయంకృషిచే వర్తక వ్యాపారములందు చతురతను ఆర్జించి, ఒక ధనిక వితంతువును పెండ్లాడి, సంపన్నుడు కాగలిగెను. వర్తక వ్యాపారముల సందర్భమున ఈయన సిరియా మొదలగు సమీప దేశములందు పర్యటించి, అచట వ్యాప్తిలో ఉండిన యూద, క్రైస్తవ మతములను గురించిన సమగ్రపరిచితిని సముపార్జించెనని విశ్వసించదగి ఉన్నది. జరతుష్ట్రమతపు మూలవిషయములు కూడ ఈయనకు సుపరిచితములై ఉండినటుల కన్పట్టుచున్నది.

మహమ్మద్ జన్మభూమియగు అరేబియా దేశము దాదాపుగ ఒక ఎడారి. సెమిటిక్ జాతి ప్రజల తొలుతటి స్థావరము ఇదియే అని పండితుల అభిప్రాయము. సారరహితమగు ఇచటి భూమి పెక్కురను పోషింప సమర్థవంతము కాకపోవుటచే అంతటంతట - చరిత్ర పూర్వయుగము మొదలుగ-ప్రజానివహములు సమీపదేశములలో వలసచేరి ప్రాచీన ఈజిప్టు, బాబిలోనియా నాగరకతల వికసనమున పాల్గొనగల్గినవి. వర్తక వ్యాపారములందే కాక, విజ్ఞాన వ్యాపనమునను పేరు ప్రఖ్యాతులను ఆర్జించిన ఫొనీషియన్‌లును, యూదులును ఈ సెమిటిక్ జాతికి చెందిన వారలే. అరేబియాను వదలి దూరదేశములకు పోయిన సెమిటిక్ జాతులు ఇటుల ప్రశస్తిని ఆర్జించినను, అరేబియాయందలి ఆ జాతివారు మాత్రము నాగరకతలో తగు పురోగతిని పొందక, సంచార జీవితమునకు అలవడి ఉండిరి. అందులకు ముఖ్యకారణము ఆ దేశపు సహజ పరిస్థితియే అని చెప్పదగును. తగినంత వర్షపాతము ఆ దేశమున కరవగుటచే, ఎడనెడ జల్లులవలన, ఇసుక ఎడారులందు అటనట మనగలిగిన పచ్చికతావులలో తమ ఒంటెల మందల మేపుకొనుచు, అచటి ప్రజలు సంచార జీవితమును గడపెడివారు. ఈ సంచార ప్రజలందరును భాషా సంస్కృతులను అనుసరించి ఒకేజాతివారు అయినను, సంప్రదాయములను అనుసరించి పెక్కు తెగలుగ ఆనాడు చీలి ఉండెడివారు. ఒక్కొక్క తెగకు ఒక ఇష్టదేవతయు, తత్పరివారమును ఆరాధనీయములై ఉండెడివి. ఆ దేవతలకు ప్రతిమూర్తులుగ రాళ్లనో, చెట్లనో, విగ్రహములనో వారు పూజించెడివారు. ఇటుల విభిన్న దేవతలను ఆరాధించు ఈ తెగలవారికి అందరికిని మక్కానగరము మాత్రము సర్వజనాదరణీయమగు పుణ్యక్షేత్రముగ ఉండెడిది. వారి జాతీయైక్యమునకు మక్కాను ఒక ప్రతీకముగ వారు భావించి

ఆదరించెడివారు. ఆ నగరములో ఒక చతురస్రాకారపు దేవళమున వివిధ విగ్రహములతో పాటుగ 'కాబా' అను ఒక సనాతన శిలయు ఉండెడిది. సెమిటిక్ జాతివారందరిచే సమ్మానితుడగు అబ్రహామ్ అను పుణ్యపురుషుడు ఈ శిలను సనాతనకాలమున సంస్థాపించెననియు, అబ్రహామ్ జన్మించుటకు పూర్వమే ఒక దేవళమున ఆ శిల ఉండెడిదనియు, ఆ శిలకు అలౌకిక శక్తులు కలవనియు ఆనాటి అరేబియాలోని వారందరును విశ్వసించిరి. అందువలన అరబ్బీ ప్రజలకు అందరికిని పుణ్యక్షేత్రముగ మక్కానగరము రూపొందింది, నానాప్రాంతముల నుండియు యాత్రాకాలము లందు ప్రజలను ఆకర్షింపగలుగుచు ఉండెడిది.

ఇట్టి మక్కానగరమున వసించుచుండిన మహమ్మద్‌నకు క్రమముగ అరబ్బులందలి పలుతెగల ప్రజల విశ్వాసములతో పరిచయము లభించుటయే కాక, వానియందలి వైరుధ్యమును స్పష్టమై ఉండును. ఇందులకు తోడుగ ఏకైక పరమేశ్వరారాధనను అవలంబించిన యూద, క్రైస్తవ, జరతుష్ట్రమతములును ఆయనపై కొంత ప్రభావమును నెరపి ఉండును. తత్ఫలితముగ కలిగిన జిజ్ఞాసకు పరిణామముగ ఇస్లామ్‌ధర్మము రూపొందెను. భగవదనుభూతి మహమ్మద్‌నకు లభించెననియు, భగవదావేశితుడైన ఆ మహాపురుషుని వాణినుండి సనాతన ధర్మసూత్రములు వెలువడెననియు సంప్రదాయ విశ్వాసము. ఆ దివ్యవాణినుండి వెలువడిన సందేశములను పెంకులు, ఖర్జూర పత్రములు, శిలాఫలకములు మొదలగు వానిపై ఆయన సన్నిహితులు లిఖించి భద్రపరచిరి (ఇవియే తరువాత సంకలితరూపమున మహమ్మదీయుల పవిత్రగ్రంథమగు ఖురాన్‌గ రూపొందింపబడినవి). క్రమముగ ఈ సందేశములు పలువురను ఆకర్షింపగలిగి, మహమ్మద్‌నకు అనుయాయివర్గము ఏర్పడినది.

కాని, మహమ్మద్ బోధనలు వ్యాపించుట మక్కానగరములోని పలుకుబడి కలవారికి గిట్టనిదయ్యెను. విగ్రహారాధనను మహమ్మద్ నిరసించుట అందులకు ఒక ముఖ్యకారణము. వివిధ దేవతల అస్తిత్వమును మహమ్మద్ నిరాకరించుటయే కాక, అల్లా అను పేర వ్యవహృతుడగు ఏకైక దేవుడు తప్ప మరెవ్వరును ఆరాధ్యుడు కాడని నిర్ద్వంద్వముగ బోధించెను. ఇందులకు మక్కాలోని ప్రముఖులు వ్యతిరేకతను తెల్పి, కడకు మహమ్మద్‌ను అంతమొందించుటకు యత్నించుటచే, మహమ్మద్ కొలదిమంది అనుయాయులతో మదీనా నగరమునకు పారిపోయెను (క్రీ. శ. 622). ఈ పలాయనవత్సరమునకు మహమ్మదీయ మత చరిత్రలో ప్రముఖస్థానము కలదు. ఇస్లామ్‌చరిత్ర ఆనాటి నుండి ఆరంభిత మయ్యెనని భావింపబడి, తన్మతానుయాయులచే ఆ సంవత్సరము మొదలుగ 'హెజిరా' అను పేర శకపరిగణన జరుపబడుచున్నది.

మక్కా నగరమునకు ఉత్తరమున దాదాపు 435 కిలోమీటరుల దూరమున ఉన్న మదీనా నగరమున మహమ్మద్ సందేశము తొలుతగ సర్వజనామోదితమైనది. ఆయన ఆ నగరమున ఒక మసీదును నిర్మింపజేసి, తన ఉపదేశములను అనుసరించు రీతిలో ప్రార్థనాదికములను అట వ్యాప్తిలోనికి తెచ్చెను. క్రమముగ అనుయాయుల సంఖ్య వృద్ధిలోనికి వచ్చిన తరువాత, ఆయన మక్కావాసులకు తగు గుణపాఠము బోధించు ఉద్దేశముతో మక్కానుండి పయనించు వర్తకపు బిడారులపై దోపిళ్లు సాగించి, కడకు క్రీ. శ. 630 లో మక్కానగరముపైకి దండయాత్రను నడపి, ఆ నగరమును వశపరచుకొనెను. అంతట అచ్చటి దేవళమున ఉండిన విగ్రహములలో కాబా శిలను తప్ప తక్కిన వానిని శిథిలపరచినట్లు తెలియుచున్నది. అంతటినుండి మక్కానగరము అరేబియాకు రాజకీయముగను, మత విషయకముగను కేంద్రమయ్యెను. క్రీ. శ. 632 లో మహమ్మద్ స్వర్గగతుడగునప్పటికి దాదాపుగ అరేబియా యందు అంతటను ఇస్లామ్ మతము వ్యాపించుటయేకాక, మత లౌకిక విషయముల రెండింటను మహమ్మదే దేశమున అత్యధిక భాగమునకు ఏకాధిపత్యమును వహించెను.

అనేక దేవతారాధనను, విగ్రహారాధనను అంతము చేయుటయేకాక అరబ్బులందు నైతిక జీవనమును పెంపొందించు కొన్ని ప్రమాణములను మహమ్మద్ నెలకొల్పెను. సంఘములోని దురాచారములను పెక్కింటిని ఆయన నిర్మూలించుటయే కాక, తరతమ విచక్షణను ఎరుగని సౌభ్రాతృత్వమును తన మతానుయాయులందు పెంపొందింపగలిగెను. పలు తెగలుగ చీలియున్న అరబ్బీ ప్రజలను ఏకైకజాతిగ ఆ మహాపురుషుడు రూపొందించెను. 'అల్లా ఒకడే దేవుడు, అతని ప్రవక్త మహమ్మద్' అనునది అంతటినుండి మహమ్మదీయుల ఏకైక నినాదమై, వారికి ప్రోత్సాహమును కలిగించెను. తమ ధర్మరక్షణకును, తమ ధర్మమును వ్యాపింపజేయుటకును సాగించెడు యుద్ధమున లభించు మరణము తమ్ము స్వర్గసీమకు సులభముగ చేర్చగలుగునని మహమ్మద్ ప్రవచించిన సందేశము ఆయన అనుయాయులందు ఒక నూతనోత్తేజమును, సాహసమును రేకెత్తించినది. ఎడారిజీవనముచే రాటుదేరి, కష్టసహిష్ణుతకును, సాహసయుత జీవనమునకును అలవడిన అరబ్బీ యోధులను ఈ నూతన మత సందేశము ఒక సుసంఘటిత శక్తిగ రూపొందించగలిగినది. తత్ఫలితముగ 'హెజిరా'

తరువాత ముప్పది సంవత్సరములైన నిండుగ ముగియక మునుపే, అరబ్బీ సేనావాహినులు ఇరాన్ దేశపు సార్వభౌముని అంతమొందించి, ఆ దేశమును లోగొనుటయే కాక, ప్రాచ్య రోమన్ సామ్రాట్ సేనలను పారద్రోలి, అతని సామ్రాజ్యములోని సిరియా, పాలస్తీనా, ఈజిప్టు దేశములను వశపరచుకొనగలిగినవి. ఇటుల రాజ్య విస్తృతితోపాటుగ, ఇస్లామ్‌మత వ్యాపనమును కూడ సాగించుటలో అరబ్బులకు నాయకత్వమొసగినవారు కలీఫాలు.

**ఇస్లామిక విజృంభణము :** 'కలీఫా' [చూ.] అను అరబ్బీ పదమునకు 'వారసుడు' అని అర్థము. మహమ్మద్ స్వర్గగతుడైన తరువాత ఆ మతానుయాయులు తమకు నాయకుడుగ అబూబేకర్ అనువానిని ఎన్నుకొనిరి. మహమ్మద్ జీవిత కాలమున అతనికి కుడి భుజముగ ఉండి మెలగినవాడు ఈ అబూబేకర్. మహమ్మద్‌నకు ప్రియతమమగు ఇస్లామ్‌మత వ్యాప్తిని కొనసాగించుటకు ఇతడు దీక్ష వహించెను. ఇస్లామ్‌ను ప్రపంచమున వ్యాపింపజేయుటకు మహమ్మద్ సంకల్పించి క్రీ. శ. 628 లో తనకు తెలిసియున్న సమకాలిక ప్రభువులకు తన మతోద్దేశములను తెలుపుచు ఉత్తరములను పంపెను. బైజాంటైన్, ఇరాన్, చీనా సామ్రాట్‌లకు ఆనాడు ఇట్టి ఉత్తరములు చేరినటుల తెలియవచ్చుచున్నది. అనామకుడగు ఒక అరబ్బీవాని పిచ్చివ్రాతలుగ ఆ ప్రభువులు వానిని ఆ కాలమున భావించిరి. కాని, ఈ వ్రాతలకు సార్థక్యము కలిగించుటకు అబూబేకర్ సంకల్పించెను. ఇందులకు ప్రాతిపదికగ తగు సన్నాహములను ఇతడు చేసి, అరేబియాయందు అప్పటికి ఇస్లామ్ మతము వ్యాపించని ప్రాంతములను అన్నింటిని లోగొని అచ్చటకూడ ఆ మతమునకు వ్యాప్తిని కల్గించెను. అంతట అబూబేకర్ మరణించగ (634) ఓమర్ కలీఫా అయ్యెను. ఇతని కాలముననే, ఇదివరలో పేర్కొనబడిన రీతిగ ఇరాన్, సిరియా, పాలస్తీనా, ఈజిప్టు అరబ్బుల వశమైనవి.

ఓమర్ మరణము (644) తరువాత, అరబ్బులలో చెలరేగిన కొన్ని అంతఃకల్లోలముల వలన, ఇస్లామ్ సేనావాహినుల పురోగతి కొంత మందగించినను, అంతటంతట కొందరు ప్రముఖ సేనానాయకుల ఆధ్వర్యవమున ఆఫ్రికా ఉత్తరతీరమున మిగిలిన భూమియు వారి వశమైనది. తత్ఫలితముగ అదివరలో రోమన్‌లను, ఫొనీషియన్‌లను సైతము ధిక్కరించి, లొంగక మనగలిగిన బర్బరులవంటి ఉత్తర ఆఫ్రికా జాతుల ప్రజలు ఇస్లామ్ మతముచే ఆకర్షితులై ఆ మతమునే కాక అరబ్బుల భాషా సంస్కృతులను సైతము స్వీయము చేసికొనిరి. క్రీ. శ. 711 లో అరబ్, బర్బర సంయుక్త సేనలు తారిఖ్ అను సేనాని నాయకత్వమున ఆఫ్రికాను యూరప్‌లోని స్పెయిన్ నుండి వేరుచేయు జలసంధిని దాటి, యూరప్‌ను ప్రవేశించి స్పెయిన్‌ను వశపరచుకొనినవి. తారిఖ్ సేనాని నిర్వహించిన ఆ సాహసకార్యమునకు స్మారకముగ ఆ జలసంధికి సన్నిహితముగ స్పెయిన్‌నందున్న చిన్న కొండకు 'జబర్ - ఎల్ - తారిఖ్' అని అరబ్బులు నామమిడిరి. అదియే వికృతిచెంది నేడు 'జిబ్రాల్టర్' అని వ్యవహరింపబడుచున్నది. స్పెయిన్‌ను ఆక్రమించిన ఇస్లామ్ సేనావాహినులు ఆ తరువాత పిరనీస్ కొండలను దాటి ఫ్రాన్స్‌పై చెదరువాటుగ దండయాత్రలను సాగింప మొదలిడినవి. కాని, అప్పటిలో ఆ ప్రాంతమును పరిపాలించుచుండిన చార్లెస్ మార్టెల్ అనువాని నాయకత్వమున ఫ్రాంక్‌లు ఇస్లామ్ సేనలను పరాజితములను చేయుటతో (732) ఆ దిక్కున వారి పురోగతి ఆగిపోయినది.

ఇక తూర్పున సిరియా, పాలస్తీనా, ఈజిప్టులను పోగొట్టుకొనిన ప్రాచ్య రోమన్ సామ్రాజ్యము ఆసియామైనర్ నందును, తూర్పు యూరప్‌లోను తనకు కల ప్రతిపత్తిని మాత్రము కాపాడుకొనగలిగినది. భూమార్గమున మాత్రమే దండెత్తి ప్రాచ్య రోమన్‌సామ్రాజ్యమును జయించుటలో విఫలులైన అరబ్బులు భూ, సముద్ర మార్గముల రెండింట దండెత్తి, ఆ సామ్రాజ్యమును జయించుటకై ఒక నౌకాదళమును కూడ సమాయత్తము చేసికొని, 717లో దండెత్తి, సంవత్సరకాలము తమ ముట్టడిని కొనసాగించిరి. కాని, ప్రాచ్య రోమన్ సేనానుల యుద్ధకుశలతచే అరబ్బుల నౌకాదళము దగ్ధముచేయబడుటతో, ఆ ప్రయత్నము విఫలమై, తూర్పు యూరప్‌నకు అరబ్బుల బెడద తప్పిపోయెను.

పశ్చిమమున స్పెయిన్‌ను వశపరచుకొనిన సమయముననే (711) అరబ్బులు భారతదేశమున సింధురాష్ట్రమును వశపరచుకొనిరి. కాని, అటనుండి భారతదేశపు తక్కిన ప్రాంతములలోనికి రాకుండ వారిని రాజపుత్రులు నిరోధింపగలిగిరి. ఇరాన్‌ను ఆక్రమించిన తరువాత అరబ్బులు మధ్య ఆసియాకును తమ జైత్రయాత్రలను విస్తరింపజేసి, అచట తురుష్కులందు ఇస్లామ్‌మతమును వ్యాపింపజేసిరి. ఆ సందర్భముననే 751 లో చీనీయ సార్వభౌముని సేనలతో అరబ్బులు పోరాడవలసి వచ్చెను. అందు జయము కలిగినప్పటికి, అరబ్బులు చీనాలోనికి పోవుటకు ఉత్సహింపక వెనుదిరిగిరి. అంతటనుండి చీనాదేశముతో అరబ్ సామ్రాజ్యము వాణిజ్యరీత్యా మాత్రమే సంబంధమును కలిగి ఉండెను. ఈ పరిచయము మూలమున పలువురు అరబ్బులు చీనా ప్రభువు సేనలలో స్వచ్ఛందముగ చేరిరి.

అంతట ఇస్లామ్ మతము శాంతియుత మార్గమున చీనా యందు కొన్ని ప్రాంతములలో తావును ఆర్జించినది.

ఇంతటి విశాలమగు అరబ్ సామ్రాజ్యమునకు మొదట మక్కా నగరమే ముఖ్యనగరమైనను, తరువాత సౌకర్యార్థమై డమాస్కస్ నగరము ముఖ్యనగరముగ గ్రహింపబడెను. కాని, 750 లో కలీఫా పదవి కొరకై జరిగిన పోరాటములో మహమ్మద్ బంధువర్గపు సంతతివారగు అబ్బాసీయులు విజయము పొందిన తరువాత వారు బాగ్దాద్‌ను ముఖ్యనగరముగ చేసికొనిరి. పరాజితులగు పూర్వపు కలీఫా వంశీయులలో ఒకడు స్పెయిన్‌నకు పారిపోయి అట కార్డొబా నగరము రాజధానిగ ఆ ప్రాంతమున తన కలీఫా పదవిని సుస్థిరము చేసికొనెను. ఇటుల అరబ్ సామ్రాజ్యము ద్విధా విభిన్నమైనను అందు అత్యధిక భాగము అబ్బాసీ - కలీఫాల ఆధిపత్యమునే గుర్తించెను. ఈ అబ్బాసీయులలో పరిపాలకుడుగనేకాక, లలిత కళాపోషకుడుగను, న్యాయశీలుడుగను చారిత్రక ప్రఖ్యాతి పొందినవాడు హారూన్ అల్ - రషీద్ (785 - 809 ప).

అబ్బాసీయుల అధికారము నిరంతరాయముగ కొన సాగలేదు. తొమ్మిదవ శతాబ్దిలో కలీఫా పదవికై మరల అంతఃకల్లోలములు కొనసాగి, మహమ్మద్ కుమార్తెయగు ఫతీమా వంశజుడు ఒకడు ఈజిప్టునందు తాను కలీఫానని ప్రకటించుకొని, ఈజిప్టు ప్రజల ఆదరణను ఆర్జించి, బాగ్దాద్‌లోని కలీఫాను ధిక్కరించెను. ఈ ఫతీమా వంశజులకే ఫాతిమేయులను వ్యవహారనామము కలదు. తరువాత కొంతకాలమునకు సిరియాదేశము సైతము ఈ ఫాతిమేయుల ఆధిపత్యమును అంగీకరించెను.

**పవిత్ర రోమన్ సామ్రాజ్య సంస్థాపన:** ఇటుల అంతఃకల్లోలములతో సతమత మగుచున్నను మూడు ఖండములందు తన ప్రభావమును నెరపిన ఇస్లామిక విజృంభణమును పశ్చిమ యూరప్‌నందు ఫ్రాంక్‌ల నాయకుడగు చార్లెస్ మార్టెల్ అరికట్టగలిగెనని ఇదివరలో తెలుపబడినది [చూ. పు. 75]. ఈ ఫ్రాంక్‌లు జర్మానిక్ జాతియందలి ఒక శాఖకు చెందినవారు. అయిదవ శతాబ్దియందు రైన్‌నదీ పరిసర భూములలో వసించుచుండిన వీరు, తక్కిన జర్మానిక్ జాతులతోపాటుగ హూణుల దండయాత్రలను ఎదుర్కొనుటలో పాల్గొనిరనుట నిజమే అయినను, తరువాత తక్కిన జర్మానిక్ జాతులవలె రోమన్ రాజ్య వ్యవహారములలో జోక్యము వహించి ఉండలేదు. బహు శాఖలుగ చీలిన ఫ్రాంక్‌లను ఐక్యము చేయగలుగు నాయకుడు వారియందు జన్మింపక పోవుటయే ఇందులకు కారణమై ఉండవచ్చును. కడకు వీరియందు ఒక శాఖకు చెందిన ప్రముఖుడు - క్లోవిస్ అనువాడు - తక్కిన శాఖల ప్రముఖులను జయించి ఫ్రాంక్‌లను తన నాయకత్వము అంగీకరించునటుల చేయగలిగెను (496).

క్లోవిస్ కాలమునాటికి తక్కిన జర్మానిక్ జాతులలో క్రైస్తవమతము వ్యాపించినను ఫ్రాంక్‌లు మాత్రము ఆ మతమును ఆదరింపక సాంప్రదాయిక బహు దేవతారాధననే ఆశ్రయించి ఉండిరి. కాని, జర్మానిక్ జాతులందు వ్యాపించిన క్రైస్తవమతము అరియన్ శాఖకు చెందినది. రోమ్ నగరమందలి పోప్‌లు క్రైస్తవమతమందలి అతనేసియన్ శాఖయే ఉత్తమమని వాదించువారు అగుటవలన, ఈ జర్మానిక్ క్రైస్తవుల ఎడ వారికి ద్వేషభావము ఉండెడిది. రాజ్యవిస్తృతినే ప్రధానలక్ష్యముగ ఇడుకొనిన క్లోవిస్ ఈ ద్వివిధ క్రైస్తవమత శాఖల మధ్య గల విరోధ భావమును తనకు అనువుగ ఉపయోగించుకొనుటకై, అతనేసియన్ క్రైస్తవ సంప్రదాయపు కుటుంబమునకుచెందిన ఒక రాకుమారిని పెండ్లాడి, ఆ మతమును స్వీకరించెను. అంతటనుండి అతడు అరియన్ క్రైస్తవ పాలకులపై జరుపు దండయాత్రలు అతనేసియన్ వాద పరిరక్షణకే జరుపబడుచున్నటుల భావింపబడి, పోప్ యొక్క సాను భూతి సహకారములు అతనికి లభించినవి. అందువలన నేటి బెల్జియమ్‌లోని ఒక మారుమూల ప్రాంతమునకు ఆనాడు అధిపతిగ ఉండిన క్లోవిస్ క్రమముగ పిరనీస్ పర్వతశ్రేణివరకు తన రాజ్యమును విస్తృతము చేయగలిగెను. తత్ఫలితముగ ఫ్రెంచిజాతికి తొలుత ప్రతిపత్తిని కల్పించినవాడుగను, ఫ్రాన్స్‌నకు ప్రథమ పాలకుడుగను ఇతడు పరిగణింపబడుచున్నాడు. ఈతని వంశము వారే మెరోవింజియన్‌లని యూరప్ చరిత్రలో పేరొందిరి. కాని, క్లోవిస్ తరువాత వచ్చిన ఆ వంశికులు అసమర్థులగుటవలన క్రమముగ రాజ్యాధికారమును రాజభవన రక్షణోద్యోగులు వశపరచుకొనిరి. ఈ ఉద్యోగులలో పెపిన్ అనువాడు అతి సమర్థుడు. ఇతడు రక్షణోద్యోగము వంశపారంపర్యముగ తన వంశములోనే వచ్చునటుల ప్రభువు అనుమతిని ఆర్జించెను. ఇతని కుమారుడు - చార్లెస్‌మార్టెల్ - తండ్రిని మించినవాడు. పిరనీస్‌ను అతిక్రమించి ఫ్రాన్స్‌నందు చొరబడిన ముస్లిమ్ సేనావాహినిని అరికట్టినది ఇతడే. ఇతని కుమారుడగు పెపిన్ నామమాత్రపు మెరోవింజియన్ ప్రభుత్వాధికారమునకు స్వస్తి చెప్పి, ఆ వంశపు కడపటి రాజును రాజ్యభ్రష్టునికావించి తానే రాజయ్యెను (751).

చార్లెస్‌మార్టెల్, అతని కుమారుడు పెపిన్ పరిపాలించిన విశాలరాజ్యమున వివిధ నాగరకతా స్థాయిలలో

ఉండిన ప్రజలు వసించిరి. ఆ రాజ్యపు పశ్చిమ, దక్షిణ భాగములందు లాటిన్ సంస్కృతికి లోనైన కెల్ట్ జాతివారు విరివిగ ఉండిరి. ఈశాన్యభాగమున అప్పటికి క్రైస్తవమతమును స్వీకరింపని ఫ్రిజియన్‌లు, శాగ్జన్‌లు వసించి ఉండిరి. తూర్పున - అప్పటికి కొలదికాలము క్రిందటనే క్రైస్తవ మతమును అవలంబించిన - బవేరియన్‌లును, ఇంకను ఆవల క్రైస్తవేతరులగు స్లావ్‌లు, అవర్‌లు మొదలగువారును ఉండిరి. ఒకే రాజ్యమందు ఉండినను సంస్కృతులందు కల ఈ వైరుధ్యమే చారిత్రక గతిలో నేటి ఫ్రాన్స్, బెల్జియమ్, హాలెండ్, జర్మనీ, స్లావ్ రాజ్యములు రూపొందుటకు అవకాశము కల్పించినది.

మెరోవింజియన్ రాజరికమును తొలగించిన పెపిన్ చర్యకు ఆ కాలపు పోప్ తన సమ్మతిని తెలిపి, తన ఆమోదముద్రను వైచెను. ఇందులకు కృతజ్ఞతా సూచకముగ పెపిన్ ఇటలీ ఉత్తరభాగమును ఆక్రమించిన లోంబార్డ్‌లను ఓడించి, వారి రాజ్యమును పోప్‌నకు దత్తము చేసెను. న్యాయరీతిలో ఇటలీకి పాలకుడుగ భావింపబడు ప్రాచ్య రోమన్ సామ్రాట్‌నకు అది చెందవలసి ఉండెను. కాని, పెపిన్ దీనిని పోప్‌నకు చెందజేయుటతో మత పీఠాధిపతిగ మాత్రమే అంతవరకు ఉండిన పోప్‌నకు ఒక రాజ్యముపై కూడ సర్వస్వామ్యము లభించెను. పెపిన్ తరువాత అతని రాజ్యమును అతని కుమారులు ఇరువురును పంచుకొనిరి. కాని, అనతికాలముననే వారిలో ఒకడు మరణించుట వలన, రాజ్యమంతయు రెండవవాడగు చార్లెస్‌కే దక్కెను (771). ఇతడే చరిత్ర ప్రసిద్ధుడగు చార్లెస్ మహనీయుడు లేదా షార్లమేన్ [చూ].

షార్లమేన్ నలుబదియారు ఏండ్లు పరిపాలించెను. ఈ దీర్ఘపరిపాలనా కాలమును అతడు రాజ్యవిస్తృతికే కాక సుస్థిర పరిపాలనమును నెలకొల్పుటకును వినియోగించెను. పలు జైత్రయాత్రల మూలమున అతడు ఆర్జించిన విశాల సామ్రాజ్యము నేటి డెన్మార్క్ నుండి పిరనీస్ పర్వతములకును, ఎల్బేనది నుండి అట్లాంటిక్ మహాసముద్రము వరకును విస్తరించి ఉండినది. అట్టి సామ్రాజ్యపు స్థైర్యమునకు అందలి ప్రజలందరు ఏకైక మతావలంబకులగుట దోహదకారి అని అతడు భావించి క్రైస్తవమత వ్యాపనమునకు తీవ్ర కృషి సల్పెను. ఔచిత్యముతో ప్రసక్తి వహింపక, అందులకు అతడు అన్ని విధములగు మార్గములను అవలంబించెను. అందు తొలుతటి మార్గము దౌర్జన్యము. 'క్రైస్తవమును అవలంబింతువా లేక మరణింప ఇచ్చగింతువా ?' అనునది అతని సూటిప్రశ్న. మతావలంబనకు నిరాకరించినవాడు అతని కత్తికి ఎర కావలసినదే. తొలుత ఇట్టి మార్గమును అవలంబించినను, తరువాత అతడు వేరు విధమగు సౌమ్యమార్గమును అవలంబించెను. దారిద్ర్యము ఎక్కువగ ఉన్నచోట్ల ఈ సౌమ్యమార్గము ఉపకరించినది. తనంతతానుగ క్రైస్తవమతమును అవలంబింతునని ఎవడైన ముందునకు వచ్చి ఆ మతమును స్వీకరించినచో అతనికి తెల్లని అంగీని ఇత్తునని ఆ ప్రభువు చాటించెను. అంతట పశ్చిమ యూరప్ నందలి అటవీ సీమలలోని క్రైస్తవేతరులందు క్రైస్తవమతము వ్యాపించుటతోపాటుగ తెల్లని అంగీలును వెల్లివిరిసినవి. స్వయముగ విద్యావిహీనుడే అయినను షార్లమేన్ విద్యావ్యాప్తికి ఎక్కువగ కృషి చేసెను; పండితులను అత్యధికముగ గౌరవించెను. విద్యావంతుడైన ప్రతివానికిని అతడు ఉద్యోగావకాశమును కల్పించెను. ఈ విధముగ క్రైస్తవమతమునకును, లాటిన్ సంస్కృతికిని సేవ చేయుటతో పాటుగ యూరప్ చరిత్రలో ఒక నూతనాధ్యాయమునకు అతడు ఇంకొక విధముగ కూడ శ్రీకారమును చుట్టెను. అదియే పవిత్ర రోమన్ సామ్రాజ్యమను పేర రోమన్ సామ్రాజ్య పునరుద్ధరణ. ఇందు అతనితోపాటు కర్తృత్వము వహించినవాడు ఆ కాలపు పోప్ లియో - III.

ఈ పునరుద్ధరణను గురించి తెలిసికొనుటకు ముందుగ ఆ కాలమునందలి పోప్‌ల పరిస్థితిని గురించి తెలిసికొనుట అత్యావశ్యకము. పశ్చిమ రోమన్ సామ్రాజ్య పతనానంతరమున నామమాత్రముగ ఇటలీ మొదలగునవి ప్రాచ్యరోమన్ సామ్రాట్‌నకు లొంగి ఉన్నను, ఆ ప్రాంతములందే కాక తక్కిన పశ్చిమ యూరప్‌నందును సువ్యవస్థిత పరిపాలన మృగ్యమైనది. అట్టి కాలమున ఆ ప్రాంతములను అన్నిటిని ఐక్యము చేయు ఏకైకశక్తి క్రైస్తవమతము మాత్రమే. ఈ మతమునకు మూలాధారము పోప్. ఆ పోప్ పదవియందు నైతికబలము కల గ్రెగరీవంటి వాడు ఉన్నపుడు, ఆ అరాజక పరిస్థితులందును తన పలుకుబడిని వ్యాపింపజేయగలిగి ఉండెనను విషయము ఇదివరలో తెలుపబడినది. కాని, ఆ పదవిని క్రమముగ పలువురు అసమర్థులు ఆక్రమించుటచే దాని ఎడల సామాన్యప్రజలకును, పాలకులకును ఆదరము సన్నగిలినది. ఇట్టి పరిస్థితులలో సమర్థుడగు ప్రభువు అండదండలు ఆ పీఠమునకు ఆవశ్యకమయ్యెను. ప్రాచ్య రోమన్ పాలకులు నిత్యమును ముస్లిమ్‌లు మొదలగు వారితో యుద్ధములందు మునిగి తేలుచుండుట వలన అందులకు వారు సమర్థులుగ పోప్‌లకు కన్పట్టలేదు. ఇక తక్కిన యూరప్‌న షార్లమేన్‌తో సాటివచ్చువాడు ఆనాడు లేకుండెను. ఇందులకు తోడుగ ప్రజలందు రోమన్

సామ్రాజ్యపు గతవైభవపు స్మృతి సర్వత్ర వ్యాపించి ఉండెను. అందుచే షార్లమేన్‌నే అట్టి రోమన్ సామ్రాట్‌గ చేసినచో, రోమ్‌నకును, తనకును పూర్వపు ప్రశస్తి రాగలుగునని పోప్ తలచి ఉండుటయే ఇట్టి పునరుద్ధరణకు కారణమై ఉండునని భావించుటకు అవకాశము కలదు. ఇందులకు తోడుగ పూర్వ రోమన్ సామ్రాజ్యమును తన ఆధ్వర్యవమున పునరుద్ధరించవలెనని షార్లమేన్ కూడ సంకల్పించి ఉండెననియు, ఇందులకేఅతడు ప్రాచ్య రోమన్ సామ్రాజ్ఞి ఐరిన్‌ను పెండ్లియాడ యత్నించి విఫలుడు అయ్యెననియు కొందరు రచయితల కథనము. ఎటులైన నేమి క్రీ. శ. 800 లో క్రిస్టమస్ పండుగ దినమున రోమ్ నగరములోని 'సెంట్ పీటర్ చర్చి' లో ప్రార్థన చేసి లేచిపోనున్న షార్లమేన్ శిరముపై పోప్ ఒక హేమ మకుటమును ఉంచి, పూర్వ రోమన్ సామ్రాట్‌లు వహించిన 'సీజర్, అగస్టస్' బిరుదములతో ఆతనిని రోమన్ సామ్రాట్‌గ ప్రకటించెను. రోమన్ సామ్రాజ్య పునరుద్ధరణయు, అందులకు తాను చక్రవర్తియగుటయు తనకు ఇష్టము లగునవియే అగుటవలన షార్లమేన్ అందులకు అంగీకరించి ఊరకుండినను, ఆ పదవిని కట్టబెట్టుట తనవలన జరిగినటుల పోప్ కర్తృత్వము వహించి తనకొక అధికారమును కల్పించుకొనుట మాత్రము షార్లమేన్‌నకు అంగీకృతము కాలేదు.

కాని, ఇట్టి పునరుద్ధరణ వలన ఒరిగినది ఏమియు లేదు. పేరు ఎటులున్నను యథార్థమున ఆ సామ్రాజ్యము ఫ్రాంక్‌ల సామ్రాజ్యముగ మాత్రమే మనినది. నామ మాత్రముగ రోమ్‌నగరమే దాని కేంద్రముగ ఉండినను, దాని ప్రతిపత్తికి మూలాధారము ఇటలీకి వెలుపలనే ఉండినది. పోప్‌లు దానికి తగిలించిన 'పవిత్ర' అను పదము నేతిబీరకాయలోని 'నేయి' వలెనే అపార్థత వహించినది. ఇక 'సామ్రాజ్య' ప్రతిపత్తియు షార్లమేన్ తరువాత దానికి దక్కలేదు. ఐనను ఈ పవిత్ర రోమన్ సామ్రాజ్యము ఆ తరువాత క్రమముగ వివిధ రాజవంశముల ఆధిపత్యమున 1806 వరకు ఎటులో మనుగడ సాగింపగలిగినది (ఆ యా వివరములు ఆ యా సందర్భములందు ముమ్ముందు పఠింపనగును).

షార్లమేన్ తరువాత అతని కుమారుని కాలమున ఆ మహాసామ్రాజ్యము ఛిన్నాభిన్నమయ్యెను. లాటిన్ సంస్కృతికి లోబడిన దక్షిణ, పశ్చిమ భాగములు క్రమముగ ఏకదేశముగ సుసంఘటితములగుట అంతటి నుండియే ఆరంభమైనది. ఇక రైన్‌నది నుండి స్లావ్‌ల రాజ్యముల వరకును కల ప్రాంతము జర్మన్‌లకు చెందిన వివిధ అల్ప రాజ్యములుగ రూపొందినది.

యూరప్‌నందు షార్లమేన్ మరణానంతరమున మొదలిడిన ఈ విచ్ఛిత్తియందే ఆ ఖండమునందు ముమ్ముందు రూపొందనున్న వివిధ జాతీయ ప్రాంతముల రూపురేఖలు కొంతవరకు ఏర్పడుటకు ఆస్కారము కలిగినది. అటులని ఆనాడు అవి ఒక్కపెట్టున రూపొందినవని భావింపతగదు. అందులకు ముందుగ యూరప్ ఖండము పెక్కు కల్లోలిత పరిస్థితులను ఎదుర్కొనవలసి వచ్చినది. ఆ పరిస్థితులలో 9, 10 శతాబ్దములందు అట చెలరేగిన అరాజకత, యుద్ధ పీడ, అధికారాసక్తుల కుతంత్రములు మొదలగు వానిని వివరించుటకు ఇట అవకాశము లేదు. ఎటులైననేమి, కడకు నేడు ఫ్రాన్స్ దేశముగ వ్యవహరింపబడు ప్రాంతము లందు 911 నాటికి షార్లమేన్ వంశజుల పరిపాలన అంతరించినది. అట హగ్‌కేపట్ అనువాడు తన పేర వేరొక రాజవంశమును నెలకొల్పి మాండలిక సామంతపాలకుల పరిగణన పొందినను, నిజమగు అధికారము మాండలికుల చేతులలోనే ఉండినది. ఇక పూర్వపు షార్లమేన్ రాజ్యమందలి జర్మన్ భాగములలోని మాండలికులు 918 లో హెన్రీ అను జర్మన్ జాతీయుని తమకు పాలకునిగ ఎన్నుకొనిరి. కాని, ఇట సైతము మాండలికులే ఆంతరంగిక పరిపాలనా విషయములందు సర్వస్వతంత్రులై ఉండిరి. ఇందులకు హెన్రీ అభ్యంతరము తెలుపక చతురతతో వ్యవహరించెను. అందులకు ప్రత్యామ్నాయముగ అతని మరణానంతరమున అతని కుమారుడు 'ఓటో' నే మాండలికులు ప్రభువుగ ఎన్నుకొనిరి (936). ఇతడే సుప్రసిద్ధుడగు ఓటో-I [చూ]. జర్మనీయందు సుసంఘటితమగు పరిపాలనను ఏర్పరచి అతడు ఆ దేశమును బలవత్తర రాజ్యముగ రూపొందించెను.

షార్లమేన్ మరణానంతరమున పోప్ అధికారము మరల హీనస్థితికి వచ్చెను. దక్షిణముననున్న సిసిలీని ఆక్రమించిన అరబ్‌లవలన బెడదతో పాటుగ, ఇటలీయందలి సాహసిక సామంతులను సైతము పోప్‌లు ఎదుర్కొనవలసి వచ్చెను. ఇందులకు తోడుగ పోప్ పదవి క్రమముగ నీతివిహీనుల చేతులలోనికి పోయినది. పోప్‌లను ఎన్నుకొను ఎన్నికలలో సామంతులు జోక్యము వహించి ఎన్నికలను తారుమారు చేసెడివారు. ఈ పరిస్థితులలో పోప్ పదవిలో ఉన్నవాడు త్వరలో పదభ్రష్టుడగుటయో లేదా బలవన్మరణము పాలగుటయో తప్పక జరుగుచుండెడిది. తత్ఫలితముగ 896 నుండి 963 వరకు నడచిన అల్ప కాలమున ఇరువది మంది ఒకరి వెనుక ఒకరు పోప్ పీఠమును అధిష్ఠించిరి. కడకు వ్యభిచారిణీ పౌత్రుడగు వాడు ఒకడు జాన్ XII అను నామముతో ఆ పీఠమును

అధిష్ఠించుటతో ఆ నైచ్యము అతి నికృష్టస్థాయిని అందుకొనినది. అంతట రోమ్‌నందలి పెద్దల ఆహ్వానముపై జర్మన్ రాజగు ఓటో రోమ్‌నకు వచ్చి, అట పవిత్ర రోమన్ సామ్రాట్‌గ పట్టాభిషిక్తుడయ్యెను (962). ఈ పట్టాభిషేకమును పోప్ స్వయముగ తన చేతులతోనే జరిగించినను, ఆ తరువాత ఓటో చక్రవర్తి పోప్‌ను పదవీభ్రష్టుని చేసి, తనకు నచ్చినవానిని వేరొకనిని లియో - VIII అను పేర పోప్‌గ చేసెను. ఇటుల షార్లమేన్ కాలమున నెలకొల్పబడిన పవిత్ర రోమన్ సామ్రాజ్యము ఓటో కాలమున పునరుద్ధరితమైనది. కాని, అంతటినుండి అవిచ్ఛిన్నముగ అతి దీర్ఘకాలము అది కొనసాగుటచే చరిత్రకారులు అనేకులు 962 నే పవిత్ర రోమన్ సామ్రాజ్య సంస్థాపన జరిగిన కాలముగ పేర్కొనెదరు.

ఈ పవిత్ర రోమన్ సామ్రాట్‌ను తమ చక్రవర్తిగ ఫ్రెంచి ప్రజలు తొలుతనుండియు అంగీకరింప లేదు. అయినను, తక్కిన యూరప్‌నందు తన పలుకుబడిని విస్తరింపజేయుటకై ఓటో అవిరళకృషి చేసెను. జర్మనీ, ఇటలీ ప్రజలను ఏకమొనర్చుటకై అతడును, అతని అనంతరమున అతని వంశికులును చాల యత్నించిరి. ఈ వంశపువాడగు ఓటో - III రాజధానిని రోమ్‌నకు మార్చి, పూర్వపు రోమన్ సామ్రాజ్య వైభవమును స్మృతికి తెచ్చుచు, పశ్చిమ క్రైస్తవ రాజ్యమండలికెల్ల ఏకైక కేంద్రముగ ఆ నగరము రాణించునటుల చేయుటకు తన సమకాలిక పోప్‌తో కలసి యత్నించెను. కాని, ఆ కృషి విఫలమైనది. అయినను, ఆ కాలమున హంగేరీ మొదలుకొని ఫ్రాన్స్ వరకు గల యూరప్ ఖండమంతయు పవిత్ర రోమన్ సామ్రాట్‌లు అనబడు ఈ ఓటో వంశీయుల పాలనలోనికి వచ్చినది. యూరప్ ఖండమునకు చెందినవియే అయినను సముద్రము వలన విడివడిన బ్రిటిష్ దీవులు ఈ సంఘటనలో ప్రత్యక్షముగ పాల్గొనక, స్కాట్‌లాండ్, ఇంగ్లండు, ఐర్లాండ్ దేశములుగా ఆ కాలముననే రూపొందినవి.

**యూరప్‌పై వివిధ జాతుల దాడులు:** ఇటుల యూరప్‌నందు ఫ్రాన్స్, ఇంగ్లండు పవిత్ర రోమన్ సామ్రాజ్యము అనునవి ఏర్పడి కుదురుకొను సమయముననే వీనినేగాక, వీనికి తోడుగ బైజాంటైన్ సామ్రాజ్యమును సైతము కల్లోలపరచు దండయాత్రలు వెలుపలినుండి వచ్చిపడసాగినవి. వీనిలో తొలుతటిది అరబ్బుల దండయాత్ర; రెండవది నార్స్‌మన్‌లు అనబడు ఉత్తర యూరప్‌వాసుల దాడులు; మూడవది మధ్య ఆసియా నుండియు, దక్షిణ రష్యానుండియు వచ్చిపడిన తుర్కుల దండయాత్రలు.

కలీఫా పదవిని గురించిన వైరుధ్యముల ఫలితముగ వేర్వేరు ప్రాంతములందు కలీఫాలు మువ్వురు ఏర్పడిరను విషయము పాఠకుల దృష్టికి ఇదివరకే తేబడినది [చూ. పు. 76]. వీరిలో ఈజిప్టునందు నెలకొనిన ఫాతిమేయులనబడు కలీఫాలు మతసహనము లేనివారు. క్రైస్తవుల పుణ్యక్షేత్రమగు జెరూసెలమ్‌ను వారు ఆక్రమించి, క్రైస్తవులు తమ పుణ్యభూమిని దర్శించుటకు అభ్యంతరములను కల్పించిరి. ఇంతియేకాక సిసిలీ ద్వీపముకూడ అరబ్బుల వశమున ఉండుటచే ఇటలీకి అందువలన బెడద ఏర్పడినది. అట్టులే సముద్రాధిపత్యము సైతము అరబ్బుల వశమున ఉండుటచే ప్రాచ్య రోమన్ సామ్రాజ్యపు మనుగడ దినదిన గండముగ పరిణమించినది.

కాని, అరబ్బులవలనకన్న మిన్నగ యూరప్ ఖండము ఆనాడు నార్స్‌మన్‌ల దాడులచే కల్లోలితమైనది. యూరప్‌నందలి స్కాండినేవియా ద్వీపకల్పము ఈ నార్స్‌మన్‌ల తొలుతటి నివాసము. వారి నివాసభూమియే నేడు నార్వే, స్వీడెన్, డెన్మార్క్ దేశములుగ రూపొందినది. కాని, వేర్వేరు కాలములందు ఈ జాతియందలి వేర్వేరు తెగలు యూరప్‌లోని వివిధ ప్రాంతములపై దండయాత్రలను జరపినవి. చిన్న చిన్న నౌకలలో వీరు పయనించి, దూరదేశములకు పోయి దోపిడి జరపెడివారు. క్రీ. శ. అయిదు, ఆరు శతాబ్దములందే వీరిలో కొన్ని తెగలవారు తమ దండయాత్రలు మొదలిడిరి. ఆ శతాబ్దములందు ఇంగ్లండున వలస చేరిన ఏంగిల్‌లు, శాగ్జన్‌లు, జూట్‌లు ఈ కోవలోనివారే అని పండితుల అభిప్రాయము. ఆ తరువాత ఈ జాతివారి రెండవ వెల్లువ 8, 9 శతాబ్దములలో యూరప్‌ను ముంచి ఎత్తినది. వీరిలో ఒక శాఖకు చెందిన డేన్‌లు ఇంగ్లండుపై దండెత్తి అందు సగభాగమును వశపరచుకొనిరి. ఆ కాలమున ఇంగ్లండును పాలించు ఆల్‌ఫ్రెడ్ [చూ.] బహు సమర్థుడు; పరిపాలనా దక్షుడు. ఇతని కృషి మూలమున డేన్‌లందు క్రైస్తవ మతము వ్యాపించినది. ఆ తరువాత ఆ మతము పలువురి కృషిఫలితముగ నార్స్‌మన్‌లలో సర్వత్ర వ్యాపించెను. ఆల్‌ఫ్రెడ్ తరువాత కొంత కాలమునకు డేన్‌లే కెన్యూట్ రాజుగ ఇంగ్లండునకు అంతటికిని పాలకులైరి (1017); అతని పరిపాలనా కాలమున డేన్‌లు గ్రీన్‌లాండ్, ఐస్‌లాండ్ దీవులలో వలస చేరిరి. ఉత్తర అమెరికా యందును ఆనాడు ఒక వలసను వారు నెలకొల్పినటుల తెలియుచున్నది; కాని, అది వర్ధిల్లలేదు. వాయవ్యపు ఫ్రాన్స్‌నందు ఆ కాలముననే కొందరు నార్స్‌మన్‌లు వలస చేరిరి (911).

ఈ ప్రాంతమునకే నార్మండీ అనియు, అందు వలస చేరిన నార్స్‌మన్‌లకు నార్మన్‌లు అనియు వ్యవహారము కలిగినది. ఈ నార్మన్‌లలో ఒక ప్రభువు - విలియమ్ అను వాడు - ఇంగ్లండును జయించి (1066) అచట తన పరిపాలనను నెలకొల్పెను.

చరిత్ర ప్రసిద్ధులగు ఈ నార్స్‌మన్‌లు అటు పశ్చిమ దిశకేకాక తమ స్వదేశమునుండి తూర్పు దిక్కునకును తమ దండయాత్రలను సాగించిరి. బాల్టిక్ సముద్రమును తమ పడవలచే అతిక్రమించి వారు నదీ మార్గములను అనుసరించి రష్యా మధ్యభూమికి చొరబారిరి. అట వారు నోవోగ్రాడ్ మొదలగు చోటుల కొన్ని వలసలను ఏర్పరచుటయే కాక అటనుండి నల్ల సముద్రము, కాస్పియన్ సముద్రముల తీర భూములకు పయనించి, ఆ ప్రాంతములను ఆక్రమించిరి. దారి పొడుగునను, వీలైనపుడు దోపిడి లేదా వ్యాపారముల వలన వారు జీవించిరి. అంతియే కాదు; ఆ నాడు పారసీకమును కూడ వారు కల్లోలపరచిరని తెలియ వచ్చుచున్నది. తమ చిన్న పడవలతో ఒక గొప్ప నౌకాదళమును నిర్మించి దండయాత్రలు జరిపి, పలుతూరులు వారు కాన్‌స్టాంటినోపుల్ నగరమునకే ముప్పు తేగలిగిరి (865; 904; 941; 1043). ఇటుల రష్యా ప్రాంతములకు వచ్చిన నార్స్‌మన్‌లలో రూరిక్ అనువాడు నోవోగ్రాడ్ నగరమునకు పాలకుడయ్యెను (850 ర). అతని కుమారుడే ఆధునిక రష్యా రాజ్యమునకు తొలిరూపమును ఏర్పరచెను.

కాలక్రమమున నార్మండీలోని నార్మన్‌లు మధ్యధరా ప్రాంత భూములకును తమ పలుకుబడిని విస్తరింపజేసిరి. తొలుత అచటి పాలకుల సేనలలో జీతపు సైనికులుగ వారు చేరి, తరువాత తామే స్వయముగ దండయాత్రలకు పూనుకొనిరి. తుదకు వారి యుద్ధచాతుర్యమునకు వశులై పోప్‌ను, ఆనాటి పవిత్ర రోమన్ సార్వభౌముడును వారి మైత్రిని అవలంబించిరి (1053); కాని, ఇది చిరకాలము నిలువలేదు. తరువాత వారు ఒక సమయమున పోప్‌నే ఓడించి తామును క్రైస్తవులగుటచే అతనిని విడిచి వైచిరి. అందులకు బదులుగ ఉదాత్తగీతిలో పోప్ వారి అవినయమును క్షమించెను! అంతియే కాదు; క్రమమున నార్మన్‌లు దక్షిణ ఇటలీలోని కొంత భాగమును ఆక్రమించుటయే కాక, అరబ్బులను ఓడించి, సిసిలీని వశపరచుకొనిరి (1060 - 90). అచట నుండి రాబర్ట్ అను వాని నాయకత్వమున నార్మన్‌లు ప్రాచ్యసామ్రాజ్యముపై దండెత్తి, అందు డురజ్జో అను నగరమును వశపరచుకొనిరి. కాని, ఇటలీలో చెలరేగిన కల్లోలముల వలన వెనుదిరిగి పోవలసివచ్చినది (1082).

అరబ్బుల వలన గాని, నార్స్‌మన్‌ల వలన గాని చేకూరిన పరిణామముల కన్న విషమములగు వానిని తుర్కుల దండయాత్రతో యూరప్ ఖండము ఎదుర్కొనవలసి వచ్చినది. ఈ తుర్కులు మధ్య ఆసియా యందలి హూణులలో ఒక శాఖకు చెందినవారని పలువురు పండితుల అభిప్రాయము. అంతటంతట ఈ హూణుల బెడద యూరప్ ఖండమునే కాక ఆసియాలోని కొన్ని ప్రాంతములను కూడ కల్లోలితములుగ చేసిన విషయము పాఠకులకు సుపరిచితమే. షార్లమేన్ కాలమున ఈ తుర్కులలోని అవరలు, మాజియర్‌లు అను తెగలవారు ఆ సామ్రాజ్యపు తూర్పు సరిహద్దుపై దండయాత్రల సలిపిరి. కాని, ఆ చక్రవర్తి వారిని నిలువరింపగలిగెను. ఆ సార్వభౌముని అనంతరమున రాజ్యపు పటిమ సన్నగిల్లినంతట ఈ తెగల వారు మరల దండయాత్రలకు పూనుకొని, 900 నుండి 950 వరకు ఫ్రాన్స్, జర్మనీ, ఉత్తర ఇటలీ దేశములలో తమ దోపిడులను విచ్చలవిడిగ కొనసాగించిరి. ఈ దండయాత్రల ఫలితముగ తూర్పు యూరప్‌నుండి దక్షిణమునకు తరుమబడిన బల్గేరియన్‌లు డాన్యూబ్ నదికిని, ప్రాచ్య సామ్రాజ్యమునకును మధ్య గల ప్రదేశమున నేటి బల్గేరియా రాజ్యమును నెలకొల్పిరి.

ఈ మాజియర్ దండయాత్రల నుండి యూరప్‌ను రక్షించిన ఖ్యాతి ఓటో - I కు దక్కినది. ఇతడు వారిని తరిమివేయుటయే కాక, వారి స్వదేశమున క్రైస్తవ మతము వ్యాపింపచేయుటకు కృషిచేసెను. ఆ దేశమే నేటి హంగేరీ. కడకు ఇంకను పలువుర కృషిఫలితముగ 1000 నాటికి హంగేరీయందు అంతటను క్రైస్తవ మతము వ్యాపించుటయే కాక అంతటితో మాజియర్ లందలి దౌర్జన్యతత్త్వమును కొంతవరకు ప్రశాంతత పొందినది. ఇటుల తుర్కులందలి ఒక శాఖ సౌమ్యజీవితమునకు అలవడినను, ఆసియాలోని తక్కిన తుర్కులలో మాత్రము ఇట్టి మార్పు కలుగలేదు. శస్త్రజీవనమును వారు యథేచ్ఛగ కొనసాగించుచు, సభ్యరాజ్యములను కల్లోల పెట్టుటయే తమ వృత్తిగ ఇడుకొనిరి. ఇటుల దోపిడుల సాగించిన పలుతెగల తుర్కులలో చారిత్రక రీతిలో ప్రముఖత వహించినవారు సెల్జుక్ తుర్కులు. అరబ్బులు మధ్య ఆసియాలో సాగించిన దండయాత్రల ఫలితముగ సున్నీ శాఖకు చెందిన ఇస్లామ్ మతము వీరియందు విరివిగ వ్యాపించెను. అంతటినుండి ఇస్లామ్ రాజకీయములందు వీరి ప్రసక్తి అతిశయిల్లెను. బాగ్దాద్‌నందలి కలీఫాలు క్షీణదశలో ఉన్న కాలమున ఈ తుర్కుయోధులే వారికి అండగ ఉండిరి. ఇస్లామ్‌నందు సంస్కరణవాదముగ

భావింపబడి తత్కారణమున సున్నీలచే ద్వేషింపబడు షియా సంప్రదాయమును అవలంబించిన ఇరాన్, ఆర్మీనియా ప్రభువులను ఈ తురుష్క యోధులు ఓడించి, బాగ్దాద్ కలీఫాను కడకు తమ రక్షణలోనికి స్వీకరించిరి. పదునొకండవ శతాబ్ది ఉత్తరార్ధము ఆరంభించినది మొదలుగ కలీఫాలు తురుష్క సర్దారుల చేతి కీలుబొమ్మలైరి. ఇటుల ప్రశస్తిని ఆర్జించిన తురుష్క యోధులు పూర్వమునుండియు ఇస్లామ్ సామ్రాజ్య విస్తృతికి అవరోధముగ నిలిచిన ప్రాచ్య సామ్రాజ్యమును అంతమొందింప సంకల్పించి, ఆసియా మైనర్ నందు అత్యధిక భాగమును ఆక్రమించిరి (1071). అంత తమ సామ్రాజ్యము ఇక నిలువజాలదను పరిస్థితి ఏర్పడినంతట ప్రాచ్య రోమన్ సామ్రాట్ పోప్‌నకు సహాయమునకై విజ్ఞప్తిని పంపెను. అంతకుముందే తురుష్కుల దండయాత్రల మూలమున ప్రాచ్య యూరప్‌నందును, ఆసియాయందును క్రైస్తవమతమునకు సర్వనాశము ఘటిల్లెనను ప్రవాదములు యూరప్‌నందు ఎల్లెడల వ్యాపించెను. ఇట్టి పరిస్థితిలో అప్పటి పోప్ (అర్బన్ - II) ఫ్రాన్స్‌నందు క్రైస్తవ ప్రముఖుల సమావేశమును జరిపి, క్రైస్తవమత సంరక్షణార్థమై యూరప్‌వాసులు తమ అంతఃకలహములకు స్వస్తి చెప్పి, సుసంఘటితులై తురుష్కులను ఎదిర్చి, జెరూసెలెమ్ మున్నగు పుణ్యక్షేత్రములను కాపాడవలసినదిగ ప్రబోధించెను (1095). తత్ఫలితముగ యూరప్‌నందు ఒక నూతన చైతన్యము ఉదయించి ప్రపంచేతిహాస ప్రసిద్ధములగు క్రైస్తవ ధర్మయుద్ధములు - క్రూసేడ్‌లు [చూ.] - ఆరంభితములైనవి. వీనిని, వీని ఫలితములను గురించి తెలియుటకు ముందుగ ప్రాచ్య ఆసియాయందు జరిగిన కొన్ని సంఘటనల వైపునకు మన దృష్టిని మరల్పవలసి ఉన్నది.

## భారత, విశాల భారతములు

### (క్రీ. శ. 622 - 1236)

జన్మభూమియగు అరేబియా దేశపు సరిహద్దులను అతిక్రమించి ఇస్లామ్ మతము పారసీకమును లోగొని అటతావును కల్పించుకొనిన కాలమున ఉత్తర భారతదేశము హర్షుని పాలనమున ఉండెను. హర్షుని మరణానంతరమున (647) అతని సామ్రాజ్యము విచ్ఛిన్నమైనది. అంతట ఆ యా ప్రాంతములందు మాండలిక ప్రభువులు సర్వస్వతంత్రులై చిన్న చిన్న రాజ్యములను స్థాపించుకొనిరి. ఈ ప్రభువులలో కొందరు అంతటంతట తక్కిన వారిని జయించి, ఉత్తర భారతదేశమున మరల ఒక విశాల సామ్రాజ్యమును సంస్థాపింపవలయునని సంకల్పించి కృషి చేసిరి. కాని, కడకు క్రీ. శ. 836 లో ప్రతిహార వంశీయుడగు భోజచక్రవర్తి ఉత్తర భారతదేశమును అంతటిని జయించి సామ్రాట్‌గ అభిషిక్తుడగువరకు ఆ యత్నము సఫలతను పొందలేదు. క్రీ. శ. 647 మొదలుగ 836 వరకును నడచిన ఈ దీర్ఘకాలమున సామ్రాజ్య సంస్థాపన కొరకై కృషి చేసిన రాజవంశములలో ఉత్తరగుప్త, కర్కోట, పాల రాజవంశములు ముఖ్యముగ పేర్కొనదగినవి.

వీరిలో ఉత్తర గుప్తులు మగధవాసులు. వీరికిని, పూర్వ గుప్తులకును కల రక్తసంబంధమును గురించిన వివరములు తెలియవచ్చుటలేదు. కాని, వీరిలో ఆదిత్యసేన గుప్తుడు హర్షుని అనంతరమున గుప్తరాజ్యమును పునరుద్ధరించుటకై యత్నించి అందు కొంత సఫలతను ఆర్జించినటుల తెలియవచ్చుచున్నది. క్రీ. శ. 672 లో ఈతని పరిపాలన అంతరించినటుల భావించుటకు ఆధారములు కలవు. ఆ తరువాత ఈతని వంశజులు మువ్వురు క్రమముగ ఆ విశాల రాజ్యమును పరిపాలించినను వంగ ప్రాంతమును పాలించు గౌడుల విజృంభణవలన ఆ రాజ్యము ఎక్కువకాలము మనలేక పోయినది. కాని, మగధరాజ్యమును గౌడులు తమ వశమున దీర్ఘకాలము ఉంచుకొనలేకపోయిరి. ఇంతలో కనూజ్ పాలకుడగు యశోవర్మ ఆ రాజ్యమునకు హర్షునినాటి ప్రతిపత్తిని తిరిగి చేకూర్చుటకు యత్నించి, తన జైత్రయాత్రలవలన ఉత్తర భారతదేశమున అత్యధికభాగమును లోగొనుటచే గౌడులు మగధనుండి వైదొలగిరి. సమకాలిక చీనా సార్వభౌమునితో దౌత్యసంబంధమును నెలకొల్పుకొని (731) యశోవర్మ హర్షునివలెనే అన్ని విధముల ప్రతిష్ఠను ఆర్జించెను. కాని, కనూజ్ రాజ్యమునకు చేకూరిన ఈ ప్రశస్తి అత్యల్పకాలము మాత్రమే నిలువగలిగినది. సమకాలిక కాశ్మీర పాలకుడగు ముక్తాపీడ లలితాదిత్యునితో సంఘటిల్లిన వైరము ఫలితముగ యుద్ధరంగమున యశోవర్మ అంతరించెను (740). అంతట భారత రాజకీయ రంగమున కాశ్మీర ప్రాంత పాలకులు సమధిక ప్రాముఖ్యమును ఆర్జించిరి.

కాశ్మీర పాలకుడగు ముక్తాపీడలలితాదిత్యుడు 'కర్కోట' వంశజుడు. ఈతని తాతయగు దుర్లభవర్ధనుడు కాశ్మీరమున తొలుతగ ఈ రాజవంశపు పాలనను నెలకొల్పెను. లలితాదిత్యుని (733 - 769 ప) కాలమున కాశ్మీరము ఒక సామ్రాజ్యమునకే కేంద్రము కాగలిగెను. కనూజ్ పాలకుడగు యశోవర్మనే కాక టిబెట్ సేనలను, తురుష్కులను సైతము ఓడించి లలితాదిత్యుడు సార్వభౌమ ఖ్యాతిని ఆర్జించెను.

అరబ్బులనుండియు, టిబెట్ వాసులనుండియు తన సామ్రాజ్యమునకు ముప్పురాగలదను భయముతో నాటి చీనీయ సార్వభౌముడు లలితాదిత్యునితో మైత్రిని అవలంబించి వ్యవహరించెను. లలితాదిత్యుని మనుమడగు వినయాదిత్యుడు తాతను పోలిన వీరుడే అయినను దౌష్ట్యమునకును, దుష్టపరిపాలనమునకును పేరొందెను. క్రమముగ 9 వ శతాబ్ది మధ్యకాలమునకు కాశ్మీరపు ప్రశస్తి భారత రాజకీయ రంగమున సన్నగిలెను.

క్రీ. శ. 8 వ శతాబ్దిలో భారతదేశమున ప్రాముఖ్యమును ఆర్జించిన వేరొక వంశము 'పాల' రాజులకు చెందినది. వంగరాష్ట్రమున క్రీ. శ. 750 ప్రాంతమున అరాజకత వ్యాపింపగ, 'గోపాలు' డను వానిని ప్రముఖులు రాజుగ ఎన్నుకొనిరి. ఈతడే పాలవంశమునకు మూల పురుషుడు. ఈ వంశమునకు చెందిన రెండవరాజు ధర్మపాలుడు. ఈతడు కనూజ్ రాజ్యమును వశపరచుకొని, అచట తన చేతి కీలుబొమ్మ అగు చక్రాయుధుని పాలకునిగ చేసెను. ధర్మపాలుని రాజ్యము ఢిల్లీనుండి బంగాళాఖాతము వరకును, జాలంధరము నుండి వింధ్యాద్రుల వరకును వ్యాపించెనని తెలియవచ్చుచున్నది. ఈతని అనంతరమున ఇతని సోదరుని పుత్రుడు దేవపాలుడు రాజయ్యెను. ఈ దేవపాలుడు పశ్చిమదేశపాలకులగు ప్రతిహారులయు, దక్షిణదేశపాలకులయు ప్రతిఘటనను ఎదుర్కొని విజయవంతముగ నిలువగలిగెను. ఈ దేవపాలుని అనంతరమున పాలవంశపు ప్రశస్తియు క్షీణస్థితి పొందినది. ఈ పాలవంశీయులు బౌద్ధులు. బౌద్ధమత వ్యాప్తికి వీరికాలమున ఎక్కువ కృషి జరిగెను. జావా, సుమత్రా, మలయాలను ఆ కాలమున పాలించు బౌద్ధ ప్రభువులతో వీరు సన్నిహిత సంబంధముల నెలకొల్పుకొనిరి.

క్రీ. శ. 898 నాటికి పాలప్రభువుల జన్మభూమియగు వంగప్రాంతమున ఉత్తర భాగమంతయు ప్రతిహార సామ్రాజ్యమున అంతర్లీనమగుటతో పాలరాజ్యము ఒక అల్పరాజ్యముగ పరిణమించినది. ఆ తరువాత దాదాపు రెండు శతాబ్దములు ఆ స్థితిలోనే ఆ రాజ్యము మనగలిగినది; కాని, పూర్వవైభవమును సంతరించుకొనలేక పోయినది.

ఇటుల వంగదేశము వరకు తమ సామ్రాజ్యమును విస్తృతమొనర్చిన ప్రతిహార రాజవంశమునకు మూల పురుషుడు నాగభటుడు. ఉజ్జయిని ముఖ్యనగరముగ అవంతి ప్రాంతమును ఇతడు పాలించెనని కొందరు చరిత్రకారుల కథనము. ఇది ఎటులున్నను మాళవప్రాంతమును ఇతడు తొలుత పరిపాలించెననియు, సింధుదేశమును ఆక్రమించిన అరబ్బులు అటనుండి తక్కిన భారతదేశములోనికి చొచ్చుకొని రాకుండ నిరోధించిన రాజపుత్రయోధులలో ఇతడును ఒకడనియు ఈతని శాసనములవలన తెలియవచ్చుచున్నది. ఈయన వంశమున జన్మించిన వత్సరాజు పరంపరాగతమగు రాజ్యపు సరిహద్దులను విస్తరింపజేసి సామ్రాట్ కాగలిగెను. కాని, దక్షిణ భారతదేశమున ఆనాడు ప్రముఖతను ఆర్జించిన రాష్ట్రకూట పాలకుడు - ధ్రువుడు - ఈ వత్సరాజును ఓడించి, అతని రాజ్యమును ఆక్రమించెను. అయినను వత్సరాజు కుమారుడగు నాగభటుడు - II (800 - 833 ప) స్వీయ పరాక్రమమువలన రాజ్యమును మరల ఆర్జించుటయేకాక, కనూజ్ పాలకుడగు చక్రాయుధుని ఓడించి, పారద్రోలి (816) కనూజ్ నగరమును తన రాజధానిగ చేసికొనెను. ఈ నాగభటుడు - II కూడ తండ్రివలెనే రాష్ట్రకూటుల దండయాత్రను ఎదుర్కొనవలసివచ్చినది. తత్ఫలితముగ దక్షిణదేశమున కొంత భూమిని అతడు రాష్ట్రకూటులకు వదలుకొనెను. నాగభటుడు - II యొక్క పౌత్రుడగు మిహిరుడు తాతను మించిన వీరుడుగ పేరొంది, జైత్రయాత్రల మూలమున పలుప్రాంతముల జయించి, ప్రతిహార సామ్రాజ్యమునకు స్థిరరూపమును కల్పించెను. ఈ మిహిరునకే 'భోజు' డనియు వ్యవహారము కలదు. హిమాలయములు మొదలుగ వింధ్యాద్రి వరకును, సట్లెజ్‌నది మొదలుగ బ్రహ్మపుత్రానదివరకును ఈతని సామ్రాజ్యము విస్తరించి ఉండెను. ఇటుల కాశ్మీరము, వంగప్రాంతమున దక్షిణ భాగము తప్ప దాదాపుగ తక్కిన ఉత్తరభారతదేశమంతయు అతని ఆధీనమున ఉండెను. ఆ తరువాత క్రీ. శ. 916 వరకు ఈ విశాల సామ్రాజ్యము ప్రతిహారవంశజుల వశముననే చెక్కుచెదరక ఉండగలిగెను. అంతటినుండియు ఆ రాజ్య పాలకులు రాష్ట్రకూటుల తీవ్రదండయాత్రలను ఎదుర్కొనవలసివచ్చెను. ఈ దండయాత్రలచే రాజ్యపు స్థైర్యమునకు భంగమేర్పడి తుదకు 977 మొదలుగ సామ్రాజ్యమునందలి వేర్వేరు ప్రాంతములు స్వతంత్రములు కానారంభించినవి. అయినను కనూజ్ కేంద్రముగ ఒక అల్పరాజ్యము మాత్రము ప్రతిహారరాజవంశీయుల వశముననే 1018 వరకు ఉండెను.

ప్రతిహార సామ్రాజ్యస్థైర్యమునకు భంగమును కలిగించిన వారుగ పైన పేర్కొనబడిన రాష్ట్రకూటులు దక్షిణ భారతదేశ పరిపాలకులు. హర్షుని కాలమున దక్షిణభారతదేశమున చాళుక్య వంశీయుడగు పులకేసి ప్రముఖతను ఆర్జించి ఉండెనని ఇదివరలో తెలుపబడినది [చూ. పు. 45].

ఆ పులకేసియు, అతని అనంతరమున క్రమముగ అతని వంశజులును పల్లవ రాజులతో పోరాటములందు నిరంతరముగ మునిగి తేలిరి (ఈ పల్లవులు కృష్ణానదికి దిగువ ఉండిన ప్రాంతమును ఆ కాలమున పాలించిరి). తత్ఫలితముగ చాళుక్య ప్రభువులు బలహీనులగుట వలన వారి సామంతులగు రాష్ట్రకూటులు దంతిదుర్గుని నాయకత్వమున రాజ్యమును వశపరచుకొనిరి (753). ఈ వంశపువాడగు ధ్రువుని కాలమున (780-793 ప) రాష్ట్రకూటులు దక్షిణభారతదేశ రాజులను మాత్రమేకాక, ఉత్తర భారతదేశమున ప్రతిహార వంశపు రాజగు వత్సరాజును సైతము ఓడించి అఖిల భారత ఖ్యాతిని ఆర్జించిరి. ధ్రువుని కుమారుడు గోవిందుడు - III (793 - 814 ప) తండ్రిని మించిన మహా విజేత. ఈతని కాలమున దక్షిణభారతదేశము రాష్ట్రకూటుల ఆధిపత్యమును అంగీకరించినది; సింహళము అతని సార్వభౌమత్వమునకు అంగీకృతి తెలిపినది. ఇంతియేకాదు, దక్షిణదేశ విజయముతో తృప్తి చెందక, గోవిందుడు ఉత్తర భారతదేశముపైకిని దండెత్తెను. అట అతడు కనూజ్, మాళవములను జయించుటయే కాక, సమకాలీన పాలరాజును కూడ లోగొనెను. అయినను ఉత్తర భారతదేశమున ఏ ప్రాంతమును అతడు తన రాజ్యమున చేర్చుకొనలేదు. గోవిందుని కుమారుడగు నృపతుంగుని (అమోఘవర్ష - I) కాలమున (814 - 880) రాష్ట్రకూట రాజ్యము ప్రపంచ రాజ్యములందు ఒక ప్రముఖ రాజ్యముగ పేరెన్నిక కాంచెను. రాష్ట్రకూటుల రాజధానియగు మాన్యఖేటము (మాల్ ఖేడ్) ఆ నాడు విదేశీయవర్తకులను పలువురను ఆకర్షింపగలిగెను. ప్రపంచమున నాలుగుమాత్రమే ప్రముఖ రాజ్యములు కలవనియు, అందు రాష్ట్రకూట రాజ్యము ఒకటి అనియు, చీనా, ప్రాచ్య రోమన్, అరబ్బీ సామ్రాజ్యములు తక్కిన మూడుగ లెక్కింపబడుచున్నవనియు ఆనాటి అరబ్బీ చరిత్ర రచయితలు పేర్కొనిరి. నృపతుంగుని అనంతరమున రాష్ట్రకూటుల వైభవము సన్నగిల మొదలిడినది. కడకు 973 లో రాష్ట్రకూట ప్రభువుల ఆధిపత్యమును తొలగించి, చాళుక్యులలో ఒక తెగవారు (వీరికే కల్యాణి చాళుక్యులను వ్యవహారము కలదు) తైలపుని నాయకత్వమున రాజ్యమును వశపరచుకొనిరి. అంతకు కొంత కాలము పూర్వమున పల్లవ, పాండ్య ప్రభువుల పరిపాలనలను అంతరింపజేసి తమిళనాడున చోళులు ఆధిక్యమును వహించిరి. అంతటినుండి దాదాపు రెండు శతాబ్దముల కాలము దక్షిణభారత సర్వాధిపత్యము కొరకై చోళులును, కల్యాణి చాళుక్యులును పరస్పరము పోరాడిరి. వీరిలో ఎవరును తమ ఆశయమును సాధింపలేక పోవుట నిజమే అయినను, చోళులు మాత్రము రాజరాజ - I (985 - 1016 ప.), అతని కుమారుడు రాజేంద్రచోళ - I (1012 - 1044 ప.) అనువారి పరిపాలనా కాలములందు అద్భుత విజయములను సాధించిరి. తమిళనాడు మాత్రమే కాక, భారతదేశపు తూర్పు తీరమంతయు ఆ కాలమున చోళుల వశమయ్యెను. చోళ సేనానులు ఆనాడు గంగాతీరము వరకు తమ సేనలను అప్రతిహతముగ నడపిరి. చోళుల నౌకాబల ధాటికి లొంగి సింహళము, నికోబార్ దీవి, మలయా, సుమత్రా ద్వీపములు చోళ రాజుల సర్వంసహాధిపత్యమునకు తలయొగ్గినవి. కాని, చోళరాజ వంశీకుడగు రాజేంద్రకులోత్తుంగ చోళుని (1070 - 1120 ప.) అనంతరమున ఈ రాజ్యప్రతిష్ఠ సన్నగిలి, రాజ్యము క్రమముగ పాండ్య ప్రభువుల వశమయ్యెను. అట్టులే కళ్యాణి చాళుక్యుల వైభవమును నామమాత్రావశిష్టమై, 1190 లో ఆ రాజ్యము దేవగిరి, ఓరుగల్లు, ద్వారసముద్రములు కేంద్రములుగ క్రమమున యాదవ, కాకతీయ, హొయిసల అను మూడు చిన్న రాజ్యములుగ విడివడెను. [చూ. తెలుగు సంస్కృతి - ౧ సంపుటము - పు. 182; 224].

ఇటుల దక్షిణ, ఉత్తర భారతదేశములందు వేర్వేరు రాజ్యములు పొడమి అంతరించెడు ఈ కాలమున, ఈ రాజ్యముల ఉత్పత్తి, పతనములతో నిమిత్తము లేకుండ భారతసంస్కృతితో కల పరంపరాగత సంబంధమును సురక్షితముగ ఉంచుకొని దూరప్రాచ్యమున భారతీయుల వలస రాజ్యములు వర్ధిల్లినవి. ఇటుల ఆ ప్రాంతమున ఈ యుగమున పేరొందిన రాజ్యములలో తొలుతగ పేర్కొనదగినది సుమత్రాదీవిలోని శ్రీవిజయ రాజ్యము. క్రీ. శ. 4 వ శతాబ్దిలో స్థాపితమైన ఈ రాజ్యము 7 వ శతాబ్ది అంతమునకు విపుల ప్రశస్తిని ఆర్జింపగలిగినది. క్రీ. శ. 684 లో ఆ రాజ్యమును బౌద్ధమతావలంబియగు శ్రీ జయనాగుడు పాలించుచుండెనని తెలియవచ్చుచున్నది. 686 లో ఇతడు జావా ద్వీపముపై దండెత్తెను. క్రీ. శ. 775 నాటికి పరిసర ద్వీపములనేకాక, మలయా ద్వీపకల్పమును సైతము శ్రీవిజయపాలకులు తమ సామ్రాజ్యమున లీనము చేసికొనిరి. కాని, 8 వ శతాబ్ది అంతమునకు ఈ రాజ్యపు పటిమ సన్నగిలి శైలేంద్రరాజులు ప్రఖ్యాతిని ఆర్జించిరి. మలయా ద్వీపకల్పము ఈ శైలేంద్ర ప్రభువుల తొలుతటి స్థావరము. స్వస్థానమున తమ అధికారమును సుస్థిరమొనర్చుకొని, శ్రీవిజయప్రభువుల ఆధిపత్యమునుండి విడివడి, ఈ శైలేంద్ర ప్రభువులు ఆ వెనువెంటనే జావా ద్వీపమును వశపరచుకొనిరి (782). ఈ శైలేంద్రులను గురించిన పెక్కు విశేషములు అరబ్బీ చరిత్ర రచయితల

వలన విదితములు. సువర్ణద్వీపమునే (జావా, సుమత్రా మొదలగు వానినే) కాక సువర్ణభూమియందలి కాంభోజ (కాంబోడియా), చంపా (వియెత్నామ్) రాజ్యములను కూడ శైలేంద్రరాజులు పరిపాలించిరని వారి వ్రాతల మూలమున తెలియుచున్నది. ఈ రాజులు బౌద్ధ మతానుయాయులు. ప్రాచ్య భారతదేశమును ఆ కాలమున పాలించిన పాలరాజులతో వీరు సన్నిహిత సంబంధములను నెలకొల్పుకొనిరి. క్రీ. శ. 9 వ శతాబ్ది మధ్య భాగము వరకు శైలేంద్రసామ్రాజ్యము చెక్కుచెదరక నిలువ గలిగెను. అంతట జయవర్మ - II (క్రీ. శ. 802 - 854 ప.) ఆధిపత్యమున కాంభోజము శైలేంద్రుల ధిక్కరించి స్వాతంత్ర్యమును ఆర్జించినది. దాదాపుగ ఆ కాలముననే జావా ద్వీపము కూడ సామ్రాజ్యమునుండి విడివడినది.

కాంబోడియా, జావా దేశములు విడివడిన తరువాత సైతము శైలేంద్రసామ్రాజ్యము తక్కిన ప్రాంతములపై తన ఆధిపత్యమునకు భంగము రాకుండ జాగరూకత వహించి, దాదాపు ఇంకొక శతాబ్దికాలము బలవత్తర రాజ్యముగ మనగలిగినది. ఆనాడు అరేబియా, చీనా దేశముల మధ్య జరుగు వ్యాపారమునకు వినిమయ స్థానముగ ఉపకరించి ఆ దేశము సంపన్నతను ఆర్జించినది. సాంస్కృతికముగనే కాక వాణిజ్యరీత్యా సైతము భారత దేశమున పలు ప్రాంతములతో ఆ సామ్రాజ్యము సన్నిహిత సంబంధములను ఆ కాలమున నెలకొల్పుకొనినది. కాని, దురదృష్టవశమున చోళప్రభువులతో ఈ సామ్రాజ్య ప్రభువులకు వైరము సంఘటిల్లినది. తత్ఫలితముగ రాజేంద్ర చోళ ప్రభువు తన నౌకాదళమును ఈ సామ్రాజ్యముపైకి పంపెను (ఈ దండయాత్ర విషయము ఇదివరలో చోళుల ప్రసక్తిలో దిఙ్మాత్రముగ పేర్కొనబడినది). ఈ నౌకాదళము శ్రీవిజయము (పాలింబాంగ్), మలయాయందలి కడారం (కెడ్డా) మొదలగు పెక్కు ప్రదేశములను వశపరచుకొనుటయేకాక అప్పటి శైలేంద్ర రాజ్యపాలకుడగు సంగ్రామ విజయోత్తుంగవర్మను బందీగ పట్టుకొనెను (1025). చోళుల సర్వంసహాధిపత్యమును అంగీకరించిన తరువాత ఈ రాజునకు అతని రాజ్యము మరల ఈయబడినది. కాని, క్రమముగ చోళరాజ సింహాసనమున బలహీన ప్రభువులు చేరినంతనే క్రీ. శ. 1090 తరువాత శైలేంద్రరాజ్యము మరల స్వతంత్రతను సంపాదించెను. ఆ తరువాత కాలు నిలువద్రొక్కుకొని 13 వ శతాబ్దివరకు ఆ రాజ్యము తన మనుగడను ఏదియో ఒక తీరున సాగింపగలిగినది.

భారతదేశమునను, విశాల భారతదేశమునను పై తీరుగ ఈ యుగమున పెక్కు రాజ్యములు - అందు కొన్ని అతి సమర్థములు - రూపొందినను, ఇందేదియు దీర్ఘకాలము మనుగడను సాగించి, ఈ ప్రాంతములను అన్నింటిని రాజకీయముగ ఐక్యమొనర్పజాలక పోయినదను విషయము సుస్పష్టము. కాని, ఈ ప్రాంతములందు అన్నింటను సాంస్కృతిక ఐక్యము ఆనాడు బాగుగ రూపుగొనినది. పదింబదిగ యుద్ధాదుల వలన రాచరికమున ఈ ప్రాంతము లందు మార్పులు జరుగుచుండినను, ఆ యుద్ధాదులలో పాల్గొను రాజులకును, సేనానులకును సాంఘిక వ్యవస్థను గురించిన అభిప్రాయములు ఒకే తీరుగ ఉండి ఉండుటవలన ఈ మార్పులవలన సంఘ పరిస్థితియందు అస్తవ్యస్తత ఏదియు కలుగలేదు. అధికారమునకై పెనగులాడు వారిలో విజేత కడకు ఎవడైనను అతడు పూర్వసాంఘిక వ్యవస్థను యథాతథముగ సాగిపోనిచ్చి, తన అధికారమును మాత్రము నిలుపుకొనుటకై కృషి చేసెడివాడు. తత్ఫలితముగ సామాన్య పౌరునకు రాజకీయపు మార్పులందు ఆసక్తియే ఉండెడిదికాదు. గ్రామీణ జీవితము ఆనాడు భారతదేశమునందును, విశాల భారతదేశమునను ఒడుదొడుకులు లేక సాగిపోవుచుండెడిది. గ్రామము ప్రక్కనే ఇరువురు రాజుల సేనల మధ్య పోరాటము జరిగినను, దాని ఫలితమును గురించి గ్రామీణులు ఎట్టి శ్రద్ధయు వహించెడివారు కారు. గ్రామమునుండి సంప్రదాయ రీతిని అనుసరించి సాలీనా తనకు రాదగు రాజ భాగము, శుల్కములు వగైరా మాత్రమే విజేత స్వీకరించెడివాడు. తక్కిన స్థానిక పరిపాలనము అంతయు సంప్రదాయ పద్ధతిని అనుసరించి ప్రజలే గ్రామనాయకుల మూలమున నిర్వహించుకొనెడివారు. పూర్వరాజులు ప్రజాహిత సంస్థలకును, మత సంస్థలకును ఇచ్చిన భూదానాదులను ఆ రాజులను జయించి దేశమును వశపరచుకొనిన ప్రభువులు సైతము ఆమోదించెడివారు. ఈ పద్ధతియే వర్తక వ్యాపార సంస్థల విషయమునను రాజులు అనుసరించెడివారు. సాంస్కృతిక ఐక్యముచే సాధింపబడిన ఈ పరిణామము ఒక తీరుగ గర్వకారణమే అయినను, భారతదేశ చరిత్రలోని తదనంతర దుస్సంఘటనకు ఇయ్యదియే మూలమైనదని కూడ చెప్పవచ్చును. రాజకీయ కల్లోలములవలన సంఘవ్యవస్థకు భంగము కలుగదను అభిప్రాయము వేరులు పాదుకొనిన తరువాత రాజకీయ జీవితముతో సామాన్య పౌరులకు సంబంధము లేకుండపోయినది. కొందరు సాహసికులును, అధికార తృష్ణగల కొన్ని పాలకకుటుంబములును మాత్రమే ఆసక్తి

వహించు వ్యవహారములుగ యుద్ధములు పరిణమించినవి. దేశస్వాతంత్ర్య రక్షణమున సామాన్యపౌరుడు బాధ్యత వహించి తీరవలయునను విషయము అంతట కనుమరుగైనది. అందువలన సామాన్య ప్రజానీకమునకు సంబంధించినంతవరకు భారతదేశమున ఆనాడు ఒక విధమగు స్తబ్ధత ఆవరించినదని భావింపవచ్చును. ఇట్టి స్తబ్ధత సాంఘికపురోగతికి వేరుపురుగు. అంతట ఇట్టి స్తబ్ధతను పోగొట్టదగు ఆఘాతములను దేశమునకు తగులునటుల చేయుటకు కాలపురుషుడు రూపొందించెనా అనునటుల భారత సాంస్కృతిక భావనలను మన్నించని ఒక నూతన శక్తి అఫ్ఘనిస్తాన్‌లో పదవ శతాబ్ది అంతమునకు రూపు గొనినది. తుర్కు యోధులు ఆ శక్తికి సాధనములైరి. ఆ తుర్కుయోధులకు ఆత్మవిశ్వాస బలమును, విజిగీషను, ఉత్సాహమును ఇస్లామ్ మతము సమకూర్చినది.

తుర్కులు, వారి తొలుతటి స్థావరము, వారియందు ఇస్లామ్‌మతము వ్యాపించుట, అరబ్ సామ్రాజ్య వ్యవహారములలో పలుకుబడిని ఆర్జించి వారు కలీఫాను తమ చేతి కీలుబొమ్మగ చేసికొనుట మొదలగు విషయములు ఇదివరలో పాఠకుల దృష్టికి వేరొకచోట తేబడినవి [చూ. పు. 80-81]. అట్టి తుర్కులలో ఒక శాఖవారు అఫ్ఘనిస్తాన్‌లో గజనీ నగరము కేంద్రముగ తత్పరిసరములందు ఆధిక్యమును ఆర్జించిరి. వీరికి 977 లో సబుక్తిజిన్ అనునతడు ప్రభువయ్యెను. వాయవ్య సరిహద్దును అతిక్రమించి భారత దేశముపై ఇస్లామ్ సేనలను తొలుతగ నడపినవాడు ఈతడే. వాయవ్య భారతదేశములోని లంఘన్, పెషావర్ ఇతడు వశపరచుకొనెను. ఇతని మరణానంతరమున (997) ఇతని కుమారుడు మహమూద్ (ఇతనికే గజనీ మహమూద్ అనియు వ్యవహారనామము కలదు) తండ్రి తలపెట్టిన జైత్రయాత్రలను కొనసాగించి పంజాబ్‌వరకు భారతభూమిని జయించెను; కాని, భారతదేశమున సామ్రాజ్యమును నెలకొల్పుటకు అతడు యత్నింపలేదు. ఆ దేశపు నగరములను, దేవాలయములను దోచి ధనరాసులను, బానిసలను గజనీకి తరలించుకొని పోవుటయే అతని ముఖ్యాశయముగ ఉండెను. పశ్చిమ భారతదేశమున ప్రసిద్ధ పుణ్యక్షేత్రముగ ప్రసిద్ధికాంచిన సోమనాథ దేవాలయమును దోచుటయేకాక, అచటి లింగమును ఇతడు నిర్మూలించెను (1026). కనూజ్‌వరకు గల పశ్చిమ భారత దేశమంతయు ఇతని దండయాత్రకు లోనై ధ్వంసమయ్యెను. తన పరిపాలనా కాలమున (998 - 1030) ఇతడు పదునేడు పర్యాయములు భారతదేశముపై దండెత్తి బండ్లకొలదిగ సువర్ణరాసులను, అనర్ఘమణులను దేశము నుండి తరలించుకొని పోవుటయేకాక, మధుర మొదలగు భారత పుణ్యక్షేత్రములందలి రమ్యాలయములను నేలమట్టమొనరించి, అంతటితో తనివిపొందక, వానిని పరశురామ ప్రీతికి పాలుచేసెను. కాస్పియన్ సముద్రము మొదలుగ పంజాబ్‌వరకు తన సామ్రాజ్యమును ఇతడు విస్తరింజేసినను, ఇతని మరణముతో ఆ సామ్రాజ్యము సైతము అతుకుల బొంతగ పరిణమించి అంతఃకల్లోలములకు నిలయమయ్యెను. 1049 తో గజనవీయుల (సబుక్తిజిన్ వంశీయుల) పరిపాలన పటిష్ఠతను కోల్పోయెను. ఆ తరువాత లాహోర్ వరకు కల వాయవ్య భారత దేశము మాత్రము ముస్లిమ్ పరిపాలనలో ఉండినను, తక్కిన భారతదేశమునకు చాల కాలమువరకు ఎట్టి ముప్పును కలుగలేదు.

గజనీ మహమూద్ భారతదేశముపై దండయాత్రలను సాగించినకాలమున ప్రతిహార సామ్రాజ్యము చరమస్థితి యందు ఉండినది. మాండలికులలో కొందరు నామ మాత్రముగ ప్రతిహారసామ్రాట్‌ల సామంతులుగ ఉన్నను, మొత్తముమీద అందరును స్వతంత్రులుగనే వ్యవహరించుచుండిరి. ప్రతిహారుల రాజధానినగరమగు కనూజ్‌ను మహమూద్ దోచిన (1018) తరువాత ప్రతిహార పాలకులు మరల పూర్వవైభవమును సంతరించుకొనజాలక అంతరించిరి. అంతట గహాడ్‌వాలా వంశీయుడు - చంద్రదేవుడు - కనూజ్‌ను వశపరచుకొని (1090) తూర్పున అయోధ్య వరకు తన రాజ్యమును విస్తరింపజేసెను. ఢిల్లీయును ఈతని రాజ్యముననే ఆనాడు ఉండినది. 1194 వరకు ఈ వంశీయులు ఈ రాజ్యమును పరిపాలించిరి. కాని, వీరిలో ఎవరును హర్ష, భోజులవలె ఉత్తర భారతదేశమున రాజకీయ ఐక్యమును సాధించుటకు కృషిచేయలేదు. ఈ వంశీయులలో కడపటివాడు జయచంద్రుడు. ఇతని కాలమున ఉత్తరభారతదేశము బహు స్వతంత్ర రాజ్యములుగ విభక్తమై ఉండెను. అంతియేకాక ఆ రాజ్యములమధ్య పరస్పర విద్వేషములు పెచ్చుపెరిగి యుద్ధములకును తరచుగ దారితీయుచు ఉండెడివి. జయచంద్రుని సమకాలీనులలో పృథ్వీరాజు సుప్రసిద్ధుడు. ఇతడు చౌహాణ శాఖకు చెందిన రాజపుత్రుడు. అజ్మీర్ పరిసర ప్రాంతమును ఈతడు పాలించెడువాడు. జయచంద్రుని కుమార్తె (సంయుక్త) ను పృథ్వీరాజు కొనిపోవుటయు (1175 ర), తత్ఫలితముగ రగులుకొనిన వైరము ఆ రెండు రాజవంశముల నాశనమునకే కాక భారతదేశ దాస్యమునకును మార్గము సుగమమొనర్చిన విషయమును భారతేతిహాస పాఠకులకు సుపరిచితము.

పదునొకండవ శతాబ్ది ప్రథమార్ధమున సాగిన గజనీ మహమూద్ దండయాత్రల వలన భారతదేశీయ పాలకులలో వివేకము ఏమియు ఉదయించలేదనుటకు పైన పేర్కొనబడిన వైరములు నిదర్శనములు. ఇట్టి అవకాశమును సద్వినియోగము చేసికొని పూర్వపు గజనీ మహమూద్‌ను అనుకరించుచు భారతదేశముపై దండయాత్రలు సాగించినవాడు మహమ్మద్ షిహాబ్ ఉద్దీన్; ఇతనికే మహమ్మద్ ఘోరీ అనియు వ్యవహార నామము కలదు. గజనవీయుల ఆధిక్యము అంతరించినంతట ఘోర్ వంశజులు గజనీ నగరమును ఆక్రమించుకొనిరి (ఈ ఘోర్ వంశీయుడే మహమ్మద్ ఘోరీ). ఇతడు గజనీ సామ్రాజ్యమునకు చెందిన భారతదేశ వాయవ్యభాగమున తన అధికారమును సువ్యవస్థితము చేసికొనినతరువాత, పొరుగున ఉన్న హిందూ రాజ్యములపైకి తన దృష్టిని మరల్చెను. రాజపుత్రులు అజ్మీర్ పాలకుడగు పృథ్వీరాజు నాయకత్వమున తొలుత ఘోరీని ఓడించి తరిమిరి (1191); కాని, మరుసటి సంవత్సరమే ఘోరీ వేరొక దండయాత్రను సాగించి, రాజపుత్ర సేనలను ఓడించి అజ్మీర్ ప్రాంతమును వశపరచుకొనెను. పృథ్వీరాజుతో వైరము మూలమున ఘోరీని ఎదుర్కొనుటకు రాజపుత్రులతో కలయక వేరుగ నిలచిన జయచంద్రుని 1194లో ఘోరీ ఓడించి కనూజ్, వారణాసి ప్రాంతములను ఆక్రమించెను.

గజనీ మహమూద్ వలె కాక తాను జయించిన ప్రాంతములందు తన పేర సువ్యవస్థితరాజ్యమును నెలకొల్పుటకు కృషిచేసి, మహమ్మద్ ఘోరీ భారతదేశమున ఇస్లామ్ రాజ్యస్థాపనము చేసెను. భారతదేశములోని తన రాజ్యమును పాలించుటకు తనకు ప్రతినిధిగ అతడు కుతుబ్ ఉద్దీన్ అను బానిసను నియమించెను. ఢిల్లీ రాజధానిగ ఇతడు వ్యవహరించుచు, మహమ్మద్ ఘోరీ మరణానంతరమున, తాను పాలించు ప్రాంతమునకు, సేనానుల ఆమోదబలమున సుల్తాన్ కాగలిగెను (1206). ఇతని వంశీయులు క్రమముగ 1236 నాటికి దాదాపు ఉత్తర భారతదేశమును అంతటిని తమ ఆధిపత్యములోనికి తీసికొనిరాగలిగిరి.

ఇటుల 13వ శతాబ్ది ఆరంభమునకు ఉత్తర భారతదేశమున ముస్లిమ్ సామ్రాజ్యము సుస్థిరరూపమును పొందినను, దక్షిణభారతదేశము మాత్రము స్వతంత్రముగ ఆ కాలమున నిలువగలిగినది. అట పండ్రెండవ శతాబ్ది అంతమునకు కల్యాణి చాళుక్యుల సామ్రాజ్యము అంతరించినది. అటులే 13వ శతాబ్ది ఆరంభమునకు చోళుల వైభవమును నామమాత్రావశేషముగ పరిణమించినది. ఈ రెండు సామ్రాజ్యములకు బదులుగ - ఇదివరలో పేర్కొనబడినటుల - దక్షిణభారతదేశమునందు ఉత్తరమున యాదవ, కాకతీయ రాజ్యములును, తక్కిన ప్రాంతమున పాండ్య, హొయిసల రాజ్యములును రూపుగొనినవి. ఇవియు ఆ కాలమున పరస్పర కలహములతో సతమతమగుచు ఉండెడివి. ఉత్తరభారతదేశమునకు చేకూరిన దురవస్థను చూచియైన గుణపాఠమును గ్రహించి ఐకమత్యమున మెలగుటకు ఆ రాజ్యములు యత్నించినవి కావు. ఇక విశాల భారతదేశమున శైలేంద్రరాజ్యము ఆనాటికి బలహీనతను చెందుటచే, అందలి వివిధ ప్రాంతములు స్వతంత్రములు అగుటయు, కొన్ని నూతన రాజ్యములు భారతసంస్కృతిని అనుసరించి రూపొందుటయు జరిగినను, 13వ శతాబ్ది ఆరంభమునకు భారతభూమితో వానికి గల సన్నిహిత సంబంధము సన్నగిల మొదలిడినది. ఉత్తరభారతదేశమున ప్రసిద్ధ సాంస్కృతిక కేంద్రములు ముస్లిమ్‌ల వశమగుట ఇందులకు ఒక ముఖ్య కారణము. అందువలన ఈ విశాల భారతదేశములోని రాజ్యములందు అంతటినుండి పూర్వముకన్న మిన్నగ చీనాదేశపు పలుకుబడి అతిశయిల్లుటకు అవకాశము కలిగినది.

## చీనా, తక్కిన ప్రాచ్యదేశములు
### (618 - 1206)

**చీనా :** విశాల భారతదేశమందలి సామ్రాజ్యముల వలెనే, చీనా దేశము సైతము క్రీస్తు శకారంభము మొదలుగ భారత సంస్కృతిచే ప్రభావితమైనదను విషయము ఇదివరకే వివరింపబడినది [చూ. పు. 45]. కాని, సుమత్రా, జావా, మలయా మొదలగు వానియందు ఈ సంస్కృతి బ్రాహ్మణ, బౌద్ధమతముల రెండింటి సాయమున వ్యాప్తిచెందగ, చీనాయందు అటులగాక బౌద్ధమతము మాత్రమే ఈ సంస్కృతి వ్యాప్తికి కృషిచేసినది. ఇంతియే కాదు, ఇచ్చట వేరొక ప్రముఖ భేదమును కూడ గమనింప వలసియున్నది. భారతదేశము వలెనే చీనాదేశమును మౌలికసంస్కృతిని కలిగిన ఒక ప్రాచీనదేశము. కావున ఆ దేశము తాను గ్రహించిన భారత సంస్కృతిని స్వీయ సంస్కృతితో చక్కగ మేళనము చేసికొని, తన ప్రత్యేకతకు భంగము కలుగకుండ వ్యవహరించుచునే భారతదేశముతో ఈ యుగమున సన్నిహిత సంబంధమును నిలుపుకొనినది. హాన్ ప్రభువుల కాలమున మొదలిడిన ఈ సంబంధము టాంగ్ వంశపు రాజుల కాలమున (క్రీ. శ. 618 - 907) దృఢతరమైనది.

టాంగ్ వంశపు పరిపాలనను స్థాపించిన లీ య్వాన్, అతని కుమారుడు లీ షిహ్-మిన్ భారతదేశ పాలకుడగు

హర్షచక్రవర్తికి సమకాలీనులు. ఇందులో రెండవవాని కాలముననే హుయాన్‌స్యాంగ్ అను బౌద్ధ యాత్రికుడు భారతదేశమును దర్శించి, తన అనుభవములకు లిఖిత రూపము కల్పించి, చీనీయ పండితులకు భారత సంస్కృతితో సమగ్రపరిచితిని కలిగించెను. లీ షిహ్-మిన్ కాలమున తుర్కిస్థానములోని అల్పరాజ్యములు అన్నియు చీనా సార్వభౌముని సర్వాధిపత్యమునకు లోబడినవి. ఇటుల మధ్య ఆసియాలో చీనీయులకు ఆధిపత్యము లభించిన తరువాత ఆ మార్గమున భారతదేశముతోను, పారసీకము తోను సన్నిహిత సంబంధములను నెలకొల్పుకొనుటకు చీనా సార్వభౌములకు మార్గము సుగమమైనది. టిబెట్ దేశముతోడను ఆ కాలమున చీనాదేశము మైత్రిని అవలంబించి, భారతదేశముతో సంబంధమును ఆ మార్గమున కూడ గాఢతరము చేసికొనెను. క్రీ. శ. 7వ శతాబ్ది పూర్వార్ధమున టిబెట్ దేశము స్రృంజిన్‌గంపో అను ఒక మహాయోధుని నాయకత్వమున ఒక స్వతంత్ర రాజ్యముగ రూపొంది ఉండెను. ఆ రాజు చీనా సామ్రాట్ కుటుంబము నందలి ఒక కన్యను పెండ్లియాడెను. ఈమె మూలమున తొలుతగ టిబెట్‌లో బౌద్ధమతము ప్రచారములోనికి వచ్చినది. స్రృంజిన్‌గంపో ప్రభువు భార్యలలో వేరొకతె నేపాల్ రాజు కుమార్తె. ఆమెయు బౌద్ధమతావలంబినియే. అందు వలన నేపాల్‌నుండియు బౌద్ధమతము ఆమె ఆదరణమున టిబెట్‌న ప్రవేశించి, వ్యాపించినది.

టాంగ్ వంశపు రాజులలో శ్వాన్‌చుంగ్ (712-756 ప.) లలిత కళాపోషకుడుగ చీనాదేశ చరిత్రలో పేరెన్నిక గాంచెను. కాని, ఈతని పరిపాలనా కాలపు కడపటి సంవత్సరములలో విశాల చీనాసామ్రాజ్యము పలు దండయాత్రలకు లోనై పాటవమును కోల్పోయినది. తూర్పు చీనాలో నైరృతి మూలన 'తాయ్' జాతులవారు స్వతంత్ర రాజ్యమును స్థాపించుకొనుటతో (730) సామ్రాజ్యమునకు క్షీణదశ మొదలయ్యెనని భావింపవచ్చును. వీరిని లోగొనుటకై టాంగ్ సామ్రాట్ రెండుసారులు దండయాత్రల నడపి విఫలుడై కడకు తన నామమాత్రపు సార్వభౌమత్వమును వారు అంగీకరించుటతో తృప్తిపడి ఊరకుండెను. అంతలో పశ్చిమమున తుర్కులలో ఉయ్‌గుర్ జాతివారు విజృంభించి టిబెట్ మొదలుగ హోయాంగ్‌హో నదివరకు కల విశాల రాజ్యమును జయించిరి (745). ఈ కాలముననే చీనా సామ్రాట్ అరబ్బుల దండయాత్రను సైతము ఎదుర్కొనవలసి వచ్చెను. సముద్రపు పోటువలె పశ్చిమమునుండి వచ్చి పడుచుండిన అరబ్బు సేనావాహినిని సామ్రాజ్యపు పొలిమేరలలోనే అడ్డగింపదలచి పామీరు, హిందూకుష్ పర్వతములనుదాటి చీనా సేనలు అరబ్బులను ఎదుర్కొని పోరాడినవి; కాని, కడకు పరాజితములు అయినవి (751). తత్ఫలితముగ తుర్కిస్తానము అరబ్బులకు చేజిక్కినది. కాని, అప్పటికే తమ మూలస్థావరము అగు అరేబియానుండి కడుదూరమునకు వచ్చిన అరబ్బులు ఇంకను తూర్పునకు పోవుటకు ఉత్సహింపకపోవుటచే అరబ్బులవలన ప్రమాదము చీనాకు అంతటితో తప్పినది. అయినను దురదృష్టవశమున అంతఃకల్లోలములు అంతటి నుండి చీనాదేశమును వేధింప మొదలిడినవి. చీనా సార్వభౌముని ఉపపత్నియొక్క అనుగ్రహమును సంపాదించి, తత్ఫలితముగ క్రమముగ చీనా సేనానాయక పదవిని అధిష్ఠింపగలిగిన ఒకానొక తురుష్కయోధుని చర్యల మూలమున ఈ అంతఃకల్లోలములు మొదలై (755) తీవ్రము లగు అంతర్యుద్ధములకు దారితీసినవి. తరువాత ఈ తిరుగుబాటులు ఎట్టులో అణచబడినను, సార్వభౌమునికి నామమాత్రాధికారము మాత్రమే మిగిలి వాస్తవాధికారము ఆ యా ప్రాంతములందలి సైనికాధికారులకు వశమైనది. ఈ పరిస్థితులలో సామ్రాజ్యపు రెండు రాజధానులందు ఒకటి అగు లోయాంగ్‌ను ఉయ్‌గుర్‌లును, వేరొకటి యగు ఛాంగన్ నగరమును టిబెట్ సేనలును కొల్లగొట్టినవి (763). ఆ తరువాత దాదాపు ఒక శతాబ్దివరకు దేశము ఇట్టి కల్లోలములతోనే సతమతమయినను సాంస్కృతికముగ మాత్రము ఏకత్వమును కాపాడుకొనగలిగినది. క్రీ. శ. 907 కు చీనా దేశమున ఉత్తర భాగమును, లోపలి మంగోలియాయును మంగోల్ లందలి ఖిటాన్ శాఖీయుల వశమైనవి. దక్షిణభాగమున 5 రాజవంశములు క్రమముగ 907 మొదలుగ 959 వరకు పాలించినను, వీనిలో ఏదియు ఆ ప్రాంతమున అంతటను అధికారమును చలాయించలేక పోయినది. 960 లో సుంగ్ రాజవంశము ఈ ప్రాంతమున అధికారమునకు వచ్చినది. దక్షిణ చీనాను దాదాపు మూడు శతాబ్దముల కాలము ఈ రాజవంశము పాలించినది. ఆ కాలమున చీనా సంస్కృతి సర్వతోముఖముగ నవ్య వికసనమును పొందినది. కాని, దూరప్రాంతములు కేంద్ర ప్రభుత్వాధికారమును మన్నింపక స్వతంత్రించుట వారి పరిపాలనా కాలముతోనే మొదలైనది. సామ్రాజ్యపు దక్షిణపు కొనన ఉన్న అన్నామ్ (నేటి ఉత్తర వియెత్నామ్) 935 లో స్వాతంత్ర్యమును ప్రకటించుటయే కాక, తమకు దక్షిణమున ఉండి, చీనా సామ్రాట్ సర్వాధిపత్యమును అంగీకరించిన చంపారాజ్యపు ముఖ్యనగరమగు ఇంద్రపురమును కొల్లగొట్టినది. చీనా సార్వభౌముడు తన పలుకుబడిని ఉపయోగించి చంపారాజ్యమును రక్షించుటకు

పలుమారులు యత్నించినను ప్రయోజనము లేకపోయినది. ఇంతలో ఉత్తరచీనాయందు అధికారమున ఉన్న ఖిటాన్ మంగోల్‌లను తొలగించి చిన్ వంశీయులు అచట తమ ఆధిపత్యమును నెలకొల్పుటయేకాక (1122), సుంగ్ వంశీయుల వశమున ఉన్న ప్రాంతమును కూడ హరించుటకై దండయాత్రల సాగించిరి. వారి ధాటికి ఆగజాలక సుంగ్ పాలకులు తమ రాజధానిని దేశపు దక్షిణపుకొనకు తరలించి, చిన్‌రాజుల సేనలతో పోరాటమును సాగించిరి. ఇట్టి నిరంతర యుద్ధములవలన ఇరుపక్షములును విసుపు చెందిన తరువాత ఒక సంధి కుదిరి, ఉత్తర, దక్షిణ చీనారాజ్యములకు ఎగువ హాన్‌నది సరిహద్దుగ అంగీకరింపబడెను (1141). ఆ తరువాత సైతము అడపతడపగ ఈ ఉభయులమధ్య యుద్ధములు చెలరేగినవి. ఇట్టి యుద్ధములలో ఒకదానియందు 1161 లో సుంగ్‌సేనలు తుపాకిమందును ఉపయోగించి చిన్ సేనలను ఓడించినవి. ప్రపంచమున ప్రేలుడు సామగ్రితో జరిగిన తొలుతటి యుద్ధము ఇదియే.

చిన్ వంశపాలకులు సుంగ్ పాలకులతో నిరంతరముగ పోరాడినను, సుంగ్ పాలకులవలెనే వారును చీనా సంస్కృతినే ఆదరించి పరిపోషించిరి. చీనా సంస్కృతి ఆ కాలమున కొరియా, జపాన్‌దేశములపై సమధిక ప్రభావమును నెరపినది. కొరియాదేశము టాంగ్ వంశీయుల కాలమున చీనా సామ్రాట్ సర్వాధిపత్యమును అంగీకరించినది (678). తదాదిగ ఆంతరంగిక విషయములందు మాత్రమే ఆ దేశము స్వతంత్రతను వహించి మెలగినది. టాంగ్ ప్రభువుల తరువాత ఖిటాన్ మంగోల్‌లును, వారి అనంతరమున చిన్ పాలకులును కొరియాపై సార్వభౌమత్వమును నిర్వహించిరి. ఈ మధ్యకాలమున కొరియా దేశ పాలనమున మార్పులు అనేకములు జరిగినను, చీనా సార్వభౌమతకు మాత్రము అచట భంగము కలుగకుండ ఆ సార్వభౌములు శ్రద్ధవహించిరి. క్రీ. శ. 670 మొదలుగ 935 వరకు కొరియాను పాలించిన సిల్లా వంశీయ ప్రభువుల కాలమున బౌద్ధమతము చీనా ప్రచారకుల మూలమున అచట తావును కల్పించుకొని వికసనము పొందినది. సిల్లా రాజవంశము పతనము చెందిన తరువాత కోర్యో రాజవంశము అట పరిపాలన నెరపినది (935-1392).

**జపాన్ :** జపాన్ దేశమున చీనా సంస్కృతియు, చీనా ప్రచారకుల మూలమున బౌద్ధమతమును ఈ యుగమున విరివిగ వ్యాపించినను, చీనా సామ్రాట్‌లు జపాన్‌ను జయించుటకు చేసిన ప్రయత్నములు విఫలములైనవి. అయినూజాతి [చూ. సం. 10 - పు. 161] అను పేరున వ్యవహరించు ఆదిమవాసుల వశమున ఉన్న మారుమూల ప్రాంతములను సైతము జపాన్ చక్రవర్తుల సేనలు ఈ యుగమున జయించి అన్ని దీవులలోను సువ్యవస్థిత ప్రభుత్వము ఏర్పరచుటకు మార్గము సుగమము చేసినవి. కాని, క్రమముగ సార్వభౌముని నామమాత్రపు పాలకునిగ చేసి, అధికారమును తమచేతిలో ఉంచుకొనుటకు సంపన్న సైనిక కుటుంబములు స్పర్ధవహించి పోరాడ మొదలిడినవి. కడకు 'ఫూజివారా' కుటుంబము ఈ పోరాటమున నెగ్గి అధికారమును చేబట్టి (866), సార్వభౌముని తన గుప్పిటియందు ఉంచుకొని ప్రభుత్వమును దాదాపు మూడు శతాబ్దముల కాలము నిర్వహించినది. ఈ కుటుంబపు పాలకుల కాలమున జపాన్ భాషా, సంస్కృతులు ప్రత్యేక రూపములను సంతరించుకొనినవి. బౌద్ధమతమందలి వివిధ సంప్రదాయములు ఆ సమయమున జపాన్‌దేశమున ఆదరణను పొందినవి. 1160 లో ఫూజివారా ఆధిక్యమును అంతరింపజేసి, 'తైరా' కుటుంబము అధికారమును గ్రహించినను, వారు కాలు నిలువద్రొక్కుకొనుటకైన వ్యవధిలేకుండ, వారిపై తిరుగుబాటును లేవదీసి కామాకురా కుటుంబము ప్రభుత్వయంత్రమును కైవసము చేసికొనెను (1185). ఈ కామాకురా కుటుంబమును క్రమముగ లోగొని వారికిని, చక్రవర్తికిని నామమాత్రాధికారమును కల్పించి, 'షోగన్' (ప్రతినిధి) హోదాతో హోజో వంశీకులు పాలించుట 1205 తో మొదలయ్యెను* ఈ కాలమున జపాన్ జాతీయత పెచ్చు పెరిగినది. జపాన్ నౌకాదళములు కొరియా, చీనా దేశములందలి సముద్రతీరస్థ నగరములను కొల్లగొట్టగలిగినవి. మత విషయకముగ ఆ యుగమున పాలకులు బౌద్ధమతమందలి ధ్యాన (జెన్) శాఖను అభిమానించుటచే దేశమున ఆ శాఖకు విరివిగ వ్యాప్తి కలిగినది.

ఇటుల కొరియా, జపాన్‌దేశముల మీదనేగాక చీనా దేశము ఆగ్నేయ ఆసియాలో తన ఇరుగు పొరుగున ఉన్న కాంభోజము, ద్వారవతి, హరిపుంజయ రాజ్యములపై తన ప్రభావమును నెరపినది. వీనిలో కాంభోజము క్రమముగ బలమును ఆర్జించి ద్వారవతిని తనలో లీనము చేసికొనినది. హరిపుంజయ రాజ్యము స్వతంత్రముగ 13 వ శతాబ్ది వరకు మన గలిగినది. ఈ రాజ్యములలో చీనా సంస్కృతిని మించి భారతీయ సంస్కృతికి తొలుత ఎక్కువ ఆదరణ ఉండెడిది. కాని, కడకు భారతదేశపు రాజకీయ పరిస్థితుల వలన 13 వ శతాబ్ది ఆరంభమునుండియు, ఇదివరలో చెప్పబడినటుల, ఈ రాజ్యములందేకాక మలయా, బర్మా,

* 19 వ శతాబ్ది మధ్యభాగమువరకు ఇట్టి షోగన్‌ల పాలనయే- పలుమారు చేతులు మారుచు - ఆ దేశమున అమలులో ఉండెను.

జావా మొదలగు వానియందును చీనా దేశీయులదే పై చేయి అయినది.

ఈ యుగమున బర్మాతో చీనా దేశమునకు సన్నిహిత సంబంధము ఏదియు లేదనియే చెప్పవచ్చును. భారత దేశమునకు దక్షిణ చీనానుండి వచ్చు యాత్రికులు మాత్రము ఉత్తర బర్మాద్వారా భారతదేశమునకు ఆనాడు చేరుచుండినటుల చీనీయుల వ్రాతల వలన తెలియుచున్నది. తొలుత బర్మాదేశము హిందూ సంస్కృతికి లోనైన పలు రాజ్యములుగ చీలి ఉండినది. క్రమముగ బౌద్ధమత మహాయాన శాఖయు అట ప్రవేశించి రాజుల ప్రోత్సాహమున బలమును సమకూర్చుకొనినది. క్రీ. శ. 1044 లో అనువ్రతుడను పేరుగల రాజు తన విజయయాత్రల వలన దేశమున అత్యధిక భాగమును ఒక రాచరికము క్రిందకు కొని రాగలిగెను. చీనీయ సామ్రాట్‌తో దౌత్య సంబంధములను నెలకొల్పుకొని సర్వస్వతంత్రుడై ఈ రాజు పాలించెను. ఈయన కాలమున హీనయాన బౌద్ధము సింహళ ప్రచారకుల మూలమున దేశమున ప్రవేశించి, రాజాదరణ బలమున మహాయానమును ఆవలకు త్రోయగలిగెను.

13 వ శతాబ్ది ఆరంభమునకు ఇటుల తూర్పు ఆసియాలోని పలుదేశములపై చీనా సమధిక ప్రభావము నెరపినను, ఆ దేశము మాత్రము రాజకీయముగ ద్విధావిభక్తమై ఉండినది. ఈ పరిస్థితిని అంతరింపజేయుటకు సమర్థవంతమగు శక్తి ఏదియు దేశమున ఉద్భవించుటకు ఆ కాలమున అవకాశమే లేకుండెను. కాని, ఇంతలో ఆ దేశపు వెలుపలి సరిహద్దులలో ఒక నూతన చారిత్రక శక్తి - మంగోల్ జాతుల జైత్రయాత్ర రూపమున - ప్రాదుర్భావమై చీనాను ఆక్రమించుటయే కాక, ఆసియా, యూరప్ ఖండములలో పలురాజ్యముల సరిహద్దులను తుడిచిపెట్టి, నూతన పరిణామములకు త్రోవదీసెను. ఆ మంగోల్‌లను గురించియు, వారి విజయములను గురించియు తెలిసికొనుటకు ముందుగ 13 వ శతాబ్ది ఆరంభమున తక్కిన ప్రపంచము ఉండిన తీరుతెన్నులను తెలిసికొనుట సముచితము.

యూరప్ (1095 - 1270): క్రైస్తవ పుణ్యక్షేత్రమగు జెరూసెలెమ్‌నకును, తూర్పురోమన్ సామ్రాజ్యపు ఉనికికిని, ముస్లిమ్‌ల వలన కలిగిన బెడదను నివారించుటకై, పదునొకండవ శతాబ్ది అంతమున పోప్ ఉద్బోధనను అనుసరించి, యూరప్ నాలుగు మూలల నుండియు క్రైస్తవ వీరులు 'క్రూసేడ్‌లు' అను ధార్మిక యుద్ధములను సాగింప మొదలిడిరను విషయము ఇదివరలో తెలుపబడినది [చూ. పు. 81]. ఇట్టి క్రూసేడ్‌లు అంతటంతట ఎనిమిది పర్యాయములు 1270 వరకు కొనసాగినవి. కాని, వీనిలో తొలుతటి మూడు మాత్రమే పరిగణనీయములు; తక్కినవి పేరునకు మాత్రమే క్రూసేడ్‌లు.

తొలుతటి క్రూసేడ్ 1095 లో - ఇదివరలో తెలుపబడిన రీతిగ - మొదలైనది. ఆ కాలమునకు మధ్య ప్రాచ్యమున అబ్బాసీయ కలీఫాల ప్రతిష్ఠ నామమాత్రావశిష్టమై సెల్జుక్ తురుష్క నాయకుల చేతిలో కీలుబొమ్మగ కలీఫా ఉండెననుట పాఠకులకు సువిదితమే. ఈ తురుష్కులలో మాలిక్‌షా (1073 - 1092 ప) యును, అతని వజీరు నిజామ్ అల్ - ముల్క్‌ను పేర్కొనదగిన వారు. వీరి అనంతరము తురుష్క రాజ్యము బహుధా విభిన్నమగుటచే ప్రాంతీయ ప్రభువులు స్వతంత్రతను ఆర్జించి అంతఃకలహములందు నిమగ్నులైరి. ఇట్టి పరిస్థితిని అవకాశముగ గ్రహించి మొదటి క్రూసేడ్ సేనలు సులభముగ సిరియా, ఆసియా మైనర్ లందలి కీలక స్థానములను ఆక్రమింపగలుగుటయే కాక, 1099 లో జెరూసెలెమ్ నగరమును వశపరచుకొనినవి. ఈ మొదటి క్రూసేడ్ దళములలో ఇటలీ, ఫ్రాన్స్‌లందలి లాటిన్ జాతులు ప్రముఖపాత్ర వహించినవి. సిరియా, ఆసియా మైనర్ లందు తమకు చేజిక్కిన ప్రాంతములందెల్లను ఈ జాతుల వివిధ నాయకులు చిన్నచిన్న రాజ్యములను నెలకొల్పి యూరప్‌నందలి తమ పరిపాలనా విధానమునే నెలకొల్పిరి. తూర్పు రోమన్ సామ్రాట్‌నకు సామంతులుగ ఉండుటకు వీరు ఒప్పుకొనినను, ఆ ఒప్పుదల కార్యరూపమును పొందజాలక పోయినది. జెరూసెలెమ్ నగరమున ఇట్టి రాచరికమే ఒకటి నెలకొల్పబడినది. కాని, క్రూసేడ్‌లను ప్రోత్సహించిన పోప్‌నకు మాత్రము అందు ఏ అధికారమును దక్కలేదు. 1187 వరకు పరిస్థితి దాదాపుగ ఈ రీతిగనే కొనసాగెను.

విచ్ఛిన్నమైపోయిన తురుష్క రాజ్యము కొంతకాలమునకు సాలా అల్ - దీన్ అను వాని నాయకత్వమున తన పూర్వ ప్రశస్తిని సంతరించుకొన్నది. సిరియా, ఈజిప్టుల రెండింటను ఆతడు తన ఆధిపత్యమును స్థాపించి, జెరూసెలెమ్‌ను సులభముగ వశపరచుకొనుటయే (1187) కాక, లాటిన్ జాతీయులు ఆ ప్రాంతమున స్థాపించిన రాజ్యములను అన్నింటిని ఆక్రమించెను. అంతకు పూర్వముననే ముస్లిమ్‌లు జెరూసెలెమ్ ప్రాంతమున ఏడెస్సా అనుదానిని వశపరచుకొనినప్పుడు (1144) క్రైస్తవ పుణ్యక్షేత్రమునకు సంఘటిల్లనున్న ఆ విపత్తును యూరప్ వాసుల దృష్టికి కొనివచ్చి, రెండవ క్రూసేడ్‌ను పోప్ సమాయత్తము చేసెను. ఆ రెండవ యత్నమున ఫ్రాన్స్, జర్మనీ ప్రభువులు ప్రముఖ పాత్రలు వహించిరి. 1147 లో మొదలైన ఈ దండయాత్ర ఏ ఫలితమును సాధింపలేక

పోయినది. జెరూసెలెమ్ పతనమైన తరువాత మూడవ క్రూసేడ్ 1189 లో మొదలైనది. ఈ దండయాత్రలో పోప్‌నకు భాగస్వామ్యము ఏదియు లేదనియే చెప్ప వచ్చును. క్రైస్తవ పుణ్యక్షేత్ర రక్షణకై తాము చేయు యత్నములవలన, తమ ప్రజలలోనే కాక క్రైస్తవ ప్రపంచమున అంతటను తమకు ప్రతిష్ఠయు, పలుకుబడియు లభింపగలవను అహమహమికతో ఆ కాలపు పవిత్ర రోమన్ సామ్రాట్ ఫ్రెడరిక్, బ్రిటిషు ప్రభువు రిచర్డ్ - I, ఫ్రాన్స్ దేశపు ప్రభువు ఫిలిప్ - II ఇందు పాల్గొనిరి. వీరిలో తొలుతటి ప్రభువు ఆసియా మైనర్ లోనికి తన సేనతో చొరబడిన తరువాత, ప్రమాదవశమున జల మరణము పొలగుటవలన అతని సేన చెల్లా చెదర య్యెను. తక్కిన వారిరువురును ఏకీభావము లేకుండ నిరంతరము తగవులాడుకొనుచు, ఎట్టులో కొంత కాలము యుద్ధమును కొనసాగించిరి. కాని, 1191 లో ఫిలిప్ తిరిగి స్వదేశమునకు పోగా, రిచర్డ్ తుదకు సాలా అల్ - దీన్‌తో రాజీపడి జెరూసెలెమ్ నగరమును నిరాటంకముగ క్రైస్తవులు చేరుటకు వలనుగ తీరము వెంబడి ఒక చీలిక నేలను సంపాదించి, వెనుకకు మరలెను (1192).

ఆ తరువాత సాగిన క్రూసేడ్‌లు తమ మూలోద్దేశమునకే విరుద్ధముగ వ్యవహరించి, ఫలితమును సాధింపజాలక పోవుటయేకాక, పరిహాసభాజనములు కూడ అయినవి. నానాటికి హీనస్థితికి దిగజారుచున్న తమ ప్రతిష్ఠను పునరుజ్జీవితము చేయుటకు పోప్‌లును, క్రైస్తవలోకమున పేరును సముపార్జించి రాజకీయముగ పైకివచ్చుటకు కొందరు ప్రభువులును 1192 తరువాత క్రూసేడ్‌లను సాధనములుగ ఉపయోగించుకొనిరే కాని, వీరిలో ఎవరికిని జెరూసెలెమ్ రక్షణ అంతగ పట్టినటులనే కన్పట్టదు. పైగా ఈ క్రూసేడ్‌లను అవకాశముగ గ్రహించి ఇటలీలోని వెనిస్ నగర పాలకులును, కొందరు సాహసిక యోధులును వెలుపలి ప్రాంతములను కైవసము చేసికొనుటకు యత్నించి, అందు కొంత కృతకృత్యతను సాధించిరి. ఈ వెలుపలి ప్రాంతములు క్రైస్తవులవా లేదా క్రైస్తవేతరులవియా అను విచక్షణయు కడకు అంతరించినది. తత్ఫలితముగ నాలుగవ క్రూసేడ్ సందర్భమున క్రైస్తవ రాజ్యమగు బైజాంటైన్ మీదకే క్రూసేడ్ దళములు దండెత్తి, ఆ సామ్రాజ్యపు ముఖ్యనగరమగు కాన్‌స్టాంటినోపుల్‌ను వశ పరచుకొనినవి (1204). ప్రాచ్య సామ్రాట్ అంతట నిషే నగరమునకు పారిపోయి అటనుండి మిగిలిన రాజ్యమును పాలింప మొదలిడెను. ఈ విధముగ క్రైస్తవ క్షేత్రముల రక్షణకై బయలుదేరిన క్రూసేడ్‌లు చివరకు లాటిన్, గ్రీక్ సంతతుల క్రైస్తవుల మధ్య యుద్ధముగ పరిణమించి యూరప్‌నకు అంతటికిని దిగ్భ్రాంతిని కలిగించెను. ఈ అవకాశమును ఉపయోగించుకొని ముస్లిమ్ సేనలు జెరూసెలెమ్‌ను సంపూర్ణముగ వశపరచుకొని, క్రైస్తవు లకు అట ఎట్టి ప్రతిపత్తియు లేకుండ చేసినవి (1244). ఆ తరు వాత పేరునకు కొన్ని క్రూసేడ్‌లు జరిగినను, జెరూసెలెమ్ మాత్రము క్రైస్తవులకు దక్కలేదు సరికదా క్రైస్తవ పుణ్యక్షేత్రములనుండి ముస్లిమ్‌లను తరిమివేయుటకై సంకల్పింపబడిన క్రూసేడ్‌లు ఆ ఉద్దేశమును సాధింపకనే అంతరించినవి.

కాని, క్రూసేడ్‌లకు ప్రపంచ చరిత్రలో వేరొక విధముగ అనితర ప్రాముఖ్యము లభించినది. వైరమూల మునైనను యూరప్ వాసులకు ఈ క్రూసేడ్‌లవలన ప్రాచ్య సంస్కృతితో పరిచయము ఏర్పడినది. ఈ పరిచయమే యూరప్ చరిత్రలోని తరువాతి పరిణామము లకు చాలవరకు దోహదకారి ఐనది. అంతియే కాదు; యూరప్‌న ఐబీరియన్ ద్వీపకల్పము (నేటి స్పెయిన్, పోర్చుగల్) లో ఉండిన ఏకైక అరబ్ రాజ్యము అంత రించుటకును ఈ క్రూసేడ్‌లే కారణభూతములైనవి (1212). అంతకు పూర్వమే 1055 లో అరబ్బులను ఆ ద్వీపకల్పమున కొంత భాగమునుండి తరిమివైచి ఫెర్డినాండ్ అను యోధుడు పోర్చుగల్ దేశమునకు తొలుతటి రూపమును కల్పించెను.

**ఆఫ్రికాలోని ఇస్లామ్ సంస్కృతి :** ఇక ఆసియా, ఆఫ్రికా ఖండములలో ముస్లిమ్ సామ్రాజ్యము మాత్రము చెక్కు చెదరక నిలువగలిగినది. దానిపై ఆధిపత్యము అరబ్బుల చేతులనుండి జారి తుర్కుల వశమైనను ఈ తుర్కులును - కొలది అపవాదములతో - అరబ్బీ భాషా సంస్కృతులనే ఆదరించి పరిపోషించిరి. తుర్కుల వశము కాకుండ, అరబ్బీ భాషా సంస్కృతుల ప్రభావమునకు లోనై మనగలిగిన రాజ్యములును ఆఫ్రికాయందు కొన్ని ఆ కాలమున ఉండినవి. వీనిలో పశ్చిమ ఆఫ్రికాయందలి ఘానా, మాన్‌డింగో, సోంఘే రాజ్యములును, తూర్పు ఆఫ్రికాయందలి జాంజి రాజ్యమును పరిగణనీయములు. ఇవి అన్నియు నీగ్రో రాజ్యములు. వీనిలో ఘానా రాజ్యము అతి ప్రాచీనము. ఉత్తర ఆఫ్రికా తీరభూమిని అరబ్బులు ఆక్రమించినంతట అరబ్బీ భాషా సంస్కృతుల చేతను, ఇస్లామ్ మతముచేతను ప్రభావితులైన బర్బరులు దక్షిణ భూములపై దండెత్తి 1076 లో ఘానా రాజ్యపు ముఖ్యనగరమును ఆక్రమించిరి. అచ్చట ఇస్లామ్ మతమును వారు కొంతవరకు వ్యాపింపజేసిరి. కాని,

ఆ రాజ్యము మాత్రము ఈ దండయాత్ర మూలమున బలహీనమై 14 వ శతాబ్దికి నామావశిష్టమైనది. ఘానా ముఖ్య నగరము ఎగువ నైజర్ నది ప్రాంతమున ఉండెడిదని అచ్చట త్రవ్వకముల వలన తెలియవచ్చుచున్నది. ఆ విస్మృత ప్రాచీన ఘానా రాజ్యపు పేరును ఆధునిక కాలమున ఆఫ్రికాలోని గోల్డ్ కోస్ట్ ప్రాంతము స్వతంత్రతను పొందిన తరువాత స్వీయనామముగ గ్రహించినది.

ఘానాకన్న మిన్నగ ఇస్లామ్‌మతమును అవలంబించి కొంత పురోగతిని మాన్‌డింగో రాజ్యము సాధించినది. ఇదియే ఆ తరువాత 'మాలీ' అను పేర వ్యవహృతమైనది. ఇస్లామ్‌మతము పశ్చిమ ఆఫ్రికాయందలి నీగ్రోలలో వ్యాపించిన తరువాత ఈ నీగ్రోరాజ్యము ప్రాబల్యమును పొందినది. టింబక్‌టూ ముఖ్యనగరముగ ఈ రాజ్యము 1213 మొదలుగ ఒక శతాబ్దము విలసిల్లినది. పశ్చిమ ఆసియాయందలి సోంఘే రాజ్యము - మాలీరాజ్యము అస్తమించిన వెనుక - ప్రముఖతను ఆర్జించినను, ఈ సోంఘే ప్రాంతమున ఒక వ్యవస్థిత నీగ్రోరాజ్యము క్రీ. శ. 9 వ శతాబ్ది మొదలుగ రూపుగొనియే ఉండెనని పండితుల అభిప్రాయము. మధ్య నైజర్ ప్రాంతమునందలి గావో నగరము ఈ రాజ్యమునకు రాజధాని. ఈ రాజ్యపు అధిపతి క్రీ. శ. 1009 లో ఇస్లామ్‌మతమును అవలంబించెను. ఇక తూర్పు ఆఫ్రికాలోని నీగ్రోరాజ్యమగు జాంజియు ఇస్లామ్ మతముచేత ఆ నాడు కొంతవరకు ప్రభావితమైనది. అరబ్బీభాషయు జాంజియందలి నీగ్రో భాషలపై తన ప్రభావమును నెరపినది. అయినను ఇచట ఒక విషయమును మాత్రము గమనింపక తప్పదు. జాంజిలో తీరప్రాంతములందు వర్తక వ్యాపారములకు ప్రసిద్ధిగాంచిన నగరములలో మాత్రమే ఇస్లామ్ ఆ నాడు వ్యాపించినది. దేశ మధ్యమున మాత్రము సాంప్రదాయిక నీగ్రోమత విశ్వాసములే వ్యాప్తిలో ఉండినవి. ఈ జాంజిరాజ్యము నేటి జాంజిబార్ దీవి మొదలుగ ఆఫ్రికా తూర్పుతీరమున వ్యాపించి ఉండినది. ఈ రాజ్యపు ప్రముఖ నగరము 'మాలింది'.

పైన పేర్కొనబడిన నీగ్రోరాజ్యములను గురించిన సమగ్రవివరములు మనకు ఇప్పుడు లభించుటలేదు. ఇవి అన్నియు తమ ప్రాభవమును కోల్పోయి ఆ తరువాత అంతరించుటచే, వాని శిథిలముల పరిశీలన వలనను, ఆ రాజ్యములను దర్శించిన కొందరు యాత్రికులు రచించిన గ్రంథముల వలనను కొన్ని వివరములను మాత్రమే మనము నేడు గ్రహింపగలుగుచున్నాము. అంతియేకాదు; రొడీషియా మొదలగు ప్రాంతములందు లభించిన భవన శిథిలాదులను గమనింపగ, తక్కిన ఆఫ్రికాయందును ఆ కాలమున కొన్ని నీగ్రోరాజ్యములు సువ్యవస్థితములై నాగరక జీవితమును నడుపుచు, అరబ్బీ, భారతీయ సంస్కృతులతో సంబంధము కలిగి ఉండినటుల విశ్వసించుటకు అవకాశము కలుగుచున్నది. చారిత్రక పరిశోధకులు ఈ విషయమున ఎక్కువగ కృషిచేసి, వివరములను వెలువరించుదనుక వీని ప్రతిపత్తి, స్థాయి మొదలగు వానిని గురించి నిశ్చితాభిప్రాయమును తెలియజేయుట దుస్సాహసమే అయినను, ఆఫ్రికా ఖండమును అంధకారఖండమని కొందరు వ్యవహరించుట మాత్రము పొరపాటనియు, మతరాజ్య యుగమున ఉత్తర ఆఫ్రికాయందలి అరబ్ రాజ్యములతో పాటుగ ఈ దక్షిణ, పశ్చిమ, ప్రాచ్య ఆఫ్రికాలయందును వివిధ నీగ్రోరాజ్యములు సువ్యవస్థిత రీతిలో నెలకొని ఉండెననియు స్పష్టముగ తెలుపవచ్చును.

**వివిధ సంస్కృతుల వైఫల్యము :** ఇటుల 13 వ శతాబ్ది ప్రథమపాదమున ప్రపంచమున క్రైస్తవ, ఇస్లామ్, హైందవ, బౌద్ధ సంస్కృతులు భౌగోళికముగ ప్రత్యేక విభిన్న ప్రాంతములందు తమ ఆధిపత్యమును నెలకొల్పుకొనినవి. యూరప్ ఖండమంతటను ఆనాటికి క్రైస్తవ మతసంస్కృతులు వ్యాపించినవి; బౌద్ధమతము బర్మా, చీనా మొదలుగ తూర్పు ఆసియా యందంతటను, సింహళములోను, ఆసియా ద్వీప సముదాయమునను ప్రాముఖ్యమును ఆర్జించినది. హిందూకుష్ మొదలుగ పశ్చిమమున ఉన్న తక్కిన ఆసియాయందును, క్రైస్తవదేశమగు ఎతియోపియా తప్ప మిగిలిన ఉత్తర ఆఫ్రికాయందును ఇస్లామ్ సుస్థిరతను సంపాదించినది; ఉత్తర భారతదేశమునను ఇస్లామ్ అప్పటికి రాజకీయాధికారమును ఆర్జించినను, స్వతంత్రమగు దక్షిణ భారతదేశము వలెనే ఉత్తర భారతదేశము సైతము హైందవ సంస్కృతికే అంకితమై ఉండినది. కాని, ఈ పై నాలుగు మతసంస్కృతులలో హైందవసంస్కృతి అప్పటికే సృజనశక్తిని కోల్పోయినది. అంతటినుండి తన అస్తిత్వమును కాపాడుకొనుటకై కృషి చేయుటలోనే అది శ్రద్ధ వహించినది. ఇక తక్కిన మూడింటి విషయమున కూడ ఒక విధమగు స్తబ్ధత ఆ కాలమున గోచరింప సాగినది. విశాలమగు అరబ్ సామ్రాజ్యము తుత్తునియలై దాని స్థానమున వేర్వేరు తురుష్కరాజ్యములు ఉద్భవించుట ఇస్లామ్‌ను ఆనాడు ఆవహించిన మాంద్యతకు ఒక బాహ్య చిహ్నము మాత్రమే. ఈ దృష్టితో పరికించినపుడు యూరప్ వాసులు సాగించిన క్రూసేడ్‌లు విఫలమగుట ఒక యాదృచ్ఛిక సంఘటనగ మనకు కన్పట్టదు. ఇస్లామ్ శక్తి ఎంత హీనస్థితికి దిగజారినను, దాని స్థానమును ఆక్రమించి,

ప్రపంచపు చారిత్రకగతిని మున్ముందునకు కొనిపోగలశక్తి యూరప్‌లోని క్రైస్తవరాజ్యములకు అప్పటికి చేకూర లేదను విషయమును క్రూసేడ్‌లు స్పష్టము చేసినవి. ఇక ప్రాచీన చీనా సంస్కృతిని అండగ గ్రహించిన బౌద్ధము సైతము చీనాయందు ఏకైక రాజకీయశక్తిని రూపొందించుటలో విఫలమగుటవలన భావి చరిత్రను అది తీర్చి దిద్దలేదని వ్యక్తమైనది.

ఇటుల తమ పూర్వోత్సాహములను కోల్పోయిన ఈ సంస్కృతులలో ఒక నూతనోద్రేకమును రేకెత్తించుటకు అనువగు నూతన రక్తము ప్రవేశితమైనపుడు మాత్రమే ఈ స్తబ్ధత తొలగగలదను భావముతో కాలపురుషుడు రూపొందించి పంపెనా అనునటుల పై సంస్కృతులలో దేనికిని చెందని మంగోల్ జాతి చారిత్రకరంగమున ప్రవేశించుటతో చరిత్రగతి ఒక క్రొత్తమార్గమును త్రొక్కినది.

**మంగోల్‌ల అభ్యుదయ పతనములు :** మధ్య ఆసియాలోని గోబి ఎడారికి ఉత్తరమున ఉన్న సారరహితమగు భూమి మంగోల్‌ల తొలుతటి నివాసము. తార్తారులు అను పేర చీనీయులకు ఈ జాతివారు క్రీస్తుశకారంభమునకు పూర్వమునుండియు సుపరిచితులై ఉండిరి. ఈ తార్తారుల దండయాత్రల బెడదనుండి తమదేశమును రక్షించుకొనుటకే ప్రాచీన చీనాప్రభువులు చారిత్రక ప్రసిద్ధి కాంచిన చీనా మహాకుడ్యమును నిర్మించిరి. ఈ కుడ్యము సైతము తార్తారుల కోవకు చెందిన మంగోల్‌ల దండయాత్రలను ఆపలేకపోయినదను విషయమును 13వ శతాబ్ది రుజువు చేసినది.

పలుతెగలుగ చీలి అంతర్యుద్ధములలో మునిగి ఉండిన మంగోల్‌లను ఏకనాయకత్వము క్రిందకు కొనివచ్చినవాడు తెమూజిన్ (1162-1227). పదమూడు ఏండ్ల చిరుత ప్రాయమున - తండ్రి మరణానంతరమున - తన తెగకు నాయకత్వమును ఆర్జించిన (1206) తెమూజిన్ తనశక్తి యుక్తుల చేత ప్రతిస్పర్ధులను నిర్మూలించి, అచిరకాలమున అన్ని మంగోల్ తెగలును తన నాయకత్వమును ఆమోదించునటుల చేయగలిగెను. మంగోల్‌ల ఏకీకరణమే కాదు, ప్రపంచ విజయము అతని ఆశయము. అందుకొరకే అతడు 'చెంఘిజ్‌ఖాన్' అను బిరుదమును గ్రహించెను. ఈ పదమునకు మంగోల్‌ల భాషలో 'సర్వ విజేత అయిన సార్వభౌముడు' అని అర్థము. క్రమముగ అతని నిజనామము కన్న ఈ బిరుదమే అతని పేరుగ ఎల్లెడల వ్యాప్తమైనది.

కరకుదనమునకును, కష్టసహిష్ణుతకును, నిర్దాక్షిణ్యవర్తనకును పేరొందిన మంగోల్ మూకలకు ఆత్మవిశ్వాసబలమును, నిశితమగు క్రమశిక్షణను చెంఘిజ్‌ఖాన్ సమకూర్చి ఉయ్‌గుర్, కిర్‌గిజ్ ప్రజలను కూడ తన ఆధిపత్యమును అంగీకరించునటుల చేసి తొలుతగ ప్రాచ్య భూముల పైకి తన దండయాత్రలను సాగించెను.

ఉత్తర చీనాను జయించిన (1215) తరువాత అతడు తుర్కురాజ్యముల వైపునకు మరలి బొఖారాను (1219), సామర్కండ్‌ను (1220) వశపరచుకొనెను. అటనుండి మంగోల్ దళములు వేర్వేరు సేనాపతుల నాయకత్వమున పలుదిశలకు విజృంభించినవి. మంగోల్‌ల దండయాత్రా ధాటికి ఆగజాలక రష్యారాజ్యము కూలిపోయినది. క్రమముగ చెంఘిజ్‌ఖాన్ సేనా నివహములు నల్లసముద్రపు ఉత్తరపు ఒడ్డునకు చేరినవి. అంతకు పూర్వమునవే మంగోల్ సేనల విజయవార్తలు యూరపియన్ రాజ్యముల రాజధానులకు చేరి పాలకవర్గములందు భయాందోళనల రేకెత్తించినవి. ముఖ్యముగ బైజాంటైన్ పాలకులు తమ రాజ్యపు ఉనికికే అంత్యము దాపురించినదని కల్లోలితులైరి. ఇంతలో 1227 లో చెంఘిజ్‌ఖాన్ మరణించెను. అంతట మంగోల్ నాయకుల దృష్టి స్వీయరాజ్య వ్యవహారముల వైపునకు మరలుట వలన దండయాత్రా ప్రగతి తాత్కాలికముగ ఆగినది. కాని, చెంఘిజ్‌ఖాన్ మరణమునాటికే యుక్రెయిన్‌లోని నీపర్ నది మొదలుగ తూర్పున పసిఫిక్ మహాసముద్రతీరము వరకు మంగోల్ సామ్రాజ్యము విస్తరించినది. దానికి పరిపూర్ణతను చేకూర్చిన వారు చెంఘిజ్‌ఖాన్ అనంతరము పాలనను నెరపిన మంగోల్ నాయకులు.

చెంఘిజ్‌ఖాన్ మరణానంతరమున మంగోల్ నాయకులు అతని కుమారుడు ఓగటాయ్‌ని మహాఖాన్‌నిగ (సార్వభౌమునిగ) ఎన్నుకొనిరి. తండ్రివలెనే ఇతడును స్వదేశమునందలి కారకోరమ్ నగరమునే రాజధానిగ చేసికొని పాలనను నిర్వహించెను. ఇతని సర్వాధిపత్యమునకు లోబడి చెంఘిజ్‌ఖాన్ కుమారులలో తక్కినవారు వేర్వేరు ప్రాంతములందు పరిపాలనను నిర్వహించుచు, పరిసర ప్రాంతములపై దండయాత్రలను నడపి, సామ్రాజ్యపు పొలిమేరలను ఆవలకు విస్తరింప చేయగలిగిరి. ఇట్టి వారిలో జగ్‌తాయ్ అనువాడు బొఖారా ప్రాంతమునకును, బైకాల్ సరస్సునకు దక్షిణమున ఉన్న దేశమునకు తులీ అనువాడును అధిపతులైరి. చెంఘిజ్‌ఖాన్ పౌత్రులగు ఓర్డా, బాటూ అను వారలు ఖ్వారిజమ్ సీమకును, యూరల్, ఆక్సస్‌నదీ పరీవాహ భూములకును క్రమముగ ఆధిపత్యము వహించిరి.

తులీ సాయమున అనతి కాలముననే ఓగటాయ్ ఉత్తర చీనాను పాలించు చిన్ ప్రభువుల అధికారమును నిశ్శేషము

చేయుటయే కాక దక్షిణచీనాను పాలించు సుంగ్ వంశీయులనుకూడ ఓడించి చీనాదేశమునకు సామ్రాట్ కాగలిగెను (1234). ఇది ఇటులుండ పశ్చిమమున బాటూ నాయకత్వమున మంగోల్ దళములు రష్యాలోని పూర్వ ప్రభువుల అధికారమును అంతరింపజేసి, రష్యాను ఆక్రమించుటయే కాక, అటనుండి ముందునకు పయనించి హంగేరీలోని ప్రముఖ నగరములను వశపరచుకొనినవి (1241). ఇంతకు కొంత కాలము ముందుగనే జార్జియా, ఆర్మీనియా మంగోల్‌ల వశమైనవి (1236). కాని, అంతలో అకస్మాత్తుగ ఓగటాయ్ మరణించుట (1242) వలన, రాజ్యాధిపత్యమును గురించిన వివాదములలో మంగోల్ నాయకులు పాల్గొనవలసివచ్చుటచే దండయాత్రలు ఆగిపోవుటయును, రాజ్యపు పొలిమేరలకు ఆవల ఉన్న ప్రభువులును, ప్రజలును నిబ్బరముతో ఊపిరి పీల్చుకొనుటకు వ్యవధి చేకూరుటయును సంభవించినవి.

ఓగటాయ్ తరువాత రాజ్యము ఎవరికి చెందవలయునను విషయమున మంగోల్ నాయకులలో ఏర్పడిన అభిప్రాయభేదములవలన దానిని గురించి ఒక నిర్ణయము జరుగుటకు దీర్ఘవ్యవధి పట్టినది. కడకు చెంఘిజ్‌ఖాన్ మనుమడగు 'మంగూ'ను మహాఖాన్‌గ మంగోల్ నాయకులు ఎన్నుకొనిరి (1251). తన సోదరులలో ఒకడగు కుబ్లయ్‌ఖాన్‌ను చీనాకు రాజప్రతినిధిగ మంగూ నియమించెను. అంతట క్రమముగ దక్షిణ చీనాలోని సుంగ్ అధికారావశేషములను మారుమూల ప్రాంతములకు తరిమివేయుటయేకాక మంగోలియన్ దళములు టిబెట్‌ను కూడ వశము చేసికొనినవి. తత్ఫలితముగ చీనాతో టిబెట్‌నకు రాజకీయ సంబంధము అంతటినుండి మొదలైనది. మంగూ సోదరులలో వేరొకడు - హులగూ అను వాడు - తన ప్రభుని ఆనతిపై ఇరాన్‌పై దండెత్తి ఆ దేశమును వశపరచుకొని (1256), అటనుండి బాగ్దాద్‌నగరముపై దండెత్తి ఆ నగరమును ఆక్రమించి కొల్లగొట్టుటయే కాక, నిర్దయుడై తనకు లొంగిన కలీఫాను వధించెను (1258). ఆ తరువాత అతడు సిరియానుకూడ వశపరచుకొనగలిగినను, ఈజిప్టును పాలించు తుర్కు ప్రభువుల (మామ్‌లుకుల) సేనలు అతనిని పాలస్తీనాలో ఎదుర్కొని పరాజితుని చేసినవి (1260). ఈ అపజయమువలన పశ్చిమ దిశకు మంగోల్‌ల పురోగతి అరికట్టబడినది. ఇంతలో మంగూ మరణించెను (1259). అంతట మంగోల్ నాయకులు సమావేశమై కుబ్లయ్‌ఖాన్‌ను మహాఖాన్‌నిగ ఎన్నుకొనిరి (1260). కుబ్లయ్‌ఖాన్ ఇదివరకే చీనాలో రాజప్రతినిధిగ ఉండుటవలన అతనిని అప్పటికే చీనా సంస్కృతి ఎక్కువగ లోగొనినది. మహాఖాన్‌గ ఎన్నుకొనబడిన వెనువెంటనే అతడు మాతృభూమియందలి కారకోరమ్‌నకు బదులుగ చీనాయందలి ఖాన్‌బాలిక్ నగరమును మంగోల్ సామ్రాజ్యమునకు రాజధానిగ చేసెను. ఈ ఖాన్‌బాలిక్ నగరమే తరువాత పీపింగ్ (నేటి పెకింగ్) నగరముగ మారినది. మంగోల్‌ల సామ్రాజ్యమునకు అంతటికిని తాను ప్రభువే అయినను కుబ్లయ్‌ఖాన్ చీనా, టిబెట్, మంగోలియా పరిపాలనమున మాత్రమే నేరుగ శ్రద్ధ వహించి, తక్కిన ప్రాంతముల పరిపాలనను అదివరకే నిర్వహించుచున్న తన బంధువులకు వదలివేసెను. అయినను, ఈ ప్రాంతీయ పాలకులును కుబ్లయ్‌ఖాన్‌ని సార్వభౌమతను మన్నించి, అతని జీవితాంతముదనుక సామ్రాజ్యపు ఏకతకు భంగము రానీయకుండ కాపాడిరి. ఇటుల నిర్వహింపబడిన ప్రాంతీయ మంగోల్ రాజ్యములలో ఇరాన్‌న హులగూ సంతతి వారు నెలకొల్పిన ఇల్‌ఖాన్‌ల రాజ్యమును, రష్యాయందు బాటూ సంతతివారి ఆధిపత్యమున ఉండిన కిప్‌చాక్ రాజ్యమును ప్రముఖములు.

చీనాదేశమును కుబ్లయ్‌ఖాన్ చీనాజాతీయునివలెనే పాలించెను. చీనాయందు జాతీయమతముగ పరిగణనను పొంది, విపులవ్యాప్తిని ఆర్జించిన బౌద్ధమతమును ఆ ప్రభువు అవలంబించుటయే కాక చీనా, మంగోలియా దేశములలోని మంగోల్‌లు అందరును అవలంబించునటుల చేసెను. చీనాలో మారుమూల ప్రాంతముల తలదాచుకొన్న కడపటి సుంగ్ వంశపు ప్రభువును లొంగదీసికొని (1276) తరువాత అతడు చీనా సామ్రాజ్య విస్తరణకై పలుయత్నములను చేసెను. కాని, వీనిలో జపాన్‌పై అతడు సాగించిన నౌకాబల దండయాత్ర సంపూర్ణముగ విఫలమయ్యెను (1281). అన్నామ్, చంపా దేశములపై 1282 మొదలుగ 1288 వరకు అతని సేనానులు సాగించిన దండయాత్రలు ఆసించినంతగ ఫలప్రదములు కాకపోయినను, ఆ రాజ్యములు కడకు చీనా సార్వభౌముని ఆధిపత్యమును అంగీకరించినవి. బర్మాయందు మాత్రము కుబ్లయ్‌ఖాన్ సంపూర్ణ విజయమును సాధించెను. అచటి ప్రభువులు దాసోహమని కప్పమును కట్టుటకు అంగీకరించిరి (1287). జావాపై జరిపిన నౌకాబలపు దాడిలో మంగోల్‌లు తొలుత విజయమును సాధింపగలిగినను (1292-93), అచట కాలు నిలువద్రొక్కుకొనజాలక వెనుకకు మరలవలసి వచ్చినది. దండయాత్రలతో ప్రసక్తి లేకుండనే తాయిలాండ్‌నందు ఆనాడు ఏర్పడి ఉండిన సుఖోదయ రాజ్యమును, కాంభోజ రాజ్యమును చీనా ప్రభువునకు కప్పము చెల్లించినవి

(1294-96). కుబ్లయ్‌ఖాన్ మరణించిన (1294) తరువాత క్రమముగ అతని సంతతివారును అతడు చూపిన మార్గమును అనుసరించియే చీనా ప్రభువులవలెనే పాలించిరి. కాని, కుబ్లయ్‌ఖాన్ పౌత్రుడగు తేమూర్ ఓల్ జైతూ తరువాత మంగోల్ల ఎడ చీనా జాతీయుల ప్రతికూల భావము పెచ్చుపెరుగుటచే, ఆ అదనును ఉపయోగించుకొని, ఒక బౌద్ధ భిక్షుకుడు ప్రజల తిరుగుబాటును లేవదీసి మంగోల్ ప్రభుత్వమును చీనాలో అంతరింపజేసి (1368-71), తానే ప్రభువై ఒక రాజవంశమునకు మూల పురుషుడయ్యెను. ఈ రాజవంశమే 'మింగ్' వంశమని చీనా చరిత్రలో వ్యవహరింపబడుచున్నది.

తక్కిన ఆసియాయందలి వివిధ ప్రాంతీయ మంగోల్ సామ్రాజ్యములను కూడ కాలక్రమమున ఇట్టి పరిణామమే ఎదుర్కొనినది. ఇరాన్‌ను పాలించు ఇల్ - ఖాన్ వంశీయులు ఆ దేశమున వ్యాపించిన ఇస్లామ్‌నే అభిమానించి అవలంబించిరి (1295). అందుచే వారి రాజ్యమునందలి మంగోల్లును ముస్లిమ్‌లుగ మారిరి. ఇల్ - ఖాన్‌ల రాజ్యమున ఆ కాలమున ఇరాన్ మాత్రమే కాక సిరియా, ఆసియామైనర్‌న కొంతభాగము చేరి ఉండినవి. కాని, సిరియాను 1303 లో ఈజిప్టు పాలించు తుర్కులు వశపరచుకొనుటతో ఇల్-ఖాన్‌ల రాజ్యమునకు అంత్యదశ ఆరంభమైనది. క్రమముగ 1335 కు వారి పరిపాలన నామమాత్రావశిష్టమై, మాండలికులు స్వతంత్రులైరి.

ఇల్ - ఖాన్‌ల రాజ్యముకన్న రష్యాయందలి కిప్‌చాక్ మంగోల్ రాజ్యము ఎక్కువ కాలము మనగలిగినది. తన పశ్చిమ దండయాత్రలనుండి వెనుకకు మరలిన తరువాత బాటూసేనాని తన స్కంధావారమునే రాజధానిగ పరిసర విజితప్రాంతమును పాలించుటకు ఆరంభించుటతో (1241) ఈ రాజ్యము రూపుగొనినది. వాల్గానదీతీరమున ఈ శిబిరము ఉండెడిది. వైభవోపేతమగు ఆ శిబిరమును బాటూ సేనాని 'సిర్ ఓర్డా' అని వ్యవహరించెను. ఈ మంగోల్ భాషా పదమునకు 'సువర్ణ స్కంధావారము' అని అర్థము (ఇందువలననే ఈ కిప్‌చాక్ రాజ్యమును బ్రిటిషు చరిత్ర రచయితలు 'గోల్డెన్ హోర్డ్' అని వ్యవహరింతురు). ఈ స్కంధావారము క్రమముగ ఆ రాజ్యమునకు రాజధాని అగుటయేకాక, వెలుపలి ప్రాంతముల వారి పరిగణనలో ఆ రాజ్యపునామముగ సైతము లెక్కకు వచ్చెను. రష్యా రాజ్యము ఆ కాలమున పెక్కుభాగములుగ విభక్తమై మాండలికుల పాలనలో ఉండినది. వీరందరును కిప్‌చాక్ రాజ్యమును పాలించు ఖాన్‌ని ఆధిపత్యమునకు లోబడి కప్పమును చెల్లించెడివారు. 1357 వరకు ఈ రాజ్యము అప్రతిహతముగ రాణించగలిగినది. కాని, ఆ సంవత్సరమున కిప్‌చాక్ రాజ్యప్రభువు నిస్సంతుగ మరణించుటతో రాజ్యమున అరాజకత చెలరేగి, కల్లోలములకు దారితీసెను. కాని, అనతికాలముననే బాటూ సోదరుడగు ఓర్డా సంతతికి చెందిన తోక్తమిష్ రాజ్యమును వశపరచుకొని, ప్రతిస్పర్థులను నిర్మూలించెను (1378). ఈ ఓర్డా వంశీయులు తూర్పున వేరొక రాజ్యమును అదివరకే పాలించుచుండిరి. ఆ రాజ్యమే తూర్పు కిప్‌చాక్ రాజ్యము లేదా శ్వేతస్కంధావార రాజ్యమని చరిత్రలో వ్యవహృతమైనది. 1378 తరువాత ఈ రెండు కిప్‌చాక్ రాజ్యములును ఇటుల ఏకపరిపాలనక్రిందకు వచ్చి పూర్వ మంగోల్ రాజ్య వైభవమును కొంత సంతరించుకొనగలిగినవి. కాని, ఇంతలో మధ్య ఆసియాలో వేరొక మంగోల్ నాయకుడు-తైమూర్ అను వాడు-తలయెత్తి కిప్‌చాక్ రాజ్యమునకు ముప్పుతెచ్చెను. ఈ తైమూరునకే 'తామర్లేన్' అనియు వ్యవహారము కలదు. చెంఘిజ్‌ఖాన్ వంశముననే కూతురు బిడ్డల సంతతికి చెందినవాడు ఇతడు. చెంఘిజ్‌ఖాన్‌ను అనుకరించి తానును ప్రపంచ విజేత కావలయునని ఆసించి ఇతడు తగిన సైన్యమును సమాయత్తము చేసికొని 1369 లో సామర్కండ్‌ను వశపరచుకొని, అటనుండి దండయాత్రల సాగించి క్రమముగ 1387 నాటికి సిజిస్తాన్, ఆఫ్ఘనిస్తాన్, ఇరాన్, కుర్దిస్తాన్‌లను వశపరచుకొని 1391 లో సంయుక్త కిప్‌చాక్ రాజ్యపాలకుడగు తోక్తమిష్‌ను ఓడించెను. అంతటితో కిప్‌చాక్ రాజ్య ప్రతిష్ఠయు అంతరించినది.

చెంఘిజ్‌ఖాన్‌ను అనుకరించుటకు యత్నించిన తైమూర్‌నందు చెంఘిజ్‌ఖాన్‌లోని తక్కిన ప్రజ్ఞావిశేషములు అంతగ లేకపోయినను, క్రూరత్వము మాత్రము వేయిరెట్లుగ నెలవు చేసికొనినది. ఉత్తర భారతదేశమునందలి ఢిల్లీ మొదలు పశ్చిమమున సిరియావరకును కల విస్తృత భూమిలోని జనాకీర్ణ నగరములను ధ్వంసము చేయుటలో అతడు ఆనందమును చూరగొనెను. 13వ శతాబ్దిలో హులగూ చేసిన దండయాత్రల మూలమున ఇరాక్‌లోని పట్టణములును, వ్యావసాయిక జలాధారములును నిర్మూలితములు కాగా, 14వ శతాబ్దిలో తైమూర్ సాగించిన నిర్దాక్షిణ్యపు దండయాత్రల మూలమున మధ్యప్రాచ్యము అంతయు అట్టి శోచనీయస్థితిని పొందినది. మానవుల తలపుర్రెలతో గోపురముల నిర్మించి చూచుట అతనికి ఒక విలాసముగ ఉండెడిది. ఇస్ఫహాన్ నగరమును వశపరచుకొనిన తరువాత అతడు అచటి పౌరులను వధించి 70,000 పుర్రెలతో గోపురమును ఒకదానిని నిర్మింపజేసెను. ఇట్టి

క్రూరచర్యలవలన పరిసర రాజ్యపాలకులను అతడు భయకంపితులుగ చేసెను. ఈజిప్టు దేశపు పాలకుడు అతని ఆధిపత్యమును అంగీకరించి కప్పమును చెల్లించెను. అప్పటికే ఆసియా మైనర్‌లో సెల్జుక్ తురుష్కులను లోగొని, రాజ్యమును స్థాపించిన ఓటోమన్ శాఖీయులగు తురుష్కులు తైమూర్ హింసాకాండను చవిచూచిన తరువాత లొంగి, మనగలిగిరి. ఇంత విశాల సామ్రాజ్యమును సంపాదించిన తరువాత, అంతటితో తృప్తి చెందక, చీనాను వశపరచుకొనుటకై దండయాత్రా సన్నాహములను తైమూర్ మొదలిడి, అది కార్యరూపమును దాల్చక పూర్వమే 1405 లో మరణించెను. అతని మరణముతోపాటుగ అతని సామ్రాజ్యపు ఏకతయు అంతరించినది. తూర్పు ఇరాన్ ప్రాంతము మాత్రము అతని వంశీయుల ఆధిపత్యమున ఆ తరువాత ఏబది ఏండ్ల కాలము ఉండినది.

చెంఘిజ్‌ఖాన్‌తో 1206 లో మొదలిడిన మంగోల్ దండయాత్రా ప్రవాహము తైమూర్ మరణముతో అంతమొందినటుల భావింపవచ్చును (ఈ మంగోల్‌ల సంతతికే చెందిన బాబర్ ఆ తరువాత 120 సంవత్సరములకు భారతదేశమున ఒక మహా సామ్రాజ్యమునకు మూలపురుషుడు కాగలిగినను, ఆనాటికి మంగోల్ జాతిలో కలిగిన భావ పరిణామము దృష్ట్యా దానిని వేరుగ పరిగణింపవలసి ఉన్నది). ప్రపంచమున తత్పూర్వమందు అంతటంతట రూపుగొనిన సామ్రాజ్యములతో ఏదియు విస్తృతియందు ఈ మంగోల్ సామ్రాజ్యమునకు సమానము కానేరదనుట నిస్సంశయము. ఇట్టి విశాల రాజ్యసంస్థాపకులగు మంగోల్‌లవలన ప్రపంచసంస్కృతికి కలిగిన లాభము తగినంతగ లేకపోయిన మాట నిజమే అయినను, ప్రప్రథమముగ మధ్యధరా ప్రాంత యూరప్‌వాసులకు అతిదూర ప్రాచ్య నాగరకతల ప్రాశస్త్యమును గురించి గౌరవ భావము కలుగుటకు ఈ మంగోల్ సామ్రాజ్యము కారణభూతము అయినదనుట మాత్రము నిర్వివాదాంశము.

చీనా సామ్రాజ్యము (1371 - 1500) : మంగోల్ సామ్రాజ్యపాలకులను చీనా దేశమునుండి తరిమివైచి చీనాలో మరల దేశీయ ప్రభుత్వమును స్థాపించిన మింగ్ వంశపురాజులు కుబ్లయ్‌ఖాన్‌చే రూపొందింపబడిన చీనా సామ్రాజ్య సమగ్రతకు భంగము రానీయకుండ జాగరూకత వహించుటయే కాక చీనాకు సముద్రాంతర దేశములందు పూర్వముకన్న మిన్నగ మన్నన లభింపజేయుటకు తొలుతలో శ్రద్ధ వహించిరి. రాజ్యవిస్తృతికై సాగించిన వీరి కృషిలో పరిగణనీయమైనవి వీరు సాగించిన నౌకాబలపు దండయాత్రలు. వివిధ నౌకాధ్యక్షుల నాయకత్వమున ఈ దండయాత్రలు 1403 మొదలుకొని 1433 వరకును సాగినవి. ఈ నౌకాధ్యక్షులలో ప్రముఖుడుగ చారిత్రక ఖ్యాతిని ఆర్జించినవాడు చెంగ్ హో. ఇతడు తన నౌకాబలముతో ఆసియా ద్వీప సముదాయముపై దాడిసలిపి, సుమత్రాను ఆక్రమించి (1405 - 07), ఆ రాజును, సింహళ సేనలను ఓడించి (1408 - 11), సకుటుంబముగ సింహళదేశపు రాజును బందీకృతులుగచేసి, చీనా సార్వభౌమునికడకు కొనిరాగలిగెను. తన కడపటి నౌకాయాత్రలో (1433) అతడు తూర్పు ఆఫ్రికావరకును పయనించి మక్కా మొదలగు అరేబియా సముద్ర తీరస్థ ప్రాంతములనుండి కప్పములను చీనా సార్వభౌముని కొరకై గ్రహించెను. ఈ కాలముననే చీనా సార్వభౌముని సేనానివహములు మంగోలియాను నాశనము చేసి, మంగోల్‌లు మరల విజృంభింపకుండ చేయుటకై గాఢ యత్నము చేసినవి. అయినను ఈ యత్నము విఫలమైనది. చెంఘిజ్‌ఖాన్ వంశీయుడగు దయాన్ 1470 లో మంగోల్ జాతులందు ఐకమత్యమును నెలకొల్పి తన రాజరికము క్రింద మంగోలియాలో ఒక రాజ్యమును స్థాపించెను.

కొరియా మాత్రము మంగోల్‌ల పతనానంతరమున లీ వంశమను క్రొత్త రాజవంశపు ఆధ్వర్యవమున, మింగ్ సామ్రాట్‌ల ఆధిపత్యమును మన్నించి, యథాపూర్వముగ వ్యవహరించినది. 1392 లో అధికారమును చేపట్టిన ఈ నూతన రాజవంశపు పాలనలో తొలుతటి శతాబ్దమున కొరియాదేశము వివిధ రంగములందును పురోగమించి సంపన్న దేశముగ పరిణమించినది. ఆ కాలమున వివిధ కళలును రాజాదరణ బలమున అట వికసనమును పొందినవి.

మంగోల్‌ల నౌకాధాటిని త్రిప్పగొట్టి మనగలిగిన జపాన్‌దేశము చీనా సంస్కృతిని, బౌద్ధమతమును పూర్వమువలెనే ఆదరించుచు, చీనాను మింగ్ వంశజులు పాలించు కాలమునను స్వతంత్రముగ మనగలిగినది. కాని, 13 వ శతాబ్ది ప్రథమ పాదము ముగియుటకు ముందుగనే ఫూజివారా షోగన్‌లు బలహీనులగుటచే వారిని తమ చేతిలో ఉంచుకొని హోజో కుటుంబీకులు 1333 వరకు పరిపాలనను తమ వశమున నిలుపుకొనిరి. తరువాత చక్రవర్తియే అధికారమును వశపరచుకొనుటకై యత్నించినను, ఆ ప్రయత్నము విఫలమై అషికాగా వంశీయుడు ఒకడు షోగన్ పదవిని ఆర్జించెను (1336). తరువాత రెండు శతాబ్దముల పైకాలము జపాన్‌దేశము అషికాగా వంశీయులగు షోగన్‌ల పాలనలో ఉండినది. ఈ కాలమున సర్దారుల స్వార్థపరత్వమున కల్లోలములు పెక్కుమారులు చెలరేగి అంతర్యుద్ధములకు దారితీసినను, విదేశ వ్యాపా

రము విరివిగ సాగి పెక్కుపట్టణములు దేశమున రూపొందుటకు అవకాశము కలిగినది. సాహిత్య, శిల్పాది వివిధ కళలును వికసన మందినవి.

దక్షిణమున చీనా సామ్రాట్‌లు ఆర్జించిన రాజ్యము ఎక్కువ కాలము వారి చేతిలో ఉండలేదు. 1436 లో అన్నామ్ స్వతంత్రతను ఆర్జించుటయేకాక 1471 లో చంపారాజ్యమును సంపూర్ణముగ తనలో లీనము చేసికొనినది. సింహళము అనతికాలముననే చీనీయుల ఆధిపత్యమును త్రోసిరాజనినది. చీనానుండి మంగోల్ దండయాత్రల కాలమున దక్షిణమునకు పయనించిన తాయి మూకలచే అయోధ్య రాజధానిగ నెలకొల్పబడిన (1350) సయామ్‌రాజ్యము, చీనాసామ్రాట్ సర్వాధిపత్యమును నామమాత్రముగ అంగీకరించినను (1371), తక్కిన అన్ని విషయములందును సర్వస్వతంత్రముగనే వ్యవహరించి, ఖ్మేర్ సామ్రాజ్యమును అంతమొందించి, కాంబోడియాను వశపరచుకొని, బర్మా, మలయాపై కూడ తన పలుకుబడిని వ్యాపింపజేసినది. మలయా, జావా, సుమత్రాలో చెంగ్‌హో దండయాత్రల తరువాత అల్పరాజ్యములు అనేకములు బయలుదేరి నిరంతరము పోరాటములలో మునిగి ఉండుటవలన అట ఏకీకృత రాజ్య వ్యవస్థయే రద్దయినది. ఇట్టి ఎడ ముస్లిమ్‌లగు భారత, అరబ్బీ వర్తకుల పరిచితివలన 15 వ శతాబ్ది ఉత్తరార్ధమున కొందరు రాజులు ఇస్లామ్‌ను అభిమానించి, అవలంబించుటచే క్రమముగ ఆ శతాబ్ది అంతమునకు ఆ ద్వీప సముదాయమున పలు రాజ్యములలో ఆ మతము విరివిగ వ్యాప్తిని పొందినది.

భారతదేశము (1206 - 1526): మంగోల్‌ల తీవ్రఘాతికి లోనుగాని ఏకైక ఆసియాదేశము, భారతదేశము మాత్రమే. మంగోల్ నాయకుడు చెంఘిజ్‌ఖాన్ ప్రపంచ విజయముకొరకై బయలుదేరిన వత్సరముననే (1206) ఉత్తర భారతదేశమున - ఢిల్లీ కేంద్రముగ - బానిస వంశీయుడగు కుతుబ్ - ఉద్దీన్ ఐబక్ నాయకత్వమున తొలుతటి ముస్లిమ్ రాజ్యపాలన ఆరంభితమైనది. బానిసవంశము తరువాత క్రమముగ మరి ఐదు ముస్లిమ్ రాజవంశములు 1526 వరకు ఢిల్లీ కేంద్రముగ పరిపాలన నెరపినవి. వీనిలో తొలుతటి బానిసరాజవంశపు కాలముననే ఉత్తర భారతదేశము అంతయు ముస్లిమ్ పాలనకు లోనైనది. మంగోల్‌ల చెదరువాటుదాడులు అంతటంతట వీరి రాజ్యమున వాయవ్యభాగమును కల్లోలితము చేసినను, అప్పటి ప్రభువులు ధనమును ఇచ్చియో లేదా బలమును ఉపయోగించియో మంగోల్‌లను తరిమివేయగలిగిరి. మూడవ రాజవంశమగు ఖిల్జీ వంశమునకు చెందిన అల్లా ఉద్దీన్ తన దండయాత్రా తీవ్రతచే మధుర వరకు దక్షిణభారతదేశమును కల్లోలితము చేసి (1305-1313) అపార ధనరాసులను కొల్లగొట్టుకొని పోవుటయే గాక, దక్షిణదేశ ప్రభువులు ఢిల్లీసుల్తాన్ ఆధిపత్యమును అంగీకరించునటుల చేయగలిగెను. ఖిల్జీ ప్రభువుల పతనానంతరమున ఢిల్లీ సింహాసనమును అధిష్ఠించిన తుఘ్లుక్ వంశీయులలో ఒకడగు మహమ్మద్ బిన్ తుఘ్లుక్ (1325 - 1351 ప) సాగించిన అతిసాహసపు అవివేక చర్యలవలన సామ్రాజ్యము ఏకతను కోల్పోయి, ఉత్తర భారతదేశమున వివిధ ముస్లిమ్ ప్రభువులు స్వతంత్రులైరి. ఈ కాలముననే దక్షిణ భారతమున ఒక స్వతంత్ర రాజ్యమును బహమన్‌షా అనువాడు స్థాపించి (1347) ఒక రాజవంశమునకు మూలపురుషుడయ్యెను. ఇదియే బహ్మనీ రాజ్యము. భారతదేశమును అంతటిని ఇటుల లోగొనుచుండిన ముస్లిమ్‌ల ఉద్ధతిని అరికట్టి హిందూ సంస్కృతిని కాపాడు ఉద్దేశముతో ఆ కాలముననే తుంగభద్రా నదీతీరమున విజయనగరము (నేటి హంపి) రాజధానిగ విజయనగర సామ్రాజ్యము హరిహర, బుక్కరాయలచే స్థాపింపబడినది (1335). క్రమముగ ఈ హిందూరాజ్యము కృష్ణకు దిగువ భారతదేశభూమిని అంతటిని తన ఆధిపత్యములోనికి కొనిరాగలిగినది. [చూ. తెలుగు సంస్కృతి - ౧ : పు. 233, 338, 369, 502].

అంతటినుండి అటనట, ఎడనెడ యుద్ధాదులవలన కలుగు కొలది మార్పులతో 16 వ శతాబ్ది ప్రథమపాదము వరకు భారత రాజకీయ పటము స్థూలముగ ఈ రీతినే ఉండినది. మహమ్మద్ బిన్ తుఘ్లుక్ అనంతరమున క్రమముగ హీనస్థితికి వచ్చిన ఢిల్లీ సుల్తాన్‌ల అధికారము - మంగోల్ నాయకుడు తైమూర్ తన దండయాత్రా కాలమున (1399) ఢిల్లీనగరమున సాగించిన హింసాకాండ ఫలితముగ - అత్యంత హీనస్థితికి దిగజారినది. అంతట తైమూర్ దేశమును విడిచిపోయిన తరువాత ఖిజర్‌ఖాన్ అను సయ్యద్ వంశీయుడు తైమూర్ ప్రతినిధినని పేర్కొనుచు, ఢిల్లీ సింహాసనమును వశపరచుకొని (1414), అనంతరమున స్వతంత్రుడయ్యెను. ఈ సయ్యద్ వంశీయులు కాని, వీరి పతనానంతరము ఢిల్లీసుల్తాన్ పదవిని ఆర్జించిన (1478) లోడీ వంశీయులు కాని ఢిల్లీకి గత వైభవమును కొలది మాత్రముగ ఐనను సమకూర్పలేకపోయిరి.

తక్కిన ఆసియా, యూరప్ రాజ్యములు: తైమూర్ మరణానంతరమున అతని సామ్రాజ్యమునందు అత్యధిక భాగము విడివడిపోయినది. అంతట క్రిమియా మొదలుగ

మంగోలియావరకు వివిధ మంగోల్ రాజ్యములు మరల అధికారమును వహించినవి. అయినను వీని యందు పూర్వపు ఐక్యభావన మాత్రము మృగ్యమైనది. ఈ రాజ్యములలో కిప్‌చాక్ రాజ్యము తైమూర్ దండ యాత్రా ఫలితముగ పూర్వపు ప్రతిష్ఠను కోల్పోయినను, రాజ్యపు విస్తృతిని యథాతథముగ కాపాడుకొనగలిగినది. ఈ రాజ్యమున అంతర్భాగముగ ఉండిన రష్యాలోని వివిధ ప్రాంతముల మాండలిక ప్రభువులు ఆంతరంగిక విషయము లందు స్వతంత్ర ప్రతిపత్తి కలిగి ఉండి, మంగోల్ ప్రభువునకు కప్పమును మాత్రము చెల్లించెడివారను విషయము ఇది వరలో తెలుపబడినది [చూ. పు. 94]. ఇట్టి సామంతులలో కాలక్రమమున మాస్కోనగర మాండలికుడు ప్రముఖత వహించి మంగోల్‌ల ఆదరణను ఆర్జించెను. తత్ఫలితముగ తక్కిన మాండలికులనుండి కప్పములను వసూలుచేసి, దానిని మంగోల్ ఖాన్‌నకు చెల్లించు అధికారమును మాస్కో పాలకుడగు ఇవాన్ - I (1325 - 1341 ప) ఆర్జించెను. ఈ అధికారమే కాలక్రమమున మాస్కో పాలకులను తక్కిన సామంతులకన్న బలవత్తరులనుచేసి, వారిలో స్వతంత్ర రాజ్యస్థాపనేచ్ఛను రేకెత్తించినది. కడకు 1480 లో అప్పటి మాస్కో పాలకుడగు ఇవాన్ - III (1462 - 1505 ప) మంగోల్ సేనలను ఘోర పరాజయము పాలుచేసి సర్వస్వతంత్రుడయ్యెను. అతడు అంతట తూర్పున యూరల్ పర్వతములవరకు తన రాజ్యమును విస్తరింపజేసి, రష్యాకు తొలుతటి జాతీయ ప్రభువు కాగలిగెను.

ఇక పారసీకదేశము తైమూర్ వంశీయులచేతిలోనే 1469 వరకు ఉండి, అంతట తుర్కులలో తుర్కోమన్ శాఖకుచెందిన ఉజూన్ హసన్‌కు వశమైనది. పరిసర దేశములగు కుర్దిస్తాన్, అజర్‌బైజాన్, ఇరాక్ దేశము లను కూడ ఈ హసన్ ఆక్రమింపగలిగెను. కాని, 1473 లో ఓటోమన్‌తుర్కులు ఇతనిని పరాజితుని చేసి, ఇతని విజృంభణమును అరికట్టిరి. పారసీకమును తుర్కోమన్‌లు ఎక్కువ కాలము తమ స్వాధీనమున ఉంచుకొనజాలకపోయిరి. చిరకాలము నుండియు పరజాతీ యుల పాలనలో క్రమ్మగుచున్న పారసీకులను సమీకరించి, ఇస్మాయిల్ అనువాడు తుర్కోమన్‌ల ప్రభుత్వమును అంతమొందించి 1500 లో దేశీయప్రభుత్వమును నెలకొల్పి, సఫావిద్ రాజవంశమునకు మూలపురుషుడు అయ్యెను. ఈ సఫావిద్ రాజవంశపు పాలకులు తొలుతనుండియు ఓటోమన్‌తుర్కుల బెడదనుండి దేశమును కాపాడు కొనుటకే తమ యావచ్ఛక్తిని ధారపోసిరి.

ఓటోమన్‌లు - రాజ్యవ్యాప్తి: ఈ ఓటోమన్ తుర్కులు ముస్లిమ్‌లు. వీరిని ఒక శక్తివంతజాతిగ సమీకరించినవాడు ఎర్‌టోగ్రల్ అను వీరుడనియు, ఇతడు తొలుత బైజాం టైన్ సామ్రాజ్యపు పొలిమేర కాపుగ ఉండెననియు, ఈతని కుమారుడు ఉస్మాన్ (1290 - 1326 ప) దుర్బలస్థితిలో ఉండిన ఆ సామ్రాజ్యపు పొలిమేరలో కొంత రాజ్యమును వశ పరచుకొని ఓటోమన్‌ల రాచరికమునకు మూలపురుషు డయ్యెననియు తుర్కుల చరిత్రకారులు కొందరు పేర్కొనిరి. కాని, దీనిని గురించిన చారిత్రకాధారములు కన్పట్టుట లేదు. చరిత్రకు సోపపత్తికముగ తెలిసినంతవరకు ఆర్ ఖాన్ - I (1326 - 1359 ప) ను ఓటోమన్ తుర్కురాజ్యము నకు తొలుతటి వ్యవస్థాపకుడుగ పేర్కొనదగి ఉన్నది. ఆనాటికి సెల్జుక్ తుర్కుల ప్రశస్తి ఆసియామైనర్ నందు అంతరించినది. క్రమముగ అచటి పూర్వపు సెల్జుక్ తుర్కు ప్రాంతములను కొన్నింటిని ఓటోమన్ తుర్కులు వశపరచు కొనిరి. కాని, పొరుగున ఉన్న బైజాంటైన్ సామ్రాజ్య ముతో మాత్రము చాలకాలమువరకు మైత్రిని అవలం బించియే వీరు వ్యవహరించిరి. ఆ సామ్రాజ్యపు ప్రతి పత్తికి భంగము కలిగించకుండ వారు 1345 లో బాస్ఫరస్ జలసంధిని దాటి చల్లగ యూరప్‌లోనికి చొరబారిరి. ఆనాడు బాల్కన్ ప్రాంతపు క్రైస్తవపాలకులు అంతర్యుద్ధ ములలో మునిగి ఉండుటను అవకాశముగ వినియోగించు కొని ఓటోమన్ తుర్కులు మేసిడోనియా, ఇలిరియా, యుగోస్లావియా, బల్గేరియా ప్రాంతములను వశపరచు కొనిరి (1354 - 1389). అంతట తూర్పున ఆసియామైనర్ వైపునకు మరల వారు తమ దృష్టిని మరల్చి అన టోలియాను ఆక్రమించిరి (1391). ఇటుల తూర్పు, పడమర లకు ఓటోమన్ సామ్రాజ్యము విస్తరించి బైజాంటైన్ రాజ్య మును అన్నివైపుల చుట్టుముట్ట గలిగినది. అంతట ఓటో మన్ పాలకులు కాన్‌స్టాంటినోపుల్‌ను వశపరచుకొనుటకు సంకల్పించిరి. కడకు మహమ్మద్ - II పరిపాలనా కాలమున (1451 - 81) ఓటోమన్ తుర్కుసేనలు కాన్‌స్టాంటినోపుల్ నగరమును వశపరచుకొని(1453), బైజాంటైన్ సామ్రాజ్య మును అంతమొందించి, తుర్కు సామ్రాజ్యమునకు సమగ్ర తను కల్పించినవి. ఇటుల తూర్పు, మధ్యధరా ప్రాంత భూమిని అంతటిని వశపరచుకొనిన తుర్కుల వలన తమ వర్తకమునకు ముప్పురాగలదని భావించి, వర్తకనగర రాజ్యమగు వెనిస్ (ఇటలీ) నౌకాదళ బలముతో తుర్కులను ఎదుర్కొని పోరాడినది (1463 - 79). ముస్లిమ్ రాజ్యమగు టర్కీని నిరోధించి క్రైస్తవ సంస్కృతిని కాపాడదలచి ఆ కాలపు పోప్ సైతము హంగేరిని ప్రోత్స

హించి వెనిస్ రాజ్యమునకు సాయపడునటుల చేసెను. కాని, ఈ సహాయమును పొందియు వెనిస్ నిలువజాలక పోయినది. తుర్కుల ప్రబల నౌకాబలము కడకు వెనిస్ నగరపు సమీపమునకుచేరి ఆ నగరమునకు ముప్పుతెచ్చినది. అంతట వెనిస్ నగరము టర్కీ పాలకులతో సంధి కుదుర్చుకొని, నల్లసముద్ర ప్రాంతముల తాను సాగించు వ్యాపారమునకై సాలీనా కప్పమును తుర్కులకు చెల్లించుటకు అంగీకరించినది (1479). మహమ్మద్ పౌత్రుడగు సలీమ్-I (1512-1520 వ) కాలమున ఓటోమన్ సామ్రాజ్యము పూర్వముకన్న మిన్నగ విస్తృతిని, ప్రశస్తిని ఆర్జించినది. ఇతడు ఈజిప్టును పాలించు మామ్లుకులను ఓడించి సిరియా, ఈజిప్టులను, అరేబియాలోని ముస్లిమ్ పుణ్యక్షేత్రములను వశపరచుకొనుటయే కాక మామ్లుకుల పోషణలో ఉండి అప్పటివరకు కలీఫా పదవిని నిర్వహించుచుండిన అబ్బాసీ వంశీయుని తన పోషణలోనికి తీసికొనెను. దీనివలన ముస్లిమ్ ప్రపంచమున టర్కీకి సమధిక ప్రశస్తి లభించుటయేకాక, కాలక్రమమున ఓటోమన్ ప్రభువే కలీఫా పదవిని కూడ వహించుటకు మార్గము సుగమమయ్యెను.

కాన్‌స్టాంటినోపుల్ పతనముతో బైజాంటైన్ సామ్రాజ్యము నెలవుగ ఆ ప్రాంతమున వర్ధిల్లిన గ్రీక్ సంస్కృతియు, క్రైస్తవమతమును బాగుగ దెబ్బతినినవి. ఇది క్రైస్తవ ప్రపంచమునకు ఒక పెద్ద ఆఘాతమే అయినను, ఇందువలన కలిగిన నష్టమును మరపించగల ఒక మహత్తర లాభము యూరప్‌నకు కాన్‌స్టాంటినోపుల్ పతనమువలన చేకూరినది. ఆ పట్టణము తుర్కుల వశమైనంతనే దానిని వదలిన గ్రీక్ పండితులు యూరప్‌నందలి వేర్వేరు ప్రాంతములకు పయనించి, ప్రాచీన గ్రీక్ల విజ్ఞానముతో యూరప్‌నకు పరిచితిని కలిగించి, ఆ ఖండమున నూతన చైతన్యము కలుగుటకు తోడ్పడిరి.

యూరప్ (1270-1522): క్రైస్తవధర్మ రక్షణకై యూరప్‌న అన్ని ప్రాంతములనుండియు వివిధ నాయకుల ఆధిపత్యమున బయలుదేరిన క్రూసేడ్‌లయందలి ఉత్సాహము క్రమక్రమముగ సన్నగిలి 13 వ శతాబ్ది అంతమునకు సమసిపోయినదను విషయము పాఠకులదృష్టికి ఇదివరకే తేబడినది [చూ. పు. 90]. యుద్ధతంత్రమున ముస్లిమ్‌సేనలు ప్రదర్శించిన చాతుర్యమే ఇందులకు ప్రముఖ కారణమైనను, యూరప్‌నందు ఆ కాలమున ప్రవర్తిల్లిన రాజకీయ సంఘటనలును ఇందులకు కారణములు కాకపోలేదు. క్రూసేడ్‌ల నాయకత్వమును తాను వహించవలెనని పోప్‌ను, అట్టిది జరుగకుండ తమ ఆధ్వర్యవముననే జరుగవలెనని వేర్వేరు జాతుల ప్రభువులును స్పర్ధ వహించుటచే ఈ క్రూసేడ్‌లందు ఐకమత్యము శూన్యమైనది. క్రూసేడ్‌ల ఈ విఫల ప్రయత్నములవలన తమకుగల పలుకుబడి ఎట్టిదియో పోప్‌లకు సువిదితమైనది. అంతటినుండి పోప్‌లు మతవిషయిక వ్యవహారములందుకన్న లౌకిక వ్యాపారములందే ఎక్కువ శ్రద్ధవహించి, యూరప్ రాజకీయములందు అప్రతిహతమగు అధికారమును నెరపు ఉద్దేశముతో కృషిచేసిరి. 1294 లో బానిఫేస్-VIII పోప్ పదవిని అధిష్ఠించినప్పటినుండి ఈ విధానము తీవ్రతర రీతిలో అమలులోనికి కొనిరాబడి, 1534 వరకు అమలులో ఉండినది. ఈ విధానమును అమలులోనికి తెచ్చుటలో అవలంబింపబడిన తీరు తెన్నులు, దాని వైఫల్యము, తత్పరిణామములు అనునవియే ఆ కాలపు యూరప్ చరిత్రలోని ప్రముఖాంశములుగ పేర్కొనబడవచ్చును.

ఆ నాటి యూరప్ రాజకీయ పటమునందు పవిత్ర రోమన్ సామ్రాజ్యము ప్రముఖస్థానమును ఆక్రమించినది. ఆ సామ్రాజ్యపు చక్రవర్తి ఎన్నుకొనబడవలయునను నియమము అప్పటిలో ఉన్నను, ఆ పదవికి ఒకరిని ఎన్నుకొను హక్కుమాత్రము కొంతమంది సామంతులకు మాత్రమే భుక్తమై ఉండినది. ఏ ఒక రాజకుటుంబమునందును ఈ చక్రవర్తి పదవి శాశ్వతముగ నిలిచిపోకుండుటకు ఈ సామంతులు శ్రద్ధవహించుచుండిరి. అయినను, ఈ చక్రవర్తి పదవి అనేక అధికారములు కలది అగుటచే సమర్థుడగు చక్రవర్తి యూరప్ రాజకీయములందు ప్రముఖ పాత్రను నిర్వహింప వీలు ఉండెడిది. కావున చక్రవర్తిని తమ ఆజ్ఞాబద్ధునిగ చేసికొనినయెడల యూరప్‌నందు అంతటను అధికారమును నెరపు అవకాశము లభించునను భావనతో పోప్‌లు మొదటినుండియు అందులకై కృషిచేసిరి.

సామంతులు చక్రవర్తిని ఎన్నుకొనిన తరువాత అతనికి రోమ్ నగరమున మకుటాభిషేకమును పోప్ నిర్వహించుట ఒక సంప్రదాయముగ ఉండెడిది. పోప్ వలన చేకూరెడి ఇట్టి పరిగణనవలన క్రైస్తవ లోకమున చక్రవర్తికి ఆదరణము లభించెడిది. ఇది ఒక విధముగ గొప్ప అధికారమే అయినను, విపరీత పరిస్థితులందు ఉపయోగించుటకు అనువుగ 'బహిష్కరణ' అను ఆయుధము కూడ పోప్‌లకు ఉండెడిది. తన ఆజ్ఞను మన్నించని చక్రవర్తిని పోప్ మతబహిష్కృతునిగ చేసెడివాడు. ఆనాటి ప్రజలలో అలముకొనిన విశ్వాసములను బట్టి తత్ఫలితముగ చక్రవర్తి పుణ్యలోకములకు దూరుడైనవాడుగ పరిగణింపబడి, ప్రతిష్ఠను కోల్పోయెడివాడు. ఈ ఆయుధము తొలుతటి చక్రవర్తుల కాలమున బాగుగ ఉపయోగపడి, పోప్‌లకు అప్రతిహతమగు అధికారమును సమకూర్చినది.

కాని, కాలక్రమమున భావగతిలో వచ్చిన మార్పులవలన ఆ ఆయుధము తన పటుత్వమును కోల్పోయినది.

పోప్ ప్రయోగించిన బహిష్కరణాయుధమును విఫలమొనర్చి నిలువగలిగిన పవిత్ర రోమన్ సామ్రాట్‌లలో ముఖ్యముగ పేర్కొనదగినవాడు ఫ్రెడరిక్ - II చక్రవర్తి (1220 - 1250 ప). తొలుతగ సిసిలీ - నేపిల్స్ సంయుక్త రాజ్యమునకు రాజుగ ఉండిన ఇతనిని సామ్రాజ్య మండలి సామంతులు చక్రవర్తిగ ఎన్నుకొనిరి (సిసిలీ అనునది ఇటలీకి దక్షిణమున ఉన్న దీవి. నేపిల్స్, ఇటలీ ద్వీపకల్పము నందలిది). అంతట భౌగోళికముగ ఇటలీకి చెందినవగు సిసిలీ, నేపిల్స్‌లలో పైతృకముగ తనకు వచ్చిన హక్కును చక్రవర్తి వదలుకొను షరతుపై పోప్ ఫ్రెడరిక్‌నకు మకుటాభిషేకము చేసెను. రోమ్‌నకు సమీపమున ఉన్న నేపిల్స్, సిసిలీ తనకు దక్కినచో ఇటలీ ద్వీపకల్పము అంతయు క్రమముగ తన పాలన లోనికి వచ్చునని పోప్ భావించెను. కాని, దీనిని గుర్తెరిగిన ఫ్రెడరిక్ పట్టాభిషిక్తుడైన తరువాత ఆ ప్రాంతములను వదలుకొనక పోవుటయేకాక పోప్ ఆజ్ఞాపించిన రీతిగా క్రూసేడ్‌ను సాగించుటకును నిరాకరించెను. అంతట పోప్ క్రుద్ధుడై చక్రవర్తిని మతబహిష్కృతుని చేయుచు ఒక దీర్ఘ శ్రీముఖమును వెలువరించెను (1227). అంతట పోప్ శ్రీముఖమునందలి వాదనల నెల్ల పరాస్తము చేయుచు, మత, లౌకిక సమస్యలకు కల విభిన్నతను నిర్దేశించి లౌకిక విషయములందు పోప్‌నకు అధికారము ఎట్టిదియు లేదని తెలియజేయుచు ఒక అతి దీర్ఘ సమాధానమును ఫ్రెడరిక్ చక్రవర్తి వెలువరించి, దాని ప్రతులను యూరప్‌నందలి సమకాలీన క్రైస్తవప్రభువులకు అందజేసెను. ఆ తరువాత అతడు తనంతతానుగ, పోప్ ఉత్తరువుతో నిమిత్తము లేకుండ, క్రూసేడ్‌ను సాగించి, యుద్ధమార్గమును అవలంబించక, సామపద్ధతిచే దౌత్యరీతిలో శత్రువులతో సమాధానము కుదుర్చుకొని, క్రైస్తవ పుణ్యక్షేత్రమును క్రైస్తవులు దర్శించు అధికారమును ఆర్జించుటయేకాక, జెరూసెలెమ్‌నందు పాలకుడుగ పట్టాభిషిక్తుడయ్యెను (1229). కడకు గత్యంతరములేక ఫ్రెడరిక్ సేనలధాటికి నిబ్బరముచెడి పోప్ తన బహిష్కరణాయుధమును ఉపసంహరించెను (1230). ఆ తరువాత మరల ఇటలీ రాజకీయములను బట్టి పోప్‌కు చక్రవర్తితో వైరుధ్యము పొడమెను. అంతట రెండవసారిగ చక్రవర్తిని పోప్ వెలివేసి (1239), అంతటితో ఊరకుండక, వేరొక చక్రవర్తిని సామంతులలో కొందరు ఎన్నుకొనునటుల చేసెను. కాని, తుదివరకు పోప్‌ను, అతనిని సమర్థించినవారిని ఎదుర్కొని పోరాడి చక్రవర్తి విజయమును ఆర్జించెను. 1250 లో ఫ్రెడరిక్ మరణించిన తరువాత అతని వంశీయులను పోప్ బహిష్కరించి, చక్రవర్తి పదవి వారికి దక్కకుండ జేయుటయే కాక, సిసిలీ రాజ్యమును సైతము ఫ్రెంచి రాజు సోదరునికి చెందునటుల చేసెను.

ఫ్రెడరిక్ - II చక్రవర్తిని యూరప్ చరిత్రలోని ఆధునిక యుగమునకు వైతాళికుడుగ పేర్కొనవచ్చును. క్రైస్తవ మతములోని ఛాందసభావనలను అతడు నిరసించెను. మత విచక్షణతో నిమిత్తములేకుండ విజ్ఞానము ఎట నున్నను దానిని ఆర్జించుట సముచితమని అతడు విశ్వసించి, తదనుగుణముగ కృషి చేసెను. యూద, ముస్లిమ్, క్రైస్తవ తత్త్వవేత్తలను అతడు తన ఆస్థానమున పోషించి, విద్యావ్యాప్తికై అవిరళ కృషి చేసెను. కాని, పరిపాలకుడుగ ఫ్రెడరిక్ వైఫల్యమును పొందెను. పైతృకమగు సిసిలీయెడ అతనికి గాఢాభిమానము ఉండుటచే, అతడు ఆ ప్రాంతపు పాలనను సుసంస్కరితము చేయుటకు మాత్రమే శ్రద్ధవహించి, జర్మనీయెడల అశ్రద్ధవహించెను. అందువలననే, నామమాత్రముగ చక్రవర్తి ఆధిపత్యమును అంగీకరించినను, జర్మనీ సామంతులును, మతాధిపతులును అన్నిరీతుల స్వతంత్రులుగనే వ్యవహరింపసాగిరి. కొన్ని వ్యాపారనగరములును భూస్వాముల అధిపత్యమునుండి విడివడి స్వతంత్రములుగనో లేదా మరికొన్ని నగరములతో కలసి ఒక ప్రత్యేకసమితి (లీగ్) గనో వ్యవహరించుట ఆ కాలముననే ఆరంభితమైనది. కడకు 15 వ శతాబ్ది అంతమునకు విశాల జర్మనీ రాజ్యమున దాదాపు మూడు వందలకు మించి అల్పరాజ్యములు రూపొందినవి.

ఫ్రెడరిక్ - II మరణానంతరమున పోప్ జోక్యము వలన చెలరేగిన బహిష్కరణల కల్లోలము సమసిన తరువాత 1273 లో - హాప్స్‌బర్గ్ వంశీకుడు - రుడాల్ఫ్ చక్రవర్తిగ ఎన్నుకొనబడెను. ఈ హాప్స్‌బర్గ్ వంశీయుల కాలమున ఇటలీయందు పోప్‌నకుకల అధికారమును, సిసిలీయందు పోప్ ప్రోద్బలమున నెలకొల్పబడిన రాజవంశపు ప్రతిపత్తిని చక్రవర్తి ధ్రువపరచుటయే (1275) కాక, సిసిలీయందును, పోప్ పాలితరాష్ట్రములందును తనకుకల అధికారములను అన్నింటిని పూర్తిగ వదలుకొనెను (1279). ఇది పోప్‌నకు విజయమే అయినను, ఈ విజయగర్వము కడకు దుష్పరిణామములకు త్రోవదీసినది. ఫ్రెడరిక్ - II కాలమున అతనిని నిరోధించు సంకల్పముతో ఫ్రాన్స్‌దేశపు రాజు అండను పోప్ గ్రహించి అతనికి అనుకూలుడుగ ఉండెను. ఫ్రెడరిక్ అనంతరమున పరిస్థితులు కుదుటబడి, పోప్ పలుకుబడి అతిశయిల్లినప్పటినుండియు ఫ్రాన్స్‌దేశపు రాజుతో

పాటుగ పవిత్ర రోమన్ సామ్రాట్‌ను కూడ లెక్కలోనికి తీసికొని, ఒక్కొక్క అవసరమున ఒక్కొకరియెడ ఎక్కువ మక్కువచూపుచు భేదతంత్రమును అవలంబించి, పోప్ వ్యవహరింపసాగెను. తత్ఫలితముగ ఒకసారి మతాచార్యుల నుండి పన్నులను వసూలుచేయు విషయమున ఫ్రాన్స్ రాజుతో పోప్‌నకు వైమనస్యము కలుగగ, ఆ రాజును బహిష్కరించుటకై అప్పటి పోప్ అగు బానిఫేస్-VIII సంకల్పించెను. దీనిని ముందుగనే గుర్తెరిగి ఫ్రాన్స్‌రాజు అనుచరులు పోప్ మందిరమున చొరబడి పోప్‌ను దుర్భాషలాడి, చెరబట్టి బందీగ ఫ్రాన్స్‌నకు కొనిపోవ యత్నించిరి (1303). ప్రజలు అంతట జోక్యము వహించి పోప్‌ను రక్షించినను, అతడు అవమానముచే క్రుంగి అనతికాలముననే మరణించెను.

తరువాత రోమ్ ప్రాంతము అంతయు అరాజకత పాలు కాగా పోప్ పదవికే భద్రత మృగ్యమై క్రొత్తగ పదవిని అధిష్ఠించిన పోప్ ఒక సంవత్సరకాలముననే మరణించెను. తత్ఫలితముగ 1305 నుండి క్రమముగ పోప్ పదవిని పొందిన వారలు ఏడుగురు రోమ్‌ను వదలి ఫ్రాన్స్‌దేశ మధ్యమున తమకు చెందియుండిన అవిగ్నాన్‌లో వసించిరి. పోప్‌లకు ఘటిల్లిన ఈ దురవస్థనే చరిత్రకారులు ఆలంకారికముగ 'బాబిలోనియా కారావాసము' అని పేర్కొనెదరు. 1378 వరకు ఈ పరిస్థితిలో మార్పు రాలేదు. ఫ్రాన్స్‌లో వీరు ఉండుట వలన వీరిపై ఫ్రెంచి ప్రభువు పలుకుబడియు, ఒత్తిడియు ఎక్కువగ ఉండెడివి. అందువలన పవిత్ర రోమన్ చక్రవర్తియు, ఫ్రెంచివారికి వ్యతిరేకులగు క్రైస్తవ ప్రభువులును పోప్‌ను చులకనగ చూడ మొదలిడిరి. ఈ పరిస్థితిని అంతము చేయుటకై 1378 లో పోప్‌గ ఉండిన గ్రెగరీ-XI రోమ్‌నకు చేరి అటనే మరణించగ తరువాత రోమ్ వాసుల ఒత్తిడికిలోనై ఇటలీ దేశీయుని పోప్‌గ మతాచార్యులు ఎన్నుకొనిరి. కాని, ఈ ఎన్నిక చెల్లనేరదనుచు కొందరు మతాచార్యులు అవిగ్నాన్‌లో వేరొక పోప్‌ను ఎన్నుకొనిరి. వారి వారి వసతులను అనుసరించి క్రైస్తవ రాజులలో ప్రతియొకడును వీరిలో తనకు నచ్చిన పోప్‌ను గుర్తింపసాగెను. ఈ అవకతవక పరిస్థితిని చక్కచేయుటకై ఫ్రెంచి ప్రభువు మతాచార్యులను సమావేశపరచి, వీరిని ఇరువురను కాదని వేరొకనిని పోప్‌గ ఎన్నుకొనజేసెను (1409). కాని, ఈ నిర్ణయమును మన్నించుటకు పదవులలో ఉన్న పోప్‌లు నిరాకరించుటచేత అంతట యూరప్‌న ముగ్గురు పోప్‌లు ఒకేసారి ఆధిపత్యము వహించు దుస్థితి సంఘటిల్లెను. ఇందువలన పోప్‌పదవికి చులకదనము ప్రాప్తించుటయేకాక, పోప్‌పదవి అనునదియే క్రైస్తవమత సూత్రములకు విరుద్ధమను వాదమును కొందరు పండితులు లేవదీసి, ప్రచారము చేయుటయు సంభవించెను. క్రైస్తవప్రభువులు పోప్‌ను ఎంతగ ధిక్కరించినను, పోప్‌పదవికే భంగము వాటిల్లినయెడల ప్రభువుల ప్రతిపత్తికిని భంగము కలుగగలదని విశ్వసించువారుగ ఆ కాలమున ఉండుట వలన, అప్పటి చక్రవర్తి సిజిస్మాండ్ 1414 మొదలుగ 1417 వరకు మతాచార్యుల సమావేశమును ఒకదానిని జరిపించి, పోప్‌పదవికై కొట్లాడుచున్న ముప్పురిని బలవంతముగా తొలగింపజేసి, వేరొకనిని పోప్‌గ ఎన్నుకొనజేయుటయే కాక, పోప్‌పై పెత్తనమును చేయుటకు ప్రముఖుల సమితికి అధికారము కలదను ముఖ్యసూత్రమును ఆమోదింపజేసెను. అంతటితో ఆ వివాదము అంతరించెను. అంతటినుండి ఆ యా క్రైస్తవదేశముల రాజులద్వారా మాత్రమే పోప్ వ్యవహరించు పరిస్థితి ఏర్పడి, పోప్‌లు తమకు కలదనిభావించిన అప్రతిహతాధికారమునకు స్వస్తి చెప్పబడినది.

పోప్‌ను, చక్రవర్తియు ఇటుల పెనగులాడుటవలన, ఇటు ఇటలీకాని, అటు జర్మనీకాని రవంతయు అభివృద్ధి చెందలేకపోయినవి. కాని, మధ్యయూరప్‌న ఈ ఘర్షణ చెలరేగుచున్న కాలముననే పశ్చిమ యూరప్‌న ఫ్రాన్స్, ఇంగ్లండు క్రమముగ బలవత్తరములై యూరప్‌నందలి ప్రముఖ జాతీయరాజ్యములుగ ముందునకు రాగలిగినవి. ఉత్తరఫ్రాన్స్ కోస్తాపై వసించిన నార్మన్‌లు ఇంగ్లండును జయించిననాటినుండియు, ఈ రెండు దేశముల మధ్య రాజకుటుంబముల సంబంధబాంధవ్యములనుబట్టి అతి సాన్నిహిత్యము ఏర్పడినది. క్రమముగ ఈ రాజకుటుంబముల బాంధవ్యమే ఆంగ్లరాజులకు ఫ్రాన్స్‌నందు కొంత భూభాగమున స్వత్వము కలుగజేసినది. ఈ స్వత్వమును గుర్తించుటకు ఫ్రాన్స్‌రాజు నిరాకరించుట నెపముగ ఘర్షణ ఆరంభమై 1338 లో యుద్ధమునకు దారితీసినది. ఈ యుద్ధము అప్పటప్పట విరామములతో 1453 వరకు చెలరేగినది. ఇదియే యూరప్‌చరిత్రలో 'శతవర్ష సంగ్రామము' అని వ్యవహరింపబడుచున్నది. జాతీయత అనునది ఈ ఉభయదేశములందును రూపొంది ఉత్తేజిత మగుటకు ఈ యుద్ధము కారణభూత మైనది. ఫ్రెంచి ప్రభుత్వపు సైన్యములు అన్నిరంగములందును పరాజితములై పరిస్థితి నిరాశావహముగ ఉండిన పరిస్థితిలో, ఆ యుద్ధకాలమున ఫ్రెంచిసేనలకు నాయకత్వము వహించుటకు రైతుబిడ్డయగు ఒక కన్య ముందునకు వచ్చెను. ఈమెయే చారిత్రక పసిద్ధిని ఆర్జించిన జోన్ డి ఆర్క్. భగవద్వాణిని అనుసరించి తాను దేశరక్షణకై పూనుకొనినటుల ఆమె నుడివెను. ఆమె నాయకత్వమున

ఫ్రెంచి సేనలు ముందునకు నడచి ఆంగ్లేయులను ఓడించి, కీలకస్థానములందలి కోటలను వశపరచుకొని, ఫ్రెంచి రాజునకు పూర్వప్రతిష్ఠను మరల చేకూర్పగలిగినవి. ఆ తరువాత ఫ్రెంచిరాజు విరోధులు ఆమెను పట్టుకొని ఆంగ్లేయులకు అప్పగించగ వారు ఆమెను అభిచారిణి అను నేరము ఆరోపించి మరణశిక్ష విధించి, సజీవముగ అగ్నిపాల్జేసిరి (1431). కాని, ఆమె మరణము ఫ్రెంచిజాతి యందు నూత్నోద్రేకమును రేకెత్తించినది. తత్ఫలితముగ ఫ్రెంచి సేనలు ఆంగ్లేయ సేనలను ఫ్రాన్స్‌నుండి తరిమివేయ గలిగినవి (1453). ఫ్రెంచితీరమందలి కెలేనగరము మాత్రమే ఆంగ్లేయుల వశమున మిగిలిపోయినది. ఆ తరువాత ఆంగ్ల రాజకుటుంబమున సింహాసనమునకై వచ్చిన పోరాటములచే (గులాబీల యుద్ధములు 1455-85) ఆంగ్ల దేశము కల్లోలితమైనను, కడకు 1485 లో ట్యూడర్ రాజవంశపు మూలపురుషుడగు హెన్రీ - VII పాలకుడగుటతో ఆ దేశమున సుస్థిరపాలనము నెలకొనెను. ఇంతకు చాలకాలము ముందుగనే ఐర్లాండ్‌న ఆంగ్లేయులు ఒకవలసను స్థాపించుటయే కాక, ఆంగ్లప్రభువు పక్షమున ఒక రాజప్రతినిధియు అట పరిపాలన నెరపుట ఆరంభమయ్యెను (1171). ఎడనెడ కొన్ని సంఘర్షణలతో ఆంగ్లరాజు తన ప్రభుత్వమును అట కొనసాగింపగలిగినను, ఐరిష్ ప్రజలను సంతృప్తిపరచుటకై, ఆ దేశమునకు ప్రత్యేక రాజ్యప్రతిపత్తిని కల్పించి తన వశముననే ఉంచుకొనెను (1450). స్కాట్‌లాండ్ మాత్రము ఇంగ్లండు పాలకులను ధిక్కరించి నిలచి, ఫ్రాన్స్‌తో సన్నిహితమైత్రిని అవలంబించినది.

ఇట్టి జాతీయరాజ్యములు పశ్చిమ యూరప్‌న రూపొందు కాలమున, పవిత్ర రోమన్ సామ్రాజ్యమునకు పొలిమేరలందున్న తక్కిన యూరప్‌నను కొన్ని నూతన రాజ్యములు ఈ యుగముననే రూపొందినవి. నార్స్‌మెన్‌ల తొలుతటి నివాస భూములగు నార్వే, స్వీడెన్, డెన్మార్క్ తొలుత వేర్వేరు రాజ్యములుగ రూపొంది కడకు డెన్మార్క్ పాలకురాలగు మార్గరెట్ రాణి ఏకాధిపత్యమును అంగీకరించినవి (1387). ఈ ఏకత 1520 వరకు నిలువగలిగినది. తూర్పు యూరప్‌న 1320 లో పోలండ్ రాజ్యము వ్లాడిస్లావ్ - IV నాయకత్వమున రూపొందినను, పలు బాలారిష్టములను ఎదుర్కొనవలసి వచ్చినది. హంగేరీ స్వతంత్రముగ మనగలిగినను, తురుష్కుల బెడదతో సతమతమైనది. ఇక మధ్య యూరప్‌న స్విజర్లండ్ అను నూతన రాజ్యము ఈ కాలముననే రూపుగొనినది. 1291 లో ఆల్ప్స్ పర్వత ప్రాంతమునందలి మూడు అటవీ మండలములు (కేంటన్‌లు) చక్రవర్తి సర్వాధిపత్యము క్రిందనే ఒక స్వతంత్ర సమాఖ్యగ వ్యవహరించుటకు పూనుకొనుటతో రూపొందిన ఈ రాజ్యము అంతటంతట పరిసర మండలములు స్వేచ్ఛాపూర్వకముగ తనతో చేరుటవలన 1481 కి 9 మండలముల రాజ్యముగ వికసనము పొందుటయే కాక, పరిసర ప్రభువుల ప్రతిరోధమును ఈ మధ్యకాలమున ఎదుర్కొని నిలువగలిగినది; రాచరికమును అభిమానింపక ఈ రాజ్యము గణరాజ్య విధానమును నెలకొల్పుకొనినది.

**పునరుజ్జీవనోద్యమము :** స్విజర్లండ్ వలెనే రాజరికమును ఎరుగని నగర రాజ్యములు కొన్ని ఆ యుగమున ఇటలీయందు వర్ధిల్లినవి. వీనిలో వెనిస్, మిలాన్, జెనోవా, ఫ్లారెన్స్ ముఖ్యములు. అందు వెనిస్ నగరము వర్తక రాజ్యముగ తూర్పు మధ్యధరాసముద్రపు వ్యాపారమున అత్యధిక భాగమును స్వీయము చేసికొనుటయే కాక, నౌకామార్గముల పరిరక్షణకై ఆ ప్రాంతమున వివిధ దీవులను ఆక్రమించి, తీర భూములందు పెక్కు వలసలను నెలకొల్పినది. ఓటోమన్ తురుష్కుల నౌకాబలపు ధాటికి వెనిస్ నగరము కడకు లొంగవలసి వచ్చినను, యూరపియన్ వాణిజ్య రంగమున ప్రముఖపాత్రను ఆ నగరము ఈ యుగాంతముదనుక నిర్వహించినది. అట్టులే ఫ్లారెన్స్ నగర రాజ్యమును యూరపియన్ వర్తకమునకు పెక్కు విధముల దోహదము చేసినది. అంతియే కాదు, చరిత్రలో ఈ నగర రాజ్యములకు వేరు తీరుగ సైతము అనితర ప్రాముఖ్యము లభించినది. తూర్పు రోమన్ సామ్రాజ్యముతోడను, అరబ్బులతోడను వర్తక వ్యాపారముల మూలమున సన్నిహిత పరిచితిని ఆర్జించిన ఈ నగరములనుండియే పునరుజ్జీవనోద్యమము యూరప్‌నందలి తక్కిన ప్రాంతములకు పయనించినది. ప్రాచీన విజ్ఞానమునందు గర్భితములై ఉండియు, రోమన్ సామ్రాజ్యము అస్తమించిన తరువాత యూరప్‌నకు సంబంధించినంత వరకు లుప్తములైపోయిన కళా, శాస్త్రీయ విషయములు యూరప్‌వాసులకు లభ్యములై నవ్యవికసనము పొందుటకు పునరుజ్జీవనోద్యమము సాధనమైనది. ఈ ఉద్యమమునకు జన్మభూములు ఇటలీయందలి ఈ నగర రాజ్యములు. గణితము, ఖగోళ శాస్త్రము మొదలగు విజ్ఞానశాస్త్రములును, లలిత కళలును ఇచటి పండితుల మూలమున యూరప్‌న నలుమూలలకు ప్రాకినవి. కాన్‌స్టాంటినోపుల్ పతనము ఇందులకు ఎక్కువగ పోత్సాహము కల్పించినది.

ఇట్టి నవ్య విజ్ఞానముచే ప్రభావితములైన యూరపియన్ దేశములలో ఆ విజ్ఞానమునకు వినియుక్తరూపమును కల్పించుటకు తొలుతగ పాటుపడిన దేశములు స్పెయిన్, పోర్చుగల్. ఐబీరియన్ ద్వీపకల్పమునుండి ముస్లిమ్‌లను

తరిమివైచిన తరువాత ఈ రెండు క్రైస్తవ రాజ్యములును అట రూపొందినవి. భూమి, దాని రూపము, ఇండియా మొదలైన ప్రాచ్య దేశములకు మధ్యధరా సముద్రముతో సంబంధములేని వేరు మార్గమును కనుగొనుట - అను విషయములపై ఆనాటి పోర్చుగల్ రాకుమారుడు హెన్రీ (1394-1460) కి జిజ్ఞాస కలిగినది. ఇతనికే నౌకాయానమున కల కుతూహలమును బట్టి 'నావిక హెన్రీ' అనియు వ్యవహారము కలదు. 1460 లో తాను మరణించునప్పటికి హెన్రీ ప్రజ్ఞావంతులు, గణిత, ఖగోళ, భూగోళ శాస్త్రములందు పరిచితికలవారు, సాహసవంతులు నగు నావికులను కొందరిని తయారుచేయగలిగెను. ఈ నావికులు ఆఫ్రికా ఖండపు పశ్చిమ తీరమును తొలుత పరిశోధింపగలిగిరి. ఇంతలో స్పెయిన్ ప్రభువునకును ఇండియాకు ఒక నూతన మార్గమును కనుగొను విషయమై కుతూహలము కలిగి, క్రిస్టఫర్ కొలంబస్ అను సాహస నావికునికి నౌకలనొసగి ప్రోత్సహింపగ, అతడు పశ్చిమమునకు అట్లాంటిక్ సముద్రమున పయనించి (1492), క్యూబా దీవిని కనుగొని అదియే ప్రాచ్య ఇండియా దేశము అనుకొని తిరిగివచ్చెను. ఇంతలో పోర్చుగీస్ నావికుడు వాస్కో డ గామా ఆఫ్రికా దక్షిణాగ్రమును చుట్టి భారతదేశమును నౌకామార్గమున చేరి (1498), స్వదేశమునకు తిరిగివచ్చెను. ఇంతటితో భారతదేశమునకు సరాసరిగ నౌకాప్రయాణము సులభమై, ఆ వాణిజ్యమున పోర్చుగీస్‌వారిది పైచేయి అయ్యెను.

కొలంబస్ కనుగొనినది భారతదేశము కాకపోయినను, అది ఒక నూతన ప్రపంచము. ఆసియా, యూరప్, ఆఫ్రికా దేశములలోని వారికి ఆ భూమి ఉనికి అప్పటికి తెలియదు. కొలంబస్ తరువాత పలువురు నావికులు క్యూబా పరిసర దీవులను కూడ కనుగొని తుదకు ఆ దీవులకు సమీపమున ఉన్న ముఖ్య భూఖండమును కూడ కనుగొనిరి. అట్టి నావికులలో ఒకని పేరున ఆ భూఖండమునకు 'అమెరికా' అను పేరు కలిగినది. ఆ ఖండమున అదివరకే సువ్యవస్థితములైన నాగరక రాజ్యములు కొన్ని ప్రాంతములందు ఉన్నటుల కూడ క్రమముగ తెలియవచ్చినది. అట్టి రాజ్యములలో ఒకటి అజ్టెక్ రాజ్యము. ప్రస్తుతపు మెక్సికో ప్రాంతమున ఆ రాజ్యము నెలకొని ఉండెడిది. స్పానిష్ నావికులు దానిని అంతమొందించి, స్పెయిన్ సామ్రాజ్యమునకు ఆ ఖండమున అంకురారోపణము చేసిరి (1519). ఆ సంవత్సరముననే స్పెయిన్ రాజు ప్రోత్సాహమున ఫెర్డినాండ్ మెజెల్లాన్ అను నావికుడు పశ్చిమదిశగ పయనించి భారతదేశమునకు సముద్రమార్గమును కనుగొనుటకై బయలుదేరి అట్లాంటిక్ సముద్రమును దాటి, దక్షిణ అమెరికా దక్షిణాగ్రమునుచుట్టి, పలు కష్టముల పాలయినను జంకక, పసిఫిక్ మహాసముద్రమును ఉత్తరించి నేడు ఫిలిప్పీన్ దీవులని అనబడువానిని కనుగొనెను. అప్పటి స్పెయిన్ రాకుమారుడు ఫిలిప్ పేరిట అతడు ఆ దీవులకు ఆ పేరు పెట్టెను. అచట స్థానికులతో జరిగిన సంఘర్షణమున అతడు మరణించినను, అతనితో పోయిన నౌకలలో ఒకటి మాత్రము కడకు మిగిలిన కొలది మంది నావికులతో హిందూమహాసముద్రమున పయనించి, ఆఫ్రికానుచుట్టి స్వదేశమునకు చేరినది (1522). ఇటుల అదివరకు ఆసియా, యూరప్, ఆఫ్రికా ఖండములవరకే పరిమితమై ఉండిన మానవుని విజ్ఞాన పరిధి పోర్చుగీస్, స్పానిష్ నావికుల యాత్రలతో క్రమముగ విస్తరిల్లి, కడకు మెజెల్లాన్ యాత్రతో యావత్ భూగోళమును లోగొని మానవచరిత్రలో నూతన పురోగతికి త్రోవతీసినది.

## కళా కౌశలములు

ఇస్లామ్ ఆవిర్భావముతో మొదలిడి మెజెల్లాన్ భూప్రదక్షిణముతో కడచిన ఈ యుగమున వస్తూత్పత్తియందు మానవుని కుశలత పూర్వయుగమునందు కన్న ఎక్కువ పరిణతిని ఆర్జింపజాలక పోయినను, తొలుత ఏ కొన్ని ప్రాంతములకు మాత్రమో పరిమితమై ఉన్న ఆ కుశలత ఈ యుగమున విస్తృత ప్రపంచమున పలు ప్రాంతములకు వ్యాపింపగలిగినది. ఈ కుశలతా వ్యాప్తికి అరబ్ సామ్రాజ్యము ఎక్కువగ కృషిచేసినది. ప్రాచీన గ్రీస్, చీనా, భారత విజ్ఞానులు తమ తమ దేశములందు ప్రచారములోనికి తెచ్చిన వివిధ విజ్ఞాన శాస్త్రములను, వస్తూత్పత్తి కౌశల్యములను అరబ్బులు స్వీకరించి వ్యవస్థీకరించి, వానిని తమకు జ్ఞాతమగు తక్కిన ప్రపంచమునందు ఎల్లెడల వ్యాపింపజేసిరి. అనంతరయుగమున పశ్చిమ యూరప్‌నందు ప్రాభవమును ఆర్జించిన విజ్ఞానశాస్త్ర ప్రాచుర్యమునకు అరబ్బులు ఈ విధముగ బీజావాపనము చేసిరని భావింపవచ్చును.

ఇట్టి విజ్ఞానశాస్త్ర వ్యాపనమున అరబ్బులును, వారిని అనుసరించిన కొందరు తక్కిన జాతుల ముస్లిమ్‌లును నిర్వర్తించిన కృషి వివరములను క్రమరీతిలో వివరించుటకు ఇట అవకాశము లేకున్నను, ఆ కృషికి సంబంధించిన కొన్ని ముఖ్య విషయములను మాత్రము సంక్షిప్తముగ పేర్కొనుట సముచితము. అందు ఒక ముఖ్యాంగముగ తొలుత పేర్కొనదగినది 'కాగితము'. చీనా ఈ కాగితపు పరిశ్రమకు జన్మస్థానము. క్రీ. శ. 105 లోనే ఆ దేశమున ఒక రాజోద్యోగి కాగితమును చేయుటను కనుగొనెనని

తెలియుచున్నది. కాని, ఆ తరువాత దాదాపు అయిదు శతాబ్దములు ఈ పరిశ్రమయందలి రహస్యములు చీనీయులకు మాత్రమే వేద్యములై ఉండినవి. అంతట ఏడవ శతాబ్ది ఆరంభమున చీనాయందలి ఒక బౌద్ధభిక్షుకుడు జపాన్‌కు మతప్రచారమునకై పోయి అట ఈ పరిశ్రమను నెలకొలిపి,జపాన్ దేశీయులకు అందు కుశలతను కల్పించెను. ఇక పశ్చిమ ప్రపంచమున దీని వ్యాప్తికి అరబ్బులు కారణభూతులైరి. 751 లో అరబ్బులకు చీనీయులతో సామర్కండ్ ప్రాంతమున జరిగిన సంగ్రామమున చీనా సేనలు పరాజితములై, చీనీయులు పలువురు ఖైదీలుగ అరబ్బుల చేజిక్కిరి. ఆ ఖైదీలలో కొందరు కాగితపు పరిశ్రమలో కుశలురు. వారి మూలమున అరబ్బులు కాగితముచేయు పద్ధతిని గ్రహించిరి. కలీఫాల ముఖ్యనగరమగు బాగ్దాద్‌నందు క్రీ. శ. 793 లో తొలుతగ కాగితము విరివిగ తయారు చేయబడినది. తరువాత ముస్లిమ్ సంస్కృతితోపాటుగ ఈ పరిశ్రమయు క్రమముగ సిరియా, ఈజిప్టు, మొరాకో దేశములకును, అటనుండి స్పెయిన్‌కును వ్యాపించినది. 12 వ శతాబ్దమున స్పెయిన్‌నుండి ఈ పరిశ్రమ తక్కిన యూరప్ దేశములకు పయనించినది.

చీనాదేశమున అతిదీర్ఘకాలమునుండియు ఆదరింపబడిన కాగితపు పరిశ్రమతో, భారతీయ బౌద్ధమత ప్రచారకుల మూలమున భారతదేశమునకు ఏడవ శతాబ్దికి పూర్వముననే పరిచితి ఏర్పడి ఉండునని భావించుటకు అవకాశములు కలవు. కాని, వ్రాతపనిలో కాగితమునకు కల ప్రాముఖ్యమును ఆనాటి భారతీయులు గుర్తింపక పోవుటవలననే కాబోలు దానికి ఆదేశమున ఆనాడు వ్యాప్తి లభింపలేదు. సాంప్రదాయికముగ వచ్చు తాళపత్ర, భూర్జపత్రములకే భారతదేశమున ఆనాడు ఆదరణ ఉండినది. కాని, 15 వ శతాబ్దిలో కాశ్మీర్ రాష్ట్రమును పాలించిన జైన్ - అల్ - అబ్దీన్ అను ప్రాజ్ఞ ప్రభువు తన ముఖ్యపట్టణమున కాగితపు పరిశ్రమకు తావు కల్పించుటతో భారతదేశమున కాగితపు వ్యాప్తి మొదలైనది.

విరివిగ కాగితము ఉత్పత్తి అగుటవలన లేఖనమును, గ్రంథ ప్రచురణమును సులభసాధ్యములు కాగలిగినవి. ఈ అవకాశమును సద్వినియోగము చేసి, ఖ్యాతి ఆర్జించిన కలీఫాలలో తొలుతటివాడు అల్ మన్సూర్ (754 - 775 ప). భారతీయ, గ్రీక్ వైజ్ఞానిక రచనలు అనేకములు ఈతని కాలమున అరబ్బీలోనికి అనూదితములు అయినవి. ప్రాచీన గ్రీక్ తత్త్వవేత్తల రచనలు అరబ్బీపండితులను ఆ కాలమున ఆకర్షింపగలిగినవి. ముఖ్యముగ వీరిలో అరిస్టాటిల్ రచనలను గురించిన వ్యాఖ్యానములును, వివరణములును పెక్కు అరబ్బీ భాషయందు ఆ యుగమున రచింపబడినవి. అరబ్బీ పండితుడు ఫారబీ (870 - 960) అరిస్టాటిల్ తత్త్వశాస్త్రముపై సమగ్రమగు ఒక వ్యాఖ్యను రచించుటయే గాక గ్రీక్ భాషలోని న్యాయశాస్త్ర, మానసికశాస్త్ర గ్రంథములను పెక్కింటిని అనువదించెను. వీని అన్నింటి కన్నను అతడు సంగీతశాస్త్రమును గురించి రచించిన ఒక ఉద్గ్రంథము ఎక్కువగ ప్రశంసింపదగినది. పశ్చిమ ఆసియా దేశముల సంగీతశాస్త్ర సంప్రదాయములను అతడు ఆ గ్రంథమున సవిమర్శకముగ చర్చించెను. అరిస్టాటిల్ ప్రణీత తత్త్వశాస్త్రముపై అరబ్బీలో వ్యాఖ్యానమును రచించిన వేరొక మహాపండితుడు ఇబ్నసినా (అవిసెన, 980 - 1037). గణిత, ఖగోళశాస్త్రవేత్తగను, వైద్యశాస్త్ర ప్రవీణుడుగను కూడ ఇతడు సుప్రసిద్ధతను ఆర్జించెను. అల్బరూనీ (973 - 1048) అను వేరొక పండితుడు తత్త్వశాస్త్ర, గణిత, ఖగోళశాస్త్రములందు ప్రవీణతను ఆర్జించి, సంస్కృతమునుండి పెక్కు శాస్త్రగ్రంథములను అరబ్బీలోనికి అనువదించుటయేకాక, భారతదేశమును దర్శించి అచట తన పర్యటనానుభవములకు లిఖితరూపము కల్పించి, నాటి భారతదేశపు పరిస్థితిని తెలియగోరు చరిత్ర రచయితలకు సాహాయ్యకుడయ్యెను. శాస్త్రగ్రంథములే కాదు; గ్రీక్, సిరియక్, సంస్కృత, పారసీక సాహిత్య గ్రంథములును ఆనాడు అనేకములు అరబ్బీలోనికి తర్జుమా చేయబడినవి [చూ. సం. 9 - పు. 71, 173].

ఇట్టి తర్జుమా కార్యక్రమమును సువ్యవస్థితముగ సాగించుటకై కలీఫా అల్ మామూన్ (813 - 833 ప) ప్రవీణులతో ఒక ప్రత్యేక సంస్థను బాగ్దాద్‌న నిర్మించెను. మత విచక్షణతో నిమిత్తము లేకుండ వివిధ దేశీయులగు పండితులను అందు సభ్యులుగ అతడు వేతనముపై నియమించి, వారికి చేదోడుగ ఉండుటకై ఒక అమూల్య గ్రంథభాండాగారమును సమకూర్చుటయేకాక, ఖగోళశాస్త్ర పరిశోధనలను క్రమముగ నిర్వహించుటకు అనువుగ ఒక వేధశాలను కూడ అట నిర్మింపజేసెను. ఇట్టి వేధశాలనే వేరొక దానిని డమాస్కస్ నగరమువద్ద కూడ అతడు నిర్మింపజేసెను. వివిధ ప్రాచీన భాషలలోని ప్రాచీన శాస్త్రగ్రంథములను ఈ కలీఫా సేకరించి, ఆ యా గ్రంథముల తర్జుమా పనిని సుప్రసిద్ధ పండితులకు అప్పగించెను. గ్రీక్, సిరియక్, కాల్డిక్ గ్రంథముల అనువాదముల పర్యవేక్షించుటకు కోస్తా అను క్రైస్తవ పండితుని, పారసీక గ్రంథముల కొరకై యాహ్యాబిన్‌హారూన్‌ను, సంస్కృత గ్రంథముల తర్జుమా కొరకు దుబణ అను బ్రాహ్మణుని ఆ కలీఫా నియమించినటుల తెలియవచ్చుచున్నది.

అరబ్బీపండితులు ఆ యుగమున పెక్కు శాస్త్రములతో పరిచితిని ఆర్జించి కృషిచేసినను, ముఖ్యముగ గణిత, ఖగోళ, వైద్యశాస్త్రములలో వారు సాగించిన అవేక్షణకు ప్రపంచము ఎంతయో వారికి ఋణపడి ఉన్నది. గ్రీకుల నుండి క్షేత్రగణిత, ఖగోళశాస్త్రములను, భారతీయులనుండి అంకగణితమును వారు గ్రహించి, వానిని అభివృద్ధిచేసిరి. శూన్యాంకము ('0' సున్న) ను ఉపయోగించుటయును, అంకెలకు స్థానపు విలువలను కల్పించుటయును భారతీయులనుండి అరబ్బులు గ్రహించుటయేకాక, భిన్నములను దశాంశరూపమున వ్యక్తీకరించుటను వారు కనుగొనిరి. బీజ గణిత మూలసూత్రములను సువ్యవస్థీకరించినదియు అరబ్బులే. ఖగోళశాస్త్రమును గ్రీక్ పండితులనుండి గ్రహించిన తరువాత వారు దానిని ఎంతయో అభివృద్ధి చేసిరి. శింశుమారచక్రము నందలి నక్షత్రములకు పెక్కింటికి వారు నామములను ఏర్పరుచుటయే కాక, అట్టి నక్షత్రముల పట్టికను కూడ తయారు చేయగలిగిరి. ఖగోళశాస్త్ర రహస్యములను గుర్తెరుగుటకు వారు సునిశితములగు పరికరములను నిర్మింప నేర్చిరి. కాని, మూలసూత్రముల విషయమున మాత్రము వారు గ్రీక్ పండితుడు టాలెమీ పేర్కొనిన వానిని మించి వేరుగ దేనిని కనుగొనజాలక పోయిరి.

గణితమునకేకాక వైద్యశాస్త్ర, జీవశాస్త్ర, రాసాయనిక శాస్త్రములందును అరబ్బులు పరిగణనీయమగు కృషి చేసిరి. సృష్టి రహస్యములను గుర్తెరుగుటకు వస్తు పరిశీలనా చతురతను వారు గ్రీకులకన్న మిన్నగ ఉపయోగించిరనుట ఇందువలన విదితమగుచున్నది. ఇబ్నిసినా రచితమగు కానూన్ అను వైద్యశాస్త్రగ్రంథము అరబ్బు వైద్యశాస్త్రజ్ఞుల పాండితికి పరాకాష్ఠ. కాని, వైద్యశాస్త్రమున ఇంకను ముందునకు పయనించుటకు అరబ్బులను ఒక అవరోధము ఎదుర్కొనినది. మానవ శరీర వ్యవచ్ఛేదనమును ఇస్లామ్ నిరసించినది. అందువల్ల అరబ్బు పండితులు తాము ఆశించినంతగ వైద్యశాస్త్రమున పురోగమింపలేకపోయిరి. ఇక రాసాయనిక శాస్త్రమునకు ఒక ప్రాతిపదిక రూపమును కల్పించినవారు అరబ్బులే అని చెప్పవచ్చును. అన్ని ధాతువులను బంగారముగ మార్చగల పరుసవేదిని సాధించు ఆశతో ఈ శాస్త్రమున అరబ్బులు తమ కృషిని సాగించిరి. ఆ ఆశయము సిద్ధింపకపోయినను, రాసాయనిక శాస్త్రమున కొన్ని ప్రాతిపదిక విషయములను మాత్రము వారు కనుగొనగలిగిరి [చూ. సం. 2-సమీక్ష].

అరబ్బుల కృషిచే పరిపుష్టతను ఆర్జించిన వేరొక శాస్త్ర విభాగము భూగోళశాస్త్రము. ఆనాడు తమకు జ్ఞాతమైన ఉండిన ప్రపంచమునందు పర్యటించి అరబ్బీ విజ్ఞానవేత్తలు పలువురు నానా దేశములను గురించిన విషయములను గ్రంథస్థములుగ చేసిరి. వారిలో అల్-మసూదీ (పదవ శతాబ్ది), అల్-ముకద్దసీ (పదవ శతాబ్ది), అల్-ఇద్రిసి (1100-1166), అబుల్ ఫెదా (1273-1313) అను వారలు పరిగణనీయులు. ఆ యుగపు ప్రపంచపు స్థితిగతులను తెలిసికొనుటకు ఈ గ్రంథములు ఎంతయో ఉపకరించుచున్నవి. శాస్త్రీయరీతిలో చరిత్ర రచనను సాగించుటకును అరబ్బీ పండితులు కొంత కృషి చేసిరి. వీరిలో సుప్రసిద్ధుడు ఇబ్న్ కల్దూన్ (1332-1406); కార్యకారణ రీతిలో చారిత్రక సంఘటనలను ఇతడు తన గ్రంథమున వివరించుటయేకాక వివిధ నాగరకతలు అంతటంతట ప్రపంచమున రూపుగొని, వికసనమొంది, అంతరించుటకు కారణభూతములగు సాంఘిక, తాత్త్విక మూలసూత్రములను కనుగొనుటకై కొంత కృషి చేసెను.

ఇటుల వివిధ శాస్త్ర శాఖలందు అరబ్బు పండితులు అవిరళ కృషిచేసి, వాని వ్యాపనమునకు తోడ్పడుచుండిన ఈ యుగమున వారికి ఈ విజ్ఞానభిక్ష పెట్టిన గ్రీక్, భారతీయ, చీనా పండితులు మాత్రము తమ మాతృభూములలో ఆ యా శాస్త్రములందు పరిగణనీయమగు అభివృద్ధిని సాధింపజాలక పోయిరి. పై వానిలో గ్రీక్ విజ్ఞానము ఏనాడో తన మాతృభూమిని వదలి కడకు బైజాంటియమ్ రాజ్యమును ఆశ్రయించినదనుట పాఠకులకు విదితమే [చూ. పు. 49]. ఆ రాజ్యమునందలి గ్రీక్ పండితులైనను పూర్వవిజ్ఞానమును భద్రమొనర్చుటకే శ్రద్ధ వహించిరి; కాని,నూతన విషయములను కనుగొనుటకు కృషిసల్పలేదు. బైజాంటియమ్ ప్రభువులును కళాపోషకులుగ పేరెన్నిక కాంచినను, తమకు దక్కిన ప్రాచీన గ్రీక్ శాస్త్రీయ విజ్ఞానమును అభివృద్ధి పరచుటకు శ్రద్ధ వహింపలేదు. అయినను ఆ విజ్ఞానమును, కళాచాతుర్యమును యూరప్‌నకు అందజేయుటలో అరబ్బులతో సమముగ వారును పాలు పంచుకొనవలసిన వారలే అని అంగీకరింపక తప్పదు. ఇంతియే కాదు; వర్తక వ్యాపారాదుల వలన చీనాతో తమకు లభించిన సంబంధము మూలమున పట్టునూలు పుట్టుపూర్వోత్తరములను బైజాంటైన్ ప్రభువులు తొలుతగ సేకరింపగలిగి, క్రమముగ వానిని తక్కిన ప్రపంచమునకు అందజేసిరి.

ఇక భారతదేశము ఆ యుగమున విజ్ఞానశాస్త్రాదులందు పూర్వము కన్న ఎక్కువ పురోగతిని సాధింపజాలక పోయినది. ఇందులకు కారణములు సుస్పష్టములు. భారతదేశము ఆ యుగమున ఒక ధార్మిక విప్లవమునకు

లోనైనది. ఆ విప్లవమే ఆనాటి పండితలోకపు భావనను ఎక్కువగ లోగొనినది. పౌరాణిక హిందూమతము బౌద్ధ, జైనములను లోగొనుటలో ఆ యుగమున పూర్వభాగమును, హిందూ - ఇస్లామ్ మతముల వైరుధ్యముతో ఉత్తర భాగమును అంతరించినవి. వీనికి తోడుగ హర్షుని (క్రీ. శ. 606 - 647 ప.) అనంతరమున దేశమున - కడకు అత్యధికభాగమునందైనను - ఏకరాజపాలన దీర్ఘకాలము నెలకొనుటకే అవకాశములు అపుడు మృగ్యములు అయినవి. ఒకవేళ ప్రతిహారుల కాలమునందువలె అట్టిది ఏర్పడినను, భారతీయ సంస్కృతి లౌకిక విద్యలందు అత్యుచ్చస్థాయిని అందుకొనినదనియు, భారతీయ సాంఘిక వ్యవస్థ అసమానపటుత్వము కలది అనియు, ఒక విధమగు అహంకృతియును, సంతృప్తియును దేశమును అలముకొనినవి. 11 వ శతాబ్దిలో భారతదేశమున పర్యటించిన అల్బిరూనీ (973 - 1048) భారతీయ పండితులందు కన్పట్టిన ఈ అహంకృతిని తన గ్రంథమున తీవ్రముగ నిరసించెను. అయినను కులక్రమాగతములగు వివిధ విజ్ఞానములును, వృత్తికౌశలములును చెక్కుచెదరక పూర్వయుగమునందు వలెనే మనగలిగినవి. కొన్నియెడల ఆ విజ్ఞానము కొంత అభివృద్ధిని సాధించిన ఘట్టములును లేకపోలేదు. అట్టి అభివృద్ధిని సాధించిన వారిలో పేర్కొనదగినవాడు భాస్కరాచార్య - II (జ. 1114). ఇతడు సుప్రసిద్ధ గణిత, ఖగోళశాస్త్రవేత్త. ఇతడు తన కాలమువరకు వికసనమొందిన ఆ శాస్త్రములకు సువ్యవస్థీకృత రూపములను కల్పించెను. అటులే పెక్కు ప్రాచీన వైద్యశాస్త్ర గ్రంథములకు పరిష్కృత రూపములును ఈ యుగముననే పూర్వభాగమున సిద్ధించినవి. ఈ యుగపు ఉత్తరార్ధమున ముస్లిమ్‌లకు దేశమున అత్యధికభాగము వశమగుటతో రెండు విభిన్న మత, సంస్కృతుల మధ్య సంఘర్షణతోడనే కాలము గడచినది. కాని, విజ్ఞానశాస్త్ర వికసనము వైపునకు హిందూ రాజులుగాని, ముస్లిమ్ సుల్తానులుగాని తమ దృష్టుల మరల్పలేదు.

భారతదేశముతో పోల్చి చూచినపుడు ఈ యుగమున చీనాదేశము కొంత మెరుగుగ ఈ విషయములందు పురోగమించినటుల భావించుటకు అవకాశము కలదు. అందులకు అచటి రాజకీయ వ్యవస్థయే కారణమని అంగీకరింపక తప్పదు. ఈ యుగమున ఎన్ని ఒడుదొడుకులకు లోనైనను, ఆ దేశము చాలకాలము ఒకే ఒక కేంద్రప్రభుత్వపు ఆధిపత్యమున మనగలిగినది. అయినను, ఆ దేశమున సైతము పండితులందు ఒక అర్థరహిత స్వయంసంతుష్టి, అహంభావము భారతదేశమునందు వలెనే ఈ యుగమున తలయెత్తినవి. ప్రపంచ రాజ్యములకు అన్నింటికిని తలమానికము తమ దేశమే అనియు, శాస్త్రవిజ్ఞాన నాగరకతలకు నిలయము తమ జన్మభూమియే అనియు, తక్కినవి అన్నియు అనాగరక దేశములనియు భావించుట ఆ యుగమున చీనీయులకు ఒక ముఖ్యలక్షణముగ పరిణమించినది. అయినను, అచ్చు పని మొదలగు కొన్ని నూతన విద్యలు ఈ యుగముననే చీనాయందు అభివృద్ధిని సాధించినవి. మంగోలియన్ ప్రభువుల కాలమున 1279 లో పెకింగ్ కోటపై ఒక వేధశాల నిర్మితమై, అందు కంచుతో పోతపోసిన సునిశితపరికరములు ఉపయోగింపబడినవి. వీని అన్నింటికన్నను నౌకా విద్యయందు చీనీయులు ఎక్కువ ప్రావీణ్యమును ఈ యుగమున సాధించిరి. నౌకకు వెనుక భాగమున చుక్కానిని ఏర్పరచుటను చీనీయులు తొలుతగ ప్రవేశపెట్టిరని విజ్ఞుల అభిప్రాయము. అంతటితో పెద్ద పెద్ద నౌకలను సైతము ఇచ్చవచ్చిన రీతిగ మరల్చుటకు సౌకర్యము లభించినది. ఇంతియేకాదు; దిక్సూచికా యంత్రము (నావికుని కాంపాస్)ను సైతము చీనీయులు తొలుతగ కనుగొనిరని కొందరు పండితుల అభిప్రాయము. అరబ్బీ పండితులు ఈ యంత్రమును కనుగొనిరనువారు కొందరున్నను, ఉత్తరదిక్కును సూచించు సహజలక్షణము అయస్కాంతమునకు కలదనుటను తొలుతగ గుర్తించిన వారు చీనీయులే అనుట నిర్వివాదాంశము.

విజ్ఞానశాఖల వికసనమున ఈ విధముగ ఆ యుగమునందు వివిధ దేశముల మధ్య తరతమ భేదములున్నను లలితకళల విషయమున మాత్రము ఈ దేశములందు అన్నింటను వేర్వేరు తీరులుగ అభివృద్ధి ద్యోతకమైనది. మూర్తి చిత్రణము ఇస్లామ్ మతమునకు విరుద్ధమగుటవలన ఆ మతము వ్యాపించిన ప్రాంతములందు అట్టి చిత్రలేఖనము గాని, విగ్రహ శిల్పముగాని తావును కల్పించుకొనజాలక పోయినను, మసీదులు మొదలగువాని నిర్మాణమున ముస్లిమ్ శిల్పులు ఒక నూతన శిల్పరీతిని ప్రవేశపెట్టిరి. గుమ్మటపు శిఖరములు, సన్నని స్తంభములు, సూదిమొనదేలు కమానులు (ఆర్చీలు) ఈ శిల్పపు విశిష్ట లక్షణములు. బైజాంటైన్, పారసీక శిల్పములను నేర్పుగ మేళవించుటవలన ఈ అరబ్బీ శిల్ప సంప్రదాయము రూపుగొనినదని తద్‌జ్ఞుల అభిప్రాయము. మూర్తి చిత్రణమునకు తమకు అవకాశము లేమిచే ముస్లిమ్‌శిల్పులు భవన కవాటములందు రేఖా చిత్రములను, ఖురానునందలి వాక్యములను విన్నాణముతో తీర్చి దిద్ది తమ వైదగ్ధ్యమును ప్రకటించిరి.

చీనా, భారత దేశములందును, చీనాచే ప్రభావితములగు కొరియా, జపాన్ దేశములందును, భారత సంస్కృతికి వశీ

కృతములైన ఆగ్నేయ ఆసియా దేశములందును శిల్ప, చిత్రలేఖనాది లలితకళలు ఈ యుగమున అచ్చెరువుగొలుపు రీతిగ అభివృద్ధిని సాధించినవి. భారతదేశమున ఈ కాలమున - క్రీ. శ. 1200 వరకు - వివిధ శిల్ప సంప్రదాయములు వికసన మొంది అత్యుచ్చ ప్రాభవమును ఆర్జించినవి. ఈ శిల్పము చాలవరకు దేవళములను ఆశ్రయించినది. అందలి ఔత్తరాహ సంప్రదాయమునకు భువనేశ్వర్, ఖజురాహో ప్రాంతముల ఆలయములును, దాక్షిణాత్య సంప్రదాయమునకు తంజావూరు నందలి శివాలయమును ఈ నాటికి లక్ష్యములుగ నిలిచి ఉన్నవి. దాక్షిణాత్య సంప్రదాయమే కొలది మార్పులతో విశాల భారతమునకు కొనిపోబడినది. కాని, స్థానికములగు కొన్ని ప్రత్యేకతలను అది అట సంతరించుకొనినది. ఆ ప్రత్యేకతయే ప్రస్ఫుటముగ నేటికిని అంకారవాట్ [చూ.] శిథిలములందు కననగుచున్నది. బౌద్ధ సంస్కృతిని ఆశ్రయించిన శిల్పము ఈ యుగమున భారత భూమియందు పరిగణనీయమగునట్టుల రూపుగొనక పోయినను, జావా ద్వీపమున బొరాబుదూరునందలి మహాయతనమున ఆ లోపము పూరింపబడినది. ఔత్తరాహ, దాక్షిణాత్యములే కాక స్థానికములగు మరికొన్ని శిల్ప సంప్రదాయములును ఆ కాలమున భారతదేశమునందు పోషణమును ఆర్జించినవి. వీనిలో శ్రీనగర్ ప్రాంతపు మార్తాండ దేవాలయమున కననగు కాశ్మీర సంప్రదాయమును, ఆబూ పర్వతముపైన దిలావరాలో నిర్మితములగు దేవాలయములందు ద్యోతకమగు రాజస్థాన సంప్రదాయమును పరిగణనీయములు. చిత్రలేఖనమును ఆ కాలమున భారతీయ పాలకుల పోషణమును విరివిగ ఆర్జించినది. దీనికి రాజాంతఃపురములును, దేవాలయములును ఆటపట్టులుగ ఉపకరించినవి. కాని, భారతదేశమున 1200 తరువాత సంఘటిల్లిన రాజకీయ విపర్యయముల వలన జాడగానరాని రీతిగ ఇవి అంతరించినవి. ఎల్లోరా యందలి కైలాసదేవళము పైకప్పు లోతట్టున కొన్ని చిత్రములు ఈ నాడును కననగుచున్నవి. అట్టులే పుదుక్కోట ప్రాంతపు సిత్తన్నవాశల్ లోను, తంజావూరునందును కొన్ని ఆలేఖ్యములు కన్పట్టుచున్నవి.

చీనాయందు శిల్పము తన జాతీయ సంప్రదాయమునే అనుసరించి ఈ యుగమున వెంపొందినను, బౌద్ధ మతము మూలమున భారత శిల్పపు తీరులును కొన్ని అందు చొరబారినవి. దీనినే కొరియా, జపాన్ అనుకరించినవి. శిల్పమునందుకన్న చిత్రలేఖనమున చీనా కళారాధకులు ఆనాడు కొన్ని నూతన పద్ధతులను అవలంబింపగలిగిరి. అందును ముఖ్యముగ 12 వ శతాబ్ది పూర్వభాగమున సుంగ్ వంశీయ ప్రభువుల ఆదరణమున ప్రాదేశిక చిత్రణము అత్యుచ్చస్థాయిని అందుకొనినది. అటులే జంతురూప చిత్రణమున చావ్ మెంగ్ ఫూ (1254 - 1322), కుసుమవల్లీ చిత్రణమున చైన్ హ్స్వాన్ (1235 ర - 1290) అనువారలు పరాకాష్ఠను అందుకొనగలిగిరి. చీనాలో తొలుతనుండియు వ్యాప్తియందుండిన పింగాణీ పరిశ్రమయును కొన్ని క్రొత్త మార్గములను అవలంబించినది.

పాశ్చాత్య ప్రపంచమునందు శిల్పవైఖరి తొలుత ఈ యుగమున రోమన్ల సంప్రదాయమునే అనుసరించి నడచినది. కాని, ఆలయనిర్మాణమున త్వరలోనే ఒక క్రొత్త మార్గము అవలంబింపబడినది. రోమన్ల శిల్ప సంప్రదాయమును అనుసరించిన భవనములు ఎత్తు తక్కువగ ఉండి, లోపల వెలుతురు వచ్చుటకు వసతిలేనివి అగుటచే క్రమముగ ఆ సంప్రదాయమును కాదని ఒక నూతనరీతి అవలంబింపబడినది. ఈ నూతన రీతియే 'గోథిక్ సంప్రదాయము' అని వ్యవహరింపబడుచున్నది. ఈ పద్ధతిని అనుసరించిన నిర్మాణములందు కొనదేలిన కమానులును, ఆనుడు గోడలును భవనములకు ఆధారములుగ ఉపకరించెడివి. ఇందువలన నిర్మాణములు ఎక్కువ ఎత్తుగ పైకి లేచుటకును, విరివిగ కిటికీలను నెలకొల్పుటకును వసతి లభించినది. ఈ నూతన సంప్రదాయము తొలుతగ ఉత్తర ఫ్రాన్సునందు అవలంబింపబడి, అటనుండి తక్కిన పశ్చిమ యూరప్‌న అనతికాలమున వ్యాపించినది.

పైన ప్రసక్తితములగు వానికన్న ఎక్కువగ లెక్కలోనికి తీసికొనదగినది ఆనాడు జరిగిన విద్యావ్యాపనము. ఇదియు తొలుత చాలవరకు మతమును ఆశ్రయించియే వివిధ దేశములందు వ్యాప్తిని పొందినది. వివిధ మతముల ప్రార్థనాలయములను ఆశ్రయించి విద్యాశాలలు ఆనాడు విస్తరిల్లినవి. ప్రాచ్య భారతదేశమునందలి నలందా, ఉద్దండపుర, విక్రమశిలా విద్యాపీఠములును, పశ్చిమ భారతదేశమున వలభియందలి విద్యాశాలయు, దక్షిణ భారతదేశమునందలి కంచి, బాహూరు విద్యాసంస్థలును, చీనాలోని హాన్‌లిన్ విద్యాపీఠమును ఈ యుగమునకు చెందినవియే. ఇట్టి సుప్రసిద్ధ విద్యాపీఠములే కాక, ఆ యా స్థానిక పాలకుల పోషణతో పండితులు నిర్వహించెడు పాఠశాలలును, ఘటికాస్థానములును, ప్రత్యేక విద్యలను బోధించెడు కళాశాలలును ఉండెడివి. ఇస్లామ్ వ్యాప్తినందిన ప్రాంతములందు మసీదులును, రాజాస్థానములును విద్యాపీఠములుగ ఉపకరించినవి. యూరప్‌నందును మతబోధకుల ప్రోత్సాహము వలననే తొలుత ఇట్టి విద్యాసంస్థలు నెలకొని క్రమముగ విశ్వవిద్యాలయములుగ రూపొంది

నవి. ఇట్టుల పశ్చిమ యూరప్‌న రూపొందిన వానిలో తొలుతటిది పారిస్ యూనివర్సిటీ (12వ శతాబ్ది), ఆతరువాత క్రమముగ బ్రిటన్ నందలి ఆక్స్‌ఫర్డ్ (1167), కేంబ్రిడ్జ (1209) విద్యాపీఠములు, ఇటలీయందలి పాడువా (1222), నేపిల్స్ (1224), సాలామన్‌కా (1227) విద్యాశాలలును, జెకోస్లోవాకియాలోని ప్రాగ్ (1347), పోలండ్‌లోని క్రకావ్ (1364), ఆస్ట్రియాయందలి వియెన్నా (1367) విద్యాపీఠములును క్రమముగ ఆయా సూచితాబ్దములందు రూపుగొనినవి. ఆయా విద్యాసంస్థలందు మతమునకే తొలుతగ ఎక్కువ ప్రాముఖ్యము ఉండుటవలన పశ్చిమ యూరప్‌న లాటిన్, తూర్పు యూరప్‌న గ్రీక్, ఇస్లామ్ సంస్కృతి వ్యాపించినచోట అరబ్బీ, భారత, విశాల భారతదేశములందు సంస్కృతమును బోధనా భాషలుగ ఆనాడు వ్యవహరించినవి. చీనాలో ఆనాడు ప్రామాణిక చీనీయ భాషయే విద్యాసంస్థలందు ఆదరింపబడినది. కొరియా, జపాన్ దేశములందు తొలుత చీనీయ భాషకు ఆదరణమున్నను, అచటి జాతీయ భాషలును క్రమముగ ముందుకు రాగలిగినవి.

జాతీయభాషలు ఇటుల ముందునకు రాగల్గుట కొరియా, జపాన్ దేశములలోననే కాక, తక్కిన ప్రపంచమునను ఆనాడు కలదు. ఆగ్నేయ ఆసియాలో సయామ్ ప్రజల మాతృభాషయగు తాయ్ యందును, జావాలోని కవి భాషయందును సారస్వతము ఈ యుగముననే రూపుగొన మొదలిడినది. భారతదేశమున నేడు వాడుకలో ఉండిన జాతీయ భాషలలో తమిళము తప్ప తక్కినవి అన్నియు ఈ యుగముననే సారస్వత సంపదను ఆర్జించుకొనినవి. తమిళము మాత్రము పూర్వయుగముననే సాహితీ సంపత్తిని ఆర్జించిన విషయము పాఠకుల దృష్టికి ఇదివరలోనే తేబడినది [చూ. పు. 54]. ఇటుల భారతదేశమునను, విశాల భారతదేశమునను సాహిత్య సంపదను సంతరించుకొన మొదలిడిన జాతీయ భాషలు బ్రాహ్మీలిపి జన్యములగు లిపులను స్వీయములుగ చేసికొనినవి. ఇస్లామ్ సంస్కృతి వ్యాపించిన ప్రాంతములందెల్ల అరబ్బీనే సాంస్కృతిక భాషగ చేయుటకు అరబ్బులు తొలుత యత్నించిరి. ఉత్తర ఆఫ్రికాయందు వీరి యత్నము సఫలతను ఆర్జించినను, పురాతన సంస్కృతిని కలిగిన పారసీకమునందును, భారతదేశమునందును అట్టిది సాధ్యము కాజాలకపోయినది. అయినను అరబ్బీ సంస్కృతికి లోనై పారసీకభాష ఒక నూతన రూపమునేకాక నూతనలిపిని సైతము గ్రహించి ఇరాక్‌నకు తూర్పున ఉన్న ముస్లిమ్ దేశములందు సాంస్కృతికభాషగ ఎన్నికకు రాగలిగినది. కాని, మతవిషయములకు సంబంధించినంతవరకు అరబ్బీదే ఈ దేశములందును పైచేయిగ ఉండినది. ఈ అరబ్బీ సాంస్కృతిక ప్రవాహమునబడి కొట్టుకొనిపోకుండ మధ్య ఆసియా యందలి తుర్కీభాషలును తమ ప్రతిపత్తిని ఏదియో ఒక రూపమున కొంతవరకు నిలబెట్టుకొనగలిగినవి. ఆ తుర్కీ భాషలలో ఒకదాని ప్రస్ఫుట రూపమే నేటి టర్కీయందు సాంస్కృతిక, రాజకీయ భాషగ వాడుకలో ఉన్నది.

యూరప్‌నందును పైన పేర్కొనబడిన రీతిగనే జాతీయ భాషలు ఈ యుగమున ముందునకు రాగలిగినవి. ఇటలీయందు డాంటిమహాకవి (1265 - 1321) తన గ్రంథరచనను ఇటాలియన్ భాషలో సాగించుటతో ఈ పరిణామము మొదలైనటుల భావింపవచ్చును. యూరప్‌నందు నేడు వాడుకలో ఉన్న ఇంగ్లీషు మొదలగు భాషలు అన్నియు క్రమముగ ఆనాటినుండి సారస్వత సంపదను సేకరించుకొని ముందునకు రాగలిగినవి. ఇట్టివానిలో పశ్చిమ, మధ్య యూరప్‌లందలి భాషలన్నియు రోమన్ లిపినే కొలది స్థానికావసరములకు తగిన మార్పులతో గ్రహించినవి. కాని, తూర్పు యూరప్‌నందలి భాషలకు మాత్రము వానిలోని ధ్వని విశేషములను బట్టి గ్రీక్‌లిపి రూపములకు సన్నిహితమగు వేరొక లిపి రూపొందింపబడినది. దీనిని నిర్మించుటలో ప్రముఖపాత్ర గ్రహించినవాడు సిరిల్ (827 - 869) అను పేరుగల మత ప్రచారకుడు. అతని నామమును బట్టి ఈ నూతన లిపికి 'సిరిలిక్ లిపి' అను పేరు గలిగెను. నేటి రష్యన్ మొదలగు స్లావ్ భాషలు అన్నియు సిరిలిక్ జన్యములగు లిపులతోనే వ్రాయబడుచున్నవి.

ఇటుల ప్రాచీన భాషల ప్రాముఖ్యమును సడలింపజేసి జాతీయ భాషలు ముందుకు వచ్చుట ఈ యుగపు ఉత్తరార్ధమున జరిగినది. ఆ కాలముననే విద్యాబోధన యందును ఒక విధమగు మార్పు రానారంభించినది. మతమును ఆశ్రయించి, విద్యాబోధన సాగినంతకాలము మానవుని ధీశక్తి విచ్చలవిడిగ సాగిపోవుటకు అవకాశము చాల తక్కువ. కొన్ని మూలసూత్రములను ఎదురు ప్రశ్న లేకుండ అంగీకరించుటయే అట్టి విద్యావిధానపు మూల ప్రాతిపదిక. ఇట్టి దానివలన విజ్ఞాన పురోగతి కుంటువడునని భావించువారు క్రమముగ ముందునకు రాగలిగిరి. యథార్థమున చీనాదేశమున తొలుతనుండియు ఇందువలననే ఏదియో ఒక రీతిగ మత విద్యనుండి లౌకిక విద్యను వేరు పరచుటకు యత్నము జరిగి కొంతవరకు సఫలతను పొందినది. భారతదేశమున జరిగిన ధార్మిక

విప్లవముల పర్యవసానముగ మతమే విద్యావిధానమున ముఖ్య ప్రతిపత్తిని ఆర్జించి, అన్ని ప్రతిరోధములను ఎదుర్కొని నిలిచినది. అట్టులే ముస్లిమ్ ప్రపంచమున సైతము మతమునుండి లౌకిక విద్యను వేరుపరచుటకు కొందరు యత్నించిరి. కాని, వారి కృషి విజయమును పొందజాలక పోయినది. ఇక పశ్చిమ యూరప్‌న మాత్రము ఈ కృషి క్రమముగ ముందునకు పోగలిగినది. క్రీ. శ. 13 వ శతాబ్దిలో - క్రూసేడ్‌లు సాగించిన దినములలో-ఫ్రెడరిక్-II తో ఈ కృషి మొదలయ్యెనని చెప్పవచ్చును. పోప్‌తో ఫ్రెడరిక్ - II పోరాటము సాగించుటయేకాక, విద్యలను క్రైస్తవేతరులనుండి అయినను గ్రహింపవచ్చునను తలంపుతో సమధిక కృషి సల్పెననుట ఇదివరలో వేరొకచోట ప్రస్తావితమైనది [చూ. పు. 99]. ఫ్రెడరిక్ - II వలె మతాసక్తిలేని ప్రభువులే కాదు, మతాభిమానముకల కొందరు పండితులును ఇందుకు ఒక విధముగ దోహదము చేసిరి. మత విషయిక మూల సూత్రముల తాత్త్విక రీతిలో రుజువు చేయుటకు తార్కిక పద్ధతిని వీరు అమలులోనికి కొనివచ్చిరి. ఇందువలన క్రమముగ తర్కశాస్త్రాభిరుచి ప్రాచీన గ్రీక్ పండితుల గ్రంథముల వైపునకు పండితుల దృష్టిని మరల్చినది. ఈ ప్రాచీన సారస్వతాభిమానము పెట్రార్క్ (1304 - 1374) ను బోలు మానవతావాదులు ప్రశస్తిని ఆర్జించుటకు తోడ్పడినది. పరలోకపు విషయములకు బదులుగ ఇహలోకపు మానవ జీవితమును సుఖప్రదముగ చేయుటకు తీరు తెన్నులను వెదకుటయే మానవుని విధి అనుట మానవతా వాదపు ముఖ్య సూత్రము. ఈ వాదపు ప్రాబల్యమే యూరప్‌న పండితులను విజ్ఞానశాస్త్ర పిపాసులుగ చేయగలిగినది. అంతట అరబ్బీ మొదలగు భాషలలోని వివిధ విజ్ఞానశాస్త్ర గ్రంథములు అనూదితములై యూరప్‌న వ్యాపింప ఆరంభించినవి. ఈ మానవతావాదము క్రమముగ మతాచార్యులందును వ్యాపించి, విజ్ఞాన శాస్త్రపు పురోగమనమును ద్రుతతరము చేసినది. ఇట్టి వారిలో ముఖ్యుడు ఎరాస్మస్ (1466 - 1536) అను డచ్చి మతాచార్యుడు.

ఇట్టి విజ్ఞానతృష్ణను తీర్చుటకు పశ్చిమ యూరప్‌న ఈ యుగపు చరమ భాగమున అచ్చు పరిశ్రమ చాలవరకు తోడ్పడినది. దిమ్మలనుండి పుస్తకపు పుటలను ముద్రించు పద్ధతి చీనాలో అతి ప్రాచీన కాలమునుండియు అమలులో ఉండినది. చీనాదేశమున ఇటుల ముద్రితమైన ఒక గ్రంథము తొలుతగ క్రీ. శ. 868 లో వెలువడినటుల నిశ్చితముగ తెలియవచ్చుచున్నది. కాని, వేర్వేరు అక్షరములకు వేర్వేరు అచ్చులను రూపొందించి, వానిని కావలసిన రీతిలో కూర్చి గ్రంథమును ముద్రించుట మాత్రము 1041 నుండి ఆరంభితమైనది. యూరప్‌నకు ఈ విధానము కొనిరాబడిన రీతి స్పష్టముగ తెలియవచ్చుటలేదు ; కాని, తొలుతగ జర్మనీలోని మెయిన్‌జ్ నగరమున బైబిలు గ్రంథము 1456 లో ఈ విధముగ ముద్రితమైనది. దీనిని ముద్రించినవాడు జాన్ గుటెన్‌బర్గ్ (1393 ర. - 1468 ర.). అంతట క్రమముగ ఈ పరిశ్రమ తక్కిన యూరప్‌నకు వ్యాపించి, గ్రంథ కల్పనమును సులభతరము చేసి విద్యా వ్యాప్తికి తోడ్పడినది.

పశ్చిమ యూరప్‌నకు ప్రపంచ రాజకీయములందు తరువాతి యుగమున ప్రముఖ స్థానమును కల్పించుటకు తోడ్పడిన పునరుజ్జీవనోద్యమ సాఫల్యమునకు కారణభూతములైనవి పెక్కులున్నను, వానిలో ముద్రణ, దిక్సూచి, తుపాకిమందు ముఖ్యములని చెప్పక తప్పదు. వీనిలో దిక్సూచితో పరిచయము యూరప్ వాసులకు కాన్‌స్టాంటినోపుల్ పతనము తరువాత చేకూరినది. తుపాకిమందును చీనీయులు ప్రాచీనకాలము నుండియు గుర్తెరిగియున్నను, వినోద వ్యాసంగములకే దానిని ఉపయోగించిరి. క్రీ. శ. 1161 లో దానిని చీనీయులు యుద్ధావసరములకై తొలుతగ వినియోగించుట ఇదివరలో వేరొకచోట ప్రసక్తింపబడినది [చూ. పు. 88]. చీనీయులనుండి ఈ రహస్యమును గ్రహించిన మంగోల్‌లు దీని వ్యాప్తికి తోడ్పడి ఉందురని కొందరి ఊహ. 14 వ శతాబ్దిలో యూరప్‌నందు యుద్ధావసరములకు దీని వాడుక మొదలైనది.

ఇటుల వివిధ ప్రాచీన విజ్ఞానములు నూతన రూపములతో ఈ యుగమున ప్రాచుర్యములోనికి వచ్చుటయేకాక, యంత్రశాస్త్రమున మానవుడు తన ధీశక్తిని ఉపయోగించుటయు ఈ యుగాంతముననే మొదలైనది. కాలమును సరిగా సూచించుటకు ధాతుదండ, చక్రాదులతో గడియారమును నిర్మించుటకు ఈ యుగముననే కృషి మొదలైనది. 1232 లో ఈజిప్టు సుల్తాన్ ఒక గడియారమును ఫ్రెడరిక్ - II చక్రవర్తికి కానుకగ పంపెను. ఆ తరువాత యూరప్‌నందు కొలది మార్పులతో ఇట్టి గడియారములు ప్రభువుల ఆస్థానములందును, ప్రముఖ ప్రార్థనాలయములందును క్రమముగ నెలకొల్పబడినవి.

ఇక మానవుడు విజ్ఞానశాస్త్ర సత్యాన్వేషణమున తన యాత్రను మొదలిడిన ఈ యుగపు అంతమున జనించిన ఒక మహా విజ్ఞానిని ఈ సందర్భమున పేర్కొనకున్న ఈ విషయ చర్చ సమగ్రము కానేరదు. అతడే లియొనార్డో

డా విన్సీ (1452-1519). ఆశ్చర్య జనకము, అభూత పూర్వము అయినది ఆతని ధీశక్తి. విజ్ఞాన శాస్త్రమున అతనిది బహుముఖమగు ప్రజ్ఞ. ప్రకృతిశాస్త్రము, శారీరక శాస్త్రము, గణితము, నిర్మాణ విద్య మొదలగు వానిలో నే కాక లలిత కళలందును డా విన్సీ ప్రజ్ఞానిధి. వివిధ విషయములను గురించిన తన పరిశీలనలను అతడు గ్రంథస్థములుగ చేసెను. ఈనాడు అవి పండితులకు సైతము అచ్చెరువును జనింపజేయునవిగ ఉన్నవి. అన్నిటికన్న ఆతని యాంత్రికశాస్త్ర ప్రావీణ్యము ప్రశంసనీయము. యంత్రవిద్యా ప్రవీణతవలన మానవుడు రోదసీయానమును సాధింపగలుగునని అతడు శాస్త్రీయముగ తన గ్రంథమున రుజువు చేయుటయే కాక, అందులకు అనువగు యంత్రమును నిర్మించు తీరు తెన్నుల ప్రణాళికను రూపొందించెను. ఇటుల విజ్ఞానశాస్త్ర పురోగతిని తొలుతనే ఊహించగలిగిన ఆ పండితుని భావనలు తరువాతి యుగమున సఫలతను పొంది అతని ఘనతను రుజువు చేసినవి.

## ధార్మిక భావన

పూర్వయుగములందు చీనా, భారతదేశము, పారసీకము, మధ్యధరా ప్రాంత దేశములలో మాత్రమే పరిమిత వ్యాప్తిని పొంది ఉండిన వస్తూత్పత్తి కుశలతయు, విజ్ఞానము ను యూరప్, ఆసియా, ఆఫ్రికా దేశములలోని మారుమూలప్రాంతములకు సైతము ఇటుల ఈ యుగమున వ్యాపించుటకు కారణ భూతములైన వివిధ చారిత్రక శక్తులలో మతమునకు ఎక్కువ భాగస్వామ్యము ఉండుట పాఠకులకు ఇప్పటికే సువిదితమై ఉండవచ్చును. ఈ యుగారంభమున ప్రాదుర్భావమొందిన ఇస్లామ్ మతమే కాక, తక్కిన ప్రాచీన మతములును ఈ విజ్ఞానవ్యాపనమున పాల్గొనుట యథార్థమే అయినను, మానవ జీవితమందలి వివిధ రంగములందును అప్రతిహత సర్వాధికారమును వహించుటలో ఇస్లామ్ మతము తక్కిన వానిని మించి ఈ యుగమున కొంతకాలము వరకు ముందంజ వేసినదని అంగీకరింపక తప్పదు.

తక్కిన మతకర్తలతో పోల్చి చూచినప్పుడు ఇస్లామ్ మతప్రవక్తయగు మహమ్మద్‌నందు ఒక ప్రత్యేక విభిన్నత గోచరించును. గౌతమబుద్ధుడు, జీసస్ క్రైస్తు, మసీష్ మొదలగు ప్రాచీన మతప్రవక్తలు విషయసుఖములకు ఆలవాలమగు సాంసారిక జీవితమునకు వైదొలగి సత్యాన్వేషణకై పూనుకొనినవారు. మహమ్మద్ ప్రవక్త జీవితము అట్టిది కాదు. ప్రియతమయగు ఖదీజా మరణానంతరమున సైతము సాంసారిక జీవితమును త్యజించక, కుటుంబ జీవనము గడపుచు, సాటి అరబ్బులందు ధర్మచింతనను ప్రేరేపించుటకే అతడు కృషి చేసెను. సునిశిత దృష్టితో పరికించినపుడు సమకాలీన సంకుచిత ప్రపంచమున ఒక చక్కని సంఘవ్యవస్థను రూపొందించుటయే అతని ఆశయముగ కన్పట్టును. మానవవర్గముల విడదీయు అడ్డుగోడలను నిర్మూలించి సమతా దృష్టిని పెంపొందించుటయే ఇస్లామ్‌మత లక్ష్యము. అతిత్వరితగతిలో నాటి విజ్ఞాత ప్రపంచమునందు దాదాపు సగమున ఆ మతము వ్యాపించుటకు మూలమైనది ఈ సమతాదృష్టియే. అందువలన ఇస్లామ్ మతపు ప్రాశస్త్య చర్చలో భాగముగ కొందరు చారిత్రకులు చేసినటుల ఇస్లామ్ మతప్రవక్త సాంసారిక జీవితవిధానమును, బౌద్ధ, క్రైస్తవ మతస్థాపకుల వైరాగ్యమయ, సాధు జీవితములతో పోల్చుట సముచితము కానేరదు. సహజ రీతిలో సామాన్య కుటుంబ జీవనమును గడపు మానవుని బాధ్యతగల సంఘపు పౌరునిగ తీర్చిదిద్దుటలో తక్కిన వానితో పోల్చి చూచినప్పుడు ఇస్లామ్ బోధనలు ఎంతవరకు ఉపకరించినవను దృష్టితో మాత్రమే ఇట్టి విషయమును ఐతిహాసికుడు పరికింపవలసి ఉన్నది.

ప్రవక్తమూలమున పరమేశ్వర సందేశము ఖురాన్ రూపమున వెలువరింపబడెనని ఇస్లామ్ మతానుయాయుల విశ్వాసము. ఇందు ప్రవచితములగు మానవధర్మములు అతిసరళములు; అత్యల్ప సంఖ్యాకములు. ఏకైక పరమేశ్వరుని (అల్లా) యందు ఇస్లామ్ మతావలంబి అచంచల విశ్వాసము కలిగి, అతనిని మాత్రమే ఆరాధింపవలెను; అల్లా యొక్క ప్రవక్త మహమ్మద్ అనియును అతడు విశ్వసింపవలెను. కాని, ఇందువలన మహమ్మద్‌నకు మానవాతీతతను ఆరోపించుట ఆ మతము తన లక్ష్యముగ ఇడుకొనలేదు. భగవదనుగ్రహము కొరకై ప్రార్థనలను, ఉపవాసములను నియమిత రీతిలో సాగించి, జీవితకాలమున కడకు ఒక సారియైనను మక్కాయాత్రను ముస్లిమ్ చేయవలెను. ఈ ధర్మములతో పాటుగ ప్రాముఖ్యము కలిగిన వేరొక విధి 'జకత్' చెల్లింపు. ఇది ఒక విధమగు పన్ను అని చెప్పవచ్చును. ముస్లిమ్ అగువాడు తన మూలధన ఆదాయములందు సాలుసరిగ నూటికి $2\frac{1}{2}$ వంతున ఇందు మూలమున చెల్లింపవలసి ఉండును.

పై ధర్మములన్నిటిని మించినది ఈ మతమున నొక్కి చెప్పబడిన సర్వమానవ సౌభ్రాతృత్వము. ఖురాన్ ఉపదేశములలో పలుతావులందు పదేపదే ఈ విషయము చెప్పబడుటయే ఈ ధర్మమునకు ఇస్లామ్ కల్పించిన సమధిక ప్రాముఖ్యమును విశదము చేయుచున్నది. మానవుల

మధ్యగల సంబంధములకు సువ్యవస్థిత సరళరూపమును కల్పించుటకు ప్రవక్త చేసిన కృషికి మూలాలంబనము ఈ ధర్మమే. ఇంతియేకాదు, తన అనుయాయులు ఒకరియెడ ఒకరు వ్యవహరించదగు పద్ధతిని నిర్ద్వంద్వముగ స్పష్టీకరించుటలో మహమ్మద్ కడు శ్రద్ధ వహించెను. హెజిరా శకము పదవ సంవత్సరమున - తన నిర్యాణమునకు ఒక సంవత్సరము ముందుగ - మక్కాను దర్శించినపుడు తన అనుయాయులకు అతడు ఒక మహా సందేశమును ఇచ్చెనని ఇస్లామ్ సంప్రదాయ వేత్తలు అనెదరు. ఆ మతానుయాయుల దృష్టిలో మహాప్రాముఖ్యమును ఆర్జించిన ఆ సందేశము ఈ తీరుగ కలదు:

'ప్రజలారా! మరుసటి సంవత్సరమున నేను మీ మధ్య ఉండగలనో లేనో చెప్పలేను. మీ జీవితములును, ఆస్తిస్వత్వములును పవిత్రములు; పరస్పరము అవి ఎల్లప్పుడు మాననీయములు;

'ప్రతివానికిని తన పైతృకమున భాగస్వామ్యము కలదని భగవదాజ్ఞ. అట్టి వారసత్వపు హక్కును నిషేధించు మరణ శాసనము ఎట్టిదియు చెల్లనేరదు;

'శిశువునందు కల స్వత్వబాధ్యతలు జనకునికి అనుల్లంఘనీయములు; దాంపత్య బంధమును విచ్ఛిన్న మొనర్చువాడు శిలావర్షోపహతుడు కాదగును;

'తన జనకుని, తన స్వామిని కాదని వేరు వారలకు ఆ యా స్థానములను కల్పించువానిని పరమేశ్వరుడును, దేవదూతలును, సర్వమానవలోకమును శాపోపహతుని చేయగలరు;

'ప్రజలారా! మీ భార్యలకు మీయెడ నిర్వర్తింపదగు కొన్ని బాధ్యతలు కలవు. అట్టులే మీకు మీ భార్యలయెడ నిర్వర్తింపదగు బాధ్యతలును కలవు. దాంపత్య ధర్మమును అతిక్రమింపక, అనుచిత చర్యను ఎట్టిదానిని చేయక వర్తించుట భార్యల విధి. ఆ విధిని మన్నించని వారిని నిర్బంధితలుగ చేసి, దండించుటకు మీకు అధికారము కలదు. కాని, అట్టి దండన క్రౌర్యపూరితము కారాదు. తత్ఫలితముగ తప్పుమార్గమునుండి వారు వైదొలగిన యెడల వారికి అన్నవస్త్రములను తగినటుల ఇచ్చి వారిని పోషింపుడు. వారు మీ అదుపు, ఆజ్ఞలకు లోబడిన నిర్బంధితలు కావున వారిని చక్కగ ఆదరింపుడు. తమకు సంబంధించిన దేనియందును వారికి సర్వాధికారములు లేవు; భగవంతుని యానగ మీరు వారిని గ్రహించితిరి; భగవానుని దివ్యవాణిని అనుసరించి వారి తనువులను మీవిగ చేసికొంటిరి;

'ఇక మీ బానిసల విషయము: మీరు ఎట్టి ఆహారమును భుజింతురో దానినే వారికిని పెట్టుడు; ఎట్టి వస్త్రములను మీరు ధరింతురో అట్టివానినే మీ బానిసలను ధరింపనిండు. క్షమింపరాని దోషము ఏదియైన వారు చేసినచో వారిని అమ్మివేయుడు; వారును పరమేశ్వరుని సేవకులే అగుట వలన వారిని మీరు బాధింప తగదు;

'ప్రజలారా! నా ఆదేశమును విని, అందలి అర్థమును తెన్నగ గ్రహింపుడు. ముస్లిమ్‌లు అందరును పరస్పరము సోదరులను విషయమును గుర్తింపుడు; మీరందరును సమానులు.'

మహమ్మద్ నిర్మింపదలచిన ఆదర్శ మానవ సమాజపు రూపురేఖలు పై సందేశమున చక్కగ చిత్రణమును పొందినవి. ఇందలి మొదటి ఉపదేశము వలన ఒకరి ధనమును వేరొకరు దౌర్జన్యమార్గమున కొల్లగొట్టు విధానమునకును, విద్వేషమునకును స్వస్తి చెప్పబడినది. కట్టకడపటి ఉపదేశము వలన నిరక్షరకుక్షియు, దరిద్రుడునగు అనాగరకునికిని, మహాపండితునికిని మధ్యగల సాంఘికవ్యత్యాసము రద్దు చేయబడినది. ఇట్టి సమతాభావనకు మూలబీజములు క్రైస్తవాది ప్రాచీన మతములలో కలవనుట నిజమే అయినను వానికి సామాజికమగు ప్రస్ఫుట రూపము ఇస్లామ్‌న మాత్రమే చేకూరినదనుటలో సంశయమునకు తావులేదు.

ఇటుల మతభావనలకు సామాజికపు విలువలను కల్పించుటయందే కాక, ఆస్తికతా దృష్టియందును ఇస్లామ్ ఒక ప్రత్యేక మార్గమును త్రొక్కినది. 'ఏకేశ్వరారాధాన' అనునది పశ్చిమఆసియాయందు అతిప్రాచీనకాలమున నేయూదులచే నెలకొల్పబడినది. దానినే క్రైస్తవ మతమును బలపరచి, దానికి విశ్వజనీనతను కల్పించినది. అటులే జరతుష్ట్రి, మానీ మతములును ఏకేశ్వరుని ఆరాధనకే అంకితములైనవి. కాని, ఈ మతములందు అన్నింటను సామాన్యమానవునికిని, పరమేశ్వరునికిని మధ్యను అర్చకగణము లేదా పురోహితగణము అడ్డుగ నిలిచి పెత్తనము నెరపుట ఆ నాడు ఒక పరిపాటిగ పరిణమించినది. ఈ అడ్డంకిని తొలగించి, ఇస్లామ్ మతము ఆస్తికతకు ఒక నూతన వైఖరిని కల్పించినది. అర్థరహితములగు ప్రతీకములకును, హోమధూమములకును, అర్చక పురోహితుల మంత్రఘోషలకును తావులేని ఆస్తిక్యమును మహమ్మద్ ప్రవక్త రూపొందించెను.

ఇక నాటి మానవలోకమున ఇస్లామ్ వ్యాపించిన తీరు సైతము తక్కిన మతముల వ్యాపనారీతికి విభిన్నమైనదని దాని చరిత్ర స్పష్టము చేయుచున్నది. ప్రాదుర్భావమొందిన తరువాత నూరు సంవత్సరములు నిండకముందే ఇస్లామ్ మతము తూర్పున సింధునది మొదలుకొని ఆఫ్రికా పశ్చిమతీరము దనుక వ్యాపింపగలిగినది. వ్యాప్తియందు

ఇట్టి ద్రుతగమనము తక్కిన మతములలో దేని విషయమునను కనరాదు. ఇట్టి శీఘ్రవ్యాప్తికి దోహదకారియైనది ఇస్లామ్‌న మతభావనలకు కల్పింపబడిన సామాజికపు విలువయా? ఆస్తికత యందలి సరళతయా? లేదా అరబ్బుల యుద్ధనైపుణ్యమా? అను ప్రశ్నకు సమాధాన మొసగు పట్టున చారిత్రకుడు అందు తొలుతటి దానికే ఎక్కువ ప్రాముఖ్యమును ఈయక తప్పదు.

ఇస్లామ్ మతావిర్భావకాలము నాటికి ఉత్తర ఆఫ్రికా, పశ్చిమ ఆసియా, మధ్య ఆసియా ప్రాంతములందు సామాజిక స్థైర్యము సన్నగిలినది. ప్రాచీనకాలపు నాగరకతా కేంద్రములగు ఈజిప్టు, బాబిలోనియా ఈ ప్రాంతములకు చెందినవియే అయినను క్రీ. పూ. 4 వ శతాబ్ది మొదలుగ ఈ ప్రాంతములందు సుస్థిర సంఘవ్యవస్థ రూపొందుటకు అవకాశములు మృగ్యములైనవి. ఒకటి వెనుక వేరొకటిగ వేర్వేరు సామ్రాజ్యములు అట రూపొంది అంతరించినవే కాని వీనియందు, చీనా - భారతదేశములందు ఉండినటులుగ, ధారావాహికగ నిలువజాలిన ఏకైక సాంఘిక భావన మాత్రము మనజాలక పోయినది. జరతుష్ట్రమతము అట్టి భావనకు తొలుత ఒక విధముగ తోడ్పడినను, గ్రీక్‌ల విజయయాత్రా ఫలితముగ అట వ్యాపించిన గ్రీక్ సంస్కృతి తత్పూర్వపు సాంఘిక స్థైర్యమును సడలించుటలో మాత్రము నెగ్గినదే కాని, వేరు విధముగ క్రొత్త స్థిరత్వమును రూపొందింపజాలక పోయినది. ఇక అట వ్యాపించిన యూద, క్రైస్తవ, జరతుష్ట్ర, మనీష్ మతములు సుస్థిర సాంఘికవ్యవస్థకు దోహదకారులు కాలేక పోవుటయేకాక, వీనియందలి వైరుధ్యములు కలతలకును, అస్థిరతకును త్రోవతీసినవి. తత్ఫలితముగా ఇస్లామ్ ప్రాదుర్భావకాలము నాటికి ఆ ప్రాంతములందు సాంఘికమగు అస్తవ్యస్తత, కలిమిలేముల వైరుధ్యము, నిరాశ, నిస్పృహ ఎల్లెడల వ్యాపించినవి. ఇట్టి స్థితిలో ఉన్న ప్రజలకు ఇస్లామ్ మతము విమోచనమును చేకూర్చు దివ్యసాధనముగ కన్పట్టుటచే వారు దానిని కిమ్మనక అవలంబించి, దాని వ్యాప్తికి తోడ్పడిరి.

సామాజికమగు స్థైర్యము క్షీణతనుప్రాపింపని ప్రాంతములందు ఇస్లామ్ ఎక్కువగ పురోగమింప లేకపోయినదనుటకు యూరప్, చీనా, భారతదేశములందలి ఇస్లామ్ మత వ్యాప్తిచరిత్రను మనము ఒక నిదర్శనముగ గ్రహింపవచ్చును. మహమ్మద్ జనించునప్పటికే యూరప్‌న - ముఖ్యముగ మధ్యధరాసముద్ర తీరస్థ దేశములందు - క్రైస్తవ మతము సామాన్య ప్రజానీకమున వ్యాపింపగలుగుటయే కాక, చక్రవర్తుల పరిగణనను సైతము ఆర్జింప గలిగినది. జీసస్ క్రీస్తు బోధించిన క్రైస్తవ మతము వ్యక్తిగతమగు పరిశుద్ధ జీవనమునే ధ్యేయముగ భావించుట యథార్థమే అయినను, చారిత్రక పరిణామముల బలమున క్రీస్తు బోధనలకు క్రమముగ సామాజికపు విలువ చేకూరినది. అందును ముఖ్యముగ రోమన్ సామ్రాజ్య పతనానంతరమున యూరప్ ప్రజలయందు సాంఘిక స్థిరత్వమును చేకూర్చుటకు క్రైస్తవ మతము ఏకైక సాధనమైనది. పోప్ గ్రెగరీ, బెనెడిక్ట్ మొదలగు వారల కృషి ఇందులకు దోహదకారి అయిన విషయము ఇదివరలో వేరొకచోట తెలుపబడినది [చూ. పు. 65] సంఘమున ఇట్టి స్థిరత్వము రూపొంది ఉండుటవలననే యూరప్ ఆ యుగమున ఇస్లామ్ మతప్రవాహమున లీనముకాక నిలువ గలిగినది.

ఇక చీనా, భారతదేశములు ఆనాడు పటిష్ఠ సాంఘిక వ్యవస్థలకు పేరెన్నికగని ఉండినవి. జాతీయత అనునది ప్రపంచమున తొలుతగ ఆ రెండు దేశములలో మాత్రమే పరిణతస్థితిని అందుకొనగలిగినదను విషయము ఇదివరలో వేరొకచోట పాఠకుల దృష్టికి తేబడినది [చూ. పు. 86]. కాని, ఇందొక భేదము కలదు. భారతదేశము సాంస్కృతికముగ ఏకతను పొందినను, అట ఏకైక కేంద్రాధికారము రాజకీయ స్థాయిలో రూపొందలేక పోయినది. తత్ఫలితముగ దేశము ఇస్లామ్ సేనావాహినుల వశమగుటకు చక్కని అవకాశము చేకూరినది. కాని, రాజకీయాధికారమును కోల్పోయినపుడు సైతము తన సామాజిక వ్యవస్థయందు తనకు గల దృఢ విశ్వాసమును భారతజాతి కోల్పోవలేదు. అందువలననే దేశమున అత్యధిక భాగమున ఇస్లామ్ వ్యాపింప లేకపోయినది. తొలుతనుండియు పారసీకులు, గ్రీక్‌లు, శకులు, హూణులు మొదలగువారి దండయాత్రలకు పాల్పడి, సంక్షుభితమై, చక్కని సామాజిక వ్యవస్థ కుదురుకొనుటకు అవకాశము చిక్కని పశ్చిమోత్తర భారతదేశమునందును, భారతదేశపు జాతీయ సంస్కృతీ కేంద్రములకు దూరమై సామాజిక దృఢతను చేకూర్చుకొనజాలని దూరప్రాచ్యభారతదేశపు కడయంచులందునను మాత్రమే ఇస్లామ్ దృఢముగ నెలకొనుటకు వీలు చిక్కినది.

చీనాదేశమున ఇట్టి అవకాశము సైతము ఇస్లామ్‌నకు లభించినదికాదు. స్వీయ సమాజ ప్రాశస్త్యముపై తమకు గల అచంచల విశ్వాసముతోపాటుగ రాజకీయముగ సైతము ఆ నాటి చీనాజాతి ఏకతను పొంది ఉండుటవలన ఇస్లామ్‌ను తన పొలిమేరలలోనే ఆపగలిగినది. అటులని చీనాయందును, భారతదేశమున ఉత్తర, దక్షిణ ప్రాంతములందును ఇస్లామ్ వ్యాపింపజాలక పోయినదని ఇందువలన

భావింపదగదు. ఆ ప్రదేశములందు అటనట అల్ప సంఖ్యాకులను ఆ మతము ఆకర్షింపగలిగినది. ఇందులకు ముఖ్య కారణము సూఫీలు మొదలగు ముస్లిమ్ సాధు జనుల ఆదర్శ జీవన విధానము. ఈ ప్రాచీన దేశములందు తొలుతటి నుండియు ఇతరుల అభిప్రాయముల ఎడ సహన భావము, సాధుజనుల అనుసరణ ఆదరణీయములై ఉండినవి. అందువలన అల్పసంఖ్యాకులు కొందరు రుచిభేదమును అనుసరించి ఇస్లామ్‌ను స్వీకరించినను, ప్రాచీన సామాజిక జీవితస్రవంతి సన్నజాలు పడక ఈ దేశముల రెండింటను రాణింపగలిగినది.

ఎనిమిదవ శతాబ్ది ప్రథమ పాదాంతము మొదలుగ ఇస్లామ్ పురోగతి మందగించుటకు ఇంకొక కారణము సైతము కలదు. మహమ్మద్ ప్రవక్తయు, అతని అనంతరమున క్రమముగ కలీఫా పదవిని ఆర్జించిన అబూ బేకర్, ఓమర్ అను వారలును సరళ నిరాడంబర జీవితమునకు పేరెన్నిక పొందినవారు. అందువలన తమ అనుయాయులతో వారు కలసిమెలసి పొరపొచ్చెములు లేక చరించి సర్వమానవ సౌభ్రాతృత్వమును ఆచరణలో రుజువు చేసిరి. కాని, అరబ్బుల రాజ్యము విస్తరించిన కొలది విజయములవలన లభించిన ధనాదులవలన ఆడంబరయుత జీవనముపై మక్కువ అరబ్బీయోధులలో క్రమముగ రేకెత్త మొదలిడినది. కలీఫా ఓమర్ దీనిని మొగ్గలోనే త్రుంపివేయుటకు ఎంతయో కృషి చేసెను. ఆ సందర్భమున ఈ క్రింది ఉదంతములు ఇట పేర్కొనదగినవి: ఇస్లామ్ సేనలకు జెరూసెలెమ్ లొంగవలసిన పరిస్థితి ఏర్పడినపుడు ఆ నగరవాసులు ఓమర్ ఖ్యాతిని విన్నవారగుటవలన ఆ కలీఫా వచ్చినచో, తమ నగరమును వారికి చేజేతుల స్వాధీనము చేయగలమని అభ్యర్థింపగ, మదీనాలో ఉండిన కలీఫా హుటాహుటిగా 965 కి. మీ. పయనించి జెరూసెలెమ్‌ను చేరెను (688). ఈ దూర ప్రయాణమును ఒంటెపై సాగించినపుడు అతడు తన ప్రక్కన ఒక సంచిలో యవలను, వేరొక సంచిలో ఖర్జూర ఫలములను, దప్పిక తీర్చుకొనుటకు ఒక నీటి తిత్తిని, ఒక కొయ్య పళ్లెమును మాత్రమే ఉంచుకొని, ఒక అనుచరుని మాత్రమే తోడుగ గ్రహించెను. జెరూసెలెమ్ నగరపు పరిసరములందు అతని సేనానులందరు చీని చీనాంబర భూషితులై అలంకృతాశ్వములను ఆరోహించి అతనికి స్వాగతమీయ వచ్చిరి. ఈ ఆడంబర పటాటోపమును చూచినంతనే సరళ జీవనుడగు ఓమర్ క్రోధావేశితుడై ఒంటెనుండి క్రిందకు దిగి, చేతికి వచ్చిన బెడ్డలను, రాళ్లను తీసికొని తన సేనానులను తరిమి తరిమి కొట్టుచు 'ఏమి ఈ అమానుషపు వేషములు? ఈ సొగసు దుస్తులకు ఏ ప్రయోజనము కలదు? అరబ్బీ యోధులేనా వీరు? కల్ల ఎరుగని ఎడారి వాసులు ఎట మాయమైరి?' అని నోటి కొలది వారిని దూషించి, వారిని తనతో రానీక, తన ఏకైక అనుచరునితో జెరూసెలెమ్‌న ప్రవేశించెను.

వేరొక అదనున సైతము కలీఫా ఓమర్ తన అనుచరులలో బయలుదేరిన భోగలాలస జీవితాశను దూయబట్టెను. పారసీక దేశమున పాలకుడుగ నియమింపబడిన తన అనుచరుడు కూఫా నగరమున స్వోపయోగమునకై ప్రాసాదమును ఒకదానిని నిర్మింప సంకల్పించినటుల తెలియవచ్చినంతనే ఆ కలీఫా ఆ పాలకునికి ఒక ఉత్తరము వ్రాయుచు 'పూర్వపు పారసీక చక్రవర్తి ఖుస్రూను అనుకరించుచు నీవు ఒక ప్రాసాదమును కట్టింపదలచితివని నాతో కొందరనిరి. అంతేకాదు; ఆ ప్రాచీన చక్రవర్తి నివసించిన రాజప్రాసాదపు కవాటములనే నీ ప్రాసాదమునకు పెట్టెదవని కూడా తెలియవచ్చినది. ఇక, ఆ తరువాత, ఆ చక్రవర్తివలెనే అంగరక్షకులను, ద్వారపాలకులను కూడ నీ ప్రాసాదము కడ నీవు ఉంచెదవా? మతానుయాయులకు వైదొలగి వసించి పేదలు నిన్ను దర్శింప వీలులేకుండ చేయుటయేనా నీ సంకల్పము? ప్రవక్త విధించిన మర్యాదను ఉల్లంఘించి, పారసీక సామ్రాట్లవలె వైభవమును ఆసించి, వారివలె అధోగతిని పొందఇచ్చగింతువా?' అని మందలించెను.

కాని, ఆ మందలింపులు ప్రయోజన శూన్యములైనవి. అతని తరువాత కలీఫా అయిన ఓత్‌మన్ కాలమున సుఖలాలసత అరబ్బుల లోగొనినది. అంతటితో విద్వేషములు పెచ్చు పెరిగినవి. కలీఫా పదవికొరకై కీచులాటలు, అంతర్యుద్ధములు అంతట చెలరేగి ఇస్లామ్ సంఘమున అనైక్యమునకు దారితీసినవి. సున్నీ, షియా విభేదములు ఆ మతమున పొడచూపుటకు కలీఫా పదవికై జరిగిన తగవులాటలే కారణములు. వారసత్వరీత్యా మహమ్మద్ బంధువర్గమున ఆ పదవి ఉండెవలెనని షియా సంప్రదాయానుయాయులు పట్టుబట్టిరి. పారసీకమునందును, భారత దేశమునందును వీరు నేడు పరిగణనీయ సంఖ్యలో కలరు. షియాలతో ఈ విషయమున అంగీకరింపనివారు సున్నీ సంప్రదాయానుయాయులగు ముస్లిమ్‌లు. ఈ ద్వివిధ సంప్రదాయముల మధ్య చెలరేగిన యుద్ధములవలన మక్కాయందలి కాబా నిలయమే - ఒకపుడు - దగ్ధము చేయబడినది. ఇస్లామ్‌నకు ప్రత్యేక విశిష్టతను చేకూర్చిన సర్వమానవ సౌభ్రాతృత్వమును, సరళ జీవితమును ఇటుల తమ ప్రాముఖ్యమును కోల్పోవుటతో, ఆ మత

ముపై తిరుగుబాటులు జరుపుటకు అటనట కొన్ని యత్నములు జరిగినవి. అట్టి వారిలో 'కర్మేతియన్' లన బడు ఒక సంప్రదాయమువారు 891 మొదలుగ 906 వరకు అరేబియా, సిరియా దేశములను కొల్లగొట్టి, కడకు మక్కానే ఆక్రమించి, అచటి కాబా శిలను హరించిరి. ఇట్టి తిరుగుబాటులను కలీఫాలు కడకు అడచివేయగలిగి నను, ఇస్లామ్ తన తొలుతటి బలమును కోల్పోవుటకు ఇవి కారణభూతము లైనవి.

ఇంకొక విషయమునుకూడ ఇట గమనింపవలసి ఉన్నది. మహమ్మద్ ప్రవక్త అరబ్బులందు విజిగీషతోపాటుగ జ్ఞానపిపాసను రేకెత్తించెను. తత్ఫలితముగ తొలుతటి కలీఫాల కాలమున ప్రపంచ విజ్ఞానమునకు అరబ్బులు ప్రాతినిధ్యము వహింపగల్గిరి. ఇటుల వివిధ విజ్ఞానములతో పరిచితి లభించిన తరువాత దానిని ముందునకు కొనిపో వలసిన బాధ్యత వారిపై పడినది. ఈ బాధ్యతను వారు నిర్వహించుటలో మత ఛాందసాభిప్రాయములను అడ్డుగ పెట్టుటకు కొంత యత్నము జరిగినది. మతముయొక్క చారిత్రక, సాంఘిక ప్రతిపత్తిని గమనించని ఛాందస వాదులు ఇటుల చేయుట తక్కిన మతముల చరిత్రలందును మనకు ద్యోతకమగుచున్నది. ఇట్టి అడ్డులను అతిక్రమించి, ఇస్లామ్‌ను ముందునకు కొనిపోవుటకు కలీఫా మామూన్ (813 - 833 ప.) గట్టి కృషి చేసెను. మానవునికి సంకల్ప స్వేచ్ఛ కలదనియు, తన బాగోగుల తీర్చి దిద్దుకొనుట యందు అతని కృషికి సమధిక ప్రతిపత్తి కలదనియు, హేతువాద బద్ధమగు రీతిలో సాంఘిక న్యాయమును మానవులకు చేకూర్చుటయే భగవత్సృష్టికి ధ్యేయమగు ననియు పేర్కొను ముతాజిల్ సంప్రదాయవాదములను అతడు విశ్వసించి, ఆ వాదమునకు ఇస్లామ్ లోకమున ప్రచారమును కల్పించెను. ఈ వాదమువలన ఖురాన్ నందలి సూక్తులకు విపులార్థము కల్పింపబడి, పరమతముల యెడ సహన భావమునకు అందు తావు కల్పింపబడుటయే కాక, హేతువాదమునకు అందని ఛాందసవాదములకు స్వస్తిచెప్పి, ముస్లిమ్ వైజ్ఞానికులు సృష్టిరహస్య పరిశోధ నలో పురోగమించుటకు మార్గము సుగమము చేయ బడినది. కాని, కలీఫా ముతావకీలు (847 - 861 ప.) కాలమున ఈ వాదము నిషేధింపబడి, ఛాందస వాదులకే మరల ప్రముఖత చేకూరినది. అంతటితో ఇస్లామ్‌న ప్రగతి శీలత కుంటుపడినది.

ఇస్లామ్ నాయకత్వమున 9 వ శతాబ్ది మధ్య భాగమున సంఘటిల్లిన మార్పు సైతము ఇస్లామ్‌నకు ఈ దురవస్థ చేకూరుటకు కొంత తోడ్పడినది. మహమ్మద్ ప్రవక్తచే ఉత్తేజితులై ఇస్లామ్ వ్యాపనమున తొలుత ప్రముఖపాత్ర వహించిన అరబ్బు నాయకులు అంతఃకలహముల మూల మున క్రమముగ బలహీనులై తమ తమ పదవుల నిలుపు కొనుటకై అరబేతరులగు తుర్కులు మొదలగు తక్కిన ముస్లిమ్‌లపై విరివిగ ఆధారపడి ఉండుట 9 వ శతాబ్దితో ప్రారంభమైనది. సంచార జాతులగు తుర్కులు అందు వ్యాపించుటకు పూర్వమే ఇస్లామ్ నాయకులందు - పారసీక దేశమును జయించిన నాటినుండియు - భోగలాలసత వెచ్చు పెరిగినది. కావున, తుర్కు ప్రజానీకమున ఆ మతము వ్యాపించునాటికి అందలి సరళ జీవితపు మూలసూత్రముల ప్రాబల్యము సన్నగిలి, విజిగీషకు మాత్రమే ముఖ్య ప్రతి నిధిగ ఇస్లామ్ రూపొందినది. తత్కారణమున తుర్కు లందు విజిగీషయు, అందులకు సాధనముగ సౌభ్రా తృత్వమును మాత్రమే ఇస్లామ్ రూపొందించగలిగినది. ఇస్లామ్‌మత చరిత్రలో తొలుతటి అరబ్బులయందు కన వచ్చిన విజ్ఞాన సంపాదనేచ్ఛ - కలికమునకైన - తుర్కుజాతు లందు కనరాకుండుటకు ఇదియే ముఖ్యకారణము. ఈ తుర్కు జాతులే 9 వ శతాబ్ది ఉత్తరభాగమునుండియు ఇస్లామ్ మత చరిత్రయందు నాయకత్వము వహించినవి. వీరి మూలముననే భారతదేశము మొదలగు వానియందు ముస్లిమ్ రాజ్యములు రూపుగొనినవి. ఇట్టి రాజ్యములందు పూర్వపు అరబ్బుల ఆధిపత్యమున ముస్లిమ్ ప్రపంచమున కన్పట్టిన రీతిగ వైజ్ఞానిక తృష్ణ కన్పట్టకుండుటను తుర్కు జాతులందు వ్యాపించునాటికి ఇస్లామ్ పొందిన రూప వికృతికి ఒక నిదర్శనముగ గ్రహింపదగును.

ఇస్లామ్ రూపొందునాటికి భారతదేశమున వైదిక, బౌద్ధ, జైన మతములు వ్యాప్తిలో ఉండినవి. భారత జాతీయజీవనమున సాంప్రదాయికముగ కన్పట్టు సహన భావము ఆ నాడును ఆ యా మతానుయాయుల మధ్య జరుగు వ్యవహారములందు ఆలంబనముగ ఉండినది. అయినను అటనట ఇందులకు అపవాదములును లేక పోలేదు. పశ్చిమ వంగాధిపతియగు శశాంకుడు గయ యందలి బోధివృక్షమును ఖండించుట (7 వ శతాబ్ది తొలు తటి పాదము) మొదలగునవి ఈ అపవాదములలో లెక్కింపదగినవి. కాని, మొత్తముమీద ప్రజలందును, ప్రభువులందును సామాజిక ప్రతిపత్తికి భంగము చేకూరని రీతిలో, సర్వమతాదరణ సహజధర్మముగ పరిగణింపబడెడి దని చెప్పవచ్చును. హర్షుని మొదలుగ భారతీయ పాలకులు ఇస్లామ్ సేనలచే దళితులగు వరకు ఈ ధర్మమునే అవలం బించిరని ఆనాటి వ్రాతలవలన మనకు తెలియవచ్చుచున్నది. గాహడ్వాలవంశీయుడగు గోవిందచంద్రుడు(1104-1155 ర.)

క్రీ. శ. 1128 లో ఒసగిన ఒక శాసనము ఆనాటి భారత దేశపు జాతీయజీవనమున సర్వమత సహనభావము రూపుగొనిన రీతిని చక్కగ విశద మొనర్చుచున్నది. గంగా తీర్థమున - వారణాసికడ - స్నానమొనర్చి, దేవ, ఋషి, పితృగణముల సంస్మరించి, ఆదిత్య,మహేశ, వాసుదేవులను అర్చించి, హోమమూలమున అగ్నిని ఆరాధించి, జేతవన విహారవాసులును, సమ్మాననీయులును అగు బౌద్ధ భిక్షు కుల ఎడను, ముఖ్యముగ ఆ విహారమున వసించు శాక్య రక్షితుడను ఉత్కళీయ పండితుని ఎడను, తచ్ఛిష్యుడును, చోళరాష్ట్ర వాసియు నగు వాగీశ్వర రక్షితుని ఎడను తనకు గల ఆదరము వలన వారికి ఆరు గ్రామములను గోవిందచంద్రుడు దానము చేసినటుల ఆ శాసనమున చెప్పబడినది.

12 వ శతాబ్దినాటికి భారతదేశమున పలుప్రాంతము లందు బౌద్ధ, జైనమతములు తమ ప్రాబల్యమును కోల్పోయి నవి. పౌరాణిక హిందూమతము క్రమముగ వానిని ద్వేష మూలమున అంతరింపజేసినది కాదు. తమ వికసనమునందు కాలక్రమమున బౌద్ధ, జైనములు జాతీయ సాంప్రదాయిక భావనలను తమలో మిళిత మొనర్చుకొని, హిందూమతము నకు సన్నిహితములు కాజొచ్చినవి. అంతట జాతీయ సంప్ర దాయమునకు ముఖ్యప్రాతినిధ్యము వహించిన హిందూ మతము చల్లగ వానిని తనలో లీనము చేసికొన మొదలిడి నది. రక్తపాతము, విద్వేషము లేకుండ విస్తృత పరివ్యాప్తి చెందిన రెండు గొప్ప మతములను తనలో లీన మొనర్చి కొనిన ఘనత హిందూమతమునకు ఒక్కదానికే ప్రపంచ చరిత్రయందు చేకూరినది.

హుయాన్‌స్యాంగ్ భారతదేశ యాత్రనాటికే బౌద్ధ మతము భారతదేశమున పలుప్రాంతములందు వెనుకంజ వేయుట మొదలిడినది. ఆ పరిస్థితిని గమనించిన ఆ యాత్రి కుని మనోవేదన అతని వ్రాతలందు చిత్రణమును పొందినది. కాని, చారిత్రకముగ చూడ బౌద్ధ, పౌరాణిక హిందూ మతములు ఒకదానికి వేరొకటి చేరువయగుట క్రీస్తు శకా రంభము నుండియే మొదలైనదని చెప్పవచ్చును. బౌద్ధమున మహాయానమునకు ప్రాశస్త్యము చేకూరినప్పటినుండియు ఇది ఆరంభితమైనది. విగ్రహారాధనను సామాన్యమానవులకు ఆకర్షణీయమగునటుల చేయుటకు మహాయానము యత్నిం చినదని స్థూలరీతిలో చెప్పవచ్చును. ఇట్టి కృషియే పాశుపత, భాగవత మతముల వ్యాప్తిమూలమున పౌరాణిక హిందూ మతమున సాగినది. జైనమతముకూడ తీర్థంకర పూజకు విరివిగ వ్యాప్తిని కల్పించినది. నిర్వాణ ప్రాప్తికి వివిధ మార్గములు కలవను వాదము క్రమముగ హిందూమత, బౌద్ధమతముల రెండింటను తావేర్పరచుకొనినది. వివిధ భావనలకు మూర్తికల్పనము చేసి పూజించుట ఈ రెండు మతములందును ఆనాడే మొదలైనది. అంతేకాక, మంత్ర ములు, తాయెత్తులు మొదలగువానియందు విశ్వాసము కల కొన్ని ప్రాచ్య భారత జాతులందు వ్యాపించుటకు బౌద్ధ, హిందూ మతములు రెండును అహమహమికతో కృషి చేయుటతో మంత్రములు, ముద్రలు, ధారణులు మొదలగు వానియందు విశ్వాసము పౌరాణిక హిందూమత, మహా యాన బౌద్ధముల రెండింటను తావు కల్పించుకొనినది. తత్ఫలితముగ ఈ మతముల మధ్య విభేదము క్రమముగ సన్నగిలినది. బౌద్ధ దేవతలు, హిందూ దేవతలు అను విభే దము లేకుండ అందరిని పూజించుట సామాన్య జనులలో పరిపాటి అయినది. ఈ దేవతలయందు సైతము సరస్వతి, గణేశుడు మొదలగు కొందరు బౌద్ధ, జైన, హిందూ మత సారస్వతముల మూడింట సమానాదరణను ఆర్జించిరి. ఇందులకు గల కారణమును వేరుగ వెదకనవసరము లేదు. భారత జాతీయ భావనలో సాంప్రదాయికముగ వచ్చునవి ఈ మూడు మతములకు సర్వసామాన్యముగ ఆదరణీయము లగుటయే ఇందుకు ప్రబలహేతువు.

ఒక విగ్రహారాధన విషయముననే కాదు ; దార్శనిక వాదమున సైతము బౌద్ధ, హిందూ మతములకు గల విభేదము క్రమముగ సన్నగిలినది. దార్శనిక చర్చలలోనికి దిగుటకు గౌతమబుద్ధుడు నిరాకరించినను, అతని అను యాయులందు క్రమముగ దార్శనిక జిజ్ఞాస పెచ్చుపెరిగినది. మహాయానమును రూపొందించిన బౌద్ధపండితులు దీనికి బల మును చేకూర్చిరి. నాగార్జునాదులచే ప్రచలితమగు మాధ్య మిక దార్శనికచర్చ ఈ కృషికి ఫలితమని చెప్పవచ్చును. నలందా, విక్రమశిలా, ధాన్యకటక విద్యాపీఠములు ఈ వాద వికసనమునకు దోహదకారులైనవి [చూ. సం. 7 - పు. 485]. ఈ మాధ్యమిక వాదము [చూ. సం. 7 - పు. 606] మౌలికముగ బౌద్ధపండితుల కృషిఫలితమే అని అనుటలో కొంత వాదబలము లేకపోలేదు. కాని, దీనిని రూపొందించిన ధీమంతులందరును భారతీయులే అనియు, సంస్కృతభాషనే వారు దానికి సాధనముగ వినియో గించిరనియు, తత్కారణమున వారి వాదములయందు జ్ఞాతముగనో, అజ్ఞాతముగనో భారతదేశపు సాంప్రదా యిక, దార్శనిక ప్రభావము కొంతవరకు ఉండి తీరునను టలో పొరబాటు ఏదియు లేదనియు మనము విశ్వసించు టకు ఆధారములు కలవు. అందువలననే క్రమముగ బౌద్ధ మత, హిందూమతముల దార్శనిక వాదముల మధ్య గల సాన్నిహిత్యమును స్పష్టీకరించి, వీనిని మేళనము చేయుటకు

కృషియు ఆరంభితమైనది. ఈ కృషికి శ్రీకారము చుట్టిన వాడు గౌడపాదుడు [చూ. సం. 7 - పు. 378].

గౌడపాదుడు క్రీ. శ. ఆరవ శతాబ్దిలో జీవించెనని చారిత్రకులలో పలువురి అభిప్రాయము. ఈతడు రచించిన మాండూక్యకారికయే ఆగమశాస్త్రము అనియు వ్యవహృతమగుచున్నది. ఉపనిషత్తుల ప్రామాణ్యమును విశ్వసించిన ఈ పండితుడు అందు ప్రవచితమగు అజాతివాదమునే బౌద్ధదార్శనికులును తమ రచనలందు ఖ్యాపించిరని రుజువుచేసెను. ఈ విధముగ ఇతడు అద్వైతవేదాంత - బౌద్ధముల పరస్పర సంబంధమును స్పష్టీకరించుటతో, బౌద్ధమునకు గల ప్రత్యేకత అంతరించుటకు తెరువు పర్పడినది. గౌడపాదుడు సంకల్పించిన ఈ సమన్వయతను ముందునకు కొనిపోయినవాడు అతని ప్రశిష్యుడు శంకరుడు (క్రీ. శ. 788 - 820)* తన వాదబలముచే బౌద్ధ, జైనముల ప్రత్యేక ప్రతిపత్తికి భంగము కలిగించుటయే కాక, భారత జాతీయ భావనతో ముడివడిన వైదిక సంప్రదాయమునకు అవిరోధములగు కొన్ని వాదములకు మాత్రమే పరిగణనను కల్పించి, ఇతడు షణ్మత స్థాపకుడయ్యెను. కాలక్రమమున శంకరుని దార్శనిక భావనలను అంగీకరించని రామానుజ, మధ్వాచార్యులు వేరు వేరు దార్శనిక వాదములకు ప్రాచుర్యమును వైదిక తరుచ్ఛాయయందుననే కల్పింపగలిగిరి.

ఇస్లామ్ సేనలు ఉత్తరభారతదేశమును లోగొనునాటికి పైన పేర్కొనబడిన వైదిక వాదములు భారతదేశమున విపుల వ్యాప్తిని పొంది ఉండినవి. బౌద్ధము సైతము నలందా, విక్రమశిలా విద్యాపీఠములను ఆశ్రయించి ప్రాచ్య భారత దేశమున ఆ కాలమున తావేర్పరచుకొని ఉండినది. కాని, ఇస్లామ్ సేనల విధ్వంసకచర్యల ఫలితముగ ఆ విద్యాపీఠములు అంతరించి, బౌద్ధభిక్షువులలో పలువురు టిబెట్, నేపాల్ మొదలగు దేశములకు పలాయనమొనర్చిరి. భారతదేశ ప్రజాసామాన్య జీవితముతో మిశ్రితమైన పౌరాణిక హిందూమతము మాత్రము ఓపిన మేరకు కాలు నిలువ ద్రొక్కుకొని, తన మనుగడకై పోరాటమును సాగించి మనగలిగినది. అయినను ఈ జీవన్మరణ సమస్య తన్నెదుర్కొనుటతో, స్వీయాస్తిత్వమున మాత్రమే శ్రద్ధవహింపవలసి వచ్చినందున ఆ మతము తనయందలి సృజనశక్తిని కోల్పోయినది. మాతృభూమిలో హిందూ మతమును ఈ క్లిష్టస్థితి ఎదుర్కొనుట వలన మలయా, జావా మొదలగు దూరప్రాంత రాజ్యములందలి హిందూమత ప్రతిపత్తికి భంగమేర్పడి, అట ఇస్లామ్ నెలవు కల్పించుకొనగలిగినది. తక్కిన దూరప్రాచ్య దేశములందలి హిందూమతము పలుప్రాంతములందు బౌద్ధములో లీనమైనది. కడకు ఇండోనీషియా ద్వీపజాలమందలి బలిద్వీపమున మాత్రము హిందూమతము ఎట్టులో నిలిచి, నేటికిని మనుగడను సాగించుచున్నది.

భారతదేశమున బౌద్ధము తన ప్రత్యేక ప్రతిపత్తిని కోల్పోవువరకు, ప్రాచ్య ఆసియాలోని వివిధ దేశములందలి బౌద్ధ సంప్రదాయములకును భారతదేశీయ బౌద్ధగురువులే ఒరవడి నిడిరి. ధాన్యకటక విద్యాపీఠమున భావవివేకునిచే ప్రవచింపబడిన మాధ్యమిక స్వాతంత్రిక సంప్రదాయము ఈ యుగమున దివాకరుని మూలమున (613 - 680) చీనాయందు తావేర్పరచుకొనెను. వాయవ్య భారతదేశమున రూపుగొనిన సుఖావతి సంప్రదాయము మధ్య ఆసియాలోనికి వ్యాపించి, అట బాగుగ వికసనమంది షాన్‌టావో (613 - 681) అను చీనా భిక్షుకుని కృషిమూలమున చీనాయందును, ఆ తరువాత యూ జూ నింబుడ్సు - షూ (1071 - 1132) కృషి ఫలితముగ జపాన్‌నందును విపులాదరణను ఆర్జించినది. ఈ సంప్రదాయమును అనుసరించి అమితాభుడను పేరున బోధిసత్త్వుని పూజ ఈ దేశములందు వ్యాపించినది. పై వానికన్న ఎక్కువ ఆదరణను ఆర్జించినది ధ్యానసంప్రదాయము. దీనికి విపులవ్యాప్తిని కల్పించిన వాడు బోధిధర్ముడను బౌద్ధ భిక్షువు. ఇతడు పారసీక దేశీయుడగు బౌద్ధుడనియు, అటనుండి భారతదేశమునకు వచ్చెననియు వేరొక కథనము కలదు. ఇతడు క్రీ. శ. 520 లో చీనాకు పోయి అట ధ్యానసంప్రదాయమునకు వ్యాప్తి కల్పించెను. అటనుండి జపాన్‌నకు - ఈ యుగమున - ఆ సంప్రదాయము వ్యాపించుటయే కాక, నేటికిని 'జెన్' అను పేరున జపానీయుల మన్ననను ఆర్జించినది. 'స్వస్వభావములోనికి నిరీక్షించి బుద్ధత్వమును పొందుట' ఈ సంప్రదాయానుయాయుల ముఖ్య లక్ష్యము.

బౌద్ధమతమందలి మాధ్యమిక ప్రాసంగిక సంప్రదాయము నలందా, విక్రమశిలా విద్యాపీఠములందలి భిక్షువుల

* శంకరుని కాలనిర్ణయమున ప్రముఖపాత్ర వహించినది కాంబోడియాయందు కనుగొనబడిన ఒక 9 వ శతాబ్ది శాసనము. శివసోముడను అచటి రాజపురోహితుడు తాను శంకరభగవానుని సాక్షాచ్ఛిష్యుడనని చెప్పుకొనెను. కాని, శంకరుని పరమ గురువగు గౌడపాదుని కారికలు భావవివేకుని తర్కజ్వాలలో ఉద్ధరితములైనను విషయము ఈ కాలనిర్ణయమునకు విరోధముగ ఉన్నది. భావవివేకుడు హుయాన్‌స్యాంగ్‌నకు పూర్వుడనియు, క్రీ. శ. 570 వరకు జీవించెననియు చీనా వ్రాతల వలన తెలియుచున్నది. అందువలన శివసోమునిచే పేర్కొనబడిన శంకరుడు ప్రస్థానత్రయ భాష్యకర్తయగు శంకరభగవత్పాదులేనా అనునది ఇంకను విచారణీయము.

కృషిమూలమున టిబెట్‌న వ్యాపించినది. అట్టి భిక్షుకులలో అత్యంత ప్రసిద్ధిని ఆర్జించినవాడు అతీశదీపంకరుడు (980-1053). టిబెట్‌న అప్పటికి హీనస్థితికి దిగజారిన బౌద్ధ మతమును అతడు సంస్కరించెను. అతనిచే ప్రభావితులైన బౌద్ధ భిక్షుకులు పలువురు సంస్కృతమునందలి వందల కొలది బౌద్ధగ్రంథములను టిబెట్ భాషలోనికి అనువదించిరి. ఈ యుగమున సింహళమున హీనయాన బౌద్ధము స్వీయ ప్రతిపత్తిని నిలుపుకొనగలుగుటయేకాక, క్రమముగ బర్మా, సయామ్‌దేశములలో మహాయానపు పలుకుబడిని అంత రింపజేసి, తానట వ్యాపింపగలిగినది.

కాని, ఈ యుగాంతమునకు బౌద్ధమతమున చొరవ కల్పించుకొనిన ఒక విలక్షణతను ఇట పేర్కొనవలసి ఉన్నది. భారతదేశమున ఆ మతమునకు స్థావరము మృగ్యమగుటతో వివిధ దేశముల బౌద్ధమత సంప్రదాయములకు కూడలిగ ఉపకరించిన మూలము అంత రించినది. అంతటినుండి ఆ యా సంప్రదాయములు తాము వ్యాపించిన దేశముల జాతీయ భావనతో మేళనము చెందుట తప్ప వానికి వేరు గత్యంతరము లేకపోయినది. అందువలననే చీనా దేశమునందలి బౌద్ధము అచటి జాతీయ సంప్రదాయములగు కన్‌ఫ్యూషియన్, టావో వాదములతో సమన్వయత చెంది, చీనా జాతీయజీవనమున అంతర్భాగమైనది. కొరియా, జపాన్, టిబెట్ దేశము లందును ఇట్టి పరిణామమే దానికి సంఘటిల్లినది. జపాన్‌ నందలి సాంప్రదాయిక షింటో మతముతోడను, టిబెట్ నందు పూర్వము నుండియు వ్యాప్తియందుండిన 'బోన్' అనబడు తాంత్రికవాదముతోడను ఆ మతము సమన్వయ తను సాధించి ప్రత్యేక రూపముల సంతరించుకొని అటులనే నేటికిని ఆ యా దేశములందు వ్యాప్తియందున్నది.

క్రైస్తవమతము ఈ యుగమున క్రీ. శ. 1000 నాటికి యూరప్ ఖండమునందు అంతటను వ్యాపింపగలిగినది. రోమన్ సామ్రాజ్య పతనానంతరమున పశ్చిమ యూరప్‌న ఏర్పడిన అరాజక పరిస్థితిలో సామాజిక స్థైర్యమును కాపాడుటకు గ్రెగరీ మొదలగు పోప్‌ల ఆధ్వర్యవమున జరిగిన కృషియే ఇందులకు ఒక ప్రముఖ కారణమని చెప్ప వచ్చును. క్రైస్తవ మతముయొక్క ఈ సాంఘిక ప్రయో జనమును గుర్తించిన షార్లమేన్, ఆల్‌ఫ్రెడ్ మొదలగు ప్రభువులు ఈ వ్యాపనమునకు శీఘ్రగతిని చేకూర్చిరి. క్రైస్తవమతము ఇటుల వ్యాపించుటతో మతాధిపతులగు పోప్‌ల అధికారము విస్తృతమై, నిరవధికాధికారము నిరవధిక కాలుష్యమునకు దారితీయునను నానుడి వారి యందును సార్థక్యము పొందినది. పోప్‌లయందు పొడమిన అధికారలాలసతయే పవిత్ర రోమన్ సామ్రాజ్య ప్రభువు లలో పలువురతో వారు సంఘర్షణలకు దిగుటకు కారణ మగుట మొదలగు వివరములు లోగా వేరొకచోట చారిత్రక విషయ కథనమున పేర్కొనబడినవి [చూ. పు. 48]. పోప్‌లకు, చక్రవర్తులకును మధ్య బయలుదేరిన వైమనస్యములవలన పోప్‌ల పలుకుబడి క్రమముగ చాల తగ్గినది. ఇందులకు తోడుగ క్రీ. శ. 1000 ప్రాంతమున క్రైస్తవలోకము రెండు శాఖలుగ విడివడుటతో ప్రాచ్య యూరప్‌నందలి క్రైస్తవులపై పోప్‌నకు గల అధికారము అంతరించినది. ఈ విభజనకు చారిత్రక కారణములు పెక్కు కలవు. తొలుతనుండియు పశ్చిమ యూరప్‌నందలి క్రైస్త వులు లాటిన్ భాషనే మత ప్రమాణ గ్రంథముల భాషగ ఆదరించిరి. తూర్పు యూరప్‌న అటులగాక గ్రీక్ భాష యందే మత గ్రంథముల రచనయు, ప్రార్థనలును జరుగు చుండెడివి. ఇందులకు మత మూలసూత్రముల వివరణను గురించిన అభిప్రాయ భేదములును తోడైనవి. పశ్చిమ, మధ్య యూరప్‌లందు పోప్‌లచే ఆదరితమై, ప్రచారము లోనికి వచ్చిన మూర్తిపూజను ప్రాచ్యయూరపీయన్ క్రైస్తవ గురువులు అంగీకరింపరైరి. వీటి అన్నింటిని మించిన ప్రముఖకారణము యూరప్‌నందలి నాటి రాజ కీయ పరిస్థితి. ప్రాచ్యయూరప్‌న బైజాంటైన్ ప్రభువులు తురుష్కులచే తాము అంతమొందింపబడువరకు ఆ యుగ మున ఆధిపత్యము వహించిరి. పశ్చిమ యూరప్‌పై వారికి అధికారము లేకపోవుటవలన పోప్ నిరంకుశత్వ మును వారు అదుపులోనికి కొని రాజాలక పోయిరి. అందుచేత తమకు సన్నిహితుడగువాడే తమ రాజ్యమందలి క్రైస్తవ లోకముపై పెత్తనము కలిగియుండుట అనువుగ ఉండునని ఆ ప్రభువులు భావించిరి. ఈ కారణముల అన్నింటి ఫలితముగ క్రీ. శ. 1000లో క్రైస్తవలోకము రెండుశాఖలుగ చీలినది. రోమ్‌నందలి పోప్ ఆధిపత్యమును అంగీకరించిన పశ్చిమశాఖకు 'రోమన్ కేతలిక్ చర్చి' అనియు, కాన్‌స్టాంటినోపుల్ నగరపు ప్రముఖ మతా చార్యుని (పేట్రియార్క్) ఆధిపత్యమును అంగీకరించిన తూర్పుశాఖకు 'గ్రీక్ ఆర్తడాక్స్ చర్చి' అనియు పేరులు అంతటనుండి కలిగినవి.

క్రైస్తవలోకము ఇటుల రెండుగ చీలిన తరువాత సైతము పోప్ ఆధిపత్యము పశ్చిమ, మధ్య యూరప్‌లందు కొంతకాలమువరకు నిరాఘాటముగ కొనసాగినది. ఇందు లకు క్రూసేడ్‌లు చక్కగ ఉపకరించినవి. క్రైస్తవ పుణ్య క్షేత్రముల రక్షణకై క్రైస్తవ ప్రజానీకమున చెలరేగిన గాఢాకాంక్షను ఊతగ గ్రహించి తమ అధికారమును

దృఢతరము చేసికొనుటకు పోప్‌లు యత్నించిరి. ఫ్రెడరిక్ - II మొదలగు ప్రాజ్ఞ ప్రభువులు దీనిని నిరోధింపదలచినను, వారందు గణనీయమగు సఫలతను ఆర్జింపలేక పోయిరి. పోప్‌ల చర్యలపట్ల చక్రవర్తులకు ఎట్టి నిరసన భావము ఉన్నను, పోప్ పదవి రద్దు అయినచో సామాజిక స్థిరతకే భంగము కలుగునని వారు భావించువారగుట పోప్ పదవికి స్థైర్యము సమకూర్చినది. క్రూసేడ్‌లు ఇంకొక తీరుగ సైతము పోప్‌లకు ఉపకరించినవి. క్రూసేడ్‌లలో పాల్గొన అశక్తులైన వారినుండి, వారి శక్తిననుసరించి ధనమును వసూలుచేసి, వారి అపరాధముల క్షమించుచు క్షమాపణ పత్రము (ఇండల్ జెన్స్) లను విక్రయించుట ఇందుతో ఆరంభితమైనది. ఇది మంచి ధనాదాయమార్గముగ కడకు పరిణమించినది. కావున క్రూసేడ్‌లు తుదముట్టిన తరువాత కూడ ఈ మార్గమును వీడుటకు పోప్‌లు ఇష్టపడలేదు. క్రైస్తవ మతానుయాయులు తాము చేసిన పాపములనుండి విముక్తిపొంది, స్వర్గరాజ్యమున తమకు మున్ముందు మరణానంతరమున స్థానము చేకూరుటకై అనుమతి పత్రములుగ ఉపకరించునను ప్రథను కల్పించి, ఈ క్షమాపణ పత్రములను అంతటినుండి పోప్‌లు విక్రయింపజేయ మొదలిడిరి. ఈ విధముగ ధనము కలవానికి సులభముగ అరచేతిలోనికి స్వర్గము వచ్చు ఉపాయమును చూపెట్టి క్రైస్తవమతమును నవ్వులపాలగు దుస్థితికి ఈ యుగాంతమునకు పోప్‌లు కొనివచ్చిరి.

క్రైస్తవ మతమునకు ఇట్టి దుష్పరిణామములను చేకూర్చిన పోప్‌ల అధికార జాడ్యమనెడు ప్రతీపశక్తిని ఎదుర్కొనుచు, ఆ మతమున తొలుతటినుండియు జ్ఞాతముగనో, అజ్ఞాతముగనో ప్రచలితమైన ఒక అభ్యుదయశక్తిని మనమిట విస్మరించరాదు. క్రైస్తవ వ్యక్తిగత జీవితమును పవిత్రమార్గమున నడపుటకు తమ జీవితములను అంకితమొనర్చిన బెనిడిక్ట్ మొదలగు నిస్స్వార్థజీవుల మార్గమును అనుసరించిన ప్రముఖులు మొనాస్టరీలను ఆశ్రయించియో లేదా వేరుగనుండియో ఆ మతమును ఎదుర్కొనుచున్న చెడుగుల నివారించుటకు కృషిచేయుచుండిన విషయము ఇదివరలో ప్రస్తావింపబడినది [చూ. పు. 64]. అట్టి క్రైస్తవ సన్యాసులయు, పండితులయు జీవిత విధానములును, బోధనలును ఆ యుగమున క్రైస్తవమతమును రక్షించుటకు బాగుగ తోడ్పడినవి. అందులకు సంబంధించిన వివరములకు ఇట అవకాశము లేకున్నను, అట్టి కృషిలో భాగస్వామ్యము వహించిన వారిలో బ్రిటిష్ పండితుడు జాన్ విక్లిఫ్ (1320 - 1384), బొహీమియా వాసియగు జాన్ హస్ (1369 - 1415), ఫ్రాన్స్‌వాసియగు జాన్ కాల్విన్ (1509 - 1564), జర్మన్ దేశీయుడు మార్టిన్ లూథర్ (1483 - 1546) క్రైస్తవ మతచరిత్రయందు అత్యంత ప్రాముఖ్యము వహించిరని మాత్రము ఇట పేర్కొనక తప్పదు. వీరిలో తొలుతటి పండితుడు ఇంగ్లీషు భాషలోనికి బైబిల్‌ను అనువదించి, దేశభాషలలోనికి ఆ పవిత్రగ్రంథము అనూదితమగుటకు త్రోవ చూపించుటయే కాక, కేథలిక్ సిద్ధాంతములను పెక్కింటిని నిరసించి, క్రైస్తవమతమునకు తొలుతటి సరళతను చేకూర్చెను. రెండవవాడగు హస్ క్షమాపత్రముల అమ్మకమును తీవ్రముగ నిరసించి, పోప్ అధికారమును ధిక్కరించుటచే, మత బహిష్కృతుడై, మత సభచే విచారింపబడి, శిక్షితుడై తత్పర్యవసానముగ సజీవముగ కొరతన దగ్ధుడయ్యెను. జాన్ కాల్విన్ విగ్రహపూజను నిరసించి తీవ్ర సంస్కరణలను అమలులోనికి కొనివచ్చి, క్రైస్తవమతమందలి నేటి ప్రెస్బిటేరియన్ సంప్రదాయమునకు మూలపురుషుడు అయ్యెను. ఈ మువ్వురికన్న ఎక్కువ విజయమును సాధించిన ఖ్యాతి మార్టిన్ లూథర్‌నకు దక్కినది. క్రైస్తవ మతముపై పోప్‌నకు కల అధికారమును ఇతడు నిరసించుటయే కాక పోప్‌ల ఆధ్వర్యవమున క్రైస్తవమతమందు ప్రవేశము కల్పించుకొనిన దురాచారములను పెక్కింటిని ఖండించి, తన వాదమునకు కల 95 ఉపపత్తులను లిఖించిన పత్రములను స్వస్థలమగు విట్టెన్‌బర్గ్‌లోని క్రైస్తవాలయపు తలుపుపై 1517 లో చీల బిగింపుచేసి, ప్రతిపక్షులను వాదమునకు ఆహ్వానించెను. ఈ ఉపపత్తులు నాటి క్రైస్తవ లోకమునంతటిని సంక్షుభితము చేయుటయేకాక, పోప్ అధికారమును త్రోసిరాజను ప్రొటెస్టెంట్ సంప్రదాయములు విస్తృతముగ యూరప్‌న నెలకొని, మత విప్లవమును ఒకదానిని లేవదీయుటకు కారణభూతములు అయినవి. ఈ విప్లవపు పరిణామ ఫలితములు తరువాతి యుగమున స్ఫుటరూపమును పొందుటచే అవి అట చర్చనీయములు.

ఇటుల అంతరంగిక సంక్షోభము వలన యూరప్‌నందు భిన్నశాఖలుగ క్రైస్తవము రూపొందిన ఈ యుగపు చరమభాగమున తుర్కులు బైజాంటైన్ రాజ్యప్రతిపత్తిని అంతముచేయుటవలన పశ్చిమ ఆసియానుండి ఆ మతము వైదొలగవలసి వచ్చినది. అయినను, 15 వ శతాబ్ది కడపటి దశకము నుండియు పశ్చిమ యూరప్ దేశీయ నావికులు నూతన దేశములందు చొరబడుటతో వారితో పాటుగ అమెరికా యందును, దక్షిణ ఆసియాయందలి తీర ప్రాంతములందును క్రైస్తవము తావు కల్పించుకొను

టయు జరిగి, విస్తృత ప్రపంచమును మున్ముందు తన కైవసము చేసికొనుటకు తెరువేర్పరచుకొనినది.

మతరాజ్యయుగమున ప్రపంచమున పలుతావులందు ఆ యా మతములు పొందిన వివిధ పరిణామములను గురించిన ఈ చర్చను ముగించుటకు ముందుగ, ఆ మతము లన్నింట ఏదియో ఒక తీరున ఆనాడు కనవచ్చిన అనుభూతివాదవికసనము ఒక సామాన్య లక్షణమును గురించియు, పశ్చిమ యూరప్‌న ఈ యుగమున వికసన మొంది ఆ ప్రాంతపు రాజ్యములకు ఒక విశిష్టతను చేకూర్చిన ఛాత్రవాదమును గురించియు ఇట పేర్కొన వలసి ఉన్నది.

పాశ్చాత్యులచే 'మిస్టిసిజమ్' అను పేరున వ్యవహరింపబడునదియే ఈ అనుభూతివాదము. అంతరనుశీలనచే సత్యమును కనుగొని, ఇంద్రియాతీతమగు దివ్యానుభూతిని సాధించు వ్యక్తిగత కృషి అని దీనిని స్థూలముగ నిర్వచింపవచ్చును. ఈ యుగమున అన్ని మతములందును ఏదియో ఒక ప్రస్ఫుటరూపమున ప్రపంచ విస్తృతముగ కొందరు వ్యక్తులచేతను, సంఘముల వలనను ఈ వాదము వికసన మొందుటకు కల సామాజిక భావనల చర్చ ఇట ప్రసక్తాంశముకాదు. కాని, కర్మకాండల వలన మతములు వేర్వేరు రూపములతో కన్పట్టుచున్నను, వీనియందలి ప్రాతిపదిక భావన ఒకటియే అనుట ఇందుమూలమున విదితమైనదని మాత్రము ఇట చెప్పవలసి ఉన్నది. క్రైస్తవ మతమున సెంట్ ఆంతోనీ (250-316)తో మొదలైన ఈ వాదము ఈ యుగమున సెంట్ బెర్నార్డ్ (1091-1153), సెంట్ తామస్ అక్వైనాస్ (1225-1274) మొదలగు వారివలన ప్రాబల్యమును చేకూర్చుకొనినది. ఇక భగవదస్తిత్వమున ప్రకటితాభిప్రాయమును వెలువరించిన బౌద్ధమున సైతము ధ్యానసంప్రదాయము పేరున ఈ అనుభూతివాదము తావు కల్పించుకొనినది. ఇస్లామ్‌నందు సూఫీలు అనబడువారు ఈ వాదమునకు అత్యంత ప్రచారమును కల్పించిరి. ఈ సూఫీల నిరాడంబరయుత స్వచ్ఛజీవనము వలననే భారతదేశమున పలువురు ఇస్లామ్ వైపునకు ఆకర్షితులైరి. ఇక హిందూమతమున జ్ఞాన, భక్తిమార్గముల ననుసరించిన మహాత్ముల జీవితములందు ఈ అనుభూతి వాదము తన పరాకాష్ఠను అందుకొనినది. ఇందువలన సూఫీల చింతనమునకును, జ్ఞానయోగ, భక్తియోగ నిష్ఠుల భావనలకును కల సాన్నిహిత్యమును గుర్తించిన పలువురు భారతదేశమున ఈ యుగమున హిందూ-ముస్లిమ్ మతముల సమన్వయమునకై కృషిచేసిరి. వీరిలో రామానందుడు (13 వ శతాబ్ది), కబీర్ (15 వ శతాబ్ది) ముఖ్యులు. గురునానక్ (1469-1538) కూడ ఈ కోవలోని వాడే. హిందూ-ముస్లిమ్ మతసమన్వయమునకై అతడు చేసిన కృషిఫలితమే నేటి సిక్కుమతము.

ఇక ఛాత్రవాదమనునది క్రైస్తవమతమున ఈ యుగమున రూపొంది ఆ మతమునకు ఒక ప్రత్యేక విశిష్టతను చేకూర్చిన దానినిగ మనము పరిగణింపవచ్చును. మత, దార్శనిక, విజ్ఞానశాస్త్ర సంప్రదాయముల ఏకీకృత వ్యవస్థ అని దీనిని నిర్వచింపవచ్చును. ఆనాటి మతములలో ఇస్లామ్‌న తప్ప తక్కిన వానియందిట్టి కృషి ఆ యుగమున జరుగలేదు. ఇస్లామ్ నందలి ముతాజిల్ వాదము ఇందులకు సన్నిహితము. కాని దానిని ఛాందసవాదులు మొగ్గలోనే త్రుంచివేయుటతో అది అంతరించినది. క్రైస్తవమున మాత్రము ఇయ్యది సంపూర్ణ వికసన మొంది, మానవతావాదమునకు మార్గమును సుగమము చేసినది. తరువాతి యుగమున క్రైస్తవరాజ్యములు తదితర రాజ్యములను అధిగమించి పురోగమించుటకు పూర్వరంగముగ ఈ ఛాత్రవాద [చూ. సం. 7 - పు. 412] వికసనము ఈ రీతిగ కొంత తోడ్పడినది.

## సంఘ వ్యవస్థ

**ఇస్లామ్‌మత ప్రభావము :** ఈ యుగమున ప్రత్యేకముగ గమనింపదగినది సాంఘిక రాజకీయ వ్యవస్థలపై ఇస్లామ్ మత ప్రభావము. ముస్లిమ్ సమాజము మతరాజ్య వ్యవస్థా ప్రాతిపదికపై మహమ్మద్ ప్రవక్తచే తొలుత రూపొందింపబడినది. ప్రవక్త జీవించి ఉండినంతకాలము ఆ వ్యవస్థకు అతడు మార్గదర్శిగ వ్యవహరించెను. తనకు శ్రుతిగోచరమగు భగవద్వాణిని అనుసరించి ఆ యా సమయములందు ఈ వ్యవస్థాపాలనమునకై అతడు నియమములను ఏర్పరచెను. ఆతని కాలమున పరిపాలనమును నిర్వహించు ఉద్యోగివర్గముకాని, పరిపాలనా యంత్రముకాని ఉండెడిది కాదు. అన్ని విషయములందును అతడే ప్రత్యక్షపు జోక్యము వహించి నడపెడివాడు. కాని, నిర్ణయములను తీసికొనుట మొదలగు విషయములలో అతడు కొన్ని సంప్రదాయములను నెలకొల్పగలిగెను.

1. ఏ నిర్ణయమైనను, సమాజ సభ్యులను సంప్రతించిన మీదటనే రూపొందింపబడెడిది; అట్టి సంప్రతింపులలో ప్రతి సభ్యుడును స్వేచ్ఛగ తన అభిప్రాయములను వెలువరించెడివాడు;

2. సమాజమునందలి పేదసాదలను, ఆతురులను పోషించుటకై 'జికత్' అను పేర సభ్యులనుండి కొంత మొత్తము వసూలు చేయబడెడిది;

3. ముస్లిమ్ ఆధిపత్యముగల రాజకీయ వ్యవస్థయందు పాల్గొను యూదులు, క్రైస్తవులు మొదలగు ముస్లిమేతర సమాజముల హక్కులను, బాధ్యతలను నిర్వచించుచు, ప్రవక్త కొన్ని ఒడంబడికలను కుదుర్చుకొనెను.

ఈ విధముగ కొన్ని మూలసూత్రముల రూపొందించిన ఫలితముగ ఒక విధమైన ప్రజాతంత్రపు శ్రేయోరాజ్యమునకు మహమ్మద్ పునాదులు వైచెను. ఈ వ్యవస్థ మత విషయికమే అయినను, మతేతరులు కూడ కొన్ని హద్దులకు లోబడి తమ తమ సంప్రదాయములను అనుసరించి జీవించుటకు తెరువు ఏర్పరుపబడినది. ఇటుల తమ పాలనలో ఉండిన మతేతరుల ధన, ధర్మ, ప్రాణ రక్షణకు ముస్లిమ్ రాజ్యము పూచీపడినందులకు ప్రత్యామ్నాయముగ 'జిజియా' అను పన్నును వారు చెల్లించవలసివచ్చుటయు ఆ కాలముననే ఏర్పడినది.

మహమ్మద్ అనంతరమున ముస్లిమ్ సమాజమునకు కలీఫా పదవిని అధిష్ఠించిన వాడు పెద్దయయ్యెను. ఇతనిని ముస్లిమ్ ప్రజలు ఎన్నుకొనవలయునను విధి తొలుత ఉండెడిది. ఇతడు ముస్లిమ్ ప్రార్థనలను నిర్వహించు ఇమామ్‌గనే కాక, రాజకీయాధిపతిగ (అమీర్ అల్ మొమీనిన్) సైతము వ్యవహరించెడివాడు. ఇటుల ప్రవక్త వలె భగవద్వాణిచే నడపింపబడువాడు కాక సామాన్య మానవుడు ఒకడు సమాజముపై పెత్తనము వహింపవలసి వచ్చినను, ఏ విషయమునందు అయినను ఖురాన్ గ్రంథమే తుది అధికారముగ ఉండుటవలన, మత రాజ్య వ్యవస్థ చెక్కు చెదరక ముందునకు నడవగలదని తొలుత ఆశింపబడినది. తొలుతటి కలీఫాల విషయమున ఈ ఆశకు భంగము కలుగలేదు. ముస్లిమ్ సమాజము విస్తృతిని పొందిన కొలది, తదనుగుణముగ ఈ కలీఫాలు ఒక పరిపాలనా యంత్రాంగమును రూపొందించిరి. ఇస్లామ్ సమతా ధర్మమును అక్షరశః పాలించుటకు వీరిలో కొందరు కృషి చేసిరి. తనకు సంబంధించిన ఒక న్యాయ వివాద సందర్భమున సామాన్య పౌరునివలెనే న్యాయాధీశుని ఎదుట కలీఫా ఓమర్ హాజరయ్యెను. అగతికులకు సహాయము చేయు సందర్భమున వారి ఇండ్లకు తక్కిన కూలీలవలెనే అతడును పిండిమూటలను మోసెడివాడట. ముస్లిమ్ రాజ్యమందలి ముస్లిమేతరుల హక్కులను కుంచింపజేయుటను అతడు తీవ్రముగ నిరసించుటయేగాక, ముస్లిమ్ రాజ్యమందలి అగతికులలో ముస్లిమేతరులగు వారిని సైతము పోషించవలసిన అనుల్లంఘనీయ బాధ్యత ముస్లిమ్ సమాజముపైనను, రాజ్యముపైనను కలదని ఖురాన్ విధించుచున్నదని అతడు తెల్పి, అందులకు ఆధారముగ ఖురాన్‌నందలి ఒక సురా (గీతము)కు సాధికారిక వ్యాఖ్యానమును ప్రవచించెను.

క్రీ. శ. 660 లో నాలుగవ కలీఫా అంతరించిన తరువాత ముస్లిమ్ సమాజమున రాజకీయ విభేదములు అత్యంత క్లిష్టస్థితికి దారితీసినవి. ముస్లిమ్‌లు రాజ్య విస్తృతిని లక్ష్యముగ ఇడుకొనరాదనియు, అరేబియా వరకే తమ కార్యక్షేత్రమును పరిమితము చేసికొని, ఇస్లామిక్ ఆదర్శముల సాఫల్యమునకై నిరంతర కృషిని చేయుటయే సముచితమగుననియు కొందరు ముస్లిమ్ నాయకులు వాదించిరి. కాని, వీరి వాదము నెగ్గలేదు. వీరి ప్రతిస్పర్ధులు మువావియా అను వాని నాయకత్వమున ముస్లిమ్ సమాజమున పలుకుబడిని ఆర్జించిరి. ఇస్లామ్‌ను ప్రపంచమంతట వ్యాపింపజేయుటయే మువావియా యొక్క లక్ష్యము. ఇది కార్యరూపములో కడకు అరబ్బుల ఆధిపత్యమున నడచు ఏకనాయక ప్రభుత్వమునకు దారితీసినది. ఈ మువావియాచే సంస్థాపింపబడిన ఒమ్మాయిద్ వంశమునకు చెందిన కలీఫాలు ఈ విధముగ నిరంకుశ ప్రభువులైరి. ఈ ప్రభువులును ఖురాన్‌నే తమ పవిత్ర గ్రంథముగ గ్రహించుట నిజమే. కాని, దైనందిన పరిపాలనా వ్యవహారములందు పెక్కింటను-ఖురాన్ వలన నిర్దిష్టములగు మార్గములు సూచింపబడని సందర్భమున-ప్రవక్త జీవితకాలపు వ్యావహారిక నిర్ణయములు ఏవియైన అందులకు ఉపకరించునెడల అవి అనుసరింపబడవలయుననియు, అట్టివియు లభించనియెడ కలీఫాయే తన బుద్ధిని ఉపయోగించి ముస్లిమ్ ప్రజానీకమునకు నచ్చెడు సముచిత నిర్ణయమును తీసికొనవలయుననియు ఒక సంప్రదాయమును తొలుతటి కలీఫాలు ఏర్పరచిరి. ముస్లిమ్‌రాజ్యము విస్తృతమైనకొలది మహమ్మద్ కాలపు ముస్లిమ్ సమాజము కని, విని, తలపోసియెరుగని నూతన పరిస్థితులు పెక్కులు ఆ సంఘమును ఎదుర్కొనినవి. అట్టియెడ కలీఫాలు సముచిత నిర్ణయములను కైకొనుటలో మానవ సహజమగు అధికారవాంఛ వానికి రూపొసంగెడిది. అట్టి నిర్ణయములు సాధారణముగ ఇస్లామ్ మూలసూత్రములకే వైదొలగియుండుట వలననే మతానుయాయులగు పలువురు జ్ఞానులు వానిని నిరసించి, రాజకీయములలో పాల్గొనక, తమ వ్యక్తిగతాదర్శ జీవనమునే ప్రచార సాధనముగ గ్రహించి ఇస్లామ్ మత వ్యాపనమునకు కృషి చేసిరి.

ఒమ్మాయిద్ కలీఫాల పాలనను తుదముట్టించి, తన్మూలమున ముస్లిమ్ లోకమున అరబ్బుల ఆధిపత్యమునకు స్వస్తిచెప్పి, అధికారమును గ్రహించిన అబ్బాసీయుల

కాలమున పారసీక రాజ్యవ్యవస్థయందలి బాహ్యరూపములు సైతము యథాతథముగ గ్రహింపబడినవి. ససానియన్ ప్రభువుల కాలమునందువలెనే ఈ కలీఫాలును రాచరికపు మర్యాదకు అనువుగ ఒక వజీర్ (ప్రధాన మంత్రి) ను ఏర్పరచుకొనిరి. కాని, ఈ ప్రభువులది నిరంకుశ పాలనయే అయినను, సువ్యవస్థీకృతము, ఉదారతాయుతము అని అంగీకరింపక తప్పదు. పారసీక రాజుల కాలపు పరిపాలనాయంత్రాంగమును అంతటిని వీరు పునరుద్ధరించినను, న్యాయ నిర్వహణ మొదలగు వానియందును, పరిపాలనా మూలసూత్రముల విషయముననుఖురాన్‌నకు అవిరుద్ధముగ చరించుటకు సాధ్యమైనంత మేరకు శ్రద్ధ వహించిరి. తొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్ధమున అబ్బాసీయుల అధికారము సన్నగిలుటతో ముస్లిమ్‌లోకమందలి వివిధ ప్రాంతములందలి పాలకులు స్వతంత్రులైరి. అయినను బాగ్దాద్‌నందలి కలీఫా యొక్క నామమాత్రాధికారమును మాత్రము బలవత్తర ముస్లిమ్ ప్రభువులు సైతము ఆ తరువాత చాలకాలము గుర్తించిరి. ప్రసిద్ధ విజేతయగు గజనీ మహమూద్ (998-1030 ప.) సైతము బలహీనుడగు కలీఫా వలన తనకు రాగల ముప్పేమియు లేకున్నను, ఆ కలీఫా పరిగణనయే తన రాజ్యార్హతకు ఆధారముగ గ్రహించి వ్యవహరించెను. అయినను, ఇందులకు కొన్ని అపవాదములును లేక పోలేదు. ఈ యుగమున భారతదేశమును పాలించిన అల్లా ఉద్దీన్ ఖిల్జీ, మహమ్మద్ బిన్ తుఘ్లుక్ ఈ అపవాదములందు పేర్కొనదగినవారు. ఇది ఎటులున్నను, వివిధ ముస్లిమ్‌రాజ్యముల ప్రభువులలో పలువురు కలీఫాల పరిగణనను ఒక ముఖ్యవిషయముగ గ్రహించి, ఆ యుగమున వర్తించిరని చెప్పక తప్పదు. మువావియా తలపెట్టిన ప్రపంచ విస్తృత ముస్లిమ్ మత రాజ్యము ఈ విధముగ - యథార్థమున కాకపోయినను, నామమాత్రముగనైనను, ప్రపంచమునంతటను కాకపోయినను - ఆసియా, ఆఫ్రికా దేశములలో పరిగణనీయ విస్తృత ప్రాంతము నందైనను నెలకొల్పబడినది. ఈ వివిధ ముస్లిమ్ ప్రాంతములందును కొన్ని స్థానికములగు మార్పులకు లోబడి అబ్బాసీ కలీఫాల పరిపాలనా విధానమే అవలంబింపబడినది.

ఈ యుగ మధ్యభాగమున ముస్లిమ్ సేనలు తమ ఆక్రమణను మొదలిడువరకు భారతదేశమున రాజకీయ, సాంఘిక వ్యవస్థావిధానములు పురాతన సంప్రదాయములను అనుసరించియే కాలానుగతములగు కొలది మార్పులతో అమలునందు ఉండినవి. ఉత్తరదేశమున గుప్తులును, దక్షిణదేశమున చాళుక్య, పల్లవులును పెట్టిన ఒరవడియే తరువాతి పాలకులును అనుసరించిరి. ఈ యుగారంభమునకు చాల పూర్వముననే గణరాజ్యవిధానము భారతదేశమున అంతరించిన విషయము పాఠకులు ఎరిగియే యుందురు. ఆరవ శతాబ్ది మొదలుగ రాజపాలనయే ఏకైక పాలనా విధముగ భారతదేశమున పరిణమించినది. చాలవరకు ఈ రాజపదవి వంశపరంపరానుగతముగ సంక్రమించెడిది. కాని, కొలది సందర్భములందు ప్రకృతులు (పలుకుబడిగల పెద్దలు), మాండలికులు లేదా బ్రాహ్మణులు లేదా వీరందరును కలిసి పాలకుని ఎన్నుకొనుటయు జరిగెడిది. కాని, ఇట్టి సందర్భములు అరుదుగ ఉండెడివి. తన అనంతర పాలకుని రాజే నియమించు సందర్భమున సైతము రాజసభలోని సభ్యులును, రాజవంశికులును ఉపస్థితులై ఉండవలయునను నియమము ఉండెడిది. రాజ్యపాలనకు స్త్రీలు అనర్హులుగ ఆ కాలమున పరిగణింపబడలేదని తోచుచున్నది. తక్కిన ప్రాంతములందు ఎట్టులున్నను, ఆంధ్ర, కాశ్మీర్, ఉత్కళములందు మాత్రము స్త్రీలు ఈ యుగమున పరిపాలనా భారమును వహించినటుల స్పష్టమగుచున్నది. రాజు విష్ణ్వంశసంభూతుడను ప్రథ ఈ యుగమున భారతదేశమున సర్వసామాన్యముగ గ్రాహ్యమైనది. కాని, దీనిని నిరసించిన పండితులును కొందరు ఆనాడు ఉండిరి. రాజులకు విష్ణ్వంశను ఆపాదించిన ధర్మశాస్త్ర కర్తలు సైతము రాజులు స్వశ్రేయమును లక్షింపక ప్రజాశ్రేయమునే తమ ధ్యేయముగ ఇడుకొనవలయునని విధించిరి. ఈ విధిని ఈ యుగపు భారతదేశపు రాజులందరును ఆమోదించినను, అది కార్యరూపమును తాల్చుటమాత్రము ఆ యా రాజుల వ్యక్తిగత గుణములపై ఆధారపడి ఉండెడిది. ఇందులకు ముఖ్యకారణము వారి అధికారమును హద్దులో ఉంచు యంత్రాంగము లేకపోవుటయే. పరిపాలనా యంత్రమంతయు రాజుల ఇచ్ఛను అనుసరించి నడచెడిది. రాజనిర్ణయమే తుది నిర్ణయముగ అన్ని విషయములందును గ్రహింపబడెడిది. కాని, ఇచట ఒక విషయమును మరువకూడదు. సాంప్రదాయికముగ వచ్చిన గ్రామీణ స్వపరిపాలన మాత్రము ఈ యుగముననుభారతదేశమున చెక్కుచెదరక నిల్చుటచే, రాజులకు ప్రజల దైనందిన వ్యవహారములలో జోక్యము వహించు అవసరము ఎక్కువగ ఉండెడిది కాదు.

భారతదేశమున పలు ప్రాంతములను ముస్లిమ్‌లు ఆక్రమించిన కొలది, ఆ ప్రదేశములందు - పరిపాలనా విధానములందు - మార్పులును వచ్చినవి. ముస్లిమ్ సుల్తానులలో పలువురు కలీఫాకు నామమాత్రముగ బాధ్యత వహించి

నను, సర్వ విషయములందును నిరవధికాధికారముతో వ్యవహరించిరి. ఆ సుల్తానుల అధికారమునకు సైనిక బలమే ముఖ్యాలంబనము. వారి నిరంకుశతకు హద్దు ఎట్టిదియు ఉండెడిది కాదు. ఆనాటి చారిత్రక పరిస్థితులలో వారు ఆ విధముగ తప్ప మనజాలెడివారు కారని అంగీకరింపక తప్పదు. ఒక వైపు దేశీయులగు హిందూప్రభువులనుండియు, ప్రజలనుండియు, వేరొక వైపున మంగోల్ మూకల బెడదనుండియు వారు ఆత్మ రక్షణ చేసికొనుటలోనే వారి కాలము గడచుటవలన, తమ ప్రతిపత్తిని కాపాడుకొనుటకు బలమగు కేంద్ర ప్రభుత్వము ఆనాటి సుల్తానులకు ఆవశ్యకముగ కన్పట్టినది. ఈ బలమగు కేంద్రము కడకు నిరంకుశత్వమునకు మారు పేరుగ పరిణమించినది.

ముస్లిమ్ ఆక్రమిత భారతదేశముననేకాదు, తక్కిన ముస్లిమ్ రాజ్యములందును రాజత్వము సంక్రమించుటకు విధినియమములు ఏవియు ఆనాడు రూపొందింపబడలేదు. అయినను, ఆచరణయందు సాధారణముగ, మరణించిన పాలకుని వంశపు వారిలో ఒకనిని నిర్ణయించుటకే ఇది పరిమితమై ఉండెడిది. పుట్టుక, సమర్థత, పూర్వపాలకుని అభీష్టము అనునవి సాధారణముగ కొన్ని సందర్భములందు రాజపదవికి అర్హుని నిర్ణయించుటకు తోడ్పడెడివి. కాని, వీని అన్నిటిని తేల్చి నిర్ణయించు భారము సార్వత్రికముగ సర్దారులపైననే ఉండెడిది. ఈ సర్దారులు సాధారణముగ స్వీయ ప్రయోజనములపైననే శ్రద్ధవహించి వ్యవహరించెడివారే గాని, రాజ్య శ్రేయస్సును గమనించెడి వారే కాదు. కాని, ఈ సర్దారులు సైతము తమ పదవులకై ప్రభువును ఆశ్రయించియే ఉండవలసి వచ్చెడిది. బలవంతుడగు ప్రభువు సర్దారులలో పలువురను ఆ పదవినుండి తన ఇచ్ఛవచ్చిన రీతిలో తొలగించెడివాడు. వంశానుగతము లగు హక్కులు సర్దారులకు లేకుండ చేయుటలో ముస్లిమ్ ప్రభువులు కడు శ్రద్ధ వహించిరి. అందువలన ప్రజలలో పలుకుబడిని ఆర్జించి, వారితో కలసి మెలసి తిరిగెడి మాండలిక వర్గము రూపొందుటకు ముస్లిమ్ రాజ్యము లందు మార్గము మృగ్యమైనది.

చీనా దేశమందు టాంగ్ వంశపాలకులు ఏడవ శతాబ్ది ప్రథమభాగమున అధికారము గ్రహించినప్పటినుండియు రాజ్యాంగ వ్యవస్థను సువ్యవస్థీకృతము చేయుటకు వారు ఎంతయో కృషిచేసిరి. వారు నిర్మించిన వ్యవస్థయే కొలది మార్పులతో 1912 వరకు చీనాలో అమలునందు ఉండినది. చక్రవర్తి తన కార్యదర్శులను, ఆరు మంత్రి వర్గముల ప్రతినిధులను ప్రతిదినము సమావేశపరచి రాజ కార్యముల నిర్వర్తించుట టాంగ్ ప్రభువుల తోడనే మొదలైనది. దేశమంతయు తొలుత (637) పది రాష్ట్రములుగ విభజింపబడినను, పరిపాలనా సౌకర్యమునకై తరువాత 15 రాష్ట్రములుగ ఏర్పరుపబడినది (733). ప్రతి రాష్ట్రమునకును ఒక రాష్ట్రపాలకుడు (చౌ) ఉండెడివాడు. ఇతడు తన పాలితప్రాంతమునకు సంబంధించినంతవరకు ఆరు మంత్రివర్గముల కార్యక్రమములకును బాధ్యత వహించి వర్తించెడివాడు. పరిపాలనా సౌకర్యమునకై టాంగ్ ప్రభువులు దేశమునకు లోయాంగ్, చాంగన్ అను రెండు రాజధానులను ఏర్పాటు చేయుటయే కాక, ఉద్యోగులకు శిక్షణ నిచ్చుటకు ఆ నగరములలో ప్రతిదానియందును ఒక విద్యాపీఠమును నెలకొల్పిరి. ఆ యా రాష్ట్రముల నుండి నిర్ణీత సంఖ్యలో ఉత్తములగు విద్యార్థులను పోటీ పరీక్షలలో నిర్ణయించి, ఈ విద్యాపీఠములందు శిక్షణకై రాష్ట్రపాలకులు పంపెడివారు. శిక్షితులైన తరువాత ఈ విద్యార్థులను - అర్హతలను బట్టి - శ్రేణీ క్రమమున వర్గీకరించి ప్రభుత్వపు ఉద్యోగములందు నియమించెడివారు. ఈ విధముగ ప్రభుత్వ వ్యవస్థలో ఎగువనుండి ఎనిమిదవ శ్రేణి ఉద్యోగుల వరకు ఈ శిక్షితులగు విద్యార్థులే నియమింపబడెడివారు. ఉద్యోగి పై పదవిని పొందుటకు ఉద్యోగ నిర్వహణమందలి ప్రవీణత మాత్రమే కొలబద్దగ ఉపకరించెడిది.

ఈ యుగమున దాదాపుగ కడపటివరకు మని అంతరించిన ప్రాచ్య రోమన్ సామ్రాజ్యము - రోమన్ న్యాయశాస్త్ర నిర్వహణరీతులను కొనసాగించుచు - నిరంకుశ పాలనకు ఆటపట్టుగ వ్యవహరించినది. ఆసియా - యూరప్ కూడలియందున్న ఈ రాజ్యము వివిధ పార్శ్వములనుండి వైరరాజ్యముల ప్రతిఘటనను ఎదుర్కొని సదా మనవలసి వచ్చుటవలన కేంద్రప్రభుత్వాధికారము కాలక్రమమున ఎక్కువ పటిష్ఠతను ఆర్జింపవలసిన ఆవశ్యకతయు కలిగినది. తొలుతగ ఆ రాజ్యాంగవ్యవస్థయందు వారసత్వరీత్యా రాజరికము సంక్రమించవలసిన నియమము లేకపోయినను 9 వ శతాబ్ది ఉత్తరార్ధమునుండియు వారసత్వపు రాజరికమే అట కుదురుకొనినది. సార్వభౌముని సర్వాధికారమునకు లోబడి స్ట్రతగోయ్ అను ఉద్యోగి రాష్ట్ర పరిపాలనను నిర్వహించెడివాడు. పదనొకండవ శతాబ్ది ఆరంభమునకు ఆ సామ్రాజ్యమున ఇట్టి రాష్ట్రములు ముప్పది (వీనిలో 18 ఆసియాయందును, 12 యూరప్ లోను) ఉండినవి. నిత్యము యుద్ధములతో తలమునుకలగుచు తన ప్రతిపత్తిని ఈ సామ్రాజ్యము నిలుపుకొనవలసి ఉండుటచే, సామ్రాట్ల ఆదరణబలమున సైన్యమును,

నౌకాదళమును సువ్యవస్థీకృతము లయినవి. తత్ఫలితముగ కొన్ని సమయములందు సైన్య, నౌకాధ్యక్షుల పలుకుబడి రాజకీయములపై వ్యాపించగలిగినది. కాలక్రమమున రాష్ట్రపాలకులును తమ ప్రాంతములందు విరివిగ పలుకుబడిని ఆర్జించిరి. వీరిలో కొందరు విస్తారముగ భూములను కొనుగోలుచేసి, తమ అధికారమును తమ ప్రాంతమున సుస్థిరము చేసికొనిరి. చిన్న రైతుల కమతములను హరించుచున్న ఇట్టి భూస్వాముల యత్నములను నిరోధించి, వారి అధికారములను అరికట్టుటకు సార్వభౌముడు పెక్కుమారులు యత్నించియు విఫలుడయ్యెను. క్రమముగ ఈ భూస్వాములు సార్వభౌమునే ధిక్కరింప సాహసించిరి.

భూస్వామి వ్యవస్థ : ప్రాచ్య యూరప్‌నందుకన్నను భూస్వాముల పలుకుబడి పశ్చిమ యూరప్‌నందు ఆ యుగమున ఎక్కువగ వ్యాప్తిని పొందగలిగినది. ఆనాటి పశ్చిమ యూరప్‌నందలి పరిస్థితులు ఇందులకు బాగుగ ఉపకరించినవి. రోమన్ సామ్రాజ్య పతనానంతరమున పటిష్ఠమగు కేంద్రప్రభుత్వము లేకపోవుటవలన ఆ యా మండలములందలి ప్రజలు వ్యవస్థీకృతమగు సంఘమును ఏర్పరచుకొనుటకు తమ పరిస్థితులను అనుసరించి కృషి చేయవలసిన ఆవశ్యకత ఏర్పడినది. అపుడు బలవంతులను ఆశ్రయించి వారిని సంతృప్తిపరచి మనుటకన్న బలహీనులకు వేరొక మార్గము లేకుండెను. ఇటుల తమలో ఒక బలవంతుని అండగగొని బలహీనులు పలువురు తమ మనుగడకు ఉపకరించు ఒక సంఘవ్యవస్థను ఏర్పరచుకొనుటతో విభిన్న మండలవ్యవస్థలు ఏర్పడినవి. ఈ మండలములకు పెద్దలుగ ఉన్న బలవంతులందరును తమలో అత్యంత బలవంతుడగువానిని ప్రభువుగ అంగీకరించి, ఈ వ్యవస్థ చెక్కుచెదరక ఉండుటకై కృషిచేసెడివారు. కాని, వీరు అందరును భూమిని ఆశ్రయించి మాత్రమే ఆనాడు మనవలసి ఉండినది. అందువలన భూమిని సేద్యముచేయు భారము కట్టకడపటి బలహీనులపై పడినది. ఇట్టి వ్యవస్థనే 'భూస్వామి (ఫ్యూడల్) వ్యవస్థ' అని చరిత్ర రచయితలు వ్యవహరింతురు.

భూస్వామి వ్యవస్థలో రైతులకు భూమియందు స్వామ్యము ఉండెడిది కాదు. రైతు అధీనమున ఉన్న ఆస్తికి చట్టరీత్యా భూస్వామియే సర్వాధికారి. ఆ ఆస్తియందలి ఫలసాయమును తాను అనుభవించుచున్నందులకై రైతు భూస్వామికి ఆశ్రితుడు (వేసల్) గ ఉండెడివాడు. ఇక భూస్వామికి రైతు చెల్లించవలసిన కట్టడులు ఆ యా స్థానిక పరిస్థితులను బట్టి మారుచుండెడివి. ఇవి వస్తురూపముగనేకాక సేవారూపముగ కూడ ఉండెడివి. అవసరమైనపుడు తన భూస్వామి రక్షణకై యుద్ధమున సైనికుడుగ పాల్గొనుటకును రైతు సంసిద్ధుడై ఉండవలెను; భూస్వామి నివసించు దుర్గమునకు కావలా కాయవలెను. ఆ సంఘవ్యవస్థయందు రైతులే కాదు, తక్కిన వారును భూస్వామికి అంకితులై తమ జీవితమును గడిపెడివారు. ఇటుల తమ భూమియందలి ప్రజల ధన, మాన, ప్రాణములను తమ కైవసమున ఉంచుకొనిన భూస్వాముల హక్కులకు భంగము కలుగకుండ దేశపురాజు వ్యవహరించెడివాడు. అందులకు బదులుగ భూస్వాములు రాజునెడ భక్తిగలిగి యుద్ధాదులందు అతడు కోరినరీతిగ సాయపడి రాజరికపు మనుగడకు తోడ్పడెడివారు.

రష్యాకు పశ్చిమమున ఉన్న యూరప్‌నందు ఎనిమిదవ శతాబ్ది మొదలుగ ఇట్టి సాంఘికవ్యవస్థయే కుదురుకొనినది. ఆనాటి సంఘవ్యవస్థకు అనువైన భద్రతను చేకూర్చుటకు క్రైస్తవమతమును తోడ్పడినది. మొనాస్టరీలును, చర్చీలును పలుప్రాంతములందు వెలసి, విద్యాబోధనాదులకు ఉపకరించుటయేకాక, భూ రూపమున విరివిగ సంపదను ఆర్జించగలిగినవి. ఈ మతసంస్థల పెద్దలకు తత్ఫలితముగ భూస్వామియుగమున భూస్వాములతో దీటగు స్థానము లభించినది. ఇటుల క్రమముగ సంఘము ఆనాడు మతాచార్యవర్గము, ప్రభువర్గము, కృషికవర్గము అను మూడు వర్గములుగ విడివడినది. పోప్ మొదలుకొని గ్రామీణ మతబోధకుని వరకు గల క్రైస్తవ మత ప్రచారకులు మొదటి వర్గమునకు చెందినవారు; చక్రవర్తి, రాజు, భూస్వాములు, సైనికులు, రాజోద్యోగులు రెండవవర్గమునందలివారు; ఇక మిగిలిన శ్రామికలోకము మూడవ వర్గమునకు చెందినది. ఇట్టి సంఘవ్యవస్థలో భూస్వామిని లేదా చర్చిని ఆశ్రయించిన కుగ్రామములు తప్ప పట్టణములు రూపొందుటకు అవకాశమే లేకుండెను [చూ. తరగతివారీ వ్యవస్థ సం. 10 - పు. 417].

విశీర్ణమగు రోమన్ సామ్రాజ్యమందలి సంఘవ్యవస్థను ఏదియో ఒక తీరుగ నిలువబెట్టుటకు ఉపకరించిన భూస్వామి వ్యవస్థను చెక్కుచెదరకుండ నిలుపుటకు ఆ యుగపు ప్రభువులు ఎంతగ కృషిచేసినను, అందలి వివిధ వర్గముల మధ్యను, ఒకే వర్గమునందలి పలు అంతరువుల వారి మధ్యను ఉండిన వైరుధ్యముల ఫలితముగ క్రమముగ ఆ వ్యవస్థ పండ్రెండవ శతాబ్ది మొదలుగ మార్పులను పొంద మొదలిడినది. పోప్‌నకు రాజులతోగల వైరుధ్యములను గురించి ఇదివరలో తెలుపబడినది [చూ. పు. 65]. వీని ఫలితముగ మతాచార్యుల అధికారములకు కొన్ని

హద్దులు ఏర్పడుట మొదలైనది. దీనితోపాటుగ రాజునకును, భూస్వాములకును మధ్య చెలరేగిన ఘర్షణలును కొన్ని మార్పులకు దోహదము చేసినవి. ఈ ఘర్షణ ఇంగ్లండునందు స్ఫుటరూపమును చెంది, కడకు భూస్వాములు ఆనాటి పాలకుడగు జాన్‌పై ఒత్తిడిని కొనివచ్చి లొంగదీసి, రాజుయొక్క అధికారములకు హద్దులను ఏర్పరచు ఒక పత్రముపై అతడు సంతకముచేసి అంగీకరించునటుల చేయగలిగిరి (1215). ఈ పత్రమే 'మాగ్నా కార్టా' [చూ.] అను పేర వ్యవహృతము. ఆధునిక ప్రజాస్వామ్య సౌధమునకు ఈ పత్రమును ఒక పునాదిరాయిగ పేర్కొనవచ్చును. రాజుయొక్క నిరంకుశాధికారమునకు స్వస్తిచెప్పి, రాజును చట్టములకు బద్ధుడే అను విషయమును ధ్రువీకరించి, భూస్వాములయెడ రాజు చట్టబద్ధముగ వ్యవహరించు సంప్రదాయమును నెలకొల్పుటకు మాగ్నా కార్టాయందు సంకల్పింపబడినది. భూస్వాముల సమ్మతి లేనిదే క్రొత్త పన్నులను రాజు విధించరాదను సంప్రదాయము దీనివలన ఏర్పడినది. అందువలన తనమనుగడకై రాజు భూస్వాముల సభను అంతటంతట సంప్రదించవలసిన అవసరము కలిగినది. ఈ సభయే కాలక్రమమున ఇంగ్లండున 'పార్లమెంటుగ' పరిణమించి, ప్రజాస్వామ్య పరిపాలనకు త్రోవదీసినది.

భూస్వాములు ఇంగ్లండులో వలెనే, తక్కిన ప్రాంతములందును తమ హక్కులను నిలుపుకొనుటకై కృషిచేసిన ఆ కాలమున యూరప్‌లో సంఘమున అట్టడుగున ఉన్న కర్షకులు మొదలగు శ్రామికులు చేయునదిలేక చేతులు ముడుచుకొని నికృష్ట జీవితములను గడపుచుండిరి. ఇంతలో యూరప్‌నందలి సాంఘిక వ్యవస్థను అట్టుడికించి పలు పరిణామములను చేకూర్చుటకు మహామారి (ప్లేగు) జాడ్యము కారణభూతమైనది. 1340 మొదలుగ 1348 వరకు ప్రపంచమున అత్యధిక భాగమును - ముఖ్యముగ యూరప్‌ను - అది కల్లోలితము చేసెను. దీనిమూలమున యూరప్‌నందలి ప్రజానీకమున అత్యధిక భాగము నశించెను. కొన్నిగ్రామములే సర్వనాశనములై మరణించిన వారిని పూడ్చిపెట్టుటకు దిక్కులేని పరిస్థితులు ఏర్పడెను. విపరీతమగు ఇట్టి జననష్టమువలన కూలిపని చేయువారి సంఖ్య తగ్గి, వస్తూత్పత్తియు తగ్గెను; ఆస్తి విలువలు పడిపోయెను. ఇట్టి పరిస్థితులలో భూస్వాములు తమకు చట్టమొసగిన హక్కులను పురస్కరించుకొని, తక్కువ కూలికే ఎక్కువ పనిని చేయించుకొనుటకు యత్నించిరి; ఋణదాతలు ఋణస్తులను పీడింపసాగిరి. ఇట్టి చర్యల ఫలితముగ యూరప్‌నందు 14 వ శతాబ్ది ఉత్తరార్ధమున రైతుల తిరుగుబాటులు చెలరేగెను. ఈ పరిస్థితులలో యూరప్ ఆర్థికవ్యవస్థయందు వాణిజ్యమునకు ప్రాముఖ్యము కలుగ మొదలైనది. వాణిజ్యమును ఆశ్రయించి రూపొందిన వృత్తి శ్రేణులు మొదలగువానిలో పనివారుగ చేరుటకు దళితప్రజలకు అవకాశము కలిగినది. ఈ మార్పులను అర్థము చేసికొనుటకు ప్రాతిపదికగ మతరాజ్యయుగము నందలి ప్రపంచమున వాణిజ్యము వహించిన పాత్రను గురించి తెలిసికొనవలసి ఉన్నది.

ఈ యుగారంభమున చీనా, పారసీక, భారతీయ వర్తకులు భూమార్గమునను, జలమార్గమునను జరుగు వ్యాపారమున అత్యధిక భాగమును తమ కైవసము చేసికొని ఉండిరి. కాని, ఈ యుగమధ్యమునకు భారతీయులును, పారసీకులును ఈ పోటీనుండి వైదొలగి, వారి స్థానమును అరబ్బులకు దత్తము చేసిరి. ఈ మార్పునకు ఆ యా దేశములందు జరిగిన రాజకీయ సంఘటనలనే ప్రముఖ హేతువులుగ పేర్కొనవచ్చును. అయినను ఈ మార్పు చాపక్రింద నీటివలె క్రమగతిలో వచ్చినదేకాని ఆకస్మికముగ జరిగిన సంఘటన కాదు. 11 వ శతాబ్దిలో కూడ భారతీయ వాణిజ్య సంఘములు దేశస్థ వ్యాపారమునే కాక సముద్రాంతర విదేశ వాణిజ్యమును సైతము కొనసాగించిన నిదర్శనములు కన్పట్టుచున్నవి. ఇట్టి వాణిజ్య సంఘములలో 'అయిన్నూరువార్' అను సంఘమును గురించిన కొన్ని వివరములు తెలియవచ్చుచున్నవి. ఆనాటి రాజులకు ఉండినటులనే ఈ సంఘమునకును దీర్ఘమగు ప్రశస్తి ఒకటి ఉండెడిది. 'వీర వణిజ ధర్మ' పాలకులుగ వారి శాసనములందు ఈ సంఘము వారు పేర్కొనబడిరి. వారితో వర్తక సంబంధముగల విదేశములలో మలయా, కాంభోజ, పారసీక దేశములు లెక్కింపబడినవి. సముద్రములను దాటి ఆరు ఖండములందలి రేవులకును తాము పయనించెడివారమని వారు చెప్పుకొనిరి. 1088 వ సంవత్సరపుదిగ గుర్తింపదగిన వీరి శాసనము సుమత్రాయందు కనుగొనబడినది. అట్టులే బర్మాయందలి పేగన్ నగరమున ఆ కాలముననే ఒక విష్ణుదేవాలయమును నిర్మించి, వారొసగిన శాసనము కూడ ఒకటి తెలియవచ్చినది. చీనాతోడను ఆ కాలమున భారతదేశము వర్తక సంబంధములను కలిగి ఉండినది. భారతీయ వర్తకుల వలస ఒకటి క్రీ. శ. 8 వ శతాబ్దిలో చీనాయందలి కేంటన్ నగరమున ఉండెడిదనియు, అచట హిందూ దేవతలకై ఆలయములను పెక్కింటిని వారు నిర్మింపజేసిరనియు తెలియవచ్చుచున్నది.

విదేశ వాణిజ్యమునను, భూమార్గమున బైజాంటైన్, పారసీకరాజ్యములతో జరుపు వ్యాపారమునను చీనీయులు

తొలుతనుండియు శ్రద్ధవహించినను, ఆ దేశమందలి రాజకీయ పరిస్థితులవలన తొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్ధము నుండియు విదేశవ్యాపారమునకు ప్రోత్సాహము సన్నగిలినది. కాని, పదవ శతాబ్ది అంతమున పరిస్థితులు కుదుటబడినంతట, నాటి సుంగ్ ప్రభుత్వము విదేశ వ్యాపారముపై ప్రత్యేక శ్రద్ధవహించి దానిని ప్రభుత్వపు ఏకైకాధిపత్యమునకు లోజేసి ప్రోత్సహించెను. అంతటినుండి 15 వ శతాబ్ది ఉత్తరార్ధమువరకు చీనా నౌకలు ఆఫ్రికా తూర్పుతీరముదనుక వాణిజ్యమును కొనసాగించినవి. మంగోల్ చక్రవర్తులు చీనాను ఆక్రమించిన తరువాత ఈ వ్యాపారమునకును, నౌకా నిర్మాణమునకును ప్రభుత్వ ప్రోత్సాహము పూర్వముకన్న మిన్నగ లభించినది. వారి తరువాత మింగ్ ప్రభువుల కాలమున నౌకా నిర్మాణ విద్య తన పరాకాష్ఠను అందుకొనినది. పెక్కు తెరచాపలు కల నౌకలను నిర్మించుట 1420 నాటికి ఎక్కువ పరిణతిని పొందినది. కాని, ఈ నౌకాయానము మూలమున దేశమున ఒక ప్రత్యేకవర్గము బలపడుటను సహించనివారి ప్రోద్బలము వలన ప్రభువుల ప్రోత్సాహము అంతటినుండి నౌకా వ్యాపారమునకు సన్నగిల్లెను. విదేశ వ్యాపారము వలన దేశమునందలి అమూల్య ధాతువులు విదేశములకు తరలింపబడుట తప్ప వేరు ప్రయోజనము లేదను అభిప్రాయమునకు బలము లభించెను. దాని పర్యవసానముగ రెంటిని మించిన తెరచాప కొయ్యలుగల నౌకల నిర్మాణమును నిషేధించుచు చీనా ప్రభుత్వము శాసనము చేసెను (1500). అంతటితో విదేశవ్యాపార రంగమునుండి చీనా నిష్క్రమించినది. అరబ్బీవర్తకులే ఆ స్థానమునుకూడ ఆక్రమించి ఉందురు. కాని, కొన్ని పరిణామముల మూలమున అరబ్బులను కడకు ద్రోచి పోర్చుగీస్‌వారును, తరువాత క్రమముగ తక్కిన యూరపియన్ జాతులవారును ఆ స్థానమును ఆక్రమించిరి.

యూరపియన్ జాతులలో వర్తక వ్యాపారములందు అభిరుచిని కల్గించుటకు తోడ్పడిన చారిత్రక పరిణామములలో తొలుతగ పేర్కొనవలసినవి క్రూసేడ్‌లు. క్రూసేడ్‌లకు పూర్వమున యూరప్‌తో ప్రాచ్యరాజ్యములు జరుపు వ్యాపారమునకు బైజాంటైన్ రాజ్యమును, మధ్యధరా సముద్రతీర ప్రాంతమునందలి వెనిస్ మొదలగు కొన్ని రేవులును వినిమయ స్థానములుగ ఉపకరించెడివి. కాని, ఈ వర్తకమున పశ్చిమ యూరప్‌నకు భాగస్వామ్యము చాల తక్కువ ఉండెడిది. పశ్చిమ యూరప్‌నందలి ఉన్నత వర్గముల జీవితవిధానమున భోగలాలసతకు అప్పటికి తావు లభింపకుండెను. క్రూసేడ్‌ల మూలముగ యూరపియన్ యోధులకు, ధనికులకు, భూస్వాములకు ప్రాచ్య ప్రపంచపు జీవిత విధానముతో పరిచయము లభించినది. బైజాంటైన్ ప్రభువులు, తుర్కుసుల్తానులు గడపెడి భోగయుత జీవనము వారిని ఆకర్షింపగలిగినది. ప్రాచ్యదేశములందు దొరకు సన్నని వస్త్రములు, పింగాణి సామగ్రి, మసాలా దినుసులు మొదలగువానికై యూరప్‌నందు అంతటినుండి గిరాకీ హెచ్చినది. సంఘమున వర్తక వర్గము ఏర్పడుటకు ఈ పరిస్థితి దారి తీసినది.

అరబ్బులతోను, తుర్కులతోను పరిచితి వలన విశాల ప్రపంచమును గురించిన పరిజ్ఞానము పాశ్చాత్యులలో అంతటినుండి అధికమైనది. సుసంపన్నములగు విశాల ప్రాచ్య దేశములకు పయనించి సంపదను ఆర్జించుటకు సాహసికులు పలువురు కృషి చేయుటకు ఇందువలన ప్రోత్సాహము లభించెను. ఈ రాకపోకలు తొలుత భూమార్గమునే ఆశ్రయించినవి. 13 వ శతాబ్దమున ఏర్పడిన మంగోల్ సామ్రాజ్యము ఇట్టి రాకపోకలకు కొంత భద్రతను కల్పించినది. ఇట్టి సాహసచర్యలకు పూనుకొనినవారిలో మచ్చుతునకగ పేర్కొనదగినవాడు మార్కో-పోలో [చూ]. ఇటలీ వాసియగు ఈతడు 1271 లో స్వదేశమును విడిచి 1295 నాటికి ఆసియాలో ఒక మూలనుండి వేరొక మూలవరకు తన పర్యటనలను సాగించి తన అనుభవములకు లిఖితరూపము కల్పించి, చీనా, భారత దేశముల వైభవ సంపదలయెడ యూరప్‌వాసులకు ఆసక్తిని కల్పించెను.

క్రూసేడ్‌లవలన వేరు విధముగ సైతము యూరప్‌నకు ప్రయోజనము సమకూరినది. ప్రాచ్యజాతులతోటి పరిచయమువలన వ్యవసాయము మొదలగు వానియందు నూతన విషయములను యూరప్‌వాసులు గ్రహించిరి. వానిని అమలులో పెట్టుటవలన దేశమున క్రమముగ ఉత్పత్తి పెరిగినది. అడవులను కొట్టి, బాడవల నీటిని వెలుపలికి పారించి, క్రొత్త క్షేత్రములను సాగుచేయుట అంతట మొదలైనది. తమకు కావలసిన వానికన్న అదనముగ ఉన్ని, చర్మములు మొదలగు వానిని రైతులు తమ కృషి వలన ఉత్పత్తిచేయుటతో వాని ఎగుమతికై వర్తకవర్గము పల్లెలందును స్థానమును ఆర్జింపగలిగినది. కాని, ఈ అదనపు ఉత్పత్తికి అమ్మకమునకై కేంద్రస్థానముల ఆవశ్యకత క్రమముగ కలిగి అట్టి కేంద్రములు అటనట స్థాపింపబడినవి. ఈ కేంద్రములు కడకు పట్టణములుగ రూపొందినవి. నార్త్ సముద్రమును, బాల్టిక్ సముద్రమును చుట్టుముట్టి తీర భూములందు తొలుతగ పెక్కు పట్టణములు బయలుదేరినవి. ఈ పట్టణములందలి జర్మనీ వర్తకులు రష్యాలోని బొచ్చు సరకులను ఇంగ్లీషు సరదారులకును, ఫ్రెంచిదేశపు ద్రాక్ష

సారాయిని నార్వేయందును విక్రయించెడివారు. ప్రతి శుక్రవారముతో బాటు కొన్ని ప్రత్యేక పర్వదినములందు మాంసాహారము నిషిద్ధమని మతాధికారులు ఆ కాలమున విధించుటవలన, బాల్టిక్ సముద్రమున విరివిగ లభించు చేపలకు గిరాకీ విరివిగ ఉండుటచే, జర్మనీ వర్తకులు వివిధ క్రైస్తవ దేశములకును వానిని ఎగుమతి చేసెడివారు. ఉత్తర యూరప్‌న బ్రూజిజ్ నగరము ఆ కాలమున ముఖ్య వర్తక కేంద్రముగ పేరెన్నికను పొందినది. నేడు బెల్జియమ్ అని వ్యవహరింపబడు ప్రాంతపు తీరభూమినందు స్కెల్ట్, మ్యూజ్ నదీముఖద్వారములకు సమీపమున, రైన్‌నదికి సన్నిహితముగ ఆ నగరము ఉండెడిది. ఉన్ని వస్తువుల తయారీ కేంద్రముగనే కాక, ఉన్ని వర్తక కేంద్రముగను ఆ నగరము పేరొందెను.

ప్రాచీన యుగమునందు వలెనే, ఈ యుగమునను వర్తక వాణిజ్యములు పెక్కు కష్టనష్టములకు లోబడి సాగుచుండెడివి. అందువలన స్వీయ ప్రయోజనముల రక్షణార్థమై ఒకే నగరమున వసించు వర్తకులు శ్రేణులుగ రూపొందుట పశ్చిమ యూరప్‌న - ఈ యుగపు ఉత్తరార్ధమున - మొదలైనది. బలవత్తరములగు శ్రేణులు తమ సక్రమ వ్యాపారమునకు నష్టము కలిగించు ప్రభువులను సైతము ధిక్కరించి ఎదుర్కొనెడివి. ఇట్టి సంఘటిత కృషి వలన శ్రేణులు తమయందలి వర్తకులకు కొన్ని స్వత్వములను చేకూర్చగలిగినవి. ఒక్కొక్కపరి ఒక దేశపు ప్రభువునకు మూల్యమును చెల్లించి, ఆ దేశమున వ్యాపారమును సాగించు గుత్త అధికారమును సైతము ఒక్కొక శ్రేణి ఆర్జించెడిది. తమకు సరియగు మన్ననను కలిగించని ప్రభువు పాలించు దేశమును వెలివైచి, ఆ దేశమునకు తమ సరకులను పోనీయకుండ ఈ శ్రేణులు చేయగలిగి ఉండెడివి. పశ్చిమ యూరప్‌నందలి శ్రేణులు క్రమముగ తాము నివసించు పట్టణములకు స్వయంపరిపాలనను కొన్నియెడల ఆర్జింపగలిగినవి. సాధారణముగ ప్రభువునకు ధనరూపముననో, వస్తురూపముననో కొంత చెల్లింపు జరిపి, ఇట్టి పరిపాలనాధికారమును వారు సంపాదించెడివారు. అయినను కొన్ని పట్టుల బలమును ఉపయోగించి ఒక్కొక శ్రేణి ఈ స్వయం పరిపాలనాధికారమును పొందిన ఘట్టములును లేకపోలేదు. బాల్టిక్ సముద్రతీరమునందలి జర్మనీ వర్తకుల శ్రేణి - 'హాన్‌సియాటిక్ లీగ్' అను పేరు కలది - ఆ ప్రాంతములందలి పెక్కు నగరములను తన అధీనములోనికి గ్రహించుటయే కాక, తమ వర్తక నౌకలపై డెన్మార్క్ దేశపు రాజు పన్ను విధించినందులకు కినిసి, ఆ దేశపు రాజధానిపై తన నౌకాబలముతో ముట్టడి జరపి, ఆ నగరమును కొల్లగొట్టి, తమకు నచ్చిన సంధికి ఆ రాజును అంగీకరించునటుల చేసెను (1370).

వర్తకుల కొరకు మాత్రమేకాక, వృత్తిపనివారల కొరకును ఇట్టి శ్రేణులు ఆ కాలమున రూపొందినవి. వేర్వేరు వృత్తులకు వేర్వేరు శ్రేణులు సాధారణముగ అపుడు ఏర్పడినవి. పని కుశలతను అభివృద్ధి చేసికొనుటకును, తమ శ్రేణికి చెందిన సామాజిక ప్రయోజనములకై ధనమును తమ మజూరీలనుండి సేకరించి క్రమ రీతిలో వెచ్చించుటకును ఇందువలన మార్గము వృత్తిశ్రేణులకు ఏర్పడినది.

ఇందుతోపాటుగ వృత్తిపనివానికి గౌరవమును ఏర్పడినది. అందువలన భూస్వాముల వద్ద వెట్టిచాకిరీచేయు కష్టజీవులు స్వతంత్రజీవనమునకై ఇట్టి వృత్తులను చేపట్టుటకు ఉత్సహించిరి. భూమి యందలి అధికోత్పత్తిని విక్రయించి, వచ్చిన ధనమును భూస్వామికి చెల్లించి, తన స్వాతంత్ర్యమును తాను పొందుటకు ఆ కష్టజీవులకు అప్పటి పరిస్థితులును సాయము చేసినవి. ఇష్టములేని వారివలన చాకిరీ చేయించుకొనుటకన్న, ధనరూపముగ వారినుండి కొంత మూల్యము గ్రహించి శాసన విహితములగు తమ హక్కులను వదలుకొని, తమ ఆశ్రితులకు స్వతంత్రమును కలుగజేయుటయే ఆ కాలపు పరిస్థితులలో తగిన మార్గమని భూస్వాములును తలంచిరి. ఇటుల విడివడిన శ్రామికుడు సాధారణముగ ఏదియో ఒక వృత్తి విద్యను అభ్యసించి పట్టణమున చేరెడివాడు లేదా స్వతంత్రముగ భూమిని ఆర్జించి కృషి చేసి బ్రతికెడివాడు.

పరిస్థితులు ఇటుల మారుటతో సంఘమున ప్రభువులు, మతాచార్యులు, వర్తకులు, రైతులు మొదలగువారు అను వర్గములు ఏర్పడినవి. భూస్వామి వ్యవస్థయు, వెట్టిచాకిరీయు పలుప్రాంతములందు అంతరించినవి. ఇందులకు తోడుగ నూతన ఆయుధములు రూపొందుటవలన అశ్వికదళముకన్న సైనిక వర్గమునకు ప్రాముఖ్యము హెచ్చెను. అందుచే సాంప్రదాయిక యోధవర్గపు వారిని కాదని ప్రజలనుండి సైనికులను రాజులు సేకరింప మొదలిడిరి. అంతట రాజసభలయందు మతాచార్యవర్గ, మాండలిక ప్రభువర్గములతోపాటుగ వర్తకులకును, ధనిక కర్షకులకును స్థానము లభించెను.

ఈ మార్పులు త్వరితగతిలో పశ్చిమ యూరప్‌న తొలుత సంఘటిల్లినవి. ప్రజల బలమును సమకూర్చికొనిన రాజులంతట తమ రాజ్యములు వర్తక వ్యాపారములందు మధ్యధరా తీరప్రాంతవాసులయు, తుర్కులయు ఆధిపత్యమును అంతము చేసి ముందునకు వచ్చునటుల చేయుటకు ఉత్సహించి, ప్రాచ్యభూములకు సముద్రమార్గములను అన్వే

మింపసాగిరి. ఆ ప్రయత్నములో పోర్చుగీస్‌వారు 15వ శతాబ్ది ఆఖరులో ముందంజవేయగలిగిరి.

పైన పేర్కొనబడిన వర్తకశ్రేణులును, వృత్తిశ్రేణులును పశ్చిమ యూరప్‌నకు క్రొత్తవియే అయినను, ప్రాచ్య దేశములందు, అందును చీనా, భారతదేశములలో ప్రాచీన కాలముననే అవి రూపొంది వ్యవహరించుచు ఉండినవి. ఈ యుగమునందు అట్టివి జపాన్ మొదలగు దేశములందును నెలకొనినవి. ఈ వర్తక శ్రేణులను ఆలంబనముగ గ్రహించి నగరములు రూపొంది, వర్తకులకు రాజకీయములందు స్థానము లభించుట యూరప్‌నందు మాత్రము ఈ యుగమున సంఘటిల్లినను, ప్రాచ్యదేశములు ఆ పరిణామ స్థాయిని ఎన్నడో అందుకొనినవి. కాని, ప్రాచ్యదేశములు ఆ స్థాయినుండి ముందడుగు వేయలేదు సరికదా కొన్ని పట్టుల వెనుకంజ వేసినవి. పశ్చిమ యూరప్ మాత్రము ప్రాచ్యదేశముల విజ్ఞాన సంపదను స్వీయము చేసికొని, వాని స్థాయిని అందుకొనుటతో ఆగిపోక 16వ శతాబ్ది తరువాత సర్వతోముఖముగ పురోగమించి చరిత్రగతిని కైవసము చేసికొని, మూడు శతాబ్దములలో భూగోళమునందు సర్వత్ర సాంస్కృతికముగను, రాజకీయముగను తన ప్రాముఖ్యమును విశదము చేసినది. తక్కిన నాగరక ప్రపంచమును అధిగమించి పశ్చిమ యూరప్ ఇటుల పురోగమింపగలుగుటకు కారణములు ఏవియైన కలవా ? అను విషయమును పలువురు చారిత్రకులు చర్చించిరి. కొందరు ఇది భగవన్నిర్దేశితమగు యాదృచ్ఛిక సంఘటనగ భావించిరి. కొందరు క్రైస్తవ నాగరకతయొక్క విశిష్టతను ఇది తెలియజేయునని నుడివిరి. ఇట్టి వాదములు అంధ విశ్వాస ప్రేరితములు, అభినివేశపూరితములు అని వేరుగ తెలుపవలసిన అవసరము లేదు. హేతువాద బుద్ధితో దీనిని చర్చించిన మరికొందరు చీనా ముందునకు పురోగమింపలేక పోవుటకు వారి లిపి క్లిష్టతను ముఖ్యకారణముగ పేర్కొనిరి. వర్ణవిభజన వలన భారతదేశము తన చైతన్యమును కోల్పోయి దిగజారినదని - అట్టివారలే - కొందరనిరి. కాని చీనా, భారతదేశములు క్రీ. శ. ఆరంభమున అత్యున్నత సంస్కృతిస్థాయికి పురోగమించి, తక్కిన ప్రపంచమునకు నాగరకతాభిక్షను పెట్టిన సమయమున సైతము చీనాలో క్లిష్టలిపియు, భారతదేశమున వర్ణ విభజనయు ఉండినవని గమనించినచో పై వాదములందలి లోపములు స్పష్టము కాగలవు. కావున పశ్చిమ యూరప్ సాధించగలిగిన సాంస్కృతిక, వైజ్ఞానిక పురోగతికి వేరు కారణములను అన్వేషించుటకై ఈ విషయమును వేరొక దృక్కోణమునుండి ఇట పరికింపవలసి ఉన్నది.

'నాగరకత' అను దానిని స్థూలముగ నియమయుత జీవిత విధానముగ నిర్వచింపవచ్చును. విశృంఖలతకు స్వస్తి చెప్పి, సంఘ సుస్థిరతయందు తనకుకల బాధ్యతలను గుర్తెరిగి, సంఘనియమములను అతిక్రమింపక, నిగ్రహముతో వర్తించు స్థితిని మానవుడు చేరినపుడే అతడు నాగరక మానవుడుగ పరిగణింపబడుచున్నాడు. ఇట్టి వ్యక్తుల కూటమియే నాగరక సంఘము. ఇట్టి సంఘములు ప్రాచ్యదేశములందు అతిప్రాచీన కాలముననే నెలకొనినవి. ఇట ప్రాచ్యదేశములని వ్యవహరింపబడు వానిలో ఈజిప్టు మొదలుగ చీనావరకు కల దేశములేకాక మధ్యధరా ప్రాంత దేశములును చేరి ఉన్నవి. వీనియందు అతిదీర్ఘ కాలము సువ్యవస్థిత మానవ సంఘములు మనుటచే అందలి ప్రజలలో నియమయుత జీవనము సహజ లక్షణముగ సంక్రమించినది. ఈ సంఘములందు పైతరగతుల పాలకులను కూలద్రోసి వేరు జాతులవారు వచ్చినపుడు కొన్ని సంఘర్షణలు కలుగుట నిజమే అయినను, త్వరలోనే ఒక విధమగు నియమబద్ధ జీవితము మరల కుదురుకొనెడిది. తొలుతటినుండియు నియమములకు లోబడి వర్తించుటకు అలవడిన ప్రజానీకము కిమ్మనక ఈ మార్పును ఆమోదించి యథాపూర్వముగ వ్యవహరించెడిది. ఏర్పడిన ఒక వ్యవస్థను విమర్శించుటకుగాని, మార్పునకై తీవ్రయత్నము చేయుటకు గాని అచటి ప్రజానీకమునకు చొరవ ఉండెడిది కాదు. ఇక పశ్చిమ యూరప్‌న పరిస్థితి అట్టిది కాదు. క్రీ. శ. 8వ శతాబ్దివరకు నాగరకతను ఎరుగక, సంచారజీవితమునకు అలవడిన గాల్‌లు మొదలగు జాతులకు ఆ ప్రాంతము నివాసము. క్రైస్తవమతము అట ప్రవేశించినది మొదలుగ మెల్లగ నాగరకత అటకు వ్యాపించినది. అయినను నియమయుత జీవనమునకు అలవడని ఆ జాతులకు అట్టిది సహజముగ కంటకముగ ఉండెడిదని విశ్వసించుటకు ఆధారములు కలవు. తమను లొంగదీయు ప్రతి నియమమును కాదని ఎదురు తిరిగి వ్యవహరించుటకు వారిలో సహజముగ ఉండెడు తిరుగుబాటు తత్వము వారిని ప్రేరేపించెడిది. పరిస్థితులు అనుకూలించినపుడు ఈ తత్వము ప్రస్ఫుట రూపమును పొంది కొన్ని ఫలితములను సాధించెడిది. పశ్చిమయూరప్‌న - ఈ యుగమున - పోప్‌నకు రాజ, చక్రవర్తులతోడను, రాజునకు భూస్వాములతోడను, మతాచార్యులకు పండిత లోకముతోడను, భాగ్యవంతులతో పేదలకును, రాజులకు వర్తక శ్రేణులతోడను సంఘటిల్లిన వైరుధ్యములందును, పోరాటములందును అంతర్లీనమై ఉండినది ఈ తిరుగుబాటు తత్వమే. అట్టి వైరుధ్యముల మూలముగనే వివిధ వర్గముల స్వత్వములకు కొన్ని

అవధులు ఏర్పడి, ప్రజానీకము పురోగమించుటకు మార్గము సుగమమైనది. ప్రాచీన నాగరకతలలో అట్టి తిరుగుబాటు తత్వము లోపించుటవలననే అవి పురోగమింపలేక పోయినవి.

ఒక విధముగ చూడ మానవునియందలి ఈ తిరుగుబాటు తత్వమే అతనిని క్రమముగ ఆటవిక దశనుండి నాగరక దశకు కొనివచ్చుటకు సహకరించినదని చెప్పవచ్చును. తన పరిసరములను యథాతథముగ గ్రహించి ఊరకుండినచో అతడు పురోగమించుటకు అవకాశమే ఉండెడిదికాదు. తనకు వ్యతిరేకములుగ ఉన్న పరిసరములను ఎదుర్కొని లొంగదీయుటకు అతడు చేసిన కృషి వలననే అతడు పురోగమించగలిగెను. ఈ తిరుగుబాటు తత్వమే ప్రతివిషయమును గురించి ప్రశ్నించు స్వభావమును అతనికి అలవడ చేసినది. ఈ ప్రశ్నించు స్వభావమునే 'విచికిత్సా పూర్వకమగు జిజ్ఞాస' అని వ్యవహరింపవచ్చును. ఈ జిజ్ఞాస శూన్యమైనపుడు మానవుడు విజ్ఞాన పథమున పురోగమింపలేడు. పశ్చిమ యూరప్‌నందలి పండితులలో సహజముగ వచ్చిన తిరుగుబాటు తత్వమునకు అనుగుణముగ ఈ జిజ్ఞాస నెలవు కల్పించుకొనినది. అందువలన ప్రతి విషయమును సునిశితముగ పరిశీలించు దృష్టి అలవడి, విజ్ఞానశాస్త్ర రహస్యములను అన్వేషించుటలో వారు ముందంజవేసిరి. సాంఘిక జీవనమున, వారి ఆవిష్కరణముల వలని ప్రయోజనము స్పష్టముగ కన్పట్టినంతనే, వారికి పూర్వముకన్న మిన్నగ ప్రోత్సాహము లభించినది. తత్ఫలితముగ పశ్చిమ యూరప్ పురోగమించి, తరువాతి యుగమున ప్రపంచాధిపత్యమును ఆర్జించినది. చీ. శే. రా.

# సామ్రాజ్యయుగము

(1522 - 1945)

ప్రప్రథమ భూప్రదక్షిణ నౌకాయాత్రవలన మెజెల్లాన్ స్పెయిన్‌నకు ఖ్యాతిని సమకూర్చిన కాలముననే రాజ్యాంగరీత్యా సైతము కొన్ని మార్పులు జరిగి, యూరప్ రాజకీయములలో ఆ దేశము ఇచ్ఛాపూర్వకముగనో లేదా అనిచ్ఛతోడనో ప్రముఖ పాత్ర వహింపవలసిన పరిస్థితి ఏర్పడినది. 1516 లో స్పెయిన్ రాజ్య సింహాసనము దౌహిత్రస్వత్వపు మూలమున ఛార్లెస్ - I కు లభించెను. ఇతడు ఆ కాలపు పవిత్ర రోమన్ సామ్రాజ్యపు చక్రవర్తికి పౌత్రుడు. ఈ ఛార్లెస్‌నకు తండ్రి మరణము మూలమున 1506 లోనే నెదర్‌లండ్స్, లగ్జెంబర్గ్, ఫ్లాండర్స్ మొదలగు రాష్ట్రముల ప్రభుత్వము చేజిక్కినది. ఇందులకు తోడుగ పితామహుని అనంతరమున పవిత్ర రోమన్ సామ్రాజ్యమునకును ఇతడు చక్రవర్తిగ ఎన్నికై (1520) ఆ సామ్రాజ్య పాలకుల నామక్రమమును అనుసరించి ఛార్లెస్ - V చక్రవర్తిగ పేరొందెను. ఈ చక్రవర్తి పదవి ఎన్నిక ద్వారా లభించునదిగ తొలుత నుండి ఏర్పాటైనను, కాలక్రమమున ఎన్నికలతంతుకు లోబడి హాప్స్‌బర్గ్ వంశీయుల సంతతికి చెందినవారియందే నిలుపబడి ఉండుటకు అనుకూలముగ పరిస్థితులు సమకూడినవి. హాప్స్‌బర్గ్ వంశమునకే ఛార్లెస్ సైతము చెంది ఉండెను. అయినను చక్రవర్తిగ ఎన్నుకొనబడుటకు ఇతడు ఎక్కువగ ధనమును వెచ్చింపవలసి వచ్చెను. ఆ కాలపు యూరప్ రాజకీయములందు కొంత పలుకుబడిని ఆర్జింపగలిగిన ఫ్రాన్స్‌దేశపు రాజు ఫ్రాన్సిస్ - I, ఇంగ్లండు దేశపురాజు హెన్రీ - VIII యు చక్రవర్తి పదవిని ఆసించి ఛార్లెస్‌కు పోటీగ నిలుచుటవలన ఈ క్లిష్టపరిస్థితి ఏర్పడెను. ఇందులకు తోడుగ పోప్ సహకారము ఫ్రెంచి రాజునకు సమకూరెను. ఈ పరిస్థితి నుండి గట్టునపడుటకై చక్రవర్తి పదవికి జరుగు ఎన్నికలలో నియోజకులు (ఎలెక్టర్‌లు) గ వర్తించు ఏడుగురు ప్రముఖులలో ఆరుగురుకు విరివిగ ధనమొసగి చక్రవర్తి పదవిని ఛార్లెస్ సంపాదింపగలిగెను. ఈ విధముగ వివిధ మార్గముల ద్వారా విపరీత విస్తృతికల రాజ్యమునకు అతడు ప్రభువయ్యెను. స్పెయిన్ దేశమే కాక, ఉత్తర, మధ్య యూరప్ అంతయును, ఇటలీలో అత్యధిక భాగమును, సిసిలీ దీవియును అతని వశమున ఉండెను.

యూరప్‌న అత్యధిక భాగమును లోగొనిన ఛార్లెస్-V రాజ్య విస్తృతి మూలమున పెక్కు చిక్కులను ఎదుర్కొనెను. ఫ్రాన్స్, ఇంగ్లండు దేశముల ప్రభువులును, పోప్‌ను యూరప్‌ఖండమున ఛార్లెస్ అత్యధిక ప్రాబల్యమును వహించినచో రాజ్యాధికార తౌల్యమునకు భంగము ఏర్పడగలదను భయముతో అతనికి కల ఇబ్బందులను క్లిష్టతరములుగ చేయుటలోనే శ్రద్ధవహించిరి. చక్రవర్తి సామ్రాజ్యపు తూర్పు సరిహద్దున విశాల యూరపియన్ భూమిని ఆక్రమించి నెలవు కల్పించుకొనిన ఓటోమన్ సామ్రాట్‌లు భూమార్గమునను, సముద్రమార్గమునను ఛార్లెస్‌నకు దండయాత్రా భయమును అనవరతము కల్పించుచుండిరి. వీని అన్నింటికన్నను కొరుకుడువడని సమస్యగ పరిణమించినది ఆనాటి యూరప్‌ను కల్లోలపరచిన మత సంస్కరణోద్యమము. ఇదివరలో చెప్పబడినటుల పోప్ అధికారమును ధిక్కరించుచు చెలరేగిన ప్రొటెస్టంట్ వాదము మార్టిన్‌లూథర్ నాయకత్వమున

ఉచ్చస్థాయిని అందుకొనినది. అంతకు పూర్వపు దినములలో ఇట్టి సంస్కరణవాదులను పోప్‌ను, అతని అనుచరులును సులభముగ మట్టుబెట్టి, వారి వాదములకు వ్యాప్తి కలుగకుండ నిరోధించెడివారు. కాని, పదునారవ శతాబ్ది ప్రథమ పాదముననే పుస్తకముద్రణయు విరివిగా వ్యాప్తిని పొందమొదలిడుటవలన ఈ ప్రొటెస్టంట్ వాదమునకు ప్రచారము విరివిగ లభించెను. తొలుత తన వివాదమును లాటిన్ భాషలో సాగించినను, కాలక్రమమున మార్టిన్ లూథర్ సామాన్య ప్రజానీకపు సౌకర్యమునకై జర్మనీ భాషనే తన వాదమునకు సాధనముగ గ్రహించెను. ఇటుల సామాన్య ప్రజలలో ఈ భావములు వ్యాపించుటవలన ఈ సంస్కరణవాదులను గాని, వారి నాయకుడగు లూథర్‌ను గాని నిర్మూలించుటకు వీలు చిక్కకుండెను. ఇందులకు తోడుగ కొందరు జర్మనీ మాండలిక ప్రభువులును ఈ సంస్కరణవాదమును ఆమోదించి లూథర్‌నకు బాసటగ నిలిచిరి. వీరిలో పలువురకు సంస్కరణ వాదమందలి ఆధ్యాత్మిక విలువకన్న, ఈ వాదమును ఆమోదించిన ఎడల మతపీఠముల ఆస్తులను తమ కైవసము చేసికొనవచ్చునను ఆర్థిక ప్రయోజనాపేక్షయే మార్గదర్శిగ ఉపకరించినది. త్వరలో ఈ సంస్కరణవాదము తక్కిన ఉత్తర యూరపియన్ ప్రాంతములకును ప్రాకెను. లూథర్‌తో నిమిత్తము లేకుండ జాన్ కాల్విన్ (1509-1564) [చూ. సం. 7 - పు. 353] అను వేరొక పండితుడు లూథర్ వలెనే పోప్ అధికారమును నిరాకరించి, కొన్ని యెడల లూథర్ వాదమునుండి విభిన్నమగు వేరొక సంస్కరణ వాదమును లేవదీసెను. ఈ సంస్కరణవాదము స్విజర్లండ్, స్కాట్‌లాండ్, ఇంగ్లండు, నెదర్‌లండ్స్, జర్మనీ దేశముల లోని పలుప్రాంతములందును తరువాత బొహీమియా, హంగేరీ దేశములలోనికిని వ్యాపించినది.

ఈ సంస్కరణ వాదముల వ్యాప్తి ఛార్లెస్ చక్రవర్తికి తక్కిన ఇబ్బందులను మించిన బెడదను తెచ్చిపెట్టెను. పోప్‌ను అనుసరించిన కేథలిక్ మాండలికులును, వ్యతిరేకులగు ప్రొటెస్టంట్ మాండలికులును నిరంతరము తగవులాటలలో మునిగి తేలుటవలన తన సామ్రాజ్యపు భద్రతకు భంగము వాటిల్లగలదను భయముచేత ఆ చక్రవర్తి మత సమస్యను ఏదియో విధముగ పరిష్కరించితీరవలెనని కృషి చేసెను. స్వయముగ అతనికి పోప్‌ఎడల సదభిప్రాయము లేకపోయినను, తొలుతటి నుండియు పెంపకము వలన అతనికి కేథలిక్ భావముల యెడల ఆదరము ఎక్కువగ ఉండినది. ఇందులకు తోడుగ వారసత్వరీత్యా తనకు సంక్రమించిన స్పెయిన్ వాసులు రోమన్ కేథలిక్‌లు అగుటయు అతనికి ఆ వాదమునందు సుముఖతను కల్పించినది. అటులని జర్మన్ మాండలికులలో పలువురి అభిమానమును ఆర్జించిన ప్రొటెస్టంట్ వాదముతో విరోధము తెచ్చిపెట్టుకొనుటకు అతడు ఉత్సహింపలేదు. ఇట్టి తటపటాయింపు వలన పరిస్థితులు సరిపడలేదు సరికదా, ప్రొటెస్టంట్ మాండలికులు 'స్మాల్ కాల్‌డిక్ లీగ్' అను పేర సుసంఘటితులై (1531) చక్రవర్తిని ఎదిరించి 1546 మొదలుగ పోరాటమును సాగించిరి. తొలుత ఈ తిరుగుబాటును చక్రవర్తి అడచగలిగినను, 1552 లో తీవ్రరూపమున అది మరల ప్రత్యక్షమయ్యెను. కడకు తనను వేధించు సమస్యలతో విసివి, ఆ చక్రవర్తి పదవీ పరిత్యాగముచేసి (1556), తన సోదరుడు ఫెర్డినాండ్‌కు సామ్రాజ్యమును, నెదర్‌లండ్స్‌తో కూడిన స్పెయిన్ రాజ్యమును కుమారుడగు ఫిలిప్‌నకును దత్తమొనర్చెను. ఈ పదవీ పరిత్యాగమునకు కొలది కాలము పూర్వముననే (1555) ఫెర్డినాండ్ కృషి మూలమున ప్రొటెస్టంట్‌లకును, కేథలిక్‌లకును మధ్య ఒక ఒడంబడిక కుదిరెను. ఇది జరిగిన స్థలమును బట్టి దీనికి 'ఆగ్స్‌బర్గ్ ఒడంబడిక' అను పేరు కలిగెను.

ఆ ఒడంబడిక ప్రజల మతాభిప్రాయములను గురించి జరిగినదే అయినను అందులో ప్రజల ప్రసక్తి రవంతయు లేదు. మతాభిప్రాయస్వేచ్ఛ అనునది ఆ ఒడంబడికను అనుసరించి మండలప్రభువులకు మాత్రమే దత్తమైనది, వ్యక్తియగు పౌరుని ప్రమేయమే అందు కన్పట్టదు. ఒక మాండలిక ప్రభువు అభిరుచిని అనుసరించియే ఆ మండలములో కేథలిక్, ప్రొటెస్టంట్ వాదములలో ఏదియో ఒకటి అభిమానితమై ప్రజలచే మన్నింపబడవలెను. ఇరువదవ శతాబ్ది పాఠకునకు ఇట్టి నిర్ణయము ఒక విడ్డూరముగ కన్పించవచ్చును. కాని, ఆ నాటి పరిస్థితులకు ఆ నిర్ణయము అనుగుణమైనదియే. ప్రభువుల ప్రయోజనముల దృష్టిలో పౌరులును, మతాభిప్రాయములును ఆనాడు ఆటపావులు మాత్రమే. ఆ మతాభిప్రాయములు ప్రభువుల సౌకర్యమును అనుసరించి మారెడివే కాని, అందలి వాదబలమును బట్టి అవలంబింపబడెడివి కావు. ఉదాహరణమునకు ఆనాటి ఇంగ్లండుదేశపు చక్రవర్తియగు హెన్రీ - VIII ని గ్రహింపవచ్చును. అతనికి ప్రొటెస్టంట్ వాదము అనిన తొలుత గిట్టెడిదే కాదు; దానిని ఖండించుచు ఒక గ్రంథమును సైతము రచించి పోప్ మన్ననను పొంది, అతడు 'మత పోషకుడు' అను బిరుదమును ఆర్జించెను. కాని, భార్యకు విడాకులిచ్చి, తన ఇచ్చవచ్చిన స్త్రీని పెండ్లాడుటకు పోప్ అంగీకారమును ఈయక పోయినంతట, ఆ రాజు క్రుద్ధుడై పోప్ అధికారమును తిరస్కరించెను (1534);

అట్టివి ఆనాటి రాజుల మతాభిప్రాయములు. వారికి కావలసినది తమ ఆధ్వర్యవమున తమ రాజ్యపు ఉన్నతి మాత్రమే. ఇదియే క్రమముగ తరువాతి శతాబ్దమున జాతీయత పెచ్చుపెరిగిన కొలది ఒకే రాజు, ఒకే దేశము, ఒకే మతము అను నినాదమునకు యూరప్ దేశములందు తావు కల్పించినది.

ఛార్లెస్ చక్రవర్తి పదవీ పరిత్యాగము తరువాత జర్మనీయు, ఇటలీయు నామమాత్రముగ చక్రవర్తి ఆధిపత్యమును గుర్తించినను, యథార్థమున మాండలికుల పరిపాలనలో విభక్తములై ఉండినవి. ఫ్రాన్స్ మాత్రము ఫ్రాన్సిస్ పెట్టిన ఒరవడిని అనుసరించి సర్వసత్తాక రాజరికముగ రూపొందుచు ఉండినది. స్పెయిన్ నందును, ఇంగ్లండులోను రాజరికములు చక్కగ కుదురుకొని, జాతీయ ప్రయోజనములకై కృషిచేసి, ప్రజల ఆదరణను సైతము ఆర్జింపగలిగినవి. 1580 లో వారసత్వరీత్యా స్పెయిన్ రాజగు ఫిలిప్ - II పోర్చుగల్ నకు కూడ ప్రభువు కాగలిగెను. ఇటుల ఐబీరియన్ ద్వీపకల్పమునందలి రెండు రాజ్యములకును తానే ప్రభువైన తరువాత ఫిలిప్ యూరప్‌న ప్రముఖతను ఆర్జించుటయేకాక, తత్పూర్వము 16 వ శతాబ్ది ఆరంభము నుండియు స్పెయిన్, పోర్చుగల్ నావికుల అన్వేషణల ఫలితముగను, సాహసిక యోధుల కృషివలనను అమెరికా మొదలగు ప్రాంతములందు నెలకొనిన వలస రాజ్యములకును ప్రభువై, ఆ వలసలవలన చేకూరిన అమూల్య ధనరాశులవలన దేశమును సుసంపన్నముగ చేసెను. ఫిలిప్‌నకు సమకాలికురాలుగ ఇంగ్లండును పాలించిన రాణి ఎలిజబెత్ - I ; ఇంగ్లండు దేశచరిత్రలో ఈమె పరిపాలనాకాలము స్వర్ణయుగముగ పేరెన్నిక కనినది. ఈమెచే ప్రేరితులగు సాహసిక నావికులవలన తనకు అమెరికానుండి నౌకలలో వచ్చు ద్రవ్యరాశులు కొల్లగొట్టబడుచుండినవను మిషతో 27,000 మంది సైనికులు కల 132 నౌకల దళము (ఆర్మడా) ను ఫిలిప్ ఇంగ్లండు పైకి దండయాత్రకు పంపెను. ఆకృతియందు స్పెయిన్ వారి పడవలకన్న చిన్నవియైనను చలనోత్సాహమున వానిని మించిన తమ చిన్న నౌకలతో ఇంగ్లీష్ నావిక యోధులు స్పెయిన్‌వారి నౌకాదళమును పరాభూతము చేసి (1588), విస్తృత ఖ్యాతిని ఆర్జించిరి.

స్పెయిన్, ఇంగ్లండు సముద్రాధిపత్యమునకై పెనగులాడుచుండిన ఈ సమయమున ఫ్రాన్స్‌దేశము మతాభిప్రాయ విభేదముల తగవులతో సతమత మగుచు ఉండినది. కడకు లూయీ - XIII కాలమున రిష్‌లూ అను ప్రధాన మంత్రి ఆధ్వర్యవమున ఆ దేశముసుస్థిరతను ఆర్జింపగలిగినది. పరిపాలనయందు సంస్కరణలను ప్రవేశపెట్టుట ద్వారా ఫ్రాన్స్‌దేశమున సువ్యవస్థిత పరిపాలనను నెలకొలుపుటయే కాక, యూరప్‌నకు మకుటముగ ఫ్రాన్స్‌ను రూపొందించుటకు అతడు కృషి చేసెను. ఈ యత్నము సఫలీకృతము కావలెనన్న హాప్స్‌బర్గ్ చక్రవర్తుల పటిష్ఠతను సన్నగిల జేయుట ముఖ్యమని రిష్‌లూ భావించెను. ఆ సంకల్ప సాధనకు ముప్పది సంవత్సరముల యుద్ధము (1618 - 1648) అతనికి అవకాశమును కల్పించెను.

ముప్పది సంవత్సరముల యుద్ధపు [చూ.] ప్రాతిపదిక కారణము మధ్య యూరప్‌నందలి మతాభిప్రాయ విభేదములు 1555 లో జరిగిన ఆగ్స్‌బర్గ్ ఒడంబడికను అనుసరించి 1552 కు పూర్వమున ప్రొటెస్టంట్ మాండలికులు హరించిన మతపీఠముల ఆస్తులు ఆ మాండలికులకే చెందియుండునటులనే ఏర్పాటు జరిగినది. కాని, 1552 తరువాత హరింపబడిన ఆస్తులు మాత్రము పోప్‌నకు సంక్రమింపవలసి ఉండెను. కాని, ఈ విషయమున తగు చర్య పుచ్చుకొనక ప్రొటెస్టంట్ మాండలికులు మిన్నకుండుటయేకాక, 1555 తరువాత సైతము ప్రొటెస్టంట్‌లుగ మారిన మాండలికులు కూడ చర్చి ఆస్తిని నిరాటంకముగ కాజేయుటకు మొదలిడిరి. ఇది ప్రాతిపదిక కారణమే అయినను యుద్ధము మాత్రము - బొహీమియా వాసులు తమ రాజ్యమునకు చక్రవర్తి నియమించిన కేతలిక్‌ను కాదని ఒక ప్రొటెస్టంట్ ప్రభువును ఎన్నుకొనుటతో - మొదలయ్యెను. ఈ యుద్ధపు వివిధ ఘట్టములతో ఇట ప్రసక్తి లేదు. ప్రొటెస్టంట్‌లను బలపరచు మిషతో ఈ యుద్ధమున డెన్మార్క్, స్వీడెన్, ఇంగ్లండు దేశములును జోక్యము వహించి, వివిధ రంగములందు చక్రవర్తి సేనలను ఎదుర్కొని పోరాడినవి. స్పెయిన్ దేశము చక్రవర్తికి అండగ నిలిచినది. క్రమముగ ఈ పోరాటమునకు మతరూపము సన్నగిల్లి రాజకీయ రూపము సిద్ధించినది. కేతలిక్ రాజ్యమునకు తాను ప్రధానమంత్రియే అయినను స్వీడెన్ ప్రభువును, ప్రొటెస్టంట్‌ను అగు గస్టేవస్ అడోల్ఫస్‌కు విరివిగ ధనమును, ఆయుధములను ఇచ్చి, రిష్‌లూ మంత్రి ఆపోరాటము సమసిపోకుండుటకు కృషి చేసెను. కడకు హాప్స్‌బర్గ్ ప్రభువులదే పైచేయి అగు క్లిష్టస్థితి సంఘటిల్లగ ఫ్రాన్స్ దేశమునే రిష్‌లూ యుద్ధములోనికి ప్రొటెస్టంట్‌ల పక్షమున దింపి (1639), స్పెయిన్‌తో పోరాటమునకు పూనుకొని, ఆ దేశమును 1643 లో పరాజితము కావించెను. ఈ దీర్ఘపు పోరాటము 1648 లో వెస్ట్‌ఫేలియా సంధి [చూ.] తో అంతమైనది. ఆ సంగ్రామ ఫలితముగ హాప్స్‌బర్గ్‌ల సామ్రాజ్యము అత్యంత బలహీనమైనది. సంధి ఫలితముగ ఆ సామ్రాజ్యమునందలి బ్రాండెన్‌బర్గ్

రాష్ట్రము విస్తృత పరిసర భూములను కలుపుకొని, బలపడి, అన్ని విధముల స్వతంత్రరాజ్యముగ వ్యవహరించ మొదలిడినది. ఇదియే తరువాత ప్రష్యా అనుపేర జర్మనీదేశపు రాజకీయములందు ప్రాముఖ్యమును పొందినది. వెస్ట్‌ఫేలియా సంధివలననే హాలండ్ దేశమును, స్విజర్లండ్ దేశమును స్వతంత్ర రాజ్యములుగ పరిగణన పొందినవి. యుద్ధసమయమున స్పెయిన్ బలహీనతను చెందిన అవకాశమును ఉపయోగించుకొని 1640 లో పోర్చుగల్ దేశము స్పెయిన్ రాజరికము నుండి విడివడి, మరల స్వతంత్ర రాజ్యముగ రూపొందెను.

ముప్పది సంవత్సరముల యుద్ధమును ప్రోత్సహించి, హాప్స్‌బర్గ్‌లను బలహీనపరచుటకై యత్నించిన రిష్‌లూ ఆ యుద్ధము ముగియువరకు మనలేదు. వాని అనంతరమున వచ్చిన ప్రధాని మేజరిన్ ఆ విధానమునే అనుసరించి, ఫ్రాన్స్‌ను యూరప్‌న బలవత్తమ రాజ్యముగ రూపొందించుటకు యత్నించెను. మేజరిన్ అనంతరమున రాజగు లూయీ - XIV ఈ బాధ్యతను వహించెను. 1643 లోనే సింహాసనమునకు వచ్చినను, పసివాడగుట వలన ఇతడు మేజరిన్ మరణముదనుక (1661) రాజరికపు విధులను నిర్వహింప పూనుకొనలేదు. అంతటి నుండి రాజ్యభారము వహించుటయే కాదు; దానిని నిరంకుశముగ, మరణ పర్యంతము (1715) నిర్వహించెను. ఈ దీర్ఘకాలమున ఫ్రాన్స్‌ను ప్రాదేశికముగ విస్తృతము చేయుటకై, సైన్యమును పునర్నిర్మించి, అతడు ఏదియో ఒక మిషతో పొరుగు రాజ్యములతో యుద్ధములను సాగించుటయే తన పనిగ ఇడుకొనెను. వీని అన్నింటి ఫలితముగ కడకు స్పెయిన్‌నకు తన మనుమని ఒకనిని రాజుగ చేసి, తూర్పున ఆల్సేస్ పరగణాను మాత్రము అతడు ఫ్రాన్స్‌నకు కలుపగలిగెను. కాని, అందులకు ప్రతిఫలముగ అమెరికాయందును, ప్రాచ్యఖండములందును ఫ్రెంచివారు సంపాదించిన విశాల ప్రాంతములను పోగొట్టుకొనెను.

తన యుద్ధప్రియతవలన లూయీ - XIV ఫ్రాన్స్‌దేశపు ప్రజలకు నష్టము కలిగించుట వాస్తవమే అయినను లలితకళాపోషకుడుగను, పరిపాలనాధురీణుడుగను పేరొందెను. యూరప్‌నందలి రాజలోకమున అనుసరింపదగిన ఒరవడిగ అతడు మన్ననను ఆర్జించెను. అతనిచే పునర్నిర్మితమగు పారిస్ నగరము యూరప్‌నందలి తక్కిన రాజధానులకు ఒజ్జబంతి అయ్యెను. వేష-భాషలకు పారిస్ నగరము యూరప్‌వాసులకు మార్గదర్శియగుట అప్పటినుండియే మొదలయ్యెను. వీనిని అన్నింటిని సాధించిన లూయీ మహాదేకరాట్ (గ్రాండ్ మోనార్క్) అను బిరుదము వహించినందున, లూయీ విధానము మహాదేకరాజత (గ్రాండ్ మోనార్కీ) అను పేర యూరపియన్ రాజులకు అందరికిని ఆదర్శముగ పరిగణనకు రాదొడగెను.

ఈ మహాదేకరాజతకు ప్రాతిపదిక రాజునకు కల నిరంకుశాధికారము. ఇట్టి నిరంకుశాధికారము రాజునకు ఉండితీరవలయునను భావన లూయీ - XIV వలన క్రొత్తగ బయలుదేరదీయబడినది కాదు. రాజు దేవాంశసంభూతుడను ప్రాచీన వాదముననే దాని బీజములు కలవు. 16 వ, 17 వ శతాబ్దములందు యూరప్‌నందును రాజులలో ఈ భావన నెలకొని, అప్పటప్పట వ్యక్తరూపమును పొందిన ఘట్టములు లేకపోలేదు. కాని, లూయీ విషయమున కొన్ని పరిస్థితులు అనుకూలించుటవలన, ఈ భావన అతని ఆధ్వర్యవమున ఫ్రాన్స్‌దేశమున ఆ కాలమున కొంత విజయమును పొందగలిగినది. ‘ఒక దేశము, ఒక మతము, ఒక రాజు’ అను నినాదము చేతను, ఫ్రాన్స్‌నకు ప్రాదేశిక విస్తృతిని కల్గించి తన్మూలమున యూరప్‌న ఆ రాజ్యమునకు ప్రముఖతను కల్పించుటకై కృషి చేయుచుండినటుల ప్రజానీకమును భ్రమపరచుట చేతను, లలితకళలను, వర్తకమును, సైన్య పునర్నిర్మాణమును ప్రోత్సహించి ప్రజలలో నిరుద్యోగము ఎక్కువగ వ్యాపింపకుండునటుల చేయుట వలనను లూయీ తన నిరంకుశతను ప్రజానీకము ఆమోదించునటుల చేయగలిగెను. కాని, యూరప్‌నందలి రాజులలో పలువురకు అట్టి అవకాశములు ఆనాడు లభింపలేదు. ముద్రణాదుల వ్యాప్తి వలన స్వేచ్ఛాభావనలు విరివిగ వ్యాపించుటకు అవకాశము పెరుగుటచే ప్రజలందు నిరంకుశతను ప్రతిఘటించు స్వభావము రూపొందసాగినది. ఇది పరిస్థితులు అనుకూలించుటవలన క్రమముగ స్విజర్లండ్, హాలండ్, బ్రిటన్ దేశములలో ప్రస్ఫుటరూపమును ఆర్జించి, విజయమును ఆ పదునేడవ శతాబ్దియందే సాధింపగలిగినది.

ఇంగ్లండున ఎలిజబెత్ - I పరిపాలన ముగిసిన పిదప, అచటి రాజుల నిరంకుశ పాలనయెడ పార్లమెంట్ (ప్రజాసభ) కు కల వైముఖ్యము పెచ్చుపెరిగినది. చివరకు పార్లమెంట్‌నే అప్పటి ప్రభువగు ఛార్లెస్ - I రద్దు చేసెను. కాని, ధనాభావముచే 1628 లో మరల సమావేశపరచి పార్లమెంట్ కోరినటుల ‘స్వత్వ విజ్ఞప్తి (పిటీషన్ అవ్ రైట్స్)’ ని ఆమోదించెను. అయినను ఈ తగవు అంతటితో తీరలేదు. తన అధికారమునకు ఇటుల విప్రతిపత్తి కలుగుటను సహింపజాలక రాజు పార్లమెంట్‌ను సమావేశపరుపకయే పరిపాలనను నిర్వహించుటకు 1629 నుండి 1640 వరకు యత్నించెను. కాని, అందు నెగ్గలేక తుదకు 1640 లో పార్లమెంట్‌ను ఛార్లెస్ - I మరల సమావేశ పరచెను, ఈ

పార్లమెంట్ కే ఇంగ్లండు చరిత్రలో 'దీర్ఘకాలపు పార్లమెంట్' అను వ్యవహారము కలదు. పార్లమెంట్ లోని లోకసభ (హౌస్ ఆవ్ కామన్స్) యందు మాత్రమే ప్రభుత్వాధికారము న్యస్తమైనటుల రాజు అంగీకరింప వలసినదిగ ఈ సభ పట్టుపట్టెను. కడకు ఈ తగవు రాజునకును, పార్లమెంట్ నకును మధ్య యుద్ధముగ పరిణమించి ఛార్లెస్ రాజును పార్లమెంట్ పక్షపు సేనలు బందీగ గ్రహించి, పార్లమెంట్ తీర్పును అనుసరించి శిరచ్ఛేదము చేయుటతో అంతరించినది (జనవరి 30,1649). కాని, పార్లమెంట్ పక్షమునకు అంతవరకు నాయకత్వము వహించి పోరాడిన ఆలివర్ క్రామ్ వెల్ పార్లమెంట్ చెప్పుచేతలలో ఉండుటకు నిరాకరించి పార్లమెంట్ ను రద్దుచేసి (1653), మత, లౌకిక విషయముల రెండింట తానే సర్వాధికారము లను వహించి, నియంతగ మరణ పర్యంతము (1658) పాలించెను. అతని అనంతరమున సమర్థులగు పాలకులు లభింపకుండుటవలన పూర్వపు ఛార్లెస్ - I యొక్క వంశము వారికే సింహాసనము ఈయబడినది. కాని, వీరు ఇంగ్లండు దేశమున వ్యాప్తియందు ఉన్న ప్రొటెస్టంట్ మతమును అభిమానింపని కేతలిక్ లు అగుటయేకాక, రాజ నిరంకుశతను ఇచ్ఛగించువారు అగుటవలన మరల కలతలు చెలరేగి, ప్రజలు ఆ రాజవంశమునే పదవినుండి తొలగించి, అందలి కడపటి రాజునకు అల్లుడగు వానిని ఒకనిని రాజుగ కొనివచ్చిరి (1688). అంతట పార్లమెంట్ తన హక్కులను సుస్పష్టము చేయుటకై స్వత్వప్రకటనను (డిక్లరేషన్ ఆవ్ రైట్స్) ఒక దానిని వెలువరించుటయే కాక దానినే చట్టరూపమున స్వత్వశాసనము (బిల్ ఆవ్ రైట్స్) అను పేర ఆమోదించి, రాజు అంగీకారమును పొందెను (1689). రాజు యొక్క అధికారములకు హద్దులను ఏర్పరచుచు రాజును, పార్లమెంట్ ను ఒద్దికతో దేశపరిపాలనను నిర్వహించు విధానమును ఈ శాసనము ఉభయ పక్షముల ఇష్టముతో నెలకొల్పగలిగెను. విపరీత రక్తపాతము లేకుండ ఇష్టపూర్వకముగ రాజునుండి పార్లమెంట్ నకు అధికారమును సంక్రమింప చేయగలిగిన ఈ సంఘటనయే 'ఉదాత్త విప్లవము (గ్లోరియస్ రివల్యూషన్)' అని ఇంగ్లండు చరిత్రయందు వ్యవహరింపబడుచున్నది.

ఇక స్పెయిన్ ప్రభుత్వపు దాస్యమునుండి వెలువడుటకు హాలండ్ సాగించిన పోరాటమే ఆ రాజ్యమున ప్రజాప్రముఖులకు పలుకుబడిని కల్గించుటకు తోడ్పడినది. ఈ పోరాటము విజయవంతముగ ముగిసినంతట (1609) ఒక విధమగు గణరాజ్యము ఆ దేశమున ఒక ప్రముఖ రాజవంశపు పెద్దరికమున నెలకొన గలిగినది. స్విజర్లండ్ నందును చారిత్రక పరిణామములవలన వివిధ మండలములు స్వేచ్ఛాపూర్వకముగ గణరాజ్యముగ రూపొంది విస్తృతిచెందుట జరిగినది. కాని, వీనిపై హాప్స్ బర్గ్ ల సర్వాధిపత్యము నామ మాత్రముగ చాలవరకు ఉండినది. కడకు ఇదివరలో చెప్పబడినటుల [చూ. పు. 130] వెస్ట్ ఫేలియా శాంతిసంధి [చూ.] వలన హాలండ్ నకును, స్విజర్లండ్ నకును స్వతంత్రరాజ్యములుగ పరిగణన లభించినది.

పశ్చిమ యూరప్ నందుననే కాక తూర్పు యూరప్ నందును ఆ కాలమున గణరాజ్యమని చెప్పదగిన వేరొక రాజ్యము రూపొందినది. అదియే పోలండ్. ఇచట కొందరు ప్రజాప్రముఖులచే ఎన్నుకొనబడిన రాజరికము పాలనను నెరపెడిది. అయినను దాని ఉనికినిబట్టి అది ఒక బలహీన రాజ్యముగ మాత్రమే మనగలిగినది.

ఇటుల ప్రజాతంత్రభావన అటనట మొలకెత్తి అస్ఫుట రూపమునైనను వ్యాపించుచుండిన ఈ కాలముననే ఫ్రాన్స్ నందలి మహాదేశరాజతకు తుల్యమగు రాచరికము యూరప్ ఖండపు తూర్పు కడయంచున - రష్యాయందు - నెలవు కల్పించుకొనినది. ఆ దేశమునకు పశ్చిమ యూరప్ తో క్రైస్తవమతము మూలమునను, రాచరికపు సంబంధముల వలనను సాన్నిహిత్యము పెంపొందిన కొలది, యూరపియన్ సంప్రదాయములును, భావములును అట వ్యాపించి బలపడసాగినవి. పీటర్ (1672 - 1725) రాజు కాలమున ఈ పరిణామము ఉచ్చతరస్థితిని ప్రాపించినది. పరిపాలనా భారమును వహించినది మొదలుగ (1696) అతడు రష్యన్ ల జీవితమున వివిధ రంగములందును యూరపియన్ సంప్రదాయములను ప్రవేశపెట్టెను. యూరప్ న పర్యటించిన ఫలితముగ ఆ ఖండపు పరిశ్రమలయు, నౌకాదళ, సైన్య బల వ్యవస్థలయు తీరుతెన్నులను అతడు సమగ్రముగ తెలిసికొని, వానిని తన దేశమున అనుకరించెను; కడకు మతపీఠాధిపత్యమును రద్దొనర్చి తన దేశమందలి క్రైస్తవ మతము తనకే బాధ్యతవహించి వర్తించునటుల జేసెను. వాయవ్యమున బాల్టిక్ సముద్రతీరమునకు తన రాజ్యమును అతడు విస్తరింపజేసి, యూరప్ నకు సాన్నిహిత్యమును పూర్వముకన్న మిన్నగ ఆర్జించుటయే కాక, ఎగుమతి దిగుమతులకు ఏడాది పొడవున పనికివచ్చు రేవులను సంపాదింపగలిగెను.

ఇటుల 16 వ, 17 వ శతాబ్దములలో యూరప్ న చరిత్ర అతి త్వరితగతిలో నడచిన ఫలితముగ నూతన భావములతో పాటుగ నూతన జాతీయ రాజ్యములును తావు కల్పించుకొని ముందునకు రాగలిగినవి. ఈ పరిణామముల ఫలితములు స్థానికముగ యూరప్ ఖండమునకు మాత్రమే

సంబంధించినవి అయినచో, ఈ ప్రపంచ చరిత్ర సమీక్ష యందు, వానిని ఇంతమాత్రపు స్థూలరీతిలోనైనను ప్రసక్తింపవలసిన పని ఉండెడిదికాదు. కాని, 16వ శతాబ్ది మొదలుగ - ఇదివరలో పేర్కొనబడినటుల - కొన్ని చారిత్రక పరిణామములవలన చరిత్రగతిని యూరప్ దేశములు తమ కైవసము చేసికొనినవి. యూరప్ ఎల్లలను అతిక్రమించి యూరప్‌వాసులు అమెరికా మొదలగు నూతన భూములకు వలస తరలుటయు, ప్రాచ్య భూములకు వర్తక దృష్ట్యా పయనించి అట స్థావరముల నెలకొల్పి, ప్రముఖతను ఆర్జించుటయు ఈ రెండు శతాబ్దములయందే మొదలై కొనసాగినది. అట్టి వలసలు, వ్యాపారవిస్తృతులు, వాని పరిణామములు మొదలగు వానిపై యూరప్‌దేశముల రాజకీయ సంఘర్షణల ముద్ర స్థిరముగ ఉండుటవలన ఆ యా కాలములందలి యూరప్ దేశముల రాజకీయ ప్రతిపత్తిని గురించియు, వాని పరస్పర సంబంధములను గురించియు తెలిసికొనుట పాఠకులకు అత్యంతావశ్యకము. కావున, వానిని స్థూలముగ ఇట ఇంతవరకు తెలుపవలసి వచ్చినది. ఇక యూరప్‌ను గురించిన ఈ విషయములను భూమికగ గ్రహించి 16వ శతాబ్ది మొదలుగ యూరపియన్‌లు తమ సముద్రాధిపత్యము ద్వారా వర్తించిన తీరుతెన్నులను తెలియవలసి ఉన్నది.

**అమెరికా ఉనికిని కనుగొనుట :** 1492 లో అట్లాంటిక్‌న పశ్చిమముగ పయనించిన కొలంబస్ క్యూబా, హయిటీ దీవుల ఉనికిని కనుగొనినను, వానిని ఆసియాఖండ పరిసర దీవులుగ భ్రమించి, స్వదేశమునకు తిరిగివచ్చి దేశీయులకును ఆ విధముగనే తెలిపెను. ఆ తరువాత మూడు పర్యాయములు సముద్రయాత్రచేసి, ఆ పరిసరములందలి వేర్వేరు దీవులను కనుగొనినను, అవి అన్నియును ఆసియాయందలి ఇండియా దేశమునకు సన్నిహితములగునవియే అను భ్రమ కొలంబస్‌నకు పోలేదు. అందువలననే అతడు వానికి 'ఇండీస్' అని పేరిడెను. స్పెయిన్ ప్రభువు సాయమున తన అన్వేషణను సాగించుట వలన ఈ దీవులలో స్పెయిన్ రాజరికపు ఆధిపత్యమును కొలంబస్ సంస్థాపించెను. ఆ కాలముననే పోర్చుగీస్‌వారును సముద్రమార్గమున ప్రాచ్యభూములను చేరుటకు యత్నించుచున్నందున, తాము కనుగొనిన భూములనే పోర్చుగీస్ వారును కనుగొని, తమవిగ ప్రకటించి తగవులాటకు దిగుదురను సందేహముతో స్పెయిన్‌ప్రభువులు తమ హక్కులను స్థిరపరచవలసినదిగ క్రైస్తవమత పీఠాధిపతియగు పోప్‌ను ప్రార్థించిరి. అంతట సముద్రాన్వేషణల ఫలితముగ స్పెయిన్, పోర్చుగల్ దేశములమధ్య తగవులాటలు చెలరేగకుండుటకై అప్పటి పోప్ 1493 లో ఒక శ్రీముఖమును వెలువరించెను. అజోర్స్ దీవినుండి పశ్చిమమున 160 కి. మీ. దూరమున దక్షిణమునకు గీయబడిన ఒక రేఖకు పశ్చిమమున ఉండు భూములలో క్రైస్తవరాజు వశమున లేనిది ఏదియైనను స్పెయిన్‌నకు చెందవలసినదిగ ఇందువలన ఏర్పాటు జరిగెను. ఆ రేఖకు తూర్పు దిక్కున ఉండు భూములలో క్రైస్తవేతర రాజుల వశమున ఉన్నవానిపై పోర్చుగల్‌నకు ఈ విధముగ హక్కు సంక్రమించెను. తరువాత 1494 లో ఈ ఏర్పాటులో కొలది మార్పులు ఉభయ పక్షముల ఇష్టముపై జరిగెను.

కొలంబస్ కనుగొనిన 'ఇండీస్' (ఇవియే నేటి వెస్ట్ ఇండీస్ దీవులు) లో కాలు నిలువ ద్రొక్కుకొనిన తరువాత స్పెయిన్ వారిలో కొందరు అన్వేషకులు ఫ్లోరిడా ప్రాంతమును 1520 లో కనుగొనిరి. వేరొక అన్వేషకుడు అంతకు కొలదికాలము పూర్వముననే పనామా భూసంధి ప్రాంతమును కనుగొని దానికి అవల వైపున పసిఫిక్ మహాసముద్రమును కనుగొనెను. ఉత్తర, దక్షిణములందు దేశపు తీరమును ఆశ్రయించి ఈ మహాసముద్రము విస్తృతముగ వ్యాపించి ఉన్నదని అచటి స్థానిక ప్రజలు ఆ అన్వేషకునికి తెలియజేసిరి. అంతటితో ఆ భూఖండము ఆసియా కాదనియు, వేరొకటి అనియు స్పెయిన్‌వారు నిర్ధారణకు రాగలిగిరి. ఈ విశాల భూఖండమును సైతము స్పెయిన్ సామ్రాజ్యమున అంతర్భాగముగ చేసికొనుటకు అప్పటి క్యూబా గవర్నర్ సంకల్పించి, 1517 లో మెక్సికో యందలి యూకటాన్ ద్వీపకల్పము పైకి ఒక దండయాత్రాదళమును పంపెను. అప్పటివరకు పరిసరదీవులందు అనాగరక ప్రజలను మాత్రమే కనుగొనిన స్పెయిన్ యోధులకు ఆ ద్వీపకల్పమున అబ్బురము కలిగించు రీతిగ నాగరకతను పొందిన దేశీయులు కంటబడిరి.

**అమెరికాలోని పూర్వ నాగరగతలు :** 'అమెరికా' అనుపేర తరువాత ప్రపంచమునకు తెలియవచ్చిన ఆ నూతన ప్రపంచమున తక్కిన ప్రపంచముతో ఎట్టి సంపర్కమును లేకుండగనే, స్వయంకృషితో కొన్ని జాతులు క్రీ. శ. 1000కి ముందుగనే ధాతుయుగపు నాగరకతాస్థాయిని అందుకొనగలిగినవి. వానిలో చరిత్రకు తెలియవచ్చిన మేరకు ప్రప్రథమమైనది మాయా నాగరకత [చూ. సం. 10 - పు. 583]. ఈ నాగరకత తొలుతగ మధ్య అమెరికాలో, అనగా హోండూరాస్, గ్వాతెమాలా ప్రాంతములందు రూపొంది వర్ధిల్లెను. క్రీ. పూ. 500 ప్రాంతమునుండియే మాయాలు నాగరకతా పథమున పురోగమింప మొదలిడిరనియు, క్రీ. శ. 1000 నాటికి

వీరి నాగరకత పరాకాష్ఠను అందుకొన గలిగినదనియు పలువురు పండితుల అభిప్రాయము. వీరు రాతితో మాత్రమే పరికరములను నిర్మింప నేర్చిరి. ధాతువులలో బంగారముతో తప్ప తక్కినవానితో వారికి పరిచయము లేకుండెను. యూరప్‌వాసులు కాలిడు నాటికే ఈ మాయా నాగరకత అంతరించినది. కరవుకాటకములును, అంతర్యుద్ధములును ఇందులకు కారణమై ఉండునని అభిజ్ఞుల ఊహ. చిత్రలిపి సంకేతములతో వీరు శిలలపై చెక్కిన పంచాంగములును, శిల్పచాతుర్యమును వెలివరచు రీతిగ నిర్మింపజేసిన ఉన్నత దేవమందిరములును, రాజప్రాసాదములును నేటికిని - శిథిల రూపమున సైతము - ఆ నాగరకతా స్థాయిని తెలియజేయుచున్నవి. ఆ నాగరకత తన అంత్యదశలో మెక్సికోకును వ్యాపించి క్రమముగ అట ప్రాచుర్యమునకు వచ్చిన అజ్‌టెక్ నాగరకతలో లీనమయ్యెను.

స్పెయిన్‌వారు కాలిడునాటికి మెక్సికోయందు ఈ అజ్‌టెక్ నాగరకత అత్యుచ్చస్థితిలో ఉండెను. చేతిపనుల విన్నాణమునకు పేరొందిన పనివారును, ఆ పనివారు తయారు చేసిన వస్తువులను దూర భూములకు కొనిపోయి విక్రయించి దేశమునకు బంగారమును కొనివచ్చు వర్తకులును, నేలను సాగుచేయు రైతులును ఆ సంఘమున ఉన్నను సర్దారులదే పైచేయిగ ఉండెడిది. ఈ సర్దారులే మతాచార్యులుగ సైతము వర్తించెడివారు. మాయాల వలెనే అజ్‌టెక్‌లును శిల్పాది విద్యలలో కుశలురే అయినను కంచు మొదలగు ధాతుమిశ్రముల తయారీని గురించిగాని, ఇనుమును గురించిగాని ఎరుగరు. వారి పరికరములు రాతితో చేయబడెడివి. చేతిపనులలో కుశలతను ఆర్జించిన అజ్‌టెక్ శిల్పులు రాతితో అద్దములను, క్షురకర్మకు పనికివచ్చు కత్తులను తయారు చేసెడివారు. బంగారముతో మాత్రము వారికి పరిచితి విరివిగ ఉండినది.

ఈ అజ్‌టెక్ నాగరకతకు సమకాలీనముగ దక్షిణ అమెరికాలో ఇన్‌కా నాగరకతయు వర్ధిల్లినది. ఆండీస్ పర్వత సానువుల మధ్య పెరూదేశ ప్రాంతము ఈ నాగరకతకు నెలవు. ఆండీస్ పర్వతములకును, పసిఫిక్ మహాసముద్రమునకును మధ్యనున్న భూమియంతయు దక్షిణమున ఆర్జెంటీనా, చిలీ వరకు ఈ ఇన్‌కాల సామ్రాజ్యమున చేరి ఉండినది. పెద్ద ఆనకట్టలను కట్టి భూములకు నీరు పారించి, వ్యవసాయము చేయుటను వీరు నేర్చిరి. కుండలు చేయుటయు, నేతపనియు వీరియందు గొప్ప పరిణతిని సాధించినవి. బంగారము, రాగి, కంచు ధాతువులతో ఇన్‌కాలకు పరిచయము ఉండెడిది. కాని ఇనుమును మాత్రము వారెరుగరు. వ్రాతకై లిపిని వారు కనుగొనలేకపోయిరి; కాని, త్రాళ్లపై వేయబడు కొన్ని ముడులవలన భావ ప్రకటనకును, గ్రంథరచనకును, పంచాంగముల లెక్కించుటకును వీరు అవకాశమును కల్పించుకొనిరి.

## అమెరికాలో యూరపియన్‌ల వలస వ్యాప్తి

పై అజ్‌టెక్, ఇన్‌కా నాగరకతల రెండింటిని స్పెయిన్ సాహసికులు నీతి - నియమముల జంకు రవంతయు ఇడుకొనక 1536 కు అంతముచేసి, ఆ ప్రాంతములను ఆక్రమించి సువర్ణరాశులను స్పెయిన్‌కు తరలించిరి. అది చాలక బంగారము, వెండి గనులలో దేశీయులచే వెట్టి చాకిరి చేయించి, లబ్ధములయిన ఆ అమూల్య ధాతువులలో కొంత స్పెయిన్ రాజునకు పంపి, మిగతాదానిని అచటి స్పెయిన్ సైనికులు కాజేసెడివారు. అమెరికా ఖండమందలి ప్రముఖ నాగరకతలను ఇటుల అంతము చేసిన తరువాత దక్షిణ, మధ్య అమెరికాలలోని తక్కిన ఆదిమజాతులను అడచి, ఆ ప్రాంతములను అనతికాలములోనే స్పెయిన్‌వారు వశపరచుకొనిరి. కాని, బ్రెజిల్ దేశము మాత్రము ఒక పోర్చుగీస్ నావికునిచే కనుగొనబడుటవలన పోర్చుగీస్‌వారికే దక్కినది.

అమూల్య ధాతువుల తరలింపుపైనుండి ఆసక్తి కొంత దిగజారిన తరువాత వ్యవసాయోత్పత్తిపైకి స్పెయిన్‌వారు తమదృష్టిని మరలించిరి. తన సర్దారులకు స్పెయిన్ చక్రవర్తి తన సామ్రాజ్యమునందలి భూములను పంచి ఇచ్చుటవలన విశాల క్షేత్రములు వారికి ఏర్పడి దేశీయులు కూలిచేసి బ్రతుకు దుస్థితికి లోనైరి. ఇట్టి పరిస్థితులలో దేశీయుల శ్రేయస్సుకై - ఏ కొలదిగనైనను - మతసంస్థలు కృషిచేయగలిగినవి. 1549 తరువాత క్రైస్తవమత ప్రచారమునకై అమెరికాకు వచ్చిన మతసంస్థలు దేశీయులలో విద్యావ్యాప్తికై కృషి చేయుటయేకాక, దేశీయుల స్వత్వములకై కూడ పోరాడినవి. దేశీయులకు స్పానిష్ భాషతో పరిచయమును కల్గించుటయేకాక, వివిధ వృత్తి విద్యలను కూడ మతాచార్యులు వారికి బోధింపజేసిరి. వీనివలన క్రైస్తవ సంస్కృతి, స్పానిష్‌భాషయు సంకర రూపమున అమెరికాలోని స్పెయిన్ సామ్రాజ్యమునందు అంతట వ్యాపించుటయేకాక స్పెయిన్ జాతియు, ఆదిమ జాతులును వైవాహిక బంధములను ఏర్పరచుకొనిన ఫలితముగ ఒక మిశ్రజాతియు రూపొందినది [చూ. సం. 10 - పు. 587].

దక్షిణ అమెరికాలో తమకు దక్కిన ఒకే ఒక స్థావరమగు బ్రెజిల్‌లో పోర్చుగీస్‌వారు ఎక్కువగ వలసస్థావరము

లను పర్వరచుకొనుటకు యత్నించకపోయినను, విరివిగ వ్యవసాయ క్షేత్రములను నెలకొల్పి, వాని ఉత్పత్తిని వ్యాపారమునకై వినియోగించుటకు కృషిచేసిరి. కాని, బ్రెజిల్‌నందలి దేశీయులకు స్థిరనివాసము, వ్యవసాయము అనిన ఆనాడు ఆదరము ఉండెడిదికాదు. అందువలన ఇందులకై కూలిజనమును వేరుప్రాంతములనుండి తీసికొని రావలసిన ఆవశ్యకత కలిగినది. తత్ఫలితముగ ఆఫ్రికా నుండి నీగ్రో బానిసలు కొనిరాబడిరి. ఆ తరువాత ఇట్టి సందర్భములలోనే వెస్ట్ ఇండీస్‌నకును నీగ్రో బానిసలు దిగుమతి చేయబడిరి. తత్ఫలితముగ పశ్చిమ యూరప్ నాగరకతల ఆధ్వర్యవమున హేయమగు బానిస వ్యాపారము విరివిగ సాగ మొదలైనది. కాలక్రమమున వెస్ట్ఇండీస్‌లో తక్కిన జాతులకన్న నీగ్రోల సంఖ్యయే ఎక్కువైనది. బ్రెజిల్‌లో పోర్చుగీస్, అమెరికా ఆదిమ జాతులు, నీగ్రోలు సంకరము చెందిన ఫలితముగ ఆ దేశమున ఒక మిశ్రజాతి, పోర్చుగీస్ భాషా, క్రైస్తవ మత, సంస్కృతులను అవలంబించి రూపొందినది [చూ. సం. 10 - పు. 428].

ఈ విధముగ పదునారవ శతాబ్ది అంతమునకు పశ్చిమ యూరప్‌నందలి పోర్చుగల్, స్పెయిన్ దేశములు సముద్రాధిపత్యమును వహించి, అమెరికాలో ఫ్లొరిడా మొదలుగ దక్షిణమున ఉన్న భూమిపై ఆధిపత్యము వహింపగలిగినవి. ఆ కాలముననే ప్రాచ్యదేశములందు పోర్చుగల్ విశాల ప్రాంతములను అటనట ఆక్రమించి ఒక సామ్రాజ్యమును స్థాపింపగలిగినది. ఇటుల ఈ రెండు దేశములును సముద్రపు బాటలను గుత్తగొనుటవలన యూరప్‌నందలి తక్కిన దేశములకు కన్నెర్ర అయ్యెను. ఆ దేశములలో జర్మనీ, ఇటలీ దేశములందుతప్ప తక్కిన అన్నింట వృత్తికుశలత ఈ యుగమున పెంపొందుటవలన, తయారీ సరకులకై విపణులను, తయారీకొరకై కొన్ని ముడిపదార్థములను వీరు వెదకుకొనవలసివచ్చినది. ఇందులకు స్పెయిన్, పోర్చుగల్ దేశములపై ఆధారపడుటవలన తక్కిన దేశములు పెక్కు ఇబ్బందులను ఎదుర్కొనవలసివచ్చెను. అమెరికా నుండి ఐబీరియన్ (స్పెయిన్) ద్వీపకల్పమునకు ప్రవహించు సువర్ణప్రవాహముకూడ తక్కిన దేశములందలి కొందరు సాహసికులకు ఆశలను రేకెత్తించెను. తత్ఫలితముగ వివిధ దేశములును తమ పరిస్థితులను అనుసరించి వలసలకై కృషి చేసినవి. పోప్ వెలువరించిన శ్రీముఖమును అనుసరించి సముద్రాంతర క్రైస్తవేతరసీమలపై ఆధిపత్యము స్పెయిన్, పోర్చుగల్ దేశములకు మాత్రమే కలదను ఏర్పాటును ప్రొటెస్టంట్ దేశములగు ఇంగ్లండు, హాలండ్, డెన్మార్క్ దేశములే కాక కేతలిక్ దేశమగు ఫ్రాన్స్‌సైతము త్రోసి రాజని వ్యవహరించినది. ఈ ప్రయత్నములలో అమెరికాకు సంబంధించినంతవరకు ఇంగ్లీషు, ఫ్రెంచి సాహసికుల యత్నములే ఎక్కువగ ఫలితములను సాధింపగలిగినవి.

ఫ్రెంచివారు ఉత్తర అమెరికాయందు క్విబెక్ ప్రాంతమున 1608 లో తమ తొలుతటి స్థావరమును నెలకొల్పిరి. అటనుండి లోనికిపోయి వారు క్రమముగ ఉత్తర అమెరికా ఉత్తరభాగమునందు అంతటను అటనట వర్తకస్థావరముల నెలకొల్పి, బొచ్చు సరకుల వ్యాపారమును సాగించిరి. లూయీ - XIV కాలమున భారీ ఎత్తున దేశాంతర్భాగపు అన్వేషణయు, వలసయు సాగింపబడినవి. ఉత్తర అమెరికా అంతర్భాగమున ఉన్న మహా సరస్సుల పరిసర ప్రాంతములను ఫ్రెంచివారగు క్రైస్తవమత ప్రచారకులు పరిశీలించి వివరములను గ్రహించుటయే కాక, అచటి ఆదిమజాతులలో క్రైస్తవ మతమును వ్యాపింపజేసిరి. ఈ మతప్రచారకుల ఒరవడిని అనుసరించి లాసల్లే అను ఫ్రెంచి ప్రముఖుడు దక్షిణమున మెక్సికో సింధుశాఖవరకు దేశమును పరిశీలించి, ఉత్తర అమెరికా మధ్యభాగమునకు చెందిన ఆ విశాల భూమికి - ఫ్రెంచిరాజగు లూయీ పేర - 'లూజియానా' అని పేరిడి, ఫ్రెంచిరాజ్యమున దానిని చేర్చెను (1682). మధ్యభాగము ఇటుల ఫ్రెంచివారి వశమైనను సెయింట్ లారెన్స్ దిగువ ఉత్తర అమెరికా తీర భూమియందు ఇంగ్లీషు ప్రజలు తమ వలసలను స్థాపింపగలిగిరి. వీనియందలి తొలుతటి స్థావరము 1607 లో నెలకొల్పబడెను. ఆ తరువాత తీరము పొడవున అటనట స్థావరములు నెలకొని విస్తృతి చెందినవి. ఇంగ్లండులో మత విషయికముగను, ఆర్థికముగను చెలరేగిన దుస్సహ పరిస్థితులే చాలవరకు ఈ వలసలకు కారణభూతములైనవి. తీరమున ఉత్తరప్రాంతపు వలసలను, దక్షిణప్రాంతపు వలసనుండి వేరుపరచుచు ఒక డచ్చివలసయు అపుడు ఏర్పడినది; కాని, దానిని ఆ కాలపు ఇంగ్లండు ప్రభువగు ఛార్లెస్ - II వశపరచుకొని, ఆంగ్లేయులకు వశముచేసెను (1664). అదియే ఇప్పటి న్యూయార్క్.

ఆంగ్లేయులును, ఫ్రెంచివారును అమెరికా యందు ఇటుల ఒకరి పొరుగున వేరొకరు చేరగనే, యూరప్ నందలి రాజకీయముల ప్రభావము అట ద్యోతకము కాసాగినది. యూరప్‌న ఇంగ్లండు, ఫ్రాన్స్ దేశములమధ్య పోరాటములు సంఘటిల్లినపుడెల్ల వాని ఫలితములు వాని వలసలందును కానవచ్చెడివి. వీనిలో స్పానిష్ వారసత్వపు యుద్ధమును (1701 - 1714), సప్త సంవత్సర యుద్ధమును (1756 - 1763) ఇట ప్రసక్తిలోనికి తీసికొనదగినవి. వీనిలో మొదటిదానివలన ఉత్తర అమెరికాలోని అకేడియా

హడ్సన్ బే ప్రాంతము, న్యూ ఫౌండ్‌లాండ్ అనువానిని ఫ్రెంచివారు ఇంగ్లీషువారికి వదలుకొనిరి; రెండవదాని వలన ఫ్రెంచివారు కెనడాను ఇంగ్లీషువారికి వశపరచుటయేకాక భారతదేశమున తమ సామ్రాజ్య సంపాదనా యత్నమునకును స్వస్తి చెప్పవలసిన వారైరి (ఉత్తర అమెరికా అంతర్భాగమున ఫ్రెంచివారు ఆర్జించిన లూజియానా మాత్రము స్పెయిన్‌నకు 1763 లో ఈయబడి, తరువాత 1800 లో ఫ్రెంచివారి వశమై, 1803 లో కొనుగోలు మూలమున యునైటెడ్ స్టేట్స్‌కు లభించినది).

## ప్రాచ్యమున పాశ్చాత్య వలసల వ్యాప్తి

భారతదేశమునకు సముద్రమార్గమున త్రోవను కనుగొనిన ఖ్యాతి పోర్చుగీస్‌లకే దక్కినను, క్రమముగ వారి సముద్రాధిపత్యమును త్రోసిరాజని హాలండ్, ఇంగ్లండు, స్వీడెన్, డెన్మార్క్, ఫ్రాన్స్ వర్తకసంఘములును ముందునకు వచ్చి ప్రాచ్యదేశములతో నౌకావాణిజ్యమునకు పూనుకొనినవి. కాని, ఇవి సువ్యవస్థితరీతిలో సముద్రయానమును గురించి తగు విజ్ఞానమును సంపాదించుటకు ముందుగ దాదాపుగ ఒక శతాబ్దికాలము పోర్చుగీస్ నావలే సముద్రవ్యాపారమును గుత్తగొని, అదివరకు అరేబియా సముద్రమున వ్యాపారముపై సర్వస్వామ్యమును వహించిన అరబ్బీవర్తకులను ఆవలకు నెట్టివేయగలిగినవి. యూరప్ రాజ్యములలో స్పెయిన్ ఒకటి మాత్రమే వారికి ప్రతిస్పర్ధిగ నిలచినను, పోప్ వెలివరచిన శ్రీముఖమువలనను, తరువాత ఉభయులు చేసికొనిన సర్దుబాటులను బట్టియు పోర్చుగీస్‌వారికి పోటీగా స్పెయిన్ ప్రాచ్యదేశములందు వ్యవహరింపక మిన్నకుండెను.

కళ్ళికోటవద్ద వ్యాపారోద్దేశముతో 1498 లో దిగిన పోర్చుగీస్‌వారు క్రమముగ అప్పటి దక్షిణ భారతదేశపు రాజకీయ పరిస్థితులను ఆధారముగ చేసికొని 1510 లో గోవాను ఆక్రమించుకొనుటతో భారతదేశమునకు పశ్చిమ తీరమున ఒక విస్తృతభూమిపై ఆధిపత్యమును వహింపగలిగిరి: ఆ తరువాత వారు ఆ దేశపు ప్రాక్పశ్చిమతీరము లందు అటనట పలు స్థావరములపై ఆధిపత్యమును నెలకొల్పగలిగిరి. భారతదేశముననే కాక తక్కిన ప్రాచ్య భూములందును పలు స్థావరములను వారు ఆర్జించిరి. ఇరాన్ తీరపు హార్మజ్ (1507), మలేసియా యందలి మెలుక్కా (1511), చీనా తూర్పుతీరమందలి మకావో (1557), బర్మాతీరమందలి మార్తబాన్ (1519), జపాన్ లోని తనేగాషీమా దీవి (1542 - 43) మొదలగునవి ఆ కాలమున పోర్చుగీస్ వర్తక స్థావరములుగ ఆ యా సూచితాబ్దములందు స్థాపింపబడినవి. సయామ్‌నందును వారు పలుతావులలో స్థావరములను స్థాపించి, సింహళమున అత్యధిక భాగమున తమ పలుకుబడిని వ్యాపింపజేయగలిగిరి. పోర్చుగీస్‌లు ఎటకుపోయినను అటకు వారి ఆదరణను పొందిన క్రైస్తవమత ప్రచారసంఘము (జెసూట్ అను ప్రత్యేక సంప్రదాయమునకు చెందినది) వారిని అనుగమించినది. పరమతములయెడ అసహిష్ణుత ఆ సంఘములోని వారి ముఖ్యలక్షణము. అందువలన కాలిడినచోటుల నెల్ల పోర్చుగీస్‌లు దేశీయ ప్రజల విద్వేషమును ఎదుర్కొనవలసి వచ్చినది. ఆసియాలోనేకాదు, ఆఫ్రికాయందలి క్రైస్తవ రాజ్యమగు ఎతియోపియాలో సైతము ఈ జెసూట్ మత ప్రచారకుల చర్యలవలన పోర్చుగీస్‌లకు చుక్కెదురైనది.

పోర్చుగల్ సముద్రాధిపత్యమును వహించి ప్రాచ్య దేశములందలి తీరభూములలో స్థావరములను, రాజ్యములను స్థాపించిన ఈ శతాబ్దియందే ఆ విశాల ప్రాచ్యదేశములందును రాజకీయముగ చారిత్రాత్మకములగు పలు సంఘటనలు జరిగినవి. ఆ శతాబ్ది ప్రథమ పాదమున ఈజిప్టు ఓటోమన్ తుర్కులకు సంపూర్ణముగ వశమయ్యెను (1517). మధ్యప్రాచ్యమున షియా సంప్రదాయపు ఇస్లామ్‌నకు చెందిన షా ఇస్మాయిల్ సున్నీ మతానుయాయులగు ఓటోమన్ తుర్కులయు, ఉజ్బెక్‌లయు ప్రతిఘటనను ఎదుర్కొని ఇరాన్‌న ఒక జాతీయ రాజ్యమును నెలకొల్పి (1501), షియా సంప్రదాయపు ఇస్లామ్‌నకు జాతీయ మతముగ పరిగణనను కల్పించెను. ఈ వంశీయులు 1722 వరకు ఆ దేశమును పరిపాలించిరి. ఈ వంశమునకు చెందినవాడే చరిత్ర ప్రసిద్ధుడగు షా అబ్బాస్ (1587 - 1629 ప.) దృఢమనస్కతకును, సువిశాల దృష్టికిని ఇతడు పేరొందెను. సైన్యమును సువ్యవస్థీకృతము చేసి తుర్కులను, ఉజ్బెక్‌లను పరాజితులుగ చేయుటయేకాక లలితకళలను పోషించి, పరంపరాగతముగ లలితకళాచరిత్రయందు పారసీకమునకు ఉండిన ప్రతిష్ఠను అతడు చిరస్థాయిగ చేసెను.

ఉత్తర భారతదేశమున 16వ శతాబ్దిలో నామ మాత్రాధికారమును నెరపుచున్న ఢిల్లీసుల్తాన్‌ను పరాజితుని చేసి, మొగల్ నాయకుడు బాబర్ ఒక నూతన సామ్రాజ్యమునకు పునాదులను వేసెను. అది మొదలుగ [ఆఫ్ఘన్‌ల నాయకుడగు షేర్‌షాయు, తదనుగాములును పాలించినపుడు (1540 - 1555) తప్ప] దాదాపుగ మూడు శతాబ్దముల కాలము ఆ మొగల్‌సామ్రాజ్యము [చూ. భారతదేశ చరిత్రను రూపొందించుటలో ప్రముఖపాత్ర వహించినది. ప్రపంచమున విజేతలుగమాత్రమేకాక పరిపాల

నాథురీణులుగను పేరొందిన కొలదిమంది చక్రవర్తులలో మొగల్ వంశమునకు చెందిన అక్బర్‌నకు (1556 - 1605 ప.) గణనీయమగు స్థానము కలదు. మత సహిష్ణుతకు పేరొందిన అతని పరమత జిజ్ఞాసను క్రైస్తవమతము నెడల అతనికిగల ప్రేమగ పోర్చుగీస్‌వారు పొరపడిరి. కాని, వారి ఆశలు వమ్మాయెను. ఉత్తర, మధ్య భారతదేశములును దక్కనున అహమ్మద్ నగర్ రాజ్యమును అప్పటికి మొగల్ సామ్రాజ్యమున చేరి ఉండినవి. దక్కనునందలి ఏకైక హిందూ రాజ్యమగు విజయనగరరాజ్యము దక్కనులోని ముస్లిమ్ రాజ్యముల కూటమిచే ఆ శతాబ్దపు తృతీయపాదమున ఓడింపబడి (1565) బలహీనమయ్యెను [చూ. సం. 3 - పు. 369].

బర్మాయందు ఈ శతాబ్దియందే తాబిన్ ష్వెహ్తీ అను యోధుడు దిగువ బర్మాను 1542 లోను, ఎగువ బర్మాను 1546 లోను వశపరచుకొని బర్మాకు రాజు కాగలిగెను. పోర్చుగీస్‌లకు ధనమొసగి జనరూపమునను, ఆయుధ రూపమునను సాహాయ్యమును ఇతడు పొందెను. ఈతని వంశీయుడగు బాయిన్‌నాంగ్ సయామ్‌పై దాడి జరపి, అయోధ్యను వశపరచుకొని తన రాజ్యమును విస్తృతము చేయగలిగెను కాని, నిరంతర యుద్ధముల వలన రాజ్యము పటుత్వము కోల్పోవుటవలన సర్దారులు తిరుగుబాటు చేసి రాజధానియగు పెగూ నగరమునే ధ్వంసము చేసిరి. అంతట రాజ్యము ఛిన్నాభిన్నమై వివిధ ప్రాంతములు మాండలికులకు వశమైనవి (1600).

చీనాయందు ఈశతాబ్దిలో మింగ్‌రాజ్యము సుస్థిరతను సంపాదించుకొని సంప్రదాయ పద్ధతులలో పురోగమింపగలిగినది. మింగ్ ప్రభువుల సర్వాధిపత్యమును అంగీకరించి కొరియా యందు దేశీయపాలకులు పరిపాలన నెరపుచున్నను, జపానీయులు ఆ శతాబ్ది అంతమున సాగించిన ఒక దండయాత్ర మూలమున (1592 - 98) దేశము సర్వనాశనమైనది. చీనా సేనల జోక్యము వలన దేశము మాత్రము జపానీయుల వశము కాకుండ నిలువగలిగినది. జపాన్ దేశము ఈ శతాబ్ది ఉత్తరార్ధమున పటిష్ఠ నాయకత్వపు బలమున, జాతీయైక్యమును సంపాదింపగలిగినది. అంతవరకు దేశమున పలుప్రాంతములందు అధికారమును వహించి చక్రవర్తి పరిపాలననే ధిక్కరింపగలిగిన మత పీఠముల ప్రాభవము ఈ శతాబ్ది అంతమునకు నామావశిష్టమైనది.

ఈ రాజ్యములలో ఏవియు పోర్చుగీస్‌ల రాకను మొట్ట మొదట ఒక ముఖ్యవిషయముగ భావించినవి కావు. కాని, మత వ్యాపనమున వారు వహించిన శ్రద్ధ క్రమముగ కొన్ని దేశముల పాలకులకు - అందును ముఖ్యముగ చీనా, జపాన్, భారతదేశములందు - కొంత విద్వేషమును వారియెడ కలిగించినది. ఇందులకు తోడుగ యూరప్‌నుండి డచ్చివారు మొదలగు తక్కిన జాతీయులును వ్యాపార రంగమున ప్రవేశించుటతో పోర్చుగీస్‌ల పరిస్థితి విషమించినది.

హాలండ్ దేశీయులగు డచ్చివారు తమ ప్రభుత్వాదరణమున 1602 లో 'డచ్చి ఈస్ట్ఇండియా కంపెనీ' అను దానిని స్థాపించిరి. అంతకు కొలది కాలము పూర్వముననే 1600 లో ఇంగ్లండునను 'ఈస్ట్ఇండియా కంపెనీ' ప్రాచ్య భూములందు వ్యాపారమునకై ప్రభుత్వానుమతిని పొందినది. ఫ్రాన్స్‌నందు మాత్రము ఇట్టి వర్తక సంఘము 1664 లో 'కంపెనీ డి ఇండీ ఓరియంటలే' అను పేరున ప్రభుత్వ ప్రోత్సాహముతో రూపొందినది. డెన్మార్క్, స్వీడెన్ దేశముల వర్తకులును ఇట్టి వర్తక సంఘములుగ రూపొంది కొంతకాలము వ్యవహరించినను వారు ప్రాచ్య భూములందు స్థిరమగు రాజకీయ పరిణామమునకు దేనికిని కారణభూతులు కాకుండ కడచనుటవలన వారి ప్రసక్తి ఇట ఆవశ్యకము కాదు. ఇటుల ఏర్పడిన వర్తక సంఘములలో డచ్చివర్తక సంఘము మున్ముందుగ పోర్చుగీస్ వారిని ఎదుర్కొని వారి సముద్రాధిపత్యమును తన కైవసము చేసికొనగలిగినది. ఇండోనీషియాలోని అంబోయినాను పోర్చుగీస్‌ల నుండి డచ్చివారు వశపరచుకొని (1605), సుగంధ ద్రవ్యముల వ్యాపారమును తమ చేతులలోనికి తీసికొనుటయే కాక, జావా దీవిలోని జకార్తాను సైతము వశపరచుకొని (1619), దాని శిథిలములపై బటేవియా నగరమును నిర్మించి, మొలుక్కాను కూడ స్వాధీనము చేసికొనిరి (1641). 1658 లో వారు పోర్చుగీస్ వారిని సింహళమునుండి తరిమి, వారి స్థానమును ఆక్రమించిరి. ఆఫ్రికాయందలి గుడ్‌హోప్ అగ్రపు పరిసర ప్రాంతమును, పశ్చిమ తీరమున కొన్ని స్థావరములను వీరు వశపరచుకొనిరి. భారతదేశమున పులికాటు, సూరత్ మొదలగు చోటులందును, చీనా తీరమునకు సమీపమున ఫార్మోజా దీవిలోను, పశ్చిమ జపాన్‌లోని హిరాడోలోను వారు ఫ్యాక్టరీలను స్థాపింపగలిగిరి. ఇటుల 17 వ శతాబ్దిలో ప్రాచ్య సముద్ర ఆధిపత్యమునకు సంబంధించినంతవరకు డచ్చివారిదే పైచేయి అయినటుల కన్పట్టసాగినది.

ఇంతలో ఇంగ్లీషువారి ఈస్ట్ఇండియా కంపెనీయు భారతదేశమున మొగల్ ప్రభువుల సమ్మతితో 1613 లో సూరత్‌న ఒక స్థావరమును ఏర్పరచుకొనినది. ఆ తరువాత చక్రవర్తి అనుమతితో మరికొన్ని స్థావరములను కూడ దేశమున వివిధ ప్రాంతములందు ఆ కంపెనీ వారు నెలకొల్పిరి.

ఇండోనీషియా దీవులందు డచ్చివారి పోటీవలన ఇంగ్లీషు వర్తకులు అచట కాలు నిల్వద్రొక్కుకొన జాలకపోయిరి. ఇరాన్‌లోని హోర్మజ్‌ను మాత్రము వారు పోర్చుగీస్‌ల నుండి బలప్రయోగమున వశపరచుకొని, ఇరాన్ దేశపు వ్యాపారమున కొన్ని సౌకర్యములను ఆర్జించిరి. 1639 లో భారతదేశపు తూర్పుతీరమున నేటి మద్రాసు ప్రాంతమును ఒక స్థానికపాలకుని ఆదరణవలన వారు సంపాదించిరి.

ఇటుల ఇంగ్లీషువారు వ్యాపార రంగమున పైకి వచ్చుట డచ్చివారికి సహింపరానిదయ్యెను. అంతట ఉభయ పక్షముల మధ్య వైరుధ్యములు పెరిగి యుద్ధము లకు ప్రోవతీసెను. 1652 లో జరిగిన ఒక నౌకాయుద్ధమున డచ్చి నౌకాదళము పరాజితమగుటతో ఇంగ్లీషువారికి మార్గము సుగమమైనది; కాని, అనతికాలముననే ఫ్రెంచి వారును సముద్రాంతర దేశములతో వ్యాపారము మొద లిడుట వలన 17 వ శతాబ్ది అంతమునుండియు ఆంగ్లేయులు ఫ్రెంచివారి పోటీని ఎదుర్కొనవలసి వచ్చినది.

భారతదేశ రాజకీయ వ్యవస్థ 18 వ శతాబ్ది ఆరంభ మునకు తన పటుత్వమును కోల్పోయినది. మొగల్ రాజ వంశపు ప్రముఖులలో కడపటివాడగు ఔరంగజేబు సామ్రాజ్యమును ఆసేతు హిమాచలము విస్తరింప చేయగలిగెనే కాని తన మతఛాందసమువలన దాని పటుత్వ మునకు భంగము కల్గించెను. ఉత్తరమున రాజపుత్రులు, జాటులు మొదలగువారు సామ్రాజ్య విచ్ఛిన్నముకొరకై కృషిచేయగ, దక్షిణమున మహారాష్ట్ర రాజ్యసంస్థాపకుడు శివాజీ నాయకత్వమున రూపొందింపబడిన మహా రాష్ట్రుల దేశభక్త్యుత్సాహములు ఔరంగజేబును అంత్య కాలమున పీల్చి పిప్పిచేసినవి. తత్ఫలితముగ భారత దేశైక్యమును రాజకీయముగ కాపాడగల శక్తి మృగ్య మయ్యెను. మొగల్ పాదుషాలు పేరునకు భారతదేశ చక్రవర్తులుగ లెక్కింపబడుచుండినను దేశము, సాహ సికులగు యోధులు ఇచ్చవచ్చిన రీతిగ రాజ్యములను రూపొందించుటకు అనువగు కార్యరంగముగ పరిణ మించినది. ఈ అస్తవ్యస్త పరిస్థితినుండి రక్షించి దేశమునకు ఏకతను సమకూర్చుటకు మహారాష్ట్రులు యత్నించిరి. కాని, 1761 లో పానిపట్టు యుద్ధమున మహారాష్ట్రులను ఆఫ్ఘన్‌పాలకుడగు అహ్మద్‌షా అబ్దాలీ భారత ముస్లిమ్ పాలకుల సాయముతో ఓడించుటతో, మహారాష్ట్ర కేంద్ర ప్రభుత్వపు ఆధిపత్యము సన్నగిలి, రాష్ట్ర పాలకులు బలపడుటచే దేశము ఛిన్నాభిన్నమైనది. ఇట్టియెడ తమ ఆధిపత్యమును భారతదేశమున నెలకొల్పుటకు ఫ్రెంచి, ఇంగ్లీషు కంపెనీలు రెండును యత్నించినవి.

తక్కిన ప్రాచ్యదేశములందును ఆనాడు ఇట్టి యూర పియన్ వర్తక సంఘములు ఉండినను, ఆ దేశములందు పెక్కింటి పరిస్థితులు వేరుగ ఉండుటవలన విదేశీయుల రాజ్యములు చీనా మొదలగు దేశములందు ఏర్పడుటకు తావులేకుండెను. విదేశీయ వర్తకులు తొలుతగ వర్తకము పేరున వచ్చినను క్రమముగ మతవ్యాప్తికిని, తరువాత రాజ్యాధికారమునకును వారు ప్రోవదీయగలరను భయము కొన్ని దేశములందు 17 వ శతాబ్దిలోనే కలుగ సాగినది. తత్ఫలితముగ 1638 లోనే యూరపియన్ వర్తకులను తమ రేవులలోనికిగాని, దేశములోనికిగాని రాకుండ జపాన్ ప్రభుత్వము నిషేధించెను. డచ్చివారి క్రింద ఉన్న ఒక చిన్న స్థావరమును మాత్రము వారిక్రింద ఉండనిచ్చి, వారైనను దేశములోనికి రాకుండ తమ కడకువచ్చు ప్రభుత్వోద్యోగులతో మాత్రమే వ్యవహ రించునటుల జపాన్ ప్రభుత్వము కట్టడి చేసెను. తరువాత దాదాపు రెండువందల సంవత్సరముల పై కాలమువరకు యూరప్‌వాసులకు ఏ విధముగను చొరరాని ప్రదేశముగ జపాన్ వ్యవహరించెను.

చీనా దేశమున 17 వ శతాబ్దిలో మింగ్ ప్రభుత్వము అంతరించి మంచూ ప్రభుత్వము ఏర్పడెను (1644). వీరును చీనీయ సంస్కృతిని అవలంబించి పోషించుటయే కాక, పలు పరిసర ప్రాంతములను చీనా సామ్రాజ్యమున చేర్చిరి. ఫార్మోజా దీవియందు చీనీయ సామ్రాట్ పరి పాలన మంచూల చేతనే నెలకొల్పబడినది (1683). యూరపియన్ వర్తకులకును, మతప్రచారకులకును తొలుత కొన్ని వసతులను నెలకొల్పి, వారివలన ఖగోళ శాస్త్రము మొదలగువానిని గురించి కొన్ని నవీన విషయ ములను గ్రహించినను, యూరపియన్ జాతులవారు ఒకరిని వేరొకరు సముద్రపు బందిపోటులుగ నిందించు టయు, మతప్రచారము పేరున జాతీయైక్యమునకు వారు భంగము కలిగించు తీరును గమనించిన తరువాత యూరపియన్ జాతులు అన్నియు పరధన రాజ్యాక్రమణ లందు ఆసక్తి కలవియే అగునను నిర్ణయమునకు చీనా ప్రభుత్వమువచ్చి, కేంటన్ రేవును మాత్రమే విదేశీయ వ్యాపారమునకు తెరచి ఉంచి, అచట సైతము కొన్ని నిర్బంధములను విధించినది (1757). తొలుతనుండియు మకావో రేవున పోర్చుగీస్‌లకు ఉండిన ప్రతిపత్తికి మాత్రము ఆ ప్రభుత్వము భంగము కలిగింపలేదు.

ఇట్టి ప్రతిఘటనలు ఏవియు లేని భారతదేశమున ఫ్రెంచి వారును, ఇంగ్లీషువారును రాజ్యాధికారమునకై పోటీలు పడి కృషిచేసిరి. అందులో ఫ్రెంచివారి నాయకుడు డూప్లే

[చూ]; ఇంగ్లీషువారికి నాయకుడుగ వ్యవహరించినవాడు రాబర్ట్ క్లైవ్ [చూ]. ఈ ఇరువురి నాయకత్వమున సాగిన ఆ పోరాటమును గురించిన వివరములను ఇట ప్రస్తావించ పనిలేదు. కడకు ఇంగ్లీషువారిదే పైచేయి అయినది (1754). 1757 లో జరిగిన ప్లాసీయుద్ధమునను, 1764 లో బక్సార్ వద్ద జరిగిన పోరాటమునను వారు క్రమముగ బెంగాల్, అయోధ్య నవాబుల సేనలను ఓడించి, భారతదేశ రాజకీయపటమున స్థానమును ఆర్జించిరి. 1766 లో ఉత్తర సర్కారులు వారికి చేజిక్కినవి. 1763 లో సప్తవర్ష సంగ్రామానంతరమున కుదిరిన సంధిని అనుసరించి ఫ్రెంచివారికి భారతదేశమున పాండిచ్చేరి, చంద్రనగరము మొదలగు కొన్ని స్థలములు మాత్రమే మిగిలినవి. అంతటిలో భారతదేశమున మహారాష్ట్రులును, దక్షిణ భాగమునకు సంబంధించినంతవరకు హైదరు అను మైసూరు పాలకుడును మాత్రమే వారిని ప్రతిఘటించెడి వారుగ కన్పట్టిరి. హైదరు మరణించిన తరువాత అతని కుమారుడు టిప్పూను ఓడించి (1792) బ్రిటిష్‌వారు అతని రాజ్యమున అత్యధికభాగమును కైవసము చేసికొని, మిగిలినది తమకు సాయమొనర్చిన దేశీయరాజులకు పంచిపెట్టిరి. 1798 లో సింహళమును కూడ వారు ఆక్రమించిరి.

ఇటుల ఇంగ్లండు సముద్రాధిపత్యమును 18 వ శతాబ్ది అంతమున కైవసము చేసికొని, ప్రపంచ చరిత్రలో ఎవరు కని విని ఎరుగని విశాలభూమికి ఆధిపత్యము వహించి, పరాజయమనునది ఎరుగక మున్ముందునకు పోవుచుండి నటుల కన్పట్టెను. కాని, ఇంతలో అనుకొనని రీతిగ ఆశించని మూలనుండి ఒక ఆఘాతము ఇంగ్లండునకు తగిలినది. అదియే అమెరికా స్వాతంత్ర్య సంగ్రామము [చూ. పు. 140]. దీని ఫలితముగ అమెరికాయందలి ఇంగ్లీషు సామ్రాజ్యమున ఒక ప్రముఖ భాగము విడివడిపోయినది (1776). ఆ భాగమే 'యునైటెడ్ స్టేట్స్ ఆవ్ అమెరికా' (అమెరికా సంయుక్త రాష్ట్రములు) అనుపేరున నేడు ప్రపంచ చరిత్రలో ప్రముఖ స్థానము వహించినది. ఆ దేశము స్వాతంత్ర్యమునకై పోరాడుటకు దారితీసిన కారణములను తెలిసికొనుటకు ఆనాటి యూరప్‌నందలి పరిస్థితులను పరిశీలించుట ఆవశ్యకము.

## 18 వ శతాబ్దిలో యూరప్

యూరప్ ఖండపు ముఖ్య భూభాగమున లూయీ-XIV పదునేడవ శతాబ్దిలో తన దేశమగు ఫ్రాన్స్‌న అమలు నందుంచిన నిరంకుశ రాజరికపు విధానమే 18 వ శతాబ్దమున సైతము ఆ ఖండమున పలుదేశములందు అనుకరింపబడినది. కాని, ఈ నిరంకుశ ప్రభువులందు ఆ శతాబ్ది యందు కన్పట్టిన ఒక విశిష్టతనుబట్టి వీరిని 'ప్రాజ్ఞ నిరంకుశులు' అని వ్యవహరించుట చరిత్ర రచయితలకు పరిపాటి అయినది. ఈ ప్రభువులు తాము స్వయముగ విద్యావంతులు అగుటయేకాక లలితకళలను, విజ్ఞాన శాస్త్రమును పోషించుటలో సమధిక శ్రద్ధ వహించిరి. సువ్యవస్థిత పరిపాలనయందు నిరంతర జాగరూకతను వహించుటతోపాటుగ ప్రతి ఒకరును వీరిలో స్వీయదేశమునకు అనితరప్రాముఖ్యమును లభింపజేయుటయే తమ ధ్యేయముగ గ్రహించిరి. పదునెనిమిదవ శతాబ్దమున ఇటుల ఖ్యాతిని ఆర్జించిన నిరంకుశ పాలకులలో ప్రష్యా పాలకుడగు ఫ్రెడరిక్-II, రష్యా పాలకురాలగు కేతరిన్-II, ఆస్ట్రియాను పాలించిన మేరియా తెరెసా, జోసఫ్-II ప్రముఖులుగా పేర్కొనదగినవారు.

ముప్పది సంవత్సరముల సంగ్రామపు అనంతరమున యూరప్ రాజకీయ రంగమున ఒక స్వతంత్రరాజ్యపు హోదాలో కాలిడిన ప్రష్యా రాజ్యము ఫ్రెడరిక్-II (1740 - 1786 ప.) కాలమున దృఢత్వముతోపాటుగ ప్రశస్తిని కూడ ఆర్జింపగలిగినది. అందువలననే ఫ్రెడరిక్‌నకు 'మహనీయుడు' అను బిరుదము ప్రాప్తించినది. రాజ్యమును, సైన్యమును సువ్యవస్థీకరించుటతోపాటు రాజ్యపు ఎల్లలను విస్తరింపజేయుటను తన ధ్యేయముగ ఇడుకొనిన ఈ రాజునకు ఆస్ట్రియారాజ్య సింహాసనముకొరకు చెలరేగిన వారసత్వసంగ్రామము తగిన అదనును సమకూర్చెను. ఆస్ట్రియా పాలకుడును, పవిత్ర రోమన్ సామ్రాజ్య చక్రవర్తియు అగు ఛార్లెస్-V తన అనంతరమున తన రాజ్యము తన కుమార్తె మేరియా తెరెసాకు చెందునటులను, చక్రవర్తి బిరుదము తన అల్లునికి లభించునటులను ఏర్పాటులుచేసి, యూరపియన్ రాజ్యపాలకులలో పలువురి ఆమోదమును సైతము అందులకు సంపాదించి 1740 లో మరణించెను. ఆ వెనువెంటనే అతని ఏర్పాటులన్నియు వృథయై, సింహాసనముకొరకు తగవులాటలు చెలరేగినవి. ఆ పోరాటమున మేరియా తెరెసా పక్షమును ఇంగ్లండు అవలంబించెను. ఫ్రాన్స్ మొదలగు రాజ్యములు ఎదిరి పక్షమును అవలంబించినవి. ఈ పోరాటమును అవకాశముగ గ్రహించి ఫ్రెడరిక్-II ఆస్ట్రియాకు చెందిన సైలీషియాను వశపరచుకొనెను. తరువాత ఈ వారసత్వపు పోరాటము ముగిసి మేరియా తెరెసాయే ఆస్ట్రియా పాలకురాలుగ గుర్తింపబడినను (1748); సైలీషియా మాత్రము ప్రష్యాకే దక్కినది. అంతట

ప్రష్యాను ఒక బలవత్తరరాజ్యముగ తక్కిన యూరపియన్ రాజ్యములు గుర్తించుటయేకాక తదనుగుణముగ తమ విదేశనీతిని మార్చుకొన మొదలిడినవి. ఫ్రాన్స్, ఆస్ట్రియా, రష్యా, స్వీడెన్, శాక్సనీ దేశములు ఒక మిత్ర మండలిగ రూపొంది ఫ్రెడరిక్ - II ను అరికట్టుటకు యత్నించగ, ఇంగ్లండు దేశము ఫ్రెడరిక్‌కు అండగ నిలిచినది. పదునెనిమిదవ శతాబ్దిలో యూరపియన్ రాజ్యముల సంబంధములలో వచ్చిన ఈ పరివర్తననే 'రాజ్యతంత్రీయ విప్లవము' (డిప్లమాటిక్ రివల్యూషన్) అని చరిత్రకారులు వ్యవహరింతురు. ఇంగ్లండు, ఫ్రాన్స్ దేశములమధ్య వలసలకొరకై చెలరేగిన పోటీని ఈ విప్లవమునకు ఒక ప్రాతిపదికగ గ్రహింపదగును. ఈ పోటీయే సప్తవర్ష సంగ్రామము (1756-1763) గ పరిణమించి, యూరప్‌నను, సముద్రరంగమునను, అమెరికాయందును ఇంగ్లండు విజయమును ఆర్జించుటతో అంతమైనది. ఇటుల ఇంగ్లండునకు విజయము చేకూరుటకు యూరప్ భూభాగమున ఫ్రెడరిక్ రాజు ఫ్రాన్స్ మొదలగు మిత్రమండలి రాజ్యములపై సాధించిన విజయములు చాలవరకు తోడ్పడినవి.

ఫ్రెడరిక్‌నకు సప్తవర్ష సంగ్రామమువలన అదనముగ భూభాగము ఏదియు దక్కలేదు. కాని, 1772 లో పోలండ్ నుండి పశ్చిమ ప్రష్యాను అతడు వశపరచుకొనుటకు అతనికి అవకాశము లభించినది. ఇందులో అతనికి ఆస్ట్రియా, రష్యా సాయపడినవి. తొలుత రష్యారాజ్యము ఫ్రాన్స్‌తో చేరి ఉండి, ప్రష్యాను ప్రతిఘటించినను, 1761 లో రష్యా పాలకురాలగు ఎలిజబెత్ మరణించిన తరువాత, తదనంతర పాలకులు ప్రష్యాయెడల సుముఖభావమును అవలంబించిరి. అట్టి సమయమున 1763 లో పోలండ్ పాలకుడు మరణించగ, రాజ్యమునకై చెలరేగిన కలతలలో, అప్పటి రష్యా చక్రవర్తిని అగు కేతరిన్ - II జోక్యము కలుగజేసికొని, ఫ్రెడరిక్ - II తోడను, మేరియా తెరెసా తోడను రాయబారములు జరపి పోలండ్ విభజనను గురించి ఒక అంగీకారమును కుదుర్చుకొనెను. తత్ఫలితముగ డాన్జిగ్, థోర్న్ నగరములు తప్ప తక్కిన పశ్చిమ ప్రష్యారాష్ట్రము ఫ్రెడరిక్‌నకును, గెలీషియా రాష్ట్రము ఆస్ట్రియాకును, వైట్ రష్యా అనబడు ప్రాంతము రష్యాకును లభించినవి (1772). అంతకు పూర్వము విస్తృతిలో యూరప్‌న మూడవ ప్రముఖ రాజ్యముగ పేరొందిన పోలండ్ ఈ విభజనతో అత్యధిక భూభాగమును కోల్పోయి ఒక అల్పరాజ్యముగ మిగిలినది. కాని, 1793 లోను, 1795 లోను మరల జరిగిన విభజనలవలన ఆ అల్పరాజ్యము సైతము అంతరించినది (1918 లో ప్రథమ ప్రపంచయుద్ధ ఫలితముగ ఆ దేశము దాస్యమునుండి విడివడి పునర్జన్మను పొందినది).

కేతరిన్ - II పరిపాలనలో రష్యా సామ్రాజ్యము అత్యంత విస్తృతిని ఆర్జించినది. తుర్కులను ఓడించి, క్రిమియా మొదలగు నల్లసముద్ర ప్రాంతములను ఆ చక్రవర్తిని వశపరచుకొని, దక్షిణమున సముద్రపు రేవులను పొందగలిగినది (1794).

రాజ్యవిస్తృతితోపాటుగ ఈ నిరంకుశ పాలకులు విద్యా, కళా, విజ్ఞానముల పోషణయందు విపరీత శ్రద్ధ వహించిరి. ప్రగతిశీలములగు భావములను ఆ యుగమున ప్రవచించిన వాల్‌టెయిర్ (1694 - 1778) మొదలగు ప్రసిద్ధ రచయితలతో కేతరిన్ చక్రవర్తిని ఉత్తర ప్రత్యుత్తరముల జరుపుటయే కాక, ప్రజాక్షేమమును గురించి ప్రభుత్వమున ప్రవేశపెట్టదగు కొన్ని ముఖ్యసంస్కరణలకు తన సుముఖతను తెలియజేసినది. అట్టులే ఫ్రెడరిక్ - II కూడ ప్రముఖ పండితులయు, ప్రగతిశీలురయు సహవాసమును ఆశించి, వారిని పోషించెను. ఇటుల ఆనాడు వ్యాప్తి నందుండిన ప్రగతిభావములకు మాటమాత్రపు సానుభూతిని వీరు తెలియజేసిరనుట నిజమే అయినను ఆ వాదములను ఆచరణలోనికి తెచ్చుటకు వారేమియు పూనుకొనలేదు. కాని, ఈ విషయమున ఆస్ట్రియాపాలకుడగు జోసెఫ్ - II (1765 - 1790 ప.) కొంత నిజాయితీతో వర్తించెనని చెప్పదగును. ఇతడు మేరియా తెరెసా కుమారుడు. చట్టదృష్టిలో పౌరులందరకు సమానత, వెట్టి చాకిరి రద్దు, మత సహనము మొదలగువానికి తావు కల్పించు సంస్కరణలను అతడు ప్రవేశపెట్టెను. కాని, ఇందువలన అతడు తన సర్దారుల ప్రతిరోధమును అడుగడుగున ఎదుర్కొనవలసివచ్చెను. అంతియే కాదు; తమ ఆకాంక్ష లేకుండనే ప్రభువుచే ప్రవేశపెట్టబడిన ఈ సంస్కరణల లాభములను సామాన్య ప్రజలు గుర్తింపనేరక సహకరించరైరి. అంతటితో ఊరకుండక, వెట్టిచాకిరిని పోగొట్టుకొనిన రైతులు పలువురు పనిపాటలులేక తిరుగుబాటులకు పూనుకొనిరి. అంతట చేయునదిలేక జోసెఫ్ చక్రవర్తి తన సంస్కరణలలో పెక్కింటిని రద్దుచేసెను (1790, జనవరి).

జోసెఫ్ చక్రవర్తి చేసిన ఈ విఫలప్రయత్నము మానవ సాంఘిక పరిణామమును గురించిన ఒక విషయమును స్పష్టము చేసినది. సాంఘికముగ వ్యక్తి పురోగమనమునకు ఆ యా అదనులందు ప్రవేశపెట్టబడవలసిన మార్పులు సహజ పరిణామరీతిలో జరిగినపుడు మాత్రమే దానివలన ప్రయోజనము సాంఘికముగ సమకూరును. ఒక సాంఘిక పరివర్తనమునకు తగు పరిస్థితులు, దానికొరకై ఆవేదన

ప్రజానీకమున స్ఫుటరూపములను పొందవలయును. అంతట ఆవేదనను సక్రమరూపమున మరలించదగు భావ ప్రచారము పండితులవలన జరుగవలయును. ఇట్టి ఆవేదనయు, భావ ప్రచారమును తోడుతోడుగ ప్రచలితములు అయినపుడే సాంఘిక పురోగతి ప్రయోజనకరమగు రీతిలో జరుగగలదు. యూరప్ ఖండమున 15 వ శతాబ్ది మధ్య భాగము మొదలుగ ఆధ్యాత్మిక, రాజకీయ, సాంఘిక పరిస్థితులను గురించిన ఒక విచికిత్సయు, తత్పరిణామముగ ఆ పరిస్థితుల మూలకారణములను గమనింపవలయునను జిజ్ఞాసయు, ఎల్లెడల వ్యాపింప మొదలిడినవను విషయము ఇదివరలో తెలుపబడినది [చూ. పు. 131]. ఆ జిజ్ఞాస ఎక్కువగ పశ్చిమ యూరప్‌న వేరులు పాదుకొనగలిగినదనియు అట ప్రసక్తింపబడినది. కాని, పరిస్థితుల ప్రాబల్యమువలన ఇంగ్లండు, ఫ్రాన్సు దేశములందు మాత్రమే ఆ జిజ్ఞాస ఎక్కువగ ఫలప్రదము కాగలిగినది. జాన్ విక్లిఫ్ వంటి పండితులు పలువురు పోప్, రాజు మొదలగువారికి కల ప్రత్యేక ప్రతిపత్తుల అవశ్యకతను గురించి చర్చించుట ఆరంభించిరి. జాన్ లాక్ (1632-1704), మాంటెస్క్యూ (1689-1755), వాల్ టెయిర్, రూసో (1712-1778) ప్రభృతులగు దార్శనికులు, సాంఘికశాస్త్రజ్ఞులు వ్యక్తి స్వాతంత్ర్యాది స్వత్వములను సవిమర్శముగ చర్చించుటవలన రాజులకు కలదను కొనుచున్న దైవాంశ యందలి విశ్వాసము మొదలగునవి సన్నగిలి ప్రభుత్వము, దాని విధులు, దాని అధికారములను గురించి నూతన అభిప్రాయములు కలుగ జొచ్చినవి. కాని, ఈ ప్రగతిశీలక భావనలు ఒక విప్లవ రూపమున పైకివచ్చుటకు పరిస్థితులు అనుకూలించినపుడు మాత్రమే సాధ్యమగును. అటుల అనుకూలించినను అన్యథా శరణ్యము లేనప్పుడు అది దౌర్జన్యరూపమును పొందును లేదా వేరుమార్గము దొరికినపుడు ఇంగ్లండునందలి ఉదాత్త విప్లవమువలె సరళరూపమున పరివర్తనను కొనివచ్చును. కాని, ఉదాత్త విప్లవమువంటివి యూరప్ ఖండమున రూపొందుటకు పరిస్థితులు అపుడు అనుకూలించినవి కావు. భావుకులగు పండితులు ప్రగతిశీలకములగు విషయములను ఎంత చర్చించినను ప్రభువులందును, మధ్యతరగతి వారలందును లూయీ-XIV చూపించిన మహదేకరాజతాభావనయే వేరులు పాదుకొనినది. ప్రక్కన ఉన్న ఇంగ్లండున వచ్చిన మార్పు సైతము వారికి కనువిప్పును కలిగించినది కాదు. ఇట్టి పరిస్థితులలో ఇంగ్లండు రాజరికమునకు లోబడిన వేరొక దూరప్రాంతమున-అమెరికాయందు-ఈ విప్లవభావనలు తగురూపమును సంతరించుకొని, అమెరికా స్వాతంత్ర్య యుద్ధముగ పరిణమించినవి.

**అమెరికాలో విప్లవము :** ఇంగ్లండు దేశమున-ఉదాత్త విప్లవము తరువాత-రాజరికపు అధికారమునకు హద్దులు ఏర్పడి, ప్రజలలో పై తరగతులవారికి అధికారములు సంక్రమించినను, ఆ దేశపు వలసలయందుమాత్రము ఈ విప్లవమువలన మార్పులేదు. కాని, 1763 వరకు ఫ్రెంచి వారినుండియు, అమెరికా ఆదిమవాసుల బెడదనుండియు తమ్ము రక్షించుకొనుటకై ఉత్తర అమెరికా తూర్పుతీరమునందలి ఇంగ్లీషు వలసలు మాతృదేశపు ప్రభుత్వముపై ఆధారపడి ఉండుట తప్పనిసరి అయినది. ఈ మధ్యకాలమున సైతము మాతృదేశప్రభుత్వము రక్షణ విషయమున తప్ప తక్కిన విషయములలో శ్రద్ధవహించినది కాదు. అచటి వలసల ప్రజలే ఏవియో ఏర్పాటులు చేసికొని తమ ఆంతరంగిక పరిపాలనను నిర్వహించుకొనుచుండెడివారు. ఈ పరిస్థితులలో వలసల రక్షణకైన వ్యయమును వాని పైననే రుద్దవలెనను సంకల్పము ఇంగ్లండు ప్రభుత్వమునకు కలిగినది. అంతట 1765 లో వలసల ప్రజలను సంప్రదించకుండనే ఆ ప్రజలపై స్టాంపుపన్ను మొదలగువానిని బ్రిటిష్ పార్లమెంట్ విధించెను. వలసలయందలి ప్రజలలో ఏ తరగతివారికిని ప్రాతినిధ్యములేని పార్లమెంట్ తమపై విధించిన పన్నుల బాధ్యతను అమెరికాయందలి వలసల ప్రజలు ధిక్కరించుటకు సంకల్పించిరి. అదివరకే యూరప్‌లో విశృంఖలగతిలో లాక్, రూసో మొదలగు వారివలన ప్రచారములోనికి తేబడిన వ్యక్తిస్వాతంత్ర్య భావన, అట్లాంటిక్ మహాసముద్రమును ఉత్తరించి, ఆ వలసలకు వ్యాపించి యుండుటవలన 'ప్రాతినిధ్యము లేనపుడు పన్నులను విధించు అధికారము కూడా ఉండరాదు' అను నినాదముతో పదమూడు వలసల ప్రజల ప్రతినిధులు అమెరికాలోని బ్రిటిష్ ప్రభుత్వమునుకాదని 1774 లో సమావేశమై స్వత్వ, పరివేదనా ప్రకటనను (డిక్లరేషన్ ఆవ్ రైట్స్ అండ్ గ్రీవెన్సెస్) వెలువరించి స్వాతంత్ర్య యుద్ధమునకు సమాయత్తమైరి. తరువాత 1775 నుండి యుద్ధము మొదలయ్యెను. అంతట 4 జూలై, 1776 న వలసల ప్రతినిధులు స్వాతంత్ర్యమును ప్రకటించిరి. ఫ్రాన్స్, స్పెయిన్ దేశములు వలసల స్వాతంత్ర్యమును గుర్తించి, వానికి సాయముచేసినవి. కడకు వలసల విజయముతో సంగ్రామము ముగిసి, 1783 లో పారిస్ నగరమున సంతకములు జరిగిన శాంతిసంధిలో అమెరికా వలసల సంపూర్ణ స్వాతంత్ర్యమును బ్రిటన్ గుర్తించినది. 1787 లో వలసల ప్రతినిధులు సమావేశమై ప్రపంచమున ప్రప్రథమముగ

వ్యక్తి స్వాతంత్ర్య, స్వత్వముల గుర్తించిన ఒక ప్రజా స్వామిక రాజ్యాంగమును లిఖిత రూపమున ఆమోదించి వెలువరించిరి [చూ. యునైటెడ్ స్టేట్స్].

అమెరికా వలసలలో బయలుదేరిన ఈ విప్లవ వాయువు 1776 న అంతటంతట బలమును సేకరించుకొని, యూరప్, అమెరికా ఖండములలో 1848 దనుక పలు ప్రాంతములందు విజృంభించి, బహు చరిత్రాత్మక సంఘటనలకును, అనేక నూతన రాజ్యములు రూపొందుటకును కారణభూతమైనది. అందు తొలుతగ పేర్కొనదగినది ఫ్రెంచి విప్లవము (1789).

**ఫ్రెంచి విప్లవము :** లూయీ - XIV మొదలుకొని ఫ్రాన్స్ రాజకీయ, ఆర్థిక రంగములందు ఉన్నతిని పొంది నటుల కన్పట్టినను, ఆ దేశమున క్రింది తరగతులవారి జీవితము మాత్రము నికృష్ట స్థితిలోనే ఉండినది. ఇందులకు తోడుగ రూసో మొదలగువారి రచనలు అమలునందున్న సాంఘికవ్యవస్థ యెడల వారికి కల అసంతృప్తిని రెచ్చ గొట్టినవి. ఈ అసంతృప్తి చాలకాలము అవ్యక్త రూపముననే అడగి ఉండినదికాని, కడకు ప్రభువుల విచ్చలవిడి ఖర్చుల మూలమున దేశమున ఆర్థిక సంక్షోభము ఏర్పడుటతో దానికి వ్యక్తరూపము చేకూరుటకు అవకాశము లభించినది. దేశమును ఆర్థిక సంక్షోభము నుండి గట్టెక్కించుటకై క్రొత్త పన్నుల విధింపునకు ఆమోదమును సంపాదించు తలంపుతో అప్పటి ఫ్రెంచి పాలకుడు లూయీ - XVI ప్రజాప్రతినిధుల సభను 1789 లో సమావేశపరచెను. ఇట్టి ప్రతినిధి సభ ఒకటి (స్టేట్స్ - జనరల్) తొలుతనుండియు ఫ్రెంచి రాజులచే గుర్తింపబడినను, 1614 తరువాత 1789 వరకు దానిని సమావేశపరచి, దాని అభిప్రాయమును గ్రహించుటకు ఫ్రెంచిరాజు ఎవరును పూనుకొనలేదు. ఈ సభయందు సర్దారులు, మతాచార్యులు, సామాన్యులు అను మూడు వర్గములు ఉండినవి. కాని, సంఖ్యాబలమున సామాన్యులు తక్కిన రెండువర్గముల సమష్టి సభ్యసంఖ్యను అధిగమించిరి. ఈ అవకాశమును ఉపయోగించుకొని సామాన్యవర్గపు ప్రతినిధులు రాజుపై ఒత్తిడిని తేగలిగిరి. తొలుత సైన్యబలమును ఉపయోగించి తన స్థానమును కాపాడుకొనుటకు రాజు యత్నించినను, కడకు సాయుధ పోరాటమునకు ఉపక్రమించిన ప్రజల బలమును గుర్తించి అతడు లొంగి, ప్రజాప్రతినిధులు రూపొందించిన రాజ్యాంగమును ఆమోదించెను (14 సెప్టెంబరు, 1791). కాని, ఈ విధముగ జరిగిన మార్పును సక్రమ మార్గమున పోనీయక నిరోధించు సంఘటనలు కొన్ని జరిగి, ఈ విప్లవమును తీవ్రదౌర్జన్య మార్గమునకు త్రిప్పినవి. ఫ్రెంచి రాజునకు కల అధికారములు చాల వరకు తగ్గింపబడి, అతడు రాజ్యాంగ బద్ధ ప్రభువుగ మాత్రమే ఉండు పరిస్థితి ఏర్పడినంతనే, క్రమముగ తమ పరిస్థితియు అటులే మారునను భయముతో ఆస్ట్రియా, ప్రష్యా ప్రభువులు ఫ్రెంచిరాజునకు పూర్వాధికారములను తిరిగి సంక్రమింపజేయుటకై తాము జోక్యము వహింతుమని ప్రకటించిరి. అంతట ఫ్రాన్స్ నందలి ప్రజాప్రభుత్వము ఆస్ట్రియాపై యుద్ధమును ప్రకటించుటయే కాక, రాజును పదవీ భ్రష్టునిచేసి అచ్చపు గణతంత్రరాజ్యమును నెలకొల్పినది. ఈ పరిస్థితులలో ప్రష్యాకూడ ఆస్ట్రియా పక్షమున యుద్ధములోనికి దిగినది. యుద్ధరంగమున పరిస్థితులు విషమించినకొలది, ప్రజలకు పూర్వపు రాజరికముపై ద్వేషము పెచ్చుపెరిగినది. కడకు ప్రజాప్రతినిధులు రాజును విచారించి మరణశిక్ష విధించి అమలు జరిపిరి (జనవరి 21, 1793). ఫ్రాన్స్ రాజు ఇటుల మరణశిక్ష పాలగుట యూరప్‌నందలి రాజలోకమునకు ఆందోళనాజనకమై, ఫ్రాన్స్‌పై వారి దాడి తీవ్రతరమైనది. దాని ఫలితముగ, దేశరక్షణకై తీవ్రచర్యలను తీసికొనవలసియున్నదను తీవ్రవాదుల పలుకుబడి ఫ్రాన్స్‌న విస్తరించినది. ఈ తీవ్రవాదులకే 'జాకోబిన్‌లు' అను వ్యవహార నామము కలదు. వీరి ఆధ్వర్యవమున 1793 సెప్టెంబరు మొదలుకొని 1794 జూలైవరకు అత్యంత భయానక రక్తదాహపు పరిపాలన సాగినది. అర్థరహితపు నేరముల మిషతో పలువురు దేశభక్తులే ఈ తీవ్రవాద ప్రభుత్వమువలన అంతము చేయబడిరి. కడకు దేశమునకు ఈ పరిస్థితితో విసువెత్తినది. తీవ్రవాదుల నాయకుడగు రాబ్స్ పియెరీ స్వీయానుచరులవలననే కడకు దుర్మరణము పాలయ్యెను (1794). ఈ కాలముననే విదేశ ప్రభువుల సేనలను ఫ్రెంచిసేనలు పలురంగములందు ఓడించి తమ దేశప్రతిపత్తిని కాపాడుకొనినవి. అంతట సక్రమ శాసన నిర్మాణమునకై రెండు పరిపాలనా సభలును, కార్య నిర్వహణకై అయిదుగురు ప్రముఖులుగల ఒక నిర్వాహక మండలి (డైరెక్టరీ) యు నెలకొల్పబడినవి. కాని, విదేశీయుల జోక్యముతో బయలుదేరిన యుద్ధము మాత్రము అప్పటికి ముగియలేదు. నిర్వహణమండలి అధ్యక్షతన ఆ యుద్ధము వివిధ రంగములందు కొనసాగి, ఆ యుద్ధములలో ఆరితేరిన సేనానిగ అందరికన్న మిన్నగ నెపోలియన్ బోనపార్టీ అను ప్రముఖుడు ముందునకు రాగలిగి ప్రజాదరణను ఆర్జించెను. కడకు ఆ నెపోలియన్ 1799 లో నిర్వాహకమండలిని కూలద్రోసి నూతన ప్రభుత్వమును ఏర్పరచి అందులకు అనువుగ క్రొత్త రాజ్యాంగ

మును రూపొందింపజేసెను. ఈ రాజ్యాంగము మూలమున ముగ్గురు సంఘముఖ్యు (కన్సల్) ల అధీనమున ఫ్రెంచి గణతంత్రరాజ్యము నడపబడునటుల ఏర్పాటు జరిగి, అందు ప్రథమ సంఘ ముఖ్యుడుగ నెపోలియన్ నియమింపబడెను. ఇంకను ఇరువురు సంఘ ముఖ్యులు ప్రథమ సంఘ ముఖ్యునితో కలిసి పాలించుటకు నియమము ఏర్పడినను, ఆ ఇరువురును యథార్థమున సలహాదారులుగ మాత్రమే అధికారములను కలిగి ఉండిరి. నెపోలియన్ నాయకత్వ చతురతచే ఫ్రెంచి సేనలు అన్ని రంగములందు పురోగమించి, 1802 నాటికి తమ పూర్వరాజ్యపు ప్రతిష్ఠను తిరిగి నెలకొల్పుటయే కాక, ఇటలీ మొదలగు ప్రాంతములందు తమ పలుకుబడిని నెలకొల్పినవి. 1802 లో జరిగిన సంధితో యుద్ధము అంతమయినది.

ఫ్రాన్స్‌నకు ఇటుల సాటిలేని ప్రతిష్ఠను చేకూర్చిన ఫలితముగ ప్రజానురాగమును ఆర్జించిన నెపోలియన్ కడకు ఫ్రెంచి చక్రవర్తిగ ప్రకటితుడు కాగలిగెను (1804 మే); మతగురువగు పోప్ అతనిని అభిషిక్తుని చేసెను. పారంపర్యముగ నెపోలియన్ వంశముననే చక్రవర్తిత్వము ఉండునటుల ఏర్పాటు సైతము జరిగెను. ఇటుల రాజరికమును అంతమొందించుటతో బయలుదేరిన విప్లవము చక్రవర్తి పదవిని ఏర్పరచుకొనుటతో ఒక నూతన మార్గమును త్రొక్కినను, విప్లవపు మూలసూత్రములకు కాలానుసారముగ కార్యరూపమును కల్గించుటకు నెపోలియన్ యత్నించెననుట మాత్రము యథార్థము.

ప్రపంచ చరిత్రలో కననగు యుద్ధతంత్ర నిపుణులలో నెపోలియన్ అగ్రశ్రేణికి చెందినవాడుగ పేరెన్నిక గాంచెను. అంతియేకాదు; పరిపాలనా వ్యవహారములందును, సువ్యవస్థిత శాసన నిర్మాణమునను అతడు అత్యంత కుశలుడు. ఫ్రెంచి విప్లవమునందలి ప్రాతిపదిక భావనలు అతనియందు రూపుగొనినవని కొందరు రచయితల అభిప్రాయము. అస్తవ్యస్తరీతిలో ఉన్న ప్రపంచపు సాంఘిక పరిస్థితిని చక్కపెట్టవలసిన ఆవశ్యకత ఎంతయో కలదని అతడు విశ్వసించి, అందులకు అనువుగ వ్యూహ నిర్మాణమును కొనసాగించెను. తొమ్మిది ఏండ్లు మాత్రమే అతడు చక్రవర్తిగ వ్యవహరించెను. కాని, ఈ అల్పకాలముననే తన భావములకు అనుగుణముగ యూరప్‌నందలి రాజకీయవ్యవస్థను చక్కజేయుటకు తీవ్రకృషి చేసెను. ప్రపంచమున తక్కిన విజేతలవలెనే అతడును సైనికబలముననే తనకు అండగ గ్రహించుట యథార్థమే అయినను అందొక విశిష్టత కలదు. ఆతడు జయించిన ప్రాంతమునందెల్ల మానవ శ్రేయమును లక్ష్యముగ ఇడుకొనిన సువ్యవస్థిత పరిపాలన నెలకొలుపబడినది; ఉదార భావములకు అచట వ్యాప్తి చేకూరినది.

కాని, నెపోలియన్ దండయాత్రా వివరములు మొదలగువాని స్థూలకథనమైనను ఇట ప్రసక్తితమగు విషయము కానేరదు. అందులకు ఫ్రాన్స్‌దేశపు చరిత్రయే సముచితమగు భూమిక కాగలదు. అయినను అతని దండయాత్రల ఫలితములు మాత్రము ఇట సంగ్రహముగ వక్తవ్యములు. ఆస్ట్రియా చక్రవర్తిని ఓడించి పవిత్ర రోమన్ సామ్రాజ్య చక్రవర్తిత్వమును అతడు వదలుకొనునటుల (1806) చేయుటతో, జర్మనుల మాండలికరాజ్యములలో ఒక విధమగు ఐక్యము చేకూరుటకు నెపోలియన్ తోడ్పడెను. అదివరకు జర్మనుల మాండలిక రాజ్యముల సంఖ్య 709 నుమించి ఉండగా, నెపోలియన్ కృషి ఫలితముగ ఆ సంఖ్య 39 కి దిగివచ్చినది. 1809 నాటికి దాదాపు యూరప్ ఖండమంతయు అతని ఆధిక్యమును అంగీకరించినది. అటుల అంగీకరింపని బ్రిటన్‌నకు గుణపాఠము నేర్పుటకై ఆర్థిక దిగ్బంధము మొదలగు పెక్కుమార్గములను అవలంబించియు నెపోలియన్ కృతకృత్యుడు కాలేకపోయెను. నౌకాయుద్ధమున బ్రిటిష్‌వారికి గల ప్రవీణత వారిని ఆ సమయమున రక్షింపగలిగినది. ఇంతలో 1812 న రష్యాపై అతడు జరిపిన దండయాత్ర అతిశోచనీయ రీతిలో విఫలతను పొందెను. కడకు ఆస్ట్రియా, ప్రష్యా, రష్యా, బ్రిటన్, స్వీడెన్, స్పెయిన్, పోర్చుగల్ మిత్రమండలిగ ఏకమై నెపోలియన్‌పై పలురంగములందు దండయాత్రల జరపి, పరాజితుని చేసిన ఫలితముగ అతడు 1814 లో రాజ్యపరిత్యాగముచేసి, ఎల్బాదీవియందు వసించుటకు అంగీకరించెను. అంతట పూర్వపు పాలకుల వంశమునకు చెందిన లూయీ - XVIII ఫ్రాన్స్‌నకు రాజయ్యెను. మరల 1815 లో ఎల్బాదీవినుండి తిరిగి వచ్చి నెపోలియన్ ఫ్రెంచి సేనలను సమకూర్చుకొని యుద్ధమునకు దిగెను. కాని, మిత్రమండలి అతనిని వాటర్‌లూ యుద్ధమున ఘోరపరాజయము పాల్జేసి (22 జూన్, 1815) ఖైదీగ పట్టుకొని, దక్షిణ అట్లాంటిక్‌లోని సెయింట్ హెలీనా దీవిలో నిర్బంధితుని చేసినది. ఆ నిర్బంధముననే అతడు మరణించెను (5 మే, 1821).

**వియెన్నా కాంగ్రెస్ :** నెపోలియన్‌ను ఓడించిన తరువాత యూరప్‌ఖండపు పటమున దేశముల సరిహద్దులను తీర్చిదిద్దుటకు ఆస్ట్రియా రాజధానియగు వియెన్నాయందు యూరప్ రాజ్యముల అంతర్జాతీయ సమావేశము (సెప్టెంబరు 1814 - 1815 జూన్, మధ్య వరకు) జరిగినది. మిత్రమండలిలోని ప్రముఖ రాజ్యములగు ఆస్ట్రియా, బ్రిటన్,

రష్యా, ప్రష్యా ఇందు ముఖ్యపాత్రల వహించినవి. దేశము లందలి ప్రజల ఇష్టానిష్టములతో నిమిత్తము లేకుండ యూరప్‌న వివిధరాజ్యములకు ఈ సమావేశము రూపురేఖ లను సంతరించినది. నెపోలియన్ ధాటికి నామమాత్రావ శిష్టములైన రాజరికములను సాధ్యమైనంతవరకు పున రుద్ధరించి, ఫ్రెంచి విప్లవపు మూలభావములను ప్రజలలో వ్యాపింపనీయకుండ జేయుటయే ఈ సమావేశము తన ముఖ్యోద్దేశముగ ఇడుకొనినను, స్వప్రయోజనములను రక్షించుకొని ప్రముఖతను పొందుటకు ప్రతి రాజ్యమును యత్నించుటవలన చర్చలు అతి దీర్ఘ కాలము కొనసాగినవి. ఈ చర్చల ఫలితముగ ఆస్ట్రియా, ప్రష్యా దేశములతో పాటుగ స్పెయిన్ మొదలగు వానియందును పూర్వ రాజ వంశములు పునరుద్ధరితములు కాగల్గినవి. పూర్వపు హాలండ్ నకు బెల్జియమ్ కలుపబడి నెదర్‌లండ్స్ రాజ్యము రూపొం దింపబడినది ; జర్మనీలోని 39 మాండలిక రాజ్యములును ఒక రాజ్యకూటమి (కాన్‌ఫెడరేషన్)గ ఏర్పడినవి. పూర్వపు పోలండ్‌లో కొంత భాగము ఒక నూతన పోలండ్ రాజ్య ముగ రూపొందింపబడినను, దానిపై అధికారము రష్యా పాలకునికే దత్తము చేయబడినది. ఒక ప్రత్యేక రాజ్యాం గము మాత్రము కలిగి మనునట్టి ఏర్పాటుతో నార్వే రాజ్యము స్వీడెన్‌కు ఈయబడినది. స్విజర్లండ్ యొక్క సంపూర్ణ స్వాతంత్ర్య ప్రతిపత్తి గుర్తింపబడుటయే కాక కొన్ని ప్రదేశములును అదనముగ కలుపబడినవి. మధ్య ధరా సముద్రమందలి మాల్టాయును, ఫ్రెంచి, డచ్చి వలస లలో అత్యధిక భాగమును ఇంగ్లండునకు దక్కినవి [చూ. వియెన్నా కాంగ్రెస్].

**అమెరికాలో స్వాతంత్ర్యోద్యమ వ్యాప్తి:** ప్రజలయు, జాతులయు అభీష్టములతో నిమిత్తము లేకుండ పాలకుల ప్రయోజనముల దృష్టితో వియెన్నా కాంగ్రెస్ రూపొందించిన కృత్రిమపు హద్దులు ఎక్కువ కాలము నిలువలేక పోయినవి. అమెరికా, ఫ్రాన్స్ దేశములలో చెలరేగిన విప్లవముల వలన ప్రజలయందు జాతీయ స్వాతంత్ర్యము, చట్టబద్ధపాలన, సమానత్వము అను భావ ములు యూరప్, అమెరికా ఖండములలో ఎల్లెడల వ్యాపించుటకు అవకాశము లభించినది. తత్ఫలితముగ నిరంకుశతను ప్రతిఘటించుటకు ప్రజలలో స్థైర్యముపొడమి నది. ఇట్టి ప్రతిఘటన 19 వ శతాబ్దిలో తొలుతగ దక్షిణ, మధ్య అమెరికాలలో మొదలిడినది. స్పెయిన్ సింహాసన మును నెపోలియన్ వశపరచుకొనినంతట (1808) మధ్య, దక్షిణ అమెరికాలయందలి స్పెయిన్‌వలసలు స్పెయిన్ ప్రభుత్వదాస్యమునుండి విడివడి స్వాతంత్ర్యమును ప్రక టించినవి. నెపోలియన్ పతనానంతరము పూర్వపు పరి స్థితిని పునరుద్ధరించుటకు యత్నము జరిగినను యునైటెడ్ స్టేట్స్ ప్రతిఘటనవలన యూరప్ రాజ్యములు అందు జోక్యము కలిగించుకొనుటకు వెరచినవి. అప్పటికి యునై టెడ్‌స్టేట్స్ పశ్చిమమున ఉన్న లూజియానాను ఫ్రెంచి వారినుండియు, ఫ్లారిడాను స్పెయిన్‌నుండియు ఆర్జించి పసిఫిక్ నుండి అట్లాంటిక్ వరకు విస్తరించుటయే కాక వ్యవ సాయ, పారిశ్రామిక రంగములందును అతి త్వరిత గతిలో ముందంజవేయ మొదలిడినది. అమెరికా ఖండ మున స్పెయిన్ వలసరాజ్యమును పునరుద్ధరించుటకు యూరపియన్ రాజ్యములు జోక్యము వహించిన, అట తనదేశపు ప్రతిపత్తికి భంగము కలుగునను భయముతో అప్పటి యునైటెడ్‌స్టేట్స్ అధ్యక్షుడగు మన్రో యూరపి యన్ రాజ్యములు స్పెయిన్ వలసలను పునరుద్ధరించుటను నిషేధించుచు తన దేశము అనుసరింపదగు ఒక సిద్ధాంత మును ప్రకటించెను (1823). ఇదియే 'మన్రో సిద్ధాంతము (మన్రో డాక్ట్రిన్)' అనుపేర చరిత్రలో పేరొందినది. ఇటుల తక్కిన యూరపియన్ రాజ్యముల జోక్యము నిషే ధింపబడినను, స్పెయిన్ ప్రభుత్వపక్షపు సేనల బెడదనుండి దక్షిణ అమెరికా రాజ్యములు తమ స్వాతంత్ర్యమును కాపాడుకొనవలసివచ్చెను. ఈ దక్షిణ అమెరికా రాజ్య ముల స్వాతంత్ర్యపోరాటములో స్వాతంత్ర్యకాములకు నాయకత్వము వహించిన సైమన్ బొలివర్, సాన్ మార్టిన్ చారిత్రక ఖ్యాతిని ఆర్జించిరి. 1826 నాటికి స్పెయిన్‌నకు చెందిన అమెరికాఖండములోని వలసలు అన్నియు స్వతంత్రదేశములు కాగలిగినవి. పోర్చుగల్‌కు దక్షిణ అమెరికాయందున్న ఒకే ఒక వలసరాజ్యము బ్రెజిల్ 1822 లోనే మాతృదేశముతో తన సంబంధమును తెగతెంపులు చేసికొని స్వాతంత్ర్యమును పొందినది. ఆ శతాబ్ది ఆరంభముననే హాయిటీరాజ్యము ఫ్రెంచి దాస్యము నుండి విడివడి (1804), ఆధునికయుగమందలి తొలుతటి నీగ్రోరాజ్యముగ అవతరించినది. ఆ దేశపు స్వాతంత్ర్య సంగ్రామమున టౌసేన్ లావర్చర్ అను నీగ్రోసేనాని ప్రముఖపాత్ర వహించెను.

**యూరప్‌లో విప్లవ పరంపర :** వియెన్నా కాంగ్రెస్ [చూ.] అనంతరమున సైతము విప్లవాగ్ని అంతటంతట చెలరేగి పూర్వవ్యవస్థలను అంతరింపజేసినది. ఫ్రాన్స్‌లో పునరుద్ధరింపబడిన రాజరికము 1830 విప్లవమువలన అంత రించి వేరొక చట్టబద్ధ రాజరికము ఆ స్థానమును ఆక్ర మించినను, అదియు 1848 విప్లవమువలన అంతరింపగ రెండవసారి గణరాజ్యము స్థాపింపబడినది. ఈ గణరాజ్య

మునకు పూర్వపు నెపోలియన్ జ్ఞాతియగు లూయీ నెపోలియన్ అధ్యక్షుడై తన చతురతచే 1852 లో ఆ దేశపు చక్రవర్తిగ నెపోలియన్ - III అను పేర ప్రకటితుడు కాగలిగెను. కాని, 1870 లో మరల ఆదేశమున గణరాజ్యమేర్పడెను. బెల్జియమ్ తిరుగుబాటు జరిపి నెదర్లండ్స్‌నుండి విడివడి స్వతంత్రరాజ్యముగ రూపొందెను (1830).

ఈ విప్లవములు యూరప్‌నందలి కొన్ని దళితజాతుల స్వాతంత్ర్యమునకును దారితీసినవి. అట్టివానిలో తొలుతగ స్వాతంత్ర్యమును ఆర్జించినది గ్రీస్ (1830). టర్కీ చక్రవర్తి నిరంకుశపాలననుండి విడివడుటకు క్రైస్తవ రాజ్యములు - అందును ముఖ్యముగ రష్యా, ఇంగ్లండు - దానికి సాయపడినవి. ఆ తరువాత స్వాతంత్ర్యమును పొందినది ఇటలీ. వియెన్నా కాంగ్రెస్ నిర్ణయములను అనుసరించి ఇటలీలో విస్తృతభాగములు ఫ్రాన్స్, ఆస్ట్రియా, స్పెయిన్ లకు దత్తములయినవి. వాయవ్యమున సార్డీనియా - పియెడ్మాంట్ అను చిన్నరాజ్యమును, పోప్‌చే పాలింపబడు రోమ్‌నగర పరిసర భాగములును మాత్రమే అప్పుడు స్వతంత్రముగ ఉండినవి. ఈ నికృష్ట స్థితినుండి దేశమును ఉద్ధరించుటకు పియెడ్మాంట్ పాలకుడు విక్టర్ ఎమాన్యుయెల్ - II (1820 - 1878) ను, అతని మంత్రియగు కావూర్ (1810 - 61), దేశభక్తులగు జోసెఫ్ మేజినీ (1805 - 72), జోసెఫ్ గారిబాల్డీ (1807 - 1882) నిరంతర కృషి సలిపిరి. వారి నాయకత్వమున సాగిన స్వాతంత్ర్య పోరాటము విజయవంతముగ ముగిసి, ఐక్య ఇటలీరాజ్యము రూపొంది (1861), విక్టర్ ఎమాన్యుయెల్-II ఆ రాజ్యమునకు ప్రభువయ్యెను. అప్పటిలో వేరుగ నిలిచిపోయిన వెనిస్, రోమ్ ప్రాంతములును క్రమముగ ఐక్య ఇటలీ రాజ్యమున చేరుటతో ఆ రాజ్యమునకు రోమ్ రాజధాని అయ్యెను (1870).

ఈ విప్లవకర పరివర్తనల కాలముననే జర్మనీ జాతీయతా భావనయు క్రమక్రమముగ పటిష్ఠతను పొంది ఏకైక జర్మనీ రాజ్యము రూపొందుటకు అనుకూలములగు పరిస్థితులు ఏర్పడినవి. ప్రష్యా పాలకుడగు ఫ్రెడరిక్ - II [చూ.] పాలనలో వికసనము అగుటకు మొదలయిన ఆ జాతీయతా భావన, 1830, 1848 విప్లవములచే పరిపుష్టతనుపొంది, బిస్మార్క్ (1815 - 98) [చూ.] నాయకత్వమున సఫలతను పొందినది. ప్రష్యా పాలకుడగు విలియమ్ - I చే తన రాజ్య నిర్వహణకు ఛాన్సెలర్ (ప్రధాని) గ నియమితుడైన ఈ బిస్మార్క్ తన రాజ్యతంత్ర నైపుణిచేతను, సైనిక వ్యవస్థా పునర్నిర్మాణము వలనను, జర్మనీ రాజ్యములపై ఆస్ట్రియా పలుకుబడిని తగ్గింపజేయుటయేకాక (1866), ప్రష్యాకు జర్మనీ రాజ్యములందు ప్రముఖ స్థానమును కల్పించెను. ఇతడు తన రాజ్యతంత్రనిపుణతచే ఫ్రెంచిరాజగు లూయీ నెపోలియన్ ప్రష్యాపై యుద్ధము ప్రకటించు పరిస్థితిని కొనివచ్చుటయేకాక, ఆ యుద్ధమున ప్రష్యా పాల్గొనుట జర్మనీ జాతీయ ప్రయోజనముల రక్షణకొరకే అను భావమును ఎల్లెడల వ్యాపింపజేయగలిగెను. ఆ యుద్ధమున ప్రష్యా విజయమందుటతో జర్మనీ రాజ్యములందు ఆ రాజ్యమునకు అత్యధిక ప్రశస్తి లభించి, కడకు ఆ రాజ్యపు రాజగు విలియమ్ - I ఇరువది ఐదు జర్మనీ రాజ్యములు మిళితమైన ఐక్యజర్మనీ రాజ్యమునకు చక్రవర్తిగ ప్రకటితుడు కాగలిగెను (జనవరి 18, 1871).

ఇట్టి జాతీయ స్వాతంత్ర్య, స్వయం నిర్ణయ సిద్ధాంతములు తూర్పు యూరప్‌నందును ఆ కాలమున విరివిగ వ్యాపించినవి. వానిలో గ్రీస్ విషయము ఇదివరలో పేర్కొనబడినది. రుమేనియా, సెర్బియా, బల్గేరియా, ఆ కాలముననే తురుష్కుల నిరంకుశత్వ పాలనమునుండి విడివడినవి. కాని, హంగేరీయు, కొన్ని స్లావ్ జాతులును ఆస్ట్రియా - హంగేరీ సామ్రాజ్యముననే అస్వతంత్ర స్థితిలో మిగిలిపోయినవి.

**సామ్రాజ్యముల ఆర్జనకై పోటీ :** ఇట్లు జాతీయతా భావము విప్లవకర పరివర్తనలను యూరప్‌లో 19 వ శతాబ్దిలో కొనివచ్చుటయేకాక, పశ్చిమ యూరప్ రాజ్యములతోపాటు వలసలకొరకై తపించు కొన్ని నూతన యూరపియన్ రాజ్యములను రంగములోనికి కొనివచ్చినది. తత్ఫలితముగ 1860 మొదలుగ ప్రాత సామ్రాజ్యవాద రాజ్యములతోపాటుగ క్రొత్తవియును ప్రపంచమున వలసలను ఆర్జించుటకై కృషిచేసినవి. యూరప్‌న అత్యంత విస్తృతి కలిగిన ఆస్ట్రియా - హంగేరీ సామ్రాజ్యము మాత్రము యూరప్ ఖండమున తన ఉనికిని కాపాడుకొనుటలోనే శ్రద్ధవహించి, వలసల విషయము తలపెట్టకుండినది. ఇక టర్కీ సామ్రాజ్యము, బాల్కన్ రాజ్యములు స్వతంత్రతను పొందిన తరువాత కూడ ఆఫ్రికాలో ఈజిప్టు మొదలుకొని ఆసియాలో పారసీకముదనుక వ్యాపించి యున్నను, తక్కిన యూరపియన్ రాజ్యముల వలె సాంఘిక, వైజ్ఞానిక రంగములందు పురోగతిని సాధింపనేరనందున ఆ రాజ్యముల దృష్టిలో దాని బ్రతుకు పరిహాస భాజనముగ పరిణమించినది. ఇటుల ఈ రెండు ప్రముఖ రాజ్యములుతప్ప తక్కిన యూరపియన్ ప్రముఖ రాజ్యములు పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్థపు ఆరంభము

మొదలుగ, అదివరకే విస్తృతముగ వలసరాజ్యములను ఆక్రమించిన బ్రిటన్, నెదర్లండ్స్, ఫ్రాన్స్ దేశములతో పోటీగ వలసరాజ్యముల ఆర్జనకై అహమహమికతో కృషిచేయుటలోనే ఆ తరువాత రానున్న ప్రథమ ప్రపంచ యుద్ధపు బీజములు చల్లబడుటచే, వాని కృషిఫలితములను ఇట పరికింపవలసి ఉన్నది.

ప్రపంచమున బలహీనరాజ్యములను, అనాగరక జనావాసిత ప్రాంతములను లోగొను సామ్రాజ్యదాహముతో యూరప్ రాజ్యములు పైన తెలిపిన రీతిగ పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్ధము మొదలుగ పునర్విజృంభణకు పూనుకొనినపుడు, వానికి తోడుగ యునైటెడ్ స్టేట్స్ కూడ కార్యరంగమున అడుగిడినది. బ్రిటిష్ రాజ్యమునుండి విడివడినది మొదలుగ ఆ రాజ్యము అతివేగముతో పురోగమించినది. ఇదివరలో చెప్పబడిన రీతిగ లూజియానా, ఫ్లారిడా మాత్రమే కాక, యుద్ధమువలన మెక్సికోనుండి న్యూ మెక్సికో, కాలిఫోర్నియా, టెక్సాస్ రాష్ట్రములను (1848), రష్యానుండి కొనుగోలువలన అలాస్కాయును (1868) ఆ రాజ్యమునకు దక్కుటతో ప్రాదేశికముగ దాని విస్తృతి పెరిగినది. బ్రిటన్‌లో అదివరకే మొదలైన పారిశ్రామిక విప్లవము ఆ దేశమున ఆ శతాబ్ది ఉత్తరార్ధ ఆరంభమునుండి కాలూని దేశమును సుసంపన్నముగ చేయ మొదలిడినది. ఆ పరిస్థితులలో నీగ్రో బానిసలకు స్వాతంత్ర్యము చేకూర్చు విషయమున దేశమున ఉత్తర, దక్షిణ ప్రాంతముల మధ్య భిన్నాభిప్రాయములు ఏర్పడి, అంతర్యుద్ధమునకు దారితీసినవి (1861). అప్పటిలో దేశమునకు అధ్యక్షుడుగ ఉండిన అబ్రహామ్ లింకన్ [చూ.] జగమెరిగిన ప్రజా స్వాతంత్ర్య పరిరక్షకుడు. అతని ఆధ్వర్యవమున ఉత్తర ప్రాంతపు సేనలు దక్షిణ ప్రాంతపు సేనలను ఓడించి, జాతీయైక్యమును మరల నెలకొల్పుటయే కాక, నీగ్రోల దాస్యవిముక్తికి మార్గమును కొంత సుగమము చేయగలిగినవి (1865). తదాదిగ యునైటెడ్ స్టేట్స్ వ్యవసాయ, పారిశ్రామిక రంగముల రెండింట అచ్చెరువుకొలుపు రీతిగ పురోగతిని సాధింప ఆరంభించినది. యూరప్ ఖండపు నాలుగు చెరగులనుండియు నిరుద్యోగులగు పౌరులు పలువురు ఆ దేశమునకు ఆ కాలమున లక్షల సంఖ్యలో వలసచేరి ఆ పురోగతిలో భాగస్వామ్యమును వహించిరి. ఇటుల సంపదలతోపాటుగ జన సంఖ్యయందును తక్కిన అమెరికాఖండ ప్రాంతములను అధిగమించిన ఆ దేశము, అమెరికా ఖండపు రక్షణకు తానొక్కటియే బాధ్యత వహించినటుల అమెరికా ఖండ రాజకీయములలో వ్యవహరించసాగెను. ఈ బాధ్యతను నిర్వహించు దృష్టితో అట్లాంటిక్, పసిఫిక్ మహాసముద్రములందు తగు స్థావరములను సంపాదించుటకు దానికి కోరిక కలిగినది; ఈ ఇచ్ఛయే సామ్రాజ్యార్జనలో దానిని పాల్గొనునటుల చేసినది.

ఇటుల సామ్రాజ్యవాద రాజ్యములు ఒకరిపై వేరొకరు స్పర్ధతో ప్రపంచపు నలుమూలలకును తమ సామ్రాజ్యములను విస్తరింపజేయుటలో, శ్వేతేతర మానవుల జన్మస్వత్వముల హరించి నాగరకతా ప్రగతిని కుంటుపడజేయుట యథార్థమే అయినను, తమ స్వార్థప్రయోజనముల సాధనలో అనిచ్ఛాపూర్వకముగను, కొలది పట్టులందు ఇచ్ఛాపూర్వకముగను సైతము పాశ్చాత్య విజ్ఞాన, సంస్కృతులను ప్రపంచమున ఎల్లెడల వ్యాపింపజేసి ఒక చారిత్రక పాత్రను నిర్వహించినవి. ఇట్టి చారిత్రక పాత్ర నిర్వహణకు పరోక్షముగ తోడ్పడిన ఆ సామ్రాజ్యవాదము ప్రపంచమున వేర్వేరు ప్రాంతములందు అచటి దేశకాలపరిస్థితులను అనుసరించి వేర్వేరు తీరులుగ, వేర్వేరు రూపములతో ముందునకు సాగినది. కావున సామ్రాజ్యవాద యుగపు ఆరంభమునుండియు వేర్వేరు జాతుల నాయకత్వమున ముందునకు సాగి, పందొమ్మిదవ శతాబ్ది అంతమునకు సుస్థిర రూపమును పొందిన ఈ పాశ్చాత్య విజ్ఞాన, సంస్కృతీ వ్యాపనమును ఆ యా తీరు తెన్నులనుబట్టి 1. అధివసనము; 2. ఆధిపత్యము; 3. ఆక్రమణము; 4. ఆదమనము; 5. అనుకరణము అనురీతిగ అయిదు తెరగులుగ వర్గీకరించి పరిశీలించుటవలన ఆ విషయము సుకరముగ జ్ఞాతము కాగలదు.

**అధివసనము :** ఇందు సామ్రాజ్యవాద దేశపు ప్రజలును, వారి అనుమతిని పొందిన తదితరులును వలసదేశమున నివాసముగ చేరి, తొలుతటి దేశీయులను అంతమొందించుటయో లేదా మారుమూల ప్రాంతములకు తరిమివేయుటయో చేసి, దేశమును వశపరచుకొనుట జరిగినది. అమెరికా ఖండమందలి పాశ్చాత్యరాజ్యముల వలసలును, ఆస్ట్రేలియా, న్యూజీలండ్, దక్షిణ ఆఫ్రికా దేశములును ఇట్టివియే. వీనిలో అమెరికాఖండమందలి వలసలలో ఉత్తర అమెరికాయందలి కెనడా తప్ప తక్కినవి అన్నియు పందొమ్మిదవ శతాబ్ది ప్రథమ పాదాంతమునకు స్వాతంత్ర్యమును ఆర్జించిన విషయము ఇదివరలో తెలుపబడినది [చూ. పు. 143]. అమెరికా స్వాతంత్ర్య సంగ్రామము [చూ.] తరువాత బ్రిటిష్ ప్రభుత్వమునకు వివేకము కలిగి కెనడా యెడల కొంత సౌమ్యభావముతో వ్యవహరించుట జరిగినది. ఆ దేశమున వలసచేరిన ఫ్రెంచి, బ్రిటిష్‌జాతుల మధ్య పరస్పర సామరస్యము కుదురుటయే తడవుగ,

వారు రూపొందించుకొనిన సమాఖ్యారూపక రాజ్యాంగ మును బ్రిటిష్ ప్రభుత్వము ఆమోదించి, బ్రిటిష్ రాజరిక మునకు మాత్రము లోబడి తక్కిన అన్నివిధముల స్వతంత్ర తను పొంది ఉండగల అధినివేశ ప్రతిపత్తి (డొమిని యన్ స్టేటస్)ని కెనడా దేశమునకు లభింపజేసినది (1867).

ఆస్ట్రేలియా - న్యూజీలండ్ : దక్షిణ పసిఫిక్‌లోని ఆస్ట్రే లియా ఖండపు ఉనికి మధ్యయుగములనుండి పలువురకు చూచాయగ జ్ఞాతమై ఉండినను తొలుతగ ఆ ఖండమును కనుగొని అందు కాలిడి అన్వేషించిన ఖ్యాతి డచ్చి నావికు లకు దక్కినది (1613 - 27). అయినను వారట వలస చేర లేదు. తరువాత జేమ్స్ కుక్ అను ప్రసిద్ధ బ్రిటిష్ సాహసిక నావికుడు దాని ప్రతిపత్తిని కనుగొని, (1768 - 71) బ్రిటిష్ ప్రభుత్వమునకు ఒక నివేదిక పంపినంతట, దానిని నేరస్థు లకు ఆవాసముగ రూపొందించు సంకల్పము ఆ ప్రభుత్వ మునకు కలిగి 717 మంది నేరస్థులు తొలుతగ 1788 లో అట చేర్చబడిరి. 1793 నుండి సాధారణ పౌరులు కూడ అట చేరి వలసల స్థాపించుట ఆరంభమయ్యెను. అటనట పలుప్రాంతములందు రూపుగొనిన ఈ వలసలలో జనసంఖ్య పెరిగినంతట ఇవి వేర్వేరు రాష్ట్రములుగ ఏర్పడి, అంత రంగిక స్వతంత్రపాలనకై ఆందోళనము చేసినవి. బ్రిటిష్ ప్రభుత్వము ఈ వేర్వేరు రాష్ట్రముల ఆంతరంగిక పరి పాలనా స్వాతంత్ర్యమును అంతట గుర్తించినది (1850). క్రమక్రమముగ ఈ వేర్వేరు రాష్ట్రములమధ్య సాన్ని హిత్య సామరస్యములు పెంపొంది సమాఖ్యారూపకముగ అవి అన్నియు ' ఆస్ట్రేలియా కామన్వెల్త్ ' గా పరిణమించి (1901), బ్రిటిష్ పార్లమెంట్ సమ్మతితో అధినివేశ ప్రతి పత్తిని పొందినవి [చూ. ఆస్ట్రేలియా].

న్యూజీలండ్ దీవులను సైతము డచ్చివారే కనుగొని నను (1642), కుక్ నావికుని కృషివలన ఇవి కూడ బ్రిటిష్ వారికి దక్కినవి (1769). కాని, బ్రిటిష్‌వారు ఇట వలస చేరుట 1840 నుండి మొదలైనది. ఆ దీవులలో - అందును ముఖ్యముగ ఉత్తరపు దీవిలో-అంతకు పూర్వమునుండియు వసించుచు, సాంస్కృతికముగ నవీన శిలాయుగ దశలో ఉండిన మవోరీజాతి [చూ. సం. 10 - పు. 599] వారితో బ్రిటిష్‌వారు తొలుత ఘర్షణ పడవలసి వచ్చినది. కడకు రెండు యుద్ధములలో మవోరీలను అడచి ఉత్తర, దక్షిణ ద్వీపముల రెండింటిని బ్రిటిష్‌వారు వశపరచుకొనిరి. అచటి బ్రిటిష్ పౌరులకు ఆంతరంగిక స్వపరిపాలనను బ్రిటన్ 1842 లో కలుగజేసినది. తరువాత 1907 లో న్యూజీలండ్ దేశము అధినివేశ ప్రతిపత్తిని ఆర్జించినది [చూ. న్యూజీలండ్].

దక్షిణ ఆఫ్రికా : దక్షిణ ఆఫ్రికా రాజ్యమండలి గుడ్ హోప్ అగ్రపు పరిసరములందు తొలుతగ డచ్చివారు వలస చేరిరి. ఆ డచ్చివారికే ' బోయర్ ' అను వ్యవ హారము కలదు. కాని, 1814 లో బ్రిటిష్‌వారు ఆ ప్రాంత మును (కేప్ కాలనీ) ఆక్రమించిరి. అంతట బోయర్ రైతులు ఉత్తరమునకును, తూర్పునకును పయనించి అట ట్రాన్స్‌వాల్, నేటాల్ వలసలను నెలకొల్పిరి. తరువాత 1867 లో హోప్‌టౌన్ ప్రాంతమున వజ్రములు కనుగొన బడగనే ఆ ప్రాంతమును సైతము బ్రిటిష్‌వారు ఆక్ర మించిరి. ఇంతలో ట్రాన్స్‌వాల్‌నందు బంగారుగనుల ఉనికి తెలియవచ్చినంతట దక్షిణ ఆఫ్రికాకు పూర్వము కన్న మిన్నగ ప్రాముఖ్యము కలిగినది. అందుచే కేప్ కాలనీ పాలకులు బ్రిటిష్‌ప్రభుత్వపు అండతో రాజకీయ ముగను, ఆర్థికముగను బోయర్‌లను లొంగదీసికొన యత్నించిరి. తత్ఫలితముగ 1899 లో యుద్ధము ఘటిల్లి, ట్రాన్స్‌వాల్ బ్రిటిష్‌వారి వశమయ్యెను [చూ. బోయర్ యుద్ధము]. కాని, ఆ రాష్ట్రమునకు ఆంతరంగిక స్వపరి పాలనము ఒసగబడినది. కడకు పరిస్థితుల ప్రాబల్యము వలన బోయర్‌లును, ఆంగ్లేయులును సామరస్యమును ఆసించిన ఫలితముగ ఆ యా రాష్ట్రములు సమాఖ్యారూప ముగ ఏకమై ' దక్షిణ ఆఫ్రికా యూనియన్ ' గ రూపొంది (1910) బ్రిటిష్ సామ్రాజ్యమున అధినివేశ ప్రతిపత్తిని పొందినవి. కాని, కెనడా, ఆస్ట్రేలియా, న్యూజీలండ్ దేశ ములలో సంఘటిల్లని ఒక సమస్య ఈ ప్రభుత్వమును ఎదు ర్కొనినది. ఈ దేశమున ఆదిమవాసులగు నీగ్రోలు అత్య ధిక సంఖ్యాకులు. శ్వేతజాతులసంఖ్య వారితో పోల్చి నపుడు అత్యల్పము. ఇందుకు తోడుగ చెరకుతోటల లోను, ఇతర పరిశ్రమలలోను పనిచేయుటకై 1860 మొదలు భారతదేశమునుండియు, 1903 మొదలుగ చీనా నుండియు ప్రభుత్వముచే రప్పింపబడి ఇట స్థిరనివాసము ఏర్పరచుకొనిన ఆసియావాసుల సంఖ్యయు బహుళము. కాని, శ్వేతేతరజాతులలో దేనికిని ఎట్టి భాగస్వామ్యమును, స్వత్వమును లేని రీతిగ దక్షిణ ఆఫ్రికా రాజ్యాంగము [చూ. దక్షిణ ఆఫ్రికా] రూపొందింపబడినది. ఈ వ్యత్యాసమును రద్దొనర్చి భారతీయుల ఆత్మగౌరవమును కాపాడుటకై - ఆ దేశమున తాను వసించినపుడు - మహాత్మాగాంధియు [చూ.] సత్యాగ్రహ [చూ.] రూపమున ఆందోళనల నడ పెను. కాని, ఈనాటికిని ఆ సమస్య అపరిష్కృతముగనే నిలిచి ఉండుటయేకాక, ఆ సమస్యపై కలిగిన అభిప్రాయ భేదముల ఫలితముగనే ఆ రాజ్యము బ్రిటిష్ కామన్వెల్త్ నుండి విడివడినది [చూ. అపార్తైట్ : సం. 10 - పు. 115].

**అధిపత్యము** : ఈ తరగతికి చెందిన వాని యందు సామ్రాజ్యవాద దేశము తన అధికారమును నెలకొల్పి, తన ప్రతినిధులమూలమున ప్రజా జీవితముపై ప్రత్యక్షాధికారము వహించి ప్రభుత్వమును నడపెడిది. ఇండియా, సింహళము (సిలోన్), బర్మా, మలయా, ఇండోనీషియా, ఇండో - చైనా, ఫిలిప్పీన్ ఈ వర్గమునకు చెందినవి.

**ఇండియా** : ఇండియాలో బ్రిటిష్ ప్రభుత్వము 1818 లో మహారాష్ట్రులను, 1849 లో సిక్కులను కడసారిగ ఓడించుటతో భారతదేశమున బ్రిటిష్‌వారి సామ్రాజ్యము దిటవుగ తావు కల్పించుకొన గలిగినది. మొగల్ పాదుషాకు లోబడి పరిపాలనను నెరపుచున్నటుల కంపెనీ ప్రభుత్వము [చూ. ఈస్టిండియా కంపెనీ] అట తొలుతలో వ్యవహరించినను 1827 లో ఆ నామమాత్రపు వ్యవహారమునకు స్వస్తిచెప్పి సర్వాధికారములను వహించినది. 1857 లో చెలరేగి, నానాసాహేబ్ [చూ.] మొదలగు జాతీయ వీరులచే నడుపబడిన భారత ప్రథమ స్వాతంత్ర్య యుద్ధము (1857) ఆ సామ్రాజ్య ప్రతిపత్తికి భంగము ఏర్పరచు రీతిగ తొలుత కన్పట్టినను, భారతీయుల అనైక్యము వలనను, పాశ్చాత్యుల వ్యవస్థా నిపుణత మూలముననను కడకు అడచబడినది. అంతటినుండి కంపెనీ ప్రభుత్వము అంతరించి, బ్రిటిష్ చక్రవర్తిని తన ప్రతినిధి మూలమున పాలించుట ఆరంభితమైనది. కాని, 1857 లో రగుల్కొల్పబడిన స్వాతంత్ర్య జ్యోతి చల్లారక, వేరు వేరు ప్రాంతముల వేరు వేరు రీతులుగ దాదాపు ఇరువది సంవత్సరములు స్ఫుటరూపమును పొందుచునే ఉండినది. కడకు 1885 లో భారత జాతీయ కాంగ్రెస్ [చూ.] స్థాపనతో ఆ స్వాతంత్ర్యభావన ప్రజాభిప్రాయ రూపమున క్రమరీతిలో పరిణామము చెందుటకు తెరువు ఏర్పడినది. క్రమక్రమముగ దేశీయులందు జాతీయత పెచ్చుపెరిగిన కొలది సామ్రాజ్య ప్రభుత్వము సైతము దాని తీవ్రతను తగ్గించుటకై ఏవియో కొన్ని సంస్కరణలను ప్రవేశపెట్ట వలసివచ్చినది. ఇట్టి వానిలో 1909 న ప్రవేశపెట్టబడిన మింటో - మార్లీ సంస్కరణలవలన సద్యఃప్రయోజనము శూన్యమే అయినను, రాజ్యాంగ బద్ధమగు ప్రభుత్వమునకు ఛాయామాత్రముగ అయినను ప్రసక్తి కల్పింపబడినది [చూ. భారతదేశము].

**బర్మా** : 1752 మొదలుగ అవలంపయా వంశీకుల ఆధ్వర్యవమున బర్మా ఏకీకృతమై, పశ్చిమమున భారతదేశమునందలి మణిపూర్, అస్సామ్ ప్రాంతములను సైతము ఆక్రమించినను (1822), ఈ విస్తరణ విధానము వలన ఆ కాలమున భారతదేశమును పాలించు ఈస్ట్ ఇండియా కంపెనీ [చూ.] తో విరోధమును కొనితెచ్చుకొనినది. సువ్యవస్థీకృతములగు కంపెనీ సేనల ధాటికి బర్మా సేనలు ఓడిపోయిన ఫలితముగ ఉత్తర బర్మాయందలి తీరభూమిలో అత్యధిక భాగము కంపెనీ వశమైనది (1826). తరువాత జరిగిన మరిరెండు యుద్ధముల ఫలితముగ బర్మాలో అత్యధికభాగమును, 1891 నాటికి మిగిలిన భాగమును కంపెనీకి దక్కినవి. పరిపాలనా సౌకర్యము కొరకై తమ భారత సామ్రాజ్యముతో దీనిని కంపెనీ పరిపాలకులు మిళితము చేసిరి. కంపెనీ పరిపాలనను తొలగించి బ్రిటిష్ చక్రవర్తిని అధికారమును గ్రహించిన తరువాత కూడ పరిస్థితి అటులనే 1937 వరకు కొనసాగినది [చూ. బర్మా].

**సిలోన్** : 1798 లో సింహళమున డచ్చి ఆధిపత్యమును తొలగించి బ్రిటిష్ ప్రభుత్వము 1815 లో ఆ ద్వీపమున కొలది స్వతంత్రతతో మనుచున్న కేండీ పాలకుని అధికార భ్రష్టుని చేయుటతో ఆ ద్వీపమంతయు బ్రిటిష్ వారికి వశమైనది [చూ. సిలోన్].

**సింగపూర్** : సింగపూర్ రేవు ఉన్న స్థలమును వశపరచుకొని అట స్థావరమును నెలకొల్పుటతో (1819) మలయా యందు బ్రిటిష్ ఆధిపత్యము మొదలైనది. మెలుక్కా మొదలగు పరిసర దీవులు మాత్రమే తొలుత వారి పాలనలో ఉండి 'స్ట్రెయిట్ సెటిల్‌మెంట్స్' అను పేర వ్యవహరింపబడినవి. కడకు మలయా ద్వీపకల్పము నందలి పెరాక్ మొదలగు వివిధ స్వతంత్రరాజ్యములు స్వీయ భద్రత కొరకై బ్రిటిష్ రక్షణను ఒకటి వెనుక వేరొకటిగ పొందినవి (1883 - 1909). తత్ఫలితముగ బ్రిటిష్ ఆధిపత్యము మలయా యందు అంతట నెలకొనగలిగినది [చూ. సింగపూర్].

**ఇండోనీషియా** : ఇండోనీషియా యందు డచ్చివారు 1619 లోనే కాలూనగలిగినను యూరప్‌నందలి రాజకీయముల ఫలితముగ డచ్చి, బ్రిటిష్ పాలకుల మధ్య ఇండోనీషియా యందలి పాశ్చాత్యస్థావరములు పలుమారులు చేతులు మారి కడకు 1824 నాటికి తిరిగి ఆ స్థావరములు అన్నియు డచ్చివారికే స్థిరపరచబడినవి. అంతటినుండి, జావా మొదలగు ద్వీపములలో చెలరేగిన దేశీయుల తిరుగుబాటులను అడచి, 1849 నాటికి ఆ ద్వీప సముదాయము నందు అంతటను డచ్చివారు తమ ఆధిపత్యమును నెలకొల్పిరి [చూ. ఇండోనీషియా].

**ఇండో - చీనా** : ఇండో - చీనా యంతయు 19 వ శతాబ్ది ఆరంభమున అన్నామ్ సామ్రాజ్యమని వ్యవహరింపబడి, జాతీయుడగు ఒక చక్రవర్తి పాలనలో ఉండెడిది. కేతలిక్

మిషనరీల విపరీతపు పలుకుబడిని అంతము చేయుటకు ఆ చక్రవర్తి తీసికొనిన కొన్ని చర్యలను వెపముగ గ్రహించి, ఫ్రెంచి సేనలు స్పెయిన్ సేనల సాయముతో చక్రవర్తిని ఓడించి తీరప్రాంతమున మూడు రాష్ట్రములను వశపరచుకొనుటతో (1862) ఫ్రెంచి ఆధిపత్యము అట ఆరంభమైనది. కడకు వివిధ యుద్ధముల మూలమున చక్రవర్తి అధికారమును సన్నగిల జేసి, దేశమునందలి అన్ని ప్రాంతములను ఫ్రెంచివారు తమ అధికారములోనికి తీసికొనివచ్చి (1887), 1897 నుండి తమ గవర్నర్-జనరల్ ద్వారా పరిపాలనను మొదలిడిరి. నేటి కాంబోడియా, లావోస్, ఉత్తర, దక్షిణ వియెత్నామ్ రాజ్యముల సమష్టి రూపమే నాటి ఇండో - చీనా [చూ. ఇండో - చీనా].

ఫిలిప్పైన్: పై రాజ్యముల కోవకే చెందిన ఫిలిప్పైన్ దీవులు మెజెల్లాన్‌చే కనుగొనబడినవి. 1521 మొదలుగ స్పెయిన్ వారి వశముననే దీర్ఘకాలము ఉండి 1898 లో స్పెయిన్ - యునైటెడ్ స్టేట్స్ మధ్య చెలరేగిన యుద్ధ ఫలితముగ జరిగిన సంధిని అనుసరించి యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వమునకు వశమయ్యెను. తొలుత దేశీయులు జరిపిన తిరుగుబాటును అడచిన తరువాత 1901 నుండి దేశీయుల సహకారముతో యునైటెడ్ స్టేట్స్ అచట ఆధిపత్యమును నెరప మొదలిడినది [చూ. ఫిలిప్పైన్స్].

**ఆక్రమణము :** ఈ పద్ధతిలో సామ్రాజ్యవాదమునకు బలియైన ప్రాంతములందు సామ్రాజ్యవాద దేశము స్వయముగ జోక్యము వహించి, సొంత ఆస్తి యందువలె పరిపాలన నెరపెడిది. ఈ వర్గమునకు చెందినవానిలో ప్రముఖముగ పేర్కొనతగినవి ఆఫ్రికాలో యూరపియన్‌లు ఆక్రమించిన ప్రాంతములు. ప్రపంచ చరిత్రలోని విషాదకర సంఘటనలలో మానవతాదృష్టిలో అత్యంత శోచనీయమయినది ఆఫ్రికా విభజన.

ఆఫ్రికా దేశములు : ప్రాచ్యదేశములకు సముద్ర మార్గమున పయనించుటకు పోర్చుగీస్ నావికులు మార్గమును కనుగొనినది మొదలుగ వివిధ యూరపియన్ రాజ్యములు ఆఫ్రికా తీరమును చుట్టి పయనించినను అటనట తీర ప్రాంతములందు స్థావరములను కొన్నింటిని నెలకొల్పుకొనినవియే కాని, ఖండాంతర్భాగమునకు చొరబారుటకు అవి శ్రద్ధవహించినవి కావు. ఆఫ్రికా ఖండమునందలి ఉత్తరభాగములోని ఈజిప్టు, సుడాన్, టూనీషియా, అల్జీరియా, లిబియా ఈ యుగమునకు పూర్వమునుండియే ఓటోమన్ తుర్కు సామ్రాట్‌ల నామమాత్రపు ఆధిపత్యమునకు లోబడి ఉండినను, స్థానిక పాలకులు స్వతంత్రుల వలెనే వ్యవహరించుచుండిరి. మొరాకో, ఎతియోపియా స్వతంత్ర రాజ్యములుగ ఉండినవి. పందొమ్మిదవ శతాబ్ది మొదలుగ ఫ్రెంచి, బ్రిటిష్, పోర్చుగీస్, జర్మనీ దేశాన్వేషకులు పలువురును, క్రైస్తవమత ప్రచారకులును ఖండాంతర్భాగమున పయనించి, పలు విశేషములను యూరప్ వాసుల దృష్టికి కొనిరాగలిగిరి. అంతటినుండి యూరప్ దేశపాలకులు తమ దృష్టిని ఆఫ్రికాదేశముల వైపు మరల్చి తమలో తాము ఒడంబడికలను కుదుర్చుకొని, వారివారి వసతులను అనుసరించి ఆఫ్రికాయందలి వివిధ దేశములను ఆక్రమింప మొదలిడిరి. తమ రాయబారిని అల్‌జీరియా [చూ] పాలకుడు ఈగకుంచెతో కొట్టి పరాభవించెనను మిషపై ఫ్రాన్స్ 1830 లో అల్‌జీరియా పాలకునిపై విపుల సైన్యముతో దండెత్తి, అతనిని పదభ్రష్టుని చేసి తీరభూమిని ఆక్రమించుటతో ఉత్తర ఆఫ్రికా యందు యూరప్‌వాసుల ఆక్రమణ మొదలిడినదని చెప్పవచ్చును. 1847 లో తిరుగుబాటుదారులను అడచి, తక్కిన అల్‌జీరియాను సైతము ఫ్రెంచివారు కైవసము చేసికొనిరి. ప్రక్కనున్న టూనీషియాను ఆ తరువాత ఆక్రమించుటకు బ్రిటన్ ఆమోదమును ఫ్రాన్స్ పొందగలిగినది కాని, ఇటలీ ఇందులకు పోటీగ నిలిచినది. కడకు ఫ్రెంచివారే ఇందు విజయమును ఆర్జించి, టూనీషియా పాలకుని తమ రక్షణలోనికి గ్రహించి, ఆదేశమును ఆక్రమింపగలిగిరి (1883). ఈ నష్టమును కూడతీసికొనుటకై రష్యా ఆమోదసహకారములతో లిబియాను ఇటలీ వశము చేసికొనినది (1911). మొరాకోలో పలుకుబడిని సంపాదించుకొనుటకు ఫ్రాన్స్, జర్మనీ, స్పెయిన్ కీచులాడుకొనినను కడకు ఆ రాజ్యము ఫ్రెంచి ఆక్రమణకు తలయొగ్గినది (1912). కాని, ఆ వెనువెంటనే స్పెయిన్‌ను సంతృప్తి పరచుటకై ఆ దేశమునకు మాత్రము మొరాకో రాజ్యమున కొంత భాగమును ఫ్రాన్స్ ధారాదత్తము చేసినది. ఈ పరిస్థితులలో మధ్యధరా సముద్రమును ఎర్ర సముద్రముతో సంధించు సూయెజ్ కాలువ 1869 లో డి లెస్సెప్స్ అను ఫ్రెంచి ఇంజనీర్ కృషివలన నిర్మితమై, యూరప్ నుండి భారతదేశాది ప్రాచ్యరాజ్యములకు పూర్వముకన్న చాలతక్కువ దూరపు సముద్రమార్గమును రూపొందించగ, తమ భారత సామ్రాజ్య రక్షణకొరకై ఈ సూయెజ్ కాలువ పరిసరములను తమ అదుపులో ఉంచుకొనవలసిన ఆవశ్యకత బ్రిటన్‌కు కలిగినది. అంతట ఈ సూయెజ్ కాలువపై ఆధిపత్యముకల కంపెనీలో తనకున్న వాటా పత్రమును ఈజిప్టు సుల్తాన్ విక్రయింపగ బ్రిటన్ కొనుగోలుచేసి (1875), ఆ కాలువపై కొంత ఆధిపత్యమును ఆర్జించినది. అంతకు పూర్వమునుండి బ్రిటిష్ సేనానులు

ఈజిప్టు ప్రభువు కొలువులోచేరి ఈజిప్టు సరిహద్దులను విస్తరింపజేయుటయేకాక సుడాన్‌పై ఆ రాజ్యమునకు అధిపత్యమును సైతము కల్గించిరి. క్రమముగ ఈజిప్టు ప్రభువు ఋణగ్రస్తుడై ప్రజానురాగమునకు దూరుడైన కొలది, బ్రిటిష్ ప్రభుత్వపు పలుకుబడి అతనిపై అధికమై కడకు 1882 న బ్రిటిష్‌వారు దేశపాలకుని తమ రక్షణలోనికి తీసికొని, దేశపరిపాలనపై అధికారము వహించుటతో చరమస్థాయిని అందుకొనినది. అనతికాలముననే ఈజిప్టుకు నామమాత్రపు భాగస్వామ్యమును కల్పించుచు సుడాన్‌ను కూడ బ్రిటన్ ఆక్రమించినది (1898). ఈజిప్టు వ్యవహారములలో తమకు ఫ్రెంచివారు చూపెట్టిన సానుభూతికి కృతజ్ఞతాసూచకముగ ఫ్రెంచివారు సహారాను ఆక్రమించుటకు (1890) బ్రిటిష్‌వారు సహకరించిరి. ఉత్తర ఆఫ్రికాలో లిబియా తప్ప తనకు మరేమియు దక్కలేదని కినుక వహించిన ఇటలీ దేశము 1882 లో ఎరిత్రియాను, 1889 లో సోమాలీలాండ్‌ను ఆక్రమించి, అంతటితో ఊరకొనక ఎతియోపియాను సైతము వశపరచుకొనుటకు యత్నించినది. కాని, 1896 లో ఎతియోపియా సైన్యములు ఇటలీ సేనలను అడోవావద్ద ఘోరపరాజయము పాలుజేయుటతో ఆ యత్నము విఫలమైనది.

మధ్య ఆఫ్రికాలో కాంగోనదీ తటమును అనుకొనిన విశాల ప్రాంతమును బెల్జియమ్‌రాజగు లియోపాల్డ్ 1885 లో స్వీయ వ్యక్తిగత రాజ్యముగ వశపరచుకొని తరువాత బెల్జియమ్ రాజ్యమునకే దానిని వశపరచెను (1908). కాంగోనదికి వేరొక తటమును ఆనుకొని ఉన్న ప్రదేశము ఫ్రెంచివారికి దక్కినది (1839-45). అంతియేకాక, పశ్చిమ ఆఫ్రికాలో అంతటంతట సామమున, దండోపాయమున ఫ్రెంచివారు ఆర్జించిన మారిటేనియా, సెనెగల్, ఫ్రెంచి గినీ, ఐవరీకోస్ట్, దహోమీ, ఎగువ సెనెగల్, నైజర్ రాజ్యములు అన్నియు కలుపబడి డాకర్ నగరము రాజధానిగ ఫ్రెంచి పశ్చిమ ఆఫ్రికా 1904 లో రూపొందింపబడినది. ఈ రాజ్యాక్రమణల పోటీలో జర్మనీకి పశ్చిమ ఆఫ్రికాలో కామెరూన్, టోగోలాండ్ రాజ్యములు 1884 లో దక్కినవి. బ్రిటిష్‌వారు అషాంతిజాతి [చూ. సం. 10-పు. 172] స్వాతంత్ర్యమును అంతము చేసి (1824-1894), గోల్డ్ కోస్ట్ ప్రాంతమును అంతటిని వశము చేసికొనుటయేకాక అంతకు పూర్వమే 1799 లో సియెర్రాలియోనీను, 1807 లో గాంబియాను ఆక్రమించిరి. తరువాత బ్రిటిష్ వర్తక సంస్థయగు 'రాయల్ ఆఫ్రికన్ కంపెనీ' మొదట నైజీరియాలో వర్తకరీత్యా తావు కల్పించుకొని, క్రమక్రమముగ రాజకీయాధికారమును వశపరచుకొనగ, ఆ కంపెనీ నుండి బ్రిటిష్ ప్రభుత్వము ఆ అధికారమును దఖలు పరచుకొనినది (1899). దక్షిణ ఆఫ్రికా ఖండమున పశ్చిమ భాగమున అన్‌గోలాయందు తీరప్రాంతమున పోర్చుగీస్‌వారు 1575 లోనే కాలిడి, 1648 కి నేటి సరిహద్దులవరకు ఆ ప్రాంతమును ఆక్రమించిరి. ఇక పూర్వ ప్రసక్తితమగు దక్షిణ ఆఫ్రికా రాజ్యము కాక, సిసిల్ రోడ్స్ అను బ్రిటిష్ రాజ్యతంత్రజ్ఞుని ప్రేరణచే రూపొందిన 'సౌత్ ఆఫ్రికా కంపెనీ' అను వర్తక సంస్థ కృషి మూలమున రొడీషియా రాజ్యము 1888 లో ఆర్జితమై, 1923 వరకు దాని పరిపాలనలోనే ఉండి, అనంతరమున బ్రిటిష్ ప్రభుత్వపు పరిపాలనకు అప్పగింపబడినది. ఈ ప్రాంతమున జర్మనీచే నైరృతి ఆఫ్రికా 1883 లో ఆక్రమితమైనది. తూర్పు ఆఫ్రికాలోని జాంజిబార్ సుల్తాన్‌ను, ఉగాండా ప్రభువును బలహీనులుగ ఉండుట అవకాశముగ గ్రహించి బ్రిటన్, జర్మనీ అచట ఆధిపత్యమును ఆర్జించుటకై పోటీపడి కృషిచేసి, వివిధ ప్రాంతములను ఆక్రమించిన ఫలితముగ కడకు 1901 లో ఒక ఒప్పందమునకు రాగలిగి, తద్వారా జర్మనీ తూర్పు ఆఫ్రికా (టాంగన్యికా*) ప్రాంతముపై జర్మనీల ఆధిపత్యము గుర్తింపబడినది. ఉగాండా, కెన్యా, జాంజిబార్* దేశములను బ్రిటన్ తన రక్షణలోనికి గ్రహించినది. న్యాసాలాండ్ అదివరకే బ్రిటిష్‌వారికి దక్కినది. మొజాంబిక్‌లో పోర్చుగీస్ ఆక్రమణను తక్కిన యూరపియన్ రాజ్యములు ఈ కాలముననే గుర్తించినవి. తూర్పు ఆఫ్రికా పంపకములలో జోక్యము కలిగించుకొనని ఫ్రాన్స్ 1885 లో మలగాసీ ద్వీపమును ఆక్రమించుటకు బ్రిటన్ ఆమోదమును తెలిపినది. పైన పేర్కొనబడినవియేకాక, దక్షిణ ఆఫ్రికా రాజ్యము అధినివేశ స్వత్వము పొందిన పిదప సైతము, ఆ రాజ్యముచే పరివృతములై వేరు వేరు ప్రాంతములందున్న బసూటోలాండ్, బెచూనాలాండ్, స్వాజీలాండ్ ప్రాంతములను బ్రిటన్ తన ఆక్రమణలో ఉంచుకొనినది. ఇటుల పందొమ్మిదవ శతాబ్ది అంతమునకు ఆఫ్రికా ఖండమున ఎతియోపియా, లైబీరియా తప్ప తక్కిన ప్రాంతములు అన్నియును యూరప్ రాజ్యములచే ఆక్రమితములైనవి. వీనిలో ఎతియోపియా అతి ప్రాచీన స్వతంత్రరాజ్యమనుట పాఠకులకు తెలిసినదే. లైబీరియా ఒక నూతన రాజ్యము. యునైటెడ్‌స్టేట్స్‌లో కొందరు ఉదార భావుకుల కృషిమూలమున దాస్యము నుండి విడివడిన నీగ్రోలను ఆఫ్రికాకు తరలించుటయే

* టాంగన్యికా, జాంజిబార్ ఇటీవల (1965) ఏర్పడిన టాంజేనియాలో అంతర్భాగములు.

శ్రేయస్కరమని తలపెట్టబడి, తత్ఫలితముగ దాస్య విముక్తులగు నీగ్రోల వలసగ 1822 లో రూపొందింపబడిన వలసయే లైబీరియా; 1847 లో ఇది ఒక స్వతంత్ర గణరాజ్యముగ రూపొంది పరిగణనను ఆర్జించినది [చూ. లైబీరియా].

ఈ ఆక్రమణ విధానము ఆఫ్రికా ఖండమున చెలరేగినంత విరివిగా కాకపోయినను, అట్లాంటిక్, హిందూ, పసిఫిక్ మహాసముద్రములందలి పలు దీవుల ఆక్రమణలోను విరివిగ ముందునకు నడచినది. స్పెయిన్‌తో జరిపిన యుద్ధఫలితముగ యునైటెడ్ స్టేట్స్‌కు లభించిన పోర్టోరికో మొదలగునవియు, ఆక్రమణ మూలముగ లభించిన హవాయీ దీవులును ఈ లెక్కలోనికే వచ్చును.

**అదమనము :** ఈ విధానమున సామ్రాజ్య వాద రాజ్యము తన పలుకుబడిని ఒక దేశమున విస్తరింపజేసి, ఆ దేశమునకు నామమాత్రపు స్వాతంత్రము ఉంచి, నిర్వీర్యముగచేసి తన అదుపులో ఉంచుకొనెడిది. సాధారణముగ ఒకటికి మించిన సామ్రాజ్యవాద రాజ్యములు ఒక దేశముపై కన్నువైచి, తమలో తామొక అంగీకారమునకు రాలేనపుడు ఈ విధానము బాగుగ ఉపకరించినది. అపుడు ఆ దేశమున వివిధ ప్రాంతములను తమ పలుకుబడి ప్రాంతములుగ విభజించుకొని, నామమాత్రపు స్వాతంత్ర్యము మాత్రము దళిత దేశమునకు మిగిల్చెడివి. ఈ విధానముచే జపాన్ తప్ప తక్కిన స్వతంత్ర ఆసియా, ఆఫ్రికా రాజ్యములు అన్నియును, లాటిన్ అమెరికా రాజ్యములును పీడితములగుట యథార్థమే అయినను ఇందులకు లక్ష్యముగ తొలుత పేర్కొనదగినది చీనా; ఆ తరువాత పరిగణనలోనికి గ్రహింపదగినవి సయామ్, ఇరాన్.

యూరపియన్‌ల ఆక్రమణకు గురికాకుండ తప్పించుకొనుటకై, వారి వర్తక వ్యాపారములను చాలవరకు పదునెనిమిదవ శతాబ్ది ఉత్తరార్థమున కేంటన్ రేవునకే చీనా పరిమితముచేసినను, లాభదాయకమగు చీనా వ్యాపారమును వదలుకొనుటకు ఇచ్ఛలేక యూరపియన్‌లు, అందును ముఖ్యముగ బ్రిటిష్‌వారు, జ్ఞాతాజ్ఞాత మార్గముల తమ వర్తకమును సాగించిరి. ఈ వర్తకములో అత్యంత లాభదాయకమైనది నల్లమందు వ్యాపారము. చీనాప్రభుత్వము ఈ వ్యాపారమును ప్రజారోగ్యదృష్టితో నిషేధించినను, బ్రిటిష్ వర్తకులు పట్టు విడువక సాగించుటతో 1839 లో చీనా - బ్రిటన్ దేశముల మధ్య యుద్ధము మొదలై అందు బ్రిటన్‌దే పైచేయి అయినది. తత్ఫలితముగ జరిగిన నాన్‌కింగ్ సంధిని (1841) అనుసరించి హాంగ్ కాంగ్ దీవి బ్రిటిష్‌వారికి దత్తమగుటయేకాక, వర్తకమునకై కేంటన్, షాంగేవంటి ప్రముఖములగు ఐదు రేవు పట్టణములందు వసతులు కల్పింపబడినవి. ఈ ఒడంబడిక తక్కిన సామ్రాజ్యవాద రాజ్యములకు మార్గదర్శియై వారును ఇట్టి సౌకర్యములకొరకై పోటీలు పడి ముందునకు రామొదలిడిరి. 1844 లో యునైటెడ్‌స్టేట్స్‌కును, తదనంతరమున తక్కిన సామ్రాజ్యవాద రాజ్యములకును అతిరిక్త ప్రాదేశిక (ఎక్‌స్ట్రా టెరిటోరియల్) స్వత్వములు కల్పింపబడినవి. అందువలన విదేశీయులగు నేరస్తులను విచారించు అధికారమును చీనా వదలుకొనవలసి వచ్చినది. చీనాకు పట్టిన ఈ నికృష్టస్థితి 1858 లో యునైటెడ్‌స్టేట్స్, బ్రిటన్, ఫ్రాన్స్, రష్యా రాజ్యములతో చీనా జరుపుకొనిన టీన్‌చీన్ సంధితో అత్యధమ స్థాయిని అందుకొనినది. దానితో మరి 11 రేవు పట్టణములు విదేశీయవర్తకమునకు తెరువబడుటయేకాక, రేవు సుంకముల శాఖపై పర్యవేక్షణాధికారము విదేశీయులకు అప్పగింపబడి, నల్లమందు వ్యాపారము చట్టసమ్మతము చేయబడినది. అటనుండి సామ్రాజ్యవాదదేశములు తాము కోరిన వసతులనెల్ల పోటీలుపడి నిస్సహాయకమగు చీనానుండి ఆర్జించినవి. చీనాప్రభుత్వము అందులకు కాదనినచో, దండోపాయమును ప్రయోగించుటకును ఆ రాజ్యములు వెరచినవి కావు. 1894 లో ఈ సామ్రాజ్య దాహపు రాజ్యములకు సైదోడుగ జపాన్‌కూడ వచ్చుటతో చీనాపని మరింత క్లిష్టమైనది. ఆ సందర్భమున జరిగిన చీనా - జపాన్ యుద్ధములో చీనా ఓడిపోయి కొరియాకు స్వాతంత్ర్యము ఇచ్చి, ఆదేశముపై జపాన్ తన పలుకుబడిని వ్యాపింపజేయుటకు వసతిని కల్పించుటయేకాక, ఫార్మోజా (తైయువాన్) ను, పెస్కడోర్ దీవులను జపాన్‌నకు దత్తము చేసినది (1895). ఆ తరువాత పదియో ఒక నెపముపై, చీనా నుండి వసతులను, రేవులను సంపాదించు పోటీ పాశ్చాత్య రాజ్యములలో పెచ్చు పెరిగినది. ఇట్టి పరిస్థితులలో దేశమున సువ్యవస్థిత పరిపాలనను ఏర్పరచి, సైన్యాదులను ఆధునిక పద్ధతులపై పునర్నిర్మితములుగ చేయుటకు తగు సంస్కరణలను ప్రవేశపెట్టుటకు 1906 లో మంచూ ప్రభుత్వము కృషిచేసినది. కాని, ఆ కృషి విఫలమయ్యెను. ఈ స్థితినుండి దేశమును ఉద్ధరించుటకు సన్‌యత్‌సేన్ [చూ.] నాయకత్వమున రూపొందిన ఒక విప్లవసంస్థ విజయమును సాధింపగ అప్పటి చక్రవర్తి రాజ్యపరిత్యాగమును చేసెను; తత్ఫలితముగ చీనా ఒక గణరాజ్యముగ రూపొందెను. కాని, పరిస్థితుల ప్రాబల్యమునకు లొంగి య్వాన్‌షిహ్-కాయ్‌కి గణరాజ్యపు అధ్యక్షపదవిని సన్‌యత్‌సేన్ ఒసగెను. సైనిక నాయకుడగు ఈ అధ్యక్షుడు స్వార్థప్రయో

జనముల దృష్టిలో పెట్టుకొని వ్యవహరించుటవలన దుర దృష్టవశమున జాతీయ పునర్నిర్మాణమును, ప్రజాస్వామిక ప్రభుత్వ విధానమును ప్రగతిని సాధింపలేకపోయినవి.

సామ్రాజ్య దాహమునకు లోనై ఆక్రమితములైన ఇండియావంటి వానితో పోల్చినపుడు **ఇరాన్**, **సయామ్** బలవద్రాజ్యములుగ పరిగణనీయములు కానే కావు. కాని, సామ్రాజ్యవాద రాజ్యముల పోటీలవలన ఈ రెండు రాజ్యములను, వానిలో వేనిచేతను ఆక్రమింపబడక స్వతంత్ర ప్రతిపత్తిని నామమాత్రముగనైనను నిలుపుకొనగలిగినవి. ఇరాన్ దేశమును కబళించుచో రష్యాకు హిందూ మహా సముద్రపు రేవు లభింపగలదను భయముచేత, భారతదేశమును పాలించుచుండిన బ్రిటిష్ ప్రభుత్వము 1798 మొదలుగ ఇరాన్ ఆర్థిక, రాజకీయ జీవితమున జోక్యము వహించి వర్తించినది. 1884 నాటికి రష్యా దక్షిణమున తన పొరుగున ఉండిన అల్పరాజ్యములను అన్నింటిని జయించి, ఇరాన్ పొలిమేరలందుచేరి ఉత్తర ఇరాన్ రాజకీయ వ్యవహారములలో జోక్యము వహింపసాగినది. అప్పటిలో ఇరాన్‌ను పాలించిన కజర్ వంశపాలకులు రష్యానుగాని, బ్రిటన్‌నుగాని నిరోధింపజాలకపోయిరి. కడకు 1907 లో బ్రిటన్ - రష్యా కుదుర్చుకొనిన ఒక ఒడంబడికను అనుసరించి ఇరాన్ స్వాతంత్ర్యమును ఇరువురును గుర్తించునటులను, పారసీక సింధుశాఖా పరిసర ప్రాంతములందు బ్రిటన్‌కు కల ప్రయోజనములను గుర్తించి, ఇరాన్‌న ఆగ్నేయ భాగము బ్రిటిష్ ప్రభావమునకు లోనైన ప్రాంతముగను, దేశమున ఉత్తరార్ధ భాగము రష్యా పలుకుబడి ప్రాంతముగను, మధ్యదేశము ఈ ఉభయుల ఉమ్మడి పలుకుబడికి లోనై ఉండునటులను నిర్ణయము జరిగెను. ఆఫ్ఘనిస్తాన్ దేశము భారతదేశపాలకులగు బ్రిటిష్ వారితో జరిపిన పలు కయ్యముల తరువాత రష్యా, బ్రిటన్ పోటీవలన 1880 లగాయితు తన ప్రతిపత్తిని కాపాడుకొనగలిగినది.

బ్రిటిష్ పాలితమగు బర్మాకును, ఫ్రెంచి పాలితమగు ఇండో - చీనాకును మధ్య సయామ్ (థాయిలాండ్) ఉండుటవలన, ఆరెండు రాజ్యముల పోటీవలన ఆ రాజ్యపు స్వతంత్ర ప్రతిపత్తి ఏదియో ఒక తీరున నిలువగలిగినది. 1907 లో తాము జరిపికొనిన ఒక ఒడంబడికను అనుసరించి బ్రిటన్, ఫ్రాన్స్ దేశములు సయామ్ స్వాతంత్ర్యమును గుర్తించుచు ఆ దేశమున మీనామ్‌నదీతటపు పశ్చిమ ప్రాంతము బ్రిటిష్ పలుకుబడికిని, తూర్పు ప్రాంతము ఫ్రెంచి పలుకుబడికిని లోనై ఉండునటుల ఏర్పాటు చేసికొనినవి.

**అనుకరణము :** పై నాలుగింటికిని మూలతత్త్వము ననే విభిన్నమైనను పాశ్చాత్య సామ్రాజ్యవాద భావముల వ్యాప్తికి ఇదియు తోడుపడుటచే ఈ విధానము పైవానితో పాటుగ ఇట పేర్కొనబడినది. ఇందు పాశ్చాత్య సామ్రాజ్యవాదదేశము ఏదియు ఏవిధమగు అధికారమును సంపాదించుట జరుగలేదు; కాని, ఆదేశములను అనుకరించి, ఒక పాశ్చాత్యేతరదేశము వైజ్ఞానికాది రంగములందు పురోగమించి, వారి సామ్రాజ్యవాదమును తు. చ. తప్పకుండ ఆచరణరూపములోనికి తెచ్చుటకై యత్నించుట జరిగినది. ఈ విధానమునకు ఏకైక నిదర్శనము **జపాన్.**

జపాన్ : 1638 లో పాశ్చాత్యులతో తెగతెంపులు చేసికొని, వారిని ఎవరిని తన దేశమున అడుగిడకుండ నిషేధించిన జపాన్ ఆ విధానమునే రెండు శతాబ్దుల పై కాలము కొనసాగించినది. ఈ మధ్యకాలమున రష్యా మొదలగు కొన్ని దేశముల ప్రతినిధులు జపాన్‌న అడుగిడి పరిచితిని సాధించుటకు యత్నించియు విఫలులైరి. ఆ సమయమున జపాన్ ప్రభుత్వపు ప్రత్యేకానుమతితో హిరాడో దీవిలో మాత్రమే వ్యవహరించుటకు అనుమతిని పూర్వము నుండియు ఆర్జించిన డచ్చి కంపెనీవలన, సమకాలీన ప్రపంచపు పురోగతిని జపాన్ ప్రభుత్వపు పెద్దలు అంతటంతట తెలిసికొనుచునే ఉండిరి. కాని, ఈ పరిజ్ఞానమువలన జపాన్‌నకు ఒరిగినదియు ఏదియు లేకపోగా, అచటి రాజకీయ వేత్తలు ఈ విషయముల యెడ నిర్లక్ష్యము సైతము వహించిరి. కడకు యునైటెడ్ స్టేట్స్ తన దేశమునందలి బెస్త వాండ్రు ఇబ్బందిపడి జపాన్ రేవులకు చేరినపుడు వారి యెడ ఆదేశ ప్రభుత్వము సరియగు వైఖరిని వహించునటులను, కాలిఫోర్నియానుండి షాంగేకు పయనించు వర్తక నౌకలు నీటి సౌకర్యముకొరకై ఆగుటకు ఒకటి రెండు జపాన్ రేవులలో వసతులను కల్పించవలసినదిగను జపాన్ ప్రభుత్వమును అర్థించుచు, పెర్రీ అను నౌకాధిపతి నాయకత్వమున నాలుగు సైనికనావలను పంపుటతో (1853) చరిత్రగతి వేరొక తెరువు పట్టినది. ఈ అభ్యర్థనకు తగు సమాధానము లేనందున మరుసటి వత్సరమున పెర్రీ ఇంకను ఎక్కువ నౌకాబలముతో జపాన్ తీరముపై బల ప్రయోగము మూలమున కాలిడెను. అంతట జరిగిన సంధి [చూ. కనగవా సంధి] వలన యునైటెడ్ స్టేట్స్ మొదలగు రాజ్యములకు రెండు రేవులు తెరువబడుటతోపాటుగ పాశ్చాత్య విజ్ఞాన, సంస్కృతులకును తన సరిహద్దులను జపాన్ బాహాటముగ తెరచినది. అంతటినుండి పురోగతిని సాధింపదలచి ఆ దేశపు పెద్దలు భూస్వామివ్యవస్థను రద్దొనర్చి, చక్రవర్తిని సర్వాధికార సమేతునిచేసి, అతనిని

కీలక స్థానమునందు వహించిన దేశభక్తిని దేశమున రేకెత్తించి, పారిశ్రామిక విప్లవమును కొనివచ్చి, సైనిక, నౌకాబలముల ఆధునిక రీతిలో పునర్వ్యవస్థీకరించి 1894 నాటికి పాశ్చాత్య రాజ్యములతో సమాన స్థాయిలో తమ దేశము వ్యవహరించునటుల చేయగలిగిరి. ఆ సంవత్సరము మొదలుగ చీనా రాజకీయ వ్యవహారములలో ఆ రాజ్యము జోక్యము వహింప మొదలిడినది. 1894 - 95 యుద్ధ ఫలిత ముగ కొరియా స్వాతంత్ర్యమును చీనా గుర్తించునటుల చేసిన తరువాత కొరియాపై పెత్తనమును తానే వహించుటకు జపాన్ పూనుకొని, రష్యాకు ప్రతిస్పర్ధి అయినది. ఈ స్పర్ధయే కడకు రష్యా - జపాన్ యుద్ధము (1904 - 05) నకు దారితీసినది. పాశ్చాత్య ప్రముఖరాజ్యములలో ఒకటి యగు రష్యాను ఆ యుద్ధమున జపాన్ ఓడించుటతో దళిత ప్రాచ్యజాతులకు నూతన జాతీయోత్సాహమును, ఆత్మ విశ్వాసమును కలుగుట నిజమే అయినను, జపాన్‌నకు ఆ విజయగర్వము తలకెక్కి ఆ దేశము సామ్రాజ్యోన్మాదపు త్రోవపట్టునటుల చేసినది.

ఈ విధముగ ప్రపంచమంతయు ఇరువదవ శతాబ్ది ఆరంభమునకు పాశ్చాత్య సంస్కృతి ప్రభావితమైనది. ఆ సంస్కృతి సాధుమార్గమున కాక, రక్తపిపాసాయుతమగు సామ్రాజ్య వ్యాపనమార్గమున మారుమూల ప్రాంతములకును వ్యాపించుట వలన, ఆ సంస్కృతి యందలి లాభములలో భాగస్వామ్యము ఎట్టిదియు దళిత జాతులకు లభింపలేదు సరికదా స్వాతంత్ర్యమును కోలుపోయిన ఆ జాతులలో మానవ సహజమగు ప్రగతి శీలతయు కుంటువడినది. ఇట్టి పరిస్థితిలో సామ్రాజ్యవాదమున అంతర్భూతములై ఉన్న వైరుధ్యములే క్రమముగ రెండు ప్రపంచ మహా యుద్ధము (1914 - 45) లకు త్రోవదీసి, ఆ సామ్రాజ్యవాద సౌధము కూలిపోవుటకు కారణ భూతములైనవి.

## ప్రపంచ యుద్ధములు

ప్రథమ ప్రపంచ యుద్ధమున పాల్గొనిన ప్రతిరాజ్యమును అందలి తన ప్రవేశమునకు గల కారణములను ఏదియో ఒక ఉదాత్తరీతిలో పేర్కొనుట నిజమే అయినను, సామ్రాజ్యవాద విస్తృతి వలన ప్రపంచమున సంఘటిల్లిన పరిణామములే సహజముగ ఈ యుద్ధమునకు త్రోవదీసిన వనుట నిర్వివాదాంశము. అతిమాత్రమగు జాతీయాభిమానమును, సామ్రాజ్య వ్యాపనమును ప్రేరేపించు వానిలో ఒక ముఖ్యకారణముగ పేర్కొనవచ్చును. 19 వ శతాబ్ది ఉత్తరార్ధమున యూరప్ ఖండమున ఈ జాతీయాభిమానము హద్దుమించి వెర్రితలలు వేయసాగినది. 1871 లో జర్మనీ సామ్రాజ్యము రూపుగొనిన దాదిగ ఈ తత్వము మరింతగ ప్రబలినది. జర్మనీచే పరాజితమై (1870) తూర్పున రెండు పరగణాలను పోగొట్టుకొనిన ఫ్రాన్స్ దేశము జర్మనీ యెడల కక్షవహించి వర్తింప సాగినది. ఇందులకు ప్రతిగ జర్మన్‌లు దక్షులగు వారి నాయకత్వమున రాజకీయముగను, సైనికముగను సుస్థిరతను ఆర్జించి, యూరప్ రాజకీయములలోనే కాక, ప్రపంచ రాజకీయము లందును ప్రముఖపాత్ర వహించుటకు కృషి చేసిరి. ఇక తూర్పు యూరప్‌న బాల్కన్ రాజ్యములందు జాతీయాభిమానము పెచ్చు పెరుగుటచే అచటి స్లావ్ జాతులకు ఓటోమన్ సామ్రాజ్య దాస్యమునుండి విమోచనము చేకూర్చుటకు రష్యా జోక్యము వహించుటతో టర్కీ - రష్యా మధ్య రవరవలు పొడమినవి. ఈ బాల్కన్ రాజ్యము లన్నియు క్రైస్తవ రాజ్యములు అగుటవలన వీని స్వాతంత్ర్య విషయమున ఆస్ట్రియా - హంగేరీ, జర్మనీ దేశములకును కొంత ఆసక్తి ఉన్నను వీనియందు రష్యా పలుకుబడి పెరిగిన యెడల తమ ప్రతిపత్తికిని భంగము కలుగునను భయము వానికి ఉండినది.

కడకు టర్కీ - రష్యా మధ్యనున్న వైరుధ్యములను సడలింపజేసి యూరప్‌న రాజకీయ స్థైర్యమును నెలకొల్పు ఉద్దేశముతో 1878 న బెర్లిన్ నగరమున వివిధ రాజ్యముల సమావేశము జరిగినది. ఇదియే బెర్లిన్ కాంగ్రెస్ [చూ.] అని వ్యవహరింపబడుచున్నది. ఈ సమావేశమున జర్మనీ, ఆస్ట్రియా, గ్రేట్‌బ్రిటన్, ఫ్రాన్స్, ఇటలీ పాల్గొనెను. దీని ఫలితముగ ఏవియో కొన్ని ఏర్పాటులు బాల్కన్ రాజ్యములు మొదలగువానిలో జరిగినను, ఆ యా రాజ్యముల మధ్య విభేదములు సడలలేదు. అంతటి నుండి జర్మనీ, ఆస్ట్రియా, టర్కీ కలసిమెలసి వ్యవహరించుట మొదలిడినవి. ఇక బెర్లిన్ కాంగ్రెస్ సందర్భమున జర్మనీ వహించిన వైఖరికి కినుక చెందిన రష్యా ఆ మూడు రాజ్యములను తన శత్రువులుగ భావించి వ్యవహరింప ఆరంభించినది. యూరప్‌న అది మొదలుగ రెండు ప్రతిస్పర్ధి వర్గములు రూపొందసాగినవి. 1879 లో జర్మనీ, ఆస్ట్రియా పరస్పర మైత్రిని కుదుర్చుకొనినవి. ఇదియే కడకు ఇటలీకూడ అందు చేరుటతో 1882 లో త్రైరాజ్య మైత్రి (ట్రిపుల్ అలయన్స్) గ పరిణమించినది. యూరప్ ఖండపు ముఖ్య భూభాగమున చెలరేగుచున్న ఈ రాజకీయముల తుఫానునుండి సాధ్యమైనంతవరకు వైదొలగి ప్రపంచమున పలు ప్రాంతములకు విస్తరించిన తన విశాల సామ్రాజ్యమును కాపాడుకొనుటకు తొలుత శ్రద్ధ వహించిన గ్రేట్‌బ్రిటన్ సైతము కడకు ఫ్రాన్స్‌తో తన

కుండిన సాంప్రదాయిక విరోధమునకు స్వస్తి చెప్పి, ఆ రాజ్యముతో 1904 లో సామరస్య మైత్రిని (ఎన్ టెన్ టీ కార్డియల్) కుదుర్చుకొనినది. అంతకు ముందుగనే యూరప్ ఖండమున జర్మనీ సామ్రాజ్యపు ఉనికివలన రష్యా, ఫ్రాన్సు మధ్య మైత్రి ఒడంబడిక జరిగినది. ఆసియాయందు తన సామ్రాజ్యపు ఉనికికి రష్యా విస్తృతిని ఒక అభ్యంతరముగ పరిగణించిన గ్రేట్ బ్రిటన్ సైతము 1905 లో జపాన్‌చే రష్యా పరాజయమును పొందిన తరువాత రష్యా యెడల సుముఖభావము వహించి, ఫ్రాన్సు ప్రేరణమువలన ఆ రాజ్యముతో సన్నిహిత మైత్రిని అవలంబించినది (1907). ఇరువదవ శతాబ్ది ఆరంభమునకు జర్మనీ ఒకటియే తన ప్రతిస్పర్ధిగ రూపొందిన దని గ్రేట్ బ్రిటన్ గ్రహించుట ఇందులకు కారణముగ గ్రహింపదగును. పారిశ్రామిక విప్లవము ఇంగ్లండున తొలుతగ రూపొందినను, జర్మనీయు అచిరకాలముననే ఆ విప్లవమునకు తనదేశమున తావు కల్పించి, పారిశ్రామిక ఉత్పత్తియందు ఇంగ్లండునకు పోటీగ నిలువగలిగినది. అదియేకాక, ముడివస్తువుల సంపాదనకై గ్రేట్ బ్రిటన్ వలెనే సముద్రాంతర భూములందు వలసలను ఆర్జింప వలయునని జర్మనీ పాలకులు కుతూహలము చూపుటతో గ్రేట్ బ్రిటన్‌కు ఆందోళన కలుగక తప్పినది కాదు. తత్ఫలితముగ 1910 నాటికి జర్మనీ, ఇటలీ, ఆస్ట్రియా, టర్కీ ఒక పక్షముగను, రష్యా, ఫ్రాన్సు, బ్రిటన్ మరి యొక పక్షముగను యూరప్‌న రెండు ప్రతిస్పర్ధి వర్గములు యుద్ధ సమాయత్తములుగ రూపుగొనినవి. ఈ ద్వివిధ పక్షములును ఒకదానితో వేరొకటి పోటీపడి, యుద్ధ సామగ్రిని, నౌకాబల, సైనిక బలములను విరివిగ పెంపొం దింపసాగినవి. యుద్ధము అనివార్యము అను భావము సర్వత్ర వ్యాపింప మొదలిడినది. 1912 లో బాల్కన్ రాజ్యములు టర్కీమీద సాగించిన దండయాత్రయు, 1913 లో ఆ రాజ్యములు ఒకదానిపై వేరొకటి సాగించిన పోరాటములును పరిస్థితులను మరింత క్లిష్టతరములుగ చేసినవి.

కడకు బాల్కన్ ప్రాంతమున బోస్నియా రాజధాని యగు సరజెవోలో ఆస్ట్రియా సామ్రాజ్య చక్రవర్తికి వారసుడగు ఫ్రాన్సిస్ ఫెర్డినాండ్ హత్య గావింపబడుట (జూన్ 28, 1914) ప్రపంచ యుద్ధమునకు సద్యః కారణ ముగ ఉపకరించినది. ఈ హత్యకు సెర్బియా పాలకుల ప్రోత్సాహము కలదను నెపమున ఆ దేశముపై ప్రతీకార చర్యగ ఆస్ట్రియా యుద్ధము ప్రకటించినది (28 జూలై, 1914). సెర్బియా పక్షమున రష్యా యుద్ధసన్నద్ధమగుటతో ఆస్ట్రియా పక్షమును జర్మనీ అవలంబించి రష్యా, ఫ్రాన్సు దేశములపై యుద్ధమును ప్రకటించి రంగమున దిగినది (1914 సం. ఆగస్టు 1-3). ఫ్రాన్సుపై దండయాత్ర సాగించుటకు సులభమార్గముగ బెల్జియమ్‌పై జర్మనీ దండెత్తి - 1839 లో యూరప్ రాజ్యములు ఆ రాజ్యము నకు కల్పించిన - తాటస్థ్య ప్రతిపత్తికి భంగము కల్గించుటను నెపముగ గ్రహించి గ్రేట్ బ్రిటన్ జర్మనీపై ఆగస్టు 4 వ తేదీన యుద్ధమును ప్రకటించినది. ఆ సంవత్సరపు అంతమున ఓటోమన్ సామ్రాజ్యము కేంద్రరాజ్యముల (ఆస్ట్రియా, జర్మనీ) పక్షమున చేరినది. ఇటలీ తొలుత కొంత తటపటాయించి 1915 లో మిత్రరాజ్యము (ఫ్రాన్సు, బ్రిటన్, రష్యా) ల పక్షమున దిగినది. 1914 లోనే జపాన్ మిత్రరాజ్యముల పక్షమున చేరినది. 1915 లో బల్గేరియా కేంద్రరాజ్యముల పక్షమునను, 1916 లో మిత్రరాజ్యముల పక్షమున రుమేనియాయు ఈ మారణ యుద్ధమున కాలిడి నవి. మిత్రరాజ్యముల పక్షమున తనకు గల సానుభూతి వలననేమి లేదా తన పెట్టుబడులకు భంగము కలుగు నను భయమువలన నేమి కడకు 1917 లో యునైటెడ్ స్టేట్స్ మిత్రరాజ్యముల పక్షమున చేరినది. ఈ విధముగ ప్రత్యక్ష, పరోక్ష రీతులలో ప్రపంచమునందలి 31 రాజ్య ములు ఈ యుద్ధమున పాల్గొనినవి.

ఈ ప్రథమ ప్రపంచ మహాయుద్ధమున భూతల యుద్ధ ములు ఆగ్నేయ యూరప్, మధ్య యూరప్, ఇరాక్, అరేబియా దేశములలోని వివిధ రంగములలో నాలుగు సంవత్సరముల కాలము చెలరేగినవి. ఈ మధ్యకాలమున ఎడనెడ ప్రపంచమున వివిధ ప్రాంతములందు సముద్ర రంగమునను, ఎడనెడ యుద్ధకాలమున కొంతవరకు వాయుతలమున సైతము పోరాటములు జరిగినవి. దీర్ఘ కాల యుద్ధమువలన ఎదిరిపక్షపు జన, వస్తు బలములకు నష్టము కలిగి, పరిస్థితులు తమకు అనుకూలింపగలవని ప్రతి యొక పక్షమును ఇందు భావించినది. జర్మనీకి ఆహార వస్తువుల సరఫరా జరుగకుండ నిరోధించుటకై తమ నౌకాబలము మూలమున గ్రేట్ బ్రిటన్, ఫ్రాన్సు దిగ్బంధనము విధించగ, తమ జలాంతర్గాముల మూలమున మిత్రరాజ్యముల నౌకలను ముంచి, దిగ్బంధనము నుండి విడివడుటకు 1916-17 లో జర్మనీ తీవ్ర ప్రయత్నము చేసి అందు కొంతవరకు నెగ్గ గలిగెను; కాని, విచక్షణా రహితముగ ఈ విధానమును కొనసాగించి యునైటెడ్ స్టేట్స్‌తో పగను కొనితెచ్చుకొని ఆ రాజ్యము మిత్రరాజ్యముల పక్షమున యుద్ధములో దిగుటకు అవకాశమును కలిగించినది.

ఇటుల సాగిన ఈ దీర్ఘ యుద్ధమున తొలుతగ రంగము నుండి వైదొలగినది రష్యా. యుద్ధరంగమున సంఘటిల్లిన పరాజయములతోపాటుగ, దేశమున ఆర్థిక స్థైర్యమును సన్నగిలుటవలన, ఆ దేశమునందలి వామపక్షపు విప్లవ శక్తులకు బలముకలిగి అవి సాగించిన తిరుగుబాటు ఫలితముగ రష్యాలోని జార్ ప్రభుత్వము కూలిపోగా క్రమమున అట లెనిన్ [చూ.] నాయకత్వమున బోల్షివిక్‌లు అను అతివాదుల కమ్యూనిస్ట్ ప్రభుత్వము ఏర్పడి సోవియట్ రష్యా [చూ.] రూపుగొనినది (7 నవంబరు, 1917). ఆ విప్లవ [చూ. అక్టోబరు విప్లవము] ప్రభుత్వము జర్మనీతో బ్రెస్ట్ - లిటోవస్క్ సంధిని చేసికొని (3 మార్చి, 1918), యుద్ధమునుండి వైదొలగినది. తరువాత రుమేనియా పతనమై జర్మనీతో సంధి కుదుర్చుకొనినది (7 మే, 1918). కాని, ఆ సంవత్సరము సెప్టెంబరు నాటికి జర్మనీ, ఆస్ట్రియా దేశములను, వాని సహచరులను దుర్బలత ఆవహించు చిహ్నములు కన్పట్టసాగినవి. తొలుతగ బల్గేరియా లొంగి సంధిని ఆశించినది (30, సెప్టెంబరు). విభిన్నజాతులను అడచి వర్ధిల్లిన ఆస్ట్రియా సామ్రాజ్యము అంతట తన పటుత్వమును కోల్పోవుటచే జెకోస్లోవాకియా, యుగోస్లావియా స్వాతంత్ర్యమును ప్రకటించి, ఆ సామ్రాజ్యపు విచ్ఛిత్తికి త్రోవ చూపినవి. అంతట ఆస్ట్రియా లొంగినది (3 నవంబరు). ఆ తరువాత కొలది దినములకు జర్మనీ లొంగినది. అంతటితో 11 నవంబరు, 1918 న యుద్ధ విరమణము జరిగినది. అప్పటికి ఆ దీర్ఘ యుద్ధ ఫలితముగ ప్రపంచమున 90 లక్షలమంది యుద్ధములో మరణించిరి; అంతకు మూడింతలు వికలాంగులైరి; సామాన్య ప్రజలలో లక్షలకొలది ప్రాణములను పోగొట్టుకొనిరి; శతకోట్ల సంఖ్యలో ధనము వ్యయమైనది; యునైటెడ్ స్టేట్స్ తప్ప దాదాపుగ అన్ని దేశములును ఋణభారముచే క్రుంగిపోవు స్థితికి వచ్చినవి.

నానాజాతిసమితి: కాని, యుద్ధనిర్వహణకన్న శాంతి సాధన అత్యంత క్లిష్టతరమను విషయమును ప్రథమ ప్రపంచ యుద్ధానంతరపు సంఘటనలు రుజువు చేసినవి. మిత్రరాజ్యములును, వాని సహచరులును ఆ యుద్ధమున ప్రవేశించినపుడు, ఆ యుద్ధము ప్రజాస్వామ్య పరిరక్షణ కొరకును, ప్రపంచమునకు యుద్ధ భయమునుండి విముక్తి కల్గించుటకును సంకల్పింప బడినదని శ్రీరంగనీతులను ఎన్నియో ఉచ్చైస్స్వరమున ప్రకటించినను వారు మాత్రము నిజముగ ఆ ఆదర్శముల యెడ ఎట్టి శ్రద్ధను వహించిన వారు కారు. వారిలో ప్రతి ఒకరికి కావలసినవి స్వీయరాజ్య వైభవ ప్రతిష్ఠా విస్తృతులు. కాని, ఆ రాజ్యములు చెప్పెడు ఆదర్శములలో కొంతయైనను నిజము ఉండక పోదనియు, ఆ ఆదర్శ సాధనకు మిత్ర రాజ్యముల సాయమును కొంతవరకైనను పొంద వచ్చుననియు ఊహించి పొరపడిన వాడు అప్పటి యునైటెడ్ స్టేట్స్ అధ్యక్షుడగు వుడ్రో విల్సన్ [చూ.]. ఆ ఉన్నతాదర్శముల సాధనకై అతడు ప్రపంచ రాజ్యములు అనువర్తింపదగు నైతిక నియమావళిని 14 సూత్రములలో రూపొందించెను. శాంతి సంధికి ఈ 14 సూత్రములును ప్రాతిపదికగ వర్తింపగలవని ఆసించియే జర్మనీ సేనలు లొంగినవి. కాని, ఆ తరువాత పారిస్ సంధి [చూ.] ని రూపొందించుటకు జరిగిన వివిధ రాజ్య సమావేశమున ఈ ఆశలన్నియు వమ్మైనవి. విల్సన్ ప్రవచితమగు ఆదర్శవాదమునెడ నామమాత్రపు సానుభూతిని మాత్రము తెలిపి ఒక 'నానాజాతిసమితి' (లీగ్ ఆవ్ నేషన్స్) [చూ.] ని స్థాపించుటకు మాత్రము ఆ రాజ్యములు అంగీకరించినవి. ఇక తక్కిన విషయములలో ఆ యా రాజ్యములు స్వీయ ప్రయోజనములనే ముఖ్యముగ దృష్టిలో ఇడుకొని వ్యవహరించినవి. ఇటుల రూపొందింపబడిన శాంతి సంధి పత్రముపై పారిస్ సమీపమున వెర్సెయిల్స్‌లో విజయగర్వమున మిత్రరాజ్యములును, గత్యంతరములేక జర్మనీయును సంతకములు చేసినవి (28 జూన్, 1919). కక్ష సాధించుటకు ముఖ్యోద్దేశముగ ఇడుకొని రూపొందింపబడిన ఈ వెర్సెయిల్స్ సంధి [చూ.] యే ఒక విధముగ ద్వితీయ ప్రపంచ యుద్ధమునకు బీజమయ్యెనని అభిజ్ఞుల అభిప్రాయము.

ప్రథమ ప్రపంచ యుద్ధమునకు జర్మనీయే దోహదము చేసినదను నేరమును ఈ శాంతి సంధి ఆరోపించి అందులకు పరిహారమును జర్మనీ చెల్లించవలెనని నిర్ణయము చేసినది. అందులకై తగు వాయిదాలలో పెద్ద మొత్తములను మిత్ర రాజ్యములకు చెల్లించునటుల ఏర్పాటులు జరిగినవి. జర్మనీ భూభాగములో ఇదివరకు ఫ్రాన్స్‌నుండి 1870 లో జర్మనీ తీసికొనిన ప్రాంతము ఫ్రాన్స్‌నకును, కొంత భూమి డెన్మార్క్‌నకును ఈయబడినవి. పూర్వయుగమున పోలండ్‌గ ఉండి జర్మనీ, ఆస్ట్రియా, రష్యా దేశములకు చేజిక్కిన ప్రాంతమును మరల వేరుచేసి పోలండ్ రాజ్యముగ మిత్రరాజ్యములు రూపొందించినవి. జర్మనులు తమ నౌకాదళమును, వర్తక నౌకలును, వలసలును మిత్రరాజ్యములకు వశము చేయు ఏర్పాటు జరిగినది. 10,000 లకు మించిన సైన్యము జర్మనీకి ఉండకూడదను నియమముతో పాటుగ భారీయుద్ధ సామగ్రి ఏదియు జర్మనీకి ఉండకూడదని విధింపబడినది. కేంద్రరాజ్యములలోని తక్కిన

ప్రముఖ రాజ్యములయెడ సైతము మిత్రమండలి రాజ్యములు నిర్దాక్షిణ్యముగ వ్యవహరించినవి. ఆస్ట్రియా-హంగేరీ సామ్రాజ్యము విచ్ఛిన్నము చేయబడి ఆస్ట్రియా, హంగేరీ, జెకోస్లోవాకియా, యుగోస్లావియా అందుండి రూపొందింపబడినవి. ఆ సామ్రాజ్యమునందలి కొన్ని ప్రాంతములు ఇటలీకి, పోలండ్‌నకు, రుమేనియాకు దత్తము చేయబడినవి. బల్గేరియాలో అధిక భాగము రుమేనియా, యుగోస్లావియా, గ్రీస్ దేశములకు దక్కినది. ఓటోమన్ సామ్రాజ్యము విచ్ఛిన్నము చేయబడి అందు పాలస్తీనా, ఇరాక్ దేశములు బ్రిటిష్‌వారి అధీనమున ధర్మకర్తృత్వ (మాండేటరీ) ప్రాంతములుగ చేయబడినవి. వీనిలో పాలస్తీనాను యూదుల జాతీయావాసముగ చేయు ఏర్పాటునకును అంగీకారము ప్రచ్ఛన్నముగ అప్పుడే కుదిరినది. హెడ్జాజ్ ప్రాంతము బ్రిటిష్ పెత్తనమునకు లోబడిన రాజ్యముగ ఏర్పాటైనది; ఆల్‌బేనియా స్వతంత్రరాజ్యముగ ఏర్పాటైనది. సిరియా దేశము ఫ్రాన్స్‌నకు మాండేటరీ ప్రాంతముగ దక్కినది. టర్కీ దేశము మాత్రము కెమాల్‌పాషా [చూ.] నాయకత్వమున మిత్రమండలిని ప్రతిఘటించి తన ప్రతిపత్తిని కాపాడుకొనినది.

ఇటుల తమ ఇచ్చవచ్చినటుల యూరప్ పటమును, తక్కిన ప్రపంచపటమును మిత్రరాజ్యములు మార్పుచేసినవి. ఈ మార్పులవలన యూరప్‌లో అదనముగ కొన్ని నూతన రాజ్యములు రూపొందినవి. ఈ సమయముననే సోవియట్ రష్యా అవలంబించిన వైఖరివలనను, పశ్చిమ రాజ్యముల ప్రోత్సాహమునను రష్యాసామ్రాజ్యము నుండి కొన్ని రాజ్యములు విడివడినవి. సోవియట్ రష్యా కాక ఇటుల మొత్తముమీద 1920 నాటికి యూరప్‌న తొమ్మిది క్రొత్తరాజ్యములు: ఫిన్లాండ్, ఎస్తోనియా, లాట్వియా, లిథూనియా, పోలండ్, జెకోస్లోవాకియా, హంగేరీ, ఆల్‌బేనియా, యుగోస్లావియా రూపొందినవి. తక్కిన ప్రపంచమునను మార్పులు జరిగినను అందువలన టర్కీ, జర్మనీదేశముల వశమున ఉండిన ప్రాంతములపై ఆధిపత్యము మిత్రరాజ్యములలో కొందరికి సంక్రమించుటవలన అచట నూతన స్వతంత్ర రాజ్యములు రూపొందలేదు. ఈ నూతన వ్యవస్థతో పరిస్థితులు కుదుటబడగలవనియు, నానాజాతిసమితిని ఒక సాధనముగ గ్రహించి దానివలన ప్రపంచశాంతికి భంగము కలుగకుండ చేయగలమనియు మిత్రరాజ్యములు అపుడు ఆసించినవి. కాని, అనంతర పరిణామములు అందులకు విరుద్ధముగ సంఘటిల్లినవి.

నానాజాతిసమితికి కల అధికారములును, సామర్థ్యమును ఎట్టివైనను ఆ సంస్థ స్థాపనోద్దేశములు మాత్రము శ్లాఘనీయములు. వివిధ దేశముల ఆయుధోత్పత్తులను జాతీయ భద్రతకు భంగము కలుగని రీతిగ తగ్గించి యుద్ధోత్సాహమును తగ్గించుట; అంతర్జాతీయ విధి నిర్వహణలో శక్తివంచన లేకుండ సభ్యరాజ్యములు కృషిచేయునటుల చేయుట; బాహ్య దురాక్రమణనుండి దేశములకు రక్షణను కల్పించుట; ఏ దేశపు ప్రాదేశిక సమగ్రతకును భంగము రాకుండ చూచుట; సభ్యరాజ్యముల రాజకీయ స్వాతంత్ర్య ప్రతిపత్తిని కాపాడుట; రహస్య సంధులకు మన్ననలేకుండ చేయుట; వివిధ దేశములమధ్య కుదిరెడు ఒడంబడికల ప్రతులను సమితి సచివాలయమున భద్రపరచుట - అను ఇట్టి ముఖ్యోద్దేశములతో ఆ సంస్థ నెలకొల్పబడినది. ఏ సభ్యరాజ్యమైనను సమితి నిర్ణయమును కాదని యుద్ధచర్యకు పూనుకొనినచో అట్టి రాజ్యముపై ఆర్థికపు ఆంక్షలను విధించు అధికారము సమితికి అప్పగింపబడినది. అట్టి ఆంక్షకు గురియైన దేశముతో తక్కిన సభ్యరాజ్యములు వ్యాపారాది సంబంధములను తెగతెంపులు చేసికొనవలయును. సమితి కార్యకలాపముల సాధనకై ఒక సచివాలయము జెనీవా (స్విజర్లండ్)లో ఏర్పడినది. అంతర్జాతీయ వివాదముల పరిష్కారమునకై హేగ్ నగరము (నెదర్లండ్స్)న ఒక అంతర్జాతీయ న్యాయస్థానము 11 గురు జడ్జీలతో నెలకొల్పబడినది.

ఇటుల కొన్ని అధికారములు ఉండినను, తాను మనిన ఇరువది ఏండ్లలోను, గణనీయమైనరీతిలో సమితి వ్యవహరింపజాలక పోయినది. కొన్ని దేశముల మధ్య సరిహద్దుల విషయమై ఉదయించిన కొన్ని తగాదాలను పరిష్కరించుటలోను, మాండేటరీ ప్రాంతముల పరిపాలనను పర్యవేక్షించుటలోను, ఆరోగ్య, వైజ్ఞానిక, వార్తాప్రసార, సాంఘిక వ్యవహారములలో అంతర్జాతీయ కృషిని పెంపొందించుటలోను ఆ సంస్థ కొంత సాఫల్యమును పొందినను, ప్రపంచమును పీడించు ముఖ్య రాజకీయసమస్యల పరిష్కారమున మాత్రము అయ్యది విఫలతను పొందినది. ఇందులకు: 1. కొన్ని ప్రముఖ రాజ్యములు అందు సభ్యత్వము వహింపకుండుట; 2. అగ్రరాజ్యముల చెప్పుచేతలకు ఆ సంస్థ లోనై ఉండుట; 3. తగు అధికారబలము లేకపోవుట - అనువానిని ముఖ్యకారణములుగ పేర్కొనవచ్చును.

నానా జాతి సమితి స్థాపనలో ప్రముఖపాత్రను యునైటెడ్ స్టేట్స్ అధ్యక్షుడు విల్సన్ నిర్వహించినను, యునైటెడ్ స్టేట్స్ శాసనసభ వెర్సైయిల్స్ సంధి [చూ.] లోని తమ బాధ్యతలను ధ్రువపరుప నిరాకరించి, సమితి సభ్యత్వము నుండి వైదొలగినది. అంతటినుండి సమితితో నిమిత్తము

లేకుండ, ఆ రాజ్యము వ్యవహరించి తదాదిగ కొంత కాలమునకు యూరప్‌నందలి రాజకీయములనుండి తన దృష్టిని పసిఫిక్ ప్రాంత రాజకీయముల వైపునకు మరలించినది. పసిఫిక్ మహాసముద్రమున జపాన్ తన పలుకుబడిని విస్తరింపజేసికొనుటను అరికట్టదలచి వివిధ స్వతంత్ర రాజ్యముల సమావేశమును వాషింగ్‌టన్ నగరమున యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వము జరిపెను. ఈ వాషింగ్‌టన్ సమావేశము [చూ.] న బ్రిటన్, యునైటెడ్ స్టేట్స్, జపాన్, ఫ్రాన్స్ మొదలగునవి పాల్గొనినవి. పసిఫిక్ మహాసముద్రమున ఈ రాజ్యములకు వివిధ ద్వీపములపై కల హక్కులను ధ్రువపరచుకొనుచు ఒక ఒడంబడికను, చీనాదేశ స్వాతంత్ర్య ప్రాదేశిక సమగ్రతలను గుర్తించి, ఆ దేశమున హెచ్చు తగ్గులు లేకుండ అన్ని విదేశములకు సమానావకాశములు ఉండునటుల అంగీకరించు రెండు ఒడంబడికలును ఇట కుదుర్చుకొనబడినవి. అంతేకాక బ్రిటన్, యునైటెడ్ స్టేట్స్, జపాన్, ఫ్రాన్స్, ఇటలీ నౌకాబలములు 5; 5; 3; 1.67; 1.67 నిష్పత్తిలో క్రమముగ ఉండవలయునను ఒప్పందమును అటనే జరిగినది.

నానాజాతిసమితిలో సభ్యత్వములేని వేరొక ప్రముఖ రాజ్యము సోవియట్ రష్యా. ఈ భూభాగమున 1917 లో నెలకొల్పబడిన కమ్యూనిస్ట్ ప్రభుత్వ ప్రాముఖ్యమును పశ్చిమరాజ్యములు తొలుత గుర్తింపలేక పోయినవి. లెనిన్ ఆధ్వర్యవమున అట నెలకొల్పబడిన ప్రభుత్వము ఒక విప్లవాత్మకమగు ఆదర్శమును ముందిడుకొని నడవనున్నదని కాని, ఆ విప్లవమునకు ప్రపంచచరిత్రలో ప్రముఖస్థానము లభింపనున్నదని కాని పాశ్చాత్యరాజ్యనేతలు గ్రహింపలేకపోయిరి. విప్లవ వ్యతిరేకులగు కొందరు రష్యన్‌లకు తోడుపడుటలో మొదట పాశ్చాత్యరాజ్యములు కొంత శ్రద్ధవహించి, సైన్యములను పంపినను, కడకు విప్లవసైన్యములు అన్ని విధములగు ప్రతిఘటనలను నిర్మూలించుటను గమనించిన తరువాత తమ జోక్యమును వదలుకొని, ఆ విప్లవము నెడ నిర్లక్ష్యభావమును వహించినవి. అందువలననే ప్రపంచ సంస్థయగు నానాజాతిసమితియందు దానికి స్థానము లేకుండ చేయుటయేకాక, దానిని గుర్తించుటకును పాశ్చాత్యరాజ్యములు నిరాకరించినవి. కాని, ఈ రాజ్యముల పరిగణనతో నిమిత్తములేకుండ కనివిని ఎరుగని రీతిలో సోవియట్ రష్యాలో రాజకీయ, ఆర్థిక, సాంఘిక రంగములందు సంస్కరణలు రూపొందినవి. ఈ దేశపు పేరే 'యూనియన్ ఆవ్ సోవియట్ సోషలిస్ట్ రిపబ్లిక్స్' (సోవియట్ సోషలిస్ట్ గణరాజ్య సమితి) గ మార్పు జరిగినది (ఇదియే సౌకర్యమునకై 'సోవియట్ రష్యా' అని వ్యవహరింపబడుచున్నది). దేశమునందలి భూమియు, సంపదయు, సంఘ (ప్రభుత్వ) పరము చేయబడినవి. ఉన్నత వర్గములకు కల ప్రత్యేకాధికారములు రద్దొనర్పబడి, సిద్ధాంతరీత్యా సర్వసమానత్వము నెలకొల్పబడినది. విద్యా, విజ్ఞానముల వ్యాప్తికి నిరంతర కృషి మొదలైనది. తరతరముల అజ్ఞాన దారిద్ర్యముల నుండి విడివడి ముందునకు పురోగమించి నాగరక సంపన్న రాజ్యములతో సమానస్థాయిని ఆర్జించు కుతూహలముతో, అనుల్లంఘనీయములని ఇతరులు భావించు కొన్ని మానవ స్వత్వములనైనను కుంచింపజేసి, పురోగతియే తమ లక్ష్యముగ ఆ దేశము ముందునకు పోనుత్సహించినది. అట్టి దేశమును కలకాలము గుర్తింపకుండుట అశక్యము. కడకు తొట్టతొలుతగ ఆ రాజ్యముతో సాన్నిహిత్యము ఏర్పరచుకొనినది జర్మనీ (1922).

## యుద్ధానంతర పరిస్థితులు

శాంతి సంధి వలన యుద్ధనేరపు బాధ్యత జర్మనీపై మోపబడుటచే ఆ దేశమునకు తొలుత నానాజాతిసమితిలో సభ్యత్వము ఈయబడలేదు. పరిహారముల చెల్లింపువలని భారము, నానాజాతిసమితినుండి వెలియగుట మొదలగునవి జర్మనీకి విపరీతముగ బాధాజనకములైనవి. దీనికి తోడుగ పరిహారములను సరిగా చెల్లించుటలేదను నెపముపై ఫ్రాన్స్‌దేశము జర్మనీలోని రూర్ పరగణాపై దండెత్తి దానిని వశపరచుకొనినది (1923). ఇదియేకాక దేశమును ఆక్రమించుకొని అటనట ఉన్న మిత్రరాజ్యముల సైన్యముల ఉనికి జాతీయాభిమానము కల జర్మనులకు అవమానజనకముగ ఉండెడిది. ఈ పరిస్థితులలో క్రమముగ దేశము ఆర్థికముగ క్షీణస్థితికి వచ్చినది. అట్టియెడ పాశ్చాత్య రాజ్యములయెడ కలిగిన ద్వేషమే సోవియట్ రష్యాతో - పైన పేర్కొనిన రీతిగ - ఆ దేశము సాన్నిహిత్యమును ఏర్పరచుకొను నటుల చేసినది. 1922 లో జరిగిన రపల్లో ఒడంబడికలు [చూ.] ఫలితముగ జర్మనీ - సోవియట్ రష్యా మధ్య కుదిరిన ఈ మైత్రి పలువిధముల చారిత్రక ప్రాముఖ్యము కలది. యుద్ధచతురులగు జర్మనీ సేనానులు నూతన వ్యూహముల, సాధనములను గురించిన తమ ప్రయోగములకు తమదేశమున పశ్చిమదేశముల అభ్యంతరము వలన తావులేక పోవుటచే సోవియట్ రష్యా దేశమునే రంగముగ వాడుకొనిరి. ఈ అవకాశమును సోవియట్ రష్యా సేనానులు చక్కగ ఉపయోగించుకొని, యుద్ధతంత్రమున నూతన విషయముల గ్రహించిరి. తరు

వాత 1936 లో సోవియట్ రష్యా ప్రభుత్వము తన సేనను సంస్కరించి జర్మనీ ప్రభావమునకు లోనైన వ్యక్తులను నిర్మూలించినను, జర్మనుల యుద్ధతంత్రమును గురించిన సమగ్ర పరిచితి మాత్రము సోవియట్ సైన్యమునకు బాగుగ ఉపకరించినది.

జర్మనీకి ఆర్థికముగ కలిగిన దురవస్థవలన జర్మనీయే కాక యూరప్‌నకును నష్టము వాటిల్లుటను గమనించి నంతట పాశ్చాత్యరాజ్యములు కళ్లు తెరచి పరిహారముల సమస్యను గురించి పునరాలోచన సల్పినవి. అంతట వాయిదాల పద్ధతిలో కొన్ని మార్పులను చేయుటయేకాక, ఆర్థికముగ కాలునిలువ త్రొక్కుకొనుటకై జర్మనీకి యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వము ఒక ప్రణాళిక క్రింద 50 కోట్లడాలర్లు* అప్పు ఇచ్చినది. ఇదియే 'డాయిస్ ప్రణాళిక' అని వ్యవహృతము (1924). అంతటినుండి జర్మనీ యెడల కొంత సుముఖభావము యూరప్‌న కలుగ ఆరంభించినది. ఆ తరువాత 1926 లో జర్మనీదేశమునకు నానాజాతి సమితిలో సభ్యత్వము కల్పింపబడినది. ఇంతకు కొంత కాలము ముందుగనే సోవియట్ రష్యా ప్రభుత్వమును గ్రేట్ బ్రిటన్ గుర్తించినది (1924). అంతట క్రమముగ వేర్వేరు యూరపియన్ రాజ్యములును, 1925 లో జపాన్ దేశమును, 1933 లో యునైటెడ్‌స్టేట్స్‌ను సోవియట్ రష్యాకు పరిగణను ఒసగినవి. కడకు 1934 లో నానాజాతి సమితిలో సోవియట్ రష్యా చేరినది. సోవియట్ రష్యాకు ఇట్టి పరిగణన కలుగుటకు ఆ దేశమున క్రమశః వచ్చిన మార్పులును కొంతవరకు కారణములైనవి. 1924 లో లెనిన్ మరణించిన తరువాత నాయకత్వపు పోరాటమున పైకి రాగలిగిన స్టాలిన్ [చూ.] విదేశములలో కమ్యూనిస్ట్ ఉద్యమముల ప్రోత్సహించుటకు పూర్వపు రీతిగ శ్రద్ధ వహింపక, సోవియట్ రష్యాలో విప్లవమునకు సార్థకత కల్గించుటకు మాత్రమే కృత నిశ్చయత వహించుటవలన విదేశ ప్రభుత్వములకు సోవియట్ భూమియెడ కొంత సామరస్యము కలుగుటకు అవకాశము ఏర్పడినది.

ఇటుల జర్మనీ, సోవియట్ రష్యా చేరుటవలన సమితికి అదనముగ బలము చేకూరవలసి ఉండెను. కాని, కొన్ని చారిత్రక సంఘటనలవలన సమితి పతనమునకు అప్పటికే ఒక విధముగ అంకురార్పణ జరిగినది. అగ్రరాజ్యములగు గ్రేట్ బ్రిటన్, ఫ్రాన్స్ తొలుతటి నుండియు సమితిని తమ చేతి కీలుబొమ్మగ ఉంచుకొనుటకు సంకల్పించినవే కాని, సమితి ఉద్దేశములకు ఆచరణ రూపమును కల్పించుటకు కృషి చేయలేదు. యుద్ధకాలమున తాత్కాలిక ప్రయోజనములకొరకై చేసికొనిన రహస్య ఒడంబడికలను, వాగ్దానములను మన్నించుటలో తాము చూపిన చొరవను సమితి ఉద్దేశ సాఫల్యముకొరకై వారు ప్రదర్శింపక మిన్నకుండిరి. ఈ రహస్య ఒడంబడికల ఫలితముగనే పూర్వపు ఓటోమన్ సామ్రాజ్యమున వివిధ ప్రాంతములలో మారు వేషములతో బ్రిటిష్, ఫ్రెంచి, ఇటాలియన్ సామ్రాజ్య వాదములు చొరవ కల్పించుకొనినవి. ఇట్టి ఒడంబడికల మూలముగనే తుర్కీ జాతికి చెందిన ప్రాంతములను గ్రీకులు ఆక్రమించుటకు బ్రిటిష్, ఫ్రెంచి ప్రభుత్వములు ఆమోదము తెలిపినవి. అంతట ఈ బలవత్తర రాజ్యముల ప్రోత్సాహముతో గ్రీక్ సైన్యములు స్మిర్నా పై దండెత్తి (14 మే, 1919) వశపరచుకొని, అటనుండి టర్కీ దేశపు అంతర్భాగమును సైతము ఆక్రమించుకొనుటకు పూనుకొనినవి. అంతట టర్కీ జాతీయులు తమ జాతీయ నాయకుడగు ముస్తఫా కెమాల్ నాయకత్వమున సమీకృతులై సోవియట్ రష్యా సమకూర్చిన ఆయుధముల సాయమున అప్పటికి అంగోరా (అంకారా) నగరమువరకు త్రోసికొని వచ్చిన గ్రీక్ సైన్యములను ఓడించి సముద్రములోనికి తరిమిరి (ఆగస్టు, సెప్టెంబరు, 1922). ఆ తరువాత కుదిరిన లాసేన్ ఒడంబడిక వలన (24 జూలై, 1923) టర్కీ దేశమునకు న్యాయము చేకూరినది. కాని, తమ సామ్రాజ్యముల ఉనికి కొరకై ఇట్టి అవకతవక పనులను అగ్రరాజ్యములే చేయుటవలన సమితికి వారివలన సహకారము కన్న అపకారమే ఎక్కువగ చేకూరినది. ఇంతేకాక, బ్రిటన్, ఫ్రాన్స్ తమకు కొన్ని సౌకర్యములను చేకూర్చి, కొన్ని భూ ప్రదేశములను తమకు కలిపినను, ఇటలీ మొదలగు రాజ్యములు సంతృప్తిపడినవి కావు. మిత్రరాజ్యముల పక్షమున పోరాడి నష్టపడినందులకు తగినంతగ పరిహారము తమకు చెందలేదని ఇటలీ ప్రజలు భావించినందువలన, అచట క్రమముగ అగ్రరాజ్యముల యెడ విరోధభావముతో పాటుగ నైరాశ్యమును వృద్ధియైనవి.

**ఇటలీ :** పైన వివరించిన పరిస్థితులను అవకాశముగ గ్రహించి, ఫాసిస్ట్ పార్టీ నిర్మాత ముస్సోలినీ [చూ] ఇటలీలో అధికారమునకు రాగలిగెను (1922). 'ఫాసిజమ్' అను నూతన వాదము ఇటు ప్రజాస్వామ్యమునకును, అటు కమ్యూనిస్ట్ వాదమునకును వ్యతిరేకమైనది. నియంతృత్వము దాని ఆలంబనము; జాతీయ దురభిమానము దాని ప్రాతిపదిక. నిరుద్యోగముతోడను, ఆర్థిక కల్లోలముతోడను, సతమతమగు ప్రజానీకమున అతిమాత్రపు దేశభక్తిని, సామ్రాజ్యార్జనాసక్తిని రేకెత్తించి ముస్సోలినీ తన పదవికిని, తన పార్టీకిని సుస్థిరతను కల్పించెను. నిరంకుశపు

* డాలరు = సుమారు రూ. 4-75.

పాలనను చేపట్టి, అతిత్వరితగతిలో అతడు దేశమున నిరుద్యోగమును పోగొట్టి, విద్యావ్యాపనము మొదలగు వానియందు దేశము పురోగమించునటుల చేసి, ప్రజలు తమ సహజ స్వత్వములను కొన్నిటిని మనసార వదలుకొన ఇష్టపడునటుల చేసెను. అతడు అంతట సైనిక బలమును, నౌకాదళమును సువ్యవస్థితములుగను, దృఢతరములుగను చేసి, సామ్రాజ్యార్జనకై యత్నములు చేయసాగెను (1930).

**జపాన్ :** ఇటలీవలెనే యుద్ధానంతరమున తనకేమియు దక్కలేదని వ్యథచెందిన వేరొక రాజ్యము జపాన్. ప్రపంచ యుద్ధమున మిత్రరాజ్యముల పక్షమున చేరుటలో దాని ముఖ్యోద్దేశము ప్రాచ్య ఆసియాయందు ప్రముఖ స్థానమును ఆక్రమించుట. అందువలన యుద్ధకాలముననే చీనాపై ఒత్తిడి జరిపి, కొన్ని సౌకర్యములను ఆ దేశము ఆర్జించినది. యుద్ధానంతరమున శాంతిసంధిమూలమున పసిఫిక్ మహాసముద్రమున భూమధ్యరేఖకు ఉత్తరమున అదివరకు జర్మనీపాలనమున ఉండిన దీవులపై మాండేట్ అధికారము జపాన్‌కు లభించినది (1920). కాని, నానాట బలపడుచుండిన సైనిక, నౌకాదళనాయకుల పలుకుబడి ఆ రాజ్యమున క్రమముగ ఎక్కువగుటవలన సామ్రాజ్య కాంక్ష పెచ్చుపెరిగినది. కడకు చీనాయెడల విస్తరణ విధానమును 1931 మొదలుగ జపాన్ అవలంబించినది. 1932 లో మంచూరియాను జపాన్ ఆక్రమించి అచట ఒక 'స్వతంత్ర' ప్రభుత్వమును నెలకొల్పుటతో ఈ విస్తరణ విధానమునకు కార్యరూపము తొలుతగ ఘటిల్లినది. జపాన్ దురాగతమును నిరసించుచు నానాజాతిసమితికి చీనా ఫిర్యాదు చేయగ ఆ సమితి ఒక కమీషన్‌ను నియమించినది. ఆ కమీషన్ నివేదికను అనుసరించి మంచూరియాలోని క్రొత్త ప్రభుత్వమును గుర్తింప సమితి నిరాకరించినది. అంతట సమితి నుండి జపాన్ వైదొలగినది. అందులకు ప్రతిగ తగుచర్య తీసికొనక సమితి కిమ్మనక ఊరుకొనినది. సమితి ఇటుల దుర్బలత చెందుటకు ముఖ్యకారణము అగ్రరాజ్యముల స్వార్థపరత. విశాల సామ్రాజ్యములను కలిగి ఉండిన ఆ దేశములకు, జపాన్‌కు కలిగిన సామ్రాజ్యార్జనా సక్తిని దూయబట్టుటకు తగిన నైతికబలము లేకపోయినది. ఇందులకు తోడుగ 1929 అంతమున మొదలై ప్రపంచమును కల్లోలితముచేసిన ఆర్థిక సంక్షోభము నుండి ఆ దేశములును, యునైటెడ్ స్టేట్స్‌ను ఆ సమయముననే వెలువడుచుండినవి. అట్టి క్లిష్ట సమయమున యుద్ధమును కొనితెచ్చుకొనుటకు ఆ రాజ్యములలో ఏదియు ఉత్సహించినది కాదు.

**జర్మనీ :** పారిశ్రామిక విప్లవము మొదలుగ ప్రపంచము ఎడనెడ ఆర్థికసంక్షోభములకు గురియగుచుండిన మాట నిజమే అయినను, 1929 లో పొడమిన ఆర్థిక సంక్షోభమునకు మాత్రము చరిత్రయందు ఎనలేని ప్రాముఖ్యము లభించినది. ఈ సంక్షోభమునుండి విడివడుటకై ఆ యా దేశములు అనుసరించిన తీవ్ర విధానములే ఆ తరువాత ఆ యా దేశముల చరిత్రను, ప్రపంచ చరిత్రను క్రొత్త మార్గముల నడపినవి. యునైటెడ్ స్టేట్స్, గ్రేట్ బ్రిటన్, ఫ్రాన్స్ మొదలగు ప్రజాస్వామ్య దేశములలో పరిశ్రమలపై ప్రభుత్వము జోక్యము వహించి శ్రేయోరాజ్యమునకు పునాదులు కల్పింపవలయునను ఉదార భావనకును, ప్రజాస్వామ్యరీతిలో సోషలిజమ్‌ను నెలకొల్పవలయునను పక్షములు బలపడుటకును ఈ సంక్షోభము తోడుపడెను. ఇటలీ, సోవియట్ రష్యావంటి నియంతృత్వ దేశములలో ప్రజలపైనను, సంపదపైనను ప్రభుత్వమునకు అదివరకే ఉండిన నిరంకుశాధికారము ఇంకను బలపడుటకు అది తోడ్పడెను. అందుమూలముననే ప్రజాస్వామ్యము బాగుగ కుదురుకొనని దక్షిణ అమెరికా రాజ్యములలో నియంతృత్వపాలనలు నెలకొల్పబడినవి. కాని, వీని అన్నింటిని మించిన సంఘటన ఒకటి ఈ ఆర్థిక సంక్షోభపు ఫలితముగ జర్మనీలో జరిగినది. అదియే హిట్లర్ [చూ.] ఆధ్వర్యవమున నాజీలు జర్మనీలో అధికారమును స్వీకరించుట.

**నాజీ వాదము :** 'నేషనల్ సోషలిజమ్' (జాతీయ సామాజిక వాదము) అను దాని సంక్షిప్త రూపము 'నాజీ'. ఇది ఫాసిజమ్‌ను అన్ని విధములను పోలినది. ఈ వాదము జర్మనులందు జాతీయదురభిమానమును రేకెత్తించినది. జర్మనుల దురవస్థకు యూదులును, వెర్సెయిల్స్ సంధియు కారణములనియు, జర్మనుజాతి తన ఇంటిని చక్కదిద్దుకొని ప్రపంచమున అగ్రరాజ్యముగ రూపొందవలసిన చారిత్రక బాధ్యత దానికి కలదనియు, మానవ జాతులలో అత్యుత్తమ నార్డిక్ (స్వచ్ఛార్య) వర్గమునకు చెందిన జర్మనులకు చరిత్రయే ఈ హక్కును కల్పించినదనియు స్వజాత్యుత్కృష్టతాభావము [చూ. సం. 10 - పు. 809] తో పార్టీ నాయకుడగు హిట్లర్‌ను, అతని అనుచరులును సాగించిన ప్రచారము 1929 మొదలుగ యువకులనే కాక పారిశ్రామికులను, సైనిక వర్గమును కూడ ఆకర్షించినది. ఆర్థిక సంక్షోభము వలన కలిగిన నిరుద్యోగము ఇందులకు తోడ్పడినది. కడకు అప్పటి జర్మనీ అధ్యక్షుడు నాజీలను అభిమానించి హిట్లర్‌ను ఛాన్సెలర్‌గ నియమించెను (1933). తరువాత అనతికాలముననే హిట్లర్ సర్వాధికారములను

గ్రహించి, తక్కిన పార్టీలను నిర్మూలించి, జర్మనీ ఆర్థిక, రాజకీయ, సాంఘిక రంగములందు అన్నింట నాజీలకు అధికారమును సంక్రమింపజేసెను. అంతటినుండి ఆ పార్టీ తన ఉద్దేశములకు కార్యరూపమును కల్పించుటకు కృషిచేసినది. 1933 లో నానాజాతిసమితినుండి జర్మనీ వైదొలగినది; యుద్ధావసరములకై దేశమున ఉత్పత్తిని పెంచుటకై జరిగిన కృషిమూలమున నిరుద్యోగము మటుమాయమైనది. వెర్సెయిల్స్ సంధి ఏర్పాటులను కాదని సైనిక, నౌకా, వైమానిక దళముల నిర్మాణమును కొనసాగినది. జర్మనీ బలమును ఆర్జించినకొలది ఆ దేశపు ప్రతిష్ఠయు పెరిగినది. యుద్ధానంతరమున జర్మనీనుండి వేరుపరుపబడిన సార్ మండలము జర్మనీకి తిరిగి అప్పగింపబడినది (1935). అట్టిదే అగు రైన్‌లాండ్‌ను జర్మనులు సైనిక బలముతో ఆక్రమించి, అట సైనిక స్థావరములను నెలకొల్పిరి (1936). ఈ పరిస్థితులలో జపాన్, జర్మనీ సిద్ధాంతరీత్యా సామరస్యమును సాధించినవి (నవంబరు, 1936). అంతటినుండి ఇవి అక్ష (యాక్సిస్) రాజ్యములని వ్యవహరింపబడుట పరిపాటి అయినది. అనతికాలమున ఇటలీయు అందు చేరినది. ఈ మూడు రాజ్యములును ఇటుల మైత్రిని సాధించుటకు ముఖ్యకారణము వారి అందరియందును కననగు సామ్రాజ్యార్జనాసక్తి. యూరప్‌న హిట్లర్ తన ఉద్ధతిని సాగించుటకు మొదలిడిన కాలముననే ఇటలీ నియంతయగు ముస్సోలినీ ఆఫ్రికాయందలి ఎతియోపియాపైకి సేనలను నడపెను (3 అక్టోబరు, 1935). అంతట సమితి సమావేశమై ఇటలీని దురాక్రమణకు పూనుకొనిన దేశముగ ప్రకటించి, ఆంక్షల విధించినను లెక్కచేయక ఎతియోపియాను అంతటిని 1936 నకు ఇటలీ ఆక్రమించినది. పెట్రోల్ సరఫరాపై విధింపబడిన ఆంక్షను సక్రమముగ అమలు జరుపుటకు అగ్రరాజ్యములు సహకరింపకపోవుట వలననే ఇటలీ ఆ సమయమున ఆంక్షలను ఎదుర్కొని నిలువగలిగినది.

**చీనా :** ఈ సమయముననే జపాన్ తన సామ్రాజ్య విస్తరణ ప్రణాళికను క్రమముగ ఆచరణలోనికి తెచ్చుటకు పూనుకొనినది. ఏదియో ఒక అల్పసంఘటనను ఒక నెపముగ గ్రహించి ఆ దేశము 1936 జూలై మొదలుగ చీనాపై అప్రకటిత యుద్ధమును కొనసాగించినది. 1937 అంతమునకు నాటి చీనారాజధాని నాన్‌కింగ్ జపాన్‌కు వశమైనది. ఈ సమయమున చీనాలో ప్రజాప్రభుత్వ పాలకుడుగ ఉండిన చియాంగ్ - కై - షేక్ వెలుపలి జపానీయుల దండయాత్రతో పాటుగ దేశమున కమ్యూనిస్టుల తిరుగుబాటులను ఎదుర్కొనవలసివచ్చినది. ఈ కమ్యూనిస్టులు తొలుత చియాంగ్ - కై - షేక్ నాయకత్వమున ఉండిన కోమింగ్‌టాంగ్‌పార్టీతో సహకరించి జాతీయ పునరుజ్జీవనమునకై కృషిచేసిరి. క్రమముగ ఆర్థిక సంస్కరణల విషయమున చియాంగ్ - కై - షేక్ అవలంబించిన మితవాదవైఖరి వారికి నచ్చనందున వారు విడివడిరి (1927). తదాదిగ అంతర్యుద్ధము చెలరేగినది. మావ్ సే టుంగ్, చూతే అనువారల నాయకత్వమున కమ్యూనిస్టులు తొలుత కియాంగ్సీ, ఫూకీన్ రాష్ట్రములలో పాలనను నెలకొల్పినను, ప్రభుత్వపు బలముల ఒత్తిడికి ఆగజాలక అటనుండి బయలుదేరి 8 వేల కిలోమీటర్లు తమ యావత్ సైనిక అనుచరవర్గముతో కష్టనష్టములకు ఓర్చి ప్రయాణముచేసి చీనాలో వాయవ్యమూలన దూరప్రాంతమున షెన్సీ రాష్ట్రమును చేరుకొని, అట తమ పాలనను నెలకొల్పిరి. ప్రపంచ చరిత్రలో పేరెన్నిక కనిన సాహస కృత్యములలో ఒకటిగ లెక్కింపదగినది ఈ ప్రస్థానయాత్ర. షెన్సీ రాష్ట్రమున వారు దిటవుగ స్థావరమును కల్పించుకొని, భూసంస్కరణలను అమలులోనికి తెచ్చి, అచటి రైతుజనులను కమ్యూనిస్ట్ అభిమానులుగ మార్చి, ప్రభుత్వముతో తమ అంతర్యుద్ధమును కొనసాగించిరి. 1936 లో జపాన్ చీనాపై దండయాత్ర సాగించిన తరువాత చియాంగ్-కై-షేక్ నాయకత్వమున పోరాడు కొమింగ్ టాంగ్ సేనలతో కలసి జపాన్‌ను ప్రతిఘటించుటకు కమ్యూనిస్టులు ఉత్సహించినను చియాంగ్ - కై - షేక్ తొలుత అందులకు అంగీకరింపలేదు.

అగ్రరాజ్యముల సామ్రాజ్యవాదమును అనుకరించిన ఈ అక్షరాజ్యముల చర్యలవలన ప్రపంచమున వివిధ భాగములందు శాంతికి భంగము ఏర్పడిన ఈ సమయమున ఆ అగ్రరాజ్యముల సామ్రాజ్యములందును వివిధ స్వాతంత్రోద్యమములు తలలెత్తి ఆ రాజ్యములను ఆందోళన పరచినవి. ఇంగ్లీషు, ఫ్రెంచి భాషలు ఆ యా జాతుల సామ్రాజ్యములందు విరివిగ ప్రచారితములు అగుటవలన అందుతోపాటుగ ఆ సారస్వతములందలి ప్రజాస్వామ్యవాద భావములకును ఆ యా సామ్రాజ్యములందు వ్యాప్తి లభించినది; తత్కారణమున వివిధ ప్రాంతములందు స్వాతంత్ర్యోద్యమములు చెలరేగినవి. ముఖ్యముగ భారత దేశమునను, అరబ్బీదేశములందును సాగిన అట్టి ఉద్యమములు తక్కిన అస్వతంత్ర దేశములకు మార్గదర్శకములు అయినవి.

**ఇండియా :** ప్రథమ ప్రపంచ యుద్ధకాలమున భారత దేశ ప్రజానాయకులలో పలువురు అనుసరించిన సహకార వైఖరికి ప్రతిఫలముగ పరిమితాధికారములు కల ప్రజా

పరిపాలనను రాష్ట్రములందు నెలకొల్పుటకు బ్రిటిష్ ప్రభుత్వము ప్రజాందోళనపై అంగీకరించినను, స్వాతంత్ర్యోద్యమములను, వాక్స్వాతంత్ర్యమును నిర్మూలించుటకు అమలులోనికి తెచ్చిన కొన్ని చట్టముల వలనను, చర్యల వలనను ప్రజలలో అసంతృప్తి చెలరేగినది. అంతట భారత జాతీయ కాంగ్రెస్ గాంధీజీ [చూ.] నాయకత్వమున సహాయ నిరాకరణోద్యమము [చూ.]ను కొనసాగించినది. ముస్లిమ్‌లీగ్‌ను ఆ సమయమున గాంధీజీకి అండగ ఉండినది (1920 - 22). కాని, శాంతియుత పద్ధతిలో జరుగవలసిన ఆ పోరాటము దురదృష్టవశమున దౌర్జన్య చర్యలకు త్రోవతీయుటవలన గాంధీజీ ఆ ఉద్యమమును ఆపివేసెను. అయినను సహాయ నిరాకరణోద్యమ ఫలితముగ వేలకొలది ప్రజాసేవకులు కారాగార బద్ధులగుటయు, కొందరు మరణించుటయు జరిగి, దేశమున స్వతంత్రభావనకు విరివిగ వ్యాప్తి చేకూరినది. కడకు కాంగ్రెస్ మహాసభ 1930 లో సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానమును ఆమోదించినది. దానిని గుర్తించుటకు బ్రిటిష్‌ప్రభుత్వము నిరాకరింపగ గాంధీజీ నాయకత్వమున శాసనోల్లంఘనోద్యమము [చూ.] కొనసాగింపబడినది. కడకు కాంగ్రెస్‌తో బ్రిటిష్ ప్రభుత్వము సామరస్యమునకు వచ్చి భారత రాజకీయ సమస్యా పరిష్కారమునకై లండనులో జరుగు రౌండ్ టేబిల్ సభ [చూ.] లో ఆ పక్షము తరపున గాంధీజీ పాల్గొనునటుల చేయగలిగినది. కాని, అది అంతగ ఫలప్రదము కాలేదు. అంతట బ్రిటిష్ ప్రభుత్వము సమాఖ్యారూపకముగు రాజ్యాంగమును ఆమోదించి (1935), భారతదేశముపై విధింపగ తత్ఫలితముగ జరిగిన ఎన్నికలలో భారత రాజకీయ పక్షములన్నియు పాల్గొనినవి. అందు జాతీయ కాంగ్రెస్ అత్యధిక రాష్ట్రములలో బలవత్తమ పక్షముగ పైకివచ్చి దీర్ఘసమాలోచనల అనంతరమున తనకు ప్రాబల్యము చేకూరిన రాష్ట్రములందు అధికారమును స్వీకరించినది (1937). కాని, ఆ రాజ్యాంగ చట్టమును అనుసరించి ఏర్పడనగు కేంద్ర ప్రభుత్వరూపమునకు మాత్రము ఆమోదింప నిరాకరించినది. ఈ సమయముననే భారత ముస్లిమ్‌లందు జాతీయ వ్యతిరేక శక్తులకు ప్రాబల్యము క్రమ క్రమముగ చేకూరుట ఆరంభమై, ముస్లిమ్ ప్రాబల్యము కల భారత ప్రాంతములు వేరు రాజ్యముగ రూపొందవలయునను ఆశయమును రూపొంద మొదలిడినది.

**అరబ్బీ దేశములు :** అరబ్బీ దేశములందు స్వాతంత్రోద్యమమున ఎక్కువ ముందునకు వచ్చినది ఈజిప్టు. ప్రథమ ప్రపంచ యుద్ధమునకు పూర్వమున తమ అధీనములో ఉండిన పాలకుని మూలమున అధికారమును నిర్వహించుచుండిన బ్రిటిష్ ప్రభుత్వము ఆ యుద్ధకాలమున పాలకునినే పదభ్రష్టుని చేసి సర్వాధికారములను తానే స్వీకరించినది. 1917 లో రాజరికము పునరుద్ధరింపబడినను, యుద్ధానంతరమున ఆ దేశమున స్వాతంత్ర్యమునకై సాద్ జగ్‌లుల్ పాషా మొదలగు వారి నాయకత్వమున ప్రజలు ఆందోళన సలిపిరి. తత్ఫలితముగ కొన్ని సంస్కరణలు జరిగినను, ప్రజలకు అవి సంతృప్తిని కలిగించినవి కావు. తుదకు 1922 లో ఈజిప్టును స్వతంత్రదేశముగ బ్రిటన్ గుర్తించినను బ్రిటిష్ వారి ప్రయోజనముల రక్షణ నిమిత్తమై మినహాయింపులు విపరీతముగ అందు చేర్చబడుటవలన ఆ స్వాతంత్ర్యము నామమాత్రమే అయినది. చిట్టచివరకు 1936 లో ఈజిప్టునకు చాలవరకు సంతృప్తిని కలిగించు ఒడంబడిక ఈజిప్టు - గ్రేట్‌బ్రిటన్ మధ్య కుదిరినది. సూయెజ్ కాలువ ప్రాంతమున కొద్ది సేనను నిలుపుకొనుటకును, 8 ఏండ్లకాలము ఆలిగ్జాండ్రియా నౌకాశ్రయమును వాడుకొనుటకును, యుద్ధకాలమున మాత్రము ఎక్కువ సైన్యములను దేశమున నిలుపుటకును గ్రేట్ బ్రిటన్‌కు అందు వసతి కల్పింపబడినది. ఆ సమయముననే ఈజిప్టునకు నానా జాతి సమితి యందు సభ్యత్వము కల్పింపబడినది.

ఫ్రాన్స్ ఆధిపత్యమున మాండేటరీ ప్రాంతముగ ఉండిన సిరియా యందును రాజకీయాందోళనలు ఆ కాలమున చెలరేగెను. సిరియాను విభజించి ఈ ఉద్యమముల బలమును అడచుటకు ఫ్రాన్స్ తొలుత యత్నించినది. అందువలన 'లెబనాన్' అను ప్రాంతమును మాత్రమే వేరు రాజ్యముగ ఫ్రాన్స్ నిర్మింప గలిగినది (1920). తక్కిన అన్ని ప్రాంతములును సమైక్యముగ నిలువగలుగుట వలన తుదకు సామరస్యపు మార్గమును ఫ్రాన్స్ అవలంబించి, సిరియాలోని జాతీయప్రభుత్వముతో ఒక ఏర్పాటునకు రాగలిగినది. తన్మూలమున ఆ తరువాత మూడేండ్లకు సిరియా సంపూర్ణ స్వాతంత్ర్యము పొంది, నానా జాతి సమితిలో సభ్యత్వము పొందుటకు ఉభయ రాజ్యములును అంగీకరించినవి (1936).

ఇరాక్‌న మాత్రము బ్రిటిష్ ప్రభుత్వము కొంత చతురతతో వర్తించినది. తనకు మాండేట్‌గ దక్కిన ఆ ప్రాంతమున ప్రజలను సంతృప్తిపరచుటకై అట ఒక కొత్త అరబ్బీ రాజరికమును ఆ దేశము నెలకొల్పి (1921) ఆ ప్రభుత్వముతో మిత్రత్వ సంధిని కుదుర్చుకొనినది. తరువాత మూడు ఏండ్లకు ఆ దేశమున తనకు కొన్ని విమాన స్థావరములు మిగిలియుండు ఏర్పాటుతో ఇరాక్ స్వాతంత్ర్యమును గ్రేట్ బ్రిటన్ గుర్తించినది. 1932 లో ఇరాక్‌నకు నానా జాతి సమితిలో సభ్యత్వము చేకూరినది.

ఇటుల తమ సామ్రాజ్యములందలి స్వాతంత్ర్యోద్యమములతో తలమునకలగుచున్న ఈ అగ్రరాజ్యములకు 1937 లగాయతు అక్షరాజ్యముల చర్యలు యుద్ధ భయమును ఆవహింప జేసినవి. 1938 లో హిట్లర్ ఆస్ట్రియాను వశపరచుకొనెను. జెకోస్లోవాకియాలోని సుడెటన్ ప్రాంతము జర్మనీకి చేరవలసిన ప్రాంతమని హిట్లర్ అంతట తగవును లేవదీసెను. గ్రేట్ బ్రిటన్, ఫ్రాన్స్ తొలుత ఇందులకు ప్రతిఘటించినను కడకు 1938 లో కుదిరిన మ్యూనిక్ ఒడంబడిక [చూ.] ను అనుసరించి సుడెటన్ ప్రాంతమును జర్మనీ ఆక్రమించుకొనుటకు ఆ దేశములు అంగీకరించి, అంతటితో హిట్లర్‌నకు యూరప్‌నందలి రాజ్య విస్తృతికాంక్ష అంతము కాగలదని ఆసించినవి. కాని, వాని ఆశలు వమ్మైనవి. 1939 మార్చిలో కడమ జెకోస్లోవాకియాను కూడ హిట్లర్ ఆక్రమించెను. దరిదాపుగ ఆ కాలముననే బాల్కన్‌లలోని ఆల్‌బేనియాను ఇటలీ వశపరచుకొనినది. ప్రాచ్య ఆసియాయందు తూర్పు చీనా అంతయు జపాన్ సేనలకు వశమైనది. చీనా ప్రభుత్వము తన కేంద్రమును దేశాంతర్భాగమున చుంకింగ్ నగరమునకు మార్చి నిస్సహాయస్థితిలో పోరాటమును కొనసాగించుచు ఉండినది.

అక్షరాజ్యములు ఇటుల క్రమక్రమముగ బలపడుటకు కారణము అగ్రరాజ్యముల నిర్లక్ష్యమే కాదు; అందులకు మరొక కారణము కూడ కలదు. అక్షరాజ్యముల ముఖ్య ప్రతిస్పర్ధి సోవియట్ రష్యా అని భావించిన వారును ప్రజాస్వామిక రాజ్య నాయకులలో పలువురు ఆ నాడు ఉండిరి. అందువలన అక్షరాజ్యములు బలవత్తరములు అయిన యెడల కడకు సోవియట్ రష్యాకును, వానికిని మధ్య పోరాటము చెలరేగి, అవి అన్నియును బలహీనములు కాగలవని వారు ఆసించిరి. ఇట్టివారి తంత్రములను సోవియట్ రష్యాయును గుర్తించి మెలకువతో వర్తించినది. స్టాలిన్ నాయకత్వమున ఆ దేశపు ప్రభుత్వము క్లేశకర త్యాగములనుచేసి దేశమును పారిశ్రామికముగను, సైనికముగను బలపరచినది. ముఖ్యముగ 1937 తరువాత ఆ దేశపు సైన్యము పూర్వముకన్న మిన్నగ సువ్యవస్థితము కా మొదలిడినది. కడకు 1939 లో యూరప్‌నందలి ప్రజాస్వామిక రాజ్యములు యుద్ధము అనివార్యమని భావించు స్థితికి వచ్చినపుడు, ఆ రాజ్యములతో కలసి హిట్లర్ దురాగతములను నిర్మూలించుటకును ఆ దేశము ఉత్సుకతను చూపినది. కాని, ప్రజాస్వామిక రాజ్యములు ముందునకు వచ్చుటకు సంకోచించినవి. 1917 మొదలుగ సోవియట్ రష్యా యెడ వారవలంబించిన విరుద్ధభావనయే అందులకు కారణము. ఇట్టి సమయమున భేదతంత్రమును హిట్లర్ ప్రయోగించి, సోవియట్ రష్యాతో నిరాక్రమణ సంధిని కుదుర్చుకొనెను (23 ఆగస్టు, 1939). అంతట సెప్టెంబరు 1, 1939 న పోలండ్ పైకి తన సైన్యములను జర్మనీ నడపినది. పోలండ్ రక్షణకు అదివరలో హామీలను ఇచ్చియుండిన గ్రేట్ బ్రిటన్, ఫ్రాన్స్ అంతట జర్మనీపై యుద్ధము ప్రకటించుటతో ద్వితీయ ప్రపంచ యుద్ధము ఆరంభమైనది.

ప్రథమ ప్రపంచ యుద్ధమున జరిగినటుల తూర్పు, పడమర రంగములందు పోరాడవలసిన క్లిష్టపరిస్థితి జర్మనీకి ఈ రెండవ యుద్ధమున తొలుత లేకపోవుటచేతను, యుద్ధమునకై తగు వ్యూహములను, యంత్రశక్తిని జర్మనీ సైన్యాధిపతులు ముందుగనే ఏర్పరచుకొని ఉండుటవలనను, పోలండ్‌లోని తీవ్ర ప్రతిఘటనను అతిసులభముగ అంతరింపజేసి, జర్మనీ సైన్యములు నాలుగు వారములలో పోలండ్‌ను వశపరచుకొనినవి. భౌగోళికముగ పోలండ్‌నకు అందుబాటులోలేని గ్రేట్ బ్రిటన్, ఫ్రాన్స్ ఆ దేశమునకు ఏ విధముగను ఆ సమయమున సాయపడగలిగినవి కావు. ఆ సమయముననే అదివరలో జర్మనీతో కుదుర్చుకొనిన ఏర్పాటును అనుసరించి సోవియట్ రష్యా సైన్యములు తూర్పు పోలండ్‌పై దండయాత్రను సాగించి (సెప్టెంబరు 17, 1939) ఆ భాగమును ఆక్రమించినవి. ఆ తరువాత కొలది దినములకే ఎస్తోనియా, లాట్వియా, లిథూనియా దేశములపై ఒత్తిడి మూలమున ఆ రాజ్యములందు సైనిక, నౌకా స్థావరములను సోవియట్ రష్యా ఆర్జించినది. ఫిన్లాండ్ నుండియు ఇట్టి సదుపాయములను పొందుటకు సోవియట్ రష్యా ఒత్తిడి చేసినది. కాని, ఆ రాజ్యము నిరాకరించుటవలన దానిపై దండయాత్రను సాగించినది. ఈ దాడిని తన అల్ప సైన్యముతో ఆ రాజ్యము వీరోచితముగ ప్రతిఘటించినను, కడకు లొంగి, సోవియట్ రష్యా కోరికలలో కొన్నింటిని అంగీకరించి ఒక నౌకాశ్రయమును, కొంత భూభాగమును దత్తము చేసినది (మార్చి 12, 1940). పోలండ్ భూభాగము జర్మనీవశమైన తరువాత జర్మనులు కొంతకాలము స్తబ్ధత వహించి ఊరుకొని అంతట సైనిక, నావిక, విమాన దళముల సాయమున డెన్మార్క్, నార్వే దేశములపై దండయాత్రను సాగించిరి ఏప్రిల్ 9, 1940). డెన్మార్క్ సులభముగ వారి వశమైనను, నార్వే మాత్రము ఆ సంవత్సరము ఏప్రిల్ 30 వరకు తన ప్రతిఘటనను కొనసాగించినది. కడకు మంత్రివర్గముతో పాటుగ, నార్వే దేశపు రాజు తలదాచుకొనుటకు లండన్‌నకు పారిపోయిన తరువాత, ఆ దేశమును జర్మనులు సంపూర్తిగ వశము చేసికొనిరి.

అంతటినుండి నాజీ యుద్ధయంత్రము అతి త్వరితగతిలో ముందునకు సాగినది. వైజ్ఞానిక పురోగతివలన సైన్యమునకు యంత్రములసహాయము విరివిగ లభించునటుల హిట్లర్ చేయగలిగినందువలన, శత్రువులను దిగ్భ్రాంతి పరచు వేగముతో దాడిని సాగించు విధానమును అపుడు జర్మనులు ముందుగ ప్రపంచమున అమలులోనికి తెచ్చిరి. ఇదియే 'మెరపు యుద్ధము (బ్లిట్‌జ్ క్రీగ్)' అని వ్యవహృతము. అందువలననే పశ్చిమరంగమున జర్మనీ తనపై దాడిని అరంభించిన (మే 10, 1940) తరువాత 18 దినములలో హాలండ్, బెల్జియమ్ దేశములను ఆ దేశము ఆక్రమించినది. బెల్జియమ్‌ను రక్షించుటకై ఆ దేశపు తీరభూమిలో దిగిన 350 వేల బ్రిటిష్, ఫ్రెంచి సైనికులు అనుకొనని రీతిగ జరిగిన నాజీల పురోగతివలన సముద్ర తీరమున డన్‌కర్క్ ప్రాంతమున చిక్కుబడిరి. అంతట ఆయుధ సామగ్రిని అంతటిని దిగవిడిచి చేతికి చిక్కిన యానసాధనముల సాయముతో ఆ సేనలు బ్రిటన్‌కు తరలింపబడినవి. అంతట జర్మనులు తమ పురోగతిని ఆపక ఫ్రాన్సులోనికి చొరబడి, 70 దినములలో ఫ్రాన్సు సైన్యములను పరాజితములను చేసిరి. నాజీ సైన్యములు పారిస్ నగరములోనికి చొరబడనున్న సమయముననే జర్మనీ పక్షమున ఇటలీచేరి బ్రిటన్, ఫ్రాన్సు దేశములపై యుద్ధమును ప్రకటించినది (జూన్ 10, 1940). అంతట ఫ్రాన్సు లొంగినది (జూన్ 22). యుద్ధకాలమున ఉత్తర ఫ్రాన్సు జర్మనీ సేనల ఆక్రమిత ప్రాంతముగ ఉండుటకు ఫ్రాన్సు ప్రభుత్వము అంతట అంగీకరించి, దక్షిణ ఫ్రాన్సున విచీ రాజధానిగ జర్మనులకు అనుకూలమగు ఒక ప్రభుత్వమును నెలకొల్పినది. కాని, స్వాతంత్ర్యకాంక్షగల ఫ్రెంచి సైనికులు కొంతమంది మాత్రము ఆ కాలముననే యుద్ధమును కొనసాగించి, ఫ్రాన్సునకు విమోచనము కల్పించు సంకల్పముతో డి గాలీ [చూ.] సేనాని నాయకత్వమున 'ఫ్రెంచి జాతీయ కమిటీ' అను సంస్థను లండన్‌న ఏర్పరచిరి.

ఇక, జర్మనీ ప్రతిస్పర్ధి వర్గమున అప్పటికి అపరాజితముగ నిలిచినది గ్రేట్‌బ్రిటన్ మాత్రమే. కాని, డన్‌కర్క్‌న సంఘటిల్లిన విషాదకర తిరోగమనమువలన, ఆ దేశము యుద్ధయత్నములను మొదటినుండి మరల ప్రారంభించవలసిన పరిస్థితి ఏర్పడినది. ఆ సమయమున ధీరతకు పేరొందిన చర్చిల్ [చూ.] నాయకత్వము ఆ దేశమునకు లభించినది. అతని అసమాన నాయకత్వమున ధైర్యముతో నిలిచి, జర్మనీ వైమానిక దాడులను ఆ దేశము ఎదుర్కొనుటలో 'రాడార్' అను నూతన పరికరమును ఉపయోగించినది. అట్టి దాడుల వలన దేశమునకు కొంత నష్టమును కలిగించినను జర్మనీ సేనలు మాత్రము బ్రిటిష్ దీవులపై అడుగిడలేక పోయినవి.

ఇందులకు జర్మనీ నౌకా బలహీనత కొంతవరకు కారణమైనను ఈ సమయముననే హిట్లర్ యూరప్‌న తన స్థానమును సుస్థిరము చేసికొనుటకై సోవియట్ రష్యాపై దాడి సన్నాహములను రహస్యముగ చేయుచుండుటయు ఇందులకు తోడ్పడినది. అందులకు ప్రాతిపదికగ రుమేనియాను జర్మనీ తొలుత వశపరచుకొని, దానిని రక్షణలోనికి తీసికొనినది. గత్యంతరములేక రుమేనియా అక్షరాజ్యముల పక్షమున చేరినది (నవంబరు 23). ఆ కాలముననే హంగేరియును, ఆ తరువాత కొలది మాసములకు బల్గేరియాయును, యుగోస్లావియాయును ఆ కూటమిలో చేరినవి. కాని, యుగోస్లావియా రాజధాని యగు బెల్‌గ్రేడ్‌న ఆ వెనువెంటనే తిరుగుబాటు జరిగి, తాటస్థ్యమును అవలంబించవలెనను వారికి ప్రాబల్యము లభించెను. ఇంతకు కొలది మాసములు ముందుగ ఇటలీ సేనలు ఆల్‌బేనియా నుండి గ్రీస్‌పై దండెత్తి గ్రీక్ సైన్యముల తీవ్ర ప్రతిఘటనను అంతరింపచేయజాలక సతమతములు అగుచుండినవి. కొన్ని బ్రిటిష్ సేనాదళములును ఆ సమయమున గ్రీక్ సేనలకు సాయపడుచు ఉండినవి. ఈ పరిస్థితిలో జర్మనీ సేనలు యుగోస్లావియా, గ్రీస్ దేశములపై మెరుపు దాడిని సల్పి వానిని లొంగదీసినవి. యుగోస్లావియాలో మాత్రము మారుమూల ప్రాంతములందు గెరిల్లా దళములుగ రూపొంది దేశభక్తులు పోరాటమును ద్వితీయ ప్రపంచయుద్ధము కడవరకు సాగించిరి.

ఇటుల సోవియట్ రష్యా తప్ప తక్కిన యూరప్‌న ముఖ్య భూభాగము అంతయు తన పలుకుబడికి లోనైన తరువాత హిట్లర్ తన దృష్టిని సోవియట్ రష్యావైపునకు సారించి అకస్మాత్తుగ ఆ దేశముపై దాడిచేసెను (జూన్ 22, 1941). అంతట సోవియట్ రష్యాకు కావలసిన సాయమునంతటిని తన శక్తిమేరకు చేసి, యుద్ధమున సైదోడుగ ఉండుటకు గ్రేట్‌బ్రిటన్ ముందునకు వచ్చి సోవియట్ రష్యాతో సహకరించినది.

ఈ సందర్భమున గమనింపవలసిన వేరొక ముఖ్య విషయము ఈ యుద్ధారంభకాలమున యునైటెడ్ స్టేట్స్ వహించిన పాత్ర. ప్రజాస్వామ్యములయెడ సానుభూతి కల ఆ దేశమున, అపుడు రూజ్‌వెల్ట్ [చూ.] అధ్యక్షుడుగ ఉండెను. అతడు ఉదారభావ ప్రేరితుడు. ద్వితీయ ప్రపంచ యుద్ధము రాకుండ చేయుటకు అతడు తొలుతటినుండియు పలు ప్రయత్నములు చేసెను. కాని, హిట్లర్‌నకు అతని సౌమ్యమార్గము నచ్చలేదు. యుద్ధము ఆరంభమైనది

మొదలుగ రూజ్‌వెల్ట్ ప్రజాస్వామ్యరాజ్యములకు వీలైనంత సాయము - యునైటెడ్ స్టేట్స్ రాజ్యాంగము ఒప్పుకొనిన మేరకు - చేయుటలో శ్రద్ధవహించెను. ఫ్రాన్స్ పతనానంతరమున, పశ్చిమార్ధగోళమునందలి కొన్ని బ్రిటిష్ పాలిత ప్రాంతములందు స్థావరములను యునైటెడ్ స్టేట్స్ నెలకొల్పుటకు బదులుగ 50 డిస్ట్రాయర్ నౌకలను యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వము గ్రేట్‌బ్రిటన్‌కు దత్తముచేసినది (సెప్టెంబరు 2, 1940). ఆ తరువాత అరువు - కౌలు (లెండ్ లీజ్) విధానము అనుదానిని రూపొందించి యునైటెడ్ స్టేట్స్ భద్రతకు అతి ముఖ్యములుగ కన్పట్టు దేశముల రక్షణకై సరకులను, సైనిక సేవా వసతులను కల్గించుటకు ఆ దేశము ముందునకు వచ్చినది. ఇదిగాక, యుద్ధోద్దేశములు ప్రజాస్వామిక వ్యవస్థకు అనుకూలముగ ఉండవలయునను కాంక్షతో రూజ్‌వెల్ట్, విన్‌స్టన్ చర్చిల్‌తో అట్లాంటిక్ మహాసముద్రమున ఒక నౌకపై సమావేశమై ఒక ప్రణాళికను రూపొందించెను (ఆగస్టు 14, 1941). ఇదియే అట్లాంటిక్ చార్టర్ [చూ.] అని వ్యవహృతము. సోవియట్ రష్యాపై జర్మనీ దండయాత్ర మొదలిడిన తరువాత సోవియట్ రష్యాకు కూడ అరువు - కౌలు వసతిని యునైటెడ్ స్టేట్స్ విస్తరించినది (అక్టోబరు 1, 1941).

తూర్పు రంగమున (సోవియట్ రష్యాపై దాడిలో) జర్మనీసేనలు తొలుత ప్రతిఘటనను నిర్మూలించుచు, సత్వరగతిలో పురోగమించినవి. కాని, విశాలరంగమున పోరాటమును సాగింపవలసివచ్చుటతో మెరుపు యుద్ధ తంత్రములు అనుకొనిన రీతిగ అట ఫలప్రదములు కాలేకపోయినవి. సాధ్యమైనంతవరకు ముఖాముఖ యుద్ధమునకు వైదొలగి సోవియట్ రష్యాసేనలు తిరోగమించి, భూదగ్ధవిధానము (స్కార్చ్‌డ్ ఎర్త్ పాలసీ) ను అవలంబించినవి. తమది విశాల దేశమగుటవలన మారుమూల ప్రాంతములకు తమ పరిశ్రమలను తరలించి ఎదురుదాడి సన్నాహములను సోవియట్ రష్యా చేయుచు పలు త్యాగములను చేసెను.

ఇంతలో ప్రాచ్య ఆసియాయందును, పసిఫిక్ ప్రాంతమునను పరిస్థితులు విషమించినవి. ఫ్రాన్స్, హాలండ్ దేశములు జర్మనీ వశమైనతరువాత ఆగ్నేయ ఆసియాయందలి వాని సామ్రాజ్యములలో జపాన్ స్థావరము కల్పించుకొనినది. ఇది యునైటెడ్ స్టేట్స్, గ్రేట్‌బ్రిటన్ దేశములకు ఆందోళన కల్గించినది. జపాన్‌ను దౌత్యవ్యవహారరీతిలో నిరోధించుటకు యునైటెడ్ స్టేట్స్ చేసిన యత్నము విఫలమై కడకు డిసెంబరు 7, 1941 న యునైటెడ్ స్టేట్స్‌కు చెందిన హవాయీదీవిలోని పెరల్ హార్బర్‌పై జపాన్ అకస్మాత్తుగ వైమానికదాడిని జరిపి, యునైటెడ్ స్టేట్స్ నౌకాబలమునకు తీవ్ర నష్టమును కలిగించినది. అంతట జపాన్‌పై యునైటెడ్ స్టేట్స్ యుద్ధమును ప్రకటించినది. వెంటనే జపాన్ పక్షమున జర్మనీ, ఇటలీ చేరి యునైటెడ్ స్టేట్స్‌పై యుద్ధమును ప్రకటించినవి. పెరల్ హార్బర్‌పై దండయాత్ర సాగించిన వెనువెంటనే ఆగ్నేయ ఆసియాలోని బ్రిటిష్‌సామ్రాజ్య ప్రాంతములపైనను జపాన్ దండయాత్ర మొదలిడినది.

అక్షరాజ్యములు తమ విజయయాత్రలలో పరాకాష్ఠను 1942 లో అందుకొనినవి. మాస్కో, లెనిన్‌గ్రాడ్ నగరములవరకు జర్మనులు పురోగమించిరి. కాని, ఆ నగరములను వారు వశపరచుకొనజాలకపోయిరి. ఆ ఏడాది సెప్టెంబరు నాటికి జర్మనీసేనలు దక్షిణమున ఉన్న స్టాలిన్‌గ్రాడ్ (నేటి వోల్గాగ్రాడ్) దరికి చేరినవి. ఆ దుర్గమును ఆక్రమించుకొనినచో బాకూ నూనెగనులు తమ వశమై సోవియట్ రష్యా ప్రతిఘటన తగ్గుముఖము పట్టగలదని ఆసించి హిట్లర్ తన సర్వస్వమును ఒడ్డి ఆ దుర్గమును వశపరచుకొన యత్నించెను. సోవియట్ రష్యా సేనలును కష్ట నష్టములకోర్చి, అతి ధైర్యముతో ప్రతిఘటనను సాగించినవి. ఆ సంవత్సరము మార్చినెల ముగియునాటికి హాంగ్‌కాంగ్, ఇండొనీషియా, సింగపూర్, మలయా, బర్మా, ఫిలిప్పీన్ దీవులును, అల్‌యూషన్ దీవులలో రెండును జపాన్ వశమైనవి. ఫిలిప్పీన్స్‌లో కొన్ని ప్రత్యేక ప్రాంతములందు మిగిలిన ప్రతిఘటనయు మేనెలకు అంతమైనది. అంతటితో జపాన్ పురోగతి కుంటుపడినది. అట జర్మనీయు స్టాలిన్‌గ్రాడ్‌ను వశపరచుకొనలేక నిలిచిపోయినది. కాని, అక్షరాజ్యములపై తిరుగుదాడిని సాగించు శక్తిమాత్రము మిత్రరాజ్యముల (బ్రిటన్, సోవియట్ రష్యా, యునైటెడ్ స్టేట్స్) కు అప్పటికి చేకూరలేదు.

కాలము గడచినకొలది మిత్రరాజ్యములకు జన బలమును, అర్థబలమును విరివిగ పెంపొందినవి. పారిశ్రామికముగ ప్రపంచమున అగ్రస్థానమును పొందిన యునైటెడ్ స్టేట్స్ తన పరిశ్రమలను అన్నింటిని యుద్ధోన్ముఖములను చేసెను. మిత్ర రాజ్యములకు సంబంధించినంతవరకు యునైటెడ్ స్టేట్స్ ఆనాడు ఆయుధాగారముగ రూపొందినది. యూరప్, ఆఫ్రికా, ఆసియా, పసిఫిక్ ద్వీపములందలి వివిధ యుద్ధరంగములలోని, బ్రిటిష్, సోవియట్ రష్యా, చీనా, తదితర సైనికులకు యునైటెడ్ స్టేట్స్ పరిశ్రమలు విరివిగ ఆయుధములను, వస్తువులను సరఫరా చేసినవి. దీనితోపాటుగ సురక్షితములు, నవ్యాయుధసముపేతములు అగు సైనిక, నౌకా, వైమానిక దళములను యునైటెడ్ స్టేట్స్ తన దేశమున రూపొందించి

నది. కడకు 1942 అంతమునకు బ్రిటిష్ సేనలతో కలసి యునైటెడ్ స్టేట్స్ దళములు వాయవ్య ఆఫ్రికాలో దిగి, యూరప్‌న ద్వితీయ రంగమును నెలకొల్పుటకు సన్నద్ధము లైనవి. 1943 మేనెల సగము గడచుసరికి ఉత్తర ఆఫ్రికా నుండి అక్ష సేనలు తరిమివేయబడినవి. అందుకు ముందుగనే సోవియట్ రష్యా సేనల తిరుగుదాడి ఫలితముగ జర్మనీ దళములు స్టాలిన్‌గ్రాడ్ వద్ద ఘోర పరాజయము పాలైనవి (ఫిబ్రవరి 2, 1943). అంతట యునైటెడ్ స్టేట్స్‌నుండి సేకరించిన విస్తార విమాన బలముతోడను, యుద్ధ సామగ్రి తోడను సోవియట్ రష్యా సేనలు పశ్చిమమునకు త్రోసి కొనిరా మొదలిడినవి. 1944 ఏప్రిల్ నాటికి ఆ సేనలు రుమేనియా సరిహద్దులకు చేరినవి. అంతకు ముందుగ పశ్చిమ యూరప్‌న 1943 జూలై 10 న సిసిలీలో యునైటెడ్ స్టేట్స్ - బ్రిటన్ సేనలు దిగి రెండవ రంగమును రూపొందించినవి. ఇటలీలో అంతట ముస్సోలినీ ప్రభుత్వము కూలద్రోయబడి, నూతన ప్రభుత్వము మిత్రరాజ్యములతో సంధి సంప్రదింపులకు దిగినది. తరువాత మూడు నెలలకు మిత్రరాజ్య సైన్యములు దక్షిణ ఇటలీలో కాలిడి ముందునకు పురోగమించినవి. అంతట ఇటలీ ప్రభుత్వము లొంగినది (సెప్టెంబరు 3, 1943). కాని, అప్పటిలో కారాగారమున ఉండిన ముస్సోలినీని జర్మనీ సైనిక దళములు రక్షించగ, జర్మనీ ఆక్రమణలో ఉండిన ఉత్తర ఇటలీలో అతడు ఒక నూతన ప్రభుత్వ వ్యవస్థను నెలకొల్పెను. అంతట జర్మనుల ప్రతిఘటనను ఎదుర్కొనుచు మిత్రరాజ్య సైన్యములు మెల్లగ పురోగమించినవి.

నార్మండీ ప్రాంతమున మిత్రరాజ్య సైన్యములు 1944, జూన్ 6 న దిగుటతో జర్మనీ పరిస్థితి అత్యంత క్లిష్టస్థితికి వచ్చినది. తూర్పున రష్యన్‌లను, పశ్చిమమున మిత్రరాజ్య సైన్యములను ప్రతిఘటించుట జర్మనీకి కష్టతరమయ్యెను. దానికి తోడుగ మిత్రరాజ్యముల విమానములు నిరంతర దాడులను సాగించి జర్మనీ యందలి పారిశ్రామిక కేంద్రములకు తీవ్ర నష్టములను కలిగించినవి. ఇటలీలో మిత్రరాజ్య సైన్యములు ఉత్తరమునకు త్రోసికొని వచ్చినవి. ఆ సమయమున స్విజర్లండ్‌నకు పారిపోవనున్న ముస్సోలినీని ఇటలీలోని ఫాసిస్ట్ వ్యతిరేక సైనికులు కాల్చి చంపిరి. ఇక జర్మనీ లొంగుబాటు అనివార్యమగు స్థితికి వచ్చెను. అంతకుముందే టెహరాన్‌లో జరిగిన సమావేశమున సోవియట్ రష్యా, బ్రిటన్, యునైటెడ్ స్టేట్స్ నాయకులు జర్మనీ ఆక్రమణను గురించి కొన్ని నిర్ణయములకు రాగలిగిరి (డిసెంబరు, 1943). ఈ పరిస్థితిలో క్రమముగ 1945 సంవత్సరారంభమునకు మిత్రరాజ్యముల సైన్యములు నలుమూలల జర్మనీ సరిహద్దులను చేరుకొని దండయాత్రలను తీవ్రతరములు చేసినవి. సోవియట్ రష్యా సేనలు ద్రుతగతితో పురోగమించి బెర్లిన్‌నగరమును చేరి ముట్టడించి నగరములోనికే చొరబడ గలిగినవి. కడకు హిట్లర్ ఆత్మహత్య చేసికొనగ, జర్మనీసేనలు మిత్రరాజ్య సేనలకు లొంగినవి (మే 7, 1945); ఆ నెల 8 వ తేదీతో యూరప్ రంగమున యుద్ధము అంతమైనది.

విస్తృత రంగములందు బలసంపన్నములగు రాజ్యములతో ఒకే పర్యాయము పోరాటము సాగించుటతో అదివరకే బాధపడుచున్న జపాన్‌కు జర్మనీ పతనము వలన పరిస్థితి శోచనీయమయ్యెను; క్రమముగ మిత్రరాజ్య సైన్యములు బర్మా మొదలగు ప్రాంతములలో ముందుకు త్రోసికొని రాగలిగినవి. పసిఫిక్ మహాసముద్రములోని జపాన్ ఆక్రమిత ద్వీపములను 1944 మొదలుగ యునైటెడ్ స్టేట్స్ నౌకాదళములు ఆక్రమింప మొదలిడినవి. కడకు 1945 ఏప్రిల్‌లో ఓకినావా ద్వీపము యునైటెడ్ స్టేట్స్ వశమైన తరువాత జపాన్ ద్వీపముల పైననే వైమానిక దాడులను సాగించుట సులభతరము కాగలిగెను. ఇట్టి పరిస్థితులలో ఆగస్టు 6, 1945 న యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వము జపాన్ దీవులందలి హిరోషిమా నగరముపై ఆటంబాంబును ప్రయోగింప జేసినది. ఆటంబాంబు [చూ. సం. 2 - పు. 167] అనునది అసమాన మారణ శక్తికల నూతన ఆయుధము. విజ్ఞానవేత్తల సాయమున యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వము అప్పటిలో దానిని ప్రపంచమున ప్రప్రథమముగ నిర్మింప నేర్చినది. హిరోషిమా నగరమున వసించు 313,000 ప్రజలలో 50,000 మందికి పైగా ఆ బాంబు ప్రయోగమువలన వెనువెంటనే మరణించిరి; ఈ మరణించిన వారిలో అత్యధిక సంఖ్యాకులు యుద్ధముతో జోక్యములేని సామాన్య పౌరులు. ఇంతేకాక ఆ పట్టణమున మూడింట రెండు వంతులు సర్వనాశనమైనది; చావు దప్పినవారికిని రేడియో ధార్మికతగల పరమాణు ధూళి ప్రభావమువలన జీవితము దుర్భర రోగపీడితము అయినది. అంతట ఆగస్టు 8 న సోవియట్ రష్యాయును జపాన్‌పై యుద్ధమును ప్రకటించినది. ఈ పరిస్థితులలో లొంగుబాటును గురించి ఆలోచించుటకై జపాన్ నాయకులు సమావేశములు జరుపసాగిరి. కాని, ఆ సమయముననే వేరొక ఆటంబాంబును నాగసాకీ నగరముపై వేసి, తన మారణ హోమమును నిరాటంకముగ యునైటెడ్ స్టేట్స్ సాగించినది. కడకు జపాన్ మిత్రరాజ్య సేనలకు లొంగినది (సెప్టెంబరు 2, 1945). అంతటితో ద్వితీయ ప్రపంచ యుద్ధమును, ఈ మారణ హోమమునకు

కారణ భూతమగు సామ్రాజ్యవాదపు మనుగడకు కల అవకాశములు పూర్తిగ అంతరించినవి [చూ. ప్రపంచ యుద్ధము - II].

## కళా కౌశలములు

చరిత్ర ఒక కాలమున మంద వేగమున నడచును; ఒకపుడు అది అతి ద్రుతరీతిలో పరవళ్లిడును; కొంత కాలము అది స్తంభించినదా అను సంశయము కలుగు రీతిగ ఒకే తీరుగ మార్పులెట్టివియులేక వందల సంవత్సరముల మేరకు పయనించును; ఒకపుడు పరివర్తనలు త్వరితగతిలో ఒకటి వెనుక ఒకటిగ సంఘటిల్లి, అదివరకు వేయి సంవత్సరములలో సాధ్యపడని పరిణామములు పదుల సంవత్సరములలో జరిగి, చరిత్ర అతి త్వరితగతిలో నడచినటుల కన్పట్టును. చారిత్రక పరిణామములు ఇటుల అత్యంత వేగముతో సంఘటిల్లిన వానియందు పూర్వపు యుగముల కన్న అన్ని విధముల మిన్నగ వర్తిల్లినది ఈ సామ్రాజ్య యుగము. వస్తూత్పత్తియందు మానవుడు ఈ యుగమున తాను అదివరలో కని, విని, భావించి ఎరుగని ఉన్నత కుశలతను సాధింపగలిగెను. కాని, ఈ సాధన అంతయు యూరప్‌న - అందున పశ్చిమ యూరప్‌ననే - తొలుత పరిణతినిపొంది, అటనుండి తక్కిన ప్రాంతములకు వ్యాపించినది. ప్రాచీన నాగరకతా నిలయములందు వస్తూత్పత్తి కుశలత ప్రాచీన కాలమున ఉన్నటులే ఉండి, ఆ యా వృత్తులకు సంబంధించిన నైపుణ్యము భారతదేశమున చాల వరకు కులక్రమాగతముగను, తక్కిన ప్రాచ్య దేశములలో వృత్తి సంఘములను ఆశ్రయించియు సజీవముగ ఉండినది. కాని, అట ఉత్పత్తి సాధనములలో క్రమవికసనము ఏమియు లేక తాతలనాటి కొరముల్లే మార్పేమియు లేక వాడబడుచుండెడివి. ఈ ఉత్పత్తి సాధనములలో ప్రయోజన కరములగు మార్పులను కొనివచ్చుటకు అభ్యాసమునకు తోడుగ విజ్ఞానశాస్త్ర వికసనమును జరిగి తీరవలయును. కాని, ఇదివరలో చెప్పబడినటుల ప్రాచ్యదేశములందు అందులకు ఆకాలమున తగు అవకాశమే కొరవడెను; సాంఘిక, రాజకీయ పరిస్థితులవలన పండితులందును జిజ్ఞాస సన్నగిలెను. నూతన విషయాన్వేషణయే పలు సంప్రదాయములకు నింద్యముగ కన్పట్టినది. 'ప్రాతదానిని వదలకూడదు; క్రొత్తదానిని గ్రహించకూడదు' అను భావమునకు సర్వత్ర వ్యాప్తి చేకూరినటుల ఉండినది ఆనాటి ప్రాచ్యదేశముల పరిస్థితి. కాల పురుషుడు కదలక మెదలక పడియుండినటుల కన్పట్టు ఆ కాలమున సైతము అటనట కొందరు జిజ్ఞాసువులు ప్రాచ్యదేశములందు ఉద్భవింపక పోలేదు. అట్టివారిలో భారతదేశమునందలి అంబర్ సంస్థానాధిపతి సవాయ్ జయసింహ (1686 - 1743) [చూ. సం. 9 - పు. 273] ప్రముఖుడు. ఖగోళశాస్త్ర అవేక్షణల కొరకై భారతదేశమునందలి అయిదు ప్రముఖ నగరములలో వేధశాలలను నెలకొల్పి పండితులను నియమించి, అవేక్షణలను జరిపి, నిర్దుష్టములగు ఖగోళ పట్టికలను అతడు తయారుచేయించెను. వివిధ యూరపియన్ నగరములకును పండితులను పంపి, అచట జరుగు విజ్ఞాన వికసనమును గురించి సమాచారమును సేకరించుటకు అతడు కృషిచేసెను; నగర నిర్మాణాదులందు శాస్త్రీయ మార్గములను అతడు ప్రవేశపెట్టెను. కాని, ఆనాడు ప్రాచ్యదేశములందు తావు కల్పించుకొనిన నిరాశావహ పరిస్థితికి అతడు ఒక అపవాదము మాత్రమే. అతనితోడనే ఆ విజ్ఞాన పిపాస అంతరించినది.

యూరప్‌న మాత్రము విజ్ఞాన శాస్త్ర వికసనము ఈ యుగమున ఉరుకులు పరుగుల మీద జరిగినది. విజ్ఞానశాస్త్ర రహస్యమును ఒకదానిని సాధించినంతనే అది ఒక నూతన సమస్యకు ప్రవేశము కల్పించెడిది; ఆ సమస్యా పరిష్కారము వేరొక శాస్త్ర రహస్యపు అవేక్షణకు దారితీసెడిది. ఇటుల క్రమరీతిలో సోపానసరళిలో పండితులు విజ్ఞాన సౌధమున పైకిపోవుటకు ఆనాడు అవకాశములు ఏర్పడినవి. అట్టి అవకాశము కలుగుటకు ఎక్కువగ తోడ్పడినది విజ్ఞానశాస్త్రముల వినియుక్తరూపమువలన లోకమునకు కలిగిన ప్రయోజనము. అట్టి ప్రయోజనమువలన లాభపడిన ధనికులును, వర్తకులును, ప్రభువులును పూర్వము కన్న మిన్నగ లాభములను సాధించు తలంపుతో నూతన యంత్రముల ఆవిష్కరణకు దోహదము కల్పించు విజ్ఞాన రహస్యములను సాధించు వైజ్ఞానికులకు తోడ్పడి పోషించెడివారు. తత్ఫలితముగ ఒకదానిపై వేరొకటి ఆధారపడి విజ్ఞానశాస్త్రమును, దాని వినియుక్తరూపమున ప్రయోజనమును సాధించగల వస్తూత్పత్తి పరిశ్రమలును ముందునకు పోగలిగినవి.

ఇటుల కలసిమెలసి సైదోడుగ ఒకదానిపై వేరొకటి ప్రభావము నెరపుచు పురోగమించిన విజ్ఞానశాస్త్ర, పారిశ్రామికాభ్యుదయములను కార్యకారణరీతిలో చర్చించుటకు ఇట అవకాశములేదు. కాని, ఆ యుగమున వివిధ పండితుల కృషివలన క్రమరీతిలో వివిధరంగములందు పురోగమించిన విజ్ఞానశాస్త్ర వికసనమును సంగ్రహముగ ముందుగ తెలిపి, దానిని ప్రాతిపదికగగొని అభివృద్ధి చెందిన పారిశ్రామికాభ్యుదయమును దిఙ్మాత్రముగ సూచించుట మాత్రము అత్యంతావశ్యకము.

ఆధునిక యూరపియన్ విజ్ఞానశాస్త్ర వికసనమునకు వైతాళికులుగ పేర్కొనదగు వారిలో ప్రముఖుడగు లియొనార్డో డా విన్చిని గురించి వెనుకటి అధ్యాయపు కడపట పేర్కొనబడినది [చూ. పు. 109]. విజ్ఞాన శాస్త్రమున ప్రయోగము (ఎక్స్‌పెరిమెంట్)నకు కల ప్రముఖస్థానమును అతడు గుర్తించెను. అతడు ఏ గ్రంథమును రచింపలేదు. కాని, అతనివలన శిక్షితులగు పలువురు శిష్యులు అతని భావములకు విరివిగ వ్యాప్తిని కల్పించిరి. ఈ భావనా వ్యాప్తికి అప్పటిలో యూరప్‌న అమలులోనికివచ్చిన పుస్తక ముద్రణయు చాల తోడ్పడినది ఇట్టి వ్యాప్తివలన యూరప్‌లోని పలుమూలల పండితులు ఒకరి అభిప్రాయము వేరొకరు గ్రహించి విజ్ఞానశాస్త్ర కృషిలో ముందడుగు వేయగల్గిరి. ఇట్టి కృషిలో ముందు లాభమొందినది ఖగోళశాస్త్రము. పోలండ్ విజ్ఞాని నికొలాస్ కోపర్నికస్ (1473 - 1543) భూకేంద్ర సిద్ధాంతమును కాదని సూర్యకేంద్ర సిద్ధాంతమునకు ఉపపత్తిని కల్పించెను. ఆ తరువాత కెప్లర్, గెలీలియో [చూ. సం. 9 - పు. 243] అను ఇరువురు వైజ్ఞానికులు 1610 ప్రాంతమున ప్రాయోగికముగ కోపర్నికస్ [చూ. సం. 9 - పు. 198] వాదమునకు బలమును చేకూర్చిరి. వీరిలో యోహాన్ కెప్లర్ (1571 - 1630) జర్మన్‌దేశీయుడు. ఇతడు గ్రహప్రదక్షిణ మార్గము వృత్తము కాదనియు, అది దీర్ఘవృత్తాకారమున ఉండుననియు రుజువుచేసెను. రెండవవాడగు గెలీలియో గెలిలీ (1564 - 1642) ఇటలీదేశవాసి. దూరదర్శనిని తొలుతగ ఉపయోగించిన ఖగోళవేత్త ఇతడే. దూరదర్శనివలన గ్రహనక్షత్ర దర్శనము స్పష్టతరము కాగల్గుటవలన సామాన్య ప్రజానీకమున సైతము అపుడు ఆ శాస్త్ర రహస్యములను గురించిన కుతూహలము పెంపొందసాగినది. ఇందులకు తోడుగ అప్పటిలో పశ్చిమయూరప్ రాజ్యములు దూరదేశాన్వేషణకై నౌకాయానమున శ్రద్ధ వహించినందువలన, భూనక్షత్రాదుల స్థితిగతులను తెలియజేయు ఖగోళవిజ్ఞానమునకును, దూరదర్శని మొదలగు యంత్రముల తీరుతెన్నులను విదితముచేయు చాక్షుష విజ్ఞానమునకును, వాని అనుబంధి విజ్ఞానములకును పోషణ లభించినది. గెలీలియో ఆవిష్కరణలుగ లెక్కింపదగిన వానిలో తెర్మామీటర్ [చూ. సం. 2 - పు. 216], భారమితి [చూ. సం. 2-పు. 519], దూరదర్శని [చూ. సం. 2-పు. 398], సూక్ష్మదర్శని, లోలక గడియారము ముఖ్యములు.

విజ్ఞాన శాస్త్ర అవేక్షణలకు సునిశిత పరికరములు అత్యావశ్యకములు. ఇట్టి పరికరముల నిర్మాణమునకు ఎక్కువగ దోహదము కల్పించినవి ఆ కాలపు వైజ్ఞానికుల అకాడమీలు. వానిలో ముఖ్యమైనది లండన్‌లోని రాయల్ సొసైటీ. అది 1660 లో రాజాదరణతో నెలకొల్పబడినది. దానియందు సభ్యులైన పండితుల గ్రంథములకు తత్కారణమున విరివిగ ప్రతిష్ఠయు, వ్యాప్తియు ఉండెడివి. ఈ సొసైటీ సభ్యులలో అజరామర ఖ్యాతిని ఆర్జించినవాడు న్యూటన్ (1642 - 1727), గురుత్వాకర్షణబలము [చూ. సం. 2 - పు. 324 ; 448] గురించి అతడు సునిశిత పరిశోధనలు సలిపి అందులకు సంబంధించిన కొన్ని నియమములను రూపొందించుటయే కాక చలనము, గతి, కాంతి మొదలగు వానిని గురించిన గణిత శాస్త్రీయ చర్చకు శ్రీకారమును చుట్టెను [చూ. సం. 2 - పు. 448 ; సం. 9 - పు. 360]. యంత్రశాస్త్రము అభివృద్ధి అగుటకు ఈతనికృషి ఎంతయో ఉపకరించినది. అతని అనంతరమునఅతని నియమములలో ప్రాయోగికముగ కొన్ని సందర్భములందు కొన్ని అపవాదములను పరిశీలించిన లావాజ్యే (1743 - 1794) అను ఫ్రెంచి విజ్ఞాని రాసాయనిక శాస్త్రమునకు ఆధునిక రూపమును కల్పించిన వారిలో తొలుతటివాడు [చూ. సం. 2 - పు. 604]. ఆక్సిజన్ (ప్రాణవాయువు)ను యౌగికములనుండి తొలుతగ వేరుపరచినవాడు ఇతడే. ఈ కాలముననే లావాజ్యేకు సమకాలికుడగు వోల్టా (1745 - 1827) [చూ. సం. 2 - పు. 711] విద్యుత్‌ను నిరంతర ప్రవాహముగ పంపగలుగు బ్యాటరీని నిర్మింపగలిగెను. అంతటితో ఒక అద్భుతపు నూతన శక్తి మానవునకు లభ్యమైనది. ఇటుల ప్రముఖులు పలువురు జరుపు వైజ్ఞానిక ఆవిష్కరణల ప్రాముఖ్యమును ప్రపంచపు దృష్టికి తెచ్చుటలో ప్రప్రథమముగ ఫలవంతమగు కృషి జరిపిన వారలు లావాజ్యే సమకాలికులగు వాల్‌టయిర్, డిడెరో. డిడెరోచే ప్రచురింపబడిన 'ఎన్‌సైక్లోపీడియా (విజ్ఞాన సర్వస్వము)' యూరప్ నందుననేకాక యునైటెడ్ స్టేట్స్ యందును ఆకాలమున విపులాదరణను ఆర్జింపగలిగినది. ఆ విజ్ఞాన సర్వస్వమున ఐహిక భోగములకు ఉపకరించు లౌకిక వస్తు సంజాతమును గురించిన సమగ్ర విశేషములను తెలియజేయుటలో అనితర శ్రద్ధవహింపబడినది. మతము, మత గ్రంథములు, ఆధ్యాత్మిక విషయములను గురించి అత్యల్పము, ఆదరరహితము అగు చర్చకు మాత్రమే అట తావొసగబడినది. అంతే కాదు ; అంధ విశ్వాసములు, శకునములు, జాతకములు మొదలగు వానిని గురించియు, అలౌకిక విషయములను గురించియు, పలుతావుల నిరసనయు ఆ గ్రంథమున కన్పట్టును. ఇట్టి గ్రంథము ప్రజాదరణను ఆర్జించిన కొలదియు, ఆ పశ్చిమ దేశములందు విజ్ఞానార్జన యెడల

ఆసక్తి పెచ్చు పెరుగసాగినది. క్రమక్రమముగ విజ్ఞాన శాస్త్ర వికసనమువలన పూర్వపు అర్థరహిత విశ్వాసములు చాలవరకు సడలినవి. సృష్టి మొదలగువానిని గురించి మత గ్రంథములు చెప్పిన దానితో అంతట తనివి చెందక పండిత వర్గము దానినిగురించి వైజ్ఞానికుల దృష్టితో ఆలోచింప మొదలిడినది. ఈ విజ్ఞానరంగమున ఫలదాయకమగు కృషి సల్పినవాడు ఛార్లెస్ డార్విన్ (1809 - 1882). పరిణామ క్రమమున సృష్టి రూపొందుచున్నదని అతడు నిరూపించెను [చూ. సం. 10 - పు. 412]. ఈ పరిణామవాదము మానవుని భావనలలో పలురంగములందు విప్లవకర పరివర్తనలకు దారితీసినది.

ఈ పరిశోధనలును, ఆవిష్కరణలును గ్రంథములందు చర్చలకు మాత్రమే ఉపకరించునవిగ ఉండినచో, వానివలన మానవజాతికి లాభము ఎక్కువగ కలిగెడిదే కాదు. వీనికి ఇదివరలో చెప్పబడినటుల వినియుక్తరూపము తోడ్పడ చేకూరినది. దానిమూలమున వస్తూత్పత్తియందు విస్మయకర పరివర్తనలను కొనివచ్చిన పారిశ్రామిక విప్లవము రూపుగొనినది.

పారిశ్రామిక విప్లవమును ‘విప్లవము’ అని పేర్కొనుటలో కొంత అపార్థమునకు తావు కలదు; ‘విప్లవము’ అనునది సామాన్యముగ ఒక ఆకస్మిక పరివర్తనకు పర్యాయపదముగ వాడబడుచున్నది. కాని, పారిశ్రామిక విప్లవమువలన వచ్చిన మార్పులు క్రమానుగతిలో చల్లగ ఒకదాని వెనుక వేరొకటి ముందునకు వచ్చినవి. అయినను ఈ మార్పులవలన మానవ జీవితరంగమున విప్లవకర పరివర్తనలు సంఘటిల్లినవి. అందువలన కొంతవరకు అపార్థతకు తావున్నను దీనిని పారిశ్రామిక విప్లవము [చూ. సం. 5 - పు. 558] అని వ్యవహరించుటయే సమంజసము.

**పారిశ్రామిక విప్లవము :** ఈ పారిశ్రామిక విప్లవ చరిత్రను నాలుగు ఘట్టములుగ - 1. 1776 నుండి 1837 ; 2. 1837 నుండి 1873 ; 3. 1873 నుండి 1929 ; 4. 1929 నుండి 1945 వరకు - విభజించి చర్చించుటవలన పాఠకులకు విషయ గ్రహణము సుకరము కాగలదు. ఈ ఘట్టములలో తొలుత రెండింటిని కలిపి ప్రథమ పారిశ్రామిక విప్లవముగను, మూడవ దానిని ద్వితీయ పారిశ్రామిక విప్లవముగను, నాలుగవ దానిని తృతీయ పారిశ్రామిక విప్లవముగను కొందరు రచయితలు వర్గీకరించిరి. అయినను పైవిధముగ ఘట్టములుగ విభజించుటలో కొంత ఔచిత్యము కలదు. పారిశ్రామిక విప్లవము వలన వస్తూత్పత్తి విరివిగ సాగినంతట ఒకప్పుడు వస్తువుల నిల్వ పెరిగిపోయి, అమ్ముడుపోని దుస్థితి ఏర్పడుట జరుగును. దీనినే ఆర్థిక సంక్షోభము (ఎకనమిక్ క్రైసిస్) అని ఆర్థిక శాస్త్రవేత్తలు పేర్కొనెదరు. ఈ సంక్షోభమువలన కొన్ని కార్ఖానాలు మూతపడి, నిరుద్యోగము వ్యాపించి, కల్లోలములను కలిగించిన తరువాత క్రమముగ పరిస్థితులు కుదుటపడి, మరల యథాపూర్వముగ ఉత్పత్తి సాగును. ఇట్టి సంక్షోభములు 1837, 1873, 1929 సంవత్సరములలో ప్రపంచమును క్షోభ పెట్టినవి. ఇక 1945 లో పరమాణుశక్తితో మానవునికి పరిచితి లభించినంతట వస్తూత్పత్తిలో విప్లవకర పరివర్తనలను కొనివచ్చుటకు మానవునికి కొన్ని నూతన విధానములు గోచరములు కాసాగినవి. కావున ఆ యా సంవత్సరములను సరిహద్దులుగ గ్రహించి పారిశ్రామిక విప్లవ చరిత్రల ఘట్టములుగ వర్గీకరించుట ఉచితమే అగును.

పైన పేర్కొనబడిన ఘట్టములలో తొలుతటి రెండింటియందును గ్రేట్ బ్రిటన్ అగ్రగామిగ వ్యవహరించినది. అందువలననే పారిశ్రామిక విప్లవమునకు జన్మస్థానముగ ఆ దేశము లెక్కింపబడుచున్నది. అట్టి విప్లవము రూపొందుటకు ప్రపంచమున తక్కిన ఏ ప్రాంతమునను లేని కొన్ని వసతులు ఆ నాడు గ్రేట్ బ్రిటన్‌న మాత్రమే సమకూరినవి. సముద్రాధిపత్యము క్రమముగ ఆ దేశమునకు దక్కినంతట వ్యాపారమును పెంపొందినది. గిరాకీ పెరిగిన కొలది సరకుల ఉత్పత్తిని విరివిగ పెంపొందించుటకు అభిలాషయు అతిశయిల్లినది. సామ్రాజ్య వ్యాపనము వలననేమి, వ్యాపార సంబంధముల వలననేమి ముడివస్తువులను విరివిగ సంపాదించగలిగిన పరిస్థితి ఆ నాడు గ్రేట్ బ్రిటన్‌కు సమకూరినది. ఆ కాలమున మానవునికి తెలిసిన శక్తిదాయక యంత్రములలో ముఖ్యమైనది నీటి మరయే. నీటి పతనమువలన తిరుగుటకు అనువుగ నిర్మింపబడిన ఒక చక్రమే ఈ మర యందలి ముఖ్యభాగము. దీని వలన లభించు శక్తివలన కొంత ఉత్పత్తి ఆ కాలమున సాధ్యమైనను, గిరాకీకి తగినటుల వస్తువుల సరఫరా జరిగెడిది కాదు. అదియునుగాక, ఋతువుల మార్పును అనుసరించి నీటి ప్రవాహమున హెచ్చు తగ్గులు ఉండుటవలన ఇందువలన లభించు శక్తిపై నమ్మకము ఉంచి వ్యవహరించుటకు సాధ్యము కాకుండెడిది. నీటిమరలకు తోడుగ గాలి మరలును కొన్నిచోటుల ఉండినను, వానివలన లభించు శక్తియు ఋతువులను అనుసరించి మార్పు చెందెడిది. ఇక వస్తూత్పత్తిలో కావలసిన అగ్నికొరకు తొలుత కట్టెయే ఎక్కువగ వాడబడెడిది. కాని, కాలక్రమమున అడవులు తగ్గుటవలన కట్టెకును కరువు ఏర్పడ సాగినది. తత్ఫలితముగ జరిగిన అన్వేషణకు ఫలితముగ నేలబొగ్గునకు వాడుక ఏర్పడినది. ఈ గనులు

త్రవ్వకము వలన క్రమముగ లోతు భాగములకు చేరినపుడు, అచట ఊరుచుండెడి నీరును లాగివేయుటకు మార్గములను అన్వేషింపవలసి వచ్చినది. అందులకై జరిగిన కృషివలన నీటిని వెలుపలికి పంపుచేయు ఆవిరిపంపు రూపొందినది (1705). నేలబొగ్గు బండ్లు త్వరితగతిలో పోవుటకు కొయ్య పట్టాలను దారిపొడుగున బిగించుటయు అపుడే మొదలైనది. ఆ తరువాత ఇనుప కొలుములకు నేల బొగ్గు వాడుకతో ఇనుము ఉత్పత్తి విరివిగ పెరుగుటవలన కొయ్య పట్టాలకు బదులుగ ఇనుపపట్టాలును మెల్లగ ఉపయోగము లోనికి వచ్చినవి. ఈ మార్పులన్నియు ఇంగ్లండున 18 వ శతాబ్దపు ఆరంభముననే రూపుగొనినవి. ఆవిరి యంత్రముతో నడపబడు పట్టునేత కార్ఖానాయును ఒకటి 1718 లో ఆ దేశమున స్థాపింపబడినది. ఈ పరిస్థితిలో ఉత్తర అమెరికాలో బ్రిటిష్ వారి వలసలలో ప్రత్తి ఉత్పత్తి విరివిగ జరుగుట ఆరంభమైనది. దీనిని ముడి పదార్థముగ గ్రహించి జవుళీ ఫ్యాక్టరీలను నెలకొల్పు యత్నము అంతట గ్రేట్ బ్రిటన్‌న ఆదరణను ఆర్జించినది. అంతవరకు ఈ జవుళీ పరిశ్రమకు, చేనేతకు ముఖ్య కేంద్రములన్నియు ప్రాచ్య భూములలో - అందును ముఖ్యముగ భారత దేశమున - ఉండినవి. ఈ పరిశ్రమను గ్రేట్ బ్రిటన్ వరపరచుకొనవలయునన్న విరివిగ చౌకమార్గముల యంత్రసహాయమున ఉత్పత్తిని సాగించిననే సాధ్యమగును. అందులకై జవుళీ నేతయందలి వివిధ పరిశ్రమలను త్వరితగతిలో చేయుటకు వీలు కలిగించు యంత్రములకై అవేక్షణ జరిగినది. ఈ సమయముననే జేమ్స్‌వాట్ (1736 - 1819) [చూ. సం. 2 - పు. 625] తన వైజ్ఞానిక ప్రతిభచే పూర్వపు ఆవిరి యంత్రము కన్న అన్నివిధముల సమగ్రతరమగు క్రొత్త ఆవిరి యంత్రము (స్టీమ్ ఇంజన్) ను కనుగొనెను (1763 - 1769). ఇది అంతటినుండి జవుళీ పరిశ్రమకే కాక తక్కిన పరిశ్రమలకును ఉపకరించినది. ఇందులకు తోడుగ ఆ కాలమున జవుళీ పరిశ్రమలో ఉపయోగించు వడుకు యంత్రములను హార్‌గ్రీవ్స్, ఆర్క్‌రైట్ అను వారలు కనుగొనిరి (1769). పై ఇరువురు కనుగొనిన సాధనములను జతపరచి సమగ్రమగు వడుకు యంత్రము (మ్యూల్) ను క్రాంప్‌టన్ 1779 లో రూపొందించెను. కార్ట్‌రైట్ అనునతడు యంత్రశక్తిచే పనిచేయు మగ్గమును కనుగొనుటతో (1785) జవుళీ పరిశ్రమకు గ్రేట్ బ్రిటన్‌న పటిష్ఠత చేకూరినది (1793). అంతటినుండి వస్త్రములను ప్రపంచమున పలుప్రాంతములకు గ్రేట్ బ్రిటన్ ఎగుమతి చేయసాగినది. అతి పురాతన కాలమునుండియు యూరప్‌నకును, ఆసియా యందలి తక్కిన దేశములకును సన్నని వస్త్రములను పంపుటలో పేరొందిన భారతదేశపు చేనేతపరిశ్రమ నాటినుండి ప్రాముఖ్యమును కోల్పోయినది.

ఇట్టి పారిశ్రామిక పరివర్తన వలన ఆవిరి యంత్రములకు గిరాకీ పెరిగినంతట వానిని చేయుటకు కావలసిన ఇనుమునకును, యంత్రములను చక్కగ, కుదిరికగ, కావలసిన పరిణామమునకు హెచ్చుతగ్గులు లేకుండ నిర్మింపగలుగు కార్ఖానాలకును ఆవశ్యకత కలిగినది. ఇనుమును కరగించుటకు నేలబొగ్గును విరివిగ వాడుటతో ఇనుము ఉత్పత్తి - ఇదివరలో తెలిపినటుల - ఎక్కువ కాగలిగినను ఇనుముచే యంత్రములను నిర్మించుటలో ఆ కాలమున మార్గదర్శకుడైనవాడు జాన్ విల్కిన్‌సన్ (1728 - 1808).

యంత్రనిర్మాణము మాత్రముననే వస్తూత్పత్తి విరివిగ సాగదు; అందులకు ముడిపదార్థములు ఎడతెగకుండ తగినంత ప్రమాణమున చేరుటకు తగు సౌకర్యములు ఉండవలయును; ఆ రవాణా సౌకర్యములే ఉత్పత్తియైన వస్తువులను మార్కెట్‌లకు చేర్చుటకును ఉపయోగించును. 1815 పూర్వమున ఇంగ్లండు దేశపు బాటలు గతుకుల డొంకలుగ ఉండెడివి. ఆ సంవత్సరము తరువాత జాన్ మకాడమ్ అను ఒక ఇంజనీర్ ప్రోద్బలమువలన కంకర రోడ్లు ఆ దేశమున రూపొందసాగినవి. అవియే కాక వివిధ పారిశ్రామిక కేంద్రములను కలుపు నీటి కాలువలును ఆ కాలమున ప్రయాణసౌకర్యమునకై ఇంగ్లండున తొలుతగ త్రవ్వింపబడినవి. అనతి కాలముననే ఫ్రాన్స్, యునైటెడ్ స్టేట్స్ ఆ విషయమున గ్రేట్ బ్రిటన్‌ను అనుకరించినవి.

కాలువలకు బదులుగ రైలురోడ్లకు 1837 ప్రాంతమున ఆదరణ చేకూరినది. జార్జి స్టీఫెన్‌సన్ (1781 - 1848) కృషివలన ఇంగ్లండులో తొలుతటి రైలు ఇంజను (లోకోమోటివ్) రూపొందింపబడినది (1815). అది తొలుతగ సరకుల బండ్లను లాగుటకు వినియుక్తమై, క్రమముగ 1825 నాటికి ప్రయాణీకుల బండ్లను లాగుటకును వాడుకలోనికి వచ్చినది. ఇటుల పారిశ్రామిక విప్లవము ప్రథమ ఘట్టము ముగియునాటికి గ్రేట్ బ్రిటన్‌న పలుప్రాంతములను కలుపుచు రైలురోడ్లు ఏర్పడి రైళ్లు నడువ సాగినవి.

గ్రేట్ బ్రిటన్‌నకు 1837 లో సంఘటిల్లిన ఆర్థిక సంక్షోభము వలన కొంత ఇబ్బంది ఏర్పడినను, తదనంతరమున పారిశ్రామిక కుశలత తక్కిన యూరప్ ఖండమునకును, యునైటెడ్ స్టేట్స్‌కును వ్యాపించుటకు వసతులు ఏర్పడినవి. యూరప్‌న జాతీయవాదముతోపాటుగ దేశమునందలి వివిధ ప్రాంతముల మధ్య దూరతాభావమును సన్నగిల్ల జేయుటకు రైలు రోడ్లును తోడ్డైనవి. 1848 నుండి

1871 వరకు జరిగిన కాలమున ఈ రైలురోడ్ల నిర్మాణము యూరప్ ముఖ్య భూభాగమున విరివిగ సాగినది. ఇటలీలో కావూర్, ఫ్రాన్స్‌లో నెపోలియన్ - III, జర్మనీలో బిస్మార్క్ ఈ జాతీయ రైలుమార్గముల నిర్మాణమున ప్రత్యేక శ్రద్ధ వహించిరి. రైలురోడ్ల ప్రక్కనే వివిధ పారిశ్రామిక కేంద్రములును రూపొంద సాగినవి. యునైటెడ్ స్టేట్స్‌లోను ఈ కాలముననే అట్లాంటిక్, పసిఫిక్ తీరములను కలుపు రైలుమార్గము నిర్మింపబడినది. తన్మూలమున ఆ దేశమున పశ్చిమ భాగమునకు వలస తీవ్రతరము కాగలిగినది. అందుతోపాటుగ పరిశ్రమలును యంత్రసహాయమున భారీ ఎత్తున నెలకొల్పబడుటయు మొదలైనది.

ఇంతకు కొంతకాలము పూర్వముననే వాట్ నిర్మితమగు ఆవిరి ఇంజన్‌ను ఒక పడవకు బిగించి, దాని సాయమున తెడ్డు, తెరచాపలతో నిమిత్తము లేకుండ ఆ పడవను నడుపుట 1802 లో విలియమ్ సిమింగ్టన్ చే గ్రేట్ బ్రిటన్ లో సాధింపబడినది. దాని పరిణామముగనే క్రమముగ ఆవిరిచే నడుపబడు నౌకలు వ్యాప్తిలోనికి వచ్చినవి. ఈ పరిణామములు అన్నింటియందును ఈ రెండవ ఘట్టమున గ్రేట్ బ్రిటన్‌తోపాటుగ, ఫ్రాన్స్, జర్మనీ, యునైటెడ్ స్టేట్స్ సముచితముగ పాల్గొనినవి. కాని, ఈ కాలమున సైతము గ్రేట్‌బ్రిటన్ దేశమే పురోగామిగ వ్యవహరించినది. 1818 లో తొలుతగ నౌకల నిర్మాణమునకు ఇనుము ఉపయోగింపబడినది. అంతట మరతెడ్డు (స్క్రూ ప్రొపెలర్) ను కనుగొనుటతో (1836) సముద్రయానము మరింత సులభతరము అయినది.

నూతన యంత్రముల నిర్మాణములు విరివిగ సాగు పరిస్థితులు ఇటుల సమకూరినంతట ఇనుమునకు బదులుగ ఉక్కును వాడుటవలన యంత్రముల దార్ఢ్యము అతిశయిల్ల గలదను భావన పొడమెను. కాని, ఇనుమునుండి ఉక్కును తయారుచేయుట ఆ కాలమున చాల వ్యయమూలకముగ ఉండినది. అట్టి సమయమున బెస్సెమర్ అను బ్రిటిషు విజ్ఞాని ఆక్సీకరణ సమర్థమగు విసరుగాలిని కొలిమి (బ్లాస్ట్ ఫర్నెస్) లో ప్రవేశపెట్టుటవలన చౌకగ ఉక్కును తయారుచేయు పద్ధతిని కనుగొనెను (1857). భాస్వరము లేశమాత్రమును కలియని ముడి ఇనుము విషయమున మాత్రమే ఈ పద్ధతి పనికివచ్చినను, ఉక్కు పరిశ్రమకు ఈ విధానము చక్కని దోహదకారి అయినది.

బెస్సెమర్ విధానమునే చాలచక్కగ పనిగొని యునైటెడ్ స్టేట్స్, జర్మనీ ఉక్కు పరిశ్రమలో పురోగమింపగలిగినవి. యునైటెడ్ స్టేట్స్‌లో ఉక్కు పరిశ్రమకు దృఢములగు పునాదులను కల్పించినవాడు ఆండ్రూ కార్నిజీ (1835 - 1919); జర్మనీలో రూర్‌లోయయందు ఉక్కు పరిశ్రమకు స్థిరమగు స్థావరమును, అభివృద్ధికి అనువగు పరిస్థితులను కలిగించినవాడు ఆల్‌ఫ్రెడ్ క్రప్ (1812-1887).

ఉక్కు పరిశ్రమ ప్రముఖ దేశములందు తావు కల్పించుకొనుటతో పారిశ్రామిక విప్లవమున తృతీయ ఘట్టము ఆరంభితమైనటుల భావింపవచ్చును. ఈ ఘట్టమున గ్రేట్ బ్రిటన్‌తోపాటుగ, యునైటెడ్ స్టేట్స్, జర్మనీ సమానముగ ప్రాముఖ్యమునకు రాగలిగినవి. పైవానితో సమానముగ కాకపోయినను, పరిగణనీయ రీతిలో బెల్జియమ్, ఫ్రాన్స్, ఆ తరువాత తక్కిన కొన్ని యూరప్ దేశములును, ఆసియాయందలి జపాన్‌ను ఆ ఘట్టమున కొంత ప్రాముఖ్యమును క్రమముగ గడించినవి. ఉక్కు పరిశ్రమలో అంతటంతట కొన్ని అభివృద్ధికర పరివర్తనలు ఈ ఘట్టమున రూపుగొనినవి. అవియేకాక, విద్యుచ్ఛక్తి, పెట్రోలియమ్, గాసొలిన్ ఇంజన్, వినియుక్త రాసాయనిక విద్యలకు సంబంధించిన పరిశ్రమలును ఈ కాలమున నెలకొల్పబడినవి.

పరిశ్రమయందు నేలబొగ్గునకు వాడుక పెరిగిన కొలది, దానిని గురించిన పరిశోధనయు విస్తరిల్లి రాసాయనిక పరిశ్రమలకు దారితీసినది. నేలబొగ్గును వేడిచేసినపుడు 'బొగ్గుతారు' అను ద్రవపదార్థము లభించును. దీనినుండి వేర్వేరు వర్ణద్రవ్యములను రూపొందించు పద్ధతులను జర్మనీ రాసాయనికులు తొలుతగ కనుగొనిరి. తరువాత యునైటెడ్ స్టేట్స్‌లోను దీనికి ప్రాచుర్యము లభించినది. ఇనుప పరిశ్రమలందును రాసాయనికశాస్త్రము విరివిగ వినియుక్తమై ఎట్టి ఇనుమునైనను ఉక్కుగమార్చు ప్రక్రియలు రూపొందుటయు, ఆ యా ముడి ఖనిజములనుండి అల్యూమినియము వంటి క్రొత్త ధాతువులను సాధించుటయు కనుగొనబడినది.

విద్యుచ్ఛక్తి, దానిని నిల్వజేయుట, ప్రసరింపజేయుట మొదలగువానిలో వాల్టా, గాల్వనీ, ఫారడే పండితులు అదివరకే శాస్త్రీయఫలితముల సాధించినను, వార్తలను దూరప్రాంతములకు చేరవేయు ప్రక్రియకు అది సాయపడునని కనుగొనబడిన తరువాత దానివలన తొలుతటి పారిశ్రామిక ప్రయోజనము లభించినది. టెలిగ్రాఫ్ మూలమున సందేశమును దూరమునకు తంతిద్వారా అందజేయుటను సామ్యుల్ మోర్స్ (1791 - 1872) కనుగొనెను. ఇట్టి తంతివార్త వాషింగ్టన్‌నుండి బాల్టిమోర్‌నకు ప్రపంచమున తొలుతగ 1844 లో పంపబడినది. టెలిఫోన్ విధానము కనుగొనబడుటతో (1876) విద్యుచ్ఛక్తి వాడుక

ఇంకను ఎక్కువైనది. ఈ విధానమును కనుగొనినవాడు అలిగ్జాండర్ బెల్. ఆ తరువాతి దశాబ్దములలో తంతి లేకుండనే వార్తలను దూరమునకు అందజేయుటకు అనువగు ప్రక్రియను సాధించుటకు కృషి జరిగినది. దీనియందు జయమును సాధించినవాడు ఇటలీదేశస్థుడగు మార్కోనీ (1874 - 1937) [చూ. సం. 2 - పు. 532]. ఈతడు కనుగొనిన (1895) నిస్తంత్రీ వార్తాప్రసార ప్రక్రియవలన సముద్ర మధ్యమునుండి నౌకలు దూరప్రాంత తీరములకు వార్తలను అందజేయుట సాధ్యమై తత్ఫలితముగ సముద్ర యానము కొంత సులభతరమైనది.

విద్యుచ్ఛక్తిచే అన్ని విధముల పనిగొని, దానిని మానవుని బానిసగ రూపొందించిన ఘనత యునైటెడ్ స్టేట్స్ వాసియగు తామస్ ఆడిసన్ (1847 - 1931) కు దక్కినది [చూ. సం. 2 - పు. 171]. విద్యుద్దీపమును తొలుతగ రూపొందించినది ఇతడే. విద్యుచ్ఛక్తిని నిల్వజేయు 'పవర్ హౌస్'ను నిర్మించి, అటనుండి నగరమునందలి పలు విద్యుద్దీపములకు విద్యుచ్ఛక్తి సరఫరాచేయు విధానమును ఇతడు కనుగొనెను (1882). విద్యుత్ ఉత్పాదనకు తొలుత ఆవిరియంత్రములు ఉపయోగింపబడినను క్రమముగ అందులకు జలపాతములు ఎక్కువ చౌకగ ఉపయోగపడునను విషయము కనుగొనబడినది. అందువలన నేలబొగ్గు విరివిగ లభ్యము కాని దేశములలో - ఇటలీ, స్విజర్లండ్, ఐర్లాండ్, స్కాండినేవియా మొదలగు దేశములలో - విద్యుత్ ఉత్పత్తి జలాధారములవలన అంతటినుండి సాధింపబడి, తన్మూలమున ఆ దేశముల పారిశ్రామికాభివృద్ధికి మార్గము సుగమమైనది.

శక్తినిచ్చువాటిలో విద్యుచ్ఛక్తికి పోటీగ పెట్రోలియమ్ పందొమ్మిదవ శతాబ్దమున ముందునకు రాగలిగినది. లోకాల్పు (ఇంటర్నల్ కంబశ్చన్) ఇంజన్ 1886 లో కనుగొనబడిన తరువాత, మోటారు కారులందు అట్టి ఇంజన్లకు చలనశక్తి సాధకముగ పెట్రోలియమ్‌నకు విరివిగ ప్రాచుర్యము లభించినది. 1894 లో తొలుతగ ఇట్టి మోటారుకారు ఫ్రాన్స్‌లో రూపొందింపబడినది. ఇట్టి కారులను భారీ ఎత్తున ఉత్పత్తిచేయు విధానములను సాధించి, వానిని సామాన్య ధనికుల అందుబాటులోనికి తెచ్చినవాడు యునైటెడ్‌స్టేట్స్ వాసి అగు హెన్రీ ఫోర్డ్.

లోకాల్పు ఇంజనులవలన యానసాధనములందు వేరొక లాభదాయకమగు ఆవిష్కరణయు జరిగినది. అదియే వాయు విమాన నిర్మాణము. రాకపోకల సాధనములలో భూమార్గమున రైలు తర్వాత క్రమముగ ఆధునికపు సైకిలు (1876), కారు మొదలగునవి వచ్చినను దేశదేశముల మధ్య గల దూరములను సంకుచితము చేయగలుగుటలో వీనిని అన్నింటిని అధిగమించినది విమానము. పందొమ్మిదవ శతాబ్దిలోనే వాయుయానము విషయమున పలువురు పరిశోధనలు చేసి కృషి సల్పినను వారి ప్రయత్నములు నెగ్గలేదు. 1903 లో ఆర్ - విల్ రైట్, విల్బర్ రైట్ అను సోదరుల కృషివలన మొదటి విమాన ప్రయాణము సాధ్యమైనది. అంతటినుండి అది క్రమముగ అభివృద్ధి చెందినను 1920 వరకు పరిగణనీయమగు అభివృద్ధిని అది సాధింపలేదు.

పారిశ్రామిక విప్లవమున 1929 తరువాత మొదలైన నాలుగవ ఘట్టమున విమాన నిర్మాణము శరవేగమున ముందుకు సాగినది. యుద్ధమున విమానముల ప్రయోజనము గుర్తింపబడుట అందులకు ఒక ముఖ్య కారణము. 1944 నాటికి విమాన నిర్మాణమున మానవ జాతి సాధించిన కుశలతవలన భూగోళమును విమానము మూలమున ఒక దినమున చుట్టివచ్చుటకు తెరువు ఏర్పడినది.

ఈ పారిశ్రామిక విప్లవ కాలముననే విజ్ఞానశాస్త్రమును ఆలంబనముగ గ్రహించి వ్యవసాయమును గొప్ప పరివర్తనలను సాధించినది. ఇందు కృషిచేసిన ప్రముఖులలో తొలుతటివాడు జుస్టస్ ఫాన్ లీబిగ్ (1803 - 1873). భాస్వరము, పొటాష్, నైట్రోజన్‌లను నేలనుండి ఉద్భిజ్జములు గ్రహించునని అతడు రుజువుచేసి, అవి తగు నిష్పత్తులలో ఉండు ఎరువు పంటకు అవసరమని స్పష్టముచేసెను. క్రమముగ వివిధ శాస్త్రజ్ఞుల కృషితో ఈ శాస్త్రము వికసనము చెందినది. అట్టివారిలో లూథర్ బర్ బాంక్ (1849 - 1926) పరిగణనీయుడు. ఆయా ఉద్భిజ్జ జాతులందును, దుంపలందును క్రొత్తరకములవానిని రూపొందించు తెరువులను అతడు అన్వేషించి అందు కృతకృత్యుడయ్యెను. వ్యవసాయము చేయు తీరుతెన్నులందును యాంత్రిక సాధనములను ప్రవేశపెట్టుటవలన విశాల క్షేత్రముల సేద్యము లాభకరమగుటకు మార్గము ఏర్పడినది.

విజ్ఞానశాస్త్ర వికసనమువలన ఇటుల మానవ జీవితోపాధికే కాక, జీవితమున మానవుని పీడించు రోగములను ఎదుర్కొని నిరోధించుటకును మార్గములు సుగమములైనవి. ఇందులకై వైద్యశాస్త్రమున పలు పండితులు పలు దేశములందు ఆధునిక పద్ధతులలో కృషి చేసిరి. ఆధునిక వైద్య శాస్త్రపు మూలపురుషులలో ప్రముఖుడు విలియమ్ హార్వే (1578 - 1657). మానవ దేహమున రక్త ప్రసరణ రీతిని అతడు శాస్త్రీయరీతిలో నిరూపించెను. ఇతనిని అనుసరించి శస్త్రచికిత్సకు శాస్త్రీయ రూపమును కల్పించి,

మోటుపద్ధతులకు స్వస్తి చెప్పుటలో తోడ్పడినవాడు జాన్ హంటర్ (1728 - 1793). ఈతని శిష్యుడగు ఎడ్వర్డ్ జెన్నర్ (1749 - 1823) మశూచికమును గురించి పరిశోధించి టీకాల ఉపయోగమును కనుగొని ప్రచారములోనికి తెచ్చి, ప్రపంచమునకు మశూచి బాధా నివారణ కల్గుటకు తోడ్పడెను. ఈ విధముగ రోగ నిరోధక విజ్ఞానమునకు అతడు మూలపురుషుడు కాగలిగెను. తరువాత జరిగిన వైద్య శాస్త్రాన్వేషణలలో ప్రముఖపాత్ర నిర్వహించిన వాడు లూయీ పస్తూర్. గాలి, సంపర్కము మొదలగు పెక్కుమార్గముల పయనించు సూక్ష్మజీవుల (బాక్టీరియా) వలన వస్తువులు దూషితములు కాగలవనియు, ఉష్ణమును నియమబద్ధముచేసి దానిని నశింపజేయవచ్చుననియు, మానవులలో రోగములను కల్గించు క్రిముల ప్రవేశమువలన రోగములు కలుగుననియు, అట్టి క్రిములలో బలహీనము లగు వానితో చేసిన టీకాలవలన ఆ యా రోగముల నిరోధింప వచ్చుననియు అతడు నిరూపించెను. ఆ కాల మునందే ఫ్రెంచి జాతీయుడు రీనీ లేనెక్ స్టెతస్కోప్‌ను కనుగొనెను (1819). వేదనాపహారి (ఎనేస్తటిక్) గ ఈతర్‌ను తొలుతగ 1846 లో యునైటెడ్ స్టేట్స్‌లోని ఒక దంతవైద్యుడు ఉపయోగించెను. ఇటుల రోగనిదానము నకు, రోగ నివారణకు ఉపయోగించు పెక్కు యంత్ర సాధనములును విజ్ఞానశాస్త్ర సహాయమున లభించినవి.

ఇంకను ఇటుల మానవ స్వస్థతకే కాక మానవుల వినోదమునకును విజ్ఞానశాస్త్రము తోడుపడినది. ఛాయా చిత్రగ్రహణము(ఫొటోగ్రఫీ)నకు తెరువు యేర్పడిన (1822) తరువాత అట్టి చిత్రములను ఒక క్రమగతిలో అమర్చి సంఘటనలను జరిగినవి జరుగునటుల చూపుటకై కొంత కృషి జరిగినది. దీనిలో కడకు కృతార్థుడైనవాడు జార్జి మేలీ అను ఫ్రెంచి యువకుడు (1909). అయినను అది మనము నేడు చూచు సినిమా ఫిల్మ్ తొలి రూపము మాత్రమే. క్రమముగ వివిధ యంత్ర శాస్త్రవిదుల చేతు లలో అది పరిణతిచెంది నేటి టాకీ సినిమాగ పరిణమించి నది. ఇట్టి తొలి చలనచిత్రము 1915 లో యునైటెడ్ స్టేట్స్‌లో రూపుగొనినది. 1920 నాటికి రేడియోయును, ఆ తరువాత టెలివిజన్ యును పరిపూర్ణతను సాధించినవి.

విజ్ఞానశాస్త్రము ఇటుల మానవుని శ్రేయమునకు తోడు పడుట నిజమేయైనను ఇంతకన్న మిన్నగ యుద్ధావసర ములకై మారణాస్త్రముల రూపొందించుటలో అది ఎక్కువగ వినియుక్తమైనది. ఈ యుగారంభమున జేనకిత్రాడు తుపాకులును, రాళ్లను విసరు ఫిరంగులును మాత్రమే వ్యాప్తిలో ఉండినవి. కాని, క్రమక్రమముగ వానిలో మార్పులు కలిగినవి. వానిని మీటనొక్కి కాల్చుటకు అనువుగ యంత్రపరికరము సమకూర్చబడినది. తొలుతటి కాలపు తుపాకి తోటాలు తుపాకిమందును, చిన్న సీసపుగుండ్లును కలిపి కాగితపు సంచులలో దట్టించుట వలన తయారయ్యెడివి. 19 వ శతాబ్ది పూర్వభాగము వరకు పరిస్థితి అటులనే ఉండినది. తరువాత దీని నిర్మాణమున మార్పులు జరిగినవి. తుపాకి బరువును క్రమముగ తగ్గినది. 17 వ శతాబ్ది తరువాత ఫిరంగులలో ఇనుప గుండ్లను ఉపయోగించుటయు మొదలైనది. నౌకల కును, ఆతరువాత స్టీమర్‌లకును ఫిరంగులను సమ కూర్చుటయు అంతట ఆరంభమైనది. ప్రథమ ప్రపంచ యుద్ధ (1914 - 1918) కాలమున టాంక్‌లును, జలాంతర్గా ములును రూపొందింపబడినవి. ద్వితీయ ప్రపంచ యుద్ధ (1939 - 1945) కాలమునకు విమానములనుండి బాంబులను కురిపించుటయందును, విషక్రిముల వ్యాపనముతో యుద్ధ మును సాగించుటలోను మానవుడు దక్షతను సంపాదించెను. కడకు 1945 లో వెలసిన అటంబాంబు [చూ. సం. 2 - పు. 167]తో మానవుని యుద్ధోత్సాహము తన పరాకాష్ఠను అందుకొనినది. ఇక అటనుండి వెనుకకువచ్చి విజ్ఞానశాస్త్ర మును మానవ కళ్యాణమునకై వినియోగించుటయో లేదా ముందునకుపోయి సర్వనాశనమగుటయో తప్ప వేరు గత్యంతరము లేని పరిస్థితి మానవజాతిని ఎదుర్కొనినది.

## ధార్మిక భావన

ఇతఃపూర్వపు మతరాజ్య యుగమున సంఘముపై అధి కారమును సమగ్రముగ గ్రహించుటకు మతము కృషిచేసి అందు కొంత సఫలతను ఆర్జించినను, ఈ యుగారంభము నుండియు ఆ అధికారపు పునాదులు సడలి అది చివరకు నామమాత్రావశిష్టమైనది. ప్రపంచమునందు అంతటను సర్వసామాన్యముగ ఈ నాలుగు శతాబ్దములలో ఇట్టి పరిణామము సంఘటిల్లినను, ఇందులకు కల కారణములు మాత్రము వేరువేరుగ ఉండినవి. ఆసియా, ఆఫ్రికా ఖండములలోని సమాజము సృజనశీలతను కోల్పోవుట వలన మతాచారముల గ్రుడ్డి అనుసరణయు, అంధ విశ్వాస మును, కొన్ని పట్టుల అర్థరహిత ఛాందసత్వమునకు దారితీసి మత మూలభావనలకే విరుద్ధములుగ పరిణమించి, సుస్థిర సమాజమును రూపొందింపజాలక పోవుటవలన వానియందు ప్రజలకు నామమాత్ర గౌరవమే కడకు మిగిలెడు దురవస్థ ఘటిల్లినది. ఇక యూరప్‌న అటుల గాక సమాజమున సృజనశక్తి పెంపొందుటవలన నూతన భావప్రేరితమగు సంఘవ్యవస్థ రూపొందుటకు మతము

తగురీతిగ సహకరింపలేక పోవుటచేత దాని ప్రాముఖ్యము క్రమముగ సన్నగిలినది. కాని, ఈ పరిణామము ఒక్క పెట్టున జరుగలేదు. కాలక్రమమున వివిధ సంఘటనలు ఇందులకు తోడుపడి దానిని రూపొందించినవి.

ఈ యుగారంభమున లూథర్ [చూ. సం. 7 - పు. 665] నాయకత్వమున ప్రొటెస్టంట్ వాదము క్రైస్తవమతమున తలయెత్తి, పోప్‌నకుగల అధికారములను నిరసించి, ప్రజాభిప్రాయమును, కొందరు ప్రభువుల మన్ననను ఆకర్షింపగలిగిన విషయము ఇదివరలో తెలుపబడినది [చూ. పు. 129]. అంతట క్రైస్తవ మతము పేరిట యూరప్‌న - అందును ముఖ్యముగ జర్మనీలో - యుద్ధములు - ఇదివరలో పేర్కొనబడిన ముప్పది సంవత్సరముల యుద్ధము మొదలగునవి - చెలరేగినవి. కడకు ఈ యుద్ధములవలన ప్రొటెస్టంట్ వాదము సరియైనదా? లేదా రోమన్ కేతలిక్ వాదము సరియా? అను విషయము తేల లేదు సరికదా, ఆ యా రాజ్యములలో రాజులు అనుసరించు మతమే ఆదరణీయమను అర్థరహిత నిర్ణయము జరిగినది. ఈ నిర్ణయమువలన మేలుకన్న కీడే ఎక్కువగ సంఘటిల్లినది. రాజానుమతము కాని క్రైస్తవమత శాఖను ఆదరించినవారికి ఆ రాజు రాజ్యమున వసించుటకే ఆస్కారము లేకపోయినది. వారు తమ విశ్వాసములను మార్చుకొన నిరాకరించుచో వారు సజీవముగ దహనము చేయబడుటయో లేదా వేరు విధముగ హింసింపబడుటయో జరిగెడిది. ఇట్టివి 16, 17 శతాబ్దుల యూరప్‌న ఘాతుక కృత్యములుగ భావింపబడెడివి కావు.

ఈ మతవాద ఛాందసము అంతటితో ఆగినది కాదు. ఒకే ఒక పోప్‌ను అనుసరించువారగుటవలన రోమన్ కేతలిక్‌లలో సంప్రదాయ భేదములు లేకున్నను, పీఠాధిపతిగ ఎవనిని అంగీకరింపని ప్రొటెస్టంట్‌లలో మాత్రము విభిన్న సంప్రదాయములు ఏర్పడి, ఆ సంప్రదాయముల మధ్య వైమనస్యములు పొడమి తీవ్ర పరిణామములకు దారితీయుటయు జరిగినది. ఇంగ్లండు ప్రొటెస్టంట్ దేశమే అయినను, అచటి ప్రొటెస్టంట్‌లలోనే నాన్‌కన్‌ఫర్మిస్ట్‌లు అనబడు వేరొక సంప్రదాయము రూపొందినది. వీరి మతాచరణ విధానము ఇంగ్లండును పాలించు ప్రొటెస్టంట్ ప్రభువునకును, దేశమునందలి అత్యధిక ప్రజానీకమునకును నచ్చనందున, ఆ నాన్‌కన్‌ఫర్మిస్ట్‌లు దేశమును వీడి పోవలసిన పరిస్థితి ఏర్పడెను. వీరిలో పలువురకు చెవులు కోయబడుట, కొరడాలచే కొట్టబడుట, విపరీతములగు జరిమానాలను చెల్లించుట, కారాగారమున దీర్ఘకాల వాసము మొదలగు శిక్షలు విధింపబడినవి. కడకు ఇట్టి వారిలో ఒక వర్గము ఈ బాధలనుండి విడివడుటకై 1620 లో దేశమును విడిచి పడవలపై విశాల సముద్రమున పయనించి, ఉత్తర అమెరికా తూర్పు ప్రాంతమునకు చేరి అట వలసలు నెలకొల్పినది. ఈ వర్గము వారికే యునైటెడ్ స్టేట్స్ చరిత్రలో 'యాత్రిక జనకులు (పిల్‌గ్రిమ్ ఫాదర్స్)' అను వ్యవహారము కలదు. కాని, ఇటుల తమ ధార్మిక భావనలయందలి పట్టుదలవలన మాతృభూమిని వదలి కష్టములపాలైనవారు సైతము మతాంధతలో తక్కినవారికి తీసిపోయెడివారు కారు. తమ వెనువెంటనే అమెరికా ఖండమునకు వలస వచ్చిన వేరొక బ్రిటిష్ దళమువారు తమ సంప్రదాయమునకు చెందినవారు కాదను నెపముతో వారిని తమ వలస ప్రాంతమున నివసింపనిచ్చుటకు యాత్రికజనకులు అంగీకరింపకుండిరి.

ప్రొటెస్టంట్ మతము నెలకొల్పబడుటకు ముఖ్యకారణము అప్పటిలో పోప్‌లందు బయలుదేరిన లౌకిక సుఖలాలసత. ఈ లాలసతను నిరోధించి, మతపీఠపు వ్యవహారములను చక్కబరచిన జాలుననియు, పోప్ పీఠముపైననే తిరుగుబాటు జరిపి వేరొక సంప్రదాయమును నెలకొల్పవలసిన అవసరము లేదనియు భావించిన క్రైస్తవ సాధుజనులును కొందరు ఆ కాలమున ఉండిరి. వారిలో ఎరాస్మస్ అను డచ్చి పండితుడును, తామస్ మూర్ అను బ్రిటిష్‌జాతీయుడును ప్రముఖులు. వీరిరువురును క్రైస్తవ మత సంస్థలోని లోపములను విమర్శించి, వానిని తొలగించు మార్గములను సూచించుచు పెక్కు గ్రంథములను రచించిరి; కాని, ప్రొటెస్టంట్ సంప్రదాయము ప్రత్యేకముగ రూపొందుటను మాత్రము నిరసించిరి. కడకు ఇట్టి తన చర్యవలన రాజాగ్రహమునకు పాలై మూర్ మరణశిక్షకు లోనయ్యెను. ఇట్టివారి కృషివలన రోమన్ కేతలిక్ సంప్రదాయమున కొన్ని సంస్కరణలను ప్రవేశపెట్టవలసిన ఆవశ్యకత గుర్తింపబడినది. ఇట్టి సంస్కరణోద్యమమునకు ఫలవంతమగు రూపమును కల్పించినవాడు లయోలా (1491 - 1556) [చూ. సం. 10 - పు. 656]. ఇతడు స్థాపించిన జీసస్‌సంఘపు సభ్యులకే 'జెసూట్‌లు' అను పర్యాయనామము ఏర్పడి, అది రూఢతను ఆర్జించినది. ఈ జెసూట్‌లు సుశిక్షితులు, క్రమశిక్షణాపరులు, దక్షులు నగు మత ప్రచారకులుగ పేరొందిరి. స్పెయిన్, పోర్చుగల్ సామ్రాజ్యములలో వీరు క్రైస్తవ మత వ్యాప్తికై విపరీతపు కృషిని సాగించిరి. ప్రాచ్య దేశములందు వారి కృషి అంతగ ఫలవంతము కాక పోయినను దక్షిణ అమెరికాలో ఆదిమజాతులందును,

మిశ్రజాతులందును విద్యా సంస్కారాదులును, వృత్తి కుశలతయు వ్యాపించుటకు వీరు కారణభూతులయిరి. కొన్ని యెడల ఆదిమజాతుల శ్రేయమునే ముఖ్య లక్ష్యముగ ఇడుకొని వీరు స్పెయిన్ పాలకులనే ప్రతిఘటించిరి. ఇటుల మానవాభ్యుదయమునకు తమకు తోచిన రీతిలో క్రమబద్ధ కృషి సాగించిన జెసూట్‌లు మతఛాందసమునందును, పరసంప్రదాయముల ద్వేషించుటయందును తక్కిన అన్ని సంప్రదాయములవారిని తలదన్నిరి. ఇటుల ఒక సంప్రదాయమును వేరొక సంప్రదాయము ద్వేషించుచు, తమ ప్రతిస్పర్థులను అంతమొందించుటయే తమ లక్ష్యముగ ఇడుకొనుటవలన క్రమముగ క్రైస్తవ మత ప్రాతిపదికలగు ప్రేమ, కారుణ్యములకు అందు తావే లేకుండు దురవస్థ ఏర్పడినది. అందువలన ఇట్టి మతము మానవ సమాజమును సువ్యవస్థితము చేయగలదా యను సందేహము యూరప్‌నందలి పలువురు ధీమంతులకు కలిగినది. ఇట్టి పరిస్థితులలో విజ్ఞానశాస్త్ర వికసనమువలన వ్యాప్తిచెందిన హేతువాదము కొంతవరకు ఆ ఖండమునకు సాయపడి, మనుజుల ఆలోచనలను వేరు మార్గమునకు మరలించినది. ఇందులకు జాతీయవాదమును తోడ్పడినది. నిర్దిష్టభాషా, భౌగోళిక ప్రాంతములకు చెందిన ప్రజలు ఒక జాతివారనియు, ఆ జాతి తక్కిన జాతులను అధిగమించి పేరు గడించుటకు అందలి ప్రతి పౌరుడును కృషిచేయవలయుననియు పేర్కొను జాతీయతకు యూరప్‌న ఆదరము లభించుటతో క్రమముగ మత విద్వేషములు మొదలగునవి వెనుకదారి పట్టినవి.

**హేతువాద వికసనము :** కాని, అన్నింటికన్న మిన్నగ మతాధికారపు పునాదులను సడలించినది హేతువాద వికసనము. విజ్ఞాన శాస్త్రాభివృద్ధికి దోహదకారి అయిన ఈ హేతువాదము ధార్మిక భావనయందును ప్రవేశము కల్పించుకొనుటతో ఆ భావన పదునేడవ శతాబ్దిలో రెండు విభిన్న శాఖలుగ చీలినది. ఇందు మొదటిది దైవవాదము (డీ ఇజమ్); రెండవది లౌకికవాదము. ఇందు తొలుతటిది ఇంగ్లండుదేశమునందలి కొందరు హేతువాదానుసారులగు పండితులచే రూపొందింపబడి తక్కిన యూరప్‌న వాల్ టెయిర్ (1694 - 1778) [చూ. సం. 6 - పు. 775], రూసో (1712 - 1778) [చూ. సం. 10 - పు. 651] అనువారలచే ప్రబల ప్రచారమును పొందినది. క్రైస్తవ మతమున హేతువాదమునకు విరుద్ధమగు దానికి స్వస్తి చెప్పి, దానికి నైతిక సూత్రముల ప్రాతిపదికపై ప్రాబల్యమును సమకూర్ప వీరు యత్నించిరి. మత భావనతో వైజ్ఞానిక భావనను, తార్కికగతితో నైతికపు విలువలను జోడించి సమన్వయతను సాధించుట మానవుని ఆదర్శముగ వారు విశ్వసించి, దానికి ప్రచారమును కల్పించిరి. ఈ దైవవాదమును జర్మనీలో రీ మరస్ (1694 - 1768), లెస్సింగ్ (1729 - 1781) అను వారలు విపులవ్యాప్తిలోనికి తెచ్చిరి. [చూ. సం. 7 - పు. 665] ఈ భావన పలు దార్శనిక వాదములకును దారితీసినది. అట్టి దార్శనికులలో స్పినోజా (1632 - 1677) [చూ. సం. 7 - పు. 762), కాంట్ (1724 - 1804) [చూ. సం. 7 - పు. 342] ప్రముఖులు. ఇందు తొలుతటి పండితుడు రాజనీతి, నయశాస్త్ర, మత భావనలను గురించి పలు గ్రంథములను రచించుటయే కాక, దృశ్యమానమగు ప్రపంచమున కన్పట్టు వివిధ వైరుధ్యముల మధ్య సమన్వయతను సాధించు జీవిత విధానము మానవునకు ప్రకృతి పరమేశ్వరులతో పొరపొచ్చెమును ఎరుగని మేళనమును సమకూర్చునని ప్రవచించెను. జ్ఞానము యొక్క పరిమితావధులను గురించి కాంట్ పండితుడు చర్చించి తన్మూలమున భౌతికవాద, నాస్తికవాదముల ఖండించి, స్వాతంత్ర్య నైతిక నియమముల ఉనికికి ఆధారభూతమగు పరమేశ్వర భావనకు ప్రచారమును కల్పించెను. ఆ తరువాత వచ్చిన దార్శనికులలో హెగెల్ (1770 - 1831) [చూ. సం. 7 - పు. 776] ముఖ్యుడు. చరిత్ర, తర్కశాస్త్రము, కళాభ్యుదయము, మత వికసనము మొదలగు వివిధ విషయములను చక్కగ మేళనముచేసి, ఒక దార్శనిక వాదమును అతడు రూపొందించెను. బాహ్య పరిస్థితులును, మానసికానుభూతులును ఒకే ఒక రూపపు వికృతులనియు, వీని గమ్యస్థానము పరమేశ్వరుడని వ్యవహరింపబడు నిరుపాధిక భావనయే అనియు అతడు ఉద్ఘోషించెను. సృష్టిపరిణామగతి మూడు ఘట్టములను అనుసరించి పదింబదిగ పురోగమించుచున్నదని అతడు నుడివి, ఆ ఘట్టములను-1 . యోజన (థీసిస్), 2. ప్రతియోజన (ఆంటీథీసిస్), 3. సంయోజన (సింథెసిస్) అని వ్యవహరించెను. ఒక ప్రత్యేక కాలపు పరిస్థితిని ' యోజన ' గ గ్రహించితిమేని కాలక్రమమున ఆ యోజనకు ప్రతికూలములగు కొన్ని సంఘటనలు (ప్రతియోజనలు) రూపొందుననియు, కడకు ఆ రెండింటి సామరస్య ఫలితముగ సంయోజన తటస్థించుననియు, ఆ సంయోజనయే తరువాతి గతికి ' యోజన ' గ ఉపకరించుననియు, సృష్టిక్రియ ఇటులే సాగుచున్నదనియు హెగెల్ పేర్కొనెను.

ఈ విధముగ క్రైస్తవమత బాహ్యాచారములకును, సంస్థాగతసంప్రదాయములకును దూరమయ్యును, పరమేశ్వర భావనకు ప్రతిపత్తి కల్పించిన ఈ వాదములకు ఒక సామాజిక రూపమును కల్పింప యత్నించినవాడు టాల్

స్టాయ్ (1828 - 1910) [చూ. సం. 6 - పు. 691]. న్యాయయుతమగు సామాజిక వ్యవస్థను రూపొందించుటకు క్రైస్తవ మత మూల భావనలు చేయగల సాయమును ప్రస్ఫుటము చేసి, ఆ మతమున తావు కల్పించుకొనిన దాంభికాచారములను, సంప్రదాయములను, సమాజ శ్రేయ వ్యతిరేక భావనలను అతడు నిరసించెను.

దైవవాదము వలెనే హేతువాద వికసనమువలన రూపొందిన వేరొకశాఖ అగు లౌకిక వాదమునకు మూల పురుషునిగ రెనే డేకార్ట్ (1596 - 1650) [చూ. సం. 7 - పు. 656] ను పేర్కొన వచ్చును. ఫ్రెంచి జాతీయుడగు ఈ పండితుడు పరమేశ్వరాస్తిత్వమును అంగీకరించినను, బుద్ధివాదమునకు తన రచనలలో ఎక్కువ ప్రాముఖ్యమును కల్పించెను. ఇతని తరువాత ఈ బుద్ధివాదము ఎక్కువగ పరిణతిని పొంది పలువురు యూరపియన్ పండితులలో అజ్ఞేయతావాదమునెడ ఆదరణను కల్పించినది. భగవదస్తిత్వ నాస్తిత్వములతో ప్రసక్తి పెట్టుకొనక దృశ్యమగు సమాజపు ఉనికినే ప్రాతిపదికగ గ్రహించి విషయ పరిశీలనను చేయుట ఈ వాదపు ముఖ్యలక్షణము. ఇది క్రమముగ ఆగస్ట్ కాన్ట్ (1798 - 1857) [చూ. సం. 7 - పు. 364; సం. 10 - పు. 289] ప్రవచితమగు ప్రత్యక్ష జ్ఞాన ప్రాధాన్యవాదమునకు దారితీసినది. ఇటుల భగవదస్తిత్వముతో నిమిత్తము లేకుండ సామాజిక వ్యవస్థకు చేకూరు ప్రయోజనముల దృష్టితోనే మానవుడు తన ధార్మిక భావనను ముడివేయ యత్నించిన ఫలితముగ క్రమముగ సత్తావాదము (పాజిటివిజమ్), ఉపయోగితావాదము (యుటిలిటేరియనిజమ్), ఉదారవాదము (లిబరలిజమ్), సమాజవాదము (సోషలిజమ్), కమ్యూనిజమ్ మొదలగునవి రూపొందినవి. లోకాతీత వస్తువుతో ఎట్టి ప్రమేయములేని సంఘ వ్యవస్థయే వీని అన్నింటి ధ్యేయ విషయము అగుటవలన ఈ యుగపు సంఘ వ్యవస్థను గురించి పరిశీలించు సందర్భమున మాత్రమే వానిని దిఙ్మాత్రముగ ప్రదర్శించుట సమంజసము కాగలదు.

యూరప్‌న రూపుగొనిన పై వివిధ దార్శనిక, సామాజికవాదములును అమెరికా ఖండమునందును భాషా సాన్నిహిత్యాదుల వలన తోడ్తోడ వ్యాపించి, అందు తమ ప్రభావమును నెరపినవి. ఆఫ్రికా, ఆసియా ఖండములకు మాత్రము పై వాదములతో ఎట్టి పరిచితియు 19 వ శతాబ్ది ఆరంభమువరకు ఏర్పడలేదు. ఆ ఖండములందలి దేశములలో ముస్లిమ్ దేశములందు మత ఛాందసమునకు తోడుగ సున్నీ, షియా విభేదములును ఈ యుగారంభమున వికృత రూపములను పొందినవి. సున్నీశాఖకు ఓటోమన్ ప్రభువులును, షియాశాఖకు పారసీక పాలకులగు అబ్బాసీయులును నాయకత్వము వహించిరి. ఆ కాలమున భారతదేశమున అక్బర్ [చూ.] చక్రవర్తి సర్వమత సామరస్యమును సాధించి సుస్థిర సమాజమును రూపొందించుటకు కృషి చేసి విఫలుడయ్యెను. కాని, తొలుతటి మొగల్ ప్రభువుల కాలమున ఏవియో కొలది అపవాదములతో మత సామరస్యము నెలకొనగలిగినను ఔరంగజేబు సంకుచిత దృష్టి వలన అందులకు లోపమేర్పడి, తన్మూలమున ఆ సామ్రాజ్య స్థైర్యమునకే భంగము కలిగినది. 18 వ శతాబ్ది మొదలుగ పాశ్చాత్య విజ్ఞానము ఆసియా యందలి పలు ప్రాంతములకు జొరబడుటతో ప్రాచ్య దేశములందును తమ పూర్వ మతములను నూతన పరిస్థితులకు అనువుగ సంస్కరించు సంకల్పము అటనట కొందరు ధీమంతులందు అంకురింప మొదలిడినది. ముస్లిమ్ ప్రపంచమునకు సంబంధించినంత వరకు అట్టి వానిలో తొలుతటిది వాహబీ ఉద్యమము. దీని మూలపురుషుడు అరేబియా వాసియగు మహమ్మద్ ఇబ్న్ అబ్ద్ అల్ - వాహబీ (ర. 1703 - 1791). ఇస్లామ్‌ను క్రీ. శ. 950 నాటికి పూర్వమున ఉన్న రూపమునకు కొని పోవుట ఈ ఉద్యమపు సంకల్పము. ఒక విధముగ దీనిని కాలమునకు ఎదురీత అని చెప్పవచ్చును. అందువలన అది సఫలతను చెందలేదు. వాహబీ ఉద్యమము భారతదేశమున అంతకు ముందే అట ప్రచారమున ఉన్న షా వలీ అల్లా అను పండితుని బోధనలతో మిళితమై, కొంత వ్యాప్తి లోనికి వచ్చినది. ఈ ఉద్యమపు ఫలితముగనే ఖురాన్ తొలుతగ ఉర్దూలోనికి తర్జుమా చేయబడినది. 1857 మొదలుగ దీనిచే ప్రభావితులైన ఉలేమాలు ఖురాన్ ప్రబోధములను పాశ్చాత్య విజ్ఞాన శాస్త్రముల దృష్టితో చర్చించుటను నిరసించిరి. తత్ఫలితముగ వైజ్ఞానిక విద్యకు ముస్లిమ్‌లు దూరమగుటయు, ఇస్లామ్ మతవిద్యయందు సమకాలీన విజ్ఞాన శాస్త్రముల ప్రభావము మృగ్యమగుటయు సంభవిల్లినవి. ఆ తరువాత వచ్చిన సంస్కర్తలలో జమాల్ అల్ - దీన్ అఫ్ఘానీ (1839 - 1897) గణనీయుడు. ఇస్లామ్ నందలి స్వచ్ఛతకు భంగము కలుగనీయక, అందు చేరిన చెడ్డ సంప్రదాయముల నిరోధించి, ముస్లిమ్ సమాజపు స్వాతంత్ర్య, ఆర్థిక సుస్థిరతలను తిరిగి నెలకొల్పుటకు అనువుగ పాశ్చాత్య విజ్ఞానమును అవలంబించుట ముస్లిమ్‌ల విధి అని అతడు ప్రబోధించెను. ఈ ఉపదేశములు ఉదాత్తములే అయినను వీనివలన సద్యఃఫలితము అరబ్బీ దేశములలో గాని, ఓటోమన్ సామ్రాజ్యమున గాని ఎట్టిదియు - పరిగణనీయమగునంతగ - కలుగలేదు.

హిందూ మతమున 19 వ శతాబ్ది మొదలుగ పలువురు సంస్కర్తలు నూతన పరిస్థితులకు అనువుగ మార్పులను

కొనితెచ్చుటకు యత్నించిరి. అట్టివారిలో తొలుతటివాడు రామమోహనరాయ్ (1772 - 1833) [చూ. సం. 7 - పు. 652; సం. 10 - పు. 647]. క్రైస్తవాది మతములతో అతనికి కలిగిన పరిచితివలన అతడు ఏకేశ్వరోపాసనము మాత్రమే అవలంబించుదానినిగ హిందూ మతమును సంస్కరించ దలచి, అందులకు ఉపపత్తిని కల్పించు కొన్ని ఉపనిషత్తులను ప్రమాణముగ గ్రహించి 'బ్రహ్మసమాజము' అను సంస్కరణ సంప్రదాయమును నెలకొల్పెను. కాలముల తరబడి హిందూమతమున నెలవును కల్పించుకొనిన సహగమనము [చూ. సం. 10 - పు. 765] వంటి దురాచారములను నిర్మూలించు శాసనములను చేయుటకు ప్రభుత్వమును అతడు ప్రోత్సహించెను. అతని అనంతరమున, దేశీయ సంస్కృతియే ఆధారముగ దయానంద సరస్వతి (1824 - 1883) [చూ. సం. 7 - పు. 458] 'ఆర్యసమాజము' అను పేర వేరొక సంస్కరణోద్యమమును ప్రవేశ పెట్టెను. ఇస్లామ్ నందు వాహాబీ చేసిన కృషివలెనే ఇతడు హిందూమతమునకు తొలుతటి వైదిక కాలపు రూపమును కల్పించి, విగ్రహారాధన [చూ. సం. 7 - పు. 682] ను అంతరింపజేయుటకు కృషిచేసెను. ఈ బ్రహ్మసమాజ, ఆర్యసమాజముల వాదములు పలువురు విద్యావంతుల దృష్టిని ఆకర్షించి, పాశ్చాత్య విజ్ఞాన వ్యాపనముచేత తమ మతమునెడ విశ్వాసము సడలిన వారికి మరల ఆత్మవిశ్వాసమును కల్గింప గలుగుట నిజమే అయినను, హిందూ ప్రజానీకమున సర్వసామాన్య వ్యాప్తిని పొందలేకపోయినవి. తొలుతటి నుండియు విభిన్నారాధనల సమన్వయ రూపమునకు అలవాటుపడిన ఆ ప్రజానీకమున ఇట్టి సంస్కరణలు తావు కల్గించుకొనుటకు అవకాశము కలుగకుండినది. ఈ పరిస్థితిలో సాంప్రదాయికముగ భారతదేశమున వచ్చు సర్వమత సమానాదరణ బుద్ధిలోని ఉత్కృష్టతను తెలియజేసి, హిందూమతానుయాయులకు భావి మార్గమును సూచింపగలిగినవాడు రామకృష్ణ పరమహంస (1836 - 1886) [చూ. సం. 7 - పు. 651]. ఈయన శిష్యుడు వివేకానందుడు (1862 - 1902) [చూ. సం. 7 - పు. 690] హిందూ మతపు ఉత్కృష్ట రూపమగు వేదాంతమతము నందలి విశ్వజనీనతను ప్రపంచపుదృష్టికి తెచ్చుటయేగాక, ఆధునిక యుగమున హిందువులు తమ జాతి మతముల ఉన్నతికిని, విశ్వకల్యాణమునకును అనుసరించవలసిన మార్గమును రూపొందించెను. ఆ తరువాత హిందూమతమునందలి ఈ ఉన్నత భావములకు కార్యాచరణ రూపమును సూచించి, ఆ మతమునందలి అస్పృశ్యతాది దుష్టాచారముల నిర్మూలించుటయే కాక సత్యాహింసాయుత సమాజ స్థాపనకై కృషిచేసినవాడు మహాత్మాగాంధీ అని వ్యవహృతుడగు మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ [చూ.] ధార్మిక భావనను రాజకీయములకు జోడించి మానవ సమాజమును ఉన్నతస్థాయికి కొనిపోవుటకు అతడు కృషిచేసెను.

తక్కిన ప్రాచ్యదేశములలో ఈ యుగమున మతమునకు సంబంధించిన విప్లవకర పరివర్తనలు ఏవియు సంఘటిల్లలేదు. కాని, అట పూర్వమతముల పరిధవము క్రమముగ సన్నగిల్లి, వానియెడల వైముఖ్యము వ్యాపించినది. జపాన్‌లో జాతీయ మతమగు షింటోమతము బౌద్ధమతమును లోజేసికొని ఈ యుగమున ముందునకు వచ్చినది. ఇదియే క్రమముగ చక్రవర్తియెడల గల విపరీత భక్తిని ఆలంబనముగ కలిగిన జాతీయ దురహంకారతావాదముగ పరిణమించినది.

చీనాదేశమున కాంగ్‌యూవీ (1856 - 1927) అను దార్శనిక పండితుడు, సనాతన కన్‌ఫ్యూషియన్ వాదమునకు ఒక నూతన వ్యాఖ్యానమును రూపొందించి పాశ్చాత్య భావనలకు అనుగుణములగు పరిపాలనా పద్ధతులకు ఆ వ్యాఖ్యాన మూలమున బలమును చేకూర్చి, దానిని ప్రచారమునకు తెచ్చుటకు కృషిచేసెను. కాని, అతని కృషి ఫలవంతము కాలేదు.

## సంఘ వ్యవస్థ

పూర్వయుగమునందు సంఘ వ్యవస్థపై మతమునకు చేకూరిన అధికారము క్రమక్రమముగ ఈ సామ్రాజ్యయుగమున దిగజారినది. అటులని ఈ మార్పు ఒక్క పెట్టున ప్రపంచమంతట సంఘటిల్లినదని చెప్పుటకు వలనుపడదు. మానవుని విజ్ఞానము సర్వతోముఖముగ విజృంభించిన కొలది హేతువాదమునకు జత కుదురని మతవిశ్వాసము లందు నమ్మకము సన్నగిలినది. సంఘ వ్యవస్థను దిటవుగను, మానవునికి సౌఖ్యదాయకముగను ఉంచుటకు అనువగు యంత్రాంగమును గురించిన నూతన అభిప్రాయములు మానవునిలో జనించి, విశాలవ్యాప్తిని సాధింప మొదలిడినవి. సంఘ వ్యవస్థను గురించి మానవునిలో ఈ యుగమున కలిగిన ఈ భావపరిణామపు చరిత్రను సౌకర్యార్థము నాలుగు దశలుగ విభజించి పరిశీలించుట యుక్తము. ఇవి : 1. మొదటిదశ (1522 - 1776); 2. రెండవదశ (1777 - 1848); 3. మూడవదశ (1849 - 1918); 4. నాలుగవదశ (1919 - 1945).

మొదటి దశ: పోర్చుగీస్, స్పానిష్ నావికుల సాహస పూరిత కృషివలన ప్రపంచమునందలి వివిధదేశములమధ్య

ఏదియో విధముగ కొంతపరిచితి ఈ దశలో మొదలై, క్రమక్రమముగ విస్తృతి చెందినది; కాని, మానవ సంఘ వ్యవస్థలో తొలుత ఇది ఎట్టి విప్లవాత్మక పరిణామములను కొనిరాలేదు. 16 వ శతాబ్దమున నాగరక ప్రపంచ మంతయు - ప్రాచ్యదేశములందేమి, పశ్చిమదేశములందేమి - మతాచార్యవర్గము, సైనికవర్గము, వర్తకవర్గము, శ్రామికవర్గము అను నాలుగు వర్గములుగ విభక్తమై ఉండినదని స్థూలముగ చెప్పవచ్చును. కాని, ఇందు సైనిక వర్గపు పలుకుబడియే అన్నింట ఎక్కువగ ఉండినను, వర్తక వర్గము కూడ అంతటంతట క్రమముగ పైకి రాగలుగుట - ముఖ్యముగ పశ్చిమ దేశములందు - ఆ కాలముననే మొదలైనది. ఇందుతోపాటుగ సంఘవ్యవస్థను దిటవుగ ఉంచుటకు ఆనాటి పాలకులందరును తరతమ భేదములతో మతమును ఊతగ గ్రహించిరనియు చెప్పవచ్చును. కాని, మతమును ఇటుల ఉపయోగించుకొనుటలో స్థానిక పరిస్థితులను అనుసరించి ఒక్కొక్క రాజ్యము ఒక్కొక్క మార్గమును అనుసరించినది. ఆ యా విభిన్న పద్ధతులను ఇట సాకల్యముగ చర్చించ అవకాశములేదు. కాని, అట్టివానిలో ఒక విచిత్ర నూతన మార్గమును అవలంబించిన ఓటోమన్ పాలకుల పరిపాలనా వ్యవస్థ మాత్రము ఇట కొంత విపులముగ పేర్కొనదగినది.

నిష్పక్షపాత వైఖరియు, సమర్థతయు పరిపాలనాధికారులకు ఉండవలసిన ముఖ్యలక్షణములనుటను ఓటోమన్ పాలకులు గుర్తించిరి. అట్టి అధికారులుగ నియమింపబడువారికి శైశవమునుండియు తగు శిక్షణ ఈయవలసి ఉండుననియు వారు భావించిరి. అందులకై తమ పాలిత ప్రజలలో ముస్లిమ్‌లనుండియు, ముస్లిమేతరులనుండియు మంచి లక్షణములు కల కొందరు శిశుపులను సుల్తాన్‌లు నిర్బంధముగ సేకరించెడివారు. అంతేకాక బానిస వ్యాపారుల వద్దనుండియు కొందరు శిశువులను వారు కొనుగోలు చేసెడివారు. ఈ శిశువులకు ఇస్లామ్‌మత విధిని అనుసరించి క్రమశిక్షణాదులను బోధించి పెద్దవారగువరకు తగు తరిఫీదును ఇచ్చెడివారు. వీరు సైనిక శిక్షణను పొందుటయేకాక, వేరుగ ఏదియో ఒక వృత్తియందును కుశలతను ఆర్జించెడివారు. ఇటుల సుశిక్షితులగు వీరిలో దేహదార్ఢ్యము కలవారికి సుల్తాన్ తన సైన్యమున ఉద్యోగములను కల్పించెడివాడు. ధీమంతులగువారికి పౌరపాలనా శాఖలందును, దౌత్యశాఖలందును ఉద్యోగములు ఈయబడెడివి. తల్లిదండ్రులతో గాని, బంధువులతో గాని ఎట్టి సంబంధమును లేక సుల్తాన్ సహాయమే దిక్కుగ చిన్నతనమునుండియు పెరిగి, మత - లౌకిక విద్యలందు ప్రవీణులైన ఇట్టి ఉద్యోగులు సుల్తాన్‌నందు భక్తిశ్రద్ధలు కలిగి వ్యవహరించుటయే కాక, నిష్పక్షపాతముగ తమ విధులను నిర్వహించి, మతధర్మ, రాజ్యవ్యవస్థా రక్షణమునకై వంచనమెరుగక కృషి చేయగలరని ఆనాటి ఓటోమన్ పాలకులు ఆసించిరి. బానిసతనమును ప్రోత్సహించు ఇట్టి ఏర్పాటు మానవుని పురోగతికి ఒక అడ్డంకియనుట నిజమేయైనను, ఓటోమన్ సామ్రాజ్యము పటుత్వము కోల్పోకుండ చాలకాలము మనుటకు ఈ ఏర్పాటు కొంతవరకు కారణభూతమైనదని అంగీకరింపకతప్పదు. కాని, కాలక్రమమున ఈ ఏర్పాటులో మార్పులు జరిగి, బానిసలకు బదులుగ తమ బిడ్డలనే సేనాపతులు, రాష్ట్రపాలకులు మొదలగువారు ప్రముఖోద్యోగములలో చేర్చుటకు తమ పలుకుబడిని వినియోగించుటవలన పరిపాలనావ్యవస్థలోని పటుత్వము సన్నగిలినది. అంతట 19 వ శతాబ్ది మొదలుగ సమర్థతకు బదులుగ, పరువపు పుట్టుకయే ఆ సామ్రాజ్యమున ఉద్యోగార్హతగ పరిణమించి, సామ్రాజ్య వినాశమునకు త్రోవ చూపినది.

ఇక ప్రాచ్యదేశములందు చీనాలో పూర్వకాలపు పరిపాలనా విధానమే ఈ కాలమునను కొనసాగినది. కుబ్లయ్ ఖాన్ వంటి మంగోల్ ప్రభువులను సైతము ఆ చీనాదేశ సంస్కృతి లోగొనగలుగుటయేకాక, మంగోల్‌లు, మంచూల్‌లు మొదలగు విదేశీయులను తనలో లీనమొనర్చుకొని తన సంఘ వ్యవస్థను చెక్కు చెదరకుండ కాపాడుకొనగలిగినది. పోటీ పరీక్షలవలన ఉద్యోగులను నియమించు పూర్వసంప్రదాయమునే ఈ కాలపు ప్రభువులును పాలించినను, పై వర్గములలోని వారలలో ఆశ్రిత జన పక్షపాతము, పదవీకాంక్ష మొదలగునవి క్రమముగ తావుకల్పించుకొనినవి. జపాన్‌న ఒకవిధమగు భూస్వామి విధానము పరిపాలనా వ్యవస్థను తన గుప్పిటిలో ఉంచుకొనినది. పేరునకు చక్రవర్తియే దేశమునకు పాలకుడైనను, ఈ భూస్వాములు అతిబలవంతులై తమ మండలములందు దాదాపుగ సర్వస్వతంత్రులై ఉండిరి. అయినను చక్రవర్తి యెడల మన్ననయు, దేశపు ఐక్యమున గాఢతరాసక్తియు ఈ భూస్వాముల ముఖ్య లక్షణములు అగుటచే, దేశమున సంఘ వ్యవస్థ దిటవుగ మనగలిగినది. భారతదేశమునందలి క్షత్రియులవలెనే ఈ జపాన్ భూస్వాములును 'బుషిడో' అని వ్యవహరింపబడు క్షాత్ర ధర్మమును అవలంబించి, అందు సుశిక్షితులై దేశ గౌరవమునకై కృషిచేయుచుండెడివారు.

భారతదేశమున 14 వ శతాబ్ది మొదలుగ హిందూ - ముస్లిమ్ మత సంస్కృతుల మేళనమువలన ఒక నూతన సంఘ వ్యవస్థకు ఆవశ్యకత కలిగినను, దానికి సఫలతను

చేకూర్చు నాయకత్వము ఆనాడు మృగ్యమైనది. ఈ రెండు మత సంస్కృతులలోని ఉత్తమాశయములకు భంగము కలుగని రీతిలో మతప్రసక్తినుండి కొంతవరకు వైదొలగిన పరిపాలనా వ్యవస్థను రూపొందించుటకు అక్బర్ చక్రవర్తి కొంత కృషి చేసినను అది విఫలతను పొందినది. ఆ తరువాతి పాలకులలో - ముఖ్యముగ ఔరంగజేబు కాలమున - ఇస్లామ్ మతప్రాతిపదికపై పరిపాలనా వ్యవస్థకు రూపొసంగు యత్నము జరిగినది. అది సఫలతను పొందకపోగా 18 వ శతాబ్ది ఆరంభమున సామ్రాజ్యపు మనుగడకే అంతరాయమును కల్పించినది. కాని, ప్రాచీనకాలమునుండియు కులములను ఆశ్రయించి మనిన వృత్తులపై ఆధారపడి ఉండిన సాంఘిక వ్యవస్థ ఏదియో ఒకతీరుగ నిలద్రొక్కుకొని మనుగడను సాగించినది. వర్ణవిచక్షణను ఎరుగని ఇస్లామ్‌మతమును అవలంబించినవారు సైతము కొలది అపవాదములతో తమ పూర్వపు వృత్తులనే అవలంబించి వ్యవహరించెడివారు. అందువలన సంఘజీవనము ఎక్కువ ఒడుదొడుకులకు లోనుకాకపోవుట నిజమే అయినను, సృజనశక్తిని చాలవరకు కోల్పోయినది.

16 వ శతాబ్ది మొదలుగ యూరప్ దేశములందు - ఇదివరలో పేర్కొనబడినటుల - మతప్రమేయము రాజకీయములందు విరివిగ కన్పట్టినను, క్రమముగ 17 వ శతాబ్ది మధ్యభాగమునకు జాతీయత ముందునకువచ్చి మతశాఖా విద్వేషమును చాలవరకు కనుమరుగుచేసినది. ఈ జాతీయత ఆనాటి యూరప్‌న రెండు వైఖరులుగ స్ఫుటరూపములను పొందినది. అందు తొలుతటిది రాజాశ్రితము; రెండవది ప్రజాశ్రితము. తొలుతటిదానికి లూయీ - XIV నాటి ఫ్రాన్స్‌ను, రెండవదానికి స్విజర్లండ్‌ను ఉదాహరణములుగ గ్రహింపవచ్చును. ఇంగ్లండునను, హాలండ్‌నను రాజరికముల ప్రతిపత్తికి భంగము కలుగకపోయినను, అట ప్రజానాయకుల పలుకుబడికి లొంగియే ప్రభుత్వము సాగవలసిన పరిస్థితి క్రమముగ ఏర్పడుటవలన వానిని కూడ ప్రజాశ్రితములుగనే లెక్కింపదగును. ఇటుల జాతీయతావాదము - భిన్న భిన్న వైఖరులను అవలంబించియు - యూరప్‌న - ముఖ్యముగ పశ్చిమ, ఉత్తర యూరప్ ప్రాంతములందు - వ్యాపించుటయే ఆ ప్రాంతపు దేశములు క్రమముగ ముందంజవేసి, ప్రపంచమునందలి తక్కిన దేశములను అధిగమించి పురోగమించుటకు ప్రథమ సోపానముగ ఉపకరించినది. ప్రాచ్యదేశములలో జపాన్‌న తప్ప తక్కిన వానియందు చైతన్యమయమగు ఇట్టి జాతీయవాదము రూపొందుటకు అవకాశములు లోపించినవి. భారతదేశమున అతి సనాతనకాలముననే నెలకొనగలిగిన సాంస్కృతిక ఐక్యము, ఇస్లామ్‌మతవ్యాప్తి మొదలుగ కల్లోలతను చెందుటవలన ఏక జాతీయత అట రూపొందలేకపోయినది. ఇటుల భారతదేశముననే కాదు, తాను వ్యాపించిన తక్కిన దేశములందును, అతిమాత్రపు మతాభినివేశమును రేకెత్తించి, జాతీయ భావమునకు ప్రతిబంధకముగ ఇస్లామ్ ఆ కాలమున వ్యవహరించినది. చీనాలో సనాతనకాలమునుండియు నిలిచి ఉండిన జాతీయభావము ఈ కాలమున సైతము చెక్కుచెదరక ఉండినను, నాగరకతాస్థాయియందు పరాకాష్ఠను తమదేశము అందుకొనకలిగినదను అంధవిశ్వాసము చీనా ప్రజలలో స్తబ్ధతను కల్పించి, పురోగతికి అడ్డంకిగ ఏర్పడినది. జపాన్‌న మాత్రము చక్రవర్తి నామమాత్రపు ఆధిపత్యమున భూస్వాముల అండదండలతో జాతీయత ప్రస్ఫుటరూపమును 16 వ శతాబ్దికే పొందగలుగుట నిజమే అయినను, యూరప్ దేశములందలి జాతీయత, జపాన్‌న రూపొందిన జాతీయతకన్న విభిన్నతను ఆర్జించి, పురోగమించి, ప్రపంచ చరిత్రయందు గణనీయములగు మార్పులను కొనివచ్చుటకు ఉపకరించిన కొన్ని నూతన భావములు ఆకాలమున యూరప్ దేశములందు సమకూడినవి. ఇవియే : 1. వాణిజ్యవాదము; 2. ప్రజాస్వామ్యవాదము. ఈరెండును ఆకాలపు జపాన్‌న లోపించినవి.

ఆ కాలపు యూరప్ దేశముల రాజకీయ వ్యవహార నిర్వహణకు జ్ఞాతముగనో, అజ్ఞాతముగనో ఒక విధమగు ప్రాతిపదికగ వ్యవహరించినదని రాజనీతిజ్ఞులలో పలువురచే భావింపబడు వాణిజ్యవాదమున అమూల్య ధాతువులను విరివిగ దేశమునకు సమకూర్చుటయే దేశ సంపదను వృద్ధి చేయుటయగునని భావింపబడినది. ఈ వాదపు ప్రభావమునకు లోనైన ప్రతిదేశమును తన దేశమునందలి తయారీవస్తువులను సాధ్యమైనంత భారీ ఎత్తున ఎగుమతి చేయుటకును, దిగుమతులను సాధ్యమైనంతగ తగ్గించుటకును, తత్ఫలితముగ చేకూరు వ్యాపారపు మిగులుదల (బేలన్స్ ఆవ్ ట్రేడ్) ను వెండి, బంగారముల రూపమున సేకరించుటకును అహమహమికతో కృషిచేసినవని స్థూలముగ చెప్పవచ్చును. ఈ కృషి సాధనలో విదేశీ వ్యాపారమునకును, జాతీయ పరిశ్రమలకును ప్రోత్సాహము విరివిగ లభించినది. ఇందులకు ఆనాటి యూరప్‌నందలి పరిస్థితులును బాగుగ అనుకూలించినవి. అమెరికాఖండపు ఉనికిని కనుగొనిన ఫలితముగ ఆ ఖండమునుండి విపరీతముగ రజత, సువర్ణరాశులు స్పెయిన్‌ను చేరుటయే కాక, అట నుండి వ్యాపారపు లావాదేవీల మూలమున యూరప్‌నందలి ఇతర దేశములకును చేరుకొనినవి. ధనము ఇటుల

విరివిగ కొందరి తావున నెలవు కల్పించుకొనుటతో ముడి వస్తువుల సంపాదించు సామర్థ్యము ఆ ధనము కలవారికి లభించినది. తత్ఫలితముగ వృత్తిశ్రేణులు తమ ప్రతిపత్తిని కోల్పోయినవి. అంతకు పూర్వమున తనకు కావలసిన ముడిపదార్థమును తన వృత్తిశ్రేణిద్వారానే పొందెడు కార్మికుడు, అంతటినుండి ధనస్వామిని ఆశ్రయించి తన జీవితమును గడపు పనివాడుగ మారిపోయినాడు. 17 వ శతాబ్దము మొదలిడునాటికే పరిశ్రమను వ్యవస్థీకరించుటలో సాధింపబడిన కుశలతవలన పలువురు పనివారిచే పనిగొను కార్ఖానాలను, ఫ్యాక్టరీలను ధనస్వాములు స్థాపించి సాగించుటకు వసతులు ఏర్పడినవి, వెండి - బంగారములు విరివిగ వాడుకలో ఉండుటవలన వస్తువుల ధరలును క్రమముగ పెరుగసాగినవి. ఈ విపరీతపు ధరలకు అనుగుణముగ భూస్వాములు కమతముల మక్తాలను హెచ్చుచేయ మొదలిడగ, సేద్యమును వదలి రైతులు పలువురు పరిశ్రమలు నెలకొనిన తావులకు చేరిరి. ఆ పరిశ్రమలయందైనను వారికి అందరికిని సరిగా పనులు లభించెడివికావు. అందువలన బిచ్చగాండ్రసంఖ్య ఎక్కువగ పెరిగిపోయినది. 1630 ప్రాంతమున పారిస్ నగరమునందలి జనులలో దాదాపు నాలుగవవంతు మంది భిక్షుకులుగ ఉండిరని లెక్కలవలన తెలియుచున్నది. తక్కిన యూరప్ దేశమునందలి పరిస్థితులును ఆనాడు అంతకన్న మెరుగుగ ఉండెడివి కావు.

వెండి, బంగారములు విరివిగ కూడుటతో పైవిధముగ యూరప్ దేశములందలి సంఘ వ్యవస్థ మార్పులను పొందుచున్న కాలముననే అమెరికా ఖండమునందలి మానవ సంఘ వ్యవస్థయందును తీవ్రములగు మార్పులు సంఘటిల్లినవి. అందులకును యూరప్ దేశముల ధనాశయే మూల కారణము. వెండి, బంగారములను కొల్లగొట్టు కృషిలో ఆ ఖండమునందలి పూర్వవాసులను సంఘ వ్యవస్థలో దిగువ స్థాయికి యూరపియన్‌లు కొనివచ్చిరి. అంతట ఆఫ్రికా ఖండమునుండి నీగ్రోలను అచటికి బానిసలుగ చేర్చుటతో అమెరికాయందలి మానవ సంఘ వ్యవస్థలో ఒక నూతన దళితవర్గము రూపొందినది. 16 వ, 17 వ శతాబ్దులలోని యూరపియన్‌లకు వెండి, బంగారముల ఆర్జనకు బానిస వ్యాపారము సులభము, లాభదాయకము నగు రాచబాటగ ఉపకరించినది. ఈ దిగువ తెలుపబడిన సంఘటన ఆ కాలమున బానిస వ్యాపారము వలన చేకూరిన విపరీత ధనార్జననేకాక, ఆ వ్యాపారమును నిర్వహించువారి ప్రవర్తన, వారియెడ ప్రజల వైఖరి మొదలగువానిని గురించియు కొంత తెలుపగలదు.

ఇంగ్లండులోని ప్లిమత్‌నగరమునకు చెందిన జాన్ హాకిన్స్ అనువాడు ఈ బానిస వ్యాపారమును సాగించుచు అందులకై మూడు సారులు సముద్రయాత్రలను నిర్వహించెను. 1562 లో అతడు చేసిన తొలి సముద్రయాత్ర ఫలితముగ స్వ నగరమునందెల్ల అతడు అత్యంత ధనవంతుడుగ లెక్కకు రాగలిగెను. రెండవసారి 1567 లో అట్టి బానిస వ్యాపారపు నౌకాయాత్రవలన ఇంగ్లండునందెల్ల సాటిలేని ధనికుడుగ అతడు రూపొందెను. ఇక 1567 లో జరిపిన వ్యాపారయాత్ర అతనికి లెక్కకు మించిన ధనమును చేకూర్చుటతోపాటుగ స్పెయిన్, ఇంగ్లండుల మధ్య నౌకా యుద్ధమునకును దారితీసినది. ఇటుల ధనార్జన చేసిన ఆ ప్రబుద్ధుడు, విజ్ఞుడు అగు ప్రతిమానవుడు అనుసరించదగు ఒక నియమావళిని రూపొందించి అందు 'అనుదినము పరమేశ్వరుని సేవింపుము', 'తోటిమానవుని ప్రేమింపుము' అను నియమములకు అగ్రస్థానమును కల్పించెను. బానిస వ్యాపారపు ఆనుపానులను కనిపెట్టి ఇంగ్లండున దానిపై ఆసక్తిని కల్పించినందులకు ప్రతిఫలముగ, ఆ దేశపు ప్రభుత్వము అతనికి సర్ (ఆర్య) బిరుదము ఇచ్చి సత్కరించినది.

వాణిజ్య వాదము వలన సంఘ వ్యవస్థలో కలిగిన ఇట్టి కల్లోలమునుండి మానవుని వెలికి తీసి, పురోగతి పథమున అతనికి ఆనాడు తావు కల్పించినది ప్రజాస్వామ్యవాదము. ఒక విధముగ చూడ జాతీయవాదము, వాణిజ్య వాదమును ప్రజాస్వామ్యభావనకు దోహదకారులైనవనియు చెప్పవచ్చును. జాతీయవాదమున తన జాతి సమష్టిగ తక్కిన జాతులతో సాటిగనైనను ముందునకు పోవలయునను ఆకాంక్ష గర్భితమై ఉండుననుట నిర్వివాదాంశము. ప్రజల సమష్టిరూపమే జాతి. అందువలన జాతి పురోగమించవలెనని ప్రజలు తమ బాధ్యతలను మనసార నిర్వర్తించుటకు తగు పరిస్థితులు సమకూర్చబడవలెను. ఈ పరిస్థితులను సమకూర్చు కృషిఫలితముగ ప్రజలకు కొన్ని అధికారములు సంక్రమింపక తప్పదు. ఆనాటి యూరప్‌నందు ఇట్టి పరిణామమే సంఘటిల్లి క్రమముగ - ఇదివరలో తెలుపబడినటుల - ప్రజాశ్రిత జాతీయవాదము రూపుగొనినది. కాని, ఇటుల రూపొందిన ప్రజాస్వామ్యమున 18 వ శతాబ్ది ఆరంభమువరకు 'ప్రజ' అనుదానికి ఒక విధమగు సంకుచితార్థము మాత్రమే వ్యాప్తిలో ఉండినది. పలుకుబడికల పైవర్గముల వారే 'ప్రజలుగ' ఆ కాలమున అధికారములను ఆర్జించిరి. ఆంగ్లదేశము నందలి పార్లమెంట్‌లో కానిండు, ఫ్రెంచి ప్రభువుల 'స్టేట్స్ - జనరల్' లో కానిండు ఆ కాలమున పై తరగతులదే

ఆధిపత్యము; శ్రామిక జీవులకు అందు భాగస్వామ్యము ఏదియు లేదు.

అయినను ఈ సంకుచిత ప్రజాస్వామ్య భావన వలన సంఘ వ్యవస్థ చక్కగ రూపొందలేదనుట 17 వ శతాబ్ది మధ్యభాగముననే సువిదితమయి, యూరప్‌న భిక్షుకుల సంఖ్య విరివిగ పెరిగి, వర్గ ప్రయోజనముల మధ్య సంఘర్షణలు చెలరేగుటతో ధీమంతులలో పలువురు ఆదర్శ సంఘ వ్యవస్థను గురించి ఆలోచించుటకు యత్నించిరి. ఇట్టి వారిలో ఆంగ్లేయుడగు జాన్ లాక్, ఫ్రెంచి వారగు మాంటెస్క్యూ, డిడెరో నాయకత్వమున పనిచేసిన విజ్ఞాన సర్వస్వవాదులు ప్రముఖముగ గణనీయులు. వీరు కాక ఆనాటి ఆర్థిక శాస్త్రవాదులును, భౌతికాధికార వాదులు (ఫిజియోక్రాట్‌లు) ను ఆహార, వస్తు సంపదల ఉత్పత్తి వినిమయములపై జరిపిన సునిశిత పరిశీలనయు ఆ కాలపు సంఘ వ్యవస్థలోని అసంబద్ధతలను వెలికి తీసికొని రాగలిగినది. వీరి అందరిని మించి, సంఘ వ్యవస్థలో తీవ్ర పరివర్తనలు కలుగవలెనను గాఢాకాంక్షను ప్రజలలో రేకెత్తించినవాడు రూసో. ఈ పేర్కొనబడినవారందరి వాదములను ఇట చర్చించుట ధ్యేయ విషయము కాదు. కాని, వీరి యందరియందును నాటి సంఘ వ్యవస్థయందలి అస్తవ్యస్తతలను చక్కచేయు ఆసక్తి మాత్రము ప్రస్ఫుటమని చెప్పక తప్పదు. ఈ గాఢాసక్తి ఒక్కొక్కప్పుడు ఉద్రేక భావనగ మారి, వారి వాదములను హేతువాద పథమునుండి వైదొలగించిన ఘట్టములును లేక పోలేదు. కాని, ఈ వాదములన్నింట ప్రజల సమష్టి ఇచ్ఛకు మారు రూపమే ప్రభుత్వమనియు, ఏ ప్రభుత్వమునకును తన ప్రజలను బానిసలుగ చేయుటకు హక్కు లేదనియు, ప్రజలందరును సమానులనియు సర్వసామాన్యముగ పేర్కొనబడిన మూల విషయములే ప్రజాస్వామ్య భావనకు ప్రాతిపదికలుగ నిలిచినవనుట నిర్వివాదాంశము. ఈ పండితుల వాదములు ఆకాలమున చేకూరిన ముద్రణాదుల సౌకర్యము వలన, త్వరిత గతిలో యూరప్, అమెరికా ఖండములందు వ్యాపించినవి.

ఒక విషయము మాత్రము ఇట మరువకూడదు. ప్రజాస్వామ్య భావన ఈ యుగమున పై పండితుల చేతులలో పరిపూర్ణ వాద బలమును సమకూర్చుకొనినను, ఈ భావన ప్రపంచమునకు నూతనము కాదనుట పాఠకులు ఎరిగిన విషయమే. ప్రాచీన గణరాజ్యముల కాలమునుండియు ఇది వ్యాప్తిలో ఉండి, అందును ముఖ్యముగ గ్రీక్ పండితుల మూలమున విజ్ఞానిలోకమున కొంత వ్యాప్తిని పొందినది, కాని, భావన ఒకటి ఉన్నంతమాత్రమున అది ఆచరణలోనికి వచ్చితీరవలయునను నియమము లేదనుట గత ప్రపంచచరిత్ర రుజువు చేసినది. ఒక భావన సరియయిన కార్యరూపమును పొందవలయుననిన అందులకు తగురీతిగ చారిత్రక పరిస్థితులు అనుకూలించవలెను. ఈ యుగమున బయలుదేరిన ప్రజాస్వామ్య భావనకు సైతము యూరప్‌న తొలుత పరిస్థితులు అనుకూలించలేదు. వాణిజ్యవాదము వలన విరివిగ ధనము చలామణిలోనికి వచ్చి తన్మూలమున బలవత్తర సైన్యములను పోషింపనేర్చిన యూరప్ రాజ్యము లందు ఈ ప్రజాస్వామ్యభావన కార్యరూపమును పొందకుండ పై తరగతులవారు అడ్డగింపగలిగి ఉండుట ఇందులకు ఒక ముఖ్యకారణము. కాని, దూరమున ఉత్తర అమెరికాయందలి బ్రిటిష్ వలసలలో ఈ భావన ఫలోన్ముఖ మార్గమును పట్టుటకు తగు పరిస్థితులు చేకూరినవి. మాతృదేశమందలి సామాన్య బ్రిటిష్‌పౌరునికి అప్పటికి లభించని ఒక సంపూర్ణ ప్రజాస్వామ్యస్వత్వము ఆ వలసలలోని బ్రిటిష్‌పౌరునికి ఆనాడు ఉండినది. అది స్థానిక పరిపాలనవరకే పరిమితమై ఉన్నను, పరిపాలనయందు ప్రజలందరును బాధ్యతలను, హక్కులను కలిగి ఉన్నారను మూలసూత్రమునకు అట కార్యరూపము సిద్ధించినది. ఇది క్రమముగ గాఢరూపమొంది, మాతృదేశమునుండి నడపబడు పాలనలో సైతము తమకు సంపూర్ణ ప్రాతినిధ్యము ఉండితీరవలయునను ఆకాంక్షగ పరిణమించుటకు కొన్ని చారిత్రక పరిస్థితులును అనుకూలించినవి. అతి దూరమున బ్రిటన్‌నుండి నడుపబడు సామ్రాజ్యప్రభుత్వము, సైన్యాదులను అటకు తరలించి దానిని అడచుటకును వీలులేకపోయినది. ఇందుకుతోడుగ బ్రిటన్, ఫ్రాన్స్ లందలి కొందరు ఉదారతావాదులయు, దళిత సామాన్య ప్రజలయు సానుభూతి దానికి అబ్బి, బ్రిటిష్ ప్రభుత్వపు చర్యలను నిష్ఫలము జేసినవి. ఇటుల ఇన్ని పరిస్థితుల ఆనుకూల్యమువలన సాఫల్యమును ఆర్జించి, నూతన మానవ సంఘ వ్యవస్థానిర్మాణమున తొలిమెట్టుగ ఉపకరించినది 1776 లో వెలువడిన యునైటెడ్ స్టేట్స్ స్వాతంత్ర్య ప్రకటన [చూ. పు. 140].

యూరప్‌నందును, అమెరికాయందును ఆ తరువాత జరిగిన పలు పరివర్తనములకు ఇది నాందిగ పనిజేసినది. ఇక తక్కిన జ్ఞాతప్రపంచమున ఆసియా, ఆఫ్రికా మొదలగు చోటుల సంఘ వ్యవస్థ 18 వ శతాబ్ది మధ్యభాగమునకు స్వయం చలనశక్తిని కోల్పోయినది. యూరపియన్ రాజ్యముల సామ్రాజ్య వ్యాపార విస్తరణల దుష్ఫలితములు ఆ సంఘ వ్యవస్థలో మిగిలిన జీవశక్తిని సైతము సన్నగిలజేసినవి. ఇక అంతటినుండి యూరపియన్ సంఘ

వ్యవస్థల, అర్థరహితానుకరణయు, అనుసరణయు మాత్రమే ఆసియాయందు అటనట తావు కల్పించుకొనినవి. అందు వలన ఆ తరువాత మానవసంఘ వ్యవస్థాపునర్నిర్మాణ మున పాల్గొనిన పురోగామి శక్తుల పరిశీలించుటకు యూరప్, అమెరికా ఖండములనే పఠనీయ వస్తువులుగ మనము గ్రహింపక తప్పదు.

రెండవ దశ: యునైటెడ్‌స్టేట్స్ స్వాతంత్ర్య ప్రకట నము తరువాత పదుమూడు సంవత్సరములకు ఇదివరలో చారిత్రక విషయకథనమున పేర్కొనబడిన తీరుగ ఫ్రెంచి విప్లవము [చూ. పు. 141] ఫ్రాన్స్‌నేకాక యూరప్ నంతను కల్లోలితము చేసినది. అయ్యవి రూపొంది, పురోగ మించిన తీరులలో విభిన్నత ఉన్నను, ఈ రెండు విప్లవముల మూల సూత్రములలో ఏకత ఉన్నటుల తెలుపుటకు ఆ యా విప్లవముల అనంతరము నెలకొల్పబడిన ప్రభుత్వ ములు వెలువరించిన మానవ స్వత్వప్రకటనములు నిదర్శన ములు. కాని, ఈ రెండు విప్లవములును విజయవంతములయి గణరాజ్యములుగ రూపొందిన తరువాత నూతన సంఘ వ్యవస్థా నిర్మాణమునకు బాటలు వేయుట అంతగ సులభము కాదనుట స్పష్టమైనది. రాచరికమును, నిరంకు శాధి కారమును నిర్మూలించి, తమ భవితవ్యమును తమ చేతిలోనికి తీసికొనగలిగితిమను సంతుష్టి ఆ దేశముల సామాన్య ప్రజలకు అబ్బినను, ఆ భవితవ్యమునకు రూప రేఖల సంతరించు విషయమున తగు ప్రణాళికలే లేనటుల వారికి అపుడు స్పష్టమైనది. సంఘమునందలి ప్రజలందరికి నచ్చురీతిగ ఆస్తి, ద్రవ్యచలామణీ, అంతర్జాతీయ సంబంధ ములను నిర్వహించు బాధ్యత విప్లవ నాయకులను ఎదుర్కొని వారిని తబ్బిబ్బుచేసినది.

కాని, ఈ పై మూడు సమస్యల పరిష్కారమున యునైటెడ్‌స్టేట్స్‌కు ఆ దేశపు ఉనికినిబట్టి సౌలభ్యము సమకూరినది. దేశమున సేద్యమునకు తగిన భూమి విరివిగ అనుపయుక్తముగ పడియుండుట ఈ సమస్యల పరిష్కార మున ఆ ప్రభుత్వమునకు ఎక్కువ సాయము చేసినది. బలవత్తరములగు యూరప్ రాజ్యములకు అతిదూరమున ఉండుటవలన అంతర్జాతీయ సంబంధముల క్లిష్టతయు ఆ దేశమును ఎక్కువగ బాధపెట్టినది కాదు. ఇంగ్లండునందలి పారిశ్రామిక విప్లవము [చూ. పు. 168] మూలమున యునైటెడ్‌స్టేట్స్‌లోని ప్రత్తి మొదలగు ముడిపదార్థము లకు గిరాకీ విరివిగ పెరుగుటతో ఆర్థికపు రాబడి అతిశ యిల్లి, ఆ దేశమున చలామణీ సమస్యయు త్వరితముగ పరిష్కృతమైనది. కాని, ఫ్రాన్స్‌నకు ఇట్టి సదుపాయములు ఏవియు లేకపోవుటవలన ఈ సమస్యల పరిష్కారము క్లిష్టతరమై, నిరాశా, నిస్పృహలకు తావొసగి, తన్మూల మున విద్వేషమును, దౌర్జన్యకాండయు పెచ్చు పెరిగినవి. ఆస్తి మొదలగు పై సమస్యలను సమతా సూత్రములకు అనుగుణముగ పరిష్కరించుటకు విరివియగు వస్తూత్పత్తి కుశలతయు, అంతర్జాతీయ సౌహార్దమును ముఖ్యసాధనము లని మనకు గత 180 సంవత్సరముల చరిత్ర రుజువుచేసినది. కాని, ఆనాటి ఫ్రాన్స్‌నకు ఈ రెండును అందరానివిగ ఉండినవి. భూస్వాములను అంతముచేసి, భూమిని పంపకము చేయుట వలన మాత్రమే వస్తూత్పత్తి సమస్య పరిష్కృతము కాదనుట వెల్లడి అయినంతనే విప్లవోద్వేగము కొంత వెనుకంజ వేసినది. అట్టియెడ నిరాశోపహతులగు ప్రజలు బలవంతుడగు ఒకని నాయకత్వమునకు లొంగి సమస్యా పరిష్కార మార్గమును అతనికి వదలివేయుట మానవ చరిత్రయందు సహజముగ కన్పట్టు సంఘటన. అట్టి పరిణామము మూలముననే పూర్వపు సంఘ వ్యవస్థయందలి రాచరికము మొదలగునవి దొడ్డిదారిన ఫ్రాన్స్‌న చేరి నెపోలియన్ సామ్రాజ్యము [చూ. పు. 142] ఏర్పడుటకు సహకరించినవి.

కాని, ఇటుల ఏర్పడిన రాచరికము సైతము స్వాతంత్ర్య, సమానతా, సౌభ్రాతృత్వముల మేలి ముసుగునే, ఆ కాలపు ప్రజల భావనను అనుసరించి ధరించినది. నెపోలియన్ దండయాత్రలు అన్నియు ఈ వేషము తోడనే ముందునకు సాగినవి. ఇట్టి దండయాత్రలు ఫ్రాన్స్ దేశమును ఆర్థిక క్లిష్టపరిస్థితినుండి గట్టెక్కించుటతో పాటుగ, తమకు లోనైన దేశములందు అన్నింట సామాన్య ప్రజలలో మానవ సమానతా భావమును రేకెత్తించుటకు ఉపక రించినవి. దండయాత్రలను ఎదుర్కొని నిలువగలిగిన ఇంగ్లండున సైతము ఈ భావములకు కొంత ప్రాపు లభించి, తన్మూలమున ప్రజాస్వామ్యము కొంత విపులతను ఆర్జించి నది. అందువలననే నెపోలియన్ పతనానంతరమున యూరప్‌న పూర్వ వ్యవస్థను పునరుద్ధరించిన పెద్దలలో పలు వురు ఏదో ఒక విధముగ ప్రజల హక్కులను కాలక్రమ మున గుర్తించుట తప్పనిసరి అయినది.

నెపోలియన్ పతనానంతరమున యూరపియన్ దేశము లందు ప్రజాస్వామ్యభావనా వ్యాప్తికి ఎక్కువ కృషిచేసిన వారు ఉదారతావాదులు (లిబరల్స్). ఆనాటి పారి శ్రామిక విప్లవ వికసనమును వీరికి చేదోడుగ ఉండినది. నూతనముగ భాగ్యములను ఆర్జించి సంఘమున పైకి రాగలిగిన పారిశ్రామికులును, వర్తకులును ఉదారతా వాదులకు బలమొసగి, తమకు సంఘమున సమధిక ప్రతి పత్తిని ఆర్జించుటకై కృషిచేసిరి. ఈ ఉదారతావాదుల

కృషి ద్విముఖముగ సాగినది. ఇందువలన జాతీయతను సుదృఢ మొనర్చుటతోపాటుగ ప్రజాస్వామ్యమునకు విపులతర ప్రాతిపదికను వీరు కల్గింపగలిగిరి. అటులని ఈ ఉదారతావాదులను సంపూర్ణ ప్రజాస్వామ్యవాదులుగ లెక్కించుట సముచితము కానేరదు. వీరి దృష్టిలో ఆస్తిపరులు మాత్రమే వోటునకు హక్కుకలవారు. కాని, ఎన్నుకొనబడిన ప్రజాసభలకు ప్రభుత్వ నిర్వహణపై అదుపు ఉండవలయునను ప్రజాస్వామిక మూలసూత్రమునకు విపులవ్యాప్తిని కల్పించుటలో ఉదారతావాదులు అనల్ప కృషిచేసిరి. ఇట్టి వాదములను ఆస్ట్రియా ప్రధాని యగు మెట్టర్‌నిఖ్ వంటి ప్రముఖులు కొందరు నిరసించి ప్రతిఘటించినను క్రమముగ ఆ వాదములు ప్రజాభిప్రాయమును తమ వైపునకు ఆకర్షింప గలిగినవి.

ఉదారతావాదమునకు తొలుతటి ప్రముఖ విజయము ఇంగ్లండున చేకూరినది. పారిశ్రామిక విప్లవము ముందుగ ఆ దేశమున వికసనమొంది, భూస్వాముల పలుకుబడిని తగ్గించుటను ఇందులకు ప్రబల హేతువుగ పేర్కొనవచ్చును. 1815 తరువాత కొలదికాలమునకు ఇంగ్లండున 'లోకసభ (హౌస్ ఆవ్ కామన్స్)'కు జరుగు ఎన్నికల విధానమున మార్పులు జరుగవలయునని ఆందోళనను ఉదారతావాదులు సాగించిరి. అప్పటి నియోజక వర్గముల ఏర్పాటున చాల అవకతవకలు ఉండెడివి. సుసంపన్నములగు కొన్ని పెద్ద నగరములకు ప్రాతినిధ్యమే ఉండెడిది కాదు. జనసంఖ్య తరుగుపడిపోయి, కొలదిమంది రైతులు మాత్రమే వసించు ప్రాత పట్టణములలో పెక్కింటికి మాత్రము ఒక్కొక్కదానికి ఇరువురు లోకసభాసభ్యులను ఎన్నుకొను అధికారము ఉండెడిది. అట్టి ప్రదేశములందు అచటి ప్రతినిధుల ఎన్నిక అచటి భూస్వామి ఇష్టముపై ఆధారపడి ఉండెడిది. ఇటుల దాదాపుగ లోకసభలో మూడింట రెండువంతుల సభ్యుల ఎన్నిక భూస్వాముల దయాధర్మములను ఆశ్రయించి ఉండెడిది. ఉదారతావాదులగు విగ్ పార్టీవారు ఇంగ్లండున లోకసభలో ప్రాబల్యమును ఆర్జించిన తరువాత, పైన పేర్కొనబడిన అస్తవ్యస్తతలను చక్కజేయుటకు తగు సంస్కరణలను ప్రవేశపెట్టిరి. 'ప్రభువుల సభ (హౌస్ ఆవ్ లార్డ్స్)' ప్రతిఘటనను ఎదుర్కొని ప్రజాబలము సాయమున ఈ సంస్కరణలు ప్రభుత్వామోదమును పొంది అమలులోనికి వచ్చినవి. ఇందువలన ఒక పరిమితికి తగ్గని ఆస్తికల ప్రతి పౌరునికి గ్రేట్‌బ్రిటన్‌న వోటు హక్కు లభించినది. నియోజక వర్గములు దాదాపుగ వోటర్ల సంఖ్యాబలమునకు అనుగుణముగా రూపొందుటకు కొన్ని చర్యలు తీసికొనబడినవి. వీని అన్నింటి ఫలితముగ పట్టణములలోని కార్ఖానా యజమానులకును, వర్తకులకును విరివిగ ప్రాతినిధ్యము లభించినది.

కాని, వోటు హక్కును ప్రజలలో మరికొందరికి కల్పించినందువలన మాత్రమే సంఘ వ్యవస్థయందు దృఢత నెలకొనజాలదను విషయమును కొందరు ధీమంతులు ఆనాడు గుర్తించిరి. ఆస్తి, దానియందలి ఉత్పత్తి అనునవి సరిగ పరిష్కృతములగుట సంఘ సుస్థిరతకు మూలమని వారు విశ్వసించిరి. అట్టివారిలో రాబర్ట్ ఓవెన్ గణనీయుడు. ఇతడు స్కాట్‌లాండ్‌వాసి; స్వీయకృషివలన ధనవంతుడై 1813 నాటికి 2000 కార్మికులచే పనిగొను మిల్లునకు యజమాని కాగలిగెను. తన మిల్లులోని కార్మికుల జీవన ప్రమాణమును అధికము చేసి, వారికి జీవిత సౌకర్యములను పెక్కింటిని చేకూర్చుటకు అతడు కృషిచేసెను. సహకార సంఘములద్వారా స్వీయ సౌఖ్యములకు ప్రజలు కృషి చేయు విధానమును ఇతడు ప్రోత్సహించెను. ప్రజలలో విద్యావ్యాప్తికి కృషిచేయుట తన ధర్మముగ ప్రభుత్వము పరిగణించని ఆ కాలమున తన మిల్లులోని కార్మికుల బిడ్డలకు విద్యా సౌకర్యములను అతడు కల్పించెను. అతని ప్రయత్నమును తక్కిన మిల్లు యజమానులలో ఎవరును అనుకరించని విషయము యథార్థమే అయినను ఆ నాడు భావగతిలో కలుగుచుండిన మార్పులకు రాబర్ట్ ఓవెన్ ప్రవర్తనను ఒక నిదర్శనముగ గ్రహింపదగును.

ఇంగ్లండున పైన పేర్కొనబడిన రీతిగ సౌమ్య మార్గమున మార్పులు జరుగుటకు పరిస్థితులు బాగుగ అనుకూలించినవి. పారిశ్రామిక విప్లవమువలన పల్లె ప్రజలు పట్టణములకు తరలుటయు, తన్మూలమున నిరుద్యోగము మొదలగునవి విరివిగ వ్యాపించుటయు నిజమే అయినను, విశాలమగు సామ్రాజ్యము ఇంగ్లండునకు అప్పటికి ఏర్పడుటవలన, వలస మొదలగు పరిష్కారమార్గముల వలన నిరుద్యోగమును, తత్ఫలితమగు అసంతృప్తిని తగు హద్దులలో ఉంచి సౌమ్యమార్గమున మార్పులను కొనిరాగలుగుట ఆ దేశమున సాధ్యమయ్యెను. తక్కిన యూరపియన్ దేశములలో అట్టి పరిష్కారమునకు సౌమ్యమార్గము అవలంబించుటకు తగు పరిస్థితులు సమకూడక పోవుటచే ప్రజలలోని అసంతృప్తి 1848 విప్లవముల [చూ.] రూపమున యూరప్ ఖండమును కల్లోలితము చేసినది. పారిస్‌లో కానిండు, వియెన్నాలో కానిండు, బెర్లిన్‌లో కానిండు ఈ విప్లవములలో పాల్గొనినవారిలో ఆకలి మంటలకు లోనైన కార్మికుల సంఖ్య అత్యధికము. ఆస్తికలవారిపై ఆస్తిలేని వారి తిరుగుబాటులుగ ఆ విప్లవములను పేర్కొనవచ్చును.

ఆ విప్లవములు అడచివేయబడినను, వాని మూల సూత్రముల యెడ ఆదరణమాత్రము ప్రజలలో సన్నగిలక, తరువాత సంఘ వ్యవస్థలో పలుమార్పులను కొనివచ్చుటకు కారణభూతమైనది.

ఇటుల విప్లవముతో మొదలై విప్లవములతో కడచనిన ఈ రెండవ దశలో యూరప్‌న ప్రజానివహము విశ్రాంతి ఎరుగక నిరంతరము కల్లోలమున మునిగియున్నను ఈ కాలముననే మానవ సమాజమును నియమబద్ధముగ నడపుటకు సహకరించు రెండు చర్యలకు నాందీ ప్రస్తావన జరిగినది. అందులో తొలుతటిది న్యాయశాస్త్ర సంస్కరణకై యత్నము; రెండవది మతమునుండి విద్యావిధానమును వేరుపరచి, ప్రభుత్వప్రోత్సాహమున దానిని నిర్వహించుటకు జరిగిన కృషి.

ప్రాచీన కాలమున రోమన్‌లచే రూపొందింపబడి, తరువాత జస్టీనియన్ కృషివలన సంహితారూపమును పొందిన న్యాయశాస్త్ర సూత్రములే ఈ యుగము వరకు - క్రైస్తవ మతధర్మముల మూలసూత్రములకు లోబడి - యూరప్‌న ఆదరింపబడినవి. కాని, భావగతిని అనుసరించి సంఘమున కలిగిన మార్పులకు అందు తావు కల్పించుటకు గాఢ కృషి అంతవరకు జరుగలేదు. ఇంగ్లండున పార్లమెంట్ ప్రజల ఒత్తిడికి లొంగి అంతటంతట కొన్ని నూతన చట్టములను చేసినను, ఒక నూతన న్యాయసంహితను నిర్మించుటకు కృషి జరుగలేదు. అట్టి కృషి తొలుతగ ఈ కాలమున ఫ్రెంచి విప్లవపు ఉద్ధృతము తగ్గిన తరువాత నెపోలియన్-I చే నిర్వహింపబడినది. ఇదియే 'కోడ్ నెపోలియన్' అను పేర వ్యవహృతము. రోమన్ న్యాయసూత్రముల అస్పష్టత మొదలగు వాని ఫలితముగ ఫ్రాన్స్‌లో వివిధ రాష్ట్రములందు అమలులోనికి వచ్చియుండిన విభిన్న న్యాయశాస్త్ర విధానములకు బదులుగ ఏకైక న్యాయ సంహితా విధానమును అతడు అమలులోనికి తెచ్చెను. ఫ్రెంచి విప్లవ ఫలితముగ రూపొందిన మానవ స్వత్వ ప్రకటనలో 'మానవులందరు సమాన స్వత్వములు కలవారు' అని తెలుపబడిన మూలసూత్రములకు అనుగుణముగ న్యాయ నిర్వహణ జరుగుటకు వీలు ఈ కోడ్ నెపోలియన్ వలన కలుగునని నెపోలియన్ తలపెట్టెను. కాని, నవ్య భావనలను అనుసరించి చూచినయెడల మనకు అందలి నియమములు పెక్కు అసందర్భముగ తోచును. ముఖ్యముగ స్త్రీల హక్కుల విషయమున ఆ సంహిత చాల సంకుచిత దృష్టిని అవలంబించినది. ఒక్క ఫ్రాన్స్‌ననేకాదు, ఇంగ్లండు మొదలగు తక్కిన యూరపియన్ దేశములందును స్త్రీల పరిస్థితి ఆనాడు ఆ విధముగనే ఉండినది.

ఈ కాలముననే హాలండ్‌న రోమన్ న్యాయశాస్త్రమునకు కాలానుగుణముగ నూతన రూపము కల్పింపబడినది. ఇదియే 'డచ్చి - రోమన్‌లా' అని వ్యవహృతమైనది. దాదాపుగ ఈ కాలముననే తక్కిన ప్రముఖ యూరపియన్ దేశములందును న్యాయశాస్త్రము సంస్కరితమై, క్రోడీకరింపబడినది.

యూరప్‌న విద్యావిధానము క్రైస్తవ మతవ్యాప్తి మొదలుగ 19వ శతాబ్ది మధ్యభాగము వరకు మతాధికారుల చేతులలో ఉండినది. ధనికులు మాత్రము తమ బిడ్డలకు ప్రత్యేకాధ్యాపకులను నియమించెడి వారు. సామాన్యులందరును మత ప్రచారకుల పాఠశాలలలో చదువుకొనవలసినదే. అప్పటి విద్యావిధానము కూడ చాల మోటుగ ఉండెడిది [చూ. సం. 10 - పు. 129]. సక్రమ విద్యాబోధనకు బెత్త మొక్కటియే ముఖ్యసాధన మనుట ఆనాటి ఉపాధ్యాయుల అభిప్రాయము. అందువలన పాఠశాలలలో చదువు వారి సంఖ్య అత్యల్పముగ ఉండెడిది. ఈ పరిస్థితుల నుండి తప్పించి విద్యాబోధనకు సరియైన మార్గమును ఏర్పరచుటకు మతాచార్యుల సంబంధము లేకుండ కొందరు ధీమంతులు కృషిచేసిరి. వారిలో స్విజర్లండ్ వాసియగు పెస్టాలాజీ (1746 - 1827) [చూ. సం. 10 - పు. 499] ప్రముఖుడు. విద్యాబోధనలో ప్రజారంజక పద్ధతులను ఇతడు ప్రవేశపెట్టెను (1799). కాని, అప్పటిలో యూరపియన్ ప్రభుత్వములలో ప్రష్యా తప్ప తక్కినవి ఏవియును పెస్టాలాజీ చూపిన ఒరవడిని అనుసరించుటకు యత్నించలేదు. ప్రజలలో సరియైన విద్యను వ్యాపింపజేయుటవలన కలుగు ప్రయోజనములను ఆ ప్రభుత్వములు అప్పటికి గుర్తించినవి కావు. ఫ్రాన్స్‌నందలి ధీమంతులు పలువురు విప్లవానంతరమున విద్యావిధానమున మార్పును తెచ్చుటకు ప్రభుత్వముపై ఒత్తిడి తెచ్చిన ఫలితముగ నెపోలియన్ అట్టి పాఠశాలలను నెలకొల్పజేసెను; కాని, వానికి తగిన ధన సహాయమును కల్పింపక పోవుటవలన అవి అంతరించినవి. ఇంగ్లండున 1832లో విద్యావ్యాప్తికి సహాయము చేయుటకై ఒక సంస్కరణ చట్టమును పార్లమెంట్ ఆమోదించినది. కాని, అందులకై వినియోగింపవలసిన కొద్ది మొత్తమును సైతము మత సంస్థల పరముగనే వెచ్చించినది. ఈ పరిస్థితులలో ప్రష్యామాత్రము పురోగామి దృక్పథమును అవలంబించినది. యూరప్ రాజకీయములలో అప్పటిలో తొలుతగ ప్రముఖతకు వచ్చుచుండిన ఆ దేశమునందలి జాతీయతావాదులు పెస్టాలాజీ అనుసరించిన నూతన విధానపు విలువను బాగుగ గుర్తించ గలిగిరి. అంతట తొలుతగ 18 మంది ఉపాధ్యాయులు

స్విజర్లండ్‌నకు పెస్టాలాజీ విధానములను నేర్చుకొనుటకు పంపబడిరి. శిక్షితులగు ఆ ఉపాధ్యాయుల సాయమున ప్రష్యాలో తొలుతగ నూతన విద్యావిధానము ప్రవేశ పెట్టబడినది. ఆ దేశమున అంతకు ముందుగనే 1787 మొదలుగ ప్రభుత్వపు ఆధ్వర్యవమున నిర్బంధ ప్రాథమిక విద్యా శిక్షణము అమలులో ఉండుట వలన ఈ క్రొత్త మార్పు అట సులభముగ తావు కల్పించుకొనగలిగినది. 1830 లో ఫ్రాన్స్‌దేశము ప్రష్యాను అనుసరించినది. తరువాత తక్కిన యూరపియన్ దేశములును ఆ మార్గముననే అవలంబించి ప్రగతిని సాధించినవి.

ఈ పైన తెలుపబడిన మార్పులు సైతము ఉదారతావాద భావముల వ్యాప్తి వలననే ఆ కాలమున చేకూరగలిగినవనుట విస్పష్టము. కాని, ఈ ఉదారతావాదమే ప్రజలలో నిరాశను రేకెత్తించి 1848 విప్లవములకు మూలకారణమైనదని కూడ మనము భావింపవచ్చును. ప్రజాస్వామ్యమునకు విపులతర ప్రాతిపదికను కల్పింప సంకల్పించిన ఆ వాదము హేతువాదరీతిలో తాను పోగలిగినంత దూరము పోకపోవుట అందలి మొదటిలోటు. ఆ వాదపు ఆందోళనల వలన వోటు హక్కు ఆస్తిపరులకు మాత్రమే లభ్యమైనది. తమకును అట్టి హక్కు లభింపగలదని ఆసించిన శ్రామికుల ఆశలు వృథాయైనవి. ఎన్నికలు మొదలగునవి ధనస్వాముల ఇచ్ఛను అనుసరించి నడచు తంతులు మాత్రమే అను అపప్రథ దళిత శ్రామికలోకమున యూరప్‌నందు వ్యాపించినది. ఇట్టి అసంతృప్తికి బాహ్యరూపములగు 1848 విప్లవములు అడచివేయబడినవి. కాని, ఆ అసంతృప్తిమాత్రము నశించక కడకు యూరప్‌నందు ద్వివిధ పరిణామములకు త్రోవదీసినది. వేరొక తీవ్రతర విప్లవమునకు శాస్త్రీయమార్గములను శోధించు కృషిలో శ్రామిక లోకమును అభిమానించు ధీమంతులు పాల్గొనుట ఇందలి తొలుతటి పరిణామము. ఆస్తిపరుల యెడ ప్రజలలో చెలరేగిన విద్వేషమును వేరొక మార్గమునకు త్రిప్పి, ఆస్తి హక్కులను రక్షించుటకు పాలకవర్గములు కృషిచేయుట ఇందలి రెండవ పరిణామము. ఈ రెంటి ఫలితములే మూడవదశలో సంఘ వ్యవస్థలోని పరివర్తనములకు రూపకల్పనము చేసినవి.

మూడవ దశ: పలు విప్లవములకు ఆకరమై, వాని అడచివేతవలన యూరప్‌న దళిత శ్రామిక లోకమున నిరాశా నిస్పృహలను తాత్కాలికముగ వెల్లివిరియజేసిన 1848 వ వత్సరముననే మానవ సంఘ వ్యవస్థలో అనూహ్యపరిణామములను కొనివచ్చుటకు సాధన భూతమైన వేరొక సంఘటనయు జరిగినది. అదియే 'కమ్యూనిస్ట్ మానిఫెస్టో' (సామ్యవాద భావ వివరణ పత్ర) ప్రకటన. కార్ల్ మార్క్స [చూ. సం. 5 - పు. 633], ఏంగెల్స [చూ. సం. 7 - పు. 333] అను ఇరువురు ధీమంతుల కృషి ఫలితముగ ఈ మానిఫెస్టో రూపొందినది. 19 వ శతాబ్దపు ప్రారంభము నుండియు యూరప్‌న అటనట వ్యాప్తి చెందుచుండిన సోషలిస్ట్ భావములకు ఒక దార్శనిక యాథార్థ్యమును కల్పించుటకు ఈ మానిఫెస్టోలో కృషి జరిగినది.

సోషలిస్ట్‌వాదము ఇటుల 19 వ శతాబ్ది మొదలుగ వాద బలమును సమకూర్చుకొన యత్నించుట నిజమేయైనను, అట్టి వాదమునకు భావనా మాత్రపు ప్రాతిపదిక ప్రాచీన సంఘములకాలము నుండియును కలదు. మానవ సమతా సూత్రములను వ్యాప్తికి తెచ్చిన ఉపనిషత్కారులు, బుద్ధుడు, జీసస్ క్రీస్తు, మహమ్మద్ మొదలగువారల బోధన లందును, ఆదర్శ గణరాజ్యమును చిత్రించిన గ్రీక్ పండితుడు ప్లేటో రచనలందును, ఇంకను మధ్యయుగములందు భూతలమున స్వర్గమును సృజించ సాధ్యమని భావించిన పలువురు రచయితల గ్రంథములందును ఈ సోషలిజమ్ (సమాజ వాదము) నకు బీజములు కలవని చెప్పవచ్చును. కాని, ఆ వాదమునకు సుస్థిర రూపమును కల్పించుటకు 19 వ శతాబ్ది పరిస్థితులు బాగుగ సహకరించినవి.

పారిశ్రామిక విప్లవము మొదలుగ పాశ్చాత్య రాజ్యములందు మానవ సంఘ వ్యవస్థను గురించిన విచారణ తీవ్రముగ సాగినది. అట్టి కృషిలో తొలుతటి ప్రముఖుడుగ లెక్కింపదగిన ఆడమ్ స్మిత్ (1723 - 1790) [చూ.] తన రచనలో సంపదుత్పత్తి మొదలగు వానిని విపులముగ చర్చించి విస్తృత సంపదుత్పత్తికి వ్యక్తిగత స్వాతంత్ర్యమును ఒక ముఖ్య ప్రాతిపదికగ పేర్కొనెను. సమర్థులగు వ్యక్తులు సమధికోత్సాహమున తమ శారీరక మేధాశక్తులను వినియోగించుటవలననే పారిశ్రామిక విప్లవము రూపొందుటయు, వికసించుటయు జరుగుట ఈ వాదమునకు మరింత బలమును చేకూర్చినది. కాని, కాలక్రమమున ఆ విస్తృత సంపదుత్పత్తివలన సంపదపై అధికారము ఏ కొలదిమందికో దక్కి, నిరుద్యోగము విరివిగ వ్యాపించుటతో ధీమంతులు పలువురు ఆస్తి మొదలగు వానిపై ఉండు హక్కులను గురించి సవిమర్శముగ చర్చింప మొదలిడిరి. ఆస్తిపై వ్యక్తిగతమగు స్వత్వము సమాజమునకు శ్రేయోదాయకమా? అను విషయమును సునిశితముగ చర్చించిన వారిలో తొలుతటివాడు క్లాడి హెన్రీ డీ సెయింట్ - సైమన్ (1760 - 1825). 'నవ్యక్రైస్తవము' అను అర్థమొసగు పేరుగల తన గ్రంథమున అతడు ఆస్తిపై ప్రభుత్వపు జోక్యము, సమాజశ్రేయమునకు అనుగుణ

ముగ ప్రణాళికారచన, ఆస్తి హక్కుల విధానములందు మార్పులు, ఆర్థిక సామాజిక సమానతను నెలకొల్పుట మొదలగు వానిని ఆదరించెను (1825). ఆ తరువాత ఈ వాదమే వివిధ రచయితల చేతులలో వివిధ రీతుల వికసనము పొందినది. కొందరు ప్రభుత్వమునకు బదులుగ ఉత్పత్తిదారుల సంఘముల సమష్టి చర్యవలననే సంఘ వ్యవస్థ నడువవలెనని సూచించిరి. పియెరీ జోసెఫ్ ప్రౌడన్ (1809 - 1865) అను ఆర్థికశాస్త్రవేత్త 'ఆస్తి హక్కు అనునది చౌర్యమునకు పర్యాయపదము' అని పేర్కొని, ఈ హక్కును నిర్మూలించి న్యాయ, స్వాతంత్ర్య, సమానత్వములకు ఆకరమగు ఆదర్శ అరాజక వ్యవస్థ వైపునకు పురోగమించుటయే మానవజాతి ధ్యేయమని పేర్కొనెను. ఇదివరలో వేరొకచోట పేర్కొనబడిన రాబర్ట్ ఓవెన్ [చూ. పు. 181] మొదలగు ఆంగ్లేయులును ఇట్టివియే కాక పోయినను, దాదాపుగ వీనిని పోలు అభిప్రాయములను కలిగియుండిరి. ఇటుల సోషలిస్ట్ వాదము వివిధ రచయితల చేతులలో వివిధ రూపములను పొందినను, వీనియందు అన్నింట అంతర్జాతీయతా భావనయు, సమాజముపై సంపదకు సర్వాధికారము ఉండవలయునను ఆకాంక్షయు సర్వసామాన్యముగ ఆదరింపబడినవి.

కాని, మార్క్స్, ఏంగెల్స్ వెలువరించిన కమ్యూనిస్ట్ వాదమునకు పైన పేర్కొనబడిన సోషలిస్ట్‌వాదముల కన్న వేరొక ప్రత్యేకమగు విశిష్టత చేకూరినది. తక్కిన సోషలిస్ట్ రచయితలు భావముల ప్రచారము వలన క్రమముగ మానవులలో భావపరివర్తన జరిగి సమష్టి కృషి వలన సోషలిస్ట్ సంఘ వ్యవస్థ ఏర్పడుట తమ ఆకాంక్షగ పేర్కొనిరి. ఇట్టి ఆకాంక్షలను మార్క్స్ పరిహసించుచు, ప్రత్యేక వ్యక్తుల ఆకాంక్షలకు అనుగుణముగ మానవ సంఘ వ్యవస్థ ఏనాడును రూపొందలేదని తెలిపి అటుల రూపొందగలుగునని భావించిన సోషలిస్ట్ రచయితలకు 'స్వప్నలోకపు (యుటోపియన్)' సోషలిస్ట్‌లను పర్యాయ నామమును కల్పించెను. మార్క్స్ దృష్టిలో చరిత్రగతికి ఒక ప్రత్యేక నియమము కలదు [చూ. కమ్యూనిజమ్]. ఆ నియమమును అనుసరించి మానవ సమాజము ఒకానొక చారిత్రక ఘట్టమున సోషలిస్ట్ సమాజముగ రూపొందుట వినా వేరు గంతవ్యము ఉండదు. అట్టి స్థితి అపుడు యూరప్‌న కొన్ని దేశములందు ఆసన్నమయ్యెననియు, పారిశ్రామిక విప్లవము మూలమున సంఘమున ఉత్పత్తి చెందిన అస్తవ్యస్తతయంతయు అందులకు దోహదకారియగుననియు, సుసంఘటిత, సుశిక్షిత కార్మికవర్గము విప్లవము మూలమున రైతుల, సైనికుల సాయమున అధికారమును స్వీకరించి తన ఆధ్వర్యవమున నియంతృత్వమును నెలకొలిపి, సంఘ వ్యవస్థయందు పరివర్తనలను కొనివచ్చి, సంపదుత్పత్తి సాధనములపై ప్రభుత్వ యాజమాన్యమును స్థాపించి క్రమదశలలో ప్రభుతారహితము, స్వయంచాలకము, సర్వసమానతా ప్రాపకము అగు కమ్యూనిస్ట్ సమాజమునకు బాటలు తీర్చి దిద్దగలదనియు కార్ల్ మార్క్స్, ఏంగెల్స్ తమ మానిఫెస్టో యందు స్పష్టీకరించిరి. ఈ మానిఫెస్టోయందలి విషయములకే ఆ తరువాత 'డాస్ కాపిటల్' అను తన రచన వలన సమగ్ర వాదోపపత్తులను సమకూర్చుటకై మార్క్స్ కృషి చేసెను. కార్ల్ మార్క్స్ చేతిలో ఒక దర్శనశాస్త్ర ప్రతిపత్తిని ఆర్జించిన ఈ సోషలిస్ట్ వాదమునందలి విషయములు వెలువడినదాదిగ పలు వాద వివాదములకు గురియైనవి. సంపదుత్పత్తి, విభజనముల ప్రభావము చరిత్రగతిపై కలదను విషయమున మార్క్స్ వాదముతో పలువురు పండితులు అంగీకరించినను, ఆ మానిఫెస్టో యందలి తక్కిన విషయములు ప్రజాస్వామ్యవాదుల చేతను, కొందరు ఆర్థికశాస్త్రవేత్తల చేతను నిరాకరింపబడినవి. ఇట్టి విమర్శకులతో పాటుగ మార్క్స్ వాదావలంబకుల సంఖ్యయు విపులముగ పెరిగినది. పరస్పర ఖండనములతోడను, దురభినివేశముతోడను నిండిన ఈ వివాదముల ప్రయోజనము ఎటులున్నను ప్రాచీన మతకర్తల నుండియు, భావనామాత్రముగ ఆదరితమై ఉండిన సర్వమానవ సౌభ్రాతృత్వమునకును అంతర్జాతీయతావాదమునకును విస్పష్ట రాజకీయ రూపమును తొలుతగ కల్పించిన ఖ్యాతి సోషలిస్ట్‌వాద ప్రచారకులకు - అందును ముఖ్యముగ మార్క్స్ పండితునకు - దక్కినదని అంగీకరింపక తప్పదు. ప్రజాస్వామ్య మూలసూత్రములలో తొలుత నుండియు నిహితమై ఉండిన అంతర్జాతీయతా భావన జాతీయవాదపు ఉద్ధృతము మూలమున కనుమరుగై పోగా, దానికి ప్రస్ఫుట రూపమును కల్గించుటకు సోషలిస్ట్‌వాదము యత్నించినది. ఈ యత్నమే కమ్యూనిస్ట్ మానిఫెస్టోలోని తుదివాక్యమున 'ప్రపంచ శ్రామికులారా! ఏకముకండు' అను ప్రబోధమున ప్రతిబింబితమైనది. ఆ ఆశయసాధనకు మార్క్స్ మొదటి ఇంటర్‌నేషనల్ [చూ.]ను స్థాపించెను (1864).

ప్రపంచ చరిత్రలో ఆ తరువాత ఒక ప్రముఖ స్థానమును ఆర్జించిన ఈ కమ్యూనిస్ట్ మానిఫెస్టో తాను వెలువడిన కాలమున పలుకుబడిగల వర్గములనుండి కాని, కడకు ధీమంతులలో పలువురనుండి కాని ఎక్కువ ఆదరణను పొందలేక పోయినది. కాని, నాటి సంఘమున పారిశ్రామిక

విప్లవము మూలమున కలిగిన అస్తవ్యస్తతలను పూర్వసంప్రదాయపు ఆర్థికశాస్త్రవేత్తలును కొందరు గమనించి, తమ తమ వాదములను పునఃపరిశీలింప యత్నించిరి. అట్టివారిలో జాన్ స్టువార్ట్ మిల్ (1806 - 1873) [చూ.] ముఖ్యముగ గణనీయుడు. ఆర్థిక, రాజనీతిశాస్త్రవేత్తయగు ఈ ఆంగ్లేయ రచయిత పూర్వసంప్రదాయానుయాయులచే ప్రతిపాదింపబడిన రీతిగ సంపదుత్పత్తి సాధనములపై వ్యక్తిగత నిరవధిక అధికారమును ఆమోదించుచునే, మానవ దయాళుతా బుద్ధితో ప్రభుత్వము ఆ అధికారమున ఏ కొలదిగనో జోక్యము వహింపవచ్చునని 'రాజకీయ ఆర్థిక వ్యవస్థా మూలసూత్రములు (ప్రిన్సిపుల్స్ అవ్ పొలిటికల్ ఎకానమీ)' అను తన గ్రంథమున పేర్కొనెను. కమ్యూనిస్ట్ మానిఫెస్టో వెలువడిన సంవత్సరముననే మిల్ పండితునిచే రచింపబడిన పై గ్రంథమును వెలువడెను.

ఆ కాలముననే వేరొక భావనకును ప్రాపు లభించినది. వివిధ రాజ్యముల రాజకీయ ఆర్థిక వ్యవస్థలును ఒకే తీరుగ ఉండ వీలుపడదనియు, ఆ యా రాజ్యములందలి విభిన్న సాంఘిక పరిణామదశలకు అనుగుణముగ ఆ యా వ్యవస్థలు రూపొందవలయుననియు కొందరు జాతీయ సంప్రదాయవాదులు అభిప్రాయపడిరి. ఈ వాదమునకు ఉపపత్తి బలమును చేకూర్చినవాడు ఫ్రెడ్రిక్ లిస్ట్ (1789 - 1846) అను జర్మన్ పండితుడు [చూ. సం. 5 - పు. 42].

పాశ్చాత్యలోకమున 1848 తరువాత భావనలందును, వ్యవస్థలందును పరివర్తనలను కొనివచ్చుటకు జ్ఞాతముగనో, అజ్ఞాతముగనో సహకరించినవి పై మూడు విధముల వాదములే అని స్థూలముగ చెప్పవచ్చును. అందు మార్క్స్ చేతను, తక్కు విధముల సోషలిస్ట్లచేతను ఆదరింపబడిన సోషలిస్ట్ వాదమునకు శ్రామికలోకముననను, కొందరు పండితులందును వ్యాప్తి కలిగినను, సంఘ వ్యవస్థలో మార్పులను కొనివచ్చు బలము వానికి అప్పటికి చేకూరలేదు. ఆస్తి హక్కుల విషయమున ఆ వాదము తలపెట్టిన పరివర్తనలును, అందలి అంతర్జాతీయతావాదమును ధనస్వాముల (పెట్టుబడిదారుల) పలుకుబడికి లోనైన జాతీయ ప్రభుత్వములకు భయసంజనకములైనవి. అంతట అట్టి వాదమునకు లోనైన శ్రామిక లోకపు దృష్టిని అటనుండి మరల్చుటకై యూరప్‌నందలి ప్రభుత్వములు కృషి మొదలిడినవి. అందులకై రెండు మార్గములు అవలంబింపబడినవి. అందు తొలుతటిది వోటు హక్కును క్రమముగ విస్తరింపజేయుట; ఇందువలన ప్రభుత్వమున తమకును భాగస్వామ్యము కలిగినదను సంతృప్తి శ్రామికలోకమున వ్యాపింపజేయవచ్చును. ఇక రెండవది సాంఘిక సంస్కరణలను కొనివచ్చుట; దీనివలన జీవన సదుపాయములు శ్రామికులకు కొంత విరివిగ లభ్యమగుటతో వారు సంతృప్తి వహించి జాతీయాశయముల సాధనకై ప్రభుత్వముతో సహకరింపగలరని ఆశింపబడినది. ఈ ద్వివిధ మార్గములందును మిల్ పండితుడు ప్రభుత్వము అవలంబించదగునని సూచించిన మానవ దయాళుతాయుతమగు కొలది జోక్యమును, లిస్ట్ పండితుడు సూచించిన జాతీయ ప్రయోజనానుగుణవ్యవస్థయు ప్రతిబింబితములయినవనుట సుస్పష్టము. ఈ మార్గములను అవలంబించుట వలన యూరప్‌నందు కలిగిన రాజ్యాంగ వ్యవస్థా పరిణామముల వివరములు ఇట చర్చనీయములు కావు [చూ. రాజనీతి సమీక్ష; పాశ్చాత్య రాజ్యాంగ వ్యవస్థా పరిణామము]. అటులే సాంఘిక సంస్కరణలను గురించియు చర్చించ ఇట అవకాశములేదు. కాని, ఈ సాంఘిక సంస్కరణల విషయమున జర్మనీ తొలుతగ కార్యాచరణకు పూనుకొనినదని మాత్రము చెప్పవలసి ఉన్నది. అప్పటికే సామ్రాజ్యములను సంపాదించిన గ్రేట్ బ్రిటన్, ఫ్రాన్స్ దేశములతో దీటుగ తమ జాతి త్వరితగతిలో ముందునకు వచ్చి త్వరలో వానిని అధిగమింపవలయునను జర్మనీ పాలక వర్గముల ఆకాంక్షయే ఇందులకు మూలకారణమని చెప్పవచ్చును. సంతృప్తి చెందిన కార్మికలోకపు సాయమువలననే అట్టి పురోగతి సాధ్యమగుననియు, కార్మికులకు కొన్ని జీవిత సౌకర్యములను చేకూర్చి, వారు సోషలిస్ట్ల అంతర్జాతీయతావాదమును త్యజించి, జాతీయతావాదమును అవలంబించునటుల చేయుట జాతీయాశయముల సాధనకు ముఖ్యప్రాతిపదిక అగుననియు జర్మనీ పాలకులు భావించిరి. కార్మికుల శ్రేయమును ఉపలక్షించి జర్మనీ ప్రభుత్వము 1883 - 89 మధ్యకాలమున ఆరోగ్యము, ప్రమాదము, వృద్ధాప్యము, అశక్తత మొదలగువాని విషయమున భద్రతను కూర్చు శాసనములను క్రమరీతిలో అమలునకు కొనివచ్చినది. గ్రేట్ బ్రిటన్‌న ఫ్యాక్టరీ చట్టములు 1833 - 1847 మధ్య రూపొందింపబడినను, అవి తగినంత విపుల ప్రాతిపదికను కలిగి ఉండినవి కావు. జర్మనీ ప్రభుత్వము సాంఘిక సంస్కరణలను ప్రవేశపెట్టిన తరువాత గ్రేట్ బ్రిటన్ ముందునకువచ్చి కార్మికులకు పెక్కు సదుపాయములను కల్పించినది. క్రమముగ ఈ సాంఘిక శ్రేయోకృషి ప్రభుత్వపు ఒక ముఖ్యబాధ్యతగ గ్రహింపబడినది. ఇందులకు ధనికులపై అదనముగ పన్ను విధించుటయు ఆరంభితమైనది (1909). ఈ చర్యలకు కొంతవరకు కార్మికుల సంఘటితశక్తియు దోహదకారిగ ఉపకరించినది. కార్మిక సంఘము (ట్రేడ్ యూనియన్)ల సంస్థాపన

18 వ శతాబ్ది అంతముననే గ్రేట్ బ్రిటన్‌న మొదలైనను, తొలుతగ అది ఎక్కువ ప్రయోజనకారిగ ఉండినది కాదు [చూ. సం. 5 - పు. 450]. 1825 లో అట్టి సంఘములు యజమానులచేతను, ప్రభుత్వముచేతను పరిగణన పొందు అధికారము ఆర్జించినను, సమ్మెచేయుట నిషేధింపబడినది. 1888 నాటికి ఆ సంఘములు పటిష్ఠతను పొంది ప్రభుత్వ నిర్ణయముల పై ప్రభావమును కొలదిగనైనను నెరప గలిగినవి.

పై చర్యలవలన ఆ యా జాతీయ ప్రభుత్వములు ఆశించినటుల కొంతవరకు ప్రయోజనము సమకూడినది. పందొమ్మిదవ శతాబ్ది పూర్వార్ధము ముగిసినప్పటినుండియు పాశ్చాత్య రాజ్యములందు జాతీయతా దురభినివేశము క్రమక్రముగ పెచ్చుపెరిగినది. గ్రేట్ బ్రిటన్, ఫ్రాన్స్, హాలండ్ వంటి దేశములందు సామ్రాజ్య విస్తరణతో పాటుగ పాలకజాతికి చెందితిమనుభావమును విపులముగ వ్యాప్తిపొందినది. అట్టి విపుల సామ్రాజ్యములు లేని జర్మనీ వంటి వానియందు అట్టివానిని సంపాదించుటకు జాతి యంతయు కృషిచేయవలయునను ఆకాంక్ష పెచ్చుపెరిగినది. యునైటెడ్ స్టేట్స్ నందును ఈ సామ్రాజ్య సంపాదనా యత్నము కొంత తావు కల్పించుకొనినది. ఇటుల జాతీయ దురభినివేశములు పెచ్చుపెరిగి సామ్రాజ్య విస్తరణకై యూరప్ దేశములు కృషిచేయుటలో యూరపియన్ శ్వేతజాతికి ఒక చారిత్రక బాధ్యత కలదనియు, ఆ బాధ్యతను నిర్వర్తించుటకై శ్వేతేతర జాతులపై తమ ఆధిపత్యమును నెలకొల్పవలసి ఉన్నదను దురభిప్రాయము జ్ఞాతముగనో, అజ్ఞాతముగనో యూరప్ జాతులందు ఆ కాలమున వ్యాపించినది [చూ. సం. 10 - పు. 809]. దీని వలన అంతర్జాతీయతాభావము మరుగున పడిపోయి మార్క్స్‌చే స్థాపింపబడిన మొదటి ఇంటర్నేషనల్ (అంతర్జాతీయ సంస్థ) సరిగ పనిచేయుటకు పరిస్థితులు అనుకూలింపక పోవుటవలన ఆ సంస్థ అంతరించినది (1876). మరల 1889 లో అట్టి సంస్థయే రెండవ ఇంటర్నేషనల్ అనుపేరున స్థాపితమైనను, అదియును జాతీయతాదురాభి నివేశమును అడచలేక పోయినది. ప్రథమ ప్రపంచయుద్ధము (1914 - 1918) మొదలైనంతనే అట్టి సామ్రాజ్యవాదపు పోరాటమున పాల్గొనవలదని ఆ సంస్థ ఎంత ఆదేశించినను దానిని లక్ష్యముచేయక, ఆ సంస్థయందు సభ్యత్వము వహించిన వివిధ దేశముల కార్మికోద్యమ నాయకులును, తమ తమ జాతీయ ప్రభుత్వములనే సమర్థించి యుద్ధమున పాల్గొనిరి. అంతటితో రెండవ ఇంటర్నేషనల్ కూడ నిష్ఫలముగ అంతరించినది (1914).

ఇటుల అంతర్జాతీయతను పోషించుటకై నెలకొల్పబడిన ఇంటర్నేషనల్ కృషి విఫలమైనను, వేరొక విధముగ అంతర్జాతీయతాభావము చాపక్రింది నీరువలె, అజ్ఞాత మార్గమున ప్రపంచమున నెలవు కల్పించుకొనినది. ఒక విధముగ శ్వేతజాతుల సామ్రాజ్యాసక్తియే అనుకొనని రీతిగ దీనికి దోహదకారియైనది. తమ విశాల సామ్రాజ్యముల రక్షణకై నవీన వైజ్ఞానిక పరిశోధనల సాయమున రాకపోకలను, వార్తాప్రసారమును సులభతరములుగ చేయుటకు సామ్రాజ్యములు పూనుకొనుటతో పాశ్చాత్య సారస్వతమును, ఆర్థిక, సాంఘిక భావములును ఆసియా - ఆఫ్రికా ఖండములందు వ్యాపింపదొడగినవి. తమ పరిపాలనలో సాయపడుటకు తమ సామ్రాజ్యములందలి దేశీయులకు - కొందరికి - తగు శిక్షణను ఇచ్చుటకు సామ్రాజ్య దేశములే పూనుకొనుట వలన ఈ భావముల వ్యాపనమునకు త్వరితగతి చేకూరినది. ఇందులకు తోడుగ ఆ యా దేశములందలి కొందరు ధీమంతులును సమాజము ముందునకు నడచుటకు పాశ్చాత్య భాషల పరిజ్ఞానము అత్యావశ్యకమని గ్రహించి దానికి ప్రోత్సాహమును కల్పించిరి. ఇట్టి వారిలో ప్రముఖులుగ భారతదేశమునందలి రామమోహనరాయ్ (1772 - 1833) [చూ. సం. 10 - పు. 647], చీనా యందలి చెంగ్ క్వా - ఫాన్ (1811 - 1872), జపాన్‌నందలి హిరోబూమి ఇటో (1838 - 1909) యుగణనీయులు. కాని, ఇట్టి ప్రోత్సాహము సత్వరముగ ఫలించుటకు దాస్యబద్ధమగు భారత దేశమునను, స్తబ్ధతానిమగ్నమగు చీనా దేశమందును పరిస్థితులు సహకరించినవి కావు. స్వతంత్రమును, జాతీయతా భావప్రేరితమునగు జపాన్‌న మాత్రము పాశ్చాత్య సంఘ వ్యవస్థకు బలమును చేకూర్చిన విజ్ఞాన శాస్త్రాదుల యందలి ఆదరము అతిశీఘ్రముగ వేరూనుకొనినది. తత్ఫలితముగ ఆ దేశమునందలి భూస్వామి వ్యవస్థ రద్దు అయినది (1869) ; సార్వజనిక విద్యావిధానము ప్రవేశ పెట్టబడినది (1871) ; రెండు సభలు కల శాసనసభ ఏర్పడినది (1889). పాశ్చాత్య న్యాయశాస్త్ర విధానములను అనుసరించుచు పౌర (సివిల్), దండ (క్రిమినల్), వ్యాపార, న్యాయ సంహితలు రూపొందింపబడి అమలులోనికి కొని రాబడినవి. కాని, ఇటుల పాశ్చాత్య సంఘ వ్యవస్థయందలి బాహ్యారూపములను, విజ్ఞానశాస్త్రములను స్వీకరించిన జపాన్ దేశమున దురదృష్టవశమున ఆస్తి, విభజనము మొదలగు వానిని గురించిన ఉదారభావనలు వేరూను కొనలేక పోయినవి. స్వతంత్రమగు జపాన్‌నందునేకాక పాశ్చాత్యుల సామ్రాజ్య కాంక్షకు బలియైన తక్కిన

ఆసియా, ఆఫ్రికా దేశములందును వ్యవహార నిర్వహణ సౌకర్యార్థమై న్యాయశాస్త్రము, అందును ముఖ్యముగ దండన్యాయమును, వ్యాపారన్యాయమును మతమునుండి వేరుచేయబడి పాశ్చాత్య భావనలకు అనుగుణముగ లౌకిక రూపమును పొందినవి.

పైన తెలుపబడిన మార్పులవలన ప్రపంచదేశములు తమ ఆకాంక్ష లేకుండగనే పరస్పర సాన్నిహిత్యమును పెంపొందించుకొను సమయముననే మానవ సంఘ వ్యవస్థా చరిత్రలో ఒక కళంకముగ వర్తించిన బానిసవ్యాపారము అంతమగుటకును పరిస్థితులు సహకరించినవి. అమెరికా ఖండమునందలి వలసలలో శ్రామికబలము తగినంత లేకపోవుట వలన 16 వ శతాబ్ది మొదలుగ విస్తృత ధనాదాయ మార్గముగ పలు పాశ్చాత్య రాజ్యములచే ఆదరింపబడిన బానిస వ్యాపారమునకు అమెరికా దేశములలో తగినంత జనసంఖ్య ఏర్పడుటయు, పారిశ్రామిక విప్లవము సాగుటయు కారణములుగ 18 వ శతాబ్ది మధ్యకాలమునకు గిరాకీ తగ్గినది. ఈ పరిస్థితులకు తోడుగ యూరప్‌నందలి ఉదారభావ వ్యాపనము మూలమున రచయితలు, మత సంస్కర్తలు మొదలగు వారిలో పలువురు ప్రముఖులు దీనిని నిరసించుచు పలు గ్రంథములను ప్రచురించిరి. కాని, రాజకీయ రంగమున పలుకుబడి కలవారిని ఈ ప్రచారము తొలుత ఆకర్షింపజాలక పోయినది. తుదకు విలియమ్ విల్బర్‌ఫోర్స్ (1759 - 1833) అను బ్రిటిష్ రాజనీతిజ్ఞుని కృషి మూలమున గ్రేట్ బ్రిటన్‌లోని పార్లమెంట్ చట్ట మూలమున బానిస వ్యాపారమును, బానిసత్వమును నిషేధించినది (1811). అంతకు కొంతకాలము ముందుగనే డెన్మార్క్‌నను బానిసవ్యాపారము చట్టమూలమున నిషేధింపబడినది (1792). 1814 లో జరిగిన వియెన్నా కాంగ్రెస్ [చూ.] న యూరప్ రాజ్యములు బానిసత్వపు నిర్మూలనమునకు సూత్రప్రాయముగ అంగీకృతిని తెలిపినవి. కడకు 1842 లో యూరప్ రాజ్యములన్నియు బానిస వ్యాపారమును శిక్షార్హముగ చేసినవి. యునైటెడ్‌స్టేట్స్‌ను క్రొత్తగ బానిసలను దిగుమతిచేయుటను శిక్షార్హము చేసినది; కాని, అదివరలో దిగుమతి అయిన బానిసలకును, వారి సంతతికి చెందినవారికిని బానిసత్వమును రద్దుచేయుటకు యునైటెడ్ స్టేట్స్‌లో పలుకుబడి కల వర్గములు అప్పటిలో అడ్డు తగిలినవి. క్రమముగ ఈ విషయమై చెలరేగిన అభిప్రాయ భేదములు అంతర్యుద్ధమునకు దారితీసినవి. బానిసత్వపు నిర్మూలనమును సమర్థించిన అధ్యక్షుడు అబ్రహామ్ లింకన్ [చూ.] ప్రేరేపణ వలన 1862 లో కడకు బానిసత్వము ఆ దేశమున నిర్మూలితమైనది. ఈ విధముగ తన మొదటి అడ్డంకి సడలినప్పటినుండియు తదితర మానవ స్వత్వములను ఆర్జించుటకు యునైటెడ్‌స్టేట్స్‌లోని నీగ్రో కడు దీక్షతో కృషిచేయ మొదలిడెను. ప్రగతి శీలురగు కొందరు శ్వేతజాతీయుల సాయమున ఆ కృషి ఈ నాటికిని సాగుచునే ఉన్నది. బానిసతనమును నిర్మూలించుటకు కృషి జరిగిన ఆ పరిస్థితులలోనే విముక్తులగు బానిసలచే స్థాపింపబడిన ఆధునిక కాలపు తొలుతటి స్వతంత్ర రాజ్యములగు హాయిటీ (1825), లైబీరియా (1847) సూచితాబ్దములందు రూపొందినవి.

ఇటుల అవ్యక్తము, అస్ఫుటము అగు రూపమున మానవ సమానతాభావము ప్రపంచమున ఎల్లెడల ఏదియో ఒక విధముగ తావు కల్పించుకొనినది. జాతీయతా దురభినివేశమువలనను, కార్మికోద్యమమునకు పై తరగతుల నుండి లభించిన సానుభూతి సహకారములవలనను ఇది పశ్చిమ యూరప్‌న కొంత మరుగుపడినను, తూర్పు యూరప్‌న - రష్యా సామ్రాజ్యమున - ఆ అంతర్జాతీయతా భావమునకు దోహదము కల్పించు తీవ్ర సోషలిస్ట్ భావములు మేధావులందును, పారిశ్రామిక కార్మికులందును తావు కల్పించుకొనుటకు వసతి చేకూరినది. పశ్చిమ యూరపియన్ దేశముల నుండి పారిశ్రామిక విప్లవమును గ్రహించుటకు ఉత్సుకతను చూపిన రష్యా సామ్రాజ్యపు చక్రవర్తులు, అట్టి విప్లవమునకు సహచర రూపమున చనుదెంచు ఉదారతాభావముల వ్యాప్తిని మాత్రము నిరోధించుటకై దౌర్జన్య పద్ధతులను వినియోగించుటకు వెనుదీయలేదు. తత్ఫలితముగ కార్మికులందును, పేదరైతులందును బయలుదేరిన అసంతృప్తిని ఉపయోగించుకొని, మార్క్స్ బోధించినటుల దౌర్జన్య పద్ధతుల వలన ప్రభుత్వమును కూలద్రోసి, నూతన వ్యవస్థను నెలకొలుప ఉత్సహించు తీవ్రవాదులు అట కొన్ని ప్రాంతములందు పలుకుబడిని ఆర్జించిరి. రష్యాదేశపు సామ్రాట్ ఈ ఉద్యమమును అడచుటకు జరిపిన తీవ్రకృషివలన అది రహస్యమార్గములను బట్టి ప్రచలితము కాసాగినది. ఆ ఉద్యమపు నాయకులు పశ్చిమ, ఉత్తర యూరప్ దేశములందు అమలులో ఉన్న వాక్స్వాతంత్ర్యాదులను అవకాశముగ గ్రహించి వానిని తమ నెలవుగ చేసికొని రష్యాయందలి తీవ్ర వాదులకు ప్రోత్సాహము కల్పించిరి.

తక్కిన దేశములతో పోల్చి చూచినపుడు టర్కీ సామ్రాజ్యము మాత్రము ఆ కాలమున ఉదారభావ వ్యాప్తిలో పేదవడినదిగ లెక్కింపదగి ఉండెను. మానవ సమతాభావమును సంఘ వ్యవస్థలోనికి కొనిరా యత్నించిన ఇస్లామ్‌నకు చేయూత ఇచ్చి తద్ద్వారా సామ్రాజ్య ప్రజల

దృష్టిని యూరప్‌నందలి ఉదారభావముల వైపునకు పోనీయకుండ చేయుటకు ఆ సామ్రాజ్య పాలకులు యత్నించిరి. అటులని యూరపియన్ సైన్య వ్యవస్థాదులను స్వీయములు చేసికొనుటలో మాత్రము వారు వెనుకంజవేయలేదు. ఇటుల పాశ్చాత్య నాగరకతయొక్క బాహ్యరూపమును గ్రహించి, అందలి మేలిగుణములను నిరాకరించుటకు ఆ సామ్రాజ్యము యత్నించుటలో దాని స్థితి మేడిపండు వాటముగ పరిణమించినది. ఎంత నిరోధించినను, యూరప్‌న చెలరేగిన జాతీయతావాదము టర్కీ సామ్రాజ్యమును కూడ కొంతవరకు లోగొనినది. తత్ఫలితముగ ఆ సామ్రాజ్యమునందలి క్రైస్తవ జాతులే కాక, అరబ్బుల వంటి ముస్లిమ్ జాతులును స్వేచ్ఛకును, స్వయం నిర్ణయమునకును తాపత్రయ పడసాగినవి.

ఇట్టి పరిస్థితులలో ప్రపంచ చరిత్రగతిని తమ వశమున ఆనాడు ఉంచుకొనిన యూరపియన్ రాజ్యముల జాతీయతా దురభినివేశముల ఫలితముగ వాని వాని ప్రత్యేక శ్రేయస్సాధనలకు పరిష్కార మార్గముగ వారిచే భావితమయిన ప్రథమ ప్రపంచయుద్ధము సంఘటిల్లినది. తత్ఫలితముగ అందు పాల్గొనిన ఏ ఒక ప్రత్యేక జాతికిని గణనీయమగు శాశ్వత లాభము ఏమియు సమకూడకపోయినను, అయాచితముగ, పరిస్థితుల ప్రాబల్యమున, అంతర్జాతీయతావాదముపై ఆధారపడిన ఒక నూతన సమాజ వ్యవస్థను, రక్తపాతమున, దౌర్జన్యమార్గమున స్థాపించ దీక్షవహించిన బోల్షివిక్ ల ప్రభుత్వము రష్యాలో విప్లవ ఫలితముగ ఏర్పడెను (1917).

నాలుగవ దశ : ప్రథమ ప్రపంచ యుద్ధానంతరమున శాంతి సాధనకై పలు సమావేశములు జరిపి, కృషిచేసిన విజేతృ రాజ్యప్రతినిధులకు ఆ యుద్ధప్రగతివలన ప్రపంచ ప్రజలలో కలిగిన భావ పరివర్తనమును గురించిన ప్రసక్తి రవంతయు పట్టలేదు. నామమాత్రాధికారములు కలిగిన నానాజాతిసమితిని నెలకొల్పుట, ఆస్ట్రియా - హంగేరీ, రష్యా, టర్కీ సామ్రాజ్యములకు చెందిన యూరపియన్ ప్రాంతములందు అన్నింట జాతీయ స్వయంనిర్ణయ సిద్ధాంతము పేరున చిన్న చిన్న రాజ్యముల నెలకొలిపి వానిని గుర్తించుట, విజిత రాజ్యములకు చెందిన వలస ప్రాంతములను మాండేటరీ (ధర్మబద్ధ) పాలన నెపమున బ్రిటన్, ఫ్రాన్స్, ఇటలీ, జపాన్ దేశములు పంచుకొనుట, జర్మనీ నుండి వీలయినంత పెద్దమొత్తమును అతి త్వరితగతిలో నష్ట పరిహారము నెపమున వసూలు చేయుటకు తగు ఒడంబడికలను కుదుర్చుకొనుట - అను ఈ నాలుగు మహాత్కార్యములను నిర్వర్తించుట వలన శాంతియుత మానవ సంఘ వ్యవస్థా పరిణామమునకు యూరప్‌నను, తన్మూలమున ప్రపంచమునను రాచబాటలను తీర్చిదిద్దగలిగినటుల ఆ రాజనీతిజ్ఞులు భావించిరి. ఆస్తి, ఉత్పత్తి, వినిమయముల విషయమున తమ రాజ్య ప్రజలలోనే కలిగిన భావ విప్లవమును కాని, స్వాతంత్ర్యసాధన విషయమై వలస ప్రజలలో అంకురితమైన గాఢాకాంక్షను కాని, యూరప్, ఆసియా ఖండములలో విస్తృత భూమిని ఆక్రమించిన రష్యాయందు స్థావరమును నెలకొలుపుకొనిన కమ్యూనిస్ట్ నియంతృత్వపు ప్రాముఖ్యమును కాని వారు లెక్కగొనక, అటుల వ్యవహరించుట వలన వారి అంచనాలును, ఆశలును త్వరలోనే తారుమారైనవి.

నానాజాతిసమితియందు జర్మనీ, రష్యా దేశములకు తావు లేకపోవుటతోపాటుగ దాని స్థాపనను తొలుత నుండియు ప్రోత్సహించిన ప్రెసిడెంట్ విల్సన్ చర్యను బలపరచుటకు యునైటెడ్ స్టేట్స్ కాంగ్రెస్ నిరాకరించుట వలన సమితి ప్రతిపత్తియే అర్థరహితమైనది. ఇక సమితిపై పెత్తనమును నిర్వహించు బ్రిటన్, ఫ్రాన్స్ దేశములకును సమితికి ఎక్కువ బలము చేకూరుట వాంఛనీయము కాకపోవుటచేత, ఈ విషయము వానిని అంతగ బాధించినది కాదు. కాని, ఈ రాజ్యములతోపాటుగ తక్కిన యూరపియన్ రాజ్యములను ఎక్కువగ కల్లోలితములు చేసినవి ఆనాటి ఆర్థిక సమస్యలు.

ప్రథమ ప్రపంచ యుద్ధకాలమున వివిధ ప్రభుత్వములు యుద్ధనిర్వహణ సక్రమరీతిలో సాగుటకై తమ దేశము లందలి పరిశ్రమలపై ఒక విధమగు ఆధిపత్యమును నెలకొల్పినవి. ఉత్పత్తిని అధికతరముచేసి, ఆహారాది వస్తువుల సక్రమ విభజనకై మార్గములను ఏర్పరచుటకు ప్రభుత్వములు ఆ కాలమున కృషిచేసినవి. వివిధ యుద్ధపరిశ్రమల లోను, అనుబంధ పరిశ్రమలలోను ఉత్పత్తి విరివిగ సాగవలసిన అవసరమునుబట్టి యుద్ధకాలమున నిరుద్యోగమునకు అవకాశమే దాదాపుగ శూన్యమయ్యెను. యుద్ధము ముగిసిన వెంటనే ఈ పరిస్థితులన్నియు తలక్రిందులయ్యెను. వివిధ పరిశ్రమలపై ప్రభుత్వములు తమ అజమాయిషీని తొలగించినవి. ధనస్వాములు తమ తొలుతటి యాజమాన్యమును మరల స్వీకరించి, ఉత్పత్తిని తమ లాభముల గిట్టుబాటునకు అనుగుణముగ మార్చ మొదలిడిరి. యుద్ధ పరిశ్రమలకు ఆవశ్యకతయు సన్నగిల్లెను. తత్ఫలితముగ నిరుద్యోగము క్రమక్రమముగ వ్యాపించినది. ఇందులకు తోడుగ జాతీయ స్వయంనిర్ణయము పేరున, యూరప్‌న ఎల్లెడల బయలుదేరిన చిన్న రాజ్యముల ఉనికియు ఈ ఆర్థిక కల్లోలమును తీవ్రతరము చేసినది. జాతీయ స్వయం

నిర్ణయ సిద్ధాంతమును అనుసరించి రూపొందిన విభజన వలన అందలి ప్రజల దామాషాకు తగినటుల సంపదుత్పత్తికి ఉపకరించు ముడిపదార్థములును, కుశలతయు నెలకొని ఉండవను నగ్నసత్యము క్రమముగ తేటతెల్లమైనది. జాతీయ సర్వసత్తాకత పేరున ప్రతిరాజ్యము ఒక ప్రత్యేక ద్రవ్యవిధానము, చలామణీ, ఎగుమతి దిగుమతులపై అజమాయిషీని ఏర్పరచుకొనుటతో యుద్ధాత్పూర్వము ఏ కొలదిగనో యూరప్‌న ఉండిన ద్రవ్య వినిమయ సామరస్యము బహుధా విచలత చెందినది. ఈ క్లిష్ట పరిస్థితిని ఇంకను క్లిష్టతరము చేసినది ఋణ సమస్య. యూరప్‌న నూతనముగ నెలకొనిన జాతీయ రాజ్యములు, తమకు ప్రతిపత్తిని కల్పించిన యుద్ధమునకై తగిలిన వ్యయమున తమ వాటాను చెల్లించుటకు మిత్రరాజ్యములకు ఋణపడినవి. ఈ మిత్రరాజ్యములు అన్నియు యునైటెడ్ స్టేట్స్‌కు ఋణపడినవి. మిత్రరాజ్యములకు నష్టపరిహార రూపమున జర్మనీ ఋణపడియుండినది. ఇటుల గజిబిజిగ ముడివడి ఉండిన ఈ ఋణములను వాయిదాలమేరకు చెల్లించుటకు - నిరుద్యోగిత వ్యాపించిన కొలది - అవకాశము మృగ్యమైనది. ఈ ఋణముల చెల్లింపునకై పన్నులవలన తగు మొత్తమును చేకూర్చజాలని ప్రభుత్వములు ముమ్మరముగ నోట్లను అచ్చు గ్రుద్దించినవి. ఈ నోట్లు అసంఖ్యాకముగ చలామణీకి వచ్చుట వలన వస్తువుల ధరలు విపరీతముగ పెరిగిపోయి, తన్మూలమున నాణెపు అంతర్జాతీయ విలువ పడిపోయి, ఒక విధమగు ఆర్థిక మాంద్యము యూరప్‌న 1920 లగాయితు తావు కల్పించుకొన మొదలిడినది. ఎక్కువ ఋణభారమును వహించిన జర్మనీయందును, విప్లవ మూలమున సంపదుత్పత్తి సాధనములు దెబ్బతినిన సోవియట్ రష్యాయందును ఈ మాంద్యము అత్యంత తీవ్రరూపములను తాల్చినది. సోవియట్ రష్యాయందలి బోల్షివిక్ ప్రభుత్వము నోట్ల ముద్రణకు విరివిగ పూనుకొనిన ఫలితముగ ధరలు పెచ్చుపెరిగి, కడకు ఒక కోడిగ్రుడ్డు ఖరీదు 10,000 రూబుల్‌లకు పెరిగెను. ప్రజలలో ధనస్వామ్యమును నిరసించిన బోల్షివిక్ ప్రభుత్వము ఇట్టి పరిణామము వలన ధనమునకు విలువలేదను విషయమును ప్రజలు గుర్తించగలరని తలచి దీనిని తొలుత ప్రోత్సహించినది. కాని, ఇట్టి విపర్యయము వలన ప్రజలలో సంపదుత్పాదనోత్సాహము నశించుటతోపాటుగ అంతర్జాతీయముగ రష్యా ప్రతిపత్తికి భంగము కలుగగలదను సత్యమును గ్రహించి ప్రభుత్వము చలామణీని సంస్కరించి, 10,000 పాత రూబుల్‌లకు సమానమగు క్రొత్త రూబుల్ నాణెమును ప్రవేశ పెట్టినది (1921); తరువాత 1923 లో *రూబుల్‌ను బంగారముతో ముడివెట్టి జార్ కాలపు స్థైర్యమును దానికి కల్పించినది. 1925 లో జర్మనీయు ఇట్టి సంస్కరణయే చేసి, క్రొత్త *మార్క్‌ను ప్రవేశ పెట్టినది. ఇట్టివేయగు కొన్ని మార్పుల వలనను, జర్మనీ చెల్లించదగు నష్టపరిహారపు చెల్లింపుల ఏర్పాటునందు యునైటెడ్ స్టేట్స్ ప్రోత్సాహమున అమలులోనికి వచ్చిన సదుపాయములవలనను యూరప్‌న మరల ద్రవ్య వినిమయ స్థైర్యము నెలకొనినది. కాని, త్వరలోనే 1929 లో ఆర్థిక సంక్షోభము అతి తీవ్రరూపమున యూరప్‌నే కాక ప్రపంచమును అంతటిని కల్లోలితము చేసి, సంఘ వ్యవస్థలో అప్పటికి కుదురుకొనిన లోపములను వెలికి తెచ్చినది.

ఆర్థిక సంక్షోభము పారిశ్రామిక విప్లవమున ఒక సహజ పరిణామమనియు, అంతటంతట ఉత్పత్తి పెంపుదల, గిరాకీ తగ్గుదల వలన అట్టిది కలిగినను అది త్వరలో అంతరించి పరిస్థితులు కుదుటబడి యథాపూర్వముగ పరిశ్రమలు పురోగమింపగలవనియు, సంప్రదాయ (శిష్ట) ఆర్థికవేత్తలు చెప్పుదురు. ఇందలి యథార్థత ఎట్టిదైనను 1929 సంక్షోభము మాత్రము ఆ ప్రవీణుల ఊహలను కూడ అతిక్రమించినది. ఈ సంక్షోభమునకు కల కారణములలో యూరప్‌న వ్యాపించిన నిరుద్యోగము, ముడివస్తువుల అందుబాటులో గల అభ్యంతరములు మొదలగునవి ప్రముఖపాత్ర వహించినను, వానితోపాటుగ ఆనాడు యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వము బాకీల చెల్లింపు విషయమున వహించిన పట్టుదలయు కొంతవరకు కారణభూతమైనది. ఈ చెల్లింపునకు సరిపోవు రీతిలో సరకులను దిగుమతి చేసికొనుటకు ఆ ప్రభుత్వము నిరాకరించినది. సరకుల దిగుమతి వలన తమ పరిశ్రమలలో నిరుద్యోగము ఏర్పడునని ఆ ప్రభుత్వము భయపడి, బంగారము రూపమున బాకీలు చెల్లించవలసినదిగ కోరుచు దిగుమతి పన్నులను విపరీతముగ పెంచివేసినది. ఇందువలన తొలుత సువర్ణము ప్రవాహరూపమున యునైటెడ్ స్టేట్స్ చేరినది. ఆ దేశమునందలి పరిశ్రమలలో ఉత్సాహము పెచ్చు పెరిగినది; ఉత్పత్తి విరివిగ పెరిగినది. ఉత్పత్తికి తగినటుల దేశమున గిరాకీ లేనపుడు దేశీయులకే వాయిదాలపై వస్తువులను అమ్ము సంస్థలు వెల్లివిరిసి అమ్మకమును ప్రోత్సహించినవి. అమ్మకము పెరిగిన కొలది పరిశ్రమలందలి వాటాల ధర నిజపుధరకన్న చాల ఎక్కువగ పెరుగుటయు జరిగినది. కాని, ఈ కృత్రిమపు ధరలు ఒక పరిమితికి దాటి పెరుగలేవనుట ఒక ఆర్థిక సత్యము. గిరాకీ తగ్గుముఖము

* రూబుల్ = రూ. 1-19; మార్క్ = రూ. 1-13 (1960).

పట్టగనే ఈ పెరుగుదల తగ్గినది. అంతట ఈ వాటాల వ్యాపారము సాగించువారిలో ఆందోళన మొదలై అక్టోబరు 24, 1929 న న్యూయార్కులోని వాల్ స్ట్రీట్ మార్కెట్‌లో ఒకరికన్న ఒకరు తక్కువ ధరలకు వాటాలను, హామీ పత్రములను అమ్మటతో ధరలు ఎన్నడు కనివినని వేగముతో పతనము చెందినవి. యునైటెడ్ స్టేట్స్ పెట్టుబడులతో ముడివడి ఉన్న తక్కిన ప్రపంచము అంతటను వస్తువుల ధరలు అతిహీనస్థితికి ఆ మరునాటికే దిగజారినవి. తత్ఫలితముగ సోవియట్ రష్యా తప్ప తక్కిన ప్రపంచ రాజ్యములు అన్నియును తరతమ భేదములతో ఏదియో ఒక తీరుగ ఈ ఆర్థిక సంక్షోభమునకును, తత్పరిణామములకును గురియైనవి. తక్కిన ప్రపంచ రాజ్యముల నుండి ఆర్థిక రీత్యా విడివడి ఉండిన సోవియట్ రష్యాను మాత్రము ఈ సంక్షోభము లోగొనినది కాదు.

ఈ ఆర్థిక సంక్షోభము వలన పారిశ్రామిక దేశములలో పరిశ్రమలు మూలపడినవి; కార్మికులు నిరుద్యోగులై దిక్కుమొక్కులేక అల్లాడిరి. ముడిపదార్థములను, ఆహార ధాన్యములను ఉత్పత్తిచేయు దేశములలో ధరలు పడిపోయి, ఎగుమతులకు అవకాశము లేక, కృషిచేయుటకు ఉత్సాహమే సన్నగిలినది. ఎల్లెడల నిస్పృహ, నిరాశ అలముకొనినవి. కాని, మానవ సంఘ వ్యవస్థను ఇటుల చీకాకుపరచి, స్థైర్యమును సడలించిన ఈ క్లిష్టపరిస్థితినే చారిత్రక రీతిలో పరికించినపుడు విశ్వమానవ గత చరిత్రను భావి చరిత్రనుండి వేరు పరచు ఒక విస్పష్ట సీమా రేఖగ దీనిని మనము భావింపవచ్చును. ఈ క్లిష్ట సంక్షోభమునుండి తమ తమ దేశములను ఉద్ధరించుటకు వివిధ దేశముల పాలకులు చూపిన చొరవలోను, మానవ సంఘమును ఎదుర్కొనిన ఈ ఉపద్రవమునకు మూలకారణములను అరసి తగు నివారణోపాయములను సూచించుటకు భావనాశీలురగు పండితులు సలిపిన కృషిలోను అంతర్జాతీయ భావ విపుల వ్యాప్తికి బీజములు చల్లబడినవి. ఆ యా కృషి వివరములను విపులముగ పేర్కొనుటకు ఇట అవకాశము లేదు. కాని, వీని ఫలితముగ ప్రపంచమున మూడువాదములు 1. కమ్యూనిజమ్; 2. ఆధునిక ప్రజాస్వామ్య వాదము; 3. ఫాసిజమ్ ఆదరమును ఆర్జించినవి.

పై వానిలో మొదటి దానికి మూలకందము సోవియట్ రష్యా. అంతర్జాతీయతావాదమును ముఖ్యప్రాతిపదికగ గ్రహించిన ఈ దేశము తన వాదమునకు అనుకూలముగ తక్కిన ప్రపంచమును త్రిప్పికొనుటకై మూడవ ఇంటర్నేషనల్‌ను 1919 లో స్థాపించినది. కాని, త్వరలోనే విప్లవమనునది ఎగుమతి చేయబడు పదార్థము కాదని గుర్తించినది. ఇందులకు తోడుగ స్వదేశమున బోల్షివిక్‌లు ఎదుర్కొనిన అంతర్యుద్ధమును, కరవుకాటకములును వారి విప్లవోద్రేకమును కొంతవరకు చల్లబరచి, ప్రశాంత బుద్ధితో విప్లవసమస్యలను ఎదుర్కొను అలవాటు వారికి కలుగజేసినది. 1920 - 21 లో విప్లవనాయకులు తెచ్చిపెట్టిన తీవ్ర సంస్కరణలతో దేశమున ఉత్పత్తి పడిపోయి కరవు కాటకముల వలన జననాశము విపరీతముగ జరిగి, సంఘ వ్యవస్థామూల ప్రాతిపదికయే అంతరించు పరిస్థితి ఏర్పడగ, ఒక విధమగు రైతువారీ వ్యవస్థ పునరుద్ధరింపబడినది. లెనిన్ మరణానంతరమున నాయకత్వమునకై జరిగిన పోరాటమున తొలుతగ సోషలిస్ట్ వ్యవస్థా నిర్మాణము సోవియట్ రష్యాకు మాత్రమే పర్యాప్త మొనర్పబడవలయునను స్టాలిన్ వాదము నెగ్గి, అతడు నియంతయైన తరువాత రైతువారీ వ్యవస్థకు మరల స్వస్తిచెప్పబడినను, దీని మూలమున సోవియట్ రష్యాయును, ఒక ప్రత్యేక జాతీయవాద ప్రభావితమగు దేశముగనే అంతర్జాతీయ రంగమున పేరును పొంది పరిగణనను కల్పించుకొనినది. 1928 లో ఆ దేశమున మొదలిడబడిన పంచవర్ష ప్రణాళికల వలన దేశము పారిశ్రామికముగ తీవ్రవేగమున పురోగమింప మొదలిడినది. దేశమున ద్రవ్యచలామణీయు, ఎగుమతి దిగుమతులును ప్రభుత్వ వ్యవస్థ చేతిలో ఉండి, వేరొక దేశపు చలామణీతో ఏ తీరుగను ముడివడకుండ ఉండుట వలన 1929 నాటి ఆర్థిక సంక్షోభము ఆ దేశమును బాధింపలేదు సరికదా, ఆ కాలముననే ఆ దేశము మూల పరిశ్రమల స్థాపన విషయమున చాల ముందంజవేసినది. ఈ ప్రగతి శ్లాఘనీయమే అయినను, దీని సాధనకై ఆ దేశమునందలి సామాన్య మానవునికి గల ప్రాతిపదిక వాక్ప్రావనా స్వాతంత్ర్యములు రద్దుచేయబడినవి. దేశమంతయు ఒక పోలీసు పాలిత రాజ్యముగ పరిణమించినది. ప్రజాస్వామికవాదులు మానవత్వపు ప్రాతిపదికగ భావించు వ్యక్తి స్వాతంత్ర్యము అచట అంతరించినది; కాని, జాతీయసంపద విరివిగ పెరిగినది.

రెండవదియగు ఆధునిక ప్రజాస్వామ్యము యథార్థమున, ఒక నూతన వాదము కాదు; యూరప్, అమెరికా ఖండములలో ప్రాయోగికదశలో ఉండిన ప్రజాస్వామికమునకు ఇది సహజ పరిణామమే. ఆర్థికావకాశముల సమానతకు చోటీయని వోటుహక్కు - ప్రజాస్వామ్యము మానవ సంఘ వ్యవస్థకు సరియగు స్థిరత్వమును కల్పింపజాలదని ప్రజాస్వామికవాదులలో పలువురు 18 వ శతాబ్ది అంతము నుండియు భావించుచుండిరి. క్రమక్రమముగ వోటు హక్కునకు విస్తృత ప్రాతిపదికను కల్పించుటతోపాటుగ

కార్మిక శ్రేయస్సు కొరకై కొన్ని సంస్కరణలు ప్రవేశ పెట్టబడినను అధికారము, పలుకుబడి కల వర్గముల అధీనముననే ఉండినది. పరిశ్రమలును, పత్రికలు మొదలగు ప్రచార సాధనములును వారి అధీనములో ఉండుట వలన ఎన్నికలు మొదలగు వానిలో వారి జోక్యము ప్రత్యక్షము గనో, పరోక్షముగనో విస్తరించుటకు అవకాశములు అంతటంతట అతిశయిల్లినవి. పరిశ్రమల విస్తరణకును, తద్ద్వారా నిరుద్యోగనిర్మూలనమునకును విస్తృతావకాశ ములు కలిగి, మానవుని స్వేచ్ఛాజీవితమునకు వసతి కలిగిన యునైటెడ్ స్టేట్స్‌లో సైతము ఎన్నికలపై ధనికవర్గముల అనుచిత ప్రభావము విపరీతముగ పెరిగి పోయినది. ఎన్నికలలో అధికారమును ఏ మార్గముననో సంపాదించి, దానికి సుస్థిరత కల్పించుటకై, ఆశ్రితులకు ఉద్యోగము లను, వ్యాపారావకాశములను ఇచ్చుట ఒక పరిపాటిగ యూరప్, అమెరికా ఖండములందు పరిణమించినది. కొన్ని కొన్ని ప్రాంతములందు పరస్పరాశ్రయముపై బ్రతుకు అధికార, ధనాసక్తుల ముఠా ఒకటి సర్వాధి కారములను వహించి, ఎన్నికల ఫలితమును ఇచ్ఛ వచ్చినటుల రూపొందించుటకును సమర్థమై ఉండెడిది. యునైటెడ్ స్టేట్స్‌లో పారిశ్రామికముగను, రాజకీయము గను కీలక స్థానముగ పేరొందిన న్యూయార్కు నగర మున 1870 లో రాజకీయపు పలుకుబడిని, అనుచిత మార్గముల ద్వారా ఒక ముఠా మూలమున ట్వీడ్ అను నతడు ఆర్జించెను. ఈ ముఠాకే 'టమ్మనీరింగ్' అనుపేరు ఆనాడు ఏర్పడి వ్యంగ్యార్థమున లంచగొండి రాజకీయ సంస్థకు పర్యాయపదముగ రూఢ్యర్థమును పొందినది. యూరప్, అమెరికా ఖండములలో వ్యాపించిన ఈ రాజ కీయ జాడ్యమును నివారించుటకై ఉద్యోగుల నియామక మున 'అర్హతా విధానము (మెరిట్ సిస్టమ్)' అమలు లోనికి వచ్చినది. 1871 లో జర్మనీ సామ్రాజ్యమున ఈ విధానము ప్రవేశ పెట్టబడి క్రమముగ బ్రిటన్, ఫ్రాన్స్, యునైటెడ్ స్టేట్స్‌కు వ్యాపించినది. కాని, ఈ అర్హతా విధానము అన్ని శాఖలకు వర్తింపజేయుటలో మాత్రము వివిధ ప్రభుత్వములు వివిధాపవాదములను ఏర్పరచుటతో ఏ ప్రభుత్వమునను ఇది సంపూర్తిగ అమలులోనికి రాలేక పోయినది. కేవలము అర్హతలనే ప్రాతిపదికగ గ్రహించి ప్రభుత్వోద్యోగులను అందరిని నియమించుట అనునది ఈ నాటికిని ప్రజాస్వామిక రాజ్యములు సాధించలేక పోయిన వని చెప్పవచ్చును.

అర్హతా విధానము వలన పలుకుబడిగల వారి దౌష్ట్య మును అరికట్టుటకు యత్నములు జరిగిన కాలముననే వోటు హక్కును విస్తృతతరము చేయుటకును కృషి జరిగినది. 1871 లో ఫ్రాన్స్ దేశమున మగవారికి అందరికిని వోటుచేయు హక్కు లభించెను. ఈ విషయమున బ్రిటన్ అంచెల వారీగా ముందునకు నడచినది. 1867 నాటికి ఆ దేశమున ఫ్యాక్టరీ పనివారలకు అందరికిని వోటుహక్కు ఈయబడినది. తరువాత 1884 లో ఇట్టి హక్కులే వ్యవ సాయ కార్మికులకును కల్పింపబడినవి. స్త్రీలకు మాత్రము ఆ హక్కు ఆ నాటికి ప్రజాస్వామిక పథమున పురోగ మించిన గ్రేట్ బ్రిటన్, ఫ్రాన్స్, యునైటెడ్ స్టేట్స్ దేశములలో సైతము లేకుండెను. కాని, తీవ్రాందోళనా ఫలితముగ కొన్ని బ్రిటిష్ అధినివేశములలోను, యునై టెడ్ స్టేట్స్, స్కాండినేవియా దేశములందును, స్త్రీలకు వోటు హక్కులు తొలుత ఏర్పడినవి. వీనిలో మొదట దారి చూపినది న్యూజీలండ్. ఆ దేశమున 1893 లో స్త్రీలకు వోటుహక్కు లభించినది. అంతట 1902 లో ఆస్ట్రేలియా లోను, 1907 లో నార్వేయందును, ఆ సంవత్సరముననే యునైటెడ్ స్టేట్స్‌లోని కొన్ని పశ్చిమ రాష్ట్రములందును స్త్రీలు ఆ హక్కును ఆర్జించిరి. బ్రిటన్‌లో మాత్రము చాల కాలము వరకు ఎన్నికలలో స్త్రీలు పాల్గొనుటను గురించి తీవ్ర ప్రతిఘటన ఉండినది. కాని, అచట స్త్రీలు సాగించిన తీవ్రపు ఆందోళన ఫలితముగ 1918 లో వారికి ఆ హక్కు లభించినది. వెంటనే యునైటెడ్ స్టేట్స్ లోను అన్ని రాష్ట్రముల స్త్రీలకును వోటు హక్కులు ఉండవలయునను ఉద్యమము సాగి, 1920 లో విజయమును పొందినది. ఆ సమయముననే డెన్మార్కు, జర్మనీ దేశము లలో కూడ ఇట్టి హక్కులు మహిళలకు లభించినవి. కాని, విప్లవ భావములకు జన్మస్థలముగ పేరొందిన ఫ్రాన్స్‌న మాత్రము ఇందులకు ప్రతిఘటన అతి దీర్ఘకాలము కొన సాగినది. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున మాత్రమే అచ్చట స్త్రీలకు వోటు హక్కు లభించినది.

వోటుహక్కు ఇటుల క్రమముగ వివిధ ప్రజాస్వామిక దేశములందు విపులతను పొందినను, దానివలన మాత్రమే సంఘ వ్యవస్థలోని లోపములు చక్కజేయబడవనియు, క్రిందివర్గముల వారు సైతము రాజకీయములందు తమ పలుకుబడిని ఎట్టి అడ్డంకులు లేక వ్యాపింపజేసినపుడు మాత్రమే సంఘపు ఆర్థిక వ్యవస్థయందలి అస్తవ్యస్తత అంతరింపగలదనియు ప్రథమ ప్రపంచ యుద్ధానంతరపు పరిస్థితులు స్పష్టము చేసినవి. ఇందులకు తోడుగ రష్యాలో ప్రజ్వరిల్లిన విప్లవమును ఈ భావమునకు దోహదము చేసినది. అంతట ప్రజాస్వామిక మార్గముల ద్వారా సోష లిస్ట్ సమాజమును స్థాపింప కృషిచేయు రాజకీయ పక్ష

ములు కార్మికుల అండదండలతో యూరప్‌నందు రూపు గొనినవి. గ్రేట్‌బ్రిటన్ నందలి లేబర్ పక్షమును, తక్కిన యూరపియన్ దేశములలోని డెమోక్రాటిక్ సోషలిస్ట్ పార్టీలును ఇటుల ఏర్పడినవే. ఇవి తొలుత కొంత బలమును ఆ యా దేశములందు ఆర్జించుకొనినవి. ముఖ్యముగ గ్రేట్‌బ్రిటన్‌నందు లేబర్ పార్టీ 1929 లో ప్రభుత్వమును కూడ ఏర్పరచగలిగినది. కాని, పలుకుబడి కల వర్గముల తీవ్ర ప్రతిఘటనవలనను, అనాదిగ వ్యక్తిగతపు ఆస్తిపై ప్రజలలో నెలకొని ఉండిన గాఢపు మక్కువను తొలగించు పరిస్థితులు అప్పటికి సమకూడకపోవుటవలనను, ఆ ప్రభుత్వము సోషలిస్ట్ సమాజ నిర్మాణ విషయమున గణనీయమగు కృషిని సాగించలేక అంతరించినది (1931 ఆగస్టు). దానికి తోడుగ 1929 లో వచ్చిన ఆర్థిక సంక్షోభము వారి దుందుడుకు చర్యల ఫలితమేయని వారి ప్రత్యర్థులు సాగించిన ప్రచారము సామాన్య ప్రజలపై కొంత ప్రభావమును నెరపి, వ్యతిరేకతను ఎక్కువ చేసినది. ఇటుల ఆ కాలమున గ్రేట్‌బ్రిటన్‌నే కాదు, తక్కిన యూరప్‌ను సోషలిస్ట్ సమాజమును నిర్మింపదలచిన ప్రజాస్వామిక పక్షములకు చుక్కెదురైనది. కాని, పరోక్షముగ 1929 నాటి ఆర్థిక సంక్షోభము సోషలిస్ట్ భావములకు కొంత బలమును కలిగించినది. వ్యక్తిగతపు ఆస్తిపై ప్రభుత్వము తీవ్రతర నియమనాధికారమును గ్రహింపనిచో, ఆ సంక్షోభము నుండి విడివడుట అసాధ్యమను విషయమును శిష్ట సంప్రదాయ ఆర్థిక భావనలు కలవారును అపుడు అంగీకరింపవలసి వచ్చినది. పెట్టుబడిదారీ విధానమునకు పెట్టని కోటయని తలపబడు యునైటెడ్‌స్టేట్స్‌లోనే ఈ భావము కడకు తావు కల్పించుకొనినది. 1933 లో యునైటెడ్‌స్టేట్స్ అధ్యక్షుడుగ పదవిని స్వీకరించిన రూజ్‌వెల్ట్ స్వీయ దేశమును ఆర్థిక సంక్షోభము నుండి గట్టెక్కించుటకు అవలంబించిన 'న్యూ డీల్ (నవ్య వ్యవహరణ)' లో ప్రతిబింబితమైనది ఈ భావనయే. సోషలిస్ట్ సిద్ధాంత వాదములకు రూజ్‌వెల్ట్ వ్యతిరేకి ; అయినను సంపదుత్పత్తి వినిమయములపైనను, బ్యాంకింగ్ పైనను ప్రభుత్వపు ఆధిపత్యమును, నియమనాధికారమును వివిధ చట్టముల ద్వారా అతడు గాఢతరము చేసెను. గిట్టుబాటుతో నిమిత్తము లేకుండ నిర్మాణ కార్యక్రమములను సాగించి, నిరుద్యోగమును పారద్రోలుటకు కృషిచేసెను. పొలములను బీడుగ ఉండుటను నిషేధించి భూస్వాములు వానియందు విధిగ ప్రత్తిపంటను సాగించవలసినదిగ ఆదేశించెను. ఇటుల కడకు పరిస్థితుల ప్రాబల్యమువలన ప్రజాస్వామికము ఒక నూతన రూపమును సంతరించుకొనినది. ఇటులే తక్కిన ప్రజాస్వామిక రాజ్యములును సంప్రదాయ ఆర్థిక శాస్త్రభావనలకు స్వస్తిచెప్పి, ఉత్పత్తి - వినిమయములపైనను, ఎగుమతి - దిగుమతుల పైనను, బ్యాంకింగ్ పైనను ప్రభుత్వపు ఆధిపత్యమును, జోక్యమును గాఢతరము చేసినవి. ఇట్టి చర్యలు ఆ యా రాజ్యములందలి ప్రజాస్వామిక సోషలిస్ట్‌లకు కొంత బలమును పరోక్షముగ చేకూర్చినవి. ఈ చర్యల వలన ఆర్థిక సంక్షోభములనుండి ఆ యా రాజ్యములు కొంతవరకు తేరుకొనుట వాస్తవమే అయినను, యూరప్‌నందలి నిరుద్యోగము, ఈ చర్యల కన్న మిన్నగ, అంతటనుండి సాగిన యుద్ధ పరిశ్రమల వ్యాప్తివలననే ముఖ్యముగ అంతరించినదని చెప్పవచ్చును. ఈ యుద్ధోన్మాదమునకు ముఖ్యకారణము ఫాసిజమ్ యొక్క వ్యాప్తి.

ఫాసిజమ్ [చూ ] అనునది అటు కమ్యూనిస్ట్ నియంతృత్వమునకు,ఇటు ప్రజాస్వామికమునకును వ్యతిరేకియగు జాతీయ నియంతృత్వము. యుద్ధానంతరపు యూరప్‌నందును, యునైటెడ్‌స్టేట్స్‌నందును ప్రజాస్వామ్యము తానున్న రూపున ఆర్థిక కల్లోలములను అంతరింపజేయలేదను భావము పలుతావుల వ్యాపించిన కాలమున కొన్ని రాజ్యములు ప్రజాస్వామ్య విధానమునకే స్వస్తిచెప్పి, వేరు మార్గములను వెదకుటకై ఉత్సుకత చూపినవి. ఆర్థిక మాంద్యాదుల వలన స్థిరతను కోల్పోయిన ప్రజానీకము సాధారణముగ తమ సమస్యల పరిష్కార భారమును సమర్థుడని తాము భావించు ఏ ఒకనికో అంటగట్టి వానిని అనుసరించుటకు సంసిద్ధమగుట ఒక చారిత్రక సత్యము. ఇట్టిదియే ఆ కాలమున జరిగి యూరప్‌నందును, దక్షిణ అమెరికాయందును నియంతృత్వములు ఏర్పడినవి. ఈ నియంతృత్వములు సోవియట్ రష్యాయందలి నియంతృత్వము కన్న విభిన్నమైనవి. ఆస్తి హక్కులు మొదలగువానిలో అవసరమునకు మించి పరివర్తనలను కొనివచ్చుట వాని ఆశయము కాదు. ఎన్నికలు మొదలగు ప్రజాస్వామిక విధానములనుకాదని ఏకవ్యక్తినియంతృత్వము లేదా ఏకపక్ష నియంతృత్వమును నెలకొల్పి, త్వరిత చర్యల వలన దేశమును ఉద్ధరించుట వీని లక్ష్యము. కాని, వీనిలో కొన్నింటి లక్ష్యము అంతటితో ఆగినది కాదు. ప్రజాస్వామ్య వ్యతిరేకతతో పాటుగ జాతీయతా దురహంకారమును కూడ అవి స్వీయము చేసికొనినవి. చారిత్రక ప్రాముఖ్యమును ఒక కాలమున సంతరించికొని తరువాత పతనము చెందిన దేశముల ప్రభుత్వములు ఇందు ముందంజవేసి, తమ ప్రజలను లోగొనినవి. జాతీయతా దురహంకారమును, ప్రజాస్వామ్య వ్యతిరేకతయు మేళనము చెందిన ఈ వాదమునకే ఫాసిజమ్ అను పేరు.

ఇది ఇటలీలో తొలుతగ ఏర్పడినది. ఆర్థిక సంక్షోభానంతర జర్మనీయందును హిట్లర్ నాయకత్వమున 'నాజీ వాదము' అను పేరున ఇట్టిది నెలవు కల్పించుకొనినది. బ్రిటన్ వలెనే విపుల సామ్రాజ్యమును ఆర్జింపదలచిన జపాన్ నందును సైనికతత్వము రూపున దీనికి ఆదరము కలిగినది. సహజకారణముల వలన తక్కిన జాతులకన్న ఒక ప్రత్యేక జాతికి విశిష్టత చేకూరుననియు, అట్టి జాతి తక్కిన జాతులను తన ఆధిపత్యమునకు లోజేసి పరిపాలించినపుడే సువ్యవస్థిత మానవసంఘము ఏర్పడగలదనియు ఈ వాదావలంబకులు విశ్వసించిరి. తమ ఉద్దేశముల సాధనకై జాతిని అంతటిని సమాయత్తపరచి, అందులకు తగిన ఆయుధబలమును సమకూర్చుటకై వివిధ పరిశ్రమల కృషిని వీరు ఏకోన్ముఖము చేసిరి. ఇందువలన ఆ యా దేశములందలి సామాన్యపౌరుడు నిరుద్యోగపు బారి నుండి విముక్తుడయ్యెను; కాని, వ్యక్తిత్వమునే విస్మరించి ప్రభుత్వపు యంత్రమున ఒక ఉపాంగముగ మారిపోయెను.

స్వతంత్ర రాజ్యములందు ఇటుల రాజ్యాంగ, సామాజిక వ్యవస్థలను గురించిన వివిధ భావనలు కార్యరూపమున తావు కల్పించుకొను కాలమున సైతము దుర్బలమగు చీనాయందును, ప్రపంచమున అత్యధిక భాగమును ఆవరించిన అస్వతంత్ర రాజ్యములందును మాత్రము వీని ప్రభావము గణనీయ రీతిలో కన్పట్టలేదు. కాని, ఫాసిజమ్‌నందు సహజముగ నెలకొనిన విస్తరణకాంక్ష ఫలితముగ ఎతియోపియా రాజ్యము ఇటలీచే ఆక్రమితమైనపుడు ప్రజాస్వామిక రాజ్యములందలి ప్రగతిశీలురతోపాటుగ ఆసియాలోని కొన్ని వలస రాజ్యములందలి మేధావులును నూతనముగ వచ్చిపడిన ఈ బెడదనుగురించి విచారింప మొదలిడిరి. కాని, సామాన్య ప్రజానీకపు దృష్టియంతయు తమ్ము అడచి ఉంచిన సామ్రాజ్య ప్రభుత్వములను కూలద్రోయుట యందే నిమగ్నమైనది. కొన్ని పట్టుల తమ దేశమునకు సత్వర పురోగతిని ఆకాంక్షించు యువకబృందము సోవియట్ రష్యాయందలి కమ్యూనిస్ట్ విధానముచే ఆకర్షితులైరి. 1921 తరువాత ఆసియాలోని కార్మిక సంఘము (ట్రేడ్ యూనియన్) లందు కమ్యూనిస్ట్ వాదము కొంత తావు కల్పించుకొనినది. ముఖ్యముగ చీనాయందు కమ్యూనిస్ట్ వాదాభిమానులు ఒక సుశిక్షిత వర్గముగ రూపొందిరి.

చీనా దేశమున 1912 లో రాచరికమును కూలద్రోసి గణ రాజ్యమును నెలకొల్పుటలో ప్రముఖ పాత్రను నిర్వహించిన వాడు సన్ యత్ సేన్ [చూ.]. అభ్యుదయమునకై జాతీయత, ప్రజాస్వామ్యము, సాంఘిక న్యాయము అను మూడు సూత్రములను తన దేశీయులు అనుసరింపవలెనని ఈతడు ప్రవచించెను. కాని, దేశపునర్నిర్మాణమున అతనిని పూర్వ సంప్రదాయవాదులు అడుగడుగున ఎదుర్కొనిరి. ఇందులకు తోడుగ ప్రథమ ప్రపంచయుద్ధానంతరమున పశ్చిమ రాజ్యములు జపాన్‌ను అభిమానించి చీనాను వంచించుట అతనికి నిరాశను కలిగించెను. అంతట అతడు సోవియట్ రష్యాయందలి బోల్షివిక్ నాయకుల సాయమున తన రాజకీయ పక్షమగు కోమింగ్‌టాంగ్‌ను, ఆర్థిక వ్యవస్థను పునర్నిర్మింప పూనుకొనెను. అతని మరణానంతరమున 1928 నాటికి చీనాను ఏకైక రాజకీయ వ్యవస్థగ రూపొందించుటలో అతని అనుగామియగు చియాంగ్-కై-షేక్ [చూ.] కృతకృత్యుడయ్యెను. కాని, ఆ కాలముననే అతని పక్షమున ఒక ప్రముఖ వర్గము కమ్యూనిస్ట్ వాదపు పలుకుబడికి లోనయ్యెను. ఇందులకు తోడుగ చీనాయందలి భూస్వామి వ్యవస్థను రద్దుచేయుటకు చియాంగ్-కై-షేక్ వెనుకంజ వేయుటతో ప్రజలలో కమ్యూనిస్ట్‌ల పలుకుబడి క్రమముగ అతిశయిల్లి, వాయవ్య చీనాయందు ఒక విస్తృత స్థావరమును వారు నెలకొల్పుకొనగలిగిరి. చీనాలోని మంచూరియాను జపాన్ ఆక్రమించిన తరువాత, జాతీయ శ్రేయస్సు దృష్ట్యా, కోమింగ్‌టాంగ్ పక్షపు సేనలును, కమ్యూనిస్ట్ పక్షపు సేనలును కలసి శత్రువుతో పోరాడినను, ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున పోరాటముతోపాటుగ ప్రజలలో పార్టీ సిద్ధాంతముల విపుల వ్యాప్తిని కూడ కమ్యూనిస్ట్‌లు సాధించిరి.

భారతదేశమున 1921 మొదలుగ అటనట కమ్యూనిస్ట్ వాదమునకు కొంత ఆదరణము లభించినను, ప్రముఖ నాయకులలో ప్రజాస్వామ్యము ఎడలనే ఆదరణము నెలవు ఏర్పరచుకొనినది. ఇంగ్లీషు భాషా పరిజ్ఞానము, ఇంగ్లండు నందలి ప్రజాస్వామ్య సిద్ధాంతములతో పరిచితి ఇందులకు కొంత సాయపడిన మాట నిజమేయైనను, ఇందు ప్రముఖ పాత్ర నిర్వహించినది గాంధీజీ (1869 - 1948) నాయకత్వమని చెప్పకతప్పదు. మానవజాతిలో పరస్పర ప్రేమ, సౌభ్రాతృత్వములను నెలకొల్పుటకు ఉపనిషత్తులు మొదలుగ జగమున విస్తరించిన భావనా సంపత్తికి ఆచరణ రూపమును కల్పించి రాజకీయ వ్యవహార నిర్వహణమును ఉన్నత స్థాయికి ఆయన కొనిపోయెను. సత్య, అహింసలపై ఆధారపడు మానవ సమాజ నిర్మాణము ఆయన ధ్యేయము. దేశము స్వతంత్రతను ఆర్జించుటకు శత్రువు నెడల ద్వేషమునకు గాని, దౌర్జన్యమునకు గాని తావియ్యని 'సత్యాగ్రహము' అను క్రొత్త పోరాటపు విధానమును

ఆయన రూపొందించెను. ఆయనకు అనుగామియగు జవాహర్‌లాల్ నెహ్రూ (1889 - 1964) యందు పాశ్చాత్య ప్రజాస్వామికమునందలి ఉన్నత భావనలతోపాటుగ సోషలిజమ్‌నందలి మేలి భావములును మూర్తిగొనినవి. ఇట్టి వారల ఆధ్వర్యవమును సంతరించుకొనిన ' భారత జాతీయ కాంగ్రెస్ ' [చూ.] నాయకత్వమున సోషలిస్ట్ వాదమును ఆదరించు ప్రజాస్వామిక భావములు భారతీయ యువకులందు వ్యాపించినవి. కాని, బ్రిటిష్ సామ్రాజ్య ప్రభుత్వము అట్టి భావముల వ్యాప్తికి అడ్డుతగిలి అవి సఫలతను చెందకుండజేయు సంకల్పముతో భారతదేశమున ఆ కాలమున కొందరు ముస్లిమ్ నాయకులందు మతరాజ్య నిర్మాణమున కుతూహలమును రేకెత్తించి, ఆదరించి, తన ప్రతిపత్తిని కాపాడుకొనుటకు యత్నించినది.

అయినను భారత, చీనా దేశములలోని నూతన భావములుగాని, అరబ్బు రాజ్యములందు వ్యాపించిన అస్పష్ట జాతీయతా భావముగాని, ఆఫ్రికాలోని నీగ్రో జాతులలో నిహితమై ఉన్న స్వాతంత్ర్యాకాంక్ష గాని 1930 తో అంతమగు కాలమునకు ప్రపంచ రాజకీయ రంగమున ప్రముఖ పాత్రల నిర్వహించు స్థితిలో లేవు. యూరప్‌నందలి ప్రముఖదేశములు, యునైటెడ్ స్టేట్స్, జపాన్ మాత్రమే ఆ కాలమున ప్రపంచ చరిత్రగతిని తమ ఆధీనమున ఉంచుకొనినవి. వీనిలో ప్రముఖ ప్రజాస్వామిక రాజ్యములు దేశమునందలి తమ ప్రజాస్వామ్యమును వలసలయందలి తమ సామ్రాజ్యవాదముతో జతకుదుర్చుటలో సతమతమగుచు యుద్ధమును ఆకాంక్షింపక, ఉన్నదానిని కాపాడుకొన యత్నించినవి. కమ్యూనిస్ట్ రాజ్యమగు సోవియట్ రష్యా తన దేశమున సుస్థిర సోషలిస్ట్ సమాజమును తొలుత నెలకొల్పు ఉద్దేశముతో కృషిచేయుచు పారిశ్రామికముగను, సైనికముగను బలపడుటకై శాంతిని వాంఛించినది. కాని, ఈ రెండు వ్యవస్థలును బలవత్తరములగునెడల తమ ఆశయములకే భంగముకలుగగలదను భయముతో ఫాసిస్ట్ రాజ్యములు అంతట తమ విస్తరణకొరకై శాంతిని భంగము చేయుటకు పూనుకొనినవి. క్రమముగ ఆ చర్యలు ద్వితీయ ప్రపంచ యుద్ధముగ పరిణమించి ప్రపంచ ప్రముఖ రాజ్యములు అన్నియు అందు పాల్గొనవలసి వచ్చినది. అంతటితో ప్రపంచమున యుద్ధము అవిభాజ్యమను విషయముతో పాటుగ శాంతియు అవిభాజ్యమే అనుట ఆ రాజ్యములకు తేటతెల్లమైనది. అక్షరాజ్యములను ఓడించిన తరువాత ప్రపంచదృష్టితో శాంతిసాధనకై తగు మూలసూత్రముల అండతో ఒక ప్రపంచరాజ్యముల సమితిని స్థాపించి, నూతన మానవసంఘ వ్యవస్థానిర్మాణమునకు తగు అవకాశములను కల్పించవలయునను ఆకాంక్ష ఆ రాజ్యముల నాయకులందు పెచ్చుపెరిగినది. తత్ఫలితముగ రూపొందినదియే ఐక్యరాజ్య సమితి. అంతటితో విశ్వచరిత్రలో ఒక నూతనాధ్యాయము మొదలైనది. చీ. శే. రా.

# ఐక్యరాజ్య యుగము

## (1945 నుండి)

ప్రపంచ ప్రజలను యుద్ధభయమునుండి శాశ్వతముగ కాపాడగలుగు ఒక అంతర్జాతీయ సంస్థను నిర్మించు సంకల్పము కొన్ని అగ్రరాజ్యముల నాయకులందు ద్వితీయ ప్రపంచ యుద్ధకాలముననే భావనా మాత్రముగ తొలుత రూపుగొని క్రమక్రమముగ యథార్థతను పొందినది. 1941 లో జరిగిన మిత్రరాజ్య ప్రకటనయు, అట్లాంటిక్ ప్రణాళికా (చార్టర్) ప్రచురణయు, 1942 లోని యునైటెడ్ నేషన్స్(ఐక్యరాజ్య సమితి) ప్రకటనయు, 1943 లోని మాస్కో, టెహరాన్ సమావేశములును ,1944 లోని డంబర్టన్ ఓక్స్, యాల్టా (క్రిమియా) సమావేశములును (సమావేశముల వివరములకై ఆ యా శీర్షికలను చూడుడు) ఈ సంకల్పమునకు దృఢతను కల్పించుటకు తోడుపడినవి. కడకు 1945, ఏప్రిల్ 25 నుండి జూన్ 26 వరకు శాన్‌ఫ్రాన్సిస్కో నగరమున సమావేశమును జరపిన 50 రాజ్యముల ప్రతినిధుల దీర్ఘచర్చలఫలితముగ యునైటెడ్ నేషన్స్ ప్రణాళికకు తుది రూపము కల్పింపబడినది. అంతట ఆ ప్రణాళికపై సంతకముచేసిన 51 రాజ్యముల ఆమోద, సభ్యత్వములతో 1945, అక్టోబరు 24 న ' ఐక్యరాజ్య సమితి (యునైటెడ్ నేషన్స్ఆర్గనైజేషన్)' అవతరించినది. యుద్ధకాలమున అక్షరాజ్యముల ఓటమికై అగ్రరాజ్యములు తమ ధన, జన, సంపదల వినియోగమున చూపిన ఏకమనస్కతయే శాంతి సంస్థాపన విషయముననను కొనసాగి, ఐక్యరాజ్యసమితి (ఐ. రా. స.) కి ఆలంబనముగ ఉండగలదను ఆశయము ఈ సమితి నిర్మాణమున ముఖ్యప్రాతిపదిక. అందువలన అగ్రరాజ్యములగు యునైటెడ్ స్టేట్స్, యునైటెడ్ కింగ్‌డమ్, సోవియట్ రష్యా, ఫ్రాన్స్, చీనా దేశములలో ఏ ఒక దేశమును వ్యతిరేకించని పట్టున మాత్రమే నిశ్చిత చర్యకు పూనుకొను అధికారము ఐ. రా. స. యందలి భద్రతా సంఘమునకు సమితి ప్రణాళికద్వారా కల్పింపబడినది. [ఐ. రా. స. నిర్మాణాదులను గురించిన

వివరములకు చూ. ఐక్యరాజ్య సమితి]. క్రమక్రమముగ పలు స్వతంత్ర రాజ్యములు సమితియందు చేరుటతో 1965, సెప్టెంబరు 23 నాటికి దానియందలి సభ్యరాజ్యముల సంఖ్య 117 కు పెరిగినది.

ప్రథమ ప్రపంచ యుద్ధానంతరమున రూపొంది, క్రమముగ బలహీనమై అంతరించిన నానాజాతిసమితి [చూ.] కన్న ఐక్యరాజ్యసమితి ఒక విధముగ దృఢతరమని చెప్పవచ్చును. ప్రపంచ ప్రముఖ రాజ్యములగు యునైటెడ్ స్టేట్స్, సోవియట్ రష్యా దేశముల సహాయము నానాజాతి సమితికి లభింపలేదు. ఐక్యరాజ్య సమితికి మాత్రము ఆ రెండు రాజ్యముల ప్రాపు తొలుతనుండియు లభించినది. అంతియేకాదు, నానాజాతి సమితి కాలమున దాస్యనిమగ్నములై ఉండిన పలు దేశములు ఐ. రా. స. నిర్మాణానంతరమున స్వతంత్రములై సమితిలో సభ్యత్వమును గ్రహించుటవలన నానాజాతి సమితియందుకన్నను ఎక్కువగ ప్రపంచ ప్రజలకు ప్రాతినిధ్యము ఐ. రా. స. యందు లభించినది. అయినను ఐ. రా. స. యును నానాజాతి సమితివలెనే సర్వసత్తాక స్వతంత్రరాజ్యముల సద్భావపూర్వక సమ్మేళనమను విషయమును ఇట మరవకూడదు. అల్పరాజ్యము కానిండు, అగ్రరాజ్యము కానిండు ఇందలి ఏ సభ్యరాజ్యమును తన సర్వసత్తాకతను అంతర్జాతీయ సంస్థకు లోనుచేయుటకు అంగీకరించు స్థితిలో లేదు. అందువలన ఐక్యరాజ్య సమితి అధికారము చాల పరిమిత స్థాయిలో మాత్రమే ప్రపంచ వ్యవహారములందు అమలులోనికి రాగలిగినది. వివాదమునకు తావీయని కొన్ని సమస్యలను పరిష్కరించుటకు మాత్రమే అది సహకరించ గలిగినది. ప్రపంచమును పీడించు కొన్ని ప్రముఖ విషయములను గురించిన సమగ్ర చర్చకు ఒక వేదికగ మాత్రమే అది ఇప్పటికి వ్యవహరింప గలిగినది. కాని, ఇన్ని అవధులకు లోబడియైనను, ప్రపంచప్రజల శాంతి - సంకల్పమునకును, ఐక్య భావమునకును ఒక ప్రతీకముగ అది నెలకొని, ఆదర్శ ప్రపంచ వ్యవస్థను ఆశించు ప్రపంచ ప్రజలకు ఒక ఆశాజ్యోతిగ ఉన్నదని అంగీకరింపక తప్పదు.

ఐక్యరాజ్య సమితి వలన ఆశించబడినంతగ ఫలితము లభింపకపోవుటకు ముఖ్యకారణము అగ్రరాజ్యముల మధ్య ఉత్పన్నమైన వైరుధ్యము. ద్వితీయ ప్రపంచ యుద్ధము అంతమగు స్థితికి వచ్చినప్పటినుండియు, యుద్ధాత్పూర్వమున సోవియట్ రష్యాకు పశ్చిమ రాజ్యముల యెడ ఉండిన భయ సందేహములు మరల ముందునకు రాదొడగినవి. యుద్ధానంతర సమస్యల పరిష్కరణలో ప్రతి విషయమునను ఈ అభిప్రాయభేదములు తావు కల్పించుకొని, క్లిష్టతకు దారి తీసినవి. ఈ యుద్ధానంతర సమస్యలను 1. విజిత రాజ్యముల పరిస్థితి ; 2. యుద్ధానంతర పునర్నిర్మాణము ; 3. వలసరాజ్యముల స్వాతంత్ర్యార్జన ; 4. చీనాలో నూతన వ్యవస్థ - అను నాలుగు శీర్షికలక్రింద విభజించి పరిశీలించుట వలన విషయము సుగమము కాగలదు.

**విజిత రాజ్యముల పరిస్థితి :** ద్వితీయ ప్రపంచ యుద్ధము జరుగుచుండిన కాలముననే యుద్ధానంతరమున విజిత శత్రురాజ్యముల యెడను, విముక్త రాజ్యముల యెడను వహింపదగు వైఖరిని గురించి మిత్రరాజ్యములందలి అగ్రరాజ్యములు సుదీర్ఘచర్చలు జరిపినవి. 1945 జూలై, ఆగస్టు మాసములలో పోట్స్‌డమ్‌లో జరిగిన అంతర్జాతీయ సమావేశములందు ఈ చర్చల పర్యవసానముగ విజిత, విముక్త రాజ్యములందు బాధ్యతాయుత ప్రజా ప్రాతినిధ్య ప్రభుత్వములను నెలకొల్పుటకు ప్రణాళిక రూపొందింపబడినది. కాని, యుద్ధానంతరమున జర్మనీ, ఆస్ట్రియా, కొరియా దేశములలో వివిధ భాగములు మిత్ర రాజ్యములలోని వివిధ రాజ్యముల ఆక్రమణలోనికి వచ్చినవి. తమ తమ ఆక్రమణలోనికి వచ్చిన వివిధ భాగములను ఏకీకృతముగ చేసి, ఒక్కొక్క దేశమున ఒక్కొక్క బాధ్యతాయుత ప్రభుత్వమును నెలకొల్పుటకు పాశ్చాత్య రాజ్యములును, సోవియట్ రష్యాయును కలసి వ్యవహరింపలేక పోయినవి. ఇటుల పరస్పరము అనుమానములు పెచ్చు పెరిగిన కొలది, తమ తమ ప్రతిపత్తులకు భంగము కలుగునను భయముతో ఆ యా రాజ్యములు తమ అందరి ఆక్రమణలో ఉండిన ఆ మూడు దేశములందే కాక, వేర్వేరుగ తమ అధీనములో ఉండిన ప్రాంతములనుండియు తమ సేనలను వైదొలగించుటకు ఉత్సుకత చూపకుండినవి. యుద్ధము ఆగిపోయిన తరువాత రెండు ఏండ్లకు సైతము యునైటెడ్ స్టేట్స్, గ్రేట్ బ్రిటన్, సోవియట్ రష్యాదేశములు తమ సరిహద్దులకు సుదూరమున ఇతర దేశములలో తమ సేనలను నిలిపియుంచి, వానిని తొలగింపకుండినవి. 1947 లో జర్మనీ, ఫిన్లాండ్, ఆస్ట్రియా, హంగేరీ, పోలండ్, రుమేనియా, యుగోస్లావియా, కొరియా, మంచూరియా దేశములలో సోవియట్ రష్యాకు చెందిన 20 లక్షల ఆక్రమణ సేనలు నిలిచి ఉండినవి. అటులే ఆ కాలమున జర్మనీ, ఆస్ట్రియా, ఇటలీ, గ్రీస్, పాలస్తీనా, ఇరాక్, సూయెజ్ కాలువ ప్రాంతము, ట్రాన్స్‌జోర్డాన్, లిబియా, ఎరిట్రియా, ఇటాలియన్ సోమాలీలాండ్, జావా, సుమత్రా, ఈజిప్టు దేశములలో మొత్తముమీద 750 వేల బ్రిటిష్ సేనలును, జర్మనీ, ఆస్ట్రియా, ఇటలీ, చీనా, కొరియా, జపాన్, ఫిలిప్పీన్ దీవులు, పసిఫిక్ మహాసముద్ర దీవులలోను,

ఇంకను అటనట విమాన స్థావరములు, నౌకాశ్రయములు మొదలగువానిలోను తావు కల్పించుకొని 650 వేల యునైటెడ్ స్టేట్స్ సేనలును నెలకొని ఉండినవి. ఇటుల ఆక్రమణ సేనలు పలుతావుల నిలిచి ఉండుటవలన, అచటి ప్రాంతీయ రాజకీయ సమస్యలకు అంతర్జాతీయ ప్రాముఖ్యము లభించి, తన్మూలమున అంతర్జాతీయముగ ఘర్షణయు, స్పర్ధయు రూపొందుటకు ఆస్కారము ఏర్పడినది.

ఇట్టి అంతర్జాతీయ క్లిష్టతను సడలింపజేయుటకై 1946 డిశంబరులో ఐక్యరాజ్యసమితి చొరవతీసికొని ఆ యా రాజ్యములు తమ సైనిక బల సంఖ్యా వివరములను తెలియజేసి, యుద్ధాయుధముల పర్యవేక్షణకు అంగీకరించవలసినదిగ వాంఛించెను. అంతట తన ఆటంబాంబుల నిల్వను ధ్వంసము చేయుటయో లేదా వానిని వాని నిర్మాణ రహస్యములతో పాటుగ అంతర్జాతీయాధికారమునకు అప్పగించుటయో జరుపుటకు తాను సంసిద్ధమని యునైటెడ్ స్టేట్స్ 1947 జూన్‌లో ప్రకటించినది. కాని, ప్రపంచ రాజ్యములు ఆటంబాంబు ఉత్పత్తి వినియోగములపై దిట్టమగు పర్యవేక్షణకు అంగీకరించినపుడు మాత్రమే తాను ఈ పనికి పూనుకొనగలనని యునైటెడ్ స్టేట్స్ అపుడు ఒక షరతు విధించినది. ఆటంబాంబును ఏ ఇతర ప్రముఖ దేశమును నిర్మించకుండుటకై యునైటెడ్ స్టేట్స్ వేసిన ఎత్తుగ దీనిని సోవియట్ రష్యా భావించి, సంపూర్ణ నిరాయుధీకరణకు ప్రపంచము అంగీకరించినపుడు మాత్రమే ఆటంబాంబుల ఉత్పత్తిపై పర్యవేక్షణయు సాధ్యపడగలదని చెప్పి, అట్టి పర్యవేక్షణకు నిరాకరించినది.

ఇట్టి అభిప్రాయ భేదములే శాంతిసంధుల విషయమునను ఉత్పన్నములైనవి. ఆ శాంతిసంధులను రూపొందించుటకై నియమింపబడిన అగ్రరాజ్య ప్రతినిధి సంఘము దాదాపు 200 సమావేశములను జరిపి, బహుళ చర్చల పర్యవసానముగ 1946 డిశంబరులో అట్టి సంధుల ముసాయిదాలను రూపొందించగలిగినది. కాని, ఒక్కవిషయమున - యుద్ధదోషుల విచారణను గురించి - మాత్రము అగ్రరాజ్యముల మధ్య ఆనాడు ఏకాభిప్రాయము కుదిరినది. యాల్టా, పోట్స్‌డమ్ సమావేశములలో జరిగిన నిర్ణయముల వలన అంతర్జాతీయ న్యాయశాస్త్రమున ఒక నూతన విషయమునకు తావు కల్పింపబడినది [చూ. సం. 11 - అంతర్జాతీయ న్యాయశాస్త్రము]. యుద్ధమును ప్రేరేపించి నిర్వహించినందులకును, విజిత జాతులకు చెందిన పౌరులయెడ యుద్ధకాలమున జరిపిన దుశ్చర్యలకును ఆ యా వ్యక్తులు బాధ్యతవహించవలసి ఉండుననుట అందలి ముఖ్యాంశము. తదనుగుణముగ 1945 సెప్టెంబరులో యుద్ధదోషుల పట్టిక ఒకటి తయారు చేయబడినది. న్యూరెంబర్గ్ నగరమున ఈ యుద్ధదోషుల విచారణ ఒక అంతర్జాతీయ న్యాయస్థానమున జరిగినది. 1946 అక్టోబరులో ఆ విచారణ ముగిసి, తీర్పు ఈయబడి, అమలుచేయబడుట మూలమున యుద్ధదోషులగు 11 మంది నాజీ నాయకులు ఉరి తీయబడిరి. ఇటుల యుద్ధదోషుల విచారణలో చూపిన ఐక్యభావనను తక్కిన విషయములందు అగ్రరాజ్యములు ప్రదర్శింపజాలక పోయినవి. యుద్ధానంతరమున పరిష్కరింపవలసిన దేశముల సరిహద్దుల సమస్యలు - యూరప్‌నకు సంబంధించినంతవరకు - అపరిష్కృతముగనే నిలిచిపోయినవి. జర్మనీ, ఆస్ట్రియా దేశములు ఆక్రమణ సేనల వశమునందే ఉండవలసిన పరిస్థితి ఏర్పడినది. అందులకై ఆ యా దేశములు కొన్ని ప్రాంతములుగ విభజింపబడి వేర్వేరు ప్రాంతములు యునైటెడ్ స్టేట్స్, బ్రిటన్, ఫ్రాన్స్, సోవియట్ రష్యా దేశముల ఆక్రమణ సేనల ఆధీనమున ఉంచబడినవి. బెర్లిన్, వియెన్నా నగరములు అటులే వివిధ ఆక్రమిత ప్రాంతములుగ విభక్తములైనవి. కడకు ఆస్ట్రియా స్వతంత్రతను ఆర్జించినను (1955), జర్మనీ పరిస్థితి మాత్రము కుదుటబడలేదు. అది ఈ నాటికిని అగ్రరాజ్యముల మధ్య వైరుధ్యముల ఫలితముగ పశ్చిమ జర్మనీ, తూర్పు జర్మనీయను రెండు రాజ్యములుగ ఏర్పడి ఉన్నది. బెర్లిన్‌నగరము కూడ అట్టి దుస్థితికే లోనై ఉన్నది [చూ. జర్మనీ, తూర్పు; జర్మనీ, పశ్చిమ; బెర్లిన్ సమస్య].

తూర్పు యూరప్‌న సోవియట్ రష్యా వహించిన వైఖరి వలన అగ్రరాజ్యముల మధ్య వైరుధ్యములు ఇంకను పెచ్చుపెరిగినవి. ఈ రాజ్యములు అన్నియు సోవియట్ రష్యా దేశమునకు సరిహద్దులందుననో, సమీపముననో ఉండుట వలన వీనియందు 'మిత్ర' ప్రభుత్వములు ఏర్పడిననేతప్ప సోవియట్ రష్యాకు భద్రత చేకూరదని ఆ దేశము భావించినది. అందువలన తనచేత విముక్తములైన దేశములందు అన్నింట కమ్యూనిస్ట్ పలుకుబడి గల ప్రభుత్వములు రూపొందుటకు సోవియట్ రష్యా కృషిచేసినది. ఈ కృషి ఫలితముగ బాల్కన్ రాజ్యములలో రుమేనియా, బల్గేరియా, అల్ బేనియా, యుగోస్లావియా దేశములును, మధ్య యూరప్‌న పోలండ్, హంగేరీ దేశములును తొలుత కమ్యూనిస్టుల పలుకుబడిలోనికి పోయినవి. ఆ తరువాత అనతికాలముననే జెకోస్లోవాకియాయందును ఆ పరిస్థితియే సంఘటిల్లినది. ఈ రాజ్యములు అన్నియు సోవియట్ రష్యా మార్గదర్శిత్వమును అంగీకరించినవి. తత్ఫలితముగ వీనికి పశ్చిమ రాజ్యములతోటి సంబంధములు దాదాపుగ తెగిపోయినవి. ఈ పరిస్థితినే సాలంకారికముగ వర్ణించుచు

సోవియట్ రష్యా యందును, దానిని అనుసరించిన తూర్పు యూరప్ రాజ్యములందును వసించు ప్రజలందరును తమ వారగు పశ్చిమ దేశప్రజలనుండి ఒక 'ఇనుపతెర' (ఐరన్ కర్టెన్) చే వేరుచేయబడిరని విన్‌స్టన్ చర్చిల్ ప్రస్తావించెను. ఈ విధముగ 1947 నాటికి ప్రపంచము పశ్చిమ, ప్రాచ్య వర్గములుగ రాజకీయ విధానముల రీత్యా విభజితమైనది. పశ్చిమవర్గమునకు యునైటెడ్ స్టేట్స్ యును, ప్రాచ్యవర్గమునకు సోవియట్ రష్యాయును నాయకత్వము వహించినవి (ఇందలి ప్రాచ్యవర్గము అనునది ప్రాచ్యజాతుల సమష్టి నామముగ ఇందు వాడబడలేదని పాఠకులు గమనింపవలెను. తూర్పున ఉన్న కమ్యూనిస్ట్ రాజ్యములకే అది వర్తించును). ఈ రెండు వర్గములను అంతటినుండి సాగించిన ఆయుధ రహిత సంఘర్షణకే 'ప్రచ్ఛన్నయుద్ధము (కోల్డ్ వార్)' అను పేరు వాడుకలోనికి వచ్చినది.

అప్పటిలో కమ్యూనిస్ట్ ప్రభావమునకు లోనుగాక తూర్పు యూరప్‌న గ్రీస్, టర్కీ మాత్రమే మిగిలినవి. కాని, గ్రీస్‌నందును కమ్యూనిస్టుల తిరుగుబాటులు చెలరేగినవి. టర్కీయు తన పరిస్థితిని గురించి ఆందోళనపడసాగినది. ఈ పరిస్థితులలో పశ్చిమ రాజ్యములు కమ్యూనిస్ట్ అధికార విస్తృతిని అరికట్టుటకు కృషిచేసినవి. ఈ కృషి రెండు మార్గముల సాగినది: 1. ఆర్థిక పునర్నిర్మాణము; 2. సైనిక ఒడంబడికలు.

**యుద్ధానంతర పునర్నిర్మాణము:** ద్వితీయ ప్రపంచ యుద్ధము ముగియుటకు కొలదికాలము ముందుగనే, యుద్ధానంతరమున విముక్తములైన దేశములలోని ప్రజలకు సాయపడుటకై 'ఐక్యరాజ్య సాహాయ్యక, పరిపోషక వ్యవస్థ (యు. ఎన్. ఆర్. ఆర్. ఏ.)' అను పేర ఒక అనుబంధ సంస్థ నెలకొల్పబడినది. కాని, దీనికన్నను ఎక్కువ సాహాయ్యమును చేకూర్చగల వసతి ఏర్పడినగాని యూరప్‌న కమ్యూనిస్టుల పలుకుబడిని తగ్గించుటకు వలనుపడదని యునైటెడ్ స్టేట్స్ అధ్యక్షుడగు ట్రూమన్ [చూ.] భావించి, తదనుగుణముగ 1947 లో ఒక విధానమును రూపొందించెను. ఆ విధానమునకు మూలమగు భావనయే ఆ కాలమున 'ట్రూమన్ సిద్ధాంత'మను పేర వ్యవహృతమైనది. 'సాయుధములగు అల్పసంఖ్యాక వర్గములనుగాని, వెలుపలినుండి వచ్చు ఒత్తిడిని గాని ప్రతిఘటించి తమ స్వాతంత్ర్యమును కాపాడుకొన యత్నించు ఏ దేశపు ప్రజానీకమునైనను ఆదుకొనుటయే యునైటెడ్ స్టేట్స్ కర్తవ్యము' అని ఆ సిద్ధాంతమున ఉద్ఘోషితమైనది. ఈ సిద్ధాంతమునకు యునైటెడ్ స్టేట్స్ ప్రజాసభ (కాంగ్రెస్) ఆమోదమును తెలిపిన ఫలితతముగ 'మార్షల్ ప్లాన్' అనబడు ఆర్థికసాహాయ్యక కార్యక్రమము యూరప్‌న అమలులోనికి వచ్చినది. ఈ సాహాయ్యమువలన టర్కీ, గ్రీస్ దేశములు కాలు నిలువద్రొక్కుకొనినవి. కమ్యూనిస్టుల బెడదనుండి గ్రీస్ తప్పించుకొనగలిగినది.

మార్షల్ ప్లాన్ వలన సహాయమును పొందవలసినదిగ యూరప్‌నందలి అన్ని దేశములను యునైటెడ్ స్టేట్స్ ఆహ్వానించినది. కాని, సోవియట్ రష్యాయును, దాని పలుకుబడిలోని తూర్పు యూరప్ దేశములును యునైటెడ్ స్టేట్స్ పలుకుబడి యూరప్‌న అతి విస్తృతముగ వ్యాపించుటకు ఈ మార్షల్ ప్లాన్ ఒక పన్నుగడమాత్రమే అను మిషపై దాని సాహాయ్యమును పొందుటకు నిరాకరించినవి. అయినను, ఉత్తరమున నార్వే మొదలుకొని దక్షిణమున గ్రీస్, టర్కీ వరకును గల తక్కిన యూరప్ దేశములు దీనివలన యుద్ధ నష్టమునుండి కోలుకొనగలిగినవి. ముఖ్యముగ పశ్చిమ జర్మనీ అతి త్వరితగతిలో పునర్నిర్మితమై యుద్ధాత్పూర్వమునందువలెనే ప్రముఖ పారిశ్రామిక రాజ్యముగ రూపొందినది. ఇటుల పశ్చిమ యూరప్ రాజ్యములు యునైటెడ్ స్టేట్స్ సాహాయ్యమున పురోగమించగ తూర్పు యూరప్‌న కమ్యూనిస్ట్ రాజ్యములు సోవియట్ రష్యా మార్గదర్శిత్వమున సంఘటితములై పురోగమించుటకు కృషిచేసినవి.

మార్షల్ ప్లాన్ వలని సాహాయ్యక కార్యక్రమము 1952 వరకును సాగినది. ఆ తరువాత సైతము 'పరస్పరభద్రతా సంస్థ (మ్యూచ్యుయల్ సెక్యూరిటీ ఏజన్సీ)' మూలమున పశ్చిమ యూరప్ దేశములకు యునైటెడ్ స్టేట్స్ సాయపడినది. ఈ ఆర్థిక సాహాయ్యముతోపాటుగ సైనికబలము కూడ యూరప్‌న సుసంఘటితమైనపుడు మాత్రమే సోవియట్ రష్యా సైన్యములు యూరప్‌ను కబళించకుండ ఆపుటకు వీలు కలుగునని యునైటెడ్ స్టేట్స్ భావించి, 1949 లో ఒక సైనిక రక్షణ వ్యవస్థను 'ఉత్తర అట్లాంటిక్ రక్షణ వ్యవస్థ (నార్త్ అట్లాంటిక్ ట్రీటీ ఆర్గనైజేషన్)' లేదా నాటో [చూ.] అను పేర అమలులోనికి కొనివచ్చినది. తొలుత ఇది ఉత్తర అట్లాంటిక్ రాజ్యములకు (యునైటెడ్ స్టేట్స్, కెనడా, పశ్చిమ యూరపియన్ రాజ్యములకు) మాత్రమే ఉద్దేశితమైనది. కాని, క్రమముగ దీని కార్యక్షేత్రము విస్తృతీకరింపబడి, మధ్యధరాసముద్రమును ఆనుకొని గ్రీస్, టర్కీ దేశములవరకు నెలకొనిన కమ్యూనిస్టేతర యూరపియన్ రాజ్యములకును అందు తావు కల్పింపబడినది. క్రమముగ పశ్చిమ జర్మనీకిని అందు ప్రవేశము లభించినది.

యునైటెడ్ స్టేట్స్ నాయకత్వమున ఇటుల పూర్వ ప్రతిపత్తిని మరల ఆర్జింపగలిగిన యూరప్ దేశములందు స్వావలంబనమువలన యూరప్‌ను పటిష్ఠతరము చేయవలయునను ఆకాంక్ష క్రమముగ రూపుగొనినది. 'యూరపియన్ రక్షణ సమితి (యూరపియన్ డిఫెన్స్ కమ్యూనిటీ)' అను పేర ఒక నూతన వ్యవస్థ ఇందులకై బెల్జియమ్, ఫ్రాన్స్, ఇటలీ, లక్జెంబర్గ్, నెదర్లండ్స్, పశ్చిమ జర్మనీ సభ్యత్వముతో ఏర్పరుపబడినది. అటులనే కమ్యూనిస్ట్ల పలుకుబడికి లొంగని యూరప్ దేశములు అన్నియు ఒక సమాఖ్యగ రూపొందవలయునను భావనయు కలిగినది. దీనికి ప్రాతిపదికగ 'యూరపీయసభ (కౌన్సిల్ ఆవ్ యూరప్)' అను పేర ఒక సంస్థ ఏర్పాటైనది. ఇందు కమ్యూనిస్టేతర యూరప్‌నందలి చాల దేశములు - గ్రేట్ బ్రిటన్‌తోసహా - సభ్యత్వమును పొందినవి. అట్టులే పశ్చిమ యూరప్ ఆర్థిక వ్యవస్థను సంఘటితపరచుటకై అందలి ప్రముఖ దేశములు ఉమ్మడి విపణి (కామన్ మార్కెట్) మొదలగు వానిని రూపొందించినవి. కాని, వీనిలో గ్రేట్ బ్రిటన్‌కు సభ్యత్వము లేదు. ఇట్టి సమష్టి సంస్థలవలన పశ్చిమ యూరప్‌కు కొంత లాభము కలిగినమాట నిజమే అయినను, ఆ దేశములందు పారిశ్రామిక, వ్యవసాయ దేశముల మధ్య గల విభిన్న ఆర్థికాభిప్రాయములు, జర్మనీ, ఫ్రాన్స్ మధ్య పరంపరగ వచ్చుచున్న వైరుధ్యము మొదలగువానివలన పశ్చిమ యూరప్ దేశముల ఏకీకరణోద్యమము తగిన పురోగతిని సాధింపలేక కుంటుపడినది.

యునైటెడ్ స్టేట్స్ నాయకత్వమున నాటో రూపొందినందులకు ప్రతీకారముగ కమ్యూనిస్ట్ రాజ్యములు వార్సా ఒడంబడిక [చూ] అను పేర రక్షణ వ్యవస్థను ఏర్పరచుకొనినవి (1955). ఈకాలముననే సోవియట్ రష్యాయును ఆటం బాంబు రహస్యమును కనిపెట్టగలుగుటయే (1949) కాక వివిధ ప్రయోగములను సాగించి పరమాణ్వాయుధ నిర్మాణమున యునైటెడ్ స్టేట్స్‌తో పోటీకి దిగినది. కాని, ఇంతకు ముందుగనే కమ్యూనిస్ట్ రాజ్యములలో సైతము క్రమముగ సోవియట్ రష్యాను కాదని తమ జాతీయ ప్రయోజనముల దృష్ట్యా వ్యవహరించు సంకల్పము కొన్నింట కలిగినది. అయినను ఇట్టి సంకల్పమునకు స్పష్ట రూపము యుగోస్లావియాయందు మాత్రమే సిద్ధించినది. యుగోస్లావియాలోని కమ్యూనిస్ట్‌పార్టీ అధినేతయగు మార్షల్ టిటో తన దేశపు వ్యవహారములలో సోవియట్ రష్యా జోక్యము కలిగించుకొని, దేశశ్రేయమునకు భంగము కల్గించుచున్నదని ఆరోపించి (1948), సోవియట్ రష్యా నాయకత్వమును త్రోసి రాజనెను. అంతటినుండి కమ్యూనిస్ట్ సిద్ధాంతమునే అవలంబించియు, సోవియట్ రష్యా పలుకుబడికి లొంగక, టిటో [చూ.] నాయకత్వమున యుగోస్లావియా పురోగమించుచున్నది.

పరాజిత రాజ్యములలో ఒకటియగు జపాన్ విషయమున ఆక్రమణ రాజ్యమగు యునైటెడ్ స్టేట్స్ కొంత సానుభూతితో వ్యవహరించినది. ఆ దేశపు పాలకుడగు హిరోహిటోకు ఆపాదింపబడిన దైవత్వమునకు స్వస్తిచెప్పబడి, రాజరికము మాత్రము నిలిచియుండుటకు వసతి కల్పింపబడినది. దేశమున తగు సంస్కరణలు ప్రవేశపెట్టబడి, ప్రజాస్వామిక రాజ్యపాలన నిర్వహింపబడుటకు తగు ప్రాతిపదికలు ఏర్పరుపబడినవి. యునైటెడ్ స్టేట్స్ సాయమున దేశము పారిశ్రామికముగ అతి త్వరితగతిలో పురోగమించగలిగినది. ఇక జపాన్‌తో శాంతి సంధిని కుదుర్చుకొను విషయమునను సోవియట్ రష్యాతో పశ్చిమ రాజ్యములకు ఏకీభావము కుదరక, పశ్చిమ రాజ్యములు మాత్రమే అట్టి శాంతి సంధిని తొలుత కుదుర్చుకొనినవి [చూ. జపాన్].

వలస రాజ్యముల స్వాతంత్ర్యార్జన : ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమునకు పూర్వమునుండియు పెక్కు వలస రాజ్యములలో కమ్యూనిస్ట్ పక్షములు అచటి జాతీయ శక్తులతో కలసి జాతీయ స్వాతంత్ర్యముకొరకై కృషి చేయుచుండినవి. ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున సోవియట్ రష్యాతో సామ్రాజ్య పాలక రాజ్యములును చేరి పోరాటమును సాగించుటవలన వివిధ వలస రాజ్యములందలి కమ్యూనిస్ట్ పక్షములు మిత్రరాజ్యముల పక్షమున యుద్ధ కృషిలో పాల్గొనుటయో, అక్ష రాజ్యములచే ఆక్రమితములైన వలసలయందు దేశ విముక్తికై పోరాటమును సాగించుటలో పాలు పంచుకొనుటయో జరిగినది. ఇందులకు తోడుగ యుద్ధకాలమున జపాన్‌చే ఆక్రమితములైన ప్రాంతములందు 'ఆసియా వాసులదే ఆసియా' అను నినాదము వ్యాపించి, జాతీయాభిమానమును తీవ్రతరము చేసినది. యుద్ధానంతరమున ఈ వలసల పరిస్థితులను అవకాశముగ గ్రహించి కమ్యూనిస్ట్‌లు తమ వాదమును వ్యాపింపజేయుటకు అనుకూల పరిస్థితులు ఏర్పడినవి. ఇట్టియెడ ఆ వలసలకు విముక్తిని కల్గించి, అందలి జాతీయవాద పక్షములకు బలమును చేకూర్చుట మూలమున మాత్రమే కమ్యూనిజమ్ వ్యాప్తిని అరికట్టుటకు అవకాశము ఉండునని యునైటెడ్ స్టేట్స్, బ్రిటన్ దేశములలో పలువురు రాజనీతిజ్ఞులు భావించిరి. యుద్ధకాలమున సైతము దాస్య రాజ్యముల విముక్తి విషయమున యునైటెడ్ స్టేట్స్, చీనాయును జ్ఞాతాజ్ఞాత మార్గముల

తమ సానుభూతిని సూచించినవి. యుద్ధానంతరమున 1946 లో ఫిలిప్పీన్ దీవులకు స్వాతంత్ర్యమును కలుగ జేయుటతో, యునైటెడ్ స్టేట్స్ తన వాగ్దానమును నిలబెట్టుకొనుటయే కాక, తక్కిన సామ్రాజ్యములకు ఒరవడి పెట్టినది. అప్పటిలో గ్రేట్ బ్రిటన్ దేశమున అధికారమును గ్రహించిన లేబర్ పార్టీ ప్రభుత్వము ఈ విషయమున సుముఖత వహించి, భారత ఉపఖండమునకు స్వాతంత్ర్యమును కలిగించినది (1947). కాని, అంతకు పూర్వమున తన ప్రతిపత్తిని కాపాడుకొనుటకై సామ్రాజ్య ప్రభుత్వము అవలంబించిన భేదతంత్రము మూలమున బలమును ఆర్జించిన ముస్లిమ్‌లీగ్‌ను సంతృప్తిపరచుటకై పాకిస్తాన్ అనుపేర బహుళ సంఖ్యాక ముస్లిమ్ ప్రజానీకముగల రెండు ప్రాంతముల సమష్టిరూపమగు ఒక దేశమును ఆ ఉపఖండమున రూపొందించి, స్వతంత్రముగ జేసి, తక్కిన దానికి ఇండియా (భారత్) అనుపేర స్వాతంత్ర్యమును గ్రేట్ బ్రిటన్ కలుగచేసినది [చూ. భారతదేశము]. ఆ తరువాత 1948 లో బర్మా, సింహళము స్వతంత్రములైనవి. మలయా, సింగపూర్, బోర్నియో యందలి బ్రిటిష్ పాలిత ప్రాంతములును కాలక్రమమున స్వాతంత్ర్యమును పొందినవి. గ్రేట్ బ్రిటన్ నుండి స్వాతంత్ర్యమును పొందిన దేశములలో బర్మా తప్ప తక్కినవి కామన్‌వెల్త్ [చూ.] నందు సభ్యత్వమును గ్రహించి, బ్రిటన్‌తో సన్నిహిత సంబంధమును నిలుపుకొనినవి. కాని, పూర్వమువలె 'బ్రిటిష్ కామన్‌వెల్త్' అని వ్యవహరింపబడుటకు మారుగ, 'వివిధ దేశముల కామన్‌వెల్త్ (కామన్‌వెల్త్ ఆవ్ నేషన్స్)' అను నూతన వ్యవహార నామమును అప్పటినుండి అది వహించినది. అంతియేకాదు, 1950 (జనవరి, 26) లో భారతదేశము గణరాజ్యము (రిపబ్లిక్) గ రూపొందిన తరువాత బ్రిటిష్ రాజరికముతో ఏ సంబంధమును లేని గణరాజ్యము సైతము కామన్‌వెల్త్‌న సభ్యత్వమును పొందు సంప్రదాయము ఏర్పడినది [చూ. కామన్‌వెల్త్].

వలసల విముక్తి విషయమున నెదర్‌లండ్స్, ఫ్రాన్స్ దేశములు తొలుత కొంత వెనుకంజ వేసినవి. తత్ఫలితముగ ఫ్రాన్స్‌దేశము ఇండోచీనా, ఆల్‌జీరియా దేశములలోను, నెదర్‌లండ్స్‌దేశము ఇండోనీషియాయందును తీవ్ర ప్రతిఘటనలను ఎదుర్కొని, విపరీత నష్టములకు లోనై, కడకు పరిస్థితులకు లొంగి ఆ యా దేశములకు స్వాతంత్ర్యమును కల్పించినవి [చూ. ఇండోనీషియా; ఆల్‌జీరియా; కాంబోడియా; లావోస్; వియెత్నామ్, ఉత్తర; వియెత్నామ్, దక్షిణ].

అన్నియు అచ్చముగ వలస దేశములు కాక పోయినను, దాదాపుగ వలస దేశముల పరిస్థితులలోనే ఉండిన అరబ్బు దేశములందును యుద్ధానంతరమున పరిణామములు అతి త్వరితగతిలో సంఘటిల్లినవి. సిరియా, లెబనాన్ దేశముల నుండి ఫ్రెంచి సేనలును, ఇరాక్ నుండి బ్రిటిష్ సేనలును యుద్ధానంతరమున వైదొలగినవి. ఈజిప్టునందు సూయెజ్ కాలువ ప్రాంతమున బ్రిటిష్ సేనలు స్థావరమును ఏర్పరచుకొనియుండుట తమ జాతీయ గౌరవమునకు భంగకరముగ భావించిన ఈజిప్టు ప్రజలు ప్రభుత్వమున పరివర్తనను కొనివచ్చుటకై ఆందోళన చేసిరి. తత్ఫలితముగ ఈజిప్టు దేశపురాజు పదవీభ్రష్టుడగుటయు, సైన్య సాహాయ్యమున మహమ్మద్ నజీబ్ అను నతడు అధికారమును గ్రహించి, ఈజిప్టును గణరాజ్యముగ ప్రకటించుటయు జరిగినది (1953). ఆ తరువాత జమాల్ అబుల్ నాసర్ [చూ] అను సేనాని నజీబ్‌ను పదవినుండి తొలగించి తానే అధ్యక్షుడై (1954), క్రమముగ దేశమున సోషలిస్ట్ భావనలకు అనుగుణములగు సంస్కరణలను ప్రవేశపెట్టుటయే కాక, అరబ్బు దేశముల జాతీయతా వాదమునకు కైరోను ముఖ్యకేంద్రముగ రూపొందించెను. ఇంతకు ముందుగనే ఇటలీ నుండి బ్రిటన్‌చే విముక్తి కల్పింపబడిన లిబియా 1951 లో స్వతంత్రమయ్యెను. అరబ్బులలో చెలరేగిన ఈ జాతీయభావోద్రేకమునకు లొంగి ఫ్రాన్స్‌దేశము మొరాకో, టూనీషియా దేశములకు స్వాతంత్ర్యమును ఒసగినది (1956). ఆల్‌జీరియాకు తీవ్రఘర్షణల తరువాత 1962 లో స్వాతంత్ర్యము సిద్ధించినది [చూ. ఈజిప్టు; టూనీషియా; మొరాకో; లిబియా].

అరబ్బు దేశములందు ఇట్టి తీవ్ర జాతీయభావము వ్యాపించుటకు పాలస్తీనా సమస్యా పరిష్కార విషయమున ఐక్యరాజ్యసమితి అవలంబించిన వైఖరియు కొంత తోడ్పడినది. పాలస్తీనాను యూదులకును, అరబ్బులకును పంచి రెండు రాజ్యములుగ రూపొందించవలసినదిగ ఐక్యరాజ్యసమితి 1947 నవంబరులో ఒక తీర్మానమును చేసినది. ఈ విభజనను అరబ్బు దేశములు - ఈజిప్టు, సిరియా, లెబనాన్, ఇరాక్, సౌదీ అరేబియా, యెమెన్, జోర్డాన్ దేశములు - ప్రతిఘటించినవి. కాని, ఐక్యరాజ్య సమితి తీర్మానమును ప్రాపుగ గ్రహించి, తమకు ఆ తీర్మానము ప్రకారము లభ్యము కాగల ప్రాంతమును పాలస్తీనాలో వశపరచుకొని దానిని సర్వస్వతంత్రమగు ఇజ్రాయెల్ రాజ్యముగ యూదులు ప్రకటించిరి (1948, మే). కాలక్రమమున ఈ రాజ్యమును అగ్రరాజ్యములు గుర్తించుటయే కాక, ఐక్యరాజ్యసమితిలో దానికి సభ్యత్వమును కల్పించినవి.

అరబ్బు రాజ్యములు మాత్రము దీనిని ప్రతిఘటించుచునే ఉన్నవి. ఇస్రాయెల్‌కు అరబ్బు రాజ్యములతో కల సరి హద్దున ఐక్యరాజ్యసమితి పర్యవేక్షక దళము శాంతిని కాపాడుచున్నది.

యుద్ధకాలమున సోవియట్ రష్యా, యునైటెడ్ స్టేట్స్, గ్రేట్ బ్రిటన్ సేనలచే ఆక్రమితమైన ఇరాన్ నుండి యుద్ధానంతరమున కడపటి రెండు రాజ్యముల సేనలు వైదొలగినను, సోవియట్ రష్యా సేనలు మాత్రము వైదొలగలేదు. కాని, ఐక్యరాజ్యసమితిలో జరిగిన తీవ్ర చర్చానంతరమున అవియును వైదొలగినవి. అయినను కమ్యూనిస్ట్ భావప్రేరితమగు టూడేపార్టీ ఇరాన్‌న అప్పటికి బలమును ఆర్జించి దేశమున నూనె గనులలో బ్రిటిష్ కంపెనీలకు గల అధికారమును అంతరింప జేయుటకు కృషిచేసినది. ముసాదిక్ అను జాతీయనాయకుని ఆధ్వర్యవమున ఈ కృషి తొలుత నెగ్గినను, రాజు పదవీ పరిత్యాగము మొదలగు వానివలన దేశమున కల్లోలము చెలరేగినది. కడకు సైన్యము ప్రభుత్వమును వశపరచుకొనుటయు, రాజు మరల పదవిని గ్రహించుటయు జరిగినది (1953). తదాదిగ భూసంస్కరణలు మొదలగునవి ప్రవేశ పెట్టబడుటయే కాక, చట్టబద్ధ రాజరికపు పరిపాలన నెలకొనుటకు కృషి మొదలైనది.

యుద్ధానంతరమున వలసల స్వాతంత్ర్యార్జన వలన ఆఫ్రికా ఖండ పటపు స్వరూపమే మారిపోయినది [చూ. ఆఫ్రికా]. ఉత్తర ఆఫ్రికాలో ఇదివరలో చెప్పబడిన అరబ్బు రాజ్యములు స్వతంత్రతను ఆర్జించిన కాలముననే అంతటంతట తక్కిన ఆఫ్రికాయందలి పెక్కు వలస రాజ్యములు స్వాతంత్ర్యమును ఆర్జించినవి. 1956 లో సుడాన్ స్వతంత్రతను పొందినది. ఆ వెనువెంటనే ఘూనాకు స్వాతంత్ర్యము లభించినది. తరువాత రెండేండ్లు అయినను ముగియక పూర్వమే గినీ స్వతంత్రరాజ్యమైనది. అంతట టోగో [చూ.], కామెరూన్ [చూ.] వానితో చేరినవి. 1960 లో ఈ స్వాతంత్ర్యార్జనోద్యమము అతి తీవ్రగతిలో ముందునకు సాగినది. ఆ సంవత్సరపు జూన్ మాసమున మాలీ, కాంగో (లియోపాల్డ్ విల్లీ) సోమాలీలాండ్, మలగాసీ స్వతంత్రతను ఆర్జించినవి. జూలై నెలలో సోమాలియా స్వేచ్ఛను పొంది, సోమాలీలాండ్‌తో మిళితమై నూతనముగ సోమాలీ గణ రాజ్యముగ రూపొందినది. ఆ సంవత్సరము ముగియు నాటికి దహోమీ, గెబన్, కాంగో (బ్రజ్జవిల్లీ), ఐవరీకోస్ట్, సెంట్రల్ ఆఫ్రికన్ రిపబ్లిక్, మారిటేనియా, నైజీరియా, నైజర్, అప్పర్ వోల్టా, సెనెగల్ దేశములు స్వతంత్ర రాజ్యములుగ అవతరించినవి. 1961 లో టాంగన్యికా, సియెర్రాలియోనీ దేశములకు స్వతంత్రత లభించినది. 1962 లో రువండా, బురుండీ దేశములకు స్వేచ్ఛ చేకూరినది. 1963 లో కెన్యా, జాంజిబార్ స్వతంత్రరాజ్యముల పట్టికలో చేరినవి. కాని, అనతికాలముననే జాంజిబార్ టాంగన్యికాతో సమాఖ్యలోచేరగ టాంజేనియా రూపొందినది (1965). 1964 లో జాంబియా (ఉత్తర రొడీషియా), మలావీ (న్యాసాలాండ్) రాజ్యములు స్వతంత్రములు అయినవి. బ్రిటన్ పాలనలో ఉన్న బెచూనాలాండ్, స్వాజీలాండ్, బసూటోలాండ్ దేశములకు స్వతంత్ర ప్రతిపత్తిని త్వరలో కలుగజేయుటకు బ్రిటన్ చర్యలను తీసికొనినది. స్వతంత్రతను ఆర్జించినవానిలో అదివరకు బ్రిటిష్ సామ్రాజ్యమున చేరిన వానియందు ఈజిప్టు, సుడాన్ తప్ప తక్కినవి స్వాతంత్ర్యానంతరమున కామన్ వెల్త్ సభ్యత్వము పొందినవి. ఫ్రెంచి పాలనలో ఉండిన వానిలో ఆల్‌జీరియా, మొరాకో, గినీ మొదలగు పెక్కు రాజ్యములు స్వాతంత్ర్య సిద్ధి తరువాత ఫ్రెంచి కమ్యూనిటీ [చూ.] లో సభ్యత్వమును గ్రహింప నిరాకరించినవి. 1965 లో గాంబియా స్వతంత్రను పొందినది. 1965 ముగియు నాటికి ఆఫ్రికాలో పోర్చుగీస్ పాలనలోని అన్‌గోలా, మొజాంబిక్ దేశములును, స్పెయిన్ పాలనలోని సహారాయును, తదితరములగు చిన్న మండలములును, దక్షిణ రొడీషియాయును, దక్షిణ ఆఫ్రికా దేశపు ధర్మకర్తృత్వపు పాలనలో ఉన్న నైరృతి ఆఫ్రికాయును తప్ప తక్కినవన్నియు స్వతంత్రను ఆర్జించినవనియే చెప్పవచ్చును. దక్షిణ రొడీషియా బ్రిటిష్ చక్రవర్తిని పాలనలోని వలస రాజ్యమే అయినను, పరిమిత స్వాతంత్ర్యముకల ప్రభుత్వమును కలిగి ఉన్నది. ఈ ప్రభుత్వము ఆ దేశమందు అల్ప సంఖ్యాకులుగ ఉన్న శ్వేతజాతీయులకు మాత్రమే ప్రాతినిధ్యము వహించుచున్నది. అధిక సంఖ్యాకులగు ఆఫ్రికా జాతీయులకు అధికారము చేజిక్కకుండుటకై, ఆ ప్రభుత్వము సామ్రాజ్య ప్రభుత్వమును కాదని తానే స్వతంత్రించి స్వతంత్ర రాజ్యముగ ప్రకటించుకొనినది. కాని, బ్రిటన్‌తో సహా తక్కిన ప్రపంచ రాజ్యములు దానిని గుర్తింప నిరాకరించినవి (1965 నవంబరు). ఆఫ్రికాలోని పోర్చుగీస్ వలసలకు స్వాతంత్ర్యము శాంతియుత మార్గములవలన చేకూర్చుటకు ఐక్యరాజ్యసమితి చేసిన కృషి పోర్చుగీస్ ప్రభుత్వపు మొండి పట్టుదలవలన ఫలప్రదము కాలేదు. దక్షిణ ఆఫ్రికా స్వతంత్రరాజ్యమే అయినను, అందు అల్పసంఖ్యాకులగు శ్వేత జాతీయులకు మాత్రమే ప్రాతినిధ్యము వహించు ప్రభుత్వము సర్వాధికారముల వహించుచు, అధికసంఖ్యాకులగు తదితర వర్ణ జాతులను హీనస్థితికి కొనివచ్చినది. దీనిని చక్కచేయుటకు ఐక్యరాజ్యసమితి నాయకత్వమున

ప్రపంచ రాజ్యములు చేసిన కృషి విఫలమైనది. ఇంతియే కాక, ప్రథమ ప్రపంచ యుద్ధానంతరపు ఏర్పాటులను అనుసరించి ధర్మకర్తృత్వపాలనకై తనకు అప్పగింపబడిన నైరృతి ఆఫ్రికాను స్వీయ రాజ్యముగ చేసికొని, అచటను అల్ప సంఖ్యాకులగు శ్వేతజాతీయుల పాలననే నెలకొల్ప దక్షిణ ఆఫ్రికా యత్నించినది. దీనిని అరికట్టుటకై ఐక్య రాజ్యసమితి చేసిన యత్నములు సానుకూలతను ఇప్పటికి పొందలేదు. కాని, తక్కిన ప్రపంచమందలి ధర్మకర్తృత్వ పాలిత ప్రాంతముల [చూ.] లో పెక్కు 1965 నాటికి స్వతంత్రతను ఆర్జించినవి. వానిలో న్యూగినీయును, సైనిక తంత్రరీత్యా ప్రాముఖ్యమును వహించిన కొన్ని పసిఫిక్ సముద్ర ద్వీపములును మాత్రమే అస్వతంత్ర స్థితిలో మిగిలి ఉన్నవి.

ఇటుల పెక్కు రాజ్యములు స్వాతంత్ర్యమును పొందుటతో ప్రపంచ రాజకీయ రంగమున కొన్ని నూతన పరిస్థితులు ఏర్పడినవి. స్వతంత్రత సిద్ధించునాటికి ఇందు కొన్నింట దక్షత గల రాజకీయ పక్షములు రూపొందియే ఉండక పోవుట పలు సందర్భములందు కొన్ని క్లిష్టతలకు దారితీసినది. ఇట్టి పరిస్థితిలోనే కాంగో (లియోపాల్డ్ విల్లీ) లో అచటి ప్రధాని అభ్యర్థనపై ఐక్యరాజ్యసమితి జోక్యము వహింపవలసి వచ్చినది. ఇందువలన పలు అభ్యంతరములను ఎదుర్కొనిన తరువాత అచట కొంత వరకు శాంతిని ఐక్యరాజ్యసమితి నెలకొల్పినను, అచటి వామపక్ష శక్తులను ఎదుర్కొనుటకై ఐక్యరాజ్యసమితి జోక్యము వినియుక్తమైనదను వాదమునకు తావేర్పడి అగ్రరాజ్యముల మధ్య వైరుధ్యమునకు ఆ సంఘటన దారి తీసినది. మరికొన్ని నూతన స్వతంత్రరాజ్యములు తమ దేశములందలి వామపక్ష ప్రాబల్యమును అరికట్టుటకును, సైనికముగను, ఆర్థికముగను బలపడుటకును అగ్రరాజ్యముల వైరుధ్యములలో పాల్గొని పశ్చిమ రాజ్యముల పక్షమును అవలంబించినవి. వీనిలో కొన్ని తక్కిన రాజ్యములతో తమకు గలిగిన వివాదముల పరిష్కారమున తమకు బలము లభించుటకై పశ్చిమ రాజ్యముల పక్షమును అవలంబించి నవి. ఇందులకు పాకిస్తాన్ ఒక ముఖ్యమగు లక్ష్యము. భారతదేశమునందలి కాశ్మీరు తనకు చెందవలయునను ఆకాంక్షతో తన వాదమునకై సైనికముగను, తదితరముగను బలము చేకూర్చుకొనుటకై పశ్చిమ రాజ్యముల అండను పాకిస్తాన్ ఆశించినది. ఇట్టిగ్రుక్పథముల ఫలితముగ కమ్యూనిజమ్‌ను అరికట్టు సంకల్పమును వెలివరచుచు పశ్చిమ రాజ్యముల అండదండలతో ప్రాచ్య దేశములకు సంబంధించిన కొన్ని రక్షణ ఒడంబడికలు కుదుర్చుకొన బడినవి [చూ. సీటో, సెంటో]. కాని, ఈ క్లిష్టసమయమున భారతదేశము జవాహర్‌లాల్ నెహ్రూ [చూ.] ఆధ్వర్యవమున ఒక వైదేశిక విధానమును అమలులోనికి కొని వచ్చినది. ప్రపంచమును ద్విధా విభజించయత్నించు కమ్యూనిస్ట్, కమ్యూనిస్టేతర కూటములలో వేనియందును చేరక, అంతటంతట ఉత్పన్నములగు ఆ యా ప్రపంచ సమస్యలను నిష్పాక్షిక బుద్ధితో విమర్శించి, ప్రపంచ శ్రేయమునకును, స్వీయ శ్రేయమునకును అనుగుణముగ ఆ యా పట్టుల తమ విధానమును నిర్ణయించుకొనుచు, ప్రపంచ శాంతియే తమ ఆశయముగ ఇడుకొని నూతన వర్ధమాన రాజ్యములు పురోగమించుట సముచితమని భారతదేశము విశ్వసించి, దానిని తన వైదేశిక నీతికి ఆలంబనముగ చేసినది. నాసర్ నాయకత్వమున ఈజిప్టు ప్రభుత్వమును, టిటో నాయకత్వమున యుగోస్లావియా ప్రభుత్వమును దీనిని సమర్థించి నవి. క్రమముగ పెక్కు వర్ధమాన రాజ్యములు ఈ విధానమును ఆదరించినవి. ఈ విధానమే తటస్థత లేదా అలీనత (నాన్ ఎలైన్‌మెంట్) అను పేరున వ్యవహరింపబడుచున్నది. ఈ విధానమువలన కొన్ని వర్ధమాన రాజ్యములు రాజ్యకూటముల తగవులాటలలో చిక్కుకొనకుండ బ్రతుకుటయేకాక, అగ్రరాజ్యముల మధ్య వైరుధ్యములవలన కలుగు దుష్ఫలితముల బారినుండి ప్రపంచమును కొన్నిసమయములందు రక్షింపగలిగినవి. కొరియా, వియెత్నామ్, లావోస్‌లోని సంఘటనలు ఇందులకు ముఖ్య లక్ష్యములు. ఉభయ రాజ్య కూటములకును ఈ దేశములందు ప్రాపు లభించిన ఫలితముగ యుద్ధోన్మాదము చెలరేగగ, దానిని సమయించుటకు భారతదేశము గణనీయమగు కృషి చేసినది. కాని కొరియాయును, వియెత్నామ్ దేశమును ద్విధా విభక్తములగుట తప్పలేదు [చూ. కొరియా; వియెత్నామ్]. లావోస్ దేశము సంక్షుభిత స్థితిలోనే మిగిలి పోయినది. పై దేశములలోని వామపక్ష శక్తులు అతి బలీయములగుటకు వీనికి పొరుగున ఉన్న చీనాయందు ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున ఏర్పడిన కమ్యూనిస్ట్ ప్రభుత్వము ఎక్కువగ తోడుపడినది.

చీనాలోని నూతన వ్యవస్థ : యుద్ధకాలమున చీనాలోని జాతీయ ప్రభుత్వ సేనలకును, కమ్యూనిస్ట్ పక్షపు సేనలకును మధ్య ఏర్పడిన సాహచర్యము యుద్ధానంతరమున భగ్నమైనది. పలు సంఘర్షణల తరువాత అచటి ముఖ్య భూభాగమున ప్రభుత్వమును కమ్యూనిస్ట్‌పక్షము కైవసము చేసికొని (1949), 'చీనా ప్రజా గణరాజ్యము' అను పేరున ప్రభుత్వమును నెలకొల్పినది. చియాంగ్-కై-షేక్ [చూ.] నాయకత్వమునందలి జాతీయప్రభుత్వము అంతట

తైవాన్ (ఫార్మోజా) దీవికి తరలింపబడినది. చీనా ప్రజా గణరాజ్యప్రభుత్వమునే సర్వాధికారయుత సమగ్ర చీనా ప్రభుత్వముగ సోవియట్ రష్యాయును, దానిని అనుసరించు కమ్యూనిస్ట్ రాజ్యములును, అలీన రాజ్యములును, పశ్చిమ యూరప్ ప్రాంతమునందలి కొన్ని రాజ్యములును గుర్తించినవి. కాని, యునైటెడ్ స్టేట్స్‌యును, దాని పలుకుబడికి లోనైన కొన్ని రాజ్యములును పరిగణనను నిరాకరించి తైవాన్‌లోని చియాంగ్-కై-షేక్ ప్రభుత్వమునే చీనా ప్రభుత్వముగ పరిగణించినవి. తత్ఫలితముగ ఐక్యరాజ్యసమితియందు సభ్యత్వము తైవాన్‌లోని ప్రభుత్వమునకే నిలిచిపోయినది. చీనా ప్రజా గణరాజ్యపు ప్రాతినిధ్యపు సమస్య ఐక్యరాజ్యసమితిలోని సర్వసభ్య సమావేశములలో అయిదవ సమావేశము మొదలుగ ప్రతిదానియందును చర్చనీయాంశముగనే ఉండి, ఈనాటికిని అపరిష్కృతముగ నిలిచినది.

ఇటుల కమ్యూనిస్ట్ చీనా, యునైటెడ్ స్టేట్స్ మధ్య బయలుదేరిన వైరుధ్యము కొరియాలో చీనా అవలంబించిన వైఖరివలన విస్తృతమైనది. యుద్ధాత్పూర్వమున జపాన్ సామ్రాజ్యమున చేరియుండిన కొరియాకు స్వతంత్రమును-యుద్ధానంతరమున-కల్పించుటకు ఐక్యరాజ్యములు నిర్ణయించుకొనినవి. కాని, యుద్ధకాలపు సంఘటనల వలన యుద్ధానంతర కాలమునకు ఆ దేశమునందలి ఉత్తర భాగము సోవియట్ రష్యా ఆక్రమణలోను, దక్షిణ భాగము యునైటెడ్ స్టేట్స్ ఆక్రమణలోను ఉండినవి. ఈ రెండు ఆక్రమణ రాజ్యములును ఒక నిర్ణయమునకు రాలేకపోయినంతట ఆ దేశము ఉత్తర, దక్షిణ దేశములుగ విభక్తమై ఆ యా ఆక్రమణరాజ్యములకు అనుకూలములగు ప్రభుత్వములు ఏర్పడినవి (1948). కాని, దేశమును ఏకీకృతము చేయవలయునను ఆకాంక్షతో ఉత్తర దేశమునందలి కమ్యూనిస్ట్ ప్రభుత్వము దక్షిణదేశముపై దాడిచేసినది (1950). ఆ దాడిని అరికట్టుటకై ఐక్యరాజ్యసమితి నిర్ణయించుకొనినది. అప్పటిలో చీనా ప్రాతినిధ్య సమస్యపై సోవియట్ రష్యాయు, దాని సహచర రాజ్యములును సమితి సమావేశములను బహిష్కరించుచున్నందున ఈ ఏకగ్రీవ నిర్ణయము సాధ్యమైనది. అంతట యునైటెడ్ స్టేట్స్ సేనలును, దానితో సహకరించిన తదితర రాజ్యముల సేనలును ఐక్యరాజ్యసమితి నిర్ణయములను అమలులో పెట్టుటకు కొరియాలో దిగినవి. ఉత్తర కొరియా సైన్యములు ఓడిపోవు స్థితి సంఘటిల్లినంతట చీనా ప్రజా గణరాజ్యము తన వలంటీర్లను అసంఖ్యాకముగ అట దింపి, యుద్ధమును క్లిష్టతరము చేసినది. కడకు భారతదేశపు యత్నముల మూలమున యుద్ధవిరమణ జరిగి (జూలై, 1953), 38 వ అక్షాంశ రేఖ సరిహద్దుగ ఉత్తర, దక్షిణ కొరియా దేశములు కుదుటపడినను, కొరియా సమస్య అపరిష్కృతముగనే ఉండి, చీనా, యునైటెడ్ స్టేట్స్ మధ్య వైషమ్యమునకు హేతువైనది. ఇందులకు తోడుగ తైవాన్‌ను చీనా ప్రజా గణరాజ్యము ఆక్రమించకుండుటకై ఆ దీవికి యునైటెడ్ స్టేట్స్ దేశము రక్షణను ప్రకటించుటతో ఆ వైరుధ్యములు పెచ్చు పెరిగినవి. వియత్నామ్‌లో కూడ కొరియాలో వలెనే చరిత్ర నడచినది. ద్విధా విభక్తమైన ఆ దేశమునను ఉత్తర భాగమునందలి కమ్యూనిస్ట్ ప్రభుత్వపు ప్రోత్సాహమున దక్షిణ భాగమున తిరుగుబాటులు చెలరేగగా యునైటెడ్ స్టేట్స్ అందు జోక్యము వహించినది (1965). ఉత్తర భాగమునకు కమ్యూనిస్ట్ చీనా అండగ నిలబడినది. ఆ సమస్యయు ఇప్పటికిని అపరిష్కృతముగనే నిలచినది (1965).

తదితర పరిణామములు : ప్రాచ్య - పాశ్చాత్య రాజ్యకూటముల మధ్య చెలరేగిన ప్రచ్ఛన్న యుద్ధచరిత్రలో స్టాలిన్ మరణము (1953) తో ఒక నూతన అధ్యాయము ఆరంభితమైనదని చెప్పవచ్చును. అతని అనంతరమున క్రమముగ స్థైర్యమును ఆర్జించిన నూతన ప్రభుత్వమునకు కృశ్చేవ్ [చూ] నాయకత్వము లభించినప్పటినుండియు, ఆ దేశమున వ్యక్త్యారాధనకును, నిర్దాక్షిణ్యపు ఏకవ్యక్తి నియంతృత్వమునకును దాదాపుగ స్వస్తి చెప్పబడుటయే కాక, ప్రాచ్య, పాశ్చాత్య రాజ్యకూటముల మధ్య గల వైషమ్యము కొంత సడలినది. పశ్చిమార్ధగోళమున ప్రప్రథమముగ క్యూబాయందు నెలకొల్పబడిన కమ్యూనిస్ట్ ప్రభుత్వమునకు రాకెట్‌లు మొదలగు నూతన ఆయుధములను సోవియట్ రష్యా సమకూర్చిన విషయముపై యునైటెడ్ స్టేట్స్ - సోవియట్ రష్యా మధ్య యుద్ధము సంఘటిల్లు ప్రమాదము ఏర్పడినను, అప్పటిలో యునైటెడ్ స్టేట్స్ అధ్యక్షుడుగ ఉండిన కెనెడీ [చూ.] యును, సోవియట్ రష్యా అధినేత కృశ్చేవ్‌యును ప్రదర్శించిన సహనము వలన ఆ సమస్య ప్రజ్వరిల్లకుండ సమసినది [చూ. క్యూబా]. కాని, ఆ కాలముననే చీనా ప్రజా గణరాజ్యము సోవియట్ రష్యా అవలంబించిన వైఖరిని నిరసించి, కమ్యూనిస్ట్ ప్రపంచమున ఒక నూతన వాదమునకు దారితీసినది. ప్రపంచమున శాంతియుత పద్ధతులవలన విప్లవము రూపుగొనదనియు, మూడవ ప్రపంచయుద్ధమున ప్రపంచమంతయు అటంబాంబులవలన ధ్వంసము కాగలదనుట అత్యుక్తియనియు, విప్లవవ్యాప్తికి యుద్ధము అనివార్యమనియు ఆ దేశము వాదించి, తదనుగుణముగ తన విధాన

మును రూపొందించుకొనుటయే కాక, యుద్ధ విముఖతను ప్రదర్శించిన సోవియట్ రష్యా కమ్యూనిస్ట్ పార్టీ అధినేత లను దూయబట్టినది. ప్రపంచమునందలి కమ్యూనిస్ట్ పార్టీ లలో కొన్ని ఈ వాదమును ఆమోదించినవి. చీనా కమ్యూనిస్ట్ పార్టీ అవలంబించిన ఈ నూతన విధానము చీనా ప్రభుత్వపు విస్తరణ కాంక్షకు ఒక ప్రతిబింబముగ పరిగణింపవచ్చును.

చీనాలో బయలుదేరిన ఈ విస్తరణకాంక్షయే భారత దేశపు సరిహద్దును అతిక్రమించి, తనకు అనువుగ దౌర్జన్య సహాయమున సరిహద్దులను నిర్ణయించుటకై చీనాదేశము దండయాత్రను నడపుటకు హేతువైనది (1962 అక్టోబరు). కొన్ని తటస్థ రాజ్యముల కృషివలన యుద్ధవిరమణ అప్పటిలో జరిగినను, చీనా దేశము తన మొండిపట్టును వదల నందున, ఆ సమస్య అపరిష్కృతమై, చీనా - భారత దేశములు సరిహద్దు పొడవునను నిరంతరము సేనలను సమాయత్తముచేసియుంచు స్థితి సంఘటిల్లినది. ఈ విస్తరణ కాంక్షకు ఫలితముగనే త్వరలో సైనికముగ అగ్రరాజ్య స్థాయిని అందుకొనవలయునను దీక్షతో 1963 లో చీనా దేశము తొలిసారిగ ఆటంబాంబును రూపొందించి ప్రేల్చినది. చీనా ఇటుల శక్తివంతదేశముగ రూపొందిన కొలది ప్రపంచమున - అందును ముఖ్యముగ ఆసియాలో - కొన్ని రాజ్యములు తమకు తక్కిన దేశములతో గల సమస్యల పరిష్కారమునకు చీనా ప్రజా గణరాజ్యపు అండదండలను ఆశ్రయించుట సంభవించినది. ఇట్టి పరిణామమువలననే పాకిస్తాన్ ఆ దేశముతో మైత్రిని అవలంబించి, కాశ్మీరు సమస్యా పరిష్కారమును యుద్ధమూలమున నిర్వహించుటకై తలపెట్టి భారతదేశముతో యుద్ధమునకు దిగినది (1965); కాని, ఆ ప్రయత్నము విఫలమైనది.

ప్రపంచ రాజకీయములలో చీనా ప్రజా గణరాజ్యము ప్రముఖ పాత్ర వహించిన కొలది క్లిష్టసంఘటనలు ఇటుల విస్తృతి చెందుచున్నను, ఈ కాలముననే ప్రపంచమున శాంతి సాధనకై కొంత కృషి జరిగినది. 1963 లో ఆటంబాంబు ప్రేలుడును నిరోధించుచు కుదుర్చుకొనిన పరిమితపు ఒడంబడిక ఈ కృషిలో ప్రముఖ భాగమని చెప్పవచ్చును. సోవియట్ రష్యా, యునైటెడ్ స్టేట్స్ దేశములతో సహా పెక్కు రాజ్యములు అందు సంతకములు చేసినను, చీనా ప్రజా గణరాజ్యమును, ఫ్రాన్స్ దేశమును అందులకు నిరాకరించినవి. ఆ పరిమితపు ఒడంబడికనే విస్తృతీకరించుటకు యత్నములు జరుగుచున్నను, చీనా ప్రజా గణరాజ్యము ఆకృషిలో పాల్గొనకున్నది.

## కళా కౌశలములు

ఇరువది సంవత్సరముల అల్పవ్యవధి మాత్రమే ఇప్పటికి కడచనిన వర్తమానపు ఈ ఐక్యరాజ్యయుగమున మానవుడు వివిధ రంగములందు సాధించిన ప్రగతిని మదింపువేసి లెక్కించుటకు యత్నించుట తొందరపాటు పని కాగలదు. సంఘటనలకును, విజ్ఞాన శాస్త్రావిష్కరణలకును, ప్రముఖ మానవుల కృషికిని యథార్థపు విలువలను నిర్ణయించుటకు సన్నిహితత్వము ఒక అవరోధము. భావి చరిత్రకారుడు మాత్రమే ఆ విధిని సముచితముగ నిర్వహింపగలడు. అందువలన స్థూలరీతిలో ఆ యా విషయములను గురించి పేర్కొనుటకు మాత్రమే ఇట అవకాశము కలదు.

పారిశ్రామిక విప్లవమున 1929 లో మొదలైన నూతన ఘట్టమే ఈ యుగమునను కొనసాగుచున్నదని భావింపవచ్చును. ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున సైనికావసరములకై విజ్ఞాన శాస్త్రమున సాధింపబడిన ప్రగతి యుద్ధానంతర కాలమున వినియుక్త రూపమునను, అన్వేషణా మార్గమునను ఇంకను ముందునకు పయనించ గలిగినది. ఆ పరిణామమున పరమాణు విజ్ఞానమునకు ఎక్కువ ప్రోత్సాహము లభించినది. తొలుత యునైటెడ్ స్టేట్స్ వశమున మాత్రమే ఉండి, ఆ దేశముతో కల సన్నిహితత్వము వలన గ్రేట్ బ్రిటన్ కు మాత్రమే జ్ఞాతమై ఉండిన ఈ విజ్ఞానమున సోవియట్ రష్యాయును, ఫ్రాన్స్ను, చీనాయు క్రమముగ పరిచితిని పొంది బాంబులను నిర్మింప మొదలిడినవి. జపాన్, కెనడా, భారత దేశముల వంటి మరికొన్ని దేశములు ఆటంబాంబు నిర్మాణమునకు పూనుకొనగలుగు స్థాయివరకు ఈ విజ్ఞానశాస్త్రమున పరిచితిని సాధించినవి. కాని, మానవశ్రేయో దృష్టితో బాంబుల నిర్మాణమునకు పూనుకొనకున్నవి. రేడియో ధార్మికధూళి పతనమువలన మానవజాతికి రాగల ముప్పులను నివారించు దృష్టితో ప్రముఖ పరమాణుశక్తి రాజ్యములు (సోవియట్ రష్యా, యునైటెడ్ స్టేట్స్) ఆటంబాంబుల నిర్మాణ రహస్యములు విస్తృతముగ తెలియబడకుండుటకు కృషి చేయుచున్నవి. చీనా, ఫ్రాన్స్ ఇందులకు ప్రస్తుతమున సహకరింపక పోయినను తక్కిన ప్రముఖ రాజ్యముల ఆమోదము ఈ ఒడంబడికకు లభించినది. కావున మున్ముందు పరమాణుశక్తి యుద్ధమందు వినియోగమగుటకు బదులుగ, మానవ జీవితమును సుఖమయము చేయుటకు సాయపడగలదనియు, అపవాదములు లేకుండ ప్రపంచ రాజ్యములన్నియు ఈ కృషిలో పాల్గొన గలవనియు ఆశించుటకు కొంత ఆస్కారము లభించుచున్నది. పరమాణువు నుండి లభించుశక్తి మానవుని

దైనందినోపయోగమునకు కొనివచ్చుటకు యత్నములు జరుగుచున్నవి. 1952 లో యునైటెడ్‌స్టేట్స్‌లోని అర్కో వద్ద పరమాణుశక్తినుండి లభించిన విద్యుత్ సహాయమున దీపములను వెలిగించుటతో ఈ యత్నము ఆరంభింపబడినది. అట్టి విద్యుత్ ఉత్పత్తిని ఆర్థికరీత్యా గిట్టుబాటులోనికి తెచ్చుటకు విజ్ఞానులు ఇపుడు కృషిచేయుచున్నారు. ఆ కృషి విజయవంతమయినపుడు విద్యుత్ ఉత్పత్తి ఏ ప్రాంతముననైనను సులభ సాధ్యము కాగలదు. పారిశ్రామిక రంగములో నూతన సాధనములను ప్రవేశపెట్టి మానవుని శ్రమను అధమస్థాయికి తగ్గించి వస్తూత్పత్తియంతయు యంత్ర సహాయముననే (స్వతశ్చలనతో) జరుప సంపన్న దేశములు కృషిచేయుచున్నవి. విద్యుత్ పరిశ్రమయు ద్వితీయ ప్రపంచ యుద్ధము మొదలుగ అతి త్వరితగతిలో అభివృద్ధిని సాధించినది. ఇందలి ప్రగతి వలన రాడార్, టెలివిజన్, ట్రాన్సిస్టార్, ఎలక్ట్రానిక్ ఎనలోగ్, డిజిటాల్ కంప్యూటర్ (సంఖ్యాగణిత్రము) మొదలగునవి రూపొందినవి. సంఖ్యాగణిత్రము మానవ మేధకన్న చురుకుగ పనిచేసి క్లిష్టగణిత సమస్యలను అతి సూక్ష్మకాలమున పరిష్కరించగలుగుచున్నది. వస్తువును 10,00,000 రెట్లకు పెంచి చూపించగలుగు ఎలక్ట్రాన్ సూక్ష్మదర్శిని నిర్మాణము కూడ సాధ్యమైనది. కణత్వరకములు (పార్టికిల్ ఆక్సిలరేటర్స్) అను నూతన యంత్రములను ఈనాడు విద్యుత్ పరిశ్రమ రూపొందించినది. వీనివలన పరమాణు సంఘటకములైన ప్రోటాన్‌లకు కొన్ని శతకోటుల ఎలెక్ట్రాన్ వోల్టుల శక్తిని సమకూర్చి త్వరణము కల్గించుటకు తెరువేర్పడి, పరమాణు భౌతిక విజ్ఞానమున అవేక్షణ సులభ సాధ్యమైనది. ఇట్టి శక్తినే తగ్గుస్థాయిలో సమకూర్చు చిన్న యంత్రములు కూడ నిర్మితములగుచున్నవి. రోగ నిర్ణయమునను, చికిత్సా ప్రక్రియ యందును ఇవి ఉపయోగపడుచున్నవి. ప్లాస్టిక్‌లు, లోహకాంతకములు (ఫెర్రో మాగ్నెటిక్స్), స్వచ్ఛములగు జెర్మేనియమ్, సిలికాన్, యురేనియమ్, ప్లూటోనియమ్ మూలద్రవ్యములు ఈనాడు రూపొందింపబడుటకు అవకాశములు కలిగి, వీని సాయమున వివిధ రంగములందు మానవుడు అభివృద్ధిని సాధించుటకు మార్గము ఏర్పడినది. రాసాయనిక రంగమున ప్లాస్టిక్‌లే కాక, నైలాన్, టెరిలిన్‌వంటి కృత్రిమదారములు, సంయోజితపు విటమిన్‌లు, హార్మోన్‌లు, ప్రతిజీవకములు (ఆంటీబయాటిక్స్) మొదలగు వాని ఉత్పత్తికి నూతన అవేక్షణలవలన అవకాశము కలిగినది.

రాకెట్‌లు మొదలగు వానికై జరిపిన అవేక్షణవలన రోదసీయాన విజ్ఞాన పరిచితికి ఈ యుగమున అవకాశము లభించినది. ఇందు తొలి అడుగువేసిన ఖ్యాతి సోవియట్ రష్యాకు దక్కినది. 1957 లో ఆదేశము రోదసిలోనికి ఒక కృత్రిమ ఉపగ్రహ (స్పుత్నిక్ - I) మును పంపినది. వెనువెంటనే యునైటెడ్‌స్టేట్స్ కూడ అట్టి కృత్రిమ ఉపగ్రహమును ఒక దానిని పంపగలిగినది. అంతటి నుండి ఆ ఉభయదేశములును అహమహమికతో ఆ విజ్ఞానమున అభివృద్ధిని సాధించుటకు కృషిచేసినవి. ఆ కృషిఫలితముగ 1965 నాటికి దినముల కొలదిగ మానవులను రోదసిలో ఒక రోదసీ నౌకసాయమున చరింపజేసి, భూమికి క్షేమముగ కొనిరాగలుగు ప్రవీణతను అవి సాధించినవి. ఈ విజ్ఞాన ప్రగతివలన రోదసిని గురించియు, చంద్రగోళపు వెనుకభాగము మొదలగువానిని గురించియు సమధిక పరిజ్ఞానము ప్రపంచమునకు లభ్యమైనది. చంద్రగోళమునకు ఒక మనుజుని రోదసీ నౌక సాయమున పంపి, మరల కొనివచ్చుటకు యత్నము జరుగుచున్నది. ఈ రోదసీ విజ్ఞానమువలన మానవజాతికి మున్ముందు కలుగు లాభములను ఇపుడు అంచనావేయుట అసాధ్యము. అయినను ప్రస్తుతము టెలివిజన్ పరిధిని విస్తృతము చేయుటకును, దూరవిషయగ్రహణ (టెలికమ్యూనికేషన్స్) కును భూమి చుట్టును తిరుగు ఒక కృతిమ ఉపగ్రహమును ఉపయోగించుటకు మార్గమేర్పడుటతో మానవ దైనందిన జీవితమున ఈ విజ్ఞానము వినియుక్తరూపమున ఉపకరించుట ఆరంభమైనది.

## ధార్మిక భావన

ఈ నూతన అవేక్షణలు మానవుని ధార్మిక భావనపై ఎట్టి ప్రభావమును కలిగింప గలిగినవను విషయము స్పష్టముగ నిర్ణయింపబడుటకు ఇది అదను కానేరదు. ద్వితీయ ప్రపంచ యుద్ధమున మానవజాతి పొందిన సంక్షోభము మానవునియందు ధార్మికభావనా విప్లవమును కొంతవరకు రేకెత్తించిన మాట మాత్రము తథ్యము. బాహ్యాచారములతో పనిలేకుండ మతముల మూలసూత్రములకు ఆచరణ రూపమును కల్పించుటలోనే మానవజాతి శ్రేయము ముడివడియున్నదను భావము క్రమముగ బలమును ఆర్జించుచున్నది. ఆ సమయముననే మతమును, మానవుని ఆర్థిక, రాజకీయ జీవన విధానమును జోడించుటకును కొన్నియెడల కృషి జరుగుచున్నది. యూరప్‌నందలి క్రైస్తవ సోషలిస్ట్ పార్టీలు, అరబ్బుదేశములందలి ఇస్లామిక్ సోషలిస్ట్ ఉద్యమములును ఈ కృషిలో అంతర్భాగములే. మతమును ఇటుల రాజకీయ భావమునకు జోడించుట వలన మతమునకు విశ్వజనీనతను కల్గించుటయే వీని లక్ష్యము

కావున, సర్వ మానవ సౌభ్రాతృత్వభావనకు దోహద కారిగ ఈ కృషిని భావింపవచ్చును. కాని, కొన్ని పట్టుల మతమును రాజకీయములతో జోడించి దానికి సంకుచితార్థమును కల్గించుటకును యత్నములు జరిగినవి. మత ప్రాతిపదికపై పాకిస్తాన్, ఇస్రాయెల్ నిర్మాణములు ఇందులకు మచ్చుతునకలు. కాని, నేడు వేద్యమగు మానవ ధార్మిక భావనా ప్రగతికి వీనిని తాత్కాలికపు అపవాదములుగ మాత్రమే గ్రహింపదగి ఉన్నది. మొత్తము మీద అటు కమ్యూనిస్ట్ రాజ్యములలో కానిండు, ఇటు కమ్యూనిస్టేతర రాజ్యములలో కానిండు మానవుల శ్రేయోసాధనను గురించిన చర్చ మాత్రమే నేడు వినవచ్చుచున్నది. దీని సాధనకు సూచించు మార్గములలో కమ్యూనిస్ట్ రాజ్యములు మతప్రసక్తిని నిషేధించుటయు, ఈశ్వర భావననే తిరస్కరించుటయు జరుగుట యథార్థమే అయినను, మత భావనలను నిరసించని ప్రజాస్వామిక రాజ్యములందు వలెనే అచటను మానవుని వికాసమే ముఖ్య లక్ష్యముగ ఉన్నది. అందువలన ఈ ఉభయ ప్రాంతములందు జరుగు కృషియు కొన్ని ఒడుదొడుకుల తరువాత ధార్మిక భావనను మానవుని యందు ఉత్తేజము చేయుటకే తోడ్పడగలదని భావింపవచ్చును. సంస్థాగత బాహ్యాచారకాండల సడల్చి మతమును మానవ సమాజపు చేరువకు తెచ్చుటకు వివిధ మతములందు కృషి ఈనాడు మొదలైనది. వ్యవస్థాపటిష్ఠతకు పేరొందిన రోమన్ కేతలిక్ క్రైస్తవ సంప్రదాయమున సైతము జాన్ - XXIII పోప్ పదవిని అధిష్ఠించినది మొదలుగ విప్లవకరములగు మార్పులు పీఠాధిపతుల వలననే ప్రవేశపెట్టబడినవి. తక్కిన క్రైస్తవ సంప్రదాయములతోడనే కాక, తదితర మతములతోడను మైత్రీబద్ధ ప్రవర్తనను పెంపొందించుటకు కృషి ఆ సంప్రదాయమున జరుగుచున్నది. తక్కిన మతములందును జ్ఞాతాజ్ఞాత రూపముల ఈ కృషి సాగుచున్నది. ఇక ఈ యుగమున ధార్మిక భావనారంగమున విద్యావంతులందు కొంతవరకు తావు కల్పించుకొనిన అజ్ఞేయతా వాదమును నానాట ప్రాముఖ్యమును ఆర్జించగలుగుచున్నది. ఈశ్వరాస్తిత్వ, నాస్తిత్వములతో ప్రసక్తి వహింపక, జాతి వర్ణ మత వివక్షతలేని సుసంపన్న మానవ సమాజమును నిర్మించుటయే ధర్మముగ భావించుట ఈ వాదమున ముఖ్యాంశము.

## సంఘ వ్యవస్థ

మానవ సంఘ వ్యవస్థ రూపొందవలసిన తీరు తెన్నులను గురించిన చర్చలు ఈ యుగమున అనితర ప్రాముఖ్యమును కల్పించుకొనినవి. కమ్యూనిస్ట్ దేశములకును, తత్ వ్యతిరేక రాజ్యములకును మధ్య చెలరేగుచున్న ప్రచ్ఛన్న యుద్ధమున గర్భితమైనది మానవ సమాజ వ్యవస్థను గురించిన ఈ భావ వైరుధ్యమే.

ద్వితీయ ప్రపంచ యుద్ధము కొన్ని నగ్న సత్యములను స్పష్టము చేయగలిగినది. వానిలో ముఖ్యముగ పేర్కొనదగినది మానవ జాతుల సమానత. జపాన్‌వలన శ్వేత జాతి సైన్యములు పలుప్రాంతములందు ఓడింపబడుటయు, జాతి దురహంకారమునకును, స్వజాతీయోత్కృష్టతా గర్వమునకును పేరొందిన జర్మనీసేనలను ఆ దురహంకారమును నిరసించు సోవియట్‌రష్యా సేనలు నిర్మూలించుటయు ఈ విషయమును స్పష్టము చేసినవి. తత్ఫలితముగ జాతుల సమానతను గురించి శ్వేతజాతిలో భావ పరివర్తనకలుగుట తప్పని సరి అయినది. పూర్వపు నానాజాతి సమితి నిర్మాణ కాలమున మానవ జాతి సమానతా సూత్రమును అందు చేర్చుటకు జపాన్ చేసిన కృషిని శ్వేత జాతి రాజ్యములు ప్రతిఘటించినవి. కాని, పైన పేర్కొనబడిన భావ పరివర్తన మూలమున ఐక్యరాజ్యసమితి నిర్మాణకాలమున ఈ సూత్రము అంగీకరింపబడుటయే కాక, ఆ తరువాత దీనిని గురించిన ధ్రువీకృత ప్రకటనయు వెలువడినది. అయినను, ఈ జాతి సమానతా సూత్రమునకు కార్యాచరణ రూపము అన్ని ప్రాంతములందును సంఘటిల్లలేదు. ముఖ్యముగ దక్షిణ ఆఫ్రికాయందును, దక్షిణ రోడీషియాయందును శ్వేతజాతి దురహంకారము వెర్రితలలు వేసినది. ప్రజాస్వామ్యరాజ్యమగు యునైటెడ్ స్టేట్స్‌న నీగ్రోజాతి ఈనాటికిని కొన్ని రాష్ట్రములందు జాతి విచక్షణా ఫలితములగు ఇబ్బందులను ఎదుర్కొనుచున్నది. దీనిని మట్టుపెట్టుటకు శాసనము సన్నిహిత పూర్వకాలముననే ఆమోదింపబడినను, ఇంకను అట అవరోధములు మిగిలియే ఉన్నవి. ఇట్టి అపవాదములు కొన్ని అట నట ఉన్నను, మొత్తముమీద ప్రపంచమున జాతి సమానతా సూత్రమునకు గట్టిప్రాపు లభించినదనియు, అవరోధములన్నియు త్వరలోనే సమయగలవనియు భావించుటకు అవకాశము కలదు.

నేటి ప్రపంచమున దాదాపు మూడవవంతు ప్రజానీకము వసించు దేశములందు కమ్యూనిస్ట్‌ల పరిపాలనాయంత్రము నెలకొల్పబడి, సంఘ వ్యవస్థకు తదనుగుణముగ రూపము కల్పింపబడుచున్నది. అట్టి పరిపాలనా యంత్రాంగమున ప్రజాభిప్రాయమును వెలువరించు కమిటీల మూలమున పరిపాలన నిర్వహింపబడునని సిద్ధాంత రీత్యా చెప్పబడుచున్నది; లేదా ఇదియే ఇంకొక విధముగ

చర్చాను నయముల (కన్‌సల్టేషన్ అండ్ పర్సుయేషన్) ను ప్రాతిపదికలుగ కలిగిన శ్రామికజన నియంతృత్వమనియు నిర్వచింపబడుచున్నది. కాని, యథార్థమున అట అధికారమును నిర్వహించునది కమ్యూనిస్ట్‌పార్టీ. పరిపాలనలో అన్ని స్థాయిలయందును దీని ప్రభావము కన్పట్టును. పార్టీ అధినేతృసంఘము (పోలిట్ బ్యూరో) సాగించు విధానములకు ఏకగ్రీవామోదమును తదితరులనుండి రాబట్టుటకై ఉపయోగించు సాధనములందు మాత్రమే చర్చాను నయములు అందు ఉపయోగపడుచున్నవి. కమ్యూనిస్ట్ పక్షము తప్ప తక్కిన రాజకీయ పక్షములు ఏవియు అట ఫలవంతముగ పనిచేయుటకు అవకాశము లేకపోవుటవలన ప్రచార సాధనములు అన్నియు భావవైవిధ్యమును అరికట్టి అనుకరణానుసరణలకు మాత్రమే పనికివచ్చు మానసిక పరిస్థితిని ప్రజలందు కల్పించుటకు తోడ్పడుచున్నవి. ఇట్టి వానివలన ప్రజలలో భావ స్వాతంత్ర్యము కుంటువడి, మానవ వికాసమునకు భంగమేర్పడునని తద్విమర్శకుల అభిప్రాయము. కాని, అట్టి మానసిక పరిస్థితి ఆ దేశమునందు ఆర్థిక రంగమున కృషి ఏకోన్ముఖముగ జరుగుటకు ఉపకరించినది. సోవియట్ రష్యా మూడు దశాబ్దములలో సాగించిన అత్యద్భుత పారిశ్రామిక ప్రగతిని అందులకు నిదర్శనముగ పేర్కొనవచ్చును. కాని, ఆ దేశములందు వ్యక్తిగత ఆస్తిస్వత్వములు దాదాపుగ నిషేధింపబడినవి.

ఇట్టి కమ్యూనిస్ట్ వ్యవస్థను యునైటెడ్ స్టేట్స్, గ్రేట్ బ్రిటన్ మొదలగు పశ్చిమ ప్రజాస్వామిక రాజ్యములు మానవ సమాజ శ్రేయో విరోధిగ భావించుచున్నవి. మానవుడు ఇట్టి వ్యవస్థ వలన క్రమముగ 'ఆరంభ శూన్యు' డగుననియు, కార్యాచరణోత్సాహము సన్నగిలుననియు, ఒకవేళ మానవుడు పనిచేసినను యంత్రమున ఉపాంగము వలె అతడు వ్యవహరించునే గాని సంపూర్ణ మానవుడుగ వికసనము పొందలేడనియు ప్రజాస్వామికవాదుల భావన. ఆ భావనకు అనుగుణముగ పాశ్చాత్య ప్రజాస్వామికములందలి సంఘ వ్యవస్థలు క్రమగతిలో రూపొందినవి. ఇందు వ్యక్తిగత ఆస్తి స్వత్వములు నిరవధికములగుటవలన, సామాన్య ప్రజల స్వాతంత్ర్యము అనునది ధనికుల ఇష్టానిష్టములపై ఆధారపడి ఉండునని కమ్యూనిస్ట్‌లు విమర్శింతురు. ఇందు కొంత సత్యము కలదనుట నిర్వివాదాంశము. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున ఈ పశ్చిమ ప్రజాస్వామిక రాజ్యములందు ఈ విమర్శను ఎదుర్కొనుటకు కృషి గాఢతరమైనది. పశ్చిమ యూరప్‌న ఫ్రాన్స్, ఇటలీ, పశ్చిమ జర్మనీ దేశములందును, తదితరములగు చిన్న దేశములందును యుద్ధానంతర పునర్నిర్మాణమువలన ఈ పని సులభ సాధ్యమయ్యెను. పరిశ్రమలను నిర్వహించు కార్పొరేషన్‌లలో వ్యక్తులతో పాటుగ ప్రభుత్వమునకును భాగస్వామ్యము కల్పింపబడినది. వీనిలో ఫ్రాన్స్ ఇంకొక అడుగు ముందునకువైచి శక్తి ఉత్పాదనకు అవసరములగు పరిశ్రమలను అన్నింటిని జాతీయకరణము [చూ. సం. 5 - పు. 486] చేసినది. ఉక్కు పరిశ్రమను మాత్రము ధనస్వాముల అధీనమున ఉంచినది. ఇటుల కొన్ని ఉత్పత్తి రంగములందు వ్యక్తిగత స్వామ్యము నిలబెట్టబడినను, ఆ వ్యక్తులకు తమ పరిశ్రమలందు ఉండిన అధికారములు కుంచింపబడినవి. ఫ్రాన్స్‌లో జాన్‌మానే అను ఆర్థిక శాస్త్రవేత్త మార్గదర్శిత్వముతో ఈ ప్రభుత్వపు జోక్యము స్థిర రూపమును పొందినది. జాతీయ ఆర్థిక జీవన పునర్నిర్మాణమునకు ప్రభుత్వపు ప్రణాళికలను ఉపయోగించి, ప్రభుత్వ మార్గదర్శిత్వమున అవి నడచునటుల చేయుట జాన్‌మానే తన ఆశయముగ ఇడుకొనెను. గ్రేట్ బ్రిటన్‌న యుద్ధానంతరమున అధికారమును గ్రహించిన కార్మికపక్ష ప్రభుత్వము ఉక్కుపరిశ్రమ మొదలగు వానిని జాతీయకరణము చేయుటయేకాక ఆరోగ్య వసతులును, రోగ నివారణ మొదలగువానియందు సర్వజనులకు సమానముగ సౌకర్యములు చేకూరు వసతి కల్పించినది. కార్మిక పక్షమును ఓడించి, అధికారమును గ్రహించిన కన్సర్వేటివ్ పార్టీ ప్రభుత్వము పూర్వపు లేబర్‌పార్టీ ప్రభుత్వము చేసిన సంస్కరణలను కొన్నిటిని రద్దుచేసినను, మొత్తము మీద జాతీయ పునర్నిర్మాణమున ప్రభుత్వము భాగస్వామ్యము వహించవలయునను మూల సూత్రమునకు భంగమును కలిగించుటకు సాహసించలేదు.

ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున యునైటెడ్ స్టేట్స్‌లో ప్రభుత్వముచే నెలకొల్పబడిన ఫ్యాక్టరీలు యుద్ధానంతరమున కొన్ని వైయక్తిక సంస్థ (కంపెనీ) లకు అమ్మివేయబడినను, జలవిద్యుత్ నిర్మాణములు మొదలగు వానిని ప్రభుత్వము తన వశమున ఉంచుకొనుటయే కాక, వ్యవసాయోత్పత్తుల ధరలను నిలుకడగ ఉంచుట, ఫ్యాక్టరీ కార్మికుల శ్రేయమునకు భంగము కలుగకుండుటకై తగు శాసనములను నిర్మించుట, సాంఘిక భద్రతా శాసనమును అమలుపరచుట ద్వారా వృద్ధాప్యపు భృతులను నాలుగు కోట్ల ప్రజలకు కల్పించుట, ఆర్థిక అసమానత్వము పెరగకుండ పరిశ్రమలపై హెచ్చు పన్నులను విధించుట మొదలగు వాని ద్వారా సాంఘిక జీవనమును శ్రేయోమయముచేయుటకై కృషిచేసినది. ఈ కృషి వలన వ్యక్తిగతాదాయములపైనను, ఆస్తులపైనను ప్రభుత్వము ఎక్కువగ జోక్యము వహించుట తప్పలేదు.

కమ్యూనిస్టు రాజ్యములును, పశ్చిమ ప్రజా రాజ్యములును గాక మిగిలిన ప్రపంచము యుద్ధానంతరమున ప్రాముఖ్యమునకు వచ్చినది. ఇందలివి అన్నియు వెనుకబడిన దేశములు; ఇందు పెక్కు నూతనముగ స్వాతంత్ర్యమును ఆర్జించినవి. త్వరగ పయనించి సంపన్న రాజ్యముల స్థాయిని అందుకొనవలయునని వీని ఆకాంక్ష. ఇందులకు ప్రజా స్వామ్యమునే మార్గముగ గ్రహించి కృషిచేయుటకు ఇవి తొలుత కృషిచేసినవి. కాని రాజకీయ దక్షత లేకపోవుటవలనను, స్థానిక పరిస్థితులు సహకరింపక పోవుటవలనను వీనిలో కొన్నింటియందు క్రమముగ నియంతృత్వములు వేర్వేరు రూపములతో తలయెత్తినవి. పాకిస్తాన్, ఇండోనీషియా, ఆఫ్రికాలోని కొన్ని దేశములును ఇందులకు ఉదాహరణములు. వీనియందలి పాలన నియంత్రిత ప్రజాస్వామ్యము లేదా ప్రాతిపదిక ప్రజాస్వామ్యము అను ఇట్టి పేరులతో వ్యవహరింపబడుచున్నను, యథార్థమున అచట సాగుచున్నది నియంతృత్వము. తక్కిన వెనుకబడిన దేశములలో ప్రజా స్వామ్యమునకు స్థావరముగ నిలబడగలిగినది భారతదేశము మాత్రమే. ఉత్తమ ప్రజాస్వామిక సంప్రదాయములతో భారతదేశపు రాజ్యాంగము రూపొందింపబడినది. అటు కమ్యూనిస్టు దేశములందు ఆదరణ పొందు ఆర్థిక సమానతకు ఇటు ప్రజాస్వామిక దేశములందు ఎక్కువ మన్నింపబడు రాజకీయ సమానత్వమును జోడించి భారతదేశమును సోషలిస్టు ప్రజాస్వామికముగ రూపొందించుటకు కృషి త్వరితగతిలో సాగుచున్నది.

సంపదయు, శాంతియు ప్రపంచమున ఏ ఒక ప్రాంతమున కొరవడినను దాని ఫలితము ప్రపంచమంతయు అనుభవింపవలసి వచ్చుననుట ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున సుస్పష్టమైనది. అందువలన యుద్ధానంతరమున వెనుకబడిన దేశములకు ఆర్థికముగను, ఆహారరూపముననను, ఋణముల వలనను, పరిశ్రమల నెలకొల్పుటలో తోడుపడియును సాయపడుటకై సంపన్న దేశములు కృషిచేయుచున్నవి. ఇందు ఎక్కువ సహాయము యునైటెడ్ స్టేట్స్ వలన లబ్ధమైనది. తదితర సహాయ కార్యక్రమములలో ప్రముఖముగ పేర్కొన తగినది కొలంబో ప్రణాళిక; బ్రిటన్‌తో సన్నిహిత సంబంధముగల వెనుకబడిన ఆసియా రాజ్యములలో పారిశ్రామికాభ్యుదయమునకు ఇది తోడుపడినది. యునైటెడ్ స్టేట్స్‌వలె భారీయెత్తున కాకపోయినను, సముచిత స్థాయిలో సోవియట్ రష్యాయును ఇండియా, ఈజిప్టువంటి వర్ధమాన దేశముల వ్యవసాయ, పారిశ్రామికాభ్యున్నతికి సాహాయ్యము చేసినది. వెనుకబడిన దేశములలో తటస్థ దేశములేకాక తదితరములును ఇటుల సోవియట్ రష్యా, యునైటెడ్ స్టేట్స్ దేశములు రెండింటి వలన సాయమును గ్రహింప గలిగినవి. ఇట్టి సాయము కొన్ని పట్టుల ఆ యా రాజ్యకూటముల రాజకీయపు ఎత్తులతో ముడివడి ఉండినదను విమర్శకు కొంత తావున్నను వెనుకబడిన దేశములు పురోగమించుటకు ఈ సహాయము వలన మార్గము సుగమమగుట మాత్రము యథార్థము.

మానవుడు ఈ నాడు విజ్ఞానశాస్త్ర మార్గమున అత్యంత దూరము పయనించి వస్తూత్పత్తి కుశలతయందు కని విని ఎరుగని ప్రావీణ్యమును సంపాదించియున్నాడు. ఈ ప్రావీణ్యము లోకవినాశక మార్గములందు దుర్వినియోగము కాక, శాంతి మార్గములందు లోక కళ్యాణబుద్ధితో వినియుక్తమగు నెడల అనతికాలమున వెనుకబడిన దేశములును సంపన్న దేశముల స్థాయికి రాగలుగుట సులభసాధ్యమే కాగలదు. కాని, ఈ నాడు ప్రపంచమును యుద్ధభయము ఆవేశించినది. యుద్ధమువలననే ప్రపంచ సమస్యల పరిష్కారము సాధ్యమని విశ్వసించు కొన్ని రాజ్యములును కలవు. అట్టి యుద్ధము ఎట బయలుదేరినను అది క్రమముగ పరమాణ్వస్త్రములతో జరుగు ప్రపంచ యుద్ధముగ పరిణమించి ప్రపంచమును సర్వనాశనము చేయగలదు. అట్టిది జరుగకుండ నివారించు బాధ్యత ఈ నాడు ప్రపంచ భవితవ్యమును తమ చేతులయందుంచుకొనిన బలవత్తర రాజ్యములపై కలదు.

మానవజాతి భవితవ్యము : దాదాపు 5000 ఏండ్లక్రిందట ప్రాచీన నాగరకతా కేంద్రములగు నాలుగు నదీ పరివాహ ప్రదేశములందు మొదలైన మానవ చారిత్రక ప్రగతి పలు ఒడుదొడుకులను, అవరోధములను అతిక్రమించి ప్రపంచపు నలుమూలల నున్న వివిధ జాతుల మానవుల మధ్య గల దూరభావమును సమయించి, నేడు రెండు మార్గముల కూడలిని ఒక దానిని చేరుకొనినది. అందు మొదటి మార్గము భయావహము; రెండవది శ్రేయోదాయకము. జాతి దురహంకారమును, రాజకీయార్థికాశయ దురభినివేశమును మానవ జాతిని సమ్మోహితముచేసి, దానిని భయావహమార్గమున ప్రవేశపెట్టినచో పరమాణ్వస్త్రములతో జరుగు మహాయుద్ధము వలన ప్రజ నశించుటయే కాక, భూగోళమే జీవావాసమునకు అయోగ్యముగ పరిణమింపగలదు. అటులగాక సహనమును, ఇతరులభిప్రాయములను అర్థము చేసికొనవలయునను ఆకాంక్షయు, లోక కళ్యాణబుద్ధియు మానవ జాతికి తోడుపడి దానిని శ్రేయోదాయక మార్గముననే నడపించినచో దాస్యమునకును, దారిద్ర్యమునకును, అవిద్యకును, అస్వస్థతకును తావులేని నూతన మానవ ప్రపంచము తప్పక రూపొందగలదు. చీ. శే. రా.

# రాజనీతి సమీక్ష

## రాజనీతి అనగా ఏమి?

రాజ్యపరిపాలనము గురించిన శాస్త్రమునకు 'రాజనీతి' అని పేరు. ఇందు రాజ్యము, రాజ్యమునకు ఉండవలసిన లక్షణములు (అంగములు), రాజ్యాధికారము, పౌరుల సమత్వ స్వాతంత్ర్యములకు రాజ్యాధికారముతో గల సంబంధము, రాజ్యపరిపాలనా విధానము, రాజ్యము యొక్క కర్తవ్యములు, ప్రపంచములోని రాజ్యముల పరస్పర సంబంధములు మొదలైన విషయములను గురించిన విమర్శనా సహితమైన వివరణము ఉండును.

ఏదో ఒక ప్రత్యేక భూ భాగమునకు పరిమితమై, అందు స్థిరముగ నివసించు ప్రజలను దండనాధికార సాధనమున పాలించుటకు ఏర్పడిన ప్రభుత్వ సహితమైన సర్వస్వామ్యము గల సంఘమునకు 'రాజ్య' మని పేరు. ఈ నిర్వచనము ప్రకారము రాజ్యమునకు ప్రత్యేక భూ భాగము, అందులో స్థిరముగా నివాసము చేయు ప్రజలు, వారిని పాలించుటకు దండనాధికారము గల ప్రభుత్వము, ఆ ప్రజా సంఘము సంపూర్ణ స్వామ్యము కలిగియుండుట అను నాలుగు లక్షణములు ఉండవలెను. వీటిలో ఏది లోపించినను 'రాజ్యము' అను పేరు సార్థకము కాజాలదు.

బహు ప్రాచీన కాలములో మానవులు ఒక భూ భాగములో స్థిరముగా నివసించక సంచారులుగా ఉండెడివారు. అప్పట్లో కూడ వారు గుంపులుగా ఏర్పడి, సంఘజీవులుగా ఉండినందున ఒక్కొక్క గుంపుపై అధికారాన్ని చలాయించేవారు కొందరు ఉండుట జరుగుతూ వచ్చినది. ప్రతి గుంపూ సర్వస్వామ్యము, సర్వస్వాతంత్ర్యము కలదిగా కూడ ఉండెడిది. కాని, వారిదే అని చెప్పుకొనతగిన ప్రత్యేక భూ భాగము ఏదీ లేని కారణమున ఆ దశలోని మానవ సంఘములను రాజ్యములుగా పరిగణించుటకు వీలులేదు. క్రమక్రమముగా వేటయుగము, పశుపాలనా యుగము అంతరించి వ్యవసాయయుగము ప్రవేశము కాగా, వారు ఏదో ఒక భూభాగములో స్థిరముగా నివాసము కావడము, దానిని వారు తమ మాతృభూమిగా భావించడము జరిగినది. అది మొదలు రాజ్యములు ఏర్పడినవి. నిర్ణీతమైన సరిహద్దులతో కూడిన భూ భాగము రాజ్యమునకు అవసరమని ఇది స్పష్టము చేయుచుండును.

రాజ్యమునకు భూభాగము ఎంత అవసరమో ప్రజలు కూడ అంత అవసరము. ప్రజలు లేని శూన్యప్రదేశము రాజ్యము అనే పేరునకు తగినది కాదు. అట్టి ప్రదేశములో కథలలో వర్ణించబడే రాబిన్‌సన్ క్రూసో వంటివాడు ఏకాకిగా, ఎవరికిని లోబడక సర్వస్వామ్యముగల ప్రభువుగా ఉండవచ్చు. కాని, అతని పరిపాలనకు లోబడిన ప్రజలు ఎవరు లేనందున అతని పాలనలో ఉండిన ప్రదేశము రాజ్యము కాజాలదు. ప్రజలు ఉన్నప్పుడే పాలన అవసరము. ప్రభుత్వము-ప్రజలు అనే విభేదము ఉంటేనే గాని రాజ్యము అను మాటకు అర్థము లభించదు.

రాజ్యము అను మాట చెల్లుటకు ప్రత్యేక భూ భాగము, అందులో స్థిరముగా నివాసముచేయు ప్రజలు - ఈ రెండు మాత్రము - చాలవు. ప్రజలపై అధికారము చలాయించుచు, సామాజిక నియమములను ధిక్కరించే వారిని దండించగల ప్రభుత్వము ఒకటి ఉండుట అవసరము. రాజ్యమునకు దండనాధికారము మూలము అని ప్రాచీన కాలము నుండి ఇప్పటివరకు అందరును అంగీకరించుచున్నారు. ప్రభుత్వము లేని అరాజకస్థితిలో మానవ సంఘము నిలబడజాలదు. దానిని తొలగించే శక్తిగల ప్రభుత్వము ఏర్పడినప్పుడే సంఘము రాజ్యముగా రూపొందుతున్నది.

కాని, ఒక మానవ సంఘము స్థిరముగా ఒక ప్రత్యేక భూ భాగములో నివాసము చేయుచు ఉండవచ్చును; దానిని పాలించుటకు ఒక ప్రభుత్వము కూడ ఉండవచ్చును. అంత మాత్రము చేత ఆ సంఘము రాజ్యము అన్న మాటకు తగి ఉండదు. అది సర్వస్వామ్యముకలదిగా ఉన్నప్పుడే రాజ్యము అగును. సర్వస్వామ్యము అనగా సంఘము ఏర్పరచుకొన్న ప్రభుత్వము సంఘమునకు చెందిన భూ భాగము అంతటిపైన అధికారము కలిగి ఉండడము అనిన్నీ, ఆ భూ భాగమునకు బాహ్యముగా ఉండే ఇంకొక ప్రభుత్వమునకు లోబడకుండా ఉండడమనిన్నీ అర్థము. అన్ని ప్రభుత్వములు ఈలాటివి కావు. 1947 కు పూర్వము భారతదేశములో ఒక ప్రభుత్వము ఉండెడిది; కాని, అది సర్వస్వామ్యము కలది కాక, దాదాపు 9,600 కి. మీ. దూరములో ఉన్న ఇంగ్లండులోని ప్రభుత్వమునకు లోబడినదిగా ఉండెడిది. అందుచేత భారతదేశమునకు రాజ్యము

అను పేరు 1947 వరకు చెల్లలేదు. 1947 లో ఇంగ్లీషు వారి పరిపాలన అంతరించినప్పుడు ఏర్పడ్డ జాతీయ ప్రభుత్వము సంపూర్ణ స్వామ్యము కలదిగా రూపొందినది. బాహ్యముగా ఉండే ప్రభుత్వములలో దేనికీ ఇది లోబడి ఉండవలసిన పనిలేదు. అందుచేత భారతదేశము గణరాజ్యము (రిపబ్లిక్) గా రూపొంది 1950 నుండి ఒక స్వతంత్ర రాజ్యము అయినది.

ఈ వివరణము వలన ప్రతి రాజ్యమునకు ఒక ప్రత్యేక భూభాగము, అందులో స్థిరముగా నివాసము చేయు ప్రజలు, ఆ ప్రజలను పాలించు ప్రభుత్వము, ఆ ప్రభుత్వము సంపూర్ణాధికారము - సర్వస్వామ్యము - కలదిగా ఉండడము అను లక్షణములు నాలుగు ఉండవలెనని స్పష్టము అగుచున్నది.

ప్రస్తుతము (1965) ప్రపంచములోని రాజ్యముల సంఖ్య సుమారు 120. ప్రతి రాజ్యమునకు పైన పేర్కొనబడిన లక్షణములు నాలుగు ఉన్నను, వాటి ఏలుబడిలో ఉండు భూభాగములోను, ప్రజా బాహుళ్యములోని వాటిలోని ప్రభుత్వ విధానములలోను చాల భేదము కనుపించుచునే ఉన్నది. రాజనీతిలో ఎక్కువ భాగము ప్రభుత్వ విధానముల వివరణమునకు సంబంధించినది. ఆ వివరణమును చేయుటకు పూర్వము భూభాగము ప్రజాబాహుళ్య రాజ్యముల బలాబలములను, ప్రభుత్వ విధానములను ఏ విధముగా నిర్ణయించుచున్నవో తెలిసికొనుట అవసరము.

రాజ్యముల బలాబలములకు వాటి విస్తీర్ణము కొంత వరకు మాత్రమే కారణమగుచున్నది. స్వల్ప విస్తీర్ణము గల రాజ్యముల రక్షణ సులభసాధ్యము కాదు. అధిక విస్తీర్ణము గల వాటినుండి దానికి ఎప్పుడూ ప్రమాదమే. అట్టి రాజ్యములు సమీపమందు ఉన్నప్పుడు ప్రమాదము మరింత ఎక్కువ. కాని, అధిక విస్తీర్ణము గల రాజ్యములు అన్నియు బలవత్తరములని చెప్పుటకు వీలులేదు. విస్తీర్ణము కంటె భూభాగము యొక్క ఇతర ప్రకృతులు ఈ సందర్భమున ఎక్కువ ప్రాధాన్యము వహించుచున్నవి. భూసారము, ఖనిజ సంపద, అటవీ సంపద, గొప్ప నదులు, నౌకాశ్రయములతో కూడిన సముద్ర తీరము, సమశీతోష్ణము మొదలగు సహజ సంపదలు గల రాజ్యము విస్తీర్ణమందు చిన్నదైనను ఇట్టి సంపదలు లేని విస్తీర్ణాధిక్యము గల రాజ్యమునకంటె బలవత్తరమగుటకు ఇదియే ప్రధాన కారణము. దీనికి తోడు ప్రకృతి సిద్ధములగు పర్వతములు, సముద్రములు, నదులు మొదలైనవి సరిహద్దులుగా గల రాజ్యము చిన్నదైనను శత్రువులకు అభేద్యమగును. విస్తీర్ణాధిక్యముతో పాటు సహజ సంపదలు గల రాజ్యములు ప్రపంచమందు అగ్రస్థానము వహించగలిగి ఉన్నవి. ప్రస్తుతము యునైటెడ్ స్టేట్స్, సోవియట్ రష్యా రాజ్యములు ఇట్టివి. ఇట్టి లక్షణములు కలిగిన ఇండియా, చీనా, బ్రెజిల్ మొదలైన మరికొన్ని రాజ్యములు భావికాలమున ఇప్పటికంటె ఎక్కువ ప్రాధాన్యమును వహింపగలవని అనుకొనుటకు కూడ ఇదియే కారణము.

రాజ్యము యొక్క విస్తీర్ణము దాని బలాబలముల పైననే గాక, అందులోని ప్రభుత్వ విధానముపైన కూడ కొంత ప్రభావము కలదిగ ఉన్నది. ప్రాచీనకాలపు నగర రాజ్యము [చూ.] ల వలె రాజ్యములు చిన్నవిగ ఉన్నచో ప్రజలందరు ఒకచోట సమావేశమై ప్రత్యక్ష ప్రజాపాలనము సాగించుట సాధ్యము. కాని, అధిక విస్తీర్ణము గల రాజ్యములలో ఇది సాధ్యము కాదు. అందుచేతనే ఈ కాలపు రాజ్యములలో ప్రజాస్వామ్యము ప్రజలు ఎన్నుకొన్న ప్రతినిధులద్వారా జరగవలసి ఉన్నది. ఇదిగాక అత్యధిక విస్తీర్ణము గల రాజ్యముల పరిపాలనమంతయు ఒకే కేంద్రమునుండి జరిపించుట సులభము కాదు. అట్టి రాజ్యములను అనేక రాష్ట్రములుగ విభాగము చేసి, రాష్ట్ర ప్రభుత్వమునకు అనేక అధికారములను ఇచ్చుట అవసరము అగుచున్నది. ప్రస్తుత కాలమున అధిక విస్తీర్ణము గల ఆస్ట్రేలియా, ఇండియా, కెనడా, యునైటెడ్ స్టేట్స్ మొదలగు రాజ్యములలో వికేంద్రీకరణము ప్రధాన లక్షణముగా గల సమాఖ్య (ఫెడరల్) పరిపాలనా విధానము ఏర్పడి ఉండుటకు ఇదియే కారణము. స్వల్ప విస్తీర్ణము గల రాజ్యములలో వికేంద్రీకరణమునకు ఇంతటి అవసరము లేదు. ఈ విధముగ రాజ్యము యొక్క భౌగోళిక లక్షణములు చాలవరకు దాని బలాబలములను, ప్రభుత్వ విధానమును నిర్ణయించుచున్నవి.

ఇదే విధముగ రాజ్యములోని జనసంఖ్యయు, జనులలోని లక్షణములును దాని యొక్క బలాబలముల పైనను కొంత ప్రభావము కలవిగ ఉన్నవి.

ఎక్కువ జనసంఖ్యయు, జనసాంద్రతయు గల ఇండియా, చీనా, సోవియట్ రష్యా, యునైటెడ్ స్టేట్స్ మొదలగు రాజ్యములు కావలసినంత సైనిక బలమును చేకూర్చుకొనగలవిగ ఉన్నవి. ఇట్టి రాజ్యములలో వ్యవసాయము, పరిశ్రమలు మొదలైన వాటిలో పనిచేయుటకు కావలసిన కార్మికులను సులభముగ సమకూర్చవచ్చును. వీటికి గల అంగబలము అత్యధికము. కాని, అన్ని పరిస్థితులలో జనసంఖ్య ఎక్కువగ ఉండుట లాభకరము కాజాలదు. జనసంఖ్యకు కావలసిన ఆహారాది పదార్థములను సమృద్ధిగ సంపాదించుటకు సంపూర్ణావకాశము ఉన్నప్పుడే అట్టి సంఖ్య

లాభకారి అగుచున్నది. అట్లు కానప్పుడు జనసంఖ్య పెరుగుదలతోపాటు ఆహారాది పదార్థముల ఉత్పత్తి పెరుగక పోవుటయు, ప్రజలు దారిద్ర్యమును అనుభవించుటయు, దాని మూలమున ప్రభుత్వముపై తిరుగుబాట్లు జరుగుటయు సంభవించవచ్చును. ఆర్థికముగను, తదితర విధములుగను రాజ్యము వృద్ధిగాంచుటకు ఎంతటి జనసంఖ్య అవసరమో అంతటి జనసంఖ్య మాత్రము రాజ్యమందుండుట మంచిది. అంతకంటె తక్కువ జనసంఖ్య గాని, ఎక్కువ జనసంఖ్య గాని ఉండరాదు.

ఈ సందర్భములో సంఖ్యాబలము కంటె జనులయొక్క శక్తిసామర్థ్యములు, తెలివితేటలు మొదలగు సుగుణ సంపత్తి ఎక్కువ ప్రాధాన్యమును వహించుచున్నవి. ప్రజలు ఆరోగ్యవంతులుగ ఉండుట, వారి కార్యదీక్ష, పనిపాటలయందు వారికి గల నిపుణత, వారి యోగ్యత, వారి దేశభక్తి, వారి విద్య, వారిలోని సంఘీభావము మొదలగు వాటిని బట్టి రాజ్యము యొక్క బలము నిర్ణయించబడుచున్నది. ఇంగ్లండు, ఫ్రాన్సు మొదలగు పాశ్చాత్య దేశములవారు స్వల్ప సంఖ్యాకులైనను అధిక సంఖ్యాబలము గల ఆసియా ఖండములోని రాజ్యములను జయించి, విశాల సామ్రాజ్యములను స్థాపించి ఇటీవలి వరకు పరిపాలించుటకు వారిలోని ఇట్టి సుగుణ సంపత్తే ప్రధాన కారణము.

ప్రజలలో ఉండవలసిన సుగుణములన్నింటియందు ప్రస్తుత కాలమున వారిలో జాతీయతాభావము అగ్రస్థానము వహించి ఉన్నది. వివిధ జాతులతో కూడిన సామ్రాజ్యములలో ఇట్టి భావము ఏర్పడుట కష్టసాధ్యమగుటచేత సామ్రాజ్యములు అనేకములు ఇటీవలి కాలమున విచ్ఛిన్నములై వాటిస్థానమున అనేక జాతీయ స్వతంత్ర రాజ్యములు స్థాపింపబడుట జరిగెను. ప్రజల ఇష్టానిష్టములతో నిమిత్తము లేక, సైనికబలము ఒక్కదానినే ఆధారము చేసికొని వారిని పాలించుట నేడు సాధ్యముకాని పని. అనేక దేశములలో యుగయుగములుగ సామాన్య ప్రజలలో రాజకీయ చైతన్యము లేకుండెను. రాముడు పరిపాలించినను, రావణుడు పరిపాలించినను తమ పరిస్థితిలో విస్తారభేదము ఏలాటిదియు ఉండదను భావముతో వారు ఉండిరి. కాని, ప్రస్తుత కాలమున దేశములన్నిటిలో సామాన్య ప్రజలు కూడ రాజకీయచైతన్యము కలవారైరి. ఇందుచేత రాజ్యముల బలాబలములను నిర్ణయించుటలో వారి మనోభావములకు ఎక్కువ ప్రాధాన్యము లభించుచున్నది.

ప్రజలలోని జాతీయభావ ప్రాధాన్యమును గుర్తించు సందర్భమున దానితో సన్నిహిత సంబంధము గల మరియొక విషయమును కూడ గమనించుట అవసరము. మానవ చరిత్ర ప్రారంభమైన కాలమునుండి ఒక రాజ్యము ఇంకొక రాజ్యమును, ఒక దేశము ఇంకొక దేశమును, ఒక జాతి ఇంకొక జాతిని జయించి గొప్ప సామ్రాజ్యములను స్థాపించుకొనుటలో అధర్మము గాని, అన్యాయము గాని ఏలాటిదియు లేదనే భావము ఇటీవలవరకు వ్యాపించి ఉండెను. దిగ్విజయములు కావించి, సామ్రాజ్యములను స్థాపించి తమ సామ్రాజ్యాధికారమును సాగించుటకు అశ్వమేధాది యాగములను చేయుట క్షత్రియులకు సత్సాంప్రదాయమను భావము భారతదేశములో వ్యాప్తిగాంచి ఉండెను. మౌర్య సామ్రాజ్యము, ఆంధ్ర సాతవాహన సామ్రాజ్యము, గుప్త సామ్రాజ్యము వంటి ప్రాచీన సామ్రాజ్యములన్నియు ఈ భావముయొక్క ఫలితములే. ఇదే విధముగ ప్రపంచములో ఇతర ప్రాంతములవారు కూడ ప్రవర్తించిరి. అలెగ్జాండర్ స్థాపించిన గ్రీక్ సామ్రాజ్యము, తర్వాత స్థాపింపబడిన రోమన్ సామ్రాజ్యము, ఆసియాలోని పారసీకాది సామ్రాజ్యములు, కలీఫాలయొక్కయు, మంగోల్ల యొక్కయు, ఓటోమన్ల యొక్కయు సామ్రాజ్యములు, చీనా సామ్రాజ్యము, భరతఖండములో మహమ్మదీయులు స్థాపించిన సామ్రాజ్యములు, ఆధునిక యుగమున ఇంగ్లీషువారు, డచ్చివారు, ఫ్రెంచివారు, తదితర పాశ్చాత్యులు ప్రపంచ వ్యాప్తముగ స్థాపించిన సామ్రాజ్యములు, జపాన్‌వారి సామ్రాజ్యము, రష్యా సామ్రాజ్యము [చూ. సామ్రాజ్యయుగము - పు. 127] ఇవి అన్నియు ఇట్టివే. ప్రపంచ చరిత్రలో చాల భాగము సామ్రాజ్యచరిత్ర అనుటలో అతిశయోక్తి ఏలాటిది లేదు. విస్తీర్ణ దృష్ట్యా రాజ్యముల కొక హద్దు ఉండవలసినది లేదనే అభిప్రాయము పరిపాలకులందరిలో గాఢముగ ఉండెను. అలెగ్జాండర్, నెపోలియన్, చెంఘిజ్‌ఖాన్, హిట్లర్ మొదలైన వారియొక్క ఆశయము ప్రపంచమునంతను జయించి తమ అధీనములోనికి తెచ్చుకొనుటయే. ఇప్పటికి కూడ ఈలాటి ఆశయము కలవారు ప్రపంచములో లేకపోలేదు.

కాని, గత రెండు వందల సంవత్సరముల నుండి సామ్రాజ్యముల విషయమై ఒక విధమైన విరోధభావము ప్రపంచమందు వ్యాపించ సాగెను. ఒక దేశము ఇంకొక దేశమును, ఒకజాతి ఇంకొక జాతిని జయించుట ధర్మవిరుద్ధమను వాదము బయలుదేరెను. దీనికి 'జాతీయతావాద' మని పేరు. ఒక్కొకజాతికి ఒక ప్రత్యేక సంస్కృతి కలదనియు, దానిని సంరక్షించుటయు, వృద్ధిచేయుటయు ఆ జాతియొక్క హక్కు అనియు ఒక జాతి ఇంకొక

జాతిని జయించి సామ్రాజ్యాధికారమును స్థాపించినప్పుడు జయింపబడ్డ జాతియొక్క సంస్కృతికి వినాశము కలుగుచున్నదనియు, ప్రతి జాతియొక్క సంస్కృతి అభివృద్ధి యగుటవలన ఆ జాతియేకాక ప్రపంచమంతయు లాభము పొందగలదనియు, ప్రపంచ శ్రేయస్సుదృష్ట్యా వివిధములగు సంస్కృతులు వృద్ధిగాంచుట అవసరమనియు విజ్ఞులు భావించసాగిరి. ఈ భావము క్రమక్రమముగ వ్యాపించి మొట్టమొదట యూరప్ ఖండమునందును, తదుపరి ఆసియా, ఆఫ్రికా ఖండములందును క్రమముగ వ్యాపించి, జాతీయోద్యమము రాజకీయోద్యమమునకు కారణభూతమయ్యెను. ఒక్కొక్కజాతికి ఒక స్వతంత్ర రాజ్యము ఉండుట ధర్మమన్న సిద్ధాంతముయొక్క ప్రభావము వలన, అదివరకు సామ్రాజ్యాధిపతులకు లోబడి ఉండిన వివిధ జాతులు తిరుగుబాటు చేయసాగిరి. సామ్రాజ్యములు అనేకములు కూలిపోయెను. వాటి స్థానములో అమెరికా ఖండమున యునైటెడ్‌స్టేట్స్, మెక్సికో, బ్రెజిల్ వంటి స్వతంత్ర జాతీయ రాజ్యములు, యూరప్ ఖండమున జర్మనీ, ఇటలీ, పోలండ్, గ్రీస్ మొదలైనవి, ఆసియా ఖండమున ఇండియా, పాకిస్తాన్, ఇండోనీషియా మొదలైనవి, ఆఫ్రికా ఖండమున ఈజిప్టు, టూనీషియా, లైబీరియా, ఘూనా మొదలైనవి స్థాపింపబడెను. విస్తీర్ణ దృష్ట్యా రాజ్యములకు ఒక హద్దు ఉండవలెనను సూత్రము ఆచరణలోనికి వచ్చెను. రాజ్యములను విస్తృతపరచుకొనదలచినవారు ఇతర జాతులను జయించి వశపరచుకొనుట ధర్మవిరుద్ధమను వాదము సమర్థనీయమయ్యెను. ప్రస్తుతము ప్రపంచములో పదెనిమిది విశాల సామ్రాజ్యములకు బదులు సుమారు నూట ఇరువది స్వతంత్ర రాజ్యములు స్థాపితములగుటకు ఈ సిద్ధాంతము ప్రధాన కారణము.

సామ్రాజ్య విధానములో అనేక జాతులు, అనేక దేశములు కలసి ఒకే పరిపాలనలో ఉండుటచేత కొన్ని లాభములు చేకూరగలవనుటలో సందేహము లేదు. సామ్రాజ్యములో చేరిన విశాలప్రదేశమందు యుద్ధములు లేక ప్రజలు ప్రశాంతముగ జీవితమును గడుపగలవారగుచున్నారు. వివిధ ప్రాంతములు సామ్రాజ్యమునందు ఉండుటచేత ఆర్థికాభివృద్ధి సులభతరమగుచున్నది. సామ్రాజ్య రక్షణకు కావలసిన సైనికబలమును సమకూర్చుకొనుట కూడ సులభ సాధ్యము. ఇట్టి లాభములు కొన్ని ఉన్నను సామ్రాజ్య పరిపాలనావిధానము, అధికారము వహించిన జాతియొక్క పురోభివృద్ధిని ఉద్దేశించి మాత్రమే జరుపబడుటచేత తక్కిన జాతులు వెనుకబడిపోవుటయు, వారు ఎట్టి గౌరవములేక అధికారజాతికి బానిసలవలె చాకిరి చేయవలసివచ్చుటయు తప్పుటలేదు. ఈ విధానములోని గొప్ప లోపము అన్నిజాతుల అభివృద్ధికి సమానావకాశములు లేకపోవుటయే. కాని, సామ్రాజ్యము పూర్తిగ విచ్ఛిన్నమై, అందులోని ఒక్కొక్కజాతి ఒక స్వతంత్ర రాజ్యముగ రూపొందుటచేత ప్రతిజాతికీ ఆత్మగౌరవమును సంపాదించిన సంతోషము లభించినను, సర్వవిధములలో అభివృద్ధి పొందుటకు కావలసిన అవకాశములు లభించగలవని చెప్పుటకు వీలులేదు. ఒక్కొక్క స్వతంత్ర రాజ్యమునకు ఒక ప్రత్యేక రక్షణబలము అవసరమగుచున్నది. స్వతంత్ర రాజ్యములలో అనేకములు విస్తీర్ణమందును, జనసంఖ్యయందును చాల చిన్నవి అగుటచేత తమకు కావలసిన రక్షణబలమును సమకూర్చుకొనలేని స్థితిలో ఉండుట తప్పదు. వీటిలో అనేకములు ఆర్థికముగ వెనుకబడినట్టివి. ఇందులోని ప్రజలు ఆహారాది విషయములలో వారి కనీస అవసరములను కూడ తీర్చుకొనలేక కటిక దారిద్ర్యమును అనుభవించుచుండువారు; స్వశక్తిచే తమ ఆర్థికస్థితిని చక్కబెట్టుకొనలేనివారు; అభివృద్ధిగాంచిన ఇతరదేశములపై ఆధారపడవలసినవారు. ఇట్టి పరిస్థితులలో వీరి స్వాతంత్ర్యము ఎంతవరకు లాభకరముకాగలదో చెప్పుటకు వీలులేదు. ఇదిగాక స్వతంత్రరాజ్యముల సంఖ్య విపరీతముగ పెరిగిపోవుటచేత రాజ్యముల మధ్య రాకపోకలకును, వర్తక వ్యాపారములకును లెక్కలేని అవరోధములు గలుగుచున్నవి. కనుక ఏజాతికి ఆజాతి స్వతంత్ర రాజ్యముగా రూపొందుట ఎంతవరకు వాంఛనీయమను విషయములో అనేకులకు సందేహము కలుగుటయందు ఎట్టి ఆశ్చర్యము లేదు.

దీనికితోడు సామ్రాజ్య విచ్ఛిత్తివలన స్వతంత్రమును సంపాదించిన దేశములనేకములలో ప్రజలయందు రాజకీయ చైతన్యము గాని, తామందరు ఒకే జాతికి చెందిన వారన్న భావము గాని లేనికారణమున ఒకదేశమందు అనేక స్వతంత్ర రాజ్యములు స్థాపితములగుచున్నవి. భారత ఉపఖండము ఇండియా అని, పాకిస్తాన్ అని రెండు స్వతంత్ర రాజ్యములుగా చీలిపోవుటకు ఇదే కారణము. ఫ్రెంచివారు వదలిన ఇండోచీనాలో అనేక స్వతంత్ర రాజ్యములు ఏర్పడినవి. ఇట్టి ప్రమాదము మరికొన్ని దేశములలో సంభవించు పరిస్థితులు లేకపోలేదు. 'జాతి' అన్న మాటకు ఇదమిత్థమని చెప్పతగ్గ అర్థము లేకపోవుటచేత ఇట్టి ప్రమాదము సంభవించుచున్నది. భారత ఉపఖండములోని వారందరు ఒకజాతివారని అనేకులు అంగీకరించినను, మహమ్మదీయులు ప్రత్యేకజాతివారన్న వాదము బలపడుటచేత పాకిస్తాన్ నిర్మాణము తప్పినది కాదు. ఇప్పు

డిప్పుడు దక్షిణ భారతదేశమందలి ద్రావిడులు ప్రత్యేక జాతివారనియును, వారికి ప్రత్యేక స్వతంత్రరాజ్యమైన 'ద్రావిడస్థానము' ఏర్పడవలెననియును వాదము వినబడుచున్నది. జాతీయవాదము సామ్రాజ్యముల విచ్ఛిత్తికే కాక దేశముల విచ్ఛిత్తికి కూడ దారితీయుచున్నది.

ప్రపంచమంతయు కలిసి ఒక రాజ్యముగ ఏర్పడినప్పుడు దానికి లోబడిన జాతీయరాజ్యములు ఎన్ని ఉండినను నష్టము లేదు. అట్టి పరిస్థితిలో యుద్ధప్రసక్తి గాని, యుద్ధములలో గెలుపొందుటకు రక్షణ బలముల సమకూర్చుకొనవలసిన అవసరము గాని, ఏ జాతీయ రాజ్యమునకు ఉండదు. అన్ని రాజ్యముల సమానాభివృద్ధికి ప్రపంచ రాజకీయసంస్థ స్థాపించబడే సూచనలు కనుమేరచూపులో ఎచ్చటను కనుపించుటలేదు. అందుచేతనే స్వతంత్ర జాతీయ రాజ్యములసంఖ్య పెరుగుట ప్రమాదకరమనే భావము వ్యాపించుటకు అవకాశము చేకూరినది.

పాలకజాతులు, పాలితజాతులు అన్న విభేదమును ఆధారము చేసికొని పాలకజాతుల ఆధిపత్యమునకును, అభివృద్ధికిని ఏర్పడిన సామ్రాజ్యములు విచ్ఛిన్నములు కావలసినవే. కాని, వాటి స్థానమున లెక్కలేని జాతీయ రాజ్యముల సంస్థాపనము జరుగవలసినదేనా ? లేక అనేక జాతుల కలయికవల్ల ఏర్పడ్డ ఇంకొక రాజ్యవిధానమును ఏర్పరచుకొనుట వాంఛనీయమా ? ప్రస్తుతము ప్రపంచము ఎదుర్కొనుచుండు ప్రధాన రాజ్యనిర్మాణ సమస్య ఇదియే.

ఇరుగు పొరుగున ఉండు స్వతంత్రరాజ్యములు కలిసి ఒక విధమైన సమాఖ్యారాజ్యముగ రూపొందుట ఈ సమస్యకు పరిష్కారమార్గమని అనేకులు భావించుచున్నారు. ఈ భావము శైశవ దశలో ఉన్నను క్రమక్రమముగ బలమును చేకూర్చుకొనగల సూచనలు కనుపించుచున్నవి. పశ్చిమ యూరప్‌లోని ప్రజాస్వామిక రాజ్యములన్నియు ఒక సమాఖ్య రాజ్యముగ రూపొందుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. అట్టి సమాఖ్య కెనడా, యునైటెడ్ స్టేట్స్ దేశములతో కలిసి 'ఉత్తర అట్లాంటిక్ కూటమి' అను పేరుతో స్థిరత్వము సంపాదించవలెనను ఆశయము బలపడుచున్నది. అదే విధముగ తూర్పుయూరప్‌లోని రాజ్యములు సోవియట్ కూటమిలో చేరిపోవు సూచనలు కనుపించుచున్నవి. ఉత్తర ఆఫ్రికాలోను, పశ్చిమ ఆసియాలోను ఉండు అరబ్బు రాజ్యములన్నియు ఒక సమాఖ్యగ ఏర్పడుటకు ప్రయత్నము జరుగుచున్నది. ఇట్టి ఉద్యమములు కొన్ని ఆగ్నేయ ఆసియాలోను, దక్షిణ అమెరికాలోను తల ఎత్తుచున్నవి. వీటిని అన్నిటిని బట్టి అనేక జాతీయ రాజ్యములు కలిసిన సమాఖ్యారాజ్యమే ప్రస్తుత పరిస్థితులలో ఆదర్శరాజ్యమను సిద్ధాంతము ప్రచారములోనికి వచ్చుచున్నది. విస్తీర్ణదృష్ట్యా రాజ్యముల పరిణామము అనేక దశలలో సాగినది. ప్రథమదశలో రాజ్యములు చిన్నవిగ ఉండినవి; రెండవ దశలో గొప్ప సామ్రాజ్యములు వ్యాప్తిగాంచినవి ; మూడవ దశలో సామ్రాజ్యములు విచ్ఛిన్నములై అనేక స్వతంత్ర జాతీయరాజ్యములుగ రూపొందినవి. ప్రస్తుత ప్రపంచము ఈ మూడవ దశలో ఉన్నది. కాని, త్వరితకాలములో దీనిని దాటి సమాన ప్రతిపత్తి గల జాతీయరాజ్యముల సమాఖ్య దశ అని చెప్పదగు నాలుగవ దశలో ప్రవేశింపనున్నది. ఇదే ఆఖరు దశ అని చెప్పరాదు. ఈ సమాఖ్యలున్నూ, ఏ సమాఖ్యలోను చేరని స్వతంత్ర రాజ్యములున్నూ కలసి ఒక ప్రపంచ రాజకీయ సంస్థగా అయిదవ దశలో ఏర్పడవచ్చును. అట్టి దశ వచ్చినప్పుడు 'పరిపాలనమునకై మానవకోటి ఏర్పరచుకొన్న రాజ్యము' అను సంస్థ ఒక ప్రాంతమునకు కొన్ని లక్షల చదరపు కిలోమీటర్లకును పరిమితము కాక, ప్రపంచమునంతా ఆవరించినది కాగలదు. మా. వెం. రం.

# రాజ్యాధికారము

విస్తీర్ణమునుబట్టియు, జనసంఖ్యనుబట్టియు కొన్ని రాజ్యములు పెద్దవిగను, కొన్ని చిన్నవిగను ఉన్నప్పటికీ అన్ని రాజ్యములలో ప్రభుత్వము అను సంస్థ ఒకటి ఉండును. ప్రభుత్వము లేనిదే రాజ్యమనునది ఉండదు.

ప్రభుత్వమునకు ప్రధాన లక్షణము ప్రజలపై దండనాధికారమును చలాయించగలిగి ఉండుట. అందుచేతనే మన పూర్వులు రాజునకు 'దండధరుడు' అనియు, రాజనీతికి 'దండనీతి' అనియు పేర్లు పెట్టిరి.

'అధికారము' అనునది ఒక విధమైన శక్తి (పవర్). ఇతరులకు ఇష్టమున్నను, లేకున్నను వారి ప్రవర్తనను మార్చి వారిచేత పనులను చేయింపగల సామర్థ్యమునకు 'శక్తి' అని పేరు. అధికారము కూడ ఇతరులను వశపరచుకొనుచున్నది. అంతమాత్రముచేత ఈ రెండును ఒకటి కావు. అన్నివిధములైన శక్తులకు అధికారమను పేరు చెల్లదు. బాటసారిపై బలప్రయోగముచేసి, వానిని వశపరచుకొని, వాని వస్తువులను తనకు ఇచ్చునట్లు వాని ప్రవర్తనమును మార్చగలశక్తి దారిదోపిడి చేయువానికి కలదు. కాని, ఇది అధికారముకాదు. శక్తిని వినియోగించుటకు నైతికమైన అర్హత గలవానిచేతిలో అది ఉన్నప్పుడే దానికి అధికారమను పేరు చెల్లును. నైతికమనియు,

సబబైనట్టిది అనియు, న్యాయమైనట్టిది అనియు భావింపబడుశక్తికి 'అధికారము' ని పేరు. అనుమానాస్పదుడను కారణమున బాటసారిని ఎర్రటోపీ ధరించిన పోలీసు పట్టుకొనుచున్నాడు. పైకి అతడు చేయు పనికిని, దారి దోపిడివాడు చేయు పనికిని ఎట్టి భేదము కనుపించదు. వీరు ఇద్దరును వారి శక్తిని ఉపయోగించుచున్నారు. కాని, పోలీసు ఉద్యోగి ఉపయోగించుశక్తి అర్హత - లేదా హక్కు - కలవాని చేతిలోనిశక్తి. అది న్యాయమైనట్టిదిగను, సబబైనట్టిదిగను పరిగణింపబడునట్టిది. శక్తియు, న్యాయము కలసినపుడు అధికారము రూపొందుచున్నది. అందుచేత ప్రభుత్వము చలాయించు శక్తికి 'అధికారము' ను పేరు లభించినది.

మానవ సమాజములో అధికారమును వహించువారు ప్రభుత్వము వారు మాత్రమే కాక, తదితరులు కూడ అనేకులు ఉన్నారు. ఎక్కడ పదిమంది కలసి - ఒక ప్రయోజనమును సాధించుటకు - సంఘముగ ఏర్పడుచున్నారో అక్కడ అధికారమును వహించువారు కొందరు ఉండక తప్పదు. తల్లి, తండ్రి, భార్య, భర్త, పిల్లలు అనువారితో కూడిన కుటుంబమను సంఘములో కుటుంబ యజమాని తక్కినవారిపై అధికారము చలాయించుచున్నాడు. ఉపాధ్యాయులు, విద్యార్థులు కలసి ఏర్పడిన విద్యాలయమను సంఘములో ఉపాధ్యాయుడు విద్యార్థులపై అధికారమును వహించి, వారికి ఇష్టమున్నను లేకున్నను వారిచేత విద్యకు సంబంధించిన పనులు అనేకములను చేయించుచున్నాడు. మత సంఘములలో మతగురువులు శిష్యులపై అధికారమును వహించుచున్నారు. పెత్తనముచేయు అధికారులు లేక ఏ సంఘము కూడ పనిచేయుట సాధ్యము కాదు [చూ. సం. 10 - అధికారము పు. 146].

రాజ్యము కూడ ఒక సంఘమని ఇదివరకే నిర్వచించి ఉన్నాము [చూ. పు. 209]. ఇతర సంఘములలో పెత్తనదారులకు, కార్యనిర్వాహకులకు గల స్థానము రాజ్యములో ప్రభుత్వమునకు కలదు. రాజ్యమునకు గల అధికారము ప్రభుత్వము అను సంస్థ సాధనమున చలాయింపబడుచున్నది.

ప్రభుత్వము చలాయించు రాజ్యాధికారమునకును, తక్కిన సంఘముల అధికారమునకును కొన్ని అంశములలో గొప్ప భేదము కలదు. అందుచేత తక్కినవాని అధికారమునకు లేని విశిష్టత రాజ్యాధికారమునకు సంప్రాప్తించుచున్నది.

రాజ్యాధికారము హింసతోకూడిన దండనాధికారరూపమును ధరించుచున్నది. రాజ్యాధికారమును ఎదిరించిన వారిపై ప్రభుత్వము జరిమానాలను వేయుట, వారి ఆస్తులను వశపరచుకొనుట అను శిక్షలనే గాక, వారి శరీరమునకు బాధను కలిగించు శిక్షలను కూడ విధించగలదిగ ఉన్నది. వారిని ప్రభుత్వము కొరడా దెబ్బలకు గురిచేయవచ్చును; నిర్బంధించి, కారాగారములలో వారిచేత కఠినమైన పనులను చేయించవచ్చును; ఉరిశిక్ష విధించి వారి ప్రాణములను తీయవచ్చును; గుంపులుకూడి శాసన విరుద్ధముగ ప్రవర్తించినవారిని ల్యాటీ దెబ్బలకును, తుపాకుల కాల్పులకును గురిచేయవచ్చును. ప్రభుత్వేతరాధికారులు ఇట్టిదారుణ శిక్షలను విధించగల స్థితిలో లేరు. తమ తమ సంఘములలోని సభ్యులను వశపరచుకొనుటకు వారు దండనాధికారమును (కొయెర్సివ్ పవర్) గాక ప్రేమ, ప్రచారము, ధనము, ప్రబోధము మొదలైన సాధనములను ఉపయోగించుచున్నారు. కుటుంబ యజమాని పిల్లలను ముద్దాడి వారిని వశపరచుకొనుచున్నాడు. పిల్లవాడు తన ఏడ్పుతో తండ్రిని వశపరచుకొనుచున్నాడు. ఫ్యాక్టరీ యజమాని కార్మికులకు ధనమును ఇచ్చి వారిచేత పనులను చేయించుకొనుచున్నాడు. కొందరు అధికారులు హింసతోకూడిన దండనలను విధించుట కలదు. కాని, ఆ శిక్షలకు ఒక హద్దు ఉన్నది. దానికిమించి వారు దండించినప్పుడు ప్రభుత్వము ఏర్పరచిన న్యాయస్థానముల ద్వారా వారు శిక్షార్హులగుచున్నారు. స్వతహాగా వారికి దండనాధికారము లేదు. వారి అధికారము ప్రభుత్వముచే కల్పించబడి; ప్రభుత్వము నిర్ణయించు హద్దులకు లోబడినట్టిది.

ప్రభుత్వము చలాయించు రాజ్యాధికారమునకును, ప్రభుత్వేతర సంస్థల అధికారమునకును ఇంకొక భేదము కూడ కలదు. ఇతరుల అధికారమునకు ఇష్టపడనివారు దానినుండి తప్పించుకొనుటకు వీలున్నది. మతగురువు అధికారమును ఇష్టపడనివాడు ఆ మతమును వదలివేయవచ్చును. తండ్రియొక్క అధికారమును ఇష్టపడనివాడు కుటుంబమును వదలి వైదొలగవచ్చును. కుటుంబము, మతసంఘము, విద్యాసంఘము, కార్మికసంఘము, రైతు సంఘము, వర్తకసంఘము మొదలగు రాజ్యేతర సంఘములలోని సభ్యత్వము ఐచ్ఛికము. సంఘ నియమములు కఠినముగ ఉన్నట్లు గాని, తృప్తికరములుగ లేనట్లు గాని భావించు సభ్యులు సంఘమును వదలి వెళ్ళిపోవచ్చును. కాని, రాజ్యాధికార, రాజదండనములకు ఇష్టపడనివారికి రాజ్యమునుండి తొలగిపోవుట సాధ్యము కాదు. ఇష్టమున్నను లేకపోయినను నిర్బంధముగ రాజ్యములో సభ్యత్వము వహించవలసి ఉన్నది. రాజ్యాధికారుల అనుజ్ఞ

లేక రాజ్యమునుండి వెడలిపోవుటకు వీలులేదు. వెడలిపోయినను ఇంకొక రాజ్యమును ప్రవేశించి, అచ్చటి రాజ్యాధికారమునకు లొంగిపోవుట తప్పదు. ప్రపంచములోని ప్రతి భూభాగము ఏదియో ఒక రాజ్యములో చేరి ఉన్నది. రాజ్యమునకును, పౌరులకును గల సంబంధము విడాకులపద్ధతిలేని దాంపత్యము వంటిది.

పై వివరణమునుబట్టి రాజ్యపరిపాలనము అంతయు హింసతో కూడిన దండనాధికారము ద్వారా జరుగుచున్నదని భ్రమపడరాదు. ప్రతినిమిషమున ఇట్టి అధికారమును ప్రభుత్వము వినియోగించవలసిన అవసరము లేదు. విప్లవకాలమందును, ప్రజానురాగమును పూర్తిగ కోల్పోయిన సమయములందును ఇట్టిది అవసరమగుచున్నది. కాని, ఇది ఉన్నగాని రాజ్యము నిలబడదు. సామ, దాన, భేదోపాయములు సఫలములు కానప్పుడు దండోపాయమును ఉపయోగించుటకు ప్రభుత్వమునకు అవకాశము కలదు. ఇతరుల అధికారములో లేని విశిష్టత రాజ్యాధికారములో ఉన్నదని చెప్పుటకు ఇది ప్రధాన కారణము.

రాజ్యాధికారములోని మరియొక విశేషమును కూడ ఈ సందర్భములో గమనించవచ్చును. రాజ్యాధికారము దేశవ్యాప్తమైనది. దేశములోని వారందరు - ఎట్టి మినహాయింపులులేక - దానికి లోబడి ఉన్నారు. రాజ్యేతర సంఘముల అధికారము ఇంతటి వ్యాప్తి కలది కాదు. అట్టి సంఘములలో సభ్యత్వము వహించిన వారి సంఖ్య పరిమితమైనది. రైతుసంఘమున రైతులు మాత్రము, కార్మిక సంఘమున కార్మికులు మాత్రము, ఒక మతసంఘములో ఆ మతమునకు చెందినవారు మాత్రము సభ్యులుగ ఉన్నారు. అందుచేత ఆ సంఘములలోని పరిపాలకవర్గమునకు కల అధికారము దేశవ్యాప్తమైన రాజ్యాధికారమువలె విశాలమైనది కాదు. ఇతర అధికారములకును, రాజ్యాధికారమునకును సాధనమందేగాక, వైశాల్యమందు కూడ భేదము కలదు. కుటుంబమునుబట్టి, కులమునుబట్టి, మతమునుబట్టి, వృత్తినిబట్టి, రుచులనుబట్టి ప్రజలలో సహజముగ ఏర్పడు భేదములు తక్కిన సంఘములకు ఆధారము. రాజ్యమను సంఘమునకు ఇట్టి భేదములు ఆధారములు కావు. ఇట్టి భేదములు ఎన్ని ఉన్నను వారందరు ఒక భూభాగమున నివసించువారగుటచేత నివాసదృష్ట్యా వారందరు ఒక్కరని, వారందరు కలసి సాధించవలసిన ప్రయోజనములు అనేకములు ఉన్నవని అనుకొనుటయే రాజ్యమునకు ఆధారము. ప్రజలందరిలో కనబడు సాధారణ ధర్మమువలన రాజ్యము ఏర్పడుచున్నది; తక్కిన సంఘములు వారిలోని భేదములవలన ఏర్పడుచున్నవి.

దండనాధికారము రాజ్యాధికారమునకు ప్రత్యేక లక్షణమైనను, ఇట్టి అధికారమునకు భయపడి ప్రజలు ప్రభుత్వమునకు విధేయులై ఉన్నారని భావించరాదు. ప్రజల విధేయతకు భయము కారణము కాదు. దానికి ప్రబలమైన ఇతర కారణములు ఉన్నవి. అవి ఏవియో తెలిసికొనుట అవసరము.

మానవజీవితమందు రెండు ప్రధాన సూత్రములు అత్యంత ప్రభావము కలవిగ ఉన్నవి. రాజ్యములు ఏర్పడుటకును, రాజ్యాధికారమునకు ప్రజలు విధేయులై ఉండుటకును ఇవియే కారణములు. వీనిలో మొదటిది: 'మానవుడు స్వేచ్ఛను కోరువాడు' అనునది; రెండవది: 'మానవుడు సంఘజీవి' అనునది. స్వేచ్ఛను కోరు మానవుడు సంఘముతో జీవితమును గడుపుటకు రాజ్యమనునది సాధనమగుచున్నది. ఈ సాధనము లేనిపక్షమున స్వేచ్ఛా జీవితమునకును, సాంఘికజీవితమునకును సమన్వయము కుదురజాలదు.

ప్రతి మానవుడు స్వేచ్ఛాప్రియుడు; తనకు ఇష్టము వచ్చినట్లు తాను నడుచుకొని, తనలో లీనమైయున్న శక్తి-సామర్థ్యములను బహిర్గతములు కావించుకొని, తన వ్యక్తిత్వమును ప్రదర్శించుటకు ఉత్సాహపడుచుండును. ఇది అతని సహజగుణములలో ఒకటి. తన ఇష్టానిష్టములను పూర్తిగ వదలి, ఇతరులకు దాసానుదాసుడై ప్రవర్తించుటకు ఎవడును ఇష్టపడడు. ఇతరులను వశపరచుకొని, తన ఇష్టప్రకారము వారు ప్రవర్తించునట్లు చేయుటకు ప్రతి మానవుడు ప్రయత్నించుచుండును. ఈ అధికారప్రియత్వము స్వేచ్ఛాప్రియత్వముయొక్క ప్రతిబింబము. ఒక రంగములో పరమవిధేయుడై ఉండువాడు ఇంకొక రంగములో సర్వాధికారము వహించదలచును. ఆఫీసులో యజమానికి ఎదురుచెప్పలేక పరమ విధేయుడైనవాడు ఇంటిలో భార్యపైనను, పిల్లలపైనను నిరంకుశత్వము వహించుట దీనికి తార్కాణము.

మానవుడు సంఘజీవి. ఒంటరిగా ఉండడు - ఉండలేడు; పదిమందిమధ్య జీవితము గడపవలసినవాడు; ఇతరుల సహాయములేక ఏ ప్రయోజనమును సాధింపలేనివాడు. అతడు కుటుంబములో పుట్టి తల్లిదండ్రుల సహాయమున పెరిగి పెద్దవాడగుచున్నాడు; ఇతరులతో సాంగత్యముచేసి చదువును, వృత్తిని నేర్చుకొనుచున్నాడు. వినోద, విలాసములకు ఇతరుల సాంగత్యము అతనికి అవసరమగుచున్నది. గ్రామములలోను, పట్టణములలోను ఇరుగుపొరుగు వారిమధ్య అతడు కాలము గడుపుచున్నాడు. మానవుడు సంఘజీవి అనుటలో ఇమిడియుండు అర్థము ఇదియే.

సంఘములో జీవించవలసిన వానికి సంపూర్ణ స్వేచ్ఛ సాధ్యము కాదు. ఇతరులను కాదని తనకు ఇష్టము వచ్చినట్లు ప్రవర్తింపదలచిన వానికి ఇతరుల సహాయము లభించక పోవుటయేగాక, వారివలన ఆటంకములు కూడ సంభవించును. స్వేచ్ఛాప్రియుడై తనకు ఇష్టమువచ్చినట్లు పనులను చేయుటవలన ఇతరులకు నష్టమును, కష్టమును కలుగవచ్చును; వారికి గల స్వేచ్ఛ లోపించును. వాడు బలవంతుడైనను, బలహీనులు అనేకులుకలసి వానికి అడ్డుతగిలి, అతని ప్రయత్నములకు విఘాతము కలిగించవచ్చును. అతడు ఇతరులకు అడ్డుతగులుటచేతను, ఇతరులు అతనికి అడ్డు తగులుటచేతను, అందెవరును తాము వాంఛించిన పనులను పూర్తిచేసికొనలేక స్వేచ్ఛను కోల్పోయినవారగుదురు; పరస్పర ఘర్షణమూలమున ఎవరి స్వేచ్ఛయు సార్థకము కాజాలని స్థితి సంభవించును. దీనిమూలమున ఒక గొప్ప సత్యము బయల్పడుచున్నది. సంఘములోని వారందరికి స్వేచ్ఛ ఉండవలయుననిన, అందరుకూడ కొన్ని నియమములకు, కట్టుబాట్లకు లోబడవలసి ఉన్నదనుటయే ఈ సత్యము. ఒకరికొకరు అడ్డు తగులకుండునట్లు ప్రవర్తించుట అవసరము. అప్పుడు ఎవరికి ఎంతటిస్వేచ్ఛ ఉండవలెనో అంతటిది ఉండుటయు, దానిని ఉపయోగించుకొని వారి వారి వాంఛలను వారు తీర్చుకొనుటయు, వారి వ్యక్తిత్వమును ప్రదర్శించుటయు జరుగ గలవు. స్వేచ్ఛాజీవితమునకు నియమము ఆధారము.

పదిమందిమధ్య కాలమును గడపవలసి వచ్చినప్పుడు నియమము ఎంత అవసరమో ఒక సామాన్య దృష్టాంతము ద్వారా స్పష్టముచేయవచ్చును. పట్టణవీథులలో ఒకవైపు నుండి కొందరు, ఎదుటివైపునుండి కొందరు నడుచుచుందురు. అదేవిధముగ రెండువైపులనుండి వచ్చు బండ్లు, బస్సులు, మోటార్లును ఉండును. ఇట్టి వాహనములలో ఉండువారును, కాలినడకను వెళ్లువారును స్వేచ్ఛగా ప్రయాణముచేసి వారి వారి గమ్యస్థానములను చేరదలచువారలే. కాని, అందరికి స్వేచ్ఛ ఉన్నదిగదా అని ఎవరికి తోచినట్లు వారు నడువ సాగినయెడల ఒకరిపైన ఇంకొకరు పడుట, బస్సులు బోల్తాగొట్టుట, మోటార్లకు ప్రమాదము సంభవించుట తప్పదు. అట్టి స్థితిలో ఎవరు కూడ సకాలములో గమ్యస్థానము చేర లేరు. ఎట్టి ప్రమాదములేక అందరు వారి వారి గమ్యస్థానములను చేరుటకు కొన్ని నియమములను పాటించుట అవసరము. అందరు వీథిలో వారి వారి ఎడమప్రక్కన నడుచుట, ఎవరు కూడ గుంపులు గుంపులుగా కూడి ఒకచోట నిలబడి పోకుండుట, బస్సులు, మోటార్లు గంటకు కొన్ని కి. మీ. కంటె ఎక్కువవేగమున నడవకుండుట మొదలైనవి ఇట్టి కొన్ని నియమములు. ఇవి అందరి స్వేచ్ఛకు భంగకరముగా కనుపించవచ్చును. కాని, ఎట్టి ప్రమాదమునకు గురిగాక అందరు వారి వారి గమ్యస్థానములను చేరుటకు వారి స్వేచ్ఛకు ఇట్టి హద్దు ఉండుట అవసరము. ఈ నియమములను అందరు పాటించునట్లు చేయుటకును, పాటించనివారిని శిక్షాపాత్రులుగ చేయుటకును పోలీసు ఉద్యోగులు వీథులలో అచ్చటచ్చట నిలబడి ఉండుట కూడ అవసరము. మనము చేరదలచుకొనిన గమ్యస్థానమును నిర్విఘ్నముగ చేరుటయే స్వేచ్ఛకు ఫలితము. అందరు కొన్ని నియమములను పాటించుచు, తమ స్వేచ్ఛను క్రమబద్ధముగ చేసికొనుటచేత అందరును వారి వారి గమ్యస్థానములను సకాలమున చేరువారగుచున్నారు. నియమము లేనప్పుడు దౌర్జన్యమునకు దిగి, బలప్రయోగము చేసి, ఇతరులను త్రోసికొని వెళ్లగలవారు - అనగా ఇతరుల స్వేచ్ఛకు భంగము కలిగించగలవారు - గమ్యస్థానము చేరుటయు, తక్కినవారు వెనుకబడిపోవుటయు జరుగును. కావున స్వేచ్ఛ, సాంఘిక జీవితము అను రెండింటినీ మానవుడు కోరుచున్నాడు. ఈ రెండును అతనికి కావలసినవే. ఈ రెండింటినీ ఏకకాలమందు సాధించుటకు మార్గము కావలసి ఉన్నది. స్వేచ్ఛకు భంగము కలిగించని సాంఘిక జీవితమును, సాంఘిక జీవితమునకు భంగము కలిగించని స్వేచ్ఛను నియమమను సాధనమువలన మానవుడు పొందుచున్నాడు. మన పూర్వులు జీవితమునకు అంతటికిని 'ధర్మము' మూలమని చెప్పిరి. నియమము, క్రమము, ధర్మము ఒకే అర్థమును సూచించు పర్యాయపదములు.

మానవుడు సంఘజీవి అగుటచేత మంచి - చెడుగు, ఒప్పు - తప్పు, న్యాయము - అన్యాయము అను విభేదములు ఏర్పడుచున్నవి. సంఘములోని వారి ఎడల ఒకడు ఏ విధముగ ప్రవర్తించవలెనో ఈ మాటలు నిర్ణయించుచున్నవి. ఇతరులతో సంబంధములేక ఏకాకిగ జీవించువానికి వీటితో నిమిత్తము లేదు. జీవితము నియమబద్ధమైనప్పుడే మంచి, ఒప్పు, న్యాయము మొదలైనవి సార్థకములు అగుచున్నవి.

మానవులు సంఘములో నివసించుటవలన వారు చేయవలసిన పనులు రెండు రకములుగ ఉన్నవి: స్వప్రయోజనమును సాధించుటకై చేయునవి మొదటి రకములోనివి; సంఘము యొక్క సమష్టి ప్రయోజనమును సాధించుటకై చేయవలసినవి రెండవ రకములోనివి. శత్రువులనుండి సంఘమునకు కలుగు ప్రమాదములనుండి రక్షించుటకు జరుగవలసిన పనులు సమష్టిప్రయోజనమునకు సంబంధించినవి. ఇట్టివి అనేకములు ఉన్నవి. వీనిని చేయుటలో సంఘములోని వారందరు వారికి ఇష్టమున్నను లేకపోయి

నను నిర్బంధముగ తోడ్పడుట అవసరము. ఇట్టి తోడ్పాటును సంపాదించుటకు కూడ జీవితము నియమబద్ధము కావలసి ఉన్నది.

మానవ జీవితము సాంఘిక జీవితము అగుటచేతను, సాంఘిక జీవితమునకు నియమము ఆధారము అగుటచేతను మానవులందరిపై సంపూర్ణ ఆధిపత్యమును వహించతగినది నియమము ఒక్కటియే.

అనాదిగ మానవుడు సంఘజీవియగుటచేత నియమములు కూడ అనాదిగ ఏర్పడి ఉన్నవి. సంఘములు అన్నిటిలో మొదటిది కుటుంబము. నియమములు కుటుంబ జీవితముతో ప్రారంభమయ్యెను. స్త్రీ - పురుషులకు మధ్య ఎట్టి నియమములు ఉండవలెననునది సాంఘిక సమస్యలలో ప్రాధాన్యము వహించి ఉన్నది. భార్యా - భర్తలమధ్య ఉండదగిన సంబంధము, తల్లి - కొడుకుల మధ్య, తండ్రీ - కుమార్తెల మధ్య, అన్నదమ్ములు - అక్క చెల్లెండ్ర మధ్య ఉండరాదను నియమము ఆదికాలపు కుటుంబములో ఏర్పడినట్టిది [చూ. సం. 10 - పు. 170]. ఆస్తిని గురించిన నియమములు అనేకములు అప్పటివే. ప్రస్తుత కాలమున ప్రభుత్వమునకు ఉండు అధికారమంతయు ఆదికాలమున కుటుంబములోని పెద్దకు ఉండెను. నియమములకు విరుద్ధముగ ప్రవర్తించినవారిని అతడు శిక్షించెడువాడు. అట్టివారికి మరణదండన విధించుటకు కూడ అతనికి అధికారము ఉండెను. తరతరములుగ కుటుంబ జీవితమునకు అలవాటుపడిన మానవుడు నియమబద్ధ జీవితమునకును, దండనాధికారమునకును అలవాటుపడినవాడయ్యెను.

కాలక్రమమున కుటుంబములు అనేకములు కలసి కులములుగను, కులములు అనేకములు కలసి తెగలుగను ఏర్పడినవి. కుటుంబములో తండ్రికి గల అధికారము, తెగలలో కులపెద్దలకు, వారందరిపై నాయకత్వము వహించిన రాజునకు సంక్రమించెను. రాజ్యము, రాజ్యాధికారము ఈ విధముగ ఏర్పడెను [చూ. సం. 10 - పు. 303].

దండనాధికారముగల కుటుంబపు పెద్దకు తక్కినవారు ఏ కారణమున విధేయులుగ నడుచుచుండిరో ఆ కారణముననే వారు రాజ్యాధికారమునకు విధేయులై నడవసాగిరి. సాంఘికజీవితమును క్రమబద్ధముగ చేయుటకు కావలసిన నియమములను ఉల్లంఘించినవారిని శిక్షించి, అట్టి నియమములను రక్షించి, సాంఘికజీవితమును నిరపాయముగ సాగింపజేయువాడు రాజు అనియు, రాజ్యాధికారము అందుకు ఏర్పడినదనియు ప్రజలలో విశ్వాసము గాఢముగ నాటుకొనెను. అవసరమైనప్పుడు క్రొత్త నియమములకు రూపము కల్పించి వాటిని అమలులో పెట్టుటకు కూడ రాజ్యాధికారము ప్రధాన సాధనమని వారు విశ్వసించిరి. ప్రజలు ప్రభుత్వమునకు విధేయులై ఉండుటకు యుగయుగములుగ వారిలో జీర్ణమైపోయిన ఈ విశ్వాసమే ప్రధానకారణము కాని, ప్రభుత్వ అధీనములోనుండు బలప్రయోగ సాధనములగు సైన్యములు, పోలీసులు, కారాగారములు కావు. ప్రభువులు క్రూరులై ఘోరకృత్యములను కావించినప్పుడు కూడ అరాజకముకంటె ఏదియో ఒక ప్రభుత్వము ఉండుట మేలు అన్న విశ్వాసమే వారిని విధేయులుగ చేయుచున్నది. విప్లవములను లేవదీసి, ఒక ప్రభుత్వమును కూలద్రోయువారు కూడ దాని స్థానమున ఇంకొక ప్రభుత్వమును నెలకొల్పుటకు ఈ విశ్వాసమే కారణము. నియమబద్ధజీవితమందు ప్రజలకు విశ్వాసము లేని నాడు ఏ ప్రభుత్వము కూడ నిలబడజాలదు. రాజ్య బలాబలములకు మూలము ప్రజల సమ్మతియే గాని, ప్రభువుల వశమందుండు బలప్రయోగశక్తి కాదని రాజనీతిజ్ఞులు చెప్పుటలో ఉండు సత్యము ఇదియే.

విధేయతకు ఇట్టి విశ్వాసము ఆధారమైనప్పుడు దండనాధికారమునకును, సైన్యాదులకును అవసరమేమి అను సంశయము కలుగవచ్చును. సాధారణముగ ప్రజా బాహుళ్యములో ఇట్టి విశ్వాసమున్నను కొన్ని పరిస్థితుల కారణమున ప్రతి సమాజములో కొందరియందు ఇది లోపించి ఉన్నది. ఇంతేగాక, సామాన్యముగ ఈ విశ్వాసము కలిగి విధేయులై ప్రవర్తించువారు కూడ ఒక్కొకప్పుడు నియమ విరుద్ధముగ ప్రవర్తించుట కలదు. దైనందిన వ్యవహారములలో అనుసరణీయమార్గమేదియో తెలిసిన మనము దానికి విరుద్ధమగు మార్గములో నడుచుటయు కలదు గదా! అందుచేత నియమోల్లంఘనము చేయువారు కొందరు ఉండుటయు, అట్టివారిని శిక్షించవలసిన అవసరము ఏర్పడుటయు జరుగుచున్నది. నియమోల్లంఘనము చేయు వారిని శిక్షించుటకు దండనాధికారమే లేనిపక్షమున ఉల్లంఘించువారి సంఖ్య పెరిగి, సాంఘిక జీవితమునకు అపాయము కలుగును. ఇట్టి అపాయమునుండి రక్షించుటకు దండనాధికారము అవసరమగుచున్నది.

పై వివరణమువలన మానవ జీవితము సాంఘిక జీవితమనియు, సాంఘిక జీవితమునకు నియమము లేదా న్యాయము (లా) 'ఆధారమ' నియు, నియమము క్రియారూపము ధరించుటకు నియమోల్లంఘనము చేయువారిని శిక్షించగల రాజ్యాధికారము ఉండవలెననియు, రాజ్యాధికారమునకు ప్రజలు విధేయులై ఉండుటకు నియమము యొక్క అవసరమందువారికి గల విశ్వాసమే ప్రధాన కారణము అనియు స్పష్టమగుచున్నది. మా. వెం. ఢం.

# రాజ్యోత్పత్తి

కుటుంబములు అనేకములు కలసి కులములుగను, కులములు అనేకములు కలసి తెగలుగను ఏర్పడిన కారణమున కుటుంబముల మధ్యను, కులముల మధ్యను సంభవించు వివాదములను పరిష్కరించు అధికారము గల ప్రత్యేక సంస్థ అవసరమయ్యెను. ప్రప్రథమమున ఇది కుటుంబ యజమానులతోడను, కులపెద్దలతోడను కూడిన సభా రూపమున ఉండెను. ఇట్టి సభలో వయస్సువలన గాని, వాగ్ధాటివలన గాని గౌరవ పాత్రుడైనవాడు నాయకుడుగ పరిగణింపబడుట సహజము. తొలికాలపు రాజులు ఇట్టి నాయకులే అయి ఉండవచ్చును. ఇదిగాక అప్పుడప్పుడు ఒక తెగవారు ఇంకొక తెగవారిపై యుద్ధములు సాగించి వారి వశమందుండు గోగణములను, భూములను అపహరించుట జరుగుచుండెడిది. కొన్ని తెగలవారు వ్యవసాయమును నేర్చుకొని, గ్రామములందు స్థిరముగ నివసించుటకు అలవాటుపడి, పండించిన పంటలను దాచుకొనుటకు ఆరంభించిన తర్వాత, యుద్ధముల ప్రమాదము మరింత వృద్ధిగాంచెను. దేశసంచారులుగ ఉండిన తెగలవారు ఇట్టి వారిపైబడి, యుద్ధములలో వారిని జయించి, వారి భూములను వశపరచుకొని, వారిపై రాజ్యాధికారమును వహించి, రాజ్యాధికారముతోపాటు భూములకు యజమానులై, జయింపబడినవారిచే భూములను వ్యవసాయము చేయించి, పండిన పంటలలో అధికభాగమును అనుభవించువారైరి. యుద్ధములు సంభవించుట మూలమున శత్రువులవలన గలుగు ప్రమాదమునుండి రక్షింపగలవాడును, పౌరుషవంతుడును అగువాడు నాయకుడు అగుటయు, అతని అనుచరులు ఒక ప్రత్యేక క్షత్రియ వర్గముగ ఏర్పడుటయు సంభవించెను. జయింపబడిన భూములలో అధికభాగము వీరివశమయ్యెను. వయోవృద్ధులు, వాక్చతురత గలవారు పౌరుషవంతుల నాయకత్వమును అంగీకరించి వారికి సలహాదారులైరి [చూ. జెరెంటోక్రసీ: సం. 10- పు. 402]. శత్రుభయమునుండి ప్రజలను రక్షించగలవారు రాజులగు సంప్రదాయము ప్రాబల్యము గాంచెను. ఒక తెగవారు ఇంకొక తెగవారిని జయించుటచేత జయించినవారు పాలకవర్గముగను, జయింపబడిన వారు పాలితవర్గముగను ఏర్పడెను. ఈ విధముగ రాజకీయమైనట్టియు, ఆర్థికమైనట్టియు తరతమభేదములు సంభవించెను. ధైర్య సాహసములచే నాయకత్వమును సంపాదించి రాజులైన వారు అధికారము తమ కుమారులకు చెందవలయునని కోరుట సహజము. ఆ కోరిక సఫలమగుటకు వారికి అనేక అవకాశములు ఉండెను. అందుచేత కాలక్రమమున రాజరికము వంశపారంపర్యమయ్యెను. దీనితో పాటుగ రాజులకు సలహాదారులుగ ఉండిన మంత్రులు, సేనాపతులు, పౌరోహితులు మొదలైనవారు వంశపారంపర్యముగ ఉద్యోగములలోనికి వచ్చువారైరి. పురాణములలో మనకు గోచరించు రాజ్యములు, రాజవంశములు ఈ విధముగ ఏర్పడినట్టివియే.

ఈ పరిణామమందు గుర్తించదగిన అంశములు మరి కొన్ని కలవు. ఏరోజునకు కావలసిన ఆహారమును ఆరోజు కష్టపడి సంపాదించుకొనవలసిన స్థితిలో - అనగా వేట, చేపలు పట్టుట ప్రధాన జీవనోపాయములుగ ఉండిన కాలములో - సంపాదించుకొన్నదానిలో కొంత భాగమును దాచుకొనుటకు వీలులేనికారణమున ఆస్తి అని చెప్పుకొనుటకు తగినదేదియు లేకుండెను. పశుపాలనా యుగమందు ఇది కొంతవరకు మారి ఆస్తి అనునది ఏర్పడెను. వ్యవసాయయుగము ప్రారంభమైన తర్వాత ఆస్తిని సంపాదించుటకు మరింత అవకాశము లభించెను. కొందరికి ఎక్కువ పంటపండుటయు, కొందరికి తక్కువ పండుటయు, కొందరు ఆస్తిపరులగుటయు, కొందరు కాకుండుటయు సహజమయ్యెను. దానిఫలితముగ అసూయ, దొంగతనము మొదలగు దోషములు పుట్టెను. దొంగల నుండి ఆస్తిని రక్షించుకొనవలసిన అవసరము ఏర్పడెను; దండనాధికారమునకు ఎక్కువ ప్రసక్తి లభించెను. ఆస్తి అను వ్యవస్థలేని కాలములో రాజ్యాధికారమునకు పరిమితమైన ప్రాధాన్యము ఉండెను. ఈ వ్యవస్థ ఏర్పడిన తర్వాత ఆ ప్రాధాన్యము వృద్ధిగాంచెను. రాజ్యోత్పత్తికిని, రాజ్యాధికారోత్పత్తికిని ఏవి కారణములు అను ప్రశ్నకు సమాధానము చెప్పవలసి వచ్చినపుడు కుటుంబదశయందు ఉండిన మానవ సంఘము కులములుగను, తెగలుగను విస్తరించుట, యుద్ధములు, వ్యవసాయము, ఆస్తి వ్యవస్థ, తరతమ భేదములు మొదలైనవన్నియు ఇట్టి కారణములనియు, ఈ కారణములు పరస్పరాశ్రయములనియు గ్రహించవలసి ఉన్నది. వీటి అన్నిటికి ఒక సమాన ధర్మము ఉన్నది. ఇవి అన్నియు రక్షణకు అవసరమును కల్పించునట్టి పరిణామములు. రాజ్యాధికారము మూలమున కలుగు ప్రయోజనములన్నిటిలో రక్షణ - శత్రుబాధలనుండి రక్షణ, చోరుల నుండి రక్షణ, ఆస్తి రక్షణ, తరతమ భేదముల రక్షణ - అగ్రస్థానము వహించుటకు ఈ పరిణామములే కారణములు.

ఈ సందర్భమున ఇంకొక విషయమును గురించి కూడ కొంత ప్రస్తావించవలసి ఉన్నది. ఆదికాలపు మానవులు రెండు విధములైన ప్రమాదములకు గురియగుచు వచ్చిరి. వాటిలో మొదటిదానిలోనివి మానవ కల్పితములు - యుద్ధములు, దొంగతనము మొదలైనవి ఈలాటివి; రెండవ రకములోనివి ప్రకృతి కల్పితములు - సకాలమున వర్షములు లేకపోవుట, అతివృష్టి, అంటువ్యాధులు మొదలైనవి ఇట్టివి. వాటినుండి రక్షించుకొను ప్రయత్నములో మతమునకు ప్రాధాన్యము లభించెను. ఇట్టి ప్రమాదములను కల్పించునవి ప్రకృతిలోని మానవాతీత శక్తులనియు, ఆ శక్తులను వశపరచుకొన గలిగినయెడల ప్రమాదములు తొలగ గలవనియు, వాటిని వశపరచుకొనుటకు మంత్రములు, తంత్రములు సాధనములనియు, ఆ సాధనములను ఉపయోగింపగలవారు కొందరున్నారనియు, అట్టి మంత్రవేత్తల నాయకత్వమును అనుసరించి వారికి లోబడి ప్రవర్తించినయెడల ప్రకృతి సిద్ధములగు ప్రమాదములనుండి రక్షించుకొనవచ్చుననియు తొలికాలపు మానవులు విశ్వసించిరి. దీని ఫలితముగ మంత్రవేత్తలకు సంఘములో ప్రాధాన్యము లభించెను. ఈ మంత్రవేత్తలే కాలక్రమమున మతబోధకులుగను, పౌరోహితులుగను మారిరి. తొలికాలపు రాజ్యములు అనేకములలో మానవాతీత శక్తులను, దేవతలను మంత్రముల మూలమునను, యజ్ఞయాగాదుల మూలమునను, స్తోత్ర పాఠముల మూలమునను వశపరచుకొనగల వారను ప్రతీతి ఉండినవారే రాజులగుచువచ్చిరి. తరువాతి రాజ్యములలోకూడ మంత్రవేత్తలగు పౌరోహితుల సహాయములేక రాజ్య పరిపాలనము జరుగుట సాధ్యముకాదను విశ్వాసము నాటుకొనుటచేత రాజులకు సలహాలను ఇచ్చువారిలో పౌరోహితులు అగ్రస్థానము వహించిరి (మధ్య యుగములోని పాశ్చాత్య రాజ్యములన్నిటియందును క్రైస్తవ మతాధిపతులకు రాజ్యపరిపాలనమందు సన్నిహిత సంబంధముండుటకు ఇదియే కారణము. మతాధికారులు చెప్పినట్లు రాజులు ప్రవర్తించవలెనా లేదా రాజులు చెప్పినట్లు మతాధికారులు ప్రవర్తించవలెనా అను వివాదము క్రైస్తవ ప్రపంచమందు - ముఖ్యముగ యూరప్‌లో - ఈ కారణముచేతనే బయలుదేరెను. దీనినిబట్టి రాజ్యాధికారోత్పత్తియందును, దాని పరిణామమందును మతమునకు గల ప్రాధాన్యము ఎట్టిదో స్పష్టమగుచున్నది) [చూ. మత రాజ్యయుగము - పు. 73].

దండనతోకూడిన రాజ్యాధికారమును సమర్థించుటకై ప్రతిపాదింపబడిన ప్రాచ్య, పాశ్చాత్య రాజకీయ సిద్ధాంతములలో అనేకములు రాజ్యాధికారముతో నియమబద్ధ జీవితమునకును, రక్షణకును, మతమునకును గల సంబంధమును బలపరచుచున్నవి. భీష్ముడు ధర్మరాజునకు రాజధర్మములను తెలుపుచు 'ధర్మార్థ కామములు మూడును రాజధర్మముపై నాధారపడి యున్నవి. గుర్రమునకు బగ్గమును, నేన్గున కంకుశమును బోలె, లోకమునకు రాజధర్మమే శాసించునదై యున్నది. అట్టిరాజధర్మమే చెడనేని లోకము కట్టుపాటులేమి జెడక తప్పదు. సూర్యుడుదయించుచునే జీకటుల నడగించునట్లు, సరిగా వర్తించు రాజధర్మము లోకమును దుర్గతినుండి బాపుచున్నది. ఉత్తముడగు రాజు లేని రాష్ట్రమున నిలువదగదుగాన, ప్రజలు దాము సుఖింప గోరుదురేని నొక యుత్తముడు అగు క్షత్రియుని దమకు ప్రభునిగా నెన్నుకొని, వాని నభిషిక్తుంగావించికొనవలయును. మరియు నా భూరమణుని ద్వారమున గార్యము లెల్లగావించుకొనుచుండవలయును. ఆ రీతి వారొనర్పనిచో, తమలో దుష్టులగు గొందరు వెడలి, సాధుజనుల బాధించుటయ గాక, వారి ధన దారాదుల నపహరింప బూనుకొందురు. బలహీనులను బలవంతులగువారు పొలయించుటగలిగి, తుదికి చిరుత చేపలను గండుమీలు మ్రింగునట్లయి దురాచారములు మెండగుట సంభవించును. మరియు గృషియు, వాణిజ్యము, గోరక్షణము మున్నగు ప్రజల జీవనాధారములు పాడుబడును' అనియు, 'విష్ణు వంశమే రాజగుటను, భూనాయకు డెల్లవారికి వందనీయుడగుచు వచ్చుచుండెను' అనియు ఉపదేశించెను. ఇట్టి అభిప్రాయములు ఇతర రాజనీతి గ్రంథములందును వ్యక్తపరచబడి ఉన్నవి.

మా. వెం. రం.

# వివిధ ప్రభుత్వములు

అధికారమును చేపట్టినవారు దానిని దుర్వినియోగపరచకుండ అడ్డగించు మార్గములను అన్వేషించుట రాజనీతియందు ముఖ్యమగు సమస్య. ఒక సమాజములోని వ్యక్తులును, సంఘములును ఇతరవ్యక్తుల, సంఘముల స్వేచ్ఛకు ఆటంకము కలిగింపకుండ చూచుటకు బలవత్తరమగు రాజ్యాధికారము అవసరమగుచున్నది. ఇట్టి బలమగు అధికారమునకు రక్షకభటులు, సైన్యము, కారాగారములు మొదలగునవి సాధనములుగ ఉపయోగింపబడుచున్నవి. కాని, ఈ రాజ్యాధికారమును చేపట్టినవారు అవాంఛనీయములగు ఉద్దేశములు కలిగియుండు ప్రమాదము కలదు. మొట్టమొదట అట్టి అధికారమును వృద్ధిచేసికొని ఎల్లపుడును దానిని తామే నిర్వహింపవలయుననెడి అభిలాష నిత్యము

వారికి ఉండును. అందుకొరకు తమ అధికారమునందుండు అన్ని విధములగు సాధనములను వినియోగపరచెదరు. స్వలాభముకొరకు గాని, తమ బంధువులయు, స్నేహితులయు, సన్నిహితులయు, తమ పార్టీ యొక్కయు లాభము కొరకు గాని వీనిని వినియోగపరచు ప్రమాదము ఉన్నది. అధికార ఆపేక్షగల ప్రతి వ్యక్తియందును పై గుణములు సహజముగ కనిపించును. ఇదియే రాజకీయ రంగములోని అవినీతి. ఇట్లుచేయుట రాజ్యము యొక్క ముఖ్యోద్దేశమునే అలక్ష్యము చేయుట అగును.

నిరంకుశులు, క్రూరులు అగు పరిపాలకులు అన్ని కాలములయందు అధికారమందు ఉండిరి. ఇదిగాక అల్ప సంఖ్యాక ప్రభుత్వములు ఏర్పడిన ప్రతి రాజ్యమునందును (ఇట్టి ప్రభుత్వములే ప్రపంచమునందు వేలకొలది సంవత్సరములు అధికారము నందు ఉండినవి) అధికారమున ఉండినవారు ఇతర వర్గములపై నిరంకుశముగ పెత్తనమును చలాయించిరి. సామ్రాజ్య పరిపాలనా విధానమునందును, వలస రాజ్యముల పరిపాలనా విధానమునందును పరిపాలితుల యొక్క అవసరములు - పరిపాలకుల అవసరముల కొరకు - త్యాగము చేయబడినవి. ఈ ముఖ్య కారణము వలననే అధికారము చేపట్టినవారు దానిని దుర్వినియోగ పరచకుండుటకై తగిన కట్టుదిట్టములు చేయు సంస్థలు అవసరమయ్యెను.

ఈ కట్టుదిట్టములు రెండువిధములు : ఒకటి నైతికము ; రెండవది రాజ్యాంగసంబంధము. పరిపాలకులలో నైతిక దృక్పథము ఏర్పడునట్లు చేయుట మొదటి పద్ధతి. నిస్స్వార్థ పరత్వమునకు, సమయస్ఫూర్తికి, తెలివితేటలకు పేరెన్నిక గన్న మహనీయునికి పరిపాలనాధికారము అంతయు హస్తగతము చేసిన ఎడల పైనుడివిన విధముగ అధికారము దుర్వినియోగము కాదని ప్లేటో [చూ.] అను దార్శనికుడు తలచెను. భారతదేశమున కౌటిల్యుడు [చూ.] కూడ ఇట్టి ఉద్దేశ్యములనే కలిగి ఉండుటచే రాజకుమారులకు శ్రేష్ఠతమమగు విద్యను బోధించి తీరవలయునని తన అర్థశాస్త్ర గ్రంథమున పేర్కొనెను. ఈనాటికి కూడ ప్రజాస్వామిక దేశములలో కానిండు లేదా సర్వస్వాధికార రాజ్యములందు కానిండు నాయకులతోపాటు ప్రజలకు కూడ అట్టి విద్యాబుద్ధులు అవసరములనెడి భావన ఆదరింపబడుచున్నది. విద్యను అభ్యసించినయెడల ప్రతి అధికారియు జ్ఞానము పొంది తనకు హస్తగతమయిన అధికారమును దురాశాపీడితుడై దుర్వినియోగపరచుకొనడని వారి నమ్మకము.

కాని, అధికార దుర్వినియోగమును అరికట్టుటకు ఈ పద్ధతి ఒక్కటే సార్థకమైనది కాదు. నాయకుల విద్యాభ్యాసము వారి నైతికదృష్టికి కొంత తోడ్పడవచ్చును. సర్వలక్షణములు కలిగిన సుగుణరాశియగు మానవుడు ఉండుట చాల అరుదు. విద్యాభ్యాసమువలన చాల కొద్ది మంది మాత్రమే అట్టివారుగ తయారగుటకు అవకాశములు కలవు. అట్టివారు లభించినను వారిని గుర్తించుట సాధ్యము కాదు. ఒకవేళ అట్టి వ్యక్తులు గుర్తింపబడినను వారు అధికారమును చేపట్టుట యన తూష్ణీంభావము వహింపవచ్చును. అయినను అట్టివారు అధికార బాధ్యతలను స్వీకరించిన పిదప తమ అధికారమును దుర్వినియోగ పరుపరని నమ్మకమేమి ? అనేక దేశములలో విద్యావంతులగు అధికారులు అవినీతిపరులైన నిదర్శనములు అనేకములు కాననగును. ఏది ఎట్లయినను విద్యాబుద్ధుల వలన అధికారులలో దుర్నీతి వ్యవహారములు సమసిపోవని తేలుచున్నది. ఇందువలన అధికారము దుర్వినియోగపడకుండ అరికట్టుటకు రాజ్యపరిపాలనా యంత్రాంగమునందు తగు విధమగు సూత్రములను చేర్చుట లేదా బాహ్య విధానములను ఏర్పరచుట - అను మార్గమును అవలంబింపవలసి ఉన్నది. ఇదియే రెండవదియగు రాజ్యాంగ సంబంధమగు కట్టుదిట్టముల మార్గము.

ఈ కట్టుదిట్టములు కూడ రెండు రకములుగ ఉన్నవి. రాజ్యము యొక్కయు, రాజ్యాధికారమును వహించు వారి యొక్కయు మొత్తపు అధికారమునకు ఒక హద్దును కల్పించుట ఈ విధానములో మొదటిది. ఇందు ఏ యే రంగములలో ఎంతెంత అధికారము చలాయించవలెనో, ఏ యే రంగములలో రాజ్యాధికారము చలాయించరాదో, ఏ యే రంగములలో వ్యక్తులు గాని, సంఘములు గాని వారివారి ఇష్టానుసారము వ్యవహారములను జరిపించుకొనవచ్చునో నిర్ణయింపబడును. రాజ్యమునకును, సమాజమునకును మధ్య భేదము కలదను సూత్రముపై ఇది ఆధారపడి ఉన్నది. రాజ్యమునకు కల సర్వాధికారములు పరిమితములు అయినపుడు సహజముగ అవి దుర్వినియోగపడుటకు అవకాశములు తక్కువగును.

రాజ్యాధికారములను అన్నిటిని స్వతంత్రతాప్రతిపత్తి కలిగిన వివిధ సంస్థలకు పంచి ఇచ్చుట రెండవ పద్ధతి. దీనిప్రకారము అధికారము వివిధ సంస్థలకు నిర్దేశింపబడునే గాని, ఒకచోట కేంద్రీకృతమగుటకు అవకాశము లేదు. ఇట్టితరి అధికారము దుర్వినియోగము కాదు.

అధికారములు కేంద్రీకృతాధికారములు, విభాజితాధికారములు అని రెండు తెగలుగ విడదీసినపుడు ఆ యా పద్ధతులనుబట్టి రాజ్యములను నిరంకుశ ప్రభుత్వ రాజ్యములుగను, రాజ్యాంగ బద్ధ పరిపాలిత రాజ్యములుగను

క్రమముగ రెండు రకములుగ విభజనము చేయవచ్చును. నిరంకుశ రాజ్యములలో అధికారము ఒకే ఒక అధికార సంస్థయందు - ఆ సంస్థ వ్యక్తి కానిండు, కమిటీ కానిండు, సభ కానిండు లేదా ఒక రాజకీయపార్టీ కానిండు - కేంద్రీకృతమై ఉండును. నిరంకుశ రాజ్యములలో గాని, రాజ్యాంగబద్ధ రాజ్యములలో గాని దేశాధ్యక్షులు, ప్రధాన మంత్రులు, మంత్రిమండలులు, శాసనసభలు, కార్యనిర్వాహక వర్గములు అనునవి సహజ పరిపాలనా సంస్థలు. రాజ్యాంగ బద్ధ రాజ్యములలో ఈ ఒక్కొక్క సంస్థకు ప్రత్యేకాధికారమీయబడి, ఒకదానిపై ఇంకొకటి అధికారము దుర్వినియోగము కాకుండ పర్యవేక్షణ చేయుటకు అవకాశము కలదు. కాని, నిరంకుశ రాజ్యములలో సర్వాధికారములు, వాటిని నిర్వహించు అన్ని సంస్థలు ఒకే ఒకరి అధికారమునకు లోబడి, తద్ ఆజ్ఞానుసారము పరిపాలనసాగించును. ఇట్టి అధికారవిధానములోని తారతమ్యములవలననే నిరంకుశ రాజ్యములు, రాజ్యాంగబద్ధ రాజ్యములు అని వేర్వేరు రాజ్యములు ఏర్పడుచున్నవి.

నిరంకుశ రాజ్యములు రెండు విధములు : 1. అధికారతావాద (అథారిటేరియన్) రాజ్యములు ; 2. సర్వస్వాధికార (టోటలిటేరియన్) రాజ్యములు. అధికారతావాద రాజ్యములు రాజ్యాధికారమును కొంతవరకు పరిమితము చేయుటకు అంగీకరించి, అటుల చేయబడక శేషించి తమ స్వాధీనమందున్న అధికారమును చలాయించుటయందు మాత్రమే నిరంకుశత్వము చూపుచున్నవి. ప్రాచీన కాలమునాటి భారతదేశమందలి రాచరికములు, 16 వ శతాబ్దమునుండి యూరప్‌లో ఏర్పడిన నిరంకుశ ప్రభుత్వములు ఈ కోవలో చేరినవి. ఆనాడు భారత దేశములోని ప్రభువులు నిరంకుశులైనప్పటికి, ఆ యా ప్రదేశములందు అమలునందుండు సాంఘిక, ఆర్థిక, ఆచారవ్యవహారములలో జోక్యము కలుగచేసికొనకుండ వాటిని వివిధ మతములకు, కులములకు, వర్తక సంఘములకు వదలిరి. అధికారమంతయు ధర్మబద్ధమను సూత్రమును వారు గుర్తించిరి. ధర్మమునకు తాము కర్తలు కామనియు, ప్రజలచే దానిని పాటింపచేయుట మాత్రమే తమకు గల అధికారమనియు వారు నమ్మిరి.

సర్వస్వాధికార రాజ్యములలో వ్యక్తి జీవితమునకును, సామూహిక జీవనమునకును సంబంధించిన ప్రతి విషయమును - మినహాయింపులులేక - రాజ్యపరిపాలకుల ఆదేశానుసారము జరుగవలెను. అట్టి రాజ్యములలో రాజకీయము, రాజకీయముకాని విషయము అను భేదము పాటింపబడదు. ప్రతివిషయము రాజకీయ పరముగనే పరిగణింపబడును. వ్యక్తికి అస్తిత్వములేదను తత్త్వము ఈ సర్వస్వాధికార విధానమునకు మూలము. ఈ సిద్ధాంతములో జాతులు, వర్గములు మొదలగు సామూహికములకే నిజమైన అస్తిత్వము కలదు. వ్యక్తులకు స్వతంత్ర జీవితమేదియు లేదనియు, జాతియొక్కయు, దేశముయొక్కయు, వర్గముయొక్కయు అభివృద్ధికి తోడ్పడు సాధనము మాత్రమే వ్యక్తియనియు వీరినమ్మకము. ఇట్టి రాజ్యములలో అన్నిటియందు ప్రజలు జ్ఞానహీనులు అనియు, అట్టి ప్రజలు పరిపాలించుటకు సహజసామర్థ్యముగల శిష్టులయొక్కయు లేదా ఉన్నత వర్గములయొక్కయు అధికారమునకు లోబడవలసిన వారనియు అధికారుల అభిప్రాయము. ఈ పద్ధతిని అనుసరించు రాజ్యములో ఒక వ్యక్తి గాని, ఒక సమూహము గాని నాయకత్వము వహించవలయునను సూత్రము నిర్వివాదాంశముగ పరిగణింపబడుచున్నది.

ప్రజాస్వామిక రాజ్యములలో మౌలిక హక్కులుగ గుర్తింపబడు వాక్స్వాతంత్ర్యమునకు గాని, సాంఘిక స్వాతంత్ర్యమునకు గాని సర్వస్వాధికార రాజ్యములలో ఎట్టి ప్రసక్తియు లేదు. సర్వస్వాధికార రాజ్యము లన్నిటియందు రాజ్యాధికారము అంతయు ఏదియో యొక రాజకీయ పక్షము అధీనమున ఉండును. అది సోవియట్ రష్యా, చీనావంటి దేశములలో ఉన్న కమ్యూనిస్ట్‌పక్షము వంటిది కాని, ముసోలినీ నాటి ఇటలీలోని ఫాసిస్ట్‌పక్షము వంటిది గాని, హిట్లర్ నాటి జర్మనీలోని నాజీపక్షము వంటిది కాని, ప్రస్తుతము నాసర్ ఏలుబడిలోనున్న ఈజిప్టు, ఆయూబ్‌ఖాన్ ఏలుబడిలోనున్న పాకిస్తాన్ దేశములలోని అధికారపక్షముల వంటివి గాని కావచ్చును.

పై రాజ్యములలో ఆర్థిక, సాంఘిక విషయములు, విద్య, మతము, చిత్రకళలు, సారస్వతము, వినోదములు మొదలగు విషయములన్నియు ప్రభుత్వపరమై వారి ఇచ్ఛాప్రవృత్తుల ననుసరించి ఉండును. ఇందులో కూడ వ్యక్తులకు స్వాతంత్ర్యము లేదు. అట్టి రాజ్యములకు అండదండలు ప్రజాభీష్టము కాదు. ఈ ప్రభుత్వాధికారుల కనుసన్నలలో మెలగు సైన్యమే వాటికి అండదండలు. నేటికాలమున సోవియట్ రష్యా, చీనా, తూర్పు యూరప్ నందలి కమ్యూనిస్ట్ రాజ్యములు, ఉత్తర వియెత్నామ్, ఈజిప్టు, పాకిస్తాన్, ఘానా మొదలగు దేశములు సర్వస్వాధికార రాజ్యములు.

సర్వస్వాధికార రాజ్యోత్పత్తికి కారణములు అనేకములు. అందు 1917 లో రష్యాయందు జరిగిన సాంఘిక విప్లవము లాంటివి ఒక కారణము. ఈ రాజ్యమున నూతన సమాజమును

అత్యంత స్వల్పవ్యవధిలో రూపొందించు ప్రయత్నములో అంతర్గతముగ గాని, బాహాటముగ గాని తమ పక్షమునకు ఎదురగు వ్యతిరేకతను కమ్యూనిస్ట్ పక్షమువారు రూపుమాపి, సర్వస్వాధికారమును చేపట్టిరి. ఇతర దేశములు కొన్ని వారిని అనుకరించినవి. ప్రథమ ప్రపంచ యుద్ధము వలన ప్రజలలో కలిగిన సంక్షోభము, అశక్తత మూలమున ప్రజాస్వామ్యము విఫలత నొందుటయు, జర్మనీ, ఇటలీ దేశములలో సర్వస్వాధికార రాజ్యోత్పత్తికి, ఫాసిస్ట్ ఉద్యమవ్యాప్తికి కారణములయ్యెను. వలస విధానము నుండి ఇటీవలనే విముక్తిగాంచిన ఆసియా, ఆఫ్రికాఖండము లందలి రాజ్యములలో ప్రజలు ప్రజాస్వామిక సంస్థలను నడుపుటయందు అనుభవము లేనివారగుట చేతను, ప్రజాస్వామిక సంబంధమగు స్వాతంత్ర్యముల విలువను గ్రహింపలేని వారగుటచేతను ఈ సర్వస్వాధికారపరిపాలన తప్పనిసరి అయ్యెను. అచటి ప్రజలు దారిద్ర్య సమస్యను పరిష్కరించుటయందును, అందుకై సత్వరమగు ఆర్థిక అభివృద్ధిని సాధించుటయందును ఉత్సాహము కలిగిన వారగుటచేత వారికి ఈ సర్వస్వాధికార విధానమే రుచించినది.

ఆధునిక సాంకేతిక పరిజ్ఞానము ఈ విధానమునకు దోహదము కల్పించినది. ఈ కాలపు మారణాస్త్రములు రాజ్యము యొక్క అధికారమును అత్యధికముగ వృద్ధిచేయగలిగినవి. అందువలన సాయుధులగు ప్రజల తిరుగుబాటులు అసాధ్యములు అగుచున్నవి. ప్రభుత్వమునకు రేడియోలు, పత్రికలు, సినిమాలు ఉపయోగకరములగు ప్రచార సాధనములు. ప్రభుత్వము యొక్క అభిప్రాయములను ఏకోన్ముఖముగ ప్రజాహృదయములలో నాటుకొనునట్లు చేయుటకు ఇవి ఉపయోగపడుచున్నవి. ఇందువలన ప్రజలందరు వైవిధ్యము ఎరుగని ఏకమనస్కతకు లోనయ్యెదరు. ప్రభుత్వము యొక్క అభిప్రాయములే వారి అభిప్రాయములు అగును. మరియు పారిశ్రామికాభివృద్ధి చెందిన దేశములందును, అట్టి వృద్ధి కాంక్షించు ఇతర దేశములలోను ప్రాచీన కాలమునుండి సంప్రదాయసిద్ధముగ అధికారము వహించుచు వచ్చిన మతపీఠాధిపత్యములు, కుటుంబము మొదలగు సంస్థలు క్షీణత పొందినందున వాటి స్థానమును ఆక్రమించి ప్రజలపై పూర్తి అధికారము వహించుటకు సర్వస్వాధికార రాజ్యములకు అవకాశము ఏర్పడినది. మా. వెం. రం.

# ప్రజాస్వామిక రాజ్యము

నిరంకుశ, రాజ్యాంగబద్ధ రాజ్యములమధ్య తారతమ్యములలో ముఖ్యముగ చెప్పుకొనదగినది అధికార విభజన [చూ]. రాజ్యాంగబద్ధ రాజ్యములు ప్రజాస్వామికములు కాని, ప్రజాస్వామికములు కానివి కాని అయి ఉండవచ్చును. రాజ్యాంగబద్ధములు అయ్యును, ప్రజాస్వామికములు కాని రాజ్యములు అరుదుగ ఉండును. కాన, మన చర్చనీయాంశమంతటిని రాజ్యాంగబద్ధములయిన ప్రజాస్వామిక రాజ్యములను గురించియే కేంద్రీకరింపదగును. ప్రజాస్వామ్యమున అధికారము కేంద్రీకృతము కాకుండ విభజితమగునను ముఖ్యలక్షణమును అనుసరించియే అట్టి రాజ్యమున ప్రజలు ఒక నియోజకవర్గముగ రూపొంది రాజ్యాధికారము నమలు జరుపుటలోను, అదుపునందుంచుకొనుటలోను, అధికారమున భాగస్వామ్యముగల తక్కిన వారిపై అదుపు వహించుటకు స్వత్వము కలిగియుండుట ఏర్పడినది. ఇట్లు ఏర్పడుట ప్రజాస్వామిక మూలభావనను అనుసరించియే జరుగుచున్నది. రాజ్యాధికారమునకు కుదురు ప్రజలే అనియు, సర్వసత్తాకత వారియందే న్యస్తమై ఉన్నదనియు ఈ ప్రజాస్వామిక మూలభావన విశదము చేయుచున్నది. ఈ మూలభావనను అనుసరించియే తత్ఫలితముగ ప్రజాస్వామ్యరాజ్యమున ప్రభుత్వము ప్రజల ఎన్నిక మార్గముననే అధికారమునకు రాగలుగుచున్నది. అధికారమందున్న ఒక ప్రభుత్వమును తొలగించి, దాని స్థానమున వేరొక ప్రభుత్వమును నెలకొల్పుటకును ప్రజలకు హక్కు కలదు. అందువలనే ప్రభుత్వమును ఎన్నుకొనుటకును, దానిని తొలగించుటకును గల హక్కును ప్రజలు చలాయించుటకు అవకాశము నొసగు రాజ్యాంగ విధానమే 'ప్రజాస్వామ్య' మని నిర్వచించుట ఉత్తమము.

ప్రజాస్వామ్యమున ఎన్నికలు నిర్ణీతకాలావధిలో జరుగుచుండును. ఏ ఒక వ్యక్తియు జీవితపర్యంతము ఒక పదవికి ఎన్నుకొనబడకూడదు. అట్లయినచో పదవిని అలంకరించినవారు బాధ్యతారహితముగ నిరంకుశపాలన నెరపుటకు ఆస్కారము కలదు. ఏ ఒక ప్రభుత్వమును నిరవధికముగ ప్రభుత్వపాలన జరుపుటకు ప్రజాస్వామ్య సంప్రదాయములకు విరుద్ధము. ప్రజలకు ప్రభుత్వముపై గల అధికారము దేశమున జరుగు ఎన్నికలవలన వ్యక్తమగుచున్నది.

ప్రజాస్వామికముపై నమ్మకములేక, ఎన్నుకొనబడినంతనే ప్రజాస్వామ్యమును నశింపచేసి, ఏకాధిపత్యరాజ్యమును స్థాపించు ఆదర్శము గల ప్రభుత్వమును మాత్రము ఎన్నుకొనుహక్కు వోటరులకు లేదను విషయము ఇందే గర్భితమై ఉన్నది. ప్రజాస్వామిక రాజ్యాంగమున విశ్వాసము లేని కమ్యూనిస్ట్లు గాని, ఫాసిస్ట్లు గాని ప్రభుత్వమునకు

ఎన్నుకొనబడుటవలన పై చెప్పిన ప్రమాదములు జరుగ వచ్చును. ప్రజాస్వామ్యవ్యతిరేకులను ఎన్నుకొనుట ఆత్మ హత్యా సదృశమగును. అట్టివారిని ఎన్నుకొనిన అధిక సంఖ్యాక ప్రజలు భవిష్యత్తులో తాము ఎన్నుకొను హక్కు పోగొట్టుకొనుటయే కాక, తక్కిన అల్పసంఖ్యాకులకు కూడ ఆ హక్కును లేకుండ చేయుచున్నారు. అంతేకాదు, భావి పౌరులకు కూడ అట్టి హక్కులేనట్లు వారు చేయు చున్నారు. ఈవిధముగ రాబోవు తరములవారిని కూడ బానిసలుగ చేయుట న్యాయసమ్మతము కాజాలదు. ఈ దృష్టితో చూచినపుడు ప్రభుత్వమును ఎన్నుకొనుటకు ప్రజలకు గల అధికారము పరిమితమైనదే అని చెప్పనగును.

ప్రజలకు ప్రభుత్వమును ఎన్నుకొనుటకు, తొలగించు టకు గల అధికారము ఎన్నికలు స్వేచ్ఛగను, న్యాయము గను జరిగినపుడు మాత్రమే చక్కగ అమలులోనికి రాగలుగుచున్నది. జన్మ, కుల, మత, వర్గ, వర్ణ, భాషా భేదములతో నిమిత్తములేక ఏ పౌరుడైనను ఎన్నికలలో అభ్యర్థిగ పోటీచేయుటకు స్వతంత్రత కలిగి ఉన్నాడను విషయము 'స్వేచ్ఛాయుతమగు ఎన్నిక' అను దాని యందు ఇమిడి ఉన్నది.

ఉపన్యాసములు, కరపత్రములు, సమావేశములు మొద లగు ప్రచార సాధనముల ద్వారా తాము ప్రతిపాదించు అభ్యర్థికి అండగనిలచి ప్రచారము చేయుటకు ఏ రాజకీయ పక్షమునకైనను హక్కు ఉన్నదను విషయము ఇందువలన స్పష్టమగుచున్నది. మరియు ప్రభుత్వములోని లోపము లను ఎత్తిచూపి, వాటిని సవరించి, పరిపాలన చక్కపరచు మార్గోపాయములను వెల్లడించి తమ పక్షమును ఎన్నుకొను నట్లు ప్రజలను అభ్యర్థించు హక్కు రాజకీయ పక్షములకు కలదు. ఈ కారణమువలననే వాక్స్వాతంత్ర్యము, రచనా స్వాతంత్ర్యము, సమావేశ సంఘటనా స్వాతంత్ర్యములు ప్రజాస్వామ్య రాజ్యమునందలి ప్రజలకు ప్రాథమిక హక్కులుగ గుర్తింపబడుచున్నవి. ప్రజాస్వామ్యమునందు నాయకత్వము ఒకనికే చెందవలసినదికాదు. అది పోటీ వలన తేలవలసిన విషయము. అంతేకాని, ఒకే పక్షము యొక్కగాని, ఒకేవ్యక్తి యొక్కగాని సొత్తు కాదు.

ఈ రాజకీయ వ్యవస్థయందు పరిపాలనా వ్యవహారములు అన్నియు చర్చింపబడిన తరువాతనే నిర్ణయమునకు రాగలవు. ప్రభుత్వము నిర్వహింపవలసిన విధులేవి ? అవి జోక్యము కలుగచేసికొననవసరము లేని విషయము లేవి ? ప్రభుత్వము అనుసరింపవలసిన విధానమేది ? అను విషయ ములు చర్చాంతమున తేలవలెనేగాని, బలప్రయోగముల ద్వారా నిర్ణయింపబడకూడదు. కావుననే ప్రజాస్వామ్యము చర్చలమూలమున ఏరుపడు పరిపాలనా విధానమనీ కొందరు రాజకీయ శాస్త్రజ్ఞులు నిర్వచించుచున్నారు.

ప్రజలలో ఏకగ్రీవాభిప్రాయము ఎల్లప్పుడును సాధ్యము కాని కారణమున ప్రజాస్వామ్యములో అధిక సంఖ్యాకుల అభిప్రాయమును బట్టియే విషయ నిర్ణయము జరుగు చున్నది. కాని, ఇంతమాత్రముచేత ప్రజాస్వామ్యమనగా అధిక సంఖ్యాకుల ప్రభుత్వమని నిర్వచింపరాదు. కారణ మేమన, అధిక సంఖ్యాకుల నిర్ణయమేదియు శాశ్వతముగ అమలులో ఉండునట్టిదికాదు. అధికసంఖ్యాకులు చేసిన నిర్ణయములకు విరుద్ధముగ ప్రజలలో ప్రచారముచేసి, తమ అభిప్రాయమునకు అధికసంఖ్యాప్రాబల్యము తెచ్చుకొను టకు గల హక్కు అల్పసంఖ్యాకులకు కలదు. ప్రజాస్వామ్య ములో శాశ్వతమైన అల్పసంఖ్యాక పక్షము గాని, అధిక సంఖ్యాక పక్షము గాని ఉండదు; ఉండుటకు వీలులేదు.

ప్రజాస్వామ్యమునందు ఒకవిషయముపై తీసికొను నిర్ణయములు సత్యాసత్యములమీదను, తప్పొప్పులమీదను ఆధారపడక సమయానుకూలముగ ప్రజలకు ఏది వాంఛ నీయము, ఏది వాంఛనీయము కాదు అనుదానిపై ఆధారపడి ఉండును. తప్పొప్పులు కాని, సత్యాసత్యములు కాని అధిక సంఖ్యాకుల అభిప్రాయమునుబట్టి నిర్ణయింప సాధ్యముకాదు. భూమి గోళాకారముగ ఉండక, సమ తలముగ ఉన్నదని అధికసంఖ్యాకులు అభిప్రాయపడినను, భూమి సమతలముగ ఉండబోదు సరిగదా గోళాకార లక్షణము మారదు.

ఒక సమయములో తమకు కావలసినదేదియో, మరి యొక సమయములో తమ అవసరము లేవియో, ఒక సమయములో తమకు ఎవరు పరిపాలకులుగ ఉండ వలెనో, వేరొక సమయములో ఎవరు అధికారమునకు రావలయునో అను విషయములను అధికసంఖ్యాకులు నిర్ణయింపవచ్చును. అల్పసంఖ్యాకులు అధిక సంఖ్యాకుల అభిప్రాయమును రెండు కారణముల వలన శిరసా వహింతురు :

1. అధిక సంఖ్యాకుల అభిప్రాయము ఏ సందర్భమునను అల్ప సంఖ్యాకులు అనుభవించు నైతిక, ఆధ్యాత్మిక విషయము లకు సంబంధించిన విలువలకు భంగము కలిగించదు. ఏ ప్రజాస్వామ్యము కూడ ఇట్టి విషయములందు సర్వస్వాధి కార రాజ్యములలోవలె జోక్యము కలిగించుకొనదు ;
2. అల్పసంఖ్యాకులకు అధిక సంఖ్యాకుల అభిప్రాయములో మార్పు తీసికొనివచ్చు హక్కు ఉన్నది. అల్పసంఖ్యాకులు కాలక్రమమున అధికసంఖ్యాకులు అగు అవకాశము ఉన్నది.

ఎన్నికలు వాస్తవముగ ప్రజాస్వామ్య సిద్ధాంతము ననుసరించి జరుగవలెనన్న వయోజనులకు వోటింగు హక్కు

ఉండితీరవలయును [చూ. ఎన్నికలు]. వోటు చేయదగు వయోజనుల పేర్లను వోటర్ల జాబితాలో చేర్చవలెను. ప్రతి నియోజకవర్గమునందును సాధ్యమైనంతవరకు సమాన సంఖ్య గల వోటర్లు ఉండవలయును. ఎన్నికలన్నియు ఎలక్టొరల్ కమీషన్ (ఎన్నికల కమీషను) వంటి నిష్పాక్షిక సంఘములచే నిర్వహింపబడవలెను. అట్టి కమీషన్ ఏర్పాటుకు భారత రాజ్యాంగమునందు అవకాశము ఇవ్వబడినది.

ఎన్నికలవలన ఏ పక్షము ప్రభుత్వమునకు రావలెననుట నిర్ణయమగుటయేకాక, ఏ యే విధానములను ప్రభుత్వము అనుసరింపవలెననుట కూడ నిర్ణయమగును. పూర్వము పలు బడిలో ఉన్న ప్రభుత్వమే తిరిగి ఎన్నుకొనబడినపుడు ఆ పూర్వప్రభుత్వము అనుసరించు పరిపాలనావిధానము లను ప్రజలు ఆమోదించినట్లగును. కాని, ఆ ప్రభుత్వము ఎన్నికలలో పరాజయమొందినప్పుడు ఆ విధానములు జనామోదితములు కాలేదనియు, క్రొత్త విధానములను ఆచరణలో పెట్టవలసిన సమయము ఆసన్నమైనట్లును గుర్తింపవలయును. ప్రతి రాజకీయపక్షము అధికారము లోనికి రావలయుననియు, సంపాదించిన అధికారము వదలరాదనియు, వాంఛించుటచేత ప్రజల ఇష్టానిష్టములను తెలిసికొని తదనుసారము తమ విధానములను అనుసరింప గోరుచున్నవి. ఈ కారణముచేతనే ప్రజాస్వామ్యము నందు పరిపాలనా కార్యకలాపములలో ప్రజలు కూడ భాగస్వాములనియు, కర్తవ్యాకర్తవ్యములను నిర్ణయించి నిర్వహించుట యందు వారికి కూడ స్థానము కలదనియు చెప్పవచ్చును.

ప్రజలకొరకు ప్రజలచేత పరిపాలింపబడు ప్రభుత్వము గల రాజ్యమే 'ప్రజాస్వామ్య' మని కొందరి నిర్వచనము. కాని, ఇది సరియగు నిర్వచనము కాదు. ఇట్టి ప్రజా స్వామ్యము ఒక చిన్న గ్రామమునందుగాని, ఒక పట్టణ మందుగాని సాధ్యమగును. అట్టి ప్రదేశములలో మాత్రమే ప్రజలందరు ఒక సభలో సమావేశమై రాచకార్యములను చర్చల మూలమున జరుపుకొనుటకు అవకాశము కలదు. అప్పుడు కూడ చేసిన నిర్ణయములను అమలు పరచుటకు కార్యనిర్వాహకులు నియమింపబడవలయును. కాని, దేశ వ్యాప్తమైన రాజ్యములలో ప్రజలచే స్వయముగ పరిపా లింపబడు ప్రజాస్వామ్యములు ఉండుటకు అవకాశము లేదు. పరిపాలనలో ప్రావీణ్యము, నేర్పు కలిగియుండుట పరిపాలకులకు ముఖ్యము. ప్రజలందరికిని ఇట్టి ప్రత్యేక అర్హతలు ఉండవు. తత్కారణముననే ప్రజలు పరిపాలకు లను ఎన్నుకొందురు.

ప్రజలకొరకు పాటుపడు ప్రభుత్వమే ప్రజాస్వామ్యమని దానికి మరియొక నిర్వచనము కలదు. కాని, ప్రజలకొరకు పాటుపడనని చెప్పు ప్రభుత్వము ఏనాడును కానరాదు. ఏమన ప్రతిప్రభుత్వము ప్రజాశ్రేయస్సుకొరకు పాటుపడు చున్నట్లే చెప్పుకొనును. ఈ నిర్వచనము ప్రకారము నిరం కుశులగు స్టాలిన్, హిట్లర్ కూడ తమ ప్రభుత్వములు ప్రజలశ్రేయోభివృద్ధికొరకే పాటుపడు ప్రజాస్వామ్యము లని చాటుటకు అవకాశము ఉండెడిది. కనుక ఈ నిర్వ చనము కూడ సరియైనది కాదు. ప్రభుత్వమును ఎన్నుకొను స్వతంత్రత ప్రజలకు గల రాజ్యమే ప్రజాస్వామ్యమని నిర్వచించుట సమంజసము.

రాచరికపాలన ఉండవలయునా లేదా గణరాజ్యపాలన ఉండవలయునా అను విషయములను, ఇతర ప్రత్యేక విషయములను కూడ నియోజకసమితి (ఎలక్టరేట్) నిర్ణయ మునకు వదలుట కొన్ని దేశములలో ఆచారము కలదు. కొన్ని రాజ్యములలో రాజ్యాంగ పరిషత్తులచే నూతనముగ రూపొందింపబడిన రాజ్యాంగమును, రాజ్యాంగమునకు సంబంధించిన సవరణలను కూడ ప్రజాసమ్మతికే వదలుట సంప్రదాయము. స్విజర్లండ్‌వంటి కొన్ని రాజ్యములలో ప్రజానిర్ణయ (రెఫెరెండమ్), శాసనోపక్రమణ (ఇనీషి యేటివ్) విధానములు అమలునందున్నవి. శాసన సభలచే ఆమోదింపబడిన బిల్లు ప్రజామోదమును పొందిన తరు వాతనే చట్టమగుచున్నది. ఇదియే ప్రజానిర్ణయ విధానము అగుచున్నది. శాసనోపక్రమణ విధానములో చట్టములు చేయవలసిన విషయములను ప్రజలే ప్రభుత్వమునకు నివే దింతురు. దేశముల సరిహద్దులు మొదలగు విషయములను ఒక్కొక్కప్పుడు జనవాక్యము (ప్లెబిసైట్) [చూ.] నకు నివే దించుట కూడ చరిత్రగతియందు కాననగును; కాని, ఈ విధానము రోషావేశములకు దారితీయుటకు అవ కాశము కలదు. ప్రజానిర్ణయ, ఉపక్రమణ విధానములు ప్రపంచములో కొద్ది దేశములలో మాత్రను అమలునందు ఉన్నట్లు కాననగును.

ప్రజలలో ఒక వర్గముయొక్క కాని, ఒక శాఖయొక్క కాని శ్రేయస్సుకొరకై కాక, ప్రజలందరి శ్రేయస్సుకై పాటుబడగలదను కారణమునను, ఇట్టి ఆదర్శము నెరవేరు టకు ప్రజలందరు ఎన్నుకొనునట్టియు, వారికి బాధ్యత వహించినట్టియు ప్రభుత్వమొక్కటియే సాధనమను కారణ మునను ప్రజాస్వామ్య విధానము సమర్థింపబడుచున్నది. ప్రభుత్వముయొక్క మంచి చెడ్డలు అది అనుసరించు కార్య కలాపముల ఫలితములనుబట్టియే నిర్ణయించుట యుక్తము. ప్రభుత్వము నిర్వహించు కార్యనిర్వాహకులకు ప్రత్యేక

నిపుణత, శక్తిసామర్థ్యములు అవసరములు; కాని, వారు నిర్వహించు కార్యముల ఫలితములు మంచివా కావా అని నిర్ధారణ చేయదగినవారు ప్రజలొక్కరే. క్రొత్త చెప్పులు కరచినవో లేదో అవి ధరించినవారికే తెలియును కాని, వాటిని కుట్టినవానికి తెలియదు కదా! అట్లే శాక పాకముల రుచి భోక్తలకే తెలియనగును.

ఆధునిక కాలమున సంఘమునందు దారిద్ర్యము, అనారోగ్యము, రోగములు ఉండనవసరము లేదనియు, వాటి నిర్మూలనకై కంకణము కట్టుకొనిన ప్రభుత్వము వాటిని నిర్మూలింపగలదనియు ఈనాటి ప్రజల విశ్వాసము. నేటి ప్రజాస్వామ్య రాజ్యములలో ఒకటియగు ఇంగ్లండు వంటి రాజ్యములలో మాత్రమే పైచెప్పిన పరిస్థితుల నిర్మూలనకై ప్రథమముగ చర్యలు తీసికొనబడినవి. సర్వ స్వాధికార రాజ్యములు తరువాత మెల్లగ వాటి అడుగు జాడలలో నడచినవి. ఈ కారణము వలననే అనేకులకు ప్రజాస్వామ్యముపై విశ్వాసము ఏర్పడినది. సాంఘిక వ్యవస్థలో కలుగవలసిన మార్పులు శాంతియుతముగ జరుగుటకు అవకాశము కల్పించి, రక్తపాతముతో కూడిన విప్లవముల అవసరమును ప్రజాస్వామ్యము తగ్గించుచున్నది.

తక్కిన రాజ్యాంగములందు కన్నను ప్రజలు న్యాయ బద్ధులగుటకును, దేశభక్తులుగను, ప్రజాసేవాతత్పరులు గను ఉండుటకును ప్రజాస్వామ్యము తోడ్పడుచున్నది. ఏ యే చట్టములకు బద్ధులుగ ప్రజలు నడచుకొనవలెనో ఆ యా చట్టముల నిర్మాతలు తమ ప్రతినిధులే అయినందు వలన వాటిని అయిష్టతతో కాక, ఇష్టతతోనే ఆమో దించి ఆ చట్టములు నిర్ణయించు హద్దులను అతిక్రమింపక ప్రజలు నడచుకొందురు. ప్రభుత్వము తమ సొంతమని భావించుకొన్నపుడు ప్రజలు తమకును, ప్రభుత్వమున కును అవినాభావ సంబంధమును ఆపాదించుకొని, ప్రభుత్వ కార్యకలాపములలో సార్వజనీన ఉత్సాహముతో పాల్గొందురనుట నిస్సందేహము.

ఎన్నుకొనుటకు ప్రజలకు గల సమర్థతనే 'స్వేచ్ఛ' అన వచ్చును. ప్రజాస్వామ్యమున తమ పాలకులను, వారు అనుసరింపవలసిన విధానములను, కార్యక్రమములను స్థూలరీతిలో నిర్ణయించి ఎన్నుకొనుటకు ప్రజలు సమర్థత కలిగి ఉందురు. ఇట్టి స్వేచ్ఛకే రాజకీయ స్వాతంత్ర్యము - రాజకీయరంగమున స్వతంత్రత - అను పర్యాయ నామము ఏర్పడెను. వాక్స్వాతంత్ర్యము, సమావేశస్వాతంత్ర్యము ప్రజలకున్నపుడు మాత్రమే ఈ స్వాతంత్ర్యము సార్థకత వహించగలదు. అందువలననే ప్రజాస్వామ్యమనగా పైన ఉదాహృతములగు పౌరస్వాతంత్ర్యములు కలిగి ఉండుట అని అర్థము సిద్ధించుచున్నది. ప్రజాస్వామికము కాని రాజ్యమున ఇట్టి పౌరస్వాతంత్ర్యములు అమలునందు ఉండ నేరవు.

ప్రజాజీవితమునందలి ఒక రంగమునకుమాత్రమే రాజ కీయ స్వాతంత్ర్యము పరిమితమై ఉన్నది. కాని, జీవిత ములో ఆర్థిక, ఆధ్యాత్మిక రంగములవంటి ఇతర రంగ ములు కూడ కలవు. అందుచేత ఆర్థిక స్వాతంత్ర్యము, మత స్వాతంత్ర్యము అను వాటికి కూడ ప్రసక్తి కలుగుచున్నది. ప్రజాస్వామిక ప్రభుత్వము కూడ ఇట్టి స్వాతంత్ర్యములపై ఆంక్షలు విధింపవచ్చును. అధికసంఖ్యాకులు వాటికి అను కూలురై ఉండవచ్చును. కాని, అంతమాత్రముచేత ప్రభు త్వము ప్రజాస్వామిక లక్షణమును కోల్పోవుచున్నదని చెప్పరాదు. ప్రజాస్వామ్య ప్రభుత్వము మద్యపానము, జూదము, వ్యభిచార వృత్తి మొదలగు వాటిని నిషేధింప వచ్చును. ఇవన్నియు స్వేచ్ఛపైన విధింపబడు నిర్బంధ ములే. అట్టి నిర్బంధములు ఏదేని ప్రజాస్వామ్యముకాని ఒక రాజ్యమందు లేకపోవచ్చును. కాని, ఈ కారణమున ప్రజాస్వామిక రాజ్యము దాని లక్షణమును పోగొట్టు కొనదు. ప్రజలకు రాజకీయ స్వాతంత్ర్యము ఉండుటయే ప్రజాస్వామిక రాజ్యమునకు ప్రధాన లక్షణము. తక్కిన స్వాతంత్ర్యములు ఉండవచ్చును; లేకపోవచ్చును.

కాని, ప్రజాస్వామికములో ఇట్టి నిర్బంధములవలన నష్టపడు అల్పసంఖ్యాకులు అధిక సంఖ్యాకులకు నచ్చచెప్పి, వారి అభిప్రాయమును మార్చుటకు తగిన అవకాశము ఉన్నది. అందుచేత రాజకీయ స్వాతంత్ర్యము తక్కిన స్వాతంత్ర్యములన్నిటికిని ప్రధాన సాధనము. దానితో తక్కిన స్వాతంత్ర్యము లన్నిటిని సంపాదింపవచ్చును.

కొందరు ప్రజాస్వామ్యమును ధనికవర్గ పరిపాలనయని నిర్వచింతురు. కమ్యూనిస్ట్ పక్షమువారు ఈ విధముగ ఖండించుచుందురు. కాని, ఇది సరియగు ఖండన కాదు.

దేశములోని ప్రతి ఒక బీదవానికి గల అధికారము కన్నను ఒక్క ధనికునికి గల అధికారము మిక్కుటమనుట వాస్తవము. కాని, ఇంతమాత్రముచేత ప్రజాస్వామ్యములో ధనికులకు గల మొత్తపు అధికారము దేశములోని పేద లందరి మొత్తపు అధికారముకన్న ఎక్కువని చెప్పుట సరి కాదు. బీదప్రజలదే అధిక సంఖ్యాబలము. అనేక ప్రజాస్వామ్యములలో కార్మికపక్షమువారు చేయుచున్నట్లు పేదలందరు ఒక పక్షముగ ఏర్పడియున్న యెడల వారి అధి కారము ధనికుల అధికారముకంటె అధికముగనే ఉండును. అట్టి పక్షములుగ నిర్మాణమగుటచేతనే వారు ధనికులపై ఎక్కువ పన్నులు విధించుటకును, అనాదిగ ధనికులు

అనుభవించుచుండిన అధికార పదవులనుండి వారిని తొలగించుటకును శక్తిగలవారైరి. ధనికులందరు ఎల్లపుడు కలసి కట్టుగ ప్రవర్తించుట లేదు. వారిలో వారు అనేక ఉపవర్గములుగ చీలిపోవుచుందురు. ఇదికూడ వారి బలహీనతకు కారణము.

ప్రజాస్వామ్యము జయప్రదమగుటకు రాజ్యములో తగిన నాయకత్వము ఉండవలెను. తగిన నాయకులు ప్రజలను క్రమమార్గమున నడిపింతురు. ప్రజలు చెప్పిన మార్గముననే వారు నడువరు. తమకు (నాయకులకు) ఏది న్యాయమని తోచునో దానిని ప్రజలు సమర్థించవలెనని చెప్పగల ధైర్యము వారికి ఉండును. ప్రజలు కోరిన పనులు వారి (ప్రజల) నిజమైన శ్రేయస్సుకు భంగకరములని నాయకులు అనుకొన్నప్పుడు వారి అధికారమును వారు వదలుకొనుటకు సిద్ధపడుదురే కాని, ప్రజల వాంఛలను కొనసాగింపరు. వారు ప్రజలను ఆవేశపూరితులను చేసి, వారి వోట్లను సంపాదింప ప్రయత్నించునట్టివారు కారు; సొంత అభిప్రాయములేవియు లేక, ప్రజల అభిప్రాయములే తమవని ఆర్భాటములుచేయు రాజకీయ ఆశావాదులును వారు కారు. నాయకులకు బదులుగ ఇట్టి ఆశావాదులకు ప్రజాస్వామ్యము లోబడినపుడు అది వినాశముగాంచు ప్రమాదము ఏర్పడుచున్నది.

నేటి ప్రజాస్వామ్యములు అన్నిటియందును రాజ్యాంగములు ఉన్నవి. ఏవియో కొన్ని రాజ్యాంగములు తప్ప తక్కినవన్నియు లిఖితములు. ప్రభుత్వము అనుసరింపవలసిన మూలసూత్రములను, విధానములను, అధ్యక్షులు, మంత్రివర్గము, శాసనసభ, న్యాయస్థానములు మున్నగు ప్రభుత్వాంగములు నిర్వహించవలసిన అధికారములను, ప్రభుత్వమునకు, పౌరునికి గల సంబంధమును రాజ్యాంగము నిర్ణయించుచున్నది. ప్రభుత్వ కార్యకలాపములన్నియు రాజ్యాంగబద్ధములుగ ఉండవలయును. ప్రజాస్వామ్య రాజ్యాంగములు రాజ్యము యొక్క మొత్తపు అధికారమును పరిమితముచేసి, ఆ అధికారమునంతను ప్రభుత్వ శాఖలమధ్య విభాగించుచున్నవి. అందువలననే రాజ్యాంగబద్ధరాజ్యమనిన పరిమితాధికారములు గల రాజ్యమని చెప్పబడుచున్నది.

ప్రజాస్వామిక రాజ్యములన్నింటిలో లిఖిత రాజ్యాంగములు ఉండుటకు కారణము నిరంకుశ ప్రభువులపై ప్రజలు తిరుగుబాటుచేసి, ప్రజాస్వామికమును స్థాపించుటయే. అట్టి నిరంకుశ ప్రభుత్వములు పునఃప్రతిష్ఠితములు కాకుండుటకు ప్రభుత్వాధికారములను, ప్రజల హక్కులను, ప్రభుత్వపు అధికారములను చలాయించదగిన క్రమమును నిర్ణయింపగలది లిఖితరాజ్యాంగము మాత్రమే అని ప్రజాస్వామిక వాదులు భావించిరి. రాజ్యాంగము ఇటు ప్రజకు, అటు ప్రభుత్వమునకు జరిగిన లిఖితరూపమగు ఒప్పందము వంటిది. రాజ్యాంగములు అనేకములు ప్రత్యేక రాజ్యాంగ పరిషత్తుల ద్వారా నిర్మాణమగుటకును, అవి మూల శాసనములని భావింపబడుటకును, వాటికి విరుద్ధముగ ఉండు సామాన్య శాసనములును, ప్రభుత్వకార్యములును చెల్లవని న్యాయస్థానములు ప్రకటించుటకును ఇదియే కారణము. భారత రాజ్యాంగ నిర్మాణక్రమము, ఉన్నత న్యాయస్థానము, దాని ఆధిక్యతను నిలబెట్టు విధానము అందులో సవరణలు చేయుటకు అనుసరింపబడు కార్యక్రమములు ఈ విషయమును స్పష్టపరచుచున్నవి.

లిఖిత రాజ్యాంగము ఉన్నంత మాత్రమున ప్రభుత్వము దానిని అనుసరించియే నడచుచున్నదని చెప్పుటకు వీలు లేదు. ప్రజాస్వామ్యము వేరులు పాతుకొనిపోయిన గ్రేట్ బ్రిటన్, యునైటెడ్ స్టేట్స్, స్కాండినేవియా దేశముల లోను, ఆస్ట్రేలియా, న్యూజీలండ్ మున్నగు దేశములలోను మాత్రమే రాజ్యాంగమును అనుసరించి తు. చ. తప్పక ప్రభుత్వ పరిపాలన నెరపబడుచున్నది. ప్రభుత్వమును చేపట్టినవారు రాజ్యాంగము ప్రకారము అక్షరశః పరిపాలన చేయుచున్నారు. రాజ్యాంగమును అనుసరించి పరిపాలన జరుగుచున్నదియు, లేనిదియు వేయికండ్లతో కనిపెట్టి ప్రజలు కూడ పరిశీలించుచుందురు. భారతదేశము, సిలోన్, బర్మా మున్నగు దేశములు చాలకాలము నిరంకుశ పాలనకు లోనై తద్విముక్తి అనంతరము ఇటీవలనే ప్రజాస్వామ్య రాజ్యములైనవి. ఈ దేశములలో ప్రజలిపుడిపుడే ప్రజాస్వామిక ప్రభుత్వము నడపుటను నేర్చుకొనుచున్నారు. దానియందు వారికి గౌరవ విశ్వాసములు కలుగుటకు కొంతకాలము పట్టును. అందుచేత ప్రజాస్వామ్య పరిపాలన గాఢముగ నాటుకొనుటకు ఇంకను కొంతకాలము పట్టవచ్చును. పై దేశములలో ఎట్టి విధములగు హఠాత్సంఘటనలు జరుగని పక్షమున ప్రజాస్వామికము స్థిరపడు అవకాశములు ఉన్నవి. సోవియట్ రష్యా, కమ్యూనిస్ట్ చీనా మున్నగు దేశములలోను, నియంతృత్వ దేశములగు ఈజిప్టు, లాటిన్ అమెరికా దేశములు మున్నగువానిలోను రాజ్యాంగములందు నిర్దేశింపబడిన ప్రజాస్వామ్య పద్ధతులను ఆచరణలో పెట్టు ఉద్దేశము పరిపాలకులలో కానరాదు. అపుడు రాజ్యాంగము అలంకారప్రాయమే అగుచున్నది.

ప్రపంచమున రాజ్యాంగము నామమాత్రముగ అనుసరింపబడు దేశములు అనేకములు ఉండుటయే కొన్ని దేశము

లలో రాజ్యాంగబద్ధమగు ప్రభుత్వము పట్ల విశ్వాసము సడలుటకు ప్రధాన కారణము. అంతేకాక, అనేక దేశములలో సామాన్యపౌరులు ఆహారము, వస్త్రములు, గృహములు, విద్య మొదలగు జీవితావసరములకు సంబంధించిన సమస్యలయందే శ్రద్ధకలవారుగ ఉన్నారు. శాసన సభలను అధికారము చేపట్టుటకై పోటీపడు రాజకీయ పక్షములును రాజ్యాంగము పౌరులకు ప్రసాదించు హక్కులు మొదలగు వాటియందు తగినంత శ్రద్ధ వహించుటలేదు. వారికి కావలసినది వారి ముఖ్యావసరములు తీరుట మాత్రమే. వారి దృష్టియంతయు వాటి సంపాదనయందే లగ్నమగుచున్నది. కొన్ని వర్ధమాన దేశములలోని అధిక సంఖ్యాక ప్రజలకు ప్రభుత్వముల యొక్క బాహ్యస్వరూపమునందు శ్రద్ధ లోపించుటయు, ప్రభుత్వ కార్యకలాపములలో మాత్రమే శ్రద్ధ ఉండుటయు గమనింపగ, ఈ దేశములలో ప్రజాస్వామ్యము భవిష్యత్తున స్థిరముగ ఉండగలదా అను సంశయమునకు తావేర్పడుచున్నది. ఈ విధములగు పరిస్థితుల కారణమున ప్రజాస్వామ్యము యొక్కయు, రాజ్యాంగబద్ధ ప్రభుత్వముల యొక్కయు భవిష్యత్స్వరూపము ఇదమిత్థమని నిర్ణయించి చెప్పుట కష్టసాధ్యము.

మా. వెం. రం.

# ప్రాథమిక హక్కులు

ప్రభుత్వాధికారముల హద్దులను నిర్దేశించుటకును, వాటి దుర్వినియోగమును అరికట్టుటకును, రాజ్యాంగము ఒక సాధనముగ భావింపబడు రాజ్యములలో రాజ్యాంగమందు కొన్ని ప్రాథమిక హక్కులను చేర్చుట సంప్రదాయముగ ఉన్నది. ఇట్టి హక్కులతో సాధారణముగ ప్రభుత్వము జోక్యము కలిగించుకొనకూడదు. ఇవి రాజ్యము యొక్కయు, ప్రభుత్వము యొక్కయు అధికారమునకు ఒక హద్దును కల్పించుచున్నవి. ఈ హక్కులను నిరోధించు చట్టములను చేయుటకు గాని, కార్యక్రమములను సాగించుటకు గాని ప్రభుత్వమునకు అధికారము లేదు.

యూరప్ ఖండమునందు 18 వ శతాబ్దమున ఎల్లెడల నిరంకుశ ప్రభుత్వములు బలపడి, ప్రజలు అనుభవించు కనీసపు స్వేచ్ఛాస్వాతంత్ర్యములకు భంగము వాటిల్లిన సమయమున లిఖితపూర్వక రాజ్యాంగములలో ఇట్టి హక్కులను చేర్చుట ద్వారా ప్రభుత్వాధికారములకు హద్దులు కల్పింపవచ్చునను భావము వ్యాపించినది.

ఫ్రెంచి విప్లవమునకు పూర్వము యూరప్ ఖండ దేశములను నిరంకుశ ప్రభువులు పాలించెడివారు. వారి అధికారములకు చట్టబద్ధమగు హద్దులు ఉండెడివి కావు. లౌకిక వ్యవహారములందేకాక, ఆధ్యాత్మిక విషయములందు కూడ తమ అధికారమును ఉపయోగించి ప్రజలు అవలంబింపవలసిన మతమును కూడ ఆ పరిపాలకులు నిర్ణయించెడివారు. వారి ఇష్టతకు వ్యతిరేకముగ ఇతర మతమును స్వీకరించు ప్రజలను వారు చాల బాధించెడి వారు. అట్టి ప్రజలకు ప్రభుత్వోద్యోగములు కూడ లభించెడివి కావు. వాక్స్వాతంత్ర్యము ఎవరికిని ఉండెడిదికాదు. ప్రభువుల అయిష్టతకు గురియైన పౌరులు సంవత్సరముల తరబడిగ కారాగారవాసములు చేయవలసి వచ్చెడిది. ఆ యా దేశములలోని ప్రజల జీవితములు ప్రభువుల ఇచ్ఛను అనుసరించి ఉండెడివి. వస్త్రధారణలోను, వస్తువాహనాదుల ఉపయోగములలో కూడ ప్రజలు ప్రభుత్వేచ్ఛకు లోబడవలసి ఉండెను. పన్నులను విరివిగ విధించి పౌరుల ఆస్తిపాస్తులకు ప్రభువులు సొంతదారులు అయ్యెడివారు. కష్టించుట ఒకరివంతు, సుఖభోగాదులను అనుభవించుట మరియొకరివంతుగ ఆ నాటి ప్రజాజీవనము గడచెడిది. వర్గభేదమును కల్పించి, కొన్ని వర్గముల వారు ఎక్కువ లాభములను, కొన్ని వర్గములవారు తక్కువ లాభములను పొందునట్లు చట్టములను చేసెడివారు. నేరమునుబట్టి శిక్ష విధించుటకు బదులుగ నేరస్థుల అంతస్తులను, తాహతులను బట్టి దండన విధింపబడెడిది. న్యాయము కూడ తదనుసారము వ్యక్తి వ్యక్తికి మారుచుండెడిది.

ఇంతటి అధికారము ప్రభుత్వమునకు ఉండనవసరమా అను విషయమును గురించి ఆ కాలపు తత్త్వవేత్తలు చర్చించి ఉండనవసరములేదని ఒక నిర్ణయమునకు వచ్చిరి. ప్రభుత్వ కార్యకలాపములు కొన్నివిషయముల వరకే పరిమితము చేయవలసిన అవసరము వారికి ఏర్పడినది. నిరంకుశత్వమును రూపుమాపుటకు గ్రేట్ బ్రిటన్, యునైటెడ్ స్టేట్స్, ఫ్రాన్స్ దేశ ప్రజలు కావించిన విప్లవములు ఆ సిద్ధాంతములకు మూలాధారములైనవి. ప్రజాస్వామ్య సిద్ధాంతములకు ప్రాబల్యము హెచ్చుటతోపాటు 19, 20 శతాబ్దములలో మితాధికారవాదము కూడ వ్యాపించి స్థిరత్వమును సంపాదించుకొనినది.

పై విధములగు హక్కులు మానవ జీవితమునకును, ప్రజల ఆస్తికిని, సమానత్వమునకును సంబంధించినవి. ఏ యే విషయములపైన ప్రతిమానవునికి ప్రాథమిక హక్కులు ఉండవలెనను ప్రశ్నకు వాని శరీరముపైన, వాని స్వేచ్ఛపైన, వాని ఆస్తిపైన హక్కులు ఉండవలెనని అప్పటి తత్త్వవేత్తలు సమాధానము చెప్పిరి.

శరీరముపై హక్కు అనగా - ఎవరి శరీరమును వారు స్వేచ్ఛగ ఉపయోగించుకొనుట; వాని అనుమతిలేనిదే ఇతరులు దానిని స్వప్రయోజనములకు ఉపయోగించు కొనకుండుట. ఇతరులకు అమ్ముడుపోయిన బానిసలకు వారి శరీరములపై హక్కు లేదనుటకు ఇదియే కారణము. నిర్బంధములకు లోబడవలసిన వారికి సుఖము కాని, వికాసము కాని, వ్యక్తిత్వము కాని లభించుట సాధ్యము కాదు.

స్వేచ్ఛపైన హక్కు అనగా - దేనిని పరమార్థమనియు, సత్యమనియు ఒక వ్యక్తి గాఢ నమ్మకము కలిగి ఉండునో దానిని అనుసరించి జీవించు అవకాశమును, దానిని గురించి అభిప్రాయమును వ్యక్త పరచుటకు స్వాతంత్ర్యమును కలిగి ఉండుట. ఈ స్వేచ్ఛకు మత, భావ, వాక్స్వాతంత్ర్యములని పేరు కూడ కలదు. నిరంకుశ పాలనలో ఇట్టి స్వేచ్ఛా స్వాతంత్ర్యములు ఉండెడివి కావు. స్వానుభవమును అనుసరించి ఎవరి జీవితమును వారు సరిదిద్దుకొన కలిగినపుడే యథార్థమైన సౌఖ్యము లభించును; కాని, ఇతరులు జోక్యము కలుగజేసికొని, తమ జీవితమును సరిదిద్దునపుడు అట్టి సుఖసౌఖ్యములు లభించుట కష్టము.

సుఖజీవితమునకును, వ్యక్తిత్వవికాసమునకును ఆస్తిపై హక్కు ఉండుట అవసరమని విప్లవయుగ తత్త్వవేత్తలు ప్రతిపాదించిరి. ఆత్మశక్తులు వికాసము చెందుటకు ప్రతి మానవునికి బాహ్యసాధనములు కావలసి ఉన్నవి. వ్యవసాయదారునికి కావలసిన పనిముట్లు, పశువులు, భూమి అతని ఆధీనమున ఉండిననే ఆస్తిహక్కు ఉండినట్లు అగుచున్నది; సాధనముల పైనను, ఫలితము పైనను హక్కు ఉండినపుడే అతడు సుఖజీవనము సాగించుటకు అవకాశము కలదు.

శరీరముపైన, స్వేచ్ఛపైన, ఆస్తిపైన ఉండు హక్కులు గాక, మిగిలిన హక్కులేవి? అనెడి ప్రశ్నకు కాలానుగుణముగ భిన్నసమాధానములు వచ్చుచుండుటచే హక్కుల జాబితాలు మారుచున్నవి.

జాతి, మత, కులములతోడను, స్త్రీ - పురుష భేదముల తోడను ఎట్టి ప్రసక్తిలేక వ్యక్తులపై విధించవలసిన శిక్షలను విధించుట, వారికి అందవలసిన లాభములను అందజేయుట రాజకీయ స్వత్వముల దృష్ట్యా సమత్వమని అనిపించుకొనును. ఈ దృక్పథముతోడనే భారత రాజ్యాంగము రూపొందింపబడినది. మూలశాసనము 19 - 28 సూత్రముల ద్వారా పౌరులందరికి -

1. వాక్స్వాతంత్ర్యమును, ప్రకటనా స్వాతంత్ర్యమును కలిగి ఉండుటకు;
2. శాంతియుతముగ సమావేశమగుటకు;
3. సభలను జరుపుకొనుటకు, సంఘములను స్థాపించుకొనుటకు;
4. దేశములో స్వేచ్ఛగ సంచారము చేయుటకు;
5. దేశమున ఏప్రాంతమందైన నివాసము ఏర్పరచుకొనుటకు;
6. ఆస్తిని సంపాదించుకొనుటకు;
7. ఇచ్చవచ్చిన వృత్తిలో ప్రవేశించి జీవనోపాధిని సంపాదించుకొనుటకు;
8. తమతమ శరీరములపై స్వాతంత్ర్యము కలిగి ఉండుటకు;
9. తమ ఇచ్చవచ్చిన మతమును స్వీకరించుటకు; ప్రచారము చేయుటకు;

భారత రాజ్యాంగము స్వాతంత్ర్యమును కల్పించుచున్నది. ఒక రాజకీయ రంగములోనేకాక సామాజిక జీవితరంగముల అన్నింటిలోను అభివృద్ధి సాధనకు ఈ మూలసూత్రములే ఆధారములు. ఉపన్యాసములుచేయు సామర్థ్యము గలవారికిని, రచయితలకును మాత్రమే వాక్స్వాతంత్ర్యము ఉపయోగించుననియు, జన సామాన్యమునకు దానివలన ఎక్కువ ఉపయోగములేదనియు తలచుట పొరపాటు. ఎవరికి తోచిన అభిప్రాయమును వారు వ్యక్తము చేయుటకు కావలసిన స్వాతంత్ర్యము అందరకు తప్పక ఉండవలసినదే.

వ్యక్తులు ఏ ప్రయోజనమును సాధించుకొనదలచినను, వారు కలసి చర్చించుటకు సంఘములుగ ఏర్పడుట అవసరము. 'సంఘీభావమే బలము' అను నానుడి కలదు కదా! దేశములో రైతు సంఘములు, వృత్తి సంఘములు, రాజకీయ పక్షములు, వైజ్ఞానిక సంఘములు మొదలగువాటి అవసరమును భారత రాజ్యాంగము 19 వ సూత్రము అంగీకరించుచున్నది.

దేశములో ఇష్టమువచ్చినట్లు సంచరించుట, జన్మస్థానము ఏదైనను కోరిన ప్రాంతమందు స్థిరావాసము ఏర్పరచుకొనుట వ్యక్తి వికాసమునకు అవసరములు. పై నుడివిన 4, 5 స్వాతంత్ర్యములు ఈ సత్యమును అంగీకరించుచున్నవి. భారతీయులందరు ఒకే కుటుంబమునకు చెందినవారనెడి భావము వృద్ధియగుటకు కూడ ఈ స్వాతంత్ర్యములు సాధనములుగ ఉపయోగపడుచున్నవి.

మానవ సౌఖ్యమునకు ఆస్తిహక్కు ముఖ్య సాధనమని ఇదివరలోనే నిరూపితమైనది [చూ. పు. 226]. 6 వ స్వాతంత్ర్యము దీనిని గుర్తించుచున్నది. ఎవరికి రుచించిన వృత్తిని వారు స్వీకరింపగలుగు స్వాతంత్ర్యము ఉన్ననే ఎక్కువ ఆదాయమును సంపాదింపగలుగుదురు. ఒకవ్యక్తి స్వేచ్ఛానుసారము వృత్తిని అవలంబించు స్వాతంత్ర్యమును 7 వ సూత్రము ప్రసాదించుచున్నది.

ఒక వ్యక్తి శరీరముపై ఉండు స్వాతంత్ర్యమును 8 వ సూత్రము గుర్తించుచున్నది. న్యాయస్థానములచే విచా

రింపబడకుండ వ్యక్తులను నిర్బంధించుటను ఈ సూత్రము వ్యతిరేకించుచున్నది. ఏది నేరము, ఏది నేరము కాదు అను విషయమున నిర్ణయాధికారము శాసన సభలకే గాని, మంత్రి వర్గములకు చెందిన మంత్రులు మొదలగు అధికారులకు ఉండకూడదని భారత రాజ్యాంగమున 21 వ సూత్రము నిర్ణయించుచున్నది. వీటి అన్నిటి ఫలితముగ పౌరులకు వారివారి శరీరములపై ఉండదగ్గ స్వాతంత్ర్యము లభించుచున్నది.

ఎవరికి నచ్చిన మతమును వారు స్వీకరించి ప్రచారము చేయుటకు 25 వ సూత్రము ప్రజలకు స్వాతంత్ర్యమును ఒసగుచున్నది.

కొన్ని ప్రాంతములలో భూస్వాములు ధనవంతులై, వ్యక్తులను బలప్రయోగముతో తరతరములుగ వారిచేత వెట్టిచాకిరి చేయించుకొను ఆచారము వ్యక్తిస్వేచ్ఛకు భంగకరమగుటచేత భారత రాజ్యాంగము 23 వ సూత్రము దానిని నిషేధించుచున్నది.

మతవ్యవహారములలో పూర్తిగ స్వేచ్ఛను 26, 28 సూత్రములు కల్పించుచున్నవి. 29 వ సూత్రము వారి వారి భాషను, లిపిని, సంస్కృతిని పరిరక్షించుకొను హక్కు ప్రతిశాఖకు ఉన్నదనియు, ప్రభుత్వ విద్యాలయములలో కాని, ప్రభుత్వ సహాయమును పొందు ఇతర విద్యాలయములలో కాని జాతి, మత, కుల, భాషాది వివక్షతలేక అందరికిని ప్రవేశము ఉండవలెననియు నిర్ణయించుచున్నది. 30 వ సూత్రము మతమును బట్టిగాని, భాషనుబట్టి గాని, అల్పసంఖ్యాకులగు ప్రజలు వారి వారికి ఇష్టమగు విద్యాసంస్థలను స్థాపించుకొను హక్కును, వాటి పోషణ నిమిత్తము తక్కిన విద్యాలయములవలె ప్రభుత్వ సహాయమును పొందు హక్కును కల్పించుచున్నది.

'హద్దులేని అధికారము ఎంత అనర్థదాయకమో హద్దులులేని ప్రాథమిక హక్కులు కూడ అంత ప్రమాదకరములే' అని ప్రతి హక్కుకు ఒక హద్దును మూలశాసనము కల్పించుచున్నది. సమత్వసిద్ధాంతమునకు విరుద్ధముగ కన్పించినను స్త్రీలకు, చిన్నపిల్లలకు ప్రత్యేకసదుపాయములను రాజ్యాంగము ప్రసాదించుచున్నది. పురుషులకు లభించని విద్యావేతనములను ప్రభుత్వము స్త్రీలకు లభింపజేయవచ్చును. వయస్సు వచ్చిన వారికి లభింపని ఆహార సదుపాయములను పిల్లలకు లభింపజేయవచ్చును. ఇదే విధముగ వెనుకబడిన జాతులవారికి విద్యాలయములలోను, ఉద్యోగములలోను తక్కిన జాతులవారికి లేని ప్రత్యేక సదుపాయములను ప్రభుత్వము కల్పించుటను మూలశాసనము సమర్థించుచున్నది.

వాక్స్వాతంత్ర్యము మూలమున దేశభద్రతకు, మిత్రరాజ్యములతోడి మైత్రికిని, శాంతియుత జీవితమర్యాదకును, నీతికిని భంగము కలుగకుండుటకును, కోర్టుల ధిక్కారము, పౌరుల పరువునష్టము, నేరములకు ప్రోత్సాహము సంభవింపకుండుటకును అవసరములైన సహేతుక నిర్బంధములను శాసనములద్వారా ప్రభుత్వము విధింపవచ్చును. సమావేశముల మూలమున అల్లరులు చెలరేగి శాంతియుత జీవనమునకు భంగము వాటిల్లకుండ చేయుటకు సహేతుక నిర్బంధములను సమావేశ స్వాతంత్ర్యముపైన విధింపవచ్చును. ఇట్టి నిర్బంధములనే శాంతిని నిలబెట్టుటకొరకును, శాంతియుత జీవనము కొరకును సంఘ సంస్థాపనా స్వాతంత్ర్యముపైన విధింపవచ్చును. అవినీతి చర్యలకును, సంఘ విద్రోహక చర్యలకును దోహదకారకములగు సంఘముల సంస్థాపనము మూలశాసన సమ్మతము కాదు. సంచారమునకును, నివాసమునకును, ఆస్తికి సంబంధించిన స్వాతంత్ర్యముల మూలమున ప్రజలందరి యోగక్షేమములకు గాని, షెడ్యూల్ జాతుల ప్రత్యేక యోగక్షేమములకు గాని హానికలుగకుండుటకు ఈ స్వాతంత్ర్యములపై ఆంక్షలు విధింపవచ్చును. ఇచ్చవచ్చిన వృత్తిని అవలంబించు స్వాతంత్ర్యము ఉండవలసినదే కాని, దాని వలన సంఘమునకు కొన్ని ప్రమాదములు సంభవింపవచ్చును. ఉదాహరణకు: వైద్యశాస్త్రమును అభ్యసింపని వారు వైద్యవృత్తిని అవలంబించినటులయిన నష్టములు ఎన్నియో సంభవించును. అదేవిధముగ ఆ యా వృత్తులకు సంబంధించిన జ్ఞానము సంపాదింపక, న్యాయవాదులుగాను, ఉపాధ్యాయులుగాను, సాంకేతిక నిపుణులుగాను జీవనోపాధిని సంపాదించుకొను అవకాశమున్న ఎడల సంఘములోని వారందరు తన్మూలమున నష్టపడక తప్పదు. ఏ యే వృత్తుల నవలంబించుటకు ఏ యే అర్హతలు కావలయునను విషయము ప్రభుత్వము నిర్ణయింపవలెను. ఈ నిర్ణయములకు లోబడి ఆ యా అర్హతలు కలిగిన వ్యక్తులు ఆ యా వృత్తులను అవలంబింపవలసి ఉండును. ఇదిగాక కొన్నికొన్ని వ్యాపారములును, కొన్ని కొన్ని పరిశ్రమలును ప్రభుత్వాధీనములో ఉండుట ప్రజాశ్రేయస్సు దృష్ట్యా లాభకరమగుచుండును. ఈ కారణమున కూడ వ్యక్తి స్వాతంత్ర్యముపై నిర్బంధములను విధింపవలసిన అవసరము ఏర్పడుచున్నది. ఇచ్చవచ్చిన మతమును స్వీకరించుటకు ప్రతివ్యక్తికిని స్వాతంత్ర్యమున్నను, దేశభద్రతకు, నీతినియమములకు, ఆరోగ్యమునకు భంగకరములగు మతాచారములు ఉండరాదని మూలశాసనము వ్యక్తపరచుచున్నది. మతము పేరిట అల్లరులు లేవదీయువారి యొక్కయు,

దేవాలయములను స్వలాభము కొరకు వినియోగపరచు వారియొక్కయు దుశ్చర్యలను అరికట్టుటకు తగిన కట్టు దిట్టములు తీసికొనుట మూలశాసనమునకు విరుద్ధము కాదు.

ఆస్తిహక్కు విషయములో కూడ వ్యక్తిస్వాతంత్ర్యమునకు కొన్ని మినహాయింపులు ఉన్నవి. 31, 31 ఏ, 31 బి సూత్రములు ప్రజల సమష్టి శ్రేయస్సుకొరకు వ్యక్తుల ఆస్తులను వశపరచుకొనుట అవసరమని ప్రభుత్వమునకు తోచినపుడు వారికి ఏదో పరిహారమును ఇచ్చి వారి ఆస్తులను వశపరచుకొను అధికారమును కల్పించుచున్నవి. జమిందారీలను రద్దుచేసి, జమిందారుల ఆస్తులను వశపరచుకొనుట, జీవిత భీమా కంపెనీలను, ఇంపీరియల్ బ్యాంక్‌ను జాతీయము చేయుట ఈ సూత్రముల ఆధారముతోడనే జరిగినది. వ్యక్తుల ఆస్తులను వశపరచుకొనుటలో ప్రభుత్వము గమనింపవలసిన షరతులు రెండు మాత్రమే. ప్రజల శ్రేయస్సుకై వినియోగపరచుటకు వాటిని వశముచేసికొనుట మొదటిది; నష్టపరిహారము ఇచ్చుట రెండవ షరతు. నష్టపరిహారమును నిర్ణయించు అధికారము శాసనసభలకు పూర్తిగ ఉన్నది. ఈ విషయములో న్యాయస్థానములకు ఏవిధమగు జోక్యము ఉండదు.

ఎవరి శరీరముపై వారికి స్వాతంత్ర్యము ఉన్నదను హక్కుపైన కూడ మూలశాసనము ఒక నిర్బంధము విధించినది. న్యాయస్థానముల విచారణతోగాని, తీర్పుతోగాని నిమిత్తములేక అనుమానాస్పదులైన వ్యక్తులను నివారక నిర్బంధము (ప్రివెంటివ్ డిటెన్షన్) లో ఉంచు అధికారమును ప్రభుత్వమునకు 22 వ సూత్రము కల్పించుచున్నది. ఎట్టి నేరము చేయకపోయినను, నేరముచేయునని గాని, మరేదయిన ప్రమాదము కలిగించునని గాని ప్రభుత్వాధికారులకు తోచినపుడు ఏ వ్యక్తినైనను వారు నిర్బంధములో ఉంచవచ్చును. భారతదేశమునకు స్వరాజ్యము వచ్చిన కొద్దిరోజులలో దేశములోని పరిస్థితులు చాల అలజడికి కారణములై ఉన్నందువల్లను, రహస్యముగ దేశవిద్రోహక చర్యలు చేయుటకు కొందరు పూనుకొనినందువల్లను, ఆహార పదార్థములను గుప్తపరచి చీకటి బజారులలో ఎక్కువ లాభములకు విక్రయించు వర్తకులు ఉండుటచేతను ప్రభుత్వమునకు ఇట్టి అధికారము అవసరమైనది.

అల్పసంఖ్యాకులు స్థాపించుకొను మతసంస్థలు, దానధర్మసంస్థలు, శాంతికి, నీతికి, ఆరోగ్యమునకు భంగకరముగ ఉండరాదను నియమమును రాజ్యాంగము విధించుచున్నది. ఈ నియమములకు లోబడి వారివారి మతములను, భాషను, సంస్కృతిని రక్షించుకొనుటకు అన్ని అల్పసంఖ్యాక వర్గముల వారికిని హక్కు కలదు.

ఈ సందర్భములో గమనించదగిన విషయము ఇంకొకటి కలదు. మూలశాసనములో ప్రాథమిక హక్కులను పేర్కొనినంత మాత్రమున ప్రభుత్వాధికారము పరిమితమైనదని భావింపరాదు. హక్కులను అతిక్రమించుచు శాసనసభలు చేయు చట్టములను కార్యవర్గాధికారులు ప్రవేశపెట్టు కార్యక్రమములను అమలులోనికి రాకుండ చేయగల రాజకీయసంస్థ ఒకటి ఉన్నప్పుడే ప్రభుత్వము మూలశాసనమునకు లోబడి ఉండును. అనేక ప్రజాస్వామిక రాజ్యములలో ఉన్నత న్యాయ స్థానములు ఇట్టి సంస్థలై ఉన్నవి. మూలశాసనములో పేర్కొనబడు హక్కులకు విరుద్ధముగ ప్రభుత్వము తీసికొను చర్యల ఫలితముగ నష్టపడిన పౌరులు ప్రభుత్వముపై న్యాయస్థానమునందు అభియోగము తెచ్చి, న్యాయస్థానముయొక్క తీర్పును పొందవచ్చును. అట్టి తీర్పును ప్రభుత్వము శిరసావహించవలసి ఉండును. ఇట్టి ఏర్పాటు ఉండినపుడే ప్రభుత్వములు హద్దుమీరక ఉండుట తటస్థించును.

18, 19 వ శతాబ్దములలో ప్రాథమిక హక్కులనబడిన హక్కులకును, 20 వ శతాబ్దములో ప్రాథమిక హక్కులనబడు వానికిని చాల భేదము కలదు. 20 వ శతాబ్దిలో జీవనోపాధికి చేయు కృషికి ఉద్యోగ సంపాదనము, కనీస వేతనములు, విరామకాలము, వార్థక్యమున పింఛనులు, సాంఘికభద్రత, విద్య మొదలగునవి ప్రాథమిక హక్కులైనవి; స్వాతంత్ర్యమునకును, ఆస్తికిని సంబంధించు హక్కులకు అంతగ ప్రాముఖ్యము లేదు. అల్పవర్గముల వారికిని, జన బాహుళ్యమునకును ప్రజాస్వామిక రాజ్యమున ప్రాముఖ్యత హెచ్చుటయే హక్కుల ఒరవడిలో గత శతాబ్దములకును, నేటి శతాబ్దమునకును మధ్య వ్యత్యాసములు ఉండుటకు కారణము. అట్టి వర్గముల ప్రజలు కోరు హామీలు మాధ్యమిక కుటుంబీకుల అవసరములకన్నను భిన్నములై ఉండుట సహజము. వారు స్వాతంత్ర్యమునకు గాని, ఆస్తికి గాని ప్రాముఖ్యతను ఇవ్వరు; సాంఘిక భద్రతయే వారు ఆశించు ముఖ్య హామీ. మా. వెం. రం.

# నియోజకవర్గము

రాజ్యమునకు సంబంధించిన సర్వవ్యవహారముల నిర్వహణ అంతయు ప్రభుత్వము ద్వారా జరుగుచున్నది. రాజ్యముయొక్క సంకల్పము (విల్) ను వ్యక్తపరచి, దానిని వ్యవస్థితరీతిలో అమలులో పెట్టు సంస్థయే 'ప్రభుత్వము'.

ప్రజాస్వామ్య ప్రభుత్వములో వేర్వేరు అంగముల ద్వారా పరిపాలన జరుగుచున్నది. వాటిలో నియోజక వర్గము ఒకటి. శాసన సభలు, కార్యనిర్వాహక వర్గము, న్యాయశాఖ ప్రభుత్వమునందు తక్కిన పరిపాలనాంగ ములు. అధికారము వీటి అన్నిటియందు న్యస్తమై ఉన్నది. ఇవికాక రాజకీయపక్షములు రాజ్యపరిపాలన యందు ప్రముఖ పాత్ర వహించుచున్నవి.

సక్రమ మార్గముల ద్వారా జరుగు ఎన్నికల మూల మున ప్రభుత్వమును ఎన్నుకొనుట నియోజకవర్గముల కర్తవ్యము. ఇదికాక, ప్రభుత్వ కార్యకలాపములను పర్య వేక్షించి విమర్శించుట, ప్రభుత్వమునకు క్రొత్త మార్గము లను సూచించి నూతన పద్ధతులను ప్రజాభిప్రాయము ద్వారా వ్యక్తపరచుట ఈ నియోజకవర్గములు తప్పక నిర్వహించవలసిన కార్యక్రమములు.

ఈ నవీన యుగమున కొన్ని రాజ్యములలో 21 ఏండ్ల వయస్సు దాటిన స్త్రీ - పురుషులందరును ఈ నియోజక వర్గములలో సభ్యులు. వోటు చేయుటకు అర్హతగలవారే ఈ నియోజక వర్గములలో సభ్యులగుటకు అర్హులను సిద్ధాంతము ఒకటి ఉన్నను, ఈ అర్హతలు ఎచటను నిర్వ చింపబడి ఉండలేదు. ఆస్తిపాస్తులు లేనివారికంటె అవి ఉన్నవారు మాత్రమే దీనికి అర్హులనుట అసందర్భము. ఏదైన ఒక వర్గము వారికి వోటులేనపుడు ప్రభుత్వము ద్వారా వారికి లభించవలసిన ప్రయోజనములకు వారు దూరులగుదురని అనుభవము వలన తెలియుచున్నది. 'అధికారబాహుళ్యులగువారు అధికారలాభములకు కూడ బాహుళ్యులగుచున్నారు.' సాంఘిక జీవనము సుఖప్రదము చేయుటలో ప్రతి వ్యక్తియు సహాయపడవలయుననిన వయోజన వోటింగ్ హక్కు ఉండవలయును.

ఏ సూత్రముననుసరించి వోటర్లను నియోజక వర్గము లుగ విభాగము చేయవలెనను విషయము గురించి వాదోప వాదములు ఉన్నవి. ప్రస్తుతము భారతదేశములో వోటరుల నివాస స్థానమును బట్టి నియోజక వర్గములుగ విభాగము జరుగుచున్నది. కాని, బ్రిటిష్ పరిపాలన కాలములో ఇట్టి నియోజక వర్గములతోపాటు మతమును బట్టి, కులమును బట్టి, వృత్తులను బట్టి కొన్ని నియోజక వర్గములు ఏర్పరుప బడుచుండెడివి. ఇట్టి నియోజక వర్గముల మూలమున ప్రజలయందు ఐకమత్యము చెడి, దేశవిచ్ఛిత్తికి దారితీయు శక్తులు బలపడునను కారణమున భారతదేశ రాజ్యాంగ మూలశాసనములో ఈ విధానము రద్దుచేయబడి, దాని స్థాన మున నివాసము ఒక్కటియే ఆధారముగ ఉన్న ప్రాదేశిక నియోజక వర్గములు (టెరిటోరియల్ కాన్‌స్టిట్యూ యన్సీ) ఏర్పాటు చేయబడెను. ఇదియే యుక్తమైన విధానము.

రాజ్యము ప్రజలందరి సమష్టి ప్రయోజనమునకై ఏర్పాటుకాబడిన సంస్థగాని ప్రత్యేకముగ ఒక మతము యొక్కగాని, కులము యొక్కగాని, వర్గము యొక్కగాని ప్రయోజనమునకై ఏర్పడినది కాదు. సమష్టి ప్రయోజన మును సాధించు సభ్యులలో సమష్టి దృక్పథమును ప్రోత్స హించుటకు ప్రాంతీయ నియోజక వర్గములకే స్థానము కలదు. ఇట్టి నియోజక వర్గములలో ఒక్కొక్క దాని యందు అన్ని మతముల వారు, అన్ని కులముల వారు, అన్ని వర్గముల వారు కలసి పనిచేయవలసినవారు అగు చున్నారు. మతము మొదలైన వాటిని బట్టి ఏర్పడు ప్రత్యేక నియోజక వర్గములు స్వభావ సిద్ధమైన రాజ్య లక్షణమునకు విరుద్ధములు. రాజకీయ సభలలో చర్చకు వచ్చు దేశరక్షణ, వాణిజ్యము, వ్యాపారము, విద్య, వ్యవసాయము, సాంఘిక సంక్షేమము, న్యాయపరి పాలన, వైదేశికనీతి మొదలగు విషయములకు సంబంధిం చిన సమస్యలను పరిష్కరించుటలో మతము, కులము, జాతి, వృత్తి మొదలైనవాటిని బట్టి ఎన్నుకొనబడిన ప్రతి నిధులు చెప్పగలిగినదేమియు ఉండదు. ఇదిగాక, ఇతర రంగములలో ఉండు భేదములను ప్రత్యేక నియోజక వర్గ ముల ద్వారా రాజకీయ రంగమున ప్రవేశ పెట్టుట మూలమున ప్రజలలో ఉండు విభేదములు మరింత బల పడును. కులమునుబట్టియు, వృత్తులనుబట్టియు నియోజక వర్గములను ఏర్పరచుటలో ఏయే కులమునకు, ఏయే వృత్తికి శాసనసభలో ఎందరెందరు ప్రతినిధులు ఉండవలెనో నిర్ణయించుట కూడ సాధ్యము కాని పని. ప్రాంతీయ నియోజక వర్గముల ఏర్పాటులో ఇట్టి సమస్యలు ఉత్పన్నములు కావు. ఈ కారణముల అన్నిటినిబట్టి ప్రాంతీయ నియోజక వర్గములు ఉత్తమములని చెప్పదగి ఉన్నవి.

ఎన్నికలు అపరోక్షములు, పరోక్షములని రెండు రక ములు (అపరోక్షపు ఎన్నికలకే ప్రత్యక్ష ఎన్నికలు అని వ్యవహారము కలదు). అపరోక్షపు ఎన్నికలలో ప్రజలే స్వయముగ అన్ని శాసన సభలలోని సభ్యులను ఎన్నుకొనె దరు. దీనివలన వోటరునకు, ప్రతినిధికి మధ్య సన్నిహిత సంబంధము ఏర్పడి, తత్కారణమున వోటరునకు బాధ్య తానువర్తియై ప్రజాప్రతినిధి మెలగుటకు వీలు కలుగు చున్నది. ప్రజాస్వామ్యము బాల్యావస్థయందున్న దేశము లలో పరోక్షపు ఎన్నికల విధానమే ఉత్తమమని కొందరి వాదము. ఈ పద్ధతిని జరుగు ఎన్నికలలో అభ్యర్థులు

చేయు ఖర్చు పరిమితము అగును. అంతేకాక, ఈ ఎన్నికలు జరుగుట కూడ సులభతరము అగును.

పరోక్ష విధానములో గ్రామములోని ప్రజలు గ్రామ పంచాయతీలను ఎన్నుకొనుటయు, పంచాయతీ సభ్యులు పంచాయతీ సమితులను ఎన్నుకొనుటయు, సమితి సభ్యులు జిల్లా పరిషత్ సభ్యులను, పరిషత్ సభ్యులు రాష్ట్ర శాసన సభను, శాసన సభలు రాజ్యసభ సభ్యులను ఎన్నుకొనుటయు జరుగును. ఆంధ్రప్రదేశ్ నుండి రాజ్యసభకు ఎన్నుకొనబడవలసిన వారు 18 మంది సభ్యులు; పరోక్ష విధానములో వీరిని ఆంధ్రప్రదేశ్ శాసన సభలోని 300 మంది సభ్యులు మాత్రమే ఎన్నుకొనెదరు.

కాని, ఈ విధానమందు అవినీతికి ఎక్కువ అవకాశము లభించును. నాలుగైదు లక్షల వోటర్లు గల నియోజక వర్గములోని వారిని లంచములు ఇచ్చి వశపరచుట కంటె మూడువందల వోటర్లు గల శాసన సభను లంచము ద్వారా వశపరచుకొనుట సులభతరము. అపరోక్షపు విధానములో అభ్యర్థులును, వారి తరఫున ప్రచారము చేయువారును, ప్రజలలో తిరిగి వారితో సన్నిహిత సంబంధమును ఏర్పరచుకొని, వారి అవసరములను, ఇష్టానిష్టములను తెలిసికొనవలసిన వారగుచున్నారు. రాజ్యసభ సభ్యులను శాసన సభలోని సభ్యులు ఎన్నుకొను పద్ధతిలో అభ్యర్థులు ప్రజల ఇష్టానిష్టములను గుర్తింపవలసిన అవసరము కాని, వారి ఎదుట నిలబడవలసిన అవసరము కాని ఉండదు. ఇట్టి స్థితిలో ప్రజాభిప్రాయానుసారము పరిపాలన జరుగుట సాధ్యము కాదు.

ఎన్నికలు జరుపబడు నియోజక వర్గములను ఏకసభ్య నియోజక వర్గములుగను, బహుసభ్య నియోజక వర్గములుగను విభజింపవచ్చును. వోటింగు సాధారణ ప్రాబల్య పద్ధతిని గాని, అనేకతా ప్రాబల్య విధానమును అనుసరించి గాని, నైష్పత్తిక ప్రాబల్యమును అనుసరించి గాని జరుపబడుచున్నది. భారతదేశములో ఏక సభ్యత్వ నియోజక వర్గములు ఉన్నవి. ఇందు ఎన్నిక కాబడిన సభ్యునకు మొత్తము వోటు కాబడిన వోట్లసంఖ్యలో అధికసంఖ్యలో వోట్లు రానవసరము లేదు. ఈ పద్ధతి నైష్పత్తిక విధాన పద్ధతి కంటె ఉత్తమమైనది. ఈ పద్ధతిన జరుగు ఎన్నికలు రాజకీయ పక్షముల సంఖ్య వృద్ధియగుటకు అవకాశము ఈయదు. బాధ్యతాయుత ప్రభుత్వములు చక్కగ నడచుటకు అవసరమైన స్థిరమగు మంత్రి వర్గములు ఏర్పడుటకు కూడ ఈ పద్ధతి అనుకూలముగ ఉన్నది.

శాసన సభలకు సభ్యుల ఎన్నుకొనునపుడు ఎన్నికలు రహస్య వోటింగు పద్ధతిలో జరుపబడును. ఎవరు ఎవరికి వోటు చేసినది తెలిసికొనుటకు వీలులేనపుడే వోటర్లు మొగమోటమిలేక నిర్భయముగ వోటుచేయగల వారగుదురు. లంచగొండితనము మొదలగు అవినీతికరములగు ఆచారములను మాన్పుటకు కూడ ఈ పద్ధతి ఎక్కువ అనుకూలించుచున్నది. ఇందుచేత దీనిని గురించి ప్రస్తుతము ఎట్టి వాదోపవాదములు లేవు.

ఎన్నికల సార్థక్యము నిర్ణయించుటలో రెండు మూడు విషయములు గమనించదగి ఉన్నవి. పార్లమెంటరీ విధానమననుసరించు భారతదేశము వంటి దేశములలో ఎన్నికల మూలమున ఎవరు శాసన సభ్యులుగ ఉండవలెనో నిర్ణయింపబడుటయేకాక, ఏ పక్షము వారు మంత్రులుగ దేశపరిపాలన సాగించవలెనో నిర్ణయింపబడవలసి ఉన్నది. ఎన్నికలలో ఒక రాజకీయ పక్షమునకు మాత్రమే బలము చేకూరినపుడు మంత్రివర్గ నిర్మాణము సులభతరమగుచున్నది. ఏ పక్షమునకు కూడ అట్టి బలము చేకూరనపుడు రెండు మూడు పక్షములు కలసి సంకీర్ణ మంత్రివర్గముగ ఏర్పడుటయు, అది స్థిరముగ అధికారములో లేకుండుటయు జరుగును. ఏకపక్ష మంత్రివర్గ నిర్మాణమునకు అనుకూలించు ఎన్నికలు ఎక్కువ సార్థక్యము కలిగినట్టివని చెప్పవచ్చును. ఎన్నికల మూలమున మరియొక ప్రయోజనము కూడ లభింపవలసి ఉన్నది. రాజకీయ విషయములను గురించి సామాన్య ప్రజలలో పరిజ్ఞానము, చైతన్యము వ్యాపించుటకు ఎన్నికలు ప్రధాన సాధనములు. ఎన్నికల కాలమున జరుగు ప్రచారము దీనికి ఎంతయో తోడ్పడుచున్నది. పోటీ లేకను, ఏకగ్రీవముగను ఎన్నికలు జరుగునపుడు ఇట్టి ప్రయోజనము లభింపదు. అందుచేత పోటీతో కూడిన ఎన్నికలే ఈ దృష్ట్యా ఎక్కువ సార్థకత కలవి అని చెప్పవచ్చును.

ఎన్నికల సంరంభములో రెండు దశలు కలవు. మొదటిది: అభ్యర్థుల నియామకము; రెండవది: వోటింగు. వోటరులు తమకు నచ్చిన వారికి వోట్లువేసి ఎన్నుకొనుట జరుగదు. అభ్యర్థుల జాబితాలో ఎవరినో ఒకరిని ఎన్నుకొనవలసినదే కాని, గత్యంతరము లేదు. అనర్హులగు అభ్యర్థులు ఎన్నికకు నిలబడిన ఎడల వారిలో ఒకనిని ఎన్నుకొనితీరవలయును. ఈ కారణమున అభ్యర్థులను నియమించుటలో ప్రధాన పాత్ర వహించు రాజకీయ పక్షములు ఎక్కువ బాధ్యతాయుతముగ ప్రవర్తింపవలసి ఉండును [చూ. ఎన్నిక].

రెండవ దశలో వోటింగ్ జరుగునపుడు కొన్ని అవినీతికరములగు పనులు రాజకీయ పక్షముల స్వార్థపరత్వము

వలన జరుగుట ఎల్లరు ఎరిగిన విషయమే. ఇట్టి అసందర్భములు జరుగకుండ కట్టుదిట్టములు చేయవలసి ఉండును. ఆ ఎన్నికల సమయమున వోటరులు అభ్యర్థుల అర్హతలకు ప్రాధాన్యము ఇచ్చుచు వోటు చేయవలెనేగాని కుల, మత, వర్ణ, వర్గ వివక్షతలకు ప్రాధాన్యము ఇవ్వరాదు; ఈ దృష్ట్యా వారు వోటు చేయుట వాంఛింపదగినది.

వయస్సు తప్ప ప్రత్యేక అర్హతలేవియు అభ్యర్థులకు ఉండవలసినట్లు ఎక్కడను నిర్వచింపబడి ఉండలేదు. కొన్ని కొన్ని అర్హతలు వారికి ఉండుట అవసరమని అనేకులు అభిప్రాయపడుచున్నారు. సభ్యులుగ ఉండువారు శాసన సభలో చేయవలసిన పనులను చక్కగ చేయుటకు కనీస విద్యార్హత అవసరము. వారు సభా కార్యక్రమములలో పాల్గొనుటకు రాజ్యాంగ మూలశాసనమును గురించియు, సభా నిబంధనముల గురించియు సంపూర్ణ జ్ఞానము కలవారై ఉండవలెను. సభలో ప్రవేశపెట్టబడు బిల్లుల యొక్కయు, తీర్మానముల యొక్కయు, ప్రతిపాదనల యొక్కయు అర్థమును గ్రహింపగలవారుగ ఉండవలెను. దీనికంతకు అక్షరజ్ఞానము మాత్రమే కాక, కొంత ఉన్నత విద్య కూడ అవసరము. ఇదికాక సభ్యులుగ ఉండువారు సభాకంపము లేక నోరువిప్పి మాట్లాడగలవారుగ ఉండవలెను. దీనికితోడు జిల్లా పరిషత్తులలోనో లేదా పంచాయతీ సమితులలోనో, స్థానిక మునిసిపల్ వ్యవహారముల లోనో లేదా ప్రజాసేవకై ఉద్దేశింపబడిన ఇతర సంస్థలలోనో సభ్యులుగ ఉండి, కొద్దిపాటి అనుభవమునైనను గడించిన వారుగ ఉండవలెను. వీటితోపాటు సభ్యులు నిజాయితీ, సచ్ఛీలము, ప్రజాసేవాసక్తి, స్వార్థరాహిత్యము కలిగి ఉండుట అవసరము. సభ్యత్వమును స్వలాభము కొరకును, బంధువుల లాభము కొరకును వినియోగింపక, ప్రజల హితమునకై ఉపయోగించువారుగ ఉండవలెను. ఇవన్నియు శాసన సభకు పోటీచేయు అభ్యర్థులకు ఉండవలసిన అర్హతలు. ఇవి చట్టబద్ధములైనను, కాకపోయినను ఇట్టి అర్హతలు కలవారే అభ్యర్థులుగ నిలబడుటయు, ఇట్టి అర్హతలు కలవారినే ప్రజలు ఎన్నుకొనుటయు దేశ శ్రేయస్సు దృష్ట్యా అవలంబనీయములు. మా. వెం. రం.

# రాజకీయ పక్షములు

నేటి ప్రజాస్వామిక దేశములన్నింటిలోను రాజకీయ పక్షములు ఉన్నవి. అవిలేని ప్రజాస్వామిక దేశము ఇంతవరకు ఏదియు ఉండలేదు. కొందరు వ్యక్తులు అధికారమును చేపట్టు కోరికతో ఎన్నికలలో నిలబడి, పోటీచేసి, గెలుపొందు తలంపుతో ఒక సంఘముగ ఏర్పడిన ఎడల ఆ సంఘము 'రాజకీయపక్షము'ని పేర్కొనబడుచున్నది. ప్రతి రాజకీయపక్షము కూడ రాజకీయములందు, కొన్ని నిర్దిష్ట సిద్ధాంతములందు విశ్వాసముకలిగి ఉండి, వాటిని ఆచరణలో పెట్టుటకు ఒక కార్యక్రమమును నిర్ణయించుకొని ఉండును. అట్టి సిద్ధాంతములు, ఆ కార్యక్రమములు మాత్రమే దేశ శ్రేయస్సును వృద్ధిపరచగలవని వారి నమ్మకము.

ప్రజాస్వామ్య ప్రభుత్వము సక్రమపద్ధతిన సమర్థతతో నిర్వహింపవలెనన్న రాజకీయపక్షముల ఆవశ్యకత ఎంతేని కలదు. ప్రజాస్వామికములో ప్రధానముగ జరుగవలసిన కొన్ని కార్యక్రమములు వాటి మూలముననే జరుగుటకు అవకాశము కలదు. ప్రజాస్వామ్య సిద్ధాంతపు మూలసూత్రములలో ముఖ్యమైన ప్రజాభిప్రాయము రాజకీయ పక్షములద్వారా వ్యక్తమగుచున్నది.

ప్రజాస్వామ్య రాజ్యము రాజకీయపరముగ సామాన్య ప్రజానీకముపై ఎనలేని పరిపాలనా భారమును, బాధ్యతను మోపుచున్నది. దానిని భరించుటకు వారికి అవకాశము, శక్తి లభింపకున్నవి. అట్టి పరిపాలనా భారమును వహించుటలో రాజకీయపక్షములు ప్రజలకు తోడ్పడుచున్నవి. దేశపరిపాలనమునందు ఉత్పన్నములగు సమస్యలను ఆకళింపుచేసికొని పరిష్కరించుటలో ఏ సమస్యకు మొదటి ప్రాముఖ్యమును, ఏసమస్యకు రెండవ ప్రాముఖ్యమును ఈయవలయునో నిర్ణయముచేసి ఆ సమస్యా పరిష్కారమునకు తీసికొనవలసిన చర్యలు తీసికొనుట మొదలగునవన్నియు దేశప్రజల నిర్ణయములపై ఆధారపడి ఉన్నవి. కాని, విద్యాసౌకర్యములు బహుళ వ్యాప్తి నందిన దేశములలో కూడ నూటికి 90 పాళ్లు ప్రజలలో రాజకీయపరిజ్ఞానము చాల తక్కువ. దళితదేశములందును, ఇపుడిపుడే అభివృద్ధిచెందుచున్న ఇతర దేశ ప్రజలలోను పై చెప్పిన పరిజ్ఞానము చాల కనీస స్థితియందు ఉన్నది. సాధారణముగ ప్రతిపౌరుడును, దినదినము ఉత్పన్నమగు సాంసారిక సమస్యలను ఎదుర్కొని, తత్పరిష్కారమునందే కాలమును గడుపుచున్నాడు. తన జీవనమునకు సంబంధించినంతవరకు తనకేమికావలయునో అనుభవము ద్వారా అవగతము చేసికొని, తనకుగల కోరికలను, ఆశయములను తీర్చుకొనుటకే మానవుడు తాపత్రయపడుచున్నాడు. కాని, తనసాటి ఇతర పౌరుల యొక్క, మానవ సంఘము యొక్క మంచి చెడుగులను గురించి కాని, ప్రజలందరి వాంఛలు సఫలమగుటకు ప్రభుత్వము ఎట్టి కార్యక్రమములు

అనుసరింపవలయునో నిర్ణయించుటయందు కాని అతడు అంత సమర్థుడు కాడు. అతనికి ఇట్టి శక్తిని కల్గించుటలో రాజకీయపక్షములు ప్రధానపాత్ర నిర్వహించుచున్నవి. వాటి ప్రచారముద్వారా ప్రతిపౌరుడును రాజకీయముగ ఏది వాంఛితమో, ఏది కాదో, ఏది సాధ్యమో, ఏది అసాధ్యమో తెలిసికొని అట్టి పరిజ్ఞానముతో ఎన్నికలలో బాధ్యతాయుతముగ పాల్గొనుటకు సమర్థుడు అగుచున్నాడు.

సాధారణముగ పౌరులలో చాలమందికి ప్రభుత్వకార్యకలాపములేవియో తెలియవు సరికదా, తెలిసికొనుటకు కూడ ఇచ్ఛ కనుపించదు. ఆ ఇచ్ఛను, శ్రద్ధను ప్రతి పౌరుడు కలిగి ఉండునటుల అతనిలో మానసిక ఉత్తేజము కల్పింపబడవలయును. పౌరులలో ఇట్టి శ్రద్ధ లోపించుటచే సాధారణ ఎన్నికలు జరుగు సమయములందుకూడ వోటరులలో అనేకులు ఎన్నికలలో పాల్గొనుటయందు ఎట్టి శ్రద్ధను చూపుటలేదు. ప్రతి పౌరుడును ప్రభుత్వ వ్యవహారములందు శ్రద్ధకలవాడై ఉండవలెనను సూత్రముపైననే ప్రజాస్వామికసూత్రము ఆధారపడి ఉన్నది. ఈ సూత్రము కార్యరూపము పొందుటకు రాజకీయపక్షముల తోడ్పాటు చాల అవసరము. ప్రజలలో ప్రభుత్వ కార్యకలాపములలో శ్రద్ధవహించునట్లు చేయుటకు ఎన్నికల సమయమునందే కాక, మిగిలిన అన్నిసమయములందు కూడ తగు ప్రచార సాధనముల మూలమున రాజకీయ పక్షములు కృషి చేయుచున్నవి. అట్లుచేయుట వాటికి చాల లాభకరము. ఎన్నికలలో విజయము సంపాదించుటకు ఇది యొక ప్రధాన సాధనము.

ప్రజాస్వామికములో ప్రభుత్వము ప్రజలకు బాధ్యత వహించి పరిపాలన జరుపుటయు, నిరంకుశముగను, బాధ్యతా రహితముగను పరిపాలనము జరుపకుండుటయు అవసరము. ప్రభుత్వ వ్యతిరేకపక్షములు ఉండుటచేతనే అట్టి అవసరము తీరుచున్నది. ఈ వ్యతిరేకపక్షములు ప్రభుత్వవిధానములను, కార్యకలాపములను విమర్శించి అందలి దోషములను ఎత్తిచూపును. ప్రభుత్వము ఏ యే సందర్భములలో పొరపడెనో ప్రజలకు అవి సూచించును. ఇందు మూలముగ ప్రభుత్వము బాధ్యతతో ప్రవర్తించునట్లు ఒత్తిడి ఏర్పడుచున్నది. ప్రభుత్వ వ్యతిరేకపక్షములు లేనందువలననే సోవియట్ రష్యాలో స్టాలిన్, జర్మనీలో హిట్లర్ నిరంకుశముగ ప్రవర్తించుటకు అవకాశము కలిగినది. ప్రభుత్వము తనకు గల అధికారమును దుర్వినియోగము చేయకుండునట్లు వ్యతిరేకపక్షమువారు ఒకవిధమైన అజమాయిషీ జరుపుచున్నారు.

భారతదేశమువంటి పార్లమెంటరీ ప్రభుత్వము గల దేశములలో ఆ ప్రభుత్వముయొక్క స్థిరత్వము, అధికారమునకు వచ్చిన రాజకీయపక్షము శాసనసభలో అది సంపాదించుకొనిన ప్రాబల్యము (మెజారిటీ) పై ఆధారపడి ఉండును; లేదా శాసనసభలోని సభ్యులు వారికి ఇచ్ఛ వచ్చిన విధముగ వోటుచేయు అవకాశము ఉండినపుడు మంత్రివర్గము చీటికిమాటికి మారుటయు, పదే పదే కొత్త మంత్రివర్గములు ఏర్పడుటయు తప్పదు. మంత్రివర్గము అస్థిరమైనపుడు దేశమునందు అనేక అనర్థములు సంప్రాప్తించుట కలదు. శాసనసభలలోని సభ్యులు స్వతంత్రులుకాక కొన్ని రాజకీయపక్షములకు చెందినవారైనపుడు ఇట్టి అస్థిరత్వ ప్రమాదమునకు ఎక్కువ అవకాశము ఉండదు.

రాజకీయపక్షముల కర్తవ్యములు ఇవికాక ఇంకను చాల కలవు. అభ్యర్థుల నామ నిర్దేశములు చేయుట, నామ నిర్దేశము చేయబడిన అభ్యర్థుల తరఫున ఎన్నికలలో ప్రచారము చేయుట, ఈ ప్రచారమునకు కావలసిన ఖర్చులో కొంత భాగమును భరించుట మొదలగునవి వారి ఇతర కార్యకలాపములు. సమర్థులగు అభ్యర్థులు సభ్యులగుటకు ఇదంతయు అవసరమే. ప్రజలను, ప్రభుత్వమును కలుపుటలో రాజకీయపక్షములు ప్రధాన సాధనములుగ ఉన్నవి.

మా. వెం. రం.

# శాసన సభ

ప్రజాస్వామిక రాజ్యముల అన్నిటియందును సాధారణముగ శాసనసభలో 'ఎగువసభ, దిగువసభ' అని రెండు కక్ష్యలు ఉండుట ఆచారము. ప్రజలతో ప్రత్యక్ష సంబంధము కలిగియుండు సభ దిగువసభ. అందలి సభ్యులు ప్రాంతీయ నియోజకవర్గముల ద్వారా ప్రత్యక్షపు ఎన్నికల మూలమున ఎన్నుకొనబడుదురు. శాసనసభలో రెండు కక్ష్యలు ఉండవలయునా అను విషయము గురించి వాదోపవాదములు జరుగుచునే ఉన్నవి.

ప్రజాస్వామికరాజ్యముల శాసనసభలో ఒకే కక్ష్య ఉండు పక్షమున తొందరపడి అనాలోచితముగ శాసన నిర్మాణాది కార్యక్రమములు కొనసాగు ప్రమాదము ఉన్నదనియు, అట్టి ప్రమాదమునుండి రాజ్యమును రక్షించుటకు రెండవ కక్ష్య అవసరమనియు, దిగువసభలో ప్రాతినిధ్యము లభింపని వర్గములకు రెండవ కక్ష్య ప్రాతినిధ్యము కల్పించు అవకాశము ఉన్నదనియు, దిగువసభ ఎన్నికలలో నిలబడుటకు అంగీకరించని ప్రముఖులు అనేకులు రాజకీయములలో

ప్రవేశించి దేశసేవ చేయుటకు ఎగువసభ ఉపయోగపడగల దనియు, దిగువసభలోని పొరపాట్లను సరిదిద్దుకొనుటకు రెండవ కక్ష్య అవకాశము ఇచ్చుచున్నదనియు ద్వికక్ష్యాయుత శాసనసభలు ఉండవలెనను వాదమును సమర్థించు వారు అనెదరు. రెండవ కక్ష్య ఉండుటచేత పరిపాలన ఖర్చులు అనవసరముగ పెరుగుననియు, సాధారణముగ రెండవ కక్ష్య సభ్యులు నూతన సంస్కరణములకు అడ్డు తగులుచుందురనియు, ప్రజాస్వామిక విధానములో ప్రత్యేక వర్గములకు ప్రాతినిధ్యము కల్పింపవలసిన అవసరము లేదనియు, భారతదేశములోనే ఎగువసభలులేని రాష్ట్రములు అనేకములు (ఉదా: కేరళ, గుజరాత్, మధ్య ప్రదేశ్, బీహార్) ఉన్నవనియు, వాటిలో ఎగువసభలు లేని కారణమున వాటి పరిపాలన కుంటుపడలేదనియు ద్వికక్ష్యాయుత శాసనసభా విధానమును ఖండించువారి వాదము. ఈ రెండు వాదములలోను కొంత సత్యము లేకపోలేదు. అందుచేతనే వాదములు జరుగుచున్నను, ప్రపంచములో ఏదియో కొన్ని రాజ్యములందు తప్ప తక్కిన రాజ్యములు అన్నిటిలోను రెండు కక్ష్యలతోను కూడిన శాసనసభల సాధనముననే పరిపాలన జరుగుచున్నది. ఈ సందర్భములో రెండు ప్రధాన విషయములను గమనించుట అవసరము. మొదటిది: శాసనసభలలో రెండు కక్ష్యలు ఉన్నను అధిక సంఖ్యాక రాజ్యములలో దిగువసభలకు ఉండునంతటి అధికారము, ప్రాధాన్యము ఎగువసభలకు ఉండుటలేదు. ప్రజలు ప్రత్యక్షముగ ఎన్నుకొను దిగువసభలకే ఎక్కువ అధికారము ఉండవలయునను అభిప్రాయమును అందరును అంగీకరింతురు. యునైటెడ్ స్టేట్స్ వంటి ఏదో ఒక దేశమునందు మాత్రమే దిగువసభకంటె ఎగువ సభకు ఎక్కువ అధికారములు ఉన్నవి. రెండవది: సమాఖ్యా విధానమును అనుసరించు భారతదేశమువంటి రాజ్యములలో ఎగువసభ తప్పక ఉండవలసిన అవసరము కలదు. అట్టి విధానములో కేంద్రప్రభుత్వమునకు కొన్ని స్వతంత్రాధికారములు ఉన్నట్లు రాష్ట్రప్రభుత్వములకు కూడ కొన్ని స్వతంత్రాధికారములు ఉన్నవి. రాజ్యాంగ నిర్మాణములో రాష్ట్రప్రభుత్వ అధికారములకు కేంద్రప్రభుత్వము నుండి ఎట్టి ప్రమాదము కలుగకుండ వాటిని రక్షించుటకు ఒక ప్రత్యేక 'రాజకీయ సంస్థ' ఉండుట అవసరము. ఆ సంస్థ రాష్ట్రములచే ఎన్నుకొనబడినట్టిదిగాను, రాష్ట్రముల దృష్ట్యా రాజకీయవిషయములను పరిశీలించునట్టిదిగాను ఉండవలెను.

సమాఖ్యారాజ్యములు అన్నిటిలో ఇట్టి బాధ్యతను వహించు సంస్థ ఎగువసభ. ఈ కారణముచేత ఇతర దేశముల మాటలు ఎట్టివైనను భారతదేశమునకు, ఇతర సమాఖ్యారాజ్యములకు 'రాజ్యసభ' వంటి ఎగువసభ అవసరము అగుచున్నది.

ఎగువసభయొక్క రూపకల్పనలో ప్రపంచమునందు ఎచ్చటను ఒకేపద్ధతి అనుసరింపబడి ఉండలేదు. ఉదాహరణకు: యునైటెడ్ స్టేట్స్ వంటి దేశములలో ఎగువసభ సభ్యులను ప్రత్యక్ష ఎన్నికలమూలమున ప్రజలు ఎన్నుకొనుచున్నారు. భారతదేశమువంటి దేశములలో ఎగువసభ సభ్యులు అపరోక్ష విధానమున రాష్ట్రశాసనసభ్యులచేత ఎన్నుకొనబడుచున్నారు. కెనడావంటి కొన్ని దేశములలో జీవితపర్యంతము ఎగువసభ సభ్యులు ప్రభుత్వముచే నామనిర్దేశము చేయబడుచున్నారు. ఈ పద్ధతులేకాక మరి కొన్ని కూడ అమలునందు ఉన్నవి.

అధికారములను చలాయించు స్వాతంత్ర్యము శాసనసభలకు ఉండవలెనన్న ఆ సభలోని సభ్యులు ప్రభుత్వోద్యోగులు గాని లేదా దానితో సంబంధము ఉండిన వ్యక్తులుగ గాని అయి ఉండరాదు. ఈ ఆచారము సర్వసాధారణముగ అన్ని దేశములలోను అమలునందు ఉన్నది. శాసనసభలు సమావేశము కావలసినకాలము, అవి నిర్వహించవలసిన బాధ్యతలు, శాసనసభ్యులు అనుభవించు ప్రత్యేక హక్కులు రాజ్యాంగమునందు పొందుపరుపబడి ఉండును. ఈ విషయములలో ప్రభుత్వము ఎన్నడును జోక్యము కలిగించుకొనరాదు. శాసనసభ తాను నిర్వహింపవలసిన కార్యక్రమ విధి విధానములను తానే నిర్ణయించుకొనుటకు అధికారము కలిగి ఉన్నది. సభాధ్యక్షుని ఎన్నుకొనుటకు, అతనిని పదవి నుండి తొలగించుటకు శాసనసభకు హక్కు ఉన్నది. దీనిని బట్టి సాధారణముగ ప్రతి శాసనసభయు తన యజమాని తానై ఉండి, తన కార్యకలాపముల కొరకు ప్రభుత్వముపై ఆధారపడి ఉండదను విషయము తెలియుచున్నది. ప్రభుత్వముపై ఆధారపడు శాసనసభలు నిరంకుశాధికారము కలిగిన ప్రభుత్వములలో కానవచ్చుచున్నవి.

ప్రజల అపరోక్ష, పరోక్ష ఎన్నికల మూలమునను, రాష్ట్రపతి, రాష్ట్రగవర్నర్ల నామనిర్దేశముల మూలమునను రూపొందిన శాసనసభలు చేయవలసిన పనులు మూడు రకములు. వీటిలో మొదటిది: శాసననిర్మాణము; రెండవది: ప్రభుత్వముయొక్క ఆదాయ వ్యయ నిర్ణయము; మూడవది: మంత్రివర్గముల ద్వారా జరుగు దైనందిన పరిపాలనముపై పర్యవేక్షణము.

ప్రస్తుతయుగమును 'శాసననిర్మాణయుగము', అని చెప్పవచ్చును. ప్రాచీన, మధ్య యుగములలో పరిపాలించిన వారు సాధారణముగ ఎపుడో కాని క్రొత్త శాసనములను

చేసినవారు కారు. సంఘములో సనాతనముగ ఏర్పడిన ఆచారములను, సంప్రదాయములను అమలుపరచుటయే తమ కర్తవ్యమని వారు భావించిరి. ధర్మసంస్థాపనముకంటె ధర్మపరిరక్షణమునకే రాజ్యము ఏర్పడినదను విశ్వాసముతో ఆనాడు వారు ప్రవర్తించిరి. పూర్వులకంటె తమకు ఎక్కువ తెలియునను అహంభావము వారికి ఉండెడిది కాదు.

శాసన నిర్మాణము: ఆధునిక యుగమందు నూతన పరిస్థితులు ఏర్పడెను. క్రొత్తవృత్తులు, క్రొత్త ధనార్జన సాధనములు వాడుకలోనికి వచ్చెను. భిన్నసంస్కృతి, భిన్న ఆచారములు గల పాశ్చాత్యులు కొంతకాలము దేశమును పాలించుటచేత ప్రాచీన సంప్రదాయములందు గౌరవము తగ్గుటయు, నూతన ఆశయములు, సిద్ధాంతములు ప్రాబల్యము కాంచుటయు సంభవించెను. మానవులందరి మధ్యను, స్త్రీ - పురుషులమధ్యను సమానత్వము ఉండవలెనను భావము వృద్ధిగాంచెను. వీటి అన్నిటికి అనుగుణముగ సమాజములోని నియమ నిబంధనలు మారవలెననియు, అవసరములైన మార్పులను ప్రవేశపెట్టుటకు ప్రభుత్వము ఒక్కటే తగిన సంస్థ అనియు విశ్వాసము ఏర్పడెను. క్రొత్త క్రొత్త శాసనముల నిర్మాణమునకు ఈ విధముగ ఆవశ్యకత కలిగెను.

గత నూరు, నూటయాభై ఏండ్లమధ్య సంఘ స్వరూపము మారుటలో క్రొత్త శాసనముల పాత్ర అత్యంత ప్రధానమైనది. శాసనముల మూలమున సంఘదురాచారములుగ పేర్కొనబడు సహగమనము, శిశుహత్య, బాల్యవివాహములు, వరకట్నములు, మద్యపానము మొదలగునవి నిషేధింపబడెను; అస్పృశ్యత తొలగింపబడెను; స్త్రీ పునర్వివాహము, వర్ణాంతరవివాహములు, పురుషులతో సమానముగ స్త్రీలకు వారసత్వపుహక్కులు, విడాకుల పద్ధతి సదాచారములయ్యెను; జమీందారీలు రద్దయినవి; భూవసతులకు గరిష్ఠప్రమాణము నిర్ణయింపబడెను; కౌలుదారులకు ప్రత్యేక సదుపాయములు కల్పింపబడినవి; 'దున్నినవానిదే భూమి' యను సూత్రానుసారము సంస్కరణలు ప్రవేశపెట్టబడినవి; కార్మికుల వేతనములు, కార్మికులు పనిచేయవలసిన కాలము మొదలైనవి శాసనబద్ధములు అయ్యెను; ఏయే వృత్తులను అనుసరించుటకు ఎట్టి అర్హతలు ఉండవలెనో నిర్ణయింపబడెను; నిర్బంధ విద్యావిధానము ప్రవేశపెట్టబడెను. ఈ యుగములో శాసననిర్మాణమునకు గల ప్రాధాన్యము రుజువుచేయుటకు ఇంతకంటె తార్కాణము అవసరములేదు [చూ. న్యాయశాస్త్ర సంపుటము].

ఆదాయ వ్యయ నిర్ణయము: శాసనసభలు చేయదగు పనులలో రెండవది ప్రభుత్వముల ఆదాయ వ్యయములను నిర్ణయించుట. ప్రభుత్వము తలపెట్టు కార్యకలాపములు అన్నింటికిని ద్రవ్యము అవసరము. ఈ ద్రవ్యమును సంపాదించుటకు మూడు మార్గములు అనుసరింపబడుచున్నవి. మొదటిది: ప్రజలపై పన్నులు విధించుట; రెండవది: బస్సురవాణా, రైల్వేలు వంటి వ్యవహారములను జాతీయకరణముచేసి, వాటిద్వారా లాభములను సంపాదించుట; మూడవది: ప్రజలనుండి ఋణములు తీసికొనుట. ప్రభుత్వ ఖర్చులకు కావలసిన ద్రవ్యములో ఎంతెంత మొత్తము ఈ మూడు మార్గములద్వారా - ఒక్కొక్క దానినుండి - సంపాదించవలసినది, పన్నులలో ఎట్టివానిని విధించవలసినది నిర్ణయించగల అధికారము శాసనసభలది. శాసనసభల అనుమతిలేక ఎట్టి స్వల్ప ఆదాయమును సంపాదించుటకు ప్రభుత్వమునకు ఎట్టి అవకాశమును లేదు. పన్నుల మూలమునను, జాతీయకరణము చేయబడిన వ్యవహారముల మూలమునను కలుగు కష్టనష్టములను భరించవలసినవారు ప్రజలగుటచేత ప్రజాప్రతినిధులతోకూడిన శాసనసభ అనుమతిలేక ఇట్టి కార్యక్రమములలో ప్రభుత్వము ప్రవేశింపరాదను నియమము ప్రజాస్వామిక రాజ్యములు అన్నింటిలో పాటింపబడుచున్నది.

ప్రభుత్వమునకు లభించిన ఆదాయమును వివిధ కార్యక్రమములకు ఖర్చుపెట్టవలసి ఉన్నది. దేశరక్షణ, న్యాయ నిర్వహణ, విద్య, ఆరోగ్యము, సాంఘిక క్షేమము, నిరుద్యోగ భృతి మొదలగునవి ఇట్టివి. ఏయే కార్యములకు, ఏయే ప్రయోజనములకు ఎంతెంత ద్రవ్యము ఖర్చుపెట్టవలసినదీ తీర్మానించుటలో శాసనసభల ఆమోదము అవసరము. ప్రభుత్వ కార్యకలాపములవలన లాభమును అనుభవించువారు ప్రజలు గనుక వారి ప్రతినిధుల అనుమతిలేక ప్రభుత్వము ఎట్టి ఖర్చు చేయుటకును రాజ్యాంగము అనుమతించదు.

ప్రభుత్వముపై పర్యవేక్షణ: శాసనసభలు చేయవలసిన మూడవ పని ప్రభుత్వముపై పర్యవేక్షణ. రాజ్యపరిపాలనావిధానములో దేశమును, రాష్ట్రములను పరిపాలించు అధికారము మంత్రివర్గమునకు కలదు. శాసన సభలు మంజూరుచేయు ద్రవ్యనిధి వారి వశమున ఉండును. దానిని చట్టసమ్మతముగ ఖర్చుపెట్టవలసిన వారు కూడ వారే. పరిపాలన సౌష్ఠవముగ జరుగుటకు నియమింపబడిన అధికారపు సిబ్బంది అంతయు వారి ఆజ్ఞలకు లోబడి తమ తమ విధులను నిర్వహించును. ఇట్టి అర్థసహాయము, అంగబల సహాయము కలవారై మంత్రులు దేశపాలన

సాగించవలసి ఉన్నది. ఈ సాగించుటలో వారు శాసన సభలకు బాధ్యులై ప్రవర్తించవలెను. ఈ బాధ్యతను చక్కగ నిర్వహించుచున్నదియు, లేనిదియు చూచువారు శాసన సభ్యులు. పరిపాలనలో ఏ లోపమున్నను దానిని శాసన సభ్యులు మంత్రులదృష్టికి తెచ్చి దాని సవరణకై పాటుపడవలసినవారుగా ఉన్నారు [చూ. రాజ్యపరిపాలన విధానము - తెలుగు సంస్కృతి - 2; పు. 484].

శాసనములను నిర్మాణము చేసినంతమాత్రమున ఎవరికిని ఎట్టి లాభము కలుగబోదు. వాటిని పూర్తిగ అమలు పరచినపుడే వాటిమూలమున సమకూరవలసిన ప్రయోజనము సమకూరకలదు. వాటిని అమలులో పెట్టవలసిన వారు మంత్రివర్గమువారు. 'అమలులో పెట్టుటయందు లోపములు ఏవైన సంభవించిన ఎడల మంత్రులను మందలించవలసిన పని శాసన సభలది. మా. వెం. రం.

# కార్యనిర్వాహకవర్గము

నేటి ప్రజాస్వామిక రాజ్యములలో కార్యవర్గమును గురించి చెప్పునపుడు అట్టి వర్గము రెండు విధములుగ ఉన్నదని తెలిసికొనవలసి ఉన్నది. అందులో ఒక దానికి పార్లమెంటరీ కార్యవర్గ విధానమనియు, రెండవ దానికి అధ్యక్షవర్గ విధానమనియు పేరులు కలవు. డైరెక్టరీ వినథామనుపేర మరియొకటి ఉన్నది గాని అది ఒక స్విజర్లండ్‌లో మాత్రమే కనిపించుచున్నది.

పార్లమెంటరీ విధానము గల రాజ్యములలో అలంకారప్రాయుడైన ఒక అధినేతయు, వాస్తవాధికారము గల ఒక మంత్రి వర్గమును ఉండును. ఈ అధినేత బ్రిటన్ దేశమందు వలె వంశపారంపర్యముగ అధికారములోనికి వచ్చు రాజు లేదా రాణి కావచ్చును; లేదా భారత దేశమున రాష్ట్రపతి, పశ్చిమ జర్మనీలో ప్రెసిడెంట్ వంటి ఎన్నుకొనబడిన ఒక అధ్యక్షుడు కావచ్చును. వీరందరికి రాజ్యాధినేతలను బిరుదములు ఉన్నను, ప్రభుత్వమంతయు వారి పేరట జరుగుచున్నను, వారి అధికారములు నామమాత్రములే. వారు చేయు పనులన్నియు మంత్రివర్గ సలహాపైననే చేయదగి ఉన్నవి. వారి పేరిట చేయబడు పనులన్నిటిని మంత్రులే చేయుచుందురు. అందుచేత మంత్రి వర్గమే వాస్తవమైన కార్యనిర్వాహక వర్గమని చెప్పదగి ఉన్నది.

పార్లమెంటరీ విధానములో కార్యవర్గము, శాసన శాఖల మధ్య పరస్పర ఆశ్రయము ఉన్నది. కార్యవర్గ శాఖను నియమించుటకును, ఉచితమని తోచినపుడు దానిని తొలగించుటకును శాసనసభకు ఈ విధానమున అధికారము ఉన్నది. కాని, శాసనసభ యొక్క కార్యక్రమమును నిర్ణయించుట, దానిపై నాయకత్వమును వహించుట, చట్ట నిర్మాణ విషయములందు ప్రభుత్వమే మొదట ఉపక్రమించుట, ప్రభుత్వవిధానములను నిర్ణయించుట మొదలగు విషయములద్వారా శాసన సభను సైతము కార్యవర్గము ఒక తీరుగ తన అదుపులో ఉంచుకొనుచున్నదనియు చెప్పదగును. వీటి అన్నింటికన్నను కార్యనిర్వాహక వర్గమునకు శాసన సభపై ఎక్కువ ప్రాధాన్యము కల అధికారము వేరొకటి కలదు. శాసనసభను ఇష్టము వచ్చినపుడు రద్దు చేయుట, తిరిగి ఎన్నికలు జరగవలెనని నిర్ణయించి క్రొత్త శాసనసభ ఏర్పడునట్లు చేయుట ఇదియే ఆ అధికారము. నిర్ణీత కాలావధికి ముందుగ తమ సభ్యత్వమును పోగొట్టుకొనుట శాసనసభ్యులకు రుచింపని విషయము. అట్లు రద్దయిన పక్షమున శాసనసభ్యులు అభ్యర్థులుగ నిలబడుటయు, ఎన్నికలలో గెలుపొందుటకు ధనవ్యయము చేయుటయు తప్పనిసరి అగుచున్నది. అట్టి సంకట పరిస్థితిని ఎదుర్కొనుటకు ఎవరును సంసిద్ధులు కాజాలరు. అందుచేత కార్యవర్గమునకు గల ఈ అధికారము శాసనసభను అదుపులో పెట్టుటకు ఎక్కువగ తోడ్పడుచున్నది.

అధ్యక్ష కార్యవర్గవిధానము ప్రధానముగ యునైటెడ్ స్టేట్స్ [చూ.] లో అమలునందు ఉన్నది. ఆ దేశములో దేశాధినేతయగు అధ్యక్షుని (ప్రెసిడెంట్) కి కార్యనిర్వహణమందు సర్వాధికారము కలదు. అందు కార్యనిర్వహణాధికారమును వహించు అధ్యక్షుని ప్రజలే నాలుగు ఏండ్లకు ఒక పర్యాయము ఎన్నుకొందురు. ఈ ఎన్నికలతో శాసన విభాగమునకు (యునైటెడ్‌స్టేట్స్‌లో శాసన విభాగమునకు 'కాంగ్రెస్' అని పేరు) ఎలాటి సంబంధమును లేదు. ఉద్యోగకాలములో అధ్యక్షుడు చేయుపనులు శాసన విభాగమునకు నచ్చినను, నచ్చకపోయినను ఉద్యోగమునుండి అతనిని తొలగించు అధికారము శాసన విభాగమునకు లేదు. అతడు కార్యనిర్వహణకు సంబంధించినంతవరకు స్వతంత్రుడు. పరిపాలన విషయములలో అతనికి సలహాలను ఇచ్చుటకు కావలసిన మంత్రులను (కార్యదర్శులను) అతడే నియమించుకొనును. వారి వారి ఉద్యోగ పరిమితి కూడ అధ్యక్షుని నిర్ణయముపై ఆధారపడి ఉండునేకాని, శాసన విభాగ ఇష్టానిష్టములపై ఆధారపడదు. శాసనసభలతో నిమిత్తము లేక అధికారములోనికి వచ్చుట, నిర్ణీతకాలము ముగియు వరకు అధికారములో ఉండుట, స్వతంత్రముగ అధికార

మును చలాయించుట మొదలగు ప్రధాన లక్షణములు కలిగి ఉండు ఇట్టి ప్రభుత్వమునకు 'అధ్యక్ష ప్రభుత్వ' మను పేరు ప్రచారములోనికి వచ్చెను [చూ. అధ్యక్ష ప్రభుత్వము].

కాని, అధ్యక్ష విధానమునందు కూడ శాసన, కార్య వర్గశాఖల మధ్య పరస్పరాశ్రయము కాననగుచున్నది. శాసనసభ చేయు నిర్ణయమువలన అధ్యక్షుడు పదవీ విరమణము చేయకపోయినను, ధన సంబంధములగు విషయములపై అధ్యక్షుడు తప్పక శాసనసభపై ఆధారపడవలసినదే. శాసనసభ ధనమును మంజూరు చేసిన కాని, అధ్యక్షుడు పరిపాలన జరుపుటకు సాధ్యము కాదు. నూతనముగ అధ్యక్షుడు ప్రవేశపెట్టు విధానములను ఆచరణలోనికి తెచ్చుటకు కూడ అతడు శాసన సభపై ఆధారపడి ఉండవలెను. శాసన సభయును ఆర్థిక విషయములను నిర్ణయించుటలో అధ్యక్షుని సలహాలకు తగు విలువనొసగవలసి ఉండును. దేశప్రజలందరకును అధ్యక్షుడు మార్గదర్శి అగుటచేత శాసన సభ అతనిని సాధారణముగ నిర్లక్ష్యము చేయజాలదు.

అధ్యక్షవిధానములో కార్యవర్గశాఖకు ఉన్నట్టి స్థిరత్వము పార్లమెంటరీ విధానములోని మంత్రివర్గమునకు కొన్ని పరిస్థితులలో లభింపకపోవుటయు, తత్ఫలితముగ మంత్రులు తరచు మారుచుండుటయు జరుగుచుండును. శాసనసభలో ఏపార్టీకి మెజారిటీబలము లేనపుడు రెండు మూడు పార్టీలు కలిసిన కాని మంత్రివర్గ నిర్మాణము సాధ్యముకానపుడు మంత్రివర్గమునకు స్థిరత్వము ఉండదు. మెజారిటీ పక్షములో ముఠాలు, బహునాయకత్వము బయలుదేరినపుడు ఇట్టి ప్రమాదము సంభవించును. తరచు మంత్రులు మారుటవల్ల పరిపాలనాధికారము అంతయు ఉద్యోగుల హస్తగతమగుట కూడ కలదు. ఇట్టి ప్రమాదము అధ్యక్షవిధానములో సంభవింపదు. ఒక పర్యాయము ఎన్నుకొనబడిన అధ్యక్షుడు ఎక్కడ ఏమి జరిగినప్పటికి, శాసన విభాగము అతని కార్యక్రమములను సమర్థించినను, సమర్థించకపోయినను, అందులో పార్టీలకు ఉండు బలాబలములు ఎట్టి మార్పులు చెందినను, రాజ్యాంగరీత్యా అధ్యక్షునికి గల పదవీ కాలపరిమితి ముగియువరకు (నాలుగు లేదా అయిదు సంవత్సరములు) అతడు చెక్కుచెదరకుండ అధికారములో ఉండును.

ఇంత మాత్రముచేత అధ్యక్ష విధానములో లోపము లేవియు ఉండవని భావించరాదు. పార్లమెంటరీప్రభుత్వము ఉండు రాజ్యములన్నింటిలో మంత్రి వర్గములు తరచుగ మారుచుండుట - కొన్ని దేశములలో తప్ప - తటస్థించుట లేదు. ప్రజాభిప్రాయానుసారము పరిపాలన సాగవలెనను ప్రజాస్వామిక విధాన మూలసూత్రమును ఆచరణయోగ్యము చేయుటకు పార్లమెంటరీ ప్రభుత్వములో ఉండునట్టి అవకాశము అధ్యక్ష విధానములో లేదు. ప్రజల వాంఛలకు ఎన్నికల కాలములో పార్టీనాయకులు చేసిన వాగ్దానములను అనుసరించి రూపము కల్పించి తదనుగుణముగ శాసనముల నిర్మించుట, వానిని పూర్తిగ అమలులో పెట్టుట అను రెండు ముఖ్యాంశములు జరుగవలసి ఉన్నవి. వీటిలో ఒకటి మాత్రమే జరిగిన లాభము ఉండబోదు. రెండు అంశముల కార్యాచరణయు జరుగుటకు ఉభయ శాఖల మధ్య పూర్తి సహకారము, సౌహార్దము అవసరము. అధ్యక్ష విధానములో శాసనశాఖ వేరుగను, కార్యవర్గశాఖ వేరుగను వాటి వాటి పనులను చక్కపెట్టుకొనుటచేత ఇట్టి కార్యము సులభసాధ్యమగుట లేదు. ప్రజాభిప్రాయమును అనుసరించి పరిపాలన జరుగకుండుటకు శాసనశాఖ కారణమని కార్యవర్గశాఖవారును, కార్యవర్గశాఖవారు కారణమని శాసనశాఖ వారును చెప్పి, తప్పించుకొనుటకు ఈ విధానములో వీలున్నది. అధ్యక్ష బలము ఒక పార్టీకిన్నీ, శాసనశాఖలో మెజారిటీబలము ఇంకొక పార్టీకిన్నీ ఉన్నపుడు ఈ రెండును కలిసి పనిచేయుట అసంభవము. పార్లమెంటరీ విధానములో మంత్రులుగాని, శాసనసభవారుగాని పరస్పరము ఒకరిపైన ఇంకొకరు నేరారోపణ చేయుచు ఇట్టి బాధ్యతను తప్పించుకొనుటకు వీలులేదు. ఈ విధానములో కార్యవర్గశాఖ శాసనసభలో ఒక భాగమై ఉన్నది. మంత్రులు అందు నాయకత్వము వహించినవారు; సభలో మెజారిటీబలము వారికి ఉండును. ప్రజాభిప్రాయములను మన్నించు ఉద్దేశము, ఎన్నికల కాలములో తాము చేసిన వాగ్దానములను చెల్లించు ఉద్దేశము మంత్రులకు ఉండినప్పుడు ఈ పరిస్థితిలో వానిని నెరవేర్చుట వారికి కష్టము కాని పని. అధ్యక్ష విధానములో బాధ్యతలను తప్పించుకొనునట్లు ఈ విధానమున తప్పించుకొనుటకు వారికి ఎట్టి అవకాశమును లేదు. అందువలన పార్లమెంటరీ విధానమే ప్రజాస్వామిక సూత్రములకు ఎక్కువ అనుగుణముగ ఉన్నట్లు చెప్పవచ్చును.

పార్లమెంటరీ విధానము గల రాజ్యములలో మంత్రులందరు శాసన సభలో సభ్యత్వముగలవారుగ ఉండుట ఒక లక్షణము (అట్టి సభ్యత్వములేనివారు ఒక్కొక్కపుడు మంత్రులైనప్పటికి అది తాత్కాలికమగు ఏర్పాటే అగుచున్నది). ఇట్టి నియమము శాసనశాఖ వారిపట్ల వారికి ఉండవలసిన బాధ్యతను మరింత బలపరచుచున్నది.

వారెల్లప్పుడు శాసన సభ యొక్క పర్యవేక్షణలో ఉండుట చేత సభవారి అభిప్రాయములకు అనువుగ పరిపాలన సాగించుట వారికి తప్పని సరి అగుచున్నది.

మంత్రులందరు శాసనసభా సభ్యులుగ ఉండుటయే కాక, అందు ఏ రాజకీయ పక్షమునకు అధిక సంఖ్యాబలము ఉన్నదో దానిపైన నాయకత్వము వహించినవారే పార్లమెంటరీ విధానమున మంత్రులగుచున్నారు. ఏ ఒక పక్షమునకును అధికసంఖ్యాబలము లేనపుడు, ఏ రెండు పక్షములు కలసిన అట్టి బలము ఏర్పడునో అట్టి వాని నాయకులు మంత్రులగుదురు. ఈ రెండు పద్ధతులలో దేని ద్వారా మంత్రులైనప్పటికి, మంత్రి వర్గమును శాసనసభ లోని అధిక సంఖ్యాకులు బలపరచుటచేత పరస్పర సహకారముతో కార్యవర్గ, శాసనశాఖలు పనిచేయుటకు అవకాశము లభించుచున్నది. అధ్యక్ష విధానములో ఇట్టి సహకారము అన్ని సమయములలోను లభింపదు. ఒక్కొక్కపుడు అధ్యక్షుడు ఒక రాజకీయ పార్టీకి చెందిన వాడుగ ఉండుటయు, శాసన శాఖలో ఇంకొక పార్టీకి మెజారిటీబలము ఉండుటయు జరుగుచుండును. అట్టి సమయములలో అధ్యక్షుని కార్యక్రమములకు శాసన శాఖల ద్వారా లభించవలసిన బలము లభించకపోవుట, శాసన శాఖ సూచనలను అధ్యక్షుడు అంగీకరించకపోవుట సంభవింపవచ్చును. శాసనశాఖ ఒక మార్గములోను, కార్యవర్గశాఖ ఇంకొక మార్గములోను నడచుటచేత ప్రభుత్వ పరిపాలనయొక్క సౌష్ఠవము తగ్గిపోవును. అధ్యక్ష విధానములో ఉండు ఈ ప్రమాదము పార్లమెంటరీ విధానములో ఉండదు.

పార్లమెంటరీ విధానములో మంత్రులందరిపై నాయకత్వము వహించు 'ప్రధాన మంత్రి (ప్రైమ్ మినిస్టర్)' ఉండుట ఈ విధానమునకు ప్రధాన లక్షణము. ఇతనిచే ఎన్నుకొనబడినవారే మంత్రులగుచున్నారు. ఇతని విశ్వాసమును ఎవరైనను కోల్పోయినచో వారు మంత్రిత్వమును వదలుకొనవలసిన వారు అగుచున్నారు. ప్రభుత్వ కార్యకలాపములలో ప్రధానమగు మార్పులు జరిగినపుడు వాటిని అధికారహోదాతో ప్రజలకు ప్రప్రథమముగ తెలియపరచువాడు ఈతడే. రాజకీయ రంగమున ప్రధాన పాత్ర ఇతడే నిర్వహించును.

'మంత్రుల సమష్టి బాధ్యత (కలెక్టివ్ రెస్పాన్సిబిలిటీ)' అనునది కూడ పార్లమెంటరీ విధాన లక్షణములలో ఒకటి. సమష్టి బాధ్యత అనగా మంత్రులందరు ఒక జట్టుగ అధికారములోనికి వచ్చుట, అధికారము నుండి తొలగ వలసి వచ్చినపుడు అందరు కలసి జట్టుగ తొలగిపోవుట అని అర్థము. మంత్రులు అనేకులైనప్పటికి, సమష్టి బాధ్యతతో వారందరు ప్రవర్తింపవలసినవారగుటచేత వారి మధ్య ఐక్యభావము ఏర్పడుచున్నది.

ఈ విధానములో కార్యవర్గము - అనగా మంత్రివర్గము - శాసనసభపై నాయకత్వము వహించుట కూడ పార్లమెంటరీ విధాన లక్షణములలో ఒకటి. శాసనసభపై నాయకత్వము వహించుటకు అర్హత కలిగిన సంస్థ మంత్రి వర్గమే. సభలో ప్రముఖులుగ ఉండువారు మంత్రులగుట చేత, నాయకత్వమునకు వారికి ఎక్కువ అర్హత కలుగు చున్నది. ఒక్కొక్క మంత్రి అధీనములో పరిపాలనా శాఖలు కొన్ని ఉండుటచేతను, వాటికి సంబంధించిన ప్రభుత్వోద్యోగులతో వారికి సన్నిహిత సంబంధము ఉండుటచేతను, పరిపాలనలో ఉండు లోపములను గురించియు, వాటిని సరిదిద్దుటకు కావలసిన సంస్కరణలను గురించియు, దేశాభ్యుదయమునకు సాధనములగు ఇతర మార్పులనుగురించియు వారికి తెలిసినంతగా సాధారణ సభ్యులకు తెలిసి ఉండదు. ఇంతేకాక ఎన్నికలకాలములో మెజారిటీ బలమును సంపాదించిన రాజకీయపక్షమునకు మంత్రులు నాయకులై ఉన్నారు. ప్రజలకు వీరు చేసిన వాగ్దానములను చెల్లించవలసిన బాధ్యత సాధారణసభ్యుల కన్న మంత్రులకే హెచ్చుగ ఉండును. ఈ కారణముల మూలమున శాసనసభపై నాయకత్వము వహించి, దాని కార్యక్రమములను క్రమమార్గమున నడిపించి, ప్రజలకు చేసిన వాగ్దానములను చెల్లించుటలో మంత్రివర్గమునకు ప్రత్యేక ప్రాధాన్యము కలదు.

ఈ కాలమున అధ్యక్ష విధానమును అనుసరించు దేశము లందుగాని, పార్లమెంటరీ విధానమును అనుసరించు దేశము లందుగాని ప్రభుత్వశాఖలందన్నింటిలోను కార్యవర్గమే ప్రబలతరమగుటను గమనింపదగును. కొన్ని సమయము లలో శాసనసభ చేయవలసిన నిర్ణయములను కూడ కార్య వర్గమే నిర్ణయించుట జరుగుచున్నది. శాసనసభ అప్పు డపుడు సమావేశమగుచున్నది. కాని, కార్యవర్గము దైనం దిన వ్యవహారములను ఏనాటికి ఆనాడు పర్యవేక్షించు సంస్థ. దాని అధికారము ప్రబలతరమగుటకు ఇది కూడ ఒక కారణము. నేడు ప్రపంచమంతయు క్లిష్టపరిస్థితులను ఎదుర్కొనుచున్నది. ఇది యొక విప్లవయుగము. రాజకీయరంగములో వెంటవెంటనే నిర్ణయములను తీసికొనవలసిన అవసరము ఏర్పడుచున్నది. చర్చ జరిపి, సావకాశముగ నిర్ణయములను తీసికొనుటకు వ్యవధిలేదు. ఇట్టి పరిస్థితి అంతయు కార్యవర్గమునకే ఎక్కువ ప్రాధాన్యమును కల్గించుచున్నది.

స్విజర్లండ్ దేశమున అమలునందుండు డైరెక్టరీ విధానపు కార్యవర్గమున పైరెండు విధానముల లక్షణములు సమ్మేళనము చెందినవని చెప్పదగును. అందు మంత్రివర్గమును శాసనసభ ఎన్నుకొనుచున్నది. ఆ మంత్రివర్గసభ్యులు శాసనసభాసమావేశముల కార్యక్రమములలో పాల్గొనుచుందురు. ఈ తీరుగ పార్లమెంటరీ ప్రభుత్వములోని మంత్రివర్గమువలెనే వీరు పనిచేయుచున్నను, యునైటెడ్ స్టేట్స్ అధ్యక్షునివలె నాలుగు ఏండ్లకొక పర్యాయము వీరు ఎన్నుకొనబడి, ఆ పదవీకాలము ముగియువరకు అధికారమందు ఉందురు. ఇందు ఇంకను వేరొక విలక్షణత కలదు. ఈ మంత్రివర్గసభ్యులు అందరు ఒకే రాజకీయ పక్షమునకు చెందినవారును కారు. అందువలన ఆ ప్రభుత్వమున పార్లమెంటరీ విధానపు ప్రభుత్వమునందున్న రీతిగ సమష్టి బాధ్యతకు అవకాశమే లేదు. స్విజర్లండ్ నందు అమలులోనుండు ఇట్టి కార్యవర్గ విధానమును పోలునది మరొక దేశమునందు కానరాదు. మా. వెం. రం.

# న్యాయశాఖ

ప్రభుత్వ పరిపాలనాంగములలో న్యాయశాఖ మూడవది. న్యాయసూత్రములను ప్రత్యేక వివాద పరిష్కారమునకై వినియోగము చేయుచు, ధర్మమును పాలించుటయే ఈ శాఖయొక్క కర్తవ్యము. పౌర (సివిల్) న్యాయము, దండ (క్రిమినల్) న్యాయము అని న్యాయము రెండు రకములు. ఎవరైనను న్యాయవిరుద్ధములగు నేరములను చేసినచో వారిని విచారించి శిక్షించుట న్యాయశాఖ చేయు పనులలో నొకటి. ఇదియే క్రిమినల్ న్యాయ పరిపాలనము. ప్రభుత్వము పౌరుల లేదా సంఘముల మధ్యగాని, ప్రభుత్వశాఖల మధ్యగాని, సమాఖ్యా విధానమును అనుసరించు దేశములలో రాష్ట్రప్రభుత్వములకు, కేంద్ర ప్రభుత్వమునకు మధ్యగాని ఉత్పన్నములగు వివాదములను న్యాయశాఖ తీర్పులనిచ్చి పరిష్కరించుట సివిల్ న్యాయ పరిపాలనము అనిపించుకొనుచున్నది.

పూర్వకాలమున ఒక వివాదము సివిల్ న్యాయమునకు సంబంధించినదైనను, క్రిమినల్ న్యాయమునకు సంబంధించినదైనను ప్రభుత్వముచే స్థాపింపబడిన కోర్టులద్వారా పరిష్కరింపబడెడిది కాదు. కాని, ఇపుడు న్యాయపరిపాలనము అంతయు ప్రభుత్వపు అధీనముననే ఉన్నది. దేశములోని న్యాయస్థానములు అన్నియు ప్రభుత్వముచే స్థాపింపబడినవే.

నేటి ప్రజాస్వామిక దేశములన్నిటిలోను కోర్టులుగాని, న్యాయమూర్తులుగాని శిరసావహింపవలసిన ప్రధాన సూత్రములు కొన్ని కలవు:

1. ప్రజలందరకు ఒకే న్యాయము ఉండవలయును. దానికే న్యాయ పరిపాలనయందు 'సమత్వము' ని పేరు;
2. అధికులు – అల్పులు అని గాని, ధనికులు – బీదలు అని గాని భేదములేక న్యాయ స్థానములన్నియు ప్రజలందరి అందుబాటులో ఉండవలెను;
3. నేరము చేసినట్లు అనుమానింపబడినవాడు నేరము చేసిన కాలములో అమలునందున్న శాసనమును ధిక్కరించినట్లు న్యాయస్థానములో రుజువైనపుడు మాత్రమే శిక్షకు పాత్రుడు కావలయును;
4. న్యాయ పరిపాలనచేయు న్యాయాధీశులు ఎవరును ప్రభుత్వము, శాసన సభలు, ప్రజలు మొదలగు ఇతరుల ఒత్తిడికి లోబడరాదు. రాజ్యాంగ మూలశాసనము వారి స్వాతంత్ర్యమును సంరక్షింపవలెను. న్యాయమూర్తి చేయు పరిష్కారమునకు అతడు ఎవరిచేతను శిక్షింపబడరాదు. అతడు ఇచ్చు తీర్పులను ప్రభుత్వము తప్పక అమలులో పెట్టవలెను;
5. వివాదములన్నియు సాధారణ న్యాయస్థానములచేతనే పరిష్కరింపబడవలయును కాని, ఒక్కొక్క వివాదమును పరిష్కరించుటకు ఒక్కొక్క ప్రత్యేక న్యాయస్థానమును ఏర్పరచరాదు.

న్యాయమూర్తుల స్వాతంత్ర్యమును రక్షించుటకు ఏది పటిష్ఠమైన సాధనమనునది ప్రతిరాజ్యము ఎదుర్కొను ప్రధాన సమస్యలలో ఒకటి. న్యాయమూర్తులను నియమించు విధానము, వారి ఉద్యోగ కాలపరిమితి, వారికి ఇచ్చు జీతభత్యములు, దుష్ప్రవర్తనకు వారిని ఉద్యోగము నుండి తొలగించు విధానము – వీటి అన్నిటిపైన వారి స్వాతంత్ర్యము ఆధారపడి ఉన్నది.

న్యాయమూర్తుల నియామకములో ప్రపంచమునందు అంతట ఒకే విధానము అనుసరింపబడుటలేదు.

1. కొన్ని రాజ్యములలో న్యాయమూర్తులు ఎన్నికలమూలమున ఎన్నుకొనబడుచున్నారు. కాని, ఇది వారి స్వాతంత్ర్యమునకు భంగకరము. వారి ఉద్యోగకాలము మిక్కిలి పరిమితమైనపుడు ఇది ఎక్కువ భంగకరమగుచున్నది;
2. కొన్ని దేశములలో ఉన్నత న్యాయస్థానములలోని న్యాయమూర్తులు శాసన సభలచే ఎన్నుకొనబడుచున్నారు. ఇది కూడ వారిని పక్షపాతముగలవారిగ చేసి, వారి స్వాతంత్ర్యమునకు భంగము కలిగించుచున్నది;
3. మరికొన్ని దేశములలో ఇతర ప్రభుత్వోద్యోగులను నియమించునట్లే న్యాయమూర్తులను కూడ పోటీపరీక్షల ద్వారా నియమించు ఆచారము ఉన్నది. కాని, అట్టి న్యాయమూర్తులు ఉద్యోగ వర్గమునకు చెందినవారమన్న భావముతో ప్రవర్తించుటయు, వారికి లభింపవలసిన ఉన్నత

పదవులు న్యాయశాఖామాత్యుని ఇష్టానిష్టములపై ఆధారపడుటచేత వారు మంత్రివర్గమునకు లోబడి ప్రవర్తించుటయు జరుగుచున్నది ;

4. భారతదేశము వంటి అనేక దేశములలో ప్రభుత్వకార్యవర్గశాఖయే న్యాయమూర్తులను నియమించును. ఇట్టి నియామకములలో కూడ రాజకీయముల ప్రభావము కన్పించుటకు అవకాశము ఉన్నది. అందుచేత అట్టి ప్రభావమును తగ్గించుటకు కావలసిన చర్యలను తీసికొనుట చాల అవసరము.

న్యాయమూర్తులను స్థిరముగ కొంతవయస్సు వచ్చు వరకు నియమించు పద్ధతి ప్రజాస్వామిక రాజ్యములలో అమలునందు ఉన్నది. భారతదేశమున సుప్రీమ్‌కోర్టులోని న్యాయమూర్తులు 65 ఏండ్ల వయస్సు నిండువరకు పదవిలో ఉండవచ్చును. వారి ఉద్యోగకాలపరిమితి ప్రభుత్వపు లేదా తదితరుల ఇష్టానిష్టములపై ఆధారపడని కారణమున వారు స్వతంత్రులుగ ఉండగల వారగుచున్నారు. వారికి ఇచ్చు జీతములు కూడ హెచ్చుగనే ఉన్నవి. ఉద్యోగకాలమున వారి జీతభత్యములను మార్పుచేయుటకు వీలులేదు. ఈ కారణమున కూడ వారు నిష్పాక్షికదృష్టికల వారు అగుచున్నారు.

న్యాయమూర్తులు సత్ప్రవర్తకులు కానపుడు వారిని పదవిచ్యుతులను చేయుటకు ప్రత్యేక చర్యా విధానము కలదు. ఆ చర్యను అనుసరింపక వేరువిధముగ వారిని ఉద్యోగములనుండి తొలగించుటకు వీలులేదు. భారతదేశమున అట్టి చర్యావిధానము అనుసరింపబడుచున్నది.

పై చెప్పిన విషయములను బట్టి న్యాయమూర్తులు చాల వరకు మంత్రివర్గమునకుగాని, శాసనసభకుగాని లోబడవలసిన అవసరములేక స్వతంత్రించి పనిచేయు అవకాశము ఉన్నట్లు స్పష్టమగుచున్నది. కాని, న్యాయశాఖ కార్యవర్గశాఖపైనను, శాసనశాఖ పైనను అజమాయిషీ చలాయించదగునా అను వివాదగ్రస్తమగుప్రశ్న ఉత్పన్నమై ఉన్నది. నిజమునకు అందరికి ఒకేవిధమగు న్యాయము ఉండవలెనను సూత్రఫలితముగ కార్యనిర్వాహకవర్గము వారును, ఉద్యోగ వర్గమువారును వారి వారి ఉద్యోగ ధర్మములను నిర్వహించుటలో చట్టవిరుద్ధముగ ప్రవర్తించిన ఎడల న్యాయ స్థానములచే విచారింపబడవలసిన వారు అగుచున్నారు. ఇట్టి విచారణమూలమున వారు వారి స్వాతంత్ర్యమును కోల్పోయి, న్యాయశాఖకు లోబడవలసిన వారు అగుచున్నారను ఆక్షేపణ ఒకటి కలదు. కాని, ఈ ఆక్షేపణ సహేతుకమైనది కాదు. అట్టివారు న్యాయశాఖకు లోబడినట్లు చెప్పుటకు వీలులేదు. వారు లోబడినది చట్టమునకును, న్యాయమునకును మాత్రమే.

శాసనసభ తయారుచేయు చట్టము దేశ రాజ్యాంగమునకు విరుద్ధముగ ఉన్నచో, అది చెల్లనేరదని నిర్ణయము చేయు అధికారము కొన్ని దేశములలో న్యాయాధిపతులకు కలదు. భారతదేశము, యునైటెడ్ స్టేట్స్, కెనడా, ఆస్ట్రేలియా మొదలగు దేశములలో ఇట్టి పద్ధతియే అనుసరింపబడుచున్నది. ఈవిధముగ శాసనసభ చేయు చట్టములను కూడ న్యాయశాఖ పరిశీలించుట శాసనసభ మర్యాదకు భంగకారిగ ఉన్నదని కొందరి వాదము. ప్రాథమిక హక్కులకు హామీ నొసగు దేశములలోను, సమాఖ్యాపద్ధతిని అనుసరించు దేశములలోను ఇట్టి పరిశీలనము అవసరము అగుచున్నది. సమాఖ్యాపద్ధతి ప్రభుత్వములలో కేంద్ర, రాష్ట్రప్రభుత్వములకు మధ్య అధికార విభజన జరుగుచున్నది. ఈ విభజనకు విరుద్ధముగ కేంద్రప్రభుత్వముగాని, రాష్ట్రప్రభుత్వముగాని చట్టములను చేసినచో, అట్టివానిని నిష్పాక్షికదృష్టితో పరిశీలించుటకు ఒక సంస్థ ఉండితీరవలయును. అదే న్యాయశాఖ అయి ఉండుట సముచితము. అటులనే వ్యక్తికి సంబంధించిన హక్కులకు భంగకరముగ కార్యవర్గశాఖగాని, శాసనశాఖగాని ప్రవర్తించకుండ చూచుటకు న్యాయస్థానములు అవసరముగ ఉండవలసినవే.

పై వివరణమునుబట్టి ప్రజాస్వామిక రాజ్యములలో రాజ్యాధికారము 1. నియోజకసమితి ; 2. శాసనసభ ; 3. కార్యవర్గశాఖ ; 4. న్యాయశాఖ అను వివిధ సంస్థల మధ్య విభజితమైనట్లు స్పష్టమగుచున్నది. అధికారము ఇటుల విభజితమై ఉండుటవలననే ప్రజాస్వామ్యమున అధికారపదవులలో ఉన్నవారు అధికారమును దుర్వినియోగమొనర్పజాలకున్నారు. ప్రజాస్వామ్యము విజయవంతముగ సాగుకొలది అధికార దుర్వినియోగమునకు అవకాశము తగ్గిపోవును. మా. వెం. రం.

# అధికార వికేంద్రీకరణము

రాజకీయ అధికారము దుర్వినియోగపడకుండ చేయుటకు అధికార వికేంద్రీకరణము ఒక సాధనము.

ఒకదేశములో మొత్తపు అధికారము రెండు మూడు ప్రభుత్వములమధ్య విభజితమై ఉండుట అధికార వికేంద్రీకరణము అనబడును. ఈ విధముగ అధికార పంపిణీ రాజ్యాంగబద్ధమైనపుడు ఆ రాజ్యము సమాఖ్యా విధాన రాజ్యమని అనిపించుకొనును. కాని, శాసనసభలు చేయు చట్టముల ద్వారా అధికారపంపకము జరిగినపుడు, అది స్థానిక స్వపరిపాలనా విధానమని అనబడును. సమాఖ్యావిధానము ఉన్నతస్థాయికి చెందిన వికేంద్రీకరణము.

సమాఖ్యా పద్ధతిని అనుసరించు రాజ్యములలో ప్రభుత్వములు రెండు స్థాయిలలో ఉన్నవి:

1. దేశమునకు అంతటికి నియోజక సమితులు, ఒక శాసనసభ, ఒక కార్యవర్గశాఖ మొదలగు ప్రభుత్వాంగములతో కూడిన ఒక కేంద్రప్రభుత్వము ;
2. దేశములోని రాష్ట్రములలో ఒక్కొక్కదానికి ప్రత్యేకముగ కార్యవర్గశాఖ, శాసనశాఖ, నియోజక సమితులు మొదలగు పరిపాలనాశాఖలతో కూడిన ఒక రాష్ట్రప్రభుత్వము ను కొన్ని సమాఖ్యాదేశములలో కేంద్ర ప్రభుత్వమునకు ప్రత్యేకముగను, రాష్ట్రప్రభుత్వములకు ప్రత్యేకముగను న్యాయస్థానములును ఉన్నవి.

దేశములోని మొత్తపు అధికారము కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వముల మధ్య విభజింపబడుచున్నది. దేశరక్షణ, వైదేశికనీతి, విదేశాంగ వ్యవహారములు, ధనము, బ్యాంకింగ్ మొదలగు విషయములు కేంద్రప్రభుత్వపు అధికారమున ఉండును. శాంతిభద్రతలు, విద్య, ప్రజారోగ్యము, వ్యవసాయము మొదలగు విషయములు రాష్ట్ర ప్రభుత్వపు అధీనమున ఉండును. కొన్ని విషయములు ఉభయప్రభుత్వముల అధికారమున ఉండును. ఇట్టి అధికార విభజనమే సమాఖ్యాపద్ధతికి మూలసూత్రము.

ఈ అధికారముల పంపకము రాజ్యాంగబద్ధమై ఉండుట వలన అందు మార్పులు తేవలెనన్న రాజ్యాంగమును సవరించిన గాని వీలుకాదు. సమాఖ్యాపద్ధతి రాజ్యములన్నిటిలోను కేంద్రప్రభుత్వము, రాష్ట్రప్రభుత్వములు అన్నియు కలసి నిర్ణయము తీసికొనిన కాని రాజ్యాంగమును సవరించుటకు వీలుకాదు. కేంద్రప్రభుత్వము రాష్ట్రప్రభుత్వపు అధికారములను అతిక్రమింపకుండుటకు పై విధానము ఒక సాధనము. ఏ సమయమందైనను, ఒక ప్రభుత్వపు అధికారములను రెండవ ప్రభుత్వము అతిక్రమించిన యెడల మొదటి ప్రభుత్వము ఉన్నత న్యాయస్థానమునకు ఫిర్యాదు చేయు అధికారము కలిగి ఉన్నది.

ఈ అధికార విభజనమునకు సార్థకత కలిగించుటకు కేంద్రప్రభుత్వ నిర్మాణమందు రాష్ట్రప్రభుత్వములకు అవకాశము కల్పింపబడినది. కేంద్ర శాసనసభలోని ఎగువ సభ (రాజ్యసభ) లో రాష్ట్రప్రతినిధులకు స్థానము కల్పించుటకు ఇదియే కారణము. దేశాధినేతను ఎన్నుకొనుటలో రాష్ట్ర శాసన సభలు కూడ పాల్గొనుచున్నవి. ప్రజలలో జాతీయైక్యభావముతోపాటు నైసర్గికపరిస్థితుల మూలమునను, భాషా భేదముల మూలమునను, సంస్కృతులలోని భేదముల మూలమునను భిన్నత్వము ఏర్పడిన దేశములలో సమాఖ్యావిధానము ఆధునిక కాలమందు స్థాపింపబడినది. ఆ యా ప్రాంతములందలి ప్రజలకు వారి వారి ప్రాంతీయ సంస్కృతియందు గాఢమైన అభిమానము ఉండుటయే సమాఖ్యా విధానమునకు ఆధారము.

ఇటీవల కాలమున సమాఖ్యా రాజ్యములందు కూడ కేంద్రప్రభుత్వపు అధికారములు ఎక్కువ పెరిగిపోవుట జరుగుచున్నది. పారిశ్రామిక, సాంకేతిక పరిణామములే దీనికి కారణము. ఈ మార్పుల మూలమున ఉత్పన్నములయిన నిరుద్యోగము, ఆర్థికమాంద్యము, ధరలలో ఒడుదొడుకులు, సమ్మెలు మొదలగు వాటికి సంబంధించిన సమస్యలను పరిష్కరించుటకు కేంద్రప్రభుత్వమునకే సాధ్యమగుచున్నది. వీనికితోడు ప్రపంచమునందంతటను యుద్ధభీతి వృద్ధిగాంచుటచేత దేశరక్షణ విషయమై కేంద్ర ప్రభుత్వము ఎక్కువ అధికారమును వహించవలసిన పరిస్థితి ఏర్పడినది. రాష్ట్రప్రభుత్వములు కూడ దైనందిన కార్యకలాపములను జరుపుటకు ఆర్థిక సహాయమునకై కేంద్ర ప్రభుత్వముపైననే ఆధార పడవలసినవి అగుచున్నవి.

ఈ కారణములు అన్నిటివలనను మొత్తపు అధికారమును పరిమితము చేయుటకు అనుసరింపబడు సమాఖ్యా పద్ధతి ఇంతకు పూర్వము ఉన్నట్లు ప్రస్తుతము సార్థక్యము పొంది ఉండలేదు.

స్థానిక స్వపరిపాలన విధానములో రాష్ట్రప్రభుత్వము స్థానికసంస్థలకు తన అధికారములలో కొన్నిటిని పరివర్తనముచేసి, ఆ అధికారములు చలాయించుటలో వాటికి కొంత స్వాతంత్ర్యమును కల్పించుచున్నది. పరివర్తనము చేయబడిన అధికారముల సంఖ్య ఎక్కువైనపుడును, వాటిని చలాయించుటలో ఎక్కువ స్వాతంత్ర్యము ఉన్నపుడును స్థానిక సంస్థలు కూడ రాజ్యాధికార నిర్వహణములో భాగస్వాములుగ ఉండగలుగుచున్నవి. స్థానికసంస్థలు వాటిని ఎన్నుకొను ప్రజలకు ఎక్కువ సన్నిహితములుగ ఉండుటచేత ప్రజలు వాటిపై ఎక్కువ అధికారమును వహించుటకును, అందుచేత అవి వాటి అధికారమును దుర్వినియోగము చేయకుండుటకును తక్కువ అవకాశము ఏర్పడుచున్నది. ఈ సూత్రమును ఆధారముగ చేసికొనియే ఇటీవలి కాలమున భారతదేశములో పంచాయతీ రాజ్యవ్యవస్థ ఏర్పాటు చేయబడినది. ఈ వ్యవస్థవలన అధికారము వికేంద్రీకృతమై గ్రామీణ ప్రజానీకమునకు దానిలో ప్రత్యక్ష సంబంధమును, దానిపై పెత్తనమును లభించుట వలన ప్రజాస్వామిక భావనకు గాఢముగా సార్థక్యము చేకూరగలదని ఆసింపబడినది.

మా. వెం. రం.

## ప్రభుత్వోద్యోగులు

ప్రభుత్వ విధానములను కార్యాచరణలోనికి తెచ్చుటకు ప్రభుత్వోద్యోగులు సాధనములు అగుచున్నారు. ప్రభుత్వము కర్తవ్యమును నిర్ణయించును; నిర్ణయింపబడిన కర్తవ్యమును నిర్వహించువారు ఉద్యోగులు.

భారతదేశమువంటి దేశములలో ప్రస్తుతము ఉన్నత అధికార పదవులందు ఉండు కార్యదర్శు (సెక్రటరీ) లు మొదలుకొని, క్రింది పదవులలో ఉండు గుమాస్తా (క్లెర్క్)ల వరకు లక్షలాది ఉద్యోగులు ఉందురు.

ప్రభుత్వోద్యోగ లక్షణములలో ఇచట కొన్ని పొందుపరుపబడి ఉన్నవి: ఉద్యోగులు వివిధ పరిపాలనా శాఖలకు సంబంధించిన ప్రత్యేక కార్యక్రమములందు నేర్పుగల నిపుణులు. ఈ నిపుణతయే వారికి గల ప్రధాన లక్షణము. వారికిని, వారిపై పర్యవేక్షణ జరుపు మంత్రులకును ఇందులో గొప్ప భేదము ఉన్నది. మంత్రులకు లేని నిపుణత వారి ఉద్యోగులకు కలదు.

ఒక పనిని నిర్వహించుటలో అనుభవము పెరిగిన కొలదీ నిపుణత హెచ్చుగుచున్నది. ఈ కారణము వలననే ఉద్యోగులను వారి వారి ఉద్యోగములందు స్థిరముగ నియమించవలసిన అవసరము ఏర్పడుచున్నది. ఉద్యోగి, తన ఉద్యోగమునందు ఎంత ఎక్కువకాలము పనిచేయునో అంత సామర్థ్యమును, నిపుణతయు అతడు సంపాదింపగలుగుచున్నాడు. అధికారమునకు వచ్చిన రాజకీయ పక్షముతో నిమిత్తములేక అతడు తన కార్యక్రమమును కొనసాగించుకొనును. ఎన్నికలమూలమున అధికారములోనికి వచ్చు రాజకీయ పక్షములలో మార్పు కలిగినను ఉద్యోగులలో మార్పు ఉండరాదను సంప్రదాయము దీని ఫలితమే.

ఈ కారణముచేత ఉద్యోగులను నియమించుటలో రాజకీయ పక్షపాతము ఉండరాదను విషయము తేటతెల్లమగుచున్నది. చాల దేశములలో పోటీ పరీక్షలయందు ఉత్తీర్ణులయిన వారే ప్రభుత్వోద్యోగులుగ నియమింపబడుచున్నారు. ఈ పరీక్షలు పార్టీలతో సంబంధములేని 'పబ్లిక్ సర్వీస్ కమీషన్' అను సంస్థచే నిర్వహింపబడుచున్నవి. ఆ ఉద్యోగుల జీతభత్యములు, ప్రమోషన్‌లు, క్రమశిక్షణ, ఉద్యోగ విరమణ మొదలగు విషయములన్నియు ప్రత్యేక నిబంధనలద్వారా నిర్ణయింపబడుచున్నవి.

ఉన్నతస్థాయియందుండు ఉద్యోగులు ప్రభుత్వ విధానములను నిర్ణయించుటలో మంత్రులకు సలహాదారులుగ పనిచేయుచుందురు. కార్యనిర్వహణము నందు - వారికి కలుగు విశేషమగు అనుభవము-వారు సలహాదారులగుటకు అర్హతను కల్పించుచున్నది. మంత్రివర్గము తలపెట్టిన విధానములను అమలు జరుపుటయందు ఎదుర్కొనవలసిన కష్టములను వారు చక్కగ ఎరిగినవారు. అందుచేత క్రొత్త విధానములను ప్రవేశపెట్టుటలో మెలకువతో ప్రవర్తించవలెనని వారు మంత్రులకు చెప్పగల స్థితిలో ఉందురు. కష్టములను ఎదుర్కొనుటకు కావలసిన ఉపాయములను కూడ వారు సూచించగలరు. వారు నిర్భయముగ వారి అభిప్రాయములను వ్యక్తపరచవచ్చునను హామీ మంత్రులు వారికి ఈయవలయును. మంత్రులు, వారికి సలహాదారులైన ఉన్నతోద్యోగులు ఇట్టి సన్నిహిత సంబంధము కలవారగుటచేతనే శాసనసభలలో ప్రశ్నలకు సమాధానము చెప్పవలసివచ్చినపుడు ఉన్నతోద్యోగుల పొరపాట్లకు మంత్రులే బాధ్యత వహించుచున్నారు.

ఆధునిక కాలమున ఉద్యోగివర్గము చాల ఎక్కువ అధికారముగల సంస్థగ రూపొంది ఉన్నది. అందువలననే కొందరు రాజనీతిజ్ఞులు ప్రభుత్వాంగములగు శాసనసభ, కార్యవర్గము, న్యాయశాఖలతోపాటుగ దీనిని నాలుగవ అంగముగ అభివర్ణించి ఉన్నారు. ఈ ఉద్యోగి వర్గము ట్రేడ్‌యూనియన్‌లవలె సంఘముగ ఏర్పడి సమ్మెల ద్వారా ప్రభుత్వ కార్యకలాపములను స్తంభింపచేయగల శక్తిని సంపాదించి ఉన్నది. మా. వెం. రం.

## ప్రభుత్వముపై పలుకుబడి కలిగిన అనధికార సంస్థలు

నియోజక సమితులు, శాసనసభ, కార్యవర్గము, న్యాయస్థానములు, ఉద్యోగివర్గము మొదలగు సంస్థలు అన్నియు ప్రభుత్వ పరిపాలనకు ముఖ్య అంగములని ఇదివరకే ప్రసక్తికి తేబడినది [చూ. పు. 233]. ఇవికాక, ప్రభుత్వములో అంతర్భాగములు కాని సంస్థలు కూడ ప్రభుత్వముపై పలుకుబడిని చలాయించుచున్నవి. ప్రభుత్వ పరిపాలనా నిర్ణయములలోను, కార్యాచరణపద్ధతులలోను కొద్దిగానో, గొప్పగానో అవి మార్పులను తెచ్చుచున్నవి. ఈ విధమగు పలుకుబడి కలిగియుండుట వలన అట్టి పరిపాలనలో అనధికార సంస్థలు కూడ భాగస్వాములై ఉన్నవని చెప్పదగి ఉన్నవి.

ఒకదృష్టితో పరిశీలించిన ఎడల ప్రజాప్రభుత్వము-అనగా ప్రజాభిప్రాయానుసారము - పరిపాలించు ప్రభుత్వము అని చెప్పదగి ఉన్నది. సమాజములో ప్రజాభిప్రాయ

మును రూపొందించి దాని పై ప్రభావముగల సంస్థలన్నియు ప్రభుత్వముపై పరోక్షముగ పలుకుబడి కలవనియే చెప్ప దగి ఉన్నవి. ప్రచార సాధనములన్నియు ఈ కోవకు చెందినవే అయి ఉన్నవి. ఈ కారణము వలననే వార్తాపత్రికలు ప్రాముఖ్యమును వహించుచున్నవి. విద్య బహుళ వ్యాప్తినందిన దేశములలో సారస్వతము ప్రముఖ సాధనము అగుచున్నది. వార్తా పత్రికలు కాక, రేడియో, సినిమా, టెలివిజన్ మొదలగు ప్రచార సాధనములు అన్నియు ప్రజాభిప్రాయమునకు ఒక రూపొసగుటకు తోడ్పడుచున్నవి.

ప్రభుత్వము పై పలుబడి కలిగిన అనధికార సంస్థలన్నిటిలోను రాజకీయ పక్షములు నిర్వహించు పాత్ర ముఖ్యమును, శక్తివంతమును అయి ఉన్నది. అభ్యర్థులను ఎన్నుకొను అధికారము కలిగి ఉండుటవలన, రాజకీయ పక్షములు చట్టములు చేయు శాసన సభ్యులను, కార్యనిర్వాహకులను నిర్ణయించుచున్నవి. ప్రభుత్వముయొక్క పాలనా విధానములను ఈ కారణముచేత రాజకీయ పక్షములే నిర్ణయించుచున్నవి. కావుననే ప్రజాప్రభుత్వమనగా రాజకీయ పక్షముల సాధనమున పరిపాలించు ప్రభుత్వమని కొందరి నిర్వచనము.

కాని, ఈ కాలపు ప్రజాస్వామిక రాజ్యములలో రాజకీయ పక్షములకు రాజ్యాంగమందు గుర్తింపు లేదు. అవి తమ కార్యకలాపములలో చాలభాగము రహస్యముగ జరుపుకొనుచున్నవి. వాటి ఆర్థిక పరిస్థితిని గురించి అనగా వాటికి ఏవిధముగ రాబడివచ్చుచున్నదో, ఏవిధముగ అది ఖర్చగుచున్నదో బహిరంగముగ తెలియుట లేదు. ప్రజలు సర్వస్వామ్యము కలవారగుటకు బదులు రాజకీయ పక్షములే సర్వాధి కారములు కలవిగ పరిణమించినవి. ఒక్క యునైటెడ్ స్టేట్స్ లో మాత్రమే రాజకీయ పక్షములు అధికార సంస్థలుగ శాసనముచే గుర్తింపబడి ఉన్నవి. మిగిలిన దేశములలో కూడ ఇట్టి గుర్తింపు అవసరము.

రాజకీయ పక్షములు కాక, ప్రభుత్వముపై పలుకుబడి కలిగిన అనధికార సంస్థలు మరికొన్ని కలవు. వాటిని గురించి కూడ ఇట చర్చించుట ఉచితము.

ప్రజాస్వామ్యమున ఒంటరిగ ఎవరును ప్రభుత్వము పై పలుకుబడికలవారు కాజాలరు. ఒంటరిగ ప్రభుత్వము వద్ద నుండి తమకోరికలను ఎవరును సాఫల్యము చేసికొనజాలరు. ఈ కారణము వలన ఒకే విధములగు కోరికలు కల వారు అందరును కలసి ఒక సమాజముగ ఏర్పడి, సమష్టి ప్రయత్నముచేసి, ప్రభుత్వమును ఒప్పించి, తమ కోరికలను తీర్చుకొను ప్రయత్నము చేయుచుందురు.

అందువలన పలురకములగు ఐచ్ఛిక సంస్థలు ప్రజాస్వామ్య రాజ్యములందు పనిచేయుచున్నవి. రైతు సంఘములు, వ్యవసాయ కూలీల సంఘములు, కార్మిక సంఘములు [చూ. సం. 5 - పు. 453], చేనేత సంఘములు, వర్తక సంఘములు మొదలగు వృత్తి సంఘములు పై రకములలో చేరినవే. కొన్ని దేశములలో అట్టి సంఘములు వందలాది ఉన్నవి. ఇవి కాక, మతపీఠములు మొదలగు వేర్వేరు మత సంస్థలు, మత సంఘములు కూడ అట్టి అనధికార సంస్థల జాబితాలో చేర్చదగినవి. కళోద్ధరణ కొరకు కళాకారుల సంఘములు ఉన్నవి. ప్రజాసేవ కొరకు సాంఘిక సేవా సంఘములు ఉన్నవి.

భారత దేశమువంటి దేశములలో కుల సంఘములు ఏర్పడినవి. ఇవి అసహజమైనవి కావు. భారతీయ సమాజములో కులవ్యవస్థ [చూ. సం. 10 - పు. 303] అనునది ఒక ప్రధాన భాగము. ఒకవ్యక్తి తాను ఏ కులమునకు చెందినవాడో ఆ కులమునకు సంబంధించిన వారితో కలిసి పని చేయుట అతనికి సులభము.

ఒకప్పుడు వ్యక్తికిని, రాజ్యమునకు మధ్య ఏవిధమగు అడ్డమాకలు కల్పింపబడకూడదనియు, పౌరుడు రాజ్యమునకు సదా విధేయుడై ఉండవలెననియు అభిప్రాయపడెడివారు. కాని, అట్టి అభిప్రాయము వాస్తవికతకు విరుద్ధము. ఏలనన, మానవుడు ఏకాకిగ బ్రతుకలేడు. అతడు సంఘజీవి. సామూహిక జీవనమే అతనికి ఆనందదాయకము అగుచున్నది.

పై చెప్పిన సంఘములన్నియు తమ సంఘమునకు, సంఘ సభ్యులకు కావలసిన సదుపాయములను సంపాదించుట కొరకు తమ పలుకుబడికి ప్రభుత్వమును లోబరుచుకొనజూచుచున్నవి ; కార్యాలయములను ఏర్పరచుకొని నిపుణులగువారిని నియమించి ప్రజాభిప్రాయముపై పలుకుబడి సంపాదించుకొన ప్రయత్నించుచున్నవి ; తన్మూలమున ప్రభుత్వమువద్దకు రాయబారములను నడపి, తమ కోరికలను తీర్చుటకు వారి పై ఒత్తిడి కలిగించుచున్నవి; మంత్రులతోను, శాసన సభ్యులతోను మంతనములు జరిపి, ఆ యా సంఘముల వారికి ఉపయోగించు విధమున ప్రభుత్వ విధానములను మార్పు చేయుటకు అవి ప్రయత్నించుచున్నవి.

ప్రభుత్వము నియమించు వివిధ సలహా సంఘములలో ఇట్టి సంస్థలకు ప్రాతినిధ్యము లభించుచున్నది :

కార్మిక సంఘము (ట్రేడ్ యూనియన్)లు, వర్తక సంఘము (ఛేంబర్స్ ఆవ్ కామర్స్)లు మొదలగు సంఘములు కొన్ని శాసనసభలకు తమ అభ్యర్థులను పంపి

పరిపాలనలో ప్రత్యక్షముగ పాల్గొనుచున్నవి [చూ. కార్మిక సంఘములు - భారతదేశము - సంపుటము. 5 - పు. 453]. ఈ విధముగ అనధికారసంస్థలు అనేకములు ప్రభుత్వముపై పలుకుబడి నెరపుచున్నవి. మా. వెం. రం.

# ప్రభుత్వ ధర్మములు

రాజనీతిశాస్త్రమందు చర్చించవలసిన మరొక విషయము 'ప్రభుత్వ ధర్మము' లేవి అనునది [చూ. ప్రభుత్వ ధర్మములు - అకారాది]. అందు చెప్పబడిన వివరములను బట్టి చూడ బాహ్యోపద్రవములనుండియు, ఆంతరంగిక ఉపద్రవములనుండియు ప్రజలను రక్షించుట ప్రభుత్వధర్మములలో అగ్రస్థానము వహించునది అని స్పష్టమగుచున్నది. ఈ ధర్మనిర్వహణకు సాధనములుగ సాయుధ సేనలు, రక్షక భటులు, న్యాయస్థానములు, కారాగృహములు ఉపయోగపడుచున్నవి. రక్షణ నొసగుటకు మాత్రమే కాక, వ్యక్తుల యొక్కయు, మొత్తపు సమాజము యొక్కయు సంక్షేమాభివృద్ధికి పాటుపడుటకు రాజ్యము అవసరము. వరదలు, క్షామము, అంటు జాడ్యములు మొదలగువానిని నిరోధించుట ప్రజారోగ్యము, విద్యాభివృద్ధి, ప్రజాసంక్షేమ కార్యక్రమముల తెగకు చెందినవి. బలహీనవర్గములను బలముగల వర్గములబారినుండి రక్షించుటకు ప్రభుత్వము తీసికొను చర్యలును ఈ కోవలోనికి వచ్చును. కౌలుదారీ చట్టములు, అధిక వడ్డీల నిరోధకచట్టములు, ఫ్యాక్టరీచట్టములు మొదలైనవి ఈ రకమునకు చెందినవే. తమను తాము రక్షించుకొనలేని ప్రజలను రక్షించు ఉద్దేశముతోడనే ఆధునిక రాజ్యములన్నియు నిరుద్యోగ పరిహారము, వైద్యసహాయము, వృద్ధాప్యమున పింఛనులు, ప్రసూతి సౌకర్యములు, సంతానమునకు అలవెన్సులు మొదలగు సంఘసంక్షేమ కార్యక్రమములను తలపెట్టుచున్నవి. సాంఘికన్యాయమును అభివృద్ధిచేయు ఉద్దేశముతో ప్రజలందరి సహకారము వలన ఉత్పత్తియగు ధనధాన్యములు ప్రజలందరికి న్యాయానుసారము పంపకము చేయుటకును, కలవారికి, లేనివారికి మధ్యనుండు భేదములను తగ్గించుటకును అవి ప్రయత్నములు చేయుచున్నవి. ఈ విధములగు కార్యక్రమములు సాంఘిక సమైక్యము వృద్ధిగాంచుటలో తోడ్పడుచున్నవి. దేశములోని ఖనిజ సంపద, ఆటవికసంపద, భూసారము మొదలగు సహజ సంపదలను స్వలాభోద్దేశముతో వ్యక్తులు, సంఘములు వినాశము చేయకుండ సంరక్షించుటకై ప్రభుత్వములు అనేక కార్యక్రమములను సాగించుచున్నవి. వీటి ఉద్దేశము భావితరములవారి శ్రేయస్సును సంరక్షించుటయే. మొత్తముమీద దేశ సంరక్షణము, సంక్షేమ సంరక్షణము, సాంఘిక న్యాయరక్షణము, సాంఘిక సమైక్యరక్షణము, సహజ సంపదల రక్షణము అను వివిధ అంశములతో కూడిన సంరక్షణము ప్రభుత్వ ప్రధాన ధర్మమని చెప్పదగి ఉన్నది,

మా. వెం. రం.

# రాజనీతి తత్త్వశాస్త్రచరిత్ర

## ప్రాచీనయుగము

రాజనీతితత్త్వమును గురించిన విచారణ మొట్టమొదట గ్రీస్ దేశములో నగర రాజ్యములు వర్ధిల్లుచుండిన కాలములో ప్రారంభమైనదని కొందరు రచయితలు సిద్ధాంతము చేసిరి. కాని, నిజమునకు ప్రాచ్యఖండ దేశములలోని స్మృతి కర్తలు రాజ్యపాలనమును గురించి రచించిన అనేక గ్రంథములు ఉన్నవి. కౌటిల్యు [చూ.] ని అర్థశాస్త్రము, అటుపిమ్మట కామందకీయ నీతిశాస్త్రము మున్నగు వివిధ గ్రంథములకు ఆధార భూతమగుటయే కాక, ఆచరణలో రాజ్యపాలన నిర్వహణమందును, రాజనీతిని నిర్ణయించుకొనుటలోను కూడ ఉపకరించుచుండినది. యాజ్ఞవల్క్యుడు, శుక్రుడు, ప్రతాపుడు మున్నగువారు రచించిన స్మృతులలోను, రాజనీతిశాస్త్రగ్రంథములలోను పాలకులగు రాజులున్ను, పాలితులగు ప్రజలున్ను అనుసరించవలసిన విధులు, ధర్మములు కలవు. మహాభారతములోని శాంతిపర్వము ప్రామాణికమగు రాజనీతిశాస్త్ర గ్రంథముగా పరిగణింపదగినది. చక్రవర్తియగు కృష్ణదేవ రాయలు రచించిన 'ఆముక్తమాల్యద' మున్నగు కావ్యములలో కూడ రాజనీతిని వివరించు కొన్ని విభాగములు ఉన్నవి. కొన్ని సామాన్య శతకములలో కూడ రాజకీయ జీవితమునకు సంబంధించిన ఉదాత్త సూక్తులు, విమర్శలు కనిపించుచున్నవి. తెలుగులోని వేమన శతకము అట్టివానిలో ప్రఖ్యాతమయినది. ఇతర దేశములలో కూడా ఇట్టి సామాన్యరచనలు, హమ్మురబీ వంటివారు రచించిన ధర్మశాస్త్రములు బయలు వెడలినవి. అయితే, ఈ గ్రంథములన్నిటిలోను రాజనీతిని గురించిన కొన్ని విషయములు మాత్రమే కలవు. కనుక, వాటిని రాజనీతి తత్త్వశాస్త్ర గ్రంథములుగా పరిగణించుటకు వీలు లేదని తద్జ్ఞుల మతము. రాజ్యపాలనను గురించిన

కొన్ని సామాన్య సిద్ధాంతములను మాత్రమే అవి నిర్వచించును.

క్రమముగ పాలితప్రజలలో తమ హక్కులను గురించిన చైతన్యము ఉదయించినది. దానితో వారు రాజకీయాధికారముయొక్క స్వరూప, స్వభావములను గురించియు, ఆ అధికారముపట్ల తమ బాధ్యతలకు లేదా విధేయతలకు గల సబబులను గురించియు చర్చలు చేయుటకు ఆరంభించిరి. ముఖ్యముగ గ్రీస్ దేశపు ప్రాచీన నగర రాజ్యములలోని విలక్షణమైన నైతిక వాతావరణములో ఆరిస్టాటిల్ [చూ.] చెప్పినట్లు మానవుడు ఒక ' రాజకీయ జంతువు ' గ పరిగణింపబడెను. రాజ్యజీవనమంతా అవిభక్తముగ ఒకే ప్రదేశమున కేంద్రీకృతమయి ఉండెను; నగర రాజ్యమే అట్టి ప్రదేశము. తదతిరిక్తముగ వ్యక్తులు తమది అని చెప్పుకొనదగిన ప్రత్యేక జీవనమేదియు లేకుండెను. రాజ్యముతో అవసరములేని వ్యక్తి పశువో, భగవంతుడో కావలెనని భావింపబడెడిది.

ప్రాచ్యదేశములలోను, పాశ్చాత్యదేశములలోను కూడ రాజనీతిని గురించిన ఆదిమ భావములన్నీ రాజునందు భగవదంశ కలదను వాదముపై ఆధారపడి ఉండినవి. గ్రీస్ దేశమున రాజనీతి తత్త్వశాస్త్ర విచారణ చిహ్నములు హోమర్ రచనలలోనే మొట్టమొదట మనకు కనిపించుచున్నవి. సార్వభౌముని లౌకిక ప్రభుత్వము గ్రీక్ ఒలింపియా దేవతలందరిలోను జూస్ (ద్యుఃపిత) కు గల సర్వాధిపత్యము వంటిదని హోమర్ ఉపమించెను. కాని, హీసియడ్ కాలమునాటికి రాజరికపు పద్ధతి క్రమముగా క్షయమై పోవుచున్నట్లు అతని గ్రంథమున కనిపించును. సామాన్యప్రజల ప్రవర్తనవలెనే రాజుల చర్యలు కూడ ఆ నైతిక పరీక్షలన్నిటికి నిలబడ గలిగి ఉండవలెనని ఆయన విస్పష్టముగ సిద్ధాంతము చేసెను.

పారసీకుల దండయాత్ర తరువాతనే - ఆ నాటి విద్వాంసులలో ఉదయించిన చైతన్యఫలముగా - రాజనీతి తత్త్వపరిశోధనము బయలుదేరినది. తత్కాలపు భావనలకు ప్రాచీనభావములతో బయలుదేరిన సంఘర్షణలో మానవ జీవన సమస్యలను గూర్చి క్రొత్తగా అనేక సంశయములు నాడు బయలుదేరినవి. సోఫోక్లీస్ రచించిన 'ఆంటిగోనే' మున్నగు నాటి విషాదాంత నాటకములలో ఈ సంశయములు వెల్లడించబడినవి. 'ఆంటిగోనే' నాటకములో మానవ ధర్మములకు, దేవధర్మములకు సంఘటిల్లుచున్న వైరుద్ధ్యము, అంతరాత్మ ప్రబోధము నిరూపితము అయినవి. సోఫిస్టులు తమ హేతువాదమునకు నిలువని ఏ సిద్ధాంతమును ఆమోదించెడివారు కారు. ప్రభుత్వ విధానము మానవులు తమ సౌకర్యార్థము చేసికొన్న సాంకేతిక విధానమనియు, అన్ని విషయములలోను మానవుడే ప్రామాణికుడనియు, జీవితమందు దేశకాల పాత్రములను బట్టి ఎప్పటికి ఏది ఉచితమో దానిని ఆచరణలో పెట్టవలెననియు వారి మతము. అట్లే సినిక్‌లు చేసెడి ప్రచారము కూడ విధ్వంసనకరముగనే ఉండెను. సత్పురుషులందరు కలుషిత వాతావరణ పూరితమైన సంఘముతో సంపర్కము లేకుండ వైదొలగి ఉండవలెనని వారు బోధించుచుండిరి. సమష్టి ప్రపంచ పౌరవ్యవస్థను గురించి వారు కలలు గనుచుండుటచే ప్రత్యేక రాజ్యప్రభుత్వ విచారము వారిని ఆకర్షించలేదు. రాజనీతికిని, ప్రజాజీవితమునకును సంబంధించిన నిర్మాణాత్మకమైన ఏకైక భావవాహిని యుద్ధములో వీరమరణము పొందిన ఎథీనియన్‌లను స్మరిస్తూ పెరిక్లీస్ గావించిన శ్మశానోపన్యాసములో చక్కగ వ్యక్తీకరింపబడెను.

సిరక్యూస్ దురంతముతో ఏథెన్స్ రాజ్యమున ప్రజాజీవన నైతిక మర్యాదలన్నియు చట్టున కూలిపోయి, తత్పర్యవసానముగ జీవన విధానములలోను, భావనా పద్ధతులలోను విపరీత పరిణామములు ఉద్భవిల్లినవి. తత్ఫలితముగ నాడు సోఫిస్టులు మున్నగువారు ప్రబోధించెడి విధ్వంసనకరములగు దుష్టపద్ధతులను అరికట్టుటకు సక్రమముగ యోచింపగల వివేకవంతుల అగత్యము ఏర్పడెను. అట్టి తరుణమందే సోక్రటీస్ ముందుకు వచ్చెను. ఆ సోఫిస్టుల సిద్ధాంతములను ఆయన నిర్దాక్షిణ్యముగ ఖండించి, వారిని పరిహాసపాత్రులను చేసి, సత్యాన్వేషణమును ప్రబోధించెను. అంతేకాదు 'సౌశీల్యమే జ్ఞానము, జ్ఞానమే సౌశీల్యము' అను తన సుప్రసిద్ధ సిద్ధాంతముతో సక్రమమైన నీతిమార్గమునకు సముచితమైన పునాది వేసెను. అంతవరకు జీవన విధానమునకు, భావనా పద్ధతికి నడుమ పెద్ద అఖాతము ఏర్పడి, విపత్కర దుష్ఫలితములకు హేతువగుచుండెను. ఆ అఖాతమునకు ఆయన సేతువు నిర్మించి సమన్వయత ఏర్పరచెను. ప్లేటో, అరిస్టాటిల్ అను తత్త్వవేత్తలు ఇరువురును ఈ నిర్మాణాత్మక కృషినే ఇంకను కొనసాగించి, సక్రమ రాజ్య నిర్వచనమునకు పునాదులు వేసిరి [చూ. సోక్రటీస్ సం. 7 - పు. 753; సోఫిస్టులు సం. 7 - పు. 753].

సోక్రటీస్ శిష్యుడగు ప్లేటో 'ఎపాలజీ', 'క్రైటో' అను రెండు గ్రంథములలో రాజకీయ విధేయతకు సంబంధించిన సమస్యలను విపులముగ చర్చించి, ధర్మశాస్త్రము యొక్క ఆధిక్యమును, పవిత్రతను నిరూపించెను. వ్యక్తులకు, రాజ్యమునకు గల సంబంధమును గురించి కూడ ప్రసంగ

వశముగా ఆయన చర్చించెను. రాజ్యమనగా వ్యక్తుల సమూహమనియు, వ్యక్తియన్న రాజ్యాంశమనియు నిర్వచించెను. ఈ యభిప్రాయమునే 'రిపబ్లిక్' అను మరియొక గ్రంథమున ఆయన విపులీకరించెను. న్యాయమును గురించిన పరామర్శ ఈ గ్రంథమున ప్రధాన విషయము. ఆదర్శప్రాయమగు సర్వోత్తమ రాజ్యమనగా 'స్వర్గమున తయారు చేయబడిన నమూనాను అనుసరించి ఉండు నగరరాజ్య' మని ఆయన నిర్వచించెను. అట్టి సర్వాంగ సౌష్ఠవము గల నగరరాజ్యమును స్థాపించి, క్రమముగ నిర్వహించెడి విధానములను కూడ వివరించెను. రాజ్య శాసనములను శిరసావహించవలెనని ప్రజలకు ఉద్బోధించెను. 'తత్త్వశాస్త్రవేత్తలు రాజులుగ, రాజులు తత్త్వశాస్త్ర వేత్తలుగ అగువరకు' రాజ్యములకు ఏర్పడిన అరిష్టములు నివారణ కావని ఆయన విశ్వాసము. 'రిపబ్లిక్' (గణరాజ్యము) అను గ్రంథములో ప్లేటో భావములు ఆకాశపథముల విహరించుచుండినను, 'స్టేట్స్‌మన్' (రాజనీతిజ్ఞుడు) అను గ్రంథములోను, అంతకంటెను ఎక్కువగా 'లాజ్' (శాసనములు) అను గ్రంథములోను తిరిగి భూమికి దిగివచ్చెను. 'టిమియా' మున్నగు ఆయన ఇతర సంభాషణల (డైలాగ్స్) లో కూడ ఆయన విశిష్టభావములు విడివిడిగా చెదరి ఉన్నవి.

ఆ విధముగ ప్లేటో రాజనీతి తత్త్వశాస్త్ర చరిత్రలో ప్రప్రథమ పర్యాయము ఆ శాస్త్రమునకు సంబంధించిన మూలసమస్యలను లేవదీసెను. ఆయన రాజకీయ భావనాపూర్వక వాదములకు పితామహుడు.

ప్లేటో శిష్యుడగు అరిస్టాటిల్ స్వభావములోను, వాద పద్ధతిలోను కూడ తన గురువునకు భిన్నమైన ప్రస్తారము గలవాడు. ప్లేటో ఎదుర్కొనవలసి వచ్చిన సమస్యలనే అతడును ఎదుర్కొనవలసి వచ్చినది. కాని, వాస్తవికతను అనుసరించి ప్రవర్తించు 'ఎంపెరిసిస్ట్' అగుటచే తన కాలము నాటి పరిస్థితులను, తన చుట్టును గల రాజకీయ జీవితమును స్వయముగ పరిశీలించెను. ఈయన భావములలో కొన్ని ప్లేటో భావములకు భిన్నముగ ఉండెను. భార్యాబిడ్డలను, ఆస్తిని సమష్టిగా అనుభవించవలెనను కమ్యూనిజమ్ మొదలగు భావములను ఆయన ఆమోదించలేదు. కాని, రాజ్యము యొక్కయు, వ్యక్తుల యొక్కయు స్వరూప స్వభావాదుల ప్రధాన సమస్యల విషయములో మాత్రము గ్రీకుల పూర్వభావములనే అరిస్టాటిల్ సమర్థించెను. 'రాజ్యమనగా మానవులు తమ సౌకర్యార్థము ఏర్పాటు చేసికొనిన వ్యవస్థ' అన్న సోఫిస్టుల సిద్ధాంతమును ఆయన ఖండించెను. రాజ్యము దాని అగత్యమును బట్టి అవతరించి, ప్రకృతి ప్రభావముచే వర్ధిల్లుచున్నదని ఆయన అభిప్రాయము. రాజ్యము జీవనభద్రత కొరకు ఉదయించెననియు, సుఖజీవనము కొరకు వర్ధిల్లుచున్నదనియు పై భావమునే మరియొక విధముగ వ్యాఖ్యానించవచ్చును. 'వ్యక్తి' కన్న 'రాజ్యము' ప్రధానమని ఆయన విశ్వసించును. రాజ్యము ఉన్నప్పుడే మానవుడు సుఖముగా జీవనము చేయుచు, తన నైతిక లక్ష్యములను సిద్ధింప చేసికొనగలడని ఆయన వాదము. సత్‌పౌరుడే సత్పురుషుడు. శాసనవిధేయతలోనే నిజమైన స్వాతంత్ర్యము ఇమిడి ఉన్నది. రాజ్యోత్పత్తి క్రమమును, కుటుంబము-గ్రామము మున్నగు సాంఘిక వర్గములతో రాజ్యమునకు గల సంబంధమును కూడ అరిస్టాటిల్ చర్చించెను. మిగిలిన సాంఘిక వర్గములు మానవుని స్వల్పాశయముల సిద్ధికి ఉపకరించునవి కాగా, రాజ్యము అతని పరమలక్ష్యమగు సర్వోత్తమ జీవనసిద్ధికి ఉపకరించును. మానవునకు సంపూర్ణ స్వయంపోషకత్వము. రాజ్యము ఉండిననే సాధ్యమగును; రాజ్యమే లేనిచో మానవుని జీవితము అసంపూర్ణమగును [చూ. రాజ్యము].

వృత్తుల ప్రాతిపదికపై వేరు వేరు తరగతులుగ సంఘమును విభజించు పద్ధతిని గురించి కూడ అరిస్టాటిల్ చర్చించెను. వృత్తుల ప్రాతిపదిక కంటె మానవుని ఆత్మలో నిక్షిప్తమై ఉన్న గుణములనుబట్టి అట్టి విభజన చేయదగునని సిద్ధాంతీకరించుటకు ప్లేటో ప్రయత్నించెను. అదియే అతడు నిర్వచించిన మానవాత్మక త్రివర్గ సిద్ధాంతముగ ప్రసిద్ధి కెక్కెను. రాజ్య వ్యవస్థారూపము యొక్క ప్రధాన స్వభావమును గురించియు, దానిలోని అధికార విభజన పద్ధతిని గురించియు అరిస్టాటిల్ చర్చించెను. ఆయన 'మధ్యేమార్గ' సిద్ధాంతమును ప్రచారము చేయుచు, మధ్య తరగతి సాధించగల సాంఘిక సామరస్యము, స్థైర్యము అవసరమని బోధించెను.

అనేక రాజ్యాంగములను సమీక్షించి, వాటిని సక్రమ, అక్రమ రాజ్యాంగములుగ విభజించి ఆయన చేసిన రాజ్య వర్గీకరణము సుప్రసిద్ధము. 'మిశ్రమ' రాజ్యాంగమందే అత్యధిక స్థైర్యము సాధ్యమనియు, కనుక అదియే సర్వోత్తమమనియు ఆయన సిద్ధాంతము. భిన్నభిన్న సాంఘికశక్తులు సమానబలము కలిగి ఉండుట వలన రాజ్యము సుస్థిరముగ ఉండును. అనగా రాజ్యములో పరస్పర వైరుధ్యము గల భిన్నభిన్న భాగములు సమాన శక్తి గలవిగ ఉండుట అవసరము. పౌరత అనగా రాజ్యపాలనలో భాగమును పంచుకొనుట అని నిర్వచించి, దాని ఉపలక్షణములను కూడ అరిస్టాటిల్ వివరించెను. మానవులలో స్వభావసిద్ధముగనే కొందరు యజమానులుగ

ఉండదగిన వారనియు, మరి కొందరు బానిసలుగా ఉండ దగిన వారనియు సిద్ధాంతీకరించి, బానిస పద్ధతిని కూడ ఆయన సమర్థించెను. కాని, సహజసిద్ధమగు బానిసత్వమును మాత్రమే ఆయన సమ్మతించెను [చూ. వాస్తవికతా వాదము సం. 7 - పు. 678].

ఈ విధముగ అరిస్టాటిల్ వాస్తవికతను అనుసరించి సిద్ధాంతీకరించు 'ఎంపెరిసిస్ట్'. ఆయన అభిప్రాయములు వాస్తవపరిస్థితులను ఆధారముగా చేసికొని ఏర్పరచు కొన్నవి. ఆయన రాజకీయ వాస్తవికతావాదమునకును, రాజనీతి శాస్త్రమునకును పితామహుడు.

ఇట్లు ప్లేటో, అరిస్టాటిల్ అను ఇరువురు కలిసి రాజ్య వ్యవస్థా సిద్ధాంతమునకు పునాదులు వేసిరి. వారి కాలము నుండి రాజనీతిని గురించిన భావములు ఆదర్శప్రాయ మయిన భావనా పూర్వకవాదమునకు, వాస్తవికతా వాద మునకు నడుమ ఇటునటు ఊగులాడుచున్నవి. రాజనీతి విజ్ఞానములోను, రాజకీయ జీవితములోను శాశ్వతమైన ప్రాతిపదిక సిద్ధాంతములను వారు ఇరువురును నిర్వచించిరి. దానితోబాటు వారు కొన్ని సమస్యలను కూడ లేవదీసిరి. ఆ సమస్యలను గురించి రాజనీతితత్త్వజ్ఞులు నేటికిని పరస్పర భిన్నాభిప్రాయములను వెలిబుచ్చుచు, తర్జన భర్జనలు చేయుచునే ఉన్నారు [చూ. ప్లేటో సం. 7 - పు. 540; అరిస్టాటిల్ సం. 7 - పు. 291].

రోమన్‌రాజ్యమున రాజకీయవిజ్ఞానము ఆనాటి పరి స్థితులలోని పరిణామములకు అనుగుణముగ ఏర్పడు చుండెను. కాని, ఆ దేశమున రాజనీతితత్త్వజ్ఞానమున కన్న న్యాయశాస్త్రము ఎక్కువగా వృద్ధిచేయబడినది. నగర రాజ్యము ప్రబలమైన ప్రపంచ మహాసామ్రాజ్యముగా పెరిగిపోవుటతో, రోమన్‌లు ప్రాచీనకాలమున గ్రీక్‌ల శిక్షణకు లోబడి అలవర్చుకొన్న రాజనీతిని పరిత్యజించి, దానికి భిన్నముగా స్టోయిక్‌వాదమును అనుసరించిరి [చూ. సం. 7 - పు. 761]. పౌరత అను పదమునకు గ్రీక్‌లు చెప్పు అర్థమునకు, రోమన్‌లు చెప్పు అర్థమునకు చాల వ్యత్యాసము ఏర్పడినది. గ్రీక్‌లకు పౌరత రాజకీయ శబ్ద ముగ ఉండెడిది. రోమన్‌లకు అది న్యాయశాస్త్ర శబ్దము అయినది. రోమన్‌రాజ్య పౌరులలో వైరుధ్యము అపార ముగ పెరుగుచుండుటవల్లను, ఆ సామ్రాజ్యము అనేక జాతుల ప్రజలతో కూడినది అగుటవల్లను ఈ మార్పు తప్పని సరిగ సంఘటిల్లినది. 'పౌరత' రాజకీయార్థమంతటిని కోల్పోయి, కేవలము న్యాయశాస్త్ర సంబంధమైన పారి భాషిక పదమైనది. సామ్రాజ్యమును గురించియు, న్యాయశాస్త్ర సంబంధమైన హక్కును గురించియు రోమన్‌ల భావములన్నియు స్పష్టముగ న్యాయశాస్త్ర సూత్రములుగా నిరూపితములు అయినవి. ఈ భావము యొక్క ప్రభావము ఆధునిక సర్వతంత్రస్వాతంత్ర్యాధి కారమునకును, న్యాయశాస్త్రమునకును గాఢముగ సోకినది.

రోమన్‌లలో ప్రముఖ భావుకులు, పబ్లిసిస్ట్‌లు (ప్రచు రణ కర్తలు) రాజనీతివేత్తలు కారు. వారు రాజకీయము లకును, రాజనీతికిని సంబంధించిన చర్చలకు వైదొలగి పోవలసివచ్చెను. చక్రవర్తి యగు మార్కస్ అరీలియస్, బానిస అగు సెనీకా అను ఇరువురును నాటి భావనా పద్ధతులకు ముఖ్యమార్గదర్శకులు. వారు ఇద్దరును స్టోయిక్ తత్త్వవేత్తలు. వారు న్యాయశాస్త్రము సర్వజనీనమై, ఇతర మానవకోటికి కూడ వర్తించునట్లు సవిస్తరముగ క్రోడీకరించిరి. కాని, వారి సిద్ధాంతములు రాజకీయ సిద్ధాంత ములుగ పరిగణింపబడుటకు తగిన యోగ్యతను మాత్రము సమకూర్చుకొన లేదు. సిసిరో కూడ పబ్లిసిస్ట్‌లలో ప్రతిభా వంతుడుగ పేర్కొన దగినవాడే కాని, రాజనీతి తత్త్వజ్ఞు డుగ అభివర్ణింపదగిన వాడు కాడు.

## మధ్యయుగ రాజనీతి తత్త్వశాస్త్ర చరిత్ర

మధ్యయుగములలో రాజనీతి సంరంభము చాల తక్కువ. రాజకీయ సమస్యలను గురించిన చర్చలు న్యాయశాస్త్ర వేత్తల రచనలలోను, మతగ్రంథములలోను మాత్రమే కనిపించును. అవియైనను లౌకికాధికారములకున్ను, ఆధ్యాత్మికాధికారములకున్ను నడుమ ఏర్పడిన సంఘర్షణకు మాత్రమే సంబంధించి ఉన్నవి. కనుక, మానవ సంఘముల లోని రాజకీయ వ్యవస్థల స్వరూప స్వభావాదుల గురించిన తత్త్వాన్వేషణమందు కానరాదు. సామ్రాజ్యాధిపతుల కున్ను, క్రైస్తవ పీఠాధిపతికిన్ని మధ్య సాగుచుండిన వాదోపవాదములు మాత్రము నాడు మానవుల దృష్టిని విశేషముగ ఆకర్షించుచుండెను. ఈ ఉభయాధికారముల భగవత్ సంకల్పిత పవిత్రతయే ఈ ఉభయపక్షముల వాద ములకున్ను ప్రధాన ప్రాతిపదిక. 'డ మోనార్కియా' అనే గ్రంథములో డాంటే పండితుడున్ను, 'డిఫెన్సర్ పాసిస్' అనే గ్రంథములో మార్సిగ్లియో పండితుడున్ను సామ్రాజ్యాధికారముల గౌరవమును సమర్థించిరి. 'రాజుల ప్రభుత్వము' అను గ్రంథమున పోప్ పక్షము సమర్థింప బడెను. ఈ గ్రంథమును అక్వైనాస్ [చూ. సం. 7 - పు. 225] కొంత వ్రాసి అసంపూర్ణముగా వదలివేయగా, లూకా ప్రాంతమునకు చెందిన అతని శిష్యుడు టాలమీ పూర్తిచేయుటకు పూనుకొని సాగించెను.

మధ్యయుగములో చివరిభాగమున ప్రచారములో ఉన్న పద్ధతికి ఛాత్రవాదము [చూ. సం. 7 - పు. 410] అని పేరు. తామస్ అక్వైనాస్ ఈ వాద పండితులలో అగ్రగణ్యుడు. ఛాత్రవాదమునకు ఈయన ఏర్పరచిన క్రమశిక్షణమునే నేటికిని రోమన్ కేతలిక్ పండితులు అనుసరించుచున్నారు. పాశ్చాత్య ప్రపంచాభ్యుదయమునకు ఈపద్ధతి విశేషముగ ఉపకరించినది. కాని, రాజనీతి తత్త్వశాస్త్ర వికాసమునకు తామస్ అక్వైనాస్ చేసినది బహుస్వల్పము. అదియైనను సూటిగా కాక, వ్యంగ్యముగానే సాగినది. సాధారణముగ అతని రచనలు అన్నియు పూర్తిగా మతసిద్ధాంతములతో ముడిపెట్టుకొని ఉండుటచే అందులో రాజకీయ సిద్ధాంతములను చర్చించుటకు తగినంత అవకాశమే లేకపోయినది.

తామస్ అక్వైనాస్ పండితుడు సెంట్ అగస్టిన్‌తో సరిసమానుడు. వారు ఇరువురు రోమన్ కేతలిక్ మత వ్యవస్థకు ప్రముఖ సూత్రకారులు. సెంట్ అగస్టిన్ చేసిన రాజకీయ సిద్ధాంత సమగ్రవివరణము ఆయన రచించిన 'డ సివిటాస్ డీ' (భగవంతుని పట్టణము) అను గ్రంథములో కలదు. మతగురువులందరు ఈ గ్రంథమును శిరోధార్యముగ భావింతురు. లౌకికాధికారవ్యవస్థలన్నియు ఆధ్యాత్మికాధికార వ్యవస్థకు పూర్తిగ లోబడి ఉండవలెనని అతని వాదము. భగవదిచ్ఛలను నిర్వర్తించు ప్రభుత్వమే నీతిమంతమగు ప్రభుత్వమగునని ఆయన వ్రాసెను. 'క్రైస్తవ దివ్యజ్ఞాన సమన్వితమయినప్పుడే లౌకికాధికార వ్యవస్థ పవిత్రమైనది అగును. కనుక, ప్రభుత్వవ్యవస్థ క్రైస్తవమతసంస్థతో పూర్తిగా సంబంధము కలిగి ఉండవలె' నని అగస్టిన్ ఉద్ఘాటించెను. కాని, ఈ లౌకిక, పారలౌకికాధికార వ్యవస్థలకు ఏవిధమైన సంబంధము ఉండవలెనో 'డ సివిటాస్ డీ'లో వివరింపబడలేదు. అతని భావన ద్వంద్వముగ ఉన్నను, అతని ధోరణి మాత్రము మధ్యయుగపు పోప్‌లు పొందగోరిన నిరంతర లౌకికాధికారముల పద్ధతికి దారి చూపినది. ఈ అధికారములు పోప్‌నకు ఉండవలెనని వాదించుటలో తామస్ అక్వైనాస్ తనకు గల తార్కిక నిపుణత అంతను వినియోగించెను.

డాంటే పండితుడు తామస్ అక్వైనాస్ కన్న ఇంకొక అడుగు ముందుకు వేసెను. రాజత్వమే ప్రభుత్వ వ్యవస్థలలో సర్వోత్తమమైనదనియు, ప్రపంచమంతయు ఒకే రాజుయొక్క ప్రభుత్వములో ఉండుటయే ప్రపంచ శాంతికి మూల సాధనమనియు, లౌకిక ప్రపంచ సామ్రాజ్యము ఏర్పడవలెననియు అతడు చెప్పెను. ఈ విధముగ సామ్రాజ్యవాదుల భావములను ఆయన స్పష్టపరచెను.

మధ్యయుగము నాటి 'ద్విఖడ్గ' సిద్ధాంతమును బట్టి ఉభయ పాలకుల (లౌకిక, మతాధికార వ్యవస్థల) అధికారములున్ను సాగుచుండెను. ఖడ్గము పాలనాధికార చిహ్నము. అధికారము అంతటికి మూలము భగవంతుడు. ఆ భగవంతుడు మానవులను శాసించుటకు ఒక ఖడ్గమును రాజునకున్ను, మానవుల ఆత్మలను శాసించుటకు మరియొక ఖడ్గము పోప్‌నకున్ను ప్రసాదించెను. ప్రతి మానవుడు నిత్యత్వానిత్యత్వముల అద్భుత సమ్మేళనము అగుట వలన ఆ రెండు భాగములలో పరమాత్మాంశమగు అనశ్వర భాగమే ముఖ్యమైనది అనిన్ని, అందుచేత నే రాజుకంటెను చర్చియే ఎక్కువ అధికారము కలది అనిన్ని మత సిద్ధాంత పక్ష రచయితల విశ్వాసము. మతవాదులు తమ వాదమును ఎంత తీవ్రముగా సాగించిరో, అంత తీవ్రముగా సామ్రాజ్య పక్ష తార్కికులు దానిని ఖండించిరి. ఈ విధముగ మత, ప్రభుత్వాధికారముల రెండింటి మధ్యను నలిగి క్రైస్తవ ప్రపంచైక్యమును సాధింపవలెనను ఆశయము కేవలము ఆశయముగానే మిగిలిపోయినది. 'సీజర్ పట్ల చూపవలసిన భక్తి ప్రపత్తులు సీజర్‌నకే చెందజేయుదురు గాక! భగవంతునకు చెందదగు భక్తిప్రపత్తులు భగవంతునకే చెందజేయుదురు గాక!' అను మత ప్రబోధము కేవలము నిష్ఫలము అయ్యెను.

పదునాలుగవ శతాబ్ది మధ్య కాలములో మరొక ఉద్యమము బయలుదేరినది. సామ్రాజ్యవాద ప్రాబల్యము క్రమముగ తగ్గి జాతీయతాభావము బలపడుటకు ఈ ఉద్యమము తోడుపడినది. సామ్రాజ్యము క్రమముగ క్షీణించుచుండుటవల్లను, సమగ్ర ప్రభుత్వ వ్యవస్థను ఏర్పరుపగల శక్తి మతవ్యవస్థకు లేకపోవుటవలనను ఈ జాతీయ రాజ్యముల ప్రత్యేక ప్రభుత్వోద్యమము వర్ధిల్లుటకు అవకాశము ఏర్పడినది. జాతీయ రాజ్యభావము రూపొందినది. ఈ సమయములోనే భూస్వాముల ఉద్ధతి క్రమముగ క్షీణించుటకు ఆరంభించెను. రాజకీయముగ పట్టణముల ప్రాముఖ్యము వృద్ధియగుచుండెను. క్రైస్తవ మతవ్యవస్థలో పోప్ పక్షము వారు, తద్వ్యతిరేక పక్షమువారు పరస్పరము నిందారోపణలు చేసికొనుచు, ఒకరి నొకరు వెలివేయుదుమని బెదిరించుకొనుచుండుటవలన మతవ్యవస్థలో ఐకమత్యము మృగ్యమాయెను. క్రైస్తవ జగత్తంతయు పోప్‌చేతను, చక్రవర్తి చేతను సంయుక్తముగ పరిపాలింపబడు ఒకే 'కామన్‌వెల్త్' అనెడు భావము శాశ్వతముగ విస్మరింపబడెను.

మత సంస్కరణోద్యమము అనబడు ప్రొటెస్టంట్‌ల తిరుగుబాటే ఈ పరిణామమునకు కారణము. రాజనీతి విజ్ఞానమున తీవ్ర పరిణామములకు హేతువులు కాగల

నూతన ఉద్యమములు బయలుదేరెను. వైక్లిఫ్, హస్ మున్నగువారు ఈ ఉద్యమములకు ముఖ్య నాయకులు. కాలక్రమమున ఈ ఉద్యమములు పూర్వ రాజకీయ భావములను పూర్తిగా తారుమారుచేసి, నూతన యుగారంభమునకు బాటలు తీర్చినవి.

## ఆధునిక యుగ రాజనీతి తత్త్వశాస్త్ర చరిత్ర

పాశ్చాత్యుల ఆధునిక రాజకీయ తత్త్వశాస్త్రము అత్యంత సంకీర్ణ స్వభావము గలది. భిన్నభిన్న పరిస్థితుల పర్యవసానముగ రూపొంది, భిన్నభిన్న భావవాహినుల సంగమ ఫలితముగ అది విస్తృతమైనది. సాంస్కృతిక పునరుజ్జీవనమునకున్ను, మత సంస్కరణోద్యమమునకున్ను ఫలితముగ మధ్యయుగములనాటి శృంఖలములనుండి ప్రపంచమునకు విముక్తి కలిగించి, నూతన యుగము ఉదయించినది. ఈ మహోద్యమముల రెండింటిలో గల ఉదారతా, జీవకారుణ్యభావముల ప్రభావము ఈ నూతన యుగ రాజనీతి తత్త్వశాస్త్రమునందు విశేషముగ గోచరమగును. సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమము యొక్క ప్రబల రాజకీయ ప్రభావము మతప్రాబల్య రహిత మగు రాజ్యవ్యవస్థ రూపొందుటకు ఉపకరించినది. అట్లే, మత సంస్కరణోద్యమము యొక్క అత్యుత్తమ ఫలితముగ ఆధునిక రాజ్యములు అవతరించినవి.

గ్రీస్, రోమ్ దేశములందలి ప్రాచీన క్రైస్తవేతర సంస్కృతిలోని శాస్త్రీయ జీవకారుణ్య పద్ధతుల ప్రభావము వలన మధ్యయుగములకు లక్షణమగు 'లోకాంతర తత్పరత' క్రమముగ క్షీణించిపోయినది. మానవ జీవితమునకు సంబంధించిన సమస్యలను గురించియు, వాటికి మానవ కారుణ్య భావములతో కూడిన పరిష్కార మార్గములను గురించియు చైతన్యపూరితమగు ఆసక్తి ఉద్భవించినది. మతగ్రంథముల పరమ ప్రామాణికత, లోకాతీతములు అనబడు అసహజ మతసిద్ధాంతములను ప్రబోధించు ఛాత్రవాదము అంతరించి పోయినవి. ప్రొటెస్టంట్ల తిరుగుబాటుతో కలిగిన మత సంస్కరణోద్యమము వలన సంభవించిన రాజకీయఫలితములు కూడ ఈ నూతన రాజకీయ సిద్ధాంతములు ప్రచారములోనికి వచ్చుటకు కారణములు అయినవి. వాటిలో చాల భాగము ప్రజాస్వామ్య లక్షణములు గలవి. జాతీయ సిద్ధాంతము కూడ దానితో పాటే వాడుకలోనికి వచ్చినది. జాతీయరాజ్యములో పరిపాలనము మతపక్షపాత రహితముగ ఉండవలెనను సిద్ధాంతమునకు మూలాధారము పరమత సహన సిద్ధాంతము. రాజకీయ సమస్యలను పరిష్కరించుటలో మత సిద్ధాంతముల ప్రసక్తి గాని, సంప్రదాయ విశ్వాసముల ప్రసక్తి గాని రాకూడదను ఈ సిద్ధాంతమే ఆధునిక రాజకీయ దృక్పథమునకు రూపకల్పన చేసినది. రాజనీతి తత్త్వవేత్తలు చేసిన ఈ నిర్ణయముల సమర్థనకు చారిత్రకానుభవములున్ను, నాటి రాజకీయ సంఘటనలున్ను ఆలంబనములయినవి. అంతేకాని, ప్రాచీన మతగ్రంథ సూక్తులతో గాని, తత్త్వవేత్తల సంప్రదాయములతో గాని తమ నిర్ణయములను సమర్థించుకొనుటకు వారు ప్రయత్నింపలేదు.

'ఇల్ ప్రిన్సిపీ (పాలకుడు)' అను గ్రంథమును రచించిన మెకియవెల్లీ ( 1469 - 1527 ) ఇటలీదేశమందు మత సంస్కరణోద్యమ ఫలితముగ అవతరించిన ఘనులలో అగ్రగణ్యుడు. మానవుడుగను, భావుకుడుగను అతనికి అతడే సాటి. అతని తరువాతి కాలమున జరిగిన యూరప్‌లోని జాతీయైకమత్యస్థాపన విధానము అతని ప్రబోధములకు అనుగుణముగానే సాగినది. భూస్వామ్యవిధానములోని అరిష్టములు అన్నిటికి రాజుయొక్క సర్వాధికారమే విరుగుడని ఆయన ప్రబోధించెను.

ఆధునిక యుగమున అవతరించిన రాజనీతి తత్త్వశాస్త్రకర్తలలో వాస్తవముగా మొదటివాడు మెకియవెల్లియే అని అందురు. అతని పిమ్మట కూడ జాన్ కాల్విన్ (1509 - 1564) [చూ. సం. 7 - పు. 353] వంటి పలుకుబడి గల రచయితలు కొందరు తమ సిద్ధాంతములను సమర్థించుకొనుటకు పూర్వమత గ్రంథములను, విద్వాంసుల విశ్వాసములను ప్రమాణములుగా గైకొనిరి. లూతర్ [చూ.] మాత్రము మతవ్యవస్థకు, రాజకీయవ్యవస్థకు ఎంత మాత్రము సంబంధము ఉండకూడదని వాదించి, రెండింటిని వేరువేరుగా ఉంచవలసినదను సిద్ధాంతమును బలపరచెను. కాల్విన్, లూతర్ ప్రవచించిన సిద్ధాంతములవలన కలిగిన ముఖ్యఫలితములలో మొట్టమొదటివి స్వాతంత్ర్యము దెసకు గాక, బలవదధికారము దెసకే ఎక్కువగా దారితీయుచున్నట్లు కన్పించెను. ప్రజలు ప్రభుత్వాధికారమునకు విముఖులు కాక, విధేయులై ఉండవలెనని వారు బోధించిరి. కాని, సాంస్కృతిక పునరుజ్జీవనమునకు, మత సంస్కరణోద్యమమునకు వాస్తవపర్యవసానముమాత్రము ప్రజలకు వ్యక్తి స్వాతంత్ర్యమున్ను, భావనా స్వాతంత్ర్యమున్ను కలుగజేసి, ప్రజాస్వామ్య భావమునకు దోహదము చేయుటయే అని ఇదివరకే మనము తెలిసికొంటిమి.

అరిస్టాటిల్ రచించిన 'పాలిటిక్స్' అను గ్రంథముతోను, మాంటెస్క్యూ రచించిన 'స్పిరిట్ అవ్ ద లాజ్'

అను గ్రంథముతోను సరిపోల్చదగిన గ్రంథమొకటి 16వ శతాబ్దిలో వెలువడినది. 'రాజ్య వ్యవహారములను గురించిన ఆరు సంపుటములు' అను గ్రంథమును ఫ్రెంచి విద్వాంసుడు జీన్ బోడిన్ (1530 - 1596) రచించెను. అందులో జాతీయ రాజ్యాధిపత్యవ్యవస్థకున్ను, ప్రాంతీయ రాజ్యాధిపత్యవ్యవస్థకున్ను కూడ వర్తించెడి ఒక ప్రణాళికను రూపొందించుటకు ఆయన ప్రయత్నించెను. ఈ భావము అప్పుడప్పుడే ప్రాముఖ్యములోనికి వచ్చుచుండెను. రాజ్యముల నడుమ ఉండవలసిన సంబంధములను వివరించు శాసనములను గూర్చి ఏడవ శతాబ్దారంభములో డచ్ న్యాయశాస్త్రవేత్తయగు హ్యూగో గ్రోషియస్ (1583 - 1645) విపులముగ చర్చించెను; 'యుద్ధశాంతి ధర్మములు' అను ఉద్గ్రంథమును రచించి, అంతర్జాతీయ న్యాయశాస్త్రము [చూ. సం. 11] నకు పునాదులు వేసెను.

ఇంగ్లండు దేశము కూడ రాజనీతి తత్త్వశాస్త్ర సిద్ధాంత భాగమునకు కొంత దోహదము చేసెను. మొట్టమొదట పదునారవ, పదునేడవ శతాబ్దులలో రిచర్డ్ హ్యూకర్ (1553 - 1600) 'లాజ్ ఆవ్ ఇక్లీజియాస్టికల్ పాలిటీ' అను రాజనీతితత్త్వ గ్రంథమును రచించెను. పిమ్మట జాన్ మిల్టన్ (1608 - 1674) [చూ. సం. 6 - పు. 759] కొన్ని రాజనీతిక విమర్శలను ప్రకటించెను. రాజనీతి తత్త్వశాస్త్రమును గూర్చి సమగ్రముగా ఆంగ్లేయులు రచించిన గ్రంథములలో తామస్ హాబ్స్ (1588 - 1679) [చూ. సం. 10 - పు. 815] రచించిన 'లెవియేథన్' అను గ్రంథము మొదటిది. సాంస్కృతిక పునరుజ్జీవనము, మతసంస్కరణోద్యమముల పర్యవసానముగ బయలువెడలిన అభిప్రాయములు ఆ గ్రంథమున వివరింపబడినవి. ఆధునిక యుగమందలి అతి అగాధమైన భౌతికవాదము (మెటీరియలిజ్మ్) ను ఆయన ప్రారంభించెను. 'హేతువాదయుగము' నకు ప్రధానలక్షణమైన కర్కశతర్కపద్ధతికి ఆయనయే వైతాళికుడు. అయినను, ఆయన హేతువాదమునకు మానవ స్వభావములోని పరిపూర్ణతను గాక, దౌష్ట్యమునే ప్రాతిపదికగా తీసికొనెను. మానవుడు పరిపూర్ణుడు కాగలడను భావములను ఆయన సరకుగొనలేదు. కాని, 15 వ శతాబ్దిలో హేతువాదము పూర్ణవికాసమును పొందుటతో దాని స్వభావమే మారిపోయెను. 19 వ శతాబ్దపు ఔదార్యవాదమునకు నాందీగీతము పాడిన ఆంగ్ల తీవ్రవాదులగు తామస్ పెయిన్, గాడ్విన్ మున్నగు రచయితలు 'మానవుడు పరిపూర్ణుడు కావచ్చు' ననే గాఢమైన విశ్వాసమును తమ రచనలలో ప్రకటించిరి. ఫ్రాన్స్‌లోని విజ్ఞాన సర్వస్వ రచయితలు, వాల్ టెయిర్ [చూ.], రూసో [చూ.] కూడ సహజముగ హేతువాద విధానమును వివరించిరి [చూ. సం. 7 - పు. 546].

హాబ్స్ అనంతరము గణుతికి ఎక్కిన గొప్ప ఆంగ్లవిజ్ఞాని జాన్ లాక్ (1632 - 1704) [చూ. సం. 7 - పు. 660]. అతడు రచించిన రచనలలో ముఖ్యమయినది నాటి విప్లవమును ఆధారముగ చేసికొని రచితమయినది. ప్రభుత్వ వ్యవస్థను గురించి చర్చించుచు ఆయన వ్రాసిన రెండు గ్రంథములలోను ఇంగ్లండు దేశమున రాజునకును, పార్లమెంట్ నకును నడుమ సంఘటిల్లిన సంఘర్షణలలో సిద్ధాంతరీత్యా పార్లమెంట్‌ను ఆయన సమర్థించెను. ఆధునిక ఉదార రాజ్యాంగ వ్యవస్థావాదమునకు అతనిని పితామహునిగ పరిగణింతురు. అనంతరము 19 వ శతాబ్దములో చాల ప్రాముఖ్యమునకు వచ్చిన ఉదార సంప్రదాయ సిద్ధాంతమునకు మార్గదర్శకులు అయిన రాజ్యాంగ వ్యవస్థావాదులలో ఇతడే మొదటివాడు.

**ఉపయోగితా వాదము** (యుటిలిటేరియనిజమ్) స్వభావసిద్ధముగ ఆంగ్లేయుల సిద్ధాంతము. దాని ప్రభావములను రూపొందించినవాడు జెరిమీ బెంథామ్ (1748 - 1832) [చూ. సం. 7 - పు. 552] పండితుడు. జేమ్స్ మిల్, జాన్ స్టూవర్ట్ మిల్ [చూ. సం. 7 - పు. 679] అతని శిష్యులు. పిమ్మట జాన్ ఆస్టిన్ శాసన స్వరూపమును సక్రమముగా వ్యాఖ్యానించి, సర్వస్వాతంత్ర్యమును ఉపయోగితావాద సిద్ధాంతమును విపులీకరించెను.

సుప్రసిద్ధ ఫ్రెంచి తత్త్వవేత్త మాంటెస్క్యూ (1689 - 1775) [చూ. సం. 10 - పు. 55] మానవ శాస్త్రమునకు, భూగోళశాస్త్రమునకు రాజకీయములతోగల సంబంధమును వివరించెను. 'శాసనముల తత్త్వము' అను ఉద్గ్రంథము 18 వ శతాబ్ది మధ్యకాలమున వెలువడెను. రాజకీయాధికార విభజన సిద్ధాంతమును రాజనీతి తత్త్వశాస్త్రమునకు అతి అమూల్యాలంకారముగా ఆయన సమకూర్చెను.

రూసో (1712 - 1778) పండితుడు ఫ్రాన్స్‌లో హేతువాద యుగమున వెలసిన సంశయోపేత విపరీత తత్త్వమునకు ప్రతినిధియైన దార్శనికుడు. అతడు రచించిన 'ద సోషల్ కాంట్రాక్ట్' అను సుప్రసిద్ధ గ్రంథము ముఖ్యముగ రాజకీయ అన్యాయములను సమూలముగ ఛేదించుటకు ఎక్కువగ ఉపకరించినది. ఫ్రెంచి విప్లవమునకు అదియే వేదమైనది. దానిలోని భావములు, పారిభాషిక పదములు 'మానవ స్వత్వ ప్రకటన' రచించినప్పుడు విశేషముగ ఉపకరించినవి [చూ. రూసో].

రూసో చేసిన ప్రధాన సిద్ధాంతమును అపార్థము చేసికొనుటకున్ను, అలక్ష్యము చేయుటకున్ను అవకాశము

లేకపోలేదు. అతని దృష్టిలో రాజ్యపాలన వ్యవస్థ నైతిక స్వేచ్ఛకు బహిస్స్వరూపము; స్వాతంత్ర్య సముపార్జనకే కాని, నిస్సంగత్వమునకు ఉద్దేశింపలేదు. శాసనమును, అభీప్సితమును గుర్తించుటయే స్వాతంత్ర్యము. అనుదిన వ్యవహారములో నొకప్పుడు వ్యక్తిగతముగ ఒక పౌరుని స్వార్థమునకు ఈ అభీప్సితము విరుద్ధముగ కనిపించినను, అది వాస్తవముగ అతని పరిపూర్ణాభీప్సిత మైనప్పుడు విరుద్ధముకాదు. మానవుని 'వ్యక్తిగతాభీప్సితమునకును, వాస్తవాభీప్సితమునకును వ్యత్యాస మున్న'దని పరమ కాల్పనిక చింతాపరులు అందరును ఉద్ఘాటించిరి. ఈ వాస్తవాభీప్సితమునే రూసో సార్వజనీనాభీప్సితము అనెను. ప్రయోజనకరమగు స్వాతంత్ర్యము అనిన ఉదాత్త స్వార్థమును - అనగా సార్వజనీనాభీప్సితమును - సాధించు కొనుటయని అర్థము. కనుక, ప్రభుత్వాధికారము దానిని సాధించుకొన గలుగుటలోనే ఉండును. అందువలన ప్రభుత్వాధికారమునకును, సత్తాధికారమునకును భేదము ఉన్నది. సత్తాధికారము ఇతరులకు దత్తము చేయబడ వచ్చును. ప్రభుత్వాధికారము మాత్రము ఇతరులకు దత్తము చేయుటకు అవకాశములేదు. శాసనములు అన్నియు సార్వజనీనాభీప్సితమును అనుసరించియే చేయబడును. కనుక శాసనసముదాయమంతయు వ్యక్తుల వాస్తవాభీప్సితముల క్రోడీకరణమే అగును. వ్యక్తుల హక్కులలో ఏదియు రాజ్యమునకు విరుద్ధముగ ఉండరాదు. అట్లుండవచ్చునన్నచో అది స్వ మత విరోధమగును.

రూసో సిద్ధాంతములు అటుపిమ్మట ప్రసిద్ధ రాజనీతి తత్త్వవేత్తల భావనా పద్ధతికి విశేషముగ ఉపకరించినవి. కాంట్ (1724 - 1804) [చూ. సం. 7 - పు. 342], హెగెల్ మున్నగు రాజనీతి తత్త్వవేత్తలకును, పరమకాల్పనిక వాదుకులను కూడ రూసో భావములు ఉపయోగపడినవి. కాంట్ తన న్యాయశాస్త్ర సిద్ధాంతమునకు రూసో నిర్వచించిన సార్వజనీనాభీప్సిత సూత్రమునే ప్రాతిపదికగ చేసికొనెను. రూసో రచనలలోని మంచి భావములు అన్నిటిని ఆయన స్వీకరించెను. కాని, మానవ నీతి శాస్త్ర ప్రమాణములను నిర్ధారణ చేయుటలో వ్యక్తియే పరమ ప్రమాణమని ఆయన నిర్వచించెను. నాటినుండి బయలు దేరిన ప్రజాస్వామ్య భావనలన్నిటికి ఈ భావమే ప్రాతిపదిక అయ్యెను.

'శాశ్వత శాంతిని గురించిన వ్యాసము' అను తన సుప్రసిద్ధ రచనలో కాంట్ శాసనబద్ధమైన ప్రపంచ సాంఘిక వ్యవస్థకు అవసరమగు నైతిక పరిస్థితులను నిర్వచించెను. అట్టి ప్రపంచ వ్యవస్థకు రాజ్యాంగ వ్యవస్థావాదమే (కాన్స్టిట్యూషనలిజమ్) ప్రాతిపదికగ ఉండవలెనని కూడ ఆయన వాదించెను.

కాంట్ వలెనే హెగెల్ కూడ రూసోను అనుసరించెను. నైతికస్వాతంత్ర్యము మానవుని విలక్షణమైన ప్రత్యేక స్వభావమను రూసో సూత్రమునే ఈయన తన భావనలకు ఆధారము చేసికొనెను. న్యాయ శాసనములకు నీతితోగల వైరుద్ధ్యమును ఆయన అధిగమించెను. హేతువాదరీత్యా అంతరంగికముగ అవసరమయిన దానిని బహిరంగముగ సిద్ధింపచేసికొనుటలోనే వాస్తవ స్వాతంత్ర్యము ఇమిడి ఉన్నదని నిరూపించుటకు ప్రయత్నించుట ద్వారా ఆయన ఈ పని చేయగలిగెను. దానిని సిద్ధింప చేసికొనుటకు అనుకూల పరిస్థితి అవసరము. సంఘము, రాజ్యము ఆ అనుకూల పరిస్థితిని కలిగించగలవు. ప్రభుత్వ వ్యవస్థ సాంఘిక మర్యాదలకు, నైతిక సిద్ధాంతములకు బహిస్స్వరూపమని అతని మతము. కనుక ప్రభుత్వ వ్యవస్థ కేవలము వ్యక్తులు ఒండొరుల హక్కులలో జోక్యము కలిగించుకొనకుండా అరికట్టుటకు చేసికొనిన ఏర్పాటు కాదనియు, సమష్టిగా సంఘమంతటి శ్రేయస్సును లక్ష్యముగ పెట్టుకొనిన హేతువాద బద్ధమైన అభీప్సితము యొక్క బహిస్స్వరూపమే అనియు ఆయన వాదించెను. అట్టి ప్రభుత్వము సమష్టిగత స్వేచ్ఛా సంకల్ప స్వరూపమే అగుటవలన - కేవలము సాంఘిక సమష్టి సమయ పద్ధతిపై ఆధారపడి ఉండదు. కుటుంబము, గ్రామసమాజము, సంఘజీవియైన మానవుని పరమశ్రేయస్సాధనకు ఉపకరించెడి సర్వసంస్థలు అట్టి ప్రభుత్వవ్యవస్థలోని భాగములే అగును. ఈ విధముగ - తక్కిన సాంఘిక కార్యక్రమములు అన్నింటికిని పరస్పరానుకూల్యము సమకూర్చుటయే ప్రభుత్వమునకు గల ముఖ్యకర్తవ్యమని హెగెల్ అభిప్రాయము. మానవులు ఎప్పుడు ఎట్లు నడచుకొనవలెనో శాసనరీత్యా ప్రభుత్వము నిర్ధారణ చేయకపోవచ్చును. కాని, సంఘము సక్రమముగ ఉండుటకు, నైతికమర్యాదలు సవ్యముగ పాటింపబడుటకు అవసరమగు వాతావరణమును కలిగించి, దానిని భద్రముగ కాపాడు బాధ్యత మాత్రము తప్పకుండ ప్రభుత్వమునకు ఉన్నది.

హెగెల్ కూడ రూసోవలెనే చాలవరకు అపార్థము చేసికొనబడి, నిందలకు గురి అయ్యెను. అతని సిద్ధాంతము అభ్యుదయాభివృద్ధికి ప్రతిబంధకమని ఖండింపబడినది. అంతేకాదు, అభ్యుదయాభివృద్ధి ప్రతిబంధక వాదులలో అగ్రేసరుడుగ కూడ ఆయన అభివర్ణింపబడెను. వాస్తవముగా ఇంతకన్న అసత్యమయిన అభిప్రాయము మరొకటి ఉండబోదు. 'హక్కుల తత్త్వము' (ఫిలాసఫీ ది

రైట్స్) అను అతని గ్రంథమును పరిశీలించినచో ఈ విష యము తేటతెల్లము కాగలదు.

జాతీయతయే 'ఉత్తమ జీవితమునకు పునాది' అని హెగెల్ విశ్వాసము. అయితే, ఆయన భావించిన జాతీయత ఆధ్యాత్మిక పరమయినది. హక్కులన్నిటి ధర్మమును మించిన సర్వాధికారము కలదిగా రాజ్యమును నిరూపించినాడని హెగెల్‌ను నిందించుట ఘోరమయిన అత్యాచారము. ప్రభుత్వమున కన్న ప్రపంచ చేతస్సునకు హెగెల్ అధిక ప్రాధాన్యము ఒసగెను. ఆ ప్రపంచచేతస్సునకు దివ్యత్వము కలదని అతని విశ్వాసము. అతని దృష్టిలో ప్రభుత్వము నైతిక జగత్తునకు సంరక్షకత్వ బాధ్యత వహించు సంస్థ. దానిపైని, దానిలోను భగవంతుని సామ్రాజ్యము వ్యాపించి ఉన్నది. కనుక, హెగెల్ సంగ్రామములకు అనుకూలుడని కాని, ప్రపంచాధిపత్యకాంక్షను సమర్థించువాడని కాని చెప్పుట అసంగతము. శక్తికి దివ్యత్వము ఆపాదించెడి జర్మన్ సిద్ధాంతము క్రమముగా ఆదర్శప్రాయమయిన కాల్పనిక పరిపూర్ణతావాదమునకు ప్రత్యాఘాతముగాను, ఇతర చారిత్రక కారణముల వల్లను రూపొందినది. నైతిక వ్యవస్థాసౌష్ఠవమునకు అత్యవసరములయిన వాటిలో ఒకటి యుద్ధమని జనరల్ ఫాన్ బెర్న్‌హార్డీ సిద్ధాంతీకరించెను. శైశవదశలో నుండిన జర్మనీజాతి మనస్సీమలో ట్రైచ్‌కే ఏటేట ఇట్టి భావబీజములను వెదజల్లుచుండెను. ప్రభుత్వము ప్రజాభీప్సితముపైనే ఆధారపడి ఉండునని హెగెల్ చెప్పిన మాట వాస్తవమే కాని, దానిని స్థిరముగా నిలబెట్ట గల బంధము ప్రజలందరిలోను గాఢముగ నాటుకొని ఉన్న క్రమశిక్షణభావమే కాని పశుబలముకాదు. ప్రజాభీప్సితమునకును, పశుబలమునకును గల వైరుద్ధ్యమును ట్రైచ్‌కే పూర్తిగ తుడిచిపెట్టెను. ప్రభుత్వ మనగా బలము అనిన్నీ, ఒక జాతి శ్రేయస్సుకొరకు యుద్ధము ప్రకటించినప్పుడు విధిగా ఆ యుద్ధము సమగ్రమును, ఉత్తేజనకరమును అగు ననిన్నీ, అందుచేత యుద్ధము ప్రభుత్వమునకు అత్యావశ్యకమైన సాధనమనిన్నీ ట్రైచ్‌కే తాను రచించిన 'పాలిటిక్' అను గ్రంథమున వివరించెను.

ఫ్రెంచి విప్లవము ప్రపంచమంతటికిని ప్రముఖమైన మహనీయ సంఘటన. ఆ ఉద్యమము మానవ భవిష్యత్తుకు శుభోదర్కమైనదని ప్రశంసించువారును, వినాశకరమైనదని తెగడువారును కూడ ఆ కాలమున చాలమంది ఉండిరి. ఫ్రెంచివారు అరాజకత్వమును సృష్టించుటయందు చరిత్రలో సాటిలేని మహాశిల్పులని బర్క్ ప్రవక్తవలె ప్రవచించి, తన విమర్శనలతో వారిపై నిప్పులు చెరిగి పోసెను. ఇంగ్లండులో వెలసిన అద్భుత మేధావులలో అతడు ఘనతకెక్కిన వాడు. కాని, అతని సిద్ధాంతములు రాజకీయ ఉదార, సనాతన వాదముల విషమసంకరము. ఫ్రాన్స్‌దేశములోని విప్లవముపై బర్క్ చేసిన విమర్శనలకు సమాధానముగను, నూతన సిద్ధాంతములకు సమర్థకముగాను థామస్ పెయిన్ (1737 - 1809) 'మానవుల హక్కులు' అను గ్రంథమును ప్రకటించెను [చూ. బర్క్].

ఐనను పందొమ్మిదవ శతాబ్ది మధ్య భాగములోనే రాజనీతి తత్త్వశాస్త్రమందలి అత్యాధునిక ధోరణులతో మనకు తొలిపరిచయము ఏర్పడెను. ఈ వినూతన ధోరణులు అనేక సిద్ధాంతముల సమ్మిశ్రణములు అగుటవలన అయోమయములుగ ఉన్నవి. సాంఘికశాస్త్రమునందలి వివిధ శాఖలలో జరిగిన నూతన పరిశోధనల ఫలితముగ నూతన మార్గములు ఏర్పడుట, రాజకీయ సంఘటనలకు నూతన నిర్వచనములు చెప్పవలసివచ్చుట తటస్థించినది. ఈ విధముగ రాజకీయ సంఘటనలకు అన్నింటికి చారిత్రక, ఆర్థిక, మనస్తాత్త్విక, మనుష్యతాత్త్విక, భౌగోళిక, జీవ తాత్త్విక శాస్త్ర నిర్వచనములు బయలుదేరినవి. ఈ సాంఘిక శాస్త్రమునకు ఆగస్ట్ కాన్ట్ (1798 - 1857) [చూ. సం. 10 - పు. 289] మొదట సాంఘిక భౌతిక శాస్త్రము (సోషియల్ ఫిజిక్స్) అని నామకరణము చేసి, ఆయనే ఆ శాస్త్రనిర్మాణమునకు ఉపక్రమించెను. ఛార్లెస్ డార్విన్ ప్రకటించిన సిద్ధాంతములు 'భౌతిక శాస్త్రము - రాజనీతి' అను గ్రంథమును రచించిన వాల్టర్ బేజట్ పండితునకు విశేషముగ ఉపకరించెను. అట్లే - హెర్‌బర్ట్ స్పెన్సర్ కూడ డార్విన్ సిద్ధాంతమును ఉపయోగించుకొనెను; ఇటీవలి తత్త్వశాస్త్ర సిద్ధాంతములు కూడ రాజనీతి తత్త్వశాస్త్రమును తీర్చిదిద్దుటకు విశేషముగ ఉపయోగపడినవి. ఒక వంక కాల్పనిక పరిపూర్ణతావాదమునకున్ను, మరొకవంక వాస్తవికతావాదమునకు చెందిన పరిణామ జాతీయవాదములకున్ను మధ్య వివాదములు ఇంకను సాగుచునే ఉన్నవి. మరొకవంక ప్రధాన సమస్యల విషయములో కాల్పనిక పరిపూర్ణతా వాదమును సవాలు చేయుచున్న వాదములు - అనేకాధికార వాదము (ప్లూరలిజమ్), వ్యావహారికసత్తా వాదము (ప్రాగ్మాటిజమ్), ప్రయోగానుభవ వాదము (ఎక్స్‌పెరిమెంటలిజమ్), భావ సాధనవాదము (ఇన్‌స్ట్రుమెంటలిజమ్)-క్రొత్తగ బయలుదేరినవి. గ్రీన్ బ్రాడ్లే, బోజంకెట్ మున్నగు కాల్పనిక పరిపూర్ణతావాద పండితులు కాంట్, హెగెల్ మున్నగు జర్మనీ పండితుల సిద్ధాంతములను, ప్రాచీన గ్రీక్ దార్శనికుల భావములను తమ వాదములను సమర్థించుకొనుటకు

ఉపయోగించుకొనిరి. ఇటలీ దార్శనికుడు అయిన బెనెడెటో క్రొచే తత్త్వము హెగెల్ తత్త్వార్థమునకు అత్యంత సన్నిహితముగ ఉండెను. యునైటెడ్ స్టేట్స్ విదుషీమణి ఎమ్. పి. ఫాలెట్ రచనలలో కూడ హెగెల్ భావముల ధోరణి కనుపించును. హెన్రీ బెర్గ్‌సన్ [చూ. సం. 7 - పు. 552] సిద్ధాంతములను ఫ్రాన్స్‌దేశపు కార్మిక సంఘవాదము పూర్తిగ ఉపయోగించుకొనినది. పరిణామవాదము శాస్త్ర సంఘటితము కాకమునుపే దానిని అవలంబించిన వాడని చెప్పదగిన బెంజమిన్ కిడ్ తాను రచించిన 'సాంఘిక పరిణామము' (సోషియల్ ఎవల్యూషన్) అను గ్రంథములో స్వాభావిక వరణ (నేచురల్ సెలక్షన్) సూత్రానుసారముగ తన సిద్ధాంతములను సమర్థించుకొనెను. స్వార్థపరత లేని ప్రశాంత, నాగరక సంఘ నిర్మాణసిద్ధికి మానవులలోని 'పాశవ ప్రవృత్తు' లను విడిచిపెట్టుటయే 'స్వాభావిక వరణము' నకు లక్ష్యమని విశదీకరించెను. పరిణామవాదుల నాయకులలో ఒకడగు టి. ఎచ్. హక్స్‌లీ (1825 - 1897) [చూ. సం. 10 - పు. 813] 'పరిణామవాదము - నీతి' అను తన గ్రంథములో స్వాభావిక వరణ సూత్రము నైతికముగ ఏమాత్రమును విలువలేదనియు, మానవునకు కొన్ని లక్ష్యములున్ను, తాను భద్రముగ కాపాడుకొన దగిన కొన్ని ప్రమాణములున్ను గలవని నిరూపించెను. మానవునిలోని సృజనాత్మక శక్తులకు సాధ్యమైనంత పూర్ణవికాసమును కలిగించుటే రాజకీయ వ్యవస్థ పరమ లక్ష్యముగ ఉండవలెనని 'స్వతంత్రుని ఆరాధన' అను గ్రంథములో బెర్‌ట్రాండ్ రసెల్ [చూ. సం. 7 - పు. 641] సిద్ధాంతీకరించెను. ఆయన రచించిన 'సాంఘిక పునర్నిర్మాణ సూత్రములు', 'స్వాతంత్ర్యమునకు రాచబాటలు' అను గ్రంథములు అత్యంత భావోద్బోధకములు. స్పెన్సర్ వలెనే ఈయన ప్రభుత్వాధికారమును గూర్చి భయమును వెల్లడించెను. వ్యవహారికసత్తావాదమునకు, మానవతావాదము (హ్యూమనిజమ్) నకు, ప్రయోగానుభవవాదమునకు, భావసాధనవాదమునకు విలియమ్ జేమ్స్, షిల్లర్, జాన్ డ్యూయీ, పియర్స్, తార్‌స్టైన్ వెబ్లెన్, రాస్కో పౌండ్, లియాన్‌డగ్‌విట్, హెరాల్డ్ లాస్కీ, వాల్టర్ లిప్‌మన్ ముఖ్య నాయకులు.

రాజనీతి శాస్త్రములో పరస్పర వైరుధ్యము గల ప్రాతిపదిక విషయములను గురించిన చర్చలు తిరిగి ప్రారంభమైనవి. ఈ విధముగ ఏకాధికారవాదము (మోనిజమ్) నకు, అనేకాధికారవాదము (ప్లూరలిజమ్) నకును, నైతికవాదమునకు, అనైతికవాదమునకును తీవ్ర వాదోపవాదములు చెలరేగెను. ఏకాధికార, కాల్పనిక పరిపూర్ణతావాదముల సాంఘిక, రాజకీయ తత్త్వములను ఎల్. టి. హాబ్‌హౌస్ [చూ. సం. 10 - పు. 815] తన 'ప్రభుత్వమునకు సంబంధించిన తాత్త్విక సిద్ధాంతము' (మెటాఫిజికల్ తీయరీ ఆవ్ ది స్టేట్) అను గ్రంథమున తీవ్రముగ ఖండించెను. జి. డి. ఎచ్. కోల్ పారిశ్రామిక సంఘ సామాజికవాదము (గిల్డ్ సోషలిజమ్) ను సమర్థించెను.

ఆర్థిక శక్తుల ఉద్ధతివలన రాజనీతి విచారణలో ఆర్థిక శాస్త్ర ప్రాముఖ్యము హెచ్చెను. ఈ సందర్భములో నిర్వచనమునకు గల తాత్త్వికాధారమునకు ద్వంద్వ తార్కిక భౌతికవాదము (డైలెక్టికల్ మెటీరియలిజమ్) అని పేరు. కార్మిక (ప్రొలెటేరియన్) రాజకీయసిద్ధాంతము క్రొత్తగా బయలుదేరెను. జర్మనీకి చెందిన ఫెర్డినాండ్ లాసాల్ (1825 - 1864), కార్ల్ మార్క్స్ (1818 - 1883), ఫ్రీడ్రిక్ ఎంగెల్స్ (1820 - 1895) అను వారు కార్మిక సామాజికవాదమును లేవదీసిరి. వీరిలో మార్క్స్, ఎంగెల్స్ కార్మికోద్యమమునకు ముఖ్యమైన 'శాస్త్రీయ సామాజిక వాదము' నకు సృష్టికర్తలు. కమ్యూనిస్ట్ ప్రణాళిక (మానిఫెస్టో), పెట్టుబడి (కాపిటల్) అను గ్రంథములలో 1. చరిత్రకు ఆర్థిక శాస్త్ర నిర్వచనము; 2. వస్తుమూల్యమునకు కార్మిక సిద్ధాంతము; 3. పెట్టుబడిదారీ వ్యవస్థకు తప్పనిసరియైన వినాశము అను మూడు ముఖ్య సూత్రములను మార్క్స్ వివరించెను. చరిత్రకు ఆర్థికశాస్త్రరీత్యా చెప్పగల నిర్వచనమును లోరియా ఇంకను ఎక్కువగా విపులీకరించెను. లెనిన్, ట్రాట్‌స్కీ అనువారు మార్క్స్ సిద్ధాంతములను సోవియట్ రష్యాలో ఆచరణలోనికి తెచ్చిరి. అచ్చమైన మార్క్స్‌వాదులమని చెప్పుకొనువారిలో ఒకడు కారల్ కాంట్‌స్కీ. ఎడాల్ఫ్ వాగ్నర్, గస్టావ్ ష్మాలర్, ఆల్బర్ట్ షాఫిల్ ప్రజాస్వామిక పరిణామ సామాజికవాదులుగా ప్రఖ్యాతులయినారు. గ్రేట్ బ్రిటన్‌లో బెర్నార్డ్ షా [చూ. సం. 6 - పు. 792] ప్రోత్సాహ ప్రోద్బలములు గల క్రమ పరిణామ (ఫేబియన్) సామాజిక వాదులు - హెన్రీ జార్జి, విలియమ్ మారిస్, సిడ్నీ వెబ్ మున్నగువారు - సామాజిక వాదమునకు ఇంకను భిన్న భిన్న వ్యాఖ్యానములు చేసిరి. సాముదాయికవాదము, అరాజకవాదము, కార్మిక ప్రాతినిధ్యవాదము (సిండికాలిజ్మ్), పారిశ్రామిక సంఘ సామాజికవాదము అనునవి కార్మిక సామాజికవాదమందలి ఇతర శాఖలు. వీనిలో అరాజకతావాదము రెండుగా చీలిపోయి, వ్యక్తిగతమయిన అరాజకతావాదము, సమష్టిగతమైన అరాజకతావాదము అను రెండు నూతన శాఖలు వెలసినవి. ఇవిగాక, కేవలము రష్యాలోనే పుట్టి పెరిగిన బోల్షివిజమ్, నిహిలిజమ్ అని మరి రెండు

వాదములు ఉన్నవి. క్రొపాట్కిన్, బాకూనిన్ అనువారు ఈ వాదములను మొదట విశదపరచినవారు. ఇంతవరకు చర్చింపబడిన ఆధునిక కార్మిక రాజకీయ సిద్ధాంతములకు తోడు వలసరాజ్యవాదము, సామ్రాజ్యవాదము కూడ ఉన్నవి. ప్రపంచ వ్యవస్థీకరణముపట్ల ఉత్సాహము క్రము ముగ పెరుగుచు, అంతర్జాతీయ వాదమునకు దారి తీయుచున్నది. మానవులలోని భిన్నభిన్న జాతులకు సంబంధించిన సమస్యలుకూడ రాజకీయ సిద్ధాంతములు రూపొందుటకున్ను, వాటిని ఆచరణలో పెట్టుటకున్ను కొంతవరకు ఉపకరణములు అగుచున్నవి. జాతీయత అనగా ఒక జాతికి చెందిన వారిలో ఉదయించిన ఏకీ భావము, స్వాభిమానము అని చెప్పవచ్చును. ఈ భావము యొక్క అత్యంత తీవ్రస్వభావము హిట్లర్ బోధించిన జీవిత మూలజాతీయతా వాద (బయో నేషనలిజమ్) రూప మును దాల్చినది. ఆర్య, ట్యూటన్‌వాదములవంటి ఉద్య మములలో కూడ ఈ జీవిత మూలజాతీయతావాద లక్షణ ములు స్పష్టముగ కనిపించుచున్నవి. అయినను, ఏకప్రపంచ రాజ్యమును గోరు కాల్పనిక పూర్ణతావాదులు, సామాజిక వాదులు, కార్మిక ప్రాతినిధ్యవాదులు, పారిశ్రామిక సమష్టి సామాజిక వాదులు కూడ జాతీయవాదమును నిరసించిరి. జాతి రాజ్యవ్యవస్థను సమర్థించిన తాత్త్వికసిద్ధాంత వాద ములను అన్నిటిని వీరందరును తీవ్రముగ ఖండించిరి.

పల్లెపట్టుల జనమంతయు క్రమక్రమముగ పట్టణములకు ఎక్కుచుండుటవలన పట్టణముల జనాభా బాగుగా వృద్ధి అగుట ఇటీవలి రాజకీయ సంఘటనలలోని మరి యొక ప్రముఖ విషయము. పట్టణముల జనాభా వృద్ధియగుట, పారిశ్రామికాభివృద్ధి జరుగుట ఒకదాని వెంట ఒకటి సాగుచు, ప్రజాస్వామిక పౌరతకు సంబంధించిన నూతన సమస్యలను సృష్టించుచున్నవి. సారోకిన్, పాట్రిక్ గెడ్డిజ్, ఎల్. పి. జాక్స్ మున్నగు సాంఘికశాస్త్రవేత్తలు, దార్శ నికులు ఈ సమస్యను వివిధ దృక్పథములనుండి పరిశీలించి, సర్వాంగసుందర నగరనిర్మాణము సాధించుటకు పరిశోధ నలు చేయుచున్నారు.

సాంఘికశాస్త్రములోను, మనశ్శాస్త్రములోను, ముఖ్య ముగా సాంఘిక మనశ్శాస్త్రములోను, మానవశాస్త్రము లోను, మానవ భూగోళశాస్త్రములోను నేడు జరుగు చున్న పరిశోధనలు కూడ రాజనీతి తత్త్వశాస్త్ర వికాస మునకు తోడ్పడుచు, అనేక నూతన చర్చలకు కారణము అగుచున్నవి. రాజ్యమనగా సాముదాయిక సాంఘిక రక్షకభటుడను నిర్వచనమును స్పెన్సర్, లబాన్, విలియమ్ గ్రేహం, సమ్నర్ సిద్ధాంతీకరించిరి. షాఫిల్, వరమ్జ్ మున్నగువారు 'రాజ్యము' అనగా సంఘమును సమీకరించి సక్రమముగ నడుపు ప్రధానసంస్థ అని విశ్వసించుచున్నారు. ఈ విశ్వాసమును అనుసరించి వివిధ విషయములలో ప్రభు త్వము జోక్యము కలిగించుకొను అవకాశము ఎక్కువ అగును. గంప్లర్ట్రీ లొరియా, ఓపెన్ హీమర్ పండితులు సామాన్యపదార్థములు అన్నింటిని పరిశీలించి వివిధ సాంఘిక రాజకీయవిధానముల వాస్తవ స్వభావములను గ్రహించు టకు ప్రయత్నము చేసిరి. వార్డ్ గిడ్డింగ్స్, లడ్విగ్ స్టెయ్న్ మున్నగు సాంఘికశాస్త్రవేత్తలు రాజ్యమనగా ఒక పెద్ద సాంఘికసంస్థ అనిన్నీ, సాంఘిక సుస్థితికి, అభ్యుదయము నకు అది ఆవశ్యకము అనిన్నీ పేర్కొనిరి.

సాంఘిక మనశ్శాస్త్రము రాజనీతిశాస్త్ర వికాసమునకు విశేషముగ తోడ్పడినది. రాజనీతిశాస్త్రమునకు కీలకము మనశ్శాస్త్రములోనే ఉన్నదని కూడ కొందరి విశ్వాసము. రాజకీయవాతావరణము కేవలము 'సాంఘిక' మనియే సాంఘికశాస్త్రవేత్త ముఖ్యముగ భావించును. విలియమ్ మెక్‌డుగల్, జాన్‌డ్యూయీ (1858 - 1952) [చూ. సం. 10 - పు. 416], గ్రేహం వాలస్ మున్నగు మనశ్శాస్త్ర వేత్తలు మానవుని స్వభావమును, మానసిక ప్రవృత్తులను, సహజప్రవృత్తులను, ఉద్వేగములను అనుసరించియే రాజ కీయ వాతావరణమును, ముఖ్యముగ రాజకీయప్రవర్తనను వ్యాఖ్యానించుచున్నారు. లబాన్, రాస్ వంటి మన స్సాంఘిక శాస్త్రవేత్తలు ఆధునిక నగర నాగరకతలోని మూకల మనస్తత్త్వమును అనుసరించి ఆధునిక రాజకీయ పక్షాల వైఖరులను పరిశోధింప కృషిచేసిరి.

మానవశాస్త్రము, మానవ తాత్త్విక - భూగోళ శాస్త్రము రాజనీతిశాస్త్ర వికాసమునకు చేసిన దోహదము మెక్‌లెన్నా, లూయీ ఎచ్. మార్గన్, రాట్జెల్ రచన లలో వ్యక్తమగుచున్నది. మాంటెస్క్యూ (1889 - 1755), బోడిన్ (1530 - 96), బక్‌ల్ (1821 - 62), సెంపిల్ రాజనీతి శాస్త్రమున భౌగోళిక ప్రభావములనుగురించి తమ రచన లలో విపులముగ చర్చించిరి.

కారల్ రిటర్ ప్రముఖ మానవ తాత్త్విక - భూగోళ శాస్త్రవేత్తలలో గణనీయుడు. రాట్జెల్ శిష్యుడునగు స్వీడెన్ పండితుడు చెలెన్ భూగోళసంబంధ రాజనీతి అను అర్థముతో 'జియో - పొలిటిక్స్' అను నూతన పదమును సృష్టించెను. ఈ పదము రాజనీతి విజ్ఞానమునకు, ఆచరణకు, విధానమునకు ఉపకరణముగ ఉపయోగ పడినదనికూడ చెప్పుచున్నారు.

కనుక, ఇటీవలి రాజకీయ భావనా పద్ధతులను వివరిం చుటలో పారిశ్రామికవాదము, జాతీయవాదము, పట్టణ

ప్రాబల్యావాదము, మహిళాభ్యుదయ వాదము మొదలగు సాంఘికోద్యమములను కూడ ఆలోచించుట అవసరమగు చున్నది. అట్లే వ్యాపారవర్గము, కార్మికవర్గము, జాతి వర్గము మొదలగు ముఖ్యవర్గముల పోకడలను, ఈ యుగ మందలి వైజ్ఞానికోపకరణములను, పరిచయములను, సంఘర్షణలను భిన్నభిన్నాశయములు, విధానములు గల వివిధనాగరకతలకు జరుగుచున్న సంయోగములను కూడ చక్కగ పరిశీలించుట అవసరము.

ఈ విధముగ పందొమ్మిదవ శతాబ్దిలోను, అంతకు పూర్వశతాబ్దులలోను వెలువడి, మనకు సంక్రమించిన రాజకీయభావ సముదాయమునకు తోడు అనేక నూతన సమస్యలనుకూడ నేడు ఎదుర్కొనవలసి వచ్చుచున్నది. ప్రజాస్వామ్య సంప్రదాయము తీవ్రవిమర్శలకులోనైనది. అందువలన దాని లోపములను పూరించుటకు నూతన ఉపాయములు, సంస్కరణలు అవసరమైనవి. ఆధునిక నియంతృత్వపద్ధతి, ఏకపక్ష నిరంకుశత్వము వెలసినవి. సిద్ధాంతరీత్యా నేటి ప్రముఖ వివాదము ప్రాచీన ప్రజా స్వామిక రాజ్యపద్ధతికి, సోవియట్ రష్యా మున్నగు సర్వాధికార ప్రభుత్వ పద్ధతులకు మధ్య సాగు ప్రముఖ సంఘర్షణగా రూపొందినది.

ఇదిగాక - అంతర్జాతీయవాదము, జాతీయవాదము, సామ్రాజ్యవాదము, వలస రాజ్యవాదము మొదలగు కొన్ని సిద్ధాంతములు కూడ బయలుదేరినవి. ప్రాచ్య జగత్తులో వినూతన జాతీయ చైతన్యము ఉదయమగుటతో ఈ మూడు వాదములకు బలము తగ్గుట ఆరంభమైనది. జాతి రాజ్యమున కన్న విస్తృతమైన రాజ్యవ్యవస్థను గురించిన ఆశయములకు పలుకుబడి ఎక్కువగుచున్నది. మానవుని శ్రేయస్సునకు సంబంధించిన ప్రతి విషయము నేడు ప్రపంచమంతటి దృష్ట్యా చర్చింపబడుచున్నది. ఈ ఆచారము క్రమముగా వృద్ధియగుచున్నది. అందువలన విశాలదృష్టి యొక్క అగత్యము మున్నెన్నడును ఎరుగనంత ఎక్కువగా ఏర్పడినది. అంతర్జాతీయ మనస్తత్త్వము నేడు మనకు సుదూర లక్ష్యము కాక, కనుచూపుమేరలోనికి వచ్చినట్లు కనిపించు చున్నది. ఆధునిక ఉదారవాదులు అంతర్జాతీయ ప్రజాభిప్రాయములోను, అంతర్జాతీయ వ్యవస్థీకరణము లోను, ప్రపంచ వ్యవస్థలోను తమ విశ్వాసములను నేడు విస్పష్టముగ ప్రకటించుచున్నారు.

ద్వితీయ ప్రపంచ యుద్ధము ముగిసిన పిదప యూరప్ నందలి రాజకీయ భావనను ద్వివిధవాదములు - సోవియట్ దేశపు కమ్యూనిజమ్, యునైటెడ్ స్టేట్స్ ధనస్వామ్య వాదము - కొంతవరకు లోగొనినవి. యుద్ధాత్పూర్వమున దక్షిణపక్షమునకు చెందిన అధికార సర్వస్వాధికారవాదము (టోటలిటేరియానిజమ్), ఫాసిజమ్, నాజీజమ్‌ల రూపమున యూరప్‌కును, ప్రపంచ భద్రతకును ఆందోళనాజనకముగ పరిణమింపగ, యుద్ధానంతరమున, వామపక్షమునకు చెందిన అధికార సర్వస్వతావాదము, కమ్యూనిజమ్ రూపమున యూరప్‌ను కలవరపరచినది. యూరప్‌నందలి సామాన్య పౌరునికి ఫాసిజమ్‌నందు కన్పట్టు అవాంఛనీయ లక్షణములు దాదాపుగ అన్నియును కమ్యూనిజమ్‌నందు కన్పట్టినవి. ప్రజాస్వామ్యమున పౌరునికి లభించు ప్రాథమిక స్వత్వములు - వాక్స్వాతంత్ర్యము మొదలగునవి - ఫాసిజమ్, కమ్యూనిజమ్ రెండింట సర్వశూన్యములగుట వలన ఈ రెండింటి మధ్యగల విభేదము సామాన్యుని దృష్టిలో కనుమరుగైనది.

యుద్ధమునకు పూర్వపు యూరప్‌న ప్రజాస్వామిక రాజ్యములందలి కొన్ని విస్తృత వర్గములందు, కమ్యూనిజపు కొన్ని లక్షణముల యెడ కొంత సానుభూతి ఉండెడిది. యూరప్ రాజకీయములందు 18 వ శతాబ్ది ఉత్తరార్థము నుండియు క్రమముగ తాపు కల్పించుకొనిన ఉదారతావాదపు సహజ సహేతుక పరిణామమే కమ్యూనిస్ట్ వాదమనియు, అందువలన ఫ్రెంచి విప్లవమునెడ గౌరవము కల వారందరును కమ్యూనిజమ్‌నెడ కొంత సానుభూతి వహింపదగుననియు ఆ కాలమున భావింపబడినది. కాని, యుద్ధానంతరమున, అధికార సర్వస్వతావాదము ఆలంబనముగ సోవియట్ దేశపు ఆదరముతో తూర్పు యూరప్‌న ప్రజానీకపు ప్రజారాజ్యము (పీపిల్స్ డెమోక్రసీ) లు నెలకొల్పబడిన తరువాత తక్కిన యూరప్‌నందలి రాజనీతి భావుకుల దృష్టిలో ఉదారతావాదపు అసహజ, అవాంఛనీయ పరిణామముగ కమ్యూనిస్ట్ వాదము కన్పట్ట మొదలైనది. ఇట్టి భావుకులలో ప్రముఖుడు యాకోవ్ టాల్మన్. ' అధికార సర్వస్వక ప్రజాస్వామ్యపు ఉత్పత్తి వివరములు ' (ఆరిజిన్స్ ఆవ్ టోటలిటేరియన్ డెమోక్రసీ) అను తన గ్రంథమున ఈ భావననే ఆ పండితుడు వివరించినాడు. మార్క్స్ ప్రవచితమగు కమ్యూనిజమునకు బీజములు ఫ్రెంచి విజ్ఞాన సర్వస్వవాదుల వ్రాతలందును, భయానక విప్లవ పరిపాలనను ఆదర్శ సమాజ నిర్మాణమునకు మార్గముగ అవలంబించిన జాకోబిన్‌ల సిద్ధాంతములందును కననగునని ఆయన పేర్కొనెను. అటులే, స్వతంత్ర భావనకు దోహదకారిగ బయలుదేరెడు ఉదారతావాదపు పోకడ, గమ్యమును అతిత్వరితగతిలో చేరవలయునను వ్యామోహమునకు లోనై, ప్రక్కదారులు తొక్కి కడకు స్వతంత్రతనే అంతరింపజేసి, అధికార సర్వస్వతా వాద

ముగ దుష్పరిణతిని పొందుటకు ఎక్కువ అవకాశము కలదని ఇసయా బెర్లిన్ అను ప్రముఖవక్త విశదీకరించెను.

ఇటుల సోవియట్ కమ్యూనిస్ట్ వాదము నెడ వైముఖ్యము పశ్చిమ యూరప్ న ప్రబలుట నిజమే యైనను, ఆ వాదమునకు బదులుగ ఆదర్శ సమాజ నిర్మాణమునకు త్రోవదీయు నూతనవాదపు రూపరేఖలు మాత్రము యూరపియన్ భావుకులకు అప్పటిలో దృశ్యమానములు కాకుండినటుల అప్పటి ప్రముఖ రచయితల వ్రాతలవలన వేద్యమగుచున్నది. అట్టి అనిశ్చిత వైఖరిలోనున్న వారికి యునైటెడ్ స్టేట్స్ ధనికవాదము మాత్రము కొంతవరకు అలంబనీయమైనది. కాని, ఈ పట్టున ఈ ధనికవాద మనునది యుద్ధాత్పూర్వపు ధనికవాదముకన్న వేరైనదను విషయము గమనార్హము. ఔదార్యవంతము, విజ్ఞానయుత మునగు ఈ యునైటెడ్ స్టేట్స్ ధనికవాదము యుద్ధపీడిత పారిశ్రామిక రాజ్యముల సమస్యలను కొంతవరకు పరిష్కరింప గలిగినదనుట యథార్థము. ఇట్టి ధనికవాదమునకును 18, 19 శతాబ్దుల ఉదారతావాదమునే మూలస్రోతస్సుగ పేర్కొనదగును. ప్రతి వ్యక్తికిని సహజములు, అనతిక్రమణీయములునగు స్వత్వములు కలవనియు, అట్టి వానిని పోషించుటయే తన విధిగ కృషిచేయుచు, ఆ కృషి నిర్వహణము సాధ్యమైనంత తక్కువగ మాత్రమే ఆ స్వత్వములను కుంచింపజేయుచు ప్రభుత్వము వ్యవహరింపవలసి ఉండుననియు ఈ వాదము పేర్కొనుచున్నది. విజ్ఞతతో వ్యవహరించు ప్రభుత్వపు సాయమున ధనస్వామ్య వ్యవస్థ చక్కగ, కుదురుగ, అస్తవ్యస్తత లేకుండ పనిచేయ గలదనియు, ఉత్పాదకుని స్వతంత్రతను నిర్మూలించకుండ, ధైర్యముగ ముందంజవేసి, ఆర్థికరంగమును విస్తృతీకరించి, అనుభవనీయ వస్తువులకు క్రొత్త గిరాకీ అంతటంతట పెంపొందింపజేసి, ఉత్పాదిత వస్తువులకు విపణిని నెలకొల్పుట వలన, ఆర్థిక సమస్యల పరిష్కారమునకు సులభ మార్గమేర్పడుననియు ఈ వాదావలంబకుల విశ్వాసము. ఈ శతాబ్దపు ముప్పదులలో యునైటెడ్ స్టేట్స్‌లో అమలునకు వచ్చిన నవ్యవ్యవహారణ (న్యూ డీల్-చూ. సమీక్ష; పు. 192) కు విస్తృతరూపముగ దీనిని భావింపదగును. ఈ నవ్య వ్యవహారణను విశ్వజనీనముగ, కమ్యూనిస్టేతర దేశములకు వ్యాపింపజేయుటకు యునైటెడ్ స్టేట్స్ ధనికవాదము ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున కృషి చేసినది.

కాని, అటు సోవియట్ కమ్యూనిజమ్‌నుగాని, ఇటు యునైటెడ్ స్టేట్స్ ధనికవాదమును గాని ఆదర్శ మానవ సమాజపు రాచబాటలుగ అంగీకరింపని రాజనైతిక భావుకుల సంఖ్య క్రమముగ విస్తృతమైనది. ఈ రెండింటికిని మధ్యేమార్గముగ ఉండు దానిని అన్వేషించుటకు యత్నములు వేర్వేరు రీతులలో సాగినవి. ఈ యత్నములకు అన్నింటికిని స్థూలముగ రెండు ముఖ్యభావనలను ప్రాతిపదికలుగ పేర్కొనదగును. అందు తొలుతటిది: సామాజికాభ్యుదయమునకై ప్రభుత్వపు జోక్యము; రెండవది: ప్రపంచప్రజకు ఎట్టి యుద్ధభయము లేకుండ జేయుటకై నూతనమానవవ్యవస్థను రూపొందించుట. ఈ భావనలు రూపుగొనుటకు ద్వితీయ ప్రపంచ యుద్ధమే కారణభూతమైనదని చెప్పవచ్చును. యుద్ధకాలమున కమ్యూనిస్టేతర దేశములందు సైతము ఆర్థిక, వస్తూత్పాదనా రంగములందు ప్రభుత్వమే విరివిగ జోక్యము వహించి క్రమరీతిలో ఉత్పాదనను, వినియోగమును నిర్వర్తించి యుద్ధమును జయప్రదముగ నిర్వహించుటచేత, సామాజికాభ్యుదయ కృషిలో ప్రభుత్వము ఎక్కువగ జోక్యము వహించుట వలన సమాజమునకు శ్రేయమే కలుగగలదను భావనకు బలమేర్పడినది. వర్తమాన రాజ్యములందును ఈ మధ్యేమార్గము నెడల ఆసక్తి క్రమముగ ఎక్కువైనది. ఈ మధ్యేమార్గమునకు మూలమగు వాదమే ప్రజాస్వామిక సామాజికవాదము అని వ్యవహరింపబడుచున్నది. ఈ వాదమునకును, దీనికి సన్నిహితములగు తక్కిన సోషలిస్టు ఉద్యమములకును మూల స్రోతస్సు యూరపియన్ ఉదారతావాదమే అని చెప్పవచ్చును. ఆ వాదపు ఆధారభావనలగు స్వతంత్రతా, సమానతా, సౌభ్రాతృత్వములకు లభించు సార్థక్యమును బట్టియే ఆ యా వాదముల విలువ లెక్కింపబడుచున్నది.

కమ్యూనిస్ట్ వాదమును ఎదుర్కొనుటకై సంప్రదాయ ఉదారతావాదము కృషి చేయు సమయముననే కమ్యూనిస్ట్ వాదమున సైతము విభిన్నతలు గోచరింప మొదలైనవి. రక్తపాత విప్లవమును ఆదరింపక పటిష్ఠ ఆర్థిక వ్యవస్థా నిర్మాణమున ధనస్వామిక దేశములతో శాంతియుత స్పర్ధవహించి కృషిచేయుటవలన కమ్యూనిజమ్ వ్యాపింపగలదని సోవియట్ నాయకులు వాదింపగ, దౌర్జన్యయుత ప్రజావిప్లవమే నూతన మానవ సమాజ నిర్మాణ సమర్థమని చీనా కమ్యూనిస్టుల వాదన.

ఇటుల రాజనైతిక భావన ప్రపంచమున ఎల్లెడల నేడు వ్యాపించినది; నూతన మానవ సమాజ నిర్మాణేచ్ఛ వివిధ దేశముల మానవుల లోగొనినది. యుగయుగముల భావదాస్యమునుండి విడివడ యత్నించు మానవుని నిగూఢాకాంక్షకు ఇది ఒక ప్రతీక. చీ. శే. రా; ప్ర. రా.

---

# చరిత్ర-రాజనీతి

## అకారాది వివరణము

**అంకారవాట్ :** ఆగ్నేయ ఆసియాలో అతి విస్తృత ముగ వ్యాపించియుండిన భారతీయ సంస్కృతిని గుర్తునకు తెచ్చుచు నేడు కాంబోడియా [చూ] యందు కననగు ఒక శిథిల దేవాలయము. ఈ దేవాలయము నిర్మింపబడిన అంకారతామ్ అను నగరమును ఖ్మేర్ రాజుల సంతతికి చెందిన జయవర్మ-II క్రీ. శ. 802 లో నిర్మింపజేసెను. ఆ వంశమువాడే అగు ఉదయాదిత్యవర్మ (క్రీ. శ. 1050-1066 ప) ఈ దేవాలయమందలి అత్యున్నత గోపురమును నిర్మింపజేసెనని కొందరు చారిత్రకుల భావన. ఈ దేవాలయము తొలుత విష్ణుదేవునికై నిర్మింపబడెననియు, తదుపరి మహాయాన బౌద్ధ సంప్రదాయపు లోకేశ్వరుని పూజకై ఇది మార్చబడెననియు కొందరి తలంపు. ఏది ఎటులున్నను ఈ దేవాలయ పరిమాణము, ఇందలి శిల్ప కళా వైచిత్రి చూచువారికి విభ్రాంతిని కొలుపుచున్నవి. దీని బహిః ప్రాకారపు చుట్టుకొలత సుమారు 5,540 మీటర్లు. ఈ ప్రాకారము మొత్తమున అటనట నిర్మింపబడిన 50 గోపురము (విమానము) లు కలవు. ఒక్కొక్క విమానమునకు గల నాలుగు ముఖములలో ప్రతి దాని యందు లోకేశ్వరుని ముఖము పెద్ద పరిమాణమున చెక్కబడినది. దేవాలయపు గోడలందు రామాయణ, భాగవతములందలి గాథలు అచ్చెరువు గొలుపు రీతిగ శిల్పకళా వైచిత్ర్యము ఒలుకునటుల చెక్కబడినవి. 13 వ శతాబ్ది ప్రథమ పాదాంతమున తాయ్ మూకలు ఈ ఖ్మేర్ రాజ్యమును అంతమొందించినవి. అంతటి నుండి అంకారతామ్ నగరము క్రమముగ శిథిలమై నిర్జనమగుటచే అరణ్యము నగరమును అలముకొనెను. 1861 లో కొందరు ఫ్రెంచి వారు ఈ అడవులలో పర్యటించుచు, ఈ శిథిలావశేషముల ఉనికిని కనుగొనిరి. వారిలో ఒకడగు లూయీ డి లా పోర్టీ ఈ శిథిలముల ప్రాముఖ్యమును గుర్తించి వానిని ప్రపంచ దృష్టికి కొనివచ్చెను. 1907 లో ఈ ప్రాంతము ఫ్రెంచి వారి వశమైన తరువాత ఫ్రెంచి వలస ప్రభుత్వము వీనిని భద్రపరచుటకు శ్రద్ధ వహించెను. ఫ్రెంచి వలస ప్రభుత్వము అంతరించిన పిదప నేటి కాంబోడియా ప్రభుత్వము ఫ్రెంచి వైజ్ఞానికుల సాహాయ్యమున వీనిని భద్రమొనర్చు విషయమున శ్రద్ధవహించుచున్నది [చూ. కాంబోడియా].

చీ. శే. రా.

**అంటార్కటికా :** దక్షిణధ్రువమును చుట్టి ఉన్న ఒక హిమావృత భూఖండము. వైశాల్యము సుమారు 1,55,40,000 చ. కి. మీ. దీనియందు కొంతభాగము ఇంకను అనావిష్కృతమై ఉన్నది. ఇందలి పలుప్రాంతములను దర్శించి, అందలి వివరములను తెలియజేయుటకు వివిధ దేశీయులగు సాహసికులు అనేకులు పెక్కుయత్నములజేసి, కొంతవరకు సఫలులైరి. ఆ యా సాహసికుల జాతీయతను అనుసరించి వారు కనుగొనిన ప్రాంతములు ఆ యా దేశములకు చెందవలయునని భావింపబడినను, ఈ సూత్రము కొన్ని తగవులకు కారణమైనది. ఈ ప్రదేశమున పర్వతములు అనేకములు కలవనియు, వాని శృంగములు మాత్రమే మంచు పొరనుండి వెలుపలకు కనబడుచున్నవనియు, ఈ పర్వతములందు విలువగల ధాతువులు అనేకములు కలవనియు తెలియవచ్చినంతటినుండి ఇందలి విశాల ప్రాంతములందు తమకు స్వత్వములు కలవనుచు ఆర్జెంటీనా, చిలీ, ఫ్రాన్స్, నార్వే, ఆస్ట్రేలియా, గ్రేట్ బ్రిటన్ తొలుత వివాదములు లేవదీసినవి. క్రమముగ యునైటెడ్ స్టేట్స్, సోవియట్ రష్యా ఇందు పాల్గొనినవి. కడకు ఈ స్వత్వములను గురించిన వివాదములను అటుంచి అంటార్కటికా యందు వివిధ స్థావరములను నెలకొల్పి శాస్త్రీయ పరిశోధనలను సాగించుటకు 1959 లో బెల్జియమ్, జపాన్, న్యూజీలండ్, నార్వే, సోవియట్ రష్యా, దక్షిణ ఆఫ్రికా యూనియన్, గ్రేట్ బ్రిటన్, యునైటెడ్ స్టేట్స్, ఆర్జెంటీనా, ఆస్ట్రేలియా, చిలీ, ఫ్రాన్స్ ఒక ఒడంబడికను కుదుర్చుకొని శాస్త్రీయ పరిశోధనలను సాగించుచున్నవి.

చీ. శే. రా.

**అండమాన్, నికోబార్ దీవులు :** భారతదేశ భూభాగమునకు తూర్పుగ బంగాళాఖాతమున ఉన్న దీవుల సమూహము ; రాజకీయముగ భారతదేశ అంతర్భాగము. ఇందు మొత్తము 204 దీవులు ఉన్నవి. విస్తీర్ణము 8,327 చ. కి. మీ. ; జనాభా 63,548. 9 వ శతాబ్దము నాటి అరబ్బుల రచనలను బట్టియు, మార్కొపోలో వ్రాతలను బట్టియు మొదట ఈ దీవులలోని ఆదివాసులను గూర్చి తెలియవచ్చుచున్నది. నవీన శిలాయుగమునకు ముందే వీరిచట స్థిరపడినట్లు ఊహించుచున్నారు. 'హనుమాన్' శబ్దము మలయాభాషలో 'హండుమాన్' అయి, తుదకు

'అండమాన్' నామముగ మారెనని కొందరి తలంపు. కెప్టెన్ ఆర్చిబాల్డ్ బ్లెయిర్ నాయకత్వమున ఆంగ్లేయులు ఈ దీవులను 1789 లో వశపరచుకొని, ఇచ్చట ఒక వలసను ఏర్పరచుకొనిరి. 1858 నుండి 1942 వరకు ఇండియా నుండి ద్వీపాంతరవాసము విధింపబడిన ఖైదీలను ఇచ్చటికి పంపుచూ వచ్చిరి. 1942 జూలైలో ఈ దీవులు జపాన్ వారి అధీనమై, కొంతకాలము నేతాజీ సుభాష్‌చంద్ర బోస్ [చూ.] నెలకొల్పిన అజాద్ హింద్ ఫౌజ్‌కు స్థావరముగ ఉండి, తుదకు 1945 అక్టోబరులో తిరిగి భారత ప్రభుత్వమువారి అధీనమైనవి. రాజకీయముగ ప్రస్తుతము ఈ దీవులు స్వతంత్ర భారత దేశమునకు చెంది కేంద్ర పాలిత రాష్ట్రముగ ఉన్నవి [చూ. సం. 10 - పు. 133]. ప్ర. రా.

**అంతర్జాతీయ ఆరోగ్యసంస్థ :** చూ. ఐక్యరాజ్య సమితి ; సం. 8 - పు. 186.

**అంతర్జాతీయ ఆహార, వ్యవసాయ సంస్థ :** చూ. ఐక్యరాజ్యసమితి ; సం. 8 - పు. 289.

**అంతర్జాతీయ కార్మిక సంస్థ :** చూ. ఐక్యరాజ్య సమితి ; సం. 5 - పు. 360.

**అంతర్జాతీయ తపాలా సంస్థ :** చూ. ఐక్యరాజ్య సమితి.

**అంతర్జాతీయతావాదము :** ప్రపంచములోని వివిధ జాతుల మధ్య వీలైనంత ఎక్కువ సహకారమున్నయెడల మానవ శ్రేయస్సు పెంపొందగలదనియు, ప్రపంచ సుస్థిర శాంతికి అది దారితీయగలదనియు ఒక సిద్ధాంతము కలదు. ప్రపంచములోని వివిధ జాతులను - వాటి ప్రత్యేకతలకు గాని, స్వతంత్ర కార్యాచరణకు గాని భంగము కలిగించకుండగనే - ఒక త్రాటిపై నడిపింపగల ఒక జగదేకరాజ్య సంస్థాపనను గూర్చి అంతర్జాతీయతావాదులు ఆలోచించుచున్నారు. తమ వాదమును బలపరచుకొనుటకు వీరు నానాటికి అభివృద్ధి చెందుచున్న విమానయానాది సౌకర్యముల వలన దూరదేశములు దగ్గరగుచున్నవనియు, అందుచేత వివిధజాతుల మధ్య ఇతోధికసన్నిహిత సంబంధములు ఏర్పడగలవనియు, పరస్పర సాహాయ్యము అవసరమగుట వలన జగదేకరాజ్య సంస్థాపనము సాధ్యము కాగలదనియు వాదించుచున్నారు. వీరి సంకల్పము నెరవేరుటకు మూడు ముఖ్యమైన ప్రతిబంధకములు ఉన్నవి :

1. జాతీయ, రాజకీయ, ఆర్థిక, సైనిక ప్రత్యేక స్వామ్యములు ఎవరివి వారు విడిచి పెట్టుకొనలేనంత తీవ్రముగ స్థిరపడి ఉన్నవి ;
2. వివిధ జాతుల మధ్య సంస్కృతిలో తర, తమ వ్యత్యాసములు అత్యధికముగ ఉన్నవి ;
3. అనేక రాజ్యములలో భిన్న భిన్న రాజకీయ సిద్ధాంతములు దృఢపడి ఉన్నవి.

వీటిని అనుసరించి వివిధ రాజ్యముల మధ్య పరస్పర సదవగాహన ప్రస్తుతమునకు దుస్సాధ్యముగ పరిణమించినది. కాని, ఆదర్శరీత్యా మాత్రము జగదేక రాజ్య సంస్థాపన వాంఛనీయము. ప్ర. రా.

**అంతర్జాతీయ ద్రవ్య సంస్థ :** చూ. ఐక్యరాజ్య సమితి ; సం. 5 - పు. 332.

**అంతర్జాతీయ న్యాయస్థానము :** చూ. ఐక్యరాజ్య సమితి.

**అంతర్జాతీయ పునర్నిర్మాణ అభివృద్ధి బ్యాంక్ :** చూ. ఐక్యరాజ్యసమితి ; సం. 5 - పు. 365.

**అంతర్జాతీయ వర్తక సంఘము :** చూ. ఐక్య రాజ్యసమితి.

**అంతర్జాతీయ విద్యా, శాస్త్రీయ, సాంస్కృతిక సంస్థ:** చూ. ఐక్యరాజ్యసమితి, యునెస్కో సం. 10 - పు. 629.

**అంతర్జాతీయ సంస్థలు :** మానవకోటి యొక్క రాజకీయ, ఆర్థిక, సాంఘిక, వైజ్ఞానికాది వ్యవహారములను క్రమబద్ధములుగ చేయుటకు ఏర్పడిన సంస్థలు రెండు రకములుగ ఉన్నవి : 1. జాతీయ సంస్థలు - ఇవి ఒక రాజ్యమునకు మాత్రమే పరిమితములైనవి. ఆ యా రాజ్యములలోని శాసనసభలు, న్యాయస్థానములు మొదలైనవి ఇట్టివి ; 2 అంతర్జాతీయ సంస్థలు - ఇవి అన్ని రాజ్యములకు వ్యాప్తములై, అన్ని రాజ్యములకు సంబంధించిన వ్యవహారములను పరిశీలించునవి.

అంతర్జాతీయ సంస్థలలో అనేకములు ప్రభుత్వములచే స్థాపింపబడినవి - ఐక్యరాజ్యసమితి [చూ.], అంతర్జాతీయ తపాలా సంస్థ మొదలగునవి. ఇట్టివి సుమారు 100 సంస్థలు ఉన్నవి. మరికొన్ని వివిధ రాజ్యములలోని వర్తకులు, కార్మికులు మొదలైన సామాన్య ప్రజలు స్థాపించినవి. అంతర్జాతీయ వర్తక సంస్థ, అంతర్జాతీయ కార్మిక సంస్థ మొదలగునవి [చూ. సం. 5 - 350 - 368]. అందుచేత అంతర్జాతీయ సంస్థలను అధికార సంస్థలనియు, అనధికార సంస్థలనియు విభాగము చేయవచ్చును. ప్రభుత్వములచే స్థాపింపబడిన సంస్థలలో కొన్ని అనేక ప్రయోజనములను సాధించుటకై స్థాపింపబడినవి. ఐక్యరాజ్యసమితి ఇట్టిది. వీటికి సాధారణ సంస్థలు అని పేరు. ఏదో ఒక ప్రయోజనమును మాత్రము సాధించుటకు ఏర్పడిన ప్రత్యేక సంస్థలు - అంతర్జాతీయ ఆరోగ్యసంస్థ, ఆహార - వ్యవసాయ

సంస్థ, అంతర్జాతీయ విద్యా వైజ్ఞానిక సంస్థ మొదలగునవి [చూ. సం. 8 - పు. 186 ; సం. 10 -పు. 629].

ఈ క్రింది పట్టిక మూలమున పై వర్గీకరణము స్పష్టము కాగలదు :




ప్రభుత్వములచే స్థాపింపబడిన అంతర్జాతీయ సంస్థలు 19 వ శతాబ్దమునకు పూర్వము లేవనియే చెప్పవచ్చును. కాని, 19 వ శతాబ్దపు ప్రారంభమందుండి ఇట్టి సంస్థలు క్రమక్రమముగ వృద్ధిగాంచెను. దీనికి ప్రధాన కారణములు రెండు : 1. ప్రకృతిశాస్త్ర పరిజ్ఞానము వృద్ధిగాంచుటచేత ప్రయాణ సౌకర్యములు పెరిగి, దేశములు అన్నియు పరస్పరాశ్రయములు అయ్యెను. దేశముల మధ్య వర్తక వ్యాపారములు వృద్ధిపొందెను. ఏ దేశము కూడ స్వయంపోషకముగ ఉండలేని పరిస్థితులు ఏర్పడెను. ఈ విధముగ వృద్ధిగాంచుచుండిన పరస్పర సంబంధములకు అనుగుణమైన అంతర్జాతీయ సంస్థలను స్థాపించవలసిన అవసరము కలిగెను.

2. యుద్ధముల స్వభావము మారుట - అనాదిగ ప్రపంచములో యుద్ధములు జరుగుచుండినను, అదివరకు జరిగిన యుద్ధములు ఏవియు 19 వ శతాబ్దమునుండి జరిగిన యుద్ధములవలె సర్వనాశనకరములు కావు. 1914 - 18 లో జరిగిన ప్రపంచ యుద్ధము [చూ.] నందు 80 లక్షలకు పైగా సైనికులు మృతిచెందిరి. యుద్ధానంతరము క్షామము, వ్యాధియు ప్రపంచమునెల్ల ఆవరించినవి ; అనేక పట్టణములు, పల్లెలు నాశనమైనవి. ప్రపంచయుద్ధము - II లో [చూ.] హతులైన వారి సంఖ్య 220 లక్షలు. వికలాంగుల సంఖ్య 340 లక్షలు. విమానముల నుండి ప్రేలిన బాంబుల మూలమున సామాన్యజనులు కూడ లక్షలాదిగ హతులైరి. మితిమేరలు లేని ఆస్తికి నష్టము సంభవించెను. ఒక యూరప్ ఖండమునందే ఇట్టి నష్టము 1 లక్ష 50 వేల కోట్ల రూపాయలకు మించి ఉండెను. రాజ్యముల మధ్య సంభవించు వివాదములను యుద్ధసాధనమున గాక, శాంతియుతముగ పరిష్కరింపగల అంతర్జాతీయ సంస్థ ఒకటి అవసరమను అభిప్రాయము ఈ యుద్ధముల మూలమున రాజకీయవేత్తలు అనేకులలో నాటుకొనెను.

ఇందుకై 1815 నుండి అనేక ప్రయత్నములు జరిగెను. వీటి అన్నిటిలో ప్రపంచ యుద్ధము - I తర్వాత 1919 లో చేయబడిన ప్రయత్నము ప్రధానముగ పేర్కొనదగినది. దాని ఫలితముగ 'నానాజాతిసమితి' [చూ.] స్థాపింపబడెను. అంతర్జాతీయ సహకారమును పెంపొందించి, శాంతిభద్రతలను సాధించుటయే దీనియొక్క ఆశయము. కాని, ఈ ఆశయము సిద్ధించుటకు తగినట్లుగ ఇది నిర్మాణము కాని కారణమున దీని మూలమున గొప్ప ప్రయోజన మేదియు లభించలేదు.

ప్రపంచయుద్ధము - II జరుగుచుండిన కాలమున యునైటెడ్ స్టేట్స్, సోవియట్ రష్యా, బ్రిటన్ మొదలైన అగ్ర రాజ్యముల నాయకులు ఇట్టి ప్రయత్నమును ఇంకొకదానిని కావించి 1945 లో ఐక్యరాజ్యసమితి [చూ.] ని స్థాపించిరి. ఇప్పటి అంతర్జాతీయ సంస్థలలో ఐక్యరాజ్యసమితి అగ్రస్థానము వహించుచున్నది. మా. వెం. రం.

**అంతర్జాతీయ సైనికదళము :** చూ. ఐక్య రాజ్య సమితి.

**అంతస్సంగ్రామము :** ఒకే దేశములో రెండు రాజకీయాది పక్షముల మధ్య ఆధిపత్యము కొరకు జరుగు సంగ్రామమునకు అంతస్సంగ్రామము (సివిల్ వార్) అని పేరు. ఈ పక్షములు రాజకీయ, సాంఘిక, మత సంబంధ విద్వేషములలో దేనివల్లనైనను ఏర్పడవచ్చును. అంతస్సంగ్రామమునకును, విప్లవమునకును, ఉపప్లవమునకున్ను భేదము ఉన్నది.

అంతస్సంగ్రామమందు రెండు పక్షముల వారును ఇంచుమించు సమానబలము, సమానమైన పలుకుబడి గలవారు. ఏదో ఒక పక్షము పూర్తిగ విజయము పొంది ఆధిపత్యము వహించుట సంభవించును. బ్రిటన్‌లో రాజపక్షము వారికిని, పార్లమెంట్ పక్షము వారికిని (1642 - 49), యునైటెడ్ స్టేట్స్ ఉత్తర - దక్షిణమండలముల వారి మధ్యను (1861 - 65) జరిగిన సంగ్రామములును, లావోస్‌లో (1963) జరిగిన పోరాటమును అంతస్సంగ్రామములు.

విప్లవము : ప్రభుత్వమునుగాని, ప్రభుత్వ విధానమునుగాని పడగొట్టి పరిణామ రూపమున ప్రభవించిన సంఘటనకు 'విప్లవము (రివల్యూషన్)' [చూ.] అని పేరు. ఇందు యుద్ధములు, రక్తపాతములు జరుగవచ్చును ; జరుగక పోవచ్చును. ఉదా : 1. బ్రిటన్‌లో జరిగిన విప్లవము (1688) రక్తపాతము లేనిది ; 2 యునైటెడ్ స్టేట్స్‌లో జరిగిన విప్లవము (1775) రక్తపాతము అంతగా లేకుండ జరిగినదే

ఐనను బ్రిటన్‌తో సంగ్రామమునకు దారి తీసినది; 3. ఫ్రాన్సులో జరిగినది (1789) రక్తపాత సంయుతమై మహాసంగ్రామమునకు దారి తీసినది. ఇవి రాజకీయ కారణములవలన కలిగిన విప్లవములే. ఇట్టివే చీనా (1911 - 1949) లోను, సోవియట్ రష్యా (1917) లోను జరిగినవి.

ఉపప్లవము : దిగువ తరగతులవారు పైతరగతుల వారిపై చేయు తిరుగుబాటుకు 'ఉపప్లవము (ఇన్‌సరెక్షన్)' అని పేరు. ఐతే, ఆ ఎగువ తరగతుల వారు సంప్రదాయ సిద్ధముగనో, వ్యవస్థా సమ్మతముగనో అధికారము కలిగి ఉండవలెను. వారివలన కలుగు బాధ సహింపలేక దిగువ తరగతులవారు తిరుగుబాటు చేయునప్పుడే అది ఉపప్లవము అనబడును. అట్టి సమయములందు ప్రభుత్వము జోక్యము కలుగజేసికొని తిరుగుబాటును అణచివేయుట సాధారణముగ జరుగును; కాని, ఒక్కొక్కప్పుడు తిరుగుబాటుకు కారణములుగా ఉండిన బాధలు కొంతవరకైనను తగ్గించుటయు జరుగుచుండును. బ్రిటన్‌లో కర్షకుడైన వాట్‌టైలర్, అతని వర్గమువారు భూస్వాములపై చేసిన తిరుగుబాటు (1381) ఉపప్లవమునకు ఒక ఉదాహరణము. ప్ర. రా.

**అక్కడియన్ నాగరకత :** చూ. సమీక్ష - పు. 15.

**అక్కన్నమాదన్నలు :** దక్షిణ భారతదేశ చరిత్రయందలి కుతుబ్‌షాహీ పరిపాలనా యుగమున పేరెన్నిక గాంచిన రాజనీతిజ్ఞులు [చూ. సం. 3 - పు. 701]. చీ. శే. రా.

**అక్టోబరు విప్లవము :** 1917 లో సోవియట్ రష్యాయందు జరిగిన బోల్షివిక్ విప్లవమునకు ఇది ఒక పర్యాయ నామము. బోల్షివిక్‌ల నాయకత్వము క్రింద పెట్రోగ్రాడ్ (లెనిన్‌గ్రాడ్) నగరములోని సైనికులు, నావికులు, కార్మికులు 1917, నవంబరు 6 వ తేదీన ప్రధాన ప్రభుత్వ భవనములను ఆక్రమించుకొని అలెగ్జాండర్ కెరెన్‌స్కీ యొక్క తాత్కాలిక ప్రభుత్వమును కూలద్రోసిరి. సోవియట్ రష్యా యందు ఆ నాడు అమలునందుండిన కాల పరిగణనను అనుసరించి ఆ తేదీ అక్టోబరు 23 గ లెక్కింపబడుచుండెను. అందువలన ఆ విప్లవమునకు 'అక్టోబరు విప్లవము' అను పేరు కలిగినది. విప్లవానంతరమున ప్రభుత్వ భారమును వహించిన బోల్షివిక్ ప్రభుత్వము అమలునందున్న కాలపరిగణనను మార్చి, తక్కిన ప్రపంచమున అమలునందున్న పరిగణన విధానమునే అనుసరించి విప్లవ జయంతిని ప్రతి సంవత్సరము నవంబరు 6 న జరుపుచున్నను, 'అక్టోబరు విప్లవము' అను పేరు మాత్రము యథాతథముగ నిలిచి ఉన్నది. ప్ర. రా.

**అక్బర్ చక్రవర్తి (1542-1605) :** భారతదేశమును ఏలిన మొగల్ చక్రవర్తులలో మూడవవాడు; హుమాయూన్ కుమారుడు. విశాల సామ్రాజ్యమును ఆర్జించి సుస్థిర మొనర్చుటయే గాక, హిందూ - ముస్లిమ్ సమైక్యము కొరకై నిరంతర కృషి చేసిన రాజకీయ చతురుడు. భారత దేశమందు మాత్రమే కాక ప్రపంచ మందలి ప్రభువులలోనే అగ్రగణ్యులుగ పరిగణింపదగిన వారిలో అక్బర్ ఒకడనుట నిర్వివాదాంశము.


అక్బర్ చక్రవర్తి

తన తండ్రి మరణానంతరము 1556 లో ప్రభువుగ ప్రకటింపబడు నాటికి అక్బర్ పదునాలుగేండ్ల ప్రాయము గలవాడు; వయస్సు చిన్నది; కాని, ఎదుర్కొనిన రాజకీయ సమస్యలు పెద్దవి. నామమాత్రముగ చేకూరిన రాజ్యాధికారము యథార్థముగ కూడ తనకు లభ్యపడునట్లు అతడు యత్నింపవలసి వచ్చెను.

మొదట రాజధానీ నగరమగు ఢిల్లీని వశపరచుకొనుటకు అక్బర్ నిశ్చయించెను. ఆ సమయమున ఢిల్లీ పట్టణమును ఆఫ్ఘన్ సేనానాయకుడగు హేమూ ఆక్రమించి ఉండెను. అందువలన అక్బర్ తన శ్రేయోభిలాషియు, సలహాదారును అగు బైరాంఖాన్ సహాయముతో ఢిల్లీకి సైన్యమును నడపెను. పానిపట్ వద్ద 1556 లో మొగల్-ఆఫ్ఘన్ సేనల మధ్య మహాసంగ్రామము జరిగినది. ఇందు మొగల్ ప్రభువు అక్బర్ ఆఫ్ఘన్‌లను ఓడించి ఢిల్లీని ఆక్రమించెను.

తదనంతరము అక్బర్ తన సలహాదారగు బైరాంఖాన్ అధీనత నుండి తప్పించుకొని, స్వతంత్రుడై, రాజపుత్రులపై దృష్టి మరల్చెను. అంబర్ రాజ్య పాలకులగు బీహారీమల్, అతని తనయుడు భగవాన్‌దాస్, మనుమడు మాన్‌సింగ్ అను రాజపుత్రవీరులు తమంత తామే అక్బర్‌కు లోబడి అనుచరులైరి. కాని, గోండ్వానా రాష్ట్రమును ఏలిన రాణీదుర్గావతి శక్తివంచన లేకుండ పోరి మరణించెను. ఇంతకన్నను రాణాప్రతాప్‌సింహుని రాజ్యమగు మేవార్‌న ప్రజలు మొగల్ చక్రవర్తి తమ ప్రధాన నగరమగు చిత్తోడ్‌ను ముట్టడించినపుడు కనబర్చిన స్వాతంత్ర్యపిపాస, సమర కౌశలము అద్భుతమైనవి. చిత్తోడ్ పతనమైన తరు

వాత అక్బర్ త్వరితముగ రణతంభోర్, బికనీర్, జైసా ల్మర్ మొదలగు ప్రాంతములను తన అధీనము చేసికొనెను. బుందేల్ రాజపుత్రులతో మైత్రి జరిగిన తరువాత, రాజపుత్ర పాలకులు (మేవార్ వీరుడగు రాణా ప్రతాప్ సింహుడు తప్ప తక్కినవారు) అందరును అక్బర్ యొక్క సార్వ భౌమత్వమునకు అంగీకరించినట్లాయెను. గుజరాత్ (1572 - 73), బెంగాల్ (1575), ఒరిస్సా (1592) రాష్ట్ర ములు మొగల్ సామ్రాజ్యమున చేరినందున పడమట అరే బియా సముద్రము మొదలు తూర్పున బంగాళాఖాతము వరకును ఈ సామ్రాజ్యము విస్తరింప గలిగెను.

అంతట వాయవ్య భారత దేశముపై దండెత్తి (1585 - 95 మధ్య) క్రమముగ కాబూల్, కాందహార్, కాశ్మీర్, సింధు, బెలూచిస్తాన్‌లను అక్బర్ తన సామ్రాజ్యమున కలుపుకొనుట జరిగినది.

ఇక మిగిలినది వింధ్యకు దక్షిణమున ఉన్న భూభాగము మాత్రమే. అయితే, దక్షిణ దేశముపై మొగల్ సేనల యొక్క ప్రథమప్రయత్నము ఫలవంతము కాలేదు. తుదకు 1599 లో అక్బర్ చక్రవర్తి స్వయముగ దక్కన్‌కు వచ్చి అసీర్‌గడ్, బర్హాన్‌పూర్ మొదలగు ప్రదేశములను నేర్పుతో సాధించి ఖాన్‌దేశ్, అహ్మద్‌నగర్, బేరార్ రాజ్యములను తన అధీనమందు ఉంచుకొనెను.

ఈ సువిశాల సామ్రాజ్యమును అక్బర్ తన బుద్ధి చాతుర్యము విశదమగునట్లు పాలించెను. పాలనా-నిర్వ హణ కార్యమునందు ఈ ప్రభువునకు షేర్షా [చూ.] మొద లగు పూర్వ పాలకుల సంప్రదాయములు కొంతవరకు తోడ్పడినవి. పాలనా సౌకర్యము కొరకు తన సామ్రాజ్య మును అక్బర్ సుబాలు, సర్కారులు, పరగణాలుగ భాగించి, ఒక్కొక్క భాగమును ఒక్కొక్క తరగతికి చెందిన ప్రాంత పాలకుల అధీనమందు ఉంచెను. గ్రామము అన్నిటికన్న చిన్న భాగము. అక్బర్ కాలమున 18 సుబాలు కలవు. సుబాపాలనా పద్ధతి సాధారణముగ సార్వభౌముడు ఏర్పరచిన పద్ధతిని సాగుచుండెడిది. గ్రామ ములందు చాలవరకు పూర్వపు గ్రామ స్వపరిపాలనయే సాగినది. పెద్ద పట్టణములందు కొత్వాలున్ను, పల్లె ప్రాంతములందు ఫౌజుదారున్ను శాంతి, రక్షణ కార్య ములను చేయుచుండిరి. ముఫ్తీలను న్యాయవాదుల సాయ ముతో కాజీలనబడు న్యాయమూర్తులచే న్యాయ నిర్వ హణ కొనసాగింప బడుచుండెను. కొన్ని సమయము లందు చక్రవర్తి స్వయముగ విచారించి తీర్పుచెప్పుట కూడ జరుగుచుండెను. అక్బర్ ప్రభుత్వమందు సైనికో ద్యోగ, సామాన్యోద్యోగముల మధ్య భేదము లేదు. ప్రభుత్వోద్యోగులు అందరికి మన్‌సబ్దారులు అని పేరు. ఈ మన్‌సబ్దారీ పద్ధతిని అనుసరించి ఉద్యోగులు వేర్వేరు తరగతులుగ ఏర్పడి ఉండిరి. వీరు యుద్ధకాలమునందు నిర్ణీతమగు సైనిక బలమును చేకూర్చుచు, సామాన్య సమ యములందు ప్రభుత్వ కార్యములను నిర్వహించుచు చక్ర వర్తికి తోడ్పడుచుండిరి. ఇందుకు వారు ప్రభువు నిర్ణ యించిన జీతములను తీసికొనెడివారు. అక్బర్ సైన్యము చాల వరకు మన్‌సబ్దారీ బలగము మీదనే ఆధారపడ ఉండెను. అదికాక చతురంగ బల సమేతమగు సైన్య మును కూడ అతడు పోషించెను.

అక్బర్ భూమి శిస్తు విధానమును సంస్కరించెను. భూమి యొక్క విస్తీర్ణము, సారము, పంటలను బట్టి న్యాయ సమ్మతముగ భూమిశిస్తు నిర్ణయింపబడి వసూలు చేయబడుచుండుట జరిగినది. ఇట్లుండుటవలన ఇది దేశీయ, విదేశీయ చరిత్రకారుల ప్రశంసను పొందినది. దేశీయులును, అధిక సంఖ్యాకులును అగు హిందూ ప్రజల యెడ (ముఖ్యముగ రాజపుత్రుల యెడ) ఈ చక్రవర్తి అవలంబించిన పద్ధతి ఈతనికి గల ఐక్య నిర్మాణ శక్తికిని, సాత్త్విక స్వభావమునకును ఒక ప్రబల నిదర్శనము. హిందువులకు అవమానకరములైన జిజియా మొదలగు పన్నులను తీసివేసియు, వారిలో సమర్థులగు వారికి ఉచిత మైన, ఉన్నతమైన ఉద్యోగములను ఇచ్చియు హిందూమతా వలంబకులగు రాజపుత్ర వీరులను సైన్యాధ్యక్షులను చేసియు, రాజపుత్ర కన్యలను వివాహమాడియు తనకును, తన ప్రజానీకమునకును మధ్య మతవైషమ్యము లేకుండ ఇతడు చేసెను.

జాతియైక్యమును సాధింపవలెనను ఇతని ఆసక్తి రాజ కీయములకే సంకుచితమై ఉండిపోక, మత విషయములకు కూడ వ్యాపించినది. 1575 ప్రాంతమున ఫతేపూర్‌సిక్రీ నగరమందు ఇబాదత్‌ఖానా అను ప్రార్థన మందిరమును నిర్మింపజేసి, అచటికి ఇస్లామ్, హిందూ, జైన, క్రైస్తవ, పారసీక మతగురువులను రప్పించి, వారి మత ప్రసంగము లను, వాదోపవాదములను విని, మతములు భిన్నరూపమున ఉన్నను, ఒకే సత్యమును తెలుపుటకు యత్నించు వివిధ మార్గములని అక్బర్ గ్రహించి, చివరకు 1582 న సర్వ మతసార సమ్మిళితమైన 'దీన్ ఇలాహీ' అను నూతన మతమును ప్రవచించెను. కాని, అక్బర్‌కు అతి సన్ని హితులగు ఏ కొలది మంది మాత్రమో దానిని ఆదరించిరి; కడకది ఆ సార్వభౌముని తోడనే అంతరించెను.

రాజనీతి చతురుడుగను, పాలకుడుగను మాత్రమే కాక సాహిత్య, లలితకళా పోషకుడుగ సైతము అక్బర్ ప్రసిద్ధిని

పొందెను. తాను చదువుకొనని వాడయ్యును, అబుల్ ఫజల్, బదానీ, బీర్బల్, ఫైజీ మొదలగు కవి, పండిత, ఐతిహాసికులను తన ఆస్థానమున ఇతడు పోషించెను. ఆనాడు పారసీక సారస్వతము ప్రథమ స్థానము ఆక్రమించుట నిజమే అయినను, హిందీకి కూడ ఆదరణ లభించినది. ప్రసిద్ధ హిందీ కవులు తులసీదాస్, సూర్ దాస్ అక్బర్ కు సమకాలికులై అతని రాజ్యమున వసించిరి. ఆ సార్వభౌముని లలితకళా సక్తికి ఫతేపూర్ సిక్రీ యందలి భవనములు శాశ్వత నిదర్శనములు. హిందుస్థానీ సంగీత సంప్రదాయమునకు మేలుబంతి నిడిన తాన్ సేన్ అక్బర్ ఆస్థాన గాయకుడు.

అక్బర్ శక్తియుక్తులు గల వ్యక్తి. సామ్రాజ్య సముపార్జనమందే కాక, దానిని సుస్థిరమొనర్చుటయందు కూడ అసమాన సామర్థ్యమును అతడు ప్రదర్శించెను. ప్రజలను ఇంతగ ప్రేమించిన ప్రభువుగాని, పాలితుల అనురాగమును ఇంతగ అనుభవించిన పాలకుడుగాని భారతదేశ చరిత్ర యందలి మహమ్మదీయ పాలనా యుగమున అక్బర్ తప్ప మరెవ్వరును కానరారు. [చూ. అక్బర్ నామా ; భారత దేశము].

ఓ. ఎస్. ఎన్. మూర్తి.

**అక్బర్ నామా :** మొగల్ వంశీయుడగు అక్బర్ చక్రవర్తి [చూ.] వంశమును, రాజ్యపరిపాలనా విధానమును అభివర్ణించు పారసీక గ్రంథము. అక్బర్ ఆస్థాన విద్వాంసుడగు అబుల్ ఫజల్ వ్రాసినది. ఇందు ప్రధాన భాగములు మూడు : మొదటి భాగమునందు తైమూర్ వంశ వివరణము; రెండవ భాగమునందు అక్బర్ జీవితచరిత్ర; మూడవ భాగమునందు అక్బర్ రాజ్యపరిపాలనా చరిత్ర వివరింపబడి ఉన్నది. మొగల్ కాలపు భారతదేశ చరిత్ర రచనకు ఈ గ్రంథము ప్రముఖాధారము.

చీ. శే. రా.

**అగస్టస్, గయస్ జూలియస్ సీజర్ అక్టేవియస్** (క్రీ. పూ. 63 - క్రీ. శ. 14): మొదటి రోమన్ చక్రవర్తి; 'అగస్టస్' అనునది ఇతని బిరుదము; అక్టేవియస్ అనునది నిజనామము. రోమన్ సామ్రాజ్యమును సువిస్తృత మొనర్చిన జూలియస్ సీజర్ [చూ.] కు ఇతడు మేనగోడలు కుమారుడు. తనకు కుమారులు లేకపోవుటచే జూలియస్ సీజర్ అక్టేవియస్‌ను దత్తపుత్రుడుగ గ్రహించెను. బ్రూటస్ మొదలగు రోమన్ శాసన సభ్యులు కుట్రపన్ని జూలియస్ సీజర్‌ను హత్యగావించిన తరువాత ఏర్పడిన సందిగ్ధావస్థలో జూలియస్ సీజర్ స్థానమును ఆక్రమించుటకు జూలియస్ సీజర్ అనుచరులగు లెపిడస్, ఆంటోనీ గట్టి ప్రయత్నములు చేసిరి. కాని, ప్రజలలో అక్టేవియస్‌కు పలుకుబడి ఉండుట గమనించి అతనితో వారిరువురును సంధి చేసికొనిరి. వీరు ముప్పురును ఏకమై పాలకత్రయ ప్రభుత్వము (ట్రయంవరేట్) ను ఏర్పరచి, బ్రూటస్ మొదలగు కుట్రదారులను నిర్మూలించిరి. అంతట ఈ నాయకులు ముప్పురును రోమన్ సామ్రాజ్యము [చూ.] ను పంచుకొనిరి. కాని, అనతి కాలముననే తన నేర్పువలన లెపిడస్, ఆంటోనీ అను వారలను పదభ్రష్టులనుచేసి, రోమన్ సామ్రాజ్యమునకు అక్టేవియస్ ఏకైక ప్రభువయ్యెను. అతని ప్రతిభకు మెచ్చి రోమన్ శాసనసభ అతనికి సేనాధిపత్యముతో సహా సామ్రాజ్యాధికారములను అన్నిటిని కల్పించి, ఇతనికి 'అగస్టస్' అను బిరుదము ఒసగినది. అగస్టస్ సీజర్ రోమన్ సామ్రాజ్యమునకు మొదటి చక్రవర్తి అయ్యెను.

క్రీ. పూ. 27 నుండి క్రీ. శ. 14 వరకు ఇతడు సామ్రాజ్యమును పాలించెను. రోమన్‌లలో వ్యాపించిన దుర్వ్యసనములు, దాంభిక జీవనము, నాస్తికత్వము మొదలగు దుర్గుణముల నిర్మూలించుటకును, రోమన్ రాష్ట్రములకు ఆంతరంగిక స్వపరిపాలన సమకూర్చుటకును ఈ చక్రవర్తి తన జీవిత కాలమును వినియోగించెను. గ్రంథాలయముల నిర్మించి, గ్రీక్ విజ్ఞానమును రోమన్ ప్రజలకు అందించుటకు ఇతడు కృషిచేసెను. మహాకవులైన వర్జిల్, హోరేస్, చరిత్రకారుడు లివీ ఇతని సమకాలికులు. రోమన్ చరిత్రలో ఇతని పరిపాలనకాలము స్వర్ణయుగముగ పేరు గాంచినది.

ఇతడు క్రీ. శ. 14, ఆగస్టు 19 తేదీన మరణించెను. ఇతని జీవితకాలపు ప్రముఖ సంఘటనలలో పెక్కు ఆగస్టు మాసముతో ముడివడి ఉన్నవి. కనుకనే 'సెక్స్టాలిస్' అని పూర్వము వ్యవహరింపబడెడి ఆ మాసమునకు ఈ చక్రవర్తి తనపేర 'అగస్టు' అను పేరిడెను.

ప్ర. రా.

**అగ్నిమిత్రుడు** (క్రీ. పూ. 148 - 140 ప.): ప్రాచీన భారతదేశమునందలి మగధరాజ్యమును పాలించిన శుంగవంశపు రాజులలో రెండవవాడు; పుష్యమిత్రుని కొడుకు. కాళిదాసు రచించిన 'మాళవికాగ్నిమిత్రము' అను నాటకమందలి కథానాయకుడు. యువరాజుగ ఉన్నపుడు నర్మదానది వరకును వ్యాపించి ఉండిన దక్షిణ రాజ్యభాగమునకు రాజప్రతినిధి. విదర్భరాజును ఓడించి తన ఆజ్ఞకు బద్ధునిగ చేసికొనెను. ఇతని రాగి నాణెములు కొన్ని రోహిల్ ఖండ్‌లో దొరికినవి. ఇతని పట్టపురాణి ధారిణీదేవి; వసుమిత్రుడు, సుజ్యేష్ఠుడు ఇతని కుమారులు.

ప్ర. రా.

**అగ్రరాజ్యములు :** చారిత్రక ప్రసిద్ధివల్లను, రాజకీయ, ఆర్థిక బలమువల్లను, సైనిక మహత్త్వము వల్లను ప్రపంచములో మిక్కిలి పలుకుబడిగలవని ప్రసిద్ధములైన

రాజ్యములను అగ్రరాజ్యములు అనుచున్నారు. ప్రపంచ యుద్ధములు I & II మధ్యకాలము (1919 - 39) లో ఫ్రాన్స్, జర్మనీ, బ్రిటన్, ఇటలీ, జపాన్, యునైటెడ్ స్టేట్స్, సోవియట్ రష్యా అగ్రరాజ్యములుగ ప్రసిద్ధములైనవి. కాని, ప్రపంచయుద్ధము - II (1939 - 45) తరువాత ఈ వ్యవస్థయంతయు మారిపోయినది.

ఈనాడు బ్రిటన్, ఫ్రాన్స్, సోవియట్ రష్యా, యునైటెడ్ స్టేట్స్ అగ్రరాజ్యములుగ లెక్కింపబడుచున్నవి. కాని, రాజకీయ, ఆర్థిక, సైనిక బలసంపత్తులను అనుసరించి చూడ సోవియట్ రష్యా, యునైటెడ్ స్టేట్స్ మాత్రమే యథార్థముగ అట్టి పేరుకు తగియున్నవని చెప్ప వచ్చును. ప్ర. రా.

**అచ్యుత దేవరాయలు** (1530 - 1542 ప.) : విజయనగర సామ్రాజ్య ప్రభువు [చూ. సం. 3 - పు. 394].

**అజంటా విహారములు** : భారతదేశమున మహారాష్ట్రములో వింధ్యపర్వతముల నుండి చీలిన ఒక పర్వత శ్రేణియందు అర్ధచంద్రాకారముగ వ్యాపించి ఉన్న 76 మీటరుల ఎత్తుగల ఒక చరియలో నిర్మింపబడిన 28 గుహాలు. ఈ గుహాలలోని కుడ్యచిత్రములు బౌద్ధసంప్రదాయమునకు చెంది, ప్రాచీన భారత చిత్రకళా ప్రాభవమును వేనోళ్ల చాటుచు ఖండఖండాంతరముల నుండి విహార యాత్రికులను ఆకర్షించుచున్నవి. 1819 లో యూరపియన్ సైనికులు ఈ గుహాల ఉనికిని కనిపెట్టిరి. ఈ గుహాల నిర్మాణము క్రీస్తుశకము మొదటి శతాబ్దియందు ఆరంభమై 8 వ శతాబ్దివరకు సాగినట్లు తెలియుచున్నది. [చూ. సం. 3 - పు. 704]. ప్ర. రా.

**అజాద్ హింద్ ఫౌజ్** : చూ. సుభాస్ చంద్రబోస్.

**అట్లాంటిక్ చార్టర్** : యునైటెడ్ స్టేట్స్ అధ్యక్షుడు ఫ్రాంక్లిన్ రూజ్‌వెల్ట్ [చూ.], బ్రిటిష్ ప్రధాని విన్‌స్టన్ చర్చిల్ [చూ.] 1941, ఆగస్టు 9 మొదలు 12 వరకు ఉత్తర అట్లాంటిక్ మహాసముద్రములో ఒక నౌకపై సమావేశమై ఈ ప్రణాళికను రూపొందించిరి. అంతట ఆగస్టు 14 న ఈ ప్రణాళికను యునైటెడ్ స్టేట్స్ అధ్యక్షుడు తన నెలవగు వైట్‌హౌస్ నుండి ప్రకటించెను. ఇందు గల అంశములు :

1. ప్రాభవ, ప్రాబల్యముల కొరకు ఏ దేశమున్ను యత్నింప రాదు ;
2. ఏ ప్రాంతములోను అచ్చటి ప్రజల అభీష్టమునకు విరుద్ధముగ యాజమాన్యమందు మార్పు తీసికొని రాకూడదు ;
3. ప్రతి జాతికిని తనకు ఇష్టమైన ప్రభుత్వమును తాను ఎంచుకొనుటకు హక్కు గలదు ;
4. ముడిపదార్థములు అన్ని దేశములకును సమానముగ అందుబాటులో ఉండవలెను ;
5. ప్రపంచ ఆర్థిక, సాంఘికాభివృద్ధి నిమిత్తము ప్రపంచ రాజ్యముల మధ్య అన్యోన్య సహకారము ఆవశ్యకము.
6. ప్రపంచ మానవు లందరికిని దారిద్ర్యము నుండియు, భయము నుండియు విముక్తి చేకూర్పగల సుస్థిరమగు శాంతిని నెలకొల్పవలెను ;
7. సముద్రములపై అన్ని దేశములకును సమానమగు అధికారము ఉండవలెను ;
8. దౌర్జన్య ప్రయోగ విధానములను పరిత్యజించి, తమ తమ ఆయుధ సంచయములను అన్ని దేశములును తగ్గించుకొనవలెను. ప్ర. రా.

**అట్లీ, క్లెమెంట్ రిఛర్డ్** (జననము 1883) : ఆంగ్ల రాజనీతివేత్త ; ఒకపుడు ప్రధాన మంత్రి ; ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీలో విద్యాభ్యాసము. 1905 లో న్యాయవాదిగా వృత్తి ప్రారంభించి, తరువాత రాజకీయములలో ప్రవేశించెను. వెబ్ దంపతుల (బియాట్రిస్, సిడ్నీ వెబ్) ప్రభావ బలమున సోషలిస్టు భావములు బాగుగా పాతుకు పోయినందువలన 1907 లో ఫేబియన్ సొసైటీలో సభ్యత్వమును గ్రహించి, ఆ తరువాత అచిరకాలంలోనే కార్మికపక్షములో చేరెను. లండను స్కూల్ ఆవ్ ఎకనామిక్స్‌లో సాంఘికశాస్త్ర అధ్యాపకుడుగా కొంతకాలము పని చేసెను. ప్రపంచ యుద్ధము - I లో పాల్గొని తిరిగి వచ్చిన తరువాత స్టెప్నీ నగరమునకు మొదటి కార్మిక పక్ష మేయర్‌గా ఎన్నిక అయ్యెను. 1922 లో పార్లమెంట్ సభ్యుడుగా ఎన్నిక అయ్యెను. సైమన్ కమీషన్ సభ్యుడుగా భారత దేశములో పర్యటన చేసెను. అప్పుడే భారతీయులకు స్వపరిపాలన ఇవ్వవలననే భావము ఆయనకు కలిగినది. 1931 లో బ్రిటిష్ కార్మిక పక్షము మిశ్రమ ప్రభుత్వములో చేరవలయునా లేదా అను అంశముపై తర్జన భర్జనలు చెలరేగినవి. మిశ్రమ ప్రభుత్వములో ప్రవేశించే విషయములో రామ్సే మాక్డొనాల్డ్‌ను అనుసరించడానికి అట్లీ అంగీకరించలేదు. 1935 లో అట్లీ కార్మికపక్ష నాయకత్వమును చేపట్టెను. ఆ హోదాలోనే ఆయన కన్సర్వేటివ్



క్లెమెంట్ రిఛర్డ్ అట్లీ

పక్షపు విదేశాంగ విధానమును పార్లమెంట్‌లో నిశితంగా విమర్శించెను. ప్రపంచ యుద్ధము - II ప్రారంభమైన తరువాత కన్సర్వేటివ్ పక్ష నాయకుడు విన్‌స్టన్ చర్చిల్ 1940 లో ఏర్పాటుచేసిన మిశ్రమ ప్రభుత్వములో అట్లీ చేరెను. 1945 లో జరిగిన సాధారణ ఎన్నికలలో కార్మిక పక్షము విజయము సాధించుటతో అట్లీ ప్రధానమంత్రి కాగలిగెను. అట్లీ ప్రధాన మంత్రిత్వ కాలములో జరిగిన ప్రధాన చారిత్రాత్మక సంఘటన భారతదేశమునకు స్వాతంత్ర్య ప్రదానము. అయితే, అందులకు ముందుగ మత ప్రాతిపదికపై భారత ఉపఖండమును భారత్ - పాకిస్తాన్ అను రెండు భాగములుగా విభజించటము జరిగినది. అట్లీ హయాములోనే బర్మా, సిలోన్, పాలస్తీనా (ఇజ్రాయెల్) దేశములకు కూడ స్వాతంత్ర్య ప్రదానము జరిగినది. నూతన రీతిలో కామన్‌వెల్త్ [చూ.] నిర్మాణము కూడ ఈ కాలములోనే జరిగినది. 1951 లో జరిగిన ఎన్నికలలో కన్సర్వేటివ్ పార్టీ అధికారములోకి రావటముతో 1955 వరకూ అట్లీ ప్రతిపక్ష నాయకులుగా వ్యవహరించెను. ఆ తరువాత ఆయనకు 'ఎరల్' బిరుదు లభించెను. అట్లీ 1954 లో 'యాజ్ ఇట్ హాపెన్డ్' అనే గ్రంథమును, 1962 లో 'ట్విలైట్ అఫ్ ఎంపైర్' అనే గ్రంథమును రచించెను.

పి. ఆర్. పి.

**అధిక సంఖ్యాక ప్రభుత్వము** : చూ. అధిక సంఖ్యాక సూత్రము.

**అధిక సంఖ్యాక సూత్రము** : అనేకమంది సభ్యులతో కూడిన శాసన సభలు, మంత్రులసభలు, న్యాయస్థానములు మొదలైన రాజకీయ సభలలో అధిక సంఖ్యాక సభ్యుల అభిప్రాయానుసారము తుది నిర్ణయము చేయు పద్ధతికి అధిక సంఖ్యాక సూత్రమని పేరు. నిర్ణయమునకు పూర్వము జరుగు చర్చలో పాల్గొనుటకు సభ్యులందరికి సమాన హక్కు కలదు. ఆ అంశముపై ఎవనికి తోచినట్లు వారు వోటు చేయవచ్చును; వోటు చేయక తటస్థముగ ఉండవచ్చును. కాని, తుది నిర్ణయము మాత్రము వోటు చేసిన వారిలో అధిక సంఖ్యాకుల అభిప్రాయానుసారము చేయబడును. నిర్ణయమునకు విరుద్ధముగ వోటుచేసిన వారు కూడ దానికి బద్ధులగుదురు. ప్రజలలో దానికి ప్రతికూలురుగ ఉండువారు కూడ ఆ నిర్ణయమునకు - అది శాసనము కావచ్చును, చెల్లించవలసిన పన్ను కావచ్చును, న్యాయస్థానపు తీర్పు కావచ్చును - బద్ధులై ప్రవర్తించవలెను.

అధికసంఖ్యాక సూత్రము అన్ని దేశములలో సంప్రదాయమగుటకు ఒక ప్రధాన కారణము ఏకగ్రీవామోద సూత్రము ఆచరణయోగ్యము కాకపోవుట. కొన్ని దేశములలో కొన్ని కాలములందు కొన్ని సభలలో ఏకగ్రీవామోదము లేక ఏ నిర్ణయము కూడ చేయుటకు వీలు లేకుండెను. దీని ఫలితముగ పరిపాలనములో తరుచుగ ప్రతిష్టంభన ఏర్పడి ఎంతటి అవసరమైన పనులను కూడ చేయుట సాధ్యము కాకపోవుచుండెను. సభలో ఒక సభ్యుడు ప్రతికూలుడుగ ఉండినను, తక్కిన సభ్యుల అభిప్రాయములకు ఏలాటి విలువ లేకుండెను. ఇట్టి ప్రమాద పరిస్థితి ఏర్పడకుండుటకు అధిక సంఖ్యాక సూత్రమే ఉత్తమ సాధనమని అనుభవము ద్వారా అన్ని దేశముల వారు గ్రహించిరి.

ఈ సూత్రము వలన అల్పసంఖ్యాకుల హక్కులకు భంగము కలుగుచున్నదని వాదించు వారు లేకపోలేదు. కాని, ఇది సహేతుకమైన వాదము కాదు. రాజకీయ విషయములలో చేయబడు నిర్ణయములు శిలాశాసనముల వలె శాశ్వతములైనవి కావు. పరిస్థితులు, ప్రజాభిప్రాయము మారినప్పుడు వాటిని సవరించుకొనవచ్చును; రద్దుచేయవచ్చును. నిర్ణయములకు విముఖులుగ ఉండు సభ్యులు ప్రజలలో ప్రచారము కావించి వారి అభిప్రాయములను మార్చుటకు పూర్తి అవకాశము ఉన్నది. ఈ అవకాశమును వారు వినియోగించు కొనవచ్చును. ఇట్టి అవకాశము ఉండునంత వరకు ఎవరి హక్కులకు ఎట్టి భంగములేదని చెప్పవలెను. ఏకగ్రీవామోద సూత్రము ఆచరణ యోగ్యము కానిసమయమున అధిక సంఖ్యాక సూత్రమును అనుసరించుట కంటె గత్యంతరము లేదు.

నిర్ణయించవలసిన విషయముల ప్రాధాన్యమును బట్టి 'సామాన్య అధిక సంఖ్య', 'ప్రత్యేక అధిక సంఖ్య' అను భేదము అనేక రాజ్యాంగములలో కల్పింపబడి ఉన్నది. సామాన్య శాసనములు, పన్నులు, ఇతర సామాన్య విషయములను శాసన సభలలో నిర్ణయించవలసి వచ్చినప్పుడు సభలో హాజరై వోటుచేయు వారిలో అధిక సంఖ్యాకుల అభిప్రాయానుసారము నిర్ణయము జరుగును. ఈ సంఖ్య సభలోని మొత్తపు సభ్యులలో అధిక సంఖ్య కాకపోవచ్చును; ఇది సామాన్య అధిక సంఖ్య. కాని, రాజ్యాంగ మూలసూత్రములను సవరించవలసి వచ్చినప్పుడు సభ్యులలో మూడింట రెండువంతుల అధిక సంఖ్యాకుల ఆమోదము ఉండవలెను; ఇది ప్రత్యేక అధిక సంఖ్య. ఇట్టి నియమముల వలన అల్పసంఖ్యాకుల అభిప్రాయమునకు మరింత విలువ కలుగు అవకాశము లభించుచున్నది.

మా. వెం. రం.

**అధికార విభజనము :** ఇది రాజనీతి శాస్త్రమందలి ఒక ముఖ్య సిద్ధాంతము. ఈ సిద్ధాంతమును 18 వ శతాబ్దమున ఫ్రాన్సుదేశపు రాజకీయవేత్త అగు మాంటెస్క్యూ [చూ.] ప్రవచించెను.

అధికార విభజన మూలసూత్రములు రెండు : మొదటి దానివలన రాజ్యాధికారము అంతయు 1. శాసన నిర్మాణము ; 2. కార్య నిర్వహణము ; 3. న్యాయ నిర్ణయము అను మూడు వేర్వేరు అధికారములుగా విభజితమైనది ; రెండవ దానివలన ఈ అధికారములను వేర్వేరు వ్యక్తులు నిర్వహించవలయునని విధింపబడినది. అనగా శాసనములు చేయువారు కార్య నిర్వాహకులుగ ఉండుట, కార్య నిర్వాహకులు న్యాయ నిర్ణయము చేయుట అనునవి అధికార విభజన సూత్రమునకు విరుద్ధములు. ఈ విధముగ రాజ్య పరిపాలన జరిగినప్పుడే మానవుని వ్యక్తి స్వాతంత్ర్యము రక్షింపబడునని మాంటెస్క్యూ అభిప్రాయపడెను.

ఆనాడు బ్రిటన్‌లో రాజ్యాధికారము పై రీతిగ విభజింపబడి ఉండెననియు, తత్కారణముననే బ్రిటిష్ ప్రజలు వ్యక్తి స్వాతంత్ర్యమును అనుభవింప గలుగుచున్నారనియు మాంటెస్క్యూ ఊహించెను. ఫ్రాన్సుదేశమునందు శాసన నిర్మాణము చేయువారును, కార్యనిర్వహణము చేయువారును ఒకరే (రాజు) ఐనందు వలనను, ఒక్కొక్క సమయమునందు రాజే న్యాయనిర్ణయము చేయుచుండుట వలనను ఫ్రాన్సుదేశములో వ్యక్తిస్వాతంత్ర్యము లేకుండెనని అతడు తన అభిప్రాయమును తెలిపెను.

శాసన నిర్మాణాధికారము, కార్య నిర్వహణాధికారము, న్యాయ నిర్ణయాధికారము అను మూడు అధికారములను ఒకే సంస్థ నిర్వహించవలయుననిన అందులకు తగిన అసమాన శ్రద్ధ, ప్రావీణ్యము, స్వార్థ రాహిత్యము, నిష్పాక్షికత ఆ సంస్థ యందలి సభ్యులకు ఉండవలెను. అట్టి వారు ఉండుట దుర్లభము. కావున ఆ యా అధికారములకు తగిన ప్రత్యేకార్హతలు, ప్రత్యేక ప్రజ్ఞ కలవారిచే పై వివిధ సంస్థలు వేర్వేరుగ నిర్వహింపబడుట వాంఛనీయము. అట్టియెడ ఒక్క అధికార సంస్థ చేయు అధికార దుర్వినియోగమును తక్కినవి కొంతవరకు నిరోధింప గలిగి, పరస్పరము ఆధారపడి వర్తింప గలవు.

ఈ సిద్ధాంతమును అనుసరించి యునైటెడ్ స్టేట్స్ రాజ్యాంగము నిర్మింపబడినది. అధ్యక్ష ప్రభుత్వ [చూ.] విధానమును అనుసరించిన రాజ్యాంగములు అన్నియు దాదాపు అధికార విభజన సిద్ధాంతమునే అనుసరించుచున్నవి.

కాని, వ్యక్తి స్వాతంత్ర్యమును రక్షించుటకు ఈ సిద్ధాంతాచరణము అవసరము లేదని వివిధ దేశముల పరిపాలనా విధానములు వ్యక్తపరచుచున్నవి. బ్రిటన్‌లో ఇట్టి విధానము అమలునందు ఉన్నదని మాంటెస్క్యూ అనుకొనుటలో పొరబడెను. అచట శాసనసభయు కొంతవరకు మంత్రివర్గమునకు లోబడి ప్రవర్తించవలసి ఉన్నది. మంత్రివర్గము శాసన సభలో ఒక భాగమే ఐనను బ్రిటన్‌లో పౌరుల స్వాతంత్ర్యమునకు భంగము లేదు.

శాసన నిర్మాణాధికారమునకు, కార్య నిర్వహణాధికారమునకు పరస్పర సంబంధము లేకుండుటవల్ల కొంత ఘర్షణ ఏర్పడి, దేశ పరిపాలన కుంటుపడుటకు అవకాశము ఉన్నది [చూ. అధ్యక్ష ప్రభుత్వము]. అందువలన శాసన నిర్మాణాధికారము, కార్య నిర్వహణాధికారము గల సంస్థలు రెండును పరస్పర సౌహార్దముతో ప్రవర్తించు పరిపాలనయే ఉత్తమమని చెప్పవచ్చును.

కార్య నిర్వహణము, శాసన నిర్మాణాధికారము స్వతంత్రించి ఉన్నప్పుడు ప్రభుత్వము ప్రజలకు బాధ్యత వహించి పరిపాలన సాగించుట సులభ సాధ్యము కాదు. అట్టియెడ పరిపాలనలోని లోపములు అన్నిటికిని శాసన సభ కారణమని మంత్రివర్గమును, మంత్రివర్గమే కారణమని శాసన సభయు ఒకరినొకరు నిందించుకొనుచు బాధ్యతలనుండి తప్పించుకొనుటకు అవకాశము ఉన్నది. అందువలన ప్రజాభీష్టానుసారము పరిపాలన జరుగుట కష్టసాధ్యము అగును. కావుననే ప్రజాస్వామికములు అనేకములలో నేడు అధికార విభజన సూత్రానుసారము కాక, మంత్రివర్గము శాసన సభకు బాధ్యత గలిగి ప్రవర్తించునట్టి విధానము అమలునందు ఉన్నది. భారతదేశమునందు కూడ ఈ విధానమే అనుసరింప బడినది [చూ. భారత రాజ్యాంగము].

మా. వెం. రం.

**అధ్యక్ష ప్రభుత్వము :** ప్రజాస్వామ్య ప్రభుత్వములలో కొన్నిటిని బాధ్యతాయుత ప్రభుత్వములు అనియు, కొన్నిటిని అధ్యక్ష ప్రభుత్వములు అనియు విభాగము చేయవచ్చును. భారతదేశము, బ్రిటన్, కెనడా, ఆస్ట్రేలియా మొదలైనవి మొదటి రకములోనివి; వీటిలోని ప్రభుత్వములు బాధ్యతాయుతములు. యునైటెడ్ స్టేట్స్, దక్షిణ అమెరికా లోని రాజ్యములు అనేకములు రెండవ రకములోనివి ; వీటిలోని ప్రభుత్వములు అధ్యక్ష ప్రభుత్వములు.

ప్రభుత్వ శాఖలలో శాసనశాఖకు, కార్యవర్గ శాఖకు మధ్య ఉండు సంబంధములలోని భేదమువలన పై విభాగము ఏర్పడుచున్నది.

బాధ్యతాయుత ప్రభుత్వము గల దేశములలో కార్య వర్గశాఖ - అనగా మంత్రుల సభ - శాసన శాఖకు బాధ్యత కలదియై ప్రవర్తించును. శాసన శాఖకు విశ్వాస పాత్రులై అందులోని అధిక సంఖ్యాకుల ఆమోదమును పొందినవారే మంత్రులు అగుటయు, ఆమోదము ఉన్నంత వరకే వారు మంత్రి పదవులలో ఉండుటయు, దానిని కోల్పోయిన వెంటనే అధికారము నుండి తొలగి పోవుటయు ఈ బాధ్యతకు ప్రధాన చిహ్నము. మంత్రివర్గము అధికారములో ఉండుటను, ఉండక పోవుటను నిర్ణయించునది శాసనశాఖ అగుట చేత, ఈ విధానములో మంత్రులు శాసనశాఖకు లోబడినవారు అగుచున్నారు.

యునైటెడ్ స్టేట్స్ వంటి దేశములలోని అధ్యక్ష విధానము దీనికి భిన్నమైనది. ఈ విధానములో కార్యవర్గ శాఖాధికారము శాసనశాఖతో సంబంధము లేని అధ్యక్షుని వశమందు ఉండును. అధ్యక్షుని ప్రజలే ఎన్నుకొందురు. ఇతనికి ఒక నిర్ణీతమైన పదవీ కాలము - 4 లేదా 5 సంవత్సరములు ఉండును. ఈ కాలములో ఇతడు చేసెడి పనులు శాసనశాఖకు నచ్చినను, నచ్చకపోయినను ఇతనిని అధికారము నుండి తొలగించుటకు శాసనశాఖకు వీలులేదు. పరిపాలన విషయములలో ఇతనికి సలహాలను ఇచ్చు మంత్రులను ఇతడే నియమించును. వారు ఇతనికి బాధ్యులు గాని, శాసన శాఖకు బాధ్యులు కారు. ఇందుచేత ఇతని ప్రభుత్వము శాసన సభకు ఏలాటి బాధ్యత లేని ప్రభుత్వము. శాసన శాఖతో నిమిత్తములేక అధికారము లోనికి వచ్చుట, నిర్ణీత కాలము ముగియువరకు అధికారములో ఉండుట, స్వతంత్రముగ అధికారమును చలాయించుట అను లక్షణములు గల ఈ విధానమునకు 'అధ్యక్ష ప్రభుత్వ విధానము' అని పేరు.

భారతదేశము వంటి బాధ్యతాయుత ప్రభుత్వములో అధ్యక్షుని అధికారము నామమాత్రము. అధ్యక్ష ప్రభుత్వములో అతనిది వాస్తవమైన అధికారము. బాధ్యతాయుత ప్రభుత్వములో కార్యవర్గ శాఖలోని మంత్రులు పదే పదే మారవచ్చును. అధ్యక్ష ప్రభుత్వములో కార్యవర్గశాఖకు స్థిరత్వము ఉన్నది. బాధ్యతాయుత ప్రభుత్వములో కార్యవర్గము వారు శాసనసభపై నాయకత్వము వహించి దాని సహకారమును సంపాదింపగలవారు అగుదురు. అధ్యక్ష ప్రభుత్వ విధానములలో ఇట్టి సహకారము కష్టసాధ్యము. మా. వెం. రం.

**అధ్యక్షుడు :** చూ. భారత రాజ్యాంగము.

**అన్‌గోలా :** ఆఫ్రికా పశ్చిమతీరమందలి పోర్చుగల్ వలసరాజ్యము. అన్‌గోలాకు సరిహద్దులు : కాంగో (లియోపాల్డ్‌విల్లీ) ఉత్తర రొడీషియా, [తూ]; నైరృతి ఆఫ్రికా [ద]; దక్షిణ అట్లాంటిక్ మహాసముద్రము [ప]; కాంగో (లియోపాల్డ్‌విల్లీ) [ఉ]; [వై] 12,51,512 చ. కి. మీ.; [జ] 48,32,677 ఇందు 80,000 మంది వలస వచ్చిన పోర్చుగీస్ వారు. తక్కిన వారు అనేకములైన జాతులు; [భా] పోర్చుగీస్ భాష పరిపాలనా వ్యవహారములందును, పాఠశాలలందును ఉపయోగింపబడుచున్నది. వివిధ ఆఫ్రికా భాషలు ఆయా జాతులలో ప్రచారమునందు ఉన్నవి. [మ] పోర్చుగీస్ వారు రోమన్ కేథలిక్‌లు, తక్కిన వారిలోకూడ క్రైస్తవమతము చాలవరకు వ్యాప్తియందు ఉన్నది. [రా] లువండా (1,58,882).

చరిత్ర : 15 వ శతాబ్ది అంతమున పోర్చుగీస్ నావికులు ఈ దేశమున కొన్ని స్థావరములను నెలకొల్పుటతో పాశ్చాత్యులకు ఈ దేశముతో పరిచితి తొలుతగ లభించినది. డియోగోకామ్ అను పోర్చుగీస్ సాహసికుడు 1482 నుండి మూడేండ్లు ఈ దేశ తీరమున పర్యటించి, అచటి దేశీయులతో సన్నిహితత్వమును ఆర్జించెను. అతని వ్రాతలను బట్టి ఆనాడు ఈ దేశమును మ్వానీ కాంగో అను బిరుదము కల రాజు బొంజాకాంగో నగరమును రాజధానిగ పాలించుచుండెనని తెలియుచున్నది. పోర్చుగల్ ఈ దేశముతో వర్తకసంబంధములను అభివృద్ధిపరచుటయే కాక, మత ప్రచారక దళములను 1490 ప్రాంతముల నుండి అన్‌గోలాకు పంపి, ఆ దేశీయులను క్రైస్తవులుగ చేయుటకు కృషి చేసినది. ఆ కృషి ఫలితముగ దేశమునందలి పలుజాతులు క్రైస్తవమతమును స్వీకరించుటయే కాక, కడకు దేశ ప్రభువు కూడ క్రైస్తవుడయ్యెను. 1534 లో బొంజాకాంగోలో క్రైస్తవ ప్రార్థనాలయము నిర్మింపబడి, ఆ నగరనామము 'సావోసాల్వడార్' అని మార్పు చేయబడెను. 16 వ శతాబ్ది చివరి భాగమున ఆఫ్రికా అంతర్భాగమునుండి నరమాంసాశనులగు బంగలా తెగలవారు ఈ దేశముపై బడి కొల్లగొట్టి దేశ వైభవమును అంతమొందించిరి. అంతట ఈ దేశమున పోర్చుగీస్ వారి పలుకుబడియు సన్నగిల్లెను.

కాని, అనతికాలముననే పోర్చుగీస్‌వారు ఈ దేశపు దక్షిణ భాగమున తమ ఆధిపత్యమును సుస్థిరము ఒనర్చుకొను తలపుతో అచట కొన్ని స్థావరములను నెలకొల్పి, వానికి తొలుతటి గవర్నర్‌గ పాలో డయాజ్ అను వానిని పంపిరి. అతడు దేశపు దక్షిణ భాగమునందలి దేశీయ పాలకుల నెల్ల లొంగదీసి, అచట పోర్చుగీస్ ఆధిపత్యమును స్థాపించెను. ఆ కాలముననే (1576) రాజధానియగు లువండా నిర్మింపబడెను. 1640 - 1648 మధ్య డచ్చివారు ఈ ప్రాంతమున కొన్ని రేవులను వశపరచుకొనినను, పోర్చుగీస్ వారు వారిని త్వరలోనే తరిమివైచి, ఉత్తర ప్రాంతమునకు కూడ తమ అధికార

మును వ్యాపింపజేసిరి. పోర్చుగీస్‌వారు ఈ దేశమునందలి అనాగరకులు, నిస్సహాయులు నగు ప్రజలను బానిసలుగ కొనిపోయి, బ్రెజిల్ (ద. అమెరికా) లో విక్రయించి విపరీతముగ ధనమును ఆర్జించిరి. 1836 లో బానిస వ్యాపారము చట్టరీత్యా నిషేధింపబడినను, అటుతరువాత సైతము 20 వ శతాబ్ది ఆరంభము వరకు ఈ వ్యాపారము చాటుమాటుగ భారీఎత్తున సాగుచునే ఉండెను.

బెల్జియమ్, ఫ్రాన్స్ దేశములతో పోర్చుగల్ 1885-86 లో ఏర్పరచుకొనిన ఒడంబడికల ఫలితముగ అన్‌గోలా సరిహద్దులు ఆగ్నేయ భాగమున తప్ప తక్కిన అన్ని వైపుల నిర్ణయింపబడినవి. 1891 లో బ్రిటన్‌తో జరిగిన ఒడంబడిక మూలమున ఆగ్నేయమున ఉత్తర రొడీషియా (జాంబియా) తో ఈ దేశపు సరిహద్దు నిర్ణయింపబడినది.

దేశము సహజ సంపద కలిగినదియే అయినను, దానిని సరిగ వినియోగించి దేశమును సుసంపన్నము చేయుటకు గాని, దేశీయుల శ్రేయస్సుకొరకు గాని పోర్చుగీస్ ప్రభుత్వము శ్రద్ధను పూనలేదు. 1913 లో దేశీయ వ్యవహార శాఖను ఒకదానిని ప్రభుత్వము ఏర్పాటుచేసినది. కాని, దానివలన జరిగిన మేలేదియు లేదు. పైగా 1914 నుండి నిర్బంధపు చాకిరీ చట్టము అమలులోనికి తేబడినది. చివరకు ప్రజల ఆందోళన ఫలితముగ ఈ చట్టము 1922 లో రద్దు చేయబడినది. కాని, ప్రభుత్వపు పనులకై మాత్రము నిర్బంధముగ కార్మికులచే పని చేయించు నియమము మాత్రము నిలుపబడినది. ఇట్టి నిర్బంధపు చాకిరీ మూలముననే, దేశమునందలి దూరప్రాంతములకు సైతము చక్కని రోడ్లను పోర్చుగీస్ వలస ప్రభుత్వము నిర్మింపజేసినది.

దేశమున వ్యవసాయమును భారీ ఎత్తున సాగించుటకు బ్రెజిల్ దేశపు పెట్టుబడిదారులు అచట కృషిచేసి, విస్తృత క్షేత్రములను స్థాపించిరి. వీనిలో దేశీయులు కూలివారుగ పనిచేసి జీవింతురు. ఇటుల దేశీయులను వేధించుటకు తోడుగ పోర్చుగీస్ ప్రభుత్వము గుడిసెపన్నును 1935 లో విధించి వసూలు చేయ మొదలిడినది. దీనిని అనుసరించి 16 ఏండ్లు దాటిన ప్రతి పురుషుడు తన ఆర్జనను అనుసరించి ఒక మొత్తమును ప్రతి సంవత్సరము పన్నుగ ప్రభుత్వమునకు చెల్లింపవలయును. ఒక పురుషుడు 100 రోజులలో ఆర్జించు మొత్తమునకు ఇది దాదాపుగ సరిపోవును.

దేశీయులలో కొన్ని అల్పవర్గముల వారికి పోర్చుగీస్ వారు పోర్చుగీస్ భాషా సంస్కృతులను అలవరచి, వారిని తమ ఉద్యోగులుగ నియమించుకొని, పరిపాలన సాగించుచున్నారు. ఇటుల పోర్చుగీస్ సంస్కృతిని అవలంబించి, తమ దోపిడికి సాయపడిన వారికి సంలీను (అసిమిలాడో) లను పేరునొసగి, వారికి పోర్చుగల్ రాజ్య పౌరసత్వము లను ప్రభుత్వము కలిగించినది. వేలలో మాత్రమే లెక్కింపదగు ఈ సంలీనులు అందుమూలమున దేశీయులనుండి విడివడి పోవుటవలన స్వాతంత్ర్యాందోళనమునకు దేశమున అవకాశమే ఏర్పడకుండెను.

ప్రపంచ యుద్ధము - II అనంతరమున ఆఫ్రికాలో పలు ప్రాంతములందలి వలస రాజ్యములను అంతమొందించిన స్వాతంత్ర్యవాయువులు అన్‌గోలా యందును చైతన్యమును కలిగించెను. సరిహద్దునందలి కాంగో [చూ.] స్వతంత్రమైన తరువాత కాంగో నాయకుల ప్రోత్సాహము ఈ ఉద్యమమునకు సమకూరెను. 1961 మొదలుగ దేశమున విప్లవ సంఘములు ఏర్పడి వలస ప్రభుత్వమును కూలద్రోయుటకు దౌర్జన్య చర్యలు జరుప సాగినవి. పోర్చుగీస్ వలస ప్రభుత్వము సామ్రాజ్య కేంద్రమగు పోర్చుగల్ నుండి సేనలను రప్పించి, ఈ స్వాతంత్ర్యోద్యమమును దారుణ హింసాకాండచే అడచుటకు యత్నించినది. తత్ఫలితముగ దేశభక్తులు అనేకులు మరణించిరి; పలువురు మారుమూల ప్రదేశములలో తలదాచుకొనిరి. ఐనను విప్లవ నాయకులు తక్కిన ఆఫ్రికాలోని స్వతంత్ర దేశముల సానుభూతి సహకారములతో ఉద్యమమును సాగించుచున్నారు.

ఈ పరిస్థితులలో అన్‌గోలాకు స్వాతంత్ర్యమును ఒసగవలసినదిగ ఐక్యరాజ్యసమితి (యునైటెడ్ నేషన్స్) మూలమున ఆఫ్రేసియా రాజ్యములు [చూ.] ఒత్తిడిని తీసికొని రాగలిగినవి. కాని, పోర్చుగల్ రాజ్యమున అన్‌గోలా ఒక అంతర్భాగమే కాని, వేరుగ వలస కాదను వింత వాదమునకు పోర్చుగల్ పూనుకొని, యునైటెడ్ నేషన్స్ జోక్యము నెడల నిరాదరణ వహించెను. అంతట 1963, మే 22 నుండి 25 వరకు అడ్డిస్‌అబాబాలో అఖిల ఆఫ్రికా ఖండపు స్వతంత్ర దేశములు సమ్మేళనము జరిపి, ఆఫ్రికా యందు ఇంకను దాస్యమున ఉన్న అన్‌గోలా వంటి ప్రాంతముల స్వాతంత్ర్యోద్యమములకు ఆర్థిక, నైతిక సహకారములను ఒసగుటకు తీర్మానించినవి. తత్ఫలితముగ ఈ ఆఫ్రికా రాజ్యముల విదేశమంత్రులు డాకర్ నగరమున తాము జరిపిన సమావేశమునందు అన్‌గోలా ప్రజోద్యమములలో అత్యంత పటిష్ఠతగల ఉద్యమమునకు నాయకుడగు హోల్డెన్ రాబర్టో ఏర్పరచిన ప్రవాస ప్రభుత్వమునే అన్‌గోలాకు చెందిన న్యాయబద్ధ ప్రభుత్వముగ గుర్తించి, దానికి అన్నివిధముల సాయపడుటకు నిర్ణయించిరి (1963, ఆగస్టు 12). చీ. శే. రా.

**అనంతాచార్యులు, పనప్పాకము :** చూ. సం 4 - పు. 706.

**అప్పర్ వోల్టా :** ఆఫ్రికాలోని స్వతంత్ర రాజ్యము. నైజర్ [తూ] ; దహోమీ, టోగో, ఘానా ; ఐవరీకోస్ట్ [ద] ; మాలీ ఫెడరేషన్ (సమాఖ్య) [ప, ఉ] ; [వి] 3,15,690 చ. కి. మీ ; [జ] 45,00,000 ; [భా] ఫ్రెంచి భాష ప్రభుత్వ, వ్యాపార రంగములందు వాడబడుచున్నది ; ఆఫ్రికన్ భాషలు కూడ ప్రచారమునందు ఉన్నవి ; [మ] దేశమున ప్రజలందరు వివిధ నీగ్రో జాతులకు చెందినవారు ; అత్యధిక సంఖ్యాకులు ప్రకృతి దేవతారాధకులు ; ఇస్లామ్, క్రైస్తవ మతములు కూడ ప్రచారమునందు ఉన్నవి ; [రా] అవగడౌగా (47,500).

చరిత్ర : ఆదినుండియు నీగ్రో ప్రజల నివాస భూమిగ ఉన్న ఈ ప్రాంతపు చరిత్రను గురించిన వివరములు ఏవియు తెలియవచ్చుట లేదు. కాని, పాశ్చాత్యులకు 16 వ శతాబ్దిలో




ఈ ప్రాంతముతో పరిచయము ఏర్పడునప్పటికి, ఇచ్చట అవగడౌగా నగరము రాజధానిగ ఒక నీగ్రో రాజ్యము ఉండెను. పాశ్చాత్యులు అచట తొలుత వర్తక సంబంధములను మాత్రమే ఏర్పరచుకొని తృప్తి చెందిరి. కాని, 19 వ శతాబ్ది అంతమునకు పరిసర రాజ్యములు అన్నింటిని వశపరచుకొనిన ఫ్రెంచివారు ఈ అవగడౌగా రాజ్యమును 1897 లో తమ రక్షితరాజ్యముగ గ్రహించిరి. 1919 లో రాచరికమును అంతరింప జేసి, ఫ్రెంచివారు తమ వలస ప్రభుత్వమును ఇట నెలకొల్పిరి. కాని, 1933 లో దీని ప్రత్యేకతను రద్దొనర్చి ఇందలి వివిధ ప్రాంతములను సరిహద్దులందున్న నైజర్, ఫ్రెంచి సుడాన్, ఐవరీకోస్ట్ దేశములలో వారు కలిపి వేసిరి. ప్రపంచ యుద్ధము - II అనంతరము ఈ ప్రాంతపు ప్రజల అభీష్టమును గమనించి ఫ్రెంచి ప్రభుత్వము ఈ రాజ్యమును పునర్నిర్మించి (1947) స్వయం పరిపాలన ఒసగెను. 1958 లో ఈ రాజ్యము ఫ్రెంచి కమ్యూనిటీకి [చూ.] చెందిన గణరాజ్యముగ ఉండుటకు నిర్ణయించుకొనెను. 1959 లో ఇందులకు అనువుగ ఒక రాజ్యాంగము తయారు చేయబడి ప్రజల ఆమోదమును పొందెను. అంతట 1960, ఆగస్టు 5 న ఈ రాజ్యము గణరాజ్యముగ రూపొందినది. మారిస్ యమియోగో అను నతడు తొలుతటి అధ్యక్షుడు అయ్యెను.

రాజ్యాంగము : ప్రజాస్వామిక గణ రాజ్య ప్రభుత్వ విధానము ఇచట అమలునందు ఉన్నది. అధ్యక్షుని, శాసన సభను ప్రజలు అయిదేండ్లకు ఒకతూరి ఎన్నుకొనెదరు. శాసన సభయందు 75 మంది ఎన్నుకొనబడిన సభ్యులు కలరు. తాను నియమించుకొనిన మంత్రివర్గపు సాయమున అధ్యక్షుడు పరిపాలనను నిర్వహించును. కాని, 1966, జనవరి 4 న సైన్యము ప్రభుత్వాధికారమును కైవసము చేసికొనుటవలన రాజ్యాంగము రద్దు చేయబడినది. చీ. శే. రా.

**అప్రత్యక్ష ఎన్నిక :** ఎన్నికల వలన పూరింపవలసియున్న స్థానములను వోటరులు ప్రత్యక్షముగ పాల్గొనిన ఎన్నికలవలన గాక, ఆ వోటరులు ఎన్నుకొనిన ప్రతినిధులు మాత్రమే పాల్గొను ఎన్నికలవలన పూరించు ఒక విధమగు ఎన్నిక పద్ధతి. యునైటెడ్ స్టేట్స్ అధ్యక్ష, ఉపాధ్యక్ష పదవులకు ఒక నియోజకమండలి ద్వారా అప్రత్యక్ష ఎన్నిక జరుగవలెనని ఆ దేశపు రాజ్యాంగము నిబంధించినది. ఐనను ఆచరణలో మాత్రము ఆ నియోజక మండలి యందలి సభ్యులు తమ ఇచ్ఛానుసారము గాక, తమ రాష్ట్రములలోని అధిక సంఖ్యాకుల నిర్దేశానుసారమే వోటు చేయుచున్నారు. భారత రాజ్యాంగమును [చూ.] అనుసరించి రాష్ట్రములందలి శాసన పరిషత్తు (లెజిస్లేటివ్ కౌన్సిల్) లందలి కొన్ని స్థానములకును, కేంద్రమందలి రాజ్యసభ (కౌన్సిల్ ఆవ్ స్టేట్స్) కును [చూ.] ఎన్నికలు అప్రత్యక్ష పద్ధతినే జరుగుచున్నవి (అప్రత్యక్ష ఎన్నికకే పరోక్షపు ఎన్నిక అనియు వ్యవహారము కలదు). ప్ర. రా.

**అబిసీనియా :** చూ. ఎతియోపియా.

**అబుల్ కలామ్ అజాద్, మౌలానా (1888 - 1958) :** భారత జాతీయ నాయకుడు. ప్రవాసమేగిన ఒక భారతీయ ముస్లిమ్ కుటుంబమున 1888 నవంబరు 11 న మక్కా నగరమునందు ఈతడు జన్మించెను. బాల్యము అరేబియాలో గడచినది. అరబ్బీభాషను, ప్రాచ్య మత సిద్ధాంతములను పఠించి అందు పాండిత్యము గడించి ఇరాక్, ఈజిప్టు, సిరియా, టర్కీ



మౌలానా అబుల్ కలామ్ అజాద్

ఫ్రాన్సు దేశములను సందర్శించి యూరపియన్ భాషా సారస్వతములతో పరిచయము ఈయన సంపాదించెను. అంతట మాతృదేశమగు భారతదేశమును చేరి, 1912 మొదలుగ కలకత్తానుండి 'అల్ - హిలాల్' అను ఉర్దూ వారపత్రికను నడిపెను; 1920 లో ఖిలాఫత్ ఉద్యమము [చూ.] నను, 1930 - 32 నాటి శాసనోల్లంఘన సందర్భము నను పెక్కేండ్లు కారాగారవాసశిక్షను అనుభవించెను. 1942 నుండి 1945 వరకు 'క్విట్ ఇండియా' ఉద్యమము మూలమున ఇతర కాంగ్రెస్ కార్యవర్గ సభ్యులతోపాటుగ నిర్బంధములో ఉంచబడెను. 1923, 1930, 1940 - 46 లలో కాంగ్రెస్ అధ్యక్షుడుగ ఉండెను. పెక్కు సంవత్సరములు కాంగ్రెస్ కార్యవర్గ సభ్యుడుగ ఉండెను. 1942 లోని క్రిప్సు రాయబార కాలముననుు, 1946 లోని మంత్రివర్గ రాయబార సందర్భముననుు ఈయన ప్రముఖపాత్ర వహించెను. 1951 ఫిబ్రవరిలో పార్లమెంటులోని కాంగ్రెస్ పక్షమునకు ఉపనాయకుడు అయ్యెను. 1947 జనవరిలో తాత్కాలిక ప్రభుత్వమున విద్యామంత్రిగ ఈయన పనిచేసెను. ఆ తరువాత స్వతంత్ర భారత ప్రభుత్వ మంత్రివర్గమున ఆ పదవి యందే మరణపర్యంతము ఈయన పనిచేసెను. రాజకీయ వేత్తగనే కాక, ఉర్దూ, అరబిక్, పారసీక భాషలలో ప్రసిద్ధ పండితుడుగ ఈయన పేరొందెను [చూ. సం. 6 - పు. 496]. బొ. శ్రీ.

**అబ్దుర్ రజాక్ :** ఇతడు గోలకొండ నవాబు అగు అబుల్ హసన్ తానాషా యొక్క కొలువునందు ఉండిన స్వామిభక్తికల ఒక సేనాని. 1687 లో ఔరంగజీబ్ [చూ.] గోలకొండను ముట్టడించి, దానిని పట్టుకొనుటకై లంచములు ఇచ్చి కొందరను స్వామిద్రోహులు అగునట్లు చేసినపుడు, అట్టి నైచ్యమునకు పాల్పడక, కడవరకు రాజభక్తితో తానాషా వైపుననే ఉండి పోరినవాడు ఈ రజాక్ ఒక్కడే. అబ్దుల్లాఖాన్ అను మరియొక సేనాని చేసిన ద్రోహముచే శత్రువులు కోటలోనికి వచ్చుట వినినంతనే రజాక్ శీఘ్రముగ తన గుర్రమును ఎక్కి, చేత కత్తిపట్టి శత్రువులతో ఘోరముగ పోరెను. ఇతని దేహమంతయు శత్రువుల కత్తివ్రేటుల గాయములతో నిండి, తెలివి తప్పియుండ, గుర్రము ఇతనిని తీసికొనిపోయి ఒక తోటలో పడవైచెను. మరునాడు కొందరు అతనిని గుర్తించి ఔరంగజీబ్ కడకు గొనిపోయిరి. ఇతని శౌర్యమునకు అచ్చెరువంది ఔరంగజీబ్ 'ఇట్టి సేనాని మరియొకడు తానాషా యొద్దనున్న గోలకొండ సాధించుట దుర్లభమై యుండు' నని మెచ్చుచు ఇతనికి చికిత్స చేయుటకై ఇద్దరు వ్రణవైద్యులను ఏర్పాటుచేసెను. ఈ వైద్యులు ఆ స్వామిభక్తుని గాయములకు చికిత్సజేసి, "అతని శరీరము మీద మొత్తము 70 గాయములు లెక్కించితిమి; మరియు గాయములు ఇంకను కలవు; కాని, గాయముపై గాయము పడి లెక్కించుటకు సాధ్యము కాలేదు" అని చెప్పిరి. 16 దినములు ఉపచారములు చేయగా ఇతడు కండ్లు విప్పెను. అంత ఔరంగజీబ్ ఇతని అపరాధములు క్షమించి, మన్సబ్‌దారీ మొదలగు అధికారములు ఇచ్చెదననియు; ఇతని కుమారులను ఇతని యొద్దకు పంపెదననియు కబురంపెను. కాని, రజాక్ తనకు చేయించిన ఉపచారములకు కృతజ్ఞత తెలుపుచు, తానెటులైన జీవింపబోననియు, జీవించినను ఉద్యోగ ధర్మముల నెరవేర్చుటకు తగిన సామర్థ్యము ఉండదనియు, ఒకవేళ సామర్థ్యము ఉండినను తానాషా ఉప్పు తిన్నవాడెవ్వడును శత్రువగు ఔరంగజీబ్ కొలువున ఉండజాలడనియు ప్రత్యుత్తరము అంపెను. ఇది విని ఔరంగజీబ్ సిగ్గుపడెనట. గి. వేం. సీ.

**అబ్దుల్ హమీద్ - II** (1876 - 1909) : చూ. టర్కీ.

**అబ్బాసీయ కలీఫాలు :** క్రీ. శ. 750 నుండి 1258 వరకును అరేబియా సామ్రాజ్యమును ఏలిన కలీఫాలకు వంశకర్తయైన అబ్బాస్ పేరును బట్టి అబ్బాసైడ్ (అబ్బాసీయు) లని పేరువచ్చినది. ఈ అబ్బాస్ మహమ్మద్ ప్రవక్త పినతండ్రి. 661 నుండి అరేబియా సామ్రాజ్యమును ఏలుచుండిన ఉమ్మాయిద్ కలీఫాలలో కడపటివానిని క్రీ. శ. 750 లో జాబ్ నది ఒడ్డున మోసూల్ వద్ద ఓడించి అబ్బాస్ కలీఫా అయి, అబ్బాసీయ కలీఫాల వంశకర్త అయ్యెను. ఈ వంశపు కలీఫాలలో క్రీ. శ. 786 నుండి 808 వరకును రాజ్యమేలిన హారూన్ అల్ రషీద్ ఘనత చెందిన కలీఫా. ఇతని పరిపాలనమువలన అబ్బాసైడ్ సామ్రాజ్యము అభివృద్ధి పొందినది. అనేక నగరములు వెంపొందినవి. సాహిత్యము, కళలు ప్రసిద్ధిచెందినవి. బాగ్దాద్ రాజాస్థానము ఎంత దివ్యముగను, తేజోవంతముగను శోభిల్లినదో 'అరేబియన్ నైట్సు' అను కథల పుస్తకములో గల వర్ణనలను బట్టి తెలియగలదు.

క్రీ. శ. 813 నుండి 833 వరకును రాజ్యమేలిన మామూన్ కలీఫా కాలములో అనేక విశ్వవిద్యాలయములు స్థాపింపబడినవి. ఖగోళ, గణిత, ప్రకృతి, వైద్యశాస్త్రములకును, ఆధ్యాత్మిక విద్యకును సంబంధించిన సంస్కృత, గ్రీక్ గ్రంథములు అరబ్బీ భాషలోనికి అనువదింపబడినవి. 9 వ శతాబ్దమందు అరేబియా సామ్రాజ్యసౌభాగ్యము తురుష్క జాతుల వారి దాడులవలనను, దేశమందలి అంతఃకలహముల వలనను చెడినది. ఆ తరువాత కొలది కాలముననే కలీఫాలకు ఉండిన సామ్రాజ్యాధికారము అంతయు తురుష్క జాతీయు

లగు సర్దారులకు సంక్రమించినది. కలీఫాలను పేరు, బాగ్దాద్ నగరము మాత్రమే కడపటి కలీఫాలకు దక్కినవి; అవికూడ 1258 లో హులగూ అను మంగోల్ నాయకుడు కడపటి కలీఫాను ఓడించి చంపుటతో అంతమొందినవి. గి. వేం. సీ.

**అబ్రహామ్ లింకన్ :** చూ. లింకన్, అబ్రహామ్.

**అమరావతి :** చూ. సం. 4 - పు. 716.

**అమృతసర్ కాల్పులు :** చూ. భారతదేశము.

**అమెనోతప్ :** ఈజిప్టును పాలించిన నలుగురు ప్రభువు (ఫారో) లకు ఈ పేరు కలదు. అమెనోతప్ - I క్రీ. పూ. 1570 ప్రాంతమున 10 సంవత్సరములు రాజ్యమును ఏలెను. అమెనోతప్ - II థోత్‌మీజ్ - III కుమారుడు. క్రీ. పూ. 1450 మొదలు 25 ఏండ్లు పాలించెను. అమెనోతప్ - III థోత్‌మీజ్ - IV కుమారుడు; క్రీ. పూ. 1410 మొదలు 36 ఏండ్లకు పైగా రాజ్యపాలన చేసి, గొప్ప మందిరములను, దేవాలయములను నిర్మించి ఖ్యాతి గాంచెను. అమెనోతప్ - IV అమెనోతప్ - III కుమారుడు. ఇతనికే అక్‌నాటన్ అను పేరును కలదు. క్రీ. పూ. 1375 మొదలు 1358 వరకు ఇతడు పాలించెను. ఇతడు ప్రపంచచరిత్రమున విఖ్యాతిగాంచిన మహానుభావులలో ఒకడు. ఇతనికి పూర్వము ఈజిప్టు ప్రజలు పెక్కు దేవతలను ఆరాధించుచుండిరి. ఈ అమెనోతప్ దేవుడు ఒక్కడే అనియు, అతడు సర్వాంతర్యామి అనియు, కరుణాసముద్రుడు అనియు, సూర్యభగవానుడే ఆ దేవుడు అనియు చాటెను. ఏకేశ్వరవాదము భారతదేశములో వేదకాలమునాటి ఋషులు కొంతవరకు గ్రహించి ఉండిరి. కాని, ఇతర దేశములలో ఈ అభిప్రాయము నూతనమైనది. ఈ నూతనాంశమును గ్రహించి చాటినవాడు అమెనోతప్. ఇదిగాక మానవకోటి అంతయు దేవుని బిడ్డలనియు, వారిలో వారు కలహించుట, యుద్ధములు చేయుట దేవునికి ఇష్టము కాదనియు, సామ్రాజ్య తృష్ణ తనకు లేదనియు 'అక్‌నాటన్' (అమెనోతప్ - IV) చాటెను. సామ్రాజ్యస్థాపన అనగా మానవ హృదయముల ప్రేమ సామ్రాజ్యస్థాపనయే అని ఉద్బోధించిన అశోక చక్రవర్తి [చూ.] కి వేయి ఏండ్లకు పూర్వమే ఈ మహనీయుడు ఆ సత్యమును లోకమునకు చాటెను. ఈ బోధన యందు ఎంత సత్యమున్నదో తెలిసికొన కుతూహలము కలవారై కొందరు సామంతులు 'అక్‌నాటన్' పై తిరుగబడిరి. హిట్టైట్‌లు అను తెగవారు సిరియాపై బడిరి. హీబ్రూలు పాలస్తీనాపై దండయాత్ర సాగించిరి. కాని, వీరిలో ఎవరితోడను అక్‌నాటన్ యుద్ధము చేయుటకు ఒప్పుకొనలేదు. వి. నా.

**అమెరికా ఖండము :** పశ్చిమార్ధ గోళమందలి ఏకైక విశాల భూఖండము. ఈ ఖండమును తొలుతగ కనుగొనిన వాడుగ భావింపబడు అమెరిగో వెస్పూచీ అను వానివల్ల ఈ పేరు ఈ ఖండమునకు కలిగినది. భౌగోళికాది ప్రత్యేకతలను బట్టి ఈ ఖండమును ఉత్తర అమెరికా, మధ్య అమెరికా, దక్షిణ అమెరికా అను పేరులతో మూడు ఉపఖండములుగ విభజించి వివరించుట పరిపాటి.

ఉత్తర అమెరికా : గ్వాటెమాలా, బ్రిటిష్ హొండూరాస్ దేశములకు ఉత్తరమున ఉన్న అమెరికా ఖండపు ప్రాంతమంతయు ఉత్తర అమెరికాగా పేర్కొనబడుచున్నది. ఈ ప్రాంతపు వైశాల్యము 2,34,17,500 చ. కి. మీ. పరిపాలన రీత్యా క్రింది ప్రత్యేక రాజ్యములుగ ఉత్తర అమెరికా విభక్తమై ఉన్నది.

1. యునైటెడ్ స్టేట్స్; 2. కెనడా; 3. గ్రీన్‌లాండ్ దీవి (డెన్మార్క్‌కు చెందినది); 4. మెక్సికో; 5. సెయింట్ పియెరీ - మిక్వెలాన్ దీవులు (ఫ్రెంచివారివి).

మధ్య అమెరికా : బ్రిటిష్‌హొండూరాస్, గ్వాటెమాలా ప్రాంతములతో సహా అవి మొదలుగ పనామా దక్షిణ సరిహద్దువరకు గల ప్రాంతము ఈ పేరున వ్యవహరింపబడుచున్నది. ఈ ప్రాంతపు వైశాల్యము 5,91,813 చ. కి. మీ. పరిపాలన రీత్యా ఈ ప్రాంతము క్రింది ప్రత్యేక రాజ్యములుగ విభక్తమై ఉన్నది.

1. బ్రిటిష్ హొండూరాస్; 2. గ్వాటెమాలా; 3. హొండూరాస్; 4. ఎల్‌సాల్వడార్; 5. నికరాగ్వా; 6. కోస్టారికా; 7. పనామా.

ఇవికాక, సాన్నిహిత్యమును బట్టి కారిబియన్ సముద్రమును ఆశ్రయించి ఉన్న క్రింది ద్వీపరాజ్యములును ఈ ప్రాంతమునకు చెందినవిగనే లెక్కింపదగి ఉన్నవి.

1. క్యూబా; 2. హాయిటీ; 3. డొమినికన్ రిపబ్లిక్; 4. వెస్ట్‌ఇండీస్. ఈ ద్వీపరాజ్యముల మొత్తపు వైశాల్యము 2,11,442 చ. కి. మీ.

దక్షిణ అమెరికా : పనామాకు దక్షిణమున ఉన్న ప్రాంతము అంతయు దక్షిణ అమెరికాగా వ్యవహరింపబడుచున్నది. ఈ విస్తృత భూభాగ వైశాల్యము 1,78,19,099 చ. కి. మీ. పరిపాలనరీత్యా ఈ ప్రాంతము దిగువ తెలుపబడిన ప్రత్యేకరాజ్యములుగ విభక్తమై ఉన్నది.

1. ఆర్జెంటీనా; 2. ఈక్వడార్; 3. ఉరుగ్వే; 4. కొలంబియా; 5. గయానా (డచ్చి); 6. గయానా (ఫ్రెంచి); 7. గయానా (బ్రిటిష్); 8. చిలీ; 9 పరాగ్వే; 10 పెరూ; 11. బొలీవియా; 12. బ్రెజిల్; 13. వెనిజ్యులా. చీ. శే. రా.

**అమెరికా రాజ్యముల కూటమి :** పశ్చిమార్ధగోళమునందలి సర్వస్వతంత్ర రాజ్యముల నడుమ సంపూర్ణ సహకారమును, సమైక్యతను సాధించుటకై 'అమెరికా రాజ్యముల కూటమి' (ఆర్గనైజేషన్ ఆవ్ అమెరికన్ స్టేట్స్) అను సంస్థ 1948 లో బగోటా నగరమున నెలకొల్పబడెను (30-4-1948). ఈ సంస్థ నిర్మాణ సూత్రముల ప్రకారము పశ్చిమార్ధగోళము నందలి స్వతంత్రరాజ్యములు అన్నియు ఇందు సభ్యత్వమును పొందవచ్చును. 1951 డిశంబరులో ఈ సంస్థ వ్యవహరింప నారంభించెను. 1955 నాటికి ఆర్జెంటీనా, గ్వాతెమాలా, ఉరుగ్వే తప్ప తక్కిన 21 రాజ్యములు ఈ సంస్థలో సభ్యత్వమును పొందెను. సభ్యరాజ్యములు క్రింద పేర్కొనబడిన విధులను నిర్వర్తించుటకు నిర్ణయింపబడినది :

1. ఐదు పండ్లకు ఒకసారి సభ్యరాజ్యములు సమావేశమై, అంతర్జాతీయ పరిస్థితులను, జాతీయ పరిస్థితులను సమాలోచించి వాటి దృష్ట్యా పరస్పర సంబంధములను ఎప్పటికప్పుడు నిర్ణయించుట; అమెరికా రాజ్యముల కూటమి యొక్క రాజకీయ విధానములను తదనుగుణముగా సవరించుట;
2. సభ్యరాజ్యముల విదేశాంగ మంత్రులు, రక్షణ మంత్రులు అవసరమైన సందర్భములలో సమావేశమై, పరస్పర సహకారమును గురించి, రక్షణ చర్యలను గురించి చర్చించి నిర్ణయములు గైకొనుట;
3. ఈ సంస్థయొక్క ప్రధాన కార్యాలయము వాషింగ్టన్ నగరమున స్థాపింపబడెను. ఈ సంస్థ క్రింద ఏర్పడిన సాంకేతిక ఉప సంఘముల ద్వారా సభ్యరాజ్యముల సమస్యలు పరిశీలింపబడి, వివిధ సహాయ సహకారములు నెరపబడును.

ఈ కూటమి యొక్క ఆర్థిక, రాజకీయ వ్యవహారములపై యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వ ప్రభావము ఎక్కువగా ఉన్నది. యునైటెడ్ స్టేట్స్, క్యూబా ప్రభుత్వముల నడుమ 1962 లో జనించిన వైరుధ్యముల కారణముగ అమెరికా రాజ్యముల కూటమినుండి క్యూబా వైదొలగవలసి వచ్చెను. ప్ర. రా. సు.

**అమెరికా సంయుక్త రాష్ట్రములు :** చూ. యునైటెడ్ స్టేట్స్.

**అమెరికా స్వాతంత్ర్య సంగ్రామము :** చూ. యునైటెడ్ స్టేట్స్.

**అరవిందుడు :** చూ. దర్శనములు, మతములు - సం. 7 - పు. 260.

**అరాజకతా వాదము :** రాజనీతిశాస్త్రమందలి ఒక ప్రముఖవాదము. ప్రభుత్వాధికారముతో అవసరము లేకుండ ప్రజా సంఘములు తమంత తాము ఐచ్ఛికముగ సమష్టి వ్యవహారములను జరుపుకొను వ్యవస్థయే అత్యుత్తమమని అరాజకతావాదము (అనార్కిజమ్) తెలుపుచున్నది. నిర్బంధమునకు లోబడి వర్తించుటకు బదులు పరిపూర్ణ స్వతంత్రతతో ఐచ్ఛికముగ మానవుడు తన విధిని నిర్వహించునటుల చేయుటయే ఈ వాదావలంబకుల ఉద్దేశము.

ఇట్టి వాదమును ప్రాచీన కాలమునుండియు పలువురు దార్శనికులు అవలంబించినటుల తెలియవచ్చుచున్నను, దీనికొక నిర్దిష్ట రూపము 18 వ శతాబ్ది నుండియే ఏర్పడినది. ఆనాడు యూరప్‌నందుండిన సాంఘిక వ్యవస్థను పర్యాలోకించిన కొందరు దార్శనికులు మానవునికి శ్రేయమొసగు సంఘవ్యవస్థ అరాజకతావాదమును అనుసరించియే నిర్మింపబడ వీలగునని భావించిరి. 'లోకమందలి ధనిక, దరిద్ర విభేదమునకు మూలకారణము ప్రభుత్వము. తన అధీనమున ఉన్న దండనాధికారమును ప్రభుత్వము ధనికుల రక్షణకొరకే వినియోగించుచున్నది. చట్టములు అనునవి అధికారమందుండువారి ఇష్టానిష్టములను వ్యక్తపరచు సూత్రములని మాత్రమే చెప్పనగును. భూమియందును, మూలధనమునందును కొలదిమందికి గల సర్వాధికారములను సంరక్షించుటకే ఈ చట్టములు వినియోగింపబడుచున్నవి. తాను సంపాదించనట్టిదియు, తన అనుభవమునకు అక్కర లేనట్టిదియు అగు భూమి, మూలధనము లోనగు వానిని నాది, తనది అని చెప్పుకొనుట ధర్మమని మానవులు ఎంతవరకు తలంచుచుందురో అంతవరకు దారిద్ర్యము ఈ లోకమున నిలిచియే ఉండును. ప్రజాప్రభుత్వ విధానమున కూడ ఈ ధర్మము అట్టులే నిలిచియుండును. ఎన్నికల ద్వారా అధికారమునకు రాగలుగు వారు ధనికులే అగుట వలన వారొనర్చు చట్టములును ధనికుల స్వత్వముల రక్షణకే పనికివచ్చును. ఇందువలన ప్రభుత్వము అంతరించినప్పుడు మాత్రమే మానవునికి దాస్య విముక్తి కలుగును. ప్రభుత్వము అంతరించినపుడు ఏర్పడు అరాజకసంఘమున ఇష్టము లేని వానిని నిర్బంధ పెట్టుటకు వీలు ఉండదు. భూమిపైన గాని, మూలధనముపైన గాని ఎవరికిని స్వామ్యము ఉండదు. సాంఘిక వ్యవహారములు అన్నియు ఐచ్ఛికములైన ఒడంబడికల మూలమున జరుగును. ఆహారాది వస్తువులను నిల్వచేసి లాభములను ఆర్జించుటకు అవకాశము అపుడు ఉండదు ; కనుక ప్రతి వ్యక్తికిని అవసరమగునంతవరకు అవి లభించును. దరిద్ర, ధనిక విభేదము నశించుటచే నేరములు చేయు వారెవరును ఉండరు. అట్టివారు కొలదిగ ఉన్నను, ప్రజాభిప్రాయమే వారిని చక్కదిద్దును. అట్టి సంఘమున సర్వమానవ సౌభ్రాత్రము సంపూర్ణ వికసన మొందగలదు' అని వారి వాదము.

పై వాదమున కొంత సత్యము కలదనుట నిర్వివాదాంశము. కాని, ప్రభుత్వాధికారము లోపభూయిష్ఠమగుట నిజమే ఐనను, అరాజకతావాదులు తలపెట్టినటుల ప్రభుత్వమును మొదలంట నిర్మూలించిన యెడల మానవునికి సర్వశ్రేయము కలుగునని తలచుటయు సరియైనది కాదు. రోగమును కుదుర్చుటకు రోగిని నిర్మూలించుటయే మార్గమని తలచు వైద్యుని రీతిగ అరాజకతావాది ప్రవర్తించుచున్నాడు. ఇదియే అరాజకతావాదమందలి లోపము.

అరాజకతావాదులు పేర్కొను లోపములు ప్రభుత్వయంత్రమున లేకుండునటుల చూచుటకు ప్రభుత్వ నిర్మూలనముకంటె వేరు మార్గములు కలవు. ఆ మార్గములకు అన్నిటికిని ప్రధానసూత్రము అధికార వికేంద్రీకరణ [చూ. అధికార విభజనము].

ఈ అరాజకతా వాదమునకు ఎక్కువ వ్యాప్తిని కల్పించిన వారిలో 18 వ శతాబ్ది వాడగు గాడ్విన్ అను బ్రిటిష్ దార్శనికుడును, స్టర్నర్ అను జర్మనీ దేశస్థుడును, 19 వ శతాబ్ది వారగు ప్రౌధన్, సోరల్ అను ఫ్రెంచి దార్శనికులును, బకునిన్, క్రోపాట్కిన్, టాల్‌స్టాయ్ అను రష్యన్ దార్శనికులును ప్రముఖులు. మా. వెం. రం.

**అరిస్టయిడీస్** (క్రీ. పూ. 530 - 468): ప్రాచీన గ్రీస్‌లో ఒక దేశభక్తుడు; ఏతెన్స్ నగరవాసి; క్రీ. పూ. 490 లో పారసీకులతో గ్రీక్‌లకు సంఘటిల్లిన మహాయుద్ధము (మరాథాన్) లో పాల్గొని మహావీరుడని పేరు కాంచెను. కాని, ఏతెన్స్ నాయకులలో ఒకడగు తెమిస్టోక్లిస్‌కును, ఇతనికిని నౌకా విధానముపై అభిప్రాయభేదము ఉండిన కారణమున ఇతడు జన్మభూమినుండి తరిమివేయబడెను (క్రీ. పూ. 483). ఇంతలో పారసీకులు మరల (క్రీ. పూ. 480) గ్రీస్‌పై దండెత్తగా, ఈతడు స్వదేశమునకు మరలి వచ్చి పారసీకులను ఓడించుటలో తెమిస్టోక్లిస్‌కు తోడుపడెను. ఆ తరువాత ఇతడు 'డీలియెన్' సంయుక్త రాష్ట్ర సంఘమునకు చెందిన ఆర్థిక వ్యవస్థను నిర్మింప కృషి చేసి, దానికి అధ్యక్షుడై, ఏతెన్స్ పేరు ప్రతిష్ఠలను నిల్పుటయే కాక, ఏతెన్స్ సామ్రాజ్యమును స్థాపించుటకు కూడ దారి చూపెను. ధనము సంపాదించుటకు ఎన్ని అవకాశములు ఉన్నను, ఇతడు కడు బీదగ చనిపోయెను. ఇతనిని ఏతెన్స్ నగరవాసులు 'ధర్మమూర్తియైన అరిస్టయిడీస్' అని పేర్కొనుచుండిరి. గి. వేం. సీ.

**అరేబియా సామ్రాజ్యము**: చూ. సౌదీ అరేబియా.

**అల్‌బెరూనీ** (క్రీ. శ. 973 - 1048): బహుభాషా విదుడగు ప్రాచీన చారిత్రకుడు; పండితుడు; ఖగోళశాస్త్రవేత్త. ఇతని సంపూర్ణనామము అబుల్ రైహాన్ మహమ్మద్ ఇబ్న్ అహమ్మద్ అల్ బెరూనీ. మధ్య ఆసియాయందలి ఖ్వారిజమ్ రాజ్యపాలకుని వద్ద ఇతడు ఆస్థాన పండితుడుగ ఉండెను. ఆ రాజ్యమును సుల్తాన్ గజనీ మహమూద్ [చూ.] 1013 లో జయించి వశపరచుకొని, ఖైదీలుగ తన రాజధానియగు గజనీకి కొనిపోయిన వారిలో అల్ బెరూనీ ఒకడు. ఇతడు అంతటినుండి తన జీవిత శేషమును గజనీ నగరమున గడపెను. ఆ నగరముననే అతనికి భారతీయ పండితులతో పరిచితి లభించెను. వారి వలన సంస్కృతమున అతడు పాండిత్యమును గడించి హిందూ మత సంస్కృతుల గురించి బాగుగ తెలిసికొనగలిగెను. అతడు అదివరకే అరబ్బీ, హిబ్రూ, పహ్లవీ, సిరియక్, సాగ్డియన్ భాషలయందును, గణిత, రాసాయనిక, వృక్ష, ఖగోళ శాస్త్రములందును పాండిత్యము వహించి ఉండెను. ఆ యా శాస్త్రములను గురించిన అనేక గ్రంథములనే కాక అతడు భారతదేశ మత, సంస్కృతి, చరిత్రలను తెలియజేయు అసన్ - ఉల్ - బఖయా, కితాబ్ - ఉల్ - హింద్ అను రెండు గ్రంథములను అరబ్బీలో రచించెను. ఆ కాలపు భారతదేశ సాంఘిక పరిస్థితిని, చరిత్రను తెలిసికొనుటకు ఆ గ్రంథములు చారిత్రకులకు ఉపకరించుచున్నవి. చీ. శే. రా.

**అలీన రాజ్యముల సమావేశము**: చూ. తటస్థ రాజ్యముల సమావేశము.

**అల్ప - అధిక సంఖ్యాక ప్రభుత్వములు**: ప్రస్తుతము ప్రపంచమందుండు ప్రభుత్వములను అల్పసంఖ్యాకములు, అధిక సంఖ్యాకములు అని రెండు తరగతులుగ విభాగము చేయవచ్చును. ప్రజాస్వామిక ప్రభుత్వములు అధిక సంఖ్యాకములు; తదితరములన్నియు అల్పసంఖ్యాకములు. నియంతల పరిపాలనకు లోబడిన దేశములు అన్నియు అల్పసంఖ్యాక ప్రభుత్వములని చెప్పదగినవి. నియంతలు కూడ ఏదో ఒక అల్పసంఖ్యాకవర్గమును ఆధారముగ చేసికొని పరిపాలించువారు - అది సైన్యము కావచ్చును; ఒక ప్రత్యేక రాజకీయపక్షము కావచ్చును.

గత నూరు, నూట యేబది ఏండ్ల క్రిందటి వరకు ప్రభుత్వములు అన్నియు అల్పసంఖ్యాకములుగనే ఉండెను. రాజ్యములోని ప్రజలలో ప్రాధాన్యముగాంచిన ఏదో ఒక వర్గమునకు చెందిన వారే పరిపాలకులుగ ఉండిరి. ప్రజా ప్రభుత్వములని ప్రసిద్ధి కాంచిన ప్రాచీన గ్రీస్‌లోని ప్రభుత్వములు, రోమ్‌నగర ప్రభుత్వము వాస్తవముగ అల్పసంఖ్యాక ప్రభుత్వములే. రాజులచేతను, చక్రవర్తుల చేతను పాలింపబడుచున్నట్టివి కూడ ఇట్టివే. ఏ రాజ్య

మందును రాజుగాని, చక్రవర్తిగాని స్వశక్తిని ఆధారముగ చేసికొని పాలించినవాడు కాడు. అతడు ఒక వర్గమునకు నాయకుడై వారి ప్రతినిధిగ పాలించినవాడు. ప్రాచీన కాలములో భారత దేశమును ఏలిన ప్రభువులు క్షత్రియ వర్గమునకు నాయకులై వారి సహాయమున పాలించినవారలే. ఇతర దేశములలో కూడ అగ్రకులజులని గాని, భూస్వాములని గాని ప్రాధాన్యము కాంచిన వారి సహాయముననే రాజులు రాజ్యమును పరిపాలించిరి.

అన్ని దేశములందును, అన్ని కాలములందును పరిపాలనాధికారము వహించిన అల్పసంఖ్యాకులు ఒక విధమైన ప్రాధాన్యముగలవారు కారు. జాతి, కులము, వంశము, యుద్ధనైపుణ్యము, మతము, ధనము, విజ్ఞానము మొదలైనవానిలో ఏదో ఒకటిగాని, కొన్నిగాని వారి ప్రాధాన్యమునకు ఆధారముగ ఉండెను.

వైదిక యుగమందలి రాజ్యములు అనేకములలో ఆర్యజాతివారే పరిపాలకులుగ ఉండిరి. వారిది ఉత్తమజాతి యను భావము ప్రబలి ఉండెను. తర్వాతి కాలమున పరిపాలించిన వారు క్షత్రియ కులజులు. క్షత్రియులు కాని వారు యుద్ధమందు విజయము గాంచి, పరిపాలకులయి నప్పుడు తామును, తమ బంధుకోటియు క్షత్రియులే అని రుజువు చేసికొనుటకు సర్వప్రయత్నములు గావించిరి. ప్రాచీన రోమ్ నగరమున పెట్రిషియన్ కులమునకు చెందిన వారే కొన్ని శతాబ్దముల కాలము పరిపాలకులుగ ఉండిరి. యూరప్‌లో మధ్యయుగమందు ట్యూటన్ జాతికి చెందిన వారు, ఫ్యూడల్ కులములకు, వంశములకు సంబంధించిన వారు పరిపాలకులైరి. జపాన్‌లో కూడ 19 వ శతాబ్దపు మధ్యభాగము వరకు కొన్ని కులముల వారే రాజ్యపాలనము గావించుచుండిరి. గత నాలుగైదు శతాబ్దములలో వలస సామ్రాజ్యములను స్థాపించి, ఆసియా [చూ.], ఆఫ్రికా [చూ.] దేశములలో అత్యధిక భాగమును పాలించిన యూరప్‌లోని శ్వేతజాతులు స్వజాత్యుత్కృష్టతా భావము (ఎత్నోసెంట్రిసిజమ్) తో తామే ఉత్తమ జాతులవారమనియు, రంగుల్జాతుల వారిని పాలించుటకు తమకే అర్హతగలదనియు వాదించిరి [చూ. సం. 10 - పు.809]. వీరి ప్రభుత్వము జాతిని ఆధారముగ చేసికొన్న అల్పసంఖ్యాక ప్రభుత్వము. ప్రస్తుతము దక్షిణ రొడీషియా [చూ.] దక్షిణ ఆఫ్రికా [చూ.] దేశములలో అల్పసంఖ్యాకులైన శ్వేతజాతివారు పరిపాలకులుగ ఉన్నారు.

ఏదియో ఒక మతమును ఆధారము చేసికొని అధికారమందుండిన వారును అనేక దేశములను పాలించుట కలదు. 13 వ శతాబ్దములో మహమ్మదీయ ప్రభుత్వము భారత దేశమున స్థాపింపబడిన తర్వాత అల్పసంఖ్యాకులగు మహమ్మదీయులు అనేక రాజ్యములను పాలించిరి. హిందువులు ఎంత సమర్థులైనను పరిపాలనాధికారులు కాకుండిరి. 16 వ శతాబ్దమున యూరప్‌లో మతవిప్లవము జరిగిన తర్వాత కొన్ని రాజ్యములలో ప్రొటెస్టంట్‌లును, మరికొన్నిటిలో కేతలిక్‌లును పరిపాలనాధికారము వహించిరి. రెండవ శాఖ వారికి అధికార పదవులలోనికి వచ్చుటకు అవకాశము లేకుండెను. పాకిస్తాన్‌లో మహమ్మదీయులు మాత్రమే అధికారార్హులు. సోవియట్ రష్యాలో పరిపాలనాధికారము అంతయు నాస్తికులగు కమ్యూనిస్టుల చేతులలో ఉన్నది.

ధనికులు, ఆస్తిపరులు, భూస్వాములు మాత్రమే దేశ పరిపాలకులుగ ఉండు సంప్రదాయము అనేక దేశములలో ఇటీవలివరకు ప్రాధాన్యముగాంచి ఉండెను. మధ్యయుగమందు అన్ని దేశములలో ఫ్యూడల్ వర్గమునకు చెందిన భూస్వాములు, జమీందారులు అధికారమందు ఉండిరి. తర్వాతికాలమున వర్తక వ్యాపారములు, పరిశ్రమలు వృద్ధిగాంచిన దేశములలో - ముఖ్యముగ పాశ్చాత్య దేశములలో-వర్తకులతోడను, పెట్టుబడిదారుల తోడను కూడిన మధ్యవర్గమువారు పరిపాలకులైరి. ప్రజాస్వామ్యపు తొలి దశలో ఆస్తిగల వారికిని, కొన్ని పన్నులు చెల్లించు వారికిని మాత్రమే వోటింగు హక్కు, శాసనసభలలో ప్రవేశించు హక్కు, మంత్రి పదవులకు రాగల హక్కు ఉండెను.

విజ్ఞానులు అన్న కారణముచేత పరిపాలనాధికారము వహించిన అల్పసంఖ్యాక వర్గములు అన్ని దేశములందును కొన్ని కాలములలో ఉండెను. ప్రాచీన భారత దేశములో బ్రాహ్మణులు రాజ్యములను పాలించిన వర్గమువారు కాకపోయినను రాజుల పైనను, చక్రవర్తుల పైనను ప్రబలమైన పలుకుబడిని వహించి ఉండిరి. పురోహితుడు రాజునకు ప్రధాన సలహాదారుడు. మధ్య యూరప్‌లోని క్రైస్తవ చర్చి అధికారులు కూడ దేశపాలనమందు ఇట్టి ఆధిక్యము కలవారైరి. వీరు విజ్ఞానులై సమస్తము తెలిసినవారన్నదే వారి ప్రాభవమునకు హేతువు. క్రైస్తవ మత గురువైన పోప్ [చూ.] కొన్ని రాజ్యములపై సామ్రాజ్యాధిపత్యము వహించి కప్పములు వసూలు చేయుచుండెను. ఇదంతయు కొంతవరకు 'విజ్ఞానవంతులే పరిపాలించుటకు అర్హులు' అని గ్రీక్ దార్శనికుడు ప్లేటో [చూ.] ప్రతిపాదించిన సిద్ధాంతమునకు అనుగుణముగ ఉండెను. ప్రస్తుతమున కమ్యూనిస్టు దేశములను పరిపా

లించువారు ఈ కోవకు చెందినవారని చెప్పవచ్చును. మార్క్సు సిద్ధాంతమును తెలిసినవారు కమ్యూనిస్టులు మాత్రమే అనియు, ఆ కారణముచేత దేశమును పాలించుటకు వారే అర్హులనియు వారి వాదము.

ఈ విధముగ జాతి, మతము, ధనము, విజ్ఞానము మొదలైన వాటిలో ఏవో కొన్నిటిని ఆధారము చేసికొని, వేలాది సంవత్సరములు అల్పసంఖ్యాక వర్గములవారు వివిధ దేశములను పాలించువారైరి. 'అర్హతగలవారే పరిపాలకులగుట వాంఛనీయ' మను సూత్రముతో ఈ ప్రభుత్వ విధానమును అనేకులు సమర్థించిరి. ఈ సూత్రము కొంతవరకు అంగీకారయోగ్యమైనను, ఇందు కొన్ని దోషములు ఉండుటయే గాక ఇది సమర్థించు ప్రభుత్వ విధానము మూలమున ప్రజలకు అనేక నష్టములు కూడ సంభవించెను. పరిపాలనార్హతకును, జాతి, ధనము మొదలైన వానికిని ఎట్టి సంబంధమును లేదు. సమానావకాశములు ఉన్నప్పుడు అన్ని జాతుల వారు, అన్ని కులముల వారు, అన్ని మతముల వారు, ధనికులు, దరిద్రులు అందరును పరిపాలనార్హులు అగుచున్నారు. ఈ విషయమును పై సూత్రము విస్మరించుచున్నది. ఇదిగాక, రాజకీయ పరిజ్ఞానమునకును, తత్త్వపరిజ్ఞానమునకును దగ్గర సంబంధము ఎట్టిదియు లేదు. ఏ వర్గము వారు కూడ సర్వజ్ఞులు కారు. దీనికి తోడు అధికారమందు ఉండు అల్పసంఖ్యాక వర్గములవారు ప్రజలందరి శ్రేయస్సు విషయమై శ్రద్ధ వహించక తమ జాతి, తమ కులము, తమ మతములకు చెందిన వారి శ్రేయస్సుకు మాత్రమే పాటుబడుట సర్వసాధారణము. రాజ్యపాలనము మూలమున ప్రజలందరు బాగుపడుటకు బదులు కొందరు మాత్రము బాగుపడుటయు, అధిక సంఖ్యాకులు దీనస్థితియందుండుటయు ఈ ప్రభుత్వ విధానములో తప్పుట లేదు. ఇదియే ఇందులోని గొప్ప లోపము.

అల్పసంఖ్యాక ప్రభుత్వముల మూలమున కష్ట నష్టములకు లోనైన ప్రజలు 18 వ శతాబ్దపు చివరి భాగమున ఫ్రాన్సులో విప్లవమును లేవదీసి నిరంకుశప్రభుత్వమును తొలగద్రోచి ప్రజా ప్రభుత్వమునకు పునాదులు నిర్మించిరి. ఇట్టి తిరుగుబాటుకు ఆ కాలపు దార్శనికులు అనేకులు దోహదము కల్పించిరి [చూ. పు 173]. వీరందరు మానవ సమత్వ సిద్ధాంతమును ప్రతిపాదించి, ప్రజా ప్రభుత్వము లేదా అధికసంఖ్యాక ప్రభుత్వమే న్యాయమైన ప్రభుత్వమని నిరూపించిరి. అల్పసంఖ్యాక ప్రభుత్వములకు మానవ అసమత్వ సిద్ధాంతము ఆధారము; అధిక సంఖ్యాక ప్రభుత్వమునకు మానవ సమత్వ సిద్ధాంతము ఆధారము.

మానవులందరిలో మానవత్వము ఉన్నది. అందరు భగవదంశ సంభూతులు; పుట్టుట, గిట్టుట, ఆకలి, దాహము, కష్టము, సుఖము, దుఃఖము అనునవి మానవులందరిలో ఉండు సమాన లక్షణములు. అందరు సుఖముగ జీవించుటకు అర్హులు. ఒకరి సుఖము ఇంకొకరి సుఖము కంటె ఎక్కువ ప్రాధాన్యము కలదనిగాని, ఒకని బాధ ఇంకొకని బాధ కంటె తక్కువ అనిగాని చెప్పుటకు హేతువులు లేవు. ధనికుని ఆకలిబాధ దరిద్రుని ఆకలి బాధకంటె ఎక్కువ కాదు. అందరు సుఖపడవలసినవారే; అందరు తరించవలసిన వారే. ఈ సమత్వ సిద్ధాంతములోని ప్రధాన విషయము ఇదియే. మానవులందరు - రాజ్యములోని ప్రజలందరు - సుఖపడుటకు పరిపాలనాధికారము అందరి వశమందు ఉండుట అవసరము. ఎవరో కొందరు అల్పసంఖ్యాకుల వశమందున్నప్పుడు అందరి సౌఖ్యము వృద్ధియగుట సాధ్యము కాజాలదు.

సమత్వ సిద్ధాంతముతోపాటు మరియొక విషయమును కూడ అప్పటి దార్శనికులును, తర్వాత వచ్చిన విజ్ఞానులును బలపరచిరి. పరిపాలించు వారి తృప్తికొరకు గాక, పరిపాలింపబడు ప్రజల తృప్తికిని, వారి అవసరములు తీర్చుటకును రాజ్యపాలనము ఉద్దేశింపబడినది. ప్రజల అవసరములను పూర్తిగ ఎరిగిన వారే ఈ పనిని చేయుటకు సమర్థులు అగుదురు. అట్టి జ్ఞానము లేని పరిపాలకులనై పుణ్యము వ్యర్థమగును. ప్రజల అవసరముల తెలిసికొనుటకు ప్రజలందరు ఎన్నుకొనిన ప్రతినిధులు పరిపాలకులు అగుట తప్ప వేరు సాధనము లేదు. ప్రజలందరికి బాధ్యులై పరిపాలకులు ప్రవర్తించుటకు ఇట్టి విధానము అవసరము. పరిపాలకులు వారి వారి పనులను చక్కగ నిర్వహించుచున్నదీ లేనిదీ చెప్పగలవారు ప్రజలే! వంట రుచిగ ఉండునదీ లేనిదీ చెప్పగలవారు భోక్తలుగాని, వంటచేయువారు కాదు; సంగీతము శ్రావ్యముగ ఉన్నదీ లేనిదీ నిర్ణయించగలవారు శ్రోతలుగాని గాయకులు కారు. పరిపాలకులు వంట చేయువారి యొక్క, గాయకుల యొక్క స్థానమందుండువారు; ప్రజలు భోక్తల యొక్కయు, శ్రోతల యొక్కయు స్థానమందుండువారు. అందుచేత పరిపాలన విషయములో తుది అధికారము ప్రజల చేతులలో ఉండుటయే సబబు.

ఈ సిద్ధాంతముల ఫలితముగను, 18 వ శతాబ్దాంతమున ప్రారంభమైన విప్లవముల ఫలితముగను అల్పసంఖ్యాక ప్రభుత్వములు తొలగి అధికసంఖ్యాక ప్రభుత్వమని చెప్పదగిన ప్రజాస్వామ్యము [చూ.] అనేక దేశములందు వ్యాపించెను. ఎవరు పాలించవలెనో, ఎవరు పాలించ

రాదో, వారు ఎంత కాలము అధికారమందు ఉండవలెనో, వారు తలపెట్టిన కార్యములు ఉపయోగకరములో, కావో నిర్ణయించు అధికారము అంతయు ఈ దేశములందు అధిక సంఖ్యాకులైన సామాన్య ప్రజలయందు ఉన్నది. అందుచేతనే ఈ పరిపాలనా విధానమునకు 'అధికసంఖ్యాక విధానము' అను పేరు లభించెను.

ఈ విధానములో ప్రజలందరి శ్రేయస్సు సమానముగ వృద్ధి కాగలదు; ప్రజలలో ఐకమత్యము వెంపొందును; ఇది ప్రభుత్వ స్థిరత్వమునకు ఎంతయో తోడ్పడును. విప్లవముల అవసరము లేక అవసరమైన మార్పులను చేయుటకు అవకాశములు లభించును. ప్రభుత్వము వేరు, తాము వేరు అను భావమునకు బదులు ప్రభుత్వము తమదే అన్న భావము ప్రజలలో ఏర్పడుచున్నది. రాజ్యము యొక్క సుస్థిరత్వమునకును, సమష్టి సౌభాగ్యమునకును, రక్షణకును కారణభూతులగువారు అధిక సంఖ్యాకులగు ప్రజలే. అందుచేత పరిపాలనాధికారము వారి వశమందు ఉండుట సమంజసము.

కాని, ఈ విధానములో కూడ లోపములు, దోషములు కనిపించవచ్చును. అల్ప సంఖ్యాక ప్రభుత్వములలో పరిపాలనాధికారమును స్వార్థమునకై వినియోగించుకొనునట్లు అధిక సంఖ్యాక ప్రభుత్వములలో అధికారము అధిక సంఖ్యాక ప్రజల శ్రేయస్సు కొరకే వినియోగమై అల్పసంఖ్యాకులకు కష్టనష్టములు కలుగు ప్రమాదము లేకపోలేదు. స్వార్థమందలి అభిమానము, అసూయ మొదలైనవి మానవులందరిలో కనుపించు అవలక్షణములు. ప్రజలలో అధికసంఖ్యాకులు ధనహీనులు; ధనవంతులుగ ఉండువారు అల్పసంఖ్యాకులు. అధిక సంఖ్యాకులు విద్యావిహీనులు; విద్యావంతులు అల్పసంఖ్యాకులు. సామాన్య కులములకు చెందినవారు అధిక సంఖ్యాకులు, అగ్రకులములకు చెందిన వారు అల్ప సంఖ్యాకులు. భారత దేశములో హిందువులు అధిక సంఖ్యాకులు. మహమ్మదీయులు, క్రైస్తవులు, సిక్కులు మొదలైన వారు అల్ప సంఖ్యాకులు. ఇట్టి పరిస్థితులలో అగ్రకులజులకు, అల్పసంఖ్యాక మతములను అనుసరించువారికి నష్టము కలిగించు ప్రమాదము లేకపోలేదు. అధికసంఖ్యాకుల అజ్ఞానము, అసూయ, తాత్కాలిక లాభముల పట్ల గల శ్రద్ధ ఇట్టి ప్రమాదములకు దారి తీయవచ్చును. ప్లేటో, అరిస్టాటిల్ మొదలైన ప్రాచీన దార్శనికులు పై కారణములచే అధిక సంఖ్యాక ప్రభుత్వ విధానమును ఖండించిరి.

ఇట్టి ప్రమాదము సంభవించుటకు అవకాశము కలదని ఆధునిక రాజకీయవేత్తలు కూడ గ్రహించిన కారణమున అధిక సంఖ్యాక ప్రభుత్వముల అధికారము దుర్వినియోగము కాకుండుటకై రాజ్యాంగ మూలసూత్రములలో కొన్ని నియమములను విధించుట అవసరమని భావించిరి. అట్టి నియమములు భారత రాజ్యాంగము [చూ.] న కూడ కలవు. జాతి, మత, కుల భేదములతో నిమిత్తము లేక పౌరులందరికి ప్రాథమిక హక్కులను కల్పించుట, శాసన సభలను రెండు కక్ష్యలు గలవిగ రూపొందించుట, అధికార విభజన [చూ.] సూత్రమును అనుసరించి న్యాయస్థానములను ఏర్పరచుట మొదలైనవి ఇట్టి నియమములు [చూ. సం. 10 - పు. 166]. మా. వెం. రం.

**అల్లా ఉద్దీన్ ఖిల్జీ** (క్రీ. శ. 1296 - 1315 వ.): ఢిల్లీ సుల్తానులలో సుప్రసిద్ధుడుగ ఎన్నదగిన పాలకుడు అల్లా ఉద్దీన్ ఖిల్జీ. ఖిల్జీ వంశ స్థాపకుడగు జలాలుద్దీన్ యొక్క సోదరుని కుమారుడు అల్లా ఉద్దీన్. రాజ్యాధిపత్యమునందు పెద్ద ఆశగలవాడు. అందుకు అవసరమగు శక్తి, యుక్తులు కూడ ఇతనికి కలవు. జలాలుద్దీన్ పాలించు కాలమున ఇతడు అయోధ్య మొదలయిన ప్రాంతములను కొన్నిటిని సామంతుడుగ ఏలెను. 1294 లో ఇతడు వింధ్య పర్వత శ్రేణికి దక్షిణమున హిందువులగు యాదవుల [చూ.] పాలనమందు ఉన్న దేవగిరిపై దండెత్తి జయించి ధనమును, యశస్సును సంపాదించెను. ఇట్లు సింహాసనము ఎక్కకపూర్వమే తన ప్రజ్ఞావిశేషమును దిఙ్మాత్రముగ చూపెను. కడకు ఇతడు మాయోపాయమున జలాలుద్దీన్ సుల్తాన్‌ను పరిమార్చి, 1296 లో ఢిల్లీ సింహాసనమును ఆక్రమించిన నాటినుండి తన రాజకీయ చతురతను అనేక రీతుల కనపరచెను.

మొదట సామదానోపాయములను ఉపయోగించి జలాలుద్దీన్‌యందు అభిమానముగల సామంతులను సైనికోద్యోగులుగ నియమించి తన పక్షమున ఇతడు చేర్చుకొనెను. దండోపాయముచే జలాలుద్దీన్ యొక్క ఇద్దరు కుమారులను తనకు అడ్డురాకుండునట్లు చేసికొనెను. తదుపరి కాలక్రమమున తన అధికారమునకు ఎదురు తిరిగిన వారిని అందరిని స్వ, పర భేదములేక కఠినముగ దండించి, తనకు అందరును భృత్యులగునట్లు చేసికొనెను.

ఇట్లు తన పదవిని సుస్థిరము ఒనర్చుకొనిన తరువాత రాజ్యమును విస్తృతమొనర్చుటకు ఆతడు పూనుకొనెను. ఇతని కాలమున మంగోల్‌ల దండయాత్రల వలన భయము పూర్వముకన్న హెచ్చు అయినది. అల్లా ఉద్దీన్ ధైర్యమును వీడక జఫర్‌ఖాన్ వంటి సమర్థులగు సేనానుల సాహాయ్యముతో ఆపదలనన్నిటిని తప్పించుకొనగలిగెను. మంగోల్‌లు దేశముపై బడినపుడు వారిని ఎదుర్కొనుటయే

కాక, వారు తిరిగి దాడిచేయకుండ నిరోధించుటకు గాను అల్లా ఉద్దీన్ వారి మార్గమునకు అడ్డుగ బలమగు కోటలను గట్టి, తగు సైన్యమును ఉంచెను.

మంగోల్ల దండయాత్రలను ఎదుర్కొను కాలముననే అల్లా ఉద్దీన్ తన రాజ్యమును విస్తృతపరచుటకు గూడ ప్రయత్నించెను. 1305 నాటికి వింధ్యపర్వతములకు ఉత్తరమున గల దేశమంతయు (కాశ్మీర్, అస్సామ్ మినహాగా) ఈ సుల్తాన్ అధికారమునకు లోబడినది. ఇక - దక్కను, దక్షిణ భారతదేశములను లోబరుచుకొనుటకు ఆశించి అల్లా ఉద్దీన్ తన ముఖ్య సేనానులలో ఒకడగు మాలిక్ కాఫూర్ నాయకత్వమున దండయాత్రలు చేయించెను. కాఫూర్ సాగించిన దండయాత్రలు మొత్తము నాలుగు: (1) 1306 లో యాదవ రాజగు రామచంద్రదేవుని పాలనమందుండిన దేవగిరి పతనమయ్యెను; (2) కాకతీయ ప్రతాపరుద్రుడు 1310 లో లోబడవలసి వచ్చెను; (3) ద్వారసముద్ర పట్నమందలి హొయసల ప్రభువులు; (4) మధురను ఏలుచున్న పాండ్యరాజులు పరాజయమొందిరి. అల్లా ఉద్దీన్ దక్షిణమున రాజులను వశము చేసికొని, వారు ఒసగిన ధన కనక వస్తు వాహనాదులతోను, కప్పములతోను సంతృప్తి చెందెను. పరిపాలనా బాధ్యత ఉత్తరదేశమునందు పెట్టుకొన్నట్లు దక్షిణదేశమునందు ఇతడు పెట్టుకొనలేదు.

సామ్రాజ్య సముపార్జనమందేకాక రాజ్యపాలనా తంత్రమును ఉచిత రీతిని చక్కదిద్దుకొనుటలో కూడ అల్లా ఉద్దీన్ తన ఉపజ్ఞను కనబరచెను. సైన్యమును సమాయత్తపరచు సందర్భమున మోసము జరుగకుండ జాగ్రత్తపడుటయేకాక, సైనికులకు సర్వకాల సర్వావస్థలయందును వస్తువులు సులభముగ లభించుటకుగాను వాని ధరలు ముందుగ నిర్ణయించు పద్ధతిని ఇతడు అమలులో ఉంచెను. ప్రభుత్వ కార్యనిర్వహణకు కావలసిన ధనము సంపాదించుటకు అనేక విధముల పన్నులను విధించెను. ఇదికాక, రాజ్యాంగవ్యవహారములను పరిష్కరించుటలో మత గురువుల సలహాలను అనుసరింపక స్వతంత్రముగ వర్తించిన మొదటి సుల్తాను ఇతడే. ఇది ఇతని ప్రత్యేక విశిష్టతకు సాక్షి.

అల్లా ఉద్దీన్ యొక్క సామ్రాజ్యము అతనితోనే అంతరించినది; కాని, అతని దక్షిణ దండయాత్రలు, రాజ్యాంగ సంస్కరణలు మాత్రము తరువాతి మహమ్మదీయ పాలకులకు మార్గదర్శకములు అయినవి. ఓ. ఎస్. ఎన్. మూర్తి.

**అశోకుడు** (క్రీ. పూ. 272 - 231 ప.): ప్రాచీన భారతదేశమందలి మగధరాజ్యమును ఏలిన మౌర్యవంశ రాజులలో మూడవవాడు; చంద్రగుప్తుని మనుమడు; బిందుసారుని కుమారుడు. బిందుసారుడు (క్రీ. పూ. 297 - 272 ప.) రాజ్యము చేయుచుండిన కాలములో అశోకుడు



అశోక స్తంభాగ్ర మకుటము

యువరాజుగ ఉండి, తక్షశిలలోను, ఉజ్జయినిలోను రాజప్రతినిధిగా వ్యవహరించెను.

బిందుసారుడు క్రీ. పూ. 272 లో చనిపోయినను, క్రీ. పూ. 269 లో గాని అశోకుని పట్టాభిషేకము జరుగలేదు. అందుకు కారణము రాజ్యమునకై పోటీచేసిన అతని అన్నదమ్ముల పోరాటము. తుదకు అశోకుడే విజయుడై క్రీ. పూ. 269 లో రాజ్యము ఏలుటకు మొదలుపెట్టెను. ఇతని కాలమందలి సంఘటనలలో మొట్టమొదటిది కళింగ విజయము; ఇది క్రీ. పూ. 261 లో జరిగినది. ఈ సంగ్రామమందు తానే విజయుడైనను - వేల కొలదిగ హతులైన, క్షతగాత్రులైన వారి రక్తము కాలువలు కట్టి ప్రవహించుట చూచి - జీవహింస యెడల రోతయు, సకలజీవుల యెడల దయయు కలిగి, అశోకుడు శీఘ్రకాలములో బౌద్ధధర్మములను అలవర్చుకొని, బౌద్ధమతమును తాను అవలంబించుటేకాక,

లోకులందరును అవలంబించవలెనన్న సంకల్పముతో దానిని వ్యాపింపజేయుటకు తగిన ప్రచారకులను నియమించెను.

అశోకుడు బౌద్ధమతమును అవలంబించి బోధించినను, భిక్షుక ధర్మమును స్వీకరించ లేదు. భిక్షువయినగాని ముక్తి లభింపదను బౌద్ధ సిద్ధాంతమును పాటించి, అశోకుడు 240 లో రాజ్యపాలనము తన యువరాజునకును, మంత్రులకును అప్పగించి సన్యాసియై ఉండెను. కాని, రాజ్యపాలనమునకు సంబంధించిన ముఖ్యవిషయములు ఇతడే ఆలోచించి ఆజ్ఞలను ఒసగుచుండెనే కాని, రాజ్యమును పూర్తిగ విడిచిపెట్టి పోలేదు.

రాజ్య విస్తృతి : అశోకుని శిలాశాసనములు లభ్యములైన స్థలములను బట్టి చూడ ఈతని సామ్రాజ్యము వాయవ్యమున హిందూకుష్ పర్వతము మొదలు, తూర్పున గంగానదీ ముఖద్వారమందలి తామ్రలిప్తి (తామ్లూక్) వరకును, ఉత్తరమున హిమాలయములనుండి దక్షిణమున మైసూరు ప్రాంతమువరకును వ్యాపించి ఉండెనని స్పష్టము అగుచున్నది. పాండ్య, చోళ, చేరరాజ్యములు ఆ సామ్రాజ్యమునందు అంతర్భాగములు కాకున్నను, అశోకుని దాక్షిణ్యము వలననే తమ స్వతంత్ర ప్రతిపత్తిని నిలుపుకొనగలిగినవి.

పరిపాలనము చక్కగ సాగుటకు అశోకుని సామ్రాజ్యము అంతయు నాలుగు పెద్ద మండలములుగ విభక్తమైనది. మండలములను మండలాధిపతులు రాజప్రతినిధులుగ పాలించుచుండిరి. (1) తక్షశిల రాజధానిగ ఉండిన మండలము వాయవ్య భాగమందును; (2) ఉజ్జయిని రాజధానిగ ఉండిన మండలము మధ్యభాగమందును; (3) తోసలి రాజధానిగ ఉండిన మండలము తూర్పున కళింగ ప్రదేశమందును; (4) నాలుగవ మండలము నర్మదానదికి దక్షిణమందును వ్యాపించి ఉండెను. పాటలీపుత్రము (నేటి పాట్నా) సామ్రాజ్యమంతటికిని కేంద్రమగు రాజధాని. అక్కడ అశోక సామ్రాట్ నిల్చి తన అధికారమును నలుదెసలకును వ్యాపింపజేయుచుండెను.

ఇంతటి సువిశాల సామ్రాజ్యమందలి వివిధ జాతుల ప్రజలును సుఖజీవనము చేయుచు, ధార్మిక జీవనము గడపునటుల చూచుట తన విధిగ అశోకుడు భావించెను. బౌద్ధ ధర్మమును అవలంబించినది మొదలుగ అతడు ఆదర్శ వ్యక్తిగ జీవించి, ప్రజలను సత్పథగాములుగ చేయుటకు మార్గదర్శకుడయ్యెను. బౌద్ధమత గ్రంథములందలి ప్రక్షిప్త పాఠములను తొలగింప జేయుటకై క్రీ. పూ. 260 లో తన రాజధానియగు పాటలీపుత్రనగరమున బౌద్ధుల సమావేశము ఒకదానిని 'సంగీతి' అనుపేర ఇతడు ఏర్పాటు చేసి అందు కృతకృత్యుడయ్యెను. అదియే తృతీయ సంగీతి [చూ. పు. 61].

తీర్థయాత్రలు : బుద్ధదేవుని జీవితముతో సంబంధము గలిగిన వివిధ స్థలములను దర్శించి ధన్యుడు కావలయునను తలంపుతో అశోకుడు క్రీ. పూ. 246 నుండి దేశ పర్యటన కావించెను. బుద్ధుడు పుట్టిన లుంబినీ వనము (నేపాల్) ను చూచి అక్కడ ఒక శిలాశాసనమును నిలబెట్టెను. కపిలవస్తు, శ్రావస్తి, కుశీనగరము మొదలగు బౌద్ధక్షేత్రములను కూడ దర్శించి దానధర్మములు చేసి, శిలాఫలకములపై శాసనములు చెక్కించి నిలిపెను.



అశోక చక్రవర్తి చెక్కించిన శిలాశాసనము – గిరినార్

శిలాశాసనములు : బౌద్ధ ధర్మ ప్రచారమునకే కాక రాజ్య పరిపాలనా పద్ధతికిని సంబంధించిన విషయములు పరిపాలకులకును, పరిపాలితులకును తెలియవలసిన విషయ

ములు కలవి యగుటచేత అశోకుని శిలా శాసనములకు ప్రాముఖ్యము హెచ్చినది. శాసనములందలి భాష మొత్తము మీద ప్రాకృత భాషయే కాని, ఆ యా ప్రదేశములందలి మాండలిక భేదములు ఆ యా ప్రదేశము లందలి శాసనములలో కనబడుచున్నవి. వాయవ్య ప్రదేశమందలి శాసనములలో పెక్కు ఖరోష్ఠీ లిపిలోను, ఒకటి అరమాయికు లిపిలోను, వేరొకటి గ్రీక్ లిపిలోను చెక్కబడినవి. ఇక తక్కిన సామ్రాజ్య మందలి శాసనము లన్నియు బ్రాహ్మీ లిపిలో చెక్కబడినవి [చూ. సం. 6 - పు. 769]. అశోకుని శాసనములను అన్నిటిని ఎనిమిది వర్గములుగ పేర్కొనవచ్చును.

గుహా శాసనములు : ఇవి మూడు. గయ సమీపము నందున్న బరాబరు కొండ గుహలయందు ఉన్నవి. అశోకుడు రాజ్యాభిషిక్తుడైన సమయమందు అజీవికులను జైన మతస్థులకు ఈ గుహలను బహుమతిగ ఇచ్చినట్లు వారి కొరకు కట్టిన మహా విహారములందు చెక్కబడినది. వీనిలో ఒకటి క్రీ. పూ. 257 లోను, మరి రెండు క్రీ. పూ. 250 లోను చెక్కినట్లు కనబడును.

భాబ్రా శాసనము : క్రీ. పూ. 257 లోనో లేదా 256 లోనో ప్రతిష్ఠితమైనది. ఇది బైరాత్ అను స్థలమందు దొరుకుట చేత ఈ శాసనము 'బైరాత్ శిలా శాసనము' అను పేరను కలకత్తాలో ఉన్నది. బౌద్ధసంఘమందలి సన్యాసులకు తెలియవలసిన త్రిపిటకములలోని ఏడు సుభాషిత వచనములు ఇందు కలవు.

పదునాలుగు శిలాశాసనములు : క్రీ. పూ. 257 - 256 లో రచితములైనవి. ఇవి వేర్వేరుచోట్ల కనబడినవి. ఈ శాసనములలో బౌద్ధ ధర్మ సిద్ధాంతములు, రాజనీతి ధర్మములు, రాజోద్యోగులు అనుసరించవలసిన ధర్మములు విశదముగ వివరించబడినవి.

రెండు కళింగ శాసనములు : క్రీ. పూ. 256 లో అశోకుడు జయించిన కళింగ దేశమందు నెలకొల్పబడినవి.

రెండు తరాయ్ స్తంభ శాసనములు : అశోకుడు రాజ్యమునకు వచ్చిన 20 యేండ్లకు తాను చేసిన తీర్థయాత్రలకు చిహ్నముగ చెక్కించిన శాసనములు.

ఏడు స్తంభ శాసనములు : క్రీ. పూ. 245, 242 మధ్య చెక్కబడినవి. ఇందు ఆరింటను పైన పేర్కొన్న 14 శాసనములలోని విషయములే విపులముగ విశదీకరింపబడినవి.

లఘు శిలాశాసనములు : క్రీ. పూ. 257 - 256 లో రచితములైనవి.

చిల్లర శాసనములు : క్రీ. పూ. 240 నాటివి. సాంచి, సారనాథ్‌లలో కనబడినవి. స్వమత ద్వేషులయిన సన్యాసులను పట్టి కాషాయ వస్త్రములను విసర్జింప జేయవలసిన దని అశోకుడు తన సామంతునకు ఇచ్చిన ఆజ్ఞ సారనాథ్ శాసనములో ఉన్నది.

ఈ శాసనములందు అశోకుడు అవలంబించి, బోధించిన ధర్మములు స్పష్టముగ తెలియజేయబడినవి. ఇవి : తలిదండ్రుల యెడల గౌరవము, సత్యప్రియత్వము, భూతదయ, పరమత సహిష్ణుత మొదలయినవి; అధికారులు రాజ్య పరిపాలన విషయములో ఆచరించవలసిన ధర్మములు కూడ వీనియందు విశదీకరింపబడినవి. రాజ్యాధికారులు తమ తమ అధీనమందు ఉండిన మండలములందు సంచారములు చేయునప్పుడు అక్కడక్కడ సభలు జరిపి, జనులకు ధర్మోపదేశము గావించుచుండవలెనని అశోకుడు శాసించెను.

చికిత్సాలయములు తన దేశమందే కాక ఇతర దేశములందును అశోకుడు కట్టించి, రోగార్తులైన మానవులకే కాక, పశువులకును చికిత్స చేయించుటకు తగిన వైద్యులను, ఔషధములను సిద్ధపరచెను. ఔషధములకు కావలసిన ఓషధులను తోటలలో వేయించు చుండెను.

అశోకుడు బౌద్ధమత ధర్మము బోధించుటకు ధర్మోపదేశకులను నియమించి మత ప్రచారము కావించెను. అశోకుడు నియమించిన మత ప్రచారకులు పశ్చిమ ఆసియా, గాంధార, యవన దేశములకును, చోళ, పాండ్య, కేరళ, సత్యపుత్రి దేశములకును పోయి బౌద్ధమతమును వ్యాపింపజేసిరి. అశోకుడు తన కుమారుడు మహేంద్రుని, కుమార్తె సంఘమిత్రను సిలోన్ (సింహళము) నకు మత ప్రచారకులుగ పంపెను. ఆ నాడు వీరిరువురును నాటిన ధర్మ బీజమే బౌద్ధమత మహావృక్షమై నేటికిని సిలోన్‌లో నిలచి ఉన్నది [చూ. సిలోన్, దీపవంసము-మహావంసము]. ఈ విధముగ అశోక చక్రవర్తి బౌద్ధమతమును వ్యాప్తి జేయుట వలన అతని రాజ్యాధికారమునకు లోబడిన విశాల సామ్రాజ్యము కంటె అతని మత ప్రాబల్యమునకు లోబడిన ప్రదేశముల విస్తృతి అత్యధికమయి ఉండెను.

రాజకీయముగను, సామ్రాట్‌గను అశోకుని మించిన వారు ప్రపంచ చరిత్రలో కొందరు కలరు. కాని, సర్వతోముఖ రాజ లక్షణములు ఒక్కచో సంకలనము కలిగి ఉన్న అశోకుని వంటి మహనీయ చక్రవర్తులు ప్రపంచములో అరుదుగా ఉందురు. పశుబలము అనదగు రాజకీయ సైనిక బలముతో కాక, సాంస్కృతిక ప్రాబల్యముతో అశోకుడు తన సామ్రాజ్యమంతటను శాంతిని నెలకొల్పుటయే కాక, దేశస్థుల హృదయములందు సద్గుణములను పెంపొందింప గలిగెను.

అశోకుడు క్రీ. పూ. 232 - 31 లో నిర్యాణము చెందెనను, అతని ధర్మచక్రము నేటికిని (భారతదేశ జాతీయ పతాకముపై) భారత జాతికి రాజధర్మ సూచకమై ఎల్లరకు శిరోధార్యమైనది. గి. వేం. సీ.

**అసఫ్ అలీ (1888 - 1952):** భారత జాతీయ కాంగ్రెస్ [చూ.] నాయకులలో ఒకడు. కాంగ్రెస్ ఉద్యమము సందర్భములలో పలుమారులు కారాగార వాసము అనుభవించెను. ఢిల్లీ, లండన్ నగరములలో విద్యాభ్యాసము చేసెను. యూరప్‌లోని వివిధ దేశములలో పర్యటించెను. కొంతకాలము ఢిల్లీ మునిసిపల్ కమీషనర్‌గ వ్యవహరించెను. 1934 లో కాంగ్రెస్ పార్లమెంటరీ బోర్డ్ కార్యదర్శి అయ్యెను; జాతీయ ముస్లిమ్ పక్ష ప్రముఖ సభ్యుడు; 1935 లో ఢిల్లీ సంయుక్త నియోజక వర్గము నుండి కేంద్రశాసనసభకు ఎన్నిక అయ్యెను. చాల సంవత్సరములపాటు కాంగ్రెస్ కార్యవర్గ సభ్యుడు. 1942 ఆగస్టు ఉద్యమ ప్రారంభమున ఇతర కార్యవర్గ సభ్యులతోపాటు అహ్మద్‌నగర కోటలో నిర్బంధావాసము నకులోనై, 1945 లో విడుదలై, ఆ ఏడే తిరిగి కేంద్రశాసన సభకు ఎన్నిక అయ్యెను. 1946 - 47 లో తాత్కాలిక ప్రభుత్వములో రవాణా మంత్రిగ పనిచేసెను. 1947 లో యునైటెడ్ స్టేట్స్‌కు మొదటి రాయబారిగ నియుక్తుడు అయ్యెను. 1948 లో వెనుకకు పిలిపింపబడి, ఒరిస్సా గవర్నర్‌గ నియమింపబడెను. ఆ పదవిలో ఉండగనే 1952 లో చనిపోయెను. ఈయన భార్య అరుణా అసఫ్ అలీ ప్రముఖ సోషలిస్ట్‌గ 1942 ఆగస్టు ఉద్యమములో ప్రధాన పాత్ర వహించినది. ఉర్దూ, ఇంగ్లీషు భాషలలో 'స్టాలిన్ జీవితము' మున్నగు పలు గ్రంథములను అసఫ్ అలీ రచించెను. బొ. శ్రీ.

**అసీరియన్ నాగరకత :** చూ. పు. 17.

**అసీరియన్ సామ్రాజ్యము :** ప్రాచీన చరిత్రలో ఈజిప్టు, బాబిలోనియా మొదలగు సామ్రాజ్యములతో పాటుగ పేరు గాంచి, మానవ నాగరకతాభివృద్ధికి కారణమైన ఒక సామ్రాజ్యము. 'అసుర్' అనునది అసీరియన్‌ల మాతృభూమి. నేటి టైగ్రిస్ నదిని అనుకొని పశ్చిమమున పశ్చిమ ఆసియా ఎడారి వరకుగల ప్రాంతమే ఆనాడు 'అసుర్' అనబడెడిది.

క్రీ. పూ. 2000 ఏండ్ల క్రిందట ఆసియామైనర్‌లో గల హిటైట్ జాతి [చూ.] ఈ దేశమును పాలించి ఉండవచ్చును. పిమ్మట కొంతకాలము ఈ దేశము దక్షిణమున గల ఉర్ మొదలైన బాబిలోనియన్ రాజ్యముల పాలనములో కూడ ఉండి ఉండవచ్చును. ఉత్తర, దక్షిణ ప్రాంతముల రాజులతో నిరంతరము స్వాతంత్ర్యము కొరకు పోరాడవలసి వచ్చుచుండుటచే అసీరియన్‌లు మంచి వీరజాతి ప్రజలుగ రూపొందిరి.

మహావీరులచే స్థాపితములైన అసీరియన్ నగర రాజ్యములు బలవత్తరముగ ఉండి, తుదకు బాబిలోనియా రాజ్యమునే కూలద్రోసి, ఒక సామ్రాజ్యమును నిర్మింపగలిగినవి. అదృష్టవశమున పురాతత్త్వ శాస్త్రజ్ఞుల కృషి ఫలితముగ ఈ అసీరియన్ సామ్రాజ్య పాలకులను గురించిన వివరములు పెక్కు తెలియవచ్చినవి. ఆ పాలకులలో ఒకడగు సార్గన్ - II యొక్క రాజధాని ఉండెనని భావింపబడుచోట పురాతత్త్వజ్ఞులు సాగించిన త్రవ్వకములలో ఒక ఫలకముపై అసీరియాను ఏలిన రాజుల పట్టిక ఒకటి దొరకినది. దీనిలో క్రీ. పూ. 3000 ఏండ్ల ప్రాంతమున ఏలిన మొట్టమొదటి రాజు నుండి మొత్తము 107 మంది రాజులు ఉండిరి. వీరిని గూర్చి పూర్తి వివరములు తెలిసినచో 1500 ఏండ్లు పాలించిన ఈ రాజుల చరిత్ర మనకు పూర్తిగ తేదీలతో సహా తెలియగలదు.

క్రీ. పూ. 14, 13 శతాబ్దములలో ఈజిప్టు, హిటైట్ సామ్రాజ్యములు పశ్చిమమున అధికారముకొరకు కొట్లాడుకొనుచుండగా, అసీరియన్‌లు తూర్పుననే ఉండి, అచట తమ స్థావరములను బలపరచుకొనుచుండిరి. అరామియన్‌లతో యుద్ధము వలన క్రీ. పూ. 10 వ శతాబ్దమున వారి బలము పూర్తిగ దెబ్బతిన్నది. క్రీ. పూ. 9 వ శతాబ్దములో అసీరియన్‌లు తిరిగి బలవత్తరులై పశ్చిమ దేశములపై దండయాత్రకు తలపడిరి. క్రీ. పూ. 732 లో వారు డమాస్కస్‌ను జయించిరి. అనంతరము ఇతర పశ్చిమ దేశములు కూడ క్రమముగ అసీరియన్‌ల వశమైనవి.

స్వర్ణయుగము : క్రీ. పూ. 722 తో హిబ్రూ పట్టణమైన 'సెమరియా' ముట్టడిలో అసీరియా రాజు మరణించెను. అతని కుమారుడు సార్గన్ - II అటుపిమ్మట రాజై అసీరియా సామ్రాజ్య ప్రతిష్ఠను ఇనుమడింప జేసెను. సార్గన్ - II, అతని అనంతరము రాజ్యమేలిన అతని వంశీయులు కొందరును కలసి అసీరియాను ప్రపంచ దేశములకు అన్నింటికిని తలమానికముగ తీర్చిదిద్దిరి. 'నినివే' పట్టణమునకు ఈశాన్యముగ సార్గన్ - II 'డర్ సరూక్కిన్' లేదా 'సార్గన్‌నివాసము' అను రాజభవనమును కట్టించెను. దాదాపు 2½ చ. కి. మీ. విస్తీర్ణము గల ఆ ప్రదేశమున మొత్తము ఎనిమిదివేల మంది నివసించుచుండిరి. మందిర విస్తీర్ణము సుమారు 10 హెక్టేర్‌లు ఉండెను. పశ్చిమ ఆసియా అంతయు ఈ సార్గన్ ఆధిపత్యమునకు లోబడినది. సార్గన్ కంటె కూడ అతని కుమా

రుడు సెనెకరిబ్ గొప్ప చక్రవర్తి అని పేరొందెను. ఇతడు క్రీ. పూ. 705 మొదలు 681 వరకును రాజ్యమును ఏలెను. ఈ కాలము అసీరియన్ సామ్రాజ్య చరిత్రలో 'స్వర్ణయుగ' మని ప్రఖ్యాతి పొందినది. మధ్యధరా ప్రాంత మండలి ఫొనీషియన్ రేవు పట్టణములను జయించి, ఇతడు ఈజిప్టు సరిహద్దుల వరకును అసీరియన్ సామ్రాజ్యమును విస్తరింపజేసెను. సెనెకరిబ్ కుమారుడు క్రీ. పూ. 674 లో నైలు డెల్టా దుర్గములపై దండెత్తెను. అతడు అక్కడ మరణించినప్పటికిని, తత్ఫలితముగ ఈజిప్టు మాత్రము అసీరియన్ల వశమయ్యెను. సెనెకరిబ్ దిగువ నైలునదీ ప్రాంతమునకు కొంతకాలము పాటు ప్రభువుగా కూడ ఉండెను.

అసుర్‌లో తన తండ్రి కట్టించిన రాజ భవనమును విస్తృతము చేయుటతో సెనెకరిబ్ ఊరకుండలేదు. అసుర్‌కు ఉత్తరమున గల 'నినివే' నగరము నుఅతడు మనోహరముగ తయారు చేసెను. ఆ పట్టణ ప్రాకారములు టైగ్రిస్ నదీ తీరము వెంబడి సుమారు 4 కి. మీ. పొడుగున వ్యాపించి ఉండెను. ఈ నగరమునే రాజధానిగ చేసికొని, పశ్చిమ ఆసియా అంతటిని అసీరియా రాజులు పరిపాలించుచుండిరి.

సెనెకరిబ్ తన కాలమున ప్రభుత్వ వార్తాహరులద్వారా ఉత్తర ప్రత్యుత్తరములు నడపెడివాడు. ఆసియాలో రహదారులు నిర్మించుటకు కూడ అదే మొదలు. సార్గన్ కాలము నాటి రాజ భవనము నొకదానిని త్రవ్వగా, ఒక ఆయుధాగారములో సుమారు రెండువందల మెట్రిక్ టన్నుల ఇనుప ఆయుధములు కనిపించినవి. అసీరియన్ సేన ప్రపంచమున పెద్ద పెట్టున ఇనుప ఆయుధములను ఉపయోగించిన ప్రప్రథమ సైన్యము.

విదేశములకు పోయినప్పుడు అసీరియన్‌లు ఆ యా దేశముల శిల్పములను చూచి, తమ శిల్పకళలను విశేషముగ పెంపొందించుకొనిరి. అసీరియన్‌లు నిర్మించిన 'ముగ్గురు రాజుల సింహద్వారములు'ను, ఆ ద్వారముల కిరుప్రక్కలను రంగు రంగుల పింగాణీ ఇటుకలతో చేసిన అనేక చిత్రములును మిక్కిలి మనోహరములైనవి. రాజప్రాసాదములో గోడలపై అనేక శిల్పములును, చిత్తరువులును కలవు. నినివే వద్ద త్రవ్విన ఒక శిథిలముల గుట్టలో 71 హాలులకు చెందిన గోడల శిథిలములు సుమారు 3 కి. మీ. పొడవు కలవి కనిపించినవి. ఇవి అన్నియు నాటి అసీరియన్ చక్రవర్తుల వీరగాథలను, వేట మొదలైనవారి సాహస కృత్యములను నిరూపించుచున్నవి. ఈ చిత్రములు నేటికిని బ్రిటిష్ మ్యూజియమ్‌లో భద్రపరుపబడి ఉన్నవి.



అసీరియా రాజధాని బహిర్ద్వారమువద్ద గల భీకర జంతుమూర్తి

అసీరియన్ శిల్పులు చిత్రించిన సింహములను, పులులను, ఎద్దులను చూచినచో అసామాన్య శిల్పనైపుణి, విలక్షణత అందు వ్యక్తమగుచున్నవి. ఈ శిల్పములకు రంగులు కూడ వేయబడినవి. ఈ రంగులు వెలిసిపోకుండా నేటికిని అట్లే మెరయుచున్నవి. ఈ శిల్పకళను చాల వరకు ఈజిప్టువారినుండియు, హిట్టైట్‌లనుండియు అసీరియనులు గ్రహించిరి. ఇంకను విలక్షణమైన నాగరకతను సూచించు మరికొన్ని లక్షణములు అసీరియాలో కనిపించును. సార్గన్ - II పాతవ్రాతప్రతులను సంగ్రహించి, భాండాగారము నొక దానిని సంతరించి, ఫలక రూపమున ఉండిన గ్రంథములను అందు పెట్టించెను. అతని తరువాత చక్రవర్తులు ఈ భాండాగారమును అభివృద్ధిపరచిరి. సెనెకరిబ్ మనుమడు అసుర్ బనిపాల్ క్రీ. పూ. 669 లో తన తండ్రి తనకు విలువిద్యతోపాటు మట్టిఫలకములపై వ్రాయుటయు, చదువుటయు కూడ నేర్పెనని సగర్వముగ తెలుపుకొనెను. అసుర్ బనిపాల్ గ్రంథాలయములో 22 వేల మట్టి ఫలకములు 2500 ఏండ్లుగ కప్పువడి ఉన్నవి. ఇందు మత, సారస్వత, వైజ్ఞానిక గ్రంథములు పెక్కు కలవు. ఆసియాలో ప్రథమ గ్రంథాలయము ఇదియే. అన్ని రంగములందును అసీరియన్ నాగరకత బాబిలోనియన్‌ల నాగరకతను అధిగమించినది. నాటి ఇతర రాజులవలెనే అసీరియన్ చక్రవర్తులు కూడ పరిశ్రమలను, తద్వారా దేశసంపదను పెంపొందించుటకు కృషిచేయలేదు. సర్వదా సైన్యములను పెంపొందించుకొనుట యందే ఎక్కువ శ్రద్ధ చూపిరి. వ్యవసాయ

దార్లను కూడ చేర్చుకొని, తమ సైన్యమును అభివృద్ధి చేసికొన సాగిరి. తత్ఫలితముగ అనేకములైన పంట పొలములు బీళ్లుగ మారిపోయినవి. ఇటుల పంట పొలములను బీడుపెట్టుటచేతను, పరిశ్రమలు వృద్ధిపొందక పోవుటచేతను, వాణిజ్యము అరామియన్ వర్తకుల చేతులలో ఉండి, అరామిక్ భాషయే సామ్రాజ్యమందంతటను వాడుకలో ఉండుటచేతను, అసీరియన్ సామ్రాజ్యము క్రమముగ బలమును కోల్పోయెను. అప్పటికే బాబిలోనియాను వశపరచుకొని, అవకాశము కొరకు నిరీక్షించుచుండిన కాల్డియన్‌లు క్రీ. పూ. 612 లో అసీరియన్ సామ్రాజ్య రాజధానియగు నినేవేపై దండెత్తి జయించిరి. అంతటితో అసీరియా సామ్రాజ్యము అంతరించినది [చూ. సం. 10 - పు. 175]. గి. వేం. సీ.

**అంగ్‌సాన్** (1914 - 1947) : బర్మా జాతీయ నాయకుడు ; రాజకీయవేత్త. విద్యార్థిదశలోనే జాతీయోద్యమములో ప్రవేశించి జైలుశిక్ష అనుభవించెను. 1940 లో జపాన్‌కు పారిపోయెను. ఆ తరువాత తిరిగి వచ్చి బర్మా స్వాతంత్ర్యసేనకు నాయకత్వమువహించి, 1942లో జపాన్ బర్మాపై చేసిన దండయాత్రకు తన సైన్యముతో కలిసి సహాయము చేసెను. ఆ పిమ్మట ఏర్పడిన 'కీలుబొమ్మ ప్రభుత్వము'లో రక్షణమంత్రిగా వ్యవహరించెను. అయితే, ఎక్కువకాలము గడవకముందే ఫాసిస్ట్ వ్యతిరేక ఉద్యమముతో రహస్య సంబంధాలు పెట్టుకొని, 1945 మార్చి నుండి జపాన్ వారిని తరిమివేయడానికి బ్రిటిష్‌వారితో బహిరంగముగానే సహకరించెను ; ఫాసిస్ట్ వ్యతిరేక ప్రజా స్వాతంత్ర్య సంఘ నాయకుడుగా, 1946 సెప్టెంబరులో పాలక మండలి ఉపాధ్యక్షుడుగా ఎన్నికైనాడు. 1947 జూలై 19 వ తేదీన అంగ్‌సాన్‌ను, మరి ఏడుగురు మండలి సభ్యులను మండలిభవనములోనే వారి రాజకీయ ప్రత్యర్థులు హత్యచేసిరి. పి. ఆర్. పి.

**ఆంగ్లో - ఫ్రెంచి మైత్రి** (ఎంటెంటీ) : 1904 మార్చి 8 వ తేదీన జరిగిన ఒడంబడిక ప్రకారము ఆంగ్లో - ఫ్రెంచి ప్రభుత్వములకు మధ్య కుదిరిన ఏకీభావము. ఈ ఒడంబడిక పై రెండు దేశములకు సంబంధించినంతవరకు : 1. పశ్చిమ ఆఫ్రికా, థాయిలాండ్, మడగాస్కర్ (మలగాసీ), న్యూహెబ్రిడిస్ ప్రాంతములలో గల చిరకాలపు తగాదాలను పరిష్కరించెను ; 2. ముఖ్యముగ న్యూఫౌండ్‌లాండ్‌లో చేపల పట్టుకొను హక్కులను నిర్ణయించెను ; 3. అన్నింటికన్న ముఖ్యముగ బ్రిటన్‌కు ఈజిప్టులోను, అందులకు బదులుగ ఫ్రాన్స్‌కు మొరాకోలోను ఇచ్చవచ్చిన రీతిగ వ్యవహరించుటకు సౌకర్యమును సమకూర్చెను. కాని, జిబ్రాల్టర్ భద్రతకుగాని, చారిత్రక గతిలో స్పెయిన్‌కు మొరాకోలో లభించిన వసతులకు గాని భంగము కలిగించురీతిగ మొరాకోలో దుర్గనిర్మాణమును ఫ్రాన్స్ చేయకూడదను మినహాయింపు చేర్చబడెను.

ఈ ఒడంబడిక పై ఉభయ రాజ్యముల మధ్య చిరకాలమునుండి ఉండిన వైషమ్యములకు స్వస్తిచెప్పెను. యుద్ధకాలపు మైత్రిగాని, జర్మనుల యెడల వ్యతిరేకత గాని తొలుతగ ఈ మైత్రియందు ఉద్దేశింపబడలేదు. అయితే, తరువాత జర్మనులు అవలంబించిన రాజకీయ విధానము ఆంగ్లో-ఫ్రెంచి సహకారమును బలపరచి, సైనిక ఒప్పందపు సంభాషణలకు దారి తీసెను. అయినను, 1914 లో ప్రపంచ యుద్ధము - I నకు తరువాతనే పై ఉభయరాజ్యములకు యుద్ధకాలపు మైత్రిని గురించిన సంధి కుదిరెను. స్వా. వెం.

**ఆంగ్లో - రష్యను మైత్రి** (ఎంటెంటీ) : 1904 లో కుదుర్చుకొనబడిన ఆంగ్లో - ఫ్రెంచి మైత్రివంటి ఏకీభావపు ఒడంబడిక (31-8-1907). దీని ప్రకారము ఈ రెండు దేశములకు ఇరాన్‌లో కల ప్రభావిత ప్రదేశముల అవధులకును, టిబెట్, ఆఫ్ఘనిస్తాన్ సంబంధమై ఉండవలసిన వైఖరులకును నిర్దిష్టత కల్పింపబడెను. ఈ ఒడంబడిక మధ్య ప్రాచ్యమునందు జర్మనుల ప్రవేశమును, ఆంగ్లో - రష్యను సంబంధముల చెడగొట్టుటకై వారు చేయు ప్రయత్నములను నిరోధించుటకు ప్రయత్నించినది. కాని, ఇది ఆంగ్లో-ఫ్రెంచి మైత్రి వంటి సాన్నిహిత్యమును సంపాదింపలేక పోయెను. అయినను, ఈ ఒప్పందము రష్యనులకు ఇంగ్లండుతో నిరాఘాటముగ వర్తకము చేసికొను సౌకర్యము కలిగించుటచే, వారు జపాన్‌తో జరిగిన యుద్ధమునందు ఓడుటవలన సంభవించిన నష్టమును, 1905 లో స్వదేశమునందు చెలరేగిన తిరుగుబాటును అణచుటయందు పొందిన నష్టమును పూర్తిచేసికొనగలిగిరి. స్వా. వెం.

**అంటొనైనస్ పయస్** (క్రీ. శ. 86 - 161) ; రోమన్ చక్రవర్తి (138 - 161 వ.). ఇతనికి పూర్వము చక్రవర్తిగ ఉండిన హాడ్రియన్ ఇతనిని దత్తునిగా చేరదీసి, తన వారసునిగ ప్రకటించి, ఉన్నతోద్యోగములందు నిలిపి, రాజ్య పరిపాలన, యుద్ధము చేయుటలో తగిన శిక్షణ పొందుటకు కావలసిన అవకాశము ఒసంగెను. పయస్ తాను చక్రవర్తి అయిన తర్వాత న్యాయధర్మశాస్త్రములందును, సాంఘికాచారములందును ప్రజలకు హితకరములయిన సంస్కారములను గావించెను. బానిసల కష్టములను కొంతవరకైనను తొలగించు సంస్కరణములు గావించి వారియెడల వారి యజమానులు ఎక్కువ దయతో వ్యవహరించు

నట్లు కట్టుదిట్టములను విధించెను. ఇతని కాలమున మండలముల పరిపాలనము అభివృద్ధి పొందినది. క్రైస్తవులకు రోమన్‌లవల్లను, ప్రభుత్వమువల్లను కలుగుచుండిన బాధలు తగ్గినవి. కళలను, శాస్త్రములను ఇతడు పోషించి వృద్ధిపరచెను. ఇతని పేరను రోమ్‌నగరమందు స్మారక చిహ్నముగ కట్టిన విజయస్తంభపు పీఠము మాత్రము వాటికన్‌లో ఉన్నది. స్తంభము పోయినది. గి. వేం. సీ.

**ఆంధ్ర రాష్ట్ర పరిపాలన** : చూ. సం. 4 - పు. 1397.

**ఆంధ్రులు** : చూ. సం. 3 - పు. 86.

**ఆంధ్రోద్యమము** : చూ. సం. 3 - పు. 467.

**ఆగ్స్‌బర్గ్ ఒడంబడిక (1555)**: క్రైస్తవ మతమున సంస్కరణ వాదముగ రూపొందిన ప్రొటెస్టంట్ వాదావలంబకులకు పోప్ పీఠాధిపత్యమును అభిమానించు రోమన్ కేతలిక్ సంప్రదాయానుయాయులతో కుదిరిన ఒక ఒడంబడిక. పవిత్ర రోమన్ సామ్రాజ్య చక్రవర్తియగు చార్లెస్ - V తన సామంతులందు ప్రొటెస్టంట్ వాదము వ్యాపించుటను అరికట్టుటకై తీవ్రకృషి చేయగ, దానిని ఎదుర్కొని ప్రొటెస్టంట్ సామంతులు సంయుక్తముగ చక్రవర్తి సేనలతో పోరాడిరి. కడకు ఉభయ పక్షములలో ఏదియును విజయమును సాధింపజాలక, చక్రవర్తి సోదరుడగు ఫెర్డినాండ్ కృషిఫలితముగ జర్మనీ యందలి ఆగ్స్‌బర్గ్ నగరమున 1555 లో సమావేశమై ఈ ఒడంబడికను కుదుర్చుకొనినవి. ఇందలి ముఖ్య విషయములు :

1. తన మండలమున సంస్కరణవాదము (ప్రొటెస్టంట్ వాదము)నకు అధికాదరణ ఉండవలయునా? లేదా? అను విషయమున ఆ మండలమును పాలించు సామంతునిదే కడపటి నిర్ణయముగ ఉండవలెను;
2. ప్రొటెస్టంట్ వాదమును అవలంబించు సామంతులు 1552 నకు పూర్వము స్వీయములుగ చేసికొనిన మత సంస్థల ఆస్తులు వారికే దక్కవలెను;
3. 1552 తరువాత ప్రొటెస్టంట్ వాదమును అవలంబించిన వారు మాత్రము క్రైస్తవ మత పీఠముల ఆస్తులను హరింపక వానిని పోప్‌నకు చెందజేయవలయును;
4. కేతలిక్ సామంతుల మండలములలో వసించు ప్రొటెస్టంట్‌లను తిరుగ కేతలిక్‌లుగ మార్చుటకు ఒత్తిడి చేయరాదు.' చీ. శే. రా.

**ఆగస్టు ఉద్యమము** : భారతదేశ స్వాతంత్ర్యమునకు దోహదకారులైన వివిధోద్యమములలో ప్రముఖమైన ఒక ఉద్యమము. ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున - ప్రజాభీష్టముతో నిమిత్తములేకుండ - భారతదేశమును యుద్ధములోనికి దించిన సామ్రాజ్య ప్రభుత్వమును నిరసించుచు, ఆ సామ్రాజ్య ప్రభుత్వము దేశమును వదలి పోవలసినదిగ ఆదేశించుచు అఖిల భారత కాంగ్రెస్ సంఘము ఆగస్టు 8, 1942 న బొంబాయినగరమునందు జరిగిన సమావేశమున తీర్మానించినది. ఆ తీర్మానమే 'క్విట్ ఇండియా' అను నినాదమునకు హేతుభూతమైనది. ఆ తీర్మానము ఆమోదింపబడిన తరువాత, మరునాటి వేకువజామున కాంగ్రెస్‌లోని ప్రముఖ నాయకులను అందరిని ప్రభుత్వము అరెస్టుచేసి, మారుమూల ప్రదేశములకు తరలించి నిర్బంధించినది. నాయకుల నిర్బంధమునకై కినిసి ప్రజానీకము తమంత తాముగ సాగించిన పోరాటమే ఆగస్టు ఉద్యమము. కాంగ్రెస్ తాను సాగించిన వివిధ పోరాటములందు ముఖ్యసూత్రముగ ఆదరించిన దౌర్జన్యరాహిత్యము ఈ ఉద్యమమున కొంతవరకు లుప్తమైనను, నాయక రహితమును, అవ్యవస్థితమును అయిన ఆ ఉద్యమమున బ్రిటిష్ సైనికులయు, తదనుచరులయు ప్రాణనష్టము వ్రేళ్లపై లెక్కింపదగినంత మాత్రముగనే జరిగినది. ఉద్యమ కార్యకర్తలు సామ్రాజ్య ప్రభుత్వ దమననీతికి ఆధారములగు రైలు మార్గములను, స్టేషన్‌లను, తంతి వార్తా సౌకర్యములను విచ్ఛిన్నము చేయుటలోనే అనితర శ్రద్ధవహించిరి. ఉత్తర భారతదేశములోని ఆగ్రా, అవధ్, వారణాసి, గోరఖ్‌పూర్, ముంగేర్, దర్భాంగ, చాంపరాన్, షాహాబాద్, పూర్ణియా, భాగల్పూర్, సారన్, ముజఫర్‌పూర్, పాట్నా ప్రాంతములందును, తూర్పు భారతదేశమున మిడ్నపూర్ ప్రాంతమునను, పశ్చిమ భాగమున సతారా, అష్టి, చిమూర్ ప్రాంతములందును, దక్షిణ భారత దేశమున గుంటూరు, కృష్ణా, పశ్చిమగోదావరి జిల్లాలలోను ఈ ఉద్యమము తీవ్రరూపమును పొందినది. సామ్రాజ్య ప్రభుత్వము దీనిని ఎదుర్కొనుటకై దౌర్జన్య సాధనములను అన్నింటిని ఉపయోగించినది. కడకు విమానములనుండి దాడులను కూడ సాగించినది. ప్రభుత్వపు లెక్కల ప్రకారము, ప్రభుత్వ చర్యలమూలమున 1942 సంవత్సరపు కడపటి అయిదు నెలలలో 60,000 మందికి పైగా అరెస్ట్ చేయబడిరి. 18,000 మంది విచారణలేని ఖైదుకు లోనైరి. పోలీసులయు, సైనికులయు కాల్పుల వలన 940 మంది హతులైరి; 1,630 మంది గాయపడిరి. ఈ చర్యలవలన ఉద్యమపు బాహ్యా తీవ్రత చాలవరకు శమించినది.

ఈ ఉద్యమమున తొలుతటి నుండియు కాంగ్రెస్‌లోని సోషలిస్ట్ వర్గనాయకులు ముఖ్యపాత్ర వహించిరి. 1943 లో హజారిబాగ్ జైలు నుండి జయప్రకాశ్ నారాయణ్ తప్పించుకొని వచ్చిన తరువాత, అవ్యవస్థితమగు ఈ ఉద్యమమునకు వ్యవస్థిత రూపమును కల్పించుటకు అజ్ఞాత

చర్యలవలన కొంత కృషి జరిగినది. కాని, ఆ సంవత్స రాంతమునకు ప్రభుత్వము జయప్రకాశ్ నారాయణ్‌ను మరల పట్టుకొనుటచే ఉద్యమ ప్రగతి కుంటువడినది.

ఆగస్టు ఉద్యమము ఇటుల కడకు అణచబడినను, దాని ఫలితములు తదనంతర భారత చరిత్రపై గాఢముగ పని చేయగలిగినవి. నిరుద్ధ భారతపు తీవ్రాసంతృప్తిని మరచి పోరాని రీతిగ ప్రపంచపు దృష్టికి ఆ ఉద్యమము తేగలిగి, తన్మూలమున యుద్ధానంతరమున భారత దేశము స్వతంత్రమగుటకు కొంతవరకు హేతువైనది [చూ. భారత దేశము].

చీ. శే. రా.

**ఆగ్నేయ ఆసియా రక్షణ వ్యవస్థ (సీటో):** ఆగ్నేయ ఆసియాలో కమ్యూనిస్ట్ ప్రభావమును అరికట్టు టకై ఏర్పడిన ఒక రక్షణ వ్యవస్థ. బ్రిటన్, ఆస్ట్రేలియా, దక్షిణ కొరియా ప్రభుత్వములు 1949 లో ఇట్టి సంస్థ అత్యావసరమని ప్రప్రథమముగ యునైటెడ్ స్టేట్స్‌కు సూచించినవి. ఈ రక్షణ వ్యవస్థ యూరప్‌లో కమ్యూ నిజమ్‌ను అరికట్టుటకై ఏర్పడిన ఉత్తర అట్లాంటిక్ రక్షణ వ్యవస్థ (నాటో) [చూ.]ను పోలి ఉన్నది. కాని, ఆసి యాలో అత్యధిక సంఖ్యగల స్వతంత్ర తటస్థ రాజ్యములు అన్నియు ఈ వ్యవస్థపట్ల అసమ్మతిని ప్రకటించెను. ఆసియా రాజ్యముల సహకారము లేకయే ఈ రక్షణ వ్యవస్థ సమర్థ వంతముగ పనిచేయజాలదని పశ్చిమ రాజ్యములకు తెలియును. ఐనను ఆగ్నేయ ఆసియాలోను, ఆసియా మొత్తములోను కమ్యూనిస్ట్ ప్రతికూల ప్రభుత్వముల ప్రయోజనములను సంరక్షించు సంకల్పముతో ఈ వ్యవస్థ స్థాపింపబడెను. ఇండోచీనా, ఉత్తర కొరియా దేశము లలో కమ్యూనిస్ట్ ప్రభుత్వములు ఏర్పడినప్పటినుండియు ఈ రక్షణ వ్యవస్థ ద్వారా యునైటెడ్ స్టేట్స్, బ్రిటన్ మున్నగు ప్రభుత్వములు ఆగ్నేయ ఆసియా ఆంతరంగిక వ్యవహారములలో అధికముగ జోక్యము కలిగించుకొన ఆరంభించినవి. ఆనాటినుండియు అంతర్జాతీయ రాజకీయ పరిస్థితులు విషమింపసాగెను.

యునైటెడ్ స్టేట్స్, బ్రిటన్, ఫ్రాన్స్, ఆస్ట్రేలియా, న్యూజీలండ్, పాకిస్తాన్, థాయిలాండ్, ఫిలిప్పిన్ రాజ్యముల ప్రతినిధులు 1954, సెప్టెంబరు 8 న రూపొందిన ఈ రక్షణ ఒడంబడికపై సంతకములు చేసిరి. సభ్యరాజ్య ముల నడుమ సహకారము నెరపుకొనుటకును, సమష్టి రక్షణ ఒనర్చుకొనుటకును, ఆంతరంగిక వ్యవహారములలో జోక్యము కలిగించుకొనకుండుటకును నిర్ణయములు చేయ బడినవి. కమ్యూనిస్ట్ రాజ్యములైన సోవియట్ రష్యా, చీనా [చూ.] వంటి దేశములు ఈ వ్యవస్థను బహిరంగ ముగ ఖండించినవి. ఈ వ్యవస్థ యొక్క ముఖ్య కార్యా లయము థాయిలాండ్ రాజధానియగు బాంకాక్‌లో ఉన్నది.

ప్ర. రా. సు.

**అటంబాంబు :** చూ. భౌతిక, రాసాయనిక శాస్త్ర ములు - సం. 2. పు. 167.

**అడమ్స్, జాన్ (1735 - 1826) :** యునైటెడ్ స్టేట్స్‌కు రెండవ అధ్యక్షుడు (1797 - 1801); క్విన్సీలో జన్మించెను. 1755 లో పట్టభద్రుడయ్యెను. వృత్తిరీత్యా న్యాయవాది. అమెరికన్‌లపై బ్రిటిష్‌వారు విధించిన స్టాంపు చట్టాన్నీ, అమెరికన్ విప్లవమునకు దారితీసిన ఇంకా అనేక ఇతర చర్యలనూ వ్యతిరేకిస్తూ రాజకీయాల్లో ప్రవేశించెను. ఈ కాలములోనే ఆయన తన నివాసాన్ని బోస్టన్‌కు మార్చి, బోస్టన్‌లోని దేశభక్తుల వర్గమునకు నాయకత్వము వహించెను. 1774 లో జరిగిన మొదటి కాంటినెంటల్ కాంగ్రెస్‌లోనూ, ఆ తరువాత జరిగిన రెండవ కాంటినెంటల్ కాంగ్రెస్‌లోనూ పాల్గొనెను. కాంటి నెంటల్ ట్రూప్ కమాండర్ - ఇన్ - చీఫ్‌గా జార్జి వాషింగ్ టన్ పేరును ప్రతిపాదించినది అడమ్సే. అమెరికా స్వాతంత్ర్య ప్రకటనను గట్టిగా సమర్థించటమేకాక, ముసా యిదా సంఘసభ్యుడుగా స్వాతంత్ర్య ప్రకటనను తీర్చి దిద్దుటలో ప్రముఖపాత్ర వహించెను. మస్సాచుసెట్స్‌లో జరిగిన రాజ్యాంగ మహాసభలో ఇతడు ముఖ్యపాత్ర నిర్వహించెను. ఆ తరువాత ఫ్రాన్స్‌కు వెళ్లి సహాయ సంపాదనా ప్రయత్నములు ప్రారంభించి-1782 లో నెదర్ లండ్స్ నుండి ఋణమును సాధించుటలో కృతకృత్యు డయ్యెను. యునైటెడ్ స్టేట్స్, బ్రిటన్ మధ్య యుద్ధమును అంతము చేసిన పారిస్ సంధి (1783) ఆయన మంతనాల ఫలితమే. జార్జి వాషింగ్‌టన్ యునైటెడ్ స్టేట్స్ అధ్యక్షు డుగ ఉండిన కాలమున 1789 నుండి 1797 వరకు అడమ్స్ ఉపాధ్యక్షుడుగ వ్యవహరించెను. హామిల్టన్ వంటి స్వపక్షీ యులు వ్యతిరేకించినా అధ్యక్షపదవికి అభ్యర్థిగా పార్టీ చే నియమితుడై 1796 ఎన్నికల్లో ఫెడరలిస్ట్‌లపక్షమున అఖండ విజయము సాధించెను. కాని, అతని పదవీకాలమున ఫెడర లిస్ట్ పక్షమున చెలరేగిన అంతఃకలహములును, వైమనస్య ములును పార్టీలో అతనికి కల పలుకుబడిని అంతరింప జేసినవి. వీనికి తోడుగ యూరప్ రాజకీయములలో ఫ్రాన్స్ ఎడ వహించవలసిన వైఖరిని గురించియు అభి ప్రాయ భేదములు చెలరేగినవి. అంతట తన మంత్రి వర్గమునందలి కొందరు ప్రముఖులకు వ్యతిరేకముగ చరించి అడమ్స్ ఫ్రాన్స్‌తో సామరస్యవైఖరిని అవలం బించెను. తత్ఫలితముగ 1800 సంవత్సరపు అధ్యక్షుని

ఎన్నికలలో అభ్యర్థిగ ఉండుటకు అతడు ఉత్సహించినను, అతని పార్టీ అతనిని వ్యతిరేకించి జఫర్‌సన్‌ను నియమించినది. అంతట రాజకీయరంగమునుండి ఆడమ్స్ నిష్క్రమించెను. 1826 జూలై 4 వ తేదీన అతడు కాలధర్మముచెందెను. పి. ఆర్. పి.

**ఆన్‌డొర్రా :** యూరప్‌లోని పిరనీస్ పర్వతశ్రేణి దక్షిణ సానువులపై స్పెయిన్, ఫ్రాన్స్‌ల మధ్యను ఉన్న ఒక చిన్న రాజ్యము.

[వి] 464 చ. కి. మీ ; [జ] 11,356 ; [భా] కేటలాన్ ; [మ] రోమన్ కేథలిక్ ; [రా] ఆన్‌డొర్రా లావెల్లా.

**చరిత్ర :** ఈ దేశవాసుల పూర్వికులు షార్లమెన్ [చూ.] చక్రవర్తికి మహమ్మదీయులను జయించుటలో సాయపడినందులకై వారికి ఆ ప్రభువు ఈ రాజ్యము ఒసగెనని ఇచట ఒక గాథ ప్రచారమున కలదు ; ఇందుకు




చారిత్రక ఆధారము లేవియు లేవు. కాని, లూయీ చక్రవర్తి కుమారుడు చార్లెస్ ఈ రాజ్యమున పన్నులు వసూలు చేసికొను అధికారమును ఉర్గెల్ నగరపు జమీందారునకు ఒసగెనని మాత్రము చారిత్రకాధారములవలన రుజువగుచున్నది. ఆ సమయముననే ఈ పన్నుల వసూలు అధికారము తనకు కలదనియు, మత పీఠ పోషణకై పూర్వ రాజులు తమ పీఠమునకు దాని నొసగిరనియు చెప్పుచు ఉర్గెల్ మతపీఠాధిపతి (బిషప్) ఒక తగాదా లేవదీసెను. ఈ తగాదా పర్యవసానము తేలకమునుపే ఉర్గెల్ జమీందారు నిస్సంతుగ మరణించుటచే వాని అధికారము వారి వారసులును, ఫ్రాన్స్ దేశీయులును అగు ఫాయీ జమీందారులకు సంక్రమించెను. ఈ జమీందారులకును, ఉర్గెల్ బిషప్‌నకును గల ఈ తగాదా చివరకు 1278 లో పరిష్కారమై, ఉభయులకును ఆన్‌డొర్రాపై సమాన హక్కులు ఉండునటుల ఒడంబడిక కుదిరెను. కొంతకాలమునకు ఈ ఫాయీ జమీందారీ వారసత్వము 1578 లో అప్పటి ఫ్రెంచి సార్వభౌముడగు హెన్రీ - IV కు సంక్రమించుటవలన ఆన్‌డొర్రాయందు ఆ జమీందారులకు గల హక్కు ఫ్రెంచి రాజవంశమునకు లభించెను. కాని, 18 వ శతాబ్ది అంతమున ఫ్రాన్స్‌లో రాచరికము నశించి, ప్రజాస్వామ్య ప్రభుత్వము స్థాపింపబడినందువలన ఈ హక్కు అంతటి నుండి ఫ్రెంచి ప్రభుత్వాధ్యక్షునికి సంక్రమించెను.

ఈ విధముగ స్పెయిన్ నందలి ఉర్గెల్ నగరపు బిషప్‌నకును, ఫ్రెంచి ప్రభుత్వాధ్యక్షునకును ఉమ్మడి హక్కు ఈ రాజ్యమున ఏర్పడి, ఈనాటికిని అది అమలునందున్నది. కాని, ఈ అధికారము నామ మాత్రమే. సంప్రదాయముగ వచ్చు ఈ అధికారములను గౌరవించు ఉద్దేశముతో ఆన్‌డొర్రా ప్రభుత్వము రెండేండ్ల కొకసారి ఫ్రాన్స్ అధ్యక్షునికి 960 ఫ్రాంక్‌లను, ఉర్గెల్ బిషప్‌నకు 460 పెసెటా (స్పెయిన్ నాణెము) లను లాంఛనముగ చెల్లించుచున్నది. దేశ పరిపాలనాధికారము మాత్రము కౌన్సిల్ జనరల్ అనబడు శాసన సభయందు ఉన్నది. ఈ శాసన సభయే పరిపాలనా కార్యనిర్వహణకై సిండిక్ జనరల్ అను ఉద్యోగిని, అతనికి సహాయమొనర్చుటకై సబ్ సిండిక్ అను వేరొక ఉద్యోగిని నియమించును. దైనందిన పరిపాలనను వీరిరువురు నిర్వహింతురు. శాసనసభ సభ్యులు ప్రజలచే ఎన్నుకొనబడుదురు. కుటుంబ యజమానులకు మాత్రమే ఇచట వోటింగు హక్కు కలదు. చీ. శే. రా.

**అనందగోత్రులు :** చూ. సం. 3 - పు. 113.

**అనిబిసెంట్ :** చూ. సం. 10 - పు. 196.

**ఆఫ్ఘన్ యుద్ధములు :** భారతదేశమునందలి ఆంగ్ల సామ్రాజ్య ప్రభుత్వము వాయవ్య సరిహద్దు భద్రతను ఆసించి ఆఫ్ఘనిస్తాన్ జాతీయ వ్యవహారములలో జోక్యము కలుగజేసికొనిన ఫలితముగ సంఘటిల్లిన యుద్ధములు. ఇట్టివి వేర్వేరు కాలములందు మూడు యుద్ధములు జరిగినవి:

మొదటి ఆఫ్ఘన్ యుద్ధము (1839 - 1842) : 1826 లో ఆఫ్ఘనిస్తాన్‌కు దోస్త్ మహమ్మద్ అనువాడు పాలకుడు (అమీర్) అయ్యెను [చూ. ఆఫ్ఘనిస్తాన్]. ఇతడు పారసీక పాలకుల యెడను, రష్యాయందలి ప్రభుత్వము ఎడను సుముఖత వహించి వర్తించుట భారతదేశమునందలి ఈస్ట్ ఇండియా కంపెనీ ప్రభుత్వమునకు గిట్టకుండెను. రష్యా, పారసీకముల మైత్రితో భారత సరిహద్దున దోస్త్ మహమ్మద్ ప్రబలుడగుట తమ సామ్రాజ్యమునకు ముప్పుగ ఆ ప్రభుత్వము భావించినది. అంతట ఆఫ్ఘనిస్తాన్‌ను

పాలించిన పూర్వ రాజవంశమునకు చెందిన షాషుజాకు బ్రిటిషువారును, వారి మిత్రుడగు సిక్కు పాలకుడు రంజిత్ సింగ్‌ను ప్రాపునొసగి షాషుజాను రాజుగ చేయుటకై ఆఫ్ ఘనిస్తాన్‌పై దండెత్తిరి. సిక్కు సేనలు పంజాబు నుండియు, ఆంగ్ల సైన్యము ఫిరోజ్‌పూరునుండి సింధు రాష్ట్రము, బెలూచిస్తాన్ ద్వారా పయనించియు, కాందహార్‌ను చేరుకొనినవి. తొలుత విజయము ఆంగ్లేయులకును, వారి మిత్రులగు సిక్కులకును లభించి షాషుజా రాజయ్యెను (3 ఆగస్టు, 1839). 1840 లో దోస్త్ మహమ్మద్ బ్రిటిష్ వారికి లొంగగా కలకత్తాకు అతడు ఖైదీగ పంపబడెను. అయినను షాషుజా పాలనకు ఆఫ్ ఘనిస్తాన్‌లో ప్రజామోదము లభింపలేదు. బ్రిటిషు సేనలు కాబూల్‌న స్థావరమును ఏర్పరచుకొని అతనికి అండగ ఉండవలసి వచ్చినది. ఇంతలో రంజిత్‌సింగ్[చూ.]మరణము వలన సిక్కు సేనలు అటనుండి ఉపసంహరింపబడినవి. తరువాత 1841 న కాబూల్‌లో ప్రజల తిరుగుబాటులు చెలరేగి, అచటి బ్రిటిష్ సేనానియు, అతని సహచరులు ఇరువురును చంపబడిరి (నవంబరు 2). అంతట అచట బ్రిటిష్ సేనలు అవమానకరములగు షరతులపై తిరుగుబాటుదారుల నాయకుడగు అయూబ్ ఖాన్‌నకు లొంగి (11 డిసెంబరు), ఆయుధములను అతనికి అప్పగించి, దీనావస్థలో భారత దేశమునకు తిరుగు ప్రయాణమునకు పూనుకొనినవి. కాని, మార్గమధ్యమున ఆఫ్ ఘన్‌లు సాగించిన హత్యాకాండకు వారందరును బలియైరి. అందువలన కాబూల్ నుండి బయలుదేరిన 16,500 బ్రిటిష్ సైనికులలో తిరోగమనమునకు పూర్వము - లొంగుబాటు షరతులకు పూచీగా - అయూబ్ ఖాన్‌నకు వశపరుపబడిన 120 మంది తప్ప, తక్కిన వారందరును - ఒకరు మినహాగా - మార్గమధ్యముననే నశించిరి. డా. బ్రైడన్ అనునతడు మాత్రము శల్యావశిష్టుడై కడకు జలాలాబాద్‌నకు చేరి ఆ తిరోగమనపు విషాదగాథను బ్రిటిష్ అధికారులకు తెలియజేసెను. అంతట అప్పటిలో నూతనముగ అధికారమును గ్రహించిన గవర్నర్ జనరల్ లార్డ్ ఎల్లెన్‌బరో ఇందులకు ప్రతీకార చర్యలను తీసికొని బ్రిటిష్ వారి ప్రతిష్ఠను తిరుగ నెలకొల్పుటకై కృతనిశ్చయత వహించి, తదనుగుణముగ చర్యలకు పూనుకొనెను. ఈ మధ్యకాలమున షాషుజా హత్యచేయబడెను. అంతట అప్పటికి ఆఫ్ ఘనిస్తాన్ సరిహద్దులలో నిలిచి ఉండిన ఆంగ్లసైన్యములు ఎల్లెన్‌బరో ప్రోత్సాహ ఫలితముగ విజృంభించి, ఆఫ్ ఘన్ సేనలను ఓడించి, కాబూల్‌ను వశపరచుకొనినవి (15 సెప్టెంబరు, 1842). అంతటితో ఊరకొనక కసితీర్చుకొనుటకై ఆ నగరమును దోచి అమాయిక ప్రజలను హత్యచేసి, ఆ నగరపు బజారులను మందుగనుల ప్రేలుడు వలన నేలమట్టము చేసినవి. అంతట విజయ గర్వముతో తిరిగి వచ్చెడు బ్రిటిష్ సైన్యము గజనీ నగరపు కోట తలుపులను ఊడబెరికికొని, తమతో కూడ వానిని భారతదేశమునకు కొని వచ్చినది. పూర్వకాలమున గజనీ మహమూద్ సోమనాథ దేవాలయమును నిర్మూలించి కొనిపోయిన తలుపులు ఇవియే యని లార్డ్ ఎల్లెన్‌బరో వానిని ప్రదర్శించి, హిందూ ప్రజల ఆదరణను ఆర్జించుటకు యత్నించెను. కాని, ఆ తలుపులు దేవాలయమునకు సంబంధించినవి కావని త్వరలోనే రుజువయ్యెను. అంతట ఆఫ్ ఘనిస్తాన్‌నకు బ్రిటిష్ వారి ఆదరముతో దోస్త్ మహమ్మద్ తిరిగి పాలకుడై, 1863 వరకు పాలించెను.

రెండవ **ఆఫ్ ఘన్ యుద్ధము** (1878 - 1880): దోస్త్ మహమ్మద్ అనంతరమున అతని కుమారులు ఒకరిపై మరియొకరు సింహాసనమునకై పోరాటములను సాగించిన తరువాత వారిలో షేర్ ఆలీ అనువాడు అమీర్ కాగలిగెను. ఆంగ్లేయుల యెడ అతనికి సుహృద్భావము లేకుండెను. రష్యాతో సన్నిహిత సంబంధములను అతడు నెలకొల్పుకొని, విదేశ దండయాత్రనుండి ఆఫ్ ఘనిస్తాన్‌నకు రక్షణను ఆ దేశమునుండి ఆర్జించి, రష్యా రాయబారికి తన ఆస్థానమున ఘన సన్మానము చేసెను. ఈ చర్య బ్రిటిష్‌వారికి క్రోధజనకమయ్యెను. ఇంతలో బెర్లిన్ సమావేశము [చూ.] వలన రష్యా - బ్రిటన్ దేశముల మధ్యగల సమస్యలు పరిష్కృతములైనవి. అంతట తమ రాయబార వర్గమును ఆఫ్ ఘనిస్తాన్‌న నెలకొల్పుటకు అంగీకరించవలసినదిగ భారత ప్రభుత్వము కోరగ అమీర్ నిరాకరించెను. దీనికి ప్రతీకారముగ బ్రిటిష్ సేనలు ఆఫ్ ఘనిస్తాన్‌పైకి దండయాత్ర మొదలిడినవి (నవంబరు 20, 1878). రష్యన్‌లు బెర్లిన్ సమావేశమువలన ఏర్పడిన నూతన పరిస్థితిని అనుసరించి అమీర్‌నకు సాయపడరైరి. బ్రిటిష్ సేనలు ఆఫ్ ఘన్ సేనలను జయించి ముందునకు సాగినవి. షేర్ ఆలీ దేశమును వదలి తుర్కిస్తాన్‌కు పారిపోయి, కొలది కాలమునకు అట మరణించెను. అతని కుమారుడు యాకూబ్ బ్రిటిష్‌వారితో సంధి కుదుర్చుకొనెను (26 మే, 1879). ఈ సంధి షరతులు బ్రిటిష్ వారికి లాభదాయకములుగ ఉండినవి. కాబూల్‌లో బ్రిటిష్ రాయబారవర్గము ఉండుటకును, తన వైదేశిక నీతిని భారతదేశపు గవర్నర్ జనరల్ సలహా సంప్రదింపులతో రూపొందించుటకును, కొన్ని ప్రదేశములను భారత ప్రభుత్వమునకు దత్తము చేయుటకును అమీర్ అగు యాకూబ్ అంగీకరించెను.

కాని, అనతికాలముననే ఈ సంధి భగ్నమయ్యెను. కాబూల్‌లోని బ్రిటిష్ రాయబారి హత్యచేయబడెను (3 సెప్టెంబరు); అంతట మరల యుద్ధము మొదలైనది. యాకూబ్‌ను - అసమర్థత కారణముగ - బ్రిటిష్ వారు పదవి నుండి తొలగించి, అతని బంధువగు అబ్దుల్ రహమాన్ సాయమును గ్రహించిరి. కడకు (జూలై, 1880) షేర్ అలీ కుమారుడగు ఆయూబ్ ఖాన్‌ను ఓడించి, బ్రిటిష్ సేనలు ఆఫ్ఘనిస్తాన్‌ను వశపరచుకొని, అబ్దుల్ రహమాన్‌ను అమీర్‌గ చేసినవి. వార్షికముగ బ్రిటిష్ వారి నుండి నియమిత ధన సాహాయ్యమును పొందుటకును, విదేశ వ్యవహారములను భారత ప్రభుత్వపు అదుపుకు లోబడి నిర్వహించుటకును అమీర్ అంగీకరించెను. పూర్వపు సంధిమూలమున భారత ప్రభుత్వమునకు దక్కిన ప్రాంతములను ఆఫ్ఘనిస్తాన్ వదలుకొనెను. ఇందువలన బ్రిటిష్ వారి పలుకుబడిలోనికి ఆఫ్ఘనిస్తాన్ వచ్చుటయే కాక, రష్యావలన భారతదేశపు సరిహద్దులకు కలుగగల దని భావింపబడిన బెడదకు అవకాశము అంతరించినది.

మూడవ ఆఫ్ఘన్ యుద్ధము (1919): అబ్దుల్ రహమాన్ అనంతరమున అమీర్ అయిన అతని కుమారుడు హబిబుల్లా 1919 లో హత్యచేయబడగా, అతని కుమారుడు అమానుల్లా అమీర్ అయ్యెను. భారత సామ్రాజ్య ప్రభుత్వము తన దేశము నెడల వర్తించు పద్ధతి అతనికి నచ్చలేదు. తత్ఫలితముగ ద్వేషములు ఉత్పన్నములై యుద్ధమునకు దారి తీసినవి. 1919 ఏప్రిల్, మే నెలలలో జరిగిన ఈ యుద్ధమున ఆధునిక యుద్ధపరికరముల సాయమున భారత సామ్రాజ్య సేనలు అతి త్వరితగతిలో ఆఫ్ఘన్ సైన్యమును ఓడించ గలిగినవి. అంతట ఆఫ్ఘన్‌ల అభ్యర్థన వలన సంధి కుదిరినది (8 ఆగస్టు, 1919); 1921 లో ఈ సంధి ధ్రువపరుపబడినది. అమీర్‌నకు పూర్వపు ఏర్పాటును అనుసరించి ఈయబడెడి వార్షిక ధన సాహాయ్యము దీనివలన రద్దయినది. కాని, అంతటి నుండి ఆఫ్ఘనిస్తాన్ దేశప్రభుత్వపు వైదేశిక నీతిపై ఎట్టి నియమనాధికారమును వహించకుండుటకు భారత ప్రభుత్వము అంగీకరించినది. రెండు ప్రభుత్వములును పరస్పర దేశ స్వాతంత్ర్య, సమగ్రతలను మన్నించుటకును, సమాన స్థాయిలో దౌత్య సంబంధముల నెలకొల్పుకొనుటకును అంగీకరించినవి.

చీ. శే. రా.

**ఆఫ్ఘనిస్తాన్ :** మధ్య ఆసియా యందలి ఒకస్వతంత్ర రాజ్యము. అన్ని దిక్కులను ఇది భూ పరివృతమై ఉన్నది. ఈ దేశమునకు సోవియట్ రష్యా యందలి టర్కమన్‌స్తాన్, ఉజ్బెక్‌స్తాన్, తాజిక్‌స్తాన్ ప్రాంతములును [ఉ]; భారత దేశాంతర్గతమగు జమ్మూ - కాశ్మీరమునందలి వాయవ్య భాగమును (ప్రస్తుతము ఇది పాకిస్తాన్ ఆక్రమణలో ఉన్నది), చీనా, పాకిస్తాన్




దేశము [తూ]; పాకిస్తాన్ [ద]; ఇరాన్ [ప] సరిహద్దులుగ ఉన్నవి. [వి] దేశ వైశాల్యము సరిగ లెక్కింపబడుటకు అనువుగ సర్వేజరుపబడలేదు. కాని, దాదాపు 6,57,500 చ. కి. మీ. విస్తీర్ణము ఉండునని అంచనా; [జ] ఏనాడును జనాభా లెక్కలు సక్రమముగ జరుగలేదు. అందువలన జనసంఖ్యను గురించి వివిధాభిప్రాయములు కలవు. ఈ అభిప్రాయములను అనుసరించి ఈ అంచనా 80 లక్షల నుండి 140 లక్షల వరకు వివిధ రీతులుగ చెప్పబడుచున్నది. దేశపు ప్రజలలో నాలుగవ వంతు స్థిరనివాసము లేని దేశ సంచారులు. ప్రజానీకమున అత్యధిక సంఖ్యాకులు పఠానులు. వీరికే ఫక్తూన్‌లనియు వ్యవహారము కలదు. వీరు దాదాపు నూటికి 60 మంది వరకు ఉందురు. [భా] వీరి మాతృభాష పుస్తూ అనబడు ఆర్యభాష. వీరి తరువాత సంఖ్యా విషయమున లెక్కకు వచ్చువారు తాజిక్‌లు. వీరు పారసీకభాషను మాట్లాడుదురు. పై రెండు జాతుల వారును కాక దాదాపు 8 లక్షల మంది తుర్కులును, 2 లక్షల మంది ఉజ్బెక్‌లును దేశమందలి ఉత్తర ప్రాంతములందు వసించుచున్నారు. [మ] దేశమందలి ఈ వివిధ జాతుల ప్రజలును ముస్లిమ్‌లే. ఇందు సున్నీశాఖవారు అత్యధికము. [రా] కాబూల్ (సుమారు 3 లక్షలు).

చరిత్ర : ఈ ప్రాంతము వైదికయుగమున ఆర్యనాగరకతకు ఆటపట్టుగ ఉండుటవలన భారతీయ ఆర్యులకు ఈ ప్రాంతముతో సన్నిహిత సంబంధము ఉండెనని తెలియవచ్చుచున్నను క్రీ. పూ. ఆరవ శతాబ్ది నుండియు ఇదిపారసీక సామ్రాజ్యమున అంతర్భాగముగ ఉండినది. క్రీ. పూ. 326 లో ఆ పారసీక సామ్రాజ్యము గ్రీక్ విజేత అలిగ్జాండర్‌చే అంతమొందిన తరువాత ఈ ప్రాంతము గ్రీక్‌ల పాలనలోనికి వచ్చినది. క్రమముగ గ్రెకో-బాక్ట్రియన్‌లు, శకులు, కుషాన్‌లు మొదలగు వారి పరిపాలనలును అట నెలకొని అంతరించినవి. 8 వ శతాబ్దములో అరబ్బులు ఈ దేశమును జయించుటయు, అంతటి నుండి క్రమముగ

బౌద్ధమతమును త్రోసిరాజని ఇస్లామ్ అచటి ప్రజానీకమున ప్రాచుర్యమునకు వచ్చుటయు జరిగినది. అంతట 1220 లో మంగోల్ నాయకుడగు చెంఘిజ్‌ఖాన్ సేనల దాడులకు ఈ ప్రాంతము లోనై తదాదిగ దాదాపు ఒక శతాబ్దికాలము మంగోల్‌ల పాలనలో ఉండెను. పిమ్మట ఈ దేశము విచ్ఛిన్నమై వివిధకాలములందు సమీపమందలి వివిధ సామ్రాజ్యములలో అంతర్గతము అయినది. అయినను, ఆ కాలమున అఫ్ఘన్‌లు భారతదేశ రాజకీయములందు 16 వ శతాబ్ది వరకు ప్రముఖ పాత్రను నిర్వహించిరి. 18 వ శతాబ్దిలో పారసీకదేశపు రాజగు నాదిర్‌షా ఈ దేశమును పారసీకసామ్రాజ్యమున చేర్చెను (1737). నాదిర్‌షా మరణానంతరమున అతని అఫ్ఘన్ సర్దారులలో ఒకడగు అహ్మద్‌షా దురానీ (1747 - 1773 ప.) స్వదేశమున స్వతంత్రప్రభుత్వమును నెలకొల్పి, పాలకుడయ్యెను. భారతదేశమందలి వాయవ్య భాగమును ఇతడు వశపరచుకొనుటయే కాక, భారత రాజకీయములందును ప్రముఖత వహించి, పానిపట్టు యుద్ధమున మహారాష్ట్రులను ఓడించెను (1761). ఇతని కుమారుడగు తైమూర్‌షా (1773 - 1793) బలహీనుడగుట వలన అతని కాలమున భారత వాయవ్య ప్రాంతమున అఫ్ఘన్‌ల పాలన అంతరించినది. క్రమముగ దురానీ వంశీకుల పాలనకు ప్రజాదరణ తగ్గి, అంతరించగ బరక్‌జాయి తెగకు చెందిన దోస్త్ మహమ్మద్ అఫ్ఘనిస్తాన్‌కు ప్రభువయ్యెను (1826). ఇతని కాలమున భారతదేశమునందలి బ్రిటిష్ సామ్రాజ్యము, రష్యన్‌లు దక్షిణమునకు చొరుచుకొని వచ్చుటను అరికట్టు ఉద్దేశముతో అఫ్ఘనిస్తాన్ జాతీయ వ్యవహారములలో జోక్యము మొదలిడినది. ఈ జోక్యము ఫలితముగ మూడు యుద్ధములు సంఘటిల్లినవి [చూ. అఫ్ఘన్ యుద్ధములు]. 1879 లో బ్రిటిష్ వారి విజయము వలన చేకూరిన సంధి మూలమున అఫ్ఘనిస్తాన్ పాలకుల విదేశాంగశాఖపై యాజమాన్యము బ్రిటిష్ వారికి లభించినది. 1921 లో వేరొక సంధి వలన ఈ అధికారము అంతరించి, అది మొదలుగ ఆ దేశము బ్రిటన్‌తోడను, భారత దేశమందలి బ్రిటిష్ సామ్రాజ్య ప్రభుత్వముతోడను సమాన స్థాయిలో వ్యవహరించుట మొదలయ్యెను. రెండు ప్రపంచ యుద్ధములందును ఈ దేశము తటస్థత వహించినను, మిత్ర రాజ్యముల యెడ సానుభూతిని వెల్లడించినది.

ఆ దేశమునకు ప్రభువుగ 1919 లో అధికారమును గ్రహించిన అమానుల్లా కాలమున త్వరితగతిలో దేశమున సంస్కరణలను కొనివచ్చి, దేశమును ఆధునికముగ చేయుటకు కృషి మొదలైనది (1928). కాని, సనాతన మత సంప్రదాయ వాదులకు ఇది నచ్చనందున దేశమున తిరుగుబాటులు చెలరేగుట వలన అమానుల్లా పదవీపరిత్యాగము చేసి, విదేశమున తలదాచుకొనవలసి వచ్చినది (1929 మే). అంతట బచా - ఇ - సక్కో అను దుస్సాహసికుడు అధికారమును తాత్కాలికముగ వశపరచుకొనినను, రాజవంశీకుడగు మహమ్మద్ నాదిర్‌షా జోక్యము కలుగజేసికొని అల్లరులను అణచి, ప్రజాభీష్టమును అనుసరించి తానే అమీరు అయ్యెను. ఇతడును అమానుల్లావలెనే సంస్కరణ వాదియే యైనను, తగు మెలకువతో క్రమదశలలో వానిని అమలునకు కొనివచ్చుటకు కృషి ఆరంభించెను. 1933 లో ఇతడు దుర్మరణమునకు లోనుకాగా, ఇతని కుమారుడు మహమ్మద్ జహీర్ రాజై, తండ్రి మొదలిడిన సంస్కరణలను ఫలవంతములుగ కొనసాగించెను. భారత ఉపఖండము స్వాతంత్ర్యమును ఆర్జించిన తరువాత పాకిస్తాన్, భారతదేశములతో సామరస్యముగ మెలగుటకు అఫ్ఘనిస్తాన్ కృషిచేసినది. కాని, పాకిస్తాన్‌లో వాయవ్యమున ఉన్న పఠాను ప్రాంతములకు స్వయం నిర్ణయాధికారమును అఫ్ఘనిస్తాన్ బలపరచుచున్నందున పాకిస్తాన్‌తో అఫ్ఘనిస్తాన్‌కు క్రమముగ విభేదములు పెచ్చుపెరిగినవి.

రాజ్యాంగము : నిరంకుశ రాజరికపు పాలనయే ఈ దేశమున చాలకాలము అమలులో ఉండినది. కాని, దేశ పాలకుని ప్రగతిశీలతవలన ఇచట 1931 అక్టోబరులో ఒక రాజ్యాంగము అమలులోనికి తేబడి, సిద్ధాంతరీత్యా శాసనబద్ధమగు రాచరికపు పాలన ఏర్పరుపబడినది. అయినను, ఆ రాజ్యాంగమునుబట్టియైనను ప్రజలకు ఎక్కువ అధికారములు లభించినవి కావు. ఒక విధమగు అల్పసంఖ్యాక ప్రభుత్వమే (ఆలిగార్కీ) అట అపుడు నెలకొల్పబడినది. క్రమముగ ప్రజాందోళనాఫలితముగ 1964 లో వేరొక నూతన రాజ్యాంగము ప్రభుత్వామోదితమైనది. దీనివలన వయోజనపు వోటింగ్ హక్కు అమలులోనికి తేబడినది. ఇరువదియేండ్ల వయస్సునకు తగ్గని స్త్రీ - పురుషులకు అందరకు వోటుచేయు అధికారము లభించినది. 1965 లో దీని ప్రకారము రహస్యపు సార్వజనిక ఎన్నికలు జరిగినవి. ఆ సంవత్సరము అక్టోబరు 1 నుండి రాజ్యాంగము అమలులోనికి వచ్చినది; ఈ రాజ్యాంగము ప్రకారము ప్రభువునకు పరిపాలనలో సాయపడుటకై రెండు సభలకు అధికారము అప్పగింపబడినది. ఇందొకటియగు లోకసభ (వోల్సీ జిర్గా) కు 216 మంది సభ్యులు ప్రజలచే ఎన్నుకొనబడుదురు. ఎగువసభ (మెషానో జిర్గా) లో 84 మంది సభ్యులు కలరు. వీరిలో 28 మందిని ప్రజలు అపరోక్షపు

ఎన్నికలో ఎన్నుకొనెదరు. 28 మందిని రాష్ట్రసభలు ఎన్నుకొనును. తక్కిన వారిని రాజు నియమించును. రెండు శాసన సభలలో అధిక సంఖ్యాకుల సమ్మతిని ఆర్జించిన వానిని రాజు ప్రధానిగ చేయును.

ఇటుల ప్రజాస్వామికమగు నూతన రాజ్యాంగ విధానము ఆ దేశమున అమలులోనికి వచ్చినను, పూర్వసంప్రదాయమును అనుసరించి, మతమునకు అందు ప్రముఖ స్థానము కల్పింపబడినది. ఈనాడును ఇస్లామ్ పేరనే అట పరిపాలన నిర్వహింపబడుచున్నది. చీ. శే. రా.

**ఆఫ్రికా :** వైశాల్యమున ప్రపంచమునందలి రెండవ పెద్ద ఖండము. ఈ ఖండమున నివసించు ప్రజలను గురించి కాని, జంతుజాలమును గురించి కాని ఇటీవలివరకు బాహ్య ప్రపంచమునకు విస్తారముగ తెలియకపోవుటవలన దీనిని ఇదివరలో 'తమోవృతఖండము' అని పిలుచుచుండెడివారు. కాని, శాస్త్రజ్ఞుల కృషి ఫలితముగ ఇప్పుడు ఆ ఖండమును గురించిన పెక్కు వివరములు తెలియవచ్చుచున్నవి.

ప్రపంచ ప్రాచీన నాగరకతలలో ఒకటి ఉత్తర ఆఫ్రికాలోని ఈజిప్టు [చూ.] నందు వర్ధిల్లినది. గ్రీక్‌లు, ఫొనీషియన్‌లు ఉత్తర ఆఫ్రికాలో మధ్యధరా సముద్రతీరమున ప్రాచీన కాలమున వలసలను స్థాపించిరి. ఆ ప్రాంతమున వర్ధిల్లిన కార్తేజ్ సామ్రాజ్యము ఇంచుమించు మధ్యధరా సముద్ర తీరభూమి అంతటిపైన ఆధిపత్యము వహించినది. రోమన్‌లు కార్తెజీనియన్‌లను జయించిన పిమ్మట రోమన్ సామ్రాజ్యమున కార్తేజ్ ఒక రాష్ట్రమైనది. ప్రాచీన కాలమున ఉత్తర ఆఫ్రికాలోని అలెగ్జాండ్రియా నగరము గొప్ప విద్యాకేంద్రముగ ప్రసిద్ధి పొందెను. రోమన్‌ల ప్రతిభ అంతరించి, వేండల్‌లు ఇటలీలో అడుగు పెట్టిన తరువాత, ఉత్తర ఆఫ్రికా కూడ వారి అధీనమైనది. వేండల్‌లు పతన మొందిన పిమ్మట ఈ ప్రాంతము బైజాంటైన్ సామ్రాజ్యమున అంతర్భాగమైనది. 7 వ శతాబ్దిలో అరబ్బులు దండెత్తి వచ్చుటతో వారి మతము, భాష, ఆచారములు ఇచటకు దిగుమతి అయినవి. 15 వ శతాబ్దిలో అరబ్బుల ప్రతిష్ఠ సన్నగిలినంతనే ఇందు మొరాకో తప్ప తక్కిన ప్రాంత మంతయు ఓటోమన్ (టర్కీ) ప్రభువుల హస్తగతమయ్యెను. మధ్య యుగములందు యూరప్ వాసులకు ఉత్తర ఆఫ్రికాతో ఎట్టి సంబంధమును లేకుండెను. కాని, 19 వ శతాబ్దమున ఆల్జీరియా, మొరాకో, టూనీషియా దేశములపై ఫ్రాన్స్ దండయాత్ర జరిపి వానిని జయించినది.

మధ్య ఆఫ్రికాయందలి ప్రముఖ రాజ్యమగు ఎతియోపియా యందును ప్రాచీన కాలమునుండియు నాగరకతా వ్యవస్థ అవిచ్ఛిన్నముగ వెలయుచుండెననియే భావించుటకు అవకాశము కలదు.

ఈ ఖండమున సహారా ఎడారికి దక్షిణముగ ఉన్న ప్రాంతమంతయు చాలకాలమువరకు అజ్ఞాతముగనే ఉండెను. కాని, అచటి అవశేషములనుబట్టి క్రీ. పూ. 30,000 సంవత్సరములనాడు నీగ్రో తెగలవారు ఈ ఖండపు తూర్పు తీరమున చేరి క్రమముగ ఖండమునందలి దక్షిణ ప్రాంతమునంతటిని ఆక్రమించినటుల చారిత్రకులు భావించుచున్నారు. మధ్య యుగములలో అనేక నీగ్రో సామ్రాజ్యములు ఇట వర్ధిల్లినవి. రొడీషియా యందలి 'జింబాబ్వే' లనబడు శిథిల దుర్గములును, తూర్పుతీరపు రేవు నగరములందలి ప్రాచీన శిథిలములును ఈ విషయములను రుజువొనర్చుచున్నవి. ఖండపు పశ్చిమ తీరమున వర్ధిల్లిన మధ్యయుగపు నీగ్రో రాజ్యములలో ఘానా, మాలీ, సుడాన్ రాజ్యములు పేర్కొనదగినవి. మధ్య యుగములందు ఈ ఖండపు తీరమున అరబ్బులు కొన్ని వలసల నెలకొల్పిరి. అరబ్బీభాషతో నీగ్రో ప్రజల భాష మిశ్రితమగుటచే ఏర్పడిన స్వాహిలీభాష నేటికిని ఆఫ్రికా ఖండపు దక్షిణభాగమున వివిధ మాతృభాషలు గల ఆఫ్రికన్ జాతుల మధ్య సామాన్య భాషగ ఉపకరించుచున్నది.

ఈ 'తమోవృత ఖండము' ను గూర్చి కనుగొనుటకు పాశ్చాత్యులెవరును 15 వ శతాబ్ది ఆరంభము వరకు ఔత్సుక్యమును ప్రదర్శింపలేదు. యూరప్ నుండి ప్రాచ్య దేశములకు పోవు త్రోవలో ఆఫ్రికా ఉండుటవలన తమకు మజిలీలుగ చేసికొనుటకు ఆ ఖండ తీరప్రాంతమున కొన్ని స్థావరములను నిర్మించుకొనుట మంచిదని యూరపియన్ వర్తకులకు తోచినది. దీనికి తోడు 'నూతన ప్రపంచము' (అమెరికా ఖండము) బయల్పడుటతో చౌకగా కూలిపని చేయువారి ఆవశ్యకత ఎక్కువైనది. అందుచే ఆఫ్రికాలోని నీగ్రోలను బానిసలుగ పట్టుకొని అమెరికా ఖండమునకు పంపుట మొదలు పెట్టిరి.

పోర్చుగీస్ నావికుడు వాస్కోడ గామా 1497 లో మొదటిసారి గుడ్‌హోప్ అగ్రము చుట్టి ప్రయాణించిన తర్వాత కొద్ది కాలముననే ఆఫ్రికా తూర్పుతీరము వెంబడి పోర్చుగీస్ స్థావరములు వెలసినవి. 16 వ శతాబ్దిలో బ్రిటిష్‌వారు, ఫ్రెంచివారు పశ్చిమ తీరము వెంబడి బానిసల వర్తక కేంద్రములు స్థాపించుట మొదలుపెట్టిరి. ఆఫ్రికా జాతుల వారు తమ ఖైదీలను ఈ కేంద్రములకు తీసికొనివచ్చి తెల్లవారికి బానిసలుగ విక్రయించుచుండిరి. అటుతరువాత నడచిన రెండు శతాబ్దములలో సుమార



ఆఫ్రికా
రాజకీయ విభాగములు
అట్లాంటిక్
మహాసముద్రము
స్పెయిన్
టర్కీ
సిరియా
నల్ల సముద్రము
మొరాకో
రబాత్
అ ల్ జీ రి యా
లి బి యా
ఈజిప్టు
కైరో
మారిటేనియా
మాలి
నైజర్
చా డ్
సూడాన్
ఎతియోపియా
కె న్యా
నైరోబి
టాంజేనియా
నైజీరియా
కామెరూన్
సెంట్రల్ ఆఫ్రికన్ రిపబ్లిక్
గాబన్
మొంబాసా
ఉత్తర రొడీషియా
బోట్స్వానా
నైరృతి ఆఫ్రికా
దక్షిణ ఆఫ్రికా
డర్బన్
పోర్ట్ ఎలిజబెత్
కేప్ ఆవ్ గుడ్ హోప్
మలగసీ రిపబ్లిక్
హి ం దూ మ హా స ము ద్ర ము
మైళ్లు 0 500 1000 1500
కి. మీ. 0 1000 2000

1 కోటి, 50 లక్షల మంది నీగ్రోలు విదేశములకు - ముఖ్యముగా ఉత్తర అమెరికాలోని యునైటెడ్ స్టేట్స్‌కు - బానిసలుగ పంపబడిరి.

ఆఫ్రికాలో బంగారు గనులు 16 వ శతాబ్దిలో బయల్పడినవి. దానితో వివిధ యూరపియన్ దేశములవారు ఇటకు వలస రాసాగిరి. బెల్జియమ్ రాజు లియోపాల్డ్ - II 1879 లో స్టాన్లీని తన తరపున కాంగో ప్రాంతమును స్వాధీనము చేసికొనుటకై పంపుటతో - ఆఫ్రికా భూముల కొరకు యూరప్ జాతుల నడుమ - తీవ్రతరమైన పోటీలు ఏర్పడినవి. ఈ కాలములో ఆఫ్రికా జాతులను ఎన్నిటినో యూరపియన్‌లు నిర్మూలించుట జరిగినది. ఆఫ్రికా భూభాగములకై పోటీ పడుటలో పాటింపనగు నియమావళి 1884 - 85 మధ్య బెర్లిన్‌లో జరిగిన ఒక మహాసభలో ఆమోదితమైనది. కాంగో స్వతంత్ర రాష్ట్రమును బెల్జియమ్ ప్రభువగు లియోపాల్డ్ వ్యక్తిగతమైన ఆస్తిగా ఆ సభ గుర్తించినది. కాని, 1908 లో లియోపాల్డ్ కాంగో స్వతంత్ర రాష్ట్రమును బెల్జియమ్ ప్రభుత్వాధీనము చేసెను.

పై బెర్లిన్ మహాసభ వలన ఆఫ్రికా ఖండమున ఆ యా యూరపియన్ రాజ్యముల విస్తరణకు కొన్ని మూల సూత్రములు నిర్ణయింపబడినను, ఆ యా ఆక్రమిత ప్రాంతముల సరిహద్దుల నిర్ణయము మాత్రము ఆ తరువాత 15 సంవత్సరములలో కుదుర్చుకొనబడిన ఈ క్రింది ఒడంబడికల వలన జరిగినది :

1. గ్రేట్ బ్రిటన్, జర్మనీ దేశములు తూర్పు, పడమర, నైరృతి ఆఫ్రికాలలో తమ ప్రభావిత ప్రాంతముల సరిహద్దులను నిర్ణయించుకొనుచు కుదుర్చుకొనిన ఒడంబడిక (జూలై 1, 1890) ;

2. మలగాసీని ఫ్రెంచి రక్షిత ప్రాంతముగను, సహారాలో ఫ్రెంచి పలుకుబడిని, నైజర్ - చాద్ సరస్సు ప్రాంతములందు బ్రిటిష్ పలుకుబడిని గుర్తించుచు చేయబడిన ఆంగ్లో - ఫ్రెంచి ప్రకటన (ఆగస్టు 5,1890) ;

3. ఆంగ్లో - పోర్చుగీస్ సంధి - దీనివలన ఆఫ్రికా ఖండమున తూర్పు, పడమరలలోని పోర్చుగీస్ ఆక్రమిత ప్రాంతములకు, వాని రెంటికి మధ్యగ ఉన్న బ్రిటిష్ ఆక్రమిత ప్రాంతముతో కల సరిహద్దులు నిర్ణయింపబడినవి (జూన్ 11, 1891) ;

4. ఫ్రాంకో - జర్మన్ ఒప్పందము - దీనివలన ఫ్రాన్స్‌నకు మధ్యసుడాన్ దక్కినది (మార్చి 15, 1894) ;

5. తూర్పు ఆఫ్రికాలో బ్రిటిష్ వారికిని, ఇటలీ వారికిని చెందిన ప్రభావిత ప్రాంతముల సరిహద్దుల నిర్ణయించుచు కుదుర్చుకొనిన ఏర్పాటులు(1891 లో మార్చి 24, ఏప్రిల్ 15);

6. గ్రేట్ బ్రిటన్, ఫ్రాన్స్ కుదుర్చుకొనిన ఒప్పందములు- వీనిలో తొలుతటి దానివలన చాద్ సరస్సునకు పశ్చిమమున ఉన్న ప్రాంతములందు ఫ్రెంచివారి అధికారమును, నైలునదికి చెందిన ఎగువ లోయలో బ్రిటిష్‌వారి పలుకుబడియును గుర్తింపబడినవి (జూన్ 14, 1898; మార్చి 21, 1899).

ఆఫ్రికాలో ఇటుల సాగిన వలసల పోటీలో ఫ్రెంచివారిది పైచేయి అయినది. తూర్పునుండి పడమరవరకు ఉత్తర ఆఫ్రికాలో అత్యధికభాగము ఫ్రెంచి సామ్రాజ్యమున అంతర్గతమయ్యెను. బ్రిటిష్‌వారు ఆర్జించిన వలస ప్రాంతము విస్తీర్ణమున ఫ్రెంచి వారికి లభించిన దానికంటె తక్కువ అయినను ఆ ప్రాంతము ఎక్కువ సారవంతమైనది. ఉత్తరమున ఆంగ్లో - ఈజిప్షియన్ సుడాన్ మొదలుకొని దక్షిణమున గుడ్‌హోప్ అగ్రము వరకు బ్రిటిష్‌వారి వశమయ్యెను. పడమటి తీరమున ఉన్న అన్‌గోలా [చూ.], తూర్పుతీరమునందలి మొజాంబిక్ [చూ.] ప్రదేశములు పోర్చుగీస్ వారికి దక్కెను. వలసల పోటీలో ఆలస్యముగ వచ్చి చేరిన జర్మనీకి టాంగన్యికా మొదలగు నాలుగు వలస ప్రాంతములు మాత్రమే లభించినవి. ఇటుల 19 వ శతాబ్ది ముగియునాటికి ఆఫ్రికాయందు ఉత్తరమున మధ్యధరా ప్రాంతము నుండి నామమాత్ర స్వాతంత్ర్యము అనుభవించుచుండిన ఈజిప్టు, ఎతియోపియా, లైబీరియా తప్ప మిగిలిన ఆఫ్రికా ఖండము అంతయు యూరపియన్ సామ్రాజ్యకాంక్షకు లోనై దాస్యాంధకారమగ్నమయ్యెను. ఈ స్థితిలో ప్రథమ ప్రపంచ యుద్ధ పర్యవసానముగ జర్మనీకి చెందిన వలసరాజ్యములు మిత్రరాజ్యముల వశమై అందు బ్రిటన్‌నకు టాంగన్యికా, బెల్జియమ్‌నకు రువండా - ఉరుండీ, దక్షిణ ఆఫ్రికాకు నైరృతి ఆఫ్రికా మాండేటరీ ప్రాంతములుగ లభించినవి; టోగో లాండ్‌ను బ్రిటన్, ఫ్రాన్స్ పంచుకొనినవి; కామెరూన్స్‌లో అధికభాగము ఫ్రాన్స్‌నకు, మిగిలినది బ్రిటన్‌నకు మాండేటరీలుగ లభించినవి. కడకు ప్రపంచ యుద్ధము - II ఫలితముగ జరిగిన ప్రపంచ పరిణామముల మూలమున ఆఫ్రికా ఖండమందలి రాజ్యములు అనేకములు స్వాతంత్ర్యమును ఆర్జించుకొన గలిగినవి; తక్కిన దేశములు త్వరలో స్వతంత్రములు కాగలుగునను ఆశకు తావు ఏర్పడినది. ఆ యా ప్రత్యేక రాజ్యములను గురించిన శీర్షికలలో వానికి సంబంధించిన పూర్తి వివరములు కననగును. ప్రక్కపుటలోని పట్టిక వలన ఆఫ్రికాలోని వివిధ దేశముల రాజకీయ ప్రతిపత్తిలో గత ఇరువది ఏండ్లలో కలిగిన మార్పులు స్పష్టము కాగలవు. చీ. శే. రా.

# ఆఫ్రికా రాజ్యములు - వాని ప్రతిపత్తిలో మార్పులు

| వరుస సంఖ్య | దేశము పేరు | విస్తీర్ణము (చ. కి. మీ.) | జనాభా (తాజా అంచనా) | 1945 లో ప్రతిపత్తి | 1965 లో ప్రతిపత్తి |
|---|---|---|---|---|---|
| 1. | అన్‌గోలా | 12,51,512 | 48,32,677 | పోర్చుగీస్ వలస రాజ్యము | పోర్చుగీస్ సముద్రోత్తర ప్రాంతము. |
| *2. | అప్పర్ వోల్టా | 3,15,690 | 45,00,000 | ఫ్రెంచి వలస రాజ్యము | ఫ్రెం. క. లో సభ్యత్వము కల స్వతంత్ర గణరాజ్యము. |
| 3. | అల్‌జీరియా | 23,81,741 | 1,07,84,269 | ఫ్రెంచి సముద్రోత్తరమండలము | స్వతంత్ర గణరాజ్యము. |
| 4. | ఇఫ్నీ | 1,919 | 49,889 | స్పానిష్ వలస రాజ్యము | స్పానిష్ సముద్రోత్తర రాష్ట్రము. |
| 5. | ఈజిప్టు | 10,00,000 | 2,78,03,000 | నామమాత్ర స్వతంత్రత గలిగి బ్రిటిష్ ఆధిపత్యమునకు లోనైన దేశము | స్వతంత్ర గణరాజ్యము. |
| 6. | ఉగాండా | 2,39,640 | 70,15,900 | బ్రిటిష్ సంరక్షిత రాజ్యము | కా. నే. లో సభ్యత్వముగల స్వతంత్ర ప్రజాస్వామిక రాజ్యము. |
| 7. | ఎతియోపియా | 11,84,320 | 2,10,00,000 | స్వతంత్ర రాజ్యము | స్వతంత్ర రాజ్యము. |
| 8. | ఎరిట్రియా | ... | ... | ఇతఃపూర్వము ఇటాలియన్ వలసగ ఉండి యుద్ధ ఫలితముగ బ్రిటిష్ సైనిక పాలనలో ఉండినది. | ఎతియోపియాలో ఒక రాష్ట్రమయినది. అందువలన వైశాల్య, జనసంఖ్యా వివరములు ఈయబడలేదు. |
| 9. | ఐవరీకోస్ట్ | 3,22,464 | 34,10,000 | ఫ్రెంచి వలస రాజ్యము. | ఫ్రెం. క. లో సభ్యత్వముగల స్వతంత్ర గణరాజ్యము. |
| 10. | కాంగో (బ్రజ్జవిల్లీ) | 3,42,000 | 8,64,684 | ఫ్రెంచి వలస రాజ్యము | ఫ్రెం. క. లో సభ్యత్వముగల స్వతంత్ర గణరాజ్యము. |
| 11. | కాంగో (లియోపాల్డ్‌విల్లీ) | 23,45,409 | 1,50,07,000 | బెల్జియమ్ వలస రాజ్యము | స్వతంత్ర రాజ్యము. |
| 12. | కామెరూన్ | ... | ... | బ్రిటిష్ ధర్మకర్తృత్వ ప్రాంతము. | దీనిలో ఉత్తర ప్రాంతము నైజీరియా యందును, దక్షిణ ప్రాంతము కామెరౌన్‌నందును చేరినవి. కావున వివరములు ఈయబడలేదు. |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 13. | కామెరాన్ | 4,75,442 | 45,95,000 | ఫ్రెంచి రాష్ట్రము | స్వతంత్ర గణరాజ్యము. |
| 14. | కెన్యా | 5,82,646 | 88,47,000 | బ్రిటిష్ వలస రాజ్యము, సంరక్షిత రాజ్యము | ... |
| 15. | కేప్‌వర్డి దీవులు | 4,033 | 2,01,549 | పోర్చుగీస్ వలస రాజ్యము | పోర్చుగీస్ సముద్రోత్తర మండలము. |
| 16. | గాంబియా | 10,369 | 3,15,486 | బ్రిటిష్ వలస రాజ్యము, సంరక్షిత రాజ్యము | స్వతంత్ర రాజ్యము. |
| 17. | గినీ | 2,45,857 | 33,56,900 | ఫ్రెంచి వలస రాజ్యము | స్వతంత్ర గణరాజ్యము. |
| 18. | గెబన్ | 2,67,000 | 4,52,500 | ఫ్రెంచి వలస రాజ్యము | ఫ్రెం. క. లో సభ్యత్వము కల స్వతంత్ర గణరాజ్యము. |
| †19. | ఘానా (గోల్డ్ కోస్ట్) | 2,37,873 | 72,44,000 | బ్రిటిష్ వలస రాజ్యము | కా. నే. లో సభ్యత్వము కల స్వతంత్ర గణరాజ్యము. |
| 20. | చాద్ | 12,84,000 | 27,20,300 | ఫ్రెంచి వలస రాజ్యము | ఫ్రెం. క. లో సభ్యత్వము కల స్వతంత్ర గణరాజ్యము. |
| ¶21. | జాంజిబార్ | ... | ... | బ్రిటిష్ రక్షితమగు సుల్తాను రాజ్యము | స్వతంత్రమైన తరువాత టాంజేనియాలో లీనమైనది. |
| 22. | జాంబియా (ఉత్తర రొడీషియా) | 7,54,000 | 35,87,000 | బ్రిటిష్ రక్షిత ప్రాంతము | కా. నే. లో సభ్యత్వముగల స్వతంత్ర రాజ్యము. |
| 23. | టాంగన్యికా | ... | ... | బ్రిటిష్ పాలనలోని రాజ్యము | 1961 లో స్వతంత్రతను పొంది తరువాత టాంజేనియాలో లీనమైనది. |
| 24. | టాంజేనియా | 9,39,704 | 1,00,46,070 | బ్రిటిష్ పాలనలో ఇందలి టాంగన్యికా, జాంజిబార్ వేర్వేరుగ ఉండినవి | కా. నే. లో సభ్యత్వము కల స్వతంత్ర రాజ్యము. |
| 25. | టూనీషియా | 1,25,180 | 42,90,000 | ఫ్రెంచి రక్షిత రాజ్యము | స్వతంత్ర గణరాజ్యము. |
| 26. | టోగో (టోగోలాండ్) | 56,600 | 15,88,000 | ఫ్రెంచి ధర్మకర్తృత్వ ప్రాంతము | స్వతంత్ర గణరాజ్యము. |
| 27. | దక్షిణ ఆఫ్రికా | 12,23,409 | 1,62,36,000 | బ్రిటిష్ కామన్‌వెల్త్‌లో సభ్యత్వము కల స్వతంత్ర రాజ్యము | స్వతంత్ర గణరాజ్యము. |
| 28. | దహోమీ | 1,15,762 | 22,00,000 | ఫ్రెంచి వలస రాజ్యము | ఫ్రెం. క. లో సభ్యత్వము కల స్వతంత్ర గణరాజ్యము. |
| 29. | నైజర్ | 12,67,000 | 30,40,673 | ఫ్రెంచి వలస రాజ్యము | ఫ్రెం. క. లో సభ్యత్వము కల స్వతంత్ర గణరాజ్యము. |
| 30. | నైజీరియా | 9,23,772 | 3,72,13,000 | బ్రిటిష్ వలస; సంరక్షిత రాజ్యము | కా. నే. లో సభ్యత్వము కల స్వతంత్ర సమాఖ్య. |

| వరుస సంఖ్య | దేశము పేరు | విస్తీర్ణము (చ. కి. మీ.) | జనాభా (తాజా అంచనా) | 1945 లో ప్రతిపత్తి | 1965 లో ప్రతిపత్తి |
|---|---|---|---|---|---|
| 31. | నైరృతి ఆఫ్రికా | 8,22,905 | 5,84,000 | దక్షిణ ఆఫ్రికా ధర్మకర్తృత్వ ప్రాంతము | దక్షిణ ఆఫ్రికా ధర్మకర్తృత్వ ప్రాంతము. |
| 32. | పోర్చుగీస్ గినీ | 36,125 | 5,44,184 | పోర్చుగీస్ వలస రాజ్యము | పోర్చుగీస్ సముద్రోత్తర మండలము. |
| 33. | ఫెర్నాండో పో | 2,033 | 61,197 | స్పానిష్ వలస రాజ్యము | స్పానిష్ సముద్రోత్తర మండలము. |
| 34. | బసూటోలాండ్ | 30,303 | 6,97,000 | బ్రిటిష్ వలస రాజ్యము | బ్రిటిష్ వలస రాజ్యము. |
| 35. | బురుండీ | 27,834 | 26,00,000 | బెల్జియమ్ ధర్మకర్తృత్వ ప్రాంతము | స్వతంత్ర రాజ్యము. |
| 36. | బెచూనాలాండ్ | 5,69,798 | 3,50,000 | బ్రిటిష్ రక్షిత రాజ్యము | బ్రిటిష్ రక్షిత రాజ్యము. |
| ¶37. | మడగాస్కర్ (మలగాసీ) | 5,95,790 | 58,03,000 | ఫ్రెంచి వలస రాజ్యము | ఫ్రెం. క. లో సభ్యత్వము కల స్వతంత్ర గణరాజ్యము |
| 38. | మలావి (న్యాసాలాండ్) | 96,200 | 40,00,000 | బ్రిటిష్ రక్షిత రాజ్యము | కా. నే. లో సభ్యత్వము కల స్వతంత్ర రాజ్యము. |
| 39. | మారిటేనియా | 10,85,805 | 7,70,000 | ఫ్రెంచి వలస రాజ్యము | ఫ్రెం. క. లో సభ్యత్వము కల ఇస్లామిక గణరాజ్యము. |
| 40. | మాలీ (ఫ్రెంచి సుడాన్) | 12,04,021 | 43,05,000 | ఫ్రెంచి వలస రాజ్యము | స్వతంత్ర గణరాజ్యము. |
| 41. | మొజాంబిక్ | 7,82,824 | 65,92,994 | పోర్చుగీస్ వలస రాజ్యము | పోర్చుగీస్ సముద్రోత్తర మండలము. |
| §42. | మొరాకో | 4,43,680 | 1,23,60,000 | ఫ్రెంచి వలస కొంత; తక్కినది స్పానిష్ వలస | స్వతంత్ర రాజ్యము (స్పెయిన్ వారి వలసలు మాత్రము చెదురు వాటుగ కొన్ని నిలబడినవి). |
| 43. | రియోమునీ | 17,449 | 1,83,377 | స్పానిష్ వలస రాజ్యము | స్పానిష్ సముద్రోత్తర రాష్ట్రము. |
| 44. | రువండా | 26,338 | 26,94,749 | బెల్జియమ్ ధర్మకర్తృత్వ ప్రాంతము | స్వతంత్ర రాజ్యము. |
| 45. | రొడీషియా (దక్షిణ రొడీషియా) | 3,89,361 | 38,80,000 | స్వయంపరిపాలక బ్రిటిష్ వలస | స్వయం పరిపాలక బ్రిటిష్ వలస. కాని, 11-11-65 ఏకపక్షముగ స్వతంత్రతను ప్రకటించినది. అయినను పెక్కుదేశములు పరిగణన ఈయలేదు. |
| 46. | లిబియా | 17,59,540 | 12,44,000 | అంతకు పూర్వము ఇటాలియన్ వలస; ద్వితీయ ప్రపంచ యుద్ధము తరువాత బ్రిటిష్ సైనిక పరిపాలనలో ఉండినది. | స్వతంత్ర సమాఖ్య. |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 47. | లైబీరియా | 1,11,370 | 12,90,000 | స్వతంత్ర గణరాజ్యము | స్వతంత్ర గణరాజ్యము. |
| 48. | సహారా, స్పానిష్ | 2,65,940 | 23,793 | స్పానిష్ వలస రాజ్యము | స్పానిష్ సముద్రోత్తర రాష్ట్రము. |
| 49. | సావోటోమీఇ ప్రిన్సిపీ దీవులు | 963 | 63,676 | పోర్చుగీస్ వలస | పోర్చుగీస్ సముద్రోత్తర మండలము. |
| 50. | సియెర్రాలియోనీ | 72,326 | 21,83,000 | బ్రిటిష్ వలస; రక్షిత ప్రాంతము | కా. నే. లో సభ్యత్వము కల స్వతంత్ర రాజ్యము. |
| 51. | సుడాన్ (ఆంగ్లో-ఈజిప్షియన్ సుడాన్) | 25,05,823 | 1,30,11,000 | ఇంగ్లండు, ఈజిప్టుల సంయుక్త విభుత్వమునకు లోబడి ఉండినది. | స్వతంత్ర గణరాజ్యము. |
| 52. | సెంట్రల్ ఆఫ్రికన్ రిపబ్లిక్ (ఉబంగీ – షరీ) | 6,17,000 | 12,50,000 | ఫ్రెంచి వలస రాజ్యము | ఫ్రెం. క. లో సభ్యత్వము కల స్వతంత్ర గణరాజ్యము. |
| 53. | సెనెగల్ | 1,97,161 | 32,80,000 | ఫ్రెంచి వలస రాజ్యము | ఫ్రెం. క. లో సభ్యత్వము కల స్వతంత్ర గణరాజ్యము. |
| 54. | సోమాలియా (ఇటాలియన్ సోమాలీలాండ్) | 6,37,661 | 22,50,000 | అంతకు పూర్వము ఇటాలియన్ వలసగ ఉండి, ద్వి. ప్ర. యు. తరువాత సైనిక ఆక్రమణలో ఉండి, తరువాత ఐ. రా. స. ధర్మకర్తృత్వ ప్రాంతము | స్వతంత్ర గణరాజ్యము. |
| 55. | సోమాలీ లాండ్ | ... | ... | బ్రిటిష్ రక్షిత రాజ్యము | సోమాలియాతో కలుపబడినది. |
| 56. | సోమాలీ లాండ్ (ఫ్రెంచి) | 21,999 | 81,000 | ఫ్రెంచి వలస రాజ్యము | ఫ్రెంచి సముద్రోత్తర మండలము. |
| 57. | స్వాజీలాండ్ | 17,366 | 2,70,000 | బ్రిటిష్ రక్షిత ప్రాంతము | బ్రిటిష్ రక్షిత ప్రాంతము. |
| 58. | సూటా, మెలిల్లా మొ. (మొరాకోలోని స్పానిష్ స్థావరములు) | 212 | 1,52,000 | స్పానిష్ వలస రాజ్యము | స్పానిష్ సముద్రోత్తర రాష్ట్రము. |

ఫ్రెం. క. = ఫ్రెంచి కమ్యూనిటీ; కా. నే. = కామన్‌వెల్త్ ఆవ్ నేషన్స్; ద్వి. ప్ర. యు. = ద్వితీయ ప్రపంచ యుద్ధము; ఐ. రా. స. = ఐక్యరాజ్యసమితి. † ఇందు పూర్వము బ్రిటిష్ ప్రాంతముగ ఉన్న టోగోలాండ్ కూడ చేరినది. ¶ వీనియందు ఆశ్రిత స్వల్ప ప్రాంతములు కూడ చేరి ఉన్నవి. § పూర్వపు టాంజియర్ దక్షిణప్రాంతము ఇందు చేరినది; స్పెయిన్ ప్రాంతములు మాత్రము చేరలేదు. * ఫ్రెంచి సుడాన్, ఐవరీకోస్ట్, నైజర్ దేశముల నుండి కొన్ని భాగములు తీసి కలుపుటచే 1947 లో రూపొందినది.

**ఆఫ్రేసియా రాజ్యముల సమావేశము :** ఇండోనీషియాలోని బాండుంగ్ నగరమున 1955, ఏప్రిల్ 18-24 లలో జరిగిన ఒక చారిత్రక సమావేశము. దీనికే 'బాండుంగ్ సమావేశము' అనియు పేరు కలదు. ఆఫ్రికా, ఆసియా ఖండములందలి రాజ్యముల మధ్య సాన్నిహిత్యమును పెంపొందించుట, ఇంకను ఆ ఖండములందు అటనట నిలిచి ఉన్న సామ్రాజ్య ప్రభుత్వములను ఎదుర్కొని పోరాడు వలసదేశములకు నైతిక సహకారము ఒసగుట ఈ సమావేశము యొక్క ఉద్దేశములు. ఇజ్రాయెల్, దక్షిణ ఆఫ్రికా తప్ప తక్కిన ఆఫ్రికా - ఆసియా స్వతంత్ర రాజ్యముల ప్రతినిధులందరును ఇందు పాల్గొనిరి. చీనా ప్రజాగణరాజ్యము ప్రప్రథమమున పాల్గొనిన అంతర్జాతీయ సమావేశము ఇదియే. ఐక్యరాజ్యసమితి యొక్క 'మానవస్వత్వ ప్రణాళిక' ను ఈ సమావేశము బలపరచి, ఆఫ్రికాలోని కొన్ని ప్రాంతములందు కననగు వర్ణ విచక్షణను నిరసించినది. ఇజ్రాయెల్ తో అరబ్బు దేశములకు ఏర్పడిన వివాదమున ఈ సమావేశము అరబ్బు దేశములనే సమర్థించినది. ఏడెన్ వలసయు, తత్ప్రాంతమునందలి బ్రిటిష్ రక్షిత అరబ్బు రాజ్యములును యెమెన్ రాజ్యమునకే చెందవలయునని భావించుచు, ఇంకను వలసలుగ మిగిలి ఉండిన రాజ్యములు జరుపుచున్న స్వాతంత్ర్యోద్యమములను ఈ సమావేశము బలపరచినది.

ఈ సమావేశ ఫలితముగ చీనాయందలి నూతన ప్రభుత్వమునకు తక్కిన ఆఫ్రేసియా రాజ్యములతో పరిచితి కలిగెను. అంతేకాక ఆఫ్రేసియా రాజ్యములు పరస్పరము అర్థము చేసికొను అవకాశము కలిగినది. ఈ సమావేశమున పాల్గొనిన 29 రాజ్యములలో కొన్నింటికి ఐక్యరాజ్యసమితి సభ్యత్వము లేకున్నను, ఆ సభ్యత్వము కల రాజ్యములు అన్నియు అంతటినుండియు ఐక్యరాజ్య సమితి సమావేశములందు ఒక వర్గముగ 'ఆఫ్రేసియా వర్గము' అను పేర వ్యవహరించి కృషి చేయుచున్నవి. 1955 మొదలుగ అంతటంతట స్వాతంత్ర్యమును ఆర్జించి, ఐక్యరాజ్యసమితిలో సభ్యత్వమును గడించిన తక్కిన ఆఫ్రేసియా రాజ్యములును ఇందు చేరుట వలన ఈ వర్గమునందలి రాజ్యముల సంఖ్య 1963 ఆరంభమున 50 కి మించినది. 1965 లో ఆఫ్రేసియా రాజ్యముల సమావేశమును వేరొకదానిని ఆల్జీరియా దేశమున జరుపుటకు నిర్ణయింపబడినను, ఆల్జీరియా ప్రభుత్వమున కలిగిన మార్పుల వలన తొలుతను, ఆ తరువాత చీనా, ఇండోనీషియా దేశములు అనుసరించిన ప్రతిఘటనా వైఖరి మూలమునను ఆ సమావేశము కాలనిర్ణయము లేకుండ వాయిదా పడినది.

ప్ర. రా. సు.

**ఆయవ్యయ పట్టిక :** 'బడ్జెట్' అను ఇంగ్లీషు పదము 'బౌజెటీ' అను ప్రాచీన ఇంగ్లీషు పదమునుండి వ్యుత్పన్నమైనది. 'బౌజెటీ' అనగా ఒక చిన్నసంచి. ఆర్థికమంత్రి అట్టి ఒక సంచి నుండి కాగితములు పైకి తీసి, రానున్న ఆర్థిక సంవత్సరమునకు ప్రభుత్వ ప్రణాళికను పార్లమెంట్ నకు నివేదించెడివాడు. అందుచే దీనికి 'బడ్జెట్' అని పేరు వచ్చినది. ఒక ప్రభుత్వము యొక్క ద్రవ్య సంబంధమైన వ్యవహారములను క్రమబద్ధముగ నిర్వహించుటకు అవకాశము కల్పించుటయే బడ్జెట్ యొక్క వాస్తవమైన ప్రయోజనము. ఈ వ్యవహార నిర్వహణలో ఆదాయమును, ఆవశ్యకమగు వ్యయమును ముందుగ అంచనా వేయుట, ఆదాయమునకును, తద్వినియోగమునకును సంబంధించిన శాసనములను తయారుచేయుట, జమాఖర్చు చిఠాలను నిర్వహించుట, వాటిని శాస్త్రీయముగ శోధింపజేయుట, నివేదికలను తయారుచేయుట వంటి అనేక కార్యక్రమములు ఒక దాని వెంట ఒకటి నిర్వర్తింపవలసి ఉండును [చూ. సం. 5 - పు. 401].

ప్ర. రా.

**ఆయుధ విసర్జన :** చూ. నిరాయుధీకరణ.

**ఆయూబ్ ఖాన్, మహమ్మద్** (జ. 1907) : పాకిస్తాన్ అధ్యక్షుడు (1958 నుండి). 1907 మే 14 వ తేదీన సరిహద్దు రాష్ట్రములో జన్మించెను. ఆలిఘర్ ముస్లిమ్ యూనివర్సిటీలోను, సాండ్ హర్ట్స్ (ఇంగ్లండు) లోని రాయల్ మిలిటరీ కాలేజీలోను విద్యాభ్యాసము. 1928 లో బ్రిటిష్ ఇండియన్ ఆర్మీలో చేరెను. 1947 లో కర్నల్ హోదాను పొందెను. క్రమముగ 1951 లో పాకిస్తాన్ దళాల కమాండర్ - ఇన్ - ఛీఫ్ గా నియుక్తుడయ్యెను. 1954 - 56 లో పాకిస్తాన్ రక్షణ మంత్రిగా వ్యవహరించెను. 1958 అక్టోబరు 7 వ తేదీన పాకిస్తాన్ అధ్యక్షుడు ఇస్కందర్ మీర్జా పాక్ రాజ్యాంగాన్ని రద్దుచేసినప్పుడు తొలుత మార్షల్ లా ముఖ్య అడ్మినిస్ట్రేటర్ (సైనిక చట్టమును అమలు జరిపే ప్రధానాధికారి) గా ఆయూబ్ ఖాన్ నియమితుడై, తన పలుకుబడి మూలమున - ఆ తరువాత అక్టోబరు 24 న ఏర్పడిన క్రొత్త మంత్రి వర్గమున - తానే ప్రధానమంత్రి కాగలిగెను. అంతట త్వరితగతిలో జరిగిన రాజకీయ పరివర్తనలవలన, సైన్యబల సహాయమున ఆయూబ్ ఖాన్ పాకిస్తాన్ అధ్యక్షుడుగా అధికారమును గ్రహించెను (అక్టోబరు 28). 1960 ఫిబ్రవరిలో జరిగిన జనవాక్య సేకరణలో ఆయన అధ్యక్షత ధ్రువపడెను. 1962 లో మార్షల్ లా పరిపాలన సమాప్తమై, పాకిస్తాన్ క్రొత్త

రాజ్యాంగము ప్రకటితమైనది. ఈ రాజ్యాంగమును అనుసరించి 1964 లో ఎన్నికలు జరిగి, తత్ఫలితముగ అయూబ్ ఖాన్ మరల అధ్యక్షుడు కాగలిగెను.

పాకిస్తాన్‌లో అయూబ్ ఖాన్ ప్రోత్సాహమున అమలులోనికి వచ్చిన ఆ క్రొత్తరాజ్యాంగము మౌలిక ప్రజాస్వామ్యము (బేసిక్ డెమోక్రసీ) అని వ్యవహరింపబడుచున్నను అందు శాసనసభకు నామమాత్రపు అధికారములు మాత్రమే కలవు. అధ్యక్షుడే నియంతగ వ్యవహరించుటకు అన్ని అవకాశములును అందు కలవు. సామాన్యజనులు ఎదుర్కొను సమస్యల నుండి వారి దృష్టిని మరల్చి, తన పదవికి భద్రతను చేకూర్చుకొనుటకు కాశ్మీర్ సమస్య [చూ.] అయూబ్‌నకు కొంతవరకు ఉపకరించినదని చెప్పవచ్చును. బలప్రయోగము వలన కాశ్మీర్‌ను వశపరచుకొనవలయునని 1965 లో అతడు చేసిన యత్నము విఫలమై, భారత సేనలు లాహోర్ పరిసరముల వరకు చొచ్చుకొనిపోగలిగినవి [చూ. కాశ్మీర్ సమస్య; పాకిస్తాన్; టాష్ ఖండ్ ప్రకటన; భారతదేశము]. పి. ఆర్. పి.

**అరబ్ లీగ్ :** వేర్వేరు అరబ్బు రాజ్యముల స్వతంత్ర ప్రతిపత్తులను సంరక్షించుచు, వాని మధ్య రాజకీయ, ఆర్థిక సమైక్యమును నెలకొల్పు ఉద్దేశముతో ఏర్పడిన ఒక సంస్థ. ఇరాక్, జోర్డాన్, లెబనాన్, సౌదీ అరేబియా, ఈజిప్టు, సిరియా, యెమెన్ దేశములు సభ్య రాజ్యములుగ ఈ సంస్థ 1945 లో స్థాపింపబడినది. లిబియా (1953), సుడాన్ (1965), మొరాకో, టూనీషియా (1958), కువాయిట్ (1961), అల్ జీరియా (1962) ఇందు సభ్యరాజ్యములుగ చేరినవి. కాని, సభ్యరాజ్యముల మధ్య గల కొన్ని వైరుధ్యముల మూలమున ఈ సంస్థ ఆదర్శమగు అరబ్బుదేశముల సమైక్యము ఈనాటికిని దుస్సాధ్యముగనే ఉన్నది. ఈ లీగ్ ముఖ్య కార్యాలయము ఈజిప్టు రాజధాని యగు కైరో నగరమున కలదు. చీ. శే. రా.

**అరిస్టాటిల్** (క్రీ. పూ. 384 - 322) **:** గ్రీక్ దార్శనికుడు; రాజనీతి వేత్త. వివిధ శాస్త్రములకు సంబంధించిన గ్రంథములను ఇతడు రచించెను. రాజనీతి శాస్త్రమును గురించియు, తన కాలమున అమలునందున్న వివిధ రాజ్యాంగములను గురించియు రచించిన గ్రంథములును వీనిలో కొలదిగ కలవు. 'మానవుని మంచితనమును పోషింపగల ప్రభుత్వమే సరియైన ప్రభుత్వ' మని ఇతని అభిప్రాయము. అట్టి ప్రభుత్వము: 1. సాధువర్తనము కల రాజు పరిపాలించెడు రాజ్యముగాని; 2. సాధువర్తనము కల సంపన్న వర్గములవారు పరిపాలించు రాజ్యముగాని; 3. సాధువర్తనము కల పౌరులు అందరును కలిసి పరిపాలించు ప్రజా గణరాజ్యముగాని కావచ్చును. ఇందుకు విరుద్ధముగ ఉన్న రాజ్యములు దుష్టరాజ్యములని అరిస్టాటిల్ నిర్వచించెను [చూ. సం. 6 - పు. 508; సం. 7 - పు. 291]. గి. వేం. సీ.

**ఆర్జెంటీనా :** దక్షిణ అమెరికాలోని గణరాజ్యము. ఉరుగ్వే, బ్రెజిల్, పరాగ్వే [తూ]; అట్లాంటిక్ మహాసముద్రము, చిలీ [ద]; చిలీ [ప]; బొలీవియా [ఉ] సరిహద్దులు. [వి] 27,76,656 చ. కి. మీ.; [జ] 2,15,84,471. అత్యధిక భాగము యూరపియన్ సంతతి; అచ్చమగు ఆదిమజాతి వారు




30,000 మించరని అంచనా; ఆదిమ జాతి క్రమక్రమముగ నశించుచున్నది; మిశ్రమజాతియు కలదు; [భా] స్పానిష్ భాష; [మ] 95% క్రైస్తవులు; [రా] బ్యూనోస్ ఐరిస్ (జ. సం. 37,33,000).

చరిత్ర : 1516 లో స్పెయిన్ దేశ నావికులు ఆర్జెంటీనా తీరమును మొట్టమొదట దర్శించిరి. 1526 - 32 లో సెబాస్టియన్ కేబట్ అను స్పానిష్ సాహస నావికుడు పెరానా నదీముఖమును చేరి, వెండిగనులు గల దేశమని విని ఆ నదికి రయో డీ లాప్లాటా (వెండి నది) అని పేరు పెట్టెను.

అర్జెంటీనా (అర్జెంటమ్ అనగా లాటిన్‌లో 'వెండి' అని అర్థము) అను పేరు సైతము దానినిబట్టి వచ్చినదే.

స్పెయిన్ రాజు చార్లెస్-V 1535 లో పెడ్రో డి మెండో జాను పంపగా అతడు బ్యూనోఐర్స్‌ను ఒక స్పానిష్ వలసరాష్ట్రముగ ఏర్పరచెను. అదే క్రమముగా విస్తృత మొందెను. ఇటుల తుదకు 1600 నాటికి అర్జెంటీనా అంతయు స్పెయిన్ వారి పరిపాలనములోనికి వచ్చినది. ఆ నాటికి ఆ ప్రాంతమున 'ఇన్‌కా' నాగరకత [చూ. సం. 10-పు. 588] వ్యాపించి ఉండెను. స్పానిష్ రాజ్యము ప్రబలిన తరువాత 'ఇన్‌కా' నాగరకత స్పానిష్ నాగరకతలో లీనమైనది.

స్పెయిన్ దేశమును నెపోలియన్ 1809 లో స్వాధీన పరచుకొని తన సోదరుడైన జోసెఫ్‌ను రాజ్యాభిషిక్తుని చేసినప్పుడు అర్జెంటీనాలో స్వాతంత్ర్యోద్యమము ప్రజ్వరిల్లి, 1816 లో స్వాతంత్ర్యము ప్రకటితమైనది. కాని, ఈ స్వాతంత్ర్యము క్రమముగ అంతఃకలహములకు దారితీసినది. ఏకత్వ (యూనిటరీ) ప్రభుత్వము కావలయునని కొందరును, సమాఖ్య (ఫెడరల్) ప్రభుత్వము వలన మాత్రమే దేశము బాగుపడునని మరికొందరును రాజకీయ వేత్తలు భావించినందులకు ఫలితముగ అంతఃకల్లోలములు చెలరేగినవి. చివరకు 1862 లో సమాఖ్యారాజ్యాంగ వాదులకే జయము చేకూరినది. కాని, అంతఃకలహములు మాత్రము ఏదియో ఒక కారణమున చెలరేగుచుండుట ఆ రాజ్యమున ఒక సామాన్యలక్షణముగ పరిణమించినది.

అర్జెంటీనాలో 1910 నాటికి కార్మికోద్యమము బలపడిన కారణముగ రాజ్యాంగములో కొన్ని మార్పులు ఘటిల్లినవి. సార్వజనీనకమయిన రహస్యపు ఎన్నికల పద్ధతి అప్పటినుండి అమలులోనికి వచ్చినది. ప్రపంచ యుద్ధము I - II లలో ఈ దేశము తాటస్థ్యమును అవలంబించి, తన ఎగుమతులను అభివృద్ధిపరచి, స్థానిక పరిశ్రమలను పెంపొందింప జేసికొనినది.

ద్వితీయ ప్రపంచ యుద్ధము జరుగు కాలమున అర్జెంటీనా చాల కాలము వరకు తాటస్థ్యము వహించి ఉండెను. కాని, సైన్యమందు మాత్రము అక్షరాజ్యముల ఎడ అభిమానము ఎక్కువగ ఉండుటచే 1943 లో సైన్యము తిరుగుబాటు చేసి, అప్పటి అధ్యక్షుని అధికారము నుండి తొలగించి, నియంతృత్వమును స్థాపించెను. ఐనను దక్షిణ అమెరికా రాజ్యములందు యునైటెడ్‌స్టేట్స్‌కు గల పలుకుబడి వలన ఈ సైనిక నియంతృత్వ ప్రభుత్వము సైతము అక్షరాజ్యముల పక్షమున చేరలేకపోవుటయే కాక, త్వరలోనే వేరొక వర్గము వారిచే అధికారమునుండి తొలగింపబడెను. ఇటుల వెంట వెంట ప్రభుత్వములు మారుచు దేశమున స్థిరప్రభుత్వమే లేకుండెను. కడకు 1945 లో యుద్ధగతి అక్షరాజ్యములకు వ్యతిరేకముగ ఉండుట గమనించి, అర్జెంటీనా కూడ మిత్రరాజ్యముల పక్షమున ప్రపంచ యుద్ధము-II న చేరెను. అంతట 1946 లో దేశమందు జరిగిన ఎన్నికలలో కల్నల్ జువాన్ డోమింగో పెరాన్ అను ప్రముఖుడు అధ్యక్షుడుగ ఎన్నుకొనబడెను. ఉభయ శాసనసభలందును ఈతని పక్షము వారే అధిక సంఖ్యాకులుగ ఎన్నుకొనబడిరి. దేశమునందలి కార్మిక వర్గమును, సైన్యమును పెరాన్‌కు అండగా ఉండిరి. ఈ అవకాశమును ఉపయోగించుకొని పెరాన్ దేశశ్రేయస్కరములగు ఆర్థిక, రాజకీయ, సాంఘిక సంస్కరణములను కొన్నింటిని ప్రవేశపెట్టి, నియంతృత్వ రీతిలో వానిని అమలులోనికి తెచ్చెను. క్రమముగ సైన్యమునందలి ఒక బలవత్తర పక్షము వారికి పెరాన్ ఎడల ఆదరము నశించుట వలన ఆ వర్గమువారు 1955 సెప్టెంబరులో అతని ప్రభుత్వమును కూలద్రోసి, అతనిని దేశభ్రష్టుని కావించిరి. తరువాత రెండు ఏండ్లు దేశము ఒక తాత్కాలిక ప్రభుత్వపు అధీనమున ఉండెను. అంతట 1958 లో ఎన్నికలు జరిగి ఆర్టురో ఫెర్నాండెజ్ అనునతడు అధ్యక్షుడుగ ఎన్నుకొనబడినను, సుస్థిర ప్రభుత్వము కుదురుకొనక, కడకు సైన్యపు అండతో జోసిమేరియాగ్విడో 1962 లో అధ్యక్షుడై ఎన్నికలు జరిగిన ఫలితముగ డాక్టర్ ఆర్టురో ఇలియా అధ్యక్షుడయ్యెను (1963). అయినను స్పెయిన్‌లో ప్రవాసమున్న పెరాన్, తన అనుచరుల మూలమున దేశ రాజకీయములలో జోక్యము వహించి, మరల అధికారమును గ్రహింప యత్నించుచున్నాడు.

రాజ్యాంగము : ఈ దేశమున ప్రస్తుతము అమలులో ఉన్న రాజ్యాంగము తొలుత 1853 లో యునైటెడ్ స్టేట్స్ రాజ్యాంగమును అనుసరించి రూపొందింపబడినది. 1949 లో పెరాన్ ప్రభుత్వము దీనిని రద్దుచేసి, వేరొక రాజ్యాంగ విధానమును అమలులోనికి కొనివచ్చెను. కాని, ఆ ప్రభుత్వమును కూలద్రోసి అధికారమునకు వచ్చిన తాత్కాలిక ప్రభుత్వము 1853 రాజ్యాంగమునే తిరిగి అమలులోనికి కొనివచ్చెను. తరువాత 1957 అక్టోబరులో సమావేశమైన రాజ్యాంగ పరిషత్తు ఈ 1853 రాజ్యాంగమున దేశకాలములను అనుసరించి కొన్ని మార్పులను చేసెను. ప్రస్తుతము అమలునందున్న రూపమున ఈ రాజ్యాంగమును అనుసరించి వివిధ రాష్ట్రప్రభుత్వములును, వానిని అనుసంధించు ఒక సమాఖ్య ప్రభుత్వమును దేశపరిపాలనను నిర్వహించుచున్నవి. అవశిష్టాధికారములు రాష్ట్ర ప్రభుత్వములకే

చెందుచున్నవి. అధ్యక్షుడు, ఉపాధ్యక్షుడు అపరోక్షపు ఎన్నిక మూలమున ప్రజలచే ఎన్నుకొనబడుదురు. వీరి అధికార కాలపరిమితి ఆరు సంవత్సరములు. అధ్యక్షునికి విస్తృతాధికారములు కలవు. శాసన నిర్మాణమునకై సెనేట్, ప్రతినిధుల సభ అను రెండు విధముల శాసనసభలు కలవు. బడ్జెట్ ఆమోదము, ద్రవ్యవిషయక శాసన ప్రవేశము మొదలగు అధికారములు దిగువసభకు మాత్రమే చెంది ఉన్నవి. 17 ఏండ్ల వయసు మించిన ప్రతి పౌరునికి వోటింగు హక్కు కలదు. చీ. శే. రా.

**ఆర్నాల్డ్ జె. టాయన్‌బీ**: చూ. టాయన్‌బీ.

**ఆర్యావర్తము**: భారతదేశమునందలి ఉత్తరభాగము (ఉత్తర హిందూస్థానము) నకు ప్రాచీనకాలమున వాడుకలో ఉండిన ఒక పేరు. క్రీ. పూ. రెండవ శతాబ్ది ప్రాంతమున రూపుగొనినదిగ భావింపదగు మనుస్మృతియందును, ఆ కాలముననే సంగ్రథితమైన వాల్మీకి రామాయణమునను ఈ నామము తొలుత కనవచ్చుచున్నది. మనుస్మృతియందు ఈ నామముచే సూచింపబడు ప్రాంతము ఉత్తర - దక్షిణములందు హిమాలయము మొదలుగ వింధ్యాద్రి వరకును, పూర్వ - పశ్చిమములందు సముద్రపర్యంతమును విస్తరించినటుల తెలుపబడినది. సముద్రగుప్తుని అలహాబాదు ప్రశస్తియందు ఉత్తర హిందూస్థానమునకు పర్యాయ నామముగ 'ఆర్యావర్తము' వాడబడినది. చీ. శే. రా.

**ఆర్యులు**: ఆర్యభాషలను మాటలాడుచుండిన వారికి ఆర్యులని వాడుక. ఈ భాషలున్ను, ఈ భాషలను మాటలాడుచుండిన తెగలున్ను చాలా కాలము క్రిందటను ఆసియా ఖండమున కాస్పియన్ సముద్రమునకున్ను, హిందూకుష్ పర్వతములకున్ను మధ్యగల ప్రదేశమందు వ్యాపించి ఉండినవి. నాలుగువేల సంవత్సరముల క్రిందట ఈ ఆర్యులలో ఒక ప్రధానశాఖవారు ఇండియా దేశమునకును, మరియొక ప్రధానశాఖవారు యూరప్ ఖండ ప్రదేశములకును పోయి నివాసములు ఏర్పరచుకొనిరి. కొందరు ఇరాన్‌లో ఉండిపోయిరి. వీరికి 'ఇరానియన్' లని పేరు. వీరి దేశమునకు పరిష్యా యనిన్ని, వీరికి పారసీకులనిన్ని పేరులు. యూరప్ ఖండమందు నివాసములు ఏర్పరచుకొన్న గ్రీక్‌లు, రోమన్‌లు, జర్మన్‌లు మొదలైన జాతులవారు మాటలాడుచుండిన గ్రీక్, లాటిన్, జర్మన్ మొదలైన భాషలు ఆర్యభాషలే! ఆ విధముగానే ఇండియాలో వేదములలోని భాషయే సంస్కృతభాషగా పరిణమించినది. ఆ తర్వాత సంస్కృత భాషనుండి పాలీ, ప్రాకృత భాషలు బయలుదేరినవి. ఆ విధముగానే యూరప్ ఖండమందు పెక్కు భాషలు గ్రీక్, లాటిన్, జర్మన్ భాషల నుండి బయలుదేరినవి. ప్రాచీన కాలములో భాషనుబట్టి జాత్యైక్యమును నిర్ణయించుట సాధ్యమయి ఉండినా, రానురాను వేర్వేరు భాషలు మాటలాడువారును, వేర్వేరు జాతులవారును కలసిమెలసి నివసించుటవలన అల్ప సంఖ్యాకులయినవారు అధిక సంఖ్యాకులభాషలను అలవరచుకొని, తమ మాతృభాషలను విడిచిపెట్టుకొనుటచేతను భాషను బట్టి జాతిని నిర్ణయించుట అసాధ్యమయినది. ఇండియానుండి యూరప్ ఖండమందలి పాశ్చాత్య దేశములవరకును వ్యాపించి ఉన్న ఆర్యసంతతి భాషలకు 'ఇండో - యూరపియన్ భాష' లని పేరు. ఇండియాలో ప్రాకృతభవములైన భాషలే నేటి బెంగాలీ, ఒరియా మొదలైనవి. గి. వేం. సీ.

**ఆల్ జీరియా**: ఆఫ్రికా ఖండములోని స్వతంత్ర రాజ్యము.
ఈ దేశమునకు టూనీషియా, లిబియా [తూ]; మాలీ, నైజర్ [ద]; మొరాకో [ప]; మధ్యధరా సముద్రము [ఉ]. [వి].




23,81,741 చ. కి. మీ; [జ] 1,07,84,269. వీరిలో 10,70,000 ఫ్రెంచివారు; తక్కినవారు అరబ్బులు, బర్బరులు; [భా] ఫ్రెంచి భాష వ్యాపార, రాజకీయములందు వాడబడుచున్నది; అరబ్బీ భాష సామాన్య ప్రచారమునందు ఉన్నది; [మ] ఫ్రెంచివారు రోమన్ కేథలిక్‌లు; తక్కిన ఆల్ జీరియన్‌లు ముస్లిమ్‌లు; [రా] ఆల్ జీర్స్ (7,50,000).

చరిత్ర: ఉత్తర ఆఫ్రికాయందలి మగ్రిబ్ అను ప్రాచీన ప్రాంతమున మొరాకో, టూనీషియా దేశములతోపాటు ఆల్ జీరియా కూడ తొలుత అంతర్భాగముగ ఉండెడిది. ఉత్తర ఆఫ్రికాయందలి తక్కిన ప్రదేశములందువలెనే ఇచటను వివిధ జాతులు ఆ యా కాలములందు వలస

వచ్చి చేరి, అచటి ప్రాచీన జాతులతో మేళనమందినవి. ఈ ప్రాచీన జాతికి బర్బరులు అను వ్యవహారము కలదు. ప్రాచీన కాలమున కార్తెజీనియన్, రోమన్, బైజాంటైన్ పాలకులు ఇట క్రమముగ పాలించిరి.

క్రీ. శ. 7 వ శతాబ్దము మొదలుగ అరబ్బులు మగ్రిబ్ దేశముపై వరుసగ పలుమారులు దండయాత్రలు సలిపి, క్రమముగ 12 వ శతాబ్దినాటికి రోమన్ నాగరకతా శేషములనెల్ల నిర్మూలించి, ప్రజానీకమున అరబ్బీ భాషా సంస్కృతులను, ఇస్లామ్ మతమును వ్యాపింపజేసిరి. దండెత్తివచ్చిన అరబ్బులును కాలక్రమమున బర్బరులతో మేళనమందిరి. మధ్యయుగములందు బర్బరులు గొప్ప సామ్రాజ్యములను ఈదేశమున నిర్మించిరి. ఈ సామ్రాట్లు అందరు ముస్లిమ్ మత వికసనమునకై అతిశ్రద్ధతో కృషి చేసిరి. ఇటుల ఏర్పడిన తొలి సామ్రాజ్యములలో అల్ మొరావిడీ, అల్ మోహదీ అనునవి ఆఫ్రికా చరిత్రలో ప్రశస్తి నార్జించినవి. అల్ మోహదీ సామ్రాజ్యావశేషములపై 13 వ శతాబ్దమున మూడు వేర్వేరు రాజ్యములు రూపొందినవి. ఈ మూడు రాజ్యములలో ఒకటి యగు అబ్ద్ - ఎల్ - వాడి రాజ్యమే అల్ జీరియా తొలిరూపము. ఈ మూడు రాజ్యములును నిరంతరము పరస్పర కలహములతో సతమతమై తుదకు బలహీనములగుటచే, 16 వ శతాబ్దమునకు ఈ ప్రాంతములందు అన్నిట అరాజకము చెలరేగెను. ఇట్టి పరిస్థితులలో పశ్చిమముననుండి పోర్చుగల్, స్పెయిన్ ప్రభుత్వములును, తూర్పునుండి ఓటోమన్ సామ్రాజ్యనేతలును ఈ ప్రాంతములను వశపరచుకొని మధ్యధరా సముద్రమున ఆధిపత్యమును ఆర్జించుటకై పోటీపడి కృషిసల్పిరి. ఈ యత్నమున తొలుత స్పెయిన్ విజయమును ఆర్జించి అల్ జీర్స్ నగరమును 1510 లో వశపరచుకొని, క్రమముగ దేశమునందంతట తన ఆధిపత్యమును సంస్థాపించెను. స్పెయిన్ దాస్యము నుండివిడివడు తలంపుతో అల్ జీరియా ప్రజా ప్రతినిధులు అంతట టర్కీవారిని సాయము నడుగగ, ఖైదరుద్దీన్ అను వాని నాయకత్వమున ఒక టర్కీ సేనాదళము 1518 లో అల్ జీర్స్ నగరమును వశపరచుకొనెను. టర్కీయందలి ఓటోమన్ సామ్రాట్లకు లోబడి ఖైదరుద్దీన్ ఈ రాజ్యమును పాలించుచు, అల్ జీరియాయందలి తక్కిన భాగములనుండి స్పెయిన్ వారిని క్రమముగ పారద్రోలెను. అటనుండి 1830 వరకు ఈ దేశము టర్కీ సామ్రాట్ల ఆధిపత్యమును అంగీకరించిన సామంత రాజవంశముల పాలనలో ఉండెను.

కొందరు ఫ్రెంచివర్తకులు ఈ దేశమున వ్యాపారమునకై చేరుటతో 16 వ శతాబ్దిలో ఫ్రెంచివారికి ఈ దేశముతో తొలుత పరిచితి ఏర్పడెను. అంతటినుండి దాదాపు మూడు శతాబ్దములు ఫ్రెంచివారు ఈ దేశమున వ్యాపారస్థులుగనే ఉండిరి. కాని, 19 వ శతాబ్దమున ఒక వర్తక సంబంధపు తగవును విచారించుసందర్భమున అచట తన దర్బారులో చేరిన ఫ్రెంచి రాయబారిని అల్ జీరియా పాలకుడగు హుస్సేన్ తన 'ఈగ కుంచె' తో కొట్టెను (1827). దీనిని నెపముగ గొని ఫ్రెంచి ప్రభుత్వము 37 వేల సైన్యమును పంపి, అల్ జీరియా సేనలను ఓడించి టర్కీ పరిపాలనను అంతమొందించెను (జూలై 5, 1827). కాని, దేశీయ సర్దార్లు మాత్రము చాలకాలము వరకు ఫ్రెంచి ప్రభుత్వమును ప్రతిఘటించి నిలువ గలిగిరి. కడకు సర్దార్లలో ప్రముఖుడగు అబ్దుల్ ఖాదర్ను బూగో అను ఫ్రెంచిసేనాని 1844 లో ఓడించి ఖైదు చేయుటతో, దేశీయుల ప్రతిఘటన అంతమొంది దేశము ఫ్రెంచి వారి వశమయ్యెను. అంతట అల్ జీరియా ప్రభుత్వమును నిర్వహించుటకు ఫ్రెంచి ప్రభుత్వము బూగో సేనానినే నియమించెను.

మధ్యధరా సముద్రతీరమున ఉన్న ఈ దేశపు తీర భూములు ఫ్రెంచివారు వలస చేరుటకు అనుకూలముగ ఉండునని తొలుత గ్రహించినవాడు బూగో. ఇతడు 40 వేల మంది ఫ్రెంచి వ్యవసాయదారులను అల్ జీరియా తీర మండలి పల్లెపట్టులందు వలస చేరునటుల ప్రోత్సహింప గలిగెను. తరువాత ఇచటికి వచ్చిన ఫ్రెంచి ప్రభుత్వ ప్రతినిధులు అందరును బూగో ఒరవడినే అనుసరించిరి. క్రమముగ దేశీయులు భూములను నిర్బంధముగ ఫ్రెంచి వారికి విక్రయించుటకు అనువగుచట్టములు ఏర్పడెను. అనేక విశాల క్షేత్రములు ఫ్రెంచి భూస్వాముల అధీనములోనికి వచ్చెను. ఇదికాక ఉద్యోగరీత్యా అల్ జీరియాకు వచ్చి అచటి నగరములందు స్థిరపడిన ఫ్రెంచివారి సంఖ్యయు అంతటంతట పెరిగెను. ఫ్రెంచి వారి విధానముల ప్రతిఘటించుచు బొలాద్ సిద్దీ చౌక్ అనువాని నాయకత్వమున 1861 నుండి ఒక తిరుగుబాటు ప్రజ్వరిల్లెను. కాని, ఫ్రెంచివారు దానిని అడచివేయగలిగిరి. 1872 లో కూడ అట్టిదే ఒక తిరుగుబాటు జరిగెను. కాని, అదియు విఫలమయ్యెను. 1876 నాటికి అల్ జీరియా యందు స్థిరనివాసము ఏర్పరచుకొనిన ఫ్రెంచి వారి సంఖ్య 3,76,000 కు పెరిగెను.

ఈ దేశమును ఫ్రాన్స్ దేశపు పరిపాలనా వ్యవస్థకు చెందిన దానినిగ చేసి, పరిపాలన రీత్యా ఫ్రాన్స్‌దేశమున అంతర్భాగముగ చేయుటకు యత్నములు 1881 నుండి జరిగెను. కాని, దేశమునందలి ముస్లిమ్‌లకు షరియత్తు (ముస్లిమ్ న్యాయశాస్త్రము) నకు బదులుగ ఫ్రెంచి న్యాయ

చట్టమును అమలు జరుపుటలో గల కొన్ని ఇబ్బందుల వలన ఆ ప్రయత్నమునకు 1896 లో స్వస్తి చెప్పబడినది. అంతటినుండి ఈ దేశము మరల గవర్నర్ జనరల్ పాలనలో ఉంచబడినది. ఎన్నుకొనబడిన ఒక శాసనసభ సాయమున ఇతడు అధికారమును నిర్వహించుచుండెను. ఈ శాసనసభకు ఎన్నికలు మూడు ప్రత్యేక నియోజక వర్గముల (ఫ్రెంచి భూస్వాములు, తక్కిన ఫ్రెంచి వారు, దేశీయులు) నుండి జరిగెడివి. అందువలన ఫ్రెంచి వారిదే పైచేయిగ ఉండెడిది. ఫ్రెంచివారు ఈదేశమును వ్యావసాయికముగ మాత్రమే కొంతవరకు అభివృద్ధి చేసిరి. అందును ద్రాక్ష తోటల పెంపకమునకు, అందుండి మద్యమును తయారుచేయుటకు మాత్రమే వారు ప్రాధాన్యమొసగిరి. తక్కిన పంటలు ఏవియు అచట అభివృద్ధి పరుపబడలేదు. ఫ్రాన్సు దేశపు పరిశ్రమలకు దెబ్బతగులునను భయమువలన పరిశ్రమలను ఈ దేశమున స్థాపించుటకు ఫ్రెంచి ప్రభుత్వము ప్రోత్సాహ మొసగకుండెను.

ప్రపంచ యుద్ధము - II కాలమున జర్మనీకి ఫ్రాన్సు లొంగినపుడు ఏర్పడిన విచీప్రభుత్వపు అధికారము ఈ దేశమున కొంత కాలము అమలునందు ఉండెను. కాని, యుద్ధతంత్రరీత్యా దీని ప్రాముఖ్యమును గుర్తించిన మిత్రమండలి వారు తగిన ఏర్పాటులను చేసికొని, 1942, నవంబరు 8 నాడు ఈ దేశతీరమున కాలిడి విచీప్రభుత్వపు పెత్తనమును అంతమొందించిరి. అంతట దేశపరిపాలనా వ్యవహారముల బాధ్యతను డీ గాలీ [చూ] సేనాని నాయకత్వమున గల ఫ్రెంచి స్వతంత్ర ప్రభుత్వము వహించెను. మిత్రమండలి సేనల కార్యాలము ఆల్ జీయర్సు నగరమున 1944 వరకు ఉండెను.

ప్రపంచ యుద్ధము - II అనంతరము ఫ్రెంచి ప్రభుత్వము యథాపూర్వముగ తన పరిపాలనను ఇచట సుస్థిర మొనర్చుటకు యత్నించెను. కాని, దేశీయులలో స్వాతంత్ర్యకాంక్ష ఆ నాటికి గాఢముగ బలపడుటచే, ఫ్రెంచి వారికి అదియొక సమస్యగ పరిణమించెను. ఏవియో కొన్ని నామమాత్రపు సంస్కరణల మూలమున ప్రజలను సంతృప్తిపరుప ఫ్రెంచిప్రభుత్వము చేసిన కృషి విఫలమయ్యెను. అంతట 1954, నవంబరు నుండి ఫెర్ హాత్ అబ్బాస్ అను వాని నాయకత్వమున ఆల్ జీరియన్ దేశభక్తులతో నిర్మితమయిన 'ఫ్రంట్ డి లా లిబరేషన్ నేషనల్' అను విమోచక పక్షము ఫ్రెంచి ప్రభుత్వమును కూలద్రోయుటకు దౌర్జన్యమార్గమును అవలంబించెను. ప్రక్కనున్న ముస్లిమ్ రాజ్యముల ఆర్థిక, నైతిక సాహాయ్యము నే కాక, ప్రపంచ మండలి స్వాతంత్ర్యకాముకులయందరి సానుభూతి సహకారములును, ఫెర్ హాత్ నాయకత్వమున ట్యునిస్‌లో ఏర్పడిన ఆల్ జీరియన్ తాత్కాలిక ప్రభుత్వమునకు లభించెను. ఈ పోరాటము దాదాపు 8 ఏండ్లు కొనసాగెను. ఆల్ జీరియా స్వాతంత్ర్యనిరోధము ఫ్రెంచి ప్రభుత్వమునకు కళంకప్రాయమయ్యెను. ఆ మధ్య కాలమున ఫ్రాన్సునందు ఏర్పడిన కొన్ని ప్రభుత్వములు ఆల్ జీరియా విప్లవకారులతో రాయబారములు జరుపుటకు కొంత సుముఖతను చూపినవి; కాని, ఆల్ జీరియాయందలి ఫ్రెంచి వలస దారుల ఒత్తిడికి భయపడి వెనుకంజ వేసినవి. ఈ ఫ్రెంచి వలసదారులకు అండగ ఆల్ జీరియాయందు ఒక రహస్య ఫ్రెంచి సైనిక దళము 'ఆర్గనైజేషన్ డి లా ఆర్మీ సీక్రెటీ' అనుపేర పని చేయుచుండెడిది. ఈ సైనిక దళము ఆల్ జీరియాయందలి స్వాతంత్ర్యోద్యమమును అడచుటకు రహస్య దౌర్జన్య చర్యల మూలమున కృషి చేసినది. కడకు డీ గాలీ సేనాని ఫ్రెంచి ప్రభుత్వాధినేతగ వచ్చిన తరువాత ఈ విషమసమస్యాపరిష్కారమునకు తీవ్ర ప్రయత్నము జరిగినది. ఆల్ జీరియాకు స్వయంనిర్ణయాధికారమును కలిగించుట తన విధానముగ అతడు ప్రకటించి, దానిని ఫ్రాన్సు - ఆల్ జీరియా దేశములందలి జనాభిప్రాయమునకై (రెఫరెండమ్) నివేదించెను. వోటు చేసిన వారిలో మూడింట రెండువంతులు డీ గాలీ విధానమును బలపరచిరి. అంతట ఆల్ జీరియా తాత్కాలిక ప్రభుత్వము ప్రజల పక్షపు ఏకైక ప్రతినిధిగ మాత్రమే ఫ్రెంచి ప్రభుత్వముతో మాటాడుటకు తన అంగీకారమును తెలిపెను. కడకు టూనీషియా ప్రెసిడెంట్ హబీబ్ బోర్గుబా రాయబారముల ఫలితముగ ఆల్ జీరియా తాత్కాలిక ప్రభుత్వపు ప్రతినిధులును, ఫ్రెంచి ప్రభుత్వ ప్రతినిధులును ఫ్రాన్సునందలి ఏవియన్ అను ప్రదేశమున సమావేశమగుటకు నిర్ణయము జరిగెను. ఇంతలో డీ గాలీ విధానమును భగ్నము చేయుతలంపుతో ఆల్ జీరియా యందలి ఫ్రెంచి సైనికులలో కొందరు మారిస్‌షాలీ, రావూల్ సాలాన్ అను సేనానుల నాయకత్వమున తిరుగుబాటు చేసి, ఆల్ జీర్సు నగరమును వశపరచుకొని, తక్కిన ఆల్ జీరియాను వశపరచుకొనుటకు యత్నించిరి. కాని, తుదకు వీరి తిరుగుబాటును డీ గాలీ అడచివేయ గలిగెను. ఇంతలో ఆల్ జీరియా ప్రభుత్వపు అధ్యక్షుడుగ ఉన్న ఫెర్ హాత్ అబ్బాస్‌ను తొలగించి విమోచక పక్షమువారు యూసఫ్ బెన్ ఖెడ్డా అను వానిని అధ్యక్షునిగ ఎన్నుకొనిరి.

తరువాత ఏవియన్‌లో జరిపిన సమావేశముల ఫలితముగ ఆల్ జీరియాలో స్వయంనిర్ణయమునకై అంగీకారము కుదిరినది. దీనిని అనుసరించి 1962 జూలైన

ఆల్ జీరియాయంతట స్వయంనిర్ణయముపై జనవాక్య సేకరణ జరుగగ, అధికసంఖ్యాకులు స్వతంత్ర ఆల్ జీరియాకే తమ ఆమోదమును తెలుపుచు ఆల్ జీరియా ప్రవాస ప్రభుత్వమును బలపరచిరి. అంతట ఫ్రెంచి ప్రభుత్వము తన అధికారమును త్యజించి, బెన్ ఖెడ్డా నాయకత్వమున ఉన్న స్వతంత్ర ప్రభుత్వమునకు అధికారమును ఒప్పగించెను (1962, జూలై 3). కాని, స్వాతంత్ర్యోదయముతో పాటుగ విమోచక దళమున అంతఃకలహములును ఆరంభమయ్యెను. విమోచక దళ సేనానులలో కొందరి యెడ ఖెడ్డా అవలంబించిన విధానమునకు నిరసనను తెలుపుచు కొందరు నాయకులు బెన్ బెల్లా అను వేరొక ప్రముఖ నాయకుడు అధ్యక్షుడు కావలెనని పట్టుపట్టుట వలన అంతఃకల్లోలములు ఆరంభమయ్యెను. కాని, తుదకు దేశక్షేమమును గమనించి ఖెడ్డా వైదొలగి బెన్ బెల్లాను అధ్యక్షుని చేసెను. అంతట బెన్ బెల్లా ఏడుగురు సభ్యులుగల ఒక రాజకీయ పరిపాలకవర్గమును ఏర్పరచి, దాని సాయమున పరిపాలనను నిర్వహింప మొదలిడెను. తరువాత కొలది దినములకు రాజ్యాంగ పరిషత్తుకు ఎన్నికలు జరిగి, ఆ పరిషత్తుకు ఫెర్ హాత్ అబ్బాస్ అధ్యక్షుగ ఎన్నుకొనబడెను. కాని, రాజ్యాంగ రచనా సందర్భమున అబ్బాస్‌కు బెన్ బెల్లాతో తీవ్ర విభేదములు ఏర్పడినందున అబ్బాస్ రాజ్యాంగ పరిషత్ అధ్యక్ష పదవికి రాజీనామా ఇచ్చెను (1963, ఆగస్టు 14).

ఆ తరువాత బెన్ బెల్లా మార్గదర్శకత్వమున ఒక రాజ్యాంగము రూపొందింపబడి ప్రజామోదితమైన ఫలితముగ ఆ బెన్ బెల్లాయే అధ్యక్షుడుగ ఎన్నుకొనబడెను (సెప్టెంబరు 15, 1963). అతడు అంతట సోషలిస్టు సిద్ధాంతములను అనుసరించు కొన్ని సంస్కరణలను ప్రవేశపెట్టి నియంతృత్వరీతిలో వానిని అమలునకు కొనిరా యత్నించిన ఫలితముగ అతని సన్నిహితులందే పలువురు అతని ప్రభుత్వమును కూలద్రోయ యత్నించిరి. కడకు, హావరీ బౌమెడిన్నే అనునతడు బెన్ బెల్లాను పదవీభ్రష్టుని చేసి ప్రభుత్వాధికారమును గ్రహించెను (19 జూన్, 1965).

రాజ్యాంగము : రాజ్యాంగరీత్యా ఈ దేశము గణరాజ్య ప్రభుత్వపు పాలనలో ఉన్నది. రాజకీయ పక్షములలో ఎఫ్. ఎల్. ఎన్ (ఫ్రంట్ డి లా లిబరేషన్ నేషనల్) పార్టీకే అత్యధిక ప్రాబల్యము కల్పింపబడినది. దేశమున ఎన్నికలు ఏకపట్టికావిధానమున జరుగును. అధ్యక్షుని ప్రజలే ఎన్నుకొనెదరు. పార్టీ నియమించు అభ్యర్థికి అనుకూలముగనో, వ్యతిరేకముగనో వోటు చేయుటకు మాత్రమే రాజ్యాంగమున అవకాశము కల్పింపబడినది; పోటీగా వేరొక అభ్యర్థిని నిలుపు వసతి అందులేదు. శాసనసభ ఏకకక్ష్యకము.

చీ. శే. రా.

**ఆల్ ఫ్రెడ్** (క్రీ. శ. 848 ? - 900) : ఇతడు బ్రిటన్‌లోని పశ్చిమ సాగ్జన్‌ల (వెసెక్స్) రాజు. క్రీ. శ. 866 లో తన మూడవ అన్నగారైన ఎతెల్రెడ్ రాజ్యమునకు వచ్చిన నాటినుండి ఇతని పేరు, ప్రతిష్ఠలు ప్రారంభమైనవి.

ఆల్ ఫ్రెడ్ యొక్క యుద్ధముల సంవత్సరము 871 అనవచ్చును. ఆ ఏడు అతనికి డేన్‌లతో 9 యుద్ధములు జరిగినవి. అందు కొన్నిట జయములు, కొన్నిట అపజయములు కలిగినవి. 871, జనవరి 8 న ఆష్‌డౌన్ వద్ద ఆల్ ఫ్రెడ్ గొప్ప జయముపొందెను; ఏప్రిల్‌లో ఎతెల్రెడ్ అనంతరము ఆల్ ఫ్రెడ్ రాజయ్యెను. కాని, రాజైనప్పటి నుండియు విశ్రాంతి అనునది అతడు ఎరుగడు. 876 మొదలుగ అంతటంతట మరల మరల వచ్చి పడుచున్న డేన్‌ల దండయాత్రల ధాటిని వివిధ రంగములందు అతడు ఎదుర్కొని 896 నాటికి ఆల్ ఫ్రెడ్ వానిని పూర్తిగ అడచివేసెను.

ప్రజల విజ్ఞాన వికాసమునకై ఆల్ ఫ్రెడ్ చాల చారిత్రక, వైజ్ఞానిక గ్రంథములను ఇంగ్లీషులోనికి తర్జుమా చేసెను. వాటిలో 'ఆంగ్లో - సాగ్జన్‌ల చరిత్ర' జగద్విఖ్యాతమైనది. విదేశపు పండితులకు ఎందరికో ఆల్ ఫ్రెడ్ తన ఆస్థానమున ఆశ్రయము ఇచ్చి ఉదారముగ పోషించెను.

ఆల్ ఫ్రెడ్ సర్వాధికారి ఐనను తన శాసనసభ హక్కులను నిలిపి పాలింప యత్నించెను. అతని శాసనములు, ధర్మనిర్ణయ పద్ధతులు ప్రజాక్షేమమును చేకూర్చినవి. ప్రజలను డేన్‌ల నుండి విముక్తులను చేసినవాడు, ప్రజాపాలకుడు, ప్రబోధకుడు, బ్రిటన్ సమైక్యమునకు పునాది వేసిన మహనీయుడు అని అతడు పేరుపొందెను. బ్రిటిష్ రాజులలో కెల్ల 'ఘనుడు' అను బిరుదుకు సర్వవిధముల ఆల్ ఫ్రెడ్ అర్హుడు. నాటికి, నేటికి బ్రిటిష్ ప్రజలు ఆల్ ఫ్రెడ్‌ను ఆదర్శ పురుషునిగ, ఆదర్శ పరిపాలకునిగ పరిగణింతురు.

వి. నా.

**ఆల్ బేనియా** : ఆగ్నేయ యూరప్‌న, బాల్కన్ ద్వీపకల్పము నందలి ఒక ప్రజా గణరాజ్యము.

ఈ దేశమునకు యుగోస్లావియా [ఉ ; తూ] ; గ్రీస్ [ద] ; ఎడ్రియాటిక్ సముద్రము [ప] సరిహద్దులుగ ఉన్నవి. [వి] 28,748 చ. కి. మీ. [జ] 17,11,300. [భా] సార్వత్రికముగ గ్రాంథికము అగు ఆల్ బేనియన్ భాషయే వ్యవహారమున ఉన్నను, ష్కుమ్‌బి నదికి ఉత్తరమునను, దక్షిణమునను క్రమముగ గెగ్, టోస్క్ అను మాండలిక భాషలును వ్యాప్తిలో ఉన్నవి. [మ] ప్రజలలో

65% ముస్లిమ్‌లు; తక్కినవారు క్రైస్తవులు; [రా] టిరేన్ (టిరనా) (1,19,000).




చరిత్ర: రోమన్ సామ్రాజ్యమున ఈ ప్రాంతము అంతర్భాగముగ ఉండిన కాలము మొదలుగ ఈ దేశమును గురించిన చారిత్రక విషయములు తెలియవచ్చుచున్నవి. రోమన్‌ల పరిపాలనాకాలముననే క్రైస్తవ మతమునకు ఇట వ్యాప్తి చేకూరినది. 4 వ శతాబ్దిలో రోమన్ సామ్రాజ్యము ప్రాచ్య, పశ్చిమ సామ్రాజ్యములుగ విభజితమైనపుడు ఈ ప్రాంతము ప్రాచ్య సామ్రాజ్యమున అంతర్భాగమైనది. కాని, 4 వ, 5 వ శతాబ్దములలో గాతుల దండయాత్రల వలనను, క్రీ. శ. 640 లో సెర్బుల దండయాత్రల వలనను ఈ ప్రాంతము కల్లోలితమై, ప్రాచ్య రోమన్ (బైజాంటైన్) సామ్రాట్‌ల పాలన నామమాత్రముగనే అట కొనసాగినది. కడకు 861 లో బల్గేరియన్‌లు ఈ ప్రాంతముపై దండెత్తి, దేశమున అత్యధిక భాగమును వశపరచుకొని, స్వతంత్రముగ దానిని అతిదీర్ఘ కాలము పాలించిరి. కాని, ప్రాచ్య రోమన్ సామ్రాట్ 1014 లో ఈ ప్రాంతమును జయించి, దేశము అంతటను మరల తన అధికారమును సంస్థాపించెను. తదనంతరమున ఆ సామ్రాట్‌ల వంశమునకే చెందిన మైకేల్ కొమ్నేనస్ ఈ దేశము నందలి ఎపిరస్ రాజధానిగ ఒక స్వతంత్ర రాజ్యమును నెలకొల్పెను (1204). ఈతని రాజ్యమున దక్షిణ ఆల్ బేనియా మాత్రమే చేరి ఉండినది. కొమ్నేనస్ వంశీకుల అధికారము 1318 వరకు కొనసాగినది. అంతట వేరొక రాజవంశము వారిస్థానమును ఆక్రమించి 1358 వరకు అధికారము నిర్వహించినది. ఆ కాలముననే మధ్య ఆల్ బేనియా ప్రాంతము సిసిలీ ద్వీపపాలకుల వశమైనది (1271). వీరి పాలన అట 1368 వరకు సాగినది. ఇక తక్కిన ఆల్ బేనియా ఆ కాలమున సెర్బులకు లోనైనది (1180); సెర్బుల చరిత్రలో ప్రముఖ విజేతగ పేరొందిన స్టెఫాన్ దూషన్ (1331 - 58 ప.) కాలమున ఆల్ బేనియా లోని వివిధ ప్రాంతములును అతని సర్వాధిపత్యమును అంగీకరించినవి. దూషన్ అనంతరమున దేశీయపాలకులు అటనట స్వతంత్రులైనను, అనతి కాలముననే దూషన్ అనుచరులలో ఒకడగు బల్షా అను నార్మన్ యోధుడు స్కుటరీ (ఉస్కుదర్) నగరము రాజధానిగ ఒక రాచరికమును నెలకొల్పి (1366), మాండలికులను చాల వరకు లోగొన గలిగెను. ఈ రాచరికపు పాలన అత్యల్పకాలము మాత్రమే కొనసాగి, 1421 లో అంతరించినది.

తుర్కులు ఈ ప్రాంతముపై దండయాత్రలను 1431 మొదలుగ మొదలిడిరి. వెనిస్ (వెనిజియా) నగర పాలకుల సాయముతో దృఢనాయకత్వమున ఆల్ బేనియన్‌లు తుర్కులను ప్రతిఘటించినను, క్రమముగ 1571 నాటికి దేశమంతయు ఓటోమన్ తుర్కుల సామ్రాజ్యమున అంతర్భాగమైనది. ఆ సామ్రాట్‌ల ఆదరణ మూలమున ఇస్లామ్ మతము ఈ దేశమున కాలూని, క్రమముగ సగమునకు మించిన ప్రజానీకమున తావు కల్పించుకొనినను, ఆల్ బేనియా వాసులకు తుర్కుల యెడ గల విద్వేషము మాత్రము సమయలేదు. తీవ్రములగు తిరుగుబాటులు ఎడనెడ కొనసాగినవి. వీని అన్నింట స్కుటరీ నగర సామంత పాలకులు తక్కిన దేశీయుల సహకారముతో 1760 మొదలుగ సాగించిన స్వాతంత్ర్య పోరాటము తీవ్రతమమైనది. దీనిని 1831 నాటికి ఓటోమన్ సామ్రాజ్య ప్రభుత్వము అడచి వేయ గలిగినది.

కాని, 19 వ శతాబ్ది మధ్యభాగమున బాల్కన్ రాజ్యము లందు చెలరేగిన స్వాతంత్ర్యాకాంక్ష ఆల్ బేనియాను సైతము సంచలితము చేసినది. అయినను ఈ కాలముననే వేరొక బెడదను సైతము ఆల్ బేనియా ఎదుర్కొనవలసి

వచ్చినది. టర్కీ సామ్రాజ్యమునుండి విడివడిన గ్రీస్ మొదలగు బాల్కన్ రాజ్యములు, ఆల్ బేనియాలోని వివిధ భాగములను స్వీయములుగ చేసికొనుటకు పూనుకొనినవి. అందువలన ఒక వైపున టర్కీ సామ్రాజ్య పాలకులను, వేరొక వైపున గ్రీస్, మాంటెనెగ్రో మొదలగు బాల్కన్ రాజ్యముల దురాక్రమణ వాంఛలను ఆల్ బేనియా 1879 మొదలుగ ప్రతిఘటింపవలసి వచ్చినది. కడకు ఆల్ బేనియా సమస్య యూరప్‌న అగ్రరాజ్యములకు సంబంధించిన సమస్యగ పరిణమించి, 1912 లో లండనున జరిగిన అగ్రరాజ్య రాయబారుల సమావేశమున పరిష్కరింపబడినది. తత్ఫలితముగ 1913, జూలై 29న ఆల్ బేనియా సర్వసత్తాక స్వతంత్రరాజ్యముగ అవతరించెను. అగ్ర రాజ్యములే విలియమ్ అను విదేశీయ రాజ వంశీకుని ఆల్ బేనియాకు పాలకునిగ నియమించినవి.

రాజగు విలియమ్ ఆల్ బేనియాయందలి కల్లోలిత పరిస్థితులతో విసుగుచెంది, అచిర కాలముననే దేశము వదలి పోయెను (సెప్టెంబరు 3, 1913). గ్రీస్ దేశము అగ్ర రాజ్యములను త్రోసిరాజని దక్షిణ ఆల్ బేనియాను ఆక్రమించెను. ఆ తరువాత ప్రథమ ప్రపంచ యుద్ధకాలము (1914 - 1918) న దేశమున పరిస్థితులు అన్యరాజ్యములు చేసిన ఆక్రమణలవలన దిగజారినవి. యుద్ధానంతరమున (1918) దేశమున ప్రజామోదము గల ఒక తాత్కాలిక ప్రభుత్వము ఏర్పడి, శాంతి సమావేశములందు పాల్గొనినను ప్రయోజనము శూన్యమైనది. దేశమున అత్యధిక భాగము అప్పటికి ఇటాలియన్‌ల అధీనమునను, కడమ భాగము యుగోస్లావ్ సేనల వశమునను మిగిలిపోయినది. అంతట విసివి, 1920 లో ఆల్ బేనియన్‌లు విస్తృతాధికారములు కలిగి, దేశమునందలి అన్ని వర్గములకు ప్రాతినిధ్యము వహించు పాలకమండలి (రీజెన్సీ) ని నెలకొల్పి, దాని నాయకత్వమున సుసన్నద్ధులై పోరాటమును సాగించి, ఇటాలియన్‌లను తరిమి వేసిరి; గ్రేట్ బ్రిటన్ జోక్యము వలన యుగోస్లావ్ సేనలును దేశమును వదలినవి. కడకు 1921, నవంబరు 9 న ఆల్ బేనియా మరల సర్వస్వతంత్ర రాజ్యముగ రూపొందినది. స్వాతంత్ర్యసమస్య ఇటుల పరిష్కృతమైన తరువాత దేశ నాయకులలో విభేదములు పెచ్చుపెరిగి, కడకు అహమ్మద్ బే జోగూ అను నాయకుడు అధికారమును గ్రహించి, ప్రజాసభ ఆమోదముతో దేశమును గణ రాజ్యముగ ప్రకటించి (1925, జనవరి 22) తానే అధ్యక్షుడయ్యెను. ప్రజాశ్రేయోదృష్టితో ఈతడు తన కృషిని మొదలిడినను, దేశపు ఉత్తరపు సరిహద్దును యుగోస్లావ్ సేనల నుండి రక్షించుటకై ఇటలీతో ఒక రక్షణ సంధిని కుదుర్చుకొనెను (1926, నవంబరు 27). తత్ఫలితముగ ఇటలీ పలుకుబడికి ఆ దేశము లోనైనది.

అయినను జోగూ స్వదేశమున సుస్థిర పాలనకై విరివిగ కృషి చేసెను. 1928 లో అతడు ప్రజామోదముతో రాజపదవిని గ్రహించి, పార్లమెంటరీ ప్రజాస్వామ్యమును దేశమున ప్రవేశపెట్టెను; మత స్వాతంత్ర్యమునకు తావు కల్పించెను. విద్య, వ్యవసాయ రంగములందు దేశము ప్రగతి సాధించునటుల చేయగలిగెను. ఇటలీతో చిరకాలము నుండియు నిలిచి ఉండిన వివాద సమస్యలను అన్నింటిని సామరస్యమార్గమున పరిష్కరించుటకు అతడు కృషి చేసెను. కాని, సామ్రాజ్యదాహ పీడితమగు ఫాసిస్ట్ ఇటలీ తాను అదివరలో ఇచ్చి ఉండిన వాగ్దానములను అన్నింటిని వమ్ముచేసి, ఆల్ బేనియాపై సేనలను దించి, ఆక్రమించినది (1939, ఏప్రిల్ 7); రాజు దేశమును వదలి పారిపోయెను. అంతటి నుండి దీనిని తమ ఆక్రమణ క్రింద ఉంచుకొని, ద్వితీయ ప్రపంచ యుద్ధకాలము (1939 - 45) న గ్రీస్‌పై దండయాత్ర జరుపుటకు స్థావరముగ ఇటలీ సేనలు వాడుకొనినవి. ఆ యుద్ధములో పలు సార్లు ఓటమి చెందుట వలన గ్రీక్‌లయు, జర్మన్‌లయు ఆక్రమణలలో సైతము ఈ దేశము కొంతకాలము ఉండినను, ఆ కాలమున ప్రతిఘటనోద్యమము - కమ్యూనిస్ట్ పార్టీ ఆధిపత్యమున - ఆ పార్టీ నాయకుడగు ఎన్‌వర్ హోక్సా నాయకత్వమున కొనసాగినది. కడకు అక్షరాజ్యముల పరాజయముతో దేశము స్వతంత్రతను పొందినది (అక్టోబరు, 1944).

అంతట ఎన్‌వర్ హోక్సా నాయకత్వమున విప్లవ వాదులు అధికారమును చేజిక్కించుకొని (1944), ప్రజాగణ రాజ్యమును స్థాపించిరి. స్వాతంత్ర్యసిద్ధి అనంతరమున యుగోస్లావియాయును, ఈ దేశమును కలసి మెలసి కొంత కాలము వ్యవహరించినవి. కాని, సోవియట్ రష్యాతో యుగోస్లావియాకు వైరుధ్యము సంఘటిల్లిన పిదప, ఈ దేశము యుగోస్లావియాతో సంబంధమును తెగతెంపులు చేసికొనినది. కమ్యూనిస్ట్ సిద్ధాంత వ్యాఖ్యానములందు కలిగిన అభిప్రాయ భేదమే కాక, 750 వేల ఆల్ బేనియన్‌లు వసించు ప్రాంతము యుగోస్లావియాలో చేరి ఉండుటయు ఈ వైరుధ్యమునకు కొంతవరకు హేతువైనది. 1961 లో జరిగిన 22 వ కమ్యూనిస్ట్ పార్టీ కాంగ్రెస్ [చూ. కమ్యూనిజమ్] తరువాత సోవియట్ రష్యాతో కలిగిన అభిప్రాయ భేదముల వలన సోవియట్ రష్యా పలుకుబడికి ఆల్ బేనియా లోనగుటకు నిరాకరించగ, దౌత్య సంబంధములను సోవియట్ రష్యా విచ్ఛిన్నము

చేసినది (1961); తదాదిగ కమ్యూనిస్ట్ చీనాతో అత్యంత సాన్నిహిత్యమును ఆల్‌బేనియా ఆర్జించినది.

రాజ్యాంగము : ఆల్‌బేనియా ఒక ప్రజా గణరాజ్యము. రాజ్యాంగము 1946 లో ఆమోదితమై, 1950 లో కొన్ని సవరణలను పొందినది. ఏకకక్ష్యకమగు శాసనసభ యందు శాసనాధికారము న్యస్తమై ఉన్నది. 18 ఏండ్ల వయసు పై బడిన వారికి అందరికిని వోటుహక్కు కలదు. కమ్యూనిస్ట్ పార్టీ మాత్రమే దేశమునందలి ఏకైక రాజకీయ పక్షము. నాలుగేండ్లకు ఒక పర్యాయము శాసనసభకు సాధారణ ఎన్నికలు జరుగును; ఏక పట్టికా విధానమును అనుసరించి శాసనసభ్యులు ఎన్నుకొనబడుదురు. దేశమున సర్వాధిపత్యము - లాంఛనముగ - అధ్యక్షునియందు నిహితమై ఉన్నది. శాసన సభయందు ఇప్పటి (1965) సభ్య సంఖ్య 214; ఈ సభ జూన్ 4, 1962 న ఎన్నుకొనబడినది. శాసనసభా సమావేశములు జరుగని సమయమున అధిపాలక వర్గము (ప్రెసిడియమ్) శాసన నిర్మాణాధికారమును కలిగి ఉండును. ఈ వర్గమునకు దేశాధ్యక్షుడే అధ్యక్షుడుగ పని చేయును. కార్యనిర్వహణాధికారము మంత్రివర్గమునకు చెంది ఉన్నది. మంత్రి వర్గము ప్రధాని ఆధిపత్యమున పని చేయును. ప్రధానిని, మంత్రివర్గ సభ్యులను, అధిపాలక వర్గమును శాసనసభయే నియమించును. చీ. శే. రా.

**అలండ్ దీవి** : స్వీడెన్ దేశమున చేరిన దీవి; చూ. స్వీడెన్.

**అలెగ్జాండర్** (క్రీ. పూ. 356 - 323) : ఇతడు ప్రపంచచరిత్రలో ప్రసిద్ధిగాంచిన విజేతలలో ఒకడు. గ్రీస్‌న అంతర్భాగమగు మేసిడోనియాను పాలించిన ఫిలిప్ రాజు ఇతని తండ్రి. ఆ కాలమున తనకు తెలిసినన్ని దేశములు జయించి ఇతడు 'జగద్విజేత' అని పేరు గాంచెను. సుప్రసిద్ధ దార్శనికుడు అగు అరిస్టాటిల్ (చూ. సం. 7 - పు. 291) వద్ద విద్యాభ్యాసముచేసి, తండ్రి మరణానంతరము - తన ఇరువదవ ఏట - మేసిడోనియా సింహాసనమును ఇతడు అధిష్ఠించెను. మొదట తన దేశమందు శాంతిభద్రతలు నెలకొల్పి, గ్రీస్‌లోని ఇతర రాజ్యములను వశపరచుకొని పిదప పారసీక సామ్రాజ్యముపై దాడి వెడలి, 'ఐసస్' 'గ్రానికమ్', 'ఆర్బిలా' యుద్ధములందు పారసీక సైన్యములను ధ్వంసముచేసి, ఆ సామ్రాజ్యమునంతటిని ఆక్రమించుకొనెను. దీనిమూలమున ప్రాచీన సామ్రాజ్యములను స్థాపించిన ఈజిప్టు, బాబిలన్ దేశములు అలెగ్జాండర్ స్వాధీనములయ్యెను. అంతట ఇతడు ఆఫ్ఘనిస్తాన్, బెలూచిస్తాన్ మీదుగా కైబరుకనుమ ద్వారా భారత దేశమున ప్రవేశించి పూరు (పురుషోత్తముడు) వను రాజును ఓడించి పంజాబ్‌నంతటిని జయించెను. మగధ సామ్రాజ్యముపై దండెత్తవలెనని తలచుచుండగా ఇతని సైన్యములు అందులకు ఇయ్యకొనకుండుటచే వెనుకకు మరలెను. ప్రాచ్య, పాశ్చాత్యదేశముల సమ్మేళనమునకై అతడు అంతర్జాతీయ వివాహములను ప్రోత్సహించి, తానే ఒక పారసీక కన్యకను వివాహమాడి మార్గదర్శి అయ్యెను. ఇంకను నూతనదేశములు జయింపవలెనని తలచుచుండగా క్రీ. పూ. 323 లో జ్వరపీడితుడై ఇతడు తన ముప్పది మూడవ ఏడైనా పూర్తికాక మునుపే బాబిలన్ పట్టణమున మరణించెను.

ఇతని దిగ్విజయయాత్రలు అత్యద్భుతములు. ఇట్లు ప్రపంచములో చాల భాగమును జయించిన మహాశూరులు ఎందరో లేరు. అందును, అంత చిన్నతనముననే జయించిన వారు లేరనియే చెప్పవచ్చును. అలెగ్జాండర్ ప్రపంచమునందలి విశేష భాగమును జయించుటతో తృప్తిచెందక, గ్రీక్ నాగరకతను ప్రపంచమందంతటను వ్యాపింపజేయ యత్నించెను. తాను జయించిన ప్రతిదేశమందును పట్టణములను నిర్మించి, గ్రీక్‌లను అచట ఉంచెను. వీనిలో 'అలెగాండ్రియా' [చూ] 'అలెగ్జాండ్రెటా', 'హీరట్' ప్రసిద్ధములు. ఇవి వర్తక వ్యాపారములకు కేంద్రములు అగుటయే కాక, గ్రీక్ నాగరకతను వ్యాపింపజేయుచు, ప్రసిద్ధిగాంచెను. ప్రపంచమంతటిని ఏకపాలనము క్రిందికి తెచ్చి, ప్రాచ్య పాశ్చాత్య భేదములను నిర్మూలింప ఇతడు ప్రయత్నించెను. అలెగ్జాండర్ నిర్మించిన సామ్రాజ్యము అతని మరణానంతరము విచ్ఛిన్నమైనను గ్రీక్ నాగరకత, సంస్కృతి ప్రపంచమందంతటను వ్యాపింపజేయవలయు ననెడి ఇతని కోర్కెమాత్రము కొంతవరకు సఫలమయ్యెను [చూ. పు. 35]. వి. నా.

**అలెగ్జాండ్రియా** : ఈజిప్టుదేశపు ఉత్తరపు తీరమున (31° 12′ ఉ, 29° 15′ తూ.) ఉన్న ఒక ప్రాచీనమగు రేవు పట్టణము. క్రీ. పూ. 332 లో ప్రపంచ ప్రఖ్యాత విజేత అలెగ్జాండర్ మహానీయునిచే ఈ నగరము తొలుత నిర్మితమైనది. అతని అనంతరమున అతని సేనానులలో ఒకడగు టాలమీ ఈజిప్టునందును, పరిసర ప్రాంతములందును తన ఆధిపత్యమును నెలకొల్పి, అలెగ్జాండ్రియాను తన రాజధానిగ చేసికొనెను. అతడును, అతని వంశజులును చేసిన కృషి మూలమున ఆ నగరము వైభవ విషయమునందే కాక విద్యావిషయికముగను సమకాలీన ప్రపంచమందంతట ఖ్యాతిని ఆర్జించినది. అచటి మ్యూజియమ్ (సరస్వతీ మందిరము) క్రమముగ ప్రముఖ విద్యాపీఠముగ పేరెన్నిక పొందినది. క్రీస్తుశకారంభము వరకు ఖగోళ,

భూగోళాది శాస్త్రములకు సంబంధించిన పెక్కువిషయములందు ఆ విద్యాపీఠమునందలి పండితులు అవిరళ కృషిచేసి, పెక్కు నూతన విషయములను ఆవిష్కరింప జేసిరి. జ్యామితి శాస్త్ర పితామహుడగు యూక్లిడ్, యాంత్రిక శాస్త్ర ప్రవీణుడగు ఆర్కిమిడీజ్ మొదలగువారలు ఆ విద్యాపీఠమునకు సంబంధించినవారలే అని చారిత్రక ప్రసిద్ధి. ముఖ్యముగ ఖగోళశాస్త్ర విషయమున ఆలెగ్జాండ్రియా విద్యాపీఠము ఆ యుగమున ప్రామాణికతను ఆర్జించినది. భారతీయపండితులు ఈనగరమునే 'యవనపురి' అని వ్యవహరించిరి. క్రీ. పూ. ప్రథమ శతాబ్దిలో తక్కిన ఈజిప్టుదేశముతోపాటుగ ఈ నగరము రోమన్‌ల వశమైనది. వారి పరిపాలనా కాలమున సుప్రసిద్ధ ధాన్యాగారముగ ఈ నగరము పేరొందినది. కాని, రోమన్ సామ్రాజ్యమున పటిష్ఠత సన్నగిలిన కొలదియు ఈ నగరము సైతము క్షీణతను పొందినది; అయినను. ఆ యుగమున క్రైస్తవ దార్శనిక వికసనమునకు కేంద్రముగ పేరు పొందినది. క్రీ. శ. 640 లో అరబ్బులు దీనిని వశపరచుకొనిరి. సుప్రసిద్ధమగు ప్రాచీన ఆలెగ్జాండ్రియా గ్రంథాలయము తొలుత రోమన్‌ల దాడి వలనను, తరువాత క్రైస్తవ మత ఛాందసుల దౌష్ట్యముల వలనను నష్టముకాగా, శేషించినది అరబ్బుల దాడికాలపు కల్లోల పరిస్థితులలో నామమాత్రావశిష్టమైనది. కాలక్రమమున ఆగ్నేయముగ సుమారు 200 కి. మీ. దూరమున కైరోనగరము క్రీ. శ. 969 లో నిర్మింపబడినది మొదలుగ ఈ నగరపు ప్రాముఖ్యము తగ్గినది. అంతియే కాక, 1498 లో పోర్చుగీస్ వారు ఆఫ్రికాను చుట్టి ప్రాచ్యభూములకు సముద్రమార్గమును కనిపెట్టుటతో పాచ్య, పశ్చిమ దేశముల మధ్య అంతవరకు వినిమయస్థానముగ వ్యాపార రంగమున ఉపకరించిన ఆలెగ్జాండ్రియానగరము తన వైభవమును కోల్పోయినది. నేడు ఇది దాదాపు 10 లక్షలు మాత్రమే జనసంఖ్య కలిగిఉన్నది [చూ. ఆలెగ్జాండర్; ఆలెగ్జాండ్రియా గ్రంథాలయము]. చీ. శే. రా.

**ఆలెగ్జాండ్రియా గ్రంథాలయము**: ఆలెగ్జాండ్రియా ఈజిప్టును పాలించిన గ్రీకు రాజులైన టాలెమీల రాజధానియై ఉండెను. ఇందు ప్రాచీన కాలమున విఖ్యాతికెక్కిన గ్రంథాలయము ఉండెడిది. ఇది విద్యాప్రియులగు టాలెమీలచే పోషింపబడెను. మొదట గ్రీక్ వాఙ్మయమునకు సంబంధించిన గ్రంథములే ఉండినను, క్రమముగ వివిధ దేశీయ వాఙ్మయగ్రంథములు ఇందు చేర్పబడెను. టాలెమీ ఫిలడాల్ఫస్ కాలములో సుమారు లక్షగ్రంథములు ఇందుండెనట! తరువాత, టాలెమీలు దీనిని పదులక్షల వరకు పెంచిరి. ఇంతటి గ్రంథాలయము ఆ కాలమున ప్రపంచమునందు ఎచ్చటను లేదని ప్రసిద్ధి. దురదృష్టవశమున అరబ్బులు ఈ పట్టణమును జయించినప్పుడు ఈ గ్రంథాలయమును పూర్తిగ నాశనము జేసిరి. [చూ. ఆలెగ్జాండర్; ఆలెగ్జాండ్రియా] గా. హ.

**ఆల్సేస్ - లారైన్**: ఫ్రాన్స్‌నందలి ఈశాన్య రాష్ట్రములు; ఫ్రాన్స్, జర్మనీల మధ్య పలుమారులు చేతులు మారుటచే చారిత్రక ప్రసిద్ధిని కాంచినవి. 1648 లో జరిగిన వెస్ట్‌ఫేలియా ఒప్పందము ప్రకారము ఆల్సేస్‌లోని చాల భాగమును ఫ్రాన్స్ మొదట ఆక్రమించుకొనెను; 1681 లో అదనముగ 10 స్వతంత్ర నగరములను స్వాధీన పరచుకొనెను. 1766 లో లారైన్ లాంఛన ప్రాయముగ ఫ్రాన్స్‌తో జతగూర్చబడెను. అయితే, ఫ్రెంచి - ప్రష్యన్ యుద్ధానంతరము 1871 లో జరిగిన ఫ్రాంక్‌ఫర్ట్ సంధి షరతులను అనుసరించి - లారైన్‌లోని బెల్‌ఫోర్ట్‌ను చుట్టుకొని ఉన్న ప్రాంతము మినహా - మిగిలిన లారైన్, ఆల్సేస్ రాష్ట్రములు జర్మనీకి దత్తము చేయబడి ఆల్సేస్-లారైన్ అను సంయుక్త నామము వహించెను. తదుపరి జర్మన్‌లు పై రెండు రాష్ట్రములలోని ఇనుప, ఖనిజ నిక్షేపములను పారిశ్రామికముగ అభివృద్ధి చేసి, తగినంత లాభమును గడించిరి. ఇట్లుండ, ఆల్సేస్ - లారైన్ సంయుక్త రాష్ట్రమును జర్మన్‌లు ఆక్రమించుకొని పాలించుట ఫ్రాన్స్‌లో చాలమందికి తలవంపుగ ఉండినది. ఇంతలో ప్రపంచ యుద్ధము - I జరుగుటయు, అందు జర్మనీ ఓడిపోవుటయు సంభవించెను. దాని పర్యవసానముగ 1919 లో జరిగిన వెర్సెయిల్స్ సంధి [చూ.] ని అనుసరించి పై రెండు రాష్ట్రములును ఫ్రాన్స్‌కు మరల లభించెను. 1940 లో హిట్లర్ ఈ ఆల్సేస్ - లారైన్ సంయుక్త రాష్ట్రమును జయించి, తన రాజ్యములో ముఖ్యభాగముగ చేసికొనెను. కాని, హిట్లర్ పతనానంతరము 1945 లో అది మరల ఫ్రాన్స్‌కు దక్కినది. స్వ. వెం.

**ఆసఫ్ జాహీలు**: చూ. ఆసఫ్ జాహీ నిజామ్ రాజ్యము, సం. 3 - పు. 432.

**ఆసియా**: ప్రపంచమందలి ఖండములు అన్నింట వైశాల్యముననేకాక, చారిత్రక ప్రాముఖ్యము బట్టియు ఈ ఖండము ప్రథమ స్థానమును ఆక్రమించుచున్నది. పెక్కు ప్రాచీననాగరకతలు ఈ ఖండముననే వర్ధిల్లినవి. ప్రపంచమున విపులముగ వ్యాప్తిచెందిన ప్రసిద్ధ మతములకు అన్నింటికిని జన్మభూమి ఈ ఆసియా ఖండము.

పరిసర ద్వీప సముదాయముతో కలసి ఈ ఖండపు వైశాల్యము 8,40,00,000 చ. కి. మీ.; అనగా భూగోళపు ఉపరితల వైశాల్యమున దాదాపు 1/11 వ వంతు ఈ

ఖండము ఆవరించి ఉన్నది. నేడు ఈ ఖండము పరిపాలన రీత్యా ఈ క్రింది ప్రత్యేక రాజ్యములుగ విభక్తమై ఉన్నది.

1. ఆఫ్ఘనిస్థాన్ 2. ఇండోనీషియా 3. ఇజ్రాయెల్ 4. ఇరాక్ 5. ఇరాన్ (పరిష్యా) 6. ఏడెన్ 7. కటార్ 8. కాంబోడియా (కాంభోజ్య) 9. కువాయిట్ 10. కొరియా, ఉత్తర 11. కొరియా, దక్షిణ 12. చీనా (గణరాజ్యము - తైవాన్) 13. చీనా ప్రజా గణరాజ్యము 14. జపాన్ 15. జోర్డాన్ 16. టర్కీ 17. తైమర్ 18. థాయిలాండ్ 19. నేపాల్ 20. పాకిస్తాన్ 21. ఫిలిప్పీన్ దీవులు 22. బర్మా 23. బెహరీన్ 25. బ్రూనీ 25. భారతదేశము (ఇండియా) 26. భూటాన్ 27. మంగోలియా, ఔటర్ 28. మకావో 29. మలేసియా (మలయా, సాబా, సారవాక్ చేరి) 30. మస్కట్ & ఓమన్ 31. యెమెన్ 32. లావోస్ 33. లెబనాన్ 35. వియెత్నామ్, ఉత్తర 35. వియెత్నామ్, దక్షిణ 36. సంధిగత షేక్ రాజ్యములు 37. సింగపూర్ 38. సింహళము (సిలోన్) 39. సిక్కిమ్ 40. సిరియా 41. సైప్రస్ 42. సౌదీ అరేబియా 43. హాంగ్ కాంగ్.

ఇవికాక ఆసియాలో ఉత్తరభాగమున ఊరల్ పర్వతములు మొదలు పసిఫిక్ మహాసముద్రమువరకు గల విశాలప్రాంతము సోవియట్ రష్యా యందు పరిపాలన రీత్యా చేరి ఉన్నది. పై రాజ్యములను గురించిన వివరములు ఆ యా శీర్షికల క్రింద కానవగును. చీ. శే. రా.

**ఆసియా మైనర్**: పశ్చిమ ఆసియాలో మధ్యధరా సముద్రమును అనుకొని ఉన్న ఒక ద్వీపకల్పము. దీని యందు అత్యధిక భాగము నేడు 'టర్కీ' దేశముగ వ్యవహరింపబడుచున్నది. ఈ ద్వీపకల్పమునకు ఉత్తరమున నల్లసముద్రమును, పశ్చిమమున ఈజియన్‌సముద్రమును, దక్షిణమున మధ్యధరా సముద్రమును నెలకొని ఉన్నవి; బాస్ఫరస్, డార్డెనల్స్ జలసంధులు యూరప్‌నుండి ఈ ద్వీపకల్పమును వేరు చేయుచున్నవి. తూర్పున ఆర్మీనియన్ పీఠభూమిని దీని సరిహద్దుగ పరిగణింపదగును. ఈ ప్రదేశమునకు 'ఆసియా మైనర్' అను నామము క్రీ. శ. 5 వ శతాబ్ది మొదలుగ వాడుకలోనికి వచ్చినది. రోమన్‌ల సామ్రాజ్యమున చేరిన ఆసియాయందలి ఈ భాగమును తక్కిన ఆసియానుండి విడివరచి పరిగణించుటకై ఆసియా మైనర్ (చిన్న ఆసియా) అను పేరు అప్పటిలో రోమన్ రచయితలచేత దీనికి కల్పింపబడి ఉండునని కొందరి అభిప్రాయము. ఈ ద్వీపకల్పముననే హాలిస్ పర్వతశ్రేణికి పశ్చిమమున ఉన్న భాగమునకు 'అనటోలియా' అని వ్యవహారము కలదు.

యూరప్, ఆసియా ఖండముల మధ్య ఒక 'సేతువుగ' ప్రపంచచరిత్రలో ఈ ద్వీపకల్పము ప్రాముఖ్యమును గడించినది. ఈ ప్రదేశపు తీరభూమినుండియే ఆసియాయందలి వివిధ మానవ జాతులును, సంస్కృతులును యూరప్‌నకు చేరుకొనినవి. అంతియేకాక, ప్రాచీనకాలము నుండియు వివిధ మానవ జాతులయు, రాజ్యములయు, దేశములయు అభ్యుదయ పతనములకు ఈ ద్వీపకల్పము నెలవైనది [చూ. టర్కీ, బైజాంటియమ్, లిడియా, హిట్టైట్‌లు]. చీ. శే. రా.

**ఆస్టిన్, జాన్ (1790 - 1859)**: బ్రిటిష్ న్యాయశాస్త్ర వేత్త; బారిస్టర్. బెంథామ్, జేమ్స్ మిల్, జాన్ స్టూవర్ట్ మిల్ మొదలయిన దార్శనికుల సన్నిహిత మైత్రితో 1826 - 32 లో లండన్ యూనివర్సిటీలో జ్యూరిస్ ప్రూడెన్స్ ప్రొఫెసర్ గా పని చేసిన దొడ్డవాడు. ఈ శాస్త్రమును గురించి ఇతడు రచించి, 1832 లో ప్రకటించిన గ్రంథములు నేటికిని న్యాయస్థానములందు ప్రమాణ గ్రంథములు. అందు సర్వస్వామ్యమునకు అతడు చేసిన నిర్వచనము నేటికిని నిలచి ఉన్నది. న్యాయ విధులకును, నీతి విధులకును గల సంబంధము, తారతమ్యము ఇతడు చక్కగ వివరించెను. సంప్రదాయ సిద్ధాంతవాదులు సంప్రదాయ ధర్మములకు రాజశాసనములకంటెను ఎక్కువ బలము, స్వతంత్రత కలదని వాదించినప్పుడు వారి వాదములను ఖండించి, రాజుకు గల సర్వస్వామ్యమును ఇతడు అతిశయింప జేసెను. గి. వేం. సీ.

**ఆస్ట్రియా**: మధ్య యూరప్‌నందలి ప్రజా సత్తాక గణరాజ్యము.

ఈ రాజ్యమునకు పశ్చిమ జర్మనీ, జెకోస్లోవాకియా [ఉ]; హంగేరి [తూ]; యుగోస్లావియా, ఇటలీ [ద]; స్విట్జర్లండ్; లిక్టెన్‌స్టీన్ రాజ్యములు [ప] సరిహద్దులుగ కలవు. [వి] 83,849 చ. కి. మీ; [జ] 71,50,700; [భా] దేశీయులలో 99% ప్రజల




మాతృభాష జర్మన్; [మ] ప్రజలలో 89% రోమన్ కేథలిక్‌లు, 6.2% ప్రొటెస్టంట్‌లు, 0.2% యూదులు; ఇక తక్కిన వారు ఏ మతమునకును చెందనివారు. [రా]. వియెన్నా (16,19,668).

చరిత్ర: ఆస్ట్రియా అను పేరు ఆస్టెర్‌రిఖ్ శబ్దము నుండి వచ్చినది. తూర్పురాజ్యమని ఆ శబ్దమునకు అర్థము.

దీనిచరిత్ర 1273 వరకును అంతగా తెలియదు. తెలిసికొన దగిన విషయములును లేవు. 1273 లో హాప్స్‌బర్గ్ రాజైన రుడాల్ఫ్ పవిత్ర రోమన్ సామ్రాజ్యమునకు చక్రవర్తిగ నియమితుడయ్యెను. ఈ హాప్స్‌బర్గ్ వంశ నాయకులు నేటి స్విజర్లండ్ ఉత్తరభాగమున ఆకాలమందు ఒక చిన్న రాజ్యమును ఏలుచుండిరి.

ఈ హాప్స్‌బర్గ్ వంశమువారే రుడాల్ఫ్ కాలము నుండి 1806 లో పవిత్ర రోమన్ సామ్రాజ్యము అంతరించు వరకును చక్రవర్తులు అగుచుండిరి. ఆతరువాత ఆస్ట్రియా సామ్రాజ్యము వెలసినది. దానికి కూడా ఈ వంశము వారే సామ్రాట్‌లు. 1918 లో ప్రపంచ యుద్ధము - I ముగియుటతో ఈ వంశము కూడ అంతరించినది.

హాప్స్‌బర్గ్ రాజులలో మాక్సిమిలియన్ - I 1459 - 1519 వరకును ఈ సామ్రాజ్యము ఏలి పేరు పొందెను. ఇతని కుమారుడు ఫిలిప్ స్పెయిన్‌రాజు కుమార్తె జువాన్‌ను పెండ్లియాడెను. ఆదంపతుల కుమారుడైన చార్లెస్-V (ప 1519 - 1556) స్పెయిన్‌కు సైతము రాజగుటచేత స్పెయిన్, ఆస్ట్రియా ఏకమగుటకు కారణమయ్యెను. చార్లెస్ - V తమ్ముడు ఫెర్డినాండ్ - I (ప. 1556 - 1564) బోహీమియా, హంగేరీ రాజ్యములకు వారసురాలైన ఏన్‌ను పెండ్లియాడుట చేతను, అతని చెల్లెలు మేరీ హంగేరీ రాకొమారుడైన లూయీని పెండ్లియాడుట చేతను బోహీమియా-హంగేరీ రాజ్యములు ఆస్ట్రియా రాజ్యములో చేరినవి. ఈ హాప్స్‌బర్గ్ వంశజులలో చార్లెస్ - VI (ప. 1711 - 1740) కు కుమార్తె మేరియా తెరెసా (1740 - 1780) లోరేన్ రాజు ఫ్రాన్సిస్ - I (ప. 1745 - 65) ను పెండ్లియాడుటచేత ఆ తరువాత ఆస్ట్రియా సామ్రాజ్యమును ఏలిన లియోపాల్డ్ - II, అతని కుమారుడు ఫ్రాన్సిస్ - II (ప. 1792 - 1835) హాప్స్‌బర్గ్ - లోరేన్ రాజవంశము వారు అయినారు.

ఆస్ట్రియా చరిత్రలో ఈ చార్లెస్ - VI, మేరియా తెరెసా కాలములందు ప్రాముఖ్యము గల సంఘటనలు జరిగినవి. చార్లెస్ - VI తండ్రియగు లియోపాల్డ్ కాలమున స్పెయిన్ పాలకుడుగ ఉండిన చార్లెస్ - II నిస్సంతుగ మరణించుచు, ఫ్రాన్స్ రాజగు లూయీ - XIV కుమారుడును, తనకు మేనల్లుడును అగు అంజుఫిలిప్‌కు స్పెయిన్ రాజ్యమును ఒసగెను (1700). అదివరకే ఫ్రాన్స్ రాజ్యము యూరప్ ఖండమందు లూయీ - XIV ప్రతిభవల్ల కడు బలముగల రాజ్యమై ఉండుట చేత స్పెయిన్ సామ్రాజ్యముకూడా కలిసిన యెడల మరింత బలము కలిగిన రాజ్యమగునని యెంచి ఇంగ్లండ్ రాజ్యమున్ను, తన కుమారులకు స్పెయిన్ రాజ్యములో ఏమీ దక్కలేదని ఆస్ట్రియా రాజు లియోపాల్డ్‌న్ను పట్టుదల కలిగి సంగ్రామమునకు పూనుకొనిరి. ఆ సంగ్రామమునకు 'స్పానిష్ వారసత్వపు సంగ్రామము' [చూ.] అని పేరు. సంగ్రామము ముగిసిన తరువాత జరిగిన సంధి ఫలితముగ స్పెయిన్‌వారి నెదర్లండ్స్, ఇటలీలోని మిలాన్, నేపిల్స్, సార్డీనియా ప్రాంతములు ఆస్ట్రియాను ఆ కాలమున పాలించు చార్లెస్ - VI కు దక్కినవి. ఇటలీలో ఆస్ట్రియా సంపాదించుకొన్న ప్రదేశములున్ను, పలుకుబడిన్ని 1866 వరకున్ను ఆస్ట్రియా వారికి నిలిచి ఉండెను.

ఆ తరువాత ఆస్ట్రియా చరిత్రలో నడచిన సంఘటనలలో చెప్పుకొనదగినది ఆస్ట్రియా వారసత్వపు సంగ్రామమునకు సంబంధించినది. లియోపాల్డ్ కుమారులలో జోసెఫ్ - I (1705 - 1711), చార్లెస్ - VI (1711 - 1740) రాజ్యమేలిరి. వీరికి పురుషసంతానము కలుగలేదు. ఈ రాజ వంశపు పద్ధతి ప్రకారము స్త్రీ సంతానమునకు వారసత్వపు హక్కు లేదు. అందుచేత, చార్లెస్ సామ్రాజ్యమందలి వివిధ రాష్ట్రములవారిని, తక్కిన రాజ్యముల వారిని స్త్రీ వారసత్వమును అంగీకరింపుడని కోరెను. అందరును అందుకు సమ్మతించి, చార్లెస్ చనిపోగానే ఎదురు తిరిగిరి. ఒక్క ఇంగ్లండ్ మాత్రము చార్లెస్ - VI కుమార్తె అగు మేరియా తెరెసా [చూ.] కు అండగా నిలిచినది. అప్పుడు ప్రారంభమైన ఆస్ట్రియా వారసత్వపు సంగ్రామము (1742 - 48) లో ప్రష్యారాజు ఫ్రెడరిక్ - II సైలీషియాను ముట్టడించి తీసికొనెను. ఇంతలో మేరియా తెరెసా భర్త లోరేన్ ప్రభువు వారసత్వరీత్యా జర్మనీ చక్రవర్తి అయ్యెను. ఈ సంఘటన వలన ఫ్రాన్స్‌తో ఆస్ట్రియాకు మైత్రి కుదిరినది. ఫ్రాన్స్ సాయముతో తాను కోల్పోయిన సైలీషియాను మరల ఆర్జించుటకు ప్రష్యా రాజు ఫ్రెడరిక్ తోడి సంగ్రామమునకు తెరెసా పూనుకొనినది. అప్పుడు జరిగిన సప్తవర్ష సంగ్రామములో మొదట కొన్ని యుద్ధములందు తాను విజయము పొందినను, కడకు ఆస్ట్రియా సైలీషియాను తెచ్చుకొనలేక పోయినది.

ఫ్రాన్సిస్ - I చనిపోగానే అతని కుమారుడు జోసెఫ్-II (1765 - 1780) తన తల్లి మేరియా తెరెసాతో ఉమ్మడిగా సామ్రాజ్యపదవియందు ఉండెను. తల్లి జీవించి ఉన్నంత వరకును ఆమెదే సర్వాధికారమున్ను; అతనికి అంతగా పలుకుబడి లేకపోయినది. 1780 లో మేరియా తెరెసా చనిపోయినది. జోసెఫ్ - II స్వతంత్ర రాజయినాడు. ఇతడు కాలానుగుణమైన సాంఘిక రాజకీయ సంస్కరణములు ఆస్ట్రియాలో గావించవలెనన్న అభిలాష గలవాడు. కాని, అందులకు కావలసిన నేర్పుగలవాడు కాదు. సంపన్న వర్గ

ముల స్వార్థపరత్వాధికారములను, మాండలిక స్వాతంత్ర్యములను తొలగించి, రాజ్యాధికార పరిపాలనము కేంద్రీకరించి బలపరచుటకు ఇతడు పూనుకొనెను. కాని, ఈ పని తృప్తికరముగా నెరవేరలేదు. 1781 లో మత విషయమున ఇతడు చేసిన సంస్కరణములు మాత్రము ఈ దేశమందు మంచి ఫలితములను కలుగజేసినవి. 1790 లో జోసెఫ్ చనిపోగానే అతని తమ్ముడు లియోపాల్డ్ - II ఆస్ట్రియా చక్రవర్తి అయినాడు. ఇతడు రాజ్యమేలిన రెండు సంవత్సరములలోను నెదర్లండ్స్‌తోను, హంగేరితోను కలిగిన వివాదములు తొలగి పోవుటయును, టర్కీతో రష్యా ప్రోత్సాహము వలన కలిగిన కలహములు తప్పుటయు, ప్రష్యాతో చెలిమియు ఇతని విదేశాంగనీతి వలన సంభవించినవి. ఇతడు 1792 లో చనిపోగానే ఫ్రాన్సిస్ - II చక్రవర్తి అయ్యెను. ఆ వెంటనే ఫ్రాన్స్ దేశములో పుట్టిన విప్లవ ఫలితముగా ఫ్రాన్స్ దేశముతో యూరప్ ఖండమందలి తక్కిన రాజ్యకూటమి వారికి సంగ్రామము ప్రారంభించినది. విప్లవమువల్ల బలము తగ్గిన ఫ్రాన్స్ దేశమును ఓడించుట సులభమని ప్రష్యా, ఆస్ట్రియా నాయకులు తలచిరి.

హోహెన్ లిండెన్ వద్ద 1800, డిసెంబరు 3 వ తేదీని జరిగిన యుద్ధమందు ఫ్రెంచివారికి గొప్ప విజయములు కలుగుట వలన ఆస్ట్రియా నష్టపడిపోయినది. అప్రతిష్ఠపాలు కావచ్చునన్న భయముతో ఫ్రాన్సిస్ - II తనంత తానే జర్మన్ (పవిత్ర రోమన్ సామ్రాజ్య) చక్రవర్తి అను బిరుదు వదలుకొని, నెపోలియన్‌ను సంతృప్తి పరచెను. వంశపరంపరగా వచ్చిన ఆస్ట్రియా చక్రవర్తిత్వమును మాత్రము నిలుపుకొని ఫ్రాన్సిస్ - I అని పేరు పెట్టుకొనెను.

ఇంగ్లండుతో ఆస్ట్రియా, రష్యా, స్వీడెన్ కలిసి 1805 లో నెపోలియన్‌ను ఎదిరించినవి. ట్రఫాల్‌గర్ వద్ద జరిగిన నౌకా యుద్ధమందు బ్రిటిష్‌వారు గొప్ప విజయమును పొంది సముద్రముపై నెపోలియన్‌కు బలము లేకుండ చేసినను, 1805, డిసెంబరు 2 వ తేదీని ఆస్టర్‌లిట్జ్ వద్ద ఆస్ట్రియా, రష్యా సేనలను నెపోలియన్ పూర్తిగా ఓడించెను. తత్ఫలితముగ వెనిస్ రాష్ట్రములను ఆస్ట్రియా ఇటలీకి ఇచ్చివేసి, ఇటలీకి నెపోలియన్ రాజుగా ఉండుటకు సమ్మతించెను.

నెపోలియన్ తన మొదటి భార్యయైన జోసెఫీన్‌కు 1810 లో విడాకులిచ్చి, ఆస్ట్రియా చక్రవర్తి ఫ్రాన్సిస్ - I కుమార్తె మేరీ లూయీని వివాహమాడెను. దానివలన ఆస్ట్రియాతో నెపోలియన్‌కు మైత్రి కుదిరినది. కాని, ఆ కట్టె కాలము నిలువలేదు. నెపోలియన్ దౌర్జన్యములను, తనకు కలిగిన నష్టములను చూచి సహించలేక 1813, ఆగస్టు 12 వ తేదీని ఆస్ట్రియా మరల నెపోలియన్‌తో డి యుద్ధమును ప్రకటించినది. 1814 లో నెపోలియన్ ఓడిపోయి ఎల్బా దీవికి నిర్వాసితుడై పోయెను [చూ. నెపోలియన్].

నెపోలియన్ పతనానంతరము వివిధ యూరపియన్ రాజ్యముల పాలకుల ప్రతినిధులు ఆస్ట్రియా రాజధాని యగు వియెన్నాయందు 1814-15 లో మహాసమావేశము జరిపి, యూరప్ ఖండపు దేశపటములను సరిదిద్ది, స్థిరరూపములను ఏర్పరచుటకు కృషిచేసిరి. ఈ సమావేశమునే చరిత్రకారులు వియెన్నా కాంగ్రెస్ [చూ.] అని వ్యవహరింతురు. ఈ కాంగ్రెస్ నిర్ణయముల ఫలితముగ ఇటలీ దేశమందలి లొంబార్డీ - వెనిజియా ప్రదేశములును, ఇల్లీరియా, డాల్‌మేషియా మండలములును, బవేరియాలోని సాల్జ్‌బర్గ్, టిరోల్ ప్రదేశములును, గలిసియా మండలమును ఆస్ట్రియారాజ్యమందు చేరినవి.

ఇంకా ఈ ఏర్పాట్లు జరుగుచుండగానే నెపోలియన్ ఎల్బానుండి తప్పించుకొనివచ్చి 1815, మార్చి 20 వ తేదీని పారిస్‌నగరము ప్రవేశించి ఫ్రెంచి రాజుగా రాజ్య మేలుటకు మొదలు పెట్టెను. అంతట ఆస్ట్రియా, బ్రిటన్, ప్రష్యా, రష్యా రాజ్యములవారు సంప్రదించుకొని మిత్రమండలిగ ఒక పెద్ద సైన్యమును సమకూర్చుకొని నెపోలియన్‌ను ఓడించి పట్టుకొనుటకు నిశ్చయించుకొనిరి. మరల సంగ్రామము చెలరేగినది. తుదకు జూన్ 18 వ తేదీని వాటర్లూ యుద్ధమున మిత్రమండలి సేనలు నెపోలియన్‌ను ఖైదీగా పట్టుకొని సెంట్ హెలీనా దీవికి నిర్వాసితుని జేసి నిర్బంధావాసమున ఉంచినవి. 1840 వరకును ఆస్ట్రియా చరిత్ర ప్రశాంతముగా సాగిపోయినది.

ఫ్రాన్స్‌లో మరల 1848 లో విప్లవము పుట్టినది. ఫ్రెంచి రాజయిన లూయీ ఫిలిప్‌ను పదభ్రష్టునిచేసి, రెండవసారి ప్రజాసత్తాక రాజ్యము (రిపబ్లిక్) ను ఫ్రెంచివారు స్థాపించిరి. ఆ విప్లవవార్త తెలియగానే ఆస్ట్రియా రాజధానియైన వియెన్నాలోను, హంగేరి రాజధానియైన బుడాపెస్ట్‌లోను అలజడి కలిగినది. బాధ్యతాయుత ప్రభుత్వము కొరకై ఉభయ దేశముల ప్రజలును తీవ్రాందోళన సలిపిరి. ఆస్ట్రియా చక్రవర్తి ఫెర్డినాండ్ - I అంతట భార్యాసహితముగ వియెన్నా విడిచి పారిపోయి, విప్లవ సూచనలు భయంకరముగా కనబడుటచేత తన పదవిని విడిచిపెట్టుకొనెను. అతని కుమారుడు ఫ్రాన్సిస్ జోసెఫ్ - I (1848-1916) చక్రవర్తి అయ్యెను. తన విశాల

సామ్రాజ్యమున వివిధ జాతులును స్వాతంత్ర్యముకొరకై జరుపుచున్న ఆందోళనములను ఏదియో ఒక తీరున సాధ్యమైనంతవరకు అడచి, సామ్రాజ్యమును సుస్థిర మొనర్చుటకు ఈతడు కృషిచేసెను. అయినను అతడందు కొంత వరకు మాత్రమే సఫలతను ఆర్జించెను. రష్యా సైనిక సహాయముతో హంగేరి స్వాతంత్ర్యమును పడగొట్టి, వేలకొలది విప్లవ నాయకులను జోసెఫ్ చంపించెను. ఆ తరువాత 1867 లో శాంతియుతముగా కొన్ని రాజకీయ సంస్కరణలను, 1887 లో కొంత స్థానిక స్వతంత్రతను హంగేరి సంపాదించుకొన్నది. 1907 లో ఆస్ట్రియాయు, హంగేరియు ఆస్ట్రియా - హంగేరిగా ఏకమైనవి [చూ. హంగేరి].

ఇటలీలోను, జర్మనీలోను, ఆస్ట్రియా తాత్కాలికపు విజయములను పొందినది. కాని, కొద్ది కాలములోనే 1859 సరికి ఇటలీలో ఆస్ట్రియాకు మిగిలిన రాష్ట్రము వెనిస్ మాత్రమే. జర్మనీలో ఆస్ట్రియా సంపాదించుకొన్న నాయకత్వమును చూచి ప్రష్యా సహింపలేక 1866 లో సంగ్రామమునకు పూనుకొన్నది. బోహీమియా ఈశాన్య భాగమందలి పడమటి జెకోస్లోవాకియాలోగల సాడోవా పల్లెవద్ద జరిగిన యుద్ధములో ఆస్ట్రియాను ప్రష్యా పూర్తిగా ఓడించి, లోగడ ఆస్ట్రియాకు తోడ్పడి ఉండిన మధ్య జర్మనీ రాష్ట్రములను వశపరచుకొన్నది. దానితో జర్మనీ పై గల ఆధిపత్యమును ఆస్ట్రియా పోగొట్టుకొన్నది. ఆ సమయమందే ఇటలీలో వెనిజియా ప్రాంతమును కూడా ఆస్ట్రియాకు విరోధియైన సార్డీనియా తీసికొన్నది. దానితో ఆస్ట్రియా యాజమాన్యము పడమటి ప్రదేశమందు అంతరించినది. అంతటితో సామ్రాజ్యముపై గల ఆశను ఆస్ట్రియా విడిచిపెట్టుకొన్నది. అంతేకాక, 1867 లో ఏర్పడిన ఉత్తర జర్మనీ రాష్ట్రముల కూటమి ప్రష్యా రాజాధిపత్యమునకు లోబడి ఏర్పడినది. దాని అధ్యక్షుడు ప్రష్యారాజే ; కాని, అతని సచివుడైన బిస్మార్క్ అన్నింట అధికారమును వహించెను [చూ. బిస్మార్క్]. ఇతని రాజనీతి ఫలితముగ ప్రష్యా మహాశక్తివంతమైన రాజ్యముగ రూపొంది, కడకు 1870-71 లో జరిగిన సంగ్రామమున ఫ్రాన్స్‌ను ఓడించెను. అంతట ప్రష్యా రాజు విలియమ్ - I జర్మనీ చక్రవర్తిగ ప్రతిష్ఠితుడయ్యెను. అంతటి నుండి మధ్యయూరప్ నందలి రాజ్యములందు ప్రష్యా దేశముదే పైచేయి అగుటవలన ఆస్ట్రియా-హంగేరి ప్రభువులు ఆ దేశముతో మైత్రిని అవలంబించి వ్యవహరించిరి [చూ. జర్మనీ].

జర్మనీ - ఆస్ట్రియా - ఇటలీ రాజ్యత్రయము 1882 లో మైత్రి కుదుర్చుకొనినవి. మొదట 5 ఏండ్లకు మాత్రమే - అనగా 1887 వరకు మాత్రమే - అమలులో ఉండవలెనని అనుకొనినప్పటికీ, మరల మరల సమావేశములందు బలపడి ఈ మైత్రి 1915 వరకును నిలిచినది.

రష్యా - టర్కీ మధ్య 1877 - 78 లో సంగ్రామము జరిగినప్పుడు సెర్బియా దేశము రష్యాకుతోడుగ యుద్ధము చేసి, టర్కీవారికి ఓడిపోయినది (ఈ సెర్బియా ఆస్ట్రియాకు ఆగ్నేయమున ఉన్న పరిసర రాజ్యము). అప్పుడు సెర్బియా పక్షమున ఆస్ట్రియా, జర్మనీ జోక్యము కలుగజేసికొనినవి. కాని, తుదకు సెర్బియా స్వాధీనపరచుకొనవలెనని ఆశించిన బోస్నియా, హెర్జ్‌గొవీనా రాష్ట్రములు సెర్బియాకు దక్కలేదు ; ఆస్ట్రియా స్వాధీనపరచుకొన్నది. అందువలన అప్పటినుండి సెర్బియాతో ఆస్ట్రియాకు విరోధము కల్గినది. క్రమక్రమముగ ఈ విరోధము పెచ్చుపెరిగి 1914 లో ఆస్ట్రియా సెర్బియాపై యుద్ధము ప్రకటించుటకు దారితీసెను. ఇదియే ప్రపంచ యుద్ధము - I [చూ.]గ పరిణమించినది. ప్రపంచ యుద్ధము - I లో జర్మనీ, ఆస్ట్రియా పూర్తిగా ఓడిపోయినవి ; ఆస్ట్రియా సామ్రాజ్యము అంతమొందినది. ఆస్ట్రియా - హంగేరి చక్రవర్తియైన చార్లెస్ - I ఆస్ట్రియాకుగాని, హంగేరికిగాని పరిపాలకుడుగా నిల్వలేక నిర్వాసితుడై, 1922 లో చనిపోయెను. హంగేరి మునుపటికంటె వైశాల్యములో తగ్గి, స్వతంత్ర రాజ్యమయినది. ఆస్ట్రియా వైశాల్యములో ఐర్లాండ్ కంటె చిన్నదయి, చిన్న ప్రజాసత్తాక రాజ్యమైనది. ఈ పరిస్థితులలో జర్మనీతో కలసి ఉండుటకు ఆస్ట్రియా సంకల్పించినది. కాని, నానాజాతిసమితి అందుకు సమ్మతింపలేదు. జర్మనీలో (1933-34) నాజీపార్టీ పలుకుబడి సంపాదించుకొని, జర్మనీతో ఆస్ట్రియా ఏకీకరణముకోసము యత్నించినది. 1938 లో ఆ యత్నము ఫలించి, ఆస్ట్రియారిపబ్లిక్ జర్మనీలో ఒక భాగమైనది. రిపబ్లిక్ అను పేరుపోయి 'ఆస్ట్‌మార్క్' అను పేరు వచ్చినది.

ప్రపంచ యుద్ధము - II లో జర్మనీ, జర్మనీతో కలిసిన ఆస్ట్రియా పూర్తిగా ఓడిపోయిన తరువాత మిత్రమండలి సేనలు ఆస్ట్రియాయందలి వేర్వేరు భాగములను, వియెన్నానగరమును 1945 లో ఆక్రమించినవి. తుదకు 1955, మే 15 వ తేదిన జరిగిన ఒడంబడిక మూలమున మిత్రరాజ్యములు అన్నియు తమ సేనలను ఆస్ట్రియానుండి ఉపసంహరించి ఆస్ట్రియాకు స్వాతంత్ర్యమొసగినవి. తదాదిగ ఆస్ట్రియా ప్రజాస్వామికగణరాజ్యమై యూరప్ రాజకీయములలో తాటస్థ్యము వహించి మనుచున్నది.

రాజ్యాంగము : 1945 లో ఆస్ట్రియా తన చరిత్రయందు రెండవసారి గణరాజ్యముగ రూపొందిన వెనువెంటనే

1920 నాటి రాజ్యాంగము 1929 సంవత్సరపు సవరణలతో పునరుద్ధరితమైనది. ఈ రాజ్యాంగమును అనుసరించి తొమ్మిది రాష్ట్రముల సమాఖ్యాప్రభుత్వముగ ఇందలి కేంద్రప్రభుత్వము వర్తించుచున్నది. నాలుగేండ్లకొకసారి కేంద్ర శాసనసభకు ఎన్నికలు జరుగును. ఆ శాసనసభ ద్వికక్ష్యకము. దిగువ సభకు 'నేషనల్ రాట్' అనియు, ఎగువ సభకు 'బుందెస్ రాట్' అనియు పేరులు. రాష్ట్రముల జనసంఖ్యా నిష్పత్తిలో రాష్ట్ర శాసనసభలవలన 50 మంది సభ్యులు ఎగువ సభకు ఎన్నుకొనబడుదురు. నైష్పత్తిక ప్రాతినిధ్య విధానమును అనుసరించి 25 ఎన్నిక మండలములచే ఎన్నుకొనబడిన 165 మంది సభ్యులు దిగువ సభలో కలరు. 21 ఏండ్లకు తగ్గని వారికందరికి వోటు హక్కు కలదు. శాసనసభ్యులకు కనీసపు వయఃపరిమితి 26 ఏండ్లు. శాసనోపక్రమణాధికారము దిగువసభకు మాత్రమే కలదు. ప్రతి రాష్ట్రమునకును ఏకకక్ష్యకమగు శాసనసభ కలదు. కేంద్ర-రాష్ట్రముల మధ్య అధికారములు సువిభక్తములై ఉన్నవి; పెక్కు సందర్భములందు కేంద్ర శాసనములను అమలుజరపు అధికారము రాష్ట్ర ప్రభుత్వములకే ఈయబడినది. గణరాజ్యాధ్యక్షుడు ఆరేండ్లకు ఒకసారి ఎన్నుకొనబడును. గి. వెం. సీ.

**ఆస్ట్రియా-హంగేరీ సామ్రాజ్యము:** చూ. ఆస్ట్రియా; హంగేరీ.

**ఆస్ట్రేలియా :** ఆసియా ఖండమునకు ఆగ్నేయమూలన హిందూ, పసిఫిక్ మహాసముద్రముల మధ్య దక్షిణార్ధగోళమున సముద్ర పరివృతమై ఉన్న స్వతంత్ర రాజ్యము.

ఈ రాజ్యమున ఆస్ట్రేలియా ఖండమును, దానికి దక్షిణమున సమీపముననే ఉన్న టాస్మేనియా ద్వీపమును చేరి ఉన్నవి. పరిపాలనా స్వరూపమును బట్టి ఈ రాజ్యమును 'కామన్‌వెల్త్ ఆవ్ ఆస్ట్రేలియా' అనియు వ్యవహరించుచుందురు. [వి] 76,94,951 చ. కి. మీ; [జ] (ఆదిమజాతులుకాక) 1,09,65,100; జన సాంద్రత చ. కి. మీ. కు సుమారు 1. ఆదిమజాతులు సుమారు 70,000. ఆదిమజాతులు కాక మిగిలిన వారందరును యూరపియన్ వర్గమునకు, అందును ముఖ్యముగ బ్రిటన్‌కు చెందిన వారలే. [భా] ఇంగ్లీషు. ఆదిమజాతుల వారియందు మాత్రము లిఖిత రూపములు ఎరుగని ప్రాచీన భాషలు కొన్ని వ్యాప్తియందు ఉన్నవి. [మ] క్రైస్తవ మతము సర్వత్ర వ్యాపించి ఉన్నది. అందును ప్రొటెస్టంట్‌లు అత్యధికము. [రా] కాన్‌బెర్రా (39,061).

చరిత్ర : యూరపియన్‌లు ఆస్ట్రేలియాను ఎన్నడు కనుగొనిరో చెప్పుట కష్టము. ఈ ఖండమును గురించి విస్పష్టమైన పరిజ్ఞానము ఎవరికిని లేనపుడే దూరప్రాచ్య, దక్షిణ సముద్రములలో ఒక పెద్ద భూభాగము కలదని అస్పష్టముగ సూచించిన వారు కొందరు లేకపోలేదు. 16 వ శతాబ్దములో ఈ నూతన ఖండాన్వేషణోద్యమము ఎక్కువ చురుకుగ సాగినది. ఆస్ట్రేలియాకు వచ్చిన డచ్చి నావికులు ఈ ఖండపు పడమటితీర పరిసర ప్రదేశములకు అన్నిటికిని డచ్చిపేర్లను పెట్టిరి. కెప్టెన్ కుక్ అను బ్రిటిష్ నావికునితో ఈ పరిశోధనలలో రెండవ యుగము ప్రారంభమైనది. 1770 లో ఇతడు ఆస్ట్రేలియా తూర్పు తీరమున ఉత్తరముగ ప్రయాణముచేసి, తాను కనుగొనిన ఈ ప్రదేశమంతటిని బ్రిటన్‌నకు సంక్రమింప చేసినాడు. అదే నేటి న్యూ సౌత్‌వేల్స్ రాష్ట్రము. 1788 లో ఫిలిప్ అను గవర్నరు యాజమాన్యమున సిడ్నీలో మొదటి స్థావరము నెలకొల్పబడువరకును-దక్షిణ టాస్‌మేనియాలో మినహా - పూర్వముకంటె ఎక్కువ వలసలు స్థాపితము కాలేదు. అయితే, అప్పటినుండి తీరమునందు పరిశోధనలు తరచుగా జరుగుచు వచ్చెను.

సిడ్నీ వలస సంస్థాపనమునకును, అమెరికన్ విప్లవమునకును కొంత సంబంధము ఉన్నది. అమెరికా ఖండములో తనకు గల వలసలను కోల్పోయిన పిమ్మట నేరస్థులకు ప్రవాస శిక్షారంగముగ వినియోగించుటకే ఇంగ్లండు ఈ స్థావరమును నెలకొల్పినది. అంతకు పూర్వమే వచ్చి అక్కడ స్థిరపడినవారు అక్కడకు నేరస్థులు వచ్చుటను హర్షించలేదు. ఎందుచేతనైతేనేమి, మొత్తము మీద ప్రతి సంవత్సరమున్ను ఆస్ట్రేలియాకు పంపబడుచుండిన నేరస్థుల సంఖ్య క్రమముగ తగ్గుచు వచ్చెను.

కేవలము నేరస్థుల ప్రవాసమునకు మాత్రమే ఉపయోగించుటచేత మొట్టమొదటి గవర్నర్ ఈ ఖండము లోపలి భాగములో పరిశోధనలు జరుపుటకు తగు ప్రోత్సాహము కలిగింపలేదు. బంగారము బయల్పడుటతో ధనవంతులు కావచ్చుననే ఆశతో అనేకులు పూర్వముకంటె విరివిగా దేశము లోపలిభాగములకుపోయి స్థిరపడసాగిరి. ఇందుకు పొగ ఓడలును, రైలు మార్గములును మిక్కిలి తోడ్పడినవి. అట్లు ఆస్ట్రేలియా కవాటములను తెరచి దేశము లోపలిభాగములోనికి చొచ్చుకొనిపోవుటకు సాహసించిన ప్రథములలో హ్యూమ్ నది ఉనికిని కనుగొనిన హేమిల్టన్ హ్యూమ్, ఆ నదికి ఉపనది అగు డార్లింగ్‌నదీ తీరమువెంట పరిశోధన జరిపిన చార్లెస్ స్టుఅర్ట్, ఎడ్వర్డ్ అయిర్ మున్నగు వారిని ముఖ్యముగ పేర్కొనవలెను.

అమెరికా విప్లవము 1788 లో న్యూ సౌత్‌వేల్స్ పరిశోధనకు దారితీసినది. ఇక నెపోలియన్ చేసిన యుద్ధములు టాస్‌మేనియా వలసను నెలకొల్పుటకు ప్రోత్స

హించినవి. 1815 సంధి అనంతరము పశ్చిమ ఆస్ట్రేలియా (1829), క్వీన్స్‌లాండ్ (1826), దక్షిణ ఆస్ట్రేలియా (1836), విక్టోరియా వలసలు క్రమముగ స్థాపించబడినవి. ఆ విధముగ 1863 నాటికి ఆస్ట్రేలియా ఖండమున అయిదు విడి విడి వలసలు ఏర్పడినవి. ఆరవది టాస్‌మేనియా. పైన పేర్కొనిన ప్రతివలసకును రేవుపట్టణము ఒకటి రాజధాని నగరముగ ఉండెను. తత్ఫలితముగ ప్రతి వలసకును తక్కిన వలసలతో ఈర్ష్యయు, స్పర్ధయు ప్రబలి, ఏ వలసకు ఆ వలస తన వర్తక - వ్యాపారములను ఇతర వలసలకు పోనీయకుండ తన రాజధాని నగరము ద్వారానే సాగించుకొనుచుండెను. 1850 ప్రాంతములో బ్రిటిష్ ప్రభుత్వము ఏదో ఒక విధమైన 'సంయుక్త రాజ్య' విధానమును నెలకొల్పుటకు చేసిన ప్రయత్నములు అన్నియు విఫలమైనవి. 1880 ప్రాంతమున ప్రపంచమందలి వలసలు అన్నిటి విదేశవిధానములలోను మార్పులు కొనివచ్చిన సమస్యలు ఆస్ట్రేలియాలో కూడ ఉత్పన్నములు అగుటవలన బ్రిటిష్ ప్రభుత్వము తత్క్షణమే శ్రద్ధ వహించవలసి వచ్చెను. చీనావారు వలస వచ్చుటయు, న్యూ కెలెడోనియాలో ఉన్న ప్రవాస ప్రజలను గురించి ఫ్రాన్స్‌తోను, న్యూగినీ విభజన సందర్భములో జర్మనీతోను వచ్చిన కలతలున్ను, ఆస్ట్రేలియాకు సరియైన రక్షణ లేదను భావము క్రమముగా దేశములో ఉన్న వారందరకును కలుగుటయు ఇవన్నియు కారణములుగా ఈ రాజ్యములన్నియు కలిసి సంయుక్త చర్య తీసికొనవలసిన ఆవశ్యకత మరింత ఎక్కువ అయినది. అయితే, పరస్పర ద్వేషముతో ప్రవర్తించుచున్న రాష్ట్ర వలసప్రాంతములు ఒక్కమారుగ ఇట్టి చర్య తీసికొనుట అంత సులభము కాదు. అందుచేతనే ఇవి తమ అధికారములో కొంతైనను కేంద్ర ప్రభుత్వమునకు ఒప్పగించుటకు 20 ఏండ్లకాలము పట్టినది. తుదకు ఎంతో ప్రయత్నము మీద 1901 లో ఆస్ట్రేలియా 'కామన్ వెల్త్' అను పేరుతో ఒక సమాఖ్యా రాజ్యముగా వెలసినది. దీనిని బ్రిటిష్ పార్లమెంట్ ఆమోదించెను. విదేశ రాజకీయ వ్యవహారములను చక్కబెట్టు అధికారము ఈ కామన్ వెల్త్‌నకు వలసలు ఒప్పగించినవి. నాటి నుండి ఈ ఆరు వలసలున్నూ రాష్ట్రములను పేరుతో వ్యవహరింపబడుచున్నవి. ఈ ఆస్ట్రేలియా సమాఖ్యలో కేంద్ర ప్రభుత్వమునకు కేవలము కొన్ని ప్రత్యేక విషయములపై - అనగా రక్షణశాఖ, వర్తకము, వలసపోవుట మొదలగు వాటిపై మాత్రమే - అధికారము ఇవ్వబడెను. తదితర విషయములను ఆ యా రాష్ట్రములకే విడిచి పెట్టిరి. అంతేకాక, ఆస్ట్రేలియా రాజ్యాంగమును ఆదేశపు ప్రజలే సవరణచేసికొను అధికారము కూడ అందు కల్పింపబడెను.

అధినివేశ ప్రతిపత్తి : సామ్రాజ్య విస్తీర్ణము పెరిగిన కొలది 19 వ శతాబ్దములో బ్రిటన్‌లో ఉన్నవారికి సామ్రాజ్యముపట్ల గల అభిప్రాయములు కూడ మారుచు వచ్చెను. ప్రజాస్వామ్య సిద్ధాంతములు బ్రిటిష్‌వారి అందరికిని వంటపట్టుటతో అక్కడి ప్రభుత్వమునకును, అధినివేశములోని ప్రభుత్వ విధానమునకును చాల పోలికలు ఏర్పడినవి. అంతేకాక, అధినివేశములలోకూడ జాతీయాభిమానము ఎక్కువ అగుటచే వారు బ్రిటిష్ అధికారమును ప్రతిఘటింపజొచ్చిరి. ఆస్ట్రేలియాకు మాతృభూమితో గల సంబంధపు ప్రాతిపదిక ఇందువలన మారజొచ్చెను. దీనిని గుర్తించి ఆస్ట్రేలియాకు బాధ్యతాయుత ప్రభుత్వమును ఒసగుచు బ్రిటిష్ పార్లమెంట్ చట్టము చేయుట వలన ఆంతరంగిక వ్యవహారములలో ఆస్ట్రేలియాకు స్వతంత్రత సిద్ధించెను. ఈ ప్రతిపత్తినే 'అధినివేశ ప్రతిపత్తి (డొమినియన్ స్టేటస్)' అని వ్యవహరింతురు. 1914 - 1918 యుద్ధానంతరము ఈ అధినివేశ ప్రతిప్రత్తియే క్రమపరివర్తనచెందగ తక్కిన బ్రిటిష్ అధినివేశములతోపాటు ఆస్ట్రేలియాయు స్వతంత్ర రాజ్య ప్రతిపత్తితో నానాజాతి సమితిలో చేరినది. రెండు ప్రపంచ యుద్ధములందును బ్రిటన్ పక్షమున ఆస్ట్రేలియా పోరాడినది.

ప్రపంచ యుద్ధము - II సందర్భములో జపాన్ 1942, ఫిబ్రవరి 19 న డార్విన్ రేవుపై బాంబులు వేసెను. ఆస్ట్రేలియా చరిత్రలో పరదేశ దండయాత్ర జరుగుటకు ఇదే మొదలు.

ఆనాటి నుండి ఆస్ట్రేలియన్‌లు తమ సర్వస్వమును ఒడ్డి తమ స్వాతంత్ర్యరక్షణమునకై - జపాను శరణాగతి చెందువరకు - మిత్రమండలి సాయమున పోరాటమున పాల్గొనిరి.

యుద్ధము జరుగుచున్న సమయములో ప్రతి వ్యక్తియు యుద్ధము చేయవలెను లేదా ఇంకొక విధముగనైన యుద్ధమునకు సహకరించుచుండవలెనని కార్మికపక్షపు ప్రధానమంత్రి అగు జాన్ కర్టిన్ ఆస్ట్రేలియా ప్రజానీకమును హెచ్చరించినాడు. అంతేకాక, ప్రతి వ్యక్తి తన కర్తవ్యమును సక్రమముగ నిర్వర్తించునట్లు చూచుటకై ప్రభుత్వము వివిధ శాఖలను తన అదుపులో ఉంచుకొనినది. అనవసర వస్తువుల ఉత్పత్తిని, వాటి ఎగుమతులను నిల్పివేసిరి. కొరత పదార్థములకు 'రేషనింగ్' ప్రవేశపెట్టిరి. దేశములోని ప్రజలందరును ఇట్టి మార్పులను ఓపికతో సహించినారు. వీరు యునైటెడ్ స్టేట్స్‌కు ఆహార పదార్థ

ముఠను పంపి, కొన్ని వేలమంది అమెరికన్ ప్రజలకు ప్రాణదానము చేసిరి. యుద్ధావసర పరిశ్రమాగారములను నిర్మించిరి. మిత్రరాజ్యాల కార్యాచరణ సంఘము యుద్ధమునకు ఆవశ్యకమైన రోడ్లను, వంతెనలను వేయించెను. 1942, నవంబరు మాసములో ఈ సంఘము వయస్సు మళ్లినవారిని, దుర్బలులను కూడ కొందరిని యుద్ధ రంగములలోను, మిగిలిన వారిని విమానపు దాడులు జరుగుచున్న ప్రదేశములలోను నియమించినది. నైరృతి దిక్కుగ పసిఫిక్ రంగములోని సేనలకు 100 కి 95 పాళ్లు ఆహార పదార్థములను అందచేసినది ఆస్ట్రేలియా దేశమే. అంతే కాక, వస్త్రములు, జోళ్లు మున్నగు వస్తువుల విషయములో సైనికులకు ఎట్టి ఇబ్బందిని కలుగనీయలేదు. రాయల్ ఆస్ట్రేలియన్ నౌకాదళము యుద్ధముచేయని సముద్రమే లేదనవచ్చును. వీరి నావికులు జర్మనీపై బాంబులు ప్రయోగించుటలోను, యూరప్‌లో జరిగిన యుద్ధములలోను విశేషఖ్యాతి పొందినారు.

1945 లో జరిగిన శాన్‌ఫ్రాన్సిస్కో సమావేశము [చూ.] లో ఆస్ట్రేలియా పాల్గొని ప్రపంచమందలి చిన్న రాజ్యాలకు కూడా ఐక్యరాజ్యసమితి సభ్యత్వము కలిగించుట కొరకు విశేషముగా కృషిచేసినది. ప్ర. రా.

**రాజ్యాంగము** : సమాఖ్య (ఫెడరల్) పద్ధతి రాజ్యాంగ విధానము ఈ దేశమున అమలునందు ఉన్నది. బ్రిటిష్ సార్వభౌముని రాజప్రతినిధి (గవర్నర్ జనరల్) లాంఛనప్రాయముగ ఆస్ట్రేలియా కామన్‌వెల్త్‌పై అధికారమును నెరపును. ప్రతినిధులసభ (హౌస్ ఆవ్ రిప్రజెంటేటివ్స్), సెనేట్ అను రెండు కక్ష్యలుగ ఈ కామన్‌వెల్త్ పార్లమెంట్ రూపొంది ఉన్నది. రాజ్యమునందలి వివిధ నియోజక మండలములనుండి వోటర్లచే ఎన్నుకొనబడిన 124 గురు సభ్యులు ప్రతినిధులసభయందు కలరు. సెనేట్‌లోని సభ్యుల సంఖ్య 60. వీరు రాజ్యమందలి వివిధ రాష్ట్రములకు ప్రాతినిధ్యము వహింతురు. ఒక్కొక్క రాష్ట్రము నుండి 10 మంది సెనేట్ సభ్యులు రాష్ట్రమందలి మొత్తము వోటర్లవలన ఎన్నుకొనబడుదురు. ప్రతినిధుల సభలోని అత్యధికసంఖ్యాక పక్షపు నాయకుడు ప్రధాన మంత్రిగ నియమితుడగును. ఇతడొక మంత్రివర్గము నియమించుకొని పరిపాలనను రాజప్రతినిధి లాంఛనపు ఆమోదముతో నెరపును. ఇరువది పండ్ల వయస్సునకు మించిన ప్రతి పౌరునికిని - స్త్రీ - పురుష విచక్షత లేక - ఈ దేశమున వోటింగు హక్కు కలదు. వోటువేయుట అనునది వోటరునకు అనుల్లంఘనీయమగు విధి. అందువలననే 1931 తరువాత జరిగిన ప్రతి ఎన్నికలోను నూటికి దాదాపు 96 మంది వరకు వోటుచేయుట కన్పట్టుచున్నది.

పాలిత రాజ్యములు : ఆస్ట్రేలియాకు కొన్ని వలసలును కలవు. నౌరూ అను దీవిని, న్యూగినీలోని కొంత భాగమును ఐక్యరాజ్యసమితి ధర్మకర్తృత్వసంఘ పర్యవేక్షణకు లోబడి ఆస్ట్రేలియా పాలించుచున్నది. ఆగ్నేయ న్యూగినీ, అష్‌మోర్, కార్డియర్ దీవులు, క్రిస్ట్‌మస్ ద్వీపము, కోకస్ ద్వీపభూమి, హెర్డ్ - మాక్‌డొనాల్డ్ ద్వీపభూమి, మెక్‌క్వెయిరీ దీవి, నార్‌ఫోక్‌దీవి అనునవి ఆస్ట్రేలియా అధీనమున ఉన్న అస్వతంత్ర భూములు. 1936 నుండి అంటార్కిటికా [చూ.] దక్షిణ ధ్రువప్రాంత భూమియందు అడేలీలాండ్ తప్ప తక్కినదంతయు తనకే చెందినదిగ పరిగణింపబడవలెనని ఆస్ట్రేలియా ఆందోళన చేయుచున్నది. వి. ఆర్.

**ఆహార వ్యవసాయ సంఘము:** చూ. ఐక్యరాజ్యసమితి; ఎఫ్. ఏ. ఓ. - సం. 8 - పు. 289.

**ఇంగ్లండు** : చూ. యునైటెడ్ కింగ్‌డమ్.

**ఇంటర్నేషనల్** : ప్రపంచమునందలి వివిధ రాజ్యములలో సామ్యవాదము (సోషలిజమ్)ను నెలకొల్పుటకు కృషిచేయువారి ప్రయత్నములను సమన్వయపరచుటకై స్థాపింపబడిన చరిత్రాత్మకమగు అంతర్జాతీయ సంస్థ. ఇట్టి సంస్థలు క్రమముగ మూడు నెలకొల్పబడినవి. ఇవికాక నాలుగవ ఇంటర్నేషనల్ అను పేర ఒక సంస్థ ట్రాట్‌స్కీ [చూ.] చే స్థాపింపబడినది. కాని, అది అంతగా చారిత్రక ప్రాముఖ్యమును గడింపలేక పోయినది.

మొదటి ఇంటర్నేషనల్ : 1864 లో లండన్ నగరమున అంతర్జాతీయ కార్మికసంస్థ (ఇంటర్నేషనల్ వర్కింగ్ మెన్స్ అసోసియేషన్) అను పేర మార్క్సుచే నెలకొల్పబడెను. 1872 లో ఈ సంస్థ ప్రధాన కార్యాలయము న్యూయార్కునకు తరలింపబడినది. కాని, అటనుండియు పనిచేయుటకు వసతి చిక్కక 1876 లో రద్దు అయ్యెను.

రెండవ ఇంటర్నేషనల్ : 1889 లో పారిస్ నగరమున ఈ సంస్థ స్థాపించబడెను. ప్రపంచ కార్మికుల ఐక్యతను దృష్టిలో ఉంచుకొని - యుద్ధమును ప్రతిఘటించుటకై ఆ యా దేశములందలి కార్మికులు కృషి చేయవలెనని ఈ సంస్థ స్థాపింపబడినను, ప్రపంచ యుద్ధము - I జరుగుచున్న సమయములో జాతీయతావాదపు వ్యాప్తిచే ఆకర్షితులైన కార్మికులు ఈ సంస్థ ఆదేశములను తిరస్కరించినందున ఆ సంస్థ నామమాత్రావశిష్టమయ్యెను. కాని, 1920 లో కొందరు సామ్యవాదులచే ఇది పునరుద్ధరింపబడి,

సామ్యవాద ప్రజాస్వామిక పక్షముల చర్చావేదికగ ఈనాటికిని పనిచేయుచున్నది.

**మూడవ ఇంటర్నేషనల్ :** రెండవ ఇంటర్నేషనల్ లుప్తమైన తరువాత రష్యాలోని విప్లవ విజయానంతరము సోవియట్ రష్యానాయకుల ప్రేరణమున 1919 మార్చిలో ఈ మూడవ సంస్థ నెలకొల్పబడెను. దీనికే 'కోమిన్‌టరన్' అను మరియొక పేరుకూడ కలదు. వివిధ దేశములయందు కమ్యూనిస్ట్ విప్లవము సాధించుట దీని ఆశయము. కాని, ప్రపంచయుద్ధము - II జరుగుచున్న సమయమున ప్రజాస్వామ్య రాజ్యములగు బ్రిటన్, యునైటెడ్ స్టేట్స్ మైత్రిని అపేక్షించిన సోవియట్ రష్యా ఆ రాజ్యములను సంతృప్తిపరచుటకై ఈ 'కోమిన్‌టరన్' ను 1943 మే లో రద్దుపరచెను.

యుద్ధానంతరమున వివిధ దేశములందలి కమ్యూనిస్ట్ పక్షముల కార్యక్రమమును సమన్వయింపజేయుటకై 'కోమిన్‌ఫారమ్' అను వేరొక అంతర్జాతీయసంస్థ నెలకొల్పబడి (1945) ఇప్పటికిని వ్యవహరించుచున్నది.

స్వ. వెం.

**ఇండియా :** చూ. భారతదేశము.

**ఇండో - చీనా :** ఆసియా ఖండములో 1945 వరకు ఫ్రెంచివారి వలసప్రాంతముగ ఉండిన ఒక రాజ్యము. ప్రపంచ యుద్ధము - II అనంతరమున ఈ దేశము లావోస్ [చూ.], కాంబోడియా [చూ.], వియెత్నామ్ [చూ.] అను మూడు నూతన రాజ్యములుగ విభక్తమైనది. వివరములు ఆ యా శీర్షికల క్రింద కాననగును.

చీ. శే. రా.

**ఇండోనీషియా :**




ఆసియా ఖండమునకు చెందిన స్వతంత్ర రాజ్యము.

ఆగ్నేయ ఆసియాయందు నెలకొని ఉన్న అనేక దీవులలో చిన్నవి, పెద్దవి దాదాపు 3,000 దీవులు చారిత్రక గతి విశేషమున ఏకదేశముగ పరిగణన నొందుటవలన రూపొందినది ఈ రాజ్యము. ఈ ద్వీప సముదాయమున జావా (1,32,089 చ. కి. మీ.), మదుర, సుమత్రా (4,20,000 చ. కి. మీ.) ద్వీపములు ప్రముఖములు. బోర్నియో (కలిమంతన) ద్వీపమున 72% దేశము (5,43,900 చ. కి. మీ.) మాత్రమే ఇండోనీషియాకు చెంది ఉన్నది. సెలిబిస్ (శూలవేశి) దీవియు, తత్పరిసరస్థములగు అల్ప దీవులును ఇందు చేరి ఉన్నవి. న్యూగినీ (ఇరియన్) అను ద్వీపమున పశ్చిమ భాగము ఇటీవలివరకు తగాదా ప్రాంతముగ ఉండి, కడకు ఇండోనీషియాకు చెందజేయబడవలయునని నిర్ణయింపబడినది. ఇట్టి వివిధ దీవులతో చేరిన భూభాగము [వి] 14,91,562 చ. కి. మీ. [జ] 9,88,30,000 ఈ జనసంఖ్యలో దాదాపు మూడింట రెండు వంతులు ప్రజలు జావా దీవియందే నివసించుచున్నారు. ఇండోనీషియాలో అల్పసంఖ్యాక వర్గములలో ముఖ్యముగ పేర్కొనదగినవారు చీనావారు. వీరి సంఖ్య దాదాపు 20 లక్షలు. [భా] దాదాపు 25 వివిధ భాషలును, 300 మాండలికములును ప్రజలలో వ్యాప్తియందున్నను 'భాషా ఇండోనీషియా' అను కృతక భాష దేశమున జాతీయ భాషగ సాంస్కృతిక, రాజకీయ పరిపాలనా రంగములందు ప్రాముఖ్యము వహించి ఉన్నది. మలయన్ భాషనుండి కొలది మార్పులతో - జాతీయోద్యమ కాలమున - ఈ భాష రూపొందింపబడినది. [మ] ప్రజలలో 80% ముస్లిమ్‌లు, క్రైస్తవులు 4.3%, బౌద్ధులు 3%, హిందువులు 2.2%, తక్కినవారు ప్రకృతి దేవతారాధకులు. [రా] జకార్తా (28,40,000).

**చరిత్ర :** ఈ దీవులు చరిత్ర పూర్వయుగమునుండియు మానవావాసములుగ ఉండెనని అచటి ప్రాచీన అవశేషములవలన తెలియనగుచున్నది. పసిఫిక్ మహాసముద్రపు దీవులందు అటనట చెదరియుండి నివసించుచున్న పోలినీషియన్ జాతి [చూ. సం. 10 - పు. 501] ప్రజలే ఇచట తొలుత వసించుచుండెడివారనియు, క్రమముగ ఆసియా మధ్యభూభాగమునుండివచ్చిన వివిధ జాతులు అందుచేరి, ఆదివాసులతో [చూ. సం. 10 - పు. 217 - 219] సమ్మిశ్రణమొందినవనియు శాస్త్రజ్ఞుల భావన. క్రీస్తుశకారంభ కాలముననే భారతీయులకును, చీనీయులకును ఈ ద్వీపములు సుపరిచితములై ఉండెను. భారతీయులు ఈ ద్వీపములలో కొన్నింటిని సువర్ణద్వీపము, కర్పూర ద్వీపము, నారికేళద్వీపము, యవద్వీపము మొదలగు పేరులతో వ్యవహరించుటనుబట్టి చూడ వ్యాపార మూలమున తొలుత వారికి ఈ ద్వీపములతో సంబంధము ఏర్పడెనని భావింపవీలగుచున్నది.

జావా ద్వీపమున ప్రచారమునందున్న ఒక సంప్రదాయ గాథను అనుసరించి క్రీ. శ. 73 లో ఆజశకుడు అను భారతీయ రాజకుమారుడు సౌరాష్ట్రమునుండి 5,000 మంది పరివారముతో ఈ జావా ద్వీపమునకు వలస వచ్చెననియు, అతని వలననే బ్రాహ్మణ మతము ఇచట వ్యాపించెననియు తెలియవచ్చుచున్నది. ఫాహియాన్ క్రీ. శ. 414 లో జావాను పాలించు హైందవ రాజు ఆస్థానమును దర్శించెను. అప్పటికి అచట బౌద్ధమతమునకు అంతగ వ్యాప్తి లేకుండెనని అతడు తెలిపెను. కాని, ఆ తరువాత కొలది కాలముననే అచట బౌద్ధమతము ప్రవేశించెను. కాశ్మీరునకు చెందిన గుణవర్మ యను రాజకుమారుడు బౌద్ధ భిక్షుకుడై జావా ద్వీపమునకు ఏతెంచి, అచట బౌద్ధ మతమును వ్యాపింపజేసెనని సంప్రదాయ కథనము వలన తెలియనగుచున్నది. బౌద్ధమతము క్రీ. శ. అయిదవ శతాబ్ది మధ్యభాగమునుండి ఇచట వ్యాపింప ఆరంభించెనని భావించుటకు అవకాశములు కలవు. బ్రాహ్మణ, బౌద్ధ మతములు రెండును ఇచట పరస్పర విద్వేషములు లేకుండ మెలగినవి.

క్రీ. శ. 4 వ శతాబ్దమున 'శ్రీవిజయ' అను పేరు గల ఒక స్వతంత్ర రాజ్యము సుమత్రా యందు నెలకొల్పబడెను. అది క్రమముగ విస్తరించి 6 వ శతాబ్దినాటికి జావా మొదలగు తక్కిన ద్వీపములనే కాక, మలయా ద్వీపమును సైతము లోగొనెను. సమకాలీన ఆసియా రాజ్యములందు ఈ రాజ్యము సమధిక ప్రతిష్ఠను ఆర్జించెను. ఈ వంశపు రాజుల పరిపాలనాకాలమున ఈ ద్వీపములందు పలు ప్రాంతములలో సంస్కృత విద్యా కేంద్రములు స్థాపింపబడినవి. సుప్రసిద్ధ చీనా బౌద్ధ యాత్రికుడు ఇట్సింగ్ [చూ.] చీనానుండి భారతదేశమునకు ఏగుచు క్రీ. శ. 671 లో సుమత్రాయందలి శ్రీవిజయనగరము (నేటి పాలెంబాంగ్) ను దర్శించి, అచటి సంస్కృత విద్యాపీఠమున ఆరు నెలలు సంస్కృతమును అభ్యసించెను. మరల తిరుగు ప్రయాణమున - క్రీ. శ. 685 - 689 మధ్య కాలమున-ఇతడు ఆ దీవిని దర్శించి, అట కొంతకాలము వసించి, సంస్కృతమున ఉన్న బౌద్ధ గ్రంథముల పెక్కింటిని చీనా భాషలోనికి అనువదించెను.

క్రీ. శ. ఎనిమిదవ శతాబ్ది మధ్య భాగమున శ్రీవిజయ రాజ్యమునకు చెందిన మలయాయందలి కొంతభాగమును శైలేంద్ర వంశజుడగు రాజొకడు వశపరచుకొని స్వతంత్ర రాజ్యమును ఒక దానిని స్థాపించుకొనెను. ఈ శైలేంద్ర వంశపు మూలపురుషుడు భారతదేశమునందలి కళింగమునకు చెందిన గాంగ [చూ. సం. 3 - పు. 234] రాజుల వంశపు వాడని కొందరు చారిత్రకులు తలంచుచున్నారు (ఆంధ్రప్రదేశ్ నందలి గోదావరికి ఉత్తరమున ఉన్న ప్రాంతమంతయు ఆనాడు కళింగమని వ్యవహరింప బడెడిది). ఈ శైలేంద్ర రాజ్యము క్రమ క్రమముగ విస్తరిల్లి, జావా దీవిని వశపరచుకొని, శ్రీవిజయ రాజ్యముతో సరితూగెనని తెలియవచ్చుచున్నది. తుదకు 9 వ శతాబ్ది మధ్య భాగమున, ఈ ఉభయ రాజ్యములకు శైలేంద్ర వంశజుడే ప్రభువై, రెండు రాజ్యములును అంతటినుండి ఏకరాజ్యముగ వ్యవహరింప దొడగెనని శాసనములవలన తెలియుచున్నది. కాని, ఈ సమ్మేళనము బాంధవ్యమువలన జరిగెనో లేదా ఆక్రమణవలన జరిగెనో తెలిసికొనుటకు తగిన ఆధారములు లేవు.

శైలేంద్ర రాజులకు దక్షిణ భారతదేశమునందలి చోళ రాజులతోను, ఉత్తర భారతదేశమున నలందా ప్రాంతమును పాలించిన 'పాల' రాజులతోను సన్నిహిత దౌత్య సంబంధములు ఉండెనని భారతదేశమున ఉపలబ్ధములైన శాసనములవలన తెలియుచున్నది. దక్షిణ భారతదేశమును ఏలిన రాజేంద్ర చోళుడు (1012 - 42 ప.) తన దిగ్విజయ కాలమున శ్రీవిజయ రాజ్యముపై నౌకా బలముతో దండయాత్ర జరిపి, రాజ్యపాలకుని ఓడించినటుల తెలుపబడినను ఆ రాజ్యము చోళ సామ్రాట్ల పాలననుండి అనతికాలముననే విడివడెను. శైలేంద్ర రాజులు మహాయాన బౌద్ధ మతావలంబకులైనను బ్రాహ్మణ మతమును సైతము ఆదరించిరి.

శైలేంద్ర వంశజులు జావా దీవిని సైతము పాలించుచుండినను, అందలి తూర్పుభాగము మాత్రము స్వతంత్రముగనే చాలకాలము మనగలిగెను. క్రీ, శ 10 వ శతాబ్ది ఆరంభమున అచట 'బలితుంగు' డను స్వతంత్రరాజు పాలించుచుండెనని తెలియవచ్చుచున్నది; అతడు పాలించు రాజ్యము 'మాతర' మని వ్యవహరింపబడుచు ఉండినది. ఈతని వంశమునకు చెందిన అయిరలింగ ప్రభువుకాలమున ఈ రాజ్యము జావా ద్వీపమున అత్యధిక భాగమును ఆక్రమించెను (1037). ఈతని వంశమునకు చెందిన సింధుకుడను రాజు (క్రీ. శ. 929 - 947 ప.) నకు చెందిన పెక్కు శాసనములు పురాతత్త్వశాస్త్రజ్ఞులచే కనుగొనబడినవి. వీనివలన ఆనాటి సాంఘిక, రాజకీయ వ్యవస్థలను గురించిన పెక్కు విషయములు తెలియనగుచున్నవి. 13 వ శతాబ్ది అంతమున ఈ రాజ్యమున తిరుగుబాటులు జరిగి విద్రోహులు దేశమును ఆక్రమించుటయే కాక, చీనా ప్రభుత్వపు రాయబారి వర్గమునకు చెందినవారిని అవమానించిరి. అంతట చీనాప్రభువగు కుబ్లయ్ ఖాన్ [చూ.] తననౌకల దళమును

పంపి, విద్రోహులను నిర్మూలించి (1292), పూర్వపు రాజ వంశపు వానికే రాజ్యమును సంక్రమింపజేసెను. అంతటి నుండి ఆ రాజవంశమువారు 'మజాపహిత' మను నగరమును (నేటి సురబాయాకు సమీపమున ఉండు దానిని) రాజధానిగ చేసికొని పాలించుటచే ఆ రాజ్యమునకు మజాపహిత రాజ్యమని పేరు కలిగెను. క్రీ. శ. 1377 లో శైలేంద్ర వంశీకులగు ప్రభువులకును, మజాపహిత ప్రభువులకును యుద్ధములు జరిగి, అందు సాధించిన విజయము ఫలితముగ ఇండోనీషియా దీవులన్నియు మజాపహిత ప్రభువుల వశమయ్యెను.

ఇటుల ఇండోనీషియా దీవులనన్నిటిని లోగొనిన మజాపహిత సామ్రాజ్యమును పాలించిన వారిలో రాజసనగరుడనువాడు (1350-1389 ప.) ప్రముఖుడు. 'పనతరన' మని నేడు వ్యవహరింపబడు పట్టణమున ఉన్న దేవాలయపు కుడ్యములపై, రామాయణ, భాగవతములందలి విశేషములను ఈతడు చెక్కబడునటుల చేసెను. అవి నేటికిని కళాభిజ్ఞుల దృష్టిని ఆకర్షించుచున్నవి. ఈ రాజు మరణముతో మజాపహిత సామ్రాజ్యమునకే కాక, ఇండోనీషియాయందలి భారతీయ సంస్కృతికిని అవసానదశ మొదలిడెను. జావాకు సమీపమున ఉన్న మొలుక్కాయందు 15 వ శతాబ్ది ఆరంభమున ఇస్లామ్‌మతము నెలవు కల్పించుకొని [చూ. మలేసియా] అటనుండి క్రమముగ ఇండోనీషియా దీవులందంతట వ్యాపింప ఆరంభించెను. 15 వ శతాబ్ది అంతమునకు బలి ద్వీపమునందు తప్ప తక్కిన ఇండోనీషియా దీవులందన్నింట ఇస్లామ్ మతము విరివిగ వ్యాపించెను. నేటికిని బలి ద్వీపమున హిందూ మతము అచటి ప్రజలచే ఆదరితమై నిలచి ఉన్నది. తక్కిన ద్వీపములలో ఇస్లామ్‌ను అవలంబించిన వారియందు సైతము భాషయందును, ఆచారములందును భారతీయ సంస్కృతి లక్షణములు నిలచియే ఉన్నవి.

ఇండోనీషియా ద్వీప రాజ్యమున 15వ శతాబ్ది అంతము వరకు పైన చెప్పినటుల వర్ధిల్లిన రాజ్యముల ప్రభువులు బ్రాహ్మణమతమువారైనను, బౌద్ధులైనను ఆ ఉభయ మతములను సమదృష్టితో ఆదరించి పోషించిరి. బ్రాహ్మణ మతమును అవలంబించినవారిచే అట శివ, విష్ణు, శ్రీ దేవులు విరివిగ అర్చింపబడుచుండిరి. శివ - విష్ణువుల అభేదమును సూచించు హరిహరమూర్తిపూజయు కొంతకాలము వ్యాప్తియందుండెను. బౌద్ధులలో మహాయానమతానుయాయులు ఎక్కువగ ఉండిరి. దేవాయతనములను, స్తూపములను నిర్మించుటలో రాజులు శ్రద్ధవహించి ఉండుట వలన భారతీయ శిల్పకళ - అచటి జాతీయతను సంతరించుకొని - చక్కగ వికసిల్ల గలిగెను. మధ్య జావాలో బోరూబూదూరు అని నేడు వ్యవహరింపబడు మహాస్తూప నిర్మాణమున ఈ శిల్పకళ తన పరాకాష్ఠను అందుకొనినది. భారతదేశపు సాంఘికాచారములే ఆనాడు ఇట అనుసరింపబడినవి.

దేశము చిన్న చిన్న రాజ్యములుగ 15 వ శతాబ్ది అంతమునుండియు విభక్తమై వేర్వేరు సుల్తానుల పరిపాలనలో ఉండెను. ఈ ముస్లిమ్ రాజ్యములు అన్నియు సుసంఘటితములై ఏకైక సుస్థిర సామ్రాజ్యముగ రూపొందు అవకాశము లభించుటకు ముందుగనే పాశ్చాత్యులు ఇట కాలిడిరి.

పోర్చుగీస్ వారు ఇట 16 వ శతాబ్దిలో అడుగిడుటతో, పాశ్చాత్యులకు ఈ ద్వీప రాజ్యముతో పరిచితి లభించెను. పోర్చుగీస్‌లు ఇట తొలుత కొంత ప్రాంతమును వశపరచుకొనినను, త్వరలోనే దేశీయుల ప్రతిఘటన మూలమున 1565 నాటికి ఆ దీవులలో 'టైమర్ దీవి' లోని ఒక భాగమున తప్ప తక్కిన అన్నింటి నుండి తమ స్థావరములను ఎత్తివేసిరి. ఇంతలో స్పెయిన్, బ్రిటన్, నెదర్‌లండ్స్ వర్తకులు ఇట అటనట స్థావరములను ఏర్పరచుకొనిరి. కాని, స్పెయిన్ అనతికాలముననే అటనుండి వెడలిపోవుటచే, బ్రిటిష్‌వారును, డచ్చివారును ఈ ద్వీప రాజ్యమున తమ ఆధిపత్యమును నెలకొల్పుటకు పోటీలు పడి కృషి సలిపిరి. తుదకు డచ్చి వర్తకులే విజయము సాధించిరి. 17 శతాబ్ది మధ్యమున ఇంగ్లీష్ వారు ఇటనుండి వెడలిపోయిరి. ఆ తరువాత ఒక శతాబ్దికాలము డచ్చి వర్తకసంఘము ఈ దేశమును పాలించెను. కాని, ఆ సంఘము నిరంతరము దేశీయ ప్రభువులగు సుల్తానుల తిరుగుబాటులను ఎదుర్కొనవలసి వచ్చుటచే విపరీతముగ ధనవ్యయముపాలై దివాలా యెత్తెను. అందుచే 1798 లో నెదర్‌లండ్స్‌నందలి డచ్చి ప్రభుత్వము స్వయముగ ఈ ద్వీపరాజ్యపు పరిపాలనా బాధ్యతను వహించెను. తరువాత డచ్చివారికిని, ఇంగ్లీష్ వారికిని మధ్య యుద్ధము ఆరంభము కాగా, ఆ సందర్భమున ఇంగ్లీషువారు ఈ ద్వీపరాజ్యమును 1811 లో వశపరచుకొనినను 1824 లో కుదిరిన సంధిని అనుసరించి మరల ఈ దేశము డచ్చివారికే ఇంగ్లీష్‌వారు చెంద చేసిరి. కాని, డచ్చివారి ప్రత్యక్ష పాలనయందు ఆ కాలమున ఈ దేశమున కొలది ప్రాంతములు మాత్రమే చేరి ఉండెను. దేశమున అత్యధిక భాగమును డచ్చివారి సర్వాధిపత్యమును అంగీకరించిన సుల్తానులే పాలించుచుండిరి. ఈ సుల్తానులు అంతటంతట తిరుగుబాటులు చేయుచుండిరి. కడకు 1903లో సుల్తానులను పదవీభ్రష్టుల జేసి, డచ్చిప్రభుత్వమే సర్వాధి

పత్యము వహించి, గవర్నర్ జనరల్ ద్వారా పాల నము నిర్వహింప మొదలిడెను.

డచ్చివారి వలసపరిపాలన ఇండోనీషియా వాసుల శ్రేయోదృష్టితో కాక, డచ్చి సామ్రాజ్య ప్రయోజనముల దృష్టితో సాగెను. ప్రజలకు 20 వ శతాబ్దిలో కొన్ని స్థానిక ప్రభుత్వాధికారములు ఒసగబడినను, వానివలన ప్రజలకు సమియు లాభింపకుండెను. క్రమముగ దేశమున స్వాతంత్ర్యమునకై ఆందోళన ఆరంభమయ్యెను. ఈ ఆందోళనమున అహ్మద్ సుకర్నో, మహమ్మద్ హట్టా అనువారు ఇరువురు ప్రధాన పాత్ర వహించిరి. వీరి ఆధ్వర్యవమున 1927 మొదలుగ ఈ జాతీయోద్యమము ప్రజలయందు విరివిగ బలపడసాగెను. అంతట డచ్చిప్రభుత్వము ఈ ఇరువురు నాయకులను ప్రవాసమంపినది. ఇంతలో ద్వితీయ ప్రపంచ యుద్ధము మొదలగుటయు, అందు నెదర్‌లండ్స్ దేశమును నాజీ సైన్యములు ఆక్రమించుటయు జరిగెను. మాతృదేశము ఇటుల పరాధీనమైనను, డచ్చి వలస పాలకులు ఇండోనీషియాను దాస్యమున నిలిపియుంచి తమ పాలనను అట సాగించుచునే ఉండిరి. ఇంతలో జపాన్ యుద్ధమున దిగి, డచ్చి సేనలను ఓడించి, 1942, మార్చి 8 వ తేదీన ఈ ద్వీపరాజ్యమును వశపరచుకొనెను. అంతట 1945 వరకు ఈ రాజ్యము జపాన్ ఆక్రమణలో ఉండెను. ఈ కాలమున ఇండోనీషియా జాతీయోద్యమము పునరుజ్జీవితమైనది. జపాన్ సేనలను మిత్రరాజ్యసేనలు ఓడించిన వెనువెంటనే జాతీయోద్యమవాదులు సుకర్నో, హట్టా ఆధిపత్యమున విజృంభించి, 17 ఆగస్టు, 1945 న ఒక స్వతంత్ర గణరాజ్య ప్రభుత్వమును ఏర్పరచి, డచ్చివారి పునరాక్రమణను నిరోధించిరి. తరువాత నాలుగు సంవత్సరములు జాతీయవాదులకును, డచ్చివారికిని మధ్య సంఘర్షణలును, అప్పటప్పట సంప్రతింపులును కొనసాగెను. తుదకు ఐక్యరాజ్యసమితి జోక్యము వహించిన తరువాత ఇండోనీషియాకు స్వాతంత్ర్యము నొసగుటకు నెదర్‌లండ్స్ (డచ్చి) ప్రభుత్వము ఆమోదించెను. అంతట తత్ఫలితముగ 1949, డిసెంబరు 7 వ తేదీన ఇండోనీషియా స్వతంత్ర దేశముగ సర్వాధికారములను గ్రహించెను. స్వాతంత్ర్య ప్రదాన కాలమున జరిగిన ఒక ఏర్పాటును అనుసరించి 'నెదర్‌లండ్స్ - ఇండోనీషియా యూనియన్' అను పేర సహకారవ్యవస్థయు ఆ సమయముననే రూపొందింపబడెను. ఆర్థిక, సాంస్కృతిక, రక్షణ వ్యవహారములందు మైత్రీసహకారములతో ఉభయ దేశములును అటమీద చరించుట ఆ వ్యవస్థయొక్క ఉద్దేశమైనను, కారణాంతరములవలన అది అటుల పరిణమింపజాలక పోవుటచే, ఆ వ్యవస్థ 1954, ఆగస్టు 10 న రద్దొనర్పబడెను. చీనా ప్రజా గణరాజ్యముతో సాన్నిహిత్యమును అవలంబించి 1961 మొదలుగ ఇండోనీషియా ప్రభుత్వము తన విదేశాంగవిధానమును రూపొందించుకొనినది. 1963 లో మలేసియా రూపొందినంతట ఆ చర్య సామ్రాజ్యవాదమునకు ప్రోద్బలకమను మిషపై, మలేసియా నిర్మూలనకై సుకర్నో తీవ్రయత్నములకు పూనుకొనుటయేకాక, భద్రతా సమితిలో మలేసియాకు స్థానము లభించినందులకు కినిసి ఐ. రా. స. నుండి వైదొలగెను (1965). కాలక్రమమున ఈ దేశమునకు కమ్యూనిస్ట్ చీనాతో కల మైత్రికిని భంగము ఏర్పడినది. 1965, అక్టోబరు 1 న ప్రభుత్వమును వశపరచుకొనుటకై లేవదీయబడిన ఒక తిరుగుబాటునకు కమ్యూనిస్ట్‌ల సహకారము కలదని రుజువైన తరువాత చీనాతో స్నేహసంబంధములు ఈ దేశమునకు రద్దయినవి. నామమాత్రముగ సుకర్నోయే అధ్యక్షుడైనను, అధికారము మాత్రము సేనానియగు సుహార్తోకు సంక్రమించినది (మార్చి, 1966).

రాజ్యాంగము: స్వతంత్ర ఇండోనీషియాకు 1945 లో తొలుత ఒక రాజ్యాంగవిధానము ప్రకటితమైనది. అందు అధ్యక్షునకు సర్వాధికారములు ఉండెడివి. ప్రజాసభ (పార్లమెంట్) ఒకటి ఉండెడిది గాని, అందలి సభ్యులను వివిధ జాతీయ పక్షముల నుండి వాని ప్రాబల్య నిష్పత్తిలో అధ్యక్షుడే నియమించెడివాడు. తరువాత 1955 లో ఒక నూతన రాజ్యాంగచట్టము ఆవేదింపబడి, ఎన్నుకొనబడిన శాసన సభ ఏర్పడుటకు వసతి కల్పింపబడినది. నైష్పత్తిక ప్రాతినిధ్యమును అనుసరించి ఎన్నుకొనబడు 260 మంది సభ్యులు ఈ శాసనసభయందు కలరు. నాలుగేండ్లకు ఒకతూరి శాసనసభకు ఎన్నికలు జరుగవలయునను ఏర్పాటు కలదు. కాని, అధ్యక్షుడు తన అధికారములను ఉపయోగించి దానిని ఎప్పుడైనను రద్దుచేయవచ్చును. అధ్యక్షుడును, ఉపాధ్యక్షుడును చరమ నిర్ణయాధికారములు కలిగి ఉందురు. 1956 నవంబరులో ఇటుల ఎన్నుకొనబడిన శాసన సభ (దివాన్, పరవాకిలన్ ర. ఖత్.) ఏర్పడినది. సుకర్నో అధ్యక్షుడుగను, హట్టా ఉపాధ్యక్షుడుగను ఎన్నుకొనబడిరి. అధ్యక్ష, ఉపాధ్యక్షుల పదవీ పరిమితి కాలము మాత్రము రాజ్యాంగ చట్టమున నిర్ణయింపబడలేదు.

పేరునకు ఇటుల ప్రజాస్వామిక గణ రాజ్యముగ ఈ దేశము ఉన్నను, యథార్థమున మాత్రము ఎన్నుకొనబడిన ప్రజాప్రతినిధుల ప్రభుత్వము ఇట అమలు జరుపబడుటలేదు. జాతీయోద్యమములందు సుకర్నో ప్రముఖ పాత్ర వహించి, ప్రజా విశ్వాసమును అతడు చూరగొన్నవాడగుటవలన ప్రజాసభ నిర్ణయములను అతడు పలుసారులు త్రోసి

రాజని వ్యవహరింపగలిగెను. 1959, జూలైలో అతడు 1945 రాజ్యాంగ విధానమును పునరుద్ధరించి సర్వాధి కారముల వహించెను. 1960 మార్చిలో అప్పటికే నామ మాత్రావశిష్టముగ ఉన్న ప్రజా సభను రద్దుచేసి, తానే ఆదేశముల మూలమున పరిపాలన సాగించెను. తరువాత అతడు ఒక క్రొత్త ప్రజాసభను ఏర్పరచెను. అందు వివిధ వృత్తి వర్గముల నుండి 131 మందిని, 9 రాజకీయ పక్షముల నుండి 130 మందిని, సైన్యముల నుండి 33 మందిని, ఇంకను మిగిలిన వర్గములనుండి 96 మందిని ప్రతినిధులుగ అధ్యక్షుడే నియమించెను. ఇటుల ఏర్పడిన సభ్యులు కల ప్రజాసభ అధ్యక్షుని సర్వాధికారములకు లోబడి వ్యవహ రించును. ఇట్టి ప్రజాస్వామ్యమును నియంత్రిత ప్రజా స్వామ్యము (గైడెడ్ డెమోక్రసీ) అనుపేర అధ్యక్షు డగు సుకర్నో వ్యవహరించుచున్నాడు. తన దేశపు పరిస్థితులలో సామ్యవాదవ్యవస్థకు ఇది మార్గమును సుగ మము చేయునని ఆయన విశ్వాసము. 1963 లో అహ్మద్ సుకర్నోయే తన జీవితాంతమువరకు ఇండోనీషియా అధ్యక్షుడుగ ఉండవలెనని ప్రజాసభ కోరగ, సుకర్నో ఆమోదించెను.

రాజకీయ పక్షములు దేశమున అనేకములున్నను 1. పార్టి నేషనల్ ఇండోనీషియా; 2. మస్జుమీ; 3. నహద్ అల్ ఉతుల్ ఉలేమా; 4. పార్టి కమ్యూనిస్ట్ ఇండోనీసియా అనునవి ప్రముఖములు. ఇందులో కడపటిది ఆ దేశపు కమ్యూనిస్ట్ పార్టీ. తొలుతట ఇది జాతీయోద్య మమున ప్రముఖపాత్ర వహించిన పక్షము. కడమ రెండింటియందు కూడ కొంతమంది జాతీయోద్యమ కార్య కర్తలున్నను, ముస్లిమ్ మతాభినివేశము వాని ముఖ్య లక్షణముగ ఉన్నది. అన్ని పక్షములకును సామ్యవాద మున విశ్వాసము కలదు. 1965, అక్టోబరు 1 న ప్రభుత్వ మును వశపరచుకొనుటకు జరిగిన తిరుగుబాటునకు కమ్యూనిస్టుల సహకారము కలదని స్పష్టమైనతరువాత, కమ్యూనిస్ట్ పార్టీ ఆదేశమున నిషిద్ధమైనది. చీ. శే. రా.

**ఇందిరా గాంధి** (జ. 1917, నవంబరు 19): భారత ప్రధాన మంత్రి (1966 - ), ప్రప్రథమ భారత ప్రధాన మంత్రి యగు జవాహర్ లాల్ నెహ్రూ యొక్క ఏకైక పుత్రిక; తల్లి కమలా నెహ్రూ. తండ్రి ఈమెను 'ఇందిరా ప్రియ దర్శిని' అని ముద్దుగా పిలుచుచుండెడివాడు. శ్రీమతి గాంధి శాంతినికేతన్‌లోని విశ్వభారతిలో విద్యను అభ్యసించెను. తండ్రివలెనే ఈమెకూడ విశ్వకవి టాగూర్ చే విశేషముగ ప్రభావిత అయ్యెను. టాగూర్ కు ఈమెయందు అపార వాత్సల్యము, గౌరవము ఉండెడివి. ఇందిర కొంత కాలము స్విజర్లండ్‌లోను, తరువాత ఆక్స్‌ఫర్డ్‌లోను విద్యా భ్యాసము కొనసాగించెను. తండ్రి తాతల నివాసగృహ మైన ఆనందభవనము (అలహాబాదు) ఎడతెగని రాజకీయ


ఇందిరా గాంధి

కార్యకలాపములకు రంగ స్థలము అగుటచే ఈమె తీవ్ర రాజకీయ వాతావరణము నందే పుట్టి పెరిగెను. అందు వలన చిరుత ప్రాయముననే ఈమె రాజకీయములలో చొరవ చూపించెను. కాంగ్రెస్ స్వచ్ఛంద సేవకుల సహాయార్థము 'వానరసేన' అని వ్యవహరింపబడిన పిల్లల సైన్యమును తయారుచేసెను; కాంగ్రెస్‌లోని యువక సహాయ సంఘములో సభ్యత్వము స్వీకరించెను. తన 21 వ ఏట శ్రీమతి గాంధి కాంగ్రెస్‌లో చేరి, జాతీయోద్యమములో పాల్గొని, 13 నెలలు జైలుశిక్ష అనుభవించెను; 1937 ఎన్నికలలో కాంగ్రెస్ తరఫున ప్రచారముచేసి, ప్రజలతో సాన్నిహిత్యమును కల్గించు కొనెను. 1942 లో ఈమెను ఫిరోజ్ గాంధీ వివాహ మాడెను. వివాహమైన కొద్ది కాలముననే ఈమె మరల నిర్బంధింపబడెను. కాంగ్రెస్ కార్యవర్గము, కేంద్ర ఎన్నికల సంఘము, కేంద్ర పార్లమెంటరీ బోర్డు - వీటిలో చిరకాల సభ్యత్వమువలన అనేక సంవత్సరముల పాటు ఈమె జాతీయ జీవనములో ప్రముఖపాత్ర నిర్వ హించెను; నాగపూర్ కాంగ్రెస్ (1959, ఫిబ్రవరి) నకు అధ్యక్షత వహించెను. ఆసియా, యూరప్, అమెరికా, ఆఫ్రికా దేశములలో శ్రీమతి ఇందిరా గాంధి విస్తారముగ పర్యటించెను. పిల్లల సంక్షేమమునకు, మహిళాభ్యుదయ మునకు ఈమె అవిరళ కృషి చేసినది. శ్రీమతి గాంధికి యేల్ యూనివర్సిటీ హాలాండ్ స్మారక బహుమతి (1960), యునైటెడ్ స్టేట్స్ మదర్స్ అవార్డ్ (1963) లభించినవి. ప్రశంసనీయమైన రాజనీతి కుశలతకు లభించు ఇసబెల్లా బహుమతి నొసగి ఇటీవల ఇటలీ ప్రభుత్వము ఈమెను సత్కరించినది. తన తండ్రి గృహమున అతి థేయినిగా వ్యవహరించిన 18 సంవత్సరములలో భారత రాజకీయ ధురంధరులతోను, విదేశ ప్రముఖులతోను ఈమెకు ఎక్కువ పరిచయము, పలుకుబడి లభించెను. 1964 జూన్‌లో స్వర్గీయ లాల్ బహదూర్ శాస్త్రి మంత్రివర్గ ములో శ్రీమతి ఇందిర రేడియో సమాచార మంత్రిగ తొలిసారిగ పదవిని చేపట్టెను. లాల్ బహదూర్ మరణా

నంతరమున 1966 జనవరి 24 వ తేదీన భారత ప్రధాన మంత్రి పదవిని అధిష్ఠించెను. ఆ. వెం.

**ఇక్ష్వాకులు** : చూ. సం. 3 - పు. 105.

**ఇగ్నేషియస్, లయోలా** : చూ. లయోలా ఇగ్నేషియస్.

**ఇజ్రాయెల్** : మధ్యధరా సముద్రతీరమున నెలకొని ఉన్న ఒక ఆసియా రాజ్యము.

ఈ దేశమునకు లెబనాన్ [ఉ]; సిరియా, జోర్డాన్, [తూ]; ఈజిప్టు [ద]; మధ్యధరా సముద్రము [ప] సరిహద్దులుగ ఉన్నవి. దక్షిణముననే 9 కి. మీ. పొడవున ఎర్రసముద్రము కూడా ఈ దేశమునకు తగిలి ఉన్నది. [వి] 20,700 చ. కి. మీ; [జ] 24,36,000; [భా] సాధికార జాతీయ భాష హిబ్రూ; అయినను అల్ప సంఖ్యాకులగు అరబ్బులు తమ మాతృభాషలో విద్యను అభ్యసించుటకు, న్యాయస్థానములు మొదలగువానియందు వ్యవహారముల జరుపుటకు స్వాతంత్ర్యము కలదు. [మ] అత్యధిక సంఖ్యాకులు యూదుమతానుయాయులు. [రా] జెరూసెలెమ్ (1,56,000).

చరిత్ర; అత్యంత ప్రాచీన చరిత్ర గల ఈ దేశము క్రీ. శ. మొదటి శతాబ్దమున ప్రపంచ చరిత్ర నుండి లుప్తమై మరల ఈ ఇరువదవ శతాబ్దమునుండి నూతనముగ ఆవిర్భావమొంది, చరిత్ర గతియందు పాల్గొనుచున్నది. క్రీ. శ. మొదటి శతాబ్దాంతమునకు పూర్వమున ఈ దేశము ఇజ్రాయెల్ అను పేరు తోడనే యూదుమతానుయాయుల మాతృభూమిగ ఉండెడిది [చూ. యూదులు]. రోమన్ సామ్రాజ్యముపై ఈ యూదులు తిరుగుబాటు చేయుట వలన క్రీ. శ. 73 లో ఆ సామ్రాజ్య సేనలు ఈ యూదు జాతిని నిర్మూలింప సమకట్టుటతో యూదులు ఆ దేశమును విడిచి ఆసియా, యూరప్ ఖండము లందలి పలు దేశములకు వలస పోయిరి. రోమన్‌లు అంతట ఈ దేశపు పేరు సైతము మార్చివైచి, పాలస్తీనా అని పేరిడిరి. వలసపోయిన యూదులు వివిధ దేశములందుండి వృద్ధియై కాలగతిని అనుసరించి ఆ యా దేశములందలి వేష భాషలను అవలంబించినను, తమ తమ సంస్కృతులను కాపాడుకొని, తమ మాతృభూమిని తిరిగి తమ వంశీకులు ఏనాటికైనను తిరిగి చేరగలుగుదురనియే ఆశించుచుండిరి. ఆశాయుతమగు ఆ భావన ప్రపంచమందలి యూదులకు అందరికిని ఏకతను చేకూర్చ గలిగెను. కాని, ఈ ఆశ పదునెనిమిది వందల సంవత్సరముల కాలము సాఫల్యమందక ఉండెను. అందుచేత 19 వ శతాబ్దినుండి తమ భావనకు ఒక కార్యరూపమునొసగుటకు కొందరు యూదులు యత్నించిరి. 1822 లో రష్యానుండి కొందరు యూదులు బయలుదేరి పాలస్తీనాకు వలసవచ్చుటతో ఈ యత్నము ఆరంభమయ్యెనని చెప్పవచ్చును. ఇదియే ప్రపంచ యూదు వ్యవస్థ (వరల్డ్ జియోనిస్ట్ ఆర్గనైజేషన్) ఏర్పడుటకు (1897) దారి తీసినది. దీని ప్రోత్సాహమున యూదులు పలు తావులనుండి పాలస్తీనాకు రాదొడగినను, ఆనాడు వారికి ఆ దేశమున సరియైన ఆదరము లేకుండెడిది. ఇంతలో ప్రపంచ యుద్ధము - I ప్రారంభమయ్యెను. యూదు నాయకుల సహాయమును అర్థించిన బ్రిటిష్ ప్రభుత్వము యుద్ధానంతరమున పాలస్తీనాయందు యూదులకు ఒక జాతీయావాసము ఏర్పరచగలనని వాగ్దానము చేయుచు ప్రకటన చేసెను (1917). ఈ ప్రకటనకే ఆనాటి బ్రిటిష్ ప్రభుత్వ విదేశ వ్యవహార మంత్రి పేరుననుసరించి 'బాల్ఫర్ ప్రకటన' అను పేరు కలిగెను. యుద్ధానంతరమున నానాజాతిసమితి పాలస్తీనాను బ్రిటిష్‌వారికి ధర్మకర్తృత్వప్రాంతముగ ఒసగినపుడు (1922) ఈ ప్రకటమునకు సమితి తన సమ్మతిని తెలియజేసెను. తదనుసారముగ బ్రిటిష్ ప్రభుత్వపు ప్రోత్సాహమును అనుసరించి వివిధదేశములనుండి యూదులు పాలస్తీనాకు చేరి, అచట అప్పటిలో అధిక సంఖ్యాకులుగ ఉండిన అరబ్బులనుండి భూములను కొని, అచట నివసింప దొడగిరి. క్రమక్రమముగ యూదుల సంఖ్య ఎక్కువై, ప్రపంచ యుద్ధము - II నాటికి దాదాపు 7 లక్షలకు పెరిగి, అచటి అరబ్బుల సంఖ్యను మించ దొడగెను. ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున అరబ్బుల సానుభూతిని, మైత్రిని ఆర్జింప యత్నించిన బ్రిటిష్ ప్రభుత్వము పాలస్తీనాలోనికి యూదులవలసను యుద్ధము మొదలైన తరువాత అనతికాలముననే ఆపివేసెను. అంతట పాలస్తీనాలోని యూదులు రహస్య దౌర్జన్యోద్యమముల మూలమున బ్రిటిష్ ప్రభుత్వమును ఎదుర్కొనిరి. ఇందులకు తోడుగ జర్మనీ, తూర్పు యూరప్ దేశములందు నాజీలు అవలంబించిన యూదవ్యతిరేకవిధానమువలన ఆ దేశములందలి యూదులు ఘోరబాధలకు లోనుకావలసివచ్చుట



వలన ప్రపంచ ప్రజల సానుభూతియు యూదులకు చేకూరెను. కావున తుదకు యుద్ధానంతరమున బ్రిటిష్ ప్రభుత్వము తన ధర్మకర్తృత్వాధికారమును వదలుకొని 1947, నవంబరు 29 న పాలస్తీనా సమస్యను యునైటెడ్ నేషన్స్ (ఐ. రా. స.) సర్వసభ్య సమావేశమునకు నివేదించెను. అంతట ఈ సమస్యను పరిష్కరించు ఉద్దేశముతో పాలస్తీనాను యూదు, అరబ్బు ప్రజలకు విభజించవలసినదిగను, జెరూసెలెమ్ మాత్రము అంతర్జాతీయ నగరముగ ఉండునటులను ఐక్యరాజ్యసమితి నిర్ణయించెను. యూదులు అందులకు అంగీకరించి 1948, మే 14 వ తేదీన స్వతంత్ర ఇజ్రాయెల్ రాజ్యము రూపొందినటుల ప్రకటించిరి. అరబ్బులు మాత్రము ఇందులకు సమ్మతించలేదు. అరబ్బు రాజ్యములు అగు ఈజిప్టు, ఇరాక్, జోర్డాన్, లెబనాన్, సౌదీ అరేబియా, సిరియా దేశములు అంతట ఒక్కుమ్మడిగ ఇజ్రాయెల్ పై దండెత్తినవి కాని సువ్యవస్థితమగు ఇజ్రాయెల్ సేన ఆ దండయాత్రను తిరుగగొట్టినది. తరువాత 1956 లో ఇజ్రాయెల్ సేనలు సినాయ్ ప్రాంతముపై దండెత్తినవి. అంతట ఐ. రా. స. జోక్యము కలిగించుకొని యుద్ధవిరమణను ఏర్పరచుటచే, ఆ యుద్ధ విరమణ రేఖయే ఇజ్రాయెల్ సరిహద్దుగా ఇప్పటికి నిలిచి ఉన్నది. అరబ్బు రాజ్యములు మాత్రము దీనిని గుర్తించుటలేదు. స్వతంత్రతను ప్రకటించిన వెంటనే యూదులు నిర్నిరోధముగ వలసవచ్చుటకు అనుమతించుచు ఇజ్రాయెల్ ప్రభుత్వము శాసనము చేయుటతో (1950), 1958 నాటికి అదనముగ 9 లక్షల యూదులు వలస రాగలిగిరి. వివిధ దేశములనుండి వలసవచ్చిన యూదులందరును హిబ్రూను జాతీయభాషగ గ్రహించి, దేశమును సుసంపన్నమొనర్చుటకు నిరంతర కృషి సల్పిరి. తత్ఫలితముగ ఆర్థికరంగమున దేశము చాలవరకు పురోగమింప గలిగినది ; కాని, సన్నిహిత అరబ్బు దేశములతో మైత్రిని ఈ దేశము సాధింపలేకపోవుట శోచనీయము.

రాజ్యాంగము: ఈ దేశము ప్రజాస్వామిక గణరాజ్యము. లిఖిత రాజ్యాంగ చట్టము ఏదియు ఈ దేశమునకు లేదు. కాని, 1950 లో ప్రథమముగ సమావేశమయిన జాతీయ శాసనసభ (నెస్సెట్) చేసిన ఒక శాసనమును అనుసరించి, క్రమశః ఒకదాని వెనుక నొకటిగ దేశాభివృద్ధిని గమనించి చేయబడు ప్రాతిపదిక శాసనములు అన్నియు మున్ముందు రాజ్యాంగ చట్టముగ క్రోడీకరింపబడగలవను నిర్ణయము జరిగినది. శాసన నిర్మాణాధికారము జాతీయ శాసనసభయందు న్యస్తమై ఉన్నది. ఏకకక్ష్యగల ఈ శాసనసభ (నెస్సెట్) లో 120 మంది ఎన్నుకొనబడిన సభ్యులు కలరు. నాలుగేండ్లకొకసారి ఈ సభకు సార్వజనిక రహస్యపు ఎన్నిక పద్ధతిన ఎన్నికలు జరుగును. 18 ఏండ్లు వయస్సుకు తగ్గని పౌరులకు అందరికి వోటు హక్కు కలదు. శాసనసభ ఎన్నుకొనిన 'అధ్యక్షుడు' దేశాధిపతిగ వ్యవహరించును. ఇతని పదవీకాల పరిమితి అయిదేండ్లు. రాజకీయ పక్షములతో సంప్రతించిన మీదట ఈతడు 'ప్రధాన మంత్రిని' నియమించును. మంత్రివర్గమున ప్రధాన మంత్రికాక సాధారణముగ 15 గురు మంత్రులు ఉందురు. మంత్రివర్గము శాసనసభకు బాధ్యత వహించి పరిపాలన నిర్వహించును. న్యాయశాఖకు స్వతంత్ర ప్రతిపత్తి కలదు.

చీ. శే. రా.

**ఇటలీ** : దక్షిణ యూరప్ నందలి ఒక స్వతంత్ర రాజ్యము.




ఈ రాజ్యమున ఇటలీ ద్వీపకల్పమును, దానిని ఆనుకొని ఉన్న మరికొన్ని దీవులును చేరి ఉన్నవి. ఈ ద్వీపములలో సిసిలీ, సార్డీనియా దీవులు ప్రముఖములు. ఇటలీ ద్వీపకల్పమునకు ఫ్రాన్స్, స్విజర్లండ్, ఆస్ట్రియా, యుగోస్లావియా [ఉ]; టిర్రీనియన్ సముద్రము, అయోనియన్ సముద్రము [ద], ఎడ్రియాటిక్ సముద్రము [తూ] సరిహద్దులందు నెలకొని ఉన్నవి. ఈ ద్వీపకల్పపు దక్షిణపు కొనకు అనతి దూరమున సిసిలీ దీవియు, ఆ దీవికి వాయవ్యమున 335 కి. మీ. దూరమున సార్డీనియా దీవియు కలవు. [వి] దీవులతో సహా చేరి ఇటలీ విస్తీర్ణము 3,01,225 చ. కి. మీ.; ఇటలీ ద్వీపకల్పమునందే నెలకొనియున్న సాన్ మారినో, వాటికన్ సిటీ ఇటలీతో సంబంధము లేని స్వతంత్ర రాజ్యములు [చూ. సాన్ మారినో; వాటికన్ సిటీ]. [జ] 5,04,21,000 ; [భా] ఇటాలియన్, ఫ్రెంచి, జర్మన్ భాషలుకూడ కొన్ని ప్రాంతములందు మాతృభాషలుగ ప్రచారమందు ఉన్నవి. [మ] రోమన్ కేథలిక్

సంప్రదాయపు క్రైస్తవ మతము ప్రజలలో విరివిగ వ్యాప్తియందు ఉన్నది. [రా] రోమ్ (17 లక్షలు).

చరిత్ర : క్రీ. శ. 476 వరకును ఇటలీ దేశమంతటికిని అన్వయించే చరిత్ర రోమ్ చరిత్రతో సంబంధించినదే కాని, ప్రత్యేకించి చెప్పదగినదేదీ లేదు [చూ. పు. 40; 47]. మొరటు జాతి నాయకుడయిన ఒడోసర్ (క్రీ. శ. 434 - 493) ఇటలీ దేశమంతటికిని (476 - 493) రాజు అయి నప్పటినుండిన్ని ఇటలీదేశ చరిత్ర ఆరంభమైనదని చెప్ప వచ్చును. అతని అనంతరము 493 లో ఆస్ట్రొగాత్‌ల రాజ యిన థియోడోరిక్ మహనీయుడు (454 - 526) ఇటలీదేశ మును జయించి ఇటలీకి రాజుగా (493 - 526) ఉండెను. ఇతని కాలములో దేశమందు ప్రశాంతి నెలకొన్నది ; దేశ భాగ్యము అభివృద్ధి చెందినది; ఇతడు స్థాపించిన గాతిక్ రాజవంశము క్రీ. శ. 552 వరకును నిలచినది.

గాతిక్ వంశ రాజుల పరిపాలనము 552 లో అంత మొందినది. ఇటలీదేశము బైజాంటిన్ సామ్రాజ్యమందు ఒక భాగమయినది. పిమ్మట కొంతకాలమునకు జర్మన్ జాతికి సంబంధించిన లొంబార్డులు బైజాంటిన్ సామ్రాజ్య దేశములలోనికి అంతటంతట యెక్కువగ ప్రవేశించి, రోమ్ నగరమును కూడ ముట్టడించుటకు తలపెట్టిరి. అట్టి విప త్కాలమున లొంబార్డుల వలన కలుగనుండిన అపాయ మును తొలగించి, రోమ్ నగరమును, పోప్‌ను ఫ్రాంక్‌ల రాజయిన పెపిన్ కాపాడెను. పెపిన్ కొడుకైన షార్లమేన్ (క్రీ. శ. 724 - 814) లొంబార్డులను పూర్తిగా జయించి, క్రీ. శ. 800 లో చక్రవర్తి అయ్యెను. రాజ్యాభిషిక్తుడయి నప్పుడు ఇతడు లొంబార్డ్ రాజులు ధరించుచుండిన ఇనుప కిరీటమును ధరించెను. పోప్‌నకు తన తండ్రి పెపిన్ చేసిన భూదానమును నిలబెట్టెను.

షార్లమేన్ సామ్రాజ్యము క్రీ. శ. 843 లో విచ్ఛిన్నమైన తర్వాత 120 సంవత్సరముల కాలము ఇటలీలో రాజకీయ సంబంధమైన పరిపాలనము లేకపోయినది. క్రీ. శ. 962 లో ఓటోమహనీయుడు పవిత్ర రోమన్ సామ్రాజ్యమునకు చక్రవర్తిగా పోప్‌చే రాజ్యాభిషిక్తుడయ్యెను. ఇతడు అరాచక దుస్థితిని తొలగించి, ఇటలీలో సరియైన పరిపాల నము నడపించెను. మధ్యయుగమందు ఈ పవిత్ర రోమన్ సామ్రాట్‌లే ఇటలీకి పరిపాలకులైనట్లు అధికారము చెలాయించుచుండిరి. కాని, ఇటలీలో కొన్ని ప్రదేశముల వారు పరదేశీయులయిన ఈ జర్మన్ జాతి సామ్రాట్‌ల అధి పత్యమునకు లొంగి ఉండుటకు సమ్మతింపక తిరుగుబాట్లు సాగించుచుండిరి. అందుచేత ఆ తిరుగుబాట్లను అణచి వేయుటకు ఈ సామ్రాట్‌లు తీవ్రముగా యుద్ధములు చేయ వలసి వచ్చినది. వీరిని ప్రతిఘటించినవారిలో ముఖ్యులు పోప్‌లే. సామ్రాట్‌ల అధికారమును తొలగించుకొనుటకు పోప్‌లు తమ యావచ్ఛక్తిని వినియోగించుచుండిరి.

నగర రాజ్యముల యుగము : ఇటలీలో ఈ కాలమందు ప్రబలమైన నూతన శక్తితో మిలాన్ (మిలానో), జెనోవా, ఫ్లారెన్స్, పీసా, వెనిస్ (వెనిజియా) మొదలయిన నగరములు కొన్ని స్వాతంత్ర్యమును ప్రకటించుకొన్నవి. తమ్ము బాధించు ప్రభువులను, సామ్రాట్‌లను సైతము ప్రతిఘటింప గల బలమును ఈ నగరములు తెచ్చుకొనగలిగినవి. ఈ నగరములున్ను, వీటి చుట్టును గల కొంత ప్రదేశమున్ను అనేక విధముల వృద్ధి లోనికివచ్చి నూతన సంస్కృతిని, సంపదను చేకూర్చు కొన్నవి. కాని, ప్రతి నగరములోను గ్వెల్ఫ్, గిబలీన్ అనేవర్గములు రెండుపుట్టి, నగరముల ఐక్యమునకు భంగము కలిగించి, నగరాభివృద్ధికి ప్రతిబంధకముగా ఉండినవి. పోప్ అధికారమును, ఆధిపత్యమును నిలబెట్టి పరుల అధి కారమును తొలగించుకొనుటకు పూనుకొన్నవారు గ్వెల్ఫ్‌లు. సామ్రాట్ అధికారమును, ఆధిపత్యమును నిల బెట్టుటకు చూచినవారు గిబలీన్‌లు. ఈ రెండు వర్గముల వారికిని సదా కలహములు చెలరేగి నగరముల ప్రశాం తికి, సౌభాగ్యమునకు చేటు కలుగుచుండెను.

నవీన యుగము : 1494 లో ఫ్రాన్స్ రాజయిన చార్లెస్ - VIII నేపిల్స్ నగరమును జయించి, రాజుగా రాజ్యాభిషిక్తుడయ్యెను. అతడు కొద్దికాలములోనే మరలి పోయెను గాని, పరరాజులు దండెత్తివచ్చి నగరము లను స్వాధీనపరచుకొని రాజ్యమేలుట సులువైన పని అని రుజువు చేయగలిగెను. అతని ఒరవడిని ఫ్రెంచి, స్పానిష్ రాజులు దండయాత్రలు సాగించి, ఇటలీ ప్రదేశ ములను ఆక్రమించుకొనిరి. కడకు స్పెయిన్ దేశమునకు రాజున్ను, పవిత్ర రోమన్ సామ్రాజ్యమునకు సామ్రాట్‌ను అయి ఉండిన చార్లెస్ - V (1500 - 1558) ఇటలీ దేశమును స్వాధీనపరచుకొనెను. ఈ చార్లెస్ - V పరిపాలనమువలన మునుపటి అరాజక దురవస్థ కొంత తొలగిపోయి, సుస్థితి కొంత ఏర్పడినది. తర్వాత సుమారు 200 ఏండ్ల కాలము ఇటలీదేశ చరిత్ర ఏకముఖముగా నడవలేక పలు విపర్యయములకు లోనయ్యెను.

ఫ్రెంచి విప్లవ యుగము : ఫ్రెంచి విప్లవము పుట్టి నప్పుడు దాని విజృంభణ ప్రసారమును అడచివేయుటకు ఏకమయిన రాజ్యముల కూటమిలో ఇటలీ రాజ్యముల వారుకూడ చేరుటకు ప్రయత్నించిరి. అది సాకుగా పెట్టు కొని నెపోలియన్ ఇటలీపైకి దండెత్తివచ్చి ఇటలీ దేశ

మును తన సామ్రాజ్యమునకు లోబడునట్లు చేసికొనెను. 1797 లో కాంపో ఫార్మియా సంధి జరిగినప్పుడు వెనిస్ నగరరాజ్యము ఆస్ట్రియావారికి వశపడినది. తక్కిన ఇటలీ దేశమంతా అయిదు ప్రజాసత్తాక రాజ్యములుగా విభక్త మయినది. మిలాన్, జెనోవా, రోమ్, బోలోన్యా, నేపిల్స నగరములు ఆ అయిదు రాజ్యములకును రాజధాని నగరములయినవి. నెపోలియన్ ఇటలీ దేశమును విడిచిపెట్టిపోగానే ఇటలీవారు ఫ్రెంచి సేనలను వెడలగొట్టి స్వాతంత్ర్యము ఆర్జించిరి. కాని, నెపోలియన్ మరల దండెత్తివచ్చి నేపిల్స రాజ్యమునకు తన సోదరుడైన జోసెఫ్‌ను రాజుగా నియమించెను; రోమ్ నగరమును సైతము పట్టుకొనెను; పోప్‌ను ఫ్రాన్స దేశమందు నిలిపెను.

ఫ్రెంచి విప్లవానంతర సంఘర్షణ : నెపోలియన్ పతనానంతరమున 1815 లో వియెన్నా కాంగ్రెస్ [చూ.] సమావేశము జరిగినది. అందలి తీర్మానముల ప్రకారము ఇటలీ దేశమంతా 14 రాష్ట్రముల క్రింద విభక్తమయినది. ఇందులో సెవాయ్ రాజవంశమువారికి పియెడ్మాంట్ రాష్ట్రమున్ను, రెండు సిసిలీలు గల రాజ్యము బూర్బోన్ ఫెర్డినాండ్‌కున్ను, చర్చి రాష్ట్రములు పోప్‌కున్ను దఖలు పడినవి. తక్కిన రాష్ట్రములలో ఆస్ట్రియా ఆధిపత్యము నెలకొల్పబడెను.

ఈ విధముగా దేశము విచ్ఛిన్నమైపోవడము ఇటలీకి కష్టముగానే ఉండెను. 1831 లో పియెడ్మాంట్‌నకు చార్లెస్ ఆల్బర్ట్ రాజయినాడు. ఇతడు నాలుగు రాష్ట్రముల వారిని కూడదీసికొని, దేశస్వాతంత్ర్యము కొరకు ప్రయత్నించెను. తక్కిన కొన్ని రాష్ట్రములవారు ఇతనికి తోడ్పడిరి. ఆ కాలమందే మాజినీ (1805 - 72) అను ఇటలీదేశపు యువకుడు, దేశాభిమాని, ధైర్యవంతుడు విప్లవనాయకుడైనాడు. ఆస్ట్రియా ఆధిపత్యమును పడగొట్టి దేశ స్వాతంత్ర్యమును సంపాదించుటకై ఇటలీ యువకసంఘమను పేర నొక సంఘమును స్థాపించి, ఇది వరకు జరిగిన ప్రయత్నములవలె రహస్యముగా గాక బహిరంగముగానే స్వాతంత్ర్యోద్యమమును నడపించి దేశమంతటికీ ఒక ప్రజాసత్తాక రాజ్యమును స్థాపించుటకు ఇతడు కంకణము కట్టుకొనెను. 1848 లో మాజినీ మొదలయిన దేశభక్తులు ఇటలీ దేశమందు ఎల్లెడల తిరుగుబాట్లు సాగించిరి. రోమ్ నగరము మాజినీ అధికారమునకును, అతని అనుచరులలో ప్రఖ్యాతుడైన గారిబాల్డీ అధికారమునకును లోబడినది. కాని, ఫ్రాన్స అధ్యక్షుడైన లూయీ నెపోలియన్ పంపిన ఫ్రెంచి సైన్యము పోప్ పక్షమువచ్చి రోమ్ నగరమును స్వాధీనపరచుకొని పోప్‌నకు వశపరచెను. పియెడ్మాంట్‌లో మాత్రము ప్రజాస్వామ్యాభిమానము నిలిచినది. పియెడ్మాంట్ రాజయిన విక్టర్ ఎమాన్యుయల్ - II ప్రజా స్వామ్యోద్యమము సాగనిచ్చి ఆస్ట్రియావారిని ప్రతిఘటించెను. అతడు కౌంట్ కావూర్‌ను ప్రధాన మంత్రిగా నియమించుట అతనికే కాక ఇటలీ దేశమునకే గొప్ప మేలుగా పరిణమించినది. నవీన దేశముగా ఇటలీని మార్చిన వీరులలో కావూర్‌నే అగ్రగణ్యునిగా పరిగణింపవచ్చును. పియడ్మాంట్ రాజుల రాచరికముగల ఏకరాజ్యముగ ఇటలీని రూపొందించుటకు కావూర్ కృషిచేసెను.

ఇటలీ ఏకీకరణము : ఫ్రాన్స సహాయముతో ఆస్ట్రియావారి ఆధిపత్యమును ఇటలీనుండి తొలగించవలెనన్న ఆశ కావూర్‌కు ఎక్కువగా కలిగినది; అతని ఆశ తుదకు నెరవేరినది. 1859 లో ఫ్రెంచి సేనలు ఆల్ప్స పర్వతములను దాటి వచ్చినవి. అంతట స్వాతంత్ర్యపు కడపటి తీవ్ర ప్రయత్నము ప్రారంభమైనది. ఆస్ట్రియా - పియెడ్మాంట్ మధ్య పోరాటము ఆరంభమైన తరువాత రెండు మాసములకంటె ఎక్కువకాలము జరుగలేదు. మెజెంటా, సోల్ ఫరినో రంగములలో జరిగిన యుద్ధములలో ఫ్రెంచి సేనలున్ను, పియెడ్మాంట్ సేనలున్ను ఆస్ట్రియాను పూర్తిగా ఓడించినవి. మిలాన్, ఉత్తర లొంబార్డీపై తమకుగల అధికారములను ఆస్ట్రియా విడిచిపెట్టుకొనెను. అయితే, ఈ ఆనందకరమైన సంఘటనతోపాటు ఒక విషాదకరమయిన సంఘటనకూడ జరిగినది. ఇప్పుడు జరిగిన సంగ్రామమందు తనసేనల సాయమున విజయము చేకూరినందున నీస్, సెవాయ్ మండలములను తన ఫ్రాన్స దేశమునకు రావలసిన వంతుగా నెపోలియన్ రాజు తన రాజ్యములో చేర్చుకొనెను. అందుకు ఇటలీవారు కాదనలేక ఒప్పుకొనవలసివచ్చినది.

ఇటలీ వీరులలో అగ్రగణ్యుడుగా అందరి మెప్పును పొందిన గారిబాల్డీ సిసిలీ, నేపిల్స రాజ్యములను 1860 నవంబరులో వశపరచుకొనెను. రెండు సిసిలీల రాజ్యము పియెడ్మాంట్ రాజయిన విక్టర్ ఎమాన్యుయల్ రాజ్యములో అంతర్భాగమయినది. 1861 లో విక్టర్ ఎమాన్యుయల్ ఇటలీదేశ రాజుగా ప్రకటింపబడెను. ఇక వెనిస్, రోమ్ రాష్ట్రములు మాత్రమే ఇటలీ రాజ్యమందు చేరవలసి ఉండెను. 1866 జూన్ - ఆగస్టులో ప్రష్యాపై ఆస్ట్రియా జరిపిన ఆరువారముల యుద్ధములో ప్రష్యాకు సాయము చేసినందుకు బహుమానముగా వెనిస్ నగర రాజ్యము ఇటలీకి వచ్చినది. ఇక ఒక్క రోమ్ నగర

రాజ్యమే చేరవలసి ఉండెను. 1867 లో గారిబాల్డీ రోమ్ నగరమును ముట్టడించెను. కాని, పోప్‌నకు ఫ్రెంచివారు తోడై గారిబాల్డీని ఎదిరించి వెడలగొట్టిరి. అప్పుడు విజయము చేకూరకపోయినా, మరి మూడు సంవత్సరములు గడచిన తర్వాత ప్రష్యాతో ఫ్రెంచివారికి సంగ్రామము జరుగుటచేత ఫ్రెంచి సేనలు రోమ్‌నగరమును విడిచిపెట్టి పోవలసివచ్చినది. ఆ వెంటనే గారిబాల్డీ తన సేనలను వెంటబెట్టుకొనిపోయి, రోమ్ నగరమును స్వాధీనపరచుకొని, ఇటలీ ఏకైక రాజ్యమునకు రోమ్‌నగరమే రాజధాని అయినదని ప్రకటించి కృతార్థుడయ్యెను.

విక్టర్ ఎమాన్యుయల్ - III 1900 లో రాజయిన తరువాత గ్రేట్ బ్రిటన్, ఫ్రాన్స్ మొదలయిన రాజ్యములవలెనే ఇటలీ రాజ్యముకూడ వలసదేశములను సంపాదించి సామ్రాజ్యము కావలెనన్న కోరిక ఇటలీవారికి ఉదయించినది.

ఇటలీ 1911 లో విజృంభించి టర్కీతోటి యుద్ధమునకు దిగినది. ట్రిపోలీలో గల ఇటలీ దేశీయుల భద్రతకు తుర్కులవలన భంగము కలుగుచుండుటచే యుద్ధము చేయవలసి వచ్చినదని ఇటలీ సాకు చెప్పినది. యుద్ధ ఫలితముగా ట్రిపోలీ ఇటలీకి స్వాధీన మయినది.

ప్రపంచ యుద్ధము - I - ఇటలీ: 1914 లో మహాసంగ్రామము ప్రారంభించినప్పుడు ఇటలీ ఒక సంవత్సరము పాటు తటస్థముగా ఉండెను. కాని 1915, మే 24 వ తేదీని మిత్రమండలి పక్షము చేరి ఆస్ట్రియా-హంగేరీతో యుద్ధము ప్రకటించినది.

ఈ ప్రపంచ యుద్ధములో మిత్ర మండలితోకూడి విజయము పొందినందుకు ప్రతిఫలముగా ఇటలీకి యూరప్ ఖండమందలి - అంతవరకును ఆస్ట్రో - హంగేరీ అధీనమందుండిన - 14,400 చ. కి మీ. విస్తృతి గల పెద్ద ప్రదేశము సంక్రమించినది.

ఫాసిజమ్‌కు లోబడిన ఇటలీ: సంగ్రామమందు మిత్రమండలితో కలసి విజయములో పాల్గొని పెద్ద ప్రదేశము సంక్రమింప చేసికొనినను ఇటలీ ప్రజలకు అనేక దురవస్థలు కలిగినవి; నిరుద్యోగ సమస్య తీవ్రమైనది. సైనికులకు జీవన సౌకర్యములు కలిగించుట కష్టమైనది. సంధి సమావేశములో మిత్రమండలివారు ఇటలీకి తగిన ఫలము దక్కనీయలేదన్న అసంతృప్తి ప్రభుత్వమునకున్ను, ప్రజలకున్ను మనోవేదన కలిగించినది. 1919 - 1920 లో కార్మికుల సమ్మెలు తరుచుగా జరుగుచువచ్చినవి. దేశము సోవియట్ రష్యా లాగున కమ్యూనిస్ట్ రాజ్యముగ పరిణమించగలదన్న భయము తోచినది.

అట్టి పరిస్థితులలో ముస్సోలినీ [చూ.] దేశదృష్టిని ఆకర్షించెను. ఇతడు మొట్టమొదట సైనికుడు; సామాజికవాది. 1919 మార్చిలో జాతీయవాదులసంఘమును ఏర్పరచి నాయకుడయ్యెను. ఈ సంఘమునకు ఫాసిస్ట్‌సంఘమని పేరు. కార్మికులకును, కర్షకులకును ఇది ప్రాపుగా తయారయినది. రాజుగా ఉండిన విక్టర్ ఎమాన్యుయల్ - III ముస్సోలినీని ప్రధాన మంత్రిగా నియమించి, ప్రభుత్వమును నడుపుమని కోరెను (1922). ముస్సోలినీ ప్రధాన మంత్రి కాకపూర్వము ఇటలీ రాజ్యాంగవిధానము ఇంగ్లండులోని రాజ్యాంగ విధానమువలెనే రాజుతోపాటు ప్రజాప్రతినిధిసభ, మంత్రివర్గము కలదిగా ఉండెను. ముస్సోలినీ ఈ విధానమును మార్చివేసెను. తన ఫాసిస్ట్ పక్షమునుండి కొందరిని ఒక పెద్ద సంఘముగా ఏర్పరచి, ఆ సంఘము వారికే శాసన నిర్మాణాధికారమున్ను, ప్రభుత్వ కార్య నిర్వాహకులకు సలహా ఇచ్చే అధికారమున్ను ఇతడు సంక్రమింపచేసెను. పార్లమెంట్ సభ్యులు కేవలము ప్రభుత్వమువారి ఆజ్ఞలను ఆచరణలో పెట్టగల పౌరులుగాను, యుద్ధ సమయమందు యుద్ధము నడపే యోద్ధలుగాను ఉండునట్లు చేసెను. క్రమక్రమముగా ముస్సోలినీ దేశనాయకుడై సర్వాధికారమున్ను వహించి, కేంద్రాధికారమును బలపరచి దేశమందుగల పల్లెలు, పట్టణములు, నగరములు అన్నీ ఈ కేంద్రాధికారమునకు అనువర్తులగునట్లు రాజ్యాంగ విధానమును మార్చివేసెను.

సైన్యాభివృద్ధి, సంగ్రామ సామగ్రి సంగ్రహణము 1935 నుండిన్ని జరుగుతూ వచ్చినవి. 1935 లోనే ఆఫ్రికాలోని ఎతియోపియా దేశముపై ఇటలీ దండెత్తి 1936 లో వశపరచుకొనెను. 1937 లో ఇటలీ, జర్మనీ దేశములకు మైత్రి కుదిరినది. ఈ రెండు రాజ్యములకు అంతటినుండి అక్షరాజ్యములు అను పేరు కలిగినది. స్పెయిన్ దేశములో అంతర్యుద్ధము చెలరేగినప్పుడు జర్మనీతోపాటు ఇటలీ కూడ జనరల్ ఫ్రాన్సిస్కో ఫ్రాంకో పక్షమునకు సహాయము చేసెను. 1939 లో ఇటలీ సేనలు ఆల్‌బేనియాను ముట్టడించి, ఇటలీ వారి అధికారమును అక్కడ నిలబెట్టినవి.

ప్రపంచ యుద్ధము - II-ఇటలీ: ప్రపంచ యుద్ధము - II ప్రారంభించు సరికి ఇటలీ సేనలలో 7,50,000 మంది సైనికులు ఉండిరి. అయినను 1940, జూన్ 10 వ తేదీ వరకున్ను సంగ్రామములోనికి ఇటలీ ప్రవేశించలేదు. ఆ నాటికి ఫ్రాన్స్ అపజయము విశదమయినది. ఆ సమయమందు ఇటలీ జర్మనీపక్షము చేరి, యుద్ధమునకు సన్నద్ధమైనది. మరి 14 దినములకే ఫ్రాన్స్ ప్రభుత్వము లొంగినది.

ఆ మాత్రపు తోడ్పాటునకే ఫ్రెంచిసీమలో ఒక చీలికవంటి ప్రదేశము ఇటలీకి లభించినది.

గ్రీస్ దేశముపై ఇటలీ 1940, అక్టోబరు 27 వ తేదీన దండెత్తెను. గ్రీస్ సైనికులు ధైర్యముతో పోరి, ఆత్మ సంరక్షణము చేసికొనగల్గిరి. కాని, జర్మనీ సేనలు కూడ యుద్ధరంగమునకువచ్చి ఇటలీకి తోడయినవి. అంతట 1941, మే లో గ్రీస్ దేశమున్ను, యుగోస్లావియా దేశ మున్ను శత్రువులకు లోబడినవి.

ముస్సోలినీ పతనము : ప్రపంచ సంగ్రామము అక్ష రాజ్యములవారికి ప్రతికూలముగా పరిణమించి, 1943 సరికి ఇటలీ సామ్రాజ్యమందలి ఆఫ్రికా ప్రదేశములు అన్నియు మిత్రమండలి వశమైనవి. అందువలన ముస్సోలినీ తన ప్రధాన మంత్రి పదవికి రాజీనామా పెట్టవలసి వచ్చి నది. కాని, జర్మనీవారి సహాయముతో ఉత్తర ఇటలీ ప్రదేశ మునకు పేరుకు మాత్రము నాయకుడైనాడు. సిసిలీ ద్వీపము మిత్రమండలివారికి దఖలుపడినది. బ్రిటిష్, యునైటెడ్ స్టేట్స్, కెనడా సేనలు ఇటలీ దక్షిణ భాగ మును వశపరచుకొనినవి.

ఇటలీ ప్రభుత్వము ఏ షరతులు లేకుండా మిత్రమండలి వారికి 1943, సెప్టెంబరు 8 వ తేదీన పూర్తిగా లోబడినది. 1944 లో మిత్రమండలివారు రోమ్ నగరమును కూడ స్వాధీనపరచుకొనిరి. ముస్సోలినీని, అతని మంత్రివర్గ మందలి 12 గురు సభ్యులను, అతని ప్రియురాలిని, మరి నలుగురిని కోమో సరస్సువద్ద ఒక గ్రామములో ఫాసి జమ్ వ్యతిరేకులు పట్టుకొని చంపివేసిరి (ఏప్రిల్ 28, 1945).

యుద్ధానంతర సమస్యలు : 1945 సెప్టెంబరులో నూతన విధానము ప్రకారము ఏర్పడిన ఇటలీ ప్రతినిధులసభ స్వతంత్రత కలదిగా ప్రారంభోత్సవము జరుపుకొన్నది. 1946 లో ఈ మహాసభకు ఎన్నికలు జరిగినవి. విక్టర్ ఎమా న్యుయల్ తన సింహాసనమును తన కుమారుడైన హంబర్ట్‌కు అందజేసి విశ్రాంతి పుచ్చుకొనెను. కాని, 1946 మే లో రాచరికమునకు స్వస్తిచెప్పి, దేశము ప్రజాసత్తాక రాజ్యము కావలెనని మహాజనసభ తీర్మానించెను. అందుకు హంబర్ట్ రాజు ప్రతిఘటించెను. అంతట జనవాక్య ఫలిత ముగ ఈ దేశము గణరాజ్యప్రతిపత్తిని పొందగా రాజ రికము అంతరించినది (1946, జూన్ 2).

క్రొత్త రాజ్యాంగ విధానము 1947 లో ఆమోదింప బడి, దానిని అనుసరించి ఎన్నికలు జరిగినవి. ఎన్రికో డ నికోలా మొదటి అధ్యక్షుడయినాడు. మిత్రమండలి వారితో సంధి పొసగినది. మిత్రమండలివారు దేశములో నిలబెట్టి ఉంచిన సేనలను దేశమునుండి తొలగించివేసి నారు; యునైటెడ్ స్టేట్స్ నుండి ఆర్థిక సాహాయ్యము లభించినది. 1955 లో ఐక్యరాజ్యసమితియందు సభ్యత్వము ఈ దేశమునకు లభించినది.

రాజ్యాంగము : ఇటలీ క్రొత్త రాజ్యాంగ విధానము 1948, జనవరి మొదటి తేదీని అమలులోనికి వచ్చినది. ఇటలీ పార్లమెంట్‌లో రెండు కక్ష్యలు - ఛేంబర్ ఆవ్ డెప్యుటీజ్, సెనేట్ కలవు. దేశమందలి 25 ఏండ్లు నిండిన వయోజనులు అందరికిని ఛేంబర్ ఆవ్ డెప్యుటీజ్‌కు సభ్యు లను సూటిగా ఎన్నుకొనే హక్కు గలదు. 80 వేలమంది జనులకు ఒక్క సభ్యుని చొప్పున ఎన్నుకొనే ఏర్పాటు జరిగి నది. ఎన్నుకోబడిన సభ్యులు ఐదు ఏండ్లు సభ్యులుగా ఉండ గలరు. ఇక సెనేట్ సభ్యుల ఎన్నికలు 19 మండలముల విభాగమును బట్టి ఏర్పడినవి. ఒక్కొక్క మండలమునుండి కనీసము 6 గురు సెనేట్ సభ్యుల చొప్పున ఎన్నుకొను టకు వీలుగా ఏర్పాటు జరిగినది. ఇందులో 2 లక్షల జనాభాకు ఒక సభ్యుడు చొప్పున ఎన్నుకోబడవలసి ఉన్నది. రిపబ్లిక్ ప్రెసిడెంట్ అయిదుగురు యావజ్జీవ సెనేటర్‌లను నియమించవచ్చును. ఒకసారి అధ్యక్షుడైనవాడు శాశ్వత సభ్యుడుగా సెనేట్‌లో ఉండవచ్చును. ఛేంబర్ ఆవ్ డెప్యు టీజ్, సెనేట్ సభలు రెండున్ను, మాండలిక సంఘముల నుండి ముగ్గురు చొప్పున వచ్చిన డెలిగేట్లున్ను కలసి అధ్యక్షుని ఎన్నుకొందురు. ఈ ఎన్నికలలో మూడింట రెండువంతులు ప్రాబల్యము ఆర్జించినవాడు అధ్యక్షుడు కావలెనన్న నియమము ఉన్నది. కాని, మూడుసార్లు ఎన్ని కలు జరిపినా, ఇట్టి ప్రాబల్యము ఎవనికిని లభించని ఎడల సాధారణరీతిలో ఎక్కువ వోట్లు తెచ్చుకొనిన అతడే అధ్య క్షుడు కావచ్చునన్న సవరణ కూడా ఉన్నది. అధ్యక్షు డైనవాడు 50 ఏండ్లకు తక్కువ ఈడు కలవాడు కాకూడదు. ఎన్నుకొనబడినవాడు అధ్యక్ష పదవిలో 7 ఏండ్లు ఉండ వచ్చును. సెనేట్ సభకు అధ్యక్షుడైనవాడు రిపబ్లిక్‌కు ఉపాధ్యక్షుడగును. ప్రభుత్వము ప్రవేశ పెట్టిన తీర్మానము వీగిపోయినంతమాత్రమున మంత్రివర్గము పదవిని వీడిపోవ అక్కరలేదు. విశ్వాస రాహిత్య తీర్మానము నెగ్గినపుడే అది వీడిపోవలసి ఉండును. ఈ రెండు సభలలో దేనినైనను విడగొట్టి, క్రొత్తగా ఎన్నికలు జరిపించే అధికారము అధ్య క్షునికి కలదు. కాని, అతని ఉద్యోగకాలమందలి చివరి ఆరు మాసములలోను మాత్రము ఈ పని జరిపించుటకు వీలులేదు.

చీ. శే. రా.

**ఇట్సింగ్** (క్రీ. శ. 635 - 713) : క్రీ. శ. ఏడవ శతాబ్ది ఉత్తరార్ధమున భారతదేశమునందు పర్యటనచేసిన చీనా బౌద్ధ యాత్రికులలో ప్రముఖుడు. ఇతని నిజ

నామము చాంగ్ వెన్ - మింగ్. ఇతడు క్రీ. శ. 635 లో చీనాలో జన్మించెను. బౌద్ధ శాస్త్రములను పఠించి, పదు నాలుగవ ఏట భిక్షుక ధర్మమును స్వీకరించి, ఇట్సింగ్ అను నూతన నామమును గ్రహించెను. హుయాన్ స్యాంగ్‌ను అనుసరించి బౌద్ధ క్షేత్రముల సేవించుటకై భారత దేశమునకు పోవలయునను ఆకాంక్ష క్రీ. శ. 649 లో ఇతనికి కలిగినది. కాని, 671 వరకు అది నెరవేరలేదు.

ఇట్సింగ్ క్రీ. శ. 671 లో చీనాలోని కేంటన్ రేవు నుండి ఒక పారసీక నౌకలో తన ఏకైక శిష్యునితోకూడ సముద్రమార్గమున భారత దేశమునకు ప్రయాణమయ్యెను. శ్రీవిజయ రాజధానియగు ఫో - కే (పాలెంబాంగ్) నగరమున నిలిచి ఆరుమాసములు సంస్కృత భాషను అభ్యసించెను. అచటనుండి క్రమముగ మలయా ద్వీప కల్పము నందలి కీ - తా (కెడ్డా) చేరి అట ఆరుమాసములు ఉండి, అంతట లో - జెన్ - క్వో (నికోబార్) దీవులను దర్శించి తర్వాత నలందా సమీపమున ఉన్న తామ్రలిప్తి నగరమును చేరెను (673). ఉత్తర భారత దేశమున అనేక ప్రదేశములను పర్యటించి, నలందాలోని బౌద్ధ సన్యాసుల విహారమున పది ఏండ్లు అధ్యయనము చేసెను. పెక్కు బౌద్ధ ధర్మ గ్రంథములను సేకరించెను. క్రీ. శ. 692 లో భారత దేశమునుండి బయలు దేరి మార్గమధ్యమున శ్రీవిజయ రాజ్యమున ఆగి, తరువాత కేంటన్‌కు పోయి, అల్ప కాలము మాత్రమే అటనుండి విద్యావంతులగు నలుగురు సహచరులతో తిరిగి శ్రీవిజయరాజ్యమునకు వచ్చి, బౌద్ధ గ్రంథముల ప్రతులను తయారుచేయుటను కొనసాగించెను. ఆ కార్యక్రమము పూర్తియైన తరువాత క్రీ. శ. 695 లో స్వదేశమునకు అతడు పోయెను. క్రీ. శ. 700 - 712 మధ్య ఇతడు 56 బౌద్ధ గ్రంథములను 230 సంపుటములుగ చీనా భాషలో ప్రచురించెను. క్రీ. శ. 713 లో ఇతడు మరణించెను. ఇతని గ్రంథములవలన ఆనాడు వివిధ దేశములందు అమలులో ఉండిన విభిన్న బౌద్ధ ధర్మ సంప్రదాయములును, సాంఘికాచారములును, నౌకాయాన సంబంధ విషయములును చక్కగ తెలియనగుచున్నవి. వసంతలక్ష్మి.

**ఇతియోపియా :** చూ. ఎతియోపియా.

**ఇన్‌కా నాగరకత :** చూ. ఇన్‌కాలు.

**ఇన్‌కాలు :** దక్షిణ అమెరికాలోని పెరూదేశములో ప్రాచీనకాలమందు నివసించి ఉండిన ఒక నాగరకజాతి. ఈ జాతివారికే 'కెచ్వా ఇండియన్' లను వ్యవహారమును కలదు. అనేక శతాబ్దములు ఇన్‌కాలు తమ జాతి పరిపాలకుల పరిపాలనమందు ప్రశాంతముగ జీవనము గడుపు కొంటూ నాగరకులు అయినారు. పరిపాలకునికి వారి కెచ్వా భాషలో 'ఇన్‌కా' అని పేరు. 'ఇన్‌కా' శబ్దమునకు రాజన్న అర్థమే మొదట ఉండినా, రాను రాను 'ఇన్‌కా' శబ్దము జాతివాచకము అయినది. కొంత కాలమునకు ఇన్‌కాలు పెరూదేశము దాటి, దక్షిణ అమెరికాలో పడమటి ప్రదేశమంతా వశపరచుకొనిరి.

స్పెయిన్ దేశమువారు 1500 లో ఇన్‌కా సామ్రాజ్యమునంతా జయించి, ఇన్‌కాలను అడవి మృగములను వేటాడినట్లు వేటాడి చంపివేసిరి. అయినా చాల మంది ఇన్‌కాలు స్పెయిన్‌వారి కొలువులో జీవించిరి. నేటికి ఇంకను చాలమంది ఇన్‌కాలు 'పెరూ', 'బొలీవియా', 'ఈక్వడార్' ప్రాంతములలో ఉన్నారు. [చూ. మధ్య అమెరికా నాగరకతలు : సం. 10 - పు. 587]. గి. వేం. సీ.

**ఇఫ్నీ :** పశ్చిమ ఆఫ్రికాయందలి స్పెయిన్ పాలిత ప్రాంతము [చూ. స్పెయిన్].

**ఇబ్న్ బతూతా (1304 - 1378):** బహు దేశపర్యటన సలిపి తన అనుభవములను గ్రంథస్థము ఒనర్చిన ఒక ముస్లిమ్ యాత్రికుడు. ఇతని సంపూర్ణ నామము అబూ అబ్దుల్లా మహమ్మద్ ఇబ్న్ బతూతా. ఆఫ్రికా ఖండపు వాయవ్య తీరమందున్న టాంజియర్ ఇతని జన్మభూమి. 1325 లో ఇతడు తన జన్మస్థలమును వీడి ప్రపంచయాత్రకై బయలుదేరి వివిధ ప్రాచ్య దేశములను పర్యటించి, 1355 లో మాతృభూమికి మరల చేరెను. తన పర్యటనలో ఇతడు ఉత్తర ఆఫ్రికాను, మధ్య ప్రాచ్యములందలి ప్రముఖ రాజ్యములను, ఆఫ్రికా తూర్పు తీరపు రేవు నగరములను, మక్కా, మదీనాలను, భారత దేశము, జావా, సుమత్రా, చీనా, సింహళము (సిలోన్), మాల్ దీవులను దర్శించెను. భారత దేశమును ఇతడు దర్శించినపుడు మహమ్మద్ బిన్ తుఘ్లుక్ ఢిల్లీయందు పాలించుచుండెను. ఆ సుల్తాను ఇబ్న్ బతూతాను ఢిల్లీ నగరపు కాజీగ నియమించెను. ఆ ఉద్యోగమున ఇతడు ఎనిమిది ఏండ్లు పనిచేసి, ఆ తరువాత చీనా దేశమునకు పాదుషా పంపిన రాయబారవర్గమును అనుగమించి చీనాకు పోయెను. స్వగృహమునకు చేరునప్పటి ఇతడు 120 వేల కి. మీ. దూరమునకు మించి పయనించెనని లెక్కింపబడినది. తన అనుభవములను వివరించుచు ఇతడు అరబ్బీలో రచించిన గ్రంథము చారిత్రకులకు ఆధారగ్రంథముగ ఉపకరించుచున్నది. చీ. శే. రా.

**ఇరాక్ :** పశ్చిమ ఆసియా యందలి ఒక స్వతంత్ర రాజ్యము.

ఈ దేశమునకు టర్కీ [ఉ]; ఇరాన్ [తూ]; పారసీక సింధుశాఖ, కువాయిట్, సౌదీ అరేబియా [ద]; సిరియా, జోర్డాన్

[ప] సరిహద్దులుగ ఉన్నవి. [వి] 4,48,742 చ. కి. మీ.; [జ] 68,03,153; [భా] జాతీయభాష అరబ్బీ; [మ] అత్యధిక సంఖ్యాకుల మతము ఇస్లామ్; [రా] బాగ్దాద్ (జనసంఖ్య 10,86,000).




చరిత్ర: ప్రపంచమున అతిప్రాచీన చరిత్ర కలిగిన ప్రాంతములలో ఇరాక్ దేశము ఒకటి. చరిత్రకు అందని కాలముననే అచట జనావాసములు నెలకొని ఉండినటుల అచటి త్రవ్వకములవలన తెలియుచున్నది.

ప్రాచీన యుగము; ప్రాచీన కాలమున సుమేరియన్, అక్కడియన్, బాబిలోనియన్, అసీరియన్ నాగరకతలు ఇట వర్ధిల్లినవి. గ్రీక్‌లకు ఈ దేశము మెసపొటేమియా అను పేర పరిచితము [చూ. మెసపొటేమియా]. అసీరియన్ సామ్రాజ్యమును అంతమొందించిన పారసీకుల సామ్రాజ్యమున ఇది కొంతకాలము ఉండి, ఆ తరువాత అలిగ్జాండర్ సామ్రాజ్యమున అంతర్భాగమయ్యెను. అలిగ్జాండర్ అనంతరము అతని అనుచరులలో ఒకరు పాలించిన సెల్యూసిడ్ సామ్రాజ్యపు రాజధాని సెల్యూసియా ఈ దేశమున ఉండినది. క్రీ. పూ. 138 లో సెల్యూసిడ్ రాజులనుండి ఈ రాజ్యము పార్థియన్‌ల వశమయ్యెను. పార్థియన్‌లకును, రోమన్ చక్రవర్తులకును మధ్య చెలరేగిన యుద్ధములు అనేకములు ఈ దేశప్రాంతముననే జరిగెను.

మధ్య యుగము: క్రీ.శ. 637 లో అరబ్బులు ఈ ప్రాంతమును జయించి ఇస్లామ్ మతమును వ్యాపింపజేయుటయే కాక, దీనిని తమ వలసగ చేసికొనిరి. అందువలన క్రమముగ తక్కినజాతుల ప్రజలు క్షీణించుటయో, వలస పోవుటయో జరిగి, ఈ దేశమున అరబ్బులు అత్యధిక సంఖ్యాకులైరి. ఇస్లామ్ సామ్రాజ్యమును పాలించిన అబ్బాసీయ (750-1258) కలీఫాలకు ఈ దేశమందలి బాగ్దాద్ రాజధానినగరము అయ్యెను. ఈ పాలకులలో ప్రముఖుడగు హరూన్ అల్ రషీద్ (785 - 809 ప.) కాలమునను, అతని కుమారుని కాలమునను బాగ్దాద్ నగరము ప్రపంచమందలి ప్రముఖ విజ్ఞానులను, కళావేత్తలను ఆకర్షింప గలిగెను. 13 వ శతాబ్దిలో ఈ సామ్రాజ్యము క్షీణదశ పొందెను. మంగోల్ విజేత చెంఘిజ్ ఖాన్‌నకు మనుమడగు హులగూ అను అతడు బాగ్దాద్ నగరమును 1256 లో కొల్లగొట్టి దేశమునందలి నీటిపారుదల సౌకర్యముల నిర్మూలించెను. తరువాత 1393 లో ఈ ప్రాంతము తైమూర్ సామ్రాజ్యమున కలసిపోయెను.

ఇంతలో ఆసియా మైనర్ ప్రాంతమున ఒక విశాల రాజ్యమును తురుష్కులు స్థాపింపగలిగిరి. ఆ టర్కీ ప్రభువులలో ప్రముఖుడగు సులేమాన్ ఇరాక్‌ను 1534 లో వశపరచుకొనెను. 17 వ శతాబ్దిలో పారసీకుల ఆక్రమణలో ఈదేశము కొలదికాలము ఉండినను, మొత్తముమీద ప్రపంచ యుద్ధము - I వరకు ఇది టర్కీ సామ్రాజ్యమున అంతర్భాగముగ ఉండినదని చెప్పవచ్చును.

ఆధునిక యుగము: ప్రపంచ యుద్ధము - I అనంతరమున టర్కీ సామ్రాజ్యము విచ్ఛిన్నమైనపుడు ఇరాక్ వాసులు స్వతంత్రించుటకు ప్రయత్నించిరి. కాని, మిత్రమండలివారు ఈ ప్రాంతమును నానాజాతి సమితి [చూ.] వశమున ఉంచి సమితి పక్షమున పరిపాలనను - ధర్మకర్తృత్వ బుద్ధితో-బ్రిటన్ నిర్వహించునటుల చేసిరి. కాని, దేశీయులు అందులకు ఒప్పుకొనక తిరుగుబాటు చేయుటచే 1921, ఆగస్టు 23 న అమీర్ ఫైజల్ అను అరబ్ నాయకుని ఇరాక్‌కు రాజుగా బ్రిటిష్ ప్రభుత్వము ఏర్పాటుచేసెను. తన రాజకీయ చతురతచే ఫైజల్ - I ఇరాక్ ప్రజానాయకుల ఆదరమును, బ్రిటిష్‌వారి మైత్రిని నిలబెట్టుకొని క్రమముగ బ్రిటిష్‌వారి ఆక్రమణ వైదొలగునట్లుచేసెను. 1930 లో ఇతడు బ్రిటన్‌తో పరస్పర మైత్రి ఒడంబడిక చేసికొనెను. తుదకు 1932 లో ఇరాక్ స్వతంత్రమై నానాజాతి సమితి సభ్యత్వమును ఆర్జించెను; కాని, రాజకీయ, ఆర్థిక రంగములందు బ్రిటిష్ వారి పలుకుబడి ఏ మాత్రము తగ్గలేదు.

ఫైజల్ - I 1933 లో చనిపోయెను. అతని పుత్రుడు ఘాజీ 1939 లో ప్రమాదవశమున చనిపోగా, ఘాజీ కుమారుడును, బాలుడును అగు ఫైజల్ - II కు రాజ్యాధికారము సంక్రమించెను. అతనికి వయస్సు చాలమిచే

అతని పినతండ్రి అబ్దుల్ ఇలాహ్ రాజ్య వ్యవహర్తగా 1953 వరకు పాలించెను.

ప్రపంచ యుద్ధము - II జరుగుచున్నప్పుడు ఈ దేశమున ప్రజలు బ్రిటిష్‌వారి పలుకుబడినుండి తప్పించుకొనుటకై తిరుగుబాటు చేయగ (1941), బ్రిటిష్ సేనలు ఈదేశమును 1930 ఒడంబడికను అనుసరించి ఆక్రమించెను. యుద్ధానంతరమున (1947) జరిగిన ఎన్నికలలో వచ్చిన ప్రభుత్వము బ్రిటన్‌తో సామరస్యమును ఆసించి కృషిచేయగా, దేశీయులు ఎదురు తిరిగి ఆందోళన జరిపిరి (1948). తరువాత వచ్చిన ప్రభుత్వము 1930 ఒడంబడికను రద్దు ఒనర్చినది. 1953 లో ఫైజల్ - II స్వయముగ రాజ్య వ్యవహారముల నిర్వహింప ఆరంభించెను. కాని, ప్రజలలో అసంతృప్తి మాత్రము సమయలేదు. తుదకు 1958, జూలై 4 న అబ్దుల్ అల్ కరీబ్ ఆల్ కాశీమ్ నాయకత్వమున సైన్యము తిరుగుబాటు జరిపి, ఫైజల్ - II రాజును, ప్రధాన మంత్రిని వధించి రాజ్యమును వశపరచుకొని, విప్లవ ప్రభుత్వమును కాశీమ్ అధ్యక్షతన నెలకొల్పెను.

ఆతరువాత కాశీమ్ విప్లవాత్మక సంస్కరణలను కొనితెచ్చి, విద్య, వ్యవసాయము మొదలగు వానియందు కొంత అభివృద్ధిని సాధించెను. కాని, అతడు తన నిరంకుశ ధోరణివలన పూర్వ మిత్రులలో పలువురితో విరోధము తెచ్చిపెట్టుకొనెను. అంతియేగాక కమ్యూనిస్టులు ఈతనితో సహకరించుటవలన జాతీయ సామ్యవాద పక్షములకు ఈతనియందు ద్వేషభావము ఏర్పడెను. ఇందులకు తోడుగ అరబ్బు దేశముల ఐక్యమును సాధింపనెంచు ఈజిప్టు అధ్యక్షుడు నాసర్ తో ఇతడు సహకరింపకుండెను. వీని అన్నిటి ఫలితముగ సైన్యమునందలి ఒక వర్గము తిరుగుబాటుచేసి, ఇతనిని, ఇతని అనుచరులను అంతమొందించి అధికారమును గ్రహించెను (1963, ఫిబ్రవరి).

మేజర్ అబ్దుల్ సలామ్ అరెఫ్ ఈ ప్రభుత్వమునకు అధ్యక్షత వహించెను. ఈ ప్రభుత్వము సిరియా, ఈజిప్టు ప్రభుత్వములతో జరిపిన మంతనముల ఫలితముగ, ఈ మూడు రాజ్యములు కలసి సంయుక్త అరబ్బు గణరాజ్య సమాఖ్యగా రూపొందుటకు నిర్ణయము జరిగినది (1963, ఏప్రిల్). కాని, ఇది ఆచరణలోనికి రాకపూర్వమే ఈజిప్టు - ఇరాక్ మధ్య వైమనస్యములు మరల పొడమినవి. ఇరాక్‌లో సుస్థిరపాలనను ఈ విప్లవ ప్రభుత్వము కొంతవరకు నెలకొల్పినను ఆంతరంగికముగ కుర్దులను అల్పసంఖ్యాకులు స్వయంనిర్ణయమునకై చేయు ఆందోళనను ఎదుర్కొనవలసి వచ్చినది. 1966, ఏప్రిల్ లో అధ్యక్షుడు అరెఫ్ విమాన ప్రమాదములో మరణించగ, అతని సోదరుడు మేజర్ అరెఫ్ అధ్యక్షుడుగ ఎన్నుకొనబడెను.

రాజ్యాంగము : ఫైజల్ - II రాజును విప్లవకారులు వధించువరకు ఈ రాజ్యము వంశానుగతము, రాజ్యాంగ చట్టబద్ధము అగు రాచరికపు పాలనను కలిగి ఉండెను. కాని, తదనంతరమున గణరాజ్యముగ ప్రకటితమయ్యును సైనిక నాయకత్వమునకు లోనైనది. 1963 విప్లవము తరువాత కూడ పరిస్థితులు ఇంకను కుదుటపడి సరియైన రాజ్యాంగము ఏర్పడలేదు. విప్లవసమితి ఎన్నుకొనిన అధ్యక్షుడు నియమించిన మంత్రివర్గము పరిపాలనను నిర్వహించుచున్నది. చీ. శే. రా.

**ఇరాన్ :** ఆసియాలో ఒక స్వతంత్ర రాజ్యము. దీనినే పరిష్యా అనియు, పారసీకమనియు పేర్కొందురు.

ఈ దేశమునకు సోవియట్ రష్యా, కాస్పియన్ సముద్రము [ఉ]; ఆఫ్ఘనిస్థాన్, పాకిస్తాన్ [తూ]; అరేబియా సముద్రము, పారసీక సింధుశాఖ [ద]; ఇరాక్, టర్కీ [ప]. [వి] 16,48,000 చ. కి. మీ.; [జ] 2,22,26,000; [భా] జాతీయభాష పారసీకము, కాని, టర్కిష్ ఆర్మీనియన్‌లు వాయవ్యమునను, పశ్చిమమున కుర్దూ భాషయు, దక్షిణమున అరబ్బీయు, తూర్పున పుష్తూయు కొన్ని అల్పసంఖ్యాక వర్గములచే ఆ యా ప్రాంతములయందు మాట్లాడబడుచున్నవి; [మ] ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు ముస్లిమ్‌లు; [రా] టెహరాన్ (జ. సం. 15,12,082).




చరిత్ర: అతి ప్రాచీన నాగరకత కలిగిన ప్రాంతములలో ఇరాన్ దేశము ఒకటి. పురాతత్త్వ శాస్త్రజ్ఞులు ఈ దేశమున అనేక ప్రాంతములందు సాగించిన త్రవ్వకములవలన చరిత్రకు అందని పురాతన యుగముల నుండియు మానవులు ఇట వసించుచుండిరని స్పష్టమగుచున్నది. దాదాపు క్రీ. పూ. 6000 లోనే శిలాయుగపు మానవులు ఇట వసించి వ్యవసాయ, పశుపోషణాదులలో పరిమిత కుశలతను ఆర్జించి ఉండిరని తెలియవచ్చుచున్నది.

క్రీ. పూ. 3000 ప్రాంతమున కంచు (బ్రాంజ్) అను మిశ్ర ధాతువుయొక్క వాడుకను ఎరిగిన మానవ నాగరకత ఇట వర్ధిల్లినది.

ప్రాచీన యుగము: క్రీ. పూ. 2000 ప్రాంతమున ఆర్య జాతులు ఇటకు అంతటంతట వచ్చి చేరినవి. కాని, తొలుతటి వారిలో పలువురు క్రమముగ భారతదేశము వైపునకు పయనించగా (క్రీ. పూ. 1500), ఆ తరువాత వచ్చినవారు (క్రీ. పూ. 900) ఇరాన్‌నే తమ మాతృభూమిగ చేసికొనిరని కొందరు చారిత్రకుల భావన. ఇటుల వచ్చిన ఆర్యులలో మీడులు, పారసీకులు అను రెండు తెగలు ఈ దేశ ప్రాభవమునకు మూలస్తంభములైనవి. మీడులు పశ్చిమ ఇరాన్‌నందు చేరి అట ఒక రాజ్యమును స్థాపించి, ఏకబతన్ (నేటి హందాన్ నగరము) ను తమ రాజధానిగ చేసికొనిరి. పారసీకులు దక్షిణ ఇరాన్‌ను తమ నెలవుగ చేసికొనిరి. మీడుల రాజగు 'క్షయార్ష'[1] (క్రీ. పూ. 625 - 585 ప.) ప్రక్కన ఉన్న అసీరియా రాజ్య ప్రాబల్యమును అణచి, దక్షిణ దేశమును కూడ ఆక్రమించి, నూతన రాజ్యమును సంస్థాపించెను. కాని, త్వరలోనే పారసీకుల రాజగు 'కురుష్'[2] తిరుగుబాటుచేసి మీడు రాజ్యమును అంతమొందించి తన ఆధిపత్యమున మీడు, పారసీక రాజ్యములను ఏకరాజ్యముగ రూపొందించుటయే కాక, విశాల సామ్రాజ్య నిర్మాత అయ్యెను. ఈతని వంశమే 'హఖమనీషి'[3] వంశమని పేరొందినది. ఆతని తరువాత ఈ హఖమనీషి సామ్రాజ్యమును క్రమముగ పాలించిన చక్రవర్తులలో 'కాంభోజ'[4], 'దుర్యావష'[5], 'క్షరక్ష'[6] 'ఋతక్షరక్ష'[7] అను వారలు ప్రముఖులు. గ్రీస్, ఈజిప్టు దేశములు సైతము వీరి దిగ్విజయయాత్రలకు లోనైనవి. [చూ. పు. 34]. తూర్పున సింధునది వరకును వారి సామ్రాజ్యము విస్తరించెను. ఆ ప్రభువులు జరతుష్ట్ర మతావలంబకులు. ఈ జరతుష్ట్ర మతమునే జొరాష్ట్రియన్ మతమనియు వ్యవహరింతురు [చూ. జొరాష్ట్రియన్ మతము సం. 7. పు. 424].

మహావిజేత అలెగ్జాండర్ సాగించిన ప్రాచ్య దిగ్విజయ కాలమున (క్రీ. పూ. 334 – 330) ఈ పారసీక సామ్రాజ్య సౌధము అతని ధాటికి నేలమట్టమయ్యెను. ఆ తరువాతి శతాబ్దమున దేశాటులును, ఆయుధోపజీవులును అగు శక జాతియోధులు హఖమనీషి సామ్రాజ్యమునందలి పార్థవ రాష్ట్రమును ఆక్రమించి, తమ నెలవుగ ఏర్పరచుకొని, దానిని ఒక స్వతంత్ర రాజ్యముగ రూపొందించి, క్రమముగ పారసీక రాజ్య ప్రభువులైరి. వీరు హఖమనీషి రాజ వంశమునకు చెందినవారుగనే వ్యవహరించి, ఆ రాజ్య ప్రాబల్యమునకును, సంస్కృతి పునరుజ్జీవనమునకు తోడ్పడిరి. వీరికి పార్థియన్‌లను వ్యవహారము కలిగినది. ఆ కాలముననే పశ్చిమ ఆసియాయందు తమ సామ్రాజ్యమును వ్యాపింపజేయ నెంచిన రోమన్ చక్రవర్తులతో ఈ పార్థియన్ ప్రభువులు నిరంతర సమరములందు మగ్నులు కావలసి వచ్చెను. తత్ఫలితముగ వీరి ప్రాభవము సన్నగిలుటయు, సామంతులగు ససానియన్ వంశీకులు పారసీక రాజ్య ప్రభువులు అగుటయు సంఘటిల్లెను. కాని, రోమన్ సామ్రాజ్యముతో పోరుమాత్రము అంతములేకుండ సాగుచుండెను. రోమన్‌సామ్రాజ్యము రెండుభాగములై పశ్చిమ ఆసియాయందు బైజాంటియన్ సామ్రాజ్యము ఏర్పడిన తరువాత ససానియన్‌లు ఆ సామ్రాజ్యముతోకూడ తమ పోరాటమును సాగించిరి. ఇరాన్ దేశమున జాతీయ సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమమునకు ససానియన్ పాలకులు చేయూత నొసగి, పారసీక సంస్కృతికి ఆసియాదేశమందు ప్రముఖ స్థానమును కల్పించిరి.

మధ్య యుగము: ఏడవ శతాబ్దపు తొలి పాదమున ముస్లిమ్ మతావేశ ప్రేరితులగు అరబ్బు యోధులు ససానియన్ సామ్రాజ్యమును అంతమొందించి, ఇస్లామ్ మతమును అట వ్యాపింప జేసిరి. సనాతన జరతుష్ట్ర మతానుయాయులకు అంతట అచ్చట తావులేకపోవుటచే అందు కొందరు ఉపలబ్ధములగు కొన్ని మత గ్రంథములతో భారతదేశమునకు వలసపోయిరి. ఇటుల వలసపోయిన వారి సంతతివారే నేడు భారత దేశమున 'పార్సీ'లు అను పేర వ్యవహరింపబడుచున్నారు. క్రీ. శ. 9 వ శతాబ్దికి ఇరాన్ దేశమున దాదాపుగ అంతటను ఇస్లామ్ వ్యాపించి, అది జాతీయ మతముగ రూపొందెను. అంతటినుండి అరబ్బు ఆధిపత్యము సన్నగిలి, ముస్లిమ్‌లగు ఇతర రాజవంశీకులు ముందునకు రాదొడగిరి. ఇటుల పేరునకువచ్చిన వంశములలో గజ్నవీ వంశ మొకటి. ఈ వంశమునకు చెందిన గజనీ మహమూద్ (11 వ శతాబ్ది) పేరొందిన విజేత. పశ్చిమ ఇరాన్ మొదలుకొని సింధునదివరకును వ్యాపించిన సామ్రాజ్యమును ఈతడు నెలకొల్పుటయే కాక, కళా పరిపోషకుడుగ కూడ పేరొందెను. ఈ గజ్నవీ వంశీయులను అంతమొందించి, తుర్కీ జాతివారగు సెల్జుక్‌లు రాజ్యమును ఆక్రమించిరి. వీరి కాలమున ఈ సామ్రాజ్యము బాస్ఫరస్ జలసంధినుండి చీనీయ తుర్కీస్తాన్ వరకు

1. సియాగ్జరీస్, 2. సైరస్, 3. అకెమీనిడ్, 4. కేంబిసిస్, 5. డరయస్, 6. క్సెర్క్సస్, 7. ఆర్టక్సెర్క్సస్, అను పేరులు పై మూల పారసీక నామములకు వికృత రూపములుగా గ్రీక్, లాటిన్ భాషలనుండి నేటి చరిత్రలోనికి వచ్చి చేరినవి.

వ్యాపించెను. పారసీకేతరులయ్యును ఈ వంశపు ప్రభువులు పారసీక సంస్కృతిని అవలంబించి దానిని పరిపోషించిరి. క్రీ. శ. 12 వ శతాబ్ది ఉత్తరార్ధమున వీరిని అంతమొందించి ఖ్వార్ జమ్‌షాలు అనబడు రాజవంశమువారు ఆ రాజ్యమును ఆక్రమించి కొంతకాలము పాలించిరి.

ఇంతలోనే చెంఘిజ్‌ఖాన్ నాయకత్వమున మంగోల్ సేనానివహములు ఆసియా ఖండమును సంక్షోభిత మొనరింప మొదలిడెను. చెంఘిజ్‌ఖాన్ మనుమడగు హులగూ ఇరాన్ దేశమును, తత్పరిసర ప్రాంతములను జయించెను. ఇతనికి గల అధికార బిరుదమును అనుసరించి ఇతని వంశమునకు 'ఇల్ ఖాన్ వంశము' అను పేరు కలిగినది. ఈ వంశీయులును పారసీక జాతీయ సంస్కృతిని, ఇస్లామ్ మతమును అవలంబించి దేశీయులతో కలసి మెలసి వ్యవహరించిరి. 14 వ శతాబ్ది కడపటి భాగమున, అంతఃకలహముల మూలమున ఈ రాజవంశము బలహీనము కాగా, ఇంకొక మంగోలియన్ విజేత - తైమూర్ - ఈ రాజ్యమును తన సామ్రాజ్యమున అంతర్భాగము కావించుకొనెను (1380 - 90). కాని, తైమూర్ సంతతివారలు సమర్థులు కాకపోవుటచే, ఆ సామ్రాజ్యము నుండి ఇరాన్ 16 వ శతాబ్ది తొలుతటి పాదమున విడివడెను. అంతట దేశమునందలి వివిధ మాండలికులు స్వతంత్రులై అల్ప రాజ్యములు నిర్మించుకొనిరి. ఈ మాండలిక వంశములలో ప్రముఖమైనది సఫావీ రాజవంశము. ఇస్లామ్ నందలి షియాశాఖకు ప్రవర్తకుడగు వాని వంశము ఇది. అందులకు తోడుగ వీరు అచ్చమగు పారసీక జాతికి చెందినవారు అగుటచే త్వరలోనే ఆ వంశము ప్రాబల్యమును గడించి, షియా సంప్రదాయమునకు ఇరాన్‌లో ఆధిక్యమును కల్పించి, రాజ్యమును తన ఆధిపత్యముక్రింద ఏకీకృతము ఒనర్చెను. వీరి కాలమున ఇస్ఫహాన్ నగరము దేశమునకు రాజధాని యయ్యెను. జాతీయ సంస్కృతికి పునర్వికసనము కలిగెను. కాని, క్రమముగ ఈ ప్రభువులు బలహీనులు కాగా 1722 లో ఆఫ్ఘన్ సేనలు ఈ దేశమును ఆక్రమించెను. అంతట దేశీయ యువకులను సమీకరించి నాదిర్ కులీ అను నాయకుడు ఆఫ్ఘన్‌లను తరిమివేసి, 1736 లో నాదిర్‌షా అను పేరుతో తానే రాజ్యాధిపతి అయ్యెను.

**ఆధునిక యుగము :** 18 వ శతాబ్ది అంతమున కజార్ అను తుర్కి తెగ యోధులు ఈ దేశమును వశపరచుకొని, 1926 వరకు పాలించిరి. వీరిలో చివరవాని కడ తొలుత యుద్ధ మంత్రిగను, తరువాత ప్రధాన మంత్రిగను పనిచేసిన రిజాఖాన్ అను పారసీక యోధుడు 1926 లో రాజ్యమును వశపరచుకొని రిజాషా అను పేరుతో రాజయ్యెను. ఈతని వంశము పహ్లవీ అను పేర వ్యవహరింపబడుచున్నది. ఈతని పరిపాలన 1941 వరకు నిరాటంకముగ సాగెను. అంతట ప్రపంచ యుద్ధము - II జరుగు సమయమున జర్మనులు ఈ దేశమును ఆక్రమింపకుండ ముందుగ జాగ్రత్త వహించుటకై ఈ దేశమున బ్రిటిష్ సేనలు దక్షిణ భాగమును, సోవియట్ సేనలు ఉత్తర భాగమును ఆక్రమించెను. అంతట రిజాషా రాజు పదవిని త్యజించగ అతని కుమారుడు మహమ్మద్ రిజా పహ్లవీ రాజయ్యెను. ప్రపంచ యుద్ధము - II తరువాత బ్రిటిష్ సేనలు ఇరాన్ నుండి వైదొలగెను. కాని, సోవియట్ రష్యా సేనలు ఏదియో నెపమున కొంతకాలము ఇటనే ఉండి, క్రమముగ ప్రపంచాభిప్రాయమునకు లొంగి వైదొలగెను. ప్రభువగు మహమ్మద్ రిజా ఉదారభావ ప్రేరితుడు అగుటచే దేశమందు నూతన సంస్కరణములును, రాజకీయ పక్షములకు పలుకుబడియు కలిగెను. 1941 నుండి 1953 వరకు ప్రధాన మంత్రిగా ఉండిన మొసాదిక్ తీవ్రభావ ప్రేరితుడు అగుటచే ప్రభువు ఆమోదము లేకుండగనే అతడు తీవ్ర సంస్కరణములను ప్రవేశపెట్టెను. విదేశీయ వర్తక సంస్థల ఆధిపత్యమున ఉన్న నూనె కర్మాగారములను అతడు జాతీయము ఒనర్చెను. క్రమముగా రాజునకును, ప్రధాన మంత్రికిని మధ్య అభిప్రాయ భేదములు ఎక్కువ అగుటచే, మహమ్మద్ షా తన రాజ్యమును వదలి విదేశములకు పోయెను (1953). అంతట త్వరలోనే మొసాదిక్ ప్రభుత్వము పతనము కాగా, మహమ్మద్ షా దేశమునకు తిరిగివచ్చి ప్రజామోదముతో ఆధిపత్యము వహించెను. 1954 లో దేశప్రభువే వ్యవసాయరంగమున నూతన సంస్కరణలను ప్రవేశపెట్టి, తన సొంత భూములను పంచి ఇచ్చెను. తరువాత దానిని దేశమంతట విస్తరింపజేయుటకు అతడు ఉద్యమించగ పలుకుబడి గల భూస్వామి వర్గపు రాజకీయ వాదులును, రాచరికపు వ్యతిరేకులును నిరోధించిరి. తుదకు ఈ విషయముపై జనాభిప్రాయమును సేకరించుటకు రాజు ఏర్పాటు చేయగా ప్రజలు రాజు వాదమునే సమర్థించిరి (1963). ప్రపంచ రాజకీయములందు ఇరాన్ పాశ్చాత్యరాజ్యముల వైపునకు మొగ్గి వ్యవహరించుచున్నది. 'బాగ్దాద్ ఒడంబడిక' అని వ్యవహరింపబడు మధ్య ప్రాచ్య రక్షణసంధి (సెంటో) [చూ.] లో పాకిస్తాన్‌తోపాటుగ ఇరాన్ కూడ సభ్యత్వము వహించి యునైటెడ్ స్టేట్స్, బ్రిటన్ దేశములతో సహకరించుచున్నది.

రాజ్యాంగము : రాజ్యాంగ బద్ధము, వంశానుగతము అగు రాచరికము ఇట పరిపాలన నెరపుచున్నది. 1907 లో తొలుత ప్రచురితమై అంతటంతట క్రమముగ 1925, 49, 57 లలో సవరణలను అందిన రాజ్యాంగచట్టమును అనుసరించి రాజ్యాంగ నిర్వహణ ఇట జరుగుచున్నది. షా (రాజు) ముస్లిమై ఉండవలెను. చరమ నిర్ణయాధికారము రాజునకే చెంది ఉన్నది. శాసన సభయందు రెండు కక్ష్యలు కలవు. తన ఇచ్చవచ్చినపుడు ఈ రెండింటిని లేదా ఒకదానిని రాజు రద్దు చేయవచ్చును. శాసనసభలో తొలుతటి కక్ష్యకు 'మజిలిస్' అని వ్యవహారము కలదు. రెండవది సెనేట్. తొలుతటి దాని యందు 200 మంది సభ్యులును, రెండవ దానియందు 60 మంది సభ్యులును ఉందురు. సెనేట్ సభ్యులలో సగము మందిని రాజు నియమించును. తక్కిన సగముమంది రెండు అంచెలలో ఎన్నుకొనబడుదురు. 20 ఏండ్లు దాటిన పురుషులు అందరికి వోటు హక్కు కలదు. ఆర్థిక విషయములందు సెనేట్‌కు మాత్రము అధికారములేదు. తక్కిన అన్ని శాసన నిర్మాణ విషయములందును ఉభయ కక్ష్యలకు సమానత్వము కలదు.

రిజా షా కాలమునందు ఈ దేశమున రాజకీయ పక్షములు నిషేధింపబడినవి. కాని, ఇప్పటి ప్రభువు రాజకీయ పక్షముల ఉనికి సమ్మతించుటచే 1941 నుండి రాజకీయ పక్షములు అనేకములు ఏర్పడినవి. వీనిలో జాతీయపక్షము, టూడే (ప్రజానీక) పక్షము ప్రధానములు. ఇందు రెండవది కమ్యూనిస్ట్ సిద్ధాంతములయందు విశ్వాసము కలది. 1957 నుండి ప్రభుత్వ ప్రోత్సాహమున మరికొన్ని నూతన పక్షములు బయలుదేరినవి. వీనిలో ప్రముఖమైనది మర్దమ్ (ప్రజా) పక్షము.

చీ. శే. రా.

**ఇల్టుమిష్** (క్రీ. శ. 1211 - 1236) : ఉత్తర భారతదేశమును పాలించిన బానిసవంశపు ప్రభువులలో సుప్రసిద్ధుడు. మహమ్మద్ ఘోరీ తరువాత కుతుబుద్దీన్ స్థాపించిన ఢిల్లీ రాజ్యము శీఘ్రకాలములో అధోగతికి వచ్చినది. 1211 లో సింహాసనమును ఎక్కిన సుల్తాను (ఆరాంఖాన్) బలహీనుడు. ఈ అవకాశమును కనిపెట్టి ప్రాంతపాలకులు స్వతంత్రప్రభువులైరి. దేశ మధ్యమందలి కలహములకు తోడు దేశాంతరమునుండి మంగోల్‌ల దండయాత్రలు కూడ సంభవించినవి. ఇట్టి కష్టములవలన రాజ్యము విచ్ఛిన్నముకాగల విపత్తు ఏర్పడెను.

ఈ క్లిష్ట పరిస్థితులలో కుతుబుద్దీన్ అల్లుడగు ఇల్టుమిష్ ఢిల్లీయందలి తురుష్క సామంతుల సహాయముతో ఆరాంఖాన్‌ను తొలగించి ఢిల్లీ సింహాసనము ఆక్రమించి, తన అధికారమును సుస్థిరము చేసికొనుటకు పూనుకొనెను. ఇందుకై తొలుత తిరుగబడిన సైనికోద్యోగులను లోబరచుకొని, తదుపరి బెంగాల్ రాష్ట్ర పాలకుడగు ఆలీమర్దాన్ ఖిల్జీని, సింధు ప్రాంతమును ఏలు నాజిరుద్దీన్ కుబాచాను, పంజాబును ఆక్రమించిన తాజుద్దీన్ ఇల్దుజ్‌ను లోబరచుకొనెను. అంతఃకలహము నడచు కాలమునందే బాహ్య శత్రువులగు మంగోల్‌లు చెంఘిజ్‌ఖాన్ నాయకత్వమున పశ్చిమ పంజాబు వరకును దండెత్తివచ్చిరి; కాని, వెంటనే వెడలిపోయిరి. అయితే, మంగోల్‌ల దాడివలన భయము దేశమందు వ్యాపించుటచేత ఇల్టుమిష్ తన వైరులగు రాష్ట్ర పాలకులను లోబరచుకొనుటకు అవకాశము చిక్కినది. ఇట్లు వంశానుగతముగ వచ్చిన రాజ్యమును విచ్ఛిన్నము కాకుండ కాపాడుకొనుటయే కాక, అతడు దానిని విస్తరింపజేసికొనెను. రాజపుత్ర వీరులతో పోరాడి రణతంబోరు, మందోర్, గ్వాలియర్, మాల్వా ప్రాంతములను కలుపుకొనెను. చివరకు వింధ్యకు ఉత్తరమునగల దేశమునంతను తన ఏకచ్ఛత్రాధిపత్యము క్రిందికి తీసికొనివచ్చెను. ఇతని శక్తి, సామర్థ్యముల గుర్తించి బాగ్దాద్‌లోని కలీఫా తన హర్షామోదములను ప్రకటించెను.

ఇల్టుమిష్ తన రాజ్యమును ఆంతరంగికముగ విద్రోహులనుండి, బాహ్యముగ శత్రువులనుండి రక్షించి విస్తృతమొనర్చి సమర్థతతో 25 ఏండ్లు పాలించెను. పరరాజ్యములను జయించుటయందే కాక, పాలనయందుగూడ నైపుణ్యమును ఇతడు ప్రదర్శించెను. తన పూర్వీకుడగు కుతుబుద్దీన్ వలె మత ప్రచారమునకును, భవన నిర్మాణమునకును చాల తోడ్పడెను. యుద్ధ - శాంతి సమయములందు ఇల్టుమిష్ కనబర్చిన ప్రజ్ఞా విశేషమును బట్టి ఇతనిని కొందరు చరిత్రకారులు బానిస వంశపాలకులందరిలో గొప్పవాడని కీర్తించిరి.

ఓ. ఎస్. ఎస్. మూర్తి.

**ఇస్తాంబుల్** (కాన్‌స్టాంటినోపుల్) : టర్కీదేశములోనికెల్ల పెద్దనగరము. ప్రపంచచరిత్రలో అత్యంత ప్రాచీన కాలమునుండి ప్రసిద్ధి వహించిన కాన్‌స్టాంటినోపుల్ నగరమునకే టర్కీ ప్రభుత్వము 1929 లో 'ఇస్తాంబుల్' అని క్రొత్త పేరు పెట్టినది. 1923 వరకు టర్కీకి ఇది రాజధానిగా ఉండెను; నాటినుండి 'అంకారా' టర్కీకి రాజధాని అయినది. ఈ నగరము రాజధాని గౌరవమును కోల్పోయినను, ఆర్థిక, పారిశ్రామిక, సాంస్కృతిక ప్రాముఖ్యము మాత్రము ఈ నగరమునకు తగ్గిపోలేదు. 1900 లో ఈ నగరమున స్థాపించిన జాతీయ విశ్వవిద్యాలయము శాఖోపశాఖలుగా వృద్ధి పొందినది. ఈ నగరమందలి జనసంఖ్య 10 లక్షలకు పైగా ఉన్నది. ఇంత జనసంఖ్యగల నగరము టర్కీలో మరొకటి లేదు.

గ్రీక్ పురాణ గాథలనుబట్టి జేసన్ యాజమాన్యమున ఆర్గొనాట్‌లని వ్యవహరింపబడు నావికులు బాస్ఫరస్ జల సంధి ద్వారా నేడు ఇస్తాంబుల్ నగరము నిలచి ఉన్న ప్రదేశమువరకు 'బంగారపు ఉన్ని' కొరకై ప్రయాణించి వచ్చినట్లు తెలుస్తున్నది. క్రీ. పూ. 500 ప్రాంతమున సాహసికులైన గ్రీక్ నావికులు కొందరు 'బైజాంటియమ్' అను పేర మొదట ఈ నగరమును స్థాపించిరి. క్రీ. పూ. 513 లో పరిష్యా రాజు డరైయస్ - I (దుర్యూష) 'బైజాంటియమ్' ను జయించి కొంతకాలము తన పాలనము క్రింద నిలుపుకొనెను. క్రీ. పూ. 333 ప్రాంతమున మేసిడోనియా రాజు అలెగ్జాండర్ ఈ నగరమును జయించెను. పిమ్మట కాలక్రమమున ఈ నగరము రోమన్ సామ్రాజ్యమున అంతర్గతమైనది. క్రీ. శ. 330 ప్రాంతమున రోమన్ చక్రవర్తి కాన్‌స్టాన్‌టైన్ ఈ నగరమును విస్తరింపజేసి, తన ప్రాచ్య సామ్రాజ్యమునకు రాజధానిగా చేసెను. అతడు దీనిని 'క్రొత్త రోమ్ (న్యూ రోమ్)' అని వ్యవహరించినను, అతని అనంతరము 'కాన్‌స్టాంటినోపోలిస్' (కాన్‌స్టాన్‌టైన్ నగరము) అను వ్యవహారము ఏర్పడినది. రోమ్ పతనము చెందిన తరువాత దాదాపు వేయి ఏండ్లు కాన్‌స్టాంటినోపుల్ నగరమే బైజాంటైన్ సామ్రాజ్యమునకు రాజధానిగా ప్రపంచ ప్రసిద్ధిపొందెను [చూ. సమీక్ష - పు. 43].

ఒటోమన్ తుర్కులు 1453 లో బైజాంటైన్ సామ్రాజ్యమును అంతమొందించి, ఈ నగరమును వశపరచుకొనిరి. అంతట 1453 మొదలు 1923 వరకు ఈ నగరము కొంతకాలము ఒటోమన్ సామ్రాజ్యమునకున్ను, తరువాత కొంతకాలము టర్కీ దేశమునకున్ను రాజధానిగా ఉండెను.

బొ. శ్రీ.

**ఈక్వడార్ :** దక్షిణ అమెరికా పశ్చిమ తీరమున భూమధ్య రేఖపై నెలకొని ఉన్న ఒక స్వతంత్రరాజ్యము. భూమధ్యరేఖను బట్టియే ఈ దేశమునకు ఈక్వడార్ అను పేరు కలిగినది.

ఈ దేశమునకు పెరూ [తూ, ద]; కొలంబియా [ఉ]; పసిఫిక్ మహాసముద్రము [ప] సరిహద్దులుగ ఉన్నవి; దేశతీరమునకు దాదాపు 1,120 కి. మీ. దూరమున పసిఫిక్ మహాసముద్రమున నెలకొని ఉన్న గలాపగస్ దీవులును (వైశాల్యము 7,832 చ. కి. మీ.) ఈ రాజ్యమునకే చెంది ఉన్నవి. [వి] ఈ దీవులతో చేరి దేశపు విస్తీర్ణము 2,70,670 చ. కి. మీ. అని అంచనా. పెరూ దేశముతో ఈ రాజ్యమునకు కల సరిహద్దున 180 కి. మీ. పొడవు గల కొంత ప్రదేశమునకు చెందిన సరిహద్దు వివాదము ఇప్పటికిని అపరిష్కృతముగ నిలిచియే ఉన్నది. [జ] 45,81,476. శ్వేతజాతులును, ఆదిమ అమెరికన్‌లును, నీగ్రోలును సంకరమొందగ రూపొందిన మిశ్రజాతికి చెందినవారు ఇందు అత్యధిక సంఖ్యాకులుగ ఉన్నారు. [మ] ప్రజలలో ఎక్కువమంది రోమన్ కేతలిక్‌లు. [రా] క్విటో (జ. సం. 2,99,000).




చరిత్ర : క్రీ. శ. 1,000 కి పూర్వమే ఇచట ఆదిమ అమెరికన్ జాతులు కొన్ని కొంత నాగరకతను ఆర్జించి, ఒక విధమగు రాజ్య సమాఖ్యను ఈ ప్రాంతమున నెలకొల్పుకొని ఉండినటుల తెలియవచ్చుచున్నది. కాని, ప్రక్కనే ఉన్న పెరూ దేశమును అప్పుడు పరిపాలించుచుండిన ఇన్‌కా [చూ.] సామ్రాట్‌లు కడు బలవంతులు అగుటచే ఈ సమాఖ్య 15 వ శతాబ్దిలో ఇన్‌కాలకు లొంగి, క్రమముగ ఇన్‌కా సామ్రాజ్యమున అంతర్భాగమయ్యెను. అప్పటికే దక్షిణ అమెరికాయందు కొన్ని ప్రాంతములలో స్పెయిన్ దేశీయులు కాలూని వలస రాజ్యముల స్థాపించి ఉండిరి. వారికి ఈక్వడార్‌నందలి కొన్ని రేవు పట్టణములతో తొలుత పరిచితి లభించినది. అయినను వారు ఈక్వడార్‌ను వశపరచుకొనుటకు అంతగ శ్రద్ధవహించక, పెరూ దేశమును ఆక్రమించుటకు దీనిని ఒక మజిలీగ మాత్రమే తొలుత ఉపయోగించుకొనిరి. పెరూను ఆక్రమించిన తరువాత స్పానిష్ వారు క్రమముగ ఈ దేశమునుకూడ ఆక్రమించిరి (క్రీ. శ. 1531). అప్పటినుండి దాదాపు మూడు శతాబ్దములపాటు ఈ దేశము స్పెయిన్‌వారి వలస పాలనకు లోబడి ఉండెను. క్రీ. శ. 1822 లో ఈ దేశపు ప్రజలు స్పెయిన్ పాలనను ధిక్కరించి స్వతంత్రతను ఆర్జించిరి. ఆ సమయమునందే పరిసరములందున్న కొన్ని ఇతర దేశములును స్పెయిన్ సామ్రాజ్యమునుండి విడివడినవి. వాని

స్వాతంత్ర్యార్జనకు తోడుపడిన బొలీవర్ [చూ.] అను నాయకుడు ఈక్వడార్ స్వాతంత్ర్యోద్యమమునకును తోడుపడెను. ఇటుల స్వాతంత్ర్యమునందిన వివిధ ప్రాంతములను - అనగా నేటి ఈక్వడార్, కొలంబియా, వెనిజ్యులా, పనామా అని వ్యవహరింపబడు దేశములను - కలిపి ఒక గొప్ప స్వతంత్ర రాజ్యముగ నిర్మింపవలెనని బొలీవర్ తలపెట్టి, అటుల ఐక్య మొనర్చెను. కాని, 1830 లో ఈ ఐక్యమునకు భంగము ఏర్పడి, ఈక్వడార్ వేరుపడి, ఒక నూతన అధ్యక్షుని ఎన్నుకొనినది. ఆ ముహూర్త బలమెట్టిదో కాని, ఆ నాటినుండి ఈనాటి (1966) వరకు ఆ దేశము అవ్యవస్థిత పరిపాలనకు పేరొందినది. ఈ 136 ఏండ్లలో 15 రాజ్యాంగములు మారినవి; 46 గురు అధ్యక్షులు పరిపాలన నెరపిరని పేరే కాని, వీరిలో 12 మంది మాత్రమే నిర్ణీత పదవీకాలము కడవరకు ఉండగలిగిరి. 1860 నుండి 1875 వరకు నియంతగ ఉండిన గేబ్రియల్ గేరియా మొరేనో కాలమున నియంతృత్వ ఫలితముగ దేశమున శాంతియు, సుస్థిరతయు కొంతవరకు నెలకొనినను, అతని పరిపాలన మత ప్రాతిపదికపై నిర్వహింపబడుటచే రోమన్ కేతలిక్‌లకు మాత్రమే ప్రాబల్యము లభించి, తక్కినవారికి అందరకును అసంతృప్తి జనకమయ్యెను. అంతట మితవాదులు ఆ ప్రభుత్వమును కూలద్రోసి, మతమును రాజ్యపరిపాలన నుండి వేరుపరచి, ప్రజలకు భావ, మత, ప్రచురణ స్వాతంత్ర్యములను కొంతవరకు కల్పించిరి. 1944 వరకు దేశము వీరి పరిపాలనలో ఉండెను. తరువాత 1948 వరకు దేశము మరల రాజకీయ కల్లోలములకు నిలయమయ్యెను. 1948 తరువాత ఎడనెడ రాజకీయ కల్లోలములు ఉన్నను, దేశము ఆర్థికముగ చాల పురోగమింప గలిగినది. 1956 నుండి కొంత వరకు రాజకీయ సుస్థిరతను కూడ ఈదేశము ఆర్జించినది.

రాజ్యాంగము: ఈ దేశమున ప్రస్తుతము అమలులో ఉన్న రాజ్యాంగము 1946 లో ఆమోదింప బడినది. ఇది ఆ దేశపు 15 వ రాజ్యాంగము. పరిపాలనయందు కీలకస్థానమును ఆక్రమించునది కౌన్సిల్ ఆఫ్ స్టేట్. అధ్యక్షుని మంత్రి మండలి సభ్యులును, కాంగ్రెస్, సుప్రీమ్ కోర్టుల ప్రతినిధులును ఇందు సభ్యత్వము కలిగి ఉందురు. అధ్యక్షుడు నాలుగేండ్లకు ఒకమారు ప్రజలచే ఎన్నుకొనబడును. కాని, ఒకసారి అటుల ఎన్నికైన అతడు ఆ వెనువెంటనే ఆ పదవికి మరల ఎన్నుకొనుట నిషిద్ధము. అధ్యక్షుడే సర్వసేనాపతి; రాజ్యపాలకుడు. దేశమున అత్యాయిక పరిస్థితి ఉదయించినపుడు ఇతడు తనంతట తానే విస్తృతాధికారముల వహింప అధికారము గలిగి ఉన్నాడు. అధ్యక్షుడు తన ఇచ్చవచ్చిన తొమ్మిదిమందిని మంత్రి మండలి సభ్యులుగ నియమించును. వీరు అధ్యక్షునకు బాధ్యత వహించి పని చేయుదురు. కాంగ్రెస్‌నందు సెనేట్, ఛేంబర్ ఆవ్ డిప్యుటీజ్ అను రెండు కక్ష్యలు కలవు. తొలుతటిదానిలో 47 గురు సభ్యులు ఉందురు. వీరిలో 35 గురు వివిధ రాష్ట్రముల నుండియు, 12 మంది వివిధ వృత్తి సంఘముల నుండియు నాలుగేండ్లకు ఒక పర్యాయము ఎన్నుకొనబడుదురు. ఛేంబర్ ఆవ్ డిప్యుటీజ్‌లో ఉండు 73 గురు సభ్యులను రెండేండ్లకు ఒకతూరి ప్రజలు ఎన్నుకొనెదరు. 18 ఏండ్లు, అంతకు మించిన వయస్సు కలిగిన, విద్యావంతుడైన ప్రతి పౌరునికి వోటు హక్కు కలదు. వోటుచేయుట అనునది పురుషులకు అనుల్లంఘనీయమగు విధి. స్త్రీలకు మాత్రము ఐచ్ఛికము. చీ. శే. రా.

**ఈజిప్టు**: ఉత్తర ఆఫ్రికాయందలి ఒక స్వతంత్ర రాజ్యము. 1958 ఫిబ్రవరిలో ఈ దేశముతో సిరియాదేశమును కలసి సమాఖ్యగ రూపొందినపుడు ఈ సమాఖ్యకు (సంయుక్త అరబ్ రిపబ్లిక్) అను పేరు కలిగినది. తరువాత సిరియా విడిపోయినను ఈ దేశము మాత్రము సంయుక్త అరబ్ రిపబ్లిక్ (U. A. R. యునైటెడ్ అరబ్ రిపబ్లిక్) అనియే నేడు వ్యవహృతమగుచున్నది.




ఆఫ్రికా ఖండమున ఈశాన్య భాగమునందు నెలకొని ఉన్న ఈ దేశమునకు మధ్యధరా సముద్రము [ఉ]; జోర్డాన్, ఇజ్రాయెల్, ఎర్రసముద్రము [తూ]; సుడాన్ [ద]; లిబియా [ప] సరిహద్దులందున్నవి. [వి] 10,00,854 చ. కి. మీటర్లు; [జ] 2,60,80,000; [భా] అరబ్బీ భాష; [మ] ప్రజలలో 91% ముస్లి

ములు; క్రైస్తవులు 8% కలరు. తక్కినవారు యూదులు. [రా] కైరో (జ. సం. 30,35,000).

చరిత్ర: అతి ప్రాచీనకాలమునుండియు అవిచ్ఛిన్నముగ నడచుచున్న చరిత్ర గల దేశములలో ఇది ఒకటి. 19 వ శతాబ్ది అంతమున పురాతత్త్వశాస్త్రజ్ఞులు సాగించిన పరిశోధనల మూలమున ప్రాచీన ఈజిప్టువాసులు ఉపయోగించిన చిత్రలిపి (హైయరగ్లిఫిక్స్) ని చదువుమార్గము ఏర్పడినందున, ఆ దేశపు ప్రాచీన చరిత్రను గురించిన వివరములు అనేకములు తెలియవచ్చినవి.

చరిత్ర పూర్వయుగము: అతి ప్రాచీన కాలమునుండియు మానవావాసముగ ఉండిన ఈ దేశపు చరిత్ర పూర్వయుగపు కాలపరిమితి దీర్ఘమని పురాతత్త్వ విదుల భావన. అప్పటి కాలమునందు ప్రాచీన, నూతన శిలాయుగపు ప్రజలు నివసించి ఉండినట్లు చరిత్రజ్ఞులు భావించుచున్నారు. వారు ఉపయోగించిన పాత్రలు, పరికరములు, ఆయుధములు చాల దొరకినవి. వీరు వేర్వేరు తెగలుగ తమ నాయకుల పాలనమున ఉండినట్లును, క్రమముగ చిన్న చిన్న నగర రాజ్యములు స్థాపించుకొని, తమలో తాము పోరాడుకొనుచుండినట్లును, క్రీ. పూ. నాలుగువేల ఏండ్ల ప్రాంతమున ఈజిప్టు రెండు రాజ్యములుగా ఏర్పడినట్లును చరిత్రజ్ఞులు నిర్ణయించుచున్నారు.

చారిత్రక యుగము: ఈజిప్షియన్లు సుమారు క్రీ. పూ. 3,400 నరికి వ్రాత మొదలుపెట్టి ఉండిరి. అప్పటినుండి వారి చరిత్రను మూడు భాగములుగ విభజింపవచ్చును: 1. క్రీ. పూ. 3,400 – 2,500 వరకు ప్రాచీన రాజ్యకాలము; 2. క్రీ. పూ. 2,500 – 1,580 వరకు మధ్య యుగము; 3. క్రీ. పూ. 1,580 – 525 వరకు సామ్రాజ్య యుగము. ఈజిప్టునందలి రెండు రాజ్యములను కలిపి ఒకే రాజు పాలించిన నాటినుండియు ప్రాచీన రాజ్య కథ ప్రారంభమగును. ఈ రెండు రాజ్యములును మెనెస్ అను రాజు కాలమున సుమారు క్రీ. పూ. 3,400 లలో ఏక రాజ్యముగనైనవి. అప్పటినుండి మూడువేల ఏండ్లపాటు ఈజిప్టు దేశమును 'ఫారో' అను బిరుదము కల రాజులు పాలించుచుండిరి. ఈ రాజ్యమునకు చాలకాలమువరకు 'మెంఫిస్' రాజధానిగ ఉండెను. మెనెస్ కాలము నాటినుండి గ్రీక్ రాజగు అలెగ్జాండర్ క్రీ. పూ. 332 లో ఈజిప్టును జయించునాటికి ముప్పదియొక్క వంశముల రాజులు ఈజిప్టును పాలించి ఉండిరి.

ప్రాచీన యుగము: ప్రాచీనకాలపు రాజుల వైభవప్రాభవములను వారు నిర్మించిన పిరమిడ్‌లు [చూ.] వేనోళ్ల చాటుచున్నవి. ప్రపంచ చిత్రములలో ఈ పిరమిడ్‌లు ఎన్నదగినవి. ఇవి రాజులయు, వారి సామంతులయు సమాధులు. 'గిజా' యొద్ద నిర్మించిన 'పిరమిడ్' అన్నిటికన్న మిన్న. దానిని 'కూఫూ' అను ఫారో నిర్మించెను. దాని నిర్మాణమునకై నూరువేలమంది పనివాండ్రు ఇరువది ఏండ్లు పనిచేసి ఉందురని చరిత్రజ్ఞులు భావించుచున్నారు. ఇది నేల మట్టము నొద్ద 72 చదరపు మీటరులు గలది. దీని ఎత్తు 137 మీటరులు. ఇది ఒక్కొక్కటి 2,032 కిలోగ్రాముల బరువు గల ఇరువదివేల రాళ్లచే నిర్మితమైనదట.

మధ్య యుగము: మధ్య యుగమంతయు యుద్ధ పరంపరతో అరాజకముగ ఉండెను. బలహీనులైన రాజులు సింహాసనమును అధిష్ఠించుచుండుటచే సామంతులు ప్రబలులై రాజులను మరింత బలహీనులను చేసిరి. ఏకమై ఉండిన రాజ్యము విచ్ఛిన్నమై ఎన్నియో చిన్న చిన్న రాజ్యములు ఉద్భవించెను. ప్రజలు అష్టకష్టముల పాలైరి. ఈ కాలమున సెమిటిక్ జాతికి చెందిన 'హిక్సాస్' అను గోపాలకవంశ రాజులు ఈజిప్టును జయించిరి. వీరు గొప్ప వీరులై, ఇనుముతో తయారుచేసిన ఆయుధములతో ఈజిప్షియన్‌లను సులభముగ ఓడించి, ఈజిప్టును ఆక్రమించుకొనిరి. వీరు విదేశీయులయ్యును, ఈజిప్షియన్‌ల ఆచార వ్యవహారములను అవలంబించి పూర్వపు ఫారోల బిరుదముల దాల్చి, ఈజిప్షియన్‌లతో ఏకమైపోయిరి. వీరి పరిపాలన కాలములో రాజ్యము ఎక్కువగా విస్తరించెను. ఆ కాలమందే సిరియా కూడ వీరి పాలనములోనికి వచ్చినది. కాని, క్రీ. పూ. 1580 లో ఈజిప్షియన్‌లు తిరుగుబాటుచేసి వీరి పాలనను అంతమొందించిరి.

సామ్రాజ్య యుగము: హిక్సాస్‌ల పాలనానంతరము 18 వ వంశపు రాజులు సింహాసనము ఎక్కిరి. వీరి పాలనమున ఈజిప్టు మహోన్నత స్థితికి వచ్చెను. వీరు మహాసామ్రాజ్యము స్థాపించి, అఖండ వైభవముతో 450 ఏండ్లు పాలించిరి.

ఈ కాలమునకు సంబంధించిన అనేక విశేషములను సుప్రసిద్ధమయిన 'కర్ణక్' దేవాలయము తెలియజేయుచున్నది. ఇది 'తీబ్స్' పట్టణమున ఉన్నది. దీని నిర్మాణమునకు 2,000 ఏండ్లు పట్టినదట. అప్పటి రాజులందరును తమ శక్తికొలది ఆ దేవాలయమును శిల్పకళాకౌశలముచే అలంకరింప యత్నించిరి. ఆ దేవాలయపు గోడలన్నియు అమూల్యమైన శిల్పములతోను, శాసనములతోను చిత్రితములై, నాటి ఈజిప్షియన్‌ల కళానైపుణ్యమును బహుముఖముల చాటుచున్నవి.

ఈ వంశపు చక్రవర్తులలో థుత్మసిస్ – III మహాయోధుడు. తాను పాలించిన ఏబది వత్సరములలో థుత్మసిస్ – III దిగ్విజయయాత్రలు ఎన్నియో చేసి, అనేక

శత్రు రాజులను జయించి, ఈజిప్టు కీర్తిని నలు దిక్కుల వ్యాపింపజేసెను. సుడాన్, పాలస్తీనా, సిరియా, పడమటి ఆసియా రాజులతో యుద్ధములు చేసి వారిని ఓడించెను. తన నౌకా బలముచే 'ఈజియన్' ద్వీపములను కొన్నిటిని జయించెను.

థుత్మసిస్ - III అనంతరము ప్రసిద్ధికెక్కిన వాడు అమెనోతప్ - III (క్రీ. పూ. 1411 - 1375). ఇతడు సుప్రసిద్ధమైన లక్సర్ దేవాలయము నిర్మించి వన్నెకెక్కెను. ఇతని తరువాత అమెనోతప్-IV సింహాసనము అధిష్ఠించెను. ఈతడు ప్రపంచ చరిత్రలో ఎన్నుకొనదగిన నాయకమణి. మత విషయములలో ఈతడు పెద్ద మార్పుచేసెను. బహు దేవతారాధనమును నిషేధించి, దేవుడు ఒక్కడే అనియు, ఆ దేవుడు దయాసముద్రుడు, సర్వాంతర్యామి, జగత్పిత అనియు బోధించెను. ఆ దేవుడే సూర్యభగవానుడు అని సిద్ధాంతము చేసెను.

అమెనోతఫ్ - IV పుత్రులులేని వాడగుటచే అతని అల్లుండ్రు ఇరువురు ఒకరి తరువాత ఒకరు సింహాసనము ఎక్కిరి. వారిలో రెండవవాడగు 'తుతెన్ ఖాటన్' తన పేరును 'తుతెన్ ఖామేన్' అని మార్చుకొనెను. తన మామగారి మతమును పూర్తిగా వదలకున్నను, ప్రాత పద్ధతులను అవలంబించెను. ఈతని సమాధియందు కనుగొనబడిన అమూల్య వస్తువులు ఆనాటి నాగరకతను, ఇంకను ఎన్నియో విశేషములను మనకు తెలియజేయుచున్నవి.

పందొమ్మిదవ రాజ వంశమున రామిసెస్ - II సుప్రసిద్ధుడు. ఇతడు మహాయోధుడై సుడాన్, సిరియా దేశములను జయించెను. ఇతని పరిపాలన 67 ఏండ్లు విజయవంతముగ సాగినది.

ఈ రామిసెస్ - II అందమైన దేవాలయములు, భవనములు ఎన్నియో కట్టించెను. కర్ణక్ దేవాలయములో స్తంభముల మండపమున్ను, నూబియాలోని అబూసింబెల్ పట్టణము దగ్గర ఒక గొప్ప శిలా దేవాలయమున్ను ముఖ్యమైనవి. ఆ దేవాలయమునకు ఎదుట 18 మీటరుల ఎత్తు గల అతని శిలా విగ్రహములు నాలుగు కలవు. ఆ దేవాలయము ఉదయ భాస్కరునికి అంకితమైనది.

ఈ రామిసెస్-II మరణానంతరము సామ్రాజ్యమునందు అంతఃకలహములు మరల రేకెత్తినవి. శత్రురాజులు అన్ని దిక్కులనుండి ఈజిప్టుపై దండెత్తసాగిరి. క్రీ. పూ. 670 లో అసీరియన్‌లు ఈజిప్టును జయించిరి. కాని, సామెటికస్ (క్రీ. పూ. 664 - 610) నాయకత్వమున ఈజిప్షియన్‌లు అసీరియన్‌ల పారద్రోలి స్వాతంత్ర్యమును బడసిరి. కాని, ఈ వంశమువారు చాలకాలము పాలింపలేదు. సామెటికస్ - III కాలమున పరిష్యా చక్రవర్తి యగు కాంభోజ (కాంబిసిస్) ఈజిప్టుపైబడి, రాజును పదభ్రష్టునిగచేసి, దేశమును ఆక్రమించుకొనెను. కొలదికాలము ఈజిప్టు పర్షియన్‌ల పాలనమున ఉండెను. క్రీ. పూ 332 లో మేసిడోనియా రాజగు ఆలిగ్జాండర్ పర్షియన్‌లను ఓడించి, ఈజిప్టును జయించెను. క్రీ. పూ. 323 లో ఆలిగ్జాండర్ మరణింపగానే అతడు స్థాపించిన మహాసామ్రాజ్యము అంతటితో విచ్ఛిన్నమైనది. అతని సేనానాయకులు ఆ సామ్రాజ్యమునంతను భాగించుకొనిరి. ఈజిప్టుదేశము 'టాలమీ' పాలయ్యెను.

ఈ టాలమీ వంశమువారు ఈజిప్టును 300 ఏండ్లుపైగా చక్కగ పాలించి కళలను పోషించి, గ్రీక్ నాగరకతను, గ్రీక్ సంస్కృతిని ఈజిప్టునందు ఎల్లెడల వ్యాపింప చేసిరి. వీరి పాలనమున వారి రాజధానియైన ఆలిగ్జాండ్రియా పట్టణము గ్రీక్ నాగరకతకు ముఖ్య కేంద్రమై, పూర్వకాలపు ఏతెన్స నగరమును మరపింప జేసెను. క్రీ. పూ. 30 లో టాలెమీ వంశమునకు చెందిన 'క్లియోపాత్రా' [చూ.] అను రాణి రాజ్యమును పాలించుచుండెను. ఆమె జగదేక సుందరి అను ప్రఖ్యాతి గాంచినది. ఆమెను రోమ్ దేశ పాలకుడైన 'అగస్టస్' ఓడించి, ఈజిప్టును జయించెను. రోమన్‌ల పాలనమున ఈజిప్టు అభివృద్ధి గాంచినది. ఆహార పదార్థములకు రోమ్ సామ్రాజ్యము ఈజిప్టుపై ఆధారపడి ఉండెను. క్రీ. శ. తొలి 2 శతాబ్దముల కాలమున క్రైస్తవులను ఈజిప్టువారు హింసించుచుండిరి. కాని, రాను రాను క్రైస్తవ మతమునకు ఈజిప్టుదేశము ప్రాగ్దేశ కేంద్రమయినది (ప్రాచీనకాలపు ఈజిప్టు ధార్మిక, విజ్ఞాన, కళాభ్యుదయము కొరకు చూ. పు. 14; 17; 49; 58; 66.).

అర్వాచీన, నవీన యుగములు : క్రీ. పూ. 30 నుండి క్రీ. శ. 640 వరకును రోమన్ సామ్రాజ్యమందు స్వాతంత్ర్యము లేక రోమన్ ప్రభుత్వమునకు లొంగి ఉండుటచేత ఈజిప్టువారి భాగ్యము అమితముగా తరిగిపోయినది. ఈజిప్టు దేశములో పండించిన ధాన్యము రోమన్ ప్రజలకు పంచిపెట్టుటకు తీసికొని పోబడెడిది. 640 లో అరబ్బులు దండెత్తివచ్చి రోమన్ ప్రభుత్వమును పడగొట్టి తమ అధికారమును నెలకొల్పిరి. వీరు మహమ్మదీయ కలీఫాకు పంపుటకు కావలసిన పన్నులు వసూలు చేయుటకుగాను ఈజిప్టులో ఒక గవర్నర్‌ను నియమించిరి. కాలక్రమమున ఇస్లామ్ మతము ఈ దేశమందు ఎక్కువగా వ్యాపించినది. 8 వ శతాబ్దములో అరబ్బీ భాష ఈజిప్టు దేశమునకు రాజభాష అయినది.

ప్రవక్త కూతురయిన ఫతీమా వంశమునకు చెందిన వారు క్రీ. శ. 968 నుండి 1171 వరకును ఈజిప్టుకు పరిపాలకులు. వీరి కాలమందు రాజధానిగ ఉండిన కైరో నగరము ముసల్మాన్ సంస్కృతికి కేంద్రమయినది. క్రీ. శ. 1090 నుండి ఫతీమా వంశపువారి పరిపాలనము క్షీణింప సాగినది. ఆఫ్రికా ఉత్తర భాగమందలి ప్రదేశములందు వారి అధికారము తొలగిపోయినది. 1099 లో క్రూసేడ్‌లు [చూ.] జరిపిన క్రైస్తవులకు దేశము వశమయినది.

**అయుబిద్ వంశము - (1171 - 1252) :** డమాస్కస్‌లో గవర్నర్‌గా ఉండిన వాని కుమారుడు సాలాదీన్ క్రూసేడ్‌ల వారితో యుద్ధములు చేసి 1170 లో ఈజిప్టుకు వజీరయి, 1174 లో అతని ప్రభువున్ను, సిరియా సుల్తానున్ను అయిన నూరుద్దీన్ చనిపోవుటతో సిరియా, ఈజిప్టు దేశములకు సుల్తాను అయ్యెను. అతడు స్థాపించిన రాజ వంశమునకు అయుబిద్ వంశమని పేరు. ఈ వంశపు పరిపాలకుల బలము సాలాదీన్ చనిపోయిన తర్వాత క్షీణించినది.

పిమ్మట బానిసలుగా ఉండి యోద్ధలయి బలము చేకూర్చుకొన్న మెమలూక్‌లు 1252 నుండి 1517 వరకును ఈజిప్టుదేశమును ఏలిరి. ఈ కాలమందు కళ, సారస్వతము రాజపోషణమున బాగుగ వృద్ధి పొందినవి. కాని, నిరంకుశ ప్రభుత్వమువల్లను, తరచుగా ఉండిన కాటకములవల్లను, జాడ్యములవల్లను ప్రజలు అమితముగా బాధపడిరి.

ఓటోమన్ సామ్రాట్‌లు (టర్కీ ప్రభువులు) ఈజిప్టు దేశమును 1517 లో స్వాధీనపరచుకొనిరి. వీరి అధికారమునకు లోబడి ఈజిప్టు దేశమును పాలించిన పాషాల పరిపాలనములో మెమలూక్‌లే సైనికులు. మెమలూక్ సేనలను నెపోలియన్ 1799 లో ఓడించెను. అయినను ఈజిప్టులో ఫ్రెంచివారి ఆధిక్యము నెలకొల్పుటకు నెపోలియన్ చేసిన ప్రయత్నమంతా మూణ్ణాళ్ల ముచ్చటే అయినది. కాని, తురుష్కులకున్ను, మెమలూక్‌లకున్ను ఎప్పుడును కలహములే కలుగుచుండెను. తుదకు ఆల్‌బేనియా దేశవాసియు, ప్రసిద్ధ సేనానియు అగు మహమ్మద్ అలీ టర్కీ సుల్తాన్ అనుమతిని 1805 లో ఈజిప్టు పాషా అయ్యెను. అతని పరిపాలనమువలన దేశస్థితి బాగుపడినది. నౌకా, సైనిక దళములు బలపడినవి. ఇందువలన మహమ్మద్ అలీ ప్రబలుడై వంశపారంపర్యముగ అధికారము ఉండునటుల ఈజిప్టు దేశపు పాషా పదవిని, సిరియా గవర్నర్ పదవిని టర్కీ సుల్తాన్ వద్దనుండి పొందెను.

మహమ్మద్ అలీ క్రూరుడే కాని, బలము గల ప్రభుత్వమును నెలకొల్పి దేశభాగ్యమును అభివృద్ధి పరచెను. నైలునదీ డెల్టా ప్రదేశమందు ప్రత్తిపంట వృద్ధి పొందుటకు కావలసిన సౌకర్యములను ఏర్పరచెను. 1849 లో అతడు చనిపోయిన తరువాత, అతని మనుమడు అబ్బాస్ - I పరిపాలకుడయి, బ్రిటిష్ వారి సలహాతోను, తోడ్పాటుతోను అలెగ్జాండ్రియా నుండి కైరో వరకును రైలు మార్గమును నిర్మించెను. ఆ పిమ్మట ఇస్మాయిల్ అను పాషా పరిపాలనమున 1856 లో ఫ్రెంచివాడగు ఫెర్డినాండ్ డ లెసెప్ అనువాని ప్రోత్సాహముతో సూయెజ్ కాలువ త్రవ్వించుటకు ఒక సంఘము ఏర్పడినది. ఆకాలముననే ఈజిప్టు దేశమున అనేకముగా దేశాభివృద్ధికి తోడ్పడగల పనులు జరిగినవి. కాని, ఆ పాషా వృథాగా ఖర్చులు అపరిమితముగా చేయుటవలన ప్రభుత్వము ఆర్థికముగా క్షీణించినది. అప్పుడు సూయెజ్ కాలువ నిర్మాణపు వాటాలలో తనకు గల వాటాలను అతడు బ్రిటిష్ వారికి అమ్మివేసెను. ఆ కారణమున బ్రిటిష్‌వారికి ఈజిప్టులో జోక్యము కలుగజేసికొనుటకు అవకాశమున్ను, పలుకుబడిన్ని ఏర్పడినవి. ఈజిప్టు ప్రభుత్వమును పరిపాలకుని యథేచ్ఛకు విడిచిపెట్టక, ఒక రాజ్యాంగ నియమావళికి కట్టుబడి ఉండవలెనన్న నియతిని టర్కీ సుల్తాన్ ఆమోదించెను. ఆ నియతి - నిబంధనలు బ్రిటిష్, ఫ్రెంచి రాజనీతి వేత్తలు తయారు చేసిరి. ఈజిప్టు పరిపాలకుడు కెడివ్ అను హోదాతో దానికి కట్టుబడి ఉండవలసి వచ్చినది. అందుకు ఇస్మాయిల్ విరుద్ధముగా ఆచరించుటచేత 1879 లో టర్కీ సుల్తాన్ అతనిని కెడివ్ పదవినుండి తొలగించి, అతని కుమారుడైన ట్యూఫిక్‌ను కెడివ్‌గా నియమించెను. నూతన రాజ్యాంగ విధానము పునరుద్ధరించబడినది. అది సక్రమముగా నడచునట్లు చూచుటకు బ్రిటిష్‌వారును, ఫ్రెంచివారును తమ ప్రతినిధులను నియమించిరి. ఇట్టి విదేశీయుల జోక్యమును సహింపజాలని ఈజిప్టు ప్రజలు అహ్మద్ అరబ్బీ అనువాని నాయకత్వమున తిరుగుబాటు జరుపగా, ఇందులకై యుద్ధమునకు పూనుకొనుటకు ఇష్టపడక ఫ్రెంచివారు ఊరకొనుటచే, బ్రిటిష్ ప్రభుత్వము తన సేనల సాయమున ఆ తిరుగుబాటును అడచివేసెను. అటనుండి బ్రిటిష్‌వారు ఈజిప్టు వ్యవహారములపై సంపూర్ణ అధికారము వహించి, తమ ఇచ్ఛవచ్చిన రీతిగ కెడివ్‌ను నడపించిరి. ఈ ఏర్పాటులో తొలుతగ ఈజిప్టునకు క్రోమర్ ప్రభువు బ్రిటిష్ వారి కాన్సల్ జనరల్‌గ 1884 లో వచ్చెను. ఇతడు ఈజిప్టుదేశ పరిస్థితులను ఆర్థికముగ చాల చక్కబరచెను.

కిచనర్ ప్రభువు 1911 లో ఈజిప్టు దేశమునకు కాన్సల్ జనరల్‌గాను, బ్రిటిష్ ప్రతినిధిగాను వచ్చిన తర్వాత

ఈజిప్టులో బ్రిటిష్‌వారి యాజమాన్యము స్థిరపడినది. ఈజిప్టు దేశస్థులకు బ్రిటిష్ వారి ఎడల సద్భావముకూడ అధికమయినది. ఈజిప్టుదేశము అనేక విధముల అభివృద్ధి చెందినది. టర్కీ సుల్తాన్ పెట్టబోయిన అడ్డంకులు నిలువలేదు.

ప్రపంచ యుద్ధము - I 1914 లో ప్రారంభమయ్యెను. తత్ఫలితముగ 1914, నవంబరు 5 వ తేదీని టర్కీతో సంగ్రామమునకు దిగినట్లు బ్రిటిష్ ప్రభుత్వము ప్రకటించినది. టర్కీ రాజ్యము ఏలుచుండిన సుల్తాన్ ఇస్లామ్ మతమునకు కలీఫా (మత పీఠాధిపతి)గా కూడ ఉండుటవలన మహమ్మదీయ రాజ్యములు టర్కీకి సహాయముగా ఉండునేమో అన్న సందేహము కలిగి, ఈజిప్టుదేశము బ్రిటిష్ సంరక్షిత దేశమని బ్రిటిష్‌వారు ప్రకటించిరి. కాని, ఈజిప్టును బ్రిటిష్ సంరక్షిత దేశముగా ఉంచుట కష్టమైన పనిగా బ్రిటిష్‌వారికి బోధపడినది. అందుచేత ప్రపంచ మహా యుద్ధము ముగిసిన తరువాత 1922, ఫిబ్రవరి 28 వ తేదీన ఈజిప్టు స్వతంత్ర రాజపాలిత దేశమయినట్లు బ్రిటిష్ ప్రభుత్వమువారు ప్రకటనము కావించిరి. కాని, ఈ స్వాతంత్ర్యము బ్రిటిష్‌వారు విధించిన కొన్ని షరతులకు లోబడి ఉండునటుల అందే విధింపబడినది. ఈ షరతులను అనుసరించి బ్రిటిష్ సేనలు మాత్రము ఈజిప్టులోనే ఉండునటులను, సుడాన్ వేరు రాజ్యముగ ఉండునటులను ఏర్పాటులు జరిగినవి. ఎటులైననేమి, ఈ స్వాతంత్ర్యము ప్రసాదింపబడుటవలన, అంతవరకు సుల్తాన్ అను బిరుదముతో వ్యవహరించెడు అహమ్మద్ ఫవుద్ ఆనాటినుండి ఈజిప్టు రాజుగ అంగీకరింపబడి, దేశమునకు ఒక బాధ్యతాయుత రాజ్యాంగ చట్టము రూపొందింపబడెను.

ఈ నూతన రాజ్యాంగ విధానము ప్రకారము 1923, నవంబరులో ఎన్నికలు జరిగినవి. జాతీయపక్షమువారు సభలకు అధిక సంఖ్యాకులుగా వచ్చిరి. జగ్లుల్ ప్రధాన మంత్రి అయినాడు. బ్రిటిష్‌వారు దేశములో నిలిపిన సేనలను తీసికొనిపోవలెను అనిన్ని, సుడాన్ దేశము ఈజిప్టులో ఏకము కావలెను అనిన్ని పట్టుబట్టి, ఆ జాతీయ పక్షనాయకుడు జాతీయోద్యమము సాగించెను. తుదకు 1936 లో సంధి జరిగినది. సూయెజ్ కాలువవద్ద తప్ప తక్కిన ఈజిప్టు ప్రాంతములనుండి బ్రిటిష్‌వారు తమ సేనలను తీసికొనిపోవుటకున్ను, సుడాన్‌లో ఈజిప్టువారి హక్కులను నిలబెట్టుటకున్ను బ్రిటిష్‌వారు సమ్మతించిరి.

ప్రపంచ యుద్ధము - II లో మొత్తముమీద లోగడ చేసికొన్న సంధి షరతుల ప్రకారము ఈజిప్టు ప్రభుత్వము వ్యవహరించినది. సంగ్రామానంతరము మాత్రము ఆ సంధి షరతులను సవరించవలసిన ఆవశ్యకత కలిగినదని ఈజిప్టువారు బ్రిటిష్‌వారికి తెలియజేసిరి. తమ దేశము వారి కోరికలను మన్నించి బ్రిటిష్‌వారు తమ సేనలను తీసికొనిపోలేదను కోపముతో జాతీయవాదులున్ను, బ్రిటిష్‌వారి ఎడల ద్వేషముగలవారున్ను, పారిశ్రామికులున్ను ఓర్మి వహింపక తిరుగుబాటు చేసిరి. 1946, మార్చి 4 వ తేదీన అలిగ్జాండ్రియాలో దొమ్మియుద్ధము చెలరేగినది. బ్రిటిష్‌వారు కొందరు మరణించిరి.* బ్రిటిష్‌వారు మరికొద్ది దినములకు తమ సేనలను కైరో, అలిగ్జాండ్రియా ప్రాంతముల నుండి మాత్రము తీసికొనిపోయిరి.

1951, అక్టోబరు 15 వ తేదీని ఈజిప్టులోని సెనేట్ సభయున్ను, చేంబర్ ఆవ్ డెప్యుటీజ్ సభయున్ను 1936 లో జరిగిన సంధి షరతులను రద్దుపరచుచు చట్టమును చేసినవి.

ఇట్టి పరిస్థితులలో ఈజిప్టు రాజరిక ప్రభుత్వము తగిన దృఢవైఖరిని అవలంబింపకపోవుటవలననే, బ్రిటిష్ సామ్రాజ్య ప్రభుత్వము తన అధికారమును నిలబెట్టుకొన గలుగుచున్నదను అభిప్రాయము ప్రజలలోను, సైన్యములోను దృఢముగ వ్యాపించెను. దీని పర్యవసానముగ 1952, జూలై 23 న సైన్యము మహమ్మద్ నజీబ్ అను వాని నాయకత్వమున తిరుగుబాటుచేసి అధికారమును వశపరచుకొనగ, చేయునది లేక రాజగు ఫరూక్ పదవీ పరిత్యాగము ఒనర్చెను. అంతట అతని కుమారుడును, పసివాడును అగు మహమ్మద్ ఫవుద్ - II ను రాజుగచేసి, రాజ్యపాలనకై ఒక రీజెన్సీ కౌన్సిల్‌ను సైనికనాయకులు ఏర్పరచిరి. కాని, వాస్తవమున రాజ్యాధికారమంతయు నజీబ్ వశముననే ఉండెను. అంతట క్రొత్త పరిస్థితులకు తగినటుల వేరొక రాజ్యాంగమును నిర్మించు తలంపుతో 1923 రాజ్యాంగము రద్దు చేయబడెను (1952, డిసెంబరు 10). తరువాత ఒక నెల దినములకు దేశమునందలి రాజకీయ పక్షములు నిషేధింపబడెను ; 1953, జూన్ 18 న ఈజిప్టుదేశము గణరాజ్యముగ ప్రకటింపబడుటతో రాచరికము అంతరించి నజీబ్ తొలుతటి అధ్యక్షుడు అయ్యెను. కాని, అనతికాలముననే నజీబ్ నకును, అతని సహచరుడుగ ఉన్న వేరొక సైనిక నాయకుడు నాసర్ [చూ.] నకును మధ్య వైమనస్య

* 1947 లో ఈజిప్టు ప్రభుత్వము లోగడ చేసికొనిన సంధి షరతులను విడనాడి ఐక్యరాజ్యసమితి భద్రతా సంఘమువారికి దరఖాస్తు పెట్టుకొని బ్రిటిష వారు తమ సేనలను ఈజిప్టునుండిన్ని, సుడాన్ నుండిన్ని తీసికొని పోవలసినదనియు, ఆంగ్లో - ఈజిప్షియన్ సుడాన్‌లో బ్రిటిష్ ప్రభుత్వాధికారమును తొలగింపవలెననియు కోరినది. కాని, సమితి ఈ విషయమున ఏ చర్యయును తీసికొనలేదు.

ములు పొడమినందువలన నజీబ్‌ను పదవీ భ్రష్టునిచేసి, నాసర్ అధ్యక్షుడు అయ్యెను (1954, నవంబరు 4). ఆ సంవత్సరముననే ఈజిప్టునందలి సైనిక ప్రభుత్వము బ్రిటిష్ వారితో ఒక ఒడంబడికకు రాగలిగెను (అక్టోబరు 19, 1954). దానిని అనుసరించి ఒడంబడిక తేదీ తరువాత ఇరువది నెలలలోపుగ సూయజ్ ప్రాంతమునుండి తమ సేనలను తరలించుకొనిపోవుటకు బ్రిటన్ అంగీకరించినది.

జమాల్ అబ్దుల్ నాసర్ అధికారమును గ్రహించినప్పటినుండియు ఈజిప్టునందు విప్లవాత్మక సంస్కరణలు అనేకములు త్వరితగతిలో జరిగెను. ప్రభుత్వమునందు అంతటివరకు విరివిగ వ్యాప్తియందుండిన లంచగొండితనము చాలవరకు నిర్మూలింపబడెను. నాసర్ అవలంబించిన తాటస్థ్య వైఖరివలన అంతర్జాతీయముగ సైతము ఆ దేశపు ఖ్యాతి ఇనుమడించెను. 1955 లో జరిగిన బాండుంగ్ సమావేశము [చూ.] న ఈజిప్టు నాయకుడుగ నాసర్ ప్రముఖపాత్ర వహించెను. విరోధి రాజ్యమగు ఇజ్రాయెల్‌ను ఎదుర్కొనగలుగుటకై సోవియట్ రష్యానుండి ఆయుధ సహాయమును గ్రహించి ఈజిప్టు బలవత్తర రాజ్యమయ్యెను.

దేశాభ్యుదయ దృష్టితో నాసర్ తీసికొనిన చర్యలలో సూయెజ్ కాలువను జాతీయ మొనర్చుట (అక్టోబరు, 1956) ప్రముఖముగ పేర్కొనదగినది. దీని మూలమున బ్రిటిష్, ఫ్రెంచి, ఇజ్రాయెల్ దేశములతో ఈజిప్టునకు యుద్ధము తటస్థించినను కడకు ప్రపంచ ప్రజల సానుభూతి సహకారముల మూలమున ఈజిప్టు తన ఉద్దేశమును నెగ్గించుకొనగలిగినది [చూ. సూయెజ్ కాలువ]. ఈ కాలువవలన ఈజిప్టునకు సాంవత్సరికాదాయము విరివిగ లభించుచున్నది.

సూయెజ్ జాతీయకరణయందు నాసర్ అవలంబించిన దృఢవైఖరి మూలమున అరబ్బు దేశములందు అతని పలుకుబడి ఇనుమడించెను. అరబ్బుదేశముల ఏకీకరణమునకు ఈ అవకాశమును ఉపయోగించుకొను తలంపుతో 1958 లో సిరియా, యెమెన్ దేశములు ఈజిప్టుతో కలసి సమాఖ్యగ రూపొందుటకు ఏర్పాటు జరిగెను. ఈ సమాఖ్యకు సంయుక్త అరబ్బు గణరాజ్యము(యునైటెడ్ ఆరబ్ రిపబ్లిక్). అను పేరు కలిగెను. తదనుగుణముగ ఈజిప్టులోని పార్లమెంట్ పునర్నిర్మింపబడి సిరియా, యెమెన్‌లకు అందు ప్రాతినిధ్యము కల్పింపబడెను. కాని, నాసర్ అవలంబింపదలచిన విప్లవాత్మక సంస్కరణ ఎడ ప్రాతికూల్యము వహించి 1961 సెప్టెంబరులో సిరియాయు, ఆ సంవత్సరాంతమున యెమెన్ రాజ్యమును సమాఖ్యనుండి విడివడెను.

నాసర్ ఆధ్వర్యవమున 1961 మొదలుగ ఈజిప్టున విపవాత్మకములగు భూ సంస్కరణలు అమలులోనికి కొనిరాబడుటయే కాక, విద్యా, సాంఘిక రంగములందు ప్రవేశపెట్టబడిన మార్పులవలన దేశము ఆధునికమొనర్పబడినది. పాశ్చాత్య రాజ్యముల నుండియే కాక, సోవియట్ రష్యానుండియు ఆర్థిక, సాంకేతిక సాహాయ్యమును ఈజిప్టు గ్రహించి ఈనాడు పురోగమించుచున్నది.

రాజ్యాంగము : సైనిక విప్లవ పరిపాలన ఏర్పడిన తొలుతటి దినములలో దేశమున పరిపాలన అంతయు విప్లవ సంఘపు అధ్యక్షుని ఆదేశమును అనుసరించియే జరిగినది. 1953 లో రాజకీయపక్షములు అన్నియు రద్దొనరింపబడిన తరువాత జాతీయైక్యపక్షము (నేషనల్ యూనియన్ పార్టీ) అను ఒక క్రొత్త పక్షము నిర్మింపబడి, అదియే ఏకైక రాజకీయ పక్షముగ గుర్తింపబడెను. ఈ పక్షపు అభ్యర్థులు మాత్రమే పాల్గొను రీతిగ 1957 లో ఎన్నికలు జరుపబడి, 350 మంది ప్రతినిధులతో ఒక జాతీయ శాసనసభ నిర్మింపబడెను. కాని, దీనికి గల అధికారము అతి పరిమితము. 1962 లో ఈ శాసనసభకు తిరిగి ఎన్నికలు జరిగినపుడు దీనిరూపము మార్చబడి, వృత్తులద్వారా ప్రాతినిధ్యము కల్పింపబడెను. ఈ నూతన శాసనసభయు అధ్యక్షుడగు నాసర్‌నకు సలహా సంఘముగ ఉండి, అతని చెప్పుచేతలలో ఉన్నది. ఈజిప్టునందలి సాంఘిక పరిస్థితులలో ప్రజాస్వామికపు తొలుతటి రూపము ఈ తీరుగనే ఉండవలయునని నాసర్ అభిప్రాయము. గి వేం. సీ.

**ఈజిప్షియన్ నాగరకత** : చూ. ఈజిప్టు.

**ఈజియన్ నాగరకత** : మధ్యధరాముద్రము తూర్పు భాగమున గ్రీస్, ఆసియా మైనర్, ఈజిప్టుదేశముల నడుమను ఈజియన్ సముద్రము కలదు. ఇందు క్రీట్ మొదలగు దీవులు ఎన్నియో కలవు. ఇవి గ్రీస్‌నకును, ఆసియా మైనర్‌నకును నడుమ మెట్లరాళ్ళవలె ఉన్నవి. గ్రీక్ నాగరకత పుట్టకముందు ఈ ప్రాంతముల మహాద్భుతమైన మరియొక నాగరకత వెలసెను. ఇది క్రీట్ ద్వీపమున పుట్టి, వ్యాపార మూలముననుు, వలసల మూలమునను ఆసియా మైనర్ తీరమునకును, గ్రీస్ తీరమునకును వ్యాపించినది. దీనినే చారిత్రకులు 'ఈజియన్ నాగరకత' అని అందురు. ఈ నాగరకత ఈజిప్టు నాగరకత ఎంత ప్రాచీనమైనదో అంత ప్రాచీనమైనదని కొందరి అభిప్రాయము. క్రీ. పూ. 1600 కే ఈ నాగరకత పరిపూర్ణత నంది అత్యున్నత దశయందు ఉండెను.

**ఈజియన్‌ల కళలు** : ఈజియన్ శిల్పులు అతి కుశలులై, అద్భుతములగు మందిరములను, రాచనగరులను రాతితో

నిర్మించిరి. క్రీట్ రాజధానియగు నాసస్‌వద్దను, టిరియస్ వద్దను పరిశోధించిన భవనములందు నీటి గొట్టములు, ప్రత్యేక స్నానాగారములు, మరి యెన్నియో జీవన సౌకర్యములు కలవు. వారు గోడలపై చిత్రించిన బొమ్మలు, తయారుచేసిన బంగారు నగలు, మట్టిపాత్రలపై చిత్రించిన దృశ్యములు వారి కళాకౌశలమును వెల్లడించుచున్నవి.

ఈజియన్‌ల లిపి: ఈజియన్‌ల లిపి ఈజిప్షియన్, బాబిలోనియన్ లిపులకన్న సుందరముగ ఉండును. నాసస్ పట్టణమున వేలకొలది బంకమట్టి పలకల మీద వ్రాసిన శాసనములు దొరికినవి కాని, ఆ భాషను మనము ఇంకను చదువ నేర్వలేదు. ఈజియన్ నాగరకత యూరప్‌నందు ఎక్కువగ వ్యాపింపలేదు. క్రీ. పూ. 1100 కు ఈ నాగరకత నశించెను [చూ. పు - 17]. వి. నా.

**ఈతియోపియా :** చూ. ఎతియోపియా.

**ఈస్ట్ ఇండియా కంపెనీ :** చూ. బ్రిటిష్ ఈస్ట్ ఇండియా కంపెనీ.

**ఉగాండా :** తూర్పు ఆఫ్రికా యందలి ఒక స్వతంత్ర రాజ్యము.

ఈ రాజ్యమునకు సుడాన్ [ఉ]; కెన్యా [తూ]; టాంగన్యికా, రువండా, బురుండి [ద]; కాంగో (లియోపాల్డ్‌విల్లీ) [ప] సరిహద్దులుగ ఉన్నవి. [వి] 2,39,640 చ. కి. మీ. [జ] 70,15,900. వీరిలో భారత, పాకిస్తాన్ దేశీయుల సంతతి వారు దాదాపు ఒక లక్షమంది కలరు. [భా] వివిధ ఆఫ్రికన్ భాషలు మాతృభాషలుగ వివిధ వర్గములలో ప్రచారమున ఉన్నవి. కాని, స్వాహిలీ అను ఆఫ్రికన్ భాష వివిధ వర్గములమధ్య సామాన్య భాషగ వాడుకయందు ఉన్నది. [మ] ప్రజలలో దాదాపు 13 లక్షలు క్రైస్తవులు, తక్కిన వారిలో ముస్లిమ్‌లు, సంప్రదాయ ప్రకృతి దేవతారాధకులును కలరు. [రా] కాంపాలా (10,941).

చరిత్ర : అతి ప్రాచీన కాలముననే క్రీ. పూ. 4000 - 3000 ల మధ్యకాలమున ఈజిప్టునుండి కొన్ని హమిటిక్ జాతుల ప్రజలు ఇచటికి వలసవచ్చి చేరిరి. ఆనాటి ఈజిప్టు దేశపు నాగరకతను వారు అటకు తమతో కొనివచ్చి దేశమున ప్రచారమొనగిరి. అప్పటికే అచట వసించుచుండిన నీగ్రోలతోను, తక్కిన ఆదిమ వాసులతోను ఈ హమిటిక్ ప్రజలు కాలక్రమమున కలసిపోయిరి. అంతట ఈ ప్రాచీన సంస్కృతిని అవలంబించిన రాజవంశములు, ఈ దేశమందలి బుగాండా, బున్యోరో, బుసోగా, అంకోలే అను వేర్వేరు రాజ్యముల స్థాపించి వంశానుగతముగ పాలించినవి. తక్కిన ప్రపంచముతో ఎట్టి సంబంధమును కలిగించుకొనక ఈ రాజ్యములు ఇటుల అతి దీర్ఘ కాలము మనగలిగినవి. వీనిలో ప్రముఖమైనది బుగాండా రాజ్యము. నేడు విక్టోరియా న్యాంజా అని అనబడు విశాల సరోవర పరిసర దేశమును ఆ బుగాండా రాజులు పరిపాలించిరి. 19 వ శతాబ్ది మధ్యకాలమున ఈ రాజ్యమును పాలించిన సూనా రాజు జాంజిబార్ నుండి పారిపోయి వచ్చిన ఒక బెలూచీ సిపాయి మూలమున శ్వేతజాతులు తక్కిన ప్రపంచమున ఆర్జించిన ప్రాబల్యమును గురించి 1850 లో తెలిసికొనెను. 1862 లో తొలుతటి శ్వేతజాతీయుడు ఇట అడుగిడెను. సూనారాజు మరణానంతరము అతని కుమారుడు ముతేశ అనువాడు 1857 లో రాజయ్యెను. ఇతని కాలమున జాంజిబార్ నుండి ముస్లిమ్ మతప్రచారకులును, యూరప్ నుండి క్రైస్తవమత ప్రచారకులును ఈ దేశమున చేరి తమ తమ మతములను ప్రజలలో వ్యాపింప జేయుటకై కృషి సల్పిరి. వీరిలో తొలుత ముస్లిమ్‌మతబోధకులే ముందంజ వేయగలిగిరి. రాజును, బుగాండా యందలి సర్దార్‌లును ముస్లిమ్‌మతము అవలంబించిరి. 1879 నాటికి క్రైస్తవ మతమునందలి ప్రొటెస్టంట్, రోమన్ కేతలిక్ సంప్రదాయ మతబోధకులును ఇట చేరిరి. ఇటుల ముస్లిమ్, ప్రొటెస్టంట్, కేతలిక్ మతసంప్రదాయములు పోటీ పడి ఆ దేశమున మత ప్రచారము సలిపినవి. ప్రభువులు ముస్లిమ్‌లు అగుటచే, క్రైస్తవ సంప్రదాయముల నిర్మూలించుటకు వారెంతయో కృషి సల్పిరి. కాని, ప్రొటెస్టంట్ మిషనరీలకు ఇంగ్లీషు వారును, కేతలిక్‌లకు ఫ్రెంచి వారును సాయమొనర్చుటచే ఈ మత భేదములు చివరకు అంతఃకల్లోలములకు దారి తీసినవి.

ఇంతలో యూరపియన్ రాజ్యములు ఆఫ్రికాయందు తమ తమ పలుకుబడి ప్రాంతముల నిర్మించుకొనుచు చేసికొనిన ఒప్పందముల ఫలితముగ ఆంగ్లో - జర్మన్ ఒడంబడిక వలన 1890 లో ఉగాండా బ్రిటిష్ వారి పలుకుబడికి చెందిన ప్రాంతముగ గుర్తింపబడెను. బ్రిటిష్ వారి సర్వాధిపత్యమును దేశీయ ప్రభువులు తొలుత తీవ్రముగ ప్రతిఘటించిరి. ఇందులకు తోడుగ ఇంగ్లీషు వారు ప్రొటెస్టంట్ శాఖకు చెందినవారగుటవలన, ఫ్రెంచి వారిచే ప్రోత్సహింపబడి కేతలిక్‌లును ఆంగ్ల సైన్యములను ఎదిరించిరి. ఈ ప్రతిరోధములనన్నింటిని అధిగమించి, తుదకు రాజును, కేతలిక్‌లను ఓడించి ఆంగ్ల సేనలు 1892 లో రాజధానిని వశపరచుకొనినవి. కేతలిక్‌లును అంతట చేయునది లేక ఇంగ్లీషు వారితో రాజీపడిరి. ముస్లిమ్‌లకును కొన్ని ప్రాంతములందు ఆధిక్యము కల్పింపబడెను. అంత 1892 లో బుగాండా బ్రిటిష్ రక్షిత ప్రాంతముగ ప్రకటింపబడెను. తరువాత 1896 లో బున్యోరో, బుసోగా రాజ్యములును ఈ రక్షిత ప్రాంతమున చేరెను. 1902 లో అంకోలేయును, తక్కిన అల్పరాజ్యములును బ్రిటిష్ రక్షణను గ్రహించెను,

ఇటుల 1902 నాటికి ఉగాండా అంతయు సమగ్రముగ బ్రిటిష్ రక్షిత రాజ్యమయ్యెను.

బ్రిటిష్ పరిపాలనలో విద్యా, వ్యాపార రంగములందు దేశము కొంత పురోగమింపగలిగినది. బ్రిటిష్ వారు ఇచట వలస వచ్చి చేరుటకు అంతగ ఇచ్చగింపనందున దేశమున సంపద చాలవరకు దేశీయుల వశముననే ఉండుటకు అవకాశము కలిగినది. ప్రథమ ప్రపంచ యుద్ధము (1914 - 1918) న ఉగాండా సేనలు పాల్గొని మిత్రమండలికి సాయమొనర్చినవి. ద్వితీయ ప్రపంచ యుద్ధము(1939 - 45) నను ఈ దేశపు సేనలు మిత్రమండలి పక్షమున ఆఫ్రికా యందలి వివిధ యుద్ధరంగములందు పాల్గొనినవి.

ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున తక్కిన ఆఫ్రికా దేశములందువలెనే ఇచటను ప్రజలందు స్వాతంత్ర్యకాంక్ష పెల్లుబికినది. దీనిని గుర్తించి బ్రిటిష్‌ప్రభుత్వము క్రమ స్థాయిలో తగు సంస్కరణలను ప్రవేశపెట్టి, ప్రజలకు కొన్ని బాధ్యతలను ఒసగినది. ఈ దేశముననే చేరియు, స్వతంత్ర రాజ్యపు హోదాలో బ్రిటిష్ రక్షణక్రింద, వంశానుగత మగు రాజరికపు పాలనలో ఉన్న బుగాండాయందును పాలకుడగు కబాకా ప్రజలకు కొంత అధికారమును సంక్రమింపజేసెను. 1962, మార్చిలో బ్రిటిష్‌ప్రభుత్వము ఆ దేశమునకు ఆంతరంగిక స్వయంపాలన (సెల్ఫ్ గవర్న్మెంట్) ను ఒసగెను. సంపూర్ణస్వాతంత్ర్యమును ఒసగు విషయమున కూడ అంతటినుండి బ్రిటిష్ ప్రభుత్వము ఉగాండా నాయకులతో రాయబారములు మొదలిడెను. కాని, బుగాండా ఒక స్వతంత్రరాజ్యముగ ఉండవలెనని పట్టుబట్టుటచే కొంత కాలయాపన జరిగెను. కడకు ఆ దేశపు నాయకుల రాజకీయచతురతవలన ఆ సమస్య పరిష్కృతమై, ఉగాండా ఒక సమాఖ్యగ ఉండి, అందు బుగాండాకు రాష్ట్రప్రతిపత్తి ఉండునటుల నిర్ణయితమయ్యెను. దీనిని అనుసరించి 1962, అక్టోబరు 9 న ఉగాండా స్వాతంత్ర్యమునంది ఉగాండా పీపుల్స్ కాంగ్రెస్ పార్టీ నాయకుడగు మిల్టన్ ఒబోటే ప్రధానిగ స్వతంత్ర ప్రభుత్వము ఏర్పడెను. ఆ తరువాత ఒక ప్రజాస్వామిక సమాఖ్యారాజ్యాంగము ఈ దేశమునకు రూపొందింపబడి అమలులోనికి ప్రజామోదముచే కొనిరాబడినను కాలక్రమమున రాజకీయ నాయకులమధ్య చెలరేగిన వైరుధ్యముల ఫలితముగా దానిని రద్దుచేసి, మిల్టన్ ఒబోటేయే ప్రభుత్వాధ్యక్షతను, సర్వాధికారములను స్వీకరించెను (11 మార్చి, 1966). చీ. శే. రా.

**ఉట్రెక్ట్ సంధి :** నెదర్లండ్స్‌లో ఉట్రెక్ట్ నగరము వద్ద స్పానిష్ వారసత్వసంగ్రామము అనంతరమున, శాంతి స్థాపనకై కృషిచేయు తలంపుతో 1713, 1714 లో సమావేశములు జరిపిన యూరపియన్ రాజ్యములు కుదుర్చుకొనిన పలుసంధులు సామూహికముగ 'ఉట్రెక్ట్ సంధి' అని వ్యవహరింపబడుచున్నవి. వీనిలో దీర్ఘకాలిక ఫలితములకు కారణములైన ఈ దిగువవి ప్రముఖములు :

1. ఇంగ్లండు - ఫ్రాన్స్‌ల మధ్య సంధి : దీని మూలమున ఇంగ్లండునందు రాచరికము ప్రొటెస్టంట్లగు రాజుల వంశముననే నెలకొని ఉండుటకు ఫ్రాన్స్‌దేశపు రాజు వలన పరిగణన లభించెను; న్యూఫౌండ్‌లాండ్‌ను, నోవా స్కోటియాను, సెయింట్ కిట్స్ దీవిని, హడ్సన్ అఖాత ప్రాంత భూమిని ఇంగ్లండునకు ఫ్రాన్స్ దత్తము చేసెను;

2. ఫ్రాన్స్ - పోర్చుగల్ దేశములమధ్య సంధి : దీని వలన పోర్చుగల్‌కు బ్రెజిల్‌పై కల స్వామ్యమును ఫ్రాన్స్ గుర్తించెను;

3. ఇంగ్లండు - స్పెయిన్‌ల మధ్య సంధి : ఇదివరలో కుదిరిన కొన్ని వర్తకపు ఒడంబడికలను ఈ ఉభయదేశములను ఈ సంధి వలన ధ్రువపరచుకొనుటయే కాక జిబ్రాల్టర్‌ను ఇంగ్లండుకు స్పెయిన్ దత్తము చేసెను. ఇంతియే కాక, స్పెయిన్‌కు చెందిన అమెరికా ప్రాంతములందు 30 సంవత్సరముల కాలము బానిసవ్యాపారమును సాగించుకొనుటకు గుత్త అధికారము ఇంగ్లండునకు లభించెను. బి. ఆర్.

**ఉత్కళ గజపతులు :** చూ. ఓఢ్ర గజపతులు: సం. 3 - పు. 273.

**ఉత్తర అట్లాంటిక్ రక్షణ వ్యవస్థ** (నాటోకూటమి): ఉత్తర అట్లాంటిక్ దేశములు తమ సమష్టి రక్షణను, తద్ద్వారా ప్రపంచమున శాంతి భద్రతల సంరక్షణను ఉద్దేశించి కుదుర్చుకొనిన ఒడంబడికను అనుసరించి ఏర్పడిన ఒక సైనిక వ్యవస్థ. దీనికే ఆంగ్లరూపమందలి పదాద్యక్షరములను బట్టి 'నాటో' (నార్త్ అట్లాంటిక్ ట్రీటీ ఆర్గనైజేషన్) అను వ్యవహారము కలదు.

ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున సోవియట్ రష్యాతో పాశ్చాత్య రాజ్యములకు ఏర్పడిన మైత్రి యుద్ధానంతరమున భగ్నమగుటయు, తూర్పు యూరప్‌నందు వివిధ రాజ్యములు సోవియట్ రష్యా పలుకుబడికి లోనగుటయు ఈ వ్యవస్థ ఏర్పడుటకు మూల కారణములు [చూ. పు. 197]. 1947 లో గ్రీస్, టర్కీ దేశములు సోవియట్ రష్యా పలుకుబడికి లొంగకుండ చేయుటలో యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వము ప్రత్యేక శ్రద్ధ వహించి సైనిక, ఆర్థిక సహకారము సలుపుట ఈ వ్యవస్థానిర్మాణమునకు నాంది అని భావింపవచ్చును. తరువాత బ్రిటన్, ఫ్రాన్స్, నెదర్

లండ్స్, బెల్జియమ్, లక్జెంబర్గ్ రాజ్యములు పరస్పర రక్షణ కొరకై బ్రసెల్స్ నగరమున రాయబారములు జరిపి, ఒక సంయుక్త రక్షణ వ్యవస్థకు గల ఆవశ్యకతను గుర్తించి, దీనిని గురించి 1949 లో కెనడా, యునైటెడ్‌స్టేట్స్‌తో మంతనములు సలిపినవి. వీని పర్యవసానముగ ఏప్రిల్ 4, 1949 న వాషింగ్‌టన్‌లో ఈ రక్షణ వ్యవస్థ రూపొందింపబడి, అందు పైన తెలిపిన ఏడు రాజ్యములే కాక, పోర్చుగల్, డెన్మార్క్, నార్వే, ఇటలీ, ఐస్‌లాండ్ రాజ్యములును సభ్యరాజ్యములుగ చేరినవి. ఫిబ్రవరి 18, 1952 న టర్కీ, గ్రీస్, 1955, మే నెలలో పశ్చిమ జర్మనీ ఇందు చేరినవి.

ఈ వ్యవస్థ ఆధ్వర్యవమున ఒక ప్రత్యేక సేనాదళము కలదు. సభ్య రాజ్యములకు చెందిన సైనికులు - నిర్ణయించుకొనిన నిష్పత్తిని అనుసరించి - ఇందు చేరి ఉన్నారు. వీరికి అతి నవీన ఆయుధములను, పరమాణ్వస్త్రములను చేకూర్చుటయందు యునైటెడ్‌స్టేట్స్ ప్రత్యేక శ్రద్ధ వహించి కృషి చేయుచున్నది. ఈ నాటో సైనిక సంస్థ ముఖ్యకార్యాలయము పారిస్ (ఫ్రాన్స్) సమీపమున కలదు. 1965 అంతము మొదలుగ అధ్యక్షుడగు డిగాల్ [చూ.] నాయకత్వమున ఫ్రాన్స్ అవలంబించిన స్వతంత్ర వైఖరి వలన నాటోయందలి పటిష్ఠత సన్నగిలినది. పారిస్ నుండి ఒక సంవత్సరములోపల తమ కార్యాలయమును ఎత్తివేయవలసినదిగా నాటో అధికారులకు ఫ్రాన్స్ ప్రభుత్వము 1966, మార్చిలో నోటీసును ఇచ్చినది.

కమ్యూనిస్ట్ రాజ్యములను అణచు ఉద్దేశముతో ఈ వ్యవస్థ స్థాపింపబడినదనియు, యూరపియన్ రాజకీయము లందు యునైటెడ్‌స్టేట్స్ వహించు ఈ జోక్యము ఇంకొక ప్రపంచ యుద్ధమునకు దారితీయగలదనియు సోవియట్ రష్యాయును, దానిని అనుసరించు ఇతర కమ్యూనిస్ట్ రాజ్యములును తలచుచున్నవి. ఇందువలననే ఈ వ్యవస్థకు పోటీగ కమ్యూనిస్ట్ రాజ్యములును వార్సా ఒడంబడిక [చూ.] అనుపేర ఒక వ్యవస్థను ఏర్పచుకొనినవి. ప్ర. రా. సు.

**ఉద్యోగివర్గము :** పరిపాలకులు తలపెట్టిన పనులను సౌష్ఠవముగ జరుపుటకు నేర్పరులగు ఉద్యోగస్థులు ఉండవలెను. ఈ కారణము చేతనే ప్రస్తుతకాలమందు ప్రతి దేశములోను పరిపాలకులు తలపెట్టిన పనులను నిర్వహించుటకు ఉద్యోగస్థులు ఎందరో ఏర్పడి ఉన్నారు. వీరిలో ఉండవలసిన అర్హతలకును, మంత్రులు మొదలైనవారిలో ఉండవలసిన అర్హతలకును ఎంతో భేదము కలదు. వీరు నౌకా శాస్త్రము, విమానశాస్త్రము, సైనికశాస్త్రము, వ్యవసాయశాస్త్రము మొదలైన శాస్త్రములందును, విద్యలందును ఆరితేరిన వారుగ ఉందురు. ఇట్టి జ్ఞానము గ్రంథపరిచయమాత్రమున లభించునట్టిది కాదు. ఇంత కంటె అనుభవమే దీనికి ఎక్కువ ఆధారము. అందుచేత మంత్రులలో తరచుగ మార్పులు కలిగినను ఉద్యోగస్థులలో మార్పులు ఉండకూడదను సిద్ధాంతము అన్ని దేశములలోను ఈ కాలమున అంగీకరింపబడి ఉన్నది.

ఈ సిద్ధాంతమును అనుసరించి భారత రాజ్యాంగమున ఉద్యోగిశాఖ నిర్మింపబడి ఉన్నది. భారత రాజ్యమున సాధారణముగ పరీక్షా ఫలితములను ఆధారము చేసికొని ఉద్యోగులను నియమించవలసి ఉన్నది. మంత్రులు మారినపుడు క్రొత్త మంత్రులు తమకు ఇష్టులైనవారిని ఉద్యోగములలోనికి తీసికొని రాకుండ నిరోధించుటకై ఈ ఏర్పాటు అవసరమయ్యెను. పరీక్షలలో కృతార్థులైన వారికే ఉద్యోగములు కాని, తక్కినవారికి ఉద్యోగములు ఈయరాదు. ఉద్యోగములలో ఖాయపడినవారిని విచారణ లేక ఉద్యోగమునుండి తొలగించుటకు వీలులేదు. వారి వేతనముల, సెలవుల విషయమై వారికి ఉండవలసిన సదుపాయములున్ను, ఉద్యోగమునుండి విరమించుకొనిన తరువాత వారికి ఈయవలసిన ఉపకార వేతనములు మొదలగునవిన్ని మంత్రివర్గముల అభిమాన - దురభిమానములకు లోబడని తీరులో ఉంచుటకు 'పబ్లిక్ సర్విస్ కమీషన్' అను పేర ఒక కేంద్ర సంస్థ స్థాపింపబడి ఉన్నది. అందులోని సభ్యులను భారత రాష్ట్రపతి నియమించును. వారి ఉద్యోగకాలము ఆరు ఏండ్లు. ఉన్నత న్యాయస్థానమువారి సలహా లేనిదే వారిని ఉద్యోగము నుండి తొలగించుటకు రాష్ట్రపతికి అధికారములేదు. కనుక వారు నిర్భయముగ తమ విధులను నెరవేర్చుటకు అవకాశము ఉన్నది. ఉద్యోగుల నియమించుటకై ఏర్పరచవలసిన పరీక్షలు అన్నిటిని కమీషన్‌వారు ఏర్పరతురు. వానిని సాగించి, వాని ఫలితములను ప్రకటించువారు కూడ వారే. ఉద్యోగముల నుండి ఎవరినైన తొలగించవలసి వచ్చినపుడు వారి జోక్యము లేక తొలగించుటకు వీలులేదు. వారు ఏర్పరచు పరీక్షలకు జాతి, మత, కుల, వర్ణ వివక్షత లేక అర్హులగువారు అందరును రావచ్చును. వెనుకబడిన జాతుల విషయమై కొన్ని ఉద్యోగములు కేటాయింపబడి ఉన్నవే కాని, తక్కినవాటికి అన్నిటికిని పరీక్షలందు ఉత్తీర్ణులగు వారు మాత్రమే అర్హులు. ఈ కారణములచేత కుశలురును, వ్యవహారదక్షులును ఉద్యోగులు అగుటయు, వార్ధక్యము వచ్చువరకును వారు ఉద్యోగమందుండుటయు, ఇతరుల అభిమాన - దురభిమానముల మూలమున వారి పదవులలో మార్పులు లేకుండుటయు ఉద్యోగిశాఖకు చేకూరినవి.

ఎన్నికల మూలమున తాత్కాలికముగ అధికారమునకు వచ్చు మంత్రులవలన ఉద్యోగస్థులకు హాని కలుగకుండుటకై ఇట్టి ఏర్పాటులు చేయబడి ఉన్నవి. మా. వెం. రం.

**ఉప ఎన్నిక :** చూ. నడిమి ఎన్నిక.

**ఉపాధ్యక్షుడు :** చూ. భారత రాజ్యాంగము.

**ఉప్పు సత్యాగ్రహము :** చూ. భారత స్వాతంత్ర్య ఉద్యమము.

**ఉరుగ్వే :** దక్షిణ అమెరికాలోని ఒక స్వతంత్ర గణ రాజ్యము.




దక్షిణ అమెరికా ఖండమున ఆగ్నేయ ప్రాంతమున ఉన్న ఈ రాజ్యమునకు బ్రెజిల్ [ఉ]; అట్లాంటిక్ మహా సముద్రము [తూ]; రియో డి లా ప్లాటానదీముఖద్వారము [ద]; అర్జెంటీనా [ప] సరిహద్దులందు ఉన్నవి. [వి] 1,86,926 చ. కి. మీ.; [జ] 25,56,020; [భా] జాతీయభాష స్పానిష్; [మ] దేశవాసులలో అత్యధిక సంఖ్యాకులు రోమన్ కేతలిక్ సంప్రదాయపు క్రైస్తవులు; [రా] మాంటెవిడో (జ. సం. 9,85,000).

**చరిత్ర :** 1516 లో జువాన్ డయాజ్ డి సోలిస్ అను పాశ్చాత్యుడు ఈ ప్రాంతపు ఉనికిని కనుగొనుటతో యూరప్ వాసులకు ఈ ప్రాంతముతో పరిచితి లభించెను. కాని, అచటి ఆదిమవాసుల అతి తీవ్ర ప్రతిఘటన వలన యూరపియన్‌ల వలస అచట చాల కాలమువరకు స్థాపింపబడ లేదు. ప్రక్కన ఉన్న ప్రాంతములందన్నింట స్పెయిన్ వారును, పోర్చుగీస్ వారును వలసల నెలకొల్పినను, ఉరుగ్వేయందు మాత్రము వారు దాదాపు 17 వ శతాబ్దము కడవరకు కాలిడలేదు. తుదకు 1680 లో కొందరు పోర్చుగీస్ వారు బ్రెజిల్ నుండి ఇటకు చేరి కోలోనియా అను వలస రాష్ట్రమును నెలకొల్పిరి. పోర్చుగీస్‌లతో పోటీపడి స్పెయిన్ వారును 1726 లో ఈ దేశమున కొంత ప్రాంతమును వశపరచుకొని, మాంటెవిడో నగరమును నిర్మింపజేసిరి. తరువాత ఈ దేశమున సర్వాధిపత్యము విషయమున స్పెయిన్, పోర్చుగీస్ ప్రభుత్వముల మధ్య వివాదములును, సంఘర్షణలును చాలకాలము సాగెను. తుదకు ఈ రెండు ప్రభుత్వముల జోక్యమును త్రోసి రాజని, దేశీయులు జోసీ జెర్వాసియో అరిగాస్ అను దేశభక్తుని నాయకత్వమున స్వాతంత్ర్యము కొరకై 1810 నుండి పోరాడి విజయులై స్పెయిన్, పోర్చుగీస్ వలస ప్రాంతముల రెండింటిని కలిపి ఏకరాజ్యముగ రూపొందించిరి. కాని, 1816 లో పోర్చుగీస్ ప్రభుత్వ సేనలు ఈ ప్రాంతముపై దండెత్తి వశపరచుకొనినవి. అంతట అర్జెంటీనా దేశ ప్రభుత్వపు సాయమున ఈ దేశవాసులు తిరిగి తమ స్వాతంత్ర్యమును ఆర్జించిరి. 1830 లో ఇటుల ప్రప్రథమముగ స్వతంత్ర ఉరుగ్వే గణరాజ్యము ఏర్పడినను, ఆ తరువాత 22 ఏండ్ల వరకు అంతఃకల్లోలములవలన దేశము సంక్షుభితమైనది. 1852 నుండి సుస్థిర ప్రభుత్వము ఏర్పడినను రాజకీయ పక్షముల మధ్య గల తీవ్ర వైరుధ్యముల వలన దేశము తగినంతగ పురోగతిని ఆర్జింపలేకుండెను. ఇట్టి స్థితిలో 1911 లో జోసీ బాట్లీ యి అర్డోనెజ్ అను ప్రముఖుడు రెండవసారి అధ్యక్షుడై దేశమున ఆర్థిక, సాంఘిక విప్లవమును ఒకదానిని కొనివచ్చెను. తత్ఫలితముగ కార్మిక, విద్యారంగములందును, పారిశ్రామిక రంగమునను శ్రేయోదాయక సంస్కరణములు అనేకములు కొనిరాబడెను. ఇందువలన దక్షిణ అమెరికా యందలి రాజ్యములందెల్ల ప్రముఖ పురోగామి రాజ్యముగ ఉరుగ్వే ప్రసిద్ధిని ఆర్జించెను. బాట్లీ తరువాత అధికారమునకు వచ్చినవారును బాట్లీ విధానమునే ఒరవడిగ ఇడుకొని దేశపురోభివృద్ధికి తోడ్పడిరి.

ప్రథమ ప్రపంచ యుద్ధము (1914 - 1918) న తొలుత ఉరుగ్వే తాటస్థ్యమును వహించెను. కాని, 1917 నుండి యునైటెడ్ స్టేట్స్‌కు ఎక్కువగ సాయమొనర్చి విజయమునకు తోడుపడినది.

యుద్ధానంతర కాలమున ఈ దేశము రాజకీయముగ పెక్కు కల్లోలములను ఎదుర్కొనవలసి వచ్చినది. 1931 లో అధ్యక్షుడగు టెర్రా అనునతడు బలప్రయోగముచే ప్రాతికూల్యమును అడచి, రాజ్యాంగమును తన ఇచ్చవచ్చినటుల మార్చి, తానే తిరిగి అధ్యక్షుడు అగుటకు అవ

కాశము కల్పించుకొనెను. 1936 లో ఈతడు రాజ్యాంగమునే రద్దొనర్చి వేరొక రాజ్యాంగమును దేశముచే ఆమోదింప జేసెను. ఇతడు ఇటుల నియంతగ వర్తించినను, ఇతని కాలమున దేశము ఆర్థికముగ స్థైర్యమును ఆర్జింప గలిగినది. తరువాత 1938 లో నిష్పాక్షికపు ఎన్నికలు జరిగి ప్రజామోదమును ఆర్జించిన ప్రభుత్వము ఏర్పడినది.

ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున ఉరుగ్వే తొలుత తాటస్థ్యము వహించినను, మిత్రరాజ్యముల ఎడలనే సానుభూతిని వహించి, అక్షరాజ్యముల దుస్తంత్రములకు వైదొలగి ఉండెను. కాని, జపాన్ యునైటెడ్ స్టేట్స్‌పై ఆకస్మిక దండయాత్రను జరిపిన తరువాత ఉరుగ్వే అక్షరాజ్యములతో దౌత్య సంబంధములను రద్దుచేసికొని, తరువాత కొంతకాలమునకు ఆ రాజ్యములపై యుద్ధము సైతము ప్రకటించెను (ఫిబ్రవరి 15, 1945). ఐక్యరాజ్య సమితి ప్రణాళికను ఈ దేశము ఆమోదించి, అనతికాలముననే అందు సభ్యత్వమును ఆర్జించెను (డిసెంబరు 15, 1945).

రాజ్యాంగము : 1951 లో ఆమోదితమయిన రాజ్యాంగ చట్టమును అనుసరించి ఈ దేశమున పరిపాలన జరుగుచున్నది. కాని, ఆ చట్టము వలన అమలులోనికి తేబడిన గణరాజ్య విధానమున మరెచ్చటను, ఏ రాజ్యాంగమునను కనరాని ప్రత్యేక లక్షణములు కలవు. దేశమునకు పాలకుడుగ అధ్యక్షునికి బదులుగ తొమ్మిదిమంది సభ్యులుగల 'జాతీయ సమితి' యే సమష్టి బాధ్యతతో అధ్యక్షాధికారముల నిర్వహించుటకు రాజ్యాంగమున ఏర్పాటు కలదు. ఈ జాతీయ సమితియందలి సభ్యులు ప్రజలచే నాలుగేండ్లకు ఒకసారి ఎన్నుకొనబడుదురు. ఆ ఎన్నికలో ఎన్నుకొనబడవలసిన 9 మంది సభ్యులే కాక, వేరుగ 18 మంది ప్రత్యామ్నాయ సభ్యులును ఎన్నుకొనబడుదురు. జాతీయ సమితిలోని సభ్యులు ఎవరైన తమ పదవీకాలము లోపల ఏదియైన ఒక కారణమువలన వైదొలగవలసి వచ్చునెడల ఈ ప్రత్యామ్నాయ సభ్యులనుండి క్రమపద్ధతిలో ఆ ఖాళీలు పూర్తి చేయబడును. ఈ జాతీయ సమితి ఎన్నికలు జరుగు పద్ధతియందును ఒక ప్రత్యేకత కలదు. సమితి సభ్యత్వములకు వ్యక్తులకు బదులుగ రాజకీయ పక్షములే అభ్యర్థులుగ నిలబడును. అధిక సంఖ్య వోట్లు సంపాదించిన రాజకీయ పక్షమునకు జాతీయ సమితిలో ఆరు స్థానములును, సంఖ్యాబలమున ఆ తరువాత లెక్కకువచ్చు పక్షమునకు మూడు స్థానములును లభించును. అంతట ఆ యా పక్షములు తాము ఆర్జించిన స్థానములకు సభ్యులను నియామకము చేయును. ఒకసారి జాతీయ సమితిలో సభ్యత్వమును ఆర్జించినవాడు వెనువెంటనే జరుగు ఎన్నిక మూలమున సమితిలో సభ్యుడగుట నిషిద్ధము. శాసన నిర్మాణ విధి రెండు కక్ష్యలు కల శాసనసభయందు న్యస్తమై ఉన్నది.

చీ. శే. రా.

**ఋతము :** వైదికమత పరిభాషలో ఋతము అనగా విశ్వ విన్యాస లక్షణమును, సృష్టి స్థితిగతుల ధర్మమును తెలియ జేయునది అని అర్థము. నైతికముగాను, భౌతికముగాను విశ్వమునకు గల మూలధర్మమును అది బోధించును. ఋతమునకు వరుణుడు అధిష్ఠానదేవత. ఈ ఋతమును అనుసరించి ప్రతిదినము సూర్యోదయము అగుచున్నది. పంద్రెండు అరలు గల ఋతచక్రమే ఒక సంవత్సరము. గోవుల ఋతమును అనుసరించియే అపక్వమైన గోక్షీరములు ఎర్రని జీరతో కనబడును. ఋత ధర్మమును బట్టియే ప్రవాహములు ప్రవహించును. ఋగ్వేద సంహితలో ఒక సూక్తమందు ఒక కథ కలదు. యమి తన సోదరుడైన యముని వద్దకు పోయి, మానవ వంశోత్పత్తి కోసము తనతో సంప్రదాయ విరుద్ధమయిన సంయోగము చేయవలసినదని బలవంతము చేయగా యముడు ఆమె కోరికను నిరాకరించి, అందుకు కారణముగా ఈ సంయోగమును ఋతధర్మమే కాక, ఈ నైతిక భౌతిక ప్రపంచమందు ఋతమునకు అధిష్ఠాన దేవతలయిన మిత్ర, వరుణ దేవతల అనుశాసనములు కూడా నిషేధిస్తున్నవన్నాడు.

ఈ మహా భావన మన దేశములో క్రొత్తగా పుట్టినది కాదు. హిందూ - ఇరేనియా సాహచర్య కాలములోనే పుట్టి, దాయ భాగముగా మనదేశమునకు వచ్చినది. పిమ్మట కొంత కాలమునకు ఋతము అన్న పదము వాడుక నుండి తప్పినది. కాని, దానికి సంబంధము గల సత్యము, ధర్మము అనే పదములు వాడుకలోనికి వచ్చినవి. ఋతమనే పదము పోయినా, అనృతమనే పదము మాత్రము అసత్యమనే అర్థములో నిలిచి ఉన్నది. అనృతమన్నా, అసత్యమన్నా ఒక్కటే కనుక, ఋత, సత్య పదములు సమానార్థకములని చెప్పుటకు వీలులేదు. ఋతములో సత్యభావమే కాక ఇతర భావములు కూడ కలవు. ఋతము తపస్సునుండి సిద్ధించినది ; ప్రపంచ ధర్మములు అన్నిటికి వర్తించును. యజ్ఞమును, మానవ జీవితమును సూచించే సంఘటనల పూర్వ పారంపర్యమునకు వర్తించును. అందులో ఉపనిషద్ వాక్యము - 'భీషాస్మద్ వతః పరతే ....' చెప్పినట్లు వెరపుగొలిపే లక్షణ విశేషము ఉన్నది. వరుణునికి ఋతముతో ముఖ్య సంబంధము ఎట్లున్నదో, అట్లే ఇంద్రునికీ సత్యముతో ముఖ్య సంబంధము గలదు. ఇంద్రుని మహిమోన్నతి సత్యమే కాని, అతని భీషణ లక్షణము మాత్రము ఋతమునకు అంతగా అనురూపమయినది కాదు. అగ్ని

స్వరూపుడైన బృహస్పతికి గల ధనువునకు నారి ఋతము. అంతేకాక, అతడు ఋతపాలకుడు.

ధర్మము: ఋత లక్షణములలో ప్రధాన లక్షణము యొక్క సహజ పరిణామ విశేషమే ధర్మము. అది ఆధార ఆధేయ లక్షణములు రెండున్ను గలది. మనుస్మృతిలో (చూ. 7.14-27) విశ్వాత్మక ధర్మమునకున్ను, రాజ్యమేలే రాజునకు ఉండవలసిన రాజ్యాధికారమునకు ఆధార మయిన దండమునకున్ను గల సన్నిహిత సంబంధమును స్పష్టముగా తెలియజేయు వాక్యములు గలవు. అందులో దండము ధర్మమే అనిన్ని, ఆ ధర్మమందు బ్రహ్మతేజస్సు నిండుగా ఉన్నదనిన్ని, సకల జీవులను పరిపాలించవలసిన రాజుకోసమే అది సృజింపబడినదనిన్ని ఉన్నది. ఆ దండ భయమువల్లనే చేతనా చేతనములయిన సకల వస్తువు లున్ను తమ తమ క్రమము తప్పక, స్వధర్మమును విడ నాడక ప్రవర్తించుచున్నవి. దండమును సరిగా ధరించి ప్రయోగించే రాజు తనకున్ను, విశ్వమునకున్ను ఎంతో మేలు కలిగించినవాడు కాగలడు. అట్టి రాజు సత్యవాది అను కీర్తి పొందును. దండము మహత్తర తేజము గలది. అకృ తాత్ములయిన రాజులు దండమును ధరించుటకు అర్హత కలవారు కారు. ధర్మమార్గమును తప్పి నడచిన రాజు సకుటుంబముగా నశించును. అందుకు నిదర్శనముగా మహాభారతములో వేనరాజుకథ ఉదాహృతమయినది. వేనరాజు విశృంఖలాధికారము వహించి, ధర్మము తప్పి, నియంతయై యథేష్టముగా రాజ్యమేలి నశించెను. అట్టి నియంతృత్వమును పడగొట్టి నశింపజేయుట సత్కార్యమే అని ఆ కథ తెలియజేయుచున్నది. భారతీయ రాజ్యాంగ మతము ప్రకారము రాజ్యాధిపత్యమును సృష్టి ధర్మమునకును, న్యాయ ధర్మమునకును అనుగుణముగా నడపించవలెను. అట్లు నడపిన ఎడల రాజ్యాంగ వ్యవ స్థలో రాజు తన పరిపాలనాధికారమును స్వార్థపరత్వ ముతో తన ఇష్టమువచ్చినట్లు ఉపయోగించుకొని దుర్విని యోగము చేయుటకు అవకాశమేలేదు. కె. వి. ఎన్. శాస్త్రి.

ఎట్రుస్కన్‌లు: రోమ్ ఉచ్చదశలోనికి రాక పూర్వమే నాగరకతలోను, సంస్కృతిలోను పరిణతినందిన ఎట్రుస్కన్‌లను ఒక తెగవారు ఇటలీలో జీవించుచుండిరి. వీరినే గ్రీక్‌లు, టిరేనియన్‌లు అని కూడా వ్యవహరించిరి. వీరికి సంబంధించిన పురావస్తు శిథిలభాగములు కొన్ని వీరి చరిత్రను కొంతవరకు తెలియజేయుచున్నవి.

ఇటలీ ద్వీపకల్పములో ఆర్నో, టైబర్ నదుల మధ్య గల ఇట్రూరియా (నేటి టస్కనీ) వీరి ఆవాస భూమి. ట్రోజన్ సంగ్రామానంతరము క్రీ. పూ. 1100 - 1000 ప్రాంతములో ప్రాచ్యదేశములనుండి వచ్చి వీరు ఇట్రూరి యాలో స్థిరపడిరని చరిత్ర రచయితలు భావించు చున్నారు. తమకంటె ముందునుండి అక్కడ నివసించు చున్న అంబ్రియాన్‌లను వీరు తమ బానిసలుగ చేసికొనిరి. క్రమముగ ఈ ఎట్రుస్కన్‌లు ఉత్తరమున అపినైనస్ పర్వ తములను దాటి 'పో' నదీ లోయలోనికిని, దక్షిణమున టైబర్ నదిని దాటి లాటియమ్, కాంపేనియాల లోనికిని విస్తరించిరి. పో నదీ లోయలోని వారి నాగరకత 'ఫెల్సినా' (నేటి బొలోనా) కేంద్రముగా వర్ధిల్లి, క్రీ. పూ. 5 వ శతాబ్దిలో పరాకాష్ఠను అందినది. లాటియమ్‌లో ఎట్ర స్కన్‌ల ప్రభ క్రీ. పూ. 6 వ శతాబ్ది అంతట ఉజ్జ్వలముగా ఉండెను. కాంపేనియాలో మరొక 60, 70 ఏండ్లపాటు వారి ప్రతిభ నిలచి ఉండెను. క్రీ. పూ. 400 తరువాత గాల్ జాతివారు పో నదీ లోయపై ఎట్రుస్కన్‌ల యాజమాన్య మును అంతమొందించిరి. కడకు ఇట్రూరియా కూడ క్రీ. పూ. 3 వ శతాబ్దానంతరము రోమన్‌ల పెత్తనము క్రిందికి వచ్చినది.

ఎట్రుస్కన్‌ల నాగరకతా, సంస్కృతుల ప్రభావము అటుతరువాత నడచిన రోమన్ చరిత్రపై విశేషముగ కనిపించుటచే ఈ ఎట్రుస్కన్ నాగరకతకు చరిత్రలో ప్రాధాన్యము ఏర్పడినది. ఈ నాగరకతపై కొంతవరకు గ్రీక్ ముద్ర కనిపించినను, విశేషభాగము మౌలిక మైనదే. గి. వేం. సీ.

ఎడ్వర్డ్ - VII (1841 - 1910): విక్టోరియా మహా రాణి పెద్ద కుమారుడు. ఇతడు రాజు కాక మునుపు కళా శాలలయందు ఉన్నత విద్య అభ్యసించెను. సంస్కృతికి కావలసిన విజ్ఞానమును, సభ్యత మొదలయిన లక్ష ణములను అలవర్చుకొనెను. సంఘసంస్థలలోను, రాజకీయ కార్యములందును పాల్గొని ప్రపంచమందలి దేశము లందు పర్యటనము చేసి, అన్నిటను అనుభవము మెండుగా సంపాదించి-తల్లి 1901, జనవరి 22 న మర ణించగానే - 60 ఏండ్ల ప్రాయమున రాజ్యము ఏలుటకు ప్రారంభించెను. ఇతని విదేశాంగ రాజనీతి ప్రపంచ శాంతి, భద్రతలకు ఆదర్శకమైనది. అందుచేతనే ఇతనికి శాంతి సంధాత (పీస్ మేకర్) అను బిరుదము వచ్చినది. ప్ర. రా.



ఎడ్వర్డ్ - VII
(1814 - 1910)

**ఎడ్వర్డ్ - VIII** (జననము 1894): ఎడ్వర్డ్ - VII [చూ]. కుమారుడైన జార్జి - V నకు జ్యేష్ఠ పుత్రుడు. 1936, జనవరి 20 తేదీని జార్జి - V మరణించిన తరువాత గ్రేట్ బ్రిటన్, ఐర్లాండ్ దేశములకు రాజును, ఇండియా సామ్రాజ్యమునకు చక్రవర్తియు అయ్యెను. కాని, ఆ సంవత్సరమందే డిసెంబరు 11 వ తేదీని రాజ పదవిని విడిచిపెట్టవలసిన పరిస్థితులు ఏర్పడినవి. ఇతడు ఉన్నత విద్యను అభ్యసించి విదేశములందు పర్యటనము చేసి, ప్రజాహితములైన ఉద్యమములందు పాల్గొని, రాజ్యపాలనకు తగిన అర్హత సంపాదించుకొన్నవాడు. రాజ్యమునకు రాక మునుపే వాలిస్ వార్ఫీల్డ్ సింసన్ అనే సామాన్య స్త్రీని ప్రేమించి పెండ్లియాడ నిశ్చయించుకొనెను. ఆమె మొదట



ఎడ్వర్డ్ - VIII

ఒక యునైటెడ్ స్టేట్స్ వాసిని; వివాహమాడి విడాకులిచ్చి, ఒక ఆంగ్లేయుని పెండ్లియాడిన మగనాలి. ఈ ఆంగ్లేయునికి కూడా విడాకులిచ్చి ఎడ్వర్డ్ - VIII ను ఆమె పెండ్లియాడుటకు కూడ సిద్ధమయ్యెను. అట్టి స్త్రీని ఎడ్వర్డ్-VIII వివాహమాడినచో మహారాణియై చక్రవర్తి ప్రక్కన కూర్చుండుటకు అధికారము కలది అగును. అప్పుడు ప్రభువర్గమువారు సైతము ఆమెకు జోహార్లు చేయవలసి వచ్చును. అది ఆంగ్లేయ ప్రభువులకు, ప్రధాన మంత్రి (చూ. బాల్డ్విన్) కి అవమానకరముగా తోచి, 'ఎడ్వర్డ్ - VIII ఆమెనైనను విడిచిపెట్టుకొనవలెను లేదా రాజ పదవినైనను విడిచిపెట్టుకొనవలెను' అను సందిగ్ధ పరిస్థితికి రాజును బద్ధునిచేసిరి. 'రాజ పదవినైన విడిచిపెట్టుకొందునుగాని ఆమెను మాత్రము విడిచిపెట్టను' అను పట్టుదలతో రాజ పదవిని విడిచి పెట్టుటవలన అతని సోదరుడు జార్జి - VI గా సింహాసనము ఎక్కెను. పిమ్మట తమ్ముని కోరికను మన్నించి ఎడ్వర్డ్-VIII విండ్సర్ ప్రభువై సింసన్‌ను వివాహమాడెను. 1940 - 1945 లో బహామా దీవులకు గవర్నర్‌గా పనిచేసి, ఆ దేశ సౌభాగ్యమును పెంపొందించి, ప్రజాక్షేమ పోషకుడను ప్రఖ్యాతిని పొందెను. వ్యక్తిగతముగ ఇతడు అశేష ప్రజానీకపు మన్ననను ఆర్జించెను.

ప్ర. రా.

**ఎతియోపియా :** ఆఫ్రికా ఖండమందలి ఒక స్వతంత్ర రాజ్యము. ఈ దేశమునకు అబిసీనియా అను మరొక పేరుకూడ కలదు. కాని, ఎతియోపియా అనునదియే దీని నిజ నామము.




ఈ దేశమునకు ఎర్ర సముద్రము [ఉ]; సోమాలీలాండ్ [తూ]; కెన్యా, సోమాలియా [ద]; సుడాన్ [ప] సరిహద్దులుగ ఉన్నవి; [వి] 11,84,320 చ. కి. మీ. అని అంచనా; [జ] 2,10,00,000 (తాజా అంచనా) సెమిటిక్ - హామిటిక్ జాతులకు చెందిన ప్రజలు ఇందు అత్యధిక సంఖ్యాకులు; [భా] జాతీయ భాష అంహారిక్ ; కాని, దీనిని 40% మాత్రమే మాట్లాడుచున్నారు. తక్కినవారు మాట్లాడు భాషలలో ట్రిగ్రినియా, హారారీ అనునవి ప్రముఖములు. [మ] క్రైస్తవ మతమునందలి ఒక సనాతన సంప్రదాయము ఇచ్చట బహు దీర్ఘ కాలమునుండియు వ్యాప్తియందు ఉన్నది. దేశ ప్రభువే ఈ మత పీఠమునకును లాంఛనపు అధిపతి అగుటవలన ఇచట క్రైస్తవ మతమునకు ఒక ప్రత్యేకత చేకూరినది. ఇస్లామ్‌నకు చెందినవారును క్రైస్తవులతో దాదాపు సమాన సంఖ్యలో ఉన్నారు. [రా] అడ్డిస్ అబాబా (జ. సం. దాదాపు 4 లక్షలు).

చరిత్ర: 1923 వరకును అబిసీనియా అని వ్యవహృతమైన ఈ ప్రదేశములో ప్రాచీనకాలపు హామిటిక్ జాతి జనులు ఉండెడివారు. కొంతకాలము గడచిన తర్వాత సెమిటిక్ జాతి జనులు ఆసియా నుండి ఈ ప్రదేశమునకు వచ్చి వసతులు ఏర్పరచుకొనిరి. అప్పటికి ఈ ప్రదేశమందు ఉండిన నీగ్రోలను ఈ హామిటిక్ - సెమిటిక్ జాతులవారు పడమటి దిక్కుగా పారద్రోలిరి. అందులో కొందరిని మాత్రము బానిసలుగా తమ కొలువులో ఉంచుకొనిరి. పిమ్మట కొంతకాలమునకు అరబ్బులు, గ్రీక్‌లు, ఆర్మీనియన్‌లు, కొద్దిగా యూరప్ ఖండమందలి దేశముల

వారు ఇక్కడికివచ్చి వసతులు ఏర్పరచుకొనిరి. 'ఎతియో పియా' అనునది గ్రీక్ భాషా పదములతో ఏర్పడిన సమాసము. ఎండ వేడిమికి నల్లగా మాడిపోయిన ముఖములు అని అర్థము. ఈ దేశ ప్రజలు నీగ్రోలవలె కారు నలుపు గలవారు కారు కాని, నలుపెక్కిన రాగివర్ణము గలవారు. సుమారు క్రీ. పూ. 1600 నాటికి ఈజిప్టు రాజ్యములో ఎతియోపియా ఒక భాగముగా ఉండెడిది. మరి 800 ఏండ్లు గడచిన తరువాత ఎతియోపియా దొడ్డ రాజ్యమయి, దానిలో ఈజిప్టు ఒక భాగముగా ఉండెను. క్రీ. పూ. 524 లో పారసీక రాజయిన కాంభోజ (కాంబిసిస్) ఎతియోపియా దేశమును కూడ జయించి, పారసీక సామ్రాజ్యములో చేర్చుకొనెను. ఆ తర్వాత మరి కొంత కాలమునకు ఎతియోపియాలోని ఉత్తరభాగము రోమన్ సామ్రాజ్య మందు ఒక మండలములోని భాగమయినది. పిమ్మట చాల కాలము స్వతంత్ర రాజ్యముగా ఉండెను. ఈ ప్రదేశము యొక్క స్వాతంత్ర్యమును ఆధునిక యుగములో నిర్మూలించినవారు ఇటలీ దేశీయులు. వీరు 1870 మొదలుగ ఎతియోపియాలోని పలు ప్రాంతములలో పలుకుబడిని ఆర్జించిరి. కాని, 1889 లో ఇంగ్లీషువారి తోడ్పాటు చేకూరుట వలన ఇది ఇటలీ ప్రభుత్వ సంరక్షిత దేశము కావలసిన గండము తప్పినది. అయినను, ఇటాలియన్లు ఎతియోపియాను ఎట్లయిన వశపరచుకొనవలెనని అప్పు డప్పుడు దండెత్తి వచ్చుచునే ఉండిరి. 1896 లో అడోవా యుద్ధమున అబిసీనియా సేనలు ఇటలీ సేనలను పూర్తిగా ఓడించి తరిమినవి.

ఇటలీ వలన భయము గల ఎతియోపియా 1923 లో నానాజాతి సమితి [చూ.] లో సభ్యత్వము సంపాదించు కొన్నది. 1932 - 1935 మధ్యకాలమందు క్రమక్రమముగా బానిసత్వ విమోచనమునకు సంబంధించిన ఉద్యమము ఈ దేశమున చురుకుగా పనిచేసి, బానిసత్వమును చాల వరకు నిర్మూలించినది.

ఇటలీవారు 1935 - 36 లో ముస్సోలినీ కలిగించిన ఉత్సాహముతో మరల సామ్రాజ్య కాంక్ష గలవారయి, ఈ దేశముపై దండెత్తి వశపరచుకొనిరి. అంతట దేశా ధీశుడు బ్రిటన్‌కు ప్రవాసము ఏగెను. ద్వితీయ ప్రపంచ యుద్ధకాలము (1939 - 45) న బ్రిటిష్‌వారు ఎతియోపియా వారికి తోడుగా నిల్చి, సైనిక సాహాయ్యము ఇచ్చిరి. 1941 మే నెలలో అడ్డిస్ అబాబావద్ద ఎతియోపియా వారికి సంపూర్ణ విజయము కలిగినది. 1947 లో ఇటలీవారు మిత్ర రాజ్యములతో సంధి జరుపుకొని ఎతియోపియా రాజ్య స్వాతంత్ర్యమునకు తమ సమ్మతిని ప్రకటించిరి.

ఎతియోపియా మహారాజు తన రాజ్యమందు బాధ్యతా యుతమయిన రాజ్యాంగ విధానము ఏర్పరచుట కున్ను, నవీన సాంస్కృతిక పద్ధతులను అనుసరించి రాజ్యము ఏలుటకున్ను సంకల్పించి ప్రజాహితముగ పరి పాలనము సాగించుచున్నాడు.

పూర్వము ఇటలీవారి వలసగా ఉండి ద్వితీయ ప్రపంచ యుద్ధమున మిత్రరాజ్య సేనలకు వశమైన ఎరిట్రియా అను ప్రదేశము 1952, సెప్టెంబరు 15 నుండి సమాఖ్యా విధాన మును అనుసరించి ఈ రాజ్యమున అంతర్భాగమైనది [చూ. ఎరిట్రియా].

**రాజ్యాంగము :** వంశానుగతమగు రాచరికపు పాలన ఈ దేశమున అమలునందు ఉన్నది. 1955, నవంబరు 4 న చక్రవర్తి వెలువరించిన నూతన రాజ్యాంగ విధానమును అనుసరించి కొన్ని అధికారములు ప్రజలకు సంక్రమింప జేయబడినను, అంతిమ నిర్ణయాధికారము రాజునందే న్యస్తమై ఉన్నది. చక్రవర్తియే తన ఇచ్ఛవచ్చిన రీతిలో ఒక మంత్రివర్గమును, శిష్ట పరిషత్తు (క్రౌన్ కౌన్సిల్) ను నియమించుకొని వాని సాయమున పరిపాలనను నిర్వహిం చును. మంత్రివర్గ సభ్యులు చక్రవర్తికి బాధ్యత వహించి, తమకు అప్పగింపబడిన వివిధశాఖల పరిపాలనను నెరపు దురు. శిష్ట పరిషత్తు ఒకసలహాసంఘముగ మాత్రమే వ్యవహ రించును. ఈ పరిషత్తునందు జాతీయ సనాతన క్రైస్తవ మతపు ఆర్చిబిషప్ (ముఖ్య మతాధికారి), సెనేట్ అధ్య క్షుడు, చక్రవర్తిచే నియమితులగు కొందరు రాజవంశీ కులు, మంత్రులు, పెద్దలు సభ్యులుగ ఉందురు. చక్రవర్తి ఆదేశానుసారము మంత్రులు పార్లమెంట్‌నందు శాసనము లను ప్రవేశపెట్టుచుందురు. పార్లమెంట్‌నందు ఎగువసభ, ప్రతినిధుల సభ అను రెండు కక్ష్యలు కలవు. 1957 సెప్టెం బరు ఎన్నికలకు పూర్వము ఈ ఉభయ సభల సభ్యులను చక్రవర్తియే నియామకము చేయుచుండెడివాడు. ఇపుడు ప్రతినిధుల సభ సభ్యులు మాత్రము ఎన్నుకొనబడు చున్నారు. గ్రామీణ నియోజకవర్గములనుండి 2 లక్షల మందికి ఇరువురు ప్రతినిధులును, పట్టణ నియోజకవర్గముల నుండి 30 వేల మందికి ఒక ప్రతినిధియు ప్రతినిధుల సభకు నాలుగేండ్లకు ఒకతూరి ఎన్నుకొనబడెదరు. ఆంతరంగిక స్వపరిపాలన కలిగిన ఎరిట్రియా [చూ] రాష్ట్రమునకు మాత్రము రాష్ట్రశాసనసభ కలదు. గి. వేం. సీ.

**ఎన్నిక :** ఎన్నిక అనునది ప్రజాస్వామ్యవ్యవస్థ యందు ప్రజలు తమ పాలకులను స్వేచ్ఛాపూర్వకముగ నిర్ణయించుకొను విధానము [చూ. అల్ప - అధిక సంఖ్యాక ప్రభుత్వములు - పు. 272]. ప్రాచీన కాలమున రాజ్యాధి

కారమును ఆర్జించుటకు వారసత్వము లేదా బలప్రయోగములు ముఖ్య సాధనములుగ ఉండెడివి. కాని, ప్రజాస్వామ్యభావములు నేటి ప్రపంచమున విరివిగ వ్యాప్తి చెందుటవలన - ఎన్నికల మూలమున - ప్రజలనుండి అధికారమును స్వీకరించినవారే పలు దేశములందు పాలకులు అగుచున్నారు.

ఈ రాజ్యాధికారమును నిర్వహించు శాసన, న్యాయ, కార్యనిర్వాహక శాఖలలో [చూ. అధికార విభజనము - పు. 265] అధికార దృష్ట్యా అగ్రస్థానమును వహించు శాసన శాఖకు చెందిన పాలకులను మాత్రమే ప్రజలు ఎన్నుకొనుట చాలుననియు, తక్కిన శాఖలవారిని ఎన్నుకొనవలసిన అవసరము లేదనియు ప్రముఖ పండితుల అభిప్రాయము. న్యాయ, కార్యనిర్వహణశాఖలయందలి పాలకులు పక్షపాత రాహిత్యముతో వర్తింపవలయును; ఎన్నికవలన వచ్చువారు ఏదో ఒక రాజకీయ పక్షమునకు చెందు వారై ఉందురు; అందువలన వారిని ఆ పదవులందు ఉంచుట సమంజసము కానేరదు. కాని, ఈ నియమమును యథాతథముగ పాలించుట చాల కష్టము. నేటి రాజ్యాంగము లందు అధ్యక్షుడును, మంత్రివర్గమును పెక్కు సందర్భము లందు ఎన్నుకొనబడుచునే ఉన్నారు. వీరికి శాసన నిర్మాణముననే కాక, కార్యనిర్వహణమందును అధికారము కలదు. కాని, అధ్యక్షపదవి వహించువాడు పక్షపాత రహితుడై, రాజ్యాంగమును రక్షించుచుండు సంప్రదాయమును ఏర్పరకొనుటవలన ఇందలి లోపము చక్కదిద్దబడు చున్నది.

ఎన్నికలలో పాల్గొన తగినవారు ఎవరు అను విషయమున నేటిప్రజాస్వామిక రాజ్యములలో పెక్కింట యుక్త వయస్కతయే ఏకైకార్హతగ ఆదరింపబడుచున్నది. భారతదేశమున ఇందులకు 21 ఏండ్లు యుక్త వయస్సుగ పరిగణింపబడుచున్నది. ఎన్నికలలో అభ్యర్థుల గుణ దోషములను అవగాహన చేసికొనగలుగు విచక్షణాశక్తి ఎన్నికలలో పాల్గొనువారికి కలదా లేదా అని నిర్ణయించుటకు వయస్సు కన్న సాధనాంతరములు వేరుగ కన్పట్టుటలేదు. విద్య, ఆస్తి మొదలగు అర్హతలను నిర్ణయించుచో ప్రభుత్వము అల్పసంఖ్యాకులగు ధనికవర్గపువారి వశమగును. అందువలన నేడు ఏ కొలది దేశములందుననో తప్ప తక్కిన అన్నింట వయోజనులు అందరకును ఎన్నికలలో పాల్గొను హక్కు (వోటు హక్కు) కలిగింపబడినది.

ప్రజాస్వామ్యమున పాలకులుగ ఉండువారిని అందరిని గుర్తించి, ఎన్నికలలో పాల్గొను ప్రతివాడును తన అభిప్రాయమును తెలియచేయజాలడు. ఉదాహరణమునకు భారతదేశమునే గ్రహింతము. లోక సభయందలి 489 స్థానములకు నిలబడు వేలకొలది అభ్యర్థులనుండి తనకు నచ్చినవారిని 489 మందిని ఏ పౌరుడును నిర్ణయింపజాలడు. అందువలన దేశము వివిధ ప్రాంతీయ నియోజక వర్గము (కాన్‌స్టిట్యూయన్సీ) లుగ విభజింపబడినది. ఒక్కొక్క నియోజకవర్గమునుండి ఒక్కొక్కరు లేదా కొన్నిట (ద్విసభ్య నియోజకవర్గములలో) ఇరువురు మాత్రమే ఎన్నుకొనబడవలసి ఉన్నారు. ఇట్టి విభజన వలన అక్కడ అభ్యర్థులుగ నిలచియుండు కొలదిమందిలో తనకు నచ్చిన వానిని లేదా వారిని నిర్ణయించుకొనుట వోటరునకు సులభతరము అగును.

కొన్ని సందర్భములందు వృత్తిని అనుసరించి నియోజక వర్గములు ఏర్పరుపబడుచున్నవి. బ్రిటిష్‌వారు భారత దేశమును పాలించు కాలమున మతమును అనుసరించి నియోజకవర్గములు ఏర్పరుపబడినవి. ఇట్టి మతసంబంధిక నియోజకవర్గములు కడకు దేశానర్థమునకు దారితీసినవి. ఏవియో కొలది దేశములుతప్ప తక్కిన అన్నింట నేడు ప్రాంతీయ నియోజకర్గముల విధానమే అమలునందు ఉన్నది.

ఇక అభ్యర్థులకు ఉండవలసిన యోగ్యతలు ఎట్టివి? అను విషయమున వివిధాభిప్రాయములకు తావు కలదు. రాజ్యపాలనము ప్రజాశ్రేయమునకు అనుగుణముగ జరుగునటుల చూచుటకై అధికారమును వాంఛించు అభ్యర్థికి ముఖ్యముగ విద్య, ప్రపంచానుభవము, ప్రజాసేవాసక్తి, స్వార్థరాహిత్యము విధిగ ఉండితీరవలయును. కాని, వీనికి కొలబద్దలను నిర్ణయించుట శక్యము కాని పని. అందువలన చట్టముచే ఇవి నిర్ణయింపబడకున్నవి. అభ్యర్థులను నిర్ణయించు రాజకీయ పక్షముల వివేచనకును, ఎన్నికలలో పాల్గొనువారి విచక్షణా శక్తికిని ఇవి వదలివేయబడినవి. కాని, అభ్యర్థుల వయస్సు విషయమున మాత్రము రాజ్యాంగములు కొన్ని నియమములను ఇడినవి. భారత దేశమున రాజ్యసభకు పోటీ చేయువానికి 30 ఏండ్లకును, లోక సభకు పోటీ చేయువానికి 25 ఏండ్లకును తగ్గని వయస్సు ఉండవలెనని నియమము ఏర్పరుపబడినది.

ప్రజాస్వామిక దేశములందు అన్నింటను నేడు ఎన్నికల విషయమున రాజకీయ పక్షములు ప్రాముఖ్యమును వహించి ఉన్నవి. అందువలననే ప్రజాస్వామికమున ప్రజలు అధికారులు అనుట నామమాత్రమే అనియు, నిజముగ అధికారమును నిర్వహించువారు రాజకీయ పక్షముల నాయకులే అనియు కొందరు విమర్శించుచున్నారు. ఇందు కొంత సత్యము కలదు. రాజకీయ పక్షములను చేతులలో ఇడుకొనిన ఏ నలుగు రైదుగురు పెద్దలో నేడు

ఎన్నికల చక్రమును త్రిప్పుచున్నారు. అందువలన ప్రజాభిప్రాయము సరిగ ప్రతిఫలించుటకు అభ్యంతరము ఏర్పడుచున్నది. ఇట్టి పరిస్థితినుండి ఎన్నికల పద్ధతిని తప్పించుటకు మాత్రము సరియైన మార్గమును రాజనీతి శాస్త్రవేత్తలు ఇప్పటికిని సూచింపజాలకున్నారు.

వివిధ రాజకీయ పక్షములు ఒకే నియోజక వర్గమున పోటీచేసి, ఎవరికిని సగమునకు మించి వోట్లు రానపుడు ఏ అభ్యర్థి గెలిచినటుల నిర్ణయింపవలయునను విషయమున ప్రజాస్వామిక వాదులందు భిన్నాభిప్రాయములు కలవు. అట్టి ఎన్నికలలో కొందరు అధిక సంఖ్యాక సూత్రము (ప్లూరాలిటీ) ను అనుసరించి నిర్ణయము జరుగుట సముచితమని భావించిరి. మరికొందరు నైష్పత్తిక సూత్రము (ప్రొపోర్షనల్ ప్రిన్సిపిల్) ను అనుసరించుట సమంజసమని తలచి ఆ విధానమును అవలంబించిరి. ఇందులో తొలుతటి సూత్రమును భారత రాజ్యాంగము అవలంబించినది. అందువలన అట్టి ఎన్నికలలో సగముకన్న ఎక్కువ వోట్లు రాకపోయినను, తక్కిన ఏ ఒకరికన్నను మిన్నగ వోట్లు లభించినవాడే గెలుపొందినటుల నిర్ణయము జరుగుచున్నది. ఇందువలన నూటికి ఏబదికి మించిన వోటర్లకు శాసనసభయందు ప్రతినిధి లేకపోవుటయు, ఏబదికి తగ్గిన వారి ప్రతినిధికి స్థానము లభించుటయు జరుగుచున్నది. ఇందువలన ప్రజాభిప్రాయము సరిగ శాసనసభయందు ద్యోతకము కాదని కొందరు విమర్శించుచున్నారు. దీనిని సరిచేయుటకు నైష్పత్తిక సూత్రమును అనుసరించి, తదనుగుణముగ 'ఏకైక పరివర్తనీయపు వోటుపద్ధతి (సింగిల్ ట్రాన్స్ఫరబుల్)' న [చూ. వోటు] ఎన్నికలు జరుగవలెనని భారతదేశమున కొన్ని కాంగ్రెస్ వ్యతిరేక పక్షముల వారు ఆందోళన చేయుచున్నారు. కాని, సామాన్య ఎన్నికలలో ఈ సూత్రమును అవలంబించుటవలన స్థిర ప్రభుత్వము ఏర్పడని దురవస్థ కలుగునని కాంగ్రెస్ పక్షపు వారి వాదము. భారతదేశమున రాజ్యసభ యందలి సభ్యుల ఎన్నికయు, రాష్ట్రపతి ఎన్నికయు నైష్పత్తిక సూత్రమును అనుసరించియే జరుగుచున్నవి.

ఎన్నికలు అపరోక్షములు (డైరక్ట్), పరోక్షములు (ఇన్ డైరక్ట్) అని రెండు విధములు. సభ్యులను స్వయముగ సాధారణపు వోటరులే ఎన్నుకొనుట అపరోక్షపు ఎన్నిక. భారతదేశమున లోకసభకు, రాష్ట్రీయ శాసనసభకు జరుగు ఎన్నికలు అట్టివి. అటులకాక, ప్రజలచే ఎన్నుకొనబడినవారు నియోజక వర్గముగ రూపొంది వేరొక సభకు సభ్యులను లేదా పదవికి ఒకనిని ఎన్నుకొనుట పరోక్షపు ఎన్నిక. అపరోక్షపు ఎన్నికలు అన్ని విధముల శ్రేష్ఠతరములే అయినను, పలుసారులు జరుపు ఎన్నికల వలన దేశము వ్యయప్రయాసలకు లోనుకాకుండ చేయుటకు పరోక్షపు ఎన్నికలు ఆదరింపబడుచున్నవి. ఈ పరోక్షపు ఎన్నికలకే అప్రత్యక్ష ఎన్నికలు అనియు వ్యవహారము కలదు [చూ. అప్రత్యక్ష ఎన్నిక - పు. 268].

ఎన్నికలను సక్రమముగ నిర్వహించుట అనునది ప్రజాస్వామిక దేశముల శ్రేయస్సునకు అత్యావశ్యకమగు విషయము. అందువలన వానిని నియమబద్ధముగ, నిష్పాక్షిక బుద్ధితో నిర్వహించుటకు ప్రతి ప్రజా స్వామిక రాజ్యాంగమునందును ఒక యంత్రాంగము నెలకొల్పబడుచున్నది. భారత రాజ్యాంగ విధానమున ఇందులకై ఎన్నికల కమీషనర్ అను పేర ఒక ప్రముఖోద్యోగి నియమితుడై ఉన్నాడు.

ఎన్నికలవలన ప్రజాభిప్రాయము చక్కగ వ్యక్తము కావలెననిన వోటరుల పట్టీలో పేరు నమోదయిన వారిలో అత్యధిక సంఖ్యాకులు ఎన్నికలలో పాల్గొనవలెను. అటుల జరుగనిచో ప్రజాభిప్రాయమును ప్రతిబింబించని ప్రభుత్వము ఏర్పడుటకు అవకాశము కలిగి ప్రజాస్వామ్యము అర్థరహితమగును.

ఎన్నికలవలన వేరొక ప్రయోజనమును కలదు. ఎన్నికల సమయమున జరుగు ప్రచారము ప్రజలలో రాజకీయ పరిజ్ఞానమును విరివిగ వృద్ధిచేయును. పోటీలేక ఏకగ్రీవముగ ఎన్నిక జరిగినపుడు ఈ ప్రయోజనము కలుగనేరదు. మా. వెం. రం.

**ఎరిత్రియా :** ఎరిత్రియా ఎతియోపియాకు ఉత్తరమున ఉండిన ఒక చిన్న ప్రదేశము. 1892 నుండి 1941 వరకును ఇటలీ వారికి వలస రాజ్యముగా ఉండెను. అంతకు పూర్వము ఇది చిరకాలము ఎతియోపియాలోని భాగమే. 1941 లో బ్రిటిష్‌వారు ఇటలీ అధీనతనుండి తొలగించి ఈ ప్రాంతమును తమ సంరక్షణలోనికి తీసికొనిరి. అంతట $11\frac{1}{2}$ ఏండ్లపాటు ఈ ప్రదేశమునకు స్థిరమైన పరిపాలన లేకపోయినది. చివరకు 1952 లో స్థానికముగా తన పరిపాలనాస్వాతంత్ర్యము నిలుపుకొనుచు, ఈ ప్రాంతము సమాఖ్య పద్ధతిన ఎతియోపియా సామ్రాజ్యములోని రాష్ట్రమయినది [చూ. ఎతియోపియా - పు. 342]. గి. వేం. సీ.

**ఎల్ సాల్వడార్ :** మధ్య అమెరికా యందలి ఒక స్వతంత్ర రాజ్యము.

ఈ రాజ్యమునకు హోండూరాస్, గ్వాతెమాలా [ఉ]; హోండూరాస్, ఫోన్‌సికా సింధుశాఖ [తూ]; పసిఫిక్ మహాసముద్రము [ద]; గ్వాతెమాలా, పసిఫిక్ మహాసముద్రము [ప] సరిహద్దులుగ ఉన్నవి. [వి] 1,08,889 చ. కి. మీ.; [జ] 40,95,203;

శ్వేత జాతియు, ఆదిమ అమెరికన్ జాతులును సమ్మిశ్రణ మొందగ రూపొందిన మిశ్రజాతికి చెందినవారు ఇందు అత్యధిక సంఖ్యాకులు. [భా] జాతీయభాష స్పానిష్, కొలది మంది ఆదిమ అమెరికన్‌లు మాత్రము 'నహ్వాతీ' అను అమెరికన్ భాషను మాట్లాడుదురు; [మ] దేశ ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు రోమన్ కేతలిక్ సంప్రదాయపు క్రైస్తవులు; [రా] సాన్ సాల్వడార్ (జ. సం. 2,23,226).




చరిత్ర: పదునారవ శతాబ్దికి పూర్వమున కస్‌కట్‌లాన్ అను పేరుగల ఆదిమ అమెరికన్ రాజ్యము ఒకటి ఈ ప్రాంతమున వర్ధిల్లెనని తెలియవచ్చుచున్నను, అందలి పరిపాలకులను గురించిన వివరములు ఏవియు తెలియవచ్చుట లేదు. ఆ రాజ్యమును 1524 లో పెడ్రో డి అల్వారాడో అను స్పానిష్ విజేత జయించి, ఆ ప్రాంతమును స్పెయిన్ సామ్రాజ్యమున అంతర్భాగముగ చేసెను. ఆనాడు ఇది సాన్‌సొనాటీ, సాన్‌సాల్వడార్ అను రెండు రాష్ట్రములుగ విభక్తమై గ్వాతెమాలా దేశ పరిపాలనాధికారి అధికారమునకు లోబడి ఉండెను. గ్వాతెమాలా రాజ్యము స్పెయిన్ సామ్రాజ్యము నుండి 1821 లో విడివడిన వెంటనే, ఈ దేశమును తన స్వాతంత్ర్యమును ప్రకటించెను. ఆ వెనువెంటనే దీనిని మెక్సికో పరిపాలకులు ఆక్రమించి తమ సామ్రాజ్యమున కలుపుకొనిరి. కాని, ఈ దేశప్రజలు మరల తిరుగుబాటుచేసి 1824 లో స్వాతంత్ర్యమును ఆర్జించుకొనగలిగిరి. అంతట మధ్య అమెరికా యందలి తక్కిన చిన్న రాజ్యములు ఇచ్ఛాపూర్వకముగ నిర్మించుకొనిన సమాఖ్యలో ఈ దేశము చేరెను. 1839 లో ఈ సమాఖ్యనుండి ఎల్ సాల్వడార్ విడివడి, ప్రత్యేక స్వతంత్ర రాజ్యముగ రూపొందెను. 1859 లో ఈ స్వాతంత్ర్య ప్రతిపత్తికి పరిగణన లభించి, ఈ దేశము ఒక గణరాజ్యముగ ప్రకటితమయ్యెను. కాని, మధ్య అమెరికా యందలి ఈ దేశమును పోలిన అల్ప రాజ్యములన్నియు - ఏదియో ఒక విధమగు సంఘీభావమును అలవరచుకొనకున్నచో - వానిలో దేనికిని భద్రత ఉండజాలదను అభిప్రాయము ఎల్ సాల్వడార్ నందును, దానికి సన్నిహితముగ ఉన్న తక్కిన రాజ్యములందును ప్రజలలో విరివిగ వ్యాపించి ఉండెను. తత్ఫలితముగ 1951 లో మధ్య అమెరికా రాజ్యముల కూటమి [చూ. పు. 271] రూపొందింపబడి, ఆ వ్యవస్థయొక్క ప్రధాన కార్యాలయము ఎల్ సాల్వడార్ రాజధానియగు సాన్ సాల్వడార్ లో నెలకొల్పబడెను.

అవ్యవస్థత అనునది ఈ దేశపు చరిత్రలో 19, 20 శతాబ్దములందు ఒక ముఖ్య లక్షణముగ పరిణమించెను. రాజకీయ కల్లోలములు, తిరుగుబాటులు, అధ్యక్షులను బలప్రయోగముచే పదవీ భ్రష్టుల చేయుటలు ఈ దేశపు ఈ రెండు శతాబ్దముల చరిత్రలో సామాన్య విషయములు అయ్యెను. దేశ పరిపాలనలో సైనికుల జోక్యము నానాటికి అతిశయించెను. కడకు 1950 లో నూతన రాజ్యాంగము ఒకటి రూపొందింపబడి, రాజకీయ మితవాద భావములకు అందు కొంత ప్రాబల్యము కల్పింపబడెను.

ఈ దేశపు ఆర్థిక వ్యవస్థకు కాఫీ విత్తనముల పంట 1910 మొదలుగ ముఖ్యాలంబనమైనది.

రాజ్యాంగము: 1950 లో ఆమోదింపబడిన రాజ్యాంగ చట్టమును అనుసరించి ఈ దేశమున పరిపాలన నిర్వహింపబడుచున్నది. ఆరేండ్లకు ఒకతూరి ప్రజలచే అపరోక్షపు ఎన్నికలో అధ్యక్షుడు ఎన్నుకొనబడును. ఒకసారి అధ్యక్షుడుగ ఎన్నుకొనినవాడు తన పదవీకాలము తరువాత వెనువెంటనే ఆ పదవికి మరల ఎన్నుకొనబడుట నిషిద్ధము. కార్య నిర్వహణాధికారము అంతయు అధ్యక్షుని యందే న్యస్తమై ఉన్నది. రెండేండ్లకు ఒకతూరి శాసనసభ చే ముగ్గురు ప్రత్యామ్నాయాధికారులు ఎన్నుకొనబడుదురు. అధ్యక్షుడును, ఉపాధ్యక్షుడును ఏ కారణమువలననైన విధినిర్వహణకు అశక్తులగుచో ఈ ప్రత్యామ్నాయాధికారులు తమ క్రమస్థాయిని అనుసరించి అధ్యక్షపదవిని నిర్వహింతురు. శాసనసభ ఏకకక్ష్య కలిగి ఉన్నది. దీనికి సభ్యులు రెండేండ్లకు ఒకసారి ఎన్నుకొనబడుదురు. శాసనముల ప్రవేశపెట్టు అధికారము శాసనసభ సభ్యులకే కాక, అధ్యక్షునకును కలదు. శాసనసభ తీర్మానములను అధ్యక్షుడు నిరాకరింపవచ్చును (వీటో చేయవచ్చును). కాని, మూడింట రెండువంతుల ప్రాబల్యముతో అధ్యక్షుని వీటోను రద్దుచేయు అధికారము శాసనసభకు కలదు. 18 ఏండ్ల వయస్సు దాటిన స్త్రీ - పురుషులు అందరకు వోటు చేయు అధికారము కలదు. దేశమున మతస్వాతంత్ర్యము అమలునందు ఉన్నది.

చీ. శే. రా.

**ఎలిజబెత్ - I** (1533 - 1603): ఇంగ్లండు, ఐర్లాండ్ దేశముల రాణి; ఇంగ్లండు రాజగు హెన్రీ - VIII కి - ఆతని రెండవ భార్య - అనిబొలిన్ వలన కలిగిన కుమార్తె.

హెన్రీ - VIII 1547 లో మరణించిన తరువాత అతని మూడవ భార్య కుమారుడైన ఎడ్వర్డ్ రాజయినాడు. అతడు 1553 లో మరణించగానే, హెన్రీ మొదటి భార్య కుమార్తె మేరీ రోమన్ కేతలిక్ వర్గమువారి సలుకుబడి వలన రాణియైనది. ఆమె 1558 లో మరణించిన వెంటనే ఎలిజబెత్ - I రాణియైనది.

ఈమె మొట్టమొదట ముఖ్యముగా ఎదుర్కొనవలసి వచ్చిన క్లిష్టసమస్య మతమునకు సంబంధించినది. దానికి తోడు ఈమె వివాహసమస్య కూడ ఈ మతసమస్యకు అనుబంధమయినది. రోమన్ కేతలిక్ మతావలంబియైన స్పెయిన్ రాజు ఫిలిప్స్ - II, ప్రొటెస్టంట్ మతమునకు అవకాశము ఇచ్చిన ఆస్ట్రియా దేశపు ఆర్చ్‌డ్యూక్ చార్లెస్ అను వారలు ఎలిజబెత్ - I ను వివాహమాడుటకై పోటీ పడిరి. ఎవరిని పెండ్లియాడినను చిక్కులు తప్పవని తోచుటచేత అందరికిని ఆశలు పుట్టించుచు చివరకు ఈమె ఎవరిని పెండ్లియాడకుండా కాలము గడిపినది.

మత విషయములో ఈమె తన తండ్రి హెన్రీ - VIII అనుసరించిన నీతినే అనుసరించినది. రాజకీయముగా ప్రభుత్వ సమ్మతము, ప్రభుత్వ పోషణము పొందగల 'ఆంగ్లికన్ చర్చి' అను సంస్థను ఏర్పరచినది. అది అంతకంతకు ప్రజాసమ్మతమైనది. ఇట్టి పరిస్థితులలో తక్కిన కారణములతోపాటు మత విద్వేషము, ఎలిజబెత్ - I తనను పెండ్లియాడలేదన్న కోపము స్పెయిన్ రాజయిన ఫిలిప్స్ - II ను యుద్ధమునకు పురికొల్పినవి. తన నౌకా దళమును ఆతడు ఇంగ్లండుపై పంపెను. కాని, బ్రిటిష్ వారు తమ రాణి పక్షమున పోరాడి స్పానిష్ ఆర్మడా (నౌకా దళము) ను అంతను చెల్లాచెదరు చేసిరి.



ఎల్లోరా గుహలు

ఎలిజబెత్ - I పరిపాలన కాలములో సారస్వతాభివృద్ధి, అమెరికా ఖండపు ఉనికిని కనుగొనుటకు నౌకాయాత్రల ఉత్సాహము, నూతన సంస్కృతీ వికాసము ఎక్కువగా ఉండుట వలనను, ఆంగ్ల సాహిత్య చరిత్రలో ఎక్కువగా చెప్పకోదగిన షేక్‌స్పియర్ [చూ. సం. 6 - పు. 794] మహాకవి ఈమె పరిపాలనా కాలమున అనేక నాటకములు రచించి ఉండుటచేతను ఎలిజబెత్ - I కాలము ఇంగ్లండు చరిత్రలో స్వర్ణయుగముగా విరాజిల్లినది. గి. వేం. సీ.

**ఎలిజబెత్ - II** (జననము 1926): గ్రేట్ బ్రిటన్‌కు, ఉత్తర ఐర్లాండ్‌కు రాణి. 1952 లో జార్జి - VI మరణించగనే ఆయనకు పురుష సంతానము లేనందున జ్యేష్ఠ కుమార్తె అగు ఈమె బ్రిటిష్ సింహాసనమునకు వారసురాలైనది. ద్వితీయ ప్రపంచ యుద్ధములో సైనిక రంగమున మహిళాశాఖలో ఈమె పనిచేసినది. 1947 లో ఫిలిప్స్ మౌంట్‌బాటెన్‌ను వివాహమాడినది. కామన్‌వెల్త్ దేశములను అన్నిటిని పర్యటించినది. 1961 లో భారత దేశమునకు కూడ ఈమె విచ్చేసినది. కం. శ్రీ. రా.



ఎలిజబెత్ - II

**ఎల్లోరా గుహలు** : మహారాష్ట్రమున ఔరంగాబాద్ పట్టణమునకు వాయవ్యముగ 20. కి. మీ. దూరములో ఈ గుహలు ఉన్నవి. వీటిలో 12 బౌద్ధులు తొలిచినవి; 17 హిందువులు తొలిచినవి; 5 జైనులు తొలిచినవి. 15 వ శతాబ్దినాటి అరబ్ భూగోళికుడు ఆనాడు ఈ ప్రదేశము సుప్రసిద్ధయాత్రా స్థలముగ ఉండినట్లు పేర్కొనెను. బౌద్ధుల గుహలు క్రీ. శ. 350-750 మధ్య తొలువబడినవి. హిందువుల గుహలు ప్రాయశః 7 వ, 8 వ శతాబ్దులలో నిర్మితములై ఉండవచ్చును. వీటిలో మహిషాసురమర్దనము, పార్వతీపరమేశ్వరుల చతురంగ ఖేలనము, కపాల మాలాధారి అయిన భైరవుడు

మున్నగు పలు శిల్పములు కలవు. ముఖ్యముగ 8 వ శతాబ్దములో తొలువబడిన కైలాస శిలాలయము దర్శనీయ మైనది. జైనుల గుహలు ఐదును 8 వ, 13 వ శతాబ్దుల మధ్య తొలువబడినవి. ప్ర. రా.

**ఎస్తోనియా :** ప్రస్తుతము సోవియట్ రష్యాలో అంతర్భాగమైన ఎస్తోనియా యూరప్ ఖండములోని సముద్ర తీరమున ఉన్నది.

ప్రప్రథమముగా ఇది ప్రపంచ యుద్ధము - I తరువాత ఉద్భవించినది. [వి] 45,099 చ. కి. మీ. ; [జ] 11,96,000 ; [భా] ఎస్తోనియా భాష ; [మ] అత్యధిక సంఖ్యాకులు ప్రొటెస్టంట్ క్రైస్తవులు ; [రా] టాల్లిన్.

జర్మనీ యందలి ట్యుటానిక్ యోధులచే ఎస్తోనియా ప్రజలు 13 వ శతాబ్దిలో జయింపబడి, బానిసలుగా చేయబడిరి. 1521 లో స్వీడెన్ ప్రభుత్వము ఎస్తోనియాను స్వాధీనమొనర్చుకొని జర్మనీ అధికారమును వెడల నడపెను. అనంతరము 1721 లో రష్యా ప్రభువగు జార్ ఎస్తోనియాను కబళించి, అచ్చటి ప్రజలను ఘోరమైన పీడనవిధానమునకు గురిచేసెను. ఈ నిరంకుశత్వము ప్రథమ ప్రపంచ యుద్ధానంతరము వరకు కొనసాగి, తుదకు ఆ దేశము విదేశ పాలనమునుండి విముక్తి చెందెను.

ద్వితీయ ప్రపంచ యుద్ధము ఆరంభమైన కొలది కాలమునకు ఎస్తోనియా దేశము సోవియట్ రష్యా ప్రభుత్వముచే ఆక్రమితమైనది (జూన్, 1940). తరువాత పార్లమెంట్ ఆమోదముతో ఈ దేశము సోవియట్ సోషలిస్ట్ రాజ్యములో విలీనమైనది. ఈ విలీనమును యునైటెడ్ స్టేట్స్, బ్రిటన్‌వంటి కొన్ని రాజ్యములు ఆదిలో గుర్తించుటకు నిరాకరించెను. ఇప్పుడు ఈ దేశము సోవియట్ సోషలిస్ట్ సమాఖ్యలో 16 వ స్వతంత్ర రిపబ్లిక్ ప్రభుత్వముగ వ్యవహరించుచున్నది. ప్ర. రా. సు.

**ఏంగెల్స్, ఫ్రెడ్రిక్ (1820 - 95):** జర్మనీ జాతీయుడగు సోషలిస్ట్, కమ్యూనిస్ట్ సిద్ధాంత ప్రవక్తయగు కార్ల్ మార్క్సునకు సహచరుడు ; సాహాయ్యకుడు. ఇతని తండ్రి ప్రముఖ వ్యాపారి యగుటచే ఇతనిని కూడ వ్యాపారరంగమున ప్రవేశపెట్టెను. అయినను తొలుతటి నుండియు వ్యాపారమునందు కన్న దార్శనికవిషయము లందు ఎక్కువ కుతూహలము ఉండెడిది. బ్రిటన్‌లోని మాంచెస్టర్ నగర సమీపమున ఉన్న తమ ఫ్యాక్టరీని నిర్వహించు ఉద్దేశ్యముతో తండ్రి ఇతనిని 1842 లో ఇంగ్లండునకు పంపెను. 1844 లో ఇతనికి కార్ల్‌మార్క్సుతో పరిచితి లభించెను. చారిత్రక శక్తుల ప్రగతిని గురించి వీరి ఇరువురి అభిప్రాయమును ఒక రీతిగనే ఉండుటచే ఈ పరిచయము క్రమమున గాఢమైత్రిగ పరిణమించెను. కమ్యూనిస్ట్ సిద్ధాంతప్రవచనమున మార్క్సునకు ఏంగెల్స్‌తో జరిపిన సిద్ధాంతచర్చలు ఎంతయో తోడ్పడినవి. అందువలన మార్క్సుపేర ప్రకటితములైన ప్రముఖ రచనలందు అన్నింట ఏంగెల్స్ ప్రతిభా విశేషము గర్భితమై ఉన్నదని చెప్పనగును. అటులే ఏంగెల్స్ రచనలందును మార్క్సు సహకారము కాననగుచున్నది. ప్రపంచ ప్రసిద్ధిని ఆర్జించిన 'కమ్యూనిస్ట్ మానిఫెస్టో' ఈ ఇరువురి కృషి ఫలితమే. 1845 నుండి ఇంగ్లండునే తన స్థిరనివాసము చేసికొని తన జీవిత శేషమును గడపెను [చూ. కమ్యూనిజమ్, సోవియట్ రష్యా]. ప్ర. రా. సు.

**ఏకగ్రీవామోద విధానము :** చూ. అధిక సంఖ్యాక సూత్రము - పు. 264.

**ఏకపట్టికా విధానము :** కమ్యూనిస్ట్‌పక్ష ప్రాబల్యమున నడచు ప్రజాస్వామికవ్యవస్థయందు అనుసరింపబడు ఎన్నిక పద్ధతి. ఈ పద్ధతిని అనుసరించి ఒక నియోజకవర్గమున ఎన్నుకొనబడవలసిన సభ్యుల సంఖ్యను మించి అభ్యర్థుల సంఖ్య ఉండదు. ఎన్నికలను నిర్వహించు రాజకీయ పక్షము ఆ యా నియోజకవర్గములకు ఎన్నుకొనబడ తగియుండు అభ్యర్థులను తెలుపుచు దేశమునకు అంతటికిని ఏక పట్టిక (సింగిల్ లిస్ట్) ను తయారుచేసి, ఎన్నికలకు ముందుగ ప్రకటించును. ఎన్నిక తేదీన ఆ యా నియోజక వర్గములందలి వోటర్లు తమ నియోజక వర్గమునకై ఏక పట్టికయందు సూచింప బడిన సభ్యుడు తమకు ఇష్టుడగునా, కాదా? అను విషయముపై మాత్రమే వోటు చేయవలెను. ఇటుల ఏక పట్టికను తయారుచేయు విధిని సోవియట్‌రష్యాలో కమ్యూనిస్ట్ పక్షమే నిర్వహించుచున్నది ; పోలండ్‌వంటి వానియందు నేషనల్ ఫ్రంట్ అను సమష్టి రాజకీయపక్షము నిర్వహించుచున్నను, ఈ ఫ్రంట్‌నందునను కమ్యూనిస్ట్ పక్షమునకే ప్రాబల్యము కలదు. ఇట్టి ఏక పట్టికయందు కమ్యూనిస్ట్ పక్ష సభ్యులకే కాక, కమ్యూనిస్ట్‌లకు అనుకూలముగ ఉండు కొన్ని ఇతర రాజకీయ పక్షముల వారికిని, ఏ పక్షమునకును చెందని ప్రముఖ వ్యక్తులకును కొంత వరకు తావు కల్పింపబడుచున్నది. కాని, కమ్యూనిస్ట్‌పక్ష సభ్యులే విరివిగ ఉందురు. ఏక పట్టికయందు సూచింపబడిన సభ్యులను ఆ యా నియోజకవర్గములు విపరీత ప్రాబల్యముతో ఎన్నుకొనుటయే సాధారణముగ జరుగుచుండును.

ఒక నియోజకవర్గమునకు ఒక అభ్యర్థిని మాత్రమే ఉంచి, ఎన్నిక అనునది జరుపుట అర్థరహితమనియు, కమ్యూనిస్ట్ దేశములందలి నిరంకుశతకు లొంగిన ప్రజలు

చేయునది లేక, ప్రభుత్వమునకు భయపడి ఆ సూచింపబడిన అభ్యర్థికి వోట్లను ఒసగుచున్నారనియు, ఈ విధానమును ప్రజాస్వామికము అనుట నేతిబీరకాయ అనుట వంటిదే అనియు సాంప్రదాయిక ప్రజాస్వామ్యవాదులు నిరసించుచున్నారు [చూ. ఎన్నికలు - పు. 343]. చి. శే. రా.

**ఏడెన్** : అరేబియా ద్వీపకల్పపు నైరృతి కొనను ఉన్న ఏడెన్ రేవు పట్టణమును ఆశ్రయించి ఉన్న ఒక భూభాగము. ఇందు కొంతభాగము బ్రిటిష్ ప్రభుత్వపు వలస రాజ్యముగను, మరికొంత భాగము బ్రిటిష్ ప్రభుత్వపు రక్షిత ప్రాంతముగను ఉన్నది. దిగువ వివరములు ఆ విభజనను అనుసరించి ఈయబడినవి :

వలసరాజ్యము : ఈ ప్రాంతపు వైశాల్యము 117 చ. కి. మీ.; జనసంఖ్య 1,38,441. వీరిలో అరబ్‌లు అత్యధిక సంఖ్యాకులు; భారతదేశము, పాకిస్తాన్ నుండి వ్యాపారార్థమై ఇటకు వలసవచ్చినవారు ఈ ప్రాంతపు ప్రజలలో 10% కలరు; భాష అరబ్ ; అధిక సంఖ్యాకుల మతము ఇస్లామ్. ఈ వలసలో చేరియే ఏడెన్ రేవుపట్టణము ఉన్నది. ఈ రేవుపట్టణపు జనసంఖ్య దాదాపు 80 వేలు. సమీపమున కురియామురియా దీవులును పరిపాలన రీత్యా ఈ ప్రాంతముననే చేరి ఉన్నవి.

రక్షిత ప్రాంతము : ఈ ప్రాంతమునకు సమీపమున సముద్ర మధ్యమున ఉన్న శోకోత్ర ద్వీపము పరిపాలన రీత్యా ఇందే చేరి ఉన్నది.

దీని మొత్తపు [వి] ర. 2,90,365 చ. కి. మీ.; [జ] ర. 12,22,000; [భా] అరబ్ ; [మ] అత్యధిక సంఖ్యాకులు ముస్లిమ్‌లు. ఈ ప్రాంతము అంతయు 25 చిన్న రాజ్యములుగ విభక్తమై, ఒక్కొక్క రాజ్యము ఒక్కొక్క స్వతంత్ర పాలకునిచే పాలింపబడుచున్నది. ఈ పాలకులు అందరును బ్రిటిష్ వారి రక్షణను స్వీకరించి ఉన్నారు. ఈ చిన్న రాజ్యములను వాని వాని పాలకులకు గల బిరుదములను బట్టి 13 సుల్తాన్ రాజ్యములు, రెండు అమీరుల రాజ్యములు, 10 షేక్ రాజ్యములు అని వర్గములుగ విభజింపబడినవి. ఈ అన్ని రాజ్యముల రక్షణ, విదేశాంగ వ్యవహారముల బాధ్యతలను బ్రిటిష్ రెసిడెంట్ నిర్వహించును. [రా] ఏడెన్.

చరిత్ర : అతి ప్రాచీన కాలమునుండియు జనావాసములుగ పేరొందిన ప్రాంతములలో ఏడెన్ ఒకటి. ప్రాచీన కాలపు సెమిటిక్ జాతులు ఈ ప్రాంతమున క్రీ. పూ. 1200 ప్రాంతమున నెలవులను ఏర్పరచుకొని, కొంత నాగరకతను ఆర్జించినవి. రోమన్‌లకు ఈ ప్రాంతము సుపరిచితమై ఉండెను. ప్రాక్పశ్చిమ దేశములమధ్య సముద్ర వ్యాపార మార్గమున కీలకస్థానమునందు ఇది ఉండుట గమనించి, రోమన్‌లు ఈ ప్రాంతమును క్రీ. పూ. 24 ప్రాంతమున వశపరచుకొని, కొంతకాలము తమ స్వాధీనమున ఉంచుకొనిరి. రోమన్‌సామ్రాట్‌ల ప్రతిభ సన్నగిలినంతనే ప్రాంతీయ పాలకులు ఇట తమ ఆధిపత్యమును నెలకొల్పిరి. క్రీ. శ. 7 వ శతాబ్ది ఆరంభమున ఈ ప్రాంతవాసులు తక్కిన అరబ్‌లతో పాటుగ ఇస్లామ్‌ను అవలంబించిరి. అంతటినుండి ఈ ప్రాంతము విశాల ఇస్లామ్ సామ్రాజ్యమున అంతర్భాగమై ప్రాముఖ్యమును కోల్పోయెను.

పోర్చుగీస్‌వారు 16 వ శతాబ్ది ఆరంభమున హిందూ మహాసముద్రమును ఆశ్రయించి జరుగు నౌకా వ్యాపారమున ప్రాముఖ్యమును ఆర్జించినప్పటినుండియు ఈ కీలక ప్రాంతమును తమదిగ చేసికొనుటకై పోర్చుగీస్ వారును, టర్కీ ప్రభువులును పోటీపడి కృషి సల్పిరి. కడకు 1538 లో దీనిని టర్కీ ప్రభుత్వము ఆక్రమించెను. 17 వ శతాబ్దమున కొన్ని అంతఃకల్లోలముల మూలమున టర్కీవారు ఈ ప్రాంతమును వదలివేయగ, పరిసర ప్రాంతమగు 'సోనా' ను పాలించు సుల్తాను దీనిని వశపరచుకొనెను. ఆ సుల్తాను వంశపు ఆధిపత్యము ఇట 1735 వరకు సాగెను. అంతట ఈ ప్రాంతపు అల్ప రాజ్యములలో ఒకటి అగు లాహెజ్‌ను పాలించు షేక్ (ప్రభువు) సుల్తాను ఆధిపత్యమును ధిక్కరించి, ఇట ఒక స్వతంత్ర ప్రభుత్వమును నెలకొల్పెను. ఈ వంశము వారు అంతటినుండి కడుదీర్ఘకాలము ఈ ప్రాంతమును పాలించిరి.

బ్రిటిష్ వారి దృష్టిని ఈ ప్రాంతము 19 వ శతాబ్ది ఆరంభమున ఆకర్షించెను. 1839 లో వారు ఈ ప్రాంతమును వశపరచుకొని, తమ నౌకలకు బొగ్గు నింపుకొను స్థావరముగ దానిని ఉపయోగించుకొనసాగిరి. ఆ శతాబ్దముననే ఏడెన్ రేవు పరిసరముల ఉన్న షేక్ రాజ్యములు కొన్ని బ్రిటిష్ ప్రభుత్వముతో ఒడంబడికలను కుదుర్చుకొని రక్షిత రాజ్యములైనవి. 1839 నుండి 1932 వరకు భారతదేశము నందలి నాటి బొంబాయి రాష్ట్రపు ప్రభుత్వపు పాలనలో బ్రిటిష్ వారు ఈ ప్రాంతమును ఉంచిరి. 1932 నుండి 1937 వరకు భారత దేశమును పాలించు బ్రిటిష్ ప్రభుత్వపు రాజప్రతినిధి పాలనలో ఈ ప్రదేశము ఉండెను. 1937 లో భారత ప్రభుత్వపు పాలననుండి దీనిని వేరుజేసి, దీనిని మకుటపు వలస (క్రౌన్ కాలనీ) గ బ్రిటిష్ వారు మార్చిరి. ప్రథమ ప్రపంచ యుద్ధకాలము (1914-1918) న మిత్రరాజ్యములు తూర్పు ఆఫ్రికాలో సాగించిన దండయాత్రలకు ఏడెన్ ముఖ్య స్థావరముగ ఉపకరించెను.

ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున ఇచ్చటి ప్రజలలో స్వాతంత్ర్యకాంక్ష మిక్కుటమైనది. కాని, సైనిక తంత్ర రీత్యా దీనికి గల ప్రాముఖ్యమును బట్టి దీనిని విడనాడుటకు బ్రిటిష్ ప్రభుత్వము సుముఖత వహింపక, కొన్ని నామమాత్రపు సంస్కరణలను ప్రవేశపెట్టినది. ఇందులకు తోడుగ రక్షిత రాజ్యముల ప్రభువులగు షేక్‌లు ప్రజాస్వామ్యమునకు వ్యతిరేకులగుటవలన ఈ ప్రాంతపు స్వాతంత్ర్య సమస్య అతి క్లిష్టరూపమును దాల్చినది.

బ్రిటిష్ ప్రభుత్వము నియమించు గవర్నర్ జనరల్ ఇచటి పరిపాలనాధికారి. రక్షిత రాజ్యములందలి షేక్‌లు విదేశ వ్యవహారములందు తప్ప తక్కిన అన్నింట సర్వ స్వతంత్రులుగ ఉండు ఏర్పాటు కలదు. ఇట్టి పరిస్థితులలో రక్షిత ప్రాంతమందలి కొన్ని రాజ్యములు 1957 సంవత్సరమున 'దక్షిణ అరేబియా ఫెడరేషన్' అను పేర ఒక సమాఖ్యగా ఏర్పడి, బ్రిటిష్ ప్రభుత్వముతో ఒప్పందమును కుదుర్చుకొనినవి. దీనినిబట్టి వాని రక్షణ భారమును బ్రిటన్‌నందే నిలిచినది. ఆ తరువాత ఈ ఫెడరేషన్‌నకును, తక్కిన ఏడెన్ ప్రాంతమునకును స్వాతంత్ర్య సిద్ధికై కొన్ని సమావేశములు జరిగినను ఫలింపలేదు. అంతట ఏడెన్‌నందలి తీవ్రవాదులు దౌర్జన్య చర్యలకు పూనుకొనగా నామమాత్రాధికారములు ప్రజలకు గల రాజ్యాంగమును సైతము రద్దుచేసి, గవర్నర్ జనరల్ తానే సర్వాధికారములను గ్రహించెను (1965). చీ. శే. రా.

**ఏథెన్స్ :** ప్రాచీనయుగమందలి పాశ్చాత్య నగరములు అన్నిటను సంస్కృతికిని, కళలకును, ప్రజాస్వామిక సంస్థలకును ప్రసిద్ధికెక్కిన నగరము. గ్రీస్ దేశమందు అట్టికా మండలమున ఎత్తైన కొండలపై ఈ నగరము నిర్మింపబడినది. దీనికి 10 కి. మీ. దూరమున నైరృతి వైపు పైరీయస్ అను రేవుపట్టణము కలదు. అక్కడ నౌకాశ్రయము కూడ ఉన్నది.

గ్రీక్ చరిత్ర రచయిత తూసిడైడీస్ రచనలను బట్టి ఈ ఏథెన్స్ నగరమందు మొట్టమొదట ఎక్రాపొలిస్ అనే దుర్గమును, దానిచుట్టూ కొన్ని భవనములును మాత్రమే నిర్మితములు అయినట్లు తెలియుచున్నది. మరి కొంత కాలమునకు పిసిస్ట్రేటస్ అనే నియంత జూస్ ఒలింపియస్ అనే దేవాలయమును నిర్మించెను. ఏథెన్స్‌ను పారసీకులు తగుల బెట్టిన పిమ్మట తిరిగి ఆ నగరమును నిర్మించు సందర్భమున విశేషమగు మార్పులు ఏమియు జరుగలేదు.

పెరిక్లీస్ కాలములో ఏథెన్స్ నూతన శోభను సంతరించుకొన్నది. ముఖ్యముగ అనేక చరిత్రాత్మక భవనములు ఆ కాలమున నిర్మింపబడినవి. వీటిలో మేరతన్ యుద్ధ విజయ స్మారక చిహ్నముగ సైమన్ కుటుంబముచే కట్టింపబడి, పోలిగ్నోటస్ అను చిత్రకారునిచే చిత్రింపబడిన 'అలంకృత మందిరము' అన్నిటికంటె మిన్న అని ఎన్నదగును. నగరములో పలుచోట్ల థెమిస్టాక్లీజ్, మిల్‌టియడీజ్, కెతీమకస్ వంటి వీరుల యొక్కయు, ఈస్కలస్ వంటి కవుల యొక్కయు విగ్రహములు కూడ కాననగును.

వ్యాపారపు కూడలికి ఎదురుగా ఒక చిన్న కొండ చుట్టును ఎరియోపగస్ అను ప్రజా సమితి సభామందిరమును, అయిదు వందల సభ్యుల సభాభవనమును, ఇతర ప్రభుత్వ కార్యాలయ మందిరములును కాననగును. గ్రీస్‌లో ప్రభుత్వ భవనముల మీద కంటె దేవాలయముల విషయమున భక్తిశ్రద్ధలు మెండు. ఏథెన్స్ నగరమున మిక్కిలి ఎత్తైన ఒక ప్రదేశములో 305 మీటరుల పొడవు గల ఎక్రాపొలిస్ కాననగును. ఈ భవన శిఖరముననే ఏథెన్స్ నగరాధిదేవత అగు ఎతీనాదేవి అభయ ముద్రతో కూడిన స్వరూపముతో నిలిచి ఉండును. ఎక్రాపొలిస్ భవనము చలువరాతితో నిర్మితమై అనేక స్తంభములు గల ఒక విశాలమండపమువలె ఉండును. దీని స్తంభములపై చెక్కబడిన శిల్పములు అత్యంత అద్భుతములు. దీని ప్రవేశ ద్వారము కూడ దర్శనీయమగు శిల్పకళతో చెలువొందుచున్నది. ఎక్రాపొలిస్‌నకు దిగువగా నాటక ప్రదర్శనశాల ఉన్నది. ఇది ఏటవాలుగను, ఎక్రాపొలిస్‌నకు దిగువ భాగమునను ఉండుటచే దీనిలో ప్రేక్షకులు కూర్చుండుటకు నేలనే మెట్లుమెట్లుగా చేసి, దానిపై బల్లలతో బెంచీలు ఏర్పాటు చేసిరి. రంగస్థలము ఎక్రాపొలిస్‌నకు సరిగా దిగువ భాగమున ఉన్నది.

రోమన్‌లు గ్రీస్‌ను జయించిన తరువాత కూడ ఏథెన్స్ నగరమందలి సంస్కృతి మెచ్చుకొనదగినదిగానే నిలిచి ఉండెను. ఆ పిమ్మట రాజకీయముగా సామ్రాజ్యమునందు అంతటను ప్రాచీన మతము అంతరించి, క్రైస్తవ మతము వ్యాపించుటతో ఈ నగరమందలి భవనముల శోభ తగ్గిపోయినది. ముస్లిమ్‌ల దండయాత్రల ఫలితముగ ఇందలి పెక్కు భవనములు శిథిలమయ్యెను. క్రమక్రమముగ వైభవము సన్నగిల్లి ఏథెన్స్ నగరము ఒక చిన్న మాండలిక కేంద్రమయ్యెను. మరల గ్రీస్ దేశము స్వతంత్రతను ఆర్జించిన తరువాత ఏథెన్స్ రాజధాని నగరమయి ఆధునిక నాగరకతా లక్షణములను సంతరించుకొనినది [చూ. గ్రీస్, నగరరాజ్యములు]. ప్ర. రా.

**ఐక్య రాజ్య సమితి :** ద్వితీయ ప్రపంచ యుద్ధము అంతమునకు వచ్చిన పిదప, ప్రపంచమున శాంతి భద్రతల సంరక్షణకై అగ్రరాజ్యముల [చూ. పు. 262] నాయకత్వమున 1945 లో స్థాపింపబడిన ప్రముఖ అంతర్జాతీయ సంస్థయే ఐక్యరాజ్యసమితి (యునైటెడ్ నేషన్స్*) [చూ. పు. 194]. దీని ప్రధానాశయములను మూలశాసనము (చార్టర్) ఈ విధముగ పేర్కొనుచున్నది :

1. 'మన తరములోనే మానవకోటిని రెండు పర్యాయములు అపారమైన దుఃఖమున ముంచినట్టి యుద్ధము అను మహా విపత్తు బారినుండి రాబోవు తరముల ప్రజలను తప్పించుట ;

2. మానవుని ప్రధానమగు హక్కులు, వ్యక్తి యొక్క ఉన్నతి, విలువ, స్త్రీ-పురుషుల సమానత్వములు, రాజ్యముల సమానత-పై వానియందు దృఢమగు గౌరవము పెంపొంద చేయుట ;

3. అంతర్జాతీయ ధర్మమునకును, న్యాయమునకును అనుకూలములగు పరిస్థితులను నెలకొలుపుట ;

4. సాంఘిక అభ్యుదయమును, జీవన ప్రమాణమును హెచ్చించి, మానవుని స్వాతంత్ర్యమును పెంపొందించుటకై అందులకు సాధనములగు సహన, సౌభ్రాత్రములను ప్రదర్శించు శాంతి మార్గమున రాజ్యములు ప్రవర్తిల్లునటుల చేయుట ;

5. రాజ్యములు అన్నియు ఏకీభవించి ప్రపంచమున శాంతి భద్రతలను కాపాడుచు, ప్రజాశ్రేయమునకు తప్ప, వేరు విధముగ యుద్ధపరికరములను ఉపయోగింపకుండుటకై అందులకు అనుగుణములగు పద్ధతులను ఏర్పరచి ప్రజల ఆర్థిక, సాంఘిక అభివృద్ధికి తోడ్పడు అంతర్జాతీయ సంస్థలను ఏర్పరచుట-అనునవి ఐక్యరాజ్యసమితి యొక్క ప్రధాన ఆశయములు.'

(ఐక్యరాజ్యసమితియే ఐ. రా. స. అని సంకేత రూపమున వ్యవహృతము). ఈ సమితి ముఖ్య కార్యస్థానము న్యూయార్క్‌నందు కలదు. ప్రస్తుతపు (1966) కార్యదర్శి బర్మా జాతీయుడగు ఊ థాంట్.

ఐక్యరాజ్య సమితి సభ్యదేశముల పట్టిక 355, 356, 357 పేజీలలో ఇవ్వబడినది.

ఐ. రా. స యందు క్రొత్త సభ్యులను చేర్చుకొనుటకు నియమపత్రములోని నాలుగవ నిబంధన అవకాశము ఒసగినది. ఇందులకు సాధారణ సభలోని ⅔% సభ్యుల సమ్మతి అవసరము. ఈ విషయమున భద్రతాసమితి (ప్రతి ఒక శాశ్వత సభ్యుడును) కూడ సమ్మతింపవలెను. సభ్యత్వమును గోరు రాజ్యములు నియమపత్రపు బాధ్యతలను స్వీకరించుటయు, శాంతిని ఆశించుటయు అత్యంతావశ్యకము.

ఐక్యరాజ్యసమితి యొక్క ప్రధానాంగములు ఆరు : 1. సాధారణ సభ (జనరల్ అసెంబ్లీ) ; 2. భద్రతా సమితి (సెక్యూరిటీ కౌన్సిల్) ; 3. ఆర్థిక, సాంఘిక సమితి (ఎకనామిక్ అండ్ సోషల్ కౌన్సిల్) ; 4. ధర్మకర్తృత్వ సమితి (ట్రస్టీషిప్ కౌన్సిల్) ; 5. అంతర్జాతీయ న్యాయస్థానము (ఇంటర్నేషనల్ కోర్ట్ ఆవ్ జస్టిస్) ; 6. సచివ వర్గము (సెక్రటేరియట్).

* United Nations Organisation [U N O]

సాధారణసభ : (నియమపత్రము - 4 వ భాగము) ఐక్యరాజ్యసమితిలోని రాజ్యములన్నియు సాధారణ సభ యందు పాల్గొనును. ఇందులోని రాజ్యములకు అన్నిటికిని సమానమైన ఎన్నికహక్కు కలదు. ప్రతి ఒక రాజ్యమును ఐదుగురు సభ్యుల వరకును ఎన్నుకొనవచ్చును. ముఖ్యమైన విషయములందు సాధారణ సభలోని ⅔% సభ్యుల సమ్మతి అవసరము. ఈ సభ ప్రతి సంవత్సరమును సమావేశమగును. భద్రతా సమితి కాని లేదా సమితి సభ్యులు కాని కోరినప్పుడు సమావేశము కావచ్చును. నియమపత్రమునకును, శాంతిభద్రతలకును, ఐ. రా. స. లోని ఇతర సమితులకును సంబంధించిన విషయములను అన్నిటిని సాధారణసభ చర్చింపవచ్చును (నియమపత్రము - నిబంధనము, 10). భద్రతా సమితి విచారణలో ఉన్న అంతర్జాతీయ సమస్యలు తప్ప తక్కినవాటిని గురించి సాధారణ సభ భద్రతా సమితికి గాని, తక్కిన సంస్థలకు గాని అభిప్రాయము ఒసగవచ్చును (నిబంధనము 12). యుద్ధ పరికరములను తగ్గించుటను, రద్దు చేయుటను గూర్చి సాధారణసభ చర్చించి, తన అభిప్రాయములు ఒసగవచ్చును. శాంతిభద్రతలకు ప్రమాదము ఏర్పడినచో భద్రతా సమితికి తెలుపవచ్చును. సర్వతోముఖమైన అంతర్జాతీయ సహకారమునకు అవకాశములను కల్పించుటయు, అంతర్జాతీయ ధర్మమును ఏర్పరుచుటకు ప్రయత్నించుటయు (నిబంధనము 13), అంతర్జాతీయ వైషమ్యములను పరిష్కరించుటకు శాంతి మార్గములను సూచించుటయు, భద్రతా సమితి నివేదికలను, ఇతర సమితుల నివేదికలను చర్చించుటయు, ఐ. రా. స. ఆయవ్యయ పట్టికను చర్చించి ఆమోదించుటయు సాధారణ సభ ముఖ్య కర్తవ్యములు.

కార్య నిర్వహణమునందు సాధారణ సభకు సహాయపడు ఉప సంఘములు :

1. రాజకీయ విషయములకును, భద్రతకును సంబంధించిన సంఘము ; 2. ఆర్థిక సంఘము ; 3. సాంఘిక, సాంస్కృతిక, జీవకారుణ్య సంఘము ; 4. ధర్మ కర్తృత్వ సంఘము ; 5. కార్యనిర్వాహక సంఘము ; 6. న్యాయస్థానము.

భద్రతా సమితిలోని శాశ్వత సభ్యులు కానివారిని ఆరుగురిని, ఆర్థిక, సాంఘిక సమితిలోని పదునెనిమిది మంది సభ్యులను, ధర్మకర్తృత్వ సమితిలోని సభ్యులను సాధారణసభ ఎన్నుకొనును. అంతర్జాతీయ న్యాయస్థానము పదునైదుగురు న్యాయమూర్తులను, ఐ. రా. స. ప్రధాన కార్యదర్శిని నియమించుటలో సాధారణ

సభయు, భద్రతా సమితియు కూడ ప్రముఖ పాత్ర వహించును.

సాధారణ సభ చర్చించి తీర్మానించు విషయములు రెండు విధములైనవి. వీనిలో కొన్ని ముఖ్య విషయములు, మరికొన్ని సామాన్య విషయములు. ముఖ్య విషయములను తీర్మానింపవలెనన్న సభయందు 2/3 వ భాగమును, సామాన్య విషయములను తీర్మానింపవలెనన్న హాజరయిన సభ్యులలో సగముకన్న ఎక్కువగను ఆమోదింపవలెను.

1. అంతర్జాతీయ శాంతి భద్రతలు; 2. భద్రతా సమితి; 3. ఆర్థిక, సాంఘిక సమితి - వీటి ఎన్నికలు; 4. ధర్మకర్తృత్వ సమితి; 5. నూతన సభ్యుల ప్రవేశము; 6. సభ్యుల హక్కులను రద్దు చేయుట; 7. ధర్మకర్తృత్వ పద్ధతులు; 8. ఆయవ్యయ పట్టికను గూర్చిన సమస్యలు - ఇవి అన్నియు సాధారణ సభ తీర్మానింపవలసి ఉన్న ముఖ్య విషయములు.

భద్రతా సమితి (నియమపత్రము - 5, 6, 7, 8, 12 భాగములు): భద్రతా సమితియందు పదకొండు రాజ్యములకు సభ్యత్వము కలదు. చీనా, ఫ్రాన్స్, బ్రిటన్, యునైటెడ్ స్టేట్స్, సోవియట్ రష్యా ఈ ఐదును భద్రతా సమితిలోని శాశ్వత సభ్యులు. మిగిలిన ఆరుగురు సభ్యులను ఐ. రా. స. సాధారణ సభ ఎన్నుకొనును. ఎన్నికలు సామాన్యముగ రెండు ఏండ్లకు ఒకసారి జరుగవలెను. సాధారణ సభలో సభ్య రాజ్యమునకు ఐదుగురు ప్రతినిధుల వరకును ఉండవచ్చును. కాని, భద్రతా సమితిలో రాజ్యమునకు ఒక ప్రతినిధి మాత్రమే ఉండును. శాంతి భద్రతలను కాపాడుట భద్రతా సమితి ప్రధాన బాధ్యత. ప్రపంచమునందలి మానవ, ఆర్థిక సంపదలను యుద్ధములకు వినియోగింపకుండునట్లు చూచుటయును, రాజ్యములు యుద్ధసామగ్రిని తగ్గించుకొనుటకు మార్గములు సూచించుటయును భద్రతా సమితి కర్తవ్యము. ఈ కర్తవ్యమును నెరవేర్చుటలో సైనికోద్యోగి వర్గము భద్రతా సమితికి తోడ్పడును.

భద్రతా సమితి యందలి తీర్మానములకు అన్నిటికిని కనీసము ఏడుగురు సభ్యుల సమ్మతి ఉండుట అవసరము. కార్యక్రమమునకు సంబంధింపని ముఖ్య విషయములను గూర్చి స్థిరసభ్యులు అందరును సమ్మతించి ఉండవలెను. వీరిలో ఏ ఒక రాజ్యముగాని విచారింపవలసి ఉన్న అంతర్జాతీయ వివాదములో వాదిగా కాని, ప్రతివాదిగా కాని ఉన్నచో ఆ సమస్యను గూర్చిన చర్చలలో ఆ దేశము పాల్గొనదు. సాధారణ సభ అభిప్రాయములను ఐ. రా. స. లోని రాజ్యములు అంగీకరింపవచ్చును; లేకున్న నిరాకరింప వచ్చును. కాని, భద్రతా సమితి తీర్మానములను మాత్రము ఆ రాజ్యములు విధిగా అంగీకరించి తీరవలెను (1963 లో ఆమోదింపబడిన ఒక తీర్మానమును అనుసరించి భద్రతా సమితియందు 15 మంది సభ్యులు, అనగా శాశ్వత సభ్యులు కాక 10 మంది ఎన్నుకొనబడిన సభ్యులు ఉండునటుల నిర్ణయింపబడినది. ఆ నిర్ణయము 1966 ఆరంభమునుండి అమలులోనికి వచ్చినది. ఈ పది మందిలో ఆఫ్రికా, ఆసియా రాజ్యములనుండి అయిదుగురు, తూర్పు యూరప్ రాజ్యములనుండి ఒకరు, లాటిన్ అమెరికా రాజ్యములనుండి ఇరువురు ఎన్నుకొనబడు ఏర్పాటు జరిగినది. ఈ క్రొత్త ఏర్పాటును అనుసరించి భద్రతా సమితిలో కనీసము తొమ్మిది మంది సమ్మతిని ఆర్జించినపుడే ఒక ప్రతిపాదన ఆమోదితము కాగలదు; అయినను, శాశ్వత సభ్యత్వము గల రాజ్యములకు కల వీటోహక్కు మాత్రము ఎప్పటి తీరుననే నిలచిఉండును).

సైనికోద్యోగి వర్గము కాక 'పరమాణు శక్తి వర్గము' కూడ భద్రతా సమితికి సహాయపడును. ఈ వర్గమునందు భద్రతా సమితి సభ్యులు కాక, కెనడా ప్రతినిధులు కూడ కలరు.

ఈ పరమాణుశక్తి వర్గము నిర్వహించు విధులలో: 1. ప్రపంచ శాంతికి అనుకూలించునట్లు శాస్త్రవిజ్ఞానము‌ను రాజ్యములకు అన్నిటికిని అందజేయుట; 2. పరమాణుశక్తిని మానవాభ్యుదయమునకును, శాంతికిని సాధనముగ ఒనర్చుట; 3. మానవ కోటిని వినాశమొనర్చు ఆటంబాంబు [చూ. సం. 2 - పు. 167] ను, తదితర అస్త్రములును లేకుండ జేయుట; 4. ఈ నియమములకు లోబడు రాజ్యములను ఇతర రాజ్యములనుండి సంరక్షించుట; 5. అందులకు అనుకూలమైన పరిశీలనా సౌకర్యములను ఏర్పరచుట - అనునవి చేరి ఉన్నవి.

అంతర్జాతీయ వివాదములను న్యాయమార్గములలోను, శాంతిపద్ధతులలోను పరిష్కరించుకొనుట సభ్యరాజ్యముల కర్తవ్యముగా నియమపత్రము విధించినది. సంప్రదింపులు, విచారణ, మధ్యవర్తిత్వము, రాజీ, న్యాయస్థాన నిర్ణయము ఈ మార్గములలో ముఖ్యమైనవి. స్థానిక ప్రతినిధి సంస్థలు రాజ్యముల అన్యోన్య కలహములు, అంతర్జాతీయ సమస్యలు లేకుండ చేయుటకు తోడ్పడును. ప్రపంచ శాంతికి అంతరాయములగు విషయములను అన్నిటిని భద్రతా సమితి విచారింపవచ్చును. రాజ్యముల పరస్పర వైషమ్యములు ఉపశమించు మార్గములను కూడ సూచింపవచ్చును. న్యాయసంబంధమైన సమస్యలను అంతర్జాతీయ


ఐక్యరాజ్య సమితి - అనుబంధ నియోగములు
సైనిక సిబ్బంది సంఘము
సైప్రస్‌లో సైన్యము
భద్రతా సమితి
నిరాయుధీకరణ సంవర్గము
పరిపాలనా పరిష్కర్తృ సంఘము
ధర్మకర్తృత్వ సమితి
వర్ణ విచక్షణా సంఘము
మధ్యప్రాచ్య అత్యయిక సైన్యము
పాలస్తీనా కాందిశీక బాధితుల సహాయ సంవర్గము
సాధారణ సభ
అంతర్జాతీయ పరమాణుశక్తి వర్గము
వాణిజ్య వికసన సంసత్
బాలల నిధి
కాందిశీకుల హైకమీషనర్
అంతర్జాతీయ న్యాయస్థానము
సచివ వర్గము (సెక్రెటేరియట్)
వలసల విమోచన సంఘము
ప్రత్యేక నిధి
ఆర్థిక సాంఘిక సమితి
సమన్వయ పాలక సంఘము
సాంకేతిక సహాయ మండలి
ప్రాంతీయ ఆర్థిక సంవర్గములు
ప్రావృత్తిక సంవర్గములు
ప్రత్యేక నియోగములు
ILO
UPU
ICAO
IBRD
WHO
WMO
IMF
IDA
FAO
ITU
IGMCO
IFC
UNESCO
GATT

న్యాయస్థానము విచారించును. పై శాంతి మార్గములు వైషమ్యములను అంతమొందింప లేకున్న భద్రతా సమితి వీనిని చర్చించి, శాంతిని నెలకొల్పు మార్గములను సూచించును. వైషమ్యములు గల రాజ్యములే కాక, ప్రధాన కార్యదర్శియు, సాధారణ సభయు, ఐ. రా. స. లోని ఏ రాజ్యమైనను భద్రతా సమితి ఎదుట సమస్యలను ప్రవేశపెట్టవచ్చును. సభ్యులు కాని రాజ్యములు కూడ భద్రతా సమితి సాహాయ్యమును గ్రహింపవచ్చును.

శాంతికి అంతరాయము కలిగినచో గాని, యుద్ధము ఆరంభమైనచో గాని భద్రతా సమితి యుద్ధమును, వివాదములను కొంతకాలము ఆపి ప్రమాదమును తప్పింపవచ్చును. యుద్ధము ప్రబలినచో శత్రురాజ్యముతో ఆర్థిక, రాజకీయాది సంబంధములను విరమించునట్లు ఐ. రా. స. సభ్య రాజ్యములను ఆజ్ఞాపింపవచ్చును. ఇట్టి ప్రతిక్రియకు శత్రు రాజ్యము లొంగకున్న, భద్రతాసమితి కూడ యుద్ధ మార్గమునే అవలంబింపవలసి ఉండును. ఐ. రా. స. లోని సభ్యులందరును తమ సంస్థకు సైన్యసహాయము ఒసగ సంసిద్ధులుగ ఉండవలెను. కాని, 51 వ నిబంధన ప్రకారము భద్రతాసమితి చర్య గైకొనుటకు పూర్వమే యుద్ధము తటస్థించిన ఎడల ప్రతి రాజ్యమునకును స్వయంసంరక్షణ హక్కు కలదు.

**ఆర్థిక, సాంఘిక సమితి** (నియమపత్రము 10) : ఉద్యోగ సదుపాయములను, ఆర్థిక, సాంఘిక అభివృద్ధిని, ఉత్తమ జీవన ప్రమాణమును పెంపొందించుటయు, అంతర్జాతీయ ఆర్థిక, సాంఘిక, ఆరోగ్యాది సమస్యల పరిష్కారమునకును, సాంస్కృతిక, వైజ్ఞానిక సహకారమునకును సహాయ పడుటయు, స్త్రీ - పురుష భేదములు గాని, జాతి, మత, భాషా భేదములు గాని లేనట్టి మానవ స్వామ్యములనినను, స్వాతంత్ర్యములనినను గౌరవమును వృద్ధి చేయుటయు సమితి ఆశయమని 55 వ నిబంధన సూచించుచున్నది. ఈ ఆశయమును సాధించుటకు గాను ఆర్థిక, సాంఘిక సమితి నియమింపబడి ఉన్నది.

ఆర్థిక, సాంఘిక సమితిలో పదునెనిమిది మంది సభ్యులు కలరు. వీరిని అందరిని సాధారణ సభ ఎన్నుకొనును. మొట్టమొదటసారి ఎన్నుకొనబడిన వారిలో ఆరుగురు ఒక ఏడాదియును, మరి ఆరుగురు రెండు ఏండ్లును, ఇతరులు మూడు ఏండ్లును సభ్యులుగ ఉందురు. ప్రతి ఏడాదియును ఆరుగురు సభ్యుల వంతున మూడు ఏండ్ల వరకు సాధారణసభ నియమించుచుండును. ఆర్థిక, సాంఘిక సమితిలోని సభ్యులందరికిని సమానమైన ఎన్నిక హక్కు కలదు.

ఈ సమితి ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక, వైజ్ఞానిక, ఆరోగ్యాది విషయముల గూర్చి పరిశీలించి, సాధారణ సభకుగాని, ఐ. రా. స. సభ్యులకుగాని లేక ఈ విషయములకు సంబంధించిన ప్రత్యేక సంఘములకు గాని (నిబంధన 57) అభిప్రాయము ఒసగవచ్చును. పైన సూచించిన ఐ. రా. స. ఆశయములన్నియు (నిబంధన 55) ఈ సమితికి సంబంధించిన విషయములే. సాధారణ సభకు ఈ విషయముల గూర్చి నివేదించుటే కాక, ఇందులకు అంతర్జాతీయ సభలను కూడ సమావేశపరుపవచ్చును.

57 వ నిబంధనలో సూచించినట్టి ప్రత్యేక సంఘములకును, ఐ. రా. స. కిని ఆర్థిక, సాంఘిక సమితి సంబంధములను ఏర్పరుపవచ్చును. ఈ ఏర్పాటులను సాధారణసభ అంగీకరించుట అవసరము. ప్రత్యేక సంస్థల కార్యములు అన్నిటిని కూడ ఈ సమితి సమన్వయింపవచ్చును. ప్రత్యేక సంస్థలు తనకు నివేదికలను పంపునట్లు కూడ ఆర్థిక, సాంఘిక సమితి చర్య గైకొనవచ్చును. భద్రతా సమితికి అవసరమైన విషయములను ఆర్థిక, సాంఘిక సమితి తెలుపవచ్చును. భద్రతా సమితి కోరిన ఎడల ఇది అందులకు సాహాయ్యము కూడ చేయవచ్చును. సాధారణ సభ సమ్మతించినట్లయిన ఐ. రా. స. సభ్యులకును, ప్రత్యేక సంస్థలకును కూడ ఈ సమితి సహాయ పడగలదు. సాధారణసభ ఆర్థిక, సాంఘిక సమితికి ఇతర కర్తవ్యములను కూడ విధింపవచ్చును.

ఈ సమితి చర్చలకు హాజరై, అభిప్రాయములను ఒసగు వారిలో సగము కన్న ఎక్కువమంది తీర్మానములను ఆమోదించుట అవసరము. ఐ. రా. స. లోని ఏ రాజ్యమునైనను ఆర్థిక, సాంఘిక సమితి తన సమావేశములకు ఆహ్వానింపవచ్చును. ప్రభుత్వ సంబంధము లేని సంస్థలతో కూడ ఈ సమితి విషయములను చర్చింపవచ్చును.

**ధర్మకర్తృత్వ సంఘము** (నియమపత్రము 13 వ భాగము) : ఐ. రా. స. నియమపత్రములోని 12 వ భాగము ధర్మకర్తృత్వ విధానమును ఏర్పరచుటలో గల ఉద్దేశములను తెలుపుచున్నది :

1. అంతర్జాతీయ శాంతి భద్రతలను పెంపొందించుట ;
2. తన ధర్మకర్తృత్వములో ఉన్న ప్రజల రాజకీయ, ఆర్థిక, సాంఘిక భద్రతలను వృద్ధిచేయుట, వారి స్వాతంత్ర్య సాధనకు తోడ్పడుట ;
3. మానవుల హక్కులకును, ముఖ్య స్వాతంత్ర్యములకును గౌరవమును హెచ్చించుట; జాతి, మత, భాషా భేదములను ఇందులో పాటింపకుండుట, ప్రజల అన్యోన్యతా భావమును పెంపొందించుట ;

4. సభ్య రాజ్యములకును, ఆ రాజ్యముల ప్రజలకును సాంఘిక, ఆర్థిక, వ్యాపార విషయములలోను, న్యాయ విషయములలోను కొన్ని స్వామ్యములను స్థాపించుట.

ధర్మకర్తృత్వ సంఘము సాధారణ సభ యాజమాన్యమున పని చేయుచుండును. ధర్మకర్తృత్వములో ఉన్న రాజ్యముల పరిపాలనమునుగూర్చి ఈ సమితి పరిశీలించును. వీనిలో కొన్ని నానాజాతి సమితి [చూ.] యొక్క ధర్మకర్తృత్వ పద్ధతికి చెందినవి. మరికొన్ని ద్వితీయ ప్రపంచ యుద్ధమైన తరువాత శత్రురాజ్యములనుండి ప్రత్యేకింపబడినవి; మరికొన్ని స్వపరిపాలక రాజ్యములే ధర్మకర్తృత్వ పద్ధతికి మార్చబడినవి.

సమితి ధర్మకర్తృత్వము ఉన్న రాజ్యములు యుద్ధరీత్యా ప్రాముఖ్యము కలిగి ఉండినచో అవి భద్రతా సమితికి సంబంధించినవే కాని, ధర్మకర్తృత్వ సంఘమునకు సంబంధించినవి కావు. వాని విషయమున ధర్మకర్తృత్వ సంఘము భద్రతా సమితికి సహాయపడును.

1. ధర్మకర్తృత్వ పద్ధతిని అనుసరించి పరిపాలితములగు రాజ్యములును; 2. భద్రతా సమితి యందలి స్థిరసభ్యులును; 3. సాధారణ సభచే ఎన్నుకొనబడిన ఇతర రాజ్యములును ధర్మకర్తృత్వ సంఘమునందు స్థానము కలిగి ఉన్నవి. ధర్మకర్తృత్వ పద్ధతిని అనుసరించు రాజ్యముల సంఖ్యయును, అనుసరింపని ఇతర రాజ్యముల సంఖ్యయును సమానముగ ఉండవలెను. ఈ రాజ్యములను సాధారణ సభ మూడు ఏండ్లకు ఒకసారి ఎన్నుకొనును. ధర్మకర్తృత్వ సంఘములోని ప్రతి ఒక రాజ్యమునకును సమానమైన ఎన్నిక హక్కు కలదు.

అంతర్జాతీయ న్యాయస్థానము (నియమపత్రము - 14 వ భాగము): అంతర్జాతీయ న్యాయస్థానము ఐ. రా. స. ముఖ్యాంగములలో ఒకటి.

ఐ. రా. స. సభ్యులు అందరును అంతర్జాతీయ న్యాయస్థానమునకు చెందినవారు. భద్రతా సమితియు, సాధారణ సభయు అంగీకరించినచో ఇతర రాజ్యములు కూడ అంతర్జాతీయ న్యాయస్థానముతో ఇట్టి సంబంధములు కలుగ జేసికొనవచ్చును. ఈ న్యాయస్థానపు తీర్పులు ఇరు పక్షములవారును అంగీకరించి తీరవలెను. ఏ ఒక పక్షమైన న్యాయస్థానపు తీర్పునకు లోబడకున్నచో, రెండవ పక్షము భద్రతా సమితికి తెలుపవచ్చును. అవసరమైన ఎడల భద్రతా సమితి తన అభిప్రాయములను, సలహాలను తెలుపవచ్చును లేదా ఈ విషయమునందు తీసికొన దగిన చర్యలను తానే నిర్ణయింపవచ్చును [చూ. న్యాయ శాస్త్ర సంపుటము].

సచివ వర్గము (నియమపత్రము - 15 వ భాగము): ఐ. రా. స అధికారవర్గమునందెల్ల ప్రధాన కార్యదర్శి (సెక్రటరీ జనరల్) మిక్కిలి ప్రాముఖ్యముగలవాడు. భద్రతా సమితి సూచనలను అనుసరించి సాధారణసభ ఈ ముఖ్యోద్యోగిని నియమించును. ప్రతి సంవత్సరమును ఇతడు ఐ. రా. స. ను గూర్చి సాధారణ సభకు నివేదించును. శాంతి భద్రతలకు అంతరాయములు ఇతనికి అగపడినచో భద్రతా సమితికి తెలుపుట ఇతని కర్తవ్యము.

సాధారణసభ నిబంధనలను అనుసరించి ప్రధాన కార్యదర్శి ఇతర ఉద్యోగి వర్గమును నియమించును. కార్యదర్శి వర్గము ఐ. రా. స. అంతర్జాతీయ స్వరూపమునకు అనుగుణముగ ఏర్పాటు చేయబడినది. ప్రపంచములోని నానాదేశములవారు ఈ ఉద్యోగి వర్గమున ఉండుటే ఇందులకు తార్కాణము [చూ. ఐ. రా. స. అనుబంధ సంస్థలు].

జి. ఎస్. శర్మ.

**ఐ. రా. స. అనుబంధ సంస్థలు :** ఐక్యరాజ్య సమితిలో పైన వివరించిన ఆరు అంగములు కాక, ఐక్యరాజ్య సమితికి అనుబంధములుగ ఉండు ప్రత్యేక సంస్థలు పదునాలుగు ఉన్నవి. వాటిలో ప్రధానములైనవి :

1. అంతర్జాతీయ కార్మిక సంస్థ (ఇంటర్నేషనల్ లేబర్ ఆర్గనైజేషన్): దీని ఉద్దేశము వివిధ దేశములలోని కార్మికుల వేతనములను, పనిచేయు కాలమును, కార్మికులకు సంబంధించిన ఇతర విషయములను గూర్చియు చర్చించి చక్కబరచుట. ఒక్కొక్క దేశములోని పారిశ్రామిక యజమానుల యొక్కయు, కార్మికుల యొక్కయు, ప్రభుత్వము యొక్కయు ప్రతినిధులు ఇందు సభ్యులుగ ఉన్నారు [చూ. సం. 5. పు. 360].

2. అంతర్జాతీయ ఆహార వ్యవసాయ సంస్థ (ఫుడ్ అండ్ అగ్రికల్చరల్ ఆర్గనైజేషన్): వివిధ దేశములలోని ఆహార, వ్యవసాయ విషయములను సేకరించి ఆయా దేశ ప్రభుత్వములకు ఆహారోత్పత్తి పెరుగుదలకు కావలసిన పరిష్కార మార్గములను సూచించుట ఈ సంస్థయొక్క ముఖ్యోద్దేశము. ఇదిగాక ప్రపంచమున ఉత్పత్తి అగు వివిధ ఆహారాది వస్తుసామగ్రిని వివిధ దేశములకు సరిపడునట్లు పంపకవిధానమును సూచించుటయు ఈ సంస్థ తన ఆశయముగ ఇడుకొనినది [చూ. సం. 8 - పు. 289].

3. అంతర్జాతీయ విద్యా, వైజ్ఞానిక, సాంస్కృతిక సంస్థ (యునెస్కో): విద్యా విధానము ద్వారా ప్రపంచ శాంతిని గూర్చియు, మానవుల హక్కులను గురించియు దేశములు అన్నిటిలోను ప్రచారము గావించి ఐ. రా. స. ఉద్దేశములు నెరవేర్చుటయందు అన్ని దేశముల వారి తోడ్పాటు

సంపాదించుటకు ఈ సంస్థ కృషిచేయును [చూ. సం. 10 - పు. 629].

4. అంతర్జాతీయ ద్రవ్య సంస్థ (ఇంటర్నేషనల్ మానిటరీ ఫండ్): ద్రవ్యపు చలామణీ విషయములందు వివిధ దేశముల మధ్య సహకారములను పెంపొందించి ఆ యా దేశముల ద్రవ్యపు చలామణీల స్థిరత్వమునకు తోడ్పడుటకు ఈసంస్థ పాటుపడును [చూ. సం. 5 - పు. 362].

5. అంతర్జాతీయ పునర్నిర్మాణ అభివద్ధి బ్యాంక్ (ఇంటర్నేషనల్ బ్యాంక్ ఫర్ రికన్‌స్ట్రక్షన్ అండ్ డెవలప్‌మెంట్): ఇది వివిధ దేశముల ఆర్థికాభివృద్ధికి కావలసిన మూల ధనమును అప్పులుగ ఇచ్చి వారి అభివృద్ధికి తోడ్పడును [చూ. సం. 5 - పు. 365].

6. అంతర్జాతీయ ఆరోగ్య సంస్థ (వరల్డ్ హెల్త్ ఆర్గనైజేషన్): దీని ఉద్దేశ్యము వివిధ దేశములలో మలేరియా, మశూచి వంటి అంటు వ్యాధులను నిర్మూలించి, ప్రజల ఆరోగ్యమును అభివృద్ధిచేయుటకు తోడ్పడును [చూ. సం. 8 - పు. 186].

ఐక్య రాజ్యసమితి స్థాపితమై ఇప్పటికి 20 పండ్ల కాలము గడచినది (1965). ఈ మధ్యకాలమున ఇది కొన్ని అంతర్జాతీయ వ్యవహారములను పరిష్కారముగావించి, యుద్ధము సంభవించకుండ చేయగలిగినను, మరికొన్ని వివాదములను పరిష్కరించ లేకపోయెను. తొలి ఉద్దేశములను అన్నిటిని పూర్తిగ ఇది సాధింపలేకుండుటకు ప్రధాన కారణములు మూడు కలవు. ఇందులో సభ్యత్వము వహించిన రాజ్యములు సర్వసామ్యములు కలవి. వాటిపై బలప్రయోగము గావించి సమితి యొక్క తీర్మానములను అమలు పరచుటకు వీలులేదు. ఇదిగాక వారి ఆంతరంగిక వ్యవహారములతో సమితి జోక్యము కలిగించుకొనుట నియమపత్ర విరుద్ధము. భద్రతా సమితి తీర్మానములకు విరుద్ధముగ ప్రవర్తించు రాజ్యములపై కొన్ని సందర్భములలో బలప్రయోగము చేయవచ్చును గాని, అందుకు కావలసిన సైనిక దళములు సమితి వశమందు లేవు. వాటిని సమకూర్చు ప్రయత్నములు ఏవియు ఇంతవరకు సఫలములు కాలేదు. అవి కొంతవరకు సఫలములైన సందర్భములలో - ఉదాహరణకు : కాంగోలో - సమితి తన తీర్మానములను అమలులో పెట్టగలిగెను. సమితి జయప్రదముగ పనిచేయలేక పోవుటకు మరియొక కారణము భద్రతా సమితిలో అగ్రరాజ్యపంచకము (బిగ్‌ఫైవ్) నకు గల 'వీటో' అధికారము. ఈ రాజ్యములన్నియు ఏకగ్రీవముగ ఆమోదించిన గాని ప్రధాన విషయముల గురించి ఏలాటి తీర్మానమును చేయుటకు వీలులేదు. గత 20 పండ్లుగ సోవియట్ రష్యా, యునైటెడ్‌స్టేట్స్ దేశముల మధ్య విపరీత భేదాభిప్రాయములు బయలుదేరుట వలన సమితిలో ఆ రెండు రాజ్యములు కలసి పనిచేయుట దుస్సాధ్యమయ్యెను. 'వీటో' అధికారము తొలగిన గాని, సమితి పటిష్ఠముగ పనిచేయజాలదు. కాని, అది తొలగగల పరిస్థితులు ఏర్పడు సూచనలేవియు లేవు.

ఇంత మాత్రము చేత ఐక్యరాజ్య సమితి వలన ప్రయోజనములు ఏవియు లభించలేదని అనుకొనరాదు. ప్రపంచములోని సమస్త రాజ్యముల ప్రతినిధులు ఒకచోట సమావేశమై అంతర్జాతీయ వ్యవహారములను గురించి చర్చించుటకు ఇది ఎంతయో ఉపకరించుచున్నది. రాజకీయ, ఆర్థిక, సాంఘిక విషయములలో ప్రాపంచిక అభిప్రాయములను వ్యక్తపరచుటకు ఇది మహదవకాశమును కల్పించుచున్నది. అంతర్జాతీయ పారిశ్రామిక సంస్థ, అంతర్జాతీయ ఆరోగ్య సంస్థ (వరల్డ్ హెల్త్ ఆర్గనైజేషన్), అంతర్జాతీయ పునర్నిర్మాణ అభివృద్ధి బ్యాంక్ (ఇంటర్నేషనల్ బ్యాంక్ ఫర్ రికన్‌స్ట్రక్షన్ అండ్ డెవలప్‌మెంట్) మొదలైనవి వివిధదేశములలోని - ముఖ్యముగ వెనుకబడిన దేశములలోని - పరిస్థితులను చక్కపరచుటకు ఎంతయో తోడ్పడుచున్నవి. మానవకోటి అంతయు ఒక కుటుంబమునకు చెందినవారన్న విశ్వాసము బలపడుటకు ఐక్యరాజ్య సమితి ప్రధాన సాధనముగ ఉన్నది [చూ. ఐక్యరాజ్య సమితి].

మా. వెం. రం.

## ఐక్య రాజ్య సమితి సభ్యదేశముల పట్టిక

### 22-6-1965 నాటికి సవరింపబడినది

| వ. సంఖ్య. | రాజ్యము పేరు. | ఐ. రా. స. లో చేరిన తేది. |
|---|---|---|
| 1. | అప్పర్ వోల్టా | సెప్టె. 20, 1960 |
| 2. | ఆఫ్ఘనిస్తాన్ | నవ. 19, 1946 |
| 3. | అర్జెంటీనా | అక్టో. 24, 1945 |
| 4. | అల్జీరియా | అక్టో. 8, 1962 |
| 5. | అల్బేనియా | డిసె. 14, 1955 |
| 6. | ఆస్ట్రియా | డిసె. 14, 1955 |
| 7. | ఆస్ట్రేలియా | నవ. 1, 1945 |
| 8. | ఇస్రాయెల్ | మే. 11, 1949 |
| 9. | ఇటలీ | డిసె. 14, 1955 |
| 10. | ఇరాక్ | డిసె. 21, 1945 |
| 11. | ఇరాన్ | అక్టో. 24, 1945 |
| 12. | ఈక్వడార్ | డిసె. 21, 1945 |

| వ. సంఖ్య. | రాజ్యము పేరు. | ఐ. రా. స లో చేరిన తేది. |
|---|---|---|
| 13. | ఈజిప్టు (యునైటెడ్ అరబ్ రిపబ్లిక్)[1] | అక్టో. 24, 1945 |
| 14. | ఉగాండా | అక్టో. 25, 1962 |
| 15. | ఉరుగ్వే | డిసె. 18, 1945 |
| 16. | ఎతియోపియా | నవ. 13, 1945 |
| 17. | ఎల్‌సాల్వడార్ | అక్టో. 24, 1945 |
| 18. | ఐర్లాండ్ | డిసె. 14, 1955 |
| 19. | ఐవరికోస్ట్ | సెప్టె. 20, 1960 |
| 20. | ఐస్‌లాండ్ | నవ. 19, 1946 |
| 21. | కాంగో (బ్రజ్జవిల్లీ) | సెప్టె. 20, 1960 |
| 22. | కాంగో (లియోపాల్డ్ విల్లీ) | సెప్టె. 20, 1960 |
| 23. | కాంబోడియా | డిసె. 14, 1955 |
| 24. | కామెరూన్ | సెప్టె. 20, 1960 |
| 25. | కువాయిట్ | మే. 14, 1963 |
| 26. | కెనడా | నవ. 9, 1945 |
| 27. | కెన్యా | డిశ. 16, 1963 |
| 28. | కొలంబియా | నవ. 5, 1945 |
| 29. | కోస్టారికా | నవ. 2, 1945 |
| 30. | క్యూబా | అక్టో. 24, 1945 |
| 31. | గాంబియా | సెప్టె. 22, 1965 |
| 32. | గినీ | డిసె. 12, 1958 |
| 33. | గెబన్ | సెప్టె. 20, 1960 |
| 34. | గ్రీస్ | అక్టో. 25, 1945 |
| 35. | గ్వాటెమాలా | నవ. 21, 1945 |
| 36. | ఘానా | మార్చి. 8, 1957 |
| 37. | చాడ్ | సెప్టె. 20, 1960 |
| 38. | చిలీ | అక్టో, 24, 1945 |
| 39. | చీనా[2] | అక్టో. 24, 1945 |
| 40. | జపాన్ | డిసె. 16, 1956 |
| 41. | జమైకా | సెప్టె. 18, 1962 |
| 42. | జాంబియా | డిసె. 1, 1964 |
| 43. | జెకోస్లోవాకియా | అక్టో. 24, 1945 |
| 44. | జోర్డాన్ | డిసె. 14, 1955 |
| 45. | టర్కీ | అక్టో. 24, 1945 |
| 46. | టాంజేనియా[3] | ఏప్రి. 26, 1964 |
| 47. | టూనీషియా | నవ. 12, 1956 |
| 48. | టోగో | సెప్టె. 20, 1960 |
| 49. | ట్రినిడాడ్ అండ్ టొబాగో | సెప్టె. 18, 1962 |
| 50. | డెన్మార్క్ | అక్టో. 24, 1945 |
| 51. | డొమినికన్ రిపబ్లిక్ | అక్టో. 24, 1945 |
| 52. | థాయిలాండ్ | డిసె. 16, 1946 |
| 53. | దక్షిణ ఆఫ్రికా | నవ. 7, 1945 |
| 54. | దహోమీ | సెప్టె. 20, 1960 |
| 55. | నార్వే | నవ. 27, 1945 |
| 56. | నికరాగ్వా | అక్టో. 24, 1945 |
| 57. | నెదర్‌లండ్స్ | డిసె. 10, 1945 |
| 58. | నేపాల్ | డిసె. 14, 1955 |
| 59. | నైజర్ | సెప్టె. 20, 1960 |
| 60. | నైజీరియా | అక్టో. 7, 1960 |
| 61. | న్యూజీలండ్ | అక్టో. 24, 1945 |
| 62. | పనామా | నవ. 13, 1945 |
| 63. | పరాగ్వే | అక్టో. 24, 1945 |
| 64. | పాకిస్తాన్ | సెప్టె. 30, 1947 |
| 65. | పెరూ | అక్టో. 31, 1945 |
| 66. | పోర్చుగల్ | డిసె. 14, 1955 |
| 67. | పోలండ్ | అక్టో. 24, 1945 |
| 68. | ఫిన్లాండ్ | డిసె. 14, 1955 |
| 69. | ఫిలిప్పీన్ ద్వీపములు | అక్టో. 24, 1945 |

1. ఈజిప్టు తొలుతనే అక్టోబరు 24, 1945 న సమితిలో సభ్యత్వమును పొందినది. తరువాత ఫిబ్రవరి 21, 1948 న ఉభయ దేశములలో జరిగిన జనవాక్యనిర్ణయము ఫలితముగ ఈజిప్టు, సిరియా రెండును 'యునైటెడ్ అరబ్ రిపబ్లిక్' (సంయుక్త అరబ్ గణరాజ్యము) గ రూపొందినవి. అంతటితో ఆ దేశముల ప్రత్యేక సభ్యత్వములు అంతరించి, యు. అ. రిపబ్లిక్ అనుపేర సభ్యత్వము లభించినది. కాని, అక్టోబరు 13, 1961 న సిరియా దేశము స్వచ్ఛందముగ ఆ గణరాజ్యమునుండి విడివడి మరల ప్రత్యేక సభ్యత్వమును సమితియందు పొందినది. అంతటినుండి, యునైటెడ్ అరబ్ రిపబ్లిక్ అను పేర ఈజిప్టు తన పూర్వపు సభ్యత్వమును కొనసాగించుచున్నది.

2. చీనా అని ఇచట వ్యవహరింపబడినది తైవాన్ ద్వీపమునందు కొమింగ్‌టాంగ్ నాయకుడు చియాంగ్-కై-షేక్ ఆధిపత్యమున సాగుచున్న ప్రభుత్వము మాత్రమే. తక్కిన ముఖ్య భూభాగమున కమ్యూనిస్టుల నాయకత్వమున సాగుచున్న చీనా ప్రజాగణరాజ్య ప్రభుత్వమునకు కారణాంతరములవలన ఐ. రా. స. యందు సభ్యత్వము 1966 వరకు చేకూరలేదు.

3. ఐక్యరాజ్య సమితిలో టాంగన్యికా దేశము డిసెంబరు 14, 1961 న సభ్యత్వము గడించినది. జాంబిబార్ డిసెంబరు 16, 1963 న సభ్యత్వము గడించినది. తరువాత ఆ ఉభయ దేశములును సంయుక్త గణ రాజ్యముగ రూపొందుటకు అంగీకరించినవి. ఆ అంగీకృతి ఏప్రిల్ 26, 1964 న ధ్రువీకృతము అయినంతట, ఆ రెండు రాజ్యములును టాంగన్యికా - జాంబిబార్ యునైటెడ్ రిపబ్లిక్ అను పేరుతో ఏక రాజ్య ప్రతిపత్తి వహించి ఐక్యరాజ్య సమితి సభ్యత్వమును పొందినవి. టాంజేనియా అనునది ఆ యునైటెడ్ రిపబ్లిక్‌నకు పర్యాయ నామము.



ఐక్యరాజ్య సమితి కార్య కేంద్రము, న్యూయార్క్, యునైటెడ్ స్టేట్స్,



ఐక్యరాజ్య సమితి సాధారణ సభ సమావేశము



ఐక్యరాజ్య సమితి, భద్రతా సమితి సమావేశము - నవంబరు 1965.



భారత ప్రధాని నెహ్రూ, ఐక్యరాజ్య సమితి సాధారణ సభ నుద్దేశించి ప్రసంగించుట. నవంబరు 1961



భారత ప్రధాని ఇందిరాగాంధీ - ఐక్యరాజ్య సమితి సెక్రటరీ జనరల్ ఊథాంట్




ఐక్య రాజ్య సమితి భవనపు గోడపై చెక్కబడిన ఒక సూక్తి

'ప్రపంచ ప్రజలు ఇక తమ కరవాలములను నాగేటి కర్రులుగను, తమ బల్లెములను దోటికొడవళ్లుగను చరిపింపగలరు. ఇకమీదట ఒక దేశము వేరొకదేశముపై దండెత్తబోవదు; ప్రపంచ ప్రజలు యుద్ధ విద్యను ఇక అభ్యసింపబోరు.'

| | | |
|---|---|---|
| 70. | ఫ్రాన్స్ | అక్టో. 24, 1945 |
| 71. | బర్మా | ఏప్రి. 19, 1948 |
| 72. | బల్గేరియా | డిసె. 14, 1955 |
| 73. | బురుండి | సెప్టె. 18, 1962 |
| 74. | బెల్జియమ్ | డిసె. 27, 1945 |
| 75. | బైలోరష్యా | అక్టో. 24, 1945 |
| 76. | బొలీవియా | నవ. 14, 1945 |
| 77. | బ్రెజిల్ | అక్టో. 24, 1945 |
| 78. | భారతదేశము | అక్టో. 30, 1945 |
| 79. | మంగోలియా | అక్టో. 27, 1961 |
| 80. | మలగాసీ [4] | సెప్టె. 20, 1960 |
| 81. | మలావీ [5] | డిసె. 1, 1964 |
| 82. | మలేసియా [6] | సెప్టె. 16, 1963 |
| 83. | మారిటేనియా | అక్టో. 27, 1961 |
| 84. | మాల్దీవులు | సెప్టె. 22, 1965 |
| 85. | మాలీ | సెప్టె. 28, 1960 |
| 86. | మాల్టా | డిసె. 1, 1964 |
| 87. | మెక్సికో | నవ. 7, 1945 |
| 88. | మొరాకో | నవ. 12, 1956 |
| 89. | యుక్రేనియన్ సో. సో. రి. [7] | అక్టో. 24, 1945 |
| 90. | యుగోస్లావియా | అక్టో. 24, 1945 |
| 91. | యునైటెడ్ కింగ్‌డమ్ [8] | అక్టో. 24, 1945 |
| 92. | యునైటెడ్ స్టేట్స్ | అక్టో. 24, 1945 |
| 93. | యెమెన్ | సెప్టె. 30, 1947 |
| 94. | రుమేనియా | డిసె. 14, 1955 |
| 95. | రువండా | సెప్టె. 18, 1962 |
| 96. | లక్జెంబర్గ్ | అక్టో. 24, 1945 |
| 97. | లావోస్ | డిసె. 14, 1955 |
| 98. | లిబియా | డిసె. 14, 1955 |
| 99. | లెబనాన్ | అక్టో. 24, 1945 |
| 100. | లైబీరియా | నవ. 2, 1945 |
| 101. | వెనిజ్యులా | నవ. 15, 1945 |
| 102. | సింగపూర్ | సెప్టె. 22, 1965 |
| 103. | సింహళము | డిసె. 14, 1955 |
| 104. | సియెర్రాలియోనీ | సెప్టె. 27, 1961 |
| 105. | సిరియా [9] | అక్టో. 24, 1945 |
| 106. | సుడాన్ | నవ. 12, 1956 |
| 107. | సెంట్రల్ ఆఫ్రికన్ రిపబ్లిక్ | సెప్టె. 20, 1960 |
| 108. | సెనెగల్ | సెప్టె. 28, 1960 |
| 109. | సైప్రస్ | సెప్టె. 20, 1960 |
| 110. | సోమాలియా | సెప్టె. 20, 1960 |
| 111. | సోవియట్ రష్యా | అక్టో. 24, 1945 |
| 112. | సౌదీ అరేబియా | అక్టో. 24, 1945 |
| 113. | స్పెయిన్ | డిసె. 14, 1955 |
| 114. | స్వీడన్ | నవ. 19, 1946 |
| 115. | హంగేరీ | డిసె. 14, 1955 |
| 116. | హయిటీ | అక్టో. 24, 1945 |
| 117. | హోండూరాస్ | డిసె. 17, 1945 |

గమనిక : ఈ పట్టికలో ఇండోనీషియా చేర్చబడలేదు. ఆ రాజ్యము సెప్టెంబరు 28, 1950 న ఐక్య రాజ్య సమితియందు సభ్యత్వము గడించినను, మలేసియా రూపొందిన తీరును గురించి, ఆ రాజ్యముతో వైరుధ్యము వహించి, ఆ రాజ్యమునకు భద్రతా సంఘమున స్థానము కల్పింపబడినందులకు తన నిరసనను సూచించుటకై ఐక్య రాజ్య సమితిలోని తన సభ్యత్వమును ఉపసంహరించుకొనినది. ఈ ఉపసంహరణ మార్చి 1, 1965 నుండి అమలులోనికి వచ్చినది.

**ఐరిష్ ఫ్రీ స్టేట్ :** చూ. ఐర్లాండ్.

**ఐరోపా ఖండము :** చూ. యూరప్.

**ఐర్లాండ్ :** యూరప్ ఖండమునకు చెందిన ఒక స్వతంత్ర ద్వీపరాజ్యము.

ఉత్తర అట్లాంటిక్ మహాసముద్రమున తూర్పు భాగమున ఈ ద్వీపము నెలకొని ఉన్నది. ఈ ద్వీపమునకు ఈశాన్య దిశయందు ఉన్న నార్త్ ఛానల్ దీనిని స్కాట్‌లాండ్ నుండి వేరుచేయుచున్నది. అటులే తూర్పున, ఆగ్నేయమున ఉన్న ఐరిష్ సముద్రము, సెయింట్ జార్జి ఛానల్ అనునవి ఈ ద్వీపమును ఇంగ్లండు, వేల్స్ నుండి వేరుచేయుచున్నది. పశ్చిమమున అట్లాంటిక్ మహాసముద్రము దీనిని 3,200 కి. మీ. దూరమున ఉండు ఉత్తర అమెరికా నుండి వేరు చేయుచున్నది. [వి] 84,239 చ. కి. మీ. అయినను. ఇందులో 70,280 చ. కి. మీ. మాత్రమే ఐర్లాండ్ గణరాజ్యమునకు చెంది ఉన్నది. తక్కిన ఉత్తర ఐర్లాండ్ బ్రిటిష్ (యునైటెడ్ కింగ్‌డమ్) రాజ్యమునకు చెంది ఉన్నది. [జ] 28,41,000; ప్రజలను ఐరిష్ వారని వ్యవహరింతురు. [భా] ఇంగ్లీష్, ఐరిష్ భాషలు అధికార భాషలుగ వ్యవహారమందు ఉన్నవి. [మ] ప్రజలు అందరు క్రైస్తవులు. అందు రోమన్ కేతలిక్ సంప్రదాయమునకు అధిక వ్యాప్తి కలదు. [రా] డబ్లిన్ (జ. సం. 5,84,483).

---

4. మలగాసీకి మడగాస్కర్ అనునది పూర్వనామము.

5. మలావీకి న్యాసాలాండ్ అనునది ముందటి పేరు.

6. మలయా సమాఖ్యకు సెప్టెంబరు 17, 1957 న ఐక్య రాజ్య సమితియందు సభ్యత్వము చేకూరినది. తరువాత ఆ సమాఖ్యలో సెప్టెంబరు 16, 1963 న సింగపూర్, సాబా (ఉత్తర బోర్నియో), సారవాక్ రాజ్యములు చేరుటతో ఆ సమాఖ్య తన పేరును మలేసియాగ మార్చుకొని, ఐక్య రాజ్య సమితిలో ఆ తేదీన నూతనముగ సభ్యత్వమును గ్రహించినది. కాని, ఆగస్టు 9, 1965 న సింగపూర్ మలేసియా నుండి విడివడి, మరల సర్వస్వతంత్ర రాజ్యముగ ఐక్య రాజ్య సమితి యందు సభ్యత్వమును పొందినది.

7. దీనినే ఉక్రెయిన్ (ఉక్రేనియా) అని కూడా అందురు.

8. యునైటెడ్ కింగ్‌డమ్‌కు గ్రేట్ బ్రిటన్, ఇంగ్లండు అని కూడా పర్యాయనామములు కలవు.

9. సిరియాకు సంబంధించిన విషయములను, ఈజిప్టును గురించిన పైజ్ఞాపిక యందు కననగును.

చరిత్ర : చరిత్రకు తెలిసినంతవరకు ఈ ఐర్లాండ్ ద్వీపములో మొట్టమొదట నివసించి ఉండిన జనులు నూతన శిలాయుగమువారు. వారికి ప్రాచీన చరిత్ర రచయితలు పెట్టిన పేరునుండి ఎరిన్‌లు అనియు, దేశమునకు ఐర్ అనియు పేరులు వచ్చినవి. ఐర్-లాండ్ ఐర్లాండ్ అయినది. క్రీ. పూ. 300 లో ఆర్యజాతికి చెంది గాలిక్ (గొయిడలిక్) అను పేరు గల జనులు ఈ దేశమును జయించి ఆక్రమించుకొని, వారి భాషయైన కెల్టిక్ భాషను వ్యాప్తిలోనికి తెచ్చిరి.




ఇంగ్లండుదేశ రాజయిన హెన్రీ - II పోప్ అనుమతిని పొంది 1154 లో ఐర్లాండ్ దేశముపై దండెత్తి, తన ఆధిపత్యమునకు ఐర్లాండ్ వారు లోబడుటకు సమ్మతించునట్లు చేసికొనెను. ఆనాటినుండి ఇంగ్లీషువారు అనేకులు కుటుంబసహితముగా అక్కడికి పోయి వసతులు ఏర్పరచుకొనిరి ; భూములు సాగులోనికి తెచ్చుకొనిరి ; గ్రామములు, నగరములు నిర్మించుకొనిరి. బ్రిటిష్ దేశమందలి న్యాయ చట్టములే అక్కడ వసతులు ఏర్పరచుకొన్న బ్రిటిష్ వారు అమలుపరచుకొనిరి ; మరి కొంత కాలమునకు ఒక ప్రత్యేక పార్లమెంట్ సభను కూడ నిర్మించుకొనిరి.

స్టూవర్ట్ రాజుల కాలములో ఐర్లాండ్ దేశములో అల్‌స్టర్ మండలమునకు స్కాచ్ కుటుంబములవారు పోయి వసతులు ఏర్పరచుకొనిరి. గత్యంతరములేక బలము తక్కువ అయినను ఐరిష్ వారు విజయవంతముగా నిరోధించలేక పోయినా ద్వేషము ఎక్కువయినది. ప్రొటెస్టంట్ మతమును స్వీకరించిన అల్‌స్టర్ (ఉత్తర ఐర్లాండ్) భాగమునకును, రోమన్ కేతలిక్ మతమునే అవలంబించి ఉండిన తక్కిన ఐర్లాండ్ దేశమునకును ద్వేషము, కలహము పెరుగుచు వచ్చినవి.

స్టూవర్ట్ రాజుల కాలము ముగిసి, ఇంగ్లండు దేశము పూర్తిగా ప్రొటెస్టంట్ దేశమయి ప్రబలమైన రాజ్యమయి నప్పటినుండి ఐర్లాండ్‌లో అధిక సంఖ్యాకులుగా ఉండిన రోమన్ కేతలిక్ ప్రజలకు బాధలు ఎక్కువయినవి. దేశ స్వాతంత్ర్యము లభించినగాని ఈ కష్టములు తమకు తొలగిపోవను అభిప్రాయము రోమన్ కేతలిక్‌లకే కాదు, ఐరిష్ వారికి అందరికిని తోచినది. అమెరికా స్వాతంత్ర్య సంగ్రామ [చూ.] కాలమందు తగిన సమయము చిక్కినది అను ఆశతో ఐర్లాండ్ వారు తిరుగుబాటు చేసిరి. అప్పుడు పార్లమెంట్ సభ్యులను ఎన్నుకొనే అధికారము మాత్రము ఐరిష్ కేతలిక్‌లకు లభించినది. అంతేకాని, సభ్యులగుటకు హక్కు లభించలేదు. 1798 లో వినగర్ కొండవద్ద జరిగిన తిరుగుబాటు అణచివేయబడినది కాని, ఐర్లాండ్‌వలన బాధ ఎప్పటికైనను తీవ్రము కాగలదను భయము ఇంగ్లీషు వారికిని తోచినది. 1800 లో ఐరిష్ పార్లమెంట్ సభను బ్రిటిష్ పార్లమెంట్ సభతో ఏకముచేసి, 'గ్రేట్ బ్రిటన్ అండ్ ఐర్లాండ్' అంతా ఒకే రాజ్యమని ఇంగ్లీషువారు ప్రకటించిరి. ఆ సంయుక్తపు పార్లమెంట్ సభలో ఐరిష్ వారికి కొంత ప్రాతినిధ్యము సైతము ఏర్పడినది. ఇది ఐరిష్‌వారి మేలుకోసము చేసిన ఏర్పాటుగా ప్రకటితమైనను, ఈ రాజకీయ సంయోగమువలన ఐర్లాండ్ వారికి మేలు కలుగుటకు అవకాశము లేకుండెను. ఈ సంయుక్త పార్లమెంట్‌లో ఐరిష్ సభ్యులు ఎప్పుడును అల్పసంఖ్యాకులుగా ఉండవలసినదే కనుక, వారి తీర్మానములు బ్రిటిష్‌వారికి బాధ కలిగించక పోయిననేతప్ప తక్కిన సమయములలో ఎన్నడును నెగ్గ గలిగినవి కావు. అందుచేత డేనియల్ ఓకొనెల్ అను అతని యాజమాన్యమున ఐరిష్ వారు తిరుగుబాటు క్రమముగా తీనడపిరి. అందువల్ల రోమన్ కేతలిక్‌లకు విముక్తి గలిగి అధికారములు లభించినవి కాని, సంపూర్ణ స్వాతంత్ర్యము కలుగలేదు.

సిన్‌ఫెయిన్ అను ఉద్యమము 20 వ శతాబ్దారంభమునందు బయలుదేరి సంపూర్ణ స్వాతంత్ర్యము ఐర్లాండ్‌కు కావలెనని పట్టుపట్టి తీవ్రముగా కృషి సల్పెను. 1916 లో డబ్లిన్ నగరమందు పెద్ద తిరుగుబాటు జరిగినది. 1918 లో 73 సభ్యులు పార్లమెంట్‌కు ఎన్నుకొనబడినారు. కాని, వీరు సంయుక్త పార్లమెంట్‌కు వెళ్లక ఐర్లాండ్‌లోనే నిలిచి, ఐరిష్ ప్రజాసత్తాక రాజ్యమును స్థాపించిరి. తుదకు

బ్రిటిష్ పార్లమెంట్‌వారు ఐర్లాండ్‌కు స్వాతంత్ర్యమును కలుగచేయు చట్టమును ప్రకటించిరి కాని, దేశమందలి ఉత్తర భాగమునకును, దక్షిణ భాగమునకును ఉమ్మడి పార్లమెంట్ ఏర్పడునట్లుగా ప్రకటితమగుటచేత దక్షిణ భాగమువారికి అది సమ్మతము కాలేదు. అందుచేత ఐర్లాండ్‌తో సంఘర్షణ సాగుతూ వచ్చినది. దాని ఫలితముగా ఐర్లాండ్‌ను రెండు భాగములుగ బ్రిటిష్ ప్రభుత్వమువారు విభజించి, దక్షిణమున ఉన్న భాగమును, ఉత్తరమున ఉన్న భాగమును వేర్వేరు స్వతంత్ర రాజ్యములుగ చేసిరి (1921).

1925 లో 26 కౌంటీలతో దక్షిణ ఐర్లాండ్ పార్లమెంట్‌న్ను, 6 కౌంటీలతో ఉత్తర ఐర్లాండ్ పార్లమెంట్‌న్ను, ఏర్పడ్డవి. ఈ ఏర్పాటును ఈ రెండు పార్లమెంట్‌లున్ను బ్రిటిష్ పార్లమెంట్‌న్ను అంగీకరించి ధ్రువపరచినవి.

ఈ దేశము ఐరిష్ ఫ్రీస్టేట్ అను పేర 1922 నుండి 1957 వరకు వ్యవహరింపబడినది. అంతటినుండి ఐర్లాండ్ అనియే అనబడుచున్నది. 1949 లో ఈ రాజ్యము గణరాజ్యముగ ప్రకటిత మయ్యెను. 1955 నుండి ఐక్యరాజ్య సమితియందు సభ్యత్వము కల ఈ దేశము విస్తృతియందు చిన్నది అయ్యును, శాంతియుత ప్రపంచ వ్యవస్థను నిర్మించుటకు నిరంతరకృషి చేయుచున్నది.

రాజ్యాంగము : 1937 లో ఆమోదింపబడిన రాజ్యాంగ చట్టమును అనుసరించి ఈ రాజ్యమున పరిపాలన జరుగుచున్నది. సర్వాధికారము జాతీయ శాసనసభ (అవురియక్తస్) యందు నెలకొని ఉన్నది. ఈ శాసనసభయందు అందలి రెండు కక్ష్యలును, అధ్యక్షుడును అంతర్భాగములుగ పరిగణింపబడుచున్నారు. రెండు కక్ష్యలలో ఒకటి ప్రతినిధి సభ (డయిల్ ఇరియన్), మరి యొకటి శిష్టసభ (సీనడ్ ఇరియన్). అధ్యక్షుడు ఏడేండ్లకు ఒకసారి ఎన్నుకొనబడును. ప్రతినిధి సభయందు 147 ఎన్నుకొనబడిన సభ్యులు ఉందురు. అయినను ఈ సంఖ్యా నిర్ణయమును గురించి పునర్విమర్శన 12 ఏండ్లకు ఒకసారి జరుగవలయునను నియమము కలదు. శిష్టసభయందు 60 మంది సభ్యులు ఉందురు. వీరిలో 11 మందిని ప్రధానమంత్రి నియామకము చేయును; ఆరుగురను యూనివర్సిటీలు ఎన్నుకొనును; తక్కినవారు వివిధ వృత్తి వర్గముల నుండి ఎన్నుకొనబడుదురు. ప్రతినిధిసభ పంపిన బిల్లుపై తన అభిప్రాయమును తెలుపుటకు శిష్టసభకు 60 దినములు మాత్రమే గడువు నిర్ణయింపబడినది. ప్రతినిధి సభానిర్ణయమును అనుసరించి ప్రధానమంత్రిని అధ్యక్షుడు నియమించును. మంత్రివర్గమున 7 గురకు తగ్గక, 15 కు మించక మంత్రులు ఉందురు. మంత్రివర్గసహాయమున ప్రధానమంత్రి ప్రతినిధిసభకు బాధ్యత వహించి పరిపాలన నెరపును.

రాజకీయ పక్షములలో ఫయన్నా ఫయిల్, ఫినేగేల్, కార్మికపక్షములు ప్రముఖములు. ఫయన్నా ఫయిల్‌కు ప్రముఖ స్వాతంత్ర్యయోధుడు డీవెలరా నాయకుడు 1932 నుండి 1947 వరకు ఈతడు ప్రధాన మంత్రిగా ఉండెను. ఆ తరువాత సయితము అంతటంతట తన పక్షమునకు ప్రాబల్యము లభించినపుడెల్ల అతడు ప్రధాన మంత్రిగా 1959 వరకు ఉండెను. అంతట ఇతడు అధ్యక్షుడుగ ఎన్నుకొనబడెను. ఫినేగేల్ పక్షము తొలుతటి ఐరిష్ ఫ్రీస్టేట్ అధ్యక్షుడు ఆర్థర్ గ్రిఫిత్‌చే స్థాపింపబడి 1922 నుండి 1932 వరకు అధికారమున ఉండెను. అంతటి నుండి ముఖ్య వ్యతిరేక పక్షముగ ఉండి, 1947 తరువాత కార్మిక పక్షముతో కలిసి మిశ్రమమంత్రివర్గము ఏర్పరచి కొంత కాలము పాలించెను. వీరి పరిపాలన కాలముననే కామన్‌వెల్త్ [చూ.] నుండి ఐర్లాండ్ చీలి గణరాజ్యము అయ్యెను.

గి. వేం. సీ.

**ఐ-లా-షాపెల్ శాంతి సంధులు :** ఐ-లా-షాపెల్ అనునది జర్మనీలోని ఒక చారిత్రక నగరము. దీనికే ఆకెన్ అను పేరును కలదు. యూరప్ దేశముల సమావేశము (కాంగ్రెస్) లు ఇచట 1668, 1748, 1818 లలో జరిగి ఆ యా సందర్భములందు కొన్ని శాంతి సంధులు కుదుర్చుకొనబడినవి.

మొదటి సంధి : వీనిలో తొలుతటి కాంగ్రెస్‌కు పర్యవసానముగ 1668, మే 2 న శాంతి సంధి కుదిరినది. ఫ్రాన్స్ దేశపురాజగు లూయీ-XIV తన భార్యకు గల వారసత్వహక్కు రీత్యా స్పెయిన్‌నందు కొన్ని ప్రాంతములు తనకు చెందవలయునని ఆ దేశముతో సాగించిన యుద్ధము ఈ శాంతి సంధితో అంతమైనది. దీనివలన స్పెయిన్‌నకు చెందిన ఫ్లాండర్స్‌లో అప్పటికి ఫ్రెంచిసేనల వశమైన ప్రాంతములు అన్నియు ఫ్రాన్స్‌నకే దఖలు పరచబడినవి. స్పెయిన్‌లోని ఆక్రమిత ప్రాంతములు మాత్రము స్పెయిన్ రాజ్యమునకే తిరుగ అప్పగింపబడినవి. ఈ శాంతి సంధియందలి షరతుల సక్రమ పాలనకై గ్రేట్ బ్రిటన్, స్వీడెన్, హాలండ్ దేశములు పూచీ పడునటుల హేగ్ నగరమున మే 7, 1669 న ఒక ఒడంబడిక రూపొందింపబడినది.

రెండవ సంధి : రెండవ కాంగ్రెస్ వలన ఆస్ట్రియా వారసత్వ సంగ్రామము ముగిసి, శాంతి సంధి అక్టోబరు 18, 1748 న కుదిరినది. ఈ శాంతి సంధియందలి ముఖ్య విషయములు :

1. యుద్ధమునకు ఫలితముగ చేతులు మారిన ప్రాంతములు అన్నియు యుద్ధపు పూర్వపు హక్కుదారులకే అప్పగింపబడుట; ఇందువలన కేప్ బ్రెటన్ ఫ్రాన్స్‌నకును, భారతదేశము నందలి మద్రాసు ఆంగ్లేయులకును, కొన్ని సరిహద్దు నగరములు డచ్చి వారికిని లభించినవి;

2. స్పెయిన్‌లోని రాజ వంశమునకు చెందిన డాన్ ఫిలిప్‌కు ఇటలీలోని పర్మా, పియాసింజా, గవస్తల్లా పరగణా (డచ్చీ)లు లభించినవి;

3. స్పెయిన్ వలసలలో ఏడాదికి 4,000 మంది బానిసలను దిగుమతి చేయుటకు బ్రిటన్‌కు 1713 లో ఏర్పడిన అధికారము గుర్తింపబడినది;

4. ప్రొటెస్టంట్ సంప్రదాయానుయాయియగు హానోవర్ కుటుంబమునకు ఆంగ్ల రాజ్య సింహాసనముతో పాటుగ, జర్మనీ లోని తమ రాష్ట్ర పాలనయందును వంశానుగత స్వత్వము కలదనుటను గుర్తించుట;

5. మేరియా తెరెసాకు హాప్స్‌బర్గ్ వంశపు వారసత్వము కలదని గుర్తించి, ఆమె భర్తయగు ఫ్రాన్సిస్‌ను పవిత్ర రోమన్ సామ్రాజ్య చక్రవర్తిగ పరిగణించుట;

6. సైలీషియా పరగణాయును, గ్లాజ్ మండలమును ప్రష్యాకే చెంది ఉండగలవని హామీ ఇచ్చుట;

వీనిలో 3 వ షరతునకు కొలది కాలము తరువాత స్పెయిన్ అభ్యంతరము తెలిపినది. అంతట అందులకై నష్ట పరిహారముగ లక్ష పౌనుల మొత్తమును గ్రహించి బ్రిటన్ తన హక్కును వదలుకొనినది.

మూడవ సంధి: నెపోలియన్ పతనానంతరమున ఫ్రాన్స్ నుండి తమ ఆక్రమణ సేనలను తొలగించు విషయమును, తదనుబంధ విషయములను చర్చించుటకై నాలుగు మిత్ర రాజ్యములు - గ్రేట్ బ్రిటన్, ఆస్ట్రియా, ప్రష్యా, రష్యా - జరిపిన సమావేశమే ఐ - లా - షాపెల్ లోని మూడవ కాంగ్రెస్. ఆ రాజ్యముల అనుమతిపై ఫ్రాన్స్ ప్రతినిధియు అందు పాల్గొనెను. 1818, అక్టోబరు 1 న మొదలైన సమావేశమున జరిగిన చర్చల ఫలితముగ ఫ్రాన్స్‌నుండి సేనలను తొలగించు విషయమున సూత్ర ప్రాయముగ అంగీకారము కుదిరి, అందులకు సంబంధించిన శాంతి సంధిపై అక్టోబరు 9 న సంతకములు జరిగెను. ఆ తరువాత యూరప్‌న మరల కల్లోలము చెలరేగకుండ చేయుటకై మిత్ర రాజ్యములు అనుసరింపదగు విధానమును గురించి సుదీర్ఘ చర్చలు జరిగినను, ఫలశూన్యములయ్యెను. కడకు శాంతిని సుస్థిరము ఒనర్చుటకై తమకు గల దృఢసంకల్పమును, అందులకు పరస్పర సాన్నిహిత్యమును నెలకొల్పుకొనుటలో తమకు గల ఆకాంక్షను వెలువరించుచు, ఆ ప్రముఖ రాజ్యములు ఒక ప్రకటనను మాత్రము చేయగలిగినవి. బానిస వ్యాపారమును నిరోధించు విషయమునను అట చర్చలు జరిగినవి కాని, అంగీకారము కుదురలేదు. చీ. శే. రా.

**ఐవరీ కోస్ట్**: ఆఫ్రికా ఖండపు పశ్చిమ తీరమున ఉన్న ఒక స్వతంత్ర గణ రాజ్యము.

ఈ రాజ్యమునకు అప్పర్ వోల్టా, మాలీ సమాఖ్య [ఉ]; ఘానా [తూ]; అట్లాంటిక్ మహా సముద్రము [ద]; గినీ, లైబీరియా [ప] సరిహద్దులుగ ఉన్నవి. [వి] 3,22,463 చ. కి. మీ.; [జ] 34,10,000. వీరిలో వివిధ జాతుల ఆఫ్రికన్ ప్రజలును చేరి ఉన్నారు. [భా] వివిధ జాతుల మాతృభాషలుగ దాదాపు 60 ఆఫ్రికన్ భాషలు వ్యవహారమందు ఉన్నను, ఫ్రెంచి భాషయే అధికార భాషగ పరిగణింపబడినది. [మ] దేశ ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు ప్రకృతి దేవతారాధకులు, క్రైస్తవులు కొలదిగ కలరు. [రా] అబిజాన్ (జ. సం. 1,27,585).

చరిత్ర: ఈ దేశపు ప్రాచీన చరిత్రను గురించిన వివరములు అంతగ తెలియవు. 15 వ శతాబ్దమునుండి ఈ




దేశముతో యూరపియన్‌లకు పరిచితి లభించినది. యూరపియన్‌లలో తొలుతగ పోర్చుగీస్ నావికులు ఇట కాలిడిరి (1488). తరువాత క్రమముగ స్పానిష్, డచ్చి, బ్రిటిష్ వర్తకులును ఇటకు చేరిరి. 17 వ శతాబ్దినుండి ఫ్రెంచివారు ప్రత్యేక శ్రద్ధతో ఈ దేశమున వర్తక స్థావరముల నెలకొల్పి కృషిచేసిరి. క్రమముగ ఫ్రెంచివారు ఇచటి వివిధ తెగల నాయకులతో ఒడంబడికలు కుదుర్చుకొని, ఈ ప్రాంతమున రాజకీయముగ పలుకుబడిని ఆర్జించిరి (1887). కాని, ఈ ప్రాంతముననే కొంత భాగమును ఆ నాడు పాలించుచుండిన సమోరీ అను ఆఫ్రికన్ ప్రభువు ఫ్రెంచివారిని ఎదుర్కొని కడు దీర్ఘ కాలము పోరాడెను. 1898 లో ఫ్రెంచివారు ఇతనిని నిర్జించిరి. కాని, దేశము నందలి దుర్గమప్రాంతములను వశపరచుకొనుట చాల కష్ట

సాధ్యమయ్యెను. తుదకు 1914 నాటికి దేశమంతట ఫ్రెంచి అధికారము గుర్తింపబడెను. ఈ దేశమందలి వివిధ ప్రాంతములను ఫ్రెంచివారు సమైక్యపరచి (1893), దీనికి ఐవరీకోస్ట్ అని పేరిడిరి. 1933లో అప్పర్ వోల్టా [చూ.పు.268] అను వలస రాజ్యమును కూడ ఫ్రెంచివారు దీనికి కలిపిరి. కాని, 1947లో ఆ దేశము ఐవరీకోస్ట్‌నుండి మరల విడివడెను. ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున 1940 నుండి 1943 వరకు నాజీలతో సహకరించిన విచీయందలి ఫ్రెంచి ప్రభుత్వపు ఆధిపత్యమున ఈ దేశము ఉండెను. కాని, ప్రజానీకమున ప్రముఖ నాయకులు కొందరు డిగాలీ [చూ.] ఆధ్వర్యవమున ఉన్న స్వతంత్ర ఫ్రెంచి ప్రభుత్వముతో సహకరించిరి. యుద్ధానంతరమున 1946లో ఈ దేశము ఫ్రెంచి రాజ్యమునందలి సముద్రోత్తర ప్రాంతము (ఓవర్‌సీస్ టెర్రిటరీ) గా గుర్తింపబడెను. దేశము త్వరలోనే ఆర్థికముగ పురోగమించుటవలన ఆఫ్రికాయందలి ఫ్రెంచి వలసలలోనెల్ల సంపన్నవంతమని పేరొందెను. 1958లో జరిగిన జనాభిప్రాయ సేకరణను అనుసరించి, ఫ్రెంచి కమ్యూనిటీ [చూ.] లో చేరిన స్వతంత్ర రాజ్యముగ ఉండుటకు ఈ దేశము నిర్ణయించుకొని, అంతటనుండి స్వతంత్రత అనుభవించుచున్నది.

రాజ్యాంగము : ఫ్రెంచి కమ్యూనిటీ సభ్యత్వమువలన చేకూరిన బాధ్యతలకు లోబడి ఈ రాజ్యము తన పరిపాలనను నిర్వహించుకొనుచున్నది. ఫ్రెంచి కమ్యూనిటీ సెనేట్ నందలి 284 మంది సభ్యులలో ఐవరీకోస్ట్ 11 మంది సభ్యులను ఎన్నుకొనును. దేశ పరిపాలనను నిర్వహించు ప్రధాన మంత్రియే దేశాధిపతిగ వ్యవహరించును. ఇతనిని శాసన సభ ఎన్నుకొనును. ప్రధాన మంత్రియే తన సహచరులగు మంత్రులను నియమించుకొనును. శాసన సభయందు 100 మంది సభ్యులు ఉందురు. అయిదేండ్లకు ఒకసారి ఈ శాసనసభకు ఎన్నికలు జరుగును. ఎన్నికలు సార్వజనిక, వయోజన రహస్యపు ఎన్నికల పద్ధతిన జరుగును. రాజ్యాంగమున నిర్ణయించబడిన కొన్ని నిర్ణీత విషయములపైననే శాసన సభ చట్టములను చేయును. తక్కిన వాటి విషయమున ప్రధాన మంత్రి నాయకత్వమున పని చేయు కార్యనిర్వాహక వర్గమే నిర్ణయములను చేయును. బడ్జెట్ విషయమున శాసన సభ చర్చించి మార్పులు చేసినపుడు ఆదాయముకన్న వ్యయము ఎక్కువగా తేలినచో కార్యనిర్వాహక వర్గము దానిని సరిపుచ్చుటకు బడ్జెట్‌లోని ఖర్చును తగ్గించుటయైన చేయవలయును లేదా అదనపు పన్నుల విధించి, ఆ పన్నులను ఆమోదించవలసినదిగ శాసన సభను కోరవలెను. ఇటుల కోరిన తరువాత 15 రోజులలోగా శాసన సభ దీనిని ఆమోదించినటుల తెలియజేయనిచో, కార్యనిర్వాహక వర్గమే తన వసతిని అనుసరించి బడ్జెట్‌ను సవరించి అమలులోనికి తేవలెను. ప్రధానిని, అతని ప్రభుత్వమును తొలగించుటకు శాసన సభకు హక్కు కలదు. పదవియైన అధికార దుర్వినియోగము జరిగినటుల శాసన సభ భావించినచో ప్రధాన మంత్రిని గాని, అతని మంత్రి వర్గములోని సభ్యుని ఎవనినైన గాని విచారించి మూడింట రెండువంతుల ప్రాబల్యముతో శిక్షించుటకును శాసన సభకు హక్కు కలదు. చీ. శే. రా.

**ఐస్‌లాండ్ :** యూరప్ ఖండమునకు చెందినదిగ పరిగణింపబడు ఐస్‌లాండ్ దీవి ఒక స్వతంత్ర గణ రాజ్యము.

స్కాట్‌లాండ్ దేశమునకు వాయవ్యమున సుమారు 830 కి. మీ. దూరమునను, నార్వే దేశమునకు పశ్చిమమున 1000 కి. మీ. దూరమునను ఉత్తర అట్లాంటిక్ సముద్రముచే పరివృతమై, ఉత్తర ధ్రువ వృత్తమును ఆనుకొని దిగువన ఈ ద్వీప రాజ్యము నెలకొని ఉన్నది. [వి] దాదాపు 1,03,000 చ. కి. మీ.; ఈ ద్వీపమునకు సమీపమున ఉన్న కొన్ని అల్ప ద్వీపములును రాజ్యాంగ రీత్యా ఈ దేశమునకు చెందినవిగ పరిగణింపబడుచున్నవి. [జ] 1,83,478. [భా] జాతీయ భాష ఐస్‌లాండిక్ ; [మ] జనులందరును లూథరన్ సంప్రదాయపు క్రైస్తవులు. [రా] రైక్జవిక్ (జ. సం. 70,850).

చరిత్ర : ధ్రువప్రాంతమునందున్న ఈ ద్వీపమునకు తొలుతగ నార్వేయందలి కొందరు సాహసికులు ఇన్‌గోల్ఫర్ అర్‌నర్‌సన్ అనువాని నాయకత్వమున క్రీ. శ. 874 లో వలసపోయి అట నివాసములను ఏర్పరచుకొనిరి.




వారిని అనుసరించి ఆ శతాబ్దముననే కాక, పదవ శతాబ్దమున సయితము పలువురు నార్వే దేశీయులును, స్కాట్‌లాండ్, ఐర్లాండ్ వాసులును అటకు చేరిరి. క్రమముగ క్రీ. శ. 930 లో ఈ స్థావరముల సక్రమ పరిపాలన కొరకై ఆల్‌తింగ్ అను పేర ఒక కేంద్ర శాసన సభ స్థాపింపబడినది. ఈ శాసన సభకు శాసన నిర్మాణముననే కాక, న్యాయ

విచారణకును అధికారము ఉండెడిది. ఇందులకు తోడుగ ఆ కాలముననే వివిధ శాసనముల క్రోడీకరణము జరిగినది. క్రీ. శ. 1000 నుండి ఇట క్రైస్తవ మతము వ్యాపింప ఆరంభించి, అనతి కాలముననే జాతీయ మతమైనది. కాని, ప్రజానీకమున మాత్రము పూర్వపు బహుదేవతారాధన యందలి విశ్వాసము అంతగ సడలక చాలకాలము ఉండి, 12, 13 శతాబ్దములలో వారి సారస్వతమందు ప్రతి ఫలించినది. 1262 లో ఈ దేశ ప్రజల ప్రతినిధులు ఆ సమయమున నార్వే దేశమును పాలించుచుండిన హాకన్-IV రాజుతో ఒక ఒడంబడికను కుదుర్చుకొని, దాని మూల మున ఆ ప్రభువు సార్వభౌమాధిపత్యమును అంగీకరించిరి. అంతటినుండి ఈ దేశమునకు గల స్వతంత్రప్రతిపత్తి నశించుటయే కాక, కడకు ఆంతరంగిక పరిపాలనాధి కారము సైతము లేక నార్వేరాజు రాజ్యమున ఒక మండలముగ ఈ దేశము ఉండవలసి వచ్చెను. తరువాత నార్వేదేశము డెన్మార్క్ ప్రభువుల పాలనలోనికి పోయి నప్పుడు ఐస్‌లాండ్ కూడ ఆ ప్రభువుల ఆధిపత్యమునకు లోబడెను (1381). వారి పరిపాలన కాలముననే క్రైస్తవ మతమందలి ప్రొటెస్టంట్ సంప్రదాయము ఇట ప్రవేశ పెట్టబడి, ఆదరణను ఆర్జించెను (1540 ప్రాంతము). అపుడు దేశపు విదేశవ్యాపారము అంతయు డేనిష్ వర్తకుల అధీనమున మాత్రమే ఉండెను. 1786 వరకును పరిస్థితులు ఇటులనే ఉండి, ఆ సంవత్సరమున ఆ ప్రత్యేకాధికారములను రాజు రద్దు చేయుటచే డేనిష్ సార్వభౌముని విశాల రాజ్య ములో ప్రజలందరికిని వర్తకము చేసికొను అవకాశము కలుగజేయబడెను. అంతట ఐస్‌లాండ్ వాసులు తమ విదేశీ వ్యాపారమును తమవశము చేసికొనగలిగిరి. కాని, అంతటనుండి దేశము కరవులు, జాడ్యములు, అగ్ని పర్వత విజృంభణములు మొదలగు పలు అరిష్టములకు గురియగుటచే 1800 నాటికి దేశ జనాభాలో సగము నశించెను. ఇందుమూలమున ప్రజలలో అసంతృప్తి చెలరేగ, డెన్మార్క్ రాజు సర్వాధికారముల వహించి, అదివరకే నామమాత్రపు సలహా సంఘముగ మారి ఉండిన ఆల్ థింగ్ (శాసనసభ) ను రద్దుచేసెను. అంతట 1830 ప్రాంతమునుండి జాతీయోద్యమము దేశమున రూపొంది, క్రమముగ బలము ఆర్జించి, ఆల్ థింగ్ మరల ఏర్పడునటుల చేయగలిగెను (1843); కాని, ఆ శాసనసభకు అధికారములు ఏవియు లేకుండెను. తరువాత ఈ ఉద్యమవాదుల ఒత్తిడికి లొంగియే డెన్మార్క్ ప్రభువు ఐస్‌లాండ్‌తో వ్యాపా రము చేయుటకు తన రాజ్యవాసులు కాని విదేశీయులకును వసతి కలిగించెను (1854). అంతనుండి జాతీయోద్యమము పూర్వముకన్న మిన్నగ పటిష్ఠతను ఆర్జించి జోన్ సిగర్డ్‌సన్ అను దేశభక్తుని నాయకత్వమున ఆందోళన సాగించి, 1874 లో పరిమితమగు ఆంతరంగిక పరిపాలనాధి కారమును ఆర్జించెను. క్రమముగ 1903 లో సంపూర్ణమగు ఆంతరంగిక స్వాతంత్ర్యము (హోమ్‌రూల్) ఐస్‌లాండ్‌కు లభించెను. తుదకు 1918 లో డెన్మార్క్‌తో జరిగిన ఒక ఒడంబడికను అనుసరించి ఈ దేశము సర్వస్వతంత్ర మయ్యెను. కాని, లాంఛన ప్రాయముగ డెన్మార్క్ రాజే ఐస్‌లాండ్‌కు కూడ ప్రభువుగ ఉండి, విదేశ వ్యవహార ములకు బాధ్యత వహించి రాజ్యాంగబద్ధుడై వ్యవహ రించుటకు ఏర్పాటు జరిగెను. ద్వితీయ ప్రపంచ యుద్ధకాల మున నాజీ సైన్యములు డెన్మార్క్‌ను వశపరచుకొని నందున (ఏప్రిల్ 9, 1940), ఐస్‌లాండ్ స్వతంత్రముగ బ్రిటన్, యునైటెడ్ స్టేట్స్‌తో దౌత్యసంబంధములను ఏర్పరచు కొనెను. 1940 లో బ్రిటిష్ సేనలు ఈ దీవిని తమ రక్షణ లోనికి తీసుకొనినవి. కాని, 1941 లో ఆ సేనలు ద్వీపమును విడిచిపోవలసి వచ్చుటచే యునైటెడ్ స్టేట్స్ సేనలు ఈ ద్వీపమును తమ రక్షణలోనికి తీసికొన్నవి. యుద్ధానంతర మున 1947 లో యునైటెడ్ స్టేట్స్ సేనలు ఆ ద్వీపమును వదలిపోయినవి. అంత 1944, మే లో జరిగిన జనాభిప్రాయ సేకరణను అనుసరించి డెన్మార్క్ ప్రభువుతో గల సంబం ధము ఈ రాజ్యము తెగతెంపులు చేసికొని, స్వతంత్ర గణ రాజ్యముగ రూపొందినది. 1946 లో ఈ దేశము ఐ. రా. స. యందు సభ్యత్వమును ఆర్జించెను.

రాజ్యాంగము : ఈ దేశము ఒక స్వతంత్ర గణరాజ్యము. శాసన నిర్మాణాధికారము ఆల్ థింగ్ (శాసన సభ) యందును, అధ్యక్షునియందును న్యస్తమై ఉన్నది. సార్వ జనికమగు ఎన్నిక పద్ధతిని అనుసరించి నాలుగేండ్లకు ఒక సారి అధ్యక్షుడు ఎన్నుకొనబడును. ఎనిమిది నియోజక వర్గములనుండి నైష్పత్తిక ప్రాతినిధ్య విధానమున 60 మంది సభ్యులు నాలుగేండ్లకు ఒకసారి ఆల్ థింగ్‌నకు ఎన్నుకొన బడుదురు. వీరు సమావేశమై తమనుండి 20 మంది సభ్యులను ఎగువ సభ (ఎన్ డీల్డ్) కు ఎన్నుకొనెదరు. కడమ వారు ఆల్ థింగ్ నందు సభ్యులుగ ఉందురు. ఆర్థిక శాసనముల, బడ్జెట్ వ్యవహారముల విషయమున రెండు సభలును సంయుక్తముగ సమావేశమై చర్చించి నిర్ణయ ముల జరపును. తక్కిన విషయములను అవి వేరు వేరుగ చర్చించును. ఒక విషయమునకు ఉభయ సభల ఆమోదము లభించనిచో, సంయుక్త సమావేశమున అది చర్చింపబడిన మీదట మూడింట రెండువంతుల ప్రాబల్య ముతో ఆమోదింపబడిననే అది చట్టమగును. బడ్జెట్‌నకు

మాత్రము సామాన్య ప్రాబల్యము సరిపోవును. రాజ్యాంగమునకు ఏదైన సవరణ ఆమోదింపబడినచో, వెంటనే శాసన సభ రద్దొనర్చబడి, తిరిగి ఎన్నికలు జరుపబడును. అట్టుల తిరుగ ఎన్నుకొనబడిన శాసనసభయు ఆ సవరణను ఆమోదించినపుడు మాత్రమే అది శాసనము కాగలదు. కార్య నిర్వాహణాధికారము అధ్యక్షునియందు కలదు. తనకు సహాయము చేయుటకు ఒక ప్రధానిని అధ్యక్షుడు నియమించును; తక్కిన మంత్రులను ప్రధాని నియమించును. శాసన సభకు బాధ్యతవహించి వీరు పరిపాలన నిర్వహింతురు. దేశమున అయిదేండ్లకు తగ్గకుండ వసించి, 21 ఏండ్ల వయస్సునకు తగ్గని ప్రతి పౌరునికి వోటు హక్కు కలదు. చీ. శే. రా.

**ఐసెన్‌హొవర్, డ్వయిట్ డేవిడ్** (జ. 1890): యునైటెడ్ స్టేట్స్ అధ్యక్షుడు (1953-61); సేనాని. 1890, అక్టోబరు 14 వ తేదీన టెక్సాస్‌లోని డెనిసన్‌లో జననము. వెస్ట్‌పాయింట్‌లోని అమెరికా సైనిక అకాడమీలో విద్యాభ్యాసము (1911). 1941లో వాషింగ్టన్‌లోని సైనిక వృత్తిలో వివిధ హోదాలలో పని చేసి, కడకు ప్రపంచ యుద్ధము-II లో సిసిలీ, ఉత్తర ఆఫ్రికా ప్రాంతమును జయించుటలోను, ఇటలీపై దాడి చేయుటలోను, ఫ్రాన్స్‌పై సేనలను దింపి, పశ్చిమమునుండి జర్మనీపై జరిపిన విజయ యాత్రలోను పాల్గొన్న మిత్రరాజ్య దళాలకు సుప్రీం కమాండర్ హోదాలో నాయకత్వము వహించెను. 1948 లో ఉద్యోగ విరమణ చేసి, ఆ వెంటనే కొలంబియా యూనివర్సిటీ అధ్యక్షపదవిని స్వీకరించెను. 1950 లో ఉత్తర అట్లాంటిక్ రక్షణ వ్యవస్థ [చూ. నాటో] దళమునకు సుప్రీంకమాండర్ గాను, 1951 లో యూరప్ లోని మిత్ర రాజ్యాల ప్రధాన సైనిక కార్యాలయాధిపతి గాను పనిచేసి, 1952లో సైనిక పదవికి రాజీనామా ఇచ్చి, 1953 ఎన్నికలలో రిపబ్లికన్ పార్టీ అభ్యర్థిగా యునైటెడ్ స్టేట్స్ అధ్యక్ష పదవికి పోటీ చేసెను. ఆ పోటీలో డెమొక్రాటిక్ పార్టీ అభ్యర్థియగు స్టీవెన్‌సన్‌ను ఓడించి యునైటెడ్‌స్టేట్స్‌కు 34 వ అధ్యక్షుడుగ ఎన్నికయ్యెను. 1957 లో మరొకసారి యునైటెడ్‌స్టేట్స్ అధ్యక్షుడుగ ఎన్నికయ్యెను. ఐసెన్‌హోవర్ హయాములో దేశీయ విధానముకన్న విదేశాంగ విధానమే అమెరికన్‌ల మన్ననకు పాత్రమయ్యెను. కమ్యూనిస్ట్ దురాక్రమణకు వ్యతిరేకముగా ఏ మధ్య ప్రాచ్యదేశానికైనా సరే ఆర్థిక, సైనిక సహాయము చేయగలమని ఆయన ప్రకటించెను. ఇదియే ఐసెన్‌హోవర్ సిద్ధాంతము అని వ్యవహృతము. 1959, సెప్టెంబరులో ఐసెన్‌హోవర్ సోవియట్ రష్యా ప్రధాని కృశ్చేవ్ [చూ.] కు స్వాగతమిచ్చి ఆదరించెను. ఈ సుహృద్భావ చర్య కారణముగా ప్రచ్ఛన్న యుద్ధపు ఉద్ధృతము కొంతవరకు తగ్గినది. కాని, ఆ తరువాత యునైటెడ్‌స్టేట్స్‌కు చెందిన గూఢచారి విమానములు సోవియట్ రష్యాపై జరిపిన విహారణ మూలమున సామరస్య భావము నశించి, ఐసెన్‌హోవర్‌కు సోవియట్ రష్యా సందర్శనకై తాను ఒసగిన ఆహ్వానమును సైతము సోవియట్ రష్యా రద్దు చేసినది. 1961 లో పదవీ విరమణ చేసినప్పటినుండియు ఐసెన్‌హోవర్ రాజకీయములనుండి చాలవరకు వైదొలగి విశ్రాంత జీవనమును గడుపుచున్నాడు [చూ. యునైటెడ్‌స్టేట్స్]. పి. ఆర్. పి.



డ్వయిట్ డేవిడ్ ఐసెన్‌హోవర్
(జ. 1890)

**ఒడంబడికలు**: స్వతంత్ర దేశములు - రెండుగాని, అంతకంటె ఎక్కువ గాని - ఏదైనా ఒక అంతర్జాతీయ విషయములో చేసికొన్న ఒప్పందమునకు 'ఒడంబడిక' అని పేరు. ఈ ఒడంబడికలు అమలునకు పూర్వమున అవి ఆయా దేశముల ప్రజా సభలలోనో, ప్రభుత్వముల వారి చేతనో అంగీకృతములు కావలెను.

ఈ ఒడంబడికలు విషయప్రాధాన్యమును బట్టి వేర్వేరు పేరులతో ఉన్నవి. పరస్పర కలహములను అంతరింప జేయుటకు ఏర్పడినవి 'సంధి' అని పేరున ఉండును. ఉదా: ప్రథమ ప్రపంచ యుద్ధానంతరము జరిగిన వెర్సెయిల్స్ సంధి [చూ.]. శత్రువులవల్ల తమ దేశములకు అపాయము కలుగునన్న భయముతో మిత్రరాజ్యముల వారు చేసికొను ఒప్పందములకు మైత్రులు, కూటములు అని పేరు. ఉదా: 1815, నవంబరు 20 వ తేదీని బ్రిటన్, ఆస్ట్రియా, ప్రష్యా, రష్యా అను నాలుగు రాజ్యములున్ను ఫ్రాన్స్‌లోని విప్లవములవల్ల తమకు ఏవిధమైన అపాయమైనను కలిగిన ఎడల దానిని తప్పించుకొనుటకున్ను, పారిస్ సంధి [చూ.] షరతులు నిలుపుకొనుటకున్ను పరస్పర సాహాయ్యార్థము కొన్ని నిబంధనలను ఏర్పరచుకొన్నవి. కొన్ని రాజ్యముల వారు మధ్యవర్తులుగా ఉండి బెల్జియమ్, స్విజర్లండ్ వంటి దేశముల తాటస్థ్య నీతిని నిలబెట్టుటకు ఏర్పరచుకొన్న వానికి పరిష్కారపు ఒడంబడికలు (ఆర్బిట్రేషన్ ట్రీటీస్). ఇవి కాక - ఎగుమతి దిగుమతి పన్నులు, రైళ్లు, తపాలా

ఏర్పాట్లు, సహకారసంఘ వ్యవస్థలు మొదలయినవి ప్రపంచము అంతటికి వర్తించేవి కనుక వివిధ రాజ్యముల నడుమ ఒడంబడికలు జరిగినవి ; జరుగుచున్నవి. ప్ర. రా.

**ఓటో - I :** పవిత్ర రోమన్ సామ్రాజ్య చక్రవర్తి. జర్మనీ రాజైన హెన్రీ ద ఫౌలర్ కుమారుడు (912 - 73). 936 లో తండ్రి మరణించగానే జర్మనీ ప్రభువులు అందరును ఓటోను రాజుగా ఎన్నుకొనిరి.

ఓటో తన తండ్రివలె జర్మనీలో ప్రభు మండలములపై నామమాత్రాధికారముతో తృప్తి పడక, ఏకచ్ఛత్రాధిపత్యము వహించి షార్లమేన్ నాటి రోమన్ సామ్రాజ్యమును పునరుజ్జీవింపజేసి చక్రవర్తి కావలెనన్న పట్టుదలతో 936 నుండి కృషిచేసెను. సామంత ప్రభువులు ఒక్కొక్కరే మరణించగా ఏదో సాకుపెట్టి వారి మండలములను స్వాధీనపరచుకొనుచుండెను.

ఇవ్రియా మండలమందు మిలటరీ గవర్నర్‌గా ఉండిన బెరెంజర్ 945 లో తన పదవిని విడిచి, ఇటలీ దేశమందు ఆధిపత్యము వహించి, 950 లో లోతేర్ అనే రాజు మరణించగా అతని భార్యయైన ఎడిలైడ్‌ను నిర్బంధించి తన కుమారుని పెండ్లియాడవలసినదని బలవంతపెట్టెను. అప్పుడు ఆమె రక్షింపుమని ఓటోను శరణు వేడగా ఓటో 951 లో ఇటలీపైకి దండెత్తిపోయి, లొంబార్డీ మండలమును ఆక్రమించి, తానే ఇటలీకి రాజునని ప్రకటించుకొని, ఇంతకు ముందు భార్యను కోల్పోయి ఉండినవాడు కనుక ఎడిలైడ్‌ను వివాహమాడెను. బెరెంజర్ పారిపోయెను.

తన సామ్రాజ్యాధికారమును రాజకీయముగనే కాక మత సంబంధముగ కూడ ఓటో - I విస్తరింప చేసికొనెను. అందుకు 960 లో అతనికి అనుకూలమైన అవకాశము లభించినది. బెరెంజర్ బాధ మరల విజృంభించినది. పోప్‌గా ఉండిన జాన్ - XII తనను, తన మతసంస్థను రక్షింపుమని ఓటోను వేడుకొనెను. అంతలో తన మొదటి భార్య కుమారుడు లుడాల్ఫ మరణించుటవల్ల ఎడిలైడ్‌కు పుట్టిన తన చిన్న కుమారుని ఓటో - II అను పేరుతో యువరాజుగా 961 లో వర్మ్స్ నగరమున ప్రకటించి, తన దేశ పరిపాలనము ఒక అధికార వర్గమునకు అప్పగించి ఇటలీ దేశమునకు తన పరివారముతో ఓటో - I పోయెను. అతనిని ఎదిరించువారే లేకపోయిరి. 962 లో పోప్ అతనికి యథావిధిగా కిరీటము తొడిగి, పవిత్ర రోమన్ సామ్రాజ్యమునకు చక్రవర్తి అని ప్రకటించెను.

దక్షిణపు ఇటలీలో కూడ తన ఆధిపత్యాన్ని నెలకొల్పవలెనన్న ఆశతో రాజకీయచతురత చూపించి, తూర్పు రోమన్ సామ్రాజ్యాధిపత్యము వహించి ఉండిన రోమానస్ - II కుమార్తె యగు థియోఫోన్‌ను ఓటో - II కు ఇతడు వివాహము చేసెను.

ఇటలీలో ఈ వివాహమూలముగా పలుకుబడి సంపాదించి ఓటో - I డెన్మార్క్ పాలకుల జోహార్లు కూడ పొంది, సామ్రాజ్యాధికారమును విస్తరింప చేసికొని, మతసంస్థను రాజకీయసంస్థకు లోబడిన దానినిగా చేసి షార్లమేన్ కంటెను గొప్పవాడయ్యెను. గి. వేం. సీ.

**ఓటో తుర్క్ :** చూ. కెమాల్ పాషా.

**ఓటోమన్ తుర్కులు :** చూ. టర్కీ.

**ఓఢ్ర గజపతులు :** ప్రాచ్య భారతదేశమును పాలించిన ఒక సుప్రసిద్ధ రాజవంశము చూ. సం. 3 - పు. 273.

**ఓమన్ అండ్ మస్కట్ :** చూ. మస్కట్ అండ్ ఓమన్.

**ఔరంగజీబ్** (1658 - 1707 ప.) : భారత దేశమును పాలించిన మొగల్ చక్రవర్తులలో ఆరవవాడు ; షాజహాన్ కుమారుడు. సువిశాల సామ్రాజ్యమును సంకుచిత దృష్టితో పాలించుట సాధ్యము గాదను సత్యము ఔరంగజీబ్ ప్రభుత్వ చరిత్రవలన తేటతెల్లము అగును.



ఔరంగజీబ్
(1658 - 1707 ప.)

షాజహాన్ కాలమున ఔరంగజీబ్ దక్కన్ ప్రాంతమునకు రెండు సార్లు రాష్ట్రపాలకుడుగ నియమితుడై, అచటి శత్రురాజులను లోబరుచుకొనుటయందును, ప్రజలను సక్రమముగ పాలించుట యందును తనకు ఉన్న నైపుణ్యమును కనబర్చెను. తదుపరి 1657 లో తన తండ్రి చరమావస్థ సమయమున సింహాసనము కొరకు చెలరేగిన కల్లోలములలో ఇతడు తన అన్నగారగు దారాను ధర్మత్, సముగర్ సంగ్రామములలో ఓడించి, తన తండ్రిని ఆగ్రాయందు నిర్బంధమందు ఉంచి, తక్కిన సోదరులలో మురాద్‌ను మోసముచే లోబర్చుకొని, షుజాను బెంగాల్ నుండి తరిమి మొగల్ సింహాసనమును సంపాదించుటయే కాక, తన రాజ్యాధికారము నిష్కంటకమొనర్చుకొనగలిగినవాడు. 1658 లో నామమాత్రముగను, 1659 లో సర్వ లాంఛనములతోను ఇతడు పట్టాభిషిక్తుడయ్యెను. ఔరంగజీబ్ ప్రభువు ' అలంగీర్ 'అను అత్యున్నత

బిరుదు నామముతో 1707 వరకు పాలించెను. ఇతని పాలన ప్రారంభకాలమున ఈశాన్య దిశలోని కూచ్ - బీహార్, అస్సామ్, చిటగాంగ్ ప్రాంతములు మొగల్ సామ్రాజ్యమునకు చేర్చబడినవి.

దక్కన్‌లోని బీజపూర్ 1686 లోను, మరు సంవత్సరమే గోల్కొండ రాజ్యము ఇతనిచే స్వయముగ జయించబడినవి. ఇంతేకాక, ఇతని ప్రాభవము దక్షిణాదిని తంజావూరు, తిరుచినాపల్లి వరకును ప్రాకినది. 1690 నాటికి ఔరంగజీబ్ అధికారము ఉచ్చస్థితియందు ఉండెను. ఔరంగజీబ్ కాలమున మొగల్ సామ్రాజ్యము ఉత్తరమున కాశ్మీర్ దేశమునుండి దక్షిణమున కావేరి నదివరకును, పశ్చిమమున ఆఫ్ఘనిస్తాన్ నుండి తూర్పున అస్సామ్ రాష్ట్రము వరకును వ్యాపించెను.

రాజ్యమును అభివృద్ధి చేయవలెనను కాంక్ష ఔరంగజీబ్ నకు తన పూర్వీకుడగు అక్బర్ చక్రవర్తి [చూ. పు. 260] వలె ఉన్నను, దానిని సాధించుటయందు అక్బర్‌కు కల చాకచక్యము ఇతనికి లేకుండెను. శత్రువులను మిత్రులుగ చేసికొనుటకు బదులు తన మూర్ఖత్వముచే వారిని ప్రబల విరోధులుగ మార్చుకొనిన పాలకుడు ఇతడు. ఇతడు స్వకీయ మత దురభిమానమున హిందువులను అవమానపరచి, జాటులు, బుందేలులు, సత్‌నాములు మొదలగు వారు తన ప్రభుత్వమునకు ఎదురు తిరుగునట్లు చేసికొనెను. సిక్కుల గురువగు తేజ్‌బహదూర్‌ను చంపుటతో మొగల్ పాలనకు సిక్కులు ప్రబల విరోధులగుట జరిగినది. వీటికన్నిటికన్న మిన్నయైనవి ఉత్తరమున మార్వార్, మేవార్ రాజ్యములతో సాగిన పోరాటము; దక్కన్‌నందు మహారాష్ట్రులతో సల్పిన సమరము. ఇవి అన్నియు ఔరంగజీబ్‌ను ఆవరించిన మతదురహంకార దుష్ఫలితములు. మహారాష్ట్రులతోడి వైరము క్రమముగ మహావ్రణముగ విషమించి, తుదకు 1707 లో అహమ్మద్ నగరములో అలంగీర్ మరణముతో అంతమయినది. వ్యక్తిగతముగ ఇతని జీవితము నిష్కళంకమైనది. రాజకీయములందు శక్తియుక్తులు కలవు. కాని, సౌమ్యము, సౌహార్దము కానరావు. మతావేశము రాజకీయ దృష్టిని మందమొనర్చి, ఇతనిని తప్పుటడుగులు త్రొక్కించినది. ఇందుకు ఫలితముగ మొగల్ సామ్రాజ్యమునకు ఇతని కాలమున పెరుగుదలయు, విరుగుదలయు కూడ సంభవించినవి. ప్ర. రా.

**కటార్ :** పారసీక సింధుశాఖ తీరభూమియందున్న ఒక చిన్న స్వతంత్ర రాజ్యము [చూ. పారసీక సింధుశాఖ తీరమందలి షేక్ రాజ్యములు].

**కడప నవాబులు :** చూ. తెలుగు సంస్కృతి. సం. 4 - పు. 742.

**కనగవా సంధి** (1854, మార్చి 31) **:** యునైటెడ్ స్టేట్స్‌కును, జపాన్‌కును మధ్య కుదిరిన ఒక సంధి. కమోడోర్ పెర్రీ (యునైటెడ్ స్టేట్స్) నెరపిన మూడేండ్ల దౌత్య కృషి ఫలితముగ కనగవా సంధి కుదిరినది. దీని ప్రకారము యునైటెడ్ స్టేట్స్‌తో వ్యాపారము చేయుట కొరకు జపాన్‌లో రెండు రేవుపట్టణములలో వసతి కల్పింపబడుటకును, యునైటెడ్ స్టేట్స్‌కు సంబంధించిన నౌకలనుండి దురదృష్టవశమున జపాన్ తీరమును చేరిన వారిని ఆదరించుటకును ఏర్పాటు జరిగెను. అంతకు ముందు విదేశీ నౌకలకు జపాన్ రేవుపట్టణములలో ప్రవేశము లేకుండెను; తప్పిపోయి జపాన్ తీరమును చేరిన విదేశీయులు జపానీయులచే క్రూరముగ హింసింపబడుచుండిరి. ఈ సంధి కుదిరిన 18 మాసముల లోపుననే బ్రిటన్, రష్యా, హాలెండ్ దేశములకు కూడ ఇట్టి సౌకర్యములనే జపాన్ కల్పించెను. ఈ సంధి పత్రముల మూలకముగనే జపాన్‌నకు విదేశీ రాజ్యములతో వర్తక వ్యాపారాది సంబంధములు ప్రారంభమైనవి. స్వ. వెం.

**కనిష్కుడు** (క్రీ. శ. 78 - 105 ప.) **:** భారత దేశ చరిత్రలో ప్రసిద్ధిని ఆర్జించిన ఒక సామ్రాజ్యాధిపతి. ఇతడు కుషాన్ [చూ.] ల రాజవంశమునకు చెందినవాడు. కుషాన్ వంశ పాలకులలో ద్వితీయుడు అగు కడఫిసస్ - II తరువాత కనిష్కుడు రాజు అయ్యెను. కడఫిసస్ - II కు కనిష్కునితో గల సంబంధము ఎట్టిదియో ఇప్పటికిని తెలియదు. కనిష్కుడు తన పేర ఒక శకమును స్థాపించెనని మాత్రము అతని నాణెములవలన తెలియుచున్నది. ఈ శకమే కాలక్రమమున శకనృపకాలము, శాలివాహన శకము అను పేరులతో భారత దేశమునను, భారతీయ సంస్కృతి వ్యాపించిన తక్కిన ప్రాచ్యదేశములందును ప్రాచుర్యము పొందెనని చారిత్రకులలో పలువురి అభిప్రాయము. కొందరు కనిష్కుని శకమునకు శాలివాహన శకముతో సంబంధము ఎట్టిదియు లేదనియు, కనిష్కుడు క్రీస్తుశకపు మొదటి శతాబ్దికి చెందినవాడు కాదనియు, అతని పరిపాలన క్రీ. శ. 125 ప్రాంతమున మొదలై ఉండవచ్చుననియు విశ్వసించుచున్నారు. కాని, భారత దేశమున వ్యాప్తియందుండిన శకములను గురించి తెలిపిన అల్ బెరూనీ [చూ. పు. 272] క్రీ. శ. రెండవ శతాబ్దిలో ఆరంభమైన శకము దేనిని గురించియు తెలిపి ఉండక పోవుటచే, మొదటి శతాబ్దిలో మొదలిడిన

శకనృపకాలమే కనిష్కశకమై ఉండవచ్చునని భావించుటయే సముచితముగ కన్పట్టుచున్నది.

కనిష్కుని రాజధాని పురుషపురము (నేటి పాకిస్తాన్ లోని పెషావర్). అతని సామ్రాజ్యము తూర్పున పాటలీపుత్రము (నేటి పాట్నా) వరకు ఉత్తర హిందూస్థానమున వ్యాపించి ఉండెను. పశ్చిమమున పార్థియన్ సామ్రాజ్యము అతని రాజ్యపు సరిహద్దున ఉండెను. చీనా సామ్రాజ్యమునందలివి అగు ఖోటాన్, యార్కండ్, కాష్గర్ దేశములపై కనిష్కుడు దండయాత్రలు సాగించి, కప్పములను రాబట్టుకొనెను. దక్షిణమున సింధుదేశము వరకును గల భూభాగము అతని అధికారమునకు లోబడి ఉండెను.

బౌద్ధమత చరిత్రలో అశోకుని తరువాత ప్రముఖస్థానము కనిష్కునకు దక్కినది. కాని, బౌద్ధ మతస్థులు ఈతనిని ప్రముఖ బౌద్ధునిగ పేర్కొనినను, ఈతని నాణెములందు జరతుష్ట్రి, యవన, మైత్రేయ, హైందవ మత సంప్రదాయములకు చెందిన విగ్రహములు విరివిగ కన్పట్టుట ఒక విచిత్రము. ఇందువలన కనిష్కుడు ఈ మతములను అన్నింటిని సమదృష్టితో చూచెననుట కన్న, బహుశః ఆ యా ప్రాంతములందు వాడుకయందు ఉండిన మతములకు ప్రాముఖ్యము కల్పించి, తన్మతానుయాయుల ప్రేమను ఆర్జించుటకై ఇట్టి నాణెములను కనిష్కుడు ప్రచారమున ఉంచెనని విశ్వసింపదగి ఉన్నది. ఇది ఎటులున్నను, కనిష్కుడు మాత్రము బౌద్ధుడు అనుట నిర్వివాదాంశము. పురుషపురమున అతడు నిర్మింపజేసిన మహాస్తూపము అందుకు ఒక ముఖ్య నిదర్శనము. ఆ స్తూపము ఇప్పుడు లేకున్నను, ప్రసిద్ధ చీనా యాత్రికుడు ఫాహియాన్ క్రీ. శ. 5 వ శతాబ్దియందు ఈ స్తూపమును దర్శించి, దాని విశేషములను తన గ్రంథమున పేర్కొనెను. బౌద్ధుల చతుర్థ మహాపరిషత్తు కనిష్కుని కాలమున, అతని ఆదరణమున సమావేశమయ్యెనని సాంప్రదాయిక గాథలవలన తెలియనగుచున్నది. పార్శ్వుడు అను థేరుని సలహాపై, కనిష్కుడు ఈ సమావేశమును ఏర్పాటు చేసి, వసుమిత్రుని దానికి అధ్యక్షునిగను, అశ్వఘోషుని ఉపాధ్యక్షునిగను చేసెనని హుయాన్‌స్యాంగ్ పేర్కొనినాడు. బౌద్ధమత పవిత్ర గ్రంథములందలి ప్రక్షిప్త భాగములను ఈ సమావేశమందలి పండితులు తొలగించి గ్రంథముల చక్కజేసి, వ్యాఖ్యానముల వెలయించిరి అనియు, ఆ వ్యాఖ్యానసహితముగ ఆ గ్రంథములు రాగిరేకులపై వ్రాయబడి, కనిష్కునిచే నిర్మితమగు ఒక స్తూపమున ఆనాడు భద్రపరుపబడినవి అనియు ఆ చీనా యాత్రికుని రచనల వలన తెలియుచున్నది. ఆ సమావేశమునందలి పండితులచే సంకలితమగు 'మహావిభాష' అను బౌద్ధమత తత్త్వసర్వస్వపు చీనా భాషానువాదము మాత్రము నేడు ఉపలబ్ధము అగుచున్నది. సంస్కృత భాషయందుండిన మూల గ్రంథము లుప్తమైనది.

మహావిజేతయగు కనిష్కుడు తన వార్ధక్యమున మధ్య ఆసియా యందలి చున్‌లింగ్ పర్వతముల ప్రాంతమున ఉన్న ఒక దేశముపై దండయాత్ర సాగించు యత్నమున ఉండ, అతని దండయాత్రలతో విసివి వేసారిన అతని సేనానులలో కొందరు, అతడు అస్వస్థుడై శయనించిన అదనును అవకాశముగ గ్రహించి అతనిపైబడి అతనిని వధించిరని సాంప్రదాయిక చీనా గాథలు తెలుపుచున్నవి. చీ. శే. రా.

**కమ్యూనిజమ్ :** సంపదుత్పత్తి సాధనముల అన్నిటిపైనను సమాజమునకు సర్వస్వత్వము కలిగి, సంపదను, ఆదాయమును యావత్ప్రజానీకమున అందరికి సముచితముగ, సమాన సంతృప్తి చేకూరునటుల విభజించు ఏర్పాటు గల సాంఘిక వ్యవస్థను రూపొందించుటయే ఉద్దేశముగ గల రాజకీయ, ఆర్థిక, సాంఘిక వాదము.

మానవ నాగరకత రూపొందినది మొదలుగ, ఏదియో ఒక తీరున స్థూలరీతిలో ఈ వాదము అంతటంతటను ఆదరణను ఆర్జించినదనుట చారిత్రక సత్యము. ఆదిమ యుగపు జనసంఘమున సంపదపై ఒక విధమగు సామాజిక సర్వాధికారము నెలకొని ఉండెడిదని చరిత్ర స్పష్టము చేయుచున్నది. ఈ నాటికిని సంస్కృతి స్థాయిలో ఆదిమ మానవులనే పోలిఉన్న కొన్ని జాతులలో ఇట్టి సామాజిక అధికారము కాననగుచున్నది. అస్సామ్‌నందలి 'లోటా' జాతి ప్రజలలో ఈ ఇరువదవ శతాబ్దిలో సైతము ఇట్టి విధానమే అమలునందు ఉన్నదనియు, గ్రామమునందలి సంపద అంతయు గ్రామవాసుల ఉమ్మడి ఆస్తిగ పరిగణింపబడుచున్నదనియు తెలియవచ్చుచున్నది (జె. పి. మిల్ రచించిన 'లోటానాగాస్' అను గ్రంథము). కొన్ని పసిఫిక్ దీవులలో కూడ ఈ నాటికిని ఇట్టి సామాజిక సర్వస్వత్వము నెలకొని ఉన్నదని వేరొక ప్రముఖ రచయిత పేర్కొనెను (హిస్టరీ ఆవ్ మెలనీషియన్ సొసైటీ). ఈ విధముగ స్థూలరీతిలో కమ్యూనిజపు లక్షణములు కల ఈ ఆదిమ జనసంఘ వ్యవస్థనే ఆర్థిక, సాంఘిక శాస్త్రవేత్తలు 'ఆదిమ కమ్యూనిజమ్ (ప్రిమిటివ్ కమ్యూనిజమ్)' అని వ్యవహరించుచున్నారు.

కాని, ఆదిమ యుగపు అనాగరక స్థితినుండి మానవుడు వెలువడి, శ్రమ విభజనకు అలవాటుపడిన సంఘము

రూపొందిన కొలది వ్యక్తిగత స్వత్వముల పరిధి విస్తృత మైనది. కాని, అంతట సైతము కొందరు మతకర్తలును, దార్శనికులును సంపదపై సామాజిక సర్వస్వత్వమునే ఆదరించి ప్రచారము చేసిరి. ఈ ప్రచారమునకు విపుల వ్యాప్తి ఆశించినరీతిగ చేకూరక పోయినను, అచటచట సాధు జనులు కొందరు ఆశ్రమములను ఈ సిద్ధాంతమునకు అనుగుణముగ నిర్వహించిరి. మధ్యయుగములందలి క్రైస్తవ సాధుజనులు అనేకులు ఇట్టి ఆశ్రమములను నెల కొల్పుటతో తృప్తి పొందక మానవుడు తన సత్ప్రవర్తన వలన ఇహలోకముననే భూతలస్వర్గమును నెలకొల్పగల డని ఆశించి, దానిని వివరించుచు గ్రంథముల రచించిరి. ఈ రచనలవలెనే 'యుటోపియా (భూతల స్వర్గము)' అను పదము యూరప్‌న వ్యాప్తికి వచ్చినది. కాని, మానవ సాంఘిక వ్యవస్థానిర్మాణమున ఆనాడు ఈ ప్రచారము ఏమియు పనిచేయజాలక పోయినది.

కొందరు ఉదార భావుకులను 19 వ శతాబ్దిలో ఈ వాదము ఆకర్షించినది. వారికి ఈ వాదము నందు ఆసక్తి కలిగించుటకు వారి హేతువాదాభిమానమును, సౌజన్యమును మూల కారణములైనవి. మతమునకు అందు ఏమియు ప్రసక్తి లేదు. మానవ సంఘము స్నేహ, గౌరవ, సమానత్వ, సౌభ్రాతృత్వముల మీద ఆధారపడి ఉన్నపుడు మాత్రమే సుస్థిర వ్యవస్థ రూపొందగలదని వారు భావించిరి. ఇట్టి వారిలో రాబర్ట్ ఓవెన్ గణనీయుడు. కాని, ఇట్టి వారి ఆశయములు ఒక స్వల్ప పరిమితిలో మాత్రమే సాఫల్యము పొందినవి. ఆ యా వ్యక్తుల వ్యక్తిగత సౌశీల్యాదులపైన మాత్రమే ఆధారపడి ఉండిన ఆ వ్యవస్థ వారితోనే అంతరించినది.

ఇటుల వ్యక్తిగతాభిరుచులపై ఆధారపడి ఉండు దురవస్థను తప్పించి, కమ్యూనిజమ్‌కు ఒక శాస్త్రీయ ప్రతిపత్తిని కల్పించినవాడు కార్ల్ మార్క్స్ [చూ.]. అంతటినుండి కమ్యూనిజమ్ అను పదము మార్క్సుచే వివరింపబడిన సిద్ధాంతమునకే పర్యాప్తమై వ్యవహృతము అగుచున్నది.

మార్క్స్ పండితుని దృష్టిలో మానవ సామాజిక వ్యవస్థ ప్రత్యేక వ్యక్తుల సౌజన్య సౌశీల్య ఆదరాభిమానములపై ఆధారపడి ఉండక, ఒక శాస్త్రీయ నియమబద్ధ రీతిలో పరిణామముపొందుచున్నది. ఈ నియమముల అవేక్షణలో దార్శనికుడు అగు హెగెల్ పండితుని విచార ధార మార్క్సుకు చాల సాయపడినది [చూ. మార్క్స్, మార్క్సువాదము, సం. 7 - పు. 611]. ఈ నియమములను స్పష్టరీతిలో అతడు ఏంగెల్స్ [చూ. పు. 348] పండితునితో కలసి 'కమ్యూనిస్ట్ మానిఫెస్టో'లో తొలుతగ (1848) వివరించెను.

అందలి ప్రముఖ విషయములను ఈ క్రింది రీతిగ తెలుప వచ్చును :

1. తొలుతనుండియు నడచుచున్న మానవ చరిత్ర యంతయు వర్గముల మధ్య జరుగు సంఘర్షణయొక్క చరిత్రయే ;

2. ఒక ఘట్టమున వ్యవస్థితమగు సమాజమున సంపదుత్పత్తి పరికరములలో వచ్చు మార్పులవలన ప్రతిఘటన శక్తులు బయలుదేరి ఒక నూతన వ్యవస్థ రూపొంది నూతన రీతిలో పాలక, దళిత వర్గములు ఏర్పడుటకు దోహద కారులు అగును ;

3. తొలుతటి యుగమున అగ్రజాతుల, బానిసల మధ్యను, మధ్యయుగములందు భూస్వాముల, కర్షకుల మధ్యను, ఉత్తర-మధ్య యుగములందు వ్యాపార శ్రేష్ఠుల, పనివారల మధ్యను ఈ వర్గ సంఘర్షణ సాగినది. 18 వ శతాబ్ది ఉత్తరార్ధమునుండి ధనస్వాముల, శ్రామికుల మధ్య ఈ సంఘర్షణ మొదలై సాగుచున్నది ;

4. ధనస్వాములకు, శ్రామికులకు మధ్య జరుగు ఈ నాటి వర్గ సంఘర్షణయే అట్టి సంఘర్షణలలో కడపటిది కాగలదు. స్వప్రయోజన దృష్టితో ధనస్వామివర్గము చేయు చర్యల వలననే శ్రామికవర్గము సుసంఘటితమై కాలక్రమమున తక్కిన కర్షకులు మొదలగు దళిత వర్గముల సాయమున దోపిడీదారులగు ధనస్వామి వర్గపు పలుకుబడిని అంతరింపజేసి, సర్వాధికారమును గ్రహించును. ఈ విధముగ దళితవర్గపు నాయకత్వము వహించిన శ్రామికవర్గము నియంతృత్వమును ఏర్పరచి సమానత్వముపై ఆధారపడిన వర్గ రహిత సమాజమును నిర్మింప కృషి చేయును.

కమ్యూనిస్ట్ మానిఫెస్టోలో వెలువరింపబడిన భావములకు సిద్ధాంత రీత్యా బలమును చేకూర్చుటకై 'డాస్ కేపిటల్' అను వేరొక గ్రంథమును మార్క్స్ రచించెను. దీనియందు శ్రామికుని కష్టముచే ఉత్పత్తియగు వానియందు కలుగు 'అదనపు విలువ'ను పెట్టుబడిదారు కొల్లగొట్టి శ్రామికుని జీవితమును దైన్యపూరితము చేయుట వివరింపబడినది. ఈ అదనపు విలువ సిద్ధాంతము ఆ తరువాతి కాలమున పలు విమర్శలకు లోనై, పలువురు పండితులచే ఖండింపబడినను, వర్గ విద్వేషమును రెచ్చగొట్టి, కార్మిక వర్గము సుసంఘటితము అగుటకు హేతువైనది.

తన ఆశయ సాధనకు అంతర్జాతీయ కార్మిక వర్గ సుసంఘటననే మార్క్స్ ప్రాతిపదికగ గ్రహించెను. అంతియే

కాక, ఈ ఆశయము జర్మనీలో తొలుతగ కార్యరూపమును పొందుననియు ఆయన సూచించెను. కాని, తరువాతి సంఘటనలు అందులకు విరుద్ధముగ నడచినవి. పశ్చిమ, మధ్య యూరప్ రాజ్యములు వలస విధానమువలనను, పారిశ్రామిక విప్లవము వలనను సుసంపన్నములై, ఆ సంపదలో ఏ కొంత భాగమో ఏదియో ఒక తీరుగ కార్మిక వర్గమునకు దక్కి, కార్మికుల పరిస్థితులు గ్రుడ్డిలో మెల్లగ మెరుగుపడినకొలది, కార్మికులును జాతీయతా దురహంకారమునకు లోనైరి. తత్ఫలితముగ వారియందలి అంతర్జాతీయతయు, విప్లవాసక్తియు చల్లబడినవి. ఇట్టి పరిస్థితులలో కమ్యూనిజమ్‌నకు ఒక నూతన గతిని కల్పించినవాడు నికొలాయ్ లెనిన్ [చూ.] అను మారు పేరుచే ప్రఖ్యాతుడగు వ్లాడిమిర్ ఇల్విచ్ ఉలియనోవ్.

రష్యాలో కమ్యూనిస్ట్ (బోల్షివిక్) పార్టీయొక్క నియంతృత్వమును లెనిన్ స్థాపించినప్పటినుండియు [చూ. సోవియట్ రష్యా], కమ్యూనిస్ట్ పార్టీలను వివిధ దేశములందు సువ్యవస్థితములుగ చేయుటకు కృషి ఆరంభమైనది [చూ. కమ్యూనిస్ట్ పార్టీలు]. కాని, సన్నిహిత కాలమున తక్కిన దేశములందు ఎచటను కార్మికవర్గము అధికారము గ్రహించు ఆశ లేకపోవుటవలన ఒక సోవియట్ రష్యాలోనే కార్మికవర్గ నియంతృత్వ పాలనను సుస్థిరము చేయుటకై కృషి జరిగినది.

ద్వితీయ ప్రపంచ యుద్ధపు చరమ భాగమున తూర్పు యూరప్‌న అత్యధిక భాగము సోవియట్ రష్యా సేనల అధీనములోనికి వచ్చినందువలన అచట కమ్యూనిస్ట్ వాదమును అభిమానించు ప్రభుత్వములు సోవియట్ రష్యా ఆదరమున రూపొంది, ధనస్వాముల, భూస్వాముల ప్రభుత్వములను అంతము చేసినవి. ఆసియాలో చీనాయందు 1949 లో కమ్యూనిస్ట్ సేనలు మావ్ సే టుంగ్ [చూ.] నాయకత్వమున విజయము సాధించిన తరువాత అటను, వారి ప్రోత్సాహ, సహకారముల ఫలితముగ ఉత్తర కొరియా లోను, ఉత్తర వియత్నామ్‌లోను కమ్యూనిస్ట్ పద్ధతుల పై ప్రభుత్వములు ఏర్పడినవి.

ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున కమ్యూనిజమ్‌నకు ఇటుల విపుల వ్యాప్తి చేకూరినను, ఈ కాలముననే అందు కొన్ని వైరుధ్యములును బయలుదేరినవి. 1919 మొదలుగ సోవియట్ రష్యాయందలి కమ్యూనిస్ట్ పార్టీయే తక్కిన దేశముల పార్టీలపై ఒక విధమగు నియమనాధికారమును, మార్గదర్శిత్వమును వహించి ఉండెను. ఇట్టి అధికారమును తొలుతగ కాదనినది యుగోస్లావియాలోని కమ్యూనిస్ట్ ప్రభుత్వము (1951). కమ్యూనిస్ట్ వాదమును అవలంబించు దేశములును జాతీయ ప్రయోజనముల దృష్ట్యా వేర్వేరు మార్గములను అవలంబించవలసి ఉండుననుట ఇందువలన ఉత్పన్నమైనది. ఆ తరువాత, సోవియట్ రష్యాలోని కమ్యూనిస్ట్ పార్టీ వైఖరిని చీనా కమ్యూనిస్ట్ పార్టీ నిరసించి, సోవియట్ రష్యా కమ్యూనిస్ట్ పాలకులను పునరనుశీలకులు (రివిజనిస్ట్‌లు) అని నిందించుట అంతర్జాతీయ కమ్యూనిజమ్‌నకు ఒక ఆఘాతముగ పరిణమించినది. కృశ్చేవ్ [చూ.] నాయకత్వమున సోవియట్ రష్యా కమ్యూనిస్ట్ పార్టీ వ్యక్త్యారాధనను నిరసించుటయే కాక, ఈ అణవిక యుగమున యుద్ధ మార్గమునకన్న తదితర మార్గముల మూలముననే తక్కిన ప్రపంచమున విప్లవమును సాధించుటకు కృషి చేయుటను చీనా నాయకులు నిరసించిరి. ప్రపంచము ఇప్పుడు విప్లవమునకు సన్నిహితమైనది అనియు, దీనిని ప్రజ్వరిల్ల చేయుటకు అన్ని మార్గములను అవలంబింపవలయును అనియు మావ్ సే టుంగ్ అభిప్రాయము.

ఇది ఎటులున్నను నేడు ప్రపంచమున ఒక గణనీయ ప్రజానీకము - ప్రపంచ జనసంఖ్యలో దాదాపు మూడవ వంతు - కమ్యూనిస్ట్ ప్రభుత్వ విధానమునకు లోబడి ఉన్నదనుట నిర్వివాదాంశము. ఈ ప్రభుత్వములు అన్నియు - అవి ఏ పేరులతో వ్యవహరించినను - నియంతృత్వమునే ఆలంబనముగ గ్రహించినవి. ఆ యా దేశముల కమ్యూనిస్ట్ పార్టీలు మాత్రమే శ్రామిక జనుల పక్షమున ప్రభుత్వాధికారమును, నియంతృత్వమును నిర్వహించుచున్నవి. ఈ నియంతృత్వమునకు దమననీతి ముఖ్యాధారము అయినను కమ్యూనిస్ట్ నియంతృత్వమునకు తక్కిన విధముల నియంతృత్వమునకును, అందును ముఖ్యముగ ఫాసిస్ట్ నియంతృత్వమునకును మధ్య విపరీతమగు భేదము కలదు.

1. కమ్యూనిస్ట్‌ల దృష్టిలో నియంతృత్వము ఒక ఆపద్ధర్మము మాత్రమే. పెట్టుబడిదారీ వ్యవస్థకు అలవడిన ప్రజానీకమున ప్రజాస్వామ్యమును వెనువెంటనే స్థాపించుట అశక్యము. కావున సంపదుత్పత్తి సాధనములపై సర్వస్వామ్యము ప్రజానీకమునకు చేకూరి సంపద సువిభక్తమైనపుడు సహజ రీతిలో అచ్చమగు ప్రజా స్వామ్యము రూపొంది, దౌర్జన్య, దండనీతులపై ఆధారపడిన ప్రభుత్వమును, దానిని నిర్వహించు నియంతృత్వమును లుప్తత చెందగలవని కమ్యూనిస్ట్‌లు అనెదరు. ఫాసిస్ట్‌లు అటుల గాక ప్రజానీకమున తర, తమ లక్షణములు సహజములనియు, అనుల్లంఘనీయములనియు, అందువలన నియంతృత్వము సదా వాంఛనీయమనియు, సమానత అనునది అందరాని ఆశ అనియు అనెదరు.

2. కమ్యూనిస్ట్‌లు దేశ, వర్ణ, మత భేదములతో నిమిత్తములేక సర్వమానవులును సమానులే అనియు, కమ్యూనిజమ్‌చే పరివ్యాప్తమైన విశ్వమానవ వ్యవస్థయే తమ ఆశయము అనియు పేర్కొనెదరు. ఫాసిస్ట్‌లు జాతి దురహంకారతనే తమ వాదపు ముఖ్యాధారముగ గ్రహింతురు [చూ. పు. 154, 183, 184]. నా. ర.

**కమ్యూనిస్ట్ పార్టీలు :** 'కమ్యూనిస్ట్ మానిఫెస్టో'ను వెలువరించి శాస్త్రీయ కమ్యూనిస్ట్ వాదమునకు బీజావాపనము చేసిన మార్క్స్ పండితుడు కమ్యూనిస్ట్ అను పదమును వాడినను, తన ఆశయ సాధనమునకు కమ్యూనిస్ట్ పార్టీని నెలకొల్పవలెనని తలపెట్టలేదు. ఇంటర్నేషనల్ [చూ.] అని వ్యవహరింపబడు సంస్థవలననే కార్మికులు సుసంఘటితులు కాగలరని ఆయన ఆశించెను. ఇట్టి ఇంటర్నేషనల్‌లు రెండు రూపొందియు విఫలత చెందినవి. ఆ తరువాత 1917 లో రష్యాయందు విప్లవము బయలుదేరిన తరువాత యూరప్‌న సోషల్ డెమోక్రాటిక్ పార్టీలనుండి విడివడిన మార్క్స్ వాదానుయాయులు కొందరు అటనట 'కమ్యూనిస్ట్ పార్టీ' అను పేర పార్టీలను నెలకొల్పిరి. రష్యాలో మాత్రము ఈ పేరు 1918 వరకు వాడుకలోనికి రాలేదు. ఆ రెండేండ్ల తరువాత రష్యన్ కమ్యూనిస్ట్ (బోల్షివిక్) పార్టీ తన పేరును యూనియన్ కమ్యూనిస్ట్ పార్టీగ మార్చుకొనెను. ఈ పేరే 1952 వరకు అమలులో ఉండినది. అంతట బోల్షివిక్ అను పదము వదలివేయబడి 'సోవియట్ యూనియన్ కమ్యూనిస్ట్' అని పేరిడబడినది.

వివిధ దేశములందు కమ్యూనిస్ట్ విప్లవములను సాధించు తలంపుతో మూడవ కమ్యూనిస్ట్ ఇంటర్నేషనల్ మాస్కో నగరము కేంద్రముగ 1919 లో స్థాపింపబడినది. లెనిన్ అనంతరము అధికారేచ్ఛవలనను, ప్రపంచ విప్లవముపట్ల సోవియట్ కమ్యూనిస్ట్ పార్టీ అవలంబింపవలసిన వైఖరిని గురించియు స్టాలిన్, ట్రాట్‌స్కీ [చూ.]ల మధ్య చెలరేగిన వైరుధ్యములు తక్కిన దేశముల పార్టీలలో సైతము ఏకతకు భంగము కలిగించినను, 1930 లో స్టాలిన్ తన అధికారమును సుస్థిరము చేసికొని, పార్టీలోని అవాంఛిత వ్యక్తులను నిర్మూలించిన తరువాత వివిధ దేశములలోని కమ్యూనిస్ట్ పార్టీలపై మూడవ ఇంటర్నేషనల్‌కు దృఢాధికారము చేకూరినది.

అటులనే 1956, 1961 పార్టీ కాంగ్రెస్‌ల తరువాత అంతర్జాతీయ కమ్యూనిస్ట్ ఉద్యమమున సిద్ధాంతముల వివరణములు, సాధనోపాయములు మొదలగు వాని విషయమున కలిగిన అభిప్రాయభేదముల వలన, చీనా నాయకత్వమున కొన్ని దేశముల కమ్యూనిస్ట్ పార్టీలు సోవియట్ పార్టీ మార్గదర్శిత్వమును కాదనినవి. చీనాను అనుసరించిన పార్టీలలో ఆల్‌బేనియా, ఇండోనీషియా, ఉత్తర కొరియాలలోని పార్టీలు ప్రముఖములు.

రష్యాగాక తక్కిన యూరపియన్ దేశములలో ప్రపంచ యుద్ధము - I తరువాత కమ్యూనిస్ట్ పార్టీలు నెలకొల్పబడినవి. 1920 లగాయితు 30 వరకు వీనిలో కొన్నింటియందు ఆ పార్టీలు కొంతవరకు పురోగమింపగలిగినవి. కాని, ఫాసిజమ్‌నకు ఇటలీ, జర్మనీలలో తావు దొరకినది మొదలు వీనిలో అనేకములు దాదాపుగ నామమాత్రావశిష్టములైనవి. ఆ తరువాత ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున సోవియట్ సేనల విజయములచే ప్రోత్సాహము పొంది ఆ యా దేశముల కమ్యూనిస్ట్ పార్టీలు ముందంజ వేయ ఆరంభించినవి.

జర్మనీయందు కమ్యూనిస్ట్ పార్టీ 1918 లో స్థాపింపబడినను, తన పురోగతిలో పెక్కు ఒడుదొడుకులకు లోనై, కడకు హిట్లర్ కాలమున అడచివేయబడినది. అంత ఆ దేశపు కమ్యూనిస్ట్‌లలో పలువురు సోవియట్ రష్యాలో తలదాచుకొనిరి. హంగేరిలోని కమ్యూనిస్ట్ పార్టీ 1918 లో స్థాపించబడి, ఒకపుడు అధికారమును ఆర్జించినను, కడకు అడచివేయబడి, చాలా కాలము బలహీనముగనే ఉండి, 1945 లో సోవియట్ సేనలు ఆ దేశమున కాలిడినది మొదలుగ బలవత్తర శక్తిగ రూపొంది, అధికారమును గ్రహించినది. బల్గేరియాలోని కమ్యూనిస్ట్ పార్టీ 1919 లో స్థాపింపబడినది. తొలుత ఇది కొంత బలమును ఆర్జించి, అధికారమును 1923 లో స్వీకరించినను, త్వరలోనే అడచివేయబడి, 1945 లో సోవియట్ సేనల ఆగమనముతో మరల అధికారమును గ్రహించినది. యుగోస్లావియాలోని పార్టీయు 1919 లోనే నెలకొల్పబడినది. 1920 లో జరిగిన స్థానిక సంఘముల ఎన్నికలలో ఈ పార్టీ కొంత బలమును ఆర్జించినను, 1921 లో ప్రభుత్వము వలన నిషేధితమైనది. కాని, దేశమందలి ధీమంతులు పలువురు ఆ వాదముచే ఆకర్షితులగుటవలన ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున వీరందరును సమర్థ నాయకత్వమున ఫాసిస్ట్‌లను నిరోధించిరి. యుద్ధానంతరమున ఆ దేశమున కమ్యూనిస్ట్‌లు టిటో [చూ.] నాయకత్వమున ప్రభుత్వమును వశపరచుకొనిరి. రెండు ప్రపంచ యుద్ధముల మధ్యకాలమున జెకోస్లోవాకియాయందు కమ్యూనిస్ట్ పార్టీ నెలకొని, కొంత పలుకుబడిని ఆర్జించి, ఫాసిస్ట్‌ల ఆక్రమణ వలన అంతరించినది. కాని, ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున ఇది పునరుద్ధరితమై ప్రభుత్వాధికారమును గ్రహించినది

(1945). ఫ్రాన్స్, ఇటలీలలోకూడ 1918 లోనే కమ్యూనిస్ట్ పార్టీలు స్థాపింపబడినవి. ముస్సోలినీ అధికారమునకువచ్చు పర్యంతము ఇటలీలోని పార్టీ సమర్థముగ పనిచేసినది. ఫ్రాన్స్ లోని పార్టీ ట్రేడ్ యూనియన్ ఉద్యమముపై సమధిక ప్రభావము నెరపినను, 1945 కు పూర్వమున ఎట్టి అధికారమును ఆర్జింపలేక పోయినది. స్పెయిన్‌లోని పార్టీ 1920 లో నెలకొల్పబడి, అల్ప సంఖ్యాకముగ ఉన్నను, స్పానిష్ అంతర్యుద్ధ [చూ.] కాలమున గణరాజ్య సేనలకు ఎక్కువ సాయము చేయగలిగినది. గ్రేట్ బ్రిటన్ లోని కమ్యూనిస్ట్ పార్టీ 1918 లోనే స్థాపింపబడినను, కార్మికులను గాని, తక్కిన ప్రజలనుగాని అది ఏనాడును ఎక్కువగ ఆకర్షింపజాలకున్నది.

ఆసియాలోని కమ్యూనిస్ట్ పార్టీలలో ప్రముఖమైనది చీనాలోని పార్టీ. పెకింగ్ యూనివర్సిటీలో అధ్యాపకులుగ ఉండిన చెన్ తూ, శ్యూటా, చావ్ అను వారిచే 1921 జూలైలో ఈ పార్టీ స్థాపింపబడినది. 1920 ప్రాంతమున ఆ దేశమున వ్యాప్తిలో ఉండిన అరాజకము కమ్యూనిజమ్ వ్యాప్తికి దోహదకారియైనది. 1926 లో కమ్యూనిస్ట్ పార్టీ అనుయాయులకును, అధికారమున ఉన్న కొమింగ్‌టాంగ్ దక్షిణ పక్షానుయాయులకును మధ్య పోరాటములు బయలుదేరి తొలుతటి కమ్యూనిస్ట్ పార్టీ అంతరింపగ, దాని అవశేషములపై నూతనముగ కమ్యూనిస్ట్ పార్టీ నెలకొల్పబడి, మావ్ సే టుంగ్ నాయకత్వమున 1930 మొదలుగ పురోగమించి, క్రమముగ 1949 లో చీనాలో ప్రభుత్వాధికారమును గ్రహించినది.

ఇండియా, ఇండోనీషియా మొదలగు తక్కిన ఆసియా దేశములలో పెక్కింట ట్రేడ్‌యూనియన్ ఉద్యమము నుండి కమ్యూనిస్ట్ పార్టీలు రూపొందినవి. భారత దేశమున కమ్యూనిస్ట్ పార్టీ ఉద్యమము ఫిలిప్ స్ప్రాట్ అను ఆంగ్లేయుని ద్వారా 1919 నుండి ఆరంభితమైనది. 1927 లో పార్టీకి ఒక సంవిధానము ఆమోదింపబడినది. తదాదిగ ఆ పార్టీ భారత జాతీయ కాంగ్రెస్‌లో లీనమై, అజ్ఞాతముగను, జ్ఞాతముగను కొంతకాలము వ్యవహరించినది. కాని, 1929 లో ప్రముఖ కమ్యూనిస్ట్ నాయకులను ప్రభుత్వము అరెస్ట్ చేయుటతో పార్టీ నామమాత్రావశిష్టమైనది. ఆ తరువాత పార్టీ అనుయాయులు కొంతకాలము కాంగ్రెస్-సోషలిస్ట్ పార్టీలో చేరి, తద్వారా భారత జాతీయ కాంగ్రెస్‌ను కైవసము చేసికొనుటకు యత్నించిరి. కాని, ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున ఆ పార్టీ అవలంబించిన వైఖరివలన భారత జాతీయ కాంగ్రెస్‌నుండి ఆ పార్టీ అనుయాయులు బహిష్కరింపబడిరి. తరువాత 1941 లో జర్మనీ రష్యాపై దండయాత్ర సాగించిన పిదప యుద్ధము ఎడల సుముఖ ధోరణిని ఆ పార్టీ అవలంబించి, మహాత్ముని 'క్విట్ ఇండియా' ఉద్యమమును వ్యతిరేకించినది. స్వాతంత్ర్యానంతరమున ఆ పార్టీలోని అతివాది వర్గమునకు పార్టీపై అధికారము లభించినది. తత్ఫలితముగ దేశమున పలు ప్రాంతములందు దౌర్జన్యయుత విప్లవములను లేవదీయుటకు యత్నములు జరిగినవి. కాని, ప్రభుత్వము ఆ యత్నములను నిర్దాక్షిణ్యముగ మొగ్గలోనే త్రుంచివేసినది. అంతట 1951 లగాయితు రాజ్యాంగ బద్ధ రీతిలో ప్రతిఘటన సాగించుచున్నది.

భారత దేశముపై చీనా సాగించిన సరిహద్దు దండయాత్ర ఎడల వహించవలసిన వైఖరిలో కలిగిన అభిప్రాయ భేదములవలన భారత కమ్యూనిస్ట్ పార్టీలో 1962 లో చీలిక ఏర్పడినది. అంతర్జాతీయ కమ్యూనిస్ట్ ఉద్యమమున చీనా, సోవియట్ పార్టీల మధ్య ఏర్పడిన వైరుధ్యమే ఇందును ప్రతిఫలించినది. చీనా పార్టీ విధానమును ఆదరించు భారత కమ్యూనిస్ట్‌లు మార్క్సిస్ట్‌లు అను ఉపనామ సహితముగ వేరొక కమ్యూనిస్ట్ పార్టీని నెలకొల్పుకొనిరి. దక్షిణ అమెరికా, ఆఫ్రికాలలో సైతము వివిధ దేశములందు కమ్యూనిస్ట్ పార్టీలు నెలకొని ఆ యా పరిస్థితులను బట్టి జ్ఞాతముగనో, అజ్ఞాతముగనో పనిచేయుచున్నవి. ప్రపంచమున దాదాపు 80 దేశములలో ఈ పార్టీలు ఈ నాడు కలవు. వీని సభ్య సంఖ్య 70 లక్షలు. ఇందులో దాదాపు సగము మంది చీనాలో కలరు [చూ. పు. 232]. బి. ఆర్.

**కర్జన్, జార్జ్ నతేనియల్** (1859 - 1925) : భారత దేశములో 1899 - 1905 మధ్య కాలమున బ్రిటిష్ రాజ ప్రతినిధి (వైస్రాయ్) గా వ్యవహరించిన బ్రిటిష్ రాజ్య దురంధరుడు. పరిపాలనా నిర్వహణలోను, సంఘసేవా కార్యకలాపములలోను, విద్యాబోధన విషయములలోను కర్జన్ అనేక నూతన సంస్కరణలు ప్రవేశ పెట్టెను. భారత దేశములో ఇతడు నీటి వనరులను పెంపొందించి, వ్యవసాయమును అభివృద్ధి పరచెను; రైలు మార్గములను నిర్మింప జేసెను. భారత జాతీయోద్యమముపట్ల మాత్రము అసహనము ప్రదర్శించెను. ధనిక వర్గమునకే పరిపాలించు హక్కు కలదని ఇతని దృఢ విశ్వాసము. ఇతడు స్కార్స్‌డేల్ ప్రభువు జ్యేష్ఠ పుత్రుడు. ఈటన్‌లోను, ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీలోను విద్యాభ్యాసము చేసెను. 1895 లో ఒక ధనిక చికాగో వర్తకుని కుమార్తె మేరీ విక్టోరియా లీటర్ ను వివాహమాడెను. 1886 లోనే పార్లమెంట్ సభ్యుడు అయ్యెను. 1891 - 92 లలో భారతదేశ కార్యాలయములోను, 1895 - 98 మధ్య

విదేశాంగ కార్యాలయములోను సహాయ కార్యదర్శి పదవి నిర్వహించెను. పిమ్మట కొంతకాలము భారత దేశమున రాజ ప్రతినిధిగా పనిచేసి, ఇంగ్లండు తిరిగి వెళ్లిన తర్వాత ఆస్క్విత్ సంకీర్ణ మంత్రివర్గమున 1915 లో సభ్యుడయ్యెను. 1916 లో డేవిడ్ లాయిడ్ జార్జి ఏర్పరచిన యుద్ధకాల మంత్రివర్గములో కూడ పని చేసెను. తరువాత 1924 వరకు విదేశాంగ కార్యదర్శిగాను, అటు పిమ్మట కౌన్సిల్ అధ్యక్షుడుగాను పనిచేసెను. ప్ర. రా.

**కర్జన్ రేఖ :** బ్రిటిష్ విదేశాంగ కార్యదర్శి అగు కర్జన్ [చూ. పు. 370] చే పోలండ్, సోవియట్ రష్యా దేశములకు మధ్య నిర్ణయింపబడిన సరిహద్దు రేఖ. బ్రిటిష్ ప్రధాన మంత్రి అగు లాయిడ్ జార్జి 1920, జూలై 10 న పై ఉభయ దేశములకు మధ్య తగాదాలో ఉన్న సరిహద్దును పరిష్కరించు విషయమై పోలండ్‌కు ఒక సూచన చేసెను. తదుపరి ఆ సరిహద్దు నిర్ణయ కార్యభారమును కర్జన్ వహించుట వలన ఆ సరిహద్దు రేఖ అతని పేరున వ్యవహరింపబడినది. ఆ రేఖ గ్రోడ్‌నో నుండి బ్రెస్ట్‌చిటోవ్ స్కూ-ప్రెజిమినల్ ద్వారా కార్పేతియన్ పర్వతముల వరకు వ్యాపించి ఉండెను. కాని, పోలండ్ జాతీయులు ఈ ప్రతిపాదనను తిరస్కరించిరి. తరువాత వారు లాయిడ్ జార్జిచే ప్రతిపాదింపబడిన భూభాగమునకు రెట్టింపు ప్రదేశమును దండయాత్రమూలమున సంపాదించుకొనిరి. 1939లో జరిగిన నాజీ - సోవియట్ రష్యా ఒప్పందము తరువాత కర్జన్ రేఖ కొద్ది మార్పులతో జర్మన్‌లచేతను, రష్యన్‌ల చేతను ఆక్రమించుకొనబడిన ప్రాంతములకు మధ్య సరిహద్దు రేఖ అయ్యెను. 1945 లో పోలండ్ ప్రభుత్వము దానిని తమకును, సోవియట్ రష్యాకును సరిహద్దు రేఖగా అంగీకరించెను. స్వ. వెం.

**కర్ణాటక యుద్ధములు :** 18 వ శతాబ్దియందు భారత దేశమున ఫ్రెంచివారి పలుకుబడి అంతరించుటకును, ఆంగ్లేయ రాజ్య విస్తరణకును దోహదకారులైనవి కర్ణాటక యుద్ధములు. కర్ణాటక సింహాసనమునకై తగవులాడుకొను ప్రత్యర్థులలో చెరి ఒకరిని బలపరచు ఆంగ్ల, ఫ్రెంచి కంపెనీ ప్రభుత్వములు పోరాటములను అపుడు సాగించుటవలన వీనికి 'కర్ణాటక యుద్ధములు' అను పేరు కలిగినది.

భారత దేశమునకు వచ్చిన ఆంగ్లేయ, ఫ్రెంచి వాణిజ్య సంఘములకు తొలుత రాజ్యాపేక్ష లేదు. కాని, భారత దేశమునందలి కల్లోల పరిస్థితులను శ్రద్ధతో గమనించిన కొందరికి మాత్రము క్రమముగ అట్టి కోరిక కలుగ సాగినది. అట్టి వారిలో ఫ్రెంచి వాణిజ్య సంఘమునకు చెందిన డూప్లే [చూ.] ప్రముఖుడు. ఇతడు పుదుచ్చేరికి గవర్నర్.

లాబూర్డనాయ్ అను మరియొక ఫ్రెంచి నాయకుడు ఫ్రెంచి వారి అధీనమై ఉండిన మారిషస్ ద్వీపమున గవర్నర్‌గా ఉండి డూప్లేకు ప్రతిస్పర్ధిగా పనిచేయుచుండెను. ఇట్టి పరిస్థితిలో 1740 లో యూరప్‌లో ఆస్ట్రియా వారసత్వపు యుద్ధము ఆరంభమయ్యెను. ఈ యుద్ధములో ఇంగ్లీషు, ఫ్రెంచి ప్రభుత్వముల వారు ప్రధాన కక్షిదారులుగా పోరుచుండినను, ఇండియాలో మాత్రము ఈ రెండు దేశములవారును తటస్థులుగా ఉండవలెనన్న ప్రతిపాదనము మొదట జరిగినది; కాని, అది ఆచరణలోనికి రాలేదు. కమోడోర్ బార్నెట్ ఆధిపత్యమున ఇంగ్లీషు వారి నౌకాదళము కోరమాండల్ (చోళమండల) సముద్రతీరమున 1745 లో కనబడగానే మొగల్ చక్రవర్తి వల్ల నవాబ్, మన్సబ్దార్ హోదాలను పొంది ఉండిన డూప్లే, ఫ్రెంచివారి ఠాణాలపైకి ఇతరులు దాడి వెడలి రాకుండ రక్షించవలెనని కర్ణాటక నవాబు అయిన అన్వరుద్దీన్‌ను వేడుకొనెను. 1746 లో ఫ్రెంచి వారు ఒక క్రొత్త నౌకాదళమును తయారు చేయించిరి. దానికి తోడు వేరొక నౌకాదళము ఫ్రాన్స్‌నుండి పుదుచ్చేరి (పాండిచ్చేరి) కి వచ్చినది. నాగపట్టణము వద్ద ఇంగ్లీషు, ఫ్రెంచి నౌకలకు యుద్ధము జరిగి, ఫ్రెంచి నౌకలకే విజయము చేకూరినది. తర్వాత మద్రాసు, సెంట్ డేవిడ్ కోటలను ముట్టడించి కోరమాండల్ తీరము నుండి ఇంగ్లీషు వారిని తరిమివేయవలెనని డూప్లే సంకల్పించెను. అరక్షితమైన మద్రాసు యుద్ధము జరుగకుండగనే ఫ్రెంచి వారికి స్వాధీనమయినది. అందున్న ఇంగ్లీషు వారిని ఫ్రెంచివారు ఖైదీలుగా పట్టుకొని చెరసాలలో ఉంచిరి. అప్పటికి కంపెనీ వారి కొలువులో గుమాస్తాగా ఉండిన రాబర్ట్ క్లైవ్ [చూ.] కూడ ఆ ఖైదీలలో ఉండెను. ఆ సమయమందే మద్రాసును అన్వరుద్దీన్‌కు ఇచ్చి వేయుటకు డూప్లే ఒప్పందము చేసికొనెను. కాని, అటుల జరుపక డూప్లే మద్రాసు తన అధీనములో ఉంచుకొని ఖైదీలుగా ఉన్న ఇంగ్లీషు వారిని పుదుచ్చేరికి పంపి బంధించెను. పిమ్మట అతడు సెంట్ డేవిడ్ కోట మీదికి దండెత్తి పోయెను. కాని, ఇంగ్లీషు సేనా నాయకుడైన స్ట్రింజర్ లారెన్స్ ఫ్రెంచి సేనలను చెదర గొట్టెను. అంతలో బాస్కావెన్ అధ్యక్షతను మరికొన్ని ఇంగ్లీషు సేనలు వచ్చి లారెన్స్‌కు తోడయినవి. ఒక పెద్ద సైన్యముతో ఇంగ్లీషు వారు పుదుచ్చేరిని ముట్టడించిరి. కాని, ఫ్రెంచివారు విజయము పొంది తమ నగరమును రక్షించుకొనిరి. ఇంగ్లీషు వారు

మద్రాసును పోగొట్టుకొని పుదుచ్చేరి పట్టుకొనలేక సెంట్ డేవిడ్ కోటలో తల దాచుకొనిరి. 1748 లో ఆస్ట్రియా వారసత్వ యుద్ధము ముగిసి, ఐ-లా-షాపెల్ సంధి [చూ. పు. - 359] జరిగినది. అందుగల షరతుల ప్రకారము ఇంగ్లీషు వారికి ఫ్రెంచివారు మద్రాసును ఇచ్చి వేయవలసి వచ్చినది. ఇంతటితో ప్రథమ కర్ణాటక యుద్ధము ముగిసినది.

అంతట 1748 లో కర్ణాటక సింహాసనము తనకు చెంద వలసినదిగ చందాసాహెబ్ [చూ.] అనువాడు ఆందోళనను లేవతీయుటతో వేరొక యుద్ధమునకు అంకురార్పణ జరిగెను. అన్వరుద్దీన్ నకు పూర్వమున కర్ణాటక రాజ్యమునకు పాలకుడుగ ఉండిన దోస్త్ ఆలీ అల్లుడు ఈ చందాసాహెబ్. 1741 లో కర్ణాటకమును కొల్లగొట్టిన మహారాష్ట్రులు దోస్త్ ఆలీని చంపి, చందాసాహెబ్ ను కొనిపోయి ఖైదుచేసిరి. అంతట కర్ణాటకమున అరాజక పరిస్థితులు ఏర్పడగ నిజామ్ తన సర్దారులలో నెల్ల సమర్థుడు, విశ్వాసపాత్రుడు అగు అన్వరుద్దీన్ ను ఆ రాజ్యమునకు నవాబుగ నియమించెను. ఇట్టి పరిస్థితిలో 1748 లో విడుదల పొందిన చందాసాహెబ్ తన మామ రాజ్యమునకు హక్కుదారుడు తానే అని ప్రకటించుటతో వివాదము ఆరంభమయ్యెను. ఇందులకు తోడుగ ఆ కాలముననే నిజామ్ ఉల్ ముల్క్ చనిపోవుటవలన అతని రాజ్యాధిపత్యముకొరకు అతని మనుమడైన ముజఫర్ జంగ్, అతని కుమారుడైన నాజర్ జంగ్ తగవులాడుట ప్రారంభించిరి. కర్ణాటక నవాబు పదవిని అన్వరుద్దీన్, నిజామ్ పదవిని నాజర్ జంగ్ కైవసము చేసికొని ఉండిరి. కనుక ఖజానా, సిబ్బంది, పటాలము అంతా వారి చేతిలోనే ఉండెను. చందాసాహెబ్, ముజఫర్ జంగ్ బయట ఉన్న తమ తమ బలములను సమకూర్చుకొని యుద్ధమునకు సన్నద్ధులు కావలసి ఉండెను. అందుచేత వీరిరువురును డూప్లే సాయము అర్థించిరి. ఫ్రెంచి వారు తమకు సాయము చేసి, తమ కోరికలు నెరవేరునట్లు చేసిన ఎడల ఫ్రెంచి వారికి కొంత ప్రదేశము ఇచ్చెదమని ఇరువురును వాగ్దానము చేసిరి. అందుకు డూప్లే సమ్మతించెను. 1749, ఆగస్టు 3 వ తేదీన ఆంబూర్ వద్ద జరిగిన యుద్ధమునందు ఫ్రెంచివారు, ముజఫర్ జంగ్, చందాసాహెబ్ కలిసి అన్వరుద్దీన్ ను ఓడించి చంపిరి. మరి కొన్ని దినములకు విజయము పొందిన వీరు ముప్వురును ఆర్కాట్ పట్టణమున ప్రవేశించి, ముజఫర్ జంగ్ దక్కన్ సుబేదార్ అయినట్లును, చందాసాహెబ్ కర్ణాటక నవాబు అయినట్లును ప్రకటనలు గావించిరి. అన్వరుద్దీన్ కొడుకు మహమ్మద్ అలీ శత్రువులకు భయపడి, తిరుచినాపల్లికి పారిపోయి, అక్కడి కోటలో తల దాచుకొనెను. ఒక్క జింజీ కోట మాత్రము అతనికి అధీనమై ఉండెను. తక్కిన కర్ణాటక దేశమంతా చందాసాహెబ్ కు వశపడినది. ఇంతలో నాజర్ జంగ్ పెద్ద సైన్యమును సమకూర్చుకొని కర్ణాటక దేశమునకు వచ్చెను. అతనికి మురారిరావు అధ్యక్షతను 10 వేల మహారాష్ట్ర సైనికులును, మేజర్ లారెన్స్ అధ్యక్షతను 6 వందల ఇంగ్లీషు సోల్జర్లును తోడ్పడిరి. యుద్ధము జింజీనది వద్ద జరుగ నుండెను. అంతలో ఫ్రెంచి సేనలలో తిరుగుబాటు పుట్టినది. శత్రుసేన చాల పెద్దదిగా ఉన్నందుకు భయపడి ముజఫర్ జంగ్ తన పినతండ్రియైన నాజర్ జంగ్ శరణు చొచ్చెను. చందాసాహెబ్ పుదుచ్చేరికి పారి పోయెను. డూప్లే మాత్రము తనకు సహజముగా ఉండిన ధైర్యము తోను, ఓర్మితోను నిలబడి పోరాటమును సాగించెను. ఎప్పటికైన ఫ్రెంచి వారి వలన తనకు ఆపద తప్పదన్న భయము నాజర్ జంగ్ కు తోచినది. అందుచేత అతడు డూప్లేతో మంచిమాటలాడుకొని, అతని సాయము పొంద చూచెను. కాని, అతనికి వ్యక్తిగతముగా శత్రువులు అయిన కడప, కర్నూలు నవాబులు డూప్లే పన్నాగములకు లోబడి నాజర్ జంగ్ ను చంపి వేసిరి. అంతట ముజఫర్ జంగ్ మరల దక్కన్ సుబేదారుగా ప్రకటితుడయ్యెను. ఇతనికి తోడుపడి విజయము కలిగించినందుకు ప్రతిఫలముగా డూప్లే కృష్ణానదికి దక్షిణమందున్న దేశమునకు గవర్నర్ పదవిని పొందెను.

ఇంతలో 1751, ఫిబ్రవరి 14 వ తేదీన ముజఫర్ జంగ్ ను అతని శత్రువులు రాయచోటి వద్ద చంపిరి. ముజఫర్ జంగ్ కు కుమారులు ఉండిరి. కాని, వారు పసివారు అగుటచే వారిని తప్పించి, ఫ్రెంచి సేనాని బుస్సీ నాజర్ జంగ్ సోదరుడైన సలాబత్ జంగ్ ను దక్కన్ సుబేదారుగా ప్రకటించెను. ఇక కర్ణాటకములో ఇంగ్లీషువారు మహమ్మద్ అలీకి ఇతోధిక సాహాయ్యము చేయ సంకల్పించిరి. తిరుచునాపల్లి ఫ్రెంచివారి వశము కారాదని వారి సంకల్పము. ఇందులకై 1751 లో రాబర్ట్ క్లైవ్ ఒక పన్నాగము పన్ని, కర్ణాటకపు ప్రధాన నగరమైన ఆర్కాట్ ను ముట్టడించెను. ఇందువలన చందాసాహెబ్ తన బలగమునందు కొంత భాగము ఆర్కాట్ రక్షణకు వినియోగించవలసిన అగత్యము ఏర్పడినది. 50 రోజుల పాటు ఆర్కాట్ కోటను క్లైవ్ రక్షించెను. తదుపరి ఆరణి వద్ద, కావేరీ పాక్ వద్ద ఘన విజయములు సాధించి, లారెన్స్ తో కలసి క్లైవ్ తిరుచునాపల్లిని ముట్టడినుండి విడిపించెను. ఫ్రెంచి సేనానాయకుడు జీన్ లా శ్రీరంగము వద్ద ససైన్యముగ పట్టుబడినాడు. చేయునదిలేక చందా

సాహెబ్ స్వయముగ పట్టుబడినాడు. అతనిని ఒక తంజావూరి సేనాధిపతి శిరచ్ఛేదము గావించెను (1752, జూన్). ఇక డూప్లే సంధి చేసికొనక తప్పలేదు. బుస్సీ కూడ సంధి చేసికొనుట మంచిదని సలహా చెప్పెను. బుస్సీ మాత్రము హైదరాబాదులో తన ప్రతిష్ఠ పునరుద్ధరించుకొని, నిజామ్ కొరకు తన సైన్యములను ఉంచుటకు అగు ఖర్చునకుగాను ఉత్తర సర్కారులను పేరుగల దాదాపు 480 కి. మీ. సముద్రతీర ప్రాంతమును తనకు దత్తము చేయించుకొనినాడు.

ఈ స్థితి ఇట్లుండగా యూరప్‌నందు రెండు కంపెనీల యజమానులును భారతదేశమున గల తమ ఉద్యోగుల ప్రవర్తన ఎడల ఆందోళన పడుచుండిరి. వీరి యుద్ధములును, విపరీతమైన ఖర్చును చివరకు కంపెనీలకు ముప్పు దెచ్చునేమో అని వారి భయము. వీరి వైమనస్యములు సడలించు ఉద్దేశముతో ఆ కంపెనీల మధ్య సామరస్య సంభాషణలు జరిగి, 1755, జనవరిలో సంధి కుదిరినది. ఆ సంధి ప్రకారము రెండు పక్షముల వారును భారతీయ రాజుల వ్యవహారములలో జోక్యము కలిగించుకొనకూడదు; ఇరువురును వారి వారి బిరుదులు, గౌరవ నామములు వదలుకొనవలెను. కాని, చివరకు యూరప్‌న సప్తవర్ష యుద్ధము [చూ.] వచ్చుటచే ఈ సంధి నామమాత్రముగనే నిలిచి పోయినది.

యూరప్‌లో సప్తవర్ష యుద్ధము ప్రారంభించుటతో ఫ్రెంచివారికి బ్రిటిష్‌వారి భూ భాగములపై దాడి చేయుటకు మరియొక అవకాశము చిక్కినది. కౌంట్ డ లాలీ అను వానికి ఈ బాధ్యతను ఇచ్చి పంపిరి (1758). అతడు భారతదేశమునకు వచ్చునరికి బ్రిటిష్‌వారు తమ పరిస్థితులను చాలవరకు చక్కబరచుకొనిరి. లాలీ సెంట్ డేవిడ్ కోటను వశపరచుకొని మద్రాసును ముట్టడింపవలెనను పట్టుదలతో బుస్సీకి కబురంపెను. క్లైవ్ కలకత్తా నుండి ఫోర్డ్ అనువానిని పంపించెను. అతడు సమర్థుడు. అతడు ఫ్రెంచి వారిని సులభముగ ఓడించి మచిలీపట్టణమును ముట్టడించెను. సలాబత్ జంగ్ ఆ పట్టణమును, తత్పరిసర ప్రదేశమును ఫోర్డ్‌కు సమర్పించుకొని, ఫ్రెంచి వారితో ఇక సఖ్యతను ఏర్పరచుకోనని మాట ఇచ్చెను (1759). చివరకు లాలీని 1760 లో ఐర్ కూట్ అను ఆంగ్ల సేనాని వందవాసి వద్ద పూర్తిగా ఓడించి, తరువాత కొలది కాలమునకే పుదుచ్చేరిని వశపరచుకొనెను (1761).

బ్రిటిష్‌వారి అసమాన సముద్రాధిపత్యము, అర్థబలములే ఈ యుద్ధములో విజయము సాధించుటకు కారణములయినవి. చివరకు పారిస్ సంధి [చూ.] ప్రకారము (1763) పుదుచ్చేరి ఫ్రెంచివారికి ఈయబడినది. ఈ యుద్ధములతో ఫ్రాన్స్ బెంగాల్ నుండి పూర్తిగా నిష్క్రమించినది. దక్కన్‌లో ఫ్రెంచి ప్రభావము నామమాత్రావశిష్టమయినది. ఉత్తర సర్కారులు బ్రిటిష్‌వారి వశమయినవి. ప్ర. రా.

**కర్నూలు నవాబులు :** చూ. తెలుగు సంస్కృతి, సం. 4 - పు. 747.

**కర్షకుల తిరుగుబాటు :** కర్షకుల తిరుగుబాటు బ్రిటన్‌లో 1381 లో జరిగినది. అంతకు పూర్వము భూస్వాములవద్దనుండి రైతులు కొంత భూమిని సాగుబడికై తీసికొని, ఆ భూ పరిమాణమునుబట్టి భూస్వామికి పండిన పంటలో నిర్ణీతభాగము ఇవ్వడమే కాక, ఉచితముగా ఎన్నో చాకిరీలు చేయుట ఆనాటి ఆచారము. కాని, 1343 - 1350 మధ్య, ముఖ్యముగా కర్షకులలో లక్షలాది జననష్టము కలిగించిన 'బ్లాక్ డెత్ (మారి జాడ్యము)' వల్ల కర్షకుల సంఖ్య చాల తగ్గిపోయినది. అందువల్ల కూలి రేట్లు విశేషముగా పెరిగి, వస్తువుల ధరలు కూడ పెరిగినవి. అల్ప సంఖ్యాకులైన కర్షకులు పూర్వపు పద్ధతిని (పంటలో భాగమిచ్చి, ఉచిత సేవలు చేయు పద్ధతి) సాగుబడి చేయమని, కౌలుకు తీసుకున్న భూమికి ఇంతయని నిర్ణయించుకుని, ధనరూపముగ శిస్తు మాత్రమే ఇచ్చెదమని పట్టుపట్టిరి.

రిచర్డ్ - II కాలములో కర్షకుల విజృంభణమును అడచుటకు 'కర్షకుల చట్టములు' అమలు జరిపిరి. అదియుగాక నష్టకరమైన యుద్ధము సాగించుటకొరకు రిచర్డ్ 1370 - 80 మధ్య ప్రజలపైని అక్రమముగా విధించిన 'తలపన్ను' కష్టించి జీవించే వారందరితో పాటు కర్షకులను కూడ కలవరపరచినది.

పై కారణములన్నీ ఏకమై కర్షకుల తిరుగుబాటు లేవదీసినవి. ఎసెక్స్ రాష్ట్రములో బయలుదేరిన తిరుగుబాటు దేశమంతా అల్లుకున్నది. లక్షమంది కర్షకులకు పైగా బయలుదేరి జాన్ బాల్, వాట్ టైలర్‌ల నాయకత్వము క్రింద లండన్‌లో ప్రవేశించి బీభత్సము చేసిరి. లండన్ టవర్‌ను ముట్టడించి, తలపన్ను వేయించిన ఆర్చిబిషప్ సడ్బరీని చంపిరి. కాని, రిచర్డ్ గాబరాపడక తిరుగుబాటు చేసిన వారిని కోరిన కోరికలన్నీ పరిష్కరించెదనని నమ్మించి, తృప్తిపరచి, మరో ప్రక్కన వాట్ టైలర్‌ను తెలివిగా అంతమొందించెను. నాయకుడైన టైలర్ మరణించగానే తిరుగుబాటు దారులు చెల్లాచెదరై పోయిరి. తరువాత తిరుగుబాటు చేసిన వారిని పగబూని రిచర్డ్ క్రూరముగా హింసించెను. భూస్వాములకు లాభకరముగా ఉండులాగు ప్రాత వ్యవసాయ పద్ధతిని నిలబెట్టే ప్రయత్న

ములు ఎన్నో చేసెను. కాని, ఆ యత్నములు ఫలించలేదు. ఆ నాటి కర్షకుల విప్లవము క్రమక్రమముగా కౌలుకు పుచ్చుకున్న భూమికి ధన రూపములో శిస్తు కట్టు విధానమును అమలులోనికి తెచ్చినది. ప్ర. రా.

**కలీఫాలు :** పరంపరాగతముగ, ధార్మిక - లౌకిక రంగముల రెండింట, ప్రపంచమునందలి ముస్లిములందరిపై అధికారము నెరపు మహోన్నత పదవియందుండిన వారికి వాడబడిన అధికార నామము 'కలీఫా'. ఆ పదవికి ఖిలాఫత్ అని వ్యవహారము కలదు. ప్రస్తుత ప్రపంచ పరిస్థితులలో అట్టి పదవిని నిర్వహించు వారు ఎవరును లేకుండుటచే, అయ్యది నామావశిష్టమయినది. ఆ పదవియందు ఉండిన వారిలో టర్కీ దేశపు రాజవంశమునకు చెందిన అబ్దుల్ మెజీద్ కడపటివాడు. 1924, మార్చి 3 న టర్కీ విప్లవప్రభుత్వము చేసిన నిర్ణయపు ఫలితముగ కలీఫా పదవి (ఖిలాఫత్) రద్దయినది.

ఈ కలీఫా పదవి ముస్లిమ్ మత ప్రవక్త యగు మహమ్మద్ దివంగతుడైన వెంటనే ముస్లిమ్ మతానుయాయుల ఐక్యమునకును, సంఘటిత శక్తికిని లాంఛనముగ ఉండునటుల తొలుత రూపొందింపబడినది. మహమ్మద్ ప్రవక్త జీవించి ఉన్నంతవరకు, ముస్లిమ్‌లపై లౌకిక, ధార్మిక రంగముల రెండింట ఆయనయే చరమ నిర్ణయాధికారమును వహించెను. ఆయన దివంగతుడగుటకు ముందుగ తన అధికారమును నేరుగ ఎవరికిని సంక్రమింప జేయలేదు. అందువలన ఆయన మరణానంతరము (క్రీ.శ. 632) ఆయన అనుయాయులు అందరును సమావేశమై, ఆయనకు మామయగు అబూ బేకర్‌ను తమకు లౌకిక, ధార్మిక విషయములందు నాయకుడుగ ఉండునటుల నిర్ణయించిరి. ఈ నాయకునే వారు 'కలీఫా రసూల్ అల్లా (మహమ్మద్ ప్రవక్త యొక్క అనువర్తి)' అని వ్యవహరించిరి. అదియే సంక్షిప్త రూపమున కలీఫా అయ్యెను.

అబూ బేకర్ క్రీ. శ. 634 లో మరణించెను. మరణించుటకు ముందుగ అతడు ఉమర్ అను వానికి కలీఫా పదవిని ఒసగెను. ఈ ఉమర్ కాలమున పాలస్తీనా, సిరియా, మెసపొటేమియా, అసీరియా, బాబిలన్ దేశములు తొలుతగ ఇస్లామ్ సేనావాహినుల వశమగుటయు, ఆ యా దేశముల వారిలో పలువురు క్రైస్తవ మతమును త్యజించి, ఇస్లామ్ మతమును అవలంబించుటయు జరిగెను. 640 లో ఈజిప్టు దేశము సైతము ఇస్లామ్ కుటుంబమున చేరెను. 641 లో ఇరాన్ ప్రభువును అంతమొందించి ముస్లిమ్ సేనానులు ఆ రాజ్యమును వశపరచుకొని ఇస్లామ్‌ను అచట వ్యాపింప జేయ మొదలిడిరి. ఇటుల విశాల రాజ్యములు కలీఫా అధికారమునకు లోనగుటవలన, కలీఫాకు వచ్చు ఆదాయము విరివిగ పెరిగెను. క్రీ. శ. 644 లో ఉమర్ హత్య చేయబడిన తరువాత, మెదీనా యందలి ముస్లిమ్ పెద్దలు సమావేశమై ఓత్‌మన్ అనువానిని కలీఫాగా ఎన్నుకొనిరి. ఈతని మరణానంతరమున కలీఫా పదవి కొరకై కలతలు చెలరేగెను. ఈ కలతలో తుదకు విజయమును పొందిన అలీ అను నతడు కలీఫా అయ్యెను. ఇతడు మహమ్మద్ ప్రవక్తకు అల్లుడు. ఇతనిని మక్కాయందలి ముస్లిమ్ పెద్దలందరు కలీఫాగా అంగీకరించినను, ముస్లిమ్‌లలోని ఒక వర్గము వారు ఇందులకు అంగీకరింపక, సాయుధ తిరుగుబాటును లేవదీసిరి. తత్ఫలితముగ జరిగిన యుద్ధమున అలీ మరణించెను (661). కాని, తదాదిగ ముస్లిమ్ మతమున షియా సంప్రదాయమునకు చెందిన వారందరును శాస్త్రసమ్మతముగ కలీఫా అగు హక్కు అలీకి మాత్రమే కలదనియు, అతని మరణానంతరము అతని వంశము వారికే అది సంక్రమించిన దనియు విశ్వసించి, తరువాత వచ్చిన కలీఫాలను గుర్తింపకుండిరి. ఈ షియాలు అల్పసంఖ్యాకులు. అధిక సంఖ్యాకులగు సున్నీలు మాత్రము తరువాత వచ్చిన కలీఫాలను గుర్తించి ఆదరించిరి.

అలీ మరణానంతరమున అతని ప్రతిస్పర్ధులందరి ఆమోదముతో సిరియా పాలకుడగు మువావియా కలీఫా అయ్యెను. ఇతనికి పూర్వమున కలీఫాలుగ ఉండిన నలుగురకును మెదీనా నగరము వాసస్థానముగ ఉండెను. ఇతని కాలమునుండి సిరియా రాజ్యమునకు రాజధానియగు డెమాస్కస్ కలీఫాల కార్యకేంద్రము అయ్యెను. ఇతని వంశమునకు ఉమాయిద్ వంశమని పేరు. ఈ వంశమున కలీఫా మరణించుటకు పూర్వము తన వారసునే కలీఫాగా నియమించుచు, పూర్వ సంప్రదాయమును నామమాత్రముగ పాటించుటకై ముస్లిమ్ పెద్దల ఆమోదమును అందులకు గ్రహించెడివాడు. ఇటుల కలీఫా పదవి వంశపారంపర్యమున సంక్రమించు సంప్రదాయము ఈ ఉమాయిద్ వంశముతో ఆరంభమైనది. ఈ వంశీకుల కాలమున కలీఫాలు మత విషయికముగ తమకు గల విధులకు క్రమముగ స్వస్తి చెప్పి, పండితులగు మౌల్వీలకు వానిని అప్పగించి, లౌకిక పాలకులుగ (రాజులుగ) మాత్రమే ఉండి, భోగవిలాస పరాయణులై జీవించుట మొదలిడిరి. ఈ వంశము వారు పదునాలుగురు క్రమముగ కలీఫాలుగ ఉండిన అనంతరమున కడపటి వానిని అంతమొందించి అబుల్ అబ్బాస్ అనువాడు కలీఫా పదవిని గ్రహించెను (క్రీ. శ. 750). ఇతడు మహమ్మద్ ప్రవక్తకు పినతండ్రి యగు అబ్బాస్ సంతతికి చెందినవాడు.

ఈ అబుల్ అబ్బాస్ వంశమునకు అబ్బాసీయ వంశ మను పేరు కలదు [చూ. అబ్బాసీయ కలీఫాలు - పు. 569]. ఈ వంశమునకు చెందిన 37 మంది క్రమముగ క్రీ. శ. 641 నుండి 1258 వరకు కలీఫా పదవిని నిర్వహించిరి. ఈ వంశ మునకు చెందిన కలీఫా మామూన్ కాలమున మెసపొ టేమియాలోని బాగ్దాద్ నగరము ఇస్లామిక రాజ్యము నకు కేంద్రముగ రూపొందింపబడెను. దూరదేశములందు ఉన్న ముస్లిమ్ ప్రభువుల పైన సైతము వీరికి అధికారము ఉండెడిది. వీరిచే పరిగణననందని ఏ ముస్లిమ్‌దేశపు పాలకు నైనను తమ ప్రభువుగ ఆ దేశీయ ముస్లిమ్‌లు పరిగణిం చెడివారు కారు. ఇట్టి అసమాన వైభవమును అనుభవించిన రాజవంశము మంగోల్‌ల దండయాత్రవలన అంత రించెను. 1258 లో మంగోల్ నాయకుడు హులగూ బాగ్దాద్ నగరమును జయించి కొల్లగొట్టి కలీఫాను వధించెను.

అంతటినుండి ప్రపంచమునందలి ముస్లిమ్ ప్రభువులలో శక్తిగలవాడెల్ల తనకు తానే కలీఫాగా పరిగణించు కొనుటయో లేదా తనకు నచ్చిన ఒకనిని నామమాత్రపు కలీఫాగా ఉంచుటయో పరిపాటి అయ్యెను. ఇటుల కలీఫా అయిన వారిలో తొలుతటివాడు అబుల్ కాసిమ్ అహమద్. ఇతడును అబ్బాసీయ వంశీకుడే. ఈజిప్టు ప్రభువుల ఆదరణ వలన ఇతడు తనను తానే కలీఫాగా 1259 లో ప్రకటించు కొని, ఈజిప్టునందు వసించి, ఆ ప్రభువుల సాయమున బాగ్దాద్ నగరమును వశపరచుకొనుటకు యత్నమొనర్చి, తత్ఫలితముగ జరిగిన యుద్ధమున మరణించెను.

తరువాత ఇతని సంతతివారును క్రమానుగతముగ కలీఫాలుగ ప్రకటించుకొనినను, ఈజిప్టునకు వెలుపల వారికి ఎట్టి పరిగణనయు అబ్బలేదు. ఈజిప్టు ప్రభువులు సైతము వారి ఎడల నామమాత్రపు గౌరవమును మాత్రమే ప్రకటించిరి. కడకు 1517 లో ఈజిప్టు దేశమును టర్కీ ప్రభువు వశపరచు కొనినపుడు, అపుడు కలీఫాగ ఉండిన అబ్బాసీయ వంశీకుడగు ముతావక్కిలు అనువానిని ఆ ప్రభువు చెరపట్టి కలీఫా పదవిని అతడు వదలుకొను నటుల చేసెను. జీవిత శేషమును కైరో నగరమందలి కారాగారముననే గడపి, 1538 లో ముతావక్కిలు మరణించెను.

ముతావక్కిలునుండి కలీఫా పదవి తనకు చెందునటుల టర్కీ ప్రభువగు సలీమ్ - I అనుమతిని గ్రహించెనని కొందరు టర్కీ రచయితలును, పాశ్చాత్యులును వ్రాసిరి. కాని, ఇందులకు ఆధారములు కన్పట్టుట లేదు. కలీఫా పదవి విషయము ఎత్తుకొనక తన సామర్థ్యమువలన మాత్రమే ప్రపంచ ముస్లిమ్ ప్రజానీకమును తన ఆధ్వర్యవమున సుసం ఘటిత మొనర్ప సలీమ్-I తలపెట్టినటుల అతని చర్యలవలన విదితమగుచున్నది. ఇది ఎటులున్నను అతడు కలీఫా బిరుదమును వాడుకొనలేదు. 1774 లో అతని వంశమునకు (ఓటోమన్ వంశమునకు) చెందిన అబ్దుల్ హమీద్-I తనను కలీఫాగా ప్రకటించుకొనెను. అంతటినుండి టర్కీ ప్రభువులు అందరును వరుసగ ఈ కలీఫా బిరుదమును వాడుకొనిరి.

టర్కీ సామ్రాజ్యము తప్ప తక్కిన ముస్లిమ్ రాజ్యములు అన్నియు 18 వ శతాబ్ది అంతమునకు బలహీనములు అయ్యెను. అందు పెక్కు పాశ్చాత్యుల వశమయ్యెను. అందువలన దాస్యమగ్నులగు తక్కిన దేశముల ముస్లిమ్ లకు స్వతంత్ర రాజ్యమగు టర్కీయందు గల ఆదరము వలన టర్కీ ప్రభువునే కలీఫాగా గుర్తించుటకు మార్గము సుగమమయ్యెను. ఆనాడు ఇటుల షియా సంప్ర దాయపు ముస్లిమ్‌లు తప్ప తక్కిన ముస్లిమ్‌లందరి ఆదరాభి మానములను కలీఫాగా టర్కీ ప్రభువు ఆర్జించుకొన గలిగెను.

ప్రపంచ యుద్ధము - I అనంతరమున టర్కీ సామ్రా జ్యము విచ్ఛిన్నమయ్యెను. 1922, నవంబరులో టర్కీ యందలి జాతీయ సభ రాచరికమును రద్దొనర్చుటచే అప్పటి ప్రభువగు మహమ్మద్ - VI రాజ్య పరిత్యాగము ఒనర్చెను. ఇటుల లౌకిక రాజ్యాధికారమును ఆ ప్రభువు వదలు కొనినను, మత విషయికమగు కలీఫా పదవి మాత్రము ఓటోమన్ రాజవంశమునకు చెందిన అబుల్ మజీద్ అను వానికి సంక్రమింపజేయబడెను. కాని, మత విషయికముగ మాత్రమే కలీఫా చేయవలసిన విధులేవియో అపుడు సుస్పష్టములు చేయబడలేదు; అందువలన కలీఫా అధికార ములను గురించిన వివాదము ఆ తరువాత చెలరేగెను. కలీఫాకు పూర్వమునుండి ఉన్న లౌకికాధికారములు లాంఛనముగనైనను ఉండవలెననియు, టర్కీ ప్రభుత్వము అట్టి వానిని మన్నించవలెననియు దూరదేశములందలి ముస్లిమ్‌లు కొందరు ఆందోళన ఆరంభించిరి. దీనివలన టర్కీ రాజకీయములందు ఇతరుల ప్రవేశము కలుగునను సంశయముతో టర్కీ జాతీయ సభవారు 1924, మార్చిలో ఖిలాఫత్‌ను రద్దొనర్చి, కలీఫాను దేశ బహిష్కృతుని చేసిరి. అంతటితో కలీఫా పదవి నామావశిష్ట మయినది.

ప్రక్కపుట (376) లోని పట్టికలో కలీఫాల నామములును, వారివారి పరిపాలనా కాలములును వరుసగా 1258 వరకు ఈయబడినవి.

చీ. సే. రా.

## కలీఫాల పట్టిక

| | |
|---|---|
| మహమ్మద్ | క్రీ. శ. 622 (570) – 632 |
| **తొలుతటి కలీఫాలు :** | |
| అబూ బేకర్ | 632 – 634 |
| ఓమర్ | 634 – 644 |
| ఓత్మన్ | 644 – 656 |
| అలీ | 656 – 661 |
| **ఒమాయిద్ కలీఫాలు :** | |
| మొవావియా - I | 661 – 680 |
| యాజిద్ - I | 680 – 682 |
| మొవావియా - II | 683 – |
| మార్వన్ - I | 684 – 685 |
| అబ్దుల్ మాలిక్ | 685 – 705 |
| వాలిద్ - I | 705 – 715 |
| సులేమాన్ | 715 – 717 |
| ఓమర్ ఇబ్న్ అబ్దుల్ - అజీజ్ | 717 – 720 |
| యాజిద్ - II | 720 – 724 |
| హిషామ్ | 724 – 743 |
| వాలిద్ - II | 743 – 744 |
| యాజిద్ - III | 744 – |
| మార్వన్ - II | 744 – 750 |
| **అబ్బాసీయ కలీఫాలు :** | |
| అబుల్ - అబ్బాస్ అల్ - షఫా | 750 – 754 |
| అల్ - మన్సూర్ | 754 – 775 |
| అల్ - మహది | 775 – 785 |
| అల్ - హాజి | 785 – 786 |
| హరూన్ అల్ - రషీద్ | 786 – 809 |
| అల్ - అమీన్ | 809 – 813 |
| అల్ - మామున్ (మామున్ మహనీయుడు) | 813 – 833 |
| అల్ - ముతాసిమ్ | 833 – 842 |
| అల్ - వాతిఖ్ | 842 – 847 |
| అల్ - ముతావక్కిల్ | 847 – 861 |
| అల్ - ముస్తాసిర్ | 861 – 862 |
| అల్ - ముస్తైన్ | 862 – 866 |
| అల్ - ముహతాజ్ | 866 – 868 |
| అల్ - ముక్తాది | 868 – 870 |
| అల్ - ముహతమిద్ | 870 – 892 |
| అల్ - ముహతదిద్ | 892 – 902 |
| అల్ - ముక్తఫి | 902 – 908 |
| అల్ - ముక్తదిర్ | 908 – 932 |
| అల్ - కాహిర్ | 932 – 934 |
| అల్ - రాజి | 934 – 940 |
| అల్ - ముత్తఖి | 940 – 944 |
| అల్ - ముస్తక్ఫి | 944 – 946 |
| అల్ - ముహితి | 946 – 974 |
| అల్ - టాయ్ | 974 – 991 |
| అల్ - ఖాదిర్ | 991 – 1031 |
| అల్ - ఖాహిమ్ | 1031 – 1075 |
| అల్ - ముఖ్తజి | 1075 – 1094 |
| అల్ - ముస్తాజిర్ | 1094 – 1118 |
| అల్ - ముస్తార్షిద్ | 1118 – 1135 |
| అల్ - రషీద్ | 1135 – 1136 |
| అల్ - ముఖ్తాఫి | 1136 – 1160 |
| అల్ - ముస్తాన్జిద్ | 1160 – 1170 |
| అల్ - ముస్తాది | 1170 – 1180 |
| అల్ - నాసిర్ | 1180 – 1225 |
| అల్ - జాహిర్ | 1225 – 1226 |
| అల్ - ముస్తాన్సిర్ | 1226 – 1242 |
| అల్ - ముస్తాసిమ్ | 1242 – 1258 |

**కల్యాణి చాళుక్యులు :** చూ. సం. 3 - పు. 182.

**కల్హణుడు** (క్రీ. శ. 12 వ శతాబ్ది): ప్రాచీన భారత దేశపు సారస్వతమున చారిత్రక విశేషముల తెల్పునవిగ పరిగణింపబడు కొలది గ్రంథములలో ప్రముఖమని భావింపదగు ' రాజ తరంగిణి ' అను గ్రంథమును రచించినవాడు [చూ. సం. 6 - పు. 613]. చీ. శే. రా.

**కళింగదేశ చరిత్ర, ప్రాచీన :** చూ. సం. 3 - పు. 98.

**కాంగో :** 19 వ శతాబ్దము మధ్య వరకు పశ్చిమ ఆఫ్రికాలోని కాంగో నది ప్రవహించు ప్రదేశములను గురించి అంతగా తెలియదు. 1877 లో కాంగో నదీ ముఖ ద్వారమును స్టాన్లీ [చూ. దేశాన్వేషకులు], బెల్జియమ్ రాజు లియోపాల్డ్ - II ఆ ప్రాంతమున గల ఆర్థిక సంపదను గుర్తించెను. 1884 - 85 లో జరిగిన బెర్లిన్ సమావేశము [చూ.] న లియోపాల్డ్ - II కాంగో ఫ్రీస్టేట్ అను నామము గల రాజ్యమునకు అధిపతిగా పరిగణింపబడెను. ప్రస్తుతము కాంగో పేరున ఆఫ్రికా ఖండమున రెండు దేశములు కలవు. వాని రాజధానీ నగరములను బట్టి అందు ఒకటి కాంగో (బ్రజ్జవిల్లి) అని, రెండవది కాంగో (లియోపాల్డ్ విల్లి) అని పిలువబడుచున్నవి [చూ. కాంగో (బ్రజ్జవిల్లి); కాంగో (లియోపాల్డ్ విల్లి)]. చీ. శే. రా.

**కాంగో (బ్రజ్జవిల్లీ)**: ఆఫ్రికా పశ్చిమ భాగమున కాంగో నదికి పశ్చిమమున ఉన్న ఒక స్వతంత్ర రాజ్యము.

ఈ దేశమునకు సెంట్రల్ ఆఫ్రికన్ రిపబ్లిక్ [ఉ]; కాంగో నది [తూ]; కాంగో (లియోపాల్డ్ విల్లీ), అట్లాంటిక్ మహా సముద్రము [ద]; కామెరూన్, గెబన్ [ప] సరిహద్దులుగ ఉన్నవి. [వి] 3,42,000 చ. కి. మీ; [జ] 8,64,684. దాదాపు 10 ఆఫ్రికా జాతులు ఈ దేశమున వసించుచున్నవి. [భా] ఈ జాతులవారు తమ తమ ప్రత్యేక భాషలను మాట్లాడుదురు. కాని, ఫ్రెంచి భాష వ్యాపార, రాజకీయ వ్యవహార భాషగ గుర్తింపబడి, పాఠశాలలందు బోధనా భాషగ ఉపయోగింపబడుచున్నది. [మ] ప్రకృతి దేవతలను, పితృ దేవతలను పూజించు సంప్రదాయ మతములు ఈ దేశమున వ్యాప్తియందు ఉన్నవి. క్రైస్తవుల సంఖ్య చాల స్వల్పము. [రా] బ్రజ్జవిల్లీ (జ. సం. 1,07,00).




చరిత్ర: కాంగో పశ్చిమ సరిహద్దున ఉన్న అట్లాంటిక్ మహాసముద్ర తీరమందు తొలుతగ 15 వ శతాబ్దిలో పోర్చుగీస్ నావికులు దిగుటతో ఈ దేశమును గురించి యూరప్ వాసులకు తెలియవచ్చెను. బానిస వ్యాపారమున కుతూహలము కల ఫ్రెంచి వ్యాపార సంఘములు 17 వ శతాబ్దమున కాంగో నదీ ముఖద్వార ప్రాంతమున నెలవులను ఏర్పరచుకొని నీగ్రో ప్రజలను బానిసలుగ కొనిపోయి దూర దేశములందు అమ్ముచుండెడివారు. 1785 నాటికి ఈ వ్యాపారము చేయు నౌకలు సంవత్సరమునకు ఒక వందకు మించినవనిన ఆ వ్యాపారము ఆనాడు ఎంత విరివిగ జరిగెడిదో ఊహింపవచ్చును. ఫ్రెంచి విప్లవానంతరము బానిస వ్యాపారము నిషేధింపబడిన తరువాత, వేరు విధములగు వస్తువులను కాంగో పరిసర భూములనుండి సేకరించి వ్యాపారమును సాగింపవలెనను కుతూహలము వ్యాపార సంఘములకు కలిగెను. అంతట కాంగో నదీ పరిసర భూముల అన్వేషణ తీవ్రతరరీతిలో జరిగెను. సాహసికులు అగు అన్వేషకులు పలువురు దేశము లోపలికిపోయి వివరములను కనుగొనసాగిరి. వీరిలో పియెర్రి సవర్‌గ్నాన్ డి బ్రజ్జీ అను ఫ్రెంచి అన్వేషకుడు కాంగో పరిసర భూములలో వసించు బటేకీ అను ప్రముఖ ఆఫ్రికన్ జాతికి ప్రభువగు మకోకూతో 1880, అక్టోబరు 3 న కుదుర్చుకొనిన ఒడంబడిక మూలమున ఫ్రెంచివారి ఆధిపత్యము కాంగో పరిసర భూములందు సుస్థాపితమయ్యెను. 1885 లో జరిగిన బెర్లిన్ కాంగ్రెస్ [చూ.] నందు ఈ ఆధిపత్యము గుర్తింపబడెను. కాని, తక్కిన యూరపియన్ దేశములకు కూడ కాంగోలో వస్తువులను సేకరించి స్వేచ్ఛగ వ్యాపారము ఒనర్చుకొను హక్కు ఈ కాంగ్రెస్ కలిగించెను. క్రమముగ ఫ్రెంచివారు ఈ ప్రాంతమందు అంతట తమ పరిపాలన వ్యవస్థను నెలకొల్పిరి. 1910 లో ఈ కాంగో పరిసర భూములను ఫ్రెంచివారు అచ్చటి స్థానిక పరిస్థితులను అనుసరించి, గెబన్, మిడిల్ కాంగో, ఉబంగ్ - ఇ - షరీ అను మూడు వలస రాజ్యములుగ విభజించిరి. ఈ మూడు వలసలును ఫ్రెంచి ఈక్వటోరియల్ ఆఫ్రికా అను పేర ఫ్రెంచి పాలనలో ఆనాడు ఉండినవి. ద్వితీయ ప్రపంచ యుద్ధ కాలమున ఫ్రాన్స్ జర్మనుల వశమైనపుడు డీగాలీ [చూ.] నాయకత్వమున ఉన్న స్వతంత్ర ఫ్రెంచి ప్రవాస ప్రభుత్వమునకు చాడ్ దేశముతో పాటు మిడిల్ కాంగో సైతము తోడ్పడెను. 1958, సెప్టెంబరు 28 న ఫ్రెంచి ప్రెసిడెంట్ జరిపిన జనవాక్య సేకరణలో ఫ్రెంచి కమ్యూనిటీలో భాగస్వామియై స్వతంత్రరాజ్యముగ ఉండుటకు మిడిల్ కాంగో నిర్ణయించుకొని, ఆనాటినుండి కాంగో రిపబ్లిక్ అను పేర స్వాతంత్ర్యమును అనుభవించుచున్నది.

రాజ్యాంగము: ఫ్రెంచి కమ్యూనిటీ [చూ.] సభ్యత్వము వలన కలుగు స్వత్వ, బాధ్యతలకు భంగము కలుగని రీతిగ ఈ దేశరాజ్యాంగము 1959, ఫిబ్రవరి 23 న రూపొందింపబడినది. దీనిని అనుసరించి 61 మంది సభ్యులు కల అసెంబ్లీ లెజిస్లేటివ్ అనబడు శాసనసభను అయిదేండ్లకు ఒకసారి అపరోక్ష సార్వజనిక పద్ధతిన ప్రజలు ఎన్నుకొనెదరు. ఈ అసెంబ్లీయందలి అత్యధిక సంఖ్యాకుల వలన దేశాధ్యక్షుడు ఎన్నుకొనబడును. అధ్యక్షుడే ప్రధానిగ సైతము వ్యవహరించుచు తన మంత్రి వర్గమును నియమించుకొని పరిపాలనకు బాధ్యత వహించును. శాసనాధి

కారము అసెంబ్లీయందు న్యస్తమై ఉన్నది. వయోజనులకు అందరకు వోటింగ్ హక్కు కలదు. చి. శే. రా.

**కాంగో** (లియోపాల్డ్ విల్లీ): ఆఫ్రికా పశ్చిమ భాగమున ఉన్న ఒక స్వతంత్ర రాజ్యము.

ఈ దేశమునకు సెంట్రల్ ఆఫ్రికన్ రిపబ్లిక్, సుడాన్ [ఉ]; ఉగాండా, రువండా, బురుండీ, టాంగన్యికా సరస్సు [తూ]; ఉత్తర రొడీషియా, అన్గోలా [ద]; కాంగో (బ్రజ్జవిల్లీ) [ప] సరిహద్దులుగ ఉన్నవి. [వి] 23,45,409 చ. కి. మీ.; [జ] 1,50,07,000. వీరిలో యూరపియన్లు సుమారు ఒక లక్ష ఉందురు. ఈ యూరపియన్లలో 78% బెల్జియన్లు. జనాభాలో అధిక సంఖ్యాకులు బంటూ జాతికి చెందిన పలు తెగలవారు; [భా] దేశ భాషలు అన్నియు బంటూభాషావర్గమునకు చెందినవియే. కాని, వీనిలో దేనికిని జాతీయ భాషా ప్రతిపత్తి లేదు. బెల్జియమ్ ఈ దేశమును పాలించిన కాలమున బెల్జియమ్నందువలెనే ఇచటను డచ్చి, ఫ్రెంచి భాషలు రెండును అధికార, వ్యవహార భాషలుగ ఉండినవి. ఇపుడు ఫ్రెంచియే ప్రముఖ వ్యవహారభాషగ వాడుకలో నిలిచి ఉన్నది. [మ] దేశీయులలో అత్యధిక సంఖ్యాకులు తమ ప్రాచీన సంప్రదాయములను అనుసరించి ప్రకృతి దేవతలను, పితృదేవతలను ఆరాధించుచున్నారు. కాని, క్రైస్తవ మిషనరీల కృషివలన దాదాపు 50 లక్షల మంది క్రైస్తవ మతము స్వీకరించి ఉన్నారని అంచనా. [రా] లియోపాల్డ్ విల్లీ (జ. సం. 3,66,819).

చరిత్ర: 19 వ శతాబ్దమువరకు ఈ దేశపు చరిత్రను గురించి ఏమియు తెలియవచ్చుట లేదు. 15 వ శతాబ్దమున




పోర్చుగీస్ నావికులు ఈ ప్రాంతమున కాంగోనదీ ముఖద్వారమున నెలవులను ఏర్పరచుకొనినను, దేశాంతర్భాగమును పరిశోధించలేదు. 1877 లో హెన్రీ, స్టాన్లీ అను సుప్రసిద్ధ అన్వేషకులు కాంగోనదిపై దేశాంతర్భాగమున పయనించి అందలి ప్రకృతి సంపదల వివరములను తెలిపిన తరువాత ఈదేశము వివిధ యూరపియన్ దేశముల దృష్టిని ఆకర్షించెను. ఆ వెనువెంటనే బెల్జియమ్ రాజగు లియోపాల్డ్ - II తన దేశము తరపున కాంగో నదీ పరిసర భూమిపై విరివిగ అన్వేషణను సాగించి, అచటి తెగల నాయకులతో ఒడంబడికలు కుదుర్చుకొనుటకు ఆ స్టాన్లీకే అధికారమొసగి పంపెను. అంతటితో ఊరకొనక 1878 లో 'అంతర్జాతీయ కాంగో సంఘము (ఇంటర్నేషనల్ అసోసియేషన్ ఆవ్ కాంగో)' అను పేర ఒక సంఘమును స్థాపించి, కాంగో సంపత్తిని అభివృద్ధిచేసి దానితో వ్యాపారము సాగించుటకు బెల్జియమ్ రాజు పూనుకొనెను. ఈ సంఘమున వాటాలలో ఎక్కువ భాగము ఆ రాజే ఉంచుకొనెను. దీనికి తొలుత తక్కిన యూరపియన్ దేశములు కొన్ని అభ్యంతరములు లేవదీసినవి. 1884 - 85 లో బెర్లిన్ కాంగ్రెస్ [చూ.] ఈ విషయమును చర్చించి లియోపాల్డ్ సొంత పరిపాలన క్రింద కాంగోను ఒక స్వతంత్ర ప్రభుత్వముగ గుర్తించి, దాని సరిహద్దులను నిర్ణయించెను. కాని, బెల్జియమ్ రాజు నిరంకుశపాలనను గురించియు, తన సొంత లాభమునకై రబ్బరు తోటలందును, గనులందును అతడు కాంగో వాసులకు కలిగించుచున్న ఇబ్బందులను గురించియు విమర్శలు విపరీతముగ చెలరేగుటచే, 1908 లో బెల్జియమ్ రాజు తనకు ఆ దేశమున గల సొంత హక్కులను వదలుకొని, బెల్జియమ్ ప్రభుత్వమునకు ఆ హక్కులను సంక్రమింప చేసెను. ఇట్లు ఈ దేశము బెల్జియన్ల వలసగ 1959 వరకును ఉండెను. తక్కిన ఆఫ్రికాలో చెలరేగిన స్వాతంత్ర్యాకాంక్ష ఆ సంవత్సరమున ఈ దేశమునకును ప్రాకి, దేశీయుల తిరుగుబాటునకు కారణమైనది. కడకు బెల్జియమ్ ప్రభుత్వము లొంగి, 1960, జూన్ 30 న కాంగోకు స్వాతంత్ర్యము ఒసగెను.

కాని, ఈ స్వాతంత్ర్యసిద్ధి దేశమున వసించు పలు తెగల మధ్య పోరాటమునకు దారితీసెను. స్వాతంత్ర్యసిద్ధికి పూర్వము మే నెలలో జరిగిన ఎన్నికల ఫలితముగ 'జాతీయ కాంగోలీ ఉద్యమపు (మూవ్మెంట్ నేషనల్ కాంగోలే)' నాయకుడు పాట్రిస్ లుముంబా ప్రధాని అయ్యెను. అకాబోపక్ష నాయకుడు కసవూబూ అధ్యక్షుడు అయ్యెను. దేశమున పటిష్ఠ కేంద్ర ప్రభుత్వమును స్థాపింపవలెనని లుముంబా [చూ.] ఆశించెను. అధ్యక్షుడగు కసవూబూ రాష్ట్రములకు కొంతవరకు స్వేచ్ఛ ఉండవలెనని వాదించెను. రాష్ట్రములకే చాల అధికారములు ఉండి కేంద్రము నామమాత్రముగ ఉండవలెనని కటాంగా రాష్ట్రపు నాయకుడు మాయిసీ షోంబే పట్టుబట్టెను. ఈ

తగాదాలు పోరాటములకు దారితీసెను. కటాంగాయందు విలువగల గనులు ఉండుటచేతను, ఆ గనులయందు బ్రిటిష్, బెల్జియమ్ కంపెనీలకు స్వామ్యము ఉండుటవలనను షోంబే విచ్ఛిన్నకరవాదములకు ఆ దేశములందలి కొన్ని ప్రముఖ వర్గములు ప్రోత్సాహము ఒసగినవి. చేయునది లేక ప్రధాని లుముంబా ఐక్యరాజ్య సమితిని దేశమున శాంతిని స్థాపింప వలసినదిగ అర్థించెను. సమితి ఇందులకు అంగీకరించి, ఒక అంతర్జాతీయ సైనిక దళమును కాంగోలో ఉంచెను. ఈ దళమున భారత దేశపు సైనికులును ప్రముఖ పాత్ర వహించిరి. ఇంతలో అధ్యక్ష - ప్రధానుల మధ్య విభేదములు తీవ్రమై లుముంబాను అధ్యక్షుడు నిర్బంధింపజేసి, కడకు మాయిసీ షోంబే వశమున ఉంచుటయు, విషాదకర పరిస్థితులలో లుముంబా చంపబడుటయు జరిగెను.

అంతటనుండి షోంబే దురంతములు పెచ్చు పెరిగి, విదేశీయులగు కిరాయి సైనికుల సాయముతో అతడు ఐక్యరాక్య సమితి సేనలను ఎదుర్కొన ఆరంభించెను. ఎటులైనను శాంతిని నెలకొల్పుటకై షోంబేతో మాటాడుటకు వచ్చిన ఐక్యరాజ్య సమితి కార్యదర్శి హేమర్ షెల్డ్ అజ్ఞాత పరిస్థితులలో విమాన ప్రమాదమున మరణించెను (సెప్టెంబరు, 1961). ఆ తరువాత వచ్చిన ఐక్యరాజ్య సమితి కార్యదర్శి ఊథాంట్ ఈ సమస్యను ఎటులైనను పరిష్కరింపవలయునని పట్టుదల వహించెను. యునైటెడ్ స్టేట్స్ అతని చర్యకు తగు ప్రోత్సాహము ఒసగెను. తత్ఫలితముగ షోంబే సైనికులను ఐక్యరాజ్య సమితి సైనిక దళము నిర్జించి, కటాంగా యందలి కీలక కేంద్రములను అన్నిటిని ఆక్రమించెను. కాంగో ఏకీకరణకై ఊథాంట్ సమాఖ్య రూపమగు రాజ్యాంగ విధానమును ఒసగు ఒక ప్రణాళికను సూచించగ అప్పటి కాంగో ప్రధాన మంత్రి అదౌలా అంగీకరించెను. తనకు సాయమువచ్చు వారు ఎవరును లేరను విషయమును గుర్తించి షోంబే సైతము కటాంగాకు స్వతంత్రము కావలెనను వాదమును విడనాడితి నని ప్రకటించెను (1963, జనవరి 20). అయినను అంతటితో కాంగోలో రాజకీయ వ్యవస్థ కుదుటబడజాలక పోయినది. కడకు పలు విపర్యయముల తరువాత సేనాపతి యగు మొబుటూ ప్రభుత్వమును వశపరచుకొని అధ్యక్షుడు అయ్యెను (19 మార్చి, 1966). చీ. శే. రా.

**కాంగ్రెస్, భారత జాతీయ :** భారత దేశములోని ప్రధాన రాజకీయ పక్షము. దేశములోని సర్వ మతముల వారికిని ఈ సంస్థ ప్రాతినిధ్యము వహించుచున్నది. భారత స్వాతంత్ర్యోద్యమము ఈ సంస్థ నాయకత్వమున నడచినది. 1885 లో ఎల్లన్ ఆక్టేవియన్ హ్యూమ్ అను ఆంగ్లేయుని అధ్యక్షతన కాంగ్రెస్ స్థాపితమైనది. 1919 లో మోహన దాస్ కరమ్‌చంద్ గాంధీ [చూ.] రంగమున దిగు వరకును - బ్రిటిష్ ప్రభుత్వమునకు విజ్ఞప్తులు పంపుకొనుట ద్వారా భారతీయులకు ఎక్కువ సౌకర్యములను సంపాదించుటే- ఈ సంస్థ లక్ష్యముగ ఉండెను. అటుపిమ్మట దైన్య, దౌర్బల్య సూచకములగు వెనుకటి పద్ధతులకు స్వస్తిచెప్పి, దేశములో రాజకీయ చైతన్యమును, స్వాతంత్ర్యానురక్తిని పెంపొందించుట ద్వారా దాస్య విముక్తిని సాధించుటకు కాంగ్రెస్ కృషి చేసినది. 1929లో లాహోర్ సమావేశమున సంపూర్ణ స్వాతంత్ర్యమే తన లక్ష్యమని కాంగ్రెస్ చాటినది. గాంధీజీ నాయకత్వమున ఉప్పు సత్యాగ్రహము, 1942 ఆగస్టు ఉద్యమము వంటి దేశ పరివ్యాప్తములగు అహింసా సమరములను అనేకము నడపి, తత్ఫలితముగ తుదకు 1947, ఆగస్టు 15 వ తేదీన కాంగ్రెస్ సంస్థ భారత దేశమునకు స్వాతంత్ర్యమును సంపాదించి పెట్టినది. రాజకీయ స్వాతంత్ర్యముతో బాటు ఆర్థిక, సాంఘికాది ఇతర విధములగు స్వాతంత్ర్యములను కూడ సాధించు లక్ష్యముతో రాజకీయ స్వాతంత్ర్యము సిద్ధించిన పిమ్మట కూడ కాంగ్రెస్ మహాసభ నిలచి ఉన్నది. కమ్యూనిస్ట్, ప్రజా సోషలిస్ట్, జనసంఘ్, స్వతంత్ర పక్షము మొదలైన అఖిల భారత రాజకీయపక్షములు ఇంకను అనేకము వెలసి దేశములో పనిచేయుచున్నను, నేటికిని కాంగ్రెస్ పక్షమే అధిక సంఖ్యాక ప్రజాదరణకు పాత్రమై, కేంద్రములోను, రాష్ట్రములలోను కూడ ప్రభుత్వ నిర్వహణ బాధ్యతను వహించుచున్నది [చూ. భారతదేశము]. ప్ర. రా.

**కాంప్‌బెల్ - బానర్‌మన్, హెన్రీ (1836-1908) :** బ్రిటిష్ రాజనీతివేత్త; ఒకప్పుడు బ్రిటన్‌కు ప్రధాన మంత్రి. 1868 లో ఇతడు లిబరల్ పార్టీ అభ్యర్థిగా పార్లమెంట్ కామన్స్ సభకు ఎన్నికయై, కొంతకాలము వివిధ ప్రభుత్వ శాఖలలో అనేక పదవులను నిర్వహించి, 1886 లో యుద్ధ శాఖామంత్రిగా బ్రిటిష్ మంత్రి వర్గములో ప్రవేశించెను. 1892 మొదలు 1895 వరకు ఇతడు ఆ పదవినే మరల చేపట్టెను. బాధ్యతారహిత వక్తగా పరిగణింపబడినను, 1898 లో కామన్స్ సభలో లిబరల్ పార్టీ నాయకత్వమును చేపట్టి, కాంప్ బెల్ తన పార్టీలోని అభ్యుదయవర్గముతో సన్నిహితత్వమును కల్పించుకొని, తన ప్రతిష్ఠను, పలుకుబడిని పెంపొందించుకొనెను. ఆ సందర్భముననే ఇతడు బోయర్ యుద్ధము [చూ.] ను ప్రతిఘటించెను. 1895 లో 'సర్' బిరుదముచే సత్కరింపబడి, 1905 సంవత్సరాంతమున ఇతడు ప్రధాన మంత్రి పదవిని అధిష్ఠించెను; కాని, శరీర ఆరోగ్యము క్షీణించుటచే 1908 లో ఆ పదవికి తప్పని

సరిగా రాజీనామా పెట్టవలసినవాడయ్యెను. స్వదేశమున పెక్కు సాంఘిక సంస్కరణలను ప్రవేశపెట్టి, ఇతని ప్రభుత్వము దక్షిణ ఆఫ్రికాతో సమాధానపడుటకు కృషి చేసెను; తత్పర్యవసానముగనే ఆ దేశమునకు స్వపరిపాలనము లభించెను. **ఆ. వెం.**

**కాంబోడియా :** ఆగ్నేయ ఆసియాలోని ఒక స్వతంత్రరాజ్యము. దీనికే ఆ దేశపుభాషలో 'కాంభోజ' అని వ్యవహారము కలదు.




దేశమునకు లావోస్, దక్షిణ వియెత్నామ్ [తూ]; సయామ్ సింధుశాఖ; [ద]; తాయిలాండ్ [ఉ; ప] సరిహద్దులందున ఉన్నవి. [వి] 1,81,035 చ. కి. మీ.; [జ] 57,40,115; [మ] ప్రజలలో 90% హీనయాన సంప్రదాయపు బౌద్ధమతస్థులు; [భా] కాంబోడియన్ జాతీయ భాష; వ్యాపార, రాజకీయ రంగములందు ఫ్రెంచిభాష విస్తృతముగ వాడబడుచున్నది. వరిపంటకు ఈ దేశము ముఖ్యముగ పేరొందినది. ముఖ్యముగు ఎగుమతి సరకు బియ్యము. [రా] నామ్‌పెన్(జ. సం. 5,00,000).

చరిత్ర: క్రీ. శ. రెండవ శతాబ్దమున ఈ రాజ్యము ప్రాచీన ఫూనాన్ (చంపా) రాజ్యమున అంతర్భాగముగ ఉండెడిది. ఈ చంపారాజ్య పరిపాలకులు భారతీయ సంస్కృతికి చెందినవారు. వీరి రాజ్యమును క్రీ. శ. 6 వ శతాబ్దిలో అంతమొందించి ఖ్మేర్ రాజులు కాంబోడియాను ఆక్రమించిరి. ప్రస్తుతపు కాంబోడియా వాసులు ఈ ఖ్మేర్ ప్రజల సంతతివారమని చెప్పుకొనియెదరు. ఈ ఖ్మేర్ రాజులును భారతీయ మత సంస్కృతులనే అవలంబించిరి. వీరిలో ఒకడగు జయవర్మ - II అంకారథామ్ అను నగరమును క్రీ. శ. 802 లో నిర్మింపజేసి, దానిని రాజ్యపు రాజధానిగ ఒనర్చెను. ఆ ఖ్మేర్ రాజుల వైభవము 10, 11 శతాబ్దములందు అత్యుచ్ఛదశను అందుకొనెను. అప్పుడు వారి సామ్రాజ్యము ఆగ్నేయ ఆసియాయందు అత్యధికభాగమున వ్యాపించెను. ఆ నాడు వారు తమ ముఖ్యనగరమగు 'అంకారథామ్' నందు మనోహర దేవాలయములను, ప్రాసాదములను నిర్మింపజేసిరి. నేటికిని ఆ దేవాలయముల శిల్పము చూచువారిని ముగ్ధులను ఒనర్చుచున్నది [చూ. అంకారవాట్ - పు. 257]. కాని, 12 వ శతాబ్దము మొదలుకొని ఈ సామ్రాజ్యమునకు క్షీణదశ ప్రాప్తించెను. వియెత్నామ్, తాయిలాండ్ పాలకులు పలుమారులు కాంబోడియాపై దండెత్తి వచ్చి, కడకు ఆ సామ్రాజ్యమును అంతమొందించిరి. 18 వ శతాబ్ది అంతమునకు తాయిలాండ్ పాలకులకు కాంబోడియా సామంత రాజ్యమయ్యెను. ఈ దుస్థితినుండి బయటపడుటకు వేరు మార్గము తోచక 1863 లో అప్పటి కాంబోడియా పాలకుడు ఫ్రెంచి వారి రక్షణను అర్థించెను. అప్పటికే ఫ్రెంచి వారు ఆగ్నేయ ఆసియాలో కాంబోడియా పరిసరములందు గల, లావోస్, వియెత్నామ్ దేశములలో కొంత పలుకుబడిని సంపాదించి ఉండిరి. కావున వారు కాంబోడియాను కూడ ఆ రాజ్యములతో చేర్చి ఫ్రెంచి ఇండో - చీనా అను పేర ఒక రక్షిత రాజ్యమును నిర్మించి పాలించిరి. ఫ్రెంచి వారి పరిపాలనయే కాంబోడియా జాతీయతాభావమునకు దోహదకారి అయ్యెను. ఈ జాతీయతను కాంబోడియా రాజులే ప్రోత్సహించిరి. ఫ్రెంచి వారికి ఇది గిట్టకుండెను. అందుచే 1941 లో కాంబోడియా రాజు చనిపోగా అతని వారసుడగు సురమరుత్‌ను రాజుగా అంగీకరింపక, ఫ్రెంచివారు ఆ సురమరుత్ కుమారుడును, పసివాడును అగు నరోత్తమ సింహానక్‌ను రాజుగచేసి, అతనిని తమ చేతిలో కీలుబొమ్మగ ఉంచుకొన చూచిరి. కాని, ఈ బాలరాజు సైతము జాతీయతావాదియే అయ్యెను. ఇంతలో ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున జపాన్ వారు ఇండో - చీనాను ఆక్రమించి, ఫ్రెంచి పాలనను అంతమొందించిరి. జపాన్‌తో సఖ్యము పాటించుచునే నరోత్తమ సింహానక్ తన ప్రజలలో జాతీయతాభావమును కలిగించుటకు ఎక్కువ కృషి చేసెను. కావున, జపానీయులు దేశము నుండి వెడలిపోగానే కాంబోడియా ఫ్రెంచి రక్షణ నుండి వైదొలగెదనని ప్రకటించెను. ఫ్రెంచివారు తిరిగి మిత్రమండలి సేనల సాహాయ్యముతో ఇండో-చీనాను 1946 లో ఆక్రమించినను, వారు అనేక ప్రతిబంధకములను ఎదుర్కొనవలసి వచ్చెను. ఈ అదను చూచుకొని వంశానుగతము, శాసనబద్ధము అగు రాచరికపు స్వతంత్రరాజ్యముగ కాంబోడియా అవతరించెనని 1947, మే 6 వ తేదీన కాంబోడియా ప్రభువు ప్రకటించెను. తరువాత రెండు సంవత్సరములకు ఫ్రెంచివారు ఫ్రెంచియూనియన్‌లో నియమిత స్వాతంత్ర్యము గల రాజ్యముగ కాంబో

డియాను గుర్తించిరి. కాని, ఇంతలో ఫ్రెంచి వారిపై ఇండో - చీనా వాసులు సాగించు స్వాతంత్ర్యయుద్ధము ఫ్రెంచివారికి అతి క్లిష్ట స్థితిని తెచ్చిపెట్టెను. రాజకీయ చతురతకు పేరొందిన కాంబోడియా పాలకుడు నరోత్తమ సింహానక్ ఈ అవకాశమును జారవిడువక 1953, నవంబరు 9 న కాంబోడియాను స్వతంత్రరాజ్యముగ ప్రకటించెను. ప్రపంచ రాజ్యములును ఈ స్వతంత్రతను గుర్తించినవి. 1955, డిసెంబరులో కాంబోడియా ఐక్యరాజ్య సమితి యందు సభ్యత్వమును గడించెను.

సింహానక్ 1955, మార్చిలో రాజ్య పరిత్యాగము కావించి, తన తండ్రియగు సురమరుత్‌ను పాలకునిగా చేసెను. ఆతరువాత అతడు ప్రజాప్రతినిధుల అంగీకారముపై ప్రధానమంత్రి అయ్యెను. కాని, 1960 లో సురమరుత్ చనిపోవుటచే నరోత్తమ సింహానక్ ప్రజల కోరికపై మరల ప్రభువు అయ్యెను (జూన్ 13, 1960). అతని నాయకత్వమున కాంబోడియా తన భవితవ్యమును నేడు తీర్చిదిద్దుకొనుచున్నది. తాటస్థ్య విధానమును ఈ దేశము అవలంబించి, యునైటెడ్‌స్టేట్స్, సోవియట్ రష్యా, చీనా ప్రజా గణరాజ్యముల వలన ఆర్థిక సాహాయ్యమును పొందుచున్నది. కొలంబో ప్రణాళికను అనుసరించి కూడ ఈ రాజ్యము సాహాయ్యము పొందుచున్నది.

**రాజ్యాంగము :** శాసనబద్ధము, వంశానుగతము అగు రాచరికపు పాలన ఈ దేశమున అమలునందు ఉన్నది. ఈ రాజ్యాంగము 1947, మే 6 న ఆమోదితమైనది. దీనినిబట్టి శాసన నిర్మాణాధికారము రెండు కక్ష్యలుగ ఉన్న శాసన సభయందు న్యస్తమై ఉన్నది. దిగువ సభను నాలుగేండ్లకు ఒకసారి ప్రజలు ఎన్నుకొందురు. న్యాయముగ ఎక్కువ అధికారములు ఈ సభకే కలవనవచ్చును. ఈ సభలో 61 మంది సభ్యులు కలరు. ఎగువ సభయందు 24 గురు సభ్యులు ఉందురు. వీరిలో ఇరువురను రాజు నియమించును. ఇరువురను దిగువ సభయు, ఎనిమిది మందిని స్థానిక ప్రభుత్వములును, ఎనిమిది మందిని వృత్తి వ్యాపార సంఘములును, నలుగురను రాజకీయోద్యోగులును ఎన్నుకొందురు. ఎగువ సభకు అధికారములు తక్కువ. సాధారణముగ రాజునకు ఇది సలహాలను మాత్రమే ఇచ్చును. రాజే ప్రధాన మంత్రిని, తక్కిన మంత్రులను నియమించును. ప్రధాన మంత్రియు, మంత్రి మండలియు పరిపాలనకు బాధ్యత వహింతురు. చీ. శే. రా

**కాకతీయులు :** చూ. తెలుగు సంస్కృతి సం 3 - పు. 223.

**కాన్‌స్టాంటినోపుల్ :** చూ. ఇస్తాంబుల్ - పు. 328.

**కాన్‌స్టాంటినోపుల్ ఒడంబడికలు** (1915 - మార్చి, ఏప్రిల్) : బ్రిటిష్ వారును, ఫ్రెంచివారును ప్రథమ ప్రపంచ యుద్ధకాలమున సమీప ప్రాచ్యమందును, తదితర ప్రాంతములందును తమ తమ లక్ష్యములు సిద్ధించిన ఎడల, యుద్ధానంతరము కాన్‌స్టాంటినోపుల్‌ను, డార్డ్‌నెల్స్, బాస్‌ఫరస్ పరిసర ప్రదేశములును రష్యన్ సామ్రాజ్యమందు చేర్చబడునని రష్యా ప్రభుత్వమునకు రహస్యముగ హామీలను ఇచ్చిరి. ఇట్టి హామీలను ఇచ్చిన ఒడంబడికలే 'కాన్‌స్టాంటినోపుల్ ఒడంబడికలు' అని వ్యవహరించబడుచున్నవి. ఈ ఒడంబడికలు పై రెండు పాశ్చాత్యదేశములును ప్రాచ్య దేశీయ సమస్యల విషయమై అవలంబించు సాంప్రదాయిక వైఖరిలో గొప్ప మార్పును సూచించెను. రష్యన్‌లను ప్రలోభ పెట్టనిచో వారు ప్రత్యేక సంధిని చేసికొందురని పై రెండు దేశముల వారును భయపడుటయే ఈ రహస్యపు ఒడంబడికల మూలకారణము. కాని, రష్యా విప్లవము (1917) [చూ.] తరువాత బోల్షివిక్‌లు జార్ ప్రభుత్వము చేసికొనిన అన్ని ఒడంబడికలను నిరాకరించుచు, ఈ రహస్యపు ఒడంబడికలను వెలిపరుచుటతో (1918), పాశ్చాత్య రాజ్యములందును, యునైటెడ్‌స్టేట్స్ నందును మితవాదులు ఇట్టి రహస్య చర్యలను నిరసించుచు ఆందోళనలను లేవదీసిరి. ఇంతియే కాక, ఈ ఒడంబడికలను వెలువరించిన ఫలితముగ మిత్ర రాజ్యములపట్ల టర్కీ ప్రతిఘటనయు తీవ్రతరమైనది. స్వా. వెం.

**కాన్‌స్టాంటైన్** (క్రీ. శ. 288 ? - 337) : సుప్రసిద్ధ రోమన్ చక్రవర్తి; ఇతనికి 'మహనీయుడు' అని అర్థము కల బిరుదము కలదు. కాన్‌స్టాంటినస్ చక్రవర్తికి ఉపపత్నియందు ఇతడు జన్మించెను. ఇతని జనన వత్సరమును గురించి చారిత్రకులలో అభిప్రాయ భేదములు కలవు. కాన్‌స్టాంటినస్ మరణానంతరమున క్రీ. శ. 306, జూలై 25 న సేనానులు కాన్‌స్టాంటైన్‌ను పాలకునిగా ఒనర్చి, రోమన్ పాలకులు వహించు 'అగస్టస్' బిరుదమును అతనికి ఒసగిరి. కాని, పూర్వపు రాజునకు చట్టరీతిగ ఇతడు వారసుడు కాడను నెపమున ప్రాచ్య రోమన్ సామ్రాజ్య పాలకుడగు గలేరియస్ ఇతనిని 'అగస్టస్' గ గుర్తించుటకు సుముఖుడుగ లేకుండెను. అందుచేత తనను 'సీజర్' అను పదవిని పొందిన వానినిగ మాత్రమే గుర్తింప వలసినదిగ గలేరియస్‌ను కాన్‌స్టాంటైన్ అభ్యర్థించగ, గలేరియస్ అందుకు అంగీకరించెను. ఈ 'సీజర్' పదవి 'అగస్టస్' పదవి కన్న తక్కువది. కాని, కాన్

స్టాంటైన్ అప్పటికి అంతటితో తృప్తి వహించి క్రమముగ తన ప్రతిభావిశేషమువలన సైనిక బలమును ఆర్జించి, పరిసర దేశముల ఫ్రాంక్‌లను నిర్జించుటయే కాక, రోమన్ రాజకీయములందును ప్రముఖ స్థానము ఆర్జించెను. తత్ఫలిత ముగ రోమన్‌లలో ముఖ్య వర్గముల వారు ఇతనిని 'అగస్టస్'గ గుర్తించిరి (307). క్రీ. శ. 312 లో తన ప్రతికక్షి అయిన మెక్సెన్టియస్‌ను పరిమార్చి పశ్చిమ రోమన్ సామ్రాజ్యమునకు ఇతడు పాలకుడయ్యెను. ఆ తరువాత, క్రీ. శ. 315 నుండి తూర్పు సామ్రాజ్య భాగము నకు పాలకుడుగ ఉండిన లిసినియస్‌ను చంపి, క్రీ. శ. 324 లో కాన్‌స్టాంటైన్ అఖండ రోమన్ సామ్రాజ్యము నకు చక్రవర్తి అయ్యెను.

కాన్‌స్టాంటైన్ రోమ్ నగరమును ఆక్రమించుటకు పోవు సమయమున అతనికి మిట్టమధ్యాహ్నమున జ్వలించుచున్న ఒక సిలువ మింట గోచరించినదనియు, దానిపైన 'నీ పరిపాలనా కాలమున నీవు రోమ్‌ను జయించెదవు' అని ఉండెననియు, ఆనాటినుండి అతడు క్రైస్తవ మతావలంబి అయ్యెననియు క్రైస్తవ మతాను యాయులు అనెదరు. కాని, ఆనాటి రాజకీయ, సాంఘిక పరిస్థితులే కాన్‌స్టాంటైన్‌ను క్రైస్తవ మతమును అవలం బించునటుల చేసెననుట సరియగును. రోమన్ సామ్రాజ్య మున - ఆ కాలమున - రోమన్‌ల కన్న ఎక్కువగ ఇతర జాతులవారు ఉండిరి. వీరి అందరియందును సమానత్వ భావనను పెంపొందించుటకు క్రైస్తవ మతము ఎక్కువగ ఉపకరింపగలదని కాన్‌స్టాంటైన్ గ్రహింపగలిగెను. మతము అనుబంధము వీరిని అందరిని ఒక కుటుంబముగ మార్చి, విజేతలు అగు రోమన్‌ల ఎడ విజితులు అగు తక్కిన జాతుల వారికి కల విద్వేషమును అంతమొందింప గలుగుననియు, అందువలన సామ్రాజ్యమునకు సుస్థిరత చేకూర గలదనియు కాన్‌స్టాంటైన్ భావించి, క్రైస్తవ మతమును తాను అవలంబించుటయే కాక, ప్రజానీకమునందును దానిని వ్యాపింపజేసెను. మతము మూలమున తన నిరంకుశత్వ మును పూర్వము కన్న మిన్నగ దృఢతరమొనర్చుకొను సంకల్పముతో మత శాసన నిర్మాణాధికారము, మత వ్యవహార పరిష్కరణాధికారము తనవే అని ఈ చక్రవర్తి ప్రకటించెను.

క్రైస్తవ మతమును చక్రవర్తి ఇంతగ ఆదరించినను, రోమ్ నగరమునను, తత్పరిసర ప్రాంతములందును ప్రాచీన రోమన్‌ల బహుదేవతారాధనయు, విశ్వాసము లును దృఢముగ నిలిచియే ఉండెను. కావున ఈ రోమన్ ప్రాచీన మత విశ్వాసముల ప్రభావమునకు దూరముగ సామ్రాజ్య మధ్య ప్రదేశమున వేరొక ముఖ్య నగరమును నిర్మించుట సముచితమని చక్రవర్తి తలంచి, ఆసియా మైనర్ నందు కోటానుకోట్ల ధనమును వెచ్చించి, కాన్ స్టాంటి నోపుల్ (ఇస్తాంబుల్) నగరమును నిర్మించి క్రీ. శ. 330 లో దానిని తన రాజధానిగ చేసికొనెను. ఈ రాజ ధాని మార్పువలన క్రైస్తవ మతము విశాల వ్యాప్తిని ఆర్జించుటయే కాక, మున్ముందు రూపొందనున్న బైజాం టైన్ సామ్రాజ్యమునకును పునాది పడినది.

విజేతగను, క్రైస్తవ మత వ్యాపకుడుగను మాత్రమే కాక పరిపాలనాదక్షుడుగను కాన్‌స్టాంటైన్ ప్రసిద్ధిని ఆర్జించెను. సైనిక వ్యవహారములను పౌరపరిపాలనాశాఖ నుండి వేరు పరచుటయే కాక, ప్రముఖోద్యోగములందు రోమన్‌లతో పాటుగ తక్కిన జాతుల వారికిని ప్రతిభను అనుసరించి ఈతడు తావు కల్పించెను. ఇటుల వివిధ రంగములందు బహుముఖ ప్రజ్ఞను ప్రదర్శించుట వలననే ఇతనికి 'మహనీయుడు' అని బిరుదము లభింప గలిగెను. ప్ర. రా.

**కాఫీఖాన్** (1670 ? - 1740 ?): ఒక సుప్రసిద్ధ చరిత్ర రచయిత. ఇతని పూర్తినామము ముహమ్మద్ హాషిమ్ కాఫీఖాన్. దీనిలో కాఫీఖాన్ అనునది ఇతని బిరుదమని కొందరు తలచిరి కాని, అది సరియైనటుల కన్పట్టదు. భారత దేశమును పాలించిన మొగల్ రాజుల చరిత్రను, బాబర్ మొదలుకొని ముహమ్మద్‌ఖాన్ పరిపాలనా కాలపు పదు నాలుగవ సంవత్సరము (1737) వరకు, 'మున్‌తఖాబుల్ లుబాబ్ మహమ్మద్ షాహీ' అను గ్రంథముగ ఇతడు రచించెను. ఈ గ్రంథమునకే 'తారీఖ్ - ఇ - కాఫీఖాన్' అనియు పర్యాయ నామము కలదు. గ్రంథమందలి ఈతని వ్రాతలనుబట్టి చూడ 1688 కు పూర్వపు సంగతులను తన పూర్వీకులనుండి ఇతడు గ్రహించినటులను, 1688 తరువాత విషయములను తాను స్వయముగ ఎరిగియుండి వ్రాసి నటులను స్పష్టమగుచున్నది. ఇతడు ఔరంగజేబ్ కొలువులో చేరి తదాదిగ మొగల్ ప్రభువుల కొలువులోనే ఉండుట వలన విషయ సేకరణ ఇతనికి సుకరమైనది. నిష్పాక్షిక కథనమునకును, అభినివేశరహిత విమర్శనమునకును ఈతని గ్రంథము పేరొంది, మొగల్ సామ్రాజ్య చరిత్ర రచయిత లకు చక్కగ ఉపకరించినది. చీ. శే. రా.

**కాబినెట్** : చూ. మంత్రులసభ.

**కాబినెట్ ప్రభుత్వము**: చూ. భారత రాజ్యాంగము.

**కామన్‌వెల్త్** : బ్రిటన్ దేశమును, దానిచే ప్రస్తుతము పరిపాలింపబడుచున్న వలస రాజ్యములును, పూర్వము బ్రిటిష్ సామ్రాజ్యమున చేరి ఉండి తరువాత

స్వాతంత్ర్యమును ఆర్జించిన కొన్ని రాజ్యములును స్వేచ్ఛా పూర్వకముగ ఏర్పరచుకొనిన ఒక సమష్టి సంస్థకు ఇది సంక్షిప్తనామము. కామన్‌వెల్త్ ఆవ్ నేషన్స్ (నానా రాజ్య సమసంపత్తి) అనునది దీని సమగ్రనామము.

వివిధ ఖండములయందు అటనట చెదరి ఉండి, ప్రపంచమున దాదాపు నాలుగవ భాగమునకు పైగా ఆక్రమించి ఉండిన బ్రిటిష్ సామ్రాజ్యము చారిత్రక పరిణామముల వలన పరివర్తనమొందుటచే ఈ కామన్‌వెల్త్ రూపొందినది.

పదిఏడవ శతాబ్దిలో పశ్చిమార్ధగోళమునకేగి, బ్రిటిష్ దీవులందలి ప్రజలు వలస చేరుటతో బ్రిటిష్ సామ్రాజ్యమునకు అంకురార్పణ జరిగెనని భావింపదగును. విస్తృత జనసంపత్తిగాని, పాశ్చాత్యులకు తీసిపోవని నాగరకతా సంపత్తిగాని లేని దేశములందు ఇటుల వలస చేరిన ప్రజలు అచటి ఆదివాసులను మారుమూలకు తరిమివైచి, వారిలో చాల మందిని అంతమొందించుటచే కొలది కాలముననే ఈ వలస వచ్చిన వారలే అధిక సంఖ్యాకులై ఆ వలసలు శ్వేతజాతీయుల దేశములుగ మార్పొందినవి. ఇట్టివే యునైటెడ్‌స్టేట్స్, ఆస్ట్రేలియా, న్యూజీలండ్‌లు.

ఈ వలసదేశములందలి ప్రజలకు మాతృదేశముతో కల సంబంధము క్రమముగ మారజొచ్చినది. మాతృ దేశమగు బ్రిటన్ ప్రజలకు ప్రభుత్వమును ఎన్నుకొను అధికారము ఉండగ, తమకు అట్టి అధికారము లేదను అసంతృప్తి వారిలో రేకెత్తెను. ఈ ఆకాంక్షయందలి బలమును తొలుతగ ఇంగ్లండు గుర్తింపజాలక పోయినది. తత్ఫలితముగ ఉత్తర అమెరికాయందలి 13 వలసలును బ్రిటన్ నుండి చీలిపోయి వేరుగ 1783 లో యునైటెడ్‌స్టేట్స్ అనుపేర స్వతంత్రరాజ్యముగ రూపొందినవి. దీని వలన బ్రిటన్ తాను అనుసరించు వలస విధానమును మార్చుకొని, వలసలకు పరిమిత స్వయంపరిపాలన ఒసగ ఆరంభించినది. బ్రిటన్ రాజరికమును గుర్తించుచు తమ దేశమున దాదాపుగ అన్ని విషయములందును స్వతంత్రతను, బాధ్యతాయుత ప్రజాతంత్రపాలనను కలిగి ఉండు అధికారము వలసలకు ఇందువలన కలిగినది. ఈ ప్రతిపత్తికే 'అధినివేశ ప్రతిపత్తి (డొమినియన్ స్టేటస్)' అను పేరు కలదు. క్రమముగ కెనడా, న్యూఫౌండ్‌లాండ్, ఆస్ట్రేలియా, న్యూజీలండ్, దక్షిణ ఆఫ్రికా, ఐర్లాండ్ ఈ అధినివేశ ప్రతిపత్తిని ఆర్జించినవి. కాలక్రమమున ఈ ప్రతిపత్తికి విపులతర వ్యాఖ్యానము సిద్ధించినది. అందుచే మాతృ దేశమునుండి ఇష్టము వచ్చినపుడు విడివడి, తమ రాచరికపు బంధమును సైతము తెగ త్రెంపులు చేసికొనుటకు వలసలకు హక్కుకలదని బ్రిటన్ అంగీకరించినది (1931). అటుల అంగీకరించుటవలన ఆ అధినివేశములకు సంబంధించినంత వరకు సామ్రాజ్య భావన నశించి కామన్‌వెల్త్ రూపొందినది. కాని, ఆ అధినివేశములకు బ్రిటన్ వాసులతో కల రక్తసంబంధమును బట్టి దానిని 'బ్రిటిష్ కామన్‌వెల్త్ ఆవ్ నేషన్స్' అని ఆనాడు వ్యవహరించిరి.

కాని, బ్రిటిష్ ప్రభుత్వము అవలంబించిన ఈ విధానము ఆనాడు శ్వేతజాతి ఆధిక్యము వహించిన వలసలకు మాత్రమే పరిమితమైనది. బ్రిటిష్ సామ్రాజ్యమునందలి అధిక సంఖ్యాక ప్రజానీకము వసించు భారతదేశము మొదలగు శ్వేతేతర రాజ్యములకు దీనిని వర్తింప జేయుటకు బ్రిటిష్ ప్రభుత్వము తొలుత అంగీకరింపలేదు. కాని, రెండు ప్రపంచ యుద్ధముల వలన ప్రపంచ రాజకీయము లందు కలిగిన మార్పులకును, ఆసియా, ఆఫ్రికా ప్రజల ఆందోళనకును తలయొగ్గి బ్రిటన్ క్రమముగ భారత దేశము మొదలగు వానికి స్వాతంత్ర్యము ఒసగినది.

ఇటుల స్వాతంత్ర్యమొందిన ఆసియా, ఆఫ్రికా రాజ్యములకును, బ్రిటన్‌కును తొలుతటి పాలిత, పాలక సంబంధము తప్ప, వేరుగ సన్నిహిత సంబంధము ఏమియు లేకున్నను ప్రపంచ శ్రేయమును ఆశించి, ఒక నూతన సంబంధమును ఏర్పరచుకొనుటకు ఆ దేశములు బ్రిటన్‌తో సహకరించినవి. దానిఫలితమే నేటి కామన్‌వెల్త్. పూర్వపు కామన్‌వెల్త్ పదమునకు ముందున్న 'బ్రిటిష్' అను విశేషము నాటినుండి తొలగింపబడినది. కాని, బ్రిటిష్ రాచరికమును అంగీకరించుటకు మాత్రము అందు కొన్ని నిరాకరించినవి. వానిలో తొలుతటిది భారత దేశము. ఈ దేశము 1950 లో గణరాజ్యముగ రూపొందెను. కాని, బ్రిటన్ మొదలగు తక్కిన రాజ్యములు ఈ గణరాజ్యము సైతము కామన్‌వెల్త్‌నందు సభ్యత్వము కలిగి ఉండుటకు అంగీకరించినవి. భారతదేశము, తరువాత పాకిస్తాన్ మొదలగు తక్కిన కొన్ని రాజ్యములును గణరాజ్యములు అయినవి.

ఈ కామన్‌వెల్త్ సభ్యులను ఒక సంఘముగ రూపొందించిన శక్తి పరస్పర సౌహార్దత ఒక్కటియే. వేరు విధము లగు ఒడంబడికలు గాని, ఒప్పందములు గాని ఇందు లేవు. వీరి సౌహార్ద భావనకును, సమైక్యమును ఆశించు ఆకాంక్షకును ప్రతీకముగ మాత్రము బ్రిటిష్ రాణి గుర్తింపబడి, 'కామన్‌వెల్త్ మకుటము' అని వ్యవహరింపబడుచున్నది. ఇంతకు మించి శాసనములు, ఒడంబడికలు, సంప్రదాయములు మొదలగు వానివలన లభించిన వేరు అధికారములు ఏవియు ఆమెకు లేవు. ఇటుల నిర్దిష్టము, నిర్వచితము అగు విధి కాని, బాధ్యత కాని లేని సభ్యత్వము కలిగిన

దయ్యెను ఈ సంస్థ మానవ శ్రేయస్సునకు దోహదకారి కాగలిగినదనుట మాత్రము యథార్థము. శ్వేత, శ్వేతేతర జాతుల మధ్య సమైక్యమును నెలకొల్పుటకును, వ్యాపారాది వివిధ రంగములందు సాన్నిహిత్యమును నెలకొల్పి, పూర్వ విద్వేషముల నిర్మూలించుటకును ఈ సంస్థ చాల వరకు ఉపకరించుచున్నది.

ఇరువదవ శతాబ్ది ఆరంభమునందు బ్రిటిష్ సామ్రాజ్యమున చేరి ఉండిన రాజ్యములలో బర్మా, ఐర్లాండ్, దక్షిణ ఆఫ్రికా, బ్రిటిష్ సోమాలిలాండ్, దక్షిణ కామెరూన్ తప్ప తక్కినవి అన్నియు కామన్‌వెల్త్‌నందు నేడు సభ్యత్వమును కలిగి ఉన్నవి. పైన పేర్కొనిన ఐదు ప్రాంతములును వేర్వేరు కారణముల వలన బ్రిటన్‌తో తమకు గల సంబంధమును తెగ త్రెంపులు చేసికొనినవి. న్యూ ఫౌండులాండ్ 1949 లో కెనడాతో కలసి పోవుటచే తన ప్రత్యేకతను కోల్పోయినది.

ఈ నాడు కామన్‌వెల్త్‌నందు సభ్యత్వము వహించిన వివిధ దేశముల పట్టిక దిగువ ఈయబడినది:

కామన్‌వెల్త్ రాజ్యములు: 1. యునైటెడ్ కింగ్‌డమ్ 2. ఆస్ట్రేలియా 3. ఉగాండా 4. కెనడా 5. కెన్యా 6. గయానా 7. గాంబియా 8. ఘానా 9. జమైకా 10. జాంబియా 11. టాంజేనియా 12. ట్రినిడాడ్ అండ్ టొబాగో 13. నైజీరియా 14. న్యూజీలండ్ 15. పశ్చిమ సామోవ్ 16. పాకిస్తాన్ 17. భారత దేశము 18. మలావి 19. మలేసియా 20. మాల్టా 21. మాల్ దీవులు 22. సింగపూర్ 23. సింహళము 24. సియెర్రాలియోనీ 25. సైప్రస్ 26. చానెల్ దీవులు 27. జిబ్రాల్టర్ 28. మ్యాన్‌ద్వీపము 29. బ్రూనీ 30. హాంగ్‌కాంగ్ 31. ఏడెన్ 32. బ్రిటిష్ దక్షిణ ఆఫ్రికాప్రాంతములు (బసూటోలాండ్, బెచూనాలాండ్, స్వాజీలాండ్) 33. మారిషస్ 34. దక్షిణ రొడీషియా 35. సెయింట్ హెలీనా 36. సెయ్‌కెల్లిస్ 37. బహామా దీవులు 38. బెర్మ్యూడా 39. బ్రిటిష్ హొండురాస్ 40. ఫాక్‌లాండ్ దీవులు 41. వర్జిన్ దీవులు 42. వెస్ట్ ఇండీస్ దీవులు 43. ఫిజీ 44. పసిఫిక్ దీవులు 45. న్యూ హెబ్రిడిస్ 46. టోంగా.

వీనిలో తొలుతటి 25 మాత్రమే ఇప్పటికి (1966 సెప్టెంబరు) సంపూర్ణ స్వతంత్రరాజ్యములుగ సభ్యత్వము కలిగి ఉన్నవి. తక్కినవి యునైటెడ్ కింగ్‌డమ్‌చే పాలింపబడుచు, ఇంకను అస్వతంత్రముగా ఉన్నవి. పై దేశములను గురించిన వివరములు ఆ యా శీర్షికల క్రింద కననగును. చీ. శే. రా.

**కామెరూన్:** ఆఫ్రికా ఖండమందలి ఒక స్వతంత్ర రాజ్యము.

ఈ దేశమునకు చాడ్ సరస్సు [ఉ]; సెంట్రల్ ఆఫ్రికన్ రిపబ్లిక్, చాడ్ [తూ]; కాంగో రిపబ్లిక్, గెబన్, రియో ముని [ద]; గినీ సింధు శాఖ, నైజీరియా [ప] సరిహద్దులుగ ఉన్నవి. [వి] 4,75,442 చ. కి. మీ.; [జ] 45,95,000. వీరిలో 16,000 మంది మాత్రము యూరపియన్‌లు, తక్కినవారిలో ఆఫ్రికా ఖండమందలి వివిధ జాతులును కలరు; ఈ జాతులలో బంటూ జాతి [చూ. సం. 10 – పు. 538] వారి సంఖ్య అత్యధికము; తరువాత సంఖ్యాబలమును అనుసరించి లెక్కకు వచ్చువారు సెమిటిక్, హమిటిక్ జాతి ప్రజలు. [భా] ఈ వివిధ జాతుల ప్రజలును వివిధ భాషలు మాట్లాడుచుండుటచే జాతీయ భాషగ ఏ ఒక దేశీయ భాషయు పరిగణనను పొందలేక ఉన్నది. రాజకీయ వ్యాపార రంగములందు ఫ్రెంచి భాషయే సర్వత్ర ఆదరింపబడుచున్నది. [మ] మత విషయమునను దేశమున వైవిధ్యము మిక్కుటముగ కలదు. సెమిటిక్, హామిటిక్ జాతుల ప్రజలందరును ముస్లిమ్‌లు; తక్కిన దేశీయులలో పలువురు దేశీయ సాంప్రదాయిక మతములకు చెంది పితృదేవతలను, భూతములను, విగ్రహములను పూజింతురు. దాదాపు 11,22,500 క్రైస్తవులును కలరు. [రా] యావాన్‌డా (జ. సం. 36,727); ప్రముఖమగు రేవు పట్టణము దౌ ఆలా – బోనబేరీ (జ. సం. 1,14,113).




చరిత్ర: క్రీ. శ. 15 వ శతాబ్దికి పూర్వము ఈ దేశపు స్థితిగతులు ఏమియు తెలియవచ్చుటలేదు. 15 వ శతాబ్దిలో కొందరు పోర్చుగీస్ నావికులును, వర్తకులును, మత ప్రచారకులును ఈ ప్రాంతమును సందర్శించినటుల తెలియవచ్చుచున్నది. కాని, వారు సైతము ఇచట స్థావరములను వేటిని స్థాపించుకొనలేదు. ఇక కామెరూన్ ఆధునిక

చరిత్ర 19 వ శతాబ్దితో ప్రారంభమయ్యెనని చెప్పవచ్చును. 1884 లో జర్మన్ దేశాన్వేషకుడు గస్టవ్ నక్టిగల్ ఈ ప్రాంతమున పర్యటించి, స్థానిక పాలకులతో మైత్రి సలిపి, వారందరిని జర్మన్ ప్రభుత్వ రక్షణలో చేరునటుల ప్రోత్సహించి, ఆ రీతిగ కామెరూన్‌ను జర్మన్ రక్షిత రాజ్యముగ చేసెను. ప్రథమ ప్రపంచ యుద్ధమున జర్మనీ ఓడిపోయిన తరువాత జరిగిన సంధిని అనుసరించి ఈ రక్షిత రాజ్యమున అయిదవ భాగము బ్రిటిష్‌వారికిని, నాలుగు భాగములు ఫ్రెంచి వారికిని లభించెను. ఫ్రెంచివారికి లభించిన భాగమే ప్రస్తుతము పేర్కొనబడు కామెరూన్ నందు అత్యధిక భాగమును ఆక్రమించి ఉన్నది. ఫ్రెంచివారు నానాజాతిసమితి [చూ.] పర్యవేక్షణకు లోబడి ఈ ప్రాంతమును పాలించిరి. వారి ఆధిపత్యకాలమున ఆర్థికముగ దేశము పురోగమించెను. కాని, రాజకీయముగ మాత్రము దేశము దాస్యమునకు లోబడెను. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరము 1946 లో ఈ దేశము ఐక్యరాజ్యసమితి ధర్మకర్తృత్వ ప్రాంతముగ లెక్కలోనికి వచ్చెను. అంతట దేశీయులలో స్వాతంత్ర్యమునకై ఆకాంక్ష పెచ్చుపెరిగెను. ఇంతలో ఫ్రెంచి జాతీయ సభలో కామెరూన్‌కు ప్రాతినిధ్యము కల్పింపబడుటయే కాక, దేశమున ఎన్నుకొనబడిన శాసనసభయు నెలకొల్పబడి, దేశవాసులకు పరిమిత స్వతంత్రాధికారములు ఒసగబడెను. కాని, కామెరూన్ వాసులు అంతటితో తృప్తిపడక సంపూర్ణ స్వాతంత్ర్యమునకై తీవ్రాందోళనను, పోరాటమును సాగించిరి. 1960, జనవరి 1 వ తేదీ నాటికి తమ దేశము సర్వస్వతంత్రము కావలెనని 1958 లో కామెరూన్ శాసనసభవారు ఒక తీర్మానమును ఆమోదించిరి. ఈ తీర్మానమునకు ఐక్యరాజ్యసమితియును తమ అంగీకృతిని తెలియజేసెను. అంతట ఫ్రెంచివారు నూతన కామెరూన్ ప్రభుత్వమునకు దేశీయ వ్యవహార నిర్వహణయందు మాత్రము తొలుత సర్వస్వాతంత్ర్యము ఒసగిరి. క్రమముగ 1960, జనవరి నాటికి ఫ్రెంచివారు తమ అధికారములను అన్నిటిని వదలుకొనుటతో కామెరూన్ సర్వస్వతంత్రరాజ్యముగ అవతరణమొందెను. ఆ సంవత్సరమే ఫిబ్రవరి 21 వ తేదీన ఒక రాజ్యాంగ చట్టము ఆమోదింపబడెను. తదనుసారముగ ఎన్నికలు జరిగి జాతీయశాసనసభయు, తొలుతటి అధ్యక్షుడుగ అహిజో అను ఒక జాతీయ నాయకుడును ఎన్నుకొనబడిరి. ప్రక్కనే ఉన్న బ్రిటిష్ కామెరూన్స్ నందలి దక్షిణభాగము, అందలి ప్రజల స్వేచ్ఛాపూర్వక నిర్ణయమును అనుసరించి, ఈ దేశమున 1961 లో లీనమయ్యెను.

రాజ్యాంగము : ఆమోదితమగు రాజ్యాంగ చట్టమును అనుసరించి శాసనాధికారములు అన్నియు 100 గురు సభ్యులు కల జాతీయ శాసనసభ (నేషనల్ అసెంబ్లి) యందు న్యస్తమై ఉన్నవి. వయోజన వోటింగ్ పద్ధతిని అనుసరించి, ప్రత్యక్షపు ఎన్నిక ద్వారా జాతీయ శాసనసభయందలి సభ్యులును, అధ్యక్షుడును ఎన్నుకొనబడెదరు. ఈ శాసనసభకును, అధ్యక్ష పదవికిని ఎన్నికలు సాధారణముగ అయిదేండ్లకు ఒకసారి జరుగును. ఎన్నుకొనబడిన అధ్యక్షుడు ప్రధాన మంత్రిని, మంత్రిమండలి సభ్యులను నియమించును. శాసనసభకు బాధ్యత వహించి మంత్రిమండలి ప్రధాన మంత్రి ఆధ్వర్యవమున పరిపాలన నిర్వహించును. శాసన సభ విశ్వాసమునకు దూరులైన మంత్రిమండలియు, ప్రధానియు రాజీనామాను ఈయవలెను. 18 నెలల లోపున రెండు మంత్రిమండలులను శాసన సభ తొలగించినను లేదా శాసన సభలో మూడింట రెండు వంతుల సభ్యులు ఆ విధముగ కోరినను అధ్యక్షుడు శాసన సభను రద్దుచేసి తిరిగి ఎన్నికలు జరుపవలెను. న్యాయశాఖకు ఇందు స్వతంత్రాధికారములు కలవు. ప్రతి పౌరునికి మత స్వాతంత్ర్యము కలదు. చీ. శే. రా.

**కార్టెజ్, హెర్నాండో** (1485 - 1547) : స్పానిష్ సాహసికుడు; దేశాన్వేషకుడు. 1504 లో పడమటి ఇండియా దీవులకు నౌకాయాత్రచేసి, సెంటోడోమింగో దీవిలోని స్థానిక జాతుల విప్లవములో అతడు చూపిన సాహసములకు ఫలితముగ స్పానిష్ గవర్నర్ చే ఒక నౌకాదళాధిపతిగా నియుక్తుడయ్యెను. 11 చిన్న నౌకలు, 700 మంది నావికులు గల ఆ నౌకా దళముతో కార్టెజ్ అప్పటికి కొలది కాలము క్రితమే కనుగొనబడిన మెక్సికోను ఆక్రమించుకొనుటకు బయలుదేరి, 1509 లో 'శాన్ జువాన్ డ ఉల్లోవా' రేవులో దిగెను. మొదట 'వెరాక్రుజ్' అను నగరమును మెక్సికో సింధుశాఖ తీరమున స్థాపించి, పిమ్మట కొందరు అనుచరులతో అజ్‌టెక్ జాతివారి రాజధాని అగు టెనోక్టిట్లాన్ (నేటి మెక్సికో) నగరమునకు వెడలెను. అజ్‌టెక్ రాజు మాంటిజుమా సాదరముగ ఆతిథ్యమిచ్చినను, తమను నగరమునుండి పారద్రోలుటకు జరుగుచున్న ఒక కుట్రను గుర్తించి కార్టెజ్ మాంటిజుమాను ఖైదీగా పట్టుకొనెను. చాల బంగారమును, వజ్రములను పరిహారముగా గ్రహించి తుదకు ఆ చక్రవర్తిని విడచిపుచ్చెను.

తర్వాత కొంత కాలమునకు అజ్‌టెక్ జాతివారు తమ చక్రవర్తి మీదను, స్పానియర్డ్ల మీదను కూడ తిరుగబడిరి. ఆ విప్లవములో మాంటిజుమా హతుడయ్యెను. మెక్సికో నగరమునుండి స్పానియర్డ్లను అజ్‌టెక్‌లు 6 రోజుల పాటు -

తరిమి కొట్టిరి. తుదకు 'ఓటుంబా' మైదానములో జరిగిన యుద్ధములో స్పానియర్‌లు అజ్‌టెక్‌లను ఓడింప గలిగిరి. దగ్గరలో గల అజ్‌టెక్ విరోధి జాతులనుండి సైనికులను ప్రోగుచేసికొని కార్టెజ్ 1521, ఆగస్టు 13 న తిరిగి మెక్సికో నగరమును పట్టుకొనెను. స్పెయిన్ రాజు చార్లెస్-V మెక్సికోకు కార్టెజ్‌నే ప్రథమ గవర్నర్‌గ నియమించెను. కాని, 1928 లో కొన్ని నిందారోపణలకు జవాబు చెప్పుకొనుటకై అతడు స్పెయిన్‌నకు రావింపబడెను. ఆ ఆరోపణలు నిరాధారములని రుజువైనను కార్టెజ్‌నకు మెక్సికోలో తిరిగి వెనుకటి అధికారము సిద్ధింపలేదు. 1536 లో కార్టెజ్ దిగువ కాలిఫోర్నియాను కనుగొనెను. స్పెయిన్‌లోని సెవిల్లీ ప్రాంతమున 1547 లో కార్టెజ్ మరణించెను [చూ. దేశాన్వేషకులు]. బొ. శ్రీ.

**కార్డినల్ రిష్‌లూ :** చూ. రిష్‌లూ, కార్డినల్.

**కార్తేజ్ :** ఫోనీషియన్‌లు అను ప్రాచీన జాతివారు ఆఫ్రికా ఖండపు ఉత్తర తీరమున స్థాపించుకొనిన వలస రాజ్యము కార్తేజ్. అది పశ్చిమ మధ్యధరా ప్రాంతములోని వాణిజ్యమునకు అంతకును ప్రధాన కేంద్రముగా పెంపొందినది. క్రీ. పూ. 500 ప్రాంతముననే కార్తేజ్ బలమైన సైన్యముతో జైత్రయాత్రలకు సన్నద్ధమై, ఇతర ప్రాంతములకు కూడ తన రాజ్యమును విస్తరింప చేయ యత్నించుచుండెను. ఈ రాజ్యపు ముఖ్య నగరమగు కార్తేజ్ మధ్యధరా సముద్ర ప్రాంతపు పశ్చిమభాగమున ఒక ముఖ్యమైన రేవుపట్టణము. ఈ రేవుపట్టణము మంచి కీలకస్థానమున ఉండుటవలన వాణిజ్యాభివృద్ధితోపాటు కార్తజీనియన్‌లు తమ సామ్రాజ్యమును కూడ పెంపొందించుకొనిరి. ఆఫ్రికా ఉత్తర తీరమున తూర్పున సైరనీ, దక్షిణమున సహారా ఎడారి, పశ్చిమమున జిబ్రాల్టర్ జలసంధి ఎల్లలుగా కలిగి ఉన్న దేశమంతయును, సార్డీనియా, కార్సికా ద్వీపముల తూర్పు భాగములును, సిసిలీ ద్వీపపు పశ్చిమభాగమును, దక్షిణ స్పెయిన్, బాలరిక్ ద్వీపములును కూడ నాడు కార్తజీనియన్ సామ్రాజ్యమున చేరి ఉండెను.

రోమన్‌ల వలె వ్యవసాయముపై కాక, కార్తజీనియన్‌లు వాణిజ్యముపై ఆధారపడి ఉండిరి. ఆ వాణిజ్యముపై వచ్చు లాభములతో వారు తమ సైన్యమును వృద్ధిచేసికొనుచుండిరి. బానిసలచే వారు తమ వ్యవసాయపు పనులను చేయించుకొనుచుండిరి. పరిపాలకులుగా పేరునకు ఇరువురు న్యాయాధిపతులు ఎన్నుకొనబడినను, వాస్తవమునకు మాత్రము పరిపాలనాధికారము ధనికులైన వర్తక ప్రముఖుల చేతిలోనే ఉండెడిది. పరిపాలకులుగా వారు విశేష నైపుణి కలిగి ఉండిరి.

కార్తేజ్ నాగరకతలో ప్రాచ్య వైఖరి విస్పష్టముగ కనిపించుచుండెను. వారి నాగరకతపై గ్రీక్ ప్రభావము అసలు లేదనే చెప్పవచ్చును. గృహ పరిశ్రమల విషయములోను, కట్టడముల విషయములోను కూడ కార్తజీనియన్‌లు గ్రీక్‌లతో సర్వవిధముల సరితూగుచుండిరి. కార్తేజ్ రోమ్‌నకు మూడు రెట్లు విస్తీర్ణము గల ఒక మహానగరము. వర్తకపు నౌకలును, ఎగుమతి-దిగుమతులకు అవసరమగు గిడ్డంగులును కల ఒక సమగ్రమైన ఓడరేవు ఈ నగరమునకు ఉండెడిది. పట్టణము సముద్ర తీరము నుండి లోప్రదేశమునకు వ్యాపించి, నిరంతరము జనులు కిటకిట లాడుచుండెడి వ్యాపార కేంద్రములతోడను, అనేక పరిశ్రమలతోడను సర్వదా ప్రతిధ్వనులు ఈనుచుండెను. పని పాటులు చేయు కార్మికుల ఇండ్లకు వెనుకగా పెద్దపెద్ద తోటల మధ్య ధనిక వర్తకుల ఇండ్లు ఉండెడివి. వీటి అన్నిటి చుట్టును గల బ్రహ్మాండమైన ఒక ప్రాకారముతో నగరము శత్రు దుర్భేద్యమై ఉండెను. నానాటికి బలవత్తరమగుచుండిన ఉత్తర ఆఫ్రికాలోని ఆ వాణిజ్య సామ్రాజ్యముతో శత్రుత్వమే వచ్చినచో తమగతి ఏమగునో అని రోమ్ పాలక సభలోని ప్రతి సభ్యుడును తహతహలాడజొచ్చెను.

చివరకు రోమన్‌లకు కార్తేజ్‌తో యుద్ధము తప్పలేదు. సిసిలీ ద్వీపమందలి మెస్సీనా నగరమును ఆ ద్వీపమందలి సైరక్యూజ్ నగరపు గ్రీక్ ప్రభువు ముట్టడింపగా తొలి పక్షమువారు రోమన్‌లను, రెండవ పక్షమువారు కార్తేజ్‌ని సాహాయ్యము అర్థించిరి. ఈ విధముగా క్రీ. పూ. 264 లో కార్తేజ్‌తో రోమన్‌లకు యుద్ధము ప్రారంభమైనది.

ఇటలీ తీరప్రాంతమున వరుసగా రెండు నౌకా యుద్ధములలో రోమన్‌లకు విజయము కలిగినది. కాని, కార్తేజ్‌పై దండయాత్రలో కార్తజీనియన్‌లు రోమన్‌లను పూర్తిగ ఓడించిరి. తుపానుల వలన రోమన్ నౌకాదళము కూడ విధ్వస్తమై పోయినది. అయినను రోమన్‌లు పట్టు విడువక క్రీ. పూ. 242 నాటికి 200 నౌకలు గల దళముతో తయారైరై, కార్తజీనియన్‌ల నౌకాదళమును పూర్తిగా నిర్మూలించి వేసిరి (క్రీ. పూ. 251). తత్ఫలితముగ కార్తజీనియన్‌లు కఠినమగు షరతులతో కూడిన సంధికి అంగీకరించవలసిన వారైరి. ఆ సంధి ప్రకారము వారు సిసిలీ ద్వీపమును, తత్సమీపమున గల మరికొన్ని ద్వీపములను రోమ్‌నకు వదలివేయవలసి వచ్చుటయే కాక, 3,200 టేలంట్లను ($3\frac{1}{2}$ మిలియన్‌ల డాలర్లకు పైగా) కప్పము కూడ వారికి చెల్లింపవలసి వచ్చెను (క్రీ. పూ. 241). 23 ఏండ్లకు పైగా సాగిన ఈ యుద్ధము ఈ విధముగా రోమన్‌ల అఖండ విజయముతో పరిసమాప్తమైనది.

కాని, ఈ రెండు దేశముల మధ్య వైరము అంతటితో సమయలేదు. సహజముగానే కార్తేజ్, రోమ్ దేశములు తిరిగి తమతమ బలములను పెంపొందించుకొనసాగినవి.

తుదకు కార్తజీనియన్‌లు సార్డీనియాలో జీతములు ఇచ్చి పోషించుచుండిన విదేశీయ సైన్యములో చెలరేగిన ఒక తిరుగుబాటును అవకాశముగా తీసికొని, రోమన్‌లు ఆ తిరుగుబాటుదారులకు సహాయముగ వెళ్లి, కార్తేజ్ అసమ్మతిని లక్ష్యము చేయకుండా సార్డీనియా, కార్సికా ద్వీపములను వశపరచుకొనిరి. ఆ సందర్భముననే 'పో' లోయ నుండి దండెత్తి వచ్చిన 'గాల్' లను కూడ రోమన్‌లు జయించి, వారికి పౌరస్వత్వములనైన ఈయకుండా, ఆల్ప్స పర్వతముల చెంత ఉన్న వారి దేశమును కూడ తమ సామ్రాజ్యములో కలిపివేసికొనిరి.

పై మూడు ప్రదేశములను కోల్పోవుట వలన కలిగిన నష్టమును కూడతీసికొనుటకై హేమిల్కార్ అను కార్తజీనియన్ సేనాని స్పెయిన్‌ను జయించి (క్రీ. పూ. 236 - 225) అక్కడ వెండి గనులను వశపరచుకొని, ఆ ధనముతో ఆ దేశీయుల సైన్యమును ఒకదానిని కూర్చుకొని, తిరిగి రోమ్‌ను జయించుటకు యత్నింపవలెనని ఆలోచన చేసెను. కాని, అతని ఆశయము సిద్ధింపక ముందే అతడు మరణించెను.

అయినను, అతని కుమారుడైన హానిబాల్ (క్రీ. పూ. 247 - 183) [చూ.] తండ్రిని మించిన కుమారుడై 24 ఏండ్ల చిన్న వయస్సుననే తండ్రి ఆశయములను సాధించుటకు నడుము కట్టెను. స్పెయిన్‌లో ఈబ్రోనది వరకును కార్తజీనియన్‌ల అధికారమును అతడు వ్యాపింప చేసెను. గాల్‌లతో యుద్ధమున మునిగి ఉన్న రోమన్‌లు స్పెయిన్‌లో హానిబాల్‌ను నిరోధించలేక పోయిరి. కాని, ఈబ్రోనదిని కూడ దాటి ఉత్తరముగా వెళ్లకుండా అతనితో ఒక సంధి మాత్రము చేసికొనిరి.

ఈ సంధికి కట్టుబడి ఉండునటుల నటించుచునే ఉభయ పక్షములును యుద్ధసన్నాహములను చేసినవి. నలుబదివేల సుశిక్షిత సైనికులతో హానిబాల్ బయలుదేరి స్పెయిన్ తూర్పు తీరమువెంట పయనించి ఇటలీపై దండెత్తెను. మంచు తుఫానుల వల్లను, తగిన బాటలు లేనందునను ఆల్ప్స పర్వతములను దాటుటలో హానిబాల్ సైన్యము అష్టకష్టములకును గురి అయ్యెను. దుర్గమమైన ఆ పర్వతములను దాటు సరికి హానిబాల్ సైన్యము నలుబది వేలలో ముప్పది నాలుగు వేలు మాత్రమే మిగిలెను. అయినను, హానిబాల్ ధైర్యము విడనాడక పురోగమించి మెరపువలె ఇటలీ ఉత్తర దిశలో దుర్గములను అధిగమించి, 'ట్రాసిమిన్' సరస్సు చెంత ఏమరు పాటుగా ఉన్న రోమన్ కాన్సల్ పైబడి, అతని సైన్యములను ముందువెనుక నుండి చుట్టుముట్టి జయమందెను; రోమన్ సైన్యము నాశనమైనది (క్రీ. పూ. 217).

పిమ్మట క్రీ. పూ. 216 లో రోమన్ ప్రజలు నూతన మంత్రులను (కాన్సల్‌లను) ఎన్నుకొని వెంటనే యుద్ధము చేసి కార్తజీనియన్‌లను ఓడింపవలెనని ఒత్తిడి చేసిరి. అందుచే ఆ నూతన మంత్రులు క్రొత్తగా డెబ్బదివేల సైన్యమును కూర్చుకొని హానిబాల్‌ను ఎదిరించుటకై ఇటలీ దక్షిణ దిశకు తరలి వెళ్లిరి. యుక్తిగా హానిబాల్ రోమన్‌ల సరఫరాలు గల 'కెనీ' అను ప్రదేశమును పట్టుకొని, అచ్చటి సరఫరాలు అన్నిటిని వశము చేసికొనెను. అంతట రోమన్ మంత్రులకు యుద్ధము సాగించుటో లేదా సరఫరాలకై తిరిగి వెనుకకు మరలుటో నిశ్చయించుకొనవలసిన సందిగ్ధ పరిస్థితి ఏర్పడినది. 55 వేల బలముతో రోమన్‌లు హానిబాల్ సైన్యమునకు రెండింత ఉండిరి. ఆశ్వికదళము మాత్రము రోమన్‌లకు 6 వేలును, అతనికి 10 వేలును ఉండెను. పైగా, హానిబాల్ ఆశ్వికదళము రోమన్‌దళము కంటె సుశిక్షితమైనది.

రోమన్ కాన్సల్ అగు 'వర్రో' గొప్ప వర్తక ప్రముఖుడు; యుద్ధములో మాత్రము అతనికి ఎట్టి అనుభవమును లేదు. హానిబాల్ తన సైన్యమును కొంత భాగము మధ్యగా నిలిపి, సమర్థములైన రెండు ఆశ్విక దళములను దానికి ఇరుప్రక్కలను నిలిపి, ఆ ఆశ్విక దళములకు వెనుకగా రెండు ప్రక్కలను చెరి ఆరువేల ఆఫ్రికన్ దళములను నిలిపెను. రోమన్‌ల ఆశ్విక దళములు కూడ ఇదే విధముగా ప్రధాన సైన్యమునకు ఇరు పార్శ్వములను కాపుగా నిలిచి ఉండెను. కాని, యుద్ధము ఆరంభమైన కొన్ని గంటల సేపటిలోనే రోమన్‌ల ఆశ్విక దళములను చెల్లాచెదరు చేసి, పారద్రోలి హానిబాల్ ఆశ్వికులు రోమన్ పదాతులను వెన్నంటి తరుమజొచ్చిరి. కార్తజీనియన్ పదాతులకును, ఆశ్వికులకును మధ్యభాగమున రోమన్ పదాతులు చిక్కుపడిరి. హానిబాల్ తన ఆఫ్రికన్ దళములను శరవేగముతో ముందుకు నడిపించి, రోమన్‌లను నలుదెసలనుంచి బంధించి వేసెను. ఆ విధముగ కార్తజీనియన్ చక్రబంధములో చిక్కువడిన రోమన్‌లను చిత్రవధ చేయుటలో హానిబాల్ మిగిలిన దినమంతటిని గడపెను. అనేకులు రోమన్ పురప్రముఖులును, పూర్వపాలకులును, పాలక సభాసభ్యులును మొత్తము కొన్ని వేల మంది రోమన్‌లు ఆ విధముగ ఆనాడు నిహతులైరి. నాడు రోమ్‌లో బంధు వియోగమునకై దుఃఖింపని కుటుంబము

ఒకటియు లేదు. రోమన్ యోధులు తమ పదవీ చిహ్నములుగా ధరించు బంగారు చెవి పోగులను కుంచములతో కొలిచి హానిబాల్ కార్తేజ్‌కి పంపెను. ఈ అఖండ విజయమును సాధించునాటికి హానిబాల్ సేనాని వయసు ముప్పది ఏండ్లు మాత్రమే. కాని, మహావీరుడగు ఆ యువక యోధునకు విరోధశక్తులు అసంఖ్యాకములైనవి. రోమన్‌లు తమ రాజనీతి నైపుణివలన గ్రీక్ ప్రజలను రెచ్చగొట్టి, వారిలో విప్లవము లేవదీసి, తన్మూలముగా మేసిడోనియన్‌లు హానిబాల్‌నకు సహాయపడకుండునట్లు చేయగలిగిరి. హానిబాల్‌నకు ఇటలీలో ఇతరత్ర జయము సిద్ధించుచున్నను, మధ్య ఇటలీని మాత్రము రోమన్‌లు తమ అధీనతలో నిలుపుకొనగలిగిరి. క్రమముగా రోమన్‌లు సైరక్యూజ్, కాపువా మొదలైన కొన్ని పట్టణములను తిరిగి జయించుట కూడ జరిగెను. ఇటలీలో పదేండ్లు గడచిన పిమ్మట హానిబాల్ తనకు ఇంకను అదనపు బలములు వచ్చిచేరిన కాని, రోమ్‌ను జయించు ఆశ లేదని తెలిసికొనెను. అతని సోదరుడైన హన్‌డ్రూబాల్ స్పెయిన్‌లో సైన్యములను సమకూర్చుకొని, హానిబాల్ సహాయార్థము ఇటలీ దిశగా వచ్చుచుండెను. మెటారస్ నదీతీరమున సైంటినమ్ అను ప్రాంతములో రోమన్‌లు హన్‌డ్రూబాల్ సైన్యములను పూర్తిగా ఓడించి, అతనిని వధించివేసిరి. అంతటితో హానిబాల్ ఆశలన్నియు అడుగంటి పోయినవి. రోమన్‌లు స్పెయిన్‌లోని తమ సైన్యములన్నిటిని సిపియో అను ఒక యువక వీరుని అధీనము చేసిరి. అతడు కార్తజీనియన్‌లను స్పెయిన్‌లో పూర్తిగా ఓడించి, అచ్చటినుండి వారిని తరిమివేసెను. దాని వలన హానిబాల్‌నకు తన దేశము నుండి సరఫరాలు అందునట్టి మార్గము కట్టుబడి పోయెను.

కార్తేజ్ పతనము: క్రీ. పూ. 203 నాటికి సిపియో ఆఫ్రికాలో కార్తజీనియన్ సైన్యములను రెండుపర్యాయములు ఓడించెను. కార్తేజ్ పాలకులు హానిబాల్‌ను స్వదేశమునకు పిలిపించిరి. క్రీ పూ. 202 లో కార్తేజ్ దేశములో గల 'జామా' వద్ద అంతిమ యుద్ధము జరిగినది. చివరకు కార్తజీనియన్ సైన్యములు పూర్తిగా ఓడిపోయినవి. క్రీ. పూ. 201 లో జరిగిన సంధిలో కార్తేజ్ రోమ్‌నకు పదివేల టేలంట్సు (11 మిలియనుల డాలరులకు పైగా) ఏబది ఏండ్లలో చెల్లించుటకును, 30 కంటె ఎక్కువ నౌకలు ఉంచుకొనకుండుటకును, రోమ్ అనుమతి లేనిదే ఏ దేశముతోను యుద్ధము చేయకుండుటకును ఒడంబడవలసివచ్చెను. అంతటితో కార్తజీనియన్ జాతి స్వాతంత్ర్యము నశించినది. అటుపిమ్మట ఏబది ఏండ్ల వరకును కార్తేజ్ పశ్చిమ మధ్యధరా ప్రాంతములో వాణిజ్యము సాగించినది. తరువాత దక్షిణ దిశనుండి తమపై దాడులు సలుపుచుండిన నుమీడియన్‌లతో ఆత్మరక్షణార్థము కార్తజీనియన్‌లు యుద్ధము చేసిరి. అది సాకుగాగొని సంధి షరతులు భంగపరచిరని రోమన్‌లు వారిపై దండెత్తి, క్రీ. పూ. 141 లో వారిని ఓడించి, కార్తేజ్ పట్టణమును పూర్తిగా నాశనము చేసిరి.

వి. నా.

**కార్మిక నియంతృత్వము**: చూ. కమ్యూనిజమ్. పు. 366.

**కార్య నిర్వాహక వర్గము, ప్రభుత్వము**: చూ. అధికార విభజనము. పు. 265.

**కాల్డియన్ సామ్రాజ్యము**: ప్రాచీన కాలమున యూఫ్రెటీస్, టైగ్రిస్ నదుల మధ్య ఏర్పడిన సామ్రాజ్యములలో కాలక్రమమును అనుసరించి చూడ కాల్డియన్ సామ్రాజ్యము మూడవది. ఈ సామ్రాజ్యము కొద్ది కాలము మాత్రమే నిలిచి ఉండెను. అసీరియా చక్రవర్తి సెనాకరిబ్ నాశనము చేసిన బాబిలోనియా నగరమును పునర్నిర్మించి కాల్డియన్‌లు దానిని తమ రాజధానిగా చేసికొనిరి.

క్రీ. పూ. 616 వ సంవత్సరములో కాల్డియన్ సామ్రాజ్యమును ఏలుచుండిన నబోపోలస్సార్ చక్రవర్తి అసీరియన్ సామ్రాజ్యముపై దండెత్తెను. కాని, తుదకు దానిని జయింపలేక పోయెను. పిమ్మట సైగ్జారిస్ అను మీడియన్ రాజుతో కలసి నినివేపై దండెత్తి, అతడు దానిని జయించెను. క్రీ. పూ. 605 లో కార్కెమిష్ అను ప్రదేశములో ఈజిప్షియన్‌లతో కలసి యుద్ధము చేయుచున్న అసీరియన్ సైనికులను కాల్డియన్‌లు పూర్తిగా ఓడించిరి. దీనితో సారవంతమగు మధ్యప్రాచ్యము అంతయు కాల్డియన్‌ల వశమైనది.

నెబ్యుకడ్‌నేజర్ అను అతడు కాల్డియన్ చక్రవర్తులందరిలోను ప్రముఖుడు. ఈతడు క్రీ. పూ. 604 మొదలు నలుబది సంవత్సరములు ఈ సామ్రాజ్యమును ఏలెను. నిరంతరము తమపై దాడులు సలుపుచుండిన యూదులతో యుద్ధము చేసి, క్రీ. పూ. 586 లో ఈతడు వారి రాజధాని అగు జెరూసెలెమ్‌ను సర్వనాశనము చేసెను.

నిరంతరము యుద్ధములలో మునిగి తేలుచుండినను నెబ్యుకడ్‌నేజర్ బాబిలోనియా నగరమును చాల సుందరముగా తయారు చేసెను. కట్టడములలోను, శిల్పకళలోను మొదట అసీరియన్‌లను అనుకరించినను, తుదకు వారిని అధిగమించెను. అనేక బాబిలోనియన్ దైవతములకు ఈతడు ఆలయములు కట్టించెను. ఇష్టార్ దేవతకై జరుగు ఉత్సవము నడచుటకు అతిమనోహరమైన ఒక ద్వారమును కట్టించెను. మర్డూక్ దేవాలయ గోపురము కూడ చెప్పు

కొన తగినదే; ఈ గోపురములో ఒక దానిపై ఒకటిగా అనేక అంతస్తులను కట్టించి వానిపై తోటలను వేసి పెంచెను. ఇవే చరిత్ర ప్రసిద్ధిగాంచిన ఏడువింతలలో ఒకటిగ కొని యాడబడు 'ఆకాశవనాలు'. నెబ్యుకడ్ నేజర్ కాలమున వర్తక వ్యాపారములు అభివృద్ధి పొందినవి. జ్యోతిశ్శాస్త్ర మున పలువిషయములు ఆనాడు కనుగొనబడెను. గ్రహ ములలో కుజుడు, బుధుడు, గురుడు, శుక్రుడు, శని అను అయిదు గ్రహములను కాల్డియన్‌లు కనుగొనిరి. ఈ అయిదు గ్రహములను ప్రజల భవిష్యత్తును నిర్ణయించు దేవతలుగ పరిగణించుచు వీరిపేర బాబిలోనియాలో దేవా లయములను కూడ వారు నిర్మించిరి.

అసీరియనులు ఎన్నడును కని విని ఎరుగని వినూతన పద్ధతులలో కాల్డియన్‌లు ఖగోళశాస్త్రవిజ్ఞానమును పెంపొం దించుకొనినను, శిల్పకళలో మాత్రము వారు అసీరి యన్‌లు పోయినంత దూరము పోలేకపోయిరి. క్రీ. పూ. 561 లో నెబ్యుకడ్ నేజర్ మరణముతో కాల్డియన్‌ల ప్రాభవము అంతరించినది. ఇటుల అల్పకాలము మాత్రమే ఈ సామ్రాజ్యము మనగలిగినను, ప్రపంచ సభ్యతపై శాశ్వత ప్రభావమును నెరపగలిగినది. చరిత్రలో - ముఖ్యముగ ఖగోళశాస్త్ర చరిత్రలో - కాల్డియన్‌లకు తమ ప్రతిభ మూలమున అనితరలభ్యమగు స్థానము లభించినది. గి. వేం. సీ.

**కాల్విన్, జాన్ :** చూ. సం. 7 - పు. 353.

**కాశ్మీర్ సమస్య :** భారతదేశమున అంతర్భాగము అగు జమ్మూ - కాశ్మీర్‌లోని ఒక భాగమును పాకిస్తాన్ దురాక్రమణ మూలమున వశపరచుకొనుటచేత ఏర్పడిన ఒక వివాదము. అంతర్జాతీయ న్యాయసూత్రములను అనుసరించి దురాక్రమణను తొలగించి సులభముగా పరిష్కరింపదగిన ఈ వాదము - దురదృష్టవశమున - అగ్ర రాజ్యముల ప్రచ్ఛన్న యుద్ధ రాజకీయముల మూలమున ఒక అంతర్జాతీయ సమస్యగ రూపుగొనినది. ఈ సమస్యను వివరించుటకు భూమికగ కాశ్మీరమును గురించిన కొన్ని విషయములను తెలియజేయవలసి ఉన్నది.

ఈ జమ్మూ - కాశ్మీర్ రాష్ట్రమునకు ఉత్తరమున కార కోరం పర్వతములును, తూర్పున టిబెట్‌ను, దక్షిణమున పంజాబ్‌ను, పశ్చిమమున పాకిస్తాన్‌ను సరిహద్దులందు కలవు. 'రాజతరంగిణి' అను సంస్కృత కావ్యములో కాశ్మీర్ ప్రాచీన రాజుల చరిత్రను కల్హణ [చూ. పు. 376] కవి వివరించెను.

ప్రాచీన కాలములలో ఇచ్చట నివసించిన ప్రజలు సర్పములను ఆరాధించే వారు. కాని, అశోకుని కాలము నాటికి (క్రీ. పూ. 245) బౌద్ధమత ప్రచారకులు ఈ దేశ మును సందర్శించి, బౌద్ధమతమును ఇచట వ్యాపింప చేసిరి. బౌద్ధమతమునకు క్షీణదశ ఏర్పడిన తరువాత హిందూ మతము కొంతవరకు వ్యాప్తిని ఆర్జించినది. సంస్కృత పండితులకు కాశ్మీరము నెలవయ్యెను. 14 వ శతాబ్ది ఆరంభమున హిందూ రాజ పరిపాలనము అంతరించి ముస్లిమ్ పాలనకు తావు ఒసగెను. ఆ శతాబ్ది అంతమున పాలించిన సికందరు అను పాలకుని కాలమున ఇస్లామ్ ఈ ప్రాంతమున విరివిగ వ్యాపించెను. 1586 లో దీనిని మొగల్ పాదుషా అక్బర్ చక్రవర్తి [చూ. పు. 260] జయించి, తన సామ్రాజ్యమున కలుపుకొనెను. పిమ్మట 1786 నుంచి 19 వ శతాబ్దములో సిక్కులు కాశ్మీర్‌ను జయించువరకును ఆఫ్ఘన్‌లు దీనిని పాలించిరి. సోబ్రవాన్ యుద్ధానంత రము [చూ. సిక్కులు] జరిగిన లాహోర్ ఒడంబడికను అనుసరించి హార్డింజ్ ప్రభువు కాశ్మీర్ దేశ పరిసర ప్రాంత ములందు గల పర్వత సంస్థానములపై అధికారమును రాజా గులాబ్ సింగ్‌నకు ఒప్పగించినాడు (1846). అంతే కాక, సిక్కుల సామ్రాజ్యము అగు పంజాబ్‌నకు చెంది ఉన్న కాశ్మీర్, హజారా సంస్థానములను కూడ అతనికి అమ్మివేసెను. కాని, గులాబ్ సింగ్ హజారాలోని ముస్లిమ్ మొరటుజాతి వారిని అదుపులో పెట్టుకొనలేక, 1847 లో జమ్మూకు ఆగ్నేయమున ఉన్న పంజాబ్ పీఠభూమిలోని స్వల్ప విస్తీర్ణముగల ప్రదేశమును స్వీకరించి హజారాను తిరిగి సిక్కులకు ఇచ్చి వేసెను. బ్రిటిష్ దళముల సాహాయ్యముననే ఇతడు కాశ్మీరమును ఆక్రమించినాడు. అప్పటి నుంచి కాశ్మీరముపై బ్రిటిష్ సార్వభౌమత్వము ఏర్పడినది.

కాశ్మీర్ దేశపు జనాభా 1941 లో 40, 21, 600 లోను మహమ్మదీయులే అధికసంఖ్యాకులుగ ఉండినను, హిందు వగు రాజే ఆ దేశమును ఏలుచుండెను.

ఇండియా 1947 లో రెండు భాగములుగ (పాకిస్తాన్, భారత దేశము) విభక్తమైన తరువాత ఆ రెండు రాజ్య ములును ఒక దానితో ఒకటి ప్రచ్ఛన్న రూపమున యుద్ధము చేయుటకు కాశ్మీర్ సమస్య ఒక హేతువైనది. 1947 వ సంవత్సరాంతమునకు కాశ్మీరము రణరంగముగ మారి ఘోర దుస్థితికి పాల్పడినది. కాశ్మీర్ సరిహద్దు ఆవల ఉన్న అనాగరక ముస్లిమ్ మూకలు పాకిస్తాన్ ప్రోద్బల సహాయములతో కాశ్మీర్‌పై దండెత్తి వచ్చి ప్రజలను హింసింపసాగిరి. అందుచే మహారాజును, ప్రజా ప్రతినిధు లగు షేక్ అబ్దుల్లా మొదలగు జాతీయ పక్ష నాయకులును ఇండియా సాహాయ్యమును కోరి, ఇండియన్ యూని

యన్‌లో చేరిపోవుటకు తమ అంగీకారము తెల్పగా, ఇండియా ప్రభుత్వము సేనలను పంపి శ్రీనగర్, జమ్మూ, పూంచ్‌లకు భద్రత చేకూర్చెను. ఎటులైనను ఈ క్లిష్ట సమస్యను శాంతియుతముగ పరిష్కరించుట మంచిదని భావించి 1948, జనవరిలో భారతదేశము ఈ విషయమును ఐక్యరాజ్య సమితికి నివేదించి, కాశ్మీర్‌నుండి పాకిస్తాన్ సేనలు తొలగునటుల చేయవలసినదనియు, భారత దేశీయ అంతరంగిక వ్యవహారమగు కాశ్మీర్ విషయమున పాకిస్తాన్ జోక్యము వహింపకుండ చూడవలసినదనియు కోరెను. భారతదేశమున కాశ్మీర్ విలీనము క్రమబద్ధము కాదని పాకిస్తాన్ వితండవాదన చేసెను. దురదృష్టవశమున యునైటెడ్ స్టేట్స్, బ్రిటన్‌లు ఈ సమస్యను ప్రచ్ఛన్న యుద్ధపు దృష్టితో మాత్రమే పరిశీలింప ఆరంభించుటచే, సరళమగు ఈ సమస్య క్లిష్ట రూపము పొందినది. అందువలన వివాద కారణమును వెనుకకు నెట్టి, యుద్ధ విరమణమును మాత్రమే సాధించుటకు ఐక్యరాజ్య సమితి కృషిచేసినది. కడకు జనవరి 1, 1949 నుండి యుద్ధ విరమణము భారత - పాకిస్తాన్ దేశముల మధ్య అమలులోనికి వచ్చి విరమణ రేఖకు ఆవల ఉండిన కాశ్మీర్ భాగము పాకిస్తాన్ వశమున మిగిలి పోయినది. అంతట పాకిస్తాన్ సేనలను ఆక్రమిత భాగమునుండి తొలగించిన తరువాత జనవాక్యమును అనుసరించి కాశ్మీరపు భవిష్యత్తు నిర్ణయింపబడుటకు అంగీకారము కుదిరినది. కాని, ఒప్పుకొనిన రీతిగ సేనలను వైదొలగించుటకు పాకిస్తాన్ అర్థ రహితములగు షరతులను విధించుటవలన జనవాక్య నిర్ణయమును జరుపుటకు అవకాశమే లేకపోయినది. ఇందులకై ఐక్యరాజ్య సమితి ప్రతినిధులు - 1950 లో డాక్టర్ ఫ్రాంక్‌గ్రాహం - జరిపిన కృషి వ్యర్థమైనది.

ఐక్యరాజ్య సమితియందు ఇటుల అపరిష్కృతముగ ఈ వివాదము నిలచిపోయినను, పాకిస్తాన్ ఆక్రమితమగు ప్రాంతముకాక మిగిలిన కాశ్మీర్‌నందు రాజ్యాంగ విధానమునకు రూపకల్పనను భారతదేశ ప్రభుత్వము ప్రజాస్వామ్య రీతిలో సాగించినది. 1951 లో జమ్మూ - కాశ్మీర్ ప్రజలు ఒక రాజ్యాంగ పరిషత్తును ఎన్నుకొనిరి. భారత దేశమున కాశ్మీర్ విలీనమును ఈ పరిషత్తు ధ్రువపరచినది. తరువాత నవంబరు, 1956 లో రాష్ట్రపాలనకై ఒక రాజ్యాంగ విధానము ఆమోదితమైనది. ఇంతలో జాతీయ పక్షనాయకులలో పలువురు ప్రముఖులను కాదని స్వతంత్ర కాశ్మీర్ నిర్మాణ కృషిని షేక్ అబ్దుల్లా బలపరచుట వలన, తన పక్షమువారి విశ్వాసమును అతడు కోల్పోవగ, అతడు ముఖ్యమంత్రి పదవినుండి తొలగింపబడెను. జనవరి 26, 1957 న అతని స్థానే గులామ్ మహమ్మద్ బక్షీ ప్రధానియై, కాశ్మీర్‌న ప్రజాప్రభుత్వ పాలనను నిర్వహించెను. ఈ కాలముననే కాశ్మీర్‌నకు ఐక్యరాజ్య సమితి సేనలను పంపి తన్మూలమున సమస్యా పరిష్కారమును సాధింప ఒక తీర్మానమును ఐక్యరాజ్య సమితియందు బ్రిటన్, ఆస్ట్రేలియా, క్యూబా, యునైటెడ్‌స్టేట్స్ ప్రతిపాదింపగ సోవియట్ రష్యా దేశము తన వీటో అధికారమును వినియోగించి దానిని అంతము చేసినది. ఇందులకు తోడుగ కాశ్మీర్ భారత దేశమున అంతర్భాగమను విషయమును తాను గుర్తించినటుల సోవియట్ రష్యా దేశము ప్రకటించినది. తదాదిగ ఈ వివాదము ఇటులనే అపరిష్కృతముగ నిలచి ఉండినది.

ఈ మధ్యకాలమున ప్రజాస్వామ్యము కాశ్మీర్‌న బాగుగ కుదురుకొనగలిగినది; క్రమముగ భారత దేశమునందలి తక్కిన రాష్ట్రముల వలననే అదియు గవర్నర్‌చే పాలింపబడు రాష్ట్రమైనది (ఏప్రిల్ 10, 1965). భారతదేశ సమైక్యమునకై తీసికొనబడు ఇట్టి చర్యలను పాకిస్తాన్ నిరసించుచు, దేశపు ఆంతరంగిక వ్యవహారములలో జోక్యము వహించుటయే గాక, కాశ్మీర్ సమస్యను పరిష్కరించుటకై సైన్యబలమును సమాయత్తము చేసినది. కమ్యూనిజమ్‌ను ప్రతిఘటించుటకై రూపొందిన సీటో, సెంటోలలో తనకు గల సభ్యత్వమును అవకాశముగ గ్రహించి, యునైటెడ్ స్టేట్స్‌నుండియు, తక్కిన నాటో రాజ్యములనుండియు అపారముగ యుద్ధసామగ్రి పాకిస్తాన్ సేకరించినది. ఇట్టి పరిస్థితులలో జన వాక్యపు ఒడంబడికకు కాలదోషము పట్టినటుల భారత ప్రభుత్వము స్పష్టముచేసినది.

కాని, 1962 లో భారతదేశముపై చీనా దండయాత్ర జరుపుట పాకిస్తాన్‌కు ఒక సదవకాశముగ పరిణమించినది. ఆ సమయమున కాశ్మీర్ సమస్య విషయమున భారత దేశము పాకిస్తాన్‌తో సామరస్య వైఖరిని అవలంబించని ఎడల బ్రిటన్ భారతదేశమునకు సాయపడరాదని పాకిస్తాన్ వాదించ మొదలిడినది. అంతట భారత - పాకిస్తాన్ విదేశాంగ మంత్రులు సమావేశమై కొంత కృషి జరిపిరి. కాని, మూల విషయములందే కల విభేదము వలన పరిష్కారము కుదరలేదు. 1963 మొదలుగ చీనా ప్రజాగణ రాజ్యముతో పాకిస్తాన్ సన్నిహితముగ మెలగ మొదలిడి, సమస్యను పరిష్కరించుటకై దౌర్జన్య మార్గమును అవలంబింప పూనుకొనినది. ఇందులకు తొలుతటి మెట్టుగ సాయుధులగు దుండగీడులను ఆక్రమిత కాశ్మీర్ నుండి శ్రీనగర్ లోయకు పంపి, అల్లరులను లేపుటకు పాకిస్తాన్ పూనుకొనినది (ఆగస్టు 5, 1965). ఇందులకు

ప్రతిక్రియగ భారతసేనలు యుద్ధవిరమణరేఖను దాటి దుండగీడుల మార్గములను నిరోధించవలసి వచ్చినది. అంతట పాకిస్తాన్ సేనలు అంతర్జాతీయసరిహద్దురేఖను దాటి భారత దేశములోని చాంబ్ పరిసరప్రాంతమునకు చేరుకొనినవి. శత్రుసైన్యములు ఈ వ్యూహమువలన కాశ్మీర్‌ను తక్కిన భారతదేశమునుండి విడివరచ ప్రయత్నించుట స్పష్టమైనంతనే, భారతసేనలు లాహోర్ వైపునకు నడచి, తీవ్ర ప్రతిఘటనను నిర్మూలించి, లాహోర్‌నగర ప్రాంతములను చేరుకొనినవి. అంతట ఐక్యరాజ్య సమితి జోక్యము వలన సెప్టెంబరు 20, 1965 న యుద్ధ విరమణము జరిగినది. తరువాత సోవియట్ రష్యా ప్రధాని కోసిగిన్ [చూ.] ఆహ్వానమును మన్నించి భారత ప్రధాని లాల్‌బహదూర్ శాస్త్రి [చూ.] యు, పాకిస్తాన్ అధ్యక్షుడు అయూబ్‌ఖాన్ [చూ. పు. 294] ను టాష్‌ఖండ్‌న సమావేశమై, కోసిగిన్ సహకారముతో అభిప్రాయైక్యమును కొంతవరకు సాధించి, ఉభయ దేశముల మధ్య గల సమస్యల పరిష్కారమున దౌర్జన్యమును నిషేధించుట మూలసూత్రముగ కల ఒక ప్రకటనను వెలువరించిరి. ఇదియే టాష్‌ఖండ్ ప్రకటన [చూ.]. భారత - పాకిస్తాన్ దేశముల మధ్య సంబంధములు మున్ముందు మెరుగగుటకు ఈ ప్రకటన మార్గము ఏర్పరుప గలదను విశ్వాసము ఇందువలన కలిగినది. చీ. శే. రా.

**కాస్ట్రో, ఫిడల్** (జ. ఆగస్టు 13, 1927) : క్యూబా విప్లవ నాయకుడు; ప్రధాన మంత్రి. హవానా యూనివర్సిటీలో న్యాయశాస్త్రమున డాక్టరేట్ పట్టమును పొందెను (1950). విద్యార్థి దశయందే ఇతడు విప్లవాత్మక చర్యలయందు ఆసక్తి పెంపొందించుకొనెను. న్యాయవాదిగా కొంతకాలము పనిచేసి, కాస్ట్రో శాసనసభలో ప్రవేశింప నిశ్చయించుకొనెను: కాని, ఇంతలో బటిస్టా అనువాడు బలప్రయోగముచే ప్రభుత్వమును చేజిక్కించుకొనుటతో (1952), తన ప్రయత్నమును విరమించుకొని, తనతో ఏకీభవించిన శతాధిక యువకులతో కలసి బటిస్టా వ్యతిరేకోద్యమమును ప్రారంభించెను (1953). సైనికుల బారకాసుపై అతడు చేసిన దాడి విఫలమయ్యెను. ప్రభుత్వము అతనిని బంధించి, 15 సంవత్సరముల జైలు శిక్ష విధించెను. కాని, 1955 లోనే విడుదలపొంది, అతడు కొంతకాలము న్యూయార్క్‌లోను, తదుపరి మెక్సికోలోను ప్రవాసము ఉండెను; మెక్సికోలో తన అనుచర వర్గమునకు విప్లవ చర్యలలో శిక్షణ ఇచ్చి, 1956 లో స్వదేశమునకు తిరిగివచ్చెను. బటిస్టా వ్యతిరేకులతో పెద్ద వాలంటీర్ దళమును సమకూర్చుకొని ప్రభుత్వమును కూలద్రోయుటకు తిరుగుబాటును లేవదీయగ, తత్ఫలితముగ 1959 లో బటిస్టా దేశమును విడిచి, డొమినికన్ గణరాజ్యమునకు పారిపోయెను. కాస్ట్రో క్యూబాయందు కమ్యూనిస్ట్ భావములు ఆలంబనముగ కలిగిన రాజ్యాంగ విధానమును నెలకొలిపి, తన్మూలమున యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వముతో వైరుధ్యమును కల్పించుకొనెను. ఆ వైరుధ్యము ఉభయదేశముల సంబంధములలో కొన్ని అవాంఛనీయ పరిస్థితులకు త్రోవదీసినది [చూ. కృశ్చేవ్, కెనెడీ, క్యూబా]. అ. వెం.

**కుక్, జేమ్స్** (1728 - 1779) : సుప్రసిద్ధ అన్వేషకుడు; ఆంగ్ల దేశీయుడు; దేశాన్వేషకుడు; భూగోళ, ఖగోళ శాస్త్రవేత్త. 1728 లో యార్క్‌షైర్ నగరమున జన్మించెను. బాల్యము నుండియు నౌకాయానమునందు అభిరుచి కలిగి, తత్సంబంధమగు విద్యను అభ్యసించి, 1755 లో నావికుడుగ చేరెను. ఇతడు చూపిన ప్రజ్ఞా విశేషములు, శ్రద్ధాసక్తులు, సమయస్ఫూర్తి ఇతనిని ఉత్తమ నావికుల కోవలోనికి తేగలిగినవి. 1767 నుండి న్యూ ఫౌండ్‌లాండ్, లాబ్రడార్ తీర భూములను అన్వేషించి పరిశోధించుటకు ఇతడు సర్వేయర్‌గ నియమింపబడెను. 1768 లో ఇతడు ఖగోళశాస్త్ర పరిశోధనలను చేసెను. 1771 లో స్వదేశమునకు తిరిగివచ్చి అత్యంత గౌరవప్రదమగు రాయల్ సొసైటీ సభ్యత్వమును ఇతడు పొందెను. జేమ్స్ కుక్ తాను సాగించిన నౌకా ప్రయాణములలో ఆస్ట్రేలియా, బటేవియా, న్యూగినీ, న్యూ హెబ్రిడిస్, ఈస్టర్ దీవులు, న్యూ కెలడోనియా, నార్‌ఫోక్ దీవులు, పైన్ దీవి, హవాయి ద్వీపమును కనుగొనెను. హవాయి ద్వీపవాసులతో చెలరేగిన వివాద కారణమున వారిచే ఇతడు హత్యకావింపబడెను. సూర్య గ్రహణములను గూర్చియు, తన ప్రయాణానుభవమును గూర్చియు గ్రంథములు రచించి, రచయితగ కూడ ఇతడు పేరొందెను. మ. అ. శ.

**కుజల కరక డఫిశస్** : చూ. కుషాన్‌లు.

**కుతుబుద్దీన్** (ప. 1206 - 1210) : భారతదేశమును పాలించిన ముస్లిమ్ ప్రభువులలో తొలుతటివాడు. ఇతని చరిత్ర కడు చిత్రమైనది. మొదట ఇతడు బానిస; తరువాత సేనాని; చివరకు చక్రవర్తి. పేదరికమునుండి పెరిగి రాచరికమును అనుభవించెను. ఒకనాటి సేవకుడు మరొకనాటికి సుల్తాను కాగలడనుటకు ఇతనిని దృష్టాంతముగా పేర్కొందురు. ఇతడు ఢిల్లీసుల్తానులలో ప్రథముడై విలసిల్లెను.

బానిసగ ఉండి కుతుబుద్దీన్ తన యజమానుడగు ఘోరీ మహమ్మద్‌ను మెప్పింపగలిగెను. ఇతని శక్తి సామర్థ్యములను తెలిసికొని మహమ్మద్ ఇతనిని భారతదేశముపై జరిపిన దండయాత్రలలో వినియోగించెను. ఈ సందర్భమున

కుతుబుద్దీన్ ప్రదర్శించిన ప్రజ్ఞా ఫలితముగ 1192 లో జరిగిన రెండవ స్థానేశ్వర యుద్ధానంతరము మిగిలిన హిందూరాజ్యములను జయించు బాధ్యత మహమ్మద్ ఇతనికి అప్పగించెను. ఇట్టి కార్యభారము కడు కష్టమైన దైనను, ఈ యోధుడు దానిని సంతృప్తికరముగ నిర్వహించెను. రెండవ స్థానేశ్వర యుద్ధము జరిగిన తరువాత పదిసంవత్సరములలో ఢిల్లీ, రణతంభోర్, కాశీ, కనోజి, అన్హిల్‌వార్, కాలింజర్ మొదలగు పట్టణములను జయించి, గంగా - సింధు నదుల మధ్యన ఉన్న ప్రదేశమును ఆక్రమించుకొనెను. ఇంతేకాక, సమర్థులగు సేనానుల సాహాయ్యమున బీహార్, బెంగాల్ రాష్ట్రములు కూడ ఇతనికి లోబడినవి. జయించిన ప్రదేశముల పరిపాలనను ఇతడు ఘోరీ మహమ్మద్‌కు సామంత ప్రభువుగాను, రాజ ప్రతినిధిగాను సాగించి, 1206 లో మహమ్మద్ మరణించిన వెంటనే స్వతంత్రుడై, భారత దేశమునందు స్థాపించిన ముస్లిమ్ రాజ్యమునకు మొదటి సుల్తానుగ సింహాసనము ఎక్కి రాజ్యపాలనము సాగించెను. రణరంగమున నిర్దాక్షిణ్యము కనబర్చినను, రాజ్య పాలన సాగించినపుడు లోబడిన ప్రజలను దయాదాక్షిణ్యములతో చూచెను. శత్రు సంహారములందు మాత్రమే కాక శాంతియుతవ్యాసంగము లందు కూడ ఇతనికి ఆసక్తి మెండు.

ఢిల్లీయందున్న కుతుబ్‌మినార్ ఇతనికి భవన నిర్మాణ కళయందున్న అభిరుచిని చాటును. ఇతడు తన మతవ్యాప్తికై పాటుపడి, మహమ్మదీయ చరిత్ర రచయితల ప్రశంసను పొందెను. 1210 లో ఇతడు చనిపోవుట చేత ఇతని రాజ్య పాలనము నాలుగు సంవత్సరముల కంటె ఎక్కువ సాగలేదు. గి. వేం. సీ.

**కుత్బ్‌శాహీలు :** చూ. గోలకొండ కుత్బ్‌శాహి వంశము - తెలుగు సంస్కృతి, సం. 3 - పు. 427.

**కుబ్లయ్‌ఖాన్** (1216 - 1294) : చీనా దేశమున మంగోల్ సామ్రాజ్యమును స్థాపించిన విజేత. ఈతడు చెంఘిజ్‌ఖాన్ [చూ.] పౌత్రుడు. సోదరుడగు మంగు సింహాసనారూఢుడై ఉన్న సమయమున కుబ్లయ్‌ఖాన్ చీనా పడమటి భూభాగములపై దాడి వెడలెను. 1259 లో సోదరుని మరణానంతరము ఈతడు రాజయ్యెను. 1276 లో ఈతడు దక్షిణ చీనాపై దాడి వెడలి, ఆ ప్రాంతమును కూడ తన రాజ్యమున చేర్చుకొనెను. విశాల చీనా సామ్రాజ్యమునకు ఈతడు ప్రభువయ్యెను.

ఈతడు కావించిన విదేశీదండయాత్రలు సఫలము కాలేదు. జపాన్‌ను ఆక్రమించు ఉద్దేశముతో తన నౌకా సైన్యమును పలుమార్లు పంపెను. ఆ దండయాత్రలలో చివరి దండయాత్ర 1281 లో జరిగెను. కాని, ఈతని కోర్కె ఫలించలేదు. చంపా దేశము (కొచ్చిన్-చీనా) ను ఇతడు తన సామంతరాజ్యముగ చేసికొనగలిగెను ; కాని, సైన్యము విరివిగ నష్టమయ్యెను. బర్మాలోని రంగూన్ ప్రాంతము వరకును ఈతని రాజ్యము విస్తరించినది. 1293 లో ఇండోనీషియాయందలి జావారాజ్యమున తన రాయబారికి జరిగిన అమర్యాదకు కినిసి, శిక్షించుటకు ఇతడు సైన్యమునంపి జావా ప్రభువుల నిర్మూలించెను. కాని, రాజ్యమును ఆక్రమించుకొనలేక పోయెను. దక్షిణ భారతదేశము, తూర్పు ఆఫ్రికా మొదలగు భూ భాగము లందలి రాజ్యములకు రాయబారులను, సైనికదళములను పంపి తన సర్వాధిపత్యమును గుర్తించునటుల చేయుటకు ఈతడు చాల కృషి చేసెను.

కుబ్లయ్‌ఖాన్ అనాగరక మంగోల్ జాతికి చెందిన వాడైనను, చీనీయ సంస్కృతీసారస్వతములచే ఆకర్షితుడై వాటిని అతడు స్వీయమొనర్చుకొనెను. ఖగోళ శాస్త్రమును అభిమానించి పెక్కు వేధశాలలను నిర్మించి, ఆ శాస్త్రమును పోషించెను. ఇటాలియన్ యాత్రికుడగు మార్కో పోలో సాయమున విదేశీయ విజ్ఞాన వేత్తలను చీనాకు రప్పించుకొన యత్నించెను. కాని, ఇతని కృషి ఫలించలేదు.

టిబెట్‌నందు అమలునందున్న లామా సంప్రదాయపు బౌద్ధమతమును చీనాయందు వ్యాప్తిలోనికి తేదలచి, టిబెట్ లామా అగు మతిధ్వజుని ఇతడు రప్పించెను. మతిధ్వజుని కృషి వలన మంగోల్‌లందు బౌద్ధము విరివిగా వ్యాపించినది. మతిధ్వజుడు టిబెట్‌నందు వాడుకలో ఉన్న దేవనాగరిలిపిని అనుసరించిన లిపిని చీనా, మంగోల్ భాషలకు కూడ అనువర్తించెను. కాని, అది విస్తృతముగ వ్యాప్తిలోనికి రాలేదు.

కుబ్లయ్‌ఖాన్ పెకింగ్‌ను 1264 సంవత్సరమున చీనా రాజధానిగ చేయదలచి, ఆ పట్టణ నిర్మాణమును 1274 సంవత్సరమునకు పూర్తి చేయించెను. ఈతడు 1294 వ సంవత్సరమున తన 78 వ ఏట మరణించెను. మ. అ. శ.

**కుమార గుప్తుడు - I** (413 - 455 ప.) : గుప్త వంశీయుడు. చంద్రగుప్తుడు-II యొక్క కుమారుడు. తండ్రి ఆనంతరమున కుమార గుప్తుడు రాజ్యపాలనము చేసెను. ఈతడు అశ్వమేధయాగముచేసి, మహేంద్రాదిత్యుడు మొదలగు బిరుదములను పడసెను. ఇతని రాజ్యారంభ కాలము శాంతిప్రదముగా ఉన్నను, కడపటి కాలమున సామ్రాజ్యము హూణుల దండయాత్రలకు గురి అయ్యెను. కుమారగుప్తుడు తన కుమారుడైన స్కంద

గుప్తుని ప్రచండ సైనిక నివహములతో వారిని ఎదుర్కొన పంపించి, కొంత కాలము వరకు పరదేశీయుల విజృంభణ మును అరికట్టించెను. కాని, స్కంధగుప్తుడు యుద్ధరంగ మున ఉన్న సమయముననే కుమారగుప్తుడు దివంగతుడు అయ్యెను. ఇతని శాసనములందును, నాణెముల మీదను శ్రీ మహేంద్ర, అశ్వమేధ మహేంద్ర, అజిత మహేంద్ర, సింహ మహేంద్ర, సింహ విక్రమ, వ్యాఘ్ర పరాక్రమ, శ్రీ ప్రతాపాది బిరుదనామములు కన్పట్టు చున్నవి. కుం. ఈ. దత్తు

**కుమారగుప్తుడు - II (475 - 477 ప.)** : నరసింహ గుప్తుని పిమ్మట కుమారగుప్తుడు-II రాజ్యమునకు వచ్చెను. ఇతడు రెండు-మూడేండ్లు మాత్రమే పాలించి మరణించెను. ఇతని రాజ్యకాలములో తెలుపవలసిన విశేషములు మృగ్యములు. కుం. ఈ. దత్తు.

**కురుష్** (మరణము క్రీ. పూ. 528) : ప్రాచీన పారసీక సామ్రాజ్య స్థాపకుడు. ఈతని పేరు పారసీక భాషలో 'కురుష్' అని వ్యవహరింపబడినను, గ్రీక్ రచ యితలు ఈ నామమును తమ లిపిలో వ్రాయుటలో వికృత మొనర్చి 'కైరస్' అని వ్రాసిరి. అది క్రమముగ తక్కిన పాశ్చాత్య లిపులలో ఇంకను మార్పుచెంది కడకు ఆంగ్లమున 'సైరస్' అను రూపమును పొందినది. ప్రాచీన పారసీక భాష సంస్కృత భాషకు అతి సన్నిహితము. పారసీకమునందలి 'కురుష్' అనునది సంస్కృతమునందలి 'కురు' శబ్దమునకు రూపాంతరము. హఖమనిషీ (అకిమి నీడ్) రాజ వంశమున ఇతడు జన్మించెను. ఇతని తండ్రి మొదటి కాంభోజ (కాంబిసిస్) రాజు.

కురు (కురుష్) ప్రభువు బాల్యకాలపు వివరములను గురించిన చారిత్రికాధారములు ఏవియు కనుపట్టుటలేదు. ఇతనిని గురించి వ్రాసిన గ్రీక్ చరిత్రకారుడు హెరొడోటస్ ఇతని బాల్యకాలమును గురించి ప్రజలలో వ్యాప్తి యందున్న కట్టుకథలతో తన గ్రంథమును నింపివేసెను. కాని, రాజ్యాధిపత్యము వహించిన దాదిగ - అందును ముఖ్యముగ బాబిలోనియాను జయించినది మొదలుగ - ఇతనిని గురించిన చారిత్రిక విశేషములు మాత్రము సోప పత్తికముగ తెలియవచ్చుచున్నవి. బాబిలోనియాను జయించినపుడు అతడు ఆ దేశమునకు ఒసగిన సందేశము ఒక శిలాఫలకమున చెక్కింపబడి ఉండుటచే దానివలన కొన్ని వివరములు తెలియవచ్చుచున్నవి. ఇందు చెప్పబడి నట్టి వివరములు గ్రీక్ రచయితలు టాలమీ, హెరొడోటస్ మున్నగువారు కురు ప్రభువు గురించి వ్రాసిన వివరములకు సరిపోవును. హెరొడోటస్ రచించిన చరిత్రను అనుసరించి చూడ ఈతడు 29 సంవత్సరములు పరిపాలించినటుల తెలియుచున్నది.

మిడియా దేశమును జయించిన కురు ప్రభువును బాబి లోనియా, ఈజిప్టు, లిడియా, గ్రీక్ దేశములోని స్పార్టా కలసి ఎదిరించిరి. క్రీ. పూ. 546 లో సార్డిస్ పట్టణమును స్వాధీనపరచుకొనుటతో లిడియా రాజ్యము అతని స్వాధీ నము అయ్యెను. లిడియాలో చెలరేగిన విప్లవమును అడచి, అయోనియా, కారియన్, లిసియన్ రాజ్యములను ఆక్ర మించెను. క్రీ. పూ. 539 లో బాబిలోనియా రాజ్యము కురు ప్రభువు హస్తగతమయ్యెను. క్రీ. పూ. 538 నుండి ఇతడు 'బాబిలోనియా చక్రవర్తి' అని, 'ప్రపంచ రాజ్య చక్రవర్తి' యని బిరుదనామములు వహించి పరిపాలించెను. బాబిలోనియా రాజ్యాంతర్భాగములగు సిరియన్ రాష్ట్ర ములు ఇతని రాజ్యమున చేరినవి. అసీరియన్ చక్రవర్తి నెబ్యుకడ్‌నేజర్ చే పాలస్తీనానుండి సిరియాకు తరిమి వేయబడిన యూదులు అందరిని తమ స్వదేశములకు తిరిగి పోవుటకు అనుమతించి, ఈ చక్రవర్తి వారి కృతజ్ఞతకు పాత్రుడయ్యెను.

ఈతని రాజ్యము ఈజిప్టునుండి సింధునదీతటము.వరకును, దక్షిణమున పారసీక సింధుశాఖనుండి ఉత్తరమున కాస్పియన్ సముద్రమువరకును వ్యాప్తిచెందినది.

ఈ విస్తృత రాజ్యమును రాష్ట్రములుగ విభజించి ఇతడు పాలించెను. కాని, ఇతని మరణానంతరము (క్రీ. పూ. 528) రాజ్య విచ్ఛిత్తి జరిగెను. చరిత్రకు తెలిసినంతవరకు కురు ప్రభువు ప్రపంచమునందలి మొట్టమొదటి ఆర్య చక్రవర్తి. క్రౌర్యమునకు పేరెన్నిక గాంచిన ప్రభువులు పాలించిన ఆ కాలమున దయామయుడగు ప్రభువుగ పాలన నెరపి, శత్రువులగు గ్రీక్‌లచే సైతము ఇతడు మహనీయుడను ప్రశస్తినందెను. మ. ఆ. శ.

**కువాయిట్** : ఆసియాలోని ఒక స్వతంత్ర రాజ్యము. పారసీక సింధుశాఖ తీరమందలి షేకు రాజ్యములలో ఇది ఒకటి. సౌదీ అరేబియా, ఇరాక్‌లతో ఈ దేశమునకు భూతలపు సరిహద్దు కలదు. తక్కిన సరిహద్దున పారసీక సింధుశాఖ చుట్టుకొని ఉన్నది. ఈ దేశపు వైశాల్యము, జనసంఖ్య మొదలగునవి వేరొకచోట ఈయబడినవి [చూ. పారసీక సింధుశాఖ తీరమందలి షేకు రాజ్యములు].

చరిత్ర : కువాయిట్‌నందు ప్రాచీన కాలమున వసించిన జనుల వివరములు ఏవియు తెలియవచ్చుటలేదు. 1716 లో దక్షిణ అరేబియానుండి వలసపోయిన మూడు అరబ్ జాతులు ఇట నెలవులను ఏర్పరుచుకొనుటతో ఇచట అరబ్ సంస్కృతికి, ఇస్లామ్ మతమునకు స్థావరము ఏర్పడినది.

తరువాత నౌకా నిర్మాణ కుశలురగు కొందరు అరబ్బులు బెహరీన్‌నుండి ఇటకు చేరి, తమ నైపుణ్యము మూలమున నౌకల నిర్మాణమునకును, మరమ్మతులకును ఈ ప్రాంత మును ఒక నౌకాకేంద్రముగ చేసిరి. 1756 లో షేక్ సాబా అబూ అబ్దుల్లా అను ప్రముఖుడు ఇచటి ప్రజలపై తన ఆధిపత్యమును నెలకొల్పి, నేటి రాజవంశమునకు మూలపురుషుడు అయ్యెను (ఈ దేశపు రాజు షేక్ అని వ్యవహరింపబడును). ఇస్లామ్‌న ఒక తీవ్రవాదపు సంప్ర దాయమునకు చెందిన వాహాబీర్‌లును, తుర్కులును ఈ రాజవంశపు పాలనను అంతమొందించుటకు యత్నము చేయగా, అప్పటి షేక్ అగు ముబారక్ బ్రిటిష్‌వారిని అర్థించి వారి రక్షణను ఆర్జించెను (1896). తుర్కులును, రష్యన్‌లును ఈ ప్రాంతమున పలుకుబడి సంపాదించినచో తమ సామ్రాజ్యమునకు నష్టము వాటిల్లగలదను భయము వలన బ్రిటిష్‌వారు ఈ షేక్‌ను రక్షించుటకు వాగ్దాన మొనర్చిరి. కాని, అతనిని ఒక స్వతంత్ర రాజుగ మాత్రము వారు గుర్తించలేదు. ప్రథమ ప్రపంచ యుద్ధము ఆరంభ మైన కొలది దినములకు బ్రిటిష్‌వారు కువాయిట్ ప్రభువు నకు గల స్వతంత్ర ప్రతిపత్తిని పరిగణించిరి. కాని, ఒడంబడిక మూలమున దేశమున కల ఆర్థిక, రాజకీయ వ్యవహారములలో తమ పలుకుబడిని మాత్రము పూర్వము వలెనే నిలుపుకొనిరి. 1920 లో ఇట పెట్రోల్ నూనె గనులు కనుగొనబడి, బ్రిటిష్ కంపెనీలు దేశమున పలుకు బడిని ఆర్జించుటకు అవకాశము కలిగినది. ద్వితీయ ప్రపంచ యుద్ధము తరువాత బ్రిటిష్ ప్రభుత్వము ఈ దేశపు సర్వ స్వతంత్ర ప్రతిపత్తిని గుర్తించి, తన అధికారములను అన్నిటిని వదలుకొనినది. కాని, కువాయిట్ కోరినపుడు రక్షణ భారమును తాను వహించుటకు మాత్రము ఒడంబడిక కుదుర్చుకొనినది. బ్రిటిష్ సేనలు ఇట నుండి వైదొలగిన కొలది దినములకే ఇరాక్ అధ్యక్షుడగు కాశిమ్ ఈ దేశము తన దేశమున ప్రాచీన కాలమునుండియు అంతర్భాగము గనే ఉండెననియు, బ్రిటిష్ వారి కుతంత్రముల ఫలితముగ వేరుపడెననియు చెప్పి, కువాయిట్‌ను ఆక్రమింప సంకల్పిం చెను. అంతట షేక్ కోరికపై బ్రిటిష్ సేనలు ఇట దిగి, దేశ రక్షణకై పూనుకొనెను. అరబ్ లీగ్ నందలి సాదీ అరేబియా, ఈజిప్టు మొదలగు దేశములును కువాయిట్ ఎడల సానుభూతిని చూపించెను. తత్ఫలితముగ కాశిమ్ సంకల్పము నెరవేరక పోయెను.

పెట్రోల్ గనుల వ్యాపారమువలన దేశమున రాజు యొక్కయు, పై తరగతులవారి యొక్కయు ఆర్థిక ప్రతిపత్తి విపరీతము అగు ఉచ్ఛస్థాయిని అందుకొన కలిగినను, దేశపు సామాన్య ప్రజానీకము ఇంకను దారి ద్ర్యములోనే మునిగి తేలుచున్నది. ఈ దుస్థితిని తొల గించుటకు షేక్ కృషిచేయుచున్నాడు. 1963, మే లో ఈ దేశము ఐక్యరాజ్య సమితి సభ్యత్వమును ఆర్జించినది.

ఈ దేశమున వంశానుగతము, నిరంకుశము అగు షేక్ పరిపాలన అమలునందు ఉన్నది. రాజకీయ చైతన్యము కొలదిగ ఉన్నను, రాజకీయ పక్షములు ఏర్పడుటకు ప్రభుత్వపు నిషేధము ఉండుటచే అవకాశము శూన్య మైనది. చీ. శే. రా.

**కుషాన్‌లు :** భారతదేశచరిత్రలో పేరొందిన ఒక రాజవంశము. వీరు విదేశీయులు. తొలుత వీరి పూర్వీకులు మధ్య ఆసియా యందలి అక్సస్ నదీ ప్రాంతమున వసించెడి వారు. ప్రాచీన చీనా చరిత్ర రచయితలు యూ - చీ లని పేర్కొనిన ఒక సంచార జాతియందు వీరొక తెగకు చెందినవారని పండితుల అభిప్రాయము. క్రీ. శ. 40 నాటికి ఈ యూ - చీ లు స్థిరనివాసములను ఏర్పరచుకొని అయిదు తెగలుగ చీలి ఉండిరి. వీనిలో ఒకటియగు కుషాన్ తెగకు నాయకుడగు కుజల కరకడఫిశస్ తన శక్తి సామర్థ్యములచే ఒక సామ్రాజ్యమును నిర్మింప గలిగెను. ఇతడు హిందూకుష్ పర్వతముల దాటి, సింధు నదికి పడమటను ఉన్న దేశమును ఆక్రమించి 'మహారాజాధి రాజ', 'సత్య ధర్మస్థిత' మొదలైన బిరుదములు వహించి భారతీయ సంస్కృతిని స్వీకరించి క్రీ. శ. 64 లో దివంగతుడు అయ్యెను.

ఇతని కుమారుడు కడఫిశస్ - II సింధునదిని దాటి తక్షశిలను, పంజాబ్‌ను జయించి మధురానగరము వరకును తన రాజ్యమును విస్తరింపజేసెను. ఇతడు తన పేర ముద్రింపజేసిన నాణెములలో కొన్నింట గ్రీక్ లిపిలో ఈతని పేరు 'వేమో' అని పేర్కొనబడినది. ఆ నాణె ములను బట్టి ఇతని కాలమున రోమన్‌లతో భారతీయులకు వాణిజ్య వ్యాపారములు సాగుచుండెనని తెలియవచ్చు చున్నది. ఆ నాణెములలో మహేశ్వర బిరుదమును ఇతడు వహించి ఉండుటచేతను, శివుని విగ్రహము చిత్రితమగుట వలనను ఇతడు శైవుడని భావించుటకు అవకాశము కలదు.

ఇతని తరువాత కుషాన్ రాజ్యము ఏలిన కనిష్కుడు (క్రీ. శ. 78 - 105 ప.) [చూ.] భారత దేశచరిత్రలో సుప్ర సిద్ధుడు. కనిష్కుని కుమారుడు వాసిష్కుడు 5 సంవత్సర ములు మాత్రమే రాజ్యము ఏలెను. ఇతనికి మహారాజ బిరుదమే కాక రాజాధిరాజ, దేవపుత్ర, కైసర అని బిరుదములు ఉండెను. వీనిలో 'రాజాధిరాజ' అనునది

ఇరాన్ ప్రభువులకు గల 'షాహ్ - ఇన్ - షా' అను దానికి అనువాద రూపము. 'దేవ పుత్ర' అనునది చీనా సామ్రాట్లకు కల బిరుదమునకు ప్రతి రూపము ; 'కైసర' అనునది రోమన్ ప్రభువులు వహించిన 'సీజర్' అను బిరుదమునకు వికృత రూపము. వీనివలన కుషాన్ ప్రభువులకు పారసీక, రోమన్, చీనా ప్రభువులతో గల సన్నిహిత దౌత్యసంబంధము వెల్లడి అగుచున్నవి.

వాసిష్కుని అనంతరమున హువిష్కుడు రాజయ్యెను. క్రీ. శ. 138 వరకు ఇతడు పాలించినటుల ఇతని నాణెముల వలన ఊహింపదగి ఉన్నది. హుష్క, జుష్క, కనిష్క అను తురుష్క ప్రభువులు కాశ్మీరమున తమ తమ పేరులతో వేర్వేరు నగరములను నిర్మింపజేసినటుల కల్హణుడు [చూ.] తన 'రాజతరంగిణి' యందు పేర్కొనినాడు. వీరిలో హుష్కుడనువాడు హువిష్కుడై ఉండునని చారిత్రకుల అభిప్రాయము. తక్కిన ఇరువురును, హువిష్కుని తరువాత రాజ్యమును పాలించిన వాసిష్క - II, కనిష్క - II లై ఉందురనియు వారి ఊహ. క్రీ. శ. 152 నుండి 176 వరకు రాజ్యమేలిన కుషాన్ ప్రభువు వాసుదేవుడు వీరి సంతతివాడనియే భావింపబడుచున్నది. ఇతని అనంతరమున రాజ్యమును పాలించిన వారిలో కనిష్కుడు - III, వాసుదేవుడు - II (క్రీ. శ. 210 - 230 ప.) అను వారి పేరులు వారి నాణెములవలన మాత్రమే తెలియనగుచున్నవి. వాసుదేవ - II యొక్క కాలమునకు కుషాన్ రాజ్యము క్షీణతను పొందగ, మాండలికులందరు స్వతంత్రులు అయిరి. ఆ వాసుదేవుని అధీనమున మిగిలిన అల్ప రాజ్యము తుదకు పారసీక సామ్రాజ్యమున అంతర్భాగము అగుటతో కుషాన్ రాజ్యము అంతరించెను. చి. శే. రా.

**కుషాన్ సామ్రాజ్యము :** చూ. కుషాన్లు.

**కృపలానీ, జీవత్‌రామ్ భగవాన్‌దాస్** (జ. 1888): ఇతడు చరిత్ర, ఆర్థిక శాస్త్రములలో ఎమ్. ఏ. పట్టమును పొంది, బీహార్‌లో ఆచార్యుడు (ప్రొఫెసర్) గా పనిచేసెను (1912 - 1917); స్వాతంత్ర్యోద్యమమున చేరి, 1917 లో మహాత్ముని అనుచరుడై చాంపరన్ సత్యాగ్రహమున పాల్గొనెను. 1918 లో మదనమోహన మాలవ్యాకు అంతరంగిక కార్యదర్శియై, మరుచటి ఏట బెనారస్ హిందూ యూనివర్సిటీలో రాజనీతి ఆచార్యుడుగా చేరెను. 1920 లో ఆ పదవిని విడిచి, కాశీ గాంధీ ఆశ్రమములో ఖాదీ గ్రామ సేవా కార్యక్రమమును నిర్వహించెను. 1922 - 27 లో గుజరాత్ విద్యాపీఠమునకు ప్రధానాచార్యుడుగ పనిచేసెను. 9 పర్యాయములు జైలు శిక్ష అనుభవించెను. 1934 నుండి 1946 వరకు కాంగ్రెస్ సాధారణ కార్యదర్శిగా పనిచేసి, 1946 లో అధ్యక్షుడుగా ఎన్నుకొనబడి, వర్కింగ్ కమిటీలోని పెద్దలతో పొత్తు కుదురక, 1947 లో అధ్యక్ష పదవికి రాజీనామా ఇచ్చెను. రాజ్యాంగ పరిషత్తు సభ్యుడై (1946 - 1951), కాంగ్రెస్ నుండి 1951 లో వైదొలగి, కిసాన్ మజ్‌దూర్ ప్రజాపార్టీని స్థాపించెను. ఈ పార్టీ సోషలిస్ట్ పార్టీలో లీనమై, ప్రజా సోషలిస్ట్ పార్టీ ఏర్పడిన తరువాత కృపలానీ క్రొత్త పార్టీకి 1954 వరకు అధ్యక్షత వహించెను. 1952, 1957 సాధారణ ఎన్నికలలోను, 1963 ఉప ఎన్నికలలోను లోక సభకు సభ్యుడుగా ఎన్నుకొనబడెను. 1963 మొదలుగ ఏ పార్టీలోను చేరక స్వతంత్రుడుగ వ్యవహరింపసాగెను. ఇతడు బహుగ్రంథ రచయిత. గాంధేయ పథమునుగురించి చక్కగ వివరింప గలిగిన ప్రజ్ఞావంతులలో ఇతడు ఒకడు. అ. వెం.

**కృశ్చేవ్, నికితా** (జ. 1894) : సోవియట్ రష్యా రాజనీతి వేత్త; ప్రధాన మంత్రి (1958 - 64). ఉక్రెయిన్‌లో బొగ్గుగని కార్మికుడైన ఒక నిరుపేద ఇంట పుట్టి, గొర్రెల కాపరిగా జీవితయాత్ర ప్రారంభించి, ఇతడు 20 ఏండ్ల ఈడు వచ్చిన తరువాత చదువుట, వ్రాయుట అలవరించుకొనెను. 1918 లో కమ్యూనిస్ట్ పార్టీలో సభ్యుడై, రెడ్ సైన్యములో చేరి, రష్యన్ అంతర్యుద్ధములో పోరాడెను. 1925 లో కృశ్చేవ్ స్టాలినోలో పార్టీ ఉద్యోగమును చేపట్టి, క్రమముగ 1934 లో కమ్యూనిస్ట్ పార్టీ కేంద్ర కమిటీకి ఎన్నుకొనబడి, మరుచటి సంవత్సరమున మాస్కో ప్రాంతీయ కమిటీ ప్రథమ కార్యదర్శి అయ్యెను. 1938 లో ఉక్రెయిన్ రాష్ట్ర కమ్యూనిస్ట్ పార్టీ ప్రధాన కార్యదర్శిగా నియమింపబడి, ఆ రాష్ట్రములోని జాతీయ ప్రావణ్యములను అణగద్రొక్క ఆదేశింపబడెను. అందు కృతకృత్యుడు కాగలిగిన ఇతనికి స్టాలిన్ పొలిట్‌బ్యూరో పూర్ణ సభ్యత్వమును కల్పించెను. ద్వితీయ ప్రపంచ యుద్ధములో ఉక్రెయిన్ జర్మనీ ఆక్రమణ క్రింద ఉన్నంత కాలము కృశ్చేవ్ లెఫ్టినెంట్ జనరల్‌గా గెరిల్లా ప్రతిఘటన ఉద్యమమును సాగించి శత్రు విమోచనానంతరమున ఆ రాష్ట్ర పురపాలక సమితికి అధ్యక్షుడుగ పని చేసెను (1943). స్టాలిన్ మరణించిన తరువాత 1953 లో ఇతడు సోవియట్ కమ్యూనిస్ట్ పార్టీ ప్రథమ కార్యదర్శి పదవిని, 1958 లో ప్రధాన మంత్రి పదవిని అధిష్ఠించెను.

కృశ్చేవ్ పరిపాలనలో సోవియట్ శాస్త్ర విజ్ఞాన ప్రగతి పరాకాష్ఠను అందుకొనినది; ప్రప్రథమముగా ఒక రష్యన్ వ్యక్తి రోదసీ ప్రవేశము చేయగలుగుటయు, మానవుని చంద్రమండల ప్రస్థానమునకు అంకురార్పణయు జరిగినవి; స్టాలిన్ కాలమునాటి వైయక్తికారాధనకు,

నిర్దాక్షిణ్య ఏక వ్యక్తి నియంతృత్వమునకు స్వస్తి చెప్పబడినది. 1959, ఫిబ్రవరిలో జరిగిన 21 వ కమ్యూనిస్టు కాంగ్రెస్‌లో కృశ్చేవ్ నాయకత్వమున కమ్యూనిస్టు సిద్ధాంతమున ఒక నూతన భావమునకు తావు కల్పింపబడినది. సర్వ వినాశకపు పోరాటముల వలన కమ్యూనిజమ్ [చూ. - పు. 366] నకు ప్రపంచమున విజయము లభింపదనియు, ధనికవాదముతో పోటీపడి శాంతియుత మార్గమున కృషిచేసి కమ్యూనిస్టు పంథాయొక్క ప్రాశస్త్యమును రుజువు చేయుటవలననే విజయము సులభసాధ్యమనియు ఆ భావన విశదము ఒనర్చినది. రాజనీతిజ్ఞుడగు కెనెడీ సహాయముతో సోవియట్ రష్యా, యునైటెడ్ స్టేట్స్‌ల మధ్య తత్పూర్వము క్షీణించిపోయిన సంబంధములను చాలవరకు మెరుగు పరచుట, ఆటంబాంబు ప్రేలుడులను నిరోధించు పరిమితపు ఒడంబడికపై రష్యాచే సంతకము చేయించుట ఈయన శాంతికాముకతకు నిదర్శనములు. ఇతడు పట్టు విడుపు కల రాజనీతి వేత్త; యుద్ధమే సకల సమస్యలకు చరమ సాధనమని దృఢముగ విశ్వసించిన సోదర కమ్యూనిస్టు దేశము తన విధానములను ప్రతిఘటించినను తన శాంతి కృషియందు వెనుకంజ వేయలేదు; క్యూబా విషయమున తృతీయ ప్రపంచ యుద్ధ ప్రమాద నివారణమే అవశ్య కర్తవ్యమని తగ్గుదల చూపించెను. కృశ్చేవ్ యునైటెడ్ స్టేట్స్, యుగోస్లావియా, ఇండియా, బర్మా మున్నగు దేశములు సందర్శించి, ఆ యా దేశ నాయకులతో సంప్రదించి, సత్సంబంధములు పెంపొందించుకొనెను. ఇండియాను సందర్శించి, కాశ్మీర్ భారత దేశములో అంతర్భాగమని నిర్ద్వంద్వముగ ప్రకటించెను. కృశ్చేవ్ తన హయాములో వ్యవసాయాభివృద్ధికి పూర్వము కన్న మిన్నగ ప్రాధాన్యము ఒసంగెను. అనారోగ్య కారణములచే ఇతడు 1964 మధ్యకాలమున పదవీ విరమణ చేయవలసి వచ్చెను. ఇతని అనంతరమున కూడ రష్యా ప్రభుత్వము విదేశ వ్యవహారములలో ఈయన అడుగు జాడలను అనుసరించుట శాంతి ప్రియులకు ఆశాజ్యోతి అయినది. ఆ. వెం.

**కృష్ణదేవరాయలు :** చూ. తెలుగు సంస్కృతి : సం. 3 - పు. 388.

**కెనడా :** ఉత్తర అమెరికా ఖండమున ఉత్తర భాగమందున్న ఒక స్వతంత్ర రాజ్యము.

ఈ దేశమునకు ఆర్కటిక్ మహాసముద్రము [ఉ]; బేఫిన్ అఖాతము, డేవిస్ జలసంధి, అట్లాంటిక్ మహాసముద్రములు [తూ]; యునైటెడ్ స్టేట్స్ [ద] పసిఫిక్ మహాసముద్రము, అలాస్కా రాష్ట్రము [ప] సరిహద్దులుగ ఉన్నవి. [వి] 99, 76,177. వైశాల్యమును బట్టి చూడ ఈ దేశము ప్రపంచ దేశములలో రెండవ స్థానము ఆక్రమించి ఉన్నది. [జ] 1,89,28,000; ఇందులో అమెరికన్ ఆదివాసుల సంఖ్య 1,63,000, ఎస్కిమోలను ధ్రువప్రాంత వాసులసంఖ్య 11,000. తక్కిన వారందరును 16 వ శతాబ్ది నుండి ఇటకు వలన వచ్చి చేరిన యూరపియన్ల సంతతి వారు. [భా] మొత్తము జనులలో 20% ప్రెంచి భాషను, 67% ఇంగ్లీషును, తక్కిన వారు ఆదిమ అమెరికన్, ఎస్కిమో మొదలగు భాషలను మాట్లాడెదరు. ఫ్రెంచి, ఇంగ్లీషు భాషలు రెండును జాతీయ భాషలుగ పరిగణన పొంది, రాజకీయ, వ్యావహారిక రంగములందు వాడబడుచున్నవి. [రా] ఒట్టావా. (జ. సం. 2,22,129); తక్కిన పెద్ద నగరములలో క్విబెక్, మాంట్రియల్ నగరములు పేర్కొనదగినవి.

**చరిత్ర:** ఈ దేశమున ప్రాచీన కాలము నుండియు ఆదిమ అమెరికన్లును, ఎస్కిమోలును వసించుచున్నటుల తెలియవచ్చుచున్నను, వారిని గురించి చారిత్రక విశేషములు ఏవియు అంతగ తెలియవచ్చుట లేదు. ప్రాచీన కాలమున బేరింగ్ జలసంధిని దాటి ఆసియావాసులగు కొన్ని జాతులవారలు అలాస్కా ద్వారా ఇచటికిని, దీనికి దక్షిణమున ఉన్న యునైటెడ్ స్టేట్స్ మొదలగు దేశములకును వచ్చి స్థావరములను ఏర్పరచుకొనిరని భావించుటకు అవకాశములు కలవు. ఈ దేశమునకు ఉత్తరమున ధ్రువ ప్రాంతమునకు సమీపమున ఉన్న గ్రీన్‌లాండ్, ఐస్‌లాండ్ ద్వీపములకు 11 వ శతాబ్ది ఆరంభమున నార్స్‌మెన్ అను యూరపియన్ జాతివారలు వలసవచ్చి చేరిరని మాత్రము చారిత్రకాధారములవలన తెలియవచ్చుచున్నది. వారిలో కొందరు ఉత్తర అమెరికా తూర్పు తీరమున ప్రయాణము చేసి కెనడా లోని నేటి 'నోవస్కోషియా' వరకును కూడ వెళ్ళి ఉండవచ్చునని కొందరు చారిత్రకుల అభిప్రాయము. కాని, 17 వ శతాబ్దముతోనే ఇచట యూరపియన్లు స్థిరమగు స్థావరములను ఏర్పరచుకొనుట ఆరంభించిరని భావించుట సముచితము.

**ఆరంభ స్థావరములు :** ఫ్రెంచి పరిశోధకుడును, వలసల స్థాపకుడును అగు శామ్యుయల్ డ చాంప్లెయిన్‌ను 'కెనడాకు తండ్రి' అని వ్యవహరింతురు. 1604 లో ఫండీ అఖాత తీరమున ఎకేడియా వలసను స్థాపించుటకు ఇతడు చాల తోడ్పడినాడు. కాని, అప్పటికే (1603) అతడు సెంట్ లారెన్స్ నదిని కనిపెట్టుట, ఆ నదీతటముపై ఒక ప్రశస్తతరమైన వలసను స్థాపించవచ్చునని నిశ్చయించుట కూడ జరిగెను. 1608 లో అతడు శాశ్వతమైన మొదటి వలసగా క్విబెక్ వలసను స్థాపించెను. 1628 లో బ్రిటిష్ వారు ఈ దేశముపై దండెత్తి క్విబెక్‌ను స్వాధీనము చేసికొనిరి. కాని, ఆ తరువాత కొద్ది కాలములోనే క్విబెక్

తిరిగి ఫ్రెంచివారి వశమైనది. పిమ్మట ఫ్రెంచి రాజు మరికొందరను కూడ అక్కడకు వలస పంపెను. 1642 లో జెసూట్ మత ప్రవక్తలకు మతకేంద్రముగా మాంట్రియల్ వలస నెలకొల్పబడినది. 1663 లో ఫ్రెంచి రాజు లూయీ - XIV ఈ వలసను స్వాధీనము చేసికొను వరకును ఇది చర్మవర్తకపు సంఘముల అదుపులో ఉండెను. తర్వాత కొద్ది ఏండ్లలోను ఈ వలస సుసంఘటితము చేయబడినది.

ఫ్రెంచి పరిపాలన : ఫ్రెంచివారి యాజమాన్యమున కెనడాను ముగ్గురు వ్యక్తులు పాలించుచుండిరి. 1. సైనికోద్యోగి అగు ఒక గవర్నర్‌ను, 2. ఇంటెండెంట్ అను రాజకీయ నిర్వాహకుడును, 3. రోమన్ కేతలిక్ చర్చి ఉద్యోగి అగు ఒక బిషప్పును అట్టి పాలకులుగ ఉండిరి. ఈ వలసకు కూరజాతి అయిన ఇరాక్వాయ్ ఇండియన్‌లను ఆదిమ వాసులవలన ఎట్టి ప్రమాదముగాని కలుగకుండ రక్షించుట గవర్నర్ ముఖ్య కర్తవ్యము. ఈ ఇండియన్‌లు తమ వేట ప్రదేశమును వశము చేసికొనజూచుచున్న శ్వేత జాతుల వారితో తరచు యుద్ధములు చేయుచుండిరి. 1672 లో గవర్నర్‌గా వచ్చిన కౌండ్ డ ఫ్రాంటినాక్ వారితో ఘోరముగ పోరాడి, తుదకు వారిని ఓడించెను. కెనడాను పాలించిన గవర్నర్‌లలో ఇతడు అగ్రగణ్యుడు. ఇతడు దేశము లోపలిభాగములో ఉన్న ఇతర ముఖ్య ప్రదేశములలో కూడ కొన్ని వలసకేంద్రములను స్థాపించెను.

బ్రిటిష్ ఆధిపత్యము : వలసలు ఏర్పడిన వెంటనే చర్మముల లాభసాటి వర్తకముకొరకు ఫ్రెంచివారును, ఇంగ్లీషువారును తగవులాడుకొనసాగిరి. పూర్తిగా యుద్ధ సన్నద్ధులైన పిమ్మట 1754 లో బహిరంగ యుద్ధ ప్రకటన చేయకుండగనే ఇరుపక్షముల వారును పోరాటము ప్రారంభించిరి. ఈ యుద్ధములో తొలుత ఫ్రెంచివారికే విజయము చేకూరుట సంభవించెను. కాని, 1758 లో అదృష్టములు తారుమారైనవి. 1759 లో ఫ్రెంచివారు ఓడిపోవుటయు, క్విబెక్ బ్రిటిష్ వారికి స్వాధీనమగుటయు సంభవించినది. తుదకు యుద్ధము పారిస్ సంధి [చూ.] తో కాని ముగియలేదు. ఈ సంధిని అనుసరించి అమెరికాయందు కీలకస్థానమున ఉన్న కెనడా బ్రిటిష్ వారికి వచ్చినది.

బ్రిటిష్ ప్రభుత్వమును ఎదుర్కొనిన క్లిష్ట సమస్య : బ్రిటిష్ వారు కెనాడాను జయించిన తరువాత 4 సంవత్సరముల పాటు అచ్చట సైనిక పరిపాలన అమలు జరిగినది. అనుకూల పరిస్థితులు ఏర్పడిన తరువాత కాని, శాసనబద్ధ ప్రభుత్వము స్థాపించుట జరుగలేదు. ఇంచుమించు ఆ నాలుగేండ్లును బ్రిటన్ తాను జయించిన రాజ్యములతో శాంతియుత పరిష్కారములు చేసికొనుటలోనే గడిచినది. బ్రిటిష్‌వారు ఆ దేశభాషను ఉపయోగించుచు, ఆ దేశపు శాసనములనే అనుసరించుచు, ఆ దేశీయులనే ఉద్యోగములలో నియమించి, అక్కడి ఆచార వ్యవహారములలో సాధ్యమైనంత వరకు ఎక్కువ మార్పులు లేకుండ చేసిరి.

బ్రిటన్ వలసలలో దేనిలోను కెనడాలో ఉన్నంతమంది ఆంగ్లేతరశ్వేతజాతివారు లేరు. బ్రిటిష్ రాజ్యాంగమును వారికి అనువర్తింప చేయవలెనా, లేదా? వారిని అనుసరించి బ్రిటిష్ పద్ధతులనే మార్చుకొనవలెనా ? అనునది సమస్యగ ఏర్పడెను. అప్పటి బ్రిటిష్ న్యాయశాస్త్రమునుబట్టి రోమన్ కేతలిక్ మతస్థుడగు ఏ వ్యక్తికిని ప్రభుత్వోద్యోగములను చేయుటకుగాని, పాలకులను ఎన్నుకొనుటకు గాని లేదా పాలకవర్గమునకు తాను ఎన్నుకొనబడుటకు గాని అర్హత లేకుండెను. ఈ నియమానుసారము ఇంచుమించు నాడు ఆ వలసలో ఉన్నవారందరును రోమన్ కేతలిక్‌లే అగుటచే వారికి ప్రభుత్వముతో ఎట్టి సంబంధమైనను ఉండు అవకాశము లేకపోయెను. ఫ్రెంచి కెనెడియన్‌లు తమ మిత్రుడని భావించుచుండిన గవర్నర్ జేమ్స్ మర్రే సేనాని పై నియమానుసారము అసెంబ్లీని సమావేశపరచుటకు నిరాకరించాడు. అంతేకాక విప్లవాత్మకమైన మార్పులు అనేకము చేయ ప్రారంభించాడు. ఇతని తరువాతవారు కూడ ఆ త్రోవనే త్రొక్కుటచే తుదకు ఈ విధానమే క్విబెక్ చట్టము రూపమున ఆమోదమును పొందినది (1774).

బాధ్యతాయుత ప్రభుత్వము కొరకు ఆందోళనము : అమెరికా విప్లవముతో కట్టుదిట్టమైన పరిపాలనము స్థాపించక పోయినచో కెనడా కూడ తుదకు దక్కదను భయము బ్రిటిష్ వారికి ఎక్కువైపోయినది. అమెరికా స్వాతంత్ర్యయుద్ధము మేలుబంతియై కెనడా స్వాతంత్ర్యోద్యమమునకు మరింత ప్రోత్సాహము కలిగించినది. వలసదారుల అసంతృప్తి క్రమముగ ఎక్కువగుచు వచ్చి, తుదకు 1837 లో రెండు చిన్న తిరుగుబాట్లు జరిగినవి. బ్రిటిష్‌వారు ఈ పరిస్థితులను చూచి మిక్కిలి కలత చెంది, వాస్తవిక సమస్యలను పరిశీలించి, వాటి పరిష్కార మార్గము అన్వేషించుటకు 'డర్హామ్' ప్రభువును పంపిరి. అతడు కెనడా ప్రజలకు ఆమోదనీయమగు రాజ్యాంగమును ఏర్పరుపవలయునని సూచించెను. కాని, అందులకు ఇష్టపడక బ్రిటిష్ ప్రభుత్వమువారు ఫ్రెంచివారి బాధను వదల్చుకొనుటకు ఎగువ - దిగువ కెనడాలను ఏకము చేసి, ఒక శాసనసభను ఏర్పరచిరి. 1840 యూనియన్ చట్టమును అనుసరించి ఈ శాసనసభ సృష్టింపబడినది.

సంపూర్ణ స్వాతంత్ర్యమును వాంఛించిన కెనడావారికి ఈ మార్పు ఏ మాత్రము సంతృప్తిని కలిగించక పోవుటచే ఈ చట్టము నిరర్థకమని రుజువగుటకు ఎక్కువ కాలము పట్టలేదు. 1848 లో చేయునది లేక చివరకు డర్హామ్ సూచనలను అమలులో పెట్టిరి. కెనడాకు పాలకుడైన గవర్నర్ జనరల్ హక్కులను పరిమితము చేసి, ఆ హక్కులకు లోబడి స్వతంత్ర ప్రభుత్వములను నెలకొల్పుకొనుటకు ఆ వలసలకు అనుమతి ఇచ్చిరి.

అటుల స్వాతంత్ర్యముపొందిన వలసలు ప్రాథమిక సంప్రదింపులు జరిపిన తరువాత 1865 లో క్విబెక్ నందు సమావేశమై ఒక పథకమును రూపొందించినవి. ఆ పథకము తుదకు బ్రిటిష్ ఉత్తర అమెరికా చట్టముగ 1867 లో బ్రిటిష్ పార్లమెంట్‌లో ఆమోదితమైనది. ఎగువ కెనడా మితవాద పక్షనాయకుడు జాన్ ఎ. మెక్‌డొనాల్డ్ కెనడా డొమినియన్‌నకు ప్రథమ ప్రధానమంత్రి అయ్యెను.

**ప్రథమ ప్రపంచ యుద్ధము** : 1914 లో గ్రేట్ బ్రిటన్ జర్మనీపై యుద్ధమును ప్రకటించినపుడు కెనడా తన మాతృదేశమునకు యుద్ధములో సహాయము చేయ సంకల్పించినది. అందుకొరకు రాజకీయ విభేదములను విస్మరించి, కన్సర్వేటివ్, లిబరల్ పక్షములు రెండును ఏకమై, రాబర్ట్ బార్డెన్ ఆధిపత్యమున సంకీర్ణ ప్రభుత్వమును నెలకొల్పినవి. యుద్ధములో బ్రిటన్‌కు కెనడా అనేక విధముల సహాయము చేసినది. సేనలను పంపుట మాత్రమే కాక శాంతి సమయములో ఉపయోగపడు వస్తూత్పత్తిని నిల్పివేసి, యుద్ధమునకు ఆవశ్యకమైన మందుగుండు సామగ్రిని, మారణ ఆయుధములను కూడ తయారు చేసి బ్రిటన్‌కు పంపినది.

**కెనడా అభ్యుదయము** : యుద్ధము ముగిసిన పిమ్మట కెనడాలో రాజకీయ రంగమున కొన్ని మార్పులు వచ్చెను. 1921 లో జరిగిన ఎన్నికలలో లిబరల్ పక్షము విజయము పొందినది. తత్ఫలితముగా విలియమ్ మెకంజీకింగ్ ప్రధాన మంత్రి అయ్యెను. ప్రపంచమునంతను పట్టి పీడించిన ఆర్థిక దుస్థితి కెనడాకు కూడ వ్యాపించుటతో యుద్ధానంతరము ప్రారంభమైన పారిశ్రామికాభివృద్ధి 1929 లో వెనుకంజ వేసినది. 1930లో మితవాద పక్షమువారు అధికారములోనికి వచ్చి, రిచర్డ్ బి. బెనెట్ ప్రధాన మంత్రి అయ్యెను. 1932 లో ఒట్టావా వద్ద జరిగిన సామ్రాజ్యదేశ సమావేశములో వ్యాపార పరిస్థితులను చక్కపరచుటకు కొంత ప్రయత్నము జరిగినది. 1941 లో ఒక రాయల్ కమిషన్ అధినివేశ రాష్ట్ర ప్రభుత్వములను సమగ్రముగ పరిశీలించి సమర్పించిన నివేదికలో అధినివేశ ప్రభుత్వమునకు జాతీయ వ్యవహారములలోను, అందును సాంఘికాభ్యుదయ రంగములోను ఎక్కువ అధికారము ఇవ్వవలెనని సలహా ఇచ్చినది.

**ద్వితీయ ప్రపంచ యుద్ధము** : 1939, డిసెంబరు 10 వ తేదీన జర్మనీ, ఇటలీ దేశముల పై కెనడా యుద్ధము ప్రకటించినది. స్వతంత్రముగా కెనడా యుద్ధమును ప్రకటించుటకు ఇది తొలిసారి. అంతకు ముందు, కెనడా తరపున బ్రిటన్ యుద్ధము ప్రకటించుచుండెను. 1931 లో జరిగిన వెస్ట్ మినిస్టర్ ఒడంబడికను అనుసరించి స్వతంత్రముగ యుద్ధములో చేరునదీ, లేనిదీ తనకు తానుగ నిర్ణయించుకొను అధికారము కెనడాకు సంక్రమించినది. స్వాతంత్ర్యమును, ప్రజా స్వామ్య సిద్ధాంతములను సంరక్షించు ఉద్యమములో బ్రిటన్‌కు అండగా నిలబడుటకు కెనడా పార్లమెంట్ తీర్మానించినది.

యుద్ధము ఆరంభమైనప్పటినుండి కెనడా నౌకా సంపత్తియు, సేనయు కూడ అపరిమితముగా పెరిగినవి. అట్లాంటిక్ యుద్ధ రంగములో కెనడా యుద్ధనౌకలు ముఖ్యపాత్ర వహించి, తమ సామర్థ్యమును ప్రదర్శించినవి. జర్మనీ లొంగిపోయిన తర్వాత జపాన్‌తో జరిగిన యుద్ధములో కెనడా నౌకాదళము పసిఫిక్ రంగమున కూడ ఎక్కువ సహాయము చేసినది.

దేశ పరిరక్షణ కొరకు కెనడా యునైటెడ్ స్టేట్స్‌తో కలసి శాశ్వత సంయుక్త సంఘమును 1940 లో స్థాపించినది. ప్రథమ ప్రపంచ యుద్ధములో వలెనే ద్వితీయ ప్రపంచ యుద్ధములో కూడ యుద్ధము నిమిత్తము కెనడా కొన్ని వేల మిలియన్‌ల డాలర్లు అప్పు ఇచ్చెను.

**యుద్ధానంతరమున కెనడా** : ద్వితీయ ప్రపంచ యుద్ధములో మిత్రరాజ్యముల వారికి ఎంతో సాహాయ్యము చేసి, కెనడా ప్రపంచ రాజ్యములలో ఒక ఉన్నత స్థానమును పొందినది. దీనితోపాటు కెనడా ప్రజలకే కాక, ఇతర దేశములకు కూడ సంబంధించిన క్రొత్త బాధ్యతలు అనేకము కెనడా వహింపవలసి వచ్చినది.

**రాజ్యాంగము** : సమాఖ్య రీతి రాజ్యాంగము కెనడా యందు అమలునందు ఉన్నది. దేశమందలి పది రాష్ట్రములును, వాయవ్య మండలములు రెండును ఈ సమాఖ్య యందు అంతర్భాగములు. బ్రిటిష్ వారి నార్త్ అమెరికా చట్టము (1867) ను అనుసరించి క్విబెక్, అంటారియో, నోవాస్కోటియా, న్యూబ్రన్స్‌విక్ అను నాలుగు రాష్ట్రములే తొలుత కెనడా అను పేరుతో సమాఖ్యగా అవతరించినవి. తరువాత తక్కిన రాష్ట్రములును, మండలములును ఇందు చేరినవి. ఈ సమాఖ్యయందు కేంద్రమునకు బలవత్తరాధికారములు కలవు. కేంద్రమునకు ప్రత్యేకింప

బడిన నిర్దిష్టాధికారములే కాక, అవశిష్టాధికారములును కేంద్రమునకే చెంది ఉన్నవి. చారిత్రక కారణములను బట్టి బ్రిటిష్ రాణియే కెనడా దేశమునకు పరిపాలకురాలుగ పరిగణింపబడుచున్నను, ఇది లాంఛన ప్రాయమే. ఆమెచే కెనడా ప్రధాని సలహాను అనుసరించి నియమితుడగు గవర్నర్ - జనరల్ కెనడాలో ఉండి ప్రభుత్వ లాంఛనాధికారములను నిర్వహించును. ఇతని అధికార పరిమితి సాధారణముగ 5 సంవత్సరములు. యథార్థమున పరిపాలనాధికారము అంతయు ప్రధాని ఆధ్వర్యవమున వర్తించు మంత్రి వర్గమునకే చెంది ఉన్నది. ఈ మంత్రి వర్గము పార్లమెంట్‌నకు బాధ్యత వహించును. పార్లమెంట్ నందు లోక సభ (హౌస్ ఆవ్ కామన్స్), శిష్టసభ (సెనేట్) అను రెండు కక్ష్యలు కలవు. సామాన్య సభయందలి సభ్యుల సంఖ్య 265. ఈ సామాన్య సభకు ఎన్నికలు కనీసము అయిదేండ్లకు ఒకతూరి జరుగును. వయోజనులగు కెనడా పౌరులును, ఎన్నిక తేదీకి 12 నెలలకు పూర్వమునుండియు కెనడాలో వసించుచున్న బ్రిటిష్ పౌరులును వోటుహక్కు కలిగి ఉన్నారు. వివిధ రాష్ట్రములును, వాయవ్య మండలములును తమ జనసంఖ్య నిష్పత్తిలో సామాన్య సభకు సభ్యులను ఎన్నుకొనును. సామాన్యసభ యందలి అధిక సంఖ్యాక పక్షపు నాయకుని ప్రధానిగ గవర్నర్ - జనరల్ నియమించి, అతని సలహాపై తక్కిన మంత్రులను నియమించును. శిష్టసభ యందలి సభ్య సంఖ్య 102. వివిధ రాష్ట్రములకు నిర్దిష్ట రీతిలో ప్రాతినిధ్యము లభించు రీతిగ ప్రధాని సలహాపై గవర్నర్ - జనరల్ ఈ సభ్యులను నియామకము చేయును. ఈ శిష్ట సభ సభ్యుడు జీవితాంతమువరకు ఆ అధికారమున ఉండును. వాయవ్య మండలములకు శిష్ట సభ యందు ప్రాతినిధ్యము లేదు. గి. వేం. సీ.; వి. ఆర్.

**కెనెడీ, జాన్ ఫిట్జ్‌రాల్డ్** (1917 - 1963): యునైటెడ్ స్టేట్స్ రాజనీతివేత్త, 35 వ అధ్యక్షుడు. ఆ దేశపు అధ్యక్షులు అందరిలోను చిన్నవాడు. హార్వర్డ్ యూనివర్సిటీలో ఉన్నత విద్యను అభ్యసించి, పట్టభద్రుడు అయ్యెను (1940). ఈయన 1941 లో నౌకాదళమున చేరి, దక్షిణ పసిఫిక్ రంగమున పని చేయుచు, 1943 లో తన టార్పెడో నౌక జపాన్ వారిచే ముంచివేయబడినపుడు హతశేషులైన తన సిబ్బందిని అతి ప్రయత్నమున సురక్షిత ప్రాంతమునకు తరలించెను. ఆరోగ్య కారణములచే నౌకాదళ ఉద్యోగమును విడిచి, రచయితగా రాణింప జూచిన తన తొలి ఉద్దేశ్యమును కూడ మార్చుకొని, కెనెడీ 1946 లో రాజకీయములలో ప్రవేశించి, డెమోక్రాటిక్ పార్టీ అభ్యర్థిగా ప్రతినిధుల సభకు మూడు పర్యాయములు (1946, 48, 50) ఎన్నికయై, 1952 లో సెనేట్ సభ్యత్వమును కూడ చేపట్టెను; 1960 లో అధ్యక్షుడుగా ఎన్నుకొనబడి, 1961 జనవరిలో పదవీ స్వీకారము చేసెను. ఐసెన్‌హోవర్ [చూ.] కాలములో సోవియట్ రష్యా, యునైటెడ్ స్టేట్స్‌ల మధ్య చరమ స్థాయికి దిగజారి పోయిన సంబంధములను ఈయన చాల మెరుగు పరచెను. 1962 అక్టోబరులో క్యూబాలో విక్షేపాస్త్రములను సోవియట్ రష్యా సంస్థాపించుచున్నదనియు, అందువలన



జాన్ ఫిట్జ్‌రాల్డ్, కెనెడీ
(1917 - 1963)

యునైటెడ్ స్టేట్స్ భద్రతకు ముప్పు వాటిల్లు ప్రమాదము ఏర్పడుటచే తన ప్రభుత్వము క్యూబాపై దిగ్బంధము విధింపనున్నదనియు ఈయన ప్రకటించెను. దానితో తృతీయ ప్రపంచ యుద్ధయు దాదాపు ఆసన్నమైనదను భయోత్కంపము బయలుదేరెను; కాని, సోవియట్ భూమి అధినేత కృశ్చేవ్ [చూ. పు. - 395] విక్షేపాస్త్రములను ఉపసంహరించుకొనుటకు అంగీకరించుటతో ఆ ప్రమాదము నివారింపబడినది. విదేశ వ్యవహారములలోవలెనే, ఆంతరంగిక వ్యవహారములో కూడ ఈయన సాహసోపేతమైన దృఢ విధానమును అవలంబించెను. పౌరహక్కులకై పోరాటము ప్రారంభించిన నీగ్రోల ఎడ సానుభూతి కలవాడై, తత్సంబంధమైన ఒక విప్లవాత్మక చట్టమును కాంగ్రెస్‌కు సమర్పించెను. కాని, తాను సంకల్పించిన అమోఘ కృషిని పూర్తిచేయక మునుపే 1963, నవంబరు 22 వ తేదీన డల్లాస్ నగర వీధులలో టాపులేని కారులో ప్రయాణము చేయు సమయమున, ఒక భవనము 5 వ అంతస్తులోని కిటికీ గుండా ప్రేల్చబడిన తుపాకి గుండ్లకు గురియై, ఈ మహనీయుడు మరణించెను. రచయితగ సైతము కెనెడీ పేరొందెను. ఆతడు ఆంగ్లమున రచించిన 'ప్రొఫైల్స్ ఇన్ కరేజ్' అను గ్రంథము అతని రాజకీయ విషయ విమర్శనా పరిణతను స్పష్టీకరించుచున్నది. ఆ. వెం.

**కెన్యా**: తూర్పు ఆఫ్రికా యందలి స్వతంత్రగణ రాజ్యము. ఇందు కొంత రక్షిత రాజ్యముగను, శేషించినది వలస రాజ్యముగను బ్రిటిష్ ప్రభుత్వపు పాలనలో తొలుత ఉండి 1963 లో ఏక రాజ్యముగ స్వతంత్రమైనది.

ఈ రాజ్యమునకు సుడాన్, ఎతియోపియా [ఉ]; సోమాలియా, హిందూమహాసముద్రము [తూ]; టాంజేనియా




[ద]; ఉగాండా [ప] సరిహద్దులుగ ఉన్నవి. సముద్రతీరమున టాంజేనియా సరిహద్దును ఆనుకొని 16 కి. మీ. వెడల్పున ఉన్న సన్నని తీరభూమి ఈ దేశమున చేరి ఉన్నది. [వి] కెన్యా రాజ్యపు మొత్తపు వైశాల్యము 5, 82, 646 చ. కి. మీ.; [జ] 88,47,000. ఇందులో సుమారు 1,74,300 భారతీయులు, పాకిస్తానీలు; 67,700 యూరపియన్‌లు; 38,000 అరబ్బులు కలరు. తక్కిన వారందరు ఆఫ్రికన్ జాతుల వారు. ఆఫ్రికన్ జాతులలో కికుయూజాతి దాదాపు 20%; [భా] వివిధ ఆఫ్రికన్ భాషలు మాతృభాషలుగ వ్యాప్తియందు ఉన్నను, స్వాహిలీ భాష సామాన్య భాషగ వాడుకయందు ఉన్నది. రాజకీయ వ్యవహార భాష ఇంగ్లీషు; [మ] దేశ ప్రజలలో అత్యధికసంఖ్యాకులు సంప్రదాయ ప్రకృతి దేవతారాధకులు; క్రైస్తవులు దాదాపు 10 లక్షలు కలరు. తీర ప్రాంతమున ఇస్లామ్‌నకు కొంత వ్యాప్తి కలదు. [రా] నైరోబీ (జ. సం. 2,50,800), రేవు పట్టణము మొంబాసా (జ. సం. 1,52,150).

చరిత్ర: ఈ రాజ్యమును గురించిన ప్రాచీన విశేషములు ఏవియు తెలియకున్నను, ఇచట కొన్ని ఆఫ్రికన్ జాతులు క్రీ. శ. 6 వ శతాబ్ది మొదలుగ కొంత నాగరకతా స్థాయిని అందుకొని, కొన్ని అనూహ్యములగు కారణములవలన అంతరించినవని భావించుటకు ఈ దేశమున అటనట కననగు శిథిలావశేషములవలన అవకాశము కలుగుచున్నది. ఇది ఎటులున్నను, క్రీస్తు శకారంభ కాలమునకు పూర్వమునుండియు ఈ దేశపు తూర్పుతీరమునందలి కొన్ని రేవు స్థలములు భారతీయులకు, గ్రీక్‌లకు, రోమన్‌లకు సుపరిచితములై ఉండినటుల ప్రాచీన గ్రంథముల వలన తెలియనగుచున్నది. క్రీ. శ. 5 వ శతాబ్ది నుండియు అరబ్బులు ఈ తీర వ్యాపారమును వశపరచుకొనిరి. 15 వ శతాబ్ది ఆరంభమున చీనా వర్తకులును, నావికులును హిందూ మహాసముద్రమును అధిగమించి, ఈ తీర భూములను దర్శించిరి. కాని, వారు స్థిరముగ నెలకొనకుండుటచే, నౌకా వ్యాపారము అరబ్బుల వశముననే 15 వ శతాబ్ది అంతము వరకు ఉండెను. అరబ్బులు తీరమునందు స్థిరముగ నెలవుల ఏర్పరచుకొని ఇస్లామ్‌ను ప్రవేశపెట్టిరి. దేశీయుల మాతృభాషలగు బంటూ భాషలు అరబ్బీ భాషతో సంకర మొందుట వలననే నేటి స్వాహిలీ భాష రూపొందినది.

పదునారవ శతాబ్దిలో పాశ్చాత్యులకు ఈ తీర ప్రాంతముతో పరిచితి కలిగినను, వ్యాపార సంబంధములతోనే వారు తొలుతగ తృప్తి వహించిరి. ఆ కాలమున జాంజిబార్ వశమున కెన్యా తీరభూమి ఉండెను. జాంజిబార్ సుల్తాన్ ఆస్థానమున ఆంగ్లేయులు 19 వ శతాబ్దిలో పలుకుబడిని ఆర్జింపగలుగుట వలన, ఆ తీర భూమిని 1887 మే నెలలో ఒక బ్రిటిష్ సంఘమునకు సుల్తాన్ దీర్ఘ కాలపు కౌలునకు ఒసగెను. ఆ సంఘమే తరువాత ఇంపీరియల్ బ్రిటిష్ ఈస్ట్ ఆఫ్రికా కంపెనీ అను పేర రూపొంది (1888), ఆ తీర ప్రాంతమును, దానికి పరిసరముల ఉన్న దేశాంతరభాగమును అభివృద్ధి పరచుటకు బ్రిటిష్ ప్రభుత్వము వలన అనుమతి పత్రము (ఛార్టర్) ను గ్రహించెను. ఈ కంపెనీ పాలనలో వారి రక్షిత ప్రాంతముగ తీర భూమియే కాక, జాంజిబార్ సుల్తాన్‌నకు చెందని దేశాంతర భూములు కూడ ఆనాడు ఉండెను. ఆ కంపెనీ పేరునందలి పదముల ఆద్యక్షరములను అనుసరించి ఈ ప్రాంతమునకు అపుడు 'ఇబియా' అను వ్యవహారము కలిగెను. 1895 లో ఈ కంపెనీ ఆర్థికముగ నష్టపడుటచే బ్రిటిష్ ప్రభుత్వము కొంత ధనము ఒసగి, ఆకంపెనీకి ఈ ప్రాంతముపైగల వివిధ హక్కులను తన వశము చేసికొని, 'తూర్పు ఆఫ్రికా రక్షిత రాజ్యము' అని ఈ దేశమునకు పేరిడెను. అంతవరకు దేశమున పలుకుబడిని కలిగి ఉండిన అరబ్ ప్రముఖులు బ్రిటిష్ ప్రభుత్వముపై ఆ సంవత్సరమే తిరుగు బాటు జరిపిరి. కాని, దానిని బ్రిటిష్ వారు అడచి వేసిరి. అది మొదలుగ బ్రిటిష్ వారిని ప్రతిఘటింపగల వర్గము ఏదియు చాల కాలము వరకు రూపొందలేదు.

బ్రిటిష్‌వారు మొంబాసా నుండి విక్టోరియా న్యాన్‌జా సరస్సు వరకు రైలు మార్గము 1903 నాటికి వేసిరి. ఈ రైలు మార్గమునకు ఇరువైపుల ఉన్న ఉన్నత భూములు సారవంతములై శీతోష్ణస్థితిని అనుసరించి ఆంగ్లేయుల నివాసమునకు అనుకూలముగ ఉండుట గమనించి, ఆ ప్రాంతమును చట్టరీత్యా ప్రత్యేకించి, శ్వేతజాతీయులగు భూస్వాములను అట చేర్చుటకు 1903 మొదలుగ బ్రిటిష్ వలస ప్రభుత్వము కృషి చేసినది. దీనివలన దేశీయ ప్రజలలో అసంతృప్తి పెచ్చుపెరిగినది; దీనికితోడుగ భారతీయ సమస్యయు ఉదయించినది. భారతదేశమందలి బ్రిటిష్ ప్రభుత్వపు ప్రోత్సాహమున పలువురు భారతీయ వర్తకులు ఇట క్రమముగ చేర్రి. వీరి సంఖ్య 1911 నాటికే యూరపియన్‌లకు మూడురెట్లు ఉండెను. ఆర్థికముగను, విద్యావ్యాప్తులను బట్టియు యూరపియన్‌లకు ఎందును తీసిపోవని ఈ భారతీయ వర్తకులు యూరపియన్‌లతో సమానముగ రాజకీయాధికారములు కావలెనని పట్టుబట్టిరి.

ఇట్టి పరిస్థితులలో బ్రిటిష్ ప్రభుత్వము కౌలునకు తీసికొన్న తీరభూమి కాక మిగిలిన దానిని అంతయు 'మకుటపు వలస (క్రౌన్ కాలనీ) గా' మార్చి, దేశమున ప్రముఖమగు కెన్యా పర్వతమును బట్టి దేశమునకు కెన్యా అని పేరిడిరి. తీర భూమిని కూడ పరిపాలన రీత్యా అందే చేర్చి కెన్యా రక్షిత రాజ్యమని వ్యవహరించిరి (1920). అంతకు పూర్వమే రాజకీయ సంస్కరణలను కొన్నిటిని వలస ప్రభుత్వము ప్రవేశపెట్టి, గవర్నర్‌కు సాయము చేయుటకు ఒక శాసన సమితిని ఏర్పరచిరి. ఇందు ఎన్నుకొనబడు వారిలో యూరపియన్‌ల పక్షమున సభ్యులు మాత్రమే ఉండిరి. తక్కిన జాతుల తరఫున ప్రభుత్వమే ప్రతినిధులను నియమించినది.

ఇట్టి చర్యలవలన దేశమున అసంతృప్తి చెలరేగుచుండుట గమనించి బ్రిటిష్ ప్రభుత్వము కెన్యా యందు తాను అనుసరించు విధానమును గురించి ఒక స్పష్టమైన ప్రకటన చేయుచు, కెన్యాయందు ఆఫ్రికన్ జాతుల శ్రేయమే తమ పరమ ధ్యేయమనియు, తక్కిన జాతుల శ్రేయస్సాధన ఆ ధ్యేయమునకు లోబడియే జరుగగలదనియు స్పష్టీకరించెను. తరువాత కొన్ని సంస్కరణలను ప్రవేశపెట్టి శాసన సమితిలోని ఎన్నుకొనబడు స్థానములలో 11 యూరపియన్‌లకు, 6 భారతీయులకు, 1 అరబ్బులకు కేటాయించెను. కాని, ఇందువలన యూరపియన్‌లు తప్ప వేరెవరును సంతృప్తి పొందలేదు.

ఆఫ్రికన్ జాతుల శ్రేయమే తమ లక్ష్యమని ప్రభుత్వము ఎంత నుడివినను, శ్వేత జాతి భూస్వాములకై ప్రత్యేకింపబడిన భూమి విస్తీర్ణము 1935 నాటికి దాదాపు 41,440 చ. కి. మీ. అయ్యెను. దేశమున సాగుబడికి అనువుగ ఉన్న భూమిలో ఇది 24% అగుటయే కాక, అత్యంత సారవంతము కూడ అయి ఉండెను. అందుచేత తమ మనుగడకే ఇక భంగము కలుగగలదని ఆఫ్రికన్‌లు భయపడి, తమ ఆందోళనను వెలిబుచ్చిరి. అందుపై శేషించిన ప్రాంతమంతయు ఇకమీద ఆఫ్రికన్ జాతుల వారి కొరకే ప్రత్యేకింపబడగలదని ప్రభుత్వము 'దేశీయ భూ రక్షక సంస్థ (నేటివ్ లాండ్స్ ట్రస్ట్‌బోర్డ్)' ను ఏర్పరచెను. కాని, దేశీయ ప్రజలకు ఇందువలన సంతృప్తి కలుగలేదు.

ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున కెన్యెట్టా [చూ.] అను దేశీయప్రముఖుని నాయకత్వమున జాతీయోద్యమము సుసంఘటితమై స్వాతంత్ర్యమునకై ఆందోళన సలిపెను. అల్ప సంఖ్యాకులగు శ్వేతజాతీయ భూస్వాముల ఒత్తిడికి లొంగి, బ్రిటిష్ ప్రభుత్వము ప్రజా స్వామిక ప్రభుత్వమును అమలు జరుపుటకు నిరాకరించినది. అందుపై 1952 మొదలుగ మావ్ - మావ్ అను దౌర్జన్యోద్యమము దేశమున చెలరేగెను. ముఖ్యముగ కికియూ తెగ [చూ. సం; 10 - పు. 298] వారు వసించు ప్రాంతమున ఈ ఉద్యమమునకు ఎక్కువ ప్రోత్సాహము లభించెను. కెన్యాలో భూములను ఆర్జించి, దేశమును కొల్లగొట్టుచున్న శ్వేత జాతీయులను, వారికి సాయపడుచున్న ఆఫ్రికన్‌లను తుదముట్టించుటయే ఈ ఉద్యమపు పరమోద్దేశము. ఆ ఉద్దేశ సాధనకై ఆ ఉద్యమవాదులు తీసికొను ప్రతిజ్ఞకు కికుయూభాషలో గల పేరును అనుసరించి ఈ ఉద్యమమునకు 'మావ్-మావ్' అను వ్యవహారము కలిగినది. ఒకప్పుడు బ్రిటిష్ సేనలో పనిచేసి ఉండిన వారుహుయ్ అయితోతి అను కికుయూ తెగ సైనికుడు జనరల్ చైనా అను పేరుతో ఈ ఉద్యమమును నడిపెనని తెలియవచ్చుచున్నది. 1954 వ సంవత్సరమున ఇతనిని బ్రిటిష్ వారు నిర్బంధించి, మరణ శిక్ష విధించిరి. కాని, తరువాత అది యావజ్జీవ కారాగారవాస శిక్షగ మార్చబడెను. జాతీయ నాయకుడగు కెన్యెట్టా ఈ ఉద్యమమునకు ప్రోత్సాహము ఒసగుచుండెనను అనుమానమున ప్రభుత్వము అతనిని 1952 లోనే నిర్బంధించి 7 ఏండ్ల శిక్ష విధించెను. మావ్ - మావ్ ఉద్యమ వాదులు ఇందుకు వెనుకంజ వేయక తమ దౌర్జన్య చర్యలను కొనసాగించిరి. ప్రభుత్వము తన సైనిక బలమును ఉపయోగించి నాగరక లోకమునకు విభ్రాంతి కలిగించు దౌర్జన్య కాండతో మావ్ - మావ్ ఉద్యమమును అణచ గలిగినది (1958). కాని, ప్రజల స్వాతంత్ర్యాకాంక్షను నిర్మూలింపలేక పోయినది.

ఇంతలో ప్రపంచ పరిస్థితులు కెన్యా జాతీయోద్యమ వాదులకు అనువుగ పరిణమించెను. అందుచేత బ్రిటిష్ ప్రభుత్వము సాంత్వన విధానము అవలంబించి, కొన్ని సంస్కరణల మూలమున దేశీయులకు శాసన సభయందు అధిక స్థానములు ఏర్పరచెను (1961). ఈ ఎన్నికలలో జోమో కెన్యేట్టాను బలపరచు కెన్యా ఆఫ్రికన్ నేషనల్ యూనియన్ పార్టీకి అత్యధిక స్థానములు లభించెను. కడకు ప్రజాభిప్రాయమును గమనించి ఆ సంవత్సరమున నే కెన్యేట్టాపై గల ఆంక్షలు తొలగింపబడి, రాజకీయములలో అతడు పాల్గొనుటకు వసతి కలిగింపబడెను. తరువాత 1962, ఏప్రిల్ లో బ్రిటిష్ ప్రభుత్వమునకును, కెన్యా ప్రజా నాయకులకును మధ్య జరిగిన సంభాషణల ఫలితముగ తొలుత పరిమిత స్వయంపరిపాలన ఒసగుటకు బ్రిటన్ అంగీకరించినది. దానిని అనుసరించి ప్రజాస్వామిక పద్ధతిలో ఆ సంవత్సరాంతమున ఎన్నికలు జరిగి జోమో కెన్యేట్టా [చూ.] నాయకత్వమున ప్రజాస్వామ్య ప్రభుత్వము ఏర్పడెను. 1963, నవంబరు 8 నాటికి కెన్యా సంపూర్ణ స్వాతంత్ర్యమును పొంది అనంతరమున గణరాజ్యమైనది.

సరిహద్దున ఉన్న సోమాలియాతో తన సరిహద్దు లోపల ఉన్న జిల్లాలను గురించి కెన్యాకు వివాదము కలదు. అటులే తీర ప్రాంతమున జాంజిబార్ సుల్తాన్‌నకు చెంది బ్రిటిష్ రక్షిత ప్రాంతముగ ఉండిన ప్రదేశమును గురించి టాంజెనియాతో కెన్యాకు తగవు కలదు.

జాతి, మత, వర్ణ వివక్షత లేకుండ కెన్యా శ్రేయమునే ఆకాంక్షించు వారికి అందరికిని కెన్యాయందు పౌరస్వత్వము కలిగించుటయు, శ్వేత జాతీయులు సొంతముగ సేద్యము చేసికొను ప్రదేశము గాక, వారి అధీనమున ఉన్న తక్కిన భూమిని తగు మూల్యము చెల్లించి ఆఫ్రికన్ జాతులకు వశపరచుటయు తన విధానమని కెన్యేట్టా పలుమారు ప్రకటించి ఉన్నాడు. ప్ర. రా. సు.

**కెన్యేట్టా, జోమో** (జ. 1889. ర.): ప్రముఖ కెన్యా ఆఫ్రికన్ జాతీయ నాయకుడు, ప్రస్తుతము (1965) కెన్యా ప్రభుత్వాధినేత. ఇతడు కికుయూ జాతికి చెందినవాడు. కికుయూ కేంద్ర సంఘమునకు కార్యదర్శియై (1922), భూ సంస్కరణల కొరకు, ఆఫ్రికన్‌ల రాజకీయ హక్కుల కొరకు కెన్యేట్టా పోరాడెను. ప్రప్రథమ ఆఫ్రికన్ జాతీయ పత్రికను వ్యవస్థాపించెను (1928). కెన్యా ఆఫ్రికన్‌ల ప్రతినిధిగా ఇతడు 1930 లో ఇంగ్లండుకు పోయి, 16 సంవత్సరములు యూరప్ లో గడపి, ఆ సమయమున కొంతకాలము లండన్ స్కూల్ ఆవ్ ఎకనమిక్స్‌లో విద్యార్జన చేసెను. 1945 లో న్క్రుమా సహకారముతో మాంచెస్టర్ లో అఖండ ఆఫ్రికన్ కాంగ్రెస్ సంస్థను నెలకొల్పి, దానికి తొలి అధ్యక్షుడు అయ్యెను. 1946 లో స్వదేశమునకు మరలి, కెన్యా ఆఫ్రికన్ యూనియన్ సంస్థకు అధ్యక్ష పదవిని కెన్యేట్టా నిర్వహించెను (1947 - 52). మావ్ మావ్ దౌర్జన్యోద్యమమునకు ప్రేరకుడని అనుమానించి బ్రిటిష్ ప్రభుత్వము ఇతనిని జైలుశిక్ష పాల్జేసి (1952 - 59), విడుదలైన తరువాత మారుమూల ప్రాంతములందు ప్రవాసమునందు ఉంచెను (1959 - 61). ఆ కాలముననే నూతనముగ స్థాపింపబడిన కెన్యా ఆఫ్రికన్ జాతీయ యూనియన్‌కు ఇతడు అధ్యక్షుడుగ వరింపబడెను (1961). 1962 ఎన్నికలలో శాసన సభలో ఇతని పక్షమునకు ప్రాబల్యము లభించుటతో, ఇతడు ప్రవాసమునుండి విడివడి వచ్చి, రాజ్యాంగ సంస్కరణల మంత్రి పదవిని చేపట్టెను. 1962 చివరన ఏర్పడిన పరిమిత స్వయంపరిపాలనాధికారము కల ప్రజాస్వామ్య ప్రభుత్వమునకు నాయకత్వము వహించి, కెన్యేట్టా 1963, నవంబరులో కెన్యా సంపూర్ణ స్వాతంత్ర్యమును పడసిన పిదప జాతీయ ప్రభుత్వమునకు ప్రథమ ప్రధాన మంత్రి అయ్యెను [చూ. కెన్యా]. కికుయూ జాతిపై ఇతడు 'ఫేసింగ్ మౌంట్ కెన్యా' అను గ్రంథము రచించెను (1938). ఆ. వెం.

**కెమాల్ పాషా** : చూ. ముస్తాఫా కెమాల్.

**కెల్లాగ్ ఒప్పందము** : ప్రపంచయుద్ధములు - I & II మధ్య కాలమున (1919 - 1939) యుద్ధ నివారణకై జరిగిన కృషి ఫలితముగ రూపొందిన ఒప్పందము. 1927, ఏప్రిల్ నెలలో ఫ్రెంచి విదేశాంగమంత్రియగు అరిస్టైడ్ బ్రియాండ్ (1862 - 1932) యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వ కార్యదర్శియగు ఫ్రాంక్ బి. కెల్లాగ్ (1856 - 1937) నకు తమ రెండు దేశములును శాంతి సాధన నిమిత్తమై నిర్బద్ధ ఒడంబడిక చేసికొన్న చో బాగుండునని సూచించెను. కాని, కెల్లాగ్ అట్టి ఒడంబడిక కేవలము రెండు దేశముల మధ్య కంటె, బహుదేశముల నడుమ జరిగినచో లెస్సయని ఉద్ఘాటించెను. దాని పర్యవసానముగ 1928, ఆగస్టు 27 తేదీన యునైటెడ్ స్టేట్స్, ఫ్రాన్స్‌లతో సహా 15 ప్రముఖ దేశములు పారిస్ నగరమున సమావేశమై, ఒక నిర్బద్ధ ఒప్పందమును ఆమోదించినవి. దీనినే 'కెల్లాగ్ ఒప్పందము' అనెదరు. అయితే, ఈ ఒడంబడికపై సంతకము చేసిన వారు ఎవరైనను మన్రో సిద్ధాంతమును అనుసరించి అమెరికా ఖండ రక్షణ, సముద్రాంతర సామ్రాజ్యావసరములు మొదలగు వానితో సహా తమ స్వప్రయోజనముల రక్షించుకొనుటకై మాత్రము యుద్ధము చేయవచ్చునను మినహాయింపు ఇందు కలదు. ఆ తరువాత ఇంకను

50 దేశములు అనతికాలములోనే ఈ ఒప్పందమును ఆమోదించినవి. దీనిపై ముఖ్యముగా జర్మనీయేకాక, నానాజాతి సమితిలో సభ్యత్వములేని యునైటెడ్ స్టేట్స్, సోవియట్ రష్యా కూడా సంతకములు చేయుటచే ఈ కెల్లాగ్ ఒప్పందము యుద్ధ నివారణ విషయమై తగినంత అభివృద్ధిని సాధించినదని ఆనాడు తలంపబడెను. కాని, ఆ ఒప్పందమున సూచింపబడిన మినహాయింపుల వలనను, అందులకు తోడుగ ప్రపంచమును ఆవహించిన జాతీయతా దురభినివేశముల వలనను ఆ ఒప్పందము ఒక దశాబ్దము ముగియకమునుపే నిష్ఫలత చెందినది. స్వ. వెం.

**కేతరిన్ - II (1729 - 1796)** : రష్యా చక్రవర్తినులలో 'మహనీయురాలు' అను ప్రఖ్యాతి పొందిన పరిపాలకురాలు. ఆ కాలమందలి పరిపాలకులు అందరికంటెను ఎక్కువ విద్యను అభ్యసించినది; పరిపాలనా విధానములో ఎక్కువ సమర్థతను కనబరచినది. ఈమె కాలములో రాజ్యము ఎక్కువమేర విస్తరించినది. యూరప్ రాజనీతి వ్యవహారములలో రష్యావారు ఎక్కువ ఆసక్తిగలవారు అయినారు.

ఈమె 1745 లో పీటర్ - III ను పెండ్లియాడెను. అతడు 1762 లో రాజ్యమునకు వచ్చి క్రూర నియంతగా వ్యవహరించుటచేత కొద్ది మాసములలోనే పదచ్యుతుడయ్యెను. పిమ్మట మరి కొద్దికాలమునకే అతడు హతుడయ్యెను. ఆ వెంటనే కేతరిన్ - II చక్రవర్తినిగా సింహాసనము అధిష్ఠించినది.

విదేశాంగ వ్యవహారములలో ఈమె ఆసక్తి చూపి, ప్రష్యా, ఆస్ట్రియా ప్రభుత్వములతో మైత్రి చేకూర్చుకొని, పోలండ్ దేశ స్వాతంత్ర్యమును పడగొట్టుటలో తోడ్పడినది. అంతేకాక, పోలండ్‌ను మూడు భాగములుగా విభజించుటయు, అందు ఒక్కొక్క భాగము ఒక్కొక్కరు చొప్పున ప్రష్యా, ఆస్ట్రియా దేశములతో పాటు రష్యా కూడా ఒక భాగమును స్వాధీన పరచుకొనుటయు జరిగినది. ఈమె పరిపాలనకాలములో చాల భాగము టర్కీ వారితోడి కలహములతో గడచినది. ఈమె క్రిమియాను జయించి, స్వాధీన పరచుకొని నల్లసముద్రముపై రష్యా వారి నౌకలు నడచుటకు సౌకర్యములు కలిగించెను. రాజ్య పరిపాలనములోను, విద్యావ్యాప్తి విషయములోను ఈమె గావించిన సంస్కరణములు మెచ్చుకొనదగినవి. కాని, రష్యాలోని సంపన్నవర్గమువారికే ఎక్కువ మేలు కలుగు విధానమును ఏర్పరచుట వలన, ఈమె కాలములో వ్యవసాయ వర్గమునందలి శ్రామికులకు బాధలు ఎక్కువయినవి. మధ్యతరగతి ప్రజల జీవితమును ఎక్కువ భాగ్యవంతముగా చేయుటకు ఈమె యత్నించినది. కాని, ఈమె యత్నము ఫలింపలేదు. ప్రజాహిత కార్యములు ఒనరించుటకు ఈమె మొదట సంకల్పించినది; కాని, ఆ కాలమందు ఫ్రెంచి విప్లవము జరుగుటవలన తన దేశమందు సైతము ప్రజా విప్లవము జరుగగలదని భయపడి, మునుపటి వ్యవస్థలనే నిలిపి ఉంచి, సంపన్నవర్గమును విధిలేక ఈమె బలపరచినది. గి. వేం. సీ.

**కేమన్ దీవులు** : బ్రిటిష్ వారి అధీనమున ఉండిన వెస్ట్ ఇండీస్ దీవులలోని మూడు ద్వీపములు కలిసిన ఒక ద్వీప రాజ్యము. ఈ రాజ్యము విస్తీర్ణము 259 చ. కి. మీ. ఈరాజ్యపు జనాభా 8,511. రాజధాని జార్జిటవున్ (జ. సం. 2,400). [చూ. వెస్ట్ ఇండీస్]. మ. ఆ. శ.

**కైరస్** : చూ. కురుష్.

**కొమొరో ద్వీపజాలము** : ఫ్రాన్స్ గణ రాజ్యమున అంతర్భాగముగ పరిగణింపబడు ఒక సముద్రోత్తర మండలము.

ఈ ద్వీప జాలమున గ్రాండికొమోరి, అన్‌జువాన్, మొహీలీ, మయొట్టీ అను నాలుగు ద్వీపములు కలవు. ఇవి యన్నియు హిందూమహాసముద్ర పరివృతములై ఆఫ్రికా తూర్పు తీరమునకును, మలగాసీ (మడగాస్కర్) ద్వీపపు ఉత్తరాగ్రమునకును మధ్యన ఉన్నవి. వీని మొత్తపు [వి] 2.199 చ. కి. మీ; [జ] 1,85,000; [భా] స్వాహిలీ భాషకు సన్నిహితమగు కొమోరియన్ భాష ఇచటి ప్రజల మాతృ భాషగ వ్యాప్తియందు ఉన్నది. సాధికారవ్యవహార భాష ఫ్రెంచి; [మ] ప్రజలందరు ముస్లిమ్‌లు; [రా] జౌడ్‌జీ (జ. సం. 2,600).

చరిత్ర : ఈ ద్వీపములందలి ప్రాచీన వాసులను గురించిన వివరములు తెలియ వచ్చుట లేదు. కాని, అరబ్బులకు ఈ దీవులు తొలుతనుండియు సుపరిచితములై ఉండినటుల కన్పట్టుచున్నది. వారి మూలముననే ఇట ఇస్లామ్ వ్యాపించినది. 16 వ శతాబ్దిలో పాశ్చాత్యులకు ఈ దీవుల విషయము తొలుత తెలియవచ్చినది. కాని, వారు చాలకాలము వరకు ఈ దీవులను ఆక్రమింపక, అచట అల్ప రాజ్యములను పరిపాలించుచున్న సుల్తానులతో స్నేహ సంబంధములను మాత్రమే కలిగి ఉండిరి. 1830 ప్రాంతమున మడగాస్కర్ దీవియందలి శకాలవ తెగకు చెందిన యోధుడు ఒకడు ఈ ద్వీపములలో ఒకటియగు మయొట్టీ దీవియందు చేరి, అచటి జొహాన్నా నగరమును పాలించు సుల్తాను ఆశ్రయబలమున ఆ ద్వీపమునంతటిని జయించెను. అప్పటికే అచటకు అనతిదూరమున ఉన్న రియూనియన్ దీవి ఫ్రెంచివారి వశమై ఉండెను. ఈ ద్వీపమునకు సైనికతంత్రరీత్యా గల ప్రాముఖ్యమును గుర్తించి రియూనియన్ ద్వీపపు గవర్నర్ అగు అడ్మిరల్ డి

పెల్ 1841 లో మయొట్టీ దీవికి ఒక రాయబారిని పంపి, వాని మూలమున అచటి పాలకులతో ఒడంబడికలను కుదుర్చుకొని, ద్వీపమును ఫ్రెంచి ప్రభుత్వపు రక్షణలోనికి తీసికొనెను. అంతట జోహన్నా నగర పాలకుడు చేయునది లేక 1843 లో తనకు ఆ ద్వీపమున గల సర్వాధికారములను త్యజించెను. 1886 లో తక్కిన మూడు ద్వీపముల సుల్తానులును ఫ్రెంచివారి రక్షణను అంగీకరించిరి. 1908 లో ఫ్రెంచి ప్రభుత్వపు ప్రత్యక్ష పాలన ఇట ప్రవేశ పెట్టబడినది. ఇచటనుండి ఫ్రెంచి నేషనల్ అసెంబ్లీకి ఇరువురును; సెనేట్‌కు ఒకరును ప్రతినిధులు ఎన్నుకొనబడుదురు. స్థానిక పరిపాలనము ఫ్రెంచి ప్రభుత్వము నియమించు పరిపాలకునివలన కార్య నిర్వాహకవర్గపు సాయముతో నిర్వహింపబడును. ఈ కార్య నిర్వాహక వర్గమున సభ్యులు పరిపాలకునిచే నియమింపబడుదురు. కాని, బాధ్యతాయుతమగు ఆంతరంగికస్వపరిపాలనమును క్రమముగ ఇట నెలకొల్పుటకు ఫ్రెంచి ప్రభుత్వము 1961 లో అంగీకరించినది. చీ. శే. రా.

**కొరియా :** తూర్పు ఆసియాలోని ఒక రాజ్యము. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున అగ్రరాజ్యముల మధ్య ఏర్పడిన వైమనస్యముల ఫలితముగ ఈ దేశము ఉత్తర కొరియా, దక్షిణ కొరియా అను రెండు చిన్న రాజ్యములుగ విభక్తమైనది (1948). అందుచే 1948 వరకు మాత్రమే కొరియా చరిత్ర ఈ దిగువ ఈయబడినది. (తరువాత వివరములకును, ఆ యా ప్రాంతముల ఉనికి మొదలగు వివరములకును కొరియా ఉత్తర, కొరియా దక్షిణ అను శీర్షికలను కననగును).

చరిత్ర : అతి ప్రాచీన చరిత్ర కలిగిన దేశములలో ఇది ఒకటి. సృష్టికర్త స్వయముగ రూపొందింపజేసిన ఒక వరాహమువలన జనించిన టాన్-గున్ అను మహావీరుడు క్రీ. పూ. 2333 లో ఈ రాజ్యమును సంస్థాపించి రాజయ్యెనని ఈ దేశపు పురాణములు నుడువుచున్నవి. ఇందలి అలౌకిక విషయములను అటుంచినను, ఆ కాలమున ఇట ఒక రాజవంశము పరిపాలించినటుల మాత్రము నిదర్శనములు కలవు. ఆ రాజ వంశము క్రీ. పూ. 1122 వరకు ఆధిపత్యము వహించి ఉండెను. అంతట చీనానుండి వచ్చిన ప్రవాసియగు పండితుడు - కీజా అను పేరుగలవాడు - ఈ రాజ్యమును వశపరచుకొనెను. ఇతని వంశమువారిని తుదముట్టించి క్రీ. పూ. 194 లో వీమాన్ అను రాజవంశము కొలది కాలము పరిపాలన సాగించెను. కాని, త్వరలోనే దేశము మూడు స్వతంత్ర రాజ్యములుగ విభక్తమయ్యెను. వీనిలో సిల్లా అను పేరు గల రాజ్యపు రాజులు క్రీ. పూ. 57 మొదలుకొని క్రమముగ బలవంతులై తక్కిన రెండు రాజ్యముల వశపరచుకొని అతి దీర్ఘకాలము పరిపాలించిరి. ఈ వంశపు ప్రభువులు వరుసగ 56 మంది పాలించిన తరువాత క్రీ. శ. 935 లో ఈ రాజవంశమును అధికారము నుండి తొలగించి, కోర్యో అను రాజవంశము అధికారమును స్వీకరించెను. ఈ వంశపు ప్రభువులు - 34 తరములవారు - ఈ రాజ్యమును పాలించిరి. వీరి కాలమున బౌద్ధమతము జాతీయమత స్థాయిని అందుకొనెను. చీనా సంస్కృతికి దేశమున విరివిగ ఆదరణ లభించెను. ఈ వంశములో కడపటి వానిని తొలగించి, 1392 లో టేజూ అను సేనాని అధికారమును గ్రహించి రాజయ్యెను. ఈతని వంశమే 'యీ' వంశమని పేరు పొందినది. ఈ వంశమున నాలుగవ రాజగు సేజోంగ్ ప్రభువు పరిపాలన కాలమున (క్రీ. శ. 1419 - 50 వ.) దేశము అత్యంత వైభవమును, ప్రశస్తిని గడించెను.

ప్రపంచమందలి మహనీయ సమ్రాట్‌లలో ఒకడుగ పరిగణింప తగినవాడు ఈ ప్రభువు. కొరియన్ భాషకు 24 అక్షరములు గల ధ్వన్యాత్మక లిపిని ఇతడు రూపొందింపజేసెను. అచ్చు అక్షరములతో ముద్రణ సాగించుటను కూడ ఇతడు ప్రవేశపెట్టెను. సారస్వతము, విజ్ఞాన శాస్త్రము ఈయన ఆదరణమువలన గొప్ప అభివృద్ధిని ఆనాడు సాధించినవి. ఈ వంశపురాజుల కాలముననే ఆసియా ఖండము అంతటిని జయించుటకు సంకల్పించిన జపాన్ యోధాగ్రణి హిడెయోషి అనువాడు కొరియాపై నౌకా బలముతో దండెత్తగ, కొరియన్ నౌకాధ్యక్షుడు యీసూన్-షిన్ తన చాకచక్యమువలన జపాన్ దళములను నిర్మూలనము ఒనర్చెను. ఆ సమయముననే ఆ కొరియన్ నౌకాధ్యక్షుడు ఇనుపరేకుతో కప్పబడిన క్రొత్తరకపు నౌకను -'కూర్మనౌక' అను అర్థ మొసగు పేరుతో వ్యవహరింపబడు దానిని - ప్రవేశపెట్టి ఉపయోగించెను. ఇనుపరేకు పైకప్పు కలిగిన నౌకను ప్రప్రథమముగ కనుగొనిన ఖ్యాతి ఈ విధముగ కొరియావాసులకు దక్కినది. తరువాత 17 వ శతాబ్దమున మంచూ సేనలు ఈ దేశమును కల్లోలపరచినను, త్వరలోనే దేశమును వదలి పోవుట వలన, అంతటినుండి చీనా లోని 'మంచూ' సమ్రాట్‌ల యొక్క సార్వభౌమతను నామమాత్రముగ గౌరవించుచు కొరియా స్వతంత్ర దేశముగనే వ్యవహరింపగలిగినది. 19 వ శతాబ్ది నుండి యూరప్ వాసులు ఈ దేశముతో సంబంధమును కల్పించుకొనిరి. కాని, ఈ దేశమున విదేశీయులకు వ్యాపారపు వసతులు లేకుండెను.

1876 లో జపాన్‌వారు కొరియాతో కొన్ని ఒడంబడికలు చేసికొని, వ్యాపారమునకు వసతులను సంపాదించిరి. 1882 లో యునైటెడ్‌స్టేట్స్ వారును, 1883 - 1886 లో గ్రేట్ బ్రిటన్, జర్మనీ, ఇటలీ, రష్యా, ఫ్రాన్స్ దేశముల వారును ఇట్లే కొన్ని ఒడంబడికలు చేసికొనిరి. 1895 లో చీనా - జపాన్ సంగ్రామమున జపాన్ గెలుపొందినందులకు ఫలితముగ కొరియా ప్రభుత్వమునకు సలహాదారులను నియమించు అధికారము జపాన్ ప్రభుత్వమునకు లభించెను. 1904లో రష్యా - జపాన్ సంగ్రామము అయిన తర్వాత విజయము పొందిన జపాన్‌వారు కొరియా దేశముపై తమ పలుకుబడిని బలపరచుకొని తమ సంరక్షణలోని రాజ్యముగా కొరియాను పరిగణింపచేసిరి. 1910, ఆగస్టు 22 వ తేదీని కొరియా పూర్తిగా జపాన్‌వారి వలస సామ్రాజ్య ప్రభుత్వ విధానమునకు లోబడినది.

ద్వితీయ ప్రపంచ యుద్ధమందు 1945 లో జపాన్ పూర్తిగా పరాజయము పొందుటతో యునైటెడ్‌స్టేట్స్, సోవియట్ రష్యా వారి సేనలు కొరియా దేశము లోనికి పోయి జపాన్ సేనలను వశపరచుకొని, కొరియా దేశమును 38 వ అక్షాంశరేఖనుబట్టి రెండు భాగములుగా విభజించి, ఉత్తర భాగము సోవియట్ రష్యా వారికిని, దక్షిణ భాగము యునైటెడ్‌స్టేట్స్ వారికిని వశపడునట్లు పంచుకొనిరి. మిత్రమండలి రాజ్యముల వారు ఈ పంపకమునకు సమ్మతించుచు, 5 ఏండ్లు గడచిన తరువాత సోవియట్ రష్యా వారును, యునైటెడ్‌స్టేట్స్ వారును కొరియా వారికి సంపూర్ణ స్వాతంత్ర్యము కలుగ జేయవలెనని తీర్మానించిరి. ఆ తీర్మానమునకు కట్టుబడి ఉండుటకు యునైటెడ్‌స్టేట్స్, సోవియట్ రష్యాలు వాగ్దానము కూడ చేసినవి. కాని, కొరియా భావి స్థితిని గురించిన ప్రధాన విషయములలో యునైటెడ్‌స్టేట్స్ వారికిని, సోవియట్ రష్యావారికిని 1946, మే మాసములోనే అభిప్రాయభేదములు కలిగినవి. తత్ఫలితముగ రెండు కొరియా భాగములును వేర్వేరు రాజ్యాంగ విధానములను ఏర్పరచుకున్నవి. ఉత్తర కొరియాలో 'పీపిల్స్ డెమోక్రాటిక్ రిపబ్లిక్ (జన సామాన్య ప్రజాతంత్ర గణరాజ్యము) ను', దక్షిణ కొరియాలో 'రిపబ్లిక్ అవ్ కొరియా (కొరియా గణ రాజ్యము)' ను ఏర్పడినవి. ఐక్యరాజ్యసమితి వారు దక్షిణ కొరియావారి ఆశయములను ఆమోదించి, ఆ రెండు భాగములను ఒకటిగా చేసి, రిపబ్లిక్ అవ్ కొరియా అనే విధానమును సార్థకము చేయడానికి పూనుకొనిరి. కాని, కమ్యూనిస్ట్ చీనా పలుకుబడికి లొంగిన ఉత్తర కొరియా సైనికబలమున దక్షిణ కొరియాను కూడ స్వాధీనపరచుకొనుటకు సంకల్పించి, 38 వ అక్షాంశరేఖను దాటి దండెత్తినది.

డిసెంబరు 23, 1950 నుండి 1951, జనవరి 12 వరకును కమ్యూనిస్ట్ సేనల విజృంభణము దినదిన ప్రవర్ధమానముగా వెలగినది. 38 వ అక్షాంశరేఖ దాటి దక్షిణ కొరియాలో సియోల్ మొదలయిన ప్రదేశములందు కమ్యూనిస్ట్ సేనలు బలము కలిగి ఉండెను.

ఐక్యరాజ్యసమితి ఈ దురాక్రమణను ప్రతిఘటించుటకై దక్షిణ కొరియాకు తోడ్పడదలచి, వివిధ దేశముల సైన్య సహాయమును అర్థించెను. అటుల సాయపడిన వారిలో యునైటెడ్‌స్టేట్స్ సేనలు అత్యధిక సంఖ్యాకములు. అందులకు మారుగా కమ్యూనిస్ట్ చీనా తన స్వచ్ఛంద సేనలను ఒసగి ఉత్తర కొరియాకు తోడ్పడెను. తొలుత ఉత్తర కొరియాదే పైచేయిగ ఉన్నను, యునైటెడ్‌స్టేట్స్ సాయముచే దక్షిణ కొరియన్‌లు ఉత్తర కొరియా సేనలను 38 వ అక్షాంశ రేఖ అవతలకు తరిమి వేయుటయే కాక, ఉత్తర కొరియాలో ప్రముఖ స్థానములను ఆక్రమించినవి. చీనా కమ్యూనిస్ట్‌లు అంతట తమ సాయమును తీవ్రతరము చేయుటయే కాక, పరిస్థితులు విషమించినచో తమ సేనలనే యుద్ధరంగమునకు పంపవలసి వచ్చునని హెచ్చరించి, కడకు యుద్ధములోనికి దిగి, ఐక్య రాజ్య సమితి సేనలను దక్షిణ కొరియా వరకు వెనుకకు నెట్టి, ఇంకను ముందుకు పోనుత్సహించెను. తుదకు భారతదేశపు మధ్యవర్తిత్వ ఫలితముగ 1953, జూలై 27 న యుద్ధవిరమణసంధి జరిగి, ఉత్తర, దక్షిణ కొరియాలు యథాపూర్వకముగ 38 వ ఉత్తర అక్షాంశరేఖ సరిహద్దుగ నిలిచి ఉండి, పరస్పరపు సంప్రతింపుల మూలముగ మున్ముందు ఏకరాజ్యముగ రూపొందవలసి ఉండునను ఏర్పాటు జరిగెను. కాని, ఈ నాటికిని ఉత్తర, దక్షిణ కొరియా దేశములు ఏకము కాలేకున్నవి [చూ. కొరియా ఉత్తర, కొరియా దక్షిణ]. గి. వేం. సీ.

**కొరియా, ఉత్తర :** కొరియా దేశము ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరము విభజింపబడుటవలన ఏర్పడిన ప్రజాస్వామిక గణరాజ్యదేశము.

ఈ దేశమునకు చీనా ప్రజాగణరాజ్యమందలి మంచూరియా, సోవియట్ రష్యా [ఉ]; జపాన్ సముద్రము [తూ]; దక్షిణ కొరియా [ద]; కొరియా అఖాతము [ప] సరిహద్దులందు ఉన్నవి. 38 అక్షాంశరేఖ ఈ దేశమును దక్షిణ కొరియా నుండి విడదీయు సరిహద్దు రేఖగ పరిగణింప బడుచున్నది. [వి] 1,23,952 చ. కి. మీ.; [జ] 1,07,16,000. [భా] జాతీయ భాష కొరియన్; [మ] 1945 కు పూర్వము ఈ దేశమున బౌద్ధ, కన్‌ఫ్యూషియన్, క్రైస్తవ మతములు క్రమముగ ప్రజలలో వ్యాప్తియందు ఉండెడివి. కాని, ఆ తరువాత కమ్యూనిస్ట్ ప్రభుత్వము ఏర్పడిన

నాటినుండి మతము ఎడల ఆదరణ ప్రజలలో నశించు చున్నది. [రా] యాంగ్ యాంగ్ (జ. సం. దాదాపు 7 లక్షలు).




రాజ్యాంగము : 1948 రాజ్యాంగ చట్టమును అనుసరించి ఉత్తర కొరియా ప్రజాస్వామిక ప్రజాగణరాజ్యముగ ప్రకటితమై కమ్యూనిస్ట్‌పార్టీ అధ్వర్యవమున నడుచు పరిపాలనను కలిగి ఉన్నది. అధిష్ఠాన ప్రజా సభ యందు రాజ్య శక్తి యంతయు న్యస్తమై ఉన్నది. 50,000 మంది పౌరులకు ఒక ప్రతినిధి చొప్పున ఈ సభయందలి ప్రతినిధులు ఎన్నుకొనబడెదరు. ఈ సభకు మూడేండ్లకు ఒకసారి సాధారణముగ ఎన్నికలు జరుగును. కాని, 1948 లో ఎన్నుకొనబడిన సభ కొరియా యుద్ధము కారణముగ 1956 వరకు నిలిచి ఉండినది. తరువాత 1957 లో ఎన్నుకొనబడిన సభ రాజ్యాంగచట్టపు సవరణచే, నాలుగేండ్ల కాలము నిలచి ఉండినది. ఈ ప్రజాసభయే ప్రధానమంత్రిని, మంత్రి మండలిలోని తక్కిన మంత్రులను, ఉప ప్రధానులను, ముఖ్య పరిపాలనా శాఖల అధిపతులను ఎన్నుకొనును. 1957 కు పూర్వమున 20 ఏండ్ల వయసునకు తగ్గని పౌరులకే వోటు హక్కు ఉండెను. కాని, ఆ సంవత్సరము నుండి 18 ఏండ్ల వయస్సునకు తగ్గని వారికి అందరికి వోటు హక్కు కలిగింపబడినది. ఎన్నికలు తక్కిన కమ్యూనిస్ట్ గణ రాజ్యములందు జరిగిన రీతిగనే ఏక పట్టికా విధానము [చూ. పు. - 348] న జరుగును [చూ. కొరియా].

చీ. శే. రా.

**కొరియా, దక్షిణ :** ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున కొరియా దేశము రెండు స్వతంత్ర భాగములుగ విభక్తము కాగా ఏర్పడిన దేశము.

ఈ దేశమునకు ఉత్తర కొరియా [ఉ]; జపాన్ సముద్రము [తూ]; కొరియా జలసంధి [ద]; పసుపు సముద్రము [ప] సరిహద్దులుగ ఉన్నవి. [వి] 96,936 చ. కి. మీ.; [జ] 2,76,33,000; [భా] జాతీయభాష కొరియన్; [మ] ప్రజలలో దాదాపు నాలుగవవంతు బౌద్ధమతస్థులు; కన్‌ఫ్యూషియన్ మతము, చందూక్యో అను ఒక విధమగు జాతీయక్రైస్తవ మతము, ప్రొటెస్టంట్ క్రైస్తవమతము, రోమన్ కేథలిక్ సంప్రదాయపు క్రైస్తవమతము సంఖ్యాబలములో బౌద్ధమతము తరువాత క్రమముగ లెక్కకు రాగలవు; [రా] సియోల్ (జ. సం. 17,10,242).




రాజ్యాంగము : 1948 జూలైలో ఆమోదితమైన రాజ్యాంగచట్టమును అనుసరించి ఈ దేశము ప్రజాస్వామికమగు గణరాజ్య విధానపు పరిపాలనను కలిగి ఉన్నది. ఆ చట్టము 1952, 1954 లలో కొన్ని సవరణలను పొందినది. వానిని అనుసరించి అధ్యక్షుడు ప్రజలచే అపరోక్షపు ఎన్నికలో ఎన్నుకొనబడుటకు, ప్రధాని పదవి రద్దయి, అధ్యక్షుని బాధ్యతతో పరిపాలన సాగునటులను ఏర్పాటులు చేయబడినవి. వరుసగా రెండు పర్యాయములకు మించి ఏ వ్యక్తియు అధ్యక్షపదవికి ఎన్నుకొనబడ కూడదను నియమము ఒక సవరణ వలన చేర్చబడినది. కాని,ఈ నియమము తొలుతటి అధ్యక్షుడగు సింగ్‌మన్‌రీకి మాత్రము వర్తించ నేరదు. జాతీయ శాసనసభయందు రెండు కక్ష్యలు ఉండగలవను నియమము ఉన్నను, ఇప్పటికి ఎగువసభ రూపొందలేదు. దిగువ సభయగు ప్రతినిధిసభయందు కొరియాదేశము మొత్తమునకు సంబంధించిన ప్రతినిధులు ఉండుఏర్పాటు ఉన్నను, దక్షిణ కొరియాయందున్న రాష్ట్రముల ప్రతినిధులే ప్రస్తుతము ఎన్నుకొనబడినారు. 1959 లో ఈ సభలో సభ్యుల సంఖ్య 233. సాధారణ ప్రతిపాదనలు ఈ సభ వారిలో

సగము మందికి మించిన వారి ఆమోదముతో శాసనములు అగును. రాజ్యాంగ సవరణ, బడ్జెట్ ఆమోదములకు మాత్రము మూడింట రెండువంతుల ప్రాబల్యము కావల యును. కార్యనిర్వహణమున అధ్యక్షునికి సాయమొనర్చు టకు స్టేట్ కౌన్సిల్ ఒకటి కలదు. దీనియందు 15 మందికి మించక 8 మందికి తగ్గక సభ్యులు ఉందురు. ఈ సభ్యులలో ప్రతి ఒకనికి మంత్రిత్వపు హోదా ఉండును. వీరిని అధ్యక్షుడే నియమించును. వివిధ ప్రభుత్వ శాఖల నిర్వ హణము, విదేశములతో ఒడంబడికల ఏర్పాటు, బడ్జెట్ తయారుచేయుట మొదలగు విస్తృతాధికారములను ఈ కౌన్సిల్ కలిగి ఉన్నది. ప్రభుత్వ విధానములను ఈ కౌన్సిల్ అధిక సంఖ్యాక ప్రాబల్యముతో నిర్ణయించును. ఇంతేకాగ, ఉన్నతోద్యోగముల నియామకములు, రాయ బారుల ఏర్పాటు మొదలగు వానియందును ఈ కౌన్సిల్ అధికారము కలిగి ఉన్నది. 21 ఏండ్ల వయసునకు తగ్గని ప్రతిపౌరునికి వోటు హక్కు కలదు.

కాని, 1960 లో ప్రభుత్వమున అవినీతి మొదలగునవి విశేషముగ వ్యాపించినందున ఒక విప్లవ సంఘమువారు అప్పటిలో అధ్యక్షుడుగ ఉన్న సింగ్‌మన్ రీ ని తొలగించి ప్రభుత్వమును వశపరచుకొనిరి. అంతట అప్పటి విదేశాంగ మంత్రి హూ చుంగ్ అధికారమును చేపట్టె. 1960, జూన్ 15 న రాజ్యాంగము సవరింపబడి అధ్యక్షుని నిరంకుశ పాలనకు బదులు బ్రిటన్‌లో వలె మంత్రిమండలి పాలనము అచట ప్రవేశపెట్టబడెను. చుంగ్ పరిపాలనకూడ ప్రజలలో అసంతృప్తిని రేకెత్తించుటవలన జనరల్ చుంగ్ హీ పార్క్ అను సేనాని 1961, మే 16 న సైనిక విప్లవము ద్వారా చుంగ్‌ను పదవిచ్యుతునిజేసి, అధికారమును చేజిక్కించు కొనెను. తరువాత అతడే అధ్యక్షుడుగ ఎన్నుకొనబడెను (1963, అక్టోబరు 15); 175 మంది సభ్యులు కల జాతీయ శాసనసభ కూడ ఎన్నుకొనబడి, 3 వ గణరాజ్యము ప్రతిష్ఠింప బడెను (1963, డిసెంబరు 17) [చూ. కొరియా]. చీ. శే. రా.

**కొలంబస్, క్రిస్టఫర్ (1451-1506) :** పశ్చిమార్ధగోళ భూములను తొలుత కనుగొనిన సాహసిక అన్వేషకుడు. 1450 లో జెనోవా పట్టణమందు ఒక పెద్ద కుటుంబమున ఇతడు జన్మించి, తన తండ్రి అవలంబించిన నేతపని వృత్తిగా పెట్టుకొని తన బాల్యమును గడపెను. కాని, పెద్దవాడు అగుచుండిన కొలదీ అతనికి నావికావృత్తియందు అభి లాష ఎక్కువయినది. భూగోళ, ఖగోళ శాస్త్రములు, జ్యామితి, నావికావృత్తికి కావలసిన పరిజ్ఞానము లెస్సగా అలవరచుకొని జెనోవా నౌక వర్తకులతో కలిసి తిరుగుచు, సముద్రయానమందు ఇతడు అనుభవమును సంపాదించు కొనెను. 1417 లో కొలంబస్ పోర్చుగల్ దేశమునకు పోయి అచట స్థిరనివాసమును ఏర్పరచుకొని, కాలక్రమ మున ఒక నావిక నాయకుని కూతురిని పెండ్లియాడెను.


క్రిస్టఫర్ కొలంబస్
(1451 - 1506)

అయితే, ఒక ప్రధాన విష యములో తక్కిన నావికుల కును, కొలంబస్‌కును నావి కోద్యమమునందు తార తమ్యము ఉండెను. తక్కిన నావికులు ఎప్పుడును తూర్పు దిక్కుగనే సముద్ర యానము చేసి, భారతదేశ మునకు నూతన మార్గమును కనుగొనవలెనని చూచు చుండిరి. కొలంబస్ పడమటి దిక్కుగా సముద్రయానము చేసి భారతదేశమును చేరవచ్చునన్న ఆశతో పశ్చిమమార్గ మున అట్లాంటిక్ మహా సముద్రము మీదుగా పోదలచెను. అది తక్కిన వారికి పిచ్చిగా తోచినది. అయినను కొలంబస్ తన ప్రయత్నమును విడిచిపెట్టుకొనక తన ఉద్యమమునకు కావలసిన ద్రవ్యమునకై చూచుచుండెను. చిట్ట చివరకు స్పెయిన్ దేశపు రాణి ఇసబెల్లా సాహ సించి మూడు నౌకలను, 120 మంది పనివారిని కొన్ని మాసములకు సరిపడు భోజన పదార్థములను కొలంబస్‌నకు ఇచ్చి, అతని ఉద్యమమునకు దోహదము చేసినది. 1492 లో కొలంబస్ ధైర్య సాహసములతో పడమటి దిక్కుగా సముద్రయానము సాగించెను. రెండు మాసములు గడచినవి; కాని, భూతలము కనబడలేదు. అతనితో ఉన్న వారికి భయము కలిగినది. తిరిగి పోదమని పట్టు పట్టిరి. కాని, కొలంబస్ తన కోరిక నెరవేర్చుకొను సంకల్పముతో వారికి నూతనోత్సాహ మును కల్పించుచు యానము సాగించెను. తుదకు ఒక చిన్న ద్వీపము కనబడినది. దాని వెనుక ఒకటిగా ఆరేడు ద్వీపములు కనబడినవి. ఇవి అన్నియు ఇండియాకు సంబంధించిన ద్వీపములే అని అతడు అనుకొనెను. అందు వలననే వీటికి పశ్చిమ ఇండియా దీవులను పేరు ప్రచారము లోనికి వచ్చెను.

కొలంబస్ కొద్ది దినములు మాత్రమే ఆ ద్వీపములందు గడపి, అక్కడి జనులతో పరిచయము కలుగజేసికొని, అక్కడ కనబడిన వింత వస్తువులను కొన్నిటిని సేకరించి, తన పరివారముతో మరల స్పెయిన్ దేశమునకు చేరుకొనెను. స్పెయిన్ రాజు, రాణి అతనిని ఎక్కువగా గౌరవించి,

డాన్ అను బిరుదమును, బహుమతులను ఒసంగి, ప్రభుత్వ వర్గ సభ్యునిగా చేసి ఆదరించిరి.

కొలంబస్ రెండవసారి 1493 లో బయలు దేరి పోయి మరికొన్ని క్రొత్త దీవులను కనిపెట్టి, అందు వసతులను ఏర్పరచి, తనతో వచ్చిన వారిలో కొందరిని అచట ఉంచెను. తాను మరల స్పెయిన్ దేశమునకు పోయి, ఆ ద్వీపవాసులను కొందరిని స్పెయిన్‌నకు తోడ్కొని వచ్చి బానిసలుగా విక్రయించెను.

మరియొక సారి రాజదంపతుల ఆదరమున మరికొన్ని బిరుదములను పొంది, పెద్ద నౌకాదళముతో 1498 లో పయనించి ట్రినిడాడ్ మొదలయిన మరికొన్ని ద్వీపముల ఉనికిని కొలంబస్ కనిపెట్టి, వలస రాజ్యములను స్థాపించెను. ఆ వలస రాజ్యములకు అతడే గవర్నర్ పదవి వహించి ఉండెను. అతని పరిపాలనము దుష్టమయినదన్న నేరములు మోపి స్పెయిన్ ప్రభుత్వమునకు కొందరు ఫిర్యాదు చేసిరి. ప్రభుత్వాధికారులు అతని ప్రవర్తనము పరిశీలించుటకు ఒక న్యాయాధికారిని నియమించి పంపిరి. అతడు కొలంబస్‌ను దోషిగా ఎంచి చేతులకు సంకెళ్లు వేసి స్పెయిన్ దేశమునకు తీసికొని వచ్చెను. కాని, రాజ దంపతులు అతని ఎడల తమకు గల ఆదరానురాగముల చేత అతనిపై ఆరోపించిన నేరములను వినుటకయినను సమ్మతింపక అతనిని విడిచి పెట్టిరి. 1492 లో అమెరికాఖండమును తొలిసారిగా కనిపెట్టిన 'మహనీయుడు' కొలంబస్ అను ఘనత ప్రపంచ చరిత్రలో స్థిరముగా నిలిచినది. ప్రపంచ చరిత్రలో నూతన యుగారంభ ప్రారంభము కూడ ఈ సంఘటనతోనే జరిగినట్లు భావింతురు [చూ. దేశాన్వేషకులు].

గి. వేం. సీ.

**కొలంబియా :** దక్షిణ అమెరికా యందలి ఒక స్వతంత్ర రాజ్యము.

ఈ దేశమునకు కారబియన్ సముద్రము [ఉ]; వెనిజ్యులా, బ్రెజిల్ [ద]; పెరూ, ఈక్వడార్ [ప]; పసిఫిక్ మహాసముద్రము, పనామా [తూ] సరిహద్దులందు ఉన్నవి. ఈ దేశమునకు ఒక వైపున పసిఫిక్ మహాసముద్రము లోడను, మరియొక వైపున అట్లాంటిక్ మహాసముద్రము తోడను చేరిక కలదు. కారబియన్ సముద్రమున ఉన్న సాన్ఆండ్రెస్, ప్రావిడెన్షియా దీవులును, పసిఫిక్ మహాసముద్రమందలి మాల్పిలో దీవియు ఈ రాజ్యమునకే చెంది ఉన్నవి. ఈ దీవులతోచేరి [వి] 11,38,338 చ. కి. మీ.; [జ] 1,50,97,640. ఆదిమ అమెరికన్ జాతితో యూరపియన్ జాతి సంకరమొందిన ఫలితముగ రూపొందిన మిశ్రజాతి జనులు ఇందు అధిక సంఖ్యాకులు. అచ్చమగు యూరపియన్ జాతివారు 28% మాత్రము ఉందురు. నీగ్రోలును, ఆదిమ అమెరికన్లును 10% ఉందురు. [మ] దేశమున నూటికి 96 మంది రోమన్ కేథలిక్ సంప్రదాయపు క్రైస్తవులు. తక్కిన వారిలో ఇతర సంప్రదాయముల క్రైస్తవులును, యూదులును కలరు. [భా] సాధికార జాతీయ భాష స్పానిష్. కొలదిమంది ఆదిమ అమెరికన్ జాతివారు తప్ప తక్కిన ప్రజలందరు దానిని చక్కగ మాట్లాడెదరు. [రా] బగోటా (జ. సం. 6,48,324).




చరిత్ర : క్రీ. పూ. 5000 నుండియు ఈ దేశమున జనావాసములు ఉండినటుల తెలియుచున్నది. నేడు బగోటా నగరము ఉన్నప్రాంతమున చిప్చా అను పేరుగల నాగరక జాతి వసించి ఉండి, వ్యవసాయ, వాణిజ్యములందు చాల పురోగమించెనని తెలియవచ్చుచున్నది. క్రీ. శ. 1538 లో జిమేనెజ్ డీ కసాడా అను స్పానిష్ యోధుడు 900 మంది సైనికులతో ఈ ప్రాంతముపై దండెత్తి వశపరచుకొని, స్పెయిన్ సామ్రాజ్యాధికారమును ఇచట నెలకొల్పెను. ఆనాడు న్యూగ్రెనడా అను పేర స్పెయిన్ వారి వలసగ ఇది ఉండెను. బంగారమును, రత్నములును, పొగాకును ఈ దేశమునుండి విరివిగ స్పెయిన్ దేశమునకు ఆనాడు తరలింపబడుచుండెడివి. 1810, జూలై 20 న స్పెయిన్ సామ్రాజ్యమునుండి ఈ దేశము విడివడెను. స్వతంత్రతను ఆర్జించినప్పటినుండియు కొలంబియా చరిత్ర రాజకీయ కల్లోలములకు పేరొందెను. మతాధిపత్యముతో మిళితమగు బలమగు కేంద్రప్రభుత్వమును అభిలషించు సంప్రదాయ వాదుల (కన్సర్వేటివ్) కును, మతసంస్థలనుండి

వేరై ప్రభుత్వము వ్యవహరించవలెననియు, రాష్ట్రము నకు కొన్ని ప్రభుత్వహక్కులు ఉండవలెననియు అభిలషించు మితవాదు (లిబరల్) లకును ఏర్పడిన అభిప్రాయ భేదములే ఈ రాజకీయ కల్లోలములకు మూల కారణములు. తొలుత 1836 లో మితవాదుల ఆధిపత్య మున రాజ్యాంగము రూపొందెను. 1886 నాటికి సంప్ర దాయ వాదులు బలమును ఆర్జించి, రాజ్యాంగ విధానమును మార్చిరి. ఆ విధానము ఇప్పటికిని కొన్ని సవరణలతో అమలులో ఉన్నది. దీనిమూలమున దేశమున ఒక విధ మగు నియంతృత్వము అమలుజరుగుచుండుటచే అంత టంతట తిరుగుబాటులు జరుగుట ఈ దేశచరిత్రకు ఒక సామాన్య లక్షణమైనది. తొలుత ఈ దేశముననే పనామా యను ఒక రాష్ట్రముగ ఉండెను. కాని, పనామా రాష్ట్రము యునైటెడ్ స్టేట్స్ వారికి పనామా భూసంధిని కౌలుకు ఈయగా, కొలంబియా కేంద్రప్రభుత్వము దానిని ధ్రువపరుప నిరాకరించెను. అందువలన యునైటెడ్ స్టేట్స్ తోడ్పాటుతో పనామా తిరుగుబాటు చేసి, స్వతంత్రతను ఆర్జించెను (1903). 1948 లో జరిగిన రాజకీయ కల్లోలముల మూలమున కొలంబియాయందు నిరంకుశ నియంతృత్వము ఏర్పడి, ప్రజలకు బాధాకరముగ పరిణ మించెను. తుదకు రెండు రాజకీయ పక్షములవారును ఏకమై ఈ నియంతృత్వమును తొలగించి, శాసన బద్ధ ప్రభుత్వమును స్థాపించిరి (1958). ఆ రెండు పక్షముల వారును ఏర్పరచుకొనిన 16 ఏండ్ల అభివృద్ధి ప్రణాళికను అనుసరించి కొలంబియా దేశము ఇపుడు పురోగమించు చున్నది.

రాజ్యాంగము : 1886 లో ఆమోదింపబడి, ఆ యా పరిస్థితులను అనుసరించి 1910, 1936, 1945, 1957 లలో సవరింపబడిన ఏకదేశీయ గణతంత్ర రాజ్యాంగవిధానము ఈ దేశమున అమలునందు ఉన్నది. అపరోక్షపు ఎన్నికలో ప్రజలు నాలుగేండ్లకు ఒకతూరి అధ్యక్షుని ఎన్నుకొనెదరు. ఒకసారి ఆ పదవికి ఎన్నుకొనబడిన అతడు ఆ వెను వెంటనే మరియొకసారి అధ్యక్షుడుగ ఎన్నుకొనబడ కూడదు. రెండేండ్లకు ఒకతూరి ఒక ప్రత్యామ్నాయపు అధ్యక్షుని కూడ ప్రజలు ఎన్నుకొనెదరు. అధ్యక్షుడు కారణాంతముల వలన తన విధులను నిర్వర్తించలేని కాలమున లేదా గతించిన సందర్భమున ఈ ప్రత్యామ్నా యపు అధ్యక్షుడు పనిచేయును. శాసనసభయందు ప్రతినిధి సభ, సెనేట్ అను రెండు కక్ష్యలు కలవు. తొలుతటిదాని యందు 148 మంది సభ్యులు ఉందురు. వీరిని రెండేండ్లకు ఒక తూరి ప్రజలు ఎన్నుకొనెదరు. సెనేట్ నందు 80 మంది సభ్యులు ఉందురు. వీరిని నాలుగేండ్లకు ఒకతూరి ప్రజలు ఎన్నుకొనెదరు. అధ్యక్షుడు తన మంత్రి మండలిని నియ మించుకొని పరిపాలనకు బాధ్యత వహించును. 21 ఏండ్ల వయసు గల పౌరులకెల్ల ఈ దేశమున వోటింగు హక్కు కలదు. ప్రస్తుతము దేశమునందలి కన్సర్వేటివ్, లిబరల్ పక్షములు కుదుర్చుకొనిన ఒడంబడికను అనుసరించి 1974 వరకు శాసన సభయందు ఉభయ పక్షములకు సమాన ప్రాతినిధ్యము ఉండునటులను, అధ్యక్ష పదవి ఒక పక్షము తరువాత వేరొక పక్షము వారికి చెందుచుండునటులను ఏర్పాటు జరిగినది.

చీ. శే. రా.

**కొలంబో ప్రణాళిక :** దక్షిణ ఆసియా, ఆగ్నేయ ఆసియాలోని రాజ్యములు పరస్పర సహకారమువలన ఆర్థిక స్వాతంత్ర్యమును సాధించుటను ఉద్దేశముగ ఇడుకొని 1951 లో రూపొందిన సంస్థ. అందు భారతదేశము, ఇండోనీషియా, కాంబోడియా, కొరియా (దక్షిణ), థాయి లాండ్, నేపాల్, పాకిస్తాన్, ఫిలిప్పీన్ ద్వీపములు, బర్మా, భూటాన్, మలేసియా, లావోస్, వియెత్నామ్ (దక్షిణ), సింగపూర్, సింహళము లాభార్జక సభ్యత్వములను, ఆస్ట్రేలియా, కెనడా, జపాన్, న్యూజీలండ్, యునైటెడ్ కింగ్‌డమ్, యునైటెడ్ స్టేట్స్ సహాయదాయక సభ్యత్వము లను పొంది ఉన్నవి. తొలుత కామన్ వెల్త్ రాజ్యములచేతనే అది ఆరంభితమైనను, క్రమముగ యునైటెడ్ స్టేట్స్ చేరిన తరువాత దాని పరిధి విస్తృతీకరింపబడినది. ఋణములు, ఆహార సరఫరాలు, యంత్ర సామగ్రి, సాంకేతిక సహాయము, శిక్షణా కార్యక్రమములు, విద్యా విషయిక సాహాయ్యము మొదలగు రూపములలో ఇందలి సహాయ దాయక రాజ్యములు తక్కిన వానికిని, తక్కినవి పరస్పరము తమ శక్తి మేరకును సాయపడుచున్నవి. తొలుత ఏడేండ్ల కాల నిర్ణయముతో మాత్రమే ఈ ప్రణాళిక రూపొందినను, 1959 లో మరల దీని కాలావధి 1936 వరకు పొడిగింపబడినది.

చీ. శే. రా.

**కోమింగ్‌టాంగ్ :** సుప్రసిద్ధ చీనా నాయకుడగు సన్ యత్ సేన్‌చే 1891 లో స్థాపింపబడిన చీనా జాతీయ పక్షము. రాజకీయ ప్రజాస్వామ్యమును సాధించుటయు, సామాజిక సంస్కరణమునకు సంబంధించిన కార్యకలాప ములను నిర్వర్తించుటయు దానిపరమోద్దేశములు. ఈ పార్టీ 1911 లో జరిగిన చీనా విప్లవమునందు ప్రముఖ పాత్ర నిర్వహించెను. కాని, 1926–27 వరకును యుద్ధప్రియులగు చీనా మాండలిక ప్రభువుల ఒత్తిడికి లోనై గత్యంతరము లేక ఇది దక్షిణ చీనాలోనే తన కృషిని సాగించవలసి వచ్చినది. సన్ యత్ సేన్‌కు తరువాత నాయకుడైన

చియాంగ్-కై-షేక్ (జ. 1886) [చూ.] రష్యన్ల సహాయముతో ఉత్తరమున నాన్‌కింగ్ వరకు తన పార్టీ ప్రాబల్యమును స్థాపించుటయందు కృతకృత్యుడు అయ్యెను. ఈ కోమింగ్‌టాంగ్ పక్షము 1928, అక్టోబరు 10 న శక్తిమంతమగు ప్రజాప్రభుత్వమును స్థాపించి, 1931, మే నెలలో లాంఛనముగ రాజ్యాంగమును ఒక దానిని రూపొందించి అమలు పరచెను. ఆ తరువాత చీనాను ఎదుర్కొనిన జపానీయుల బెడదను, దండయాత్రను ప్రతిఘటించుటలో ఈ పక్షము ప్రముఖపాత్ర వహించెను. కాని, కాలక్రమమున సన్ యత్ సేన్ చే ప్రవచింపబడిన పరమోద్దేశముల నుండి ఈ పార్టీ దూరమగుటయేగాక, 1945 నాటికి అవినీతితో నిండినది. 1945 - 48 లో జరిగిన అంతర్యుద్ధమునందు కమ్యూనిస్టులు ఈ కోమింగ్‌టాంగ్ పక్షమును ఓడించుటచే, దేశపు ముఖ్యభూభాగమున తావులేక, శేషించిన అనుచరులతో ఈ పార్టీ నాయకుడు చియాంగ్-కై-షేక్ ఫార్మోజా (తైవాన్) కు పారిపోయి, అచ్చట పోటీగా చీనా జాతీయప్రభుత్వము అను పేరుతో ఒక ప్రభుత్వమును నెలకొల్పుకొనవలసివచ్చినది. స్వ. వెం.

**కోసిగిన్, అలెక్జీ నికలోవిచ్** (జ. 1904): సోవియట్ రష్యా రాజనీతి వేత్త; ప్రధాన మంత్రి (1964). లెనిన్‌గ్రాడ్ నగరములో జవుళి విద్యాసంస్థలోను, సహకార సాంకేతిక పాఠశాలలోను విద్యాభ్యాసము చేసి, సహకారసంస్థల కార్యకర్తగా కోసిగిన్ మనుగడ ప్రారంభించెను. 1927 లో ఇతడు కమ్యూనిస్ట్ పార్టీలో చేరి, 1939 లో కేంద్ర కమిటీ సభ్యుడు కాగలిగెను. ఈయన లెనిన్‌గ్రాడ్ జవుళి మిల్లుల డైరక్టర్‌గాను (1937 - 38), లెనిన్‌గ్రాడ్ నగర మ్యునిసిపాలిటీ ఛైర్మన్‌గాను (1938 - 39), జవుళి పరిశ్రమశాఖకు



అలెక్జీ నికలోవిచ్, కోసిగిన్ (జ. 1904)

అధిపతిగను (1939 - 40) పరిపాలనానుభవమును గడించి, ప్రభుత్వ శాఖాధిపతుల సంస్థకు వైస్‌ఛైర్మన్ (1940 - 46) పదవిని నిర్వహించెను. 1948 లో ఇతడు పాలిట్ బ్యూరోలో పూర్తి సభ్యత్వమును సంపాదించి, ఆర్థిక మంత్రిగను (1948), లఘుపరిశ్రమల మంత్రిగను (1948 - 53), వస్తూత్పత్తి మంత్రిగను (1953 - 54), రాష్ట్రప్రణాళికా కమిషన్ అధ్యక్షుడుగను (1959-60) పనిచేసెను; 1960 లో రష్యా మంత్రిమండలి ప్రథమ ఉపాధ్యక్ష పదవిని చేపట్టి, 1964 లో కృశ్చేవ్ స్థానే ప్రధానమంత్రి అయ్యెను. నాటినుండి కృశ్చేవ్ [చూ.] రాజనీతి విధానములనే కొలది మార్పులతో అనుసరించుచు, ప్రపంచశాంతిని సుస్థిరము చేయుటకు శక్తివంచన లేకుండ కృషి చేయుచున్నాడు (1965) [చూ. టాష్‌ఖండ్ ప్రకటన]. ఆ. వెం.

**కోస్టారికా**: మధ్య అమెరికా లోని ఒక స్వతంత్ర రాజ్యము.

ఈ దేశమునకు నికరాగ్వా [ఉ]; పనామా, కారబియన్ సముద్రము [తూ]; పసిఫిక్ మహాసముద్రము [ద, ప] సరిహద్దులందు కలవు.




[వి] 50,700 చ. కి. మీ. ఈ దేశమునకే చెంది, సమీప సముద్రములందున్న కొన్ని అల్పద్వీపములును ఈ లెక్కలో చేరి ఉన్నవి. [జ] 13,55,757. ప్రజలలో ఎక్కువమంది అచ్చమగు యూరపియన్ జాతికి (స్పానిష్ కోవకు) చెందినవారు. ఆమెరికన్ ఆదిమవాసులు స్పెయిన్‌దేశవాసులతో సంకరము మొందగ రూపొందిన మిశ్రజాతివారు అల్పసంఖ్యలో కలరు. [మ] దేశమున అత్యధిక సంఖ్యాకులు రోమన్ కేతలిక్ క్రైస్తవులు. [భా] జాతీయ భాష స్పానిష్. కాని, ఇంగ్లీషు భాషను కూడ చాలమంది మాట్లాడగలరు. [రా] శాన్‌జోస్ (జ. సం. 1,84,000).

చరిత్ర: 16 వ శతాబ్ది వరకు ఈ ప్రాంతమున వసించిన వారి చరిత్ర తెలియవచ్చుట లేదు. 1502 లో కొలంబస్ [చూ - పు. 407] ఈ దేశతీరమున దిగెను. ఆనాడు ఈ దేశపు జనసంఖ్య దాదాపు 25,000 ఉండెనని అంచనా. దేశవాసులలో అనేకులు బంగారు ఆభరణములను ధరించి ఉండుట చూచి, కొలంబస్ ఈ దేశమునకు కోస్టారికా (సంపన్న తీరభూమి) అని పేరిడెను. స్పెయిన్‌వారు ఈ దేశమును ఆ వెనువెంటనే జయించి, తమ సామ్రాజ్యమున అంతర్భాగముగ చేసికొనిరి. 1821 లో మధ్య అమెరికా అంతయు స్పెయిన్ సామ్రాజ్యమునుండి విడివడిన తరువాత, ఈ ప్రాంతము మెక్సికో సామ్రాజ్యమున అంతర్భాగ

ముగ రూపొందెను. ఆ సామ్రాజ్యము మూన్నాళ్ల ముచ్చటగ మాత్రమే పరిణమించి 1823 లో అంతరించగ, అంతట ఈ దేశము దక్షిణ అమెరికా సంయుక్త రాష్ట్రము లను పేర స్థాపింపబడిన సమాఖ్యలో చేరి, కడకు 1838 లో దాని నుండియు విడివడి స్వతంత్ర రాజ్యమయ్యెను. కాని, నికరాగ్వా, పనామాలతో ఈ దేశమునకు సరిహద్దును గురించిన కొన్ని తగాదాలు ఆ నాటి నుండి పరిష్కృతములు గాక నిలిచియే ఉన్నవి. రెండు ప్రపంచ యుద్ధములలోను ఈ దేశము యునైటెడ్ స్టేట్స్ పక్షముననే ఉండినను, యుద్ధములో పాల్గొనలేదు. ఈ దేశ సంపదకు కాఫీ పంట ముఖ్యాలంబనము. కొన్ని ఏండ్లనుండి అరటితోటల పెంపకము కూడ అభివృద్ధి పరచబడినది. మొత్తముమీద మధ్య అమెరికా దేశములందు అన్నింట జీవన స్థాయిలో ఈ దేశము ఉచ్చతమ ప్రమాణము కలదిగ పేరొందినది.

రాజ్యాంగము : 1871 లో ఈ దేశమునకు ఒక రాజ్యాంగ విధానము ఆమోదింపబడినను, 1949 లో దానిని రద్దుచేసి, వేరొక రాజ్యాంగ విధానమును దేశము ఆమోదించినది. దీనిని అనుసరించి దేశమునకు ఒక అధ్యక్షుడు, ఇద్దరు ఉపాధ్యక్షులు, 45 మంది సభ్యులు గల ఒక శాసనసభయు సార్వజనిక రహస్య ఎన్నిక పద్ధతిన వయోజనులగు ప్రజలచే నాలుగేండ్లకు ఒకతూరి ఎన్నుకొనబడుదురు. ఒకసారి ఎన్నుకొనబడిన వాడు రెండవ తడవ ఆ పదవికే ఆ వెనువెంటనే ఎన్నుకొనబడకూడదు. ఉప ఎన్నికల గొడవ తగ్గించుకొనుటకు, మూవురు శాసన సభాసభ్యులకు తోడుగ ఒక ప్రత్యామ్నాయ సభ్యుడును సాధారణ ఎన్నికల సమయముననే ఎన్నుకొనబడును. ఒకవేళ ఆ ముగ్గురు శాసన సభ్యులలో ఒకని పదవి ఖాళీ అయినపుడు ఈ ప్రత్యామ్నాయ సభ్యుడు ఆ పదవిని ఆక్రమించును. ఈ రాజ్యాంగ విధానమున వేరొక విశిష్టతయు కలదు. ఆంతరంగిక స్వపరిపాలక సంస్థలు కొన్ని రాజ్యాంగ విధానము మూలముననే ఈ దేశమున రూపొందింప బడినవి. ప్రజావసర సంస్థలయందు రాజకీయపు పలుకుబడి చలామణీ కాకుండ చేయుటకు ఈ విధానము అవలంబింపబడినది. ఎన్నికలను నిర్వహించు సంస్థ, జాతీయ బ్యాంకింగు సంస్థ, భీమా సంస్థ, రహదారి సంస్థ, గృహనిర్మాణ సంస్థ, విద్యుత్‌సంస్థ మొదలగునవి ఈ వర్గమునకు చెందినవి. మూడింట రెండు వంతుల శాసన సభ్యుల సమ్మతితో ఏ ప్రజావసర సంస్థకైనను ఆంతరంగిక స్వతంత్రతను కలిగించుటకు ఈ విధానమున అవకాశము కలదు.

చీ. శే. రా.

**కౌటిల్యుడు :** చూ. సం ; 5 - పు. 460.

**క్యూబా :** ఉత్తర అమెరికా లోని ఒక స్వతంత్ర ద్వీప రాజ్యము.

ఫ్లారిడా ద్వీపకల్పమునకు దక్షిణమున దాదాపు 160 కి. మీ. దూరమున కారబియన్ సముద్రముచే పరివృతమై ఈ ద్వీప




రాజ్యము నెలకొని ఉన్నది. ఈ రాజ్యమున ముఖ్యమగు క్యూబాదీవియే కాక దానికి సన్నిహితముగ ఉన్న కొన్ని అత్యల్ప ద్వీపములును చేరి ఉన్నవి. క్యూబాదీవి పొడవు దాదాపు 1,216 కి. మీ. ; నరాసరిన వెడల్పు 80. నుండి 96 కి. మీ. వరకు ఉండును. [వి] 1,14,524 చ. కి. మీ. ; [జ] 72,02,752. స్పానిష్ సంతతికి చెందిన శ్వేతజాతివారు ప్రజలలో 73% కలరు. తక్కిన వారిలో మిశ్రజాతి వారును, నీగ్రోలును చేరి ఉన్నారు. [భా] క్యూబా ప్రజల మాతృభాష స్పానిష్. కాని, ఇంగ్లీషు ద్వితీయ భాషగ విపుల వ్యాప్తిని ఆర్జించినది. [మ] ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు రోమన్ కేథలిక్ సంప్రదాయపు క్రైస్తవులు. చక్కెర ఈ దేశమున ముఖ్యమగు ఉత్పత్తి. దేశపు ఆర్థిక ప్రతిపత్తి చాలవరకు చక్కెర ఎగుమతి మీదనే ఆధారపడి ఉన్నది. [రా] హవానా (హబానా) (జ. సం. 7,85,455).

చరిత్ర : 1492 లో క్రిస్టఫర్ కొలంబస్ [చూ - పు. 407] ఈ దీవిని కనుగొని, దీనిపై స్పెయిన్ రాజ ప్రభుత్వమును నెలకొల్పెను. 1523 నుండి బానిస వ్యాపారము విరివిగ సాగి, నీగ్రోబానిసలు అనేకులు క్యూబాలో పని చేయుటకు కొనిరాబడిరి. ఇక్కడ నుండి మెక్సికో మొదలగు ప్రాంతములకును ఈ బానిసలు ఎగుమతి అగుటచే క్రమముగ ఈ వ్యాపారము వలన క్యూబా సంపన్నమై, తదితర యూరపియన్‌ల దృష్టిని ఆకర్షించెను. 1762 లో బ్రిటిష్ వారు ఈ ద్వీపరాజ్యమును ఆక్రమించుకొని, ఒక సంవత్సరకాలము తమ వశమున ఉంచుకొనిరి. తరువాత స్పెయిన్ వారి వలన ఫ్లారిడా ద్వీపకల్పమును ఇందులకు మార్పుగా గ్రహించి, స్పెయిన్ వారికే ఈ ద్వీపమును ఆంగ్లేయులు వదలిరి. ఆంగ్లేయ ఆక్రమణవలన ఈ దేశమున స్వాతంత్ర్యాకాంక్ష పెచ్చు పెరిగెను. దగ్గరనే ఉన్న యునైటెడ్ స్టేట్స్ స్వతంత్రతను ఆర్జించుటతో క్యూబా యందు ఈ స్వాతంత్ర్య భావన ఇంకను తీవ్రతరమయ్యెను.

1810 - 55 వరకు పలుమారులు స్పెయిన్ పై క్యూబా ప్రజలు తిరుగుబాటులు చేసిరి. కాని, అవి అన్నియు విఫలములు అయ్యెను. 1868 లో కార్లస్ మాన్యుయెల్ డి కెస్పెడిస్ అను సంపన్న భూస్వామి తన బానిసలకు అందరకు స్వేచ్ఛను కల్పించి, స్వాతంత్ర్యార్జనకై ప్రజలలో ప్రచారము సాగించెను. తత్ఫలితముగ గెరిల్లా దళములు అనేకములు ఏర్పడి పదిఏండ్ల కాలము స్పెయిన్ సామ్రాజ్య సేనలతో పోరాటము సాగించినవి. కాని, అందువలనను ప్రయోజనము శూన్యమయ్యెను. 1892 లో జోసీ మర్తీ అను క్యూబా దేశభక్తుడు యునైటెడ్ స్టేట్స్‌లో క్యూబా విప్లవసైన్యము ఒకదానిని రూపొందించి, క్యూబా స్వతంత్రతాజ్యోతి ఆరిపోకుండ కాపాడగలిగెను. ఈ దళము 1895, ఫిబ్రవరి 24 తేదీన తమ మాతృభూమికి స్వేచ్ఛను కలిగించుటకై ఆ దేశమున విప్లవము లేవదీసెను. తత్ఫలితముగ స్పెయిన్ సామ్రాజ్యసేనలతో జరిగిన యుద్ధమందు జోసీ మర్తీ తొలుతనే మరణించినను, స్వాతంత్ర్యయుద్ధము మాత్రము విరమణ మొందక సాగుచునే ఉండెను. యునైటెడ్ స్టేట్స్ ప్రజలు క్యూబా దేశభక్తుల ఎడ సానుభూతి వహించి ఉండిరి. అందువలన స్పెయిన్ సామ్రాజ్యాధిపతులకు యునైటెడ్ స్టేట్స్‌పై ద్వేషము అతిశయిల్లి, తత్ఫలితముగ జరిగిన దుశ్చర్యల మూలమున హవానా రేవులోని యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వపు నౌక ఒకటి బ్రద్దలొనర్పబడెను. తత్క్షణమే యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వము కూడ బహిరంగముగ క్యూబా దేశభక్తుల పక్షము అవలంబించి స్పెయిన్ పై యుద్ధము ప్రకటించెను (1898, ఫిబ్రవరి 15). కడకు స్పెయిన్ పరాజితమై, పారిస్ సంధి [చూ.] తో యుద్ధము ముగిసెను. ఈ సంధి వలన క్యూబాకు స్వాతంత్ర్యము లభించెను.

రాజ్యాంగము : క్యూబా ప్రజలు ఒక రాజ్యాంగ విధానము ఆమోదించిరి. ఆ రాజ్యాంగ విధానమున 'ప్లాట్ సవరణ' అను దాని వలన యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వమునకు క్యూబాయందు ఆంతరంగిక శాంతి, స్వేచ్ఛలను కాపాడుటకై అవసరమయినపుడు జోక్యము వహించు హక్కు కలిగింపబడెను. తత్ఫలితముగ 1906-09; 1912 లలో రాజకీయ క్లిష్టపరిస్థితి సంఘటిల్లినపుడు యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వము జోక్యము కల్పించుకొనెను. 1934 లో ప్లాట్ సవరణ రద్దొనర్పబడెను. కాని, క్యూబా యందు తనకు గల నౌకాస్థావరమును - గ్వన్ తానమో అను దానిని - మాత్రము యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వము ఈ నాటికిని తన వశముననే ఉంచుకొనినది.

పేరునకు స్వాతంత్ర్యమును అనుభవించుచున్నను, ఆర్థికముగ క్యూబా యునైటెడ్ స్టేట్స్‌తో ముడివడి ఉండెను. క్యూబాయందలి చక్కెర పరిశ్రమలన్నియు యునైటెడ్ స్టేట్స్ ధనస్వాముల అధీనమున ఉండెను. ఈ వ్యావసాయిక పరిశ్రమ తప్ప వేరు యంత్రపరిశ్రమలు ఏవియు లేనందున నిరుద్యోగము క్రమముగ పెరుగుచుండెను. ప్రథమ ప్రపంచ యుద్ధకాలమున చక్కెర ఎగుమతి విరివిగ జరిగి దేశము సంపన్నమైనను, యుద్ధానంతర సంవత్సరములలో ఈ ఎగుమతులు సన్నగిల్లి, దేశమున ఆర్థిక సంక్షోభము పెచ్చుపెరిగి రాజకీయకల్లోలములకు, నిరంకుశ పరిపాలనకు దారి తీసెను. 1925 - 40 వరకు ఇటుల నలుగురు నియంతలు పాలించిరి. 1940 లో ఒక రాజ్యాంగము ఏర్పడినను, దానిప్రకారము ఆధిపత్యము వహించిన బటిస్టా యా జల్ దివర్ అను నాయకుడు తానే నియంతగ మారి (1952), అవినీతికర పద్ధతులలో ఎన్నికలు జరిపి, తన పదవిని సుస్థిరమొనర్చుకొన జూచెను. ప్రజలలో ఈతని ఎడ విద్వేషము పెచ్చుపెరిగి, ఈతని ప్రత్యర్థియగు ఫిడల్ కాస్ట్రో [చూ. పు. 391] అను నాయకునికి ప్రాబల్యము చేకూరెను. కాస్ట్రో నాయకత్వమున జరిగిన తిరుగుబాటు కడకు 1959, జనవరి 1 న విజయవంతముగముగిసి, విప్లవప్రభుత్వము ఏర్పడెను. తన తొలి 15 నెలలు పరిపాలనాకాలములో ఈ ప్రభుత్వము విప్లవకరములగు మార్పులను ప్రవేశపెట్టి, బటిస్టాకాలమున అన్యాయమార్గములచే ధనస్వాములయిన వారినుండి అన్యాయార్జిత విత్తమును, ఆస్తిని 40 కోట్ల పెసోల * విలువగల దానిని ప్రభుత్వపరము ఒనర్చెను. ఇందులకు తోడుగ విప్లవాత్మకములగు భూ సంస్కరణలను కూడ కాస్ట్రో ప్రవేశపెట్టెను. ఈ భూ సంస్కరణలవలన చక్కెర తోటలలో స్వామ్యము కల యునైటెడ్ స్టేట్స్ కంపెనీలకు ఇబ్బంది కలిగెను. వీరు తమ ప్రభుత్వముద్వారా తమ నిరసనను తెలిపినను కాస్ట్రో లెక్కగొనలేదు. రాజ్యాంగవిధానము ఏదియు లేక నిరంకుశపు ఉత్తరవులమీదనే పాలనను కాస్ట్రో సాగించుచున్నాడని కొందరు క్యూబా ప్రజాస్వామ్య వాదులును ఇతనికి వ్యతిరేకమైరి. ఇట్టివారికి యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వము తన దేశమున తావొసగి ప్రోత్సహించెను. క్యూబా చక్కెర దిగుమతులను నిషేధించెను. అందువలన సోవియట్ రష్యా రాజ్యముతో వర్తక సంబంధములను క్యూబా ఏర్పరచుకొనెను. 1961, జనవరిలో యునైటెడ్ స్టేట్స్‌కు క్యూబాతో దౌత్యసంబంధములు తెగ తెంపులయ్యెను. ఆ సంవత్సరమే ఏప్రిల్ 17 తేదీన యునైటెడ్ స్టేట్స్‌నుండి క్యూబా ప్రవాససైనిక దళము ఒకటి క్యూబాపై దండెత్తెను. కాని, ఆ దళమును కాస్ట్రో

* పెసో = దాదాపు 5 రూపాయలు.

దళములు నిర్జించి 1,200 మందిని ఖైదీలుగ పట్టుకొనెను. ఆ తరువాత కాస్ట్రో ఒక ప్రకటన చేయుచు, తన ధ్యేయము క్యూబాలో ఒక సోషలిస్ట్ రాజ్యమును నెలకొల్పుటయే అని నిర్ద్వంద్వముగ తెలిపెను. అంతటనుండి అతడు క్యూబా దేశరక్షణకై సోవియట్ రష్యా కూటమిని ఆశ్రయించి సుసన్నద్ధమయ్యెను. యునైటెడ్ స్టేట్స్ రాజ్యములకు ఇది నచ్చకుండెను. కడకు క్యూబాయందు సోవియట్ రష్యా నెలకొల్పిన క్షిపణి (రాకెట్ మిసిలీ) కేంద్రములవలన అమెరికాదేశముల భద్రతకే భంగము కలుగగలదని యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వము క్యూబా చుట్టును నౌకా దిగ్బంధమును విధించుచు ఇంకను తగు చర్యలను తాము తీసికొనగలమని ప్రకటించెను (1962, అక్టోబరు). యునైటెడ్ స్టేట్స్ చర్యను నిరసించి సోవియట్ రష్యా క్యూబా పక్షము వహించెను. ఆటమ్ బాంబు యుద్ధ సంక్షోభమునకు ప్రపంచము గురియగునను భయము కలిగెను. కాని, కడకు సోవియట్ రష్యా అధినేత కృశ్చేవ్ [చూ.] తమ క్షిపణులను తీసికొనిపోవుటకు నిర్ణయించుకొని, అటుల చేయుటతో ప్రపంచము ఆ ప్రమాదము నుండి బయటపడెను. అయినను క్యూబా - యునైటెడ్ స్టేట్స్‌ల మధ్య విద్వేషము ఇంకను చల్లారలేదు. చీ. శే. రా.

**క్రామ్‌వెల్, ఆలివర్ (1599 - 1658):** ఆంగ్లదేశ పాలకుడు (1653 - 58); రాబర్ట్ క్రామ్‌వెల్ కుమారుడు; 1599, ఏప్రిల్ 25 న జన్మించెను. లండనులో న్యాయ శాస్త్రము అభ్యసించెను. 1628 - 29 లో పార్లమెంట్ సభ్యుడుగా హంటింగ్‌టన్ నుండి ఎన్నుకొనబడెను. చార్లెస్-I రాజునకు వ్యతిరేకముగ జరిగిన అంతర్యుద్ధమున ఈతడు ప్రముఖపాత్ర వహించెను. సుశిక్షిత సైనిక దళమును తయారుచేసి, ఈతడు రాజ సైన్యములను ఓడించెను. చార్లెస్ రాజునకు మరణశిక్ష విధించిన 'రంప్' పార్లమెంట్ సభ్యులలో ఇతడొకడు. క్రమముగ ఇతడు 'రంప్' పార్లమెంట్‌ను రద్దు చేసి, కౌన్సిల్ ఆవ్ స్టేట్‌ను ఏర్పరచి, కాలక్రమముగ ఆంగ్లదేశ సంరక్షకుడను హోదాను ఆర్జించి, సర్వాధికారయుత పాలకుడయ్యెను (1653). ఇతడు 1658, సెప్టెంబరు 3 వ తేదీన మరణించెను. వి. నా.

**క్రిమియా సమావేశము:** ద్వితీయ ప్రపంచయుద్ధము అవసానదశయందు పశ్చిమ రంగమునందలి యుద్ధవ్యూహములను గూర్చి చర్చించుటకై క్రిమియా దీవిలోని యాల్టాలో జరిగిన సమావేశము. దీనినే 'యాల్టా సమావేశ' మని కూడ వ్యవహరింతురు. ఇందు ప్రెసిడెంట్ రూజ్‌వెల్ట్ (యునైటెడ్ స్టేట్స్), విన్‌స్టన్ చర్చిల్ (బ్రిటన్), స్టాలిన్ (సోవియట్ రష్యా) లు తమ తమ సైనికాధికార దౌత్య ప్రతినిధులతో సహా పాల్గొనిరి (1945, ఫిబ్రవరి 7-12). వీరి చర్చల సారాంశముగ 12-2-1945 న ఈ క్రింది అంశములతో ఒక ప్రకటన వెలువడెను: 1. జర్మనీపై అంతిమ విజయము చేకొనుటకు వ్యూహములు నిర్ణయింపబడెను; 2. అట్లు జయింపబడిన జర్మనీని స్వాధీనపరచుకొని పరిపాలించుటకు, నష్ట పరిహారములు రాబట్టుకొనుటకు నిశ్చయింపబడెను; 3. యుద్ధానంతరము స్వతంత్రము చేయబడిన యూరప్ రాజ్యములకు పై మూడు రాజ్యములు సమష్టిగ సహాయము చేయవలెను; 4. ప్రపంచ శాంతిభద్రతలను కాపాడుటకై సమర్థమైన ఒక అంతర్జాతీయ సమితిని ఏర్పాటు చేయుటకు పై మూడు రాజ్యములును చేయూత ఈయవలెను.

అట్టి అంతర్జాతీయ సమితి స్థాపనకై 25-4-1945 న. శాన్‌ఫ్రాన్సిస్కోలో జరుగనున్న ఐక్యరాజ్యసమితి [చూ.] సమావేశమును పై మూడు రాజ్యములును బలపరచెను [చూ. శాన్‌ఫ్రాన్సిస్కో సమావేశము]. స్వ. వెం.

**క్రీట్:** మధ్యధరా సముద్ర పరివృతమగు ఒక చిన్నద్వీపము (34° 50' - 35° 40' ఉ. అక్షాంశ; 23° 30' - 26 20' తూ. రేఖాంశ). వైశాల్యము దాదాపు 8,600 చ. కి. మీ., ప్రస్తుతము ఈ ద్వీపము రాజ్యాంగరీత్యా గ్రీస్ దేశమున అంతర్భాగమై ఉన్నది [చూ. గ్రీస్].

వైశాల్యమున చాల చిన్నదియైనను, ఈ ద్వీపము చారిత్రకముగ అత్యధిక ప్రాముఖ్యమును గడించినది. గ్రీక్ నాగరకతా ప్రాదుర్భావమునకు పూర్వముననే తూర్పు మధ్యధరాప్రాంతమున నెలకొని ఉండిన ఈజియన్ నాగరకత (చూ. పు - 335) యందు అంతర్భాగమగు మినోనా నాగరకత [చూ.] కు ఈ ద్వీపము నెలవై ఉండినది. క్రీ. పూ. 3400 మొదలుగ క్రీ. పూ. 1100 వరకు ఈ నాగరకత కొనసాగి, కొన్ని ఘట్టములందు అత్యద్భుత వికసమును పొంది అంతరించినది. సమకాలికమగు ప్రాచీన ఈజిప్టు నాగరకతతో తొలుతనుండియు క్రీట్‌వాసులకు పరిచితి ఉండినటుల ఆ ద్వీపమున లభ్యమైన ప్రాచీనావశేషములవలన స్పష్టమగుచున్నది. ఆ ప్రాచీనకాలమున ఈ ద్వీపమునకు ముఖ్యనగరముగ ఉండిన నాసస్ నగర శిథిలావశేషములు పురాతత్త్వశాస్త్రజ్ఞుల కృషి ఫలితమున వెలువడి, ఆకాలపు అద్భుతకళావికసనమును, పట్టణ నిర్మాణ కౌశలమును వెల్లడి చేయగలిగినవి. ఆనాటి క్రీట్‌వాసులందు తొలుత చిత్రలిపియే వాడుకయందు ఉండినను, క్రమముగ రేఖారూపమగు లిపియు రూపొందెనని అచట లభించిన లిఖితఫలకములును, ముద్ర

లును స్పష్టము చేయుచున్నవి. కాని, ఆ లిపిని చదువుటలో పండితులు ఎవరును ఇప్పటికి కృతకృత్యులు కాకపోవుట వలన అందలి విషయములు దురవగాహములుగ ఉన్నవి. క్రీట్ నందలి ప్రాచీననాగరకత క్రమముగ గ్రీస్ దేశమునకు ప్రాకి, అట మైసీనియా నాగరకత [చూ. సం; 10 - పు. 622] అని పేరొందినది. ఈ మైసీనియా నాగరకత కడపటి దశలో గ్రీస్ దేశమునకు వలస వచ్చిన ప్రాచీన ఆర్యనాగరకతలో లీనమైనది. చీ. శే. రా.

**క్రుగర్, పాల్** (1825 - 1904): దక్షిణ ఆఫ్రికా యోధుడు; బోయర్ నాయకుడు. విద్యాగంధవిహీనుడైనను, రాజకీయవేత్తగా గణనీయమైన విజయమును సాధించి, ప్రజానీకముచే ఓమ్ (పితృవ్య) పాల్ అని పురస్కరింపబడిన వాడు.

క్రుగర్ కేప్ కాలనీలో జన్మించెను; బోయర్ల మహాప్రస్థాన సమయమున తల్లి దండ్రులతో ట్రాన్స్‌వాల్ కు తరలివచ్చి, చిన్నతనమునందే సైన్యములో చేరి క్రమముగా పైకి రాగలిగెను. 1852 లో బ్రిటిష్ ప్రభుత్వము ట్రాన్స్‌వాల్ కు స్వాతంత్ర్యము ప్రసాదించిన తదుపరి ఇతడు రాజకీయములలో చురుకుగ పాల్గొనెను; 1864 లో సర్వసేనాధ్యక్ష పదవిని అధిష్ఠించెను. రాజకీయ అస్వస్థత సాకుగా బ్రిటన్ తన దేశమును మరల ఆక్రమింపగా 1880 లో బయలుదేరిన బోయర్ విప్లవమునకు క్రుగర్ నాయకత్వము వహించెను. విప్లవ ఫలితముగ ఏర్పడిన దక్షిణ ఆఫ్రికా గణరాజ్యమునకు ఇతడు మొదటి అధ్యక్షుడు అయ్యెను (1883 - 1898). ఆ కాలమున బ్రిటన్ అండదండలతో దక్షిణ ఆఫ్రికా ఏకీకరణమునకు సిసిల్ రోడ్స్ కావించిన ప్రయత్నములను క్రుగర్ ప్రతిఘటించి, జేమ్సన్ దురాక్రమణను త్రిప్పికొట్టి, కైజర్ చే తంతిద్వారా అభినందింపబడెను. 1899 లో ప్రారంభమైన బోయర్ యుద్ధము [చూ.] లో బ్రిటిష్ సేనల పురోగమనమును నిలువరింపలేక ఇతడు యూరప్‌నకు పోయి, విదేశముల తోడ్పాటు సంపాదింప ప్రయత్నించెను; కాని, అందు విఫలుడై, 1904 లో నెదర్‌లండ్స్‌లో మరణించెను. అ. వెం.

**క్రూసేడ్‌లు**: 1100 నుండి రమారమి 1300 వరకు జరిగిన మత యుద్ధములు.

క్రూసేడ్ అనుమాట లాటిన్ భాషలోని 'క్రూషియేటా' అను పదమునుండి వచ్చినది. క్రూషియేటా అనగా సిలువకు సంబంధించినది అని అర్థము. ఈ యుద్ధములలో చేరిన వారికి గుర్తు సిలువ. అందువలననే క్రూసేడర్లు అను పేరు వారికిని, క్రూసేడ్‌లను పేరు ఈ యుద్ధములకును వచ్చినవి.

క్రైస్తవుల పుణ్యక్షేత్రముల రక్షణకై ఈ యుద్ధములు జరిగినవి. పాలస్తీనాలో ఉన్న ఆ పుణ్యక్షేత్రములు అన్నింటిని ముస్లిమ్‌లగు అరబ్బులు క్రీ. శ. 7 శతాబ్దిలో వశపరచుకొనిరి. తొలుతటి అరబ్ పాలకులు క్రైస్తవ మతము ఎడల సహనభావము వహించుటచే, దేశము ముస్లిమ్ పాలనయందున్నను క్రైస్తవ యాత్రలకు ఎట్టి ఇబ్బందులును కలుగలేదు. కాని, 11 వ శతాబ్దిలో అరబ్బుల కలీఫా (పాలకుడు) గా ఉండిన హకీమ్ అనునతడు పాలస్తీనాలోని ఒక ప్రముఖ క్రైస్తవ ప్రార్థనాలయమును కూలద్రోయించుటయే కాక, క్రైస్తవ యాత్రికులకు అట సాంప్రదాయికముగ లభ్యములగుచుండిన వసతులను అన్నింటిని రద్దొనర్చెను. కావున ఆ క్షేత్రములను తమ వశములోనికి తెచ్చుకొనుట తమ విధి అను భావము క్రైస్తవలోకము అంతట వ్యాపించెను. క్రైస్తవమత పీఠాధ్యక్షులగు పోప్‌లు ప్రజలను ఇందులకు పురికొల్పిరి. నాటి ప్రజలలో మత సంరక్షకులుగ ప్రతిష్ఠను ఆర్జించు తలంపుతో భూస్వాములు ఈ యుద్ధములలో నాయకత్వము వహించిరి. క్రమముగ చివరకు ఈ క్రూసేడ్‌లలో రాజులు కూడ చేరిరి.

మొదటి క్రూసేడ్ (1096 - 1099): పోప్ రెండవ అర్బన్ ప్రచారము వలన ప్రారంభమైనది. ప్రముఖులైన భూస్వాములు దీనికి నాయకత్వము వహించిరి. అనేక సైన్యములు కాన్‌స్టాంటినోపుల్ కు అనేక మార్గములనుండి బయలుదేరినవి. ఇవి సుశిక్షితమైన సైన్యములు కాకపోవుటచే మొదట ఈ సైన్యములు పలు చిక్కులు పడినవి. కాని, 1097 లో ఒక సుసంఘటిత సైన్యము ఏర్పడి, 1098 లో ఎడెస్సా, అంటియోక్‌లను జయించి, చివరకు 1098 లోనే ప్రముఖ పుణ్యక్షేత్రమగు జెరూసెలెమ్‌ను కూడా స్వాధీనపరచుకొనెను.

అటు పిమ్మట లోరైన్ ప్రభువగు గాడ్‌ఫ్రే జెరూసెలెమ్ పట్టణమునకు పరిపాలకుడై తిరిగి దానిని క్రైస్తవ పుణ్యక్షేత్రముగ తీర్చిదిద్దెను.

రెండవ క్రూసేడ్ (1147 - 1149): జెరూసెలెమ్ రాజ్యములో కొంతభాగమును ముస్లిమ్‌లు తిరిగి జయించుటతో ఆరంభమయినది. ఫ్రాన్స్ రాజగు లూయీ - VII, జర్మన్ చక్రవర్తి కోనార్డ్ - III దీనికి నాయకత్వము వహించిరి. కాని, వీరు ఘోర పరాజయము పొంది, పాలస్తీనా రాజ్యపు పొలిమేరలనైన చేరకయే మరలివచ్చిరి.

మూడవ క్రూసేడ్ (1189 - 1192): 1186 లో సాలాదీన్ సుల్తాన్ యుద్ధములో క్రైస్తవులను జయించి జెరూసెలెమ్‌ను ఆక్రమించెను. ఆ ప్రదేశమును తిరిగి జయించు ఉద్దేశముతో

1189 లో ఫ్రాన్స్, బ్రిటన్, జర్మనీ దేశముల రాజులు తమ ప్రాంతీయ విభేదములు మరచి మూడవ క్రూసేడ్ ప్రారంభించిరి. కాని, మార్గమధ్యమున జర్మనీ రాజు ప్రమాద వశమున నీట మునిగి మరణించెను.

ఫ్రాన్స్ రాజైన అగస్టస్ [చూ - పు. 262] తన దేశమున రాజకీయ శత్రువులపై కుట్రలు పన్నుటకై క్రూసేడ్‌ను వదలి ఇంటికి మరలెను. బ్రిటన్ రాజు రిచర్డ్ సాహసోపేతముగ పోరాడెను. కాని, చివరకు ఈ యుద్ధమున కూడ క్రైస్తవులకు విజయము లభించలేదు.

నాలుగవ క్రూసేడ్ (1202 - 1204): పోప్ ఇన్నోసెంట్ - III ప్రచారము వలన ఇది ప్రారంభమయినది. వెనిషియన్‌లతో బేరమాడి, క్రూసేడర్లు పడవలపై తూర్పు మధ్యధరా ప్రాంతము చేరిరి. కాన్‌స్టాంటినోపుల్ ను పట్టుకొనిరి. క్రూసేడర్లు అచటి బైజాన్‌టైన్ చక్రవర్తిని పదవీచ్యుతిని చేసి తమలో ఒకరిని పరిపాలకుని జేసిరి. ఈ నాలుగవ యుద్ధము ప్రాచ్య రోమన్ సామ్రాజ్యమును కొంతకాలముపాటు గ్రీక్‌ల ఆధిపత్యమునుండి తప్పించి, లాటిన్ రాజుల చేతికి ఇచ్చినది. అంతియకాని, పాలస్తీనాలో పరిస్థితులు ఏమియు మారలేదు.

బాల - బాలికల క్రూసేడ్‌లు (1212): సుమారు 30 వేల బాల - బాలికలు - అందును అనేకులు పన్నెండు సంవత్సరముల లోపు వయస్సువారు - స్టీఫెన్ అను ఫ్రెంచి గొల్ల పిల్లవాని నాయకత్వమున పాలస్తీనాలోని పవిత్ర ప్రదేశముల విముక్తికై బయలుదేరిరి. అందు అనేకులు మరణించిరి. ఇంకొక ఇరవై వేలమంది పిల్లలు నికలస్ అను జర్మను పిల్లవాని నాయకత్వమున అల్లే నిహతులైరి.

ఫలితములు: ఈ యుద్ధముల వలన యూరప్‌లో అప్పటికే ప్రారంభమైన మార్పులు త్వరితముగ జరిగినవి. క్రూసేడ్‌లు చర్చి బలమును ఇతోధికము ఒనర్చినవి. క్రూసేడ్‌లలో పాల్గొనిన వర్తకులవలన యూరప్‌లోని వర్తక వాణిజ్యములు అభివృద్ధిచెందినవి. క్రూసేడర్లు ఈ యుద్ధమువలన అనేక యుద్ధశాస్త్రరహస్యములు తెలిసికొనిరి. ప్రయాణములు, సాహస కృత్యములు, నూతన దేశములను కనిపెట్టుటలో ఉత్సాహము ప్రజలలో పెంపొందినవి. చి. బా. శ.

**క్రొపాట్కిన్** (1842 - 1921): రష్యాదేశ విప్లవకారుడు. యువకుడై ఉండిన కాలములో రష్యా జార్ అలిగ్జాండర్ - II కొలువులో అనుచరుడుగా ఉండెను. 1864 లో సైబీరియా, మంచూరియా దేశములందు పర్యటనచేసి ఆ ప్రాంతముల భూతల స్వరూపమును దేశ పటముగా చిత్రించి ప్రకటించెను. భూగోళ శాస్త్రవేత్తగా సైతము ఇతడు ప్రసిద్ధిపొందెను. అతడు ప్రకటించిన దేశ పటము నేటికిని ఉపయోగపడుచున్నది.

దేశ సంచారము చేయుటవలన ఇతనికి కర్షకుల జీవితము ఎంత దుర్భరముగా ఉండెనో బోధపడినది. అందుచేతనే కర్షకుల ఎడల అనుకంపము కలిగి ఇతడు విప్లవకారుడు అయినాడు. ఇతనిని 1874 లో జార్ ప్రభుత్వము చెరసాలలో ఉంచెను. 1876 లో ఇతడు చెరసాలనుండి తప్పించుకొని పారిపోయెను. స్విజర్లండ్, ఫ్రాన్స్, బ్రిటన్ దేశములందు పర్యటనముచేసి రాజకీయవేత్త అయినాడు. 1883 లో సైతము ఫ్రాన్స్ దేశమందు బందీకృతుడు అయ్యెను. మరి 3 ఏండ్లకు విడుదలయి, బ్రిటన్ దేశములో నివాసము ఏర్పరచుకొని, 1917 లో రష్యా విప్లవము [చూ.] జరిగిన తరువాత సోవియట్‌రష్యాకు వచ్చి స్థిరపడి, 1921 లో మరణించెను. వి. నా.

**క్రోసస్** (క్రీ. పూ. 560 - 546 ప.): ఆసియా మైనర్‌లో విఖ్యాతిగాంచిన లిడియా దేశమునకు రాజు. వర్తక వ్యాపారములచే లిడియా సిరిసంపదలతో తులతూగుచుండెను. దీనిని పాలించిన క్రోసస్ మహా ధనికుడని ప్రసిద్ధి. పారసీక ప్రభువగు కురుష్ [చూ.] మీడుల సామ్రాజ్యమును జయించి, లిడియా దేశముపై దండయాత్ర జరిపెను. దానిని గ్రహించి క్రోసస్ గ్రీక్ రాష్ట్రములకును, ఈజిప్టు - బాబిలోనియా రాజ్యములకును తనకు సాయముచేయుమని కబురు పంపెను. క్రోసస్ సైన్యములను కురుష్ ఓడించి, లిడియా రాజధానియైన సార్డిస్‌ను పట్టుకొని, క్రోసస్‌ను బందీగా చేసెను. కాని, తుదకు క్రోసస్‌ను మన్నించి, అతడు జీవించి ఉన్నంతకాలము గౌరవముగ చూచుచుండెను. కాని, లిడియా రాజ్యమును మాత్రము తన సామ్రాజ్యములో కలుపుకొనెను. వి. నా.

**క్లాడియస్** (క్రీ. పూ. 10 - క్రీ. శ. 54): రోమన్ చక్రవర్తి; అగస్టస్ చక్రవర్తికి మనుమడు; టైబీరియస్ చక్రవర్తికి మేనల్లుడు. కాలిగ్యులా చక్రవర్తిగా ఉన్నపుడు క్రీ. శ. 37 లో క్లాడియస్ 'కాన్సల్' పదవినంది, తన తెలివితేటలు వెల్లడిచేశాడు. ఇంతలో కాలిగ్యులా హత్య కావడముచేత క్రీ. శ. 41 లో సెనేట్ సభ్యులకు ఇష్టములేకపోయినప్పటికినీ విశ్వాసపాత్రులైన తన రోమ్ రక్షక వర్గపు సాహాయ్యముతో క్లాడియస్ చక్రవర్తి అయినాడు.

తన సామ్రాజ్యమును పెంచి, సక్రమముగా పాలించవలెనని క్లాడియస్ ఆశయము. క్రీ. శ. 43 లో ఆఫ్రికాలోని మారిటేనియాను ఆక్రమించి, ఆ సంవత్సరమే బ్రిటన్ పైకి దండెత్తి, దక్షిణ భాగమును వశపరచుకొనినాడు. క్రీ. శ. 44 లో జూడియా, క్రీ. శ.

46 లో త్రేస్ వశమై తిరిగి రోమన్ రాష్ట్రములుగ మారినవి.

క్లాడియస్ తన ఆశయములకు అనువైన పరిపాలనా విధానమును ఏర్పాటు చేసెను. రాష్ట్రపాలనకు ప్రత్యే కోద్యోగులు (ప్రాక్యురేటర్ లు) నియమితులైరి. రాష్ట్ర ములలో వారే సర్వాధికారులు. ఉద్యోగపు తరగతులను బట్టి జీతములు ఏర్పాటైనవి. బానిసత్వమునుండి విముక్తి బడిసిన వారు ఎందరో చక్రవర్తికి అనుచరులై ఉన్నతో ద్యోగాలను, మంత్రిపదవులను సంపాదించినారు.

న్యాయశాఖోద్యోగులను కీలుబొమ్మలను చేసి క్లాడి యస్ తన న్యాయస్థానములో తానే న్యాయమూర్తిగా ఉండి, విచారణ జరిపెడివాడు. ఇట్లు చేయుట సెనేట్ కు చాలా కష్టము కలిగించినది. లోపములు ఎన్ని ఉన్నను క్లాడియస్ ప్రజాక్షేమమును కాంక్షించిన వాడనుట యథార్థము. ఇతని కాలమున హార్బర్ లు, ఆనకట్టలు మొదలైనవి నిర్మితమై సామ్రాజ్యము సుభిక్షము అయినది. క్రీ. శ. 54 లో క్లాడియస్ ఆకస్మికముగా మరణించెను. అతని భార్యయగు అగ్రిప్పినా కుక్క గొడుగులలో విషము పెట్టి అతనిని చంపినదని రోమన్ చరిత్రకారుడైన టాసిటస్ [చూ.] వ్రాసెను. వి. నా.

**క్లియోపాత్రా** (క్రీ. పూ. 67 - 30) : ఈజిప్టును ఏలిన టాలమీల వంశములో ఈమె తుది రాణి. భూలోకసుందరి అనియు, నెరజాణ అనియు పేరు గాంచినది. తన తమ్మునితో పదునైదవ ఏట సింహాసనమునకు వచ్చెను. తమ్ముడు అనిన గిట్టక ఈమె సిరియా దేశమునకు వెళ్లి, రోమన్ లలో యోధాగ్రేసరుడని పేరు గాంచిన 'జూలియస్ సీజర్' సాహాయ్యమున తమ్ముని ఓడించి, మరియొక తమ్మునితోడ సింహాసనమునకు వచ్చెను. కాని, విషప్రయోగముచే అతనిని జంపించివైచెను. ఈమె సీజర్ జీవితాంతమువరకు అతని ఉంపుడుకత్తెయై ఉండి, అతని మరణానంతరము 'మార్క్ ఆంటోనీ' ని తన వలలో జిక్కించుకొనెను. ఆంటోని, క్లియోపాత్రా అనిన రోమన్ లకు గిట్టక పోవుటచే 'ఏక్టియమ్' యుద్ధమున 'ఆక్టేవియస్ సీజర్' వారిని ఓడించెను. ఈ యుద్ధానంతరము 'ఆక్టేవియస్' ను తన స్వాధీనము చేసికొన క్లియోపాత్రా భగీరథ ప్రయత్నము గావించి విఫల మనోరథయై క్రీ. పూ. 30 లో ఆత్మహత్య గావించుకొనెను. ఈమె మరణానంత రము ఈజిప్టు రాజ్యము రోమ్‌సామ్రాజ్యములో కలుప బడెను [చూ. రోమ్]. వి. నా.

**క్లెమెన్ స్యూ, జార్జెస్** (1841 - 1929) : ప్రపంచ యుద్ధము - I లో ఫ్రాన్స్ ప్రధాని. 1903 లో సెనేట్ కు సభ్యుడుగ ఎన్నుకొనబడినను, 1906, మార్చి వరకు ఇతడు ఏ ఉద్యోగమును నిర్వహించలేదు. అటుతరువాత ఇతడు దేశీయ వ్యవహారముల మంత్రిగ నియమింపబడెను. 1906, అక్టోబరులో క్లెమెన్ స్యూ ప్రధాని అయ్యెను. ఇతని మంత్రి వర్గము రెండు సంవత్సరముల తొమ్మిది మాసములు మాత్రము అధికారములో ఉండెను. ఇతని ప్రభుత్వము సామ్యవాదులపై గట్టి దెబ్బ తీయుటకును, దేశములో ప్రబలుచున్న సమ్మె ఉద్యమమును అదుపులో ఉంచుటకును తీవ్ర కృషి చేసెను. ప్రపంచ యుద్ధము - I న మొదటి మూడు ఏండ్లలో సైన్యముల యొక్క అసమర్థతను, అప జయములను గూర్చి బహిరంగముగ విమర్శించుటకు క్లెమెన్ స్యూ ఏమాత్రము వెనుదీయలేదు. 1917, నవం బరులో అనామకులగు కొందరు మంత్రులతో మరల ఇతడు ప్రధాని అయ్యెను. వీరి సహాయముతోను, తన అప్రతిహత ధైర్యముతోను ఇతడు 1918, మార్చిలో జరిగిన జర్మన్ ల దాడినుండి ఫ్రాన్స్‌ను సుసంఘటితపరచి, రక్షించి 1918, నవంబరులో ఆ దేశము జయలక్ష్మిని చేకొనునట్లు చేయ గలిగెను. ఇతడు 1919 లో జరిగిన పారిస్ శాంతి సమా వేశము [చూ.] నకు అగ్రాసనాధిపత్యము వహించెను. ఆ సమావేశమున ఇతడు విల్సన్, లాయిడ్ జార్జి కంటె జర్మన్ ల పట్ల కఠినముగ ప్రవర్తించినను జర్మన్ ల ఎడ దయచూపించెనని ఇతనిని ఫ్రెంచివారు విమర్శించిరి. ఈ విమర్శయు, పార్లమెంట్ లో ఇతడు చూపు అధికార ఆడం బరమునకై ప్రజలు వహించిన నిరసనయు ఏకమై 1920, జనవరిలో రాజకీయరంగమునుండి ఇతని నిష్క్రమణము నకు దారితీసెను. స్వ. వెం.

**క్లైవ్, రాబర్ట్** (1725 - 1774) : భారతదేశమున బ్రిటిష్ సామ్రాజ్యమునకు పునాదులు వేసిన ఆంగ్లేయుడు. ఈతడు 1744 లో మద్రాసునందలి తూర్పు ఇండియా వర్తక సంఘము [చూ.] నందు వ్రాయసకారుడుగ నియమితు డయ్యెను. 1746 లో మద్రాసునందలి సెంట్ జార్జి కోటను ఫ్రెంచి సేనాని లాబూర్డనాయ్ ఆక్రమించుట వలన క్లైవ్ ఫ్రెంచివారి బందీ అయ్యెను [చూ. కర్ణాటక యుద్ధములు పు. 371]. కాని, సెంట్ డేవిడ్ కోటకు ఈతడు తప్పించు కొని పారిపోయెను. 1747 లో సైన్యమున చేరెను. ఆంగ్లేయ సైన్యాధికారియగు మేజర్ లారెన్స్ ఆదేశానుసారము తంజావూరు పంపబడిన సైన్యమునందు ఈతడు చేర్చుకొన బడెను. ఈ దాడియందు క్లైవ్ చూపిన అసమాన ధైర్య సాహసములు అతనికి 'కెప్టెన్' హోదా తెచ్చిపెట్టినవి. 1751 లో కర్ణాటక రాజధానియగు ఆర్కాట్ ముట్టడికి ఈతడు వేసిన పథకములు ఆమోదింపబడినవి. రెండు

మాసముల వ్యవధిలో 500 మంది మాత్రమే గల సైన్యము సహాయమున ఆర్కాట్ పట్టణము క్లైవ్ వశమయ్యెను. అస్వస్థత కారణముగ 1753 లో స్వదేశమునకు ఈతడు పోయెను. 1756 లో భారత దేశమునకు తిరిగి వచ్చునప్పటికి తూర్పు బంగాళపు పరిపాలకుడగు సిరాజ్ - ఉద్ - దౌలా కలకత్తాను ముట్టడించెను అను వార్త తెలియుటతోడనే ఇతడు కలకత్తాకు వెళ్లి, 1757 లో ప్లాసీ యుద్ధమున అతనిని ఓడించెను. నాటినుండి 1760 వరకు బంగాళమునకు గవర్నర్ పదవిని నిర్వహించెను. 1760 లో ఇతడు స్వదేశమునకు ఏగి పార్లమెంట్ సభ్యుడయ్యెను. 1764 లో మరల బంగాళమునకు గవర్నర్‌గ నియమితుడై పరిపాలనను చక్కబరచి, స్వదేశమునకు మరలెను (1766). కాని, బంగాళమునందు తన పదవీ బాధ్యతలను దుర్వినియోగపరచుకొనెను అను నిందారోపణలకు గురి అయ్యెను. పార్లమెంట్ చే నియమింపబడిన సంఘము అతనిపై గల నేరారోపణలను విచారించి - స్వదేశమునకు మహోపకారము చేసినవాడని నిర్ణయించి - ఆరోపణలను త్రోసిపుచ్చినది. కడకు మానసిక ఆందోళనకు, అనారోగ్యమునకు గురియై, 1774, నవంబరు 2 వ తేదిన ఇతడు ఆత్మహత్య గావించుకొనెను. మ. అ. శ.

**క్షరక్ష - I** (జెర్ జెస్) (క్రీ. పూ. 486 - 465 ప.): పారసీక సమ్రాట్. క్షరక్ష పదము గ్రీక్ భాషలో (క్ష అను అక్షరము ఆ భాషలో లేకపోవుటవలన) జెర్ జెస్ అను అపభ్రంశరూపమును పొందినది. ఇతని తండ్రి దుర్యూష ప్రభువు; తల్లి కురుష్ కుమార్తె అగు అటోసా. తన తల్లిని వివాహమాడిన తరువాతనే తండ్రి చక్రవర్తి అగుటచే, వయోధికులైన సవతిసోదరులు ఉన్నను సామ్రాజ్యమునకు ఇతడే వారసుడు అయ్యెను. సింహాసనమును అధిష్ఠించిన సంవత్సరముననే (క్రీ. పూ. 486) క్షరక్ష ఈజిప్టులో చెలరేగిన కల్లోలమును అడచివైచి, తన సోదరుని ఆ దేశమునకు మండలాధిపతిగ నియమించెను. పారసీక సామ్రాజ్యములో విలీనము చేయబడిన ఆసియామైనర్ లోని గ్రీక్ నగర రాజ్యములు చేసిన తిరుగుబాటుకు చేయూత ఇచ్చిన ఏతెన్స్‌పై పగసాధింప యత్నించి కృతకృత్యుడుకాని తన తండ్రి దుర్యూషప్రభువు సంకల్పమును నెరవేర్చుటకు క్షరక్ష తీవ్రసన్నాహములు కావించెను. హెల్లెస్‌పాంట్ (ప్రస్తుతపు డార్డినెల్స్) కు అడ్డుగా పడవలతో సేతువును నిర్మించి, ఇతడు అతాస్ భూసంధిగుండా కాలువను త్రవ్వించెను; సార్డిస్ నుండి బయలుదేరి త్రేస్, మేసిడోనియాల మీదుగా ఏతెన్స్‌పై దండయాత్ర సాగించెను. స్పార్టన్ ప్రభువు లియోనిడస్ 300 సైనికులతో తెర్మాపోలే అను ఇరుకు మార్గమువద్ద పారసీకులను అడ్డగించి, ఘోరయుద్ధము చేసి, వీరమరణము పొందెను. పారసీకులు ఏతెన్స్‌ను పట్టుకొని పరశురామప్రీతి చేసిరి. కాని, సాలమిస్ వద్ద ఏతెన్స్ నౌకాదళము పారసీక నౌకాదళమును చిందరవందర చేయుటతో మార్డోనస్ అను తన సేనానిని యుద్ధము కొనసాగింప నియోగించి, ఇతడు ఆసియాకు మరలి పోయెను. తుదకు పారసీకులు సంపూర్ణ పరాజయమును పొంది గ్రీస్ నుండి వైదొలగిరి. క్రీ. పూ. 465 లో క్షరక్ష తన అంగరక్షక దళనాయకునిచే హతుడయ్యెను. అ. వెం.

**ఖిలాఫత్ ఉద్యమము:** భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో ప్రముఖపాత్ర వహించిన ఒక ఉద్యమము. ప్రథమ ప్రపంచ యుద్ధము (1914 - 18) తరువాత టర్కీ సామ్రాజ్యము విచ్ఛిన్నము చేయబడి, వివిధప్రాంతములు బ్రిటన్, ఫ్రాన్స్‌ల చెప్పుచేతలలోనికి వచ్చి, టర్కీ సుల్తాన్ ప్రతిష్ఠకు భంగము చేకూరుట ఈ ఉద్యమమునకు మూలహేతువు. టర్కీ పాలకుడు టర్కీ సామ్రాజ్యమునకు సుల్తాన్ అగుటయే కాక, సున్నీ ముస్లిమ్ లోకమంతటికిని కలీఫా [చూ. కలీఫాలు - పు. 374] పదవిని కూడ వహించినవాడు. అతని ప్రతిపత్తికి భంగము కలిగి, మతక్షేత్రములగు మక్కా, మదీనా ప్రాంతములందు బ్రిటిష్‌వారి పలుకుబడికి లోనైన పాలకులు ఆధిపత్యము వహించుట కలీఫా పదవి ఎడను, తద్ద్వారా ఇస్లామ్ ఎడను అవమానకర చర్యగ ముస్లిమ్‌లు భావించిరి. తత్ఫలితముగ భారత ముస్లిమ్‌లందు అబుల్ కలామ్ అజాద్ [చూ. పు. 268] మొదలగు ప్రముఖులు సాగించిన ప్రచార ఫలితముగ కలీఫా పదవీప్రతిష్ఠను కాపాడుటకై బ్రిటిష్ ప్రభుత్వమును లొంగదీయుటకు ఒక ఉద్యమము 1920 లో రూపొందినది. ఇదియే ఖిలాఫత్ ఉద్యమము. అప్పటికే రౌలట్ చట్టము మొదలగు ప్రజాస్వాతంత్ర్య వ్యతిరేక శాసనములవలనను, జలియన్‌వాలా బాగ్ దురంతముల [చూ.] వలనను, ఆర్థిక కల్లోలముల వలనను సంక్షుభితమై ఉన్న భారత దేశమున ఈ ఉద్యమము ప్రభుత్వ వ్యతిరేక ప్రజా సంఘటనకు దోహదము చేసినది. దేశీయుల ఆకాంక్షలలో ఖిలాఫత్ ఉద్యమవాదుల ఆకాంక్షలను కూడ మేళనము చేయుటకు గాంధీ మహాత్ముని నాయకత్వమున కాంగ్రెస్ ఆమోదించినది. తత్ఫలితముగ కనివిని ఎరుగని రీతిగ హిందూ - ముస్లిమ్ ప్రజాసమైక్యము ఏర్పడి, 1921 లో సహాయ నిరాకరణోద్యముగ రూపు దాల్చినది [చూ. భారతదేశము]. కాని, టర్కీయందు మతప్రసక్తిలేని లౌకికరాజ్యమును టర్కీ ప్రజలే కెమాల్ పాషా [చూ. పు. 402] నాయకత్వమున నెలకొల్పుకొని, టర్కీ సుల్తాన్‌కు కల కలీఫా పదవిని రద్దుచేయుటతో (1924) ఖిలాఫత్ ఉద్యమమునకు కల ప్రాతిపదికయే

అంతరించినది. అంతటినుండి క్రమక్రమముగ పలువురు ముస్లిమ్‌లు కాంగ్రెస్ నుండి వైదొలగుటయు, భారత రాజకీయములందు సామ్రాజ్య ప్రభుత్వపు ప్రోత్సాహ బలముతో ముస్లిమ్‌లీగ్ బలపడుటయు జరిగినది. చి. శే. రా.

**ఖిల్జీ వంశము (1290 - 1320):** భారత దేశమున పాలన నెరపిన ఒక ప్రముఖ రాజవంశము. దీని మూల పురుషుడు జలాలుద్దీన్. 1290, జూన్ 13 న సింహాసనమును అధిష్ఠించినపుడు జలాలుద్దీన్ 70 ఏండ్ల పండు ముదుసలి. అతడు చాల సాత్విక స్వభావుడు అగుటచేత ఓడింపబడిన మంగోల్‌ల ఎడ కనికరమూని ఢిల్లీలో నివసింప సమ్మతించెను. అందువలన నూతనముగ హిందూ రాజ్యములపై దాడి జరుగలేదు. కాని, అతని అల్లుడగు అల్లాఉద్దీన్ ఖిల్జీ [చూ. పు. 275] చాందేరి ముట్టడికని బయలుదేరి, దేవగిరిని పాలించుచున్న యాదవ రాజు అగు రామదేవుని భయపెట్టి అతనివద్ద నుండి గొప్ప ధనము కొల్లగొని, ఆ ధన సాహాయ్యముతో ఏ అడ్డము లేకుండ తన మామను జంపి, తానే ఢిల్లీ సుల్తానయ్యెను. 1296 లో - అల్లా ఉద్దీన్ కాలములోనే - ఢిల్లీ సుల్తానుల అధికారము దక్షిణ భారతదేశములోనికి విస్తరించినది. మొదట అతడు అలిగ్జాండర్ [చూ.] వలె ప్రపంచ దిగ్విజయమునకు బయలుదేరవలెనని, మహమ్మద్ ప్రవక్తవలె నూతన మతస్థాపకుడు కావలెనని ఆశించెను; కాని, అవి తన శక్తికి మించిన పనులని వాటి నుండి విరమించి, ఆచరణ సాధ్యములగు కొన్ని అవసర కార్యములకు ఉపక్రమించెను. జలాల్ పక్షమువారిని మట్టుబెట్టి, మంగోల్‌లను ఆరుమార్లు వెనుకకు నెట్టి, గుజరాత్, మేవార్, మాళ్వా మున్నగు రాజపుత్ర రాజ్యములను జయించెను. మాలిక్ కాఫూర్ [చూ.] అను తన సేనానాయకుని దక్షిణ భారతదేశము నందలి హిందూ రాజ్యములపై దండయాత్ర చేయుటకు పంపెను.

మాలిక్ కాఫూర్ మొదటి దక్షిణదేశ దండయాత్ర 1307 లో ప్రారంభించెను. శత్రురాజులకు శరణు ఇచ్చి నాడను సాకుతో దేవగిరి రాజగు రామదేవుని మీదనే మొదటి దాడి జరిగెను. మాలిక్ కాఫూర్ రామదేవుని ఓడించి, అల్లా ఉద్దీన్‌ను శరణువేడుకొమ్మని ఢిల్లీకి పంపెను. ఢిల్లీకి సామంత రాజుగా ప్రతి ఏట కప్పము కట్టెదనని ఒప్పుకొని, రామదేవుడు తిరిగి తన రాజ్యమునకు వచ్చి వేసెను. రామదేవునివలెనే 1309 లో ఓరుగల్లు రాజగు కాకతీయ ప్రతాపరుద్రుడును, 1311 లో ద్వారసముద్రమును ఏలుచుండిన హొయిసల వంశస్థుడగు మూడవ బల్లాలుడును అల్లా ఉద్దీన్‌కు కప్పము కట్టు సామంత రాజులుగా ఉండ సమ్మతించిరి. 1311 వ సంవత్సరములోనే పాండ్య సింహాసనమునకుగాను తగవులాడుచుండిన సుందర, వీరపాండ్యులను అన్నదమ్ములిద్దరిని తొలగించి పాండ్యరాజ్యమునకు ఒక మహమ్మదీయ గవర్నర్‌ను నియమించి, 1311, అక్టోబరు నెలలో అతివైభవముగా మాలిక్ కాఫూర్ ఢిల్లీకి తిరిగివచ్చెను. 1312 లో యాదవ రామదేవుని కుమారుడు శంకరుడు స్వతంత్రుడగుటకు ప్రయత్నింపగా, అతనిని తొలగించి అల్లా ఉద్దీన్ యాదవ దేవగిరి రాజ్యమును ఢిల్లీ రాజ్యములో చేర్చెను. ఇట్లు అల్లా ఉద్దీన్ తన అధికారమును దక్షిణాపథమున ద్వారసముద్రమువరకు వ్యాపింపజేసెను.

అల్లా ఉద్దీన్ మరణింపగా అతని సేనానాయకుడగు మాలిక్ కాఫూర్ అల్లాఉద్దీన్ కుమారులను ఇద్దరిని గ్రుడ్డివారిని గావించి, మూడవ వానిని చెరయందు ఉంచి, నాలుగవ వాని పేర రాజ్యాధికారమును అంతటిని తన హస్తగతము కావించుకొనెను. ఈ అదను చూచుకొని యాదవ రామదేవుని అల్లుడు హరపాలదేవుడు దేవగిరి రాజ్యమును ఆక్రమించెను. గుజరాత్ తిరుగుబాటు కావించెను. ఓరుగల్లు, ద్వారసముద్రము రాజ్యములు స్వతంత్రములైనవి. ఇట్లు అల్లాఉద్దీన్ నిర్మించిన సామ్రాజ్యము అంతరించుటకు ప్రారంభించినది. అట్టి సమయమున అల్లా ఉద్దీన్ మూడవ కుమారుడు ముబారక్ చెరనుండి బయటకు వచ్చి, మాలిక్ కాఫూర్‌ను చంపించి, ఢిల్లీ సింహాసనము అధిష్ఠించెను. 1316, ఏప్రిల్‌లో గుజరాత్, దేవగిరి రాజ్యములను తిరిగి జయించెను. ఈ విజయ పరంపర ముబారక్‌ను గర్వోన్మత్తుని కావించినది. అప్పటి నుండి అతడు దుర్వ్యసన లోలుడై కడకు తన సేనానాయకుని చేతనే (1320, ఏప్రిల్‌లో) హతుడయ్యెను. ఇట్లు ముబారక్‌ను చంపి రాజ్యమునకు వచ్చిన ఖుస్రూ అధికార గర్వము మహమ్మదీయ సర్దారులకు అందరకు దుస్సహమయ్యెను. తుదకు 1320, సెప్టెంబరు నెలలో వాయవ్యపు సరిహద్దు రక్షణయందు ఉండిన ఘాజీబేగ్ తుఘ్లుక్ అను సేనానాయకుడు ఢిల్లీమీద దాడిసల్పి, ఖుస్రూను ఓడించి ఉరిదీసెను. 1320, సెప్టెంబరులో అతడు ఘియాజుద్దీన్ తుఘ్లుక్ అను బిరుదుతో ఢిల్లీ సుల్తాను పదవి స్వీకరించి, తుఘ్లుక్ వంశమును స్థాపించెను [చూ. తుఘ్లుక్ వంశము]. గు. వెం.

**ఖ్వాజా మహమ్మద్ గవాన్ (1403 - 1481):** దక్కన్ చరిత్రయందు పేరొందిన ఒక సుప్రసిద్ధ యోధుడు; రాజనీతిజ్ఞుడు; పండితుడు. జన్మభూమియగు పారసీక దేశమును రాజకీయ కారణములచే విడిచి, ఇతడు ఆ కాలమున దక్షిణ హిందూస్థానమున పండిత పోషణకు

పేరొందిన బీదర్ నగరమును తన 43 వ ఏట చేరెను. ఇతని మేధాశక్తికి అచ్చెరువందిన బహమనీ సుల్తాన్ అల్లా ఉద్దీన్ షా - II (1435 - 58) సర్దార్ పదవిని ఇతనికి ఇచ్చి సత్కరించెను. అప్పటినుండి స్వకీయ పరాక్రమ, సద్గుణ శీలముల చే క్రమముగ ఇతడు ప్రధానామాత్య పదవిని పొందెను. అల్లాఉద్దీన్ షా తరువాత క్రమముగ రాజ్యమునకు వచ్చిన మువ్వురు సుల్తానుల కాలమునను ఇతడు ఆ పదవియందే ఉండి రాజ్యమును ఎంతయో విస్తృతము ఒనర్చెను. సక్రమమగు పరిపాలనా వ్యవస్థను ఏర్పరచుటకు కొన్ని సంస్కరణలను ఇతడు ప్రవేశపెట్టెను. న్యాయశాస్త్రమందును, గణితశాస్త్రమందును మహాపండితుడుగ పేరొందిన ఈ అమాత్యుడు పలు విద్యాసంస్థలను నెలకొల్పి పోషించెను. కాని, విదేశీయుడగు ఈతడు ఇంతగ శక్తి సంపన్నుడగుటకు ఓర్వజాలని దక్కన్ ముస్లిమ్ సర్దారులు కుట్రపన్ని, ఈతని ముద్రికను సంపాదించి, కళింగ ప్రభువుతో గవాన్ కుట్ర జరుపుచున్నటుల అతడు వ్రాసినటుల ఒక లేఖను సృష్టించి అప్పటి సుల్తానగు మహమ్మద్‌షా (1463 - 82) కు చేరునటుల చేసిరి. కల్పితకథను నమ్మి, గవాన్ చెప్పెడిమాటలను సరకుగొనక ఉన్నవానిని ఉన్నటుల గవాన్‌ను నరికి వేయవలసినదిగా సుల్తాన్ ఆజ్ఞాపించెను. గవాన్ భక్తితో భగవానుని ప్రార్థించుకొనుచు తన తలను ఖడ్గమున కొసగెను (1481). అతని మరణము తరువాత సత్యము తెలియవచ్చి సుల్తాన్ పశ్చాత్తాప తప్తుడయ్యెను. గవాన్ మరణము తరువాత అతని కోశాగారమును పరిశీలింపగ అందు 300 రూప్యములు మాత్రమే ఉండెను. తన ధనము అంతటిని అతడు ధర్మ కార్యముల కొరకే వినియోగించెను. వండుకొనుటకు కొన్ని చాపలు, వండుకొనుటకు మట్టి పాత్రలు మాత్రమే ఇంట ఉండెడివి.

ఇంతగా పేరొందిన ఈతడును ఆనాటి కాలప్రవాహగతికి లోనై స్వహస్తముతో కాఫిరులను చంపుట ఒక పుణ్యకార్యముగ భావించెడివాడు. ఈ మతాంధత తప్ప తక్కిన అన్నివిధములలోను ఈతడు వంద్యుడని చెప్పవచ్చును [చూ. సం. 3 - పు. 364 - 366]. షెర్వానీ.

**గజనీ మహమూద్** (997 - 1030 ప.): భారత దేశముపై విస్తృతముగ జరిగిన మహమ్మదీయ దండయాత్రలలో మొదటి దానిని సాగించినవాడు గజనీ మహమూద్*.

ఇతడు క్రీ. శ. 997 లో గజనీ రాజ్యసింహాసనమును తన తండ్రి యగు సబుక్తిజిన్ మరణానంతరము సంపాదించెను. భారతదేశ సామీప్య సౌభాగ్యములు ఈ యోధుని దృష్టిని ఆకర్షించినవి. ఇస్లామ్ మతము ఈ దేశములో వ్యాపింపజేయవలెనన్న కోరిక ఎక్కువయినది. అందుచేత భారత దేశముపై ఏఏట దండెత్తుటకు అతడు దీక్ష కైకొనెను. భారతదేశములో మహమూద్ సాగించిన దండయాత్రలు 17 కంటె ఎక్కువ గలవు. మొదటి దండయాత్ర 1000 లో జరిగినది. మరు సంవత్సరము వంశానుగతముగ వచ్చుచున్న వైరమును పురస్కరించుకొని పంజాబ్ ప్రాంత పాలకుడగు హిందూ ప్రభువు జయపాలుని ఓడించెను. జయపాలుని మరణానంతరము అతని పుత్రుని ఆనందపాలుని హతము ఒనర్చెను. కనోజి రాజ్యపాలకుడగు రాజ్యపాలుడు, చాందేలు వంశీయుడగు గండరాజు మహమూద్ దాడికి భయపడి భృత్యులైరి. రాజులను ఓడించి లోబరచుకొనుటతో తృప్తిపడక, ఈ మహమ్మదీయ యోధుడు తన దండయాత్రలలో హిందూ దేవాలయములను నాశమొనర్చుట కూడ పనిగా పెట్టుకొనెను. 1018 లో మథురపైని, 1025 లో సోమనాథ దేవాలయముపైని బడి రెంటిని విధ్వంసముచేసి, వానిని దోచుకొని, ధన, కనక, వస్తువాహనములను అమితముగ తన దేశమునకు తీసికొనిపోయెను.

ఇతని దాడులు ఉత్తర భారతదేశమున కాశ్మీర్ మొదలు కనోజి వరకును వ్యాపించినవి. భారతదేశము అవల మధ్య ఆసియా ప్రాంతమందున్న మహమ్మదీయ రాజ్యములను కూడ ఇతడు జయించెను. ఇట్లు విస్తృతమగు సామ్రాజ్యమును, విశేషమగు రాజ్యాధికారమును అనుభవించి, 33 సంవత్సరములు సింహాసనము అధిష్ఠించి, 62 ఏండ్లు జీవించి, 1030 లో మరణించెను. పరజాతుల ఎడ వైరుధ్యము చూపినను, ఈ మహమూద్ స్వ జాతి, మత, సంస్కృతులయందు గౌరవాభిమానములు కలిగి ఉండెను. ఓ. ఎస్. ఎన్. మూర్తి.

**గజపతులు :** చూ. ఓఢ్ర గజపతులు - తెలుగు సంస్కృతి, సం - పు. 273.

**గయానా :** దక్షిణ అమెరికా ఉత్తర తీర ప్రాంతమున కొంత భాగమునకు ఈ పేరు పూర్వము ఉండెడిది. అది అంతయు నేడు డచ్చి గయానా, ఫ్రెంచి గయానా, బ్రిటిష్ గయానా అని మూడు వలస రాజ్యములుగ విభజితమై ఉన్నది.

ఈ గయానా తీరమును మొదట క్రిస్టఫర్ కొలంబస్ [చూ. పు. 407] 1498 లో కనుగొనెను. తరువాత

* సింధు దేశమున క్రీ. శ. 8 వ శతాబ్దిలో అరబ్బులు కాశిమ్ అనువాని నాయకత్వమున దండయాత్ర జరిపినను, ఆ దండయాత్రల వలన భారతదేశ రాజకీయ, సాంఘిక పరిస్థితులలో ఎట్టి మార్పును జరుగలేదు.

వేర్వేరు దేశముల అన్వేషకులు ఈ ప్రాంతమున పర్యటించిరి. 1598 లో డచ్చివారు వర్తక సంబంధములు నెలకొల్పిరి. తరువాత ఫ్రెంచి, ఇంగ్లీషు వర్తకులు అట చేరిరి. యూరపియన్ రాజకీయములలోని కొన్ని మార్పులవలన 1667 లో ఇంగ్లీషువారు వారి హక్కులను డచ్చివారికి సంక్రమింపజేసిరి. డచ్చివారి అధీనముననే ఈ ప్రాంతము చాలకాలము ఉండెను. 1781 లో బ్రిటిష్‌వారు ప్రస్తుతపు బ్రిటిష్ గయానాను ఆక్రమించిరి. కాని, ఎక్కువ కాలము నిలుపుకొన లేక పోయిరి.

బ్రిటిష్‌వారు 1803 లో తాము పూర్వము ఆక్రమించిన భూములను మరల ఆక్రమింప గలిగిరి. 1814 - 15 లో జరిగిన ఏర్పాటును అనుసరించి బ్రిటిష్‌వారి భాగము బ్రిటిష్‌వారికే చెందుటకు కూడా డచ్చివారు అంగీకరించిరి. ఫ్రెంచివారి ఆక్రమణలో ఉండిన భాగము స్పెయిన్, డచ్చి, బ్రిటిష్, పోర్చుగీస్ వారితో జరిగిన పోరాటములలో చేతులు మారి తుదకు 1817 మొదలుగ ఫ్రెంచివారి అధీనముననే ఉండినది. మిగిలిన గయానా, సురినామ్ లేదా డచ్చి గయానా అనుపేర డచ్చివారి అధీనమున మిగిలెను. ఈ మూడు గయానాల వివరములు ఆ యా శీర్షికలలో పొందుపరుపబడినవి. మ. ఆ. శ.

**గయానా, డచ్చి :** దక్షిణ అమెరికా ఉత్తర తీర ప్రాంతమున నెదర్‌లండ్స్ అధీనమున ఆంతరంగిక స్వాతంత్ర్య ప్రతిపత్తి గల ఒక రాజ్యము. దీనికే సురినామ్ అనియు వ్యవహారము కలదు.

ఈ దేశమునకు ఫ్రెంచి గయానా [తూ]; బ్రిటిష్ గయానా [ప]; బ్రెజిల్ [ద]; అట్లాంటిక్ మహాసముద్రము [ఉ] సరిహద్దులందు ఉన్నవి. [వి] 1,42,822 చ. కి. మీ.; [జ] 3,30,000. వీరిలో 47. 5% ఆఫ్రికన్ జాతీయులు; 31. 4% భారతీయ సంతతికి చెందినవారు, 17. 8% ఇండోనీషియా వాసులు. ఇతరులు 0. 8%. [భా] అధికార భాష డచ్చి. కాని, ఇతర భాషలు కూడ వాడుకలో ఉన్నవి. [రా] పరమరిబో (జ. సం. 1,07,000).

చరిత్ర : డచ్చివారి పరిపాలనలో ఈ వలస రాజ్యము ఎక్కువ అభివృద్ధి చెందలేదు. ఇందు చెరకు తోటల సాగునకు తొలుత డచ్చివారు పెట్టుబడి పెట్టినను, అందు వారికి అభిరుచి క్రమముగ తగ్గినది. రాజకీయముగ సైతము ఈ ప్రాంతము ఎక్కువ అభివృద్ధి చెందలేదు. నేటికిని ఇచ్చట డచ్చివారి పరిపాలనయే సాగుచున్నది. మ. ఆ. శ.

**గయానా, ఫ్రెంచి :** ఫ్రెంచివారి అధీనమున ఉన్న గయానా ప్రాంతము.

ఈ రాజ్యమునకు బ్రెజిల్ [తూ - ద]; డచ్చి గయానా [ప]; అట్లాంటిక్ మహాసముద్రము [ఉ] సరిహద్దులందు కలవు. [వి] 90,649 చ. కి. మీ.; [జ] 33,698; [మ] రోమన్ కేథలిక్ క్రైస్తవ మతానుయాయులు పెక్కురు కలరు. [రా] సయెన్నే (జ. సం. 17,000).

చరిత్ర : ఈ రాజ్యము ఫ్రెంచివారి అధీనమున 17 వ శతాబ్దమునుండి ఉన్నది. వారు ఈ ప్రాంతమున స్థిర నివాసములు ఏర్పరచుకొను యత్నము అచటి ఆదివాసుల ప్రతిఘటన వలన ఆగిపోయినది. 1853 నుండి 1864 వరకు ఫ్రెంచి నేరస్థులకు వలసలు ఏర్పరచుటకు జరిగిన ప్రయత్నము కూడ విఫలమయ్యెను. తరువాత ఇట వసించిన ఆదిమవాసులలో ఫ్రెంచి సంస్కృతి ప్రవేశపెట్టబడినది. ప్రస్తుతము ఈ రాజ్యము ఫ్రెంచి రాజ్యమున చేరి ఉన్న సముద్రోత్తర మండలముగ రాజకీయాధికారములు కలిగి ఉన్నది. మ. ఆ. శ.

**గయానా, బ్రిటిష్ :** ఆంతరంగిక స్వాతంత్ర్యము గల ఈ దేశము బ్రిటిష్‌వారి అధీనమున ఉన్నది.

ఈ రాజ్యమునకు వెనిజ్యులా [ప]; బ్రెజిల్ [ద]; డచ్చి గయానా, [తూ]; అట్లాంటిక్ మహాసముద్రము [ఉ] సరిహద్దులుగ కలవు. [వి] 2,14,969 చ. కి. మీ.; [జ] 5,90,140. ఇందు దాదాపు సగము మంది భారతీయ సంతతికి చెందినవారు. మూడవ వంతు నీగ్రో జాతివారు. [భా] అధికార భాష ఇంగ్లీషు, భారతీయ భాషలు కూడ వాడుకలో ఉన్నవి. [రా] జార్జిటౌన్ (జ. సం. 1,50,000).

చరిత్ర : ఇరువదియవ శతాబ్ది ఆరంభమునుండి భారతీయులు పలువురు చెరకు తోటలలో పని చేయుటకు ఈ దేశము చేరి, ఇచటనే స్థిర నివాసములు ఏర్పచుకొనిరి. తొలుత బానిసలుగ కొనిరాబడి, తరువాత స్వాతంత్ర్యమును పొందిన నీగ్రోలు జనసంఖ్యలో భారతీయుల తరువాత లెక్కకు వచ్చెదరు. ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున బ్రిటిష్ ప్రభుత్వమువారి అనుమతితో యునైటెడ్‌స్టేట్స్ వైమానిక, నౌకా స్థావరములను ఈ దేశమున ఏర్పరచుకొనెను. ఆ యుద్ధానంతరమున ఇచట జాతీయోద్యమము చెడ్డీ జగన్, బరన్‌హామ్ అను వారి నాయకత్వమున రూపొందినది. వీరిలో తొలుతటి అతడు భారతీయ సంతతికి చెందినవాడు; రెండవ వాడు నీగ్రో నాయకుడు. 1961 లో బ్రిటిష్ ప్రభుత్వము ఈ ప్రాంతమునకు పరిమిత స్వయంపరిపాలన ఒసగినది. చెడ్డీ జగన్ ప్రధాని అయ్యెను. తరువాత దురదృష్ట వశమున జగన్, బరన్‌హామ్‌ల మధ్య ఏర్పడిన వైమనస్యములు 1963 లో భారతీయులకును, నీగ్రోలకును మధ్య సంఘర్షణలకు దారితీయుటవలన బ్రిటిష్ ప్రభుత్వము జోక్యము కల్పించుకొని శాంతిని నెలకొల్పెను. ఆ తరువాత ప్రవేశపెట్టిన నూతన రాజకీయ సంస్కరణముల వలన ఎన్నికల విధానమున మార్పులు జరిగిన ఫలితముగ బరన్‌హామ్ ప్రధానమంత్రి అయ్యెను.

కాలక్రమమున 1966, మే లో గయానా స్వతంత్రమై, కామన్ వెల్త్‌లో సభ్యతను ఆర్జించెను. మ. ఆ. శ.

**గరిబాల్డీ, జూజెపే** (1807 - 1882): ఇటలీ స్వాతంత్ర్యోద్యమ నాయకుడు. 1834, 1848 లలో రెండు పర్యాయములు ఆస్ట్రియా పాలన నుండి ఇటలీకి విమోచనము కలిగించుటకు జరిగిన విఫల ప్రయత్నములతో గరిబాల్డీ సహకరించెను. తత్ఫలితముగా 1834 లో ఇతడు మరణదండనకు గురియై దక్షిణ అమెరికాకు పారిపోయి అచట తల దాచుకొనవలసి వచ్చెను (1836).


జూజెపే గరిబాల్డీ
(1807 - 1882)

తర్వాత ఇటలీకి మరలివచ్చి, 1848 లో జరిగిన విఫల సంఘర్షణలో ముఖ్య పాత్ర వహించి తాను మాజీనీని కలసి అర్థాయుష్కమైన ప్రజాసత్తాక రాజ్యము ఒక దానిని సృజించి, దాని బలములకు గరిబాల్డీ అధిపతి అయ్యెను. ఇతని ప్రభుత్వ పతనానంతరము ఫ్రాన్స్, ఆస్ట్రియా, స్పెయిన్, నేపిల్స్ (నేపోలీ) రాజ్యముల సేనలు కలసి ఇతనిని తరిమినపుడు అతి చాతుర్యముగ తప్పించుకొని ఇతడు మధ్య ఇటలీ ద్వారా పారిపోయెను. ఈ కష్టదశలో ఇతనికి ఆశ్రయమిచ్చినది న్యూయార్క్. అక్కడ చాల కాలము వర్తకము చేసి ఇతడు అపార ధనమును గడించెను.

తిరిగి 1859 లో సార్డీనియా రాజు విక్టర్ ఎమాన్యుయెల్ నాయకత్వమున ఇటలీ స్వాతంత్ర్యోద్యమము తల ఎత్తినది. ఈ ఉద్యమములో గరిబాల్డీ కూడ చేరినాడు. 1860, ఆగస్టులో నేపిల్స్ రాజు వద్దనుండి వేయిమంది 'ఎఱ్ఱచొక్కా' భటుల దళము సాహాయ్యమున సిసిలీని గరిబాల్డీ స్వాధీనము చేసికొనెను; కాని, ప్రజాభిమతమును అనుసరించి సిసిలీపై అధికారమును విక్టర్ ఎమాన్యుయెల్‌నకు అప్పగించెను. తన జన్మభూమియగు నీస్ ఇటలీతో ఐక్యము కాకుండుట ఇతనికి మనోవ్యథ కలిగించెను. తుదకు ఇతనికి ఇటలీ స్వతంత్ర ప్రభుత్వముతో కూడ అభిప్రాయ భేదములు కలిగెను. ఈతడు ప్రజా స్వామ్యాభిమాని. ఫ్రెంచి ప్రజా సత్తాకము జర్మనీతో చేసిన యుద్ధమున ఈతడు ఫ్రెంచివారికే న్యాయము ఒనర్చెను. ఫ్రాంకో - జర్మనీ యుద్ధానంతరము కాప్రెరా దీవికి ఇతడు పోయి శేషించిన జీవితమును అక్కడనే వెళ్లబుచ్చెను. ప్ర. రా.

**గస్టావస్ అడాల్ఫస్** (క్రీ. శ. 1594 - 1632): ఇతడు స్వీడెన్ దేశపు రాజు. 17 వ శతాబ్ది పూర్వార్ధమున ముప్పది సంవత్సరముల యుద్ధమువలన సర్వనాశనము కావించబడిన యూరప్‌నందు స్వీడెన్‌ను, ప్రొటెస్టంట్ ప్రజలను ఆదుకొనిన మహానుభావుడగు గస్టావస్ - II నవయుగ సేనానులలో ఉద్దండుడు.

ఇతడు స్టాక్‌హోమ్‌లో జన్మించెను. 1611 లో తన 17 వ ఏట గస్టావస్ అనే పేరుతో రాజ పీఠము అధిష్ఠించెను. ఇరువది సంవత్సరముల వయస్సు సరిగా నిండని ఇతనితో యుద్ధము చేయలేక డెన్మార్క్ ఓడిపోయెను. 1630 లో రష్యా, పోలండ్ దేశములతో పోరాడి అందు విజయుడై బాల్టిక్ తూర్పుతీరమువరకును తన రాజ్యమును విస్తరింపచేసెను.

రెండు ప్రధాన లక్ష్యములను దృష్టిలో ఇడుకొని ఇతడు ముప్పది సంవత్సరముల యుద్ధములో కలుగచేసికొనుట తటస్థించెను. 1. జర్మనీలోని ప్రొటెస్టంట్‌లను గట్టెక్కించుట; 2. తన రాజ్యమును జర్మనీ వరకును విస్తరింపచేసి, బాల్టిక్ సముద్రమును స్వీడెన్ దేశ సరస్సుగా మార్చుకొనుట. ఈ లక్ష్యముల సాధనకై జర్మన్ సమ్రాట్ సైన్యములతో ఇతడు పలుమారులు యుద్ధము ఒనర్చి పరాజితులను ఒనర్చెను. కాని, కడకు బడ్జెన్ అఖాతమువద్ద జరిగిన యుద్ధమున ఇతడు గాయపడి శత్రువులచేత చిక్కెను. స్వీడెన్ రాజులలో ఇతడు అగ్రగణ్యుడు. ఇతని మరణముతో ముప్పది సంవత్సరముల యుద్ధము [చూ.] యొక్క మత, నైతిక ఆశయములు అన్నియు విఫలమై కేవలము అది రాజకీయ దురంధరత్వ నిరూపణకొరకు జరిగిన పోరాటముగా పర్యవసించెను [చూ. ముప్పది సంవత్సరముల యుద్ధము]. ప్ర. రా.

**గాంగ వంశము, అర్వాచీన**: చూ. సం. 3 - పు. 234.

**గాంగులు, పూర్వ**: చూ. సం. 3 - పు. 173.

**గాంధీ, మోహన్‌దాస్ కరంచంద్** (1869-1948): భారత జాతీయ పిత; నవభారత నిర్మాత; ప్రపంచమునకు శాంతిసందేశమును ప్రసాదించిన యుగపురుషుడు; మహాత్మా అను ఉపనామమును ఆర్జించిన సత్యాహింసా ప్రవక్త.

మోహన్‌దాస్ కరంచంద్ గుజరాత్‌నందలి పోర్‌బందరులో 1869, అక్టోబరు 2 న జన్మించెను. ఈతని తండ్రి కాబాగాంధీ. కతియవాడ్ సంస్థానమునకు దివాన్‌గా ఈయన తండ్రి రాజకోటలో పని చేయుచున్నపుడు ఏడు సంవత్సరముల వయస్సుగల గాంధీ కూడ రాజకోటకు వెళ్లెను. అచటనే విద్యాభ్యాసముచేసి మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉత్తీర్ణుడయ్యెను.

రాజకోటలో చదువు ముగిసిన తరువాత గాంధీని బారిస్టర్ పట్టము చదువుటకై లండను పంపించవలెనని గాంధీ కుటుంబము వారు నిశ్చయించిరి. 'మహిళా, మద్య, మాంసము'లను ముట్టనని తల్లి ఎదుట శపథముచేసి, గాంధీ లండనుకు బయలుదేరెను. బారిస్టర్ చదువును ఎట్లో పూర్తి చేసికొని భారత దేశమునకు వచ్చి తన అన్నగారికి న్యాయవాద వృత్తిలో సహాయముచేయుటకు బొంబాయి వెళ్లెను. ఇంతలో దక్షిణ ఆఫ్రికాలో గల భారతీయ వ్యాపారస్థుని తరఫున వాదించుటకై గాంధీకి ఆహ్వానము వచ్చినది. అందులకు గాంధీ అంగీకరించి, దక్షిణ ఆఫ్రికాకు బయలు దేరెను (1893).


మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ (1869 – 1948)

దక్షిణ ఆఫ్రికాలో వర్ణవైషమ్యము ప్రబలముగా ఉండెను. మొదటి తరగతి పెట్టెనుండి 'కూలీ' బారిస్టర్ గాంధీని అధికారులు నెట్టివేసిరి. రంగుజాతులవారి బాధలు గాంధీకి స్వానుభవము వలన బోధపడి, దక్షిణ ఆఫ్రికాలోని భారతీయుల హక్కులకై పోరాడుటకు అతడు సంసిద్ధుడయ్యెను. ఆనాటినుండి సత్యాగ్రహము [చూ.] అను తన అపూర్వ శాంతియుత విధానమువలన 1914 లో భారతీయుల వాంఛలు సఫలీకృతమగు వరకు గాంధీ దక్షిణ ఆఫ్రికాలోనే ఉండెను.

పిమ్మట గాంధీ స్వదేశమునకు వచ్చి అచటి జాతియోద్యమములో ప్రముఖపాత్ర వహించెను. గాంధీ రాకతో భారతీయ స్వాతంత్ర్యోద్యమ స్వరూపమే మారి పోయినది. ప్రథమ ప్రపంచ యుద్ధసమయమున గాంధీ బ్రిటిష్ వారితో సహకరించినను, 1919 లో జలియన్ వాలా బాగ్ దురంతములు [చూ.] జరుగుటతో బ్రిటిష్ ప్రభుత్వముపట్ల తీవ్ర వైరము వహించెను. అందరును రాట్నము వడుకవలెననియు, ఖద్దరు ధరించవలెననియు ప్రచారముచేసి, శాంతియుత సహాయ నిరాకరణోద్యమము, విదేశ వస్తుబహిష్కరణోద్యమము సాగించి, దేశమున రాజకీయ చైతన్యమును అతడు కలిగించెను. 1930 లో గాంధీ దండివద్ద ఉప్పు సత్యాగ్రహమును ప్రారంభించెను. ఈ ఉద్యమమును అణచలేమని గ్రహించి బ్రిటిష్‌వారు లండనులో రౌండ్ టేబిల్ సమావేశమునకు కాంగ్రెస్‌ను ఆహ్వానించిన మీదట, కాంగ్రెస్ మహాసభకు ఏకైక ప్రతినిధిగా గాంధీజీ లండను వెళ్లెను. కాని, రౌండ్ టేబిల్ సమావేశము సఫలము కాలేదు. భారత దేశమునకు వచ్చినవెంటనే అనేక నాయకులతోపాటు గాంధీజీ కూడ బంధితుడయ్యెను. జైలులో ఉండగనే హరిజనుల ప్రాతినిధ్యము విషయమై ప్రభుత్వము ప్రకటించిన విధానము రద్దు చేయించుటకు గాంధీజీ 'మరణ పర్యంత నిరశన దీక్ష' ప్రారంభించెను. వివిధవర్గముల నాయకులు ఒడంబడికకు వచ్చిన మీదట గాంధీజీ నిరాహార దీక్ష విరమించెను.

జైలునుండి విడుదలై వచ్చిన తరువాత గాంధీజీ రాజకీయములనుండి తొలగి సాంఘిక సేవకై పాటుబడజొచ్చెను. అయినను భారత జాతీయ కాంగ్రెస్ విధానములకు అతడే విధాత.

ద్వితీయ ప్రపంచయుద్ధ (1939 – 45) సమయమున గాంధీజీ తొలుతటినుండియు వ్యక్తిగతముగ యుద్ధము ఎడల తనకు గల వైముఖ్యమును తెలియజేయుచు, నైతికముగ మాత్రము పోలండ్ మొదలగు బాధిత దేశముల ఎడ తన సానుభూతిని, ఫాసిస్ట్, నాజీవిధానముల విషయమున తన నిరసనను స్పష్టముగ వెల్లడించెను. కాంగ్రెస్ మాత్రము భారతదేశమునకు స్వాతంత్ర్యము ఒసగినచో, బ్రిటన్ మొదలగు మిత్రరాజ్యముల పక్షమున పోరాడుటకు సుముఖతను వెల్లడించినను, ముస్లిమ్‌లీగ్ కాంగ్రెస్‌లకు గల వైరుధ్యమును ఒక నెపముగ కొని బ్రిటన్ తక్షణ స్వాతంత్ర్యమును ఒసగ నిరాకరించెను. అంతట గాంధీజీ తన యుద్ధవ్యతిరేక వైఖరిని సుస్పష్టము చేయుచు, వ్యక్తిసత్యాగ్రహమును 1941 లో తన అనుమతి పొందిన కొందరు అనుయాయుల మూలమున సాగించెను. ఇంతలో జపాన్ యుద్ధమున ప్రవేశించిన ఫలితముగ యుద్ధ ప్రమాదము భారతదేశమునకు సన్నిహితము అయ్యెను. బ్రిటిష్ సామ్రాజ్యవ్యవస్థ భారతదేశమున ఉండుట వలన ఆ దేశము ఇంకను ఎక్కువ ముప్పునకు లోను కాగలదని తలచి, గాంధిజీ 1942, ఆగస్టు 9 న 'క్విట్ ఇండియా' (దేశమును వదలి బ్రిటిష్ ప్రభుత్వము పోవలయునను) తీర్మానమును కాంగ్రెస్‌చే ఆమోదింప చేసెను. తత్ఫలితముగ తన అనుయాయులతో పాటుగ గాంధీజీ అరెస్టు చేయబడుటయు, పూనా సమీపమున ఉన్న ఆగాఖాన్ భవనమున నిర్బంధితుడగుటయు జరిగెను. అంతట దేశములో క్రోధాగ్ని పెల్లుబికి, ప్రజలు పెద్ద ఎత్తున విప్లవము ప్రారంభించిరి. అదియే ఆగస్టు విప్లవము [చూ. పు. 282].

జైలులోనే గాంధీజీ భార్య కస్తూరిబా 1944 లో మరణించెను. దేశ నాయకులందరును కారాగారములలో

ఉన్నను, ప్రజలలో తీవ్రమైన సంచలనము, అసంతృప్తి ప్రబలినది. ఈ అసంతృప్తి సైన్యములో కూడ ప్రవేశించినది. అందుచే బ్రిటిష్‌వారు సామరస్య సాధనకై తొలుత గాంధీజీని విడుదల చేసిరి. ఆ వెంటనే ముస్లిమ్‌లీగ్ నాయకుడగు జిన్నాతో ఒక అంగీకారమునకు రావలెనని మహాత్ముడు ఎంత ప్రయత్నించినను సాధ్యము కాలేదు. ఈ నాయకులలో ఒక సామరస్యము సాధించు తలపుతో ప్రభుత్వము సిమ్లాలో ఒక సమావేశమును జరిపెను. కాని, ఆ సమావేశము విఫలమైనది. జిన్నా తన పాకిస్తాన్ పట్టు వీడలేదు. చివరకు కాంగ్రెస్ దేశవిభజనకు అంగీకరింపవలసి వచ్చినది. 1947, ఆగస్టు 15 న దేశము రెండు డొమినియన్‌లు (అధినివేశములు) గా విభజింపబడినది. తత్పర్యవసానముగ అమానుషములై మత కల్లోలములు చెలరేగినవి. గాంధీజీ కల్లోలిత ప్రాంతములను పర్యటించి మతసామరస్యమును నెలకొల్పుటకు తన యావచ్ఛక్తిని వినియోగించెను. కడకు ఈ ఉద్దేశము తోడనే ఢిల్లీలో నిరశనదీక్షను వహించి, వివిధ మత వర్గముల నాయకులు శాంతిని కాపాడుటకై ఒసగిన హామీపై అయిదు రోజుల అనంతరము దీక్ష విరమించెను.

ఉపవాస విరమణానంతరము 1948, జనవరి 30న గాంధీజీ ప్రార్థన సమావేశమునకు వెళ్లుచుండగా నాథూరామ్ వినాయక్ గాడ్సే అను హిందువు ఒకడు గాంధీజీని పిస్తోలుతో కాల్చి చంపెను. గాంధీ మహాత్ముని హత్యతో భారతదేశమంతయు కన్న తండ్రిని పోగొట్టుకొన్న చిన్న పిల్లలవలె విలపించినది. ప్రపంచమంతయు ఒక శాంతి ప్రవక్తను కోల్పోయినట్లు పరితపించినది. (1920 తరువాత గాంధీజీ జీవిత చరిత్ర. భారత రాజకీయములతో విడదీయరాని తీరున ముడివడినది. కావున వివరములకు : చూ. భారతదేశము - చరిత్ర). ప్ర. రా.

**గాంబియా :** పశ్చిమ ఆఫ్రికా యందలి స్వతంత్ర రాజ్యము.

అన్నివైపుల సెనెగల్ గణరాజ్యముచే ఈ రాజ్యము పరివృతమై ఉన్నది. [వి] 10,369 చ. కి. మీ; [జ] 3,15,486 ; [భా] దీనిలోని వారందరును హౌసా భాష మాట్లాడుదురు. [మ] అందరు ముస్లిమ్‌మతానుయాయులు. [రా] బాతర్‌స్ట్ (జ. సం. 19,602).

చరిత్ర: ఈ ప్రాంతము పోర్చుగీస్ నావికులచే మొట్టమొదట 15 వ శతాబ్దిలో కనుగొనబడినది. కాని, ఆ ప్రాంతమున స్థిరావాసములు ఏర్పరచుకొనుట జరుగలేదు. తరువాత అచ్చట వ్యాపార విస్తరణోద్దేశముతో బ్రిటిష్ వారు వలస స్థాపించుకొనిరి (1588). అంతట వర్తకులును, వర్తక సంస్థలును గాంబియానదీ ప్రాంతములందు స్థావరములు ఏర్పరచుకొనుటకు బ్రిటిష్ రాణియగు ఎలిజబెత్తు - I నుండి అనుమతిని పొందిరి. 1807 వ సంవత్సరమునుండి గాంబియా సియెర్రాలియోనీలో చేరి బ్రిటిష్ వారి అధీనమున ఉండెను. కాని, 1843 నుండి అది ప్రత్యేక మకుటాధిపత్యపు వలస అయినది. బ్రిటిష్ పరిపాలిత ప్రాంతముగ ఇది 1814 లో జరిగిన పారిస్ ఒడంబడిక వలన ధ్రువపరుపబడినది. 1866 లో గాంబియా పశ్చిమ ఆఫ్రికా వలసరాజ్యముతో చేరిన ఒక ప్రత్యేక రాష్ట్రము అయినది. కాని, 1888 లో తిరిగి మకుటాధిపత్యపు వలసగ మార్చబడినది.

బ్రిటిష్ పరిపాలనక్రింద క్రమముగ ప్రజలకు ప్రభుత్వమున భాగస్వామ్యము కలిగించుటకు యత్నములు జరిగినవి. వాని ఫలితముగ 1961లో పరిమితాధికారములు కల ప్రజాప్రభుత్వము ఏర్పరుపబడినది. 1963, అక్టోబరు 4 నుండి ఈ దేశమునకు ఆంతరంగిక స్వపరిపాలనము కలుగజేయుటకు బ్రిటన్ అంగీకరించెను. ఆ తరువాత 1965 లో ఈ దేశమునకు స్వతంత్రత లభించినది. మ. ఆ. శ.

**గాత్‌లు :** అనేక దండయాత్రలు సలిపి రోమ్ యొక్క అద్వితీయ శక్తిని తక్కువస్థాయికి తెచ్చిన విజిగాత్‌లు ఉత్తరమునుండి వచ్చిన అనాగరకులలో మొదటివారు; వీరికే పశ్చిమ గాత్‌లు అనీ వ్యవహారము కూడా కలదు. వీరు ఎచటనుండివచ్చిరో నిర్ధారణగా చెప్పలేము. ఉత్తరమున ప్రస్తుతము మనము స్వీడెన్ అని పిలుచుచున్న దేశమున గాత్‌లు మొదట నివసించేవారని కొన్ని గాథలను బట్టి తెలియుచున్నది. [.చూ పు. 47]

డాన్యూబ్ నదికిని, నల్లసముద్రమునకును ఉత్తరముగ ఉన్న మహాసామ్రాజ్యమును గాత్‌లు కొంతకాలము పాలించిరి. అంతలో క్రీ. శ. 375 లో హూణులు అను ఒక తెగవారు ఆసియానుండి బయలుదేరి యూరప్‌నకు తరలివచ్చుచు మార్గమున తటస్థపడిన ఆస్ట్రొగాత్ (తూర్పు గాత్)లతో యుద్ధముచేసి వారిని పూర్తిగా ఓడించిరి. గత్యంతరము లేక ఆస్ట్రొగాత్‌లు డాన్యూబ్ నదికి ఆవల ఉన్న ప్రదేశములలోను, రోమన్ సామ్రాజ్యపు సరిహద్దుల లోను తలదాచుకొనవలసి వచ్చెను. పిమ్మట 378 లో వీరు ఏడ్రియానోపిల్ పట్టణ సమీపమున జరిగిన యుద్ధములో వాలెన్స్ చక్రవర్తిని ఓడించి చంపిరి. అందువల్ల కొంత కాలము వీరు రోమన్ రాజ్యములో నిశ్చింతగా కాలము గడిపిరి. కాని, 394-5 లో తియోడోసియస్ నాయకత్వమున తిరుగుబాటుచేసి తూర్పు సామ్రాజ్యములోని చాల

భాగమును ధ్వంసము చేసిరి. తుదకు 401 లో అలరిక్ కాలమున రోమ్ గాత్‌ల హస్తగత మయ్యెను.

అలరిక్ (370-410) తర్వాతి వారు ఇటలీని కూడ దాటిపోయి, దక్షిణ గాల్, స్పెయిన్ దేశములలో బలిష్ఠమైన సామ్రాజ్యమును స్థాపించిరి. అయితే, 507 లో గాల్‌లో ఉన్న విజిగాత్‌లు ఫ్రాంక్‌లచే ఓడించబడి, పిరనీస్ పర్వతములకు ఆవల ఉన్న ప్రదేశములకు తరుమబడిరి. ఇక స్పెయిన్‌లో మాత్రము రాజ్యము 200 ఏండ్లపాటు వర్ధిల్లెను. చివరకు 711 లో ఆఫ్రికాను దాటివచ్చిన మూరులు గాత్‌లతో ఎనిమిది దినములు భయంకరముగా యుద్ధము చేసి వారిని ఓడించిరి. ఈ యుద్ధము వలన విజిగాత్‌ల సామ్రాజ్యము నిర్మూలమయ్యెను.

తూర్పు సామ్రాజ్యము యొక్క సేనాధిపతులు ఇటలీని 526 లో జయించిరి. అటు పిమ్మట ఆస్ట్రొగాత్‌లు ఇటలీని విడిచి ఆల్ప్స్‌పర్వత పంక్తులకు ఉత్తరమున ఉన్న అనాగరక జాతులతో ఐక్యమై, చరిత్రనుండి మాయమైరి. ప్ర. రా.

**గినీ:** ఆఫ్రికా ఖండమున వాయవ్యభాగమందు ఉన్న ఒక స్వతంత్రరాజ్యము.




ఈ దేశమునకు పోర్చుగీస్ గినీ, మాలీ సమాఖ్య [ఉ]; ఐవరీకోస్ట్ [తూ]; సియెర్రాలియోనీ, లైబీరియా [ద]; అట్లాంటిక్ మహాసముద్రము [ప] సరిహద్దులందు ఉన్నవి. [వి] 2,45,857 చ. కి. మీ.; [జ] 33,56,900. జనులలో వివిధ ఆఫ్రికన్ జాతిసంతతులవారు కలరు. [భా] వివిధ ఆఫ్రికన్ భాషలు మాటాడబడుచున్నను, ఫ్రెంచి భాషయే పరిపాలనారంగమున వాడబడుచున్నది. ఇంగ్లీష్ భాష క్రమముగ రెండవ ప్రముఖ భాషగ పరిగణనకు వచ్చుచున్నది. [మ] దేశవాసులలో క్రైస్తవులును, ముస్లిమ్‌లును కొలదిగ మాత్రమే కలరు. అధిక సంఖ్యాకులు సంప్రదాయ ప్రకృతి దేవతారాధకులు. [రా] కానక్రీ (జ. సం, 80,000).

చరిత్ర: ఆఫ్రికాఖండమందు ప్రాచీన నాగరకతకు నెలవులుగ పేరొందిన ప్రాంతములలో ఇది ఒకటి. పురావస్తు శాస్త్రజ్ఞులు ఇప్పటికి వెలికి తీసిన విషయములబట్టి క్రీ. శ. 5 వ శతాబ్ది నుండియు ఈ ప్రాంతపు ప్రాచీన చరిత్ర మనకు తెలియవచ్చుచున్నది. క్రీ. శ. 5 వ శతాబ్దినుండి 8 వ శతాబ్దివరకు ఉన్నత దశ అనుభవించిన ఘానా సామ్రాజ్యమున ఈ ప్రాంతము తొలుత అంతర్భాగముగ ఉండెడిది. ఈ సామ్రాజ్యము 11 వ శతాబ్దిలో అవసాన దశ నొంది, కడకు 1235 లో మాలింక్ తెగవారిచే స్థాపింపబడిన మాలింకీ సామ్రాజ్యమున లీనమయ్యెను. 13, 14 శతాబ్దులలో మాలింకీ సామ్రాజ్యము తన వైభవమున పరాకాష్ఠను అందుకొని 15 వ శతాబ్దియందు హీనస్థితికి దిగజారినను, 16 వ శతాబ్దియందు సైతము ఒక అల్ప రాజ్యముగ మనగలిగెను. కడకు 17 వ శతాబ్దిలో సుడాన్ నందలి బర్‌బర్‌లను యోధజాతి ఈ రాజ్యముపై దండెత్తి దీనిని అంతమొందించెను.

పోర్చుగీస్ వర్తకులు 15 వ శతాబ్దియందు ఈ దేశమున కాలిడుటతో యూరపియన్‌లకు ఈ దేశముతో సాన్నిహిత్యము ఏర్పడెను. 17 వ శతాబ్దిలో బ్రిటిష్, ఫ్రెంచి, పోర్చుగీస్ వర్తకులు ఒకరితో మరొకరు పోటీపడుచు, ప్రాబల్యము ఇట ఆర్జించుటకు పెనగులాడిరి. కడకు ఫ్రెంచివారు 19 వ శతాబ్దిలో ఇందలి కొన్ని ప్రాంతములను తమ రక్షణలోనికి తీసికొన కలిగిరి. ఫ్రెంచివారికి ఈ దేశపు తీర ప్రాంతములపై గల హక్కు పారిస్ సంధి (1814) [చూ.] కాలమున గుర్తింపబడినది. కాని, తక్కిన దేశము ఆ కాలమున ఫులానీ అను ఆఫ్రికన్ తెగవారి ఆధిపత్యమున ఉండెను; వీరు ముస్లిమ్‌లు. వీరితో తొలుత ఫ్రెంచివారు వర్తక సుంకములను గురించియు, కొన్ని ప్రాంతములపై వారికి గల అధికారములను గురించియు ఒక ఒడంబడికకు రాగలిగినను, అది ఎక్కువ కాలము నిలువలేదు. తుదకు 1891 - 93 వరకు జరిగిన పోరాటములలో ఫ్రెంచివారు వీరిని జయించి కడమ దేశమును కూడ వశపరచుకొనిరి.

తొలుత ఈ ప్రాంతమును ఫ్రెంచివారు రివేరేడి సుద్ (దక్షిణ నదీప్రాంతము) అని వ్యవహరించెడివారు. 1893 లో దీనికి ఫ్రెంచి గినీ అని నామమిడబడినది. అంతట నుండి పరిసరములందు ఉన్న తక్కిన ఫ్రెంచి వలసలతో పాటుగ ఇదియు ఫ్రెంచివారి వలస పరిపాలనలో ఫ్రెంచి పశ్చిమ ఆఫ్రికా సమాఖ్యలో చేరి 1958 వరకు ఆ విధముగనే ఉండెను. 1946 వరకు ఈ దేశవాసులకు ఫ్రెంచి పౌరస్వత్వము కలిగింపబడలేదు. 1946 లో పౌరస్వత్వము కలిగింపబడుటయే కాక, స్వపరిపాలనకై పరిమితాధికారములును కలుగజేయబడినవి. వోటు హక్కు తొలుత కొన్ని ప్రత్యేకార్హతలు కలిగిన వారికే నియమితమైనను,

కాలక్రమమున అందలి నియమములు సడలింపబడి, 1957లో సార్వజనిక వయోజనపు ఎన్నిక విధానము రూపొందినది. దేశీయ శాసన సభకు ఆంతరంగిక వ్యవహారములందు విస్తృతాధికారములు కల్పింపబడినవి. కడకు 1958 లో ఫ్రెంచి రాజ్యాంగచట్టముపై జరిగిన జనవాక్యసేకరణ యందలి నిర్ణయమును అనుసరించి ఫ్రెంచి గినీ సంపూర్ణ స్వాతంత్ర్యమును ఆర్జించెను [చూ. ఫ్రెంచి కమ్యూనిటీ]. స్వాతంత్ర్యార్జనానంతరమున సాంఘిక, ఆర్థిక రంగములందు అభివృద్ధిని సాధించుటకే కాక, ఆఫ్రికన్ దేశములందు సమైక్య భావమును నెలకొల్పు కృషిలో కూడ గినీ దేశము విస్తారముగ కృషిసలిపెను. ఆఫ్రికా సమైక్యమున తొలి మెట్టుగ 1961, జూలై 1 న మాలీ, ఘూనా దేశములతో కలసి గినీ దేశము 'యూనియన్ ఆవ్ ఆఫ్రికన్ స్టేట్స్' అను పేర ఒక సమాఖ్యను నెలకొల్పెను. కాని, దీనికి గల అధికారములు స్పష్టముగ నిర్వచింపబడకపోవుటచే ఈ సమాఖ్యవలన ప్రయోజనము ఏమియు కలుగలేదు.

**రాజ్యాంగము:** 1958, నవంబరు 12 వ తేదీన ప్రచురితమైన రాజ్యాంగచట్టము ప్రకారము గినీయందు ప్రజాస్వామిక, లౌకిక, సాంఘిక, గణతంత్ర రాజ్యము నెలకొల్పబడినది. సర్వసత్తాకత ఇందు ప్రజానీకమునకు చెంది ఉన్నది. తదనుగతములగు అధికారములను ప్రజలు జాతీయ శాసన సభ (నేషనల్ అసెంబ్లీ) మూలమునను లేదా అవసరమగు ఎడల ప్రజానిర్ణయము (రెఫరెండమ్) వలనను అమలు జరుపుచున్నారు. జాతీయ శాసనసభకు అయిదేండ్లకు ఒకసారి సార్వజనికపు వోటు హక్కు ద్వారా ఎన్నికలు జరుగును. అధ్యక్షుడు రాజ్యాధిపతి; ఈ అధ్యక్ష పదవికి 7 ఏండ్లకు ఒక పర్యాయము సార్వజనికపు నియోజన విధిని అనుసరించి ఎన్నికలు జరుగును. కార్యనిర్వహణకు అధ్యక్షుడే బాధ్యత వహించును. ఈ బాధ్యతను నిర్వహించుటలో ఇతనిచే నియమింపబడు మంత్రిమండలి ఇతనికి సాయముచేయును. మంత్రి మండలి సభ్యులకు శాసన సభయందు సభ్యత్వము నిషిద్ధము. శాసన సభయందును, దానికి సంబంధించిన ఉపసంఘములందును హాజరయి తమ అభిప్రాయములను తెలుపుటకు మాత్రమే వారికి అధికారము కలదు. రాజ్యాంగ చట్టపు సవరణలు శాసన సభ యందు మూడింట రెండువంతుల ప్రాబల్యముతో ఆమోదింపబడవలెను. అవసరమగుచో ఆ సవరణను ప్రజానిర్ణయమునకు నివేదించవలెను. చీ. శే. రా.

**గినీ, పోర్చుగీస్:** పశ్చిమ ఆఫ్రికా తీరమునందలి పోర్చుగీస్ పాలిత ప్రాంతము.

దీనికి గినీ గణరాజ్యము [తూ, ద]; సెనెగల్ [ఉ]; అట్లాంటిక్ మహాసముద్రము [తూ] సరిహద్దులుగ ఉన్నవి. [వి] పరిపాలన రీత్యా దీనిలో చేరి ఉన్న బిస్సాగోస్ దీవులతో కలసి దీని విస్తీర్ణము 36,131 చ. కి. మీ.; [జ] సుమారు 5,40,000; పలు తెగలకు చెందిన నీగ్రోలు ఇందు వసించుచున్నారు. [రా] బిస్సౌ; ముఖ్యమగు రేవు పట్టణముకూడ అదియే.

పోర్చుగీస్ నావికులు ఈ ప్రాంతమును కనుగొనిన (1446 - 47) నాటినుండియే దీనిని గురించిన వివరములు తెలియుచున్నవి. 16 వ శతాబ్దిలో బానిస వ్యాపారమునకు ముఖ్య కేంద్రముగా ఉపకరించినది. పోర్చుగీస్ దేశపు సముద్రోత్తర రాష్ట్రముగ కేప్ వర్డీ దీవులతో కలిపి ఇది తొలుత పాలింపబడినది; కాని, 1879 లో పాలనా సౌలభ్యముకొరకై వేరుపరచబడినది. తదాదిగ పోర్చుగీస్ దేశపు సముద్రోత్తరరాష్ట్రముగనే పరిగణింపబడుచు, ఒక గవర్నర్ పాలనలో ఉన్నది. చీ. శే. రా.

**గిబ్బన్, ఎడ్వర్డ్ (1773 - 1794):** చరిత్ర రచయిత. ఆంగ్లదేశీయుడు. ఒక సంపన్న కుటుంబమున జన్మించెను. ఆక్స్‌ఫర్డ్‌లో కొలదికాలము చదివి, తర్వాత స్విజర్లండ్‌లో లాసేన్‌లో 5 సంవత్సరములు విద్యను అభ్యసించెను. సప్తవర్ష యుద్ధ [చూ.] సమయమున అతడు బ్రిటిష్ సైన్యములో కెప్టెన్‌గా పని చేసెను. కాని, ప్రత్యక్ష యుద్ధమున పాల్గొనలేదు. యూరప్‌లో అనేక ప్రాంతములలో పర్యటించిన పిదప, 1770 లో లండనులో స్థిరపడి, 'రోమన్ సామ్రాజ్య పరిక్షయ, పతనముల చరిత్ర (డిక్లైయిన్ అండ్ ఫాల్ ఆవ్ రోమన్ ఎంపైర్)' అను తన ప్రఖ్యాత చరిత్ర రచనయందు గిబ్బన్ దాదాపు రెండు దశాబ్దములు కృషి చేసెను. 1774లో అతడు పార్లమెంట్‌కు ఎన్నికయై, 9 ఏండ్లు అందు సభ్యుడుగా ఉండెను. 1783 లో లాసేన్‌కు తిరిగి వచ్చి, అచ్చట పైన పేర్కొన్న చరిత్ర రచనను ముగించెను. 6 పెద్ద సంపుటములుగా వెలువడిన ఈ గ్రంథము చరిత్ర పరముగనే గాక, భాషాపరముగ కూడ అత్యున్నతమయినదని శ్లాఘింపబడి, అనేక ఇతర భాషలలోనికి కూడ అనువదింపబడెను. గిబ్బన్ తన గ్రంథములో రాజకీయములకు, మత విషయములకు, యుద్ధ వర్ణనలకు అపార ప్రాముఖ్యమును ఇచ్చి, ఆర్థిక, సాంఘిక శక్తుల విషయమున చాల అశ్రద్ధ చూపెను. అతడు తన స్వీయ చరిత్రను కూడా రచించెను. ఆ. వెం.

**గుప్తవంశరాజులు:** భారతదేశ చరిత్రయందు సుప్రసిద్ధతను ఆర్జించి, ఒక సామ్రాజ్యమును ఏలిన రాజవంశజులు. కుషాన్ సామ్రాజ్యము విచ్ఛిన్నమైన తరువాత ఒకటి రెండు శతాబ్దముల కాలము ఆర్యావర్తదేశ చరిత్రయందు అజ్ఞాత యుగమని చెప్పవచ్చును. ఆర్యావర్తమును

పరదేశీయుల బారినుండి తప్పించి, ప్రాచీన హిందూ సామ్రాజ్యమును నిలుపుటకు నాగులు, వాకాటకులు చేసిన ప్రయత్నములను గుప్తవంశజులు పూర్తి గావించిరి. మౌర్యుల పిమ్మట ఒక మహాసామ్రాజ్యమును ఉత్తర భారతదేశమున నిర్మించినవారు గుప్తకులజులే. వీరి మూల పురుషుడు శ్రీగుప్తుడు. ఇతడు మగధదేశమును క్రీ. శ. రెండవ శతాబ్దారంభమున పాలించినట్లు తెలియుచున్నది. తరువాత గుప్తుడు అనువాడు మగధను మూడవ శతాబ్దాంతరమున పాలించెను. ఇతని కుమారుడు ఘటోత్కచుడు. ఈ ఘటోత్కచుని కుమారుడు చంద్రగుప్తుడు. గుప్తసామ్రాజ్య పాలకులలో వేరొక చంద్రగుప్తుడును ఉదయించుట వలన ఇతనిని చరిత్రకారులు చంద్రగుప్తుడు - I అనిరి.

ఆర్యావర్తము పరదేశీయుల పాలబడకుండ రెండు వందల సంవత్సరములు కాపాడి జీర్ణ హిందూ సామ్రాజ్యమును పునరుజ్జీవింప జేసిన ధన్యజీవులు ఈ గుప్తవంశ రాజన్యులు. చంద్రగుప్త - II (విక్రమాదిత్య) పండిత కవి పోషకులు. ఇతని ఆస్థానమునందు నవరత్నములు అను పేర సంస్కృత సారస్వతములో పేరు గాంచిన కాళిదాసాది మహాకవులు ఉండిరని విజ్ఞులు వ్రాయుచున్నారు. కాని, దీనిని ధ్రువపరచు చారిత్రకాధారములు మృగ్యములు.

గుప్తవంశరాజులు వైష్ణవమతావలంబకులు; పరమ భాగవతులు. కాని, వీర వైష్ణవులు కారు. వీరి కాలములో శివ, చండీ, సూర్యాది దేవతలకును దేవాలయములు నిర్మింపబడి పోషింపబడెను. బ్రాహ్మణ మత ప్రాబల్యము హెచ్చెను; బౌద్ధమత ప్రాబల్యము తగ్గిపోయెను.

గుప్తుల కాలమున ప్రభువులు సంస్కృత భాషకు చేయూతను ఇచ్చి, పండితులను, కవులను పోషించి, గ్రంథములను వ్రాయించిరి. పురాణములను మరల క్రోడీకరింప జేసి, సూత్రగ్రంథములకు భాష్యములు వ్రాయించిరి. యాజ్ఞవల్క్య, నారద స్మృతులు ఈ కాలమునకు చెందినవే. నేటి కాలమున వ్యాప్తియందు ఉండిన వాయు పురాణము ఈ కాలమున క్రోడీకరింపబడెనని విజ్ఞుల అభిప్రాయము. అన్నిటికన్నను ముఖ్యవిషయము ఏమనగా గ్రీక్ దేశీయులతో రాకపోకలు కలుగుటచేత వారి భూగోళ శాస్త్ర సిద్ధాంతములు ఆర్యావర్తమునకు ప్రాకి వచ్చి, ఆర్యభటుడు [చూ. సం. 9 - పు. 152] మొదలయిన భూగోళ శాస్త్రవేత్తలకు మార్గదర్శకములయ్యెను. నేడు గ్రీనిచ్ నుండి వలెనే ఆనాడు ఉజ్జయినినగరము నుండి రేఖాంశములు లెక్కింపబడుచుండెడివి.

గుప్తశకము: చంద్రగుప్తుడు - I పరిపాలనారంభముతో గుప్తశకము ఆరంభమయ్యెనని గుప్తశాసన పరిష్కర్తయైన ఫ్లీట్ పండితుడు తలంచుచున్నాడు. గుప్తశకము శకసంవత్సరములకు రెండువందల నలుబదిపై ఒక సంవత్సరము తరువాత ప్రారంభమయ్యెనని అల్ బెరూనీ [చూ. పు. 272] అను విదేశీయ చరిత్రకారుని అభిప్రాయము. కాని, కాలప్రారంభమును గూర్చి నిర్వచించెడు ఇతర ప్రాచీన ప్రామాణిక ఆధారములు ఏవియు లేవు.

గుప్త సామ్రాజ్య విచ్ఛిత్తి: గుప్త రాజులలో కడపటి వారికి శత్రురాజుల నిగ్రహింపగల శక్తిసామర్థ్యములు లేక పోవుటచే రాజ్యము పరాధీనమయ్యెను. హూణులు తండోపతండములుగా వచ్చి గుప్తసామ్రాజ్యమును జయించిరి. గుప్తసామ్రాజ్యవంశము అంతరించినది. కుం. ఈ. దత్తు.

**గుప్తశకము:** చూ. శకము.

**గెబన్:** పశ్చిమ ఆఫ్రికాయందలి ఒక స్వతంత్ర రాజ్యము.




దాదాపు దీర్ఘ చతురస్రాకారముగ ఉన్న ఈ దేశమునకు కాంగో రిపబ్లిక్ (బ్రజవిల్లీ) [తూ, ద]; అట్లాంటిక్ మహాసముద్రము [ప]; రియోముని, కామెరూన్ [ఉ] సరిహద్దులుగ ఉన్నవి. [వి] దాదాపు 2,67,000 చ. కి. మీ.; [జ] 4,52,500. పిగ్మీ, బంటూ, ఫాంగ్ అను మూడు ఆఫ్రికన్ జాతులకు చెందిన ప్రజలు ఇందు కలరు. వీరిలో మొదటివారు ప్రపంచ మానవ జాతులయందెల్ల ఆకృతియందు చిన్నవారు. నాగరకతా వాసన ఎరుగక మారుమూల అడవులలో వసించు ఈ జాతి ప్రజలు ఈ దేశమున క్రమముగ నశించుచున్నారు. [మ] జనులలో మూడవ వంతు క్రైస్తవ మతావలంబకులు; తక్కినవారు సంప్రదాయ ప్రకృతి దేవతారాధకులు. [రా] లైబర్‌విల్లీ (జ. సం. 21,500).

చరిత్ర: 15 వ శతాబ్ది వరకు ఈ దేశమును గురించిన చారిత్రక వివరములు ఏవియు తెలియవచ్చుట లేదు.

1470 ప్రాంతమున పోర్చుగీస్ నావికులకు ఈ ప్రాంతముతో పరిచితి లభించినది. అంతట పోర్చుగీస్ వర్తకులు తీరప్రాంతమున అటనట - అందును ముఖ్యముగ ఒగోవీనదీ ముఖద్వారమున - కొన్ని వర్తక కేంద్రములను నెలకొల్పిరి. వారిని అనుసరించి క్రైస్తవ మతప్రచారకులును తీరప్రాంతమున మతప్రచారమును చేయమొదలిడిరి. పోర్చుగీస్ వారిని ఆవలకునెట్టి క్రమముగ ఇంగ్లీషు, డచ్చి, ఫ్రెంచి వర్తక సంస్థలును ఈ దేశమున కాలూన గలిగెను. వీనిలో ఫ్రెంచి వర్తక సంస్థలు ఫ్రెంచి ప్రభుత్వాదరణ బలమున ముందంజవేసి, బానిస వ్యాపారమును కైవసము చేసికొని విపరీతముగ ధనము ఆర్జించినవి. 19 వ శతాబ్ది ఆరంభమున బానిసవ్యాపారము నిషేధింపబడుటవలన ఫ్రెంచి వ్యాపారసంస్థలు అంతటినుండి వేరువిధములగు వస్తువులతో తమ వ్యాపారమును అభివృద్ధి చేసికొనుటకు యత్నించినవి. ఈ వర్తక వ్యవహారముల మూలమున తమ భద్రతకొరకై ఫ్రెంచివారు తీరమునందలి కొన్ని రేవులను వశపరచుకొనవలసిన అవసరము ఏర్పడెను. అందువలన ఈ దేశపు ఉత్తర తీరమును అపుడు పాలించుచున్న డెనిస్ అను ప్రభువుతో 1839 లో ఫ్రెంచివారు ఒక ఒడంబడికను కుదుర్చుకొనిరి. ఆ ఒడంబడిక మూలమున ఆ రాజు రక్షణ భారమును ఫ్రెంచివారు వహించి, అందులకు ప్రత్యామ్నాయముగ అతని రాజ్యముపై సర్వాధికారములను ఆర్జించిరి. దక్షిణ తీరప్రాంతమును పాలించు లూయీ అను ప్రభువుతో కూడా ఫ్రెంచివారు ఇట్టి ఒడంబడికనే కుదుర్చుకొనిరి. ఇటులనే తీరప్రాంతమునందలి తక్కిన ప్రభువులును తమ రాజ్యములను ఫ్రెంచివారి రక్షణలో ఉంచిరి. ఫ్రెంచివారు ఈ ప్రభువుల పాలనలో ఉన్న ప్రజల భద్రతకు సాయపడిరి. రహస్యముగ జరుగుచున్న బానిస వ్యాపారమును అరికట్టి బానిసలను ఎందరినో విడుదల చేసిరి. విడుదలైన బానిసలకు ఒక స్థావరముగ తొలుత 1842 లో ఫ్రెంచివారిచే నిర్మింపబడిన లైబర్‌విల్లీ క్రమముగ ఈ దేశమునకు రాజధాని అయినది. తీరప్రాంతమున తమ ఆధిపత్యమును సుస్థిరము ఒనర్చుకొనిన తరువాత 1847 నుండి ఫ్రెంచి ప్రభుత్వము దేశాన్వేషకులను పలువురను ప్రోత్సహించి దేశాంతర్భాగమును పరిశోధింపజేసెను. ఈ అన్వేషకులు దేశమధ్యమున ఉన్న పలుజాతుల ప్రభువులతో ఒడంబడికలను కుదుర్చుకొని వారి రాజ్యములను అన్నిటిని క్రమముగ ఫ్రెంచివారి అధీనములోనికి తెచ్చిరి. 1885 లో బెర్లిన్ కాంగ్రెస్ [చూ.] నందు ఫ్రెంచి వారికి ఆఫ్రికాలో కాంగోనది కుక్షి ఒడ్డున గల ప్రదేశమున గల అధికారము గుర్తింపబడెను. ఆ తరువాత అయిదు పండ్లకు గెబన్ ప్రాంతము ఫ్రెంచి కాంగో వలస రాజ్యమున కలిపివేయబడెను. 1903 లో ఈ ప్రాంతము ఒక ప్రత్యేక మండలముగ వేరుచేయబడినది. అంతట 1910 లో ఫ్రెంచి ఈక్వటోరియల్ ఆఫ్రికాలో ఒక ప్రత్యేక వలస రాజ్యముగ ఈ ప్రాంతము పరిగణనపొందెను. 1958, సెప్టెంబరు 3 వ తేదీన జరిగిన జనవాక్యసేకరణను అనుసరించి ఫ్రెంచి కమ్యూనిటీ [చూ.] కి చెందిన ఒక స్వతంత్ర రాజ్యముగ గెబన్ రూపొందెను.

రాజ్యాంగము : 1910 నుండి 1958 వరకు ఈ దేశము ఫ్రెంచి ఈక్వటోరియల్ ఆఫ్రికాయందలి నాలుగు వలస రాజ్యములలో ఒకటిగ ఉండెను. 1958 నుండి ఫ్రెంచి కమ్యూనిటీలో స్వేచ్ఛాపూర్వకముగ సభ్యత్వము వహించి, ఆ సభ్యత్వపు బాధ్యతలకు లోబడి స్వతంత్రప్రతిపత్తిని అనుభవించుచున్నది. 1959, ఫిబ్రవరి 19 వ తేదీన ఆమోదింపబడిన రాజ్యాంగ చట్టమును అనుసరించి పార్లమెంటరీ ప్రజాస్వామికము ఈ దేశమున అమలునందు ఉన్నది. శాసనాధికారము 40 మంది సభ్యులు కల శాసనసభ (అసెంబ్లీ లెజిస్లేటివ్) యందు న్యస్తమై ఉన్నది. అయిదేండ్లకు ఒకసారి అపరోక్ష, రహస్య, సార్వజనిక, వయోజన నియోజక పద్ధతిని అనుసరించి ఈ శాసనసభ ఎన్నుకొనబడుచున్నది. అత్యధిక సంఖ్యాక పక్షపు నాయకుడు ప్రధాన మంత్రిగ శాసన సభచే ఎన్నుకొనబడును. ప్రధాన మంత్రియే ప్రభుత్వాధ్యక్షుడుగ సైతము వ్యవహరించును. కార్యవర్గమునందలి మంత్రులను తొమ్మిది మందిని ఇతడు నియామకము చేయును. 36 నెలలలోపల రెండు సారులు మంత్రివర్గములు పడిపోయిన ఎడల శాసనసభను రద్దుపరచి ప్రభుత్వము మరల ఎన్నికలను జరుపవచ్చును. చీ. శే. రా.

**గెరిల్లా :** ఒక రాజ్యము యొక్క అనుమతిలేకుండా సాయుధులై యుద్ధ చర్యలకు పూనుకొను ఒక ముఠాలోని సభ్యునికి 'గెరిల్లా' అను పదము ఆదిలో వాడుకలో ఉండెను.

అనంతరము దీని అర్థము విస్తృతమై, అధికారికముగానే యుద్ధ చర్యలకు దిగు చిన్న చిన్న ముఠా సభ్యులకు కూడ ఈ పదము వర్తింపసాగినది. తరచు ఇట్టి ముఠాలు ప్రధాన సైన్యమునుండి విడివడి, శత్రు శ్రేణుల వెనుక భాగము నుండి వచ్చి యుద్ధము చేయుచుండును.

కొట్టి పారిపోవు నీతితో యుద్ధము చేయుచుండెడు చిన్న చిన్న సంచార, సాయుధ దళములకు సంబంధించినట్టిది అను విశేష అర్థములో కూడ ఈ మాటను వాడుక చేయుచున్నారు. ఉదా : గెరిల్లా యుద్ధము. ప్ర. రా.

**గోఖలే, గోపాలకృష్ణ** (1866 - 1915) : భారతీయ రాజనీతి ధురంధరుడు; విద్యావేత్త; ఆర్థికశాస్త్ర విశారదుడు; శాసనసభావ్యవహారదక్షుడు; సర్వతోముఖ ప్రజ్ఞాశాలి. కొల్హాపురములో బీద చిత్పవన బ్రాహ్మణ కుటుంబమున జన్మించెను. బొంబాయి, పూనానగరములలో విద్యాభ్యాసము చేసి, 1844 లో పట్టభద్రుడయ్యెను. ఈయన బొంబాయి ఫర్గూసన్ కళాశాలలో ఉపన్యాసకుడుగను, ప్రధానాచార్యుడుగను పనిచేసెను. గోఖలే ఆ కాలముననే రెనెడే శిష్యుడై, ఆర్థిక శాస్త్రమును మూలముట్టుగ అభ్యసించి, ప్రజాసేవోద్యమమునకు శిక్షణయే కాక, ఆశీర్వాదమును కూడ పొందెను. 1895 లో భారత దేశ పరిపాలనా విధానమును, ఆర్థిక సమస్యలను విచారించిన వెల్బి కమిషన్ ముందు ఇతడు బొంబాయి రాష్ట్ర సమితి ప్రతినిధిగా సాక్ష్యమిచ్చెను. బొంబాయి రాష్ట్ర శాసన సభయందు, భారత శాసన సభయందు సభ్యుడుగా పనిచేసెను. 1905 లో కాశీలో జరిగిన జాతీయ కాంగ్రెస్ మహాసభకు అధ్యక్షత వహించి, ఆ సంవత్సరమందే 'సర్వెంట్స్ ఆవ్ ఇండియా సొసైటీ' ని స్థాపించెను. మితవాదియైనను భారతీయుల స్వపరిపాలన అభ్యర్థనను గట్టిగా సమర్థించి, ఇంగ్లండు దేశమునకేగి, భారత దేశములో రాజకీయ సంస్కరణలు ప్రవేశ పెట్టవలసిన ఆవశ్యకతను బ్రిటిష్ పరిపాలకులకు నొక్కి చెప్పెను; దక్షిణ ఆఫ్రికాను సందర్శించి, అచ్చటి భారతీయుల పక్షమున పోరాడుచున్న గాంధి మహాత్మునకు [చూ. పు. 421] చేయూత ఇచ్చెను.



గోపాలకృష్ణ గోఖలే
(1866 – 1915)

శాసనసభా సమావేశములలో నేమి, బహిరంగసభలలో నేమి భారతీయవాదమును బలపరచుచు గోఖలే కావించిన ప్రసంగములు ఆయన నిరర్గళ వాగ్ధాటికి, తార్కిక వైదుష్యమునకు, కూలంకష విషయ పరిజ్ఞానమునకు కనిష్ఠికాధిష్ఠితములు, ఉన్మేషకరములు అని ప్రశంసింపబడినవి. 1915 లో గోఖలే పరమపదించినప్పుడు ఆసేతు హిమాచలము కంట తడిపెట్టినది; తనకు రాజకీయ గురువని గాంధి మహాత్ముడును, త్యాగధనుడైన రాజకీయ ఋషి యని మహమ్మదాలీ జిన్నాయును ఆయనకు జోహారులు అర్పించిరి. దేశములో తత్పవిత్ర స్మృతిచిహ్నములు అనేకములు వెలసినవి. ఆ. వెం.

**గోల్డ్ కోస్ట్:** చూ. ఘానా.

**గోల్కొండ :** దక్షిణ భారతదేశమున చారిత్రక ప్రసిద్ధి ఆర్జించిన ఒక ప్రాచీన దుర్గము. ఒకప్పుడు మహా వైభవమును అనుభవించి కాలక్రమమున క్షీణదశను పొందిన గొప్ప పట్టణములలో ఇది ఒకటి. ఆంధ్రప్రదేశ్ రాజధాని అగు హైదరాబాదునకు పశ్చిమముగ 11 కి. మీ. దూరమున ఈ దుర్గము ఉన్నది. ఉన్నత పర్వతశ్రేణిపై మధ్యయుగమందు నిర్మింపబడిన ఈ బలిష్ఠమగు కోట నేటికిని చాలవరకు చెక్కుచెదరక నిలచి ఉన్నది. ఈ పట్టణమును రాజధానిగ ఇడుకొని కుత్బ్‌శాహీ రాజవంశము ఈ ప్రాంతమును 1518 మొదలుగ 1687 వరకు పాలించెను. ఈ పట్టణమును బట్టి కుత్బ్‌శాహీల రాజ్యమునకును గోల్కొండ రాజ్యమనియే వ్యవహారము కలిగినది. ఆ ప్రభువుల కాలమున ఈ పట్టణము వజ్రములకు ఎక్కువగా ప్రసిద్ధిపొందెను. వజ్రములను సానబెట్టు పరిశ్రమ ఆనాడు ఇట ఉచ్చస్థాయిని అందుకొనెను. వజ్రములకేకాక, సన్నని నూలు వస్త్రములకును గోల్కొండనగరము అపుడు ప్రఖ్యాతికి ఎక్కి, యూరప్‌నందలి పలుదేశముల వ్యాపారులను ఆకర్షించినది [చూ. సం. 3 పు. 427]. వి. నా.

**గోవింద్, గురు** (1666 - 1708) : సిక్కుల మత సంప్రదాయమున పదవ గురువు. తొమ్మిదవ గురువగు తేజ్‌బహదూర్‌నకు ఇతడు జన్మించెను. పాట్నానగరము ఇతని జన్మస్థానము. మొగలుపాదుషా అగు ఔరంగజేబ్ [చూ - పు. 364] అమలులోనికి తెచ్చిన కొన్ని మతఛాందసపు విధానములను ప్రతిఘటించుటలో కాశ్మీరబ్రాహ్మణులకు తోడుపడెనను నెపముపై తేజ్‌బహదూర్‌ను పాదుషా నిర్బంధించి, ఇస్లామ్ మతావలంబనమునో, దుర్మరణమునో కోరుకొనవలసినదిగా ఆదేశించెను. స్వ మత పరిత్యాగమునకు అంగీకరింపక, పాదుషాను ధిక్కరించి, తేజ్‌బహదూర్ దుర్మరణము పాలయ్యెను (1675). అంతట పది ఏండ్ల ప్రాయమైనను నిండని గోవింద్ గురుపీఠమునకు ఆధిపత్యము వహింపవలసి వచ్చినది. కాని, తేజ్‌బహదూర్ యొక్క వీరమరణము గురుగోవింద్‌నకును, అతని అనుయాయులకును ఉత్తేజనకారిగా ఉపకరించినది. సిక్కులను సువ్యవస్థీకరించి, ధర్మరక్షణకై యోధవర్గముగ రూపొందించిన ఖ్యాతి గురుగోవింద్‌నకు దక్కినది. ధర్మావలంబన విధిలో ఒక నూతన ప్రక్రియను - పహల్ అనబడుదానిని - అతడు రూపొందించెను. కృపాణముచే కలియబెట్టబడు జలమువలన అభిషేచనము పొందుటయే ఈ నూతన ధర్మావలంబన ప్రక్రియ. ఇటుల సిక్కుధర్మమును అవలంభించిన వారికే కాల్సా (స్వచ్ఛ) సంప్రదాయాను

యాయులని పేరు కలిగినది; వీరికి పేరుల చివర సింగ్ అనుదానిని చేర్చుటయు గురుగోవింద్ వలననే మొదలయ్యెను. ఈ దీక్షావలంబకులు 'క' పంచకమును— కేశ్ (శిరము నిండుగ కేశములు); కంఘా (దువ్వెన), కృపాణ్ (ఖడ్గము), కచ్చా (లంగోటీ లేదా పొట్టిలాగు), కర (ఇనుప మురుగు)లను—ధరించవలయునను నియమమును ఇతడు ఏర్పరచెను. శత్రువులకు వెన్ను చూపకుండుట ఒక ముఖ్య లక్షణముగ ఇడుకొని, అగతికులకును, అభాగ్యులకును సాయపడుటయే సిక్కు యోధుని ధర్మముగ ఇతడు విధించెను. అయిదవ గురువు కాలమున సంకలితమైన 'ఆదిగ్రంథ్' అను మతగ్రంథమునకు అనుబంధ రూపమున దశమగ్రంథ్‌ను ఈయన సంకలితము చేసెను. పరిసరములనున్న పర్వతసీమా నాయకులలో కొందరిని, మొగల్ సర్దారులను ఈతడు ధీరతతో ఎదుర్కొని పోరాడి, సిక్కులకు క్షాత్రధర్మ నిర్వహణలో దారి చూపెను. ఔరంగజీబ్ అనంతరమున సింహాసనముకొరకై జరిగిన పోరాటమున బహదూర్ షా పక్షమును ఇతడు అవలంబించెనని తెలియవచ్చుచున్నది. ఆ సందర్భముననే అతనితోపాటుగా గురుగోవింద్ దక్కనుకు పోవగ, గోదావరి తీరమున నాందేడ్‌నందు మతఛాందసుడగు ఆఫ్గన్ ఒకడు ఇతనిని హత్య చేసెను (1708).

గురుగోవింద్‌నకు సిక్కుల చరిత్రలో ప్రముఖస్థానము కలదు. రంజిత్‌సింగ్ వలన అప్రతిహతమగు సిక్కురాజ్యము నెలకొల్పబడిన కాలమున గురుగోవింద్ యొక్క కత్తి, డాలు, శిరస్త్రాణము మొదలగునవి మాననీయ వస్తువులుగ రాజాస్థానమున భద్రపరుపబడినవి. సిక్కురాజ్యమును బ్రిటిష్ ప్రభుత్వము వశపరచుకొనిన తరువాత అప్పటి గవర్నర్ జనరల్ అగు డల్‌హౌసీ ప్రభువు గురుగోవింద్ యొక్క ఆయుధాదులను కైవసము చేసికొని (1849), తరువాత బ్రిటిష్‌ప్రభుత్వపు అనుమతితో స్వీయములుగ చేసికొనెను. భారతదేశము స్వతంత్రతను ఆర్జించిన తరువాత డల్‌హౌసీ వంశీయులనుండి భారతప్రభుత్వము వీనిని తిరిగి గ్రహించి భారతదేశమునకు చేర్చినది (1965). చీ. శే. రా.

**గ్రీక్ - పారసీక యుద్ధము :** చూ. గ్రీస్.

**గ్రీన్‌లాండ్ :** డెన్మార్క్ దేశపు వలసగ తొలుత ఉండి, ప్రస్తుతము ఆంతరంగిక స్వపరిపాలనను అనుభవించుచు, దాదాపు ఉత్తరధ్రువ వృత్తమున నెలకొని ఉన్న ఒక ద్వీపము.

దీనికి ఆర్కటిక్ మహాసముద్రము [ఉ]; గ్రీన్‌లాండ్ సముద్రము [తూ]; ఐస్‌లాండ్ నుండి దీనిని వేరుపరుచుచు డెన్మార్క్ జలసంధియు, అట్లాంటిక్ మహాసముద్రము [ద]; డేవిస్ జలసంధి, బాఫిన్ అఖాతము [ప] సరిహద్దులందు కలవు. [వి] ౨. 21,75,600 చ. కి. మీ. కాని, ఇందు 3,41,748 చ. కి. మీ. తప్ప తక్కినది అంతయు ఎల్లప్పుడు దట్టమగు మంచుపొరచే కప్పబడి ఉండును. [జ] 33,140; ప్రజలలోని పలువురు డేనులును, ఆదిమ జాతులును కలిసిన మిశ్ర సంతతివారు; [రా] గోడ్‌తాబ్.

చరిత్ర: యూరప్ వాసులకు ఈ ద్వీపము తొలుత నుండియు పరిచితమైనటుల నిదర్శనములు ఉన్నను, ఎరిక్ అనువాడు దీనిని 982 లో కనుగొనువరకు దీనిపై యూరపియన్‌ల వలస మొదలిడకుండినది. అతడే ఈ ద్వీపమునకు గ్రీన్‌లాండ్ (శ్యామల భూమి) అను చక్కని పేరిడి, వలస చేరుటకు పలువురిలో ఆసక్తి కల్పించెను. 1231 లో ఈ వలసపై నార్వేదేశపు ప్రభుత్వము అధికారమును నెలకొల్పినది; కాని, 14, 15 శతాబ్దములందు ఆ ప్రభుత్వము అనుసరించిన నిరాదర వైఖరివలన ఆ ద్వీపమున వలస ప్రజానీకము 16 వ శతాబ్దికి దాదాపుగ అంతరించినది. ఆధునిక యుగమున 1721 లో నార్వీజియన్ మతప్రచారకుడగు హాన్స్ ఎగెడ్ ప్రోత్సాహ ఫలితముగ మరల వలస మొదలయ్యెను. 1815 లో డెన్మార్క్, నార్వేలు విడివడినప్పుడు డెన్మార్క్‌నకే ఈ ద్వీపము దక్కినది. ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున డెన్మార్క్ జర్మనుల వశమైనపుడు యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వము మన్రోసిద్ధాంతము [చూ.] ను ఆధారముగ గ్రహించి, డేనిష్ ప్రభుత్వ ప్రతినిధి అనుమతితో ఇచట స్థావరమును నెలకొల్పెను. యుద్ధానంతరమున డెన్మార్క్ ప్రభుత్వము ఈ ద్వీపమునకు ఆంతరంగిక స్వపరిపాలనా ప్రతిపత్తిని కల్పించినది (1955). ఎన్నుకొనబడిన రాష్ట్రీయ శాసన సభాసాయమున గవర్నర్‌జనరల్ ఇచట పరిపాలించును. డెన్మార్క్‌నందలి ప్రజాసభ (ఫోకేటింగ్) కు గ్రీన్‌లాండ్ ప్రజలు ఇరువురు ప్రతినిధులను ఎన్నుకొను ఏర్పాటు జరిగినది [చూ. డెన్మార్క్]. చీ. శే. రా.

**గ్రీస్ :** యూరప్ ఖండ దక్షిణ భాగమున ఉన్న ఒక స్వతంత్ర రాజ్యము.

ఈ దేశమునకు అల్‌బేనియా, యుగోస్లావియా, బల్గేరియా [ఉ]; ఈజియన్ సముద్రము, టర్కీ [తూ]; మధ్యధరా సముద్రము [ద]; అయోనియన్ సముద్రము [ప] సరిహద్దులందు ఉన్నవి. దేశమునందలి ముఖ్యభూమిని ఆనుకొని ఈజియన్, అయోనియన్ సముద్రములందు అటనట చెదరి ఉన్న పలు ద్వీపములు ఈ దేశమున పరిపాలన రీత్యా అంతర్భాగములు. ఈ ద్వీపములు అన్నింటి విస్తీర్ణము దేశవైశాల్యమున ఆరవవంతు ఉండును. [వి] 1,31,944 (ద్వీపములతో సహా) చ. కి. మీ.; [జ] 84,68,628; [భా] గ్రీక్. కాని, ఇంగ్లీష్, ఫ్రెంచి భాషలతో పలు

పురకు పరిచితి కలదు. [మ] జనులలో అత్యధిక సంఖ్యాకులు ఈస్టరన్ ఆర్తడాక్స్ చర్చి అను క్రైస్తవ మతశాఖకు చెందినవారు. [రా] ఏథెన్స్ (ఎతెనాయ్) (జ. సం. 13,00,000 అంచనా).




చరిత్ర: నేటి యూరపియన్‌ల నాగరకతకు గ్రీక్ నాగరకత మూలము. యూరప్ ఖండమునకు గ్రీక్‌లు అపూర్వ సేవ చేసిరి. వారు ఆర్యశాఖకు చెందినవారు. క్రీట్ నాగరకత [చూ. మినోవా నాగరకత సం. 10-పు. 612] క్షీణింపక పూర్వమే వారు మేసడోనియా మీదుగా గ్రీక్ దేశమున ప్రవేశించిరి. క్రీట్ నాగరకతను నాశనము చేసి, 'నాసస్' పట్టణమును రూపుమాపినది ఈ గ్రీక్‌లే అని చాలమంది చరిత్రజ్ఞుల అభిప్రాయము. వీరు గ్రీస్‌ను ఆక్రమించుకొనిన పిమ్మట కొన్ని అంతర్భేదములు ఉన్నను, ఒకరితో ఒకరు కలసి, గ్రీక్‌లు అనియు, హెలనీస్‌లు అనియు పేర్కొనబడుచు, అపూర్వమైన గ్రీక్ నాగరకతను సృష్టింపగలిగిరి.

గ్రీక్‌ల ప్రాచీన వృత్తాంతము 'ఒడెస్సీ', 'ఇలియడ్' అను గ్రంథములనుండి మనకు తెలియుచున్నది. గ్రీక్‌లు 'ట్రాయ్' నగరముపై దండెత్తి, దానిని ధ్వంసము చేసిన కథను 'ఇలియడ్' తెలుపుచున్నది. 'ట్రాయ్' దండ యాత్రలో పాల్గొని వీరాధివీరుడనియు, కుశాగ్రబుద్ధి అనియు ఖ్యాతిగాంచిన 'యులీసిస్' లేదా 'ఒడిసిస్' సంచారములను, అతని అద్భుత సాహసకృత్యములను, అతడు తన రాజ్యమయిన 'ఇతాకా' దేశమునకు మరల సురక్షితముగ చేరిన విషయములను 'ఒడెస్సీ' హృదయంగమముగ వర్ణించుచున్నది. ఈ రెండు కావ్యములను అంధుడయిన హోమర్ కవి రచించెనని కొందరును, పెక్కు కవులు రచించిరని మరికొందరును అభిప్రాయపడుచున్నారు. నేటికిని ఈ విషయము వివాదగ్రస్తమై ఉన్నది.

ఈ ఉత్కృష్ట గ్రంథములు మనకు అమూల్యమైన ఆ కాలపు రాజకీయ, సాంఘిక మత విషయములు తెలిసికొనుటకు ఎక్కువ సాయపడుచున్నవి. ఆనాటి గ్రీక్‌లు పూర్తిగా తమ గోపాలక వృత్తిని వీడి, కర్షకులయినట్లు కన్పించదు. పశువులే వారి సంపద. ముద్రిత నాణెములను వారు ఎరుగరు. వర్తక వ్యాపారములు వారికి అంతగ లేవు. తమకు కావలసిన వస్తువులకు వారు ఫోనీషియన్‌లపై ఆధారపడి ఉండిరి [చూ. సం; 10-పు. 535].

ఆ కాలమున గ్రీక్‌లు తెగలు తెగలుగ తమ నాయకుల పాలనమునందు ఉండిరి. రాజే సర్వాధికారి. అతడే సేనాధిపతియు, న్యాయమూర్తియు, మతప్రవర్తకుడును. కాని, అతడు నిరంకుశుడు కాడు. ముఖ్యవిషయములను నిర్ణయించుటలో అతడు తన జాతి పెద్దలకు ఎరిగింపకుండ చేసెడివాడు కాదు.

గ్రీక్‌లు చారిత్రక కాలము నాటికే గ్రీస్ దేశమును అంతయు ఆక్రమించుకొని బలమైన పట్టణ రాజ్యములను నిర్మించుకొనిరి. ఇందు స్పార్టా, కారింత్, ఏథెన్స్, థీబ్స్, సామాను, మైలీటస్ ముఖ్యమైనవి. పౌరస్వత్వముగల వారు కొలది మంది మాత్రమే ఉండిరి.

క్రీ. పూ. 8 శతాబ్దము నుండి గ్రీక్‌లు వలసరాజ్యముల స్థాపింప మొదలిడిరి. వారు సముద్రయాన దక్షులగుటచే ఆసియా మైనర్ తీరమునను, నల్ల సముద్రము తీరమునను, మధ్యధరా సముద్రము ఉత్తర తీరమునను, దక్షిణ ఇటలీ తీరమునను, సిసిలీలోను వలసరాజ్యములను పెక్కింటిని స్థాపించిరి. దక్షిణ ఇటలీ తీరమందలి వలసరాజ్యములకు 'మాగ్నాగ్రీసియా' లేక 'గొప్ప గ్రీస్' అని పేరు పెట్టిరి.

ఇట్లు వలసరాష్ట్రములు నిర్మించుటచే గ్రీక్‌ల వర్తక వ్యాపారము వృద్ధిగాంచుటయే కాక, వారి నాగరకతయు వ్యాపింపజొచ్చెను. వారు ఎచట ఉండినను తమ మాతృదేశమును, తమ నాగరకతను, సంస్కృతిని మరువకుండిరి.

గ్రీక్‌లు ఈజిప్టు, అసీరియా, చీనా, భారతదేశము లందువలె గొప్పసామ్రాజ్యములు నిర్మింపక, చిన్నచిన్న నగర రాజ్యములు స్థాపించిరి. వారి దేశనైసర్గిక స్థితియే దీనికి ముఖ్యకారణము [చూ. నగర రాజ్యములు].

ఇట్లు గ్రీక్‌లు వేర్వేరు రాజ్యములు నిర్మించుకొనినను వారికి ఏకీభావమును కల్గించు విషయములు ఎన్నియో ఉండెను. ఏక భాష, ఏక వాఙ్మయము, ఏక నాగరకత, ఏక సంప్రదాయము, ఏక దైవము, గ్రీక్‌లు మాత్రమే పాల్గొను 'ఒలింపిక్' పందెములు, పోటీ ఆటలు, తామంతా ఒక్కటే అనుభావము వారికి స్ఫురింప చేయుచుండెడివి.

ఈ కారణములచే వారందరును గ్రీక్‌లు అనియు, హెల నిస్‌లు అనియు పేర్కొనబడుచుండిరి.

స్పార్టా నగర రాజ్యయుగము : గ్రీక్ నగర రాజ్యము లలో స్పార్టా, ఏథెన్స్‌లు ప్రాముఖ్యము వహించినవి. గ్రీస్ దేశమును ఆక్రమించిన తెగలలో డోరియన్‌లు ఒకరు. వీరు 'లసెడిమోన్' లోయను ఆక్రమించుకొని, స్పార్టా నగరమును తమ రాజధానిగ చేసికొనిరి. వీరు లసెడి మోన్‌యాను ఆక్రమించుకొనినపుడు అచ్చటి వారిని కొందరిని చంపి, కొందరిని బానిసలుగ చేసికొనిరి. ఈ బానిసలు 'హిలట్స్' అని పేర్కొనబడిరి. క్రీ. పూ. 7 వ శతాబ్దిని ఈ హిలట్స్ స్పార్టన్‌లపై తిరుగుబాటుచేయ, వారిని అణచుట స్పార్టన్‌లకు కష్టమయ్యెను. మిక్కిలి కష్టముపై వారిని అణచిరి. ఈ తిరుగుబాటు స్పార్టన్‌ల దృక్పథమున ఒక గొప్ప మార్పుతెచ్చెను. తమ దేశమును శత్రువుల బారినుండి రక్షించుకొనుటకై ప్రతి స్పార్టన్ యువకుడును యుద్ధశిక్షణ పొందవలయును. దేశ రక్షణకై ఎట్టి త్యాగమునైనను చేయవలయును. దేశసేవ చేయజాలని వాని జన్మము వ్యర్థము. ఇట్టి అభిప్రాయముతో స్పార్టన్‌లు యుద్ధశిక్షణను పొంద మొదలిడిరి. బాలురను ఏడవ ఏటనే తలిదండ్రులనుండి విడదీసి, భావియోధులకు కావలసిన శిక్షణము ఇచ్చుచు, ఒక చోటనే పెరుగునట్లు ఏర్పాటులను చేసిరి. ప్రతి పౌరుడును సైన్యములో చేర వలయును. అరువదిఏండ్లు వయస్సు పూర్తిఅగువరకును తమ జీవితము అంతటిని దేశసేవయందే వినియోగింపవల యును. ఇట్టి శిక్షణము వలన స్పార్టన్‌లకు విజ్ఞానాభివృద్ధి ఎక్కువగ కలుగకపోయినను వారు గొప్ప యోధులైరి. గ్రీస్ దేశమున యుద్ధకౌశలమున వారికి సాటివచ్చువారు లేరైరి. వారు 'మైసీనియా' ను జయించి, 'పెలోప నీషియా (ఆర్గాన్)' అను సంయుక్తరాష్ట్రముల సంఘ మును స్పార్టా ఆధిపత్యమున నిర్మించిరి. ఇట్లు క్రీ. పూ. 6 వ శతాబ్దాంతము నాటికి స్పార్టా గ్రీస్ రాజ్యములు అన్నిటి కంటె బలిష్ఠమై ఉండెను.

పైనపేర్కొనబడిన స్పార్టాకన్నను చరిత్రయందు అధిక ప్రాముఖ్యమును వహించినది ఏథెన్స్ నగర రాజ్యము. రాజ్యాంగవిధానమున, సారస్వత నిర్మాణమున, కళాకౌశ లమున ఇతర రాజ్యములు అన్నిటికంటెను మిన్నయై గ్రీక్ నాగరకతను, సంస్కృతిని అభివృద్ధిచేసి ఖ్యాతిగాంచినది ఏథెన్స్. ప్రజాస్వామ్యము అను రాజ్యాంగ విధానమును యూరప్ ఖండమునకు ప్రసాదించినది ఏథెన్స్.

ఏథెన్స్‌నగరరాజ్యము ఎట్లు ఈ ప్రజాస్వామ్య విధాన మును అభివృద్ధి చేసెనో ముఖ్యముగ గమనింపదగిన విషయము. ఇతర గ్రీక్ రాజ్యములందువలె ఏథెన్స్ నందును ప్రథమమున రాజుల పాలనము ఉండెను. రాజుల అధికారము క్రమక్రమముగ తగ్గగా శ్రీమంతులు ఆ అధి కారమును ఆక్రమించిరి. ఇట్టి పరిపాలన విధానమునే 'నాయక సత్తాకము' అందురు. కొంతకాలమునకు వీరు ప్రజల యోగక్షేమములు మరచి, స్వలాభాపేక్షా పరులైరి. ఇట్టి విపత్తునుండి ఏథెన్స్‌ను రక్షించుటకై డ్రాకో, సోలన్, క్లైస్తనీస్ మొదలగు మహనీయులు కంకణము కట్టుకొనిరి. డ్రాకో చట్టముల నెల్ల క్రోడీక రించెను.

సోలన్ శ్రీమంతుడైన దయాళుడై ప్రజలమేలుకై ఎన్నియో చట్టములు ఏర్పరచెను. క్రీ. పూ. 594 లో ఈతనిని ఆర్కన్‌గ ఎన్నుకొనిరి. ఇతడు ప్రజలను ఆర్థిక దుస్థితినుండి కాపాడెను. పరిమితమైన భూమికంటె ఎక్కువ భూమి ఎవరికిని ఉండకూడదని శాసించెను. తినుబండార ముల వెలలు అధికము కాకుండుటకై ధాన్యములు విదేశ ములకు ఎగుమతి కాకుండునట్లు కట్టడి చేసెను. ఏథెన్స్‌లో పరిశ్రమలను అభివృద్ధి చేయుటకై పనివాండ్రను ఇతర దేశములనుండి రప్పించి, వారికి ఏథెన్స్‌లో పౌరస్వత్వము లను ఇప్పించెను. రాజ్యాంగ విధానమున ప్రతి పౌరుడును పాల్గొనుటకు వీలు గావించెను. ప్రతి పౌరుని పౌరసభలో చేర్చుకొని గొప్ప ఉద్యోగులను ఎన్నుకొనుటకును, దేశ సేవ చేయుటకును సాధనము కల్పించెను.

సోలన్ చట్టములు చాల మంచివైనను, ప్రజలలో అసంతృప్తి తగ్గలేదు. అతని అనంతరము క్రీ. పూ. 560 లో పిసిస్ట్రేటస్ రాజ్యాధికారమంతయు బలవంతముగ తన వశము చేసికొనెను.

పిసిస్ట్రేటస్ బలవంతముగ అధికారమును స్వీకరించి నను దానిని దుర్వినియోగము చేయక, ప్రజల మేలునకును, తన దేశాభివృద్ధికిని వినియోగించెను. కవులను, గాయకు లను, శిల్పులను గారవించి, ఏథెన్స్ పేరుప్రతిష్ఠలు గ్రీస్ దేశమంతయు వ్యాపింపజేసెను.

పిసిస్ట్రేటస్ అనంతరము హిపియస్ పాలకుడు అయ్యెను. కాని, ప్రజలకు అతని పాలన నచ్చలేదు. వారు క్రీ. పూ. 510 లో అతనిని దేశమునుండి తరిమివైచిరి. అట్టి పరిస్థితులలో కులీన వంశజుడగు 'క్లైస్తనీస్' అధి కారమునకు వచ్చెను. ఏథెన్స్‌నందు ప్రజాపాలన విధాన మును ఈతడు స్థాపింప యత్నించెను. 'అట్టికా' మండలమున తెగల గుంపులకు బదులుగ దేశమునంతయు పది భాగ ములుగ విభజించెను. ఈ పది భాగములందు ఉండిన పది తెగలును సంవత్సరమునకు ఒకసారి పదిమంది సేనానాయకు

లను ఎన్నుకొనవలెను. వారు సర్వాధికారులై దేశమును పాలింపవలెను. అదికాక, ప్రతి పౌరుడును స్థానిక విషయములలో పాల్గొనుటకు సామాన్య సభ ఒకటి క్లైస్తనీస్ నెలకొల్పెను. దేశమందలి సర్వ విషయములను చర్చించుటకును ఈ సభకు హక్కు ఉండెను.

గ్రీక్ నగరరాజ్యము ఇటుల వర్ధిల్లుచుండ, ఇంతలో ప్రాచ్యదేశములందు ఒక నూతన సామ్రాజ్యము పారసీక చక్రవర్తి కురుష్ నాయకత్వమున రూపొందెను. తూర్పున సింధునదీతటము మొదలుకొని పశ్చిమమున ఈజిప్టు వరకు గల విశాలభూమియందలి పలు దేశములను లోగొనిన పారసీక చక్రవర్తులు గ్రీక్ నగర రాజ్యములు సైతము తమ ప్రభుత్వమును అంగీకరించునటుల చేయుటకై కృషి సల్పిరి. దీని ఫలితముగ జరిగినవే గ్రీక్ - పారసీక యుద్ధములు.

**గ్రీక్ - పారసీక యుద్ధములు :** పారసీక చక్రవర్తులు 'లిడియా'ను జయించి, దానికి లోబడియుండిన గ్రీక్‌ల వలస పట్టణములను ఆక్రమించుకొనిరి (క్రీ. పూ. 546-545). అది అయోనియన్ గ్రీక్‌లకు నచ్చలేదు. కావున, పారసీక చక్రవర్తియగు దుర్యాష (డరయస్.1) సిథియన్‌లపై దాడి వెడలినప్పుడు, తగిన సమయమునకు వేచియుండిన వీరు పరిష్యాపై తిరగబడి, మాతృదేశపు రాష్ట్రములను తమకు సాయము చేయుడని ప్రార్థించిరి. స్పార్టా ఇతరుల కలహములలో చొచ్చుటకు ఇష్టపడక తటస్థముగ ఉండెను. కాని, ఏథెన్స అయోనియన్ గ్రీక్‌లకు సాయము చేసెను. అందుచే గ్రీక్, పారసీక రాజ్యములకు విరోధము ఏర్పడి యుద్ధము ఆరంభమయ్యెను.

పారసీక చక్రవర్తి అయోనియన్ దీవులలోని గ్రీక్‌ల తిరుగుబాటును సులభముగ అణచివైచెను. ఈ తిరుగుబాటు విఫలమయినను, దీని మూలమున గ్రీక్‌లు రెండు అమూల్య విషయములను గ్రహించిరి. 1. పారసీకులను ఓడింపవలెనన్న గ్రీక్‌లందరు ఏకము కావలయును; 2. సముద్రాధిపత్యము తమ చేతులలో పెట్టుకొని, ఏక నాయకత్వమున పారసీకరాజ్యముపై యుద్ధము సాగింపవలయును; అట్లుకాకున్న విజయము లభించుటకల్ల.

తమ శత్రువులగు అయోనియన్ గ్రీక్‌లకు సాయము చేసినందులకై ఏథెన్స్‌ను శిక్షించుటకు దుర్యాష నలుబది వేల సైన్యముతో క్రీ. పూ. 490 లో గ్రీస్‌పైబడి, ఏథెన్స్ నగరమును ముట్టడించుటకై కొన్ని అశ్వికదళములను పంపెను. అట్టి విషమ పరిస్థితులలో స్వాతంత్ర్యేచ్ఛగల ఎథీనియన్‌లు తమ వైషమ్యములు మరచి, ఈ కష్ట సమయమున తమకు సాయపడవలయునని ప్రార్థించుచు, స్పార్టాకు వార్తాహరుని అంపిరి. ఏథెన్స్, స్పార్టాలకు ఆ కాలమున ప్రబల శత్రుత్వము ఏర్పడి ఉండెను. కాని, ఏథెన్స్‌కు సంబంధించిన విపత్తును వినినంతనే వారు ఔదార్యముతో సాయము చేయ అంగీకరించిరి. కాని, స్పార్టన్ సైన్యములు సాయముగవచ్చు లోపలనే ఎథీనియన్‌లు మిల్టైడీజ్ నాయకత్వమున మేరథన్ అను జనావాస ప్రాంతమున జరిగిన యుద్ధమున పారసీక సైన్యములను ఓడించిరి. ఈ విజయము ఎథీనియన్‌లలో నూతన ధైర్యోత్సాహములు పుట్టించెను. ఈ యుద్ధమునందు ఓడుటచే పారసీక నౌకాదళములు ఆసియాకు మరలెను. ఇట్లు మొదటి గ్రీక్ - పారసీక యుద్ధములో విజయలక్ష్మి ఎథీనియన్‌లనే వరించెను.

మేరథన్ యుద్ధారంభమున ఎథీనియన్‌ల నాయకుడైన థెమిస్టక్లీస్ ఏథెన్స నౌకాబలమును వృద్ధిచేసి తమకు చిరకాల శత్రువై ఉన్న ఈజియాను ఓడించి సముద్రాధిపత్యము వహించెను.

మేరథన్ ఓటమి వినిన తరువాత దుర్యాష మరణించెను. అతని పుత్రుడైన క్షరక్ష (జెర్ జెస్) గ్రీక్‌లను ఎట్లయిన ఓడింపవలెనని నాలుగు సంవత్సరములు దీక్షబూని, ప్రచండ సైన్యములను ఆయత్తము చేసెను. గ్రీక్‌లును తమ స్వాతంత్ర్య రక్షణకై ఏకమై నిలచి ఉండిరి.

పారసీక సైన్యములు క్రీ. పూ. 480 లో డార్డెనల్స్ జలసంధిని దాటి తీరమువెంట నడచుచుండ, యుద్ధ సామగ్రితో వారి నౌకాదళము కూడ బయలుదేరెను. అట్టి అపార సైన్యములను ఎదుర్కొని యుద్ధము చేయుట అసాధ్యమని గ్రీక్‌లకు తోచెను. కాని, పారసీకులను సముద్రముపై ఓడించినచో వారి సైన్యములు ముందునకు పోలేవని గ్రహించి థెమిస్టక్లీస్ అట్లు చేయ సమకట్టెను. మూడు వందల స్పార్టన్ సైనికులతో స్పార్టన్ రాజగు లియోనిడస్ థెర్మాపోలీ అను ఇరుకు మార్గము వద్ద పారసీక సేనావాహినిని ఎదుర్కొని, ప్రచండ యుద్ధము చేసి, వీరస్వర్గము అలంకరించెను. స్పార్టా సైనికుడు ఒక్కడును మిగిలి ఉండలేదు. కాని, వారు పారసీక సైన్యములకు అపార నష్టము కలిగించిరి. ఆ సమయమున నే ఆర్టెమిజియమ్ దగ్గర గ్రీక్‌లకు, పారసీకులకు నౌకాయుద్ధము జరిగెను. ఈ నౌకాయుద్ధమున గ్రీక్‌లు అనుకొనినట్లు పారసీకులను ఓడింపలేకపోయిరి.

ఈ ఓటమి గ్రీక్‌లలో అధైర్యమును, నిరుత్సాహమును రేకెత్తించెను. థెర్మాపోలీవద్ద పారసీక సైన్యము అపారముగ నష్టపడినను ఒక గ్రీక్ దేశద్రోహి సాహా

య్యముచే మరియొక మార్గము గుండా పారసీకులు తీబ్స్, ఏథెన్స్ నగరములపై బడిరి. తీబ్స్ పారసీకులకు లొంగిపోయెను. ఏథెన్స్ ప్రజలు పట్టణమును విడిచి పోయిరి. పారసీకులు ఏథెన్స్‌నగరమును పరశురామప్రీతి కావించిరి. అట్టి విషమసమయముననే సాలమిస్, అట్టికాల మధ్య ఉండిన ఎథీనియన్‌ల నౌకాదళము పారసీకుల నౌకలపైబడి, నౌకా యుద్ధమున అఖండ విజయము కాంచెను.

అంతట మార్డొనస్ ఆధిపత్యమున కొంత సైన్యమును విడిచి, క్షరక్ష చక్రవర్తి స్వదేశమునకు మరలెను. మార్డొనస్ గ్రీక్‌లలో ఎటులయిన భేదములు కల్పించి, వారిని జయింప సంకల్పించెను. ఎథీనియన్‌లను మిగిలిన గ్రీక్‌ల నుండి వేరుచేయ ప్రయత్నించెను. కాని, తుదకు సంధి పొసగదని తెలిసినంతనే మార్డొనస్ సైన్యములతో దక్షిణముగ బయలుదేరి ఏథెన్స్‌పై బడెను. స్పార్టన్‌ల సాయమునకై వేచి ఉండిన ఎథీనియన్‌లు వారి సాయము రాకుండుటచే విసిగి, రెండవమారు తమ నగరమును శత్రువులపాలు ఒనర్చి సాలమిస్ ద్వీపమును చేరుకొనిరి. మార్డొనస్ ఏథెన్స్‌ను మరల నాశనము చేసెను. అట్టి విషమ పరిస్థితులలో ఏథెన్స్ నాశనమైన తాము కూడా నాశనము అగుదుమని గ్రహించి, స్పార్టన్‌లు తమ రాజగు పాసేనియస్ నాయకత్వమున కొంత సైన్యమును ఎథీనియన్‌ల సాహాయ్యమునకై పంపిరి. గ్రీక్ మిత్రమండలి సైన్యములును, పారసీక సైన్యమును ప్లటియా రణరంగమున ఎదురైరి. మార్డొనస్ ధైర్య సాహసములతో పోరాడెను. కాని, గ్రీక్‌లే జయించిరి. ఆ అఖండ విజయముచే గ్రీక్‌లు తమ స్వాతంత్ర్యమును కాపాడుకొనగలిగిరి.

పారసీక చక్రవర్తికి లోనై ఉండిన అయోనియన్, గ్రీక్ పట్టణములు అన్నియు తాము స్వాతంత్ర్యము బడయుటకు ఇదియే తగిన సమయమని ఎంచి, తమకు సాయపడవలెనని ఏథెన్స్‌ను ప్రార్థించిరి. ఎథీనియన్‌లు వారి ప్రార్థనను అంగీకరించి సాయము చేసిరి. మైకేల్ నౌకాయుద్ధమున పారసీకులు మరల గ్రీక్‌లచే ఓడింపబడిరి. ఆ యుద్ధ ఫలితముగ అయోనియన్, గ్రీక్ పట్టణములు అన్నియు పారసీక పాలనమునుండి తప్పించుకొని స్వతంత్రములు అయ్యెను.

**ఏథెన్స్‌కు అగ్రస్థానము :** గ్రీక్ - పారసీకుల యుద్ధకాలమందు స్పార్టా అగ్రస్థానము వహించి ఉండెను. ఆ యుద్ధము తరువాత ఏథెన్స్ ప్రాముఖ్యమునకు వచ్చెను. ఏథెన్స్ నాయకత్వమున ఒక సంయుక్త రాష్ట్రసంఘము ఏర్పడెను. గ్రీక్‌ల స్వాతంత్ర్య సంరక్షణమే దీని ప్రధాన లక్ష్యము. ఈ కర్తవ్యమును నిర్వహించుటకు ఈ సంయుక్త రాష్ట్ర సంఘమునకు బలిష్ఠమగు నౌకాదళము అవసరమై ఉండెను. దానికి అంతకును ధనము అత్యావశ్యకము. అందుకు ప్రతి రాష్ట్రమువారును ఏథెన్స్‌నకు కొన్ని ఓడలను ఇచ్చుటకో లేదా తమ వంతునకు వచ్చు ధనమును ఇచ్చుటకో ఒప్పుకొనిరి. సంవత్సరమునకు ఒకమారు ఈ సంఘ సభ్యులు 'డెలాస్' అను పవిత్రక్షేత్రమున అపోలో దేవాలయమున సంఘ కార్యక్రమమును నిర్ణయించుటకు కలసికొనుచుండిరి. అందువలననే ఈ సంయుక్త రాష్ట్ర సంఘమునకు 'డెలాస్ సంఘము' అను వ్యవహారము కలిగెను.

**ఎథీనియన్ సామ్రాజ్యము :** క్రీ. పూ. 448 లో ఏథెన్స్‌నకును, పారసీక చక్రవర్తికిని సంధి ఏర్పడెను. ఈ సంధివలన ఈజియన్ సముద్రమునను, ఆసియామైనర్ తీరమునను పారసీకచక్రవర్తుల అధికారము అంతరించెను. ఇందు గ్రీక్‌ల అధికారమును చక్రవర్తి ఒప్పుకొనెను. గ్రీక్‌లు పారసీక సామ్రాజ్యమందలి రాష్ట్రములపై దండెత్తకుండుటకు ఒప్పుకొనిరి. ఈ సంధి జరిగిన పిమ్మట, డెలాస్ సంయుక్త రాష్ట్ర సంఘము ఉండవలసిన అవసరము లేకపోయెను. కాని, ఏథెన్స్ పాలకులు డెలాస్ సంయుక్త రాష్ట్ర సంఘమును తమ సామ్రాజ్య పాలక సంఘముగ మార్చిరి. ఈ పరిపాలన ఇతర రాష్ట్రములకు నచ్చలేదు. ఈ రగులుచున్న వైషమ్యముల మూలమున ఏథెన్స్‌కును, పెలోపనీస్‌లోని రాష్ట్రములకును యుద్ధము ఏర్పడెను. ఈ రాష్ట్రములలో స్పార్టా ముఖ్యమైనది.

**పెలోపనీసియన్ యుద్ధము :** క్రీ. పూ. 431 వ సంవత్సరమున పెలోపనీసియా యుద్ధము ప్రారంభమయ్యెను. మేధావియగు పెరిక్లీస్ [చూ.] ఈ యుద్ధము రాకతప్పదని ముందే గ్రహించి ఉండెను. కాన, ఏథెన్స్‌ను యుద్ధమునకు సంసిద్ధముచేసి ఉంచెను. కాని, క్రీ. పూ. 429 లో పెరిక్లీస్ మరణించెను. ఎథీనియన్ నాయకులలో అంతటి సమర్థుడు ఇంకొకడు లేకుండెను. అందువలన ఆ తరువాత స్పార్టాతో జరిగిన యుద్ధమున ఏథెన్స్ ఓడిపోయి, స్పార్టాతో సంధి కుదుర్చుకొనెను. ఈ సంధి మూలమున స్పార్టా - ఏథెన్స్‌ల వైషమ్యములు తొలగలేదు. కాని, తాత్కాలికముగ యుద్ధము ఆగిపోయెను.

**సిసిలీపై దండయాత్ర - ఏథెన్స్ ఓటమి :** పెలోపనీస్ యుద్ధమున విజయము లభింపమిచే తమ గౌరవ ప్రతిష్ఠలను నిలుపుకొనుటకై ఎథీనియన్‌లు సిసిలీ మొదలగు దూర దేశములను జయింప సమకట్టిరి. కాని, సిసిలీయన్‌లు భూమి మీదను, సముద్రము మీదను ఎథీనియన్‌లను

పూర్తిగ ఓడించిరి (క్రీ. పూ. 415). ఎథీనియన్‌లు ఇట్టి పరాభవము ఎన్నడు ఎరుగరు. ఆ ఓటమిచే వారి పేరు ప్రతిష్ఠలు అన్నియు ఒక్కపెట్టున నాశనమయ్యెను. సిసిలీ యందు ఎథీనియన్‌లకు అపార నష్టము కలిగెను. వారి నౌకాబలమంతయు నిర్మూలితమయ్యెను. అదియే మంచి తరుణమని అంతవరకు సామ్రాజ్యములో చేరియుండి, చేయునది ఏమియు లేక అణగియున్న రాష్ట్రములు ఒక్కపెట్టున తిరుగుబాటు చేసినవి. ఏథెన్స సంపదను ఓర్వలేకున్న స్పార్టా మొదలగు రాష్ట్రములు కూడ ఏథెన్సపై దుమికినవి. అదిగాక ఏథెన్సనందే అంతఃకలహములు ప్రబలెను. ఏథెన్సపై తనకు గల పూర్వపు పగను తీర్చుకొనుటకు ఇదియే మంచి తరుణమని ఎంచి ఎంత ధనము కావలసివచ్చినను ఇచ్చుటకు సంసిద్ధుడనని పారసీక రాజు స్పార్టా నాయకుడగు లైసాండర్‌కు వర్తమానము అంపెను. స్పార్టన్‌లు పారసీకులనుండి ధనమును తీసికొని ఏథెన్సపై యుద్ధము చేయుటకు ఒప్పుకొనిరి. క్రీ పూ. 405 తో 'ఈగస్ పోటమై' వద్ద జరిగిన యుద్ధములో ఏథెన్స సంపూర్ణముగ ఓడిపోయెను. లైసాండర్ ఏథెన్స నగరమును పట్టుకొనెను. గ్రీక్‌ల దేశమునకు అంతటికిని నాయకమణి యని పేరుగాంచిన ఏథెన్సనకు ఎట్టి అపకారము చేయుటకు ఆతని మనస్సు ఒప్పుకొనలేదు. కాని, ఏథెన్స కోటలను నేలమట్టము చేసివైచెను.

ఆ ఓటమిచే ఎథీనియన్ సామ్రాజ్యము విచ్ఛిన్నమైనది. కొద్ది సంవత్సరములు మాత్రమే మనినను ఏథెన్స స్వర్ణయుగమగు పెరిక్లీస్ యుగమునకు కారణమయ్యెను. ఆ సామ్రాజ్యమే లేకుండినచో ఏథెన్స కళలను, సారస్వతమును పోషించి, తన ఖ్యాతిని చిరస్థాయిగ చేసికొనుటకు అవకాశముకూడ ఉండెడిది కాదు. ఏథెన్స చరిత్రమునందు పెరిక్లీస్ కాలమునకు స్వర్ణయుగము అను పేరు అన్నివిధముల సార్థకమైనది. కళావాఙ్మయములు ఆ కాలమున పరిపూర్ణత గాంచెను. ఏథెన్స రాష్ట్రము సకల సంపదలతో తులతూగెను.

రాజ్యాంగము : పెరిక్లీస్ కాలమున ఏథెన్స నందు పెంపొందని సంస్థ లేదు. ప్రజా ప్రభుత్వము వర్ధిల్లి, పరిణతి గాంచెను. ప్రజా ప్రభుత్వము అనిన ప్రజలకై ప్రజలు సాగించెడు పాలనము అనెడి సూత్రము సర్వవిధముల సార్థకమయ్యెను. ఆ ప్రజాస్వామ్య ప్రభుత్వము ఉత్తమ పద్ధతులపై సాగింపబడెను. ప్రజాసభ రాజకార్యములను అన్నిటిని నిర్వహించుచుండెను. సర్వ రాజ్యాంగ వ్యవహారములను అదియే చక్కబెట్టునది. రాజ్యవిషయములలో పాల్గొనని పౌరుడు ఎందుకును పనికిరాడని ఎథీనియన్‌ల అభిప్రాయము. ప్రజాసభ సకల విషయములను చర్చించి, నిర్ణయించుచుండెను. ప్రతి పౌరుడును అందు పాల్గొనవచ్చును. అదిగాక ఏ పౌరుడైనను '500 ల సభ' కు సభ్యుడుగ నిలువవచ్చును. ఆ సభలోనుండి నెలకు ఒకసారి ఎన్నుకొనబడిన చిన్న సంఘము సభా కార్యక్రమమును జరుపుచుండును. రోజుకు ఒక సభ్యుడు అగ్రాసనాధిపతి అగుచుండును. అట్లు తన జీవితకాలమునందు ఎప్పుడో ఒకప్పుడు అగ్రాసనాధిపత్యము వహించు భాగ్యము ప్రతి ఎథీనియన్‌నకు కలుగుటకు వీలుండెను.

ప్రతి పౌరుడును రాజ్యాంగ విషయములలో పాల్గొనుటకై వీలు కలుగచేయుటకు న్యాయవిచారణ సభ్యులైన వారికి, మరి ఇతర కార్యములు సాగించెడి వారికి పెరిక్లీస్ వేతనములు ఒసగుచుండెను. అట్లు పెరిక్లీస్ ప్రతిపౌరుడును రాజ్యాంగ వ్యవహారములందు పాల్గొనుటకు అవకాశము కలిగించెను.

కళలు - శిల్పము : ఆ కాలమున పెంపొందని కళ లేదు. సిద్ధహస్తులగు చిత్రకారుల, శిల్పుల చిత్తరువులు, శిల్పములు లోక విఖ్యాతి పడసినవి. వానిని చూచి కళాభిజ్ఞులు నేటికిని విస్మయమందుచున్నారు. గ్రీస్, దానిలోని ఏథెన్స కళా ప్రపంచమునకు తీర్థవాటికలైనవి. ఏథెన్స సామ్రాజ్యము, దాని వైభవము అంతరించినను పెరిక్లీస్ కాలమునాటి శిల్పుల నైపుణ్యము, వారి అపూర్వ నిర్మాణ కౌశలము, అద్భుతములగు కట్టడములు, విగ్రహములు మాత్రము చిరస్థాయిగా నిల్చి, నాటి కళావైభవమును నేటికిని స్మరణకు తెచ్చుచున్నవి.

పారసీక దండయాత్రలవలన ఏథెన్స పట్టణము రెండు మారులు ధ్వంసమయ్యెను. ఆ ధ్వంసమే ఎథీనియన్‌లకు తమ నిర్మాణ కౌశల ప్రదర్శనమునకు తగిన అదను కల్పించెను. ఎథీనియన్‌లు ఎప్పటికప్పుడు నూతనముగ పట్టణమును నిర్మింపవలసివచ్చెను. వారు తమ శక్తి సామర్థ్యములను, ధనమును వెచ్చించి, కనుల పండువుగ నూతన నగరమును నిర్మించిరి. వారి శిల్పములు నిరుపమానములు. వారు నిర్మించిన ఎథీనా విగ్రహమునకు సాటివచ్చు విగ్రహములు లేవని చాల మంది అభిప్రాయము.

సారస్వతము : పెరిక్లీస్ యుగమున సారస్వతము మహోత్కృష్టదశ అనుభవించినది. రసవత్తరమగు కావ్యములు, నాటకములు, చారిత్రక గ్రంథములు ఆ కాలమున బయలుదేరినవి. సోఫాక్లీస్, యూరిపిడిస్ [చూ. పు. 54], అరిస్టో ఫానిస్ మొదలగు నాటకకర్తలు తమ కవితానైపుణ్యముచే రసవాహినుల వెల్లివిరియజేసి, తమ కాలమునకు, తమ దేశమునకు వన్నెతెచ్చిరి.

**మేసిడోనియా పాలన యుగము :** ఏథెన్స్ సామ్రాజ్యము శిథిలమైన తదుపరి గ్రీక్ రాష్ట్రముల మధ్య ఏకతను సమకూర్చగల శక్తి ఏ నగరరాజ్యమునకు లేకపోయినది. ఏథెన్స్ సామ్రాజ్యమును నిర్మూలించుటలో ఐక్యమును ప్రదర్శించిన థీబ్స్, కారింత్, స్పార్టా దేశములు నిర్మూలన జరిగినంతటినుండియు వేర్వేరు మార్గముల బట్టినవి. ఇట్టి పరిస్థితులలో మేసిడోనియా అను ఒక చిన్న గ్రీక్ రాష్ట్రపు ప్రభువగు ఫిలిప్ (క్రీ. పూ. 382 - 336 ప.) విపుల సైన్యమును సమీకరించి, ఒకదాని వెనుక ఒకటిగ స్పార్టా తప్ప తక్కిన గ్రీక్ రాష్ట్రములనెల్ల జయించి, ఆ రాష్ట్రముల సమాఖ్య తన ఆధిపత్యమును అంగీకరించునటుల చేసెను (క్రీ. పూ. 337). ఇతడు మరణించిన తరువాత ఈతని కుమారుడు అలెగ్జాండర్ (క్రీ. పూ. 356 - 323) తన ప్రచండ సేనావాహినితో క్రీ. పూ. 333 లో బయలుదేరి పది ఏండ్లలో ఈజిప్టు మొదలుకొని సింధునది వరకు గల దేశములనెల్ల జయించి, గ్రీక్ సంస్కృతిని పలుదిశల వ్యాపింపజేసెను [చూ. అలెగ్జాండర్ పు. 303]. అలెగ్జాండర్ మరణానంతరమున ఆ సామ్రాజ్యమును అంతటిని, అతని సేనానులు పంచుకొని వేర్వేరు దేశములందు గ్రీక్ రాజవంశముల నెలకొల్పిరి. ఈజిప్టునందలి అలెగ్జాండ్రియా మొదలుకొని గాంధారమునందలి తక్షశిల వరకు గ్రీక్ లిపి, భాషా, విజ్ఞాన, సంస్కృతులకు ఆనాడు ఈ రాజవంశముల ఆదరణమున పోషణము లభించెను. కాని, మాతృదేశమగు గ్రీస్‌నందు మాత్రము సుస్థిర పరిపాలన మృగ్యమయ్యెను. క్రమముగ దేశము రెండు సమాఖ్యలుగ విడివడి, క్రీ. పూ. 280 లో కుదుట పడగలిగెను. కాని, ఈ సమాఖ్యలయందలి నగరరాజ్యములు చాలవరకు స్వాతంత్ర్యమును అనుభవించుచునే ఉండెను.

**రోమన్ యుగము :** ఇట్టి పరిస్థితులలో క్రీ. పూ. 229 లో రోమన్ నౌకాదళము ఒకటి సముద్రపు దొంగలను నిర్మూలించుటకై గ్రీస్ దేశపు తీరమున దిగి, క్రమముగ అచటి నగర గణరాజ్యములలో కొన్నింటితో మైత్రి ఒడంబడికల కుదుర్చుకొనెను. అంతటినుండి రోమ్ సామ్రాజ్యమునకు గ్రీస్ దేశముతో సన్నిహిత సంబంధము ఏర్పడెను. కాని, మేసిడోనియా ప్రభువు మాత్రము రోమ్‌నకు విరోధియగు కార్తజీనియన్ నాయకుడు హానిబాల్ [చూ. కార్తేజ్ - పు. 386] తో సన్నిహిత మైత్రిని నెరపుటచే కడకు మేసిడోనియాపై రోమ్ యుద్ధము ప్రకటింపవలసివచ్చెను. ఈ యుద్ధమున మేసిడోనియాప్రభువు పరాజితుడు అగుటయు (క్రీ. పూ. 200), అతని నిరంకుశపాలనలో ఉన్న కొన్ని గ్రీక్ గణరాజ్యములకు విముక్తి చేకూరుటయు జరిగెను. ఇందు మూలమున గ్రీక్ దేశమున రోమన్‌ల పలుకుబడి అతిశయించెను. కాని, పరాభవ తప్తుడగు మేసిడోనియన్ ప్రభువు తగు సైన్యముల సమకూర్చుకొని రోమన్‌లపై కసి తీర్చుకొన వేచి ఉండెను. అందువలన కడకు క్రీ. పూ. 171 లో రోమన్‌లు మరల అప్పటి మేసిడోనియా ప్రభువగు పెర్సియస్‌పై యుద్ధము ప్రకటించిరి. అట్టి ఎడ గ్రీక్‌ల పూర్వ వైభవమును పునరుద్ధరించుటయే తన సంకల్పమని పెర్సియస్ తక్కిన గ్రీక్ రాజ్యముల సానుభూతి ఆర్జింపగలిగెను. కాని, రోమన్ సేనావాహినులు వచ్చుచున్న వార్త తెలియగానే తక్కిన గ్రీక్ రాజ్యముల వారు అతనిని వదలి తమ మార్గమును తాము చూచుకొనిరి. అందుచే రోమన్‌లు పెర్సియస్‌ను సులభముగ ఓడించి (క్రీ. పూ. 168), ఖైదిగ పట్టుకుని, మేసిడోనియాను విభజించి, నాలుగు పాలిత రాజ్యములుగ చేసిరి. అంతటినుండి తక్కిన గ్రీక్ రాజ్యములందును రోమన్‌లు తమ అధికారములను వ్యాపింపజేయ మొదలిడిరి. కడకు క్రీ. పూ. 146 కు గ్రీస్ దేశమంతయు రోమన్‌ల వశమయ్యెను. రోమన్‌ల పరిపాలనా కాలమున గ్రీక్‌ల ప్రాచీన భాషా సంస్కృతులకు ఆదరణము తొలుత విరివిగా లభించినను క్రమముగ క్రీ. శ. 5 వ శతాబ్దినాటికి ఆ గౌరవము సన్నగిల్లెను. ఆ శతాబ్దమున దేశమున రోమన్ న్యాయసంహిత అమలులోనికి కొనివచ్చుటకు కృషి జరిగెను. క్రీ. శ. 529లో ఏథెన్స్‌నందలి ప్రాచీన గ్రీక్ విద్యాశాలలు మూసివేయబడెను. రోమన్ సామ్రాజ్యము ప్రాచ్య, పాశ్చాత్య రోమన్ సామ్రాజ్యములుగ విడివడిన తరువాత గ్రీస్ ప్రాచ్య సామ్రాజ్యమున చేరి ఉండెను. ఆ సామ్రాజ్య పరిపాలనా కాలమున స్లావ్ జాతుల దోపిడి మూకలు ఈ దేశముపై విరివిగ వచ్చిపడి, అటనట కొన్ని ప్రాంతములందు స్థిర నివాసము ఏర్పరచుకొనినవి. 10 వ శతాబ్దములో బాల్కన్ రాజ్యము [చూ.] లందలి కొన్ని శస్త్రోపజీవి సంఘములు ఈ దేశముపై పడినవి. కాని, 995 నాటికి ప్రాచ్య రోమన్ ప్రభువులు వారిని తరిమివేయ గలిగిరి. ఈ యుద్ధముల వలన గ్రీస్ దేశమునందలి జనులు విరివిగ హతులైరి.

ప్రాచ్య సామ్రాజ్యమును 1204 లో లాటిన్ జాతుల వారు ఆక్రమించుకొనిన తరువాత గ్రీస్ దేశము వివిధ పశ్చిమ యూరపియన్ జాతులకు చెందిన పలువురు సాహసికులచే జయింపబడెను. తత్ఫలితముగ గ్రీస్ దేశము చిన్న చిన్న స్వతంత్ర రాజ్యములుగ విభక్తమై విదేశీయుల పాలనలో ఉండెను. 1460 లో ఓటోమన్ తుర్కులు [చూ - పు. 364] ఈ దేశమును వశపరచుకొనునంతవరకు పరిస్థితులు అట్టులే ఉండెను.

**ఓటోమన్ యుగము :** తుర్కులు ఈ దేశమును ఆరు రాష్ట్రములుగను, ఆ రాష్ట్రములను వేర్వేరు జమీందారీలుగను విభజించి, తమ దేశీయులగు సామంత రాజులకు ఒసగిరి. స్థానిక పరిపాలన ఈ సామంతుల దయాధర్మములపై ఆధారపడి ఉండెను. కాని, తురుష్కులు ముస్లిమ్‌లు అయినను క్రైస్తవులగు గ్రీస్ ప్రజల ఎడ మత విషయకముగ అత్యంత సహనభావమును ప్రదర్శించిరి. 17 వ శతాబ్ది అంతమున ఇటలీ యందలి వెనిస్ రాజ్యము బలవత్తరమై తుర్కులను ఓడించి, గ్రీస్ దేశాంతర్భాగములగు పరిసర ద్వీపములనే కాక, గ్రీస్‌నందును కొంతభాగమును ఆక్రమింపగలిగెను. కాని, 1718 లో తుర్కులు వెనిస్ సేనలను తరిమి నష్టరాజ్యమును మరల సంపాదించుకొనగలిగిరి.

కాని, క్రమముగ సాటి క్రైస్తవ రాజ్యములగు రష్యా మొదలగు వానియందు అస్వతంత్రస్థితియందున్న గ్రీస్ ఎడ సానుభూతి ఎక్కువ కాదొడగెను. తత్ఫలితముగ గ్రీస్ స్వాతంత్ర్యార్జనకై వివిధ సంఘములు ఏర్పడి కృషి చేసి, తిరుగుబాటులను లేవతీసినవి. ఈ స్వాతంత్ర్యోద్యమములు అన్నియు క్రమముగ సుసంఘటితములై 1823 లో దేశమునకు ఒక రాజ్యాంగమును తయారుచేసి, స్వాతంత్ర్యమును ప్రకటించినవి. అంతట 1825 లో టర్కీప్రభువు తన సేనలను, నౌకాదళమును గ్రీస్‌పైకి పంపి స్వాతంత్ర్య సేనలను ఓడింపగలిగెను. కాని, ఇంతలో అగ్రరాజ్యములు అనబడు బ్రిటన్, ఫ్రాన్స్, రష్యాలు గ్రీస్ పక్షమున యుద్ధమున దిగి, 1827 లో టర్కీ నౌకాదళమును నిర్మూలించుట వలన టర్కీప్రభువు సంధికి ఒడంబడవలసి వచ్చెను. తత్ఫలితముగ 1830 లో గ్రీస్‌న అత్యధిక భాగము స్వతంత్రమయ్యెను.

**స్వాతంత్ర్య యుగము :** స్వాతంత్ర్యము పొందినప్పటి నుండియు గ్రీస్ దేశము ఆంతరంగిక కల్లోలములకు గురి అయ్యెను. తొలుతగ ప్రజలు ఎన్నుకొనిన అధ్యక్షుడు నిరంకుశుడై చివరకు హతుడయ్యెను. అంతట అగ్రరాజ్యములవారు బవేరియా రాకుమారుడు ఓటో అను వానిని గ్రీస్‌నకు రాజుగ చేసిరి (1832). ప్రజలకు ఇతని పరిపాలన నచ్చక పోవుటచే, ఇతడు 1862 లో పదభ్రష్టుడు అయ్యెను. అంతట డెన్మార్క్ రాకుమారుడు జార్జి గ్రీస్‌నకు రాజుగ చేయబడెను. అంతవరకు బ్రిటిష్ రక్షణలో ఉన్న అయోనియన్ దీవులు ఆ సంవత్సరమున గ్రీస్‌నకు అప్పగింపబడెను. 1881 లో గ్రీస్‌నకు న్యాయతః చెందవలసి ఉండి, అప్పటి వరకు టర్కీ అధీనమున ఉన్న తెస్సలీ మొదలగు కొన్ని ప్రాంతములు గ్రీస్‌నకు అప్పగింపబడినవి. కాని, క్రీట్ ద్వీపము తనకు రాలేదను అసంతృప్తి గ్రీస్‌నకు ఉండెను. కాని, తరువాత బాల్కన్ రాజకీయములందు టర్కీకి కలిగిన ఓటమి ఫలితముగ 1913 లో క్రీట్ ద్వీపము సైతము గ్రీస్‌నకు లభించినది. ప్రథమ ప్రపంచ యుద్ధకాలమున దేశమును తటస్థముగ ఉంచుటకు గ్రీస్ దేశపు రాజు కృషి చేసెను. కాని, ప్రభుత్వమున ప్రధాన మంత్రిగ ఉండిన వెనిజెలాస్ మాత్రము మిత్రమండలి (ఫ్రాన్స్, బ్రిటన్, రష్యా) పక్షమున గ్రీస్ చేరవలెనని పట్టుపట్టెను. తత్ఫలితముగ రాజు పదవీ పరిత్యాగము చేయగ (1917), దేశము మిత్రమండలి పక్షమున యుద్ధమున పాల్గొనెను. యుద్ధానంతరమున జరిగిన ఏర్పాటులను అనుసరించి, ఆసియా మైనర్‌లోని కొన్ని ప్రాంతములు గ్రీస్‌నకు లభించినవి. కాని, టర్కీయందు కెమాల్ పాషా [చూ - పు. 402] పలుకుబడి లభింపగనే గ్రీక్ సేనలు ఆసియా మైనర్ నుండి తరిమివేయబడెను.

రాచరికమును 1924 లో తొలగించి, గ్రీస్ దేశమున గణరాజ్యప్రభుత్వ విధానము ప్రవేశపెట్టబడినది. 1935 వరకు ఆ విధానము అమలులో ఉండెను. ఆ సంవత్సరమున మరల రాజరికము ఉద్ధరింపబడి జార్జి - II రాజయ్యెను. దేశమున రాచరికపు ఆధ్వర్యవమున ప్రజాస్వామికము అమలుజరుపు ఏర్పాటు జరిగినను, ప్రజాస్వామిక విధానము అట ఫలవంతము కాక కలతలకు దారితీసినది. 1936 లో ప్రధానియైన మెటక్సస్ క్రమముగ సర్వాధికారములు వహించి - తన జీవితాంతము వరకు - తానే ప్రధానిగ ఉండునటుల రాజువలన అనుమతి గ్రహించెను.

ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున 1940, అక్టోబరు 28 న ఇటలీ సేనలు గ్రీస్‌పైకి అకారణముగ దండెత్తుటతో, ఆ యుద్ధములో మిత్రమండలి పక్షమున గ్రీస్ దేశము చేరవలసి వచ్చినది. ఇటాలియన్‌లను తీవ్రముగ ప్రతిఘటించి గ్రీక్‌లు తరుమగలిగిరి. కాని, కడకు జర్మను సేనలు ఇటలీ పక్షమున వచ్చి పోరాటమున దిగుటతో చేయునదిలేక గ్రీస్ రాజు దేశమును విడిచి ఇంగ్లండునకు ఏగి అట ప్రవాస ప్రభుత్వమును ఏర్పరచెను. 1941, సెప్టెంబర్‌లో జర్మనులు గ్రీస్ దేశమును వశపరచుకొనిరి. కాని, గెరిల్లా పద్ధతులను అవలంబించి, గ్రీస్ దేశభక్తులు తమ పోరాటమును కొనసాగించిరి.

గ్రీస్ దేశమునకు నాజీ దురాక్రమణ నుండి విమోచనము 1944, డిసెంబరు మాసమున చేకూరినది. ఆ వెనువెంటనే దేశమున అధికారము స్వాయత్తము చేసికొన కమ్యూనిస్ట్ పార్టీ యత్నించినది. కాని, జాతీయపక్షములు అన్నియు ఎదురు తిరిగి ప్రతిఘటించినవి. తత్ఫలితముగ చెలరేగిన అంతర్యుద్ధము 1946 వరకు సమయకుండెను. తుదకు

1946, సెప్టెంబరులో జనాభిప్రాయ సేకరణ జరిగి, దాని పర్యవసానముగ జార్జి - II రాజు రాజ్యాంగబద్ధుడగు రాజ్యాధిపతి అయ్యెను.

ఆ మరుసటి సంవత్సరమే ఆ రాజు గతించినంతట అతని సోదరుడు పాల్ - I అనుపేర రాజయ్యెను. కాని, రాజరికమును ధిక్కరించుచు కమ్యూనిస్ట్ దళములు అటనట తమ దండయాత్రలు సాగించుచు అరాజకమును ప్రోత్సహించుచుండెను. 1949 నాటికి కమ్యూనిస్ట్‌ల తిరుగు బాటు అంతరించి, దేశమున ప్రశాంతత నెలకొనినది. 1950 మొదలుగ దేశ ఆర్థిక వ్యవస్థను పటిష్ఠము ఒనర్చుటలో గ్రీస్‌ప్రభుత్వము చాలవరకు విజయమును సాధించినది. 1951 లో ఈ దేశము నాటో [చూ.] యందు సభ్యత్వ మును ఆర్జించినది. 1953 లో టర్కీ, యుగోస్లావియాలతో ఈ దేశము రక్షణమైత్రిని కుదుర్చుకొనినది. సైప్రస్ [చూ.] ద్వీపము నందలి ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు గ్రీక్ లగుటచే ఆ ద్వీప ప్రజలు స్వాతంత్ర్యమును ఆర్జించుటకు జరిపిన పోరాటమున గ్రీస్‌దేశము వారిని బలపరచుటచే బ్రిటన్‌తో వైరుధ్యము తొలుత ఏర్పడెను. బ్రిటన్, టర్కీ, గ్రీస్‌లు జరిపిన సమాలోచనల మూలమున తుదకు 1960 లో సైప్రస్‌కు స్వాతంత్ర్యము సిద్ధించుటయేగాక, మరల టర్కీ, బ్రిటన్‌లతో గ్రీస్‌దేశమునకు యథా పూర్వకముగ మైత్రి చేకూరినది.

రాజ్యాంగము : రాజ్యాంగవిధాన బద్ధము, వంశాను గతము అగు రాచరికపు పాలన ఈ దేశమున అమలు నందు ఉన్నది. శాసననిర్మాణాధికారము రాజునందును, శాసన సభయందును న్యస్తమై ఉన్నది. శాసన సభ ఏకకక్ష్య కలది. అందలి సభ్యసంఖ్య ఏ పరిస్థితులలోను 150 కు తగ్గక, 300 కు మించక ఉండును. శాసనసభ సభ్యుడు గ్రీక్ పౌరుడై, 24 ఏండ్ల వయసునకు తగ్గక ఉండ వలెను. దేశమందలి పౌరులలో 21 ఏండ్ల వయసునకు తగ్గని స్త్రీ - పురుషులందరికిని వోటుహక్కు కలదు. ఎన్నికలు సార్వజనిక, అపరోక్ష, వయోజన, రహస్యపు ఎన్నిక విధానమున జరుగును. శాసన సభయందలి మూడింట రెండువంతుల స్థానములకు తొలి దశలోను, కడమస్థానము లకు తరువాత దశలోను ఎన్నికలు జరుగును. తొలి దశ ఎన్నికలలో అన్ని రాజకీయ పక్షములును, తమ అభ్యర్థు లను నిలిపి పాల్గొనవచ్చును. ఆ ఎన్నికలో ఒక నిర్ణీత శాతమునకు తగ్గక వోట్లు సంపాదించిన రాజకీయ పక్షము లకు మాత్రమే రెండవ దశ ఎన్నికలలో పాల్గొను అధికారము కలదు. ఇందువలన ప్రజలలో ఎక్కువ పలుకు బడి కలిగిన పక్షములకు అదనముగ స్థానములు లభించి సుస్థిరప్రభుత్వము ఏర్పడుటకు అవకాశము కల్పింపబడినది దేశమునందలి ఆ యా మండలములకు వాటి జనసంఖ్య నిష్పత్తిలో శాసన సభయందు ప్రాతినిధ్యము నిర్ణయింప బడినది.

కార్యనిర్వహణాధికారము రాజునకే చెంది ఉన్నను, అతడు ప్రధానమంత్రి నాయకత్వమున నడుచు మంత్రి మండలిద్వారా ఈ అధికారబాధ్యతలను నిర్వర్తించును. శాసన సభలో అత్యధిక సంఖ్యాక ప్రాబల్యము కలిగిన రాజకీయ పక్షమునుండియైనను, అట్టిది ఏ ఒక పక్షమును లేనిచో, అట్టి పక్షకూటమి (ఎలయన్స్) నుండియు రాజు మంత్రిమండలిని, ప్రధానిని నియమించును. పరిపాలన న్యాయయుతముగ జరుగుటను పర్యవేక్షించుటకు రాజ్య సమితి (స్టేట్ కౌన్సిల్) ఒకటి కలదు. ఇందలి సభ్యులు నియమింపబడినది మొదలుగ యావజ్జీవము అధికారమున ఉండెదరు. వీరిని మంత్రిమండలి సలహాపై రాజు నియ మించును. పరిపాలనలో ఒనగబడిన అక్రమపు ఉత్తరువు లను, నిర్ణయములను రద్దొనర్చుటకు, పరిపాలన నియమము లను అంతటంతట పటిష్ఠతరముల చేయుటకు ఈ రాజ్య సమితికి అధికారము కలదు. వి. నా.; చీ. శే. రా.

**గ్రెనడా :** స్పెయిన్ దేశమున దక్షిణ భాగమందు ఉన్న ప్రాచీన నగరము. స్పెయిన్ దేశమును క్రీ. శ. 8 వ శతాబ్దిలో అరబ్ సేనలు ఆక్రమించిన తరువాత, వారి పరిపాలనా కాలమున ఈ నగరము రూపొందినది. స్పెయిన్‌నందు అత్యధిక భాగము క్రైస్తవ రాజుల వశ మైన తరువాత కూడ గ్రెనడా నగరము రాజధానిగ గల ఆ పరిసర ప్రదేశము గ్రెనడా రాజ్యము అని వ్యవహరింప బడుచు ముస్లిమ్ ప్రభువుల వశముననే ఉండినది. కడకు క్రీ. శ. 1492 లో స్పెయిన్‌లోని తక్కిన ప్రాంతమును పాలించు క్రైస్తవ ప్రభువగు ఫెర్డినాండ్ రాజుయొక్క సేనలు ఈ నగరమును వశపరచుకొనుటతో స్పెయిన్ నందు ముస్లిమ్ పరిపాలన అంతరించినది.

ఈ నగరమున అరబ్బుల పరిపాలనా కాలపు అవశేష ములు పెక్కు నేటికిని కనవగుచున్నవి. వీనిలో నెల్ల అల్‌హంబ్రా అనుపేర ప్రసిద్ధిగాంచిన రాజ భవనము అరబ్బుల శిల్పకళా చాతుర్యమునకు పరాకాష్ఠగ పేరెన్నిక గనినది. చీ. శే. రా.

**గ్రేట్ బ్రిటన్ :** చూ. యునైటెడ్ కింగ్‌డమ్

**గ్లాడ్‌స్టన్** (1809 - 1898) : బ్రిటిష్ రాజ నీతిజ్ఞుడు. లివర్‌పూల్ (డిసెంబరు 29, 1809) లో జన్మించెను. మత రాజకీయాది విషయములను తెలిసికొనుటయందు ఎక్కువ ఆసక్తి కలవాడు. విద్యార్థిదశలో గణితము, దర్శనము

మున్నగు శాస్త్రములను పఠించెను. 1832 లో జరిగిన ఎన్నికలలో పార్లమెంట్ సభ్యుడు అయ్యెను. అప్పటి నుండియు ఇతని ప్రతిభ వెల్లడియైనది.

రాబర్ట్ పీల్ ఏర్పరచిన ప్రభుత్వమందు కోశాధిపత్యము ఇతడు 1834 లో వహించి, తర్వాత సంవత్సరములో వలసలకు ఉపకార్యదర్శి అయ్యెను. కాని, పీల్ ప్రభుత్వము ఎక్కువ కాలము స్థిరముగ ఉండక పోవుటచే గ్లాడ్‌స్టన్ పదచ్యుతుడై తన కాలమును గ్రంథపఠనము సేయుచు సద్వినియోగపరచుకొనెను.

టోరీలు 1841 లో విజయులగుటవలన పీల్ తో గ్లాడ్‌స్టన్ కూడ వర్తకసంఘమునకు ఉపాధ్యక్షుడుగా అధికారమును చేపట్టినాడు. ఎగుమతి, దిగుమతి పన్నుల విధానములో ఎన్నో మార్పులు చేసి, ఇతడు పన్నుల భారమును తగ్గించుటచే స్వేచ్ఛావర్తకమునకు అనువగు పరిస్థితులు ఏర్పడినవి.

లార్డ్ అబెర్‌డీన్ అధికారములోనికి వచ్చినప్పుడు గ్లాడ్‌స్టన్ కోశాధిపతి అయ్యెను. క్రిమియా యుద్ధము వలన విషమించిన ఆర్థిక పరిస్థితులను ఎదుర్కొని బడ్జెట్ (ఆయవ్యయ పట్టిక) ను ఆమోదకరముగా పార్లమెంట్‌లో ప్రతిపాదించి గ్లాడ్‌స్టన్ తన సామర్థ్యమును వెల్లడించెను.

మొదట టోరీ (సనాతన వాదుల) పక్షమునకు చెందిన వాడే అయినా, గ్లాడ్‌స్టన్ లిబరల్ (మితవాదులు) పక్షమున చేరి, 1865 లో కామన్స్‌సభలో లిబరల్ పక్షనాయకుడై మరి మూడేండ్లు గడచిన పిమ్మట తొలిసారి ప్రధానమంత్రి అయ్యెను. ఐర్లాండ్ దేశమందలి చర్చిని ప్రభుత్వ సంస్థ కాకుండచేయు ప్రతిపాదనము 1869 లో చేసి, పార్లమెంట్ సభాసమ్మతము గావించుకొనెను. 1870 లో ఐర్లాండ్ దేశమందలి భూస్వామ్యపద్ధతిని సంస్కరించే తన ప్రతిపాదనము కూడ పార్లమెంట్‌వారు ఆమోదించునట్లు చేసికొనగలిగెను. పబ్లిక్‌స్కూలు పద్ధతిని ఇతడు అమలు పరచెను.

లిబరల్ పక్షమువారు 1880 లో పార్లమెంట్‌లో అధిక సంఖ్యాకులు కాగా గ్లాడ్‌స్టన్ రెండవసారి (1880 - 85) ప్రధానమంత్రియై ప్రభుత్వమును సాగించెను. ఈ కాలములో గ్లాడ్‌స్టన్ చేసిన ఘనకార్యము పార్లమెంట్ సభ్యత్వమునకు సంబంధించిన సంస్కరణము. లోగడ పట్టణములందలి పౌరులకు కలిగించిన సౌకర్యములు దీనివలన తక్కిన జన సామాన్యమునకు కలిగినవి.

గ్లాడ్‌స్టన్ మూడవ సారి 1886 లో ప్రధానమంత్రి అయ్యెను. ఈ సారి ఇతడు కావించదలచిన ఘనకార్యము ఐర్లాండ్‌కు సంబంధించిన హోమ్‌రూల్ బిల్; అనగా స్వాతంత్ర్య ప్రతిపాదనము. కాని, ఇది సభాసమ్మతము కాలేదు.

ఇతడు నాలుగవ సారి 1892 లో ప్రధానమంత్రియై, మరియొక సారి ఐర్లాండ్‌కు సంబంధించిన హోమ్‌రూల్ బిల్లు ప్రతిపాదించెను. కామన్స్‌సభ ఆమోదించినా దీనిని ప్రభువుల సభ ఆమోదించలేదు.

ఇతడు రాజకీయరంగములో పనిచేయక 1894 నుండి 1898 వరకును విశ్రాంతి తీసికొనెను. ఇతడు గొప్ప విజ్ఞాని; సమయము దొరికినప్పుడెల్ల గ్రంథపఠనమో, గ్రంథ రచనయో సాగించుచుండెను. ఇతని రచనలలో ఉత్తమమయినది హోమర్‌కున్ను, హోమర్ యుగమునకున్ను సంబంధించిన విమర్శనా గ్రంథము. ఓ. ఎస్. ఎన్. మూర్తి.

**గ్వాడలోప్** : పశ్చిమార్ధ గోళమునందు ఫ్రెంచి గణ రాజ్యమున అంతర్భాగమగు సముద్రోత్తర ప్రాంతముగ పరిగణింపబడుచున్న ద్వీప రాజ్యము.

దక్షిణ అమెరికా తీరమునందలి కారబియన్ సముద్రమున వెస్ట్ ఇండీస్ దీవుల సమూహమున ఉండు రెండు పెద్ద ద్వీపములు, అయిదు చిన్న ద్వీపములుగల ఈ రాజ్యమునకు [వి] 1,777 చ. కి.మీ.; [జ] 2,82,561. ఫ్రెంచివారును, మిశ్రజాతివారును కలరు. [భా] ఫ్రెంచి; [మ] రోమన్ కేథలిక్ క్రైస్తవ మతము ఇచట వ్యాప్తియందు ఉన్నది. [రా] బాస్‌టెర్ (జ. సం. 11,837).

చరిత్ర : ఈ ద్వీప సమూహము 1493 లో క్రిస్టఫర్ కొలంబస్ [చూ - పు. 407] చే కనుగొనబడినది. 1635 లో ఫ్రెంచి కంపెనీవారు ఇందు స్థిరపడిరి. 1674 లో ఫ్రెంచి రాజ్యాధికారము ఇచట అమలులోనికి వచ్చెను. 1759 నుండి 1816 వరకు ఆంగ్లేయులకును, ఫ్రెంచి వారికిని జరిగిన పోరాటములలో చేతులు మారుచు కడపటికి ఈ ద్వీప రాజ్యము 1816 లో ఫ్రెంచివారికి దక్కెను. 1848 లో బానిసత్వము ఇట నిర్మూలింపబడినది. తొలుతనుండియు ఇది ఫ్రెంచి రాజ్యమున అంతర్భాగముగనే ఉండెను. 1928 లో సంభవించిన తుఫానువలన ఈ ద్వీపరాజ్యమునకు అపరిమిత నష్టము సంభవించెను. ఆంతరంగిక స్వపరిపాలనకై ఇచట ప్రజలు ఇపుడు ఆందోళనము సాగించుచున్నారు. మ. అ. శ.

**గ్వాతెమాలా** : మధ్య అమెరికాయందలి ఒక స్వతంత్ర రాజ్యము.

ఈ దేశమునకు మెక్సికో [ఉ, ప]; కారబియన్ సముద్రము, బ్రిటిష్ హోండురాస్, హోండురాస్, ఎల్ సాల్వడార్ [తూ]; పసిఫిక్ మహా సముద్రము [ద] సరిహద్దులందు ఉన్నవి. [వి] 1,08,889 చ. కి. మీ.; [జ] 40,95,208. ప్రజలలో 54% అచ్చమగు ఆదిమ అమెరికన్ జాతి; తక్కిన వారిలో మిశ్రజాతి

వారును, నీగ్రోలును కలరు. [భా] ఆదిమ అమెరికన్ భాషలు వ్యవహారమున ఉన్నను, స్పానిష్ భాషయే అధికారజాతీయ భాషగ పరిగణింపబడుచున్నది. [మ] జనులలో అత్యధిక సంఖ్యాకులు రోమన్ కేతలిక్ క్రైస్తవులు. [రా] గ్వాటెమాలా (జ. సం. 2,84,276).




చరిత్ర : యూరపియన్‌లు అమెరికా ఖండమున కాలిడక పూర్వమే వర్ధిల్లిన నాగరకతా కేంద్రములలో ఈ ప్రాంతము ఒకటి. అనాడు ఇది మాయాసామ్రాజ్యమున అంతర్భాగముగ ఉండెడిది. ఈ మాయాజాతివారు శిల్పాది కళలందును, గణితాది శాస్త్రములందును అత్యుచ్చ స్థాయిని అందుకొనిరి అనుటకు నేడు ఇట కనబడు ప్రాచీన నిర్మాణావశేషములు ప్రబల నిదర్శనములు. ఈ ఇరువదవ శతాబ్దిలో పురావస్తు శాస్త్రజ్ఞులు అనేకులు జరిపిన కృషిఫలితముగ ఆ పూర్వనాగరకతను గురించిన విశేషములు అనేకములు నేడిపుడు మనకు తెలియవచ్చు చున్నవి. క్రీ. శ. 12 వ శతాబ్దము నాటికి ఈ మాయా సామ్రాజ్యము ఛిన్నాభిన్నమై వివిధ మాండలికరాజ్యము లుగ చీలిపోయినది. కడకు 1524 లో పెడ్రోడీ అల్వరాడో అను స్పెయిన్ దేశీయుడు ఈ ప్రాంతమున కాలిడి, క్రమముగ దేశీయులగు మాండలికుల నిర్జించి, దేశమును ఆక్రమింప మొదలిడెను. 1550 నాటికి దేశమంతయు స్పెయిన్ సామ్రాజ్యమున అంతర్భాగమయ్యెను. 1524లో అల్వరాడోయే స్వయముగ గ్వాటెమాలా అను పేరున ఒక ముఖ్య నగరమును నిర్మింపజేసెను. దానిని బట్టియే ఈ ప్రాంతమునకు గ్వాటెమాలా అనుపేరు కలిగినది. కాని, ఆ నగరము త్వరలోనే భూకంపమువలన నేలమట్టము కాగా, ముఖ్యనగరము ఆ తరువాత పలు తావులకు మార్చబడినది. చివరకు 1776 లో నిర్మింపబడిన ప్రస్తుతపు గ్వాటెమాలా ముఖ్యనగరముగ చేయబడినది. స్పెయిన్ వారిచే ఆక్రమింపబడినప్పటినుండి దేశీయులు క్రమముగ స్పెయిన్ దేశపు సంస్కృతిప్రభావమునకు లోనైరి. కాలక్రమేణ స్పెయిన్ వాసులు ఆదిమ అమెరికన్ స్త్రీలను పెండ్లియాడిన ఫలితముగ ఒక మిశ్రజాతియు రూపొంది నది. 1821 లో ఈ ప్రాంతము స్పెయిన్ సామ్రాజ్యము నుండి విడివడి స్వాతంత్ర్యము ఆర్జించినది. అంతట మెక్సికో రాజ్యపాలనకు లోబడి కొంత కాలము ఉండి, ఈ ప్రాంతము ఆ తరువాత ఏర్పడిన మధ్య అమెరికా రాష్ట్రముల వ్యవస్థలో చేరెను. 1838 లో ఆ వ్యవస్థ విచ్ఛిన్నము కాగా ఈ దేశము ప్రత్యేక స్వతంత్ర ప్రభుత్వమును స్థాపించుకొనెను. అంతట 27 సంవత్సరముల కాలము ఆ దేశపు ప్రభుత్వము రఫేల్ కరేరా అను ఒక నాయకుని అధీనమున ఉండెను. అతని మరణానంతరము (1865) నుండి సుస్థిర ప్రభుత్వము ఈ దేశమున ఏర్పడుటయే కష్ట సాధ్యమయ్యెను; నిరంకుశ పరిపాలన పరిపాటి అయ్యెను. అంతటంతట ప్రజాస్వామ్య ప్రభుత్వములు ఏర్పడినను, చిర కాలము నిలువ గలిగినవి కావు. 1945 లో జువాన్ జోసీ అరివలో బెర్మిజో అను వాని నాయకత్వమున ఏర్పడిన ప్రభుత్వము ఆర్థిక, సాంఘిక సంస్కరణలను కొన్నింటిని ప్రవేశపెట్టి ప్రజాహిత దృష్టితో 1951 వరకు ప్రభుత్వము నెరపెను. తరువాత అధికారమును చేపట్టిన ప్రభుత్వమున కమ్యూనిస్ట్ భావములకు ప్రాబల్యము కొంతవరకు ఏర్ప డెను. అందుపై కమ్యూనిస్టేతరులు దానిని కూలద్రోసి, 1954, జూన్‌లో కార్లస్ కేస్టిలో ఆర్మాస్ అను వాని అధ్య క్షతన నూతన ప్రభుత్వము ఏర్పరచిరి. కాని, అధ్యక్షుడు త్వరలోనే ప్రతిపక్షుల వలన హతుడయ్యెను. తరువాత సక్రమముగ ఎన్నికలు జరిగి మైకేల్ యి డిగోరాస్ ఫుయెన్‌టిస్ అధ్యక్షుడు అయ్యెను (1957). క్యూబా యందు 1959 లో ఫిడల్ కాస్ట్రో [చూ. పు. 391] నాయకత్వమున విప్లవ ప్రభుత్వము నెలకొనినప్పటినుండి క్యూబా ప్రభుత్వముతో ఈ దేశపు ప్రభుత్వమునకును వైరుధ్యములు పెచ్చుపెరిగి, కడకు క్యూబాపై విప్లవ వ్యతిరేకులు సలిపిన విఫల దండయాత్రకు గ్వాటెమాలా గుప్తముగ సహకారము ఒసగి ప్రోత్సహించినది. ఇందుకు ప్రతిఫలముగ ప్రక్కన ఉన్న బ్రిటిష్ హొండూరాస్‌ను బ్రిటన్ తమకు ఒసగునటుల యునైటెడ్ స్టేట్స్ చేయగల దని ఈ దేశము ఆశించెను. కాని, ఆ కోరిక నెరవేరలేదు.

రాజ్యాంగము : 1956 లో అమోదింపబడిన రాజ్యాంగ చట్టమును అనుసరించి గణ తంత్ర ప్రజాస్వామిక పరిపాలన ఇచట అమలునందు ఉన్నది. శాసన నిర్మాణాధికారము, ఎన్నుకొనబడిన శాసన సభయందు న్యస్తమై ఉన్నది. శాసన సభ (కాంగ్రెసో నేషనల్) ఏక కక్ష్య కలది.

ఈ శాసనసభకు 66 మంది 1959 లో ఎన్నుకొనబడిరి. శాసనసభా సభ్యుని పదవీకాలపరిమితి నాలుగు సంవత్సరములు. రెండేండ్లకు ఒకపర్యాయము శాసన సభ సభ్యులలో సగముమంది పదవీకాలము పూర్తి అగునటుల తొలుత ఏర్పాటు జరిగినది. అందువలన రెండేండ్లకు ఒకసారి ఎన్నికలు జరిగి, శాసన సభయందలి సగముమంది సభ్యులు ఎన్నుకొనబడెదరు. అధ్యక్షుడు ప్రజలచే అపరోక్షపు ఎన్నిక మూలమున ఎన్నుకొనబడును. ఎన్నుకొనబడు నాటికి అతని వయసు 40 ఏండ్లు తగ్గి ఉండకూడదు. అధ్యక్షుని పదవీకాల పరిమితి ఆరు సంవత్సరములు. ఒకసారి అధ్యక్షపదవికి ఎన్నుకొనబడినవాడు ఆ వెను వెంటనే రెండు పర్యాయములవరకు మరల ఎన్నుకొనబడ కూడదు. 9 లేక 10 మంది సభ్యులు గల మంత్రిమండలి సాయమున అధ్యక్షుడు పరిపాలన నిర్వహించును. ఈ మంత్రులను అతని ఇచ్ఛానుసారమున అధ్యక్షుడే నియమించును. ఆర్థిక, సాంఘిక వ్యవహారములందును, యుద్ధ ప్రకటన, విరమణాదులయందును శాసన సభ అధికారము వహించి ఉన్నది. అధ్యక్షుడు స్వయముగ కుదుర్చుకొనిన ఏ ఒడంబడిక యైనను శాసన సభయందు మూడింట రెండువంతుల ప్రాబల్యముతో ఆమోదింపబడిన మాత్రముననే చెల్లుబాటు కాగలదు. శాసనసభయే న్యాయనిర్వహణాధికారిని, సుప్రీమ్ కోర్ట్ జడ్జీలను ఎన్నుకొనును. శాసన సభ తీర్మానములను అధ్యక్షుడు వీటో చేయ (నిరాకరింప) వచ్చును. కాని, ఆ తీర్మానము నే మరల శాసనసభ మూడింట రెండు వంతుల ప్రాబల్యముతో ఆమోదించిన ఎడల అది విధిగ చట్టము కాగలదు. దేశ పౌరులలో 17 ఏండ్లు నిండిన వారందరికి వోటు హక్కు కలదు. విద్యావంతులగు స్త్రీ-పురుషులలో 17 ఏండ్లు నిండిన వారందరు వోటు చేయుట అనివార్యము ; అనుల్లంఘనీయము అగు విధి. చీ. శే. రా.

**ఘానా :** ఆఫ్రికా ఖండమందలి ఒక స్వతంత్ర రాజ్యము.

ఈ దేశమునకు అప్పర్ వోల్టా [ఉ]; టోగో [తూ]; అట్లాంటిక్ మహాసముద్రము [ద]; ఐవరీ కోస్ట్ [ప] సరిహద్దులందు ఉన్నవి. [వి] 2,37,878 చ. కి. మీ.; [జ] 72,44,000. దేశీయులు అందరును నీగ్రోజాతికి చెందినవారు. [భా] దేశమున వివిధ ఆఫ్రికన్ జాతులవారు వివిధ మాతృభాషల మాటాడుచున్నను ఇంగ్లీషు వ్యవహార భాషగను, పాఠశాలలలో బోధనాభాషగను అమలులో ఉన్నది. [మ] దేశప్రజలలో అత్యధిక సంఖ్యాకులు




సంప్రదాయ ప్రకృతి దేవతారాధకులు, క్రైస్తవులు దాదాపు 7 లక్షలు కలరు. [రా] అక్రా (జ. సం. 4,91,060).

చరిత్ర : స్వాతంత్ర్యార్జనకు పూర్వము ఈ దేశము గోల్డ్ కోస్ట్ అనుపేర బ్రిటిష్ వలస రాజ్యముగ ఉండెను. పశ్చిమ సుడాన్‌నందు సుమారు వేయి సంవత్సరముల క్రితము వర్ధిల్లి ఉండిన ఘానా సామ్రాజ్యవాసుల సంతతికి తాము చెందిన వారము అను అభిప్రాయముతో ఈ దేశవాసులు స్వతంత్రత పొందినప్పటినుండి, తమ దేశమునకు ఘానా అను పేరు ఇడుకొనిరి. ఈ దేశపు ప్రాచీన చరిత్రను గురించిన వివరములు ఏవియు సోపపత్తిగ తెలియవచ్చుట లేదు. 1471 లో ప్రప్రథమముగ పోర్చుగీస్ వర్తకులు ఈ దేశ తీరమున కాలూనినది మొదలుగ ఈ దేశమునకు యూరోపియన్‌లతో సంబంధము కలిగెను. అప్పుడు బంగారపు ఇసుక అట లభించుచుండుటచే పోర్చుగీస్‌వారు తీరమున స్థావరములను నిర్మించుకొని, వ్యాపారమువలన విరివిగ ధనము ఆర్జించిరి. క్రమముగ వారిని అనుసరించి డచ్చివారు, డేన్‌లు, స్వీడ్‌లు, జర్మనులు, ఆంగ్లేయులు వర్తకమునకై ఇట చేరిరి. కాలక్రమేణ బంగారపు ఇసుక లభించుట తగ్గిపోవుటచే, ఈ వివిధ

యూరపియన్ జాతుల వర్తకులు బానిస వ్యాపారమునకు పూనుకొనిరి. 1807 లో బ్రిటిష్‌వారు బానిసవ్యాపారము నిషేధించిన తరువాత తక్కిన యూరపియన్ రాజ్యములు కూడ దానిని మానివేయవలసి వచ్చెను. క్రమముగ తక్కిన యూరపియన్ జాతుల వర్తకులు అంతట ఇటనుండి వైదొలగుటచే దేశపు వ్యాపారమున బ్రిటిష్‌వారి పలుకుబడి ఎక్కువయ్యెను. ఆ కాలమున ఈ దేశమునందలి జాతులలో అషాంతి జాతి [చూ. సం. 10 - పు. 172] ప్రజలు అతి బలవంతులై ఉండిరి. తక్కిన జాతుల వారిని పీడించి వారినుండి బానిసలను పట్టుకొని యూరపియన్‌లకు అదివరలో వారు అమ్మెడివారు. కావున బానిస వ్యాపార నిషేధము వలన వారికి నష్టము కలిగెను. ఆంగ్లేయులే ఇందుకు కారణభూతులను తలంపుతో వారు ఆంగ్లేయులను వేధింపసాగిరి. అందువలన ఆంగ్లేయులకును, అషాంతి వారికిని ఏడుసారులు పోరాటములు జరిగి, తుదకు 1900 లో అషాంతీలు వసించు ప్రాంతము ఆంగ్లేయులకు వశమయ్యెను. ఇంతకు పూర్వమే 1886 లో ఈ దేశమునందలి తీరభూమి బ్రిటిష్ రాచరికపు వలసగ గోల్డ్‌కోస్ట్ కాలనీ అను పేర రూపొందెను. 1897 లో దేశమందలి ఉత్తర ప్రాంతము బ్రిటిష్ రక్షిత ప్రాంతమయ్యెను. అప్పటిలో దీని పొరుగుననే జర్మన్ వలసగ ఉండిన టోగోలాండ్‌న కొంత భాగము ప్రపంచ యుద్ధానంతరము జరిగిన ఏర్పాటులను అనుసరించి 1922 లో బ్రిటిష్‌వారి ధర్మకర్తృత్వ పాలనకు ఒసగబడెను. ఇదియు గోల్డ్‌కోస్ట్‌లో పరిపాలన రీత్యా అంతటినుండి అంతర్భాగమయ్యెను.

ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరము గోల్డ్‌కోస్ట్ అతి త్వరిత గతిలో రాజకీయ పురోగతిని సాధించెను. ప్రజల ఆందోళనను ఉపశమింపజేయుటకు బ్రిటిష్ ప్రభుత్వము తొలుత కొన్ని సంస్కరణలను ప్రవేశపెట్టి, 1951 లో ఎన్నికలను జరుపగా, సంపూర్ణ స్వాతంత్ర్యమును ఆసించు కన్వెన్షన్ పీపుల్స్ పార్టీ అధిక సంఖ్యాక స్థానములను సంపాదించెను. కాని, ఆ పార్టీనాయకుడగు డాక్టరు న్క్రుమా [చూ.] అప్పటిలో రాజద్రోహ నేరముపై శిక్షను అనుభవించుచు జైలులో ఉండెను. ఎన్నికల మూలమున అతనికి కల పలుకుబడిని బ్రిటిష్ ప్రభుత్వము గుర్తించి, అతనిని విడుదలచేసి పరిమితాధికారములను అప్పగించినది. అంతటినుండి న్క్రుమా నాయకత్వమున జరిగిన రాజకీయ ఆందోళన తీవ్రతరమై, తుదకు 1957, మార్చి 6 వ తేదీన దేశము స్వతంత్రతను ఆర్జించెను. ధర్మకర్తృత్వపు ప్రాంతమగు బ్రిటిష్ టోగోలాండ్ సైతము జనవాక్య సేకరణ ద్వారా ఈ రాజ్యమున నే కలసి ఉండుటకు తన నిర్ణయమును తెలియజేసెను. అంత ఘానా అనుపేర ఈ దేశము డాక్టరు న్క్రుమా నాయకత్వమున పురోగమించినది. ఆఫ్రికా సంయుక్త రాష్ట్రములు అను పేర ఒక బలవత్తర రాజ్యమును నిర్మించు కాంక్షతో న్క్రుమా కృషి చేసెను. 1960, జూన్‌నుండి ఈ దేశము ఒక గణరాజ్యముగ రూపొందినది. అయినను, భారతదేశము వలెనే కామన్‌వెల్త్ [చూ.] లో భాగస్వామ్యమును కలిగియే వ్యవహరించుచున్నది. ప్రచ్ఛన్న యుద్ధము [చూ.] న చేరకుండ సచైతన్య తాటస్థ్య నీతిని అవలంబించుటయే తన విదేశ వ్యవహార విధానమున ముఖ్యసూత్రముగ ఈ దేశము అవలంబించినది. కాని, క్రమమున ప్రజలలో తన ఎడలగల ఆదరణను అవకాశముగ గ్రహించి తక్కిన రాజకీయపక్షములవారిని అడగద్రొక్కి, ప్రజలయందు తన వ్యక్త్యారాధనను ప్రోత్సహించుటకు న్క్రుమా యత్నించెను. అంతట ఒక సమయమున అతడు చీనా ప్రభుత్వ ఆహ్వానముపై చీనా వెళ్ళి ఉన్న సమయమున సైనిక వర్గము తదితర ప్రముఖవర్గముల సానుభూతితో ప్రభుత్వమును వశపరచుకొనినది (24, ఫిబ్రవరి, 1966). చీ. శే. రా.

**ఘోరీ, మహమ్మద్** (1173 - 1206 ప.) : ముస్లిమ్ సామ్రాజ్యమును ఉత్తర భారతదేశములో సుస్థిరముగ స్థాపించుటకు పాటుపడిన వారిలో ఇతడు మొదటివాడు.



మహమ్మద్ ఘోరీ

(1173 - 1206 ప.)

ఇతని అన్నయగు ఘియాజుద్దీన్ ఘోరీ రాజ్యమును పాలించుచుండగా 1173 లో ఘోరీ మహమ్మద్ పై రాజ్యమునకులోబడిన ఘజ్నీ ప్రాంతమునకు పాలకుడయ్యెను. నాటినుండి మహమ్మద్ భారతదేశమున సామ్రాజ్యమును స్థాపింప సంకల్పించి దాడులు సాగించెను.

ఇతనికి మొదట సింధు ప్రాంతమందలి ముల్తాన్‌ను, పంజాబ్ రాష్ట్రమును స్వాధీనములు అయినవి. తరువాత ఈ స్థానమునుండి గంగా - సింధు నదుల మధ్య గల ప్రదేశముపై దండెత్తుటకు మహమ్మద్‌కు వీలుచిక్కినది. 1191 లో ఇతడు దండెత్తినపుడు హిందూపాలకులు సమాఖ్యగ ఏర్పడి రాజపుత్ర వీరుడగు పృథ్వీరాజు [చూ.] నాయకత్వమున మహమ్మదీయ సైన్యమును స్థానేశ్వరమువద్ద ఓడించిరి. ఈ ఓటమికి నిస్పృహ చెందక, మహమ్మద్

మరుసటి సంవత్సరమే (1192) స్థానేశ్వరమునకు సైన్యమును నడిపించెను. రాజపుత్ర వీరులు వెనుకటి వలెనే విదేశ యోధులను ఎదుర్కొనిరి. కాని, మహమ్మదీయుల యుద్ధ చాతుర్యమునకు లోబడి ఓడిరి. దీని ఫలితముగ హిందువుల రాజకీయ ప్రాధాన్యము అస్తమించినది. దీని తర్వాత మహమ్మద్ అనుచరుడగు కుతుబుద్దీన్ [చూ. పు. 391] ఢిల్లీ, కాశీ, కనోజి, కాలింజర్, గ్వాలియర్ మొదలగు ప్రధాన నగరములను, ఇతని సేనానియగు మహమ్మద్ ఖిల్జీ బీహార్, బెంగాల్ రాష్ట్రములను ఘోరీ మహమ్మద్ రాజ్యమునకు చేర్చిరి.

ఇంతకు పూర్వము వచ్చిన మహమ్మదీయ యోధులవలె కాక, జయించిన దేశములు తన పరిపాలనలో ఉండునట్లు కృషిసల్పుట ఇతని విశిష్టత. ఓ. ఎస్. ఎన్. మూర్తి.

**చందా సాహెబ్ :** చూ. మహారాష్ట్రులు.

**చంద్రగుప్తుడు - I** (క్రీ. శ. 320 - 330 ప.) : ఈతడు గుప్త సామ్రాజ్య సంస్థాపకుడు ; ఘటోత్కచుడు అను వాని కుమారుడు. లిచ్ఛవీ రాజకుమారి అగు కుమారీదేవిని వివాహమాడి, అత్తవారి సాహాయ్యముతో మగధ, కోసల దేశములను పూర్తిగ వశపరచుకొని, పాటలీపుత్ర నగరము రాజధానిగ మగధ రాజ్యమును ఏలి, గుప్త సామ్రాజ్య స్థాపకుడు అయ్యెను. మహారాజాధిరాజ బిరుదము ఆతని సామ్రాజ్య సంస్థాపమును సూచించును. ఒక ప్రక్క తన యొక్కయు, రెండవ వైపు తన భార్యయొక్కయు రూపములతో నాణెములను ముద్రింపించిన మొదటి గుప్త రాజు ఈతడే. కనుక ఇతనితోనే గుప్తశకము ప్రారంభమయ్యెనని చరిత్రకారులు ఊహించుచున్నారు. ఇతడు రాజ్యమునకు వచ్చుసరికే వృద్ధుడై ఉండుటచేత స్వల్పకాలమే రాజ్యమును ఏలి, క్రీ. శ. 330 ప్రాంతమున దివంగతుడయ్యెను. కుం. ఈ. దత్తు.

**చంద్రగుప్తుడు - II** (375 - 413 ప.) : గుప్తవంశ రాజులలో సుప్రసిద్ధుడగు సముద్రగుప్తుని ద్వితీయ కుమారుడు. ఇతడు రాజ్యమునకు వచ్చినవెంటనే గుప్త సామ్రాజ్యమును విస్తరింపజేయుటకు కృతనిశ్చయుడై, మాళవ, సౌరాష్ట్ర, ఘూర్జర దేశములను జయించి, సామ్రాజ్యమును ఉత్తరమున హిమాలయము, దక్షిణమున నర్మదానది, తూర్పున వంగదేశము, పశ్చిమమున పంజాబ్ దేశమువరకు విస్తరింపజేసెను. గుప్తరాజులలో ఇతడు సుప్రసిద్ధుడు. ఇతనికి విక్రమార్కుడనియు, విక్రమాదిత్యుడనియు బిరుదు నామములు కలవు. ఇతని కాలమున వాకాటక భూపాలురు, మాళవ, ఘూర్జర, సౌరాష్ట్రములను ఏలు క్షత్రపులు ఒకరితో ఒకరు కలహించుటచేత గుప్తసామ్రాజ్య పశ్చిమపు సరిహద్దున ఉన్న ఈ క్షత్రపుల బలమును అడ్డగించి, ఆ ప్రాంతమునుండి రాజ్యమునకు ఎట్టి ప్రమాదమును కలుగకుండ చేయుటకై చంద్రగుప్తుడు వాకాటక నృపులతో సంబంధ బాంధవ్యముల నెరపి, వారి సాహాయ్యముతో క్షత్రపుల రాజ్యములను గెల్చి, గుప్త సామ్రాజ్యములో కలుపుకొనెను. ఇతడు నాగవంశ సంభూతయగు కుబేరనాగను వివాహమాడెను. తన కుమార్తె అగు ప్రభావతీదేవిని వాకాటక భూపతి అగు రెండవ రుద్రసేనునకు ఇచ్చి వివాహము కావించి, రాజ్యమును సుస్థిరము కావించెను. చంద్రగుప్తుని కాలమున గుప్తసామ్రాజ్యము మహోన్నతిని చెంది, భరతఖండ చరిత్రలో ప్రఖ్యాతికి వచ్చెను. కుం. ఈ. దత్తు.

**చంద్రగుప్తుడు, మౌర్య** (క్రీ. పూ. 322 - 298 ప.) : భారతదేశ చరిత్రలో చారిత్రక యుగమున ప్రథమ మహాసామ్రాజ్యముగ పేరుగనిన మౌర్యసామ్రాజ్యమునకు సంస్థాపకుడు ; మౌర్యవంశమునకు మూలపురుషుడు. చంద్రగుప్తుని పూర్వీకులను గురించి విభిన్న వాదములు కలవు. సంస్కృత సారస్వతమున బహుప్రచారమునందిన ముద్రారాక్షసనాటకమువలన ఇతడు మౌర్యపుత్రుడని తెలియవచ్చుచున్నది ; కడపటి నందరాజునకు ఉపపత్ని యగు మురయందు జన్మించెననియు ఒకచోట వివరింపబడినది. బౌద్ధుల రచనలవలన మౌర్యులు శాక్యులలో ఒక అంతశ్శాఖకు చెందినవారని తెలియుచున్నది ; మయూరపోషక వృత్తిగల గ్రామపు పెద్దకు జన్మించుటచే చంద్రగుప్తుడు మౌర్యుడు అని వ్యవహరింపబడెనని జైన గ్రంథములవలన తెలియుచున్నది.

కడపటి నందునివద్ద చంద్రగుప్తుడు సేనాపతిగ ఉండి, అలిగ్జాండర్ [చూ. పు. 303] దండయాత్రాకాలమున ఆ మహావిజేతను కలసికొనెననియు ఒక గాథ కలదు. ఇది ఎటులున్నను కడకు చాణుక్యుడని వ్యవహరింపబడు కౌటిల్యుడను రాజనీతి సంపన్నుని సాయమున చంద్రగుప్తుడు నంద సామ్రాజ్యమును అంత మొందించెనని మాత్రము స్పష్టముగ తెలియుచున్నది. ఇటుల మగధరాజ్య సింహాసనమును చంద్రగుప్తుడు క్రీ. పూ. 322 లో అధిష్ఠించెనని పండితుల అభిప్రాయము. వాయవ్య భారతమున గ్రీకుల అధికారమును ఇతడు అంత మొందించెను. ఆ సందర్భమున ఇతడు గ్రీక్ సేనానియగు సెల్యూకస్ నికటోర్‌ను ఓడించెను. కడకు సెల్యూకస్ మౌర్యచంద్రగుప్తునితో సంధి కుదుర్చుకొని, బాంధవ్యమును కుదుర్చుకొనెననియు గ్రీక్ రచనల వలన తెలయుచున్నది. ఆ బాంధవ్య బంధమును గురించిన వివరములు తెలియవుకాని సెల్యూకస్ యొక్క కుమార్తెను

చంద్రగుప్తునికో లేదా అతని కుమారుడు బిందుసారునికో ఇచ్చి పాణిగ్రహణము చేయుట జరిగియుండెనని ఊహింపదగి ఉన్నది.

చంద్రగుప్తుని రాజ్యవిస్తృతిని గురించిన సమగ్ర వివరములు తెలియరాకపోయినను, పశ్చిమమున ఆ రాజ్యము హిందూకుష్‌పర్వతముల వరకు విస్తరించెననుట నిర్వివాదాంశము. ఆ సార్వభౌమునికి ఉపదేష్టగ ఉండిన కౌటిల్యుని అర్థశాస్త్రమునుబట్టి చక్రవర్తి క్షేత్రమనునది భారత దేశమునకు అంతటికిని వర్తించునది అగుటవలన చంద్రగుప్తుని సార్వభౌమత్వము ఉత్తరభారతముననేకాక దక్షిణభారతమునను వ్యాపించి ఉండెనని కొందరి అభిప్రాయము.

చంద్రగుప్తుడు 24 సంవత్సరములు పాలించెను. చంద్రగుప్తుడు జైనమతావలంబి అనియు, అతడు అంతిమ దశలో ఒక మహాక్షామకాలమున రాజ్యపరిత్యాగము ఒనర్చి, జైనాచార్యుడగు భద్రబాహునితో కూడ దక్షిణదేశమునకు పోయి శ్రావణబెళగులాయందు నిరశన దీక్షచే పరమపదించెననియు జైనగ్రంథములు పేర్కొనుచున్నవి. కాని, చారిత్రకముగ ఈ వాదము సమర్థనీయము కాదని ప్రముఖ చరిత్ర రచయితల అభిప్రాయము.

చీ. శే. రా.

**చరిత్ర రచన :** ప్రాచీన కాలములో మనకు తెలిసిన చరిత్ర రచనా కుశలులు గ్రీకులు. ఈ చరిత్ర రచన ఒక కళ. అందు వారి ప్రజ్ఞ ప్రశస్తిని అందినది. 'ఇస్టోరియా' అను గ్రీక్ పదమునకు అర్థము తెలిసికొనుట; విస్తృతార్థములో జ్ఞానమునకు పర్యాయపదముగా ఇది ఉపయుక్తము. కథలు చెప్పువారిని గ్రీకులు హిస్టోరికన్‌లు అనిరి. వీరు మన కథకుల, పౌరాణికుల వంటివారు. అనాదినుంచి 19 వ శతాబ్దమువరకు చరిత్ర అన సారస్వతములో ఒక భాగమే అని సర్వజనుల అభిమతము. చరిత్ర అనగా మానవుని పరిశోధన ఫలితముగా వెలువడిన సారస్వతమే కాని, ఆ ప్రాథమిక పరిశోధన మాత్రము చరిత్ర కాజాలదని అరిస్టాటిల్ [చూ. పు. 295] నిర్వచించెను.

శాస్త్రీయమైన చరిత్ర రచనకు ఆధునిక నిర్వచనములను పరికించిన ఎడల అరిస్టాటిల్ నిర్వచనమే కడు విస్తృతార్థములో ఆమోదయోగ్యమైనట్లు స్పష్టము కాగలదు. కాని, శాస్త్రీయమైన చరిత్రకారుని రచనలో కవితా చాతురి సర్వసాధారణముగా లోపించుటచే మెకాలే, గిబ్బన్ [చూ. పు. 425] మొదలయిన రచయితల గ్రంథములలో కానవచ్చు వైదుష్యము, రచనా చమత్కృతి ఈ శాస్త్రీయ చరిత్ర గ్రంథములలో కానరావు. ఆధునిక కాలములో ఈ విధమైన చరిత్ర అనేక నూతన పద్ధతుల తోడ్పాటుతో జరుగుచున్నది.

పూర్వకాలములో తమ చరిత్రను అంతను ప్రపంచ రాజ్యములు తమ తమ పురాణేతిహాసములలో గుప్తముగ భద్రపరచుకొనినవి. మానవాతీతుల మహత్కార్యములను వర్ణించు పురాణేతిహాసములు ప్రాచీనకాలమందు విశేషముగ అభివృద్ధి చెందినవని చెప్పవలెను. హిందూ పురాణ వాఙ్మయములోని అధికభాగము ఇట్టి గాథలతోను, ఇతిహాసములతోను నిండి ఉన్నది; ఇట్టివి చరిత్రకు నిరుపయోగములని చెప్పవచ్చును. పురాణేతిహాసములతో పాటుగ పూర్వచరిత్రను కొంతవరకు వెలువరింపగలుగునవిగ పేర్కొనదగినవి పూర్వకాలపు శాసనములు. ఈ శాసనములలోని భాష చాలవరకు గద్య రూపమున ఉన్నది.

భారతదేశములో మనకు లభ్యమైన మొదటి చారిత్రక శాసనములు మౌర్యసమ్రాట్ అశోకునివి. క్రీస్తు పూర్వము రెండు, మూడు సహస్రాబ్దములకు చెందినవిగ భావింపబడు సింధు నాగరకతకు సంబంధించిన మొహరులమీద చిన్న చిన్న బొమ్మల శాసనములను గురించి కూడ మనము ఈ సందర్భములో ప్రస్తావించవలసి ఉన్నది. ఈ శాసనములను పూర్తిగ చదువుటకు ఇప్పటికిని సంతృప్తికరమైన ఏర్పాటులు లేవు. ఇట్టి వాని ద్వారా చరిత్రను సేకరించు పురావస్తుశాస్త్రము వాస్తవిక చరిత్ర రచనకు ఒక ఉపాంగమే కాని, నిజము చెప్పవలెనన్న అంతర్భాగము కాదు.

ప్రాచీన రోమన్ చరిత్రకు ప్రధానముగా ఆధారభూతములైనవి ఆయా కుటుంబములకు చెందిన కవిలెకట్టలు. అలాగే ప్రాచీన ఈజిప్టు చరిత్రకు ఉపకరించినవి ఈజిప్టు ఫారోలకు చెందిన వంశవృక్షములు. ఇవి రాతిపై చెక్కిన చెక్కడములు. అటులనే దేవాలయకుడ్యముల పైన, మఠములలోను చెక్కబడిన వంశచరిత్రలు కూడ చరిత్ర రచనకు ఆధారములు. చీనాలో ఆదినుండి నేటి వరకు పాలన సాగించిన ప్రభువుల చరిత్రలను ఆస్థాన చరిత్రకారులు భద్రపరచుచుండెడివారు. ఇందులో కేవలము చీనా ఆంతరంగిక విషయములే కాక, ఇతర ప్రపంచముతో చీనా తరఫున జరిగిన రాజకీయ, ఆర్థిక, వాణిజ్యాది సకల విషయములు నిక్షిప్తములై ఉన్నవి. ప్రాచీన భారతదేశచరిత్రను, 'విశాల భారత' ప్రాచీన చరిత్రను తిరిగి సంస్కరించుటలో ఈ రాజుల వంశచరిత్రములు ఎంతో ఉపకరించినవి.

గ్రీస్ దేశములో మొట్టమొదటి చరిత్రకారులు అయోనియాలోని నగర చరిత్రకారులు. వీరు నగర

చరిత్రలను మాత్రమే రచించిరి. వారు తమ కాలములో లభ్యమైన సాక్ష్యమును ఆధారముగా పెట్టుకొనియు,పూర్వ సంప్రదాయములను ఆధారముగా పెట్టుకొనియు విషయములను విమర్శించిరి. వీరిలో అగ్రగణ్యుడు మైలీటస్ నగరవాసియైన హికేటియస్ (క్రీ. పూ. 550 - 476).

ఈ నగర చారిత్రకుల తరువాత క్రీస్తు పూర్వము అయిదవ శతాబ్దిలో చరిత్రను రచించిన హెరొడోటస్ (క్రీ. పూ. 484 ? - 425 ?) గొప్ప అభివృద్ధిని సాధించెనని చెప్పవచ్చును. ఈయన భూగోళమును,చారిత్రక వర్ణనమును విమర్శకు, సాహిత్యమునకు ముడిపెట్టి, చరిత్రకు మానవాళి కళలలో, విజ్ఞాన శాస్త్రములలో ఒక శాశ్వత స్థానమును సంపాదించిపెట్టెను. ఈయన శక్తి, యుక్తులు అన్నిటిని గ్రీక్ - పారసీక యుద్ధములపై కేంద్రీకరించి, ఒక మహా యుగమునకు సంబంధించిన చరిత్రనంతను పొందుపరచి గద్యరూపమున గొప్ప చరిత్ర కావ్యమును రచించెను.

ఇతని సమకాలికుడే అయ్యును, ఇతని తరువాత గ్రంథ రచనకు పూనుకొనిన తూసిడైడీస్ (క్రీ. పూ. 464 - 404 ర.) ప్రతిభావంతముగ చరిత్ర రచన కావించి, హెరొడోటస్ కన్న మిన్నయని ఖ్యాతి వహించెను. ఈయన కృతులలో గ్రీక్ చరిత్ర రచన శైలి పరిణతి పొందినదని చెప్పవచ్చును.

తరువాత కొంతకాలమువరకు గ్రీక్ రచయితలలో కావ్యదృష్టి మెండైనది. క్రీస్తుకు పూర్వము నాలుగవ శతాబ్దివరకు వారిలో శాస్త్రీయజిజ్ఞాస, రచనాసక్తి తిరిగి నెలకొనలేదని చెప్పనొప్పును. ఆ తరువాతి వారిలో అతి విజ్ఞుడైన చరిత్రకారుడు పొలిబియస్ (క్రీ. పూ. 201-120). ఈయన చరిత్ర ప్రసిద్ధిగల గ్రీక్ రాజకీయవేత్త. ఈయన క్రీ. పూ. 167 లో ఇటలీకి ప్రవాసితుడైనాడు. రోమ్ సైనిక సామర్థ్యమును గురించి, ఆధిక్యమును గురించి తన దేశ ప్రజలకు చాటి చెప్పుటకు ఈయన క్రీ. పూ. 264 నుండి తన కాలమువరకు గల మధ్యధరా భూముల చరిత్రను అంతను పొందుపరచి, ఒక ఉద్గ్రంథమును రచించెను. శాస్త్రీయ దృక్పథముతో చరిత్ర రచనకు పూనుకున్న పెక్కుమంది రచయితలవలెనే పొలిబియస్ కూడ కళావేత్త కాడు. అయినను, ఆయనను అనుసరించువారు లేకపోయిరి. చరిత్రను చారణగీతములుగా చెప్పినవారికే ప్రజాదరము మెండయ్యెను.

కాని, ఆలిగ్జాండర్ జైత్రయాత్ర తరువాతి శకములో 'విశ్వచరిత్ర' రచింపబడవలయునను అభిప్రాయము ప్రబలమయినది. క్రీ. పూ. మూడవ శతాబ్దిలో ఆలిగ్జాండ్రియా వాసి ఎరాటోస్తెనీజ్ (క్రీ. పూ. 276?-196?) చరిత్ర రచనకు ప్రాతిపదికను వేసినాడని చెప్పవచ్చును. అప్పుడు ఆయన ప్రారంభించిన కృషి ఆయన తరువాతివారు కూడ కొనసాగించిరి.

గ్రీక్ రచయితలను మినహాయించినప్పుడు రోమన్‌లలో క్రీ. పూ. మొదటి శతాబ్దము వరకు కేవలము తేదీలవారీ చరిత్రరచన మాత్రమే జరుగుచుండెను. ఈ గ్రంథములలో సారస్వత వర్ణనలకును, దేశభక్తి పూరితమయిన రచనలకును పాఠక దృక్పథము కల ప్రాధాన్యము లభించినది. ఆ తరువాతి కాలమున చరిత్రను సరియగు తీరున రచించుటకు కొంత కృషి జరిగినది. ఇందు కొంత సఫలతనందిన వాడు లివీ (క్రీ. పూ. 59 - క్రీ. శ. 17) అను చరిత్ర రచయిత. అగస్టస్ యుగమునకు చెందిన రోమన్ చరిత్ర అంతను తననాటివరకు లివీ పండితుడు 142 సంపుటములలో సమగ్రముగ, సాకల్యముగ రచించెను. కాని, ఈయన గ్రంథములలో చారిత్రక విమర్శ లేదు. కొన్ని అంశములు తప్పుల తడకలు; సత్యదూరములు.

ఆ తరువాత వచ్చిన రోమన్ చరిత్రకారులు అందరిలోనూ ప్రథమ గణ్యుడు టాసిటస్ (55-120) [చూ.]. తన చరిత్ర రచనకు కావలసిన అనేకాంశములను ఆయన ఎంతో శ్రద్ధగా సేకరించుటయేగాక, విశేష శ్రమకు ఓర్చి వాటిలోని అంశముల సత్యాసత్య నిర్ధారణకు పూనుకొనిన ధీశాలి. చారిత్రకాంశముల విలువ కట్టుటలోను, సదసద్వివేక విచారణలోను, విమర్శలోను, రచనలోను ఈయన దిట్ట. రోమన్ చరిత్రలో టాసిటస్ తరువాతి కాలమున ప్రముఖ చరిత్ర రచయితగ పేరు గాంచినవాడు అమియానస్ మారుల్లియస్ (క్రీ. శ. 325-391). క్రీ. శ. 96 నుండి తన కాలము వరకు గల రోమన్ చరిత్రను ఇతడు 31 సంపుటములలో గ్రంథస్థ మొనర్చెను.

క్రీ. శ. నాలుగు - అయిదు శతాబ్దములనాటికి చరిత్ర రచనారంగమున క్రైస్తవులకును, యూదులకును ప్రముఖత లభించెను. అట్టి రోమనేతరులలో తొలుతటి వాడు యూసీబియస్. ఈతడు ఒక పాలస్తీనా మతగురువు (బిషప్). ఈయన వివిధ సంప్రదాయములను అన్నింటిని చేర్చి సమగ్రమైన, సప్రమాణమైన క్రైస్తవ చరిత్రను రచించెను. క్రైస్తవమతదృష్టిలో ప్రధానములైన సంఘటనలను అన్నింటిని గ్రీక్, రోమన్ చరిత్రలలో పేర్కొనబడిన ప్రాచ్యదేశముల సంఘటనలతో సరిపోల్చుటకు ప్రయత్నము చేసి, ఒక సూచికను తయారుచేసెను. ప్రాచీన కాలములో చరిత్ర రచనా సంవిధానమును గూర్చి తెలిసికొనుటకు ఇది మనకు విశేషముగ ఉపకరింపగలదు.

ఆ తరువాతి శతాబ్దములందు ముఖ్యముగ క్రీ. శ. 7 వ శతాబ్ది నుండి 17 వ శతాబ్ది వరకు చరిత్ర రచనా రీతి

యూరప్‌నందు ఒక వింత మార్గమున నడచినది. చరిత్ర రచన మతగాథలను అనుసరింపక తప్పని పరిస్థితి ఆ కాలమున ఏర్పడెను. క్రమముగ చరిత్ర అంతయు చర్చి చరిత్రగ పరిణమించెను. కాలపరిగణన, సృష్టి మొదలగువానిని గురించి క్రైస్తవ మతము వారికి గల కొన్ని వింత అభిప్రాయములు చరిత్రకు ఎక్కినవి. చరిత్ర రచనను ఇటుల కొనసాగించుటయే సత్యాన్వేషణ అగునని ఆనాటి రచయితలు తలచిరి. అట్టివారిలో ముఖ్యముగ పేర్కొనదగినవాడు ఓరోసియస్. పరమ క్రైస్తవ ఋషి సెయింట్ అగస్టిన్ ఆదేశమును అనుసరించి ఈ ఓరోసియస్ ఏడు చరిత్ర గ్రంథములను రచించెను. క్రీస్తు పుట్టుకనాటినుంచి ప్రపంచము ఏవిధముగ అభివృద్ధి చెందినదో మనకు సవిమర్శకముగ, సోదాహరణముగ వివరించు తొలి క్రైస్తవ ప్రపంచ చరిత్ర ఇదియే. ఆదిమానవుని అవతరణ నుండి ఆ గ్రంథరచనా సమయమునకు గతించిన కాలము ఆరువేల సంవత్సరముల కంటె ఎక్కువ కాదని ఆ గ్రంథమున పేర్కొనబడెను

మధ్యయుగములో యూరప్ చరిత్రలు అన్నియు చిన్న పెద్ద సంఘటనల సమీకరణ తప్ప అన్యము కాదు. అప్పటి చరిత్రకారులలో చెప్పుకొనదగ్గవారు కొందరు కలరు. కాని, వారిలో హేతువిమర్శన జ్ఞానము బొత్తిగ తక్కువ. మధ్యయుగములనాటి చరిత్ర దృష్టికన్న జ్ఞాన పునరుజ్జీవన యుగమునాటి చరిత్ర దృష్టి కొంచెము మెరుగు. ప్రాచీన ప్రపంచపు నాగరకతను తెలుసుకొనుటకు ఇందు కొంత ప్రయత్నము జరిగెను. అప్పటిలో సాహిత్యమునకు ఒక అనుబంధముగ మాత్రమే చరిత్ర తయారైనదని చెప్పవచ్చును. కాని, 1440 నుండి రచయితలయు, విమర్శకులయు దృష్టి శాస్త్రీయమగు చరిత్రరచన వైపు మరలినది. ప్రాచీన నగర గ్రంథముల పరిశోధనను మాక్స్ మిలియన్-I (1459 - 1519) [చూ.] సమ్రాట్ ప్రోత్సహించుటతో వియెన్నా (ఆస్ట్రియా) ఇట్టి చారిత్రక పరిశోధనకు కేంద్రమయ్యెను. సంస్కరణోద్యమము వలన శాస్త్రీయ దృక్పథముతో చరిత్ర పరిశీలనకు విశేష ప్రాధాన్యము లభించినది. అందువలన చర్చిపత్రములు అన్నిటిపై ఆ రోజులలో అతి తీవ్రమయిన విమర్శలు చెలరేగెను. 17 వ శతాబ్దములో జరిగిన కృషి ఫలితముగా జర్మనీ, ఫ్రాన్స్, బ్రిటన్ దేశములనుండి చారిత్రక పరిశోధన సామగ్రి విశేషముగ సేకరింపబడెను. 1670 లో తమకు లభించిన చారిత్రక ఆధారములు అన్నిటిని ఎట్టి సంస్కరణ లేకుండా యథాతథముగా ప్రచురించుటకు లైబ్‌నిజ్ (1646 - 1716) ఒక సంస్థను స్థాపించెను. 18 వ శతాబ్దములో ఫ్రాన్స్‌లో విషయసేకరణలోను, ప్రాచీన వస్తు సేకరణలోను కొంతకృషి జరిగినది. ఆ తరువాత శాస్త్రీయ దృక్పథముతో చరిత్ర రచనకు ఇది నాంది యైనది.

ఇటలీలో మ్యురటరీ (1672 - 1750) లైబ్‌నిజ్‌కు తుల్యుడు అనవచ్చును. చరిత్ర రచనా చరిత్రలో ఈయన కృషి అపారమయినది.

ప్రపంచము మొత్తము మీద చరిత్ర రచనలో అతి ప్రధానగణ్యమైనది 19 శతాబ్దము. ఈ కాలములో సమగ్ర చరిత్ర రచనకు పూనుకొన్న జాతీయ, అంతర్జాతీయ, చారిత్రక సంఘములు చాల వెలసినవి. దొరకిన చారిత్రక ఆధారములను గ్రంథాలయములలో భద్రము చేయుటకు కృషి ప్రారంభమైనది. చరిత్ర గ్రంథములు, ఉపయుక్త గ్రంథసూచికలు, విజ్ఞాన, వివేక పూరితములయిన వ్యాసములతోడి పత్రికలు మొదలయినవి అనేకముగా ప్రచురించుట ప్రారంభమైనది. దానికితోడు చరిత్ర రచనకు ఉపశాఖలు అనదగిన విద్యలు కూడ విశేషముగ వర్ధిల్లినవి. అందువలన సమగ్ర సత్య చరిత్ర రచనకు అపారమైన ప్రోత్సాహము లభించెను.

చరిత్ర రచన ఏ దృక్పథముతో సాగిన శాస్త్రీయను అగునను విషయమున 19 వ శతాబ్దియందు వివిధ వాదములు చెలరేగెను. చరిత్రకు గతి నిర్ణయించి, ఇచ్చవచ్చినటుల మానవసంఘ చరిత్రను నడిపించినది మహాపురుషుల మేథాశక్తియే అని కొందరు ఆనాడు విశ్వసించిరి. హ్యూమ్, గిబ్బన్ మొదలగు చరిత్ర రచయితలు చరిత్రను నడిపించునది దైవ విధియే అను పూర్వ విశ్వాసమునకు స్వస్తి చెప్పినను, దానికి ప్రత్యామ్నాయమగు వేరుకారణమును పేర్కొన జాలకపోయిరి. పరిసర వాతావరణ ప్రభావమే చరిత్ర యందలి మార్పులకు కారణమగునని బ్రిటిష్‌చరిత్రకారుడు బకిల్ (1821 - 62) అభిప్రాయపడెను. నాగకరత అభివృద్ధి చెందినకొలది ఆ వాతావరణ ప్రభావము క్రమముగ సన్నగిల్లునని కూడ అతడు గమనించెను. వీని అన్నింటికన్న ఎక్కువగ వేరైనది కార్ల్ మార్క్స్ (1818 - 1883) [చూ.] దృక్పథము. ఆర్థిక దృక్పథముతో ఇతడు చరిత్రగతికి విపులమగు క్రొత్త వ్యాఖ్యానము ఒసగెను. ఈ విధముగ క్రమముగ చరిత్ర రచనలో రాజకీయ దృక్పథమునకు ఆదరము సన్నగిల్లి, సాంఘిక దృక్పథమునకు ప్రాధాన్యము చేకూరెను.

ఆధునిక చరిత్రకారులు అందరిలోను అగ్రగణ్యుడు లియోపాల్డ్ రాంకే (1795 - 1886). ఆయన తొలి గ్రంథములో తన కృషిని వివరించుచు ఇట్లు వ్రాసెను.

'గత చరిత్రను అంతను కుణ్ణముగ పరిశీలించితినని ఇతరులు నన్నుగూర్చి చెప్పు విషయమును నేను ఆమోదింప జాలను. అట్లనే భవిష్యత్తుకు పనికివచ్చునట్లు వర్తమానము నకు రూపురేఖలు తీర్చి వ్యాఖ్యానింతునను అంశమును కూడా అంగీకరింపజాలను. అయితే ఇప్పుడు నేను చేసిన దేమిటి అన్న ప్రశ్న ఉదయించవచ్చును. నిక్కముగ ఏమి జరిగినదో వివరించుటకు మాత్రమే నేను సమర్థుడను'. ఈ లక్ష్యమును ముందిడుకుని, తాను లూథర్ అనుయాయియైనను ఈయన మత సంస్కరణ వ్యతిరేక యుగములో కేతలిక్ లందరి మన్ననలు అందునట్లుగ పోప్ చరిత్రను రచించెను. జర్మన్ దేశీయుడు అయినను, ఈయన ఫ్రాన్స్ ప్రజల అనాదరణకు అవకాశము లేనట్లు ఫ్రెంచి చరిత్ర రచించెను. ఈయన శైలి సరళ మనోహరము, ఈయన రచనలు శాస్త్రీయమైన చరిత్ర రచనకు మేటి ఉదాహరణలు.

ఎల్ఫిన్‌స్టన్ భారతదేశ చరిత్రను 1839 లో రచించిన నాటికి ముస్లిమ్‌ల హిందూదేశ జైత్రయాత్రకు పూర్వపు హిందూ యుగ చరిత్రజ్ఞానము శూన్యము అనియే చెప్పవచ్చును. ఆ తరువాతి శతాబ్దిలో శబ్దోత్పత్తి శాస్త్రము విశేషముగా అభివృద్ధి చెందినది. దీనికితోడు కొందరు ప్రాచ్యపండితులు సంస్కృతము, పాలీ, తదితర భాషలలోని గ్రంథములు అన్నింటిని సూక్ష్మాతి సూక్ష్మ ముగా విమర్శన దృష్టితో పరిశీలించిరి. ఆ తరువాత భారత దేశ ప్రభుత్వపు పురావస్తుతత్త్వశాఖవారి కృషివలన అనేక ప్రాచీన శిల్పములు, శిథిలావశేషములు లభ్యమైనవి. వీటి అన్నింటివలన భారతదేశ ప్రాచీన చరిత్ర రచనకు తగిన ఆధారములు లభించినవి. ఈ ఆధారములు అన్నింటిని పూర్తిగా ఉపయోగించుకొని ప్రాచీన భారతదేశ చరిత్రను రచించుటలో కృతార్థుడైన తొలి చరిత్రకారుడు విన్సెంట్ స్మిత్ అని చెప్పవచ్చును. 1900 ప్రాంతములో ఈయన 'భారతదేశ ప్రాచీన చరిత్ర' గ్రంథమును ప్రకటించెను. ఇటీవలి పరిశోధనలవలన అక్కడక్కడ కొంతవరకు మార్చవలసివచ్చినను, మహమ్మదీయ మహాయుగమునకు సంబంధించినంతవరకు ఎల్ఫిన్‌స్టన్ రచించిన భారతదేశ చరిత్ర నేటికిని సర్వప్రమాణము. ఇక భారతదేశములో బ్రిటిష్ రాజరికపు చరిత్రకు సంబంధించి జేమ్స్‌మిల్ (ఈతని గ్రంథమును ఎచ్. ఎచ్. విల్సన్ సరిదిద్ది ఇతని కృషిని కొనసాగించెను), బెవరిజ్, తారన్‌టన్, తదితర రచయితలు అనేక గ్రంథములను రచించిరి. ఈ గ్రంథములు అన్నియు చాలవరకు ఆంగ్ల దృకథముతో వ్రాయబడినవే! భారతీయ దృక్పథముతో ఈ చరిత్ర గ్రంథములు అన్నింటిని తిరుగ వ్రాయవలసి ఉన్నది. ఇందుకు కొంత కాలము పట్టక తప్పదు. చేయవలసిన పని ఎక్కువ. పరిశీ లించవలసిన గ్రంథములు చాలకలవు. పనిచేయువారు తక్కువ.

చరిత్ర రచనా రంగములో అసమాన శేముషిని ప్రదర్శించి ధ్రువతారలుగా ప్రకాశించిన మహారచయిత లను ఇరువురిని గురించి ప్రస్తావించవలెను.

కల్హణుడు [చూ. పు. 376] 12 వ శతాబ్దివాడు. ఈయన రచించిన రాజతరంగిణి వాస్తవచరిత్రకు అతి సన్నిహిత ముగా ఉన్న సంస్కృత కావ్యము. సంస్కృత సాహిత్య ములో ఇది ఒక్కటే వాస్తవముగా చరిత్ర గ్రంథము. ఈ కల్హణకవి తన గ్రంథమును శ్లోకములలో రచించినను ఈయనకు చరిత్రరచనా పరిజ్ఞానము మెండు. కాని, ఈయనకు లభ్యమైన ఆధారములు వలసినంత ప్రామాణ్యము గలవి కావు. అంతేకాక, ప్రాచీన సంప్రదాయములను ఇతడు కొన్ని చోట్ల సందర్భశుద్ధి లేక రచించుటచేత జాగ్రత్తగా పరిశోధించినగాని అర్థముకావు. అయినను, ఈ కవి కాలపు చరిత్రను తెలిసికొనుటకు ఇందు గ్రంథస్థము చేయబడిన స్థానిక సంఘటనలు విశేషముగా ఉపకరించగలవు.

ఆ తరువాత పేర్కొనదగినవాడు టూనీషియన్ చరిత్రకారుడు ఇబ్న్‌కల్దూన్ (1332 - 1406). అరబిక్ భాషలో అరబ్‌ల, బర్బరుల చరిత్ర రచించి, దానికి ఉపోద్ఘాతముగా చరిత్రతత్త్వమును కూడ ఇతడు రచించెను. ఇట్టి రచనకు ఇతడు మొదటివాడే అయినను ఈయన కృతి చిరకాలము ప్రపంచమునకు తెలియరాక పోయెను. ఇతడు ఆ కాలమునాటికి మించిన అసాధారణ ప్రతిభావంతుడైన చరిత్రకారుడు; సాంఘిక తత్త్వజ్ఞుడు; నేటికిని పరమప్రామాణికుడుగా పరిగణింపబడుచున్నాడు. ముస్లిమ్‌రాజుల పాలనలో పర్షియన్‌భాషలో భారతదేశ ములో అమూల్యమైన చరిత్ర రచన విశేషముగ కొన సాగినది. ఇందులో కొంతవరకు పక్షపాత బుద్ధి, రాజత్వ చిహ్నములు కానరావని చెప్పుటకు వీలులేదు. అయినను సమగ్ర దృష్టితో చూచినప్పుడు ఆ కాలమునాటి చరిత్రను తెలిసికొనుటకు ఇవి విశేషముగా ఉపకరించగలవు. ఇట్టి ముస్లిమ్ చరిత్రకారులలో అగ్రగణ్యుడు ఫెరిష్టా [చూ.]. 17 వ శతాబ్ది ప్రారంభములో ఈయన బిజాపూర్‌లో తన రచనను సాగించెను. భారతదేశములో మహమ్మదీయ పరిపాలనను గురించి సప్రమాణమైన ఒక మహా చరిత్ర గ్రంథమును ఈయన రచించెను. ఈ ఉద్గ్రంథమే భారత దేశములోని ముస్లిమ్ పరిపాలనకు సంబంధించి ఎల్ఫిన్‌స్టన్ రచించిన చరిత్రకు మూలము.

కే. ఏ. ఎన్. శాస్త్రి.

**చర్చిల్, విన్స్టన్ లియోనార్డ్ స్పెన్సర్** (1874 - 1965) : బ్రిటిష్ రాజనీతి దురంధరుడు. బ్రిటిష్ ప్రధాన మంత్రి (1940 - 1946; 1951 - 55). ఆక్స్‌ఫర్డ్ షైర్ నందలి 'బ్లెన్ హీమ్ పేలస్' లో జన్మించెను. బ్రిటన్‌కు కోశాధ్యక్షుడుగా పనిచేసిన లార్డ్ రెండాల్ఫ్ చర్చిల్ ఇతని తండ్రి. ఈతని తల్లి యునైటెడ్ స్టేట్స్‌వాసి.



విన్‌స్టన్ లియోనార్డ్ స్పెన్సర్ చర్చిల్ (1874 - 1965)

ఇతడు 1895 లో పట్టభద్రుడై, 1905 లో సైన్యమున ప్రవేశించి దక్షిణ ఆఫ్రికా, భారత దేశము లందలి బ్రిటిష్ సైనిక దళములలో పనిచేసి, తరువాత రాజీనామా ఇచ్చి, పత్రికా విలేఖరి వృత్తిని స్వీకరించి, బోయర్ యుద్ధము [చూ.]న యుద్ధవార్తా విలేఖరిగ కొంతకాలము వ్యవహరించెను. రాజకీయరంగమున ఇతడు 1900 లో కాలిడి, తొలుత కన్సర్వేటివ్ పార్టీ తరపున పార్లమెంట్ సభ్యుడు అయ్యెను. కాని, 1903 లో ఆ పార్టీనుండి తొలగి లిబరల్ పక్షమున చేరెను. 1914 లో ప్రథమ ప్రపంచ యుద్ధము వచ్చినపుడు ఇతడు బ్రిటిష్ ప్రభుత్వమున 'నౌకాధ్యక్షుడు (ఫస్ట్ లార్డ్ ఆవ్ ది అడ్మిరాలిటీ)' గ ఉండెను. కాని, ఆ యుద్ధమున కలిగిన నౌకాదళ పరాజయములకు తానే నైతికముగ బాధ్యుడనని తలచి అతడు 1915 లో రాజీనామా ఇచ్చెను. తిరిగి 1916 లో లాయిడ్ జార్జి మంత్రివర్గమున సభ్యుడైనను, ఆ మంత్రివర్గము 1923 లో పతనమగుటతో అతడు తన పదవిని కోల్పోయెను. ఆ తరువాత అతడు రెండు పర్యాయములు పార్లమెంట్‌నకు సోషలిస్ట్ వ్యతిరేక అభ్యర్థిగ నిలువబడినను గెలువజాలకపోయెను. తుదకు మరల కన్సర్వేటివ్‌ల కోరికపై ఆ పక్షమునచేరి పార్లమెంట్ సభ్యుడై కోశాధ్యక్షుడుగ 1929 వరకు వ్యవహరించెను.

నాజీ జర్మనీనుండి ఆపద కలుగనున్నదని హెచ్చరించుచు చర్చిల్ అనేక ప్రసంగములు 1933 - 38 లో చేసెను. కాని, ఆతని మాట ఎవ్వరును లక్ష్యము చేయలేదు సరికదా హేళన చేసిరి. కాని, అతడు చెప్పినటులనే నాజీ జర్మనీ మూలమున ద్వితీయ ప్రపంచ యుద్ధము ప్రారంభమయ్యెను. 24 ఏండ్ల అనంతరము చర్చిల్ మరల నౌకాదళమునకు ఆధిపత్యము వహించెను. చివరకు 1940 లో చాంబర్లిన్ రాజీనామా ఇచ్చిన పిమ్మట చర్చిల్ ప్రధాన మంత్రి అయ్యెను.

బ్రిటిష్ చరిత్రలోని అత్యంత విపత్కర తరుణములో ప్రధానియై, ఇతడు అచంచల ధైర్యముతో ప్రజాస్వామ్యమును రక్షించగలిగెను.

రూజ్‌వెల్ట్, స్టాలిన్ [చూ. క్రిమియా సమావేశము, టెహరాన్ సమావేశము] లతో సమావేశములు జరిపి ఐక్యరాజ్య సమితి నిర్మాణమున చర్చిల్ ప్రముఖపాత్ర వహించెను. యుద్ధానంతరమున జరిగిన ఎన్నికలలో తన పక్షము ఓడిపోవుటచే, చర్చిల్ ప్రతిపక్ష నాయకుడు అయ్యెను. కాని, మరల ఎన్నికలలో గెలిచి, ప్రధానియై, వార్థక్యము వలన పార్టీ నాయకత్వమునుండి వైదొలగి, ప్రధాని పదవికి 1955 లో రాజీనామా ఇచ్చెను.

రాజకీయవేత్తగానే కాక, రచయితగా కూడా చర్చిల్ చాల ప్రఖ్యాతి పొందినాడు. ఇతడు రచించిన ప్రథమ ప్రపంచ యుద్ధ చరిత్ర, ద్వితీయ ప్రపంచ యుద్ధ చరిత్ర మున్నగునవి ప్రసిద్ధ గ్రంథములుగ ఎంచబడుచున్నవి. ప్రపంచ చరిత్రలో ప్రజాస్వామ్య పరిరక్షకులలో ఒకడుగ అజరామర స్థానము ఆర్జించిన చర్చిల్‌నకు దురదృష్ట వశమున భారతదేశ స్వాతంత్ర్యము అనిన గిట్టెడిదికాదు. భారతదేశ స్వాతంత్ర్యమును ఇతడు తుదివరకు ప్రతిఘటించెను. తుదకు యుద్ధానంతరము ఈతని ప్రభుత్వము ఓడిపోయి, కార్మిక పక్ష ప్రభుత్వము ఏర్పడినపుడు మాత్రమే భారతదేశ స్వాతంత్ర్యమునకు బ్రిటన్ తన ఆమోదముద్ర ఒసగ గలిగెను. గి. వేం. సీ.

**చాంద్ బీబి** : భారతదేశ చరిత్రలో పేరొందిన వీర వనిత. ఈమె నిజాంషాహి వంశమున మూడవ రాజగు హుసేన్ నిజాంషా (1554 - 1565 ప.) యొక్క ముద్దుల కూతురు. బిజాపుర రాజ్యము ఏలిన ఆదిల్ షాహి వంశములోని నాల్గవ రాజగు అలీ ఆదిల్ షా పట్టపురాణి. రక్కసి - తంగడి యుద్ధానంతరము (1565) ఈమె భర్త అలీ ఆదిల్ షా మిక్కలి భోగలాలసుడై పరిపాలన విషయములను ఎంతమాత్రము సరకు చేయకుండినందున 1580 లో ఒక దినమున అతడు అజాగ్రత్తగ ఉన్న సమయమున ఒక కొజ్జా అతనిని తుదముట్టించెను. అలీ అనంతరము రాజైన ఇబ్రహీమ్ ఆదిల్ షా బాలుడు అగుటచే, పెత్తల్లి (పెదతండ్రి భార్య) అగు చాంద్ బీబి రాజకార్యముల నెరపుచుండెను. మంత్రుల నియామకమున ఈమె అవలంబించిన విధానము వలన ఈమె సర్దార్‌లలో రెండు పక్షములు ఏర్పడెను. ఈ అదనుచూచి నిజామ్, కుత్బ్‌శాహీలు దండెత్తి రాగా, ఈమె చతురతతో రెండు పక్షములకు ఐక్యమత్యము

కుదిర్చి, అబ్దుల్ హాసన్ అను వానిని ప్రధానిగ నియమించి, శత్రువులు మరలిపోవునటుల చేసెను. కాని, ఈ ప్రధానిని త్వరలోనే దిల్వర్ ఖాన్ అనువాడు తుదముట్టించి తానే ప్రధానియై చాందిబీబిని ఎక్కడికైన పంపించినగాని తన అధికారము పూర్తిగ చలామణీ అగుటకు వీలుండదని ఇబ్రహీమ్ ఆదిల్‌షా చెల్లెలగు ఖడీజా సుల్తానాను, మూర్తిజా నిజాంషా కుమారుడగు మిరాన్ హుసేనుకు వివాహమొనర్చి 1581 - 82 లో చాంద్ బీబిని ఖడీజా సుల్తానాకు తోడుగా ఉండుటకుగాను అహ్మదు నగరమునకు పంపివైచెను.

ఆమె అహ్మదు నగరమునకు పోయిన సమయము ఎట్టిదో కాని, అక్కడ కూడ బిజాపురములోవలె ప్రభుత్వాధికారమునకై సర్దారులలో పోట్లాటలు, సింహాసనమునకై రాజవంశీయులలో హత్యలు, ప్రతి హత్యలు జరుగుట చూచి, 1598 - 99 లో మొగల్ సేనలు అహ్మదు నగరముపై దండెత్తి వచ్చి ఆ నగరమును పట్టుకొన విశ్వ ప్రయత్నములు చేసినవి. అట్టి తరి చాంద్ బీబి వీర విహారము చేయుచు, విశ్వరూపిణియై అహ్మదు నగర కోటను రక్షించెను. మొగల్ సేనలు కష్టపడి ఒక బురుజును మాత్రము ప్రేల్చి దారిచేసికొని లోపలికి చొరబడగా, నిజామ్‌షా సేనలు పారిపోదొడగెను. అపుడు చాంద్ బీబి కవచమును తొడిగి, మొగముపై ముసుగువేసికొని, చేత ఖడ్గముధరించి తన సైన్యమునకు ధైర్యము చెప్పుచు, పడిపోయిన బురుజు వైపుకు పరుగెత్తెను. అట్టి ఈమె వీరవిహారమును చూచి నిజామ్‌షా సేనలు ద్విగుణీకృతమైన ఆవేశముతో శత్రువులకు సందివ్వక పోరినవి. అప్పటి ఈమె శౌర్యమునకు అచ్చెరువంది మురాద్ (మొగల్ సేనాధికారి) అట్టి వీరనారిని ఓడించుట దుస్తరమని గ్రహించి మాకు బిరార్ ప్రాంతము ఇచ్చిన మేము ముట్టడి విడిచి వెళ్లెదమని చాంద్ బీబికి కబురు అంపెను. వేరు సహాయమువచ్చు లక్షణములు ఏవియు లేనందున, చాంద్ బీబియు మొగల్‌లకు బిరార్ ప్రాంతము ఇచ్చి సంధి చేసికొనెను. కడకు అక్బర్ [చూ. పు. 260] 1599 - 1600 లో స్వయముగా దక్కన్‌కు దండెత్తి వచ్చి, కొడుకగు సుల్తాన్ డాన్యల్‌ను అహ్మదు నగరముపైకి పంపెను. అపుడు నిజామ్‌షాహి వ్యవస్థ చక్కగా లేనందునను, తన మాట వినువారు ఎవ్వరు లేనందునను, చాంద్ బీబి బాలరాజును తీసికొని జున్నర్ అను పల్లెకుబోవ నిశ్చయించెను. అది తెలిసిన హమీద్‌ఖాన్ అనువాడు చాంద్ బీబి పగవారికి రాజ్యము ఇచ్చుచున్నదని తప్పుడు ప్రచారము చేయగ విశ్వసించి దక్కన్ తురకలు చాంద్ బీబి అంతఃపురము చొచ్చి ఆమెను 1600 లో చంపివేసిరి. ఒక చరిత్రకారుడు వ్రాసినట్లు ఈమెవంటి స్త్రీలు అరుదు. దక్షిణ భారత దేశమందు ఉద్భవించిన పరాక్రమవతులలో ఈమె ఒకతె

షేర్వానీ.

**చాణుక్యుడు :** చూ. కౌటిల్యుడు పు. 411.

**చాద్ :** మధ్య ఆఫ్రికా యందలి ఒక స్వతంత్ర రాజ్యము.




ఈ దేశమునకు సుడాన్ [తూ]; సెంట్రల్ ఆఫ్రికన్ రిపబ్లిక్ [ద]; కామెరూన్, నైజీరియా, నైజర్ [ప]; లిబియా [ఉ] సరిహద్దులుగ ఉన్నవి. [వి] 12,84,000 చ. కి. మీ.; [జ] 27,20,000. దేశ జనులు ప్రప్రథమమున నీగ్రోజాతుల వారలే అయినను, అరబ్బులు మొదలగు పరజాతుల వలన మూలమున ఒక విధమగు మిశ్రజాతి ఇచ్చట రూపొందినది. [మ] దేశపు ఉత్తరార్ధమున ఇస్లామ్ విరివిగ వ్యాప్తియందు ఉన్నది. దక్షిణమున ప్రాచీన సంప్రదాయపు ప్రకృతి దేవతారాధన విపులముగ వ్యాప్తియందు ఉన్నది. [భా] వివిధ ఆఫ్రికన్ భాషలు ఇచట వివిధ వర్గములలో వ్యాప్తియందు ఉన్నవి. ఉత్తరమున మాత్రము వివిధ భాషల వారికిని అరబ్బీ భాష సామాన్య భాషగ వ్యవహృతము అగుచున్నది. పరిపాలన వ్యవహారములకును, పాఠశాలలో బోధనకును ఫ్రెంచి భాష ఉపయోగింపబడుచున్నది. [రా] ఫోర్ట్ లామీ (జ. సం. 58,179).

చరిత్ర : యూరప్ వాసులు ఈ దేశమును ప్రపంచ దృష్టికి గొనితెచ్చువరకు, ఈ దేశమున జరిగిన చారిత్రక విశేషములను గురించి మనకు ఏమియు తెలియరాకున్నది. బోర్నూ, అదమైవా, బగ్విర్మి, వాడై అను పేరులు గల గొప్ప ఆఫ్రికన్ సామ్రాజ్యములు ఇట ఒకదానివెనుక

ఒకటి వర్ధిల్లెనని చెప్పబడుచున్నను, అవి అన్నియు 19 వ శతాబ్దాంతము నాటికి నామమాత్రావశిష్టములయినవి. 1822 లో బ్రిటిష్ దేశాన్వేషకులు డెన్‌హామ్, క్లాపర్టన్ అను వారలు తొలుత ఈ దేశమున కొంత భాగమున పర్యటించి వివరములను తెలిపిరి. తరువాత బార్త్ (1853), నక్టిగల్ (1870 - 71) అను అన్వేషకులు మరికొన్ని వివరములు కనుగొనిరి. 19 వ శతాబ్దపు కడపటి దశకమున ఫ్రెంచివారు తమ ఆధిపత్యమును ఈ ప్రాంతమున నెలకొల్పుటకు యత్నించిరి. కాని, చాద్ ప్రజలలోని వివిధ తెగలవారును వీరిని ఎదుర్కొని పోరాడిరి. ఈ తెగల నాయకులను అడచి, కడకు 1913 నాటికి ఫ్రెంచివారు దేశీయులగు పరిపాలకులతో కుదుర్చుకొనిన ఒడంబడికల ద్వారా దేశమున తమ ఆధిపత్యమును సుస్థిరము ఒనర్చుకొనిరి. ప్రథమ, ద్వితీయ ప్రపంచ యుద్ధముల మధ్య కాలమున దేశము ఆర్థికాది విషయములందు ఫ్రెంచివారి నాయకత్వమున కొంత పురోగమింపగలిగెను. ద్వితీయ ప్రపంచ యుద్ధ కాలమున ఫ్రెంచి దేశము శత్రువుల వశమై, అచటి ఫ్రెంచి ప్రభుత్వము జర్మనులచేతి కీలుబొమ్మ అయినపుడు వారిని ధిక్కరించి వలసపోయిన స్వతంత్ర ఫ్రెంచి ప్రభుత్వ పక్షముననే ఈ దేశము ఉండునటుల అప్పటి ఫ్రెంచి గవర్నర్ చేయగలిగెను. 1945 లో ఫ్రెంచి ఈక్వటోరియల్ ఆఫ్రికాలో ఒక భాగముగ ఫ్రెంచి యూనియన్‌నందు ఈ దేశము భాగస్వామ్యము వహించెను. 1958, సెప్టెంబరు 28 న జరిగిన జనవాక్యసేకరణ ఫలితముగ ఫ్రెంచి కమ్యూనిటీలో సభ్యత వహించు స్వతంత్ర ప్రతిపత్తి గల గణరాజ్యముగ ఉండుటకు ఈ రాజ్యము నిర్ణయించుకొనెను.

**రాజ్యాంగము :** 1920 నుండి 1958 వరకు ఫ్రెంచి ఈక్వటోరియల్ ఆఫ్రికాలో అంతర్భాగముగ ఈ దేశము ఉండెను. 1958 నుండి పైన పేర్కొనినటుల ఫ్రెంచి కమ్యూనిటీలోని స్వతంత్ర రాజ్యముగ ఈ దేశము పరిణతి నందినది. ఫ్రెంచి కమ్యూనిటీ సభ్యత్వము వలన చేకూరిన బాధ్యతలకు లోబడి 1959, మార్చి 31 తేదీన ఆమోదితమగు రాజ్యాంగ విధానమును అనుసరించి ప్రజాపరిపాలన ఈ దేశమున అమలునందు ఉన్నది. దీనిని అనుసరించి శాసనాధికారము అసెంబ్లీ లెజిస్లేటివ్ అను శాసన సభయందు న్యస్తమై ఉన్నది. అయిదేండ్లకు ఒక పర్యాయము అపరోక్ష, రహస్య, సార్వజనిక వయోజన పద్ధతిలో జరుగు ఎన్నికను అనుసరించి ఈ అసెంబ్లీకి 85 గురు సభ్యులు ఎన్నుకొనబడుచున్నారు. అధిక సంఖ్యాక పక్షపు నాయకుడు దేశాధ్యక్షుడుగ ఎన్నుకొనబడును. ఈతడే ప్రధానిగ సైతము అధికారము వహించి, 15 మంది సభ్యులు గల మంత్రి మండలిని నియమించుకొనును. చీ. శే. రా.

**చానెల్ దీవులు :** యూరప్ ఖండపు ముఖ్య భూభాగమునుండి బ్రిటిష్ ద్వీపములను వేరుచేయు ఇంగ్లీషు చానెల్ నందున్న దీవులు. బ్రిటిష్ మకుటాధిపత్యమునకు లోబడి, ఆంతరంగిక స్వపరిపాలనము కలిగిన రెండు రాజ్యములుగ ఇవి ఏర్పరుపబడినవి.

1. జెర్సీ ద్వీపము [వి]. 117 చ. కి. మీ.; [జ]. 63,345. [మ] రోమన్ కేథలిక్ క్రైస్తవులు. [భా] ఫ్రెంచి. [రా] సెయింట్ హీలియెర్ (జ. సం. 26,484).

2. గ్వెర్న్‌సీ ద్వీపరాజ్యము. దీనిని ఆశ్రయించిన కొన్ని చిన్న ద్వీపములును ఈ రాజ్యమున చేరి ఉన్నవి. వానితో సహా [వి] 77·7 చ. కి. మీ.; [జ] 47,158. [మ] క్రైస్తవులు. [భా] ఇంగ్లీషు. [రా] సెయింట్ పీటర్ పోర్ట్ (జ. సం. 15,707)

**చరిత్ర :** అతి ప్రాచీనకాలమునుండియు జనావాసితములై ఉండిన ఈ దీవులందు క్రైస్తవ మతము 5 వ శతాబ్దిలో ప్రవేశపెట్టబడినది. తొలుత కొంతకాలము ఫ్రెంచి రాజ్యాంతర్భాగమగు నార్మండీలో చేరి ఉండిన ఈ రాజ్యములు 12 వ శతాబ్ద్యంతమున బ్రిటిష్ ప్రభువుల వశములైనవి. తదాది ఇవి బ్రిటిష్‌వారి పాలనలోనే ఉన్నవి. ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున 1940 లో జర్మనులు ఈ దీవులను వశపరచుకొనిరి. కాని, యుద్ధానంతరము బ్రిటిష్‌వారి ప్రభుత్వము ఇట మరల స్థాపింపబడెను. ఈ రెండు రాజ్యములకు ఆంతరంగిక స్వపరిపాలనము కలదు. ప్రజలచే ఎన్నుకొనబడిన శాసనసభల సాయముతో వీనియందు పరిపాలనను బ్రిటిష్ ప్రభుత్వముచే నియుక్తులగు గవర్నర్‌లు నిర్వహించుచున్నారు. చీ. శే. రా.

**చార్లెస్ - I (1600 - 1649) :** ఇంగ్లండు, ఐర్లాండ్‌ల రాజు. జేమ్స్-I కుమారుడు. 1600, నవంబరు 19 న జన్మించెను. అన్న అయిన హెన్రీ చనిపోయిన వెంటనే ఇతడు యువరాజై, సింహాసనమునకు వారసుడు అయ్యెను. 1625 లో రాజ్యమునకు వచ్చెను. నాటినుండి 1629 వరకు పార్లమెంట్‌తో నిరంతర వైరముతో మునిగి ఉండెను. 1629 లో పార్లమెంట్‌ను రద్దుచేసి, పదకొండు సంవత్సరముల కాలము నిరంకుశముగ పరిపాలించెను.

కాని, 1639 లో స్కాట్‌లాండ్‌తో యుద్ధము సంభవించెను. ధనాగారము కాళీ అగుటతో పార్లమెంట్‌ను సమావేశపరచక తప్పినది కాదు. కాని, పార్లమెంట్ పన్నులు మంజూరుచేయ నిరాకరించినది. రాజు దానిని రద్దు చేసెను. దీనినే స్వల్పకాలపు పార్లమెంట్ అందురు. చార్లెస్ ఆ సంవత్సరమే దీర్ఘకాలపు పార్లమెంట్‌ను

సమావేశపరచెను. ఈ పార్లమెంట్ రాజుకు కుడిభుజము వంటివాడయిన స్ట్రాఫర్డ్‌ను ఉరితీయించెను. చివరకు చార్లెస్ అనేక సంస్కరణలకు అంగీకరింపవలసి వచ్చినది.

కాని, ఒకనాడు పార్లమెంట్‌లో తనకు వ్యతిరేకులైన ఐదుగురు సభ్యులను బంధించుటకు స్వయముగ పార్లమెంట్‌నకు వచ్చుటతో రాజునకు, పార్లమెంట్‌నకు మధ్య వైరము విపరీతముగ పెరిగినది. ఆ ఐదుగురు సభ్యులును తప్పించుకొని పోయిరి. పరిస్థితులు విషమించుటతో 1642, జనవరిలో చార్లెస్ లండన్‌నగరమును విడిచి పారిపోయెను. ఆగస్టు నెలలో దేశమున అంతర్యుద్ధము ప్రారంభమయ్యెను.

మొదటి రెండు పోరాటములలో రాజుపక్షమే విజయము గాంచెను. కాని, 1644 లో మార్‌స్టన్‌మూర్ వద్ద పార్లమెంట్ సైన్యములు విజయము పొందినవి. 1645 లో నేజ్‌బీ వద్ద పోరాటమునందు చార్లెస్ ఘోరాపజయమును పొందెను. చార్లెస్ వెళ్ళి స్కాట్‌లాండ్ వారికి పట్టుబడెను. కాని, వారు అతనిని ఇంగ్లండు పార్లమెంట్‌కు అప్పగించిరి. పార్లమెంట్ అతనిని దేశద్రోహముకై విచారించి, మరణదండన విధించెను. చార్లెస్ 1649, జనవరి 30 న మరణశిక్ష పాలయ్యెను [చూ. క్రామ్‌వెల్, ఆలివర్ - పు. 413] గి. వేం. సీ.

**చార్లెస్ - V** (1500 - 1558): పవిత్ర రోమన్ చక్రవర్తి. జర్మనీని, స్పెయిన్‌ను కూడా ఇతడు పాలించెను. స్పెయిన్ రాచరికమున చార్లెస్ పేరుగల వారిలో మొదటి వాడగుటవలన స్పెయిన్‌దేశ చరిత్రయందు ఇతడు చార్లెస్ - I గ పరిగణింపబడుచున్నాడు [చూ. స్పెయిన్].

పవిత్ర రోమన్ చక్రవర్తి అగు మాక్సిమిలియన్ [చూ.] నకు ఇతడు పౌత్రుడు; ఫిలిప్స్ రాజునకు కుమారుడు. తండ్రియగు ఫిలిప్ 1506 లో మరణింపగ ఇతనికి బర్గండీ, నెదర్‌లండ్స్ రాజ్యభాగములు సంక్రమించినవి. మాతామహుడగు స్పెయిన్‌రాజు పుత్రులు లేకుండా మరణించుటచే దౌహిత్రుడగు ఇతనికే స్పెయిన్‌రాజ్యము కూడ సంక్రమించెను (1518). తరవాత 1519 లో పితామహుని మరణానంతరము ఈతనికి పవిత్ర రోమన్ సామ్రాజ్య చక్రవర్తిత్వము లభించెను. స్పెయిన్ రాచరికము మూలమున ఇతడు ఆసియా, అమెరికా, ఆఫ్రికాఖండముల లోని స్పానిష్ వలస రాజ్యములకును ప్రభువయ్యెను.

చార్లెస్ ఆరితేరిన యోద్ధ; ధీరుడు; యుద్ధతంత్రజ్ఞుడు. యుద్ధసమయములందు సేనలకు స్వయముగ నాయకత్వము వహించి, వ్యూహరచన సాగించి సేనల నడిపెడివాడు. చక్రవర్తిత్వ విషయమున ఫ్రెంచిరాజయిన ఫ్రాన్సిస్‌తోడను, అతని కుమారుడైన హెన్రీ - II తోడను ఇతడు పలుమారు పోరాడవలసి వచ్చెను. ఈ యుద్ధములు 1521 నుండి 1556 వరకు ఎడనెడ సాగినవి. కడకు 1551 - 56 వరకును జరిగిన యుద్ధమున ఫ్రాన్స్‌కే విజయము చేకూరెను. కాని, చార్లెస్ మరణానంతరము అతని కుమారుడు ఫిలిప్ - II యుద్ధము కొనసాగించి, ఫ్రాన్స్‌ను ఓడించి విజయమును ఆర్జించెను.

ఇటలీలో కూడ చార్లెస్‌ను క్లిష్టపరిస్థితులు ఎదుర్కొనినవి. 1525 లో పోప్‌గ ఉండిన క్లెమెంట్ - VIII ఇటలీలో చార్లెస్‌కు గల పలుకుబడిని పోగొట్టుటకు ప్రయత్నించెను. అందుకు కోపోద్రిక్తుడై చార్లెస్ 1527 లో రోమ్‌ను ముట్టడించి, కొంతభాగమును తగులబెట్టి పోప్‌ను బంధించెను. అంతట పోప్ శరణాగతుడై బార్సెలోనా వద్ద సంధి చేసికొనెను (1529). ఆనాటినుండి పోప్ అధికారము నామమాత్రమేయై మత విషయములలో కూడ చార్లెస్‌దే పైచేయి అయినది.

చార్లెస్ రోమన్ కేథలిక్ సంప్రదానుయాయి ఐనను మతసహనము కలవాడు. కనుక, అతని పాలనలో ప్రొటెస్టంట్‌లకు కొంత స్వాతంత్ర్యమును, కొన్ని హక్కులును లభించినవి.

డాన్యూబ్‌నదిని దాటి పశ్చిమ యూరప్‌పై దండెత్తిన తుర్కులను 1526 - 38 లో ఎదిరించి చార్లెస్ విజయము పొంది, వారి పురోగమనమును అరికట్టగలిగెను. 1535 లో ఆఫ్రికాలోని ట్యునిస్‌ను ఆక్రమించి తుర్కులను వెడలగొట్టెను.

జర్మనీలో చిన్నరాజ్యముల స్వాతంత్ర్యములను అడచి, పటిష్ఠతగల కేంద్రప్రభుత్వమును స్థాపించుటకు ఇతడు 1546 నుండి కృషి చేసెను. కాని, ఫ్రాన్స్ జోక్యమువలన అందు కృతకృత్యుడు కాలేకపోయెను.

ఇతని పరిపాలనాకాలమున కళలకును, సాహిత్యమునకును విరివిగ పోషణ లభించెను. దేశమున సుస్థిర ప్రభుత్వము ఏర్పడుటవలన వ్యాపారమునకు ఎక్కువ ప్రోత్సాహము అబ్బెను.

రాజ్యభారమువలన విసుగుచెందిన చార్లెస్ 1555 లో రాజ్యపరిత్యాగము చేసెను. స్పెయిన్‌దేశమునకును, దాని వలసలకును నేపిల్స్, మిలాన్, బర్గండీ, నెదర్‌లండ్స్‌లకును తన కుమారుడు ఫిలిప్ - II ను రాజుగను, తక్కిన రాజ్యభాగములకు తన తమ్ముడు ఫెర్డినాండ్ - I ను రాజుగను చేసి తన చక్రవర్తిత్వపదవిని తమ్ముడగు ఫెర్డినాండ్‌కే ఇచ్చి, చార్లెస్ ఒక మఠమున తన జీవితశేషమును గడపెను. గి. వేం. సీ.

**చాళుక్య చోళులు :** చూ. సం 3 - పు. 191.

**చాళుక్యులు, కల్యాణి :** చూ. సం 3 - పు. 182.

**చాళుక్యులు, బాదామి :** చూ. సం. 3 - పు. 133

**చిత్తరంజన్ దాస్** (1870 - 1925) : భారత రాజనీతివేత్త ; స్వరాజ్య పార్టీ వ్యవస్థాపకుడు ; అఖండ త్యాగి. కలకత్తాలో ఉన్నత కుటుంబమునందు జన్మించెను. కలకత్తాలోను, లండనులోను విద్యాభ్యాసముచేసి, బారిస్టర్ పట్టము పొందెను (1894). న్యాయవాదిగా కలకత్తాలో అఖండ ప్రఖ్యాతిని, అపార ధనమును ఆర్జించెను. అరవింద ఘోష్‌పై మోపబడిన కుట్రకేసులో ఆయన పక్షమున న్యాయవాదిగా ఈయన తన ప్రతిభాపాటవములను పరాకాష్ఠను పొందించెను. 1919 లో దాస్ న్యాయవాద వృత్తిని విసర్జించి, కాంగ్రెస్‌లో ప్రవేశించి, మహాత్ముని ముఖ్య అనుచరుడుగా స్వాతంత్ర్యోద్యమములో పాల్గొని అచిరకాలముననే బెంగాల్‌నకు ఏకైక నాయకుడు అయ్యెను. 1922 లో గయా కాంగ్రెస్‌కు అధ్యక్షత వహించి, కాంగ్రెస్‌వాదులు శాసన సభలను బహిష్కరించుటకంటె, వాటిలో ప్రవేశించి ప్రభుత్వ కార్యకలాపములను ప్రతిష్ఠంభింపజేయుట శ్రేయోదాయకమని దాస్ వాదించెను. పై విధానమున తన్ను బలపరచిన మోతీలాల్ నెహ్రూ [చూ.] తోను, లజపతి రాయ్ [చూ.] తోను కలసి 1923 లో 'స్వరాజ్య పార్టీ' ని సంస్థాపించెను. 1923 ఎన్నికలలో పాల్గొని బెంగాల్ శాసన సభలో కాంగ్రెస్ పక్షమునకు నాయకుడై, ఈయన స్వతంత్ర, ముస్లిమ్ సభ్యులను కూడగట్టుకొని మంత్రుల జీతాల బిల్లును శాసన సభచే త్రోసివేయించెను (1924). లార్డ్ లిట్టన్ ఎరచూపిన మంత్రి పదవిని ఈయన తృణీకరించుటచేతను, శాసన సభలో ఈయనకు సంఖ్యాబలము ఉండుటచేతను ఆ రాష్ట్రములో ద్వంద్వ ప్రభుత్వపద్ధతి తాత్కాలికముగ నిలుపుదల చేయబడవలసివచ్చెను. 1924 లో ఈయన కలకత్తా మేయర్‌గా ఎన్నుకొనబడెను. క్షీణించిన తన ఆరోగ్యమును మెరుగుపరచుకొనుటకు డార్జిలింగ్‌నకు పోయి అచ్చట దివంగతుడయ్యెను. నేతాజీ సుభాష్ బోస్ [చూ.] అంతటివాడు చిత్తరంజన్ దాస్ తనకు రాజకీయ గురువు అని చెప్పుకొనెను.

రచయితగా, కవిగా, పత్రికా సంపాదకునిగా కూడ ఈయన ప్రసిద్ధికెక్కెను. 1895 లో దాస్ "మలాంకా" అను పద్య కావ్యమును ప్రచురించెను. కాని 'సాగర్ సంగీతమ్' అనునదియే ఆయన కవితా ప్రతిభకు నికషోపలము. 1915 లో దాస్ 'నారాయణ' అను మాస పత్రికను స్థాపించెను ; తరువాత 'ఫార్వర్డ్' అను ప్రముఖ దిన పత్రికను స్వయం సంపాదకత్వముక్రింద చాలాకాలము ప్రచురించెను.

ఆ. వెం.

**చిత్తోడు :** భారతదేమున రాజస్థాన్ రాష్ట్రమునందలి ఒక ప్రాచీన దుర్గము. ముస్లిమ్ ప్రభువుల దండయాత్రలను ఎదుర్కొని దీర్ఘకాలము నిలువగలిగినది. 15 వ శతాబ్దిలో ఢిల్లీ సుల్తానుల సామ్రాజ్యమునందలి మండలములు బలముగల పరిపాలకుల సమర్థతవల్లస్వతంత్ర రాష్ట్రములు అగుచుండెను. అట్టి మండలములలో ముఖ్యమైనది ఒకటి మాల్వామండలము. 1436 - 69 లో మాల్వామండలము అధిపతి మహమూద్ ఖిల్జీ. ఇతడు తన మండలమును స్వతంత్ర రాజుగ పరిపాలించుటకును, తన మండలమునందలి రాజపుత్రులను పూర్తిగ వశపరచుకొనుటకును జైత్రయాత్రలు సలుపుచు చిత్తోడు రాణాను లోబరచుకొనుటకు దాడివెడలెను. అప్పుడు జరిగిన యుద్ధములో చిత్తోడు మహమూద్ ఖిల్జీకి వశము కాలేదు. కనుక, తమకే విజయము చేకూరినదని రాణా తలచి, చిత్తోడులో విజయగోపురము కట్టించెను. యుద్ధములో అనేక రాజపుత్రులను చంపివచ్చుటే తనకు విజయము చేకూరినట్లుగ భావించి, మహమూద్ ఖిల్జీ కూడ మాండూ నగరమునందు ఒక విజయగోపురమును కట్టించెను.

* * *

**చియాంగ్ - కై - షేక్** (జ 1886): చీనా జాతీయ నాయకుడు ; కోమింగ్‌టాంగ్ అధినేత. చియాంగ్ చుంగ్ చెంగ్ అనియు ఇతనికే మరొకపేరు కలదు. జపాన్‌లో ఒక మిలిటరీ అకాడమీలో పట్టభద్రుడయ్యెను ; 1911 చీనా విప్లవములో పాల్గొని, ఇతడు 1913-1916 లలో యువాన్ షికాయీ ప్రభుత్వమును కూలద్రోయుటకు విఫల ప్రయత్నము చేసెను సన్‌యత్‌సేన్‌చే ప్రభావితుడై చియాంగ్ అతని ముఖ్యానుచరులలో ఒకడు కాగలిగెను. కేంటన్‌లో ప్రభుత్వమును స్థాపించిన సన్‌యత్‌సేన్‌కు సైనిక సలహాదారుడుగ వ్యవహరించి (1917). ఇతడు కేంటన్ ప్రభుత్వమునకు సహాయమును అర్థించుటకై సోవియట్ రష్యాను సందర్శించి (1923), తరువాత వాంపోవా సైనిక పాఠశాలను నెలకొల్పి, దానికి ప్రధానాధ్యాపకత వహించెను. సన్‌యత్‌సేన్ మరణానంతరము (1925) న కోమింగ్‌టాంగ్‌లో ప్రాబల్యమును ఆర్జించి, 1926 లో చియాంగ్ ఉత్తర దండయాత్రచేసి హాంకావ్, షాంఘై, నాన్‌కింగ్ నగరములను వశము చేసికొనెను. తొలుదొల్త అతడు సన్‌యత్‌సేన్ విధానమును అనుసరించి, చీనా కమ్యూనిస్టులతో సహకరించి, సోవియట్ రష్యా సహాయమును స్వీకరించెను. కాని, 1927 లో ఆ విధానమును తలక్రిందులు చేసి, కమ్యూనిస్టులతో అంతర్యుద్ధమునకు దిగెను. ఆ

కల్లోలము ఫలితముగ అధికార కేంద్రమును అతడు నాన్ కింగ్‌నకు తరలించెను. ఆ సంవత్సర తృతీయపాదమున అతడు పదవిని పరిత్యజించి, ఆ సంవత్సరాంతమున సన్ యత్ సేన్ మరదలగు మేలింగ్‌సూంగ్‌ను పెండ్లాడి, కోమింగ్‌టాంగ్‌లోని ఉన్నత వర్గముల ప్రాపును ఆర్జించెను. 1928 లో మరల నాన్ కింగ్ సైన్యమునకు అధిపత్యమును వహించి, పెకింగ్ నగరమును లోగొని, చీనాజాతీయ ప్రభుత్వమును ఏర్పరచి అధ్యక్షుడయ్యెను. 1931 లో అతడు ఆ పదవిని లిన్ సెన్ అను తన సహచరునికి అప్పగించి, కొంతకాలము ప్రధానిగ పనిచేసి, 1936 మొదలుగ జపాన్ సేనల ప్రతిఘటనపై కమ్యూనిస్టులతో రాజీపడి జాతీయ నాయకుడుగా వ్యవహరించెను. 1937 లో ఇతనికి, కమ్యూనిస్టులకును మధ్య జరిగిన ఆంశిక సంధి 1940 లో రద్దయ్యెను. ద్వితీయ ప్రపంచ యుద్ధములో జపాన్ సేనలు నాన్ కింగ్‌ను ఆక్రమించుకొనిన ఫలితముగా అధికార కేంద్రము చుంకింగ్‌కు తరలింపబడిన తరువాత 1943 లో లిన్ సెన్ మరణానంతరము ఇతడు చీనా ప్రభుత్వపు కార్య వర్గాధ్యక్షుడు అయ్యెను. చర్చిల్ [చూ.] తోను, రూజ్‌వెల్ట్ [చూ.] తోను సహా కైరో సమావేశమునకు హాజరయ్యెను. యుద్ధానంతరమున కమ్యూనిస్టులతో సమాధానము కుదుర్చుకొనలేక మరల అంతర్యుద్ధమునకు తల్పడవలసివచ్చినది; ఆ సమయముననే 1948 లో చీనా జాతీయ మహాసభచే చీనా అధ్యక్షుడుగ ఎన్నుకొనబడెను. కాని, దేశములో ధనిక వర్గముతో చేతులు కలుపుటచేత చియాంగ్ ప్రజాదరణ కోల్పోయెను. కమ్యూనిస్టులు విజయపరంపరలను సాధించి, నాన్ కింగ్‌ను పట్టుకొనుటతో (1949) ఇతడు చీనా నడిగడ్డ నుంచి ఫార్మోజాదీవికి పారిపోయి, అమెరికన్‌ల అండదండలతో అచ్చట జాతీయప్రభుత్వమును నెలకొల్పి దానికి అధ్యక్షుడయ్యెను. చీనాభాషలో ఇతని రచనలు: 1. చీనా భవితవ్యము (1947), 2. సోవియట్ రష్యా-చీనా (1957) [చూ. ఐక్యరాజ్య సమితి; చీనా; తైవాన్]. ఆ. వెం.

**చిలీ:** దక్షిణ అమెరికా యందలి ఒక స్వతంత్ర రాజ్యము.

దక్షిణ అమెరికా పశ్చిమతీరమున తీరరేఖకును, ఆండీస్ పర్వత శ్రేణికిని మధ్య ఉత్తరమునుండి దక్షిణమునకు 4,208 కి. మీ. పొడవున ఈ దేశము విస్తరించి ఉన్నది. ఈ దేశపు తూర్పు పడమరల వెడల్పు ఎచటను 353 కి. మీ. కు మించదు. ఆర్జెంటీనా, బొలీవియా [తూ]; డ్రేక్ పేసేజ్ అను పేరు గల సముద్రపు రహదారి [ద]; పసిఫిక్ మహాసముద్రము [ప]; పెరూ [ఉ] సరిహద్దులుగ ఉన్నవి. [వి] 7,41,767 చ. కి. మీ. ఈ దేశపు ఆధిపత్యమున ఉన్న ఈ క్రింది పసిఫిక్ సముద్ర దీవులును ఈ రాజ్యభాగములుగ పరిగణింపబడుచున్నవి.

1. ఈస్టర్ దీవి; 2. జాన్ ఫెర్నాండెజ్ దీవులు; 3. డీగో రామిరెజ్ దీవులు; 4. సలాయి గామెజ్ దీవి; 5. సాన్ అమ్బ్రాజియో దీవి; 6. సాన్ ఫెలిక్స్ దీవి. వీనిలో తొలుత రెండింటి యందు మాత్రమే వేయి మంది లోపుగ ప్రజలు నివసించుచున్నారు. తక్కిన వానిలో జనావాసములు లేవు. ఇవికాక, అంటార్కటికా [చూ. పు. 257] లో పడమటి రేఖాంశము 53° నుండి 90° వరకు గల పాల్మర్ (హిగ్గిన్స్) ద్వీపకల్పమను హిమభూమియంతయు తనకు చెందినదని చిలీ వాదము. కాని, ఇందు కొన్ని ప్రాంతములు తమకు చెందినవని ఆర్జెంటీనా, బ్రిటన్ వాదించుచున్నవి. [జ] 81,89,534. అమెరికన్ ఆదిమ వాసులతో స్పానిష్‌జాతి సంకర మొందిన ఫలితముగ రూపొందిన ఒక మిశ్రజాతి ఇందు అత్యధికము. అచ్చమగు యూరపియన్ జాతియు, అచ్చమగు అమెరికన్ ఆదివాసి జాతియు అల్పసంఖ్యలలో కానన గుచున్నవి. [భా] జాతీయభాష స్పానిష్; అమెరికన్ జాతుల భాషలు మాతృ భాషలుగ కలవారు సైతము స్పానిష్‌ను మాట్లాడ నేర్చి ఉందురు. [మ] నూటికి 95 మంది ప్రజలు రోమన్ కేథలిక్ క్రైస్తవులు. మిగిలిన వారిలో తక్కిన సంప్రదాయముల క్రైస్తవులే కాక, ప్రకృత్యారాధకులు అగు అమెరికన్ ఆదిజాతుల వారును కలరు. [రా] సాంటియాగో (జ. సం. 15, 00,000)




చరిత్ర: యూరోపియన్‌లు దక్షిణ అమెరికాయందు అడుగిడక పూర్వము ఇన్‌కా [చూ. పు. 323] సామ్రాజ్యమున అంతర్భాగముగ చిలీ ఉండెడిది. 16 వ శతాబ్దమున ఇన్‌కా సామ్రాజ్యమును అంతమొందించిన తరువాత స్పెయిన్‌వారు తమ ఆధిపత్యము చిలీయందు కూడ స్థాపించుటకు యత్నించిరి. కాని, దేశీయులగు ప్రజలు తీవ్రముగ ప్రతిఘటించుటచే తొలుత వీరు బియో-బియో నదికి ఉత్తరమున ఉన్న దేశమును మాత్రమే వశపరచుకొని తమ వలసల ఏర్పరచుకొనిరి. క్రమముగ వీరు దేశము అంతటిని ఆక్రమించి, దానిని స్పెయిన్ సామ్రాజ్యమున అంతర్భాగముగ చేసిరి. 1810 లో ఈ దేశము స్పెయిన్ సామ్రాజ్యమునుండి విడివడి, స్వాతంత్ర్యమును

ప్రకటించినది. ఈ స్వాతంత్ర్యోద్యమమున బెర్నార్డో ఓ హిగ్గిన్స్, జోసిసాన్ మార్టిన్ అనువారలు ప్రముఖపాత్రలు నిర్వహించిరి. వీరిలో ప్రథముడు 1818 - 23 వరకు చిలీకి నియంతగ ఉండి, దేశమును వివిధ రంగములందు అభివృద్ధి పరచెను. తరవాత చిలీదేశమున ఉండదగినది సమాఖ్యాపద్ధతి పరిపాలనయా లేదా ఏకదేశీయపరిపాలనయా అను విషయమున వివాదములు చెలరేగి, ఉభయపక్షముల మధ్య అంతర్యుద్ధమునకు దారితీసెను. 1833 లో ఏకదేశీయ పరిపాలనను అభిలషించువారు విజయులయినందువలన ఒక విధమగు కేంద్రీకృతపరిపాలన గల గణతంత్రప్రభుత్వ విధానము ప్రజల ఆమోదమును పొందెను. ఈ విధానము 1925 వరకు అమలునందు ఉండెను. ఆ సంవత్సరమున ఆరురో అలెస్సాండ్రీ పాల్మా అను అధ్యక్షుడు పూర్వపు రాజ్యాంగ విధానమును మార్పుచేసి పటిష్ఠమగు కార్యవర్గముగల ఒక నూతన ప్రభుత్వవిధానమును రూపొందించి ప్రజల ఆమోద ముద్రను పొందెను. కాని, నాటినుండి నేటివరకు చిలీలో సుస్థిరప్రభుత్వము ఏదియు నెలకొనలేదు. కుట్రకు, తిరుగుబాటుకు సోషలిస్ట్, కమ్యూనిస్ట్‌ల మధ్య తీవ్రఘర్షణకు ఈ దేశము నెలవయ్యెను. ప్రథమ ప్రపంచయుద్ధమున ఈ దేశము తటస్థముగ ఉండెను; ద్వితీయ ప్రపంచయుద్ధమున మాత్రము కడపటి ఘట్టమున చిలీదేశము మిత్రరాజ్య పక్షమున చేరెను.

రాజ్యాంగము: 1925 లో సవరణ చెందిన 1833 రాజ్యాంగ విధానమును అనుసరించి ఈ దేశమున పరిపాలన జరుగుచున్నది. దేశాధ్యక్షుడు సాధారణముగ ఆరేండ్లకు ఒక పర్యాయము ప్రజలచే సరాసరి అపరోక్షపు ఎన్నికలో ఎన్నుకొనబడును. శాసనసభయందు డిప్యూటీల ఛేంబర్, సెనేట్ అను రెండుకక్ష్యలు కలవు. రాష్ట్రములవారీగా జనాభా నిష్పత్తిని అనుసరించి, 30,000 మందికి ఒకరు చొప్పున డిప్యూటీలు ఎన్నుకొనబడుదురు. నాలుగు ఏండ్లకు ఒకసారి ఈ ఎన్నికలు జరుగును. సెనేట్‌న 45 గురు సభ్యులు ఉందురు. ఒక్కొక్క రాష్ట్రవర్గమునకు అయిదుగురు చొప్పున తొమ్మిది రాష్ట్రములనుండి వీరు ఎన్నుకొనబడుదురు. వీరి అధికారముల పరిమితి ఎనిమిదిసంవత్సరములు. అధ్యక్షుడు తన ఇచ్చవచ్చిన వారిని మంత్రివర్గ సభ్యులుగ నియమించుకొనును. డిప్యూటీ ఛేంబర్, సెనేట్‌లు చేయు తీర్మానములను వీటోచేయు అధికారము అధ్యక్షునకు కలదు. కాని, సెనేట్, ఛేంబర్‌లు కలిసి మూడింట రెండువంతుల ఆమోదముతో అధ్యక్షుని వీటోను రద్దు చేయవచ్చును. 21 ఏండ్లకు తగ్గని వయసు కలిగి విద్యావంతుడయిన ప్రతి పౌరుడును వోటు చేయుటకు అర్హుడు. చీ. శే. రా.

**చీన్ వంశము :** చూ. చీనా.

**చీనా, జపాన్ యుద్ధము :** చూ. చీనా; జపాన్.

**చీనా (తైవాన్):** చూ. తైవాన్ (ఫార్మోజా).

**చీనా ప్రజాగణరాజ్యము :** ఆసియాలోని ఒక ప్రముఖ స్వతంత్ర రాజ్యము.

ఆ ఖండపు తూర్పుభాగమున పసిఫిక్ మహాసముద్రమును ఆనుకొని ఈ విశాల దేశము విస్తరించి ఉన్నది. ఈ దేశపు సముద్ర తీర రేఖ పొడవు 11,200 కి. మీ. ఈశాన్య దిశనుండి ప్రదక్షిణ సరళిలో ఆగ్నేయ దిశ వరకును ఈ దేశపు భూతల సరిహద్దు 14,400 కి. మీ. పొడవున క్రమముగ ఉత్తర కొరియా, సోవియట్ రష్యా, ఔటర్‌మంగోలియా, ఆఫ్ఘనిస్థాన్, భారతదేశము, నేపాల్, సిక్కిమ్, భూటాన్, మరల కొంతవరకు భారతదేశము, బర్మా, లావోస్, ఉత్తర వియెత్నామ్ నెలకొని ఉన్నవి. పసిఫిక్ మహాసముద్రము నందలి కొన్ని ద్వీపములును, ద్వీపసముదాయములును ఈ దేశమునకు చెంది ఉన్నవి. వానిలో తైవాన్ (ఫార్మోజా), హైనాన్ ప్రముఖములు. కాని, తైవాన్‌దీవియు, తత్పరిసరములందలి కొన్ని చిన్న దీవులును ప్రస్తుత చీనాప్రభుత్వ వశమున లేవు [చూ. తైవాన్ (ఫార్మోజా)].

ఈ విశాల చీనారాజ్యమున పరిపాలనా రీతిలో 21 రాష్ట్రములును, ఆంతరంగిక స్వతంత్రతాప్రతిపత్తిగల అయిదుమండలములు [ఇన్నర్ మంగోలియా, క్వాంగ్సి చు అంగ్, నింగ్సియా హ్వీ, సింకియాంగ్, ఉయ్‌గుర్, టిబెట్; రెండు కేంద్ర పరిపాలిత పట్టణములు (పెకింగ్, షాంగే] ను చేరి ఉన్నవి. [వి] 97,61,012 చ. కి. మీ. [జ] 65,66,30,000.; [భా] దేశమున అత్యధిక సంఖ్యాకుల భాష చైనీస్ భాష. కాని, దీనియందు పెక్కు మాండలిక భేదములు కలవు. పెకింగ్ పరిసరముల మాండలికమును అధికార జాతీయభాషగా ప్రస్తుత ప్రభుత్వము ప్రోత్సహించుచున్నది. ఆంతరంగిక స్వతంత్రత కలిగినవిగ భావింపబడు అయిదు మండలములలో చైనీయేతర భాషలు మాటాడువారు అత్యధిక సంఖ్యాకులుగా ఉన్నారు. వీరు టిబెటన్, తుర్కిక్ మొదలగు భాషలు మాటాడుచున్నారు. [మ] దేశమున కన్‌ఫ్యూషియన్, టావో, బౌద్ధమతములు విరివిగ వ్యాపించి ఉన్నవి. సామాన్య చైనీయుని మతము ఈ మూటి సమన్వయ రూపముగ ఉండునని చెప్పవచ్చును. దాదాపు ఒక కోటిమంది ముస్లిమ్‌లును, 40 లక్షలమంది క్రైస్తవులును కలరు. చైనీయ జీవితములో మతప్రసక్తి ప్రస్తుత ప్రభుత్వమున అంతకంతకు తగ్గిపోవుచున్నది. [రా] పెకింగ్ (జ. సం. 27,68,149).

చరిత్ర : ఈ దేశపు ప్రాచీనకాల చరిత్ర విశేషములు కొన్ని పురాతనపు లిపిలో ఎముకలపై చిత్రితములై ఉన్నవి. వాటిని బట్టి లిఖితపూర్వకమైన ప్రాచీన చరిత్ర క్రీ. పూ. 1500 నుండి కొలదిగ తెలియుచున్నది. 1500 నుండి 1100 వరకు షాంగ్ వంశపు రాజులు చీనా దేశమును పాలించుచుండిరి. ఈ కాలమందు ప్రజలు అందరును కృషీవలులుగానే ఉండిరి. నాటి నాగలి, కొడవలి రాతితో చేసినవే. చీనా వీరులు కంచుతో చేసిన ఖడ్గమును ధరించి

ఏదో ధాతువుతో చేసిన రథములను ఎక్కి రణరంగమునకు పోవుచుండెడివారని తెలియవచ్చుచున్నది.

క్రీ. పూ. 1122 నుండి క్రీ. పూ. 256 వరకు చౌ వంశపు రాజులును, ఆ పిమ్మట క్రీ. పూ. 205 వరకు చీన్ వంశపు రాజులును దేశమును పాలించిరి. చౌ వంశపు రాజుల కాలములోనే కన్‌ఫ్యూషియన్ (క్రీ. పూ. 551 - 478), లావ్‌చీ (క్రీ. పూ. 600) అను దార్శనికులు ఉద్భవించిరి. ఈ కాలములో అధికారయుతులైన భూస్వాముల మాండలిక ప్రభుత్వములు కూడా ఏర్పడినవి. చీన్ వంశపు రాజైన షిహ్వాంగ్ టీ కొద్దికాలము మాత్రమే రాజ్యము ఏలినను చాలా బలముగల రాజు కనుక, భూస్వాముల మాండలిక ప్రభుత్వములను అణచిపెట్టి కేంద్ర రాజ్యాధికారమును బలపరచెను. ఇతడు తార్తారులు ఈ దేశమునకు దండెత్తి రాకుండ నిరోధింపగల పెద్ద గోడను దేశపు ఉత్తర, పశ్చిమ దిశలందు కట్టించెను. ఇతడు దొడ్డవాడే కాని, ఇతరుల గొప్పతనము చూచి ఓర్వలేనితనము ఉండెను. కనుకనే తనతోనే చీనా రాజ్య ప్రతిష్ఠ ప్రారంభించినదన్న ప్రఖ్యాతి బడయగోరి, తన కాలమువరకును ఉండిన చీనా వాఙ్మయమును తగులబెట్టించెను. తన వంశనామ మయిన చీన్ శబ్దమునే దేశనామముగా వాడుకలోనికి తెచ్చెను. అందుచేతనే ఈ దేశమునకు చీనా అను పేరువచ్చినది.

హాన్ వంశపు రాజుల కాలములో (క్రీ. పూ. 202 - క్రీ. శ. 9) చీనా సామ్రాజ్యము దక్షిణ దిక్కుగా ఎక్కువ మేర వ్యాపించినది. ఈ వంశపు రాజులలో మొదటివాడు యాంగ్‌సీ నది లోయ ప్రాంతమునుండి వచ్చిన రాజే అయినా చీనా సామ్రాజ్య రాజధానిని చీనా వాయవ్య భాగమందు స్థాపించెను. దాని ప్రాచీన నామము సీయాన్. ఇది నేటి షెన్సీ మండలమందు సింగన్ అను పేర ఉన్నది. ప్రాచీన కాలమందు ఇది చీనా సామ్రాజ్యములో వాయవ్య భాగములోనిదే అయినా, మరి కొంత కాలమునకు చీనా సామ్రాజ్యము వాయవ్యదిక్కున విస్తరించుటచేత నేడు మధ్య భాగమున ఉన్నట్లు కనబడును. ఆ కాలములో ఇక్కడ రాజధాని ఏర్పడినందువల్ల పొరుగు దేశములనుండి దండెత్తివచ్చు మంగోల్‌లను నిరోధించుటకు అనుకూలముగ ఉండెను. ఈ హాన్ వంశపు రాజుల కాలములోనే రోమన్ దేశముతో వాణిజ్య వ్యాపారములు పారంభ మైనవి. ముద్రణయంత్రము కట్టెతో నిర్మితమైనది. చరిత్ర గ్రంథములు, నిఘంటువులు, సాహిత్య గ్రంథములు ముద్రితములయినవి. భారతదేశమునుండి బౌద్ధమతము చీనాకు వ్యాపించినది. పిమ్మట చీనా నుండి ఇట్సింగ్ [చూ.], ఫాహియాన్, హుయాన్‌స్యాంగ్ [చూ.] మొద లయిన విద్వాంసులు భారతదేశమునకు పోయి - బౌద్ధ మతమునకు సంబంధించిన గ్రంథములు సంపాదించి తెచ్చు కొనిరి. క్రీ. శ. మొదటి శతాబ్దమునుండి క్రీ. శ. 1200 వరకును చీనా దేశమందు బౌద్ధమతము అవలంబించిన వారి సంఖ్య క్రమముగా హెచ్చి, తుదకు బౌద్ధమతమే దేశస్థుల మతమయినది.

హాన్ వంశము తర్వాత షిన్ మొదలయిన వంశముల రాజులు రాజ్యమేలిరి. ఈ వంశములలో పేరు పొందినవి కొన్ని కలవు. 618 - 907 మధ్య రాజ్యము ఏలిన టాంగ్ వంశమువారు ఘనకార్యములు కావించిరి. ఈ వంశ స్థాపకుడైన లియూ అన్ (618 - 626) కేంద్రరాజ్యాధికార మును బలపరచెను. చక్రవర్తి సర్వాధికారి. అతని క్రింద అధికారశ్రేణి నిర్ణీతమైనది; సామ్రాజ్యమందలి మండల ములు, మండలపరిపాలనము కేంద్ర రాజ్యాధికారమునకు లోబడి ఉండు విధానము మొదలయిన రాజ్యాంగ విధానము పొందికగా ఏర్పడి లిఖితమైనది. ఈ విధానమే కొద్ది మార్పులతో 1912 వరకును సాగుచు వచ్చినది. లియూ అన్ కుమారుడైన 'ట్ ఆయ్ త్సుంగ్' ప్రభువు తన దేశమునకు దండెత్తివచ్చుచుండిన తూర్పు, పడమటి తుర్కులను ఓడించి తన అధికారమునకు లోబడునట్లు చేసి కొనెను; సాహిత్యమును పోషించెను. 641 లో చీనా రాజ కన్యను టిబెట్ రాజయిన స్రంజన్ గమ్ - పో అనువానికి ఇచ్చి వివాహము చేయుటవలన టిబెట్ దేశమందు కూడ బౌద్ధమతము వ్యాపించినది. 645లో హుయాన్ స్యాంగ్ భారతదేశమునుండి మరలివచ్చి బౌద్ధమతమును నూతన స్వరూపమున ఎక్కువగా వ్యాపింపజేసెను. ఇతడు భారతదేశమునుండి తెచ్చిన 75 గ్రంథములు (1335 సంపుటములలో) చీనా లిపిలోనికి పరివర్తనము పొందినవి. బయటకు దృగ్గోచరమగు విశ్వమంతా మనస్సులో చిత్రిత మైన దాని బహిస్స్వరూపమే అను తత్త్వము వసుబంధుని నుండి గ్రహించి హుయాన్‌స్యాంగ్ తన దేశస్థులకు బోధించెను. లోగడ లావ్‌చీ బోధించిన టావో మత సిద్ధాంతములతో బౌద్ధమత సిద్ధాంతములు జోడించి, నూతన మత సిద్ధాంతములను ఇతడు ప్రవచించెను. దానిపై అంగీకార చిహ్నముగా రాజముద్ర కూడ పడినది. ఈ రాజు కాలమందే విజ్ఞాన సర్వస్వము కూడ రచితమైనది. 712 - 756 వరకును రాజ్యమేలిన షూ అన్ రాజు 725 లో కళాపరిషత్తును స్థాపించి పోషించెను. ఇతని కాలములో చిత్రలేఖన కళ అభివృద్ధి చెందినది. ఈ రాజు కాలమందే పింగాణి పరిశ్రమ కూడ ఆరంభమైనది.

టాంగ్ వంశపువారి పరిపాలన 907 లో అంతమైనంతనే దేశమున ఆంతరంగిక కల్లోలములు పొడచూపి వివిధ రాజవంశములవారు అధికారమునకై పెనగులాడిరి. 960 వరకు ఈ పరిస్థితులు అట్టులే ఉండెను. ఈ మధ్య కాలమున వరుసగ అయిదు రాజవంశములవారు సమ్రాట్ లను బిరుదముతో వ్యవహరించిరి. కాని, వీరికి చారిత్రకముగ ప్రాముఖ్యము ఏమియు లేదు. కడకు 960 లో సుంగ్ వంశీకుడగు చావ్ వ్యాంగ్ - ఇన్ అనువాడు దేశమును ఆక్రమించి సుస్థిరమగు పాలనను నెలకొల్పెను. క్రీ. శ. 960 నుండి 1279 వరకు ఈ సుంగ్ వంశము చీనాను పాలించెను. వీరి పరిపాలనాకాలమున 997 లో చీనా రాజ్యమంతా 15 మండలముల క్రింద విభక్తమయినది. 1078 - 85 లో ఇదే 23 మండలములుగ విభక్తమయినది. వాణిజ్య వ్యాపారములు, సాంగ్రామిక విధానము, పరిపాలన పద్ధతి, విద్యా విధానము మొదలయినవి అన్నియు వృద్ధిపొందినవి. మతమునకు, తత్త్వమునకు సంబంధించిన కృషి ఎక్కువగా సాగినది. కళలు, పింగాణి పరిశ్రమలు విశేషముగా పెంపొందినవి. కాని, 13 వ శతాబ్దములో మంగోల్ల విజృంభణము చీనా ప్రశాంతికి భయంకరముగా పెరుగుచుండెను. 1206 లో చెంఘిజ్ ఖాన్ [చూ.] మంగోలియా సామ్రాజ్యమునకు చక్రవర్తియై చీనాను జయింపచూచెను. చీనా ఉత్తర భాగము అంతకంతకు ఎక్కువగా మంగోల్లకు వశపడినది. తుదకు ఆసియాలోని తక్కిన భాగములవలెనే చీనా సామ్రాజ్యము కూడ చెంఘిజ్ ఖాన్ మనుమడయిన కుబ్లయ్ ఖాన్ (1216 - 1294) [చూ. పు. 392] కు 1279 తో హస్తగతమైనది. ఇతడు చీనా సామ్రాజ్యమునకు చక్రవర్తిగా ఉన్న కాలమందే మార్కోపోలో [చూ.] చీనాకు వచ్చి ఈ చక్రవర్తిని దర్శించెను. 1368 లో చీనావారు ఏకమై తిరుగుబాటుచేసి మంగోల్లను తమ దేశమునుండి తరిమివేసి, రాజత్వమును అంతమొందించుకొనిరి. ఈ విజయమును చేకూర్చుటలో చీనావారి నాయకుడు మింగ్ వంశమువాడు. 1350 లో ఆరంభమైన మింగ్ వంశ పరిపాలనము సుమారు 300 ఏండ్లు సాగినది.

మంచూలు చీనా ఉత్తర భాగమునకు 1644 లో దండెత్తిపోయి, మింగ్ వంశమును తొలగించి, మంచూ రాజుల పరిపాలనమును స్థాపించిరి. వీరిలో ముఖ్యులు ఖాంగ్ శి, ఛియెన్ లుంగ్లు. ఈ వంశరాజుల పరిపాలనము 1912 లో చీనా ప్రజా సత్తాక రాజ్యము నెలకొను వరకును సాగినది. రాజకీయముగ చీనా మొదట మంగోల్లకును, పిమ్మట మంచూలకును లోబడినను మంగోల్లును, అంతకంటె ఎక్కువగా మంచూలును చీనా వారి సంస్కృతికి లోబడిరి. యూరప్ ఖండ దేశముల వారును, యునైటెడ్ స్టేట్స్ వారును వాణిజ్య వ్యాపారముల కొరకు చీనాకు అంతకంతకు ఎక్కువగా రాకపోకలు సాగించుచుండిరి. వాణిజ్య వస్తువులలో బ్రిటిష్‌వారు విరివిగ సాగించుచుండిన నల్లమందు వ్యాపారము ఎక్కువ ప్రధానమైనది.

బ్రిటిష్‌వారి నల్లమందు పెట్టెలను ఒక చీనా రాజోద్యోగి 1839 లో నాశనముచేసెను. అందుకు నష్ట పరిహారము ఇచ్చుకొని బ్రిటిష్‌వారి వ్యాపారపు అధికారములను స్థిరపరచవలెనని చీనా ప్రభుత్వమువారిని బ్రిటిష్‌వారు కోరిరి. ఆ కోరికను చీనా మన్నించలేదు. అందుచేత చీనావారికిని, బ్రిటిష్‌వారికిని నల్లమందుయుద్ధము 1839 - 24 లో జరిగినది. బ్రిటిష్‌వారికి విజయము చేకూరినది. అప్పుడు జరిగిన సంధి షరతులను అనుసరించి చీనా నాశనముచేసిన నల్లమందు ఖరీదును, యుద్ధముకొరకు బ్రిటిష్‌వారు వెచ్చించిన మొత్తమును చీనా ప్రభుత్వము బ్రిటిష్‌వారికి ఇచ్చుకొనవలసివచ్చినది. అంతేకాక, చీనా సముద్రతీరమందు అయిదు రేవు పట్టణములలో బ్రిటిష్‌వారు స్వేచ్ఛగా సుంకమేమీ చెల్లించనక్కరలేకుండా తమ వాణిజ్య వ్యాపారములు సాగించుకొనుటకు చీనా ప్రభుత్వము సమ్మతించుటకూడ జరిగినది. దానికి తోడు ఈ పట్టణములందు నివసించు బ్రిటిష్‌వారు చీనా సామ్రాజ్య న్యాయశాసనములకు కట్టుబడి ఉండనక్కరలేదన్న విషయముకూడ స్థిరపడినది. ఈ సంధి షరతులలో వాణిజ్య వ్యాపార వస్తువులలో ఒక్క నల్లమందు మాత్రమే అని పేర్కొని ఉండకపోవుటచేతను, ఈ షరతులలో బ్రిటిష్ వ్యాపారులకు కలుగచేసిన సౌకర్యములు ఇతర పరదేశస్థులకుకూడ వర్తించునని చెప్పకపోవుటచేతను, చీనా సముద్రతీరమందలి వాణిజ్య వ్యాపారము సాగించే అధికారము ఒక్క బ్రిటిష్‌వారికే చెందినట్లయినది.

ఈ సంఘటనను చూచి యునైటెడ్ స్టేట్స్, ఫ్రాన్స్ దేశములును, రష్యావారును చీనా దేశ దౌర్బల్యమును అనువుగా గ్రహించి బ్రిటిష్‌వారికి సమకూర్చిన వాణిజ్యాధికారము తమకు కూడా సమకూర్చవలసినదని చీనాను కోరిరి.

చీనా వారికోరికలను ఎదిరించుటకు శక్తిలేక వారితో కూడ ఒడంబడికలను చేసికొనెను. 1856 లో మరికొన్ని రేవుపట్టణములు యునైటెడ్ స్టేట్స్ వారికిని, ఫ్రాన్స్ వారికిని, రష్యా వారికిని విడిచిపెట్టడమయినది. అంతేకాక, విదేశీయులైన వర్తకులు స్వేచ్ఛగా చీనాలోనికి

రాక పోకలు జరిపి, వ్యాపారము సాగించుకొనవచ్చునన్న అనుమతికూడ ఇచ్చుట జరిగినది; అందుకు వారికి ఆపద కలుగకుండ అభయము ఇచ్చుటయు జరిగినది. అంతేకాక రాజధాని అగు పెకింగ్‌లో ఆ యా దేశములవారి రాయ బారులు ఉండుటకును అనుమతి ఇచ్చుట కూడ జరిగినది. క్రైస్తవ మతమునకు చీనాలో స్థానము లభించినది. నల్ల మందు వ్యాపారము దేశములో సాగుటకు అనుకూలముగా అమ్మకపు పన్ను తగుమాత్రముగా విధించుటకూడ జరిగినది.

బ్రిటిష్‌వారు ఇండియాలోవలెనే చీనాలోకూడ తగిన సమయము దొరకగానే రాజకీయ వ్యవహారములో జోక్యము కలుగచేసికొనిరి. దేశములో కృషీవలుల విప్లవము ఒకటి చెలరేగి మంచూ ప్రభుత్వమును అపాయ స్థితిలో ఉంచెను. తమకు వాణిజ్య సౌకర్యములు సమకూర్చి, తమ్ము ఆదరించిన ప్రభుత్వమును బలపరచుటలో ఆసక్తి గల బ్రిటిష్‌వారు మంచూవారికి తోడయిరి.

ఇటుల తమ నిలకడకొరకు విదేశీయ ప్రభుత్వపు సహాయ మును అర్థించు దీన స్థితిలో మంచూ ప్రభువులు ఉండుట గమనించి, జపాన్ చీనాయొక్క సామంత రాజ్యమగు కొరియాలోని రాజకీయ వ్యవహారములందు జోక్యము వహించుటకు పూనుకొనెను. దీని ఫలితముగ 1894 ఆగస్టున చీనా - జపాన్‌ల మధ్య యుద్ధము ప్రకటితమై కడకు 1895 లో చీనా ఘోర పరాజయమును పొందెను. దాని పర్యవసానముగ కుదిరిన ఒడంబడిక మూలమున, కొరియా స్వాతంత్ర్యమును చీనా గుర్తించుటయేకాక, జపాన్‌కు ఫార్మోజా (తైవాన్) ను, పెస్కడోర్ దీవులను, మంచూరియాలోని లయావ్‌తుంగ్ ద్వీపకల్పమును ఇచ్చి వేసి, 20 కోట్ల చీనా నాణెముల నష్టపరిహారమును కూడ చెల్లించెను. ఇందులకు తోడుగ తూర్పుతీరమునందు నాలుగు రేవు నగరములందు జపాన్‌కు స్వేచ్ఛా వ్యాపార సౌకర్యములు కల్పింపబడెను. కాని, రష్యాదేశమును, తక్కిన పాశ్చాత్య రాజ్యములును అడ్డుతగిలినందువలన లయావ్ తుంగ్‌ను మాత్రము జపాన్ వదలుకొనినది.

బ్రిటిష్‌వారి ఎడల మంచూవారికి ఆదరము ఉండినను, చీనా దేశస్థులకు మాత్రము బ్రిటిష్‌వారి ఎడలనే కాక, దేశమందు గల పరదేశస్థులందరి ఎడల ద్వేషము ఎక్కువ గానే పెరుగుచుండెను. క్రైస్తవ మతము అంతకంతకు ఎక్కువగా దేశములో వ్యాపించుట కూడ చీనావారికి దుర్భరముగా తోచినది. 20 వ శతాబ్దము ప్రారంభించు నాటికి బాక్సర్‌లు అను విప్లవకారులు పరదేశస్థులను దేశమునుండి వెడలగొట్టుటకు తీవ్రమైన ఉద్యమమును సాగించిరి.

బాక్సర్‌లు దేశమునందు పెక్కుచోట్ల విదేశీయులను 1900లో చెదరగొట్టుటయే కాక, పెకింగ్ నగరమందు విదేశ ప్రతినిధి రాయబారుల మందిరములను కూడ ముట్టడించిరి. వారికి రాజమాత రహస్యముగా తోడుపడినది. కాని, బ్రిటిష్, యునైటెడ్‌స్టేట్స్ సేనలు ఆ ఉద్యమమును అణచి వేసినవి. అప్పుడు వారికి కలిగిన నష్టమునకు పరిహారముగా చీనా ప్రభుత్వము కొంత ధనము ఇచ్చుకొనవలసి వచ్చినది. ఆ పిమ్మట యునైటెడ్‌స్టేట్స్‌వారు చీనా దేశ విద్యార్థుల విద్యావ్యాప్తికై కొంత ధనము చీనా ప్రభుత్వమునకు ఇచ్చివేసి, చీనావారి కృతజ్ఞతకు పాత్రులయిరి. ఆ పిమ్మట యునైటెడ్‌స్టేట్స్ ప్రోత్సాహ ఫలితముగా విదేశీయులందరును చీనాదేశముతోడి వాణిజ్య వ్యాపార విషయములో అధికారములు, లాభములు, సౌకర్యములు సమముగా పంచుకొనుటకు సమ్మతించిరి.

మంచూ రాజవంశము క్రమముగ బలహీనమై తన మనుగడకు విదేశ ప్రభుత్వముల తోడ్పాటునే అండగ గ్రహింపవలసిన దుస్థితికి దిగజారెను. రష్యా-జపాన్ యుద్ధానంతరము (1904) చీనాయందు ఒక రాష్ట్రమగు మంచూరియాలో ఒక ప్రదేశము జపాన్ వారును, మరి యొక ప్రదేశము రష్యా వారును వశపరచుకొనిరి [చూ. జపాన్].

బ్రిటన్, ఫ్రాన్స్, రష్యా, యూరప్ ఖండమందలి రాజకీయ పరిస్థితులను బట్టి తమ రాజకీయ వ్యవహారము లను సాగించుకొనుటలో 1911 లో నిమగ్నులయి, మహా సంగ్రామము జరుగునన్న భయముతో తమ తమ బలములను సమకూర్చుకొనుచుండిరి. అట్టి సమయమందు 1912 లో సన్‌యత్‌సేన్ [చూ.] అధ్యక్షతన విప్లవకారుల సైన్యము ఒకటి చెలరేగి, మంచూ వంశ రాజును పదభ్రష్టుని గావించి, సామ్రాజ్య విధానమును పడగొట్టి ప్రజా సత్తాక రాజ్యమును స్థాపించెను.

ఈ నూతన ప్రజా సత్తాక రాజ్యమునకు సన్‌యత్‌సేన్‌ను 1912 లో మొదటి అధ్యక్షునిగా ఎన్నుకొనిరి. కాని, అతడు ఆ పదవిని అధిక సంఖ్యాకులకు అనురక్తుడైన యువాన్ షికాయ్ (1859-1916) కి అప్పగించెను. కాని, ఈ యువాన్ షికాయ్ ప్రజా సత్తాక రాజ్యమునకు సుముఖుడు కాడు. తనను సమ్రాట్‌గా చేసికొని సామ్రాజ్య వ్యవస్థను పునరుద్ధరించుటకు సంకల్పించెను. 1916 లో అతడు చనిపోయిన తర్వాత చీనా ప్రజా సత్తాక రాజ్యమును నడుపగల నాయకుడు కనబడలేదు.

అట్టి చిక్కు సమయమున సన్‌యత్‌సేన్ మరల రాజకీయ రంగములోనికి దిగి పరరాజ్యముల వారి ధన

సాహాయ్యముతోను, సంగ్రామ వస్తు సాహాయ్యముతోను దేశమందు ఐక్యమును సమకూర్పదలచెను. కాని, అతడు 1925 లో చనిపోవుటచేత కృతకృత్యుడు కాలేదు. అతని తర్వాత చియాంగ్ - కై - షేక్ [చూ.] నాయకుడైనాడు. కాని, ఇతని రాజకీయ విధానముల మూలమున ఇతని అధ్యక్షతన ఉన్న జాతీయవాదులకును, కమ్యూనిస్టుల కును కలహములు చెలరేగినవి. కమ్యూనిస్టులు ఉత్తర, వాయవ్య ప్రాంతములకు తరిమివేయబడిరి.

ఇది ఇటులుండ చీనాయందలి ఈశాన్య భాగములో చేరి ఉన్న మంచూరియా జపాన్ వారికి ఆకర్షణీయముగా కనబడినది. మంచూ నాయకుడు తమకు లోబడి తోడ్పడు నేమో అని జపాన్‌వారు ఆశపడిరి. కాని, అతడు చీనా ప్రజాసత్తాక రాజ్యము వారి ఎడల అనురక్తుడై ఉండెను. అందుచేత అతనిని ఎదిరించి బేపింగ్ నగరమునకు పార ద్రోలి, జపాన్‌వారు మంచురియాను స్వాధీన పరచుకొని, మంచూరియా అను పేరును మంచూకోగా మార్చివేసిరి. మంచూకో అనగా మంచూల సామ్రాజ్యము అని అర్థము. లోగడ చీనా సామ్రాజ్యమునకు సమ్రాట్‌గా ఉండిన మంచూ వంశరాజునే ఈ మంచూకోకు సమ్రాట్‌గా జపాన్ నిలబెట్టెను. ఇది అంతయు జపాన్‌వారి దౌర్జన్య దురాక్రమణను అని చీనా నానాజాతి సమితి [చూ.] వారికి ఫిర్యాదు చేసెను. ఆ సమితి ఒక కమీషన్‌ను ఏర్పరచెను. కాని, దానివలన ఏమియు జరుగలేదు. జపాన్‌వారు తమ దౌర్జన్య దురాక్రమణములను సాగించు చునే 1933 లో చీనాలో ఈశాన్య భాగమందున్న జుహోల్ మండలమును ఆక్రమించి మంచూకోకు కలిపివేసిరి. అంతే కాక, ఉత్తర చీనా భాగమునందు గల 5 మండలములలో మరియు ఒక సామ్రాజ్యమును - మంచూకో వంటిది - నెల కొల్పుటకు సంకల్పించిరి. చియాంగ్ - కై - షేక్ కమ్యూ నిస్టుల వలన కలుగుచుండిన బాధ తొలగించుకొనే చిక్కులో పడి ఉండుటచేత జపాన్‌వారి సంకల్పమును నిరోధించలేక సమ్మతించెను.

కమ్యూనిస్టులు షెన్సీ మండలమందు 1936 లో ప్రబలి ఉండుటచేత, ఆ మండలమందు ప్రాచీన రాజధాని నగర మైన సీయాన్‌కు చియాంగ్ - కై - షేక్ విమానములో పోయి, అక్కడ కమ్యూనిస్టులతో యుద్ధము చేయుచుండిన చాంగ్ షూ ఏ - లియాంగ్ అంతగా శ్రద్ధవహించి యుద్ధము జరుపుటలేదని నిందించబోగా, జపాన్‌వారి దౌర్జన్య దురాక్రమణములను అరికట్టుట ముఖ్యముగదా, ఆ పని విడిచి వచ్చితివా ? అని అతనిని చాంగ్‌షూ ఏ - లియాంగ్ ఖైదీగా బంధించి చీనా నుండి జపాన్ సేనలు తొలగిపోవు వరకును కమ్యూనిస్టులతోడి యుద్ధమును ఆపివేయవలసిన దని హెచ్చరించెను. బందీగా ఉన్నంతకాలము ఈ విష యము చర్చించుటకు వీలులేదని చియాంగ్ నిరాకరించెను. మరి పది దినములు గడచిన పిమ్మట చియాంగ్ విముక్తు డయ్యెను. చీనా ప్రభుత్వమువారికిని, కమ్యూనిస్టుల కును ఒడంబడిక కుదిరినది. చీనానుండి జపాన్ వారిని పారదోలెడు వరకును యుద్ధము నిలుపుచేయుటకు ఇరు పక్షముల వారును ఒడంబడిరి. బహిరంగ రణరంగమందు జపాన్ వారితో యుద్ధము చేయుట కష్టమని తోచి, చీనా సైనికులు గెరిల్లా యుద్ధపద్ధతిలోను కొండలలో, అడవుల లోను దాగి, జపాన్‌వారి సేనలపై అకస్మాత్తుగా పడి వారిని చంపి పారిపోవుచు జపాన్ వారికి విసుగు పుట్టించిరి. అట్లు చేసిన వారిలో కమ్యూనిస్ట్ సైనికులు కూడ కలరు.

చీనాకు పరదేశములవారి సాయము : పెరల్ హార్బర్ పై జపాన్ 1941, డిసెంబరులో బాంబులు వేయుటకు పూర్వము యునైటెడ్ స్టేట్స్ చీనాకు కొంత సాయము చేసెను. విమానములలో వచ్చి సైనికులను, ఆహార సరఫరాను, ఇతర వస్తువులను చియాంగ్ సేనలకు అందజేయుచుండిరి. కాని, ఈ సాయము అంతగా ఉపకరించలేదు. జపాన్‌తో యుద్ధము చేయుటకు ప్రారంభించిన నాటినుండి చీనా వారికి యునైటెడ్ స్టేట్స్, బ్రిటన్ ఎక్కువగా తోడ్పడెను. బర్మాను జపాన్ స్వాధీనమునుండి తప్పించుటకు జరిగిన యుద్ధములలో బ్రిటిష్ వారికిని, యునైటెడ్ స్టేట్స్‌కును తోడుగా చీనానుండి వచ్చిన సేనలు కూడ పోరినవి. ద్వితీయ ప్రపంచయుద్ధము ముగియుటతో చీనాకు జపాన్ వారివల్ల కష్టములు తొలగినవి.

కాని, యుద్ధము ముగిసిన వెంటనే అంతర్యుద్ధము తిరిగి తల ఎత్తినది. చియాంగ్ పక్షమునకు, కమ్యూనిస్ట్ లకు విభేదములు ఎప్పటియట్లు పెరిగి విపరీతమైన పోరాట ములకు దారి తీసినవి. యునైటెడ్ స్టేట్స్ సహాయము తీసి కొని చియాంగ్ పక్షమువారు కమ్యూనిస్టులను కాలరాయ యత్నించుట, కమ్యూనిస్టులు గెరిల్లా యుద్ధతంత్రముతో చియాంగ్ సైన్యములను ఓడించుట ఈ రకమగు పోరాట ములతో చీనా అనేక సంవత్సరముల కాలము చెప్పరాని కష్టములు పడినది.

చివరకు చియాంగ్ సైన్యములు క్రమముగ పరా జయము పొందినవి. మంచూరియాను కూడ కమ్యూనిస్టులు వశపరచుకొనుటతో విశాలమగు చీనా అంతయు కమ్యూ నిస్టుల వశమైనది. చియాంగ్ - కై - షేక్‌నకు ఫార్మోజా (తైవాన్) దీవి మాత్రము మిగిలినది. అచటనే ఒక ప్రభుత్వమును ఏర్పరచుకొని చియాంగ్ ఇప్పటికిని చీనా

ప్రభుత్వము అనుపేర దానిని నడపుచున్నాడు [చూ. తైవాన్]. కాని, ఈ ప్రభుత్వమును చీనా ప్రభుత్వముగ ప్రపంచ ప్రముఖ రాజ్యములలో యునైటెడ్ స్టేట్స్, దానిని అనుసరించి కొలది రాజ్యములును తప్ప వేరేవియు పరిగణించుట లేదు.

చీనాలో 1949, సెప్టెంబరు 21 న కమ్యూనిస్ట్ పార్టీ ఆధ్వర్యవమున నూతన ప్రభుత్వము ఏర్పడినది. దానికి చీనా ప్రజా గణరాజ్యప్రభుత్వము అని పేరు.

ఈ ప్రభుత్వమునకు తొలుత మావ్ - సే - టుంగ్ అధ్యక్షుడు ; చౌ - ఎన్ - లై ప్రధానమంత్రి. ఈ ప్రభుత్వమును సోవియట్ రష్యా, ఇండియా, సిలోన్, నెదర్ లండ్స్, ఇండోనీషియా మున్నగు ప్రముఖ దేశములు గుర్తించినవి. యునైటెడ్ స్టేట్స్ మొదలగు కొన్ని దేశములు మాత్రము ఇంకను ఈ ప్రభుత్వమును గుర్తింపలేదు. ఈ నూతన ప్రభుత్వమునకు ఇప్పటికిని ఐక్యరాజ్యసమితిలో సభ్యత్వము లభింప లేదు. అగ్రరాజ్య పంచకములో ఒకటైన ఈ దేశము పక్షమున ఫార్మోజాలో ఉన్న చియాంగ్ - కై - షేక్ ప్రభుత్వమే సమితియందు ప్రాతినిధ్యము వహించుచున్నది.

మావ్-సే-టుంగ్ నాయకత్వమున ఏర్పడిన కమ్యూనిస్ట్ ప్రభుత్వము విశాల చీనా దేశమును సుసంఘటితము ఒనర్చుటకు తీవ్ర కృషి మొదలిడెను. చీనాలోనిదియే అని చెప్పబడు టిబెట్, మంచూ రాజ్య పతన కాలము నుండియు, పేరునకు మాత్రమే చీనా సార్వభౌమత్వమును అంగీకరించుచు, తక్కిన అన్ని విధముల సర్వస్వతంత్రముగనే వ్యవహరించుచుండెను. ఈ పరిస్థితిని తుదముట్టింప జేసి, ప్రభుత్వపు అధికారమును టిబెట్‌నందు సుస్థిర మొనర్చుటకై చీనా 1950 లో టిబెట్‌పై దండెత్తెను. టిబెట్ తన స్వతంత్రతను నిలబెట్టుకొనుటకు కొంత కృషి సల్పి, ఇతరుల సాయము కోరెను. కాని, బ్రిటన్, భారత దేశము మొదలగునవి తొలుతనుండియు టిబెట్‌పై చీనా సార్వభౌమత్వమును అంగీకరించి ఉండుటచే, టిబెట్‌ను స్వతంత్ర రాజ్యముగ గుర్తింపకైరి. ఆసియాయందు సుస్థిర శాంతి నెలకొనగలదనియు, టిబెట్ నందలి అంతరంగిక పరిపాలనా స్వేచ్ఛకు చైనీయులు భంగము కలిగించరనియు ఆశించి, భారత ప్రభుత్వము టిబెట్ నందు తనకు బ్రిటిష్ ప్రభుత్వము ద్వారా సంక్రమించిన హక్కులను కూడ వదలుకొని, చీనాతో సహకరించెను. ఈ సందర్భమున భారత - చీనా ప్రధాన మంత్రుల మధ్య జరిగిన సంప్రతింపుల ఫలితముగ రూపొందినదియే 'పంచశీల' [చూ.]. కడకు టిబెట్ పాలకుడగు దలైలామా చేయునది లేక చీనా ప్రభుత్వమునకు లోబడెను.

ఈ 1950 లోనే చీనా ఇంకొక యుద్ధమునకూడ పాల్గొనవలసి వచ్చెను. చీనా, సోవియట్ రష్యాల ప్రోత్సాహమున ఉత్తర కొరియా తొలుత దక్షిణ కొరియాపై దండెత్తగా, ఐక్యరాజ్య సైన్యములు యునైటెడ్ స్టేట్స్ నాయకత్వమున దక్షిణ కొరియాకు సాయముచేసి, ఉత్తర కొరియా సైన్యములను ఓడించి, ఉత్తర కొరియాలోనికి చొచ్చుకొని రాసాగెను. ఉత్తర కొరియా పతనమగుచో తన సరిహద్దులందు యునైటెడ్ స్టేట్స్ సైన్యములు చేరును భయముతో చీనా ప్రభుత్వము తన సేనలను ఉత్తర కొరియాకు సాయము అంపెను. ఈ యుద్ధము 1953 వరకు సాగెను. తుదకు ఐక్యరాజ్యసమితి పర్యవేక్షణమున ఉత్తర కొరియా, దక్షిణకొరియాల మధ్య యథాపూర్వ స్థితి నెలకొల్పబడెను [చూ. కొరియా - పు. 404].

క్రమముగ చీనాయందు సాంఘిక వ్యవస్థను మార్చుటకై చీనాప్రభుత్వము పూనుకొనెను. భూ సంస్కరణలు, పరిశ్రమల స్థాపన త్వరితగతిని నడువసాగినవి. ఆంతరంగిక స్వతంత్రతగల మండలములలో సైతము ఈ మార్పులు ప్రవేశపెట్టబడినవి. కాని, ఆ మండలములలో టిబెట్‌నందు మాత్రము చీనా ప్రభుత్వము ఇట్టి మార్పులను అతి తీవ్ర గతిలో ప్రవేశపెట్టక, అచటి సంఘవ్యవస్థయందలి ప్రముఖుల అధికారములను తగ్గింపచేయుటలోనే శ్రద్ధవహించెను. ఇందువలన టిబెట్ ప్రజలలో ప్రముఖులగు కంపాలు అను వర్గము వారికి అసంతృప్తి ఏర్పడి తిరుగుబాటులు చెలరేగెను. ఈ తిరుగుబాటులకు టిబెట్ సంప్రదాయ పాలకుడగు దలైలామా సానుభూతి కలదని చీనా ప్రభుత్వము భావించెను. అట్టి పరిస్థితులలో తనకు భద్రత లేదని తలచి దలైలామా 1959 లో రహస్యముగ భారతదేశమును చేరి, భారతప్రభుత్వమును ఆశ్రయము అర్థించగ ఆప్రభుత్వము అంగీకరించెను. తదాది దలైలామా భారతదేశమున నివసించుచున్నాడు. తత్ఫలితముగ చీనా - భారతదేశములకు కొంత వైమనస్యము ఏర్పడెను. ఇందుకుతోడుగ భారత - చీనాదేశముల సరిహద్దు విషయమున కూడ చీనా సరళమగు వైఖరిని అవలంబింపకపోవుటవలనను, భారత భూభాగములో చేరిన ప్రాంతములను కొన్నిటిని ఆక్రమించుటచేతను ఈ విభేదములు పెచ్చుపెరిగి, 1962 లో సరిహద్దు పోరాటమునకు దారితీసెను [చూ. భారత - చీనా సరిహద్దు సమస్య]. నేటి చీనాదేశమున ప్రభుత్వ వ్యవస్థను నడపించునది చీనా కమ్యూనిస్ట్ పక్షము. ఆ పక్షము సుసంఘటితమైనప్పుడు మాత్రమే ఆ పక్షపు కార్యక్రమము నిర్దిష్టముగ అమలు జరుపబడగలదు. అందువలన ప్రభుత్వాధినేతయగు

మావ్ - సే - టుంగ్ తన అధ్యక్ష పదవికి 1959 లో రాజీనామాను ఒసగి, చీనా కమ్యూనిస్టు పక్షపు ఆధిపత్యమును వహించెను. అంతట లియు షావ్ - చీ ప్రభుత్వాధ్యక్షుడుగ ఎన్నికయ్యెను.

అతి త్వరితగతిలో చీనాను బలవత్తరమగు కమ్యూనిస్టు రాజ్యముగ నిర్మించుటయేకాక, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమమును అన్నివిధముల బలపరచి, ప్రపంచమున కమ్యూనిజమ్‌ను వ్యాపింపజేయుటయును తన లక్ష్యములుగ నేటి చీనాప్రభుత్వము ఇడుకొనినది. కాని, కమ్యూనిజపు వ్యాప్తి అను నినాదముతో ఆ రాజ్యము అవలంబించు విధానములు సోవియట్ రష్యా మొదలగు పెక్కు కమ్యూనిస్టు రాజ్యములకు అర్థరహితములుగను, ప్రమాదజనకములుగను కన్పడుటచే, అట్టి విధానములకు సహకారము ఒసగుటకు ఆ రాజ్యములు నిరాకరించినవి. ఇందువలన ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమమున 1959 మొదలుగ విభేదములు మొలకలెత్తెను [చూ. కమ్యూనిజమ్ - పు. 366].

రాజ్యాంగము : 1954 లో దేశము ఆమోదించిన రాజ్యాంగ విధానమును అనుసరించి ఈ దేశమున పరిపాలన నిర్వహింపబడుచున్నది. జాతీయ ప్రజాపరిషత్ (నేషనల్ పీపుల్స్ కాంగ్రెస్) అను అర్థము ఒసగు పేరుగల సంస్థయందు పాలనాధికారము అంతయు న్యస్తమై ఉన్నది. ఈ సంస్థయందు రాష్ట్రములకును, కేంద్రపాలిత నగరములకును, అల్పసంఖ్యాక జాతులకును, సైన్యమునకును, విదేశస్థ చీనీయులకును ప్రాతినిధ్యము కలదు. ఇందు రాష్ట్రములు 8,00,000 ప్రజలకు ఒక ప్రతినిధి చొప్పున తమ సభ్యులను ఎన్నుకొనును (కాని, జనసంఖ్య తగినంత లేకపోయినను ప్రతిరాష్ట్రము ముగ్గురు సభ్యులను విధిగా కలిగి ఉండవలెను). కేంద్రపరిపాలిత నగరములు లక్ష ప్రజలకు ఒకప్రతినిధిని ఎన్నుకొనును. అల్పసంఖ్యాకజాతులు 150 మందిని, సైన్యము 60 మందిని, విదేశములందు ఉన్న చీనా దేశీయులు 30 మందిని ఎన్నుకొనెదరు. ఈ పరిషత్ నాలుగు ఏండ్లకు ఒకసారి ఎన్నుకొనబడి, సంవత్సరమునకు ఒక పర్యాయము సమావేశమగును. దేశాధ్యక్షుని, ఒక స్థాయీ సంఘమును పరిషత్తు ఎన్నుకొనును. పరిషత్ సమావేశము జరుగని కాలమున స్థాయీసంఘము సాహాయ్యమున అధ్యక్షుడు పాలన నిర్వహించును. మంత్రివర్గ సభ్యులను, రక్షణమండలి సభ్యులను అధ్యక్షుడే తనకు నచ్చిన రీతిని నియమించును.

పదునెనిమిది ఏండ్ల వయసుగల ప్రతి పౌరుడును వోటు చేయుటకును, ఎన్నిక పదవికి అభ్యర్థిగ ఉండుటకును హక్కు కలిగి ఉన్నాడు. తక్కిన కమ్యూనిస్టు రాజ్యములవలెనే ఏక పట్టికా విధానము [చూ. పు. 348] ను అనుసరించి ఎన్నికలు జరుగును. ఈ ఏక పట్టిక యందలి అభ్యర్థులను దేశపు కమ్యూనిస్టు పార్టీ కార్యవర్గము నిర్దేశించును. గి. వేం. సీ ; చీ. శే. రా.

**చూటే** (జ. 1886 ర.): చీనా కమ్యూనిస్టు యోధుడు; నాయకుడు. యూనాన్ సైనిక అకాడమీలో పట్టభద్రుడై (1911), ఇతడు సన్ యత్ సేన్‌ను బలపరచిన సైన్యములలో అనేక పదవులలో పనిచేసెను. 1922 లో యూరప్‌కు పోయి, చౌ - ఎన్ - లైను కలసికొని చూటే అతని ప్రేరణమున రహస్యముగ చీనా కమ్యూనిస్టు పార్టీలో ప్రవేశించెను; తరువాత గాటింజెన్ యూనివర్సిటీలో రాజనీతిశాస్త్రము అధ్యయనము చేయుచు, 1925 లో విప్లవచర్యల మూలమున జర్మనీనుండి వెడలగొట్టబడి, ఫ్రాన్స్, సోవియట్ రష్యాలలో కొంత కాలము ఉండి, స్వదేశమునకు తిరిగివచ్చి (1927), చియాంగ్ - కై - షేక్ కోమింగ్‌టాంగ్ నుండి కమ్యూనిస్టులను తొలగించిన తరువాత, చూటే నాన్‌చంగ్‌లో తిరుగుబాటు లేవదీసి, కృతకృత్యుడు కాలేక దక్షిణ కియాంక్సీ రాష్ట్రమునకు పలాయితుడై అచ్చట మావ్ - సే - టుంగ్ సాహచర్యమును ప్రారంభించెను; అంతర్యుద్ధకాలమున జరిగిన కమ్యూనిస్టు దీర్ఘయాత్ర (1934 - 35) లో ప్రముఖపాత్ర నిర్వహించెను. ద్వితీయ ప్రపంచయుద్ధకాలమున ఇతడు కమ్యూనిస్టు సేనకు సర్వసైన్యాధ్యక్షుడుగ వ్యవహరించి, చీనాప్రభుత్వ సేనలతో కలసి జపాన్ సామ్రాజ్యసేనలతో పోరాడెను. 1949 లో చీనాప్రజాగణరాజ్యము స్థాపింపబడిన తరువాత చీనీయ ప్రజావిమోచన దళమునకు సేనాధిపతి పదవిని నిర్వహించెను. ఇంతియేకాక, చూటే చీనాప్రభుత్వపు ఉపాధ్యక్ష పదవిని (1954 - 59), చీనా కమ్యూనిస్టు పార్టీ అధినేతృసంఘము (పొలిట్ బ్యూరో) లో సభ్యత్వ పదవిని నిర్వహించెను. 1959 నుండి ఇతడు చీనా జాతీయ ప్రజాసభకు అధ్యక్షుడు. ఆ. వెం.

**చెంఘిజ్ ఖాన్** (1612 - 1227) : తార్తారులకోవకు చెందిన మంగోల్ జాతి నాయకుడు; అగ్రశ్రేణికి చెందిన విజేత. ఇతని అసలుపేరు తెమూజిన్. ఇతడు కారకోరమ్ రాజధానిగ సువిశాలమైన సామ్రాజ్యమును పరిపాలించెను [చూ. పు. 92]. ఆ. వెం.

**చోళులు** : చూ. భారతదేశము.

**చౌ - ఎన్ - లై** (జ. 1898) : చీనా కమ్యూనిస్టు నాయకుడు; ప్రధానమంత్రి. సంపన్న కుటుంబమున జన్మించెను. ఇతడు టిన్‌చీన్ పాఠశాలయందును, తరువాత

(1917) జపాన్‌లోని వసేడా యూనివర్సిటీలోను పఠించి, 1919 లో చీనాకు తిరిగివచ్చి, ఆ మరుసటి సంవత్సరమే కమ్యూనిస్ట్ నాయకుడు మావ్-సే-టుంగ్ రూపొందించిన విద్యార్థి-రాజకీయకార్యకర్తల ప్రణాళిక ప్రకారము ఫ్రాన్స్‌నందు పఠించుటకు పోయెను. ఆ తరువాత కొంత కాలము గ్రేట్ బ్రిటన్‌నను, జర్మనీలోను గడిపి, చీనాకు 1924 లో తిరిగివచ్చి కమ్యూనిస్ట్ పార్టీలో సభ్యుడుగ చేరెను. 1928 లో మాస్కోలో జరిగిన అంతర్జాతీయ కమ్యూనిస్ట్ కాంగ్రెస్‌న చీనాలోని పార్టీ తరఫున ప్రతినిధిగ ఇతడు పాల్గొని, ఆ తరువాత ఆ దేశముననే 1931 వరకు ఉండి, చుంగ్‌షాన్ యూనివర్సిటీలో పఠించెను. చీనాకు తిరిగివచ్చిన తరువాత కియాంక్సీలో స్థాపింపబడిన కమ్యూనిస్ట్ గణరాజ్యమున చేరి, అనంతరమున చరిత్ర ప్రసిద్ధమగు దీర్ఘయాత్ర (1934 - 35) లో పాల్గొని యేనాన్‌కు చేరెను. 1935 లో మాస్కోలో జరిగిన అంతర్జాతీయ కమ్యూనిస్ట్ కాంగ్రెస్‌లో చీనాలోని పార్టీకి ప్రతినిధిగా పాల్గొనెను. ద్వితీయ ప్రపంచ యుద్ధ కాలమున యేనాన్‌లోని కమ్యూనిస్ట్ ప్రభుత్వమున విదేశ వ్యవహారమంత్రిగ పనిచేసి, 1944, మే మొదలుగ 1945 తొలిపాదము దనుక కమ్యూనిస్ట్ప్రభుత్వము పక్షమున చియాంగ్-కై-షేక్‌తో చీనాలో సుస్థిర ప్రభుత్వమును నెలకొల్పు విషయమున రాయబారములను సాగించెను. కాని, అవి ఫలింపలేదు. చీనాలోని ఉభయ పక్షముల మధ్య శాంతిని నెలకొల్పుటకై జార్జి మార్షల్ సాగించిన సంభాషణలందును ఇతడు పాల్గొనెను. కాని, ఫలితము శూన్యము అయ్యెను. తుదకు చీనా కమ్యూనిస్ట్‌ల హస్తగత మయిన తరువాత ఇతడు ఆ దేశపు ప్రజా గణరాజ్యము నకు ప్రధానమంత్రి పదవిని చేబట్టి, విదేశాంగ శాఖను కూడ నిర్వహించెను (1849). జెనీవాసమావేశము (1954) నకు, బాండుంగ్‌సమావేశము (1955) నకు హాజరయిన కమ్యూనిస్ట్ చైనా ప్రతినిధి వర్గమునకు నాయకత్వము వహించెను. టిబెట్ దేశపు ప్రతిపత్తి విషయమై భారత ప్రధానితో సంభాషణలు కొనసాగించి, ఆ సందర్భమున పంచశీల [చూ.] ను రూపొందించుటలో పాల్గొనెను (1954). మాస్కోలో జరిగిన 22 వ కమ్యూనిస్ట్‌పార్టీ కాంగ్రెస్‌లో పశ్చిమ రాజ్యములతోడి శాంతియుత సహజీవన సూత్రమును ఇతడు బాహాటముగ దుయ్య బట్టెను. **ఆ. వెం.**

**జకీర్‌హుసేన్** (జ. 1897): ప్రస్తుతము (1966) భారత ఉపరాష్ట్రపతి. భారతజాతీయ ముస్లిమ్ ప్రముఖుడు; విద్యావేత్త. హైదరాబాద్ (ఆంధ్రప్రదేశ్)లో జన్మించెను. ఆలిఘర్ ముస్లిమ్ యూనివర్సిటీలో ఎమ్. ఏ. పట్టము, బెర్లిన్ యూనివర్సిటీలో పి.ఎచ్.డి. పట్టము పొందెను. ఇతడు జామియామిల్లియా (ఢిల్లీ) సంస్థ ఉపాధ్యక్షుడుగ (1926-48), హిందుస్తానీ తాలిమీ సంఘము (సేవాగ్రామ్) అధ్యక్షుడుగ (1938 - 50), ఆలిఘర్ ముస్లిమ్ యూనివర్సిటీ ఉపాధ్యక్షుడుగ (1948 - 56), యునెస్కో కార్యవర్గ సభ్యుడుగ (1956 - 58), అంతర్జాతీయ విద్యార్థి సమితి భారతీయ శాఖకు అధ్యక్షుడుగ (1957), యూనివర్సిటీ గ్రాంట్స్ కమిషన్ సభ్యుడుగ, బేసిక్ విద్యాసంఘము అధ్యక్షుడుగ (1937), కేంద్ర మాధ్యమిక విద్యాసంఘము అధ్యక్షుగ, యూనివర్సిటీ విద్యాకమిషన్ సభ్యుడుగ విద్యారంగమున గణనీయమైన కృషి చేసెను; రాజ్య సభా సభ్యత్వమును (1952 - 57), బీహార్ రాష్ట్ర గవర్న పదవిని (1957 - 62) నిర్వహించెను. ఇతడు భారత ఉప రాష్ట్రపతిగ ఎన్నికయై 1962, మే 11 వ తేదీన పదవీ స్వీకారము చేసెను. ప్రస్తుతము ఢిల్లీ యూనివర్సిటీ అధ్యక్షుడు కూడాను. ఇతని దృక్పథము సువిశాలము, జాతీయభావ పూరితము. భారత ప్రతినిధిగ ఈయన పెక్కు విదేశములలో పర్యటించి, అచటివారికి భారతీయ లౌకిక విధానమును చక్కగా విశదీకరించెను. భారత ప్రభుత్వము పద్మవిభూషణ (1954), భారతరత్న (1963) బిరుదములు ఇచ్చి ఈయనను సత్కరించినది. **ఆ. వెం.**

**జదునాథసర్కార్** (1870 - 1958): సుప్రసిద్ధ భారతీయ చరిత్ర రచయిత. విద్యార్థిదశయందే ఇతడు తన ప్రతిభావ్యుత్పత్తులను వెల్లడించి, ఎమ్. ఏ పరీక్షయందు ఉత్తీర్ణుడై, తొలుత కటక్‌లోను, తరువాత చిరకాలము పాట్నాలోను చరిత్రాచార్యుడుగా పనిచేసెను. 17 వ శతాబ్దపు చరిత్రాంశములమీద, ఔరంగజీబ్ [చూ.] పరిపాలనమీద ఇతడు అనేక సంపుటముల చరిత్ర గ్రంథ ములను రచించి ప్రచురించెను. అధ్యాపన వృత్తినుండి విరమించిన తరువాత జదునాథసర్కార్ కలకత్తా యూని వర్సిటీ ఉపాధ్యక్షుడుగా నియమితుడయ్యెను. భారత దేశము పారతంత్ర్యవిముక్తి పొందినతరువాత చరిత్ర పరిశోధనారంగమున ఇతడు కావించిన నిర్వాహము గణనీయమైనది. **ఆ. వెం.**

**జనవాక్యము** (ప్లెబిసైట్): ప్రజానిర్ణయము (రెఫరెండమ్) నకు మరియొక రూపమే జనవాక్యము. ఇది 1914 - 18 సంవత్సరపు ప్రథమ ప్రపంచయుద్ధమునకు తరువాత ప్రచారములోనికి వచ్చినది. శాసనముల నిర్మాణ మునకో, తిరస్కారమునకో ప్రజానిర్ణయము వినియోగ పడగ, ప్రముఖ రాజకీయ సమస్యలను తీర్చడమునకు జన

వాక్యము వినియోగపడుచున్నది. ముఖ్యముగ వివాద గ్రస్త ప్రాంతములు ఏ రాజ్యములో, ఏ ప్రాంతములో చేరవలయుననే సమస్యలు కలిగినప్పుడు 'జనవాక్యము' ప్రకారము ఆ సమస్యలు తీర్చవలసినదనే ధర్మము లోకము అంగీకరించినది. దీనిని దుర్వినియోగము చేసిన హిట్లర్ బోటివారు లేకపోలేదు; దీనిని అనుసరింపని ఘట్టములును ఉన్నవి. దేశమున ఒక అంతర్భాగమగు దానియందలి ప్రజలకు స్వయం నిర్ణయహక్కు విషయమై జనవాక్యమును తీసికొనుట మాత్రము ఆ దేశపు సర్వాధికారమునకు భంగకరమగును కాన అట్టిది నిషిద్ధము. గా. హ.

**జపాన్:** ఆసియా ఖండమునకు చెందిన ఒక ప్రముఖ స్వతంత్ర ద్వీపరాజ్యము.




ఈ దేశమును ఆ దేశీయులు 'నిప్పన్' అని వ్యవహరింతురు. ఈ రాజ్యమున పెక్కువేల ద్వీపములు చేరి ఉన్నవి. వీనిలో హొక్కయిడో (78,516 చ. కి. మీ.), హోన్‌షూ (2,30,448 చ. కి. మీ.), షికోకూ (18,751 చ. కి. మీ.), క్యూషూ (41,948 చ. కి. మీ.) అను నాలుగు ప్రముఖ ద్వీపములు తప్ప తక్కినవన్నియు చాల అల్ప ద్వీపములు. ఈ ద్వీపములు అన్నియు ఒక హారమువలె ఆసియా ఖండపు తూర్పుభాగమున పసిఫిక్ మహాసముద్రమున 2,240 కి. మీ. పొడవున ఈశాన్యమునుండి ఆగ్నేయమునకు వ్యాపించి ఉన్నవి. ఈ ద్వీప సముదాయపు దక్షిణపుకొన కొరియా దేశపు దక్షిణాగ్రమునకు 208 కి. మీ. దూరముననను, ఉత్తరపు కొన కురైల్ దీవులకు 160 కి. మీ. దూరమునను కలవు. [వి] ఈ ద్వీప సముదాయము మొత్తము 3,69,661 చ. కి. మీ.; ఈ ద్వీప రాజ్యమున ముఖ్యమగు దీవి హోన్‌షూ. దీనియందే ప్రముఖ పారిశ్రామిక నగరములు, రాజధానియగు టోక్యోనగరము, వివిధ చారిత్రాత్మక స్థలములు కలవు. [జ] 9,62,30,000. జనసంఖ్య పరిగణనలో ప్రపంచమందలి వివిధ దేశములలో ఇది అయిదవ స్థానమున లెక్కకు వచ్చుచున్నది. [భా] జాతీయభాష జపానీ. విదేశీయ భాషలలో ఇంగ్లీషుకు ఎక్కువ ఆదరము కలదు. [మ] దేశమున జాతీయమతమగు షింటో మతముతో మేళన మందిన బౌద్ధమతము విరివిగ వ్యాప్తియందు ఉన్నది. క్రైస్తవులు దాదాపు 6 లక్షలు కలరు. [రా] టోక్యో (జ. సం. 83,10,027).

చరిత్ర: ఈ దేశపు ప్రాచీన చరిత్రను గురించి వివరములు ఏవియు తెలియవచ్చుటలేదు. ప్రాచీనకాలపు చరిత్రకు లిఖితాధారముగ 'కొజికీ' అను గ్రంథము పేర్కొనబడుచున్నది. కాని, క్రీ. శ. 712 లో ప్రకటితమయిన ఈ గ్రంథము పుక్కిటి పురాణముల రాశి అగుటవలన చారిత్రకముగ దీనికి ఏ విలువయును లేదు. సుమారు క్రీ. పూ. 660 లో సూర్యుని మనుమడయిన జమ్ముతెనా జపాన్ దేశమునకు మొదటి చక్రవర్తి అయినట్లు ఈ గ్రంథమువలన తెలియనగును. ఆ తర్వాత క్రీ. శ. 3 వ శతాబ్దము అంతమగువరకును జపాన్ చరిత్ర విషయములు ఏవీ తెలియవు. క్రీ. శ. 4 వ శతాబ్దములోనో, 5 వ శతాబ్దములోనో జపాన్ వీరులు కొరియాపై దండెత్తి ఆ దేశమును క్రీ. శ. 663 వరకును పాలించిరని చరిత్ర రచయితలు తెలియజేసిరి. 552 లో చీనా బౌద్ధమతాచార్యుడు జపాన్ వచ్చి చీనావారి నాగరకత, సంస్కృతి, లిపి, కళలు, పరిశ్రమలు దేశములో తొలిసారిగా ప్రవేశపెట్టి వ్యాపింపచేసెను. 593 నుండి 621 వరకును రాజప్రతినిధిగా ఉండిన షొటోకూ అనే రాకుమారుడు చీనా సంస్కృతి జపాన్‌లో వ్యాపించుటకు కావలసిన ప్రోత్సాహము ఒసగెను. అందుచేత అతనికి 'జపాన్ నాగరకతా సంస్థాపకుడు' అను బిరుదము సైతము లభించినది.

క్రీ. శ. 794 నుండి 1867 వరకును క్యోటోనగరము జపాన్ చక్రవర్తి రాజధానిగ ఉండెను. చక్రవర్తి కేవలము పేరునకు మాత్రమే పాలకుడు. వాస్తవముగ రాజ్యము ఏలుచుండినవారు భూస్వాములయిన ప్రభువులు. కొంతకాలము ఏదో ప్రభుకుటుంబపు పెద్ద దేశమంతటినీ వశపరచుకొనెడివాడు. మరికొంతకాలము ఆ యా మండలములందలి ప్రభువులు తమకు వశమయిన మండలములందే పరిపాలకులుగ ఉండేవారు. చక్రవర్తులు వంశానుగతముగ సింహాసనముపై కూర్చుండి, అప్పుడప్పుడు ప్రజలకు దర్శనమిస్తూ ఉండేవారు. వాస్తవమయిన పరిపాలకులతో రాజ్యవ్యవహారములు ముచ్చటిస్తూ ఉండేవారు. మొదట కొంతకాలము 'ఫూజివారా' కుటుంబ నాయకులు వాస్తవ పరిపాలకులుగా ఉండేవారు. 1992 లో యోరిటోమో

కుటుంబ నాయకుని సేనలు ఫూజివారాలను ఓడించి వారిని అధికారమునుండి తొలగించి వాస్తవ పరిపాలనాధికారమును యోరిటోమోకు సంక్రమింప చేసినవి. ఈ పరిపాలకుని సైనిక స్థావరము తూర్పు జపాన్‌లో కామకూరానగరమందు నెలకొల్పబడినది. ఇతడు షోగన్ అనే పరిపాలక బిరుదమును వహించి, చక్రవర్తి పేరనే పరిపాలనము సాగించెను. ఇతని తర్వాత ఇతని పుత్రులు అసమర్థులగుటచేత హోజో కుటుంబము వారు వారిని ఓడించి పరిపాలనాధికారమును వశపరచుకొనిరి. కాని 'షోగన్' అను బిరుదము యోరిటోమో కుటుంబమువారికే నిలిచి, వారి ప్రతినిధులుగానే ఈ హోజో కుటుంబమువారు రాజ్యపాలనము సాగించుచుండిరి.

కుబ్లయ్‌ఖాన్ జపాన్‌ను ముట్టడించుటకు ఒక నౌకాదళమును 1274 లో పంపెను. కాని, అది అప్పుడు దైవికముగా లేచిన తుపానువల్ల చెల్లాచెదరయినది. ఆ తుపానుకు 'కామీకాజే' అని పేరు. ఈ పేరు జపాన్‌వారికి శుభప్రదమయినది. కుబ్లయ్‌ఖాన్ మరియొకసారి 1281 లో నౌకాదళము పంపెను. అది కూడ విఫలమైనది.

అషికాగా కుటుంబము 1338 లో అధికారము వహించి సుమారు 250 ఏండ్లు నిలుపుకొనెను. 1582 లో హిడెయోషీ అనే మరియొక కుటుంబ వీరుడు షోగన్‌ల ప్రతినిధియై, 1598 వరకును పరిపాలనము సాగించెను. ఇతడు 1592 లో కొరియాపై దండెత్తిపోయెను. ఆ దేశమును వశపరచుకొని ఇండియా, చీనా దేశములను కూడ జయించి జపాన్ సామ్రాజ్యమును వ్యాపింపజేసికొన జూచెను. అందుచేతనే ఇతనికి జపాన్ దేశపు నెపోలియన్ అని చరిత్ర రచయితలు పేరుపెట్టిరి. కాని, ఇతని జైత్రయాత్ర కొరియా వరకే సాగినది.

విదేశములతోడి సంబంధములు: మార్కోపోలో [చూ.] చీనా, జపాన్ దేశములనుండి యూరప్ ఖండమునకు మరలి ఈ దేశముల ముచ్చటలు వర్ణించి చెప్పుటవలన యూరప్ వారికి ఈ దేశములు ధనధాన్యములకు నిలయములు అను నమ్మకము కలిగినది. ఆ పిమ్మట సాహసిక నావికులు కొందరు ఈ దేశములకు రావలెనన్న కోరికతో సముద్రయానములు చేసిరి. 1543 లో పోర్చుగీస్ నావికులు ఈ జపాన్ దీవులను చూచిరి. జపాన్ దర్శించిన యూరపియన్ నావికులలో వీరే మొదటివారు. 1549 లో ఫ్రాన్సిస్ జేవియర్ అనే జెసూయిట్ మతాచార్యుడు దక్షిణ క్యూషూ మండలమందలి కాగోషీమాకు వచ్చి రోమన్ కేతలిక్ మతమును బోధించెను. జపాన్ అతనికి స్వాగతము ఇచ్చి ఆదరించెను. అతనిని అనుసరించి స్పెయిన్, పోర్చుగల్ దేశములనుండి మత బోధకులును, వారితో వాణిజ్య వ్యాపారులును జపాన్‌కు వచ్చిరి.

మొట్టమొదట కొంతకాలము ఈ విదేశీయుల రాక ముచ్చటగనే ఉండెను. కాని, క్రమముగ వీరు దేశమును జయించి ఆక్రమించుకొందురేమో అను భయము జపాన్ పరిపాలకులకు కలిగినది. 1614 లో ఇయేయస్ అను పరిపాలకుడు క్రైస్తవ మత బోధకులందరును దేశము విడిచి పోవలెనని, క్రైస్తవ మతము స్వీకరించిన జపాన్ జనులు ఆ మతమును విడిచిపెట్టవలసినదని శాసించెను. 1637 లో వేలకొలది క్రైస్తవ మత బోధకులు హతులైరి. విదేశీయులైన వర్తకులు అందరును దేశమునుండి వెడలగొట్టబడిరి. జపాన్ మునుపటివలెనే ఇతర ప్రపంచముతో సంబంధము తెగిన ఒంటరి దేశమైనది. ఒక్క డచ్‌వారి వాణిజ్యపు నౌక మాత్రము సంవత్సరమునకు ఒకసారి వచ్చి పోవుటకు అనుమతిపొందినది. జపాన్ వారు ఎవ్వరును దేశము విడిచి పోరాదను కట్టడి ఏర్పడినది.

కాని, కొంతకాలము గడచిన తరువాత చీనాతో వ్యాపారము చేయు యునైటెడ్‌స్టేట్స్‌కు మధ్య మార్గమున తమ నౌకల సదుపాయము కొరకు జపాన్‌నందు ఒక స్థావరమును సంపాదించుట బాగుండునను గాఢాభిప్రాయము ఏర్పడెను. 1853 లో యునైటెడ్‌స్టేట్స్ నాలుగు యుద్ధనౌకలను జపాన్‌కు పంపి తమ నావికుల ఎడలను, వర్తకుల ఎడలను జపాన్‌వారు ఆదరము చూపవలసినదనియు, మైత్రి పాటించవలసినదనియు కోరినది. కాని, జపాన్ వారు యునైటెడ్‌స్టేట్స్ కోరికను మన్నింపక తిరస్కరించిరి. 1854 యెడో (నేటి టోక్యో) నగరమందలి షోగన్ మందిరములకు కనబడునట్లు యునైటెడ్‌స్టేట్స్ నౌకలు టోక్యో సముద్రశాఖయందు నిలచినవి. ఫిరంగులు పేలునన్న భయముతోచి, షోగన్ చేయునదిలేక యునైటెడ్‌స్టేట్స్ సంధి షరతుల పత్రముపై సంతకము పెట్టుటకు సమ్మతించెను. అందువలన నాగసాకీ, యోకహామా, మరి నాలుగు రేవుపట్టణములలో యునైటెడ్ స్టేట్స్ వర్తకులు వాణిజ్యము సాగించుకొనుటకు జపాన్ వారు అనుమతిని ఈయవలసివచ్చినది. ఈ అనుమతి క్రమముగ బ్రిటిష్, ఫ్రెంచి, రష్యా వర్తకులకును లభించినది.

చక్రవర్తి వాస్తవ పరిపాలకుడగుట: షోగన్ ప్రభుత్వము విదేశీయులకు దేశమందు స్థానము కలిగించుటవలన దుర్బల ప్రభుత్వమయినదని జపాన్ ప్రభువులు ఆక్షేపించిరి. దానితో ఒక చిన్న అంతర్యుద్ధము చెలరేగినది. దాని ఫలితముగ ఇంతవరకును పేరునకు మాత్రమే పరిపాలకుడుగ ఉండిన చక్రవర్తి వాస్తవమయిన పరిపాలకుడుగ

అయినాడు. అప్పుడు చక్రవర్తిగ ఉండిన మెయ్‌జీ (ముత్సుహీటో) తన రాజధానిని యెడో నగరమునకు మార్చి టోక్యో అని పేరుపెట్టెను. 1868 లో పాశ్చాత్య దేశములలో గల శాసన నిర్మాణ సభవంటి సంస్థను నిర్మింతునని చక్రవర్తి ప్రకటన కావించెను. చక్రవర్తి ఆంతరంగిక సభ్యులు - అభ్యుదయాశయులు కనుక - శీఘ్ర కాలములో జపాన్ ను నవనాగరక దేశముగ మార్చివేసిరి. భూస్వాముల అధికారవిధానమును, యుద్ధవీరుల పరిపాల నాధికారమును పూర్తిగ తొలగించి నవీన పద్ధతులను అనుసరించి సైన్య, యుద్ధ, నౌకాదళ విధానమును ఏర్పరచిరి. విద్యా విధానమును నవీన పద్ధతిని సంస్కరించి ప్రాథమిక విద్య నిర్బంధముగా అమలు పరచిరి. పరిశ్రమ లను, గని పనులను, రాక పోకల సౌకర్యములను, బ్యాంక్ విధానములను వృద్ధిచేసిరి. యూరప్ దేశముల నుండి పారిశ్రామిక నిపుణులను, కార్యవేత్తలను రావించి జపాన్ యువకులకు శిక్షణము ఒసగిరి. పెద్ద నౌకలను నిర్మింప జేసిరి. ఇతర దేశములతోడి వాణిజ్య వ్యాపారములను పెంపొందించిరి.

జపాన్ ప్రభుత్వ విధానము కూడ నవీన పద్ధతులను అనుసరించి సంస్కరింపబడినది. 1890 లో నూతనముగ ఏర్పడిన ప్రజాప్రతినిధులు గల శాసన నిర్మాణసభ తొలి సారిగా సమావేశమైనది. రాజకీయ పక్షములు ఏర్పడినవి. ప్రజాస్వామ్య విధాన లక్షణములు అంతకంతకు ఎక్కువగా గోచరములైనవి. 1918 లో ఒక సామాన్య కుటుంబము వాడు ప్రధాన సచివుడైనాడు. కార్మిక వర్గ సమితులు క్రమముగ ఎక్కువైనవి. ఆత్మ ప్రత్యయము, దేశాభి మానము పెంపొందించుకొన్న జపాన్ దేశీయులు ప్రపంచ జిగీషగలవారు అయినారు.

విదేశ రాజ్యాంగనీతి : దేశము ఇటుల శక్తిమంత మగుటతో విదేశములతో వ్యవహరించుటయందును జపాన్ కరకుదనమును వహించి స్థైర్యముతో వ్యవహరించెను. దేశ శాసనములకు లోబడనక్కరలేని స్వేచ్ఛాధికార ముతో దేశమందుండిన యునైటెడ్ స్టేట్స్, బ్రిటన్ మొదలైన ఇతర దేశములవారి స్వేచ్ఛను నిరోధించు చట్టములను గావించి, అందుకు అనుకూలమైన ఒడం బడికలను పర దేశములతో జపాన్ ప్రభుత్వము చేసి కొనెను. ఇందుకు తోడుగ పరిసర దేశములందును జపాన్ నకు పలుకుబడి అతిశయించుటకు క్రమముగ అవకాశములు ఏర్పడెను.

కొరియా విషయమై చీనా, జపాన్ దేశములవారు ప్రతిస్పర్ధులుగ ఉండిరి. అందుచేత 1894 - 95 లో చీనా - జపాన్ యుద్ధము జరిగినది. జపాన్‌వారు విజయులైరి. వారికి చీనావారు కొరియాదేశమునే కాక, ఫార్మోజా, రియూకుయూ దీవులను కూడ స్వాధీనపరచిరి. మంచూరి యాలో దక్షిణ భాగమందు కొన్ని అధికారములను సైతము చీనావారు జపాన్‌వారికి ఒసగిరి. కాని, పాశ్చాత్య దేశములు అందుకు సమ్మతింపక ఆ అధికారములను జపాన్ విడిచిపెట్టుకొనునట్లు చేసిరి. జపాన్ బ్రిటన్‌తో చెలిమి చేసికొనినది. 1904 లో జపాన్‌వారు తగిన బలమును చేకూర్చుకొన్నామన్న నమ్మకముతో మంచూరియాలో కొన్ని అధికారములను సంపాదింపగోరి రష్యాతో సంగ్రామము గావించి ఓడించిరి. దాని ఫలితముగ రష్యా 1905 లో జరిగిన ఒడంబడిక ప్రకారము తమకు గలవన్న అధికారములను విడిచిపెట్టుకొని దక్షిణ మంచూరియా రైలు మార్గమును, సఖాలీన్ ద్వీపమందలి దక్షిణభాగమును జపాన్‌కు అప్పగించెను.

ప్రథమ ప్రపంచయుద్ధము ప్రారంభించగనే జపాన్ జర్మనీతో యుద్ధము చేయ ఉద్దేశించినట్లు ప్రకటన చేసినది. యూరప్ ఖండమందు జరిగిన యుద్ధమునందు జపాన్ పాల్గొనలేదు. కాని, పసిఫిక్ మహాసముద్రమందు జర్మనీకి గల ద్వీపములను, చీనా సముద్రతీరమందు జర్మనీవారికి గల సింగ్‌టావో పట్టణమును జపాన్ ముట్టడించి పట్టు కొనెను. ఈ యుద్ధమందు జయించుటవలన కలిగిన ఫలితము లను మిత్రమండలి వారితో కలిసి జపాన్‌వారును అనుభ వించిరి. చీనాలో తమ పలుకుబడిని పెంపొందించుకొను తలంపుతో చీనా ప్రభుత్వమునకు తన ఆశయములను 21 కోరికల రూపమున జపాన్ ప్రభుత్వము తెలియజేసెను. కాని, అందులో కొన్నింటిని మాత్రమే నెరవేర్చుకొన గలిగినది. వెర్సెయిల్స్ సంధి [చూ.] షరతులను అనుసరించి, పసిఫిక్ మహాసముద్ర మధ్యభాగమున జర్మనీవారికి చెంది ఉండిన మార్షల్, కెరలీన్ దీవులు జపాన్‌వారికి దఖలు పడినవి. జపాన్ నానాజాతిసమితి [చూ.] లో చేరి, సమితికి ఉత్సాహ పూరితమయిన తోడ్పాటు అందజేసినది. 1921 - 22 లో వాషింగ్‌టన్‌లో జరిగిన వివిధ రాజ్యముల వారి సమావేశమందు యునైటెడ్ స్టేట్స్‌కును, బ్రిటన్ కును గల నౌకాదళము కంటె చిన్నదైన నౌకాదళమును మాత్రమే ఉంచుకొనుటకు జపాన్ సమ్మతించినది. అంతే కాక, చీనాలోని షాన్‌టుంగ్ నుండి తమ బలపరివారము లను తీసికొనిపోవుటకు, చీనా స్వాతంత్ర్యమునకు భంగము కలిగింపకుండుటకును కూడ జపాన్ అంగీకరించినది. ఇంకా మిత్రమండలివారితో చెలిమిని నిలబెట్టుకొనుటకు కావలసిన ఒడంబడికలను కూడ చేసికొన్నది.

**సాంగ్రామిక బల నిర్మాణము:** మెయిజీ ఔదార్యము గల చక్రవర్తి కనుక అతని కాలములో పైన వివరించిన ప్రశాంత విదేశాంగ రాజ్యనీతి నిలచి ఉండెను. 1912 లో అతడు చనిపోయిన తరువాత యోషిహిటో చక్రవర్తి అయ్యెను. ఇతడు బలహీనుడు. 1921 నుండి 1926 లో ఇతడు చనిపోయెడు వరకును రాజప్రతినిధిగను, అనంతరమున చక్రవర్తిగను పాలనము గావించిన ఇతని కుమారుడు హిరోహిటో గట్టివాడే కాని దేశమందు సాంగ్రామిక బల నిర్మాణాభిలాషుల చర్యలను నిరోధించలేకపోయెను. వీరి బలము అంతకంతకు ఎక్కువైనది. దేశపరిపాలనము వాస్తవముగ వీరికి లోబడి సాగినది.

**మంచూరియా, ఉత్తర చీనా ఆక్రమణ:** 1931 లో జపాన్ సేనలు ప్రభుత్వమువారితో సంప్రదింపకుండ స్వతంత్రించి మంచూరియాను ఆక్రమించి, 1932 లో షాంగేవద్ద చీనావారితో యుద్ధము చేసినవి. మంచూరియా వాసులును, వారితరపున యునైటెడ్ స్టేట్స్‌ను నానాజాతి సమితి [చూ.] వారికి ఫిర్యాదు చేసిరి. ఆ సమితి ఈ విషయమును పరిశీలించుటకు ఒక పరిశీలకవర్గమును ఏర్పరచి పంపిరి. ఆ వర్గము జపాన్ చర్య అత్యాచారమయినదని తెలియ చేసిరి. కాని, దానిపైన సమితి మరి ఏ చర్యను తీసికొనలేదు. 1933 లో నానాజాతిసమితి సభ్యత్వమును జపాన్ విడిచిపెట్టుకొన్నది.

జపాన్ మంచూరియాను వశపరచుకొని, లోగడ చీనా సామ్రాజ్యమునకు చక్రవర్తిగనుండి పదభ్రష్టుడైన హెన్రీపూయీ అను అతనిని మంచూరియాకు చక్రవర్తిగ నిలబెట్టి, మంచూరియా స్వతంత్ర సామ్రాజ్యమైనదని తెలియజేయుటకు దానిపేరు 'మంచూకో' అని మార్చివేసిరి. ఇటుల అక్రమముగ విదేశములను ఆక్రమించుట మొదలిడుటతో జపాన్ రాజకీయములందు పలుకుబడి ఆర్జించి, ఆ సైనిక విప్లవనాయకులు ఔదార్యనీతిని అవలంబించిన మంత్రులను చంపి, దేశపాలనమును వశపరచుకొనిరి; పిమ్మట జపాన్, కొరియా, మంచూకో, చీనాదేశములుగల జపాన్ మహాసామ్రాజ్యమును నిర్మించుటకు సంకల్పించిరి.

**ఇతర దేశములతోడి సంబంధములు:** 1936 లో కమ్యూనిస్ట్ విధానమునకు విరుద్ధమగు రాజనీతిని అవలంబించిన అక్షరాజ్యము (జర్మనీ, ఇటలీ) లతో మైత్రి చేసుకుని జపాన్ యునైటెడ్ స్టేట్స్, బ్రిటన్‌లను ఎదిరించుటకు పూనుకొనెను. 1940 లో జర్మనీకి ఫ్రాన్స్ లొంగిపోగానే జపాన్ నౌకాదళము ఫ్రెంచి, ఇండో-చీనా దేశములపై దండెత్తి ఆ ప్రాంతమును ఆక్రమించినది.

ఆగస్టు, 1939 లో సోవియట్ రష్యా-జర్మనీ మైత్రి ఒడంబడికలు సోవియట్ రష్యాపై ద్వేషము గల జపాన్‌కు ఆశ్చర్యమును, ఆశాభంగమును కలిగించినవి. 1940 లో జపాన్ కూడ సోవియట్ రష్యాతో ఒడంబడికలు చేసికొనెను. కాని, మంచూరియా సరిహద్దులలో తన సేనలను అట్లే నిలిపి ఉంచెను.

జపాన్ దురాక్రమణలు ఎక్కువగుచుండుట చూచి యునైటెడ్ స్టేట్స్ జపాన్ ఎడల గల మైత్రిని తగ్గించుకొనుచుండెను. 1940 లో జపాన్‌కు పంపించుచుండిన నూనె, ఇనుము మొదలైన సరుకులు తగ్గించివేసెను.

**ఆసియాలో నూతన రాజ్య విధానము;** జపాన్ తమకు లోబడిన రాజ్యముల కూటమును సమకూర్చి ప్రాచ్యదేశమందు పాశ్చాత్యదేశములవారి అధికారము ఏ మాత్రమును లేకుండా చేయవలెనని సంకల్పించి, దేశమంతా యుద్ధమునకు సన్నద్ధమయ్యే విధానమును ఏర్పరచుటకు పూనుకొనెను. 1941, అక్టోబరు 17 న జనరల్ హిడేకీ టోజో ప్రధానమంత్రి యగుటతో సైనిక వర్గమువారికి దేశపాలనము సంపూర్ణముగ వశపడినది.

**ద్వితీయ ప్రపంచయుద్ధము-జపాన్:** 1941, డిసెంబరు 7 న జపాన్ విమానములు పెరల్ హార్బర్‌లో ఉండిన యునైటెడ్ స్టేట్స్ నౌకాదళమును బాంబులువేసి తగులబెట్టినవి. అంతటితో యునైటెడ్ స్టేట్స్, జపాన్‌ల మధ్య యుద్ధము ప్రారంభమైనది. జపాన్ సేనలు సయామ్ దేశము, మలయాద్వీపకల్పము, ఫిలిప్పీన్ దీవులు, సయామ్, బర్మా, మలయా, ఇండోనీషియా దీవులు, అడ్మిరాలిటీ దీవులు, న్యూ ఐర్లాండ్, న్యూ బ్రిటన్, బూగైన్‌విల్, సోలమన్‌దీవులు, న్యూగినీలోని చాల భాగమును అతి త్వరితగతిలో స్వాధీనపరచుకొనినవి. అల్‌యూషన్ దీవులందలి అట్టూ, కిస్కా దీవులను పట్టుకొనినవి. అనగా అల్‌యూషన్‌లు మొదలుకొని 7, 200 కి. మీ. మేర దక్షిణమున ఉన్న సోలమన్‌దీవుల వరకును, వేక్‌దీవినుండి 8,000 కి. మీ. మేర పడమటనున్న బర్మావరకును గల ప్రదేశమంతా తమ అధీనతను పెట్టుకొనిరని చెప్పవచ్చును. అంతటితో జపాన్‌వారి ఉధృతి ఆగినది,

మే నెల, 1942 లో జపాన్‌వారి దక్షిణ న్యూగినీదాడికి ప్రతిరోధము కలిగినది. 1942, జూన్‌లో మిడ్‌వే దీవి వద్ద జపాన్‌వారి నౌకాదళము ఓడిపోవుటవలన ఆ ద్వీపమును వారు ముట్టడింపలేకపోయిరి. ఆనాటనుండి జపాన్‌వారికి అపజయములు కలుగుట ప్రారంభించెను. మరియొక సంవత్సరము గడచినంతలో జపాన్‌ను పెక్కు దీవులనుండి

తరిమివేయగల బలము యునైటెడ్‌స్టేట్స్‌కు చేకూరినది. 1942, ఆగస్టులో యునైటెడ్‌స్టేట్స్ మార్షల్, కెరలీన్, అడ్మిరాలిటీ మొదలయిన దీవులను వశపరచుకొనెను. పిమ్మట ఆరు మాసములు యుద్ధము సాగించి ఫిలిప్పీన్ దీవులను కూడ స్వాధీనపరచుకొనెను.

ఈ లోగా జపాన్ నౌకా, విమాన బలములు సన్నగిల్లినవి. యునైటెడ్‌స్టేట్స్, బ్రిటన్ నౌకాదళములు జపాన్ సముద్రతీరమును, విమానములు దేశములోని నగరములను పాడుచేసినవి. 1945, ఆగస్టు 6 న తొలిసారిగా అటం బాంబును యునైటెడ్‌స్టేట్స్ హిరోషిమాపై వేయుటతో జపాన్‌కు ఘోరమైన అపాయము వాటిల్లినది. ఆగస్టు 8 న సోవియట్ రష్యావారు జపాన్‌పై యుద్ధమును ప్రకటించి మంచూరియా, కొరియా దేశములను ముట్టడించిరి. ఆగస్టు 9 న తొలుతటి దానికన్న పెద్దదగు వేరొక అటం బాంబును నాగసాకీ నగరముపై యునైటెడ్‌స్టేట్స్ ప్రయోగించినది.

ఇక తమ ఓటమి తప్పదన్న భయము జపాన్ వారికి కలిగినది. వారు మిత్రమండలివారి వద్దకు రాయబారము అంపి, లోగడ పోట్స్‌డామ్ [చూ.] వద్ద ప్రకటితములైన షరతులను తాము అంగీకరించిన ఎడల జపాన్ చక్రవర్తి పదవికి అపాయము కలుగకుండ ఉండగలదా? అని ప్రశ్నించిరి. అందుకు విజయులైన ఆ మూడు దేశముల వారును తమ అంగీకారమును తెలియజేసిరి. ఆ వెంటనే ఆగస్టు 14 న మిత్రమండలి వారికి జపాన్ లొంగి సంధి షరతులకు ఒడంబడినది.

**యుద్ధానంతర పరిస్థితి;** 1951, సెప్టెంబరు 8 న సంధి పత్రము శాన్‌ఫ్రాన్సిస్కో నగరమువద్ద తయారైనది. దానిపైన జపాన్ ప్రతినిధులును, మరి 48 దేశముల ప్రతినిధులును సమ్మతి తెలియజేయుచు సంతకములు పెట్టిరి. 1951, అక్టోబరు 26 న జపాన్‌లోని డయట్ అనే ప్రజాసభలో ఆ సంధి షరతులకును, యునైటెడ్ స్టేట్స్‌తో ఒడంబడిక చేసికున్న భద్రతా సంధిషరతులకును అత్యధిక సంఖ్యాకులైన సభ్యులు తమ సమ్మతిని ప్రకటించిరి.

కాని, ఈ శాంతి సంధిలో సోవియట్‌రష్యా సంతకము చేయకుండుటవలన ఆ దేశమునకు జపాన్‌తో గల యుద్ధ పరిస్థితి అంతమైనటుల భావింపబడుటకు అవకాశము లేకుండెను. చివరకు 1956 లో ఈ ఉభయ దేశములును ఒక ఒడంబడిక కుదుర్చుకొనుట మూలమున ఈ యుద్ధ పరిస్థితి అంతమొందినది. అంతట ఐక్యరాజ్య సమితియందలి సభ్యత్వమును జపాన్ ఆర్జించినది.

సంధి కుదిరిన వెనువెంటనే 1951 లో యునైటెడ్ స్టేట్స్‌తో ఒక భద్రతా సంధిని జపాన్ చేసికొనెను. దానిని అనుసరించి జపాన్ రక్షణ నిమిత్తమై యునైటెడ్ స్టేట్స్ సేనలు కొంత పరిమితికి లోబడి జపాన్‌నందు కొన్ని స్థావరములలో ఉంచబడుటకు యునైటెడ్ స్టేట్స్ అంగీకరించినది. యునైటెడ్ స్టేట్స్ ఒసగిన ధనసహాయము వలనను, కొరియా యుద్ధకాలమున (1951) జరిగిన వ్యాపారాభివృద్ధి వలనను, తమ అవిరళ కృషి వలనను జపాన్ దేశీయులు త్వరలోనే యుద్ధఫలితమగు ఆర్థిక సంక్షోభము నుండి బయటపడుటయేకాక పారిశ్రామికముగ దేశమును పునర్నిర్మించి యుద్ధాత్పూర్వపు దానికన్న మిన్నదగు జీవనప్రమాణ స్థాయిని అందుకొన గలిగిరి.

**రాజ్యాంగము :** ద్వితీయ ప్రపంచయుద్ధమున జపాన్ పరాజితము కాకపూర్వము ఆ దేశమున పరిపాలనాధికారము అంతయు రాజు హస్తగతమై ఉండెను. రాజు దైవాంశసంభూతుడుగ పరిగణింపబడెడివాడు. రాజుచే నియమింపబడు మంత్రివర్గము పరిపాలనను రాజు పక్షమున సాగించుచుండెడిది. శాసనసభ అప్పుడు ఉన్నను అది రాజునుండి అధికారమును గ్రహించినదిగ మాత్రమే వర్తించెడిది. కాని, 1947 నుండియు ఈ పరిస్థితి అంతయు మారిపోయినది. ఆ సంవత్సరమున ఆమోదింపబడిన రాజ్యాంగ చట్టమును అనుసరించి అధికారము అంతయు ప్రజల హస్తగతము చేయబడినది. ప్రజల ఐక్యభావనకు లాంఛనముగను, రాజ్యమునకును ఒక ప్రతీకముగను మాత్రమే రాజు ఇకముందు వర్తించునని ఆ రాజ్యాంగ చట్టమున స్పష్టము ఒనర్పబడినది; శాసన నిర్మాణాధికారము జాతీయ శాసనసభ (డయట్) యందు న్యస్తము చేయబడినది. తమనుండి ఒకనిని శాసనసభ సభ్యులు ప్రధానిగ ఎన్నుకొనెదరు. మంత్రి వర్గమునందు ప్రధానిగాక, 11 నుండి 16 వరకు మంత్రులు ఉండి, ఒక్కొక్కరు ఒక్కొక్క పరిపాలనా శాఖను నిర్వహింతురు. మంత్రివర్గములో కనీస పక్షము సగముమందియైనా శాసన సభలో సభ్యులై ఉండవలెను. ఈ మంత్రివర్గము సమష్టిగ శాసనసభకు బాధ్యతవహించి పనిచేయును.

శాసన సభయందు ప్రతినిధి సభ, శిష్ట సభ అను రెండు కక్ష్యలు కలవు. ప్రతినిధి సభయందు 467 మంది ఎన్నుకొనబడిన సభ్యులు ఉందురు. ఈ సభకు ఎన్నికలు సాధారణముగ నాలుగేండ్లకు ఒకసారి జరుగును. శిష్టసభయందు 250 మంది సభ్యులు ఉందురు. వీరిలో 150 మంది వివిధ జిల్లాలనుండి ఎన్నుకొనబడెదరు. కడమవారు జాతీయ నియోజక వర్గములనుండి ఎన్నుకొనబడెదరు. ఏ చిత్తు చట్టమైనను

తొలుత ప్రతినిధి సభలో ప్రవేశపెట్టబడవలెను. చట్ట మగుటకు దీనికి రెండు సభల ఆమోదము కావలసి ఉన్నను, ఒకవేళ శిష్ట సభ అంగీకరించని ఎడల లేదా ఆ సభకు చిత్తు చట్టమును పంపిన 60 దినములలోగా ఏ చర్యయు ఆ సభ తీసుకొనని ఎడల దానిని ప్రతినిధి సభ రెండవసారి చర్చించి, ఆమోదించినచో అది చట్టమగును. బడ్జెట్‌ను ప్రతినిధి సభ ఆమోదించిన తరువాత శిష్ట సభ ఆమోదింపక పోయినచో సామరస్యము సాధించుటకు ప్రయత్నము జరుగును. అట్టి సామరస్యము కుదరని సందర్భముననుు లేదా తనకు బడ్జెట్ చేరిన 30 దినములలోగా శిష్ట సభ తన అభిప్రాయమును ఇదమిత్థమని తెలుపకపోయినను ప్రతినిధి సభ ఆమోదించిన రీతిగనే బడ్జెట్ అమలులోనికి వచ్చును. ప్రతినిధి సభ సభ్యుని వయస్సు 25 ఏండ్లకును, శిష్ట సభ సభ్యుల వయస్సు 30 ఏండ్లకును తగ్గరాదు. 20 ఏండ్ల వయస్సుకు తగ్గక, ఒక నియోజక వర్గమున మూడు నెలల నివాసార్హత గల స్త్రీ-పురుషులు అందర కును 1947 రాజ్యాంగ చట్టమును అనుసరించి వోటు హక్కు కలదు.

దేశమందు 1947 కు పూర్వమున రాజకీయ పక్షములు ఉన్నను అవి సిద్ధాంతములను అనుసరించి కాక, సాధారణ ముగ వ్యక్తులను ఆశ్రయించి ఉండెడివి. ప్రస్తుతము ఉన్న పక్షములలో లిబరల్ డెమోక్రాటిక్ పక్షము, జపాన్ సోషలిస్ట్ పార్టీ అనునవి ముఖ్యముగ పేర్కొనదగినవి. దేశీయ ఆంతరంగిక విషయములందు ఈ పక్షముల మధ్య ఎక్కువ విభేదములు లేకున్నను, విదేశనీతి విషయమున మాత్రము తీవ్రములగు అభిప్రాయభేదములు కలవు. యునైటెడ్ స్టేట్స్‌తో గల రక్షణ సంధిని పరిస్థితులకు అనుగుణములగు మార్పుతో సవరింపజేసి, యునైటెడ్ స్టేట్స్‌తో సహకరించుచు, తైవాన్‌నందలి జాతీయ చీనా ప్రభుత్వ మును మాత్రమే గుర్తించుచు వ్యాపారముల విషయమున మాత్రము కమ్యూనిస్ట్ చీనాతో సాన్నిహిత్యము పెంపొందించుకొనదగుననుట లిబరల్ డెమోక్రాట్ల విధానము; రక్షణ సంధిని రద్దుచేసికొని కమ్యూనిస్ట్ చీనాను గుర్తించి, సోవియట్ రష్యా, కమ్యూనిస్ట్ చీనా, యునైటెడ్ స్టేట్స్‌తో కలిసి ఒక రక్షణ సంధిని కుదుర్చుకొనవలయుననుట జపాన్ సోషలిస్ట్ల వైదేశిక నీతి. కమ్యూనిస్ట్ పార్టీకి ఈ దేశమున బలము చాల తక్కువ. గి. వేం. సీ; చీ. శే. రా.

**జఫర్‌సన్, తామస్** (1743 - 1826) : యునైటెడ్ స్టేట్స్ రాజనీతి వేత్త; మూడవ అధ్యక్షుడు. వర్జీనియా రాష్ట్రములో ఆల్బెమార్ల్ కౌంటీయందు షాడ్వెల్ వద్ద జన్మించెను (ఏప్రిల్ 13, 1743). కాలేజీ విద్యను ముగించు కొని, ఇతడు న్యాయశాస్త్రమును అభ్యసించి, 1767 లో న్యాయవాద వృత్తిని చేపట్టి, రాజకీయములలో అడుగు పెట్టువరకు ఆ వృత్తిని విజయవంతముగ నిర్వహించెను.



తామస్ జఫర్‌సన్
(1743 - 1826)

ఆనాటి పరిస్థితులను బట్టి రాజకీయరంగమున ప్రవేశించుట తప్పని సరియై, ఇతడు 1769 లో వర్జీనియా వలస శాసన సభకు ఎన్నికయై వలస రాజ్యములకు, మాతృ దేశమైన ఇంగ్లండుకు మధ్య చెలరేగిన వివాద ములో ప్రముఖ పాత్ర నిర్వహించి, బ్రిటన్‌కు వ్యతిరేకముగ దిగుమతి నిషిద్ధపు ఒడంబడికను రూపొందించెను. అమెరికాలోని 13 వలసలకు ప్రాతినిధ్యము కల మొదటి కాంటినెంటల్ కాంగ్రెస్‌న 1775 లో ఇతడు పాల్గొనెను. బ్రిటిష్ ప్రధాన మంత్రి నార్త్ ప్రభువు సూచించిన రాజీ ప్రతిపాదనలను నిరసించుచు సహేతు కము, ప్రతిభాపూర్వకము అగు సమాధానమును వర్జీనియా రాష్ట్రము తరపున జెఫర్‌సన్ ఆ కాంగ్రెస్‌న ప్రచురించెను. దానితో ఇతని శక్తియుక్తులు, రాజకీయ ధౌరంధర్యము గుర్తింపబడి, జఫర్‌సన్ రెండవ కాంటినెంటల్ కాంగ్రెస్‌కు వర్జీనియా ప్రతినిధిగా పంపబడెను. ఆ కాంగ్రెస్‌లో 13 వలస రాజ్యములు బ్రిటన్‌తో తెగతెంపులు చేసికొని, స్వాతంత్ర్య మును ప్రకటించుకొనుటకు నిర్ణయించుకొనెను. చరిత్రాత్మకమైన ఆ స్వాతంత్ర్య ప్రకటనను ఇతడే స్వయముగ రచించెను.

జఫర్‌సన్ మరల 1783 లో కాంగ్రెస్‌కు ఎన్నికయై, దేశపు కరెన్సీలో దశాంశపద్ధతిని ప్రవేశపెట్టించెను; 1784 ఆర్డినెన్స్, 1785 లాండ్ ఆర్డినెన్స్ జారీ చేయబడుటకు కారకుడయ్యెను. ఇవియే తరువాత ప్రాదేశిక వ్యవస్థీకరణకు ప్రాతిపదికలు అయ్యెను. 1784 లో వర్తకపు ఒడంబడికలను కుదుర్చుకొనుటకు యూరప్‌కు పంపబడి, ఇతడు మరుచటి సంవత్సరము ఫ్రాన్స్‌లో మినిస్టర్‌గా నియమితుడయ్యెను. ఇట్లు ఫ్రెంచివిప్లవ ప్రాథమిక ఘట్టములో ఇతడు పారిస్‌లో ఉండి మానవస్వత్వముల ప్రకటనను తయారుచేయుటలో ఫ్రెంచి విప్లవ నాయకు లకు తగిన సలహాలు అందించెను. పారిస్‌నుండి స్వదేశము నకు వచ్చి 1789 లో ఆ దేశపు ప్రప్రథమ విదేశాంగ మంత్రిగ నియమింపబడి, ఇతడు 1793 లో ఆర్థికమంత్రియగు

హామిల్టన్ యొక్క అధికార కేంద్రీకరణ ప్రావణ్యములకు నిరసనగా ఆ పదవిని పరిత్యజించెను. విదేశాంగ విధాన ములో ఇతడు అధ్యక్షుడు వాషింగ్‌టన్‌కు చాలా చేయూతను ఇచ్చెను. 1797 మొదలు 1801 వరకు ఇతడు యునైటెడ్ స్టేట్స్ ఉపాధ్యక్షుడుగ ఉండి, సెనేట్ సభకు అధ్యక్షత వహించి, సభాకార్యక్రమములను చాకచక్యము తోను, హుందాతనముతోను నిర్వహించుటకు ఆచరణ సూత్రములను తయారు చేసెను. ఇవి నేటికి కూడ వాడుక యందు ఉన్నవి. 1801 నుండి 1809 వరకు ఇతడు రెండు పర్యాయములు యునైటెడ్ స్టేట్స్ అధ్యక్షుడుగ పని చేసెను. ఇతడు తన హయాములో ప్రభుత్వ వ్యయమును చాలవరకు తగ్గించుట, ఇంగ్లండు - ఫ్రాన్స్‌ల మధ్య చెల రేగిన యుద్ధములో తటస్థ విధానము అనుసరించుట, ఫ్రాన్స్‌నుండి లూజియానా రాష్ట్రమును క్రయము సేయుట; ఓడ దొంగలపై యుద్ధము ప్రకటించుట వంటి ఘన కార్యములు ఎన్నెని కావించెను.

అధ్యక్ష పదవీ విరమణ తరువాత ఇతడు సాధించిన ఘనకార్యము వర్జీనియా యూనివర్సిటీ స్థాపన. రాజకీ యములందే కాక ఇతనికి వ్యవసాయము అనినను, శాస్త్ర పరిశోధన అనినను, గ్రంథపఠనము అనినను, శిల్పకళ అనినను ప్రగాఢమగు ఆసక్తియు, సంగీతమునందు పరిచయమును ఉండెడివి. ఇతని గ్రంథసంచయముతో యునైటెడ్‌స్టేట్స్ కాంగ్రెస్ గ్రంథాలయమునకు అంకు రార్పణ జరిగెను. యునైటెడ్ స్టేట్స్‌లోని రెడ్ ఇండియన్ భాషలకు ఇతడు నిఘంటువులను తయారు చేసెను. ఆ. వెం.

**జమైకా :** పశ్చిమగోళమందు కారబియన్ సముద్ర పరివృతమై ఉన్న ఒక స్వతంత్ర ద్వీపరాజ్యము.

[వి] 10,962 చ. కి. మీ.; [జ] 16,96,000. వీరిలో నీగ్రోలు 77%, అమిశ్రమ జాతులు 18%, తక్కినవారు శ్వేతజాతికి చెందిన వారు. [భా] జాతీయభాష ఇంగ్లీషు. [మ] దాదాపుగ ప్రజ లందరును క్రైస్తవులు. [రా] కింగ్‌స్టన్ (జ. సం. 1, 25, 556).

చరిత్ర: ఈ దేశపు చరిత్రయందలి పూర్వభాగమునకు వెస్ట్ ఇండీస్ [చూ.]. 1961 లో జరిగిన ప్రజానిర్ణయము (రెఫరెండమ్) ను అనుసరించి ఈ రాజ్యము వెస్ట్ ఇండీస్ సమాఖ్య నుండి 1962లో విడివడి, కామన్ వెల్త్ సభ్యత్వము కల స్వతంత్రరాజ్యమైనది. అంతటినుండి సంపూర్ణ ప్రజా స్వామికరాజ్య పరిపాలనా విధానము ఇట అమలునకు కొనిరాబడినది. చీ. శే. రా.

**జయప్రకాశ్ నారాయణ్** (జ. 1902): భారత జాతీయవాది; సోషలిస్టు పార్టీ వ్యవస్థాపక కార్యదర్శి; సర్వోదయ నాయకుడు. బీహార్‌లోను, యునైటెడ్ స్టేట్స్‌లోను ఉన్నత విద్యను అభ్యసించెను. ఈయన స్వాతంత్ర్యోద్యమ సమయమున కాంగ్రెస్‌లో చేరి, పెక్కు సారులు కారాగార శిక్షను అనుభవించి, అనేక త్యాగ ములు చేసెను; కార్మిక కాంగ్రెస్‌శాఖకు అధిపతి అయ్యెను (1931); కొంతకాలము కాంగ్రెస్ కార్యవర్గ సభ్యుడుగా ఉండి, అందలి ప్రముఖులతో అభిప్రాయ భేదములు ఏర్పడి, రాజీనామా ఇచ్చెను. అనంతరమున తన నాయకత్వమును అనుసరించిన సోషలిస్ట్ వర్గముతో కాంగ్రెస్‌నుండి విడివడెను (1948). తరువాత ఇతడు సోషలిస్ట్‌పార్టీ కార్యదర్శిగను, అఖిలభారత రైల్వే ఫెడరేషన్ అధ్యక్షుడుగను పని చేసెను; 1957, అక్టోబర్‌లో రాజకీయ సన్యాసము స్వీకరించితినని ప్రకటించి, నాటి నుండి తన జీవితమును పూర్తిగా సర్వోదయ కార్యక్రమము నకు అంకితము చేసికొనెను. ఆ. వెం.

**జర్‌క్సీస్ :** చూ. క్షరక్ష.

**జరతుష్ట్ర :** ప్రాచీన పారసీకమునను, కొంతవరకు పారసీక సామ్రాజ్యమునను వ్యాప్తికాంచిన జరతుష్ట్ర మతమునకు వ్యవస్థాపకుడు. ఈ మతమే జొరాస్ట్రియన్ మతమని భ్రంశరూపమున పాశ్చాత్యులచే వ్యవహృతము [చూ. సం. 7 - పు. 424]. చీ. శే. రా.

**జర్మనీ :** యూరప్ ఖండమందలి ఒక ప్రముఖ దేశము. నేడు చారిత్రక కారణముల వలన తూర్పు జర్మనీ, పశ్చిమ జర్మనీ అను పేరులు గల రెండు దేశములుగ విభక్తమై ఉన్న ఈ విశాల భూ భాగమున అనేక వేల సంవత్సరముల నుండి జనులు నివసించినను, జర్మన్ జాతి రూపొంది ఎక్కువ కాలము కాలేదు. 1871 వరకు జర్మనీ అనేక చిన్న స్వతంత్ర ప్రభుత్వముల, నగర రాజ్యముల కూటమిగనే ఉండినది.

చరిత్రకు అందని పూర్వదినములలో ఉత్తర యూరప్ అడవులలో ట్యూటన్ జాతికి చెందినవారు సంచరించేవారు. వారి సమాధులు, వారు ఉపయోగించిన పనిముట్లు వారి జీవిత విధానమును గురించి మనకు కొంత తెలియజేయును. రోమన్ ప్రజాసత్తాక రాజ్య యోధులతో జర్మనులు జరిపిన పోరాటపు కాలమునుండి జర్మనుల చరిత్ర మనకు లభ్యమగుచున్నది. మేరియస్ అను రోమన్ సేనాధిపతి ట్యూటన్ అనబడు జర్మను జాతి సైన్యమును క్రీ. పూ. 102 లో ఓడించెను. నాడు హెల్వేషియా అని వ్యవహరింప బడిన స్విజర్లండ్‌లోని జర్మన్ జాతీయుల మీదికి, రైన్‌నదీ తీరము పొడుగునా నివసించే జర్మనుల మీదికి జూలియస్ సీజర్ [చూ.] దండయాత్ర చేసెను.

అగస్టస్ [చూ. పు. 262] అను రోమన్ చక్రవర్తి జర్మనీని జయించవలెనని సంకల్పించెను. జనరల్ వేరస్ సేనాధిపత్యమున ఇతని సేనలు ఆర్మేనియస్‌చే నడుపబడు చున్న జర్మనీ సైనికులను క్రీ. శ. 9 వ శతాబ్దమున ఓడించెను. కాని, రోమన్‌లు ట్యూటన్ జాతీయుల దండ యాత్రలను అరికట్టుటకు రైన్, డాన్యూబ్ నదీతీరములను ఆక్రమించుకొనుటతో తృప్తిపడిరి. ట్యూటన్ తెగలలో అలెమన్ని, ఫ్రాంక్‌లు, గాత్‌లు, వేండల్‌లు, లొంబార్డ్‌లు మున్నగువారు ఉండిరి. రోమన్‌ల బలము క్షీణించుట ప్రారంభించుటతో జర్మన్ తెగలవారు రోమన్ సామ్రాజ్య ముపై అనేక దండయాత్రలు ప్రారంభించిరి.

ఈ జర్మన్ తెగలలో గాత్‌లు ఇటలీ, స్పెయిన్‌లలో వ్యాపించిరి. ఫ్రాంక్‌లు రైన్‌నది దిగువ భాగమునుండి గాల్‌కు వెళ్లి ఇప్పుడు ఫ్రాన్స్ అని పేర్కొనబడుచున్న విశాల రాజ్యమును ఏర్పరచిరి.

జర్మనీ తెగలవారు వారు జయించిన రోమన్ ప్రదేశము లలో స్థిరపడి, రోమన్‌లతో అంతర్వివాహములు చేసికొని, వారి నాగరకతను అవలంబించి, వారి భాషాసంప్రదా యములను అనుసరించుట ప్రారంభించిరి. ఫ్రాంక్‌ల రాజైన క్లోవిస్ క్రైస్తవమతమును అంగీకరించి, తన సైనికులకు రోమన్ నాగరకతతో పరిచయమును ఏర్పర చెను. 768 వ సంవత్సరమున రాజ్యమునకు వచ్చిన ఫ్రాంక్ రాజు షార్లమేన్ [చూ.] కాలమున రోమన్ నాగరకత ప్రభావము ఇతోధికమైనది. ఇతడు క్రైస్తవేతరులగు సాక్సన్‌లను ఓడించి వారిచే క్రైస్తవమతమును స్వీకరింప జేసెను. లొంబార్డ్‌లు రోమ్ నగరములోని పోప్‌పై దండ యాత్ర చేయుచుండగా వారిని అరికట్టెను. అందుకు పోప్ సంతోషించి షార్లమేన్‌ను రోమన్ చక్రవర్తిగా చేసెను (800). ఇతడు స్థాపించిన సామ్రాజ్యమునకు అప్పటినుండి పవిత్ర రోమన్ సామ్రాజ్యమను పేరు వాడుకలోనికివచ్చెను. ఈనాటి ఫ్రాన్స్, జర్మనీ, బెల్జియమ్, లక్జెంబర్గ్, ఆస్ట్రియా, ఉత్తర ఇటలీ, తూర్పు స్పెయిన్ ప్రదేశమును అంతటిని షార్లమేన్ చక్రవర్తి ఆ కాలమున పాలించెను.

షార్లమేన్ విశాల సామ్రాజ్యము అతని మనుమల కాలములో విచ్ఛిన్నమైనది. 843 వ సంవత్సరములో అంగీకృతమైన వెర్డన్ సంధి ప్రకారము తూర్పు భాగము జర్మను జాతీయుడైన లూయీకి లభించినది. మధ్య భాగము లోథేర్ అను వానికి వచ్చినది. దీనికి తదుపరి లోరైన్ అను పేరు వచ్చినది. ఇట్లు విడిపోగా ఏర్పడిన చిన్న రాజ్యములకు తగిన బలసంపత్తి కాని, రాజకీయ అధికారము కాని లేకుండెను. ప్రతి ప్రభువు, రాజు, సామంతుడు తన ప్రాంతమునకు తాను సార్వభౌముడు కావలెనని చూచుచుండెడివారు.

అప్పుడప్పుడు ఈ స్వతంత్రులను అందరిని అడచిపట్టి, ఏకత్వము సాధించి పరిపాలించిన పాలకులు లేకపోలేదు. అట్టి వారిలో సాక్సనీ పాలకుడు హెన్రీ ద ఫౌలర్ (919 - 936 ప.) ఒకడు. ఇతని తరువాత ఓటో మహనీయుడు [చూ. పు. 364] రోమన్ సామ్రాజ్యమును పునరుజ్జీవింప చేసెను.

కొంత కాలమునకు పవిత్ర రోమన్ సామ్రాజ్య చక్రవర్తు లకు, పోప్‌లకు మధ్య వైరుధ్యము ప్రారంభమయినది. చక్రవర్తులు పోప్‌చేత పట్టాభిషిక్తులయిన తరువాతనే చక్రవర్తిత్వము పొందుదురు కాన, పోప్ ప్రతినిధులయిన మతాధిపతులపై చక్రవర్తి అధికారము చూపించరాదని పోప్‌ల వాదన. సామ్రాజ్యములోని ఎన్నికదారులు (ఎలెక్టర్‌లు) ఎన్నుకొనుటవలన చక్రవర్తిత్వము వచ్చు చున్నది కాని, పోప్ పట్టాభిషేకమువలన కాదనియు, పోప్ పట్టాభిషేకము చేసినను, చేయకపోయినను ఎన్ను కొనబడినవాడు చక్రవర్తిగ మని తీరుననియు చక్రవర్తుల వాదన. చివరకు ఈ విభేదములు యుద్ధమువరకు వచ్చినవి. ఇటలీ దేశములోని అనేక నగరములు చక్రవర్తి పరి పాలనను వదలించుకొను అభిప్రాయముతో పోప్ పక్షము వహించినవి. చక్రవర్తి ఫ్రెడరిక్ - II [చూ.] మరణకాలము వరకు కూడ ఈ వివాదములు సాగుచునే ఉండినవి. అతని మరణానంతరము జర్మనీ అంతయు అరాజకమైనది. చాలా కాలమువరకు చక్రవర్తి ఎన్నుకొనబడలేదు. 1273 లో ఆస్ట్రియా దేశపు రుడాల్ఫ్‌ను చక్రవర్తిగా ఎన్నుకొనిరి. అతని కాలమునుండి ఆస్ట్రియా బలపడి, అనతి కాలములో ప్రముఖ రాజ్యమైనది. అతనిది హాప్స్‌బర్గ్ వంశము.

మత యుద్ధములు : 1500 నాటికి జర్మనీలో హాప్స్‌బర్గ్ వంశము ప్రాబల్యము పొందినది. తరచు హాప్స్‌బర్గ్ వంశమువారే చక్రవర్తులు అగుచుండెడివారు. రాను రాను ఈ వంశపు చక్రవర్తులకు వివాహ వారసత్వముల వలన క్రొత్త రాజ్యములుచేరి, సామ్రాజ్యము పెరిగినది. 1519 - 1555 లో పరిపాలించిన చార్లెస్ - V [చూ.] ఇందుకు ఒక ఉదాహరణ. కాని, ఈతని పరిపాలనవలన జర్మనీలో పెద్ద మేలు కలుగలేదు. కారణము ఈతని విశాల సామ్రాజ్యమే; సామ్రాజ్యమున అనేక కల్లోలములవలన ఇతడు జర్మనీలో ఉండి, స్థిమితముగా పరిపాలించుటకు వలను పడలేదు. దీనికితోడు ఇతని కాలమున మత విభేద ములు అగ్నికి ఆజ్యమును చేర్చినవి. రోమన్ కేథలిక్ మతమును మార్టిన్ లూథర్ ఎదిరించెను. అతని నూతన

సిద్ధాంతము వైపు అనేకులు మొగ్గుచూప ఆరంభించిరి. వారికి ప్రొటెస్టంట్‌లను పేరువచ్చెను. పోప్ కాని, చక్రవర్తి కాని ఈ పరివర్తనను అరికట్టలేక ఉండిరి. 1555 లో కేతలిక్‌లకు, ప్రొటెస్టంట్ మతస్థులకు మధ్య జరిగిన ఆగ్స్‌బర్గ్ సంధి [చూ. పు. 282] వలన పవిత్ర రోమన్ సామ్రాజ్యములో అరువది సంవత్సరములు మాత్రమే శాంతి నెలకొనినది. ఈ సంధిలో అనేక లోపములు కలవు. ఇది రాజులకు మాత్రమే మత స్వాతంత్రము ఇచ్చినది. కాని, ప్రజలకు కాదు. రాజులైనను కేతలిక్ మతమునో, ప్రొటెస్టంట్ మతమునో ఎంచుకొనుటకే స్వతంత్రులు కాని, వారి ఇష్టము వచ్చిన ఇతర మతములను అనుసరింప వీలులేదు. ఇందు వలన నాటికే బలపడిన కాల్విన్ మతస్థులు అసంతృప్తులైరి. సామ్రాజ్యము ఏ మాత్రము పెరిగినను, కేతలిక్ లైన చక్రవర్తులు బలపడుదురుగాన, అందుకు ప్రొటెస్టంట్‌లు సమ్మతింపకుండిరి. హాప్స్‌బర్గ్ వంశమునకు చెందిన ఫెర్డినాండ్ - I హంగేరీ, బోహీమియాలను తన వంశపు ఆధిపత్యము క్రిందికి తెచ్చెను. కాని, బోహీమియాలో కేతలిక్ అయిన ఫెర్డినాండ్ - II ను అచటి ప్రొటెస్టంట్‌లు వ్యతిరేకించుటతో చిక్కులు ప్రారంభమయినవి. ఇవి ప్రారంభమున మత వివాదములుగా ఉండినను, చివరకు యుద్ధములుగా పరిణమించి, ముప్పది సంవత్సరములు సాగి, జర్మనీ అంతటిని ఆమూలాగ్రము నేలమట్టము చేసినవి [చూ. ముప్పది సంవత్సరముల యుద్ధము].

తమ తమ స్వార్థములకొరకు యూరప్‌లోని అనేక దేశములు ఈ యుద్ధమున పాల్గొనినవి. ఫ్రాన్స్ దేశము మత విషయముకన్న, రాజ్యవిస్తరణము ముఖ్యమనుకొని తాను కేతలిక్ అయినను, కేతలిక్ అయిన ఆస్ట్రియాతో పోరాడెను. వెస్ట్‌ఫేలియాసంధి [చూ.] తో ఈ యుద్ధము అంతమైనది. ఈ సంధి ఫలితముగ చక్రవర్తి ఇంచుమించు నామమాత్రావశిష్టుడై నాడు. జర్మనీదేశము సర్వనాశనము అయినది. సుమారు మూడవవంతు జనాభా చంపబడుటయో, ఆకలికి చచ్చుటయో జరిగినదని అంచనాలవలన తేలినది.

**ప్రష్యా ప్రాబల్యము :** ఈ ముప్పదిసంవత్సరముల యుద్ధకాలమున జర్మనీ రాజ్యములలో ఒకటియైన ప్రష్యా అధికారము ఇనుమడించినది. ప్రష్యా పాలకులు హోయెన్ జొల్లెర్న్ వంశీయులు. ప్రథమమున ఈ వంశీయులగు రాజులు కొండలయందుండి రైన్‌నదిపై ప్రయాణించు వర్తకులనుండి పన్ను వసూలు చేసికొనువారు. 'హోయెన్' అనగా ఎత్తు అనియు, 'జొల్లెర్న్' అనగా పన్ను అనియు అర్థము [చూ. ప్రష్యా].

ఈ వంశమువారు తరువాత బెర్లిన్ చుట్టును కల బ్రాండెన్‌బర్గ్ తూర్పుభాగమునకు పరిపాలకులైరి. రాను రాను వీరు ఇంకను కొంత భూభాగమును, తూర్పు ప్రష్యా రాష్ట్రమును సంపాదించిరి. 1640 లో ఫ్రెడరిక్ విలియమ్ బ్రాండెన్‌బర్గ్ సింహాసనమును అధిష్ఠించిన తరువాత ఉత్తర జర్మనీలో ఈ వంశమువారు ప్రబలమైన పరిపాలకులని గుర్తింపబడిరి. చతుర్విధోపాయముల వలన బ్రాండెన్‌బర్గ్‌ను, ప్రష్యాను కలిపి ఫ్రెడరిక్ విలియమ్ ఒక సంయుక్త రాజ్యమును ఏర్పరచెను. ఇతని తరువాతివాడైన ఫ్రెడరిక్ - I 'ప్రష్యాలో రాజు' అను బిరుదును 1701 లో వహించెను. అప్పటికి ఇంకను ప్రష్యారాజు పవిత్ర రోమన్ సామ్రాజ్య చక్రవర్తికి సామంతుడే అయినను, వీరు ఇద్దరి మధ్య వైమనస్యములు నానాటికి పెరుగుచుండెను. ఫ్రెడరిక్ - I కాలమున ప్రష్యా ధనము, బలము కూడ పెరిగినవి. అతని కుమారుడు ఫ్రెడరిక్ - II (ఫ్రెడరిక్ మహానీయుడు) యూరప్‌నందు ప్రష్యా బలవత్తమ రాజ్యము కావలెనని సంకల్పించెను. అతడు తన పరిపాలన 1740 లో ప్రారంభించెను. సరిగ ఆ సంవత్సరమే పవిత్ర రోమన్ సామ్రాజ్య చక్రవర్తి అగు చార్లెస్ - VI (ఆస్ట్రియా) మరణించెను. అతడు తనకు పుత్రసంతానము లేక పోవుట చేత, రాజ్యమునకు కుమార్తె మేరియా తెరెసా [చూ.] ను వారసురాలుగ ప్రకటించెను. కాని, ఫ్రెడరిక్ ఆ నియామకమును అంగీకరింపక, ఆస్ట్రియాకు చెందిన సైలీషియాను ఆక్రమించెను.

తదుపరి మేరియా తెరెసా 1756 లో ఫ్రాన్స్, స్వీడెన్, రష్యా, శాగ్జనీ మున్నగు రాజ్యముల సాహాయ్యముతో ఎంతో ప్రయత్నించినను సైలీషియాను ఫ్రెడరిక్ వదల లేదు. సప్తవర్ష యుద్ధము (1756 - 1763) [చూ.] లో తనకు ఎదురుగ సగము యూరప్ ఖండమంతయు నిలచినను, బ్రిటన్ మాత్రమే తనకు తోడుగ ఫ్రెడరిక్ అజేయుడై నిలచెను. కొంతకాలము తరువాత ఫ్రెడరిక్ పోలండ్ విభజనకు రష్యా, ఆస్ట్రియాలతో కుట్రజేసి, కొంత భాగమును విభజించి తీసికొనెను.

ఈ విధముగ ఫ్రెడరిక్ మహనీయుని కాలమున ప్రష్యా అనేక విధముల వృద్ధిపొంది, జర్మనీలో ప్రముఖ రాజ్యము అయినది.

**జర్మనీ - నెపోలియన్ :** 1792 తరువాత జరిగిన ఫ్రెంచి యుద్ధములలో ఆస్ట్రియా, ప్రష్యాలతో సహా అనేక జర్మను రాజ్యములు పాల్గొన్నవి. నెపోలియన్ పవిత్ర రోమన్ సామ్రాజ్యమును 1806 లో రద్దుచేసి ఆస్ట్రియా, ప్రష్యాలలో కొన్ని భాగములు జయించి, రైన్‌నది

పొడుగున గల జర్మనులను ఫ్రెంచి పౌరులుగనో, మిత్రులు గనో మార్చి, పశ్చిమ జర్మను రాజ్యములను మాత్రము తన రక్షకత్వమున ఒక సమాఖ్యగా గుర్తించెను. కొంత కాలమునకు ఈ ఫ్రెంచి పరిపాలనను జర్మనులు తీవ్రముగ వ్యతిరేకింప ఆరంభించిరి. ఆ ప్రతిఘటనలో ప్రష్యా ప్రముఖ పాత్ర వహించెను.

నెపోలియన్ పతనమునకు పిమ్మట జరిగిన వియెన్నా సమావేశ ఫలితముగా ఏకైక జర్మను సామ్రాజ్యమునకు బదులు జర్మను సమాఖ్య ఏర్పడినది. అందు గల ప్రతి జర్మను రాజ్యమునకు ప్రత్యేక ప్రభుత్వము, పతాకము, రాజ్యాంగము, సైన్యము ఏర్పడినవి. ఈ సమాఖ్యకు ప్రత్యేకముగ ఒక పరిపాలకుడుగాని, చక్రవర్తిగాని లేడు. ఒక రాజ ప్రతినిధుల సభ (డయెట్) మాత్రము వివిధ రాజ్యముల మధ్య సమన్వయము, ఏకీభావము సాధించుటకు ఏర్పడినది.

**జర్మనీ ఏకీకరణము :** 1848 - 49 మధ్య జర్మనీ ఏకీకరణమునకు విప్లవోద్యమములు బయలుదేరినవి. ఫ్రాంక్‌ఫర్ట్ వద్ద జాతీయ సభ ఒకటి సమావేశమై, ప్రష్యా నాయకత్వమున ఏర్పడనగు ఐక్య జర్మన్ సమాఖ్యకు రాజ్యాంగము రచించుట ప్రారంభించెను. కాని, ఆ నాటికి ప్రష్యా రాజు ఆ సమాఖ్యకు చక్రవర్తి అగుటకు నిరాకరించెను. కాని, 1861 లో విలియమ్ - I ప్రష్యా రాజై, బిస్మార్క్ [చూ.] ను ముఖ్యమంత్రిగ ఎంచుకొనెను. సమర్థుడగు బిస్మార్క్ నాయకత్వమున 1871 లో జర్మనీ ఏకీకరణము పూర్తి అయినది.

ఇట్లు నూతన జర్మను సామ్రాజ్యావతరణముతో జర్మనీలో జాతీయ భావము ప్రబలమైనది. విలియమ్ - I చక్రవర్తి మరణానంతరము కొద్ది కాలమునకు విలియమ్ - II రాజ్యమునకు వచ్చెను. ఇతడు 1890 లో బిస్మార్క్‌ను పదవీ భ్రష్టుని చేసి, జర్మన్ నౌకాదళమును, సైన్యమును అభివృద్ధిచేసెను. ఈ సైనికాభివృద్ధి విధానము రష్యాకును, బ్రిటన్‌నకును భయకారణమయినది. జర్మనీకి చుట్టును అందరును శత్రువులైనారు. కాని, జర్మనీ మాత్రము శక్తిమంతమైనది.

**ప్రథమ ప్రపంచ యుద్ధము - జర్మనీ :** ప్రథమ ప్రపంచ యుద్ధమునకు అవ్యవహిత పూర్వకారణము ఆస్ట్రియా సింహాసనపు వారసుడగు ఆర్చ్‌డ్యూక్ ఫ్రాన్సిస్ ఫెర్డినాండ్‌ను సెర్బియాయందలి బోస్నియాలో ఎవరో హత్య చేయుట (జూన్ 28, 1914). సెర్బియాపై ఆస్ట్రియా - హంగేరీ యుద్ధము ప్రకటింపగా, రష్యా ప్రతిఘటించి ఆస్ట్రియా, జర్మనీల సరిహద్దులగుండా తన సైన్యములు పంపెను. అందుకు జర్మనీకి కోపమువచ్చి రష్యాపైనీ, దాని మిత్రమైన ఫ్రాన్స్‌పైని యుద్ధము ప్రకటించెను.

రష్యా యుద్ధమునకు సన్నద్ధము కాకముందే ఫ్రాన్స్‌ను ఉక్కిరి బిక్కిరి చేయవలెనను సంకల్పముతో జర్మనీ తన సైన్యములను లక్జెంబర్గ్, బెల్జియమ్‌ల గుండా నడిపించెను. అవి రెండును బలహీనమైన తటస్థ రాజ్యములు. నిజమునకు జర్మనీ ఒక ప్రత్యేకపు ఒడంబడికవలన ఆ రాజ్యముల తాటస్థ్యమును మన్నించవలసి ఉండెను. ఈ అకృత్యమునకు బ్రిటన్ కోపగించి జర్మనీ ఎదిరి పక్షమున చేరి యుద్ధము ప్రకటించెను. జర్మనీ సైన్యములు బెల్జియమ్‌ను, ఉత్తర ఫ్రాన్స్‌ను జయించెను. కాని, ఫ్రెంచి - బ్రిటిష్ సైన్యములు మార్న్‌నది వద్ద నిలద్రొక్కుకొనినవి.

జర్మనీకి మిత్రదేశములగు ఆస్ట్రియా - హంగేరీ, బల్గేరియా, టర్కీ, మధ్య యూరప్‌లోను, పారసీక సింధు శాఖ వరకు గల పడమటి ఆసియాలోను ఆధిక్యము వహించి ఉండినవి. కాని, ఆ దేశముల చుట్టును గల భూ - జల మార్గములు అన్నియు శత్రువుల సైన్యములతో నిండి ఉండెను. జర్మన్‌లు రష్యాను లొంగిపోవునటుల చేసిరి ; కాని, ఫ్రెంచి సైన్యములను ఓడింపలేక పోయిరి. బ్రిటన్‌వారి దిగ్బంధనను దెబ్బతీయుటకు జర్మన్‌లు జలాంతర్గాములను పంపిరి. ఈ జర్మన్ జలాంతర్గాములు యునైటెడ్‌స్టేట్స్ నౌకలను ఎదుర్కొని నష్టము కలిగించుటచే యునైటెడ్‌స్టేట్స్ కూడ జర్మనీపై యుద్ధము ప్రకటించెను (ఏప్రిల్ 16, 1917). 1918 నాటికి జర్మనీ మిత్రులు అందరు బలహీనులయిరి. జర్మనీ యుద్ధమున జయించు ఆశలు సన్నగిలెను. చివరకు 1918, నవంబరు 11 న జర్మనీ ఓటమిని అంగీకరించెను. జర్మను చక్రవర్తి నెదర్‌లండ్స్‌కు పారిపోయెను ; జర్మను సామ్రాజ్యము అంతరించి, జర్మను ప్రజా సత్తాక రాజ్యముగ ఏర్పడెను. ఈ నూతన రాజ్యము మిత్రరాజ్యములతో సంధి చేసికొనెను. వెర్సెయిల్స్ సంధి [చూ.] లోని షరతుల ప్రకారము జర్మనీకి ఇతఃపూర్వము కల వలసలు అన్నియు పోయినవి. జర్మనీలో 1,00,000 మంది సైన్యముకన్న ఎక్కువ ఉండుటకు వీలులేదు. జర్మనీ మిత్రరాజ్యములకు యుద్ధ నష్ట పరిహారముగ 33,00,00,00,000 డాలర్లు ఇచ్చుకొనవలెను.

జర్మనీకి మితవాద రాజ్యాంగము ఒకటి ఏర్పరుపబడెను, తత్ప్రకారము ప్రజలు ప్రత్యక్షపు ఎన్నికల ద్వారా అధ్యక్షుని ఎన్నుకొను ఏర్పాటు జరిగెను. మంత్రివర్గము దిగువసభ (రీచ్‌స్టాగ్) కు బాధ్యత వహించును. ఈ ప్రజాసత్తాక రాజ్యమును జర్మనీలోని మూడు పక్షములు తీవ్రముగ వ్యతిరేకించినవి. రాజప్రియవాదులు రాజత్వమును

పునరుద్ధరించవలెను అనిరి ; కమ్యూనిస్టులు కార్మిక నియంతృత్వము కావలెను అనిరి; జాతీయ సమాజవాదులు (నాజీలు) నియంతృత్వము కావలెను అనిరి. జర్మనీ పునరాయుధధారణము, వెర్సెయిల్స్ సంధిని నిరాకరించుట నాజీల ఆశయములు. వీరి నాయకుడు హిట్లర్ [చూ.].

నాజీయుగము : 1930 లో యూరప్ ఖండమున ఆర్థిక మాంద్యము వలన జర్మనీ కూడ దెబ్బతినినది. దేశములో నిరుద్యోగము సాధారణ విషయమై పోయినది. ప్రజలు తిండిలేక మాడుచుండిరి. అసంతృప్త ప్రజానీకము హిట్లర్ పక్షమువారు ఏమి చెప్పినను నమ్ముటకు తగిన స్థితిలో ఉండెను. హిట్లర్ పక్షమువారు ప్రజలకు సౌఖ్యము, తిండి, బట్ట, ఉద్యోగములు ఇచ్చెదమని వాగ్దానములు చేయుచుండిరి.

వాన్‌హిండెన్‌బర్గ్ 1932 లో అధ్యక్షుడయిన పిదప అడాల్ఫ్‌హిట్లర్‌ను 1933లో చాన్సెలర్ గాచేసెను. నాటితో హిట్లర్ నిరంకుశ పరిపాలన ప్రారంభమయ్యెను. ఎగువ సభ (రీచ్‌స్టాట్ )ను రద్దుచేసెను. దిగువ సభ (రీచ్‌స్టాగ్) కూడ ప్రభుత్వ నిర్ణయములపై తన అంగీకారము తెల్పుట తప్ప, ఇతరమేమియు చేయవలనుపడకుండ చేసెను. తన నాజీపార్టీ తప్ప, మరియొకపక్షము దేశమున లేకుండ రూపుమాపెను. ఉద్యోగుల నియామకము, మంత్రివర్గ నిర్మాణము, రాష్ట్రప్రభుత్వముల నిర్వహణము, రేడియో, పత్రికలు, పాఠశాలలు, యూనివర్సిటీలు; సినిమాలు, కార్మిక సంఘములు, చర్చీలు సర్వస్వమును హిట్లర్ ఆధిపత్యమున ఉండెను.

అధ్యక్షుడు వాన్‌హిండెన్ బర్గ్ 1934 లో మరణించెను. అప్పుడు హిట్లర్ అధ్యక్ష పదవినే రద్దుచేసి, అధ్యక్షాధికారములు, తాను ఇదివరకు నిర్వహించుచున్న అధికారములు కలిపి, నాయకుడు (ఫ్యూరర్) అను క్రొత్త పదవిని సృష్టించి, అందుకు తనను నియమించుకొనెను. 1935 లో హిట్లర్ జర్మనీలో యూదులను తరిమివేయించెను. ఆర్యులని హిట్లర్ నిర్ణయించిన వారికే జర్మను పౌరస్వత్వము లభించెను. జర్మనుజాతి పవిత్రమైన ఆర్యజాతి యని హిట్లర్ సిద్ధాంతము. 1933 లో జర్మనీ నానాజాతిసమితి [చూ.] నుండి వైదొలగెను. 1935 లో దేశములో నిర్బంధ సైనికశిక్షణను హిట్లర్ పునరుద్ధరించెను. 1936 లో ఇతడు ఇటలీలోని ఫాసిస్ట్ ప్రభుత్వముతో సంధి చేసికొనెను.

హిట్లర్ ఆస్ట్రియాను 1938, మార్చిలో వశపరచుకొని జర్మనీలో కలిపివేసెను. జెకోస్లొవాకియాలోని జర్మను భాషా ప్రాంతమయిన సూడెటన్ లాండ్‌ను తనకు ఇమ్మని పట్టుబట్టెను. అందుకు ఫ్రెంచివారు, బ్రిటిష్‌వారు అంగీకరించిరి. 1939 లో హిట్లర్ మిగిలిన జెకోస్లొవాకియాను కూడా కబళించుటయే కాక ఆ సంవత్సరమే వేసవిలో డాన్జిగ్ నగరమును, పోలండ్‌గుండా బాల్టిక్‌సముద్రమునకు మార్గమును కోరెను. పోలండ్ అందుకు అంగీకరింపక పోవుటతో తన సైన్యములను హిట్లర్ పోలండ్‌గుండా నడిపించెను. అంతటితో బ్రిటన్, ఫ్రాన్స్ దేశములు పోలండ్ పక్షము వహించి హిట్లర్‌పై యుద్ధము ప్రకటించినవి. అంతట ద్వితీయ ప్రపంచ మహాయుద్ధము [చూ.] ఆరంభమయ్యెను.

ద్వితీయ ప్రపంచమహాయుద్ధము : 1939, సెప్టెంబరు మొదటి తేదీన హిట్లర్ పోలండ్‌పై దాడిచేసి, అతి త్వరిత కాలములో అందలి పడమటి భాగమును ఆక్రమించుకొనెను. అదే సమయమున పోలండ్ తూర్పు భాగమును సోవియట్ రష్యా ఆక్రమించుకొనెను. ఈ పనికి సోవియట్ రష్యా - జర్మనీలు అంతకు ముందు చేసికొనిన ఒక రహస్యపు ఒడంబడిక కారణము. 1940 లో జర్మను సైన్యములు తటస్థ రాజ్యమయిన డెన్మార్క్‌ను ఆక్రమించి, నార్వేను కూడ ముట్టడించెను. ఆ పిమ్మట చిన్న తటస్థ రాజ్యములైన నెదర్‌లండ్స్, బెల్జియమ్, లక్జెంబర్గ్‌లు కూడ జర్మన్‌ల వశమయ్యెను. యుద్ధగతి జర్మనీకి అనుకూలముగ ఉండుట గమనించి, ఇటలీదేశము జర్మనీపక్షమున యుద్ధములో చేరెను. 1940 లో ఫ్రాన్స్ లొంగిపోయినది. బ్రిటిష్ సైన్యములు యూరప్ ఖండమునుండి తిరోగమించి బ్రిటన్ ద్వీపములో తలదాచుకొన్నవి. జర్మను శక్తి అప్రతిహతముగా కన్పట్టినది.

హిట్లర్ 1941 లో బాల్కన్ ద్వీపకల్పమును ఆక్రమించి, ముందు హెచ్చరిక లేకయే సోవియట్ రష్యాపై యుద్ధము ప్రారంభించి, మాస్కోవరకు పురోగమించెను. ఆ సంవత్సరమే డిసెంబరు 7 న అక్షరాజ్యములలో ఒకటి అగు జపాన్ పెర్ల్ హార్బరుపై హఠాత్తుగ బాంబు వేసినది. తదుపరి మూడు రోజులకు జర్మనీదేశము యునైటెడ్ స్టేట్స్‌పై యుద్ధము ప్రకటించినది. 1942 వరకును జపాన్, జర్మనీల యుద్ధ కార్యక్రమము విజయవంతముగ సాగినది. కాని, 1943 ప్రారంభమున రష్యన్‌లు స్టాలిన్‌గ్రాడ్ వద్ద ప్రతిఘటించి నిలుచుటచో పరిస్థితులు తలక్రిందులైనవి. తదుపరి క్రమముగా జర్మనీ తిరోగమనము ప్రారంభించి, చివరకు 1945 నాటికి పూర్తిగా ఓడిపోయినది.

మిత్రరాజ్యములు సంపూర్ణ విజయము పొందుట తథ్యమని రుజువైనంతనే హిట్లర్ ఆత్మహత్య కావించుకొనెను. 1945, మే 7 న జర్మనీ నిర్నిబంధముగ లొంగిపోయినది.

పరాజితమైన జర్మనీదేశము నాలుగు సైనిక మండలములుగ విభజింపబడినది. అందొక్కొక్కటి యునైటెడ్ స్టేట్స్, బ్రిటిష్, ఫ్రెంచి, సోవియట్ రష్యా అధికారులచే ఆక్రమింప బడినది [చూ. జర్మనీ, తూర్పు; జర్మనీ, పశ్చిమ]. ప్ర. రా.

**జర్మనీ, తూర్పు :** ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున జర్మనీ దేశమందలి తూర్పు భాగము సోవియట్ రష్యా ఆక్రమణకు లోబడి ఉండి, అగ్రరాజ్యముల [చూ. పు. 262] మధ్య చెలరేగిన వైరుధ్యముల ఫలితముగ సోవియట్ రష్యా ఆదరణ వలన ఒక ప్రత్యేక రాజ్యముగ ఏర్పడిన దేశము [చూ. జర్మనీ]. దీనికే 'జర్మనీ డెమోక్రాటిక్ రిపబ్లిక్' అనియు వ్యవహారము కలదు.




ఈ రాజ్యమునకు ఓడర్, నీసీ రేఖను అనుసరించి పోలండ్ [తూ]; జెకోస్లోవాకియా [ద]; పశ్చిమ జర్మనీ [ప]; బాల్టిక్ సముద్రము [ఉ] సరిహద్దులుగ ఉన్నవి. [వి]. 1,07,863 చ. కి. మీ.; కాని, ఈ రాజ్యమందే భౌగోళికముగ చేరి ఉన్న బెర్లిన్ నగరము మొత్తముపైన ఈ రాజ్యమునకు అధికారము లేదు. ఆ నగరమునందలి ఇరువది మండలములలో తూర్పు బెర్లిన్ అని వ్యవహరింపబడు ఎనిమిది మండలములపై మాత్రమే తూర్పు జర్మనీకి అధికారము కలదు. పశ్చిమ బెర్లిన్ అని పిలువబడు తక్కిన పండ్రెండు మండలములు యునైటెడ్ స్టేట్స్, బ్రిటన్, ఫ్రాన్స్‌ల రక్షణకు లోబడి ప్రత్యేక మండలముగ ఉండి, పరిపాలన రీత్యా పశ్చిమ జర్మనీతో సన్నిహిత సంబంధమును కలిగి ఉన్నవి [చూ. బెర్లిన్ సమస్య]. [జ] దాదాపు 1,70,11,000. [భా] జాతీయ భాష జర్మన్. [మ] ప్రజలందరును క్రైస్తవులు. మత స్వాతంత్ర్యమును రాజ్యాంగ చట్టము గుర్తించినను, ఆచరణయందు మాత్రము ఆస్తికతను నిరుత్సాహ పరచుటయే ప్రస్తుతము అచటి ప్రభుత్వపు ఆదర్శము. [రా] తూర్పు బెర్లిన్ (జ. సం. 11,10,016).

చరిత్ర : ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరము విజిత జర్మనీ పాలనను సమైక్యముగ నిర్వహించుటకు ఏర్పడిన మిత్రమండలి నిర్వాహక సమితి (ఎలైడ్ కంట్రోల్ కౌన్సిల్) నుండి 1948, మార్చి నెలలో సోవియట్ రష్యా ప్రభుత్వము వైదొలగి నప్పటినుండి తూర్పు జర్మనీకి ఒక ప్రత్యేకత్వము అబ్బినటుల భావింపదగును. జర్మనీ నుండి తనకు నష్టపరిహారము 1,000 కోట్ల డాలర్ల వరకు రావలయునని సోవియట్ రష్యా ప్రభుత్వము పట్టుబట్టెను. యునైటెడ్ స్టేట్స్, బ్రిటన్, ఫ్రాన్స్‌లు ఇందుకు అంగీకరింపలేదు. కాని, సోవియట్ రష్యా ప్రభుత్వము మాత్రము తన పట్టు విడువక, తన ఆక్రమణలో ఉన్న జర్మనీనుండి, ఈ నష్టపరిహారమున కొంత భాగము వసూలు చేసికొనగలిగెను. తూర్పు జర్మనీపై ఇటుల తన ఆధిపత్యమును చలాయించుకొన గలిగినను అందలి బెర్లిన్ నగరమందలి పశ్చిమ భాగము మాత్రము పశ్చిమ రాజ్యము (యునైటెడ్ స్టేట్స్, బ్రిటన్, ఫ్రాన్స్) ల ఆక్రమణలో ఉండుటయు, ఆ నగరమునకు ఆ రాజ్యముల రాకపోకలు తూర్పు జర్మనీ ద్వారా జరుగుటయు సోవియట్ రష్యా ప్రభుత్వమునకు కష్టదాయకమయ్యెను. అందుచే తూర్పు జర్మనీ ద్వారా భూభాగమున పశ్చిమ రాజ్యములు విమానముల వలన పశ్చిమ బెర్లిన్‌కు సరఫరాలను అందజేసి, తమ పలుకుబడిని అట నిలుపుకొనగలిగినవి. 1948, జూన్ 16 నుండి తన ఆక్రమణలో ఉన్న ఈ ప్రాంతమున భిన్నమగు నాణెముల చలామణీని సోవియట్ రష్యా ప్రభుత్వము ప్రవేశపెట్టెను. ఇంతలో 1949 వ సంవత్సరమున పశ్చిమ రాజ్యములవారు పశ్చిమ జర్మనీనుండి తమ ఆక్రమణ సేనలను చాలవరకు తొలగించి, ఆ ప్రాంతమును 'ఫెడరల్ జర్మనీ రిపబ్లిక్' అను పేర స్వతంత్ర రాజ్యముగ రూపొందించిరి. ఆ వెనువెంటనే సోవియట్ రష్యా ప్రభుత్వము సైతము తూర్పు జర్మనీయందు తన ఆక్రమణను కూడ చాలవరకు తొలగించి 'జర్మనీ డెమోక్రాటిక్ రిపబ్లిక్' అను పేర నూతన రాజ్యముగ తూర్పు జర్మనీని రూపొందించెను. కమ్యూనిస్ట్ పరిపాలన కలిగిన తక్కిన తూర్పు యూరపియన్ రాజ్యముల రాజ్యాంగములను పోలిన ఒక రాజ్యాంగ విధానము కూడ ఆ దేశమునకు రూపొందింపబడెను. కాని, అందలి ప్రజల స్వేచ్ఛాపూర్వక ఆమోదముతో నిమిత్తములేకుండ నిర్మింపబడిన ఈ

రాజ్యాంగవ్యవస్థ అర్థరహితమైనదనియు, అందువలన అటుల ఏర్పడిన రాజ్యము గాని, దాని అధికారులు గాని, జర్మనీకి గాని, అందలి భాగమునకు గాని ప్రతినిధులుగా గుర్తింపబడ వలనుపడదనియు పశ్చిమరాజ్యముల వారు ప్రకటించిరి. జర్మనీ ప్రభుత్వము అనునది తుది శాంతిసంధి కుదురువరకు పశ్చిమ జర్మనీ యందలి ఫెడరల్ రిపబ్లిక్‌కే వర్తింపగలదని వారు ప్రకటించి, ఆ విధముగనే తమ పరిగణను ఒసగిరి. పశ్చిమ రాజ్యములను అనుసరించిన వివిధ ప్రపంచరాజ్యములును, వారిని అనుసరించి ఫెడరల్ రిపబ్లిక్‌ను మాత్రమే పరిగణనకు తీసికొనిరి. కమ్యూనిస్ట్ కూటమి రాజ్యములు తూర్పు జర్మనీ (జర్మనీ డెమోక్రాటిక్ రిపబ్లిక్) ని పరిగణించి, జర్మనీ ఫెడరల్ రిపబ్లిక్‌ను కూడ గుర్తింప సంసిద్ధపడినవి. కాని, తూర్పు జర్మనీని ప్రత్యేక రాజ్యముగ పరిగణనచేసిన వారితో పశ్చిమ జర్మనీ దౌత్యసంబంధములను పెట్టుకొనన నిరాకరించుటచే అది వలనుపడలేదు. భారతదేశమును బోలిన తటస్థ దేశములవారు మాత్రము యథార్థ పరిస్థితులను గుర్తించి అధిక సంఖ్యాకులగు జర్మన్ ప్రజలు వసించు ఫెడరల్ రిపబ్లిక్‌తో దౌత్యసంబంధములను పెట్టుకొనుచునే; వ్యాపారాది విషయములలో తూర్పు జర్మనీతో కూడ సాన్నిహిత్యమును రూపొందించుకొనిరి. ఇది ఇటులుండ క్రొత్తరాజ్యాంగ విధానము ఏర్పరచుటతోనే తూర్పు జర్మనీ యందలి పరిస్థితులు కుదుటబడలేదు. ప్రజలలో ప్రభుత్వ విధానముల ఎడ అసంతృప్తి చెలరేగి, 1953, జూన్‌లో తిరుగుబాటుగ పరిణమించెను. సోవియట్‌రష్యా సేనల సాయముచే జర్మన్ పాలకులు ఈ తిరుగుబాటును అడచివేసిరి. కాని, ప్రజలలో ఉన్న అసంతృప్తిని నశింపచేయుటకు కొన్ని సదుపాయములను కలిగింపక తప్పని పరిస్థితి ఏర్పడెను. అందువలన జర్మనీపై వసూలుచేయు ఆక్రమణ వ్యయములో కొంత భాగమును తగ్గించివేయుటయేగాక, దేశాభివృద్ధి కొరకై కొంత ఋణమును కూడ సోవియట్‌రష్యా ప్రభుత్వము ఒసగెను. దీనితోబాటుగ, నిలువ ఉండిన నష్టపరిహారపు బాకీ కూడ రద్దుచేయబడెను. 1955, సెప్టెంబరు 20 న ఈ డెమోక్రాటిక్ రిపబ్లిక్ ప్రభుత్వముతో సోవియట్ రష్యా ప్రభుత్వము ఒక ఒడంబడిక కుదుర్చుకొనెను. దానిని అనుసరించి ఆంతరంగిక వ్యవహారములలోనే కాక, విదేశ వ్యవహారములలో సైతము సర్వస్వతంత్రత డెమోక్రాటిక్ రిపబ్లిక్‌నకు కలిగింపబడినది. కాని, పశ్చిమ జర్మనీయు, పశ్చిమ రాజ్యములును ఈ రాజ్యమునే గుర్తింపనందున, ఈ సర్వాధికారములవలన డెమోక్రాటిక్ రిపబ్లిక్‌నకు ప్రయోజనము ఏమియు కలుగలేదు. అటనుండి ఈ జర్మను సమస్య ప్రచ్ఛన్న యుద్ధము [చూ.] న అంతర్భాగమైనది. రెండు జర్మనీలు కలవను యథార్థమును గుర్తించి, ఆ ప్రాతిపదికపై ఆ రెండింటితో సంధిని అగ్రరాజ్యములు కుదుర్చుకొని, జర్మనీ సకీకరణసమస్యను చరిత్రగతికి వదలిపెట్టుటయే సమంజసమని సోవియట్ రష్యా ప్రభుత్వమును, తూర్పు జర్మనీయు అభిప్రాయపడుచున్నవి. పశ్చిమరాజ్యములు అందులకు అంగీకరింపనిచో, తాము తూర్పు జర్మనీతో ప్రత్యేకముగ శాంతిసంధిని కుదుర్చుకొనెదమని సోవియట్ రష్యా నాయకుడు కృశ్చేవ్ [చూ.] 1959 మొదలుగ పలుమారులు బెదరించెను. కాని, అందువలన బెర్లిన్ సమస్య [చూ.] మరింత క్లిష్టరూపము ధరింపగలదనియు, తన్మూలమున ప్రపంచ శాంతికి భంగము ఏర్పడుననియు భావించి దానికి కార్యరూపము ఒసగుటకు కృశ్చేవ్ పట్టుబట్టలేదు.

రాజ్యాంగము : 1949 లో ప్రకటితమయిన రాజ్యాంగ చట్టమును అనుసరించి ఈ దేశమున పరిపాలన నిర్వహింపబడుచున్నది. ఇది యొక విధమగు గణరాజ్య విధానము. పార్లమెంట్ నందు 'ప్రజాసభ (వోల్క్స్‌కమ్మర్)', 'రాజ్యసభ (లాండెర్ కమ్మర్)' అను రెండు కక్ష్యలు కలవు. తొలుతటి దానియందలి సభ్యులు నాలుగేండ్లకు ఒక పర్యాయము 18 ఏండ్ల వయసునకు తగ్గని పౌరులచేత సార్వజనిక, అపరోక్ష, రహస్యపు ఎన్నికద్వారా ఎన్నుకొనబడెదరు. కమ్యూనిస్ట్ ప్రజాగణరాజ్యములందలి ఎన్నిక విధానమును అనుసరించి, ఈ సభ్యుల ఎన్నిక ఏకపట్టికా విధానము [చూ. పు. - 348] న జరుగును. ఆ ఏకపట్టికను జాతీయ సమైక్య పక్షము (నేషనల్ ఫ్రంట్) తయారు చేయును. ఈ జాతీయ సమైక్య పక్షమున జర్మన్ సోషలిస్ట్ యూనిటీ పక్షము, ఇంకను మరి నాలుగు అల్పపక్షములు, ప్రజానీకపు సమష్టి సంస్థలు ప్రాతినిధ్యమును కలిగి ఉన్నవి. రాష్ట్రసభకు సభ్యులు రాష్ట్రములవారిగా ఎన్నుకొనబడెదరు. 1952 నుండి రాష్ట్రవిభజన రద్దొనర్పబడినను పూర్వము ఎన్నుకొనబడిన రాష్ట్రసభ ఇంకను పనిచేయుచున్నది. కాని, దాని అధికారములు అతి పరిమితములు. సంవత్సరమునకు రెండు పర్యాయములు ప్రజాసభ సమావేశమై శాసననిర్మాణ కార్యక్రమమును నిర్వహించుట, ప్రభుత్వ నిర్ణయములను ధ్రువీకరించుట, బడ్జెట్‌ను, ఆర్థికప్రణాళికలను ఆమోదించుట మొదలగు కార్యక్రమములను నిర్వర్తించును. ప్రజాసభయు, రాష్ట్రసభయు కలసి అధ్యక్షుని ఎన్నుకొనును; సుప్రీమ్‌కోర్ట్ సభ్యులను కూడ వీరే ఎన్నుకొనెదరు. ప్రజాసభ తీర్మానమును రాష్ట్రసభ

కాదనినను, దానిని మరల ప్రజాసభ ఆమోదించినచో అది చట్టము కాగలదు. అధ్యక్షుడు నాలుగేండ్లకు ఒకసారి ఎన్నుకొనబడును. ప్రభుత్వమునకు అంతటికి అతడే అధిపతి; పార్లమెంట్ సమావేశము కాని కాలమున అతడే శాసన నిర్మాణాధికారమును కలిగి ఉండును. కార్యనిర్వాహణాధికారము మంత్రిమండలియందు ఉన్నది. ప్రజాసభకు బాధ్యత వహించి, ఆ విధిని అది నిర్వర్తించును. ప్రజాసభ యందలి అత్యధిక సంఖ్యాకపక్షపు నాయకుని ప్రధానమంత్రిగా అధ్యక్షుడు నియమించును. అతడు తనతోడి మంత్రులను నియామకము చేయును. ప్రజాసభ యందు 40 సభ్యులకు తగ్గని ప్రాతినిధ్యము కల ప్రతివర్గమునకు ఈ మంత్రిమండలియందు సభ్యతను ప్రధానమంత్రి కల్పించును. 1960, సెప్టెంబరు 7 వ తేదీన అప్పటి అధ్యక్షుడు విలియమ్ పీక్ చనిపోయిన తరువాత అధ్యక్షపదవి రద్దొనర్పబడి, ప్రత్యామ్నాయముగ రాజ్యసమితి (కౌన్సిల్ ఆవ్ స్టేట్) ఒకటి ఏర్పరుపబడెను. అందు నాలుగేండ్ల సభ్యత్వపరిమితి కల సభ్యులు 23 గ్గురు నియమితులయిరి. అధ్యక్షునికి బదులుగ సభాపతి ఒకడు ప్రజాసభచే ఎన్నుకొనబడును. అధ్యక్షాధికారములు అన్నియు రాజ్యసమితి పరము చేయబడినవి. సభాపతి లాంఛనముగ అధ్యక్షతను నిర్వహించును.

చీ. శే. రా.

**జర్మనీ, పశ్చిమ :** ద్వితీయ ప్రపంచయుద్ధానంతరము యునైటెడ్‌స్టేట్స్, బ్రిటన్, ఫ్రాన్స్‌ల ఆక్రమణలోనికి వచ్చిన జర్మనీ దేశభాగము. ఇది క్రమముగ ఒక ప్రత్యేక రాజ్యముగ - అగ్రరాజ్యముల మధ్య గల అభిప్రాయ భేదములవలన - రూపొందినది. పూర్వపు జర్మనీ యందలి అత్యధిక భాగము ఈ రాజ్యమున చేరి ఉన్నది. దీనికే 'ఫెడరల్ రిపబ్లిక్ అవ్ జర్మనీ' అనియు వ్యవహారము కలదు.

ఈ దేశమునకు డెన్మార్క్ [ఉ]; తూర్పు జర్మనీ, జెకోస్లోవాకియా [తూ]; ఆస్ట్రియా, స్విజర్లండ్ [ద]; లక్జెంబర్గ్, బెల్జియమ్, నెదర్‌లండ్స్, ఫ్రాన్స్ [ప] సరిహద్దులుగ ఉన్నవి. వాయవ్య భాగమున ఉత్తర సముద్రము (నార్త్ సీ) ను అనుకొనియు, ఈశాన్య భాగమున బాల్టిక్ సముద్రమును అనుకొనియు కొలదిగ తీరభూమి ఈ దేశమునకు కలదు. [వి] 2,48,178 చ. కి. మీ.; [జ] 5,82,90,000 (పశ్చిమ బెర్లిన్‌తో సహా). భౌగోళికముగ ఈ రాజ్యముతో సాన్నిహిత్యము లేకున్నను, పరిపాలనరీత్యా బెర్లిన్‌నగరమందలి పశ్చిమభాగము ఈ రాజ్యమున చేరి ఉన్నది [చూ. బెర్లిన్ సమస్య]. బెర్లిన్ నగరమందలి ఆ పశ్చిమభాగపు జనసంఖ్య 21,74,000. [భా] జాతీయభాష జర్మన్; [మ] ప్రజలలో దాదాపు అందరును క్రైస్తవ మతానుయాయులు. ఉత్తరపు మండలములందు ప్రొటెస్టంట్‌లును, దక్షిణ మండలములందు రోమన్ కేతలిక్‌లును ఇందు అత్యధిక సంఖ్యాకులు. [రా] బోన్ (జ. సం. 1,43,000).

చరిత్ర: 1945 లో జర్మనీ దేశము మిత్రరాజ్యముల సైన్యములకు బేషరతుగ లొంగిపోయిన తదుపరి అందలి వివిధ భాగములు యునైటెడ్‌స్టేట్స్, బ్రిటన్, ఫ్రాన్స్,




సోవియట్ రష్యా సైన్యముల ఆక్రమణలోనికి వచ్చినవి. కాని, అగ్రరాజ్యముల [చూ. పు. 262] మధ్య ఏర్పడిన వైరుధ్యముల ఫలితముగ అంగీకృతమగు ఏకైక పరిపాలనా విధానము ఏర్పడక పోయెను. సోవియట్ రష్యా తన ఆక్రమణలో ఉన్న భాగమున తన ఇచ్ఛ వచ్చిన విధానమును నెలకొల్పెను [చూ. జర్మనీ తూర్పు]. తక్కిన మూడు అగ్రరాజ్యములు తమ ఆక్రమణలో ఉన్న పశ్చిమ జర్మనీ మండలములను క్రమముగ ఏకీకృత మొనర్చి, 1949లో తమ ఆక్రమణ సైన్యమును చాలవరకు తొలగించి, అచట స్వతంత్రాధికారములు గల జర్మనీ, ప్రభుత్వమును నెలకొల్పిరి. కాని, మున్ముందు పరిస్థితులు అనుకూలించినప్పుడు జరుగబోవు తుది శాంతిసంధికి లోబడి ఈ రాజ్యాంగము ఉండగలదని వారు విధించిరి. అటుల ఏర్పడిన జర్మనీ ప్రభుత్వము సమాఖ్య (ఫెడరేషన్) విధానమును అనుసరించిన గణరాజ్యము అగుటచే ఈ దేశమునకు 'జర్మన్ ఫెడరల్ రిపబ్లిక్' అను పేరు కలిగినది. యుద్ధ ఫలితముగ విపరీత నష్టమును అనుభవించిన జర్మనీని పునరుద్ధరించి, యూరపియన్ రాజ్యములలో తగు ప్రతిపత్తిని చేకూర్చుటయే తమ విధిగ ఇడుకొని, ఆ దేశనాయకులు

అంతట నుండి విధి విరామము ఎరుగక కృషిచేసి, ఆర్థికముగ ఆ దేశమును 10 ఏండ్లలో అత్యున్నతస్థాయికి కొనిరాగలిగిరి. పశ్చిమ యూరప్ రక్షణలో జర్మనీకి కల ప్రాముఖ్యమును గుర్తించి, తక్కిన పాశ్చాత్య రాజ్యములు నాటో [చూ.] రాజ్యకూటమి యందు జర్మనీకి సభ్యత్వము కలిగించిరి. గత యుద్ధ ఫలితముగ సాటి యూరపియన్ రాజ్యములతో ఏర్పడిన వైమనస్యములను చక్కజేసి కొనుటకు పశ్చిమ జర్మనీ ఎంతయో కృషిచేసి, ఒక్క సోవియట్ రష్యా విషయమున తప్ప తక్కిన అన్నింటి విషయముననను జయమును సాధింపగలిగినది. పూర్వము జర్మనీకే చెందియుండి, యుద్ధానంతరమున 1947 నుండి ఆర్థికముగ ఫ్రాన్సు అధికారమునకు లోబడి ఉండిన సార్ మండలము 1957, జనవరి 1 వ తేదీన ఆ మండలమున జరిగిన స్వేచ్ఛా పూర్వకపు ఎన్నికలమూలమున తిరిగి జర్మనీతో ఆర్థికముగ, రాజకీయముగ మేళనమందినది. ఫ్రాన్సునందు డిగాలీ [చూ.] అధ్యక్షుడైనప్పటి నుండియు (1958, డిసెంబరు) జర్మనీ, ఫ్రాన్సు దేశముల మధ్య సమైక్యత అత్యుచ్ఛస్థాయిని అందుకొనినది. పశ్చిమ యూరప్‌న ఆర్థిక, సాంఘిక, రాజకీయ రంగములందు ఐక్యము సమకూర్చు మహోద్యమమున నేడు పశ్చిమ జర్మనీ ప్రముఖపాత్రను నిర్వహించుచున్నది. కాని, జర్మనీ విభజనను రద్దొనర్చి, ఐక్య జర్మనీని రూపొందించు విషయమున మాత్రము పశ్చిమ జర్మనీ ఇప్పటి వరకు కృతకృత్యత పొందలేక పోయినది. ఉభయ జర్మనీలందును స్వేచ్ఛా పూర్వకముగ జరుగు ఎన్నికలవలన భవితవ్యము నిర్ణయింపబడవలెనని పశ్చిమ జర్మనీయు, దానిని సమర్థించు పశ్చిమ రాజ్యములును వాదించుచున్నవి. ఇందులకు తూర్పు జర్మనీయు, దానికి అండగ ఉండిన వార్సా ఒడంబడిక [చూ.] రాజ్యములును అంగీకరించుటలేదు. ఇందుకు తోడుగ బెర్లిన్‌నందలి తూర్పు, పశ్చిమ మండలముల మధ్య రాకపోకలను సోవియట్ రష్యా ప్రోద్బలమున తూర్పు జర్మనీ 1960, ఆగస్టులో నిషేధించినప్పటినుండి తూర్పు, పశ్చిమ జర్మనీల మధ్య వైమనస్యములు విషమ స్థితి అందుకొనినవి.

**రాజ్యాంగము:** 1949, మే 23 వ తేదీన ప్రచురితమైన మూలశాసనమును అనుసరించి ఇచ్చటి రాజ్యపాలన నిర్వహింపబడుచున్నది. ఈ మూలశాసనమును శాసనసభవారు మూడింట రెండువంతుల అధిక సంఖ్యతో సవరింపవచ్చును. దేశమున గల పదిరాష్ట్రముల సమైక్యపరచు సమాఖ్య విధానపు గణరాజ్య ప్రభుత్వము ఈ శాసనము వలన నెలకొల్పబడినది. ద్వితీయ ప్రపంచయుద్ధ ఫలితముగ ఈ పశ్చిమ జర్మనీని ఆక్రమించి, తరువాత ఈ గణరాజ్యమును నెలకొల్పుటకు అంగీకరించిన పశ్చిమ రాజ్యము (యునైటెడ్ స్టేట్స్, బ్రిటన్, ఫ్రాన్సు) లకు సమష్టిగ కొన్ని బాధ్యతలు ఈ దేశ విషయమున కల్పింపబడినవి. అందువలన 1. జర్మనీ ఏకీకరణకు తుది శాంతి సంధి; 2. బెర్లిన్; 3. పశ్చిమ జర్మనీ యందు నిలిపియుంచబడిన పశ్చిమ రాజ్యముల సైనిక దళముల భద్రత అను మూడు విషయములందును పశ్చిమ రాజ్యములవారు పూర్తి బాధ్యతలు వహించి ఉందురు. ఈ బాధ్యతలకు లోబడి పశ్చిమ జర్మనీయందలి గణరాజ్య విధానము సాగుచున్నది. ఇందు ఉభయ కక్ష్యలు గల శాసనసభ కలదు. అందొకటి అగు సమాఖ్యసభ (బుందేస్టాగ్) లో 497 మంది వోటు చేయు సభ్యులును, పశ్చిమ బెర్లిన్‌కు ప్రాతినిధ్యము వహించి వోటుచేయు హక్కు లేకుండ చర్చలలో మాత్రము పాల్గొను సభ్యులు 22 మందియు కలరు. వీరు అందరును నాలు గేండ్లకు ఒకసారి ఎన్నుకొనబడెదరు. రెండవది అగు సమాఖ్యాసమితి (బుందెస్‌రాట్) యందు దేశమున గల పది రాష్ట్రములును - తమ జనసంఖ్య నిష్పత్తిని అనుసరించి నియమించువారు - సభ్యత్వము వహించి ఉందురు. శాసన నిర్మాణాధికారము ముఖ్యముగ సమాఖ్య సభకే చెంది ఉన్నను, సమాఖ్యాసమితి ఆమోదము లేనిదే ఏ తీర్మానమును శాసనము కానేరదు. ఏ శాసన విషయముననైనను ఉభయ కక్ష్యలకు వైరుధ్యము ఏర్పడినచో దానిని సామరస్యసమితి పరిశీలించి చక్కజేయును. సామరస్య సమితియందు ఉభయ కక్ష్యలకు ప్రాతినిధ్యము ఉండును. దేశాధ్యక్షుడు అయిదేండ్లకు ఒక పర్యాయము సమాఖ్యా పరిషత్తుచే ఎన్నుకొనబడును. ఈ పరిషత్తునందు బుందేస్టాగ్ సభ్యులును, వారితో సమాన సంఖ్య గలుగునటుల రాష్ట్ర శాసనసభచే జనసంఖ్య నిష్పత్తిలో ఎన్నుకొనబడిన ప్రతినిధులును సభ్యత్వము వహించి ఉందురు. రాజ్యాధికారమునకు జీవవంతమగు లాంఛనము అధ్యక్షుడు. కార్య నిర్వాహణాధికారము అంతయు ఛాన్సెలర్ నాయకత్వమున ఉండు కార్యవర్గము వశమున కలదు. బుందేస్టాగ్ సభ్యుల అధికసంఖ్యాక సమ్మతి పొందినవాడు ఛాన్సెలర్‌గ అధ్యక్షునిచే నియమితుడగును. కార్యవర్గమున తన సహచరులను ఛాన్సెలరే నియమించుకొనును. దేశమున గల రాజకీయపక్షములలో క్రమముగ 1. క్రిస్టియన్ డెమోక్రాటిక్ యూనియన్; 2. సోషల్ డెమోక్రాటిక్ పార్టీ; 3. ఫ్రీ డెమోక్రాటిక్ పార్టీ; 4. జర్మనీ పార్టీ అనునవి ప్రముఖములు. కమ్యూనిస్ట్‌పార్టీ 1956 నుండి నిషేధింపబడినది. ఫెడరల్ రిపబ్లిక్ ఏర్పడినప్పటినుండియు

రాజ్యాధికారము క్రిస్టియన్ డెమోక్రాటిక్ పార్టీ వశమున ఉన్నది. ఆ పార్టీ నాయకుడగు కోనెరాడ్ అడెనోవర్ ఈ 14 ఏండ్లపాటు ఛాన్సెలర్ గా పరిపాలన నిర్వహించెను. (1949 - 64). చి. శే. రా.

**జలాలుద్దీన్ :** చూ. ఖిల్జీవంశము.

**జలియన్‌వాలాబాగ్ దురంతము:** బ్రిటిష్ సామ్రాజ్య ప్రభుత్వపు చరిత్రలో చెరగిపోరాని కళంకముగ నిలిచి ఉన్న ఒక విషాదకర ఉదంతము. దీనికే 'పంజాబ్ దురంతము' అనియు వ్యవహారము కలదు. ప్రథమ ప్రపంచ యుద్ధానంతరమున భారతదేశమున ప్రచలితమైన స్వాతంత్ర్యాకాంక్షను మట్టుబెట్టు తలంపుతో వాక్స్వాతంత్ర్యాదుల నిషేధించు రౌలట్ చట్టములను భారత దేశమునందలి బ్రిటిష్ సామ్రాజ్య ప్రభుత్వము అమలులోనికి కొనివచ్చినది. దానిని నిరసించుచు దేశమున ఎల్లెడల ప్రదర్శనములు జరిగినవి. అందునను ప్రథమ ప్రపంచ యుద్ధమున పలు సైనికులను సమకూర్చిన పంజాబ్‌నందు ఈ నిరసన ప్రగాఢతను ఆర్జించినది. అట్టి ఎడ ప్రజానీకమును భయపెట్టి, లొంగదీసికొనుటకు సామ్రాజ్య ప్రభుత్వ పాలకులు అవలంబించిన దౌర్జన్యచర్యలలో ప్రముఖమైనది జలియన్‌వాలా బాగ్ దురంతము.

జలియన్‌వాలాబాగ్ అనునది పంజాబ్ రాష్ట్రమునందలి అమృతసర్ లోని ఒక ఉద్యానవనము. ఆ ఉద్యానవనమును చుట్టి దాదాపు అన్ని వైపుల జనావాసములు కలవు. అందువలన రాకపోకలకు అనువుగ ఒకే ఒక చిన్న మార్గము ఉండినది. అట్టి ప్రదేశమున 1919, ఏప్రిల్ 6 న అమృతసర్ పౌరులలో పలువురు రౌలట్ చట్టమునకు నిరసనను తెలియజేయుటకై సమావేశమైరి. ఈ సమావేశమును తొలుతనే ప్రభుత్వము నిషేధించినది. కావున, ప్రభుత్వాదేశమున డయ్యార్ అను పేరుగల సేనాని అచటికి వచ్చి, సమావేశము చెదిరిపోవుటకు అత్యల్ప వ్యవధి మాత్రమే ఇచ్చి, సభ్యులు చెదరిపోక పూర్వమే ఒక్కుమ్మడిగా నాలుగు వైపులనుండియు సైనికులచే 1,600 రౌండ్ల తుపాకుల కాల్పులను మందుగుండుసామగ్రి ఉన్నంతవరకు జరిపించెను. తత్ఫలితముగ అధికారుల లెక్కలను అనుసరించియే 379 మంది చనిపోయిరి; 1,200 మంది గాయపడి దిక్కుమొక్కు లేక చాలకాలము అచటనే పడివుండవలసి వచ్చినది.

అనంతరమున ఈ సంఘటనను తలదన్నురీతిగ పంజాబ్‌న ప్రభుత్వము సైనిక పరిపాలన (మార్షల్ లా) ను అమలులోనికి కొనివచ్చినది; ఫలితముగ రాక్షసపాలన రాష్ట్రమంతట నగ్నతాండవము చేసినది. తక్కిన భారతదేశము నుండి కొంతకాలము ఆ సమయమున పంజాబ్ వేరుచేయబడినది. పరిస్థితులు ప్రశమనమొందిన పిదప బ్రిటిష్ ప్రభుత్వము ప్రపంచాభిప్రాయమునకు లొంగి, విచారణ జరిపించినను, తుదకు డయ్యార్ పై కఠిన చర్యను తీసికొనక ఉద్యోగమునుండి మాత్రమే విరమింపజేసినది. అనధికారముగ ఆ సమయముననే భారతజాతీయ కాంగ్రెస్ సాగించిన విచారణవలన సైనిక పరిపాలనా కాలమున సాగిన దురాగతములు పెక్కు వెల్లడియై, భారత స్వాతంత్ర్యాకాంక్షను తీవ్రతరము చేసి, సహాయ నిరాకరణోద్యమమునకు దోహదము చేసినవి. అంతటినుండి - ఏప్రిల్ 6 నుండి 12 వరకు - జాతీయ సప్తాహము భారతదేశమున స్వాతంత్ర్యసమరకాలమున పాటింపబడినది. స్వాతంత్ర్యసిద్ధి తరవాత జలియన్‌వాలాబాగ్‌న మృతవీరులకు ఒక స్మారకచిహ్నము నెలకొల్పబడినది [చూ. భారతదేశము]. చి. శే. రా.

**జస్టీనియన్ చక్రవర్తి** (క్రీ. శ. 483 - 565): రోమన్ సామ్రాజ్య చక్రవర్తి. క్రీ. శ. 483, మే 11 న ఇల్లిరికమ్‌లో జన్మించెను. 527 లో రాజ్యమునకు వచ్చెను. రోమన్ న్యాయసూత్రములను క్రోడీకరించెను. యూరప్ ఖండపు న్యాయవ్యవస్థకు పితామహుడు. * * *

**జహంగీర్** (1569 - 1627) : అక్బర్ చక్రవర్తి [చూ. పు. 260] తరువాత అతని కుమారులలో పెద్దవాడగు జహంగీర్ 1605 లో సింహాసనమునకు వచ్చి, 22 ఏండ్లు పాలించెను. తండ్రికిగల శక్తి సామర్థ్యములు జహంగీర్‌నకు లేవు. రాజ్యవిస్తరణ యందు గాని, రాజ్యపాలన యందుగాని ఇతడు స్వయముగ సాధించినది స్వల్పము. వాయవ్యమున కాందహార్ ప్రాంతమును, వింధ్యకు దక్షిణమున అహ్మద్ నగర రాజ్యమును మొగల్ అధీనతనుండి విడివడినవి. ఇందుకుతోడుగ తన ప్రేమ పత్నియగు నూర్జహాన్ కుతంత్రములకు లోబడి, ఇతడు దేశమధ్యమున కల్లోలములు చెలరేగుటకు కారణభూతుడు ఆయెను. చరమదశయందు మనశ్శాంతి లేక మనోవ్యథతో ఇతడు మరణించుట జరిగినది. ఈ కారణముల వలన స్మిత్ పండితుడు ఈ ప్రభుపాలనము అనర్థకమైనదని అభిప్రాయపడినాడు. ఐతే, ఆ అభిప్రాయము పూర్తిగా



జహంగీర్
(1569 - 1627)

అంగీకరింపదగినది కాదు. జహాంగీర్ పరిపాలన కాలమున మేవార్ సంస్థానపాలకుడు చివరకు తల యొగ్గుటయు, బెంగాల్, పంజాబ్ రాష్ట్రములు చక్రవర్తి అధీనతలోనికి వచ్చుటయు జరిగినది. పన్నుల సంస్కరణమువలన దేశీయ వర్తకము, పోర్చుగీస్ వారి సంబంధముతో విదేశ వ్యాపారమును వృద్ధిపొందినవి. రాజ్యమందు శాంతి భద్రతలు, భోగ భాగ్యములు చిర కాలము ఉండినవి. వ్యక్తిగత వ్యసనములు ఎట్లున్నను, జహాంగీర్ ప్రభువు న్యాయనిరతికి, చిత్రకళోపాసనకు, పర మత సహనమునకు పేరు సంపాందించెను. ఆ కాలపు పాశ్చాత్యరాయబారులు సైతము పై గుణములను ప్రశంసించిరి. జి. ఎస్. శర్మ.

**జాంజిబార్ :** ఆఫ్రికా తూర్పుతీరమున రెండు దీవులు కల రాజ్యము. టాంజేనియాలో అంతర్భాగము.

ఇందు జాంజిబార్, పెంబా దీవుల [వి] 2,642 చ. కి. మీ.; [జ] 3,07,000. ఇందు అరబ్, ఆఫ్రికన్ ఆసియా, యూరప్ జాతుల ప్రజలు కలరు. [మ] అధిక సంఖ్యాకులు ఇస్లామ్ మతానుయాయులు. [రా] జాంజిబార్ (జ. సం. 57,923).

చరిత్ర: ఈ దేశపు ప్రాచీన చరిత్రాంశములు తెలియ వచ్చుట లేదు. క్రీస్తుకు పూర్వపు శతాబ్దులలో బంటూ తెగ [చూ. సం. 10 - పు. 538] కు చెందిన కొందరు ఆఫ్రికన్ జాతీయులు పెంబా, జాంజిబార్ ద్వీపములలో స్థిరపడినట్లు తెలియుచున్నది. అరేబియా, పారసీక సింధు శాఖ, భారత దేశపు తూర్పు కోస్తా తీరములందలి వర్తకులు వ్యాపారరీత్యా ఈ దేశమునకు వచ్చి పోవుచుండిరి. క్రీ. శ. 10 వ శతాబ్దమున ఈ దేశవాసులు అందరును ఇస్లామ్ మతమును స్వీకరించిరి. 16 వ శతాబ్దము నాటికి ఈ దేశము పోర్చుగీస్ పరిపాలకుల సామంతరాజ్యము అయ్యెను. 1698 లో పోర్చుగీస్ వారి ప్రాంతములను కొన్నిటిని ఓమన్ ప్రభువులు [చూ. మస్కట్ & ఓమన్] ఆక్రమించుటతో ఈ దేశము కూడ వారి పరిపాలనకు లోనయ్యెను. 1829 నుండి ఓమన్ ప్రభువు వంశమునకు చెందినవాడగు అరబ్ సుల్తాను జాంజిబార్‌ను తన రాజధానిగ చేసికొని, ఆ దేశపు అభివృద్ధికి కారకుడయ్యెను. ఆ సుల్తాను ఈ ప్రాంతపు ఉత్తర భాగమును 1888 లో బ్రిటిష్ వర్తక సంఘమునకు కౌలునకు ఒసగెను. కాలక్రమమున 1890 లో ఈ దేశము అంతటిని బ్రిటిష్ రక్షిత రాజ్యముగ ఆ సుల్తానే మార్చివేసెను. 1895 లో వర్తకసంఘమునుండి ఈ దేశమును బ్రిటిష్ రాణి తన అధీనమునకు తెచ్చుకొనినది. తదాదిగ సుల్తానుకు నామమాత్రాధికారమును ఉంచి, బ్రిటిష్ ప్రభుత్వమే పాలనను నిర్వహించుచున్నది. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున తక్కిన ఆఫ్రికా దేశములందు వలెనే ఇచట స్వాతంత్ర్యాకాంక్ష పెచ్చు పెరిగినది. దీనిని గుర్తించి ప్రజలకు అధికారమును సోపాన క్రమమున అప్పగించుటకై బ్రిటన్ తగు చర్యలను గైకొని, 1961 లో ఆంతరంగిక స్వపరిపాలనమును ప్రజా ప్రతినిధులకు అప్పగించు ఉద్దేశముతో ఎన్నికలు జరిపినను, దాదాపు సమాన సంఖ్య గల అరబ్, ఆఫ్రికన్ జాతుల స్పర్ధలవలన పటిష్ఠమగు ప్రభుత్వము రూపొందలేదు. కాని, తుదకు సుల్తాను కృషిచే ప్రజా ప్రతినిధులలో ఒక విధమగు సామరస్యము కుదురుటయు, 1963, డిసెంబరు 10 నుంచి జాంజిబార్‌ను కామన్‌వెల్త్‌లో ఉండెడు స్వతంత్ర రాజ్యముగ రూపొందించుటకు బ్రిటన్ అంగీకరించుటయు జరిగినది. కెన్యా తీరమున గల ఒక చిన్న భూ భాగముపై జాంజిబార్‌నకు పూర్వకాలమునుండియు హక్కు కలదు. ఆ భూ భాగమును తనకు ఇచ్చి వేయవలెనని ఇపుడు పట్టు బట్టినది. ఈ సమస్య ఇప్పటికిని అపరిష్కృతమై ఉన్నది [చూ. టాంజేనియా]. మ. అ. శ.

**జాకొబైట్ తిరుగుబాబు :** చూ. ఫ్రెంచి విప్లవము.

**జాతి - జాతీయత :** 'జాతి - జాతీయత' అను పదముల ప్రాముఖ్యము ఇటీవలిదే! పూర్వయుగమునందు కాని, మధ్యయుగమునందు కాని ప్రపంచమున 'జాతీయత' అను భావము ఏర్పడి ఉండలేదు.

పూర్వయుగమున ముఖ్యముగ పేర్కొనదగినవారు : గ్రీక్ (క్రీ. పూ. 776 - 323) లును, రోమన్ (క్రీ. పూ. 500 - క్రీ. శ. 476) లును. ఆ కాలములోనే కాదు, చరిత్రలోకెల్ల గ్రీక్‌లు అగ్రగణ్యులే! గ్రీక్‌ల పరిపాలనా పద్ధతులును, కళాసృష్టియు, వాఙ్మయమును, తత్త్వశాస్త్రమును, వేయేల వారి సర్వతోముఖమైన ప్రతిభ జగత్కథయందు వారికి ఒక శాశ్వత స్థానమును ఒసగినది. కాని, వారియందు జాతీయత అను భావము మాత్రము జనించి ఉండలేదు. గ్రీస్‌ను ఒకే దేశముగ వర్ణించినను అందు అనేక రాజ్యములు ఉండినవి. నాడు ఒక చిన్న నగరము కూడ ఒక రాజ్యముగ పరిగణింపబడుచుండెను. ఇందులకు ఆ దేశపు నైసర్గిక పరిస్థితులు ముఖ్య కారణమని చెప్పదగును. ఒక దేశములోనే ఇన్ని ప్రత్యేక ప్రభుత్వములు ఉండినందునను, దేశమంతయు నైసర్గికముగ ఖండ ఖండములుగ విభజింపబడి ఉండినందునను గ్రీక్‌లలో విభిన్నతయే స్థిరపడినది. కాని, ఏకజాతీయత పెంపొందలేదు. కాని, రోమన్‌ల ప్రతిభ ఇతర రీతుల మిక్కిలి వికసించినది. వారు పరాక్రమశాలురు; సామ్రాజ్య స్థాపకులు; పరిపాలనా చతురులు. గ్రీక్ నగర రాజ్యములవలెనే రోమ్ కూడ ఒక సామాన్య నగర రాజ్యముగనే మొదట ఏర్పడినది.

కాని, చివరకు ఒక మహాసామ్రాజ్యమునకు కేంద్రమై నానాదేశములను పలినది. కాని, సామ్రాజ్యమున వివిధ దేశములును, రాష్ట్రములును ఉండవచ్చును. కాని, జాతుల ప్రత్యేకత మాత్రము వర్ధిల్లదు.

రోమన్ల సామ్రాజ్యము అంతరించిన పిదప మధ్య యుగము మొదలైనది. ఈ యుగమునందు ప్రభుత్వమే ఉండలేదని అనవచ్చును. ప్రభుత్వము ఎచటనయిన స్థాపింప బడినను ప్రభువు సమర్థుడుగ ఉన్నంతవరకు అది జీవించి, అతనితో కూడ అంతమొందుచుండెను. క్రీ. శ. 800 లో స్థాపింపబడిన షార్లమేన్ యొక్క రాజ్యము ఇందుకు నిదర్శనము. అంతేకాదు, వృద్ధిచెందిన క్రైస్తవ మత సంఘమును, బలవంతులైన నాయకులును, వారి సైన్యములును ప్రభుత్వమునకు ఎన్నియేని ఆటంకములను కలుగ జేయుచుండిరి. ఇట్టి పరిస్థితులలో ఫ్యూడల్ విధానము ఏర్పడినది. రాజునకు సైన్యమును సమకూర్చి ఇచ్చు షరతు మీద అతనికి కొందరు అనుచరులును, వారికి తిరిగి మరి కొందరు అనుచరులును ఈ రీతిగ మెట్లు మెట్లుగా క్రింద వరకును వ్యాపించి ఉండిరి. ఇందులోను బలవంతులయిన రాజులు ఏర్పడినప్పుడు అట్టి రాజులును, మత గురువులును జగత్సామ్రాజ్యము అను లక్ష్యసిద్ధికై కృషిచేయసాగిరి. తమ దేశముపైని కాని, తమ జాతిపైని కాని వారు ప్రత్యేక అభిమానము ఉంచుకొనలేదు.

జాతీయత వృద్ధిజెందుటకు మధ్యయుగములోని పరిస్థితులు ఈ విధముగా అనుకూలింపకున్నను, కొన్ని దేశములలో మాత్రము ఆ కాలమునందే జాతీయభావము ఏర్పడినది. ఇంగ్లండు, ఫ్రాన్సుదేశములు, స్పెయిన్, పోర్చుగల్, స్విజర్లండ్‌లు అట్టివి. ఇంగ్లండు, ఫ్రాన్సులలో సమర్థులైన రాజులు ప్రభువుల దుండగములను త్వరలో అణచి ప్రజలకు శాంతి భద్రతలు చేకూర్చిరి. అటుపిమ్మట ఈ రెండు దేశములకును గొప్ప యుద్ధము తటస్థించినది. ఈ సందర్భముననే ఇంగ్లండు - ఫ్రాన్సులలో జాతీయత జనించినది అనవచ్చును. ఇతర దేశములతోడి పోరాటము జాతీయతను త్వరలో విజృంభింపజేయును.

ఆధునిక యుగమునందు జాతీయతకు అదివరకు లేని ప్రాముఖ్యము వచ్చినది. మధ్యయుగపు ఆశయములును, అరాజకత్వమును నశించినవి. నవీనములైన యుద్ధపరికరములు ఈ కాలమున తయారైనవి. మందుగుండు విరివిగ ఉపయోగించు రాజుల సైన్యముల ధాటికి భూస్వాముల అనుచరులు గాని, వారి ప్రాకారములు గాని తాళలేక పోయినవి. అదియునుగాక, ఆధునిక యుగపు ఆరంభముననే ధైర్య, సాహసములు గల వీరులు స్పెయిన్, పోర్చుగల్, ఇంగ్లండు, తదితర దేశములనుండి బయలుదేరి మహాసముద్రములను దాటి, నూతన భూభాగములను కనుగొనిరి. ఇందువలన వాణిజ్యము పెరిగి, ఆ దేశములలో మధ్యవర్గములు ఏర్పడినవి. ఈ మధ్యవర్గములు దేశపు శాంతిభద్రతలనే కోరుచు రాజుల పక్షమును వహించి ప్రజల ఐక్యమునకును, దేశపు స్థైర్యమునకును, తన్మూలమున జాతీయతా సృష్టికిని తోడ్పడినవి. జాతీయత ఉద్భవించుటకు అనుకూలమైన వాతావరణము ఏర్పడినది.

ఫ్రాన్సుదేశమున గొప్ప విప్లవము 1789 వ సంవత్సరమున సంభవించినది. ఇది నిరంకుశ ప్రభువులపై ప్రజల తిరుగుబాటు. ఇంతకు పదమూడు సంవత్సరముల మునుపే (1776) అమెరికా దేశపు ప్రజలు ఇంగ్లండు ప్రభుత్వమును ఎదిరించి స్వతంత్రులై ఉండిరి. ఫ్రాన్సు దేశస్థులకు అమెరికా స్వాతంత్ర్యసమరము ఒక నిదర్శనమైనది. 1789 లోని ఈ మహాసంఘటనము ఫ్రాన్సునకును, యూరప్ ఖండమునందలి ఇతర రాజ్యములకును యుద్ధము కలుగజేసినది. నెపోలియన్ [చూ.] నాయకత్వమున ఫ్రాన్సు గొప్ప విజయములను పొందినది. కాని, చివరకు 1815 లో పరాజయము పొందుట తప్పలేదు. ఈ యుద్ధకాలమున యూరప్ ఖండమందంతటను జాతీయభావము జనించినది. ఎందుకన, నెపోలియన్ సామ్రాజ్యమును స్థాపింపబూని జాతులనన్నిటిని అణగద్రొక్కి ఉండెను. కాని, జాతీయతను అణచిన కొలది అది విజృంభించెనే కాని నశింపలేదు. 1822-30 లో సుమారు పండ్రెండు దేశములయందు జాతీయత స్థిరపడినది. గ్రీస్‌ను, బెల్జియమ్‌ను ఈ సందర్భమున ముఖ్యముగ పేర్కొనదగును. మరల 1848 లో జాతీయతాశక్తి పునర్జ్వలించినది. క్రిమియా యుద్ధము ముగిసిన తరువాత 1856 లో సెర్బియా, రుమేనియాలు స్వతంత్రజాతులు ఐనవి. 1871 లో ఇటలీ, జర్మనీల జాతీయత సంపూర్ణతను పొందినది. ఈ రెండు దేశములలోను జాతీయతను, ఏకీకరణమును అన్యోన్యముగ సహాయపడినవి. కాని, జాతీయభావము టర్కీసామ్రాజ్యమును విచ్ఛిన్నము ఒనర్చినది. ఇదే రీతిని రష్యా, టర్కీల యుద్ధమైనపిదప బెర్లిన్‌సంధి (1878) [చూ.] ప్రకారము బల్గేరియా, మాంటినిగ్రోలు కూడ స్వాతంత్ర్యమును పొందినవి.

ప్రథమ ప్రపంచ యుద్ధమునకు జాతీయత ముఖ్య కారణము. ఈ యుద్ధమున ఆస్ట్రియా, జర్మనీ, టర్కీ, రష్యా అను నాలుగు సామ్రాజ్యములు విచ్ఛిన్నమైనవి. ఆల్సేస్ - లోరైన్, శ్లెస్విగ్ హోల్‌స్టైన్‌లు జర్మనీ నుండి తిరిగి ఫ్రాన్సు, డెన్మార్కుల వశమైనవి. ప్రష్యాలోని భాగములు కొన్ని ఇదే రీతిని పోలండ్ వశమైనవి.

ఆస్ట్రియా జర్మన్‌ల రాజ్యములోను, హంగేరి మాగ్యారుల రాజ్యములోను చేరినవి. జెకోస్లోవాకియా, యూగోస్లావియా అను నూతన రాజ్యములు ఏర్పడినవి. పోలండ్, రుమేనియా, ఇటలీల రాజ్యములు విస్తృతములైనవి. ఓటోమన్ సామ్రాజ్యము కూడ విచ్చిన్నమై, ఈజిప్టు, హెడ్జాజ్, అర్మీనియా అను క్రొత్త రాజ్యములు ఉద్భవించినవి. ఇదే విధముగ సిరియా, పాలస్తీనా, మెసపొటేమియా (ఇరాక్) లు కూడ ప్రత్యేక రాజ్యములు అయినవి. రష్యా సామ్రాజ్యభాగములు కూడ కొన్ని పోలండ్‌లో కలిసినవి. ఎస్తోనియా, లాట్వియా, లిథూనియాలు రష్యానుండి విడిపోయినవి. ఉక్రేనియా కూడ కొంతకాలము ప్రత్యేక ప్రభుత్వమును ఏర్పరచుకొనినది. కాకసస్ ప్రాంతములో అనేక రాజ్యములు ఏర్పడినవి.

పారిస్ సంధి [చూ.] షరతులు (1919 - 20) యూరప్ పునర్నిర్మాణమున కొంతవరకు జాతీయతను గుర్తించి అందులకు అవకాశమును ఒసగినవి. 1815 నాటి వియన్నా సంధి షరతులకును, పారిస్ సంధి షరతులకును ఇది ఒక గొప్ప వ్యత్యాసము. కాని, పారిస్ సంధి షరతులు కూడ జాతీయతకు విరుద్ధములే అనుటకు నిదర్శనములు కలవు. డాన్‌జిగ్, జర్మనీలను ప్రత్యేకించుట, ఆస్ట్రియా, జర్మనీలను ఏకము కానీయకుండుట, రుమేనియా రాజ్యమున మాగ్యారులను, జెకోస్లోవాకియా రాజ్యమున జర్మనులను చేర్చుట ఇవియన్నియు జాతీయతకు విరుద్ధములు. వివిధ రాజ్యములయందున్న జర్మనులను అందరను ఏకీభవింపజేసి, జర్మనీదేశమును ఒక రాజ్యముగ జేసి, ప్రథమ ప్రపంచ యుద్ధమున జర్మనులకు కలిగిన పరాభవమునుండియు, అవమానమునుండియు తప్పింపవలెనను హిట్లర్ ఆశయమే ద్వితీయ ప్రపంచ యుద్ధమునకు కారణమైనది. జాతీయత, సామ్రాజ్యాకాంత్ష, మహా యుద్ధములు ఒక దానివెనుక నొకటి అనుసరించి ఉండునవి. జాతీయత యుద్ధములకు మూలకారణమనియే కాబోలు, నేడు జాతీయతయొక్క విలువ తగ్గినది. మానవజాతి అంతయు. ఒకే జాతి అను భావము పొడచూపుచున్నది.

జాతీయతను నిర్వచించుట కష్టము. చరిత్రయందు జాతీయతాప్రభావమును గుర్తింపగలము. కాని, దాని యథార్థ స్వరూపమును, స్వభావమును వర్ణింపలేము. జాతీయత మానవునిలోని దేశభక్తిని, దేశగౌరవమును సూచించును. అది కేవలము అంతరంగికమైనది. జాతీయత లేనిది జాతి ఏర్పడజాలదు. మానవునకు ఆత్మ ఎట్టిదో జాతికి జాతీయత అట్టిదే అనవచ్చును. అంతేకాక, జాతీయత మానవుని జీవితమునందలి ఒక అంశము. కనుక, అది ఇప్పటితో సంపూర్ణముగ పరిణతమైనదని అనుటకు వీలు లేదు. ప్రపంచమున జాతీయతాప్రభావము ప్రబలి ఉన్నది నిజమే! కాని, ఇంకను ఎన్ని జాతులు ఏర్పడునో, జాతీయత ఎన్ని ఆకృతులు దాల్చునో, దాని పరిణామము ఏ విధముగ ఉండునో ఎట్లు ఊహింపగలము? సంపూర్ణ పరిణామము తటస్థించిననే కాని, జాతీయతను వర్ణించుట సాధ్యము కానేరదు. కాని, పైన వివరించిన చరిత్రనుండి కొన్ని విషయములు స్పష్టము కాగలవు. జాతీయత అనునది యొక భావము. జాతి ఆ భావమును వ్యక్తపరచు సంస్థ; సంస్థలేనిది భావమునకు సిద్ధిలేదు. కనుక, జాతీయత జనించినతోడనే జనులు ఒక జాతిగ ఏర్పడుటకు ప్రయత్నింతురు. జాతీయత ఇంతవరకును తమ్ముతాము ఎరుగని జనులను ఏకీభవింపజేసి, వారికి ఒక ప్రత్యేకతను, చైతన్యమును చేకూర్చును. జాతీయతయందలి వైలక్షణ్యామే జాతియను సంస్థకు జీవము. అట్టి ప్రత్యేకతను సంపాదింపవలసిన జాతీయతకు స్వతంత్ర రాజ్యము అవసరము. కనుక జాతి అను సంస్థ ఏర్పడవలెనన్నచో 1. ప్రజలయందు జాతీయభావము వ్యాపించి ఉండవలెను; 2. జాతీయతను ప్రత్యక్షము ఒనర్చు రాజ్యము ఒకటి కూడ స్థాపింపబడి ఉండవలెను.

దేశము : జాతీయతా సృష్టికి దేశము, వర్గము, భాష, మతము, చరిత్ర ఇవి అన్నియు తోడ్పడును. దేశములేని రాజ్యము ఎట్లు లేదో అట్లే దేశము లేని జాతియును లేదు. జన్మభూమి అను గర్వము జాతీయతకు అత్యంతావశ్యకము. ఏ దేశపు జాతీయతను పరిశీలించినను దేశము, జన్మభూమి అందులకు మూలాధారమై ఉండును. ఆంగ్లేయునకు ఇంగ్లండుతో సమానమైన దేశము ఏదియును లేదు. అట్లే మనకు హిందూదేశముతో సాటియైన దేశము మరి ఏదియును లేదు. 'జననీ, జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ'; (తల్లియును, మాతృదేశమును స్వర్గముకన్న గొప్పవి). 'భరతఖండము సర్వోత్కృష్టమైన భూమి. ఎన్నియో జన్మములు ఎత్తి 'పుణ్యరాశిని గడించిననేకాని భరతఖండమునందు నరజన్మము దుర్లభము' అని ఇతిహాస, పురాణములందు పేర్కొనబడుట ఇట్టి భావము వలననే. అథర్వణవేదములోను, ఋగ్వేదములోను, మనుస్మృతిలోను భరతఖండము ఇదే రీతిని వర్ణింపబడి ఉన్నది. భారత జాతీయతకు దేశము ఎంత ప్రధానము అనునది మన పూర్వులు చక్కగ గుర్తించి మన జన్మభూమిని సామాన్య భూప్రదేశముగ ఎంచక పవిత్ర క్షేత్రముగ భావించుట మన కర్తవ్యమని సూచించిరి. మన పుణ్యక్షేత్రముల ఉద్దేశమును, తీర్థయాత్రల ఉద్దేశమును

కూడ ఇదే! అంతేకాక, విశాలమైన భరతఖండమునందలి ప్రజలందరును, దేశమును ఒక్కటియే అను భావమును కూడ బలపరచుట తీర్థయాత్రల ఆశయము. జాతీయత అను ఆధ్యాత్మికశక్తికి దేశము భౌతికమైన ఆధారము. ఈ ఆధారము లేనిది జాతీయత జనింపనేరదు. జాతీయత అంకురించుటకును, వృద్ధి పొందుటకును ఆ జాతికి ప్రత్యేకమును, శాశ్వతమును అయిన స్థానము అత్యంతావశ్యకము. ఇట్టి స్థానము చేకూరినచో జాతీయతా ప్రాదుర్భావమునకు వలయు ఇతర శక్తులు తమంతట తామే కాలక్రమమున అనుకూలింప గలవు. దేశమును, నైసర్గిక పరిసరములును, వీటిపై ఆధారపడి ఉండు ఆర్థిక పరిస్థితులును, జనులకు ఐకమత్యమొసగి భేదముల కల్పించనట్టి భాషయు, మత మును ప్రతికూలశక్తులనుండి జాతీయతను కాపాడగలవు. 'దేశము ఒక్కటి కానిపక్షమున జాతి, ధర్మము, భాష ఒక్కటే అయినను, దాని వలన ఏ మాత్రమును ఫలము లేదు; ఎప్పుడో ఒకప్పుడు భిన్నజాతి సృష్టింపబడుట తప్పదు. వేర్వేరు దేశములను కలిపి ఒక మహా సామ్రాజ్యమును నిర్మింపవచ్చును. కాని, ఒక మహాజాతిని నిర్మింప వీలుకాదు. సామ్రాజ్యము ధ్వంసము కాగానే మరల భిన్న జాతులు ఏర్పడును. స్వాభావికమగు ఆ భేదభావమే సామ్రాజ్య వినాశమునకు అనేక పర్యాయములు కారణ మగుచున్నది'.

'యూదులకు ఒక దేశము లేకున్నను వారియందు జాతీయత రూపుగొనలేదా?' అను సందేహము కలుగ వచ్చును కాని, వారికి తమ పూర్వదేశమును గూర్చిన ఆశ ఉండినదనుటను మరువరాదు. ఆధునికయుగమున జాతీయతకును, దేశమునకును గల సంబంధము మరింత హెచ్చినది. ప్రతి జాతియును ఒక రాజ్యమును కలిగి ఉండుటయు, ఆ దేశమునందు ప్రత్యేక ప్రభుత్వమును స్థాపించుకొనుటయు నేటి ముఖ్య లక్షణములు.

వర్గము : వర్గము లేక అన్వయము జాతీయతకు రెండవ ఆధారము అని అనవచ్చును. జాతీయత అను భావము జనుల హృదయములయందు జనించునది. జనులందరును ఒకే వర్గమువారైనచో ఈ భావము వారియందు అతి శీఘ్రము గను, ప్రబలముగను ఉద్భవింపగలదు. అంతేకాక, ఒకే అన్వయమునకు చెందిన జనులకు సామాన్యములైన ఆశయములును, ధర్మమును, చారిత్రకోద్దేశ్యమును ఏర్పడ గలవు. ప్రతిజాతియు తన ధర్మమును, చారిత్రకోద్దేశ్యమును సాధించినచో ప్రపంచపు నాగరకతకు ఒక నూతన వికాసమును, పరిపూర్ణతయు చేకూరును. 'చారిత్రకోద్దేశ్యము గల జనులే జాతి' అని మాట్సినీ యొక్క మతము.

వర్గముగాని, అన్వయముగాని జాతీయతకు ఆధారము కాదనుటకు కూడ నిదర్శనములు కలవు. స్విజర్లండ్ నందు ఇటాలియన్లును, ఫ్రెంచివారును, జర్మనులును కలరు. ఈ మూడు వర్గములలోను తిరిగి ఎన్నో తెగలు చేరి ఉన్నవి. అయినను, స్విజర్లండ్‌నందు జాతీయత లేదని ఎవరును వాదింపరు. నేటి రాజ్యములలో పలుజాతులు కూడి ఉన్నవి. వీనిని వేరువేరుగ ప్రత్యేకించుటే సాధ్యము కాకున్నది. మానవ చరిత్రయందు వేరు వేరు తెగల మేళనమును, జాతుల అన్యోన్యతయు ముఖ్యముగ అగపడునే కాని, పృథక్త్వము ఎక్కువగ కానరాదు. మరి యొక విషయము ఏమన - జాతి అనునది సాంఘిక, రాజకీయశాస్త్రములకు సంబంధించినది. వర్గము భౌతిక శాస్త్రమునకు సంబంధించినది. ఈ రెంటిని ప్రత్యేకింప వలెను గాని ఒకటి చేయరాదు. దేశములయందు వేరు వేరు సమ్మేళనములు కాలక్రమమున సంభవింపవచ్చును. ఒక వర్గము వారు ఇంకొక జాతివారితో వివాహ సంబంధములు ఏర్పరచుకొని చివరకు ఒక అన్వయముగానే కలియవచ్చును. అటులే ఒక దేశమునకు మరియొక దేశమువారు వచ్చి నివాసము ఏర్పరచుకొనినను, ఒక జాతిని ఇంకొక జాతి జయించినను కూడ రాజ్యమున అనేక నూతన వర్గములు ఏర్పడవచ్చును.

వర్గము లేదా అన్వయమును కేవలము భౌతిక దృష్టితోనే జూచుటవలన పలు వైపరీత్యములు సంభవించును. పాశ్చాత్యులు ఈ దృష్టిని అవలంబించి వర్గము (రేస్) అను పదమునకు విపరీతార్థములను ఇచ్చిరి. గోబిన్యూ అను ఫ్రాన్స్ దేశస్థుడు ఉత్తమ జాతులవారు అందరును 'ఆర్యులు' లేదా 'ట్యూటన్' వంశమునకు చేరినవారు అనెను. ఈతని మతమును జర్మనీదేశమందు పలువురు స్వీకరించిరి. వీరిలో 'హూస్టన్ స్టీవర్ట్ చేంబర్లిన్' అను నతడు ముఖ్యముగ పేర్కొనదగినవాడు. ఇతడు ఆంగ్లేయుడయ్యు జర్మనులను శ్లాఘించుచు, ఆంగ్లేయులను దూషింప సాగెను. జర్మనీ చక్రవర్తియైన విలియమ్ - II ఈ ఆంగ్లేయుని మెచ్చి, ఇతనికి తన మైత్రిని ప్రసాదించెను. ముసలితనమున చేంబర్లిన్ హిట్లరును దేశోద్ధారకుడని కొనియాడెను. చేంబర్లిన్ వాదములనే హిట్లర్ బలపరచి దేశమందంతటను ప్రచారము ఒనర్చెను. నార్డిక్ జాతియే ప్రపంచమునందెల్ల శ్రేష్ఠమైనదనియు, ఇతర జాతులను ఏలదగినదనియు అతడు ప్రకటించుచు జర్మను సామ్రాజ్యమును స్థాపింప ఉద్యుక్తుడయ్యెను. జాతీయతకు వర్గమే మూలాధారముగ చేసినచో ఇట్టి పరిణామము తప్పనిసరి అగును. కాని, ఆధ్యాత్మికముగ పరిశీలించిన వర్గము రూపరేఖల రీత్యా ఒక మానవ

వర్గమున కన్పట్టు ప్రత్యేకత మాత్రమే అని స్పష్టము కాగలదు.

భాష : ప్రజల భాషలు అనేకములుకాక ఒకటియేయై ఉండుటకూడ జాతీయతకు అనుకూలము. భాష ఒకటియైన జనులకు అందరకును ఒక వాఙ్మయము ఉండగలదు. వాఙ్మయము ఒకటియైన దేశమునందు సామాన్య భావములును, ఆశయములును ఏర్పడ గలవు. వాఙ్మయము ప్రజల భావములను, ఆశయములను, జాతీయతను చాటునది. వాఙ్మయము మూలమున ప్రజలలో ఏర్పడు ఐకమత్యము దృఢమైనది. మన దేశమున ఎన్ని ప్రాంతములు ఉండినను, ఎన్ని రాష్ట్రములు ఉండినను, మనము మాట్లాడుభాషలు ఎన్నియైనను మనకు అందరకును సంస్కృతభాష సామాన్యమైనది. వేదములు, ఉపనిషత్తులు, రామాయణ - మహాభారతములు, కాళిదాసు మొదలగు మహాకవుల కావ్యములు, నాటకములు ఇవి అన్నియును భారతీయుల అమూల్యమైన ఐశ్వర్యము. ఈ సంపద మనది మాత్రమే కాదు ; మన పూర్వులకును, భవిష్యత్సంతతివారికిని కూడ ఇందు హక్కు ఉన్నది. తరతరములవారినెల్ల వాఙ్మయము ఒకటిగజేసి, వారి హృదయములయందు జాతీయ భావమును నెలకొల్పగలదు.

జాతీయతకు సామాన్యభాష అనుకూలమే అయినను, పలు భాషలు గల దేశములయందుకూడ జాతీయత ఏర్పడ గలిగినది. ఇందులకు స్విజర్లండ్ ఒక నిదర్శనము. ఆ దేశమున ఇటాలియన్‌లును, జర్మనులును, ఫ్రెంచివారును కూడ కలరు. అచట ఈ మూడు భాషలును కూడ ఉపయోగింపబడుచున్నవి. వివిధ భాషలు మాట్లాడువారు ఒక రాజ్యమునందును, ఒక జాతియందును ఉండవచ్చును. కాని, జాతి వేరైనను భాష ఒకటియే కావచ్చును. ఆంగ్లేయులును, ఉత్తర అమెరికా దేశీయులును, బ్రిటిష్ కామన్ వెల్త్ లోని ప్రజలును ఇంగ్లీషు భాషను వాడుదురు. స్విజర్లండ్ లోను, బెల్జియమ్, కెనడాలయందును ఫ్రెంచి భాషయు, యూరప్ ఖండమునందున్న అనేక దేశములయందు జర్మన్ భాషయు, ఫిన్లాండ్ నందు స్వీడిష్ భాషయు, దక్షిణ, మధ్య అమెరికాలోని పదునెనిమిది రాజ్యములలో స్పానిష్ భాషయును ఉపయోగింపబడుచున్నవి. అయినను, ఈ దేశములు అన్నిటిలోను జాతీయత కలదని అందరు అంగీకరింతురు. సంస్కృతభాష హిందువులకెల్ల సామాన్యమనునది నిజమే కాని, అది వ్యవహార భాషలలో ఒకటి కాదు. ఇపుడు వాడుకలో ఉన్న భాషలలో హిందీ, తెలుగు, బెంగాలీ, మరాఠీ, తమిళము, అస్సామీ, పంజాబీ, కన్నడము, ఒరియా, గుజరాతీ, మలయాళము, కాశ్మీరీ, ఉర్దూ అను పదమూడింటిని ముఖ్యముగ పేర్కొనవచ్చును. ఇన్ని భాషలు ఉండినను మన దేశము కూడ జాతీయతను, స్వాతంత్ర్యమును సాధింపగలిగినది.

మతము : జాతీయతకు మతము మరియొక ఆధారము. కాని, మతము అను పదమును సంకుచిత రీతిని వ్యాఖ్యానింపరాదు. దేశమున జనులందరును ఒక మతమునే అవలంబించుట, వేరు మతములవారికి స్థానమును గాని, ఆశ్రయమును గాని ఇవ్వకుండుట, అంతేకాక వారిని పీడించి హింసించుట ఇట్టి పద్ధతులు జాతీయతకు సహాయపడవు. ఈ పద్ధతులు జాతికి హానికరములు అనుట నిస్సంశయము. జాతీయత యొక్క ఆశయములు ఇవియే యైనచో, జాతీయతకు మతము అనావశ్యక మనియే అనవచ్చును. కాని, ప్రజల ఆధ్యాత్మికదృష్టి, నీతి, ధర్మము, ఆచారము మొదలగు మతమునందలి ముఖ్య విషయములయందు ఐక్యము ఉండుట జాతీయతకు మిక్కిలి సహాయకరము. ఈ రీతిని జూచినచో ఒక జాతివారు మాత్రమే కాదు, మానవులందరును ఒకటియే అనవచ్చును. ఎందుకనగా నీతియును, ధర్మమును సార్వలౌకిక మైనవి ; మానవులకు అందరకును అన్వయించునవి. మతదృష్టియందలి ఐకమత్యము ఒకవంక జాతీయతకు కారణమగుచునే, మరొకవంక జాతి భేదములను నిర్మూలించుటకు కూడ సమర్థమైనది. అయినను, ఒక దేశమునందే ప్రజల మతములు అనేకములై పరస్పర వైషమ్యము కలిగి ఉండినచో జాతీయతకు అంతరాయము ఏర్పడును.

చరిత్ర : జాతీయతకు దేశచరిత్ర చాల ప్రధానమైనది. చరిత్ర జనుల ఆశయములను, వారి సంస్కృతిని వ్యక్తపరచునది. భాషయు, వాఙ్మయమును ప్రజలనెల్ల ఎట్లు ఏకీభవింప జేయగలవో, అట్లే చరిత్ర కూడ ప్రజలను ఏకీభవింప జేయగలదు. తమ చరిత్ర యంతయు ఒకటి ; తమ చారిత్రకోద్దేశ్యములును, ఆశయములును కూడ ఒకటియే! అంతేకాదు తమ జాతీయత, సంస్కృతి, ధర్మము ఈనాటివి కావనియు, సనాతనములైనవనియు కూడ చరిత్రనుండి ప్రజలు గ్రహింపగలరు.

జాతీయతకు పరదేశముల ఏలుబడియు దోహదకారి కావచ్చును. ఇతర రాజ్యముల నిరంకుశ ప్రభుత్వము దేశపు ప్రజలయందు జాతీయతా భావమును తప్పక జనింపజేయును. నెపోలియన్ యూరప్ ఖండమునందలి దేశములనెల్ల జయించి, నిరంకుశాధికారిగ ఏలి, ఆ దేశముల జాతీయతకు కారణభూతుడయ్యెను. ఇందులో అతని ఉద్దేశ్యము వేరు ; విధి సంకల్పము వేరు. ఎందుకనగా సామ్రాజ్యమును స్థాపించి పరిపాలింపబూనువాడు ఎవడును

జాతీయతను పెంపొందింప ఇచ్ఛగింపడు. కాని, విధి సంకల్పము ఏమన సామ్రాజ్య స్థాపనమునే జాతీయతా సృష్టికి కారణము గావించుట. సామ్రాజ్య స్థైర్యముకొరకు జాతీయతను అణగద్రొక్కవలెను. కాని, అణగద్రొక్కిన కొలది జాతీయత విజృంభించును. కాని, అణగిపడి ఉండదు. నెపోలియన్ అధఃపతనమునకు జాతీయతయే కారణము. స్వాతంత్ర్య సమరమున మహాపురుషులు పడిన కష్టములును, వారి సహనశక్తియు, వారు సాధించిన మహత్కార్యములును ఇవియే జాతీయతా జ్వాలకు ఇంధనములు. వారి చరిత్రయు, జీవితమును జాతీయతకు మూలాధారములు. దేశచరిత్రయందలి అద్భుత చర్యలను గూర్చి సామాన్య గౌరవమును, ఘోర సంకటములను గూర్చి పశ్చాత్తాపమును, దుఃఖమును ఇతర శక్తులన్నిటి కన్నను జనులను ఎక్కువగ ఏకీభవింప చేయగలవు. సామాన్య చరిత్ర గలిగి, ఒకరి ఎడ ఒకరు సౌజన్యము జూపుచు ప్రత్యేక ప్రభుత్వమునకు ఆశించు ప్రజలే జాతి యనబడుదురని 'మిల్' (1861) నిర్వచించెను. 'ఎర్నెస్ట్ రెనాన్' అనునతడు (1882) వంశము, మతము, భాష, రాజ్యము, నాగరకత, ఆర్థిక ఆశయములు ఇవి ఏవియును జాతీయతకు ప్రధానము కావనియు, దేశచరిత్రయు, అందలి కీర్తి - వైభవములును మాత్రమే జాతీయతకు కారణమనియు నుడివెను. చారిత్రకానుభవములు ప్రజలకు అందరకును మానసిక సంబంధములను ఏర్పరచును. రెనాన్ దృష్టియందు చరిత్రయందలి కీర్తి - వైభవములకన్న విపత్తులను గూర్చిన పశ్చాత్తాపమును, దుఃఖమును ప్రజలను ఎక్కువగ ఏకీభవింపజేయగలుగును. చరిత్ర వెల్లడిచేయు మునుపటి దేశభక్తుల త్యాగమును, ఇప్పటివారి దేశసేవా తత్పరతయును జాతీయతా స్థైర్యమునకు అత్యంతావశ్యకములు. మనదేశమునందలి బ్రిటిష్ పరిపాలనా చరిత్రయే దీనికి ప్రబల నిదర్శనము.

దేశము, వంశము, భాష, మతము, చరిత్ర అనునవి జాతీయతకు ఆధారములని పైన నిరూపింపబడినది. కాని, వీనిలో దేనినైనను ప్రత్యేకించి జాతీయతకు ఇదియే ఆధారమని చెప్పుటకు వీలుకాదు. దేశమే ఆధారమని అనినచో, ఇతర శక్తులు తోడ్పడకున్న దేశము ఎంత మాత్రము జాతీయతను అంకురింప చేయలేదు. దేశము జాతీయతకు ముఖ్యమే అయినను, దేశము ఒక్కటే కారణము అనుట విపరీతమైన వాదము. వంశము, అన్వయము జాతీయతకు అనుకూలములు. కాని, వంశము మాత్రమే జాతీయతను సృజింపజాలదు. అంతేకాక, వంశము అను పదమును చాల జాగరూకతతో వాడవలెను. ఎందుకన ఒకటే వంశపువారమను గర్వమును, భ్రమయును ప్రపంచశాంతికి అంతరాయములు. భాష, వాఙ్మయము, మతము కూడ దేశము, వంశముల వలె జాతీయతకు అనుకూలించును. కాని, వీనిలోని ఏ ఒకటియును ఇతర శక్తుల సాహాయ్యము లేక జాతీయతను సృజింపనేరదు. ఈ ఆధారములు అన్నియు ఉండి, వీనిని దేశచరిత్ర కూడ బలపరచినచో జాతీయతా ప్రాదుర్భావమునకు అవకాశము ఏర్పడినది అనవచ్చును. ఎందుకన, జాతీయతాశక్తి ప్రజల మనస్సునందు ఉద్భవించునది ; అంతరంగికమైనది. పైన వివరించిన ఆధారములు అన్నిటి కన్నను ప్రజల మనస్సును, భక్తివిశ్వాసములును మాత్రమే ప్రధానములని ఎంచదగును. జర్మని నీతివేత్తలు జాతి అను పదమును, ప్రజలు అను పదమును ప్రత్యేకింతురు. ప్రజలు అను పదము రాజ్యమున ఉండు జనులకు అన్వయించును. జాతి అనునది సాంస్కృతిక దృష్టియందు ఉపయోగింపబడును. వీరి అభిప్రాయమున జాతికిని, రాజ్యమునకును సంబంధము లేదు. వాడుకయందు ప్రజలును, జాతియును ఒకటియై ఉన్నది. ప్రబలమైన ప్రభుత్వమును ఏర్పరచుకొనిన జనులే జాతి అని రవీంద్రుని అభిప్రాయము. ప్రజా సమూహపు శక్తిని బలపరచుటే జాతి అను సంస్థయొక్క ఉద్దేశ్యము. పాశ్చాత్య జాతీయత యొక్క ఆశయము రాజ్య నిర్మాణమే ! కాని, సాంఘికాభివృద్ధి కాదు. ప్రజల సంస్కృతినిగాని, ఆధ్యాత్మిక శక్తులనుగాని అట్టి జాతీయత పెంపొందింపదు.

జాతికిని, రాజ్యమునకును అత్యంత సన్నిహితమైన సంబంధము కలదు. ప్రజలయందు జాతీయతాశక్తి ఆవిర్భవించిన వెంటనే వారు ప్రత్యేకమైన రాజ్యముమ స్థాపింప ప్రయత్నించి, అనతికాలముననే దానిని సాధింతురు. దేశము, ప్రజలు, దొరతనము, రాజ్యాధిపత్యము అను నాలుగును రాజ్యపు అంగములు. వీనిలోనెల్ల రాజ్యాధిపత్యము అనునది ప్రధానమైనది. రాజ్యాధిపత్యము లేని రాజ్యము ఉండనేరదు. రాజ్యాధిపత్యము అను శక్తి ద్విముఖమైనది. దేశమునందలి ప్రజలపైన, సమాజములపైన ప్రభుత్వము కలది. అంతేకాక ఇతర రాజ్యముల ఎడ స్వతంత్రముగ ప్రవర్తించునది. రాజ్యమును, జాతీయతయును గల ప్రజలు 'జాతి' అని వ్యవహరింపబడుదురు.

రాజ్యములును, జాతీయతయును భిన్నములు కాక ఏకమై ఉండుట కొంతవరకు మేలే ! ఎందుకనగా, జాతీయ భావముగల ప్రజలు ఇతర రాజ్యముల పరిపాలనమును ఓర్వలేరు. స్వతంత్రరాజ్యములను ఏర్పరచుకొను వరకును వారు ఇతరులకు బానిసలే ! కాని, స్వతంత్రులు కారు.

అనేక జాతులు ఒక సామ్రాజ్యమున ఉండుట కూడ ప్రపంచ శాంతికి వ్యతిరేకము. ఆధునిక యుగమున 19 వ, 20 వ శతాబ్దములలో ఇందుకు ఎన్నియేని నిదర్శనములు కలవు. కాని, జాతీయతనే రాజ్యముల ఆధారముగ జేయుట మరియొకరీతిని జూచినచో మిక్కిలి విపత్కరమైనది. విశాలమునైన నేటి రాజ్యములలో ఒకే ఒక జాతి ఉండుట అసంభవము. రాజ్యాధిపత్యము అనిన రాజ్యమునందలి ప్రజలపైన, సమాజములపైన ఆధిపత్యము. ఈ ఆధిపత్యమును వాస్తవముగ చెలాయించునది రాజ్యమునందలి ప్రముఖ జాతియే! ఎందుకన ప్రముఖ జాతియే అధిక సంఖ్య గలది. ఇట్టి తరి రాజ్యమునందలి అల్పసంఖ్య గల జాతులు ప్రముఖజాతికి అధీనములై ఉండక తప్పదు. రాజ్యమును, జాతీయతయును ఒకటియైనచో ప్రజల అభ్యుదయము ఆగిపోయి, జాతులు సంఘసంపర్కము లేని వ్యక్తుల స్థితిని పొందును. జాతీయతాభావము ఒకరీతిగ విప్లవకరము; మరి ఒకరీతిగ అభ్యుదయమునకు అంతరాయము.

రాజ్యస్వాతంత్ర్యము రాజ్యాధిపత్యము యొక్క రెండవ అంశము. ప్రతి యొక జాతియును స్వతంత్ర రాజ్యముగ ఏర్పడి విశృంఖలముగ ప్రవర్తించుట ప్రపంచ శాంతికి హానికరము. అట్టి విశృంఖల జాతీయతకు పారిశ్రామికశక్తి తోడైనపుడు సామ్రాజ్యకాంక్ష ప్రబలి, దేశదేశములకును వైరము ఏర్పడుట సహజము. ఇటుల జాతీయతయును, పారిశ్రామిక శక్తులును చేరి ప్రపంచయుద్ధములకు కారణమైనవి.

ఈ విధముగ సామ్రాజ్యకాంక్షయు, ప్రపంచ యుద్ధములును జాతీయతా శక్తికి కళంకమును ఆపాదించినవి. కాని, ప్రపంచయుద్ధములలో మారణహోమమునకు ఉపకరించిన పారిశ్రామికాభ్యుదయమే ఆ యుద్ధములనుండి మానవ జాతిని రక్షించుటకును ఉపకరింపగలదు. వైజ్ఞానికులు ఈ కాలమున ప్రపంచపు ఐక్యమునకు తోడ్పడు పరికరములను ఎన్నియేని నిర్మించి ఉన్నారు. నేటి ప్రయాణ సౌకర్యములును, వార్తావాహినులును దిశలనే జయించి స్థల సామీప్యమును సాధించినవి. మానవుడు ఈ పరిణామములను గుర్తించినచో జాతీయతయందలి విపత్తులను అతిసులభముగ నిర్మూలింపవచ్చును. మానవ సంకల్పము ఇందులకు ప్రధానము. అంతేకాక, విశృంఖలపు జాతీయత ప్రపంచ శాంతికి అంతరాయమనియు, ప్రపంచమంతయు ఒకటే అనియు, మానవులందరు ఒక జాతివారే అనియు కూడ మనకాలపు యుద్ధములు చాటుచున్నవి. ఈ నూతన తత్వములను గుర్తించి తదనుగుణముగ వర్తింపకున్నచో మానవజాతి ప్రపంచమున ఇక చాలకాలము ఉండుట సంశయమే అనదగును.

జాతీయ భావము మానవ చరిత్రయందు ఒక అంశమే అనియు, చరిత్రగతిని అనుసరించి మున్ముందు విశాలతరములైన మనోవృత్తులు ఏర్పడగలవనియు కొందరు వాదింతురు. జనుల మనోవికాసమే జాతీయతకు కారణము; కాని, జాతీయత సిద్ధించిన పిదప మానవసంకల్పములకు అంతర్జాతీయతయే ఆశయము కాగలదు. వికాసము హెచ్చినకొలది జాతీయతాశక్తి క్షీణించి చివరకు నశించి పోవుట కూడ సంభవమే!

జాతీయతకును, అంతర్జాతీయతకును వైషమ్యము లేదనుటకు కూడ ఆధారము కలదు. జాతీయతయే లేకున్న అంతర్జాతీయత ఎట్లు ఏర్పడును? అంతర్జాతీయత జాతీయత యొక్క పరిణామము; పరమావధి. చరిత్రను పరిశీలించినచో ఐక్యము ఎరుగని జనులయందు జాతీయత ఒక జనసామాన్య సంకల్పమును సృజించి వారికి విశిష్టతను ఒసగినదనుట స్పష్టమగును.

కాని, మానవ సంకల్పమునకును, ఆశయములకును పరిమితి లేదు; జాతీయత మానవుని ఆశయములలో ఒకటియే కాని, పరమావధి కానేరదు. ఇప్పటివరకును జాతీయతయే పరమావధిగ ఉండినది కాని, ఆ అవధిని దాటి అంతర్జాతీయతను ఇకముందు సాధింపవలసి ఉన్నది. అంతర్జాతీయతను సాధింపవలెనన్నచో రాజ్యముల స్వాతంత్ర్యమును కూడ సంకుచిత రీతిని జూడకుండుట అత్యంత ఆవశ్యకము.

అంతర్జాతీయత జాతీయతాశక్తియందు ఇమిడి ఉన్నదని కూడ అనవచ్చును. మానవుని పరమావధి వ్యక్తియందు అంతర్గతమై ఉన్నది. ఈ పరమావధి మూర్తిత్వమొందుటయే మానవ పురోగతికి లక్ష్యము. ప్రపంచమున అనేక జాతులు ఉండిన ఎడల మానవ ప్రతిభ సర్వతోముఖమై చరిత్రకు ఒక నూతన వికాసము ఏర్పడును. జగత్సృష్టియందు ప్రతి ఒక్కజాతికిని ప్రత్యేకమయిన స్థానము కలదు. రాగమునకు స్వరములవలె విశ్వకల్యాణమునకు జాతులును, ప్రత్యేక సంస్కృతులును కూడ ఆవశ్యకములు. అయినను రాగమునకు స్వరముల పొందిక కావలసినట్లే, లోకకల్యాణమునకు జాతుల పొందిక కావలెను. జి. ఎస్. శర్మ.

**జాన్సన్, లిండన్ బి.** (జ. 1908): యునైటెడ్ స్టేట్స్ రాజనీతివేత్త; 36 వ అధ్యక్షుడు (1963 నుండి). టెక్సాస్ రాష్ట్రములో జన్మించెను. ఇతడు తన 15 వ ఏట మాధ్యమిక పాఠశాల చదువు విరమించి, కార్మిక వృత్తి చేపట్టినను రెండేండ్ల పిదప మరల విద్యాభ్యాసమునకు

పూనుకొని, 1930 లో పట్టభద్రుడు అయ్యెను. కొలది కాలము అధ్యాపకవృత్తిని నిర్వహించి, తరువాత రాజకీయములలో ప్రవేశించి, 1937 లో ప్రతినిధులసభకు ఎన్నిక అయ్యెను. 1941 లో సెనేట్ సభ్యత్వమునకు విఫల ప్రయత్నము చేసి, ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున నౌకాదళములో పనిచేసి, జాన్సన్ ధైర్యసాహసములు ప్రదర్శించినందులకు సమ్మానింపబడెను. 1942 లో యుద్ధ ప్రగతిని గూర్చి విచారణ జరిపిన సంఘమునకు ఇతడు అధ్యక్షత వహించెను. 1948 లో సెనేట్ సభ్యుడుగా ఎన్నికయై,



లిండని జాన్సన్

(జ. 1908)

జాన్సన్ అచిరకాలములోనే డెమోక్రాటిక్ పక్షములో పలుకుబడిని ఆర్జించి, 1960 లో కెనెడీకి పోటీగా డెమోక్రాటిక్ పార్టీచే అధ్యక్షపదవికి నియోగింపబడ ప్రయత్నించెను. కాని, చివరకు ఉపాధ్యక్ష పదవికి నియోగింపబడి గెలుపొందెను. 1963, నవంబరు 22 తేదీన అధ్యక్షుడు కెనెడీ [చూ. పు 399] హత్యచేయబడినకొలదినిముషములకే యునైటెడ్ స్టేట్స్ 36 వ అధ్యక్షుడుగా జాన్సన్ పదవీ స్వీకారము కావించెను; 1964 ఎన్నికలలో అధ్యక్షపదవికి పోటీచేసి గెలుపొందెను. కెనెడీ ప్రారంభించిన మహత్తర కృషిని తానుగూడ కొనసాగింతునని ప్రకటించెను. ఆ. వెం.

**జార్జి - V (1865 - 1936)**: బ్రిటిష్ రాజు; బ్రిటిష్ సామ్రాజ్య చక్రవర్తి. ఇతని పరిపాలనాకాలమున (1910 - 1936) భారతదేశము బ్రిటిష్ సామ్రాజ్యమున అంతర్భాగముగ ఉండెను. తండ్రియగు ఎడ్వర్డ్ - VII మరణానంతరము ఇతడు రాజయ్యెను. ఇతడు రాజ్యమునకు వచ్చిన నాలుగు సంవత్సరములకే ప్రథమ ప్రపంచయుద్ధము ఆరంభమైనది.



జార్జి - V

(1865 - 1936)

ఒక మహా సంగ్రామము సంభవించుటవలననే కాక అనేక ప్రధాన సంఘటనలు జరుగుటవలన కూడ ఇతని పరిపాలనతో ఒక నూతన శకము ఆరంభమైనదని చెప్పవలసి ఉన్నది. నాటి ప్రధాన సంఘటనలో ముఖ్యముగ కామన్స్ సభ వారిలో పరస్పర వాదములు, బ్రిటన్ వలసల ప్రతిపత్తిలో మార్పులు, ఐరిష్ ఫ్రీ స్టేట్ ఆవిర్భావము, భారతదేశములో చెలరేగిన స్వాతంత్ర్యోద్యమము, వస్తువుల ధరలు పడిపోవుట మున్నగు వాటిని ముఖ్యముగా పేర్కొనదగును. యూరప్‌లో అనేక రాజ్యములు పతనమగుటకు సిద్ధముగ ఉన్న కాలమున ఐక్యతను చెడగొట్టునటువంటి ఇట్టి అనేక క్లిష్టసమస్యలు ఎదుర్కొనినను, సహన శీలుడగు జార్జి - V మంత్రుల సలహాలను సక్రమముగ అనుసరించుటవలన బ్రిటన్‌కు మహోపకారము జరిగినది.

రజతోత్సవము 1935, మే 4 న జరిగెను. పిమ్మట 8 నెలలకు వ్యాధిగ్రస్తుడై జార్జి - V దివంగతుడయ్యెను. ప్ర. రా.

**జార్జి - VI (1895 - 1952)**: బ్రిటన్ రాజు; బ్రిటిష్ సామ్రాజ్యపు చక్రవర్తి. జార్జి - V ఈతని జనకుడు. సోదరుడగు ఎడ్వర్డ్ - VIII [చూ. పు. 342] 1936, డిసెంబరు 11 వ తేదీన రాజ్యాధికారమును పరిత్యజించిన పిమ్మట ఇతడు సింహాసనమును అధిష్ఠించెను.

ఈతని కాలమున జరిగిన ముఖ్య సంఘటనలలో 1. ద్వితీయ ప్రపంచయుద్ధము; 2. బ్రిటిష్ సామ్రాజ్యము నందలి దేశములలో ప్రముఖములైనవి స్వతంత్రములగుట అనునవి ముఖ్యముగ పేర్కొనదగినవి. ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున దాదాపుగ యూరప్ ఖండమంతయు హిట్లర్‌నకు లొంగి ఉండి, గ్రేట్ బ్రిటన్ రాజ్య మొక్కటియే హిట్లర్‌ను ఎదుర్కొన వలసివచ్చిన క్లిష్ట సమయమున ఈ రాజు స్వదేశముననే నిలిచి ప్రజలతో కష్టసుఖములలో పాల్గొని ప్రజల ప్రేమానురాగములను ఆర్జించెను.

ఈతని కాలమున - ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున - బ్రిటిష్ సామ్రాజ్యమునందలి భారతదేశము మొదలగు రాజ్యములు స్వాతంత్ర్యమును ఆర్జించినవి. అందు బర్మా వంటి కొన్ని రాజ్యములు బ్రిటిష్ ప్రభుత్వసంబంధము నుండి సంపూర్తిగ విడివడినవి. భారతదేశము మొదలగు పెక్కు రాజ్యములు కామన్ వెల్త్ [చూ. పు 383] మూలమున బ్రిటిష్ ప్రభుత్వముతో స్వేచ్ఛాపూర్వక సంబంధములు ఏర్పరచుకొనినవి. ప్ర. రా.

**జార్జి వాషింగ్‌టన్**: చూ. వాషింగ్‌టన్, జార్జి.

**జిన్నా, మహమ్మదాలీ (1876 - 1948)**: పాకిస్తాన్ నిర్మాత; హిందూ - మహమ్మదీయ ద్విజాతి సిద్ధాంత ప్రవర్తకుడు. కరాచీలో జన్మించెను. లండన్‌లో బారిస్టర్ పరీక్షలో ఉత్తీర్ణుడై, బొంబాయిలో ప్రముఖ న్యాయవాదిగా ప్రసిద్ధికెక్కెను. కాంగ్రెస్‌లో ఇతడు నౌరోజీ, గోఖలే [చూ.] వంటి మితవాదుల కోవకు చెంది ఉండి, గాంధీజీ

ప్రారంభించిన సహాయనిరాకరణోద్యమము (1919 - 21) [చూ.] ను ప్రతికూలించి, ఆ సంస్థనుండి వైదొలగెను. ఇతడు భారత సామ్రాజ్యశాసనసభలో సభ్యుడు (1910 - 1919). జిన్నా 1913 లో ముస్లిమ్‌లీగ్‌లో ప్రవేశించి, 1916 లోను, తదుపరి 1920 లోను అధ్యక్షత వహించెను. 1934 లో లీగ్ శాశ్వత అధ్యక్షపదవిని చేపట్టి, 1947 వరకు నిర్వహించెను. ఆ కాలమున ఇతడు 'ఖాయిదే అజామ్ (మహానాయకుడు)' అని పేర్కొనబడుచుండెను. అల్పసంఖ్యాకులైన ముస్లిమ్‌ల భద్రతకు భంగము వాటిల్లకుండుటకు రాజ్యాంగరీత్యా రక్షణ నిబంధనలు కల్పింపబడవలెనని జిన్నా ప్రతిపాదించెను. లీగ్ అధ్యక్షుడుగా 1916 లో అతడు కాంగ్రెస్, లీగ్ పక్షముల తరపున ఒక రాజ్యాంగ సంస్కరణల ప్రణాళికను తయారుచేసెను. అందులో భాగమైన లక్నో ఒడంబడిక ప్రకారము ముస్లిమ్‌లకు ప్రత్యేక నియోజక వర్గములు, అల్పసంఖ్యాకులై ఉన్నచోట్ల ముస్లిమ్‌లకు ఎక్కువ ప్రాతినిధ్యము ప్రతిపాదింపబడినవి. లండనులో జరిగిన రౌండ్ టేబిల్ సమావేశము (1930-32) [చూ.] నకు హాజరై, జిన్నా హిందూ - మహమ్మదీయులకు సమాన రాజకీయప్రతిపత్తి ఉండవలెనని వాదించెను. తరువాత 1940 లో జిన్నా భారతదేశమును విభజించి, ముస్లిమ్‌లు అధికసంఖ్యాకులుగా ఉన్న ప్రాంతములతో పాకిస్తాన్ నిర్మింపబడవలెనని ఆందోళన లేవదీసెను. నాటినుండి అతడు తనపట్టు విడువక, క్రిప్స్ ప్రతిపాదనల (1942) ను తిరస్కరించి, కాబినెట్ మిషన్ సూచనల ప్రకారము ఎన్నికయైన రాజ్యాంగపరిషత్ (1946) లో లీగ్ ప్రతినిధులు పాల్గొనకుండ జేసెను; చిట్టచివరకు కాంగ్రెస్ నాయకులు తప్పనిసరిగా దేశవిభజనకు అంగీకరించుటచే, 1947, ఆగస్టు 14 వ తేదీన సృజింపబడిన పాకిస్తాన్‌కు జిన్నా తొట్టతొలి గవర్నర్ - జనరల్ పదవిని చేపట్టెను. కాని, స్వాతంత్ర్యసిద్ధితో ఆరంభమైన మతకల్లోలములను, కాశ్మీరు సమస్య [చూ. పు. 389] వంటి సద్యస్సమస్యలను పరిష్కరింపక యే అతడు 1948 లో మరణించెను. ఆ. వెం.

**జిబ్రాల్టర్ :** బ్రిటిష్ వలసపాలనయందు ఉన్న దుర్గ రాజ్యము.

స్పెయిన్ ద్వీపకల్పపు కోస్తాతీరపు నైరృతిభాగమున మధ్యధరాసముద్రపు పశ్చిమ ముఖద్వారమున ఉన్న ఈ దుర్గరాజ్యము [వి] 5.83 చ. కి. మీ.; [జ] 24,075. వీరిలో స్పెయిన్, ఇటలీ వాసులు పెక్కురు గలరు. [భా] వీరు మాట్లాడు భాషలు ఇంగ్లీషు, స్పానిష్; [మ] ఇందు ముఖ్యముగ రోమన్ కేతలిక్ క్రైస్తవ మతానుయాయులు కలరు. జిబ్రాల్టర్ జలసంధి ద్వారా పయనించు నౌకల రాకపోకలను కనిపెట్టుటకు వీలగు కీలకస్థానమున ఈ దుర్గము ఉండుటచే, దీనికి చారిత్రక ప్రాముఖ్యము అబ్బినది.

చరిత్ర: క్రీ. శ. 711 లో మహమ్మదీయులైన మూర్‌లు ఈ శిలామయ ప్రదేశమును స్వాధీనపరచుకొనిరి. వారి నాయకుడు జెబెల్ టరిక్. అతని పేరునుబట్టి ఈ స్థలమునకు 'జిబ్రాల్టర్' అనే పేరు వాడుకలోనికి వచ్చినది.

మహమ్మదీయులకు వశపడి ఉండిన ఈ జిబ్రాల్టర్‌ను స్పెయిన్‌వారు 1462 లో స్వాధీనపరచుకొనిరి. 1704, ఆగస్టు 3 న అడ్మిరల్ సర్ జార్జ్ రూక్ అను ఆంగ్ల యోధుడు జిబ్రాల్టర్‌ను పట్టుకొనెను. 1713 లో జరిగిన ఉట్రెక్ట్ సంధి [చూ. పు. 337] షరతులను అనుసరించి దీనిని గ్రేట్ బ్రిటన్‌కు స్పెయిన్‌వారు శాశ్వతముగ స్వాధీనము చేసిరి.

ఇది బ్రిటిష్‌వారికి రాజకీయముగను, సైనికముగను ఎక్కువ ముఖ్యమైన ప్రదేశము. అట్లాంటిక్ మహాసముద్రము, మధ్యధరాసముద్రముల నడుమ సాగు నౌకల రాకపోకలను అదుపులో ఉంచుకొనుటకు అనుకూలమైనది. ఇక్కడగల పెద్ద నౌకాశ్రయములో యుద్ధనౌకలను సమయమునకు పనికివచ్చునట్లు నిలుపుకొనవచ్చును. ఇది బ్రిటిష్ వలసరాజ్యము. ఒక గవర్నర్, 7 గురు సభ్యులు గల సలహాసంఘము ఉన్నది. శాసననిర్మాణసభ కలదు. గవర్నరే సైన్యాధ్యక్షుడు. గి. వేం. సీ.

**జీసస్ క్రీస్తు :** చూ. క్రైస్తు, జీసస్ ; సం. 7 - పు. 369.

**జెకోస్లోవాకియా :** మధ్య ప్రాచ్య యూరప్ నందలి ఒక స్వతంత్రరాజ్యము.




ఈ దేశమునకు తూర్పు జర్మనీ, పశ్చిమ జర్మనీ [ప], పోలండ్, సోవియట్ రష్యా [తూ; ఉ]; హంగేరీ, ఆస్ట్రియా [ద] సరిహద్దు దేశములుగ ఉన్నవి. [వి] 1,27,869 చ. కి. మీ.; దేశమున జెక్‌లు, స్లావ్‌లు అను జాతులవారు కలరు, బోహీమియా, మొరేవియా, సైలీషియా అను మండలములందు జెక్‌లును, స్లోవాకియా యందు స్లావ్‌లును వసించుచున్నారు. [జ] 1,39,01,763. వీరిలో 66.5% జెక్‌లు, 27.8% స్లావ్‌లు, తక్కిన వారు వివిధ అల్పసంఖ్యాక జాతులకు చెందినవారు. [మ] ప్రజలలో నూటికి 75 మంది రోమన్ కేతలిక్ క్రైస్తవులు; తక్కిన వారు ప్రొటెస్టంట్, తదితర మతములకును చెందినవారు. వ్యవస్థను అనుసరించి మతసంస్థలు ప్రభుత్వ విధానములకు కట్టుబడి ఉండవలసి ఉన్నది. [భా] జెక్ భాషయు, స్లావ్ భాషయు జాతీయ

భాషలుగ పరిగణన పొందినవి. రష్యన్ ద్వితీయ భాషగ 1943 నుండి వ్యాప్తిలోనికి కొనిరాబడినది. [రా] ప్రాగ్ (ప్రహా) (జ. సం. 9,84,724).

చరిత్ర: ప్రాచ్య యూరప్‌నందలి విస్తులానదీ పరీవాహ ప్రదేశమునుండి స్లావ్‌జాతి వారలు కొందరు ఈ ప్రాంతమునకు క్రీ. శ. 5 వ శతాబ్దమున వచ్చి, తమ వలసల స్థాపించి, ఈ ప్రాంతమును తమ మాతృభూమిగా చేసికొనిరి. క్రీ. శ. 9 వ శతాబ్దమున క్రైస్తవమతము ఇచట వ్యాప్తిలోనికి వచ్చెను. ఈ స్లావ్ జాతుల రాజకీయ వ్యవస్థ 7 వ శతాబ్దమునాటికే కొంత పటిష్ఠతను ఆర్జించి, తత్ఫలితముగ 9 వ శతాబ్దిలో మొరేవియన్ సామ్రాజ్యము అనునది ఇచట రూపొందెను. కాని, జర్మనిజాతులవారు, మాజియర్ (హంగేరీ) జాతులవారు 10 వ శతాబ్దిలో తమ దండయాత్రల మూలమున ఈ సామ్రాజ్యమును నిర్మూలనము ఒనర్చిరి. మాజియర్ తెగలవారు స్లావ్‌లు ఉండు మండలమును తమ అధీనమున ఉంచుకొనుటచే ఆ తరువాత దాదాపు వేయిసంవత్సరములవరకు వారి చరిత్ర జెక్‌ల చరిత్రనుండి వేరుపడెను. జెక్‌లు వసించు బోహీమియా మొదలగు ప్రాంతములు మాత్రము 10 వ శతాబ్దినుండి 'ఫెమిస్లైడ్' రాజవంశపు పాలనలో ఉండెను. ఈ రాజవంశము నుండి అధికారము బోహీమియాకు చెందిన లక్జెంబర్గ్ రాజవంశమునకు క్రీ. శ. 14 వ శతాబ్దిలో సంక్రమించెను. ఈ రాజవంశమునకు చెందిన చార్లెస్ - V పాలనకాలము బోహీమియాచరిత్రలో స్వర్ణయుగముగ ఎన్నిక గాంచెను. ఈ సామ్రాజ్య కాలముననే ప్రాగ్‌నగరము రాజధానిగ నిర్ణయితమయ్యెను. 1348 లో ఆ నగరమున ప్రథమయూనివర్సిటీ నెలకొల్పబడినది. లాటిన్ సారస్వతమునకు, క్రైస్తవమత సంస్కరణోద్యమమునకు కేంద్రముగ ప్రాగ్‌నగరము నాటినుండి 17 వ శతాబ్దము ఆరంభమువరకు యూరప్ ఖండమున ప్రశస్తిని ఆర్జించెను. 16 వ శతాబ్దిలో హాప్స్‌బర్గ్ రాజవంశీకులు బోహీమియా రాజ్యమును కైవసము చేసికొనిరి. 1620 లో జెక్‌లు తిరుగుబాటు చేసిరి. కాని, ఆ తిరుగుబాటు అడచివేయబడెను. కాని, ఫ్రెంచి విప్లవము [చూ.] జెక్ జాతీయతకు దోహదకారి అయ్యెను. కడకు 1867 లో హంగేరీ, ఆస్ట్రియా దేశములు ఏకరాజవంశ పాలనలోనికి కొనిరాబడి ఆస్ట్రియా - హంగేరీ సామ్రాజ్యము రూపొందినపుడు, జెక్‌లకు ఆ సామ్రాజ్యమున కొంత పరిమిత స్వతంత్రత లభించెను.

మాజియర్ (హంగేరియన్)ల వశమయిన స్లోవాకియా మండలము 10 వ శతాబ్దమునుండి 1918 వరకు వారి వశముననే ఉండెను. కాని, స్లావ్‌లు తమ ప్రత్యేక జాతీయతను మాత్రము పలుకష్టములకు ఓర్చి కాపాడుకొనిరి. 19 వ శతాబ్దిలో స్లావ్ పునరుజ్జీవనోద్యమము రూపొంది, తొలుత ప్రత్యేక భాషోద్యమముగ బయలుదేరి, కడకు రాజకీయోద్యమముగ పరిణమించెను.

హాప్స్‌బర్గ్ రాజవంశము 1918 లో పతనమగుటతో జెక్ మండలములు, స్లావ్ మండలము కలిసి జెకోస్లోవాకియా అను పేర ప్రత్యేక ప్రజాస్వామ్యగణరాజ్యముగ ఏర్పడెను. కాని, ఆనాడు ఈ దేశమున సూడెటన్ లాండ్ అను రాష్ట్రము ఉండెను. ఆ రాష్ట్రమున జర్మన్ ప్రజలు అధిక సంఖ్యాకులుగ ఉండిరి. దీనిని అవకాశముగ గొని, జర్మనీ నియంత హిట్లర్ ఆ ప్రాంతము జర్మనీకి చెందవలెనని పట్టుబట్టి దురాక్రమణకు తలపెట్టెను. అంతట మ్యూనిక్ నగరమున 1938, సెప్టెంబరు 29 వ తేదీన జర్మనీతో ఫ్రాన్స్, బ్రిటన్‌లు మంతనములు సలిపి, తుదకు సూడెటన్‌లాండ్‌ను జర్మనీకి చెందజేయుటకు అంగీకరించిరి. తరువాత ఆ వత్సరమే నవంబరు 2 వ తేదీన వియెన్నాలో జరిగిన వేరొక పరిష్కారమును అనుసరించి హంగేరికి కూడ జెకోస్లోవాకియా నుండి కొంత ప్రాంతము ఒసగబడెను. బలహీనమగు జెకోస్లోవాకియా వీనికన్నిటికిని అంగీకరించెను. తనకు దక్కినదానితో తృప్తిపడక హిట్లర్ జెక్ మండలములగు బోహీమియా, మొరేవియా ప్రాంతములను 1939, మార్చి 16 న తన రక్షితరాజ్యములుగ ప్రకటించి వశపరచుకొనుటయే కాక, ప్రత్యేక ప్రతిపత్తిని ఆశించు కొందరు స్లావ్‌లను లొంగదీసికొని స్లోవాకియాను సైతము ఆక్రమించి, నాజీ ప్రభుత్వ విధానమును నెలకొల్పెను. ఆ కాలముననే కార్పతో - రుథీనియా అను వేరొక ప్రాంతమును హంగేరీ ఆక్రమించెను. ఈ విధముగ ఈ దేశము ఆనాడు నామావశిష్టము అయ్యెను. జెకోస్లోవాకియా ప్రభుత్వాధిపతియగు బెనిస్ [చూ.] రాజీనామా ఇచ్చి (1938), ఇంగ్లండు చేరి, ఆ తరువాత అచట ఒక ప్రవాసప్రభుత్వమును నెలకొల్పెను. 1945 లో ద్వితీయ ప్రపంచయుద్ధము యూరప్‌నందు అంతమయిన తరువాత జెకోస్లోవాకియా మరల నూతనముగ రూపొందుటకు అవకాశము కలిగెను. 1945, మే లో జెకోస్లోవాకియా మరల స్వతంత్రతను ఆర్జించెను. ఈ సమయముననే ప్రవాస ప్రభుత్వము జెకోస్లోవాకియా కమ్యూనిస్ట్ పార్టీతో ఒక ఒడంబడికకు వచ్చెను. తత్ఫలితముగ పెక్కు మండలములందు నాలుగు రాజకీయపక్షములును, స్లావ్ మండలమున రెండు రాజకీయపక్షములును మాత్రమే గుర్తింపబడవలెనను నియమము ఏర్పడెను. బెనిస్ అధ్యక్షతనే తొలుతటి స్వతంత్ర

ప్రభుత్వము ఏర్పడెను. కాని, 1948, ఫిబ్రవరిలో కమ్యూనిస్టులు ప్రభుత్వమున అధిక బలమును ఆర్జించి, రక్తపాతము లేకుండనే ప్రభుత్వమును కైవసము చేసికొనిరి. ఆ సంవత్సరము మే, 9 వ తేదీన కమ్యూనిస్టుల పలుకుబడికి లోనయిన రాజ్యాంగపరిషత్ ఒక నూతన రాజ్యాంగ విధానమును ఆమోదించి స్లావ్‌లు, జెక్‌లు అను రెండు జాతులకు చెందిన జెకోస్లోవాకియాయందు సామాన్యప్రజల ప్రజాతంత్రరాజ్యము (పీపుల్స్ డెమోక్రసీ) ను స్థాపించితిమి అనిరి. అధ్యక్షుడగు బెనిస్ ఆ రాజ్యాంగ విధానముపై సంతకము చేయుటకు నిరాకరించి రాజీనామా ఇచ్చెను (1948, జూన్ 7).

ఆనాటి నుండి ఈ నూతన పరిపాలనావ్యవస్థను అనుసరించి జెకోస్లోవాకియా వ్యవహరించుచున్నది. భారీ పరిశ్రమలకు కమ్యూనిస్ట్ ప్రభుత్వము ఎక్కువ దోహదము ఒసగుచున్నది.

రాజ్యాంగము : 1948 రాజ్యాంగమును అనుసరించి జెకోస్లోవాకియాలో దేశమంతటికి ఒక కేంద్రప్రభుత్వమును, స్లోవాకియా మండలమునకు ఒక రాష్ట్రప్రభుత్వమును కలవు. దేశమంతటికి సంబంధించిన శాసననిర్మాణాధికారము లాంఛనముగ కేంద్రశాసనసభ (నారోనీ శ్రోమాజ్‌దేని) యందు న్యస్తమై ఉన్నది. 30 వేలమంది ప్రజలకు ఒక ప్రతినిధి చొప్పున ప్రజలు ఆరేండ్లకు ఒకసారి తమ ప్రతినిధులను ఈ సభకు ఎన్నుకొనెదరు. ప్రస్తుతము ఆ ప్రతినిధుల సంఖ్య 368. కాని, ఈ ఎన్నిక ఏకపట్టికా విధానము [చూ. పు. 348] ను అనుసరించి జరుగును. కావున మొత్తము మీద పరిపాలన వ్యవహారమంతయు ఏకైక పక్షము అగు కమ్యూనిస్ట్ పక్షము చేతులలో ఉన్నదని చెప్పవచ్చును. అధ్యక్షుడు ఏడేండ్లకు ఒక పర్యాయము ఎన్నుకొనబడును. అధ్యక్షుని వయస్సు 35 ఏండ్లకు తక్కువగ ఉండరాదు. అధ్యక్షుడే దేశాధిపతి. ప్రధానిని ఇతడు నియమించును. శాసనసభ ఏడాదికి కనీసము రెండుసార్లు సమావేశమగును. శాసనసభ సమావేశముకాని కాలమందు శాసన నిర్మాణమునకు వేరొక ముఖ్యపరిషత్ (ప్రెసిడియమ్) కలదు. దీనియందు 24 గురు సభ్యులును, ఒక సభాపతియు ఉందురు. ఈ పరిషత్‌ను ఏడాదికి ఒకసారి శాసనసభ ఎన్నుకొనును.

కేంద్రప్రభుత్వమునకు లోబడి స్లోవాకియా మండలమున 'రాష్ట్రశాసనసభ (స్లోవెన్‌స్కా నారోదారదా)' ఒకటి కలదు. ఇందును 35 వేలకు ఒక ప్రతినిధి చొప్పున ప్రతినిధులను స్లోవాకియా వాసులు ఎన్నుకొనెదరు. కేంద్రప్రభుత్వము నియమించిన ఒక కమీషన్ రాష్ట్రప్రభుత్వ వ్యవహారములను నిర్వహించుచు, రాష్ట్రశాసనసభకును, కేంద్రప్రభుత్వమునకును బాధ్యత వహించును. చీ. శే. రా.

**జెనీవా ఒడంబడిక :** ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరపు చరిత్రలో ఈ పేరున ప్రముఖతకు వచ్చిన ఒడంబడికలు రెండు కలవు - (స్విజర్లండ్ నందలి జెనీవాలో జరిగిన సమావేశమున కుదుర్చుకొనబడినందున వీనికి ఆ పేరు కలిగినది.)

మొదటిది : 1954, ఏప్రిల్ - జూలైలలో కొరియా, ఇండో - చీనా దేశములలో శాంతిని నెలకొల్పుటకై జరిగిన సమావేశ ఫలితముగ కుదిరిన ఒడంబడిక. ఈ సమావేశమున యునైటెడ్‌స్టేట్స్, సోవియట్ రష్యా, గ్రేట్ బ్రిటన్, ఫ్రాన్స్, చీనా ప్రజాగణరాజ్యము, ఉత్తర కొరియా, దక్షిణ కొరియా, వియెత్నామ్, లావోస్, కాంబోడియా రాజ్య ప్రతినిధులతోపాటుగ, వియెత్‌మిన్ పక్ష ప్రతినిధులును పాల్గొనిరి. కొరియాలో ఏర్పడిన యుద్ధవిరమణనే శాంతిసంధిగ మార్చుటకు జరిగిన కృషి మాత్రము అపుడు ఫలవంతము కాలేదు. కాని, ఇండో - చీనాలో యుద్ధవిరమణను, రాజకీయ పరిష్కారమును సాధించు దృష్టితో ఒడంబడిక సాధింపబడినది [చూ. కాంబోడియా, వియెత్నామ్, లావోస్].

రెండవది : 1962, జూలైలో లావోస్ దేశపు తాటస్థ్యమును మన్నించు ఒడంబడిక. ఇందులకై జరిగిన సమావేశమున పదునాలుగు రాజ్యములు - లావోస్, పోలండ్, దక్షిణ వియెత్నామ్, థాయిలాండ్, యునైటెడ్‌స్టేట్స్, బర్మా, కాంబోడియా, కెనడా, చీనా ప్రజాగణరాజ్యము, ఉత్తర వియెత్నామ్, ఫ్రాన్స్, భారతదేశము, సోవియట్ రష్యా, బ్రిటన్ పాల్గొనినవి. దీనిమూలమున లావోస్ దేశపు స్వాతంత్ర్య, సమైక్య, ప్రాదేశిక సమగ్రతా, సర్వసత్తాకతలను తక్కిన 13 దేశములు మన్నించుటకును, ఆ దేశమునందలి అంతర్యుద్ధమున జరిగిన యుద్ధవిరామమునకు భంగము కలుగకుండ చూచుటకు భారతదేశము, కెనడా, పోలండ్ దేశముల సభ్యత్వముతో ఒక అంతర్జాతీయ నియమన సంఘమును నెలకొల్పుటకును అంగీకరింపబడినది. చీ. శే. రా.

**జెర్‌జెస్ :** చూ. క్షరక్ష.

**జోన్ ఆవ్ ఆర్క్** (1412 - 1431) : మధ్యయుగపు ఫ్రాన్స్‌దేశచరిత్రలో ప్రముఖస్థానమును ఆర్జించిన వీరవనిత ; దేశసేవిక. ఫ్రాన్స్‌లో మ్యూజీనదీ తీరమున ఒక గ్రామములో 1412, జనవరి 6 వ తేదీన జన్మించెను. తలిదండ్రులు వ్యవసాయదారులు ; కేతలిక్ మతస్థులు. వారి యింటి ప్రక్కనే చర్చి ఉండుటవలన ఈమె అక్కడికి

వెళ్ళి దైవభక్తి అలవరచుకొన్నది. తన 13వ ఏటనే ఆమెకు ఒకసారి భగవద్వాణి వినిపించినదట. దాని ఫలితముగ ఆమె యావజ్జీవము కన్యగానే ఉండి, మానవసేవ, దేశసేవ చేయుటకు దీక్ష వహించినది. ఆమెకు కీర్తిశేషు లయిన సెయింట్స్ (మహాఋషులు) కూడా స్వప్నములో కనబడి ప్రబోధించుచుండెడివారట.

బ్రిటిష్‌వారును, బర్గండీవారును కలసి ఫ్రెంచి దుర్గమయిన ఆర్లియన్స్‌నగరమును 1428 లో ముట్టడించిరి. ఈ వార్త దేశమంతట వ్యాపించి, ఫ్రెంచివారిని కలవర పెట్టినది. అంతలో భగద్వాణి 'నీవు వెంటనే పోయి, ఆర్లియన్స్‌నగరమును రక్షించి, చార్లెస్ రాజునకు పట్టాభిషేకము గావింపుము' అని పలికినట్లు జోన్ కన్యకు వినబడినది. ఆ వాణి ఆదేశమును అనుసరించి పని చేయుటకు ప్రయత్నించగా తలిదండ్రులు అనుజ్ఞ ఈయలేదు. కాని, ఆమె రహస్యముగ వెడలి యువరాజుకు తన పూనిక తెలియచేసి, భగవంతుని సాహాయ్యము తనకు ఉన్నదని నచ్చజెప్పుటచేత, అతడు ఆమెను గురించి రాజునకు తెలియజేసెను; రాజు ఆమె కోరికను మన్నించెను. అతని సాయమున జోన్ మగవేషమున తెల్లని దుస్తులు ధరించి 'జీసస్ మేరీ' అనే మకుటముగల ధ్వజము పట్టుకొని, 4,000 సైనికులను వెంటబెట్టుకొని 1429, ఏప్రిల్ 28న శత్రువులు ముట్టడించిన ఆర్లియన్స్‌నగరమును సమీపించినది. ల్వార్ నది దాటి, కోటను ఎగబ్రాకుటకు ఆమెయే నిచ్చెన వేసినది. ఆమె ఎక్కుచుండగా శత్రువుల బాణములు ఆమెపైని, ఆమె సేనలపైని వర్షించినవి. అందులో ఒక బాణము ఆమె చేతికి తగిలి గాయపరచినది. కాని, ఆమె దానిని పాటించలేదు. ఆమె ధైర్యసాహసములను చూచిన ఆమె సేనలోని వారందరును ద్విగుణీకృతమయిన ఉత్సాహముతో పోరాడిరి. మే 7న ఆర్లియన్స్‌నగరము ఆమె వశమయినది. మే 16న చార్లెస్ - VII పట్టాభిషేకము జరిగినది. అతని ప్రక్కన నిలబడు గౌరవము యుద్ధములో విజయముపొందిన జోన్‌కు లభించినది. అంతటితో భగవద్వాణి ఆదేశమును ఆమె పూర్తిగా నెరవేర్చి ధన్యురాలయినదనియే చెప్పవచ్చును. తన పని పూర్తియైనది కనుక తాను తన గ్రామమునకు పోయెదనని ఆమె రాజుకు మనవి చేసినది. కాని, రాజు అందుకు అంగీకరింపక, 'రాజధానినగరమయిన పారిస్ ఇంకను బ్రిటిష్‌వారి అధీనతలో ఉన్నది కనుక, దానిని కూడ శత్రువులనుండి తప్పించి, సంగ్రామశేషమును జేగీయమానముగ నడపించవలసినే' దని కోరెను. అతని కోరికను మన్నించి ఆమె పారిస్‌నగరమును కూడ ముట్టడించినది. కాని, సాధించలేకపోయినది. ఆ యుద్ధమున ఆమె దేహము తీవ్రముగ గాయపడినది. బర్గండీవారు 1430, మే నెల 23న ఆమెను పట్టుకొని బ్రిటిష్‌వారికి సుమారు 15 వేల రూపాయలకు అమ్మివేసిరి. బ్రిటిష్‌వారు ఆమెను చెరసాలలో కొంతకాలముంచి, ఆమెను క్రైస్తవమతేతర స్త్రీ అనియు, అభిచారిణి అనియు నిందించి మరణదండన విధించి, 1431, మే 30 నాడు చితిపైకి ఎక్కించి కాల్చి చంపిరి.

ఆమె నిర్దుష్ట అనియు, పవిత్రత గలది అనియు 1456 లో నిర్ణయింపబడినది. 1909 లో పయస్ - X అను పోప్ ఆమె ఆత్మకు గౌరవార్పణ సంక్రమింపజేసెను. 1920 లో ఆమె సెయింట్‌గ ప్రకటిత అయ్యెను. గి. వెం. సీ.

**జోర్డాన్ :** ఆసియాలోని ఒక స్వతంత్రరాజ్యము.




ఈ దేశమునకు సిరియా [ఉ] ఇరాక్, సౌదీ అరేబియా [తూ]; సౌదీ అరేబియా [ద]; ఇస్రాయెల్ [ప] సరిహద్దులుగ ఉన్నవి. [వి] 96,610 చ. కి. మీ.; [జ] 17,27,439. [భా] జాతీయభాష అరబ్బీ కాని, లోకవ్యవహారమందలి భాషకును, గ్రంథములు, పత్రికలు మొదలగు వానియందు వాడబడు భాషకును విశేష వ్యత్యాసము కలదు. దేశవాసులలో అత్యధిక సంఖ్యాకులు సున్నీశాఖకు చెందిన ముస్లిమ్‌లు. క్రైస్తవులు దాదాపు ఒక లక్షమంది మాత్రము కలరు. [రా] అమ్మన్ (జ. సం. 2,00,000).

చరిత్ర ; పడమటి ఆసియాయందు అత్యంత ప్రాచీన చరిత్రగల విశాలభూమియందు ఈ దేశము ఒక భాగము. క్రీ. పూ. 6000 నుండియు ఈ దేశము జనావాసితమై ఉండి నటుల నిదర్శనములు కలవు. ఈ దేశము ఉత్తరమునుండి దక్షిణమునకు ప్రవహించు జోర్డాన్‌నది ఈ దేశమును

రెండు ఖండములుగ చేయుచున్నది. ఈ రెండు ఖండములు చారిత్రకగతిని అనుసరించి ఆ యా కాలములందు వేర్వేరు సంస్కృతుల ప్రభావమునకు లోనయినటుల కానవచ్చుచున్నది. క్రీ. పూ. 16 వ శతాబ్దములో ఈజిప్టురాజులు ఈ ప్రాంతమును జయించిరి. ఆ తరువాత కొన్ని సెమిటిక్ జాతులు ఈ ప్రాంతమును వశపరచుకొని, రాజ్యములను నెలకొల్పి పాలించిరి. క్రీ. పూ. 12 వ శతాబ్దిప్రాంతమున యూదులు ఈ దేశమున జోర్డాన్‌నది ఉభయపార్శ్వములందును నివాసములు ఏర్పరచుకొనిరి. కాని, తరువాత జోర్డాన్‌నది పశ్చిమతట భూమి మాత్రమే జుడా అనబడు యూదురాజ్యమున అంతర్భాగముగ ఉండగలిగెను. గ్రీక్, రోమన్‌సామ్రాజ్యముల కాలమున ఈ దేశము గ్రీక్, రోమన్ సంస్కృతుల ప్రభావమునకు లోనయ్యెను. క్రీ. శ. 105 నుంచి రోమన్‌సామ్రాజ్యమున ఈ ప్రాంతము ఒక భాగముగ ఉండెను. క్రీ. శ. 633 లో ఈ దేశముపై అరబ్బీసేనలు దండెత్తి, 636 కు దేశమంతటిని ఆక్రమించెను. ఈ దండయాత్ర ఫలితముగ ఈ దేశపు భాషా, మత, సంస్కృతులలో విపరీత పరివర్తన కలిగెను. అంతటనుండి ఇస్లామ్ జాతీయమతము అయ్యెను; ప్రజలకు అరబ్బీ మాతృభాష అయ్యెను. 12 వ శతాబ్దమున మత యుద్ధము (క్రూసేడ్) లు [చూ.] సాగించిన క్రైస్తవులు ఈ దేశమును కొలదికాలము ఆక్రమించినను, ఈ దేశపు మత, భాషా, సంస్కృతులలో మార్పేదియు రాలేదు. తరువాత టర్కీ సమ్రాట్లగు ఓటోమన్ రాజులు ఈ దేశమును తమ సామ్రాజ్యమున ఒక భాగముగ ఒనర్చి పాలించిరి (1517 - 1917). వీరి కాలమున జోర్డాన్‌నదికి తూర్పున ఉన్న భాగము (ట్రాన్స్ జోర్డాన్) ఒక రాష్ట్రముగను, పశ్చిమపు భాగము వేరుగ ఇంకొక రాష్ట్రముగను ఉండెడివి. ప్రథమ ప్రపంచ యుద్ధఫలితముగ టర్కీ సామ్రాజ్యము విచ్ఛిన్నముకాగా, పాలస్తీనాతో ట్రాన్స్ జోర్డాన్ కూడా బ్రిటిష్‌వారి ధర్మకర్తృత్వపాలనకు ఒసగబడెను. 1920 లో ఒక ప్రఖ్యాత అరబ్బీకుటుంబమునకు చెందిన అబ్దుల్లా అనువానిని ట్రాన్స్ జోర్డాన్‌కు అమీర్‌గా బ్రిటిష్‌ప్రభుత్వము గుర్తించెను. 1923 నుండి 1948 వరకు బ్రిటిష్‌ప్రభుత్వమునకు గల ప్రత్యేక బాధ్యతలకు లోబడి ట్రాన్స్ జోర్డాన్ స్వతంత్రరాజ్యముగ వ్యవహరింపగలిగెను. 1946 లో ట్రాన్స్ జోర్డాన్‌కు సంపూర్ణ స్వాతంత్ర్యము లభించెను. అంతట 1948లో దేశము పేరు జోర్డాన్‌గ ప్రకటితమై, అబ్దుల్లా దేశాధిపతిగ ప్రకటింపబడెను. 1948లో పాలస్తీనాయందు ఇస్రాయెల్ [చూ. పు. 317] రాజ్యము నెలకొల్పుటలో బయలుదేరిన యుద్ధము ఫలితముగ, జోర్డాన్ నది పడమటి ఒడ్డున ఉన్న కొంతభూమిని (పాలస్తీనాకు చెందినదానిని) అబ్దుల్లా రాజు ఆక్రమించుకొని తన దేశమున అంతర్భాగముగ చేసెను. 1951, జూలై 20 న అబ్దుల్లా రాజు హత్య చేయబడుటవలన, అతని పెద్ద కుమారుడు తలాల్ రాజయ్యెను. కాని, ఈతడు ఉన్మాది అగుటవలన రాజ్యపాలనకు అనర్హుడుగ భావింపబడుట వలన రాజ్యము ఈతని కుమారుడు హుస్సేన్‌కు లభించెను (1953).

సన్నిహితదేశముల ఒత్తిడికి జోర్డాన్ విపరీతముగ 1953 నుండి లోనయ్యెను. అరబ్ దేశముల సమైక్యము ఒనర్చు సంకల్పముతో ఈజిప్టు, సిరియా ఒక సమాఖ్యగ రూపొందినపుడు వంశానుగత రాజపాలన గల జోర్డాన్, ఇరాక్‌లతో వేరొక అరబ్ సమాఖ్యగ ఏర్పడెను (14, ఫిబ్రవరి 1958). కాని, అనతికాలములోనే ఇరాక్ రాజు ఫైజల్‌ను ఆ దేశమునందలి విప్లవకారులు హత్యచేసి, ప్రభుత్వమును ఆక్రమించుకొనుటవలన (జూలై, 1950), ఈ సమాఖ్యను జోర్డాన్ రాజు రద్దు చేసెను. తరువాత సిరియా కూడ ఈజిప్టునుండి కొన్ని విభేదములవలన వేరైనది. కాని, 1963 లో సిరియా, ఇరాక్‌లలో నూతన విప్లవప్రభుత్వములు ఏర్పడి ఈజిప్టు, సిరియా, ఇరాక్‌లు ఒక సంయుక్త అరబ్ సమాఖ్యగ రూపొంద నిర్ణయించుకొనినప్పటినుండి (ఏప్రిల్, 1963) జోర్డాన్‌లో తిరుగుబాటులు చెలరేగి, రాజరికము ఎడల వ్యతిరేకత అతిశయించినది.

రాజ్యాంగము: 1952 రాజ్యాంగ చట్టమును అనుసరించి వంశానుగతమగు రాచరికపు పాలన జోర్డాన్‌నందు అమలులో ఉన్నది. శాసననిర్మాణము, కార్యనిర్వహణ, న్యాయ నిర్వహణలను మూడు ప్రభుత్వాంగములందును రాజునకు విస్తృతాధికారములు కలవు. ఈ అధికారములకు లోబడి శాసనసభ శాసన నిర్మాణ విధిని నిర్వహించును. శాసనసభయందు ప్రతినిధిసభ, శిష్టసభ అని వ్యవహరింపదగు రెండు కక్ష్యలు కలవు. తొలుతటి దానియందు 40 మంది ఎన్నుకొనబడిన సభ్యులు కలరు. దేశమున పురుషులకు మాత్రమే వోటింగ్ హక్కు కలదు. శిష్టసభలో 20 మంది సభ్యులు ఉందురు. వీరినందరిని రాజు నియమించును. శిష్టసభ సభ్యుని పదవీకాల పరిమితి ఎనిమిది సంవత్సరములు. ప్రధాన మంత్రిని, తక్కిన మంత్రులను రాజు నియమించును. వీరు ప్రతినిధిసభకు బాధ్యత వహించి రాజు అధికారమునకు లోబడి పరిపాలించుదురు. చీ. శే. రా.

జోసెఫ్ - II: చూ. ఆస్ట్రియా - పు. 305.

ఝాన్సీ లక్ష్మీబాయ్ (1835 - 1858): భారత ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామములో పాల్గొని, అపూర్వ

శౌర్యసాహసములు ప్రదర్శించిన వీరవనిత; ఝాన్సీరాణి. లక్ష్మీబాయ్ కాశీలో మోరోపంత్ అను బ్రాహ్మణునకు జన్మించెను. చిన్నతనమునందే యుద్ధవిద్యలను అలవరించుకొను అవకాశము ఆమెకు కలిగెను. బ్రిటిష్‌వారి సంరక్షణక్రింద ఝాన్సీపాలకుడుగ ఉండిన గంగాధరరావుతో ఆమెకు ఏడవఏట వివాహము జరిగెను. గంగాధరరావు 1853 లో మరణించెను; ఆ దంపతులకు కలిగిన ఒకే ఒక కుమారుడు అంతకుముందే చనిపోయెను. ఔరసులులేని స్వదేశపరిపాలకులకు దత్తత హక్కును నిరాకరించి, వారి అనంతరమున వారి సంస్థానములను బ్రిటిష్ సామ్రాజ్యములో విలీనము చేసికొనుటకై డల్‌హౌసీ [చూ.] చే రూపొందింపబడిన ఉపసంక్రమణ సిద్ధాంతము (డాక్ట్రిన్ ఆవ్ లాప్స్) ను అనుసరించి, నిస్సహాయురాలైన లక్ష్మీబాయ్‌నుండి బ్రిటిష్ ప్రభుత్వము ఝాన్సీకోటను, రాజ్యమును వశపరచుకొనెను. ప్రతీకారచర్యకై నిరీక్షించుచు, ఆమె 1857 లో భారతదేశమునుండి బ్రిటిష్‌వారిని తరిమివేయుటకు నానాసాహేబ్ [చూ.], తాంతియాతోపి [చూ.] మున్నగు వారు లేవదీసిన విప్లవములోచేరి ప్రముఖపాత్ర నిర్వహించెను. విప్లవ సేనలసహాయముతో ఆమె ఝాన్సీకోటను స్వాధీనము చేసికొని పరిపాలింపసాగెను. తాను పాలించిన కొద్దికాలముననే ఆమె తన పరిపాలనా పాటవమును నిరూపించుకొనగలిగెను. కాని, బ్రిటిష్‌వారు విప్లవమును అణచివేయగలిగిరి. బ్రిటిష్ సేనానాయకులు ఝాన్సీకోటపై వచ్చిపడిరి. లక్ష్మీబాయ్ తన సైన్యముతో 13 దినములు హోరాహోరి పోరాడెను. కాని, సంఖ్యాబలమునందు, సాధనసంపత్తియందు అత్యంతాధిక్యముకల శత్రుసేనల ముందు ఆమె సేన నిలువజాలక విచ్చిపోయెను. లక్ష్మీబాయ్ తన అభినివేశమును సడలింపక శత్రుసేనల కన్నుగప్పి, తప్పించుకొని పోయి, గ్వాలియర్ చేరి, మరికొందరు విప్లవ వీరుల గలసి మరల బ్రిటిష్ సేనలను తీవ్రముగా ఎదిర్చెను. కాని, అక్కడ కూడ ఆమెకు దైవము ప్రతికూలమయ్యెను; శత్రువులదే పైచేయి అయ్యెను. అవకాశాంతరమునకై శత్రుశ్రేణి మధ్యనుండి తప్పించుకొని పోవుచున్న ఆమెకు ఒక ప్రవాహము అడ్డుతగిలెను. దానిని తరించుటకు ఉపాయమును అన్వేషించుచుండగా శత్రువులు వచ్చి ఆమెను చుట్టు ముట్టిరి. లక్ష్మీబాయ్ చలింపక శత్రువులతో పోరాడి, వీరస్వర్గమును అలంకరించెను (జూన్ 17, 1858). విశ్వాసపాత్రులైన ఆమె అనుచరులు వెంటనే ఆమె మృతదేహమును శత్రువులకు చిక్కనీయకుండ కొనిపోయి, రహస్యముగ అంత్యక్రియలు కావించిరి. ఆమెతో పోరాడిన ఆంగ్ల సేనానాయకులు కూడ ఆమె విప్లవ వీరులలో అగ్రశ్రేణికి చెందిన పరాక్రమవతి అని శ్లాఘించిరి.

ఆ. వెం.

**టర్క్స్ & కైకోస్ దీవులు :** బ్రిటిష్ వారి అధీనమున ఉన్న వెస్ట్ ఇండీస్ [చూ.] దీవులలోని రెండు ద్వీపములు కలసిన ఒక రాజ్యము.

ఈ రాజ్యము బహామాదీవులకు సన్నిహితముగ ఉన్నను రాజకీయముగ జమైకాపై ఆధారపడి ఉన్నది. [వి] 430 చ. కి. మీ.; [జ] 6,122. [రా] గ్రాండ్ టర్క్ (జ. సం. 1,800) [చూ: వెస్ట్ ఇండీస్].

మ. అ. శ.

**టర్కీ :** ఆసియా యందలి ఒక స్వతంత్ర రాజ్యము.




ఆసియా మైనర్ ద్వీపకల్పమును, థ్రేస్‌నందలి కొంత భూమియు, తీర సమీపమున ఈజియన్ సముద్రమున నెలకొని ఉన్న కొన్ని అల్పద్వీపములును చేరి టర్కీ రాజ్యముగ లెక్కింపబడుచున్నవి. నల్లసముద్రము, ఈజియన్‌సముద్రము, మధ్యధరాసముద్రమును ఆనుకొని ఈ దేశమునకు తీరభూమి కలదు. ఇక భూతల సరిహద్దును ఆనుకొని నల్ల సముద్రము [ఉ]; ఇరాన్, సోవియట్ రష్యా [తూ]; ఇరాక్, సిరియా [ద]; బల్గేరియా, గ్రీస్ [ప] సరిహద్దులుగ కలవు. [వి] 7,80,576 చ. కి. మీ.; [జ] 3,02,55,981; [భా] దేశభాష తుర్కీ. పూర్వము అరబ్బీ లిపిలో వ్రాయబడుచుండిన ఈ భాష 1928 నుండి రోమన్ లిపిలో వ్రాయబడుచున్నది. [మ] దాదాపుగ ప్రజలందరును ముస్లిమ్‌లు. [రా] అంకారా (జ. సం. 6,46,151).

చరిత్ర : ఈ దేశమందలి ఆదిమవాసులు ఆల్‌టాయ్, యూరల్ పర్వతములనుండి వలస వచ్చిన తురేనియన్ జాతివారని చెప్పుదురు. క్రీస్తుపుట్టుటకు 1900 ఏండ్లకు పూర్వమే అనటోలియాయందు తురేనియన్‌లు అధికారమునకు వచ్చిరి. వీరి అధికారము సుమారు క్రీ. పూ. 1800 నుంచి క్రీ. పూ. 1200 వరకు జరిగెను. వీరి అధికారము అడుగంటుటకు కారణము ఈజియన్‌ల వలసలే. ఈ ఈజియన్‌లతో వచ్చిన వారే ఫ్రిజియన్‌లు అనువారు. ఈ ఫ్రిజియన్‌ల అధికారము సుమారు క్రీ. పూ. 1000 నుండి క్రీ. పూ. 700 వరకు సాగినది. వీరి అనంతరము లిడియన్‌లు

క్రీ. పూ. 547 వరకు ప్రభుత్వమును నెరపిరి. లిడియన్‌ల ప్రభుత్వానంతరము టర్కీ ప్రాంతము పారసీక ప్రభువుల పరిపాలనయందు క్రీ. పూ. 333 వరకు ఉండినది. ఆ తరువాత అలెగ్జాండర్ [చూ. పు. 303] దండయాత్రలతో గ్రీక్‌ల అధికారము ఆరంభమై, సుమారు క్రీ. శ. 600 వరకు జరిగెను. అప్పటినుండి మహమ్మదీయుల దండయాత్రలకు ఎరయై ఈ ప్రాంతము తుదకు 1071 లో సెల్జుక్ జాతికి చెందిన తురుష్కుల వశమయ్యెను. బైజాంటైన్ చక్రవర్తియగు డయొజనిస్ రోమనస్ అను వానిని సెల్జుక్ తుర్కుల సేనాని అగు అల్ప్అర్స్లాన్ అనువాడు మంజికర్ట్ అను చోట ఓడించి, ఈ ప్రాంతమందలి గ్రీక్‌ల అధికారమును నాశనము చేసెను. 1243 లో మంగోల్ సేనాధిపతియగు చెంఘిజ్ ఖాన్ [చూ. పు. 459] కోసెడాంగ్ వద్ద సెల్జుక్ తుర్కులను ఓడించి, మంగోల్‌ల అధికారమును స్థాపించునంత వరకు అనటోలియాయందు సెల్జుక్ తుర్కుల అధికారము సాగుచుండెను. తుదకు టర్కీ దేశమునకు సార్థకనామము గలిగించిన ఓటోమన్ తుర్కులు సుమారు 1290 లో ఈ టర్కీ ప్రాంతమును ఆక్రమింప పూనుకొనిరి.

**ఓటోమన్ తుర్కులు :** ఓటోమన్ తుర్కుల వంశమునకు మూలపురుషుడు మొదటి ఉస్మాన్ (ఓత్మన్) (1259 - 1326). ఇతని పేరును బట్టియే ఈతని వంశమువారికి 'ఓత్మన్' లేక 'ఓటోమన్' వంశపు తుర్కులు అని పేరు కలిగెను. వీరు మొదట సెల్జుక్ జాతి సుల్తాన్ వద్ద చేసిన సైనికోద్యోగమునకు ప్రతిఫలముగా ఆసియా మైనర్ వాయవ్య భాగమునకు అధికారులుగా చేయబడిరి. త్వరలోనే ఆ ప్రాంతమును అంతటిని తమ అధికారము క్రిందికి తెచ్చుకొని, బైజాంటైన్ సామ్రాజ్య భాగములను క్రమముగా ఆక్రమించుచు, 1326 లో బ్రూసా పట్టణమును ఆక్రమించిరి. ఓత్మన్ కుమారుడైన అర్ఖాన్ - I 1326 నుండి 1359 వరకు రాజ్యము ఏలెను. ఇతని కాలములో 1329 లో మాల్టెపే అనుచోట బైజాంటైన్‌ల సేనను ఓడించి, 1331 లో నికేయా పట్టణమును, 1338 లో నికొమేడియా పట్టణమును ఓటోమన్‌లు పట్టుకొనిరి.

వీరు యూరప్ ఖండమందు చొచ్చుటకు 1345 లో అవకాశము ఏర్పడెను. నాటి బైజాంటైన్ చక్రవర్తి యగు జాన్ కాంటాకుజేనీచే - తనతో సింహాసనమునకుగాను పోటీకి వచ్చిన అన్నా అను చక్రవర్తినిని ఎదిరించుటకు వలయు సహాయార్థము - ఆహ్వానింపబడి, ఓటోమన్ తుర్కులు 1345 లో యూరప్ ఖండములో కాలిడిరి. దీని ఫలితముగా కాంటాకుజేనీ కుమార్తెయగు థియొడొరాను ఓటోమన్ చక్రవర్తియగు అర్ఖాన్ - I పెండ్లాడెను. 1349 లో తిరిగి సెర్బియానుండి దండెత్తివచ్చిన స్టీఫెన్ దూషణ్ అనువానిని తరిమివేయ తన మామకు సహాయార్థము అర్ఖాన్ తన సేనలను పంపెను. 1353 - 54 లో మూడవసారి సహాయార్థము ఆహ్వానింపబడి, అర్ఖాన్ సైనికులు గల్లిపొలీ అను యూరప్‌స్థావరమున ప్రప్రథమముగా నెలకొనిరి. 1359 లో అర్ఖాన్ - I మరణించునాటికి ఓటోమన్ ప్రభువుల రాజ్యము విస్తరించి, వారి నాణెములు చలామణీలోనికి వచ్చి ఉండెను. ఓటోమన్ ప్రభువుల ఉత్తరువులను బైజాంటైన్ చక్రవర్తులే అనుసరించు పరిస్థితి ఏర్పడెను.

అర్ఖాన్ - I అనంతరము ఓటోమన్ రాజ్యమునకు వచ్చిన మురాద్ - I (1359 - 1389) కాలమందు 1365 లో ఏడ్రియనోపుల్ అను నగరమును ఓటోమన్‌లు ఆక్రమించిరి. దానిని 1366 లో తమ రాజధానీ నగరముగ చేసికొనిరి. 1369 - 1372 లో యుద్ధములందు బల్గేరియా ఓడి, తుర్కులకు కప్పము కట్టుటకు బల్గేరియా రాజు షిష్మన్ అంగీకరించెను. తుర్కులు 1371 లో సెర్బియా, మేసిడోనియా ప్రాంతములను జయించి, ఆల్బేనియా, గ్రీస్ మీద దండయాత్రలు జరిపిరి. 1385 లో సోఫియా పట్టణమును పట్టుకొనిరి. 1386 లో సెర్బియా రాజగు లాజర్ తుర్కులకు కప్పము కట్టుటకు ఒప్పుకొనెను. 1387 లో జెనోవా, 1388 లో వెనిస్ నగరములు తుర్కులతో సంధిగావించుకొనెను. 1389, జూన్ 20 వ తేదీన కొసోవో యుద్ధమున మురాద్ - I ఒక సెర్బియా జాతివానిచే చంపబడెను. పిమ్మట అతని కుమారుడు సెర్బియా, బల్గేరియా దేశములను జయించెను.

మురాద్ - I అనంతరము బాయజిద్ - I (1389 - 1402 ప.) రాజ్యమునకు వచ్చెను. ఇతడు అనటోలియా పైకి తన దృష్టి మరల్చి, 1391 లో అచటి సామంత పాలకులను తరిమివేసి, వారి భూములను తన సామ్రాజ్యములో కలిపివేసెను. 1391 నుండి 1398 వరకు కాన్‌స్టాంటినోపుల్ నగరమును పట్టుకొనుటకు తీవ్ర ప్రయత్నములు జరిపి, తుర్కులు 1397 లో గ్రీస్‌పై దండెత్తి పోయిరి. ఇట్లు కలుగుచుండిన విజయ పరంపర మధ్య 1400 లో ఓటోమన్ తుర్కుల ఆదిమ రాజ్యమగు అనటోలియా మీదికి మంగోల్ నాయకుడగు తైమూర్ [చూ.] దండెత్తివచ్చెను. 1402, జూలై 20 న అంగోరా యుద్ధమందు తుర్కుల రాజగు బాయజిద్ - I పూర్తిగా ఓడిపోయెను. ఓటోమన్ సామ్రాజ్యమే అంతరించునట్లు కన్పట్టెను. సింహాసనము కొరకు బాయజిద్ కుమారులలో అంతఃకలహము అవతరించెను (1403 - 1413). తుదకు మహమ్మద్ - I అనువాడు 1413 లో తిరిగి ఓటోమన్ సామ్రాజ్యమునకు అంతటికి చక్రవర్తి అయ్యెను. ఈతని సామ్రాజ్య పాలనా

(1413 - 1421) కాలమందు వెనిస్‌తోటి ప్రథమ యుద్ధము జరిగెను (1416).

ఇతని అనంతరము ఓటోమన్ చక్రవర్తి అయిన మురాద్ - II (1421 - 57) కాలమందు వెనిషియన్లకు, తుర్కులకు 1425 నుండి 1430 వరకు గొప్ప సంగ్రామము జరిగెను. ఇందు చివరకు తుర్కులకు విజయము కలిగినది. ఆల్ బేనియా, ఎపైరస్ కూడ తుర్కులచే జయింపబడెను. 1442 లో తుర్కులు హంగేరిమీదకు దండెత్తిపోయిరి. కాని, జాన్ హన్యాడీ అను వానిచే ఓడింపబడిరి. 1448, అక్టోబరు 17 వ తేదీని ఈ జాన్ హన్యాడీ సెర్బియా మీద దండెత్తి పోయినపుడు ద్వితీయ కొసోవో యుద్ధమున మురాద్ - II చే పూర్తిగా ఓడింపబడెను.

మురాద్ - II కు పిమ్మట అతని కుమారుడు మహమ్మద్ - II రాజ్యమునకు వచ్చినది మొదలుకొని తుర్కుల పరిపాలన మీద జరుగు కుట్రలకు కేంద్రస్థానముగా ఉండిన కాన్‌స్టాంటినోపుల్‌ను పట్టుకొనుటకు కావలసిన ప్రయత్నములు అన్నియు జరిగినవి. 1453, ఫిబ్రవరి నుండి మే వరకు ముట్టడించి, తుర్కులు కాన్‌స్టాంటినోపుల్‌ను 1453, మే 29 వ తారీకున ఆక్రమించిరి. అప్పటినుండి ఓటోమన్ సామ్రాజ్యమునకు కాన్‌స్టాంటినోపుల్ [చూ.] రాజధాని అయ్యెను. 1456లో ఈ మహమ్మదే బెల్‌గ్రేడ్‌ను ముట్టడించి, జాన్ హన్యాడీని ఓడించెను; 1456 నుండి 58 వరకు సెర్బియాను, 1459 నుండి 1461 వరకు బోస్నియా, హెర్ట్స్‌గోవీనాలను లోబరచుకొనెను. 1467 లో ఆల్‌బేనియాను జయించెను. 1463 నుండి 1479 వరకు వెనిస్‌తో పోరాడి, వెనిస్‌వారిని వారి నగరము వరకు తరిమి, తుర్కులు వెనిషియన్లను సంధి చేసికొనవలెనని 1479 లో నిర్బంధించిరి. ఈ సంధి ప్రకారము నల్ల సముద్రములో వ్యాపారము చేసికొనుటకు గాను వెనిస్‌వారు తుర్కులకు 10,000 డకట్‌ల డబ్బు సంవత్సరమునకు ఒక పర్యాయము కప్పముగ కట్టునట్లు ఒప్పుకొనిరి. 1480 - 81 లో తూర్పు మధ్యధరా ప్రాంతమున గల క్రైస్తవ దుర్గమగు రోడ్స్ నగరమును తుర్కులు ముట్టడించిరి. ముట్టడి పూర్తికాక ముందే మహమ్మద్ - II మరణించెను.

మహమ్మద్ - II అనంతరము బాయజిద్ - II (1481 - 1512 వ.) ఓటోమన్ రాజయ్యెను. కాని, సింహాసనమునకు గాను అతని తమ్ముడు జెమ్ అనువాడు బాయజిద్ - II తో పోటీ జేసెను. కాని, జెమ్ ఓడి పారిపోయెను. ఈతని కాలమందు 1499 నుండి 1503 వరకు తుర్కులకు వెనిషియన్లతో యుద్ధము జరిగెను. వెనిషియన్లు మొడొన్ యుద్ధమున పరాజితులై వెనిస్ సంధికి ఒడంబడిరి. ఈ సంధి వలన లిపాంటో మున్నగు స్థావరములు తుర్కులకు లభించెను. ఇతని అనంతరము ఇతని కుమారుడు సెలిమ్ - I తన తమ్ములను ఓడించి రాజ్యమునకు వచ్చెను. 1514 లో పరిష్యాతో యుద్ధమునకు పోయి, 1514, ఆగస్టు 23 వ తేదీని పరిషియన్లను చార్డిరాన్ వద్ద పూర్తిగా ఓడించెను. 1515 లో తూర్పు అనటోలియా, కుర్డిస్తాన్ తుర్కులచే జయింపబడెను. సెలిమ్ - I 1516 లో అలెప్పో మీద దండెత్తి వచ్చిన ఈజిప్టు సుల్తానును 1516, ఆగస్టు 24 వ తేదీని మార్జ్ డాబిక్ యుద్ధమున ఓడించి చంపెను. 1517, జనవరి 22 వ తేదీని తుర్కులు కైరోను పట్టుకొనిరి. అరేబియా లోని మక్కావంటి పవిత్ర స్థలములను స్వాధీనము కావించుకొని, సెలిమ్ - I ఈజిప్టును పాలించుటకు ఒక తుర్కును గవర్నర్ - జనరల్‌గా నియమించెను.

సెలిమ్ - I నకు వెనుక సులేమాన్ - I (1520 - 66 వ.) అధికారమునకు వచ్చెను. ఈతని కాలములో ఈతని వజీరులే అధికారము నెరపిరి. అందులో ఇబ్రహీమ్ పాషా ముఖ్యుడు. ఈతని కాలమున (1521 - 1531) బెల్‌గ్రేడ్‌ను పట్టుకొని హంగేరీ, ఆస్ట్రియా దేశముల మీదకి తుర్కులు పలుమార్లు దండయాత్రలు చేయగలిగిరి. 1522 లో రోడ్స్ కూడ తుర్కులకు స్వాధీనమయ్యెను. 1526, ఆగస్టు 28, 29 లో జరిగిన మొహాక్స్ యుద్ధము నందు హంగేరీ రాజగు లూయీ ఓడిపోయి చనిపోయెను. 1528 లో హంగేరీ సింహాసనమునకు పోటీలు పడుచుండిన ఫెర్డినాండ్, జపొల్యా విషయములందు జోక్యము కలుగ జేసికొని హంగేరీమీద దండెత్తి, సులేమాన్ 1529 లో వియెన్నాను ముట్టడించెను. కాని, వెనుకకు మరలెను (1529, అక్టోబరు 16). తుదకు 1533 లో సంధి జరిగి ఫెర్డినాండ్, జపొల్యాలు సులేమాన్‌కు సామంతులైరి. 1534 లో పరిష్యా మీద యుద్ధముచేసి తుర్కులు బాగ్దాద్, మెసపొటేమియాలను జయించిరి. 1537 నుండి 1540 వరకు వెనిషియన్లు జర్మను చక్రవర్తి చార్లెస్ - V తోడను, పోప్‌తోడను కలసి తుర్కులతో యుద్ధము చేసిరి. కాని, తుదకు 1540 లో పరాజితులై తుర్కులతో సంధి కావించుకొనిరి. అంతకు ముందే 1538 లో ఎర్రసముద్రపు తూర్పు తీరమునంతయు తుర్కులు ఆక్రమించిరి. 1565 లో మాల్టా ద్వీపమును తుర్కులకు స్వాధీనమయ్యెను. 5166 లో సులేమాన్ చనిపోగా సెలిమ్ - II (1566 - 74) రాజ్యమునకు వచ్చెను. ఈతని కాలమున యూరప్ రాజ్యములతో జరిగిన యుద్ధమున 1571, అక్టోబరు 7 వ తేదీని లిపాంటోవద్ద తుర్కుల నౌకాసేన పూర్తిగ ఓడింపబడెను. మురాద్ - III కాలమందు (1574 - 95) తుర్కులు

కాకసస్ పర్వతములవరకు రాజ్యమును జయించిరి. తదనంతరము 1645 నుండి 1664 వరకు వెనిస్‌తో పందొమ్మిది పండ్లు తుర్కులకు యుద్ధము జరిగెను. 1672 నుండి 1676 వరకు ఉక్రెయిన్ కొరకు పోలండ్‌తో యుద్ధము చేసి, ఉక్రెయిన్‌ను జయించి, తురుష్కులు రష్యా సరిహద్దు వరకు సాగిరి. అయినను 1677 - 81 వరకు రష్యన్లతో జరిగిన యుద్ధమందు తురుష్కులు ఉక్రెయిన్‌ను చాలవరకు కోల్పోయిరి. 1682 నుండి 1699 వరకు ఆస్ట్రియాతో జరిగిన యుద్ధమున తురుష్కులు ఓడిపోయి కార్లోవిట్స్ సంధితో చాల రాజ్యము ఆస్ట్రియాకు ఇచ్చివేసిరి. 1714 నుండి 1718 వరకు వెనిస్‌తోడను, 1725 నుండి 1727 వరకు పరిష్యా రాజగు నాదిర్ షా తోడను, 1736 నుండి 1739 వరకు ఆస్ట్రియాతోను, రష్యాతోను తురుష్కులు యుద్ధము చేయవలసివచ్చెను. 1739, సెప్టెంబరు 18 వ తేదీని జరిగిన బెల్‌గ్రేడ్ సంధి తురుష్కులకే లాభకారియైనది. కాని, 1768 నుండి 1774 వరకును, తిరిగి 1787 నుండి 1792 వరకును రష్యా రాణి యగు కేతరిన్‌తో జరిగిన యుద్ధములందు తురుష్కులు చాల నష్టపడిరి.

సెలిమ్ - III అను సుల్తాన్ కొన్ని నూతన సైనిక వ్యాపార సంస్కరణలను 1793 లో కావించెను. కాని, వీటిని 'జెనజెరీలు' అను సైనికవర్గము వారును, మతాధికారులును ద్వేషించిరి. అందువలన అవి నిష్ఫలమాయెను. 1804 నుండి 1806 వరకు సెర్బులు స్వాతంత్ర్యమునకై తిరుగుబాటు చేసిరి. 1806 నుండి 1812 వరకు రష్యాతో తురుష్కులకు యుద్ధము జరిగెను. రష్యా తప్ప తక్కిన యూరప్ దేశములు టర్కీని పూర్తిగా పడగొట్టి రష్యా పైకివచ్చుటకు ఇష్టపడక, రష్యాకు విరుద్ధముగా టర్కీకి మద్దతు ఇచ్చుచుండిరి. 1821 లో గ్రీస్ స్వాతంత్ర్యము ప్రకటించెను. 1830 లో ఆల్జీరియాను, 1881 లో టూనీషియాను ఫ్రాన్స్ తీసికొనెను. 1878 లో సైప్రెస్‌ను, 1882 లో ఈజిప్టును బ్రిటన్ స్వాధీనము చేసికొనెను. 1911 లో ట్రిపొలీటేనియాను ఇటలీ ఆక్రమించెను. కాని, 1854 నుండి 1856 వరకు జరిగిన క్రిమియా యుద్ధములో టర్కీ పరాజితమై పూర్తిగా నశింపనున్న సమయమున ఇతర యూరప్ దేశములవారు టర్కీకి అండగా నిలిచి, బెర్లిన్ కాంగ్రెస్ [చూ.] జరిపి టర్కీని కాపాడిరి. కాని, టర్కీ క్రమముగా రాజ్యము తరువాత రాజ్యమును పోగొట్టుకొనుచుండెను. ద్వితీయ బాల్కన్ యుద్ధము [చూ.] అంతమగు కాలము నాటికి (1912 - 13) యూరప్‌లో థ్రేస్ నందలి తూర్పు ప్రాంతము మాత్రమే టర్కీకి మిగిలినది.

ఇంతలో 1908 లో 'టర్కీ యువకులు' అను ఒక రాజకీయ పక్షము టర్కీలో తలయెత్తి, సుల్తాన్‌పై ఒత్తిడి కావించి క్రమముగా అతని మనస్సు జర్మనీ వైపునకు త్రిప్పి, ప్రథమ ప్రపంచ యుద్ధము (1914 - 1918) న జర్మనీవైపు టర్కీ చేరునట్లు చేసిరి. యుద్ధకాలమందును, ఆ తరువాతను టర్కీ సామ్రాజ్యము క్రమముగా ఛిన్నాభిన్నమయినది. యుద్ధవిరమణ సంధి షరతులు చాల కఠినముగ ఉండెను. కాన్‌స్టాంటినోపుల్‌ను మిత్రమండలివారు ఆక్రమించిరి. స్మిర్నా (ఇజ్‌మిర్) గ్రీకుల స్వాధీనమయ్యెను. ఇట్టి పరిస్థితులు తమకు దుస్సహమగుటచే దేశభక్తి పూరితులైన తురుష్కులు ముస్తాఫా కెమాల్ [చూ.] నాయకత్వమున 1919 లో దేశీయ మహాసభను ఏర్పాటు కావించిరి. 1920 లో కాన్‌స్టాంటినోపుల్ నగరమున సమావేశమైన పార్లమెంట్ నందు అనటోలియా, తూర్పు థ్రేస్, మొసూల్ ప్రాంతములు టర్కీ వశములో ఉండవలెనని తీర్మానము జరిగెను. కాని, సుల్తాన్ ప్రతినిధులు సెవ్ర్ సంధికి సమ్మతించి సంతకము కావించిరి. ఈ సంధి షరతుల ప్రకారము టర్కీ సామ్రాజ్యములోని దేశములు అన్నియు మిత్రమండలి వారికి పంపకము కావలసి ఉండెను. ఈ సంధి షరతులు కొనసాగించుటకు బ్రిటిష్ సేనలు దేశీయ మహాసభ నాయకులను అనేకమందిని అరెస్ట్ చేసినవి. కాని, ఇంకను చాల మంది అంకారాకు వెళ్లిపోయి ముస్తాఫాకెమాల్ నాయకత్వమున నూతన ప్రభుత్వమును ఏర్పాటు కావించిరి. ఈ ప్రభుత్వము సోవియట్ రష్యా ప్రభుత్వముచే అంగీకార ముద్ర వడసినది. ఇట్టి అన్యాయపు సెవ్ర్ సంధి షరతులకు అసమ్మతిగా ఇండియాలో ఖిలాఫత్ ఉద్యమము [చూ.] ఉద్భవించెను. 1922 లో ముస్తాఫా కెమాల్ సేనలు గ్రీకులను ఓడించెను. నూతనముగ చేసికొనిన లోజన్ సంధి ప్రకారము మొసూల్ ప్రాంతము ఒకటి తప్ప మిగిలిన దేశీయ మహాసభ కోరిన ప్రాంతములు అన్నియు టర్కీకే తిరిగి ఇచ్చుట జరిగినది.

ప్రజాసత్తాక రాజ్యము: లోజన్ సంధి అనంతరము సుల్తాన్ పదభ్రష్టుడైనాడు. 1923 లో కలీఫా [చూ. పు. 374] పదవికూడ రద్దు చేయబడెను. టర్కీ సంపూర్ణ స్వతంత్ర ప్రజా సత్తాక రాజ్యమయ్యెను. టర్కీలోని ప్రాతకాలపు పద్ధతులన్నియు రద్దు చేయబడెను. నూతన పద్ధతులు అవలంబింపబడెను. యూరప్ వాసుల పద్ధతులను అనుసరించి దేశాభ్యుదయకరములగు సంస్కరణలు ఎన్నియో చేయబడెను. 1938 లో ముస్తాఫా కెమాల్ ఓటో తుర్కు చనిపోయినపుడు ఇస్మెత్ ఇనోనూ అనువాడు ప్రజా ప్రభుత్వమునకు నూతన అధ్యక్షుడు అయ్యెను. ద్వితీయ

ప్రపంచ యుద్ధకాలమున టర్కీ తటస్థముగా ఉండెను; కాని, 1944 లో మిత్రమండలి వారిది పై చేయి అగునట్లు కనుపించినతోడనే జర్మనీతో గల సంబంధమును త్రెంచివేసికొనెను. 1945, జనవరిలో మిత్రమండలి వారి నౌకలకు డార్డెనల్స్ ద్వారా రాకపోకలు సాగించుకొనుటకు అనుమతి ఇచ్చెను. 1945, ఫిబ్రవరి 23 వ తేదిని టర్కీ అక్షరాజ్యములపై యుద్ధము ప్రకటించి, ఐక్యరాజ్యములందు ఒకటిగా పరిగణింపబడెను.

ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున 1946 లో మధ్యధరాసముద్రమున తమకు మార్గమును ఒసగవలసినదిగ టర్కీ ప్రభుత్వమును సోవియట్ రష్యా కోరెను. కాని, టర్కీ అందులకు నిరాకరించుటచే, సోవియట్ రష్యా టర్కీతో తనకు గల మైత్రి ఒడంబడికను విడనాడెను. ఇట్టి సమయమున 1947 లో యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వము టర్కీ దేశమును సమర్థించి భారీ ఎత్తున ఆర్థిక, సైనిక సహాయము ఆ దేశమునకు ఒసగెను. ఇట్టి విదేశ నీతిని అనుసరించియే టర్కీ నాటో [చూ.] యందును, సెంటో [చూ.] యందును సభ్యత్వమును పొందెను. 1948 నుండి దేశమున ఆర్థికాభ్యున్నతిని సాధించుటకు విపుల యత్నములు జరిగినవి.

టర్కీ చరిత్రగతి 1950 నుండియు రాజకీయ పక్షముల వైరుధ్యములకు గురియైనది. 1950, మే 14 న జరిగిన ఎన్నికలలో నూతన రాజకీయ పక్షమగు డెమోక్రాటిక్ పార్టీకి అఖండ విజయము చేకూరెను. ఆ పక్షపు వారిలో నాయకుడగు సెలాల్ బేయర్ అధ్యక్షుడు అయ్యెను. మెండెరిస్ అనునతడు ప్రధాని అయ్యెను. పరిశ్రమలను ప్రభుత్వాధీనమున ఉంచక, వ్యక్తుల యాజమాన్యమున ఉంచుట ఈ పక్షపు ముఖ్యోద్దేశము. 1957 లోని ఎన్నికలందు ఈ పక్షమునకే శాసన సభయందును ఎక్కువ స్థానము లభించెను. కాని, దాదాపుగ ఈ పక్షమునకు వచ్చినన్ని వోటులే దేశపు మొత్తముమీద తక్కువ స్థానముల ఆర్జించిన ప్రతిస్పర్థి పక్షమగు రిపబ్లికన్ పీపుల్స్ పార్టీకి సైతము వచ్చెను. ఈ విధముగ దేశము ప్రభుత్వ పక్షము, వ్యతిరేక పక్షము అను రెండు సమాన పక్షములుగ చీలెను. ఈ పరిస్థితి నుండి వెలివడు మార్గము పదియులేక డెమోక్రాటిక్ పక్ష ప్రభుత్వము కొన్ని నిరంకుశపు పోకడలను అవలంబింపగ విద్యార్థులు మొదలగు వివిధ వర్గములు తిరుగుబాటులు సలిపినవి. వీటి అన్నింటి ఫలితముగ కడకు సైన్యము ప్రభుత్వమున జోక్యము కల్పించుకొని, 1960, మే 25 అర్ధరాత్రి సమయమున ప్రభుత్వమును వశపరచుకొని, అధ్యక్షుడగు బేయర్‌ను, ప్రధాని మెండెరిస్‌ను తక్కిన డెమోక్రాటిక్ ప్రభుత్వ నేతలను నిర్బంధమునందు ఉంచినది. సేనాపతియగు జెమాల్ గుర్సెల్ ప్రభుత్వాధ్యక్షుడు అయ్యెను. అతని ఆధిపత్యమున ఒక సైనిక సంఘము అటనుండి దేశ పరిపాలనను నిర్వహింప మొదలిడెను. ఈ ప్రభుత్వము సైతము వైదేశిక నీతియందు దాదాపుగ పూర్వ ప్రభుత్వపు మార్గమునే అవలంబించినది. పూర్వపు డెమోక్రాటిక్ పక్షనాయకులపై ఈ ప్రభుత్వము దేశద్రోహ నేరమును మోపి విచారణ జరిపించినది. తత్ఫలితముగ ఈయబడిన తీర్పును అనుసరించి పూర్వపు ప్రధాని మెండెరిస్, మాజీ విదేశ వ్యవహారమంత్రి ఫతిన్ జోర్లూ, ఆర్థికమంత్రి హసన్ పోలాట్కన్ అను వారులు మరణ శిక్షకు గురియైరి. తక్కిన 12 మందికి యావజ్జీవ శిక్ష విధింపబడెను.

నూతన రాజ్యాంగ పరిషత్తునకు 1961, జనరిలో ఎన్నికలు జరిగినవి. తత్ఫలితముగ రూపొందిన పరిషత్తు ఒక నూతన రాజ్యాంగమును ఆమోదించినది. దీనిని అనుసరించి ఆ సంవత్సరము అక్టోబరులో జరిగిన ఎన్నికయందు వివిధ రాజకీయ పక్షములు పాల్గొనినవి. రిపబ్లికన్ పీపుల్స్ పక్షమునకు తక్కిన పక్షముల కన్న అధిక స్థానములు లభించినవి. కాని, ప్రభుత్వమును ఏర్పరచుటకు కావలసిన బలము మాత్రము లభింపలేదు. కడకు సేనాని గుర్సెల్ నే ప్రజాప్రతినిధులలో అత్యధిక సంఖ్యాకులు అధ్యక్షుడుగ ఎన్నుకొనిరి. అధ్యక్షునిచే ప్రధానిగా నియమింపబడిన రిపబ్లికన్ పార్టీ నాయకుడు ఇనోనూ జస్టిస్ పార్టీ సహకారముతో ఒక మిశ్ర మంత్రివర్గమును ఏర్పరచెను.

రాజ్యాంగము : ఈ దేశము రాజ్యాంగబద్ధమగు గణరాజ్యము. శాసనాధికారము ప్రజలచే ఎన్నుకొనబడు జాతీయ మహాసమితియందును, పరిపాలనా నిర్వహణాధికారము ప్రధానమంత్రితో కూడిన మంత్రివర్గమునందును న్యస్తమై ఉన్నవి. దేశాధ్యక్షుడు శాసన సభాసభ్యులచే ఎన్నుకొనబడును. అతడే శాసన సభ్యులలో ఒకనిని ప్రధానమంత్రిగ నియమించును. అతడు మంత్రివర్గమును సమితి సభ్యులనుండి ఎంచుకొనును. అధ్యక్షుడు దేశాధిపతిగా ఉండి రాజకీయములకు అతీతముగ వ్యవహరించును. ప్రభుత్వ బాధ్యత అంతయు ప్రధానమంత్రియే వహించును. ఏక కక్ష్యగల జాతీయ మహాసమితియందు 541 మంది సభ్యులు కలరు. ఈ మహాసమితికి సుమారు నాలుగు సంవత్సరములకు ఒకసారి ఎన్నికలు జరుగును. 21 సంవత్సరములకు పై బడిన వారందరికి వోటింగ్ హక్కు కలదు. ప్ర. రా., చీ. శే. రా.

**టాంగ్ వంశము :** చూ. చీనా.

**టాంగన్యికా :** తూర్పు ఆఫ్రికాలోని స్వతంత్ర రాజ్యము. 1964 లో ఇది టాంజేనియా [చూ.] లో లీనమైనది.

దీనికి ఉగాండా, కెన్యా [ఉ]; హిందూ మహాసముద్రము [తూ]; మొజాంబిక్, న్యాసాలాండ్, ఉత్తర రొడీషియా [ద]; కాంగో (లియొపాల్డ్‌విల్లి), రువండా, బురుండీ [ప] సరిహద్దులుగ ఉన్నవి. [వి] 9,39,704 చ. కి. మీ.; (ఇందు సరస్సుల విస్తీర్ణము 53,483 చ. కి. మీ. చేరి ఉన్నది); [జ] 1,00,46,070. వీరిలో 65,830 భారతీయులు, పాకిస్తానీయులు, గోవనులు; 92,100 యూరపియన్‌లు కలరు. [భా] దేశమునందలి పలు ఆఫ్రికన్ జాతులలో ఆఫ్రికన్ భాషలు పెక్కు వ్యాప్తియందు ఉన్నను సామాన్య భాషగ స్వాహిలీకి ఎక్కువగ వ్యాప్తి కలదు. భారతీయులలో గుజరాతీకి ఎక్కువ వ్యాప్తి కలదు. ప్రభుత్వ భాషగ ఇంగ్లీష్ అమలులో ఉన్నది. [మ] ప్రజలలో దాదాపు 10% క్రైస్తవులు, తీరప్రాంతములందును, వర్తక కేంద్రములందును ఇస్లామ్ మతము కొంతవరకు వ్యాపించినది. కాని, ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు ప్రకృతి దేవతారాధకులు. [రా] దార్ - ఇస్ - సలామ్ (జ. సం. 1,28,742).

చరిత్ర: ఈ దేశపు పూర్వ చరిత్రను గురించిన వివరములు ఏవియు స్పష్టముగ తెలియవచ్చుట లేదు. కాని, ఈ ప్రాంతమున పలు ఆఫ్రికా జాతులు క్రీ. శ. 4 వ శతాబ్దికి పూర్వమునుండి వసించుచున్నట్లును, అందు కొన్ని జాతులు కొంత నాగరకతను కూడ సముపార్జించినట్లును విశ్వసించుటకు తగిన ఆధారములు కలవు. తొలుత నుండియు ఈ దేశమునందలి కొన్ని భాగములు అరబ్ వర్తకులకు సుపరిచితములై ఉండెను. వీరిలో కొందరు ఇట స్థావరములను ఏర్పరచుకొని, ఇస్లామ్ మతమును కొంత వరకు వ్యాపింపజేసిరి. ఇచటి అనాగరక జాతులనుండి పలువురను బానిసలుగ కొనిపోయి అరబ్ వర్తకులు విదేశములకు అమ్ముచుండెడివారు. 16 వ శతాబ్దమునుండి ఆఫ్రికా తూర్పు తీరమున వర్తక స్థావరములను ఏర్పరచు కొనిన పాశ్చాత్యులు సాగించిన బానిస వ్యాపారము ఈ అరబ్ వర్తకుల సాయముననే కొనసాగినది. 1856 లో తొలుతగ ఈ దేశపు అంతర్భాగమును బర్టన్ అను బ్రిటిష్ అన్వేషకుడు కనుకొనెను. అతనిని అనుసరించి తరువాత పలువురు అన్వేషకులును, మత బోధకులును దేశమునందలి పలు తావుల పర్యటించి వివరములను సేకరింప గలిగిరి [చూ. దేశాన్వేషకులు].

కార్ల్ పీటర్స్ అను జర్మను సాహసికుడు 1884 లో టాంగన్యికాలో ఉన్న పలు తెగల నాయకులను దర్శించి, వారితో కొన్ని ఒడంబడికలను కుదుర్చుకొన గలిగెను. ఆ ఒడంబడికల పర్యవసానముగ ఈ దేశము జర్మనీ ప్రభుత్వపు రక్షిత రాజ్యమయ్యెను (1885). 1889 లోను, 1905 లోను దేశమునందలి అరబ్‌లు జర్మనీ ప్రభుత్వముపై తిరుగుబాటులు జరిపిరి. కాని, ఆ తిరుగుబాటులు నిర్దాక్షిణ్యముగ అడచివేయబడెను. ప్రథమ ప్రపంచయుద్ధ ఫలితముగ ఈ దేశమును బ్రిటిష్ ప్రభుత్వము ఆక్రమించెను (1919). నానాజాతి సమితి [చూ.] నిర్ణయములను అనుసరించి 1922 నుండి ఈ దేశము నానాజాతి సమితి పర్యవేక్షణకు లోబడిన బ్రిటిష్ మాండేటరీ (ధర్మకర్తృత్వ) ప్రాంతమయ్యెను. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున నానాజాతిసమితి రద్దయి, దాని స్థానమున ఐక్యరాజ్య సమితి రూపొందినపుడు ఐక్యరాజ్యసమితి ధర్మకర్తృత్వ సంఘమునకు దీనిపై పర్యవేక్షణాధికారము లభించెను.

బ్రిటిష్ మాండేటరీ పాలనవలన ఈ దేశమున సుస్థిర ప్రభుత్వము ఏర్పడెను. ప్రజలకు ప్రభుత్వమున క్రమముగ భాగస్వామ్యమును బ్రిటిష్ ప్రభుత్వము కల్పించెను. ద్వితీయ యుద్ధానంతరమున ఈ దేశమున స్వాతంత్ర్యకాంక్ష గాఢమయ్యెను. ఈ స్వాతంత్ర్యోద్యమమును సుసంఘటిత మొనర్చినవాడు జూలియస్ న్యెరేరే అను జాతీయ నాయకుడు. 1959 మొదలుగ బ్రిటిష్‌ప్రభుత్వము ఈ దేశమునకు క్రమరీతిలో స్వాతంత్ర్యము ఒసగుటకు వివిధ రాజకీయ సంస్కరణలను త్వరితగతిలో ప్రవేశపెట్టినది. 1961 లో ఈ దేశము తొలుత అధినివేశపు హోదా గలిగిన స్వతంత్రరాజ్యమైనది. తరువాత డిసెంబరు 9, 1962 న గణరాజ్యమైనది. అయినను కామన్‌వెల్త్‌నందు సభ్యత్వమును మాత్రము కలిగి ఉన్నది. జూలియస్ నెరేరే ఈ గణరాజ్యమునకు ప్రథమాధ్యక్షుడు. చీ. శే. రా.

**టాంజేనియా :** ఆఫ్రికా ఖండమందలి టాంగన్యికా, జాంజిబార్ దేశములు సమాఖ్యారూపమున మేళన మొందుటవలన (ఏప్రిల్ 26, 1964) రూపొందిన రాజ్యము. దీనికే 'యునైటెడ్ రిపబ్లిక్ ఆవ్ టాంగన్యికా అండ్ జాంజిబార్' అనియు వ్యవహారనామము కలదు. ఈ సమాఖ్యారాజ్యపు [వి] 9,39,704 చ. కి. మీ.; [జ]. 1,00,46,070 [చూ. జాంజిబార్ ; టాంగన్యికా]. చీ. శే. రా.

**టాయన్‌బీ, ఆర్నాల్డ్** (జ. 1889) : బ్రిటిష్ చరిత్ర కారుడు ; ప్రపంచ నాగరకతల తులనాత్మక పరిశీలకుడు ; ప్రసిద్ధ సంఘసంస్కర్త ఆర్నాల్డ్ టాయన్‌బీ యొక్క సోదరుని కుమారుడు. ఈయన ఆక్స్‌ఫర్డ్‌లో అధ్యయనము చేసెను; ప్రథమ, ద్వితీయ యుద్ధకాలములలో బ్రిటిష్ విదేశాంగ కార్యాలయములో పని చేసెను; ఆంగ్లప్రతినిధి వర్గసభ్యుడుగ 1919, 1946 పారిస్ శాంతిసమావేశము [చూ.] లకు హాజరయ్యెను. టాయన్‌బీ లండన్ యూనివర్సిటీలో

బైజాంటైన్, ఆధునిక గ్రీక్ భాషావాఙ్మయ చరిత్రలలో ఆచార్యుడు (1919 - 24); అంతర్జాతీయచరిత్రలో పరిశోధక ఆచార్యుడు (1925 - 55). అంతర్జాతీయ వ్యవహారముల రాయల్ సంస్థకు చాల కాలము అధ్యయన నియంత్రణాధికారి. ఈతని ప్రధానరచన 'చరిత్రాధ్యయనము (స్టడీ ఆవ్ హిస్టరీ)' పది సంపుటముల ఉద్గ్రంథము (1934 - 54). ఇతర రచనలు. 1. గ్రీక్ హిస్టారికల్ థాట్ (1924); 2. సివిలిజేషన్స్ ఆన్ ట్రయల్ (1948); ది వరల్డ్ అండ్ ది వెస్ట్ (1953); 4. హిస్టోరియన్ అప్రోచ్ టు రెలిజన్ (1956); 4. ఈస్ట్ టు వెస్ట్; 6. జర్నీ రౌండ్ ది వరల్డ్ (1958); 7. హెల్లినిజమ్; ది హిస్టరీ ఆవ్ ఏ సివిలిజేషన్ అనునవి. టాయన్‌బీ ఇండియాతో సహా పలు దేశములలో పర్యటించి, పెక్కు విద్యాకేంద్రములలో ఉపన్యసించెను. తన రచనలలో ఈయన వెలిబుచ్చిన అభిప్రాయముల సారాంశము స్థలాంతరమున (సమీక్ష పు. 3, 4) వివరింపబడినది. అ. వెం.

**టాలమీలు :** గ్రీక్ రాజగు అలెగ్జాండర్ [చూ.] మరణించిన వెనుక అతని సామ్రాజ్యమును అతని సేనానాయకులు పంచుకొనిరి. అందు 'టాలమీ' అను సేనానాయకుడు ఈజిప్టుకు రాజై పాలించెను. ఈతని వంశమువారు క్రీ. పూ. 323 - 30 వరకు ఈజిప్టును విఖ్యాతిగా పాలించిరి. ఆ కాలమున గ్రీక్ నాగరకత, సంస్కృతి ఈజిప్టునందు వ్యాపించెను. వీరు విద్యాభిమానులై గ్రంథాలయములు పెక్కు స్థాపించి, పండితులను ఆదరించి, విజ్ఞానాభివృద్ధికి ఎంతయో సాయపడిరి. ఈ వంశపువారిలో కట్టకడపట పాలకత్వమును నిర్వహించిన రాణి క్లియోపాత్రా [చూ. పు. 416]. వి. నా.

**టాష్‌ఖండ్ ప్రకటన :** 1965 లో భారత, పాకిస్తాన్ దేశముల మధ్య ఏర్పడిన సంఘర్షణను శాంతియుతముగ పరిష్కరించుకొనుటకు సోవియట్ రష్యా ప్రధాని కోసిగిన్ [చూ. పు. 410] ప్రోత్సాహముతో భారత ప్రధాన మంత్రి లాల్‌బహదూర్ శాస్త్రి [చూ.], పాకిస్తాన్ అధ్యక్షుడు ఆయూబ్‌ఖాన్ [చూ. పు. 294] లు టాష్‌ఖండ్‌లో సమావేశమై 1966, జనవరి 4 నుండి 11 వరకు సుదీర్ఘచర్చలు జరిపిన అనంతరము చేసిన సంయుక్త ప్రకటన.

ప్రకటన ప్రధాన అంశములు : 1. ఐక్యరాజ్యసమితి ప్రణాళిక ప్రకారము సుహృద్భావ పూర్వకమైన ఇరుగు పొరుగు తనమును సృష్టించుకొనుట, వివాదములను బల ప్రయోగపద్ధతుల ద్వారా కాకుండా శాంతియుతమైన మార్గముల ద్వారానే పరిష్కరించుకొనుట;

2. ఉభయదేశముల సాయుధులను 1966, ఫిబ్రవరి 25 వ తేదీ దాటకముందు 1965, ఆగస్టు 5 వ తేదీనాటి స్థావరములకు ఉపసంహరించుకొనుట; యుద్ధవిరమణ నిబంధనలు పాటించుట;

3. ఒకరి ఆంతరంగిక వ్యవహారములలో మరొకరు జోక్యము కలిగించుకొనకుండుట;

4. వ్యతిరేక ప్రచారమును అరికట్టి, స్నేహపూర్వక ప్రచారమును ప్రోత్సహించుట; అనుష్ఠించుట;

5. ఉభయదేశముల దౌత్యకార్యాలయములు తిరిగి మామూలుగ పని చేయుట; ఈ సందర్భములో ఉభయులు 1961 వియన్నా నిబంధన ప్రకారము వ్యవహరించుకొనుట;

6. ఉభయదేశముల మధ్య ఆర్థిక, వాణిజ్య, సాంస్కృతిక సంబంధములను పునరుద్ధరించుకొనుట;

7. యుద్ధ ఖైదీలను పరస్పరము పరివర్తనము చేసికొనుట;

8. ప్రజలు స్వదేశమున తావులేక వచ్చివేయుటను అరికట్టుట;

9. పోరాటము సందర్భములో స్వాధీనము చేసికొనబడిన ఆస్తులను తిరిగి ఇచ్చు విషయమై చర్చించుకొనుట;

10. ఉన్నతస్థాయిలోను, ఇంకా ఇతరమైన స్థాయిలలోను సమావేశములు జరుపుటద్వారా ఉభయ రాజ్యములకు సంబంధించిన వ్యవహారములను చర్చించుకొనుట; భారత, పాకిస్తాన్ సమష్టి సంఘములను ఏర్పాటు చేయుట. పా. ల. నా.

**టాసిటస్, కార్నీలియస్ - (క్రీ. శ. 55 - 120) :** ప్రపంచమున గొప్ప చరిత్ర రచయితలలో ఒకడు. ఇతడు వ్రాసిన 1. హిస్టరీస్; 2. ఏనల్స్ అను గ్రంథములు చాల ప్రఖ్యాతమైనవి. ఇతనికి ప్రజాసత్తాక రాజ్యవిధానము అనిన ఇష్టము. పై రెండు గ్రంథములలో ఇతడు రోమన్ రాజుల పరిపాలన విధానమును విమర్శించెను. ఆ రాజుల తప్పులను, దౌర్బల్యములను ములుకులవంటి పలుకులతో ఖండించెను. ఏ. ఎస్. గుప్త.

**టిటో, యోసిప్ బ్రాజ్ (జ. 1892) :** యుగోస్లావియా కమ్యూనిస్ట్ పార్టీ నాయకుడు; దేశాధినేత. ఇతడు 1892, మే 25 న క్రోషియారాష్ట్రమున కమ్మరి కుటుంబమున జన్మించెను. ప్రథమ ప్రపంచయుద్ధములో ఆస్ట్రో - హంగేరియన్ సైనికుడుగా పాల్గొని రష్యన్‌లకు ఖైదీగా చిక్కెను. రష్యా అంతర్యుద్ధము (1918 - 20) లో రెడ్ ఆర్మీ సైనికుడుగా పాల్గొనెను. ఆ తరువాత క్రోషియాకు తిరిగి వచ్చి కార్మిక నాయకుడై, కమ్యూనిస్ట్ పార్టీ వ్యవస్థాపకుడై టిటో అను ఉపనామమును ధరించెను.

ప్రభుత్వ వ్యతిరేక రాజకీయాందోళనలకు కారణ భూతుడను నేరముతో కారాగార శిక్ష (1929-34) ఇతనికి విధింపబడెను. జర్మను సైన్యములు యుగోస్లావియాపై 1941 లో దండెత్తిన తరువాత, యుగోస్లావియా జాతి విమోచన సైన్యమునకు నాయకుడై గెరిల్లా యుద్ధమును సాగించి జర్మనుల పురోగమనమును ప్రతిఘటించెను. ఆ స్వాతంత్ర్య పోరాటమున పాల్గొనిన సైన్యమునకు మార్షల్‌గా అతడు మిత్ర రాజ్యములచే గుర్తింపబడెను. ఇతని ఉద్యమములకు ఆదినుండి సోవియట్ రష్యా, 1944 నుండి బ్రిటన్, యునైటెడ్ స్టేట్స్‌లు ఇతనికి మద్దత్తును ఇచ్చినవి.


యోసిప్ బ్రాజ్ టిటో
(జ. 1892)

యుగోస్లావియా 1945 లో స్వాతంత్ర్యమును ఆర్జించిన తరువాత ఇతడు ప్రధాని, రక్షణమంత్రి అయ్యెను. కమ్యూనిస్ట్ వాదాలంబియే యైనను, కొన్నిపట్టుల జాతీయ శ్రేయస్సు దృష్ట్యా కొమిన్‌ఫారమ్ సూచనలను ధిక్కరించి నందులకై అతని వాదములను ఖండించుచు ఆ అంతర్జాతీయ సంస్థ ఒక ప్రకటనను జూన్ 28, 1948 న వెలువరించినది. అంతట సోవియట్ రష్యా నాయకత్వమునకు లోనైన కొమిన్ ఫారమ్ నుండి ఇతడు - యుగోస్లావ్ కమ్యూనిస్ట్ పార్టీతో సహా - వైదొలగెను. 1951 తరువాత యునైటెడ్ స్టేట్స్‌నుండి సహాయ సంపత్తులను పొందుచున్నప్పటికి కమ్యూనిస్ట్ సిద్ధాంతానుసారియగు సంఘ వ్యవస్థా నిర్మాణ ప్రణాళికను ఇతడు ఏమాత్రము విడనాడలేదు. పరిపాలన, సైన్యములపై సర్వాధికారము గల యుగోస్లావియా ఫెడరేషన్ అధ్యక్షుడుగ ఇతనిని 1953 లో జాతీయ అసెంబ్లీ ఎన్నుకొనినది. ఆ తరువాత వరుసగా అధ్యక్షుడుగా ఎన్నిక అగుచు, 1963 లో కాలపరిమితిలేని అధ్యక్షుడుగా ఎన్నుకొనబడెను. అంతర్జాతీయ సమస్యలలో భారతప్రభుత్వము జవాహర్‌లాల్ [చూ.] నాయకత్వమున అవలంబించిన అలీనతా విధానమును ఇతడు బలపరచెను. కృశ్చేవ్ [చూ.] కాలమున సోవియట్‌రష్యాతో ఇతని సంబంధములు మెరుగుపడినవి [చూ యుగోస్లావియా].

పా. ల. నా.

**టిప్పుసుల్తాను** (1753 - 1799): దక్షిణ భారత దేశచరిత్రలో పేరొందిన ఒక ముస్లిమ్‌ప్రభువు. మైసూరు పాలకుడగు హైదరాలీ కుమారుడు; తండ్రి మరణానంతరము 1782 లో రాజయ్యెను. 1784 లో ఇతనికిని, ఆంగ్లేయులకును జరిగిన సంధిని అనుసరించి కెనరా, మలబార్‌లు కూడ ఇతని రాజ్యమున చేరెను. తరువాత హిందూ - మహమ్మదీయులను బలవంతమున క్రైస్తవ మతములో చేర్చుచుండిన పోర్చుగీస్‌లను బంధించి వారిని తన రాజధానియగు శ్రీరంగ పట్టణమునకు పంపెను.

పుంగనూరు, మదనపల్లి మొదలయిన పాళెములు క్రమముగ (1784 - 85) సాధింపబడినవి. ఆ పిమ్మట కొడగులో తిరుగుబాటు జరిగెనని విని టిప్పు ఆ మండలముపై దండెత్తి జయించి, కొడగు (కూర్గ్) వాసులను ఎంతమందినో శ్రీరంగ పట్టణమునకు పంపి, మహమ్మదీయులుగ చేసి, తన సేనలో కలుపుకొనెను. కొడగునుండి మరలివచ్చునప్పుడే పాదుషా అని బహిరంగముగ టిప్పు ప్రకటించుకొనెను. టిప్పునకు వశమైన నార్గల్లును తిరిగి జయించు ఉద్దేశముతో మహారాష్ట్రులు నైజామ్‌తో కలిసి మైసూరు మీదికి దండెత్తిరి. కాని, టిప్పు యుక్తిగా మహారాష్ట్ర రక్షక భటులకు లంచములు ఇచ్చి, లొంగతీసుకొని అకస్మాత్తుగా మహారాష్ట్రసేనలను తాకెను. మహారాష్ట్ర నాయకులు రిచ్చవడి తమ స్త్రీలను కూడ విడిచి పారిపోయిరి. ఆ స్త్రీలు సుల్తానుకు చిక్కిరి. కాని, సుల్తాను వారిని సగౌరవముగా సమ్మానించి, 'ఇక ఎన్నడు మా భర్తలు సుల్తానుపై వైరమూనకుండునట్లు హితబోధ చేసెద' మని వారిచే బాస చేయించుకొని, వారిని వస్త్రభూషణములతో వారి భర్తల కడకు పంపెను. వారు సుల్తాను చేసిన గౌరవ మర్యాదలను గూర్చి చెప్పి, తుదకు 1785 లో సుల్తానుకు, మహారాష్ట్రులకు సంధి కుదురునట్లు చేసిరి. ఈ సంధి అనంతరము టిప్పు రాయదుర్గము, హర్పనహళ్లి పాళెములను సాధించెను.


టిప్పుసుల్తాను
(1753 - 1799)

కాని, 1789 లో కొచ్చిన్, మలబార్ నాయకులు తిరుగుబాటు చేసిరి. వారిని అణచుటకై టిప్పు మహా సైన్యముతో బయలుదేరెను. అంతట ఆ తిరుగుబాటు

దారులు ఆంగ్లేయుల సాహాయ్యము అర్థించిరి. ఈ విధముగ మూడవ మైసూరు యుద్ధము ఆరంభ మయ్యెను.

మూడవ మైసూరు యుద్ధము. (1790 - 1792) : అప్పటి ఆంగ్లేయ గవర్నర్ - జనరల్ అగు కారన్‌వాలీస్ మద్రాసు గవర్నర్ అగు జనరల్ మెడోజ్‌తో కలిసి టిప్పు మీదికి యుద్ధమునకు వెడలెను. సత్యమంగలము వద్ద టిప్పు సేనలు జనరల్ మెడోజ్ సేనను (1790) అష్టకష్టముల పాలు చేసెను. అప్పుడు కారన్‌వాలీస్ నిజామ్‌ను, మహారాష్ట్రులను తనతో కలుపుకొని, లంచముచే టిప్పు ఉద్యోగులను తనవారిగ చేసికొని, గూఢచారులను నియమించి పెక్కు రాజద్రోహుల సాయముతో టిప్పురాజ్యముపైకి దాడిసాగించెను. 1791 లో ఆంగ్లేయులు బెంగుళూరు పేటను, కోటను పట్టుకుని శ్రీరంగపట్టణము మీదికి సేనలు నడపిరి. ఆంగ్లేయులతో టిప్పు సేనలు ఇట్లు పెనగులాడుచుండ ఆంగ్లేయుల మిత్రుడగు నిజామ్ గండికోట, తాడిపత్రి, తాడిమర్రి, కడప, సిద్ధవటమ్ కోటలను పట్టుకొనెను. మహారాష్ట్రులు దర్వారు, హార్పనహళ్లి కోటలను పట్టుకొని, సిరామండలమును ఆక్రమించుకొనిరి. కాని, ఇరువది దినములు ప్రయత్నించినను కారన్‌వాలీస్ శ్రీరంగపట్టణమును పట్టుకొనలేకపోయెను. మలబారు నుండి ఆంగ్లేయుల సాయమునకుగాను వచ్చుచుండిన సామగ్రులు యావత్తు సుల్తాను సైనికులచే కొల్లగొట్టబడెనను వార్త వచ్చెను. అంత కారన్‌వాలీస్ నిస్పృహ చెంది బెంగుళూరున నిలచి ఉన్న సేనలను తరలించుకొని వెళ్ళెను. అంతట టిప్పు గుర్రపుకొండ కోటను ముట్టడించి ఉన్న నిజామ్ మీదికి తన కుమారుడగు ఫతేహైదర్‌ను పంపెను. అతడును నిజామ్ సేనలను ఓడించి గుర్రపుకొండను కాపాడి, అచట నుండి మహారాష్ట్రులను ఓడించి, వారు ముట్టడించి ఉన్న మధుగిరిని విడిపించెను.

ఇంతలో కారన్‌వాలీస్ తిరిగి శ్రీరంగపట్టణమును పట్టుకొన రెండవతూరి బయలుదేరెను. లంచములచే సుల్తాను మంత్రులను, మనుష్యులను లొంగతీసికొని, ఈసారి కారన్‌వాలీస్ విజయవంతుడై సంధికి సుల్తాను వేడుకొనునట్లు కావింపగలిగెను. 1792 లో శ్రీరంగపట్టణ సంధి జరిగినది. దీనివలన మైసూరురాజ్యములో సగము భాగము మహారాష్ట్రులు, నిజామ్, ఆంగ్లేయులు పంచుకొనిరి. యుద్ధవ్యయము క్రింద మూడుకోట్ల రూపాయలు సుల్తాను ఇచ్చుకోవలసి వచ్చినది. ఈ షరతులు బాగుగ నెరవేరు వరకు టిప్పుసుల్తాను కొడుకు లిరువురు ఆంగ్లేయులకడ తాకట్టుగ ఉండిరి.

టిప్పు తానివ్వవలసిన డబ్బు 1792 నాటి సంధిప్రకారము ఇచ్చి, 1794 లో కొడుకులను విడిపించుకొనెను. అప్పటినుండి ఆంగ్లేయులను ఓడించి, తరిమివేయవలెనని యత్నించి ఫ్రెంచివారితో కుట్రలు చేసెను. ఈ కుట్రల ఉదంతమెల్ల తెలిసికొని వెలెస్లీ [చూ.] 1798 - 99 లో నాలుగవ మైసూరు యుద్ధము ప్రకటించి, శ్రీరంగపట్టణమును ముట్టడించెను. సుల్తాను ధైర్యముతో యుద్ధము చేయుచు, ఒక గుండుదెబ్బ తగిలి నేలకొరగి ఉండ, అతని వజ్రస్థగితమగు మొలపట్టెడను ఊడదీసుకొన చూచిన ఒక ఆంగ్ల సైనికుని సుల్తాను తన కటారితో పొడిచెను. వాడును కోపమున తుపాకిని సుల్తాను తలకు గురిపెట్టి కాల్చెను. సుల్తాను తత్‌క్షణమే మరణించెను. అంతటితో మైసూరు సుల్తానుల వైభవము అంతరించినది. సుల్తాను శవమును హైదరు సమాధికి ప్రక్కను రాజమర్యాదలతో భూస్థాపితము కావించిరి. సుల్తాను సుతులు వేలూరుకోటలో బంధింపబడిరి. సుల్తానురాజ్యములో సగభాగము విజయులు పంచుకొనిరి. మిగిలిన సగమును మైసూరు హైందవ రాజసంతతికి చెందిన ముమ్మడి కృష్ణరాజునకు ఇచ్చి, అతడు బాలుడగుటచే పూర్ణయ్యను మైసూరురాజ్య మంత్రిగా చేసిరి. ఏ. ఎన్. గుప్త.

**టిబెట్ (తిబెత్తు)**: చీనా ప్రజాగణరాజ్యమున ఒక స్వయంపాలక (ఆటానమస్) ప్రాంతము.

చీనాయందలి తక్కిన ప్రాంతము [ఉ, తూ]; భూటాన్, సిక్కిమ్, నేపాల్, భారతదేశము [ద]; భారతదేశమునందలి లడక్ జిల్లా [ప] దీనికి సరిహద్దులందు కలవు. [వి] చ. 12,17,290 చ. కి. మీ.; [జ] చ. 55,00,000 ; [భా] ప్రజల మాతృభాష తిబెతీ; [మ] అత్యధిక సంఖ్యాకులు తంత్రవాదముతో ముడివడిన మహాయాన బౌద్ధమునకు చెందినవారు; [రా] లాసా [జ. సం. ర. 40,000].

చరిత్ర : అత్యున్నతమగు పీఠభూమియందు నెలకొని, పర్వత పరివృతమైన ఈ దేశము సహజ పరిస్థితులను అనుసరించి తొలుతనుండి అల్పసంఖ్యాక ప్రజలను మాత్రమే పోషింపగలిగి ఉన్నది. 6 వ శతాబ్ది తరువాతి కాలమునకు సంబంధించి మాత్రమే ఈ దేశపు చారిత్రక విషయములు తెలియవచ్చుచున్నవి. 7 వ శతాబ్దిలో ఈ దేశమున లాసా రాజధానిగ స్రృంజిన్‌గంపో అను వానిచేత ఒక సామ్రాజ్యము స్థాపింపబడినది. ఆ కాలముననే చీనా, భారతదేశములతో ఈ ప్రాంతమునకు సంబంధము ఏర్పడి, బౌద్ధమతము అట వ్యాపించినది. 12 వ శతాబ్ది అంతమున భారతదేశము ఇస్లామ్ సేనల వశము కాగా, పలువురు బౌద్ధభిక్షువులు టిబెట్‌నకు పయనించి, అచట బౌద్ధమతమునకు దృఢతను చేకూర్చిరి. 13 వ శతాబ్దిలో చీనాను

పాలించిన మంగోల్ ప్రభువులు టిబెట్‌ను కూడ తమ పలుకుబడిలోనికి తీసికొనిరి. ఆ కాలముననే (1270) టిబెట్‌లోని శాక్యవిహారమునకు చెందిన ఒక ఆచార్యుడు చీనా చక్రవర్తియగు కుబ్లయ్‌ఖాన్ [చూ.] నకు బౌద్ధమత దీక్షను ఇచ్చెను. ఈ ఆచార్యుడే టిబెట్‌లో మతాచార్యపాలనను నెలకొల్పెను. క్రమముగ దీనిని అనుసరించి దేశమందలి ధర్మపాలనకు ఒక లామా (దలయ్‌లామా) యు, రాజకార్య నిర్వహణకు వేరొక లామా (పంచెన్‌లామా) యు బాధ్యులైరి. ఈ పదవులలో ఉన్నవారు మరణించగనే, వారు మరల శుభలక్షణములతో వేరొకచోట జన్మింతురని టిబెట్ పండితులయు, ప్రజలయు విశ్వాసము. అందువలన ఆ లామాలలో ఏ ఒకరు మరణించినను ఆ యా నిర్ణీతములగు శుభ లక్షణములు కల శిశువును మతాచార్య వర్గము వెదకుట ఆరంభించి, కనుగొనినంతట వానిని ఆ పదవికి పట్టాభిషిక్తుని చేసెడివారు.

మంచూ పాలకులు 1644 లో చీనాలో ఆధిపత్యమును ఆర్జించిన తరువాత టిబెట్‌పై తమకు అధిరాజత (సుజరైనిటీ) కలదని వ్యవహరింపసాగిరి. అయినను అప్పటిలో అది నామమాత్రముగ ఉండెడిది. ఆ కాలముననే లడక్ ఒక ఒప్పందము వలన కాశ్మీరునకు దత్తమైనది; సిక్కిమ్ భారతదేశమునందలి బ్రిటిష్ ప్రభుత్వమునకు వశమైనది (1890). భారతదేశమునందలి బ్రిటిష్ ప్రభుత్వము 1893 లో టిబెట్‌తో వర్తక సంబంధములను ఏర్పరచుకొని, తరువాత జరిగిన కొన్ని సంఘర్షణల ఫలితముగ యాతుంగ్, జియ్యాన్‌చీ, గార్తోక్ అను వర్తక స్థావరములను ఆర్జించినది (1904). అనంతరమున మధ్య ఆసియాలోనికి రష్యా ప్రభుత్వము చొచ్చుకొని వచ్చుటను అడ్డగించుటకై, టిబెట్‌పై చీనాకు కల అధిరాజతను బ్రిటన్ గుర్తించినది (1906). అయినను, చీనాలోని కల్లోల పరిస్థితులను ఊతగగొని చీనా ప్రభుత్వ ప్రతినిధుల వెడలనడిచి (1912), టిబెట్ పాలకులు తమ దేశపు స్వతంత్రతను ధ్రువీకరింపగలిగిరి. ఆ తరువాత సిమ్లాలో జరిగిన (1913-14) సమావేశమున చీనా, బ్రిటన్, టిబెట్ పాలకులు ఒక ఒడంబడికకు రాగలిగిరి. ఇదియే 'సిమ్లా ఒడంబడిక' అని వ్యవహృతము. దీనివలన లోపలి టిబెట్, వెలుపలి టిబెట్ అను రెండు భాగములుగ టిబెట్ దేశము విభక్తమై, అందు మొదటిది చీనాలో చేరునటులను, రెండవది చీనా ప్రభుత్వపు అధిరాజకతకు లోనైన స్వయం పాలక ప్రాంతముగ దలయ్‌లామా పాలనలో ఉండునటులను నిర్ణయము జరిగినది. 13 వ దలయ్‌లామా మరణించిన (1913) తరువాత చీనాతో టిబెట్‌కు సాన్నిహిత్యము కొంత పెరిగినను, స్వయంపాలనకు భంగము ఏర్పడలేదు. చీనాలో కమ్యూనిస్ట్ ప్రభుత్వము ఏర్పడిన (1949) తరువాత టిబెట్ పరిస్థితిలో మార్పు తెచ్చి, పరిపాలనరీత్యా దృఢ బంధములను ఏర్పరచవలెనని ఆ ప్రభుత్వము సంకల్పించినది. అందుచేత ఆ కాలముననే పంచన్‌లామా పదవి విషయమై బయలుదేరిన కొన్ని వివాదములలో తాను జోక్యము వహించి, చీనా కమ్యూనిస్ట్ ప్రభుత్వము టిబెట్‌పై దండయాత్ర సాగించగ (అక్టోబరు, 1950), టిబెట్ పాలకులు లొంగి ఒక ఒడంబడికను కుదుర్చుకొనిరి (మే, 1951). తత్ఫలితముగ టిబెట్ జాతీయ స్వయంపాలిత ప్రాంతముగ సంప్రదాయమును అనుసరించి దలయ్‌లామా పాలనలో ఉండునటుల ఏర్పాటు జరిగినది. అప్పటికే స్వతంత్రతను ఆర్జించిన భారతప్రభుత్వము తనకు టిబెట్‌లో కల వర్తక స్థావరములను, ఇతర సదుపాయములను వదలుకొని సహకరించినది. కాని, చీనీయులు తమ ఒప్పందమును తామే కాదని క్రమముగ కమ్యూనిస్ట్‌ల పాలనను దౌర్జన్య మార్గమున స్థాపించుటకు యత్నము చేసిరి. అంతట 1959, మార్చిలో దలయ్‌లామా ప్రతిపత్తికే భంగము కలుగునను భయము ఏర్పడి, ప్రజలు తీవ్రమగు తిరుగుబాటును లేవదీసిరి. చీనాలోని కమ్యూనిస్ట్ ప్రభుత్వసేనలు ఈ తిరుగుబాటును అడచినను దలయ్‌లామా మాత్రము దేశమును వదలి, భారతదేశమును సురక్షితముగ చేరుకొని, భారత ప్రభుత్వాశ్రయమును ఆర్జించి, తనతోపాటుగ దేశమును వదలివచ్చిన టిబెటనుల యోగక్షేమముల విషయమై నిరంతర శ్రద్ధవహించి కృషిచేయుటయే కాక, ప్రపంచ రాజ్యముల సానుభూతిని ఆర్జించి, టిబెట్ విషయమున సముచిత పరిష్కారమును సాధించుటకు కృషిచేయుచున్నాడు. ఐక్యరాజ్య సమితి [చూ. పు. 351] యును టిబెట్ ప్రజలపై చీనా ప్రభుత్వము అవలంబించిన దమననీతిని నిరసించుచు తీర్మానించినది (1965, డిసెంబరు). కాని, చీనా ప్రజాగణరాజ్యము తన పట్టుదలను సడలింపక, తీవ్ర దౌర్జన్య మార్గములను అవలంబించి టిబెట్ ప్రజల స్థైర్యమును సడలించుటకు కృషిచేయుచున్నది. తొలుత చీనీయుల పక్షమును అవలంబించిన పంచెన్‌లామాయు 1935 నాటికి వారి ఆగ్రహమునకు గురి అయ్యెను. అంతట చీనీయ కమ్యూనిస్ట్‌ల చెప్పుచేతలలో ఉండు టిబెట్ స్వయంపాలిత ప్రాంతపు ప్రజాసభ గాపోంగ్వాంగ్ జిగ్మీ అను వానిని అధ్యక్షునిగ ఎన్నుకొనినది (సెప్టెంబరు 9, 1965).

చీ. శే. రా.

**టూనీషియా :** ఉత్తర ఆఫ్రికాయందలి ఒక స్వతంత్ర రాజ్యము.

ఈ దేశమునకు మధ్యధరాసముద్రము [ఉ; తూ]; ఆల్ జీరియా, సహారా (ఫ్రెంచి) [ప]; లిబియా [ద] సరిహద్దులుగ ఉన్నవి. [వి] 1,25,180 చ. కి. మీ. ; [జ] 42,90,000. వీరిలో దేశమున స్థరనివాసము ఏర్పరచుకొనిన ఒక లక్షకు పైగా ఫ్రెంచివారును, 50 వేల ఇటాలియన్‌లును చేరి ఉన్నారు. [భా] జాతీయభాష అరబ్. అయినను ఫ్రెంచిభాష కూడ వ్యాపార, పరిపాలనా రంగములందు అరబ్ భాషతోపాటు వాడబడుచున్నది. [మ] ప్రజలలో 90% ముస్లిమ్‌లు. యూరపియన్ సంతతివారు అందరును క్రైస్తవులు; వారును, యూదులును దాదాపు 60 వేలమంది కలరు. [రా] ట్యూనిస్ [జ. సం. 6,95,000].




చరిత్ర: అతి ప్రాచీన చరిత్రగల దేశములలో ఈ దేశము ఒకటి. క్రీ. పూ. 12 వ శతాబ్దియందు ఫొనీషియన్‌లను ప్రాచీన నాగరకజాతి ఇట కార్తేజ్‌నగరమును నిర్మించి ఆ నగరమును కేంద్రముగా ఇడుకొని విశాల సామ్రాజ్యమును నెలకొల్పెను. రోమన్ సామ్రాజ్యముతో స్పర్ధవహించి దీర్ఘ కాలము నిలువగలిగిన ఈ సామ్రాజ్యము కడకు క్రీ. పూ. 146 లో రోమన్ సేనల ధాటికి నిలువజాలక అంతరించెను [చూ. కార్తేజ్]. అంతట ఈ ప్రాంతము రోమన్‌ల ఆధిపత్యమునకు లోనయ్యెను. రోమన్ సామ్రాజ్య విచ్ఛిత్తి అనంతరమున ఈ దేశము దీర్ఘకాలమువరకు అరాజకము పాలయ్యెను. 5 వ శతాబ్దమున వేండల్ జాతివారును, 6 వ శతాబ్దియందు బైజాంటియన్ ప్రభువులును అంతటంతట ఈ దేశముపై దండయాత్రలు జరిపి దేశమును అధోగతికి తెచ్చిరి. 7 వ శతాబ్దమున అరబ్‌లు ఈ దేశమును జయించుటతో ఈ దేశచరిత్రయందు ఒక నూతనాధ్యాయము మొదలిడబడెను. ఇస్లామ్‌మతముతోపాటుగ అరబ్ భాషా సంస్కృతులును ఈ దేశమున ఎల్లయెడల వ్యాప్తి పొందినవి. ఆనాడు ఇది బాగ్దాద్‌నగరము కేంద్రముగ విలసిల్లిన అరబ్‌సామ్రాజ్యమున ఒక రాష్ట్రముగ ఉండెడిది. క్రీ. శ. 800 లో అప్పటి రాష్ట్రపాలకుడగు ఇబ్రహీమ్ బెన్ అగ్లెజ్ అనువాడు బాగ్దాద్‌నందలి కలీఫాకు నామమాత్రముగ విధేయతను ప్రకటించెను. టూనీషియాను దాదాపు స్వతంత్రరాజ్యముగ చేసి, తానే దాని పాలకుడు అయ్యెను. ఈ అగ్లెజ్‌వంశీయులగు రాజుల కాలమున ఈ దేశము విస్తృతప్రాభవమును గడించెను. ఇటలీ ద్వీపకల్పమునకు సన్నిహితమగు సిసిలీద్వీపమును ఈ అగ్లెజ్‌వంశీయులు జయించి, దానిని తమ రాజ్యమున అంతర్భాగము కావించిరి. కాని, తూర్పుదేశములవారి దండయాత్రలవలన ఈ రాజ్యము అంతరించి (903), దేశమున అరాజకము ప్రబలెను. ఆ తరువాత నాలుగు శతాబ్దములకు అబూ జకరీయా అను సేనాని దేశమును ఐక్యమొనర్చి, పాలకుడై హాఫ్సీ అను వ్యవహరింపబడు రాజవంశమునకు మూలపురుషుడయ్యెను (1336). ఈ రాజ వంశీయుల పరిపాలనా కాలమున దేశము తన పూర్వ వైభవమును మరల ఆర్జింపగలిగెను. కాని, 16 వ శతాబ్దమున ఈ వంశీకులలో రాజ్యపు వారసత్వమునకై అంతర్యుద్ధములు చెలరేగిన అవకాశమును ఊతగాగొని, టర్కీ సుల్తాను సైన్యములు ఈ రాజ్యమును ఆక్రమించెను (1574). టర్కీ ప్రభుత్వము 'బే' అని వ్యవహరింపబడు తమ ప్రతినిధిని ఒకనిని నియమించి వానిద్వారా తమ పరిపాలన సాగించెను. కాని, 1705 నాటికి 'బే' గా వ్యవహరించుచున్న హుసేన్ అనునతడు టర్కీ సుల్తాన్ అధికారమును నామమాత్రముగ గుర్తించుచు, తక్కిన అన్నివిధముల స్వతంత్రపాలకుడై ఒక రాజవంశమునకు మూలపురుషుడయ్యెను.

ఈతని వంశమే టూనీషియాను పలిన కడపటి రాజ వంశము.

ఆర్థికముగా టూనీషియా ప్రభుత్వము 19 వ శతాబ్ది అంతమునకు అధోస్థితికి వచ్చి, విదేశీయులకు - అందును ఫ్రెంచివారికి - అత్యధికముగ ఋణపడినందున ఫ్రెంచి ప్రభుత్వము ఈ రాజ్యమును తన రక్షణలోనికి తీసికొనెను (1893). ఫ్రెంచివారి పెట్టుబడుల మూలమున దేశమునకు ఆధునికత చేకూరుటయే కాక, ఫ్రెంచి సేనల సాయమున దేశీయ పరిపాలకుడగు 'బే' తన పరిపాలనను దేశమంతట కట్టుదిట్టముగ వ్యాపింపజేయ గలిగెను. ఈ మైత్రి ఫలితముగ ప్రథమ ప్రపంచ యుద్ధమున ఫ్రెంచివారికి టూనీషియా సేనలు తోడ్పడినవి.

ప్రథమ ప్రపంచ యుద్ధానంతరమున స్వాతంత్ర్యకాంక్ష గాఢముగ ప్రబలెను. దేశమందలి మేధావులు దస్తూర్ అను పేరుగల రాజకీయపక్షమును స్థాపించి, దాని నాయకత్వమున స్వాతంత్ర్యమునకై ఆందోళన సాగించిరి. 1934 లో ఈ పక్షమున చీలికలు ఏర్పడి హబీబ్ బోర్గుబా నాయకత్వమున నియోదస్తూర్ పక్షము అనునది వేరొకటి ఏర్పడెను. ద్వితీయ ప్రపంచయుద్ధానంతరమున ఫ్రాన్స్ ప్రభుత్వము జాతీయవాదులను అడచుటకు తీవ్రయత్నము లను చేయుటయేకాక, పాలకుడగు మున్‌సిఫ్ బేను దేశాంతరమున ఉంచెను. దేశమున స్థిరనివాసము ఏర్పరచికొనిన ఫ్రెంచివారు జాతీయోద్యమమును నిర్మూలించుటకు ఎంతయో కృషి చేసిరి. కాని, అంతకంతకు ఈ ఉద్యమము అతి తీవ్రమై ప్రపంచ ప్రజాసానుభూతిని ఆర్జించుటచే ఫ్రెంచిప్రభుత్వము 1955 లో టూనీషియా జాతీయవాదులతో సంప్రతింపులు జరిపెను. తత్ఫలితముగ 1956, మార్చి 20 నుండి టూనీషియా స్వతంత్రరాజ్యము అయ్యెను. కాని, దేశమునందలి ప్రముఖ రేవు పట్టణమగు బిజెర్టాయందు మాత్రము ఫ్రెంచివారు నౌకాస్థావరము నెలకొల్పుకొనుటకును, ఉచితకాలమున దానిని తిరిగి టూనీషియాకు ఒసగుటకును అపుడు ఏర్పాటు జరిగెను. ప్రజానీకముచే 1957 లో ఎన్నుకొనబడిన రాజ్యాంగపరిషత్ ఆమోదించిన రాజ్యాంగ విధానమును అనుసరించి, టూనీషియాకు వంశాను గత పాలకుడగు 'బే' పదవినుండి తొలగింపబడి, దేశము గణరాజ్యముగ ప్రకటితమయ్యెను; బోర్గుబా ప్రథమ అధ్యక్షుడు అయ్యెను (1959).

టూనీషియా ప్రక్కనే ఉన్న అల్‌జీరియా స్వాతంత్ర్యము విషయమున ఈ దేశీయులు తొలుతనుండియు ఎక్కువ శ్రద్ధ వహించిరి. అల్‌జీరియాకు స్వాతంత్ర్యము ఒసగుటకు ఫ్రెంచిప్రభుత్వము సుముఖముగ ఉండగ, దౌర్జన్య పద్ధతులలో అల్‌జీరియా స్వాతంత్ర్యోద్యమమును అడచుటకు యత్నించుటతో, టూనీషియా ప్రజలకు ఫ్రెంచి ప్రభుత్వముపై విద్వేషము క్రమముగ తీవ్రస్థాయికి వచ్చెను. అందువలన 1961 లో బిజెర్టా రేవును తమకు అప్పగించు ఏర్పాటులు జరుపవలసినదిగ ఫ్రెంచి ప్రభుత్వమును బోర్గుబా కోరెను. కాని, ఫ్రాన్స్ అందులకు నిరాకరించెను. అంతట ఫ్రెంచిస్థావరమునకు గల రాకపోకల దారులను టూనీషియా జాతీయవాదులు మూసివేసిరి. ఫ్రెంచి ప్రభుత్వము తన ఆధిపత్యమును అట నిలబెట్టుకొనుటకై పారాచూట్ (ఆకాశదళము) లను పంపి, ప్రతిఘటనను అడచి, బిజెర్టా నౌకాస్థావరమునే గాక, పట్టణమును కూడ ఆక్రమించెను. ఈ పోరాటమున టూనీషియా పౌరులు అనేకులు మరణించిరి. అంతట అధ్యక్షుడగు బోర్గుబా ఐక్యరాజ్యసమితి [చూ.] కి ఫిర్యాదు చేయగా (1961, జూలై 21), వారు జోక్యము వహించి పోరాటమును అంతరింప చేసిరి. ఫ్రెంచిప్రభుత్వమును యథాపూర్వస్థితికి అంగీకరించి, క్రమముగ బిజెర్టా రేవును స్వాధీనపరచుటకు అంగీకరించెను.

రాజ్యాంగము : 1959 రాజ్యాంగ చట్టమును అనుసరించి గణరాజ్యపు పరిపాలన ఈ దేశమున అమలునందు ఉన్నది. ఐదేండ్లకు ఒకసారి ఎన్నుకొనబడు అధ్యక్షుడు దేశాధిపతిగ వ్యవహరించును. అధ్యక్షుని ఎన్నిక కాలముననే శాసనసభకు ఎన్నికలు జరుగును. శాసనసభయందు 90 మంది సభ్యులు ఉందురు. అపరోక్ష, సార్వజనిక, రహస్యపు పద్ధతిన ఎన్నికలు జరుగును. శాసనసభ తీర్మానములను అధ్యక్షుడు వీటోచేయ (నిరాకరింప) వచ్చును. కాని, రెండువంతుల ప్రాబల్యముతో ఆ తీర్మానమును మరల శాసనసభ ఆమోదించినచో అది చట్టము అగును. పరిపాలనలో అధ్యక్షునికి సాయపడుటకు 12 గురు కార్యదర్శులును, ముప్పురు ఉపకార్యదర్శులును ఉందురు.

చీ. శే. రా.

**టెల్, విలియమ్ :** స్విజర్లండ్ పురాణగాథలలోని నాయకుడు. బహుశః ఆతని కథలు ఏవియు చారిత్రకముగ నిజము కావు. అయినను వాటిలో స్విజర్లండ్ ప్రజల స్వాతంత్ర్యభావావేశము బలముగ కన్పట్టును. ఈ కథల ప్రకారము టెల్ అడవి ప్రదేశములలో ఒకటగు 'యూరీ' అను రాష్ట్రము (కాంటన్) లో ఒక రైతు. 1307 లో దేశమంతయు ఆస్ట్రియా క్రూరపరిపాలనచే పీడింపబడుచున్నప్పుడు అర్ట్‌డార్ఫ నగరమున ఒక బజారుకు టెల్ వెళ్లెను. ఆస్ట్రియా దేశపు ప్రతినిధిగ స్విజర్లండ్‌ను పాలించుచున్న గెస్లర్ ఒక కర్రపై తన టోపీని పెట్టి, ఆ దారిని

పోవు స్విస్ జాతీయులను అందరిని దానికి సలామ్ చేయ ఆజ్ఞాపించెను. ఆ నీచకృత్యమునకు టెల్ అంగీకరించ లేదు. గెస్లర్ అప్పుడు అతని అవిధేయతకు ఒక శిక్ష విధించెను. తత్ప్రకారము టెల్ తన కుమారుని తలపై ఉంచబడిన ఒక ఆపిల్ పండును ఒకే బాణముతో రెండు తునియలు అగునట్లు ఛేదించవలెను. గురి తప్పినచో టెల్ కు వెంటనే మరణము తప్పదు. టెల్ అసామాన్యమైన నేర్పు గల విలుకాడు. కావున ఆ పరీక్షకు సిద్ధపడెను. అతని కుమారుని తలపై ఆపిల్ పండు పెట్టిరి. టెల్ తన అమ్ముల పొదినుండి రెండు బాణములు తీసెను. అందొకదానిని సంధించి గురిచూచి పండునుకొట్టి, దానిని రెండు ముక్కలు చేసెను.

గెస్లర్ నివ్వెరపోయెను. అతడు టెల్ ను విడువక తప్పినది కాదు. కాని, అతనికి ఒక సందేహము వచ్చినది. 'నీవు రెండు బాణములను తీసితివేల ?' అని అతడు టెల్ ను ప్రశ్నించెను.

'మొదటి బాణము నా కుమారుని చంపినచో ఈ రెండవదానితో నీ గుండెను చీల్చివేయుటకు' అని టెల్ నిర్భయముగ జవాబు ఇచ్చెను. గెస్లర్ వెంటనే టెల్ ను బంధించెను.

గెస్లర్ అతనిని సరస్సు దాటించి తీసికొని పోవుచుండగా పెద్ద తుఫాను వచ్చెను. పడవ పెనుగాలికి ఊగి పోవుచుండెను. పడవను నడపుటలో సహాయపడునను అభిప్రాయముతో టెల్ బంధములను విప్పుమని గెస్లర్ ఆజ్ఞాపించెను. టెల్ నీటిలో దూకి, ఆ కల్లోల తరంగములలో ఈది ఒడ్డునకు చేరుకొని, అచటినుండి గెస్లర్ గుండెకు గురిపెట్టి బాణము విడిచెను.

ఆ కృత్యముతో స్విజర్లండ్ ప్రజలు ఉత్సాహితులై తిరుగుబాటు చేసిరి. అందు టెల్ ప్రముఖ పాత్ర వహించెను.

వి. నా.

**టెహరాన్ సమావేశము :** ద్వితీయ ప్రపంచ యుద్ధ (1939 - 45) కాలమున 1943, నవంబరు 28 మొదలు డిసెంబరు 1 వరకు స్టాలిన్ (సోవియట్ రష్యా), రూజ్ వెల్ట్ (యునైటెడ్ స్టేట్స్), చర్చిల్ (బ్రిటన్) మధ్య ఇరాన్ రాజధానియగు టెహరాన్‌లో జరిగిన సమావేశము. ఇట్టి సమావేశములలో ఇది మొదటిది. ఈ సమావేశమునకు పై ముగ్గురు రాజ్యాధినేతలు హాజరై పశ్చిమమున జర్మనీపై సోవియట్ రష్యా చేయు దండయాత్రకు సహకరించుటకై మిత్రమండలి సేనలు తూర్పు రంగమున ఫ్రాన్స్‌లో దిగవలసిన విధానమునకు సంబంధించిన యుద్ధతంత్రపు ఏర్పాటులను గురించి చర్చించిరి. ముమ్ముందు జపాన్‌నకు వ్యతిరేకముగ సోవియట్ రష్యాయు తక్కిన మిత్రరాజ్యములతో పాటుగ యుద్ధమున పాల్గొనుటను గురించియు, యుద్ధానంతరమున ప్రపంచ శాంతిని కాపాడుటకై ఏర్పాటు చేయదగిన అంతర్జాతీయ వ్యవస్థ సంస్థాపనమును గూర్చియు కూడ వారు అప్పుడు స్థూలముగ చర్చించిరి [చూ. ప్రపంచ యుద్ధము - II].

స్వ. వెం.

**టోంగా :** దక్షిణార్ధ గోళమందలి ఒక ద్వీప సముదాయ రాజ్యము. దీనికే ఫ్రెండ్లీ ఐలాండ్స్ అనియు పేరు కలదు.




దక్షిణ పసిఫిక్ మహాసముద్రమునందలి ఫిజీ దీవులకు తూర్పున దక్షిణ అక్షాంశరేఖ 15° నుండి 23° 5″ వరకును, పశ్చిమ రేఖాంశ 173° నుండి 177° వరకును ఈ ద్వీప సమూహము విస్తరించి ఉన్నది. ఇందు చిన్నవి, పెద్దవి కలసి మొత్తము 150 దీవులు కలవు. వీనిలో 36 దీవులు మాత్రమే జనావాసితములై ఉన్నవి. ద్వీపరాజ్యపు మొత్తము [వి] 699 చ. కి. మీ.; [జ] 65,620. [భా] టోంగాన్, పాలినీషియన్ భాషా కుటుంబమునకు చెందిన ఈ భాషకు 19 వ శతాబ్దము వరకు లిపియే లేకుండెను. ప్రభుత్వ ప్రకటనలు టోంగాన్‌లోనే కాక ఇంగ్లీషులో కూడ ప్రకటింపబడును. ఇంగ్లీషు ద్వితీయ బోధనా భాష. [మ] దేశవాసులు అందరును క్రైస్తవులు. [రా] నుకూయలోఫా (జ. సం. దాదాపు 10,000).

చరిత్ర : ఈ దేశమునందలి భాషకు లిఖిత రూపము 19 వ శతాబ్ది వరకు లభింపమిచే, ఈ దేశ చరిత్రను గురించిన లిఖితాధారములు ఏవియు కన్పడకున్నను, జనులయందు ప్రచారమున ఉన్న సంప్రదాయ గాథల వలన గత చరిత్రను గురించిన కొన్ని వివరములు తెలియవచ్చుచున్నవి. ఈ దేశమును ఏలిన వారని చెప్పబడు రాజుల

వంశావళి 10 వ శతాబ్ది వాడగు అహోయితూ అను వానితో మొదలిడుచున్నది. ఈ వంశమున 23 వ వాడయి, 15 వ శతాబ్దిలో ఈ దేశమును పాలించిన కవులుపోర్నువా అనువాడు అప్పటి వరకు రాజులకు ఉండిన ఆధ్యాత్మిక, భౌతిక అధికారములలో, ఆధ్యాత్మిక అధికారములను మాత్రము తాను నిలుపుకొని, భౌతికరాజ్యాధికారమును తన తమ్ముడగు మవంగ్ మోతువా అనువానికి ఒసగెను. ఆ మవంగ్ మోతువా వంశీకుల సంతతియే క్రమానుగతముగ ఈ రాజ్యమును ఈ నాటికిని పాలించుచున్నది.

యూరప్ వాసులలో తొలుతగ డచ్చివారు ఈ ద్వీపములలో ఒకదానిని 1616 లోను, వేరొకదానిని 1643 లోను కనుగొనిరి. కాని, వారు ఇచట స్థిరనివాసము ఏర్పరచుకొనరైరి. తరువాత చాలకాలమువరకు యూరప్ వాసులు ఎవరును ఆ ద్వీపములను గమనింపలేదు. సామ్యుయెల్ వాలేస్ అను సాహసిక నావికుడు ఈ ద్వీపములలో నవతోపుతాపు అను దీవివద్ద 1767 లో లంగరు వేసినను, అచటి ప్రజలతో అతనికి పరిచితి లభింపలేదు. 1775-1777 లలో జేమ్సు కుక్ [చూ.] ఈ ద్వీపములలో కొన్నింటిని కనుగొనెను. ఈతని వలననే ఈ ద్వీపములకు 'ఫ్రెండ్లీ ఐలాండ్స్' అను పేరు కలిగెను. అంతటి నుండి క్రమముగ క్రైస్తవ మత ప్రచార సంఘములును, బ్రిటిష్ వర్తక సంస్థలును ఇట పనిచేయ ఆరంభించినవి.

ఈ రాజ్యమునకు 19 వ శతాబ్ది మధ్య భాగమున రాజుగ పట్టాభిషిక్తుడైన 'తౌఫాహూ తుపావ్' ప్రభువు (1797-1893) కడు సమర్థుడు. ఈతడు దేశమునందలి అరాజక శక్తులను అడచి, రాజ్యమునకు సుస్థిరతను చేకూర్చెను. ఇతడు క్రైస్తవ మతము అవలంబించి జార్జి-I అను పేరును గ్రహించుటయే కాక, దేశమున క్రైస్తవ మతము వ్యాపించుటకు ఎక్కువగ సాయపడెను. దేశపు పరిపాలనను సువ్యవస్థితము చేయుటకై ఇతడు 1875 లో ఒక రాజ్యాంగ విధానమును దేశమునకు ఒసగెను. ఇతని ప్రపౌత్రుడు జార్జి-II పాలించు కాలమున 1900 లో బ్రిటన్-టోంగాల మధ్య మైత్రి ఒడంబడిక ఒకటి కుదుర్చుకొనబడుటయే కాక, టోంగా రాజ్యము బ్రిటిష్ రక్షిత రాజ్యమైనటుల కూడ ప్రకటింపబడినది. నేటికిని ఆ ప్రతిపత్తితోనే ఆంతరంగిక సర్వస్వతంత్రాధికారయుత రాజ్యముగ ఈ దేశము మనుచున్నది.

రాజ్యాంగము : వంశానుగతము, రాజ్యాంగ విధాన విహితము అగు రాచరికపు పాలనలో ఈ దేశము స్వయం పరిపాలనను కలిగి ఉన్నది. ప్రస్తుతము ఆ దేశమును పాలించునది సలోతి తుపౌ రాణి. పరిపాలనా కార్యనిర్వహణము ప్రివీకౌన్సిల్ సహాయమున ఈమె నిర్వహించును. ఈ కౌన్సిల్ నందలి సభ్యులను ఆమెయే నియమించును. మంత్రివర్గము రాణిచే నియుక్తమై, పరిపాలనను నడపును. శాసన నిర్మాణ విధిని నిర్వహించుటకు శాసన సభ కలదు. ఈ సభయందు ప్రివీకౌన్సిల్ సభ్యులును, భూస్వాములచే ఎన్నుకొనబడిన ఏడుగురు ప్రతినిధులును, సామాన్య ప్రజలచే ఎన్నుకొనబడిన ఏడుగురు ప్రతినిధులును సభ్యులై ఉందురు. ఎన్నికలు మూడేండ్లకు ఒకసారి జరుగును.

దేశరక్షణ, విదేశ వ్యవహారములు బ్రిటిష్ ప్రభుత్వపు బాధ్యతకు వదలివేయబడినవి. ఫిజీ ద్వీపముల గవర్నరే పశ్చిమ పసిఫిక్ కాన్సల్-జనరల్ హోదాలో ఈ బాధ్యతను తన స్థానిక ప్రతినిధి ద్వారా నిర్వహించును. చీ. శే. రా.

**టోగో :** ఆఫ్రికా ఖండపు పశ్చిమ తీరమందలి ఒక స్వతంత్ర రాజ్యము.




ఈ దేశమునకు అప్పర్ వోల్టా [ఉ]; దహోమీ [తూ]; గినీ సింధుశాఖ [ద]; ఘానా [ప] సరిహద్దులుగ ఉన్నవి.

[వి] 56,600 చ. కి. మీ.; [జ] 15,86,000; దేశవాసులలో అత్యధిక సంఖ్యాకులు నీగ్రోలు. [భా] మాతృభాషలుగ 44 ఆఫ్రికన్ భాషలు ప్రచారమందు ఉన్నవి. కాని, ఫ్రెంచి భాషయే సాధికార వ్యవహార భాషగ వ్యాప్తియందు ఉన్నది. [మ] దేశవాసులలో దాదాపు 50% క్రైస్తవులు, 25% ముస్లిములు, తక్కిన వారు ప్రకృతి దేవతారాధకులు. [రా] లోమీ (జ. సం. 73,645).

చరిత్ర: నేటి దక్షిణ టోగోలో అత్యధిక సంఖ్యాకులుగ ఉన్న ఈవీ జాతి ప్రజల పూర్వీకులు ఈ దేశమునకు క్రీ. శ. 12 వ శతాబ్దము నుండి 14 వ శతాబ్దము వరకు అంతటంతట నైజర్ నదీ లోయనుండి ఇటకు వచ్చిచేరి, ఇచటి ఆదివాసులపై తమ ఆధిపత్యమును సంస్థాపించిరి. 15, 16 శతాబ్దములలో పోర్చుగీస్ నావికులు ఈ దేశ తీరమున వర్తక స్థావరములు అచ్చటచ్చట నెలకొలిపి, తీరగ్రామములందలి పేద నీగ్రోలను బానిసలుగ కొనిపోయి దూర దేశములందు విక్రయించుచుండిరి. ఫ్రెంచి వారును 1626 లో ఈ దేశముతో వర్తక సంబంధములు ఏర్పరచుకొనినను, వారు స్థిరముగ ఇట ఉండకుండిరి. 1856 లో జర్మనులకు ఈ ప్రాంతముతో పరిచితి లభించెను. 1880 నుండి జర్మనులు అనేకులు ఇచ్చట పలుకుబడిని ఆర్జింప మొదలిడిరి. వారిలో నస్టావ్ నక్టిగల్ అను అతడు తీర ప్రదేశమందలి టోగో గ్రామ ప్రముఖ నాయకునితో ఒక ఒడంబడికను 1885, జూలై 5 న కుదుర్చుకొని ఈ ప్రాంతమును జర్మను రక్షిత రాజ్యముగ చేసెను. ఆనాడు ఆఫ్రికా యందు జర్మనులు సంపాదించిన వలసలలో ఇది తొలుతటిది. ఈ టోగో గ్రామమును బట్టియే ఈ ప్రాంతమునకు అంతటికిని టోగో అని జర్మనులు పేరిడిరి. 1897 లో లోమీ అను పేర ఒక నగరమును జర్మనులు నిర్మించి, దానిని రాజధానిగ చేసిరి. జర్మనుల ఆధిపత్యమున ఇచట రోడ్డు రవాణా సౌకర్యములు, విద్యా సంస్థలు, దిటవగు పరిపాలనా వ్యవస్థ నెలకొల్పబడెను.

ప్రథమ ప్రపంచ యుద్ధకాలమున బ్రిటిష్ వారును, ఫ్రెంచి వారును ఈ దేశమున వేర్వేరు భాగములు ఆక్రమించి, జర్మనులను తరిమి వేసిరి. యుద్ధానంతరమున బ్రిటిష్, ఫ్రెంచి ప్రభుత్వములు తమ అధీనమునందున్న టోగో దేశ భాగములను ధర్మకర్తలుగ పాలించుటకు అనుమతిని నానాజాతి సమితి [చూ.] ఒసగెను (1922).

ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున ఐక్యరాజ్య సమితి [చూ. పు. 351] ఏర్పరచిన పద్ధతిని అనుసరించి బ్రిటిష్, ఫ్రెంచిప్రభుత్వములు అంతర్జాతీయ ధర్మకర్తృత్వ రక్షణలో ఈ ప్రాంతములు ఉండినవి. 1947 నుండి ఈవీ ప్రజలు స్వాతంత్ర్యమునకై ఆందోళనము చేయ మొదలిడిరి. గోల్డ్ కోస్ట్‌లోను, టోగోలోను గల ఈవీ ప్రజలు వసించు ప్రాంతములను ఏకీకృతము ఒనర్చి ఒక క్రొత్త స్వతంత్ర రాజ్యమును నెలకొల్పుట ఈ ఈవీ ప్రజల ఆకాంక్ష. కాని, గోల్డ్ కోస్ట్‌ను చీల్చుటకు బ్రిటన్ అంగీకరింపకుండెను. అందువలన బ్రిటిష్ వారి స్వాధీనమున ఉన్న టోగో భూమిని గోల్డ్ కోస్ట్‌లో చేర్చి ఆ విధముగ ఘానా [చూ.] అను స్వతంత్ర రాజ్యమును ఏర్పరచిరి (1956, మే).

ఇక ఫ్రెంచివారి క్రింద మిగిలిన టోగో ప్రాంతమే నేటి టోగో దేశముగ రూపొందినది. ఫ్రెంచి వారితో జరిగిన ఒక ఒడంబడికను అనుసరించి ఈ దేశము 1960, ఏప్రిల్ 27 న సర్వస్వతంత్ర గణరాజ్యప్రతిపత్తిని ఆర్జించినది.

రాజ్యాంగము: టోగో దేశమున ప్రజా స్వామికపు పరిపాలన అమలునందు ఉన్నది. సార్వజనికపు ఎన్నికల పద్ధతిన ఆరేండ్లకు ఒకసారి ఎన్నుకొనబడు 46 మంది సభ్యులు కల ప్రతినిధుల సభ ఒకటి కలదు. కార్య నిర్వహణ బాధ్యత అధ్యక్షునిది. ఇతడే ప్రధాని పదవిని నిర్వహించును. తనకు సాయము చేయుటకు మంత్రి వర్గమును ఇతడు నియమించుకొనును.

చీ. శే. రా.

**ట్యుటానిక్ జాతులు**: ఆర్యజాతికి చెందిన కొన్ని ఉపజాతుల సమష్టి నామము. జర్మానిక జాతులనియు ఈ జాతులు వ్యవహరింపబడుట కలదు. నేటి స్వీడెన్, నార్వే, డెన్మార్క్, ఐస్‌లాండ్, జర్మనీ, ఆస్ట్రియా, లక్జెంబర్గ్, స్విజర్లండ్, ఉత్తర ఇటలీ, నెదర్‌లండ్స్, బెల్జియమ్, ఫ్రాన్సునందలి ఉత్తర, మధ్యభాగములు, స్కాట్‌లండ్‌లో తీరభాగము, ఇంగ్లండు - అను వానిలో వసించు ప్రజానీకము రూపుగొనుటకు మూల ప్రాతిపదికలుగ ఈ ట్యుటానిక్ జాతులే ఉపకరించినవని పలువురు పండితుల అభిప్రాయము. క్రీ. పూ. 7 వ శతాబ్ది ప్రాంతమున వీరు ఉత్తర జర్మనీ, దక్షిణ స్వీడెన్, డెన్మార్క్, బాల్టిక్ తీరములు తమ నెలవులుగ చేసికొని ఉండినటుల తెలియవచ్చుచున్నది. అటనుండి క్రమముగ దక్షిణ, ఆగ్నేయ, పశ్చిమములకు వీరు వివిధ కాలములందు వలసల సాగించి, వశపరచుకొనిరి.

చీ. శే. రా.

**ట్రఫాల్గర్ యుద్ధము**: చూ. ఫ్రాన్స్.

**ట్రాట్‌స్కీ** (1879-1940): రష్యా విప్లవ నాయకుడు. సోవియట్ రాజ్య వ్యవస్థాపకులలో ఒకడు అయిన ఇతని నిజనామము లెవ్ డేవిడోవిచ్ బ్రాన్‌స్టీన్.

దక్షిణ రష్యాలోని సంపన్న యూదు రైతు బిడ్డగా జన్మించి, ఒడెస్సా యూనివర్సిటీలో విద్యను అభ్యసించెను. విప్లవ భావములను ప్రచారము చేసి, రాజకీయములలో పాల్గొనినందులకు యూనివర్సిటీనుండి బహిష్కరింపబడెను.

20 ఏండ్లు నిండక మునుపే రాజకీయ నేరస్థుడుగా సైబీరియాకు పంపబడెను. సైబీరియానుండి తప్పించుకొని ఇంగ్లండు వెళ్ళి (1902, అక్టోబరు), లెనిన్ [చూ.] తో కలసెను. 1905 ఫిబ్రవరిలో రష్యాకు తిరిగి వచ్చి సెయింట్ పీటర్స్ బర్గ్ (లెనిన్‌గ్రాడ్) వర్కర్స్ కౌన్సిల్ (సోవియట్) నాయకుడుగ - 1905 విప్లవమునందు - ప్రముఖ పాత్ర వహించెను. విప్లవము అపజయము పొందిన తరువాత బంధింపబడి మరల ఇతడు సైబీరియాకు పంపబడెను. అచ్చటినుండి మరోసారి తప్పించుకొని అంతర్జాతీయ సోషలిస్టు ఉద్యమమున ప్రముఖ పాత్ర వహించి, పెక్కు సంవత్సరములు విదేశములందు గడిపెను. ప్రథమ ప్రపంచ యుద్ధ సమయమున ఫ్రాన్స్, స్విజర్లండ్, స్పెయిన్ దేశములనుండి బహిష్కరింపబడి యునైటెడ్ స్టేట్స్ చేరెను. 1917 లో జార్ ప్రభుత్వ పతనానంతరము రష్యాకు తిరిగి వచ్చి పెట్రోగ్రాడ్ సోవియట్‌కు ఇతడు ప్రెసిడెంట్ అయ్యెను. లెనిన్ ప్రభుత్వములో తొలుతగ కామిసార్ (మంత్రి) అయ్యెను. బ్రెస్ట్‌లిటోవస్క్ సంధి (1918) [చూ.] సంభాషణలను సోవియట్ రష్యా పక్షమున ఇతడు నిర్వహించెను. అంతర్యుద్ధము ప్రారంభమైనప్పుడు లెనిన్ యుద్ధ మంత్రిగా ఇతనిని నియమించెను. 1918-20 అంతర్యుద్ధములో 'రెడ్ ఆర్మీ' ని వ్యవస్థాపించి బోల్షివిక్ పార్టీకి విజయమును సిద్ధింప చేసెను.

లెనిన్ జీవించి ఉండగనే తక్కిన నాయకులతో - ముఖ్యముగ స్టాలిన్‌తో - ఇతడు ఘర్షణలో పడెను. సోషలిస్టుసమాజము విజయవంతము అగుటకు విప్లవమును రష్యాకు మాత్రమే పరిమితము చేయక ప్రపంచములోని అగ్రరాజ్యములకు కూడ విస్తరింప చేయవలెనను శాశ్వత విప్లవసిద్ధాంతము (ట్రాట్స్కీసిద్ధాంతము) ను ట్రాట్స్కీ అవలంబించెను. స్టాలిన్ [చూ.] దీనిని వ్యతిరేకించెను. లెనిన్ మరణానంతరము పార్టీనాయకత్వము ట్రాట్స్కీకి దక్కకుండ చేసి, 1925 లో అధికారమునుండియు, 1927 లో బోల్షివిక్ పార్టీనుండియు, 1929 లో రష్యానుండియు ఇతనిని బహిష్కరింప జేయుటలో స్టాలిన్ విజయుడయ్యెను.

ప్రవాసమున ఉండియు స్టాలిన్ పరిపాలనా విధానమును విప్లవ వ్యతిరేకిగా చిత్రించుచు అతడు ప్రచారము చేసి, విప్లవసాధనకై నాలుగవ ఇంటర్నేషనల్‌ను స్థాపించి కృషిచేసెను; కాని, విఫలుడయ్యెను. 1940 లో మెక్సికోలో ట్రాట్స్కీ హత్య చేయబడెను. హంతకుడు స్టాలిన్ అనుయాయి అని అభిజ్ఞులలో పలువురి నిర్ణయము. రచయితగను, మేధావిగను సైతము ట్రాట్స్కీ పేరొందెను. మార్క్సు వాదమును గురించి అతడు రచించిన పలు గ్రంథములు ప్రపంచచరిత్రతో అతనికి గల సమగ్రపరిచితిని, విమర్శనాశక్తిని విశదము చేయుచున్నవి. పా. ల. నా.

**ట్రినిడాడ్ అండ్ టొబాగో :** పశ్చిమార్ధగోళము నందలి ఒక ద్వీపరాజ్యము.

వెనిజ్యులాదేశపు ఉత్తరతీరమునకు కొలది దూరమున కారబియన్‌సముద్ర పరివృతములై ఉన్న ఈ రెండు ద్వీపములును చేరి ఒక రాజ్యముగ వ్యవహృతములు అగుచున్నవి [వి] 5,128 చ. కి. మీ. (ఇందు టొబాగో 300 చ. కి. మీ.). [జ] 8,67,000. (ఇందు టొబాగో జ. సం. 33,333). మొత్తము జనసంఖ్యలో దాదాపు 2 లక్షల నీగ్రోలును, 180 వేలమంది భారతీయులును కలరు. తక్కినవారిలో అత్యధిక సంఖ్యాకులు మిశ్రమజాతివారు. [భా] ఇంగ్లీషు, హిందీ, ఫ్రెంచి, స్పానిష్ భాషలు వివిధ వర్గములందు మాతృభాషలుగ ఉన్నను, ఇంగ్లీషు మాత్రమే సాధికార జాతీయభాషగ పరిగణన పొందినది. [మ] ప్రజలలో 70% క్రైస్తవులు, 23% హిందువులు, ముస్లిములు 6%, ఇతరులు 1% కలరు. [రా] ట్రినిడాడ్ దీవియందున్న పోర్ట్ ఆవ్ స్పెయిన్ (జ. సం 1,21,150).

చరిత్ర : [ఈ రాజ్యపు చరిత్రయందలి పూర్వవివరములకు చూ. వెస్ట్ ఇండీస్]. 1961 లో వెస్ట్ ఇండీస్ ద్వీపసమాఖ్యనుండి ఈ రాజ్యము వేరై స్వతంత్రరాజ్యముగ రూపొంది, కామన్‌వెల్త్‌నందు సభ్యత్వము కలిగి స్వాతంత్ర్యము అనుభవించుచున్నది. బ్రిటిష్‌రాణికి ప్రతినిధిగ గవర్నర్ - జనరల్ ఇచట లాంఛనపు రాచరికమును వహించును. ఎన్నుకొనబడిన ఒక ప్రతినిధి సభయు, ఒక శిష్టసభయు ఇట శాసన నిర్మాణాధికారమును కలిగి ఉన్నవి. అధిక సంఖ్యాక పక్షపు నాయకుని ప్రధానమంత్రిగ నియమించి గవర్నర్-జనరల్ అతని సలహాను అనుసరించి మంత్రివర్గమునందలి తక్కిన మంత్రులను నియమించును. శాసనసభకు బాధ్యత వహించి మంత్రివర్గము పరిపాలన నిర్వహించును. [చూ. వెస్ట్ ఇండీస్]. చీ. శే. రా.

**ట్రూమన్, హారీ ఎస్.** (జ. 1884): యునైటెడ్ స్టేట్స్ 33 వ అధ్యక్షుడు. లామార్ (మిస్సోరీ స్టేట్)లో 1884, మే 8 న జన్మించెను. చిన్నతనమున వ్యవసాయ క్షేత్రమున పనిచేసి, యువకుడుగ కాన్సాస్‌నగరపు టైమ్ కీపర్‌గను, బ్యాంక్ గుమాస్తాగను జీవించి, ప్రథమప్రపంచ యుద్ధసమయమున సైనికుడుగ పాల్గొని, యుద్ధానంతరము చిన్నవ్యాపారము నడపి, విసివి, కడకు రాజకీయములలో ప్రవేశించెను.

వరుసగ సెనేట్ సభ్యుడుగ 1934, 1940 సంవత్సరములలో ఎన్నిక అయ్యెను. మొదటితూరి సెనేట్‌సభ్యుడుగ 'న్యూడీల్' విధానములను బలపరచెను. ద్వితీయ ప్రపంచ యుద్ధ ప్రభుత్వ వ్యయ కాలమున పరిశీలన సెనేట్ కమిటీకి

అధ్యక్షుడై యుద్ధకాంట్రాక్టులలో గల లోపములను బయటపెట్టి, శతకోటి బిలియన్ డాలర్ల వృథాఖర్చును తగ్గించి, దేశవ్యాప్తముగా కీర్తిని ఆర్జించెను. డెమోక్రాటిక్ పక్షమునందలి వివిధ వర్గములకును ఉపాధ్యక్షుడు అయ్యెను. 1944 లో ప్రెసిడెంట్ రూజ్ వెల్ట్ మరణానంతరము ఇతడు అధ్యక్ష పదవిని స్వీకరించెను.



హారీ, ఎస్. ట్రూమన్

(జ. 1884)

ఆటంబాంబు [చూ. సం. 2 - పు 167] ప్రయోగమునకు అనుమతించి, జపాన్ పై యుద్ధము త్వరితగతిలో ముగించుటయే కాక, యుద్ధానంతర శాంతి సాధనకై పోట్స్‌డామ్ సమావేశము [చూ.] న పాల్గొని, అనంతరమున పటిష్ఠమైన ఐక్యరాజ్యసమితి నిర్మాణమునకు ఈయన కృషిసల్పెను. యుద్ధానంతరమున స్వదేశములో తలెత్తిన కార్మికసమస్యలను సమర్థతతో ఎదుర్కొనెను.

యుద్ధానంతరమున (1946 - 47) వివిధ దేశములందు కమ్యూనిజమ్ [చూ. పు. 366] సాధించిన శీఘ్రవ్యాప్తిని అరికట్టుటకై మార్షల్ ప్రణాళిక ద్వారా వివిధ యూరపియన్ దేశములకు సాయపడెను [చూ. పు. 156]. ఆ ప్రణాళికకు మూలమగు రాజకీయాశయమునకు ఇతని పేర 'ట్రూమన్ సిద్ధాంతము' అను పేరు కలిగినది. వెనుకబడిన దేశముల పురోభివృద్ధికి ఆర్థిక, సాంకేతిక సహాయమును ఇతోధికముగ అందజేసి, ఆ యా దేశములలో కమ్యూనిజమ్ వ్యాపించకుండా చేయవచ్చుననే సంకల్పముతో 'పాయింట్ ఫోర్ ప్రోగ్రామ్' ప్రవేశపెట్టెను.

రెండవసారి (1948) ప్రెసిడెంట్‌గా ఎన్నికైన తరవాత సోవియట్ రష్యా సైన్యపు బెడదనుండి యూరప్‌ను రక్షించుటకై 'ఉత్తర అట్లాంటిక్ రక్షణ వ్యవస్థ' [చూ. పు. 337] ను రూపొందించెను. దక్షిణ కొరియాపై కమ్యూనిస్టుల దాడిని నిరోధించుటకు ఐక్యరాజ్యసమితి ఆధిపత్యమున పంపబడిన సమితి దళములందు యునైటెడ్ స్టేట్స్ సేనలు ప్రముఖముగ పాల్గొనుటకు ఈయన విదేశాంగ నీతియే ముఖ్యకారణము. పదవినుండి వైదొలగిన తరువాత పౌర, సాంఘిక కార్యక్రమములలో ఈయన శ్రద్ధ వహించెను. ఇతని రచనలు: 'ఇయర్ ఆవ్ డెసిషన్స్ (1955); 'మిస్టర్ సిటిజన్ (1960)'; 'ది మాన్ ఆవ్ ఇండిపెండెన్స్ (1950)' మొదలగునవి. పా. ల. నా.

**ట్రేజన్** (క్రీ. శ. 53 - 117): రోమన్ చక్రవర్తి; మహావీరుడు. స్పెయిన్‌లో ఒక ఇటాలియన్ సైనిక కుటుంబములో జన్మించెను. 10 ఏళ్ళ పాటు స్పెయిన్, సిరియా దేశములలో ఉన్నత సైనికోద్యోగములు చేసి, 89 నాటికి యుద్ధవీరుడుగ గొప్ప కీర్తి సంపాదించెను. 91 లో నెర్వా చక్రవర్తి ఈతని పరాక్రమమునకు మెచ్చి, జర్మనీకి 'కాన్సల్' గా చేయడమే కాక, తన వారసునిగా దత్తత చేసికొనెను. 98 లో నెర్వా చనిపోగా, ట్రేజన్ చక్రవర్తి అయ్యెను. పరదేశీయుడు రోమన్ చక్రవర్తి అగుట ఇదే తొలిసారి.

చక్రవర్తి అయిన వెంటనే ట్రేజన్ తన సామ్రాజ్య విస్తరణమునకు పూనుకొనెను. డేసియా, పార్థియా యుద్ధములలో పార్థియా, మెసపొటేమియా, ఆర్మీనియా, అసీరియా మొదలైన తూర్పుదేశములను జయించెను. ఆ యుద్ధములకు కావలసిన అపార ధనమును కఠినమైన పన్నులను విధించుటవలన కాక, వర్తక వ్యాపారములు, వ్యవసాయ పరిశ్రమలు వృద్ధిచేసి, దేశాదాయము హెచ్చు చేయుటవలన సమకూర్చుకొనెను. జయించిన రాష్ట్రముల పాలకులుగా తనతో సమానులైన సమర్థులను నియమించెను. ట్రేజన్ గొప్ప కళాపోషకుడు. రోమ్‌నగరములోను, ఇటలీ దేశమంతటను కోట్లధనము వెచ్చించి మహాభవనములు, ఆనకట్టలు, వంతెనలు, రోడ్లు నిర్మించెను. వాటి శిథిల భాగములు నేటికిని అతని కళాప్రియత్వమును చాటుచున్నవి. వి. నా.

**డంబర్టన్ ఓక్స్ సమావేశము**: వాషింగ్‌టన్ రాష్ట్రములోని డంబర్టన్ ఓక్స్ వద్ద 1944, ఆగస్టు 21 మొదలుకొని సెప్టెంబరు 27 వరకు జరిగిన సమావేశము. ఈ సమావేశమున యునైటెడ్ స్టేట్స్, బ్రిటిష్ కామన్ వెల్త్, సోవియట్ రష్యా దేశములు పాల్గొనినవి. ఈ సమావేశ ఫలితముగా ఒక అంతర్జాతీయ సంస్థను నిర్మించుటకు స్థూలముగ ఒక పథకమును తయారుచేయవలయుననియు, దానిలోని వివరణములను మున్ముందు రూపొందించుకొనవచ్చుననియు ఒక సూచన జరిగినది [చూ. ఐక్యరాజ్యసమితి - పు. 351].

* * *

**డచ్చి ఈస్ట్ ఇండియా కంపెనీ**: ప్రాచ్య దేశములందు డచ్చి సామ్రాజ్యమును నెలకొల్పిన ఒక వర్తక సంస్థ. 1602, మార్చి 20 వ తేదీని ఒక డచ్చి ప్రభుత్వ శాసనమును అనుసరించి ప్రఖ్యాతమగు ఈ కంపెనీ స్థాపితము అయ్యెను. చిన్న చిన్న అనేక వర్తక సంఘములను సంకలితము చేయుటవలన ఈ ఈస్ట్ ఇండియా కంపెనీ రూపొందెను. మెజెల్లాన్ జలసంధికిని, గుడ్ హోప్ అగ్రమునకును మధ్య

ఉన్న ప్రదేశములో గుత్తవర్తకము చేసికొనుటకు అనుమతి ఇచ్చుటయే కాక, అక్కడి వారితో ఒడంబడికలు చేసి కొనుటకును, అచ్చట కర్మాగారములు నిర్మించుకొనుటకును కూడ డచ్చి ప్రభుత్వము ఈ కంపెనీకి అనుమతి ఒసగెను. ఇట్లు బ్రిటిష్‌వారి వలెనే డచ్చివారు కూడ వర్తక స్థానములలో కోటలను కట్టుకొని అక్కడ నిలుకడగ కొంత సైన్యమును ఉంచుకొనుటకు వీలుపడెను. ఆ తరువాత 1650 నాటికి ఇండియా వద్ద ఉన్నద్వీప సమూహములందలి సుమత్రా, జావా, సింహళము మొదలగు వలసలు ఈ కంపెనీకి స్వాధీనమైనవి. 1798 లో ఈ ప్రదేశములు అన్నిటిని డచ్చి ప్రభుత్వమునకు అప్పగించుటతో కంపెనీ యొక్క పేరే రూపుమాసి పోయెను. వి. నా.

**డచ్చిదేశము :** చూ. నెదర్‌లండ్స్.

**డఫ్రిన్** (1826 - 1902)**:** ఈయన పూర్తి పేరు ఫ్రెడరిక్ టెంపిల్ హామిల్టన్‌బ్లక్‌వుడ్ డఫ్రిన్. బ్రిటిష్ రాజనీతిజ్ఞుడు. 1872 - 78 మధ్య కెనడాకు గవర్నర్ - జనరల్. తదుపరి రష్యా, టర్కీ, ఇటలీ, ఫ్రాన్స్ దేశములలో రాయబారిగా పనిచేసి, రిప్పన్ ప్రభువు [చూ.] అనంతరము 1884 లో భారత దేశమునకు వైస్రాయిగా వచ్చెను.



డఫ్రిన్
(1826 - 1902)

డఫ్రిన్ వైస్రాయిగా వచ్చు సమయమునకు ఆఫ్ఘన్ సమస్య ప్రముఖముగ ఉండెను. ఆఫ్ఘనిస్తాన్ ఉత్తర సరిహద్దు నిర్ణయము విషయమున రష్యా - బ్రిటన్ దేశములకు విభేదములు ఏర్పడి యుద్ధమునకై ఇరువురును తీవ్ర సన్నాహములు చేసికొనిరి. కాని, ఆఫ్ఘన్ పరిపాలకుడగు అబ్దుల్‌రహమాన్ చాతుర్యమువలన సామరస్యము కుదిరి యుద్ధప్రమాదము అంతరించినది.

కాని, ఈ యుద్ధప్రమాదములకు భారతీయ స్వదేశ సంస్థానములు చేసిన సహాయమువలన ఇంపీరియల్ సర్వీసు సైన్యములు ఏర్పరుపబడినవి. అందు భారతీయ సేనాధిపతులు ఉందురు. వారు బ్రిటిష్ సర్వసైన్యాధిపతి పర్యవేక్షణలో ఉందురు. అవసరసమయములలో ఆ సేనలు బ్రిటిష్ ప్రభుత్వమునకు తోడ్పడును.

డఫ్రిన్ హయామునందే తృతీయ బర్మాయుద్ధము జరిగినది. బర్మారాజగు తీబా బ్రిటిష్ ప్రభుత్వముతో పొత్తును అపేక్షింపక ఆంగ్లవర్తకులను బాధించుచున్నాడను నెపముపై డఫ్రిన్ అతనికి అంత్యసందేశము పంపెను. అందులో తీబారాజు బ్రిటిష్ రాయబారిని స్వీకరింపవలెననియు, బ్రిటిష్‌ప్రభుత్వపు సలహాల ప్రకారమే బర్మా విదేశీయ వ్యవహారములు సాగవలెననియు, బర్మారాజు బ్రిటిష్‌వారి వర్తకములో జోక్యము కలిగించుకొనరాదనియు విధించెను. 1885, నవంబరు 10 వ తేదీతో ఆ సందేశపు గడువు పూర్తియగుటతో బ్రిటిష్ నౌకాదళము మాండలేను ఆక్రమించుకొనినది. తీబారాజు లొంగిపోయెను. 1886లో డఫ్రిన్ ఎగువ బర్మాను ఆక్రమించుకొని దిగువ బర్మాతో ఏకము చేసెను [చూ. బర్మా].

డఫ్రిన్ హయాములోనే 1885 లో భారతజాతీయ కాంగ్రెస్ మహాసభ ఏర్పడినది. వి. నా.

**డరయస్ :** చూ. దుర్యాష.

**డల్‌హౌసీ** (1812 - 1860)**:** ఇతని పూర్తిపేరు జేమ్స్ ఆండ్రూ బ్రౌన్ రామ్సే డల్‌హౌసీ. బ్రిటిష్ రాజనీతివేత్త. ఇండియా గవర్నర్-జనరల్ (1848 - 1856). ఇతడు గవర్నర్-జనరల్‌గా వచ్చిన తర్వాత నాలుగేండ్ల వరకును ద్వితీయ సిక్కు యుద్ధమును, ద్వితీయ బర్మా యుద్ధమును నడపవలసివచ్చినది. ప్రథమ సిక్కు యుద్ధము అనంతరము 1846 లో జరిగిన లాహోర్ సంధి షరతుల ప్రకారము సట్లెజ్‌నదికి ఎడమవైపుగల కొన్ని ప్రాంతములు, జలంధర్, గంగా - యమునా మధ్యదేశము మాత్రమే బ్రిటిష్‌వారికి సంక్రమించినవి. కాని, తక్కిన పంజాబ్ దేశమంతా దిలీప్‌సింగ్ అను రాకుమారునికే విడిచిపెట్టడమయినది. ద్వితీయ సిక్కు యుద్ధములో [చూ. సిక్కులు] బ్రిటిష్ వారు మొదట ఓడిపోయినను, తుదకు 1849, జనవరి 21 న ముల్తాన్ బ్రిటిష్‌వారికి వశపడినది. బ్రిటిష్ వారు విజయులైరి. పంజాబ్ దేశమును భారతదేశ సామ్రాజ్యమందు ఒక రాష్ట్రముగ డల్‌హౌసీ చేర్చుకొనెను.



డల్‌హౌసీ
(1812 - 1860)

ప్రథమ బర్మా యుద్ధము అనంతరము 1826 లో జరిగిన సంధిషరతుల ప్రకారము బర్మా దక్షిణ సముద్రతీరమున వసతులు ఏర్పరచుకొన్న బ్రిటిష్, భారతదేశ వర్తకుల హక్కులను కాపాడుటకు మరియొక యుద్ధము సాగింపవలసి వచ్చినది [చూ. బర్మా]. 1852 లో ప్రోమ్, పెగూ మండలములు బ్రిటిష్‌వారు తీసికొని తమ సామ్రాజ్యమందు

చేర్చుకొనిరి. దీనివలన బంగాళాఖాతమందలి తూర్పు సముద్రతీరము అంతా బ్రిటిష్‌వారి పరిపాలనములోనికి వచ్చినది.

అఫ్ఘనిస్తాన్ పాలకుడగు దోస్త్ మహమ్మద్ [చూ.] తో 1855 లో మైత్రి సమకూర్చుకొని, డల్‌హౌసీ వాయవ్య ప్రాంతమందు శాంతిభద్రతలు సంరక్షించుకొనెను.

భారతదేశములో ప్రజల క్షేమమును స్వదేశపరిపాలకులకంటె బ్రిటిష్ పరిపాలకులే ఎక్కువగ కాపాడగలరను నిండునమ్మకముతో డల్‌హౌసీ దేశమందలి అన్ని భాగములను బ్రిటిష్ పరిపాలనములోనికి తెచ్చుటకు తగిన అవకాశము ఎప్పుడువచ్చునా అని ఎదురుచూచుచుండెను. ఏ యే స్వదేశరాజ్యములందు పుత్రసంతానములేక రాజులు చనిపోవుచుండిరో అట్టి రాజుల రాజ్యములను బ్రిటిష్ సామ్రాజ్యమున కలిపివేయుట ధర్మయుతమని అతడు భావించెను. అట్టి రాజులకు దత్తపుత్రులు ఉన్నను వారికి రాజ్యాధికారము కలుగదని అతడు ప్రకటించెను. ఈ విధానమును అనుసరించి అతడు సతారా, బుందేల్‌ఖండ్, సంబల్‌పూర్, ఝాన్సీ, నాగపూర్, ఆర్కాట్, తంజావూరు రాజ్యములను వశపరచుకొనెను. 1853 లో మాజీ పీష్వా బాజీరావు - II చనిపోగానే అతనికి ఇచ్చుచుండిన 8 లక్షల వార్షిక భరణమును అతని దత్తపుత్రుడైన దండుపంత్ (ఉరఫ్ నానాసాహెబ్) కు ఇచ్చుట డల్‌హౌసీ ఆపివేసెను. హైదరాబాద్ నిజామ్ బ్రిటిష్‌వారికి ప్రతి సంవత్సరము చెల్లించవలసిన పైకము సక్రమముగ చెల్లించుట లేదన్న నేరము మోపి, రావలసిన పైకమును జమ కట్టుకొనుటకు బీరార్ మండలమును డల్‌హౌసీ 1853 లో స్వాధీనము చేసికొనెను.

అయోధ్య పరిపాలనము ప్రజలకు పీడాకరముగ ఉన్నదన్న కారణముచేత డల్‌హౌసీ తాను భారతదేశము నుండి వెడలిపోవుటకు ముందు 1856 లో దానిని స్వాధీనపరచుకొనెను.

ఈతని కాలమున భారతదేశములో పరిపాలన విషయమందును, ప్రజల శాంతిభద్రతల విషయమందును, అభ్యుదయాభివృద్ధి విషయమందును అనేక సంస్కరణలు జరిగినవి. కేంద్రప్రభుత్వ యంత్రాంగము సంస్కరింపబడినది. ఒక మండలమునుండి మరియొక మండలమునకు పోవు బాటలు రాకపోకల సౌకర్యములకు అనుకూలముగా వేయబడినవి. గంగానదినుండి ఒక కాలువ పెద్ద పడవలు పోవుటకు అనుకూలముగా త్రవ్వబడినది. రైలు బాటలు ప్రారంభింపబడినవి (1853). తపాలా సౌకర్యములు చక్కబడినవి. తంతివిధానము ప్రారంభమయినది. విద్యావిధానము యథోచితముగా సంస్కరింపబడినది. సాంకేతిక విద్యా వ్యాప్తికై రూర్కీలో ఇంజనీరింగ్ కాలేజీ స్థాపింపబడినది. గి. వేం. సీ.

**డిజ్‌రేలీ, బెంజమిన్** (1804 - 81) : బ్రిటిష్ రాజనీతిజ్ఞుడు ; పరిపాలకుడు. ఇతని తలిదండ్రులు 1817 లో యూదుల మతమును విసర్జించి, ఇతనికిని, తక్కిన పిల్లలకును క్రైస్తవమతమును ఇప్పించిరి. పార్లమెంట్ సభ్యుడు అగుటకు 5 సార్లు ప్రయత్నించి కృతకృత్యుడు కాక, తుదకు ఇతడు 1837 లో నెగ్గెను. 1868 లో కన్సర్వేటివ్ పక్షనాయకుడుగా ప్రధానమంత్రి అయినను, వెంటనే మంత్రివర్గము పడిపోయినది. 1874 లో మరల ప్రధానమంత్రి అయ్యెను. నవీన బ్రిటిష్‌సామ్రాజ్యమునకు మూలపురుషుడు ఇతడే.



బెంజమిన్ డిజ్‌రేలీ

(1804 - 1881)

ఈజిప్టు పరిపాలకునినుండి సూయజ్ కాలువ తాలూకు వాటాలను కొనుగోలుచేసి బ్రిటన్‌నుండి భారతదేశమునకు పోవు మార్గమును బలపరచెను. విక్టోరియారాణి భారతదేశ సామ్రాజ్య చక్రవర్తిని అగుటకు ఇతని ప్రోత్సాహము ఎక్కువగ తోడ్పడినది. విదేశాంగనీతి విషయములో రష్యా అధికారమువల్ల నష్టమురాకుండ చేయుటకు టర్కీని బలపరచు మార్గమును ప్రోత్సహించెను. బెర్లిన్ కాంగ్రెస్ [చూ.] న బ్రిటన్‌కు మంచిపేరు తెచ్చెనన్న ఘనతకు ప్రతిఫలముగ ఇతనికి రాణి 'ఎర్ల్ ఆవ్ బీకన్స్‌ఫీల్డ్' అనుబిరుదము ఇచ్చి ప్రభువుల సభలో సభ్యునిగా చేసెను. గి. వేం. సీ.

**డీగాలీ, చార్లెస్** (జ. 1890) : సుప్రసిద్ధ ఫ్రెంచి సేనాని. రాజనీతిజ్ఞుడు. ఫ్రాన్సు అధ్యక్షుడు. 1890, నవంబరు 22 న లిల్లీ నగరమున జన్మించి, సెయింట్‌సిర్ సైనిక కళాశాలనుండి పట్టభద్రుడు అయ్యెను. ప్రథమ ప్రపంచ యుద్ధమున 1916 లో పట్టుబడే వరకు అద్భుత ధైర్యసాహసాలను చూపెను. జర్మనుల వలన రానున్న ప్రమాదమును ముందుగనే గుర్తించి యాంత్రిక యుద్ధమునకు ఫ్రాన్సు ఆయత్తము కావలెనని తాను రచించిన 'భావికాలపు సైన్యము' అను అర్థమొసగు పేరుగల గ్రంథమున (1934) హెచ్చరించెను.

ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున జాతీయ రక్షణ సహాయ కార్యదర్శిగ ఇతనిని అప్పటి ప్రభుత్వాధ్యక్షుడు నియమించెను. ఫ్రాన్స్ - జర్మనీ యుద్ధ విరమణ సంధిని (1940) వ్యతిరేకించి, లండనుకు పారిపోయి, అచ్చట స్వతంత్ర ఫ్రెంచి సైన్యమును ఇతడు వ్యవస్థాపించెను.

ఉత్తర ఆఫ్రికాలో మిత్రరాజ్యసేనలు దిగి (1942), అచట నుండి అక్షరాజ్యసేనలను తరిమి వేయుటలో, అచటి ఫ్రెంచి సేనలతోపాటుగ డీగాలీ ఆధ్వర్యవమున స్వతంత్ర ఫ్రెంచి సేనలును సహకరించినవి. ఉత్తర ఆఫ్రికాలో మిత్ర రాజ్య సేనలు విజయమును పొందిన తరువాత జనరల్ ఎచ్. ఎచ్. గిరా అను వేరొక ఫ్రెంచి జాతీయ వాదితో కలసి డీగాలీ ఆల్జీరియాలో 1943, జూన్‌లో నేషనల్ లిబరేషన్ ఫ్రెంచి కమిటీని ఏర్పరచెను. ఈ కమిటీనుండి గిరాను తొలగించి, 1944, జూన్‌లో ఫ్రాన్స్ తాత్కాలిక ప్రభుత్వమును డీగాలీ ప్రకటించెను. ఆగస్టు 26 కు ఇతని ప్రభుత్వము పారిస్‌కు తరలించబడి, అక్టోబరు నాటికి ప్రధాన మిత్రరాజ్యములు అన్నిటిచేతను గుర్తింపబడెను. 1945, నవంబరులో ఫ్రెంచి నాలుగవ గణరాజ్య తాత్కాలిక అధ్యక్షుడుగ ఏకగ్రీవముగ ఇతడు ఎన్నిక అయ్యెను. కాని, వామపక్షములు తనను బలపరచనందున 1946, జూన్‌లో అధ్యక్ష పదవికి రాజీనామా చేసెను. తరువాత 1953 ఎన్నికలలో పరాజయమును పొంది, తన పార్టీని రద్దుచేసి, ఇతడు రాజకీయములనుండి విరమించుకొనెను. 1958 లో ఆల్జీరియాలో తిరుగుబాటు వచ్చి ఫ్రాన్స్‌లో అంతర్యుద్ధము సంభవించు పరిస్థితులు ఏర్పడినప్పుడు దేశ సమైక్యతను నిలబెట్టగలిగిన ఏకైక వ్యక్తిగ ఇతడు గుర్తింపబడెను. ఆల్జీరియా [చూ.] సమస్య పరిష్కరణ, నూతన రాజ్యాంగ నిర్మాణ వాగ్దానములతో శాసనాధికారము గల ప్రధానిగ జూన్ 1 న డీగాలీ ప్రభుత్వమును ఏర్పరచెను. 1958, సెప్టెంబరులో ఇతని నూతన రాజ్యాంగము ప్రజామోదమును పొందెను. ఐదవ గణరాజ్య అధ్యక్షుడుగా ఎన్నుకొనబడి 1959, జనవరి 8 న డీగాలీ పదవీ స్వీకారము చేసెను. ఆ తరువాత ఆల్జీరియా ప్రజలకు స్వయంనిర్ణయాధికారమును ఇచ్చి వారి సమస్యను పరిష్కరించెను. ఫ్రాన్స్ పురాతన వైభవమును మరల రూపొందించుటకును, అణ్వాయుధములు గల రాజ్య ముగ ఫ్రాన్స్‌ను సిద్ధము చేయుటకును, కొన్ని సందర్భము లందు యునైటెడ్ స్టేట్స్, గ్రేట్ బ్రిటన్ సద్భావమును త్రోసిరాజనియు ఇతడు విశేషముగ కృషిచేసెను. తత్ఫలితముగా పశ్చిమ రాజ్యములలో ఇతని విధానములు వివాదాస్పదములైనవి. 1965, డిసెంబరులో జరిగిన ఎన్నికలలో అధ్యక్షుడుగ మరల ఇతడు ఎన్నుకొనబడెను. పా. ల. నా.

**డీవెలరా, ఎమన్** (జ. 1882): ఐర్లాండ్ జాతీయ నాయకుడు; రాజనీతివేత్త; చాలకాలము ప్రధాని; అధ్యక్షుడు (1959 నుండి). ఈయన న్యూయార్క్‌లో జన్మించి, డబ్లిన్ రాయల్ యూనివర్సిటీలో పట్టభద్రుడై, కొంతకాలము గణితశాస్త్ర అధ్యాపక వృత్తిని చేపట్టెను. 1913 లో స్థాపితమైన ఐరిష్ వాలంటీర్ దళములో డీవెలరా ప్రముఖ నాయకుడై, విఫలమైన ఈస్టర్ విప్లవము (1916) లో ప్రధాన పాత్ర నిర్వహించెను. ఆంగ్ల ప్రభుత్వము మొదట ఈయనకు మరణశిక్ష విధించినను, ఇతడు అమెరికాలో జనించుటచే అది యావజ్జీవ కారాగార శిక్షగా మార్చబడెను. కాని, 1917 లో శిక్షితులు అందరితో పాటు ఈయన కూడ విమోచన పొందెను. ఆ సంవత్సరము ననే అక్టోబరులో ఐర్లాండ్ జాతీయ రాజకీయ పక్షమగు సిన్‌ఫెయిన్ సంపూర్ణ స్వాతంత్ర్యమే తన లక్ష్యముగా తీర్మానించి, మున్ముందు ఏర్పడనున్న ఐరిష్ గణరాజ్యము నకు డీవెలరాను అధినేతగా వరించెను. విద్రోహకర చర్యలకు ఉద్యమించుచున్నాడన్న సాకుతో ఆంగ్ల ప్రభుత్వము 1918 లో ఈయనను మరల ఇంగ్లండులో నిర్బంధించెను. కాని, మరుసటి సంవత్సరమే ఈయన చెరసాలనుండి తప్పించుకొని, యునైటెడ్ స్టేట్స్‌కు పారి పోయి, ఐరిష్ గణరాజ్యపు అప్పుపత్రముల జామీనుపై ఆ దేశమున కొంత ధనమును సేకరించెను. సమగ్ర ఐర్లాండ్ నుండి ఉత్తర ఐర్లాండ్ వేరుచేయబడిన కారణమును పురస్కరించుకొని ఈయన 1921 లో కుదిరిన ఆంగ్లో - ఐరిష్ సంధిని తీవ్రముగ వ్యతిరేకించెను. స్వదేశమునకు తిరిగి వచ్చి 1923 లో ఈయన మూడవసారి నిర్బంధింపబడి, మరుసటి సంవత్సరము విడుదల పొందెను. 1926 లో డీవెలరా 43 అనుచరులతో సహా డయల్ (పార్లమెంట్)కు ఎన్నుకొనబడి క్రమముగా అధిక సంఖ్యాబలమును సమ కూర్చుకొని 1932 లో డయల్ అధ్యక్షపదవిని, నూతన రాజ్యాంగరీత్యా 1937 లో ప్రధాని పదవిని చేపట్టెను. 1932 లో నానాజాతి సమితి [చూ.] కార్యాచరణసంస్థకు, 1938 లో అసెంబ్లీ సమావేశమునకు అధ్యక్షత వహించి, ఈయన తన ప్రతిష్ఠను పెంపొందించుకొనెను. ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున ఈయన తన దేశ తాటస్థ్యమును ప్రకటించుట మిత్రమండలికి కొంత కోపకారణమైనను ఈయన తన నిశ్చయమున చలింపలేదు. 1948 ఎన్నికలలో ప్రతిపక్షములు అన్నియు ఏకమై తన పార్టీని ఓడింపగలిగి నను, మూడేండ్ల తరువాత స్వతంత్ర సభ్యుల సహాయముతో

డీవెలరా మరల ప్రధాని పదవిని (1951-54) అధిష్ఠించెను. 1957 ఎన్నికలవలన ప్రధాని పదవి ఈయనకే లభించెను. కాని, దృష్టివైకల్యము వలన ఈయన 1959 లో ప్రధాని పదవిని విరమించి, ప్రభుత్వ అధ్యక్ష పదవిని స్వీకరించెను.

నిజాయితీ కల తన రాజకీయ చతురతవలననే కాక, తన పరిపూర్ణ విద్వత్తవలన సైతము డీవెలరా ప్రజానురాగమును చూరగొనెను. ఐర్లాండ్ జాతీయ యూనివర్సిటీకి ఈయన 1921 నుండి ఛాన్సలర్. ఐరిష్ భాషా పునర్వికాసమునకు ఎనలేని దోహదము చేసెను. అ. వెం.

**డురాండ్‌రేఖ** : భారత ఉపఖండమును ఆఫ్ఘనిస్తాన్ నుండి వేరుపరచు సరిహద్దు రేఖ. రెండవ ఆఫ్ఘన్ యుద్ధానంతరమున బ్రిటిష్ ఆక్రమిత భారతప్రభుత్వమునకును, ఆఫ్ఘనిస్తాన్‌నకును మధ్యగల పర్వతసీమలలో వసించు కొండజాతుల విషయము ఒక విషమ సమస్యగ పరిణమించెను. ఈ జాతులు అటు ఆఫ్ఘనిస్తాన్ ప్రభుత్వమును గాని, ఇటు భారతప్రభుత్వమునుగాని మన్నించెడువారు కారు. తమ సరిహద్దులను ముందులకు జరుపుటయే అప్పటిలో తమ ముఖ్య విధానముగ ఇడుకొనిన బ్రిటిష్ సామ్రాజ్యప్రభుత్వము ఈ కొండజాతులు వసించు ప్రాంతములును తమ పలుకుబడికి లోనైనవనియే వాదింపసాగినది. అంతట ఉభయప్రభుత్వములకును ఆ పర్వతసీమలందు కల పలుకుబడి ప్రాంతముల మధ్య సరిహద్దును నిర్ణయించుటకై సర్ మార్టిమర్ డురాండ్ అధ్యక్షతన ఒక సరిహద్దు కమీషన్ నిర్ణయింపబడినది. ఆ కమీషన్ కృషి ఫలితముగ నిర్ణయింపబడిన (1892) సరిహద్దు రేఖయే 'డురాండ్ రేఖ (డురాండ్ లైన్)' అని వ్యవహరింపబడుచున్నది. భారత ఉపఖండము స్వాతంత్ర్యమును ఆర్జించిన తరువాత పాకిస్తాన్, ఆఫ్ఘనిస్తాన్‌లకు ఇది సరిహద్దురేఖ అయినది. చీ. శే. రా.

**డూప్లే, జోజెఫ్‌సోయ్** (1697 - 1763): ఇతడు ఫ్రెంచి ఇండియాను పాలించిన గవర్నర్-జనరల్. లాండర్సీ (ఫ్రాన్స్)కి సమీపమునగల నోర్డ్ పట్టణమున జన్మించెను. 1715 లో ఫ్రెంచి తూర్పు ఇండియా కంపెనీలో ఉద్యోగిగా ప్రవేశించి, 1720 లో పుదుచ్చేరిలో సలహాసంఘములో సభ్యుడుగ ఎన్నుకొనబడెను. 1730 లో ఫ్రెంచి వ్యవహార శాఖకు పర్యవేక్షకుడుగ నియమింపబడి, అతి నిపుణతతో వ్యవహారములు చక్కబెట్టుటచేత 1742 లో గవర్నర్-జనరల్ పదవిని పొందెను. 1740 లో ఫ్రాన్స్, ఇంగ్లండు దేశములమధ్య యుద్ధము వచ్చినపుడు భారత దేశములో ఫ్రెంచివారి అధికారమును పెంపొందింప చేయుటకు ఎక్కువ పాటుబడెను. దేశీయ ప్రభువులతో సన్నిహిత సహకారముల నెరపి వారి ఆదరాభిమానములకు పాత్రుడయ్యెను. 1747 లో సెయింట్ డేవిడ్ కోటను ముట్టడించి కర్ణాటక దేశమున అంతటను అక్కడక్కడ తమ సేనలను నిలిపెను. అట్లు దక్షిణ భారత దేశమును అంతను తమ పాదాక్రాంతము చేసికొనుటకు ప్రయత్నములు సల్పెను. ఒకప్పుడు దేశీయ ప్రభువులు ఇతనిని రాజప్రతినిధిగా కూడ చేసికొనిరి. కాని, క్లైవ్ [చూ. పు. 416] ఇతనిని ఓడించుటతో ఇతని ఆశలన్నియు అడియాసలు అయ్యెను. తత్ఫలితముగ 1754 లో ఫ్రెంచి ప్రభుత్వము ఇతనిని స్వదేశమునకు పిలిపించుకొనెను. ఫ్రెంచి ప్రభుత్వమునకు ఇతడు చేసిన అమూల్యమైన సేవకు ఇతడు తగు విధముగా బహూకృతుడు కాలేకపోయెను. చిట్టచివరకు ఫ్రెంచి గవర్నర్లలో ఘనుడైన ఈతడు బీదరికము అనుభవించి, 1763, నవంబరు నెల 10 వ తేదీని చనిపోయెను. గి. వేం. సీ.

**డూబ్రియల్** (1885-1945): ఫ్రెంచి జాతీయుడగు శాసనవేత్త; చరిత్ర రచయిత. ఇతడు సైగాన్‌లో జన్మించెను; సైగాన్, పారిస్‌నగరములలో విద్యాభ్యాసము చేసి, డాక్టరేట్ పట్టమును పొందెను; తరువాత పుదుచ్చేరి కొలోనియల్ కాలేజీలో ఆచార్య పదవిని చేపట్టెను. ఇచ్చటనే డూబ్రియల్ హైందవ విజ్ఞానముచే ఆకృష్టుడై చాలకాలము శాసన పరిశోధనలో అవిరళ కృషి కొనసాగించెను. దక్షిణభారత దేశమున 6 వ శతాబ్దమునకు పూర్వము దేవాలయనిర్మాణము కర్ర, ఇటిక, సున్నమువంటి చెడిపోవు ద్రవ్యములతో చేయుటకు ప్రయత్నములు జరిగినవనియు, తదుపరి పల్లవరాజు మహేంద్రవర్మ శిలలను తొలచి దేవాలయములను నిర్మించు పద్ధతికి అంకురార్పణ చేసినవాడు అనియు డూబ్రియల్ నిరూపించెను; అనేక శిలలను, శిలాశాసనములను కూలంకషముగ పరిశోధించి, పల్లవరాజుల చరిత్ర రచించెను. ఇతని అనుశీలనముల మూలమున అనేక దక్షిణభారత దేశ చారిత్రకాంశములు వెలుగు చూచినవి. అ. వెం.

**డెన్మార్క్** : మధ్య యూరప్‌న ఈశాన్య తీరమందు ఉన్న ఒక స్వతంత్ర రాజ్యము.

ఈ దేశము ఒక ద్వీపకల్పము. స్కాగ్ రాక్ అను సముద్ర భాగము [ఉ]; కట్టెగాట్, ఓరిసండ్ సింధుశాఖలు, బాల్టిక్ సముద్రము [తూ]; నార్త్‌సముద్రము [ప]; జర్మనీ [ద] సరిహద్దులు. ఈ ద్వీపకల్పమును ఆశ్రయించిన దాదాపు 500 అల్ప ద్వీపములును, దూరమున ఫారోదీవులు, గ్రీన్‌లాండ్ ఈ రాజ్యభాగములుగనే పరిపాలన రీత్యా పరిగణింపబడుచున్నవి. [వి] వీనిని అన్నింటిని కలుపుకొని ఈ రాజ్యపు విస్తీర్ణము 42,880 చ. కి. మీ.; [జ] 45,85,256. ఈ దేశవాసులను డేన్‌లని వ్యవహరింతురు. [మ] వీరిలో అధిక సంఖ్యాకులు లూథరన్ చెర్చికి చెందిన క్రైస్తవులు. [భా] జాతీయభాష డేనిష్. ఇంగ్లీషు,

జర్మను భాషలతోను పలువురకు పరిచితి కలదు. [రా] కోపెన్ హేగన్ (కోబెన్ హేవ్న్) (జ. సం. 7,37,597).




చరిత్ర: డెన్మార్క్ ప్రాచీన చరిత్రను గురించిన వివరములు అంతగ తెలియవచ్చుట లేదు. 8 వ శతాబ్దము మొదలుగ కొంతకాలము ఇంగ్లండు మొదలగు దేశములపై దండయాత్రలు సలిపిన వైకింగ్‌లను నావిక యోధజాతి ఈ దేశమునుండి వచ్చినవారలే అని మాత్రము స్పష్టముగ తెలియవచ్చుచున్నది. ఈ దేశపు ప్రప్రథమ క్రైస్తవరాజు హెరాల్డ్ బ్లుటూత్ (మరణము క్రీ. శ. 985). ఇతడు నార్వేను జయించి, తన సామ్రాజ్యమున దానిని అంతర్భాగము కావించెను. అతని కుమారుడు స్వెయిన్, ఇంగ్లండును జయించెను. ఈ రాజవంశమునకు చెందిన కెన్యూట్ రాజు కాలమున (1018 - 35) ఇంగ్లండు, నార్వే, డెన్మార్క్‌లు ఏక రాజ్యముగ రూపొందెను. కాని, అతని మరణానంతరము ఈ రాజ్యము విచ్ఛిన్నమై, ఇంగ్లండున డేన్‌ల పరిపాలన అంతమొందుటయే కాక, నార్వే సైతము వేరయ్యెను. అయినను, ఆ తరువాత మూడు శతాబ్దములలో జరిగిన రాజకీయ పరిణామముల మూలమున నార్వే, స్వీడెన్ డేన్‌ల ఆధిపత్యమునకులోనై కడకు 14 వ శతాబ్ది అంతమున డెన్మార్క్, నార్వే, స్వీడెన్ ఏక రాజ్యముగ పరిగణన పొందెను. 1523 లో ఈ రాజ్యము తిరిగి విచ్ఛిన్నమై స్వీడెన్ చీలిపోయెను. కాని, నార్వే, డెన్మార్క్ మాత్రము కలిసి ఏక రాజవంశపు పాలనలో ఉండెను. 19 వ శతాబ్ది ఆరంభమున యూరప్‌ను సంక్షుభిత పరచిన రాజకీయపరిస్థితులలో ఈ సంయుక్తరాజ్యము నెపోలియన్ పక్షమును అవలంబించినందులకు - నెపోలియన్ పతనానంతరము జరిగిన ఒడంబడిక మూలమున-1814 లో నార్వే ఈ రాజ్యమునుండి వేరుపరుపబడెను. 17, 18 వ శతాబ్దములలో ప్రాచ్యఖండములందు వ్యాపార కేంద్రములను స్థాపించుటకై వివిధ యూరప్ జాతులు జరిపిన యత్నములలో డేనిష్ నావికులును, వర్తకులును పాల్గొని భారతదేశము మొదలగు హానియందు కొన్ని కేంద్రములను స్థాపించిరి. కాని, ఆంగ్లేయులును, ఫ్రెంచివారును పురోగమించి వీరికి అట తావులేకుండ చేసిరి. 1848 - 49 లోను, 1864 లోను ప్రష్యన్‌లను జర్మన్‌జాతి వారితో జరిపిన పోరాటముల మూలమున డెన్మార్క్ కొంత భూభాగమును సైతము కోల్పోయెను. అంతటనుండి దేశమున ఒక నూతన జాగృతి ఉదయించెను. తత్ఫలితముగ ఆర్థికరంగమున ఈ దేశము త్వరితగతిని పురోగమించినది. రైతువారీ భూస్వామ్య పద్ధతిన వ్యవసాయమును, పశుపోషణను అత్యుచ్చస్థితికి కొనిపోయి సుఖజీవనమును గడుపు కృషీవలుల సువర్ణభూమిగ తమదేశమునకు ఖ్యాతిని ఇచటి రైతులు కొనితెచ్చిరి. ప్రథమ ప్రపంచయుద్ధము (1914 - 1918) న ఈ దేశము తాటస్థ్యము [చూ.] ను అవలంబించెను. అయినను, ఆ యుద్ధానంతరము జరిగిన మార్పుల ఫలితముగ జనాభీష్టమును అనుసరించి, అదనముగ కొంత భూభాగము ఈ దేశమునకు చెందెను. ద్వితీయ ప్రపంచ యుద్ధకాలము (1939 - 45) న డెన్మార్క్‌నకు జర్మనీతో ఒక నిరాక్రమణ సంధి అమలులో ఉండెను. కాని, దానిని సరకుచేయక 1940 లో జర్మనీ ఈ దేశముపై దండెత్తి ఆక్రమించెను. 1945 లో జర్మనీ పరాజయముతో ఈ ఆక్రమణ అంతమై దేశము స్వతంత్రమయ్యెను. అంతటినుండి వ్యావసాయికముగ, పారిశ్రామికముగ, రాజకీయముగ ఈ దేశము త్వరితగతిని పురోగమించుచున్నది.

రాజ్యాంగము: వంశానుగతము, రాజ్యాంగబద్ధము అగు రాజవంశపు పాలన ఈ దేశమున అమలునందు ఉన్నది. 1953 రాజ్యాంగ విధానమును అనుసరించి శాసన నిర్మాణాధికారము రాజునందును, పార్లమెంట్ (ఫోకెటింగ్) నందును సంయుక్తముగ న్యస్తమై ఉన్నది. రాజు లూథరన్

చర్చికి చెందిన క్రైస్తవుడై ఉండవలెనను నియమము రాజ్యాంగమున కలదు; కాని, ప్రతి పౌరునికిని మత స్వాతంత్ర్యమును రాజ్యాంగము ఒసగినది. పార్లమెంట్ నందు ఎగువసభ అనునది ఇట లేదు. నాలు గేండ్లకు ఒకసారి పార్లమెంట్ ప్రజలచే ఎన్నుకొనబడును. మొత్తము 179 మంది సభ్యులలో 134 మందిని వివిధ నియోజకవర్గములు జనసంఖ్య నిష్పత్తిని అనుసరించి ఎన్నుకొనును. తగు సంఖ్యలో వోట్లు వచ్చినను, అధికసంఖ్య వోట్లు రాక పోవుటచే జనానీకమున తమ పలుకుబడికి తగినటుల స్థానములను ఆర్జించలేని రాజకీయ పక్షముల వారిని 40 స్థానములకు నియమించుటకు ఏర్పాటు కలదు. ఇది ఈ రాజ్యాంగము నందలి ఒక ప్రత్యేక విశిష్టత. ఇది తక్కిన స్థానములకు గ్రీన్‌లాండ్ దీవినుండి ఇరువురును, ఫారోదీవి నుండి ఇరువురును, అల్పసంఖ్యాకులగు జర్మనులనుండి ఒక సభ్యుడును ఎన్నుకొనబడుదురు. పార్లమెంట్ విశ్వాసమును ఆర్జించిన ఒకనిని రాజు ప్రధానమంత్రిగ నియమించి, అతని సలహాపై తక్కిన మంత్రులను నియమించును. న్యాయశాఖకు స్వతంత్ర ప్రతిపత్తి కలదు. దేశమునందలి పౌరులలో 22 ఏండ్లు దాటిన వారికి అందరకు వోటు చేయు హక్కు కలదు. చీ. శే. రా.

**డెమొస్తనీస్** (క్రీ. పూ. 383 - 322): ఏథెన్స్ నగరపు మహావక్త. రాజ్యకార్య దురంధరుడు. ఇతని జీవితాశయము ఏథెన్స్‌ను పునరుజ్జీవింప జేయుట. అందుకొరకై ఇతడు మహోపన్యాసములు అనేకము చేసెను. ఆ ఉపన్యాసములలో ఇతడు తన ప్రజలను మేసిడోనియా రాజైన ఫిలిప్ ఉపద్రవమునుండి కాపాడుకొన ఉద్బోధించెను. కాని, ఈతని ప్రయత్నములు వ్యర్థమయినవి. క్రీ. పూ. 338 లో ఏథెన్స్, థీబ్స్‌నగరములు పరాజితములయినవి. క్రీ. పూ. 336 లో టెసిఫన్ అనునతడు డెమొస్తనీస్‌కు అతని దేశసేవకుగాను ఒక బంగారపు కిరీటము బహుమానము ఈయవలెనని సూచించెను. కాని, ఎస్కనీస్ అను ప్రముఖుడు ఇందులకు తీవ్రముగ వ్యతిరేకించి, ఏవో కొన్ని సాకులతో టెసిఫన్‌పై కేసును కూడ పెట్టించెను. అప్పుడు ఒకవంక టెసిఫన్‌ను, వేరొకవంక తన రాజకీయ విధానమును సమర్థించుచు డెమొస్తనీస్ చేసిన ఉపన్యాసము వక్తృత్వమున ఒక మహోత్తమ కళా ప్రదర్శనము.

క్రీ. పూ. 324లో లంచము పుచ్చుకొన్నాడను ఆరోపణపై డెమొస్తనీస్ బంధింపబడెను. కాని, కారాగారమునుండి తప్పించుకొని డెమొస్తనీస్ దేశాంతరములకు పారిపోయెను. 323 లో ఆలిగ్జాండర్ [చూ. పు. 303] చనిపోయిన తరువాత గ్రీకులు సాహసముతో స్వాతంత్ర్య పునస్సంపాదనకు ఒక ప్రయత్నము చేసిరి. ఆ ఉద్యమమునకు డెమొస్తనీస్ నాయకత్వము వహించెను. కాని, గ్రీకులు జయించు ఆశలు కన్పట్టక పోవుటతో శత్రువశమగుటకన్న మరణము మేలని యెంచి, అభిమానధనుడగు డెమొస్తనీస్ ఆత్మహత్య చేసికొనెను [చూ. సం. 6-పు. 698]. గి. వేం. సీ.

**డొమినికన్ రిపబ్లిక్**: పశ్చిమార్ధగోళమున మధ్య అమెరికాకు తూర్పుగ సముద్ర మధ్యమున 'హిస్పానియోలా' అను ద్వీపమున మూడింట రెండువంతుల భూమిని ఆక్రమించిన ఒక స్వతంత్రరాజ్యము.




ఈ రాజ్యమునకు అట్లాంటిక్ మహాసముద్రము [ఉ]; కారబియన్ సముద్రము [ద]; మోనోపేసేజ్ సంధి [తూ]; హాయిటీ [ప] సరిహద్దులుగ కలవు. అనతి దూరముననే అట్లాంటిక్ సముద్ర మధ్యమున చెదరి ఉన్న బీటా, కెటలీనా, సౌనా, అల్టోవెలో, కెటలినిటా మొదలగు కొన్ని అల్పద్వీపములును పరిపాలన రీత్యా ఈ రాజ్యమున చేరి ఉన్నవి. [వి] వీని అన్నింటితో కలసి ఈ రాజ్య విస్తీర్ణము 48,734 చ. కి. మీ.; [జ] 33,34,300. వీరిలో సగము మంది శ్వేత, శ్వేతేతర జాతుల మిశ్రణమువలన రూపొందిన మిశ్రజాతివారు. 18%, నీగ్రోలు; 32% శ్వేతజాతివారలు. [భా] జాతీయభాష స్పానిష్. [మ] ప్రజలలో అధిక సంఖ్యాకులు రోమన్ కేథలిక్ క్రైస్తవులు. [రా] క్యుదద్ త్రూజిల్లో (శాంతో డోమింగో) (జ. సం. 3,00,000).

చరిత్ర: ఈ దేశమును, ప్రక్కనున్న హాయిటీ రాజ్యమును కలిసి ఉన్న హిస్పానియోలా దీవియే పశ్చిమార్ధగోళమున ప్రప్రథమమున యూరపియన్‌లకు లభించిన వలసభూమి. 1492 లో కొలంబస్ [చూ. పు. 407] ఈ దీవిని కనుగొని, స్పెయిన్ రాజ్యమునకు దీనిని చెందజేసెను. ఆనాడు ఇట కొందరు ఆదిమ అమెరికన్ జాతులవారు వసించుచుండిరి. కాని, 1506 నాటికి స్పెయిన్‌వారు ఇచట విపరీతముగ వలసవచ్చి చేరి, అమెరికా ఖండములోని తక్కిన ప్రాంతములను అన్వేషించుటకును, జయించుటకును దీనిని ఒక మజిలీగ చేసికొనిరి. వీరి ప్రాపకముననే శానిస

వ్యాపారము కూడ విరివిగ సాగుటచే, నీగ్రోలును ఇచట బానిసలుగ తొలుత చేరిరి. 1697 లో కొన్ని రాజకీయ పరిస్థితులకు లొంగి స్పెయిన్ దేశము ఈ దీవిలోని హాయిటీ అను భాగముపై ఆధిపత్యమును ఫ్రెంచి ప్రభుత్వమునకు దత్తమొనర్చెను. తరువాత 1795 లో నేటి డొమినికన్ రాజ్యమును కూడ ఫ్రెంచిప్రభుత్వమునకు ఒప్పగించెను. 1814 లో జరిగిన పారిస్ ఒడంబడికను అనుసరించి స్పెయిన్‌కు మరల ఈ ప్రాంతము లభించినను, 1821 లో దేశ ప్రజలు తిరుగుబాటు చేసి, స్వతంత్రతను ఆర్జించిరి. కాని, 1822 లో ఈ దేశమును హాయిటీప్రభుత్వము ఆక్రమించి వశపరచుకొనెను. అంతట దేశప్రజలు ఈ దాస్యమునకు తలయొగ్గక, సాయుధ రహస్య విప్లవములను కొనసాగించి, కడకు 1844 లో స్వాతంత్ర్యమును ఆర్జించిరి. కాని, ఇందువలన సామాన్య ప్రజలు మాత్రము ఏ సుఖమును పొందలేకపోయిరి. అధికారమునకై వివిధ వర్గములు పోరాడుటవలనను, కుట్రలవలనను దేశము దీర్ఘకాలము క్షుభితమయ్యెను. ఈ అవకాశమును వినియోగించుకొని స్పెయిన్ 1861 లో మరల తన వలస ప్రభుత్వమును ఇచట నెలకొల్పెను. కాని, 1863, 1864 లో జరిగిన తిరుగుబాటుల ఫలితముగ స్పెయిన్ సేనలు అట నిలువలేక, తిరిగిపోవుటతో దేశము మరల స్వతంత్రమయ్యెను. 1865 నుండి 19 వ శతాబ్ది అంతమువరకు అనేక విప్లవములకును, నీతి రహిత ప్రభుత్వములకును ఈ దేశము నెలవయ్యెను. జాతీయ ఋణము విపరీతముగ పెరిగిపోయెను. కడకు 1905 లో యునైటెడ్‌స్టేట్స్ ప్రభుత్వము తన బాకీని వసూలు చేసికొను ఉద్దేశముతో ఈ దేశపు సుంకములపై అధికారమును గ్రహించెను. ఇందులకు అంగీకరించుచు, ఆనాటి ప్రభుత్వము యునైటెడ్‌స్టేట్స్‌తో ఒడంబడిక చేసికొనెను. కాని, ప్రజలకు ఇది ఇష్టము లేకుండెను. తత్ఫలితముగ తిరుగుబాటులు, రక్తపాతములు విరివిగ జరిగెను. తుదకు 1916లో యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వమే స్వయముగ సర్వాధికారములు స్వీకరించి, దేశమున సైనిక ప్రభుత్వమును స్థాపించి, 1924 వరకు పాలించెను. అంతట దేశము మరల స్వతంత్రమయ్యెను. కాని, సుస్థిర ప్రభుత్వమునకు నోచదయ్యెను. 1930 లో రఫేల్ లియోనిడస్ త్రుజిల్లో మోలినా అను నాయకుడు అధ్యక్షుడుగ ఎన్నుకొనబడెను. ఆనాటినుండి ఈతడు ఆ దేశమున తన అధికారమును సుస్థిరమొనర్చుకొని, దేశాభివృద్ధికై చాల కృషి చేసెను. పేరుకు ప్రజాతంత్రవాదిగ చెప్పుకొనినను, ఈతడు చేతలలో నియంతృత్వ మార్గములనే అనుసరించెను. కాని, ఏది ఎటులున్నను, ఇతని నాయకత్వమున ఆర్థికముగ దేశము చాల పురోగమించెనని మాత్రము చెప్పదగును. ద్వితీయ ప్రపంచ యుద్ధమున 1941 లో ఈ దేశము అక్షరాజ్యములపై యుద్ధము ప్రకటించినది. 1945 లో ఐక్యరాజ్యసమితి సభ్యత్వమును ఆర్జించినది. త్రుజిల్లో మోలినా యొక్క ప్రభుత్వము 1963, ఫిబ్రవరిలో జరిగిన ఎన్నికలలో ఓడిపోయి, నూతన ప్రభుత్వము ఏర్పడినది.

రాజ్యాంగము : 1955 లో ఆమోదింపబడిన ఒక రాజ్యాంగ చట్టమును అనుసరించి ఇచట పరిపాలన నిర్వహింపబడుచున్నది. రెండు కక్ష్యలు గల శాసనసభ యందు శాసన నిర్మాణాధికారము న్యస్తమై ఉన్నది. ఎగువసభయందు (సెనేట్) రాష్ట్రమునకు ఒక ప్రతినిధి చొప్పున 25 గురు ప్రతినిధులును, దిగువ సభ (కెమరాడి డిప్యుటాడోస్) యందు 50,000 మంది ప్రజలకు ఒక ప్రతినిధి చొప్పున 64 గురు ప్రతినిధులును కలరు. ఏదియైన ప్రతినిధి స్థానము ఖాళీయైనపుడు డొమినికన్‌పార్టీ నాయకుడు సూచించు మూవురనుండి ఒకరిని ఆ స్థానమునకు అందులకు సంబంధించిన సభ ఎన్నుకొనును. ఈ డొమినికన్‌పార్టీ ఒకటి మాత్రమే ఆ దేశమున శాసన విహితమగు రాజకీయ పక్షముగ 1962 అంతము వరకు ఉండెను. ఇపుడు రాజకీయ పక్షములకు అన్నిటికిని సమాన ప్రతిపత్తి కలిగినది. అధ్యక్షుని ప్రజలు ఎన్నుకొనెదరు. శాసనసభలకును, అధ్యక్ష పదవికిని ఎన్నికలు అయిదేండ్లకు ఒక పర్యాయము జరుగును. అధ్యక్షుడు మంత్రిమండలిని నియమించును. అధ్యక్షుడే కార్యనిర్వాహణాధికారి ; సేనాపతి. **చి. శే. రా.**

**డ్రేక్, ఫ్రాన్సిస్** (ర. 1540 - 1596) : ప్రపంచమును చుట్టి వచ్చిన మొట్టమొదటి బ్రిటిష్ నావికుడు. ఇతడు తన 20 వ ఏట జూడిత్ అను చిన్న నౌకకు నాయకుడు అయ్యెను. ఆ పిమ్మట పశ్చిమ ఇండియా (వెస్ట్ ఇండీస్) దీవులలోని స్పెయిన్ నౌకా స్థావరములపై దెబ్బతీయుట ప్రారంభించెను. 1572 లో మూడు నౌకలు 72 సరంగులతో బయలుదేరి, పనామా భూసంధి వద్ద స్పానిష్ నగరమును ముట్టడించి, ఆ నగరమును కొల్లగొట్టి, విలువైన పదార్థములు అన్నియు ఇతడు దోచుకొనెను. ఎలిజబెత్ - I డ్రేక్ జరుపుచున్న ఈ అన్యాయ దండయాత్రలను అనుమతించుటయేకాక, వాటికి ప్రోత్సాహము కూడ ఇచ్చెను. అయిదు ఏండ్లు అనంతరము ఇతడు తన ప్రఖ్యాత ప్రపంచ యాత్రకు బయలుదేరెను. ఇతని దళమువారు చిలీ, పెరూ దేశముల తీరములు కొల్లగొట్టి, బంగారము, వెండి, వజ్రములు మొదలయినవి దోచుకొనిరి. డ్రేక్ అచటి నుండి కాలిఫోర్నియా తీరమునకు పోయి, ఆ ప్రదేశమునకు న్యూ అల్బియాన్ అని పేరు పెట్టి, అది

ఇంగ్లండు రాజ్య భాగమని ప్రకటించెను. తిరిగి వచ్చిన దారినే వెనుకకు మరలుటకు మారుగా ఇతడు పశ్చిమము నకు పోయి, పసిఫిక్ మహాసముద్రమును దాటి ప్రపంచ ప్రదక్షిణ యాత్రను పూర్తి చేసెను. ఈ ప్రయాణమునకు మూడు సంవత్సరములు పట్టినది. డ్రేక్ సాధించిన విజయ ములలో ఈ ప్రయాణము ప్రముఖమైనదిగ గణింపబడినది. ఎలిజబెత్ రాణి ఇతనికి 'సర్' బిరుదు ఇచ్చి సమ్మానించినది. ఇతడు ప్రయాణము చేసిన నౌకయొక్క కొంత కలపతో ఒక కుర్చీ చేయించి, దానిని డ్రేక్ జ్ఞాపక చిహ్నముగా ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీలో భద్రపరచిరి.

స్పానిష్ ఆర్మడా [చూ.] ఇంగ్లండుపై దండయాత్రకు వచ్చినపుడు డ్రేక్ ఆ నౌకాదళ నాయకుని నౌకను పట్టు కొనెను. గి. వేం. సీ.

**ఢిల్లీ :** అనేక శతాబ్దములనుండి భారతదేశమును పరిపాలించిన వివిధ రాజవంశముల రాజధాని అగుటచే అనేక సంస్కృతుల సమ్మేళనము ఈ నగరపు ప్రత్యేకత. ప్రాచీన హిందూ రాజ్యములకు రాజధానియగు ఇంద్ర ప్రస్థము, హస్తినాపురము నేడు ఢిల్లీ నగరము ఉన్న ప్రాంతమునకు చెందినవే.

ఢిల్లీలో మహమ్మదీయ పరిపాలనలో కట్టబడిన కోటలు, భవనములు నేటికిని కలవు. ఎర్రకోట (లాల్ ఖిల్లా), కుతుబ్ మీనార్ మున్నగునవి అందు ప్రఖ్యాతమైనవి. జయపూర్‌ను పరిపాలించిన రాజు సవాయి జైసింగు [చూ. సం. 9 - పు. 274] చేత 18 వ శతాబ్దములో నిర్మించ బడిన వేధశాల జంతర్ మంతర్ అను పేర నేడును కనబడుచున్నది.

నేటి ఢిల్లీ నగరము ప్రాత ఢిల్లీ, న్యూ ఢిల్లీ (నయీ ఢిల్లీ) అను రెండు ప్రత్యేక పట్టణములుగ ఉన్నది. న్యూ ఢిల్లీయే భారతదేశపు రాజధాని. మొగల్ ప్రభువగు షాజహాన్ ఢిల్లీనగరమును పునర్నిర్మించునాటికి ఆ ప్రాంత మున ఆరు నగరములు క్రమముగ నిర్మింపబడి రాజధాను లుగ ఉండి అంతరించెనను ప్రవాదము కలదు. తుఘ్లకాబాద్ మొదలగు పేరులు ఈ విషయమును రుజువుపరచుచున్నవి. పారంపర్యముగ భారతదేశమున ప్రచారమున ఉన్న గాథలను బట్టి ఈ నగరము అతి సనాతనమే అయినను, చారిత్రకముగ పదునొకొండవ శతాబ్దినుండి మాత్రమే దీనిని గురించి వివరములు తెలియనగుచున్నవి. ఆ శతాబ్ద మున ఈ నగరము రాజధానిగ పాలించిన తోమరవంశీయుడు అనంగపాలుడు అనువాడు నేడు లాల్ ఖిల్లా అనబడు దానిని తొలుతగ నిర్మింపజేసెను. బానిస సుల్తానుల కాలమున నిర్మింపబడినదిగ భావింపబడు కుతుబ్ మీనార్ సైతము ఆ హిందూరాజుల కాలముననే తొలుతగ వేధ శాలగ నిర్మింపబడినదనియు, దానినే తరువాత బానిస సుల్తానులు కుతుబ్ మీనార్‌గ మార్చిరనియు కొందరి వాదము. కాని, ఇది వివాదాస్పద విషయము అగుటచే సర్వత్ర అంగీకరింపబడుటలేదు. ఢిల్లీ నగరమున కననగు క్రీస్తుపూర్వపు ఇనుపస్తంభము సైతము అనంగపాలుడే మధురప్రాంతము నుండి క్రీ. శ. 1052 లో ఇచటికి తరలింప జేసెనని తెలియవచ్చుచున్నది. పృథ్వీరాజు [చూ.] ను మహమ్మద్ ఘోరీ అంతమొందించిన తదుపరి ఈ నగరము భారతదేశముతో పాటుగ ముస్లిముల వశమయినది. అంతట 1206 మొదలుగ ఇట ఢిల్లీ సుల్తానులు 1526 వరకు పాలించిరి. వారి అనంతరమున భారతదేశమును పాలించిన మొగల్‌లకు ఇది రాజధానియైనది. మొగల్ రాజులలో నాలుగవ వాడగు షాజహాన్ దీనిని పునర్నిర్మింపచేసెను.

పూర్వపు కోటను చక్కని మార్పులతో అతడు సవరింప చేయగ రూపొందినదియే నేటి లాల్ ఖిల్లా (రెడ్ ఫోర్ట్). ఆనాడు అతడు నిర్మింపచేసిన భవనములలో దివానీ ఆమ్ (ఆస్థాన భవనము); దివానీ ఖాస్ (రాజ భవనము) అనునవి నేటికిని శిల్ప - వాస్తుశాస్త్రజ్ఞుల మన్ననల పొందుచున్నవి. ఢిల్లీయందలి చాందినీచౌక్ మొగల్‌ల కాలమున ప్రపంచ మందలి భాగ్యవంతములగు విపణులందెల్ల అత్యుత్తమమని పేరొందినది. నాదిర్ షా, తైమూర్, అహమ్మద్ షా ఆ యా కాలములందు ఢిల్లీని జయించినపుడు అందలి వర్తకులను కొల్లగొట్టి అపార ధనమును తమ దేశములకు తరలించుకొని పోయిరి. ముస్లిమ్ ప్రభువులు నిర్మింపజేసిన మసీదులలో విస్తృతియందు, రమణీయతయందు పేరుగన్నది - జుమ్మామసీదు. 1707 న ఢిల్లీ నగరశోభ అంతరింప మొదలిడెను. 1803 లో బ్రిటిష్‌వారు మహారాష్ట్రులను నిర్జించి పాదుషాను తమ రక్షణలోనికి గ్రహించినప్పటి నుండియు ఈ నగరమున శాంతి భద్రతలకు కొంత స్థైర్యము ఏర్పడి వర్తక వ్యాపారములు పెరిగినవి. కాని, 1857 లో జరిగిన విప్లవమున విప్లవసైనికులకును, తిరుబాటు దారు లకును మధ్య జరిగిన పోరాటముల ఫలితముగ 1861 వరకు ఈ పట్టణము అరాచకమునకు గురియైనది. 1911 లో బ్రిటిష్‌వారి భారత సామ్రాజ్య ముఖ్య కార్యాలయములు ఢిల్లీకి తరలింపబడినవి. అంతటినుండి ఢిల్లీ యథాపూర్వక ముగ భారతదేశ రాజధాని అయ్యెను.

నయా ఢిల్లీ (న్యూ ఢిల్లీ) : నూతన పరిస్థితులకు అనువుగ ఢిల్లీనగర సమీపముననే నయాఢిల్లీ అను పట్టణము నిర్మింపవలెనను సంకల్పము 1911 లో అప్పటి భారత ప్రభుత్వమునకు కలిగినది. 1912 లో ఎడ్విన్ లూచెన్

అను భవన వాస్తువేత్త (ఆర్కిటెక్ట్) ఈ నగరమునకు ప్రణాళికలను తయారుచేసెను. పూర్వపు నగరమునకును, దీనికిని దూరము నిర్మాణకాలమున 16 కి. మీ. ఉండెడిది. తొలుతటి ప్రణాళికలను అనుసరించి నయాఢిల్లీ 13 చ. కి. మీ. విస్తీర్ణము ఉండునటుల నిర్మింపబడెను. కాని, స్వాతంత్ర్యానంతరము షట్కోణాకృతికల వరుస బజారులతో ఈ నగరము తీర్చబడినది. ఇందలి భవనములలో రాష్ట్రపతి భవనము, లోకసభా భవనము దర్శనీయములు. హిందూ, ముస్లిమ్ శిల్పకళలతో పాటు పాశ్చాత్య శిల్పకళ ఇందు తగురీతిగ మేళవింపబడెను. చీ. శే. రా.

**ఢిల్లీ సుల్తానులు :** 1206 నుండి 1526 వరకు ఢిల్లీ రాజధానిగ ఉత్తర హిందూస్థానమును ఏలిన మహమ్మదీయ రాజులు 'ఢిల్లీ సుల్తానులు' అని చరిత్రయందు ప్రసిద్ధి పొందినారు. వీరు బానిస, ఖిల్జీ, తుఘ్లుక్, సయ్యద్, లోడీ అని ఐదు వంశములకు చెందినవారు. వీరిని 'ఆఫ్ఘని సుల్తానులు' అని కూడ అందురు. కాని, వీరిలో లోడీ వంశీయులు మాత్రమే ఆఫ్ఘన్ జాతికి చెందినవారు. సయ్యద్‌లు అరబ్‌లు; మిగతావారు తురుష్కులు.

మొదట భారతదేశము మీద దండెత్తిన మహమ్మదీయులు అరబ్బులు; 711 లో మహమ్మద్ బిన్ కాశిమ్ అను వాని నాయకత్వమున సింధుదేశ రాజగు దాహిర్ అను వానిపైకి వారు దండెత్తి వచ్చిరి. దాహిర్‌ను చంపి, సింధు మైదానమంతయు ముల్తాన్ వరకు ఈ అరబ్బులు ఆక్రమించిరి. కాని, క్రమముగ అరబ్బుల అధికారము పదవ శతాబ్దినాటికి సింధుదేశమందు అంతరించినది.

ఆ పిమ్మట సబుక్తిజిన్ అను తురుష్కుడు జయపాలుడు అను హిందూ రాజును రెండు మారులు ఓడించి, పెషావర్‌ను పట్టుకొనెను. అతడు 997 లో మరణించిన తరువాత అతని కుమారుడు గజనీ మహమూద్ [చూ. పు. 419] అనువాడు 1000 నుండి 1027 వరకు భారతదేశముపై 17 మారులు దండెత్తెను. ఐనను, ఇతడు భారతదేశమునుండి అపారమైన ధనమును కొల్లగొట్టి తన దేశమునకు తరలించుకొని పోయినవాడే కాని, 1022 లో పట్టుకున్న పంజాబు తప్ప మరి ఏ ప్రదేశమును వశపరుచుకొనలేదు. గజనీ మహమూద్ అనంతరము గద్దెనెక్కినవారు బలహీనులు అగుటచే 1185 వ సంవత్సరము నాటికి వీరి అధికారము అంతరించినది.

పిమ్మట మహమ్మద్ ఘోరీ [చూ. పు. 441] అను వాడు భారతదేశమును జయించుట తన ముఖ్యమైన కర్తవ్యముగ పాటించి పెక్కుసారులు విఫలుడై తుదకు 1192 లో రెండవ స్థానేశ్వర యుద్ధమున ఢిల్లీ రాజగు పృథ్వీరాజు [చూ.] ను ఓడించి చంపి, ఆ రాజ్యమును వశపరచుకొని, తరువాత 1194 లో జయచంద్రుడు అను కనూజ్ రాజును ఓడించి, తాను జయించిన హిందూ రాజ్యమునకు అంతటికి కుతుబుద్దీన్ [చూ. పు. 391] అనువానిని తన ప్రతినిధిగ నిలబెట్టి తన దేశమునకు పోయెను.

పడమట సింధునది నుండి తూర్పున బ్రహ్మపుత్రానది వరకు గల ఉత్తర భారతదేశము అంతయు కుతుబుద్దీన్‌కు 1202 వ సంవత్సరము నాటికి స్వాధీనమైనది. అతడు 1206 లో ఘోరీ మహమ్మద్ చనిపోగా స్వతంత్రుడై, బానిస రాజవంశమునకు మూల పురుషుడు అయ్యెను [చూ. బానిస రాజవంశము]. ఈ బానిస రాజవంశమును 1290 లో అంతమొందించి 1320 వరకు ఖిల్జీ రాజులును, ఆ తరువాత 1320 నుండి 1413 వరకు తుఘ్లుక్‌లును, 1414 నుండి 1451 వరకు సయ్యద్ వంశీయులును, 1451 - 1526 వరకు లోడీ వంశజులును క్రమముగ పాలించిరి [చూ. భారతదేశ చరిత్ర]. గు. వెం.

**తంజావూరు నాయక రాజులు :** చూ. తెలుగు సంస్కృతి : సం. 4 - పు 807.

**తక్షశిల :** పాకిస్తాన్‌నందు ఉన్న ఒక ప్రాచీన శిథిల నగరము; ప్రాచీన భారతీయ సంస్కృతీ కేంద్రము. ఈ నగరము కేంద్రముగ తక్షశిల* రాజ్యము అనునది అతి ప్రాచీన కాలమున అట వెలసెను. అలిగ్జాండర్ [చూ. పు. 303] ఇండియాపై దండెత్తి వచ్చిన నాటికే ఆ తక్షశిల రాజ్యము సింధూ, జీలమ్ నదుల నడుమ వ్యాపించినది. ఈ నగరము నేటి రావల్‌పిండికి 16 కి. మీ. దూరమున కలదు. ఇది వాణిజ్య వ్యాపారములకును, వేద వేదాంగ వైద్య విద్యలకును భారతదేశ వాయవ్య భాగమున కేంద్రస్థలమై ఉండెను. ఇక్కడ వెలసిన కులపతుల ఆశ్రమములందును, విశ్వకళా పరిషత్తులందును వివిధ విద్యలను అభ్యసించుటకు దేశమందలి ఇతర భాగములవారును వచ్చుచుండిరి. ఇది అలిగ్జాండర్‌కు పూర్వము చాలా కాలమునుండియు ప్రసిద్ధికెక్కి ఉండినట్లు తెలియవచ్చినది. ఇది కొంతకాలము యవనుల పరిపాలనమందు ఉండెను. పురావస్తుశాస్త్రజ్ఞులు పరిశోధనార్థము కావించిన త్రవ్వకములవలన యవన ప్రభావ దృశ్యములు కానవచ్చినవి. అరమాయికు (ఖరోష్ఠిలిపి) శాసనము ఇక్కడ దొరికినది. ఇది చంద్రగుప్తుని నాటిదో, అశోకుని నాటిదో సరిగా చెప్పలేము. క్రీ. పూ. 3 వ శతాబ్దినుండి ఈ నగరము బౌద్ధమత కేంద్రముగ సైతము ప్రశస్తి గాంచినది. ఇక్కడి శిథిలము

* భారత స్వాతంత్ర్యానంతరము (1947) తక్షశిల పాకిస్తాన్‌లోని భాగమైనది.

లందు ఒక బౌద్ధస్తూపములు కానవచ్చుచున్నవి [చూ. సం. 10 - పు. 105]. గి. వేం. సీ.

**తటస్థ రాజ్యముల సమావేశము :** ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున అంతర్జాతీయ సంబంధములను కలుషితము చేసిన ప్రచ్ఛన్న యుద్ధమును ప్రశమింపజేయు దృష్టితో - ఆ ప్రచ్ఛన్న యుద్ధమున ఏ పక్షమునను చేరని - తటస్థ రాజ్యములు సమష్టిగ కృషిచేయుటకై యుగోస్లావియాలోని బెల్‌గ్రేడ్ నగరమున 1961 లో జరిపిన ఒక సమావేశము. దీనినే అలీన రాజ్యముల సమావేశము అనియు వ్యవహరింతురు. ఇట్టి సమావేశమును జరుపుట సముచితమని తొలుతగ ఈజిప్టు అధ్యక్షుడు జమాల్ అబ్దుల్ నాసర్, యుగోస్లావియా అధ్యక్షుడు మార్షల్ టిటో, ఇండోనీషియా అధ్యక్షుడు సుకర్ణో సూచించిరి. అంతట ఆ సంకల్ప సాధనకై జరిపిన సన్నాహక సమావేశమున ఇరువది దేశముల (ఆఫ్ఘనిస్తాన్, ఇండోనీషియా, ఇరాక్, ఈజిప్టు, ఎతియోపియా, కాంబోడియా, క్యూబా, గినీ, ఘానా, నేపాల్, బర్మా, భారత దేశము, మాలీ, మొరాకో, యుగోస్లావియా, యెమెన్, సింహళము, సుడాన్, సోమాలియా, సౌదీ అరేబియా) ప్రతినిధులును, బ్రెజిల్ నుండి ఒక పరిశీలక ప్రతినిధియును పాల్గొనిరి (1961 జూన్ 5 - 13). ఇందలి చర్చల ఫలితముగ 1961, సెప్టెంబరులో బెల్‌గ్రేడ్‌న సమావేశము జరుపుటకు నిర్ణయింపబడి, అందు పాల్గొను రాజ్యములకు ఉండవలసిన అర్హతాప్రతిపత్తి నిశ్చితమైనది. ఈ నిశ్చయమును అనుసరించి బెల్‌గ్రేడ్‌న 1961, సెప్టెంబరు 1 న మొదలిడిన సమావేశమున పై రాజ్యములతో పాటుగ కాంగో (లియోపాల్డ్ విల్లి), సైప్రస్, లెబనాన్, టూనీషియా, ఆల్జీరియా పాల్గొనినవి. ఆ యా రాజ్యముల పక్షమున పెక్కు సందర్భములలో రాజ్యాధి నేతలు లేదా ప్రభుత్వాధి నేతలు ప్రతినిధులుగ వ్యవహరించిరి. ఆల్జీరియా మాత్రము అప్పటికి స్వతంత్ర ప్రతిపత్తిని పొందక పోవుట వలన ఆ దేశపు ప్రవాస ప్రభుత్వ ప్రతినిధి పాల్గొనెను. బ్రెజిల్‌తో పాటుగ బొలీవియా, ఈక్వడార్‌లు పరిశీలకులను మాత్రము పంపి పాల్గొనినవి.

ఈ సమావేశము నెడ ప్రచ్ఛన్న యుద్ధ ముఖ్య ప్రతిస్పర్ధ రాజ్యములు - సోవియట్ రష్యా, యునైటెడ్ స్టేట్స్ - తొలుత నుండియు సుముఖత వహించినవికావు. అంతియే కాదు, అదివరలో అణ్వాయుధ పరీక్షా ప్రయోగములను తనంత తానుగ కట్టిపెట్టిన సోవియట్ రష్యా వానిని తాము మరల సాగింతునని ఆ సమయముననే ప్రకటించి, సమావేశమందలి ప్రతినిధుల పరిస్థితిని క్లిష్టతరము చేసెను అయినను, ఈ సమావేశ సభ్యరాజ్యములు నిష్పక్షపాత వైఖరితో చర్చల సాగించి, కొన్ని నిర్ణయములకు రాగలిగినవి. ఆ నిర్ణయములు రెండు పత్రముల రూపమున వెలువడినవి. వీనిలో తొలుతటి దానికి రూపకల్పన చేసినది పండిత జవహర్‌లాల్ నెహ్రూ. 'యుద్ధ ప్రమాద వివరణ - శాంతి సాధన విజ్ఞప్తి' అను ఆ పత్రమున యునైటెడ్ స్టేట్స్ అధ్యక్షుడు కెన్నడీ, సోవియట్ రష్యా ప్రభుత్వాధినేత కృశ్చేవ్ పరస్పర సంప్రతింపుల వలన సన్నిహిత సంక్షోభమును నివారించి శాంతిని నెలకొల్పవలసినదిగ విజ్ఞప్తి చేయబడినది. ఇక రెండవ పత్రమున సామ్రాజ్యవాదపు అవశేషముల నిర్మూలించి, పాలిత రాజ్యములకు స్వతంత్రతను కల్పించుట, విశ్వవ్యాప్త నిరాయుధీకరణను సాధించుటకు తటస్థ రాజ్యములు వహింపవలసిన పాత్ర, ఐక్యరాజ్య సమితిలోని భద్రతా సంఘ నిర్మాణమునను, సచివాలయ వ్యవస్థలోను జరుగవలసిన మార్పులు వివరింపబడినవి.

సమావేశానంతరమున - సెప్టెంబరు 6 న - సభ్య రాజ్యముల అన్నింటిపక్షమున ఇరువురు ప్రతినిధులు-భారత ప్రధాని జవహర్‌లాల్, ఘానా అధ్యక్షుడు న్క్రుమా - మాస్కోకును, ఇరువురు ప్రతినిధులు - ఇండోనీసియా అధ్యక్షుడు సుకర్ణో, మాలీ అధ్యక్షుడు కీటా - వాషింగ్‌టన్‌కును పయనించి, కృశ్చేవ్ - కెన్నడీ సమావేశమును గురించిన అభ్యర్థనను స్వయముగ ఆ యా రాజ్యాధినేతలకు అందజేసిరి.

ఈ సమావేశము వలన సద్యః ఫలితములు ఏవియు సిద్ధింపక పోయినను, ప్రచ్ఛన్న యుద్ధపు తీవ్రతను క్రమముగ తగ్గింపచేయుటకు తటస్థ రాజ్యములు నిర్వహింపగల్గు పాత్ర చక్కగ విదితమై, క్రమముగ కృశ్చేవ్ - కెన్నడీలు పరస్పరము అర్థముచేసికొనుటకు మార్గము ఏర్పడినది. చీ. శే. రా.

**తాంతియా తోపీ** (మ. 1859): భారత ప్రథమ స్వాతంత్ర్య యుద్ధ యోధుడు. నానాసాహెబ్ [చూ.] నకు బాల్యమిత్రుడు. బ్రిటిష్‌వారిని దేశమునుండి తరిమివేయనెంచిన నానాసాహెబ్ నిశ్చయమును ఆచరణలో పెట్టుటలో ఇతడు ప్రధానపాత్ర వహించెను.

కాన్పూర్ తిరుగుబాటుతో తాంతియా తోపీ ప్రతిభ వెల్లడి అయ్యెను. ఝాన్సీని బ్రిటిష్ ముట్టడినుండి తప్పించుటకై ఇతడు చేసిన ప్రయత్నము బేట్వాయుద్ధములో విఫలమయ్యెను. కాల్పీ మీదుగా గ్వాలియర్ చేరి ఝాన్సీ లక్ష్మిబాయి [చూ. పు. 489] తో కలిసి భావి కర్తవ్యమును గూర్చి సమాలోచనలు సలిపి, విప్లవదారుల ఆశాజ్యోతిని అతడు పునరుద్ధరించెను. గ్వాలియర్‌లో పరాజయము పొందిన పిమ్మట పిమ్మట మహారాష్ట్రుల [చూ.] సహాయము లభించుననే ఉద్దేశ్యముతో దక్కన్ చేరెను. కాని, ఇతడు

అచ్చటకు చేరుసరికి విప్లవజ్వాలలు సమసినవి. నర్మదానదిని ఇతడు దాటకుండ చేయవలెనని పెక్కు బ్రిటిష్ సైన్యాధికారులు ప్రయత్నించి విఫలులైరి. యుద్ధ తంత్రములో అసమాన ప్రజ్ఞను ఇతడు ప్రదర్శించెను. కాని, సహచరుని మిత్రద్రోహముతో తుదకు ఇతడు పట్టుబడి 1859 లో ఉరి తీయబడెను. ఇతని మరణముతో 1857 విప్లవము ముగిసినదని చెప్పవచ్చును. పా. ల. నా.

**తాజ్ మహల్ :** మొగల్ సమ్రాట్ షాజహాన్ ఆగ్రా నగర సమీపమున తన భార్య ముంతాజ్ బేగమ్ దివ్యస్మృతి చిహ్నముగ నిర్మించిన గోరీయే తాజ్ మహల్. ప్రపంచములోని సుందరతమ భవనములలో ఇది ఒకటి. దీనిని నిర్మించుటకు అనేక లక్షలమంది కార్మికులు 22 ఏండ్లకు పైగా శ్రమించిరి. 39 మీటర్ల పొడుగు, దాదాపు 60 మీటర్ల ఎత్తు గల ఈ భవనము సుధాధవళితమగు స్వచ్ఛమైన పాలరాతితో నిర్మింపబడినది. యమునానది ఒడ్డున గల ఎర్రటి ఇసుకరాతి వేదికపై నిర్మింపబడిన ఈ గోరీకి చక్కని పారసీక ఉద్యానవనములు ఒక అపూర్వశోభను సమకూర్చుచున్నవి. పున్నమి వెన్నెలలో దీని రామణీయకత చూచి తీరవలసినదే కాని, వర్ణించుటకు మాటలు చాలవు.

దీని గోపురము క్రింద రాజదంపతుల గోరీల నమూనాలు ఉన్నవి. పాలరాతిమీద చేసిన చెక్కడములోనుండి సూర్యకాంతి లోనికి వచ్చి లేసు అల్లినట్టు ఒక వింత సోయగమును కల్పించును. ఈ గోడలన్నియు పారసీక శిల్ప విరాజితములు. వీటికి అక్కడక్కడ అమూల్యములైన మణులు, రత్నములు, రవ్వలు తాపడము చేయబడినవి. మహమ్మదీయుల మతగ్రంథమైన ఖురాన్‌లోని సుభాషితములు అందమైన అరబిక్ లిపిలో చెక్కబడినవి. రాజదంపతుల నిజమైన గోరీలు నమూనాల దిగువన నిరాడంబరమైన నేలమాళిగలో ఉన్నవి. ప్ర. రా.

**తాటస్థ్యము :** ఒక రాజ్యము ఇతర రాజ్యముల మధ్య జరుగుచున్న యుద్ధములోగాని, ప్రచ్ఛన్న యుద్ధములోగాని ఏ విధమైన జోక్యమును కలిగించుకొనకుండ వైదొలగి ఉండి, ఆ యుద్ధనిమగ్న రాజ్యములతో వ్యవహరించుపట్ల నిష్పక్షపాత విధానమును అనుసరించుచు, తాను అట్లు నిజముగ వైదొలగి ఉండి, నిష్పక్షపాత విధానమునే అవలంబించుచున్నట్లు ఆ యుద్ధనిమగ్న రాజ్యములు కూడ అంగీకరించి ఉండినచో, అట్టి రాజ్యముయొక్క విధానమును న్యాయశాస్త్ర దృష్టిలో 'తాటస్థ్యము' అందురు [చూ. న్యాయశాస్త్రసంపుటము]. ప్ర. రా.

**తానీషా :** చూ. సం. 3 - గోలకొండ కుత్బ్‌శాహి వంశము - పు. 430.

**తామర్లేన్ :** చూ. తైమూర్.

**తాయిలాండ్ :** ఆగ్నేయ ఆసియా యందలి ఒక స్వతంత్ర రాజ్యము. ఈ దేశమే ఇదివరలో 'సయామ్' అని వ్యవహరింప బడెడిది. దేశభాషలో ఈ దేశము ఇప్పుడు 'ప్రదేశ్ తాయ్' అని అనబడుచున్నది. తాయిలాండ్ అనునది ప్రదేశ్ తాయ్‌కు పాశ్చాత్యభాషానువాదము.




ఈ దేశమునకు బర్మా [ప, ఉ]; లావోస్ [ఉ, తూ]; కాంబోడియా [తూ]; మలేసియా [ద] సరిహద్దులుగ ఉన్నవి. ఈ దేశమునకు నైరృతిన బంగాళాఖాతమును ఆనుకొనియు, ఆగ్నేయమున సయామ్ సింధుశాఖను ఆనుకొనియు మొత్తము 2,735 కి. మీ. తీరభూమి కలదు. [వి] 5,14,000 చ. కి. మీ.; [జ] 2,88,35,000. [భా] తాయి; [మ] జాతీయ మతము హీనయాన బౌద్ధము. బ్రాహ్మణమతము సైతము కొలది రాజపురోహిత కుటుంబములందు ప్రచారమున కలదు. దేశమునందలి ప్రముఖ అల్పసంఖ్యాక వర్గము వారు చీనీయులు. వీరు టావో, కన్ఫ్యూషియన్ సంప్రదాయములతో కలగలపు చెందిన మహాయాన

బౌద్ధమును అనుసరించుచున్నారు, [రా] బాంకాక్ (జ. సం. 15,97,020).

చరిత్ర: క్రీ. శ. ఆరవ శతాబ్ది మొదలుగ ఈ దేశమున పలు ప్రాంతములందు మోన్ - ఖ్మేర్ జాతులకు చెందిన ప్రజలు రాజ్యములను నెలకొల్పి పాలించినటుల కొన్ని ఆధారములవలన తెలియవచ్చుచున్నది. అంతకు పూర్వము ఈ దేశమున వసించినవారిని గురించిన వివరములు ఏవియు మనకు తెలియవచ్చుట లేదు. ఈ మోన్ - ఖ్మేర్ జాతుల ప్రజలలో బౌద్ధమతము ఆనాటికే నెలకొనెను. బర్మా, సింహళదేశముల బౌద్ధమత ప్రచారకుల కృషి మూలమున ఈ దేశమున బౌద్ధమతము అపుడు వ్యాపించెనని భావించుటకు అవకాశములు కలవు. బౌద్ధమతమే కాక ఆనాడు భారతదేశమునుండి బ్రాహ్మణ మతానుయాయులును ఇచట చేరిరని అచటి ఆలయాదులనుబట్టి విస్పష్టము అగుచున్నది.

హరిపుంజయ (నేటి లాంఫూన్) నగరము (క్రీ శ. 575లో స్థాపింపబడినదిగ చెప్పబడు) మోన్ - ఖ్మేర్ నాగరకతకు ఆ యుగమున కేంద్రముగ ఉండెడిది. క్రీ. శ. 13 వ శతాబ్ది వరకు ఈ దేశము ఇటుల మోన్ - ఖ్మేర్ పాలకుల వశమున ఉండెను. క్రీ. శ. 13 వ శతాబ్దిలో చీనాపాలకుడగు కుబ్లయ్‌ఖాన్ [చూ. పు. 392] చే పరాజితములై దక్షిణచీనానుండి తరుమబడిన తాయిజాతులవారు ఈ దేశముపై వచ్చిపడి మోన్ - ఖ్మేర్ రాజ్యమును అంతమొందించి, తమ రాజ్యముల స్థాపించిరి. వీరును దేశమున వ్యాప్తియందు ఉన్న భారతీయమత సంస్కృతులనే అవలంబించి ఆదరించిరి. వీరిచే స్థాపింపబడిన రాజ్యములలో ఉత్తర తాయిలాండ్ నందలి సుఖోదయరాజ్యమును, పశ్చిమము నందలి అయోధ్య రాజ్యమును ప్రముఖములు (1350). కడకు అయోధ్య రాజ్యము తాయిలాండ్ నేగాక, పరిసర రాజ్యములగు కాంబోడియా మొదలగువానిని సైతము జయించి ఏకచ్ఛత్రాధిపత్యమును గడించెను.

అయోధ్యరాజ్యము 15, 16 శతాబ్దములలో బర్మా, పెగూ దండయాత్రలను ఎదుర్కొనవలసివచ్చెను. ఆ కాలముననే పోర్చుగీస్‌వారికి ఈ దేశముతో పరిచితి లభించెను (1511). తాయిలాండ్ ప్రభువులు అంతట తమ సైన్యములో పోర్చుగీస్‌వారిని కూడ చేర్చుకొని, బర్మా, పెగూ సైనికులను తిరుగగొట్టుటయేగాక, పెగూ దేశమును కూడ జయించిరి. కాని, 18 వ శతాబ్దిలో అయోధ్య ప్రభువులలో అంతఃకలహములు చెలరేగిన అవకాశమును ఉపయోగించుకొని బర్మాప్రభువులు ఈ రాజ్యముపై దండెత్తి రాజధానియగు అయోధ్యను నాశనము ఒనర్చిరి.

ఆ తరువాత అయోధ్యపాలకుల సేనానులలో ఒకడగు ఫయాతక్‌సిన్ అనువాడు అవశిష్టసైన్యమును గుమిగూర్చి తన చతురత వలన తాయిలాండ్‌నందు సువ్యవస్థిత పరిపాలన ఏర్పరచి, బాంకాక్‌నగరమును దేశపు రాజధానిగ చేసి, తానే పాలకుడయ్యెను. కాని, ఇతడు అనతికాలముననే ఉన్మత్తుడగుటచే ఇతనిని చంపి ఫయాచక్రి అనువాడు సింహాసనమును ఆరోహించెను. ఇతని వంశమువారే ఈనాటి తాయిలాండ్ పాలకులు.

ఆధునిక యుగమున పోర్చుగీస్, డచ్చి, బ్రిటిష్, ఫ్రెంచి వారలతో క్రమముగ తాయిలాండ్‌నకు పరిచితి లభించినది. వీరిలో ఫ్రెంచివారును, ఇంగ్లీషువారును మాత్రమే తాయిలాండ్ పరిసరములందు రాజకీయముగ పలుకుబడిని ఆర్జించిరి. తూర్పున కొచిన్ చీనా, అన్నామ్, టాంకింగ్ ఫ్రెంచివారి సంరక్షణలోకి క్రమముగ చేరినవి. పశ్చిమమున ఎగువ - దిగువ బర్మాలు బ్రిటిష్‌వారి వశము అయినవి. ఇందువలన బ్రిటిష్, ఫ్రెంచి ప్రభుత్వములు రెండును తాయిలాండ్ స్వతంత్ర ప్రభుత్వముపై తమ పలుకుబడిని వ్యాపింపచేయుటకు యత్నించినవి. 19 వ శతాబ్ది అంతమున ఫ్రెంచివారితో జరిగిన ఒక సంఘర్షణ ఫలితముగ మీకాంగ్‌నదికి తూర్పున గల ప్రదేశమును అంతటిని ఫ్రెంచివారి రక్షితరాజ్యమగు అన్నామ్‌నకు తాయిలాండ్ వదలుకొనవలసి వచ్చెను. అటులే మలయా ద్వీపకల్పమున తనకు గల అధికారములను అన్నిటిని క్రమముగ బ్రిటిష్‌వారికి ఈ దేశము ధారాదత్తము చేసెను. కడకు 1896 లో బ్రిటిష్, ఫ్రెంచి ప్రభుత్వములు కుదుర్చుకొనిన ఒక ఒడంబడికను అనుసరించి అప్పటికి మిగిలిన తాయిలాండ్ యొక్క స్వాతంత్ర్యము గుర్తింపబడినది. కాని, 1907 లో సైతము బ్రిటన్, ఫ్రాన్స్, తాయిలాండ్‌ల మధ్య జరిగిన ఒక ఏర్పాటు ప్రకారము తాయిలాండ్‌లోని కొన్ని ప్రదేశములు బ్రిటన్‌కును, ఫ్రాన్స్‌కును చెంద జేయబడినవి.

తాయిలాండ్‌నందు 19 వ శతాబ్ది మధ్య కాలము వరకు ప్రాచీన నిరంకుశరాజ ప్రభుత్వమే అమలునందు ఉండెను. కాని, ఈ దేశప్రభువులగు మంగకూట (1851 - 68 ప.), చూలాలంకరణ (1868 - 1910 ప.) రాజుల కాలమున ఆధునిక పరిపాలనా విధానము క్రమముగ ఇట ప్రవేశపెట్టబడినది. అయినను రాజు నిరంకుశుడుగనే ఉండెను. కడకు ప్రజల ఆందోళనకు ఫలితముగ 1932 లో రాజ్యాంగ విహితమగు రీతిగ పాలకత్వము వహించుటకు రాజు అంగీకరించి ప్రజా ప్రాతినిధ్య సంస్థలను నెలకొల్పెను. అయినను ఈ దేశము స్థిరమైన ప్రభుత్వ విధానమునకు నోచుకొన

లేదు. 1932 మొదలుగ అంతటంతట జరిగిన తిరుగుబాటుల ఫలితముగ అప్పటికి అమలులో ఉన్న రాజ్యాంగచట్టము రద్దగుటయు, వేరొక రాజ్యాంగచట్టము ఏర్పడుటయు ఈ దేశమున పరిపాటి అయ్యెను. ఇటుల ఇప్పటికి క్రమముగ ఐదు రాజ్యాంగ చట్టములు దేశమున రూపొందింపబడినవి.

ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున ఈ దేశపు ప్రధాన మంత్రి పిబుల్ సంగ్రామ్ జపాన్‌తో సహకరించి, పూర్వము బ్రిటన్, ఫ్రాన్స్ ఒత్తిడికి లొంగి పోగొట్టుకొనిన ప్రదేశములను మరల తాయిలాండ్‌నకు చేర్చగలిగెను. కాని, ఆ యుద్ధమున జపాన్ ఓడిపోయినందున ఆ ప్రదేశములను యుద్ధానంతరమున మరల వదలుకొనవలసివచ్చెను.

యుద్ధానంతరమున ఈ దేశము ఐక్యరాజ్యసమితి [చూ. పు. 351] యందును, ఆగ్నేయ ఆసియా రక్షణ వ్యవస్థ [చూ. పు. 283] యందును సభ్యత్వము గడించినది. వీనిలో రెండవదాని ముఖ్యకార్యాలయము బాంకాక్ నగరమున కలదు.

రాజ్యాంగము : 1952 లో ఆమోదింపబడిన రాజ్యాంగ చట్టము ప్రకారము ఈ దేశమున వంశానుగతము, రాజ్యాంగచట్ట విహితము అగు రాచరికపు పాలన నెలకొల్పబడినది. ఏకకక్ష్యగల జాతీయసభ యందలి 246 మంది సభ్యులలో సగము మందిని ప్రజలు ఎన్నుకొనెదరు. తక్కిన సగము మందిని రాజు నియామకము చేయును. మంత్రులను, ప్రధానిని రాజు నియమించును. వీరు శాసనసభకు బాధ్యత వహించి పరిపాలన నిర్వహింతురు.

కాని, 1958 లో సరిత్ ధనరాట్ అను సేనాని బల ప్రయోగముచే అధికారమును గ్రహించి రాజ్యాంగ చట్టమును, రాజకీయ పక్షములను రద్దొనర్చెను. తదాది ధనరాట్ ఆధ్వర్యవమున రాజు పేరిట సైనిక పరిపాలన దేశమున అమలునందు ఉన్నది. చీ. శే. రా.

**తిబెత్తు** : చూ. టిబెట్ - పు. 493.

**తిలక్, బాలగంగాధర్** (1856 - 1920) : 'స్వాతంత్ర్యము మన జన్మహక్కు' అనే నినాదమును ప్రవేశపెట్టిన భారతదేశీయ నాయకుడు. లోకమాన్యుడుగా ప్రసిద్ధి పొందిన ఈయన 1856, జూలై 23 న రత్నగిరిలో చిత్పవన బ్రాహ్మణ వంశమున జన్మించెను. ఉపాధ్యాయుడైన ఇతని తండ్రి చిన్నతనముననే తన కుమారునికి పాశ్చాత్య భావములను పరిచయము చేసెను.

స్వచ్ఛంద సేవకై వ్యవస్థాపితమైన డెక్కన్ ఎడుకేషన్ సొసైటీలో ఉపాధ్యాయులుగ (1883), ఫర్గూసన్ కాలేజీలో ఆచార్యులుగ (1885) గోపాలకృష్ణగోఖలే [చూ.], తిలక్‌లు పని చేసిరి. గోపాలకృష్ణగోఖలే యొక్క మిత వాద విధానములను విమర్శించి, బ్రిటిష్ పాలనను తీవ్రముగ ప్రతిఘటించవలెనని భారత జాతీయ కాంగ్రెస్‌లో



బాలగంగాధర్ తిలక్
(1856 - 1920)

అతివాదవర్గ నాయకుడుగ తిలక్ వాదించెను; మరాఠీలో 'కేసరి', ఇంగ్లీషులో 'మహారాటా' అను పత్రికలను వ్యవస్థాపించి (1890), ప్రభుత్వ వ్యతిరేక ప్రచారమును తీవ్రతరము చేసెను. 1897 లో సంభవించిన ప్లేగువ్యాధి, క్షామ పరిస్థితుల నిర్మూలనములో ప్రభుత్వపు అశ్రద్ధను తన పత్రికలలో తీవ్రముగ విమర్శించి, 18 నెలల కారాగార శిక్షను అనుభవించెను. యావద్భారత బహిష్కరణ ఉద్యమమును, సాత్విక నిరోధమును ప్రబోధించినందులకు ఇతనికి 1908 లో ఆరు సంవత్సరముల జైలు శిక్ష విధింపబడెను. 1914 లో జైలు నుండి విడుదల అయిన పిమ్మట 'హోమ్‌రూల్ (స్వయంపాలన)' ఉద్యమమును దేశము అంతట విస్తరింపజేసెను. జాతీయ పోరాటములో హిందూ - ముస్లిమ్‌లను తాత్కాలికముగనైన సమైక్యపరచుటకు 1916 లక్నో ఒప్పందమును ఇతడు కుదిర్చెను. 'గీతారహస్యము', 'ఆర్కిటిక్ హోమ్ ఇన్ ది వేదాస్', 'వేదిక్ క్రోనాలజీ అండ్ వేదాంగ జ్యోతిషమ్' అను గ్రంథములు ఇతని మేధాశక్తిని వెల్లడి చేయుచున్నవి. పా. ల. నా.

**తుఘ్లుక్ వంశము** (1321 - 1412): భారతదేశమున అత్యధిక భాగమును పాలించిన ఒక రాజవంశము. ఘియాజుద్దీన్ పుట్టుక వలన పేదవాడైనను తన సుగుణ సంపత్తి వలన ఖిల్జీసుల్తానుల సేనానాయకుడై తుదకు తుఘ్లుక్ సుల్తానుల వంశస్థాపకుడు కాగలిగెను. అతడు సుల్తాను అయినప్పుడు ఖజానా వట్టిదైనది. పాలనాయంత్రము క్రమము దప్పి సామంత రాష్ట్రములు అన్నియు అరాజక స్థితియందు ఉండెను. ఘియాజుద్దీన్ త్వరలోనే అన్నిటిని చక్కబెట్టెను. 1323 లో కప్పము కట్టకున్న కాకతీయ ప్రతాపరుద్రునిమీదికి తన కుమారుడగు ఉలుగ్ ఖాన్‌ను పంపెను. ప్రతాపరుద్రుడు ఓడిపోయి, చెరలోనే మరణించెను. ఓరుగల్లు రాజ్యము ఢిల్లీ సామ్రాజ్యములో చేరినది. 1325 లో అరాజక స్థితిలో ఉన్న బెంగాల్ మీదకి దండెత్తి సంపూర్ణ విజయముతో తిరిగి వచ్చెను. కాని, అతనిని సమ్మానింప అతని

కుమారుడు ఏర్పరచిన మండపము విరిగి మీద పడి ఘియాజుద్దీన్ మరణించెను. దీనికి అతని కుమారుడు ఉలుగ్ ఖాన్ ఎంతవరకు బాధ్యుడో చెప్ప సాధ్యము కాదు.

**మహమ్మద్ బిన్ తుఘ్లుక్ :** తండ్రి మరణానంతరము ఉలుగ్ ఖాన్ 'మహమ్మద్ బిన్ తుఘ్లుక్' అను బిరుదముతో సింహాసనము అధిష్ఠించెను. శాంతియుతమగు విశాల సామ్రాజ్యము, ధనముతో నిండిన బొక్కసము కలిగి, హిందువుల ఎడ కూడ సమరస బుద్ధితో మెలగు విశాల హృదయుడు అగుటచే అతను సుల్తానైన కాలము మంచిదని చెప్పవచ్చును. కాని, అతని అప్రతిమానమగు అహంభావము, అవిధేయుల దండించుటయందు ప్రీతి, అతి క్రౌర్యము అతని పరిపాలనా సౌష్ఠవమును భంగపరచినవి. దేశ కాల పాత్రలను ఎరుగక అతడు చేయబూనిన మార్పులు ప్రజలకు అనిష్టమగుటచే చాల చెడు ఫలితములు కలిగినవి. దేశ మధ్యస్థముగ ఉండునని దేవగిరికి రాజధానీ నగరము మార్చవలెనని ఇతడు యత్నించెను. ప్రజల తీవ్రమైన అసమ్మతికి వెరగంది తిరిగి ఢిల్లీకి రాజధానిని మార్చెను. వెండి, బంగారములకు కరవు ఏర్పడినంతట ఇతడు పెద్ద విలువలకు సైతము రాగినాణెములనే ముద్రింప జేసెను. అంతేకాదు; తుదకు తోలు నాణెములను కూడ ముద్రింప జేసెను. హిమాలయ పర్వతములకు ఆవలి ప్రాంతము జయింప యత్నించి విఫలుడయ్యెను. తన కార్య వైఫల్యమునకు అంతటికిని ప్రజలే కారణభూతులని, వారియొక్క విముఖతయే ముఖ్యకారణమని వారిని నానా బాధలు పెట్టెను. చిన్న చిన్న తప్పులను క్రమముగ కనుగొని అందువలన ప్రజలకు గలిగిన నష్టమునకు పరిహారము చేయుచుండెను. కాని, అట్లు చేయుట చాల ఆలస్యము అగుటచే ప్రజల కష్టములు మితిమీరి, సామ్రాజ్యమున అరాజకత్వము ప్రబలి పోయినది. తన పరిపాలనా కాలమందలి మొదటి భాగమందు తన అధికారమును నిలువబెట్టుకొనగలిగెను. కాని, శక్తికి మించిన సామ్రాజ్యమున ప్రజలలో అసంతృప్తి కారణములుగా అతని కాలమందు పదునాలుగు తిరుగుబాట్లును, ఒకసారి మంగోల్‌ల దండయాత్రయు జరిగినవి. ఈ విపరీతములకు తోడు గంగా - యమునా మధ్యసీమలో చాలకాలము కరవు చెలరేగినది. కేంద్రప్రభుత్వము బలహీనము అగుటచే దూర ప్రాంతములలో ఉన్న సామంతులు అందరు స్వతంత్రులైరి. 1334 లో సయ్యద్ జలాలు అనువాడు మధురలో స్వతంత్రుడు అయ్యెను. 1336 లో కాపయనాయకుడు ఓరుగల్లు నుండి మహమ్మదీయ సైనికుల వెడల నడిచెను. ఆ సంవత్సరము లోనే హరిహర, బుక్కరాయలు విజయనగర సామ్రాజ్యమునకు శంకుస్థాపన చేసిరి. 1338 - 39 లో బెంగాల్ కూడ స్వతంత్రించెను. 1347 లో దక్కనులో బహమనీ రాజ్యము స్థాపించబడినది. నాగరకోట కూడ స్వతంత్రించినది. గుజరాత్, మాళ్వా, సింధు మున్నగు అన్ని ప్రాంతములలో తిరుగుబాటులు చెలరేగెను. తిరుగుబాటుదారులను అడచు ప్రయత్నమందే 1351 లో ఈ సుల్తాను 'తట్టా' అనుచోట మరణించెను.



మహమ్మద్ బిన్ తుఘ్లుక్
(1325 - 1351 ప.)

**ఫిరోజ్ తుఘ్లుక్** (1351 - 1388 ప.) : మహమ్మద్ బిన్ తుఘ్లుక్‌కు పెదతండ్రి కుమారుడు. నాటి పరిస్థితులలో అతడు తప్ప ఇతరులు ఎవ్వరును ఢిల్లీసామ్రాజ్యమును కాపాడజాలరని మహమ్మద్ బిన్ తుఘ్లుక్ కుమారుని తప్పించి, సర్దార్‌లు అందరు ఫిరోజ్‌ను సుల్తాన్‌గ చేసిరి. ఫిరోజ్ శాంతిప్రియుడు అగుటచే సామ్రాజ్యమునుండి విడిపోయిన రాష్ట్రముల పునరాక్రమణకు పూనుకొనలేదు. అతడు చేసిన కొన్ని యుద్ధప్రయత్నములు కూడ విఫలములు అయ్యెను. కాని, అతడు చేసిన ప్రయోజనకర సంస్కరణలు చాల మెచ్చుకొనతగినవి. భారమైన పన్నులు తొలగించెను; యమునా, సట్లజ్ నదులనుండి పంటకాల్వల త్రవ్వించెను; నిరుద్యోగమును నివారించెను; తీవ్ర దండనలను రద్దు చేసెను; మహమ్మదీయుల విద్య కొరకై 38 కళాశాలలు స్థాపించెను; జవున్‌పూర్ మున్నగు నగరముల నిర్మించెను; ఢిల్లీలో ఉచిత వైద్యశాల స్థాపించెను; పాడుపడిన మున్నూరు ఉద్యానముల బాగుపరచెను; బావులు, కాలువలు, రిజర్వాయరులు మున్నగునవి ఎన్నో కట్టించెను; ఇట్టి నీటిపారుదల సౌకర్యములవలన అన్ని విధములైన పంటలు వృద్ధిపొందినవి; పన్నులు బాగుగ వసూలై ఆదాయము వృద్ధిచెందినది; ప్రజలు హాయిగ సుఖించిరి. కాని, అతడు హిందువులను హింసించుటవలన ప్రజాసామాన్యమునందు అసంతృప్తి ఎక్కువైనది. జీతాలకు బదులు భూములు ఇచ్చుటవలన ఉద్యోగస్థులు సరిగ పని చేయకుండిరి. క్రమమున జీవితాంత కాలమందు పరిపాలన సరియైన పద్ధతి లేక క్షీణించినది. అతని అనంతరము సింహాసనమునకు పలువురు తగవులాడిరి. తుదకు 1398 లో మహమ్మద్ షా అనువాడు సుల్తాను అయ్యెను. అతని కాలమందు జవున్‌పూర్, గుజరాత్, మాళ్వా, పంజాబ్, ఖాందేష్ మున్నగు సామంతరాష్ట్రములు అన్నియు

స్వతంత్రించినవి. ఢిల్లీ సామ్రాజ్యము చెదిరిపోయినది. అటువంటి సమయమున 1398 లో తైమూర్ [చూ.] ఢిల్లీని కొల్లగొట్టి, ఆ నగరవాసులను చిత్రవధ చేసి, అపార ద్రవ్యములతో తన దేశమునకు తరలిపోవుచు, ఖిజిర్ ఖాన్ అనువానిని తన ప్రతినిధిగా నియమించి లాహోర్‌లో ఉండవలసినదని శాసించెను. తైమూర్ వెళ్ళిపోయిన వెనుక 1401 లో మహమ్మద్ షా తుఘ్లుక్ గుజరాత్ దేశమునుండి తిరిగివచ్చి, 1412 వరకు ఏదో రీతిగ కాలము గడపి గతించెను. అతని చావుతో తుఘ్లుక్ వంశము అంతరించినది. అప్పుడు దౌలత్ ఖాన్ లోడీ అనువానిని సర్దారులు అందరు కలసి తమ రాజుగ ఎన్నుకొనిరి. కాని, ఖిజిర్ ఖాన్ వానిని పారద్రోలి ఢిల్లీని 1414 లో ఆక్రమించి తన సయ్యద్ వంశమును స్థాపించెను [చూ. సయ్యద్ వంశము]. గు. వెం.

**తుర్కీ :** చూ. టర్కీ.

**తూర్పు ఇండియా వర్తక సంఘము (1600 - 1858) :** తూర్పు ఇండియా దీవులందు వాణిజ్య వ్యాపారములు సాగించుకొనుటకు ఇంగ్లండులో ఏర్పడిన వాణిజ్య సంఘము. దీనికి ఎలిజబెత్ - I [చూ. పు. 347] 1600, డిసెంబర్ 31 వ తేదీని ఒక అనుజ్ఞా పత్రము (చార్టర్) ఇచ్చెను. ప్రారంభదశలో ఈ సంఘము వారికి భారత దేశమందు మూడు స్థానములలో కార్ఖానాలు ఏర్పరచుకొనుటకు అనుజ్ఞ లభించెను. దానిని అనుసరించి :

1. పడమటి తీరమున మొదట సూరత్ వద్దను, పిమ్మట బొంబాయి వద్దను ;

2. దక్షిణ దేశమందలి తూర్పు తీరమున మద్రాసులో ఫోర్ట్ సెంట్ జార్జి వద్దను ;

3. ఈశాన్యభాగమందలి హుగ్లీనదీ తీరమున కార్ఖానాలు తొలుత నెలకొల్పబడినవి. ఏబది సంవత్సరముల తరువాత హుగ్లీవద్ద నుండిన కార్ఖానా కలకత్తాకు తరలినది.

ఈ వాణిజ్య సంఘము క్రమక్రమముగ దేశమందలి రాజకీయ విషయములలో జోక్యము కలుగజేసికొని, యుద్ధములు సాగించి, విజయములు పొంది, 1765 నాటికి బెంగాల్ రాష్ట్రమును వశపరచుకొని దానిని పరిపాలించుటకు పూనుకొన్నది. 1784 లో పిట్ ప్రధాని పార్లమెంట్ సభచే ఆమోదింపజేసిన ఒక చట్టమును అనుసరించి భారతదేశములోని కంపెనీ వ్యవహారములు, పరిపాలనా విధానము కంపెనీవారును, పార్లమెంట్‌కు బాధ్యత గల ' బోర్డ్ ఆవ్ కంట్రోల్ ' వారును ఇంచుమించు సమాన ప్రతిపత్తితో చూడవలసిన విధానము ఏర్పడినది. ఆ పిమ్మట ఈ సంఘము వారు యుద్ధములు సాగించి విజయులై భారతదేశమందు చాలభాగము తమ అధీనతలోనికి తెచ్చుకొనిరి. 1857 లో చెలరేగిన సిపాయిల తిరుగుబాటు దేశస్థుల స్వాతంత్ర్య సంగ్రామముగ పరిణమించినది. ఆ తిరుగుబాటును కంపెనీ వారు అణచివేసి శాంతిని నెలకొల్పినను, పార్లమెంట్ దేశ పరిపాలనము కంపెనీవారి నుండి తీసికొని బ్రిటిష్ రాణియైన విక్టోరియాకు అప్పగించి, నూతన పరిపాలనా విధానమును నెలకొల్పిరి. 1858 లో ఈ సంఘము అంతరించినది. వి. నా.

**తూసిడైడీస్ :** ప్రసిద్ధ ప్రాచీన చారిత్రకుడు [చూ. సం. 6 - పు. 705].

**తైమూర్ (1336 - 1405) :** పేరొందిన ఒక మంగోలియన్ విజేత. ఇతనికే ' తామర్లేన్ ' అనియు వ్యవహారము కలదు. చెంఘిజ్ ఖాన్ [చూ. పు. 459] వలె ఇతడునుదూర దేశముల జయించు కాంక్ష కలవాడు. మంగోలియన్‌లలో ప్రప్రథమముగ ఇస్లామ్‌ను స్వీకరించిన తెరాగై అను సర్దారు ఇతని జనకుడు. తన కాలపు మంగోలియన్ ప్రభువులలో ప్రముఖుడుగ ఉండిన ' కుర్ గన్ ' అను వానికి తైమూర్ తొలుత ఆశ్రితుడుగ చేరి(1356), క్రమముగ తన ప్రతిభావిశేషముచే కుర్ గన్ మరణానంతరమున ప్రతిస్పర్ధుల నెల్ల నిర్మూలించి, 1369 లో సమర్కండ్ రాష్ట్రపు ప్రభువుగ ప్రకటితుడయ్యెను. తరువాత ముప్పది ఏండ్లు ఇతడు తన పాలనను స్వదేశమున సుస్థిరము ఒనర్చుకొనుటయే కాక, ప్రక్క దేశములపై దండెత్తి వానిని ఆక్రమించుకొనుటకును వినియోగించెను. పశ్చిమ, వాయవ్య దిశలందు ఇతడు తన దండయాత్రలను కాస్పియన్ సముద్రము వరకును, యూరల్, వోల్గా నదీ తటముల వరకును విస్తరింపజేసెను. దక్షిణ, నైరృతి దిశలందు జరిపిన దండయాత్రల వలన పారసీక రాజ్యమందలి ప్రతి రాష్ట్రమును కల్లోలితమయ్యెను. 1395 లో ఈతడు ' కిప్ చాక్ ' ప్రాంత పాలకుని ఓడించి, ఖ్వారిజమ్‌ను హరించెను.

ఇతని మనుమడు పీర్ మహమ్మద్ 1398 లో భారత దేశముపై దండయాత్ర సలిపి ఆరు నెలల పోరాటము అనంతరము ముల్టాన్‌ను పట్టుకొనెను. ఆ సంవత్సరమే 90,000 అశ్విక దళముతో తైమూర్ సింధునదిని దాటి ముల్టాన్‌కు ఈశాన్యముగ 112 కి. మీ. దూరములో జీలమ్-చీనాబ్ నదుల సంగమము వద్ద ఉన్న తులంబాను కొల్లగొట్టి బాట్నర్ మీదుగా దారిలోని గ్రామములను దోచుకొనుచు ఢిల్లీ చేరి, ఢిల్లీని ఆక్రమించుకొని రాజుగ ప్రకటించుకొనెను. ఢిల్లీప్రభువు మహమ్మద్ గుజరాత్‌కు పారిపోయెను. తైమూర్ ఢిల్లీ ప్రజలకు అభయము ఇచ్చెను. కాని, అతని సైనికులు విచ్చలవిడిగా ప్రవర్తించుటచే తిరుగుబాటు జరిగి, తత్ఫలితముగ అనేక మంది హతులైరి.

ఈ హత్యలు పెక్కు రోజులపాటు జరిగినవి. రమారమి 1,00,000 మంది ఖైదీలు నగరపు పొలిమేరలో హత్య చేయబడిరి. నగరము అంతయు ఈ హత్యలతో, దోపిడులతో నేలమట్టము అయినది. అనేక మంది స్త్రీలు, నిపుణులైన శిల్పులు, పనివాండ్రు సమర్కండ్‌కు కొనిపోబడిరి. ఇటుల దేశమును సర్వనాశనము చేసి, హరిద్వారము, హీరట్‌ల మీదుగా తైమూర్ తన దేశమునకు వెడలి పోయెను. నాటి నుండి మొగల్‌ల పరిపాలనా కాలమువరకు ఢిల్లీ మరల బాగుపడలేదు.

ఢిల్లీనుండి తిరిగి స్వదేశమునకు చేరిన పిదప ఇతడు తుర్కులపై ఘనవిజయమును సాధించి బాగ్దాద్, అలెప్పో, డెమాస్కస్ నగరములను వశపరచుకొనెను. అంతట చీనాపై దండెత్తుటకు ఉద్యమించెను. కాని, ఇది కార్య రూపము దాల్చకముందే తీవ్ర జ్వర బాధితుడై మరణించెను (ఫిబ్రవరి 17, 1405). వి. నా.

**తైవాన్ (చీనా):** ఆసియా ఖండమునకు చెందిన ఒక ద్వీప రాజ్యము. దీనికే 'ఫార్మోజా' అనియు వ్యవ




హారము. పరిపాలన రీత్యా చీనాలో ఇది అంతర్భాగమే అయినను, ఆ దేశమందలి అంతర్యుద్ధ ఫలితముగ, కమ్యూనిస్ట్ వ్యతిరేకుల వశమున ఒక ప్రత్యేక రాజ్యముగ ప్రస్తుతము (1966) మనుచున్నది.

చీనా ముఖ్య భూభాగమునకు తూర్పున పసిఫిక్ మహాసముద్ర పరివృతమై ఉన్న ఈ ద్వీపమును ఫార్మోజా (తైవాన్) జలసంధి చీనా నుండి వేరు చేయుచున్నది. ఈ జలసంధి కొన్ని ప్రదేశములందు 160. కి. మీ వెడల్పుగ కూడ ఉండదు. పరిపాలన రీత్యా ఈ ద్వీపరాజ్యమున తైవాన్ వర్గమని వ్యవహరింపబడు 13 అల్ప దీవులును, పెన్‌ఘూ (పెస్కడోర్స్) వర్గమని వ్యవహరింపబడు 64 అల్ప దీవులును చేరి ఉన్నవి. [వి] తైవాన్ ద్వీపపు వైశాల్యము 35,967 చ. కి. మీ.; దాని చుట్టునున్న అల్ప దీవులు మొత్తపు వైశాల్యము 65 చ. కి. మీ ; ఈ అల్ప దీవులు గాక చీనా తూర్పున ఉన్న అమాయ్ అఖాత మందలి మత్సూ దీవులు (29 చ. కి. మీ.) ను ; క్విమాయ్ దీవులు అనబడు వానిలో రెండు దీవులు (162 చ, కి. మీ.) ను తైవాన్ అధికారమునకు లోబడి ఉన్నవి. [జ] దేశమున మొత్తపు జనసంఖ్య 1,15,11,000. [భా] చీనా భాషయందలి 'మండారిన్' అను పేరుగల మాండలికము అధికార భాషగ వ్యాప్తియందు ఉన్నది. ప్రజలలో వివిధ చీనీయ మాండలికములును, దేశమునందలి ఆదివాసులలో పొలినీషియన్-మలే భాషా కుటుంబమునకు చెందిన కొన్ని భాషలును ప్రచారమున ఉన్నవి. [మ] బౌద్ధమతము, టావోమతము, సంప్రదాయ పితృదేవతారాధనము సంకర మొందిన మతము ప్రజలలో వ్యాప్తియందు ఉన్నది. [రా] తైపే (జ. సం. 7,48,510).

చరిత్ర : చీనాకు అతి సమీపముననే ఈ ద్వీపము ఉన్నను, చీనా ప్రాచీన యుగ చరిత్రలో తైవాన్ ప్రసక్తి ఎచటను కానరాదు. కాని, చీనాను పాలించిన టాంగ్ రాజ వంశీయుల కాలమున (క్రీ. శ. 618 - 907) చీనీయులు ఈ దీవిలో వలసను ఏర్పరచుకొనుటకు మొదలిడిరని భావించుటకు అవకాశము కలదు. చీనా పరిపాలకుడగు కుబ్లయ్‌ఖాన్ [చూ. పు. 392] కాలమున (1259 - 94) ఈ ద్వీపమునకు సమీపమున ఉన్న పెస్కడోర్స్ ద్వీపమునందు తొలుతగ చీనా ప్రభుత్వపు పరిపాలన నెలకొల్పబడినది. కాని, తైవాన్ మాత్రము ఆ నాడును చీనా పరిపాలనకు లోబడి ఉండలేదు. మింగ్ రాజవంశము చీనాను పాలించు కాలమున (1368 - 1644) సముద్రములపై నౌకల కొల్లగొట్టి జీవించు కొందరు జపానీ సాహసికులును, చీనా దేశీయులగు కొందరు దుండగులును ఈ ద్వీపమునందలి పలు తెగల ఆదిమవాసులను జయించి తీరమునందలి వివిధ ప్రాంతములను ఆక్రమింప గలిగిరి.

పోర్చుగీస్ నావికులు 1517 లో ఈ దీవిని దర్శించి, దీనికి 'ఇల్హా ఫార్మోజా' అని పేరిడిరి. తరువాత ఒక శతాబ్దమునకు పోర్చుగీస్ వారిని ప్రాచ్యదేశ వ్యాపార రంగమునుండి తొలగించుటలో పూనిక వహించిన డచ్చి వారు పెస్కడోర్స్ దీవులను 1622 లో వశపరచుకొని, చీనా, జపాన్, ఫిలిప్పీన్ దీవుల మధ్య జరుగు సముద్ర వ్యాపారమును కల్లోల పరచుటకు వీనిని స్థావరముగ ఉపయోగించిరి. అంతట రెండేళ్ళ తరువాత చీనా ప్రభుత్వము డచ్చి సాహసికులను సాంత్వన విధానమున లొంగదీయదలచి, వారికి తైవాన్‌నందు వర్తక స్థావర

ములను నెలకొల్పుకొనుటకు వసతి ఏర్పరచి, పెస్కడోర్స్ దీవులను వారు వదలుకొనునటుల జేసెను. దీనిని అనుసరించి తైవాన్‌నందలి నైరృతి తీర ప్రాంతమున డచ్చివారు రెండు కోటలను నిర్మించుకొనిరి. డచ్చివారితో ఆనాడు పోటీగా పని చేయుచున్న స్పెయిన్‌వారు అంతట తైవాన్ ఉత్తరాగ్ర భూమిని వశపరచుకొని అచ్చట ఆధిపత్యమును నెలకొల్పిరి (1626). 1628 నుండి జపాన్ దేశ ప్రభువులు తమ దేశమునకు తక్కిన ప్రపంచముతో గల సంబంధములను తెగతెంపులు చేసికొనిన ఫలితముగ జపాన్‌వారు తైవాన్ విషయమున జోక్యము వహించుట మానివేసిరి. 1642 లో డచ్చివారు స్పెయిన్‌వారిని ఓడించి, వారి వశమున తైవాన్‌లో ఉన్న భూమినే కాక క్రమముగ తైవాన్ అంతటిని ఆక్రమించిరి (1656). ఈ ఆక్రమిత ప్రాంతమున డచ్చివారు తమ ఆధిపత్యమును సుస్థిరము ఒనర్చుకొను సమయమున చీనాయందు మింగ్‌రాజ వంశపు పరిపాలనను అంతమొందించి, మంచూప్రభువులు తమ అధికారమును నెలకొల్పిరి. అంతట మింగ్‌రాజ వంశపు రాకుమారుడు ఒకడు ఈ దీవిని డచ్చివారినుండి వశపరచుకొని ఇట తన ప్రభుత్వమును స్థాపించెను (1662). కాని, ఈ మింగ్‌వంశీయులను తైవాన్‌నుండి సైతము తరిమివైచి మంచూప్రభువులు ఈ రాజ్యమును 1682 లో వశపరచుకొనిరి.

చీనాసామ్రాజ్యమందలి ఫుకీన్ రాష్ట్రపాలకుని ఆధిపత్యమున తైవాన్‌నందు 1683 నుండి 1886 వరకు పరిపాలన సాగెను. ఈ కాలమున చీనీయులు కొందరు వలసచేరి స్థావరములను ఏర్పరచుకొనిరి. తైవాన్‌నందలి ఆదివాసులలో పలువురు చీనీయులతో కలిసిపోవుటయో లేదా దుర్గమ పర్వతారణ్య సీమలలో తలదాచుకొనుటయో జరిగెను. 1886 లో సైనికతంత్ర రీత్యా ఈ దీవికి గల ప్రాముఖ్యము ప్రభుత్వము గుర్తించి, ఈ దీవియందు ఒక ప్రత్యేక రాష్ట్రప్రభుత్వమును నెలకొల్పెను. 1895 లో చీనా-జపాన్ యుద్ధము [చూ.] అంతమొందిన తరువాత కుదిరిన సంధిని అనుసరించి చీనాప్రభుత్వము ఈ దీవిని జపాన్ ప్రభుత్వమునకు దత్తమొనర్చెను. అంతట ద్వీపవాసులు జపాన్ సామ్రాజ్యప్రభుత్వమును ధిక్కరించి తిరుగుబాటులు జరిపిరి. కాని, జపాన్ ప్రభుత్వము ఈ తిరుగుబాటులను నిర్దాక్షిణ్యముగ అడచివేసెను. ఆ తరువాత సైతము అంతటంతట చెదరుగ దేశీయులు తిరుగుబాటులు జరిపి జపాన్ ప్రభుత్వమును ఎదుర్కొని పోరాడుచునే ఉండిరి. జపాన్ పరిపాలనా కాలమున ఈ ద్వీపమున వ్యవసాయమును, రాకపోకల వసతులను బాగుగ అభివృద్ధిచెందెను. జపాన్‌భాషా సంస్కృతులను ఇట వ్యాపింప చేయుటకు జపాన్ ప్రభుత్వము విరివిగ కృషి చేసెను. ద్వితీయప్రపంచ యుద్ధకాలమున దేశమును పారిశ్రామికముగ సైతము ముందునకు కొనిపోవు తలంపుతో జపాన్‌ప్రభుత్వము ఇట కొన్ని పరిశ్రమలను నెలకొల్పెను. కాని, ద్వితీయ ప్రపంచ యుద్ధ ఫలితములగు విమానపు దాడులవలన ఇవి చాల వరకు నాశనమైనవి.

మిత్రమండలివారు 1943 లోని కైరో ప్రకటన, 1945 లోని పోట్స్‌డామ్ ఉద్ఘాటనల మూలమున తైవాన్‌ను చీనాకు అప్పగించుటకు నిశ్చయించుకొనుటచే 1945, సెప్టెంబరులో చీనా తైవాన్‌ను వశపరచుకొనినది. 1949 లో చీనా ముఖ్య భూభాగము అంతయు కమ్యూనిస్ట్‌ల వశమగుటచే, అట తావులేక చీనా కేంద్రప్రభుత్వము చియాంగ్ కై-షేక్ [చూ. పు. 451] నాయకత్వమున ఆ సంవత్సరము డిసెంబరు 8 వ తేదిన తైవాన్‌దీవికి చేరుకొనెను. కమ్యూనిస్ట్ సైన్యములు ఆ తరువాత తైవాన్‌ను సైతము వశపరచుకొన యత్నించినవి. కాని, యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వము జోక్యము వహించి, తైవాన్‌పై జరుగు దండయాత్రను ప్రతిఘటింప దలచుటచే చీనా కమ్యూనిస్ట్ ప్రభుత్వము దండయాత్రకు పూనుకొనక, బెదరింపులతోనే కాలము గడపవలసి వచ్చినది.

తైవాన్ నందలి చీనా ప్రభుత్వమునే సాధికార చీనా ప్రభుత్వముగా యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వమును, దానిని అనుసరించిన కొన్ని రాజ్యములును గుర్తించినవి. కాని, భారతదేశము మొదలగు కొన్ని ప్రముఖ రాజ్యములు ఈ ప్రభుత్వమును గుర్తింప నిరాకరించినవి. ఐక్యరాజ్య సమితి భద్రతా సమితిలో చీనా ప్రభుత్వమునకు గల శాశ్వత స్థానము ఈ నాటికిని తైవాన్ నందలి చీనా ప్రభుత్వపు వశముననే కలదు. సోవియట్ రష్యా మొదలగునవి ఐక్యరాజ్య సమితి నుండి తైవాన్ నందలి చీనా ప్రభుత్వమును తొలగించి, చీనా ముఖ్య భూ భాగమునందలి కమ్యూనిస్ట్ చీనా ప్రభుత్వమును నెలకొల్పుటకు చేసిన ప్రయత్నములు అన్నియు ఐక్యరాజ్య సమితియందు యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వమునకు కల పలుకుబడి వలన విఫలములైనవి. సైనికముగనే కాక ఆర్థికముగ కూడ యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వమునే తైవాన్ ప్రభుత్వము ఆశ్రయించి ఉన్నది. ఈ రాజ్యమందలి ఆర్థిక సుస్థిరతకు యునైటెడ్ స్టేట్స్ సహాయమే మూలాధారము.

రాజ్యాంగము : 1947, జనవరి 1 వ తేదిన చీనా ప్రభుత్వముచే విశాల చీనా రాజ్య పరిపాలన కొరకై ఉద్దేశింపబడి, ప్రచురితమైన రాజ్యాంగ విధానమే తైవాన్

నందలి చీనా ప్రభుత్వమునకు వర్తించునని ఈ ప్రభుత్వము చెప్పుచున్నను యథార్థమున అందలి పౌర స్వాతంత్ర్య స్వత్వములు అన్నియు నేడు ఇట ఆత్యయిక పరిస్థితి నెపమున ఉపసంహరింపబడినవి. అధ్యక్షుడగు చియాంగ్ - కై - షేక్ ఇచ్చు ఉత్తరువుల వలననే ఇచట ఈ నాడు ప్రభుత్వము నడచుచున్నది [చూ. చీనా]. చీ. శే. రా.

**తైవాన్, ఫార్మోజా :** చూ. తైవాన్(చీనా) - పు. 522.

**తోడరుమల్లు, రాజా :** భారతదేశమును పాలించిన అక్బర్ [చూ. పు. 260] చక్రవర్తికి ప్రధాన మంత్రి. సామాన్యమైన గుమాస్తాగా ప్రారంభించి, తన ప్రతిభా సంపత్తిచే ఇతడు ప్రధానమంత్రి అయినాడు. అక్బర్‌కు మొదటి ఆర్థికమంత్రి ముజఫర్‌ఖాన్ తర్వాతికి సహాయకుడుగా తొలుత ఇతడు పనిచేసెను. దేశములో అక్బర్ పరిపాలనా ప్రారంభములో చెలరేగిన తిరుగుబాటులను అడచుటలో ప్రముఖ పాత్ర వహించెను. అక్బర్ గుజరాత్‌ను జయించిన తరువాత అచటి భూమిశిస్తు విధాననిర్వహణము ఇతనికి అప్పగించబడినది. తరువాత బెంగాల్‌ను జయించునప్పుడు ఇతడు సేనానాయకత్వము వహించెను. ఈతని భూమిశిస్తు విధానము విజయవంతము అగుటతో ఇతడు వజీరుగను, ముఖ్య ఆర్థికమంత్రిగను నియమితుడయ్యెను. ఇతడు అనుసరించిన భూమిశిస్తు విధానములో గల ప్రధాన లక్షణములు ఆ తర్వాతి ప్రభుత్వముల వారికి అనుసరణీయములైనవి.


రాజా తోడరమల్

భూమిపన్ను లెక్కలు పారసీక భాషలో వ్రాయవలయునని నిర్బంధించి, ఇతడు హిందువులు తప్పనిసరిగ పారసీక భాష నేర్చుకొనునట్లు చేసెను. ఆ భాష నేర్చుకొనిన వారికే ప్రభుత్వోద్యోగములు ఈయబడునను నియమమును విధించెను.

ఇతడు అక్బర్ ఉద్యోగులలో అత్యంత సమర్థుడనియు, న్యాయవంతుడనియు పేరుగాంచెను. వి. నా.

**దండన విమోచనము, సర్వక్షమ :** ఒక రాజ్యము యొక్క సర్వాధికారి ఆ రాజ్యము పట్ల అపచారము ఒనర్చిన అపరాధులను దండన విముక్తులను కావించి నిరపరాధులవలె చూచు ఉదార చర్య. కేవల క్షమాపణ కంటె దీనిలో విశేషము ఉన్నది. అపరాధమును గూర్చిన న్యాయశాస్త్ర సంబంధమైన ఎట్టి అవశేషముగాని లేకుండ ఈ చర్య అపరాధికి సంపూర్ణ విముక్తి కలిగించును. ప్రభువులు మాత్రమే జారీచేయు దండన విమోచనాజ్ఞలు గాని, పార్లమెంట్ శాసనము వలన జరుగునవి కాని సాధారణముగ పట్టాభిషేక మహోత్సవమువంటి శుభ సందర్భములలో జారీ చేయబడుచుండును. ఇట్టి ఆజ్ఞలు ముఖ్యముగ రాజకీయాపరాధులకు మాత్రమే వర్తించుచుండును. ఒక్కొక్కప్పుడు విచక్షణలేకుండ సర్వవిధ అపరాధుల పట్లను వర్తింపచేయుచుండుట కూడ కలదు [చూ. న్యాయశాస్త్ర సంపుటము] ప్ర. రా.

**దక్షిణ అమెరికా :** చూ. అమెరికా; ఆర్జెంటీనా; ఈక్వడార్; ఉరుగ్వే; కొలంబియా; గయానా ఫ్రెంచి; గయానా బ్రిటిష్; గయానా సురినామ్; చిలీ; పరాగ్వే; పెరూ; బొలీవియా, బ్రెజిల్, వెనిజ్యులా.

**దక్షిణ ఆఫ్రికా గణరాజ్యము :** ఆఫ్రికా ఖండమందలి ఒక స్వతంత్ర రాజ్యము.




ఈ దేశమునకు నైరృతి ఆఫ్రికా; బెచూనాలాండ్ (బోత్స్వానా), దక్షిణ రొడీషియా [ఉ]; మొజాంబిక్, స్వాజీలాండ్, హిందూ మహాసముద్రము [తూ]; హిందూ - అట్లాంటిక్ మహాసముద్ర సంగమము [ద]; అట్లాంటిక్ మహాసముద్రము [ప] సరిహద్దులుగ ఉన్నవి. భౌగోళికముగ ఈ దేశమున ఉన్న బసూటోలాండ్ పరిపాలన రీత్యా బ్రిటిష్‌వారి రక్షిత రాజ్యము అగుట వలన అది ఒక ప్రత్యేక రాజ్యముగ పరిగణన పొందినది. దక్షిణ ఆఫ్రికా యందు పరిపాలన రీత్యా ప్రిన్స్ ఎడ్వర్డ్, మేరియాన్ అను చిన్న దీవులును చేరి ఉన్నవి. [వి] 12,23,409 చ. కి. మీ.; [జ] 1,62,36,000. వీరిలో 30,67,638 యూరపియన్ సంతతివారు, 1,08,07,309 ఆఫ్రికన్ జాతులు, 4,77,414 ఆసియా సంతతివారు (వీరిలో భారతీయ సంతతివారు అత్యధిక సంఖ్యాకులు); 14,44,867 మంది మిశ్ర జాతులవారు. [భా] ఆఫ్రికాన్స్ భాష, ఇంగ్లీషు భాష అధికార భాషలుగ పరిగణన పొందినవి. 'ఆఫ్రికాన్స్' అనునది డచ్చిభాష నుండి జనించినదియే ఐనను,



దక్షిణ అమెరికా
రాజకీయ విభాగములు
ఉత్తర అట్లాంటిక్ మహాసముద్రము
కొలంబియా
పెరూ
బొలీవియా
మనాస్
మకాపా
బ్రెసీలియా
సావోపాలో
మాంటివిడియో
0 400 800 మైళ్లు
0 400 800 1200 1600 కి. మీ.
80 70 60 50 40
90 80 70 60 50

అందు మలే, పోర్చుగీస్, ఇంగ్లీషు, బంటూ, హాటెన్‌టాట్స్ భాషా పదములు విరివిగ చేరుటచే అది ఒక ప్రత్యేకతను ఆర్జించినది; అధికార భాషలుగ ఈ రెండు భాషలు మాత్రమే గుర్తింపబడినను, దేశమునందలి వివిధ జాతుల మాతృ భాషలుగ పలు భాషలు ప్రచారమునందు ఉన్నవి. వీనిలో భారతీయ భాషలగు తమిళ, గుజరాతీ, హిందీ; ఆఫ్రికన్ భాషలగు కాఫిర్, జూలూ, ఝోసా; చీనీయుల మాతృభాషయగు చీనాభాష ముఖ్యముగ పేర్కొనదగినవి. [మ] దేశీయులలో యూరపియన్‌లు అందరు క్రైస్తవులు. ఆఫ్రికా జాతులలో కొలదిమంది క్రైస్తవులు ఉన్నను, అధిక సంఖ్యాకులు సంప్రదాయ ప్రకృతి దేవతారాధకులు. ఆసియా వాసులలో హిందూ-ముస్లిమ్ మతములు వ్యాప్తి యందు ఉన్నవి. [రా] ప్రెటోరియా (జ. సం. 3,43,400); శాసన సభలు, సమావేశమగు నగరము కేప్ టౌన్ (జ. సం. 7,29,200); న్యాయశాఖకు ముఖ్య నగరము బ్లూమ్‌ఫౌంటెన్ (జ. సం. 1,47,900); దేశమున ప్రముఖ వ్యాపార కేంద్రము జోహాన్స్‌బర్గ్ (జ. సం. 19,52,600).

చరిత్ర: 15 వ శతాబ్ది చరమ భాగము వరకు ఈ దేశమును గురించి చారిత్రక వివరములు ఏవియు స్పష్టముగ తెలియవచ్చుట లేదు. ఈ దేశపు దక్షిణపు కొనయగు గుడ్‌హోప్ అగ్రమును తొలుతగ 1488 లో బార్తొలోమ్యూ డయస్ అను పోర్చుగీస్ నావికుడు దర్శించి, యూరప్‌వాసులకు ఆ విషయమును తెలియపరచెను. తరువాత 1497 లో వాస్కో డ గామా [చూ.] అను పోర్చుగీస్ సాహసికుడు ఈ దేశమునందలి నేటాల్ ప్రాంతమును కనుగొనెను. కాని, వీరు ఎవరును తాము దర్శించిన ప్రాంతములందు స్థావరములు నెలకొల్పలేదు. తరువాత 1652 లో డచ్చి ఈస్ట్ ఇండియా కంపెనీవారి పక్షమున జాన్ వాన్‌రీ బెక్ అనునతడు ఈ కేప్ (దక్షిణాగ్రము) వద్ద ఒక స్థావరమును నెలకొల్పెను. స్వదేశమునుండి తమ ప్రాచ్యదేశములకు పయనించు డచ్చి వ్యాపార నౌకలకు ఈ స్థావరము ఒక మజిలీగా ఉండుటకు ఉద్దేశితమయ్యెను. క్రమముగ 1688 నాటికి కొందరు ఫ్రెంచి వారును ఇచట డచ్చివారితో చేరిరి. ఈ శ్వేతజాతీయుల వలన తమ భద్రతకు భంగము కలుగునను భయముచే అచటి ఆదివాసులగు ఝోసాజాతివారు వీరిపై 1770 లో దండెత్తిరి. కాని, యూరపియన్‌లు వారిని తీరభూమినుండి దేశాంతర్భాగమునకు తరిమివైచిరి. 1795 లో కేప్ అగ్రపు ప్రాంతమును బ్రిటిష్‌ప్రభుత్వము వశపరచుకొన్నది. 1814 లో వియెన్నా కాంగ్రెస్ [చూ.] నిర్ణయములను అనుసరించి హాలండ్‌ప్రభుత్వము ఈ ప్రాంతమున బ్రిటిష్‌వారి హక్కును ఆమోదించి, తన అధికారమును త్యజించెను. 1820 నుండి బ్రిటిష్ ప్రజలు ఇట వలస చేరుట ఆరంభమయ్యెను. తరువాత ఎనిమిదేండ్లకు ఇంగ్లీషు అధికార భాషగా పరిగణన పొందెను. ఆఫ్రికన్ - యూరపియన్ జాతుల సాంకర్యమువలన ఒక మిశ్రజాతియు ఇట అప్పటికి రూపొంది సంఖ్యాబలమును ఆర్జించెను. ఈ మిశ్ర జాతికిని శ్వేతజాతివారితో సమముగ పౌరస్వత్వములను బ్రిటిష్‌ప్రభుత్వము ఒసగుటయే కాక, 1834 లో బానిస వ్యాపారమును నిషేధించెను. బ్రిటిష్‌వారి ఈ సాంత్వన విధానము డచ్చిసంతతి వారికి నచ్చలేదు. అందువలన పెక్కు డచ్చి కుటుంబములు కేప్ ప్రాంతమును విడిచి ఉత్తరమున ఉన్న ఆరంజీ ఫ్రీ స్టేట్, ట్రాన్స్‌వాల్, నేటాల్‌కు వలసపోయిరి (1836). బ్రిటిష్‌వారు అంతట తమ అధికారమును తక్కిన ప్రాంతములకును వ్యాపింపచేయ పూనుకొని 1843 లో నేటాల్‌ను, 1847 లో కాఫరేరియాను, 1868 లో బసూటోలాండ్‌ను, బెచూనా లాండ్‌ను 1885 లోను, జూలూలాండ్, టోగోలాండ్ అను భూభాగములను 1887 లోను వశపరచుకొనిరి. ఆరంజీ ఫ్రీ స్టేట్ రాష్ట్రమును బ్రిటిష్‌వారు 1848 లో వశపరచుకొనినను, 1854 లో దాని స్వాతంత్ర్యము పునరుద్ధరింపబడెను. అటులే 1852లో ట్రాన్స్‌వాల్ రాష్ట్రపు స్వాతంత్ర్యమును బ్రిటిష్ వారు గుర్తించిరి. కాని, అప్పటి పరిస్థితుల ప్రాబల్యము వలన బ్రిటిష్ ప్రభుత్వము 1877 లో దానిని తిరుగ ఆక్రమించి, కొంతకాలము తన ఆధిపత్యమున ఉంచుకుని కడకు బోయర్ (డచ్చి సంతతివార)ల ప్రతిఘటనకు లొంగి 1881 లో స్వాతంత్ర్యము ఒసగెను. 1872 లో కేప్ రాష్ట్రముకును, 1897 లో నేటాల్‌నకును బ్రిటిష్ ప్రభుత్వము స్థానిక స్వపరిపాలము ఒసగెను.

దక్షిణ ఆఫ్రికా రాజకీయములలో బోయర్‌లకును, ఆంగ్లసంతతి వారికిని మధ్యగల వైరుధ్యము 19 వ శతాబ్ది అంతము వరకు ప్రముఖపాత్ర వహించెను. ట్రాన్స్‌వాల్‌లో బంగారు గనులు 1886 లో కనుగొనబడినప్పటి నుండియు అచ్చట వలసలు ఏర్పరచుకొనుటలో ఈ వైరుధ్యము అతిశయించి కడకు ఆంగ్లో - బోయర్ యుద్ధమునకు (1899 - 1902) దారితీసెను. తుదకు 1902, మే లో వెరీనిగింగ్ వద్ద జరిగిన ఒడంబడిక ప్రకారము బోయర్ (ఆఫ్రికనేర్) గణరాజ్యములగు ఆరంజీ ఫ్రీ స్టేట్, ట్రాన్స్‌వాల్ తమ స్వాతంత్ర్యమును వదలుకొనుటకు అంగీకరించినవి. కాని, తరువాత అచిరకాలముననే వానికి బ్రిటిష్ ప్రభుత్వము స్థానిక పరిపాలనము ఒసగెను. ఇటుల సామరస్యము కుదిరిన తరువాత ఆఫ్రికనేర్ నాయకులును, నేటాల్, కేప్ రాష్ట్రముల నాయకులును 1908, అక్టోబరు నుండి 1909, ఫిబ్రవరి వరకు వివిధ సమావేశములు జరిపి, ఒక సమైక్య దక్షిణ ఆఫ్రికా రాజ్యమునకు రాజ్యాంగమును

రూపొందించిరి. 1909 లో బ్రిటిష్ పార్లమెంట్ ఆ విధానమును ఆమోదించిన తరువాత 1910, మే 31 నుండి అమలులోనికి వచ్చెను. అంతటినుండి బ్రిటిష్ రాచరికపు ఆధ్వర్యవమున అధినివేశ ప్రతిపత్తి కలిగి ఈ రాజ్యము ప్రథమ, ద్వితీయ ప్రపంచ యుద్ధములలో బ్రిటన్ పక్షమున పోరాటమున పాల్గొనెను. ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున దేశము ఆర్థికముగ త్వరితగతిలో పురోగమించినది.

ఇటుల దేశము స్వాతంత్ర్యమును ఆర్జించినను, సుసంపన్నమైనను, దీని ఫలితములందు అధికభాగము అల్పసంఖ్యాకులగు శ్వేతజాతీయులకు మాత్రమే దక్కినది. దేశపు రాజ్యాంగము శ్వేత జాతీయులకు అధికారము సంక్రమింపచేయు ఉద్దేశ్యముతో రచింపబడుట ఇందులకు మూలకారణము; శాసన సభలయందు ప్రాతినిధ్యము సంపాదించు హక్కు శ్వేతజాతీయులకు మాత్రమే పరిమితమై ఉన్నది. ఈ వర్ణవిచక్షణ [చూ. సం. 10 : అపార్ తిట్ పు. 155] విధానము క్రమక్రమముగ వికృత మార్గములకు దారి తీసినది. శ్వేతేతరులు నివసించుటకు సైతము వేరు ప్రాంతములు ప్రత్యేకింపబడునటుల ఇపుడు చట్టము చేయబడుటచే, తమ నివాసముల విడిచి, శ్వేతేతరులు ఎందరో దూరప్రాంతములకు వెళ్ళవలసివచ్చినది. దేశమునందలి ఆఫ్రికన్‌లు, ఆసియావాసులు, తక్కిన మిశ్రజాతులవారును ఈ విధముగ తమ మానవస్వత్వముల కోల్పోవలసి వచ్చుటచే ప్రభుత్వము ఎడల విద్వేషము మితిమీరి, పలు ఉద్యమములకు త్రోవతీసినది. ఆసియా వాసులలో అత్యధిక సంఖ్యాకులు భారత ఉపఖండవాసుల సంతతివారు అగుటచే భారత, పాకిస్తాన్ దేశములు ఈ విషయమును ఐక్యరాజ్యసమితి దృష్టికి కొనివచ్చినవి. ఐక్యరాజ్యసమితి తనచర్యను ఖండించినను, దక్షిణ ఆఫ్రికా లెక్కగొనలేదు. కామన్ వెల్త్ [చూ. పు. 382] లో దక్షిణ ఆఫ్రికాకు సభ్యత్వము ఉండుటచే అంతలి సభ్యరాజ్యములు దక్షిణఆఫ్రికానుసక్రమ మార్గమున పెట్ట యత్నించినవి; ఇందులకు గర్హించి దక్షిణ ఆఫ్రికా కామన్ వెల్త్‌నుండి వైదొలగి, స్వతంత్ర గణరాజ్యముగ ఉండుటకు రెఫరెండమ్ (ప్రజానిర్ణయము) ద్వారా నిర్ణయించుకొనినది (మే, 31, 1961). అంతటినుండి బ్రిటిష్ రాణి ప్రతినిధికి బదులుగ ఎన్నుకొనబడిన అధ్యక్షుడే దేశాధీశుడుగ వ్యవహరించుచున్నాడు.

రాజ్యాంగము : 1909 లో ఆమోదింపబడి, 1961 లో సవరింపబడిన రాజ్యాంగ చట్టమునుబట్టి ఈ దేశమున గణతంత్ర రాజ్య విధానపు పాలన అమలునందు ఉన్నది. దేశాధ్యక్షుడు ఉభయ శాసనసభలచే ఎన్నుకొనబడును. ఇతని పదవీకాల పరిమితి ఏడు సంవత్సరములు. శాసన నిర్మాణాధికారము సెనేట్, ప్రతినిధిసభ (హౌస్ ఆవ్ అసెంబ్లీ) అను వానియందును, అధ్యక్షుని యందును న్యస్తమై ఉన్నది. ఈ శాసన సభలందు శ్వేతజాతివారు మాత్రమే సభ్యత్వమునకు అర్హులు. వీరిని ఎన్నుకొను హక్కు దేశమందలి శ్వేతజాతి వోటరులకు మాత్రమే కలదు. 1956 లో చేయబడిన ఒక రాజ్యాంగచట్టపు సవరణను అనుసరించి విద్యార్హతగల బంటూజాతి వోటర్లు తమ ప్రతినిధులుగ నలుగురు తెల్లవారిని ప్రతినిధి సభకు ఎన్నుకొను హక్కు కలిగింపబడెను. కాని, 1959 లో అదియు రద్దు చేయబడినది. ఆఫ్రికన్ ఆదివాసుల ప్రజలకు దేశమున ప్రత్యేకింపబడిన భూభాగములందు ఆఫ్రికన్‌లచే ఎన్నుకొనబడిన స్థానిక సంస్థలు 1951 నుండి స్థాపింపబడినవి. 1959 లో ఆమోదింపబడిన ఒక చట్టమును అనుసరించి ఈ స్థానిక సంస్థలనుండి పరోక్షపు ఎన్నికల మూలమున ఆదివాసి ఆఫ్రికన్‌ల శ్రేయస్సునకై కృషిచేయు జాతీయ సంస్థలను ఎనిమిదింటిని రూపొందించుటకు ఏర్పాటు జరిగినది. కాని, శ్వేతేతర జాతి ప్రజల ప్రతిఘటనచే ఇది క్రమరూపమున అమలులోనికి రాలేకున్నది. మొత్తము మీద ఈ వర్ణవిచక్షణ మూలమున దక్షిణ ఆఫ్రికా యందలి ప్రజాజీవితమంతయు వివిధ జాతులమధ్య విద్వేషములచే కలుషితమైనది.

పాలిత ప్రాంతములు : ప్రథమ ప్రపంచ యుద్ధానంతరమున జర్మనులనుండి వశపరచుకొనబడిన నైరృతి ఆఫ్రికా రాజ్యము దక్షిణ ఆఫ్రికా ప్రభుత్వపు ధర్మకర్తృత్వ పరిపాలనలో ఉంచబడినది. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున దీనిని తన రాజ్యమున చేర్చుకొనవలెనని దక్షిణ ఆఫ్రికా యత్నించినది. కాని, ఐక్యరాజ్యసమితి అందులకు నిరాకరించినది. తదాది ధర్మకర్త హోదాలో తాను పంపవలసిన నివేదికలను పంపుటకు ఈ రాజ్యము నిరాకరించుటచే [చూ. పు. 351] ఐక్యరాజ్యసమితి దక్షిణ ఆఫ్రికా బాధ్యతారహిత చర్యను ఖండించినది [చూ. నైరృతి ఆఫ్రికా].

చీ. శే. రా.

**దక్షిణా పథము :** భారతదేశమున వింధ్య పర్వతమునకు దక్షిణమున ఉన్న భూభాగమునకు 'దక్షిణా పథము' అని పేరు. దక్షిణాపథ శబ్దము వాల్మీకి రామాయణమున (క్రీ. పూ. 2 వ శతాబ్దము), స్కందపురాణమున కలదు. ఈ శబ్దము యొక్క వికృత రూపమే దక్కన్. నర్మదా నదికి దక్షిణమున లేదా ఉత్తరమున వింధ్యపర్వతముచేతను తూర్పు పడమరలందు తూర్పు - పడమటి కనుమల చేతను సీమితమైన సువిశాల త్రిభుజాకార పీఠభూమికి దక్కన్ అని వ్యవహారము. ఇటుల పరిమితార్థమున మైసూరు, ఆంధ్ర ప్రదేశ్‌లలోని పీఠభూమి భాగములు, ఈశాన్య,

పశ్చిమ మహారాష్ట్రి భాగములు, ఆగ్నేయ మధ్య ప్రదేశ్ కలసి దక్కన్ అని చెప్పబడుచున్నది. నర్మదా, కృష్ణానదుల నడిమి భూభాగమును దక్కన్ అని పేర్కొనబడుట కూడ కలదు. వింధ్యకు ఉత్తరమున గల దేశము ఆర్యావర్తము [చూ. పు. 297] అని పూర్వము వ్యవహరింపబడెను. ఆ. వెం.

**దహోమీ :** ఆఫ్రికా ఖండపు పశ్చిమతీరమునందలి ఒక స్వతంత్ర గణరాజ్యము.




ఈ దేశమునకు అట్లాంటిక్ మహాసముద్రము [ద]; టోగో, అప్పర్ వోల్టా [ప]; నైజర్ [ఉ]; నైజీరియా [తూ] సరిహద్దు లందు ఉన్నవి. [వి] 1,15,762 చ. కి. మీ.; [జ] 22,00,000. వివిధ జాతుల ఆఫ్రికన్ ప్రజలు ఇందు వసించుచు, వివిధములగు భాషలు మాట్లాడుచున్నారు. [భా] రాజకీయ వ్యాపార విషయములందు ఫ్రెంచిభాషయే సామాన్యభాషగా వ్యవహరింప బడుచున్నది. [మ] దేశమున అత్యధిక సంఖ్యాకులు ప్రకృతి దేవతారాధకులు. క్రైస్తవులు కొలదిగ కలరు; వారిలో రోమన్ కేతలిక్ ల సంఖ్య అత్యధికము. [రా] పోర్టోనోవో (జ. సం. 81,000.)

**చరిత్ర :** ఈ దేశము ఒక అతుకులబొంత దేశము. చారిత్రకముగ గాని, భౌగోళికముగ గాని ఇందలి వివిధ ప్రాంతముల మధ్య పొందిక ఏదియు లేదు. ఇందలి ఉత్తర ప్రాంతపు ప్రజలు తమ సరిహద్దు దేశమగు దక్షిణ సుడాన్ ప్రజలకు జాతిరీత్యా అతి సన్నిహితులు; దక్షిణ ప్రాంతపు ప్రజలతో వీరికి ఎట్టి సంబంధమును లేదు. బ్రిటన్, ఫ్రాన్స్‌ల మధ్య చెలరేగిన సామ్రాజ్యార్జన పోటీలో తమకు ఆ ప్రాంతమున దక్కిన వేర్వేరు ప్రదేశములను కలగలుపు చేసి, ఫ్రెంచివారు ఈ దేశమును రూపొందించిరి. అయినను, ఈ దేశపు దక్షిణ భాగము మాత్రము తొలుతటినుండియు ఒక ప్రత్యేక జాతీయత కలిగి ఉండెనని మాత్రము తెల్పుటకు కొన్ని ఆధారములు కలవు. యూరపియన్‌లకు ఈ దేశముతో పరిచయము ఏర్పడునప్పటికి అల్లాడా, దహోమీ, ఔడా అను చిన్నరాజ్యములు ఇచట ఉండెను. క్రమముగ దహోమీరాజ్యము తక్కిన రెంటిని ఆక్రమించెను. తక్కిన ఆఫ్రికన్ ప్రాంతములందువలెనే ఇచటికిని తొలుత పోర్చుగీస్ నావికులు ఏతెంచి వర్తక కేంద్రముల స్థాపించిరి. 17 వ శతాబ్దమున వారు నిర్మింపజేసినదియే నేటి పోర్టోనోవో పట్టణము. బానిస వ్యాపారము క్రమముగ లాభదాయకముగ పరిణమించుటచే పోర్చుగీస్‌ల తరువాత ఇంగ్లీషు, డచ్చి, స్పానిష్, ఫ్రెంచి వర్తకులును వచ్చి చేరి వర్తక కేంద్రములను స్థాపించిరి. 19 వ శతాబ్దమునాటికి బానిస వ్యాపారము నిషేధింపబడినను, ఈ వర్తక సంఘములు దానికి బదులుగ పామ్ ఆయిల్ అను తైలమును ఎగుమతి చేయుచు తమ వ్యాపారమును సాగించుచుండిరి. ఇంతలో ఫ్రెంచివారు దహోమీ ప్రభువుతో ఒక ఒడంబడికను కుదుర్చుకొని అదనపు వ్యాపార కేంద్రములను సంపాదించిరి (1851). ఫ్రెంచివారితో పోటీపడి, ఆ ప్రాంతపు ఇంకొక స్థానికరాజుతో ఒడంబడిక కుదుర్చుకొని ఆంగ్లేయులును ఆ పరిసరముననే అదనముగ మరికొన్ని కేంద్రములను సంపాదించిరి. కడకు ఈ పోటీలో ఫ్రెంచివారు నెగ్గిన ఫలితముగ ఫ్రెంచివారికి ఆ ప్రాంతపు ముఖ్య కేంద్రములు అన్నియు వశమయ్యెను (1889). కాని, దహోమీ మాత్రము స్వతంత్రముగనే ఉండి, ఫ్రెంచి వర్తకులపై కఠినపు పన్నులను విధించుచుండెను. ఈ పన్నులను చెల్లించుటకు ఫ్రెంచివారు నిరాకరించుటచే దహోమీ ప్రభువు ఫ్రెంచివారిపై యుద్ధము ప్రకటించి, ఫ్రెంచి కేంద్రములను వశపరచుకొన ఉద్యమించెను (1891). ఈ దహోమీ ప్రభువు సేనలో మగవారితోపాటు దాదాపు 2,000 మంది స్త్రీలును సైనికులుగ చేరి ఉండి యుద్ధములో పాల్గొనిరి. కడకు ఫ్రెంచివారు దహోమీ ప్రభువును ఓడించి, 1900 లలో ఆ రాజ్యమును వశపరచుకొనిరి. 1902 నుండి ఫ్రెంచి పశ్చిమ ఆఫ్రికా వలసరాజ్యమున ఒక భాగముగ ఈ ప్రాంతము ఉండెను. 1946 లో ఈ వలసకు కొంత స్వతంత్రప్రతిపత్తి కలిగింపబడినది. కడకు 1958 లో జరిగిన జనవాక్య సేకర

ణను అనుసరించి ఫ్రెంచి కమ్యూనిటీలో భాగస్వామ్యము కల స్వతంత్రరాజ్యముగ ఉండుటకు అంగీకరించి, 1960, ఆగస్టులో ఇది స్వతంత్ర గణరాజ్యమయ్యెను. చీ. శే. రా.

**దాదాభాయ్ నౌరోజీ :** చూ. నౌరోజీ, దాదాభాయ్

**దీపవంసము - మహావంసము :** ఈ రెండును సింహళ ద్వీపములో ప్రాచీనకాలమందు పాళీభాషలో రచితములు అయిన గ్రంథములు. ఈ ద్వీపమందలి రాజుల వంశములను గూర్చి చెప్పిన చరిత్ర కలది కనుక దీపవంసమనే పేరు ఈ మొదటి కావ్యమునకు వచ్చినది. అందు చెప్పినదానికంటె ఎక్కువ వంశముల చరిత్ర కలది కనుక రెండవ కావ్యమునకు మహావంసమనే పేరు పెట్టబడినది. రెండును సింహళ ద్వీపచరిత్రకు సంబంధించిన కావ్యములే. అందులో దీపవంసము క్రీ. శ. 4 వ శతాబ్దములో - అనగా 302 - 304 లో - రచితమై ఉండవచ్చునని చెప్పుటకు ఆధారములు కనబడుచున్నవి. సుమారు 450 లో ధాతుసేనుడు అను సింహళదేశరాజు సమక్షమున ఈ దీపవంస గ్రంథము చదువబడినట్లు తెలియవచ్చుటచేత, 450 నాటికి పూర్వమే ఇది రచితమై ఉండెనని చెప్పవలెను. తరువాత నూరు, నూట ఏబది ఏండ్లకు మహావంసము రచితమయినది. దీపవంసమును రచించినవారు ఎవరో తెలియదు కాని, మహావంసమును మహానామన్ అను పేరుగలవాడు రచించినటుల తెలియవచ్చుచున్నను, అతని తరువాతి రచయితలు అప్పుడప్పుడు కొంత విషయమును చేర్చి ఆ ఇతిహాసమును తమ కాలము దనుక వచ్చునటుల చేసినటుల స్పష్టమగుచున్నది. ఈ రెండు గ్రంథములందును చారిత్రక విషయములు చాలభాగము సమానముగానే ఉండినను రచనలో చాల తేడా ఉన్నది. గ్రంథవిషయములో రెండింటికిని సింహళద్వీపమందు ప్రాచీనకాలము నుండి 'అట్ట కథలు' అని అనుశ్రుతముగా వచ్చుచున్న కథలే ఆధారము. మహావంసమునకు దీపవంసములోని విషయములు కూడ ఆధారములు అయినవి. రెండు కావ్యములలోను నమ్ముటకు వీలులేని పుక్కిటి పురాణ గాథలు అనుశ్రుతముగ వచ్చుచున్నవి కలవు. వాటితో పాటు చరిత్రకు సంబంధించిన విషయములు కూడ కలవు. కనుక అందు ఉన్నదంతా సత్యమే అనుటకు గాని, ఏదీ నమ్మలేము అనుటకు గాని వీలులేదు. వాస్తవముగ చరిత్ర విషయములే అని గ్రహింపదగు వానివలన కొంతమేలు కలిగినది. భారతదేశ చరిత్రలో బౌద్ధయుగమునాటి చారిత్రకాంశములు కొన్ని ఈ దీపవంస, మహావంస గ్రంథములలో చెప్పిన విషయములను బట్టి నిర్ణయించుటకు ఆధారము కనపడినది. గి. వేం. సీ.

**దుర్యాష - I** (క్రీ. పూ. 521 - 485 వ.) : ప్రాచీన పారసీకసమ్రాట్. ఈతని తండ్రి విస్తాశ్ప (హిస్టాస్పెస్) కురుష్ [చూ. పు. 393] వలెనే ఈతడు కూడ హఖమనీషి రాజవంశమునకుచెందినవాడు. ఈతనిగురించిన వివరములు బేస్తూన్ శిలాశాసనమువలన తెలియుచున్నవి [చూ. శాసనవిద్య]. పాశ్చాత్య చారిత్రకులు ఈతనిని డరయస్ అని వ్యవహరించిరి.

తన పరాక్రమ బలము వలన తూర్పున సింధునది నుండి పశ్చిమమున థ్రేస్, సిథియా దేశము వరకు గల భూభాగమును ఇతడు ఆక్రమించి విశాల సామ్రాజ్యమును నెలకొల్పెను. ఈతడు సుప్రసిద్ధ యుద్ధ తంత్రజ్ఞుడు. ఏడు లక్షల సైన్యమును పడవల వంతెన మీదుగ నడపించి, ఈతడు బాస్ఫరస్ జలసంధిని అధిగమింపజేసెను. ప్రాచీన చరిత్రలో ఇంత విపుల సైన్యమును సముద్రమును దాటింపచేసినవాడు ఇతడు ఒకడే అని చెప్పదగును.

గ్రీక్ చరిత్రకారుడగు హెరొడోటస్ రచనల వలన రష్యాయందలి వోల్గానదీ ప్రాంతముల వరకును దుర్యాష - I తన సైన్యమును నడిపించెనని తెలియుచున్నది. గ్రీస్‌లోని అయోనియన్‌లు ఎథీనియన్‌ల సహాయముతో ప్రభువుపై తిరుగబడినపుడు రెండు పర్యాయములు దుర్యాష - I తన సేనలను పంపెను. ప్రఖ్యాతిగాంచిన మారథాన్ ప్రాంతమున జరిగిన యుద్ధమున పారసీక సేనలు ఓడిపోయినవి. కాని, మూడవ పర్యాయము తన సేనల నడుపుటకు సిద్ధపడు సమయమున ఈతడు క్రీ. పూ. 485 లో మరణించెను.

తన రాజ్యమును అంతను 20 రాష్ట్రములుగ విభజించి ప్రతిరాష్ట్రము కట్టవలసిన పన్నులను నిర్ణయించెను. 'దారిక్' అను బంగారు నాణెములను చలామణీలోనికి తెచ్చెను. జెరూసెలెమ్‌నందు దేవాలయము కట్టుకొనుటకు యూదులకు అనుమతి ఒసగి, వారి కృతజ్ఞతకు పాత్రుడు అయ్యెను. సర్వమతములను ఈతడు సమానభావముతో ఆదరించెను. మ. అ. శ.

**దేశాన్వేషకులు :** సంచారజాతిగ మనుగడ సాగించ మొదలిడిన కాలమునుండియు మానవుడు తన మనుగడకై అంతటంతట నివాసమును మార్చి, వేర్వేరు స్థావరములను నూతనముగ కనుగొన ఆరంభించెను. కడకు వ్యావసాయిక, పశుపాలనాదులకు అలవడి స్థిర స్థావరమును ప్రేమించుటకు పరిస్థితులు అనుకూలించినను, జనసంఖ్యా విస్తృతి ఉన్నతావున పోషక పదార్థముల లేవడి మొదలగునవి మానవులను దూరభూముల అన్వేషణకు ప్రోత్సహించినవి. ప్రాచీన కాలమునుండియు జరిగిన ఇట్టి అన్వేషణలను గురించిన

# దేశాన్వేషకులు - పట్టిక

| తేది | దేశాన్వేషకుడు | జాతీయత | ప్రధాన అన్వేషణ |
|---|---|---|---|
| 982 | ఎరిక్ ది రెడ్ | నార్వే | గ్రీన్ లాండ్. |
| 1000 | లీఫ్ ఎరిక్ సన్ | నార్వే | అమెరికా చేరిన ప్రథమ యూరపియన్. |
| 1246 - 1248 | గియోవన్ని డే పియానో కార్పినీ | ఇటలీ | మంగోలియాకు ప్రయాణము చేసెను. |
| 1253 | జి. రుబ్రుక్విస్ | ఫ్లాండర్జ్ (పశ్చిమ యూరప్) | మంగోలియాకు ప్రయాణము చేసెను. |
| 1275 - 1292 | మార్కో-పోలో | ఇటలీ | కుబ్లయ్‌ఖాన్ సేవలో ఆసియా పర్యటన. |
| 1318 | ఫ్రియర్ ఒడోరిక్ | ఇటలీ | దక్షిణ ఆసియా, మధ్య ఆసియాలలో ప్రయాణము చేసెను. |
| 1325 - 1353 | ఇబ్న్ బతూతా (మహమ్మద్ అబూ అబ్దుల్లా) | అరేబియా | మధ్య ప్రాచ్యము, భారతదేశముల ఉనికిని కనుగొనెను. |
| 1487 - 1488 | బార్తోలోమియో డయాజ్ | పోర్చుగల్ | గుడ్‌హోప్ అగ్రమును చుట్టి వచ్చిన ప్రథమ యూరపియన్. |
| 1492 | క్రిస్టఫర్ కొలంబస్ | ఇటలీ [1] | వెస్ట్ దీవిని పర్యటన. |
| 1497 | జాన్ కేబట్ | ఇటలీ [2] | ఉత్తర అట్లాంటిక్ నౌకాయానము; కేప్ బ్రెటాన్ దీవిని చేరిన ప్రథమ వ్యక్తి. |
| 1497 - 1503 | అమెరిగో వెస్‌పుచ్చి | ఇటలీ | వెస్ట్ ఇండీస్, దక్షిణ అమెరికాలకు నౌకాయానము. |
| 1498 | వాస్కో డ గామా | పోర్చుగల్ | సముద్రమార్గమున భారతదేశము చేరిన ప్రథమ యూరపియన్. |
| 1500 - 1501 | పెడ్రాల్వరెజ్ కాబ్రల్ | పోర్చుగల్ | బ్రెజిల్ సముద్రతీర పర్యటన; ఆఫ్రికాను చుట్టి భారతదేశమునకు నౌకాయానము. |
| 1502 - 1510 | లొడొవికో డీ వర్తమా | ఇటలీ | ద. ఆసియా తీర అన్వేషణ. |
| 1513 | వాస్కో నూనెజ్ డీ బాల్బో | స్పెయిన్ | పసిఫిక్ మహాసముద్రపు ఆవిష్కరణ. |
| 1513 | జుయాన్ పాన్సి డీ లియాన్ | స్పెయిన్ | ఫ్లొరిడాను ఆవిష్కరించెను. |
| 1517 | ఫ్రాన్‌సిస్కో హెర్‌నాండెజ్ డీ కార్డోబా | స్పెయిన్ | మధ్య అమెరికాలోని యూకటాన్ ఉనికిని కనుగొనెను. |
| 1519 - 1521 | హెర్‌నాండో కోర్టీస్ | స్పెయిన్ | మెక్సికోను జయించెను. |
| 1519 - 1522 | ఫెర్డినాండ్ మెజెల్లాన్ | పోర్చుగల్ | ప్రథమ భూప్రదక్షిణ నౌకాయానము. |

[1] స్పెయిన్ పతాకము క్రింద నౌకాయానము.

[2] ఇంగ్లండు పతాకము క్రింద నౌకాయానము.

| తేది | దేశాన్వేషకుడు | జాతీయత | ప్రధాన అన్వేషణ |
|---|---|---|---|
| 1519 - 1522 | ఆంటోనియో పిగాఫెట్టా | ఇటలీ | మెజెల్లాన్ వెంటవెళ్లి, అతని మరణానంతరము ప్రపంచ నౌకాయాత్రలో పాల్గొని ఆ నౌకాయాన వివరముల లిఖిత ప్రతిని జాగ్రత్తపరచెను. |
| 1522 | ఫ్రాన్సిస్కో హెర్నాండెజ్ కార్డోబా | స్పెయిన్ | నికరాగ్వా ఉనికిని కనుగొనెను. |
| 1524 | గియోవన్ని డి వెర్రజ్జానో | ఇటలీ | వాయవ్య మార్గమునకై అన్వేషణ. |
| 1525 - 1530 | డీగో డె అల్మాగ్రో | స్పెయిన్ | చిలిలోని అటకామా ఎడారినిదాటి పెరూను జయించుట. |
| 1526 - 1527 | సెబాస్టియన్ కాబట్ | ఇటలీ * | రియో డి ప్లాటావరకు దక్షిణ అమెరికా తీరప్రాంత అన్వేషణ. |
| 1527 | పాన్ ఫిలో డె నార్వాయేజ్ | స్పెయిన్ | ఫ్లోరిడాకు పశ్చిమముగ ఉన్న ప్రధాన భూభాగ అన్వేషణ. |
| 1530 - 1538 | ఫ్రాన్సిస్కో పిజారో | స్పెయిన్ | పెరూను, లైమాను వ్యవస్థాపించెను. |
| 1534 - 1536 | జాక్విస్ కార్టియర్ | ఫ్రాన్స్ | సెయింట్ లారెన్స్ నది అన్వేషణ. |
| 1536 - 1538 | గాన్ జెలో జిమేనెజ్ డి కెసాదా | స్పెయిన్ | ఉ. ఏండీస్ ఉనికి, బగోటా వ్యవస్థాపన. |
| 1539 - 1542 | హెర్నాండో డె సోటో | స్పెయిన్ | మిస్సిసిపీ నది, ఆగ్నేయ యునైటెడ్ స్టేట్స్. |
| 1540 - 1541 | పెడ్రో డె వాల్ డీవ్యా | స్పెయిన్ | చిలీని అన్వేషించి జయించెను; సాంటియాగోను వ్యవస్థాపించెను. |
| 1540 - 1542 | ఫ్రాన్సిస్కో వాస్క్వెజ్ డె కోరొనాడో | స్పెయిన్ | ఆర్కాన్సస్, గ్రాండ్ కాన్యన్. |
| 1541 | ఫ్రాన్సిస్కో డె ఒరెల్లానా | స్పెయిన్ | అమెజాన్ నది. |
| 1541 - 1542 | ఆల్వార్ నునెజ్ కావెసా డె వాకా | స్పెయిన్ | ఫ్లోరిడా నుండి మెక్సికో. |
| 1546 | ఫెర్నామ్ మెండెజ్ పింటూ | పోర్చుగల్ | ఆసియా జలములు; జపాన్ అన్వేషణ. |
| 1553 | హూగ్ విలోబీ | ఇంగ్లండు | ఆసియాకు ఈశాన్య మార్గ అన్వేషణ. |
| 1557 - 1581 | ఆంథోనీ జెంకిన్సన్ | ఇంగ్లండు | కాస్పియన్ ప్రాంత ఉత్తరము నుండి ఆర్కేంజల్ వరకు. |
| 1576 - 1578 | మార్టిన్ ఫ్రోబిషర్ | ఇంగ్లండు | వాయవ్య మార్గమునకై ఉత్తర అమెరికా తీరమును వెదకెను. |
| 1577 - 1580 | ఫ్రాన్సిస్ డ్రేక్ | ఇంగ్లండు | ప్రపంచము చుట్టు నౌకాయానము చేసిన ప్రథమ ఇంగ్లండువాని. |

* ఇంగ్లండు పతాకము క్రింద నౌకాయానము.

| తేది | దేశాన్వేషకుడు | జాతీయత | ప్రధాన అన్వేషణ |
|---|---|---|---|
| 1596 | విల్లెమ్ బారెంట్స్ | డచ్చి | స్పిట్జ్ బర్గెన్‌ను ఆవిష్కరించిన సాహస యాత్రిక నాయకుడు. |
| 1598 | జుయాన్ డె ఒనాటే | స్పెయిన్ | న్యూ మెక్సికో |
| 1602 | బార్తొలోమ్యూ గాజ్‌నోల్డ్ | ఇంగ్లండు | న్యూ ఇంగ్లండు తీరప్రాంతము, కేప్ కాడ్ అన్వేషణ. |
| 1603 - 1615 | సామ్యుయెల్ డె షామ్ ప్లాన్ | ఫ్రాన్స్ | సెయింట్‌లారెన్స్ నదికి పడమర నుండి లేక్‌హురాన్ వరకు అన్వేషించెను. |
| 1606 | బార్తొలోమ్యూ గాజ్ నోల్డ్ | ఇంగ్లండు | జేమ్స్ టౌన్‌ను వ్యవస్థాపించెను. |
| 1608 | సామ్యుయెల్ డె షామ్ ప్లాన్ | ఫ్రాన్స్ | లేక్‌షామ్‌ప్లాన్‌ను ఆవిష్కరించెను. |
| 1609 - 1610 | హెన్రీ హడ్సన్ | ఇంగ్లండు * | హడ్సన్ అఖాతము, హడ్సన్ నదుల యొక్క ఉనికిని కనుగొనెను. |
| 1615 | విలియమ్ బఫిన్ | ఇంగ్లండు | బఫిన్ అఖాత ఉనికిని కనుగొనెను. |
| 1616 | డిర్క్ హార్టాగ్ | డచ్చి | ఆస్ట్రేలియా తీరప్రాంత అన్వేషణ. |
| 1618 | పెడ్రో పాయేజ్ | స్పెయిన్ | బ్లూ నైల్ ఉత్పత్తిస్థానపు ఉనికి. |
| 1642 | ఆబెల్ జాన్స్‌జున్ టాస్‌మాన్ | డచ్చి | టాస్‌మేనియా, న్యూజీలెండ్. |
| 1659 | పియరీ ఎస్ప్రిట్ రాడిసాన్ | ఫ్రాన్స్ | లేక్ సుపీరియర్, ఉత్తర మిస్సిసిపీ అన్వేషణ. |
| 1668 - 1671 | పియరీ జాక్విస్ మార్కెట్ | ఫ్రాన్స్ | ఉత్తర మిస్సిసిపీ మైదాన ఉనికి. |
| 1669 - 1680 | రెనీరాబర్ట్ లా సాలే, సియర్ డె కావలియర్ | ఫ్రాన్స్ | నయాగరా జలపాతమును, ఓహియో నదిని ఆవిష్కరించిరి. లేక్‌మిచిగాన్ ప్రాంతమును అన్వేషించిరి. |
| 1672 - 1673 | లూయీ జోలియెట్ | ఫ్రాన్స్ | లేక్ సుపీరియర్ ప్రాంత అన్వేషణ. |
| 1675 - 1687 | డేనియల్ గ్రేసొలాన్ డులుత్ | ఫ్రాన్స్ | మాంట్రియల్, లేక్ సుపీరియర్ ప్రాంతమును అన్వేషించెను. |
| 1678 - 1683 | హెన్రీ డె తాంటీ | ఇటలీ | మిస్సిసిపీ లోయను అన్వేషించెను. |
| 1679 - 1680 | లూయీ హెన్నెపిన్ | ఫ్రాన్స్ | ఎగువ మిస్సిసిపీ ప్రాంత అన్వేషణ. |
| 1683 | ఆంటోనీ డెల మోతే కాడిల్లాక్ | ఫ్రాన్స్ | ఎగువ మిస్సిసిపీ లోయ అన్వేషణ. |
| 1683 - 1707 | విలియమ్ డాంపియర్ | ఇంగ్లండు | ప్రపంచము చుట్టు రెండుసార్లు నౌకాయానము చేసెను. ఆస్ట్రేలియా, న్యూగినీ, న్యూబ్రిటన్ తీర ప్రాంతములను అన్వేషించెను. |
| 1698 - 1701 | పియరీ లె మోయిన్ డీబర్ వీల్ డీ | ఫ్రాన్స్ | దిగువ మిస్సిసిపీలోయ అన్వేషణ. |

* డచ్చి పతాకము క్రింద నౌకాయానము.

| తేది | దేశాన్వేషకుడు | జాతీయత | ప్రధాన అన్వేషణ |
|---|---|---|---|
| 1698 - 1720 | జాన్ బాప్టిస్ట్ లె మోయిన్ బ్యాన్ వీల్ | ఫ్రాన్స్ | దిగువ మిస్సిసిపీలోయ అన్వేషణ. |
| 1699 | పియరీ లె మోయిన్ డీబర్ వీల్ డీ | ఫ్రాన్స్ | మిస్సిసిపీనది ముఖద్వార అన్వేషణ. |
| 1714 - 1716 | ఇప్పొలిటో డెసిడెరీ | ఇటలీ | మధ్య ఆసియాను, ప్రధానముగ టిబెట్‌ను అన్వేషించెను. |
| 1718 | జాన్ బాప్టిస్ట్ లె మోయిన్ బ్యాన్ వీల్ | ఫ్రాన్స్ | న్యూ ఆర్లియన్స్‌ను వ్యవస్థాపించెను. |
| 1725 - 1741 | వైటస్ బేరింగ్ | డెన్మార్క్ * | ఈశాన్య ఆసియా తీరప్రాంత, బేరింగ్ జలసంధిప్రాంత అన్వేషణ. |
| 1766 - 1769 | లూయీ ఆంటోనీ డె బుగాన్ వీల్ | ఫ్రాన్స్ | ప్రపంచము చుట్టిన ఫ్రాన్స్ దేశీయులలో ప్రథముడు. |
| 1768 - 1778 | జేమ్స్ కుక్ | ఇంగ్లండు | సాగరఖండమున విస్తృత నౌకాయానములు చేసెను. దక్షిణ పసిఫిక్‌ను అన్వేషించెను. |
| 1769 - 1772 | సామ్యూల్ హార్న్ | ఇంగ్లండు | వాయవ్య, ఉత్తర అమెరికా అన్వేషణ. |
| 1770 | జేమ్స్ బ్రూస్ | స్కాట్‌లాండ్ | బ్లూ నైల్ జన్మస్థానము. |
| 1785 - 1788 | జాన్ ఫ్రాంకాయిస్ డె లా పిరోజ్ | ఫ్రాన్స్ | ఆసియా జలముల, లా పేరుజ్ జలసంధి ఆవిష్కరణ. |
| 1787 - 1793 | రాబర్ట్ గ్రే | యునైటెడ్ స్టేట్స్ | కొలంబియానదిని ఆవిష్కరించెను. ప్రపంచము చుట్టు నౌకాయానములు నిర్వహించెను. |
| 1789 | అలిగ్జాండర్ మెకంజీ | స్కాట్‌లాండ్ | వాయవ్య కెనడాను అన్వేషించెను; మెకంజీ నదిని ఆవిష్కరించెను. |
| 1789 - 1814 | డేవిడ్ థామ్సన్ | ఇంగ్లండు | పశ్చిమ కెనడాను అన్వేషించెను. |
| 1792 | జార్జ్ వాన్‌కూవర్ | ఇంగ్లండు | వాన్‌కూవర్ ద్వీపము చుట్టు నౌకాయానము చేసెను. |
| 1795 - 1798 | జార్జ్ బాస్ | ఇంగ్లండు | ఆస్ట్రేలియా తీరప్రాంతములో బాస్ జలసంధిని అవిష్కరించెను. టాస్మేనియా చుట్టు నౌకాయానము. |
| 1795 - 1805 | ముంగో పార్క్ | స్కాట్‌లాండ్ | నైజర్‌కు మార్గమును అన్వేషించెను. |
| 1803 - 1806 | మెరివెథర్ లెవిస్ | యునైటెడ్ స్టేట్స్ | రాకీ పర్వతములగుండ పసిఫిక్ మహాసముద్రమునకు సాహస యాత్రకు (క్లార్క్‌తో) మార్గదర్శి. |

* రష్యా పతాకము క్రింద నౌకాయానము.

| తేది | దేశాన్వేషకుడు | జాతీయత | ప్రధాన అన్వేషణ |
|---|---|---|---|
| 1804 - 1806 | విలియమ్ క్లార్క్ | యునైటెడ్ స్టేట్స్ | రాకీపర్వతములగుండ పసిఫిక్ మహా సముద్రతీరమునకు చేరిన సాహస యాత్రకు (లెవిస్‌తో) మార్గదర్శి. |
| 1805 - 1807 | జెబులాన్ పైక్ | యునైటెడ్ స్టేట్స్ | మధ్య, పశ్చిమమును, రాకీ పర్వత ప్రాంతమును అన్వేషించెను. |
| 1822 - 1827 | హగ్, క్లాపర్‌టన్ | స్కాట్‌లాండ్ | నైజీరియాను అన్వేషించెను. |
| 1822 - 1827 | డిక్సాన్ డెన్‌హామ్ | ఇంగ్లండు | కేంద్ర సుడాన్, లేక్‌చాడ్ ప్రాంతములు అన్వేషించెను. |
| 1824 | జేమ్స్ బ్రిడ్జర్ | యునైటెడ్ స్టేట్స్ | గ్రేట్ సాల్ట్‌లేక్‌ను దర్శించిన ప్రథమ శ్వేతజాతీయుడు. |
| 1824 | అలిగ్జాండర్ లేంగ్ | స్కాట్‌లాండ్ | నైజర్ మైదానమును అన్వేషించెను. |
| 1826 | జెడిడియా స్ట్రాంగ్ స్మిత్ | యునైటెడ్ స్టేట్స్ | 17 మంది గల బృందమును మిస్సోరి నుండి రాకీ పర్వతములకు చేర్చెను. గ్రేట్ బేసిన్ ప్రథమఅన్వేషకుడు. |
| 1826 | జాన్ రిచర్డ్‌సన్ | స్కాట్‌లాండ్ | గ్రేట్ స్లేవ్‌లేక్ ప్రాంత అన్వేషణ. |
| 1827 | విలియమ్ పారీ | ఇంగ్లండు | ఉత్తరధ్రువము చేరుట. |
| 1828 | చార్లెస్ స్టర్ట్ | ఇంగ్లండు | ఆగ్నేయ ఆస్ట్రేలియాను, డార్లింగ్ నదిని అన్వేషించెను. |
| 1831 ; 1839 - 1843 | జేమ్స్ క్లార్క్‌రాస్ | స్కాట్‌లాండ్ | ఉత్తర అయస్కాంత ధ్రువస్థానమును, అంటార్కిటిక్‌ను అన్వేషించెను. |
| 1838 - 1842 | చార్లెస్ విల్క్స్ | యునైటెడ్ స్టేట్స్ | అంటార్కిటిక్‌ను అన్వేషించెను. |
| 1838 - 1845 | జాన్ చార్లెస్ ఫ్రీమాంట్ | యునైటెడ్ స్టేట్స్ | ఉత్తర అమెరికాలో విస్తృత పశ్చిమ దేశాన్వేషణను నిర్వహించెను. |
| 1839 - 1841 | ఎడ్వర్డ్ జాన్ ఐర్ | ఇంగ్లండు | ఆస్ట్రేలియాలోని ఎడారులను అన్వేషించెను. లేక్‌టారెన్స్ ఆవిష్కరించెను. |
| 1839 - 1844 | ఎవరిస్ట్ రెగిస్ హక్ | ఫ్రాన్స్ | చీనా, మంగోలియా, టిబెట్‌లు. |
| 1841 - 1871 | డేవిడ్ లివింగ్‌స్టోన్ | స్కాట్‌లాండ్ | ఆఫ్రికా ఖండమును అన్వేషించిన వారిలో మేటి ; జాంబెజి నది జన్మస్థానమును ; విక్టోరియా జలపాతమును, లేక్‌న్గామీని ఆవిష్కరించెను. |
| 1844 - 1845 | ఫ్రీడ్రిక్ విల్‌హెల్మ్ లుడ్‌విగ్ లీక్‌హార్ట్ | జర్మనీ | తూర్పు ఆస్ట్రేలియాను అన్వేషించుట ; ఆ ఖండమును దాటుటకు ప్రయత్నము. |

| తేది | దేశాన్వేషకుడు | జాతీయత | ప్రధాన అన్వేషణ |
|---|---|---|---|
| 1845 - 1855 | హైన్‌రిక్ బార్త్ | జర్మనీ | సహారా, సుడాన్‌లను అన్వేషించెను. |
| 1847 | ఎడ్మండ్ బి కెనెడీ | ఆస్ట్రేలియా | విక్టోరియా నది మార్గాన్వేషణకై సాహసయాత్రను చేసెను. |
| 1856 | జాన్ హానింగ్ స్పీక్ | ఇంగ్లండు | టాంగన్యికా, విక్టోరియా లేక్‌లను ఆవిష్కరించెను. |
| 1856 - 1859 | పాల్ డుషాయూ | ఫ్రాన్స్ | కేంద్ర ఆఫ్రికాను అన్వేషించెను. |
| 1858 | రిచర్డ్ బర్టన్ | ఇంగ్లండు | లేక్ టాంగన్యికా చేరెను. |
| 1858 - 1862 | జాన్ మెక్‌డాల్ స్టూవార్ట్ | స్కాట్‌లాండ్ | ఆస్ట్రేలియాలో అన్వేషణ జరిపెను. |
| 1860 | రాబర్ట్ ఓహారా బర్క్ | ఐర్లాండ్ | ఉత్తరము నుండి దక్షిణమునకు ఆస్ట్రేలియాను దాటిన ప్రథముడు. |
| 1860 | విలియమ్ గార్మన్ విల్స్ | ఇంగ్లండు | ఆస్ట్రేలియా ఖండమును బర్కతో కలిసి దాటెను. |
| 1864 | సామ్యూల్ వైట్ బేకర్ | ఇంగ్లండు | లేక్ ఆల్బర్ట్‌ను ఆవిష్కరించెను. |
| 1870 - 1873 | నికొలాయ్ మెకిలొవిచ్ పర్ జీవాల్య స్కీ | రష్యా | మంగోలియాను అన్వేషించెను. గోబీ ఎడారిని, టిబెట్‌ను దాటెను. |
| 1873 | పీటర్ ఎగర్టన్ వార్ బర్టన్ | ఇంగ్లండు | అలిస్ స్ప్రింగ్స్‌నుండి రుబర్న్‌వరకు ఆస్ట్రేలియాను దాటెను. |
| 1874 | జాన్ ఫారెస్ట్ | ఆస్ట్రేలియా | కేంద్ర ఆస్ట్రేలియాను అన్వేషించెను. |
| 1874 - 1880 | హైన్‌రిక్ ఆస్కర్ లెన్జ్ | జర్మనీ | పశ్చిను ఆఫ్రికాను అన్వేషించెను. |
| 1874 - 1889 | హెన్రీ స్టాన్లీ | గ్రేట్ బ్రిటన్ | నైలు నది సరైన జన్మస్థానమును నిరూపించెను. చంద్ర పర్వతములను ఆవిష్కరించెను. |
| 1875 - 1883 | పియరీ పాల్ ఫ్రాంకాయిస్ కామిలీ సావర్ గ్నాన్‌డె బ్రజా | ఫ్రాన్స్ | దక్షిణ, పశ్చిమ ఆఫ్రికాల అన్వేషణ. |
| 1878 - 1880 | నీల్స్ అడాల్ఫ ఎరిక్ నోర్డెన్‌షల్డ్ | ఫిన్లాండ్ * | ఈశాన్య మార్గముగుండ ప్రథమముగ ఆసియాకు నౌకాయానము చేసెను. |
| 1878 - 1890 | ఎడ్వర్డ్ ష్నిట్‌జర్ (ఎమిన్‌పాషా) | జర్మనీ | కేంద్ర ఆఫ్రికాను అన్వేషించెను. |
| 1881 | అడాల్ఫస్ వాషింగ్‌టన్ గ్రీలీ | యునైటెడ్‌స్టేట్స్ | ఆర్కటిక్‌ను అన్వేషించెను; గ్రీన్‌లాండ్‌కు ఉత్తరమున ఉన్న క్రొత్త భూమిని ఆవిష్కరించెను. |
| 1883 - 1884 | ఫ్రెడెరిక్ ష్వాట్కా | యునైటెడ్‌స్టేట్స్ | యుకాన్‌నదిని అన్వేషించెను: ఆర్కటిక్ సాహసయాత్రలు. |

* స్వీడెన్ పతాకము క్రింద నౌకాయానము.

| తేదీ | దేశాన్వేషకుడు | జాతీయత | ప్రధాన అన్వేషణ |
|---|---|---|---|
| 1885 - 1933 | సెవెన్ ఆండర్స్ హెడిన్ | స్వీడన్ | ఆసియాలో అసంఖ్యాక అన్వేషణలు. |
| 1888 | ఫ్రిడ్జాఫ్ నాన్‌సెన్ | నార్వే | గ్రీన్‌లాండ్ మంచు భూములను మొట్ట మొదట అన్వేషించెను. |
| 1891 | సాలమన్ ఆగస్ట్ ఆంఢ్రీ | స్వీడన్ | ఉత్తర ధ్రువ ప్రాంతమునకు బెలూన్ పై ఎగిరిపోవుటకు ప్రయత్నించెను. |
| 1895 | ఫ్రిడ్జాఫ్ నాన్‌సెన్ | నార్వే | ఉత్తర ధ్రువమును చేరుటకు ప్రయత్నించెను. |
| 1896 - 1926 | కార్ల్ ఇతాన్ ఏక్‌లీ | యునైటెడ్ స్టేట్స్ | ఆఫ్రికాలోని పెక్కు భాగములను అన్వేషించెను. |
| 1899 | ప్రిన్స్ లూయీ ఆమోడెయో ఆవ్‌సవాయ్ అబ్రుజ్జీ | ఇటలీ | మౌంట్ సెయింట్ ఎలియాస్ (అలాస్కా) ను మొట్టమొదట ఎక్కెను. |
| 1902 - 1912 | క్నడ్ జాన్‌విక్టర్ రాస్‌ముసెన్ | డెన్మార్క్ | ఆర్కిటిక్ అన్వేషణలు కొనసాగించెను. |
| 1903 - 1910 | జేన్ బాప్టిస్ట్ ఎటినీ ఆగస్ట్ చార్కో | ఫ్రాన్స్ | చార్కోలాండ్‌ను అవిష్కరించెను; అంటార్కిటిక్‌ను అన్వేషించెను. |
| 1904 | క్నడ్ జాన్‌విక్టర్ రాస్‌ముసెన్ | డెన్మార్క్ | మెల్‌విల్లీ అఖాతమును స్లెడ్జితో మొట్టమొదట దాటెను. |
| 1904 - 1918 | విల్హ్ జాల్మర్ స్టెఫన్‌సన్ | కెనడా | ఆర్కిటిక్ ప్రాంతముల అన్వేషణ. |
| 1905 - 1906 | రాబర్ట్ అబ్రాహామ్ బార్ట్‌లెట్ | యునైటెడ్ స్టేట్స్ | ఉత్తర గ్రాంట్‌లాండ్‌ను చేరి స్లెడ్జిలో కేప్ హెకాను తొలుతగా చేరెను. |
| 1907 - 1909 | ఫ్రెడరిక్ ఆల్బర్ట్ కుక్ | యునైటెడ్ స్టేట్స్ | ఉత్తరధృవ పరిసరములను చేరెను. |
| 1907 - 1931 | సర్ డగ్‌లస్ మాసన్ | ఇంగ్లండ్ | ఆస్ట్రేలియా, అంటార్కిటిక్ సాహస యాత్రలకు మూడుసార్లు నాయకత్వము వహించెను. |
| 1908 - 1916 | సర్ ఎర్నెస్ట్ షాకెల్‌టన్ | ఐర్లాండ్ | అంటార్కిటిక్ అన్వేషణ. ద. అయస్కాంత ధ్రువస్థాన నిర్దేశము (1909) |
| 1909 | సర్ డగ్‌లస్ మాసన్ | ఇంగ్లండు | దక్షిణ అయస్కాంత ధ్రువమును చేరెను. |
| 1909 | రాబర్ట్ ఎడ్విన్ పియరీ | యునైటెడ్ స్టేట్స్ | ఉత్తర ధ్రువము చేరిన ప్రథమవ్యక్తి. |
| 1911 | రాల్డ్ ఆముండ్‌సెన్ | నార్వే | దక్షిణ ధ్రువము చేరిన ప్రథమ వ్యక్తి. |
| 1911 - 1930 | రాయ్ చాప్‌మన్ ఆండ్రూస్ | యునైటెడ్ స్టేట్స్ | కొరియా, టిబెట్, గోబీ ఎడారి. |
| 1912 | రాబర్ట్ ఫాల్కన్ స్కాట్ | ఇంగ్లండు | దక్షిణధ్రువము చేరెను. |
| 1913; 1937; 1947 | డోనాల్డ్ బాక్స్టర్ మాక్ మిలాన్ | యునైటెడ్ స్టేట్స్ | లాబ్రడార్, గ్రీన్‌లాండ్, బఫిన్ ఐలండ్, ఆర్కటిక్ అన్వేషణ. |

| తేది | దేశాన్వేషకుడు | జాతీయత | ప్రధాన అన్వేషణ |
|---|---|---|---|
| 1922 | జాన్ వాల్టర్ గ్రెగొరీ | ఇంగ్లండు | టిబెట్‌ను అన్వేషించెను. |
| 1924 | మార్టిన్ ఎల్మర్ జాన్సన్, & ఓసాహెలెన్ లేటీ | యునైటెడ్ స్టేట్స్ | ఆఫ్రికా పెక్కు భాగములను అన్వేషించిరి. |
| 1925 - 1926 | ఎల్స్‌వర్త్ & లింకన్ | యునైటెడ్ స్టేట్స్ | విమానము, వాయు నౌకలతో ధ్రువ ప్రాంతముల అన్వేషణ. |
| 1926 | అంబర్టో నొబైల్ | ఇటలీ | ఉత్తర ధ్రువముపై వాయు నౌకలో. |
| 1926 - 1929 | రిచర్డ్ ఈవ్లిన్ బర్డ్ | యునైటెడ్ స్టేట్స్ | ఉత్తర, దక్షిణ ధ్రువముల అన్వేషణ. |
| 1928 - 1947 | రిచర్డ్ ఈవ్లిన్ బర్డ్ | యునైటెడ్ స్టేట్స్ | పెక్కు అంటార్కటిక్ సాహస యాత్రలకు నాయకత్వము. |
| 1928 | జార్జ్ విల్కిన్స్ | ఆస్ట్రేలియా | అలాస్కా స్పిట్జ్‌బర్గెన్ అన్వేషణ. |
| 1947 | ఫిన్ రాన్నే | యునైటెడ్ స్టేట్స్ | ఎడిత్ రాన్నెలాండ్ అన్వేషణ. |



వివరములు 10 వ శతాబ్దివరకు మనకు చాలవరకు అజ్ఞాతములు. కాని, ఆ శతాబ్ది తరువాత యూరపియన్ జాతులలో చెలరేగిన వ్యాపార విస్తరణ, సామ్రాజ్య స్థాపనా కాంక్షలవలన ఈ అన్వేషణ విరివిగ సాగినది. ఇట్టి అన్వేషణల సాగించినవారి కృషి వివరములను పట్టికారూపమున 10 వ శతాబ్ది మొదలుగ ప్రత్యేక పట్టిక [చూ.] లో పొందుపరుపబడినవి. పా. ల. నా.

**దోస్తు మహమ్మద్ :** ఆఫ్ఘనిస్తాన్ పరిపాలకుడు; అమీర్ అను బిరుదు ఇతనికి ఉండెను. ఇతని పరిపాలనా కాలములో మొదటి ఆఫ్ఘన్ యుద్ధము (1839 - 42) జరిగినది. బ్రిటిష్‌వారు దోస్తు మహమ్మద్ పై ఈ యుద్ధము చేసిరి. దోస్తు మహమ్మద్ బందితుడై, పదవీభ్రష్టుడై భారతదేశమునకు పంపబడెను. షాషుజా అను వేరొకనిని ఆంగ్లేయులు రాజుగ చేసిరి. కాని, ఆఫ్ఘన్‌లు తిరుగుబాటు చేయుటచే 1842 లో బ్రిటిష్‌వారు కాబూల్‌ను వదలివచ్చివేయవలసి వచ్చినది. పిమ్మట షాషుజా హత్య చేయబడెను [చూ. ఆఫ్ఘన్ యుద్ధములు - పు. 284].


దోస్తు మహమ్మద్

అంతట సెప్టెంబరు 14 న జనరల్ పోలాక్ కాబూల్‌ను తిరిగి జయించి కసి తీర్చుకొనెను. కాని, బ్రిటిష్ ప్రభుత్వము అట్టి పరిస్థితులలో తమ సైన్యమును అచట ఉంచుటకు అనుమతించలేదు.

దోస్తు మహమ్మద్ మరల 1842 లో సింహాసనాసీనుడు అయ్యెను. కాని, 1855 వరకును కాందహార్ మాత్రము ఇతని పరిపాలనలోనికి రాలేదు. 1855 లో ఇతడును, బ్రిటిష్ వారును పెషావర్ సంధి చేసికొనిరి. హీరట్‌ను పరిష్యా బారినుండి రక్షించుటకు ఇద్దరును ఒడంబడిరి. 1856 లో హీరట్ పరిపాలకుడు మరణించుటతో ఆ ప్రదేశమును పరిషియన్‌లు పట్టుకొనిరి. అందువలన ఆంగ్లేయులు పరిష్యాపై యుద్ధము ప్రకటించిరి. 1857 లో పారిస్ సంధి [చూ.] తో పరిష్యా హీరట్‌ను విడిచి పెట్టి ఆఫ్ఘనిస్తానముయొక్క స్వాతంత్ర్యమును గుర్తించినది. పరిషియన్‌లు హీరట్‌ను వదలిన తరువాత దోస్తు మహమ్మద్ హీరట్‌ను తన రాజ్యమున కలుపుకొనెను. [చూ. ఆఫ్ఘన్ యుద్ధములు - పు. 284]. ప్ర. రా.

**ద్వంద్వ ప్రభుత్వము :** భారతదేశము బ్రిటిష్ పాలనలో ఉండగా ప్రభుత్వ విధులలో కొన్నింటిని మాత్రమే రాష్ట్ర ప్రభుత్వములకు అప్పగించి, మిగిలిన విధుల నిర్వహణను బ్రిటిష్‌వారు తమ క్రింద నే ఉంచుకొనిరి. ఇట్టి పరిపాలనా వ్యవస్థను 'ద్వంద్వ ప్రభుత్వము' అందురు. కేంద్రములో ఈ విధముగ రక్షణ, విదేశాంగ వ్యవహార శాఖలను బ్రిటిష్ ప్రభుత్వము తనకు ప్రత్యేకించుకొనినది. ప్ర. రా.

**ధర్మకర్తృత్వ సంఘము :** చూ. ఐక్యరాజ్యసమితి - పు. 351.

**ధర్మము :** చూ. ఋతము - పు. 340.

**నగర రాజ్యములు :** ప్రాచీనకాలమందు జనులు ఒకచోట స్థిరనివాసమును ఏర్పరచుకొనుటకు అలవాటుపడగనే గ్రామములు రూపొందినవి. ప్రతి గ్రామమందును గల జనులందరును ఒకే భాష, ఒకే మతము, ఒకే జాతి, ఒకే విధమయిన ఆచార వ్యవహారములు గలవారు అగుటచేత సంపూర్ణమైన ఐక్యము గలవారుగ ఉండగలిగిరి. కాని, ఇతరులనుండి కలుగు దోపిడిబాధలను తొలగించుకొను శక్తిసామర్థ్యములు గలవారు కాకపోవుటచేత కొన్ని చిన్న చిన్న గ్రామములవారు ఏకమై నగరమును నిర్మించుకొనుటకు పూనుకొనిరి. ఇట్టి పరిస్థితులలో నగరములు రూపొంది, నగర రాజ్యములు ఏర్పడినవి. శత్రువులబారి నుండి తప్పించుకొనుటకు ఏర్పడినవి కనుక నగరములవారు తమ నగరముల చుట్టును గోడలుగాని, కంచెలుగాని నిర్మించుకొనుచుండిరి. కొన్ని నగరములందు దుర్గములు కూడ నిర్మితములైనవి. కొన్ని గ్రామములు చేరి నగరములు ఏర్పడినందున జాతి మత ఆచార వ్యవహారములందు గ్రామములో ఉండిన ఐక్యము కొంత తగ్గక తప్పదు. పరిపాలకుడు తండ్రివంటివాడు అనే రాజనీతి గ్రామములలో చెల్లినట్లు నగరములలో అంతగ చెల్లదు. అందుచేత కొన్ని నగరములలో రాజులు ఉండినను, గ్రీస్ మొదలయిన దేశములందు రూపొందిన నగరములలో రాజులకు మారుగా 'ప్రజా సత్తాక రాజ్య విధానములు' ఏర్పడినవి. మరికొంత కాలమునకు నగరములలో కలహములు పుట్టి ఏదో ఒక నగరము ఎక్కువ బలము గలదై, తక్కిన నగరములను లోబరచుకొనుటకు ప్రయత్నించుట కూడ జరిగినది. దానివలన ఒక్కొక్క దేశమున గల నగరములు అన్నియు ఒక పెద్ద నగరమందలి ప్రభుత్వమునకు లొంగి దేశ రాజ్యము ఏర్పడుటయో, లేదా నగరములు కొన్ని నియమములకు లోబడి సమాఖ్యను ఏర్పరచుకొనుటయో జరుగవలసిన పరిస్థితులు ఏర్పడినవి. గ్రీస్‌నందలి నగరములు అన్నియు స్వాతంత్ర్యాభిలాష ఎక్కువగా కలవి. కనుక, సమాఖ్యలకు సమ్మతించినవి కాని, దేశ రాజ్య విధానమును తల పెట్టలేదు. అలెగ్జాండర్ [చూ. పు. 303]

నిర్మించిన మహాసామ్రాజ్యమున ఇవి కలిసిపోయి తమ ప్రత్యేకతను కోల్పోయినను, తిరుగ నిలద్రొక్కుకొని, తమ స్వాతంత్ర్యమును పునరుద్ధరించుకొనుటకు యత్నించినవి. కాని, సామ్రాజ్యాకాంక్ష కల రోమన్‌లు వాని స్వతంత్రతను దక్కనీయ లేదు. ఈ విధముగ గ్రీస్ దేశము నందేకాక తక్కిన ప్రదేశములందును ప్రాచీన యుగము నాటి నగర రాజ్యములు అంతరించినవి.

మధ్యయుగములో కొన్ని నగర రాజ్యములు ఉద్భవించి వాణిజ్య ప్రాముఖ్యమును పొందినవి. ఇటలీలోని మిలాన్, ఫ్లారెన్స్, జినోవా, వెనిస్, నేపిల్స్ నగరములు కొంత కాలము స్వతంత్ర రాజ్యములై ఉండెను. జర్మనీలోని హాంబర్గ్, బ్రెమెన్, లుబెక్ మొదలయిన నగరములు తమ స్వతంత్రతను నిలబెట్టుకొని హాన్సియాటిక్ లీగ్‌లో చేరి ఉండెను.

ఆధునికయుగములో 'ఫ్రీ సిటీ' అను పేరను కొన్ని అంశములందు స్వేచ్ఛగల నగరములు కలవు. కాని, ప్రాచీన, మధ్య యుగములనాటి నగర రాజ్యములవంటివి మాత్రము లేవు. డాన్‌జిగ్ (డాన్‌స్క్) నగరము కొంత కాలము స్వతంత్ర నగరరాజ్యమై నానాజాతిసమితి [చూ.] ఆధిపత్యమునకు మాత్రము కొన్ని విషయములలో లోబడి ఉండెను. కాని, నాజీ ప్రభుత్వమువారు దీనిని వశపరచుకొని జర్మనీలో చేర్చుకొనిరి. ద్వితీయ ప్రపంచ యుద్ధము ముగిసిన తరువాత ఇది పోలండ్‌వారికి ఇచ్చివేయబడినది. గి. వేం. సీ.

**నడిమి ఎన్నిక :** శాసనసభలో ఒక స్థానము ఖాళీ అగునపుడు, ఆ స్థానమును భర్తీచేయుటకు అదే నియోజక క్షేత్రములో తిరిగి ప్రత్యేకముగ జరుపు ఎన్నికను నడిమి ఎన్నిక లేదా ఉప ఎన్నిక అందురు. శాసనసభలోని ఒక సభ్యుడు చనిపోవుటవలనగాని, రాజీనామా ఇచ్చుటవలనగాని లేదా శాసనసభచే బహిష్కరింపబడుటవలనగాని సభ్యుల సభ్యత్వపు గడువు పూర్తికాకపూర్వమే ఇట్టి ఖాళీలు సంభవించును. ఒక్కొక్కప్పుడు ఒక ఎన్నిక అశాస్త్రీయమని ప్రకటితమగుటచేతనో లేదా శాసనసభ సభ్యత్వముతో పాటుగ నిర్వర్తించుటకు వీలుకాని మరొక పదవిని ఎవరైన సభ్యుడు అంగీకరించుట చేతనో కూడ సభ్యస్థానము ఖాళీయై నడిమి ఎన్నికకు తావు ఇచ్చును [చూ. ఎన్నిక పు. 343]. ప్ర. రా.

**నరసింహగుప్తుడు (473 - 475 ప.) :** భారతదేశమును పాలించిన గుప్త రాజవంశమునకు చెందినవాడు. పురగుప్తుని కుమారుడు. ఇతడు బాలాదిత్య బిరుదాంకితుడు. 'మంజుశ్రీ మూలకల్పము' అను గ్రంథమున ఈతడు చక్రవర్తి అనియు, ఇతని పరిపాలనము నిస్సత్వము అనియు, అఖండము అనియు చెప్పబడినది. ఆ గ్రంథమువల్లనే ఇతడు చిరకాలము జీవింపక అల్పాయుర్దాయము కలిగి తన ముప్పది అరవ ఏటనే మరణించెనని తెలియుచున్నది. ఇతని పట్టపురాణి మహాలక్ష్మీదేవి. ఈమెయందు ఈతనికి కుమారగుప్తుడు అను కుమారుడు కలిగెను. కుం. ఈ. దత్తు.

**నల్లమందు యుద్ధము :** చూ. చీనా ప్రజాగణ రాజ్యము - పు. 453.

**నాక్స్, జాన్ (1513 - 1572) :** స్కాట్‌లాండ్ దేశమునందలి క్రైస్తవమత సంస్కర్త. స్విజర్లండ్‌లో మతవిప్లవమును లేవదీసి, సంస్కర్త అని పేరుపొందిన కాల్విన్‌కు ముఖ్య శిష్యుడు. 1549 నుండి ఎడ్వర్డ్ - VI పరిపాలనములో ఇంగ్లండుదేశమందు సాగిన మతవిప్లవమునకు నాక్స్ చాలా తోడ్పడెను. 1555 లో ఇంగ్లండు తరఫున స్విజర్లండ్‌కు పేస్టర్‌గా వెళ్ళి, అక్కడ కాల్విన్ బోధనలకు ముగ్ధుడై అతనికి శిష్యుడు అయ్యెను. 1559 లో స్కాట్‌లాండ్ దేశమునకు వచ్చి అక్కడ తన ప్రచారము వల్లను, వ్రాతలవల్లను మతవిప్లవమును లేవదీసెను.

కాల్విన్‌వలెనే మతసంస్కరణమునకు విద్యావ్యాప్తి ఆవశ్యకమని నాక్స్ నమ్మినవాడు కనుక, నాక్స్ ప్రతి చర్చికిని కొన్ని పాఠశాలలు అనుబంధముగ ఉండవలెనని వాదించి స్థాపింపచేసెను. ఆ పాఠశాలలలో మతవిషయములే కాక, లాటిన్‌భాష, వ్యాకరణము, తర్కము, వైద్యము మొదలైనవి కూడ విద్యార్థులు నేర్చుకొనవలెనని నచ్చచెప్పి, వాటిని బోధించుటకు తగిన పండితులను అధ్యాపకులుగా నియమింప చేసెను.

కేతలిక్ మతావేశముగల మేరీ ఇంగ్లండుదేశమునకు రాణి కాగానే నాక్స్ పలుకుబడి తగ్గినది. కాని, ఇతడు కావించిన సంస్కరణములను ఆమె పూర్తిగా తగ్గించలేకపోయినది; తాత్కాలికముగా కొన్ని తగ్గింపబడినను ఆమె అనంతరము మరల పునరుజ్జీవనమును పొందినవి. గి. వేం. సీ.

**నాగార్జునకొండ :** చూ. సం; 4 - పు. 882.

**నాజీవాదము :** ప్రథమ ప్రపంచ యుద్ధానంతరము జర్మనీలో వెలసిన ఒక సాంఘిక, రాజకీయోద్యమము. ఈ ఉద్యమ ప్రవర్తకులు 1933 నుండి 1945 వరకు జర్మనీని పాలించిరి. ఇటలీలోని ఫాసిజమ్ [చూ.] యొక్కయు, కొన్ని జర్మనీ జాతీయవాద సిద్ధాంతములయు, మానవవంశ సిద్ధాంతములయు, ప్రష్యన్ యుద్ధోన్మాద వాదము యొక్కయు ప్రభావము ఈ ఉద్యమముపై గోచరించును.

అనుసరించిన విధానములనుబట్టి ఈ ఉద్యమమును కరుణ రహితమగు నియంతృత్వ రూపముగను, సర్వస్వాధికార యుత రాజ్యవాద రూపముగను అభివర్ణింపవచ్చును. ఆధునిక ప్రచార విధానములను నాజీలు పరాకోటిదాక పెంపొందించినారు [చూ. జర్మనీ - పు. 467]. ప్ర. రా.

**నాటో**: చూ. ఉత్తర అట్లాంటిక్ రక్షణ వ్యవస్థ - పు. 337.

**నాన్‌కింగ్ సంధి** (1842): 19 వ శతాబ్ద మధ్య భాగమున చీనా - బ్రిటన్ దేశముల మధ్య కుదిరిన సంధి. దీని పర్యవసానముగ 'నల్లమందు యుద్ధము' అని వ్యవహ రింపబడు యుద్ధము ముగిసెను. దీని మూలమున చీనా దేశము హాంకాంగ్‌ను బ్రిటన్‌నకు అప్పగించుటయే కాక కేంటన్, అమోయ్, ఫూచౌ, నాంగ్ పో, షాంగే అను రేవు పట్టణములలో విదేశ వ్యాపారులు సరకులు దించి వ్యాపారము చేయుటకు కూడ అనుమతించెను. ఈ ఒప్పందమువలననే ఆ రేవులకు తరువాత కాలమున 'సంధి లబ్ధపు రేవులు' అను పేరు కలిగెను. తదనంతర సంవత్సరమున చీనాతో ఏర్పాటు చేసికొనబడిన ఒక వ్యాపారపు ఒడంబడిక వలన బ్రిటన్‌నకు పలుకుబడి ఎక్కువై వ్యాపారమునందు ప్రముఖస్థానమును ఆ దేశము సంపాదించుటకు వసతి ఏర్పడెను. స్వ. వెం.

**నానాజాతి సమితి** (లీగ్ ఆఫ్ నేషన్స్): వివిధ శాఖలతో కూడిన ఒక అంతర్జాతీయ రాజకీయ సంస్థ; ప్రపంచములోని వివిధ జాతులకు చెందిన ఒక శాశ్వత, సచేతన, రాజకీయ సమాజమును నెలకొల్పుటకు జరిగిన ప్రయత్నములలో నానాజాతిసమితి స్థాపనమే చరిత్రలో తొలి ప్రయత్నము. వెర్సెయిల్స్ సంధి [చూ.] లోను, 1919లో ఇతర శాంతి సంధులలోను తయారయిన ఒడంబడిక పత్రమును అనుసరించి నానాజాతిసమితి స్థాపితమగుటయే ప్రాయశః ప్రథమ ప్రపంచయుద్ధపు ప్రత్యక్షఫలితములలో అత్యంత పరిగణనీయమైనది.

కాని, రాజకీయముగ ఈ సమితికి గల అధికారములు చాల తక్కువ అగుటవలనను, సోవియట్ రష్యా, యునైటెడ్ స్టేట్స్ వంటి ప్రముఖ రాజ్యములు ఇందులో చేరకపోవుట చేతను యుద్ధనివారణను ఈ సమితి సాధింప లేక పోయినది. కడకు ద్వితీయ ప్రపంచయుద్ధము మొదలిడు టతో ఈ సమితి నామమాత్రావశిష్టమైనది. 1945 లో లాంఛన ప్రాయముగ ఈ సమితి తుది సమావేశమును జరిపి అంతరించినది. అంతట ప్రపంచశాంతికై ఇంతకన్న పటిష్ఠ తరమగు సంస్థ ఆవశ్యమని భావింపబడి ఐక్యరాజ్యసమితి [చూ. పు. 351] రూపొందింపబడినది.

రాజకీయ రంగమున సమితి సాధించినది శూన్యమే అయినను, కార్మికరంగము, ప్రజారోగ్యరంగము మొదలగు వానియందు మాత్రము ప్రపంచరాజ్యములందు కొంత సమైక్యతను నానాజాతి సమితి సాధించినది. ప్ర. రా.

**నానాఫడ్నవీస్** (1742 - 1800): మహారాష్ట్ర రాజ నీతివేత్త; పరిపాలకుడు. బాల్యములో తల్లివద్ద విద్యా బుద్ధులు, దైవభక్తి అలవరచుకొనెను. పీష్వా బాలాజీరావు కుమారులైన విశ్వేశ్వర రావు, మాధవరావులతో పాటు విద్యను అభ్యసించి, రాజనీతిని కూడ నేర్చుకొనెను. 1756 లో ఇతని తండ్రి చనిపోగానే బాలాజీ రావు పీష్వా ఇతనికి ఫడ్నవీస్ హోదా ఒసగెను. నాటినుండి ఇతడు యుద్ధములలోను, పరిపాలనా వ్యవహారములలోను పాల్గొనుచుండెను. 1761 లో మూడవ పానిపట్ యుద్ధమున మహారాష్ట్రులు గొప్ప పరాజయమును పొందిరి.



నానాఫడ్నవీస్
(1742 - 1800)

అంతేకాక బాలాజీరావు పీష్వా కుమారుడు విశ్వేశ్వర రావు ఆ యుద్ధములో వీరస్వర్గము పొందుటచే అదివరకే కొద్దిగ వ్యాధిగ్రస్తుడై ఉండిన బాలాజీరావు మరణించెను. 1761 లో బాలాజీరావు రెండవ కుమారుడు మాధవరావు పీష్వా అయినాడు. కాని, అతని పినతండ్రి రఘునాథ రావు పీష్వా కాగోరి మహారాష్ట్రుల ఐక్యమునకు భంగ కరముగ శత్రువులైన మహమ్మదీయులకును, ఆంగ్లేయుల కును తోడగుచు పరమ నీచుడుగ ప్రవర్తించుచుండెను. అట్టి సమయములలో నానాఫడ్నవీస్ పీష్వాకు తగిన తోడుగ నిలచి వ్యవహరించుచుండెను.

ఆ కాలమున ఆంగ్లేయుల విజృంభణము ఉన్నత దశకు వచ్చుచుండెను. ఆంగ్లేయుల కూటనీతిని గ్రహించి, వారిని మహారాష్ట్రదేశమునుండి - సాధ్యమయినంతవరకు భారత దేశమునుండి - వెడలగొట్టవలెనన్న సంకల్పము నానా ఫడ్నవీస్‌నకు ఉండెను. మహాద్‌జీ సింధియా, నాగపూర్ భాంసలే, హైదర్ వీరు ముగ్గురును, పీష్వా సేనలును ఎవరికి చేరువగ ఉండిన ప్రాంతములలో వారు ఒక్కసారిగ ఆంగ్లే యులమీదపడుటకు సంకల్పించిరి. వీరిలో భాంసలేమాత్రము ఆనాటి గవర్నర్ - జనరల్ వారెన్ హేస్టింగ్స్ [చూ.] వద్దనుండి 16 లక్షల రూపాయలు పుచ్చుకొని ఊరుకొనెను.

కర్నల్ గోడర్డ్ 1780 లో గ్వాలియర్ పై విజయము పొందెను. గ్వాలియర్ ను రక్షించ లేకపోయినను, మహాద్ జీ బ్రిటిష్ సేనలకు మాల్వా వశము కాకుండ పోరి విజయుడయ్యెను. అంతటితో మొదటి మహారాష్ట్ర యుద్ధము ఆగి, సాల్బై (సాల్ బయి) వద్ద సంధి జరిగినది. ఈ యుద్ధములో మహారాష్ట్రులు పూర్తిగా విజయము పొందకుండుటకు రఘునాథరావు ఆంగ్లేయులతో మైత్రి నెరపి దేశద్రోహి అగుటయే ప్రధాన కారణము. 1772 లో పీష్వా మాధవరావు చనిపోయినపుడు అతని తమ్ముడు నారాయణరావు నానాఫడ్నవీస్ సాయముతో పీష్వా అయినాడు. కాని, నారాయణరావు 17 ఏండ్ల యువకుడు; పీష్వా అయిన కొలది మాసములకే అతడు హత్య చేయబడెను. అతని దుర్మరణమునకు రఘునాథరావును, అతని భార్యయు కారకులు. నారాయణరావు హతుడైనను, రఘునాథరావు పీష్వా కాకుండా నారాయణరావు కుమారుడగు మాధవరావు - II (1774 - 1795) అను పసివాడు పీష్వా అగుటకు కారకుడు ఈ నానాఫడ్నవీస్.

నానాఫడ్నవీస్ గొప్ప మేధావి; రాజనీతిజ్ఞుడు; గొప్ప వ్యవహర్త. పూనానగరములో నీటి సరఫరా ఏర్పాటులు చేయించెను. బెల్గామ్ నగరమును నిర్మించెను. అనేక దేవాలయములను కట్టించెను. ధర్మశాలలు, అన్న సత్రములు పెక్కుచోట్ల స్థాపించెను. రాజమార్గములకు ఇరువైపులను నీడను ఇచ్చు చెట్లను నాటించెను. ప్రజల సౌఖ్యమునకు అనుకూలించు ఘనకార్యములు ఎన్నో కావించెను. గి. వేం. సీ.

**నానా సాహెబ్** (జ. 1821. ర.): ప్రథమ భారత స్వాతంత్ర్య యుద్ధ (సిపాయిల తిరుగుబాటు) నాయకుడు. మాజీ పీష్వా బాలాజీరావు దత్తపుత్రుడు. ఇతని నిజ నామము దండుపంత్. బాలాజీరావు మరణానంతరము (1853) తనను పీష్వాగా గుర్తించి బాలాజీరావుకు ఇచ్చిన ఎనిమిది లక్షల రూపాయల ఫించను ఇవ్వవలసినదిగా బ్రిటిష్ ప్రభుత్వమును కోరి ఇతడు విఫలుడు అయ్యెను. భారతదేశమున బ్రిటిష్ పాలనను అంతమొందించవలెననే దీక్షతో ఝాన్సీ లక్ష్మిబాయి, మరికొందరితో కలిసి విప్లవమును తీసికొని వచ్చుటకు ఇతడు కృషి చేసెను. 1857 లో కాన్పూర్ లో జరిగిన సిపాయిల తిరుగుబాటులో ఇతని అనుచరులు బ్రిటిష్ సైన్యమును చిత్రవధ కావించిరి. తిరుగుబాటు విఫలమైన పిమ్మట 1859 లో నేపాల్ కు పారిపోయిన వారిలో ఇతడు కూడ ఉండెను. ఆ తరువాత అతడు అచ్చటనే మరణించినట్లు భావించబడినది [చూ. ఝాన్సీ లక్ష్మిబాయి - పు. 489]. పా. ల. నా.

**నార్వే:** యూరప్ ఖండమునందలి ఒక స్వతంత్ర రాజ్యము.




స్కాండినేవియా ద్వీపకల్పమున నెలకొని ఉన్న ఈ రాజ్యమునకు ఆర్కటిక్ మహాసముద్రము, బేరెంట్స్ సముద్రము [ఉ]; స్వీడెన్, ఫిన్లాండ్, సోవియట్ రష్యా [ప]; నార్త్ సముద్రము [ద]; అట్లాంటిక్ మహాసముద్ర అంతర్భాగమగు నార్వేజియన్ సముద్రము [తూ] సరిహద్దులుగ ఉన్నవి. పరిసరమున ఉన్న స్వాల్ బర్డ్ అను ప్రాంతమున నార్వేకు గల సర్వాధికారమును 1920 లో నానాజాతిసమితి గుర్తించినది. [వి] 3,24,219 చ. కి. మీ.; [జ] 36,81,000. [భా] జాతీయభాష నార్వేజియన్. [మ] నార్వేదేశపు ఎవెంజెలికల్ లూథరన్ చర్చి అను జాతీయ సంప్రదాయ క్రైస్తవమతము ఇట వ్యాప్తియందు ఉన్నది. [రా] ఆస్లో (జ. సం. 4,55,133).

చరిత్ర: నార్వే దేశపు ప్రాచీన చరిత్ర సాహసికులైన వైకింగుల చరిత్ర. క్రీ. శ. 800 వ సంవత్సరము వరకు నార్వే అనేక ప్రాంతీయ నాయకులచే పాలింపబడినది. హెరాల్డ్ రాజు కాలమున క్రీ. శ. 800 లో నార్వే మొట్టమొదట ఏక రాజ్యమయినది. అనతి కాలముననే హెరాల్డ్ రాజు రాజ్యము విడిపోయి నార్వే మరల ప్రాంతీయ నాయకుల పాలైనను, మరల క్రీ. శ. 1,000 నాటికి సెయింట్ ఒలాఫ్ నాయకత్వమున ఏకమయినది. నార్వే వాసులు అనేక వందల సంవత్సరముల పూర్వము స్థాపించిన వలసలు కూడ నార్వే రాజ్యములో కలసినవి.

నార్వే రాజ్యపు వారసుడు 1375 లో డెన్మార్క్ రాజుగా ఎన్నుకొనబడుటతో, నార్వే, డెన్మార్క్ ఒకే రాజు పాలనలో ఏకమయినవి. అట్లు 400 ఏండ్ల పాటు నార్వేకు ప్రత్యేక స్థానము లేక పోయినది.

నార్వే వర్తకము 1700 నాటికి వృద్ధిచెందినది. నార్వేలో జాతీయాభిమానము, స్వాతంత్ర్యాభిలాష ఎక్కువైనవి. నెపోలియన్ యుద్ధములలో డెన్మార్క్ బ్రిటన్‌కు శత్రువైనది. కాని, నార్వే విదేశ వర్తకము మాత్రము బ్రిటన్‌తో జరుగుచుండెను. నార్వే, బ్రిటన్‌ల మధ్య రహస్య వర్తకము డెన్మార్క్ అరికట్టలేక పోయినది. 1814 లో డెన్మార్క్ ఓడిపోయినది. నార్వేను స్వీడెన్‌కు ఇచ్చివేయ వలసినదని డెన్మార్క్‌ను బ్రిటన్ బలవంతపెట్టినది.

కాని, నార్వే వాసులు స్వీడెన్ అధికారము క్రింద ప్రమగ్గుటకు అంగీకరించలేదు. వారు నార్వేను స్వతంత్ర దేశముగ ప్రకటించి, ఒక రాజ్యాంగమును ఏర్పరచుకొని క్రిస్టియన్ ఫ్రెడరిక్‌ను తమ రాజుగ ఎన్నుకొనిరి. స్వీడెన్ వారు నార్వేపై యుద్ధము చేసిరి కాని, రెండు వారముల అనంతరము ఇరుపక్షములవారును ఒక ఒడంబడికకు వచ్చిరి. తత్ప్రకారము క్రిస్టియన్ ఫ్రెడరిక్ సింహాసనమును పరిత్యజించెను. స్వీడెన్ రాజే నార్వేకు కూడ రాజయ్యెను. అతడు నార్వే నూతన రాజ్యాంగమును మన్నించుటకు అంగీకరించెను. కాని, నార్వే - స్వీడెన్‌లమధ్య పొత్తుకుదుర లేదు. నార్వే వాసులలో స్వాతంత్ర్యకాంక్ష తీవ్రమగుచుండెను. 1890 లో నార్వే పార్లమెంట్ స్వాతంత్ర్యమును ప్రకటించి, స్వీడెన్ రాచరికపు పాలననుండి వైదొలగి, తదుపరి డెన్మార్క్ రాజకుమారుడగు చార్లెస్‌ను హాకన్ - VII అను పేరున తమ రాజుగ ఎన్నుకొనెను. 1905 నుండి 1940 వరకు నార్వే క్రమాభివృద్ధి పొందెను. ప్రథమ ప్రపంచ యుద్ధకాలమున నార్వే తటస్థ విధానము అవలంబించినది. ద్వితీయ ప్రపంచయుద్ధమున కూడ తటస్థముగనే ఉండ ప్రయత్నించినది.

కాని, జర్మనులు నార్వే రేవు పట్టణములు అన్నిటిని ఒకేసారి 1940, ఏప్రిల్ 9 న అకస్మాతుగ ముట్టడించిరి. నార్వే జర్మనీపై యుద్ధము ప్రకటించెను. బ్రిటన్, ఫ్రాన్స్, పోలండ్ సహాయము చేసినను నార్వే తట్టుకొనలేక పోయినది. నార్వే అంతయు జర్మనీ అధీనమగుటతో నార్వే ప్రభుత్వము లండన్‌లో తలదాచుకొనవలసి వచ్చెను. నార్వే దేశీయుడైన విడ్కన్ క్విజ్లింగ్‌ను జర్మనులు నార్వేలో తాము ఏర్పరచిన కీలుబొమ్మ ప్రభుత్వమునకు అధిపతిగ చేసిరి. కాని, నార్వేలోనే రహస్య ఉద్యమములు లేవదీసి, జర్మనులతో నార్వే వాసులు పోరాడిరి. యుద్ధములో మిత్రమండలి జయించుటతో నార్వే తిరిగి స్వతంత్ర దేశమయ్యెను (1945). కాని, ద్వితీయ ప్రపంచ యుద్ధకాలపు అనుభవములు ఈ దేశపు విదేశనీతిలో ఒక ముఖ్యమైన మార్పునకు దోహదము ఒనర్చినవి. అంతటినుండి ఈ దేశము తన తాటస్థ్యమును విడనాడి నాటో [చూ.] మైత్రిలో చేరినది. మార్షల్ ప్రణాళిక [చూ.] ను అనుసరించి ఈ దేశము యునైటెడ్‌స్టేట్స్ నుండి ఆర్థిక సహాయమును గ్రహించి, తన ఆర్థిక వ్యవస్థను పునర్నిర్మించుకొన గలిగినది. 1960 నుండి ఈ దేశము యూరపియన్ స్వేచ్ఛా వ్యాపార సమ్మేళనమునందు భాగస్వామియై వ్యాపారమున అభివృద్ధిని సాధించినది.

రాజ్యాంగము: వంశానుగతము, రాజ్యాంగ చట్టవిహితము అగు రాచరికపు పాలన ఇట అమలునందు ఉన్నది. 1814, మే లో వెలువరింపబడి ఆ తరువాత సవరణల నందిన ఒక రాజ్యాంగ చట్టము ఇచట పరిపాలనకు ఆధారము. రాజవంశమున పురుషసంతతిలో జ్యేష్ఠుడగు వాడు సింహాసనార్హుడు అగును. జాతీయ మత పీఠమునకును ఇతడే అధ్యక్షుడు. చట్టమును అనుసరించి కార్య నిర్వహణాధికారము రాజునందును, శాసన నిర్మాణాధి కారము 'స్టోర్టింగ్' అనబడు శాసనసభ యందును న్యస్తములై ఉన్నవి. కార్యనిర్వహణమును మంత్రివర్గ మూలమున రాజు కొనసాగించును. ఈ మంత్రివర్గమున ఏడుగురకు తగ్గక మంత్రులు ఉందురు. వీరిని నియమించుటలో రాజునకు చట్టరీత్యా స్వేచ్ఛ ఉన్నను, శాసన సభ విశ్వాసము కలవారినే సంప్రదాయముగ రాజు నియమించును. నైష్పత్తిక ప్రాతినిధ్యమును అనుసరించి వివిధ మండలములనుండి ఎన్నుకొనబడిన 150 మంది ప్రతినిధులు శాసన సభయందు ఉందురు. ఈ సభ్యులు తమనుండి దాదాపు నాలుగవ వంతు సభ్యులను 'లగ్‌టింగ్' అను సభకు సభ్యులుగ ఎన్నుకొనెదరు. మిగిలినవారు అందరు 'ఓడెల్‌స్టింగ్' అను సభగ వ్యవహరింపబడుదురు. కొన్ని విధములగు చిత్తు చట్టములు తొలుత ఓడెల్‌స్టింగ్‌నందు ప్రవేశపెట్టబడి, ఆమోదింపబడిన తరువాత 'లగ్‌టింగ్'కు పంపబడి పిదప రాజు సమ్మతితో చట్టములు అగును. కాని, ఆర్థిక, రాజకీయ సంబంధములగు చిత్తు చట్టములు ఉభయ సభల సంయుక్త సమావేశమున మాత్రమే ఆమోదింపబడవలెను. ఉభయ సభలకు విభేదములు ఏర్పడినప్పుడును, రాజ్యాంగ చట్టమునకు సవరణ జరుగవలసినప్పుడును సమష్టి సమావేశమున మూడింట రెండువంతుల సమ్మతితో తుది నిర్ణయము జరుగును. గి. వేం. సీ., చీ. శే. రా.

**నాసర్, జమాల్ అబ్దుల్** (జ. 1918): అరబ్బు రాజకీయ నాయకుడు. యునైటెడ్ అరబ్బు రిపబ్లిక్ ప్రథమ అధ్యక్షుడు (1958). ఎగువ ఈజిప్టునందలి బెనిమోర్‌లో 1918, జనవరి 15 న ఇతని జననము. బ్రిటిష్ వారికి వ్యతిరేకముగ విద్యార్థుల ప్రదర్శన నడిపించి

నందులకు కైరోనందలి సెకండరీ స్కూల్‌నుండి (1953) బహిష్కరింపబడెను. న్యాయశాస్త్ర పాఠశాలలో కొంత కాలము (1937) చదివిన పిమ్మట రాయల్ మిలటరీ అకాడమీ నుండి పట్టభద్రుడు అయ్యెను.


జమాల్ అబ్దుల్ నాజర్
(జ. 1918)

'సొసైటీ ఆవ్ ఫ్రీ ఆఫీసర్స్' అను రహస్య సంఘమును ఒకదానిని నాసర్ వ్యవస్థాపించి, తద్వారా రాజకీయ అవినీతిని, ఈజిప్టుపై విదేశీయుల పెత్తనమును అంత మొందించుటకు కృషిచేసెను. పాలస్తీనా యుద్ధము (1948-49) లో పాల్గొని గాయపడెను. 1952, జూలై 23న మిలటరీ తిరుగుబాటును లేవదీసి, ఫరూఖ్ రాజును అధికారమునుండి తొలగించెను. నూతన ప్రభుత్వమునకు ప్రధానిగా జనరల్ మహమ్మద్ నజీబ్‌ను నియమించి నప్పటికి విప్లవ అధికార కమిటీద్వారా అధికారమును తన అధీనములోనే ఉంచుకొనెను. 1954 లో తనపై హత్యా ప్రయత్నము జరిగిన తరువాత, నజీబ్‌ను అరెస్ట్‌చేసి ఈజిప్టు ప్రధాని అయ్యెను. 1956 లో ఈజిప్టు గణరాజ్య ప్రథమ అధ్యక్షుడుగా ఎన్నిక అయ్యెను. సూయజ్‌కెనాల్ కంపెనీని 1956 లో జాతీయముచేసి, బ్రిటిష్, ఫ్రెంచి బెదరింపులకు లొంగక విజయము సాధించెను. సిరియా, యెమెన్‌లు ఈజిప్టుతో కలసి యునైటెడ్ అరబ్బు రిపబ్లిక్ [చూ.] గా ఏర్పడినపుడు (1958), నాసర్ దానికి ప్రథమ అధ్యక్షుడు అయ్యెను. కాని, అనతికాలముననే సిరియా, యెమెన్ దేశములు విడివడుటచే, ఈజిప్టునకు మాత్రమే నాసర్ అధ్యక్షత వహించెను.

ఆర్థిక, సాంఘికాభి వృద్ధికి 'అరబ్బు సోషలిజమ్' అను ప్రణాళికను నాసర్ ప్రారంభించెను. ఎడారి భూమిని సస్యశ్యామలముగ చేయుటకై నిర్మితమగుచున్న అస్వన్ ఆనకట్ట ఈ ప్రణాళికా విజయమునకు ఒక ముఖ్య సోపానము. విదేశ వ్యవహారములలో నాసర్ అలీన విధానమును అవలంబించుచున్నాడు. భారత ప్రధాని నెహ్రూ [చూ.] చేత ప్రవచింపబడిన 'అలీన విధానము'ను బలపరచిన వారిలో నాసర్ ఒకరు. తాను రచించిన 'ఈజిప్ట్స్ లిబరేషన్ (ఈజిప్టు విమోచనము - 1956)' అను గ్రంథమున తన రాజకీయాశయములను ఈతడు వెలువరించి, అరబ్బు దేశముల సౌభ్రాతృత్వమును, ఆఫ్రికా సమైక్యమును తన ధ్యేయములుగ పేర్కొనెను. పో. ల. నా.

**నికరాగ్వా :** మధ్య అమెరికా యందలి ఒక స్వతంత్ర రాజ్యము.




ఈ రాజ్యమునకు హొండూరాస్ [ఉ]; కారబియన్ సముద్రము [తూ]; కోస్టారికా [ద]; పసిఫిక్ మహాసముద్రము [ప] సరిహద్దులందు ఉన్నవి. [వి] 1,48,000 చ. కి. మీ.; [జ] 15,29,094. ఆదిమ అమెరికన్‌లకు శ్వేతజాతీయులతో ఏర్పడిన వైవాహిక సంబంధములవలన రూపొందిన మిశ్రజాతి ఇందు 85% కలరు. [భా] కొన్ని ఆదిమ అమెరికన్ వర్గములు వివిధ ఆదిమ అమెరికన్ భాషలను మాటాడుచున్నను, స్పానిష్‌భాష సాధికార జాతీయభాషగ వ్యవహారమున ఉన్నది. [జ] ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు రోమన్ కేతలిక్ క్రైస్తవులు. [రా] మనగ్వా (జ. సం. 1,98,939).

చరిత్ర: నికరావో అను ఆదిమ అమెరికన్ యోధుడు ఈ ప్రాంతమున తొలుతగ సువ్యవస్థిత పాలనను ఏర్పరచుట వలన ఈదేశమునకు నికరాగ్వా అను పేరు వచ్చినది. 1502 లో కొలంబస్ [చూ. పు. 407] ఈ ప్రాంతములను తొలుతగ కనుగొనెను. ఆ కాలమున ఈ రాజ్యము చిన్న రాజ్యములుగ విభక్తమై వివిధ అమెరికన్ జాతుల పాలనమున ఉండెను. అంతట అనతికాలముననే స్పెయిన్‌వారు ఈ ప్రాంతమును జయించి వశపరచుకొనిరి. ఈ దేశమునందలి గ్రెనడా, లియాన్ నగరములను 16 వ శతాబ్దిలో స్పానిష్ విజేతలే నిర్మింపజేసిరి. అంతటినుండి దాదాపు 300 ఏండ్ల కాలము స్పానిష్ సామ్రాజ్యమున అంతర్భాగముగ ఉండి ఈ దేశము దాస్యము అనుభవించినది. తరువాత 15

సెప్టెంబరు, 1821 న తక్కిన మధ్య అమెరికన్ రాజ్యము లతో పాటుగ ఈ దేశము స్వాతంత్ర్యమును ప్రకటించి అపుడు ఏర్పడిన సంయుక్త మధ్య అమెరికా రాష్ట్రముల సమాఖ్యలో ఒక రాష్ట్రముగ చేరినది. 1838 లో ఈ సమాఖ్య విచ్ఛిత్తి కాగ, ఆ వెనువెంటనే నికరాగ్వా సర్వ స్వాతంత్ర్యమును ప్రకటించి, ఒక రాజ్యాంగ విధాన మును ఏర్పరచుకొనినది. నార్బర్డో రామిరెజ్ అనునతడు ఈ దేశమునకు అధ్యక్షుడుగ ఉన్న కాలమున ఉత్తర అమెరికా వాసులకు ఈ దేశముగుండ రాకపోకల హక్కు కల్పింపబడుచు ఒక ఒడంబడిక చేసికొనబడెను. తరువాత 1901 లో ఈ ఒడంబడికను రద్దుచేయుచు యునైటెడ్ స్టేట్స్‌కు నికరాగ్వా భూసంధిగుండా కాలువ త్రవ్వుకొను హక్కు ఒసంగుచు వేరొక ఒడంబడిక చేసికొనబడెను. ఈ విధముగ ఈ దేశపు రాజకీయములలో యునైటెడ్ స్టేట్స్‌కు ప్రసక్తి ఏర్పడెను.

స్వాతంత్ర్యము 1821 లో లభించినది మొదలుగ దేశమున గల రెండు రాజకీయ పక్షములకు మధ్య నిరవచ్ఛిన్నముగ చెలరేగిన సంఘర్షణమే ఈ దేశపు రాజకీయ చరిత్రగ పరిణమించెను. వీరిలో మితవాదు (లిబరల్) లకు లియాన్ నగరము, సనాతన వాదు (కన్సర్వేటివ్)లకు గ్రెనడా నగరము రాజకీయ కేంద్రములు అయ్యెను. ఈ తగవు లాటలు అరాజకమునకు దారి తీసెను. కడకు 1912 లో యునైటెడ్ స్టేట్స్ నౌకాదళము ఇచట దిగి శాంతిభద్రతల రక్షణ భారమును వహించెను. తరువాత దేశమున సువ్యవస్థిత ప్రభుత్వము ఏర్పడగనే యునైటెడ్ స్టేట్స్ సేనలు వైదొలగినను, తిరిగి ఇట్టి పరిస్థితులలోనే 1926, 1928, 1932 లో ఆ సేనలు ఇటకు వచ్చి ఆ యా సమయము లందు శాంతిరక్షణకు సాయపడినవి. చివరకు 1936 లో ఉభయ పక్షములు లియాన్‌లో జరిపిన సమావేశమున ఆమోదింపబడిన రీతిగ యనస్తాసియో సోమోజా అను నతడు అధ్యక్షుడుగ నియమింపబడెను. 1956 లో హత్య చేయబడు వరకు ఇతడు అధికారమున ఉండెను. అంతట అతని కుమారుడు సోమోజా - డిబైలీ అధ్యక్షుడుగ 1957, ఫిబ్రవరిలో ఎన్నుకొనబడెను. ఇతని పదవీ కాలపరిమితి ఆరు సంవత్సరములు.

ఈ దేశమునకును, హోండురాస్‌కును మధ్య సరిహద్దు తగవు 1894 నుండి అపరిష్కృతముగ ఉండగ, నికరాగ్వా ఆ తగవును 1957 లో అంతర్జాతీయ న్యాయస్థానము తీర్పునకు నివేదించెను. ఆ న్యాయస్థానము వారు 1960, నవంబరులో తీర్పు చెప్పుచు మస్కటో టెరిటరీ అనబడు ప్రాంతము హోండూరాస్‌కే చెందవలెనని నిర్ణయించిరి. కోస్టారికాతో గల వేరొక సరిహద్దు తగవు అమెరికా రాజ్యముల కూటమి [చూ - పు. 271] వలన సరిచేయ బడినది.

రాజ్యాంగము : కేంద్రీకృతాధికారము గల గణరాజ్య విధానపు ప్రభుత్వము ఈ దేశమున అమలునందు ఉన్నది. అధ్యక్షుని పదవీ కాలపరిమితి ఆరు సంవత్సరములు. ప్రజలు ఇతనిని అపరోక్షపు ఎన్నికలలో ఎన్నుకొనెదరు. ఒక తడవకు అధ్యక్షుడైనవాడు, ఆ వెనువెంటనే ఆ పదవికి మరల ఎన్నుకొనబడకూడదు. అధ్యక్షుడు 25 ఏండ్లకు మించిన వయసు కలిగి ఉండవలెను. తన మంత్రివర్గమును ఇతడు నియమించుకొని, దాని సాయమున పాలనమును నిర్వహించును. శాసన సభ (నేషనల్ కాంగ్రెస్) యందు ప్రతినిధి సభ (ఛేంబర్ ఆవ్ డిప్యూటీజ్), శిష్టసభ అను రెండు కక్ష్యలు కలవు. ప్రతినిధి సభ యందలి సభ్యసంఖ్య 42. ఈ సభకు ఎన్నికలు ఆరేండ్లకు ఒక పర్యాయము జరుగును. శిష్టసభలో 16 మంది సభ్యులు ఉందురు. దేశ మందలి 16 జిల్లాలనుండియు జిల్లాకు ఒకడు చొప్పున వీరు ఎన్నుకొనబడెదరు. వీరుకాక, అంతకు పూర్వము అధ్యక్ష పదవి నిర్వహించి, సజీవులుగ ఉన్న పెద్దలును శిష్టసభలో మరణపర్యంతము సభ్యులుగ ఉందురు. శాసనసభ తీర్మాన మును అవి ఆమోదింపబడిన పది దినములలోగా, మంత్రి మండలి సలహాతో అధ్యక్షుడు తిరస్కరింప (వీటోచేయ) వచ్చును. కాని, శాసనసభ మూడింట రెండు వంతుల ప్రాబల్యముతో దానిని మరల ఆమోదించినచో అధ్యక్షుని వీటో రద్దు కాగలదు. దేశమునందలి ప్రజలలో 18 ఏండ్ల వయసునకు మించి, డిగ్రీ పరీక్షలో కృతార్థత పొందిన స్త్రీ - పురుషులందరకును, 18 ఏండ్ల వయసునకు మించి, చదువను, వ్రాయను నేర్చి వివాహితులైన వారందరికిని; తక్కిన అన్ని సందర్భములలోను 21 ఏండ్లు వయసు మించిన వారందరికిని వోటు హక్కు కలదు. చీ. శే. రా.

నికలస్ - II (1868 - 1918): రష్యన్ చక్రవర్తు (జార్) లలో కడపటి వాడు. అలిగ్జాండర్ - III పుత్రుడు. రాచకార్యములందు తన పుత్రునికి శిక్షణ ఇచ్చుటయందు అలిగ్జాండర్ - III శ్రద్ధ వహించలేదు. 1894 లో హెస్ - డార్మ్‌స్టాట్ యువరాణి అలిగ్జాండ్రా (విక్టోరియారాణి మనుమరాలు) ను ఇతడు వివాహమాడెను.

అధికారమును స్వీకరించిన వెంటనే నిరంకుశపాలననే కొనసాగించ దలచినట్లు ఇతడు వ్యక్తపరచెను. ప్రతి పక్షములను అణచివేయుట, అల్ప సంఖ్యాక మతములవారిని బాధించుట, సరిహద్దు ప్రాంతములను సోవియట్ రష్యాలో చేర్చుట ఇతడు కొనసాగించెను.

జపాన్‌తో జరిగిన యుద్ధము (1904-05) లో పొందిన అవమానకరమైన ఓటమికి తోడుగ క్షామ పరిస్థితులును, పారిశ్రామిక సమ్మెలును 1905 లో విప్లవోద్యమమునకు దారితీసినవి. అంతట ప్రాతినిధ్య ప్రభుత్వమును, కనీసపు పౌరహక్కులను ప్రసాదించు ఒప్పందముపై నికలస్ - II సంతకము చేయక తప్పినదికాదు. తత్ఫలితముగ ప్రజా ప్రాతినిధ్యము కల శాసనసభ ఏర్పడినను, ప్రజా ప్రతినిధులను గాని, సంప్రదాయపు ప్రభువర్గమును గాని అతడు విశ్వసింపక, రాస్‌పుటిన్, గ్రెగరీ [చూ.] అను క్రైస్తవ సిద్ధుని అనుచిత ప్రభావమునకు లోనయ్యెను.

ప్రథమ ప్రపంచ యుద్ధ (1914) ప్రారంభముతో ఆంతరంగిక రాజకీయ కల్లోలములు కొంతవరకు సద్దు మణగినవి. కాని, ఆ అవకాశమును పురస్కరించుకొని రాజ్య ఆంతరంగిక వ్యవహారములను క్రమపరచుటకు నికలస్ - II గాని, అతని మంత్రులు గాని ప్రయత్నము చేయలేదు.

దేశమున అసంతృప్తి వ్యాపించినది. సైన్యము యుద్ధములచే అలసిపోయినది. కాటక పరిస్థితులు ఏర్పడగా తిరుగుబాటులు చెలరేగినవి. తత్ఫలితముగ 1917, మార్చి 15 న తన అధికారమును నికలస్ - II వదలుకోవలసి వచ్చెను [చూ. రష్యా విప్లవము]. నూతన ప్రభుత్వము ఇతనిని సకుటుంబముగ నిర్బంధమునకు లోనుజేసి, పెక్కు ప్రదేశములకు ఆ యా పరిస్థితులను బట్టి తరలించినది. పురోగమించుచున్న ప్రతి విప్లవసేన రాచకుటుంబమును రక్షించునేమో అను భయముతో ఎకాటెరీన్‌బర్గ్ (ప్రస్తుత స్వెర్డ్‌లాఫ్‌స్క్) లోని స్థానిక బోల్షివిక్ సైనికాధికారి నికలస్ - II ను, అతని కుటుంబమును చంపించెను. పా. ల. నా.

**నియంతృత్వము (డిక్టేటర్ షిప్) :** అర్థము విశేషముగ మార్పులు చెందుటకు వచ్చిన పదములలో ఈ పదము ఒకటి ప్రధానముగ పేర్కొనదగినది. రోమన్ ప్రజాసత్తాక రాజ్యాంగములో ఈ పదమునకు 'రాజ్యసంస్థ ఒక గడ్డు పరిస్థితిని గడచి బయటపడవలసి వచ్చినప్పుడు కేవలము ధర్మకర్తృత్వ దృష్టితో తాత్కాలికముగ ఒక వ్యక్తి అపరిమిత అధికారములను చేపట్టుట' అని అర్థము.

అర్వాచీన కాలములో అనేక విధములైన సర్వాధికారయుత పరిపాలనకు ఉదాహరణలు లభించును. వీటిలో కొన్ని దాక్షిణ్యయుతములుగను, స్వీకరణార్హములుగను ఉన్నవి ; మరికొన్ని క్రూరములుగ సాగినవి.

నియంతృత్వము అనునది అత్యంత అస్థిరమైనట్టియు, విప్లవాత్మకములైనట్టియు పరిస్థితులకు సంబంధించినది. అట్టి పరిస్థితులు ప్రథమ ప్రపంచయుద్ధము అనంతరము ఆ యుద్ధమువలన ఎక్కువగ దెబ్బతిన్న దేశములలో అధికముగ కనిపించినవి. శిష్టాచారానుగుణముగ ఒక దేశములో చిరకాలము శాసనబద్ధ ప్రభుత్వము సాగిన పిమ్మట, దానికి ప్రతిగా వెలసిన నియంతృత్వమే నియంతృత్వ ప్రభేదముల అన్నిటిలోను మిక్కిలి ముఖ్యమైనది. నిశితముగ పరిశీలించనచో నియంతృత్వము అనునది - ప్రాచీనముగాని, అర్వాచీనముగాని - స్వపరిపాలనాశయమునకు ఇచ్చిన చెల్లుచీటియే అని స్పష్టము కాగలదు.

నియంత ఎల్లప్పుడును శాసనసమ్మతాధికారము గల మరొక వ్యక్తికి వెనుక ఉండియే కథ నడిపింపవలెనను నియమము లేదు. తానే స్వయముగ అధ్యక్షుడో, రాజో, ప్రధానమంత్రియో కూడ అయి ఉండవచ్చును. ఎవని అధికారము రాజ్యాంగ విధానమునకు విరుద్ధముగ ఉండునో అట్టివాడు వాస్తవముగ నియంతయే అగును. ప్ర. రా.

**నియోజక క్షేత్రము :** రాజకీయముగ నిర్దిష్టమైన కొంత ప్రదేశములో కల వోటరులు అందరిని కలిపి ఒక 'నియోజక క్షేత్రము (కాన్స్టిట్యూయన్సీ)' అందురు. వీరు పార్లమెంట్‌కు గాని లేదా మరొక ప్రజాప్రతినిధి సంస్థకు గాని ఆ నిర్దిష్టప్రాంతము తరఫునను, ఆ ప్రాంతమున గల అశేష జనానీకము తరఫునను ప్రతినిధిని ఎన్నుకొందురు. అర్వాచీన ప్రజాస్వామ్య భావనలు పెంపొందుటతో భౌగోళికముగ అందు నిర్దిష్ట మండలమునకే ఈ పదము వాడుక చేయబడుచున్నది. కాని, ప్రజాప్రతినిధి ప్రభుత్వ ప్రారంభ దశలలో మాత్రము విభిన్న వర్గముల లేదా హోదాల ప్రాతిపదిక మీదనే శాసనసభలను ఏర్పరచు సంప్రదాయము అమలులో ఉండెను. ప్ర. రా.

**నియోజక వర్గము :** ఒక తరగతి వారికి వోటు చేయు అర్హత గల వ్యక్తులు అందరికిని చెందినదానికి నియోజక వర్గము అని పేరు. ఉదాహరణమునకు : పట్టభద్రుల వర్గము. * * *

**నిరంకుశ ప్రభుత్వ విధానము :** గ్రీకుల వాడుకలో నిరంకుకుడు (టైరంట్) అనగా గృహయజమాని, బానిసల పాలకుడు అని అర్థము. ఈ పదము ప్రాచ్యసామ్రాజ్యముల సర్వాధికారయుత ప్రభువులకే వాడుక చేయబడినది. దీని పర్యాయ పదము అగు 'నియంత' అను పదము వలెనే ఎట్టి రాజ్యాంగమునకును లోబడకుండ సర్వతంత్ర స్వతంత్రముగ పాలించు సర్వాధికారయుత ప్రభువు అను అర్థములోనే ఈ పదము కూడ నేడు రూఢమైనది. సాధారణముగ పాలకుడు అనియంత్రితుడై సర్వాధికారములను చలాయించు వ్యవస్థ 'నిరంకుశ ప్రభుత్వ వ్యవస్థ' అని వ్యవహరింపబడుచున్నది. ప్ర. రా.

**నిరాయుధీకరణ :** ఈ పదము రెండు విభిన్న విస్పష్ట భావనలను తెలియజేయుటకు వాడబడుచున్నది. యుద్ధమునకు ఉపయోగపడు సర్వవిధ ఆయుధ సామగ్రిని నాశము చేసి, మరల దాని ఉత్పత్తికి పూనుకొనక ఉండుటయే 'నిరాయుధీకరణ' అని వ్యవహరింపబడుట సముచితమని విశాలాదర్శ భావనాశీలురగు కొందరు వాదింతురు. కాని, ప్రపంచమున సర్వరాజ్యములచేత - లేదా దాదాపుగ సర్వ రాజ్యముల చేత - ఆమోదితమగు అంతర్జాతీయమగు ఒక ఒడంబడికను అనుసరించి ఆ యా రాజ్యముల ఆయుధముల సంఖ్యా పరిణామములను తగ్గించి ఒక నిర్ణీతావధిని ఆ రాజ్యములు అతిక్రమించకుండా చూచుటయే నిరాయుధీకరణగ భావించదగునని వాస్తవికతా శీలురగు కొందరి అభిప్రాయము. ఆ ఆదర్శదృష్టితో చూచునపుడు ఇందు తొలుతటిది సర్వథా శ్లాఘనీయము. ప్రాచీన చరిత్రలో కళింగ యుద్ధానంతరమున అశోకుడు ఏకపక్షీయమగు నిర్ణయమును తీసికొని యుద్ధమును విడనాడుటను దీనికి ఉదాహరణముగ పేర్కొనవచ్చును. కాని, ఆచరణ దృష్టితో చూచినపుడు ఇది కష్టసాధ్యమే కాక, ప్రయోజనకారిగను కన్పట్టదు. అందువలన రెండవ అర్థముననే ఈ విషయము ఈనాడు ప్రపంచ రాజ్యముల దృష్టిని ఆకర్షింపగలిగినది.

ప్రథమ ప్రపంచయుద్ధమునకు పూర్వముననే కొన్ని రాజ్యములు ఇట్టి నిరాయుధీకరణ (డిజ్ ఆర్మమెంట్) కై కృషి చేసినవి. దక్షిణ అమెరికా గణరాజ్యములు ఒడంబడిక ద్వారా ఇట్టి చర్యను అవలంబించుటకు 19 వ శతాబ్దపు ఉత్తరార్ధమున సముచిత ప్రయత్నములను చేసినవి. అటులనే రెండు రాజ్యముల తమ సరిహద్దులకును, తమ పరస్పర వ్యవహారములకును సంబంధించినంతవరకు దౌర్జన్య ప్రయోగమును నిరసించి, తమ ఉమ్మడి సరిహద్దులను నిస్సైనికములుగ చేయుటయు ఆకాలమున కొంతవరకు పురోగతిని సాధించినది. ఇందులకు లక్ష్యముగ యునైటెడ్ స్టేట్స్, కెనడాలు 1818 లో కుదుర్చుకొనిన ఒడంబడికను గ్రహింపవచ్చును. దాదాపు 4,800 కి. మీ. పొడవున విస్తరించిన ఆ దేశముల ఉమ్మడి సరిహద్దు ఈ ఒడంబడిక మూలమున సేనారహితము చేయబడినది. అదివరలో ఏకరాజ్యముగ ఉండిన నార్వే, స్వీడెన్‌లు 1905 లో విడివడినపుడు కుదుర్చుకొనిన ఒడంబడికయు ఇట్టి ఫలితమునే చేకూర్చినది.

పై విధముగ ఏ కొలది రాజ్యములకో సంబంధించినటుల గాక పెక్కు బలవత్తర రాజ్యములకు సంబంధించిన రీతిగ నిరాయుధీకరణ ఒడంబడికను కుదుర్చుకొనుటకును యత్నములు 19 వ శతాబ్ది అంతమునుండియు మొదలిడబడినవి. 1899 లోను, 1907 లోను జరిగిన హేగ్ సమావేశము [చూ.] లలో ఈ విషయము పలుమారు చర్చింపబడినది. కాని, ఫలితము శూన్యమగుటయేగాక, అంతటనుండి పరస్పర స్పర్ధలతో వివిధ రాజ్యములు తమ తమ ఆయుధ బల సామగ్రులను విరివిగ పెంపుదల చేసి, ప్రథమ ప్రపంచ యుద్ధమునకు దోహదకారులు అయినవి.

ప్రథమ ప్రపంచ యుద్ధానంతరమున నిరాయుధీకరణ సమస్య మరల ప్రముఖ రాజ్యముల దృష్టిని ఆకర్షించినది. యుద్ధానంతర శాంతికి ప్రాతిపదికలుగ అధ్యక్షుడు విల్సన్ సూచించిన పదునాల్గు సూత్రములలో నాలుగవ దాని యందు 'ఏ దేశపు ఆంతరంగిక భద్రతకును భంగము చేకూర్చజాలని రీతిలో సముచితమగు కనిష్ఠస్థాయికి ఆ దేశములు తమ ఆయుధ బలములను తగ్గించి, ఆ అవధులను అతిక్రమించకుండుటకై పరస్పరము హామీలను ఇచ్చి పుచ్చుకొనవలయును' అని పేర్కొనబడినది. నానాజాతి సమితి [చూ. పు. 531] ప్రణాళికయందును నిరాయుధీకరణ కృషికి ప్రముఖ స్థానము కల్పింపబడినది. అందులకై సమితి బహుముఖముల సాగించిన కృషిలో జెనీవాయందు 1932 - 33 లలో జరిగిన నిరాయుధీకరణ సమావేశములు ప్రముఖములు. ఆ సమావేశములందు యునైటెడ్ స్టేట్స్, సోవియట్ రష్యాలతో సహా ప్రపంచరాజ్యములు అరువది పాల్గొనినవి. కాని, ప్రముఖ రాజ్యముల విభిన్న దృక్పథముల వలనను, ముఖ్యముగ ఫ్రాన్స్ - జర్మనీల వైరుధ్యము వలనను ఆ సమావేశములు పురోగతిని సాధింపలేక పోయినవి. కడకు 1933 లో జరిగిన సమావేశమునుండి జర్మనీ వైదొలగుటతో నిరాయుధీకరణను గురించిన చర్చకు అవకాశమే మృగ్యమైనది. ఆ నిరాశావహ పరిస్థితియే తుదకు ద్వితీయ ప్రపంచ యుద్ధమునకు దారి తీసినది.

ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున, ఐక్యరాజ్యసమితి [చూ. పు. 351] ప్రపంచమున శాంతిని సుస్థిరము చేయుటకై నిరాయుధీకరణ విషయమున శ్రద్ధ వహించి కృషి చేయ మొదలిడినది. తొలుదొలుతగ పరమాణుశక్తిసంఘము (అటామిక్ ఎనర్జీ కమీషన్) ను 1946, జనవరిలో సమితి ఏర్పరచి, పరమాణ్వాయుధముల నిర్మాణాదులపై నియమన అధికారమును వహించుటకు తగు ఉపాయములను సూచించవలసినదిగ ఆదేశించినది. కాని, ఆ సంఘమున యునైటెడ్ స్టేట్స్ చేసిన సూచనలు సోవియట్ రష్యాకు నచ్చక పోవుటవలన ఫలితము శూన్యమైనది. ఈ సంఘముతో పాటుగనే సాంప్రదాయిక ఆయుధముల ఉత్పత్తి వినియోగములపై తగు నియమనమును నెలకొల్పు దృష్టితో ఇట్టిదే

వేరొక సంఘమును ఆ కాలమున స్థాపింపబడినది. అంతర్జాతీయ పర్యవేక్షణ ఏర్పడినప్పుడు మాత్రమే ఆయుధముల ఉత్పత్తి వగైరాలలో తగ్గింపునకు తాను అంగీకరింతునని యునైటెడ్‌స్టేట్స్ ఆ సంఘమునకు తెలియజేయగ, అట్టి పర్యవేక్షణకు తాను అంగీకరింపజాలనని సోవియట్ రష్యా పట్టుపట్టినది. తత్ఫలితముగ పై ఉభయ సంఘములు మూడు ఏండ్లు కృషి చేసియు ఏ ఫలితమును సాధింపజాలక పోయినవి. కడకు 1952 లో ఈ ఉభయ సంఘములును ఏక సంఘముగ కలపబడి నిరాయుధీకరణ సంఘము (డిజ్ ఆర్మమెంట్ కమీషన్) అను పేరున రూపొందినవి. ఈ సంఘమున భద్రతాసమితి సభ్యులును, కెనడా ప్రతినిధియు మాత్రమే సభ్యత్వములను కలిగి ఉండిరి. స్టాలిన్ మరణానంతరమున 1954 లో సోవియట్ రష్యా వైఖరిలో కొంత మార్పు కలిగినటుల ఆశలు కలిగిన ఫలితముగ, ఈ సంఘపు కృషిని తీవ్రతరము చేయు తలంపుతో దీనికి అనుబంధముగ వేరొక ఉపసంఘము యునైటెడ్ స్టేట్స్, సోవియట్ రష్యా, బ్రిటన్, ఫ్రాన్స్, కెనడా దేశముల సభ్యత్వముతో నియమింపబడినది. ఈ ఉపసంఘమున జరిగిన చర్చలవలన కడకు ఈ రాజ్యములు అన్నియు ఏకగ్రీవముగ తమ ధ్యేయవిషయములను గురించిన ఒక సమగ్ర తీర్మానమును చేసినవి. ఆయుధముల వ్యయమునకు నిలువరింపు కలుగజేయుట, దురాక్రమణను ప్రతిఘటించునపుడుగాక తక్కిన పరిస్థితులలో పరమాణ్వాయుధముల ఉపయోగమును నిషేధించుట, పరమాణ్వాయుధముల నిర్మాణమును నిషేధించుట, సేనల సంఖ్యాబలమును తగ్గించుట, ఈ విషయములను గురించి జరిగిన ఒడంబడికల అమలును సరిచూచుటకు ఒక పర్యవేక్షక యంత్రాంగమును నెలకొల్పుట అనునవి ఈ తీర్మానమున సూచింపబడిన ధ్యేయవిషయములు. ఈ తీర్మానమును ఐక్యరాజ్యసమితికి సంబంధించిన సాధారణ సభయు 1954, నవంబరులో ధ్రువీకరించినది. ఇటుల ధ్యేయ విషయములపై ఒక అంగీకారము కుదిరినను, ఈ ధ్యేయ విషయముల సాధనకు మార్గములను మాత్రము ఉపసంఘ సభ్యులు నిర్ణయింపలేకపోయిరి. ఆ మార్గములను గూర్చి చర్చించుటకై 1955, నవంబరులో జరిగిన ఉపసంఘ రాజ్యముల విదేశాంగమంత్రుల సమావేశము ఏ ఫలితమును సాధింపజాలకపోయినది. కడకు 1956 లో హంగేరీ, సూయజ్ కాలువ ప్రాంతములందలి సంఘటనలచేత ప్రపంచ రాజకీయ వాతావరణము కలుషితము అగుటవలన నిరాయుధీకరణను గురించిన చర్చ వెనుకంజ వైచినది.

అంతట 1957, నవంబరులో ఐక్యరాజ్యసమితి సాధారణ సభ ఈ విషయమును చర్చించి, నిరాయుధీకరణ సంఘమున మరికొన్ని రాజ్యముల ప్రతినిధులను చేర్చి విస్తృతీకరించుటకు సంకల్పించినది. అందువలన ఆ సంఘమునందలి సభ్య సంఖ్య 11 నుండి 25 కు పెంపుదల అయినది. కాని, సోవియట్ రష్యా ఇందులకు అంగీకరింపక, ఆ సంఘమును విస్తృతీకరింపదలచునెడల ఐక్యరాజ్యసమితిలోని సభ్య రాజ్యములు అన్నియు అందు చేర్చబడవలెనని పట్టుబట్టినది. కడకు 1957 లో సాధారణ సభ ఇందులకు అంగీకరించుచు తీర్మానము చేసినది. కాని, ఇందువలన ఒరిగినది ఏదియు లేదు. పైగా సభ్యసంఖ్య విరివిగ పెరుగుటవలన ఫలరహితములగు వివాదములు చెలరేగినవి. అయినను ఈ సమయముననే ఐక్యరాజ్యసమితితో సంబంధము లేకుండ కొన్ని సంతృప్తికర చర్యలకు అగ్రరాజ్యములు పూనుకొనినవి. పరమాణ్వాయుధ ప్రయోగములకు తాను స్వస్తి చెప్పితినని 1958 వసంతఋతువున తొలుతగ సోవియట్ రష్యా ఏకపక్ష నిర్ణయమును ఒకదానిని ప్రకటించినది. ఆ తరువాత కొలది మాసములకే యునైటెడ్ స్టేట్స్, బ్రిటన్ అట్టి చర్యలను కైకొనినవి. యునైటెడ్ స్టేట్స్, సోవియట్ రష్యా పరస్పర పత్ర వ్యవహారములను జరిపిన ఫలితముగ ఆ ఉభయదేశముల అణుశాస్త్రవేత్తలును 1958, ఆగస్టులో జెనీవాయందు సమావేశమై, పరమాణ్వాయుధ ప్రయోగము ఎచట జరిగినను కనిపెట్టగలుగు శాస్త్రీయ మార్గములను పరిశీలించి తమ నివేదికను ఐక్యరాజ్యసమితికి పంపిరి.

ఇటుల అగ్రరాజ్యములు చొరవ తీసుకొనుటచేత విస్తృతమగు నిరాయుధీకరణ సంఘపు ప్రయోజనము ఏదియు లేకపోవుటవలన వేరొక చిన్న సంఘమును రూపొందించుట సముచితమని ఆ అగ్రరాజ్యములు తలచినవి. అంతట ప్రాచ్య - పాశ్చాత్య రాజ్యవర్గములకు సమాన ప్రతిపత్తి కలిగిన పది రాజ్యములతో నిరాయుధీకరణ సంఘము నిర్మింపబడినది. ఈ సంఘమున ప్రాచ్య (సోవియట్) వర్గమునకు చెందిన బల్గేరియా, జెకోస్లొవాకియా, పోలండ్, రుమేనియా, సోవియట్ రష్యా దేశములును, పాశ్చాత్య వర్గమునకు చెందిన కెనడా, ఫ్రాన్స్, ఇటలీ, బ్రిటన్, యునైటెడ్‌స్టేట్స్ దేశములును సభ్యత్వము కలిగి ఉండుటకు ఏర్పాటు జరిగినది. ఈ ఏర్పాటును 1959 సమావేశమున ఐక్యరాజ్యసమితి సాధారణసభ ఆమోదించినది.

అంతట జరిగిన చర్చల ఫలితముగ కడకు నిరాయుధీకరణ సాధనకు మూలసూత్రములను ఎనిమిదింటిని రూపొందించి సెప్టెంబరు 20, 1961 న యునైటెడ్‌స్టేట్స్‌ను, సోవియట్ రష్యాయు సంయుక్తముగ ప్రకటించినవి. కాని, ఆ తరువాత ఈ మూలసూత్రములకు కార్యరూపమును కలిగించుటలో మాత్రము అవి ఒక అంగీకారమునకు

రాజాలకపోయినవి. అంతట పది రాజ్యముల సంఘమున ఎనిమిదిమంది తటస్థరాజ్యముల ప్రతినిధులను చేర్చుటవలన చర్చలు ఫలప్రదములు కాగలుగునని అగ్రరాజ్యముల సలహాతో ఐక్యరాజ్యసమితి నిర్ణయించినది. తత్ఫలితముగ నిరాయుధీకరణ సంఘమున అదనముగ బ్రెజిల్, బర్మా, ఎతియోపియా, భారతదేశము, మెక్సికో, నైజీరియా, స్వీడెన్, ఈజిప్టుదేశముల ప్రతినిధులు చేరిరి (1962). ఈ తటస్థ రాజ్యములు చర్చలలో ప్రముఖపాత్రను వహించి, అగ్ర రాజ్యముల మధ్య గల అభిప్రాయ భేదములను కొంతవరకు తగ్గింపగలిగినవి. తత్ఫలితముగ పరమాణ్వస్త్ర ప్రయోగ ఆంశిక నిషేధపు సంధి ఒకటి కుదిరి దానిపై యునైటెడ్ స్టేట్స్, సోవియట్ రష్యా, బ్రిటన్ సంతకములను చేసినవి (ఆగస్టు 5, 1963). ప్రపంచమునందలి రాజ్యములలో చీనా, ఫ్రాన్స్ దేశములు తప్ప మిగిలిన రాజ్యములన్నియు దీనిపై సంతకములు చేయుటయో, ఆమోదించుటయో జరిగినది. ఈ సంధివలన భూతల, వాయు మండలములందు పరమాణ్వస్త్ర ప్రయోగములను జరపకుండుటకు అందు సంతకములు చేసిన రాజ్యములు అంగీకరించినవి. నీటియందును, భూగర్భమునందును ప్రయోగములను జరుపుటకు మాత్రము ఈ సంధి వలన అడ్డంకి ఉండదు. ఇందులకు తోడుగ సైనికోద్యోగులు మొదలగువారి తొందరపాటు చర్యల వలన ఉభయ దేశములమధ్య యుద్ధము కలుగు ప్రమాదమును నిషేధించుటకై సోవియట్ రష్యా ప్రభుత్వపు భవనము (క్రెమ్లిన్) నుండి యునైటెడ్ స్టేట్స్ రాజ్య ప్రభుత్వభవనము (వైట్ హౌస్) నకు సరాసరి వార్తా సంబంధము ఎప్పుడును సమాయత్తమై ఉండు రీతిగ ఏర్పరుపబడినది. ఇదియే 'తాజాతార్ (హాట్ లైన్)' అని వ్యవహరింపబడుచున్నది. ఇందువలన ఉభయ ప్రభుత్వాధినేతలును ముఖాముఖిగ విషయములను చర్చింప వీలైనది.

ఆంశికపు ఒప్పందమువలన పరమాణ్వస్త్రముల వ్యాప్తియు, ఆయుధ బలముల విస్తృతియు ఆపబడజాలవని కాలక్రమమున విశదమగుచున్నది. అందువలన తన మనుగడకై సంపూర్ణ, సార్వత్రిక నిరాయుధీకరణను మానవజాతి సాధింపవలసి ఉన్నది. ఈ దృష్టితోడనే 1965, నవంబరు 29 న ఐక్యరాజ్యసమితి సాధారణ సభ ఈ విషయమును చర్చించి, తత్సాధనకై 1967 లోగా ప్రపంచ నిరాయుధీకరణ సమావేశమును జరుపుటకును, అందు ప్రపంచమందలి అన్ని రాజ్యములకును ఐక్యరాజ్యసమితి సభ్యత్వముతో నిమిత్తము లేకుండ ప్రాతినిధ్యము లభింపజేయుటకును నిర్ణయించుచు తీర్మానించినది. చీ. శే. రా.

**నీరో** (క్రీ. శ. 37 - 68) : రోమన్ చక్రవర్తి (క్రీ. శ. 54 - 68 ప.). ఇతని పూర్తి నామము నీరో క్లాడియస్ సీజర్ అగస్టస్ జర్మేనికస్. క్రూరతకు పేరుపొందినవాడు. కాని, చాల పిరికివాడు. ఒక తప్పును మరియొక తప్పుతో సవరించెడివాడు; తల్లిని చంపుటకు కూడ వెనుదీయ లేదు. మొదటి భార్యయైన ఆక్టేవియాను విడిచిపెట్టి తర్వాత ఆమె ప్రాణములు తీయించెను. రెండవ భార్య కూడ ఈతని కోపమునకు గురియై, అసువులను కోల్పోయెను. ఒకస్త్రీ తనను వివాహము చేసికొనుటకు తిరస్కరించినప్పుడు ఆమెను చంపించెను. మరియొక స్త్రీని వివాహమాడుటకు వీలుగా ఆమె భర్తను చంపించెను. ఈతని కాలమున రోమ్‌నగరము తగులబడెను. క్రీ. శ. 64, జూలై 18 వ తేదీన ఆ పట్టణమున ఒక మూల కొన్ని దారు భవనములలో బయలుదేరిన మంటలు పట్టణమంతట క్రమముగ వ్యాపించి, ఆరుదినములవరకు చల్లారక పట్టణమున అధిక భాగమును దగ్ధమొనరించెను. ఇటుల చిచ్చు ముట్టింపజేసినది నీరోచక్రవర్తియే అను నింద ఒకటి సర్వత్ర వ్యాపించుటయేకాక 'రోమ్ తగులబడుచుండ నీరో ఫిడేలు వాయించుచుండెను' అను సామెతకు చోటు ఒసంగెను. కాని, ఈ వాదమును విశ్వసించుటకు ఆధారములు లేవు. అటుల తగులబడిన నగరమును చక్కగ పునర్నిర్మింపజేయుటలో నీరో తగిన శ్రద్ధ వహించుటయేగాక మనోహరమగు ఒక రాజభవనమును తనకై నిర్మింపజేసెను. ఆతని కళావైదగ్ధ్యమునకు ఆ భవనము ఒక నిదర్శనముగ ఉండెను. కాని, కళాభిరుచి మొదలగు ఈ సద్గుణములను అన్నిటిని అతని క్రూరత్వము మరుగుపరిచి వన్నెకెక్కకుండ జేసెను. కడకు అమితమగు పన్నులచేతను, క్రూరత్వము చేతను ప్రజలు అసంతృప్తులై తిరుగబడిరి. నీరో పారిపోయి దాగెను. శిష్టసభ నీరోకు మరణదండన విధించినట్లు తెలియజేయుటకు గుర్రపురౌతు వచ్చినప్పుడు అతని చేతికి చిక్కకుండ నీరో ఆత్మహత్య ఒనర్చుకొనెను. ప్ర. రా.


నీరో
(క్రీ. శ. 37 - 68)

**న్క్రుమా, క్వామీ** (జ. 1909) : ఆఫ్రికా రాజకీయ నాయకుడు; ఘానా అధ్యక్షుడు (1960 - 66); స్వర్ణకారుని పుత్రుడు. మిషనరీ పాఠశాలలోను, యునైటెడ్ స్టేట్స్‌లోని

లింకన్, పెన్సిల్వేనియా యూనివర్సిటీలలోను (1935 - 45), లండన్ స్కూల్ ఆవ్ ఎకనమిక్స్‌లోను ఇతడు విద్యను అభ్యసించెను. లండన్‌లో విద్యార్థిగా ఉన్న సమయముననే ఆఫ్రికా రాజకీయములలో శ్రద్ధ వహించి 'ది న్యూ ఆఫ్రికన్' అను పత్రికను నడపి, రాజకీయ ప్రాముఖ్యమును పొందెను.

ఘూనా (గోల్డ్ కోస్ట్) కు 1947 లో వచ్చి, జె. బి. డాంక్వాచే వ్యవస్థాపితమైన యునైటెడ్ గోల్డ్ కోస్ట్ కన్వెన్షన్ పార్టీకి ప్రధాన కార్యదర్శి అయ్యెను. 1949 లో ఆ పార్టీనుండి వైదొలగి సంపూర్ణ స్వాతంత్ర్యము ధ్యేయముగ కన్వెన్షన్ పీపుల్స్ పార్టీని ఇతడు వ్యవస్థాపించి, పెక్కు సమ్మెలను, ఆందోళనలను నడిపెను. బ్రిటిష్ ప్రభుత్వము రాజద్రోహ నేరముపై ఇతనిని జైలులో నిర్బంధించెను (1950). కాని, 1951 లో జరుపబడిన ఎన్నికలలో ఇతని పార్టీకి అధిక సంఖ్యాక స్థానములు లభించుటచే బ్రిటిష్ ప్రభుత్వము ఇతనిని విడుదలచేసి, క్రమముగ పరిమిత అధికారము గల ప్రధానిగ నియమించినది (1952). ఆ తరువాత ఇతని నాయకత్వమున జరిగిన రాజకీయ ఆందోళనల ఫలితముగ గోల్డ్ కోస్ట్‌కు 1957 లో స్వతంత్రత లభించెను. 1960 లో ఆ దేశము ఘూనా [చూ. పు. 440] అను పేరు మార్పును పొంది గణరాజ్యముగ రూపొందెను. అంతట న్క్రుమా ఆ గణరాజ్యపు అధ్యక్షుడు అయ్యెను.

ఆఫ్రికా రాజ్యములను సమైక్యపరచి 'ఆఫ్రికా సంయుక్త రాష్ట్రములు' అను పేర బలవత్తర రాజ్యమును నిర్మించుట ఇతని ధ్యేయము. ఆ ధ్యేయసాధనకు తొలి సోపానముగ ఘూనాను ఆధునిక రాజ్యముగ ద్రుతగతిలో రూపొందించుటకై అవలంబించిన నిరంకుశ విధానముల వలన పలువురు రాజకీయ నాయకుల విమర్శకు ఇతను లోనైనను, సామాన్య ప్రజానీకమున ఈతనికి కల పలుకుబడి అత్యధికము కావున ఎన్నికలలో ఇతనికి ప్రాబల్యము లభించుచునే ఉండినది. 'ఉద్ధారకుడు' గ ఇతనిని ఘూనా ప్రజలు పేర్కొనుచుండిరి. అంతర్జాతీయ వ్యవహారములలో సచైతన్య తాటస్థ్యనీతిని అవలంబించి యునైటెడ్ స్టేట్స్, సోవియట్ రష్యాల రెండింటి నుండి ఆర్థిక, సాంకేతిక సహాయమును పొందుచు దేశ పురోగతిని ఇతడు శీఘ్రతరము చేసెను. కాని, ఇతడు చీనాను సందర్శింప వెళ్ళినపుడు సైన్యము తిరుగుబాటుచేసి, ఇతనిని పదభ్రష్టుని కావించినది (1966). ఇతని రచనలు: 'ఎడుకేషన్ అండ్ నేషనలిజమ్ ఇన్ వెస్ట్ ఆఫ్రికా (1943)'; 'టువర్డ్స్ కలోనియల్ ఫ్రీడమ్ (1946)'; 'వాట్ ఐ మీన్ బై పోజిటివ్ ఆక్షన్ (1950)'; 'ఘూనా (స్వీయ చరిత్రె 1957)'.

పా. ల. నా.

**నెదర్‌లండ్స్ :** యూరప్ నందలి ఒక ప్రముఖ స్వతంత్ర రాజ్యము. దీనికే హాలండ్ అనియు వ్యవహారము కలదు. ప్రజలు డచ్చి వారని పిలువబడుదురు.




ఈ రాజ్యమునకు నార్త్ (ఉత్తర) సముద్రము [ఉ. ప]; పశ్చిమ జర్మనీ [తూ]; బెల్జియమ్ [ద] సరిహద్దులుగ ఉన్నవి. [వి] 33,612 చ. కి. మీ. కాని, ప్రతి ఏటా సముద్రపు ఒడ్డున మేట దేలిన చిత్తడి భూమిని నివాస యోగ్యముగ చేసి, దేశమునకు కలుపుట వలన నానాట దేశ వైశాల్యము పెరుగుచున్నది. [జ] 1,20,28,808. [భా] జాతీయభాష డచ్చి; [మ] ప్రజలు అందరును క్రైస్తవులు; వీరిలో రోమన్ కేతలిక్‌లు 38·5%. [రా] ఆమ్‌స్టర్‌డామ్ (జ. సం. 8,66,429); పరిపాలనా కేంద్రము హేగ్ నగరము (జ. సం. 6,06,086).

చరిత్ర : రోమన్‌ల కాలములో ఈ దేశమున బెల్జి, బటేవీ, ఫ్రిజె అను మూడు జాతులవారు ఉండెడివారు. షార్లమేన్ [చూ.] కాలమున వీరిలో చాలమంది క్రైస్తవులైరి. షార్లమేన్ సామ్రాజ్యము విడిపోయిన తరువాత నెదర్ లండ్స్‌లోని అనేక నగరములు స్వతంత్రములైనవి. 1477 లో బర్గండీకి చెందిన మేరీ రాణిచే ప్రజలు ఒక హక్కుల పత్రమును పొందిరి. దానికి 'ద గ్రేట్ ప్రివిలీజ్' అని పేరు. అది డచ్చివారికి 'మాగ్నకార్టా' [చూ.] వంటిది. మేరీ తరువాత ఆమె మనుమడు చార్లెస్ - V [చూ. పు. 450] నెదర్ లండ్స్‌కు వారసత్వపుమూలమున ప్రభువయ్యెను. అతని జన్మస్థానము నెదర్ లండ్స్‌లోని

ఫ్లాండర్స్. అందుచే డచ్చివారికి అతని ఎడల అభిమానము ఉన్నను, అతడు మితిమీరి పన్నులు విధించుటచే అసంతృప్తి చెలరేగెను. చార్లెస్-V కుమారుడు ఫిలిప్-II నెదర్‌లండ్స్‌లో ప్రొటెస్టంట్ మతమును రూపుమాపుటకు ప్రయత్నించెను. చివరకు డచ్చివారు అతని పరిపాలననే త్రోసివేసి స్వతంత్రులైరి. ఈ స్వాతంత్ర్య పోరాటమునకు విలియమ్ ద సైలెంట్ నాయకత్వము వహించెను. 1576 లో ఘెంట్ శాంతిసంధి ప్రకారము నెదర్‌లండ్స్ స్వాతంత్ర్యము పొందినను, 1648 లో వెస్ట్‌ఫేలియా సంధి [చూ.] జరుగు వరకును ఆ స్వాతంత్ర్యము లాంఛనయుతముగ గుర్తింప బడలేదు.

విలియమ్-II 1650 లో చనిపోవుటతో జాన్ ద విట్ మండలాధిపతి (స్టాడ్‌హోల్డర్) అయ్యెను. అతని కాలమున నెదర్‌లండ్స్ బ్రిటన్‌తో రెండు నౌకా యుద్ధములు చేసెను. మొదటి యుద్ధము 1652 లో క్రామ్‌వెల్ పార్లమెంట్ బ్రిటన్‌నందు అధికారమున ఉన్నపుడు జరిగినది. రెండవది 1665 లో చార్లెస్-II తో జరిగినది. 1672 లో ఫ్రెంచిరాజు లూయీ-XIV నెదర్‌లండ్స్‌ను ముట్టడించెను. అనేక నగరములు అతని స్వాధీనము అయ్యెను. శత్రువులను ఇబ్బందిలో ఇడు తలంపుతో ఆరంజి వంశస్థుడగు విలియమ్ రాకొమారుని సలహాపై దేశీయులు సముద్రమునకు అడ్డముగ కట్టిన గోడలు పడగొట్టి, నీటిని దేశములోనికి వదలి పెట్టిరి. అందువలన ఫ్రెంచి సైన్యములు వెనుకకు మరలక తప్పని పరిస్థితి ఏర్పడెను. విలియమ్ రాకొమారుడు విలియమ్-III అను పేర ఇంగ్లండు రాజయిన తరువాత అతడు ఫ్రాన్స్‌తో చాల కాలము పోరాడెను.

నెదర్‌లండ్స్ విదేశ వ్యాపారము 17 వ శతాబ్దమున చాల అభివృద్ధి పొందెను. డచ్చి ఈస్ట్ ఇండీస్ కంపెనీ, డచ్చి వెస్ట్ ఇండీస్ కంపెనీ అను రెండు వర్తక సంస్థలను నిర్మింపజేసి, వారికి తగు అధికారముల ఒసగి పూర్వ, పశ్చిమార్ధ గోళములందలి డచ్చి వ్యాపారమును క్రమముగ ప్రభుత్వము వారి పరము చేసెను. త్వరలో డచ్చి ఈస్ట్ ఇండియా కంపెనీ పూర్వ దేశములందు పోర్చుగీస్‌ల పలుకుబడిని అంతరింపజేసి, వారినుండి 1641 లో మొలుక్కాను, 1658 లో సింహళమును వశపరచుకొని, డచ్చి వలస సామ్రాజ్యమునకు అంకురార్పణ మొనరించెను. అటులే ఈ కంపెనీ ఆధ్వర్యవమున దక్షిణ ఆఫ్రికా యందలి గుడ్‌హోప్ అగ్రప్రాంతమున డచ్చి వలస స్థాపింపబడెను. 1667 లో సుమత్రాలోని దేశీయ ప్రభువుతో చేసికొనిన ఒడంబడిక మూలమున ఆ దీవి డచ్చివారి రక్షణలోనికి వచ్చెను. ఇంకను భారతదేశమునందును కొన్ని స్థావరములను వారు సంపాదించుకొన గలిగిరి. ఇటులే డచ్చి వెస్ట్ ఇండీస్ వర్తక సంఘము పశ్చిమార్ధ గోళమున పోర్చుగీస్‌లను అడచి, బ్రెజిల్ మొదలగు కొన్ని ప్రాంతములను వశపరచుకొనెను. కాని, ఫ్రెంచి, ఇంగ్లీషు వర్తక సంఘములతో వీరికి పోటీ ఏర్పడి తత్ఫలితముగ జరిగిన యుద్ధములవలన ఈ వలసలయందు పలు మార్పులు జరిగి, తుదకు పూర్వార్ధ గోళమున ఇండోనీషియా ద్వీప సముదాయమును, పశ్చిమార్ధగోళమున సురినామ్ (డచ్చి గయానా), నెదర్‌లండ్స్-ఆంటిలీస్ దీవులును మాత్రమే డచ్చి వర్తక సంఘములకు దక్కినవి.

ఫ్రెంచి విప్లవకారులు 1795 లో ఆమ్‌స్టర్‌డామ్ నగరమును స్వాధీనము చేసికొనిరి. తత్ఫలితముగ నెదర్‌లండ్స్ చీలిపోయెను. ఒక భాగమున బటేవియన్ ప్రజాసత్తాక ప్రభుత్వము అనునది ఆనాడు ఏర్పడెను. కాని, నెపోలియన్ పతనానంతరమున కొన్ని మార్పులు జరిగి నేటి నెదర్‌లండ్స్ రూపొందెను. వియెన్నా కాంగ్రెస్ [చూ.] లో దేశముల క్రొత్త సరిహద్దులను నిర్ణయించినపుడు ఆస్ట్రియన్ నెదర్‌లండ్స్‌ను, లక్జెంబర్గ్‌ను కూడ ఈ దేశములో కలిపిరి. కాని, 1830 లో ఆస్ట్రియన్ నెదర్‌లండ్స్ తిరగబడి, బెల్జియమ్ అను పేరుతో ప్రత్యేక రాజ్యముగ ఏర్పడెను. 1867 లో లక్జెంబర్గ్ వేరుపడి స్వతంత్రరాజ్యము అయ్యెను. 19 వ శతాబ్ది ప్రథమ పాదముననే విదేశవర్తకము ద్వారా వలసలను ఆర్జించిన డచ్చి వర్తక సంస్థలు రెండును ఆర్థికముగ క్షీణస్థితిని పొందుటచే ఆ వలసలపై ప్రత్యక్షాధికారమును డచ్చి దేశపు ప్రభుత్వము గ్రహించెను.

ప్రథమ ప్రపంచ యుద్ధపు కాలమున నెదర్‌లండ్స్ తటస్థముగ ఉండగలిగెను. కాని, ద్వితీయ ప్రపంచ యుద్ధమున 1940, మే నెలలో నాజీసైన్యములు ఈ దేశమును ఆక్రమించెను. అంతట దేశమును పాలించుచుండిన విల్‌హెల్మినా రాణి ఇంగ్లండునకు ఏగి లండనునందు ప్రవాస ప్రభుత్వమును నెలకొల్పెను. డచ్చి సామ్రాజ్యమునకు చెందిన ఇండోనీషియా ద్వీపరాజ్యమును జపాన్ సేనలు 1942 లో ఆక్రమించెను.

ద్వితీయ ప్రపంచ యుద్ధమున నాజీసేనలు పరాజితములైన తరువాత నెదర్‌లండ్స్ మరల స్వతంత్ర రాజ్యము అయ్యెను (మే, 1945). 1949 లో విల్‌హెల్మినా రాణి రాజ్యపరిత్యాగము చేసి, తన కుమార్తె జూలియానాకు రాజ్యము ఒసగెను.

జపాన్ పతనానంతరము ఇండోనీషియా ద్వీప రాజ్యమున తన వలస పరిపాలనను తిరిగి స్థాపించుటకు డచ్చి

ప్రభుత్వము ప్రయత్నించినది. కాని, తుదకు ఇండోనీషియా ప్రజల ప్రతిఘటనకును, ప్రపంచాభిప్రాయమునకును లొంగి 1949 లో ఆ రాజ్యమునకు స్వాతంత్ర్యము ఒసగక తప్పినది కాదు [చూ. ఇండోనీషియా పు. 312]. ప్రస్తుతము డచ్చి ప్రభుత్వపు వలస పాలనమున సురినామ్ (డచ్చి గయానా), నెదర్లండ్స్, ఆంటిలీస్ మాత్రము మిగిలి ఉన్నవి.

రాజ్యాంగము : వంశానుగతము, రాజ్యాంగ చట్ట విహితము అగు రాచరికపు పాలన ఈ దేశమున అమలునందు ఉన్నది. ప్రస్తుతము ఆ దేశమును జూలియానా రాణి పాలించుచున్నది. మంత్రివర్గ సహితుడగు పరిపాలకుని యందు కార్యనిర్వహణాధికారము న్యస్తమై ఉన్నది. మంత్రులను రాణి నియమించును. మంత్రులు శాసన సభ్యులుగ ఉండి తీరవలయునను నియమము ఇట లేదు. శాసనసభ (స్టేట్స్ - జనరల్) యందును, రాణియందును సిద్ధాంతరీత్యా శాసననిర్మాణాధికారము న్యస్తమై ఉన్నను, ఆచరణయందు శాసనసభను కాదని రాణి వ్యవహరించుట జరుగదు. శాసనసభలో రాజ్యసభ (ఎస్టేట్స్ కేమెర్), ప్రజాసభ (ట్వీడ్ కేమెర్) అను రెండు కక్ష్యలు కలవు. ఎగువ సభయగు రాజ్య సభయందు 75 మంది సభ్యులు ఉందురు. వీరిని రాష్ట్రసంఘములు నైష్పత్తిక ప్రాతినిధ్య విధిని అనుసరించి ఎన్నుకొనును. ఈ సభకు ఆరేండ్లకు ఒకసారి ఎన్నికలు జరుగును. ప్రజాసభయందు 150 మంది సభ్యులు కలరు. నాలుగేండ్లకు ఒకసారి ప్రజలచే నైష్పత్తిక ప్రాతినిధ్య విధిని అనుసరించి ఈ సభకు సభ్యులు ఎన్నుకొనబడెదరు. చిత్తు చట్టమును గాని, సవరణలను గాని ప్రవేశపెట్టు అధికారము ప్రజాసభకు మాత్రమే కలదు. రాజ్యసభకు అట్టి అధికారము లేదు. దిగువ సభలో ప్రవేశపెట్టబడిన తరువాత ఆ చిత్తుచట్టమును చర్చించి, ఆమోద, తిరస్కారములలో ఏదియో ఒకటి చేయుటకు మాత్రమే రాజ్యసభకు అధికారము కలదు. 23 ఏండ్ల వయసునకు తగ్గని డచ్చి పౌరులకు అందరికి వోటు హక్కు కలదు. 30 ఏండ్ల వయసునకు తగ్గని పౌరుడు మాత్రమే శాసనసభయందు సభ్యత వహింప అర్హుడు.

వి. నా ; చీ. శే. రా.

**నెపోలియన్ - I** (1769 - 1821) : ఫ్రెంచి చక్రవర్తి; మహాశక్తిమంతుడైన సేనాని. ఈ మహావీరుని జీవిత గతి యూరప్ ఖండ చరిత్రగతినే మార్చివేసినది.

నెపోలియన్ 1769, ఆగస్టు 15 న కార్సికాలోని అజాసియో నగరమున జన్మించెను. ఈతని తండ్రి న్యాయవాది. నెపోలియన్ సైనిక విద్యాలయములో చదివి (1784 - 85), సైన్యములో చేరెను.

మొట్టమొదటగా అతని అసమాన ప్రతిభ ప్రకటితమయినది టూలోన్ ముట్టడిలో (డిసెంబరు, 1703). అప్పటికి ఇతనికి 25 ఏండ్లు. ఆ ముట్టడి అనంతరము ఇతడు ఇటలీలో యుద్ధములు నిర్వహించవలసివచ్చెను. అచటి పరిస్థితులు బాగుండక యుద్ధములో ఓడిపోవుటతో ఇతడు సైనిక రహస్యములను శత్రువులకు చేరవేసినవాడని ఆరోపించబడినది. అందరును ఇతనికి వ్యతిరేకముగ ఉన్నను ఆరోపణను బలపరచు సాక్ష్యము లేని కారణమున ఈతడు వదలివేయబడెను. కాని, ఈ విచారణ ఫలితముగ ఈతని సేనానాయకత్వము పోయినది.

నెపోలియన్ పారిస్‌కు వచ్చి తగిన సమయమునకు వేచి ఉండెను. పారిస్‌లో విప్లవ ప్రభుత్వమునకు (కన్వెన్షన్) వ్యతిరేకముగ రాచరికవాదులు పోరాటము ప్రారంభించు సమయమున నెపోలియన్‌కు అవకాశము చిక్కినది. ఒక రాత్రిలో వ్యూహము పన్నుకొని, ఒక్కపరి తుపాకీల కాల్పులతో రాచరిక పక్షమును తరిమికొట్టి విజయమును సాధించెను (అక్టోబరు 4, 1795). రాచరికవాదులు ఆ పోరాటముతో నాశనమైరి. విప్లవ ప్రభుత్వము కూడ పడిపోయి, దాని స్థానే నిర్వాహక సంఘము (డైరెక్టరేట్) ఏర్పడినది.

ఫ్రెంచి సైన్యములకు నాయకుడైన పాల్ బర్రాస్ ఇంటికి నెపోలియన్ ఒకసారి వెళ్లి, అచట జోసఫీన్ అను ఆమెను చూచి ప్రేమించి వివాహమాడెను. వివాహమయిన రెండు రోజులకే నెపోలియన్ ఇటలీలో యుద్ధము చేయుటకు వెడలవలసి వచ్చెను (మార్చి, 1796). ఇటలీ వెళ్లి సైనికులకు ప్రోత్సాహము ఇచ్చి మిలన్‌నగరమును జయించి, ఇంకను అనేక విజయములను అతడు సాధించెను.

ఇటలీలో అనేక విజయములు సాధించి నెపోలియన్ పారిస్‌కు వచ్చెను. కార్యనిర్వాహక సంఘములో నెపోలియన్‌పై క్రమముగ అసూయ ప్రబలుచుండెను. ఇతనిని క్రిందికి దించుటకు ఆలోచనలు ఆరంభమయ్యెను. ఇట్టి పరిస్థితులలో వారు ఫ్రాన్స్‌నుండి ఇతనిని ఈజిప్టుకు బ్రిటిష్ సేనలను ఎదుర్కొనుటకు పంపిరి.

ఈజిప్టులో ఇతడు నెల్సన్ చేతిలో పరాజయము పొందెను (ఆగస్టు, 1798). దానితో ఈతని ప్రణాళికలు దెబ్బతినినవి. సరిగా ఇదే సమయమునకు ఫ్రాన్స్‌లో నిర్వాహకవర్గమువారు ఇతనిపై కుట్రపన్నుచున్నారని నెపోలియన్ తెలిసికొనెను. దానితో ఈజిప్టులో సేనానాయకత్వము వేరొకనికి అప్పగించి, ఇతడు హఠాత్తుగా మధ్యధరాసముద్రమును చిన్న పడవలో దాటి, తనకొరకు వెదకుచున్న బ్రిటిష్ నౌకలను తప్పించుకొని, పారిస్ చేరి

సాహసవంతమైన ఒక చర్యతో కార్యనిర్వాహక వర్గమును రద్దు చేసివేసెను (నవంబరు 9, 1799). తదుపరి నూతన రాజ్యాంగమును ఏర్పరచి ముగ్గురు సభ్యులు గల సలహా సంఘము చేతిలో సర్వాధికారములు ఉంచి, తాను ఆ సంఘములో మొదటి సలహాదారుడు అయ్యెను.

అధికారము చేపట్టినదే తడవుగ ఫ్రాన్స్‌లో దారి డొంక లేని అడవివలె ఉన్న న్యాయశాసనములను క్రోడీకరించి, సమగ్ర న్యాయవిధానమును ఇతడు తయారు చేసెను. దానికే 'కోడ్ నెపోలియన్' అని పేరు. నేటికిని ఫ్రెంచి న్యాయవిధానమునకు పునాది ఈ నెపోలియన్ న్యాయ సూత్రములే. ఈ న్యాయసూత్రములు నెపోలియన్ పరిపాలనా దక్షతను రుజువు ఒనర్చుచున్నవి. కాని, శాంతియుతముగా పరిపాలనను నిర్వహించుచు కాలముగడపుట నెపోలియన్‌కు సాధ్యముకాని పని. ప్రపంచమున ఒక సామ్రాజ్యమును స్థాపించుట అతని ఆశయము. అందులకు తొలి మెట్టుగ 1800 లో ఆస్ట్రియన్ సైన్యములను మరెంగో వద్ద ఓడించి మధ్య యూరప్‌నందు తావు ఆర్జించెను. అంతట 1804, డిసెంబరు 2 వ తేదీన సలహాసంఘమును రద్దుచేసి తానే 'నెపోలియన్ - I' అను బిరుదముతో చక్రవర్తి అయ్యెను. 1807 నాటికి అతడు రష్యా, ఇంగ్లండులు తప్ప మిగిలిన యూరప్‌నందు ఆధిపత్యమును ఆర్జించెను.

నెపోలియన్ తాను జయించిన భూభాగములలో రాజకీయ పరిస్థితి చక్కబరచ పూనుకొనెను. ఆ ప్రయత్నములో ఇతడు యూరప్ రూపమునే మార్చివేసెను. తన సోదరుడైన జోసెఫ్ బోనపార్టీని నేపిల్స్ రాజుగ చేసెను. ఇంకొక సోదరుడైన లూయీని హాలండ్ రాజుగ చేసెను. జర్మనీ,ఇటలీలలోని రాష్ట్రములను చిన్న చిన్న రాజ్యములుగ చేసి తన ఇష్టము వచ్చినవారికి ఏలుకొనుటకు ఇచ్చివేసెను.

తదుపరి నెపోలియన్ రష్యాపై దండయాత్ర చేసి 1807 లో జార్ అలిగ్జాండర్‌తో టిల్సిట్ సంధి చేసికొని, ఇంగ్లండుతో వర్తకము చేయనని రష్యాచే అంగీకరింప చేసెను. ఆ తరువాత స్పెయిన్‌లో చార్లెస్ - IV ను సింహాసన భ్రష్టుని చేసి నేపిల్స్ రాజుగా ఉన్న తన సోదరుని ఆ పదవిలో నియమించి, తన సేనాని మూరట్‌ను నేపిల్స్‌కు పరిపాలకుని చేసెను. ఇట్లు చిత్తము వచ్చినట్లు రాజ్యములతో చెలగాటమాడుట యూరప్ ప్రజలకు కోపకారణము అయ్యెను. ఖండమునందు ఎల్లఎడ నెపోలియన్‌పై అవిశ్వాసము ప్రబలుచుండెను.

ఇంతలో టిల్సిట్ సంధిని రష్యా అమలుజరుపుట లేదని నెపోలియన్ 6,00,000 సైన్యముతో రష్యాపై దండయాత్రకు బయలుదేరెను (1812). రష్యన్‌లు ఇతనిని ఎదుర్కొని పోరాడలేక, ఇతని సైన్యములకు లోబడవలసిన భూభాగమును తగులబెట్టుచు తిరోగమించిరి. మాస్కోవరకును నెపోలియన్ అడ్డులేక పురోగమించెను. రష్యన్‌లు మాస్కోకు కూడ నిప్పుపెట్టి పారిపోయిరి. నెపోలియన్‌కు ముందు అగ్నివలన దగ్ధమగుచున్న నగరము, వెనుక సర్వనాశనమయిన బీడు తప్ప మరేమియు కన్పించలేదు. చలికాలము సమీపించినది. వెనుకకు మరలుట తప్ప అతనికి ఏమియు మార్గాంతరము లేదు. జీవితమున ఎన్నడును ఎరుగని నిరాశతో నెపోలియన్ నిలువలేక వెనుదిరిగెను. శాత్రవ ఖడ్గములకు ఆహుతియై అజేయులును, మహావీరులును ఐన ఈతని సైనికులు అనేకులు మరణించిరి. చివరకు 1,00,000 మంది మాత్రమే బ్రతికి బయటపడిరి. ఈ వార్త శరవేగముతో వ్యాపించి, యూరప్‌లో ఇంగ్లండు, రష్యాల ప్రాబల్యమునకు కారణమయినది.

ప్రష్యా, స్వీడెన్, స్పెయిన్, బ్రిటన్, రష్యాలు ఏకమై నెపోలియన్‌తో యుద్ధమునకు సిద్ధమైనవి (1814). నెపోలియన్ ఎట్లో సైన్యములను సమకూర్చుకొని పోరాడినను, విజయము సాధ్యము కాలేదు. చివరకు ఇక లాభములేదని నిశ్చయించుకొని నెపోలియన్ ఫ్రాన్స్ సింహాసనమును పరిత్యజించెను (ఏప్రిల్ 14, 1814). లూయీ - XVIII ఫ్రాన్స్ చక్రవర్తి అయ్యెను. నెపోలియన్‌ను ఎల్బా అను దీవికి ప్రవాసితుని చేసిరి. కాని, ఒక సంవత్సరమైన తిరుగకముందే ఈ ప్రవాసమునుండి తప్పించుకొని నెపోలియన్ పారిస్ చేరుకొనెను (మార్చి, 1815). అతనిని బంధించుటకు పంపబడిన సైనికులు కూడ అతనితో కలసిపోయిరి. ప్రాత అనుయాయులను కూడదీసికొని వచ్చుచుండిన నెపోలియన్‌ను చూచి లూయీ - XVIII పారిపోయెను.

మరల మిత్ర సైన్యములు అతనిని ఎదిరించి పోరాడినవి. మూడు నెలలలో సైన్యములు కూర్చుకొని, 1518, జూన్ 12 న నెపోలియన్ యుద్ధమునకు వెడలెను. కాని, వారిని జయింపలేక లొంగిపోవలసివచ్చెను (జూలై 15, 1815). మిత్రరాజ్యములవారు నెపోలియన్‌ను ఆఫ్రికా పశ్చిమ తీరమునకు ఆవలగల సెయింట్ హెలీనా ద్వీపములో నిర్బంధితుని ఒనర్చిరి. అచట నెపోలియన్ తన జీవితపు కడపటి దినములు గడపి, 1821, మే 5 న 'కేన్సర్' వ్యాధి వలన మరణించెను.
వి. నా.

**నెపోలియన్ - III** (ఛార్లెస్ లూయీ నెపోలియన్ బోనపార్టీ) (1808-1873): ఫ్రెంచి చక్రవర్తి (1852-70); మొదటి నెపోలియన్ సోదరుడును, హాలండ్ రాజును అగు లూయీ బోనపార్టీ యొక్క కుమారుడు. నెపోలియన్ పతనము (1815) తరువాత తద్వంశీయులతో పాటు ఇతడును

చాలకాలము ప్రవాసమున కాలము గడపెను. ఆనాటి ఫ్రెంచి రాజు లూయీ ఫిలిప్ దుర్బలుడు. ప్రజల సానుభూతి లేనివాడు అగుటచే ఇతడు 1836 లోను, తదుపరి 1840 లోను ఫ్రాన్స్‌లో విప్లవమును లేవదీయ విఫల ప్రయత్నములు చేసి, యావజ్జీవ కారాగారశిక్ష విధింపబడి, 6 సంవత్సరముల పిమ్మట జైలునుండి తప్పించుకొని లండను చేరుకొనెను (1845). 1848 లో విప్లవము మూలమున ఫ్రెంచి రాజరికము రద్దుచేయబడి, ద్వితీయ గణరాజ్యము నెలకొల్పబడిన తరువాత ఈయన ఐతిహాసికమైన మొదటి నెపోలియన్ విలక్షణ వ్యక్తిత్వ ప్రభావమువలన జాతీయ మహాసభకు సభ్యుడుగను, తదుపరి అధ్యక్షుడుగను ఎన్నుకొనబడెను. 1851, డిసెంబరులో లూయీ నెపోలియన్ అకస్మాత్తుగ సైన్యమును వశపరచుకొని, సర్వాధికారములను చేపట్టి, సంవత్సరానంతరమున చక్రవర్తియై ద్వితీయ సామ్రాజ్యమును స్థాపించెను. క్రిమియా యుద్ధములో ఇతడు ఇంగ్లండు పక్షమున చేరి, తరువాత పది సంవత్సరములపాటు యూరప్ రాజకీయములలో తగవరిగ వ్యవహరించెను. పిల్ల నెపోలియన్ అని ఇతడు పేర్కొనబడెను. యునైటెడ్ స్టేట్స్ అంతర్యుద్ధముతో సతమతము అగుచున్న సమయమున రాజ్యవిస్తరణ కాంక్షతో ఇతడు మెక్సికోపై దండయాత్ర చేసి, ఆస్ట్రియా ప్రభువు మాక్సిమిలియన్[చూ.]ను అచట రాజుగా చేయ ప్రయత్నించెను. కాని, అంతఃకలహములు ముగిసి, మన్రోసిద్ధాంతము [చూ.]ను పురస్కరించుకుని యునైటెడ్ స్టేట్స్ రణరంగములోనికి దిగుటతో ఇతడు వెనుకంజ వేసెను. 1866 లో జరిగిన ప్రష్యా, ఆస్ట్రియా యుద్ధకాలమున ఇతడు బిస్మార్క్ రాజకీయ తంత్రములో చిక్కుకొని, ఆస్ట్రియాకు సహాయపడుట మాని, తద్ద్వారా కొంత లాభము గడింపజూచెను. మరల బిస్మార్క్ పన్నుగడకు లోనై ఇతడు 1870 లో ప్రష్యాపై యుద్ధము ప్రకటించి, సేడన్ వద్ద శత్రువులకు చిక్కి, జర్మనీలో నిర్బంధింపబడెను [చూ. ఫ్రాంకో - ప్రష్యన్ యుద్ధము]. 1871 సంధిప్రకారము ఇతడు బంధవిముక్తి చెంది ఇంగ్లండుకు పోయి, అచ్చటనే తనువు చాలించెను. ఆ. వెం.

నెల్సన్, హొరేషియో వైకౌంట్ (1758 - 1805) : ప్రఖ్యాతి వహించిన బ్రిటిష్ నౌకాధ్యక్షుడు. ట్రఫాల్గర్ యుద్ధమున (అక్టోబర్ 21, 1805) నెపోలియన్ నౌకాదళమును ఓడించిన వీరుడు.

ఇతడు నార్‌ఫోక్‌లో 1758, సెప్టెంబరు 29 న జన్మించెను. ఇతడు చిన్నతనమునుండియు సముద్రము అనిన ప్రీతి కలిగి ఉండి, తాను నావికుడు కావలెననుకొనుచుండువాడు. 15 వ ఏట నౌకాదళములో చేరి 'లెఫ్టినెంట్' అయి, 21 ఏండ్లు నిండక మునుపే ఒక నౌకకు నాయకుడైనాడు.

నెపోలియన్‌ను ఎదిరించిన బ్రిటిష్ నౌకాదళమునకు నాయకత్వము వహించి, ఇతడు 1794 లో కార్సికాను ముట్టడించిన సమయమున గుండుదెబ్బ తగిలి ఇతని కుడి కన్నుపోయినది. 1797 లో సెయింట్ విన్‌సెంట్ వద్ద జరిగిన యుద్ధములో సర్ జాన్ జెర్విస్ నాయకత్వమున ఈతడు పోరాడి ఫ్రెంచి, స్పానిష్ సైన్యములను ఓడించెను. అప్పుడు ఇతనికి వీరబిరుదము ఈయబడినది. 1797, జూలై లో శాంటాక్రజ్ వద్ద జరిగిన యుద్ధములో ఇతడు గాయపడెను. అందువలన ఇతని కుడిభుజము తీసివేయవలసి వచ్చినది. ఈజిప్టున 1798, ఆగస్టులో నెపోలియన్ యుద్ధమును కొనసాగించుచుండగ నెల్సన్ అతని నెదిరించి ఫ్రెంచి నౌకలను నాశనము చేసెను. దీనితో నెపోలియన్ ప్రణాళికలు అన్నియు భగ్నము అయినవి. ఈ యుద్ధముతో నెల్సన్‌కు చాల ప్రఖ్యాతి వచ్చినది. కాని, ఈ యుద్ధములో మరల గాయపడెను. 1803 లో ఇతడు సర్వ నౌకాదళాధిపతిగా నియమితుడై, 1805, అక్టోబరు 21 న నెపోలియన్‌ను చరిత్రాత్మకమైన ట్రఫాల్గర్ యుద్ధములో ఓడించెను. ఆ యుద్ధములో నెల్సన్‌కు గాయములు తగులగా, అతనిని నౌక క్రింది భాగమునకు కొనివచ్చిరి. యుద్ధములో ఆంగ్లేయులు జయించిరన్న వార్త తెలియువరకు జీవించి ఉండి 'భగవంతుడా, నా విధిని నేను నెరవేర్చితిని' అను మాటలతో వైకౌంట్ హొరేషియో నెల్సన్ కన్నుమూసెను. ఇతని స్మృతి చిహ్నము లండన్‌నగరమందలి ట్రఫాల్గర్ చౌక్‌నందు కలదు. ప్ర. రా.

నెహ్రూ, జవాహర్‌లాల్ (1889 - 1964) : భారత జాతీయ నాయక శిరోమణి, గాంధిమహాత్ముని రాజకీయ వారసుడు, స్వతంత్ర భారత ప్రథమ ప్రధాని (1947 - 1964), సుప్రసిద్ధ జాతీయ నాయకుడు, పండిత మోతీలాల్ నెహ్రూ [చూ.] కుమారుడు. నెహ్రూ అలహాబాదులో జన్మించెను (1889, నవంబరు 14); హారోలోను, కేంబ్రిడ్జ్, ట్రినిటీ కాలేజీలలోను విద్యాభ్యాసము చేసెను; అలహాబాదు హైకోర్టులో న్యాయవాదిగా జీవితయాత్ర ప్రారంభించెను. అఖండత్యాగి, ప్రముఖ కాంగ్రెస్ వాదియు అగు తన



జవహర్‌లాల్ నెహ్రూ

(1889 - 1964)

తండ్రి అడుగుజాడలను అనుసరించి, ఈయన న్యాయవాది వృత్తిని విసర్జించి, కాంగ్రెస్‌లో ప్రవేశించి, మహాత్ముని నాయకత్వముక్రింద స్వాతంత్ర్యోద్యమములో ప్రముఖ పాత్ర నిర్వహించి, తన ప్రజ్ఞాపాటవములవల్లను, త్యాగ నిరతివల్లను మహాత్మునియొక్క, యావద్దేశ ప్రజానీకము యొక్క ఆదరాభిమానములను చూరగొనెను. ఈయన జీవితములో పెక్కేండ్లు కారాగారమునందే కడచినవి. ప్రప్రథమముగా సంపూర్ణ స్వాతంత్ర్యమే తన లక్ష్యము అని తీర్మానించిన లాహోర్ కాంగ్రెస్ (1929) నకు నెహ్రూ అధ్యక్షత వహించెను; తరువాత మరి రెండు పర్యాయములు కాంగ్రెస్ అధ్యక్ష పదవిని అలంకరించెను; కాంగ్రెస్ కార్యవర్గములోను, పార్లమెంటరీ బోర్డులోను మొదటినుండి ప్రముఖ సభ్యుడై, మహాత్ముని కుడిభుజమై, భారత రాజకీయములను తీర్చిదిద్ది ఆసేతుహిమాచలము జేగీయమానుడు అయ్యెను. 1942, ఆగస్టు 'క్విట్ ఇండియా' ఉద్యమములో కడసారి నిర్బంధింపబడి; తదుపరి 1946 లో వేవెల్ స్థాపించిన తాత్కాలిక ప్రభుత్వమునకు నాయకత్వము వహించెను; స్వాతంత్ర్యము సిద్ధించిననాటి (1947, ఆగస్టు 15) నుండి భారత ప్రభుత్వమునకు ప్రధానియై, 1964, మే 27 వరకు అవిచ్ఛిన్నముగ, అప్రతిద్వంద్వముగ, అనన్యసాధారణముగ ఆ పదవిని నిర్వహించెను; ప్రధాన మంత్రిత్వముతో పాటు విదేశాంగ శాఖపై కూడ ఆధిపత్యము వహించెను. నెహ్రూ ఆధ్వర్యవమున భారతదేశము ఏ రాజ్య కూటమునను చేరక తటస్థ విధానమును అనుసరించెను [చూ. ఐక్యరాజ్య యుగము పు. 201]. సోవియట్ రష్యా వంటి ప్రాచ్యరాజ్యములతోను, యునైటెడ్ స్టేట్స్ వంటి పశ్చిమ రాజ్యములతోను సౌహార్దపూర్వక సత్సంబంధములు నెలకొల్పుకొనెను. పంచవర్ష ప్రణాళికలను అమలు జరిపి దేశమును పురోగమింపజేసెను. నెహ్రూ ప్రజాస్వామ్యవాది; స్వాతంత్ర్య ప్రియుడు. ప్రతిపక్షముల ఉనికికి, వాక్స్వాతంత్ర్యమునకు ఎట్టి భంగము కలుగనీయక, ఆయన భారతదేశమును ప్రజాస్వామ్యమునకు మంచిస్థావరముగ తీర్చి దిద్దెను. ఇండోనీషియా, కాంగో వంటి ఆసియా - ఆఫ్రికా వలస రాజ్యముల స్వాతంత్ర్యోద్యమములను నైతికముగ బలపరచి, వాటి దాస్యవిముక్తికి ఎనలేని దోహదము చేసెను. ఉద్రిక్తతను తొలగించుటకు, ప్రపంచ శాంతిని సుస్థిరముచేయుటకు ఆయన చేసిన కృషి సర్వతో శ్లాఘ్యమైనది; కొరియాలోను, లావోస్‌లోను శాంతి ఏర్పడుటకు ఆయన చాల పాటుపడెను [చూ. భారత దేశము]. వక్తగా, రచయితగా నెహ్రూ విశేష ఖ్యాతిని ఆర్జించెను. ఐక్యరాజ్య సమితి సమావేశమునందు, యునైటెడ్ స్టేట్స్ కాంగ్రెస్‌లోను, బాండుంగ్ సమావేశము [చూ.]లోను (1955) మహోపన్యాసములు ఇచ్చెను. నెహ్రూ రచనలలో 'స్వీయ కథ', 'డిస్కవరీ ఆవ్ ఇండియా (1946)', 'గ్లిమ్స్‌సెస్ ఆవ్ వరల్డ్ హిస్టరీ (1936)' చాల ప్రశస్తికెక్కినవి. నెహ్రూ 1916 లో కమలను వివాహమాడెను. ఆయన ఏకైక పుత్రిక ఇందిరాగాంధి [చూ. పు. 316] ప్రప్రథమ మహిళా భారత ప్రధాని అయ్యెను (1966). ఆయన మరణము (1964, మే 27) భారత దేశమునకు తీరనిలోటు. ప్రపంచప్రముఖులు అందరు ముక్తకంఠముతో ఆయనకు జోహారులు అర్పించిరి [చూ. నెహ్రూ, మోతీలాల్].

అ. వెం.

**నెహ్రూ, మోతీలాల్** (1861 - 1931): భారత జాతీయ నాయకుడు; జవాహర్‌లాల్ నెహ్రూకు [చూ.] తండ్రి. అలహాబాదులోని మ్యూర్ కళాశాలలో పర్షియన్, అరబిక్, భారతీయ న్యాయశాస్త్రములను అభ్యసించెను. న్యాయవాదిగ అమితమైన ధనమును ఆర్జించెను. న్యాయశాస్త్రమున మంచి పాండిత్యముకలవాడై, దేశములోని ఉత్తమ న్యాయవాదులలో ఒకడని ప్రఖ్యాతి కాంచెను. 1920 ప్రాంతములలో భారత స్వాతంత్ర్య ఉద్యమములో ప్రవేశించి, 1921, డిసెంబరు 6 న బ్రిటిష్ ప్రభుత్వముచే బంధితుడు అయ్యెను. తదుపరి అనేక పర్యాయములు జైలునకు వెళ్లెను. కారాగృహమున ఉన్నను, స్వేచ్ఛగ ఉన్నను దేశసేవకే తన జీవితము అంతయు వినియోగించిన వాడు. కాంగ్రెస్‌లో మితవాద పక్షావలంబియై శాసనసభా ప్రవేశమును సమర్థించెను.

* * *

**నేపాల్** : ఆసియా యందలి ఒక స్వతంత్ర రాజ్యము.




హిమాలయ సానువులందు నెలకొని ఉన్న ఈ దేశమునకు చీనా రాజ్యమందలి టిబెట్ ప్రాంతము [ఉ]; భారతదేశమందలి పశ్చిమ బెంగాల్ రాష్ట్రము, భారత రక్షిత రాజ్యమగు సిక్కిమ్ [తూ]; భారత దేశపు బీహార్, ఉత్తర ప్రదేశ్ రాష్ట్రములు [ద, ప] సరిహద్దులందు ఉన్నవి. [వి] 1,40,798 చ. కి. మీ.; [జ] 93,87,661. [భా] దేశమున అధికార జాతీయ భాష

నేపాలీ. కాని, వివిధ వర్గములందు మాతృభాషలుగ పెక్కు భాషలు వ్యాప్తిలో ఉన్నవి. వానిలో పహారీ, నేవారీ, తిబెతీ భాషలు ప్రముఖములు. [మ] దేశవాసులలో 85% హిందువులు, బౌద్ధులు 8%. తక్కిన వారిలో ఇస్లామ్ మొదలగు మతములు వ్యాప్తియందు ఉన్నవి. [రా] ఖాట్మండూ (జ. సం. 1,05,247).

చరిత్ర: ఆధునిక యుగమునకు పూర్వపు ఈ దేశ చరిత్రను తెలిసికొనుటకు వంశావళి అను ప్రాచీన గ్రంథము ఒకటి కొంతవరకు ఉపకరించుచున్నది. కాని, ఇందు తొలుతటి అధ్యాయములందు పేర్కొనబడిన విషయములు నమ్మ శక్యములు కాని రీతిగ ఉన్నవి. అయినను 14 వ శతాబ్ది తదుపరి జరిగిన విషయములు మాత్రము చారిత్రక రీతిలో లిఖింపబడి ఉన్నవి. దానిని బట్టి 1384 న హారిసింహ దేవుడు అను ఆర్యావర్తపు యోధుడు ఈ ప్రాంతమును జయించి, సుస్థిర పరిపాలనను నెలకొల్పెనని తెలియవచ్చు చున్నది. ఈతని వంశము అయోధ్యవంశమని పేర్కొన బడినది. ఈ వంశపు నాలుగవ పరిపాలకుని అంతమొందించి, మల్లవంశీయుడగు జయభద్రుడు రాజ్యమును ఆక్రమించెను. ఈ మల్లవంశమున ఏడవ రాజగు జయస్థితమల్లుడు (1386-1429) స్మృతివిహితమగు పాలనను ఇట ప్రవేశపెట్టి, వర్ణ వ్యవస్థను నెలకొల్పెను. ఎనిమిదవ రాజగు యక్షమల్లుని కాలమున ఈ రాజ్యము బణేప, భక్తపుర, కాంతిపుర (ఖాట్మండూ), లలితపుర అను నాలుగు స్వతంత్ర రాజ్యములుగ విభక్తమయ్యెను. కాని, మల్లవంశీయులే ఈ రాజ్యములను 1768 వరకు పాలించిరి. 1768 లో గూర్ఖాలు ఈ దేశమును అంతటిని జయించిరి. గూర్ఖాల తొలి నివాస భూమి ఉత్తర హిందూదేశమున ఉండెడిది. ముస్లిమ్ సేనల ధాటికి అట నిలువ జాలక, వీరు హిమాలయ పర్వత భూములకు చేరి నేటి కుమావ్ జిల్లా ప్రాంతమున తమ నెలవును ఏర్పరచుకొనిరి. అటనుండి క్రమముగ తూర్పునకు తమ అధికారమును వ్యాపింపజేసి, తుదకు 1768 లో తమ రాజగు పృథ్వీనారాయణుని నాయకత్వమున నేపాల్‌ను అంతటిని వశపరచుకొనిరి. శేషించిన మల్లవంశీయులలో ఒకడగు జయప్రకాశ్ (ఖాట్మండూ రాజు) భారతదేశమందలి ఆనాటి బ్రిటిష్ ప్రభుత్వపు సాయము అర్థించగ, వారు ఒక సైనిక దళమును అతనికి సాయము చేయుటకై పంపిరి. కాని, గూర్ఖా సైనికులు ఆ దళమును ఓడించి తిరుగగొట్టిరి. అయినను పృథ్వీనారాయణుని వంశీకుల కాలమున ప్రభువుల అధికారములు అన్నియు రాణాలు అనబడు ప్రధానుల చేజిక్కినవి. రాజులు నామమాత్ర పరిపాలకులైరి. 1790 లో గూర్ఖాలు టిబెట్‌పై దండయాత్ర జరుపగ, టిబెట్‌పై సార్వభౌమత వహించిన చీనా ప్రభుత్వము తన సేనలను పంపి గూర్ఖాలను ఓడించి నేపాల్ లోని నవకోటవరకు తరుముకొని వచ్చెను. అంతట చీనా ప్రభుత్వమునకు నచ్చిన రీతిగ నేపాల్ ఒక సంధి కుదుర్చుకొనినది. భారతదేశమునందలి బ్రిటిష్ ప్రభుత్వము నేపాల్ ప్రభుత్వముతో స్నేహసంబంధములను ఏర్పరచుకొని వర్తక ఒడంబడికలను చేసికొనినది (1791-92). కాని, 1803 నుండి బ్రిటిష్ వారితో నేపాల్ ప్రభుత్వమునకు వైమనస్యము ఏర్పడెను. బ్రిటిష్ వారికి చెందినవని చెప్పబడు కొన్ని ప్రాంతములను నేపాల్ ఆక్రమించుకొనుటయే ఇందులకు ఒక ముఖ్య కారణము. కడకు 1814, నవంబరులో యుద్ధము ప్రకటించి బ్రిటిష్ ప్రభుత్వము నేపాల్‌పైకి తన సేనలను పంపెను. వివిధ ప్రాంతములందు పలుమారు యుద్ధములు జరిగి విజయము పలుమారు చేతులు మారెను. కడకు 1816, మార్చిలో ఇరుపక్షములకును ఒడంబడిక కుదిరి, తత్ఫలితముగ ఇదివరలో 1803 మొదలుగ తాను ఆక్రమించిన ప్రాంతములను నేపాల్ వదలుకొని ఖాట్మండూలో బ్రిటిష్ ప్రభుత్వపు రెసిడెంట్‌ను ఉంచుకొనుటకు అంగీకరించెను. ఆనాటినుండి నేపాల్ ప్రభుత్వము విదేశ వ్యవహారములందు బ్రిటిష్ ప్రభుత్వపు అడుగు జాడలను అనుసరించి నడువ సాగెను. 1857 లో భారతదేశమున సైనికులు విదేశీయ ప్రభుత్వమును ఎదిర్చి స్వాతంత్ర్య సంగ్రామమును సాగించిన దినములలో నేపాల్ ప్రభుత్వము బ్రిటిష్ వారికి అండగ నిలబడి సైనికులను, యుద్ధసామగ్రిని ఒసగి సాయపడెను. ఇందులకు కృతజ్ఞతను వెల్లడించుటకై బ్రిటిష్ ప్రభుత్వము నేపాల్‌నకు సమీపమున ఉన్న కొంత ప్రాంతమును ఆ దేశమునకు దఖలు పరచెను. నాటినుండి భారతదేశమునందలి బ్రిటిష్ సామ్రాజ్య సేనలలోనికి గూర్ఖాలను చేర్చుకొనుట ఒక సంప్రదాయముగ ఏర్పడెను. ఆ సామ్రాజ్య సేనయందు క్రమముగ గూర్ఖా దళముల సంఖ్య 40 వరకు పెరిగెను (స్వతంత్ర భారత ప్రభుత్వము ఈ సంప్రదాయమునకు స్వస్తి చెప్పినను, బ్రిటిష్ ప్రభుత్వము తన సేనలలోనికి ఈనాటికిని గూర్ఖాలను చేర్చుకొనుచున్నది). 1904 లో టిబెట్‌పై బ్రిటిష్‌వారు జరిపిన దండయాత్రలోను, ప్రథమ ప్రపంచ యుద్ధ కాలముననను, 1919 లో ఆఫ్ఘనిస్తాన్‌పై బ్రిటిష్ సామ్రాజ్యపు ప్రభుత్వము సాగించిన దండయాత్రలోను నేపాల్ ప్రభుత్వము ధన, జన, వస్తురూపమున సాయము ఒసంగినది. వీటి అన్నిటికిని ప్రతిఫలముగ డిసెంబరు 21,1923 న బ్రిటిష్ ప్రభుత్వము నేపాల్ ప్రభుత్వముతో ఒక మైత్రి ఒడంబడికను కుదుర్చుకొని నేపాల్‌ను సర్వ స్వతంత్ర మిత్రరాజ్యముగ పరిగణించినది. ద్వితీయ

ప్రపంచ యుద్ధమునను బ్రిటిష్ ప్రభుత్వమునకు నేపాల్ సాయపడెను.

ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున భారతదేశము స్వతంత్రమైనంతటినుండియు స్వాతంత్ర్య భావన నేపాలీ ప్రజలలో వ్యాప్తి చెందెను. రాణాల చేత బందిగనుండి, పేరునకు మాత్రమే పాలకుడుగ ఉండిన త్రిభువన వీర విక్రమ రాజు ప్రజల ఉద్యమమును ప్రోత్సహించెను. రాణాలకు ఇది అసంతృప్తి జనకమయ్యెను. అంతట రాజు భారత దేశ ప్రభుత్వపు ఆశ్రయమును అర్థించ భారతదేశమునకు చేరెను (1950). తత్ఫలితముగ ప్రజోద్యమము బలపడి, రాణాల ప్రభుత్వము పతనమయ్యెను. అంత 1951, ఫిబ్రవరిలో రాజు తన దేశమును చేరి ప్రజాప్రతినిధులతో ఒక మంత్రివర్గమును నియమించెను. తరువాత ఆ ప్రతినిధుల మధ్య ఏర్పడిన కలతలవలన ఈ మంత్రివర్గమును చాల పర్యాయములు మార్చవలసి వచ్చెను. 1956 లో త్రిభువన విక్రమ రాజు గతించి, అతని కుమారుడు మహేంద్ర వీర విక్రమ సహదేవుడు రాజయ్యెను. ఇతడును ప్రజలకు ప్రభుత్వమును వశపరచుటకు తన తండ్రి కావించిన నిర్ణయమును కొనసాగించుటకే తొలుత కృషిచేసెను. 1959, ఏప్రిల్ లో తొలిసారిగ ఎన్నికలు జరిగి, శాసనసభలు ఏర్పడెను. విశ్వేశ్వరప్రసాద్ కొయిలారా ప్రధాని అయ్యెను. తాటస్థ్య వైదేశిక నీతిని అవలంబించి నేపాల్ న శ్రేయోరాజ్యమునకు తగు ప్రాతిపదిక ఏర్పరచుటకు ఈ ప్రధాని కృషి చేసెను. ఇంతలో 1960, డిసెంబరులో అకస్మాత్తుగ మహేంద్రరాజు మంత్రివర్గమును రద్దొనర్చి, కొయిరాలాను, అతని సహచరులను ఖైదునందుంచి, రాజ్యాంగచట్టమును రద్దొనర్చి సర్వాధికారములను తానే వహించెను. ప్రజాస్వామ్య వాదులు అంతట మారుమూల ప్రదేశములందుండి ప్రభుత్వసేనలతో పోరాటములు సాగించిరి. వీరికి భారతదేశీయుల సహాయము కలదని మహేంద్రరాజు భావించుటచే, భారత - నేపాల్ ప్రభుత్వములకు వైమనస్యములు పొడమినవి. కాని, 1963 లో భారత దేశీయాంగ మంత్రి నేపాల్ నకేగి రాజుతో చర్చించి వచ్చిన తరువాత ఇవి చాలవరకు సమసినవి.

నేపాల్ నకు తగిన ప్రాతిపదిక స్వయంపరిపాలన (బేసిక్ డెమోక్రసీ) ను రూపొందిచుటయే తన ఆశయమని మహేంద్రరాజు పలుమారు ప్రకటించెను. అందులకు తొలి మెట్టుగ స్థానిక సంస్థలకు ఎన్నికలను జరిపి, వాని నుండి రాష్ట్రీ పంచాయితీని అతడు 1963 లో రూపొందించెను. కాని, అధికారము అంతయు ఈనాడు అతని వశముననే ఉన్నది.

చీనా, భారత, సోవియట్ రష్యా దేశములనుండి ఆర్థిక, సాంకేతిక సహాయమును నేపాల్ గ్రహించి పురోభివృద్ధికై కృషి చేయుచున్నది. చీనాతో 1960 లో సరిహద్దు ఒడంబడికను ఈ దేశము కుదుర్చుకొనగలిగెను.

చీ. శే. రా.

**నైజర్** : పశ్చిమ ఆఫ్రికాయందలి ఒక స్వతంత్ర రాజ్యము.




ఈ రాజ్యమునకు లిబియా, ఫ్రెంచి సహారా [ఉ]; చాడ్ [తూ]; నైజీరియా, దహోమీ [ద]; అప్పర్ వోల్టా, మాలీ [ప] దేశములు సరిహద్దులందు ఉన్నవి. [వి] 12,67,000 చ. కి. మీ.; [జ] 30,40,673. వివిధ ఆఫ్రికన్ జాతుల ప్రజలు ఇందు వసించుచున్నారు. [భా] ఆఫ్రికన్ భాషలు అనేకములు మాతృభాషలుగ వ్యాప్తియందున్నను, సాధికార భాషగ ఫ్రెంచి భాష వాడుకయందు ఉన్నది. [మ] ప్రజలలో దాదాపుగ 80% ముస్లిమ్‌లు, తక్కినవారు ప్రకృతి దేవతారాధకులు. [రా] నియామీ (జ. సం. దాదాపు 40,000).

చరిత్ర: తొలుత ఈ దేశమున నల్లని ఆఫ్రికన్ జాతుల ప్రజలు వసించెడివారు. కాలక్రమమున ఉత్తర, ఈశాన్యములనుండి శ్వేత వర్ణులగు బర్బరులు మొదలగు ఆఫ్రికన్ జాతులవారు ఇట వచ్చి చేరి, అధిక సంఖ్యాకులగు ఆదివాసులపై అధికారమును ఆర్జించిరి. క్రీ. శ. 11, 12 శతాబ్దములలో అరబ్బులు ఈ దేశమును, తత్సన్నిహిత ప్రాంతములను జయించి, అరబ్బీ భాషను, ఇస్లామ్ మతమును ఇట వ్యాప్తికి తెచ్చిరి. అంతటనుండి ఈ అరబ్బీ విజేతలును, వారి పతనానంతరమున వారిని అనుకరించుచు దేశీయులగు ముస్లిమ్ ప్రభువులును తమ తమ కాలములందు విశాల సామ్రాజ్యములను క్రమముగ నిర్మించి పాలించిరి. ఆ కాలమున ఈ రాజ్యమును తమయందు అంతర్భాగముగ జేసికొనిన సామ్రాజ్యములలో హౌసా, బోర్నా సామ్రాజ్యములు ముఖ్యముగ పేర్కొనదగినవి. క్రీ. శ. 1515 లో

పొరుగు సామ్రాజ్యమగు గోషో సామ్రాజ్యపు పాలకుడగు అస్కియా మహమ్మద్ హౌసా సామ్రాజ్యమును అంతమొందించి, ఈ ప్రాంతమును వశపరచుకొనెను. కాని, 17 వ శతాబ్దమునకు హౌసా సామ్రాజ్య పాలకుల వంశీకులు మరల బలమును గడించి ఈ ప్రాంతమును తమ వశము చేసికొనిరి. కాని, ఆ నాడు ఈ దేశము చిన్నచిన్న పాలకుల రాజ్యములుగ విభక్తమై ఒక రాజ్య కూటమిగ వ్యవహరించుచుండెను. 1804 లో ఈ దేశమందలి ఫులానీ తెగవారు ఉస్మాన్ డాన్ ఫుదియో అనువాని నాయకత్వమున తిరుగుబాటుచేసి, ఈ రాజ్య కూటమిని నశింపజేసి, 1810 నాటికి దేశమంతట తమ పాలనను స్థాపించిరి. ఈ కాలముననే యూరప్ వాసులకు ఈ దేశముతో పరిచితి లభించెను. అంతట వివిధాన్వేషకులు ఈ దేశమున పర్యటించి అందలి విషయములను ప్రపంచమునకు తెలియజేసిరి.

ఫ్రెంచివారు ఈ దేశమును వశపరచుకొనుటకై 19 వ శతాబ్ది అంతమున దళములను పంపిరి. దేశీయ పాలకులు ఫ్రెంచి దళములను తీవ్రముగ ప్రతిఘటించి విపరీత నష్టముల పాలు చేసిరి. కాని, 1900 నాటికి ఫ్రెంచివారు ఒక మండలమున తమ ప్రభుత్వమును స్థాపించి, నైజర్ అని పేరిడి అటనుండి తమ ఆధిపత్యమును దేశాంతర్భాగమునకు వ్యాపింపజేయుటకు కృషి సల్పిరి. కాని, ప్రథమ ప్రపంచ యుద్ధకాలమువరకు దేశమందంతట అటనట తిరుగుబాటులు సదా చెలరేగుచు ఉండెడివి. ప్రథమ ప్రపంచ యుద్ధకాలమున జర్మన్ ప్రభుత్వము ఈ దేశీయుల తిరుగుబాటులకు సహాయము చేయుచుండెనని తెలియవచ్చుటచేత బ్రిటిష్ సేనలును ఈ దేశమున దిగి ఫ్రెంచి వారికి సాయపడి, తిరుగుబాటులను నిశ్శేషముగ అడచినవి. కాని, 1922 వరకు దేశమున శాంతి నెలకొనలేదు. ఆ సంవత్సరమున ఫ్రెంచివారు దీనిని పశ్చిమ ఆఫ్రికా సామ్రాజ్యమునకు చేరిన వలస రాజ్యముగ ఏర్పరచి, పరిపాలనను వ్యవస్థీకృతమొనర్చిరి. ద్వితీయ ప్రపంచ యుద్ధమువలన ఈ దేశమున చెప్పదగిన మార్పులు ఏవియు రాలేదు. కాని, ఆ యుద్ధానంతరమున తక్కిన ఆఫ్రికా దేశములందు వలెనే ఇటకూడ స్వాతంత్ర్యోద్యమము విజృంభించినది. ఈ ఉద్యమములను అణచుటకు ఫ్రెంచి వారు ఎంతయో యత్నించి, తుదకు విఫలులై ప్రజా ప్రతినిధులకు సోపానక్రమమున అధికారములను అప్పగించుటకు నిర్ణయించుకొనిరి. తత్ఫలితముగ ప్రజా ప్రతినిధి సంస్థలు వివిధస్థాయిలలో క్రమముగ ఏర్పడెను. తుదకు 1958, సెప్టెంబరులో జరిగిన జనవాక్య సేకరణ ఫలితముగ ఫ్రెంచి కమ్యూనిటీకి చెందిన స్వతంత్ర రాజ్యముగ మనుటకు నైజర్ నిశ్చయించుకొనెను. దీనిని అనుసరించి 1960 నుండి నైజర్ స్వతంత్ర రాజ్యము అయ్యెను.

**రాజ్యాంగము :** ఫ్రెంచి కమ్యూనిటీ [చూ.] సభ్యత్వము వలన చేకూరు బాధ్యతలకు లోబడిన గణతంత్రప్రజాపరిపాలన ఈ దేశమున అమలునందు ఉన్నది. శాసన సభయందు 60 మంది సభ్యులు కలరు. ఈ సభకు ఎన్నికలు 5 ఏండ్లకు ఒకసారి అపరోక్ష సార్వజనిక నియోజన విధానమున జరుగును. అధ్యక్షుని శాసనసభ ఎన్నుకొనును. అధ్యక్షుడు మంత్రి మండలిని నియమించుకొని శాసన సభకు బాధ్యత వహించి పరిపాలన నిర్వహించును. చీ. శే. రా.

**నైజీరియా :** ఆఫ్రికా ఖండ పశ్చిమ తీరమున ఉన్న ఒక స్వతంత్ర రాజ్యము.




ఈ రాజ్యమునకు నైజర్ గణరాజ్యము [ఉ]: కామెరూన్ [తూ]; అట్లాంటిక్ మహా సముద్రము [ద]; దహోమీ గణరాజ్యము [ప] సరిహద్దులందు ఉన్నవి. [వి] 9,23,772 చ. కి. మీ.; [జ] 3,72,13,000. నీగ్రోజాతికి చెందిన పలు తెగలవారు ఇందు వసించుచున్నారు. [భా] ఈ తెగలయందు మాతృభాషలుగ దాదాపు 135 ఆఫ్రికన్ భాషా మాండలికములు వ్యాప్తియందు ఉన్నవి. కాని, ఆంగ్ల భాషయే సాధికార భాషగ వ్యవహారమందు ఉన్నది. [మ] దేశమున ఉత్తర భాగమున ఇస్లామ్, దక్షిణ భాగమున బహుదేవతారాధన వ్యాప్తియందు ఉన్నవి. అయినను విద్యావంతులలో క్రైస్తవ మతమునకు కొంత విస్తృత వ్యాప్తి కలదు. [రా] లాగోస్ (జ. సం. దాదాపు 2,72,000).

**చరిత్ర:** బ్రిటిష్‌వారు ఈ దేశమున అడుగిడుటకు పూర్వము ఈ దేశమున నడచిన చరిత్ర గతిని గురించిన వివరములు ఏవియును క్రమ రీతిలో మనకు తెలియవచ్చుట లేదు. కాని, మధ్య యుగమున ఉత్తర నైజీరియాకు మాత్రము పశ్చిమ ఆఫ్రికాయందు ఆ కాలమున క్రమముగ

వర్థిల్లిన ఘానా, మాలీ, సోంఘాయీ సామ్రాజ్యములతో వ్యాపార సంబంధమగు సాన్నిహిత్యము ఉండెనని రూఢిగ తెలియవచ్చుచున్నది. ఉత్తర ఆఫ్రికా యందలి వివిధ రాజ్యములతో కూడ ఉత్తర నైజీరియా ఆనాడు వ్యాపార సంబంధములను ఏర్పరచుకొనెను. 15 వ శతాబ్ది అంతమున ఇట ఇస్లామ్ మతము సుస్థిర స్థానము ఆర్జించగలిగెను. 19 వ శతాబ్ది ఆరంభమున ఇస్లామ్ మతాభినివేశముతో యుద్ధములను సాగించిన ఫులానీ జాతి వీరుడు ఉస్మాన్ డాన్ ఫుదియో అను నతడు ఈ ప్రాంతముల జయించి తన సామ్రాజ్యమును నెలకొల్పెను. ఆ శతాబ్ది అంతమున బ్రిటిష్‌వారు ఈ దేశమున ఆధిపత్యము ఆర్జించువరకు నామమాత్రముగ ఈ ప్రాంతమున అధికారమును ఫులానీ ప్రభువులే చలాయించుచుండిరి.

ఇక దక్షిణ నైజీరియాను గురించి మధ్య యుగపు విశేషములు కూడ ఏమియు తెలియవచ్చుటలేదు. బానిస వ్యాపారము మూలమున యూరపియన్‌లకు ఈ ప్రాంతముతో తొలుత పరిచయము ఏర్పడినది. అందులకై ఇట తొలుతగ 16 వ శతాబ్దిలో కాలిడినవారు పోర్చుగీస్‌లు. కాని, అనతికాలమున తక్కిన యూరపియన్ జాతుల వారును అటకు చేరి పోటీలువడి బానిసలను చెరబట్టి దూర దేశములకు కొనిపోయి అమ్మి విపరీత లాభములను గడింప సాగిరి. నీగ్రో జనావాసముల పైబడి యువతీ-యువకులను పెక్కురను దౌర్జన్య పూర్వకముగ కొనిపోవుటతో నీగ్రో సాంఘిక జీవితము సర్వనాశనమైనది. మూడువందల సంవత్సరములు ఈ దురాగతము విచ్చలవిడిగ కొనసాగెను. అంతట 1807 లో తొలుతగ ఆంగ్లేయులు బానిస వ్యాపారముపై నిషేధమును ప్రవేశపెట్టి, అటనుండి దానిని ఎవరును ఈ ప్రాంతమున ఉల్లఘించకుండునటుల శ్రద్ధ వహించిరి. అంతేకాక, దేశమున లభ్యములగు కొన్ని ముడిపదార్థములను కొని తమ వ్యాపారమును బ్రిటిష్‌వారు వేరురీతిగ అభివృద్ధిచేసికొనుచు క్రమముగ తమ పలుకుబడిని తూర్పు, దక్షిణ ప్రాంతములందు విస్తరింపజేసి, తత్ఫలితముగ 1885 నాటికి ఆ ప్రాంతములందు అధికారమును వహింపగలిగిరి. 1893 లో ఇంకను కొంత ప్రాంతము వీరి అధీనమునకు వచ్చి, తత్ఫలితముగ ఆ సంవత్సరమున నైజర్ కోస్ట్ రక్షిత ప్రాంతము అను పేర ఒక వలస రాజ్యముగ ఏర్పరుపబడెను.

తక్కిన నైజీరియా ప్రాంతమును బ్రిటిష్‌వారి ఆధిపత్యమునకు కొనివచ్చిన వారిలో ప్రముఖుడు సర్ జార్జి గోల్డీ. ఒక బ్రిటిష్ వర్తక సంస్థకు అధ్యక్షుడగు ఇతడు 1885 నాటికి తక్కిన యూరపియన్ వర్తకులకు అట స్థానము లేకుండ చేయుటకై స్థానికులగు పలు తెగల నాయకులతో బ్రిటిష్ ప్రభుత్వపు పలుకుబడిని గుర్తించు రీతిగ ఒడంబడికల సాధించి, బెర్లిన్ సమావేశము [చూ.] న ఈ విషయమును తక్కిన యూరపియన్ రాజ్యములవారు అంగీకరించునటుల చేయగలిగెను. తరువాత ఈ పరిగణనను ఆధారముగ చేసికొని దండనీతి మూలమున బ్రిటిష్‌వారు తమ ప్రభుత్వమును ఉత్తర నైజీరియాయందంతట 1900 నాటికి వ్యాపింపజేయగలిగిరి.

నైజీరియాయందలి తమ వలస ప్రభుత్వములను బ్రిటిష్‌వారు 1914 లో ఏకమొనర్చి ఒక కేంద్ర ప్రభుత్వమును స్థాపించిరి. కాని, స్థానిక ప్రభుత్వములందు వారు ఎక్కువగ జోక్యము వహింపకుండిరి. ద్వితీయ ప్రపంచ యుద్ధము తరువాత బాధ్యతాయుత ప్రభుత్వమునకై ప్రజలు ఆందోళన చేయుటచే అంతటంతట అదనపు అధికారములను బ్రిటిష్ ప్రభుత్వము ఒసంగెను. కడకు 1 వ అక్టోబరు, 1960 న కామన్‌వెల్త్ [చూ. పు. 382] నందలి సభ్యత్వముతో పాటుగ స్వాతంత్ర్యమును నైజీరియా ఆర్జించినది. 1961 లో ఈ దేశమునకు సరిహద్దునందున్న బ్రిటిష్ కామెరూన్స్ (ఐక్యరాజ్యసమితి ధర్మకర్తృత్వమున ఉన్న రాజ్యము) నందలి ఉత్తరభాగము ఇచ్ఛాపూర్వకముగ ఈ రాజ్యమున చేరి ఇందు అంతర్భాగమయ్యెను.

**రాజ్యాంగము :** సమాఖ్య పద్ధతి ప్రభుత్వము ఇట అమలునందు ఉన్నది. 1958 లో ఈ దేశమునకు రాజ్యాంగము తయారుచేయబడినది. బ్రిటిష్ రాణి నియమించు గవర్నర్-జనరల్ దేశాధిపతిగ వ్యవహరించును. పశ్చిమ, ప్రాచ్య, ఉత్తర ప్రాంతములు, లాగోస్ ఫెడరల్ జిల్లా, కామెరూన్ అను ప్రాంతములు ఈ సమాఖ్యయందలి రాష్ట్రములు. రాష్ట్రస్థాయిలోను, కేంద్రస్థాయిలోను పార్లమెంటరీ ప్రభుత్వములు అమలునందు ఉన్నవి. కేంద్ర శాసనసభ ద్వికక్ష్యకము. దిగువ సభయగు ప్రతినిధులసభయందు 320 మంది సభ్యులు ఉందురు. వీరందరు దేశ ప్రజలవలన ఏకసభ్య నియోజకవర్గములనుండి ఎన్నుకొనబడుదురు. శిష్టసభ (సెనేట్) యందలి 52 మంది సభ్యులను రాష్ట్ర ప్రభుత్వములు నియమించును. వీరు కాక గవర్నర్-జనరల్ నియమించు అదనపు సభ్యులును కొందరు ఇందు ఉందురు. ప్రతినిధుల విశ్వాసము పొందినవానిని గవర్నర్-జనరల్ ప్రధానిగ నియమించును. తక్కిన మంత్రులు ప్రధాని సలహాపై నియమింపబడుదురు. దేశమునకు అంతటికి సంబంధించిన భద్రత, ప్రయాణ సౌకర్యములు, విదేశీ వ్యవహారములు, ఆర్థిక, ప్రణాళికా నిర్వహణలు అనువాని యందు కేంద్రమునకు అధికారము కలదు. విద్య, స్థానిక

ప్రయాణ సౌకర్యములు, వ్యవసాయము, పెక్కు సాంఘిక సేవా కార్యక్రమములు రాష్ట్ర ప్రభుత్వముల అధీనము ననే ఉన్నవి. రాష్ట్రములందలి శాసనసభల విధానము మంత్రివర్గ వ్యవహారము కేంద్ర పద్ధతినే అనుసరించి ఉన్నది. కాని, 1966 లో అప్పటి ప్రభుత్వమును కూల ద్రోసి సైన్యము అధికారమును వశపరచుకొనుటవలన ఈ రాజ్యాంగము తాత్కాలికముగ రద్దు చేయ బడినది.

చీ. శే. రా.

**నైటింగేల్, ఫ్లారెన్స్ (1820 - 1910) :** యుద్ధములో గాయపడిన సైనికులకు వైద్య సాహాయ్యము చేయుటకు తన జీవితమునంతయు అంకితము చేసిన ఆంగ్లేయ సహృదయ. ఈమె ఇటలీలోని ఫ్లారెన్స్ నగరములోజన్మించినది. చదువు పూర్తి అయిన తరువాత రోగులకు పరిచర్య చేయు దాది (నర్సు) వృత్తిని అవలంబించినది. 1851 లో జర్మనీలో శిక్షణ పొందినది. తదుపరి పారిస్‌లో కూడ శిక్షణ పొంది ఇంగ్లండులోని ఒక ఆసుపత్రిలో దాదులపై పర్యవేక్షకురాలుగా ప్రవేశించినది. క్రిమియా యుద్ధసమయమున సైనికులకు ఈమె చేసిన సేవవలన ఈమె ప్రపంచ ప్రసిద్ధిని ఆర్జించినది. రష్యా, టర్కీలమధ్య నల్లసముద్రపు తీర భూముల కొరకై జరిగిన యుద్ధమున 1854 మొదలుగ బ్రిటన్, ఫ్రాన్స్‌లును టర్కీ పక్షము చేరి నల్లసముద్రపు తీర మునందున్న క్రిమియాయందు సాగించిన పోరాటమునకే 'క్రిమియా యుద్ధము' అని చరిత్ర రచయితలచే పేరిడ బడినది. ఈ యుద్ధమున క్షతగాత్రులయిన సైనికులు ప్రాథమిక చికిత్సయైన లేకుండ వేల సంఖ్యలో ఇంగ్లండునకు తరలింపబడు చుండెడివారు. వారికి సేవచేయుటకు ఫ్లారెన్స్ నైటింగేల్ తన సంసిద్ధతను ప్రకటించెను. బ్రిటిష్ యుద్ధ శాఖా కార్యదర్శి ఈమెను ఒక నర్సులదళమునకు నాయకురాలిగ ఉండమని కోరెను. అందులకు అంగీకరించి ఆమె ఎడ్రియాటిక్ సముద్రతీరమున ఉన్న స్కుటరి యందలి ఒక ఆసుపత్రికి తన దళముతో వెడలెను. నాడే 500 మంది బ్రిటిష్ సైనికులు ఆ ఆసుపత్రిలో చేరిరి. వారు పదిదినముల నుండి గాయములతో బాధపడుచుండిరి. కాని, వారికి కట్లుకట్టు నాథుడు లేకపోయెను. ఆసుపత్రిలో కట్లుకట్టుటకు కావలసిన వస్తువులైనను లేకుండెను. ఇంగ్లండు పంపిన వస్తువులన్నియు నౌకలలో ముక్కుచుండెను. వాటిని



ఫ్లారెన్స్ నైటింగేల్
(1820 - 1910)

బయటకు తీయు అధికారము గల కమిటీలోని సభ్యులు కొందరు జబ్బుతో ఉండిరి. మరికొందరు యుద్ధరంగములలో ఉండిరి.

ఇట్టి పరిస్థితులలో నైటింగేల్ ధైర్యము వహించి, కావలసిన పరికరములు ఫ్రాన్స్‌నుండి తెప్పించి, తన దళములోని వారితో క్షతగాత్రుల సేవ ప్రారంభించెను. నిర్విరామముగ కృషిచేసి, మృత్యుముఖమున పడనున్న వారిని మరల ఆరోగ్యవంతులుగ చేసెను. కొద్ది నెలలలో లండన్ నుండి పరికరములు, సామగ్రి కూడ వచ్చి చేరినవి. అనతి కాలముననే నైటింగేల్ ఆ ప్రాంతమందలి సైనిక వైద్యాలయముపై అధికారిణిగ నియమింపబడెను.

ప్రతి రాత్రియు చేత దీపము పట్టుకొని రోగుల మంచముల వరుసల మధ్యనుండి నడచుచు, ఒక్కరొక్కరిని చిరునవ్వుతో పలుకరించి ఆమె ధైర్యము చెప్పుచుండెడిదట. ఇంచుమించు 7 కిలోమీటరుల దూరము మంచముల మధ్య నడిచెడిదట. ఆమె సేవాపరాయణత్వమునకు, సహృదయతకు కృతజ్ఞులైన రోగులు 'జ్యోతిర్ధారిణి (లేడీ విత్ ద లాంప్)' అని ఆమెను పేర్కొనిరి. క్రిమియా యుద్ధము ముగిసి, 1856 లో ఈమె బ్రిటన్‌కు తిరిగి వచ్చినది. ఈమె సేవకు కృతజ్ఞతాసూచకముగ బ్రిటిష్ ప్రజలు 1,50,000 పౌనుల నిధిని సమర్పించిరి. దానిని ఈమె లండన్‌లోని సెయింట్ తామస్ ఆసుపత్రిలో నర్సుల శిక్షణాలయ నిర్మాణమునకు వినియోగించెను. ఆ శిక్షణాలయమునకు ఈమె పేరే పెట్టబడినది.

నాటినుండి ప్రపంచమున సర్వదేశములును నర్సుల శిక్షణలో, సైనిక వైద్య విధానములో ఈమె పద్ధతులే అవలంబించినవి.

ప్ర. రా.

**నైర్రుతి ఆఫ్రికా :** ఆఫ్రికాయందలి ఒక అస్వతంత్ర రాజ్యము.

ఈ రాజ్యమునకు అన్‌గోలా [ఉ]; బెచూనాలాండ్ (బోత్స్వానా). దక్షిణ ఆఫ్రికా [తూ]; దక్షిణ ఆఫ్రికా [ద]; అట్లాంటిక్ మహాసముద్రము [ప] సరిహద్దులందు కలవు. [వి] 8,22,904 చ. కి. మీ.; [జ]; 5,34,000. వీరిలో దాదాపు 30 వేలమంది మాత్రము యూరపియన్‌లు, తక్కినవారు అందరు ఆఫ్రికన్ జాతులవారు. [భా] వివిధ ఆఫ్రికన్ భాషలు మాతృభాషలుగ వాడుకయందు ఉన్నవి. జర్మన్, డచ్చి భాషలకు సన్నిహితమగు ఆఫ్రికాన్స్ రాజకీయ వ్యవహార భాషగ ఉన్నది. [మ] ప్రజలలో ప్రకృత్యారాధకులు ఎక్కువ. క్రైస్తవులు స్వల్ప సంఖ్యలో కలరు. [రా] విండ్‌హోక్ (జ. సం. 36,049).

చరిత్ర : ఈ దేశపు ప్రాచీన చరిత్రను గురించిన వివరములు ఏవియు స్పష్టముగ తెలియవచ్చుట లేదు. పోర్చుగీసు వాడైన డయజ్ అను పాశ్చాత్య సాహసికుడు ఒకడు 15 వ

## నోబెల్ శాంతి బహుమాన గ్రహీతల (1901 - 1965) పట్టిక

| సంవత్సరము | పేరు | జీవిత కాలము | జాతీయత |
|---|---|---|---|
| 1901 | జీన్ హెన్రీ డునాన్ట్ | [1828 - 1910] | స్విజర్లండ్ |
| | ఫ్రెడరిక్ పాస్సీ | [1822 - 1912] | ఫ్రాన్స్ |
| 1902 | ఎలి డూకోమ్మన్ | [1833 - 1906] | స్విజర్లండ్ |
| | చార్లెస్ ఆల్బర్ట్ గోబట్ | [1843 - 1914] | స్విజర్లండ్ |
| 1903 | విలియమ్ రండాల్ క్రెమర్ | [1838 - 1908] | ఇంగ్లండు |
| 1904 | [1] అంతర్జాతీయ న్యాయసంస్థ | [స్థాపితము - 1873] | |
| 1905 | బరోనెస్ బెర్తాఫాన్ సుట్నర్ (స్త్రీ) | [1843 - 1914] | ఆస్ట్రియా |
| 1906 | థియోడోర్ రూజ్వెల్ట్ | [1858 - 1919] | యునైటెడ్ స్టేట్స్ |
| 1907 | ఎర్నెస్టో థియోడోర్ మొనేటా | [1833 - 1918] | ఇటలీ |
| ,, | లూయీ రెనాల్ట్ | [1843 - 1918] | ఫ్రాన్స్ |
| 1908 | క్లాస్ పాంటుస్ అర్నాల్డ్సన్ | [1844 - 1916] | స్వీడన్ |
| ,, | ఫ్రెడ్రిక్ బజర్ | [1837 - 1922] | డెన్మార్క్ |
| 1909 | పి. ఎస్ట్యూర్నెల్లెస్ కన్స్టన్ డి రెబెకే | [1852 - 1924] | ఫ్రాన్స్ |
| ,, | ఆగస్టె బీర్నర్ట్ | [1829 - 1912] | బెల్జియమ్ |
| 1910 | [2] అంతర్జాతీయ శాంతి సంస్థ | [స్థాపితము - 1891] | |
| 1911 | టోబియస్ అస్సర్ | [1838 - 1913] | నెదర్లండ్స్ |
| ,, | ఆల్ఫ్రెడ్ ఫ్రయిడ్ | [1864 - 1921] | ఆస్ట్రియా |
| 1912 | ఎలిహూ రూట్ | [1845 - 1937] | యునైటెడ్ స్టేట్స్ |
| 1913 | హెన్రీ లా ఫాన్టెన్ | [1854 - 1943] | బెల్జియమ్ |
| 1917 | [3] అంతర్జాతీయ రెడ్క్రాస్ సంఘము | [స్థాపితము - 1863] | |
| 1919 | వుడ్రో విల్సన్ | [1856 - 1924] | యునైటెడ్ స్టేట్స్ |
| 1920 | లియోన్ బూర్జువా | [1851 - 1925] | ఫ్రాన్స్ |
| 1921 | కార్ల్ జల్మర్ బ్రాంటింగ్ | [1860 - 1925] | స్వీడన్ |
| ,, | క్రిస్టియన్ లూయీ లాంగ్ | [1869 - 1938] | నార్వే |
| 1922 | ఫ్రిట్జోఫ్ నాన్సెన్ | [1861 - 1930] | నార్వే |
| 1925 | సర్ జోసెఫ్ ఆస్టిన్ చాంబర్లిన్ | [1863 - 1937] | ఇంగ్లండు |
| 1925 | చార్లెస్ గేట్స్ డాస్ | [1865 - 1951] | యునైటెడ్ స్టేట్స్ |
| 1926 | అరిస్టయిడ్ బ్రియండ్ | [1862 - 1932] | ఫ్రాన్స్ |
| ,, | గస్టావ్ స్ట్రెసేమన్ | [1878 - 1929] | జర్మనీ |
| 1927 | ఫెర్డినాండ్ బుసన్ | [1841 - 1932] | ఫ్రాన్స్ |

(1) ఇనిస్టిట్యూట్ ఆవ్ ఇంటర్నేషనల్ లా.; (2) ఇంటర్నేషనల్ పీస్ బ్యూరో; (3) ఇంటర్నేషనల్ రెడ్క్రాస్ సొసైటీ.
1914 - 1916, 1918, 1923 - 1924 సంవత్సరములలో బహుమతి లేదు.

| 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|
| ,, | లుడ్విగ్ క్విడ్ | [1858 - 1941] | జర్మనీ |
| 1929 | ఫ్రాంక్ బి. కెల్లాగ్ | [1856 - 1937] | యునైటెడ్ స్టేట్స్ |
| 1930 | నాథన్ సోడర్బ్లూమ్ | [1866 - 1931] | స్వీడన్ |
| 1931 | జేన్ ఆడమ్స్ | [1860 - 1935] | యునైటెడ్ స్టేట్స్ |
| ,, | నికొలస్ ముర్రే బట్లర్ | [1862 - 1947] | యునైటెడ్ స్టేట్స్ |
| 1933 | నార్మన్ ఏంగెల్ | [జ. 1874 - ] | ఇంగ్లండు |
| 1934 | ఆర్థర్ హెండర్సన్ | [1863 - 1935] | ఇంగ్లండు |
| 1935 | కార్ల్ ఫాన్ ఒసిట్జ్కీ | [1889 - 1938] | జర్మనీ |
| 1936 | కార్లోస్‌సావెద్ర లామాస్ | [జ. 1880 - ] | అర్జెంటీనా |
| 1937 | రాబర్ట్ సెసిల్, వైకౌంట్ సెసిల్ ఆవ్ ఛెల్వుడ్ | [1864 - 1958] | ఇంగ్లండు |
| 1938 | [1] అంతర్జాతీయ శరణార్థి కార్యాలయము | [స్థాపితము - 1921] | |
| 1944 | [2] అంతర్జాతీయ రెడ్క్రాస్ సమితి | [స్థాపితము - 1863] | |
| 1945 | కార్డెల్ హాల్ | [1871 - 1955] | యునైటెడ్ స్టేట్స్ |
| 1946 | ఎమిలీ గ్రీన్‌బాల్క్ (స్త్రీ) | [1867 - 1961] | యునైటెడ్ స్టేట్స్ |
| ,, | జాన్ ఆర్ మాట్ | [1865 - 1955] | యునైటెడ్ స్టేట్స్ |
| 1947 | అమెరికన్ ఫ్రెండ్స్ సర్వీస్ కమిటీ | [స్థాపితము - 1917] | |
| ,, | ఫ్రెండ్స్ సర్వీస్ కౌన్సిల్ | [స్థాపితము - 1927] | |
| 1949 | జాన్ బాయిడ్ ఆర్ | [జ. 1880] | ఇంగ్లండు |
| 1950 | రాల్ఫ్ జాన్సన్ బంచ్ | [జ. 1904] | యునైటెడ్ స్టేట్స్ |
| 1951 | లియోన్ జోహా | [1879 - 1954] | ఫ్రాన్స్ |
| 1952 | ఆల్బర్ట్ ష్విట్జర్ | [జ. 1875] | జర్మనీ |
| 1953 | జార్జి కట్లెట్ మార్షల్ | [1880 - 1959] | యునైటెడ్ స్టేట్స్ |
| 1954 | [3] ఐ.రా.స.శరణార్థి కమీషనర్ కార్యాలయము | | |
| 1957 | లెస్టర్ బోల్స్ పియర్సన్ | [జ. 1897] | కెనడా |
| 1958 | జార్జెస్ హెన్రీ పైర్ | [జ. 1910] | బెల్జియమ్ |
| 1959 | ఫిలిఫ్ జె. నోయెల్ - బేకర్ | [జ. 1889] | ఇంగ్లండు |
| 1960 | ఆల్బర్ట్ లుథూలీ | [1898 - 1967] | ద. ఆఫ్రికా |
| 1961 | డాగ్ హామర్షెల్డ్ | [1905 - 1961] | స్వీడన్ |
| 1963 | ఇంటర్నేషనల్ రెడ్క్రాస్ కమిటీ లీగ్ ఆవ్ రెడ్క్రాస్ సొసైటీస్. | | |
| 1964 | మార్టిన్ లూథర్ కింగ్ | [జ. 1929] | |
| 1965 | ఐ. రా. స. బాలనిధి | | |

(1) నాన్‌సెన్ ఇంటర్నేషనల్ ఆఫీస్ ఫర్ రిఫ్యూజెస్. (2) ఇంటర్నేషనల్ రెడ్క్రాస్ కమిటీ. (3) ఆఫీస్ ఆవ్ ది యునైటెడ్ నేషన్స్ హైకమీషర్ ఫర్ రిఫ్యూజెస్. 1928–1932, 1939–1943, 1948, 1955–1956, 1962, 1966 సంవత్సరములలో బహుమతిలేదు.

శతాబ్ది ఉత్తరార్ధమున భారతదేశమునకు సముద్రపు త్రోవ అన్వేషించు యత్నమున ఈ దేశపు తీరమునందు ఒకచోట దిగెను. కాని, ఆ తీరభూమియంతయు ఊషర క్షేత్రముగ ఉండినదని అతడు తెలుపుటచే, తరువాత కొన్ని వందల సంవత్సరముల వరకును పాశ్చాత్యులు ఎవరును, అట దిగ లేదు. 1882 లో జర్మన్ వర్తకుడగు అడాల్ఫ్ లూడరిట్జ్ అనునతడు ఈ దేశమున ఉన్న ఒక రేవు స్థలమును వశపరచుకొని, దానికి తన పేరిడి, అటనుండి దేశమధ్యమునకు పోగి, అచట నివసించు ఆఫ్రికన్ జాతుల నాయకులను వశపరచుకొని, దేశమును జర్మనుప్రభుత్వపు రక్షిత రాజ్యముగ చేసెను. ప్రథమ ప్రపంచ యుద్ధకాలమున 1915 లో దక్షిణ ఆఫ్రికా సేనలు ఈ ప్రాంతమును వశపరచుకొనినవి. ఆ యుద్ధానంతరమున జరిగిన ఏర్పాటులను అనుసరించి నానా జాతిసమితి [చూ.పు. 531] వారిచే ఈ ప్రాంతము మాండేటరీ (ధర్మకర్తృత్వ) రాజ్యముగా దక్షిణ ఆఫ్రికా పరిపాలనలో ఉంచబడెను. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున నానా జాతిసమితి రద్దయి ఐక్యరాజ్యసమితి ఏర్పడిన తరువాత ఆ సమితికి చెందిన ధర్మకర్తృత్వ సంఘపు పరిశీలనలో ఈ రాజ్యము ఉండవలెనని తీర్మానింపబడినను, దక్షిణ ఆఫ్రికా ఆ తీర్మానమును లక్ష్యపెట్టక, ఈ దేశము తన రాజ్యమున అంతర్భాగమే అని మొండిపట్టుదల వహించినది. సామరస్యపూర్వకముగ ఈ వ్యవహారము పరిష్కరింపవలెనని ఐక్యరాజ్యసమితి చేసిన కృషి వ్యర్థమైనది. దక్షిణ ఆఫ్రికాలో వలెనే ఇటను వర్ణవిచక్షణను ప్రవేశపెట్టి, అల్ప సంఖ్యాకులగు శ్వేతజాతుల ఆధిక్యమునే ధ్యేయముగ ఇడుకొని దక్షిణ ఆఫ్రికా ప్రభుత్వము వ్యవహరించు చుండుటచే దేశీయుల పరిస్థితి నానాట దుర్భరము అగు చున్నది. చీ. శే. రా.

**నోబెల్ బహుమానము :** స్వీడెన్ దేశీయుడును, రాసాయనిక శాస్త్రవేత్తయు అగు ఆల్‌ఫ్రెడ్ బెర్నార్డ్ నోబెల్ (1833-1896) తన సంపదయందు విశేష భాగమును ఒక నిధిగ 1896 లో ఏర్పరచి, దాని రాబడినుండి భౌతిక శాస్త్రము, రాసాయనికశాస్త్రము, శారీరకశాస్త్రము (లేదా వైద్యము), సాహిత్యము, శాంతిసాధన అను అయిదు విషయములలో ఒక్కొక్క దానియందు ఆ యా సంవత్సరముల విశ్వవిఖ్యాతిని ఆర్జించినవానికి ఒక్కొక్క బహుమతి చొప్పున బహుమతి ఒసగవలసినదిగా మరణ శాసనము వ్రాసి కీర్తిశేషుడయ్యెను [నోబెల్ జీవిత వివరములకు చూ. సం. 2-పు. 447; సం. 6-పు. 724]. ఈ బహుమతి ప్రదానము 1901 నుండి మొదలిడబడెను. శాంతిసాధనలో ఆ యా సంవత్సరములందు విశ్వవిఖ్యాత కృషిచేసిన వానిని లేదా సంస్థను నిర్ణయించు భారము నార్వీజియన్ పార్లమెంట్ ఎన్నుకొను అయిదుగురు సభ్యులు కల ఒక కమిటీపై ఇడబడినది. 1901 మొదలుగ శాంతిసాధనకు సంబంధిచినంతవరకు ఒక్కొక్క సంవత్సరమున బహుమతి పొందినవారి నామము, జీవితకాలము, జాతీయత 552 పుటలోని పట్టికయందు తెలుపబడినవి. (భౌతికశాస్త్రము మొదలగువానియందు బహుమతులను ఆర్జించినవారి వివరములు ఆ యా శాస్త్రములకు సంబంధించిన సంపుటములందు కననగును) [చూ.పట్టిక]. మ.అ.శ.

**నౌరోజీ, దాదాభాయి (1825 - 1917) :** భారతదేశ రాజకీయ పితామహుడుగ ప్రసిద్ధి పొందిన ప్రముఖ జాతీయ నాయకుడు. 1825, సెప్టెంబరు 4 న నాసిక్‌లో పార్సీ (జరతుష్ట్ర) మతాచార్యుని పుత్రునిగ ఇతడు జన్మించెను.


దాదాభాయి నౌరోజీ
(1825 - 1917)

ఎలిఫిన్‌స్టన్ కాలేజీలో గణితశాస్త్ర ఆచార్యుడుగ (1854)ను, బరోడా సంస్థానమున ప్రధానమంత్రిగ (1874)ను ఇతడు పనిచేసెను. భారత జాతీయ కాంగ్రెస్ వ్యవస్థాపకులలో నౌరోజీ ఒకరు. ఈ సంస్థకు మూడు పర్యాయములు 1886, 1893, 1906 లలో అధ్యక్షుడుగ ఇతడు పనిచేసెను. స్వదేశీ ఉద్యమమును ప్రారంభించినదియు ఈతడే. బ్రిటిష్ పార్లమెంట్‌కు ఎన్నిక అయిన (1892 - 95) ప్రథమ భారతీయుడు. దాదాపు 60 సంవత్సరములు భారతీయ సాంఘిక, రాజకీయ ఉద్యమములలో నిర్విరామ కృషిని సల్పి, జాతిని ఉత్తేజపరచెను. అసంఖ్యాకములయిన ఇతని రచనలలో పెక్కు రచనలు: 'పావర్టీ అండ్ అన్ బ్రిటిష్ రూల్ ఇన్ ఇండియా (1901)' అను గ్రంథమున సంకలనము చేయబడినవి. ఇండియాలో బ్రిటిష్ పాలన మూలముగ భారతదేశపు సిరిసంపదలు లండన్ నగర వీథులలో దొర్లుతున్నవనే భావమును పై గ్రంథమున నౌరోజీ వ్యక్తపరచెను. పా. ల. నా.

**న్యాయశాఖ :** రాజ్యాధికారమున ఒక ముఖ్యమగు విభాగము న్యాయ నిర్వహణాధికారము [చూ. అధికార విభజనము పు. 265]. ఈ అధికారమును నిర్వహించు శాఖనే న్యాయశాఖ అని వ్యవహరింతురు. శాసననిర్మాణాధికారము గల విభాగము రూపొందించిన చట్టములను

అమలునందు కలుగు సమస్యల పరిష్కరించు స్వతంత్ర బాధ్యత ఈ న్యాయశాఖకు కలదు. చక్కగ ఆలోచించి చట్టములను చేసినంత మాత్రముననే రాజ్యము బాగుపడదు. దానిప్రకారము రాజ్యములోని వారు అందరును ప్రవర్తించి నప్పుడే చట్టములకు ఫలితము కలుగును. పౌరులలో ఒకని ప్రవర్తనమును గురించి అది శాసన సమ్మతమా, శాసన విరుద్ధమా అను ప్రశ్న ఉదయించినపుడు దానిని నిష్పక్షపాతముగ పరిష్కరించుటకు అధికారముగలవారు రాజ్యమందున్న గాని శాసన నిర్మాణము సాఫల్యము కాంచదు. అట్టి అధికారము న్యాయశాఖకు కలదు. అట్టి వివాదములను పరిష్కరించుటే న్యాయశాఖ చేయు పని.

భారత రాజ్యాంగమున రాజ్యమునకు అంతకును ఒక ఉన్నత న్యాయస్థానము (సుప్రీమ్ కోర్ట్) ఏర్పరచబడినది. అందు ఒక ప్రధాన న్యాయాధీశుడును, ఏడుగురికి మించని సాధారణ న్యాయాధీశులును ఉండవచ్చును. పార్లమెంట్ ఆవశ్యకమని తోచినపుడు ఈ సంఖ్యను వృద్ధి చేయవచ్చును. న్యాయాధీశులను ఉద్యోగములో నియమించు వాడు రాష్ట్రపతి (అధ్యక్షుడు). ఎవరిని గాని ఇట్టి పదవికి నియమించుటకు పూర్వము రాష్ట్రపతి ఉన్నత న్యాయస్థానము తోను, రాష్ట్రములందలి హైకోర్టులకును చెందిన న్యాయాధీశులతోను సంప్రతించవలెను. హైకోర్ట్ లలో అధమ పక్షము ఐదు సంవత్సరములు న్యాయాధీశులుగ ఉండిన వారు గాని, పది సంవత్సరముల కాలము న్యాయవాదులుగ ఉండిన వారు గాని, న్యాయశాస్త్రమందు పేరు - ప్రఖ్యాతులు సంపాదించినవారు గాని ఈ పదవులకు అర్హులు. ఇట్టి వర్గములలో దేనికైన చెందినవారినే అధ్యక్షుడు ఉన్నత న్యాయస్థాన న్యాయాధీశులుగ నియమించవలెను. అట్టి పదవియందు నియమింపబడినవారు అరువదియైదు సంవత్సరముల వయస్సు పూర్తియగు వరకును ఉద్యోగమందు ఉండవచ్చును. కాని, వారి ప్రవర్తన చక్కగ లేదని గాని, ఉద్యోగము నిర్వహించుటకు వారికి సామర్థ్యము లేదని గాని పార్లమెంట్ లోని సభ్యులలో అధిక సంఖ్యాకులు (2/3 మంది) తీర్మానించి, అట్టి తీర్మానమును అధ్యక్షునికి పంపిన ఎడల వారిని అధ్యక్షుడు ఉద్యోగమునుండి తొలగింపవలెను. న్యాయాధీశుల జీతములను రాజ్యాంగ శాసనమే నిర్ణయించినది. వానిని మార్చుటకు పార్లమెంట్ నకు అధికారములేదు. ఏదైన కారణము చేత న్యాయాధీశులు న్యాయస్థానమందు హాజరు కాలేక, వివాద పరిష్కారమునకు కావలసిన కనీసపు సంఖ్యలో కూడ న్యాయాధీశులు హాజరు కానపుడు ప్రధాన న్యాయాధీశుడు రాష్ట్ర హైకోర్ట్ న్యాయాధీశులను ఆహ్వానించి, వారి తాత్కాలిక సాహాయ్యముతో అభియోగములను పరిష్కరించవచ్చును.

ఉన్నత న్యాయస్థానము కొన్ని వివాదముల విషయమున సాధారణ న్యాయస్థానముగాను, మరికొన్నిటి విషయమున పునర్విజ్ఞాపన (అపీల్) న్యాయస్థానముగాను పనిచేయుచున్నది. వివాదములకు ప్రభుత్వములే వాది, ప్రతివాదులైనపుడు వాని విచారణ ఉన్నత న్యాయ స్థానముననే ప్రారంభము కావలెను. తక్కిన వివాదములలో ఇది పునర్విజ్ఞాపన న్యాయస్థానముగ మాత్రమే పనిచేసి, రాష్ట్రములలోని హైకోర్ట్ ల నుండి వచ్చిన వివాదములపై తీర్పులు చెప్పుచుండును. ఈ వివాదములు రాజ్యాంగ శాసన వ్యాఖ్యానమునకు సంబంధించినవి కాని లేదా సాధారణమగు సివిల్, క్రిమినల్ వ్యవహారములు కాని అయి ఉండవచ్చును.

ఉన్నత న్యాయస్థానమునకు ఉండు అధికారములు అన్నిటిలోను, రాజ్యాంగశాసనమును వ్యాఖ్యానము చేయు అధికారము మిక్కిలి ముఖ్యమైనది. భారత రాజ్యాంగ శాసనము పౌరులకును, అల్పసంఖ్యాక వర్గముల వారికిని సమత్వ స్వాతంత్ర్యములకు సంబంధించిన కొన్ని మౌలికస్వత్వములను కల్పించినది. ఈ హక్కులను నిరోధించు చట్టమును కేంద్ర ప్రభుత్వము గాని, రాష్ట్ర ప్రభుత్వము గాని, మరి ఏ అధికారులు గాని చేయరాదు. ఎప్పుడైనను వారు అట్టి చట్టములను గావించి పౌరుల స్వాతంత్ర్య సమత్వములకు భంగము కలిగించిన ఎడల దానిమూలమున నష్టపడినవారు ఆ చట్టము రాజ్యాంగ శాసనమునకు విరుద్ధమను వాదమును లేవదీసి, ఉన్నత న్యాయస్థానము యొక్క పరిష్కారమును కోరవచ్చును. అట్టి వివాదమును పరిష్కరించు సందర్భమున వివాదాస్పదమైన చట్టము రాజ్యాంగశాసనమునకు విరుద్ధమైనదా, కాదా అను విషయమును ఉన్నత న్యాయస్థానము స్పష్టపరచ వలసి ఉన్నది. ఒక చట్టము రాజ్యాంగ శాసనమునకు విరుద్ధమని న్యాయాధీశులు అభిప్రాయ పడిన ఎడల ఆ చట్టము రద్దయిపోవును. కనుక మౌలిక స్వత్వములను రక్షించుటలో ఉన్నత న్యాయస్థానమునకు అధికారము అప్రతిహతమైనది.

మరియొక సందర్భములో కూడ ఉన్నత న్యాయ స్థానము రాజ్యాంగ శాసనమును వ్యాఖ్యానము చేసి వివాదములను తీర్పవలసిన ఆవశ్యకత ఉన్నది. భారత రాజ్యాంగము ద్వంద్వ విధానమును అనుసరించి ఉన్నది. ఈ విధానములో కొన్ని వ్యవహారములు మాత్రమే కేంద్ర ప్రభుత్వపు అధీనములో ఉన్నవి. మరికొన్ని రాష్ట్ర

ప్రభుత్వపు అధీనమునందు ఉన్నవి. ఒక ప్రభుత్వము రెండవ ప్రభుత్వపు అధీనములో ఉండు వ్యవహారములను గురించి చట్టములను చేయరాదు. కాని, ఒక్కొక్కప్పుడు అట్టి చట్టములు చేయబడినవని వివాదములు సంభవించును. వానిని పరిష్కరించుటలో ఆ చట్టములు రాజ్యాంగ శాసనములకు విరుద్ధములా అను విషయమును ఉన్నత న్యాయస్థానము తేల్చవలసి ఉన్నది. అట్టి సందర్భమున కూడ రాజ్యాంగశాసనమునకు వాఖ్యానము కావించుట ఆవశ్యకమగును.

చట్టములను చేసిన తరువాత అవి రాజ్యాంగ శాసన సమ్మతములా, కావా అను వివాదములను పరిష్కరించుటకు బదులు చట్టము చేయుటకు పూర్వము చట్ట విషయము రాజ్యాంగ శాసన సమ్మతమా, కాదా అని అధ్యక్షుడు ఉన్నత న్యాయస్థానాధీశులను అడుగవచ్చును. అప్పుడు వారు ఆ విషయమును పరీక్షించి, అది శాసన సమ్మతమో, కాదో చెప్పవచ్చును. సమ్మతము కాదని వారు అభిప్రాయ పడిన ఎడల చట్టము చేయుటకై వ్యర్థముగ ప్రయాస పడుటను శాసన సభవారు మానుకొందురు [చూ. న్యాయ శాస్త్ర సంపుటము]. మా. వెం. రం.

**న్యాసాలాండ్ :** చూ. మలావీ.

**న్యూకెలెడోనియా :** ఫ్రెంచి గణరాజ్య ప్రభుత్వపు అధీనమున ఉన్న ఒక ద్వీపరాజ్యము.

పసిఫిక్ మహాసముద్రము నందలి ఈ ద్వీప సముదాయపు [వి] 19,824 చ. కి. మీ.; [జ] 78,000. ఇందు 25,000 మంది యూరపియన్‌లు, 4,500 మంది వియెత్నామ్ వాసులు, 3,300 మంది ఇండోనీషియా వారు కలరు. [రా] నవోమీ (జ.సం.22,238).

చరిత్ర : క్రీ. శ. 1774 లో బ్రిటిష్ నావికుడు జేమ్స్‌కుక్ [చూ పు. 391] చే తొలుతగ ఈ ద్వీపము కనుగొనబడినది. తదాదిగ గంధపుచెక్క వ్యాపారము చేయు పలువురు పాశ్చాత్యులు ఇటకు వచ్చి చేరిరి. క్రమముగ 1843 లో ఫ్రెంచి క్రైస్తవ మత ప్రచారకులు ఇచట స్థిరావాసములు కల్పించుకొనిరి. 1853 లో దీనిని ఫ్రెంచి వారు వశపరచు కొనిరి.

ఫ్రెంచి వారికి చెంది, పసిఫిక్ మహాసముద్రమున అటనట ఉన్న పైన్, వాలిస్ ద్వీపజాలము, లాయల్టీ ద్వీపములు, హూన్ ద్వీపములు, ఫుటూనా, అలాఫ్ దీవుల పరిపాలన న్యూకెలెడోనియా నుండియే జరుపబడుచున్నది. మ. అ. శ.

**న్యూజీలండ్ :** దక్షిణార్ధ గోళమునందలి ఒక ద్వీప రాజ్యము.

పసిఫిక్ మహాసముద్రమునందలి అనేక ద్వీపములు పరిపాలన రీత్యా ఏకీభవించి ఈ రాజ్యముగ రూపొందినవి. ఈ ద్వీపముల [వి] 2,68,676 చ. కి. మీ.; వీనిలో ఉత్తరపు దీవి (1,14,677 చ. కి. మీ.); దక్షిణపు దీవి (1,46,227 చ. కి. మీ.); స్టీవార్ట్ దీవి (1,735 చ. కి. మీ.) అనునవి ప్రముఖములు. ఈ ప్రముఖ ద్వీపములు దక్షిణ అక్షాంశ రేఖ 33° నుండి 63° వరకును, తూర్పు




రేఖాంశ 162° నుండి పశ్చిమ రేఖాంశ 173° వరకును వ్యాపించి ఉన్నవి. ఈ ముఖ్య ద్వీపములు కాక వీనికి కొలది దూరమున అటనట నెలకొనిన చాతమ్ దీవులు, టొకెలా దీవులు, నివీ దీవి కూడ ఈ రాజ్యమున చేరి ఉన్నవి (వీనిలో ఏ ఒక దీవియు వైశాల్యమున 259 చ. కి. మీ. ను మించదు). [జ] 25,53,573; ఇందులో న్యూజీలండ్ దీవులందు అతి ప్రాచీన కాలమునుండియు వసించుచుండిన మవోరి [చూ. సం 10 - పు. 599] సంతతి వారి సంఖ్య 1,37,151; [భా] జాతీయభాష ఇంగ్లీషు; కాని, మవోరీలయందు వారి మాతృభాష అయిన మవోరి వ్యాప్తియందు ఉన్నది. వారికి ప్రాథమిక విద్య వారి మాతృభాషలోనే బోధింప బడుచున్నది. [మ] జనులందరును క్రైస్తవులు; [రా] వెల్లింగ్‌టన్ (జ. సం. 1,38,297).

చరిత్ర : డచ్చి ఈస్ట్ ఇండియా కంపెనీవారి కొలువు నందు ఉండిన ఎబెల్ టాస్మన్ అను నావికుడు 1642 లో ఈ దీవులను కనుగొనునంతవరకు నాగరక ప్రపంచమునకు ఈ దీవుల ఉనికియే తెలియదు. అయినను టాస్మన్ కనుగొనునాటికే ఇచట పాలినీషియన్ [చూ. సం 10 - పు. 501] అనబడు మానవజాతికి చెందిన మవోరీజాతివారు అట నివసించుచుండిరి. ఈ జాతివారి పూర్వీకులు ఆ దీవులకు ఎపుడు తొలుతగ వలసవచ్చిరో స్పష్టముగ తెలియవచ్చుట లేదు. కాని, ఆ తెగలందు నేటికిని అనుశ్రుతముగ ప్రచారమందు ఉన్న గాథలను బట్టి, అటుల వచ్చిన వలసలలో నెల్ల 1350 ప్రాంతమున జరిగిన వలస అతి ముఖ్యమైనదని

మాత్రము తెలియవచ్చుచున్నది. టాస్మన్ తరువాత యూరపియన్ నావికుడు మరియొకడు ఎవడును ఆ దీవుల వైపునకు చాలకాలమువరకు రాలేదు. తుదకు బ్రిటిష్ రాయల్ నౌకాదళమునకు చెందిన కెప్టెన్ కుక్ [చూ.] 1769, 1773, 1774, 1777 లలో ఈ దీవులున్న ప్రాంతముల నెల్ల పరిశోధించి, ఉత్తర, దక్షిణ ద్వీపముల తీర రేఖా పటమును తయారు చేసెను. అంతట 1790 నుండి తిమింగిలముల వేటను వృత్తిగా గ్రహించిన నావికులు కొందరు తీర ప్రాంతములందు వలసలు ఏర్పరచుకొనిరి. 1814 లో ఒక క్రైస్తవ మత ప్రచారకసంఘము అట కాలిడెను. కాని, వ్యవస్థీకృతమగు వలస 1840 నుండి మాత్రమే మొదలిడెను. బ్రిటన్‌నందు స్థాపింపబడిన న్యూజీలండ్ కంపెనీ ఈ వలసను ప్రోత్సహించి, అందులకు తగిన వసతులను సమకూర్చెను. ఇటుల వచ్చిన వారిలో తొలుతటివారు నెలకొల్పిన స్థావరమే వెల్లింగ్‌టన్‌నగరము. అటనుండి క్రమముగ ఈ వలసవచ్చినవారి సంఖ్య ఎక్కువ కాసాగెను. ఆ ద్వీపములందు తొలుతనుండి నివసించుచుండిన మవోరీలు తొలుత కొంత ప్రతిఘటించినను, కడకు విక్టోరియారాణి సార్వభౌమతను అంగీకరించిరి. అయినను ఆంతరంగిక పాలన తమ చేతులలో ఉండవలెనని వారు ఆశించిరి. కాని, అనతికాలముననే మవోరీల భూములను ఆంగ్లేయులు వశపరచుకొన యత్నించినందువలన మవోరీలు బ్రిటిష్ ప్రభుత్వముపై యుద్ధమునకు దిగిరి. 1860 నుండి పది ఏండ్లు ఈ యుద్ధము వివిధ రంగములందు జరిగెను. తుదకు మవోరీలకు పరిపాలనమున కొంత ప్రాతినిధ్యమును కలిగించుటతో ఈ యుద్ధము ముగిసెను. 1861 లో ఈ దేశమున బంగారు గనులు కనుగొనబడినవి. అందువలన అటనుండి కొంత కాలము ఈ దేశమునకు ఆంగ్లేయుల వలస మరింత హెచ్చయ్యెను. దేశమునందలి విశాల క్షేత్రములు వ్యవసాయముకన్న పశుపోషణమునకు ఎక్కువగ ఉపకరించినవి. విద్యుత్‌సహాయమున శీతలీకరణమొనర్చి క్షీర సంబంధ పదార్థములను దూర దేశములకు పంపుటకు విజ్ఞాన శాస్త్రప్రగతి వలన వసతులు ఏర్పడుటచే, దేశము ఆర్థికముగ అభివృద్ధినందినది. 1930 లో వచ్చిన ఆర్థిక మాంద్యము వలన దేశమున కొంత సంక్షోభము కలిగినను, లఘుపరిశ్రమల స్థాపన మూలమున దేశము త్వరలోనే ఆ సంక్షోభము నుండి వెలువడగలిగినది. రెండు ప్రపంచ యుద్ధములందును ఆంగ్ల దేశమునకు అండగ ఈ రాజ్యము నిలబడి, తన అంగబల, అర్థబలముల మూలమున విజయసాధనకు తోడ్పడెను.

బ్రిటిష్ పార్లమెంట్ చేసిన ఒక చట్టమువలన ప్రజా ప్రతినిధుల పాలన తొలుతగ 1852 లో ఈ దేశమున స్థాపింపబడి, 1907 లో ఈ దేశము అధినివేశ ప్రతిపత్తిని ఆర్జించెను. తరువాత ఆ ప్రతిపత్తికి వెస్ట్‌మినిస్టర్ చట్టము కల్పించిన విపులార్థమును అనుసరించి 1947 నుండి ఈ రాజ్యము సర్వస్వతంత్రత కలిగి లాంఛనముగ బ్రిటిష్‌రాజ పరిపాలనకు లోబడి కామన్‌వెల్త్ [చూ. పు - 382] లో సభ్యత్వము వహించి ఉన్నది.

రాజ్యాంగము : వంశానుగతము, శాసనవిహితము అగు రాజరికపు పాలన ఈ దేశమున అమలునందు ఉన్నది. బ్రిటిష్‌రాజ్ఞియే ఈ దేశమునకును పాలకురాలు. ఆమెచే నియమితుడగు గవర్నర్-జనరల్ ఆమెకు ప్రతినిధిగ, ఇచట దేశాధీశుడుగ అయి దేండ్ల కాలము వ్యవహరించును. మంత్రివర్గ సాయమున ఇతడు పరిపాలనను నిర్వహించును. శాసనసభయందు ప్రాబల్యమును ఆర్జించిన వానిని ప్రధానమంత్రిగ గవర్నర్ - జనరల్ నియమించును. ప్రధాని మంత్రివర్గ నియామకమున దేశాధీశునకు సలహా ఒసగును. శాసనసభ ఏకకక్ష్య మాత్రమే కలిగి ప్రతినిధి సభ అని వ్యవహరింపబడుచున్నది. ఇందు 80 మంది సభ్యులు ఉందురు. మూడేండ్లకు ఒకసారి ఈ సభకు ఎన్నికలు జరుగును. ప్రతినిధి సభలో నాలుగు స్థానములు 1867 నుండి మవోరీలకు ప్రత్యేకింపబడినవి. తక్కిన పరిపాలనా విషయములందు బ్రిటిష్ పార్లమెంటరీ సంప్రదాయములు ఈ దేశమున అనుసరింపబడుచున్నవి. ఎన్నికలు సార్వజనిక, వయోజన రహస్య నియోజన విధానమున జరుగును.

దేశమునందు ప్రస్తుతము వ్యాప్తియందు ఉన్న రాజకీయ పక్షములలో నేషనల్ పార్టీ, లేబర్ పార్టీ అనునవి ప్రముఖములు. తొలుతటిది వ్యాపారమున వ్యక్తులకు స్వేచ్ఛను ప్రోత్సహించును. రెండవది ఆర్థికరంగమున ప్రభుత్వపు పలుకుబడిని, అధికారమును ఎక్కువ చేయుట తన విధానముగ నిర్ణయించుకొనినది. 1935 నుండి 49 వరకు లేబర్ పార్టీ అధికారమున ఉండెను. అంతట నేషనల్ పార్టీ అధికారమును వశపరచుకొని 1957 వరకు తన అధీనమున ఉంచుకొన గలిగెను. 1957 లో లేబర్‌పార్టీ అధికారమునకు వచ్చినను, 1960 లో నేషనల్‌పార్టీ మరల అధికారమును వహింపగలిగినది.

చీ. శే. రా.

**న్యూహెబ్రిడిస్ :** పశ్చిమ పసిఫిక్ సముద్రమునందలి ద్వీపరాజ్యము.

బ్రిటిష్, ఫ్రెంచి సమష్టి పాలనయందు ఉన్న ఈ వలస రాజ్యపు [వి] ర. 14,763 చ. కి. మీ.; [జ] 60,374 లో చాల భాగము మలనేషియన్ తెగకు చెందినవారు. మిగిలినవారు వలసవచ్చి స్థిరపడిన విదేశీయులు. [మ] ఈ దేశ వాసులు క్రైస్తవ, క్రైస్తవేతర మతస్థులు. [రా] విలా (ఇఫేట్) (జ. సం. 2,000).

చరిత్ర : 1606 వ సంవత్సరమున పోర్చుగీస్ నావికుడు ఫెర్నాండెస్ డి క్విరో ఈ భూభాగమును కనుగొనెను. 1774 న జేమ్స్‌కుక్ [చూ. పు 391] అను బ్రిటిష్ నావికుడు దీనికి న్యూహెబ్రిడిస్ అని నామకరణముచేసెను. గంధపు చెక్క విశేషముగ ఇట లభించుటవలన 19 వ శతాబ్ది మధ్య కాలమున వర్తక రీత్యా ఈ ప్రాంతమునకు ప్రాముఖ్యము హెచ్చి ఆధిపత్యమునకై బ్రిటన్, ఫ్రాన్సుల మధ్య కలతలు ఏర్పడెను. బ్రిటిష్, ఫ్రెంచి వర్తకుల మధ్య ఏర్పడిన భూ సరిహద్దు తగాదాల పరిష్కారమునకై 1904 లో ఉభయ దేశములు సమష్టిగ కృషిచేసినవి. 1906 లో జరిగిన ఒప్పందము వలన ఈ రాజ్య పరిపాలనా నిర్వహణకు ఒక బ్రిటిష్ కమీషనర్, ఒక ఫ్రెంచి కమీషనర్ నియమితులైరి. ఆ దేశమునందలి బ్రిటిష్, ఫ్రెంచి సంతతుల వారికి సమాన హక్కులు కలుగజేయబడినవి.

నేటికిని, ఈ రాజ్యము ఉభయ దేశముల సమష్టి పరిపాలనకు లోబడి ఉభయ దేశముల కృషివలన బాగుగ అభివృద్ధి చెందుచున్నది. మ. అ. శ.

**పంచశీల :** వేర్వేరు ఆర్థిక వ్యవస్థలు గల దేశముల మధ్య ప్రపంచ శాంతి సంరక్షణకొరకై నెలకొని ఉండవలసిన సంబంధములను నిర్వచించు ఐదు సూత్రములకు ఇది సమష్టి నామముగ వ్యాప్తిలోనికి వచ్చినది.

భారత ప్రధాని టిబెట్‌పై చీనాకు గల సర్వాధిపత్యమును 1954, ఏప్రిల్‌లో గుర్తించుచు చీనా ప్రధానితో చేసికొనిన ఒడంబడిక యొక్క పీఠికలో ఈ సూత్రములు రూపొందింపబడినవి. అవి :

1. పరస్పరము ప్రాదేశిక సమగ్రతా, సర్వాధిపత్యములను గుర్తించుట;
2. ఒకరి ప్రదేశముపై వేరొకరు దురాక్రమణ జరుపకుండుట;
3. ఒకరి ఆంతరంగిక వ్యవహారములందు వేరొకరు జోక్యము వహింపకుండుట;
4. పరస్పర శ్రేయోదృష్టితో సమాన భావమున కృషిచేయుట;
5. శాంతియుత సహజీవనము. చీ. శే. రా.

**పటేల్, వల్లభభాయ్ :** చూ. వల్లభభాయ్ పటేల్.

**పటేల్, విఠల్‌భాయ్ :** చూ. విఠల్‌భాయ్ పటేల్.

**పనామా :** మధ్య అమెరికాలోని ఒక స్వతంత్ర రాజ్యము.

ఉత్తర, దక్షిణ అమెరికాలను కలుపు పనామా భూసంధిపై నెలకొని ఉన్న ఈ రాజ్యమునకు కారబియన్‌సముద్రము [ఉ]; పనామా సింధుశాఖ, పసిఫిక్ మహాసముద్రము [ద]; కోస్టారికా [ప]; కొలంబియా [తూ] సరిహద్దులందు ఉన్నవి. [వి] 75,650 చ. కి. మీ.; [జ] 11,77,419. ఆదిమ అమెరికన్ జాతులు శ్వేత జాతీయులతో కలసినందువలన రూపొందిన మిశ్రజాతివారు ఇందు అత్యధిక సంఖ్యాకులు. [భా] జాతీయ భాష స్పానిష్. [మ] దాదాపు ప్రజలందరును క్రైస్తవులు; అందును రోమన్ కేతలిక్‌లు అత్యధిక సంఖ్యాకులు. [రా] పనామా (జ. సం. 2,71,425).




చరిత్ర : 1501 లో ఈ ప్రాంతమును రోడ్రిగో డి బస్తిడిస్ అను సాహసిక నావికుడు కనుగొనెను. ఆ మరుసటి సంవత్సరమున కొలంబస్ [చూ. పు. 407] ఈ దేశము స్పెయిన్‌కు చెందవలెనని ప్రకటించెను. అప్పుడు అట నివసించి ఉండిన ఆదిమ అమెరికన్‌లు స్పెయిన్‌వారిని తీవ్రముగ ప్రతిఘటించినను, స్పెయిన్‌వారు కారబియన్ తీర ప్రాంతమున కొన్ని స్థావరములను తొలుత ఏర్పరచుకొనిరి. తరువాత 1578 లో పసిఫిక్ మహాసముద్ర తీరమున పనామా నగరమును వారు నిర్మించి, ఈ ప్రాంతపు పరిపాలనకు దానిని కేంద్రముగ చేసిరి. ఫ్రాన్సిస్ డ్రేక్, హెన్రీ మోర్గన్ మొదలగు సాహసిక ఆంగ్ల నావికులు స్పెయిన్ సముద్రాధిపత్యమును అంతరింపజేయుటకు కృషిచేసిన సందర్భమున పనామా తీర ప్రాంత నగరములను 16, 17 శతాబ్దములలో కొల్లగొట్టి దగ్ధమొనరించిరి; కాని, అట కాలూనజాలక పోయిరి. 1519 నుండి 18 వ శతాబ్ది మధ్యకాలము వరకు అమెరికాయందలి స్పెయిన్ సామ్రాజ్యపు పాలనకు పనామా నగరము ముఖ్య కేంద్రముగ ఉండెను. మరియు తమ సామ్రాజ్యమునందలి ఫిలిప్పీన్ దీవులతో స్పెయిన్‌వారు సాగించు నౌకా వాణిజ్యమున ఈ పనామాప్రాంతము ఒక ముఖ్య మజిలీగా రాణించి అభివృద్ధిచెందెను. కాని, 1739 లో న్యూగ్రెనడా యందు పనామా ప్రాంతమును అంతర్భాగము చేసినప్పటినుండియు దీని ప్రాముఖ్యము సన్నగిల మొదలిడినది. 1821 లో పొరుగు ప్రాంతములతో పాటుగ ఇదియు స్పెయిన్ సామ్రాజ్యమునుండి విడివడినది. కాని, అంతట కొలంబియా, వెనిజ్యులా, ఈక్వడార్ ఏర్పరుచుకొనిన ఒక సమాఖ్యలో అంతర్భాగమైనది.

1830 లో ఈ సమాఖ్య విచ్ఛిన్నము కాగా వేరుపడిన కొలంబియాలో ఒక రాష్ట్రముగ పనామా ఉండినది. కాని, కొలంబియా నుండి వేరుపడి స్వతంత్రతను ఆర్జింపవలయు నను ఆకాంక్ష అంతకంతకు పనామా వాసులలో బలపడి 1830, 31 లలో తిరుగుబాటులుగ పరిణమించెను. తుదకు 1840 - 41 లో పనామా స్వాతంత్ర్యమును తాత్కాలిముగ ఆర్జించెను; కాని, మరల కొలంబియా తన ఆధిపత్యమును అట నెలకొల్పెను.

ఇంతలో పసిఫిక్ తీరమందలి కాలిఫోర్నియాయందు బంగారపు గనుల ఉనికి కనుగొనబడుటవలన (1840) యూరప్ వాసులు అనేకులు ఆ ప్రాంతమునకు చేర యత్నించుటతో, అట్లాంటిక్ మహాసముద్రమునుండి పసిఫిక్ తీరమునకు చేరు దగ్గర త్రోవ పనామాభూసంధి అగుట వలన ఈ ప్రాంతము మరల ప్రాముఖ్యమును గడించెను. ఆ సందర్భముననే నౌకా ప్రయాణమునకు అనువుగ ఈ భూ సంధియందు ఒక కాలువను త్రవ్వి పసిఫిక్, అట్లాంటిక్ మహాసముద్రముల మధ్య నౌకల రాకపోకలకు దగ్గరదారిని ఏర్పరుచుట బాగుండునను ఆలోచన కలిగెను. కావున, అంతకు కొలదికాలము క్రిందట సూయజ్ కాలువ త్రవ్వకమును నిర్వహించిన ఫెర్డినాండ్ డీ లెసెప్స్ ఆధ్వర్యవమున ఈ పనామా భూసంధియందును ఒక కాలువను త్రవ్వుటకు ఫ్రెంచివారు తొలుతగ 1878 లో కృషిచేసిరి. కాని, ఆ కృషి విఫలమయ్యెను. అంతట 1890 లో 4 కోట్ల డాలర్లను క్రయధనముగ గ్రహించి, కాలువ త్రవ్వకమున తమకు కల హక్కులను ఫ్రెంచివారు యునైటెడ్ స్టేట్స్‌కు విక్రయించిరి. ఈ హక్కును కొలంబియా ప్రభుత్వము ధ్రువపరుప వలసి ఉండెను. 1903 లో కొలంబియాతో ఈ విషయమై రాయబారములు జరిగి ఒక ఒడంబడిక రూపొందింపబడెను. కాని, ఆ వెను వెంటనే కొలంబియా వెనుదిరిగి, ఆ ఒడంబడికను ధ్రువ పరుప నిరాకరించెను. ఇదివరకే స్వాతంత్ర్యకాంక్ష కలిగి ఉండిన పనామారాష్ట్ర వాసులు ఆ అవకాశమును ఉపయోగించుకొని యునైటెడ్ స్టేట్స్ సానుభూతి సహ కారములతో స్వాతంత్ర్యమును ప్రకటించిరి. తరువాత 1903 లోనే పనామా ప్రభుత్వము, యునైటెడ్ స్టేట్స్ పనామా కాలువ విషయమై ఒక ఒడంబడికను కుదుర్చుకొన గలిగినవి. ఇందువలన ఆ వెనువెంటనే రొక్కముగ ఒక కోటి డాలర్లను, ఆ తరువాత సాలీనా 2 లక్షల 50 వేల డాలర్లను పనామా రాజ్య ప్రభుత్వమునకు చెల్లించుటకు యునైటెడ్ స్టేట్స్ ఒప్పుకొనెను. ఈ ఒడంబడిక మూలమున పనామా కాలువకు అటు ఇటు 8 కిలోమీటరుల వెడల్పు గల ప్రదేశముపై యునైటెడ్ స్టేట్స్‌కు అధికారము కలుగుటయే కాక, పనామా స్వాతంత్ర్యమునకు భంగము ఏర్పడినపుడు దేశరక్షణకై జోక్యము వహించుటకును, కాలువను రక్షించుటకు తగు సైనిక వసతులు కల్పించు కొనుటకును, కాలువకు సమీపమున ఉన్న పనామా, కోలాన్ నగరములందు శాంతి భద్రతల రక్షణ విషయమున శ్రద్ధ వహించుటకును హక్కులు సంక్రమించెను. ఈ ఒడంబడికను అనుసరించి 1908, 1917, 1918 లలో పనామా ప్రభుత్వ వ్యవహారములందు యునైటెడ్ స్టేట్స్ జోక్యము వహించి శాంతి భద్రతల నెలకొల్పినది. కాని, 1946 నుండి మాత్రము ఇటుల ఈ దేశ వ్యవహారములందు జోక్యము వహించుటకు యునైటెడ్ స్టేట్స్ స్వస్తి చెప్పి, దేశపు రాజకీయ సంఘర్షణలందు తాటస్థ్యము వహించుచున్నది. 1956 లో పూర్వపు ఒడంబడికకు కొన్ని సవరణలు జరిగి, సాలీనా చెల్లింపబడు బాడుగ 19,30,000 డాలర్లకు పెంచ బడినది. 1914 లో ఈ కాలువ పూర్తి అయినది మొదలుగ నేటివరకు పనామా రాజకీయములలో తమ కాలువపై యునైటెడ్ స్టేట్స్‌కు కల హక్కు అనుభవములే వివాదములకు ఆస్పదములై నిలిచి ఉన్నవి.

**రాజ్యాంగము:** 1946 లో ఆమోదింపబడిన ఒక రాజ్యాంగ చట్టమును అనుసరించిన గణతంత్రవిధానపు పరిపాలన ఈ దేశమున అమలునందు ఉన్నది. దేశాధ్యక్షు డును, ఇరువురు ఉపాధ్యక్షులును అపరోక్షపు ఎన్నికలో ఎన్నుకొనబడెదరు. వీరి పదవీ కాలపరిమితి నాలుగు ఏండ్లు. ఒకసారి అధ్యక్ష పదవిని నిర్వహించినవారు ఆ వెనువెంటనే ఆ పదవికి మరియొకసారి ఎన్నుకొనబడుట నిషిద్ధము. అధ్యక్షుడు 35 ఏండ్ల వయసునకు తగ్గక, పనామా పౌరుడై ఉండవలెను. ఏడుగురు సభ్యులు కల మంత్రి వర్గమును అధ్యక్షుడు నియమించుకొని, దాని మూలమున కార్యనిర్వహణాధికార విధుల నిర్వహించును. రాష్ట్రముల గవర్నర్లను అధ్యక్షుడే నియమించును. రాయబారులను, న్యాయమూర్తులను కూడ ఇతడే నియ మించును. కాని, తరువాత అందులకు శాసనసభ వారి సమ్మతిని పొందవలెను. ఏక కక్ష్య కలిగిన శాసనసభ శాసన నిర్మాణాధికారము కలిగి ఉన్నది. ఇందు 53 గురు సభ్యులు ఉందురు. నైష్పత్తిక ప్రాతినిధ్య పద్ధతిని అనుసరించి 15,000 మంది ప్రజలకు ఒకరు చొప్పున వీరు ఎన్నుకొనబడెదరు. వీరి పదవీ కాలపరిమితి నాలుగు ఏండ్లు. శాసన సభ సమా వేశము కానికాలమున శాసన సభచే ఎన్నుకొన బడిన 5 గురు సభ్యులు కల శాశ్వత సమితి శాసన సభ వ్యవహార ములను నిర్వహించును. శాసన సభ తీర్మానమును

అధ్యక్షుడు వీటో చేయవచ్చును కాని, ఆ తీర్మానమును మరల మూడింట రెండు వంతుల ప్రాబల్యముతో శాసనసభ ఆమోదించినచో అది చట్టము కాగలదు [చూ. పనామా కాలువ].
చీ. శే. రా.

**పనామా కాలువ :** పసిఫిక్ మహాసముద్రమును, అట్లాంటిక్ మహాసముద్రమును కలుపుటకై పనామా రాజ్యము (మధ్య అమెరికా)న త్రవ్వబడిన సుమారు 64 కిలోమీటరుల పొడవుగల కాలువ. దీని త్రవ్వకముచే దక్షిణ అమెరికా చుట్టును తిరిగివచ్చు 9,660 కి. మీ. కు పైబడిన సముద్రయానము కలసి వచ్చినది. 1879 లో ఒక ఫ్రెంచి కంపెనీ ఫెర్డినాండ్ డి లెసెప్స్ అను ఇంజనీర్ యాజమాన్యమున (ఇతడే సూయజ్ కాలువ త్రవ్వించిన ఇంజనీర్) కాలువ త్రవ్వకపు పనిని ఆరంభించి 8 ఏండ్లు కొనసాగించెను. కాని, అచటి అనారోగ్యపరిస్థితులు, దుష్పరిపాలన, దుబారాలు కారణములుగ ఆ ఫ్రెంచి కంపెనీ 1889 లో దివాలా తీసెను. ఆధునిక వైద్యసదుపాయములు అమలులోనికి వచ్చి, అచట వ్యాప్తిలో ఉన్న మలేరియా మొదలగు రోగములు అదుపులోనికి వచ్చిన తరువాత అధ్యక్షుడు థియోడోర్ రూజ్‌వెల్ట్ ప్రోత్సాహమున యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వము ఆ కాలువను త్రవ్వించుటకు పూనుకొనెను. అప్పటిలో ఆ కాలువ ప్రదేశము కొలంబియా గణరాజ్యమున చేరి ఉండగ, దానికిని, తరువాత ఆ గణరాజ్యమునుండి అమెరికన్ల సహాయమున వేరుపడి నూతన గణరాజ్యముగ ఏర్పడిన పనామాకును కాలువ త్రవ్వకపు ఖర్చులకై యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వము సహాయము ఒనర్చెను. కాలువ త్రవ్వబడిన 1,295 చ. కి. మీ. వైశాల్యముగల భూభాగము యునైటెడ్ స్టేట్స్ సైనిక ప్రభుత్వాధీనమున ఉంచబడెను. ఆ కాలువ 1914, ఆగస్టు 15 న వర్తక వ్యాపారాది రహదారి ప్రయాణములకై తెరువబడెను [చూ. పనామా].
న్వ. వెం.

**పరాక్రమ బాహువు (1153 - 1186 ప.) :** ఈతడు సింహళదేశమును పరిపాలించిన సుప్రసిద్ధుడైన రాజు. ఇతడు జన్మించు నాటికి సింహళము నాలుగు భాగములుగా విభక్తమై, నలుగురు ప్రభువుల పాలనలో ఉండెను. 'రాజదేశము' ను విక్రమబాహువు, 'రుహణదేశము' ను సిరివల్లభ, సిరిమేఘులు అను ఇద్దరు సోదరులును, 'దక్షిణదేశము' ను పరాక్రమబాహువు తండ్రియు, సిరివల్లభ, సిరిమేఘుల సోదరుడును అగు మానాభరణుడును పాలించుచుండిరి. ఈ ప్రభువుల నిరంకుశ పరిపాలనలో పన్నుల భారముతో ప్రజలు క్రుంగిపోయిరి. దేశమంతట అలజడి, అశాంతి వ్యాపించినవి. అట్టి పరిస్థితులలో సార్థకనాముడైన పరాక్రమబాహువు తన బాహుపరాక్రమముచే సింహళ రాజ్యమును ఏకీకృతమొనర్చి 1153 నుండి 1186 వరకు 33 ఏండ్లు అప్రతిహతముగ పాలించెను. దాంబూల్ శిలా శాసనములో విపులముగ ఇతని పరిపాలనా సౌష్ఠవము ప్రశంసింపబడినది.

బౌద్ధమతమునకు పరాక్రమబాహువు చేసిన సేవ అనల్పమైనది. వివాదములతో వివిధ వర్గములుగ విడిపోయిన బౌద్ధులను అందరిని ఏకము చేయుటయే కాక, బౌద్ధధర్మముల పట్ల ప్రజలలో ఆదరము పెంపొందుటకు అతడు చాల కృషి చేసెను. అతడు నీటి వనరులను అభివృద్ధిపరచి, దేశమును సస్యసంపన్నము ఒనర్చెను. వేయి చెర్వులకు పైగా అతడు మరమ్మత్తు చేయుటయో లేదా క్రొత్తగా త్రవ్వించుటయో చేసెను.

సింహళచరిత్ర రచయితలు ఇతని పరిపాలన కాలమును ఆ దేశ చరిత్రలో 'స్వర్ణయుగము' అని ప్రశంసింతురు [చూ. సింహళము].
ప్ర. రా.

**పరాగ్వే :** దక్షిణ అమెరికాయందలి ఒక స్వతంత్ర రాజ్యము.




ఈ రాజ్యమునకు బ్రెజిల్, బొలీవియా [ఉ]; అర్జెంటినా, బ్రెజిల్ [తూ]; అర్జెంటీనా [ద]; బొలీవియా, అర్జెంటినా, [ప] సరిహద్దులందు ఉన్నవి. [వి] 4,06,752 చ. కి. మీ. ; [జ] 18,16,890. గౌరానీ అను ప్రాచీన అమెరికన్ జాతీయులును, స్పానిష్‌వారును మేళనమొందిన ఫలితముగ రూపొందిన మిశ్రజాతి ఇందు అత్యధిక సంఖ్యాకులు. [భా] గౌరానీ అను ఆదిమ అమెరికన్ భాషయు, స్పానిష్ భాషయు దేశమున జాతీయభాషలుగ పరిగణన పొందినవి. పరిపాలనాదిక వ్యవహారములు అన్నియు

స్పానిష్‌భాషయందే నిర్వహింపబడుచున్నను, గౌరానీ భాషను ప్రజలందరును మాటాడ నేర్చి ఉన్నారు. [మ] రోమన్ కేథలిక్ సంప్రదాయపు క్రైస్తవమతము సాధికార జాతీయమతముగ పరిగణన పొందినను, పౌరులకు మతస్వేచ్ఛ కలదు. [రా] అసన్‌సియాన్ (జ. సం. 2,81,007).

చరిత్ర : దక్షిణ అమెరికాయందలి తక్కినదేశముల చరిత్రలలో కనరాని ఒక ప్రత్యేకత ఈ దేశచరిత్రయందు కనవచ్చుచున్నది. తక్కినవానియందు స్పెయిన్ లేదా పోర్చుగీస్ వలసల స్థాపనతో పాటుగ క్రైస్తవమతము వ్యాపించినది. ఇట అటీరుగ కాకుండ ముందు మత ప్రచారము మాత్రమే విరివిగ జరిగి, చాలకాలమునకు తరువాత వలస ప్రభుత్వము స్థాపింపబడుట జరిగినది. 1537 లో స్పెయిన్ ఈ ప్రాంతమును కనుగొని అసన్‌సియాన్ నగరమును నెలకొల్పిన వెనువెంటనే జెసూట్ మత ప్రచారకులు ఇట కాలిడిరి. ఆదివాసులగు ప్రజల యోగక్షేమములందు ఈ మత ప్రచారకులు అసమానమగు శ్రద్ధవహించి, వారిని స్థిరనివాసులుగ చేయుటయేకాక, వారి నెలవులందు పాఠశాలలను, వృత్తిశిక్షణ కేంద్రములను ఏర్పరచి, ప్రజలకు క్రైస్తవ మతమునే కాక వృత్తి విద్యలను బోధించిరి. సరిహద్దుల ఉన్న స్పెయిన్, పోర్చుగల్ వలస పాలకులు ఇట పలుకుబడి సంపాదించి, ఆదివాసులను కొల్లగొట్టకుండ చూచుటలో ఈ జెసూట్ మిషనరీలు చాల పట్టుదల వహించిరి. ఇందువలన కాలక్రమమున దేశమున విద్యయు, సంపదలును విరివిగ అభివృద్ధిచెందినవి. దీనిని చూచి అసూయపడి స్పెయిన్ వలస అధికారులు జెసూట్‌ల గురించి అపనిందల వ్యాపింపజేసి, వారు ఒక స్వతంత్ర రాజ్యమును పరాగ్వేయందు నిర్మించుచున్నారని స్పెయిన్ రాజునకు కొండెములు చెప్పి, కడకు జెసూట్‌సంఘమును 1767 నుండి స్పెయిన్‌రాజు నిషేధించి వెడలగొట్టునటుల చేసిరి. జెసూట్ మతబోధకులు దేశమును విడిచిన వెంటనే స్పెయిన్ వలస ప్రభుత్వపు సేనలు పరాగ్వేను ఆక్రమించి, దేశసంపద నెల్ల దోచుకుని, గ్రామసీమలను సర్వనాశము ఒనర్చినవి. కాని, కాలక్రమమున స్పెయిన్‌వారు ఇచట గౌరానీ జాతులతో సంబంధబాంధవ్యములను ఏర్పరచుకొనుటవలన ఈ దేశమున నేటి మిశ్రజాతి రూపొందెను. 1810లో స్పెయిన్ సామ్రాజ్యమునుండి విడివడి ఈ దేశము స్వతంత్రను ఆర్జించినను, ప్రక్కనున్న అర్జెంటీనా రాజ్యమున చేరుటకు నిరాకరించుటచే ఆ రాజ్యము ఈ దేశముపై సేనల నడిపెను. ఆ దండయాత్రను ఎదుర్కొని, ఓడించి కడకు 1811 లో పరాగ్వే సంపూర్ణ స్వాతంత్ర్యమును పొందెను. కాని, స్వాతంత్ర్యమును ఆర్జించిన నాటి నుండి నేటివరకును ఆదేశమున ప్రజాప్రభుత్వము పదియు స్థిరముగ నెలకొనజాలక పోయెను. ఇన్ని ఏండ్ల నుండియు అచ్చపు నియంతృత్వములో లేదా దాదాపుగ నియంతృత్వములే అని చెప్పదగు ప్రభుత్వములో దేశమున పరిపాలన నెరపినవి. తొలుతటి నియంతయగు డాక్టర్ జోసీ గస్పార్ రోడ్రిగో ఈ దేశమునకు విదేశములతో గల అన్ని సంబంధములను రద్దుచేసి, విదేశీయులను అందరను వెడలనంపి దేశ ప్రజల భావప్రకటన స్వాతంత్ర్యమును నిరోధించినను, దేశమున వ్యవసాయమును, పశుపాలనను ప్రోత్సహించి, దేశమును సుసంపన్నము ఒనర్చుటచే జాతీయపిరుడుగ పేరొందెను. రెండవ నియంతయగు కార్లస్ అన్‌టోనియో లోపెజ్ కాలమున విదేశీయులతో సంబంధములు తిరుగ నెలకొల్పబడి, రోడ్‌రవాణా సౌకర్యములు అభివృద్ధి చేయబడినవి. 1862 లో ఇతడు మరణించగ ఇతని కుమారుడు సోలానో లోపెజ్ నియంత అయ్యెను. ఈతని కాలమున పొరుగు దేశములతో ఈతడు తెచ్చిపెట్టుకొనిన విరోధముల ఫలితముగ అర్జెంటీనా, బ్రెజిల్, ఉరుగ్వే దేశముల సైన్యములు సంయుక్తముగ పరాగ్వేపై దండయాత్ర జరిపినవి. సంఖ్యలో తమకు పదిరెట్లున్న విరోధి సైన్యములను పరాగ్వే సైన్యములు వీరోచితముగ ఎదుర్కొని పోరాడినవి. కాని, పలునష్టములకు గురి కావలసివచ్చెను. లోపెజ్ 1870 లో మరణించుటతో ఈ యుద్ధము ముగిసినను, అప్పటికి దేశమందలి పురుషులలో దాదాపు సగము వరకు యుద్ధఫలితముగ నశించిరి. ఇందువలన సాంఘిక జీవితమున చాల ఒడుదొడుకులు కలుగక తప్పదయ్యెను. ఈ యుద్ధనష్టములనుండి తేరుకొనుటకు దేశమునకు చాల కాలము పట్టెను. కాని, మరల 1932 లో తమ సరిహద్దు నందలి చాకో రాష్ట్రమును గురించి బొలీవియాతో పరాగ్వేకు యుద్ధము తటస్థించెను. ఇందు పరాగ్వే సేనలు వివాద ప్రాంతమున మూడింట రెండువంతుల భూమిని ఆక్రమించి, బొలీవియా సేనలను తరిమివైచి, దేశప్రతిష్ఠను మరల నిలబెట్ట గలిగినవి. 1935 లో ఈ యుద్ధము విరమణ మొందె, అప్పటికి పరాగ్వే జయించిన ప్రాంతము అంతయు ఆ దేశమునకే ఒసగబడినది (1938). తరువాత దేశమున నియంతృత్వ ప్రభుత్వములు ఏర్పడుటయు, అత్యల్ప కాలములోనే అవి అంతరించుటయు ఒక సహజ లక్షణముగ పరిణమించినది. 1936 నుండి 1939 లోపల నాలుగు ప్రభుత్వములు మారినవి. 1939 లో ఎన్నిక జరిగినను ఆ ఎన్నుకొనబడిన అధ్యక్షుడే నియంతగ మారెను. 1930 నుండి 1954 లోపల ఇటుల ఆరుగురు నియంతలు పరాగ్వేను పాలించిరి. కడకు 1954 లో ఆల్‌ఫ్రెడో స్ట్రోస్‌నర్ సేనాని

తన ఆశ్వికదళపు సాయమున అధికారము గ్రహించి, ఎన్నికలు జరిపి, తనను ప్రజలు ఎన్నుకొనునటుల చేసెను. 1958 లో మరల అతడు తన ఒక్కని అభ్యర్థిత్వముతో మాత్రమే ఎన్నికలు జరిపి, ఇంకొక పర్యాయము అధ్యక్షుడుగ ఎన్నుకొనబడెను. యునైటెడ్ స్టేట్స్ సహాయముతో ఇతడు దేశమున ఆర్థిక సుస్థిరతను నెలకొల్పినను, ప్రజలను స్వేచ్ఛారహితులుగ చేసెను.

రాజ్యాంగము: 1940 లో ఆమోదింపబడిన ఒక రాజ్యాంగచట్టమును అనుసరించి ఈ దేశమున కేంద్రీకృతాధికారము గల గణతంత్రరాజ్య విధానపు పరిపాలన అమలునందు ఉన్నది. ఆచరణయందు ఇది నియంతృత్వమును చట్టవిహితము చేయుటకు మాత్రమే ఉపయోగపడు చున్నది. ప్రజలలో 18 ఏండ్ల వయసునకు తగ్గని పురుషుల వలన అయిదేండ్లకు ఒకసారి అధ్యక్షుడు ఎన్నుకొనబడును. వోటు చేయుట అనుల్లంఘనీయమగు విధి. పరిపాలన అంతయు అధ్యక్షుని బాధ్యతను జరుగును; అతడే సర్వసేనాని. అవసరమైనపుడెల్ల ఆత్యయిక పరిస్థితిని ప్రకటించి, శాసన సభను రద్దుచేసి, సర్వాధికారముల వహించుటకు అతనికి అధికారము కలదు. 60 మంది ఎన్నుకొనబడిన సభ్యులు కల ప్రతినిధి సభ ఒకటి కలదు. కాని, దీనికి అధికారములు చాల కొలదిగ మాత్రమే కలవు. సాధారణముగ అధ్యక్ష నిర్ణయములను ఆమోదించుటయే దాని విధివిహిత కృత్యము. చీ. శే. రా.

**పరోక్షపు ఎన్నిక:** చూ. అప్రత్యక్ష ఎన్నిక - పు 268.

**పర్షియా:** చూ. ఇరాన్ - పు 325.

**పల్లవులు:** దక్షిణ భారత దేశ చరిత్రయందు సుప్రసిద్ధమగు పాత్ర వహించిన ఒక రాజవంశము [చూ తెలుగు సంస్కృతి - ౧; పు 121].

* * *

**పవిత్ర రాజ్య మైత్రి:** ఇది 1815 - 48 మధ్య కాలమున రష్యా, ప్రష్యా, ఆస్ట్రియా ప్రభువులు అనుసరించిన దమన విధానమును వివరించుటకు పొరపాటున తరుచుగా వాడబడిన పదము. రష్యా చక్రవర్తి అలెగ్జాండర్ ఈపత్రమును రూపొందించెను. న్యాయసూత్రములు, క్రైస్తవ మత తత్త్వములయిన ఔదార్యము, శాంతియు పరిపాలకుల ప్రవర్తనపై సద్యః ప్రభావము కలిగి ఉండి, వారి చర్యలకు మార్గదర్శకములు కావలయును అని ఇందు ఉద్ఘోషింపబడినది. ఈ రూపమున ఈ పత్రముపై రష్యా చక్రవర్తి, ఆస్ట్రియా సమ్రాట్, ప్రష్యా ప్రభువు సంతకము చేసిరి (1815, సెప్టెంబరు 26). మత విరుద్ధమని పోప్, రాజ్యాంగ రీత్యా అశక్తతవలన బ్రిటిష్ రాజ సంరక్షకుడు, క్రైస్తవేతరుడు, టర్కీ సుల్తాన్ మినహా తక్కిన యూరప్ రాజులు తదుపరి ఈ ప్రకటనపై సంతకములు పెట్టిరి. పవిత్ర రాజ్యమైత్రిని 'పేరు గొప్ప, ఊరు దిబ్బ' అని మెటర్నిక్ వర్ణించెను; 'గంభీర అగమ్యవాదమునకు, అర్థరాహిత్యమునకు మచ్చుతునక' అని కాసిల్ రీ పేర్కొనెను. పై మూడు దేశములు తరువాత ఉపసంహరించుకొనినను మొదట ఇంగ్లండుతో కలిసి అవి ఏర్పరచుకొన్న నాలుగు రాజ్యముల కూటమియే ఈ పవిత్ర రాజ్యమైత్రికన్న 1820, 1830, 1848 లలో తూర్పు యూరోపియన్ నిరంకుశప్రభుత్వములు ప్రజాస్వామిక శక్తులను అణచివేయుటకు ఎక్కువగ తోడ్పడినది. అ. వెం.

**పవిత్ర రోమన్ సామ్రాజ్యము:** క్రీ. శ. 962 లో రోమన్ సామ్రాజ్య పునరుద్ధరణమునకై పోప్ చే అభిషేకింపబడిన ఓటో పరిపాలన క్రింద ఏర్పరచబడిన సామ్రాజ్యము (క్రీ. శ. 800 లో షార్లమేన్ వలన స్థాపింపబడి లుప్తస్థితిని పొందిన పిదప ఓటో ఆధిపత్యమున ఇది పునరుద్ధరితమైనదని కొందరి వాదము). ఇందు ముఖ్యముగ జర్మనీ, ఉత్తర ఇటలీ పరగణాలు కలవు. మధ్యయుగమున క్రైస్తవ మత పీఠాధిపతి అగు పోప్ ఆశీర్వచన, ప్రోత్సాహములతో ఆ సామ్రాజ్య చక్రవర్తి ప్రాచీన రోమన్ సామ్రాజ్య సంప్రదాయములను అనుసరించి యూరప్ వాసుల ఐక్యమత్యమునకై కృషిచేయుట ఆ సామ్రాజ్య స్థాపనలోని ముఖ్యాశయము. కాని, ఆ సామ్రాజ్య చక్రవర్తులకును, పరంపరగా పోప్ పీఠము అధిష్ఠించిన పోప్ లకును ఎడతెగని సంఘర్షణ సంభవించుటచే 15 వ శతాబ్దము నాటికి ఆ సామ్రాజ్య పాలకులకు జర్మనీ పరగణాలపై దాదాపుగ ధర్మకర్తృత్వ ప్రతిపత్తి మాత్రమే మిగిలినది. 1273 నుండి ఈ సామ్రాజ్యము హాప్స్ బర్గ్ వంశీయుల పెత్తనము క్రిందికి వచ్చెను. వారు వారసత్వ రాజ్య విస్తరణమునందు తమ దృష్టిని కేంద్రీకరించి, సామ్రాజ్యపు ఎల్లలకు వెలుపలనుండు అనేక భూ భాగములను కూడ ఈ సామ్రాజ్యములో చేర్చుకొనిరి. 1806, జూన్ లో నెపోలియన్ చక్రవర్తి ఫ్రెంచి అధికార ప్రాబల్యము గల సామ్రాజ్య స్థాపనకు ప్రయత్నించినపుడు, ఈ పవిత్ర రోమన్ సామ్రాజ్యమును లాంఛన ప్రాయముగ రద్దు చేయవలసినదిగా పట్టుబట్టెను. అటుల ఆ సామ్రాజ్యము అంతరించిన తదుపరి దాని కడపటి చక్రవర్తియగు ఫ్రాన్సిస్ - II ఆస్ట్రియా చక్రవర్తి అను పేరుతో తన అధీనమున ఉన్న ప్రాంతములను పరిపాలించెను. స్వ. వెం.

**పశ్చిమ ఇండియా దీవులు:** చూ. వెస్ట్ ఇండీస్.

**పాండ్యరాజ్యము:** పాండ్య, చేర (కేరళ), చోళ రాజ్యములు దక్షిణభారతదేశమందు ప్రాచీన కాలములో వెలసిన తమిళ రాజ్యములు. ఈ మూడింటిలోను పాండ్య

రాజ్యము ప్రాచీనతమమయినది. నేటి మధుర, తిరునల్వేలి జిల్లాలు, తిరువాన్‌కూర్ (నేటి కేరళ) లో కొన్ని ప్రదేశములను కలసిన ప్రదేశమందు నాటి పాండ్యరాజ్యము విస్తరించెను. చంద్రగుప్తమౌర్యుని కాలమందు కొంత కాలము పాటలీపుత్రములో ఉండిన మెగస్తనీస్ అనే యవనుడు ఈ పాండ్యరాజ్యము దక్షిణభారత దేశమందు ఉన్నతస్థితిలో ఉండెనని తెలియజేసినాడు. అశోకచక్రవర్తి ఈ పాండ్య దేశమునకు సైతము బౌద్ధమత ప్రచారకులను పంపెను. క్రీ పూ. 20 లో ఒక పాండ్యరాజు రోమన్ పరిపాలకుడైన అగస్టస్ వద్దకు రాయబారము అంపి ఉండెను. ఇట్టి సంఘటనలను బట్టి పాండ్యరాజ్యము ప్రాచీన కాలమందు ప్రబలి ఉండెననియు, వాణిజ్య-వ్యాపార ఘనత కలిగి ఉండెననియు మాత్రమే చెప్పగలము. కాని, దీని చారిత్రక విశేషములు ఎక్కువగ తెలియవు. క్రీ. శ. 2 వ శతాబ్దమందలి కడపటి భాగములో కరికాల చోళుని మనుమనికి, సింహళ రాజయిన గజబాహునకును సమ కాలీనుడైన నెడుమ్ జెళియన్ అను పాండ్యరాజు పేరు మాత్రమే చారిత్రకాధారములతో తెలియగల మొదటి పాండ్యరాజు పేరు. ఈ రాజ్యమునకు మనకు తెలిసినంత వరకు మొదటి రాజధాని నగరము 'కోర్కై' అనెడి సముద్రతీర పట్టణము. కొంత కాలమునకు ఇసుక ఎక్కువగ మేట వేసినందున ఈ పట్టణమునకు వాణిజ్య ఘనత పోయినది. ఆ పిమ్మట వాణిజ్య సంపద కాయల్ పట్టణమునకు సంక్రమించినది. మధుర రాజధాని నగరమయినది. ఇది దక్షిణభారత దేశమందలి తమిళ విద్యాపీఠముగా ప్రఖ్యాతి పడసినది. ఇక్కడనే తమిళ సాహిత్య సంఘము (సంగమ్) ఏర్పడినది. కురళ్, శిలప్పదికారమ్, మణిమేకలై అను ప్రఖ్యాత గ్రంథములు ఈ సంగమ్ వారి ఆదరమున రచితములైన తమిళ కావ్యములు.

హుయాన్‌స్యాంగ్ [చూ.] అనే చీనాయాత్రికుడు సుమారు క్రీ. శ. 639 లో దక్షిణభారతదేశమునకు వచ్చిన నాటికి పాండ్యరాజులు పల్లవ రాజులకు సామంత రాజులుగ కప్పము చెల్లించుచుండిరి.

పాండ్యులకును, పల్లవులకును వైరము ఎక్కువై తరచుగ 7 వ, 8 వ శతాబ్దములలో యుద్ధములు జరుగుచుండెను. 8 వ శతాబ్దములో అరికేసరి అను పాండ్యరాజు పల్లవులను ఒక యుద్ధమందు ఓడించి పాండ్యరాజ్య స్వతంత్రత నిలబెట్టుకొనెను. కాని, ఆ పిమ్మట వరగుణవర్మ అనే పాండ్య రాజును పల్లవ రాజయిన అపరాజితుడు పూర్తిగ ఓడించెను. ఆ పిమ్మట పాండ్య రాజ్యము చోళ రాజ్యముతో ఏకమయి పల్లవ రాజును ఓడించి పల్లవుల బలమును పడగొట్టెను. 11 వ శతాబ్దములో పాండ్య రాజ్యము చోళ రాజ్యమునకు లోబడి ఉండెను. 13 వ శతాబ్దములో కొంతకాలము మాత్రము పాండ్యరాజ్యము పోయిన బలమును సమకూర్చుకొని స్వతంత్రత వహించినది. ఆ కాలమందే మార్కోపోలో [చూ.] పాండ్యరాజ్యమునకు వచ్చి కాయల్ పట్టణమందలి వాణిజ్య ప్రసిద్ధిని కన్నులార కాంచి మెచ్చుకొనెను. 16 వ శతాబ్దములో తక్కిన ప్రదేశములతో పాటు పాండ్యదేశము కూడ విజయనగర సామ్రాజ్యములో లీనమయినది. ఆ పిమ్మట పాండ్యరాజులు కేవలము ఒక చిన్న ప్రదేశమునకు రాజులుగ ఉండేవారు. గి. వేం. సీ.

**పాంపే** (క్రీ. పూ. 106 - 48): ఒక పేద కుటుంబమున పుట్టి ఘనత ఆర్జించిన రోమన్ పౌరుడు. క్రీ. పూ. 78 లో సిల్లా అను రోమన్ నాయకుడు మరణించిన తరువాత సెనేట్ పార్టీ నాయకుడై స్పెయిన్‌లో జరుగుచుండిన సంగ్రామమందు (క్రీ. పూ. 76 - 71) రోమన్ సేనలకు నాయకుడుగ నిలచి విజయము పొందెను. క్రీ. పూ. 67 లో మధ్యధరా సముద్రమందు దౌర్జన్యములు, దోపిడులు సాగించుచుండిన ఓడ దొంగల గుంపులను అణచివేసెను. క్రీ. పూ. 66 లో ఆసియా మైనర్ (పోంటస్) లో ప్రబలుడై ఉండిన మిత్రడేటిస్‌ను ఓడించెను. ఇతని విజయము వలన సెనేట్ పార్టీ బలము కలదైనది. ఓడ దొంగల భయము తొలగినది. ఆసియా మైనర్ పూర్తిగ రోమన్ సామ్రాజ్య ప్రభుత్వమునకు లోబడినది. అందుచేత ఇతడు మహనీయుడు అనిపించుకొనెను. కాని, క్రీ. పూ. 62 నుండి ఇతడు పరిపాలనాధికారము తన చేతిలో పూర్తిగ పెట్టుకొని సామ్రాజ్యమును ఏలినను లేదా సెనేట్‌కు అప్పగించినను ఇతని ఘనత నిలచి ఉండెడిది. ఈ రెండు పనులలోను ఏది చేయక, సీజర్, క్రాసస్‌లతో కలసి పరిపాలక త్రయవిధానమును ఏర్పరచి, ఉమ్మడిగ సామ్రాజ్య పరిపాలనము సాగించుటకు పూనుకొనుటతో ఇతని పతనము ఆరంభమయ్యెను. క్రీ. పూ. 58 లో సీజర్ [చూ.] ప్రోకాన్సల్ పదవిని పొంది గాల్ దేశమున యుద్ధము విజయవంతముగ సాగించుచు ప్రబలత ఆర్జించెను. పాంపే మాత్రము రోమ్ నగరముననే ఉండి పరిపాలనను సాగించుచు, క్రమముగ తక్కిన నాయకుల ఈర్ష్యాసూయలకు లోనయ్యెను. తత్ఫలితముగ తిరుగుబాటులు చెలరేగి క్రీ. పూ. 52 లో దేశము అరాజకమునకును, అంతఃకల్లోలములకును పాలయ్యెను. అందువలన పాంపే గ్రీస్‌నకు పారిపోయెను. క్రీ. పూ. 48 లో సీజర్ ఇతనిని గ్రీస్‌లోని ఫార్సలస్ వద్ద ఓడించెను. అక్కడ నుండి పాంపే పారిపోయి ఈజిప్టులో దాగి ఉండగా సీజర్ పక్షమువారు ఇతనిని పట్టుకొని చంపిరి. గి. వేం. సీ.

**పాకిస్తాన్ :** ఆసియా ఖండమునందలి ఒక స్వతంత్ర రాజ్యము.




భారత ఉప ఖండమున వాయవ్య భాగమున ఒక ప్రాంతమును, తూర్పు చివర ఒక ప్రాంతమును భౌగోళికముగ సాన్నిహిత్యము లేకున్నను రాజకీయముగ ఏకతను పొంది ఈ దేశముగ రూపొందినవి. అందు మొదటిది పశ్చిమ పాకిస్తాన్ అనియు, రెండవది తూర్పు పాకిస్తాన్ అనియు వ్యవహరింపబడుచున్నవి. పశ్చిమ పాకిస్తాన్ (8,04,511 చ. కి. మీ.) నకు ఇరాన్, ఆఫ్ఘనిస్తాన్ [ప]; భారతదేశము [ఉ, తూ]; అరేబియా సముద్రము [ద] సరిహద్దులందు ఉన్నవి. తూర్పు పాకిస్తాన్ (1,42,208 చ. కి. మీ.) నకు భారతదేశము [ఉ, తూ, ప]; బర్మా, బంగాళా ఖాతము [ద] సరిహద్దులందు ఉన్నవి. [జ] పశ్చిమ పాకిస్తాన్ 4,77,67,000 ; తూర్పు పాకిస్తాన్ 5,08,44,912. [భా] పశ్చిమ పాకిస్తాన్‌నందు ఉర్దూ భాషకు ప్రముఖ స్థానము ఉన్నను, మాతృభాషలుగ ఆ యా ప్రాంతములందు పంజాబీ, పుష్తూ, సింధీ, బెలూచీ, గుజరాతీ భాషలు వ్యాప్తిలో ఉన్నవి. తూర్పు పాకిస్తాన్ వాసుల మాతృభాష బెంగాలీ. ఉర్దూ, బెంగాలీ అధికార భాషలుగ గుర్తింపబడినను పరిపాలనా వ్యవహారములందును, ఉన్నత విద్యా బోధనయందును ఇంగ్లీషు వాడుకయందు ఉన్నది. [మ] దేశమున ముస్లిమ్‌లు అత్యధిక సంఖ్యాకులు, పశ్చిమ పాకిస్తాన్‌లో 1·6%, తూర్పు పాకిస్తాన్‌లో 22% మాత్రమే హిందువులు కలరు. క్రైస్తవులు, బౌద్ధులు, పార్శీలు అత్యల్ప సంఖ్యలలో ఉన్నారు. [రా] తొలుత కరాచీ (జ. సం. 19,16,000); కాని, 1959 నుండి రావల్పిండి (జ. సం. 3,43,000). పశ్చిమ పాకిస్తాన్ రాష్ట్రమునకు లాహోర్ (జ. సం. 12,97,000); తూర్పు పాకిస్తాన్ రాష్ట్రమునకు ఢాకా (జ. సం. 5,58,000).

చరిత్ర : అవిభక్త భారతదేశమునకు స్వాతంత్ర్యము ఒసగు సమయమున ఆనాటి రాజకీయ పరిస్థితులవలన దేశమునందలి ప్రముఖ రాజకీయ పక్షముల సమ్మతితో ఆ దేశమును రెండు ప్రత్యేక రాజ్యములుగ విభజించి స్వాతంత్ర్యమును ఒసగుటకు బ్రిటిష్ ప్రభుత్వము చేసిన నిర్ణయమునకు ఫలితముగ పాకిస్తాన్ 1947, ఆగస్టు 14 న రూపొందినది. అంతవరకు భారతదేశమున అంతర్భాగముగ ఈ దేశము ఉండుటచే, భారతదేశ చరిత్రలో దాని చరిత్రయు ఆనాటివరకు లీనమై ఉండినది [చూ. భారతదేశము]. పాకిస్తాన్ స్థాపనకై ఆందోళన సలిపిన ముస్లిమ్‌లీగ్ అధ్యక్షుడు మహమ్మదాలీ జిన్నా [చూ.] పాకిస్తాన్‌కు తొలి గవర్నర్ - జనరల్. అవిభక్త భారత దేశపు విభజన ఫలితముగ భారతదేశము వలెనే, పాకిస్తాన్ కూడ కాందిశీకుల సమస్యను తొలుత తీవ్రముగ ఎదుర్కొనవలసి వచ్చినది. ఉభయ దేశములందును మత వైషమ్యములు అంతకంతకు పెచ్చుపెరిగి, వక్రమార్గముల బట్టి, ప్రపంచమున కని విని ఎరుగని రక్తపాతమునకు, కుటుంబ విచ్ఛిత్తికి దారి తీసెను. ముఖ్యముగ పశ్చిమ పాకిస్తాన్ నందు ముస్లిమేతరులకు కాలు నిలుపుటకే తావు లేకుండు పరిస్థితి ఏర్పడెను. దీనికి తోడుగ భారతదేశమున చేరుటకు అంగీకరించిన కాశ్మీర్, జునాగడ్, మంగ్రోల్ సంస్థానములు తమకు చెందవలసినవిగ పాకిస్తాన్ భావించుటచే భారత - పాకిస్తాన్ దేశముల మధ్య అంతటనుండి ఒకవిధమగు ప్రచ్ఛన్నయుద్ధము [చూ. పు. 593] చెలరేగెను. ఇంతలో 1949 లో మహమ్మదాలీ జిన్నా మరణించినంతనే క్వాజా నాజీముద్దీన్ అను అతడు గవర్నర్ - జనరల్‌గ నియమితుడయ్యెను. ప్రధానియగు లియాకత్ అలీఖాన్ దేశమున సుస్థిరతను చేకూర్చుటకు భారతదేశ ప్రధానితో చర్చించి, ఉభయ దేశసంబంధములను చక్కబరచుటకు కృషి చేసెను. కాని, ఇతడు 1951 లో హత్య చేయబడెను. అంతటినుండి దేశీయ ప్రజల ఆదరణ ఆర్జించిన ఏకైక నాయకుడు ఆ దేశమునకు లభింపమిచే, సువ్యవస్థిత పరిపాలన ఏర్పడుట కష్టమయ్యెను. తుదకు 1954లో అప్పటి గవర్నర్ - జనరల్ అగు గులామ్ అహమ్మద్ శాసన సభను రద్దుచేసి, సర్వాధికారముల స్వీకరించెను. తరువాత 1955 నుండి ప్రజాప్రతినిధి ప్రభుత్వము నెలకొల్పబడినను, రాజకీయపక్షములందలి అంతఃకలహముల మూలమున ఏ ప్రభుత్వము ఎక్కువ కాలము పనిచేయలేక పోయెను. ఇంతలో 1956 నుండి అమలునకు వచ్చిన ఒక రాజ్యాంగ చట్టమువలన పాకిస్తాన్ గణరాజ్యముగ రూపొందెను (అంతవరకు అది బ్రిటిష్ రాచరికపు పెద్దరికమునకు లోబడిన స్వయంపాలిత అధినివేశముగ ఉండెను). అంతటినుండి గవర్నర్-జనరల్‌నకు బదులుగ అధ్యక్షుడు దేశాధినేత అయ్యెను. 1958 లో అధ్యక్షుడుగ ఉండిన ఇస్కందర్ మీర్జా దేశమునందలి రాజకీయ అవ్యవస్థతతో విసుగుచెంది, రాజ్యాంగ చట్టమును రద్దొనర్చి, సర్వాధిపత్యము స్వీకరించి, దేశమును

సైనికాధిపత్యమున ఉంచెను. తుదకు ఆ సంవత్సరము అక్టోబరు మాసమున ఇస్కందర్ మీర్జాయే తన అధ్యక్ష పదవికి రాజీనామా ఒసగగ, అప్పటిలో సేనాధిపతిగ ఉండిన మహమ్మద్ ఆయూబ్ ఖాన్ [చూ. పు. 294] అధ్యక్ష పదవిని గ్రహించి, తన ఇచ్చవచ్చిన వారిని మంత్రులుగ నియమించుకొని, సర్వాధికారములతో దేశమును పరిపాలింప మొదలిడెను. రాజకీయపక్షములను అన్నిటిని ఇతడు నిషేధించెను. 1930 లో స్థానిక సంస్థల సభ్యులు దాదాపు 80,000 మంది వలన నిర్ణయము (రెఫరెండమ్) [చూ. పు. 594] గ్రహింపబడుటకు ప్రభుత్వము ఏర్పాటులు చేయగ, అందు ఇంకను అయిదేండ్ల కాలము ఆయూబ్ ఖాన్ నిర్వహించెడు అధ్యక్ష పరిపాలనయే కొనసాగింపబడవలయునను నిర్ణయము జరిగెను. ఈ విధముగ తన ఆధిపత్యమునకు ప్రజల సహకారమును సంపాదించిన తరువాత, అధ్యక్షుడు ఒక రాజ్యాంగ సలహాసంఘమును నిర్మించి, దాని నిర్ణయములను అనుసరించి కొన్ని సంస్కరణలను ప్రవేశపెట్టెను. దీనికి తొలిమెట్టుగ గ్రామములందును, నగరములందును ఎన్నికలు జరిపి, ప్రాతిపదిక ప్రజా ప్రభుత్వములను స్థాపించెను. వీటికి కొన్ని స్థానిక పరిపాలనాధికారములు ఒసగబడెను. వీనినుండి పరోక్షపు ఎన్నికల మూలమున ఒక జాతీయ శాసన సభయును, రాష్ట్రసభయును రూపొందింపబడెను. కాని, వానికి అధికారములు చాలకొలదిగ మాత్రమే గలవు. కావున పాకిస్తాన్‌నందు ఇంకను ప్రజా పరిపాలన అనునది నెలకొల్పబడలేదనియే భావింపవచ్చును.

ఇటుల రూపొందినది ఆదిగా పాకిస్తాన్ రాజకీయ సుస్థిరతను చేకూర్చుకొనజాలకున్నను ఆర్థికముగ, సైనికముగ యునైటెడ్ స్టేట్స్ సాయమున కొంత స్థైర్యమును చేకూర్చుకొనగలిగినది. కొలంబో ప్రణాళిక [చూ. పు. 409] వలన కూడ ఈ దేశము సాయము గ్రహించినది. కమ్యూనిస్ట్ ప్రాబల్యమును అరికట్టుటకై ఉద్దేశింపబడిన ఆగ్నేయ ఆసియా రక్షణ వ్యవస్థ [చూ - పు. 283], మధ్య ప్రాచ్య రక్షణ వ్యవస్థ [చూ.] యందు పాకిస్తాన్ సభ్యత్వము వహించి, సైనిక సామగ్రిని యునైటెడ్ స్టేట్స్, బ్రిటన్ దేశములనుండి బాగుగ సేకరింపగలిగినది. కాని, ఈ సేకరణ అంతయు కమ్యూనిస్ట్ రాజ్యములను ఉద్దేశించి జరుగలేదనియు, భారతదేశముతో గల తన వివాదముల పరిష్కరణలో తనది పైచేయిగ ఉండుటకే ఇటుల ఒనర్చుచుండెననియు భారతదేశము తొలుతటి నుండియు యునైటెడ్ స్టేట్స్, బ్రిటన్ దేశములకు తన అభ్యంతరములను తెలియజేసినను ప్రయోజనము లేకపోయినది. కడకు, ఈ ఆయుధ సామగ్రిని అంతటిని భారతదేశముపై యుద్ధమును సాగించుటకే పాకిస్తాన్ వినియోగించినది.

భారతదేశముతో ఈ దేశమునకు గల వివాదములను ఈ క్రింది రీతిగ విభజింపవచ్చును: 1. సరిహద్దు సమస్య; 2. నదీ జలముల సమస్య; 3. ఋణ సమస్య; 4. కాశ్మీర్ సమస్య. వీనిలో తొలుతటి దానికి సంబంధించిన వానిలో కచ్ సరిహద్దునకు సంబంధించినది తప్ప తక్కినవి అన్నియు ఆయూబ్ ఖాన్ పరిపాలనకు వచ్చిన తరువాత దాదాపుగ పరిష్కరింపబడినవి. కచ్ సరిహద్దు విషయము ఉభయుల అంగీకారముపై అంతర్జాతీయ మధ్యవర్తిత్వ సంఘమునకు నివేదింపబడినది (1966). రెండవది అగు సింధు నదీ జలముల విభజన సమస్య తొలుత కొంత క్లిష్ట రూపము దాల్చినను, ప్రపంచ బ్యాంక్ వారి మధ్యవర్తిత్వము ద్వారా 1961 లో పరిష్కృతమైనది. ఇక మూడవ, నాలుగవ సమస్యలు ఇప్పటికిని అపరిష్కృతములుగనే ఉన్నవి. దేశ విభజనమూలమున సమష్టి ఋణములు అన్నియు భారతదేశము అచ్చుకొనినందున పాకిస్తాన్ తన వాటాను భారతదేశమునకు చెల్లించవలసి ఉన్నది. కాని, ఉమ్మడి ఆస్తుల పంపకములో తనకు న్యాయముగ రావలసిన వాటా రాలేదను నెపముపెట్టి పాకిస్తాన్ ఈ సమస్యను దాటవేయుచున్నది. ఇక కాశ్మీర్ సమస్య విషయమున మూలాభిప్రాయములలోనే ఉభయదేశములకును భేదములు ఏర్పడి ఉండుటవలన పరిష్కారమునకై ఇప్పటివరకు చేసిన యత్నములు అన్నియు విఫలములైనవి. కడకు 1965 లో దౌర్జన్యమార్గమున ఈ సమస్యను పరిష్కరించుటకై, తొలుత అల్లరిమూకలను గుప్తముగ కాశ్మీర్‌లోనికి పంపి, తరువాత బహిరంగముగనే భారతదేశ పశ్చిమ సరిహద్దును అతిక్రమించి, పాకిస్తాన్ తన సైనిక దండయాత్రను సాగించినది. అంతట తన సరిహద్దుల రక్షణకై భారతదేశము తిరుగు దండయాత్రను నడిపి, లాహోర్ పరిసరములకు పురోగమింపగ ఐక్యరాజ్యసమితి [చూ. పు. 351] జోక్యము వహించి, యుద్ధవిరమణను నెలకొల్పినది. తరువాత సోవియట్ రష్యా కృషివలన టాష్‌ఖండ్‌లో భారత - పాకిస్తాన్‌లకు ఒడంబడిక కుదిరి, దాని పర్యవసానముగ యుద్ధాత్పూర్వస్థితి నెలకొనినది [చూ. కాశ్మీర్ సమస్య - పు. 389; టాష్‌ఖండ్ ప్రకటన - పు. 496].

ఆఫ్ఘనిస్తాన్‌తో కూడ పాకిస్తాన్‌నకు సరిహద్దు తగవు కలదు. బ్రిటిష్ పరిపాలనలో ఉన్నపుడు డురాండ్ రేఖ [చూ. పు. 510] అనబడునది వాయవ్య సరిహద్దు రాష్ట్రము (నేటి పాకిస్తాన్‌లోని భాగము) నకును, ఆఫ్ఘనిస్తాన్‌నకును సరిహద్దుగ ఉండెడిది. ఈ సరిహద్దు రేఖకు ఆవల - ఈవల

ఉండి పుష్తూ భాషను మాట్లాడు పఠాన్ జాతివారందరు ఒకే స్వతంత్ర జాతిగ రూపొందుటకు ఈ సరిహద్దు అభ్యంతరకరమని ఆఫ్ఘనిస్తాన్ వాదము. పాకిస్తాన్‌లోని పుష్తూ భాషాప్రాంతము స్వతంత్రరాజ్యము కావలెనని ఆఫ్ఘనిస్తాన్ ఆశయము. పాకిస్తాన్ ఇందులకు అంగీకరింపనందున ఉభయదేశములమధ్య వైషమ్యములు పెచ్చుపెరిగి, తుదకు 1961, సెప్టెంబరులో పాకిస్తాన్‌తో తనకు గల దౌత్య సంబంధములను ఆఫ్ఘనిస్తాన్ రద్దు చేసికొనెను.

రాజ్యాంగము : పాకిస్తాన్ రూపొందిన తరువాత నూతన రాజ్యాంగము ఏర్పడువరకు తగు మార్పులతో 1935 భారత ప్రభుత్వపు చట్టమే ఈ దేశమున అమలులో ఉండెను. అప్పటిలో పశ్చిమ పాకిస్తాన్ నాలుగు రాష్ట్రములుగను, తూర్పు పాకిస్తాన్ ఒక రాష్ట్రముగను ఉండెను. 1954 లో పశ్చిమ పాకిస్తాన్ అంతయు ఒక రాష్ట్రముగ చేయబడినది. ఆ తరువాత 1956 లో ఒక రాజ్యాంగము రూపొందింపబడినను, అది ఎక్కువ కాలము అమలులో ఉండలేదు. 1958 నుండి ఇట అధ్యక్ష పాలనయే సాగుచున్నది. ప్రాతిపదిక ప్రజాపరిపాలక సంస్థలద్వారా రూపొందింపబడిన శాసనసభలు 1962 లో ఏర్పడినను, వానికి తగిన అధికారములు లేవు. పాకిస్తాన్ గమ్యము ఇస్లామ్ ప్రజారాజ్యమని ఆ దేశపు శాసనసభలు తీర్మానించినవి. మత ప్రాతిపదిక కల ఈ రాజ్యాంగము ఇంకను రూపొందింపబడలేదు. చీ. శే. రా.

**పాపువా :** దక్షిణార్ధ గోళమున ఒక వలస రాజ్యము.

ఆస్ట్రేలియాకు ఉత్తరమున ఉన్న న్యూగినీ ద్వీపమునందు ఆగ్నేయమున ఈ దేశము ఉన్నది. పరిపాలన రీత్యా టోబ్రియాన్, వుడ్‌లాక్ మొదలగు కొన్ని సమీపస్థ ద్వీపములును దీనియందు చేరినవి. [వి] 2,34,499 చ. కి. మీ.; [జ] 5,23,442; [మ] ప్రజలలో సంప్రదాయ ప్రకృతి దేవతారాధన వ్యాప్తియందు ఉన్నది. [రా] పోర్ట్‌మార్స్‌బై (జ. సం. 23,600).

చరిత్ర : మెలనీషియన్ [చూ. సం. 10 - పు. 620], నీగ్రిటో [చూ. సం. 10 - పు. 466] జాతులకు చెందిన ప్రజలు తక్కిన న్యూగినీ ద్వీపమునందు వలెనే తొలుతటినుండి ఇట వసించుచున్నారు. న్యూగినీ ద్వీపమును 1511లో పాశ్చాత్యాన్వేషకుడగు అంటోనియోడి అబ్రూ కనుగొనెను. తరువాత కుక్ మొదలగు ఇతర అన్వేషకులును సమీపస్థ ద్వీపములను కనుగొనిరి. 1793లో న్యూగినీ ద్వీపమునంతటిని బ్రిటిష్ ఈస్ట్ఇండియా కంపెనీ [చూ.] ఆక్రమించినను, తరువాత జరిగిన కొన్ని ఏర్పాటులను అనుసరించి 1885 లో బ్రిటిష్‌వారు ఈ ద్వీపమందలి పశ్చిమ భాగమును డచ్చివారి పరము చేసిరి. 1883 లో ఈ ద్వీపపు ఆగ్నేయ భాగముపై ఆస్ట్రేలియాయందలి క్వీన్స్‌లాండ్ రాష్ట్ర ప్రభుత్వము తన ఆధిపత్యమును నెలకొల్పదలచెను. కాని, 1884, నవంబరు 6 న బ్రిటిష్‌వారు ఆ ప్రాంతమును తమ రక్షిత ప్రాంతముగ ప్రకటించి క్వీన్స్‌లాండ్ ప్రభుత్వ ప్రయత్నములను ప్రతిఘటించిరి. 1887 లో ఈ ప్రాంతము బ్రిటిష్ వలసగ మార్చివేయబడెను. ఆ ఆగ్నేయ ప్రాంతమే నేటి పాపువా.

దీని పరిపాలనను బ్రిటిష్‌వారి అనుమతితో ఆస్ట్రేలియా కామన్‌వెల్త్ ప్రభుత్వము 1901 లో స్వీకరించినది. 1962, అక్టోబరులో ఈ దేశమున 22 స్థానిక పరిపాలనా సంస్థలు నెలకొల్పబడి, అందు ప్రజా ప్రతినిధులకు స్థానము కల్పింపబడెను. క్రమముగ దేశీయ ప్రజలకు స్వాతంత్ర్యమును కలుగజేయుటయే తమ ఉద్దేశమని ఆస్ట్రేలియా ప్రభుత్వము ప్రకటించినది. చీ. శే. రా.

**పారసీకము :** చూ. ఇరాన్ - పు. 325.

**పారసీక సింధుశాఖ తీరమండలి షేకు రాజ్యములు :** ఇవి విస్తీర్ణమున చిన్నవి అయ్యును, ప్రత్యేక స్వతంత్ర రాజ్యములుగ వ్యవహరించుచున్న కొన్ని అరబ్బు రాజ్యములు. ఆ యా రాజ్యముల పాలకులకు షేకులని వ్యవహారము. కావున వాటిని షేకురాజ్యములు అందురు.




పారసీక సింధు శాఖను ఆశ్రయించి అరేబియా ద్వీపకల్పపు తీరభూమియందు ఇవి నెలకొని ఉన్నవి. ఇవి : 1. కువాయిట్, 2 బెహారీన్, 3. కటార్, 4. అబూధబీ, 5. దుబయీ, 6. షర్జా, 7. అజమాన్, 8. ఉమ్మల్ కయ్‌వైన్, 9. రాసల్‌కైమా, 10. ఫుజైరా అనునవి. వీనిలో చివర ఏడింటికి సమష్టిగ 'సంధి విషయిక షేకు రాజ్యములు' అని వ్యవహారనామము కూడ కలదు. ఈ రాజ్యములలో బెహారీన్ అనునది తప్ప తక్కినవి సౌదీ అరేబియా, ఇరాక్‌లలో ఏదియో ఒకదానితో సరిహద్దున కలసి ఉన్నవి. బెహారీన్ మాత్రము ఒక ద్వీప సముదాయపు రాజ్యము. పారసీక సింధు శాఖచే ఇది పరివృతమై ఉన్నది. ఈ పది షేకు రాజ్యములకు సరిహద్దులు సరిగ నిర్ణయితములు కాక, ఈ నాటికిని

వివాద జనకములై ఉండుటవలన వీనిలో ఏ రాజ్యపు విస్తీర్ణమును చక్కగ లెక్క తేలకున్నది. జనసంఖ్య విషయమునను కొన్ని రాజ్యములకు వివరములు తెలియుటలేదు. కావున అంచనాలు ఈయబడినవి. కువాయిట్ [వి] 15,540 చ. కి. మీ.; [జ] 3,21,000; [రా] ఆల్ కువాయిట్ (జ. సం. 1,20,000); బెహరీన్ [వి] 598 చ. కి. మీ.; [జ] 1,52,000.; [రా] మనామా (జ. సం. 45,000); కటార్ [వి] 22,015 చ. కి. మీ.; [జ] 45,000; [రా] దవ్ హా (జ. సం. 20,000); సంధి విషయిక షేకు రాజ్యములు [వి] 83,600 చ. కి. మీ; [జ] 1,20,000; [రా] దుబయీ (జ. సం. 45,000).

ఈ రాజ్యముల ప్రజలలో అధిక సంఖ్యాకులు అరబ్బుజాతికి చెందినవారు. కొంతకాలము ఇవి బానిస వ్యాపారమునకు కేంద్రములుగ ఉండుటవలన నీగ్రోజాతియు సంకలిత రూపమున కొలదిగ ఇట కన్పట్టుచున్నది. బెహరీన్‌లో మాత్రము పారసీకజాతివారు బహుళ సంఖ్యలో కన్పట్టుదురు. కువాయిట్, బెహరీన్, కటార్ ప్రాంతములలో దాదాపు మూడవవంతు ప్రజలు భారత, పాకిస్తాన్ దేశములకు చెందినవారు; వీరు నూనెగనుల కంపెనీలలో పని చేయుటకు వలసవచ్చిరి. ఈ ప్రజలలో దాదాపుగ అందరూ ముస్లిమ్‌లే.

చరిత్ర : ఈ రాజ్యములలో బెహరీన్‌ను గురించి తప్ప, తక్కిన వానిని గురించిన ప్రాచీన చారిత్రక వివరములు తెలియవు. ప్రాచీన గ్రీక్ నావికులకు బెహరీన్ దీవులు సుపరిచితములుగ ఉండెనని మాత్రము తెలియుచున్నవి. అది ఎటులన్నను, ఈ రాజ్యముల చరిత్రను గురించి స్పష్టములగు వివరములు 7 వ శతాబ్ది మొదలుగ మాత్రమే లభ్యములు అగుచున్నవి. ఆ 7 వ శతాబ్దియందు ఇట ఇస్లామ్ మతము కాలూని, త్వరలో ప్రజల ఆదరణమును ఆర్జించినది. అంతట కొన్ని శతాబ్దముల తరువాత ఇస్లామ్‌న బయలుదేరిన ఒక నూతన సంస్కరణోద్యమమునకు ఈ ప్రాంతము కేంద్రమయ్యెను. కర్మేథియన్‌లని వ్యవహరింపబడు ఆ సంస్కరణవాదులు ఇట తమ ఆధిపత్యమును నెలకొల్పి, అచిరకాలముననే ప్రబలులై, ఆనాటి అరబ్బు సామ్రాజ్యాధిపతి అగు కలీఫా [చూ. పు. 374] ను ధిక్కరించి, అతని సైన్యమును ఓడించి, కడకు మక్కా క్షేత్రమును కూడ కైవసము ఒనర్చుకొనిరి. కాని, ఆ తరువాత త్వరలోనే వీరి బలము క్షీణించి, వీరి రాజ్యము నామావశిష్టమయ్యెను. అంతటినుండి ఈ ప్రాంతము అంతయు సాహసికులగు దోపిడిగాండ్రకు నిలయమయ్యెను. అరేబియాసముద్రమున పయనించు ఓడలను వీరు తమ నౌకల సాయమున ముట్టడించి, కొల్లగొట్టి జీవించుచుండెడివారు. అందువలన ఆనాటి విదేశీయ నావికులు ఈ పది రాజ్యములున్న తీరభూమిని 'సముద్రపు దొంగల కోస్తా' అని వ్యవహరించెడివారు. ఇటుల నౌకలను కొట్టి బలపడిన అరబ్బు సాహసికులు కడకు మతావేశితులగు వాహబీలను ముస్లిమ్ మత సంస్కరణవాదుల అండతో మస్కట్ అండ్ ఓమన్ [చూ.] రాజ్యమును అంతమొందించుటకై 19 వ శతాబ్దపు తొలి పాదమున యత్నమొనర్చిరి. అందువలన మస్కట్ అండ్ ఓమన్ రాజ్యమును రక్షించుటకు బ్రిటిష్‌ప్రభుత్వము జోక్యము కల్పించుకొని, పలు దండయాత్రలు సలిపి, ఈ సాహసికులను ఓడించి, రాజీకి వచ్చునటుల చేసినది (1820). ఈ రాజీ ఫలితముగ కుదిరిన సంధియే 'శాశ్వత సాగరిక సంధి'. అంతటినుండి 'సముద్రపు దొంగల కోస్తా' అనుటకు బదులుగ ఈ భూమికి 'సంధి విషయిక తీరభూమి' అను పేరు వ్యాప్తిలోనికి వచ్చెను. ఆ సాగరిక సంధిలో చేరిన షేకు రాజ్యముల సంఖ్య ఆ రాజ్యములలో జరిగిన విభాగముల వలనను, కొన్ని సందర్భములలో జరిగిన సమ్మేళనముల వలనను అంతటంతట పలు మార్పులు పొందినది. ఇప్పుడు అందు ఏడు రాజ్యములు కలవు. ఈ సంధి విషయిక రాజ్యములు కాక తక్కిన మూడును క్రమముగ ఆ తరువాత అంతటంతట బ్రిటిష్ రక్షణలోనికి వచ్చినవి. వానిలో కటార్ 1868 లో శాశ్వత సాగరిక సంధిని ఆమోదించినది. బెహరీన్ 1862 లోను, కువాయిట్ 1896 లోను బ్రిటిష్ రక్షిత రాజ్యములుగ ఉండుటకు అంగీకరించినవి. ఇటుల 19 వ శతాబ్ది అంతమునకు ఈ రాజ్యములందు బ్రిటిష్‌వారి పలుకుబడి సుస్థాపితమయ్యెను. కాని, బ్రిటిష్‌ప్రభుత్వము ఆ రాజ్యముల ఆంతరంగిక పాలనలో మాత్రము జోక్యము వహింపక, వైదేశిక వ్యవహారములను మాత్రము ఒడంబడిక మూలమున తన చేతియందు ఉంచుకొనెను. ఈ ఒడంబడికను అనుసరించి ఈ రాజ్యములు 1. బ్రిటిష్‌ప్రభుత్వము తప్ప మరి ఏ ఇతర విదేశీయ ప్రభుత్వము తోడను ఒడంబడికలను కుదుర్చుకొనకూడదు, ఉత్తర ప్రత్యుత్తరములు జరుపకూడదు; 2. బ్రిటిష్‌ప్రభుత్వ సమ్మతి లేనిదే ఏ విదేశీయ ప్రభుత్వపు ప్రతినిధిని చేరనీయకూడదు; 3. తమ దేశమునందలి ఏ భాగమునైనను దానాదమన విక్రయములవలన ఏ విదేశీయునకు చెందజేయకూడదు లేదా ఏ విదేశీయునికిని అందు నివాసానుమతి ఈయకూడదు.

ఈ రాజ్యములోని కువాయిట్, బెహరీన్, కటార్, అబూధబీలందు 1920 ప్రాంతమున నూనెగనులు కనుగొనబడినవి. అంతట తమ ఒడంబడికలోని మూడవ సూత్రమును అనుసరించి ఇతర విదేశీయ కంపెనీలు ఏవియు అట చేరకుండ చేసి, బ్రిటిష్‌ప్రభుత్వము తమ దేశపు కంపెనీల మూలమున నూనె వ్యాపారమును కైవసము చేసికొనెను. ఈ నూనె వ్యాపారమువలన ఈ రాజ్యములందలి ప్రజల ఆర్థికస్థాయియందును కొలదిగ ఉన్నతి చేకూరెను. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున బ్రిటిష్‌ప్రభుత్వము ఈ

రాజ్యములందు తనకు గల ప్రత్యేకపు హక్కులను విసర్జించి నది; కాని, ఇందులకు బదులుగ ఈ రాజ్యములు కోరి నప్పుడు వీని స్వాతంత్ర్యమును కాపాడుటకై తన సేనలను పంపుటకు ఒడంబడిక కుదుర్చుకొనినది.

ఈ రాజ్యముల అన్నింట కువాయిట్ తన ఆర్థిక సంపత్తిని బట్టి ప్రముఖతను ఆర్జించి ఐక్యరాజ్యసమితిలో సభ్యత్వ మును కూడ ఆర్జించినది (1963) [చూ. కువాయిట్ - పు. 393]. పై రాజ్యములు అన్నియు వంశానుగత, నిరం కుశ, రాజత్వపు పాలనలను కలిగి ఉన్నవి. చీ. శే. రా.

**పారిస్ కాంగ్రెస్:** ఫ్రెంచి విదేశాంగ మంత్రి వాలెవ్‌స్కీ (1810-68) అగ్రాసనాధిపత్యమున క్రిమియా-యుద్ధానంతరము - తూర్పు యూరప్ సమస్యలను పరిష్కరించుటకై పారిస్‌నగరమున జరిగిన అంతర్జాతీయ సమావేశము (1856, ఫిబ్రవరి - మార్చి). అయినను ఈ పారిస్ కాంగ్రెస్ నిర్ణయములు ప్రధానముగ నల్లసముద్ర ప్రాంతమునకే సంబంధించి ఉండినవి. ఈ నిర్ణయముల ఫలిత ముగ డాన్యూబ్‌నదీ ముఖద్వార ప్రదేశములను, బెస్సరేబి యాలోని కొంత భాగమును అప్పటిలో ఏర్పడనున్న రుమే నియాకు రష్యా దత్తము ఒనర్చెను; అట్లే కార్స్‌ను టర్కీకి సమర్పించెను. ఇంకను టర్కీలోని క్రైస్తవులపై మతసంబంధ రక్షకత్వబాధ్యత వహించు హక్కును కూడ రష్యా వదలు కొనెను. నల్లసముద్రముపై రష్యా యుద్ధనౌకలను నిలుపు కొనుటయును, తీరమున రక్షక దుర్గములను నిర్మించుట యును నిషేధింపబడెను. డాన్యూబ్ రాజ్యములు అగ్ర రాజ్యముల సంరక్షణక్రింద ఉంచబడెను. డాన్యూబ్‌నదిపై రాకపోకలను క్రమపద్ధతి ప్రకారము జరుపుటకు ఒక అంత ర్జాతీయ నియంత్రణ సంఘము నియమింపబడెను. అంతే గాక, యుద్ధములో తటస్థరాజ్యము [చూ. పు. 531] ల హక్కుల విషయమై వివాదగ్రస్తములగు అంతర్జాతీయ న్యాయసూత్రములను ఈ కాంగ్రెస్ విశదీకరించి నిర్ణ యించెను. కాని, ఈ నిర్ణయములలోని ముఖ్య భాగమగు నల్లసముద్రప్రాంత తటస్థ విధానము 1870 వరకే అమలులో ఉండెను. ఆ సంవత్సరమున రష్యన్‌లు పై నిర్ణయముల కును, నిబంధనలకును తాము కట్టుబడి ఉండ అవసరము లేదని ప్రకటించి, నల్లసముద్ర నౌకాబలమును ఏర్పరచు కొందుమని వెల్లడించిరి. స్వ. వెం.

**పారిస్ శాంతిసమావేశము:** ప్రథమ ప్రపంచయుద్ధము అనంతరము మిత్రమండలివారును, వారి అనుచర ప్రభుత్వ ములును కలసి భావి శాంతిస్థాపన సూత్రములను నిర్ణయించు టకై పారిస్‌నగరమున జరిపిన సమావేశము (18-1-1919; 20-1-1920). ఈ సమావేశ నిర్ణయములే తరువాత లిఖిత రూపము వహించిన వెర్సెయిల్స్, సెంట్ జెర్మెయిన్, న్యూయిలీ, ట్రియానన్, సెవెరిస్ సంధి పత్రములలో పొందుపరపబడెను. 1919, జూలై వరకును యునైటెడ్ స్టేట్స్, బ్రిటన్, ఫ్రాన్స్, ఇటలీ అను నాలుగు అగ్రరాజ్య ములు ఈ సమావేశమునందు పెద్దరికమును వహించెను.

మొదటినుండియు ఈ సమావేశ కార్యక్రమము ఈ క్రింది ఐదు ప్రధాన విభేద విషయములచే అడుగడుగునకు నిరోధింపబడుచు వచ్చెను: 1. అగ్రరాజ్య చతుష్టయాధి నేతల ఉద్దేశములలో గల విభిన్నత్వము; 2. ఆ యా దేశ ముల ప్రజలు జర్మనీపై కసి తీర్చుకొను తలంపుతో తమ ప్రభుత్వనేతలను ఆ విధానమును అవలంబించ వలసినదిగ ఒత్తిడి చేయుట-(అ) 370 మంది బ్రిటిష్ పార్లమెంట్ సభ్యులు లాయిడ్ జార్జిని జర్మన్‌ల వద్దనుండి వసూలు చేయ వలసిన నష్ట పరిహారపు మొత్తమును హెచ్చింపగోరుచు తంతి పంపుట; (ఆ) ఫ్రెంచి సేనానులు తమ ప్రధాని అగు క్లెమెన్‌సూను జర్మనీనుండి రైన్‌లాండ్‌ను పరిగ్రహింప ఒత్తిడి చేయుట; 3. అమెరికన్ ప్రజలు ప్రెసిడెంట్ విల్సన్‌ను ప్రాతప్రపంచ రాజకీయములనుండి విరమింప గోరుట; 4. అతివాద జాతీయ పక్షములు వివాదగ్రస్త ప్రాంతములను సమావేశకాలమునందే బలవంతముగా ఆయుధ సహాయ మున ఆక్రమించుకొనుట; 5. అంతర్యుద్ధ కారణముచే రష్యా సరిహద్దులను గూర్చిన అనిశ్చయత. ఇన్ని ప్రతిబంధ కములు ఉన్నను ఈ శాంతి సమావేశము విభిన్న జాతీయుల స్వయం నిర్ణయాధికారమును గురించి అంతకు ముందున్న దానికంటె అధికతర ప్రయోజనమును సాధించగలిగెను. ముందుముందు ఏర్పడనున్న నానాజాతిసమితి [చూ. పు. 531] సమితి ఈ నిర్ణయములలోని లోపములను సవరింప గలదని ఈ సమావేశ సభ్యులు ఆసించిరి. స్వ. వెం.

**పార్థియా:** ఆసియా ఖండములోని ప్రాచీనదేశము. కాస్పియన్ సముద్రమునకు ఆగ్నేయముగ ప్రాచీన పార సీక సామ్రాజ్యమున ఒక భాగమై ఉండెను. అలెగ్జాండర్ ఈ సామ్రాజ్యమును జయించెను. అతని మరణానంతరము జరిగిన రాజ్యవిభజనలో సెల్యూసిడ్ రాజులకు ఈ దేశము లభించినది. క్రీ. పూ. 250 ప్రాంతములో మొదటి అర్సా సెస్ (అర్షక) పరిపాలనక్రింద ఇది స్వతంత్రరాజ్యము అయి నది. తదుపరి శతాబ్దములలో ఇది బాగుగా అభివృద్ధిచెంది, మొదటి మిత్రడేటిస్ కాలమున యూఫ్రటీస్‌నది నుండి సింధు నది తటమువరకు వ్యాపించి, టెసిఫాన్ నగరము రాజ ధానిగా విలసిల్లిన సామ్రాజ్యముగ రూపొందినది. క్రీ. శ. 226 లో దీనిని అర్దాశిర్ - I జయించి పునర్నిర్మిత పారసీక సామ్రాజ్యములో కలిపివేసెను. గి. వేం. సీ.

**పార్నెల్** (1846 - 1891) : ఐర్లాండ్ జాతీయతావాది. ఆంగ్ల కుటుంబమున జన్మించినను, ఇతని కుటుంబము వారు ఐర్లాండ్‌లో భూములు సంపాదించి, చిర నివాసము చేసినవారు కనుక, ఇతడు ఐర్లాండ్ దేశాభిమాని అయ్యెను. 1875 లో పార్లమెంట్ సభ్యుడై ఐర్లాండ్ 'హోమ్‌రూల్' ఉద్యమములో పాల్గొని తీవ్రముగ పోరాడి శాసనోల్లంఘనమును ప్రోత్సహించెను. 1886 లో గ్లాడ్‌స్టన్ ప్రధానమంత్రిగ ఉన్నప్పుడు ఐర్లాండ్‌లో కౌలుదారులకు బాధానివారకమగు ప్రతిపాదనమును శాసనము కావించుటకు పూనుకొనినప్పుడు గ్లాడ్‌స్టన్‌కు పార్నెల్ తోడ్పడి అతని ప్రయత్నము ఫలింపజేసెను. గి. వేం. సీ.

**పార్లమెంట్** : చూ. రాజ్యసభ ; లోకసభ.

**పార్లమెంట్ ప్రభుత్వము** : చూ. ప్రజా సత్తాక రాజ్యము.

**పాలస్తీనా** : చూ. ఇస్రాయెల్ - పు. 317.

**పాశ్చాత్య రాజ్యాంగ వ్యవస్థా విధానము** : పాశ్చాత్యుల చరిత్ర గ్రీకులతో ప్రారంభము అగుటచేత పాశ్చాత్య రాజ్యాంగ వ్యవస్థాపరిణామ చరిత్ర కూడ గ్రీకుల రాజ్యాంగ వ్యవస్థతో ప్రారంభము అగును.

ప్రాచీన **యుగము** : క్రీ. పూ. సుమారు 1000 నాటి గ్రీకులను గురించిన వివరణములు హోమర్ అను సుప్రసిద్ధ కవి రచించిన కావ్యములనుండి తెలియుచున్నవి. అప్పటి కాలములో గ్రీకులు అనేక తెగలుగ విభజింపబడి ఉండిరి. అందులోని ప్రతి తెగయందు ఒక రాజకుటుంబము ఉండెను. అందులోని వారే రాజులు అగుటకు అర్హులుగ ఉండిరి. యుద్ధకాలమున సైన్యాధిపత్యము వహించుట, ఆచార విరుద్ధముగ ప్రవర్తించిన వారిని విచారణ చేసి దండించుట, దేవతల తృప్తికై చేయవలసిన పూజా పురస్కారములను ప్రజల పక్షమున చేయుట ఇవియే రాజు యొక్క ప్రధాన విధులుగ ఉండెను. దేశము అంతయు ఒకే రాజ్యమై ఒకే పరిపాలనకు లోబడి ఉండుటకు బదులు అనేక చిన్న నగరరాజ్యములు అగుటచేత అవి విస్తీర్ణమందును, జనసంఖ్యయందును మిక్కిలి చిన్నవిగ ఉండెను. తమ తమ నగరరాజ్యముల స్వాతంత్ర్యమును నిలబెట్టుకొనుటయందు వారికి ఉండిన పట్టుదల నిరుపమానము.

నగర రాజ్యములలో ప్రథమదశయందు రాజులు పాలకులుగ ఉండిరి. కాని, వారి అధికారము చాలకాలము నిలబడలేదు. గొప్ప కుటుంబములో పుట్టిన ప్రముఖులు పెద్ద భూస్వాములై రాజులను ఎదిరించుటకు సమర్థులు అగుట సంభవించెను. ఇట్టి పరిస్థితులలో అనేక నగరములందు రాజత్వము క్రమక్రమముగ క్షీణించి, తుదకు అదృశ్యమయ్యెను. క్రీ. శ. 800 ప్రాంతము నాటికి అనేక రాజ్యములలో పరిపాలనాధికారము సామంత కుటుంబములకు చెందిన ప్రముఖుల వశమయ్యెను. ప్రముఖుల ప్రభుత్వము చిరకాలము నిలబడలేదు. తొలిభాగమున వీరు ప్రజలందరి లాభమును గమనించి పాలించినను, క్రమక్రమముగ స్వలాభ ప్రియులై ప్రజలను హింసింప సాగిరి. ఇట్టి స్థితిలో అనేక నగరములందు వర్తకవ్యాపారములు చేసి, ధనమును సంపాదించిన వణిగ్వర్గము ముందుకు వచ్చి భూస్వాముల వశమందు ఉండిన రాజ్యాధికారములో తమకు కూడ భాగము ఉండవలెనని ఆందోళన చేయదొడగిరి. కొంత కాలమునకు వణిజులు, సామాన్యులు కలసి ప్రముఖులపై తిరుగుబాటు చేసి, అధికారమునుండి వారిని తొలగించిరి. రాజ్యాంగవ్యవస్థా పరిణామములో ఇది రెండవదశ.

కాని, ఇంతటితో అధికారము ప్రజల పరము కాలేదు. పరిపాలించుటకు తగిన అనుభవము వారికి లేనందునను, పరిస్థితులు విపరీతముగ ఉండినందునను తిరుగుబాటులలో నాయకత్వము వహించినవారు నియంతలై తమ అధికారమును నగరరాజ్యములో స్థాపించిరి. నిరంకుశత్వము అనబడు వీరి అధికారము ఒకటి - రెండు తరముల కాలము సాగెను. కాని, ప్రముఖులపై తిరుగుబాటు చేసిన ప్రజలు నిరంకుశత్వమును సహింపలేక, కొంతకాలమైన తరువాత నిరంకుశులపై తిరుగబడి, అధికారమునుండి వారిని తొలగించి, ప్రజాస్వామ్యమును స్థాపించిరి. నిరంకుశత్వము రాజ్యాంగ వ్యవస్థా పరిణామములో మూడవదశ. క్రీ. పూ. 500 నాటికి ఈ దశ ముగిసి అనేక నగరములలో ప్రజాస్వామ్యము స్థాపితము అయ్యెను.

ప్రజలే పరిపాలకులు అగుట ప్రజాస్వామ్యమునకు ప్రధాన లక్షణము. ఈ రాజ్యాంగము ఏతెన్స్ పట్టణములో మిక్కిలి ప్రసిద్ధి గాంచెను. ఏతెన్స్‌లోని ప్రజాస్వామ్యమునకు అనేక అంగములు ఉండెను. వీనిలో మొదటిది ప్రజాసభ. రాజ్యములోని పౌరులందరు ఇందు సభ్యులు. రాజ్యము చిన్నది అగుటచేత పౌరులందరు ప్రజాసభకు సమావేశమగుట సాధ్యము అయ్యెను. సాధారణముగ అట్టి సభలలో 7, 8 వేల మంది సభ్యులు హాజరై అచ్చటి వాదప్రతివాదములలో పాల్గొనుచుండిరి. ఆ సభకు పరిపాలనకు సంబంధించిన విషయములు అన్నిటిని గూర్చి చర్చించుటకు సంపూర్ణాధికారము ఉండెను. క్రొత్త శాసనములు చేయుట, పన్నులు విధించుట, ఆదాయమును ఖర్చుపెట్టుట, యుద్ధములు ప్రకటించుట మొదలగు పనులు అన్నిటిని ఆ సభయే చేయుచుండెను. రాజ్యాంగములలో రెండవది పంచశత సభ. ఇది ప్రతిదినము సమావేశమై ప్రజా సభవారి ఆజ్ఞ

లను అనుసరించి వ్యవహారములు జరుపుచుండెను. మూడవ రాజ్యాంగము న్యాయస్థానములు. ఏథెన్స్ పట్టణములో ప్రజలే న్యాయాధీశులుగ ఉండిరి. ప్రతి పౌరుడు న్యాయ విచారణములో పాల్గొనుటకు అర్హుడై ఉండెను. వివాద ముల స్వభావములను బట్టి ఒక వందమంది పౌరులో, రెండు వందలమంది పౌరులో, అంతకంటె హెచ్చు సంఖ్యాకులో న్యాయస్థానమందు సమావేశమై ఉభయ పక్షములవారి వాదములు విని, వివాదమును పరిష్కరించు చుండిరి. ఈ ప్రధానాంగములు కాక కొన్ని పనులను నిర్వహించుటకు ప్రత్యేక ఉద్యోగస్థులు ఉండిరి. వారిలో సైన్యాధిపతులను మాత్రమే ప్రజలు ఎన్నుకొనుచుండిరి. తక్కినవారు లాటరీ విధానమున ఉద్యోగములలో ప్రవే శించుచుండిరి. ఈ విధానములో అర్హతానర్హతల విచక్షణ లేక, ప్రతి పౌరుడు ఉద్యోగి అగుటకు వీలు ఉండెను. ఏ ఉద్యోగము కాని ఒక సంవత్సరము కంటె ఎక్కువ కాలము అనుభవించుటకు వీలు లేకుండెను. ఒక పర్యాయము ఒక ఉద్యోగము చేసిన పౌరుడు మరియొక పర్యాయము అదే ఉద్యోగము అనుభవింపరాదను నియమము కూడ అమ లులో ఉండెను. అందుచేత అన్ని ఉద్యోగములను పౌరు లందరు వారి జీవిత కాలములో ఏదియో ఒక సమయమున అనుభవించుటకు అవకాశము ఉండెను. ఆ కారణమున ఏథెన్స్‌లోని ప్రజాస్వామ్యము ఆదర్శవంతము మాత్రమే కాక, ఆచరణ యోగ్యముగ కూడ ఉండెను. పౌర సమ త్వము కూడ అదేవిధముగ ఆచరణలోనికి వచ్చెను. ఇట్టి అవకాశము ధనికులు, దరిద్రులు అను భేదములేక పౌరులు అందరు సమానముగ అనుభవించుటకు వీలు ఉండెను. ఉద్యోగము చేయు వారికి, ప్రజాసభలో హాజరైన వారికి, న్యాయస్థానములో పనిచేసిన వారికి రోజు బత్తెములు ఇచ్చు చుండిరి. తక్కిన పట్టణములలో ఇట్టి ఆచారము లేదు. అందు చేత కష్టపడి పనిచేసినగాని పొట్టగడవని సామాన్య పౌరులు సభలలో పాల్గొనుటకును, ఉద్యోగములు చేయుటకును వెనుదీయుచుండిరి. ఏథెన్స్‌లో అట్లుగాక పౌరులందరును పరిపాలనా భారమును స్వయముగ వహించువారైరి.

కాని, అప్పటి ప్రజాస్వామ్యము అనేక లోపములతో కూడుకొని ఉండెను. ప్రస్తుత కాలమందలి సంప్రదాయ మును బట్టి విమర్శించిన ఎడల అది ప్రజాస్వామ్యము కాదనియే చెప్పవలసి ఉండును. ఏథెన్స్ పట్టణములోని ప్రజలందరు ప్రజాస్వామ్యములో పాల్గొనుటకు అర్హులు కాకుండిరి. ప్రజలలో పౌరులుగ పరిగణింపబడినవారే దానికి అర్హులు. ప్రజలలో చాలభాగము బానిసవర్గము నకు చెందినవారు. వారు పౌరవర్గములో చేరకుండిరి. ఇదిగాక, వణిగ్వర్గములో చేరినవారు అనేకులు మొదటి నుండియు ఏథెన్స్‌లో కాపురము ఉండినవారు కాక, విదేశములనుండియు, ఇతర నగరములనుండియు అక్కడికి వచ్చినవారు. ఎన్ని తరములుగనో వారు అచట కాపురము చేయుచుండినను, పౌరవర్గములో చేరుటకు వారికి అర్హత లేని కారణమున వారు కూడ ప్రజాస్వామ్యము అనుభవింప లేని వారైరి. ఇదిగాక స్త్రీలు పౌరులుగ పరిగణింపబడెడి వారు కారు. అందుచేత వారు కూడ పరిపాలనాధికార మును వహించుట సాధ్యము కాదయ్యెను. వయోజను లందరకు వోటిచ్చు హక్కు, శాసనసభ్యులు అగుటకు హక్కు, అర్హతను బట్టి ఉద్యోగములలో ప్రవేశించు హక్కు ఉన్నగాని ఏ రాజ్యాంగము ప్రజాస్వామ్యము అను పేరుకు తగి ఉండదని ప్రస్తుతకాలమున అందరు అంగీకరించు చున్నారు. ఏథెన్స్‌లో ఇట్టి హక్కులు పౌరులకు మాత్రమే ఉండెను. పౌరులలో తరతమ భేదములు, అధికార, అనధి కార భేదములు లేని కారణమున అప్పటి ప్రభుత్వము ప్రజాప్రభుత్వముగ పరిగణింపబడినది; కాని, ప్రజలు అందరి దృష్ట్యా పరిశీలించిన ఎడల అది అల్పసంఖ్యాకుల ప్రభుత్వము అనియే చెప్పదగి ఉన్నది.

ఇట్టి ప్రజాస్వామ్యము కూడ శాశ్వతముగ నిలబడలేక పోయినది. భూస్వాములు, ధనికవర్గమునకు చెందిన తది తరులు కుట్రలు చేయుచునే ఉండిరి. ఇట్టి అంతఃకలహ ముల వలన అనేక నగరములు సర్వనాశనములు అయ్యెను. నగరరాజ్యముల క్షయమునకు ఇది ఒక కారణము. ఇది గాక గ్రీస్‌దేశమందు అనేక నగర రాజ్యములు ఉండిన కారణమున ఒక పట్టణమునకును, మరియొక దానికిని పర స్పర విరోధము తప్పదయ్యెను. ఇట్టి యుద్ధముల మూల మున పట్టణములు అన్నియు చితికిపోయి, తుదకు స్వాతంత్ర్య మును కోల్పోయి పరుల పాలనమునకు లోబడెను. కాని, అవి స్వాతంత్ర్యము అనుభవించిన కాలములో - అనగా క్రీ. పూ. సుమారు 1000 మొదలు 300 వరకు - వానియందలి పరిపాలన అనేకములగు మార్పులు చెందెననియు, ప్రథమ దశయందు రాజత్వము, ద్వితీయ దశయందు ప్రముఖ ప్రభు త్వము, తృతీయ దశయందు అక్రమ నిరంకుశత్వము, చతుర్థ దశయందు ప్రజాస్వామ్యము పరిపాలనా విధాన ములుగ ఉండెననియు స్పష్టమగుచున్నది.

గ్రీస్‌లోనినగరరాజ్యములనుజయించి దేశమును అంతయు వశపరచుకొనినవారు రోమన్‌లు. రోమ్ పట్టణవాసులకు రోమన్‌లని పేరు. రోమ్‌పట్టణము ఇటలీదేశమందు ఉన్నది.

మొట్టమొదట ఈ రోమ్ పట్టణమును రాజులు పాలించు చుండిరి. వారికి సహాయముగ ప్రముఖ సభ ఒకటియు,

ప్రజా సభ ఒకటియు ఉండెను. రాజులలో చివరవారు నిరంకుశులై, నియంతలవలె ప్రవర్తింప దొడగిన కారణమున ప్రజలు వారిపై తిరుగుబాటు చేసి, సింహాసనమునుండి వారిని తొలగించిరి. దాని ఫలితముగ ప్రముఖ ప్రభుత్వము స్థాపితమయ్యెను. అధికారమును దుర్వినియోగము చేసిన కారణమున రాజులను తొలగించవలసిన అవసరము రోమన్‌లకు కలిగెను. అట్టి దుర్వినియోగము జరుగకుండుటకై వారు ఒక క్రొత్త ఏర్పాటు చేసికొనిరి. పట్టణమును రాజు పాలించుటకు బదులు, ఇద్దరు అధికారులు పాలించవలెననియు, ఒకరి శాసనములు అధిక్షేపించుటకు రెండవ వానికి అధికారము ఉండవలెననియు వారు నిర్ణయించుకొని, ఏటేట ఇద్దరు అధికారులను –' కాన్‌సల్స్' అను పేర–ఎన్నుకొనసాగిరి. ఒకరి అజ్ఞలను అధిక్షేపించగల ఇతర అధికారులను నియమించుటవలన నిరంకుశత్వమును నివారించుటకు మార్గము ఏర్పడునని నిర్ణయించుకొనుటయే రోమన్ రాజ్యాంగములోని విశిష్టత. అందుచేత వారు ఒక్కొక్క ఉద్యోగమందును ఒక అధికారిని నియమించుటకు బదులు ఏక కాలమున అనేకులను నియమించుచుండిరి. ఒకే ఉద్యోగమునందు ఉండు అధికారులు ఒకరి అజ్ఞలను మరియొకరు అధిక్షేపించు అవకాశము కలవారుగ ఉండిరి. అందుచేత చాలవరకు నిరంకుశత్వ ప్రమాదము రోమన్‌లకు లేదయ్యెను.

రాజులు తొలగిన తర్వాత పరిపాలనాధికారము అగ్ర వర్ణమునకు జెందిన పెట్రీషియన్‌లు అను పుర ప్రముఖుల పరమయ్యెను. ఉద్యోగములు, అధికారము, భూములు, పూజా పురస్కారములు చేయించు హక్కు మొదలగునవి వారి వశమందు ఉండెను. సామాన్య వర్గమునకు చెందిన ప్రజల (ప్లెబియన్‌ల) కు అట్టి అధికారములు గాని, లాభములు గాని, గౌరవములు గాని లేవయ్యెను. క్రమక్రమముగ ప్లెబియన్‌లలో అసంతృప్తి పెరిగినది. వారు ప్రముఖులపై తిరుగుబాటుచేసి రోమ్ నగరమును వదలి మరియొక నగరమును కట్టుకొనెదమని బెదరించిరి. వారి సాహాయ్యము లేక పట్టణ స్వాతంత్ర్యమును నిలబెట్టుకొనుట పెట్రీషియన్‌లకు సాధ్యముకాని పని. ప్లెబియన్‌ల సంఖ్య అధికము; సైన్యములో చేరి యుద్ధము చేయుచుండినవారు వారే. అందుచేత వారి కోరికలను మన్నింపకుండుట పెట్రీషియన్‌లకు సాధ్యముకాక తుదకు రాజకీయ, ఆర్థిక, సాంఘిక విషయములు అన్నిటిలో కూడ వారికి సమానమైన హక్కులను కల్పించిరి. సమానత్వమునకై ఈ పోరాటము క్రీ. పూ. 500 నుండి 287 వరకు జరిగెను. క్రీ. పూ. 287 నాటికి ప్లెబియన్‌లు, పెట్రీషియన్‌లు సమానులై, వాస్తవమైన ప్రజాస్వామ్యము స్థాపితమయ్యెను.

కాని, రోమ్ పట్టణములో ఏర్పడిన ప్రజాస్వామ్యము ఏథెన్స్‌లో ఏర్పడిన ప్రజాస్వామ్యము అంతటి శుద్ధమైనది కాదు. ఈ రెండు పట్టణములలోని పరిస్థితులు భిన్న మార్గములందు నడచిన కారణమున ప్రజాస్వామ్య విధానమునందు కూడ కొన్ని భేదములు ఏర్పడెను. రోమ్ పట్టణము ప్రారంభములో ఇతర పట్టములవలె ఉండినను క్రమముగ గొప్ప బలమును సంపాదించి ఇటలీ దేశమునే కాక, మెడిటరేనియన్ సముద్రప్రాంతమందు ఉండిన దేశములు అన్నిటిని - గ్రీస్, గాల్, స్పెయిన్, సిరియా, ఈజిప్టు, ఉత్తర ఆఫ్రికా దేశములను - జయించగలిగెను. ఇట్టి సామ్రాజ్య సంపాదనాప్రయత్నమందు రోమ్ ప్రజలు నిమగ్నులైన కారణమున పరిపాలనాధికారము ప్రజలందరి అధీనముకాక సమర్థులగు కొందరు ప్రముఖుల యొక్కయు, వారి అధీనతలోని సభయగు సెనేట్ యొక్కయు అధీనము అయ్యెను. పేరునకు సర్వాధికారము ప్రజాసభదే. ఆ సభలో పెట్రీషియన్‌లు, ప్లెబియన్‌లు, ధనికులు, దరిద్రులు అందరును సభ్యులుగ ఉండిరి. ఆ సభ యొక్క అనుమతి లేక శాసనములు చేయుటకు గాని, ఉద్యోగస్థులను ఎన్నుకొనుటకు గాని వీలులేదు. కాని, సామ్రాజ్య సంపాదనమునకును, సంపాదించిన సామ్రాజ్యమును నిలబెట్టుకొనుటకును నిరంతరము యుద్ధములు చేయవలసిన అవసరము ఏర్పడుటచేత సభలలో సమావేశము కావలసిన పౌరులలో అధిక సంఖ్యాకులు ఎల్లపుడు యుద్ధరంగమున ఉండవలసిన వారైరి. ఇదికాక, యుద్ధకాలములందు పరిపాలనా వ్యవహారములను పరిష్కరించుటకు చిన్న సభలు ఎక్కువ సామర్థ్యము కలవిగ ఉండును గాని, వేలకొలది జనముతో కూడిన ప్రజా సభలు లాభకరములు కాజాలవు; చర్చలు రహస్యముగ జరుగవలసి ఉండును; కాలయాపన లేక కార్యములను సాధించవలసిన అవసరము ఉండును; సైనిక వ్యూహములను పన్నుటయందును, రాజనీతియందును ప్రజ్ఞగలవారి సలహా ఎక్కువ అవసరము అగును. ఈ అవసరములు అన్నియు ప్రముఖులతో కూడిన సెనేట్ సభ చక్కగ తీర్చగలదిగా ఉండెను. అందుచేత, సెనేట్ సలహాలను అనుసరించి ప్రజాసభ వర్తించుట సంప్రదాయమైనది.

క్రీ. పూ. 100 నాటికి రోమ్ పట్టణము విశాలమగు సామ్రాజ్యముపై సర్వాధికారమును వహించెను. జయింపబడిన రాష్ట్రములలోని ప్రజలను పాలించు అవకాశము ప్రముఖులకు లభించెను. కాని, ప్రముఖులు ఈ అవకాశమును దుర్వినియోగము చేసిరి. రాష్ట్ర ప్రజలను దోచి, పీడించి పిప్పిచేయుచుండిరి. ఆ దోపిడిలో కొంత భాగము

రోమ్ పట్టణములోని సామాన్య ప్రజలకు ఇచ్చి వారి నోళ్లను కట్టివేయ జూచిరి. రాష్ట్ర ప్రజల స్థితిని చక్కబరుచుటకు ప్రముఖులు కాని, తదితరులు కాని ప్రయత్నించరైరి. వారిని దోచుకొను అధికారమునకై ప్రముఖులలో కక్షలు, అంతఃకలహములు బయలుదేరెను. వీని ఫలితముగ ఒక పక్షమునకు నాయకుడైన జూలియస్ సీజర్ [చూ.] సైన్యములకు అధిపతియై విరోధి పక్షము వారిని ఓడించి, సామ్రాజ్యమునకు అంతకు నిరంకుశుడగు పాలకుడు అయ్యెను. ఆ తరువాత సుమారు అయిదువందల సంవత్సరముల వరకు - అనగా క్రీ. శ. 476 వరకు - నిరంకుశులగు చక్రవర్తుల పరిపాలనము రోమ్ సామ్రాజ్యమందు సాగెను. అనేక దేశములు ఒకే దేశ పరిపాలనకు లోబడి ఉండుటయే సామ్రాజ్యమునకు ముఖ్య లక్షణము. అట్టి సామ్రాజ్యమును పరిపాలించుటకు తగిన రాజ్యాంగ విధానమును రోమ్ చక్రవర్తులు నిర్మాణము కావించిరి. పాశ్చాత్య రాజ్యాంగ వ్యవస్థాపరిణామ చరిత్రలో రోమ్ సామ్రాజ్య రాజ్యాంగమునకు ఇందు మూలముననే ప్రాధాన్యము కలుగుచున్నది. ఈ విధానమునందు రెండు, మూడు ప్రధాన లక్షణములు గమనింపదగి ఉన్నవి. సామ్రాజ్యముయొక్క ప్రారంభ దశలో రోమ్ పట్టణ ప్రజలు అధికులనియు, సామ్రాజ్యములోని తక్కిన ప్రజలు అల్పులనియు పరిగణింపబడుచుండిరి. చక్రవర్తులు క్రమక్రమముగ ఈ భేదములను తొలగించి సామ్రాజ్యములోని ప్రజలందరు సమాన హక్కులు కల పౌరులని శాసించిరి. సామ్రాజ్యము నిలబడుటకు ఇట్టి సమత్వమే ప్రధాన ఆధారమని వారు రుజువు చేసిరి.

ఇదిగాక, రోమ్ చక్రవర్తులు సామ్రాజ్యమును అనేక రాష్ట్రములుగ విభజించి, ఒక్కొక్క రాష్ట్రమును పాలించుటకు సమర్థులును, అనుభవజ్ఞులును అగు ఉద్యోగస్థులను నియమించిరి. వారు ప్రజలను పీడింపకుండునట్లు ఏర్పాటులు అనేకములు కావించిరి. ప్రతి రాష్ట్రమునందును ప్రసిద్ధిగాంచిన పట్టణములు అనేకములు ఉండెను. స్థానిక వ్యవహారములను పాలించుటకు ప్రతి పట్టణమునందును పౌర సభలు ఉండెను. ఈ సభలు ఎన్నుకొనిన ఉద్యోగస్థులు పరిపాలనము సాగించుచుండిరి. ఇంతకంటె ప్రధాన విషయము ఇంకొకటి కలదు. రోమ్ సామ్రాజ్యమును స్థాపించుటకు పూర్వము ఈ రాష్ట్రములలో అనేక విధములగు చట్టములు, స్మృతులు, ధర్మ శాస్త్రములు ఉండెను. రోమ్ చక్రవర్తులు ఈ భిన్నత్వమును క్రమక్రమముగ తొలగించి, ఒకే విధమగు న్యాయవిధానమును సామ్రాజ్యమందు అంతట ప్రవేశ పెట్టిరి. ఇప్పటికి కూడ యూరప్ ఖండమందలి దేశములలోని న్యాయ విధానమునకు ఇదియే ఆధారముగ ఉన్నది.

రోమ్ చక్రవర్తుల అధికారము నిరంకుశమైనను, ప్రజలందరు వారిని దైవ సములుగ పూజించవలసినట్లు ఏర్పడినను, ప్రజల సౌఖ్యము వృద్ధికాంచుటకును, రెండు-మూడు వందల సంవత్సరములపాటు యుద్ధము అనిన ఏమియో తెలియక ప్రజలు శాంతి భద్రతలను అనుభవించుటకును అధికారము వినియోగింపబడుటయే వారి పరిపాలనా విధానములోని విశేషము. ఈ సందర్భమున రాజ్యాంగ వ్యవస్థా పరిణామమున గమనించవలసిన విషయములు రెండు కలవు. అధికారమును వహించవలసిన వారు ఎవ్వరెవ్వరు అనునది మొదటి విషయము. అధికారము ఎట్లు వినియోగమయ్యెను అనునది రెండవ విషయము. ఈ రెండు విషయములలో కాలభేదమును బట్టి కలిగిన మార్పులను వివరించుటయే రాజ్యాంగ వ్యవస్థా పరిణామ చరిత్ర. ఈ సూత్రమును అనుసరించి రోమ్ రాజ్యాంగ వ్యవస్థా పరిణామమును విమర్శించిన ఎడల సామ్రాజ్య కాలమున అధికారము అంతయు నిరంకుశులగు చక్రవర్తుల అధీనతలో ఉండెననియు, దానిని వారు చాలవరకు ప్రజలందరి సౌఖ్యమునకై వినియోగించిరనియు చెప్పవచ్చును.

మధ్య యుగము ; అనాగరకులగు జర్మనుల దండయాత్రల మూలమున అయిదవ శతాబ్దములో రోమ్ సామ్రాజ్యముతోపాటు ప్రాచీన రాజ్యాంగ వ్యవస్థయు అంతరించినది. దాని స్థానమున మధ్యయుగమందు పశ్చిమ యూరప్‌లో అనేక నూతన లక్షణములతో కూడిన రాజ్యాంగము ఏర్పడెను. దీనికిని, ప్రాచీన రాజ్యాంగమునకును ఎట్టి పోలికలు లేవని కూడ చెప్పవచ్చును.

అప్పటికి క్రైస్తవమత పీఠాధిపతి అగు పోప్‌నకు ప్రజలలో మిక్కిలి పలుకుబడి ఉండెను. అతని క్రింద మతాధికారులు అనేకులు ఉండిరి. చక్రవర్తులు అదివరకు చేయుచుండిన పనులు అనేకములను ఇట్టి సందర్భములలో పోప్‌లు చేయుచుండిరి. వారి అధికారము వృద్ధికాంచెను. కొంత కాలము కడచునప్పటికి రాజుల అధికారముకంటె వారి అధికారమే అధికమయ్యెను. మధ్యయుగమందు ఈ కారణము చేత వారికిని, రాజులకును మధ్య పోటీలు, స్పర్ధలు ఏర్పడుట కూడ సంభవించెను [చూ. పోప్‌లు].

రోమ్ సామ్రాజ్యము ఉచ్చస్థితియందు ఉండిన కాలములో పశ్చిమ యూరప్ అంతయు ఒకే కేంద్రప్రభుత్వ పరిపాలనకు లోబడి ఉండెను. ఈ సామ్రాజ్యమును వినాశము కావించిన జర్మనులు అనేక తెగలుగ విభాగమై ఉండిరి. అందువలన ఏ స్థానమందు కాపురము చేయుచుండినవారు వారికి తోచినట్లు రక్షణ సాధనములను కల్పించుకొనవలసిన వారైరి. ఇట్టి ప్రయత్నముల ఫలిత

ముగ భూస్వామిక వ్యవస్థను అనుసరించిన రాజ్యాంగ విధానము మొలకెత్తి, క్రమక్రమముగ ప్రబలమయినది.

భూస్వామ్యమును బట్టి రాజకీయాధికారమును చలాయించుటయే భూస్వామిక పద్ధతి యొక్క ప్రధాన లక్షణము. భూస్వాములైనవారు వారి భూములలో నివసించువారిపై అధికారము వహించి, వారి వివాదములను పరిష్కరించుచు, వారివద్ద పన్నులు వసూలు చేయుచు, అవసరమైనపుడు శాసనములు చేయుచు చిన్న చిన్న రాజులవలె ప్రవర్తించుచుండిరి. అధికారము రాజునందు కేంద్రీకృతమగుటకు బదులు అనేక భూస్వాముల పరమయ్యెను. దేశమునకు అంతకు రాజు ఒకడు ఉండినను, అతనికి ప్రజలందరిపై ప్రత్యక్షాధికారము లేకుండెను. దేశమునంతటిని రక్షించుటకు సైన్యములు అవసరమైనపుడు రాజు భూస్వాముల సాహాయ్యము కోరుచుండెను. వారు వారి అనుచరులతో రాజునకు సాహాయ్యము చేయుచుండిరి. వారి సాహాయ్యము లేనిచో రాజు దుర్బలుడై ఉండుట తప్పదు. భూస్వాముల మధ్య వివాదములు సంభవించినపుడు రాజు వానిని పరిష్కరించుచుండెను. అట్టి పరిష్కారము సాధారణముగ భూస్వాములతో కూడిన రాజసభయందు జరుగుచుండెను. దేశమునకు అంతకు సంబంధించిన చట్టములు చేయవలసి వచ్చినపుడును, భూస్వాముల వద్దనుండి ఎక్కువ పన్నులు వసూలు చేయవలసిన అవసరము ఏర్పడినపుడును రాజులు అట్టి సభలను సమావేశపరచుచు, వాని సాహాయ్యమునను, సలహాలతోడను వారి ఉద్దేశములను నెరవేర్చుకొనుచుండిరి. ఒక్కొక్కప్పుడు భూస్వాములు వారి వివాదములను రాజసభల సాధనమున పరిష్కారము చేసికొనుటకు బదులు, ఒకరితో ఒకరు యుద్ధములు చేసికొని పరిష్కరించుకొనుచుండిరి. సామాన్యముగ అట్టి యుద్ధములు అనేకములు జరుగుచు దేశశాంతికిని, ప్రజల భద్రతకును భంగము కలిగించుచుండెను. బొత్తుగ రక్షణలేని కాలమున కొద్దిపాటి రక్షణ భూస్వామిక విధానములో ప్రజలకు లభించిన మాట వాస్తవమే కాని, మొత్తముమీద ఆ విధానము సౌష్ఠవమైన రాజ్యాంగ విధానము కాదనియే చెప్పవలసి ఉన్నది.

క్రీ. శ. 12 వ, 13 వ శతాబ్దములందు ఈ పరిస్థితులు కొంతవరకు మారసాగెను. ఇంగ్లండుదేశమందును, క్రమక్రమముగ ఫ్రాన్సుదేశమందును ప్రజ్ఞావంతులును, బలవంతులును అగు రాజులు అధికారమునకు వచ్చిరి. వారు భూస్వాముల అధికారమును తగ్గించుటకును, తమ అధికారమును వృద్ధి చేసికొనుటకును కావలసిన ఉపాయములను, సాధనములను నిర్మాణము కావించిరి. భూస్వాములతో జోక్యములేక స్వయముగ కొంత సైన్యమును తయారు చేసికొనిరి. వివాదమును పరిష్కరించుకొనుటకు ప్రత్యేక న్యాయస్థానములను ఏర్పాటు చేసిరి. భూస్వాములు కూడ రాజులు కోరినపుడు వారి వారి అనుచరులతో వచ్చి రాజులకు సాహాయ్యము చేయుటకుబదులు కొంత ధనమును చెల్లించి సాహాయ్యము చేయు బాధ్యతను తప్పించుకొనుటకు సిద్ధపడిరి. ఇది కూడ కాలక్రమమున రాజుల బలము వృద్ధిగాంచుటకు మిక్కిలి తోడ్పడెను. భూస్వామిక విధానముతో కాక మరికొన్ని విధానములు కూడ కలవు. దండయాత్రల తీవ్రత తగ్గిన కారణమున వర్తక, వ్యాపారములకు ఎక్కువ అవకాశము లభించెను. దాని మూలమున పట్టణములు అనేకములు స్థాపితములు అయ్యెను. పట్టణములోని వర్తకులు వ్యవసాయముపై ఆధారపడవలసిన అవసరము లేక ధనమును సంపాదించ గలవారైరి. పట్టణవాసులు మరికొందరు పరిశ్రమలను సాగించి ధనికులైరి. వీరికి భూస్వామిక వ్యవస్థ గిట్టలేదు. భూస్వాములు పరస్పరము యుద్ధములు కావించుచు, సుంకములను విధించుచు వర్తక - వ్యాపారములకు భంగము కలిగించుచుండిరి. అందుచేత వారి అధికారము నిర్మూలనము కావించుటయే శ్రేయస్కరము అను భావము పట్టణవాసులలో వ్యాపించెను. రాజులకు కూడ అట్టి ఉద్దేశ్యమే ఉండిన కారణమున పట్టణవాసులు రాజులతో కలసి రాజుల అధికారమును బలపరచిరి. దీని మూలమున కూడ భూస్వామిక వ్యవస్థ చాలవరకు మార్పుకాంచెను.

పట్టణములు అభివృద్ధి గాంచుటచేత రాజ్యాంగ విధానమున మరియొక మార్పు కూడ వృద్ధిగాంచెను. వ్యవసాయము ఒక్కటియే ప్రధాన వృత్తిగ ఉండినంతవరకు భూస్వాములు ఇచ్చు పన్నుల మీద రాజులు ఆధారపడి ఉండిరి. పట్టణములు వృద్ధిగాంచిన కారణమున వర్తకులపై పన్నులను విధించి ద్రవ్యమును సంపాదించుటకు రాజులకు అవకాశము లభించెను. కాని, పన్నులను చెల్లించవలసిన వారితో సంప్రతించి, వారికి నచ్చచెప్పి, అటుతరువాత వారిపై పన్నులను విధించుట మంచిపద్ధతి అను భావము రాజులలో వ్యాపించినది. వర్తకులపై పన్నులు విధించుటకు పూర్వము వర్తకుల ప్రతినిధులతో సంప్రదించుట లాభకరమని రాజులు భావించి, అట్టి ప్రతినిధులను కూడ రాజసభలకు ఆహ్వానింపసాగిరి. ఈ కారణముచేత రాజసభలలో భూస్వాములేకాక వర్తకుల ప్రతినిధులు కూడ హాజరగుట మామూలయ్యెను. పరిపాలనా విధానమునకు ఇదియొక ప్రధానాంగము అయ్యెను. మరింత సులభముగ పన్నులు వసూలుచేయు ఉద్దేశముతో రాజులు ఈ సభలను నిర్మించి

నేను, క్రమక్రమముగ ఈ సభలు రాజుల నిరంకుశాధి కారమును నియమబద్ధముగ చేయుటకు సాధనములు అయినవి.

కనుక, మధ్యయుగమందలి రాజ్యాంగవ్యవస్థా పరిణామములో చర్చి (క్రైస్తవమత సంస్థ) యొక్క అధికారము, భూస్వామిక విధానము, భూస్వాముల పలుకుబడి, పట్టణముల అభివృద్ధి, రాజసభల నిర్మాణము, రాజుల అధికార సంపాదనము మొదలగునవి ప్రధానముగా గమనింపదగిన విషయములు. మధ్యయుగము అరాజకముతో ప్రారంభమైనను, తుదకు అట్టి అరాజకము తొలగి బలిష్ఠమైన రాజ్యాధికారము ఏర్పడెను.

**ఆధునిక యుగము - ప్రథమ భాగము :** రాజ్యాంగము దృష్ట్యా మధ్యయుగమునకు అధికార విచ్ఛేదము ప్రధాన లక్షణము. వ్యక్తులపై ఒక్కొక్క సంస్థ అధికారమును వహించి ఉండెను. మత విషయములందు చర్చి అధికారమునకును, ఆర్థిక విషయములందు పల్లెటూళ్లలోనివారు భూస్వాముల అధికారమునకును, పట్టణములలోని పారిశ్రామికులు, వర్తకులు నగర సంఘముల అధికారమునకును లోబడి ఉండిరి. దేశమును పాలించు రాజులకు గల అధికారము మిక్కిలి సంకుచితముగ ఉండెను. ఆధునిక యుగమున అది మార్పుగాంచెను. చర్చి యొక్క అధికారము ఎక్కువ గాను, ఆర్థిక విషయములలో భూస్వాములకును, నగర సంఘములకును ఉండిన అధికారము పూర్తిగాను రాజుల వశమై రాజత్వము సంపూర్ణాధికారము కలది అగుటయే కాక, నిరంకుశ రూపమును కూడ ధరించెను. పశ్చిమ యూరప్‌లో ఏర్పడిన రాజ్యములు అన్నియు నిరంకుశులును, సర్వస్వతంత్రులును అగు రాజుల పరిపాలనములోనికి వచ్చుటయే ఆధునిక యుగ రాజ్యాంగ వ్యవస్థలో ప్రథమ భాగమున కలిగిన గొప్ప మార్పు.

ఇదిగాక 16 వ శతాబ్దము నాటికి యూరప్‌లోని కొన్ని దేశములలో క్రొత్త అవసరములు ఏర్పడినవి. భారత దేశమునకు క్రొత్త మార్గము లభించిన కారణమున వర్తక వ్యాపారములకు ఎక్కువ అవకాశము ఏర్పడెను. భూస్వాములు విధించుచుండిన సుంకములు, నగర సంఘములు వర్తక విషయములో చేయుచుండిన చట్టములు దేశములోని వ్యాపారమునకు ఆటంకము కలిగించుచుండెను. స్థానిక లాభమును అపేక్షింపక దేశము అంతటి సమష్టి లాభమును అపేక్షించి వర్తక వ్యాపారముల గురించిన చట్టములను చేయుట అవసరమయ్యెను. అట్టి అవసరమును దేశమునంతను పాలించు రాజులు తీర్పగలరు గాని భూస్వాములు గాని, నగర సంఘములవారు గాని తీర్పగలవారు కారు. రాజుల యొక్క అధికారము ప్రబలుటకును, అట్టి అధికారమును ప్రజలు అందరు ఆమోదించుటకును ఇది యొక కారణము. వర్తక వ్యాపారములు వృద్ధిగాంచుటకు, భూస్వాముల అధికారమును అణచుటకు కూడ రాజుల అధికారము ఆవశ్యకమయ్యెను. వారు ఒకరితో ఒకరు కావించుచుండిన యుద్ధములు దేశమందలి అంతశ్శాంతికి భంగకరమగుచుండెను. శాంతిని స్థాపించి, వర్తక వ్యాపారములను వృద్ధిపరచుటకు సంపూర్ణాధికారము గల రాజులు ఉండవలసి వచ్చెను. ఇదిగాక, వర్తక వ్యాపారములకై ఇంగ్లండు, స్పెయిన్, ఫ్రాన్స్ మొదలగు దేశముల మధ్య విపరీతమైన పోటీ ప్రారంభమయినది. దీని మూలమున ఇతర దేశములతో యుద్ధములు కూడ సంభవించినవి. వీనిని దక్షతతో సాగించి జయమును సంపాదించుటకు భూస్వామిక సైన్యములకు సామర్థ్యము లేదయ్యెను. చక్కగ తర్ఫీదు పొందిన సైన్యములను సమకూర్చి దేశములోని సర్వశక్తులను ఏకోన్ముఖము చేసి, ఏకోద్దేశముతో యుద్ధములను సాగించ గల ప్రభుత్వము అవసరమయ్యెను. సంపూర్ణాధికారము గల రాజులు మాత్రమే దానిని ఆ కాలమున తీర్పగల వారైరి. ఇన్ని పరిస్థితులు కలయుటచేత అధికారము అంతయు రాజులలో కేంద్రీకృతము అయ్యెను.

గ్రీస్ నగరములలో ప్రముఖుల ప్రభుత్వమునకును, ప్రజా స్వామ్యమునకును మధ్య నిరంకుశులగు నియంతలు అధికారమునకు వచ్చినట్లు, యూరప్ ఖండమునందు అనేక దేశములలో భూస్వామిక విధానము అంతరించి, ప్రజాస్వామ్యము స్థాపితమగుటకు పూర్వము నిరంకుశులగు రాజులు అధికారమునకు వచ్చిరి. 16 వ శతాబ్దమందు జరిగిన మత సంస్కరణోద్యమమువలన ఇంగ్లండు వంటి కొన్ని దేశములలో రాజులే మతాధికారులైరి. తక్కిన దేశములలో కూడ అనేక మత విషయములందు వారి అధికారము వృద్ధి గాంచెను. చర్చి అధీనమందు ఉండిన భూములను రాజులు వశపరచుకొని చర్చికి చెందిన న్యాయస్థానములను రద్దు చేసిరి. ఇదికాక ఆ కాలమున రాజుల ప్రభుత్వోద్యోగములందు ప్రవేశించిన వారిలో ప్రముఖులగు వారు అనేకులు రోమన్ స్మృతి విధానమున పాండిత్యము సంపాదించి, అందులోని సిద్ధాంతముల ఎడల గౌరవము గలవారై, వానిని అనుసరించి పాలనము జరుపుటయందు శ్రద్ధవహించి ఉండిరి. చక్రవర్తి యొక్క నిరంకుశత్వము రోమన్ స్మృతి శాస్త్రమునకు ఆధారము అగుటచేత అదియే ఉత్తమమైన రాజ్యాంగము అను అభిప్రాయము వీరికి ఉండెను. వీరందరు రాజుల నిరంకుశత్వమును పోషించిన వారైరి.

ఈ సందర్భములో మరియొక విశేషమును కూడ గమనించవలసి ఉన్నది. మధ్య యుగమందు మతాధికారులు ఒక్కరే విద్యావంతులుగ ఉండిన కారణమున మంత్రి పదవులు, ఇతర లౌకికోద్యోగములు వారి వశమందు ఉండెను. ఆధునిక యుగమున ఈ పరిస్థితి మారినది. 15 వ శతాబ్దము నుండి ఇతర వర్గములకు చెందిన వారు కూడ విద్యలు నేర్చుకొనుటయందు శ్రద్ధవహించిరి. వారిలో సమర్థులగు వారిని రాజులు తమ ఉద్యోగములలో చేర్చుకొని, వారి సాహాయ్యమున పరిపాలనను సాగించుకొనుట ఆచారమయ్యెను. ఈ ఉద్యోగస్థులు రాజులయందు భక్తి గలవారై పరిపాలనము చక్కగ జరుగుటకు కావలసిన సంస్కరణములు అనేకములను చేసిరి. కొన్ని రాజ్యములందు ఇట్టి ఉద్యోగస్థులు ఒక ప్రత్యేక వర్గముగ ఏర్పడి పరిపాలనా నిర్వహణమునందు విశేష ప్రజ్ఞను సంపాదించగలవారైరి. అట్టి వర్గము ఒకటి వృద్ధి గాంచిన కారణమున చర్చి యొక్కయు, భూస్వాముల యొక్కయు జోక్యము లేక నిరంకుశులగు రాజులు పరిపాలనా భారమును సమర్థతతో వహింపగలవారు అయిరి. ఈ వర్గము ప్రష్యా రాజ్యమున మొట్టమొదట ప్రసిద్ధిగాంచెను. ఆధునిక రాజ్యాంగమునందు ఇది యొక ప్రధాన భాగమని చెప్పదగి ఉన్నది.

ద్వితీయ భాగము: నిరంకుశరాజత్వము మూలమున రాజ్యములోని ప్రజలలో ఐకమత్యము అభివృద్ధిగాంచి జాతీయ భావము నాటుకొనెను. చట్టములందును, న్యాయ పరిపాలనమందును, వర్తక వ్యాపారములందును రాజ్యములో ఒక ప్రాంతమునకును, మరియొక ప్రాంతమునకును మధ్యయుగమందు ఏర్పడిన భేదములను నిరంకుశులగు రాజులు చాల వరకు తగ్గించి రాజ్యమందు అంతట ఒకే పరిపాలనా విధానమును ఏర్పరచిరి. రెండుమూడు వందల సంవత్సరములు ఒకే విధానమునకు ప్రజలు అలవాటుపడిన కారణమున వారిలో అదివరకు ఉండిన భిన్న భావములు తొలగి, ఏక భావము వృద్ధి గాంచెను. ఆర్థిక విషయమున దేశము బాగుపడుటకు కావలసిన ఏర్పాటులు అనేకములను నిరంకుశులగు రాజులు కావించిరి. వారు క్రొత్త పరిశ్రమలను స్థాపించియు, వ్యవసాయమును చక్కబరచియు మధ్యవర్గమువారి ఆర్థికాభివృద్ధికి ఎంతో తోడ్పడిరి. నిరంకుశత్వములోని సుగుణములు ఇవియే; కాని, వీనితోపాటు కొన్ని గొప్ప లోపములు కూడ నిరంకుశత్వమునందు ఉండెను. నిరంకుశులగు రాజులు ఇతర మతములవారిని బాధించుచుండిరి. ఇదికాక వారు ప్రజలపై అధికములైన పన్నులు విధించి వచ్చిన ఆదాయములో చాల భాగమును యుద్ధములకును, విలాసములకును, స్వాభిమానుల పోషణమునకును ఖర్చు పెట్టుచుండిరి. కష్టపడి ప్రజలు ఆర్జించిన ధనములో చాలభాగము ఇట్లు వ్యర్థమగుటకు ప్రజలు ఇష్టపడరైరి. రాజుల చర్యలను విమర్శించుట గాని, అందులోని లోపములను సూచించుట గాని నేరముగ ఉండెను. నేరము చేసినట్లు రుజువుకాని వారిని కూడ కాలనియమము లేక కారాగారములో బంధించుట సర్వసాధారణముగ ఉండెను. నిరంకుశత్వమందు ఇన్ని లోపములు ఉండుటచేత దానిని తొలగించి దాని స్థానమున ప్రజా ప్రతినిధుల అధికారముతో కూడిన రాజ్యాంగమును నిర్మాణము చేయుట అవసరమయినది. ఇందుకు కావలసిన ఉద్యమము 1603 - 1688 మధ్య ఇంగ్లండునందు జరిగినది. ఇట్టి ఉద్దేశముతోనే - 1776 - 83, 87 లలో అమెరికా స్వాతంత్ర్య సంగ్రామము [చూ. పు. 271] తదుపరి ఫెడరల్ రాజ్యాంగ నిర్మాణము జరిగినవి. 1789 లో ప్రారంభమైన ఫ్రెంచి విప్లవము [చూ.] యొక్క ఉద్దేశము కూడ ఇదియే. ఈ మూడు విప్లవముల ప్రభావమున నిరంకుశత్వము తొలగి క్రమక్రమముగ యూరప్ ఖండమందలి దేశములందే కాక, అమెరికాలయందును, ఆస్ట్రేలియా, న్యూజీలండ్‌లందును, ఆసియా, ఆఫ్రికా ఖండములలోని కొన్ని దేశములందును 19 వ, 20 వ శతాబ్దములలో ప్రజాస్వామ్యము ఆధారముగాగల రాజ్యాంగ వ్యవస్థలు ఏర్పడినవి.

ఇట్టి రాజ్యాంగములకు దారితీసినది 1688 కి తరువాత ఇంగ్లండులో ఏర్పడిన పార్లమెంట్ రాజ్యాంగము. ఇంగ్లీషు రాజుల నిరంకుశత్వమును ఇంగ్లండులోని పార్లమెంట్ తొలగద్రోసెను. దాని ఫలితముగ సింహాసనముపై రాజు ఉండినను, పార్లమెంట్ యొక్క సమ్మతి లేక అతడు ఏ పని చేయుటకు అధికారము లేనివాడయ్యెను. పరిపాలనము అంతయు ఆతని పేర జరిగినను, శాసనములు చేయుట, పన్నులు విధించుట, ఆదాయమును ఖర్చుపెట్టుట మొదలగు పనులు అన్నిటికిని పార్లమెంట్ యొక్క అనుమతి అవసరమయ్యెను. పార్లమెంట్ యొక్క విశ్వాసమును సంపాదించిన వారినే మంత్రులుగ నియమించుకొనుటయు, ఆ విశ్వాసము అంతరించిన తరువాత వారిని పదవులలో నుండి తొలగించుటయు రాజులకు పరిపాటి అయ్యెను. కనుక, 1688 నాటి విప్లవ ఫలితముగ ఇంగ్లండులో ఏర్పడిన రాజ్యాంగ వ్యవస్థయందు మూడు ప్రధాన లక్షణములు గోచరములైనవి. లాంఛన ప్రాయము (నామమాత్రము)గ రాజు ఒకడు ఉండుట మొదటి లక్షణము; సర్వాధికారము గల పార్లమెంట్ ఉండుట రెండవ లక్షణము; పార్లమెంట్ యొక్క విశ్వాసమునకు పాత్రులైనవారు మంత్రులగుట

మూడవ లక్షణము. ఇవి అకస్మాత్తుగా ఒక్క త్రుటిలో ఏర్పడిన లక్షణములు కావు. వీనికి సంబంధించిన రాజ్యాంగ వ్యవస్థ క్రమక్రమముగా పరిణామము గాంచి, 19 వ శతాబ్దము ప్రారంభమగునాటికి నిజస్వరూపముతో వ్యక్తమయ్యెను.

అనేక లోపములతో కూడిన నిరంకుశ రాజత్వమును తొలగ ద్రోయుటకు యూరప్‌లోని ఇతర దేశములందు కూడ కొన్ని ఉద్యమములు బయలుదేరినవి. వానికి ప్రోత్సాహము కలిగించిన గ్రంథకర్తలు కొందరు ఇంగ్లండులోని రాజ్యాంగ వ్యవస్థ 'ఆదర్శ రాజ్యాంగ వ్యవస్థ' అని భావించి - దానిని ప్రశంసించుచు - అనేక గ్రంథములను వ్రాసిరి. అట్టి పనిని చేసిన వారిలో ఫ్రెంచి గ్రంథకర్తలు ఎక్కువ ప్రాముఖ్యమును వహించిరి. వారి ప్రచార ఫలితముగ ఫ్రాన్స్ మొదలగు దేశములలో విప్లవము జరిగి నిరంకుశులగు రాజుల అధికారము తొలగిన పిమ్మట ఇంగ్లీషు రాజ్యాంగము వంటి రాజ్యాంగమును అచ్చటివారు నిర్మాణము చేసికొనిరి. సాధారణముగ ఇతరులను అనుకరించుట మనుష్యునికి స్వభావము. ఒక దేశమందు వృద్ధిగాంచిన మతము, విజ్ఞానము, ఆర్థిక విధానములు, ఇతర దేశములలోనికి వ్యాపించుటకు అనుకరణ స్వభావమే కారణము. రాజ్యాంగ విషయములో కూడ ఇట్టి అనుకరణము 19 వ, 20 వ శతాబ్దములలో ఎక్కువగ జరిగెను. క్రొత్త రాజ్యాంగములు నిర్మించు ప్రయత్నములు జరిగిన దేశములు అనేకములలో చాలవరకు ఇంగ్లండులోని పార్లమెంట్ రాజ్యాంగము యొక్క అనుకరణము వ్యక్తమయినది.

యూరప్ ఖండములోని దేశములలో నిరంకుశ రాజత్వమును తొలగించుటకు చేయబడిన ప్రయత్నములు 1789 లో ఫ్రెంచి విప్లవముతో ప్రారంభమయినవి. ఈ విప్లవము గాని, నిరంకుశత్వమును తొలగించుటకు చేయబడిన మరి ఏ ఇతర ప్రయత్నములు గాని వెంటనే సాఫల్యము పొందలేదు. వాని నడక కూడ ఒకే తీరున సాగలేదు. అవి పూర్తి అగుటకు 130 సంవత్సరములు పట్టెను. ప్రథమ ప్రపంచయుద్ధము [చూ.] ముగిసిన తర్వాత-అనగా 1919-20 ప్రాంతమున గాని - మధ్య యూరప్, తూర్పు యూరప్ దేశములలో ఇట్టి రాజ్యాంగము స్థాపితము కాలేదు. క్రీ. శ. 1871 లో ఇట్టి రాజ్యాంగము ఫ్రాన్స్‌లో సుస్థిరము అయ్యెను. అంతకు కొంచెము ముందునో, వెనుకనో నార్వే, స్వీడెన్, డెన్మార్క్, బెల్జియమ్, హాలండ్, ఇటలీ మొదలగు దేశములలో ఇది నిర్మాణము అయ్యెను. బ్రిటిష్ సామ్రాజ్యములో చేరిన కెనడా, ఆస్ట్రేలియా, న్యూజీలండ్, దక్షిణ ఆఫ్రికా మొదలగు దేశములలో ఈ రాజ్యాంగము అనుకరింపబడెను.

ఇంగ్లండులో పార్లమెంట్ రాజ్యాంగము మొలకయెత్తిన కాలములో పార్లమెంట్‌నందు ప్రజలందరి ప్రతినిధులు ఉండలేదు. 1832 కు పూర్వము భూస్వాములు ఒక్కరే ప్రతినిధులను ఎన్నుకొనుచుండిరి. దేశమందు వర్తక వ్యాపారములు వృద్ధిగాంచుట చేతను, యంత్ర సాహాయ్యమున భారీ పరిశ్రమలు నెలకొనుట చేతను మధ్యవర్గము వారి పలుకుబడి వృద్ధిగాంచెను. తమకు కూడ పార్లమెంట్‌లో ప్రాతినిధ్యము ఉండవలెనని వారు ఆందోళన చేయసాగిరి. దానికి ఫలితముగ 1832 లో ప్రాతినిధ్యము లభించెను. తర్వాత క్రమముగ పట్టణములోని ఫ్యాక్టరీలలో పనిచేయు కార్మికులకును, పల్లెటూళ్లయందు వ్యవసాయము మొదలగు పనులు చేయు వారికిని, స్త్రీలకును ప్రాతినిధ్యము దొరకెను. 1928 లో జరిగిన సంస్కరణల మూలమున దేశములోని వయోజనులందరు - స్త్రీలు, పురుషులు - ఎన్నికలలో పాల్గొనువారైరి; ఫ్రాన్స్ మొదలగు దేశములలో ఇన్ని మెట్లు అవసరము లేక ప్రజలు అందరికిని ఎన్నిక హక్కు లభించెను.

రాజ్యాంగ నిర్మాణ విషయములో ప్రపంచమునకు ఇంగ్లండు దేశము పార్లమెంట్‌ను ప్రసాదించినట్లు, అమెరికా దేశము ఫెడరల్ రాజ్యాంగ విధానమును ప్రసాదించెనని చెప్పవచ్చును. స్వాతంత్ర్యమునకై ఇంగ్లీషు వారితో 1776 మొదలు 1783 వరకు యుద్ధము చేసిన అమెరికావారు 12 స్వతంత్ర రాజ్యములుగ ఏర్పడి ఉండిరి. ఈ రాజ్యములు అన్నియు కలసి యుద్ధము చేసినగాని జయము లభించదను భయము ఉండినందున వారు ఎంతో కష్టపడి 7 ఏండ్లు కలసి యుద్ధవ్యవహారములను జరిపించిరి. యుద్ధము ముగిసి స్వాతంత్ర్యము లభించిన పిమ్మట ఎవరి మార్గమున వారు ప్రవర్తింప సాగిరి. తమ ప్రవర్తన మూలమున తక్కిన రాజ్యములకు నష్టము కలుగునను ఆలోచన కొంచెము కూడ లేక రాజ్యములు ఇష్టము వచ్చినట్లు చట్టములను కావించుచు, ఇతర రాజ్యములనుండి వచ్చు సరకులపై సుంకముల విధించుచు అన్యోన్య భావము లేక మెలగుచుండిరి. కొంతకాలము అగునప్పటికి ఈ రాజ్యముల మధ్య యుద్ధములు సంభవించు పరిస్థితులు కూడ ఏర్పడెను. అట్టి సందర్భములో ప్రాజ్ఞులును, దూరదృష్టి గలవారును అగు నాయకులు కొందరు తమ రాజ్యముల స్థితిగతులను గురించి ఆలోచించి, కష్టపడి సంపాదించిన స్వాతంత్ర్యమును స్థిరముగ నిలబెట్టుకొనుటకు ఫెడరల్ రాజ్యాంగము ఒక్కటే ఉత్తమమైన సాధనమని భావించి,

అట్టి రాజ్యాంగమును నిర్మాణము కావించిరి. ఫెడరల్ విధాన ఫలితముగ ఒక్కొక్క రాజ్యమందు ఉండిన ప్రభుత్వముతో పాటు కేంద్రప్రభుత్వము ఒకటి స్థాపింపబడెను. దేశరక్షణ, విదేశవ్యవహారములు, ఎగుమతి - దిగుమతులకు సంబంధించిన ఏర్పాటులు, చలామణి, తులామానములు, రాజ్యముల మధ్య జరుగు వర్తక వ్యాపార సంబంధమగు అధికారములు అన్నియు కేంద్రప్రభుత్వ వశమయ్యెను. తక్కిన వ్యవహారములను గురించిన అధికారములు రాజ్య ప్రభుత్వము వశమందు ఉండెను. ఇట్టి అధికార విభజన [చూ. పు. 265] మే ఫెడరల్ రాజ్యాంగమునకు ప్రధాన లక్షణము. దీని మూలమున కలిసి పని చేయవలసిన వ్యవహారములు అన్నిటిలో కలిసి పని చేయుటకు అవకాశమును, స్వాతంత్ర్యము ఉండవలసిన వ్యవహారములలో స్వాతంత్ర్యమును అనుభవించుటకు అవకాశమును లభించెను. స్వాతంత్ర్య సంఘీభావములను రెంటిని సమన్వయపరచు శక్తి ఫెడరల్ విధానమునకు ఉన్నట్లు అమెరికా స్పష్టపరచిన కారణమున ఇతర దేశములు అనేకములు ఈ విధానమునే అనుసరించుటకు సిద్ధపడినవి. ఇట్టి దేశములలో స్విజర్లండ్, కెనడా, ఆస్ట్రేలియా దేశములు ప్రధానముగ పేర్కొనదగి ఉన్నవి. ఇతర రాజ్యములపై కూడ ఈ విధాన ప్రభావము కలదు.

ఫెడరల్ రాజ్యాంగ విధాన సృష్టియందే కాక మరి రెండు విషయములలో అమెరికావారు రాజ్యాంగ నిర్మాణమందు వారికి గల ఉపజ్ఞను ప్రదర్శించిరి. రాజులే కాక పార్లమెంట్లు కూడ నిరంకుశముగ ప్రవర్తించు స్వభావము కలవి అని స్వానుభవమువలన వారు తెలిసికొని ఉండిరి. అందువలన ప్రభుత్వములు నిరంకుశములు కాకుండుటకు సాధనములు కనుగొనుటయందు వారు ఎక్కువ శ్రద్ధ వహించి, అట్టి సాధనములను రెంటిని వారి రాజ్యాంగములో ప్రవేశపెట్టిరి. రాజ్యాంగచట్టమును లిఖితము గావించి, వ్యక్తుల ప్రాథమిక హక్కులను పేర్కొనుట మొదటి సాధనము. అట్టి ప్రాథమిక హక్కులకు భంగకరమగు చట్టములు చేయుట గాని, చేసిన చట్టములను అమలు పరచుట గాని న్యాయవిరుద్ధమని ప్రకటించుటకు వారు ఇట్టి సాధనమును సృష్టించిరి. ఇది ప్రభుత్వముల అధికారము నియమబద్ధముగ జేయుటకు గొప్ప సాధనమయ్యెనను అభిప్రాయము క్రమక్రమముగ ఇతర దేశములకు వ్యాపించెను. అందుచేత తక్కిన దేశములవారు కూడ వారి రాజ్యాంగ చట్టములను లిఖితములు గావించి, వారియందు వ్యక్తులు అనుభవింపదగిన ప్రాథమిక హక్కును పేర్కొనుట సంప్రదాయమయ్యెను. నిరంకుశత్వమును ఆపుటకు అమెరికావారు సూచించిన రెండవ సాధనము అధికార విభజనము. ప్రభుత్వమునకు మూడు రకముల అధికారములు కలవు. చట్టములు చేయు అధికారము మొదటిది. చేసిన చట్టములను అమలుపరచు అధికారము రెండవది. చట్టములకు విరుద్ధముగ పరివర్తించిన వారిని విచారణ చేసి, దండించు న్యాయాధికారము మూడవది. నిరంకుశులగు రాజులు/ఈ మూడు అధికారములను స్వయముగ చలాయించుచుండిరి. వ్యక్తుల స్వాతంత్ర్యమునకు అట్టి అధికార కేంద్రీకరణము మిక్కిలి హానికరముగ ఉండెను. ఇవి ఒక సంస్థలో కేంద్రీకరింపబడుట యుక్తము కాదనియు, ఒక్కొక్క అధికారము ఒక్కొక్క ప్రత్యేక సంస్థయందు ఉండవలెననియు ఇంగ్లీషు తత్త్వవేత్త యగు లాక్ [చూ.], ఫ్రెంచి తత్త్వవేత్త అగు మాంటెస్క్యూ [చూ.] ప్రతిపాదించి ఉండిరి. ఆ ప్రతిపాదనను అమెరికావారు వారి రాజ్యాంగమున ప్రవేశపెట్టిరి. 19 వ, 20 వ శతాబ్దములలో క్రొత్త రాజ్యాంగములను నిర్మించుకొనిన దేశములు అన్నింటియందును అధికారమునకు సంబంధించిన సూత్రములు చేర్చబడక పోయినను కొన్ని దేశములందు - ముఖ్యముగ మధ్య, దక్షిణ అమెరికా దేశములయందు - వీరికి ప్రాధాన్యము లభించెను. కనుక ఆధునిక రాజ్యాంగ వ్యవస్థా పరిణామములో అమెరికావారు నిర్మించిన ఫెడరల్ విధానమునకు ఎక్కువ ప్రాధాన్యము కలదని చెప్పవచ్చును. ఈ విషయములలో ఇతర దేశములవారు చాలవరకు అమెరికా రాజ్యాంగ వ్యవస్థను అనుకరించిరి.

ప్రజాస్వామ్యము ఒక్కటే ఆదర్శ రాజ్యాంగము అను అభిప్రాయము 19 వ శతాబ్దమందు యూరప్ ఖండమున ప్రాబల్యము కాంచెను. కాని, అన్ని దేశములందును అట్టి రాజ్యాంగ వ్యవస్థను స్థాపించుటకు అవకాశము లేక పోయెను. చక్రవర్తులు పాలించుచుండిన జర్మనీ, ఆస్ట్రియా, రష్యాలలో చాలవరకు నిరంకుశ విధానమే సాగుచుండెను. కాని, 1914 లో ప్రారంభమైన ప్రథమ ప్రపంచ యుద్ధ ఫలితముగ ఈ చక్రవర్తులు అంతరించిరి. సంగ్రామమందు జయము సంపాదించిన రాజ్యములలో ప్రధానములైనవి ప్రజాస్వామ్యము గల ఇంగ్లండు, ఫ్రాన్సు, అమెరికాలు అగుట వలన ఈ రాజ్యముల పలుకుబడి మిక్కిలి వృద్ధిగాంచెను. దీని మూలమున యుద్ధానంతరము ఏర్పడిన క్రొత్త రాజ్యములగు జెకోస్లోవాకియా, యూగోస్లావియా, పోలండ్, లిథూనియా, లాట్వియా, ఎస్తోనియా, ఫిన్లాండ్, జర్మనీదేశములలో ప్రజాస్వామ్యము ఆధారముగా గల రాజ్యాంగములు నిర్మాణము కావింపబడినవి. రష్యాయందు మాత్రము మరియొక విధమైన రాజ్యాంగము

స్థాపింపబడినది. ప్రజాస్వామ్యమందు నమ్మకము గల ఇంగ్లండు, ఫ్రాన్స్, యునైటెడ్ స్టేట్స్‌లకు సోవియట్ రష్యాలో పలుకుబడి లేకపోవుట చేతను, రష్యాలో విప్లవము లేవదీసివారు కమ్యూనిస్ట్ పక్షమునకు చెందిన వారు అగుట చేతను రష్యాలోని నూతన రాజ్యాంగ వ్యవస్థ భిన్నరూపమును ధరించెను. యూరప్‌లోని తక్కిన దేశములు అన్నిటియందును ప్రజాస్వామ్యము స్థాపింప బడినది.

కాని, 19 వ శతాబ్దమందలి వారు అభిప్రాయపడినట్లు ప్రజాస్వామ్యము అన్ని దేశములలో సుస్థిరముగ నాటుకొనలేక పోయెను. రెండు మూడు తరములుగ ఇటలీలో సాగుచుండిన ప్రజాస్వామ్యమును 1922 లో ముస్సోలినీ అను నాయకుడు తొలగించి, తానే దేశమునకు నియంతయై నిరంకుశ ప్రభుత్వమును స్థాపించెను [చూ. ఫాసిజమ్]. అప్పటి నుండి అతడు చూపిన మార్గమును మరికొన్ని దేశములలోని నాయకులు కూడ అనుసరించి, తమ తమ దేశములకు నియంతలైరి. 1939 లో ద్వితీయ ప్రపంచ యుద్ధము [చూ.] ప్రారంభమగు నాటికి స్పెయిన్, పోర్చుగల్, జర్మనీ, పోలండ్, ఎస్తోనియా, లాట్వియా, యుగోస్లావియా మొదలగు రాజ్యములు అనేకములు నియంతల పరిపాలన లోనికి వచ్చెను. రష్యాలో 1917 నుండి నిరంకుశత్వమే సాగుచున్నది. ఆధునిక యుగ ప్రథమ భాగమందు యూరప్ ఖండమందు ఉండిన నిరంకుశత్వము పునరుద్ధరింపబడుట జరిగినది. ద్వితీయ ప్రపంచ యుద్ధ ఫలితముగ ఈ విషయములో ప్రజాస్వామ్య పద్ధతికి అనుకూలమగు మార్పులు యూరప్‌నందు అంతగ కలుగ లేదు. ఇటలీలో నిరంకుశత్వము తొలగెను. కాని, యుద్ధమునకు పూర్వము ప్రజాస్వామ్యము అనుభవించుచుండిన జెకోస్లోవాకియా యుద్ధానంతరము రష్యాయొక్క పలుకుబడిలోనికి వచ్చి కమ్యూనిస్ట్ నిరంకుశత్వమునకు లోబడెను. ఇంగ్లండు, బెల్జియమ్, హాలండ్, డెన్మార్క్, నార్వే, స్వీడెన్, స్విజర్లండ్ దేశములందు మాత్రమే ప్రజాస్వామ్యమునకు కొంత స్థిరత్వము ఉండునట్లు కనబడుచున్నది. ప్రజాస్వామిక రాజ్యాంగము అన్ని దేశములలో స్థిరముగ నాటుకొనక పోవుటకు అనేక కారణములు కలవు. మధ్య, తూర్పు యూరప్ దేశములలోని ప్రజలు తరతరములుగ నిరంకుశ పరిపాలనకు అలవాటుపడిరి. తాము ఎన్నుకొనిన ప్రతినిధుల పరిపాలనకు లోబడుట వారికి క్రొత్త. అట్టి ప్రభుత్వమును సాగించుటకు కావలసిన అర్హత వారియందు లేకుండెను. అది కాలక్రమమున సంపాదించ దగినదే కాని, అకస్మాత్తుగ లభ్యమగునది కాదు. అట్టి విధానమందు వారికి ఎక్కువ గౌరవాభిమానములు లేకుండెను. జర్మనీ, ఇటలీ దేశములు తప్ప తక్కిన దేశములు ఆర్థికముగ మిక్కిలి వెనుకబడిన దేశములు. అందలి ప్రజలకు కావలసినదియు, వారు కోరినదియు ఆర్థిక సౌఖ్యము కాని, ప్రజా స్వామ్యము ద్వారా లభించు వాక్ స్వాతంత్ర్యము, సంఘ స్వాతంత్ర్యము మొదలగు ప్రాథమిక హక్కులు కావు. విద్యా విహీనులై దారిద్ర్యము అనుభవించుచుండిన వారికి ఇట్టి హక్కులు అనుభవించు అవకాశములు మిక్కిలి తక్కువ. వాని యొక్క ప్రయోజనములను కూడ వారు గ్రహింపజాలరు. అట్టి దేశములలో ప్రజాస్వామిక రాజ్యాంగము చక్కగ పని చేయుట కష్టసాధ్యము. విద్యావంతులగువారు కొందరు అట్టి రాజ్యాంగమును ప్రశంసించువారైనను, జన సామాన్యమునకు దానియందు అంత అభిమానము కుదరలేదు. కావున, నియంతలు దానిని తొలగ ద్రోసినను, వారు వారిని అడ్డుటకు ఉత్సహించలేదు.

ఈ దేశములలో మరియొక లక్షణము కూడ కనిపించు చున్నది. వీనిలోని ప్రజలందరు ఒకే జాతికి సంబంధించిన వారు కారు. జెకోస్లోవాకియా, పోలండ్, హంగేరీ, యుగోస్లావియా మొదలగు దేశములలో ఒక్కొక్కదాని యందును అల్పసంఖ్యాకుల సమస్య ఏర్పడి ఉన్నది. అధిక సంఖ్యాకులతో కూడిన ప్రధానజాతితో పాటు అల్ప సంఖ్యాకులగు భిన్నజాతివారు వీనియందు కలరు. అధిక సంఖ్యాకులు, అల్ప సంఖ్యాకులు అను భేదము లేక ప్రజ లందరు ఒకే జాతికి సంబంధించినవారై సంపూర్ణ సంఘీభావము కలవారైనపుడే ప్రజాస్వామ్యము ఆచరణ యోగ్యము అగుచున్నది. కాని, ఈ రెండు వర్గముల మధ్య మనస్పర్థలు స్థిరముగ ఏర్పడినపుడు ప్రజాస్వామ్యము అట్టి స్పర్థలను బలపరచుటకు అవకాశము కల్పించునే కాని, పరిపాలనము సౌష్ఠవముగ జరుగుటకు తోడ్పడజాలదు. అట్టి సందర్భములలో భిన్న జాతుల వారందరిని హద్దు, ఆజ్ఞలలో ఉంచగల నిరంకుశత్వము అవసరమగుచున్నది.

ప్రజాస్వామిక రాజ్యాంగము అకస్మాత్తుగా కాక, క్రమముగ వృద్ధిగాంచిన ఇంగ్లండు వంటి దేశములలో కూడ ఈ రాజ్యాంగ విధానమును ఖండించువారు అనేకులు ఉన్నారు. యంత్ర సాహాయ్యమున ఫ్యాక్టరీలలో పని చేయవలసిన అగత్యము ఏర్పడిన ప్రస్తుత యుగమందలి సమస్యలను పరిష్కరించుటకు ఈ విధానము తగినది కాదని వారి అభిప్రాయము. యంత్ర యుగమున ప్రజలు పెట్టుబడిదారీ వర్గము, కార్మిక వర్గము అను రెండు వర్గములుగ ఏర్పడి ఉన్నారు. వీరిమధ్య స్పర్థయు, పోరాటమును ఏర్పడి ఉన్నవి. ప్రజాస్వామ్యమందు ప్రజలు అందరి పెట్టు

బడికి సమానావకాశములు ఉండుటకు బదులు పెట్టుబడి దార్లకు ఎక్కువ పలుకుబడి లభించుచున్నది. ధనమంతయు వారి అధీనతలో ఉండుట చేతను, ధనము మూలమున అధికార పదవులను సంపాదించుట సులభమగుట చేతను అచటపేరునకు ప్రజాస్వామ్యము ఉన్న దే కాని, అచరణలో ప్రజాస్వామ్యమునకు బదులు ధనికవర్గ స్వామ్యము ఏర్పడి సాగుచున్నది. ధనికులు, దరిద్రులు, సాహుకార్లు, కార్మికులు అను వర్గభేదము ఉండునంతవరకు ప్రజా స్వామ్యము సాధ్యము కాదనియు, ఇప్పటి ప్రజాస్వామ్యము మిథ్య అనియు, ఆస్తిపరుల వర్గమును వినాశము గావించినగాని నిజమైన ప్రజా స్వామ్యము ఏర్పడదనియు కారల్ మార్క్స శిష్యులు వాదించుచు, ఇప్పటి ప్రజా స్వామిక రాజ్యాంగ వ్యవస్థను ఖండించుచున్నారు [చూ. పు. 221].

అట్టి ఖండనము సహేతుకము కాదని ప్రజాస్వామిక రాజ్యాంగ వ్యవస్థలు ఉండు ఇంగ్లండు, ఫ్రాన్స్, యునైటెడ్ స్టేట్స్, కెనడా, ఆస్ట్రేలియా, న్యూజీలండ్, డెన్మార్క్, నార్వే, స్వీడెన్, బెల్జియమ్, హాలండ్ దేశముల చరిత్రలు చాటుచున్నవి. రాజ్యాంగ విధానము స్థాపింపబడిన తర్వాత పరిపాలనలో కార్మిక పక్ష ప్రతినిధులు ప్రాబల్యము సంపాదించి, వారి స్థితిగతులు అనేక విధములుగ చక్కబెట్టుకొనిరి. ఈ దేశములలోని ప్రభుత్వములు ఉచిత విద్యను, వైద్య సాహాయ్యమును, ఆరోగ్య అభివృద్ధిని, గర్భిణీ స్త్రీల పోషణమును, శిశుసంరక్షణమును, నిరుద్యోగులకు సహాయమును, వృద్ధులకు ప్రత్యేక పెన్షన్లు మొదలగు సదుపాయములు అనేకములను కల్పించి, కార్మికుల సౌఖ్యమును అభివృద్ధి చేయుటకు అపారమైన కృషి చేయుచున్నవి. వారు విప్లవమార్గమును అనుసరించుట లేదు. కాని, విప్లవము మూలమున కమ్యూనిస్టులు నెరవేర్చగోరు ఉద్దేశములను వారు శాంతి మార్గమున నెరవేర్చగలవారు అగుచున్నారు. ప్రజాస్వామ్యము ధనికులకే కాని, కార్మికులకు లాభము కలిగించునది కాదను వాదము సత్యము కాదని ఈ దేశముల చరిత్ర రుజువు చేయుచున్నది. కాని, ఓపికతో విషయములను విమర్శించు వారు అనేకులు లేని కారణమున ప్రజాస్వామ్యము కార్మికులకు నష్టము కలిగించుచున్నది అను అభిప్రాయము అనేకులలో వ్యాపించి ఉన్నది. అట్టివారు ప్రజాస్వామ్యమునకు విరోధులై కమ్యూనిస్ట్ విధానమును అనుసరించి, సోవియట్ రష్యాయందును, సోవియట్ రష్యా పలుకుబడిలోనికి వచ్చిన మధ్య, తూర్పు యూరప్ దేశములందును, చీనాయందును, క్యూబాయందును కమ్యూనిస్ట్ నిరంకుశత్వ విధానమును స్థాపించగలవారైరి.

ప్రజాస్వామ్యమును కార్మిక పక్షవాదులగు కమ్యూనిస్టులు మాత్రమే కాక సాహుకారీ పక్షములోని వారు కూడ ఖండించుట కలదు. ప్రజాస్వామ్యములో కార్మికుల పలుకుబడి అధికమగుట తప్పదనియు ఎప్పటికైనను పరిపాలనశాఖలు అన్నిటియందును వారి ప్రతినిధుల సంఖ్య హెచ్చుననియు, అట్టివారు ఆస్తిపరులపై భరించలేని పన్నులను విధించి ఆ ద్రవ్యమును కార్మికుల సౌఖ్యములకై ఖర్చుపెట్టుదురనియు ఆస్తిపరుల అభిప్రాయము. కనుక, వారు కూడ ప్రజాస్వామ్యమునకు విరోధులై ధనికుల నిరంకుశత్వమును సమర్థించుటయు మామూలు. ఫాసిస్ట్ నియంతృత్వ విధానమునకు ఇట్టి సమర్థనమే ఆధారము. ఫాసిస్టుల దృష్టిలో మానవ సమత్వము శూన్యము. ప్రతి దేశమందును పాలకవర్గమునందు ఉండదగినవారు కొందరు కలరు. అట్టివారే పరిపాలకులగుట ధర్మము కాని, సామాన్య ప్రజలు ఎన్నుకొనినవారు అధికారులు అగుట అన్నది అనర్హులను అధికారములో ఉంచుటయే. ఇది కాక ప్రజాస్వామ్యము సంఘీభావమును విఘాతపరచు విధానము. అట్టి ప్రజాస్వామ్యమునందు ప్రజలు అనేక రాజకీయపక్షములుగ చీలిపోవుట కద్దు. దీని మూలమున ఐక్యము చెడిపోయి, మంత్రి వర్గములు అస్థిరములు అగుటయు, బలహీనములు అగుటయు తప్పదు. ఇట్టి చీలికలను రద్దుచేసి జాతీయైక్యమును నిలబెట్టి, అంతర్జాతీయ వ్యవహారములలో తమ దేశములకు గౌరవమును సంపాదించుటకు నిరంకుశ నియంతృత్వమే ఉత్తమ సాధనమని ఇటలీలో ముసోలినీ, జర్మనీలో హిట్లరు వాదించి, ఫాసిస్ట్ నిరంకుశత్వ విధానములను స్థాపించిరి. పోర్చుగల్, స్పెయిన్ మొదలగు దేశములలో ఇప్పటికిని కూడ ఇట్టి విధానమే సాగుచున్నది.

కనుక, ప్రస్తుతము యూరప్ ఖండమందు ఒకేవిధమైన రాజ్యాంగము అన్ని దేశములలో లేదు. కొన్ని దేశములలో ప్రజాస్వామిక రాజ్యాంగము స్థాపింపబడి ఉన్నది. తక్కిన వానియందు ప్రజాస్వామ్యమునకు విరుద్ధమైన నిరంకుశత్వము స్థాపింపబడి ఉన్నది. ఈ రెండు రకముల రాజ్యాంగములు ప్రస్తుతము యూరప్ ఖండమందు ఉన్నవి. వీనికి మధ్య గొప్ప సంఘర్షణ కూడ జరుగుచున్నది. వీనిలో ఏది గెలుచునో, ఏది ఓడిపోవునో చెప్పుటకు వీలు కనిపించదు. ధర్మము జయించుటయు, అధర్మము ఓడుటయు వాంఛనీయమైనను ప్రపంచములో ధర్మము ఒక్కటే గెలుపొందలేదు. ఒక్కొక్కప్పుడు అధర్మము కూడ విజయము గాంచుచున్నది. ఈ కారణములను బట్టి భావి కాలమున యూరప్ రాజ్యాంగ వ్యవస్థా పరిణామము ఎట్లుండునో నిరూపించుట కష్ట సాధ్యము. మా. వెం. రం.

**పిజారో, ఫ్రాన్సిస్కో (1475 - 1541) :** దక్షిణ అమెరికాలోని పెరూ దేశమును పరిశోధించి అందు సామ్రాజ్యాధికారమును స్థాపించిన స్పానిష్ నాయకుడు. మొదట స్పానిష్ సైన్యములో చేరి, ఇటలీలో జరిగిన యుద్ధములో పాల్గొని, సాంగ్రామిక అనుభవమును గడించెను. మెక్సికో పరిశోధింపబడిన పిమ్మట 1520 లో ఇతనికి పెరూ దేశ పరిశోధన విషయమై ఉత్సుకత కలిగినది. నూట ఎనుబది ముగ్గురు సాయుధ నావికులతో 1526 లో స్పెయిన్ నుండి బయలుదేరి, 1532, మే లో ఇతడు టమ్‌బెజ్ వద్ద దిగెను.

పిజారో తన అనుచరులతో ఖండపు లోభాగమునకు చొచ్చుకొని పోయి 'ఇన్‌కా' [చూ. పు. 323] అను ఆదిమ అమెరికన్ జాతి ప్రజల నాయకుడగు ఆటాహు వాల్పాను బందీగా పట్టుకొని ఉరితీయించెను. పిమ్మట అక్కడి రాజ వంశీయుని ఒకనిని పేరునకు మాత్రము చక్రవర్తిని చేసి, తానే సర్వాధికారమును చేపట్టెను. ఇంతలో స్పెయిన్ నుండి మరికొన్ని సైనికదళములు అల్మాగ్రో అను వాని నాయకత్వమున వచ్చి దిగెను. పిజారో, అల్మాగ్రోలు ఆ రాజ్యమును పంచుకొనిరి. 1536 లో స్థానికులగు ఇండియన్‌లు చేసిన తిరుగుబాటు తప్ప వేరేవిధమైన ప్రతిఘటనమును దేశీయులనుండి రాలేదు. ఆ తిరుగుబాటు నైనను అల్మాగ్రో సాయముతో పిజారో సులభముగానే అణచివేయ గలిగెను. కాని, దాని ఫలితముగా ఆ ఇద్దరి మధ్యను మనస్పర్ధలు పర్పడినవి. పిజారో సోదరులు 1538 లో అల్మాగ్రోను ఓడించి, వధించిరి. కాని, మూడేళ్ల అనంతరము 1541, జూన్ 26 న అల్మాగ్రో అనుయాయులు పిజారోను హత్యచేసిరి. ఇతడు స్థాపించిన సామ్రాజ్యము స్పెయిన్ రాజ్యములో ఒక వలస రాష్ట్రముగ సుమారు మూడు శతాబ్దముల కాలము విలసిల్లెను. గి. వెం. సీ.

**పిట్, విలియమ్ (చిన్న) (1759 - 1806) :** చేతమ్ ప్రభువైన విలియమ్ పిట్ కుమారుడు. తన 24 వ పటనే బ్రిటన్‌కు ప్రధానియైనవాడు. ఇంత చిన్న వయసులో ప్రధాను లైనవారు చరిత్రలో మరి లేరు.

ఇతడు 1781 లో పార్లమెంట్ సభ్యుడు అయ్యెను. 1782 లో షెల్బర్న్ ప్రభుత్వములో కోశాధ్యక్షుడై కామన్స్ సభ నాయకుడు అయ్యెను. అప్పటికి ఇతనికి 23 ఏండ్లు మాత్రమే. 1783 లో షెల్బర్న్ ప్రభుత్వము పతనమగుటతో ఇతడు ప్రధాని అయ్యెను. 1793 లో నెపోలియన్‌తో ఇతడు యుద్ధము నడుపవలసి వచ్చినది. నెల్సన్ సాధించిన విజయములో బ్రిటన్‌కు సముద్రాధిపత్యము నిలువబడినను, భూమిపై మాత్రము బ్రిటిష్ సైన్యములు ఓడిపోయినవి. పిట్ ఇంగ్లండ్, ఐర్లాండ్‌లను 1800 లో కలిపి వేసెను. ఐర్లాండ్‌లో కేతలిక్‌లకు వోటు హక్కు ఈయ సంకల్పింపగా రాజు వ్యతిరేకించెను. అందువలన ఇతడు 1801 లో రాజీనామా ఇచ్చెను.



విలియమ్ పిట్ (చిన్న)
(1759 - 1806)

మరల నెపోలియన్‌తో 1803 లో యుద్ధము జరుగుటతో ఇతడు మరల ప్రధాని అయ్యెను. కాని, ఆస్టర్‌లిడ్జ్ అను చోట మిత్ర సైన్యములు ఓడిపోగానే అప్పటికే అనారోగ్యముతో ఉన్న ఇతడు ఆ మానసిక ఆందోళనతోనే మరణించెను. వి. నా.

**పిట్, విలియమ్ (చేతమ్ ప్రభువు) (1706 - 1778):** బ్రిటిష్ సామ్రాజ్యమును నిర్మించిన ప్రముఖులలో ఒకడు. బ్రిటన్‌కు ప్రధానమంత్రి.



విలియమ్ పిట్ (చేతమ్ ప్రభువు)
(1706 - 1778)

ఇతడు 1731 లో సైన్యములో ప్రవేశించి, నాలుగు సంవత్సరములు పనిచేసెను. తదుపరి పార్లమెంట్‌కు ఎన్నికయై, తన వాక్చాతుర్యము వలన అందరి దృష్టిని ఆకర్షించి, అప్పటి ప్రధానియైన రాబర్ట్ వాల్‌పోల్ [చూ.] ప్రభుత్వమును విమర్శించు వారికి నాయకుడయ్యెను. 1746 లో ఐర్లాండ్‌కు ఉపకోశాధిపతియై, తదుపరి 'పేమాస్టర్' పదవి పొందెను. ప్రభుత్వ విధానములను విమర్శించినందువలన ఇతడు 1775 లో తన పదవి విడనాడినను, వెంటనే కామన్స్ సభానాయకుడు అయ్యెను. మరల రాజు ఆగ్రహమునకు గురియై రాజీనామా ఇచ్చినను, ఇతనికి ప్రజలలో గల అపారమైన పలుకుబడివలన రాజు ఈతనికి మరల పదవి ఈయవలసి వచ్చినది.

జార్జి - III 1760 లో రాజు అయిన తరువాత అతనితో సామరస్యము లేక పిట్ 1761 లో తన పదవికి రాజీనామా ఇచ్చెను. కాని, అతనికి రాజ్య వ్యవహారములలో పలుకుబడి మాత్రము తగ్గలేదు. అమెరికా వలస రాష్ట్రములలో జార్జి - III విధించిన పన్నులను పిట్ తీవ్రముగా వ్యతిరే

కించెను. 1766లో ఇతడు మరల ప్రధానియై 'చేతమ్ ప్రభువు' అను బిరుదు వహించెను.

బ్రిటన్ దేశమందలి సంగ్రామ కాలపు ప్రధానులలో పిట్ అగ్రగణ్యుడు. బ్రిటిష్ సామ్రాజ్యమును నిర్మింప ఆరంభించినవాడు ఇతడే అని చెప్పుట అతిశయోక్తి కానేరదు. ఈతని మార్గము తదుపరి ప్రధానులకు ఆదర్శక మైనది. తన దేశభక్తి, వాక్పటిమ, పట్టుదలవల్ల బ్రిటన్‌ను ప్రపంచమున ఒక బలమైన రాజ్యముగ చేసినవాడు ఈతడు [చూ. పిట్, విలియమ్ (చిన్న) - పు. 577]. వి. నా.

**పియర్సన్, లెస్టర్ బౌల్స్** (జ. 1897): కెనడా ప్రస్తుత ప్రధాన మంత్రి. 1897, ఏప్రిల్ 23న టొరెంటో నగరమున ఇతడు జన్మించెను. టొరెంటో (బి. ఏ. 1919), ఆక్స్‌ఫర్డ్ (1923 బి. ఏ.; 1925 ఎమ్. ఏ.) యూనివర్సిటీల నుండి పట్టభద్రుడు. టొరెంటో యూనివర్సిటీలో (1924-28) ఇతడు చరిత్ర బోధనచేసిన పిమ్మట నూతనముగ ఏర్పాటు చేయబడిన విదేశ వ్యవహారముల శాఖలో ప్రథమ కార్యదర్శి (1928-35) గ ఉండెను. అటుపిమ్మట లండనులో కెనడా ప్రభుత్వపు హైకమీషనర్ (1935-41) గను, యునైటెడ్ స్టేట్స్‌లో కెనడా రాయబారి (1945-46) గను ఉండెను. ఐక్యరాజ్య సమితి జనరల్ అసెంబ్లీ రాజకీయ కమిటీకి 1947 లో అధ్యక్షుడుగ ఉండి, పాలస్తీనా సమస్యాపరిష్కారమునకు విశేషముగ కృషిచేసెను.

కెనడా దేశపు ఫెడరల్ మంత్రివర్గములో విదేశాంగ శాఖ మంత్రిగ (1948-1957) ఉండి, బ్రిటిష్ కామన్‌వెల్తు వ్యవహారములలోను, నాటో [చూ. పు. 531] వ్యవస్థాపనలోను ప్రముఖ పాత్ర వహించెను. 1956 అక్టోబరునుండి 1957 మార్చి వరకు ఐక్యరాజ్యసమితి ప్రత్యేక సమావేశమున కెనడా ప్రతినిధి వర్గమునకు ఇతడు నాయకత్వము వహించి, పశ్చిమ ఆసియా, హంగేరీ దేశములలోని క్లిష్ట సమస్యల పరిష్కారమునకు కృషి చేసెను. ఇతడు ఆ సమయమున ఐక్యరాజ్యసమితియందు ప్రతిపాదించి ఆమోదింపచేసిన ఒక తీర్మానమును అనుసరించియే ఐక్యరాజ్య ఆత్యయిక సేన (యునైటెడ్ నేషన్స్ ఎమర్జెన్సీ ఫోర్స్) రూపొందినది. ఐక్యరాజ్యసమితి తరఫున సూయజ్ కెనాల్ సమస్యను పరిష్కరించుటకు ఇతడు చేసిన కృషికి 1957 లో నోబెల్ శాంతి బహుమానము [చూ.] ఇవ్వబడినది. 1958 లో లిబరల్ పార్టీ నాయకుడుగను, హౌస్ ఆవ్ కామన్స్‌లో ప్రతిపక్ష నాయకుడుగను పియర్సన్ ఎన్నిక అయ్యెను. 1932లో జరుపబడిన ఎన్నికలలో ఇతని పార్టీకి అధిక సంఖ్యాక స్థానములు లభించగా, 1963, ఏప్రిల్ 22న ఇతడు ప్రధానమంత్రి అయ్యెను. 1951 నుండి 1958 వరకు టొరెంటోలోని విక్టోరియా యూనివర్సిటీకి ఛాన్సలర్‌గా కూడ ఇతడు పని చేసెను. ఇతని ముఖ్యరచనలు: 'డెమోక్రసీ ఇన్ వరల్డ్ పాలిటిక్స్'; 'డిప్లొమసీ ఇన్ న్యూక్లియర్ ఏజ్'. పా. ల. నా.

**పిరమిడ్‌లు** : ప్రాచీన కాలమున ఈజిప్టుదేశమును పాలించిన రాజులు తమ సమాధులకై పిరమిడ్‌లను నిర్మించిరి. సామంతులు, భాగ్యవంతులు కూడ వీటిని నిర్మింప మొదలిడిరి. భాగ్యవంతులు ఇటుకల తోడను, రాతి తోడను వీనిని నిర్మించిరి. ఈ పిరమిడ్‌లు నిర్మించుటలో వారు తమ కళాకౌశలమును ప్రదర్శించిరి. ఇవి అపురూపమైన శిల్పములతోడను, చిత్రములతోడను అలంకృతమై ఉండెను. ఈ సమాధులలో ఆత్మ మరల ఈ లోకమునకు వచ్చునపుడు కావలసినవన్నియు సమకూర్పబడి ఉండెను. పాత్రలు, ఆహార పదార్థములు, పానీయములు, ఆయుధములు, పిల్లలు ఉపయోగించు ఆటవస్తువులు, స్త్రీల అలంకారములకు పనికివచ్చు భూషణములు మొదలగునవి అన్నియు ఈ సమాధులలో ఉంచబడెను. పూర్వకాలపు ఈజిప్టువాసులను గూర్చియు, వారి మతాభిప్రాయములను, వారి నిత్యజీవితమును, జీవితాశయములను గూర్చియు ఇవి మనకు తెలియజేయును. ఈ పిరమిడ్‌లు ప్రపంచమందలి అద్భుత దృశ్యములలో ఒకటి అని నిస్సంశయముగ చెప్పవచ్చును. 'గిజా' యొద్ద నిర్మింపబడిన పిరమిడ్ అన్నిటికన్న మిన్నయైనది. ఈ పిరమిడ్‌ను 'కూఫూ' అను ఫారో నిర్మించెను. దీనిని నిర్మించుటకు నూరువేల మంది ఇరువది సంవత్సరములు పనిచేసిరట. ఇది అడుగు మట్టమువద్ద 72 చదరపు మీటరులు ఉండి, 137 మీటరుల ఎత్తు కలిగి ఉన్నది. యంత్రాది సాహాయ్యము లేకుండగనే బ్రహ్మాండములైన ఇట్టి పిరమిడ్‌లను ఈజిప్టువాసులు ఎట్లు నిర్మింప గలిగిరో అను ఆశ్చర్యము కలుగుచున్నది. వి. నా.

**పీటర్** (1672 - 1725): రష్యా చక్రవర్తి. జార్ అలెక్సిస్ కుమారుడు. 1672, మే 30న జన్మించెను. ఇతడును, ఇతని సవతి సోదరుడు ఫెడోర్‌ను సహపరిపాలకులుగా తొలుత ప్రకటింపబడిరి. వీరి ఇద్దరికి రక్షకురాలుగా - వాస్తవమునకు సర్వాధికారిణిగా - వీరి సోదరి సోఫియా ఉండెను. 1689 లో పీటర్ తన సోదరి రక్షకత్వమును తొలగద్రోసి అధికారమును హస్తగతము చేసికొనెను. తదుపరి సోదరుడు ఫెడోర్ మరణించుటతో రాజ్యాధికారము అంతయు ఈతనికే లభించినది.

రష్యా సముద్రతీరము అంతయు ప్రతి సంవత్సరము చాలా కాలము గడ్డకట్టి ఉండును. మంచి తీరము సంపాదించి, రష్యాకు మిగిలిన ప్రపంచవర్తక వ్యాపారములతో సంబంధము ఏర్పరుపవలెనని పీటర్ సంకల్పించెను. బాల్టిక్

సముద్రప్రాంతము అంతయు బలవంతమగు స్వీడెన్ చేతిలో ఉండెను. అందుచే నల్లసముద్ర తీరమున తుర్కుల చేతిలో గల అజోవ్‌ను ఆక్రమించి, రష్యన్ నౌకాదళమును పీటర్ అభివృద్ధి చేసెను. తదుపరి ఇతడు యూరప్‌లో సంచారము చేసి, హాలండ్‌లో నౌకానిర్మాణమును నేర్చుకొని - ఇంకను అనేక విషయములను తెలిసికొని - అనేక నిపుణులతో తన దేశమునకు మరలివచ్చెను. 1709 లో స్వీడిష్ పాలక సైన్యములను ఓడించి ఇతడు కొంత ప్రదేశమును ఆక్రమింప గలిగెను. ఆ ప్రదేశములో నే సెయింట్ పీటర్స్‌బర్గ్ అను తన పేరుతో రాజధానిని ఇతడు నిర్మించెను. 1710 లో స్వీడెన్ అండతో తుర్కులు చేసిన యుద్ధమువలన ఇతడు అజోవ్‌ను తుర్కులకు వదలివేయవలసి వచ్చెను. కాని, ఇంతలో స్వీడెన్ రాజు చనిపోయిన వెంటనే సంధికి స్వీడెన్ అంగీకరించినది. తత్ఫలితముగ పీటర్‌కు తూర్పు బాల్టిక్ ప్రాంతమున చాల ప్రదేశము, ఫిన్లాండ్‌లో ఒక భాగము లభించినవి.


పీటర్
(1672 - 1725)

పీటర్ రష్యాయందలి మానవ సమాజమును పాశ్చాత్య పద్ధతులలో పునర్నిర్మించెను. దేశములో స్త్రీలకు స్వాతంత్ర్యమును ఇచ్చి, నూతన విద్యావిధానమును ఏర్పరచి, పరిశ్రమలను అభివృద్ధి చేసి, దేశపు ఔన్నత్యమునకు పునాదులు వేసెను. అందువలనే ఇతనిని మహనీయుడు అనిరి. ఇతడు 1725, జనవరి 28 న మరణించెను. గి. వేం. సీ.

**పీల్, రాబర్ట్** (1788 - 1850): బ్రిటిష్ రాజనీతిజ్ఞుడు. 1788, ఫిబ్రవరి 5 న జన్మించెను. హారోలో విద్యను అభ్యసించి, 1809 లో పార్లమెంట్‌లో కన్సర్వేటివ్ సభ్యుడు అయ్యెను. 1822 లో స్వదేశ వ్యవహారశాఖకు కార్యదర్శియై, అనేక సంస్కరణలు ప్రవేశపెట్టెను. 1834 లోను, 1839 లోను ప్రధాని అయ్యెను. కాని, రెండుసారులును కొద్ది వారముల అనంతరము రాజీనామాను ఈయవలసి వచ్చినది. పార్లమెంట్‌లో స్థిరమగు బలము చేకూరిన తరువాత 1841 లో ప్రధాని అయ్యెను. ఇతడు ఇంగ్లండులో ధాన్యవ్యాపారముల పైగల నియమములను (కారన్‌లాజ్) తొలగించెను. తరుపరి ఐర్లాండ్ సమస్యపై పార్లమెంట్‌లో ఓడిపోయి, తన పదవికి రాజీనామా ఇచ్చెను (1846). ఇతడు 1850, జూన్ 2 న మరణించెను. * * *

**పురగుప్తుడు** (467 - 473 ప.) : భారతదేశమును పాలించిన గుప్త వంశపు రాజులలో ఒకడు. స్కందగుప్తుని అనంతరమున అతని సవతి సోదరుడగు పురగుప్తుడు రాజు అయ్యెను. ఈ పురగుప్తుడు కుమారగుప్త - I కి అనంతాదేవి యందు జనించిన పుత్రుడు. ఇతడు కూడ శ్రీ విక్రమ బిరుదాంకితుడు. కుం ఈ. దత్తు.

**పూర్వగాంగులు** : చూ. తెలుగు సంస్కృతి, సం. 3 - పు 173.

**పూర్వచాళుక్యులు** : చూ. తెలుగు సంస్కృతి, సం. 3 - పు. 142.

**పృథ్వీరాజు** : భారతదేశమందలి ఢిల్లీని పాలించిన కడపటి హైందవరాజు ; చౌహాణ వంశీయుడు. తొలుత ఇతడు అజ్మీర్‌నకు మాత్రమే రాజుగ ఉండెను. ఢిల్లీ రాజును, తువరవంశపు చివరి రాజును అగు అనంగపాలునకు ఇతడు దౌహిత్రుడు అగుటచే, అనంగపాలుని అనంతరము ఢిల్లీకి కూడా ఇతడే రాజయ్యెను. అనంగపాలుని మరొక దౌహిత్రుడు, కనోజ్ రాజు అగు జయచంద్రుని కుమార్తె రాణి సంయుక్తను ఇతడు ఆమె తండ్రి అభిమతమునకు విరుద్ధముగ ఎత్తుకొని పోయి వివాహమాడుటచే జయచంద్రునితో ఇతనికి వైరము తటస్థించినది.


పృథ్వీరాజు

ముస్లిమ్ విజేత ఘోరీ మహమ్మద్ [చూ - పు. 441] హిందూ రాష్ట్రముల పై దండెత్తి తొలుతగ కీలకస్థానమందు ఉన్న సర్‌హింద్ దుర్గమును జయించి ముందునకు సాగుచుండ, రాజపుత్ర రాజులను అందరిని సమీకరించి పృథ్వీరాజు * క్రీ. శ. 1191లో స్థానేశ్వరము, కర్నాల్‌లకు మధ్యగల 'తరాయ్' వద్ద ఘోరీ మహమ్మద్‌ను ఎదిరించెను. నేర్పుగ నలుముఖములనుండి ముట్టడించి వీరవిహారము చేయుచుండిన హిందూ సైన్యముల ధాటికి ఓర్వలేక మహమ్మదీయ సైన్యములు చెల్లాచెదరై పారిపోయినవి. ఘోరీ మహమ్మద్ క్షతగాత్రుడై ప్రాణములతో తప్పించుకొనెను. కనూజ్ రాజు జయచంద్రుడు మాత్రము సహకరింపకపోయినను, మిగిలిన రాజపుత్ర యోధుల సాయముతోనే పృథ్వీరాజు ఘోరీ మహమ్మద్ సేనలను ఆనాడు తరిమి తరిమి కొట్టెను.

* ముస్లిమ్ చరిత్ర రచయితలు ఇతనిని 'రాయ్ పితౌరా' అని వ్యవహరించిరి.

కాని, అప్పుడు ఆ రీతిని అవమానితుడైన ఘోరీ మహమ్మద్ ఆ మరుసటి ఏడే తిరిగి 1,20,000 సైన్యముతో భారతదేశముపై దండెత్తి వచ్చెను. ఈ పర్యాయము ముస్లిమ్‌ల విజృంభణ దుస్సహమైనది. ఎందరో రాజపుత్ర యోధులు రణరంగమున అసువులు బాసిరి. పృథ్వీరాజు పలాయితుడై, చివరకు శిరశూతి వద్ద శత్రువు చేజిక్కి నిష్కరుణముగ వధింపబడెను. గి. వేం. సీ.

**పెన్, విలియమ్ (1644 - 1718):** క్రైస్తవ మత మండలి క్వేకర్ సంప్రదాయమునకు చెందినవాడు; ఆంగ్లేయుడు. క్వేకర్లను ఇతర క్రైస్తవులు పిచ్చివారినిగా భావించి హేళన చేయుచుండెడివారు. 1664లో కాన్ వెంటికల్ ఆక్ట్ ప్రకటితమైనది. ఈ చట్టము ప్రకారము ఇంగ్లండులో ప్రభుత్వామోదమును పొందిన చర్చి నిబంధనలకును, ప్రార్థన గ్రంథ నియమములకును వ్యతిరేకులగువారు బహిరంగముగ సమావేశములు జరుపరాదు. అట్టివారు 5 గురు సమావేశము జరిపినను అది అక్రమమే అగును. అట్టి నిబంధనను ప్రతిఘటించినాడన్న దోషమును ఆరోపించి పెన్‌ను చెరలో బంధించిరి. చెరనుండి విముక్తుడు కాగానే ఇతడు మరి కొందరితో కలసి 1682 లో యునైటెడ్ స్టేట్స్‌కు పోయి, పెన్సిల్ వేనియా వలస రాష్ట్రమునకు శంకుస్థాపనము చేసిన గౌరవమును పొందెను. గి. వేం. సీ.



విలియమ్ పెన్

(1644 – 1718)

**పెనిన్సులర్ యుద్ధము (1808 - 1814):** ఫ్రాన్స్ దేశము బ్రిటన్, పోర్చుగల్ దేశములతోను, స్పెయిన్ గెరిల్లాలతోను ఐబీరియాద్వీపకల్పములో సాగించిన యుద్ధము. యూరప్ దేశములు బ్రిటన్‌తో వర్తకము చేయరాదను నెపోలియన్ శాసనమును పోర్చుగల్ నిరాకరించుటతో ఈ యుద్ధము తటస్థించినది. స్పెయిన్‌తో ఒక రహస్యసంధి (1807 అక్టోబరు) చేసికొని, దాని కుమ్మక్కుతో ఫ్రెంచి సేనలు పోర్చుగల్‌ను ఆక్రమించెను (1807, నంవబరు). పోర్చుగల్‌లోనికి అదనపు సేనలను పంపు నెపమున నెపోలియన్ స్పెయిన్‌లో ఫ్రెంచిసేనలను దింపి, అతివేగమున మాడ్రిడ్‌ను వశపరుచుకొని, తన సోదరుడు జోసఫ్ బోనపార్టీని స్పెయిన్ రాజుగా ప్రకటించెను (1808, జూన్ 15). దానితో స్పెయిన్ ప్రజలు దేశవ్యాప్తముగ నెపోలియన్‌పై తిరుగబడిరి. నెపోలియన్‌కు వ్యతిరేకముగ పోర్చుగల్, స్పెయిన్ ప్రజలకు సహాయపడుటకై బ్రిటన్ ఐబీరియాద్వీపకల్పములో తన సేనలను దింపెను(1808, జూలై). దాదాపు ఆరు సంవత్సరముల పోరాటము తరువాత బ్రిటిష్ సేనాని ఆర్థర్ వెలస్లీ [చూ.] (తరువాత డ్యూక్ ఆవ్ విల్లింగ్‌టన్) ఫ్రెంచి సేనలపై టౌలౌస్ వద్ద అంతిమ విజయము సాధించి (1814 ఏప్రిల్), వారిని స్పెయిన్ నుండి తరిమి వేసెను. ఆ. వెం.

**పెరిక్లీస్ (క్రీ. పూ. 490 - 429):** ప్రాచీన గ్రీక్ నాయకుడు, దేశభక్తుడు. పారసీక యుద్ధానంతరమున [చూ. గ్రీస్ - పు. 429] ఇతడు ఏథెన్స్‌నగరపు రాజకీయములందు ప్రధాన స్థానమును ఆక్రమించెను. ఇతని తలిదండ్రులు శ్రీమంతులగుటచే పెరిక్లీస్ ఏ కొరతయు లేక పెరిగి, చిన్నతనమునందే సకల విద్యలను అభ్యసించి, తన 30 వ ఏటనే రాజకీయరంగమున ప్రసిద్ధి కాంచెను. ఇతడు ప్రజాపరిపాలనమును అభివృద్ధి చేసెను. అర్హతగల ప్రతి పౌరుడును రాజకీయోద్యోగము చేయుటకు వీలు కలుగ చేసెను. రాజకీయ విషయములలో పాల్గొనిన వారికి జీతములు ఏర్పాటు చేసెను. ఇట్లు పేదలైన పౌరులు కూడ దేశసేవ చేయుటకు మార్గమును చూపి, పెరిక్లీస్ పౌరుల కృతజ్ఞతకు పాత్రుడయ్యెను. ఇతడు ప్రజాసభల అధికారమును ఎక్కువ చేసెను.

పెరిక్లీస్ కాలమున కళలు అభివృద్ధి కాంచినవి. పారసీక యుద్ధమువలన నాశనమైన ఏథెన్స్ పట్టణమును పునరుద్ధరించుటకై ఇతడు పూనుకొని, ప్రసిద్ధ శిల్పుల సాయముతో ఏథెన్స్‌ను కన్నులపండువగు పట్టణముగ చేసెను. తత్ఫలితముగ ఏథెన్స్ కళాప్రపంచమునకు తీర్థవాటికయైనది.

పెరిక్లీస్ మితభాషి, సహన శీలుడు, రసజ్ఞుడు, పండిత పోషకుడు, సంగీత - సాహిత్యములను, లలితకళలను ఎంతయో ఆదరించెను. అందుచే, అతని కాలమును 'పెరిక్లీస్ యుగము' అనియు, ఏథెన్స్‌నకు 'స్వర్ణ యుగము' అనియు చారిత్రకులు వర్ణించి ఉన్నారు. భి. నా.

**పెరూ :** దక్షిణ అమెరికా యందలి ఒక స్వతంత్ర గణ రాజ్యము.

ఈ దేశమునకు ఈక్వడార్, కొలంబియా [ఉ]; బ్రెజిల్, బొలీవియా [తూ]; చిలీ [ద]; పసిఫిక్ మహాసముద్రము [ప] సరిహద్దులందు ఉన్నవి. [వి] 12,85,215 చ. కి. మీ. పెరూ, ఈక్వడార్‌ల మధ్య చాలా కాలమునుండియు నిలిచి ఉన్న సరిహద్దు తగాదా క్రీ. శ. 1942 లో అంతర్జాతీయ మధ్యవర్తిత్వము ద్వారా చాల వరకు పరిష్కృతమైనను, ఇంకను 186 చ. కి. మీ. విస్తీర్ణము గల భూభాగము వివాదాస్పదమై ఉన్నది. [జ] 1,15,11,000. [భా] స్పానిష్ భాష సాధికార జాతీయ భాష.

కాని, దేశమునందలి ఆదిమ అమెరికన్ జాతుల ప్రజలు స్వభాషలగు క్విచువా, అయిమారాలను మాటాడుదురు. [మ] ఈ ఆదిమ జాతుల సంతతివారు దేశ ప్రజలలో 37% ఉందురు. దాదాపుగ




దేశ ప్రజలందరును రోమన్ కేతలిక్ సంప్రదాయపు క్రైస్తవులు. [రా] లీమా (జ. సం. 12,62,107).

చరిత్ర: అమెరికా ఖండముపై యూరప్ వాసి కాలిడుటకు పూర్వమే ఆ ఖండమున సువ్యవస్థిత నాగరక సంఘములతో విలసిల్లిన ప్రాంతములో ఈ దేశము ఒకటి. చరిత్రకు తెలిసినంతవరకు ఈ దేశమున తొలుతగ వర్ధిల్లినది క్విచువా సామ్రాజ్యము. ఈ సామ్రాజ్య నిర్మాతల జాతీయ భాష క్విచువా. క్రీ. శ. 13 వ శతాబ్దియందు పాలించిన 'సాపా ఇన్‌కా (సూర్యదేవుని కుమారుడు)' అనువాడు ఆ రాజవంశమునకు మూలపురుషుడు. అతనిని బట్టియే తొలుత ఆ రాజ వంశీయులకును, క్రమముగ దేశ ప్రజలకును 'ఇన్‌కా' లు అను వ్యవహారము కలిగినది [చూ. ఇన్‌కాలు - పు. 323]. ఇన్‌కాల సామ్రాజ్యము పెరూ దేశమును స్థావరముగ ఇడుకొని క్రమముగ విస్తరించి, అత్యుచ్చ దశలో ఈక్వడార్, చిలీ, ఆర్జెంటీనాలలోని పలు ప్రాంతములకును వ్యాపింపగలిగెను. 16 వ శతాబ్దిలో పెరూ రాజ్యాధికారమునకై హయస్కర్, అతహ్వాల్పా అను పేరులు కల ఇన్‌కా రాజవంశపు సోదరులు యుద్ధములకు దిగుట వలన, సామ్రాజ్యము బలహీనతను పొందెను. ఆ అవకాశమును ఉపయోగించుకొని, ఫ్రాన్సిస్కో పిజారో [చూ. పు. 577] అను వాని నాయకత్వమున ఒక స్పానిష్ సేనాదళము 1531 లో ఇట కాలిడి క్రమముగ యావద్దేశమును లోగొనెను. 1535 లో వారి పరిపాలనా కేంద్రముగ ఉండుటకు అనువుగ లీమా నగరము స్పానిష్ ప్రభుత్వము వారిచే నిర్మింపబడెను. దక్షిణ అమెరికాలో స్పానిష్ వారు జయించి పాలించిన విశాల సామ్రాజ్యమున వెనిజ్యులా తప్ప మిగిలిన రాజ్యమునకు అంతటికిని ఆ నాడు లీమా నగరమే అధికార కేంద్రముగ ఉండెను. ఆదిమ అమెరికన్ జాతుల ప్రజలను అధోగతికి త్రోసి, వారి సంపదలను కొల్లగొనుటయే తమ విధిగ పరిగణించి, ఆ కాలమున స్పెయిన్ పాలకులు వ్యవహరించిరి. స్పెయిన్ వారికి ఆ నాటి పెరూ దేశము ఒక సువర్ణ భాండారము. ఈ దోపిడి ఫలితముగ దేశవాసులు అనేకులు లక్షల కొలది నశించిరి. ఈ దురాగతములనుండి దేశీయ ప్రజలను రక్షించి, కొంత వరకు ఆదుకొనిన వారు క్రైస్తవ మత ప్రచారకులు. వీరి మూలమున విద్యయు, క్రైస్తవ మతమును దేశీయులందు విరివిగ వ్యాపించెను. అయినను స్పెయిన్ సామ్రాజ్య భారములనుండి విడివడు సామర్థ్యము మాత్రము వీరికి కలుగకపోవుటచే మూడు శతాబ్దములు ఆ దాస్యాంధకారమున వారు మునిగి ఉండిరి.

కాని, వెనిజ్యులా యందు సైమన్ బొలీవర్ [చూ.], ఆర్జెంటీనాలో సాన్‌మార్టిన్ సాగించిన 19 వ శతాబ్దపు స్వాతంత్ర్యోద్యమముల వలన పెరూ దేశమున కూడ స్వాతంత్ర్యాకాంక్ష పెచ్చుపెరిగి, తత్ఫలితముగ ఆందోళనకు సాయపడు తలంపుతో సాన్‌మార్టిన్ 1820 లో పెరూ దేశ తీరమున తన సైనికులతో దిగెను. అంతటనుండి అతని సాయమున స్వాతంత్ర్యసమరము వ్యవస్థిత రీతిలో సాగి, తత్ఫలితముగ 1821, జూలై 28 న పెరూ స్వతంత్ర దేశముగ ప్రకటితము అయ్యెను. అయినను స్పెయిన్ సామ్రాజ్య సేనలు తరువాత మరికొంత కాలము వరకు స్వాతంత్ర్యమును అంత మొందించుటకు యత్నించినవి. కాని, తుదకు అవి 1824 లో ఘోర పరాజయమొందుటతో పెరూ దేశ స్వాతంత్ర్యమునకు స్థిరత్వము చేకూరినది.

పెరూ దేశమును 1826 నుండి 1908 వరకు పాలించిన అధ్యక్షులు అందరును సైనిక సహాయమున అమలు జరుపబడు గణరాజ్య పద్ధతి పరిపాలననే అమలు జరిపిరని చెప్పవచ్చును. ఈ కాలమున కొన్ని ఉన్నత వర్గములవారి చేతులలోనే అధికారము ఇమిడి ఉండెను. అయినను ఆదిమ అమెరికన్ జాతుల శ్రేయమును గమనించి ప్రభుత్వ విధానమున ఉదార సంస్కరణలను కొనివచ్చిన అధ్యక్షులును కొందరు లేకపోలేదు. 1879 - 85 వరకు సరిహద్దునకు సంబంధించిన ఒక వివాదము మూలమున పెరూ,

బొలీవియా దేశముల సేనలు సమష్టిగ చిలీదేశపు సైన్యములతో పోరాడవలసి వచ్చెను. అందు చిలీ గెలుపొందుట వలన పెరూదేశము సురేకారపు గనులకు పేరొందిన తరపాకా, అరీకా రాష్ట్రములను చిలీకి దత్తము ఒనర్చెను.

ఇరువదవ శతాబ్దపు ఆరంభమునుండి ఈ దేశమున ఆర్థిక స్థైర్యము చేకూరుటయు, రాజ్యాంగ చట్టబద్ధమగు ప్రజాస్వామ్యపు పరిపాలన ప్రవేశపెట్టబడుటయు జరిగెను. కాని, 1930 ప్రాంతమునందలి ఆర్థిక మాంద్యములవలన దేశమునందలి పరిస్థితులు తలక్రిందులై కల్లోలములకు దారితీసెను. అంతట అప్పటి అధ్యక్షుని ప్రభుత్వమును కూలద్రోసి సాంకెజ్-కెర్రో అను అతడు సైనిక ప్రభుత్వమును నెలకొల్పెను. కాని, 1935 లో ఇతడు హత్య చేయబడుటతో ఆ ప్రభుత్వము అంతమొందెను. తరువాత నైనను చాలకాలము వరకు ప్రజాస్వామ్యపు ప్రభుత్వము ఏర్పడలేదు. తుదకు 1945 లో అధ్యక్షుడుగ ఉండిన మాన్యుయెల్ పాడ్రో స్వేచ్ఛాపూర్వకపు ఎన్నికలను జరిపెను. కాని, ఇందువలన అధికారమునకు వచ్చిన పక్షము తీవ్ర వామపక్ష భావములను కలిగి ఉన్నదను నెపమున, జనరల్ ఒడ్రియా అను సేనాని ఆ ప్రభుత్వమును కూలద్రోసి సైనిక నియంతృత్వమును స్థాపించి, 1956 వరకు పాలించి, దేశమునకు ఆర్థిక స్థైర్యమును చేకూర్చి అంతట స్వేచ్ఛాపూర్వకపు ఎన్నికలు జరుపగ మాన్యుయెల్ పాడ్రో మరల అధికారమునకు వచ్చెను.

**రాజ్యాంగము :** ఈ రాజ్యమున అమలునందు ఉన్నది కేంద్రీకృతాధికారము గల గణరాజ్య విధానపు పరిపాలనము. శాసన నిర్మాణాధికారము 50 మంది సభ్యులు గల సెనేట్ నందును, 150 మంది సభ్యులు కల ప్రతినిధి సభయందును న్యస్తమై ఉన్నది. జిల్లాల వారీ నియోజక వర్గముల నుండి సెనేటర్లును, రాష్ట్రముల వారీ నియోజక వర్గములనుండి ప్రతినిధులును ఎన్నుకొనబడెదరు. వారి పదవీ కాలపరిమితి ఆరేండ్లు. కార్యనిర్వహణాధికారము అధ్యక్షునికి చెంది ఉన్నది. అధ్యక్షుడును, ఇద్దరు ఉపాధ్యక్షులును ఎన్నుకొనబడినది మొదలుగ ఆరేండ్లు పదవులలో ఉందురు. కాని, అధ్యక్షుడగు వాడు, పదవీ విరమణము తరువాత ఆ వెనువెంటనే మరల అధ్యక్షుడుగ ఎన్నుకొనబడకూడదు. 50 మంది ప్రవీణులచే ఏర్పరుపబడిన ఆర్థిక సంఘము ఒకటి అధ్యక్షునికి ఆర్థిక విషయములందు సలహాలు ఇచ్చును. విద్యావంతులై 18 ఏండ్ల వయసునకు తగ్గని వివాహితులగు స్త్రీ-పురుషులకును, 21 ఏండ్లకు తగ్గని అవివాహిత స్త్రీ - పురుషులకును వోటు చేయుట అనుల్లంఘనీయమగు విధి. 60 ఏండ్లు దాటిన పౌరులకు వోటు చేయుట ఐచ్ఛికము. చీ. శే. రా.

**పోట్స్‌డామ్ సమావేశము :** ద్వితీయ ప్రపంచ యుద్ధ కాలమున జర్మనీ లొంగిన తరువాత ప్రపంచ శాంతిని పునః ప్రతిష్ఠచేయు మార్గములను ఆలోచించుటకై జర్మనీలోని పోట్స్‌డామ్‌నందు (17-7-1945 మొదలు 2-8-1945 వరకు) ప్రెసిడెంట్ ట్రూమన్ (యునైటెడ్‌స్టేట్స్), చర్చిల్ (బ్రిటన్), స్టాలిన్ (సోవియట్ రష్యా) జరిపిన సమావేశము. బ్రిటిష్ ఎన్నికలయందు చర్చిల్ పక్షము ఓడిపోవుటచే 28-7-1945, తరువాత బ్రిటిష్ ప్రధానమంత్రియైన అట్లీ, చర్చిల్‌కు బదులుగా సమావేశమున పాల్గొనెను. ఈ సమావేశము జర్మనీని గురించి క్రింది నిర్ణయములు చేసెను : 1. దేశమున నిరాయుధీకరణము, నిస్సైనికీకరణము అమలు జరుపుట ; 2. నాజీ పార్టీకి సంబంధించిన సంస్థలను రద్దుచేయుట ; 3. యుద్ధ నేరస్థులను విచారించుట ; 4. ప్రజాస్వామ్య సూత్రములను దేశీయులలో ప్రోత్సహించుట ; 5. ప్రజాస్వామ్య రాజకీయ పక్షములను, స్థానిక స్వపరిపాలనను పునరుద్ధరించుట ; 6. సైనిక భద్రతకు భంగకరము కాని విధముగ వాక్, పత్రికా, మత స్వాతంత్ర్యములు దేశీయులకు కలుగజేయుట. అంతేకాక, ఈ క్రింది ఆర్థిక నిర్బంధములు విధించ నిర్ణయింపబడెను : 1. యుద్ధ సామగ్రియు, యుద్ధ సాధనములును నిర్మింపబడకూడదు ; 2. యుద్ధమునకు అవసరమైన ధాతువులు, రాసాయనిక ద్రవ్యములు, పరికరములు మొదలగు వాని ఉత్పత్తిపై అదుపు ఉంచబడవలెను ; 3. జర్మనీ గుత్త వ్యాపార సంస్థలను వికేంద్రీకరించవలెను ; 4. ఎగుమతి - దిగుమతులపైనను, శాస్త్రీయ పరిశోధనలపైనను అజమాయిషీ విధించవలెను. పైవానితోబాటు ద్వితీయ ప్రపంచయుద్ధము [చూ.] న కలిగించిన నష్టములకు, బాధలకు పరిహారము క్రింద కొంత మొత్తమును మిత్రమండలి రాజ్యములకు జర్మనీ చెల్లించవలెను అని కూడ ఈ సమావేశము తీర్మానించెను. జర్మనీ నౌకాసైన్యమును, వర్తక నౌకలను సహితము మిత్రరాజ్యమండలి రాజ్యములు వశపరచుకొనుటకును వివరములను గురించిన ఏర్పాటులు లేకుండ స్థూలముగ నిర్ణయములు జరిగెను [చూ. జర్మనీ, పశ్చిమ ; జర్మనీ, తూర్పు]. స్వ. వెం.

**పోప్‌లు :** క్రైస్తవ ప్రపంచములోకెల్ల చారిత్రక ప్రసిద్ధిచెందిన రోమ్ నగరమునందలి క్రైస్తవ మతాధిపతి 'పోప్' అను బిరుదముతో ముఖ్య మతాధికారిగ పరిగణనను పొందెను. సామ్రాజ్యము విస్తరించినను, రోమ్‌నగరమే ప్రధాన స్థానముగ ఉండుటచేతను, క్రైస్తవమత ప్రచార

కులు జీసస్ క్రైస్ట్ ప్రియశిష్యులు అయిన పాల్, పీటర్ అచట మతప్రచారము చేసి ప్రాముఖ్యము వహించుటచేతను ఆ పట్టణపు బిషప్‌నకు ఈ అగ్రగణ్యత క్రమముగ చేకూరినది. పైగా పీటర్ ప్రథమ రోమన్ బిషప్ అయిన కారణమున స్వర్గద్వారపు తాళపు చెవులు ఆయన చేత కలవని పెక్కుమంది విశ్వసించిరి. 5 వ శతాబ్దము చివరలో అందరు బిషప్‌లు రోమ్ బిషప్ ఆధిపత్యమును అంగీకరించిరి. అప్పటి చక్రవర్తి కూడ పశ్చిమ యూరప్ ఖండవాసులు అందరును రోమ్ నగర బిషప్ శాసనములను గౌరవించి ప్రవర్తించవలెననియు, కోరినంతనే ఆయనను దర్శనముచేసి పూజించవలెననియు ప్రకటించుటచే ఆయన పదవి అత్యున్నతమై వెలుగొందెను. ప్రథమమున పోప్ బిరుదమును చాలమంది వహించినను గ్రెగరీ - VII ఇకముందు పోప్ బిరుదము రోమ్ బిషప్ మాత్రమే వహింపనగునని ప్రకటించెను. ఆయన మత ప్రచారకులను పంపి ఇంగ్లండు, స్పెయిన్, జర్మనీ దేశములను రోమన్ కేథలిక్ మతము వంకకు త్రిప్పి, పోప్ యాజమాన్యమును ఇతర దేశములందలి క్రైస్తవులు అందరు శిరసావహించునటుల చేసెను.

ఆయన క్రీస్తు ప్రతినిధిగా భూలోకమున సత్కరింపబడుటచే, ఆర్చిబిషప్‌లు, బిషప్‌లు, మంక్‌లు, క్లెర్జీలు ఆయన ఆజ్ఞలను పాలించి ప్రవర్తించుచుండిరి. ప్రతిదేశమునను వందలకొలది మొనాస్టరీలు నిర్మింపబడుటచే అందు ఉండెడు మంక్‌లు మతప్రచారమునకు పూనుకొని తోడ్పడిరి. ప్రతి మతాధికారి తన ఉద్యోగరీత్యా ఆ సంస్థకుచెందిన భూములు, దాన ధర్మములవలన వచ్చు ఆదాయము గ్రహించి, వైభవముతో జీవించెను. క్రమముగ న్యాయపరిపాలనా సంబంధమగు అధికారములు కూడ వారు చలాయించ మొదలిడిరి. ఆ తీరుగనే పోప్‌కూడ కొంత భూభాగము తన సొంత ఆస్తిగ ఎంచుకొనుటచే ధన కనక వస్తు వాహనములతో అమిత వైభవోపేతముగ జీవించుచుండెను. క్రొత్తగ అధికారమునకు వచ్చిన చర్చి ఉద్యోగస్థులు పదవ వంతు అయివేజును పోప్‌నకు ఇచ్చుచుండిరి. మరియు అనేక కార్యములయందు ఆయనకు దక్షిణలు, సమ్మానములు, ధర్మములు సంక్రమించుచుండెడివి. చక్రవర్తి, రాజులు ఆయనను భగవంతునితో సమానునిగ ఎంచుకొని ఆరాధించి, సమ్మానించుటచే ఆయన అధికారమునకు అంతులేకుండెను. రోమన్ కేథలిక్ చర్చికి అధ్యక్షస్థానము వహించిన పోప్ ఇటుల తన ఆధిపత్యమును దృఢముగ స్థాపించుకొనెను.

షార్లమేన్ మరణానంతరము చర్చికూడ తన అధికారమును కొంత కోల్పోయెను. బిషప్‌లు, ఏబట్‌లు కూడ విస్తృతములగు భూములు కలిగి ఉండుటచే సామాన్య సామంతులవలనే రాజాధికారము అంగీకరించి ప్రమాణములు తీసికొనవలసివచ్చెను. వారిని క్లెర్జీ ఎన్నికలలో ఎన్నుకొను అభ్యాసము త్రోసిపుచ్చి, రాజునకు ఇష్టమగు వారినే ఎన్నుకొను ఆచారము ఏర్పడెను. తనకు ఇష్టము లేనివారిని ఎన్నుకొన్నచో దాని సంబంధమగు భూమిని రాజు స్వాధీనము చేయుటకు నిరాకరించెను. రాజునకు అధీనులై, వారు రాజు చెంతనుండి తమ అధికార చిహ్నములు, ఉంగరము, దండము స్వీకరించుచుండెడివారు. ఇట్టి పద్ధతులు చాలమందికి కష్టముగతోచి, చర్చి సంపూర్ణ స్వాతంత్ర్యముపొంది అనుభవింపవలెనని పట్టుబట్టిరి. క్లెర్జీ స్వతంత్రులు అయినచో రాజాధికారముపై తిరుగుబాటు చేసి, దేశక్షేమమునకు ప్రతిబంధకముగ సంచరించెదరని రాజులు భయపడిరి. కావున, వారి అన్యోన్యసంబంధములు నిర్ణయించుటకు పోరాటము ప్రారంభమైనది. దీనినే 'ఇన్‌వెస్టిచర్' పోరాటము అందురు.

పోప్ - చక్రవర్తి వివాదము: తొమ్మిదవ, పదవ శతాబ్దములలో చర్చి ఐశ్వర్యమును, పలుకుబడిని రాజులు, గొప్ప భూస్వాములు ఎదుర్కొన జూచిరి. ఇట్టి పరిస్థితులలో రోమన్ కేథలిక్ చర్చికి అంతర్జాతీయ గౌరవము సంపాదించవలెనని పోప్ చాలా తీవ్రముగ ప్రయత్నించవలసి వచ్చెను. నికలస్ - II 1059 లో పోప్ ఎన్నిక చక్రవర్తి హస్తమునుండి తప్పించి, మత ప్రచారకుల ప్రతినిధులగు కార్డినల్జ్ చేతికి అప్పగించుచు శాసించెను.

గ్రెగరీ - VII 1073 లో పోప్ అయ్యెను. ఆయన తన 12 ఏండ్ల పాలనలో పెక్కుమార్పులు కావించి, పోప్ పదవీ ప్రతిష్ఠను పునరుద్ధరించెను. బిషప్‌లను ఏర్పాటు చేయుట, తొలగించుట మున్నగు అధికారములు చక్రవర్తులకును, రాజులకును ఉండినవి. ఇప్పుడు అవి పోప్‌నకు ఇవ్వబడినవి. పోప్ చర్యలు ఎవ్వరును విమర్శింపరాదని, ఆయన ఆధిపత్యము క్రింద ఉన్న చర్చి ఎన్నటికిని తప్పిదము చేయజాలదని, ఆయనకు అప్పీళ్ళు విచారించి, అంతిమ తీర్మానము ఇచ్చు సర్వాధికారము కలదని స్పష్టము చేయబడెను. గ్రెగరీ పై సూత్రములను అనుసరించి పరిపాలించి చర్చి ప్రతిష్ఠను పెంపొందించెను. సృష్టికర్త పోప్‌ను, రాజును సూర్య చంద్రులవలె అధిపతులుగ నియమించినను, సూర్యుడే చంద్రునికన్న ఘనుడగుటచేత తన అధికారము గుర్తెరిగి, రాజు పాలింపవలెనని రాజులను అతడు హెచ్చరించెను. కాని, ఇంగ్లండు రాజగు విలియమ్, పోప్ కరుణచే తాను ఇంగ్లండు రాజు కానందున తన అనుమతి లేనిదే ప్రజలు పోప్ అధికారమును గుర్తింప అవసరము

లేదని, తన అంగీకారము పొందని పోప్ ఆజ్ఞలను పాటించ అక్కరలేదని ప్రకటించి, పోప్ అధికారమును అరికట్టెను. 1075 లో పోప్ తన మతాధికారులు సామాన్యుల వద్ద నుండి అధికారపత్రములను పొందరాదని శాసించెను. కాని, చక్రవర్తియైన హెన్రీ - IV అయ్యది సరకు చెయ్యక, తన ఇచ్చవచ్చినటుల పోప్ బహిష్కరించినవారిని దగ్గరకు చేర్చి, ఉద్యోగములను ఇచ్చి గారవించెను. పోప్ కోపోద్దీపితుడై ఆయనపై పగ తీర్చుకొన జూచుచుండెను. తన అనుచరులచే జర్మనీ చక్రవర్తి వరమ్జ్‌వద్ద ఒక సమావేశము జరిపించి, హెచ్చుమంది బిషప్‌ల రావించి, పోప్ ఆధిపత్యము తాము గుర్తింపజాలమని వారిచే ప్రకటింపచేసెను. దానికి ప్రత్యామ్నాయముగ హెన్రీని గుర్తించి వారు తీసుకొనిన ప్రమాణములు చెల్లనేరవని పోప్ శాసించెను. హెన్రీపై అసూయ, అసంతృప్తి కలిగిన పెక్కుమంది భూస్వాములు సమయము కనిపెట్టి చక్రవర్తికి గల యాజమాన్యమును త్రోసిరాజు చేసి పోప్‌ను ఆహ్వానించి, ఆయన సలహాను అనుసరించి హెన్రీని పదచ్యుతుని చేయ సంకల్పించిరి. హెన్రీ తన చక్రవర్తి పదవి పోవునని భీతినొంది, తన రాయబారులను పోప్ వద్దకు పంపి ఆయనతో సమాధానపడగోరెను. తాను క్షమాపణము కోరుటకై వచ్చితినను సందేశము పంపినను పోప్ నిరాకరించెను. మూడు దినములు వరుసగా పాదచారియై పశ్చాత్తాపముతో పోప్ సౌధమునకు వెళ్ళగా ఆయన చక్రవర్తిని వెడలగొట్టించెను. తుదకు దయజూచి చక్రవర్తిని తన చెంతకు రానివ్వగా, హెన్రీ పాదాక్రాంతుడై సాష్టాంగ దండప్రణామములు ఆచరించెను. పోప్ ఆయనను దయతో పైకి లేవనెత్తి క్షమించితినని, బహిష్కారమును తొలగించి, హెన్రీ - IV ని చర్చి సంరక్షణ క్రిందికి తీసికొంటినని ప్రకటించెను.

కాని, హెన్రీ అనుకొన్నంత నమ్రుడుగ ఉండక జర్మనీలో తన ఆధిపత్యము కాపాడుకొనినంతనే బలవంతుడై పోప్‌ను తిరిగి ధిక్కరించెను. పోప్ తిరిగి చక్రవర్తిని పదవీచ్యుతుని చేసెను. అంతట హెన్రీ ఉగ్రుడై పోప్ ఆధిపత్యమును తన ప్రజలు అంగీకరింపనవసరము లేదని చెప్పి మరొక జర్మనీ బిషప్‌నకు ఆ బిరుదు ఒసంగెను. అంతటితో ఊరకుండక పెద్ద సైన్యమునకు నాయకత్వము వహించి పర్వతముల దాటి హెన్రీ ఇటలీ ప్రవేశించి రోమ్‌ను సమీపించెను. తన సైనికులు జ్వరపీడితులు అగుటచే అప్పటిలో వెనుకకు తగ్గినను, మూడేండ్ల పిదప రోమ్‌నగరమును ముట్టడించి, పోప్‌ను నలువైపులా చుట్టివేసెను. మున్నెన్నడూ కనివిని ఎరుగనట్లు జర్మనీసైనికులు రోమ్‌ను కొల్లగొట్టి దోచుకొనిరి. ఇట్టి దారుణమైన దోపిడులకు కారకుడగు పోప్‌పై ప్రజలు తిరుగుబాటు చేయుటచే ఆయన రోమ్ విడిచిపోయి 'సాలర్నో' వద్ద మరణించెను.

హెన్రీ మరణానంతరము కూడ చక్రవర్తులకును, పోప్‌లకును పోరాటము జరుగుచునే ఉండెను. 1122 లో జరిగిన వరమ్జ్ కన్‌కార్డెట్ ప్రకారము బిషప్‌ల ఎన్నికలు చర్చి జరుపునట్లును, అధికార చిహ్నములగు ఉంగరము, దండము పోప్ ఇచ్చునట్లును, చక్రవర్తి కాని, ఆయన ప్రతినిధులు కాని ఎన్నికల సమయములో హాజరయి ఎన్నికల తగాదా పరిష్కరించునట్లును, బిషప్‌లు అందరు చక్రవర్తికి ఆయన సామ్రాజ్యమునందు ఉన్న భూములపై ఆయన ఔన్నత్యమును అంగీకరించునట్లును ఒడంబడిక సమకూర్చుకొనిరి. ఈ తీరుగ జర్మనీయందు బిషప్‌లపై యాజమాన్యము చక్రవర్తి కాపాడుకొనగలిగెను.

ఇంతటితో పోరాటము అంతమొందలేదు. 1152 లో ఫ్రెడరిక్ బార్ బొరోజా జర్మనీ రాజుగ ఎన్నుకొనబడి, పవిత్ర రోమన్ సామ్రాజ్యపు చక్రవర్తిగ పట్టాభిషిక్తుడు అయ్యెను. ఈ చక్రవర్తి తన సైనికులతో 1154 లో ఆల్ప్స్ పర్వతములను దాటి ఇటలీ ప్రవేశించెను. అప్పటి పోప్ ఏడ్రియన్ - IV అతి వైభవముతో ఆయనను రోమ్‌నగరమున పోప్ అధికారముతో పట్టాభిషిక్తుని కావించెను. అయినను, వారి ఇరువురకును తగవు తప్పినదికాదు. పోప్ స్వారీ చేయు గుర్రము జీను, కళ్ళెము పట్టుకొనుటకు ఫ్రెడరిక్ నిరాకరించి, తన గొప్పతనము పోప్ గౌరవము కన్న హెచ్చని పట్టుబట్టగా, పోప్ తానే సర్వాధికారినని ప్రకటించెను. తిరిగి పూర్వపు తగాదా - అలిగ్జాండర్ - III పోప్ అయినంతనే - తీవ్రరూపము దాల్చెను. అలిగ్జాండర్ - III పోప్ కాగానే, పోప్‌ను అగౌరవపరచగా, ఆయన కోపించి, విక్టర్ - IV అను వానిని పోప్‌గ నిలబెట్టెను. ఫ్రెడరిక్ సైనికులు పోప్‌ను వెంటాడిరి. అన్నివైపుల చక్రవర్తి అధికారము వ్యాపింపగా. పోప్ ఉక్కిరి బిక్కిరి అయ్యెను. 1189 లో చక్రవర్తి మతయుద్ధమున పాల్గొనుటకై పాలస్తీనా ప్రయాణమై ఆసియామైనర్‌నందు ఒక నదిలో స్నానము ఆచరించుచు నీటియందు మునిగి మరణించుటచే అప్పటితో ద్వితీయ ఘట్టము ముగిసినది.

ఆయన కుమారుడైన హెన్రీ - VI 1197 లో చనిపోయెను. ఆయన కుమారుడు ఫ్రెడరిక్ కడు పసివాడు. ఈ కాలముననే, అనగా 1198 లో - ఇన్నొసెంట్ - III పోప్‌గ ఎన్నుకొనబడెను. ఇతడు చాల సమర్థుడు. యూరప్ ఖండముపై పోప్ మతాధికారము అద్వితీయముగ వెల్గొందజేయుటకై ఇతడు కృషిసల్పెను. హెన్రీ చనిపోయిన

తరువాత బయలుదేరిన గల్లంతులలో ఇన్నొసెంట్ - III జోక్యము కలుగజేసికొని, తన అధికారమును పెంపొందింప యత్నించెను. ఇంగ్లండునందలి బిషప్‌లపై తన ఆశ్రితుడగు స్టీఫెన్ లాంగ్టన్‌ను ఆర్చిబిషప్‌గా నియమించెను. జాన్ రాజును పాదాక్రాంతుని చేసి, ఎక్కువ మొత్తమును కప్పము క్రింద గుంజుకొనెను. బీదలకు, సన్మార్గవర్తులకు సాహాయ్యము చేయుచున్నను ఆయన చాలమందికి శత్రువయ్యెను. పోప్ అర్థానికి లెక్కచేయక తన ధర్మములను నిర్వర్తింప బద్ధకంకణుడు ఆయెను. ఎవరికి వారు ప్రత్యేకముగ ఉండగోరిన తరి, ఆయన వారిని అందరిని ఏకము చేసి బుద్ధిమంతులుగ, విద్యావంతులుగ, సన్మార్గవర్తకులుగ చేయ సమకట్టుట మెచ్చుకొనదగినది.

ఇందులకు తోడుగ చక్రవర్తియగు ఫ్రెడరిక్ - II తో కూడ ఇతడు సఖ్యమును పాటింపగలిగెను. బాలుడైనను ఈ చక్రవర్తి మహా విద్యావంతుడుగ పేరొందెను. సిసిలీయందు ఈ చక్రవర్తి తన బాల్యమును గడుపుటవలన బహుశాస్త్రములతో పరిచయము అతనికి లభించెను. ఆ కాలమున ప్రాక్, పశ్చిమ వాసులకు సిసిలీ కూడలి స్థానముగ, నాగరకతా కేంద్రముగ పేరు పడసెను కావున, ఫ్రెడరిక్ - II ఆ అవకాశమును సద్వినియోగము చేసికొని, వేదాంత శాస్త్రమును అభ్యసించి పోప్‌లకన్న మిన్నయై ఉండెను. ఆ కాలపు యూరప్ ఖండమున ఆయనను మించిన విజ్ఞాని లేని కారణమున ఆయనకు 'ప్రపంచమందలి ఆశ్చర్యపురుషు' డని పేరిడిరి. తల్లి మరణించిన తరువాత పోప్ ఇన్నొసెంట్ సంరక్షణలో ఫ్రెడరిక్ - II కొంత కాలము ఉండెను. 1211 లో జర్మనీ రాజులు కొందరు కలసి ఆయనను జర్మనీ సార్వభౌమునిగ ఎన్నుకొనిరి. తనకు లోబడి ఉండునని తలచి ఫ్రెడరిక్ - II నకు లోగడ తగాదాలలో ఇన్నొసెంట్ సాహాయ్యము చేసెను. ఆయన జీవితకాలములో మట్టుకు ఉభయులు సఖ్యముగ ఉండిరి.

పోప్‌లు పవిత్ర స్థలముల సంరక్షణార్థమై క్రూసేడ్ (మతయుద్ధము) లను సన్నాహపరచిరి. ఫ్రెడరిక్ -II కొంత కాలము పోప్ ఇష్టానుసారము అందు ప్రవేశించనందున ఆ కాలపు పోప్ ఆయనను బహిష్కరించి నిర్బంధించి, అందు పాల్గొనునట్లు చేసెను. హోనోరియస్ పిదప గ్రెగరీ పోప్ పదవిని అధిష్ఠించెను. ఆయన ప్రోద్బలముచే ఫ్రెడరిక్ - II బ్రిండిసీ నుండి సముద్రయానము సలిపి, జబ్బుపడి రెండు రోజులలో ఇంటికి చేరెను. వెంటనే ఆయనను పోప్ బహిష్కరించగా, వీలు చూచుకొని సకల ప్రయత్నములు గావించుకొని, పాలస్తీనాకు ప్రయాణమై 1228 లో ఆ పవిత్ర భూమిని చేరుకొనెను. పోప్ అయ్యది అపార్థము గావించుకొని బహిష్కరించెను. అంతట ఆయన క్రిష్టియన్ ప్రపంచ పవిత్రతను కాపాడుటకు కత్తి కట్టితినని ప్రకటించగ ప్రజలు తిరుగుబాటు చేసి రోమ్‌నుండి గ్రెగరీని పారద్రోలిరి.

చక్రవర్తి అందులకు సంతసించి పాలస్తీనా పవిత్ర స్థలములకు అంతగ లెక్కచేయక కెయిరో సుల్తాన్‌తో సంధి చేసికొనెను. జెరూసలెమ్, బెతల్‌హామ్, నాజరెత్ దేశములను క్రైస్తవులకు ఒసంగి, సముద్రతీరమునకు రాకపోకలు జరుపుకొనుటకు అనుమతించెను. తాను వెలివేసిన చక్రవర్తి యుద్ధము వర్జించి లాభకరములగు షరతులను సంపాదింప కలిగినను, ఉగ్రుడై ఆ సంధి చెల్లనేరదని పోప్ ప్రకటించెను. ఫ్రెడరిక్ - II జెరూసలెమ్‌లో తన స్వహస్తములతో కిరీటము శిరముపై ధరించెను. పోప్‌నకు స్నేహపూర్వకముగ చక్రవర్తి జరిగినదంతయు తెలియజేయగా అప్పుడు అందులకు ఆయన ఇయ్యకొనెను.

ఫ్రెడరిక్, పోప్‌లు స్నేతులయినంతనే పూర్వపు వైషమ్యము అంతరించెను. కాని, ఆ తరువాత అనతి కాలముననే ఇటలీ దేశమునంతటిని ఫ్రెడరిక్ - II ఆక్రమింపగా తనకు నలుదిక్కులను చక్రవర్తి రాజ్యములే ఉండినను, తన అధికారమును అంతరింప జేయుటకు ఈ విధముగ చక్రవర్తి చేసెనని భావించి, చక్రవర్తిని పోప్ తిరిగి బహిష్కరించెను. అంతట ఈ సంఘర్షణ విపరీతరూపము దాల్చెను. ఉభయులు యూరప్ ఖండమంతయు తగవులో మునిగి తేలునట్లు చేసిరి. గ్రెగరీ 1241 లో చనిపోవగా ఇన్నొసెంట్ - IV పోప్‌గ ఎన్నుకొనబడెను. రాజీ కుదుర్చ ప్రయత్నము జరిగెనే కాని ఫలించలేదు. ఈ పోరాటము ఫలప్రదముగ జరుపుటకు పోప్ జర్మనీయందు ఉద్రేకము పురిగొల్పి హెన్రీరాస్పీ అను వానిని చక్రవర్తిగ ఏర్పరచి, ఫ్రెడరిక్ -II పై మత యుద్ధము ప్రకటించెను. తన అధికారము భగవద్దత్తమగుటచే మనుష్యమాత్రుడగు పోప్ దానిని పరిమార్పజాలడని, తనకన్న తక్కువ శ్రేణి హోదాకు చెందిన పోప్‌ను దండించు అధికారము తనకు కలదని చక్రవర్తి చాటెను. తత్ఫలితముగ ఇటలీయందు భయంకర యుద్ధము చెలరేగెను.

ఈ పోరాటమున ఫ్రెడరిక్ - II 1250, డిసెంబరులో హతుడయ్యెను. ఆయన అక్రమ కుమారుడు మాన్‌ఫ్రెడ్ పన్నెండు ఏండ్లు పెనగులాడెనే కాని, లాభము లేకపోయెను. ఫ్రెడరిక్ కుమారుడు కాన్‌రాడ్ కూడ మరణించగ ఆయన కుమారుడు కాన్‌రాడిన్ ఇటలీపై దండెత్తెను. 1268 లో ఆయనను ఓడించి ప్రజలు బంధించిరి. ఈ రీతిగ రాజవంశము పరిసమాప్తి చెందెను. పోప్ గెలుపొందినట్లు కనపడినను ఆయన అధికారము విచ్ఛిన్న

మైనది. యూరప్‌నందు అప్పటి నుండియు కేంద్రమున గౌరవింపదగిన పోప్ ఉద్యోగి లేకపోయెను. దక్షిణ ఫ్రాన్స్‌నందు అవిగ్నాన్‌లో పోప్‌లు శరణుజొచ్చి అజ్ఞాత వాసము గడిపిరి. రాజకీయముగ జర్మనీ పెక్కు చిన్న రాజ్యములుగ విభక్తమయినది. చర్చి అంతటికి ఏకచ్ఛత్రాధిపత్యము వహించిన పోప్ అధికారము సన్నగిలి క్షీణించి, తీవ్ర విమర్శలకు గురి అయ్యెను.

ఇటుల క్షీణదశ నందిన చర్చి గౌరవమును పదమూడవ శతాబ్దిలో డొమినికన్‌లు, ఫ్రాన్సిస్కన్‌లు అను మత సన్న్యాసుల సంఘములు కాపాడి ఉద్ధరించెను. స్పానిష్ దేశస్థుడగు డొమినిక్ మొదటి సమాజమునకు మూల పురుషుడు. రెండవ దానికి ఇటలీ నివాసి ఫ్రాన్సిస్ కారకుడు. ప్రచారకులు, ఉద్యోగస్థులు చేయు అపవిత్రత వల్లను, వారి దుష్కార్యముల వల్లను ప్రజల సదభిప్రాయమును చర్చి కోల్పోవుచున్నదని గ్రహించి, వారిరువురిని స్వార్థత్యాగులగు అనుచరులుగ తరిఫీదు చేసి, ప్రజలకు మార్గదర్శులుగ ఉండునట్లు చేయసెంచి, ఆ సమాజములు స్థాపింపబడినవి. కొంత కాలము వెనుకాడినను, ఇన్నొసెంట్ వారి సమాజములపై తన సానుభూతిని వెల్లడించెను. డొమినిక్ ప్రజల అజ్ఞానము తొలగించ బూనుకొనగ, ఫ్రాన్సిస్ వారి కష్టములను నివారింప యత్నించెను.

కొంత కాలము గడచుసరికి ఆ సమాజ సభ్యులలో కూడ ధనాభిలాష, ప్రాపంచిక సుఖలోలత్వము పెరిగెను. కాని, ఏది ఎట్లున్నను క్షీణించుచున్న చర్చి గౌరవమును కొంత వరకు వారు నిలబెట్టగలిగిరి. ఇంతలో పోప్, ఫ్రెంచి రాజుల మధ్య సంబంధములు మరింత క్లిష్టమయ్యెను. ఫ్రెంచి రాజగు ఫిలిప్ చేసిన తప్పిదముల జాబితాను ఒక దానిని తయారు చేసి అప్పటి పోప్ అగు బానిఫేస్ - VIII ఆ రాజునకు పంపుచు, పోప్ అధికారమునకు ఆయన అతీతుడు కాదని తాఖీదు పంపెను. దానికి కోపము నొంది ఫ్రెంచి రాజు సైనికులను బానిఫేస్ - VIII నివసించు అనగ్నికి పంపి మూడుదినములు పోప్‌ను బందిఖానాయందు ఉంచెను. సైనికులు పోప్‌ను వంచన చేయుటకై అమానుష కృత్యముల కావించిరి. తన ఆత్మగౌరవమునకు తీరని కళంకము కలిగెనని క్రుంగి, కృశించి బానిఫేస్ - VIII వారము రోజులలో మృత్యువు వాతబడెను. పోప్‌లతో ఇక పోరాడుట మర్యాదగాదని ఎంచి, ఫిలిప్ ఒక ఫ్రెంచి దేశస్థుడు పోప్‌గా ఎన్నుకొనబడునట్లు శ్రద్ధ వహించి పోప్ ఫ్రెంచి పట్టణము అగు అవిగ్నాన్‌లో నివసించునట్లు ఏర్పరచెను. 1305 - 77 ల మధ్య పోప్‌లు తమ ముఖ్య పట్టణము వదలి అజ్ఞాత వాసమున గడుపవలసి వచ్చెను. పోప్‌లు అందరు అంతటినుండి ఫ్రెంచివారు అగుటచేతను, వారు ఫ్రెంచి రాజు యాజమాన్యముక్రింద ధన సంపాదనకు పూనుకొని అధికార స్థాపనకు గడంగుటచేతను ఫ్రెంచి వారి రాజకీయ శత్రువులగు ఇంగ్లండు దేశస్థులు ఆ పోప్‌లను ప్రతిఘటించిరి.

ఇటుల 1305 మొదలు 1376 వరకు పోప్‌లు ఫ్రాన్స్‌నందే నివసించిరి. గ్రెగరీ - XI 1376 లో రోమ్ చేరినను పరిస్థితులు యథాప్రకారముగానే ఉండెను. ఫ్రెంచివారు ఇటాలియన్ పోప్‌ను ద్వేషించి ఫ్రెంచి క్లెమెంట్ - VII ను పోప్‌గ ఎన్నుకొనిరి. ఫ్రాన్స్, స్కాట్‌లాండ్, కాస్టీల్, ఆరగాన్, నేపిల్స్, ఫ్రెంచి పోప్ అధికారమును మన్నించి గౌరవించినవి. ఇంగ్లండు, జర్మనీ, స్కాండినేవియా, పోలండ్, పోర్చుగల్, ఇటాలియన్ దేశములు పోప్‌ను అనుసరించి ప్రవర్తించినవి. ఉభయులు ఉత్తరముల ద్వారా దూషించుకొనుచుండిరి. ఒకరిపై ఒకరు మత యుద్ధమును కూడ ప్రకటించి బహిష్కార పత్రముల పంపిరి. ఇద్దరు పోప్‌ల వద్ద ధనము లేమిచే యుద్ధము మాత్రము జరుగలేదు. ఎంత ఒత్తిడి కలుగజేసినను, తమ అధీనములో ఉన్న దేశములు డబ్బు ఇవ్వకుండెను. అంతట క్షమాపణ పత్రములు విక్రయించి ధనము ఆర్జింప సమకట్టిరి. వారి అనుచరులు బేళ్లతో అపరాధ సహస్రముల మన్నించు పత్రములు చర్చి భవనములయందు చేరిన జనసమూహములకు పంచి ఇచ్చు సర్వాధికారము పోప్‌నకు కలదని చెప్పుచు విక్రయించి, అమితమగు ధనమును ప్రోగు చేసిరి. ఈ పోప్‌ల తగవు అసహ్యకరముగ ఉండుటచే దానిని అంతమొందించుటకై 1409 లో పీజావద్ద గొప్ప సమావేశము జరిగెను. ఈ సమావేశము పోప్‌లకన్న కౌన్సిల్ అధికారము అతీతమైనదని స్థాపించగలిగెను. పోప్‌లు కూడ కౌన్సిల్ తమ్ము అధికారమునుండి తొలగించవచ్చుననుటకు సమ్మతించి తదనుకూలముగ వ్యవహరించుచుండిరి.

వైక్లిఫ్ [చూ.] ఇంగ్లీషు భాషలోనికి 1380 ప్రాంతమున బైబిల్‌ను తర్జుమా చేసి పోప్ అధికారమును ఖండించి, మతప్రచారకుల దుండగములను నిరసించెను. ఆయన శిష్యుడగు హస్ కూడ ధనసంపాదనకై క్షమాపణ పత్రములను అమ్ముట దుర్మార్గమని దూషించెను. బిషప్‌లు ఆగ్రహపూరితులైరి. ఆ కాలమున ముగ్గురు పోప్‌లు వెలసిరి. గ్రెగరీ XII, బెనిడిక్ట్ XIII, జాన్ XXIII, చక్రవర్తియగు సిజిస్‌మండ్ మరియొక కౌన్సిల్‌ను కాన్‌స్టాన్స్‌నందు సమావేశపరుపవలెనెను.

కౌన్సిల్ సమావేశమునందు పోప్ జాన్‌ను బంధించి, పదచ్యుతుని చేసి దోషారోపణలు చేసిరి. పోప్ గ్రెగరీ

రాజీనామా ఇచ్చెను. బెనిడిక్ట్ ఇంకను పోప్ నేనని పట్టుకు ప్రాకులాడెను. కాని, కౌన్సిల్ ఆయనకు అట్టి అధికారము లేదని ప్రకటించుటచే ఆయన అధికారమును ప్రజలు పాటింపలేదు. తుదకు 1417 లో రోమ్ నగరవాసి మార్టిన్ - V పోప్‌గా ఎన్నుకొనబడెను. ఈ తీరుగ బహునాయకత్వము తుదముట్టించబడెను. దానితోపాటుగ పోప్ ఆధిపత్యము కూడ అంతమొందినది. పోప్ నిరంకుశత్వము మాయమగుటచే పోప్‌లను పదభ్రష్టులను చేయు అధికారము కౌన్సిల్‌నకు సంక్రమించెను. యూరప్ వ్యవహారములలో జోక్యము కలిగించుకొనుటమాని పోప్‌లు ఇటలీలో నివసించి ఆ ద్వీపకల్పపు విషయములలో మాత్రమే జోక్యము కల్పించుకొనుచుండిరి.

ఇటలీయందు కూడ తమ మతాధిపత్యమును క్రమముగా పోప్‌లు కోల్పోయిరి. పోప్, అతని అనుచరులును విచ్చలవిడిగా ధనార్జనకు పూనుకొని, సుఖలోలత్వమును అవలంబించిరి. అయ్యది సహించజాలక సంస్కరణాభిలాషులు ప్రతిఘటించిరి. అట్టి వారిలో సెవనరోలా ప్రముఖుడు. ఇతడు పోప్ మత ప్రచారకుల దుష్ప్రవర్తనను ఖండించెను. చర్చిని సంస్కరించి ప్రజాజీవితము నైతికపరముగ చేయుటకు ఆయన సంకల్పించెను. కాని, ఆయన అనుచరులు మతోన్మాదముతో తప్పుత్రోవ త్రొక్కి, ఆయన ఉద్యమమునకు కళంకమును ఆపాదించిరి. అయినను, చర్చి సంస్కరణావశ్యకతను మాత్రము అందరును గ్రహించిరి. చి. బా. శాస్త్రి.

**పోర్ట్స్‌మత్ సంధి** (23 - 8 - 1905): రష్యా, జపాన్ దేశముల మధ్య జరిగిన యుద్ధము (1904 - 1905) ను తుదముట్టించిన ఈ సంధి షరతులు ఇవి:

1. కొరియాలో జపానీయుల ఆధిక్యమునకు రష్యన్‌లు అంగీకరించుట;
2. తనకు కౌలు మూలకముగ అనుభవములో ఉన్న ఆర్థర్ రేవును, క్వాన్‌టంగ్ ద్వీపకల్పమును (రైలు మార్గముతో సహా) రష్యా జపాన్‌నకు దఖలు పరచుట;
3. సఖాలిన్ దీవిలో దక్షిణపువైపు సగమును జపాన్‌కు దత్తము చేయుట;
4. ఉభయదేశములును మంచూరియానుండి వైదొలగి, దానిని మరల చీనాకు అప్పగించుట.

దూరప్రాచ్యమున రష్యన్ సామ్రాజ్య విస్తరణకు ఈ సంధితో స్వస్తి చెప్పబడినట్లు పరిగణింపదగును. కాని, ద్వితీయ ప్రపంచయుద్ధము [చూ.] న కలిగిన పరాజయముతో పై సంధిలోని మొదటి మూడుషరతులవలన లభించిన సౌకర్యములను జపాన్ పోగొట్టుకొనెను. స్వ. వెం.

**పోర్చుగల్**: యూరప్ ఖండపు పశ్చిమ తీరమున ఉన్న ఒక స్వతంత్ర రాజ్యము.




ఈ దేశమునకు స్పెయిన్ [ఉ, తూ]; అట్లాంటిక్ మహాసముద్రము [ద, ప] సరిహద్దులుగ కలవు. [వి] 91,971 చ. కి. మీ.; పరిపాలన రీత్యా అజోర్స్‌ద్వీప సముదాయము (2,299 చ. కి. మీ); మదీరా, పోర్టోసన్టో దీవులు (797 చ. కి. మీ) ఈ దేశమున చేరి ఉన్నవి. వీనిలో తొలుతటిది పోర్చుగల్‌నకు పశ్చిమమున 1,287 కి. మీ. దూరమునను, కడపటిది ఆ దేశమునకు నైరృతిమూలన 965 కి. మీ. దూరమునను అట్లాంటిక్ మహాసముద్ర పరివృతములై ఉన్నవి. [జ] 90,90,000. [భా] పోర్చుగీస్. [మ] దేశ ప్రజలలో 97% రోమన్ కేథలిక్‌లు. [రా] లిస్బన్ (జ. సం. 8,18,382).

చరిత్ర: పోర్చుగల్‌లోని అతి ప్రాచీన వాసులు ఫొనీషియన్‌లు, కార్తజీనియన్‌లు అను ప్రాచీన జాతులకు చెందినవారు; తరువాత గ్రీక్‌లు కూడ వచ్చిచేరిరి. క్రీ. శ. 400 సంవత్సర ప్రాంతములో విజిగాత్‌లు అనబడు అనాగరక ప్రజలు పోర్చుగల్‌ను వశపరచుకొనిరి. క్రీ. శ. 700 ప్రాంత

ములో ఉత్తర ఆఫ్రికాకు చెందిన ముస్లిమ్‌లు (మూర్‌లు అని వ్యవహరింపబడువారు) పోర్చుగల్‌ను జయించిరి. వీరు పోర్చుగల్‌ను సమర్థముగ పరిపాలించిరి. కాని, క్రీ. శ. 900 సంవత్సర ప్రాంతములో వీరు బలహీనులయిరి; క్రైస్తవులకును, వీరికిని యుద్ధములు ప్రారంభమయినవి. ఈ సంగ్రామములు 1200 వరకును సాగుచునే ఉండెను. 13 వ శతాబ్దపు ఉత్తరార్ధమున పోర్చుగల్ దేశమునకు సుస్థిర ప్రతిపత్తి చేకూరి, జాతీయ రాజవంశ పరిపాలన మొదలయినది. ఇట్టి రాజవంశములో అవేజ్ వంశపు రాజుల కాలమున పోర్చుగల్ మహోచ్ఛ్రదశను అనుభవించినది. ఈ రాజవంశపు మొదటి రాజు జాన్ పరిపాలన కాలము (1385 - 1433) న స్పెయిన్ దేశమును పోర్చుగల్ ఓడించి, బ్రిటన్‌తో మైత్రి ఒడంబడిక చేసికొనినది. ఈ జాన్ రాజు రెండవ కుమారుడు హెన్రీ నౌకాశాస్త్రమున అభిరుచి కలవాడు. అందువలన హెన్రీ ది నావిగేటర్ (నావికుడగు హెన్రీ) అని ఇతనికి వ్యవహారనామము కలిగినది. ఈ హెన్రీ నావికులను ప్రోత్సాహపరచి, క్రొత్త దేశములను, మార్గములను పరిశోధించిన వారికి బహుమానములు ఇచ్చెను. ఈ కాలముననే పోర్చుగీస్ నావికులు భారత దేశమునకు సముద్రమార్గమును కనిపెట్టుటకు సాహసముతో ప్రయత్నములు చేసిరి.

ఎమాన్యుయేల్ రాజు 1495 లో రాజ్యమునకు వచ్చెను. 1498, మే 17 న వాస్కో డ గామా [చూ.] అను పోర్చుగీస్ నావికుడు భారతదేశమునకు సముద్ర మార్గమును కనిపెట్టెను. 1500 లో దక్షిణ అమెరికాలోని బ్రెజిల్ పోర్చుగీస్‌వారి అధీనతలోనికి వచ్చినది. పోర్చుగీస్ వారి వర్తక ప్రాబల్యము పెరిగినది. క్రమముగ పోర్చుగల్‌కు ప్రాచ్యదేశములందును, దక్షిణ అమెరికాలోను, ఆఫ్రికా ఖండమునను విశాల సామ్రాజ్యము ఏర్పడెను. జాన్ - III కాలమున ఈ వైభవము తగ్గుట ప్రారంభించినది. పోర్చుగల్ నుండి అనేకులు యూదులు తరిమి వేయబడిరి. వారితో పాటుగ దేశవాణిజ్యము కూడ తరలి పోయినది. పోర్చుగీస్ వారు అనేకులు నూతనముగ కనిపెట్టబడిన దేశములలో నివసించుటకు వలస పోయిరి. 1600 నాటికి ఇంగ్లండుతోను, హాలండ్‌తోను పోర్చుగీస్ నావికులు పోటీకి నిలువలేక పోవుటచేత అనేక ప్రదేశములను పోర్చుగల్ పోగొట్టుకొనినది. క్రమముగ ప్రాచ్య దేశములందును కూడ పోర్చుగీస్ ప్రాబల్యము నశించినది.

పోర్చుగల్ రాజు 1580 లో మరణించగా, దగ్గర వారసులు ఎవ్వరును లేనందున పోర్చుగీస్ సింహాసనము స్పెయిన్ రాజు ఫిలిప్ - II కు చెందెను. 1640 లో స్పెయిన్ పాలనను త్రోసివేసి దేశీయుడగు ఒక ప్రభువు జాన్ - IV అనుపేర సింహాసనము ఎక్కెను. ఇతని వంశము 'బ్రగాంజా వంశము' అను పేర ప్రఖ్యాతి పొందినది. 1668 లో పోర్చుగల్ స్వాతంత్ర్యమును స్పెయిన్ గుర్తించెను.

జాన్ - IV కాలమున పోర్చుగల్ తన పూర్వ ప్రశస్తిని తిరిగి కొంత వరకు సాధించుకొనగలిగెను. బ్రెజిల్ దేశపు సిరి సంపదల సాయమున పోర్చుగల్ ఆ కాలమున సుసంపన్నమయ్యెను. తక్కిన బ్రగాంజా రాజుల కాలమున సైతము పరిస్థితులు ఇటులనే 18 వ శతాబ్దాంతము వరకు ఉండెను. నెపోలియన్ [చూ. పు. 542] తో బ్రిటన్ జరిపిన యుద్ధములందు పోర్చుగల్ బ్రిటన్ పక్షము అవలంబించి నందులకు ఫలితముగ నెపోలియన్ 1807 లో ఈ దేశమును ఆక్రమించి, సైనిక పరిపాలనను నెలకొల్పెను; కాని, అతని పరాజయముతో పోర్చుగల్ తిరిగి స్వతంత్రమయ్యెను. బ్రగాంజా వంశీయులే యథాపూర్వముగ పరిపాలనను అంతటనుండి సాగించిరి.

ఈ బ్రగాంజా రాజ వంశీయులు నిరంకుశ ప్రభువులు. ప్రజాస్వామ్యము అనిన వీరికి గిట్టెడిదికాదు. 1822 లో ప్రజాందోళనకు ఫలితముగ ప్రజా స్వామ్య రాజ్యాంగము ఒక దానిని ఆ నాటి ప్రభువు నెలకొల్పెను. కాని, ఆ రాజ్యాంగ విధానపు నియమములకు లోబడుటకు ఇష్టపడక త్వరలోనే ఆ ప్రభువే దానిని రద్దు చేసెను. 1822 లోనే బ్రెజిల్ దేశపు ప్రజల అందోళనకు ఫలితముగ ఆ దేశము పోర్చుగీస్ సామ్రాజ్యమునుండి విడివడి సర్వ స్వతంత్రము అయ్యెను.

పోర్చుగల్ దేశము 19 వ శతాబ్దియందు తక్కిన యూరప్ దేశములను అనుసరించి ఆర్థికముగ కొంత పురోభివృద్ధిని సాధించెను. రైలు మార్గములు, టెలిఫోనులు మొదలగు ఆధునిక నాగరకతా లక్షణములు ఏర్పడినవి. కాని, ప్రజలకు మాత్రము స్వేచ్ఛా స్వాతంత్ర్యములు సున్న అయ్యెను. ఇందులకు తోడుగ 19 వ శతాబ్ది అంతమున దేశమును పాలించిన రాజులలో అనేకులు భోగలాలసులై ప్రజల శ్రేయస్సును గమనింపనందున ప్రజలు చాల కష్టములు పడవలసి వచ్చినది. అసంతృప్తులైన ప్రజలు 1908, ఫిబ్రవరి 1 న కార్లోస్ రాజును, లూయీ యువరాజును లిస్బన్ నగర వీధులలో హత్యచేసిరి. అతని తరువాత ఎమాన్యుయేల్ - II ప్రజాహిత పరిపాలన నెలకొల్ప ప్రయత్నించెను. కాని, విఫలుడు అయ్యెను. అతడు ఇంగ్లండుకు పోయి తలదాచుకొనవలసి వచ్చినది (1910). అంతట ఎమాన్యుయేల్ డ అరిఏగా ప్రజాసత్తాక రాజ్యపు మొదటి అధ్యక్షుడు అయ్యెను.

ప్రజా సత్తాక రాజ్యము 1910 లో ఏర్పడిన నాటినుండి 1925 వరకును గల 16 సంవత్సరములలోను పోర్చుగల్ లో 18 విప్లవములు జరిగినవి. 40 మంది అధ్యక్షులు మారిరి. ప్రథమ ప్రపంచ యుద్ధము [చూ.] లో పోర్చుగల్ జర్మనీతో యుద్ధములో దిగిన కాలమున పరిస్థితులు చాల క్లిష్టమయినవి.

ప్రథమ ప్రపంచ యుద్ధఫలితముల నుండి దేశము కొంత వరకు కుదుటబడినంతనే 1925 లో దేశమున సైనిక నియంతృత్వపు పరిపాలన ఏర్పడి, తరువాత ఎన్నికలు జరిగి మార్షల్ కార్మోనా అధ్యక్షుడుగ ఎన్నుకొనబడెను. అంతటి నుండి వరుసగ 1935, 1942, 1949 లలో ఈతడే మరల మరల అధ్యక్షుడుగ ఎన్నుకొనబడుట జరిగెను. ఈతని కాలమున తొలుత 1928 లో ఆర్థిక మంత్రిగ ప్రభుత్వమునందు ప్రవేశించిన ఆన్టోనియో డి ఆలివీరా సాలాజార్ క్రమముగ ప్రాముఖ్యమును గడించి 1935 లో ప్రధాని అయ్యెను. అంతటినుండి పోర్చుగీస్ రాజ్యపాలన అతని హస్తగతమయ్యెను. దాదాపుగ నియంతృత్వాధికారములను అతడు ఆనాటినుండియు చలాయించుచున్నాడు. నామమాత్రముగ ఎన్నికలు జరుగుచున్నను, దేశమున ప్రజాస్వామ్యము అనునది నామావశిష్టమయినది. ద్వితీయ ప్రపంచయుద్ధము [చూ.] న మిత్ర రాజ్యములను పోర్చుగల్ బలపరచినది. యుద్ధానంతరమున నాటో [చూ. పు. 337] యందును, ఐక్యరాజ్యసమితి [చూ. పు. 351] యందును ఈ దేశము సభ్యత్వమును ఆర్జించినది.

ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున ప్రపంచ రాజకీయ రంగమునందు వచ్చిన నూతన పరివర్తనల తీవ్రతను గమనింపని కొలది ఛాందసులలో సాలాజార్ ఒకడు. చీనా, భారత దేశము, ఆఫ్రికాలయందు తనకు గల వలస రాజ్యముల ప్రతిపత్తిలో ఏ మార్పును కలిగించుటకు సాలాజార్ అంగీకరింపక మొండిపట్టు వహించినఫలితముగ ఆఫ్రేసియా రాజ్యములయు, అభ్యుదయ భావములు గల తక్కిన ప్రపంచ రాజ్యములయు మైత్రిని అతడు కోల్పోయెను. భారతదేశమునందలి తమ తమ వలస పాలనలను అంత మొందించుటకు తొలుతగ బ్రిటిష్‌పాలకులును, వారిని అనుసరించి ఫ్రాన్స్ ప్రభుత్వమును అంగీకరించి, ఆ దేశ ప్రజలకు స్వాతంత్ర్యము ఒసగినను, పోర్చుగల్ మాత్రము భారతదేశమందలి తన వలసలగు గోవా, డీవ్, దమన్ (డామన్), దాద్రా, నగర్‌హవేలీ ప్రాంతములకు స్వాతంత్రము ఈయ నిరాకరించెను. చారిత్రకముగ, సాంస్కృతిముగ, భాషా విషయికముగ భారత దేశముతో ముడివడి ఉన్న ఈ ప్రాంతముల ప్రజలు స్వాతంత్ర్యమొంది, భారత రాజ్యమున చేరుటకు ఆందోళన సల్పిరి. కాని, ఈ ప్రాంతములు అన్నియు పోర్చుగల్ దేశమున పరిపాలన రీత్యా అంతర్భాగములే అని చెప్పి, పోర్చుగల్ ప్రభుత్వము ఆ ప్రజల ఎడల దమననీతిని అవలంబించెను.

అంతట వీనిలోని దాద్రా, నగర్‌హవేలీ ప్రాంతములు స్వచ్ఛందముగ స్వాతంత్ర్యమును ప్రకటించెను. వీనిలోనికి సైన్యములను భారతదేశభూమి ద్వారా పంపవలసి ఉండుటచే చేయునది లేక పోర్చుగల్ ప్రభుత్వము తన సైన్యములను ఆ ప్రాంతములకు భారతదేశము ద్వారా పంపుటకు హక్కుకలదని వాదించుచు అంతర్జాతీయ న్యాయస్థానమున దావా తెచ్చెను (1956). ఆ న్యాయస్థానము భారతదేశ అనుమతి లేకుండ సైన్యములను దాద్రా-నగర్‌హవేలీ ప్రాంతములకు పంపుటకు పోర్చుగల్ కు అధికారము లేదని తీర్మానించెను (1960). అంతటినుండి గోవా మొదలగు తక్కిన వలసలయందు పోర్చుగీస్ ప్రభుత్వము దౌర్జన్య చర్యల మూలమున ప్రజల స్వాతంత్ర్యకాంక్షను అంత మొందింప యత్నించెను. తత్ఫలితముగ భారత ప్రభుత్వము తన సేనలను 1961, డిసెంబరు 18 తేదిన గోవా మొదలగు వలసలపై నడపెను. తొలుత తీవ్రముగ ప్రతిఘటించినను, కడకు ఆ మరునాడు పోర్చుగీస్ సైన్యములు లొంగెను. తరువాత గోవా మొదలగు ప్రాంతములు స్వేచ్ఛాపూర్వకముగ భారతదేశ రాజ్యమున అంతర్భాగములు అయ్యెను.

ఆఫ్రికాయందలి పోర్చుగీస్ వలసలగు అన్‌గోలా [చూ. పు. 266] యందును 1961 లో దేశీయులు స్వాతంత్ర్యము కొరకై తిరుగుబాటులు సలిపిరి. మితిమీరిన దౌర్జన్యమును ఉపయోగించి, పోర్చుగీస్ ప్రభుత్వము ఆ తిరుగుబాటును అడచినను, వారి స్వాతంత్ర్యకాంక్ష సమయలేదు.

రాజ్యాంగము : 1933 లో ఆమోదింపబడిన నూతన రాజ్యాంగ చట్టము ప్రకారము ఈ రాజ్యమున సంస్థాత్మక గణ తంత్రపు (కార్పోరేటివ్ రిపబ్లిక్) పాలన అమలునందు ఉన్నది. రోమన్ కేథలిక్ మత పీఠాధిపతి యగు పోప్ తన శ్రీముఖముల మూలమున వెలువరించు సాంఘిక న్యాయ సూత్రములు దీనికి ప్రాతిపదికలు. అధికారము అంతయు ఇందు కేంద్రీకృతమై ఉండును. దేశాధిపతి అగు అధ్యక్షుడు ఒక నియోజకకూటమి (ఎలక్టోరల్ కాలేజీ) మూలమున దేశీయులచే ఎన్నుకొనబడును. ఇతని పదవీ కాల పరిమితి ఏడు ఏండ్లు. జాతీయ శాసనసభ యందలి సభ్యులును, సంస్థామండలి (కార్పోరేటివ్ ఛేంబర్) యందలి సభ్యులును, దేశమందును, సముద్రోత్తర సీమలందును కల మండలములందలి స్థానిక ప్రభుత్వముల ప్రతినిధులును,

రాష్ట్రీ శాసనసభల సభ్యులను కలసి అధ్యక్షుని ఎన్నుకొను నియోజక కూటమిగ రూపొందుదురు. ప్రధాన మంత్రి అధ్యక్షతను పనిచేయు మంత్రిమండలి కార్యనిర్వాహణాధికారమును కలిగి ఉన్నది. అపరోక్షపు ఎన్నికలవలన ఎన్నుకొనబడిన 130 మంది సభ్యులు జాతీయ శాసనసభలో ఉందురు. సంస్థామండలి (కమారా కార్పోరేటివా) యందు 135 మంది సభ్యులు ఉందురు. వీరు పలు సంస్థల నుండి ఎన్నుకొనబడెదరు. జాతీయ శాసనసభకును, ప్రభుత్వమునకును సంస్థామండలి సలహాలు ఒసగుచుండును.

సిద్ధాంతరీత్యా దేశమున రాజకీయ పక్షములు పని చేయుటకు వీలున్నను, ఆచరణయందు ప్రభుత్వమునకు విరుద్ధముగ వ్యవహరించు ఏ పక్షమును మనుటకు అవకాశము లేదు. కావున సాలాజార్ చెప్పుచేతలలో ఉండు జాతీయైక్య పక్షము (యూనికో నేషనల్) మాత్రమే పని చేయుచున్నది.

**పాలిత ప్రాంతములు :** భారత దేశమునందలి వలసలను పోర్చుగీస్ ప్రభుత్వము 1961 లో కోల్పోయినను, ఆఫ్రికా యందు అన్‌గోలా, మొజాంబిక్, పోర్చుగీస్ గినీలును, చైనా భూభాగమందలి మకావో, ఆసియా ద్వీప సముదాయమందలి టిమర్ ద్వీపభాగము పోర్చుగీస్ ప్రభుత్వపు వలస పాలనలో ఇంకను చేరి ఉన్నవి. వీని వివరములు ఆ యా శీర్షికల క్రింద కననగును. జి. ఎన్. శర్మ ; చీ. శే. రా.

**పోర్టోరికో :** పశ్చిమార్ధగోళము నందలి ఒక స్వతంత్ర ద్వీపరాజ్యము.

వెస్ట్ ఇండీస్ [చూ.] ద్వీపములలో ఒకటి యగు ద్వీప రాజ్యము. [వి] 8,896 చ. కి. మీ.; [జ] 24,54,600. [భా] స్పానిష్, ఇంగ్లీషు భాషలు రెండును వ్యాప్తియందు ఉన్నవి. [మ] అత్యధిక సంఖ్యాకులు రోమన్ కేథలిక్‌లు. [రా] సాన్‌జువాన్ (జ. సం. 4,32,377).

చరిత్ర : 1493 లో కొలంబస్ [చూ. పు. 407]. ఈ ద్వీపమును కనుగొనెను. ఆనాడు ఇట బొరిన్‌క్వినోల్ అనబడు ఆదిమజాతి వసించుచు, కొంత నాగరకత కలిగి ఉండినది. కాని, తరువాత ఇచటకు వచ్చిచేరిన స్పెయిన్‌వారి దురాగతములవలన ఈ జాతి నామావశిష్టమైనది. తరువాత, బంగారు గనులలో పనిచేయు నిమిత్తము నీగ్రోలు [చూ. సం. 10 - పు. 468] ఇచటకు కొనిరాబడిరి. స్పెయిన్ వారి నిరంకుశ పాలనలో ఈ దేశము 1898 వరకు ఉండెను. ఆ సంవత్సరము జరిగిన స్పానిష్ - అమెరికన్ యుద్ధఫలితముగ ఈ రాజ్యము యునైటెడ్‌స్టేట్స్ ప్రభుత్వ పాలనలోకి వచ్చెను. ప్రభుత్వపు ఆధ్వర్యవమున క్రమముగ ఇచట ప్రజలకు రాజకీయాధికారములు కల్పింపబడినవి. ఆర్థిక వ్యవస్థయు కొంత ఉచ్చస్థాయికి కొనిపోబడినది. 1952 లో ఈ దేశప్రజలు ఎన్నుకొనిన ఒక రాజ్యాంగ పరిషత్తు రూపొందించిన రాజ్యాంగ విధానమును యునైటెడ్‌స్టేట్స్ ఆమోదించుటచే, ఈ దేశమునకు స్వాతంత్ర్యము చేకూరినది. అయినను యునైటెడ్ స్టేట్స్‌తో కలసి మెలసి ఉండుటకు అంగీకరించుటవలన ఆ ప్రభుత్వము నియమించు గవర్నరే ప్రజాప్రతినిధుల సాయమున పరిపాలన నిర్వహించుచున్నాడు. చీ. శే. రా.

**పోలండ్ :** తూర్పు యూరప్ నందలి ఒక స్వతంత్ర రాజ్యము.




ఈ దేశమునకు బాల్టిక్ సముద్రము [ఉ]; సోవియట్ రష్యా [తూ]; చెకోస్లోవాకియా [ద]; తూర్పు జర్మనీ [ప] సరిహద్దులందు ఉన్నవి. [వి] 3,11,780 చ. కి. మీ.; [జ] 3,08,06,000. [భా] జాతీయ భాష పోలిష్. [మ] ప్రజలలో దాదాపు 72% రోమన్ కేథలిక్‌లు; తక్కిన వారిలో ఇతరములగు క్రైస్తవ సంప్రదాయములు వ్యాప్తియందు ఉన్నవి. దేశమున మత స్వాతంత్ర్యము కలదు. కాని, ప్రస్తుత ప్రభుత్వమునకు మత రహిత సమాజ స్థాపనయే లక్ష్యము అగుటచే మతమునందు ఆదరము క్రమముగ తగ్గుచున్నది. [రా] వార్సా (జ. సం. 11,00,000).

చరిత్ర : పోలిష్ భాషను మాటాడు వివిధ వర్గములను క్రీ. శ. పదవ శతాబ్ది మధ్య కాలమున పియాస్ట్ అను పేరుగల రాజవంశపు పాలన క్రింద ఏక జాతిగ రూపొందినవి. క్రీ. శ. 966 లో ఆ రాజ వంశీకుడగు మీసకో ప్రభువు క్రైస్తవ మతమును అవలంబించి తన ప్రజలలో ఆ మతమునకు వ్యాప్తి కల్పించెను. సాహసికుడని పేరుపొందిన బొలెస్లావ్ అను పేరుగల పియాస్ట్ వంశపు రాజు (992-1025) సమకాలీన రోమన్ చక్రవర్తిచే స్వతంత్ర రాజుగ పరిగణన పొందెను. 1370 వరకును పియాస్ట్ వంశము

వారు ఈ దేశమును పాలించిరి. 1241 లో ఈ దేశము మంగోల్ల దండయాత్రకు, జర్మనుల ఒత్తిడికి లోనైనది. మరల లోడిస్లా - I కాలమున ఈ దేశము సమీకృతమైనది. 1333 - 1370 మధ్యకాలమున కడపటి పియాస్ట్ వంశీయుడగు కాసిమిర్ క్రకావ్ నగరమును తన రాజధానిగ చేసికొని దేశమును అభివృద్ధి చేసెను.

కాసిమిర్ ప్రభువునకు పుత్రులు లేరు. అందుచేత ఈ రాజవంశమునందలి హెడ్విగా అను ఆమెను పెండ్లాడిన లిథూనియా దేశపు రాజునకు పోలండ్ రాజ్యము కూడ సంక్రమించెను. ఈ రాజవంశముల వివాహ ఫలితముగ ఏర్పడిన క్రొత్త రాజవంశమునకు 'జగెల్లోనియన్ రాజ వంశము' అను వ్యవహారము ఏర్పడెను. పోలండ్ - లిథూనియాల సంయుక్త రాజ్యమును ఈ వంశము వారు 1572 వరకు పాలించిరి. ఈ వంశపు కడపటి రాజునకు సంతతి లేనందున శెయిమ్ అనబడు పౌర ప్రముఖ సభయే రాజులను ఎన్నుకొను అధికారమును ఆర్జించెను. 1572 నుండి ఇటుల ఎన్నికవలన రాజ నిర్ణయము జరుగుట అనూచానము అగుటచే క్రమముగ ఈ శెయిమ్ సభయే సర్వాధికారయుతము అయ్యెను. 16వ, 17వ శతాబ్దములలో అంతః కల్లోలములవలన ఈ దేశము చాల బలహీనమయ్యెను. 1617 లో ఈ దేశాంతర్భాగమగు ఉక్రెయిన్‌ను రష్యా వశపరచుకొనెను.

కౌంట్ స్టానిస్లావ్ పొనియటోవ్ స్కీ అను పోలిష్ ప్రభు వంశీయుడు ప్రష్యా, రష్యా ప్రాపకము వలన పోలండ్‌కు రాజుగా 1764 లో ఎన్నిక అయ్యెను. ఈ ఎన్నిక చాలమంది పోలిష్‌వారికి ఇష్టము లేదు. దేశములో అలజడి చెలరేగెను. ఈ సమయమును అనుకూలముగ తీసికొని ప్రష్యా, ఆస్ట్రియా, రష్యాదేశములు పోలండ్‌నందు కొంత భాగమును విడగొట్టి పంచుకొని, తమకు లభించిన భాగములను తమ తమ రాజ్యములలో కలుపుకొనినవి.

పోలండ్ నూతన రాజ్యాంగమును 1791, మే 3 న ప్రకటించినది. దానితో ఈ దేశమును విడగొట్టి దోచుకొనిన దేశములు మేలుకొనినవి. 1793 లో ప్రష్యా, రష్యాలు పోలండ్‌ను మరియొకసారి విభాగించి, కొంత ప్రాంతమును తాము తీసికొన్నవి.

పోలండ్ మూడవసారి కూడ 1795 లో విభక్తమైనది. పోల్‌లు తమ దేశ విభజనను ప్రతిఘటించి పోరాడినను లక్ష్యపెట్టక, రెండు విభజనల అనంతరము మిగిలిన కొద్ది దేశమును రష్యా, ప్రష్యా, ఆస్ట్రియాదేశములు పంచుకొని దేశ స్వాతంత్రమును, ఐక్యమును పూర్తిగ నశింప జేసినవి.

కాని, మరల 1807 లో ఫ్రెంచివారి క్రింద పోలిష్ భూమి యందు అధికభాగము సమీకృతమైనది. 1814 - 1815 లో ఫ్రెంచి సామ్రాజ్యము పతనమగుటతో ఈ భాగము రష్యా చక్రవర్తియైన జార్‌కు ఇచ్చివేయబడినది. అతడు ఈ భాగమును ప్రత్యేక విభాగముగ ఉంచి పరిపాలించెను.

కాలక్రమమున పోలండ్‌లో యువకులలోను, రైతులలోను జాతీయాభిమానము ప్రబలినది. తత్ఫలితముగ తొలుత 1830 లోను, మరల 1863 లోను రష్యా చక్రవర్తి ప్రభుత్వముపై పోలిష్ ప్రజలు తిరుగుబాటులు చేసిరి. కాని, రష్యన్‌లు ఆ తిరుగుబాటులను నిర్దాక్షిణ్యముగ అణచివేసిరి. పోలండ్‌లో రష్యన్‌లు పూర్తిగ రష్యన్ సంస్కృతిని ప్రవేశపెట్టిరి. రష్యన్ భాష పోలండ్ వారికి రాజ భాష అయినది.

ప్రథమ ప్రపంచ యుద్ధ సమయము వరకు పరిస్థితులు ఇట్లే గడచినవి. యుద్ధములో పోలండ్‌ను జర్మనీ ఆక్రమించినది. జర్మనులచే ఆక్రాంతమైన పోలండ్ స్థితి మరింత దుర్భరమైనది. మిత్రమండలి విజయము పొందుటతో 1919 లో పోలండ్ ప్రజాసత్తాక రాజ్యము అయినది.

జర్మనుల ఖైదునుండి విడుదలచేయబడిన పిల్‌స్డ్‌స్కీ పోలండ్‌కు మొదటి అధ్యక్షుడు అయ్యెను. క్రమముగ పోలండ్ తన భూభాగమును కొంత మరల సంపాదించెను. ఎగువ సైలీషియాలో ముప్పాతిక భాగము జనవాక్య ప్రకటనవల్ల పోలండ్‌లో కలసెను. పశ్చిమ ప్రష్యాలో యుద్ధతంత్ర రీత్యా ముఖ్యమైన రహదారి కూడ లభించినది. డాన్‌జిగ్ నగరము స్వేచ్ఛా నగరముగ చేయబడి, అచట నుండి వర్తకము చేయుటకు పోలండ్‌కు స్వేచ్ఛ లభించెను.

డాన్‌జిగ్‌ను స్వేచ్ఛానగరముగ ఉంచుటకును, పోలండ్ జర్మనీల మధ్య ఏర్పరుపబడిన క్రొత్త సరిహద్దును మన్నించుటకును వెర్సెయిల్స్ సంధి [చూ.] కాలమున జర్మనులు విధిలేక అయిష్టతతో ఒప్పుకొనిరి. జర్మనీయందు నాజీ ప్రభుత్వము ఏర్పడిన నాటినుండియు ఈ డాన్‌జిగ్ సమస్య మరింత క్లిష్టమై పోలండ్ - జర్మనీ సంబంధములు విషమించెను. అంతట పోలండ్ స్వాతంత్ర్యమునకు భంగము వచ్చు ఏ స్థితిలోనైనను తాము పోలండ్‌కు సహాయము కాగలమని బ్రిటిష్ ప్రధాని చాంబర్లిన్ ప్రకటించెను (1939 - మార్చి 31). జెకోస్లోవాకియాను నాశనము చేసి ఆక్రమించిన తరువాత హిట్లర్ [చూ.] డాన్‌జిగ్ నగరము జర్మనీకి ఈయవలెననియు, పోలిష్ కారిడార్‌లో జర్మన్‌లకు రవాణా సౌకర్యములు కావలెననియు, పోలండ్‌లోని జర్మను అల్ప సంఖ్యాకులకు క్రొత్త ప్రత్యేకాధికారములు

కావలెననియు కోరి, ఒక క్లిష్ట పరిస్థితిని తెచ్చి పెట్టెను. ఇందుకు పోలండ్ అంగీకరించలేదు.

యుద్ధ ప్రకటనమైనను చేయకుండ 1939, సెప్టెంబరు 1 న జర్మన్‌లు పోలండ్‌పై దండెత్తిరి. బ్రిటన్, ఫ్రాన్స్‌దేశములు పోలండ్ సహాయమునకు వచ్చినవి. ఈ విధముగ ద్వితీయ ప్రపంచయుద్ధము [చూ.] మొదలయ్యెను. పోల్‌లు చాల సాహసముతో పోరాడిరి. కాని, ప్రయోజనము లేక పోయినది. కొద్ది వారములలో సోవియట్‌రష్యా సైన్యములు, జర్మనీ సైన్యములు పోలండ్‌ను ఆక్రమించుకొని, ఆక్రాంత దేశమును పంచుకొనినవి. 46% దేశము సోవియట్ రష్యా, మిగిలిన భాగము జర్మనీ తీసికొనినవి. పోలండ్ పరాక్రాంతము అగుటతో పోలిష్‌ప్రభుత్వము ఫ్రాన్స్‌కు తరలి పోయినది. 1940, జూన్‌లో ఫ్రాన్స్ కూడ ఆక్రమింపబడుటతో ఈ ప్రభుత్వము లండన్‌కు తరలినది. తరువాత జర్మనీ సోవియట్‌రష్యాపై కూడ యుద్ధము ప్రకటించినది. నాజీ సైన్యములు సోవియట్‌రష్యాలో ఓడిపోయినవి. సోవియట్‌రష్యా సైన్యములు ఆగ్నేయ పోలండ్‌ను ఆక్రమించిన తరువాత లబ్లిన్‌లో ఒక ప్రభుత్వము సోవియట్ రష్యా ఆదరణమున స్థాపింపబడినది. లండన్‌లోని ప్రవాస పోలిష్ ప్రభుత్వమునకును, లబ్లిన్‌లోని ప్రభుత్వమునకును సామరస్యము కుదిరినదికాదు.

సోవియట్ రష్యా 1945 లో లబ్లిన్ ప్రభుత్వమునే పోలండ్‌కు తాత్కాలిక ప్రభుత్వముగ గుర్తించినది. బ్రిటన్, యునైటెడ్‌స్టేట్స్‌దేశములు ప్రవాస ప్రభుత్వమును గుర్తించినవి. తదుపరి లబ్లిన్ ప్రభుత్వము, మరికొందరు కలసి ఒక నూతన ప్రభుత్వమును ఏర్పరచిరి. ఈ ప్రభుత్వమును మిత్రమండలి 1945, జూలైలో గుర్తించినది.

ద్వితీయ ప్రపంచ యుద్ధ ఫలితముగ పోలండ్ దేశ పటమున పలుమార్పులు జరిగినవి. యుద్ధ మధ్యకాలమున సోవియట్ రష్యా ఆక్రమించుకొనిన ప్రాచ్యభాగము యుద్ధానంతరమున సైతము పోలండ్‌కు ఈయబడలేదు. దేశ విస్తీర్ణము దాదాపు 46% ఉన్న ఈ ప్రాచ్యభాగము సోవియట్ రష్యాకే చేరదగునని యాల్టాసమావేశ [చూ.] కాలమున (1954, ఫిబ్రవరి) యునైటెడ్‌స్టేట్స్, బ్రిటన్ దేశములు అంగీకరించినవి. కాని, పశ్చిమమునందు పూర్వము జర్మనీకి చెంది ఉండి ఓడర్, నీసీ నదులకు తూర్పున ఉండిన ప్రదేశము యుద్ధానంతరమున పోలండ్‌నకు ఈయబడినది. అయినను ఈ పశ్చిమ ప్రదేశములందు పోలండ్‌నకు చేకూరిన స్వత్వమును బ్రిటన్, యునైటెడ్ స్టేట్స్ మొదలగు పాశ్చాత్యరాజ్యములు ఇప్పటికిని గుర్తింపలేదు. పోలండ్ సరిహద్దుల తుది నిర్ణయము జర్మనీతో తాము కుదుర్చుకొనవలసిఉండు శాంతి ఒడంబడిక కాలమున జరుగవలయునని బ్రిటన్, యునైటెడ్‌స్టేట్స్, సోవియట్ గణరాజ్యములు పోట్స్‌డామ్ సమావేశ [చూ.పు.582] కాలమున (జూలై-ఆగస్టు, 1945) నిశ్చయించుకొనినవి. కాని, ఆ శాంతి ఒడంబడిక ఇప్పటికిని రూపొందలేదు. సోవియట్ రష్యా పలుకుబడిలో ఉన్న తూర్పు జర్మనీ మాత్రము 1953 లో కుదుర్చుకొనిన ఒక ఒడంబడిక మూలమున పోలండ్‌నకును, తమకును మధ్య ఓడర్ - నీసీ రేఖనే సరిహద్దుగ గుర్తించినది.

యుద్ధానంతరము ఈ దేశమున రాజకీయ రంగమునందు పెక్కు పరివర్తనలు సంఘటిల్లి, పార్లమెంటరీ సంప్రదాయ రీతిలో తొలుత 1947 లో జరిగిన ఎన్నికలలో నాలుగు ప్రముఖ రాజకీయ పక్షములతో ఏర్పడిన ఒక సమైక్య పక్షము విజయము ఆర్జించినది. అంతట అల్ప సంఖ్యాక పక్షమగు పోలిష్ రైతుపక్షపు నాయకుడు స్తనిస్లావ్ మైకోలాజిక్ దేశము విడిచి పారిపోయెను. 1952, జూలై 22 న నూతన రాజ్యాంగ చట్టము ఆమోదితమయ్యెను. 1955, మే 14 న పోలండ్ సోవియట్ గణరాజ్యము, ప్రాచ్య యూరప్‌నందలి తక్కిన ప్రజా గణరాజ్యములతోను కలసి పరస్పర మైత్రి, సహకార, సౌహార్దములు ప్రాతిపదికగ ఒక సంధిని కుదుర్చుకొనినవి. దీనికే వార్సా ఒడంబడిక [చూ.] అని పేరు.

పోలండ్‌నందు యుద్ధానంతరము అధికారము గ్రహించిన సమైక్యపక్షము క్రమముగ సంయుక్త శ్రామిక పక్షముగ రూపొంది, కమ్యూనిస్ట్ విధానములను ఆచరణలోనికి తెచ్చెను. కాని, అనుసరింపదగు విధానములందు విభేదములవలన ఈ పక్షమున కలతలు అనేకములు కలిగి, తుదకు 1956, అక్టోబరు నుండి వ్లాడిస్లావ్ గోముల్కా అధికారము వహించి ఉన్నాడు.

**రాజ్యాంగము :** ఈ దేశమున 1952 రాజాంగచట్టమును అనుసరించి పరిపాలనాధికారము అంతయు సెయిమ్ అనబడు ప్రజాసభకును, అధ్యక్ష సంఘమునకును సమష్టిగ చెంది ఉన్నది. ఏక కక్ష్యగల ఈ ప్రజాసభకు ఎన్నికలు సాధారణముగ నాలుగేండ్లకు ఒకసారి జరుగును. 18 ఏండ్ల వయసునకు తగ్గని పౌరులు అందరికిని వోటు హక్కు కలదు. ఎన్నికలు అన్నియు అపరోక్ష, సార్వజనిక, రహస్య పద్ధతిలో జరుగును. 60,000 మంది ప్రజలకు ఒక ప్రతినిధి చొప్పున ఎన్నుకొనబడెదరు. దేశమున అధికారమందున్న సంయుక్త శ్రామికపక్షమే అభ్యర్థుల పట్టికను నిర్ణయించును [చూ. ఏకపట్టికా విధానము - పు. 348]. అందు ఇష్టములేని పేరును తొలగించుటయే వోటరు

చేయు పని. ప్రజాసభ సమావేశము కాని కాలమున శాసన నిర్మాణాది విధుల నిర్వహణకై అధ్యక్షసంఘము అను ఒక సంస్థను ప్రజాసభ ఎన్నుకొనును.

కార్యనిర్వహణాధికారము అంతయు మంత్రిమండలికి చెంది ఉన్నది. ప్రధాని, ఉపప్రధాని, తక్కు మంత్రులు కల ఈ మంత్రిమండలిని ప్రజాసభయే నియమించును. సాధారణముగ సంయుక్త శ్రామికపక్షమందలి ప్రముఖ నాయకులే అధ్యక్షక సంఘమున ముఖ్య పదవులలో ఉందురు.

జి. ఎన్. శర్మ ; చీ. శే. రా.

**పోలండ్ విభజన :** చూ. పోలండ్ - పు. 590.

**పోలో, మార్కో** (1254 - 1324) : ఇటలీ దేశమునందలి వెనిస్ నగరమందు జన్మించిన ప్రసిద్ధ యాత్రికుడు. 1271 లో తన పినతండ్రులతో కూడి బయలుదేరి మొసూల్, బాగ్దాద్, కొరసాన్, పామీర్, గోబీ ఎడారి, తాంగుత్, షాంగ్‌టు ప్రదేశముల మీదుగ 1275 న చీనాకు పోయి, ఆ దేశపరిపాలకుడగు కుబ్లయిఖాన్ [చూ. పు. 392] దర్బారునందు చేరెను. మార్కోను యువాన్, బర్మా, కారకోరమ్, కొచ్చిన్ - చీనా, దక్షిణదేశమునందలి కొన్ని ప్రదేశములకు కుబ్లయిఖాన్ రాయబారిగ పంపెను. చీనాలోని యాంగ్‌చౌ రాష్ట్రమునకు ఇతడు రాజప్రతినిధిగ మూడు సంవత్సరములు పని చేసెను. 1295 లో మంగోల్ రాకుమారిని అనుసరించి, ఇతడు సుమత్రా, దక్షిణభారత దేశముల మీదుగ సముద్ర మార్గమున పారసీక దేశమునకు చేరి రాకుమారిని అట చేర్చి, అంతట స్వదేశమునకు తన వారితో కూడ పోయెను. 1298 లో జినోవాపై దండయాత్ర సందర్భమున ఇతడు ఒక నౌకాధికారిగ నియమితుడు అయ్యెను. ఆ యుద్ధమునందు ఇతడు ఓడిపోయి, జినోవా వాసులచే బంధింపబడెను. చెరసాలలో ఉన్న సమయమున తన యాత్రానుభవములను రస్టిసియానో అనువానికి చెప్పి వ్రాయించెను. అది పుస్తక రూపమున వెలువడి, అనేక భాషలలోనికి అనువదింపబడెను.

ప్రాచ్య దేశముల వైభవ సంపత్తులను గూర్చి పాశ్చాత్యులు తెలిసికొనుటకు ఈతని గ్రంథము ఉపకరించెను. దక్షిణ భారతదేశమందలి మోటుపల్లి మొదలగు రేవు పట్టణముల ప్రశస్తిని గూర్చియు, ఆ యా ప్రదేశ పరిపాలకులను గూర్చియు ఇతడు తన పుస్తకమునందు విపులముగ వ్రాసెను.

మ. ఆ. శ.

**ప్యూరిటనులు :** బ్రిటిష్ దేశచరిత్రలో ప్రాముఖ్యము వహించిన ఒక క్రైస్తవమత సంస్కరణ సంఘమునకు చెందినవారు. ప్యూరిటన్ అను పదము 'ప్యూర్' అను పదము నుండి ఉద్భవించినది. ప్యూర్ అనగా - నిర్మలమైన - అని అర్థము. మతసంస్థలను నిర్మలము చేయకోరినవారు కాన వీరికి 'ప్యూరిటనులు' అను పేరు వచ్చినది. ఈ ప్యూరిటను మతవిశ్వాసములు ఇంగ్లండులో 16 వ శతాబ్ది చివరి భాగములో ప్రారంభమయినవి. 'ప్యూరిటను' అన్న పదము 1566 ప్రాంతములలో వాడుకలోనికి వచ్చినది.

చాలమంది ప్యూరిటనులు జాన్ కాల్విన్ అను మత సంస్కర్త యొక్క సిద్ధాంతములను అనుసరించిరి. మతాధిపతులు అందరును ఒకే హోదా కలవారై ఉండవలెననియు, బిషప్పువంటి ఉన్నత మతాధిపతి సామాన్య అర్చకులపై అధికారము చలాయించరాదనియు వీరు వాదించిరి. ప్రతి మత సంఘమునకు తన ఇష్టము వచ్చిన అర్చకుని ఎన్నుకొను స్వాతంత్ర్యము ఉండవలెనని కొందరు ప్యూరిటనులు అభిప్రాయపడిరి. కొందరు ప్యూరిటనులు మతాధిపతుల అవసరమే లేదనిరి. మరికొందరు ఏ వ్యక్తియైనను మత ప్రబోధము చేయవచ్చును అనిరి. మొత్తముపై వారి వారి పట్టుదలలోని విభేదములు కారణముగ ప్యూరిటనులు అనేక కూటములుగ చీలిపోయిరి. జేమ్స్ - I పరిపాలనా కాలమున కొందరు ప్యూరిటనులు ఇంగ్లండు చర్చితో తెగతెంపులు చేసికొనిరి. వీరికే 'పృథక్కరణ వాదులు (సెపరేటిస్ట్స్)' అని పేరు. వీరిలో కొందరు అట్లాంటిక్ మహాసముద్రమును దాటి ఉత్తర అమెరికాయందు వలసలు ఏర్పరచుకొనిరి. ఈ విధముగ వీరు నేటి యునైటెడ్ స్టేట్స్ రూపొందుటకు కారణభూతులైరి.

కొంత కాలముపాటు బ్రిటిష్ రాజకీయములలో ప్యూరిటనులు ప్రముఖమైన పాత్ర వహించిరి. భగవద్దత్తాధికార సిద్ధాంతముపై చార్లెస్ - I [చూ. పు. 449] కు, పార్లమెంట్‌కు తగాదా వచ్చినప్పుడును, తదుపరి ఆలివర్ క్రామ్‌వెల్ [చూ. పు. 413] ఆధిపత్యములోను వీరి పాత్ర ప్రముఖమైనది. 1660 లో స్టూవర్ట్ రాజులు మరల రాజ్యమునకు వచ్చుటతో ప్యూరిటనుల రాజకీయ ప్రాబల్యము అడుగంటినది. కాని, ప్రొటెస్టంట్ మతమును బలీయ మొనర్చుటలోను, స్వాతంత్ర్య కాంక్షను పెంపొందించుటలోను వీరి భావము నేటికిని నిలచి ఉన్నది.

ప్ర. రా.

**ప్రకాశం, టంగుటూరి :** చూ. తెలుగు సంస్కృతి-౨; సం. 4 - పు. 937.

**ప్రచ్ఛన్నయుద్ధము :** ఇది ఆంగ్లభాషయందలి 'కోల్డ్ వార్' అను పదమునకు ఆంధ్రానువాదము. యథార్థముగ యుద్ధము జరుగక పోయినను యుద్ధకాలమునందు వలెనే దేశములమధ్య విద్వేషములు ప్రజ్వరిల్లుచు, మున్ముందు యుద్ధము రాగలదను భయముతో, ఒకరిని మించి ఒకరు

యుద్ధసామగ్రిని సేకరించుచు ఇతర దేశముల సాయమును సంపాదించుటకు కృషి చేయుచు ఉండు పరిస్థితికే నేడు 'ప్రచ్ఛన్నయుద్ధము' ను పేరు కలిగినది. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున సోవియట్ రాజ్యకూటమికిని, ఉత్తర అట్లాంటిక్ రాజ్యముల కూటమి (నాటో) [చూ. పు. 337] కిని మధ్య చెలరేగిన పరిస్థితి ఇందులకు ముఖ్యమగు ఉదాహరణము. మ. అ. శ.

**ప్రజానిర్ణయము** (రెఫరెండమ్): ఒక ప్రజాతంత్ర రాజ్యమున, రాజ్యాంగమున సూచింపబడిన పద్ధతిని అనుసరించి శాసన సభచే ఆమోదింపబడియు, ప్రజాభిప్రాయమును సేకరించవలసిన ఆవశ్యకత కల ఒక శాసనము విషయమున ప్రజలకు దానిని నివేదించి, వోటు చేసిన వారిలో అత్యధిక సంఖ్యాకుల అభిప్రాయమును అనుసరించి తుది నిర్ణయము చేయుట. ఇట్టి ప్రజాభిప్రాయము కొన్ని పట్టుల ఐచ్ఛికముగను, కొన్ని పట్టుల వైదికముగను జరుగ వలసి ఉండు ఏర్పాటులును ఉండవచ్చును. రాజ్యాంగమునకు చేయు సవరణల విషయమున, వైదికముగ ఇట్టి నిర్ణయమునకు ఆ సవరణ నివేదింపబడవలెనని యునైటెడ్ స్టేట్స్ రాజ్యాంగము మొదలగు కొన్నిటియందు కలదు. * * *

**ప్రజాభిప్రాయము**: చూ. జనవాక్యము - పు. 460.

**ప్రజా సత్తాక గణరాజ్యము** (డెమొక్రాటిక్): అంతిమ అధికారము ప్రజలయందు లేదా ఆ ప్రజలు ఎన్నుకొను ప్రతినిధులయందు నిక్షిప్తమై ఉండునట్టి రాజ్యము. ప్రజలు తాము ఎన్నుకొను ప్రతినిధులకు వారు తమ విధులను సక్రమముగ నిర్వర్తించుటకు ఆవశ్యకమైనంత అధికారమును కూడ సంక్రమింపజేయుదురు. ప్రాచీన కాలము నాటి చిన్న చిన్న ప్రజాసత్తాక గణరాజ్యములలో ప్రజలు తమకు అభిమతములగు శాసనములేవో తామే తెలియ చేయుచుండెడివారు. కాని, అర్వాచీనకాలపు పెద్ద పెద్ద ప్రజాసత్తాక గణరాజ్యములలో శాసననిర్మాణ సభలో పాల్గొనుటకు ప్రజలు తమ ప్రతినిధులను ఎన్నుకొని పంపుచున్నారు. రాజ్యాధిపతి సాధారణముగా తిన్నగా ప్రజలచేతనే ఎన్నుకొనబడుచుండును. ఈ అర్వాచీన ఆచారమే రాజరికమునుంచి ప్రజాసత్తాక గణరాజ్యమును వేరుచేసి చూపుచున్నది. రాజరికములో రాజ్యాధిపత్యము వంశపరంపరా ప్రాప్తము. భారతదేశములో బౌద్ధయుగ కాలమున కొన్ని ప్రజాసత్తాక గణరాజ్యములు వెలసి ఉండెను. ప్ర. రా.

**ప్రజాస్వామిక రాజ్యవాదము**: ప్రజాస్వామిక రాజ్యసిద్ధాంతమును ఏ విధముగ నిర్వచించినను ఈ భావన వెనుక వ్యంగ్యరూపమున ఇమిడి ఉన్న విస్తృత చరిత్రను అంతటిని ఆ నిర్వచనములో కుదింపగలుగుట కల్ల. ఇది ఒక విధమగు ప్రభుత్వపద్ధతి అని కొందరు భావించిరి. మరి కొందరు దీనిని ఒక సాంఘిక జీవన మార్గముగా భావన చేసిరి. వోటరులు యుక్తాయుక్త వివేకము కలిగి ఉండుట; ప్రజలకును, ప్రభుత్వమునకును మధ్య సమరస సంబంధము ఉండుట; పౌరులలో ఆర్థిక తరతమభావము విశేషముగా లేకుండుట; పుట్టుకను, ఐశ్వర్యమును, జాతిని, మతమును బట్టి విచక్షణతలు చూపు పద్ధతి నశించుట ఇదే ప్రజాస్వామిక రాజ్యసిద్ధాంతము యొక్క సారాంశము. దేశ, కాల పరిస్థితులకు అనుగుణముగ ఈ సిద్ధాంత స్వరూపము అనివార్యముగ మార్పులు చెందుచు వచ్చినది. జీవితములోని ప్రతి రంగములోను ప్రజాస్వామిక సిద్ధాంతమునకు ఒక విలక్షణమైన స్థానము ఉన్నది. ప్రతి రంగములోను ఇది ప్రత్యేక సమస్యలను లేవదీసినది. ఈ సమస్యలు భిన్న భిన్నములుగా ఉండుటవలన సంతృప్తికరము, సార్వజనీనము అగు సూత్రీకరణమునకు ఇవి లొంగలేదు.

రాజకీయరంగములోని ప్రజాస్వామిక సిద్ధాంతము అతి పురాతనకాలమునుండియు వచ్చుచున్నది. కాని, చాలా కాలము వరకును - అనగా 17 వ శతాబ్ది పర్యంతము - ఈ భావనకు ఇదమిత్థముగా ఒక విస్పష్టమైన స్వరూపము ఏర్పడలేదు. ఇదికాదు, అదికాదు అను 'నేతి - నేతి' వాక్యములతోనే ఇది నిర్వచింపబడుచుండెను.

సమానత్వమును గూర్చిన భావనయే - అనగా మానవులు తమ సమాన అస్తిత్వమును విస్పష్టపరచుటకును, ఆ పనిలో తమ ప్రతిబంధకములు అన్నిటిని తొలగించుకొనుటకును జరిపిన తీవ్ర ప్రయత్నమే - ప్రజాస్వామిక సిద్ధాంత సారాంశము. అందుచేత, సమానత్వము కొరకు జరిపిన ఆందోళనమే మానవునిలోని వైషమ్యములను బట్టికాక, సామ్యములను బట్టియే అధికార వ్యవస్థ ఏర్పరుపబడవలెనను సూత్రప్రకటనమే ప్రజాస్వామ్యాభివృద్ధికి ప్రాతిపదిక అయినది. ప్రజాస్వామ్య సమస్య యొక్క కీలకము సమానతను సాధించుటలోనే ఇమిడి ఉన్నది. ప్ర. రా.

**ప్రజాస్వామ్యము** (డెమొక్రసీ): చూ. ప్రజాస్వామిక రాజ్యము పు. 121.

**ప్రపంచ యుద్ధము, ప్రథమ**: యూరప్ నందలి రాజ్యముల సామ్రాజ్యకాంక్షల ఫలితముగా చెలరేగిన యుద్ధము. ఇది 1914, జూలై 28 మొదలు 1918, నవంబరు 11 వరకు సాగినది. ఈ యుద్ధమున పాల్గొనిన ద్వివిధ పక్షములకు 1. కేంద్ర రాజ్యములు (సెంట్రల్ పవర్స్); 2. మిత్రరాజ్యములు (ఎలైడ్ పవర్స్) అని చరిత్రలో వ్యవహారము కలదు. వానియందు 1. కేంద్రరాజ్యముల

పక్షమున 1914 నుండి ఆస్ట్రియా, జర్మనీ, టర్కీలును, 1915 నుండి బల్గేరియాయును యుద్ధమున పాల్గొనినవి; 2. మిత్ర రాజ్యముల పక్షమున 1914 నుండి రష్యా, ఫ్రాన్స్, యునైటెడ్ కింగ్‌డమ్, సెర్బియా, బెల్జియమ్, మాంటెనీగ్రో, జపాన్ దేశములును, 1915 నుండి ఇటలీ, సాన్ మారినో రాజ్యములును, 1916 నుండి పోర్చుగల్, రుమేనియా దేశములును, 1917 నుండి యునైటెడ్‌స్టేట్స్, పనామా, క్యూబా, బొలీవియా, గ్రీస్, తాయిలాండ్, లైబీరియా, చీనా, పెరూ, ఉరుగ్వే, బ్రెజిల్, ఈక్వడార్ రాజ్యములును, 1918 నుండి గ్వాటెమాలా, నికరాగ్వా, కోస్టారికా, హాయిటీ, హొండూరాస్ రాజ్యములును పాల్గొనినవి.

ఐనను యుద్ధ నిర్వహణమున కేంద్ర రాజ్యముల పక్షమున జర్మనీ, ఆస్ట్రియా, టర్కీలును, మిత్ర రాజ్యముల పక్షమున ఫ్రాన్స్, యునైటెడ్ కింగ్‌డమ్, రష్యా, యునైటెడ్ స్టేట్స్‌లును క్రమముగా ప్రముఖ పాత్రలు నిర్వహించినవని చెప్పదగును.

ఆ ప్రథమ ప్రపంచ యుద్ధమునకు కల కారణములు, యుద్ధము జరిగిన తీరు, దాని ఫలితములు మొదలగు వానిని గురించి సమీక్షలో ఇదివరకే తెలుపబడినది [చూ. పు. 152]. ఇట ఆ యుద్ధమునందలి ముఖ్య సంఘటనలు పాఠకుల సౌకర్యార్థమై తేదీల క్రమమున పొందుపరుప బడినవి.

1914, జూలై 28: సెర్బియాపై ఆస్ట్రియా యుద్ధప్రకటన.

ఆగస్టు 1: రష్యాపై జర్మనీ యుద్ధ ప్రకటన.

ఆగస్టు 3: ఫ్రాన్స్‌పై జర్మనీ యుద్ధప్రకటన.

ఆగస్టు 4: బెల్జియమ్‌పై జర్మనీ యుద్ధ ప్రకటన. జర్మనీపై ఇంగ్లండు యుద్ధ ప్రకటన.

ఆగస్టు 4: జర్మనీ సేనలు రాత్రి సమయమున బెల్జియమ్ సరిహద్దును దాటి దేశములోనికి చొరబడినవి. ఆగస్టు 17 వరకు పోరాడి, బెల్జియమ్ సేనలు విధిలేక బ్రసెల్స్, ఆంట్‌వెర్ప్ నగర ప్రాంతములకు తిరోగమించినవి.

ఆగస్టు 5: ఆస్ట్రియాపై మాంటెనీగ్రో యుద్ధ ప్రకటన.

ఆగస్టు 6: రష్యాపై ఆస్ట్రియా యుద్ధ ప్రకటన, జర్మనీపై సెర్బియా యుద్ధ ప్రకటన.

ఆగస్టు 8: జర్మనీపై మాంటెనీగ్రో యుద్ధప్రకటన.

ఆగస్టు 12: ఆస్ట్రియాపై ఫ్రాన్స్ యుద్ధ ప్రకటన; ఆస్ట్రియాపై ఇంగ్లండు యుద్ధప్రకటన.

ఆగస్టు 14-25: జాఫ్రె సేనాని నాయకత్వమున ఫ్రెంచి సేనలు తమ తూర్పు సరిహద్దునందలి జర్మనీ సేనా నివహములపై సాగించిన దండయాత్ర విఫలమైనది; ఈ సమయముననే బ్రిటిష్ సేనలు ఫ్రాన్స్ తీరముపై ఫ్రెంచి సేనలకు సాయము చేయ దిగినవి.

ఆగస్టు 20: జర్మనీ సేనలు తిర్లెమెంట్‌వద్ద జరిగిన యుద్ధమున (ఆగస్టు 18-19) బెల్జియమ్ సేనలను పారద్రోలి బ్రసెల్స్ నగరమును ఆక్రమించినవి.

ఆగస్టు 23: జర్మనీపై జపాన్ యుద్ధ ప్రకటన.

చీనా తీరమున జర్మనీకి చెంది ఉండిన చింగ్‌టావ్‌పై దండయాత్రను జపాన్ సేనలును, బ్రిటిష్ సేనలును కలసి సాగించుటకు తీరమున దిగినవి. కడకు నవంబరు 7 న ఆ దుర్గము లొంగినది. ఆ సమయముననే జపాన్ నౌకా దళములు జర్మనీకి చెందిన మార్షల్, మారి, యానిన్, పలావ్, కెరోలిన్స్ ద్వీపములను ఆక్రమించినవి.

పశ్చిమ రంగమున జర్మను సేనలతో బ్రిటిష్ సేనలు తొలి సారిగ తలపడినవి. మాన్స్‌వద్ద జరిగిన ఈ యుద్ధమున ఫ్రెంచి సేనతో పాటు బ్రిటిష్ సేనలు మార్నెనదివరకు తిరోగమించినవి. జర్మనీ సేనలు అంతట త్రోసికొని ముందునకు రామొదలిడినవి. ఫ్రెంచి ప్రభుత్వము పారిస్ నుండి బోర్డో నగరమునకు తరలినది (సెప్టెంబరు 3, డిసెంబరు 1914).

ఆగస్టు 25: ఆస్ట్రియాపై జపాన్ యుద్ధప్రకటన.

ఆగస్టు 26-30: ప్రాచ్య రంగమున టానెన్‌బర్గ్ వద్ద జరిగిన పోరాటము. తూర్పు ప్రష్యాపై దక్షిణ దిశనుండి సంసోనోవ్ సేనాని నాయకత్వమున దండెత్తి వచ్చిన రష్యా సేనను జర్మనీ సేనలు టానెన్‌బర్గ్ వద్ద జరిగిన పోరాటమున ఓడించినవి. లక్షకు పైగా రష్యన్‌లు ఖైదీలుగ జర్మనులకు చేజిక్కిరి. పరాభవమును ఓర్వజాలక సంసోనోవ్ ఆత్మహత్య పాలయ్యెను.

ఆఫ్రికాలోని ఆంగ్లో-ఫ్రెంచి సేనలకు టోగోలాండ్‌లోని జర్మనీ సేన లొంగినది. అంతట చేసికొనిన ఒడంబడికలను అనుసరించి బ్రిటిష్‌వారును, ఫ్రెంచివారును ఆ వలసను విభజించుకొనిరి.

1914, ఆగస్టు 28: బెల్జియమ్‌పై ఆస్ట్రియా యుద్ధప్రకటన.

బ్రిటిష్ యుద్ధనౌకలు జర్మను నౌకాశ్రయమగు హెలిగోలాండ్ బైట్‌పై దాడి జరిపినవి. మూడు జర్మనీ

నౌకలు నష్టమైనవి. అంతటనుండి జర్మనులు గనులు నాటుటను, జలాంతర్గాములను ఉపయోగించుటను తీవ్రతరము చేసిరి. దీనిఫలితముగ ఆ సంవత్సరము ముగియునప్పటికి కొన్ని చిన్న నౌకలతోపాటుగ 'అడాషస్' అను పెద్ద యుద్ధనౌకను కూడ బ్రిటిష్ నౌకాబలము కోల్పోయెను.

1914, ఆగస్టు 30: న్యూజీలండ్‌కు చెందిన దండయాత్రా బలము సామోవ్ దీవిని ఆక్రమించినది.

పారిస్ నగరముపై జర్మనులు తమ తొలుతటి వైమానిక దాడిని సాగించిరి.

సెప్టెంబరు 3: రష్యన్‌లు ఆస్ట్రియా సేనలను ఓడించి లెంబర్గ్ నగరమును వశపరచుకొనిరి. తత్ఫలితముగ తూర్పు గలీషియాను ఆస్ట్రియా వదలుకొనవలసివచ్చెను.

సెప్టెం. 6 - 15: తూర్పు ప్రష్యాపై తూర్పునుండి రన్నెన్‌కాఫ్ నాయకత్వమున దండెత్తిన రష్యా సేనలను జర్మనులు చిత్తడి ప్రాంతములకు తరిమి ఓడించి, 125 వేల మందిని ఖైదీలుగ పట్టుకొనిరి.

సెప్టెంబరు 7: నైజీరియానుండి ఒక బ్రిటిష్ సైన్యము కామెరూన్స్‌పై దండెత్తి దువలాను ఆక్రమించినవి. ఫ్రెంచి సేనలును తూర్పు, దక్షిణములనుండి ఆ దేశముపైననే దండెత్తినవి. జర్మను సేనలు తిరోగమించి, కడకు ప్రక్కన ఉన్న స్పెయిన్ వలసలో తలదాచుకొనినవి.

సెప్టెంబరు 11: బిస్మార్క్‌ద్వీప జాలమున ఆస్ట్రేలియా సైన్యము దిగినది. న్యూగినీలోని జర్మనీ సేనలు ఆస్ట్రేలియన్‌లకు లొంగినవి (సెప్టెంబరు 21).

సెప్టెంబరు 13: పశ్చిమ రంగమున ఐనీనదివరకు చేరి దాని ఉత్తర తీరమున జర్మనీ సేనలు స్థావరములను నెలకొల్పినవి. వారిని అటనుండి తరలించుటకు మిత్రరాజ్యములు చేసిన ప్రయత్నములు అన్నియు విఫలమైనవి.

సెప్టెంబరు 19: జర్మనులకు చెందిన నైరృతి ఆఫ్రికాపై బ్రిటిష్ సేన దిగినది. దక్షిణ ఆఫ్రికా రాజ్యపు సేనలును బ్రిటిష్ వారికి సాయపడినవి. కడకు జర్మనీ సేనలు లొంగినవి (జూలై 9, 1915).

సెప్టెంబరు 22: జర్మనీలోని డస్సెల్‌డార్ఫ్, కోలోన్, ఫ్రెడరిక్ షేవెన్ వైమానిక స్థావరములపై బ్రిటిష్ విమానములు దాడి సాగించినవి. అక్టోబరు 8, నవంబరు 21 తేదీలలో కూడ ఇట్టి దాడులే సాగినవి.

అక్టోబరు 9-20: ప్రాచ్య రంగమున ఆస్ట్రియా సేనలును, జర్మను సేనలును కలిసి పోలండ్‌పై సాగించిన దండయాత్రలో వార్సావరకు జర్మనీ సేనలు ముందంజవేయగలిగినవి (అక్టోబరు 12). కాని, ఆస్ట్రియా సేనలు రష్యా ధాకకు వెనుకంజవేసి క్రకావ్‌కు చేరినవి.

అక్టోబరు 29: రెండు జర్మను సైనిక నౌకలు, తుర్కుల యుద్ధ నౌకలు రెండు నల్లసముద్రపు తీరమున రష్యాకు చెందిన ఒడెస్సా, సెబాస్టపోల్, థియొడోసియాలపై కాల్పులు జరిపినవి.

నవంబరు 2: టర్కీపై రష్యా యుద్ధ ప్రకటన, టర్కీపై సెర్బియా యుద్ధ ప్రకటన.

నవంబరు 5: టర్కీపై ఇంగ్లండు యుద్ధ ప్రకటన, టర్కీపై ఫ్రాన్సు యుద్ధ ప్రకటన.

నవంబరు 16-25: ప్రాచ్యరంగమున లోడ్జ్, లనీజ్ నగరముల వద్ద మంచులోను, బురదలోను జరిగిన సంకుల సంఘర్షణలో తుదకు జర్మను సేనలు లోడ్జ్ నగరమును వశపరచుకొనినవి (డిసెంబరు - 6).

డిసెంబరు 2-6: సెర్బియా సేనలపై ఆస్ట్రియన్‌లు తొలుత విజయము సాధించి బెల్‌గ్రేడ్‌ను వశపరచుకొనినను, నిలుపుకొనలేక తుదకు పరాజయము పొందిరి. బెల్‌గ్రేడ్ నగరము మరల సెర్బియన్‌ల వశమైనది (డిసెంబరు 15).

డిసెంబరు 4-9: మెసపొటేమియాలోని కుర్నా నగరమును భారతదేశపు బ్రిటిష్ సామ్రాజ్య సేనలు వశపరచుకొనినవి.

డిసెం 5 - 17: పోలండ్‌లో లిమనోవా వద్ద జరిగిన పోరాటమున ఆస్ట్రియా సేనలు విజయము నార్జించినను, రష్యా సేనలను క్రకావ్ నగర ప్రాంతమునుండి తరిమి వేయలేక పోయినవి.

1914, డిసెం -18: ఈజిప్టు తమకు చెందిన రక్షిత ప్రాంతమని బ్రిటన్ ప్రకటించి, ఆ ప్రాంతపు రక్షణకై అచట సైన్యములను సమాయత్తము చేసినది.

1914, డిసెం 14-24 : మిత్రమండలి సేనలు సర్వ సన్నాహము లను చేసికొని ఫ్రాన్సునందు ఉత్తరమున న్యూపోర్ట్ నుండి దక్షిణమున వెర్డన్ వరకు జర్మను సేనా శ్రేణిపై తీవ్ర దండ యాత్రలను చేసినవి. కాని, ముందంజ వేయలేక పోయినవి.

డిసెంబరు 21 : ఇంగ్లండులోని డోవర్ పై జర్మనులు విమానదాడిని సాగించిరి.

పశ్చిమ రంగమున 1914 అంతమునకు ఇటుల పోరాట రేఖ ఒక స్థిర రూపమును పొందినది. అంతటినుండి ఉభయ పక్షములును కందకములను త్రవ్వుకొని పోరాటమును సాగించుటలోనే నిమగ్నములైనవి. బెల్జియమ్‌లో ఒక అల్ప ప్రాంతము తప్ప తక్కినదియు, ఫ్రాన్స్ దేశమున 10 వ వంతు విస్తీర్ణమును జర్మనుల వశమయ్యెను. తరువాత మూడు సంవత్సరముల కాలమున సాగిన పోరాటములలో ఈ పోరాటపు రేఖ అటుగాని, ఇటుగాని 16 కిలోమీటరులకు మించి మార్పు పొందక ఉండినది.

1915, జనవరి 2 : కాకసస్ పర్వత ప్రాంతముపై టర్కీ సేనల ఒత్తిడి ఎక్కువ అగుట వలన రష్యా ఇబ్బందికి లోనై టర్కీపై వేరొక వైపు నుండి దండయాత్రను సాగించవలసినదిగ బ్రిటన్‌ను కోరెను.

జనవరి 19 : ఇంగ్లండుపై జర్మనుల తొలుతటి వాయు నౌకా (ఏయిర్ - షిప్) దాడి.

ఫిబ్రవరి 4 : జలాంతర్గాములచే గ్రేట్ బ్రిటన్‌కు నౌకా యాన దిగ్బంధనమును కల్పింతునని జర్మనీ ప్రభుత్వము ప్రకటించినది.

ఫిబ్రవరి 4-22 : తూర్పు రంగమున రష్యా - జర్మను సేనల మధ్య శీతాకాలపు పోరాటమున పలుమారులు చేతులు మారి కడకు మెమెల్ రేవు జర్మనుల వశమైనది (మార్చి 21).

ఫిబ్రవరి 19 : డార్డనెల్స్ జలసంధి ప్రాంతమున బ్రిటిష్ నౌకా సైన్యము దాడిని సాగించి లెమ్నో దీవిని ఆక్రమించినది (ఫిబ్రవరి, 23).

మార్చి 22 : పెజిమిసల్ నగరమును రష్యా సేనలు వశపరచుకొని, కార్పేథియన్ పర్వత ముల కనుమల ద్వారా హంగేరిలోనికి చొరబడగలిగినవి.

మార్చి 28 : జర్మనీ జలాంతర్గామి మూలమున తొలుతగ ప్రయాణీకుల నౌక ఒకటి నష్టమైనది.

ఏప్రిల్ 2-22 : ఆస్ట్రియా సేనలు జర్మనీ సేనల సాయముతో కార్పేథియన్ పర్వత ప్రాంతముల నుండి రష్యా సేనలను తరిమివైచినవి.

ఏప్రిల్ 22 - మే 25 : ఫ్రాన్సునందలి మిత్రరాజ్య బలములు సుసన్నద్ధములై ఇప్రెస్ వద్ద సాగించిన దాడి, జర్మనులు క్లోరిన్ వాయువును ప్రతిపక్షులపై ప్రయోగించుటవలన విఫల మైనది.

ఏప్రిల్ 25 : టర్కీలోని జలసంధి ప్రాంతపు ఉత్తర ద్వీపకల్పపు కొసన బ్రిటిష్ బలములు దిగినవి; ఆ సమయముననే ఆస్ట్రేలియా సైనికులును అచటనే కొంత ఉత్తరముగ దిగిరి. ఫ్రెంచి సైన్యము జలసంధికి దక్షిణ మున దిగినది. కాని, తుర్కులు ముస్తాఫా కెమాల్ [చూ.] అను వీరుని నాయకత్వ మున తీవ్ర ప్రతిఘటనను సాగించి, ఈ వివిధ దళములకు పరస్పరము పొంతన కుదరకుండ జేసిరి (ఈ ముస్తఫా కెమాల్ తరువాత-యుద్ధానంతరమున-టర్కీ పాల కుడు కాగలిగెను).

మే 1 : హెచ్చరిక లేకుండ ఒక యునైటెడ్ స్టేట్స్ నౌకను జర్మను జలాంతర్గాములు ముంచినవి.

మే 2 : సంయుక్త ఆస్ట్రో - జర్మను సేన విస్తృత దండయాత్రను గలీషియాలో మొదలిడి నది. యుద్ధ పరికరముల లోపమువలన రష్యా సేనలు వెనుకకు తగ్గినవి. ఆస్ట్రో - జర్మను సేనలు త్వరిత గతితో పురోగ మించి కడకు పెజిమిసల్‌ను పట్టుకొనినవి. అంతటితో క్రమముగ ఆ ప్రాంతపు రష్యా సైన్యము చెల్లాచెదరైనది. జూన్ అంతము నకు ఆస్ట్రో - జర్మను సేనలు 160 కిలో మీటరుల లోనికి చొరబడి గలీషియా, బుకోవినా రాష్ట్రములను సంపూర్తిగ వశపరచుకొని వేల కొలదిగ రష్యా సైనికులను ఖైదీలుగ పట్టుకొనినవి.

1915, మే 7 : యునైటెడ్ స్టేట్స్‌కు చెందిన లూసితే నియా నౌక ఐర్లాండ్ దేశపు తీరప్రాంత సముద్రమున జర్మనులచే ముంచబడినది. ఈ నౌక వచ్చు త్రోవ ప్రమాద భరితమని తొలుతనే న్యూయార్కు నందలి జర్మను

రాయబారి కార్యాలయము హెచ్చరిక తెలిపినను, ఈ దుస్సంఘటన జరిగినది. ఈ నౌకా నష్టము వలన 1,198 మంది చనిపోయిరి. ఇందులో 139 మంది యునైటెడ్ స్టేట్స్ వాసులు. ఈ సంఘటన వలన జర్మనీ ఎడల విద్వేషము ఆ దేశమున హెచ్చు పెరిగినది. ఆదేశపు ప్రభుత్వము జర్మనీకి తీవ్రమగు నిరసనను తెలియజేసినది.

1915, మే 9 - జూన్ 18: జనరల్ పెటెన్ నాయకత్వమున ఫ్రెంచి సేనలు 9 కిలోమీటరుల ముఖభూమి కల రంగమున జర్మను సేనాశ్రేణిని విచ్ఛిన్నము చేసి, 4 కిలోమీటరులు లోనికి చొరబడినవి. కాని, ఈ యత్నమున దాదాపు నాలుగు లక్షలమంది ఫ్రెంచి సైనికులు ప్రాణములను కోల్పోయిరి. అంతటినుండి సెప్టెంబరు వరకు పశ్చిమ రంగమున మార్పు ఏమియు లేదు.

మే 23: ఇటలీ యుద్ధ సన్నాహములు పూర్తి చేసికొని ఆస్ట్రియా - హంగేరీ దేశములపై యుద్ధమును ప్రకటించెను.

మే 29: ఆల్బేనియాలోని వేర్వేరు ప్రాంతములను మాంటెనిగ్రో, సెర్బియా, ఇటలీ సేనలు ఆక్రమించుకొనుట మొదలిడినవి.

జూన్ 3: మెసపొటేమియాలో అమరా, నసీరియా నగరములను బ్రిటిష్ సేనలు వశపరచుకొని బాగ్దాద్ వైపునకు దండయాత్రను సాగించినవి.

జూన్ 29: ఇసన్ జో వద్ద 96 కిలోమీటరుల విస్తృతి కల పోరాటపు రంగమున ఇటలీ సేనలు ఆస్ట్రియన్‌లను ఎదుర్కొని పోరాడుట మొదలైనది. ఈ పోరాటము పలు విరామములతో డిసెంబరు 10 వరకు సాగినది. ఫలితము ఏమియు ఎవరికిని లభింపలేదు.

జూలై 1: ప్రాచ్యరంగమున కేంద్ర రాజ్య సేనల రెండవ విస్తృత దండయాత్ర ఇంతటి నుండి మొదలైనది. ఉత్తరమున జర్మనులు త్వరితముగ ముందంజవేసి తూర్పున విల్నా నగరమును పట్టుకొనిరి (సెప్టెంబరు 19). దక్షిణమున ఆస్ట్రియన్‌లు లట్స్క (ఆగస్టు 31), డూబ్నో (సెప్టెంబరు 8) నగరములను పట్టుకొనిరి.

సెప్టెంబరు 1: తమ్ము ప్రతిఘటించని వ్యాపార నౌకలను తగు హెచ్చరిక లేకుండను, ఆ నౌకలందలి జనులకు తగు ప్రత్యామ్నాయ సౌకర్యమును చేకూర్చకను తాము ఆ మీదట ముంచబోమని జర్మను ప్రభుత్వము ప్రకటించెను.

సెప్టెం 6 - 16: రష్యన్‌లు శత్రుసేనలను ప్రతిఘటించుటకు ఈ మధ్యకాలమున తీవ్ర కృషిచేసి, విఫలులైరి. సెప్టెంబరు అంతమునకు జర్మన్ పురోగతి ముగియునాటికి రష్యన్‌లు పోలండ్‌ను, లిథూనియాను, కౌర్‌లాండ్‌ను పోగొట్టుకొనుటయే కాక లక్షలకొలదిగ సైనిక బలమును నష్టపడిరి.

సెప్టెంబరు 22 - నవంబరు 6: రీమ్స్ - ఆర్గోన్‌ల మధ్యప్రదేశమున తగు సన్నాహముతో జాఫ్రీ సేనాని నాయకత్వమున ఫెంచి సేనలు శత్రు శ్రేణిపై తీవ్ర దండయాత్రను భారీ ఎత్తున సాగించినవి. కాని, విపరీత ప్రతిఘటనవలన ముందునకు పోజాలక పోయినవి. ఆ సమయముననే (సెప్టెంబరు 25 - అక్టోబరు 28) బ్రిటిష్ సేనలును పశ్చిమ రంగముననే ఆర్‌తాయ్ వద్ద జర్మనుల శ్రేణిపై ముందునకు సాగినవి. ఇచటనే తొలుతగ బ్రిటిష్ సేనలు దుర్వాయువును యుద్ధమున వినియోగించినవి. జర్మనులను కొంత వెనుకకు తరుమగలిగినను, అటనుండి బ్రిటిష్ సేనలు ముందునకు త్రోసికొని పోలేక పోయినవి.

ఆంగ్లో - ఫ్రెంచి సేనల సంయుక్త యత్నము ఇటుల విఫలత చెందుట వలన పశ్చిమ రంగమున యుద్ధ రంగము పూర్వపు సంవత్సరమున ఉన్నటులనే మరల నిలచినది.

సెప్టెంబరు 28: మెసపొటేమియాయందు కుట్ - ఎల్ - అమరా ను బ్రిటిష్ సేనలు వశపరచుకొని టర్కీ సేనలను పారద్రోలినవి.

1915, అక్టోబరు: జర్మనులు నూతన పరికర సమన్వితమై ప్రొపెల్లర్ ద్వారా కాల్పులు సాగించ వీలగు ఫోకర్ ప్లేన్ (విమానము) ను

విమానదాడులకు ఉపయోగింప మొదలిడిరి. తద్వారా ఆ సంవత్సరమున విమాన యుద్ధమున జర్మనులదే పై చేయి అయినది.

1915, అక్టో 6 : ఆస్ట్రో - జర్మనీ సేనలు సెర్బియాపై దండెత్తి బెల్‌గ్రేడ్ (అక్టోబరు, 9)ను, సెమెన్‌డ్రియా (అక్టోబరు, 11)ను వశపరచుకొనిరి.

అక్టోబరు 11 : బల్గేరియన్‌లు కేంద్ర రాజ్యముల పక్షమును అవలంబించి, సెర్బియా సరిహద్దును అతిక్రమించిరి.

అక్టోబరు 13 : జెప్పెలిన్ విమానములతో తూర్పు ఇంగ్లండుపైనను, లండను నగరముపైనను జర్మనులు అతి బీభత్సపు దాడిని సాగించిరి. ఇట్టివి 1915 లో 19 దాడులును, 1916 లో 41 దాడులును జరిగినవి. కాని, తరువాత విమానదాడి నిరోధక చర్యలను, విమాన ఘాతుక శతఘ్నులను ఉపయోగించి బ్రిటిష్‌వారు వీనిని నిరోధించిరి. యుద్ధ కాలపు మొత్తమున జర్మనులు 88 జెప్పెలిన్ విమానములను ఉపయోగించిరి. వీనిలో యుద్ధ విరమణనాటికి 7 మాత్రమే మిగిలినవి.

అక్టోబరు 14 : బల్గేరియా, సెర్బియా దేశములు ఒకటిపై మరియొకటి యుద్ధమును ప్రకటించినవి. ఇంగ్లండు, ఫ్రాన్స్ దేశములును బల్గేరియాపై యుద్ధమును ప్రకటించినవి (అక్టోబరు. 15, 16).

నవంబరు. 16 : బల్గేరియా సేనలు సెర్బియాలో అత్యధిక భాగమును ఆక్రమించినవి. సెర్బియా సేనలు అల్‌బేనియాలోనికి పరుగిడినవి.

డిసెంబరు 2 : మాంటెనీగ్రోను ఆస్ట్రియా సేనలు ఆక్రమించినవి.

డిసెంబరు 7 : కుట్ - ఎల్ - అమరా ను తిరిగి వశపరచుకొనుటకై టర్కీ సేనలు ముట్టడిని ప్రారంభించినవి.

డిసెం. 19-20, 1916, జన. 8-9 : టర్కీలోని డార్డనెల్స్ జలసంధి ప్రాంతమున గల్లిపొలీలో స్థావరము సర్పరచుకొనిన బ్రిటిష్ సైన్యములు సడిచప్పుడు లేకుండ ఆ ప్రాంతమును ఖాళీచేసి తిరోగమించినవి. డార్డనెల్స్ ప్రాంతమున ఇటుల బ్రిటిష్‌వారి కృషి విఫలమగుటతో, ఆ జలసంధి మార్గమును టర్కీ బంధించివేసినది. అందువలన మిత్రరాజ్యముల వలన రష్యాకు సరఫరాలు చేరు మార్గమునకు భంగము ఏర్పడినది.

జనవరి 18 : కుట్ - ఎల్ - అమరా ను తురుష్కుల ముట్టడి నుండి తప్పించుటకు బ్రిటిష్ సేనలు ప్రథమ ప్రయత్నము చేసి విఫలత చెందినవి. ఇట్టి విఫల ప్రయత్నములు మార్చి 8, ఏప్రిల్ 1 తేదీలలో మరల జరిగినవి.

జనవరి 23 : అల్‌బేనియాలోని స్కుటరిని ఆస్ట్రియా సేనలు ఆక్రమించినవి. అంతటనుండి వరుసగ ఆ దేశమునందలి పెక్కు కీలక ప్రాంతములు ఆ సేనలకు వశమైనవి.

ఫిబ్రవరి 15 - మార్చి 17 : ఇటలీలోని ఇసాన్జో వద్ద ఆస్ట్రియా సేనలతో ఇటలీ సేనల అయిదవ పోరాటము సాగినది. ఇట్లే పోరాటములు అచటనే ఆ సంవత్సరాంతమునకు మరి నాలుగు జరిగినవి. కాని, ఎవరికిని ఎట్టి లాభమును కలుగలేదు.

ఫిబ్రవరి 21 : సాయుధములగు వ్యాపార నౌకలు సైతము యుద్ధ నౌకలుగనే భావింపబడి, తమ జలాంతర్గాములచే నిర్మూల్మింపబడగలవని జర్మనీ యునైటెడ్ స్టేట్స్‌కు తెలియజేసెను.

ఫిబ్రవరి 21 : పశ్చిమరంగమున వెర్డన్ వద్ద తీవ్రపోరాటము మొదలైనది. జర్మనులు విపరీతమగు ఆయుధబలమును ఉపయోగించి డవ్‌మాంట్ దుర్గమును వశపరచుకొనిరి. ఈ పోరాటము కొలది విరామములతో జూలై 11 వరకు సాగినది. భూ సేనకు సాయముగ జర్మను - ఫ్రెంచి వైమానిక దళముల మధ్య ఈ ప్రదేశమున పోరాటములును చెలరేగినవి. వాక్స్‌దుర్గము కడకు జర్మనుల వశమైనను, వారు ఫ్రెంచివారి తీవ్రప్రతిఘటనను ఎదుర్కొనిరి. ఫ్రెంచివారు $3\frac{1}{2}$ లక్షలను, జర్మనులు అంతకు కొలది తక్కువగను సైనిక బలమును కోల్పోయిరి.

1916, ఏప్రిల్ 23 : టర్కీ సైనిక దళము అకస్మాత్తుగ దాడి జరిపి, ఆంగ్లో - ఈజిప్షన్ సేనలను ఓడించి,

సూయెజ్ కాలువ ప్రాంతపు స్థావరము లను వశపరచుకొనినవి. కాని, త్వరలోనే అటనుండి వైదొలగినవి.

1916, ఏప్రిల్ 26: టర్కీ సామ్రాజ్యమునందలి ఆసియా ఖండపు ప్రాంతములను విభజించుకొనుటకై ఇంగ్లండు, ఫ్రాన్స్, రష్యాదేశములు రహస్యముగ ఒడంబడికలు చేసికొనినవి [చూ. కాన్‌స్టాంటినోపుల్ ఒడంబడికలు - పు. 381].

ఏప్రిల్ 29: కుట్ - ఎల్ అమరా టర్కీ సేనలకు లొంగినది. 10,000 బ్రిటిష్ సైనికులు ఖైదీలుగ చిక్కిరి.

మే 9: మధ్యప్రాచ్యమున తమకు యుద్ధానంతరమున రాగల వాటాలను గురించి ఇంగ్లండు-ఫ్రాన్స్ దేశముల మధ్య ఒప్పందము [చూ. సైక్స్ - పికోట్ ఒడంబడిక] కుదిరినది.

మే 15 - జూన్ 3: ఇటలీలోని ట్రెన్‌టినోవద్ద ఆస్ట్రియా సేనల ఆకస్మిక దాడి. తొలుత కొంత భూమి ఆస్ట్రియన్‌ల వశమైనను, ఇటలీ సేనలు విజృంభించి మరల దానిని స్వాధీనము చేసికొనినవి. కాని, ఈ యత్నమున దాదాపు 1½ లక్ష ఇటలీ సైనికులు ప్రాణములను కోల్పోయిరి.

మే 26: బల్గేరియా - జర్మను సంయుక్త సైన్యము గ్రీస్ దేశమునకు చెందిన మేసిడోనియాలోని రూపెల్ దుర్గమును ఆక్రమించెను. గ్రీస్ దేశపు రాజు కేంద్రరాజ్యములతో లాలోచిపడుచుండెనని మిత్రరాజ్యములకు ఉండిన సందేహము ఇందువలన బలపడెను.

మే 31-జూన్ 1: నార్వే తీరప్రాంతమున బ్రిటిష్ - జర్మనీ నౌకాదళముల మధ్య జట్‌లండ్ వద్ద పోరాటము. కడకు జర్మనులదే పైచేయి అయినది.

జూన్ 4: ప్రాచ్య రంగమున రష్యన్‌ల తీవ్రపు దాడి మొదలైనది. 482 కిలోమీటరుల ముఖ రంగమున ఈ యుద్ధము ప్రజ్వలితమైనది. పిన్‌స్క్‌నుండి దక్షిణమున జెర్‌నోవిట్జ్ వరకు వ్యాపించిన ఈ ముఖ రంగమున 25 నుండి 125 కి. మీ. వరకు అటనట రష్యన్‌లు పురోగమించి పదిలక్షల మంది ఆస్ట్రియా సైనికులను ఖైదీలుగ పట్టుకొనినను, సమయమునకు 15 డివిజనుల జర్మనీ సేన అటకు చేరుటతో రష్యన్‌ల పురోగతి ఆగిపోయినది. పైపెచ్చు రష్యన్‌లకును ఈ యుద్ధమున 10 లక్షల సైనిక బలము నష్టమయ్యెను. అందువలన సైన్యమున ఉత్సాహబలము నశించి, అసంతృప్తి చెలరేగెను.

జూన్ 5: మిత్రరాజ్యముల ప్రోత్సాహమున టర్కీ సుల్తానుపై అరబ్బుల తిరుగుబాటు మొదలైనది. మదీనాలోని టర్కీ సేనా నివహముపై అరబ్బుల దాడి.

జూన్ 7: హెజాజ్ ప్రాంతము సర్వతంత్ర స్వతంత్రము అని అరబ్ నాయకుడు హుస్సేన్ ప్రకటించెను.

జూలై 1: పశ్చిమ రంగమున సోమీవద్ద యుద్ధము ఆరంభమైనది. ఇందు ముఖ్యముగ బ్రిటిష్ సేనలు జర్మనీ సేనలతో పోరాడినవి. భూ సేనకు సాయముగ బ్రిటిష్ వారు నూతనముగ ప్రవేశపెట్టిన డి హవిల్లాండ్, ఫార్‌మన్ ఎక్స్‌పెరిమెంటల్ విమానములును విజృంభించి జర్మనులు అంతవరకు చలాయించిన వైమానికాధిపత్యమునకు స్వస్తి చెప్పగలిగినవి. జర్మను సైనికుల సంఖ్య మిత్రరాజ్య సైనికుల సంఖ్యకన్న చాల తక్కువయే ఐనను భూ యుద్ధమున ప్రతిఘటన మాత్రము అతి తీవ్రముగ ఉండినది. ఈ పోరాటమున ఒక దినమున 60 వేల మందిని బ్రిటిష్ సేన కోల్పోయెను. యుద్ధ నష్టములలో దినవారీగా ఇట్టి నష్టము అదివరకు ఎప్పుడును సంభవింపలేదు. ఆగస్టులోకూడ ఈ యుద్ధము కొనసాగి, మిత్రరాజ్యములు మెల్లగ ముందునకు పోగలిగినవి.

1916, ఆగస్టు 2 - 21: డొరియన్‌వద్ద పోరాటము. మిత్ర రాజ్యముల సాయమున పునరాయత్తములు చేయబడిన సెర్బియా సేనలును, మిత్ర రాజ్య సేనలును గ్రీస్‌లోని సలోనికా వద్ద సన్నద్ధములై బల్గేరియన్‌ల పై దాడిని సాగించినవి.

1916, ఆగస్టు 17-19: బల్గేరియా - జర్మనీ సంయుక్త సేనలు సలోనికావద్ద ఉన్న మిత్రరాజ్య సైన్యములను వెనుకకు నెట్టి ఆ ప్రాంతమునందలి కొన్ని గ్రీక్ దుర్గములను ఆక్రమించినవి. కవల్లావద్ద ఉన్న గ్రీక్ సేన తనంతట తానుగ-ఇష్టపూర్తిగ-కేంద్రరాజ్య సేనలకు లొంగెను.

ఆగస్టు 19: ఇంగ్లండు కోస్తాపై జర్మనుల యుద్ధనౌకల దాడులు. అక్టోబరు 26, 27 లలో కూడ ఇట్టివి సాగినవి.

ఆగస్టు 27: యుద్ధానంతరమున ప్రాదేశికముగ లాభములు చేకూర్చగలమని మిత్రరాజ్యములు వాగ్దానము చేసిన ఫలితముగ రుమేనియా ఆస్ట్రియా - హంగేరీపై యుద్ధమును ప్రకటించినది.

ఆగస్టు 30: మిత్ర రాజ్యముల పక్షము అవలంబించి, తమ రాజును కాదని, వెనిజెలాస్ నాయకత్వమున క్రీట్ ద్వీపమున గ్రీక్ తాత్కాలిక ప్రభుత్వము స్థాపింపబడెను. రాజపక్షావలంబికులకును, వీరికిని సంఘర్షణలు చెలరేగెను. వెనిజెలాస్ ప్రభుత్వమునకు మిత్రరాజ్యములు పరిగణన కల్పించెను (డిసెంబరు, 19).

సెప్టెంబరు 15: బ్రిటిష్‌వారు తొలుతగ పశ్చిమ రంగమున టాంక్‌లను ఉపయోగించిరి.

అక్టోబరు 5 - డిసెం 11: మేసిడోనియాలో భారీ ఎత్తున దండయాత్ర సాగించి మిత్రరాజ్య సేనలు ఓక్రిడ్ సరస్సువరకు పోగలిగినవి. బల్గేరియా సరిహద్దున మాత్రము వారు ముందునకు పోజాలక పోయిరి.

అక్టో 24 - డిసెం 18: ఫ్రెంచి సేనలు ఎదురు దండయాత్ర సలిపి డవ్‌మాంట్, వాక్స్ దుర్గములను తిరిగి వశపరచుకొనినవి. తత్ఫలితముగా ఆ సంవత్సరమునకు పరిస్థితి యథాపూర్వ మాయెను. కాని, ఉభయ పక్షములును విపరీతముగ నష్టపడినవి.

అక్టోబరు 29: అరబ్బులకు రాజుగ హుస్సేన్ ప్రకటితుడయ్యెను. తుర్కులపై తిరుగుబాటును తీవ్రతరము చేయవలసినదిగ అరబ్బులను హుస్సేన్ ఆహ్వానించెను.

నవం. 10-14: ఆస్ట్రియా - జర్మనీ సంయుక్త సేన రుమేనియాలోనికి చొరబడి, వల్లేచియా రాష్ట్రముపై దండయాత్ర మొదలిడినది.

నవంబరు 18: పశ్చిమ రంగమున సోమీ వద్ద జరిగిన పోరాటము ముగిసినది. మొత్తము మీద బ్రిటిష్ సేనలు 323 చ. కి. మీ. భూమిని ఆక్రమించి తద్వారా కొన్ని ప్రాంతములందు 11 కి. మీ. లోనికి చొరబడినను, కీలక ప్రాంతములు ఏవియు వారికి చిక్కలేదు. ఈ పోరాటమున బ్రిటిష్ వారు 4 లక్షలను మించియు, ఫ్రెంచివారు దాదాపు 2 లక్షలను, జర్మనులు 4 లక్షలకు మించియు జననష్టమును పొందిరి.

నవంబరు 23: బల్గేరియా - జర్మనీ సంయుక్త సేన డాన్యూబ్ నదిని దాటి బుకారెస్ట్ వైపునకు పురోగమించి ఆస్ట్రియా దళములను కలసికొనినది.

నవంబరు 28: లండనుపై తొలుతటి విమాన(ఏయిర్ ప్లేన్) దాడి. 1917 - 18 లో ఇట్టివి పెక్కు జరిగినవి. తొలుత పగటి పూటనే ఇట్టివి సాగినను, క్రమముగ రాత్రి సమయములందునను దాడులను జర్మనులు నిర్వహించిరి. ఆస్తి, జననష్టములు విరివిగ ఉండినను, జర్మనులు ఆసించిన యుద్ధ ప్రయోజనములు ఏవియు వారికి లభింపలేదు.

డిసెంబరు 1-5: బుఖారెస్ట్ నగరము కేంద్ర రాజ్య బలములకు వశమయ్యెను (డిసెంబరు, 6). రుమేనియా ప్రభుత్వము మారుమూల ప్రాంతమునకు తరలిపోయి పోరాటమును సాగించెను.

డిసెంబరు 15: హెజాజ్ ప్రాంతపు రాజుగ హుస్సేన్‌నకు బ్రిటిష్ ప్రభుత్వము పరిగణన ఇచ్చెను.

1917, జనవరి: ఆస్ట్రో - జర్మను సేనలు రుమేనియాలోని తమ పురోగతిని నిర్విరామముగ కొనసాగించినవి. ఆ నెలలో ప్రథమార్ధము ముగియునప్పటికి రుమేనియాలో గోధుమ పంటకును, నూనె గనులకును పేరొందిన ముఖ్య ప్రదేశములు అన్నియు కేంద్ర రాజ్య సైన్యములకు వశమైనవి.

1917, జన. 9 - ఫిబ్ర. 24 : కుట్ - ఎల్ - అమరా ను బ్రిటిష్ సేనలు వశపరచుకొని బాగ్దాద్ వైపునకు పురోగమించినవి.

జనవరి 31 : జలాంతర్గామి చర్యలు ఎట్టి మినహాయింపులు లేకుండ ఆ మీదట తీవ్రతరములు చేయబడగలవని యునైటెడ్ స్టేట్స్‌కు జర్మనీ తెలియ జేసెను.

ఫిబ్రవరి 3 : జర్మనీతో దౌత్య సంబంధములు యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వము తెగ తెంపులు చేసికొనెను. యునైటెడ్ స్టేట్స్ అధ్యక్షుని అభ్యర్థనపై బ్రెజిల్, బొలీవియా, పెరూ, తక్కిన దక్షిణ అమెరికా రాజ్యములును అట్టి చర్యనే అవలంబించినవి. చీనాయును వానిని అనుసరించినది (మార్చి, 14).

ఫిబ్రవరి 23 : యుద్ధతంత్రరీత్యా తమ శ్రేణిని దృఢతరము చేసికొనుటకై జర్మను సేనలు పశ్చిమ రంగమున అర్రాస్ - సోయిస్సన్స్ మధ్య కొంత మేర వెనుకకు తిరోగమించినవి. ఈ విధముగ ఏర్పడిన జర్మనుల నూతన సైనిక శ్రేణియే అప్పటి జర్మను సేనాని పేరున 'హిండెన్‌బర్గ్ శ్రేణి' అని వ్యవహరింపబడినది.

మార్చి 2 : పరిష్యాలోని హామదాన్, కిర్‌మన్‌షా (మార్చి 12), కరింద్ (మార్చి 17), ఖనికిన్ (ఏప్రిల్ 4) రష్యన్‌ల వశమైనవి.

మార్చి 11 : బాగ్దాద్‌ను బ్రిటిష్ సేన ఆక్రమించినది. ఈ కాలముననే రష్యా సేనలు పశ్చిమ పరిష్యాలో చాల ముందునకు చొరబడినవి.

మార్చి 12 : రష్యాలో ప్రజ్వరిల్లిన విప్లవము ఫలితముగ ఒక ఆపద్ధర్మ ప్రభుత్వము ఏర్పడినది. రష్యా చక్రవర్తి (జార్) నికలస్ - II అంతట పదవీ పరిత్యాగము చేసెను (మార్చి 15).

మార్చి 30 : రష్యాలోని ఆపద్ధర్మ ప్రభుత్వము పోలండ్ స్వాతంత్ర్యమును గుర్తించెను.

ఏప్రిల్ మాసము : జలాంతర్గామి చర్యలు తమ పరాకాష్ఠను ఈ మాసమున అందుకొనినవి. ఈ నెలలోనే మొత్తము మీద 875 వేల టన్నుల ప్రమాణపు నౌకలను జర్మనులు ముంచి వేసిరి. ఇందు సగము బ్రిటిష్ వారికి చెందినవి. ఈ ఉపద్రవమునుండి బయట పడుటకై నౌకా నిర్మాణములను విరివిగ సాగించుటకు ఏర్పాటులు చేయుటయే కాక, సరుకుల నౌకలకు తగు రక్షణకై యుద్ధ నౌకలను పంపు ఏర్పాటు జరిగినది. జలాంతర్గాములను నశింపజేయు లోతు - బాంబు, నీటి విమానముల పర్యవేక్షణ మొదలగునవి అమలులోనికి తేబడినవి. ఇది కొంతవరకు ప్రయోజనకారి అయినది. 1917 అక్టోబరునకు జర్మనుల వలన 8 లక్షల టన్నుల ప్రమాణపు నౌకలు నష్టమైనవి. కాని, ఇందులకు ప్రత్యామ్నాయముగ జర్మనులు 50 జలాంతర్గాములను, అందలి శిక్షిత నావికులను పోగొట్టుకొనిరి. కావున, క్రమముగ అట నుండి జలాంతర్గాముల బెడద తగ్గ మొదలిడినది.

ఏప్రిల్ 6 : జర్మనీపై యునైటెడ్ స్టేట్స్ యుద్ధమును ప్రకటించెను.

ఏప్రిల్ 9 - మే 4 : పశ్చిమ రంగమున బ్రిటిష్ సేనలు అర్రాస్ వద్ద దాడిని సాగించినవి. దుర్వ్యాయువును పెద్ద ఎత్తున బ్రిటిష్ సేనలు ఇట ఉపయోగించినవి. వారు కెనడా సేనల సాయమున 6 కిలోమీటరులు జర్మను సేనా శ్రేణిలోనికి చొరబడగలిగినను, ఆ సేనా శ్రేణిని విచ్ఛిన్నము చేయలేక పోయిరి.

ఏప్రిల్ 16-20 : ఐనీ వద్దను, షాంపేనీ వద్దను ఫ్రెంచి సేనలు పెద్దయెత్తున పశ్చిమరంగమున దాడిని సాగించినవి. దానివలన ఏ ఫలితమును దక్కలేదు. ఫ్రెంచి సైన్యము విపరీత నష్టములకు లోనయ్యెను. సైనికులలో నిస్పృహాయు,నిరుత్సాహమును వ్యాపింప మొదలయ్యెను.

1917, మే 15 : ఫ్రెంచి సేనలలో నిరుత్సాహము ప్రబలుటకు దేశములోని శాంతి వాదులయు, సోషలిస్టులయు ప్రభావమే ముఖ్యకారణమని భావించి, ఫ్రెంచి ప్రభుత్వము అట్టివారి నాయకులను ఇరువది ముగ్గురను మరణ శిక్ష పాలు జేసెను.

1917, జూన్ 7 : పశ్చిమ రంగమున మెస్సినెస్ వద్ద బ్రిటిష్ దాడి మొదలైనది. ఇందు బ్రిటిష్ సేన విజయము పొంది, కీలక ప్రాంతమును కొంత ఆర్జించినది.

జూన్ 11 - 12 : గ్రీస్ వైఖరి అనిశ్చితముగ ఉండుట బాల్కన్ రంగమున తమ పురోగతికి అభ్యంతరమని మిత్రరాజ్యములు భావించుటచే గ్రీస్ దేశపు రాజగు కాన్‌స్టాన్‌టెయిన్‌ను పదవీ పరిత్యాగము చేయవలసినదిగ ఆదేశించుచు ఆ రాజ్యములు అంత్య సందేశమును పంపినవి. ఆ సమయముననే మిత్రరాజ్య సేనలు గ్రీస్ దేశమునందలి తెసలీ మొదలగు ప్రాంతములందు దిగినవి. గ్రీస్ దేశపు రాజు పదవీ పరిత్యాగము చేసెను. అతని రెండవ కుమారుడు రాజై మిత్రరాజ్యములకు అనుకూలుడగు వెనిజెలాస్‌ను ప్రధానిగ అంగీకరించెను (జూన్ 26).

జూన్ 27 : కేంద్ర రాజ్యములతో సంబంధములను తెగత్రెంపులు చేసికొని మిత్రరాజ్యముల పక్షమున గ్రీస్ దేశము యుద్ధమున ప్రవేశించెను.

జూలై 1 : ప్రాచ్య రంగమున గలీషియాయందు రష్యా సేనలు పెద్ద ఎత్తున దాడిని మొదలిడినవి. కొంతదూరము ముందునకు ఆ సేనలు వచ్చిన తరువాత ఆస్ట్రో - జర్మను సేనలు తమ ఎదురు దాడిని ఆరంభించి (జూలై 18) రష్యా సేనలను వెనుకకు తరిమి, పలు ప్రాంతములను ఆక్రమించినవి.

జూలై 6 : కర్నల్ టి. ఇ. లారెన్స్ అను ఆంగ్లేయుని రాజనీతి నైపుణ్యమువలన అరబ్బుల యందు టర్కీ ఎడల విద్వేషము ప్రజ్వరిల్లిన ఫలితముగ హెజాజ్ రైల్వేయును, అకాబాయును అరబ్బుల వశమైనవి. టర్కీ సేనల రాకపోకలకు ఇందువలన అభ్యంతరము ఏర్పడెను.

జూలై 8 : రష్యాలోని విప్లవము ఫలితముగ ప్రభుత్వ వ్యవస్థాబలము సడలుటవలన రష్యా సేనలు పశ్చిమ పరిష్యాను వదలి స్వదేశమునకు పోవ మొదలిడినవి.

జూలై 31 - నవం 10 : పశ్చిమ రంగమున ఐప్రెస్ వద్ద బ్రిటిష్ సేనలు పెద్ద ఎత్తున దాడిసాగించినవి. గొప్ప సన్నాహముతో సాగిన ఈ దాడి మూలమున 8 కిలోమీటరులు ముందునకు బ్రిటిష్ సేనలు పోగలిగినవి. కాని, దీనికి ప్రతిఫలముగ 4 లక్షల సైనిక బలము బ్రిటిష్ వారికి నష్టమయ్యెను. ఏప్రిల్ దాడి ఫలితముగ ఫ్రెంచి సేనలలో నిరుత్సాహము ప్రబలినటులనే బ్రిటిష్ సేనలందును ఈ దాడివలన నిరుత్సాహము సర్వత్ర వ్యాపింప మొదలయ్యెను.

ఆగస్టు 20 - డిసెం 15 : పశ్చిమ రంగమున వెర్డన్ వద్ద ఫ్రెంచి సేనల ఎదురుదాడి. దీనివలన ఫ్లాండర్స్‌లోని బ్రిటిష్ సేనలకు ఊపిరి పీల్చుకొను అవకాశము లభించుటయే కాక ఫ్రెంచి వారికి కొన్ని కీలక ప్రాంతములు చేజిక్కినవి.

సెప్టెం 3 - 5 జర్మను సేనలు ప్రాచ్యరంగపు ఉత్తరభాగమున రీగా నగరమును ఆక్రమించినవి.

సెప్టెంబరు 12: ఇదివరకు రష్యాలో చేరియుండిన పోలండ్‌నకు ఒక రాజ్యాంగ విధానమును కేంద్ర రాజ్యములు దత్తము చేసి, ఒక పరిపాలనా సంఘమును ఏర్పరచినవి (అక్టోబరు, 15).

సెప్టెంబరు 29 : యూఫ్రటీస్ నదిమీది రమాది నగరమును బ్రిటిష్ సేనలు వశపరచుకొనినవి. ఆ తరువాత టైగ్రిస్ నదిమీది టిక్రిట్‌ను కూడ ఆ సేనలు లోగొనినవి (నవంబరు, 6); ఇంతటితో ఆ సంవత్సరమున మెసపొటేమియాలో పురోగతి ఆగిపోయినది.

అక్టో 11-20 : జర్మనులు లాట్వియాలో అత్యధిక భాగమును, బాల్టిక్ ద్వీపములను (ఓసెల్, మూన్, డాగో ద్వీపములను) తమ దాడులవలన ఆక్రమింపగలిగిరి.

1917, అక్టో 24 - డిసెం 2 : ఇసొన్జో వద్ద ఇటలీలో తుది యుద్ధము. ఆస్ట్రో - జర్మను సేనలు తీవ్ర సన్నాహములతో దాడిని సాగించినవి. అప్పటికే నిరుత్సాహ స్థితిలో ఉన్న ఇటలీ సేనలు చెల్లాచెదరై తిరోగమించి పియావేను చేరుకొని, అటకు సాయము వచ్చిన బ్రిటిష్-ఫ్రెంచి సేనల అండతో కాలు నిలువ ద్రొక్కికొనినవి (నవంబరు 3, 4). సరఫ

రాల లోపముచే కేంద్రరాజ్య సేనలు తమ పురోగతిని ఆపినవి. ఇటలీ సేనకు 3 లక్షల జననష్టము కలిగెను.

1917, నవం 7: (రష్యాలోని ప్రాత పంచాంగమును అనుసరించి అక్టోబరు 25) విప్లవకారులలో తీవ్రవాదులగు బోల్షివిక్‌లు రష్యాలోని ఆపద్ధర్మ ప్రభుత్వమును కూలద్రోసి, అధికారమును ఆకస్మిక చర్యవలన వశపరచుకొనిరి.

నవంబరు 20: ఉక్రెయిన్ ప్రజా గణరాజ్యముగ స్వాతంత్ర్యమును ప్రకటించెను.

నవంబరు 20 - డిసెంబరు 3: టాంకులతో తొలుతటి పెద్ద దాడిని బ్రిటిష్‌వారు పశ్చిమ రంగమున సాగించిరి. 380 టాంకులు ఈ దాడిలో పాల్గొనినవి. బ్రిటిష్ సేనలు కొన్ని కీలక ప్రాంతములను తొలుత వశపరచుకొనినను, అలసట వలన ముందునకు పోజాలక పోయినవి. మాసము ముగియునాటికి జర్మనులు ఆ కీలక ప్రాంతములలో కొన్నింటిని వశపరచుకొనిరి.

నవంబరు 28: ఎస్తోనియా స్వాతంత్ర్యమును ప్రకటించెను.

నవంబరు 28: రష్యాలోని బోల్షివిక్ ప్రభుత్వము యుద్ధ విరమణమును, శాంతిని అభ్యర్థించుచు జర్మనులకు సందేశము పంపెను.

డిసెంబరు 5: బ్రెస్ట్ - లిటోవస్క్‌లో బోల్షివిక్ ప్రతినిధులకును, కేంద్ర రాజ్య ప్రతినిధులకును మధ్య శాంతి సమావేశము ఆరంభమయ్యెను.

డిసెంబరు 6: ఫిన్లాండ్ స్వాతంత్ర్యమును ప్రకటించెను.

డిసెంబరు 15: ప్రాచ్యరంగమున యుద్ధవిరమణకై ఒప్పందము కుదిరినది.

డిసెంబరు 23: మాల్దేవియా (బెస్సరేబియా) గణ రాజ్యముగ స్వాతంత్ర్యమును ప్రకటించెను.

1918, జనవరి మాసము: బ్రెస్ట్ - లిటోవస్క్ వద్ద కేంద్ర రాజ్య ప్రతినిధులతో బోల్షివిక్ ప్రతినిధులు శాంతి సంభాషణలు మొదలిడిరి. జనవాక్య నిర్ణయము జరుగనిదే నూతన బాల్టిక్ రాజ్యముల స్వతంత్ర ప్రతిపత్తిని గుర్తింప వీలుపడదని బోల్షివిక్ ప్రతినిధియగు ట్రాట్‌స్కీ [చూ. పు. 504] పట్టుపట్టినందున వృథా వాగ్వివాదము చెలరేగెను.

జనవరి 8: యునైటెడ్‌స్టేట్స్ కాంగ్రెస్‌నతాను ఒసగిన అధ్యక్షోపన్యాసమున ప్రెసిడెంట్ విల్సన్ యుద్ధ విరమణమునకును, శాంతి ప్రతిష్ఠాపనకును ప్రాతిపదికలుగ ఉపయోగించునవిగా పేర్కొనుచు 14 సూత్రములను నిర్వచించెను [చూ. విల్సన్].

జనవరి 12: లాట్వియా స్వాతంత్ర్యమును ప్రకటించెను.

జనవరి 27: బాగ్దాద్ నుండి బయలుదేరిన ఒక బ్రిటిష్ సేన కాస్పియన్ ప్రాంతమున నూనెగనుల ప్రదేశముపై బ్రిటిష్ ఆధిపత్యమునకు భంగము కలుగకుండుటకై పురోగమించి, ఎన్‌జెలి (ఫిబ్రవరి 17), కిర్‌మన్‌షా (ఫిబ్రవరి 25) పట్టుకొనెను.

ఫిబ్రవరి 1: ఉక్రెయిన్ స్వాతంత్ర్యమునకు కేంద్ర రాజ్యములు పరిగణనను ఇచ్చినవి.

ఫిబ్రవరి 10: శాంతి సంధితో నిమిత్తము లేకుండనే ఏకపక్ష నిర్ణయముగ యుద్ధము ముగిసినటుల బ్రెస్ట్ - లిటోవస్క్ శాంతి సంభాషణలలో పాల్గొనుచున్న బోల్షివిక్ ప్రతినిధి ట్రాట్‌స్కీ ప్రకటించెను.

ఫిబ్రవరి 18: బోల్షివిక్‌ల ఏకపక్ష నిర్ణయమునకు ప్రతీకారముగ యుద్ధచర్యలను మరల జర్మనులు కొనసాగించి, అతిత్వరితముగ ముందునకుసాగి పెట్రోగ్రాడ్‌నకు 160 కిలోమీటరుల దూరము వరకు పోగలిగిరి.

ఫిబ్రవరి 24: ఆర్మీనియాలోనికి టర్కీ సేనలు పురోగమించి ఎర్‌జెరమ్ (మార్చి 12), వాన్ (ఏప్రిల్ 5), బాటుమ్ (ఏప్రిల్ 15), కార్స్ (ఏప్రిల్ 27) పట్టుకొనినవి. అది మొదలుగ కాకసస్ ప్రాంతమున బోల్షివిక్ జర్మనీ, టర్కీ సైన్యములకు బ్రిటిష్ సేనలతో సంఘర్షణ మొదలైనది.

ఫిబ్రవరి, 28: లెనిన్ పట్టుదల వలన బోల్షివిక్‌లు మరల శాంతి సంభాషణలు మొదలిడిరి [చూ. లెనిన్].

1918, మార్చి 3: బ్రెస్ట్ - లిటోవస్క్ శాంతి సంధిపై రష్యా (బోల్షివిక్) ప్రతినిధులు సంతకములు చేసిరి. దీనివలన పోలండ్, లిథూనియా, ఉక్రెయిన్, బాల్టిక్ రాష్ట్రములను, ఫిన్లాండ్, ట్రాన్స్ కకేసియాలను రష్యా వదలుకొనెను.

1918, మార్చి 21 – ఏప్రిల్ 5 : 6,000 శతఘ్నులతో జర్మనులు పశ్చిమ రంగమున సెయింట్ క్వెన్‌టైన్ ప్రాంతమున విజృంభించి బ్రిటిష్ సేనాశ్రేణిని భగ్నముచేసి, 64 కిలోమీటరులు లోనికి చొచ్చుకొని రాగలిగిరి. ఫ్రెంచిసేనల సమయోచిత సాహాయ్యముతో బ్రిటిష్ సేనలు మరల నిలువ ద్రొక్కుకొనినవి. కాని, సంయుక్త నాయకత్వము లేనిది జర్మనులను ప్రతిఘటించుట దుర్ఘటమని అంతట స్పష్టమైనది. అప్పటికే కొన్ని యునైటెడ్ స్టేట్స్ సేనలును పశ్చిమ రంగమునకు చేరినవి. ఈ వివిధ రాజ్యముల సేనలకు ఫ్రెంచి జాతీయుడగు ఫోక్ సేనాని అధినాయకుడుగ ఉండుటకు కడకు నిర్ణయము జరిగెను (ఏప్రిల్ 14).

ఏప్రిల్ 9 : మాల్డేవియా గణరాజ్యము రుమేనియాలో లీనమయ్యెను.

ఏప్రిల్ 9 - 29 : పశ్చిమ రంగమున జర్మనులు ఐప్రెస్‌కు దక్షిణముగ ముందునకు నడచి, మెస్సినిస్‌ను మూకపోటున లోగొని, ఆర్ మెన్‌టియెర్‌ను ఆక్రమించిరి. ఇందువలన బ్రిటిష్ సేనా శ్రేణిలో వెలితి ఏర్పడినది.

ఏప్రిల్ 10 : ఆస్ట్రియా సామ్రాజ్యమునందలి దళిత జాతుల ప్రతినిధులు రోమ్‌న సమావేశమైరి. జెక్, యుగోస్లావ్, పోలిష్, రుమేనియన్ జాతులకు చెందిన ఆ ప్రతినిధులు తమకు జాతీయ, స్వయం నిర్ణయ స్వత్వము కలదని ప్రకటించిరి. వారి జాతీయాశయములకు ఆమోదమును మిత్రరాజ్యములు తెలిపినవి (జూన్ 3).

ఏప్రిల్ 23 : బెల్జియమ్ తీరమున జర్మనుల జలాంతర్గామి స్థావరముగా ఉపయోగపడుచుండిన జీబ్రుగేపై బ్రిటిష్ నౌకాదళము దాడిచేసినది. కాని, ఆశించినంతగ ఫలితము లభింపలేదు. ఇట్టి దాడులనే అక్టోబరు 17 - 20 వరకు మరల బ్రిటిష్‌వారు సాగించి జీబ్రుగేను, ఆ ప్రాంతముననే ఉన్న ఆస్టెండ్ అను వేరొక జలాంతర్గామి స్థావరమును వశపరచుకొనిరి.

మే 7 : కేంద్ర రాజ్యములకు రుమేనియా లొంగి శాంతి సంధి కుదుర్చుకొనినది. దీనివలన బల్గేరియాకు డోబ్రుజా లభించినది. 90 ఏండ్ల కౌలుద్వారా రుమేనియాలోని నూనె బావులపై ఆధిపత్యము జర్మనీకి చేకూరినది.

మే 26 : జార్జియా, ఆర్మీనియా, అజర్‌బైజాన్‌లు స్వాతంత్ర్యమును ప్రకటించినవి.

మే 26 : ఆస్ట్రియా సేనలనుండి పారిపోయి రష్యా వైపున చేరిన లక్షమంది జెక్ సైనికులు వ్లాడివాస్టక్‌నకు తరలింపబడు సమయమున బోల్షివిక్‌లపై తిరుగుబాటు చేసిరి. వోల్గా నదిమీది కొన్ని ప్రముఖ నగరములను, ట్రాన్స్ - సైబీరియన్ రైల్వేమీది కొన్ని స్థావరములను వారు ఆక్రమించిరి. ఆగస్టు 13 న జర్మనీపై వారు యుద్ధము ప్రకటించిరి. అంతట ఆ జెక్‌లను ఒక ప్రత్యేక జాతీయ రాజ్యమునకు చెందినవారుగ బ్రిటన్ (ఆగస్టు 13), యునైటెడ్ స్టేట్స్ (సెప్టెంబరు 3) గుర్తించినవి.

మే 27 – జూన్ 6 : ఆకస్మిక దాడి సాయమున పశ్చిమ రంగపు జర్మను సేనలు ఫ్రెంచి సేనలను వెనుకకు త్రోసి సాయిస్సన్స్‌ను వశపరచుకొని (మే 29), ఆ మరునాటికి పారిస్‌నకు 48 కిలోమీటరుల దూరమున ఉన్న మార్నీ నదిని చేరినవి.

జూన్ 4 : యునైటెడ్‌స్టేట్స్ సేనలును, ఫ్రెంచి సేనలును పశ్చిమ రంగమున జర్మనుల పురోగతిని ఆపగలిగినవి.

జూన్ 15 - 24 : ఆస్ట్రియా సేనలు ఇటలీలోని పియావే ప్రాంతమున పెద్దదాడిని సాగించినవి. కాని, పరాజితములై, లక్ష సైనికులను పోగొట్టుకొనినవి. అంతటనుండి ఆ సేనలలో నిరుత్సాహము తీవ్రగతితో వ్యాపింప ఆరంభించినది.

1918, జూన్ 23 : ప్రాచ్య రంగమున రష్యన్‌లు యుద్ధము నుండి వైదొలగిన పరిస్థితిని చక్కజేసి, అట యుద్ధచర్యలను కొనసాగించుటకు బ్రిటిష్ సేనలు మర్‌మన్‌స్క్ వద్ద ఉత్తర రష్యాలో దిగినవి. యునైటెడ్‌స్టేట్స్ సేనలును ఆ తరువాత అచట చేరినవి (సెప్టెంబరు 4). ఈ సేనలు అచట నుండి

పోవు రైలు మార్గమును, ఆర్కేంజల్ రేవును వశపరచుకొనుటతో ఈ చర్యలు కార్యరూపమున బోల్షివిక్ ప్రభుత్వ ముతో మిత్రరాజ్యములు జరుపు యుద్ధ ముగ పరిణమించినవి.

1918, జూన్ 30: ఇటలీ, ఫ్రాన్స్ దేశములు జెకోస్లోవా కియా స్వాతంత్ర్యమును గుర్తించినవి. వానిని అనుసరించి బ్రిటను (ఆగస్టు 31), యునైటెడ్ స్టేట్స్ (సెప్టెంబరు 3) పరిగణ నను ఇచ్చినవి.

జూలై 15 - ఆగస్టు 7: పారిస్ సమీపమున మార్నె నదిని జర్మ నులు దాటిరి. కాని, యునైటెడ్ స్టేట్స్ సేనల సాయమున ఫ్రెంచి సేనలు జర్మన్ సేనలను నిరోధింపగలిగినవి. కడకు జర్మను సేనలు వెనుకంజవేసినవి. సాయిస్సన్స్ మరల మిత్రరాజ్య సేనల వశమయ్యెను.

జూలై 26: బాకూ లోని బోల్షివిక్ ప్రభుత్వము కూలి పోయినది. బ్రిటిష్ సేనలు అంతట ఆ నగరమును ఆక్రమించినవి (ఆగస్టు 4).

[ప్రపంచయుద్ధము ముగిసిన వెనుక బ్రిటిష్ సేనలు ఈ ప్రాంతమును ఖాళీ చేయుచు, బోల్షివిక్‌లకు వ్యతిరేకమగు ప్రభుత్వమును ఒకదానిని డెనికిన్ సేనాని ఆధ్వర్యవమున ఏర్పరుచుటకు సహకరించి నవి. అంతట బోల్షివిక్‌లు దండెత్తి, డెనికిన్‌ను తరిమి, ఆ ప్రాంతమును వశ పరచుకొనిరి].

ఆగస్టు 3: సైబీరియాలో తిరుగుబాటును సాగించు చున్న జెక్ సైనికులకు సాయము చేయుటకై బ్రిటిష్, జపాన్ సేనలు వ్లాడివాస్టక్‌లో దిగినవి. ఆ తరువాత ఫ్రెంచి, యునైటెడ్ స్టేట్స్ సేనలు వచ్చి చేరినవి. అక్టోబరు 14 నాటికి బ్రిటిష్ సేనలును, జెక్ సేనలును ఇర్‌కుట్స్కు వద్ద కలసికొనినవి.

ఆగస్టు 8-11: పశ్చిమరంగమున అమీన్స్ వద్ద బ్రిటిష్ సేనలు నిండు సన్నాహముతో దాడిని మొదలిడి కొంత ముందునకు పోగలిగినవి.

ఆగస్టు 21 - సెప్టెంబరు 3: సోమీ, అర్రాస్‌ల వద్ద పశ్చిమ రంగమున పోరాటములు. బ్రిటిష్, ఫ్రెంచి సేనలు క్రమముగ పురోగమించినవి. జర్మనులు వెనుకంజవేసి పూర్వపు హిండెన్‌బర్గ్ శ్రేణిని చేరుకొనిరి.

ఆగస్టు 26 - సెప్టెం 14: బాకూవద్ద టర్కీ సేనలతో బ్రిటిష్ సేనలకు తీవ్ర పోరాటములు జరిగినవి. కడకు బాకూను బ్రిటిష్ సేనలు వదలి పోవు టచే, ఆ నగరము తుర్కుల వశమైనది.

సెప్టెం. 12-13: అమెరికా సేనలు పశ్చిమ రంగమున సెయింట్ మిహియెల్ వద్ద దాడిని సాగించి, ఆ ప్రాంతముతో పాటుగ 15,000 శత్రుసైనికులను ఖైదీలుగ వశపరచు కొనినవి.

సెప్టెంబరు 18: పాలస్తీనాలో బ్రిటిష్‌వారి భారీదాడి మొదలైనది. మధ్యధరా సముద్రము వద్ద టర్కీ సేనా శ్రేణులను విచ్ఛిన్నముచేసి, వెనుకకు తరిమివేసి, బ్రిటిష్ సేనలు ఉత్తర దిశకు పురోగమించినవి. అరబ్బుల సేనలు ఇందు బ్రిటిష్‌వారికి చాలా సాయపడినవి. తత్ఫలితముగ డమాస్కస్ (అక్టోబరు 1,2), బీరట్ (అక్టోబరు 7), అలెప్పో (అక్టోబరు 26) మిత్రరాజ్య సేనల వశమైనవి.

సెప్టెంబరు 26 - అక్టోబరు 15: పశ్చిమ రంగమున ఆర్‌గోన్నీ, ఇప్రెస్‌ల వద్ద పోరాటములు తగు సన్నాహములతో తీవ్ర స్థాయిలో సాగినవి. ఇందు కత్తెర వాటపు దాడిని చెరియొక మూల నుండి అమెరికా, బ్రిటిష్ సేనలు సాగించిన ఫలితముగ, ఒక ముఖ్యమగు రైల్వేలైను మిత్రరాజ్యముల వశమై, జర్మను సేనలు వెనుకంజ వేసినవి. ఈ సమయముననే బల్గేరియా లొంగుబాటు సంగతియు జర్మను సేనానులకు తెలియవచ్చి, వారిలో నిరుత్సాహమును పెంపొందించినది. ఇక రాజీ బేరములకు దిగుటతప్ప గత్యంత రము లేదని తమ ప్రభుత్వమునకు వారు వర్తమానమును పంపిరి. అంతట జర్మనీ లోని ప్రాత ప్రభుత్వము కూలిపోయి, వేరొక నూతన ప్రభుత్వము అధికారము లోనికి వచ్చినది. నూతన ప్రధాని సంధికై యత్నము మొదలిడెను.

1918, అక్టో 4: ఆస్ట్రియా, జర్మను ప్రభుత్వములు విజయముపై ఆశలు వదలుకొని శాంతి

సంధికై యునైటెడ్ స్టేట్స్ అధ్యక్షుడగు విల్సన్‌కు అభ్యర్థనలను పంపినవి.

1918, అక్టో 13 : క్రొత్తగా టర్కీ రాజ్యాధిపత్యమును వహించిన సుల్తాన్ మహమ్మద్ - VI శాంతి సంధిని అభ్యర్థించుచు యునైటెడ్ స్టేట్స్ అధ్యక్షునికి సందేశమును పంపెను.

అక్టోబరు 24 - నవంబరు 4 : ఇటాలియన్ సేనలు విట్టోరియో వెనిటో దిక్కునకు పురోగమించి, అప్పటికే ధైర్యము సడలి ఉండిన ఆస్ట్రియా సేనలను చెల్లాచెదరు చేసి, లక్షల కొలదిగ ఖైదీలను పట్టుకొనినవి. ట్రియస్టి (నవంబరు 3), ఫ్యూమ్ (నవంబరు 5) ఇటాలియన్‌ల వశమైనవి.

అక్టోబరు 29 : యుగోస్లావియా స్వతంత్ర రాజ్యముగ ఒక ప్రకటన మూలమున అవతరించినది.

అక్టోబరు 30 : టర్కీ సేనలు లొంగిన ఫలితముగ, ఆ రాజ్యమునకు సంబంధించినంతవరకు యుద్ధవిరమణకు మిత్రరాజ్యములు అంగీకరించినవి. టర్కీ రాజ్యము అంతయు మిత్ర రాజ్యముల అధీనమున సైనిక చర్యలకై ఉంచబడెను.

నవంబరు 3 : జర్మను నౌకాదళమున తిరుగుబాటు మొదలైనది.

నవంబరు 3 : ఆస్ట్రియా లొంగుబాటును అంగీకరించి మిత్రరాజ్యములు దానితో యుద్ధవిరమణను కుదుర్చుకొనినవి. ఆస్ట్రియా నౌకాబలము, కీలకప్రాంతములు మిత్రరాజ్యముల వశమైనవి.

నవంబరు 7 : జెనీవాలో జరిగిన ఒక యుగోస్లావ్ జాతీయుల సమావేశమున క్రోషియా, స్లావేనియాలు సెర్బియా, మాంటెనీగ్రోలతో సంలీనము అగుటకు నిర్ణయము జరిగినది.

నవంబరు 8 : యుద్ధ విరమణను అభ్యర్థించు జర్మను ప్రతినిధి వర్గమును ఫోక్ సేనాని తన రైలుబండి పెట్టెలో కలిసికొనెను. జర్మనీని అతి నికృష్ట స్థితికి దించు షరతులను మిత్ర రాజ్యముల పక్షమున ఫోక్ సేనాని విధించెను.

నవంబరు 9 : జర్మనుదేశపు చక్రవర్తి స్వయముగ పదవీ పరిత్యాగము చేయువిషయమున మంత్రుల అభ్యర్థనను అతడు నిరాకరింపగా జర్మను ప్రభుత్వపు ప్రధానియే చొరవ తీసికొని జర్మను చక్రవర్తి పదవీచ్యుతుని చేసెనని ప్రకటించెను. అంతట జర్మనీ గణరాజ్యముగ ప్రకటితమయ్యెను.

నవంబరు 10 : చక్రవర్తి ఎడల సైన్యపు భక్తిప్రపత్తులు సన్నగిల్లినవని హిండెన్‌బర్గ్ సేనాని మొదలగువారు చెప్పిన మీదట జర్మనీ సామ్రాజ్యపు కైజర్ (చక్రవర్తి) విలియమ్ - II దేశమును వదలి హాలండ్ నకు పోయి తలదాచుకొనెను.

నవంబరు 11 : ఆనాడు ఉదయము 11 గంటలకు పశ్చిమ రంగమున యుద్ధవిరమణ అమలులోనికి వచ్చి జర్మనీ లొంగినది.

నవంబరు 12 : ఆస్ట్రియా దేశపు సార్వభౌముడు పదవీపరిత్యాగము చేసెను. ఆస్ట్రియా గణరాజ్యముగ ప్రకటితమయ్యెను (నవంబరు 13).

నవంబరు 16 : హంగేరీ గణరాజ్యముగ అవతరించినటుల ప్రకటితమయ్యెను.

నవంబరు 18 : విప్లవ వ్యతిరేక ప్రభుత్వము - రష్యాయందు - నౌకాధ్యక్షుడగు కోల్చక్ నియంతృత్వమున నెలకొని సైబీరియాలో అత్యధిక భాగమును, తూర్పు రష్యాలో కొంత భాగమును తన ఆధిపత్యములోనికి తీసికొనిరాగలిగినది. మిత్రరాజ్య సేనలు అంతటనుండి ఈ ప్రభుత్వమునకు సానుభూతి సహకారములను అందజేసినవి.

కాని, ఆ ప్రభుత్వపు సేనలను ప్రపంచ యుద్ధము ముగిసిన వెనుక బోల్షివిక్‌లు ఓడించి 1919 సంవత్సరాంతమునకు తమ ఆధిపత్యమును తూర్పు రష్యా, సైబీరియా దేశములకు వ్యాపింపజేసిరి. అయినను వ్లాడివాస్టక్‌లో తిష్ఠవేసిన జపాన్ సేనలను మాత్రము బోల్షివిక్‌లు కదల్పలేకపోయిరి. తరువాత మిత్రరాజ్యముల ఒత్తిడి ఫలితముగ జపాన్ సేనలు ఖాళీ చేయగ ఆ రేవు నగరము బోల్షివిక్‌ల వశమైనది (1922, అక్టోబరు 25).

1918, నవం 24 : సెర్బులు, క్రోట్‌లు, స్లావ్‌లు కలసిన సంయుక్తరాజ్యము రూపొందినటుల ప్రకటితమైనది. ఆ సంయుక్త రాజ్యములో

చేరుటకు మాంటెనీగ్రో పార్లమెంట్ అంగీకరించినను, రాజు అంగీకరించలేదు. అంతట రాజును పదవీభ్రష్టుని చేసి మాంటెనీగ్రో పై సంయుక్తరాజ్యమున చేరినది (డిసెంబరు, 1). ఆ సంయుక్త రాజ్యమే యుగోస్లావియా.

ప్రథమ ప్రపంచయుద్ధము వలన నష్టములు :

| వరుస సంఖ్య | దేశము పేరు | మరణించిన వారు | గాయపడిన వారు | ఖైదీలు |
|---|---|---|---|---|
| 1. | గ్రేట్ బ్రిటన్ | 9,47,000 | 21,22,000 | 1,92,000 |
| 2. | ఫ్రాన్స్ | 13,85,000 | 30,44,000 | 4,46,000 |
| 3. | రష్యా | 17,00,000 | 49,50,000 | 25,00,000 |
| 4. | ఇటలీ | 4,60,000 | 9,47,000 | 5,30,000 |
| 5. | యునైటెడ్ స్టేట్స్ | 1,15,000 | 2,06,000 | 4,500 |
| 6. | జర్మనీ | 18,08,000 | 42,47,000 | 6.18,000 |
| 7. | ఆస్ట్రియా-హంగేరీ | 12,00,000 | 36,20,000 | 22,00,000 |
| 8. | టర్కీ | 3,25,000 | 4,00,000 | — |

యుద్ధములో మరణించిన మొత్తము జ. సం. 79,40,000
యుద్ధములో గాయపడిన మొత్తము జ. సం. 1,95,36,000
యుద్ధములో పట్టుబడిన ఖైదీల సం. 64,90,000

యుద్ధమునకు ప్రత్యక్షముగా వెచ్చించిన మొత్తము రూ. 9,02,50,00,00,000 అనియు, ఇదిగాక పరోక్షముగా రూ. 7,58,06,25,00,000 వెచ్చింపబడి ఉండుననియు అంచనాలవలన తేల్చబడినది. చీ. శే. రా.

**ప్రపంచ యుద్ధము, ద్వితీయ :** పోలండ్ పై జర్మనీ జరిపిన దండయాత్రతో మొదలై, ఉభయ పక్షములందును తదితర రాజ్యములు పాల్గొనుట మూలమున ప్రపంచ విస్తృతి పొందిన మహాయుద్ధము. ఈ యుద్ధమున పాల్గొనిన రెండు పక్షములలో జర్మనీయు, దాని సహచర రాజ్యములను అక్ష (యాక్సిస్) రాజ్యములు అనియు, వారిని ఎదుర్కొని పోరాడిన వారికి మిత్ర (ఎలైడ్) రాజ్యములు అనియు వ్యవహారనామములు వాడుకలోనికి వచ్చినవి. మిత్రరాజ్యములలో యునైటెడ్ స్టేట్స్ చేరిన తరువాత వానికి ఐక్యరాజ్యములు (యునైటెడ్ నేషన్స్) అను పేరును కలిగినది.

అక్షరాజ్యములందు జర్మనీ, ఇటలీ, జపాన్‌లు ప్రముఖ పాత్ర వహించినవి. యూరప్‌న రుమేనియా, బల్గేరియా, హంగేరీ, ఫిన్లాండ్‌లును, ఆసియాలో థాయిలాండ్‌ను అక్షరాజ్యముల పక్షమున యుద్ధమును ప్రకటించి, అందు పాల్గొనినను, వానికి అందు ప్రాముఖ్యము ఏమియు కలుగలేదు. పైగా యుద్ధపు చరమ దినములలో సోవియట్ రష్యాకు లొంగిన అనంతరమున ఫిన్లాండ్ దేశము జర్మనీపై యుద్ధమును ప్రకటించినది.

మిత్రరాజ్యములలో గ్రేట్‌బ్రిటన్, సోవియట్ రష్యా, యునైటెడ్‌స్టేట్స్, చీనా, ఫ్రాన్స్ దేశములు క్రమముగ ప్రముఖ పాత్రను నిర్వహించినవి. ఇక తక్కిన వానిలో యుద్ధపు తొలుతటి దశయందు పోలండ్, హాలండ్, బెల్జియమ్, నార్వేలు ఈ యుద్ధమున మిత్రరాజ్యముల పక్షమున సముచిత పాత్రను నిర్వహించినవి. యునైటెడ్ స్టేట్స్ ఆ పక్షమున చేరిన తరువాత దక్షిణ అమెరికా రాజ్యములు అన్నియు క్రమముగ అక్షరాజ్యములతో దౌత్య సంబంధములను త్రెంపుకొనినవి. యుద్ధపు చరమ దశలో ఇంకను పెక్కు రాజ్యములు ఐక్యరాజ్యములలో చేరినవి. కాని, ఇవి యుద్ధమున ఏ విధముగను పాల్గొనినవి కావు.

ఈ యుద్ధమున యూరప్‌నందలి పశ్చిమ, ప్రాచ్య భాగములును, ఉత్తర సముద్రప్రాంతములును, ఉత్తర ఆఫ్రికాయు, పశ్చిమ ఆసియాయును, తూర్పు చీనాయును, ఆగ్నేయ ఆసియాయును, పసిఫిక్ మహాసముద్రమును, అందలి ద్వీప సముదాయమును యుద్ధరంగములుగ ఉపకరించినవి.

ఈ యుద్ధమునకు గల కారణములును, అది సాగిన తెన్నులును ఇదివరకే సమీక్షయందు సంగ్రహముగ తెలుపబడినవి [చూ. పు. 156]. ఇట ఆ యుద్ధమునందలి ప్రముఖ సంఘటనల పరంపర తేదీల వారిగా పాఠకుల సౌకర్యార్థము పొందుపరుపబడినది.

1939, సెప్టెం. 1 : జర్మనీ సైన్యములు పోలండ్‌పై దండెత్తినవి.

సెప్టెంబరు 3 : జర్మనీపై గ్రేట్‌బ్రిటన్, ఫ్రాన్స్‌లు యుద్ధమును ప్రకటించినవి. జర్మనీపై నౌకాదిగ్బంధనమును బ్రిటిష్‌ప్రభుత్వము ప్రకటించినది.

సెప్టెంబరు 17 : జర్మను సేనలు అతిత్వరితగమనముతో పోలండ్‌ను ఆక్రమించుట గమనించిన సోవియట్‌రష్యా ముందు జాగ్రతకొరకై తూర్పువనుండి పోలండ్‌పై దండయాత్రను సాగించినది. జర్మను సేనలును, సోవియట్‌రష్యా సేనలును బ్రెస్ట్ - లిటోవస్క్ వద్ద కలసికొనినవి (సెప్టెంబరు 19).

1939, సెప్టెం 27 : వీరోచితముగ పోలిష్ సేనలు ప్రతిఘటించినను ప్రయోజనము లేక బాంబులచే శిథిల

మైన పోలండ్ ముఖ్యనగరము వార్సా జర్మను సేనలకు లొంగినది.

1939, సెప్టెం 28: పోలండ్ విభజనపై జర్మనీ, సోవియట్ రష్యాలు ఒక ఒడంబడికకు వచ్చినవి.

సెప్టెంబరు 29: జర్మనీ, రష్యా ప్రభుత్వములు పోలండ్‌ను విభజించుకొనినవి. డాన్‌జిగ్ నగరమును, పశ్చిమ పోలండ్‌ను మొత్తము 1,88,723 చ. కి. మీ. విస్తీర్ణము కల భూమి జర్మనుల వశమైనది. తూర్పు పోలండ్ (2,09,035 చ. కి. మీ) సోవియట్ రష్యాకు దక్కినది. లిథూనియా, స్లోవాకియాలకు పోలండ్ లోని కొన్ని చిన్న ప్రాంతములు చేజిక్కినవి.

నవంబరు 4: తాటస్థ్య చట్టమునకు తేబడిన ఒక సవరణపై సంతకము చేయుట మూలమున యుద్ధసామగ్రుల విక్రయముపై కల నిషేధమును యునైటెడ్ స్టేట్స్ అధ్యక్షుడు రూజ్‌వెల్ట్ తొలగించెను. అంతటినుండి రొక్కమిచ్చి తీసికొనిపోవు పద్ధతులలో యుద్ధమున పాల్గొను దేశములు యుద్ధ సామగ్రులను యునైటెడ్ స్టేట్స్ నుండి కొనుగోలు చేయుటకు వసతి ఏర్పడినది.

నవంబరు 30: ఫిన్లాండ్ సరిహద్దును సోవియట్ రష్యా సైన్యము అతిక్రమించుటతో ఆ రెండు దేశముల మధ్య యుద్ధము ఆరంభమైనది. ఈ యుద్ధము 1940, మార్చి 12 వరకు సాగినది.

1940 మార్చి 1: మూడు నెలల తీవ్రయుద్ధము తరువాత ఫిన్లాండ్ సేనల రక్షణ శ్రేణిని సోవియట్ రష్యాసేనలు విచ్ఛిన్నము చేసినవి. ఫిన్లాండ్ లొంగి, కరీలియన్ భూసంధిని, వైపురి నగరమును, హాంగో నౌకాశ్రయమును, 41,888 చ. కి. మీ. సమష్టి విస్తీర్ణము కల కొన్ని భూభాగములను సోవియట్ రష్యాకు దత్తము చేసినది.

మార్చి 30: చీనాలోని నాన్‌కింగ్‌లో జపాన్ అదుపాజ్ఞలలో పనిచేయు ఒక చీనీయప్రభుత్వము వాంగ్ చింగ్ - వీ ఆధిపత్యమున స్థాపితమయ్యెను.

ఏప్రిల్ 8: నార్వేదేశపు తీరప్రాంతమున జర్మను నౌకలు చరించకుండ చేయుటకై మందుగనులను నాటితిమని బ్రిటిష్, ఫ్రెంచి ప్రభుత్వములు ప్రకటించినవి.

ఏప్రిల్ 9: జర్మను సాయుధసేనలు డెన్మార్క్‌ను ఆక్రమించి నార్వేపై దాడిని సాగించినవి.

ఏప్రిల్ 20: ఆంగ్లో - ఫ్రెంచి దండయాత్రా బలములు దక్షిణ నార్వేలో దిగినవి. కాని, జర్మను సేనల ఒత్తిడివలన రెండువారముల తరువాత ఉపసంహరించుకొనవలసి వచ్చినది.

ఏప్రిల్ 31: నార్వేలోని డొంబాస్ అను స్థానమును జర్మనులు వశపరచుకొనిరి. అంతలో నార్వేజియన్‌ల ప్రతిఘటనా తీవ్రత విచ్ఛిన్నమైనది. అయినను, జూన్ 10 వరకు పోరాటము అటనట సాగినది. నార్వే రాజగు హాకన్ - VII తన మంత్రివర్గముతో కూడ లండన్‌నకు ప్రవాసము ఏగెను.

మే 10: జర్మనులు బెల్జియమ్, నెదర్‌లండ్స్, లక్జెంబర్గ్ దేశములపై దండయాత్రను సాగించిరి.

మే 10: బ్రిటిష్ ప్రభుత్వపు మంత్రివర్గము రాజీనామా ఇచ్చెను. విన్‌స్టన్ చర్చిల్ [చూ. పు. 447] నాయకత్వమున కన్సర్వేటివ్, లేబర్ పార్టీల సంయుక్త మంత్రివర్గము ఏర్పాటయ్యెను.

మే 11: స్వదేశ రక్షణకై పోరాడు బెల్జియమ్ సేనలతో సహకరించుటకై తమ దండయాత్రా బలములను బెల్జియమ్‌నకు బ్రిటిష్, ఫ్రెంచి ప్రభుత్వములు పంపినవి. బెల్జియన్‌ల రక్షణ కృషిలో కీలకముగ ఉండిన ఎబెన్ ఎమెల్ కోటను జర్మనులు వశపరచుకొనిరి.

మే 13: రాటర్‌డామ్ నగరము జర్మనుల బాంబుల వర్షపుధాటికి ఆగలేక లొంగినది. అంత నెదర్‌లండ్స్ దేశపు రాణియగు విల్‌హెల్మినా లండన్‌లో తలదాచుకొనినది. నెదర్‌లండ్స్ (డచ్చి) సైన్యము జర్మనులకు లొంగినది (మే 14).

1940, మే 17 - 21: జర్మనుల యంత్రాయత్త సేనలు ఉత్తర ఫ్రాన్స్‌లో చాలదూరము చొచ్చుకొనిపోయినవి. బ్రస్సెల్స్‌నగరము పతనమగుటతో బ్రిటిష్, బెల్జియమ్ సేనలు డన్‌కర్క్ వైపునకు తప్పుకొనినవి.

1940, మే 26 : బోలోన్ నగరము జర్మనుల వశమయ్యెను. చెల్లా చెదరైన బెల్జియమ్ సేనలలో ఉత్సాహము సన్నగిల్లినది. బెల్జియమ్ రాజు లియోపాల్డ్ - III తన సేనలను జర్మనులకు లొంగవలసినదిగ ఆదేశించెను.

మే 28 : బెల్జియన్‌ల లొంగుబాటుతో ఇరకాటమున పడిన బ్రిటిష్ దండయాత్రాబలము డన్‌కర్క్ నుండి ఉపసంహరింపబడవలసిన అగత్యము ఏర్పడినది.

జూన్ 4 : డన్‌కర్క్ కోస్తాపై చిక్కుకొనిపోయిన 250 వేల బ్రిటిష్ సైనికులలో 215 వేలను, అక్కడే ఉండిన 120 వేల ఫ్రెంచి సైనికులను అతిప్రయాసమీద నౌకల మూలమున బ్రిటన్‌నకు చేర్చిరి. కాని, ఆయుధములను, వస్తుసామగ్రిని దాదాపుగ అంతటిని వదలివేయవలసి వచ్చినది. బ్రిటిష్ సైన్యబలము 30,000 నష్టమయ్యెను.

జూన్ 5 : డన్‌కర్క్ నుండి బ్రిటిష్ సేనలు ఉపసంహరించబడుటవలన, వెనుకనుండి ప్రమాదము సన్నగిలగ, జర్మను సేనలు సీడన్‌నుండి అబ్బివిల్లీ వరకు చంద్రరేఖాకృతిగ విస్తరించిన ముఖరంగమున విజృంభించినవి.

జూన్ 10 : ఫ్రాన్స్, గ్రేట్ బ్రిటన్ దేశములపై ఇటలీ యుద్ధమును ప్రకటించెను.

జూన్ 10 : ఇటలీ సేనలు దక్షిణ ఫ్రాన్స్‌పై దండెత్తినవి.

జూన్ 13 : జర్మనులు పారిస్ నగరమును ఆక్రమించిరి. ఫ్రెంచి ప్రభుత్వము బోర్డోకు తరలినది. అచట మార్షల్ హెన్రీ - ఫిలిప్పే పెటైన్ నాయకత్వమున నూతన ఫ్రెంచి మంత్రివర్గము ఏర్పడెను. వెన్వెంటనే శాంతి కొరకై పెటైన్ అభ్యర్థించెను (జూన్ 17).

జూన్ 15 : ఫ్రాన్స్‌నందలి వెర్డెన్ కోట జర్మనుల వశమయ్యెను. బాల్టిక్ తీరమున సోవియట్ రష్యా సేనలు ఎస్తోనియా, లాట్వియా, లిథూనియా దేశముల లోనికి చొరబడినవి (జూన్ 15 - 17).

జూన్ 17 : పశ్చిమార్ధగోళమున తమ వశమున ఉండిన ఏ ప్రాంతములనైనను ఒక అమెరికనేతర రాజ్యము వేరొక అమెరికనేతర రాజ్యమునకు హక్కు మార్పిడిని జరుపుటను తాను గుర్తింపజాలనని యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వము ప్రకటించినది.

జూన్ 22 : జర్మను, ఫ్రెంచి (పెటైన్) ప్రభుత్వముల మధ్య యుద్ధవిరమణ జరిగినది. దానిని అనుసరించి ఫ్రెంచి సేనలు నిరాయుధములు చేయబడుటయే కాక, ఫ్రాన్స్ దేశమున ఉత్తరభాగము (దేశము మొత్తమున అయిదింట మూడు వంతులు) జర్మనుల వశమున ఉంచబడెను.

జూన్ 23 : చార్లెస్ డీ గాలీ [చూ - పు. 508] అను ఫ్రెంచి సేనాని లండన్‌లోని ఫ్రెంచి జాతీయ సమితికి అధ్యక్షుడై, జర్మనీపై ఫ్రెంచివారి పోరాటమును సాగించ కృతనిశ్చయతను ప్రకటించెను. డీగాలీని బ్రిటిష్ ప్రభుత్వము బలపరచి, పెటైన్ ప్రభుత్వముతో సంబంధములను విచ్ఛిన్నము చేసికొనినది.

జూన్ 24 : ఫ్రాన్స్, ఇటలీ దేశముల మధ్య యుద్ధవిరమణ కుదుర్చుకొనబడినది.

జూన్ నెల : డన్‌కర్క్ నుంచి పలాయనము మూలమున కలిగిన యుద్ధ సామగ్రి నష్టమును, ఫ్రాన్స్ దేశపు పతనమును, బ్రిటన్ పరిస్థితిని క్లిష్టతరము చేసినవి. అంతట సైనిక సామగ్రిని ఈయవలసినదిగ యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వమును బ్రిటిష్ ప్రధాని చర్చిల్ [చూ - పు. 447] అభ్యర్థించెను. ఆ ప్రభుత్వము అందునకు ఆమోదించి (జూన్ 3), ఆ తరువాత 3 వారములకు 5,00,000 రైఫిల్‌లు, 80,000 మరతుపాకులు, 75 మి. మి. యుద్ధ తుపాకులు 900, వీనికి 13 కోట్ల పర్యాయములు కాల్పులకు పనికివచ్చు మందుగుండు సామగ్రి వగైరాను నౌకల ద్వారా సరఫరా చేసినది.

జూన్ 26 : రుమేనియాలోని బెస్సరేబియా (49,987 చ. కి. మీ) తనకు రావలెనని సోవియట్ రష్యా పట్టుపట్టగ, రుమేనియా లొంగి ఆ ప్రాంతమును వదులుకొనినది (జూన్ 28).

1940, జూలై నెల : ఫ్రాన్స్ పతనానంతరమున ఇంగ్లీష్ ఛానల్‌లోని దీవులను జర్మనులు వశపరచుకొని, బ్రిటిష్ నగరముల మీదను,

రహదారుల మీదను, నౌకల మీదను బాంబు దాడులను సాగించిరి.

1940, జూలై 5 : దక్షిణ ఫ్రాన్సులోని విచీ నగరమున స్థావరము ఏర్పరచుకొనిన పెటైన్ ప్రభుత్వము, అంతకు రెండు రోజుల క్రితము ఫ్రెంచి నౌకలపై బ్రిటిష్ నౌకలు చేసిన దాడికి ప్రతీకారముగ గ్రేట్ బ్రిటన్‌తో సంబంధములను తెగ్రతెంపులు చేసికొనినది.

జూలై 10 : సాముదాయిక (టోటల టేరియన్) విధానపు ప్రభుత్వమును తమ దేశమున నెలకొల్పుటకు ఫ్రెంచి పార్లమెంట్ ఆమోదించి మార్షల్ పెటైన్‌కు నిరంకుశాధికారములను కల్పించెను.

జూలై 20 : రెండు సముద్రము (అట్లాంటిక్, పసిఫిక్) లకు వ్యాపించిన నౌకాదళమును రూపొందించుటకు అధికారమును ఇచ్చు బిల్లుపై యునైటెడ్‌స్టేట్స్ అధ్యక్షుడు రూజ్‌వెల్ట్ [చూ.] సంతకము చేసెను. ఆ దేశము తలపెట్టిన బృహత్తర రక్షణ ప్రణాళికలో ఇది ఒక భాగము.

జూలై 21 : సోవియట్ రష్యాలో చేర్చుకొనబడుటకై లిథూనియా, లాట్వియా, ఎస్తోనియా దేశములు అర్థించి అందుచేరినవి.

ఆగస్టు 6 : తమకు చెందిన తూర్పు ఆఫ్రికా నుండి బయలుదేరిన ఇటలీ సేనలు బ్రిటిష్ సోమాలీలాండ్‌పై దండెత్తి ఆ ప్రాంతమును ఆక్రమించినవి (ఆగస్టు 19).

ఆగస్టు 17 : గ్రేట్‌బ్రిటన్‌ను చుట్టియున్న సముద్ర ప్రాంతమంతయు గాఢ దిగ్బంధనమునకు లోనైనటుల జర్మనీ ప్రకటించెను.

సెప్టెంబరు 3 : గ్రేట్‌బ్రిటన్, యునైటెడ్‌స్టేట్స్ దేశముల మధ్య ఒక ప్రముఖమగు రక్షణ ఒడంబడిక కుదిరినది. దానిని అనుసరించి, బ్రిటన్‌నకు యునైటెడ్‌స్టేట్స్‌నుండి 50 డిస్ట్రాయర్ నౌకలు లభించినవి. ఇందులకు ప్రతిఫలముగ బ్రిటన్‌నకు చెందిన న్యూఫౌండ్‌లాండ్, బెర్మ్యూడా, బహామాదీవులు, జమైకా, ఆంటిగ్వా, సెయింట్ లూసియా, ట్రినిడాడ్, బ్రిటిష్ గయానాదేశములలో 99 సంవత్సరముల కౌలుమీద నౌకా, విమానాశ్రయములు యునైటెడ్‌స్టేట్స్ ప్రభుత్వమునకు లభ్యమైనవి.

సెప్టెంబరు 7 : లండనుపై జర్మనుల బాంబర్లు విపరీతపు దాడులను సాగించినవి. రోజునకు 300-600 వరకు మరణించుటయు, 1000-3000 గాయపడుటయు జరిగినది.

సెప్టెంబరు 11 : యూరప్ ముఖ్య భూ భాగమునందలి రేవులగు ఆంట్‌వెర్ప్, ఆస్టెన్డ్, కెలే, డన్‌కర్క్‌లపై బ్రిటిష్ బాంబర్లు దాడిచేసి జర్మనుల దండయాత్రా సన్నాహములకు భంగము కలిగించినవి.

సెప్టెం. 13-15 : ఉత్తర ఆఫ్రికాలోని లిబియానుండి ఈజిప్టుపై ఇటలీ సేన దండెత్తెను.

సెప్టెంబరు 16 : వాయుమార్గమున రక్షణను సాధించుటకు బ్రిటన్ సాగించిన కృషిఫలితముగ జర్మనుల దాడిలో పాల్గొనిన విమానములు పెక్కు నష్టములుగా మొదలిడినవి. ఆ పరిస్థితులలో ఒక రోజున 185 జర్మను విమానములు ఇంగ్లండు పైన దాడిలో నాశనమైనవి.

సెప్టెంబరు 22 : ఫ్రెంచి వారికి చెందిన ఇండో-చీనాలో మూడు విమానాశ్రయములను, ఇతర సదుపాయములను ఒత్తిడికి లొంగి జపాన్‌నకు దత్తముచేయుటకు విచీ ప్రభుత్వము అంగీకరించినందులకు పర్యవసానముగా ఇండో-చీనాలో జపాన్ సేనలు దిగ మొదలిడినవి.

సెప్టెంబరు 27 : ఇటలీ, జర్మనీ, జపాన్ దేశములు ఒక రాజ్యత్రయపు ఒప్పందమును బెర్లిన్ నగరమున కుదుర్చుకొనినవి. ఇదియే రోమ్-బెర్లిన్-టోక్యో ఒప్పందము అనియు వ్యవహృతమైనది. పది ఏండ్ల వరకు తమ తమ ప్రజల శ్రేయోభివృద్ధి దృష్ట్యా పరస్పరము సాయపడుటకు ఇందు ఏర్పాటు జరిగినది.

1940, అక్టో 11 : రుమేనియా ప్రభుత్వ సేనలకు తగు శిక్షణ ఇచ్చి అచట నూనె బావులను కాపాడు నెపముతో జర్మను సేనలు రుమేనియాలో ప్రవేశించినవి. తత్ఫలితముగ కడకు రుమేనియాపై జర్మనీ నియమనాధికారమును ఆర్జించెను.

1940, అక్టో 28: గ్రీస్ దేశమునందలి కొన్ని స్థావరములను తాను సైనికావసరములకై వాడుకొనదలచితినని ఇటలీ కోరగ, గ్రీస్ నిరాకరించినది. అంతట ఆల్‌బేనియా ద్వారా గ్రీస్‌పై ఇటలీ సేనలు దండయాత్రను సాగించినవి.

అక్టోబరు 30: బ్రిటిష్ సహాయక సేనలు క్రీట్‌నను, ఇతర గ్రీక్ ద్వీపములందును దిగినవి. అప్పటికి అమలులో ఉండిన ఒడంబడికలను అనుసరించి 134 యుద్ధ విమానములను గ్రీస్‌నకు సోవియట్ రష్యా అందజేసెను.

నవంబరు 13: టారంటో రేవులో స్థావరము ఏర్పరచుకొన్న ఇటలీ యుద్ధ నౌకాదళమున దాదాపు సగ భాగమును బ్రిటిష్ బాంబర్లు నాశము చేయుటయో, చెడగొట్టుటయో జరిగినది.

నవంబరు 20: రోమ్ - బెర్లిన్ - టోక్యో ఒప్పందమున హంగేరి చేరినది.

నవంబరు 23: రోమ్ - బెర్లిన్ - టోక్యో ఒప్పందమున రుమేనియా చేరెను.

డిసెంబరు 3: ఇటలీ సేనల శ్రేణిని విచ్ఛిన్నము చేసి గ్రీక్ సేనలు ఆల్‌బేనియాలోనికి చొరబడి 28,000 ఖైదీలను పట్టుకొనినవి. తరువాత 5 దినములకు ఆల్‌బేనియాలో నాలుగవ వంతు భూమి గ్రీక్‌ల వశమైనది. అంతట ఇటలీ సేనలకు సాయముగ జర్మను సేనలు రంగమున దిగినవి.

డిసెంబరు 8: ఉత్తర ఆఫ్రికాలోని ఇటలీ సేనలపై బ్రిటిష్ సేనలు ఆకస్మిక దాడిని మొదలిడినవి. అందు పాల్గొనిన సామ్రాజ్య సేనలు సిద్దిబిరానిని వశపరచుకొని అటనుండి లిబియాపై దండయాత్రను సాగించినవి (డిసెంబరు 12).

1941, జనవరి 5: ఉత్తర ఆఫ్రికాలో బర్దియావద్ద ఇటలీ సేనా నివహము సామ్రాజ్య సేనలకు లొంగినది. 25,000 మంది ఇటలీ సైనికులు ఖైదీలుగ చిక్కిరి.

జనవరి 10: ఇటలీకి తరలింపబడిన జర్మనీ వైమానిక దళములు సిసిలీ ప్రాంతమున సముద్రమున చరించు బ్రిటిష్ నౌకాబలములపై దాడులను మొదలిడెను.

జనవరి 15: ఆంగ్లో - ఈజిప్షన్ సుడాన్ నుండియు, కెన్యా నుండియు బ్రిటిష్ సేనలు ఇటలీకి చెందిన ఎతియోపియాలోనికిని, ఎరిట్రియా లోనికిని చొచ్చుకొని పోయినవి (జనవరి 19).

జనవరి 22: లిబియాలోని టోబ్రూక్ సామ్రాజ్య సేనల వశమైనది. ఫిబ్రవరి 8 కి ఎల్ అగ్గీలా వరకు ఆ సేనలు చేరుకొనినవి. వేవెల్ సేనాని నాయకత్వమున సామ్రాజ్య సేనలు సాధించిన ఈ ప్రగతిలో 1, 14,000 ఇటలీ సైనికులు ఖైదీలుగ చిక్కిరి.

ఫిబ్రవరి 10: రుమేనియాతో దౌత్య సంబంధములను బ్రిటన్ రద్దు చేసికొనెను.

ఫిబ్రవరి 26: ఇటాలియన్ సోమాలీలాండ్ ముఖ్య నగరము మొగదీషియా సామ్రాజ్య సేనల వశమయ్యెను.

మార్చి 1: రోమ్ - బెర్లిన్ - టోక్యో ఒప్పందమున బల్గేరియా చేరినది. సోఫియా నగరమున జర్మను సేనలు ప్రవేశించినవి.

మార్చి 11: అరువు - కౌలు చట్టమును యునైటెడ్ స్టేట్స్ కాంగ్రెస్ ఆమోదించినది. ఏ దేశముల రక్షణ కృషివలన యునైటెడ్ స్టేట్స్‌కు భద్రత చేకూరునని భావింపబడునో వానికి సరకులను, సేనా వసతులను సమకూర్చుటకు అధ్యక్షునికి ఇందువలన అధికారము లభించినది.

మార్చి 25: రోమ్ - బెర్లిన్ - టోక్యో ఒప్పందమున యుగోస్లావియా ప్రభుత్వ ప్రతినిధులు సంతకములు చేసిరి.

మార్చి 27: యుగోస్లావియాలో రీజెంట్ (రాజునకు సంరక్షకుడు) గ ఉండిన పాల్ రాకుమారుడు జర్మనుల పలుకుబడికి లొంగెనను భయమున, ప్రజలచే పదవి నుండి తొలగింపబడగ, పీటర్ - II రాజయ్యెను. అంతట పది దినములకు జర్మనీ సేనలు ఆ దేశముపై దండెత్తి, బెల్‌గ్రేడ్ నగరమును వశపరచుకొనినవి (ఏప్రిల్ 10).

1941, ఏప్రిల్ 3: ఎడారి యుద్ధమున సుశిక్షితులైన జర్మనీ సైనికుల డివిజనులు రోమెల్ సేనాని నాయకత్వమున ఇటలీ సేనలకు సాయము

చేయుటకై లిబియాకు చేరి, సామ్రాజ్య సేనల స్థావరములపై దండయాత్ర మొదలిడినవి. బ్రిటిష్‌వారు తాము అదివరకు వశపరచుకొనిన స్థావరములను వదలుకొని వెనుకకు పోవలసి వచ్చినది. ఇటుల అక్షరాజ్య సేనలు ఈజిప్టు సరిహద్దునకు త్రోసికొని వచ్చినవి (మే 29).

1941, ఏప్రిల్ 6 : ఎతియోపియా రాజధాని అడ్డిస్‌అబాబా బ్రిటిష్ - ఎతియోపియా సేనల వశమయ్యెను. ఎరిట్రియాలో ఇటాలియన్‌ల ప్రతిఘటన జూన్‌మాసమునకు అంతరించినది. 1941 ముగియునాటికి ఇటలీకి చెందిన తూర్పు ఆఫ్రికా అంతయు బ్రిటిష్‌వారి వశమయ్యెను.

ఏప్రిల్ 13 : జపాన్, సోవియట్ రష్యా దేశములు తాటస్థ్య ఒడంబడికను కుదుర్చుకొనినవి.

ఏప్రిల్ 23 : గ్రీక్‌ల ప్రతిఘటన అంతమై యుద్ధ విరమణపై సంతకములు జరిగెను. గ్రీస్ దేశపు రాజగు జార్జి - II క్రీట్ ద్వీపమునకు పారిపోయెను.

ఏప్రిల్ 27 : జర్మనులు ఏతెన్స్ నగరమున ప్రవేశించిరి. అచట బ్రిటిష్ దండయాత్రా బలము 60 వేలలో 40 వేలు క్రీట్‌నకు తరలింపబడిరి. కాని, విలువగల యుద్ధ సామగ్రిని వదలుకొనవలసి వచ్చినది.

మే నెల : జర్మనుల విమానదాడులు తీవ్రతరములై లండను నగరమునకు విపరీత నష్టమును కలిగించినవి. బ్రిటిష్ మ్యూజియమ్, పార్లమెంట్ భవనములు దెబ్బ తినినవి (మే 10); కాని, జూన్ 22 లగాయితు సోవియట్ రష్యాపై జర్మనీ సాగించిన దాడివలన బ్రిటన్‌పై విమానముల దాడి తగ్గినది. అప్పటికే సరాసరిన 5 ఇండ్లలో ఒక ఇల్లు కూలిపోవుటయో లేదా నష్టపడుటయో తటస్థించినది. పెక్కు ఫ్యాక్టరీలును, రహదారీ, నీటి పంపుల మార్గములును దెబ్బ తినుటయు జరిగినది.

మే 2 : అక్షరాజ్యముల ఎడ సుముఖత కలిగిన ఒక ప్రభుత్వము రషీద్ ఆలీ ఆధ్వర్యవమున ఇరాక్‌లో ఏర్పడి, జర్మనుల సాయమును అభ్యర్థింపగ, దానిని అరికట్టుటకై బ్రిటిష్ సేనలు ఇరాక్‌న ప్రవేశించినవి.

మే 20 : జర్మనుల గాలిగుమ్మటపు సేనలు (పేరాట్రూపర్లు) క్రీట్ దీవిపై దండెత్తినవి. అచట రేవులలో ఉన్న బ్రిటిష్ యుద్ధ నౌకలును, డిస్ట్రాయర్‌లును చాలనష్టమునకు లోనైనవి.

మే 31 : ఇరాక్ విమాన భూములను బాంబు చేసి, బాగ్దాదు లోనికి బ్రిటిష్ సేనలు ప్రవేశించుటతో ఇరాక్‌లోని తిరుగుబాటు అంతమైనది.

మే 31 : క్రీట్‌లో మిగిలి ఉండిన బ్రిటిష్ సేనలు సైప్రస్‌కును, ఈజిప్టునకును తరలింపబడినవి.

జూన్ 16 : తమ దేశములోని జర్మను కన్సలేట్ కార్యాలయములను యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వము మూసివేయించినది. ఇందులకు ప్రతీకారముగ తమ దేశములందును, తమ ఆక్రమణలో ఉండిన దేశములందును యునైటెడ్‌స్టేట్స్ ప్రభుత్వపు కన్సలేట్ కార్యాలయములను ఇటలీ, జర్మనీ ప్రభుత్వములు మూసివేయించినవి.

జూన్ 22 : సోవియట్ రష్యాపై జర్మనీ సేనలు దండయాత్ర సాగించినవి. తెల్లసముద్రము మొదలు నల్ల సముద్రము వరకు 3,200 కి. మీ. నిడివిగల ముఖరంగమున ఈ దండయాత్ర విస్తరించినది. జర్మనులతో పాటుగ వారి సహచర రాజ్యములగు ఇటలీ, రుమేనియా, హంగేరీ, ఫిన్లాండ్ దేశముల సేనలును ఇందు పాల్గొనినవి. మొత్తము దండయాత్రా బలము 30 లక్షలకు మించినదని అంచనా. సోవియట్ రష్యాకు అప్పటిలో 20 లక్షల పోరాటపు సైన్యము ఉండినదనియు, దానిని నిరవధికముగ పెంచుకొనుటకు అవకాశములు కలవనియు అభిజ్ఞులు లెక్కించిరి. గ్రేట్ బ్రిటన్ తన యావచ్ఛక్తి కొలది సోవియట్ రష్యాకు సాయపడగలదని ప్రధాని విన్‌స్టన్ చర్చిల్ వాగ్దానము చేసెను.

1941, జూన్ 23 : ఫ్రెంచివారి ఇండో - చీనాపై తమకు నియమనాధికారము కావలయునను

జపాన్ ప్రభుత్వపు కోరికకు తమ ఆమోదము లభించినదని విచీప్రభుత్వము ప్రకటించెను.

1941, జూలై 1-2: లాట్వియా రాజధాని రీగానగరము జర్మనుల వశమయ్యెను. విపరీత నష్టముతో సోవియట్ రష్యా సేనలు తిరోగమించెను.

జూలై 12: సిరియాను బ్రిటిష్ సేనలును, స్వతంత్ర ఫ్రెంచి సేనలును కలసి ఆక్రమించెను. లెబనాన్ తీరమున బ్రిటిష్ సేనలు దిగినవి. ఇంతటితో పశ్చిమ ఆసియాలో విచీప్రభుత్వపు పలుకుబడి అంతరించినది.

జూలై 13: గ్రేట్ బ్రిటన్, సోవియట్ రష్యా దేశములు పరస్పర సహాయ సంధిని కుదుర్చుకొనినవి.

ఆగస్టు 14: అట్లాంటిక్ ప్రణాళిక [చూ - పు. 263] రూపొందినది. అధ్యక్షుడు రూజ్‌వెల్ట్, ప్రధాని చర్చిల్ తమ శాంతి సాధనోద్దేశములను ఈప్రణాళికయందు వెలువరించిరి.

ఆగస్టు 19: నేపియర్ నదికి పశ్చిమమున ఉన్న ఉక్రెయిన్‌లో ఒడెస్సా తప్ప తక్కిన ప్రాంతము జర్మనుల అధీనమునకు లోనయ్యెను.

ఆగస్టు 24: జపాన్‌తో యుద్ధమునకు యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వము దిగవలసి వచ్చునెడల ఆ ప్రభుత్వమునకు బ్రిటన్ సంపూర్ణ సహకారము ఈయగలదని చర్చిల్ హామీ ఇచ్చెను.

ఆగస్టు 25-29: ఇరాన్‌పై బ్రిటిష్, సోవియట్ రష్యా సైన్యములు దండెత్తి తమకు సహకరింపగల నూతన ప్రభుత్వమును అచట నెలకొలిపినవి. ఆ దేశపాలకుడు రిజాషా పదవీ పరిత్యాగము చేసెను (సెప్టెంబరు 16). అతని కుమారుడు మహమ్మద్ రిజా పహ్లావీ రాజయ్యెను.

సెప్టెంబరు 4: లెనిన్‌గ్రాడ్ ముట్టడిని జర్మనులు ఆరంభించిరి. ఈ ముట్టడి 1943, జనవరి వరకు సాగి విఫలత చెందినది.

సెప్టెంబరు 19: కీవ్, పోల్‌టావాప్రాంతములు అక్షరాజ్యసేనల వశమైనవి. అటనుండి పురోగమించిన ఆ సేనలు అక్టోబరు అంతమునకు ముఖరంగపు దక్షిణదిశన క్రిమియాలో ప్రవేశించినవి. ఉత్తర దిశన మాస్కోముట్టడిని ఆరంభించినవి. సోవియట్ రష్యా ప్రభుత్వము తమ ప్రభుత్వకేంద్రమును కుయిబిషేవ్‌కు తరలించినది.

సెప్టెంబరు 24: 15 ప్రభుత్వములు (ఇందులో 9 ప్రవాస ప్రభుత్వములు) అట్లాంటిక్ ప్రణాళికను బలపరచినవి. ఇవి: ఆస్ట్రేలియా, బెల్జియమ్, కెనడా, జెకోస్లోవాకియా, స్వతంత్ర ఫ్రెంచి, గ్రేట్ బ్రిటన్, గ్రీస్, లక్జెంబర్గ్, నెదర్లండ్స్, న్యూజీలండ్, నార్వే, పోలండ్, సోవియట్ రష్యా, దక్షిణ ఆఫ్రికా, యుగోస్లావియా.

అక్టోబరు 1: రష్యాతో తక్కిన మిత్రరాజ్యములకు యుద్ధకాలమున కుదిరిన మొదటి ఒడంబడికపై మాస్కోలో సంతకములు జరిగినవి. అటనుండి 9 నెలల పర్యంతము యుద్ధనిర్వహణకై రష్యాకు కావలసిన సామగ్రిని సరఫరా చేయుటకు గ్రేట్ బ్రిటన్, యునైటెడ్ స్టేట్స్ ఇందుమూలమున అంగీకరించినవి. తమ సరఫరాలను కొనుగోలు చేయుటకు అనువుగ సోవియట్ రష్యాకు వేయికోట్ల డాలర్ల పరపతిని యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వము కలుగజేసినది (అక్టోబరు 30). ఆ తరువాత విస్తృతపు అరువుకౌలు ఒడంబడిక (1942, జూన్ 11) వలన ఈ సహాయము కొనసాగింపబడినది.

నవంబరు 6: సోవియట్ రష్యాకు నూరుకోట్ల డాలర్ల విలువగల అరువుకౌలు పరపతిని యునైటెడ్ స్టేట్స్ కలుగజేసినది.

నవంబరు 15: సెవాస్టపోల్ ముట్టడి ఆరంభమైనది. వీరోచిత రీతిలో సోవియట్ రష్యా సేనలు ముట్టడిని ఎదుర్కొనినవి.

నవంబరు 16: జర్మనీ సేనలు కెర్చ్‌ను వశపరచుకొనినవి.

నవంబరు 24: అక్షరాజ్యముల చేతిలో డచ్చి గయానా చిక్కునను భయమున ఆ ప్రదేశమునకు యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వము తన సేనలను పంపెను.

నవంబరు 25: రోమ్ - బెర్లిన్ - టోక్యో ఒప్పందమున బల్గేరియా చేరినది.

1941, నవం 26: లెబనాన్‌ను స్వతంత్ర రాజ్యముగ ఆ దేశపు ప్రభుత్వము ప్రకటించినది.

**1941, నవం 29 :** జపాన్ దేశపు ప్రధానమంత్రియగు హిడెకి టోజో ప్రాచ్యదేశములందు గ్రేట్ బ్రిటన్, యునైటెడ్ స్టేట్స్ దేశముల పలుకుబడిని అంతరింపజేయవలసి ఉన్నదని ఉద్ఘాటించెను.

డిసెంబరు 1 : సోవియట్ రష్యా సేనలు ఎదురు దాడిని మొదలిడి రష్టావ్‌ను వశపరచుకొనినవి. ఇటుల సాగిన ఎదురు దాడులవలన మాస్కో మీద జర్మనుల ఒత్తిడి తగ్గినది (డిసెంబరు 6).

డిసెంబరు 2 : ఇండో - చీనాయందు చేరుటలో జపాన్‌నకు గల ఉద్దేశములను స్పష్టముగ నిర్వచించవలసినదిగా ప్రెసిడెంట్ రూజ్‌వెల్ట్ కోరెను. అంతేకాక, శాంతి సంరక్షణకై సాయపడవలసినదిగ జపాన్ సార్వభౌమునికి ఆయన ఒక అభ్యర్థనను పంపెను.

డిసెంబరు 7 : హవాయీ (పెరల్ హార్బర్), ఫిలిప్పీన్స్, గ్వామ్, మిడ్‌వే దీవి, హాంగ్‌కాంగ్, మలయా దేశములపై ఆకస్మిక దాడులను సాగించి, జపాన్ యుద్ధచర్యలను మొదలిడెను.

డిసెంబరు 8 : జపాన్‌తో యుద్ధపరిస్థితి ఏర్పడెనని యునైటెడ్ స్టేట్స్ కాంగ్రెస్ ప్రకటించినది. గ్రేట్ బ్రిటన్ జపాన్‌పై యుద్ధప్రకటన చేసినది.

డిసెంబరు 10 : బ్రిటన్‌కు చెందిన యుద్ధనౌకలు - ప్రిన్స్ ఆవ్ వేల్స్, రిపల్స్ అను పేరులు కలవి - మలయాతీరమున జపాన్ విమానముల దాడివలన ముంచబడినవి.

డిసెంబరు 11 : యునైటెడ్ స్టేట్స్‌పై జర్మనీ, ఇటలీ దేశములు యుద్ధప్రకటన చేసినవి.

డిసెంబరు 11 : బ్రిటిష్ సేనలు తిరిగి సమాయత్తములై లిబియాపై రెండవ దండయాత్రను ఆరంభించినవి. రోమెల్ సేనానికి మాతృదేశమునుండి సరఫరాలు అందకపోవుటవలన అతడు క్రమముగ ఎల్ అగ్గీలియా వద్దకు తిరోగమించవలసి వచ్చినది.

డిసెంబరు 21 : థాయిలాండ్ - జపాన్ దేశముల మధ్య దశవర్ష మైత్రీ సంధిపై బాంగ్‌కాక్‌లో సంతకములు జరిగినవి. తరువాత ఒక నెలకు (1942, జనవరి 15), గ్రేట్ బ్రిటన్, యునైటెడ్ స్టేట్స్ దేశములపై థాయిలాండ్ యుద్ధము ప్రకటించినది.

డిసెంబరు 25 : హాంగ్‌కాంగ్‌లోని బ్రిటిష్ సేనలు జపాన్ సేనలకు లొంగినవి.

**1942, జనవరి 2 :** ఫిలిప్పీన్‌లోని మనీలా, కవిటే ప్రాంతములు జపానీయుల వశమైనవి. కాని, అచట బాటాన్ ద్వీపకల్పమున మాత్రము కాలు నిలువద్రొక్కుకొని యునైటెడ్ స్టేట్స్, ఫిలిప్పీన్ దేశముల సేనలు ఏప్రిల్ 9 వరకు జపానీయులను ప్రతిఘటించినవి. కడకు మే 6 కు మనీలా అఖాతమందలి కొరిజైడర్ దుర్గము జపాన్ సేనల వశమైనంతట అచట మిత్రరాజ్య సేనల ప్రతిఘటన అంతరించినది.

జనవరి 11 : నెదర్‌లండ్స్‌కు చెందిన ఈస్ట్ ఇండీస్ (ఇండోనీషియా) ను జపాన్ సేనలు ఆక్రమింప మొదలిడినవి.

జనవరి 20 : రష్యా సేనలు తమ శీతకాలపు ఎదురు దాడిని ఉద్ధృతము చేసినవి. క్రమక్రమముగ వివిధ స్థావరములను ఆక్రమించుచు ఖార్‌కోవ్ వరకు ఆ పురోగతి సాగినది.

జనవరి 21 : అమెరికాయందలి 21 గణరాజ్యముల ప్రతినిధులును రియో డి జనీరో నగరమున సమావేశమై అక్షరాజ్యములతో సంబంధములను తెగత్రెంపులు చేసికొనుటకు ఏకగ్రీవముగ అంగీకరించినవి.

జనవరి 29 : సోవియట్ రష్యా, గ్రేట్ బ్రిటన్ దేశములు ఇరాన్ స్వాతంత్ర్యమును, ప్రాదేశిక సమగ్రతను, సర్వసత్తాకతను మన్నించుటకు అంగీకరించినవి.

జనవరి 31 : ఎతియోపియా దేశపు స్వాతంత్ర్యమును గ్రేట్ బ్రిటన్ గుర్తించినది.

ఫిబ్రవరి 1 : నార్వేలోని జర్మను కమీషనర్ ఆ దేశపు పాలనకై విడ్‌కున్ క్విస్లింగ్ అను నార్వే వాసిని సచివాధ్యక్షునిగ నియమించెను. ఇతడు రాజ్యాంగమును రద్దుచేసి నియంత అయ్యెను (ఫిబ్రవరి 7).

**1942, ఫిబ్ర 15 :** జపాన్ సేనలు మలయాలో చొరబారి, అటనుండి సింగపూర్‌ను మెట్ట మార్గమున ఉత్తర దిశనుండి వచ్చి వశపరచుకొనినవి. అచట 60,000 మంది మిత్రరాజ్య

సైనికులు జపాన్ వారికి ఖైదీలుగ చిక్కిరి.

1942, ఫిబ్ర 27 } మార్చి 1 } జావా సముద్రమున నౌకా యుద్ధము. మిత్రరాజ్యముల నౌకా విభాగములు పెక్కు నాశనమైనవి. ఇందుమూలమున ఈస్ట్ ఇండీస్‌లో జపాన్ పురోగతి అతి సులభమైనది. బటేవియా నగరము మార్చి 6 న జపానీయుల వశమయ్యెను.

మార్చి 7: బ్రిటిష్‌వారు రంగూన్‌ను ఖాళీ చేసిరి. అంతట జపానీయులు బర్మాను అతి త్వరిత గతిలో ఆక్రమించిరి.

మార్చి 8: జపాన్ సేనలు బర్మాలోని రంగూన్‌ను ఆక్రమించినవి.

మార్చి 9: ఇండోనీషియా అంతయు అప్పటికి జపానీయుల వశమైనది. తైమర్ దీవియు అప్పటికి వారికి చేజిక్కినది (ఫిబ్రవరి 20). ఆస్ట్రేలియాకు ప్రమాదము కలుగునను భయము ఏర్పడినది. మిత్రరాజ్య సేనలకు ఆగ్నేయ పసిఫిక్ ప్రాంతపు సర్వసేనాపతిగ డగ్లస్ మెక్ ఆర్థర్ సేనాని నియమితుడయ్యెను.

మే 5: మడగాస్కర్‌లో జపాన్ సేనలు దిగగలవను భయముతో ముందు జాగ్రత కొరకై బ్రిటిష్ సేనలు అచట దిగినవి. నవంబరు 5 నకు అచటి విచీ సేనలు లొంగినవి.

మే 7: కోరల్ సముద్రమున నౌకా సంగ్రామము. మిత్రరాజ్యముల నౌకా, వైమానిక బలముల సమష్టి కృషివలన ఈ సంగ్రామమున జపానీయులకు 1,00,000 మెట్రిక్ టన్నుల ప్రమాణము గల నౌకా సమూహము నష్టమైనది. ఇంతటితో ఆస్ట్రేలియాకు జపాన్ దాడిబెడద తగ్గినది.

మే 26: సోవియట్ రష్యా, బ్రిటన్ దేశముల మధ్య ఇరువది ఏండ్ల పరస్పర సాహాయ్య సంధి కుదుర్చుకొనబడినది.

మే 27: అక్షరాజ్యములు రెండవ సారిగ లిబియాలో పురోగతిని సాగించినవి. ఈ తీవ్ర పురోగతిలో అలెగ్జాండ్రియాకు 112 కి. మీ. పశ్చిమమున ఉన్న ఎల్ అలామీన్‌ను అక్షరాజ్య సేనలు చేరువరకు బ్రిటిష్ సేనలు వానిని నిరోధించలేక పోయినవి (జూన్ 11); తరువాత నాలుగు నెలలు ఉభయ శ్రేణులు స్థిరముగ నిలిచి ఉండినవి.

జూన్ 4-7: మిడ్‌వే దీవిపై జపాన్ నౌకాబలము దాడి సలిపినది. కాని, యునైటెడ్ స్టేట్స్ నౌకాబలము దానిని త్రిప్పికొట్టి తీవ్ర నష్టమును కలిగించినది.

జూన్ 12: అల్యూషన్ దీవులలోని అట్టూ దీవిని జపానీయులు ఆక్రమించిరి. తరువాత కిస్కా దీవియు ఆక్రమితమైనది. ఇంతటితో జపాన్ తన దండయాత్ర ప్రగతిలో అత్యుచ్చస్థానమును అందుకొనినది. అటులే జర్మనీయు ఆ సమయముననే కాకసస్ ప్రాంతపు నూనెగనుల ప్రాంతమునకు త్రోసికొనివచ్చి తన విజయయాత్రలో పరాకోటిని చేరుకొనినది. అంతటినుండి ఈ ఉభయ దేశములకును పతనము మొదలైనది.

జూలై 2: జర్మనుల గ్రీష్మకాలపు దాడి మొదలై, సెవాస్టపోల్ వారి వశమైనది. అప్పటికి 8 నెలలకాలము ఆ నగరపు ముట్టడి సాగినది.

ఆగస్టు 7: సాలమన్ దీవులలో యునైటెడ్ స్టేట్స్ నౌకాసేనలు దిగినవి. తులగీ ద్వీపమును, గ్వడల్‌కనాల్‌లోని జపాన్ వైమానికాశ్రయములును వాని వశమైనవి.

ఆగస్టు 9: మైకాప్ జర్మనుల వశమయ్యెను. అంతట వారు డాన్‌నదిని దాటి (ఆగస్టు 20) స్టాలిన్‌గ్రాడ్‌పైకి పురోగమించిరి. రహదారీ కేంద్రముగను, ముఖ్యముగా కాస్పియన్ ప్రాంతమునుండి సోవియట్ రష్యాకు పెట్రోలియమ్ చేరు కీలక స్థావరముగను పేరొందిన ఆ నగరమును వశపరచుకొనిన తమకు పెట్రోలియమ్ విరివిగ లభించుటతోపాటుగ సోవియట్ రష్యా యుద్ధకృషిలో తీవ్ర విపర్యయమును కలిగించవచ్చునని జర్మనులు ఆసించిరి.

1942, ఆగస్టు 30: లగ్జెంబర్గ్ రాజ్యము జర్మనీలో విలీనమైనటుల జర్మనీ ప్రభుత్వము ప్రకటించినది.

దీనిని ప్రతిఘటించుటకై సమ్మె సాగించిన లగ్జెంబర్గ్ కార్మికులలో పలువురు జర్మనుల తుపాకులకు బలియైరి.

1942, సెప్టెం 1: కెర్చ్ జలసంధిని జర్మనీ సేనలు దాటినవి. నొవొరోసియాస్క్ నగరము వారి వశమైనది (సెప్టెంబరు 6). ఒక వారము రోజుల తరువాత స్టాలిన్‌గ్రాడ్ నగరమున పెక్కు ప్రాంతములలోనికి జర్మనులు చొరబడ గలిగిరి (సెప్టెంబరు 14). ఈ విధముగ జర్మనుల గ్రీష్మఋతు దండయాత్ర సఫలతను పొందినటుల కన్పట్టినను, అప్పటికే వారి సేనాశ్రేణి విపరీతముగ ముందునకు త్రోసికొని వచ్చి సువ్యవస్థతను కోల్పోయినది. ఆ అవకాశమును ఉపయోగించుకొనుటకై స్టాలిన్‌గ్రాడ్‌కు ఈశాన్యమున రష్యన్‌లు ఎదురు దాడిని సాగించిరి (సెప్టెంబరు 21). ఆ తరువాత 10 దినములకు (అక్టోబరు 1) ఆ నగరపు ఆగ్నేయ దిశనుండి సోవియట్ రష్యా సేనల ఎదురుదాడులు మొదలయ్యెను.

సెప్టెంబరు నెల: ఉక్రెయిన్ ప్రాంతములును, ఉత్తర కాకసస్ భూములును జర్మనులకు చిక్కుటవలన రష్యాలో ఆహార వస్తువులకు కాటకము ఏర్పడెను. దీనినుండి ఆ దేశమును రక్షించుటకై ఈ నెల మొదలుగ ఆహార వస్తువులను సోవియట్ రష్యాకు విరివిగ యునైటెడ్ స్టేట్స్ ఎగుమతి చేసినది. ఈ విధముగ జూలై, 1943 నాటికి మొత్తముమీద 15 లక్షల టన్నుల ఆహార ద్రవ్యములు సోవియట్ రష్యాకు చేరినవి.

అక్టోబరు 1: ఉత్తర స్లొవీనియా రాష్ట్రము జర్మనీ రాజ్యమున విలీనమైనటుల జర్మను ప్రభుత్వము ప్రకటించినది. అచట ప్రజలకు జర్మను పౌరస్వత్వములు ఈయబడినవి.

అక్టోబరు 23: ఉత్తర ఆఫ్రికాలో మూడవసారి బ్రిటిష్ సేనలు తమ దాడిని మొదలిడినవి. బ్రిటిష్ వారి 8 వ సేన ఎల్ అలామీన్ వద్ద అక్షరాజ్య సేనలను ఓడించి ఈజిప్టునుండి రోమెల్ సేనాని సేనలు వైదొలగునటుల చేయగలిగినది (నవంబరు 12).

నవంబరు 8: ఉత్తర ఆఫ్రికాలో యునైటెడ్ స్టేట్స్ సేనలు దిగినవి.

నవంబరు 11: ఉత్తర ఆఫ్రికాలో యునైటెడ్ స్టేట్స్ సేనలు దిగినందులకు ప్రతీకారముగా అప్పటికి అనాక్రమితమై, విచీ ప్రభుత్వము వశమున ఉన్న ఫ్రాన్స్ దేశపు దక్షిణభాగమును జర్మనులు వశపరచుకొనిరి. తౌలాన్ రేవులోని ఫ్రెంచి నౌకాదళమును జర్మనులు వశపరచుకొన యత్నించుట తెలియవచ్చి, ఆ నౌకలలో పనిచేయు ఫ్రెంచివారే వానిని ముంచివేసిరి.

నవంబరు 19: స్టాలిన్‌గ్రాడ్ ప్రాంతపు జర్మనీ సేనలు నిలద్రొక్కుకొను అవకాశము వానికి లభించకుండ చీకాకు పరచుచు, ఈశాన్య, ఆగ్నేయముల నుండి తమ కత్తెర దాడిని రష్యన్‌లు తీవ్రతరము చేయుటయే కాక, రజోవ్, ఖార్‌కోవ్ వైపులకు క్రొత్త దండయాత్రలను (నవంబరు 25, డిసెంబరు 16) సాగించిరి.

డిసెంబరు 1: ఉత్తర ఆఫ్రికాలోని ఫ్రెంచి పాలిత ప్రాంతములపై - బ్రిటిష్, యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వముల ఆమోదముతో అడ్మిరల్ జీన్ - ఫ్రాంకోయిస్ డార్లాన్ అధికారమును గ్రహించెను. కాని, ఆ తరువాత 3 వారములకే అతడు హత్య చేయబడెను (డిసెంబరు 24).

1943, జన 1-18: జర్మనులకు పరాజయములు ఒకదాని వెనుక ఒకటి సంఘటిల్లి వారి పరిస్థితి కల్లోలము చెందినది. రష్యన్‌లు లెనిన్‌గ్రాడ్‌నకు చేరుకొని, దానిని అప్పటికి 17 నెలల నుండియు ముట్టడించి ఉండిన జర్మనీ సేనలను పారద్రోలిరి. స్టాలిన్‌గ్రాడ్ వద్ద చిక్కుకొని పోయిన 22 జర్మను డివిజనులలో చచ్చినవారు పోను మిగిలిన 80,000 మంది సైనికులు రష్యన్‌లకు లొంగిరి (ఫిబ్రవరి 2). అంతటనుండి రష్యన్‌ల శీతకాలపు దాడి అతి తీవ్ర గతిలో ముందునకు సాగినది. మార్చి 12 కు

ఖార్కోవ్, రజోవ్, వ్యాస్మాలు వారి వశమైనవి. జర్మను నిహతులయు, ఖైదీలయు మొత్తపు సంఖ్య 5 లక్షలను దాటెను.

1943, జన 14-24: కాసాబ్లాంకా సమావేశము. యునైటెడ్ స్టేట్స్ అధ్యక్షుడు రూజ్‌వెల్ట్, బ్రిటిష్ ప్రభుత్వ ప్రధాని చర్చిల్ మొరాకోలోని కాసాబ్లాంకా రేవునగరమున 10 దినముల సమావేశము జరిపిరి. అక్షరాజ్యముల నుండి బేషరతు లొంగుబాటును సాధించుటకై 1943 నుండి మిత్ర రాజ్యములు దండయాత్ర సాగింపగలరని ఆ సమావేశాంతమున వారు ప్రకటించిరి (జనవరి 27).

జనవరి 24: బ్రిటిష్‌వారి ఎనిమిదవ సేన ట్రిపొలీని ఆక్రమించి, పారిపోవుచున్న అక్షరాజ్య సేనలను టూనీషియాలోనికి తరుముకొని పోయినవి.

ఫిబ్రవరి 6: ఇటలీ నియంత ముస్సోలినీ [చూ.] తన మంత్రివర్గములోని 11 మంది సభ్యులను బర్తరఫ్ చేయుటయే కాక విదేశ వ్యవహార శాఖను తానే గ్రహించెను.

ఫిబ్రవరి 7: ఉత్తర ఆఫ్రికాలో మిత్రరాజ్యముల యుద్ధ చర్యలను ఏకోన్ముఖము చేయుటకు ఐసెన్ హోవర్ [చూ. పు. 363] సర్వసేనానిగా నియుక్తుడయ్యెను.

మార్చి 15: అడ్మిరల్ డార్లాన్ మరణాంతరమున ఉత్తర ఆఫ్రికాలోని ఫ్రెంచి ప్రభుత్వమునకు ఆధిపత్యమును వహించిన హెన్రీ గిరా, 1940 లగాయితు 'విచీ' ప్రభుత్వము చేసిన శాసనములు అన్నియు ఫలశూన్యములుగ ప్రకటించి, విజయానంతరమున ఫ్రాన్స్ దేశపు స్వయంనిర్ణయాధికారము పునరుద్ధరితము కాగలదని వాగ్దానము చేసెను.

మార్చి 15: గత శీతకాలపు రష్యా దాడికి దెబ్బతినినప్పటికిని, జర్మనులు వసంత ఋతువున మరల ముందునకు పోనారంభించి ఖార్కోవ్‌ను మరల రష్యన్లనుండి వశపరచుకొనగలిగిరి. అంతటితో రష్యన్ల ధాటి తాత్కాలికముగ అరికట్టబడుటతో పాటుగ, ఉభయశ్రేణులును, ఎక్కువ మార్పులు లేకుండ నిలిచిపోయినవి.

మార్చి 30: బ్రిటిష్‌వారి 8వ సేన దక్షిణ టూనీషియాలోని అక్షరాజ్యసైనికశ్రేణిని విచ్ఛిన్నము చేసి, అల్జీరియానుంచి తూర్పునకు - టూనీషియాలోనికి-వచ్చుచుండిన యునైటెడ్ స్టేట్స్ సేనలను కలసికొనినవి.

మే 8 - 12: ఉత్తర ఆఫ్రికాలోని అక్షరాజ్య సేనల ప్రతిఘటన అంతరించినది.

మే 23: మూడవ ఇంటర్నేషనల్ [చూ. పు. 311] రద్దయినదని మాస్కోలో ప్రకటింపబడినది. అంతటినుండి ఆయా దేశములకమ్యూనిస్ట్ పక్షములు తమ ఇచ్ఛవచ్చినట్టుగ ఒక కేంద్ర సంస్థ ఆదేశముతో నిమిత్తము లేకుండ వ్యవహరించగలవని ఆ ప్రకటనలో ఉద్ఘాటించబడినది.

మే 24: చార్లెస్ డిగాలీ, హెన్రీ గిరాల సంయుక్త నాయకత్వమున ఫ్రెంచి జాతీయ విమోచనాసమితి రూపొందింపబడినది. అక్షరాజ్యములను ఎదుర్కొని పోరాడు మిత్రరాజ్యములకు అండగ నిలుచుటకు ఆ సమితి కృతనిశ్చయతను తెలియజేసెను.

1943, జూలై: గ్రేట్‌బ్రిటన్, యునైటెడ్‌స్టేట్స్ దేశములనుండి లభించిన వస్తుసహాయము వలన సోవియట్ రష్యా బలము 1943 లో దండయాత్రలకు సర్వసన్నద్ధమైనది. సోవియట్ రష్యా ఆయుధ కర్మాగారములకు పారిశ్రామిక యంత్రసామగ్రిని, నౌకలకు కొలదిగ ఉక్కును పంపుటయే కాక, 4,100 విమానములను, 1,38,000 మోటారుబండ్లను సోవియట్ రష్యాకు యునైటెడ్‌స్టేట్స్ అందజేసినది.

సర్వసన్నాహములను పూర్తి చేసికొని సోవియట్ రష్యా సేనలు తమ గ్రీష్మఋతు దండయాత్రను 1943 లో సాగించినవి. అప్పటికి జర్మనీకి, వాని సహచర రాజ్యములకును కలసి 240 - 260 డివిజనుల సేన మాత్రమే ఉండినది. సోవియట్ రష్యాకు 250 - 275 డివిజనుల వరకు సేనాబలము పెరిగినది. వస్తుసామగ్రియందు సోవియట్ రష్యాదే పైచేయి అయినది. దీనికితోడుగ జర్మను పారిశ్రామిక స్థావరములపై ఆంగ్లో - అమెరికన్ వైమానికదళములు సాగించిన దాడులవలన జర్మనీయందు విమానముల

నిర్మాణము మందగించినది. ఇందువలన అంతవరకు జర్మనుల యుద్ధతంత్రమున సహాయకారిగా ఉపకరించిన టాంకు - విమానముల సమన్వయపు నడకకు భంగము ఏర్పడెను. సోవియట్ రష్యాయందు ఫ్యాక్టరీలలో ఉత్పత్తికి తోడుగ, యునైటెడ్ స్టేట్స్ పంపినవియు కలసి మొత్తము మీద సోవియట్ రష్యా విమానబలము పెచ్చుపెరిగెను.

1943, జూలై 1: దక్షిణ పసిఫిక్‌న లెస్సగ సమాయత్తమైన మిత్రరాజ్యసేనలు దాడిని మొదలిడి క్రమముగ డిసెంబరు 31 నాటికి రెండోవా, సాలామువా, న్యూజార్జియా, ఫిన్ షే వెన్, బోగన్ విల్లి, గిల్‌బర్ట్ దీవులను వశ పరచుకొనినవి.

జూలై 10: యునైటెడ్ స్టేట్స్, బ్రిటన్, కెనడా దేశములకు చెందిన సేనలు ఐసెన్ హోవర్ సేనాని నాయకత్వమున సిసిలీ ద్వీపముపై దండెత్తినవి. ఈ సేనలను ఆఫ్రికానుండి తరలించుటకు 2,000 పైగా నౌకలు ఉపయోగింపబడినవి.

జూలై 26: ఇటలీలో బెనిటో ముస్సోలినీ తన పదవికి రాజీనామా ఇచ్చిన తరువాత అతడు నిర్బంధమున ఉంచబడెను. అతని స్థాన మున పీట్రో బడోగ్లియో అధికారమును గ్రహించి, ఫాసిస్ట్ పార్టీ రద్దయినటుల ప్రకటించెను (జూలై 28). కాని, జర్మను సేనలు ముస్సోలినీని రక్షించి, రిపబ్లికన్ ఫాసిస్ట్ పార్టీ ఒకటి ఏర్పడినటుల ప్రక టించినవి (సెప్టెంబరు 15). జర్మనీ అధీన మున అప్పటికి ఉండిన ఇటలీదేశపు భాగములలో ఈ పార్టీ అధికారమును నెలకొల్పగలిగినది.

ఆగస్టు 11 - 24: క్విబెక్ సమావేశము. చర్చిల్, రూజ్ వెల్ట్‌లు కెనడాలోని క్విబెక్‌న సమా వేశమై యూరప్‌న ద్వితీయరంగమును ఆరంభించువిషయమునుచర్చించిరి. ఫ్రెంచి జాతీయ విమోచనాసమితిని బ్రిటన్, సోవియట్‌రష్యా, కెనడా, యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వములు గుర్తించినవి.

ఆగస్టు 18: సిసిలీలో అక్షరాజ్య సేనల ప్రతిఘటన అంతరించినది. ఆ దండయాత్రలో మిత్ర సేనల పక్షమున 22,000 ను, అక్షరాజ్య ముల పక్షమున 1,67,000 ను జననష్టము కలిగెను. మిత్రరాజ్యములు 274 విమాన ములను నష్టపడి, అక్షరాజ్యముల విమా నములను 1,691 ని కూల్చినవి.

ఆగస్టు 23: విస్తృత ముఖరంగమున పురోగ మించిన సోవియట్ రష్యా సేనలు ఖార్‌కోవ్‌ను వశపరచుకొనినవి. అక్టోబరు నాటికి రష్యన్‌లు నీపియర్ నదిని వేర్వేరు తావుల సమీపించి కీవ్ నగరమును ఆక్రమించిరి (నవంబరు 6). సంవత్స రాంతమునకు జిటోమిర్ వారి వశమైనది (డిసెంబరు 31).

ఆగస్టు 29: కోపెన్ హేగన్ నౌకాశ్రయమున లంగరు వేసి ఉండిన డెన్మార్క్ ప్రభుత్వపు నౌకలను జర్మనులు వశపరచుకొనుటకు యత్నించగ, అచ్చటి 48 నౌకలలో 29 ని ఆ నౌకలు నడుపువారే ముంచివేసిరి. చిన్ని నౌకలలో 13 స్వీడెన్‌కు తప్పించు కొని పోయినవి. 6 మాత్రము జర్మనులకు చిక్కినవి.

సెప్టెంబరు 3: వైమానిక, నౌకాబలము సాహాయ్య ముతో మిత్రరాజ్యసేనలు మెస్సినా జలసంధిని అతిక్రమించి దక్షిణ ఇటలీలో అడుగిడినవి.

సెప్టెంబరు 9: ఇటలీ శరణాగతికి గ్రేట్ బ్రిటన్, యునైటెడ్ స్టేట్స్, సోవియట్ రష్యా దేశములు విధించిన షరతులను బడో గ్లియో మంత్రివర్గము ఆమోదించినది. జర్మనీపై ఇరాన్ యుద్ధ ప్రకటనము చేసి, ఐక్యరాజ్యములందు చేరినది.

సెప్టెంబరు 11: ఇటలీలోని బడోగ్లియో ప్రభుత్వము లొంగిన సంగతి తెలియగనే, జర్మనీ సేనలు ఇటలీలో ప్రముఖ నగరములగు రోమ్, మిలాన్, ట్రియస్టీ, జెనోవా, బోలోన్యా, వెరోనా, క్రెమోనా నగరములను ఆక్రమించినవి. బడోగ్లియో అధీనమున ఉన్న ఇటలీ సేనలు సార్డీని యాను, స్వతంత్ర ఫ్రెంచి సేనలు కార్సికాను వశపరచుకొనినవి.

1943, సెప్టెం 12: ఇటలీ నౌకాదళమున అత్యధిక భాగము తప్పించుకొని మిత్రరాజ్యముల పక్షమున చేరినది.

1943, అక్టో 9: యుగోస్లావియాలోని గెరిల్లా సేనలు మార్షల్ టిటో [చూ - పు. 496] నాయకత్వమున ట్రియస్టీ ప్రాంతమున అక్ష రాజ్య సేనలపై దాడిని మొదలిడినవి.

అక్టోబరు 13: వాయుమార్గమునను, జలమార్గమునను కావలాలను జరుపుటకు అనువుగ అజోర్స్ దీవులలోని స్థావరములను వాడుకొనుటకు గ్రేట్ బ్రిటన్‌కు పోర్చుగల్ దేశము అనుమతి ఇచ్చినది. యునైటెడ్ స్టేట్స్ నౌకలును, విమానములును ఈ వసతిలో పాలుపంచుకొనినవి.

డిసెంబరు 2-7: టెహరాన్ సమావేశము. జర్మనీపై వివిధ దిశలనుండి సాగించవలసిన దండయాత్రలను గురించి ఇరాన్ రాజధానియగు టెహరాన్‌న చర్చించి, రూజ్‌వెల్ట్, చర్చిల్, స్టాలిన్ ఒక నిర్ణయమునకు రాగలిగిరి.

1944, జన 20: ముఖరంగమున ఉత్తర భాగమున నోవ్‌గొరోడ్ నగరము రష్యన్‌ల వశమైనది. అంతట ఫిబ్రవరి నాటికి ఎస్తోనియాలో చొరబడి, క్రమముగా యుద్ధాత్పూర్వపు పోలండ్ పొలిమేరను సోవియట్ రష్యా సేనలు చేరినవి.

జనవరి 23: సముద్రమును ఉత్తరించి మిత్రరాజ్య సేనలు రోమ్‌నకు దక్షిణముగ ఉన్న ఇటలీ దేశపు తీరభూమిని చేరినవి.

ఫిబ్రవరి 2: మార్షల్ దీవులపై దాడిని మిత్రరాజ్య సేనలు సాగించినవి. క్రమక్రమముగ ఏప్రిల్ 24 నాటికి రాయ్, క్వాజలీన్, ఈన్‌విటోక్ దీవులను, అడ్మిరాలిటీ దీవులను వశపరచుకొనుటయే కాక, న్యూగినీలో పలు ప్రాంతములందును ఆ సేనలు దిగగలిగినవి. షౌటన్ ద్వీపసమూహమును (మే 28), మేరియానా దీవులును (జూన్ 16) కూడ వారికి ఆ తరువాత చేజిక్కినవి.

ఫిబ్రవరి 11: ఇటలీలో దక్షిణ భాగమున అప్పటికి విమోచనము చేయబడిన ప్రాంతము ఇటలీ ప్రభుత్వమునకు అప్పగించబడినది.

ఫిబ్రవరి 17: చెర్కాసీవద్ద సోవియట్ రష్యా సేనల మధ్య చిక్కుకొనిపోయిన పది డివిజనుల జర్మనీ సేన చాలవరకు నిర్మూలితమైనది. హతశేషులు ఖైదీలుగ పట్టుబడిరి.

మార్చి 22: జర్మనీ సేనలు హంగేరిని అతిక్రమించి, జర్మనులకు అనుకూలమగు ఒక కీలుబొమ్మ ప్రభుత్వమును నెలకొల్పినవి.

మార్చి 26: రుమేనియా సరిహద్దు వరకు ఉక్రెయిన్ ద్వారా రష్యన్‌లు పురోగమించిరి. ఒడెస్సా (ఏప్రిల్ 10), తార్నోపోల్ (ఏప్రిల్ 15) వారి వశమైనవి. మే 9 నాటికి సెవాస్టపోల్ వారికి చేజిక్కినది. అంతట ఉక్రెయిన్, క్రిమియాలు రెండును శత్రురహితములు అయినవి.

మార్చి 27: ఆర్జెంటీనా గణరాజ్యము జర్మనీ, జపాన్ దేశములపై యుద్ధమును ప్రకటించెను.

జూన్ 5: రోమ్‌నగరమున యునైటెడ్ స్టేట్స్ 5 వ సేనాదళము ప్రవేశించి వశపరచుకొనినది.

జూన్ 6: ఫ్రాన్స్‌లోని నార్మండీతీరమున సెయింట్ మార్కోవ్, ఓర్నీనదుల మధ్య ఆంగ్లో-అమెరికన్ సేనలు దిగగలిగినవి. అంతట ఒక వారము దినములలో 96 కి. మీ. నిడివిగల కోస్తా వాని వశమైనది. అంతటి నుండి నిరంతరాయముగ సరఫరాలు చేరుటకై కృత్రిమపు నౌకాశ్రయములు నిర్మింపబడినవి.

జూన్ 16: యునైటెడ్ స్టేట్స్‌కు చెందిన సూపర్ ఫోర్ట్రెస్ బాంబరు విమానములు జపాన్ దేశములో అంతర్భాగమగు క్యూషూ దీవిపై తీవ్రముగా బాంబులను వర్షించుట మొదలిడినవి.

జూన్ 17: జెట్ పద్ధతిలో నడుపబడు చోదకరహిత విమానములను పంపి వానిద్వారా బాంబులను వర్షించు నూతన విధానమును జర్మనులు ప్రవేశపెట్టిరి.

1944, జూన్ 20: ఫిన్లాండ్ వైపున రష్యా సేనలు దండయాత్ర సాగించగ, వైబోర్గ్ నగరము వారి వశమైనది. దక్షిణమున వైటెబ్స్క్ (జూన్ 26), విన్స్క్ (జూలై 3) నగరములును వారికి దక్కినవి. ఆ సమయముననే పశ్చిమ యూరప్‌న నార్మండీ వద్ద ఆంగ్లో-అమెరికన్ సేనలు దిగుటతో (జూన్ 6) జర్మనులు తూర్పురంగమునకు అదన

ముగ సేనలను తరలింపజాలక పోయిరి. తత్ఫలితముగ జూలై, ఆగస్టు నెలలలో రష్యన్‌లు నిరంతరాయముగ ముందునకు పోగలిగిరి. ఆగస్టు అంతమునకు తూర్పు ప్రష్యా సరిహద్దులకు చేరి, వారు పోలండ్-రుమేనియా దేశములపై దండెత్తిరి.

1944, జూన్ 27 : ఫ్రాన్స్‌లోని షేర్‌బర్గ్ మిత్రరాజ్యములకు చిక్కుటతో పెద్ద నౌకాశ్రయపు వసతి లభించినది. అంతట అడుగిడిన దినము (డి - డే) తరువాత 100 దినములలో 22,00,000 మంది మనుష్యులు, 4,50,000 శకటములు, 40,00,000 టన్నుల సరకులును ఫ్రాన్స్‌తీరమునకు బ్రిటన్ నుండి నౌకల ద్వారా చేర్చబడినవి.

జూలై 11 : చార్లెస్ డిగాలీ నాయకత్వమునందలి ఫ్రెంచి జాతీయ విమోచనా సమితి ఫ్రాన్స్ దేశమునందలి విముక్త ప్రాంతములకు వాస్తవతః పౌరప్రభుత్వముగ యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వము గుర్తించినది.

జూలై 24 : సోవియట్ రష్యాలోని ప్స్కోవ్‌నగరమునకు విమోచనమును సోవియట్ రష్యా సేనలు కల్పించినవి. ఇంతటితో రష్యాలోని ప్రముఖ నగరములు అన్నియు జర్మనుల ఆక్రమణనుండి వైదొలగినవి.

జూలై 27 : మాస్కోలో నెలకొల్పబడిన పోలిష్‌జాతి విమోచనా సమితిని సోవియట్ రష్యా ప్రభుత్వము గుర్తించి, విముక్త పోలండ్‌న పరిపాలనను ఏర్పరచు విషయమున ఆ సమితితో ఒక ఒప్పందమును కుదుర్చుకొనెను.

ఆగస్టు 12 : తీవ్రపోరాటము తరువాత ఇటలీయందున్న ఫ్లారెన్స్ నగరము మిత్రరాజ్యముల వశమైనది. అంతట లివర్నోనుండి అన్‌కోనా వరకుగల రేఖకు దక్షిణమున ఉన్న మేరకు ఇటలీ దేశము మిత్రరాజ్యముల అధీనమున చేరినది. జర్మనీ లొంగువరకు ఇచటి యుద్ధరంగమున ఆ తరువాత పెద్ద మార్పులు ఏవియు రాలేదు.

ఆగస్టు 15 : ఫ్రాన్స్‌దేశపు దక్షిణభాగమున మధ్యధరా తీరమున మార్సిలీ, నైస్‌ల మధ్య భూమియందు మిత్రరాజ్య సేనలు దిగగలిగినవి.

ఆగస్టు 24 : సోవియట్ రష్యా సేనలు డాన్యూబ్‌నదీ ముఖద్వారమును చేరగనే రుమేనియా ప్రభుత్వము లొంగినది. రుమేనియా లొంగుబాటుతో నల్లసముద్రమునందలి జర్మను నౌకాదళమున అత్యధిక భాగము చిక్కుపడినది. నల్లసముద్రముపై రష్యాకు ఆధిపత్యము లభించినప్పటినుండి యుద్ధ సామగ్రిని సంపాదించుటకు క్రొత్త మార్గము ఆ దేశమునకు లభించినది.

ఆగస్టు 29 : పారిస్‌నగరమునందలి జర్మనీ సేనలు సాయుధ పౌరుల ఒత్తిడికిని, వెలుపలి నుండి వచ్చు మిత్రరాజ్య సేనల దండయాత్రకును తాళజాలక లొంగవలసి వచ్చినది. మిత్రరాజ్య సేనల అంగీకృతితో డిగాలీ సేనాని అచట ప్రభుత్వమును నెలకొల్పెను.

సెప్టెంబరు 2 : బెల్జియమ్ లోనికి చొరబారిన మిత్రరాజ్య సేనలు బ్రస్సెల్స్‌నగరమునకు విముక్తిని చేకూర్చినవి.

సెప్టెంబరు 5 : బల్గేరియాపై సోవియట్ రష్యా యుద్ధము ప్రకటించినది. మూడురోజుల తరువాత బల్గేరియన్ ప్రభుత్వము యుద్ధ విరమణను అర్థించినది (సెప్టెంబరు 8). సోవియట్ రష్యా సేనలు అంతట సోఫియాలోనికి నడచినవి.

అక్టోబరు 9 : డంబర్టన్ ఓక్స్ సమావేశము [చూ - పు. 506]. గ్రేట్‌బ్రిటన్, యునైటెడ్ స్టేట్స్, సోవియట్‌రష్యా ప్రభుత్వముల ప్రతినిధులు ఆగస్టు 21 నుండి సెప్టెంబరు 27 వరకు జరిపిన సమావేశముల ఫలితముగ ఒక శాశ్వత అంతర్జాతీయ వ్యవస్థ, యునైటెడ్ నేషన్స్ (ఐక్యరాజ్యములు) అను పేరున నెలకొల్పబడవలయునను నిర్ణయము రూపొంది ఈ దినమున ప్రకటితమైనది.

అక్టోబరు 13 : మిత్రరాజ్య సేనలు ఏథెన్స్ నగరమును వశపరచుకొనినవి.

1944, అక్టో 19 : డగ్లస్ మెకార్థర్ సేనాని నాయకత్వమున యునైటెడ్‌స్టేట్స్ ప్రభుత్వపు దండయాత్రా దళములు లెయ్‌టి దీవిపై దిగి, ఫిలిప్పీన్ దీవులను తిరిగి

వశపరచుకొనుటకు దాడిని మొదలిడినవి.

1944, అక్టో 20 : యుగోస్లావియాలో మార్షల్ టిటో నాయకత్వమున గెరిల్లా సేనలచే పీడింపబడుచుండిన జర్మనీ ఆక్రమణ సేనలు రష్యన్‌ల పురోగతిని ఆపలేక పోయినవి. తత్ఫలితముగ రష్యన్‌లు బెల్‌గ్రేడ్ నగరమున ప్రవేశించగలిగిరి (అక్టోబరు 20). ఆ తరువాత రెండు వారములకు హంగేరీ రాజధానియగు బుడాపెస్ట్ గుమ్మమునకు సోవియట్ రష్యా సేనలు చేరుకొనినవి. కాని, హంగేరియన్‌ల అతి తీవ్ర ప్రతిఘటనవలన రెండు నెలల వరకు (1945, ఫిబ్రవరి) ఆ నగరము రష్యన్‌లకు వశము కాలేదు.

బాల్కన్ దేశములలో ఇటుల విజయ లక్ష్మిని వరించి మధ్య రంగమున పోలండ్‌లోనికి చొరబారి, ఉత్తరమున బాల్టిక్ తీరమున రీగాను వశపరచుకొటతో (అక్టోబరు 13) దృఢతను సంపాదించిన సోవియట్ రష్యా సేనల అతి దీర్ఘశ్రేణి, జర్మనీలోనికి పోవుటకై తుది దండయాత్రను మొదలిడినది (జనవరి, 1945). ఈ కాలముననే రైన్ నదిని అతిక్రమించి తక్కిన మిత్రరాజ్యముల సేనలు పశ్చిమదిశ నుండి జర్మనీలోనికి చొరబడినవి. ఈ రెంటి సంయుక్త కృషియే జర్మనీ పతనమునకు కారణభూతమయ్యెను.

అక్టో 21-22 : ఫిలిప్పీన్ సముద్రమున నౌకా సంగ్రామము. ఇందు యునైటెడ్ స్టేట్స్ నౌకా బలధాటికి ఆగలేక ఫిలిప్పీన్ జలప్రాంతము నుండి జపాన్ తన నౌకాదళమును ఉపసంహరించుకొనినది. ఆ సందర్భమున జపాన్‌నకు చెందిన 40 నౌకలు మునిగినవి; 46 దెబ్బ తినినవి; 405 విమానములు నష్టమైనవి. అంతట సామోవ్ దీవిపై యునైటెడ్ స్టేట్స్ బలములు దిగినవి.

1945 జనవరి 1 : ఐక్యరాజ్యములందు ఫ్రాన్స్ సంపూర్ణ స్వత్వములతో సభ్యత్వము గ్రహించినది.

జనవరి 6 : జపాన్‌తో దౌత్య సంబంధములను టర్కీ ప్రభుత్వము తెగత్రెంపులు చేసికొనెను.

జనవరి 12 : పోలండ్‌లోనికి తీవ్రవేగముగ చొరబారి సోవియట్ రష్యా సేనలు వార్సాను వశపరచుకొని (జనవరి 17) క్రమముగ జర్మనులను వెనుకకు నెట్టి విస్తులా ప్రాంతపు రక్షణశ్రేణిని వారు త్యజించునటుల చేయుటయేకాక, ఫిబ్రవరి 20 నాటికి బెర్లిన్‌కు 48 కి. మీ. దూరమునకు చేరగలిగినవి.

ఫిబ్రవరి 7-12 : క్రిమియా సమావేశము [చూ. పు. 413]. రూజ్ వెల్ట్, చర్చిల్, స్టాలిన్ క్రిమియాలోని యాల్టానగరమున సమావేశమై జర్మనీపై విజయసాధన, జర్మనీ ఆక్రమణ మొదలగు వానిపై నిర్ణయములకు రాగలిగిరి.

ఫిబ్రవరి 19 - మార్చి 17 : జపాన్ సేనలతో తీవ్ర సంగ్రామము జరిపి ఇవోజిమా దీవిని యునైటెడ్ స్టేట్స్ సేనలు వశపరచుకొనినవి. జపాన్ దేశమందలి యోకహామాకు 1,207 కి. మీ. దూరమున మాత్రమే ఈ దీవి ఉండుటవలన జపాన్‌పై బాంబులు వేయుటకు యునైటెడ్ స్టేట్స్ విమాన బలమునకు ఇందువలన చక్కని అవకాశము కలిగినది.

ఫిబ్రవరి 26 : ఐక్యరాజ్యములందు సిరియా చేరెను.

మార్చి 3 : జర్మనీపై ఫిన్లాండ్ యుద్ధమును ప్రకటించినది.

మార్చి 8 : యునైటెడ్ స్టేట్స్ మొదటిసేన రైన్ నదిని రెమాజెన్ వద్ద దాటినది. అంతట ఆ నది తూర్పుతీరమందలి జర్మనుల రక్షణ ఏర్పాటులు అన్నియు కూలిపోయినవి. ఏప్రిల్ 12 కు యునైటెడ్ స్టేట్స్ 9 వ సేన ఎల్బా నదిని చేరుకొనినది. ఆ తరువాత 8 రోజులకు సోవియట్ రష్యా సేనలు బెర్లిన్ పొలిమేరలలోనికి చొరగలిగినవి (ఏప్రిల్ 20); యునైటెడ్ స్టేట్స్, సోవియట్ రష్యా సేనలు ఎల్బానది ఒడ్డున తోర్‌గాన్ వద్ద కలసికొనినవి (ఏప్రిల్ 26).

1945, మార్చి 21 : విమాన వాహక నౌకల నుండి నిర్గమించు విమాన సమూహము జపాన్ దేశ తీర ప్రాంతమునకు పోయి జపానీయుల నౌకాదళమునకు చెందిన ప్రముఖ విభాగములపై దాడి చేసినవి. తత్ఫలితముగ 15 యుద్ధనౌకలను, 475 విమానములను జపాన్ కోల్పోయినది. యునైటెడ్ స్టేట్స్‌కు ఎట్టి నష్టమును కలుగలేదు.

1945, ఏప్రిల్ 1: యునైటెడ్ స్టేట్స్ నౌకా సేనలును, సైన్య దళములును ఓకినావా దీవిపై దాడిని సాగించినవి. ఈ దాడిని ప్రతిఘటించిన జపాన్ నౌకాబలము తీవ్ర నష్టములకు లోనై యామాటో అను 45,000 వేల టన్నుల ప్రమాణము కల సంగ్రామ నౌకను, 2 క్రూయిజర్లను, 3 డిస్ట్రాయర్లను పోగొట్టుకొనినది. ద్వీపము కడకు యునైటెడ్ స్టేట్స్ సేనలకు వశమైనను జపానీయుల ప్రతిఘటన మాత్రము జూన్ 21 వరకు సాగినది. ఈ దీవి జపాన్ దేశ నగరములకు దాదాపు 523 కి. మీ. లోపున ఉండుట వలన ఆ నగరములలో బాంబు చేయుటకు అది చక్కని స్థావరముగ ఉపకరించినది.

ఏప్రిల్ 5: జపాన్‌తో అమలులో ఉండిన తన పంచవర్ష నిరాక్రమణ ఒప్పందమును సోవియట్ రష్యా వదలుకొనినది.

ఏప్రిల్ 12: యునైటెడ్ స్టేట్స్ అధ్యక్షుడు రూజ్‌వెల్ట్ అకస్మాత్తుగ మరణించెను. అంతట ఉపాధ్యక్షుడగు హారీ ఎస్. ట్రూమన్ [చూ. పు. 505] అధ్యక్షాధికారములను గ్రహించెను.

ఏప్రిల్ 21: పోలండ్‌లోని తాత్కాలిక ప్రభుత్వమును, సోవియట్ రష్యాయును 20 వత్సరముల పరస్పరసాహాయ్య సహకార సంధిని కుదుర్చుకొనినవి.

ఏప్రిల్ 25 - జూన్ 26: శాన్ ఫ్రాన్సిస్కో సమావేశము [చూ.]. ఐక్యరాజ్యసమితి ప్రణాళికకు ముసాయిదా రూపొందింపబడినది.

ఏప్రిల్ 29: ఇటలీ లోని ఫాసిస్ట్ - వ్యతిరేక సేనలు బెనిటో ముస్సోలినీని నిర్బంధములోనికి తీసికొని, మరణ శిక్ష పాలుచేసినవి.

మిత్ర రాజ్య సేనలు ఆస్ట్రియాను ఆక్రమించిన తరువాత అచట క్రొత్తగ ఒక తాత్కాలిక ఆస్ట్రియన్ ప్రభుత్వము ఏర్పరుపబడినది.

మే 1: అడాల్ఫ్ హిట్లర్ [చూ.] మరణించెనని బెర్లిన్‌లో ప్రకటితమైనది. అప్పటికే బెర్లిన్ లోని పలు ప్రాంతములలోనికి సోవియట్ రష్యా సేనలు చొరబడినవి. అట్టి సమయమున అడ్మిరల్ కారల్ డానిట్జ్ నాయకత్వమున జర్మనీ ప్రభుత్వమునకు ప్రత్యామ్నాయముగ ఒక తాత్కాలిక పరిపాలనా సమితి ఏర్పడి, తమ దేశపు లొంగుబాటు విషయమై మిత్రరాజ్య ప్రభుత్వములతో రాయబారములను ఆరంభించినది.

మే 6: జర్మనీ ప్రభుత్వముతో దౌత్య సంబంధములను పోర్చుగల్ విచ్ఛిన్నము చేసికొనినది.

మే 7: జర్మనీలో కారల్ డానిట్జ్ నాయకత్వమున ఉండిన తాత్కాలిక పాలనా సమితి బేషరతుగా లొంగినది.

స్పెయిన్ దేశము జర్మనీతో దౌత్య సంబంధములను రద్దుచేసికొనెను.

మే 8: యునైటెడ్ స్టేట్స్ అధ్యక్షుడు ట్రూమన్, బ్రిటిష్ ప్రధాని చర్చిల్ యూరప్ నందలి యుద్ధము ముగిసినటుల తమ దేశములందు అధికారయుతముగ ప్రకటించిరి.

మే 9: జర్మనీ శరణాగతికి సంబంధించిన లాంఛన ప్రాయపు ధ్రువీకరణపై బెర్లిన్‌లో సంతకములు జరిగినవి.

మే 9: యుద్ధము అంతమైనటుల సోవియట్ రష్యా ప్రజలకు ప్రకటన ద్వారా మార్షల్ స్టాలిన్ తెలియజేసెను.

1945, మే-ఆగస్టు: పసిఫిక్ రంగమున విమాన వాహక నౌకలనుండియు, తమ వశమున ఉన్న సమీప ద్వీపముల నుండియు బయలు దేరిన యునైటెడ్ స్టేట్స్ విమానములు చరిత్రలో అభూతపూర్వమగు వైమానిక దాడిని సాగించి జపానీయుల నౌకాదళ శేషమును నిర్మూలించుటయో లేదా మూలపడునటుల చేయుటయో కాక, పరిశ్రమలను ఛిన్నాభిన్నము చేసినవి. జలాంతర్గాముల దాడివలనను, మందుగనులను నాటుట వలనను, విమానముల దాడుల వలనను జపాన్ దేశపు దీవుల పరిసరమున సముద్ర ప్రయాణపు సదుపాయములు భగ్నము చేయబడినవి. యునైటెడ్ స్టేట్స్ యుద్ధనౌకలు జపాన్ దేశ తీర సమీపమునకు పయనించి బహుజనాకీర్ణములగు నగరములపై నిర్భయముగ గుండ్ల వర్షము కురిపించుటకు సాహ

సించినవి. ఒక నెలలో 40,000 టన్నుల బాంబులను యునైటెడ్ స్టేట్స్ ఇరువదవ వాయుబలము జపాన్‌పై ఆ కాలమున వర్షించినది.

1945, జూన్ 29: సోవియట్ రష్యాకు రుథీనియా ప్రాంతమును జెకోస్లోవాకియా దత్తము చేసినది.

జూలై 3: బెర్లిన్ నగరమున అప్పటివరకు అమలులో ఉండిన సోవియట్ రష్యా ఆక్రమణ ప్రభుత్వమునకు బదులుగ సోవియట్ రష్యా, బ్రిటిష్, యునైటెడ్ స్టేట్స్ ఆక్రమణలకు చెందిన వేర్వేరు మండలములుగ ఆ నగరము విభక్తమైనది.

జూలై 10-19: జపాన్ దేశమున ముఖ్య భాగములగు వివిధ ద్వీపములపై బాంబరుల దాడులు సాగినవి. అట్టి 1,000 బాంబర్లు టోక్యో నగరముపై ఒక్కపెట్టున దాడి సాగించి బాంబుల వర్షమును కురిపించినవి (జూలై 10). తీర సమీపముననే పోయి యునైటెడ్ స్టేట్స్ నౌకా దళము హోన్షూ, హోక్కైడియా దీవులపై కాల్పులు సాగించినది. జపాన్ నౌకాదళమున మిగిలిన దానిపై యునైటెడ్ స్టేట్స్, బ్రిటిష్ విమానములు దాడిని సాగించి, టోక్యో అఖాతమున దానిలో అధిక భాగమును ముంచివేసినవి (జూలై 19). తమకు బేషరతుగ లొంగవలసినదిగ కోరుచు జపాన్‌ను గ్రేట్ బ్రిటన్, చీనా, యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వములు ఆదేశించినవి (జూలై 26); కాని, జపాన్ దానిని నిర్లక్ష్యము చేసినది.

జూలై 26: బ్రిటన్‌లో జరిగిన ఎన్నికలలో లేబర్ పార్టీ అధిక సంఖ్యాక స్థానములను ఆర్జించినది. అందువలన చర్చిల్ తన పదవికి రాజీనామా ఈయగ లేబర్ పార్టీ నాయకుడు క్లెమెంట్ ఆర్. అట్లీ [చూ. పు. 263] ప్రధాని అయ్యెను.

జూలై 17 - ఆగస్టు 2: పోట్స్‌డామ్‌సమావేశము [చూ. పు 582]. గ్రేట్‌బ్రిటన్, యునైటెడ్‌స్టేట్స్, సోవియట్ రష్యాప్రభుత్వ అధినేతలు యుద్ధానంతరమున శాంతిని పునః నెలకొల్పుటకు ప్రణాళికను నిర్ణయించుటకై చర్చలను సాగించి కొన్ని నిర్ణయములకు రాగలిగిరి.

ఆగస్టు 6: జపాన్‌లోని హిరోషిమా నగరముపై యునైటెడ్ స్టేట్స్ వైమానిక దళమునకు చెందిన విమానము, తమ ప్రభుత్వపు ఆ దేశమున ఆటంబాంబు [చూ. సం - 2 పు. 167] అను నూతన మారణాయుధమును వదలినది. తత్ఫలితముగ 50,000 మంది మరణించుటయే కాక పది చదరపు కిలోమీటరుల ప్రాంతమున ఫ్యాక్టరీలు, జనావాసములు నేలమట్టములు అయ్యెను.

ఆగస్టు 8: జపాన్‌పై సోవియట్ రష్యా యుద్ధ ప్రకనము చేసినది. సోవియట్ రష్యా సేనలు మంచూరియాలోనికి చొరుచుకొని పోయినవి.

ఆగస్టు 9: జపాన్‌లో రెండవ సారిగ ఆటంబాంబు నాగసాకి నగరముపై వేయబడినది. నగరము ధ్వంసమైనది.

ఆగస్టు 10: తమ సార్వభౌముడగు హిరోహిటోకు పదవీ భ్రష్టత చేకూరనిచో తాము లొంగుటకు సంసిద్ధమే అని జపాన్ ప్రభుత్వము తెలియజేసినది. అందులకు తగిన హామీ చేకూరిన వెంటనే జపాన్ ప్రభుత్వము శరణాగతి షరతులను ఆమోదించినది.

ఆగస్టు 10: యునైటెడ్ స్టేట్స్ ఆక్రమణ సేనలు జపాన్‌న కాలిడినవి.

1945, సెప్టెం 2: టోక్యో అఖాతమున యునైటెడ్ స్టేట్స్‌కు చెందిన మిస్సోరి అను నౌకపై శరణాగతి షరతుల పత్రమున లాంఛనముగ జపాన్ ప్రభుత్వ ప్రతినిధులు సంతకములు చేసిరి. చీ. శే. రా.

**ప్రపంచ రాజ్యములు :** ప్రపంచమున ప్రత్యేక రాజకీయ ప్రతిపత్తితో మనుచున్న వివిధ ప్రాంతముల విస్తీర్ణము జనసంఖ్య, రాజకీయ ప్రతిపత్తి, రాజధాని మొదలగునవి ఖండముల వారిగా పట్టికలో ఈయబడినవి.

1965, డిసెంబరు 1 కి సన్నిహిత పూర్వకాలమున సాధికార గణన వలన గాని, అధికారుల అంచనాల వలనగాని తెలియవచ్చిన విస్తీర్ణ, జనసంఖ్యా వివరములే ఈ పట్టిక యందు ఈయబడినవి [చూ. పట్టిక]. పా. ల. నా.

**ప్రష్యా :** ఒకప్పుడు జర్మనీలోని రాష్ట్రము. కాని, తొలుత ఒక ప్రత్యేక రాజ్యముగ ఉండినది. క్రీ. శ. 900 ప్రాంత




26 గాంబియా
27 టోగో
28 దహోమీ
29 అప్పర్ వోల్టా
30 రియో మునీ
31 కబిండా
32 ఉగాండా
33 రువండా
34 బురుండీ
35 మలావీ
36 స్వాజీలాండ్
37 లెసోతో
38 థాయిలాండ్
39 లావోస్
40 గినీ

# ప్రపంచ రాజ్యములు

(ఖండముల వారీగా)

| వరుస సంఖ్య 1 | రాజ్యము 2 | విస్తీర్ణము (చ. కి. మీ.) 3 | జన సంఖ్య 4 | రాజకీయ ప్రతిపత్తి 5 | రాజధాని 6 |
|---|---|---|---|---|---|
| | **ఆఫ్రికా ఖండము** | | | | |
| 1. | అప్పర్ వోల్టా * | 3,15,690 | 45,00,000 | స్వతంత్ర గణరాజ్యము | అవగడౌగౌ |
| 2. | ఆల్జీరియా * | 23,81,741 | 1,07,84,269 | స్వతంత్ర గణరాజ్యము | ఆల్జీర్స్ |
| 3. | ఈజిప్టు (యునైటెడ్ అరబ్ రిపబ్లిక్) * | 10.00,354 | 2,60,80,000 | స్వతంత్ర గణరాజ్యము | కైరో |
| 4. | ఉగాండా * | 2,39,640 | 70,15,900 | స్వతంత్ర రాజ్యము | కామ్‌పాలా |
| 5. | ఎతియోపియా * | 11,84,320 | 2,10,00,000 | స్వతంత్ర ప్రజాస్వామిక రాజ్యము | అడ్డిస్ అబాబా |
| 6. | ఐవరీకోస్టు * | 3.22,463 | 34,10,000 | స్వతంత్ర గణరాజ్యము | అబిజాన్ |
| 7. | కాంగో (బ్రజ్జవిల్లి) * | 3,42,000 | 8,64,684 | స్వతంత్ర గణరాజ్యము | బ్రజ్జవిల్లి |
| 8. | కాంగో (లియోపాల్డ్ విల్లి) * | 23,45,409 | 1,50,07,000 | స్వతంత్ర రాజ్యము | లియోపాల్డ్ విల్లి |
| 9. | కామెరూన్ * | 4,75,442 | 45,95,000 | స్వతంత్ర గణరాజ్యము | యావాన్‌డా |
| 10. | కెన్యా * | 5,82,646 † | 88,47,000 | స్వతంత్ర గణరాజ్యము | నైరోబీ |
| 11. | గాంబియా * | 10,369 | 3,15,486 | స్వతంత్ర రాజ్యము | బాతర్‌స్ట్ |
| 12. | గినీ * | 2,45,857 | 33,56,900 | స్వతంత్ర గణరాజ్యము | కానక్రీ |
| 13. | గెబన్ * | 2,67,000 | 4,52,500 | స్వతంత్ర గణరాజ్యము | లైబర్ విల్లి |
| 14. | ఘానా * | 2,37,873 | 72,44,000 | స్వతంత్ర గణరాజ్యము | అక్రా |
| 15 | చాడ్ * | 12,84,000 | 27,20,000 | స్వతంత్ర గణరాజ్యము | పోర్ట్ లామీ |
| 16. | జాంబియా (ఉత్తర రొడీషియా) * | 7,46,254 | 25,50,000 | స్వతంత్ర గణరాజ్యము | లూసాకా |
| 17. | టాంజేనియా * | 9,39,704 | 1,00,46,070 | స్వతంత్ర గణరాజ్యము | దార్ - ఇస్ - సలామ్ |

* ఐక్యరాజ్యసమితి సభ్యదేశములు—వాటి జాతీయ పతాకములు గల పటము వేరుగా ఇవ్వబడినది  † సముద్రోత్తర ప్రదేశములతో సహా

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| 18. | టూనీషియా * | 1,25,180 | 42,90,000 | స్వతంత్ర గణరాజ్యము | ట్యునిస్ |
| 19 | టోగో (టోగోలాండ్) * | 56,600 | 15,86,000 | స్వతంత్ర గణరాజ్యము | లోమీ |
| 20. | దక్షిణ ఆఫ్రికా గణరాజ్యము * | 12,23,409 | 1,62,36,000 | స్వతంత్ర గణరాజ్యము | ప్రెటోరియా |
| 21. | దహోమీ * | 1,15,762 | 22,00,000 | స్వతంత్ర గణరాజ్యము | పోర్టోనోవో |
| 22. | నైజర్ * | 12,67,000 | 30,40,673 | స్వతంత్ర గణరాజ్యము | నియామీ |
| 23. | నైజీరియా * | 9,23,772 | 3,72,13,000 | స్వతంత్ర గణరాజ్యము | లాగోస్ |
| 24. | నైరృతి ఆఫ్రికా | 8,22,904 | 5,34,000 | ద. ఆఫ్రికా ధర్మకర్తృత్వ ప్రాంతము | విండ్ హోక్ |
| 25. | పోర్చుగీస్ పాలిత ప్రాంతములు | | | | |
| | i. అన్ గోలా | 12,51,512 | 48,32,677 | పోర్చుగీస్ సముద్రోత్తర రాష్ట్రము | లువండా |
| | ii. మొజాంబిక్ | 7,83, 032 | 65,92,994 | పోర్చుగీస్ సముద్రోత్తర రాష్ట్రము | లోరెంజో మార్క్వెస్ |
| | iii. కేప్ వర్డి దీవులు | 4,033 | 2,01,549 | పోర్చుగీస్ సముద్రోత్తర రాష్ట్రము | ప్రెయా |
| | iv. సావోటోమీ ఇల్ ప్రిన్సిపి దీవులు | 963 | 63,676 | పోర్చుగీస్ సముద్రోత్తర రాష్ట్రము | సావోటోమీ |
| 26. | ఫ్రెంచి పాలిత ప్రాంతము | | | | |
| | i. ఫ్రెంచి సోమాలీలాండ్ | 21,999 | 81,000 | ఫ్రెంచి సముద్రోత్తర రాష్ట్రము | జిబౌటీ |
| 27. | బసూటోలాండ్ (లెసోతో) | 27,834 | 26,00,000 | స్వతంత్ర రాజ్యము | ఉసుంబురా |
| 28. | బురుండీ * | 30,344 | 6,97,000 | స్వతంత్ర రాజ్యము | మాసేరూ |
| 29. | బెచూనాలాండ్ (బోత్స్వనా) | 5,82,750 | 3,50,000 | స్వతంత్ర రాజ్యము | సెరోవే |
| 30. | బ్రిటిష్ పాలిత ప్రాంతములు | | | | |
| | i. స్వాజీలాండ్ | 17,365 | 2,70,000 | బ్రిటిష్ రక్షిత ప్రాంతము | ఉంబాబానే |
| | ii. సెయింట్ హెలీనా | 326 | 6,860 | బ్రిటిష్ వలస రాజ్యము | జేమ్స్ టౌన్ |
| | iii. దక్షిణ రొడీషియా | 3,89,362 | 38,80,000 | స్వయం పరిపాలక బ్రిటిష్ వలస. † | సాలిస్ బరీ |
| 31. | మలగాసీ * | 5,95,790 | 58,03,000 | స్వతంత్ర గణరాజ్యము | తనానరీవ్ |
| 32. | మలావీ (న్యాసాలాండ్) * | 96,200 | 40,00,000 | స్వతంత్ర గణరాజ్యము | జోంబా |
| 33. | మారిటేనియా * | 10,85,805 | 7,70,000 | ఇస్లామిక స్వతంత్ర గణరాజ్యము | నౌవాక్ ఛోట్ |
| 34. | మాలి * | 12,04.021 | 43,05,000 | స్వతంత్ర గణరాజ్యము | బొమాకో |
| 35. | మొరాకో * | 4,43,680 | 1,23,60,000 | స్వతంత్ర రాజ్యము | రబాత్ |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 36. | రువండా * | 26,338 | 26,94,749 | స్వతంత్ర గణరాజ్యము | కిగాలీ |
| 37. | లిబియా * | 17,59,540 | 12,44,000 | స్వతంత్ర రాజ్యము | బెన్ ఘాజీ |
| 38. | లైబీరియా * | 1,11,370 | 12,90,000 | స్వతంత్ర గణరాజ్యము | మన్రోవియా |
| 39. | సియెర్రా లియోనీ * | 72,326 | 21,83,000 | స్వతంత్ర రాజ్యము | ఫ్రీటవున్ |
| 40. | సుడాన్ * | 25,05,823 | 1,30,11,000 | స్వతంత్ర గణరాజ్యము | ఖార్టూమ్ |
| 41. | సెంట్రల్ ఆఫ్రికన్ రిపబ్లిక్ * | 6,17,000 | 12,50,000 | స్వతంత్ర గణరాజ్యము | బాంగీ |
| 42. | సెనెగల్ * | 1,97,161 | 32,80,000 | స్వతంత్ర గణరాజ్యము | డాకర్ |
| 43. | సోమాలియా * | 6,37,661 | 22,50,000 | స్వతంత్ర గణరాజ్యము | మొగదిషూ |
| 44. | స్పెయిన్ పాలిత ప్రాంతములు | | | | |
| | i. ఇఫ్నీ | 1,499 | 49,889 | స్పానిష్ సముద్రోత్తర రాష్ట్రము | సిదిఇఫ్నీ |
| | ii. స్పానిష్ సహారా | 2,65,960 | 23,793 | స్పానిష్ సముద్రోత్తర రాష్ట్రము | — |
| | iii. మొరాకోలోని పలు ప్రాంతములు | 212 | 1,52,000 | స్పానిష్ సముద్రోత్తర ప్రాంతములు | — |
| | iv. రియోముని | 26,016 | 1,83,377 | స్పానిష్ సముద్రోత్తర రాష్ట్రము | బాటా |
| | v. ఫెర్నాండోపో | 2,033 | 61,197 | స్పానిష్ సముద్రోత్తర రాష్ట్రము | శాంటా ఇసెబెల్ |
| | **ఆస్ట్రేలేసియా & సాగర ఖండము** | | | | |
| 1. | ఆస్ట్రేలియా * | 76,94,951 | 1,09,65,100 | స్వతంత్ర రాజ్యము | కాన్‌బెర్రా |
| 2. | ఆస్ట్రేలియా పాలితప్రాంతములు | | | | |
| | i. నార్‌ఫక్ దీవి | 34 | 1,035 | ఆస్ట్రేలియా దేశాంతర మండలము | — |
| | ii. నౌరూ దీవి | 21 | 4,849 | ఆస్ట్రేలియా ధర్మకర్తృత్వ ప్రాంతము | — |
| | iii. న్యూగినీ (ఆస్ట్రేలియా) | ర. 2,40,870 | ? | ఆస్ట్రేలియా ధర్మకర్తృత్వ ప్రాంతము | పోర్ట్‌మార్స్బై |
| | iv. పాపువా | 2,34,499 | 5,23,442 | ఆస్ట్రేలియా ధర్మకర్తృత్వ ప్రాంతము | పాపువా |
| | v. అష్‌మోర్, కార్టియెర్, హర్డ్, మేక్డొనాల్డ్ దీవులు | 293 | ? | ఆస్ట్రేలియా దేశాంతర మండలము | — |
| 3. | న్యూజీలండ్ * | 2,68,676 | 25,53,573 | స్వతంత్ర ద్వీపరాజ్యము | వెల్లింగ్‌టన్ |
| 4. | న్యూజీలండ్ పాలిత ప్రాంతములు | | | | |
| | i. టొకెలౌ దీవులు | 10 | 1,938 | న్యూజీలండ్ పాలితప్రాంతము | — |
| | ii. కుక్ దీవులు | 241 | 18,378 | న్యూజీలండ్ పాలితప్రాంతము | — |
| | iii. నివీ దీవి | 259 | 4,864 | న్యూజీలండ్ పాలితప్రాంతము | — |
| 5. | న్యూహెబ్రిడిస్ | ర. 14,763 | 60,374 | ఆంగ్లో - ఫ్రెంచి సంయుక్తాధిపత్యము | విలా (ఇఫేట్) |

† 11-11-65 న ఏకపక్షీయముగ స్వతంత్రతను ప్రకటించినది. అయినను పెక్కు దేశములు పరిగణన ఈయలేదు. * ఐక్యరాజ్యసమితి సభ్యదేశములు.

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| 6. | పశ్చిమ సామోవ్ | 2,934 | 1,02,860 | స్వతంత్ర రాజ్యము | అపియా |
| 7. | ఫ్రెంచి పాలితప్రాంతములు | | | | |
| | i. న్యూ కెలెడోనియా | 19,824 | 78,000 | ఫ్రెంచి సముద్రోత్తర మండలము | నవోమీ |
| | ii. ఫ్రెంచి పొలినీషియా | 3,844 | 76,000 | ఫ్రెంచి సముద్రోత్తర మండలము | పపీటే |
| | iii. వల్లిస్ అండ్ ఫూతునా ద్వీపములు | 158 | ర. 10,000 | ఫ్రెంచి సముద్రోత్తర మండలము | — |
| 8. | బ్రిటిష్ పాలితప్రాంతములు | | | | |
| | i. టోంగా | 699 | 65,620 | బ్రిటిష్ సంరక్షిత రాజ్యము | నుకూయలోఫా |
| | ii. పసిఫిక్ హైకమాండ్ అధీనపు దీవులు | 30,834 | 1,77,508 | బ్రిటిష్ వలస; రక్షిత రాజ్యము | హోనియారా |
| | iii. ఫిజీ దీవులు | 18,278 | 4,14,000 | బ్రిటిష్ వలస రాజ్యము | సూవా |
| 9. | యునైటెడ్ స్టేట్స్ పాలితప్రాంతములు | | | | |
| | i. అమెరికన్ సామోవ్ | 196 | 20,051 | యు. స్టేట్స్ పాలనలోని ప్రాంతము | పగోపగో |
| | ii. గ్వామ్ దీవి | 541 | 67,044 | యు. స్టేట్స్ పాలనలోని ప్రాంతము | ఆగానా్య |
| | iii. ధర్మకర్తృత్వ దీవులు | 1,779 | 75,836 | యు. స్టేట్స్ ధర్మకర్తృత్వ ప్రాంతము | — |
| | iv. మిడ్ వే, సాండ్, కింగ్ మన్ రీఫ్, పామైరా, వేక్, బేవర్, హౌలాండ్, జార్విస్, జాన్ స్టన్ దీవులు. | 52 | 805 | యునైటెడ్ స్టేట్స్ ఆశ్రిత ప్రాంతములు | — |
| | v. బోనిన్ దీవులు | 104 | 184 | | |
| | vi. మార్షల్, కరోలిన్, మరియానా | 1,779 | 70,594 | యు. స్టేట్స్ పాలనలోని ప్రాంతము | — |
| | **ఆసియా** | | | | |
| 1. | ఆఫ్ఘనిస్తాన్ * | 6,57,500 | 1,46,84,000 | స్వతంత్ర గణరాజ్యము | కాబూల్ |
| 2. | ఇండోనీషియా * | 14,91,562 | 9,88,30,000 | ప్రజాస్వామిక గణరాజ్యము | జకార్తా |
| 3. | ఇండోనీషియా పాలితప్రాంతము | | | | |
| | i. న్యూగినీ (పశ్చిమ ఇరియన్) | ర. 4,15,954 | 7,36,640 (1960) | | |
| 4. | ఇజ్రాయెల్ * | 20,700 | 24,36,000 | స్వతంత్ర గణరాజ్యము | జెరూసెలెమ్ |
| 5. | ఇరాక్ * | 4,48,742 | 68,03,153 | స్వతంత్ర రాజ్యము | బాగ్దాద్ |
| 6. | ఇరాన్ (పరిష్యా) * | 16,48,000 | 2,22,26,000 | స్వతంత్ర రాజ్యము | టెహరాన్ |
| 7. | కటార్ | 22,015 | 45,000 | స్వతంత్ర షేకు రాజ్యము | దవ్ హా |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 8. | కాంబోడియా (కాంభోజ) * | 1,81,035 | 57,40,115 | స్వతంత్ర రాజ్యము | నామ్ పెన్ |
| 9. | కువాయిట్ * | 15,540 | 3,21,000 | స్వతంత్ర షేకు రాజ్యము | అల్ కువాయిట్ |
| 10. | కొరియా, ఉత్తర | 1,23,952 | 1,07,16 000 | ప్రజాస్వామిక గణరాజ్యము | ప్యాంగ్ యాంగ్ |
| 11. | కొరియా, దక్షిణ | 96,936 | 2,76,33,000 | ప్రజాస్వామిక గణరాజ్యము | సియోల్ |
| 12. | చీనా (టిబెట్ తో సహా) | 92,61,017 | 65.66,30,000 | స్వతంత్ర ప్రజా గణరాజ్యము | పీపింగ్ (పెకింగ్) |
| 13. | జపాన్ * | 3,69,661 | 9,62,30,000 | స్వతంత్ర రాజ్యము | టోక్యో |
| 14. | జోర్డాన్ * | 96,610 | 17,27,439 | స్వతంత్ర రాజ్యము | అమ్మన్ |
| 15. | టర్కీ (తుర్కీ)* | 7.80,576 | 3,02,55,981 | స్వతంత్ర రాజ్యము | అంకారా (అంగోరా) |
| 16. | తాయిలాండ్ * | 5,14,000 | 2,88,35,000 | స్వతంత్ర రాజ్యము | బాంకాక్ |
| 17. | తైవాన్ (చీనా) * | 35,962 | 1,15,11,000 | స్వతంత్ర రాజ్యము | తైపే |
| 18. | నేపాల్ * | 1,40,798 | 93,87,661 | స్వతంత్ర రాజ్యము | ఖాట్మండూ |
| 19. | పాకిస్తాన్ తూర్పు, పశ్చిమ * | 9,46,719 | 9,86,11,912 | స్వతంత్ర రాజ్యము | రావల్పిండి |
| 20 | పోర్చుగీస్ పాలిత రాజ్యములు | | | | |
| | i. టైమర్ | 14,926 | 5,17,079 | పోర్చుగీస్ సముద్రోత్తర రాష్ట్రము | దిలీ |
| | ii. మకావో | 16 | 1,69,299 | పోర్చుగీస్ సముద్రోత్తర రాష్ట్రము | మకావో |
| 21. | ఫిలిప్పీన్ దీవులు * | 2,99,681 | 3,07,58,000 | స్వతంత్ర రాజ్యము | క్వెజోన్ సిటీ |
| 22. | బర్మా * | 6,78,033 | 2,36,64,000 | స్వతంత్ర రాజ్యము | రంగూన్ |
| 23. | బెహారీన్ | 598 | 1,52,000 | స్వతంత్ర షేకు రాజ్యము | మనామా |
| 24. | బ్రిటిష్ పాలిత రాజ్యములు | | | | |
| | i. ఏడెన్ | ర. 2,90,365 | ర. 12,22,000 | బ్రిటిష్ రక్షిత వలసరాజ్యము | ఏడెన్ |
| | ii. బ్రూనీ | 5,765 | 83,877 | బ్రిటిష్ సంరక్షిత రాజ్యము | బ్రూనీ |
| | iii. హాంగ్ కాంగ్ | 1,013 | 32,26,400 | బ్రిటిష్ వలసరాజ్యము | విక్టోరియా |
| 25. | భారతదేశము (ఇండియా) * | 32,67,536(1963) | 43,90,72,582 | ప్రజాస్వామిక గణరాజ్యము | నయాఢిల్లీ |
| 26. | భూటాన్ | 46,620 | 7,00,000 | భారత రక్షిత రాజ్యము | తింబూ |
| 27. | మంగోలియా * | 15,35,000 | 10,18,800 | స్వతంత్ర ప్రజాగణరాజ్యము | ఉలన్ బతోర్ (ఉర్గా) |
| 28. | మలేసియా * | 3,33,215 | 1,03,63,821 | రాజ్య సమాఖ్య | కౌలాలంపూర్ |
| 29. | మస్కట్ అండ్ ఓమన్ | 2,12,380 | 7,50,000 | స్వతంత్ర రాజ్యము | మస్కట్ |
| 30. | యెమెన్ * | 1,95,000 | 50,00,000 | స్వతంత్ర రాజ్యము | సానా, తాయిజ్ |
| 31. | లావోస్ * | 2,36,800 | 18,81,000 | స్వతంత్ర రాజ్యము | వియంటైన్ |

* ఐక్యరాజ్యసమితి సభ్యదేశములు.

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| 32. | లెబనాన్ * | 10,400 | 16,45,813 | స్వతంత్ర గణరాజ్యము | బీరూట్ |
| 33. | వియెత్నామ్, ఉత్తర | 1,55,229 | 1,59,16,000 | ప్రజాతంత్ర గణరాజ్యము | హానోయ్ |
| 34. | వియెత్నామ్, దక్షిణ | 1,70,805 | 1,38,00,000 | గణరాజ్యము | సైగాన్ |
| 35. | సంధి విషయక షేకు రాజ్యములు | 83,600 | 1,20,000 | స్వతంత్ర షేకు రాజ్యములు | — |
| 36. | సింగపూర్ | 581 | 14,25,929 | స్వతంత్ర రాజ్యము | సింగపూర్ |
| 37. | సింహళము (సిలోన్) * | 65,610 | 1,09,65,000 | స్వతంత్ర ద్వీప రాజ్యము | కొలంబో |
| 38. | సిక్కిమ్ | 7,298 | 1,62,189 | భారత సంరక్షిత రాజ్యము | గాంగ్ టోక్ |
| 39. | సిరియా * | 1,84,479 | 53,99,000 | గణరాజ్యము | డెమాస్కస్ |
| 40. | సైప్రస్ * | 9,251 | 5,91,000 | స్వతంత్ర ద్వీప రాజ్యము | నికోసియా |
| 41. | సౌదీ అరేబియా * | 22,53,300 | 60,36,400 | స్వతంత్ర రాజ్యము | మక్కా, రియద్ |
| | **దక్షిణ అమెరికా** | | | | |
| 1. | అర్జెంటీనా * | 27,76,656 | 2,15,84,471 | గణరాజ్యము | బ్యూనో ఐర్స్ |
| 2. | ఈక్వడార్ * | 2,70,670 | 45,81,476 | స్వతంత్ర రాజ్యము | క్విటో |
| 3. | ఉరుగ్వే * | 1,86,926 | 25,56,020 | స్వతంత్ర గణరాజ్యము | మాంటెవిడో |
| 4. | కొలంబియా * | 11,38,338 | 1,50,97,640 | స్వతంత్ర రాజ్యము | బగోటా |
| 5. | చిలీ * | 7,41,767 | 81,89,534 | స్వతంత్ర రాజ్యము | సాంటియాగో |
| 6. | డచ్చిగయానా (సురినామ్) | 1.42,822 | 3,30,000 | స్వాతంత్ర్య ప్రతిపత్తిగల రాజ్యము | పరమరిబో |
| 7. | పరాగ్వే * | 4,06,752 | 18,16,890 | స్వతంత్ర రాజ్యము | అసన్ సియాన్ |
| 8. | పెరూ * | 12,85,215 | 1,15,11,000 | స్వతంత్ర గణరాజ్యము | లీమా |
| 9. | ఫ్రెంచి గయానా | ర. 90,649 | 33,698 | ఫ్రెంచి సముద్రోత్తర మండలము | సయెన్నె |
| 10. | బొలీవియా * | 10,98.581 | 35,95,600 | స్వతంత్ర రాజ్యము | లపజ్ |
| 11. | బ్రిటిష్ పాలిత ప్రాంతములు | | | | |
| | i. ఫాక్‌లండ్ దీవులు | 21,724 | 2,693 | బ్రిటిష్ వలస రాజ్యము | స్టాన్లీ |
| | ii. బ్రిటిష్ గయానా | 2,14,969 | 5,90,140 | స్వాతంత్ర్య ప్రతిపత్తిగల రాజ్యము | జార్జిటవున్ |
| 12. | బ్రెజిల్ * | 85,11,965 | 7,75,21,000 | స్వతంత్ర రాజ్యము | బ్రసీలియా |
| 13. | వెనిజ్యులా * | 9,12,050 | 81,43,629 | స్వతంత్ర గణరాజ్యము | కారకాస్ |

| | ఉ. అమెరికా & మధ్య అమెరికా | | | | |
|---|---|---|---|---|---|
| 1. | ఎల్ సాల్వడార్ * | 1,08,889 | 40,95,203 | స్వతంత్ర రాజ్యము | సాన్ సాల్వడార్ |
| 2. | కెనడా * | 99,76,177 | 1,89,28,000 | స్వతంత్ర రాజ్యము | ఒట్టావా |
| 3. | కోస్టారికా * | 50,700 | 13,55,757 | స్వతంత్ర రాజ్యము | శాన్ జోస్ |
| 4. | క్యూబా * | 1,14,524 | 72,02,752 | స్వతంత్ర ద్వీప రాజ్యము | హవానా (హబానా) |
| 5. | గ్రీన్‌లాండ్ | ర. 21,75,600 | 33,140 | స్వతంత్ర ప్రతిపత్తిగల ద్వీపరాజ్యము | గోడ్‌తాబ్ |
| 6. | గ్వాతెమాలా * | 1,08,889 | 40,95,203 | స్వతంత్ర రాజ్యము | గ్వాతెమాలా |
| 7. | జమైకా * | 10,962 | 16,96,000 | స్వతంత్ర ద్వీప రాజ్యము | కింగ్‌స్టన్ |
| 8. | ట్రినిడాడ్ అండ్ టొబాగో * | 5,128 | 8,67,000 | స్వతంత్ర రాజ్యము | పోర్ట్ ఆవ్ స్పెయిన్ |
| 9. | డొమినికన్ రిపబ్లిక్ * | 48,734 | 33,34,300 | స్వతంత్ర రాజ్యము | క్యుదద్ త్రూజిల్లో |
| 10. | నికరాగ్వా * | 1,48,000 | 15,29,094 | స్వతంత్ర రాజ్యము | మనగ్వా |
| 11. | నెదర్‌లండ్స్ ఆంటిలీస్ * | 960 | 1,94,458 | స్వతంత్ర రాజ్యము | విలెమ్‌స్టాడ్ |
| 12. | పనామా * | 75,650 | 11,77,419 | స్వతంత్ర రాజ్యము | పనామా |
| 13. | ఫ్రెంచి పాలిత ప్రాంతములు | | | | |
| | i. గ్వాడలోప్ | 1,777 | 2,82,561 | ఫ్రెంచి సముద్రోత్తర ద్వీప రాజ్యము | బాసెటెరే |
| | ii. మార్టినిక్ | 1,100 | 2,91,357 | ఫ్రెంచి సముద్రోత్తర మండలము | ఫోర్ట్ - డి - ఫ్రాన్స్ |
| | iii. సెయింట్ పియెర్రీ అండ్ మికెలాన్ | 240 | 5,653 | ఫ్రెంచి సముద్రోత్తర మండలము | సెయింట్ పియెర్రీ |
| 14. | బ్రిటిష్ పాలిత ప్రాంతములు | | | | |
| | i. ఆంటిగ్వా | 442 | 54,304 | బ్రిటిష్ వలస రాజ్యము | సెయింట్ జాన్స్ |
| | ii. కేమన్ దీవులు | 259 | 8,511 | బ్రిటిష్ వలస రాజ్యము | జార్జిటవున్ |
| | iii. గ్రెనడా దీవులు | 344 | 88,677 | బ్రిటిష్ వలస రాజ్యము | సెం. జార్జెస్ |
| | iv. డొమినికా | 790 | 59,916 | బ్రిటిష్ వలస రాజ్యము | రోజో |
| | v. బహామా దీవులు | 11,406 | 1,22,000 | బ్రిటిష్ వలస రాజ్యము | నస్సావ్ |
| | vi. బార్ బడోస్ | 430 | 2,41,706 | స్వయంపరిపాలక బ్రిటిష్ వలసరాజ్యము | బ్రిజ్‌టవున్ |
| | vii. బెర్మ్యూడా | 54 | 45,491 | బ్రిటిష్ వలస రాజ్యము | హామిల్టన్ |
| | viii. బ్రిటిష్ హోండూరాస్ | 23,963 | 90,343 | బ్రిటిష్ వలస రాజ్యము | బెలీజే |
| | ix. సెయింట్ కిట్స్ - నెవిస్ ఆంగ్విలా | 396 | 56,591 | బ్రిటిష్ వలస రాజ్యము | బస్సేటెర్రే |
| | x. సెయింట్ లూసియా | 616 | 86,108 | బ్రిటిష్ వలస రాజ్యము | కాస్ట్రీస్ |

* ఐక్యరాజ్యసమితి సభ్యదేశములు.

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| | xi. టర్క్స్ & కైకోస్ దీవులు | 430 | 6,122 | బ్రిటిష్ వలస రాజ్యము | గ్రాండ్ టర్క్ |
| | xii. వర్జిన్ దీవులు | 153 | 7,340 | బ్రిటిష్ వలస రాజ్యము | రోడ్ టవున్ |
| | xiii. మాంట్ సెరాట్ | 83 | 12,771 | బ్రిటిష్ వలస రాజ్యము | ప్లిమత్ |
| | xiv. సెయింట్ విన్సెంట్ | 389 | 81,975 | బ్రిటిష్ వలస రాజ్యము | కింగ్స్ టౌన్ |
| 15. | మెక్సికో * | 19,72,546 | 3,84,16,043 | స్వతంత్ర రాజ్యము | మెక్సికో సిటీ |
| 16. | యునైటెడ్ స్టేట్స్ * | 93,63,389 | 19,08,18,000 | గణతంత్ర రాజ్యము | వాషింగ్టన్ |
| 17. | యునైటెడ్ స్టేట్స్ పాలిత ప్రాంతములు | | | | |
| | i. పనామా కాలువ ప్రాంతము | 1,445 | 41,517 | యు. స్టేట్స్ అధీనములోనిది | బాల్బొయా హైట్స్ |
| | ii. పోర్టోరికో | 8,896 | 24,54,600 | యునైటెడ్ స్టేట్స్ కామన్ వెల్త్ | సాన్ ఖువాన్ |
| | iii. వర్జిన్ దీవులు | 344 | 35,430 | యు. స్టే. లో చేర్చబడని ప్రాంతము | షార్లాటీ ఆమాలియా |
| 18. | హాయిటీ * | 27,750 | 44,48,000 | స్వతంత్ర గణరాజ్యము | పోర్ట్ - ఆవ్ - ప్రిన్స్ |
| 19. | హొండూరాస్ * | 1,12,088 | 20,07,990 | గణతంత్ర ప్రజాస్వామిక రాజ్యము | టెగు సిగల్పా |
| | **హిందూమహాసముద్ర ప్రాంతములు** | | | | |
| 1. | కాకోస్ దీవులు | 13 | 619 | ఆస్ట్రేలియా దేశాంతర ప్రదేశము | — |
| 2. | కొమొరో ద్వీపజాలము | 2,199 | 1,85,000 | ఫ్రెంచి సముద్రోత్తర మండలము | జౌడ్ జీ (మాయాట్) |
| 3. | క్రిస్టమస్ దీవి | 142 | 32,000 | ఆస్ట్రేలియా దేశాంతర ప్రదేశము | — |
| 4. | మారిషస్ | 2,090 | 7,10,000 | బ్రిటిష్ వలస రాజ్యము | పోర్ట్ లూలూ |
| 5. | మాల్ దీవులు * | 298 | 90,000 | బ్రిటిష్ సంరక్షిత రాజ్యము | మాలే (మాల్ దీవి) |
| 6. | రీ యూనియన్ | 2,512 | 3,63,000 | ఫ్రెంచి సముద్రోత్తర మండలము | సెయింట్ - డెనిస్ |
| 7. | సైకెల్లిస్ (సెషెల్జె) | 404 | 43,750 | బ్రిటిష్ వలస రాజ్యము | పోర్ట్ విక్టోరియా |
| | **యూరప్** | | | | |
| 1. | ఆన్డొర్రా | 464 | 11,356 | ప్రజాగణ రాజ్యము | ఆన్డొర్రా లా వెల్లా |
| 2. | ఆల్ బేనియా * | 28,748 | 17,11,300 | ప్రజాగణ రాజ్యము | టిరేన్ (టిరనా) |
| 3. | ఆస్ట్రియా * | 83,849 | 71,50,700 | ప్రజా సత్తాక గణ రాజ్యము | వియెన్నా |
| 4. | ఇటలీ * | 3,01,225 | 5,04,21,000 | స్వతంత్ర గణరాజ్యము | రోమ్ |
| 5. | ఐర్లాండ్ * | 84,239 | 28,41,000 | స్వతంత్ర ద్వీపరాజ్యము | డబ్లిన్ |
| 6. | ఐస్లాండ్ * | 1,03,000 | 1,83,478 | స్వతంత్ర గణ రాజ్యము | రైక్జవిక్ |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 7. | గ్రీస్ (ద్వీప సముదాయముతో సహా) * | 1,31,944 | 84,68,628 | స్వతంత్ర రాజ్యము | ఏథెన్స్ (ఎథెనాయ్) |
| 8. | జర్మనీ, తూర్పు (తూర్పు బెర్లిన్‌తో కలిసి) | 1,07.863 | 1,70,11,000 | స్వతంత్ర ప్రజాగణ రాజ్యము | తూర్పు బెర్లిన్ |
| 9. | జర్మనీ, పశ్చిమ (పశ్చిమ బెర్లిన్‌తో కలిసి) | 2,48,178 | 5,82,90,000 | సమాఖ్య గణరాజ్యము | బోన్ |
| 10. | జెకొస్లోవాకియా * | 1,27,869 | 1,39,01,763 | స్వతంత్ర ప్రజాగణరాజ్యము | ప్రాగ్ (ప్రహా) |
| 11. | డెన్మార్క్ * | 43,880 | 45,85,256 | స్వతంత్ర రాజ్యము | కోపెన్ హేగన్ |
| 12. | నార్వే * | 3,24,219 | 36,81,000 | స్వతంత్ర రాజ్యము | ఆస్లో |
| 13. | నార్వే పాలిత ప్రాంతములు | | | | |
| | i. స్వాల్‌బార్డ్ ద్వీపజాలము | 61,230 | 3,000 | నార్వే సామ్రాజ్యములోని భాగము | — |
| 14. | నెదర్‌లండ్స్ * | 33,612 | 1.20,28,808 | స్వతంత్ర రాజ్యము | ఆమ్‌స్టర్ డామ్ |
| 15. | పోర్చుగల్ (అజోర్స్, మదీరా కలిపి) * | 91,971 | 90,90,000 | స్వతంత్ర రాజ్యము | లిస్బన్ (లిస్‌బోవా) |
| 16. | పోలండ్ * | 3,11,730 | 3,08,06,000 | స్వతంత్ర రాజ్యము | వార్సా |
| 17. | ఫిన్లాండ్ (అలండ్ దీవులతో సహా) * | 3,37,009 | 45,59,000 | స్వతంత్ర రాజ్యము | హెల్‌సింకి |
| 18. | ఫ్రాన్స్ * | 5,47,026 | 4,78,40,000 | స్వతంత్ర గణరాజ్యము | పారిస్ |
| 19. | బల్గేరియా * | 1,10,669 | 80,45,200 | స్వతంత్ర రాజ్యము | సోఫియా |
| 20. | బెల్జియమ్ * | 30,507 | 92,51,414 | స్వతంత్ర రాజ్యము | బ్రస్సెల్స్ |
| 21. | బ్రిటిష్ పాలిత ప్రాంతములు | | | | |
| | i. ఛానెల్ దీవులు | 194 7 | 1,10,503 | బ్రిటిష్ ధర్మకర్తృత్వ ప్రాంతములు | సెయింట్ హీలియెర్ |
| | ii. జిబ్రాల్టర్ | 5.83 | 24,075 | బ్రిటిష్ వలస | జిబ్రాల్టర్ |
| | iii. మ్యాన్ దీవి | 588 | 48,150 | కామన్‌వెల్త్‌న అంతరంగిక స్వపరిపాలన కల దీవి | డగ్లస్ |
| 22. | మాల్టా (ద్వీపములతో సహా)* | 316 | 3,29,000 | కామన్‌వెల్త్‌న అంతరంగిక స్వపరిపాలన కల రాజ్యము | వలెటా |
| 23. | మొనాకో | 1.5 | 22,500 | స్వతంత్ర రాజ్యము | మొనాకోవిల్లీ |
| 24. | యుగోస్లావియా * | 2,55,804 | 1,91,50,000 | స్వతంత్ర ప్రజాగణరాజ్యము | బెల్‌గ్రేడ్ |
| 25. | యునైటెడ్ కింగ్‌డమ్ * | 2,44,030 | 5,34,41,000 | స్వతంత్ర ప్రజాస్వామిక రాజ్యము | లండను |
| 26. | రుమేనియా* | 2,37,500 | 18,38,721 | స్వతంత్ర ప్రజాగణరాజ్యము | బుఖారెస్ట్ |
| 27. | లక్సెంబర్గ్ * | 2,586 | 3,23,971 | స్వతంత్ర రాజ్యము | లక్సెంబర్గ్ |
| 28. | లిక్టెన్‌స్టీన్ | 160 | 17,800 | స్వతంత్ర రాజ్యము | వాడజ్ |

* ఐక్యరాజ్యసమితి సభ్యదేశములు.

| వరుస సంఖ్య<br>1 | రాజ్యము<br>2 | విస్తీర్ణము (చ. కి. మీ.)<br>3 | జన సంఖ్య<br>4 | రాజకీయ ప్రతిపత్తి<br>5 | రాజధాని<br>6 |
|---|---|---|---|---|---|
| 29. | వాటికన్ నగరరాజ్యము | 0.5 | 1,010 | పోప్ పాలిత నగరరాజ్యము | వాటికన్ |
| 30. | సాన్ మారినో | 99 | 17,000 | స్వతంత్ర రాజ్యము | సాన్ మారినో |
| 31. | సోవియట్ రష్యా * | 2 21,89,081 | 22,47,64,000 | సోషలిస్ట్ గణరాజ్యము | మాస్కో |
| 32. | స్పెయిన్ (కేనరీ దీవులు కలసి) * | 5,04,748 | 3,10,77,104 | స్వతంత్ర రాజ్యము | మాడ్రిడ్ |
| 33. | స్విజర్లండ్ | 41,295 | 58,74,000 | స్వతంత్ర ప్రజాస్వామిక రాజ్యము | బెర్న్ |
| 34. | స్వీడన్ * | 4,49,793 | 65,81,287 | స్వతంత్ర రాజ్యము | స్టాక్ హోమ్ |
| 35. | హంగేరీ* | 93,030 | 1,01,04,000 | స్వతంత్ర ప్రజాగణరాజ్యము | బుడాపెస్ట్ |
| | అంటార్కిటికా | 1,55,40,000 | | | |
| 1. | అం. టికా (160° తూ. అక్షాంశ మొదలు 40° తూ. అక్షాంశ వరకు 60° ద. అక్షాంశ రేఖ దిగువనున్న ప్రాంతము). | ర. 64,02,445 | ↓ | ఆస్ట్రేలియాకు చెందినది | |
| 2. | బొవ్వెట్ దీవి, పీటర్ వన్ దీవి, క్వీన్ మాడ్ లాండ్. | ర. 482 | జ నా వా స | నార్వేకు చెందినది | |
| 3. | 20 మొదలు 80° పశ్చిమ అక్షాంశ వరకు 60° ద. అక్షాంశ రేఖ దిగువన గల ప్రాంతము. | ర. 3,88,493 | ర హి త ము | బ్రిటిష్ వారికి చెందినది | |
| 4. | 60° ద. అక్షాంశ రేఖ దిగువ 100° తూర్పు అక్షాంశ మొదలు 150° పశ్చిమ అక్షాంశ వరకు ఉన్న ప్రాంతము. | ర. 4,14,393 | | న్యూజీలండ్ నకు చెందినది | |
| 5. | అనాక్రమితము | ర. 70,39,112 | ↑ | ఎవ్వరికి చెందనిది | |

* ఐక్యరాజ్యసమితి సభ్యదేశములు.

మున ఈ రాజ్యము ఏర్పడినటుల తెలియవచ్చుచున్నది. కాని, ఈ రాజ్యమును 17 వ శతాబ్దినుండి పాలించిన హోయెన్ జొల్లెర్న్ వంశీక ప్రభువుల కాలమున దీనికి ఉచ్చస్థితి ప్రాప్తించినది. ఈ వంశమునకు చెంది, ఈ రాజ్యమును స్వతంత్రముగ పాలించిన వారిలో తొలుతటివాడు ఫ్రెడరిక్ విలియమ్ (1640 - 1688).

ఈ వంశమునకు చెందిన ఫ్రెడరిక్ - II (1712 - 1786) [చూ. పు. 639] సమర్థుడగు పరిపాలకుడు. ఈతడు తన సమర్థతవలన, రాజనీతిజ్ఞత వలన ప్రష్యాను సంపన్నమైన రాజ్యముగ చేసెను. నెపోలియన్ యుద్ధముల సమయములో ప్రష్యా నెపోలియన్ అధీనమయ్యెను. 1807 లో నెపోలియన్‌తో చేసికొన్న టిల్సిట్ సంధితో ప్రష్యా తన భూభాగములో సగమును నష్టపోయెను. కాని, నెపోలియన్ యుద్ధముల ఫలితముగానే ప్రష్యా జర్మనీకి నాయకత్వము వహించగలిగెను. 1800 తరువాత బిస్మార్క్ [చూ.] ముఖ్య మంత్రిత్వముక్రింద ప్రష్యా చాల భూభాగము జయించి, ఆస్ట్రియాతో యుద్ధమున గెలిచినది. ఈ యుద్ధానంతరము ఉత్తర జర్మనీ సమాఖ్య ఏర్పడినది. మాన్ నదికి ఉత్తరమున గల 22 జర్మను రాష్ట్రములు ఈ సమాఖ్యలో చేరినవి. దీనికి ప్రష్యా రాజు అధ్యక్షుడు అయ్యెను.

1870 లో జరిగిన ఫ్రాంకో - ప్రష్యన్ యుద్ధము [చూ.] లో జర్మన్ రాష్ట్రములు ప్రష్యాతో సహకరించినవి. 1871 లో ప్రష్యా రాజు, హోయెన్ జొల్లెర్న్ వంశీయుడు అగు విలియమ్ - I జర్మన్ చక్రవర్తి అయ్యెను. ప్రథమ ప్రపంచ యుద్ధానంతరము వరకును జర్మనీని హోయెన్ జొల్లెర్న్ వంశీయులే పాలించిరి. ప్రథమ ప్రపంచ యుద్ధానంతరమున జర్మనీలోని ఒక రాష్ట్రముగ మాత్రమే ప్రష్యా పరిణమించినది [చూ. జర్మనీ పు. 467]. ప్ర. రా.

**ప్రాచ్య రోమన్ సామ్రాజ్యము :** చూ. బైజాంటైన్ సామ్రాజ్యము.

**ప్రాథమిక హక్కులు :** చూ. పు. 226.

**ప్రౌడాన్, పియొరి జోసెఫ్** (1809 - 1865) : ఫ్రెంచి దేశీయుడు. సామాజికవాది; సంస్కర్త. 1840 లో ఇతడు రచించిన 'ఆస్తియన ఏమి ?' అను గ్రంథము ఆ శతాబ్దమున వ్యాప్తినందుచున్న సామాజికవాద భావనకు అతి సహకారి అయ్యెను. ఆస్తి సంపాదించుట పర ధనాపహరణ తప్ప మరేమియు కాదని ఇతడు ఆ గ్రంథమున నిర్వచించెను. ఈ భావముల వలన ఇతడు ఫ్రెంచి ధనిక స్వాములకు వ్యతిరేకి అయినను, మార్క్సువంటి యువకులు ఇతనికి అభిమానులును, అనుయాయులును అయిరి.

కొన్నాళ్ల తరువాత కమ్యూనిస్ట్ సిద్ధాంతములను వదలిపెట్టి, ప్రస్తుత సమాజ స్థితికిని, కమ్యూనిస్ట్‌లు వాంఛించు స్థితికిని మధ్యేమార్గము అవలంబింప నిశ్చయించుకొనెను.

ఇతడు వడ్డీలు లేకుండ అప్పులు ఇచ్చు ప్రజల బ్యాంకును 1849 లో స్థాపింప యత్నించెను. కాని, ఆ ప్రయత్నము విఫలమయ్యెను. తరువాత తన కొన్ని తీవ్రవాదపు ఉపన్యాసములకు ఫలితముగ ఇతడు మూడేండ్ల కారాగారవాసమును అనుభవింపవలసి వచ్చెను. కారాగృహము నుండి వెలుపలికి వచ్చిన తరువాత కొంతకాలమునకు 1858 లో అతడు క్రైస్తవ మత సంస్థలను విమర్శించుచు ఒక గ్రంథమును రచించినందులకై ప్రభుత్వము అతనిపై నేరారోపణ చేయగా, శిక్షనుండి తప్పించుకొను ఉద్దేశముతో అతడు స్వదేశమును వదలి, బెల్జియమ్ నందలి బ్రస్సెల్స్‌లో కొంతకాలము గడపి, ఆరోగ్యము శిథిలమగుటచే తిరిగి స్వదేశమునకే వచ్చెను.

సమాజవాద చరిత్రలో ప్రౌఢాన్‌కు అత్యంత ప్రధానమైన స్థానము కలదు. ధర్మము, స్వాతంత్ర్యము, సమానత్వము ఈతని విశ్వాసములు. అందరు వ్యక్తుల శ్రమ ఒక విధమయినదే అని ఈతని వాదన. ఆస్తి అనినను, పెట్టుబడి అనినను ఈతనికి అసహ్యము. కాని, ఈతడు హఠాద్విప్లవము తెచ్చి మార్పులు సాధించు పద్ధతికి వ్యతిరేకి. కాలక్రమమున సంస్కరణలు అమలు జరుపవలెనని ఈతని భావము.

మానవునిలో క్రమపరిణామము వలన ప్రభుత్వము అనవసరమగు స్థితి వచ్చునని ప్రౌఢాన్ విశ్వసించెను. అరాజకత్వ వాదమునకు ఇతడు పితామహుడని చెప్పవచ్చును. సమాజ స్థితికి అవసరమైన నియమము చట్టముల వలని భయము వలన గాక, మానవుల హృదయములో నుండి ఇచ్ఛాపూర్వకముగనే సముద్భవించు దశ అరాజకత్వము అని ఈతడు నిర్వచించెను. ప్ర. రా.

**ప్లూటార్క్** (క్రీ. శ. 46 - 120 ర.) : గ్రీక్ రచయిత; జీవిత చరిత్రల రచనలో సిద్ధహస్తుడు. ఈతడు రచించిన '46 తాదృశ జీవితములు (46 పేరలల్ లైవ్స్)' అను గ్రంథము తరువాతికాలము వారి కందరికిని జీవితచరిత్ర రచనలో మార్గదర్శకమైనది. ఈ గ్రంథములో ఒక గ్రీక్ ప్రముఖుని జీవితము, తదుపరి దానికి సాటియని భావింపదగు ఒక రోమన్ ప్రముఖుని జీవితము జోడించి వరుసగ వ్రాయబడెను. ఈతడు ఈ గ్రంథమును రచించుటకు తొలుతగ గ్రీస్, ఇటలీ, ఈజిప్టు దేశములలో సంచారము చేసి, అనేక విషయములు సంగ్రహించి, గ్రీస్ దేశమందలి

తన జన్మభూమి కెరోనియాకు తిరిగి వచ్చి, అపోలో దేవునికి అర్చకుడుగ స్థిరపడి, అచట తన గ్రంథము రచించెనని చెప్పుదురు.

చరిత్ర రచయితగ ఇతనికి ఒక ప్రముఖ స్థానమును ఆ గ్రంథము సమకూర్చినది. కాని, గ్రీక్ వీరుల విషయమున ఈతడు చూపిన పరిశోధన సామర్థ్యము రోమన్ల ఎడ ప్రదర్శించలేదని ఈ గ్రంథము వలన సుస్పష్టము అగుచున్నది. ఈ గ్రంథమున మరొక లోపము కలదు. రచయిత వివిధ జీవితములను చిత్రించుటలో ఐతిహాసిక ప్రాముఖ్యమునకు ఎక్కువ విలువను ఈయక, నైతిక దృష్ట్యా వానిని పరిశీలించెను. అందువలన చారిత్రకముగ వాని విలువకు కొంత లోటు ఏర్పడినది. పై గ్రంథమునే కాక, ప్లూటార్క్ ఇంకను ఖగోళాది శాస్త్రములను గురించి పెక్కు గ్రంథములను, 'ఆపేరా మోరాలియా' అను పేర నీతి విషయక వ్యాసమంజరిని రచించెను. ప్ర. రా.


ప్లూటార్క్
(క్రీ. శ. 46 – 120 ర.)

ప్లెబిసైట్ : చూ. జనవాక్యము – పు. 460.

ప్లేటో (క్రీ. పూ. 427 – 347): ప్రాచీన గ్రీక్ తాత్త్వికుడు; మేధావి; సోక్రటీస్ [చూ.] శిష్యుడు. మంచి కుటుంబమున జన్మించెను. ఏథెన్స్ ప్రభుత్వమువారు సోక్రటీస్‌నకు విధించిన మరణ దండనముచే ఇతనికి ఆ ప్రభుత్వముపై అసహ్యాభావము కలిగి, గ్రీక్ ప్రజాప్రభుత్వ సిద్ధాంతముల పట్ల ఇతనికి విశ్వాసము పోయెను. 'రిపబ్లిక్' అను ప్రసిద్ధ గ్రంథములో ఇతడు ఒక ఆదర్శరాజ్యమును గురించి వ్రాసెను. అందులో విజ్ఞాననిధులైన తత్త్వజ్ఞులే అమాయకులగు ప్రజలను ఏలవలయునని అతడు తెలిపెను [చూ. సం. 7 – పు. 540]. ప్ర. రా.


ప్లేటో
(క్రీ. పూ. 427 – 347)

**ఫాక్‌లాండ్ దీవులు :** దక్షిణ అట్లాంటిక్ నందలి బ్రిటిష్ వలస రాజ్యము. దక్షిణ అమెరికా దక్షిణాగ్రమునకు ఈశాన్యమున దాదాపు 402 కిలోమీటరుల దూరముగ ఉన్న ఈ ద్వీపరాజ్యమున తూర్పు, పశ్చిమ ఫాక్‌లాండ్ దీవులే కాక, సౌత్ జార్జియా, సౌత్ ఆర్కనీస్, సౌత్ సాండ్‌విచ్, సౌత్ షెట్‌లాండ్, గ్రాహంలాండ్ ద్వీపములును చేరి ఉన్నవి. ఈ ద్వీపరాజ్యపు [వి] 21,724 చ. కి. మీ.; [జ] దాదాపు 2,693. వీరందరును బ్రిటిష్ సంతతి వారు. [మ] అత్యధిక సంఖ్యాకులు ప్రొటెస్టంట్ క్రైస్తవులు. [రా] స్టాన్లీ (జ. సం. 1,135).

చరిత్ర : 1592 లో జాన్ డేవిస్ అను ఆంగ్లేయుడు ఈ ద్వీపములను కనుగొనెను. 1690 లో కెప్టెన్ స్ట్రాంగ్ అను బ్రిటిష్ నావికుడు ఈ ద్వీపములందలి పలు తావులను కనుగొని, దీనికి 'ఫాక్‌లాండ్' అని నామకరణము చేసెను. వీనిలో తూర్పు దీవులను 1764 లో ఫ్రెంచివారును, ఆ మరుసటి సంవత్సరమున పశ్చిమ దీవులను బ్రిటిష్‌వారును తమ తమ రాజ్యములకు చెందినవిగ ప్రకటించిరి. ఫ్రెంచివారి తూర్పు దీవులను స్పెయిన్‌వారు 1766 లో కొనుగోలు చేసిరి. తరువాత పలుమారులు చేతులుమారి తుదకు 1833 లో బ్రిటిష్‌వారికే తూర్పు దీవులును సంక్రమించినవి. అది మొదలుగ ఆ ద్వీపరాజ్యము అంతయు బ్రిటిష్‌వారి వలస రాజ్యముగ ఉన్నది. ప్రథమ ప్రపంచ యుద్ధకాలమున జర్మనీ నౌకాదళముకును, బ్రిటిష్ నౌకాదళముకును మధ్య ఈ ద్వీపముల సమీపమున జరిగిన పోరాటము ఆ యుద్ధ చరిత్రలో అత్యంత ప్రాముఖ్యము గడించినది. ఆ యుద్ధ ఫలితముగ బ్రిటిష్ నౌకా బలాధిక్యము రుజువైనది. బ్రిటిష్ ప్రభుత్వముచే నియమింపబడు గవర్నర్ కార్యవర్గ సహాయమున అచట పరిపాలన నెరపుచున్నాడు. శాసన సభయందు ప్రజలచే ఎన్నుకొనబడు ప్రతినిధులు అల్పసంఖ్యాకులుగ మాత్రమే కలరు. మ. ఆ. శ.

ఫార్మోజా (తైవాన్): చూ. తైవాన్ (చీనా) – పు. 522.

**ఫాసిజమ్ :** ద్వితీయ ప్రపంచ యుద్ధమునకు దారితీసిన రాజకీయ వాదములలో ఇది ఒకటి. ఈ వాదమును అవలంబించిన వారిని 'ఫాసిస్టులు' అని వ్యవహరింతురు. ఇటలీ దేశమున బెనిటో ముస్సోలినీ నాయకత్వమున రూపొందిన రాజ్య సర్వస్వాధికారవాదమునకే ఫాసిజమ్ అను ఈ పేరు వాడుకలోనికి వచ్చినది. ఆ దేశమున 1922, అక్టోబరులో ఈ వాదమును అవలంబించిన పక్షము ముస్సోలినీ నాయకత్వమున అధికారమును హస్తగతము చేసికొనిన తరువాత ఈ వాదమునకు ఆ దేశపు ప్రజానీకమున అత్యధిక వ్యాప్తి చేకూరి, ఇతర దేశములందును తాదృశములగు ఉద్యమములకు దారితీసినది [చూ. నాజీవాదము – పు. 530].

'ఫాసిజమ్' అను ఇటాలియన్ పదము ఫాసీస్ అను లాటిన్‌పదము నుండి వచ్చినది. 'ఫాసీస్' అనగా 'గొడ్డలి దోపిన కట్టెలమోపు' అని అర్థము. ప్రాచీన కాలపు రోమ్‌లో నాటి మాజిస్ట్రేట్‌లకు ముందుగా అధికార లాంఛనముగా కొనిపోబడు కట్టెలమోపును, గొడ్డలిని ఈ పదము సూచించును. ఆదిలో ఫాసిజమ్ ఒక నియత సిద్ధాంతము కాదు. విస్పష్టము, విస్తృతము అగు ఎట్టి ప్రణాళిక గాని దానికి లేకుండెను. కేవలము బలవన్మార్గములతో అధికారము కైవసము చేసికొని నిలుపుకొనుటకు ఫాసిజమ్ ఒక సాధన మాత్రముగానే ఉండెను. అత్యాశ్చర్యకరముగా ఈ వాదము ఆ ఏకైక ఆశయ సాధనమందు తన కార్య ప్రణాళికలోని ఇతర అంశములు అన్నిటిని పూర్తిగ అప్రధానము ఒనర్చివేసినది. ఆరంభము నుండియు సమరోత్సాహము, సైనిక క్రమశిక్షణ, నిర్దాక్షిణ్యముగ కార్యాచరణకు కడంగుట మొదలగు గుణములను ఉత్కర్షించునట్టియు, నైతిక సూత్రములు సంకల్ప ద్రఢిమను సడలించునని భావించునట్టియు దృక్పథమే ఈ వాదములో విశేష ప్రాబల్యమును వహించి ఉండెను.

హేతుసంబద్ధతతో నిమిత్తము లేకుండా సహజ ప్రవృత్తిని అనుసరించి కార్యాచరణకు ఉత్సాహముతో ముందుకు దూకవలెనని ఫాసిజమ్ బోధించును. బలవంతులు బలహీనుల పైని, దృఢ సంకల్పులు సంశయాత్ముల పైని ప్రభుత్వము నెరపుట అను 'ప్రకృతి సిద్ధమగు కఠోర నియమము' ను ఫాసిస్ట్‌లు సమర్థించుచు, తద్ద్వారా తమ జాతి ఎక్కువ శక్తిమంతము, ధైర్యవంతము, దృఢ సంకల్ప సహితము అగునట్లు ఉద్బోధించి, క్రమముగా తమ ఉద్యమములో విజయము సాధింప జూచిరి. శాంతి సామరస్యములను గూర్చిన భావనయే ఫాసిజమ్‌నకు సరిపడదు. ఈ శాంతి ప్రతికూలతత్త్వమును ఫాసిజమ్ వ్యష్టి జీవితము లోనికి కూడ వ్యాపింపజేసినది.

ద్వితీయ ప్రపంచ యుద్ధము [చూ. పు. 608] న మిత్ర మండలి విజయమువలన బెనిటో ముస్సోలినీ [చూ.] తో పాటుగ పాసిజమ్ కూడ అంతరించినది అనియే చెప్పవచ్చును. కాని, ఆ వాదపు ఛాయలు మాత్రము ఈనాటికిని దక్షిణ ఆఫ్రికా వంటి కొన్ని దేశములందు అచ్చటచ్చట అప్పుడప్పుడు వెర్రితలలు వేయుచు ఆందోళనా జనకములు అగుచున్నవి. ప్ర. రా.

**ఫిజీ దీవులు :** బ్రిటిష్‌వారి పాలనలో ఉన్న ఒక ద్వీప రాజ్యము.

పసిఫిక్ మహాసముద్రమున 180° రేఖాంశకు ఉభయ పార్శ్వముల దక్షిణ అక్షాంశరేఖ 15° నుండి 20° వరకు అటనట చెదరి ఉన్న దాదాపు 320 ద్వీపములు ఈ ఫిజీ ద్వీప రాజ్యమున చేరి ఉన్నవి. రోటూమా అను వేరొక ద్వీపము ఈ ద్వీప సమూహమునకు కొలది దూరమున ఉన్నను, పరిపాలన రీత్యా ఇందే చేరి ఉన్నది. ఈ ద్వీపములలో వీటీలెవూ (10,388 చ. కి. మీ.), వనువాలెవూ (5,534 చ. కి. మీ.) అనునవి ప్రముఖములు. ఈ ద్వీపములు అన్నిటి మొత్తపు [వి] 18,278 చ. కి. మీ.; [జ] 4,14,000. జనులలో 2,05,068 మంది వలస వచ్చిన భారతీయుల సంతతికి చెందినవారు. 1,72,455 మంది ఫిజీ ఆదివాసుల సంతతివారు. తక్కిన వారిలో యూరపియన్‌లు, చీనీయులు, తక్కిన పసిఫిక్ జాతులవారు దాదాపు సమాన సంఖ్యలో కలరు. [భా] భారతీయులందు హిందీ, ఫిజీయన్‌లందు వివిధ పసిఫిక్ భాషలును మాతృభాషలుగ వ్యాప్తియందు ఉన్నవి. వ్యవహార భాష ఆంగ్లము. [మ] భారతీయులలో 90% హిందువులు, తక్కినవారు ముస్లిమ్‌లు, ఫిజీ ఆదివాసులును, యూరపియన్‌లును క్రైస్తవులు. [రా] సూవా (జ. సం. 37,371).

చరిత్ర : 1643 లో డచ్చి అన్వేషకుడు అబెల్ టాస్మన్ ఈ ద్వీప సమూహమునందలి ఈశాన్య ప్రాంతపు ద్వీపములను, 1773 లో ఆంగ్ల దేశీయుడగు కుక్ జేమ్స్ [చూ. పు. 391] అను అన్వేషకుడు మరికొన్ని ద్వీపములను కనుగొనెను. 1840 లో యునైటెడ్ స్టేట్స్ అన్వేషక దళము ఒకటి ఈ ద్వీపముల సమగ్ర పరిశీలన జరిపెను. ఇంతకు కొలది కాలము ముందుగనే ఆస్ట్రేలియా ప్రాంతమునుండి వచ్చిన కొందరు శ్వేతజాతి నావికులు ఇట నివాసములు ఏర్పరచుకొని, ఆదిమ జాతి నాయకులకు నవీన యుద్ధ సాధనములతో పరిచితిని కల్పించిరి. బావూ అను ద్వీపమును ఏలు ఒక నాయకుడు ఇందుమూలమున తక్కిన దీవులపై తన ఆధిపత్యమును నెలకొల్పెను (1829). ఇతని తర్వాత ఇతని తమ్ముడు 'తానో' అను అతడు పాలకుడై ఈ అధికారమును సుస్థిరము ఒనర్చెను. తానో యొక్క కుమారుడగు తకోంబావు 1857లో క్రైస్తవ మతమును స్వీకరించెను. పరిసరములందు ఉన్న టోంగా ద్వీపపు ప్రభువుల ఒత్తిడికి తాళజాలకను, దేశమునందలి తిరుగుబాటుల ఫలితముగ జరుగుచున్న రక్తపాతమును సహింపలేకను ఈ తకోంబావు రాజు తన రాజ్యమును 1874లో బ్రిటిష్ వారికి అప్పగించెను. బ్రిటిష్‌వారు ఇట సువ్యవస్థిత ప్రభుత్వమును స్థాపించి, చక్కెర చెరకు తోటలను నెలకొల్పిరి. ఈ చెరకు తోటలలో ఫిజీ ఆదివాసులు పనిచేయుటకు ఒప్పుకొనకుండుటచే 1880 మొదలుగ ఇచటికి భారతదేశమునుండి కూలీలను బ్రిటిష్ వారు కొని రాసాగిరి. ఇటుల కూలి పనికై చేరిన భారతీయులు ఇట స్థిరనివాసమును ఏర్పరచుకొనగా, వారి సంతతి క్రమముగ వృద్ధియై నేడు ఫిజీ ఆదివాసుల సంఖ్యను అధిగమించినది. ద్వితీయ ప్రపంచయుద్ధకాలము [చూ. పు. 608] న యుద్ధతంత్రరీత్యా ఈ ద్వీపసమూహము కీలకస్థానము వహించినది. యుద్ధానంతరమున ఇచట స్వయంపరిపాలనా

సంస్థలను నెలకొల్పుటకు బ్రిటిష్ ప్రభుత్వము కృషి చేసినది. కాని, సంపూర్ణ బాధ్యతాయుత పరిపాలన నెలకొల్పినచో, అధిక సంఖ్యాకులగు భారతీయసంతతివారికి అధికారము చేజిక్కునను భయముచే, తక్కిన వర్గములవారు అడ్డు తగులుటవలన ఆ ప్రతిపాదన అమలులోనికి రాకున్నది. ఫిజీ ఆదివాసుల భూమి అన్యజాతులవారి వశము కాకుండుటకై ప్రభుత్వము తగు రక్షణలు ఏర్పరచినది.

రాజ్యాంగము : బ్రిటిష్ ప్రభువు నియమించు గవర్నర్ ఇచట పరిపాలన నిర్వహించును. 1937 లో నిర్మింపబడి, అంతటంతట సవరణల పొందినను ఒక చట్టము ప్రకారము నియమింపబడిన ఒక శాసన సభ కలదు. ఈ శాసన సభకు గవర్నరే అధ్యక్షుడు. ఇందు 19 మంది అధికార సభ్యులును, 18 మంది ఎన్నుకొనబడిన సభ్యులును కలరు. ఫిజియన్‌లు, భారతీయులు, యూరపియన్‌లు అను ప్రత్యేక నియోజక ర్గములను అనుసరించి ఎన్నికలు జరుగును. దేశమునందు వ్యాప్తిలో ఉన్న ఏ భాషయందైన కనీసము ఒక వాక్య మును చదువగలిగిన వారికి అందరికిని వోటు హక్కు కలదు. ఫిజియన్‌లకు గల సంప్రదాయ స్థానిక పరిపాలనా స్వత్వ మును ప్రభుత్వము మన్నించుచున్నది. చి. శే. రా.

**ఫిన్లాండ్ :** యూరవ్ ఖండమున ఈశాన్య ప్రాంత మున ఉత్తరధ్రువ వృత్తరేఖపై నెలకొని ఉన్న ఒక స్వతంత్ర దేశము.

ఈ దేశమునకు సోవియట్ రష్యా [తూ]; ఫిన్లాండ్ సింధుశాఖ [ద]; బోత్నియా సింధుశాఖ, నార్వే [ప]; స్వీడెన్ నార్వే [ఉ] సరిహద్దులందు ఉన్నవి. [వి] ఆలండ్ దీవులతో సహా 3,37,009. చ. కి. మీ.; [జ] 45,59,000. దేశవాసులకు ఫిన్నులు అని వ్యవహారము కలదు. [భా] జాతీయభాష ఫిన్నిష్. స్వీడిష్ భాషను మాటాడువారు 9% కలరు; [మ] జనులందరు క్రైస్త వులు; అందు లూథరన్ చర్చి సంప్రదాయమునకు అధిక వ్యాప్తి కలదు. [రా] హెల్‌సింకి (జ. సం. 4,53,800).

చరిత్ర : ప్రముఖ మానవ జాతులలో ఒకటిగ పేరొందిన ఫిన్నో - ఉగ్రియన్ జాతికి చెందిన వారలు పలువురు సమీప మున ఉన్న బాల్టిక్ సముద్రతీర భూములనుండి క్రీ. శ. 100 ప్రాంతమున ఈ పరిసరములకు వలస వచ్చి, ఈ దేశమును క్రమముగ జనావాసముగ మార్చిరి అనుటకు బలవత్తరము లగు ఆధారములు కలవు. కాని, క్రీ. శ. 13 వ శతాబ్ది వరకు వీరు అందరు వేర్వేరు తెగలుగ విడివడి ఉండి, తమలో తాము కలహించుకొనుటయే కాక, ప్రక్కన ఉన్న స్వీడెన్ మొదలగు దేశములతోను పోరాడుచుండిరి. వీరిని జయించి వీరియందు క్రైస్తవ మతమును వ్యాపింపచేయ సంక ల్పించి, క్రైస్తవ మత పీఠాధిపతి పోప్ పరిసర క్రైస్తవ దేశముల రాజులను ప్రోత్సహించగా, దానిని పురస్కరించు కొని క్రీ. శ. 1155 ప్రాంతమున స్వీడెన్ రాజు ఎరిక్ - IX ఫిన్నులను జయించి, హెన్రీ అను మత ప్రచారకుని క్రైస్తవ మత వ్యాప్తికై ఆ దేశమున నిలిపెను. కాని, ఆతనిని జాతీయ ఋషిగ ఫిన్ను ప్రజలు ఆదరించినను,




అతని కృషి వలన మాత్రము క్రైస్తవ మతము ఎక్కువగ ఆ దేశమున వ్యాపింపలేదు. తరువాత 1209 లో థామస్ అను పేరుగల బ్రిటిష్ మత ప్రచారకుడు ఆ దేశమున వసించి అట క్రైస్తవ మతమునకు తన ప్రచారము మూల మున విపుల వ్యాప్తి కలిగించెను.

స్వీడిష్ పరిపాలన వలన స్వీడెన్ సంస్కృతియు, న్యాయ శాసనములును ఫిన్లాండ్‌నందు ఆదరితములు అయ్యెను. 1528 ప్రాంతమున స్వీడిష్ ప్రభువు ఫిన్లాండ్‌కు ఒక రాష్ట్ర స్థాయిని కల్పించెను. క్రమముగ 17 వ శతాబ్దమున ఆ దేశ ప్రజలకు ఒక జాతీయ శాసన సభ ఏర్పడు అవకాశమును స్వీడిష్ రాజు కలిగించెను. ఆ శాసనసభయందు మత పురోహితులు, యోధులు, వ్యాపారులు, రైతులు అను నాలుగు వర్గముల వారికి ప్రాతినిధ్యము కల్పింపబడెను. 18 వ శతాబ్దపు ప్రథమ దశకమునుండియు తమ సరిహద్దును ఆనుకొని ఉన్న ఈ దేశమును కబళించుటకై రష్యా చక్రవర్తులు పలు ప్రయత్నములు చేసిరి. 1710 లో రష్యా

చక్రవర్తి (జార్) పీటర్ [చూ - పు. 578] స్వీడెన్‌ను ఓడించి ఈ రాజ్యమును అంతటిని ఆక్రమింపగలిగెను ; కాని, తరువాత 1721 లో జరిగిన ఒక సంధిని అనుసరించి, ఈ దేశమునందలి ప్రాచ్య భాగమగు వైబర్గ్ రాష్ట్రమును మాత్రము తాము నిలుపుకొని, తక్కిన దానిని స్వీడెన్‌కు ఇచ్చివేసెను. ఆ తరువాత 1808 లో రష్యా చక్రవర్తి అలిగ్జాండర్ స్వీడెన్‌పై యుద్ధము ప్రకటించి ఓడించి, కుదుర్చుకొనిన ఒడంబడిక ఫలితముగ ఫిన్లాండ్ దేశమును, ఆ దేశమునకు చెందిన ఆలండ్‌దీవులును రష్యా కైవసమయ్యెను (1809). కాని, రష్యా చక్రవర్తి ఫిన్లాండ్ ప్రజల స్వాతంత్ర్యకాంక్షను మన్నించి, వారికి ఆంతరంగిక స్వతంత్ర పరిపాలన ఒసగి, అందులకు అనుగుణముగ రాజ్యాంగ విధానము ఒసగెను. కాని, రష్యా చక్రవర్తి అగు నికలస్ - II కాలమున ఈ సౌకర్యములు రద్దొనర్పబడెను (1899). ఫిన్లాండ్‌ను రష్యా సామ్రాజ్యమున అంతర్భాగముగ చేసి, ఆ దేశమున రష్యన్ భాషా - సంస్కృతులను వ్యాపింపచేయుటకు ఆ ప్రభువు పూనుకొనెను. ఆ ప్రయత్నమును దేశవ్యాపితమగు సమ్మెచే ఫిన్నులు ఎదుర్కొని ప్రతిఘటించిరి. కడకు 1899 కు పూర్వపు పరిపాలనా విధానమునే కొనసాగించుటకు చక్రవర్తి అంగీకరించెను (1905). కాని, రెండేండ్ల తరువాత తన వాగ్దానమును భంగమొనర్చి రష్యా చక్రవర్తి మరల ఫిన్లాండ్‌నందు నిరంకుశ పాలనను నెలకొల్పి, జాతీయ భాషా సంస్కృతుల నిర్మూలింప తీవ్ర యత్నములను చేసెను ; ప్రతిఘటించిన ప్రజానీకము పలు బాధలకు గురి అయ్యెను. ఇంతలో ప్రథమ ప్రపంచయుద్ధము ఆరంభమై (1914) రష్యా ప్రభువు ఆ యుద్ధమున నిమగ్నుడు కావలసివచ్చెను. తత్ఫలితముగ ఫిన్లాండ్‌న తన నిరంకుశ పాలనపు తీవ్రతను కొంతవరకు తగ్గించి, ప్రజల సహకారమును అపేక్షించి కొన్ని సౌకర్యములను ఆ చక్రవర్తి కలుగజేసెను. కాని, ప్రజలలో రష్యా ప్రభుత్వము ఎడల ద్వేషభావము మాత్రము సమయలేదు. 1917 లో రష్యాలోని విప్లవ ఫలితముగ రష్యా చక్రవర్తి ప్రభుత్వము పతనమైన అదనును అవకాశముగ గ్రహించి ఫిన్నిష్ ప్రజలు స్వాతంత్ర్యమును ప్రకటించిరి (డిసెంబరు 5, 1917). రష్యాలో అధికారమును గ్రహించిన బోల్షివిక్ ప్రభుత్వము ఈ స్వాతంత్ర్యమును గుర్తించెను (జనవరి 4, 1918). యుద్ధానంతరమున స్వతంత్ర పతిపత్తితో ఈ దేశము గణరాజ్యముగ సర్వతోముఖాభివృద్ధిని సాధించెను. ద్వితీయ ప్రపంచయుద్ధకాలము [చూ. పు. 608] న ఈ దేశము తటస్థముగ ఉండుటకు ఎంతయో కృషిచేసెను. కాని, సోవియట్ రష్యా తన భద్రత కొరకై ఈదేశపు సరిహద్దు ప్రాంతములను కొన్నింటిని ఆక్రమించుటకు పూనుకొనెను. చేయునది లేక ఫిన్నిష్ ప్రభుత్వము సేనల సమీకరించి సోవియట్ రష్యా సైన్యములతో రెండు తడవలు పోరాడెను (1939 - 40, 1941 - 44). ఎంత ధీరోధాత్తముగ పోరాడినను అసంఖ్యాకములగు సోవియట్‌రష్యా సేనల ధాటికి ఆగలేక, ఫిన్నిష్ సేన ఓడిపోయెను. తత్ఫలితముగ కొంత భూమినే కాక, ధనరూపమున నష్టపరిహారమును సైతము ఫిన్లాండ్ సోవియట్ రష్యాకు ఒసగెను. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరము ఈ ఫిన్లాండ్‌దేశము వివిధ రంగములందు గణనీయాభివృద్ధిని సాధింప గలిగినది.

రాజ్యాంగము : ప్రజాస్వామిక గణరాజ్య విధానపు పరిపాలన ఈ దేశమున అమలునందు ఉన్నది. కార్య నిర్వాహణాధికారమంతయు అధ్యక్షునియందు న్యస్తమై ఉన్నది. అధ్యక్షుడు ఆరేండ్లకు ఒక పర్యాయము 300 సభ్యులు గల నియోజక మండలి (ఎలక్టోరల్ కాలేజీ) చే, అందలి అధిక సంఖ్యాకుల సమ్మతితో ఎన్నుకొనబడును. అధ్యక్షుని ఎన్నిక జరుగు సంవత్సరమున జనవరి నెలలో ఈ నియోజక మండలి సభ్యులు ప్రజలచే ఎన్నుకొనబడుదురు. ఆ వెనువెంటనే ఫిబ్రవరి 15 న వారు సమావేశమై అధ్యక్షుని ఎన్నుకొనెదరు. కాని; ఈ విధానమునకు అపుడపుడు స్వస్తిచెప్పి పార్లమెంట్ సభ్యులే అధ్యక్షుని ఎన్నుకొనుటయు జరుగుచున్నది. అధ్యక్షుడే ప్రధానమంత్రిని, తక్కిన మంత్రి మండలి సభ్యులను నియమించును. 'పార్లమెంట్ (ఎడుస్‌కుంటా)' లో ఒక కక్ష్య మాత్రమే కలదు. అందు 200 మంది సభ్యులు ఉందురు. నాలుగేండ్లకు ఒకసారి వీరు ఎన్నుకొనబడెదరు. 21 ఏండ్లకు తక్కువ వయసు లేని వారికి అందరికి వోటు హక్కు కలదు. యూరప్ దేశములలో స్త్రీలకు వోటు హక్కు కలుగచేసిన (1906) దేశములలో ఈ దేశమే మొదటిది.

చీ. శే. రా.

**ఫిరోజ్ తుఘ్లుక్** : చూ. తుఘ్లుక్‌వంశము - పు. 519.

**ఫిలిప్పీన్ దీవులు** : పసిఫిక్ మహాసముద్ర పరివృతమగు ఒక స్వతంత్ర రాజ్యము. ఇందలి ప్రజలకు ఫిలిప్పినోలు అను వ్యవహారము కలదు.

ఆసియా ఖండమునకు ఆగ్నేయ దిశన, ఆ ఖండమునుండి దక్షిణ చీనా సముద్రముచే వేరుచేయబడిన దాదాపు 7,100 ద్వీపముల సముదాయమే ఈ రాజ్యము. [వి] ద్వీపములతో సహా 2,99,681 చ. కి. మీ. ; ఈ వైశాల్యమున దాదాపు 94% ఈ ద్వీపసముదాయమందలి ముఖ్యములగు 11 దీవులకు మాత్రమే చెందుచున్నది. లూజాన్, మిందనావో, సమార్, నెగ్రోస్, పలవాన్, పనయ్, మిందోరో, లెయిటీ, సేబూ, బోహోల్,

మస్బాతే అనునవి క్రమముగ ఈ 11 ప్రముఖ ద్వీపముల పేరులు. ఈ ఫిలిప్పిన్ ద్వీపసముదాయము అంతయు ఉ. అక్షాంశ రేఖ 21°—25′ నుండి 4°—45′ వరకు తూ. తులారేఖ 118° నుండి 127° వరకు విస్తరించి ఉన్నది. కాని, ఈ విశాల ప్రాంతము




లోనిదే అగు పల్మాస్ అను ద్వీపము మాత్రము 1928లో నెదర్లండ్స్ ప్రభుత్వమునకు దత్తము ఒనర్పబడినది. అది ఇప్పుడు ఇండోనీషియా రాజ్యమున చేరి ఉన్నది. [జ] 3,07,58,000. [భా] ఇంగ్లీష్, స్పానిష్, టగలాగ్ అను మూడు భాషలు అధికార భాషలుగ గుర్తింపబడినవి. వీనిలో ఇంగ్లీషును 30% ప్రజలు అర్థము చేసికొనగలరు. స్పానిష్‌ను మాటాడు వారు 2% మాత్రమే ఉన్నారు. టగలాగ్ అనునది జాతీయ భాషగ 1946 నుండి గుర్తింపబడినది. దీనిని ఇపుడు ప్రజలలో 35% అర్థము చేసికొనగలరు. అన్ని ప్రాథమిక పాఠశాలలందు టగలాగ్ భాష ఇప్పుడు విధిగ బోధింపబడుచున్నది. టగలాగ్ వలెనే మలే-ఇండోనీషియా భాషా కుటుంబమునకు చెందిన దాదాపు 70 భాషలు ప్రజలందు మాతృభాషలుగ ప్రచారమునందు ఉన్నవి. [మ] ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు రోమన్ కేథలిక్‌లు. ముస్లిమ్‌లు 4.1% కలరు. వీరు ముఖ్యముగ మిందనావో దీవిలో వసించుచున్నారు. బౌద్ధులు అత్యల్ప సంఖ్యలో కలరు. [రా] క్వెజాన్ సిటీ (జ. సం. 3,97,374).

చరిత్ర : ఈ దేశమునకు సంబంధించిన ప్రాచీన చారిత్రక విశేషములు ఏవియు తెలియరాకున్నను ఆ యా కాలములందలి చీనీయ గ్రంథములందు ఈ ద్వీపములతో జరిపిన వ్యాపారాది విషయముల ప్రసక్తి తరచుగ కానవచ్చుటచేత క్రైస్తవ శకారంభము మొదలుగ ఇట నాగరక సంఘములు వసించునటుల స్పష్టముగ తెలియవచ్చుచున్నది. ఆనాటి ఫిలిప్పీన్ ప్రజలపై మలయా, జావాదేశముల మూలమున భారతీయ సంస్కృతియు, ప్రభావము నెరపినది అనుటకు పలు నిదర్శనములు కలవు. ఆ రాజ్యమునందలి వివిధ మాతృభాషలలో సంస్కృత పదములు, తద్భవములు విశేషముగ కన్పట్టుచున్నవి. వారి ప్రాచీన లిపియు భారతీయ లిపులకు సన్నిహితముగ ఉండెడిదని అచట మొదట కాలిడిన యూరపియన్‌ల రచనలవలన తెలియవచ్చుచున్నది.

క్రీ. శ. 1521 మార్చి 6 ఫెర్డినాండ్ మెజెల్లాన్ [చూ.] అను పోర్చుగీస్ నావికుడు ఈ దేశతీరమున కాలిడుటతో పాశ్చాత్యులకు ఈ ద్వీపరాజ్యమును గురించి తెలియవచ్చినది. ఆ నావికుడు ఈ దేశము స్పెయిన్ సామ్రాజ్యమునకు చెందినదిగ ప్రకటించెను. అంతటినుండి స్పెయిన్ సేనలు ఈ దేశమును వశమొనర్చుకొనుటకై యత్నించగ, దేశీయులు వారిని ప్రతిఘటించి తొలుత తిరగగొట్టగలిగిరి. కాని, త్వరలోనే మైకేల్ లోపెజ్ డి లెగస్పి నాయకత్వమున స్పెయిన్ సేనలు ఈ దేశమున మరల దిగి, దేశీయుల ప్రతిఘటనను అడచి, క్రమముగ అన్ని ద్వీపములను 1600 నాటికి వశపరచుకొనినవి. స్పెయిన్ చక్రవర్తి ఫిలిప్-II పేర ఈ ద్వీపసముదాయమునకు ఫిలిప్పిన్‌లు అని స్పెయిన్ వారు పేరిడిరి. స్పెయిన్‌వారి ఆధ్వర్యవమున క్రైస్తవ మతము అట ప్రవేశపెట్టబడి, అనతి కాలములోనే మిందనావో, సూలూ ద్వీపములందలి ముస్లిమ్‌లందు తప్ప తక్కిన అన్ని వర్గములందును వ్యాపించినది. అమెరికా ఖండము నందలి తమ సామ్రాజ్యమున దీనిని ఒక అంతర్భాగముగ స్పెయిన్‌వారు పరిగణించి, మెక్సికోనగరమున ఉండు పరిపాలకుని మూలమున తమ పరిపాలను ఇట నిర్వహించిరి. ఆ కాలమున దేశమందలి విదేశీయ వ్యాపారము అంతయు వారి చేతులలోనే ఉండెను. 19 వ శతాబ్ది అంతమువరకు స్పెయిన్‌వారు ఇట పాలించినను ఆ యా కాలములందు వారు బ్రిటిష్, డచ్చి, చీనీయులు మొదలగువారి దండయాత్రలనేకాక, దేశీయుల ప్రతిఘటనను సైతము ఎదుర్కొనవలసి వచ్చినది. 1820 ప్రాంతములందు దక్షిణ, మధ్య అమెరికాలయందలి స్పానిష్ వలసరాజ్యములు స్పెయిన్ సామ్రాజ్యమునుండి విడివడినంతనే, స్పెయిన్

ప్రభుత్వపు నిరంకుశతను ప్రతిఘటించుచు ఫిలిప్పీన్‌లును ఆందోళన సలుపగ స్పెయిన్ ప్రభుత్వము తన నిరంకుశతను కొంత తగ్గించుకొని ఆ దేశమున వర్తక వ్యాపారములలో పాల్గొనుటకు తక్కిన విదేశములకును సౌకర్యములను కలిగించెను. (1830 - 1860). ఇందువలన దేశీయ ఎగుమతులకు సరియైన ధరలు లభించుటకు అవకాశము కలిగెను. అంతటనుండి క్రమముగ ప్రజలలో స్వాతంత్ర్యకాంక్ష ప్రబలమై 1896 లో తిరుగుబాటుగ పరిణమించెను. ఈ తిరుగుబాటునకు నాయకత్వము వహించిన దేశభక్తుడు జోసీ రిజాల్ (1861 - 1896) ను స్పెయిన్ ప్రభుత్వము నిర్బంధించి మరణశిక్ష పాలు చేసినను అతని అనుచరులు మాత్రము జనరల్ ఎమిలియో అగినాల్డో అను సేనాని నాయకత్వమున తిరుగుబాటును కొనసాగించిరి.

ఇంతలో స్పెయిన్, యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వముల మధ్య జరిగిన పోరాటము ఫలితముగా ఈ దేశము యునైటెడ్ స్టేట్స్ వారి వశము అయ్యెను (1898). కాని, ఫిలిప్పీన్ జాతీయవాదులు ఈ క్రొత్త పాలకులను సైతము ఎదుర్కొని నిరోధింపసాగిరి. ఇందుమూలమున ప్రజల స్వాతంత్ర్య కాంక్షను ఏదియో ఒక తీరుగ మన్నించుట సముచితమని యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వము క్రమక్రమముగ అంతటంతట పలు శాసనములను నిర్మించి, అంచెల వారీగా ఫిలిప్పీన్‌లకు స్వాతంత్ర్యమును ఇచ్చుటకు సంకల్పించి, తదనుగుణముగ చర్యలను గైకొనెను. ఇటుల 1902, 1916 లలో క్రమముగ కొన్ని అధికారములు ప్రజలకు ఈయబడినవి. కడకు 1934 లో ఆమోదింపబడిన ఫిలిప్పీన్ స్వాతంత్ర్య చట్టము మూలమున కామన్ వెల్త్ అనుపేర ఫిలిప్పీన్‌లందు ఆంతరంగిక స్వపరిపాలన ప్రవేశపెట్టబడుటయేకాక, 1944 లో సంపూర్ణ స్వాతంత్ర్యము ఈయబడునటుల వాగ్దానము కూడ ఒసగబడెను. కాని, ఈ వాగ్దానము కార్యరూపము పొందకపూర్వమే ఈ దేశముపై జపాన్ సేనలు దండెత్తి (1941 - డిసెంబరు 9), దానిని క్రమముగ వశపరచుకొనెను. జపాన్ ద్వితీయ ప్రపంచయుద్ధమున ఓడి, లొంగిన తరువాత కొంత కాలమునకు యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వము తన వాగ్దానమును నిలబెట్టుకొని 1946, జూలై 4 వ తేదీన ఫిలిప్పీన్ దేశము గణరాజ్యముగ రూపొందుటకు సహకరించెను.

యుద్ధఫలితమగు నష్టమునుండి కోలుకొనుటకును, జనులకు పునరావాస సౌకర్యములును ఏర్పరచుటకును ఫిలిప్పీన్ స్వతంత్రప్రభుత్వము తొలుతనుండియు కృషి చాలా చేయవలసివచ్చెను. ఇందులకు తోడుగ ప్రజలలోని వైరాశ్యమును అవకాశముగ గ్రహించి, అటనట తిరుగుబాటులను లేవదీయుచున్న హుకబలహాప్‌లు అను కమ్యూనిస్ట్ గెరిల్లాలను కూడ ప్రభుత్వము ఎదుర్కొనవలసివచ్చినది. వీనిని అన్నిటిని ఎదుర్కొని దేశమున సముచితములగు భూమిసంస్కరణలను ప్రవేశపెట్టి ఆర్థికాభ్యుదయమునకు మార్గమును సుగమము ఒనర్చినవాడు రామోన్ మగసేసే (1907 - 57). ఐక్యరాజ్య సమితి స్థాపననాటినుండియు ఈ దేశము ఆ సమితియందు సభ్యత్వము వహించి ప్రపంచ శాంతికై పాటుపడుచున్నది.

రాజ్యాంగము : ఈ దేశమున ప్రజాస్వామిక గణరాజ్య విధానపు పరిపాలన అమలునందు ఉన్నది. 21 ఏండ్ల వయసు దాటిన విద్యావంతులగు పౌరులకు అందరికి ఈ దేశమున వోటు హక్కు కలదు. శాసన నిర్మాణాధికారము ఉభయ కక్ష్యలు కల కాంగ్రెస్ అనబడు శాసనసభయందు న్యస్తమై ఉన్నది. ఇందలి తొలి కక్ష్యయగు సెనేట్‌నందు 24 మంది ఎన్నుకొనబడిన సభ్యులు ఉందురు. వీరిలో ఒక్కొక్కని పదవీ కాలపరిమితి ఆరేండ్లు. దిగువ కక్ష్యయగు ప్రతినిధి సభయందు 102 మంది ప్రతినిధులు ఉందురు. వీరు నాలుగేండ్లకు ఒకసారి రాష్ట్రముల వారీగా, జనసంఖ్య నిష్పత్తిలో, రాష్ట్రమునకు కనీసము ఒక ప్రతినిధియైన ఎన్నుకొనబడు నియమముతో ఎన్నుకొనబడుదురు. శాసనములను ఒనర్చుటకు, సవరించుటకు, యుద్ధమును ప్రకటించుటకు కాంగ్రెస్‌నకు మాత్రమే హక్కు కలదు.

కార్యనిర్వహణాధికారము అధ్యక్షునకు చెంది ఉన్నది. అధ్యక్షుడు నాలుగు ఏండ్లకు ఒక పర్యాయము అపరోక్షపు ఎన్నిక వలన ఎన్నుకొనబడును. ఒకసారి అధ్యక్ష పదవిని నిర్వహించినవాడు ఆ పదవికి వెనువెంటనే మరియొక పర్యాయమునకు మించి ఎన్నిక కాకూడదు. ఉపాధ్యక్షుడును నాలుగు ఏండ్లకు ఒకసారి ఎన్నుకొనబడును.

చీ. శే. రా.

**ఫిషర్, హెర్బర్ట్ ఆల్బర్ట్ లారెన్స్** (1865 - 1940): బ్రిటిష్ జాతీయుడు; చరిత్ర రచయిత; రాజనీతి వేత్త. లండనులో జన్మించెను; ఆక్స్‌ఫర్డ్‌లో అధ్యయనము చేసెను. తొలిసారిగ ఈయన చేపట్టిన పదవి షెఫీల్డ్ యూనివర్సిటీ ఉపాధ్యక్షత (1912). 1916 లో ఫిషర్ పార్లమెంట్‌లో ప్రవేశించి, విద్యా మంత్రి (ప్రెసిడెంట్ అవ్ ది బోర్డ్ అవ్ ఎడుకేషన్) అయ్యెను. ఇతని విద్యా చట్టము (1918) ఈతని మానవతావాద, మానవ శ్రేయోవాదముల మేలి కలయిక అని ప్రశంసింపబడినది. ఐక్య యూరప్ అతని ధ్యేయము. అందుకొరకు అతడు నానాజాతి సమితిని చాల బలపరచెను; బ్రిటిష్ ప్రతినిధిగా సమితి సర్వసభ్య

సమావేశములలో పాల్గొనెను (1920 - 22). 1926 లో ఫిషర్ రాజకీయములనుండి విరమించుకొనెను. చరిత్ర రచనారంగమున నెపోలియన్ యుగ చరిత్రలో ప్రామాణికుడుగ ఈయన పేరు గడించెను. 'యూరప్ చరిత్ర (హిస్టరీ ఆవ్ యూరప్)' అను మూడు సంపుటముల ఉద్గ్రంథము ఇతని ప్రముఖ రచన. ఇతరములు : 1. స్టడీస్ ఇన్ నెపోలియనిక్ స్టేట్స్మన్‌షిప్; 2. జర్మనీ (1903); 3 బోనపార్టిజమ్ (1908); 4. ది కామన్‌వీల్ (1924); 5. ది విగ్ హిస్టోరియన్స్ (1928); 6. స్వీయ చరిత్ర (అసమగ్రము). తన రచనలలో ఫిషర్ వెలువరించిన అభిప్రాయముల సారాంశము స్థలాంతరమున వివరింపబడినది [చూ. సమీక్ష - పు. 4]. ఆ. వెం.

**ఫెబియన్ సొసైటీ :** బ్రిటిష్ సామ్యవాదుల సంఘము; అక్షరాస్యులైన ప్రజానీకములో సామ్యవాద భావములను విస్తరింపజేయుటకు, సామ్యవాద సిద్ధాంతములను ఇంగ్లండుకు అనువర్తింపజేయుటకు ప్రధానముగ మధ్యతరగతి విద్యాధికులచే 1884 లో స్థాపితమైనది. మొట్టమొదటి ఫెబియన్‌లలో జార్జి బెర్నార్డ్‌షా, సిడ్నీ, బియాట్రిస్ వెబ్, గ్రాహమ్ వాలెస్ ప్రసిద్ధులు. విప్లవాత్మకమైన మార్క్స్ సామ్యవాదమును ఫెబియన్‌లు నిరాకరింతురు. దీర్ఘకాలిక రాజకీయ వికాసము, సార్వజనిక వోటింగ్ హక్కు, ప్రచారము, కార్మికుల పరిస్థితులు మెరుగుపరుచుట, ప్రయోజనకర సంస్కరణలు - వీటి ద్వారా రక్తపాతము లేకుండ చిట్టచివరకు సామ్యవాద వ్యవస్థను సాధింపవచ్చునని వీరి దృఢవిశ్వాసము. నిలకడగా పోరాడుట మాని, హింసాకర చర్యలతో చీకాకుపరచి, శత్రువులను దుర్బలులను చేసిన రోమ్ సేనాని ఫెబియస్ పేరు ఈ సంఘమునకు పెట్టబడెను. ఈ సొసైటీ బ్రిటిష్ కార్మిక పక్షమునకు తాత్త్వికబలమును ప్రసాదించి 1889 - 1900 లలో ప్రాధాన్యమును గడించెను. తరువాత ఈ సంఘము కార్మిక పక్షమునకు ప్రత్యేక పరిశోధనా సాధనముగ కృషిచేయుటకు ఉన్ముఖత చూపెను. ఆ. వెం

**ఫెరిస్తా** (1570 - 1620 ర.) : భారతదేశమునకు వలసవచ్చిన పారసీక ముస్లిమ్; భారతదేశ చరిత్ర రచయిత. మహమ్మద్ కాసిమ్ హిందూ షా అనునది ఇతనికి పెట్టిన పేరు. బిజాపుర సుల్తాన్ ఇబ్రహిమ్ - II (1580 - 1626) యొక్క ప్రాపక, ప్రోద్బలములతో ఇతడు 10 వ శతాబ్దము మొదలుకొని 1606 వరకు భారతదేశమునకు సంబంధించిన ముస్లిమ్ చరిత్రను గ్రంథస్థము చేసెను. 'తారీఖ్ - ఇ - ఫెరిస్తా' అను ఇతని రచనలో చరిత్ర రచనకు ఆవశ్యకమైన నిరహంకార విచక్షణ, వాస్తవిక నిరూపణ, జాతీయాభిమాన నిర్ముక్తత కొరవడినను దక్షిణ భారతదేశ చరిత్రను నిర్మించుటకు ఆ గ్రంథము చాల సహాయకారి అని చెప్పవచ్చును. ఆ. వెం.

**ఫొనీషియన్‌లు :** ఇప్పుడు సిరియా అను పేరున ఉన్న ప్రదేశపు తీర భాగము ప్రాచీన కాలమున ఫొనీషియా అను దేశము. ఆ దేశమున ఆనాడు ఫొనీషియన్‌లను పేర ఒక గొప్ప నాగరకజాతి వర్థిల్లినది. వీరు గొప్ప నావికులు; గొప్ప వర్తకులు. క్రీస్తు పుట్టుకకు వేయి సంవత్సరముల ముందునాటికే వీరికి మధ్యధరా సముద్రమున ప్రతిప్రాంతమును సుపరిచితము. క్రీ. పూ. 1130 నాటికే వీరు స్పెయిన్ తీరమున గల కేడిజ్ నగరమును నిర్మించిరి. వీరు గ్రీక్‌లవలెనే నగర రాజ్యములు ఏర్పరచుకొనిరి. వీరి నగరములలో సిడోన్, టైర్ నగరములు చాల ముఖ్యమయినవి [చూ. సం. 10 - పు. 535].

ఫొనీషియన్‌ల భాష బాబిలోనియన్, అసీరియన్, అరబిక్ భాషా కుటుంబమునకు చెందినది. ఇది హిబ్రూ భాషను చాల వరకు పోలి ఉండును.

ఫొనీషియన్‌లపై ఈజిప్షిన్, సుమేరియన్, బాబిలోనియన్ నాగరకతా ప్రభావము ప్రస్ఫుటముగ కానవచ్చుచున్నది. ఫొనీషియన్‌లు ఆదినుండియు సముద్ర యానమున ప్రజ్ఞగలవారు. క్రీ. పూ. 2000 నాటికే వారి నౌకలు, రేవు పట్టణములు మంచి ప్రఖ్యాతి పొంది ఉండెను. క్రీ. పూ. 1100 - 900 మధ్య మధ్యధరాసముద్రపు తూర్పు ప్రాంతమున బలవత్తమ నౌకాదళము ఫొనీషియన్‌లదే. [చూ. స. 10 - పు. 175,551].

క్రీ. పూ. 1200 నాటికి సైప్రస్ ద్వీపములో వీరు వలసలు ఏర్పరచుకొనిరి. క్రీ. పూ. 846 ప్రాంతమున వీరు కార్తేజ్ [చూ. పు. 386] నగర ప్రాంతమున వలస ఏర్పరచిరి. సిసిలీలోను, స్పెయిన్ దక్షిణ తీరమునను కూడ వీరికి వలసలు ఉండెడివి.

కాలక్రమమున ఫొనీషియన్ నగరములు బలహీనమైనవి. క్రమముగా అసీరియా, పరిష్యా రాజులును, తరువాత అలిగ్జాండర్ [చూ. పు. 303] ను వీటిని జయించిరి. క్రీ. పూ. 64 తరువాత ఫొనీషియా రోమన్‌ల పాలనలో సిరియాలో భాగముగా లీనమైపోయినది. ప్రపంచ నాగరకతకు ఫొనీషియన్‌లు సమకూర్చిన వివిధ విషయములలో ప్రముఖము వారి లిపి. ధ్వన్యాత్మక లిపులలో మనకు తెలిసినంతవరకు తొలుతటిది ఇదియే అని భావింపబడుచున్నది. దీనినుండి తొలుతగ గ్రీక్ లిపియు, దాని నుండి క్రమముగ తక్కిన యూరప్‌లోని లిపులును రూపొందినవి [చూ. లిపి : సం. 6 - పు. 769]. ప్ర. రా.

**ఫ్యూడలిజమ్ :** చూ. భూస్వామ్య విధానము.

**ఫ్రాంక్ ఫర్ట్ సంధి పత్రము :** చూ. ఫ్రాంకో - ప్రష్యన్ యుద్ధము.

**ఫ్రాంకో - ప్రష్యన్ యుద్ధము** (1870 - 1871): ప్రష్యా 1866 లో ఆస్ట్రియాపై విజయము సాధించి, ఉత్తర జర్మనీ రాజ్య కూటమిని ఏర్పరచి, దాని నాయకత్వము చేపట్టుట ఫ్రెంచి సమ్రాట్ నెపోలియన్ - III [చూ. పు. 543] కు ఆందోళన కలిగించెను. ఫ్రాన్సు గనుక ప్రష్యాతో సంఘర్షణకు దిగినచో దక్షిణ జర్మనీ రాష్ట్రములు ప్రష్యా పక్షమున చేరునని, ఆ చేరిక తన ధ్యేయమైన సమగ్ర జర్మనీ ఏకీకరణకు దారితీయునని ఆసించి బిస్మార్క్ [చూ. పు. 648] రెండు దేశములలో పరస్పర వైమనస్యములు రేకెత్తుటకు కృషిచేసెను. రష్యా, ఇటలీ దేశముల తాటస్థ్యమునకు గట్టి ఏర్పాట్లుచేసి, బ్రిటన్ కూడ అలీనత పాటించునని అభిప్రాయపడెను. ప్రష్యారాజు బంధువు, హోయెన్ జొల్లెర్న్ వంశీయుడు అగు లియోపాల్డ్ రాకుమారుడు స్పెయిన్ సింహాసనమునకు ప్రతిపాదింపబడుట యుద్ధమునకు సద్యోమిష అయ్యెను. బిస్మార్క్ సలహా చొప్పున మొదట అంగీకరించినను, ఫ్రాన్సు తీవ్ర అభ్యంతరము చెప్పుటచే చివరకు ప్రష్యారాజు ఆ ప్రతిపాదనను త్రోసి పుచ్చెను. ఫ్రెంచి ప్రభుత్వము అంతటితో సంతృప్తి చెందక ముమ్మందు కూడ అట్టి ప్రతిపాదన తిరస్కరింపబడగలదని ప్రష్యా ప్రభువు హామీ ఈయవలెనని పట్టుపట్టెను; ప్రష్యా ప్రభువు దానిని నిరాకరించెను. ఈ ఉదంతమును గూర్చి రాజు తనకు పంపిన ప్రసిద్ధ ఎమ్స్ పత్రమును కొన్ని మార్పులతో బిస్మార్క్ ప్రకటించినతోడనే ఫ్రెంచి ప్రజలు, ప్రభుత్వము ఆగ్రహావేశపూరితులైరి. తన సమరాయత్తతను ఎక్కువగ అంచనావేసికొని ఫ్రాన్సు ప్రష్యాపై యుద్ధము ప్రకటించెను (1870, జూలై 19)..

యుద్ధ ప్రారంభముననే జర్మనులు ఫ్రెంచిసేనలను మూడు చోట్ల ఓడించి, వారికి అపార నష్టమును కలిగించిరి. కడకు సేడన్ వద్ద జరిగిన యుద్ధములో ఫ్రెంచి సేనలు ఘోర పరాజయముపొంది లొంగిపోయెను; తన సేనల వెంట వచ్చిన నెపోలియన్ - III శత్రువులచేతిలో బందీ అయ్యెను (సెప్టెంబరు 1). ఈ అపజయ వార్త వినినతోడనే ఫ్రెంచి ప్రజలు నెపోలియన్ - III ను పదభ్రష్టునిచేసి, గాంబెట్టా నాయకత్వమున తృతీయ ప్రజాసత్తాక రాజ్యమును నిర్మించుకొని, పారిస్ నగరమును సంరక్షించుకొనుటకై వీరోచితముగ పోరాడిరి. కాని, చివరకు పారిస్ జర్మనుల వశమయ్యెను (1871, ఫిబ్రవరి). ఫ్రాంక్ ఫర్ట్ సంధి పత్రముపై సంతకములు చేయుటతో ఈ యుద్ధము సమాప్తమయ్యెను (1871, మే 10). పై సంధి ప్రకారము జర్మనీకి ఆల్సేస్, లోరైన్ రాష్ట్రములను సమర్పించుటకు, యుద్ధ పరిహారమును చెల్లించుటకు, పరిహారమును పూర్తిగా చెల్లించువరకు జర్మను ఆక్రమిత సేనలను భరించుటకు ఫ్రాన్సు అంగీకరించెను. ఈ యుద్ధము మూలమున బిస్మార్క్ కల నిజమయ్యెను. జర్మనీ ఏకీకరణము పూర్తియై, ప్రష్యా రాజు విలియమ్ - I జర్మనీ సమ్రాట్ పీఠమును అధిష్ఠించెను. అ. వెం.

**ఫ్రాంకో - రష్యన్ సంధి** (1891): ఆస్ట్రో - జర్మనీ మిత్ర కూటమియొక్క యుద్ధ సన్నాహముల బెదరింపులను ప్రతిఘటించుటకై రష్యా, ఫ్రాన్సు దేశములు కుదుర్చుకొనిన సంధి. ఇందులకు తొలుతటి మెట్టుగ ఫ్రెంచి ప్రభుత్వమునకు విరివిగ ఋణములు ఇచ్చుటకు రష్యన్‌లు సిద్ధపడి, 'యుద్ధ ప్రమాదము సంభవించిన సమష్టిగ దానిని సమాలోచించుదము' అనే ఫ్రెంచివారి సూచనను రష్యా అంగీకరించుటతో, ఈ సంధికి ప్రాతిపదిక రూపము ఏర్పడెను. ఈ అంగీకారము, 1893 డిసెంబరులోను, 1894, జనవరిలోను కేంద్ర రాజ్యముల (జర్మనీ, ఆస్ట్రియా - హంగేరీ, ఇటలీ) కు వ్యతిరేకముగ రహస్య సైనిక ఒడంబడికగ విస్తృతపరచబడెను. 1899, ఆగస్టులో ఈ ఒడంబడిక మరల ధ్రువపరచబడి, 1912 లో నావికా ఒడంబడికతో బలపరచబడెను. ప్రథమ ప్రపంచయుద్ధారంభము వరకు, ఈ సంధియొక్క వాస్తవ స్వరూపము వెల్లడికాకపోయినప్పటికిని రష్యాకు ఫ్రాన్సు సహాయముచేయునని జర్మనీ దృఢముగ విశ్వసించి, ఆ అవకాశమును రద్దుచేయుటకై రష్యాపై యుద్ధము ప్రకటించిన 48 గంటలలోగా ఫ్రాన్సుపై కూడా అది యుద్ధమును ప్రకటించెను.

అసంప్రేరిత దురాక్రమణకు గురి అయినప్పుడు పరస్పరము సహాయముచేసికొనుటకై 1935, మే లో ద్వితీయ ఫ్రాంకో - రష్యన్ సంధి ఏర్పడినది. కాని 1939 పరిస్థితులు సంధిషరతులను పాటించు ఆవశ్యకత కలిగించలేదని రష్యన్‌లు భావించిరి. పా. ల. నా.

**ఫ్రాంక్లిన్, బెంజమిన్** (1706 - 1790) : యునైటెడ్ స్టేట్స్ నూతన నిర్మాతలలో ఒకడు. అనేక విషయములలో ప్రవీణుడు. అచ్చు పనివాడుగ, రచయితగ, ప్రచురణ కర్తగ, శాస్త్ర పరిశోధకుడుగ, వర్తకుడుగ, వేదాంతిగ, రాజ్యకార్య ధురంధరుడుగ అనేక రంగములలో ప్రఖ్యాతి గడించినవాడు.

ఫ్రాంక్లిన్ 1706, జనవరి 17 న బోస్టన్‌లో జన్మించెను. 1719 లో అన్నగారివద్ద అచ్చుపని నేర్చుకొన ప్రారంభించెను. 1729 లో ఇతడు పెన్సిల్‌వేనియా గెజెట్ అను

వార్తాపత్రికను కొని నడిపెను. 1736 లో పెన్సిల్ వేనియా అసెంబ్లీ గుమస్తాగా చేరి 1737 లో ఫిలడెల్ఫియా తపాలా శాఖాధిపతి అయ్యెను. 1751 నుండి 1764 వరకు ఇతడు పెన్సిల్ వేనియా శాసనసభలో సభ్యుడుగ ఉండెను. ఫ్రాంక్లిన్ తన వ్యాపకములకు శాస్త్ర పరిశోధన కూడ జతచేసి భూకంపములు, వాతావరణ శాస్త్రము, సముద్రాంతర జలప్రవాహములు, నౌకాయానము మున్నగు అనేక విషయములలో విలువైన విషయములు కనిపెట్టెను. 1757 లో ఇతడు పెన్సిల్ వేనియా తగాదా విషయమున ఇంగ్లండు



బెంజమిన్ ఫ్రాంక్లిన్
(1706 – 1790)

పోయి, తదుపరి స్వాతంత్ర్య యుద్ధసమయమున ఫ్రాన్స్‌తో యునైటెడ్‌స్టేట్స్‌కు స్నేహము కుదిర్చి, తన రాజనీతిజ్ఞతను ప్రకటించుకొనెను. స్వాతంత్ర్య ప్రకటన పత్రము రచించినవారిలో ఒకడుగ ఫ్రాంక్లిన్ కూడ దానిపై సంతకము చేసెను.

తదుపరి యునైటెడ్ స్టేట్స్ రాజ్యాంగమును రచించుటలో ఇతడు చాల తోడ్పడెను. ఫ్రాన్స్‌తో ఒడంబడిక, ఇంగ్లండుతో శాంతిసంధి, స్వాతంత్ర్య ప్రకటన పత్రము, రాజ్యాంగము ఈ నాలుగింటిపై సంతకము చేసినవాడు ఇతడు ఒక్కడే; యునైటెడ్‌స్టేట్స్‌లో బానిసత్వ నిర్మూలనమునకు కూడ ఇతడు దీక్ష వహించి పని చేసెను.

అరువది సంవత్సరముల నిర్విరామ ప్రజాసేవానంతరము తన 85 వ ఏట ఈతడు మరణించెను. ఇన్ని రంగములలో ప్రఖ్యాతి వహించినను, ఫ్రాంక్లిన్ తన మరణ శాసనమును 'బెంజమిన్ ఫ్రాంక్లిన్ అను పేరుగల అచ్చు పనివాడనగు నేను ....' అని ప్రారంభించి వ్రాయుట ఈతని సౌమ్యగుణమును, నిరాడంబరతను తెలుపును.

ఏ. ఎస్. గుప్త.

**ఫ్రాన్స్ :** పశ్చిమ యూరప్‌నందలి ప్రముఖ స్వతంత్ర గణరాజ్యము.

ఈ దేశమునకు ఇంగ్లీషు చానెల్, బెల్జియమ్, లక్జెంబర్గ్ [ఉ]; పశ్చిమ జర్మనీ, స్విజర్లండ్, ఇటలీ [తూ]; మధ్యధరా సముద్రము, స్పెయిన్ [ద]; అట్లాంటిక్ మహాసముద్రము [ప] సరిహద్దులుగ కలవు. [వి] 5,47,026 చ. కి. మీ.; [జ] 4,78,40,000. [భా] జాతీయభాషగ ఫ్రెంచి వాడుకయందు ఉన్నది; మరియు స్థానికములగు భాషలు కూడ ఆయా ప్రదేశములలో వాడుకయందు ఉన్నవి. [మ] ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు రోమన్ కేథలిక్ సంప్రదాయపు క్రైస్తవ మతానుయాయులు. [రా] పారిస్ (జ. సం. 28,11,171).




**చరిత్ర:** ఈ దేశములో ప్రాచీన కాలమున కెల్టిక్ జాతి వారు ఉండెడివారు. వీరినే గాల్‌లు అని రోమన్‌లు వ్యవహరించిరి. క్రీ.పూ. 200–50 మధ్యకాలమున రోమన్‌లు గాల్‌లపై తమ ఆధిపత్యమును విస్తరింప చేసిరి. తదుపరి కాలక్రమమున గాల్‌లు రోమన్‌ల ఆచారములను అనుసరించిరి.

రోమన్ సామ్రాజ్యము పతనమగుటతో గాల్‌లను జర్మనుజాతులవారు జయించిరి. కెల్టులు అనేకులు హతులయిరి. విజిగాత్‌లు, బర్గండియన్‌లు, ఫ్రాంక్‌లు, కెల్టులు అను వేర్వేరు జాతుల వారు అనేకులు దేశమున పలు భాగములలో స్థిరపడిరి. ఫ్రాంక్‌ల రాజైన క్లోవిస్ రోమన్ పాలకుని కూలద్రోసి, విజిగాత్‌లను జయించి, క్రీ.శ. 486లో ఫ్రాంక్ రాజ్యమును ఏర్పరచి, క్రైస్తవ మతమును స్వీకరించి, దేశమున ఆ మతమునకు స్థానము కల్పించెను. ఈ క్లోవిస్ వంశీకుడగు రాజును ఒకనిని 757 లో అంత మొందించి కెరోలింజియన్ వంశీకుడగు పెపిన్ రాజ్యమును గ్రహించెను. ఈతడు బలవంతుడైన రాజు. ఈతని కుమారుడే షార్లమేన్ [చూ.].

కాని, షార్లమేన్ తరువాతివారు బలహీనులు. అతని అనంతరమున ఆ సామ్రాజ్యమును అతని వారసులు పంచుకొనుట వలననే నవీనకాలపు ఫ్రాన్స్, జర్మనీ, ఇటలీ దేశములు ఏర్పడినవి. కెరోలింజియన్ రాజవంశమును అంత మొందించి 987 లో హ్యూ కేపెట్ అను ప్రభువు ఫ్రాన్స్ ప్రాంతమునకు రాజయ్యెను. ఈతని వంశీకులకు కెపేషి

యన్ రాజులని వ్యవహారము కలదు. ఆ రాజుల పాలనలో రాజత్వము బలపడినది.

ఈ వంశమువారినుండి వెలోయ్ రాజవంశము వారికి రాజ్యము 14 వ శతాబ్దిలో సంక్రమించెను. ఆ వంశము వాడగు ఫిలిప్ - VI రాజ్యాధిపత్యమునకు ఇంగ్లండు రాజైన ఎడ్వర్డ్ - III పోటీ వచ్చెను. ఫ్రాన్స్ సింహాసనమునకు తన తల్లి వలన తాను వారసుడనని ఎడ్వర్డ్ - III వాదన. దీని కారణమున ప్రారంభమయిన యుద్ధములు ఇంచుమించు 100 సంవత్సరములు సాగినవి [చూ. శత వర్ష యుద్ధము].

ఫ్రాన్స్‌లో నిరంకుశ రాజత్వమునకు పునాదులు వేసిన వాడు లూయీ - XII. ఈతని కాలమున రాజ్యము విస్తృతమైనది. ఈ వంశము వాడగు హెన్రీ - II కాలముననే ఫ్రాన్స్‌లో ప్రొటెస్టంట్ (హ్యూజినో) లకు, కేతలిక్‌లకు మధ్య కలహములు చెలరేగినవి. 1589 వరకును ఈ కలహములు తగ్గలేదు. ఆ సంవత్సరమే ప్రొటెస్టంట్‌ల నాయకుడైన హెన్రీ (నవారే) రోమన్ కేతలిక్ మతమును స్వీకరించి హెన్రీ - IV గ ఫ్రాన్స్ రాజయ్యెను. బూర్బన్ వంశపు పరిపాలకులలో ఇతడు ప్రథముడు.

హెన్రీ - IV కాలము నుండి ఫ్రెంచివిప్లవము ప్రారంభమగు పర్యంతము ఫ్రెంచి రాచరికము నిరాఘాటముగ సాగినది. యూరప్ చరిత్రలో ఫ్రాన్స్ ప్రబలమైన స్థానమును ఆక్రమించినది. కాని, ఫ్రెంచి ప్రజలు మాత్రము దినదినము పేదవారయిపోయిరి. లూయీ - XIV కాలమున ఫ్రెంచి రాజత్వము పతాక స్థాయిని అందుకొన్నదని చెప్పవచ్చును. తరువాతి చక్రవర్తులు బలహీనులు; భోగలాలసులు. దానికితోడు అప్పటికే ప్రజలు పన్నుల బాధలవలన, విపరీతమైన పేదరికమువలన విసిగిపోయిరి. బానిస సంకెళ్లు తప్ప మరే విధమయిన ఆస్తియు లేని ప్రజలు అగ్నిపర్వతమువలె విరుచుకొని పడి, లూయీ - XVI కాలమున రాచరికమును సమూలముగ తుడిచి పెట్టిరి (జనవరి 21, 1793). ఇదియే చారిత్రక ప్రసిద్ధిని ఆర్జించిన ఫ్రెంచి విప్లవము [చూ. సమీక్ష పు. 141].

ప్రథమ గణరాజ్యము : రాచరికమును అంతమొందించిన విప్లవ దళములు దేశమున తొలుత ఒక గణరాజ్య ప్రభుత్వమును నెలకొల్పినవి. కాని, రాజును ఉరితీసిన ఫలితముగ ఈ ప్రభుత్వము యూరప్‌నందలి తక్కిన రాజ్యముల విరోధమునకు గురియైనది. దేశమున సైతము కొన్ని ప్రభుత్వశాఖలు నూతన గణరాజ్య ప్రభుత్వముపై తిరుగుబాటు సల్పినవి. అట్టి పరిస్థితులలో ఈ ప్రభుత్వము తీవ్ర నిరంకుశ విధానములను అవలంబించుటచే, క్రమముగ దేశమున ప్రజాభిహితమగు ప్రభుత్వమే మృగ్యమయ్యెను. ఈ అవకాశమును ఉపయోగించుకొని, తక్కిన విప్లవ నాయకుల పలుకుబడిని అంతరింపజేసి, నెపోలియన్ బోనపార్టీ [చూ. పు. 542] అను సేనాని సర్వాధికారములు గ్రహించి, తుదకు చక్రవర్తి బిరుదము వహించెను. ప్రజాస్వామ్యము కొరకు ఉద్దేశింపబడిన ఫ్రెంచి విప్లవము ఇటుల నెపోలియన్ యొక్క నియంతృత్వమునకు దారితీసినది.

ప్రథమ సామ్రాజ్యము : నెపోలియన్ నిరంకుశుడే అయినను, అతడు ప్రజల మెప్పును ఆర్జింప గలిగెను. ఫ్రెంచి దేశపు నాయకత్వమున యూరప్‌ను ఏకీకృతమొనర్చుటకు అతడు తన విజయయాత్రల మూలమున కృషి చేసెను. 1806 నాటికి ఇంగ్లండు, రష్యాలు తప్ప తక్కిన యూరప్ అంతయు అతని అధికారమునకు లోబడెను. కాని, తుదకు ఇతని విజృంభణమును తక్కిన యూరప్ దేశములు సమష్టిగ అరికట్టి, అతనిని ఓడించి ఎల్బాదీవికి ప్రవాసము అంపి, బూర్బన్‌ల వంశమునకే చెందిన లూయీ - XVIII ని ఫ్రాన్స్ ప్రభువుగ చేసినవి (1814). కాని, ఆ మరుసటి సంవత్సరమే ఎల్బాదీవినుండి నెపోలియన్ తప్పించుకొని వచ్చి, సేనలను సమీకరించి, ప్రభుత్వమును వశపరచుకొనగలిగెను. కాని, తక్కిన యూరపియన్ రాజ్యముల సేనలు ఇతనిని వాటర్లూ యుద్ధము [చూ.] న ఓడించి (జూన్ 18, 1815), సెయింట్ హెలీనా దీవియందు నిర్బంధితుని ఒనర్చి, రాజ్యమును లూయీ - XVIII కే మరల ఒసగినవి. లూయీ తరువాత రాజయిన చార్లెస్ - V అను వానిపై ప్రజలు తిరుగుబాటు చేసి, దేశ బహిష్కృతుని ఒనర్చి, బూర్బన్ వంశములో వేరొక శాఖకు చెందిన లూయీ ఫిలిప్పీ అను వానిని రాజుగ చేసిరి (1830). కాని, ఇతని పరిపాలన సైతము ప్రజారంజకముగ ఉండకపోవుటవలన, ఒక విప్లవము జరిగి, రాచరికము అంతరించెను (1848).

ద్వితీయ గణరాజ్యము : 1848 విప్లవానంతరమున విప్లవమున పాల్గొనిన కార్మికవర్గ ప్రతినిధుల ప్రాబల్యము వలన దేశమున వయోజనులగు మగవారు అందరికి వోటు హక్కు లభించినది. కాని, ఈ పద్ధతిపై ఎన్నుకొనబడిన రాజ్యాంగ పరిషత్తున మితవాదులకే ఎక్కువ స్థానములు లభించినందువలన సోషలిస్ట్‌లు మొదలగు కార్మిక ప్రతినిధులు ఆశించినట్టి రాజ్యాంగము రూపొందక పోయెను. అపుడు రూపొందించిన రాజ్యాంగచట్టమును అనుసరించి అధ్యక్షునికి విస్తృతాధికారములు కల్పింపబడెను. ఆ చట్టము ఆమోదింపబడిన తరువాత జరిగిన ఎన్నికలలో లూయీ నెపోలియన్ [చూ. పు. 543] అను అతడు అధ్యక్షుడు అయ్యెను. ఇతడు నెపోలియన్ బోనపార్టీ

యొక్క సోదరుని కుమారుడు. ఈ అధ్యక్షుడు క్రమముగ తన రాజకీయ ప్రతికక్షుల బలమును అడచి, 1851 లో సర్వాధికారములు గ్రహించి, తుదకు 1852 లో నెపోలియన్ - III అను బిరుదముతో చక్రవర్తి అయ్యెను.

ద్వితీయ సామ్రాజ్యము : చక్రవర్తిగ ప్రకటించుకొనిన తరువాత సైతము ప్రజాస్వామికచ్ఛాయలను తన ప్రభుత్వమున నిలిపి రాజ్యాంగబద్ధుడగు ప్రభువుగ వ్యవహరించుటకు నెపోలియన్ - III శ్రద్ధవహించెను. బ్రిటన్‌తో శతాబ్దముల తరబడిగ వచ్చుచున్న వైరమునకు ఇతడు స్వస్తిచెప్పి, ఆ దేశముతో మైత్రిని కుదుర్చుకొని, మధ్యధరా సముద్ర ప్రాంతమున రష్యాకు స్థావరము లభింపకుండ జేయుటలో కృతకృత్యుడు అయ్యెను. పారిశ్రామికముగ దేశమును ముందునకు కొనిపోవుటకు ఇతడు పలు సంస్కరణములను ప్రవేశపెట్టెను. కాని, ఈతని వైదేశిక నీతి క్రమముగ ఇతని పలుకుబడిని అంతరింపచేసెను. పశ్చిమార్ధగోళమున ఉన్న మెక్సికోను జయించి, అట తన తమ్ముడగు మాక్సిమిలియన్‌ను చక్రవర్తిగ చేసెను. కాని, దీనిమూలమున యునైటెడ్‌స్టేట్స్‌తో ఫ్రాన్స్‌నకు విరోధము వచ్చినది. యునైటెడ్ స్టేట్స్ ప్రోత్సాహము మూలమున మరుసటి సంవత్సరముననే మెక్సికో ప్రజలు తిరుగుబాటు లేవదీసి, మాక్సిమిలియన్‌ను పదవీ భ్రష్టుని చేసి, ఉరితీసిరి. యూరప్‌నందు నెపోలియన్ అనుసరించిన విధానములవలన ప్రష్యాతో [చూ. జర్మనీ పు. 467] ఫ్రాన్స్‌కు యుద్ధము తటస్థించుటయు జరిగెను (1871). తత్ఫలితముగ దేశమందలి గణతంత్రవాదులకు బలము చేకూరి రాచరికము అంతరించెను.

తృతీయ గణరాజ్యము : ఈ తృతీయ గణరాజ్యమున నిర్మింపబడిన రాజ్యాంగ విధానమున శాసన నిర్మాణాధికారము సెనేట్, ఛేంబర్ ఆవ్ డిప్యుటీజ్ అను రెండు సభలకు ఒసగబడినది. ఆ రెండును ఎన్నుకొనబడిన సంస్థలే. సెనేట్‌నందు మాత్రము ఎన్నుకొనబడిన వారికి తోడుగ 75 మంది యావజ్జీవ సభ్యులు ఉండెడివారు. రాజ్యాంగమును రూపొందించిన నేషనల్ అసెంబ్లీయే ఈ 75 మందిని తొలుత నియామకము చేసినది. కాని, ఆ అసెంబ్లీ రద్దయిన తరువాత సెనేట్ ఈ సభికులలో ఏర్పడు ఖాళీలను పూర్తి చేయుచుండెడిది. తక్కిన సెనేట్ సభ్యులు 9 ఏండ్లకు ఒక పర్యాయము ఎన్నుకొనబడెడివారు. కాని, అందు చేయబడిన ఒక ఏర్పాటును అనుసరించి ఎన్నుకొనబడిన వారిలో మూడవవంతు మంది మూడేండ్లకు ఒక పర్యాయము పదవులనుండి వైదొలగవలసి ఉండుటచే, సెనేట్‌నందలి ఆ స్థానములకు మూడేండ్లకు ఒకసారి ఎన్నికలు జరిగెడివి. ఛేంబర్ ఆవ్ డిప్యుటీజ్‌లోని ప్రతినిధులను ప్రజలు నాలుగు ఏండ్లకు ఒకపర్యాయము ఎన్నుకొనుచుండిరి. ఈ ఉభయ శాసన సభలును ఒక నియోజకవర్గముగ ఏర్పడి అధ్యక్షుని ఎన్నుకొనెడివారు. అధ్యక్షుని పదవీ కాల పరిమితి 7 ఏండ్లు. బ్రిటన్‌లో రాజ్యాంగ విహిత రీతితో వర్తించు రాజువలెనే అధ్యక్షుడు ఇట వర్తించెడివాడు. కాని, బ్రిటన్‌లో ఉన్నటుల రెండు, మూడు ప్రముఖ రాజకీయ పక్షములు ఉండుటకు బదులుగ ఫ్రాన్స్‌లో అనేక రాజకీయ పక్షములు ఉండుటవలన సువ్యవస్థిత ప్రభుత్వమును ఏర్పరచు శక్తి ఎన్నికల వలన ఏ రాజకీయ పక్షమునకు లభించెడిదికాదు. అందువలన మిశ్రమ మంత్రివర్గము ఏర్పడుటయు, అది దీర్ఘ కాలము మనలేక వేరొక దానికి తావొసగుటయు ఆ దేశపు రాజకీయములందు ఒక సంప్రదాయ లక్షణమైనది.

ఇటుల ప్రభుత్వములు పదింబదిగ మారుచున్నను, పౌరోద్యోగి వర్గమునను, సైనిక వర్గమునను గల సుస్థిర సంప్రదాయములను అనుసరించి పరిపాలన మాత్రము కుంటువడక సాగుచుండెడిది. ఇందులకు ఆనాటి ఫ్రెంచి వలస సామ్రాజ్యము కొంత సాయపడినది. ఆఫ్రికాఖండమును - దాదాపు సగమునకు మించియు - ఆసియాయందలి ఇండో - చీనాను, ఇంకను ప్రపంచమున అటనట కొన్ని ప్రదేశములను లోగొనిన ఫ్రెంచి సామ్రాజ్యపు వలసలనుండి లభించెడి ముడిపదార్థమువలన పరిశ్రమలు బాగుగ వృద్ధియై దేశమున ఆర్థిక స్థిరత చేకూరుటచే, రాజకీయముల ఒడుదుడుకులు దేశ శ్రేయమునకు భంగము కలిగించెడివి కావు. అందుచేత మంత్రివర్గములు ఎన్ని మారుచున్నను ఈ రాజ్యాంగ విధానము దేశశ్రేయమునకు దోహదకారి గనే అతి దీర్ఘ కాలము వ్యవహరింపగలిగినది.

తృతీయ గణరాజ్య కాలమున ఫ్రెంచి విదేశాంగ నీతి అంతయు జర్మనీతోగల విరోధముపై ఆధారపడి నడచినది. 1891 లో రష్యాతోను, 1904 లో బ్రిటన్‌తోను ఫ్రాన్స్ కుదుర్చుకొనిన మైత్రి ఒడంబడికలకు ఈ విధానము దారి తీసినది. పారిశ్రామికముగను, సైనికముగను అభివృద్ధి పొందిన జర్మనీదేశము తనకు ఒక సామ్రాజ్యమును నిర్మించుకొనుటకై యత్నములు చేయదొడగుటచే, రష్యా, బ్రిటన్ దేశములతో కలసి జర్మనీ ఉద్ధృతమును అరికట్టుట తన ముఖ్యవిధిగ ఫ్రాన్స్ భావించినది. ఈ విషమస్థితి కడకు ప్రపంచ యుద్ధము, ప్రథమ [చూ. పు. 594] గ పరిణమించినది.

జర్మనీ పతనానంతరము (1918) న యూరప్ ఖండము నందు ఫ్రాన్స్ బలవత్తరముగ రూపొందినది. యూరప్ ఖండమున మరల జర్మను రాజకీయ నాయకత్వము పునరుద్ధరింప బడకుండుటకై మధ్య ప్రాచ్య యూరప్‌ల

లోని చిన్న చిన్న రాష్ట్రములతో ఒడంబడికలు కుదుర్చుకొనుట, నానాజాతిసమితి [చూ. పు.531]ని బలవత్తర సంస్థగ రూపొందించుట, బ్రిటన్‌తో తనకు గల మైత్రిని దృఢమొనర్చుకొనుట అను మూడు సూత్రములు ఫ్రాన్స్ యొక్క యుద్ధానంతర వైదేశిక నీతికి ప్రాతిపదికలు అయినవి. కాని, దాదాపు ఈ మూడింటను 1935 నాటికి ఫ్రాన్స్ విఫలత చెందినది. ఇటలీయందు ఫాసిస్ట్ ప్రభుత్వము ఏర్పడుట యూరప్ రాజకీయములందు నూతన పరిణామములకు దారి తీసినది. క్రమక్రమముగ జర్మనీ ఎడ ప్రదర్శింపదగు వైఖరిలో అభిప్రాయభేదములు పెరిగి ఫ్రాన్స్, బ్రిటన్ దేశముల మధ్య వైమనస్యములు ఏర్పడినవి. ఈ విభేదములు అవకాశముగ గ్రహించి జర్మనీయందు హిట్లరు [చూ.] ఆధ్వర్యవమున నాజీప్రభుత్వము బలపడెను. జర్మనీ బలపడిన కొలది ప్రాచ్య, మధ్య యూరప్ రాజ్యములకు ఫ్రాన్స్‌నందుగల మన్నన తగ్గజొచ్చెను. ఎతియోపియాను ఇటలీ కబళించుటను సైరించుటతో నానాజాతి సమితి ప్రతిష్ఠసన్నగిలెను. అందులకు తోడుగ అప్పటిలో చెలరేగిన ఆర్థికమాంద్యమువలన ఫ్రాన్స్‌నందలి పరిశ్రమలలో ఉత్పత్తి పడిపోయెను. దేశ పరిస్థితులను సరిదిద్దలేక ప్రభుత్వములు అతి త్వరితగతిలో పడిపోవుచుండెను. చివరకు 1939 లో యూరప్ రాజకీయాకాశమున యుద్ధపు కారుమబ్బులు క్రమ్ముకొననున్న కాలమున డలాడియర్ ఆధిపత్యమున దేశమున బలమైన ప్రభుత్వము ఏర్పడెను. సామ్రాజ్యాకాంక్షతో చిన్న రాజ్యమగు పోలండ్‌ను ఆక్రమించుకొన పూనుకొనిన నాజీ యుద్ధయంత్రమును ధ్వంసమొనర్చు సంకల్పముతో బ్రిటన్‌తో కలసి ఫ్రాన్స్ 1939, సెప్టెంబరు 3 న జర్మనీపై యుద్ధము ప్రకటించెను [చూ. ప్రపంచ యుద్ధము, ద్వితీయ పు. 608].

జర్మనీ 1940 వసంత ఋతువులో పశ్చిమ దిశగ విజృంభించి హాలండ్, బెల్జియమ్ దేశములను వశపరచుకొని, డన్‌కర్క్ వద్ద బ్రిటన్ సేనలను పరాజితములను జేసి, తుదకు ఫ్రాన్స్‌పై కాలిడి త్వరలోనే ప్రతిఘటనను అంతమొందించెను. స్వాతంత్ర్యకాంక్ష గల ఫ్రెంచియోధులు అనేకులు అంతట విదేశములకు ప్రవాసము ఏగి, మిత్రమండలి వారితో కలసి యుద్ధమును కొనసాగింప బూనుకొనిరి. కాని, దేశమున ఉన్న నాయకులలో పలువురు నిరాశోపహతులై జర్మను ఆక్రమణ ప్రభుత్వముతో సహకరింప ఒడంబడిరి. వీరి నాయకుడు మార్షల్ పెటైన్. జర్మను ఆక్రమణ క్రింద ఉన్న ఉత్తర ఫ్రాన్స్ పోను, తక్కిన ఫ్రాన్స్‌నందు విచీ నగరము కేంద్రముగ మార్షల్ పెటైన్ ఒక ప్రభుత్వమును ఏర్పరచి, జర్మనులతో సహకరించెను. కాని, పటిష్ఠమగు ఫ్రెంచినౌకాదళము మాత్రము జర్మనుల చేతులలో బడకుండునటుల ఫ్రెంచినాయకులు శ్రద్ధ వహించిరి. ఇంతటితో ఫ్రెంచి చరిత్రయందలి తృతీయ గణరాజ్యము అంతరించెను (1940).

**చతుర్థ గణరాజ్యము :** ద్వితీయ ప్రపంచ యుద్ధమున జర్మనుసేనలు పరాజితములైన వెనువెంటనే ఫ్రాన్స్ డీగాలీ [చూ. పు. 508] అను నాయకుని ఆధ్వర్యవమున (1944, ఆగస్టు) మరల స్వతంత్రమగుటతో చతుర్థ గణరాజ్యమునకు నాంది అయ్యెను. ఈ గణరాజ్యమునకు ఒక రాజ్యాంగ విధానమును నిర్మించుటకు ఒక రాజ్యాంగ పరిషత్తు 1945 లో ఎన్నుకొనబడెను. ఆ పరిషత్తునకు గల అధికారములను నిర్వచించు చట్టముపై ప్రజాభిప్రాయము గ్రహించుటలో ఆ దేశములో ప్రప్రథమముగ స్త్రీలకు కూడ వోటింగు హక్కు కల్పింపబడెను. ఈ పరిషత్తు నిర్మించిన రాజ్యాంగ విధానమును ప్రజాభీష్టమునకు నివేదించగ - ఆమోదితము కానందున - 1946 లో వేరొక పరిషత్తు ఎన్నుకొనబడెను. ఈ పరిషత్తు నిర్మించిన రాజ్యాంగ విధానము ప్రజామోదితమయ్యెను. ఈ విధానము తృతీయ గణరాజ్యపు రాజ్యాంగ విధానమును కొంతవరకు గ్రహించినను, వలసలకును, ఫ్రెంచిదేశమునకును సాన్నిహిత్యము పెంపొందించు తలంపుతో ఫ్రెంచియూనియన్ అను నూతన వ్యవస్థను ఏర్పరచి, అందు వలసలకు సభ్యత్వమును కల్పించెను. 1946 లో కొన్ని అభిప్రాయభేదములను పురస్కరించుకొని డీగాలీ రాజీనామా ఇచ్చెను. ఆ తరువాత జరిగిన ఎన్నికలవలన సువ్యవస్థిత స్థిరప్రభుత్వము ఏదియును రూపొందలేదు. వివిధ రాజకీయ పక్షముల మధ్య వైరుధ్యములవలన ప్రభుత్వములు అతి త్వరితగతిలో పడిపోవ దొడగెను. బలహీనములగు ఈ ప్రభుత్వములందు ఏదియు ఫ్రాన్స్ యుద్ధానంతర ఆర్థిక పరిస్థితి గాని, వలస దేశములందు ఏర్పడిన నూతన జాగృతివలన ఉత్పన్నములయిన సమస్యలను గాని పరిష్కరింప లేకపోయెను. సోవియట్ రష్యారాజ్యపు విస్తృతిని అరికట్టుటకై రూపొందిన 'నాటో' [చూ. పు. 531] యందును, తదనుబంధ సంస్థలయందును ప్రముఖ రాజ్యముగ సభ్యత్వము వహించినను, ఐక్యరాజ్య సమితి [చూ. పు. 351] యందలి అగ్రరాజ్యములలో ఒకటిగ లెక్కింపబడుచున్నను నిజమునకు యునైటెడ్ స్టేట్స్‌నకు ఆశ్రితరాజ్యముగ ఫ్రాన్స్ పరిణమించెను. ఆర్థిక సమస్యకు తోడుగా ఆల్‌జీరియా సమస్య ఫ్రాన్స్ ప్రభుత్వమును కలవరపరచెను [చూ. ఆల్‌జీరియా పు. 297]. ఈ సమస్యలతో సతమతమగుచున్న దేశమును రక్షించు తలంపుతో 1958 లో అప్పటి అధ్యక్షుడగు 'రినీ కొటీ'

అను నతడు డీ గాలీ సేనానికి ప్రభుత్వమును వశపరచెను. అంతట ప్రభుత్వ వ్యవస్థలో గల లోపములను సరిదిద్దు తలంపుతో చతుర్థగణరాజ్యపు రాజ్యాంగ వ్యవస్థను రద్దొనర్చి, పంచమ గణరాజ్యమును డీ గాలీ రూపొందించి, ప్రజామోదమును పొందెను. చతుర్థగణరాజ్యము 1944 నుండి 1957 వరకు అమలునందు ఉండెను. ఈ పదమూడు సంవత్సరములలో 24 ప్రభుత్వములు మారెను. వీనిలో అత్యంత దీర్ఘకాలము వ్యవహరించిన ప్రభుత్వపు పదవీ కాలము 16 నెలల 10 దినములు. అత్యంత అల్ప కాలము పనిచేసిన దాని పదవీకాలము 7 దినములు మాత్రమే.

పంచమ గణరాజ్యము : ఈ గణరాజ్య విధానమున అధ్యక్షునికి యునైటెడ్ స్టేట్స్ అధ్యక్షునికి వలెనే విస్తృతాధికారములు లభించినవి (రాజ్యాంగ విధానపు వివరములు దిగువ ఈయబడినవి). ఇందువలన అధ్యక్షుడు ఆల్జీరియా సమస్యను త్వరితగతిలో పరిష్కరించి, ఆ దేశమునకు స్వాతంత్ర్యము కలుగజేసెను. డీ గాలీ నాయకత్వమున దేశమున ఒక నూతన జాగృతి ఉదయించినది. యునైటెడ్ స్టేట్స్, బ్రిటన్, సోవియట్ రష్యా దేశములతో పాటుగ ఫ్రాన్స్ నైతము పరమాణుశక్తిసహిత రాజ్యముగ రూపొందించుటకు డీ గాలీ కృషి చేయుచున్నాడు. యూరప్‌నందలి వివిధ రాజ్యములమధ్య ఆర్థిక సమైక్యము నెలకొల్పుట, జర్మనీతో దృఢమగు మైత్రిని సాధించుట, తన్మూలమున యూరప్‌లో నాయకత్వము ఫ్రాన్స్‌కు లభింపచేయుట అనునవి డీ గాలీ ఆశయములు.

రాజ్యాంగము : ఫ్రాన్స్ పంచమ గణరాజ్యపు రాజ్యాంగ విధానము అక్టోబరు 4, 1958 న ఆమోదితమైనది. దీని పీఠికలో మానవ స్వత్వములు స్పష్టముగ నిర్వచింపబడినవి. అధ్యక్షునికి ఇందు ఎక్కువ ప్రాముఖ్యము కలదు. ఈ రాజ్యాంగ విధానమునకు ఆ తరువాత వచ్చిన ఒక సవరణను అనుసరించి అధ్యక్షుని ప్రజలే అపరోక్షపు ఎన్నికలో ఎన్నుకొను అవకాశము కల్పింపబడినది. అధ్యక్షుని పదవీ కాల పరిమితి ఏడేండ్లు. శాసన నిర్మాణాధికారము సెనేట్, నేషనల్ అసెంబ్లీ అను రెండు సభలయందు న్యస్తమై ఉన్నది. సెనేట్‌న 255 మంది, నేషనల్ అసెంబ్లీ యందు 480 మంది ఎన్నుకొనబడిన సభ్యులు కలరు. సెనేట్‌నందలి సభ్యత్వమున డిపార్ట్‌మెంట్‌లు అనబడు ప్రదేశములకు ప్రాతినిధ్యము కల్పింపబడినది. అసెంబ్లీ యందు జనసంఖ్యను అనుసరించి ప్రాతినిధ్యము కల్పింపబడినది. రాజ్యాంగరీత్యా ఫ్రాన్స్‌లోనివిగనే పరిగణింపబడు సముద్రోత్తర మండలములు : 1. ఫ్రెంచి గయానా; 2. ఫ్రెంచి సహారా; 3. గ్వాడలోప్; 4. మార్టినిక్; 5. రీయూనియన్ అనువానికిని; సముద్రోత్తర ప్రదేశములు : 1. కోమొరో ద్వీపములు; 2. ఫ్రెంచి సోమాలీలాండ్; 3. ఫ్రెంచి దక్షిణ మహాసముద్ర, దక్షిణ ధ్రువ ప్రాంతములు; 4. న్యూకెలెడోనియా; 5. న్యూ హెబ్రిడిస్; 6. సెయింట్ పియెర్రీ అండ్ మికెలాన్; 7. వాలిస్ మరియు, ఫుతూనా ద్వీపములు - అను వానికిని సెనేట్‌నందు ప్రాతినిధ్యము కలదు. ప్రధానిని నియమించుటకు, అతనిని తొలగించుటకు, దేశ పరిరక్షణకై అవసరమైనపుడు సర్వాధికారములను స్వీకరించుటకు అధ్యక్షునికే అధికారము కలదు. ప్రధానియు, అతని మంత్రివర్గమును శాసన సభలకు బాధ్యత వహించి, పరిపాలనను నడపుదురు. పూర్వపు ఫ్రెంచి సామ్రాజ్యమునుండి స్వాతంత్ర్యమును ఆర్జించిన పిమ్మట వైదొలగినవి పోగా మిగిలినవి స్వేచ్ఛాపూర్వకముగ ఫ్రాన్స్‌తో ఏర్పరచుకొనిన మైత్రిని అనుసరించి రూపొందిన ఫ్రెంచి కమ్యూనిటీ [చూ. పు. 638] కిని ఫ్రెంచి రిపబ్లిక్ అధ్యక్షుడే అధ్యక్షుడుగ వ్యవహరించుచున్నాడు. ఐ. ఎస్. గుప్త; చీ. శే. రా.

**ఫ్రాన్సిస్ జోసఫ్** (1830 - 1916) : ఆస్ట్రియా చక్రవర్తి; హంగేరీ రాజు. ఫెర్డినాండ్ - I 1848 విప్లవము మూలమున రాజ్య పరిత్యాగముచేయగ, ఇతడు ఆస్ట్రియా సింహాసనమును అధిష్ఠించెను. ఆస్ట్రియా ప్రభుత్వమునకు, మితవాద హంగేరీ రాజకీయ నాయకులకు మధ్య కుదిరిన ఒడంబడికప్రకారము (1867) హంగేరీ రాజుగ అభిషిక్తుడు అయ్యెను. ఈ ఒడంబడికను అనుసరించి తన పరిపాలనా విధానములలో పెద్ద మార్పులు కొనితెచ్చుటకు సమ్మతించినను, ఇతడు యావజ్జీవము పార్టీ ప్రభుత్వమును గర్హించుచునే ఉండెను. ఉదాత్తమయిన రాజరికమే మేలని ఇతని భావము. హాప్స్‌బర్గ్ రాజరికమును వ్యక్తి నిరపేక్ష సంస్థగా మార్చి, ఇతడు సైనిక పరాజయములకు, వ్యక్తిగత విషాదములకు అతీతుడుగా వ్యవహరింప యత్నించెను. ఇతని సోదరుడు, మెక్సికో చక్రవర్తి మాక్సిమిలియన్ ఉరితీయబడెను (1867); ఇతని పట్టమహిషి ఎలిజెబెత్ ఒక అరాజకవాదిచే జినీవాలో చంపబడెను (1898); ఇతని కుమారుడు రుడాల్ఫ్ ఆత్మహత్య చేసికొనెను (1889); ఇతని వారసుడు ఫ్రాన్సిస్ ఫెర్డినాండ్ సరజెవోలో హత్యచేయబడెను (1914). ఈ సంఘటనయే ప్రథమ ప్రపంచ యుద్ధమునకు సద్యఃకారణము [చూ. ఆస్ట్రియా పు. 305, హంగేరి]. ఆ. వెం.

**ఫ్రెంచి కమ్యూనిటీ** : ఫ్రెంచి సామ్రాజ్యమున ఇంతకు పూర్వము వలసలుగ ఉండి తరువాత స్వతంత్రతను

ఆర్జించిన వానిలో కొన్ని రాజ్యములు స్వేచ్ఛా పూర్వకముగ పరస్పర శ్రేయోభివృద్ధిని ఆకాంక్షించి, ఫ్రాన్స్‌తో కలసి ఒక రాజ్య వర్గముగ వ్యవహరించుటకు నిర్ణయించుకొనిన ఫలితముగ రూపొందిన ఒక రాజ్య సమితి. ఫ్రాన్స్ [చూ.పు.634] పంచమగణరాజ్యము డీ గాలీ ఆధ్వర్యవమున రూపొందినపుడు (1958) ఆ రాజ్యాంగమున ఫ్రెంచి సామ్రాజ్యమందలి రాజ్యములు తమ భవిష్యత్తును నిర్ణయించుకొనుటకు అవకాశము కల్పింపబడి, అందులకు మూడు మార్గములు సూచింపబడినవి.

అవి : 1. వానికి ఇష్టమగునెడల యథాపూర్వస్థితి ;

2. ఫ్రాన్స్‌తో రాజ్యాంగ రీత్యా ఏకమై, ఆ దేశమునందలి సముద్రోత్తర మండలములుగనో లేదా సముద్రోత్తర ప్రాంతములుగనో ఉండుట ;

3. ఫ్రాన్స్‌తో కలసి సమానహోదాతో ఒక కమ్యూనిటీ (సమష్టి సంస్థ) గా రూపొందుట ;

ఆ తరువాత 1960 లో రాజ్యాంగమున చేయబడిన ఒక సవరణను అనుసరించి ఇదివరకు ఫ్రెంచి సామ్రాజ్యమున ఉండి, ఇపుడు సంపూర్ణ స్వాతంత్ర్యమును అనుభవించు రాజ్యములును తమ ప్రతిపత్తికి ఎట్టి భంగము లేకుండ కమ్యూనిటీలో చేరుటకు అవకాశము కల్పింపబడినది. ఇటు ఏర్పడిన కమ్యూనిటీకే 'ఫ్రెంచి కమ్యూనిటీ' అనుపేరు కలిగినది.

రాజ్యాంగముపై జరిగిన జనవాక్య సేకరణ (1958) లో ఫ్రెంచి సామ్రాజ్యమునందు అప్పటికి స్వతంత్రత ఆర్జించిన రాజ్యములలో ఫ్రెంచి గినీ తప్ప తక్కిన రాజ్యములు అన్నియు ఫ్రెంచి కమ్యూనిటిలో చేరి ఉండుటకు సుముఖతను వెల్లడించినవి. కాని, తరువాత వచ్చిన కొన్ని పరిణామముల వలన మారిటేనియా, ఐవరీకోస్ట్, దహోమీ, నైజర్, అప్పర్ వోల్టా, మాలీదేశములును వైదొలగినవి. కామెరూన్, టోగో రాజ్యములు తొలుతనే సామ్రాజ్యమునుండి వైదొలగినవి. స్వతంత్రించిన తరువాత 1962 లో ఆల్ జీరియా కమ్యూనిటీనుండి విడిపోయినది. కాని, కమ్యూనిటీ సభ్యత్వము లేకపోయినను, పై రాజ్యములతో ఒడంబడికల ద్వారా ఫ్రెంచి కమ్యూనిటీ ప్రత్యేక సంబంధములను నెలకొల్పుకొనినది. 1963, ఫిబ్రవరి నాటికి ఫ్రెంచి కమ్యూనిటీయందు ఈ దిగువ రాజ్యములు కలవు : 1. ఫ్రాన్స్ (అందులో రాజ్యాంగ రీత్యా చేరిన సముద్రోత్తర మండలములతో సహా); 2. సెంట్రల్ ఆఫ్రికన్ రిపబ్లిక్ ; 3. కాంగో రిపబ్లిక్ (బ్రజ్జవిల్లీ); 4. గెబన్ ; 5. మలగాసీ ; 6. సెనెగల్ ; 7. చాద్.

ఫ్రాన్స్ అధ్యక్షుడే ఈ కమ్యూనిటీకి కూడ అధ్యక్షుడుగ వ్యవహరించును. కమ్యూనిటీ సభ్యత కలిగిన రాజ్యముల అధినేతల సంప్రతింపుల సంఘము అంతటంతట సమావేశమై కమ్యూనిటీకి సంబంధించిన విషయములు చర్చించును. ఇది కాక, వివిధ సభ్యదేశముల శాసనసభలు తమనుండి, తమ దేశముల జనసంఖ్యా నిష్పత్తిలో ఎన్నుకొని పంపు సభ్యులు కల ఒక సెనేట్ కూడ కలదు. కాని, ఈ సెనేట్ ఒక సంప్రతింపుల సంఘముగ మాత్రమే వ్యవహరించును. సాంస్కృతిక, వైజ్ఞానిక వ్యవహారములందును, కొన్ని ఆర్థిక విషయములందును పరస్పరము కలసి మెలసి వర్తించుటకు ఈ సంప్రతింపులు ఉపకరించుచున్నవి. చీ. శే. రా.

**ఫ్రెంచి విప్లవము :** చూ. పు. 141. ఫ్రాన్స్ - పు. 634.

**ఫ్రెడరిక్ - II (1712 - 1786) :** ప్రష్యా దేశపు రాజు ; మహనీయుడు అని బిరుదమొందినవాడు. రాజ్యమునకు వచ్చిన మొదటి సంవత్సరమే (1740) సైలీషియాపై దండెత్తెను. ఆస్ట్రియా రాణి అయిన మేరియా తెరెసాకు చాల విలువైన రాజ్యభాగములలో ఒకటి ఈ సైలీషియా. ఈ ముట్టడి ఆస్ట్రియా వారసత్వ సంగ్రామమునకు, తదుపరి సప్తవర్ష సంగ్రామము[చూ.]నకు కారణము అయ్యెను. ఈ సంగ్రామములలో ఫ్రెడరిక్ - II 1756 లో శాగ్జనీపై కూడ దండెత్తెను. సైలీషియాను ఫ్రెడరిక్ - II వదలిపెట్టలేదు. ఈ యుద్ధములలో సాధించిన విజయములవలన ప్రష్యాను ఆస్ట్రియాతో సాటికి రాగలిగిన బలముగల దేశముగ ఆ రాజు రూపొందించెను. ప్రష్యా నాయకత్వమున జర్మనీలోని రాజ్యములు అన్నింటిని ఏకము చేయవలెనని చాల దూర దృష్టితో వేసిన ఎత్తుగడ ఇది.

పోలండ్ మొదటి విభజనలో ఫ్రెడరిక్ - II పాల్గొని, తన దేశమునకు క్రొత్త భూభాగములు చేర్చెను. బలీయమైన రాజ్యమును నిర్మించుటకు మాత్రమే కాక, తన రాజ్యములో ప్రజల సుస్థితికై గూడ ఫ్రెడరిక్ - II పని చేసెను. ఫ్రెడరిక్ మహనీయునికి తత్త్వశాస్త్రము అనినను, కవిత్వము అనినను ఎక్కువ ప్రీతి. వాల్టేర్ మున్నగు ప్రసిద్ధ రచయితలు ఈతని మిత్రులు. 1857 లో 30 సంపుటములుగా ఫ్రెడరిక్ - II రచనలు, ఉత్తరములు ప్రకటింపబడినవి. ఏ. ఎస్. గుప్త.

**బండారనాయకే, సాలమన్ (1899 - 1959) :** సింహళ (సిలోన్) రాజనీతిజ్ఞుడు ; ప్రధాన మంత్రి (1956 - 59). 1899 జనవరి 8 న కొలంబోలో ధనిక భూస్వామికి పుత్రుడుగ జన్మించెను. సెయింట్ తామస్ కాలేజి, మౌంట్ లావినా (సింహళము) లలోను, క్రైస్ట్‌చర్చ్ (ఆక్స్‌ఫర్డ్) లోను విద్యను అభ్యసించి, 1925 లో న్యాయవాద వృత్తిని స్వీకరించెను. కాని, కొద్దికాలముననే సింహళమునకు తిరిగి

వచ్చి రాజకీయములలో ప్రవేశించెను. క్రైస్తవ మతమును విడనాడి బౌద్ధమతమును స్వీకరించెను.

యునైటెడ్ నేషనల్ పార్టీ సభ్యునిగా 1947 ఎన్నికలలో ఎన్నిక అయి, ఆరోగ్య, స్థానిక ప్రభుత్వశాఖల మంత్రి అయ్యెను. మంత్రి పదవికి, యునైటెడ్ నేషనల్ పార్టీకి 1951 లో రాజీనామా ఇచ్చి, శ్రీలంకా ఫ్రీడమ్ పార్టీని వ్యవస్థాపించెను. 1952 నుండి 1956 వరకు సర్ జాన్ కోటెలెవాలా ప్రభుత్వములో ప్రతిపక్ష నాయకుడుగ ఉండెను. తరువాత నాలుగు వామ పక్షముల కూటమితో 'పీపుల్స్ యునైటెడ్ ఫ్రంట్' ను ఏర్పాటు చేసెను. అలీన విధానమును విదేశాంగ నీతిగను, సింహళ బౌద్ధ జాతీయతను ఆంతరంగిక విధానముగను తమ ధ్యేయముగ ఈ రాజకీయకూటమి ప్రకటించెను. 1956 ఎన్నికలలో ఈ కూటమి విజయమును సాధించగ, 1956, డిసెంబరు 12 న బండారనాయకే ప్రధాన మంత్రి అయ్యెను. కమ్యూనిస్ట్ చీనా, సోవియట్ రష్యా దేశములతో సన్నిహిత సంబంధములను ఇతడు సింహళమునకు ఏర్పరచెను. సింహళభాషను అధికార భాషగ ప్రవేశపెట్టుటకై జరిగిన ప్రయత్నమున ఇతడు పలు అభ్యంతరములను ఎదుర్కొనవలసి వచ్చెను. ఆ ఆందోళన కాలముననే ఒక బౌద్ధ భిక్షువు తుపాకి గుండ్లకు 1959, సెప్టెంబరు 25 న గురి అయి, మరుసటి రోజున ఇతడు చనిపోయెను.

ఇతడు ప్రపంచ ఆరోగ్య సంస్థకు ఉపాధ్యక్షుడు (1949); జెనీవాలో జరిగిన ప్రపంచ ఆరోగ్య సమావేశమునకు 1950 లో ప్రతినిధి. ఇతని భార్య సిరిమావో బండారనాయకే కూడ సింహళమునకు ప్రధాన మంత్రిణి (1960 - 64) గ పని చేసినది. పా. ల. నా.

**బడ్జెట్ :** చూ. ఆయవ్యయ పట్టిక - పు. 249.

**బర్క్, ఎడ్మండ్ (1729 - 1797) :** బ్రిటిష్ రాజనీతిదక్షుడు; ప్రఖ్యాతి వహించిన వక్త. ఐర్లాండ్‌నందలి డబ్లిన్‌లో జన్మించెను. ఇతని తండ్రి న్యాయవాది. కుమారుడు కూడ న్యాయవాది కావలెనని ఆతడు ఆశించెను. కాని, బర్క్‌కు రచనావ్యాసంగము అనిన ప్రీతి ఎక్కువగుటచే ఆ ఆశ ఫలించలేదు.

బర్క్ 1767 లో పార్లమెంట్ సభ్యుడు అయ్యెను. ఆ కాలమున ప్రముఖమైన, చారిత్రాత్మకమైన నిర్ణయములు అనేకము చేయవలసి ఉండుటచే పార్లమెంట్ సభ్యుడు అగుట చాల ఉత్సాహకరమయిన విషయము. బర్క్ తన వచోనైపుణితో పార్లమెంట్ దృష్టిని ఆకర్షించి, 30 ఏండ్లపాటు తన పదవిని నిర్వహించెను. కామన్స్ సభలో అత్యంత సమర్థుడు అగు వక్తగా బర్క్ పేరు గాంచెను.

హింసా విధానములు అనిన సహించని వాడు అగుటచే ఈతడు ఫ్రెంచి విప్లవమును సమర్థించ లేదు. కాని, మానవులకు ప్రయోజనకరములని తాను విశ్వసించిన అనేక ఉద్యమములను ఇతడు బలపరచెను. అందులో బానిసల విధానము ఒకటి. భారతదేశమున బ్రిటిష్ ఉద్యోగులచే పీల్చి పిప్పిచేయబడుచున్న ప్రజల పక్షమున బర్క్ పని చేసెను. ఆ విషయముననే వారెన్ హేస్టింగ్స్ [చూ.] ను విచారించుచున్నప్పుడు బర్క్ అత్యంత శక్తిమంతమైన మహోపన్యాసము చేసెను. ఏ. ఎస్. గుప్త.

**బర్మా :** ఆగ్నేయ ఆసియా యందలి ఒక స్వతంత్ర రాజ్యము.




ఈ దేశమునకు భారతదేశము, చీనా [ఉ]; థాయిలాండ్, లావోస్, చీనా [తూ]; బంగాళాఖాతము [ద]; తూర్పు

పాకిస్తాన్, బంగాళాఖాతము [ప] సరిహద్దులందు ఉన్నవి. [వి] 6,78,033 చ. కి. మీ.; సముద్రతీర రేఖ పొడవు 1,931 కిలోమీటరులు. వరిపంటకు పేరొందిన ప్రముఖదేశములలో ఈ దేశము ఒకటి. [జ] 2,36,64,000. [భా] జాతీయ భాషయగు బర్మీస్ ప్రజలలో నూటికి 80 మందికి మాతృభాష. తక్కిన వారిలో అధిక సంఖ్యాకుల మాతృభాషలు బర్మీస్‌నకు సన్నిహితములగు మాండలికములు. దేశమున అమలునందు ఉన్న రాజ్యాంగ విధానమును అనుసరించి ప్రతి వ్యక్తికి మత స్వాతంత్ర్యము ఒసగ బడి ఉన్నది. [మ] నూటికి 85 మంది ప్రజలు హీనయాన సంప్రదాయపు బౌద్ధులు అగుట వలన ప్రభుత్వపు ఆదరణ ఆ మతమునకు ఎక్కువగ కలదు. భారతదేశము, పాకిస్తాన్ దేశములకు చెంది ఇట నివాసము ఏర్పరచుకొనిన హిందువులును, ముస్లిమ్‌లును స్వల్ప సంఖ్యలో ఈ దేశమున కలరు. [రా] రంగూన్ (జ. సం. 7,37,079).

చరిత్ర: ఈ దేశపు ప్రాచీన చరిత్రను గురించిన వివరములు అంతగ తెలియవు. తొలుత ఇట నీగ్రోలకు సన్నిహితమగు మానవజాతి ఒకటి వసించి ఉండెననియు, కాలక్రమమున నిశ్శేషముగ అది అంతరించెననియు ప్రాచీన అవశేషములవలన తెలియనగుచున్నది. ఆ తరువాత ఇటకు పశ్చిమ చీనా, టిబెట్‌లనుండి మంగోలియన్ జాతి ప్రజలు వచ్చి క్రీస్తుశకారంభకాలమున చేరిరి. ఆ సమయముననే భారతదేశపు తూర్పు తీరమున వసించు భారతీయులును కొందరు పశ్చిమ బర్మా తీర ప్రాంతము లందు వలస చేరిరి. బర్మాదేశ చరిత్రలో ప్రసిద్ధిని ఆర్జించిన తెలాంగులు త్రిలింగ (తెలుగు) దేశ వాసులని కొందరి తలంపు. క్రీ. శ. 4 వ శతాబ్ది నాటికే ఈ దేశమున బ్రాహ్మణ, బౌద్ధమతములు రెండింటికిని వ్యాప్తి ఉండెనని పురావస్తు విశేషములవలన వెల్లడియగుచున్నను, అప్పుడు ఈ దేశమును ఏలిన రాజవంశములను గురించిన వివరములు ఏవియు తెలియవచ్చుటలేదు. ఆ కాలమున బర్మాయందు ప్రసిద్ధి వహించిన శ్రీక్షేత్ర, రమణ దేశాదులను పాలించిన రాజులను గురించిన కొన్ని గాథలు బర్మీయ సారస్వతమున కన్పట్టుచున్నను, అవి అన్నియు అలౌకిక సంఘటనలతో నిండి ఉన్నందున వానిలోని చారిత్రకాంశములను వెలికి తీయ వలను కాకున్నది. కాని, కాలక్రమమున బౌద్ధ మతమునకు రాజాదరణ లభించి, బ్రాహ్మణ మత ప్రభావము సన్నగిల్లెనని మాత్రము దీనివలన తెలియనగుచున్నది. అశోకుని కాలముననే తమ దేశమున బౌద్ధమతమునకు స్థానము కల్పింపబడెనని బర్మీయులు సాధారణముగ విశ్వసింతురు కాని, ఇందులకు తగిన చారిత్రక ఆధారములు లేవు.

క్రీ. శ. 11 వ శతాబ్దినుండి ఆధారసహితమగు ఇతిహాసము లభించుచున్నది. 1054 లో రాజ్యాధికారమును వహించిన అనువ్రతుడు అను రాజు పగాన్ రాజవంశమునకు మూలపురుషుడు అయ్యెను. తాంత్రికవాదములతో సంకలితమై ఉన్న బౌద్ధమతమును చక్కజేయు తలంపుతో ఇతడు తన రాజధానికి సంప్రదాయ బౌద్ధమతాచార్యుల రప్పించెను. ఈ వంశపు వారి వరుసలో 11 వ రాజగు నరాధిపతి పాలించు కాలమున చీనా సార్వభౌముడు కుబ్లయ్‌ఖాన్ [చూ. పు. 392] బర్మాదేశముపై దండెత్తి ఆ రాజవంశమును అంతమొందించెను (1287). తరువాత దాదాపు 160 ఏండ్లు దేశము అరాజకము పాలయ్యెను. ప్రాచ్య భాగమందలి షానులు, పశ్చిమ తీరమందలి తెలాంగులు, మధ్య దేశమందలి బర్మీయులు ఈ అరాజక యుగమున నిరంతర యుద్ధములలో మునిగి తేలిరి. కడకు పెగూ మండల పాలకుడగు రాజాదరితుడు అనువాడు (1453-1472) పెగూ ప్రాంత దేశమున కొంతవరకు సువ్యవస్థిత పరిపాలనను నెలకొలిపి పాలించెను. పెగూ రాష్ట్ర చరిత్రలో ఈతని పరిపాలనా కాలమును స్వర్ణ యుగముగ భావింతురు. ఈతడు తన రాజ్యమునందలి దగాన్ (నేటి రంగూన్) పట్టణమున నిర్మింపజేసిన షూదగాన్ దేవాలయము నేటికిని దర్శనీయముగ విలసిల్లుచున్నది. 1531 లో ఈ రాజవంశమును అంతమొందించి, మధ్య దేశపు బర్మీయులు తోంగూ అను రాజవంశపు ఆధ్వర్యవమున ఈ పెగూ రాజ్యమును వశపరచుకొనిరి.

తోంగూ వంశపు తొలుతటి ఇరువురు రాజుల కాలమున బర్మా దేశము అంతయు ఏక రాజవంశపు పాలనలోనికి వచ్చుటయే కాక థాయిలాండ్ దేశము సయితము ఆ సామ్రాజ్యమున అంతర్గతము అయ్యెను [చూ. థాయిలాండ్ - పు. 517]. కాని, 1581 లో థాయిలాండ్ వాసులు తిరుగుబాటు చేసి, బర్మా ప్రభువు సేనలను ఓడించిరి. ఆ సమయముననే అరకాన్ రాష్ట్రమాండలికులు పెగూ నగరముపై దండెత్తి దానిని దగ్ధము ఒనర్చిరి (1581). తరువాత తోంగూ రాజవంశీకుల ప్రతిష్ఠ సన్నగిలి, వారి అధికారము కొలది మండలములకు మాత్రమే పరిమితమై ఉండినది. కడకు అలంగపాయా వంశీకుడు అగు ప్యేబో అనువాడు తోంగూ రాజవంశీకులలో కడపటి వానిని అంతమొందించి రాజ్యమును వశపరచుకొనెను (1752). ప్యేబో పరిపాలనా కాలమున (1752-60) బర్మా అంతయు ఒకే కేంద్రపరిపాలన లోనికి రాగలిగెను.

పాశ్చాత్యులలో తొలుతగ పోర్చుగీస్‌వారికి ఈ దేశముతో 16 వ శతాబ్ది ఆరంభమున పరిచితి కలిగెను. తీర ప్రాంతమున కొందరు పోర్చుగీస్‌లు స్థావరములను ఏర్పరచుకొని క్రమముగ దేశీయులతో సంబంధ బాంధవ్యముల నెలకొల్పు కొనుటతో మిశ్రజాతి ఒకటి రూపొందెను.

ఈ మిశ్రమ జాతివారు బర్మాదేశమునందలి వివిధ మాండలికుల సైన్యములలో కూలిదండుగ చేరి పని చేసెడివారు. 1627 లో బ్రిటిష్ వర్తకులును, డచ్చి వర్తకులును తొలుతగ ఈ దేశపు తీరమున కొన్ని స్థావరములను నెల కొల్పుకొనిరి. కాని, 50 ఏండ్ల తరువాత వానిని ఎత్తివేసిరి. 1709 లో బ్రిటిష్ వర్తక సంఘము మరల ఆ దేశమునకు వచ్చి సిరియమ్ అనుచోట ఒక స్థావరమును స్థాపించి, వ్యవహరించిరి. కాని, వీరు బర్మా ప్రభువులకు సాయము చేయుచున్నారను మిషపై తెలాంగునాయకులు ఈ స్థావరమును 1743 లో దగ్ధము ఒనర్చిరి. అంతట బ్రిటిష్‌వారు తమ కార్ఖానాలను నెగ్రెయిస్ అను చోటికి తరలించిరి. కాని, తెలాంగులకు ఈ వర్తకులు తోడ్పడుచున్నారను నెపముతో మ్వేబో రాజు ఆ స్థావరమును తగులబెట్టింప జేసెను (1753).

మ్వేబో రాజు అనంతరము రాజ్యమును పాలించిన తక్కిన అలంగపాయా వంశీకుల కాలమున దేశమున ఆరకాన్ ప్రాంత వాసులు పలుమారులు తిరుగుబాటు చేసిరి. ఈ తిరుగుబాటులను దేశ ప్రభువులు విపరీత రక్తపాతముతో అడచివైచిరి. అంతటితో ఊరుకొనక, వారు ఆరకాన్ చేరువన ఉన్న భారతదేశములోని అస్సామ్, మణిపూర్‌లపై దండయాత్రల జరిపి, విపరీత నష్టమును కలిగించిరి. ఆ కాలమున భారతదేశమును పాలించు బ్రిటిష్ ప్రభుత్వము ఈ దండయాత్రను నెపముగ గ్రహించి బర్మాపై 1824 లో దండెత్తి బర్మా ప్రభువు సేనలను ఓడించెను. తత్ఫలితముగ జరిగిన సంధి వలన బర్మాయందలి ఆరకాన్, తెన్నాసెరిమ్ ప్రాంతములు బ్రిటిష్‌వారికి ఒసగబడుటయే కాక, ఒకకోటి రూపాయల నష్ట పరిహారమును సైతము బర్మారాజు బ్రిటిష్‌వారికి చెల్లింపవలసి వచ్చెను. ఈ ఒడంబడికను అనుసరించి బ్రిటిష్ రెసిడెంట్‌ను తన ఆస్థానమున బర్మా రాజు ఉంచుకొనవలసి ఉండెను. కాని, ఈ రెసిడెంట్ ఉనికిని బర్మా రాజులు తమకు అవమానముగ భావించిరి. అందువలన బ్రిటిష్‌వారి పై బర్మా ప్రభువులు ద్వేషము వహించి ఉండిరి.

తరువాత 1846 - 53 వరకు బర్మాను పాలించిన పగాన్‌మిన్ ప్రభువు కాలమున రంగూన్ రాష్ట్రపాలకుడు నౌకా సుంకములను విపరీతముగ విధించెను. బ్రిటిష్ వర్తకులకు ఇది నష్టకారణము అయ్యెను. భారతదేశమందలి బ్రిటిష్ ప్రభుత్వము ఈ విషయమై ఎన్ని విజ్ఞప్తులను చేసినను బర్మా ప్రభువు లెక్కపెట్టకపోవుటచే భారతదేశపు గవర్నర్ - జనరల్ లార్డ్ డల్‌హౌసీ [చూ. పు. 507] నౌకా సైన్యములను పంపి బర్మీయులను ఓడించెను. అంతట పెగూ రాష్ట్రము బ్రిటిష్ ప్రభుత్వపు వశమయ్యెను.

బర్మాను 1878 - 1885 వరకు పాలించిన థీబా అను బర్మా రాజు కాలమున మరల బ్రిటిష్ వారికిని, బర్మా ప్రభువునకును వైరుధ్యములు ఏర్పడెను. ఫ్రెంచివారితో థీబా రాజు వ్యాపారపు ఒడంబడికలను ఏర్పరచుకొనుటయే కాక, బ్రిటిష్ వర్తక సంఘములకు ఇబ్బందులను కలుగజేయ మొదలిడెను. అంతట 1885 లో బ్రిటిష్ సైన్యము బర్మాదేశముపై దండెత్తి, ఆ దేశమును వశపరచుకొని, రాజగు థీబాను సకుటుంబముగ భారతదేశమున మరణపర్యంతము నిర్బంధమునందు ఉంచిరి.

పరిపాలనా సౌకర్యముల నిమిత్తమై బర్మాదేశము అంతట భారత సామ్రాజ్యాంతర్గతము ఒనర్పబడినది. భారతదేశమును పాలించు బ్రిటిష్ ప్రభుత్వపు గవర్నర్ - జనరలే చీఫ్ కమీషనర్ మూలమున బర్మాను పాలించెడివాడు. ఈ పరిపాలనా కాలమున ఆధునిక నాగరకతయు, బ్రిటిష్ పరిపాలనా, న్యాయ నిర్వహణ విధానములును అట ప్రవేశపెట్టబడినవి.

భారతదేశమునుండి 1937, ఏప్రిల్ 1 న బర్మా వేరు చేయబడి బ్రిటిష్ ప్రభుత్వము నియమించు గవర్నర్ అధికారమున ఉండు వేరు రాజ్యముగ రూపొందింపబడినది. కొన్ని పరిమితులకు లోబడిన స్వపరిపాలనా విధానము అపుడు అట ప్రవేశపెట్టబడినది.

ప్రథమ ప్రపంచ యుద్ధానంతరమున ఈ దేశమున జాతీయతా భావన రేకెత్తినను ద్వితీయ ప్రపంచ యుద్ధము వరకు అది ఒక స్థిరరూపమొందలేదు.

ద్వితీయ ప్రపంచ యుద్ధకాలము నాటికి దేశమున జాతీయతాభావము విస్తృతముగ విద్యావంతులలో వ్యాపించెను. రంగూన్ విశ్వవిద్యాలయమందలి విద్యార్థి వర్గము ఈ జాతీయోద్యమమునకు నాయకత్వము వహించెను. బర్మా స్వాతంత్ర్యసముపార్జకుడు అగు ఆంగ్‌సాన్ [చూ. పు. 281], బర్మా ప్రథమ ప్రధానమంత్రి యూనూ, ప్రముఖ కమ్యూనిస్ట్ తిరుగుబాటు (1948) నాయకుడగు థాన్‌టూన్ అనువారలు ఈ విద్యార్థి వర్గమునకు చెందినవారలే. ఈ విద్యార్థి నాయకులకే థాకిన్‌లు అని వ్యవహారము కలదు. వీరు అందరును తొలుత సమష్టిగ కృషిచేసి, ఆంగ్‌సాన్ నాయకత్వమున బర్మా స్వాతంత్ర్య సేనను నిర్మించి, జపాన్ దండయాత్రకు తోడుపడి, బర్మాలో బ్రిటిష్‌సామ్రాజ్య ప్రభావమును అంతరింప జేసిరి. 1943, మార్చి 8 న రంగూన్ జపాన్ సేనల వశమయ్యెను. కాని, త్వరలోనే జపాన్‌వారి సామ్రాజ్య దాహమును బర్మా

సాయకులు గుర్తించిరి. అంతట వారు జపాన్ సామ్రాజ్య ప్రభుత్వమునకు ఎదురు తిరిగి, తమ స్వాతంత్ర్య సేనను ఫాసిస్ట్ వ్యతిరేక ప్రజాస్వాతంత్ర్య సమితి (ఆంటీ ఫాసిస్ట్ పీపుల్స్ ఫ్రీడమ్ లీగ్) గ పరివర్తన మొనర్చి పోరాటము సాగించిరి. ఈ సమితి సాయమువలననే బ్రిటిష్ సేనలు బర్మానుండి జపాన్ సేనలను తరిమివైచి, బర్మాకు విమోచనము కలిగించినవి.

కాని, ఇంతలోనే కొందరు విద్రోహుల కుట్రకు ఫలితముగ 1947, అక్టోబరు 17 వ తేదీన ఆరుగురు సహచరులతో పాటుగ ఆంగ్‌సాన్ హత్య చేయబడినందున జాతీయోద్యమమునకు యూనూ నాయకత్వము వహించి, బ్రిటిష్‌ప్రభుత్వముతో ఒక ఒడంబడికకు వచ్చెను. తత్ఫలితముగ 1948, జనవరి 4 న బర్మా సర్వస్వతంత్ర రాజ్యముగ అవతరించుటయే కాక, కామన్‌వెల్త్ [చూ. పు. 382] నుండియు వైదొలగెను. యూనూ ప్రప్రథమ ప్రధానమంత్రి అయ్యెను.

స్వాతంత్ర్యార్జనానంతరము రాజకీయముగను, ఆర్థికముగను పెక్కు సమస్యలను బర్మా ఎదుర్కొనవలసి వచ్చెను. 1947 తరువాత జాతీయోద్యమము నుండి కొందరు ప్రముఖులు వైదొలగి వేరువేరు పక్షముల స్థాపించిరి. అటుల వైదొలగిన వారిలో కమ్యూనిస్ట్‌లు సాయుధ తిరుగుబాటులకు పూనుకొనిరి. ఈ కమ్యూనిస్ట్‌లలో థాన్‌టూన్ అను ప్రముఖుని నాయకత్వమున ఉన్న ఒక వర్గము 1948 లో విస్తృతమగు ఒక తిరుగుబాటును లేవదీసెను. ఈ తిరుగుబాటుల తీవ్రత ఇప్పటికి చాలవరకు తగ్గినను, అంతరించెనని మాత్రము అనుటకు అవకాశము తక్కువ. 1958 నాటికి ఈ రాజకీయ వైషమ్యములు విపరీత స్థితికి దిగజారి సక్రమ ప్రభుత్వ నిర్వహణకు అవకాశము లోపించుటచే యూనూ ఇచ్ఛాపూర్వకముగ ప్రభుత్వమును సేనాధ్యక్షుడగు జనరల్ నే విన్‌కు అప్పగించెను (1958, అక్టోబరు 28). నే విన్ పరిపాలన 1960, ఫిబ్రవరి వరకు కొనసాగి, తత్ఫలితముగ పరిస్థితులు చాలవరకు కుదుటపడెను. అందువలన సేనాధ్యక్షుడే 1960, ఫిబ్రవరిలో ఎన్నికలను జరిపించగ యూనూ పక్షము తిరిగి అధికారములోనికి వచ్చెను. ఆ సంవత్సరమే బర్మాప్రభుత్వము చీనాప్రజాగణరాజ్యముతో సరిహద్దు వివాదము పరిష్కరించుకొనెను. 1960, అక్టోబరు 1 వ తేదీన ఈ నూతనపు సరిహద్దును సవివరముగ స్థిరపరచుచు చీనా - బర్మాదేశముల మధ్య ఒడంబడిక జరిగెను. 1961 లో బౌద్ధమతమును ప్రభుత్వాదరిత మతముగ ప్రకటించుచు, యూనూ ప్రేరణముచే రాజ్యాంగము సవరింపబడెను. తక్కిన మతములవారి మతస్వాతంత్ర్యమునకు ఇందువలన భంగము ఏమియు రాదని ఇంకొక సవరణలో స్పష్టము చేయబడినను, తక్కిన మతములవారికి ఇది కష్టము కలిగించెను. ఇందుకుతోడు షానులను అల్పసంఖ్యాకవర్గము స్వాతంత్ర్యము కొరకై సాగించిన ఆందోళనయు జాతీయ సమైక్యమునకు భంగము కలిగించునను భయమునకు తావొసంగెను. అందువలన సేనాధ్యక్షుడగు జనరల్ నే విన్ తానే స్వయముగ జోక్యము వహించి, సైన్యము సాయముతో మంత్రులను నిర్బంధించి, ప్రభుత్వ బాధ్యతలను వహించెను.

ప్రాదేశిక సాన్నిహిత్యమును బట్టి కమ్యూనిస్ట్ చీనాతో సన్నిహిత సంబంధములు నెలకొల్పుకొనినను, ప్రపంచ రాజకీయములందు తాటస్థ్య విధానమునే అవలంబించుచు, ఆఫ్రేసియా రాజ్యవర్గమున బర్మా ప్రముఖపాత్రను వహించుచున్నది.

రాజ్యాంగము : ప్రభుత్వ విధానమును అనుసరించి బర్మాదేశము బర్మా యూనియన్ అని వ్యవహరింపబడుచున్నది. ఇందలిది సమాఖ్యపద్ధతికి చెందిన ప్రజాప్రభుత్వము. ఈ రాజ్యాంగ విధానము 1947 లో ప్రజా ప్రతినిధులచే ఆమోదితమైనది. శాసన నిర్మాణమునకు రెండు సభలు 1. లోకసభ (ఛేంబర్ అవ్ డిప్యుటీజ్) 2. జాతిసభ (ఛేంబర్ అవ్ నేషనాలిటీజ్) అనునవి కలవు. నిష్పత్తిని అనుసరించి ప్రజలు ఎన్నుకొనిన 250 మంది సభ్యులు తొలుతటి దానియందును, ప్రాదేశిక ప్రాతినిధ్యమును అనుసరించి ఎన్నుకొనబడిన 125 మంది సభ్యులు రెండవ దానియందును ఉందురు. నాలుగేండ్లకు ఒక పర్యాయము ఈ సభలకు సాధారణ ఎన్నికలు జరుగును. 18 ఏండ్లు దాటిన ప్రతి పౌరునికి వోటు హక్కు కలదు. శాసనసభయందు సభ్యుడగువాడు 21 ఏండ్లకు తక్కువ ఉండకూడదు. ఉభయ శాసనసభల సభ్యులును కలసి దేశపు అధ్యక్షుని ఎన్నుకొనెదరు. ఎన్నుకొనబడినప్పటినుండి అయిదేండ్లకాలము అధ్యక్షుడు అధికారమందు ఉండును. లోకసభయందలి అధికసంఖ్యాకుల విశ్వాసమును ఆర్జించినవానిని ప్రధానమంత్రిగ అధ్యక్షుడు నియమించును. ప్రధానమంత్రి సలహాపై తక్కిన మంత్రిమండలిలోని మంత్రులను సయితము అధ్యక్షుడే నియమించును. ప్రధానమంత్రియు, మంత్రిమండలియు పరిపాలనకు బాధ్యత వహించును. ప్రస్తుతము (1962) ఈ రాజ్యాంగ విధానము తాత్కాలికముగ నిలుపుచేయబడి, సేనాధ్యక్షుడగు జనరల్ నే విన్ పరిపాలనా అధికారములను అన్నిటిని వహించెనని ఇదివరకే తెలుపబడినది [చూ. బర్మా యుద్ధములు - పు. 644] చీ. శే. రా.

**బర్మాయుద్ధములు :** భారతదేశమునందలి బ్రిటిష్ సామ్రాజ్యప్రభుత్వము బర్మాదేశముపై వివిధ కాలములందు సాగించిన మూడు యుద్ధములు.

ప్రథమ బర్మా యుద్ధము (1824): బర్మాలోని అవా నగరము రాజధానిగ ఏర్పడిన దేశీయ ప్రభుత్వము, అప్పటిలో స్వతంత్రముగ ఉండిన అస్సామ్‌ను 1821-22 లో జయించుటే కాక, చిట్టగాంగ్ ప్రాంతమునందలి బ్రిటిష్ వారికి చెందియుండిన షాపురీద్వీపమును కూడ 1823, సెప్టెంబరులో ఆక్రమించి, బ్రిటిష్‌సామ్రాజ్య పరిస్థితికి ముప్పు దెచ్చునటుల ఏర్పడుటచే, ఆ సామ్రాజ్య ప్రభుత్వము బర్మాపై యుద్ధము ప్రకటించినది (24 ఫిబ్రవరి, 1824). భూ మార్గమునను, జల మార్గమునను ఈ దండయాత్ర సాగినది. భూ మార్గపు సేన అస్సామ్‌నుండి బర్మాసేనలను తరిమివేసినది. జల మార్గమున రంగూన్‌న దిగిన సామ్రాజ్యసేన తొలుత బర్మీయుల తీవ్రప్రతిఘటనను ఎదుర్కొనినది. బందూలా అను ప్రజ్ఞాయుత సేనాని నాయకత్వమున బర్మాసేనలు బ్రిటిష్ సేనలను పలు ఇబ్బందులపాలు చేసినవి. కాని, ప్రమాదకరమున తుపాకి గుండు దెబ్బ తగిలి బందూలా మరణించిన తరువాత బర్మా సేనలకు తగిన నాయకత్వము లభింపకపోయినది. అంతట సుశిక్షితములగు బ్రిటిష్ సామ్రాజ్య సేనలు పురోగమించి దిగువ బర్మా రాజధానియగు ప్రోమ్ నగరమును ఆక్రమించినవి. కడకు అవా నగరమునకు 96 కిలోమీటరుల దగ్గరకు బ్రిటిష్ సేనలు చేరిన తరువాత బర్మాప్రభుత్వము సంధికి దిగివచ్చినది. కుదిరిన స్థలమును బట్టి ఈ సంధికి 'యండాబూ సంధి' అనిపేరు. దీనిని అనుసరించి భారత సామ్రాజ్యప్రభుత్వమునకు కోటి రూపాయలు నష్టపరిహారమును చెల్లించుటకును, ఆరకాన్, తెన్నాసెరిమ్‌రాష్ట్రములను బ్రిటిష్ వారికి వదులుకొనుటకును, అస్సామ్, కచార్, జయంతియా రాష్ట్రములలో బర్మా జోక్యము వహింపకుండుటకును, మణిపూర్‌ను స్వతంత్రరాజ్యముగ గుర్తించుటకును, అవాలో బ్రిటిష్ రెసిడెంట్‌ను ఉంచుకొనుటకును బర్మాదేశపు రాజు అంగీకరించెను.

ద్వితీయ బర్మా యుద్ధము (1825): యండాబూ సంధిని కుదుర్చుకొనిన బర్మాదేశపు రాజు మరణించిన తరువాత రాజ్యమును అధిష్ఠించిన వారలు బర్మా రాజ్యాంగ సంప్రదాయములను అనుసరించి తాము ఆ సంధిని పాటింప అవసరములేదని నిరాకరించిరి. ఇందుకు తోడుగ బర్మాలో తమ అధికారమును విస్తృత పరచవలయునను ఆకాంక్ష బ్రిటిష్ ప్రభుత్వమునకు ఉండినది. అందువలన బర్మాప్రభువు తమ రాయబారుల ఎడ చూపిన వైఖరి ఆక్షేపణీయముగ ఉండినదను నెపముపై రంగూన్‌ను ముట్టడికి లోనైన నగరముగ బ్రిటిష్ ప్రభుత్వము ప్రకటించి, బర్మా ప్రభుత్వపు నౌకను పట్టుకొనినది. ఇందులకు ప్రతీకారముగ కాల్పులను జరిపి, బ్రిటిష్‌వారి ఒక యుద్ధనౌకకు బర్మాసేనలు నష్టము కలిగించినవి. అంతట పదిలక్షల పౌనుల నష్టపరిహారమును తమకు ఏప్రిల్ 1, 1852 లోగ చెల్లించవలసినదిగ బర్మా రాజునకు అంతిమ సందేశమును పంపి, భారత సామ్రాజ్య ప్రభుత్వము ఆ గడువులోపల సమాధానము రాకపోగా, వెనువెంటనే తన సేనలను రంగూన్‌న దించి, మార్తబాన్ ప్రాంతమును, బస్సీన్‌ను క్రమముగ ఒక నెలలోపల ఆక్రమించినవి. తరువాత డిసెంబరు నాటికి ప్రోమ్, పెగూ నగరములును బ్రిటిష్ సేనల వశమైనవి. అంతట దిగువ బర్మాపై తమ ఆధిపత్యమును అంగీకరించుటకు బర్మా రాజును బ్రిటిష్ ప్రభుత్వము కోరినను అతడు నిరాకరించెను. అందులకు ప్రతిక్రియగ దిగువ బర్మా తమ వశమై, తమ రాజ్యముగ ఏర్పడినటుల బ్రిటిష్ సామ్రాజ్య ప్రభుత్వము ప్రకటించెను (20 డిసెంబరు, 1852).

తృతీయ బర్మా యుద్ధము (1885): ద్వితీయ బర్మా యుద్ధమైన తరువాత కాలక్రమమున బర్మా ప్రభువులకును, బ్రిటిష్ వారికిని మధ్య రాజకీయ సంబంధము కొంత కుదురుకొనినది. 1857 లో బర్మా రాజధాని మాండలేకు తరలింపబడిన తరువాత అచట ఒక బ్రిటిష్ రెసిడెన్సీ ఏర్పడినది. కాని, ఉభయ ప్రభుత్వముల మధ్య సామరస్యము మాత్రము కష్టసాధ్యమయ్యెను. దేశ మర్యాదలను అనుసరించి రాజు సమక్షమునకు పోవునపుడు పాదరక్షలు విడుచుటయు, రాజునకు వినమ్రతతో వంగి మ్రొక్కుటయు బ్రిటిష్ రెసిడెంట్ అవమానకరముగ భావించెను. ఇందులకు తోడుగ బ్రిటిష్‌వారి పలుకుబడిని బర్మాలో విస్తృత మొనర్పవలయునని రంగూన్‌లోని బ్రిటిష్ వర్తకులు వర్తక లాభముల దృష్టితో ఆందోళనము చేయసాగిరి. ఇంతలో ఫ్రెంచి ప్రభుత్వము ఆగ్నేయ ఆసియాలో వలస రాజ్యములను నెలకొల్పి, బర్మాతో సాహచర్యమునకై కృషి చేయుచున్నదని బ్రిటిష్ ప్రభుత్వమునకు అనుమానము ఏర్పడి, దండయాత్రకు అవకాశము ఎటుల దొరుకునా అని వేచి ఉండినది. ఇంతలో బర్మాలో కలప వ్యాపారముచేయు ఒక బ్రిటిష్ కంపెనీ ఏవియో కొన్ని నేరములను చేసెనని దానిపై బర్మాదేశపు రాజగు తీబా 2,30,000 పౌనుల జరిమానాను విధించెను. ఈ విధింపు అన్యాయమనియు, బ్రిటిష్ కంపెనీపై గల నేరమును విచారించు బాధ్యత తనకు వదలి వేయవలసినదనియు భారత

దేశమునందలి బ్రిటిష్ వైస్‌రాయ్ పట్టు పట్టెను. ఇందులకు తీబా నిరాకరింపగ, బ్రిటిష్ ప్రభుత్వము ఒక అంతిమ సందేశమును పంపుచు, అందు బర్మాయొక్క విదేశ వ్యవహారములను తమకు వదలివేయ వలసినదిగను, వర్తక వ్యాపార విషయములలో తమకు కావలసిన సదుపాయము లను కల్పింప వలసినదిగను కోరెను. ఇందులకు బర్మా ప్రభుత్వము నిరాకరించెను (నవంబరు 9, 1885). వెను వెంటనే బ్రిటిష్ సేనలు దండయాత్రను ఆరంభించి, ఇరువది దినములలో మాండలే నగరమును ఆక్రమించి, తీబాను ఖైదు చేసినవి. కాని, ఆ తరువాత బర్మా సేనలు సాగించిన గెరిల్లా పోరాటమును అడచుటకు అయిదు సంవత్సరముల కాలమును, ఆ వెనువెంటనే చెలరేగిన సరిహద్దు సీమలందలి షాన్, చిన్ తెగల పితూరీలను అడచుటకు మరి ఆరు సంవత్సరముల వ్యవధియు పట్టినది [చూ. బర్మా - పు. 640]. చీ. శే. రా.

**బల్గేరియా :** తూర్పు యూరప్ నందలి ఒక స్వతంత్ర రాజ్యము.




నల్ల సముద్రపు తీరమున 399 కిలోమీటరుల పొడవున ఉన్న ఈ దేశమునకు రుమేనియా [ఉ]; నల్లసముద్రము [తూ]; టర్కీ, గ్రీస్ [ద]; యుగోస్లావియా [ప] సరిహద్దులుగ ఉన్నవి. [వి] 1,10,669 చ.కి.మీ.; [జ] 80,45,200. [మ] దేశమున అత్యధిక సంఖ్యాకులు (90%) బల్గేరియన్ ఆర్థడాక్స్ చర్చికి చెందిన క్రైస్తవులు. తక్కిన సంప్రదాయములకు చెందిన క్రైస్తవులును, ముస్లిములును, యూదులును కొలదిగ కలరు. [భా] దేశ భాష స్లావోనిక్ భాషా వర్గమునకు చెందిన బల్గేరియన్ భాష. [రా] సోఫియా (జ. సం.6,71,192).

చరిత్ర : క్రీ. శ. 7 వ శతాబ్దిలో మధ్య ఆసియా నుండి దండెత్తి వచ్చిన బల్గరులను టర్కీ జాతివారును, స్థానిక ముగ అంతకుముందే అటకు వలస వచ్చి జీవించుచుండిన స్లావ్ జాతివారును మిశ్రణ మొందుట వలన ఈ బల్గేరియన్ జాతి రూపొందినది. ఆ నాడు ఈ ప్రాంతపు దేశములను అన్నింటిని లోగొనిన బైజాంటైన్ సామ్రాజ్యముపై ఈ జాతి తిరుగుబాటు చేసి, దేశ స్వాతంత్ర్యమును సుస్థాపిత మొనర్చుకొనినది. సిమియన్ - I రాజు కాలమున (893 - 927) ఈ దేశపు విస్తృతి ఉచ్చస్థాయిని అందుకొనినది. కాని, త్వరలోనే తన స్వాతంత్ర్యమును కోల్పోయి బైజాంటైన్ ప్రభువుల ఆధిపత్యమునకు ఈ దేశము లోనయ్యెను (1018). మరల బల్గేరియా స్వాతంత్ర్యమును ఆర్జించి బాల్కన్ రాజ్యములందు ఒక ప్రముఖ రాజ్యముగ 12, 13 శతాబ్దములలో పేరు ప్రతిష్ఠలను పొందినది. కాని, 14 వ శతాబ్ది అంతమున తుర్కులు ఈ దేశమును జయించి తమ సామ్రాజ్యమున అంతర్భాగముగ చేసికొనిరి. 1878 సంవత్సరము వరకు బల్గేరియా ఇటుల తుర్కుల పాలన లోనే ఉండెను. ఆ సంవత్సరమున రష్యా చక్రవర్తి ఒత్తిడి ఫలితముగ శాన్‌స్టెఫానో సంధి (3 మార్చి, 1878) ని అనుసరించి టర్కీ నామమాత్ర సార్వభౌమాధికారమునకు లోబడిన స్వతంత్రతను ఉత్తర బల్గేరియా ఆర్జించెను. తరువాత 1885 లో దక్షిణ బల్గేరియాను కూడ ఈ స్వతంత్ర రాజ్యము వశపరచుకొని, టర్కీ సార్వభౌమాధి కారమును తిరస్కరించెను. ప్రథమ బాల్కన్ యుద్ధకాల మున (అక్టోబరు 1912 - మే 1913) [చూ. పు. 647] టర్కీని ఎదిరించిన గ్రీస్, మాంటెనీగ్రో, సెర్బియా దేశముల పక్షమున చేరి, ఈజియన్ సముద్రమును చేరుటకు భూ మార్గమును బల్గేరియా సంపాదించెను. కాని, మేసిడోనియా రాష్ట్రమునకు సంబంధించిన ఒక వివాదము మూలమున ద్వితీయ బాల్కన్ యుద్ధమున (జూన్, జూలై 1913) గ్రీస్, రుమేనియా, సెర్బియా, టర్కీ దేశములతో బల్గేరియా పోరాడి, ఓడిపోయి తత్ఫలితముగ దక్షిణ డుబ్రుజా రాష్ట్రమును రుమేనియాకు వదలుకొనుటయే కాక, మేసి డోనియా యందు అధిక భాగమును కూడ కోల్పోయెను. ఇంతేకాక ప్రథమ ప్రపంచ యుద్ధమున జర్మనీ పక్షమును అవలంబించినందులకు ఫలితముగ నెవిల్లీ సంధిని (27 నవం బరు, 1919) అనుసరించి ఈజియన్ సముద్రమునకు పోవు భూ మార్గమునుకూడ బల్గేరియా పోగొట్టుకొనెను. అంతటి నుండి దేశమున రాజకీయ కల్లోలములు ఎక్కువ అయి స్థిర ప్రభుత్వము లేకుండెను. అందువలన ప్రజలకు గల పాలనాధి కారములను అన్నింటిని రద్దుచేసి 1935 లో ఆ నాటి బల్గేరియా రాజు బోరిస్ - III సర్వాధికారములను గ్రహించెను. ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున తన

పూర్వపు భూములను తిరిగి ఆర్జించుకొను ఉద్దేశముతో బల్గేరియా జర్మనీ పక్షమున చేరి తత్ఫలితముగ రుమేనియా నుండి దక్షిణ దుబ్రుజా రాష్ట్రమును వశపరచుకొనుటయే కాక, ఈజియన్ సముద్రతీరమునందలి పశ్చిమ త్రేస్ రాష్ట్రమును, మేసిడోనియాను ఆక్రమించెను. తరువాత సోవియట్ రష్యా సైన్యములు 1944, సెప్టెంబరులో దేశమును ఆక్రమించినవి. అంతట జరిగిన సంధిని అనుసరించి బల్గేరియాకు దక్షిణ దుబ్రుజా రాష్ట్రము మాత్రము వదల బడినది. నాటినుండి సోవియట్ రష్యా పలుకుబడికి ఈ దేశము లోనైనది. వంశానుగతమగు రాచరికము అంతమొందింప బడి 1946, సెప్టెంబరు 15 వ తేదీన బల్గేరియా ప్రజాగణ రాజ్యముగ ప్రకటింపబడినది.

రాజ్యాంగము : 1947 లో ఆమోదింపబడిన రాజ్యాంగ చట్టమును అనుసరించి ఈ దేశమున కమ్యూనిస్ట్ సంప్రదాయపు ప్రజాగణరాజ్య పద్ధతి అమలులోనికి తేబడినది. ఎన్నికల నిర్వహణయంతయు కమ్యూనిస్ట్ పక్షపు ఆధిపత్యమున ఉన్న 'ఫాదర్ ల్యాండ్ ఫ్రంట్' అను రాజకీయ పక్షము నిర్వర్తించును. 18 ఏండ్లు, అంతకుమించి వయసు గల ప్రతిపౌరునికి వోటు హక్కు కలదు. శాసననిర్మాణాధికారము అంతయు 253 సభ్యులు గల జాతీయసభ (సరోనో - సోబ్రనీ) యందు న్యస్తమై ఉన్నది. నాలుగేండ్లకు ఒక పర్యాయము ఈ సభ ఎన్నుకొనబడును. ఒక అధ్యక్షుడు, ఇద్దరు ఉపాధ్యక్షులు, ఒక కార్యదర్శి, 15 గురు సాధారణ సభ్యులు కల ఒక ప్రెసిడియమ్‌ను జాతీయ సభ సభ్యులు ఎన్నుకొనెదరు. అధ్యక్షుడే దేశప్రభుత్వ సర్వాధిపతి. శాసనసభ సమావేశపరుపబడని కాలమున శాసన నిర్మాణమునకు ప్రెసిడియమే బాధ్యత వహించును. సంవత్సరమునకు రెండు పర్యాయములు జాతీయ సభ సమావేశమగును. జాతీయ సభయే ఒక ప్రధానిని, మంత్రి మండలిని నియమించును. మంత్రిమండలి సాయముతో ప్రధాని ప్రభుత్వ కార్యనిర్వహణము ఒనరించును. చీ. శే. రా.

**బసూటోలాండ్ :** చూ. లెసోతో.

**బహమా దీవులు :** పశ్చిమార్ధ గోళమందు బ్రిటిష్ ప్రభుత్వపు వలస రాజ్యముగ ఉన్న ఒక ద్వీప సమూహము.

యునైటెడ్ స్టేట్స్ నందలి ఫ్లారిడా ద్వీపకల్ప తీరమునకు అనతి దూరమున అట్లాంటిక్ మహాసముద్రమునందు 1,223 కిలో మీటరుల పొడవున ఒక పంక్తిగా అటనట చెదరి ఉన్న 700 ద్వీపములు ఈ రాజ్యముగ వ్యవహరింపబడుచున్నవి. ఈ ద్వీప సమూహమున 20 ద్వీపములందు మాత్రమే జనులు వసించు చున్నారు. [వి] 11,406 చ. కి. మీ.; [జ] 1,22,000. జనులు అందరును బ్రిటిష్ సంతతివారు. [భా] ఇంగ్లీషు; [మ] ప్రజలు అందరును క్రైస్తవులు; [రా] నస్సావ్ (న్యూప్రావిడెన్స్ దీవి (జ. సం. 53,100).

చరిత్ర : పశ్చిమార్ధ గోళమునందు కొలంబస్ - క్రీ. శ. 1492 లో కనుగొనిన మొదటి భూ భాగము ఈ ద్వీపములలో ఒకటియై ఉండునని పలువురి అభిప్రాయము. ఆ తరువాత తొలుత వీనిని స్పెయిన్ వారు ఆక్రమించిరి. వారి పరిపాలనా కాలమున వారి దురంతముల వలన ఇచట ఆదిమ జాతి నిశ్శేషముగ నశించెను. స్పెయిన్ వారు అంతట ఈ దీవులను వదలుకొనగ, 1627 మొదలుగ బ్రిటిష్‌వారు ఇచట వలసలను ఏర్పరచుకొనిరి. 1717 లో బ్రిటిష్ ప్రభుత్వము ఈ దీవులలో తమ ప్రత్యక్ష పరిపాలనను నెలకొల్పెను. తదాదిగా ఈ దీవులను బ్రిటిష్ ప్రభుత్వము నియమించు గవర్నర్ పాలించుచున్నాడు. అమెరికా స్వాతంత్ర్య యుద్ధకాలమున బ్రిటిష్ రాచరికము ఎడ భక్తి వహించిన కొందరు అమెరికన్‌లు ఇచట చేరి విశాల క్షేత్రముల సంపాదించిరి. 1861 లో యునైటెడ్ స్టేట్స్ నందు అంతస్సంగ్రామము జరుగుచున్న కాలమున ఆ దేశపు దక్షిణ తీరపు వ్యాపారమంతయు బహామా ముఖ్య నగరమగు నస్సావ్‌కు తరలింపబడుటచే, ఈ దేశము సుసంపన్నము అయ్యెను. కెనడా, యునైటెడ్ స్టేట్స్ దేశముల వారికి వినోద యాత్రా కేంద్రముగ ఈ ద్వీపరాజ్యము ఈ నాటికిని ఉపకరించుచున్నది. ఇచటి గవర్నర్‌కు పరిపాలనలో సాయమొసగుటకు 9 మంది సభ్యులు గల ఒక కార్య నిర్వాహక వర్గము, ఒక లెజిస్లేటివ్ కౌన్సిల్, ఒక ప్రతినిధి సభ కలవు. కౌన్సిల్‌నందు 11 గురు, ప్రతినిధి సభయందు 33 గ్గురు ఎన్నుకొనబడిన సభ్యులు కలరు. దేశమున వయోజనులందరికి వోటు హక్కు కలదు. చీ. శే. రా.

**బహ్మనీ రాజ్యము :** చూ. తెలుగు సంస్కృతి, సం. 3 - పు. 338.

**బాండుంగ్ సమావేశము :** చూ. ఆఫ్రేసియా రాజ్యముల సమావేశము - పు. 294.

**బాగ్దాద్ ఒడంబడిక :** చూ. మధ్య ప్రాచ్య రక్షణసంధి.

**బాజీరావు :** చూ. మహారాష్ట్రులు.

**బానిస రాజవంశము** (1206 - 1290) : 1210, నవంబరులో కుతుబుద్దీన్ [చూ. పు. 391] మరణించెను. 1211 లో అతని అల్లుడగు ఇల్టమిష్ [చూ. పు. 328] సింహాసనమునకు వచ్చి, తిరుగుబాటును కావించిన పంజాబ్, సింధు, బంగాళములను తిరిగి జయించెను. 1228 లో మాల్వా, బుందేల్‌ఖండ్‌లపై దండెత్తి గ్వాలియర్ కోటను, భిల్సా, ఉజ్జయిని నగరములను పట్టుకొనెను. ఇల్టమిష్ 1236, ఏప్రిల్‌లో చనిపోయెను.

ఇల్టుమిష్ అనంతరము అతని కుమారులు ముగ్గురును, రజియా అను కుమార్తెయు వారి గుణదోషమువలన సామంత సర్దారులచే చంపబడిరి. కడకు 1246 లో ఇల్టుమిష్ యొక్క కడపటి కొడుకు నాజరుద్దీన్ మహమ్మద్ అనువాడు సుల్తానయ్యెను. అతనికి అతని అగ్రజుల గుణ దోషములు లేకున్నను, కేవలము సాత్వికుడగుటచే ఆనాటి మోటుసర్దారుల గీటు అడగించి, విశాలమగు తన పెద్దల రాజ్యమును పాలింపగలిగిన సామర్థ్యము లేకుండెను. కనుక, ఘియాజుద్దీన్ బాల్బన్ అను మరియొక బానిస నాజరుద్దీన్‌కు మంత్రిగ ఏర్పడి మంగోల్‌ల దాడిని అరికట్టి, సామంతసర్దార్‌లను ఉక్కడగించి, సామ్రాజ్యమును చెక్కుచెదర కుండా పాలించెను. నాజరుద్దీన్‌కు తన కూతునిచ్చి వివాహము గావించెను. నాజరుద్దీన్ అనంతరము తానే సుల్తానై, తన దర్బారు గౌరవమును కాపాడుటలోను, వాయవ్యపు సరిహద్దులందలి కొండమార్గముల కాపుదారికి తగిన కోటలను కట్టి సైన్యసన్నాహములు చేయుటలోను, ఢిల్లీ సుల్తానుల ఆధిపత్యమును స్థాపించుటలోను మిగుల చాకచక్యము, సామర్థ్యము కనబరచెను. 1282 లో బంగాళము గవర్నర్ తిరుగుబాటును అడచివేసెను. గంగా - యమునా నదుల మధ్యప్రదేశమును చక్కబరచి రాకపోకల సౌకర్యములను వృద్ధిగావించెను. న్యాయ పరిపాలనయందు అద్వితీయుడని పేరొందెను. కాని, అతని అవసాన దశయందు (1285) మంగోల్‌లతోడి యుద్ధమందు మరణించిన తన జ్యేష్ఠ పుత్రుడగు మహమ్మద్‌ను గురించి ఆవేదనపడుచు 1286 లో మరణించెను.

అతని అనంతరము అతని మనుమడగు 'కైకోబాద్' అనువాడు ఢిల్లీ సుల్తానయ్యెను. ఇతడు అధికార గర్వాంధుడై నిజాముద్దీన్ అను ఒక దుష్టుని చేతిలో కీలుబొమ్మగా మెలగుచు, మద్యపానాది దుర్వ్యసన లోలుడయ్యెను. అందుచేత దేశము అరాజకము పాలైనది. అపుడు జలాలుద్దీన్‌ఖిల్జీ అను సేనానాయకుడు ఢిల్లీ పట్టణమును ఆక్రమించెను. పిమ్మట అతని పక్షము వాడెవడో కైకోబాద్‌ను 1290 లో చంపెను. అంతటితో బానిసరాజవంశపు సుల్తానుల పాలన అంతరించినది. ఆ తరువాత ఖిల్జీవంశమువారు ఢిల్లీ సుల్తానులు అయిరి [చూ. ఖిల్జీ వంశము - పు. 418]. గు. వెం.

**బానిస వ్యాపారము :** అతి ప్రాచీనకాలమునుండి బానిసత్వము, బానిస వ్యాపారము ప్రచారములో కలవు. ఇది మానవుడు పశువుల కాపరిగా జీవించినంత కాలము ఎక్కువగా ఉన్నట్లు కన్పట్టదు. వ్యవసాయము ప్రారంభింపబడిన నాటినుండి ఇది విరివిగా కొనసాగినది. ప్రాచీన వాఙ్మయములు అన్నింటిలోను బానిసత్వము ప్రసక్తమైనది. ఇస్లామ్‌లో బానిసతనము కళంకము కాదు; అది యొక వృత్తి మాత్రమే. అమెరికాలో వలస రాజ్యములు స్థాపించిన పాశ్చాత్య దేశములు బానిసవ్యాపారము ముమ్మరముగా కొనసాగించినవి. ఆఫ్రికానుండి నీగ్రోలను బానిసలుగా తెచ్చి, తమ వలసలలో పనిపాటులు చేయించుకొనుచుండిరి. 18 వ శతాబ్దము అంతమున బ్రిటన్‌లోను, తదుపరి ఉత్తర అమెరికా రాష్ట్రములలోను మానవతావాదులు బానిసత్వము, బానిస వ్యాపారము అమానుషము, జుగుప్సాకరము అని కంఠోక్తిగా ప్రకటించిరి. లండనులో 1787 లో బానిసత్వవ్యతిరేకసంఘము స్థాపింపబడెను. బ్రిటన్‌కు సంబంధించినంతవరకు బానిసవ్యాపారమును రద్దు చేయుటకు 1789 లోనే చట్టము ప్రవేశపెట్టబడినను, 1808 వరకు అది పార్లమెంట్‌చే ఆమోదితమై శాసనము కాలేదు. యునైటెడ్ స్టేట్స్ 1808 ప్రారంభమునుండి ఈ వ్యాపారమును నిషేధించెను. డేనిష్‌ప్రభుత్వము 1802 లో బానిసవ్యాపారమును రద్దు పరచి, ఇతర యూరప్ దేశములకు మార్గదర్శి కాగలిగినది. వియన్నా కాంగ్రెస్ (1815) బ్రిటిష్‌ప్రభుత్వ ప్రోత్సాహమున బానిసవ్యాపారమును గర్హించుచు ఒక తీర్మానమును ఆమోదించినది. ఆ సంవత్సరమందే ఫ్రాన్స్, 1820 లో స్పెయిన్, పోర్చుగల్ దేశములును బానిసవ్యాపారమును నిషేధించినవి. ఆ. వెం.

**బాబర్ :** చూ. మొగల్ సామ్రాజ్యము.

**బాబిలన్ నగరము :** ప్రాచీన ప్రపంచములోని ప్రసిద్ధ నగరము; బాబిలోనియా రాజధాని; నేటి బాగ్దాద్ నగరమునకు దాదాపు 90 కి. మీ. దక్షిణముగా ఉండెను. బాబిలన్ అనగా భగవంతుని ద్వారము; కాబట్టి, ఇది బాబిలోనియన్‌లకు ధార్మిక కేంద్రము అయ్యెను. యూఫ్రటీస్‌నది నగరమునకు మధ్యగా ప్రవహించెను. క్రీ. పూ. 2000 నాటికే ఇది చాల ప్రముఖపట్టణము. హమ్మురబీ పరిపాలనములో ఇదియొక విశాల సామ్రాజ్యమునకు కేంద్రము. క్రీ. పూ. 689 లో అసీరియన్‌లచే విధ్వంసము చేయబడినను, అసీరియా పతనము తరువాత బాబిలన్ మరల ఒక స్వతంత్ర ప్రజల రాజధాని అయ్యెను. క్రీ. పూ. 604 - 561 లో ఈ నగరము మున్నెన్నడును లేని మహోన్నత స్థితిని అందుకొనెను. క్రీ. పూ. 539 లో పారసీకులకు లోబడి, ఇది నాటినుండి క్షీణదశ పొంద ఆరంభించెను. అలెగ్జాండర్ [చూ. పు. 303] క్రీ. పూ. 331 లో దీనిని జయించెను. 10 వ శతాబ్దము నాటికే బాబిలన్ పూర్తిగా శిథిలమయ్యెను. పురాతత్త్వ శాస్త్రవేత్తలు చిరకాలము త్రవ్వకములు సాగించి, నగర

విశేషములను వెల్లడించిరి. బాబిలన్‌లోని తూగుటుద్యానములను ప్రపంచములోని ఏడు వింతలలో ఒకటిగ గ్రీకులు పరిగణించిరి. బౌద్ధజాతక గాథలలో ఒకదానియందు బవేరునగరమని పేర్కొనబడినది ఇదియే అని కొందరు ఐతిహాసికుల అభిప్రాయము. **అ. వెం.**

**బాబిలోనియా నాగరకత :** చూ. పు. 17

**బాలగంగాధర తిలక్:** చూ. తిలక్, బాలగంగాధర పు. 519

**బాలట్ పత్రము :** చూ. వోటు.

**బాలాజీ, బాజీరావు :** చూ. మహారాష్ట్రులు.

**బాలాజీ, విశ్వనాథ్ :** చూ. మహారాష్ట్రులు.

**బాల్కన్ యుద్ధములు :** ఆగ్నేయ యూరప్‌లోని బాల్కన్ ద్వీపకల్పమునందలి వివిధ రాజ్యములు సమష్టిగ టర్కీతోడను, మరియు పరస్పరము తమలో తాము ప్రాదేశిక విస్తృతీకరణ వాంఛతో ఇరువదవ శతాబ్ది ప్రథమ పాదమున సాగించిన పలు పోరాటములు సమష్టిగ బాల్కన్ యుద్ధములు అను పేర చరిత్రలో వ్యవహరింపబడుచున్నవి. ఈ రాజ్యములలోని బల్గేరియా, సెర్బియా, మాంటెనిగ్రో, గ్రీస్ దేశములు సంయుక్తముగ టర్కీపై 1912, అక్టోబరులో దండెత్తుటతో మొదటి బాల్కన్ యుద్ధము మొదలైనది. ఈ యుద్ధమున శీఘ్రవిజయమును ఆర్జించి, యూరప్‌లో టర్కీకి చెందియుండిన ప్రదేశమును ఆక్రమించుకొనగలిగిన ఆనాలుగు రాజ్యములకును ఆక్రమితభూమిని పంచుకొనుటలో కలతలేర్పడి, 1913, జూన్‌లో రెండవ బాల్కన్ యుద్ధము మొదలైనది. ఈ రెండవ యుద్ధమున బల్గేరియా దేశపు సైన్యము సెర్బియా దేశ సేనలపై ఆకస్మిక దాడిని సాగించి యుద్ధమును మొదలిడినది. సెర్బియా పక్షమున రుమేనియా దేశము చేరినది. కడకు ఇరుపక్షములును సంధికి ఇష్టపడి, 1913, జూలై 30 న సమావేశమై 'బుకారెస్ట్ సంధి' ని కుదుర్చుకొనినవి.

పై సంధి ఫలితముగ మేసిడోనియా థ్రేస్ లలోని పెక్కు ప్రాంతములు బల్గేరియాకు దక్కకుండ సెర్బియా, గ్రీస్ దేశములకు దక్కినవి. బాల్కన్ యుద్ధ ఫలితములను ఈ క్రింది విధముగ లెక్కింపవచ్చును; 1. ఆడ్రియానోపుల్ పరిసర అల్ప ప్రాంతము మాత్రమే టర్కీకి యూరప్‌న మిగిలి ఉండుట; 2. అనిర్దిష్టపు సరిహద్దులతో ఆల్‌బేనియా రాజ్యము అవతరించుట; 3. సెర్బియా, మాంటెనిగ్రోల విస్తృతి రెట్టింపగుట; 4. ఈజియన్ సముద్రమున కీలకస్థానమున ఉన్న సాలోనికా అను ఓడరేవు గ్రీస్‌నకు దక్కుట; 5. అసంతృప్తము, వ్యథాకులితము అయి బల్గేరియా దేశము మిగిలిపోవుట. **పా. ల. నా.**

**బాల్కన్ రాజ్యములు :** ఆల్‌బేనియా, బల్గేరియా, గ్రీస్, రుమేనియా, టర్కీ, యుగోస్లావియా దేశములకు సమష్టిగ వాడబడు వ్యవహారనామము. ఈ రాజ్యములందు అన్నింట వ్యాపించి ఉన్న బాల్కన్ పర్వతములను బట్టి ఈ దేశములకు ఈ నామము కలిగినది. **మ. ఆ. శ.**

**బాల్టిక్ రాజ్యములు :** ఎస్తోనియా, లాట్వియా, లిథూనియా అను రాజ్యములకు సమష్టిగ వాడబడు వ్యవహారనామము. బాల్టిక్ సముద్రతీరమున ఇవి ఉండుటచే వీటికి ఆ పేరు కలిగినది. ప్రస్తుతము ఈ రాజ్యములు సోవియట్ సోషలిస్ట్ గణరాజ్యసమితి (సోవియట్ రష్యా) యందు చేరిన రాజ్యములుగ ఉన్నవి. **మ. ఆ. శ.**

**బాల్డ్విన్, స్టాన్లీ** (1867 - 1947) : బ్రిటిష్ రాజనీతివేత్త; మూడు పర్యాయములు ఇంగ్లండు ప్రధాన మంత్రి. ప్రముఖ ఇనుప పారిశ్రామికుడు అయిన ఆల్‌ఫ్రెడ్ బాల్డ్విన్ ఏకైక పుత్రుడు. కేంబ్రిడ్జిలోని హారో, ట్రినిటీ కాలేజీలలో విద్యను అభ్యసించెను. హౌస్ ఆవ్ కామన్స్‌కు కన్సరేటివ్ అభ్యర్థిగా 1908 లో ఇతడు ఎన్నుకొనబడెను. 1921 లో బోర్డ్ ఆవ్ ట్రేడ్‌కు ప్రెసిడెంట్ అయ్యెను. బోనార్ లా ప్రధానిగా ఏర్పడిన మంత్రి వర్గమున ఇతడు ఖజానా ఛాన్సలర్ (1922 - 23) అయ్యెను. 1923 లో కామన్స్ సభలో తన పార్టీ నాయకుడు అయ్యెను. ఇతని సంరక్షణ సుంకవిధానము వీగిపోవుటతో మొదటి ప్రధానిత్వము ముగిసినది. రెండవ పర్యాయము ప్రధానమంత్రిగ (1924 - 29) ఉన్నప్పుడు 1926 లో వచ్చిన సార్వత్రికపు సమ్మె (జనరల్ స్ట్రయిక్)ను అంతము చేయుటకు విశేషముగ ఇతడు కృషిసల్పెను. 1931 నుండి 1935 వరకు రామ్సే మెక్‌డొనాల్డ్ జాతీయ ప్రభుత్వములో కౌన్సిల్‌కు లార్డ్ ప్రెసిడెంట్‌గ ఉండెను. ఇతని మూడవ ప్రధాని హయాములో (1935 - 37) నానాజాతి సమితి విచ్ఛిన్నమగుట, నాజీ జర్మనీ విజృంభణ, ఇటలీ ఎతియోపియాను జయించుట, స్పెయిన్‌లో యుద్ధారంభము మూలమున అంతర్జాతీయ సంబంధములు క్షీణించినవి. ఇంగ్లండులో పునర్యుద్ధ సన్నాహములు ప్రారంభమయ్యెను. ఎడ్వర్డ్ - VIII వివాహ విషయమున (1936) ఉత్పన్నమైన క్లిష్ట పరిస్థితిని ఎదుర్కొనుటలో బాల్డ్విన్ చూపిన


స్టాన్లీ బాల్డ్విన్
(1867 - 1947)

దృఢ వైఖరి వలన రాజు పదవి పరిత్యాగమును చేయవలసివచ్చినది. 1937 లో ప్రధాని పదవి నుండి బాల్డ్విన్ విరమించుకొనెను. పా. ల. నా

**బాస్టీల్ దుర్గపతనము :** బాస్టీల్ అనునది పారిస్ నగరమున తూర్పుభాగమునందలి ఒక దుర్గము. ప్రభుత్వము తమ ఖైదీలను ఉంచు కారాగారముగ ఇది ఉపయోగింపబడినది. 1789 ఫ్రెంచివిప్లవ సందర్భమున పంచిపెట్టబడిన కరపత్రముల ద్వారా ఈ ప్రభుత్వ కారాగారమున ఖైదీలపై జరుపబడు ఘాతుక చర్యలను గురించి - అతిశయోక్తులతో నిండిన - వార్తలు ఫ్రాన్స్‌నందు నాడు అంతట వ్యాపించెను (1789 జూలై 14). తత్ఫలితముగ క్రోధోద్రిక్తులైన కార్మికులు కోటలోని రక్షక సైన్యము తమపై గుండ్లవర్షము కురిపించుచున్నను లక్ష్యపెట్టక దుర్గ ద్వారమును బ్రద్దలు కొట్టి లోన ప్రవేశించి, దుర్గ పరిపాలకుని - ప్రధాన మ్యునిసిపల్ ప్రతినిధిని - కసాయి వారివలె నరికివేసి, గోడల రాళ్లను ఒక్కొక్కటిగా విడదీసి, దుర్గమును ధ్వంసము కావించిరి. అందుచే ఈ దుర్గపతనము నిరంకుశ ప్రభుత్వ నిర్మూలన కార్యక్రమము నందు తొలి చర్యగ పరిగణింపబడినది. ఆ దినమున నడచిన కార్యకలాపములే ఫ్రెంచి విప్లవ ప్రారంభమునకు నాందీ ప్రస్తావములయ్యెనని సంప్రదాయముగ తలంచబడుచున్నది. ఈ బాస్టీల్ పతనముచే వెరగందిన ఫ్రెంచి ప్రభుత్వము ఈ ప్రజావిప్లవమును అడచుటకై ఉపయోగించదలచిన విదేశ సైన్య విభాగములను పారిస్ నగర ప్రాంతముల నుండి తొలగించెను. అప్పటినుండి రాజకీయాధికారము ఫ్రెంచి జాతీయ శాసన సభకు బదిలీ చేయబడెను. స్వ. వెం.

**బిల్లముడు - III :** చూ. యాదవులు.

**బిస్మార్క్, అటోఫాన్ (1815 - 1898):** వివిధ రాజ్యములుగ విభక్తమై ఉన్న జర్మనీలో అధిక భాగమును తొలుతగ ఏకీకృతము ఒనర్చిన జర్మను రాజ్యతంత్రవేత్త. ప్రష్యా దేశమున ధనిక కుటుంబమున ఇతడు జన్మించెను. ప్రష్యానాయకత్వమున వివిధ జర్మను రాజ్యములను ఏక రాజ్యముగ రూపొందించుట తన ఆశయముగ ఇతడు ఇడుకొనెను. 1862 లో ప్రష్యా ప్రభువగు విలియమ్ ఈతని సామర్థ్యమును గుర్తించి ఈతనిని తన ప్రధాన మంత్రిగ నియమించెను. ఆ నాటి జర్మను రాజ్యములందు ఆస్ట్రియా అన్నింటికన్న మిన్నగ ఉండెను. ప్రష్యాను కూడ ఆస్ట్రియాయంత బలవత్తర రాజ్యముగ చేయవలయునను తలంపుతో ప్రష్యాసైన్యమును బిస్మార్క్ పునర్నిర్మించెను. తరువాత రెండు రాష్ట్రముల విషయమై జర్మను రాజ్యములకును, డెన్మార్కునకును వచ్చిన తగవును పురస్కరించుకొని 1864 లో ఆస్ట్రియాతో కలిసి డెన్మార్కుపై దండెత్తి, రెండు రాష్ట్రములను వశపరచుకొనెను. కాని, ఆ రాష్ట్రముల యాజమాన్య విషయమున ఆస్ట్రియాతో బిస్మార్క్ తగవునకు దిగి ఆస్ట్రియాను యుద్ధమున ఓడించి (1866), జర్మను రాజ్యములందు ప్రష్యాకు అగ్రస్థానమును చేకూర్చెను. తత్ఫలితముగ జర్మను రాజ్యములందు రెండు కూటములు ఏర్పడి, ప్రష్యానాయకత్వమున గల కొన్ని జర్మను రాజ్యములు ఉత్తర జర్మనీ సమాఖ్యారాజ్యముగ రూపొందెను. తక్కినవి ఆస్ట్రియా నాయకత్వమున చేరెను. తరువాత ఈ రెండు కూటములకును ఎగుమతి - దిగుమతి సుంకములు మొదలగు వాని యందు ఏకీకరణము మొదలగు కొన్ని ఏర్పాటులు జరిగినను, ఏకైక జర్మను రాజ్యము మాత్రము రూపొందలేదు. కాని, స్పెయిన్ సింహాసనమును గురించి ఫ్రాన్స్ - ప్రష్యాలకు పోరాటము సంఘటిల్లి 1871 లో ఫ్రాన్స్‌ను ప్రష్యా సంపూర్తిగ ఓడించుటతో ఇందులకు అవకాశము లభించెను. ఆ పోరాటమున ఉత్తర సమాఖ్య రాజ్యములతో పాటు దక్షిణ రాజ్యములును ప్రష్యానాయకత్వమున పనిచేసినందువలన ఈ విజయము లభించుటతో, ఏకైక జర్మనీ ఆవశ్యకతను దక్షిణ రాష్ట్రములును గుర్తించెను. ఇటుల అన్ని జర్మను రాజ్యముల కోరికపై ప్రష్యారాజు విలియమ్ - I ఏకైక జర్మనీ చక్రవర్తిగ అధికారము వహించునటుల నిర్ణయము జరిగి అట్టి ప్రకటన జరిగెను (1871, జనవరి, 18). ఈ విధముగ కడకు బిస్మార్క్ తన జీవితాశయమును నెరవేర్చుకొన గలిగెను.

బిస్మార్క్ తాను స్థాపించిన ఆ జర్మను సామ్రాజ్యము ప్రధాన మంత్రిగ ఇరువది ఏండ్ల పాటు అవిచ్ఛిన్నముగ పరిపాలించెను. జర్మనీలోని పరిశ్రమలను, వాణిజ్యమును పెంపొందించి, జర్మనీని యూరప్ ఖండమునకు అగ్రగామి దేశముగ అతడు తీర్చిదిద్దెను. విలియమ్ చక్రవర్తి చనిపోయి విలియమ్ -II [చూ.] సింహాసనము అధిష్ఠించగనే అతడు బిస్మార్క్ చేతులలో సామ్రాజ్యపాలనను వదలుటకు ఇచ్చగింపక, తానే స్వయముగా పరిపాలింప పూనుకొనెను (1890) ; అందుచేత, అంత దీర్ఘ కాలము జర్మను సామ్రాజ్య నౌకను నడపిన ఆ వృద్ధ నావికుడు పదవిచ్యుతుడై, మిగిలిన తన ఎనిమిదేండ్ల జీవితమును తన స్వగ్రామములో స్వీయచరిత్రను వ్రాయుటలో గడపి 1898 లో మరణించెను. ప్ర. రా.

**బుధగుప్తుడు (477 - 496 ప.) :** భారతదేశమును పాలించిన గుప్తవంశమునకు చెందిన కడపటిరాజు. కుమార

గుప్త - II మరణానంతరము కుమారగుప్త - I యొక్క కుమారుడును, స్కంద, పురగుప్తుల సోదరుడును అయిన ఈ బుధగుప్తుడు సామ్రాజ్యాధిపతియై, ఇరువది ఐదు ఏండ్ల కాలము పరిపాలనము సాగించెను. ఇతడు తన తండ్రి, సోదరుల బిరుదముల వహించి, వంశ పరంపరాగత రాజ్యమును నిలువబెట్టుకొని పేరుగాంచిన కడపటి గుప్త భూనేత.

బుధగుప్తుని సంతతి : బుధగుప్తుని తరువాత అతని సంతతివారైన వైన్యగుప్తుడును, తాతగుప్తుడును రాజ్యమునకు వచ్చిరి. కాని, వీరు చరిత్ర ప్రసిద్ధులు కారు. వీరు ఇద్దరు ఐదారేండ్లు మాత్రము పాలించి చనిపోయిరి. వీరి తరువాత భానుగుప్త బాలాదిత్యుడు - II రాజ్యభారము వహించి, పదునెనిమిది ఏండ్లు రాజ్యపాలనము గావించెను. ఈ భానుగుప్త బాలాదిత్యుని కాలముననే హూణులు తమ నాయకుడైన తోరమానుని యాజమాన్యమున గుప్త సామ్రాజ్యముపై దండెత్తివచ్చిరి. కాని, హూణులు బాలాదిత్యుని సేనలకు ఓడిపోయిరి. ఈ యుద్ధములో తోరమానుని కుమారుడైన మిహిరకులుడు గుప్త సేనలచే బందీకృతుడు అయ్యెను. తరువాత బాలాదిత్యుని తల్లి కోరికపై మిహిరకులునకు బంధమోక్షము కలిగెను. కాని, ఆ కాలముననే జినేంద్ర యశోధర్ముడను భూపేంద్రుడు ఆర్యావర్తమున గుప్తసామ్రాజ్యమునకు ప్రక్కలోని బల్లెమై బాలాదిత్యుని కుమారుడైన వజ్రగుప్తుని యుద్ధములో సంహరించెనని చరిత్రకారులు వ్రాసి ఉన్నారు. ఏది ఎట్లయినను, బాలాదిత్యునితో గుప్తసామ్రాజ్య ప్రాభవము సమసిపోయెను.

కుం. ఈ. దత్తు.

**బుద్ధుడు** : గౌతముడు అను రాజకుమారుడు సత్యమును తెలిసికొనినందువలన బుద్ధుడై బౌద్ధమతమును ప్రజలకు ఉపదేశించెను. గౌతముడు 2500 సంవత్సరముల క్రిందటివాడు - క్రీ. పూ. 563 వ సంవత్సరము కంటె ముందు - కపిలవస్తునగరమును ఏలుచుండిన శాక్యవంశ రాజగు శుద్ధోదనుని కుమారుడు. తల్లి మాయాదేవి. చిన్నతనముననే రాజవీథిలో సంచారమునకు వెళ్లి, ప్రజల దుఃఖమును చూచి, ప్రపంచమున అట్టి బాధలు లేకుండ చేయు మార్గమునకై తీవ్రమైన అన్వేషణ ప్రారంభించెను.

భార్యను, కుమారుని వదలి, ఇల్లువెడలి గౌతముడు సత్యాన్వేషణమునకై అరణ్యములో పడి, అనేకుల బోధనలు పొంది, శరీరము శుష్కింపజేసి, తపించి చివరకు ఇవి ఏవియు సక్రమమగు మార్గములు కావని తెలిసికొని, ఏడు సంవత్సరములు నిరంతర అన్వేషణానంతరము ఒక బోధివృక్షము క్రింద అపూర్వమైన, అనన్య సాధ్యమైన సత్యమును తెలిసికొని, ఆ సత్యమును ప్రజలలో ప్రచారము చేయుటకై బయలుదేరి వచ్చెను.

ప్రపంచమున బాధలన్నియు స్వార్థమువలన కలుగుచున్నవనియు, అహింసయే పరమ ధర్మమనియు బుద్ధుడు బోధించెను. ఈయన అనుయాయులను బౌద్ధులు అందురు. తన 80 వ ఏట బుద్ధుడు నిర్యాణము పొందెను. ఈయనను అవతార పురుషునిగా బౌద్ధులు, హిందువులు కూడ కీర్తింతురు [చూ. సం. 7 - పు. 557].

* * *

**బురుండీ** : ఆఫ్రికాయందలి ఒక స్వతంత్ర రాజ్యము. ఈ రాజ్యమునకు రువండా [ఉ]; టాంజేనియా [తూ, ద]; కాంగో (లియోపాల్డ్ విల్లి) [ప] సరిహద్దులందు ఉన్నవి. [వి] 27,834 చ. కి. మీ.; [జ] 26,00,000. వీరిలో బహూతూ తెగవారు 86.5%, బతూచీ తెగవారు 12.4% కలరు. [భా] ఆఫ్రికన్ భాషలు మాతృ భాషలుగ ఉన్నను, పరిపాలనా వ్యవహారములందు ఫ్రెంచి వాడబడుచున్నది. [మ] ప్రజలలో క్రైస్తవ మతమునకు కొంత వ్యాప్తి కలదు. [రా] ఉసుంబురా (జ. సం. 46,000).

చరిత్ర : 1962 వరకు ఈ దేశము రువండీ - ఉరుండీ యందు అంతర్భాగముగ ఉండి, బెల్జియమ్ దేశపు ధర్మకర్తృత్వ పాలనమందు ఉండినది [చూ. రువండా]. తరువాత విడివడి జూలై 1, 1962 న స్వతంత్రను ఆర్జించినది. ఈ దేశము నందలి బహూతూ తెగవారు ప్రపంచమందలి అన్ని మానవజాతులలో ఎక్కువ పొడవైనవారు; వేరొక తెగ జాతియగు బతూచీ ప్రజలు అన్ని మానవ జాతులలోను చాల పొట్టి తరగతికి చెందినవారు.

రాజ్యాంగము : వంశానుగతము, శాసన విహితము అగు రాజరికము ఇట తొలుత పరిపాలన నెరపినది. కాని, 1966, నవంబరు 29 న రాచరికపు అధికారమును అంతరింపజేసి, మికాంబెరో అను సేనాని తన అధ్యక్షతన గణ రాజ్యమును నెలకొల్పెను.

చీ. శే. రా.

**బృహత్ఫలాయనులు** : చూ. తెలుగు సంస్కృతి. సం. 3 - పు 109.

**బెంటింక్, విలియమ్ (1774 - 1839)** : ఇతని పూర్తి పేరు లార్డ్ విలియమ్ కావిండిష్ బెంటింక్. బ్రిటిష్ రాజనీతివేత్త; ఒకప్పుడు భారత గవర్నర్ - జనరల్. బ్రిటిష్ ప్రధానిగ పనిచేసి యుండిన పోర్ట్‌లాండ్ డ్యూక్ - III యొక్క రెండవ కుమారుడు. ఇతడు బ్రిటిష్ సైన్యములో చేరి నెపోలియన్‌పై సాగిన యుద్ధములలో పాల్గొనెను. బెంటింక్ 1803 లో మద్రాసు గవర్నరుగ నియమింపబడెను; మద్రాసు ప్రధాన న్యాయమూర్తితోను, తన కార్యవర్గ సభ్యులతోను వివాదపడి, వెల్లూరు సిపాయీల తిరుగుబాటు సమయమున ప్రదర్శించిన వైఖరి

ఫలితముగ స్వదేశమునకు పిలిపింపబడెను. ఇతడు మరల 1827 లో బెంగాల్ గవర్నర్ - జనరల్ గను, సవరింపబడిన ఈస్ట్ ఇండియా కంపెనీ ఛార్టర్‌లోని నిబంధన ప్రకారము 1833 లో మొట్టమొదటి బ్రిటిష్ ఇండియా గవర్నర్ - జనరల్ గను నియమింపబడి, 1835 వరకు భారత దేశమును పరిపాలించెను. పౌర, సైనిక శాఖల వ్యయమును తగ్గించుట; ఠగ్గులు అను దోపిడీ దొంగలను నిర్దాక్షిణ్యముగ రూపుమాపుట; రాజా రామమోహన్ రాయ్ [చూ.] ల సహకారముతో 'సతి' లేదా 'సహగమనము' ను [చూ. సం. 10 - పు. 765] నిషేధించుట; భారత దేశములో బోధనా భాషగా ఇంగ్లీషును ప్రవేశపెట్టుట; న్యాయ, కార్య, నిర్వాహక శాఖలో ఉన్నతోద్యోగములకు భారతీయులను నియమించుట; మద్రాసు, కలకత్తా నగరములలో వైద్యకళాశాలలను నెలకొల్పుట ఇతడు చేసిన ఘనకార్యములు. 1831 లో ఇతడు మైసూరు అల్లరులను అడచి, ఆ రాజును తొలగించి, పరిపాలనకై బ్రిటిష్ ప్రతినిధిని నియమించెను. 1830 లో కఛార్ రాజును, 1834 లో కూర్గురాజును పదవిచ్యుతులను చేసి, ఆ ప్రాంతములను బ్రిటిష్ సామ్రాజ్యములో విలీనము చేసెను. ఇతని పరిపాలనలో దేశమున శాంతి నెలకొనినదని చరిత్రకారుల అభిప్రాయము. ఆ. వెం.



విలియమ్ బెంటింక్
(1774 - 1839)

**బెంథామ్, జెరిమీ** (1748 - 1832): బ్రిటిష్ వేదాంతి; న్యాయదక్షుడు; సంస్కర్త. ఇతడు ప్రవచించిన సిద్ధాంతమునకు 'ప్రయోజన వాదము' అని పేరు. 'వీలు ఉన్నంత ఎక్కువ మందికి వీలు ఉన్నంత ఎక్కువ సౌఖ్యము' సమకూర్చుట ఈ వాదముయొక్క ప్రముఖోద్దేశ్యము [చూ. సం; 10 పు - పు. 560]. * * *

**బెచూనాలాండ్:** చూ. బోత్స్వానా.

**బెనిస్, ఎడ్వర్డ్** (1884 - 1948): జెకోస్లోవాకియా రాజనీతివేత్త: ప్రభుత్వాధినేత (1935 - 38; 1945 - 48). ఇతడు ఒక నిరుపేద కృషిక కుటుంబమున జన్మించెను. ప్రాగ్ (ప్రాహా), పారిస్ యూనివర్సిటీలలో విద్యాభ్యాసముచేసి డాక్టరేట్ పట్టమును పొందెను (1908). కొంతకాలము అర్థిక శాస్త్ర, సాంఘిక శాస్త్ర ఆచార్యుడుగ పనిచేసెను. ప్రథమ ప్రపంచయుద్ధము ప్రారంభమైన నాటికి ఇతడు జెకోస్లోవాకియా జాతీయోద్యమ నాయకులలో ప్రముఖుడై, మసారిక్‌నకు కుడిభుజము అయ్యెను. బెనిస్ 1915 లో పారిస్‌నకు పారిపోయి హాప్స్‌బర్గ్‌ల పారతంత్ర్యమునుండి స్వదేశ విముక్తిని సాధించుటకు పత్రికా రచయితగను, దౌత్యవ్యవహర్తగను తీవ్రకృషి చేసి, మిత్రబృందమువారిచే తాత్కాలిక ప్రభుత్వముగ ఆమోదింపబడిన జెకోస్లోవాకియా జాతీయసంస్థకు కార్యదర్శి అయ్యెను. 1918 లో జెకోస్లోవాకియా ప్రత్యేక ప్రజాస్వామ్య గణరాజ్యముగ ఏర్పడిన తరువాత ఇతడు విదేశాంగ మంత్రిపదవిని చేపట్టి; తన దేశము తరపున వెర్సెయిల్స్ శాంతిసభలో పాల్గొనెను. నానాజాతి సమితి [చూ. పు - 531] లో ప్రతినిధిగను (1920), సమితి కార్యనిర్వాహక సంస్థలో సభ్యుడుగను పనిచేసెను (1923, 1925). తనదేశమువంటి చిన్న రాజ్యముల భద్రతకు ఉద్దేశింపబడిన అల్పరాజ్యమేళనము (1920), జెనీవా సంధి పత్రము (1924) వ్యవస్థాపించుటలో ప్రముఖ పాత్ర నిర్వహించి, ఈయన లోకార్నో సంధి [చూ.] పై సంతకము చేసెను (1925). హాప్స్‌బర్గ్ రాజవంశపు పునః ప్రతిష్ఠాపనకు 1921 లో జరిగిన రెండు ప్రయత్నములు విఫలములగుటకు ఇతడే ముఖ్య కారకుడు. మ్యూనిక్ ఒడంబడిక [చూ.] కు (1938) నిరసనగ ఇతడు తన పదవికి రాజీనామా ఇచ్చెను. 1945, మే లో మరల స్వాతంత్ర్యమును ఆర్జించిన జెకోస్లోవియాకు ఇతడు అధ్యక్షుడై, కమ్యూనిస్ట్ ప్రధాని క్లెమెంట్ స్థాపించిన రాజ్యాంగ విధానమును ఆమోదింపలేక 1948, జూన్ లో పదవినుండి విరమించి, భగ్నహృదయుడై మూడు నెలల తరువాత మరణించెను [చూ. జెకోస్లోవాకియా - పు. 485]. ఆ. వెం.

**బెర్లిన్ కాంగ్రెస్:** ఆగ్నేయ యూరప్‌నందు అగ్ర రాజ్యములకు నచ్చునట్టి బలతౌల్యము (బేలన్స్ ఆవ్ పవర్) ను సాధించుటకై జర్మనీ ప్రధానియగు బిస్మార్క్ అగ్రాసనాధిపత్యమున బెర్లిన్ నగరమున (1878 జూన్ - జూలై) జరిగిన అంతర్జాతీయ సమావేశము. ఆ సమావేశ నిర్ణయములు బెర్లిన్ సంధిచే ధ్రువీకృతములైనవి; ఆ నిర్ణయములో ముఖ్యమైనవి. 1. స్వతంత్ర ప్రతిపత్తిగల బవేరియా రాజ్యావతరణము; 2. బల్గేరియాకు దక్షిణముగ తూర్పు రుమీలియా అను పేర ఒక రాజ్యము, నామమాత్రపు టర్కీ సమ్రాట్ ఆధిపత్యమున, ఒక క్రైస్తవ గవర్నర్ పరిపాలన క్రింద ఏర్పరుచుట; 3. సెర్బియా, మాంటెనీగ్రో రాష్ట్రముల స్వాతంత్ర్యము స్థిరపరచుట; 4. రుమేనియా స్వాతంత్ర్యమును ధ్రువపరచి, ఆ రాజ్యము నుండి రష్యాకు ఇప్పించిన బెస్సరేబియాకు పరిహారముగ ఉత్తర దుబ్రుజా రాష్ట్రము రుమేనియాకు చెందజేయుట;

5. రష్యాకు కాకసస్ పర్వత ప్రాంతము దఖలు పడుట; 6. ఆస్ట్రియా - హంగేరీ (అ) బాస్నియా - హెర్జెగోవినా, (ఆ) నోవీ బజారులను వశపరచుకొను హక్కును పొందుట; 7. సైప్రస్‌ను ఆక్రమించుకొను హక్కు బ్రిటన్‌కు కలదనుట.

వీనిలో, తూర్పు రుమీలియా రాష్ట్రము బల్గేరియాతో 1885 లో లీనమైనను మిగిలిన ఈ సంధి ప్రధాన సూత్రములు 30 ఏండ్లవరకు అమలులో ఉండెను. స్వ. వెం.

**బెర్లిన్ సమావేశము** (1884, నవం. - 1885 ఫిబ్ర.): మధ్య ఆఫ్రికా విభజనను గురించి యూరప్ ప్రభుత్వముల మధ్య ఏర్పడిన ఉద్రిక్త పరిస్థితిని నివారించుటకై జర్మనీ ప్రధానియగు బిస్మార్క్‌చే ఆహ్వానింపబడిన పదిహేను రాజ్యముల ప్రతినిధుల సమావేశము. ఈ ఉద్రిక్త పరిస్థితికి ఈ దిగువ వివరింపబడిన రెండును ముఖ్య కారణములు: 1. కాంగోయందు తావును ఆర్జించిన బెల్జియన్‌ల యొక్కయు, ఫ్రెంచివారి యొక్కయు పోకడలను గురించి బ్రిటిష్ వారికిని, పోర్చుగీస్ వారికిని అపనమ్మకము గలుగుట; 2. వారికే తూర్పు ఆఫ్రికాయందును, కామెరూన్ యందును జర్మనీ విస్తరణమును గూర్చి ఆందోళనము గలుగుట.

ఈ సమావేశము: 1. కాంగో రాజ్యము సముద్రము వరకు విస్తరించుటకు అంగీకార మొసంగెను; 2. బానిసత్వమును, బానిస వ్యాపారమును అణచివేయు పద్ధతులను ఒప్పుకొనెను: 3. కాంగో - నైజర్ నదులపై నౌకాయాన స్వేచ్ఛకు పూచీపడెను; 4. యూరప్‌లోని ఈ వివిధ జాతుల మధ్య భవిష్యత్తులో ఆఫ్రికాలోని తమ వలసలను గురించి పెద్ద యుద్ధము సంభవించకుండ నివారించుటకై ఆ యా దేశీయులు నూతన వలసల స్థాపనయందు గమనించవలసిన విధులను నిర్ణయించెను.

ఈ సమావేశమునందు అంతకుముందు శ్రుతికలియని జర్మనులును, ఫ్రెంచివారును ఏకీభావముతో పనిచేయుట గమనార్హమైన ప్రముఖ విషయము. స్వ. వెం.

**బెర్మ్యూడా**: పశ్చిమార్ధగోళమందు బ్రిటన్ వలస పాలనలో ఉన్న ఒక ద్వీపరాజ్యము.

యునైటెడ్‌స్టేట్స్‌కు తూర్పు తీరమునకు దాదాపు 804 కిలోమీటరుల దూరమున ఉత్తర అట్లాంటిక్ మహాసముద్రమున అతి విస్తృత ప్రదేశమున చెదరి ఉన్న దాదాపు 300 చిన్న ద్వీపములు ఈ ద్వీప రాజ్యమునందు ఉన్నవి. ఈ ద్వీపముల మొత్తపు [వి] 54 చ. కి. మీ.; [జ] 45,491. ప్రజలందు బ్రిటిష్ సంతతి వారు ఎక్కువగ కలరు. [భా] ఇంగ్లీషు, [మ] ప్రజలు క్రైస్తవులు, [రా] హామిల్టన్ (గ్రేట్ బెర్మ్యూడా) (జ. సం. 2,800).

చరిత్ర: క్రీ. శ. 16 వ శతాబ్దిలో ఈ ద్వీప సమూహమును కనుగొనిన జువాన్ బెర్మ్యూడెజ్ అనువాని వలన ఈ రాజ్యమునకు బెర్మ్యూడా అను పేరు కలిగినది. 16 వ శతాబ్దిలో ఆంగ్లేయులు ఇట వలసచేరి దీనిని ఆక్రమించిరి. 1684 లో దీని పరిపాలనను బ్రిటిష్ ప్రభుత్వము గ్రహించినది. ద్వితీయ ప్రపంచ యుద్ధ [చూ.] కాలమున ఈ దీవియందలి 5 చ. కి. మీ. విస్తీర్ణము యునైటెడ్‌స్టేట్స్ నౌకా, వైమానికాశ్రయమునకై 99 సంవత్సరముల కౌలునకు ఈయబడినది. బ్రిటిష్ ప్రభుత్వము నియమించు గవర్నర్, కార్యవర్గ సాహాయ్యముతో ఈ దీవులను పాలించును. పరిమితాధికారములు కలిగి, రెండు కక్ష్యలు కల శాసనసభ కలదు. ఇందలి సభ్యులను ప్రజలు ఎన్నుకొనెదరు. చీ. శే. రా.

**బెల్జియమ్**: యూరప్ ఖండమున వాయవ్య దిశయందు ఉన్న ఒక స్వతంత్ర దేశము.




ఈ దేశమునకు నార్త్ సముద్రము, నెదర్‌లండ్స్ [ఉ]; జర్మనీ, లగ్జెంబర్గ్ [తూ]; ఫ్రాన్స్ [ప, ద] సరిహద్దులందు ఉన్నవి. [వి] 30,507 చ. కి. మీ.; [జ] 92,51,414. ఫ్లెమింగ్, వాలూన్ అను రెండు జాతుల ప్రజలు ఇట నివసించుచున్నారు. మొదటి జాతి వారు డచ్చి వారికిని, రెండవ వారు ఫ్రెంచి ప్రజలకును సాంస్కృతిక సాన్నిహిత్యము కలిగి ఉన్నారు. [భా] డచ్చి, ఫ్రెంచి భాషలు రెండిటికిని ఈ దేశమున విశేష వ్యాప్తి కలదు. జర్మనీభాష మాటాడువారును నూటికి ఇరువురు ఉందురని అంచనా, ఫ్రెంచి, డచ్చి భాషలు రెండును ప్రభుత్వ వ్యవహార భాషలుగ పరిగణింప బడుచున్నవి. [మ] ప్రజలందరును క్రైస్తవులు. ఇందు అత్యధిక సంఖ్యాకులు రోమన్ కేథలిక్‌లు. కాని, దేశమున చట్టరీత్యా మతస్వేచ్ఛ కలదు. జనాభా లెక్కలలో మతము పరిగణనకు తీసికొనబడుటలేదు. [రా] బ్రస్సెల్స్ (జ. సం. 13,93,326).

చరిత్ర: 1830 లో 'బెల్జియమ్' అను పేరుగల రాజ్యము ఏర్పడినను, ఈ ప్రాంతపు చరిత్ర మాత్రము క్రీస్తు పుట్టుటకు పూర్వమే ప్రారంభమైనది. క్రీ. పూ. 50 నాటికి బెల్జీ అను

ప్రజలను జూలియస్ సీజర్ జయించెను. బెల్జీ అను పదము నుండియే బెల్జియమ్ అను పదము ఏర్పడినది. సీజర్ ఆక్రమణ తరువాత ఇంచుమించు 500 సంవత్సరముల కాలము ఈ ప్రాంతము రోమన్ సామ్రాజ్యములో భాగముగా ఉండెను. ఆ తరువాత ఈ ప్రాంతము వరుసగా ఫ్రాన్స్, జర్మనీ, స్పెయిన్, ఆస్ట్రియా దేశములచే పాలింపబడెను.

మత విభేదములవల్ల 1579 లో నెదర్లండ్స్‌లో ఉత్తర-దక్షిణ భాగములు విడిపోయినవి [చూ. నెదర్లండ్స్]. అందు దక్షిణభాగమే నేటి బెల్జియమ్‌గా రూపొందినది. ఇది చాలకాలము స్పెయిన్ పరిపాలనలో ఉండెను.

కొద్దికాలముపాటు 1598 నుండి 1621 వరకు అర్చ్‌డ్యూక్ ఆల్బర్ట్ అనువాని పరిపాలనలో బెల్జియమ్ ప్రత్యేక స్వతంత్ర రాష్ట్రముగ వర్ధిల్లినది. కాని, ఇది మరల స్పెయిన్ వశమై స్పానిష్ - నెదర్లండ్స్ అను పేర పాలింపబడినది. అది బెల్జియమ్ చరిత్రలో బహు దురదృష్ట దశ. ఫ్రాన్స్‌తోడి పోరాటములో స్పెయిన్ బలము క్రమముగ క్షీణించుచుండెను. బెల్జియమ్ యుద్ధరంగముగ మారినది. ప్రతి దేశమునకును బెల్జియమ్‌ను జయింపవలెనని కాంక్షయే; చివరకు 1713 లో ఉట్రెక్ట్ సంధి [చూ. పు. 337] తో ఈ పోరాటము సమాప్తమై బెల్జియమ్ ఆస్ట్రియా అధీనమైనది. 1741 - 1780 మధ్య బెల్జియమ్ కొంత కోలుకొనినది. ఈ కాలమున కొన్ని సంవత్సరములు బెల్జియమ్‌లో చాల భాగమును ఫ్రాన్స్ పాలించినను, ఐ-లా-షాపెల్ సంధి [చూ. పు. 359] ప్రకారము బెల్జియమ్ అంతయు ఆస్ట్రియాకు ఇచ్చివేయబడినది.

ఫ్రెంచి విప్లవ కాలమున బెల్జియమ్ ఫ్రాన్స్ చేతిలో పడినది. 1815 లో వియెన్నా సమావేశము వలన హాలండ్, బెల్జియమ్ దేశములు ఏక రాజ్యమయినవి. 1830 లో మరల బెల్జియమ్ విడిపోయి స్వతంత్రమైనది. 1831 లో రాజ్యాంగము ఏర్పరుపబడి, లియోపాల్డ్ - I రాజుగా ఎన్నుకొనబడెను. సమర్థమగు రాజ్యాంగము, ఉత్తముడగు రాజు జతకూడుటచే దేశము అభివృద్ధి చెందినది.

లియోపాల్డ్ - II 1865 లో రాజయ్యెను. తదుపరి అల్బర్ట్ - I రాజయ్యెను. ఈతని పరిపాలనలో 1914 న జర్మనీ తన సైన్యములను ఫ్రాన్స్‌పైకి దండయాత్రకు బెల్జియమ్ మీదుగా పంప యత్నించి, అందులకు అనుమతించుటో లేదా తాటస్థ్యమును నిలబెట్టుకొనుటకు పోరాడుటో తేల్చుకొనవలసినదని బెల్జియమ్‌కు తెలియపరచెను. అల్బర్ట్ రాజు నాయకత్వమున బెల్జియమ్ పోరాటమునకే సిద్ధపడెను. తత్ఫలితముగ ప్రథమ ప్రపంచ యుద్ధము [చూ. పు. 594] లో బెల్జియమ్ సర్వనాశనము అయినది. యుద్ధానంతరమున బెల్జియమ్ తిరిగి స్వతంత్రమై ఆల్బర్ట్ రాజు నాయకత్వమున మరల అభివృద్ధి చెందగలిగెను.

ఆల్బర్ట్ రాజు 1934 లో మరణించుటతో లియొపాల్డ్ - III రాజయ్యెను. ఈతని పరిపాలన కాలముననే ద్వితీయ ప్రపంచయుద్ధ [చూ. పు. 608] సందర్భమున - 1940 మే 10 న - జర్మనీ హెచ్చరికయైన లేకుండ ఈ దేశమును ముట్టడించెను. లియొపాల్డ్ - III రాజు మే 28 న లొంగిపోయెను. కాని, అతని మంత్రివర్గము లొంగిపోవుటకు తిరస్కరించి లండనుకు తరలిపోయెను. మరల 5 ఏండ్లపాటు బెల్జియమ్ యుద్ధరంగమయినది.

బెల్జియమ్ మంత్రివర్గము 1944, సెప్టెంబరులో మరల స్వదేశమునకు తిరిగి వచ్చినది.

ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున దేశము ఆర్థికముగ కొంతవరకు బాగుపడినను, రాజకీయముగ మాత్రము కల్లోల స్థితికి లోబడినది. యుద్ధాత్పూర్వము దేశమును పాలించిన లియొపాల్డ్ - III రాజును మరల రాజుగ గ్రహించుట తగునా ? తగదా ? అను విషయమై రాజకీయ పక్షముల మధ్య తర్జన భర్జనలు చెలరేగెను. 1950, మార్చి 12 వ తేదీన జరిగిన సార్వజనిక ఎన్నికలలో నూటికి 57.7 మంది రాజు పునరాగమనమునకు అనుకూలముగ వోటు చేయుటచే లియొపాల్డ్ - III తిరిగి రాజు కాగలిగెను. కాని, సోషలిస్టులును, మితవాదులును ఇందులకు తమ ప్రతిఘటనను తెలుపుచు సమ్మెలను లేవదీసిరి. దేశమును ఈ క్లిష్ట పరిస్థితినుండి తప్పించుటకు వేరుదారి కనపడక, లియొపాల్డ్ - III 1950, ఆగస్టు 1 వ తేదీన తన రాజ్యాధికారమును స్వయముగ పరిత్యజించెను. తరువాత కొంత కాలమునకు అతని కుమారుడు బెడూయిన్ - I రాజుగ ప్రకటితుడయ్యెను (17 జూలై, 1952).

రాజ్యాంగము : వంశానుగత స్వత్వము గల రాచరికపు పరిపాలన ఈ దేశమున అమలునందు ఉన్నను, పరిపాలనము శాసనబద్ధమై, ప్రజాస్వత్వానుసారియై ఉన్నది. లాంఛనముగ సర్వాధికారములును రాజునందే నెలకొనిఉన్నను, శాసన నిర్మాణాధికారము ఎన్నుకొనబడిన పార్లమెంట్‌కు మాత్రమే యథార్థముగ చెంది ఉన్నది. సెనేట్, ఛేంబర్ ఆవ్ రిప్రజెంటెటివ్స్ అని ఈ పార్లమెంట్ రెండు కక్ష్యలుగ ఉన్నది. ప్రాంతీయ సమితులు సెనేట్‌నందలి సభ్యులను, సామాన్య పౌరులు రెండవదానియందలి సభ్యులను ఎన్నుకొనెదరు. పార్లమెంట్‌నందలి అధిక సంఖ్యాకపక్షమునుండి రాజు మంత్రులను నియమించవలెను. రెండు విధముల శాసనసభలకును సమానాధికార

ములు కలవు. 20 ఏండ్ల వయసు దాటిన ప్రతి పౌరునికిని వోటింగు హక్కు కలదు. వోటు చేయుట ఒక విధి. వోటు చేయనివారు జరిమానాకు పాత్రులు అగుదురు.

**పాలిత ప్రాంతములు :** ఆఫ్రికాయందలి కాంగో [చూ. పు. 378] దేశము బెల్జియమ్‌నకు వలస రాజ్యముగ ఉండెను. కాని, ప్రజల ఆందోళనకు లొంగి బెల్జియమ్ 1960 లో కాంగోకు స్వాతంత్ర్యము ఒసగెను. ఆఫ్రికాయందలి రువాండా - ఉరుండీ అను ప్రాంతమును ధర్మకర్తగ బెల్జియమ్ పాలించెను. కాని, 1962 లో ఐక్యరాజ్యసమితి [చూ. పు. 351] ఆదేశములను అనుసరించి, రువండా - ఉరుండి ప్రాంతమును రెండు దేశములుగ విభజించి, వారికి బెల్జియమ్ స్వాతంత్ర్యమొసగెను [చూ. రువండా - బురుండి].

ప్ర. రా : చీ. శే. రా.

**బెసెంట్ :** చూ. అనిబిసెంట్ - పు. 284.

**బెహరీన్ :** చూ. పారసీక సింధుశాఖ తీరమందలి షేకు రాజ్యములు - పు. 563.

**బైజాంటైన్ సామ్రాజ్యము :** అతి విస్తృతమగు ప్రాచీన రోమన్ సామ్రాజ్యము పరిపాలనా సౌష్ఠవపు లోపముచే రెండు ఖండములుగ విభక్తమైనపుడు ప్రత్యేక తను సంతరించుకొని విలసిల్లిన ప్రాచ్యభాగమే ఈ బైంజాటైన్ సామ్రాజ్యము. పశ్చిమ భాగము క్రమక్రమముగ హీనతను పొందుచుండ ఈ ప్రాచ్యభాగము మాత్రము క్రమాభివృద్ధి పొందినది. దీనిని గమనించి క్రీ. శ. 330 లో రోమన్ చక్రవర్తియగు కాన్‌స్టాంటైన్ [చూ. పు. 381] రోమ్‌నుండి రాజధాని తరలించి, ప్రాచ్య భాగమందలి బైజాంటైన్‌నగరమును తన రాజధానిగ చేసి కొనెను. ఆ నగరమును అతడు పునర్నిర్మించి కాన్‌స్టాంటినోపుల్ అని దానికి క్రొత్త నామము ఇడెను. ఆ నగరమే నేడు టర్కీదేశమున ఇస్తాంబుల్ [చూ. పు. 328] అనుపేర వ్యవహరింపబడుచున్నది.

భౌగోళికముగ ఈ కాన్‌స్టాంటినోపుల్ నగరమునకు గల ప్రత్యేక సదుపాయములవలన ఒక విశాల సామ్రాజ్యమునకు కేంద్రముగ ఉండుటకు దానికి అర్హత కలదనుట స్పష్టము. ఆసియా మైనర్‌న ఒక కీలక స్థానమున ఇది ఉండుట వలన ఇటనుండి సముద్రమార్గమున శత్రునౌకలు ఇరుకుగా ఉన్న డార్డినల్స్ జలసంధిలోనికి ప్రవేశించకుండ సంరక్షించుకొనుటకు వీలు చిక్కినది. భూమార్గమున సరిహద్దులలో కట్టిన కోటలవలన చిన్నసైన్యము ఎంత పెద్ద శత్రుసేననైన నిలువరించుటకు అవకాశము కలిగినది. ప్రజలందరు బలహీనులు, సోమరులు, అదుపు ఆజ్ఞలు లేకుండ తిరుగువారు అయినప్పటికిని వారి నగరము బలవత్తరమై, బైజాంటైన్ సామ్రాజ్యము కాన్‌స్టాంటైన్ తరువాత వేపండ్లవరకు వర్ధిల్లినది. రోమన్ శాసనములు, చాల వరకు ప్రాచీన రోమన్‌ల ఆచారములు ఈ తూర్పు సామ్రాజ్యములో కూడ అమలులో ఉండినవి. కాని, లాటిన్ భాష స్థానమును మాత్రము ప్రజల మాతృభాష అయిన గ్రీక్ భాష ఆక్రమించినది. జీవన విధానములోను, కళలలోను ప్రాచ్యదేశముల ప్రభావము ఎక్కువయినది.

రోమన్, గ్రీక్ నాగరకతలు ఈ సామ్రాజ్యమున చక్కగ మేళనమంది, బైజాంటైన్ సమ్రాట్‌ల పరిపోషణను ఆర్జించినవి. వైజ్ఞానిక, సాంఘిక, కళా రంగములందు ఈ సమ్రాట్‌లు నిరంతర కృషిని ప్రోత్సహించి, ప్రపంచమునకు అమూల్య సంపత్తిని చేకూర్చిరి.

సుప్రసిద్ధమైన జస్టీనియన్ కోడ్ అను రోమన్ శాసనము అక్కడి విద్వాంసులు వ్రాసిన గ్రంథసంపుటములలో అత్యంతోపయుక్తమైనది. జస్టీనియన్ చక్రవర్తి ఆస్థానములోని పండితులు ఈ గ్రంథమును తయారు చేసిరి. జస్టీనియన్ చక్రవర్తి కాలమున ఈ సామ్రాజ్యపు సరిహద్దులు దక్షిణ స్పెయిన్ నుండి టైగ్రిస్, యూఫ్రటీస్ నదీలోయల వరకు, ఈజిప్టు నుండి డాన్యూబ్ నది వరకు వ్యాపించినవి. ఆ నాటి నాగరక ప్రపంచమునందలి వివిధ ప్రసిద్ధ దేశములతో బైజాంటైన్ నగరమునకు వ్యాపార సంబంధములు ఉండినవి. వివిధ దేశములనుండి వచ్చిన సుందర వస్తువులతో ఆ నగరపు దుకాణములు అన్నియు కళకలలాడుచుండెడివి. 11 వ శతాబ్ది అంతములో క్రూసేడ్ (మతయుద్ధము) ల [చూ. పు. 414] సందర్భమున పాశ్చాత్యులు అచటికి వచ్చినప్పుడు పది లక్షలమంది ప్రజలతో కూడిన ఈ మహానగరములో చక్కగా, నున్నగా తీర్చిన రోడ్లు, దీపాల బారులు అమర్చిన వీధులు, పెద్ద పెద్ద ఉపవనములు, వైద్యశాలలు, నాటకశాలలు, సమర్థమైన రక్షకభటదళము, సుందరములైన సౌధములు, అద్భుతములైన పాఠశాలలు చూచి ఆశ్చర్యము చెందిరి.

చివరకు నాలుగవ మత యుద్ధములో కాన్‌స్టాంటినోపుల్ ధ్వంసమైనది. 1204 లో మతయుద్ధముల నిమిత్తము వచ్చినవారు అసూయాపరులైన వెనిస్ నగరనాయకుల ప్రోద్బలముతో కాన్‌స్టాంటినోపుల్‌ని పట్టుకొని యథేచ్ఛగా దోచుకొని, ప్రాచీన కళానిర్మాణమును ఎన్నింటినో నాశనము చేసిరి.

శిథిలావశిష్టమైన బైజాంటైన్‌సామ్రాజ్యము మరికొంత కాలము నిలిచినది. చివరకు 1453 లో ఓటోమన్ తురుష్కులు దండెత్తివచ్చి, నగరమును పట్టుకొని 13 వ

కాన్‌స్టాంటైన్ చక్రవర్తిని చంపి, యథేచ్ఛగ దోచుకొని, హత్యలు చేసి, తక్కిన ప్రజలను కొందరిని బానిసలుగ తీసికొని పోవుటతో ఆ నగరముతో పాటుగ సామ్రాజ్యమును అంతమైనది. వారు ఈ నగరములోని శాంతా సోఫియాపై గల సిలువ స్థానములో బాలచంద్ర రేఖను ప్రతిష్ఠించిరి. నాటి నుండి 1923 వరకు ఆ నగరము టర్కీకి రాజధానిగ ఉండినది. ప్ర. రా.

**బైలో రష్యా :** చూ. సోవియట్ సోషలిస్ట్ గణరాజ్య సమితి.

**బొలీవర్, సైమన్** (1783 - 1830) : దక్షిణ అమెరికా విమోచకుడని పేరుగాంచిన దేశ భక్తుడు; రాజకీయవేత్త. దక్షిణ అమెరికాయందు వెనిజ్యులా దేశమున ఇతడు జన్మించెను.



సైమన్ బొలీవర్

(1783 - 1830)

ఈతని వంశమువారు ధనవంతులు; అప్పటి ప్రభుత్వ వర్గమునకు సన్నిహితులు. వెనిజ్యులా అప్పుడు స్పెయిన్ రాచరికమునకు లోబడిన వలస రాజ్యము. ప్రభుత్వ పక్షమునకు దగ్గరి వంశములో జన్మించియు, సంపన్నుడయ్యు బొలీవర్ దేశభక్తుడగుటచే, స్పెయిన్‌కు వ్యతిరేక పక్షములో చేరి తన దేశమునకు మాత్రమే కాక పొరుగున ఉన్న దేశములకును స్వాతంత్ర్యము సంపాదించు పోరాటములో ఆస్తినంతటిని కోల్పోయినను, తుదకు కృతకృత్యుడు అయ్యెను.

స్పెయిన్ సామ్రాజ్యపు అధికారమును ధిక్కరించి 1811 లో వెనిజ్యులా స్వాతంత్ర్యమును ప్రకటించుటతో ఈ స్వాతంత్ర్యోద్యమము ఆరంభమయ్యెను. సైమన్ బొలీవర్ నాయకత్వమున ఈ ఉద్యమము ప్రక్కన ఉన్న తక్కిన స్పెయిన్ వలస రాజ్యములలోనికిని వ్యాపించెను. తత్ఫలితముగ 1813 లో న్యూ గ్రెనడా దేశము స్వతంత్రతను ప్రకటించెను.

ఈ స్వాతంత్ర్యోద్యమములను అడచి, సామ్రాజ్యాధికారమును సుప్రతిష్ఠితము చేయుటకు స్పెయిన్ చేసిన కృషివలన ఈ ఉభయ దేశములును యుద్ధ రంగములు అయ్యెను. తుదకు 1819 లో సామ్రాజ్య సేనలను బొలీవర్ నాయకత్వమున విప్లవవాదులు ఓడించిరి. అంతట 1819, డిసెంబరు 14 న వెనిజ్యులా, న్యూ గ్రెనడాలు ఏక గణ రాజ్యముగ ప్రకటింపబడెను. తరువాత 3 దినములకు ఈక్వడార్‌న కొంత భాగము కూడ ఇందు చేరినది. ఈ సమష్టి రాజ్యమునకు కొలంబియా అను పేరిడబడి, దానికి బొలీవర్ అధ్యక్షుడు అయ్యెను. కాని, స్పెయిన్‌తో పోరాటము మాత్రము సమయకుండెను. తుదకు 1821 లో జరిగిన ఒక యుద్ధమున స్పెయిన్ సామ్రాజ్య సేనలను బొలీవర్ సేనలు రెండవసారి ఓడించుటతో కొలంబియాకు బొలీవర్ సుస్థిరతను చేకూర్చ గలిగెను. తరువాత పెరూ దేశము స్వాతంత్ర్యమును ఆర్జించుటకును ఇతడు తోడ్పడి (1824 - 25), దానికిని అధ్యక్షుడు అయ్యెను. 1824, డిసెంబరులో మూడవసారి ఇతడు స్పెయిన్ సామ్రాజ్య సేనలను ఓడించుటతో దక్షిణ అమెరికాయందు స్పెయిన్ అధికారము నామావశిష్టము అయ్యెను.

పెరూలోని దక్షిణ రాష్ట్రములు ప్రత్యేక రాజ్యముగ 1825 లో ఏర్పడినవి. దీనికి బొలీవర్ గౌరవార్థము బొలీవియా అని పేరు పెట్టబడినది. ఈ రాజ్యమునకు బొలీవర్ రాజ్యాంగమును తయారు చేసెను. కాని, కొలది కాలముననే ఈతనిపై దక్షిణ అమెరికన్ రాజ్యములకు నియంత కాదలచినాడనియు, ఏదో ఒక విధముగ రాజు కావలెనని ప్రయత్నించుచున్నాడనియు వివిధ ఆరోపణలను కొందరు చేసిరి.

ఇతడు అమెరికా ఖండములోని అన్ని రాజ్యములను ఒక సమితిగ ఐక్యము చేయవలెనని ప్రయత్నించెను. కాని, విఫలుడు అయ్యెను. బొలీవర్ కొలంబియాకు మరల అధ్యక్ష స్థానమునకు ఎన్నుకొనబడెను. కాని, 1830 లో వెనిజ్యులా కొలంబియా నుండి విడిపోవుటతో ఇతడు రాజీనామా చేయవలసి వచ్చెను. చివరకు బొలీవర్ అతి దీన దశలో - ప్రవాసమున - మరణించెను. గి. వేం. సీ.

**బొలీవియా :** దక్షిణ అమెరికా లోని ఒక స్వతంత్ర రాజ్యము.

ఈ రాజ్యమునకు బ్రెజిల్ [తూ, ఉ]; పరాగ్వే, అర్జెంటీనా [ద]; చిలీ, పెరూ [ప] సరిహద్దులందు ఉన్నవి. [వి] 10,98,581 చ. కి. మీ.; [జ] 35,95,600. తగరపు ఎగుమతి ఈ దేశసంపదకు ముఖ్యమగు ఆలంబనము [భా] అధిక సంఖ్యాకుల మాతృభాష స్పానిష్. అయిమారా, క్వేచువా అను రెండు ఆదిమ అమెరికన్ భాషలు కొన్ని వర్గములందు మాతృభాషలుగ ప్రచారమునందు ఉన్నవి. [మ] ప్రజలలో రోమన్ కేథలిక్ క్రైస్తవులు ఎక్కువగ కలరు. [రా] లపజ్ (జ. సం. 3,52,921); న్యాయస్థాన కేంద్రము సుక్రే (జ. సం. 54,270).

చరిత్ర : క్రీ. శ. 16 వ శతాబ్ది వరకు ఈ దేశము ఇన్‌కాలు [చూ. పు 323] అనబడు అమెరికన్ జాతీయ ప్రభువు పాలనలో ఉండెను. 16 వ శతాబ్దమున స్పెయిన్

వారు ఈ దేశముపై దండెత్తి, ఇన్‌కాల ప్రభుత్వమును అంతమొందించి, పెరూ రాష్ట్రమున అంతర్భాగముగ దీనిని కొంతకాలము పాలించిరి. అప్పుడు ఈ ప్రాంతము 'అల్టో పెరూ' అని వ్యవహరింపబడెడిది. 1545 లో ఈ దేశమున




వెండి గనులు కనుగొనబడిన తదుపరి స్పెయిన్ ప్రజలు ఈ దేశమున విరివిగ వలసవచ్చి చేరిరి. ఆ వెండిగనుల ప్రాంతమున అపుడు నిర్మింపబడిన పొటోసీ నగరము క్రమముగ 18 వ శతాబ్ది ఆరంభమున పశ్చిమార్ధ గోళ మండలి నగరములందు అన్నిట అత్యధిక జనసంఖ్య కల నగరముగ రూపొందినది. కాని, అ తరువాత వెండిగనుల రాబడి తగ్గుట చేత 1825 నాటికి 8,000 జనసంఖ్య గల కుగ్రామముగ పరిణమించినది. 1776 లో పరిపాలనా సౌకర్య దృష్టితో స్పెయిన్ సామ్రాజ్య ప్రభుత్వము ఈ ప్రాంతమును పెరూ రాష్ట్రమునుండి వేరుచేసి బ్యూనో ఐరిస్ రాష్ట్రములో కలిపిరి. 1780-82 లో ఇచటి ఆదిమ అమెరికన్‌లు విదేశీయుల ప్రభుత్వమును అంతమొందించుటకై తిరుగుబాటు చేసిరి, కాని, దానిని సామ్రాజ్య ప్రభుత్వము దారుణ హింసాకాండతో అడచివేసెను. 1809 మొదలు బ్యూనోఐరిస్ రాష్ట్రవాసులు సాగించిన సామ్రాజ్య వ్యతిరేకపు పోరాటములో ఈ ప్రాంత వాసులును విరివిగ పాల్గొనిరి. ఈ పోరాటము 1825 వరకు సాగెను. ఈ స్వాతంత్ర్యయుద్ధమున సైమన్ బొలీవర్ [చూ. పు. 655] నాయకత్వమున దక్షిణ అమెరికాలోని తక్కిన స్పెయిన్ వలసలును చేరెను. సైమన్ బొలీవర్ మార్గదర్శిత్వము క్రింద ఇట స్వాతంత్ర్యయుద్ధమును నడపిన వారిలో ప్రముఖుడు సుక్రే సేనాని. 1825 లో స్పెయిన్ సమ్రాట్ సేనలు ఘోర పరాజయము పొందిన తరువాత, అల్టో పెరూ భవిష్యత్తును నిర్ణయించుటకై ఆ సంవత్సరపు ఆగస్టు నెలలో ఆ ప్రాంతపు ప్రతినిధులు సమావేశమై, అంతటినుండి ఒక ప్రత్యేక రాజ్యముగ అల్టో పెరూ రూపొందవలెనని తీర్మానించిరి. దక్షిణ అమెరికాయందలి స్వాతంత్రోద్యమములకు మార్గదర్శకుడగు సైమన్ బొలీవర్ పేర ఈ దేశమును బొలీవియా అని వ్యవహరింపవలెనని అపుడే నిర్ణయము జరిగెను. 1826 వ సంవత్సరముననే ఈ దేశపు ప్రప్రథమ రాజ్యాంగమును సైమన్ బొలీవర్ రచించెను. దానిని ప్రజా ప్రతినిధులు ఆమోదించిరి. దానిని అనుసరించి రూపొందిన గణ రాజ్యమునకు సుక్రేసేనాని ప్రథమాధ్యక్షుడు అయ్యెను. కాని, 1827 లో జరిగిన తిరుగుబాటు ఫలితముగ అతడు దేశమును వదలి పారిపోయెను. అంతట రాజ్యాంగ విధానము మార్చబడి, 1828 లో శాంతాక్రజ్ అనువాడు అధ్యక్షుడయ్యెను. ఇతని కాలమున దేశమున న్యాయ శాసనముల క్రోడీకరణ జరిగెను. శాంతాక్రజ్ 1839 లో పదవీ పరిత్యాగము చేసెను. నాడు మొదలుగ బొలీవియా యందు తరచుగ విప్లవములు జరుగుటయు, ప్రభుత్వములు త్వరితగతిలో మారిపోవుటయు సహజ లక్షణములు అయ్యెను. 19 వ శతాబ్ది అంతమున ఈ దేశమునకును, చిలీ దేశమునకును మధ్య సరిహద్దును గురించి పోరాటము దీర్ఘకాలము జరిగి, అందు బొలీవియా పరాజితము అయ్యెను. తత్ఫలితముగ కొంత భూ భాగమును ఈ దేశము చిలీకి దత్తము ఒనర్చెను (1895). ఇటులే ఇంకొక పోరాటమున బ్రెజిల్‌కును కొంత భూ భాగమును ఈ దేశము వదులుకొనవలసి వచ్చెను (1903). ప్రథమ ప్రపంచ యుద్ధ కాలము [చూ. పు. 594] న బొలీవియా తొలుత తటస్థముగ ఉండెను. కాని, జర్మనుల జలాంతర్గాములచే తనకు కలిగిన నష్టమునకు ప్రతిక్రియగ 1917 లో జర్మనీతో దౌత్యసంబంధముల రద్దు చేసికొనెను. అయినను మిత్ర మండలి పక్షమున ప్రత్యక్షముగ యుద్ధమున దిగక, తన ఖనిజ సంపదను వారికై వినియోగించి సాయపడెను. 1928 మొదలుగ పరాగ్వేతో ఈ దేశమునకు సరిహద్దు తగాదాలు చెలరేగెను. తుదకు 1938 లో జరిగిన సంధిని అనుసరించి, 2,59,000 చ. కిలోమీటరుల ప్రదేశమును బొలీవియా పరాగ్వేకు ఒసగెను.

ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున తగరపు ఎగుమతి విస్తారముగ జరిగి, దేశ దారిద్ర్యము కొంతవరకు తొలగెను. కాని, యుద్ధానంతరమున తగరమునకు గిరాకీ

లేక ఎగుమతులు పడిపోవుటచే దేశమున కల్లోలములు చెల రేగెను. అప్పటిలో ప్రభుత్వాధ్యక్షుడుగ ఉన్న విల్లరోల్ సేనానిని ప్రజలు పదవి నుండి తొలగించి ఉరి తీసిరి. కొంత కాలము ఇటుల దేశము అరాజకముపాలు కాగా 1952 లో 'ముఏిమెంటో నేషనల్ రివల్యూషనరియో (ము. నే. రి.)' పార్టీవారు ఒక విప్లవమును లేవదీసి, అధికారమును చేపట్టిరి. ఆ పార్టీకి చెందిన పాస్ ఎస్టెన్ సోరో అధ్యక్షుడై, దేశమునందలి పెద్ద తగరపుగనులను మూడింటిని యజమానులకు తగిన పరిహారము ఒసగి జాతీయము ఒనర్చుటయే కాక, వ్యవసాయ సంస్కరణ లను కూడ కొని వచ్చెను. తరువాత 1956 లో మూ. నే. రి. పార్టీవాడే అగు హెర్నాన్ సిలేస్ జాజో అధ్యక్షుడుగ ఎన్నుకొనబడెను. పరిశ్రమల స్థాపన, రహదారీ సౌకర్య ములను అభివృద్ధిపరచుట, ఆదిమ అమెరికన్లను జాతీ యార్థిక రంగమున భాగస్వాములుగ చేయుట అను మూడు విధముల కార్యక్రమములను నెరవేర్చుటకు ఈతడు కృషి చేసెను.

రాజ్యాంగము : 1945 లో ఈ గణరాజ్యమునకు ఒక రాజ్యాంగ విధానము తయారు చేయబడి, 1947 లో కొన్ని సవరింపులు చేయబడినవి. ఈ విధానమును అనుసరించి కేంద్రమునకు సర్వాధికారములును కలవు. అధ్యక్షుని, ఉపాధ్యక్షుని ప్రజలే నాలుగేండ్లకు ఒకసారి ఎన్ను కొనెదరు. ఒకసారి ఎన్నికైనవారు ఆ వెంటనే మరొక సారి ఎన్నుకొనబడుటకు వీలులేదు. శాసన నిర్మాణము నకు బాధ్యత వహించుటకు సెనేట్, ఛేంబర్ అను రెండు సభలు కలవు. సెనేట్‌నందు 18 మంది సభ్యులును, ఛేంబర్ నందు 68 మంది సభ్యులు (డిప్యూటీలు) ను ఉందురు. సెనేటర్లు ఆరేండ్లకు ఒక పర్యాయము, డిప్యూటీలు నాలుగేండ్లకు ఒక పర్యాయము ఎన్నుకొనబడెదరు. 1952 నుండి ఇట సార్వజనిక వోటింగు హక్కు ప్రవేశ పెట్టబడినది. పెండ్లి అయిన వారైనచో 17 ఏండ్లు దాటిన వారును, పెండ్లి కాని వారైనచో 20 ఏండ్లు దాటిన వారికిని ఇందు వలన వోటు హక్కు కలిగినది. మంత్రిమండలియందలి మంత్రుల సంఖ్య 12 ను మించరాదను నియమము కలదు. రాజ్యాంగ రీత్యా ప్రతి పౌరునికి ప్రాతిపదిక స్వత్వములు కలిగింపబడినవి. చీ. శే. రా.

**బోత్స్వానా :** ఆఫ్రికాలోని ఒక స్వతంత్ర రాజ్యము.

ఈ రాజ్యమునకు దక్షిణ రొడీషియా, మలావీ (న్యాసాలాండ్) [ఉ]: దక్షిణ ఆఫ్రికా గణరాజ్యము [ద, ప]; నైరృతి ఆఫ్రికా, అన్‌గోలా [ఉ, ప] సరిహద్దులందు ఉన్నవి. [వి] ర. 5,82,750 చ. కి. మీ.; [జ] 3,50,000. ఇందు దాదాపు 3,000 మంది యూరపియన్‌లును ; ఆసియా వాసుల సంతతివారును, మిశ్రజాతి వారును కలసి దాదాపు 1,000 మందియును కలరు ; తక్కిన వారందరును ఆఫ్రికన్‌లే. [భా] జాతీయ భాష బోత్స్వానా అను ఆఫ్రికన్ భాష. పరిపాలనా వ్యవహారములందు ఆంగ్లభాషయే వాడబడుచున్నది. [మ] ప్రజలలో క్రైస్తవ మతము విరివిగ వ్యాప్తియందు ఉన్నది. [రా.] సెరోవే (జ. సం. 16,000 ర.).

చరిత్ర : 18 వ శతాబ్దిలో క్రైస్తవ మతప్రచారక సంఘ ముల కృషివలన బోత్స్వానా రాజ్యముతో ఆకాలమున పాశ్చాత్యులకు పరిచితి లభించినది. ఈ దేశము అపుడు వివిధ ఆఫ్రికన్ జాతుల ప్రాంతములుగ విభక్తమై ఉండెను. ఈ తెగల నాయకులు తమ తమ ప్రాంతముల పాలించుచు, దేశరక్షణకు సమష్టిగ కృషిచేయుచుండెడివారు. 1852 మొదలుగ ప్రక్కన దక్షిణ ఆఫ్రికాలో ఉండిన డచ్చి సంతతి వారగు బోయర్‌లు ఈ రాజ్యమును హరించుటకై తీవ్ర యత్నముచేసిరి. బెచూనా ప్రజలు దాదాపు 30 ఏండ్లపాటు వారిని ప్రతిఘటించి, కడకు ఆ విపత్తునుండి తప్పించుకొను టకై బ్రిటిష్‌ప్రభుత్వపు రక్షణను అభ్యర్థించి, దానిని పొంద గలిగిరి (1885). తదాది అచటి వివిధ జాతుల నాయకుల హోదాలకు భంగము కలుగని రీతిగ బెచూనాలాండ్ అను పేర ఈ రాజ్యమును బ్రిటన్ పాలించినది. ఈ రాజ్యమును తనకు అప్పగించవలసినదిగ దక్షిణ ఆఫ్రికా పలుమారులు తన అభిలాషను తెలియజేసినను, ఆ దేశవాసులకు ఇష్టము లేని మార్పును అమలులోనికి తెచ్చుటకు బ్రిటన్ నిరాక రించినది. తరువాత కాలక్రమమున ఇచ్చటి ప్రజల అభీష్ట మును అనుసరించి ఈ దేశమునకు స్వాతంత్ర్యమును బ్రిటన్ ఇచ్చినది. అంతట బోత్స్వానా అను నూతన నామముతో ఈ దేశము స్వతంత్ర రాజ్యమైనది (1966, సెప్టెంబరు30).

రాజ్యాంగము: స్వాతంత్ర్యమునకు పూర్వమున 1965లో జరిగిన ఎన్నికల మూలమున రూపొందిన 31 సభ్యులు కల శాసనసభయందు, స్వాతంత్ర్యము ఆర్జించిన వెనుక, పరిపాల నాధికారములు అన్నియు న్యస్తములై ఉండునటుల ఇచట తాత్కాలికముగ ఏర్పాటు జరిగినది. ఆ సభయందు అధిక సంఖ్యాక స్థానములను ఆర్జించిన డెమోక్రాటిక్ పార్టీ నాయకుడగు సెరెచేఖామా స్వాతంత్ర్యసిద్ధి అనంతరమున అధ్యక్షుడై, 8 మంది సభ్యులు కల మంత్రివర్గమును నియ మించుకొని పరిపాలన నెరపుచున్నాడు. చీ. శే. రా.

**బోయర్ యుద్ధములు :** దక్షిణ ఆఫ్రికాదేశమున బ్రిటిష్‌వారికిని, బోయలర్‌లకును మధ్య ఇట్టివి రెండు యుద్ధములు జరిగినవి (దక్షిణ ఆఫ్రికాలో వలస చేరిన డచ్చి ప్రజల సంతతివారికే బోయర్‌లు అను పేరు కలదు).

**1881 లో జరిగిన యుద్ధము :** జూలూలను ఆఫ్రికన్ జాతులనుండి రక్షణనుపొందు తలంపుతో 1877 లో

బోయర్‌లు బ్రిటిష్ ప్రభుత్వపు ఆధిపత్యమును అంగీకరించిరి. కాని, ఆ తరువాత 1881 లో బ్రిటిష్ ప్రభుత్వాధికారమును అంతరింపజేయుటకు బోయర్‌లు తిరుగుబాటు సాగింపగ నాతివిస్తృతమగు యుద్ధము సంఘటిల్లినది. మజూబావద్ద బ్రిటిష్ సేనలను బోయర్‌లు ఓడించిరి (ఫిబ్రవరి, 1881). అంతట బ్రిటిష్ ప్రధానమంత్రియగు గ్లాడ్‌స్టన్ [చూ. పు. 437] ప్రెటోరియాలో జరిగిన ఒక ఒప్పందల మూలమున బోయర్లకు స్వాతంత్ర్యమును మరలకల్పించెను.

**1899 - 1902** వరకు జరిగిన యుద్ధము : బ్రిటిష్ ప్రభుత్వము అవలంబించిన అసంతృప్తికరపు వలస విధానము ఎడల నిరసన చెందిన బోయర్‌లు క్రుగర్ పాల్ [చూ. పు. 414] నాయకత్వమున కేప్ కాలనీ, నెటాల్ దేశములపై దండయాత్రను జరిపిరి. ఆనాటి యూరప్‌న పలుదేశముల వారికి బోయర్‌ల ఎడ కొంత సానుభూతి ఉండుటయు బోయర్‌ల ఈ చర్యకు హేతుభూతమైనది. ఈ యుద్ధమున మొదటి ఘట్టమున (అక్టోబరు 1899 - జనవరి 1900) బోయర్‌లు పదింబదిగ విజయములను ఆర్జించి, బ్రిటిష్ సేనలను కాలుకదల్పకుండ చేసిరి. కాని, రెండవ ఘట్టమున (ఫిబ్రవరి - ఆగస్టు 1900) లార్డ్ రాబర్ట్స్ నాయకత్వ ప్రతిభవలన బ్రిటిష్ సేనలు విజృంభించి, బోయర్ సేనలను పారద్రోలి, బోయర్‌ల ముఖ్యనగరమగు ప్రెటోరియాను ఆక్రమించినవి (జూన్ 5). మూడవ ఘట్టమున (సెప్టెంబరు 1900 - మే - 1902) బోయర్ సైనికులు ప్రజా సహకారముతో గెరిల్లా పద్ధతులను అవలంబించి దండయాత్రల సాగించుటవలన బ్రిటిష్ సేనలకు దారి తోచక, బోయర్‌ల ఎడ సానుభూతి కల ప్రజలను నిర్బంధ శిబిరములకు తరలింపవలసిన దుస్థితి ఏర్పడినది. అంతట బ్రిటిష్ ప్రభుత్వము సామరస్య మార్గమును అవలంబించి బోయర్లతో సంధిని కుదుర్చుకొనుటతో (మే, 1902) యుద్ధము అంతమైనది. సంధి కుదిరిన స్థలమును బట్టి ఇది వెరీనిగింగ్ సంధి అనబడుచున్నది. దీనిని అనుసరించి బోయర్‌ల రాష్ట్రములగు ట్రాన్స్‌వాల్, ఆరంజీ ఫ్రీ స్టేట్ బ్రిటిష్ సామ్రాజ్యములో చేరినవి. కాని, వానికి క్రమశః స్వయం పరిపాలనము ఈయబడుటకు వాగ్దానము జరిగినది (ఈ స్వయం పరిపాలన ఆ తరువాత 1907 లో చేకూరినది); యుద్ధమువలన ఫలసాయము కోలుపోయిన బోయర్‌ల భూముల సాగుకై 20 లక్షల పౌనులను బోయర్లకు బ్రిటిష్ ప్రభుత్వము ఇచ్చినది. చీ. శే. రా.

**బోర్నియో, ఉత్తర** : చూ. మలేసియా.

**బోల్షివిక్ విప్లవము** : చూ. అక్టోబరు విప్లవము - పు. 260.

**బోల్షివిజమ్** : మార్క్స్ సిద్ధాంతము యొక్క పరిణామ భేదమునకు బోల్షివిజమ్ అనిపేరు. ఇది రష్యన్ సాంఘిక ప్రజాస్వామిక పక్షములోని తీవ్ర వామపక్షము వారికి చెందిన సిద్ధాంతము. బోల్షివిజమ్‌నకును, మార్క్సిజమ్ లోని ఇతర శాఖలకును మధ్య అత్యంత ప్రధానములగు విషయములలోనే అనేక విభేదములు ఉన్నవి. సోషలిజమ్‌ను వ్యవస్థాపించుటకు వలయు పరిస్థితులు అన్నియు ఏర్పడు వరకును కార్మికవర్గమువారు అధికారమును కైవసము చేసికొనుట వాయిదా వేయ అక్కరలేదని, వేయరాదని బోల్షివిక్ సిద్ధాంతవాదులు వాదించిరి. పార్లమెంట్‌లో అధికసంఖ్యాకబలమును సంపాదించుకొనుట మొదలగు రాజ్యాంగానుగుణమైన పద్ధతులద్వారా కాక, బలమైనట్టియు, కేంద్రాధికారవిధేయములైనట్టియు స్థానిక వర్గములద్వారా సాయుధ విప్లవములను నడపుట మూలముననే అధికారమును కైవసము చేసికొనవలెనని కూడ వీరు వాదించిరి. ఇతర విప్లవ శక్తుల సాహాయ్యముతో కార్మిక వర్గ నియంతృత్వము వ్యవస్థాపించుట జరగగానే, ఆ నియంతృత్వాధికారమును బూర్జువా వర్గముల వారిపట్ల ప్రయోగించుటతో ఆగక, ఆర్థిక వ్యవస్థను సోషలిస్ట్ సిద్ధాంతానుగుణముగ అతిత్వరితముగ మార్పునొందించుటకు కూడ ఉపయోగింపవలెనని బోల్షివిక్‌లు నొక్కి చెప్పిరి. 1902 - 1903 లో జరిగిన ఒక సమావేశములో అధిక సంఖ్యాక వర్గము (బోల్షివిక్‌లు) తమ నాయకుడైన లెనిన్ [చూ.] అభిప్రాయములకు ప్రజల ఆమోదమును సాధింపగలిగిరి. సంఘటన కారణముగనే ఈ సిద్ధాంతమునకు 'బోల్షివిజమ్' అనుపేరు ఏర్పడినది. ప్ర. రా.

**బ్రిటన్** : చూ. యునైటెడ్ కింగ్‌డమ్.

**బ్రిటిష్ ఈస్ట్ ఇండియా కంపెనీ** : భారత దేశమున బ్రిటిష్ పరిపాలన నెలకొనుటకు హేతుభూతమైన ఒక బ్రిటిష్ వర్తకసంస్థ. దీని నిజనామము 'ఈస్ట్ ఇండియా కంపెనీ' యే అయినను, భారత దేశముతో వ్యాపారమును సాగించుటకై హాలండ్ మొదలగు తక్కిన కొన్ని యూరపీయ దేశములలో ఆ కాలమున స్థాపింపబడి, తాదృశ నామమునే వహించిన సంస్థలనుండి వేరుపరచుటకై 'బ్రిటిష్ ఈస్ట్ ఇండియా కంపెనీ' అను పేరు ఇచట వాడబడినది. ఈ 'ఈస్ట్ ఇండియాకంపెనీ' భారత, దూరప్రాచ్య ద్వీపములతో వర్తకము సాగించ ఉద్దేశితమగు వర్తక సంస్థగ ఇంగ్లండున క్రీ. శ. 1600 న స్థాపితమై, అపుడు ఆ దేశమును పాలించు ఎలిజబెత్ రాణివలన సన్నదు (చార్టర్) ను సంపాదించినది. తొలుత ఆ సన్నదు 15 సంవత్సరముల కాలమునకే పరిమితమైనను, తరువాత

శాశ్వతకాలపు సన్నదుగ మార్చబడినది. ఆరంభమున దేశీయరాజుల అనుమతితో భారతదేశపు తీరప్రాంతమునను, దూరప్రాచ్యముననను అటనట గిడ్డంగులను నెలకొల్పుకొనుటకు కొన్ని స్థావరములను ఈ కంపెనీ సంపాదించి, వర్తకమును సాగించి విపరీత లాభములను ఆర్జించినది. క్రమముగ డచ్చిదేశీయుల పోటీవలన, దూరప్రాచ్యమున తన వర్తకమునకు స్వస్తిచెప్పి, భారతదేశమునకే తన వర్తక వ్యవహారములను పరిమితము ఒనర్చినది. 18 వ శతాబ్దిలో యూరప్‌న బ్రిటన్, ఫ్రాన్స్‌ల మధ్య చెలరేగిన వైరము, భారతదేశమునందలి బ్రిటిష్, ఫ్రెంచి కంపెనీల మధ్య స్పర్ధకును కారణమైనది. అప్పటిలో కల్లోలితదశలో ఉండిన భారతదేశ రాజకీయపరిస్థితిని ఆధారముచేసికొని ఈ ఉభయవర్తకసంస్థలు ఒకటితో వేరొకటి పోటీపడి తమ పలుకుబడిని విస్తరింపజేయుటకు కృషిసల్పినవి. కడకు బ్రిటిష్ ఈస్ట్ ఇండియా కంపెనీ అందున నెగ్గి, క్రమముగ బలవత్తరమై, విశాల రాజ్యమును వివిధోపాయములచేత ఆర్జింపగలిగినది. ఈ విశాల రాజ్యమును కంపెనీ అధికారులు పాలించుటలో బ్రిటిష్ ప్రభుత్వము నియమనాధికారమును 1773 మొదలుగ వివిధ చట్టములద్వారా అమలుపరచినను, వాస్తవపు పరిపాలన మాత్రము కంపెనీ ఉద్యోగుల వశముననే ఉండెను. కడకు 1857 లో భారతీయ సైనికులు సాగించిన స్వాతంత్ర్యపోరాటము అడచివేయబడిన తరువాత బ్రిటిష్ చక్రవర్తినియే భారత ప్రభుత్వభారమును స్వయముగ గ్రహించుటతో (ఆగస్టు, 1858) కంపెనీ అస్తిత్వము అంతరించినది [చూ. భారతదేశము (ఇండియా) పు. 664.]. గు. రా.

బ్రూనీ : బ్రిటిష్ ప్రభుత్వపు రక్షణలో ఉన్న ఒక ఆసియా రాజ్యము.

ఆగ్నేయ ఆసియా యందలి ద్వీప సమూహమున ఒకటియగు బోర్నియో ద్వీపపు వాయవ్య తీరభూమియందు ఉన్న ఈ దేశపు భూతలపు సరిహద్దునందు అంతటా సారవాక్ దేశమే కలదు. [వి] 5,765 చ. కి. మీ.; [జ] 83,877. [భా] మలే భాషకు సన్నిహితమగు భాష విరివిగ వాడుకయందు ఉన్నది. ఇంగ్లీషు, మలేయును సాధికార భాషలుగ ఉన్నవి. [మ] ప్రజలందరును ముస్లిములు. [రా] బ్రూనీ (జ. సం. 17,000,).

చరిత్ర : జావా ద్వీపమును ముఖ్య కేంద్రముగ ఇడుకొని క్రీ. శ. 15 వ శతాబ్దిలో పరిసర ద్వీపములను అన్నిటిని లోగొనిన మజాపహిత సామ్రాజ్యమున ఈ రాజ్యమును, తక్కిన బోర్నియో ద్వీపమును అంతర్గతములై ఉండెడివి. అపుడు బ్రూనీని ఏలు ప్రభువు అలక వీరతాత అను రాజు బోర్నియో అంతట అధికారమును కలిగి, మజాపహిత సమ్రాట్‌లకు సామంతుడుగ ఉండెను. ఈ సమ్రాట్‌లు హిందువులు. కాని, అప్పటిలో ఆ ప్రభువుల సామంతులు అనేకులు మహమ్మదీయ మతము అవలంబింప మొదలిడిరి. బ్రూనీ ప్రభువు కూడ తక్కిన వారితో పాటు ఇస్లామ్‌ను అవలంబించి, తక్కిన సామంతులతో కలసి మజాపహిత సామ్రాజ్యమును అంతమొందించెను. తదాదిగ ఒక శతాబ్ది కాలము - అనగా 1580 వరకు - బ్రూనీ ప్రభువులు బోర్నియో ద్వీపమును, తక్కిన పరిసర ద్వీపములను పాలించిరి. 1580 లో స్పెయిన్ సేనలు బ్రూనీ నగరమును కైవసము ఒనర్చుకొనెను. కాని, ఎక్కువ కాలము అట నిలువలేకపోయినవి. అయినను, ఆ తరువాత బ్రూనీ తన పూర్వ వైభవమును ఆర్జించలేకపోయినది. దేశము అరాజకమై సాహసికులు అనేకులు నౌకల నిర్మించి, సముద్రపు దొంగతనమును వృత్తిగా గ్రహించి, రాచరికమును ధిక్కరింప సాగిరి. ఈ ఉపద్రవము నుండి తప్పించుకొనుటకు బ్రూనీ సుల్తాన్ బోర్నియోలో దక్షిణ భాగమును డచ్చివారికి ఒసగెను. తరువాత మరి కొంత భూమిని సారవాక్ అను దానిని ఒక బ్రిటిష్ సైనికునికి ఒసగెను. కడకు మిగిలిన కొలది రాజ్యముతో తానే 1888 లో బ్రిటిష్ ప్రభుత్వపు రక్షణకు లోబడెను. ద్వితీయ ప్రపంచ యుద్ధకాలము [చూ. పు. 608] న జపాన్ సేనలు దీనిని వశపరచుకొనినవి. కాని, యుద్ధానంతరము బ్రిటిష్ ప్రభుత్వము దీనిని మరల ఆక్రమించెను. 1963 లో రూపొందిన మలేసియా [చూ.] సమాఖ్యలో బ్రూనీకూడ చేరుటకు తొలుత సంకల్పింపబడెను. కాని, తరువాత కలిగిన అభిప్రాయ భేదములవలన అది కార్యరూపము పొందక పోయెను.

రాజ్యాంగము : కామన్‌వెల్త్‌నందు భాగస్వామిగ, సైనిక, విదేశ వ్యవహారములందు బ్రిటిష్‌వారి సర్వాధిపత్యమును అంగీకరించుచు ఈ రాజ్యము స్వతంత్రతను అనుభవించుచున్నది. 1959 లో అమలునకు కొనిరాబడిన రాజ్యాంగ విధానమును అనుసరించి, ఈ దేశమున వంశానుగత పాలకత్వము కలిగిన సుల్తాన్ ఆధ్వర్యవమున ఒక ప్రివీ కౌన్సిల్, ఒక కార్యనిర్వాహక వర్గము, ఒక శాసన సభ ఏర్పరుపబడినవి. కార్యనిర్వాహక వర్గమున 7 గురు ప్రభుత్వోద్యోగులును, బ్రిటిష్ హైకమీషనర్‌ను, 7 గురు సాధారణ సభ్యులును ఉందురు. ఈ వర్గమునకు అధ్యక్షుడు సుల్తానే. శాసన సభకు అధ్యక్షుడు, మంత్రి బేసర్ అనబడు ప్రధానమంత్రి, శాసన సభ యందలి మొత్తము 66 సభ్యులలో 33 మంది మాత్రమే ప్రజలచే ఎన్నుకొనబడుదురు. చీ. శే. రా.

బ్రెజిల్ : దక్షిణ అమెరికాయందలి ఒక స్వతంత్ర రాజ్యము. ఆ ఖండమున దాదాపు సగభాగము భూమిని ఈ దేశము ఆక్రమించి ఉన్నది.




ఈ దేశమునకు సరిహద్దుగ అట్లాంటిక్ మహాసముద్రము [ఉ, తూ, ద] నెలకొని ఉన్నది. ఈ తీర రేఖ పొడవు దాదాపు 6,437 కిలోమీటరులు. దక్షిణ అమెరికాలో మిగిలిన దేశములందు ఈక్వడార్, చిలీదేశములు తప్ప తక్కినవన్నియు పదియో ఒక వైపున బ్రెజిల్ దేశమునకు సరిహద్దును అనుకొనియే ఉన్నవి. [వి] 85,11,965 చ. కి. మీ.; [జ] 7,75,21,000. 1959 లో జనసంఖ్య అంచనా 650 లక్షలు. వీరిలో నూటికి 42 మంది ప్రజలు సముద్రతీరప్రాంతమునందలి పట్టణములలో నివసించు చున్నారు. ఆదిమ అమెరికన్‌లును, వలస వచ్చిన పోర్చుగీస్‌లును సంకరమొంది ఈ దేశమున ఒక ప్రత్యేక బ్రెజిలియన్ జాతి రూపొందినది. [భా] ప్రజలలో అత్యధిక సంఖ్యాకులకు పోర్చుగీస్ భాషయే మాతృభాష. జర్మన్, ఇటాలియన్ భాషలు మాతృ భాషలుగ కలవారు కొందరు స్వల్పసంఖ్యాకులు దక్షిణ రాష్ట్రము లందు ఉన్నారు. [మ] నూటికి 90 మంది ప్రజలు రోమన్ కేథలిక్‌లు; తక్కినవారిలో ఇతర క్రైస్తవ మతశాఖలవారును, యూదులును, కొలదిగ బౌద్ధులును చేరి ఉన్నారు. [రా] బ్రసీలియా (జ. సం. 1,41,742).

చరిత్ర: పెడ్రో ఆల్వారెజ్ డ కాబ్రల్ అను పోర్చుగీస్ నావికునికి 1500, మే 3 న బ్రెజిల్‌ను మొదటిసారిగ కని పెట్టిన ఘనత దక్కినది. ఆ సంవత్సరమే కొంచెము ముందుగ విసెంట్ పింజాన్ అను స్పెయిన్ దేశపు నావికుడు అమెజాన్ నదీముఖద్వారమునుండి చూచి, ఆ ప్రదేశముపై హక్కు స్పెయిన్ రాజుదని అనెను. కాని, పోర్చుగీస్, స్పెయిన్ వారల నూతన భూభాగముల మధ్య పోప్ గీసిన సరిహద్దు రేఖకు ఈ ప్రదేశము తూర్పున ఉండుటచే స్పెయిన్ తన కోరికను విడనాడవలసి వచ్చినది.

బ్రెజిల్‌లో మొదటి వలస రియో డి జనీరో వద్ద 1502 వ సంవత్సరము స్థాపింపబడినది. 1580 నుండి 1640 వరకు స్పెయిన్ రాజవంశము స్పెయిన్‌ను, పోర్చుగల్‌ను కూడ పాలించినది. అందుచే ఆ వంశమే బ్రెజిల్‌ను కూడ పాలించి నది. 1693 లో బ్రెజిల్‌లో బంగారుగనులు కనుగొనబడి నవి. తరువాత కొలదికాలమునకు వజ్రపుగనులు కూడ కనుగొనబడినవి. ఫ్రాన్స్ పోర్చుగల్‌పై దండెత్తినప్పుడు పోర్చుగీస్ రాజకుటుంబము లిస్బన్‌నుండి బ్రెజిల్‌కు తరలి పోయినది. నాటినుండి 14 సంవత్సరముల కాలము ఆ కుటుంబము బ్రెజిల్‌లోనే ఉండెను. 1821 లో బ్రెజిల్‌లో పెడ్రోను పాలకునిగ నియమించి పోర్చుగల్ రాజు ప్రధాన నగరమైన లిస్బన్‌కు తిరిగిపోయెను. ఆ మరుసటి సంవత్స రము బ్రెజిల్ స్వాతంత్ర్యము ప్రకటించుకొని, పరిపాలకుడు పెడ్రోనే పెడ్రో - I అను బిరుదుతో రాజుగ ఎన్ను కొనినది. కాని, ఈతని పరిపాలన నిష్ప్రయోజనకరముగ ఉండుటచే ఇతని 15 సంవత్సరముల కుమారుడు పెడ్రో - II రాజు అయ్యెను (1840). ఈతని పరిపాలన జనరంజకముగ ఉండెను. ఈతడు బానిసత్వమును రద్దు చేసెను. శాస్త్రము లను, కళలను అభివృద్ధి చేసెను. పరాగ్వే నియంతపై అర్జెంటీనా, ఉరుగ్వే దేశములతో కలసి చేసిన యుద్ధము తప్ప ఇతడు యుద్ధములు ఏవియును చేయలేదు.

పెడ్రో - II పదవీభ్రష్టుడుగా 1889 లో చేయబడి, రెండు సంవత్సరముల అనంతరము బ్రెజిల్‌నందు ప్రజాసత్తాక రాజ్యము ఏర్పడెను (1891). ఈ ప్రజాసత్తాక రాజ్యపు చరిత్ర అనేక అంతఃకలహములతోను, విప్లవములతోను కూడినట్టిది. 1930, అక్టోబరులో గెటూలియో వర్గాఫ్ విప్లవమును లేవదీసి, నియంతృత్వాధికారములతో తాత్కా లిక అధ్యక్షుడు అయ్యెను. 1934 లో ఇతడే రాజ్యాంగ బద్ధుడైన అధ్యక్షుడుగ ఎన్నికయ్యెను. అనంతరము బ్రెజిల్ దేశమునకు క్రొత్త రాజ్యాంగము ఏర్పరుపబడినది.

ప్రథమ ప్రపంచయుద్ధము [చూ. పు. 594] లో బ్రెజిల్ మిత్రమండలిపక్షము చేరినను, చెప్పుకొనదగిన సహాయ మేమియు చేయలేదు. నానాజాతిసమితి [చూ. పు. 531] లో బ్రెజిల్ చేరినది. కాని, కౌన్సిల్‌లో సభ్యత్వము ఈయలే దను కారణమున జూన్, 1928 లో రాజీనామా చేసినది.

ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున 1942 లో బ్రెజిల్ మిత్రమండలి పక్షమున చేరి జర్మనీపై యుద్ధము ప్రకటిం చెను. యుద్ధానంతరము 1945 లో ఈ దేశమున నియంతృత్వ విధానము ఎడల అసంతృప్తి పెచ్చుపెరిగి పోవుటచే అధ్యక్ష పదవికి వర్గాఫ్ రాజీనామాను ఒసగెను. అంతట 1946 లో నూతన రాజ్యాంగ విధానము ఆమోదింపబడినది. దానిని అనుసరించి 1950 లో జరిగిన సార్వజనిక ఎన్నికలలో గెలు పొంది వర్గాఫ్ మరల అధ్యక్షుడు అయ్యెను; కాని, 1954, ఆగస్టులో కొన్ని స్వకీయ కారణములవలన ఆత్మహత్య

చేసికొనెను. తరువాత జరిగిన ఎన్నికలలో కుబిటిశ్చెక్ అను అతడు అధ్యక్షుడు అయ్యెను; దేశ రాజధాని అగు రియో డి జనీరో దేశమునకు ఒక మూల ఉన్నందున, రాజధానిని దేశమధ్యమున ఉన్న బ్రసీలియా నగరమునకు మార్చు కార్యక్రమమును ఇతడు చేపట్టెను. 1960 లో బ్రసీలియా నగరము రాజధానిగ ప్రకటింపబడెను. ఈ అధ్యక్షుని పరిపాలనా కాలమున కాఫీవిత్తనముల ధరలు ప్రపంచమందు అంతట విపరీతముగ పడిపోవుటవలన, ఆ పంటపై ఆధారపడి ఉన్న బ్రెజిల్ ఆర్థికపరిస్థితి అంతయు కల్లోలితము అయ్యెను.

**రాజ్యాంగము :** సమాఖ్యరూపకమగు రాజ్యాంగము ఈ దేశమున అమలునందు ఉన్నది. ఆ విధానమును అనుసరించి ఈ దేశము బ్రెజిల్ సంయుక్త రాష్ట్రములు (యునైటెడ్ స్టేట్స్ ఆవ్ బ్రెజిల్) అను పేరున వ్యవహృతము అగుచున్నది. పెద్దవియు, చిన్నవియు కలసి మొత్తము 21 రాష్ట్రములు ఈ దేశమున కలవు. అధ్యక్షుడును, ఉపాధ్యక్షుడును ఐదేండ్లకు ఒక పర్యాయము ఎన్నుకొనబడుదురు. ఒకసారి ఎన్నుకొనబడినవారు మరల ఆ వెనువెంటనే జరుగు ఎన్నికలలో ఎన్నుకొనబడకూడదు. అధ్యక్షుడు శాసనసభ నిర్దేశములకు లోబడి సర్వాధికారములను కలిగి ఉండును. శాసనసభయందు సెనేట్, ఛేంబర్ ఆవ్ డిప్యుటీజ్ అను రెండు కక్ష్యలు కలవు. రాష్ట్రమునకు ముగ్గురు చొప్పున ఎన్నుకొనబడినవారు 63 గ్గురు సెనేట్‌లో సభ్యులుగ ఉందురు. వీరిలో ఒక్కొక్కరి అధికార కాలపరిమితి 8 ఏండ్లు. ఛేంబర్ నందు 326 సభ్య (డిప్యూటీ) లు ఉందురు. జనసంఖ్యకు అనుగుణమగు నిష్పత్తిలో వివిధ రాష్ట్రములనుండి వీరు ఎన్నుకొనబడెదరు. వోటర్లలో 18 మొదలు 70 ఏండ్ల వరకు వయసుకల పురుషులును, ఉద్యోగములు చేయు స్త్రీలును విధిగ వోటు చేసి తీరవలెను. అటుల చేయకుండుట ఒక నేరముగ పరిగణింపబడును. విద్యారహితులును, సేనలో చేరినవారును ఏ వయసు వారైనప్పటికి వోటు చేయకపోయినచో దానిని నేరముగ పరిగణింపరు.

చీ. శే. రా.

**బ్రెజ్నెవ్, లియోనిడ్ (జ. 1906) :** సోవియట్ రష్యా రాజనీతిజ్ఞుడు; సుప్రీమ్ సోవియట్ ప్రెసీడియమ్ అధ్యక్షుడు (1960 - 65). 1906, డిసెంబరు 19 న కామిన్‌స్కొయ (నెప్రోడర్ జిన్స్క) పట్టణమున ఉక్కు కార్మికుని పుత్రుడుగ ఇతడు జన్మించెను. నెప్రోడర్ జిన్స్క మెటలర్జీ ఇనిస్టిట్యూట్ నుండి పట్టభద్రుడు అయ్యెను.

కమ్యూనిస్ట్ పార్టీలో 1931 లో చేరెను. ద్వితీయ ప్రపంచయుద్ధ సమయమున సైన్యమున రాజకీయ కామిసార్‌గ ఉండి, 1943 లో మేజర్ జనరల్ అయ్యెను. 1950 లో మొల్‌దావియా కమ్యూనిస్ట్ పార్టీ కేంద్రకమిటీ ప్రథమ కార్యదర్శిగ ఇతడు ఎన్నుకొనబడెను. సోవియట్ సోషలిస్ట్ గణరాజ్యసమితి కమ్యూనిస్ట్‌పార్టీ 19 వ మహాసభ ఇతనిని కేంద్రకమిటీకి ఎన్నుకొని (1952), ప్రెసీడియమ్‌కు ప్రత్యామ్నాయసభ్యునిగ, ఒక కార్యదర్శిగ చేసినది. స్టాలిన్ [చూ.] మరణానంతరము (1953) ఇతడు ప్రెసీడియమ్‌నుండి తప్పుకొని రక్షణమంత్రిత్వశాఖలో రాజకీయ వ్యవహారముల ఉపప్రధాన అధికారి అయ్యెను. 1955 లో కజక్‌స్తాన్ కమ్యూనిస్ట్‌పార్టీ ప్రథమకార్యదర్శి అయ్యెను. సోవియట్ సోషలిస్ట్ గణరాజ్యసమితి కమ్యూనిస్ట్ పార్టీ 20 వ మహాసభ మరల కేంద్రకమిటీ సభ్యునిగ (1956 ఫిబ్రవరి) ఇతనిని ఎన్నుకొని ప్రెసీడియమ్ ప్రత్యామ్నాయసభ్యుని చేసెను. 1957, జూలైలో ప్రెసీడియమ్ పూర్ణసభ్యత్వమును పొంది, దానికి ఒక కార్యదర్శి అయ్యెను. ప్రెసీడియమ్ అధ్యక్షపదవికి వరోషిలావ్ 1960, మే 7 న రాజీనామా ఇవ్వగా, ఆ పదవిని ఇతడు స్వీకరించెను.

రాకెట్ ఇంజనీరింగ్‌లో విశేష కృషిసల్పి, మానవ అంతరిక్ష యానమునకు దోహదము చేసినందులకు ఇతనికి 1961 లో 'సోషలిస్ట్ కార్మిక వీర' బిరుదు ఇవ్వబడినది.

పా. ల. నా.

**బ్రెస్ట్ - లిటో వస్క్ సంధి :** ప్రథమ ప్రపంచయుద్ధ కాలమున మధ్య యూరపియన్ (జర్మనీ, ఆస్ట్రియా) రాజ్యములకును, రష్యాకును మధ్య రష్యాయందలి బ్రెస్ట్ - లిటోవస్క్‌లో 3-12-1917 న ఆరంభించబడిన శాంతి సమావేశము ఫలితముగ కుదిరిన సంధి. రష్యా ప్రతినిధులకు నాయకత్వము వహించిన ట్రాట్‌స్కీ [చూ. పు. 504] తమ దేశములో బయలుదేరిన విప్లవము జర్మనీ, ఆస్ట్రియా దేశములకు కూడ వ్యాపింపవచ్చునను నమ్మకముతో శాంతిఒడంబడిక పత్రముపై సంతకము చేయకుండ, వాదబలముతో వివిధ విషయములపై ఒక నిర్ణయము తేలకుండ వారములు కాలయాపన చేసెను. 1918, ఫిబ్రవరి 18 న జర్మనులు రష్యన్‌ల కుతంత్రమునకు కోపోద్రిక్తులై, తమ పురోగమనమును తిరుగ ఆరంభించి, రష్యా దేశ గర్భము లోనికి చొచ్చుకొని వచ్చిరి. అందుచే విధిలేక జర్మనుల షరతులకు ఒప్పుకొనుడని లెనిన్ 29-2-1918 న రష్యన్‌లను ఆదేశించెను. తరువాత మూడు రోజులకు అనగా 3-3-1918 న రష్యన్‌లు ఒక శాంతి సంధి పత్రముపై

సంతకము చేసిరి. తత్పర్యవసానముగ రష్యన్‌లు పోలండ్, బాల్టిక్ రాష్ట్రములు, ఉక్రెయిన్, ఫిన్లాండ్, కాకసస్ ప్రాంతములను కోల్పోయిరి. అయితే, పశ్చిమ రాజ్యములతో జర్మనులు చేసికొనిన యుద్ధ విరమణ సంధి దృష్ట్యా ఈ శాంతి ఒడంబడిక రద్దయినది. స్వ. వెం.

**భద్రతా సమితి :** చూ. ఐక్యరాజ్యసమితి - పు. 351.

**భారత - చీనా సరిహద్దు సమస్య :** అతి ప్రాచీనములు, ఇరుగు - పొరుగున నెలకొనినవి అగు చీనా, భారత దేశములమధ్య సంప్రదాయగతిని అనుసరించియు, కొన్ని ఎడల ఒడంబడికలను అనుసరించియు సరిహద్దురేఖ నిర్దిష్ట రూపమును ఏనాడో సంతరించుకొని పాటింపబడుచున్నను, చీనాలో కమ్యూనిస్ట్‌పార్టీ ఆధిపత్యమున ప్రజాగణతంత్ర ప్రభుత్వము నెలకొనిన తరువాత ఆ ప్రభుత్వపు దుందుడుకు చర్యల మూలమున ఆ సరిహద్దుకు భంగము ఏర్పడుట వలన 1954 లో అంకురితమై, 1962 లో వికృత సంఘర్షణగ పరిణమించి, నాటినుండియు భారత - చీనా దేశముల మధ్య సంబంధములను కలుషితము చేసి, అపరిష్కృతముగ నిలిచి ఉన్న ఒక సరిహద్దు సమస్య.

చీనాలోని కోమింగ్‌టాంగ్ [చూ. పు - 409] ప్రభుత్వమును అంతరింపజేసి, కమ్యూనిస్టులు ప్రజాగణరాజ్యమును నెలకొల్పిన నాటినుండియు, భారతదేశము ఆ నూతన ప్రభుత్వము ఎడల సుముఖత వహించి, పలు దేశములకన్న ముందుగ పరిగణనను ఇచ్చుటయేగాక, అంతర్జాతీయ సమావేశములందు నూతన చీనాప్రభుత్వము పాల్గొనుటను ప్రోత్సహించి, ఐక్యరాజ్యసమితియందును తైవాన్‌లోని చీనాప్రభుత్వమునకు మారుగ నూతన చీనాప్రభుత్వమునకు స్థానము కల్పించు సంకల్పముతో - ఆ సంకల్పము ఇతర కారణములవలన నెరవేరకపోయినను-గాఢకృషి సల్పినది. అంతియేకాదు; టిబెట్ (తిబెత్తు) ప్రాంతముపై తన సర్వాధిపత్యమును నెలకొల్పుటకు యత్నించిన చీనాప్రభుత్వపు కృషి శాంతిమార్గమున సఫలత చెందుటకు భారత ప్రభుత్వము తనకు టిబెట్‌లో ఉండిన హక్కులను వదలుకొనియు, మరియు టిబెట్ పాలకుడగు దలయ్‌లామాపై తన పలుకుబడిని ప్రయోగించియు తోడ్పడినది [చూ. టిబెట్ - పు. 498]. ఈ విధముగ ఇరుగు పొరుగు రాజ్యములగు భారత - చీనా దేశములు ఒద్దికతో మని శాంతియుత ప్రపంచ నిర్మాణమునకు అవి కృషిచేయుటకు మార్గము ఏర్పడగలదని భారతప్రభుత్వము భావించినది. ఈ భావనకు అనుగుణముగ టిబెట్ - భారతదేశముల మధ్య వ్యాపార, పర్యటనా వ్యవహారములను గురించి చీనా - భారతదేశములు ఏప్రిల్ 29, 1954న ఒక ఒడంబడికను కుదుర్చుకొని ఆ సంవత్సరమే జూన్ 3 న దానిని ధ్రువపరచినవి. ఈ ఒడంబడికకు ఉపోద్ఘాతముగ ఉభయదేశములు పరస్పర క్షేమమును, ప్రపంచశాంతిని ఆసించి పాటింపదగు అయిదు సూత్రములు చేర్చబడినవి. ఇవియే సమష్టిగ ఆ తరువాత పంచశీల [చూ. పు - 555] అని వ్యవహరింపబడినవి. పరస్పర ప్రాదేశిక సమగ్రతలను మన్నించుట అనునది అందలి ఒక ప్రముఖ విషయము. అందులకు తోడుగ, టిబెట్ - భారతదేశ వ్యాపారము సాగవలసిన మార్గముల గుర్తింపుకై సరిహద్దునందలి ఆరు కనుమలును అందు పేర్కొనబడినవి. ఇందువలన, భారత దేశ ప్రాదేశిక సమగ్రతను, ఉభయరాజ్యముల మధ్య ఉన్న సరిహద్దుయొక్క పవిత్రతను చీనారాజ్యము గుర్తించినటులనే భారతప్రభుత్వము అభిప్రాయపడినది.

కాని, అంతకు పూర్వమునుండియు చీనాదేశమున ప్రకటితములగుచున్న దేశపటములలో భారతదేశమునందలి అనేక ప్రాంతములు చీనాకు చెందినటుల సూచింపబడుచుండినవి. చీనాలో ప్రజాగణరాజ్యము ఏర్పడిన తరువాత సైతము అట్టి దేశపటములే ముద్రింపబడుట గమనించి, భారతప్రభుత్వము తన ఆక్షేపణను తెలియజేసినది. 1954, అక్టోబరులో నెహ్రూ [చూ. పు. 544] ప్రధాని చీనాను దర్శించినపుడు అచటి ప్రభుత్వముతో ఈ విషయము ప్రస్తావింపగ, అవి ప్రాత పటములనియు, యథార్థ పరిస్థితులకు అనుగుణముగ అనతికాలమున నూతన దేశపటములు ముద్రింపబడగలవనియు చీనా ప్రభుత్వము తెలిపినది.

కాని, చీనాప్రభుత్వపు ఈ హామీయును, పంచశీలపై సంతకమును రాజకీయపు ఎత్తుగడలు మాత్రమే అని తరువాతి సంఘటనలు ఋజువు చేసినవి. పంచశీలపై సంతకములై మూడు నెలలైన ముగియక పూర్వమే, భారత దేశమునందలి ఉత్తరప్రదేశ్‌లోని 'బారాహాటి' తమకు చెందినదను తగాదాను చీనాప్రభుత్వము లేవదీసినది (జూలై 17, 1954). ఆ తరువాత క్రమముగ 1955, సెప్టెంబరులో 'నీటీ' కనుమ దిగువనున్న దమ్‌జాన్ మీద, 1956, ఏప్రిల్‌లో ఉత్తరప్రదేశ్‌లోని 'నీలాంగ్' మీద చీనాప్రభుత్వపు గస్తీదళములు చొరబారి కొంతకాలము అట ఉండుటయేగాక, 1956, సెప్టెంబరులో 'షిప్కి' కనుమను అతిక్రమించినవి. 1954 ఒడంబడికలో ఈ కనుమ సరిహద్దుకనుమగా స్పష్టముగ పేర్కొనబడినది. సరియైన ప్రాదేశిక పరిజ్ఞానములేని ఉద్యోగుల చర్యలుగ భారత ప్రభుత్వము వీనిని తొలుత భావించి తన ఆక్షేపణలను అంతటంతట తెలియజేసినది.

ఇంతలో 1956 లో చీనాప్రభుత్వ ప్రధానమంత్రియగు చౌ - ఎన్ - లై [చూ. పు. 459] భారతదేశమును దర్శించెను. అప్పుడు ఉభయ ప్రధానులమధ్య జరిగిన సంభాషణలో సరిహద్దు సంఘటనల ప్రస్తావన వచ్చినది. ఉభయ దేశములకును మధ్య సరిహద్దు సమస్యలు ఏవియు గొప్పవి లేవనియు, ఏవియో కొన్ని చిన్న సర్దుబాటులు మాత్రమే జరుగవలసి ఉన్నవనియు, వానిని సంప్రతింపుల మూలమున పరిష్కరించుకొన వీలగుననియు చీనాప్రధాని అనుటయేకాక, తూర్పున మెక్ మోహన్ రేఖ అనబడు నదియే సరిహద్దురేఖగ తాము అంగీకరింప ఉన్నటుల భారతప్రధానికి తెలిపెను.

కాని, 1957 లో భారతదేశాంతర్గతమగు కాశ్మీరు నందలి లడక్ జిల్లాలోని ఈశాన్యభాగమగు అక్సాయ్ చిన్ గుండా టిబెట్ - సింకియాంగ్ లను సంధించు రోడ్డును ఒక దానిని చీనీయులు నిర్మించుచున్నారని భారతప్రభుత్వము నకు తెలియవచ్చి, వివరములు తెలిసికొనుటకై ఒక పోలీస్ దళమును, ఒక సైనికదళమును క్రమముగ దక్షిణ, ఉత్తర ప్రాంతములకు పంపినది. పోలీసుదళము తిరిగివచ్చినను, సైనికదళము ఆచూకీ తెలియరాలేదు. ఆ తరువాత తెలిసిన వివరములనుబట్టి చీనీయసైనికులు భారత సైనికు లను నిర్బంధించి తరువాత కొంతకాలమునకు విడిచిరని స్పష్టమైనది. పోలీసుదళపు నివేదికను అనుసరించి అక్సాయ్ చిన్ గుండా చీనీయులు రోడ్ వేసినది యథార్థ మని విదితమైనది.

అంతట చీనా - భారత సరిహద్దు సమస్యను గురించి చీనా ప్రధానికి భారతప్రధాని ఒక సుదీర్ఘమగు లేఖను పంపెను (డిసెంబరు 14, 1958). దీనికి చీనాప్రధాని 1959, జనవరి 23 న ఇచ్చిన సమాధానము భారత ప్రభుత్వమును విభ్రాంతమొనర్చినది. చీనా - భారతదేశముల మధ్య సరిహద్దు ఏనాడును నిర్దేశమొనర్పబడలేదను వితండవాద మును తొలుతగ చీనాప్రధాని అందు లేవదీయుటయేకాక భారతదేశములోని దాదాపు 1,29,500 చ. కి. మీ. భూమి చీనాకు చెందినదను తగాదాకలదను క్రొత్త అంశమును ప్రస్తావించుచు, ఈ తగాదా పరిష్కారము యథార్థ పరిస్థి తుల పరిగణనద్వారానే జరుగగలదని మాత్రము సూచించెను. ఈ విపరీత వాదమును పరాస్తము చేయుచు మార్చి 22, 1959 న భారతప్రధాని వేరొక లేఖ వ్రాయుచు, ఉభయ దేశముల సరిహద్దు ఏ విధముగ చారిత్రికగతిలో నిర్దిష్టరూపమును పొందినదనియు తెలియజేసెను.

భారత - చీనాల సరిహద్దు భూతలముపై నిర్దిష్ట సీమాంకముల మూలమున గుర్తింపబడక పోయినను, ఉన్నత హిమాలయ పర్వతశ్రేణీ శిఖరములను అనుగమించి వర్షవిభజన రేఖాక్రమమున, భౌగోళిక సూత్రములకు అనుగుణముగ సంప్రదాయసీమారేఖ ఏర్పడి సనాతన కాలమునుండియు వ్యవహారమున పాటింపబడుచున్నది. ఈ సంప్రదాయరేఖయే ఈ దిగువ బడంబడికల మూలమున ఆ యా ప్రాంతములందు, ఆ యా కాలములలో ధ్రువీకృత మైనది.

సిక్కిమ్: భారత ప్రభుత్వరక్షణలోని సిక్కిమ్‌నకు టిబెట్‌తో కల సరిహద్దు 1890 లోని, ఆంగ్లో - చైనీజ్ కన్ వెన్ షన్‌లో నిర్దేశింపబడి, 1895 లో భూమిపై గుర్తింప బడినది.

లడక్ ప్రాంతము: 1842 లో కాశ్మీర్ ప్రభుత్వము టిబెట్‌లోని లామా గురువుతోడను, చీనీయ సమ్రాట్ తోడను సమష్టిగ కుదుర్చుకొనిన సంధివలన సంప్రదాయ మగు సరిహద్దురేఖ ధ్రువీకరింపబడినది. అంతియేకాక, ఈ సరిహద్దు నిర్దిష్టరీతిలో, స్పష్టముగ నిర్ధారితమై కనపట్టు చున్నదని చీనా ప్రభుత్వము 1847 లో అంగీకరించినది.

మెక్ మోహన్‌రేఖ: 1913 - 14 లో చీనా, టిబెట్‌ల ప్రతినిధులు భారతప్రతినిధితో జరిపిన త్రైపాక్షిక సమా వేశమున భారతదేశ - బర్మాలతో చీనాకు కల సరిహద్దు రేఖను నిర్దేశించుసందర్భమున, ఈ రేఖ పటముపై గుర్తింపబడి, అన్నిపక్షముల అంగీకారమును పొందినది. భూటాన్ తూర్పుకొనన బయలుదేరి ఈ రేఖ చీనాను తక్కిన రెండుదేశముల నుండి వేరు చేయుచున్నది. ఈ రేఖకు నామకరణము క్రొత్తగ జరిగినను, రేఖ మాత్రము సంప్రదాయమును అనుసరించి ఉచ్చహిమాలయ పర్వత శిఖరముల వెంబడి వర్షవిభజన రేఖనే అనుసరించినది.

ఈ వివరములను తెల్పిన నెహ్రూలేఖకు సెప్టెంబరు 8, 1959 వరకు చీనా ప్రధాని సమాధానము ఈయలేదు. అంత సమాధానమొసంగుచు మెక్ మోహన్ రేఖకు తాను అంగీకృతి తెలిపిన విషయమును నిరాకరించెను. అందులకు తోడుగ అంతటినుండి చీనా ప్రభుత్వము ఎక్కువ కరకు దనము వహించి, సరిహద్దు అతిక్రమణలను ఎక్కువ చేసినది; కొంగ్ కా కనుమవద్ద ఉన్న భారతగస్తీదళముపై ఆకస్మికదాడి సలిపి అందు 9 మందిని చీనా సైనికులు వధించిరి (అక్టోబర్, 1959); తక్కిన వారిని నిర్బంధించి బలవంతముగ తమకు అనుకూలములగు 'వాఙ్మూల ముల' ను గ్రహించిరి.

భారతప్రభుత్వము అంతకును ఓరిమి వహించినది. 1960, ఏప్రిల్‌లో భారత - చీనా ప్రధానుల సమావేశము ఢిల్లీలో ఆరుదినములు సాగి ఈ విషయమునే చర్చించినది.

కాని, ఫలితము శూన్యమయ్యెను. అంతట ఉభయ ప్రభుత్వముల అధికారులును 1960, జూన్, డిసెంబరుల మధ్య పెకింగ్ (పీపింగ్), ఢిల్లీ, రంగూన్‌లలో సమావేశము లను జరిపి, పరస్పరము సాక్ష్యాధారపత్రములను దాఖలు చేసికొని పరిశీలించిరి. ఈ పరిశీలనాఫలితమగు నివేదికవలన ప్రామాణికము, బలవత్తరము, విపులము అగు సాక్ష్యము భారతదేశపక్షముననే కలదనుట స్పష్టమయ్యెను.

కాని, ఈ సాక్ష్యముపై ఆధారపడి చర్చల జరుపుటకు చీనా ప్రభుత్వము సుముఖతను చూపక, ఇంకను మొండి పట్టు వహించి, సరిహద్దు అతిక్రమణలను ఎక్కువ చేయ సాగినది. ఇందులకు తోడుగ, న్యాయతః ఇండియాకు చెందియు పాకిస్తాన్ దురాక్రమణలో ఉండిన ఆక్రమిత కాశ్మీర్ ప్రాంతపు సరిహద్దు నిర్ణయమునకై, పాకిస్తాన్‌తో చీనా ప్రభుత్వము సంభాషణలు జరిపి ఒడంబడిక కుదుర్చు కొని ఇండియాను కించపరచి, అమిత్రవైఖరిని అవలంబించి నది (మే, 1962). అంతట లడక్ ప్రాంతమున చిప్‌చాప్‌నకు దక్షిణమున స్థావరములను నెలకొల్పి, సెప్టెంబర్ 20, 1962 న ఈశాన్యసరిహద్దు ప్రాంతము (నేఫా) లో తగ్లా ప్రాంతమున చీనాసేనలు సరిహద్దును అతిక్రమించినవి.

ఇటుల కాలము గడచిన కొలదియు చీనా ప్రభుత్వపు ప్రాదేశిక వాంఛలు విపరీతముగ విస్తృతి చెందసాగినవి. అయినను అంతట సైతము భారతప్రభుత్వము ఓరిమి వహించి, నేఫా ప్రాంతపు దురాక్రమణనుండి చీనా సేనలు ఉపసంహరించిన ఎడల అధికారుల సాక్ష్యాధార నివేదికను అనుసరించి సంభాషణలను జరుపుటకు తన సన్నద్ధతను తెలియజేసినది (అక్టోబరు 6, 1962). ఇందులకు సమాధానము ఈయక, చీనా ప్రభుత్వము తన సేనలకు ఆధునిక మారణాయుధములతో సరిహద్దును పలు తావుల (ముఖ్యముగ నేఫా, లడక్‌లలో) అతిక్రమించునటుల జేసి, తీవ్ర దండయాత్రను మొదలిడినది (అక్టోబరు 20, 1962). అసన్నద్ధములు, అల్పసంఖ్యాకములు, ఆధునికాయుధ రహితములు అగు భారత గస్తీ సైన్యములు వీరోచితమగు పోరాటము సల్పియు విజితములైనవి. అచటికి అంతట తరలింపబడిన నూతన దళములు ప్రాదేశిక పరిచితి చాలక ప్రయోజనమును సాధింపలేక పోయినవి. అంతట దేశము నకు సంభవించిన ఆపదను గుర్తించి భారతప్రభుత్వము అపూర్వమగు ప్రజాసహకారముతో ఈ దాడిని ఎదుర్కొన సన్నాహములు చేయసాగినది. ఈ పరిస్థితిలో నవంబరు నెల మధ్యన అస్సామ్ మైదానమునకు సన్నిహిత దూర మున చీనా సేనలు చేరగలిగినవి. అంతట చీనా ప్రభుత్వము ఏకపక్షీయముగ యుద్ధవిరమణను ప్రకటించి (నవంబరు 21, 1962) నవంబర్ 7, 1959 నాటి ప్రత్యక్షాధీన రేఖకు వెనుక 20 కి. మీ. వరకు తిరోగమించుటకు అంగీక రించినది.

భారత - చీనాదేశముల మధ్య బయలుదేరిన ఈ కలత శాంతికాముక రాజ్యములకు అన్నింటికిని - అందును ముఖ్యముగ ఆఫ్రో - ఆసియా రాజ్యములకు - ఆందోళన కలిగించినది. అంతట సింహళము, ఈజిప్టు, ఘానా, బర్మా, ఇండోనీషియా, కాంబోడియా ప్రభుత్వప్రతినిధులు కొలంబోలో ఆ సంవత్సరము డిసెంబరులో సమావేశమై ఉభయ రాజ్యముల శాంతిసంప్రతింపులకు మార్గము సుగమము చేయుటకు కొన్ని చర్యలను సూచించిరి. వానిని భారతదేశము అంగీకరించినది. ఆ సూచనలను అనుసరించి మెక్‌మోహన్ రేఖకు ఇరువైపుల ఉభయసేనలు ఉండుటయు, లడక్‌లో నిరాయుధ ప్రాంతము ఏర్పరుప బడుటయు జరుగవలసి ఉండెను. వీనిలో తొలుతటి దానికి చీనా అంగీకరించి ఆచరణలో ఇడినను, రెండవ దానికి అంగీకరింపక నిర్నిబంధముగ శాంతిసంప్రదింపులు సాగ వలయునని పట్టుబట్టుటవలన ప్రయోజనము శూన్య మైనది. అందువలన చీనీయ ఆక్రమిత భారతప్రాంతము ఇప్పటికినీ చీనా ప్రభుత్వపు వశముననే నిలిచిపోయినది. కొలంబో సూచనలను ఆచరణలో ఇడినచో చీనాతో సంప్రతింపులవలనను లేదా తన బలమువలనను ఆక్రమిత భాగములను తిరుగ రాబట్టికొనుటకు భారతదేశము కృత నిశ్చయత వహించినది. బి. ఆర్.

**భారత జాతీయ కాంగ్రెస్:** చూ. కాంగ్రెస్, భారత జాతీయ, పు. 379.

**భారతదేశ చరిత్ర :** చూ. భారత దేశము.

**భారత దేశము** (ఇండియా) : ఆసియా ఖండము లోని ప్రముఖ ప్రజాస్వామిక గణరాజ్యము. ప్రపంచము నందలి ప్రజాస్వామిక రాజ్యములందెల్ల జనసంఖ్య రీత్యా అగ్రస్థానము వహించినది. ఈ దేశము 'భారత్' అనియు, 'ఇండియా' అనియు భారతదేశపు రాజ్యాంగ విధాన మున పేర్కొనబడినది. ఇందులకు తోడుగ లోక వ్యవ హారమున హింద్, హిందూస్తాన్ అను పేరులును వాడుక యందు ఉన్నవి.

హిమాలయోన్నత పర్వతశ్రేణీ శిఖరములందలి వర్ష పాత విభజన రేఖామూలమున తక్కిన ఆసియానుండి నిర్దిష్ట ముగ విభజింపబడిన భారత ఉపఖండమునందు పాకిస్తాన్, నేపాల్, భూటాన్, సిక్కిమ్ దేశములుగాక, తక్కిన భూమి అంతయు భారతదేశమునకు చెంది ఉన్నది. ఈ విశాల భూతలము ఉత్తరమునుండి దక్షిణమునకు విస్తరిల్లి

## పట్టిక - భారతదేశమున రాష్ట్రకేంద్ర పాలితప్రాంతములు

| వరుస సంఖ్య | రాష్ట్రము | రాజధాని | ప్రముఖ మాతృ భాషలు | విస్తీర్ణము (చ. కి. మీ.)[1] | జనసంఖ్య |
|---|---|---|---|---|---|
| | రాష్ట్రప్రతిపత్తి | | | | |
| 1. | అస్సామ్ (నేఫాతోసహా) | షిల్లాంగ్ | అస్సామీ, బెంగాలీ | 2,03,398 | 1,22,09,330 |
| 2. | ఆంధ్రప్రదేశ్ | హైదరాబాదు | తెలుగు, ఉర్దూ | 2,75,243 | 3,59,83,447 |
| 3. | ఉత్తర ప్రదేశ్ | లక్నో | హిందీ | 2,94,365 | 7,37,46,401 |
| 4. | ఒరిస్సా | భువనేశ్వర్ | ఒరియా | 1,55,859 | 1,75,48,846 |
| 5. | కేరళ | త్రివేండ్రమ్ | మలయాళము | 38,867 | 1,69,03,715 |
| 6. | గుజరాత్ | అహమ్మదాబాదు | గుజరాతీ | 1,87,092 | 2,06,33,350 |
| 7. | జమ్మూ - కాశ్మీర్ | శ్రీనగర్ | కాశ్మీరి, డోగ్రి, ఉర్దూ | 2,22,802<br>1,38,992 | లభ్యము కాలేదు[2]<br>35,60,976 |
| 8. | నాగాలాండ్ | కోహిమా | మాండలికములు | 16,487 | 3,69,200 |
| 9. | పంజాబ్ | చండీఘర్ | పంజాబీ | 1,22,009 | 2,03,06,812[3] |
| 10. | పశ్చిమ బెంగాల్ | కలకత్తా | బెంగాలీ | 87,675 | 3,49,26,279 |
| 11. | బీహార్ | పాట్నా | హిందీ | 1,74,007 | 4,64,55,610 |
| 12. | మద్రాసు | మద్రాసు | తమిళము | 1,29,965 | 3,36,86,953 |
| 13. | మధ్యప్రదేశ్ | భోపాల్ | హిందీ | 4,43,458 | 3,23,72,408 |
| 14. | మహారాష్ట్ర | బొంబాయి | మరాటీ | 3,07,268 | 3,95,53,718 |
| 15. | మైసూర్ | బెంగుళూరు | కన్నడము | 1,91,756 | 2,35,86,772 |
| 16. | రాజస్తాన్ | జయపూర్ | హిందీ, రాజస్తానీ | 3,42,266 | 2,01,55,602 |
| | కేంద్రపాలిత ప్రతిపత్తి | | | | |
| 1. | అండమాన్ - నికోబార్ దీవులు | పోర్ట్ బ్లెయిర్ | వివిధ భారతీయ భాషలు | 8,292 | 63,548 |
| 2. | గోవా - డామన్ - దీవ్ | పనాజి (పాంజిమ్) | మహారాష్ట్ర, కొంకిణి, గుజరాతీ | 3,733 | 6,26,667 |
| 3. | డాద్ర - నాగర్ హవెలి | సిల్వస్సా | గుజరాతీ | 488 | 57,963 |
| 4. | ఢిల్లీ | ఢిల్లీ | హిందీ | 1,483 | 26,58,612 |
| 5. | త్రిపుర | అగర్తలా | వివిధ మాండలికములు | 10,450 | 11,42,005 |
| 6. | పుదుచ్చేరి (పాండిచ్చేరి) | పుదుచ్చేరి | తమిళము | 472 | 3,69,079 |
| 7. | మణిపూర్ | ఇమ్ఫాల్ | హిందీ | 22,345 | 7,80,037 |
| 8. | లక్కదీవులు-మినికాయ్, అమిన్‌దివి దీవులు | కరవత్తి | మలయాళము, మాల్ | 27 | 24,108 |
| 9. | హిమాచల ప్రదేశ్ | సిమ్లా | హిందీ - పహాడీ | 28,194 | 13,51,144[3] |

[1] ఈ రాష్ట్రముల విస్తీర్ణము మొత్తమునకును 1963 లో సర్వే ఆవ్ ఇండియావారు నిర్ణయించిన మొత్తమునకును మధ్య (32,67,536 చ. కి. మీ.) భేదము కలదు. రాష్ట్రములకు సూచింపబడిన విస్తీర్ణములలో కొన్ని గ్రామ లెక్కలను అనుసరించిన తాత్కాలికపు లెక్కలు మాత్రమే. అందువలన ఈ విభేదము.

[2] ఇది పాకిస్తాన్ ఆక్రమణలో ఉన్న కాశ్మీర్ ప్రాంతము. దీని జనసంఖ్యా వివరములు తెలియవు.

[3] 1966 లో పంజాబ్ రాష్ట్రము విభజింపబడినది. హార్యానా, పంజాబ్ అను క్రొత్త రాష్ట్రములు ఏర్పరుపబడుటయే కాక, ఆ రాష్ట్రమున ఉత్తరమున కొంత భాగము హిమాచల ప్రదేశ్‌లో చేర్చబడినది. అందువలన హిమాచలప్రదేశ్ వైశాల్యము, జనసంఖ్యాదులలో మార్పులు వచ్చినవి. పూర్వపు పంజాబ్, హిమాచల ప్రదేశ్ వివరములే ఇందు ఈయబడినవి.

కర్కటరేఖ మొదలుగా సన్నగిల మొదలిడి క్రమముగా హిందూ మహాసముద్రములోనికి చొచ్చుకొనుటవలన ఈ దేశము ద్వీపకల్ప రూపమును పొందినది. ఇటుల చొచ్చుకొని పోయిన దక్షిణ భాగమునకు బంగాళాఖాతము [తూ.], అరేబియా సముద్రము [ప] కలవు. మొత్తము మీద ఈ విశాలదేశము ఉత్తర అక్షాంశ 8° 4′ నుండి 37° 6′ వరకును, తూర్పు రేఖాంశ 68° 7′ నుండి 97° 25′ వరకును వ్యాపించి, ఉత్తరము నుండి దక్షిణమునకు దాదాపు 3,218 కిలోమీటరులును, తూర్పునుండి పడమటికి రమారమి 2,977 కిలోమీటరులును గరిష్ఠ పొడవు కలిగి ఉన్నది. దేశమునకు అంతటికిని భూతలపు సరిహద్దు 15,168 కిలోమీటరులును, తీరరేఖ 5,689 కిలోమీటరులును కలవు.

ఈ దేశమున వాయవ్యభాగమున నెలకొన్న కాశ్మీర్ ప్రాంతమునకు ఉత్తర సరిహద్దుగ ముజ్‌తఘ్, అఘిల్, క్విన్‌లూన్ పర్వత శ్రేణులు కలవు. తక్కిన దేశపు ఉత్తర భాగమున క్రమముగ టిబెట్ (తిబెత్తు), నేపాల్, సిక్కిమ్, భూటాన్, టిబెట్ లోని తూర్పుభాగములు సరిహద్దులందు ఉన్నవి. తూర్పు సరిహద్దున కొంతవరకు తూర్పు పాకిస్తాన్ ఉన్నను, ఆ తూర్పు పాకిస్తాన్‌ను భారతదేశమునకు చెందిన పశ్చిమ బెంగాల్, అస్సామ్, త్రిపుర ప్రాంతములు వలగొని ఉన్నవి. ఇటుల వలగొనిన భారతభూమికి తూర్పు సరిహద్దున బర్మా కలదు. వాయవ్యమున పశ్చిమ పాకిస్తాన్, ఆఫ్ఘనిస్తాన్ దేశములు ఈ భారతదేశమునకు సరిహద్దునందు ఉన్నవి. దక్షిణపు చివరను మన్నార్ సింధుశాఖయు, పాక్ జలసంధియు ఈ దేశమును సింహాళమునుండి వేరు చేయుచున్నవి. బంగాళాఖాతమున ఉన్న అండమాన్, నికోబార్ దీవులును, అరేబియా సముద్రమునందలి లక్కదీవులు, మినికాయ్, అమిన్ దీవులును భారత దేశమునకే చెంది పరిపాలనరీత్యా ఆ దేశమున అంతర్భాగములుగ ఉన్నవి. వీని అన్నిటితోచేరి దేశపు మొత్తపు [వి] 32,67,536 చ. కి. మీ. (1963 సర్వేను అనుసరించి); [జ] 43,90,72,582 (1961 [1]); [భా] దేశమునందలి ప్రజానీకమున ప్రముఖ స్థానమును పొందిన 14 భాషలు జాతీయ భాషలుగ రాజ్యాంగరీత్యా పరిగణింపబడినవి. వీనిలో సాంస్కృతిక ప్రాముఖ్యమును బట్టి స్థానమును ఆర్జించిన సంస్కృతము కాక తక్కిన వానిలో హిందీ (సన్నిహితములగు ఉర్దూ, పంజాబీలతో కలసి) 46%, తెలుగు 10%, మరాఠీ 8%, తమిళము 8%, బెంగాలీ 8%, గుజరాత్ 5%, కన్నడము 4·5%, మలయాళము 4%, ఒరియా 3·9%, అస్సామీ 1·6% ప్రజలలో వ్యాప్తియందు ఉన్నవి (1951 [1]). తక్కిన వారిలో కొన్ని మాండలికములు, అల్పసంఖ్యాక భాషలు ప్రచారమునందు ఉన్నవి. జాతీయ వ్యవహార అధికార భాషగా దేవనాగరి లిపితోటి హిందీ భాష వ్యవహరింపబడవలయునని రాజ్యాంగరీత్యా ఏర్పాటు జరిగినను, చారిత్రక కారణములనుబట్టి హిందీకి అట్టిప్రతిపత్తి సర్వజనాంగీకృత రూపమున చేకూరువరకు అధికార సహ వ్యవహార భాషగ ఇంగ్లీషు భాషయు ఉండుటకు వసతి కల్పింపబడి, ఇంగ్లీషు భాషయే ఆచరణలో చాలవరకు వ్యవహార భాషగ వర్తించుచున్నది. కాని, రాష్ట్రములకు సంబంధించినంతవరకు పాలనా వ్యవహారములు అన్నియు రాష్ట్రపు ప్రముఖ మాతృభాషలోనే సాగవలయునను ఆకాంక్ష ప్రజలందు గాఢముగ వ్యాపించి ఉన్నది. అందువలన పలు రాష్ట్రములలో మాతృభాషయే పాలనా వ్యవహారముల భాషగ కొన్ని పరిపాలనా శాఖలందు క్రమముగ నెలవు కల్పించుకొనుచున్నది. [రా] నయాఢిల్లీ [2] (జ. సం. 2,60,272 - 1961).

దేశమునందలి వివిధ రాష్ట్రములయు, కేంద్రపాలిత ప్రాంతములయు వివరములు పట్టికలో ఈయబడినవి [చూ. పట్టిక - పు. 665].

చరిత్ర: భారతదేశము చాల విశాలమైనది. అందలి ప్రజలు బహు సంఖ్యాకులు. దేశ చరిత్ర మహాదీర్ఘమైనది. అది అనేకమైన సంఘటనలతో కూడి వివిధముగ కనపడును; దానిని వివిధముగ వర్ణింపవచ్చును. అయినను దేశచరిత్రను చిత్రించునపుడు సత్యమైన, సమంజసమైన, ప్రయోజనకరమైన దృక్పథమును అవలంబించుట అవసరము. దానియందు భిన్నత్వమును మాత్రము కనుగొని కొందరు చరిత్రకారులు అందుకు తగినట్లుగానే దానిని వర్ణించిరి. ఇది సంపూర్ణ సత్యముకాదు. భిన్నత్వము నుండి ఏకత్వమును సాధించుటకు దేశమున అనేక ప్రయత్నములు జరిగినవి. అవి కొంతవరకు ఫలించినవి కూడ. అందువలన జీవితమున అనేక రంగములందు, అనేక సమయములందు భిన్నత్వములో ఏకత్వమును రూపొందించుటకు జరిగిన కృషిని, అందుకు సంబంధించిన జయాపజయము

1 ఈ జనసంఖ్యలో పాకిస్తాన్ ఆక్రమణలో ఉన్న కాశ్మీర్ భాగపు జనసంఖ్య చేర్పబడలేదు. భారతదేశపు జనసంఖ్య 1966 నాటికి 49 కోట్లకు పెరిగినట్లు అంచనా వేయబడినది.

1 కాశ్మీరీ సైతము 14 జాతీయ భాషలలో లెక్కింపబడినను, 1951 లెక్కలలో కాశ్మీరీని గురించిన వివరములు లభ్యములు కాలేదు. 1961 లెక్కలను బట్టిన భాషావారీ శాతములు లభ్యములు కాలేదు. కాని, అంచనాను బట్టి కాశ్మీరీభాష దాదాపు 1·5% ప్రజలలో వ్యాప్తియందున్నది.

2 'న్యూఢిల్లీ' అని కూడ మరొక పేరు పలుకుబడియందు కలదు.

లను దృష్టిలో ఉంచుకొనుట సమంజసము. ఇది దేశచరిత్ర ఎడల అవలంబింపదగు దృక్పథము.

ప్రాచీన, మధ్య, ఆధునిక యుగములందు హిందూ దేశములోనికి వివిధమైన జాతి, మత, సంస్కృతులు ప్రవేశించుట జరిగినది. వానిమధ్య సమైక్యమును సాధించు యత్నములు కూడ జరిగినవి. రాజకీయరంగమున ఈ ప్రయత్నములవలన మహాసామ్రాజ్యములు వెలసినవి. సంస్కృతి రంగమున భిన్న సంస్కృతుల మధ్య సమ్మేళనము సమకూరినది. రాజకీయ, సాంస్కృతిక రంగములందు భిన్నత్వ, ఏకత్వములకు మధ్య జరిగిన పోటీలో మొత్తము మీద కాలము గడచిన కొలది, ఏకత్వమునకు తగినంత బలము చేకూరుచున్నట్లు కనబడుచున్నది. అయినను తర తరములుగ భారతీయులు అందించినది, సాధించినది తగు మాత్రపు 'భిన్నత్వముతో కూడిన ఏకత్వము (యూనిటీ ఇన్ డైవర్సిటీ)' అని గ్రహింపదగును.

ప్రాచీన యుగము (మానవోదయము): భారత భూమిపై నాలుగు లక్షల ఏండ్ల క్రితము హిమప్రళయము (గ్లేషియల్) ల సంధికాలమున మానవోదయమైనది. ఆదిమయుగములో మానవుని జీవితము కేవలము పశు ప్రాయము. కాని, మానవునిలో సుఖజీవనాసక్తి, పరిశీలన, ఆలోచన ద్వారా నేర్చుకొనగల సామర్థ్యము సహజలక్షణములు. మానవుడు క్రమక్రమముగ నాగరకతను సాధించుటకు శక్తియుక్తులే కారణము. ఆదిమదశనుండి బయలుపడి నాగరకతను పొందుటకు అనేకవేల ఏండ్లు పట్టినది. సుదీర్ఘమైన ఆ చరిత్రను పునర్నిర్మించుటకు వ్రాతపూర్వకమైన ఆధారములు లేవు. మానవుడు వాడి, విడిచిపెట్టిన పనిముట్లను బట్టి నాటిచరిత్రను రచింప వలయును. సుమారు మూడువేల ఏండ్ల క్రితమే లిపి రూపొందినది. నాటనుండి గ్రంథములు లభ్యము అగు చున్నవి. గ్రంథరచన జరిగినప్పటినుండి చారిత్రక యుగ మనియు, అంతకు ముందుగా ఉన్న యుగమును చరిత్ర పూర్వ యుగమనియు వ్యవహరించుట ఆచారము.

మృగప్రాయమైన దశ తొలగి మానవదశ ప్రాప్తించిన దని చెప్పుటకు దైనందిన జీవిత కార్యక్రమములో మాన వుడు పనిముట్లను ఉపయోగించుటయే చిహ్నము. పని ముట్లలో మానవ సహజమైన ఆలోచనాశక్తి గర్భితమై ఉన్నది. పనిముట్లే నాగరకతాభివృద్ధికి, మానవుని ప్రగతికి సాధనములు. అందుచేత ఆ యా దశలలో మానవుడు ఉపయోగించిన పనిముట్ల స్వభావమును అనుసరించి చరిత్ర పూర్వయుగమున ప్రాతరాతియుగము, క్రొత్తరాతియుగము అను విభాగములు ఉన్నవి. శిలాయుగముల తరువాత ధాతుయుగము ఆరంభమైనది. మానవుని ఆర్థిక, సాంస్కృతిక ప్రగతిలో ఈ యుగములు ఒక్కొక్కదానిని ఒక్కొక్క పై మెట్టుగా గ్రహింపవచ్చును.

శిలాయుగములు: భారతదేశములో ఆదిమ మానవుడు ఎక్కడ అవతరించెను అను అంశముపై ఏకాభిప్రాయము లేదు. హిమప్రళయము (గ్లేషియల్) లలో హిందూమహా సముద్రగర్భములో కలసిపోయిన 'లుమేరియా' ప్రాంత ముననే మానవజాతి తలిదండ్రులు ఉదయించిరి అను ఒక సిద్ధాంతము ఉన్నది. కాని, దక్షిణాపథమున తూర్పు తీరపు మిట్టభూములలోని శీతోష్ణపరిస్థితులు అనుకూలమై నందున ఆ ప్రాంతములలోనే ఆదిమభారతీయుడు ఉద యించి, ఉత్తరదేశమునకు వలస వెళ్లి ఉండునని శాస్త్రజ్ఞులు నిర్ణయించిరి. ఏమైనను అత్యంత పురాతనమైన మానవ పరికరములు హిమాలయ పర్వతపాదములో 'సోన్‌నదీ' లోయలో దొరికినవి. ఈ నది సింధునదికి ఉపనది; పశ్చిమ పాకిస్తాన్‌లో ఉన్నది. ఇవి గులకరాతి పనిముట్లు. ఇంచు మించు ఈ యుగమునకు చెందిన పనిముట్లు మద్రాసుచెంత పల్లావరములో 1863 వ సంవత్సరముననే దొరికినవి. ఇటీవల గులకరాతి పనిముట్లు ఉత్తర, దక్షిణ భారతదేశములలో పలు ప్రాంతములందు లభ్యము అగుచున్నవి.

ప్రాచీన శిలాయుగము: ఆకారము లేకుండ మోటుగా ఉన్న రాతిపనిముట్లను ఉపయోగించిన యుగమైనందుననే 'ప్రాచీన శిలాయుగ'మని పేరు వచ్చినది. గట్టిగా ఉండు పలుగురాయి, గులకరాయి నాడు ఆయుధ నిర్మాణమునకు వాడబడినవి. ఆనాటి ఆయుధములలో ప్రధానమైనవి బొరిగె, చేతి గొడ్డలి. అది 'ఆహారాన్వేషణదశ'; అడవు లలో అప్రయత్నముగా లభించిన కాయగూరలను, పశు పక్షులను భుజించెడివారు. వారికి నిప్పుచేయుట తెలియదు. వస్త్రధారణ లేదు; మతము లేదు. ఇండ్లు కట్టుకొనుట చేతకాదు; గుహలలో నివసించెడివారు. ఆంధ్రరాష్ట్రమున కర్నూలు జిల్లాలో ప్రాచీనశిలాయుగమునకు చెందిన గుహలు ఉన్నవి. ఇటీవల బళ్లారిజిల్లాలో తెక్కలికోట చెంత ప్రాచీనశిలాయుగనివాసములు కొన్ని దొరికినవి. ఆహారాన్వేషణదశనుండి ఆహార ఉత్పత్తి దశకు మానవుని పురోగతిని ఈ నివాసములు సూచించుచున్నవి. ఇచటి ప్రజలు గుండ్రని పూరి గుడిసెలలో నివసించినట్లును, వీరికి నిప్పు చేసికొనుట, కుండలు చేయుట తెలిసినట్లును కనుగొన బడినవి. ఈ నివాసములు సుమారు 10,000 సంవత్సరముల నాటివని చరిత్రకారుల నిర్ణయము.

ప్రాచీనశిలాయుగమున భారతీయులు నీగ్రిటో [చూ. సం. 10 - పు. 466] జాతివారు. దక్షిణదేశమున లభించిన

ప్రాచీన శిలాయుగము పనిముట్లకు, ఆఫ్రికా తూర్పుతీరమున దొరికిన పనిముట్లకు గల పోలికలు పై అభిప్రాయమును బలపరచుచున్నవి. అతి ప్రాచీనకాలమున నీగ్రిటో జాతులు ఆఫ్రికా తూర్పుతీరమునుండి అరేబియాసముద్ర తీరమువరకు అంతట విస్తరించి ఉండినట్లు పరిశోధకుల అభిప్రాయము. నేటి అండమాన్‌వాసులు, ఆంధ్రదేశములోని యానాదులు, తమిళదేశములోని 'కాండర్లు' నీగ్రిటోజాతికి చెందినవారే.

నవీన శిలాయుగము : కొన్నివేల సంవత్సరముల తరువాత రాతిపనిముట్లే నునుపుగ, పదునుగ, అందముగ తయారు చేయబడినవి. అదిగాక పలురకముల పనిముట్లు తయారైనవి. దీనితో నవీనశిలాయుగము ప్రారంభమైనది. ఈ యుగములోనే నాగరకతకు చిహ్నములైన వ్యవసాయము, పశుపోషణ, గృహనిర్మాణము మొదలైనవి మానవుడు నేర్చెను. ఈ యుగమునకు చెందిన నాగలి, గొడ్డలిగ ఉపయోగింపబడిన రాతి పనిముట్లు అనేకములు దొరికినవి. మతము, దైవచింతన ప్రారంభమైనవి. చనిపోయినవారికి సమాధులు నిర్మించు ఆచారము బయలుదేరినది. నవీనశిలాయుగమునకు చెందిన సమాధులు అనేకము దక్షిణదేశములోని ఆంధ్రప్రదేశ్, మద్రాసు, మైసూర్, కేరళరాష్ట్రములలో విశేషముగ బయల్పడినవి. ఈ సమాధులలో పలురకములు ఉన్నవి. కొన్నిటిని పర్వత సానువులలో గుహలుగా తొల్చెడివారు; కేరళరాష్ట్రములో ఇవి ఎక్కువ. వీనినే 'తోపై' అంటారు. భూగర్భములో రాతి పలకలతో శవపేటికల నిర్మించే పద్ధతి మరొకటి. రాతి బండలతో గుండ్రని సమాధుల నిర్మాణము వేరొకటి. ఈ రకపు సమాధులకు ఆంధ్రదేశములో 'రాక్షస గుళ్ళు' అనిపేరు. మట్టితో శవపేటికలు తయారుచేసి, వానిని పూడ్చిపెట్టు ఆచారము మరొకటి. ఈ సమాధులలో ఆహారపదార్థములు, పరికరములు, పాత్రసామగ్రి నిక్షేపం చేసెడివారు. దీనినిబట్టి మరణానంతర జీవితములో నవీన శిలాయుగ ప్రజలకు నమ్మకము ఉన్నట్లు గ్రహించవచ్చును. ఈ యుగము చివర చిన్న చిన్న పడవలు నిర్మించి విదేశములతో భారతీయులు వాణిజ్యము సాగించిరి.

నవీన శిలాయుగములోని వివిధ దశలకు చెందిన పనిముట్లు, ఇతర శిథిలములు భారతదేశములోని అన్ని ప్రాంతములలోను బయలుపడినవి. నాటి ప్రజలు ఆస్ట్రిలాయిడ్ జాతులవారైనట్లు [చూ. సం. 10 - పు. 216] తెలియుచున్నది. వీరినే కొలేరియన్‌లు అని కూడ వ్యవహరింతురు. వీరినే ఆర్య వాఙ్మయము 'నిషాదు' లని వర్ణించినది. వీరిది ముండారీ భాష. సంస్కృతభాషలో వ్యవసాయ వస్తువులకు కన్పించు పేర్లు : శ్యామ, నింబ, నారికేళ, కదలి, తాంబూల మున్నగునవి మనదేశములోని రాష్ట్రముల నామములు : త్రిలింగ, కళింగ, అంగ, వంగ మొదలైనవి ముండారీ భాషాపదములేనని భాషాశాస్త్రవేత్తల అభిప్రాయము. హిందూమతమునకు మూలమైన పునర్జన్మ భావన, ప్రపంచము గ్రుడ్డు (అండము) నుండి ఉద్భవించినదను భావము నిషాదభావములేనని పండితుల విశ్వాసము.

ధాతుయుగము : నవీన శిలాయుగము చివరి దశలోనే రాగి, బంగారము, వెండి ఖనిజములు త్రవ్వబడినవి. ఖనిజములు ఎక్కువ వాడుకలోనికి వచ్చుటతో ధాతుయుగము ప్రారంభమైనది. మొదట వాడుకలోనికి వచ్చిన ఖనిజము రాగి. రాగి, సీసము కలిపి కంచు మిశ్రమము తయారుచేయు పద్ధతికూడ కనుగొనబడినది. రాతి పనిముట్లకంటె, ధాతుపరికరములు ఎక్కువ శక్తిమంతములైనందున నాగరకత చురుకుగ పురోగమించినది.

సింధు నాగరకత : నవీన శిలాయుగము, ధాతుయుగముల సంధి యుగములోనే సింధునదీ లోయలోను, వాయవ్య సరిహద్దులలోను ప్రశస్తమైన నగర సంస్కృతి నిర్మాణము జరిగినవి. దీనినే చరిత్రలో సింధునాగరకత అని వ్యవహరించిరి. సింధునాగరకతా శిథిలములు 1922 సంవత్సరమున సింధురాష్ట్రములోని మొహెంజొదారో చెంతను, పంజాబ్‌లో హరప్పా చెంతను జరిగిన త్రవ్వకముల ఫలితముగ బయల్పడినవి, నాటినుండి భారతీయ నాగరకత ఈజిప్టు, మెసపొటేమియా సంస్కృతులు అంతటి ప్రాచీనమైనదిగ గుర్తింపబడినది. ఈ నాగరకత క్రీ. పూ. 3000 - 1500 సంవత్సరముల మధ్య కాలములో విలసిల్లినట్లు చరిత్రకారులు నిర్ణయించుచున్నారు. అంతకుముందు ఎన్నో శతాబ్దముల కృషిఫలితముగనే ఈ సంస్కృతి రూపొందినదనుట నిర్వివాదాంశము.

హరప్పా ప్రజలు తీర్చిదిద్దినట్లున్న నగరములను, వానికి రక్షణగా దుర్గములను నిర్మించుకొనిరి. నగర వీథులు విశాలములై బండ్ల రాకపోకలకు వీలుగ ఉండెడివి. కాల్చిన ఇటుకలు, కలప ఉపయోగించి రెండు మూడు అంతస్తులుగల భవనములు నిర్మించుకొనిరి. ఇండ్లకు, నగరములకు చక్కని మురుగునీటి సౌకర్యములు ఉండినవి. నగరములో వీథులకు మధ్యగా భూగర్భములో మురుగునీటి కాల్వలు కట్టబడినవి. సింధుప్రజలకు వ్యవసాయము పశుపాలన, వాణిజ్యము ముఖ్యవృత్తులు. కుమ్మరి, కమ్మరి, కంసాలి, సాలె ఉపవృత్తులు. గోధుమలు, యవలు పండించిరి. ఈ ధాన్యములతో చేసిన రొట్టెలు, చేపలు, మాంసము, ఖర్జూరపండ్లు వారి ఆహారము.

కుండలు, కంచు, రాగిపాత్రలు వాడెడివారు. కుండలను నలుపు, తెలుపు రంగులతో చిత్రాతిచిత్రములుగ అలంకరించెడివారు. స్త్రీ - పురుషులు ఉభయులూ అంతరీయము, ఉత్తరీయము, నడికట్టు, తలపాగాలు ధరించెడివారు. పలురకముల వెండి, బంగారు ఆభరణములు ఉపయోగించెడివారు. స్త్రీలు జడలు వేసుకొనెడివారు లేదా ముడులు ధరించేవారు. పురుషులు జుట్టు, మీసము తీసివేసి గడ్డములు పెంచినట్లు కనిపిస్తున్నది. సింధుప్రజలు పడవలు నిర్మించి మెసపొటేమియా మున్నగు దూరదేశములతో వర్తకము సాగించిరి. [చూ. సింధునాగరకత].

సింధునాగరకత ధ్వంసమగుటకు సింధువరదలు, విదేశీయ దండయాత్రలతోబాటు ప్రజల సంప్రదాయాంధత కారణమని చరిత్రకారుల అభిప్రాయము. ఈ నగరములను నిర్మూలించినవారు ఆర్యులేనని పెక్కుమంది పండితుల విశ్వాసము. ఆర్యుల దేవుడైన ఇంద్రునకు పురందరుడను బిరుదమున్నదిగదా! ఆ పురములు సింధునగరములేననీ, ఋగ్వేదమున పేర్కొనబడిన 'హారియూపపురమే' హరప్పా అనియు కొందరి అభిప్రాయము.

ఇతర ప్రాంతములు : ధాతుసంస్కృతి హరప్పా, మొహంజొదారోలకు మాత్రమే పరిమితము కాదు. ఇటీవల కాళీబంగన్, అమ్రిచన్హుదారో, రూపార్, అలంగీర్పూర్, లోథాల్, రామగిరి మొదలగు తావులలో సైతము హరప్పా సంస్కృతి బయల్పడినది. కాళీబంగన్‌లో హరప్పా సంస్కృతికి పునాదులు కనిపించినవి. ఘుక్కర్ లోయలోను, గంగామైదానములోని పలుతావులందును అసంఖ్యాకములైన రాగి, కంచు ఆయుధములు, పనిముట్లు దొరికినవి. ఇవి హరప్పా సంస్కృతి చరమదశకు చెందినవి. మధ్య భారతదేశములో చంబల్, నర్మదా, తపతీ లోయలలోనే వాసా, నవదతోళీ మున్నగుచోట్ల హరప్పా సంస్కృతీ శిథిలములు బయల్పడినవి. ఈ యుగము చివరి దశలో క్రీ. పూ. 1500 - 1000 మధ్య కాలమున ఆర్యులు ఇనుపపనిముట్లను ప్రవేశపెట్టిరి.

ఉత్తర, దక్షిణా పథములలో వెలసిన ధాతుయుగ సంస్కృతులలో కొంత వ్యత్యాసము ఉన్నది. ఉత్తరదేశమున రాయి, రాగి, కంచు, ఇనుము ఒకదాని తరువాత మరొకటి వాడుకలోనికి వచ్చినవి. కాని, దక్షిణదేశమున నవీనశిలాయుగాంతముననే ఇనుము వాడుకలోనికి వచ్చినట్లు భావింపబడినది. కాని, ఇటీవల మైసూరు ప్రాంత సమాధులలో ధాతుయుగమునకు చెందిన రాగి పనిముట్లు దొరికినవి. ఏమైననూ, ఉత్తర భారతదేశములో వలె దక్షిణమున రాగి విస్తారముగ వాడుకలో లేదు.

ద్రావిడులు : సింధునాగరకతకు ప్రాపయిన ప్రజలు ప్రపంచ మానవజాతులలో దేనికి చెందినవారు అను విషయమునకు స్పష్టమగు సమాధానము ఇప్పటికి లభింపలేదు. కాని, మొహంజొదారో, హరప్పా శిథిలములలో దొరికిన మానవ కళేబరములలో ఎక్కువ భాగము మధ్యధరాసముద్రజాతులకు చెందినవని పరిశోధకుల విశ్వాసము. ద్రావిడ భాషలు మాట్లాడు ప్రజలు ఈ జాతి శాఖలే. ఫాదర్ హీరాస్ మున్నగు పండితులు సింధుభాషకు, ప్రాచీన తమిళ (ద్రావిడ) భాషకు సంబంధము కలదని నిరూపింప ప్రయత్నించిరి. ఆర్య దండయాత్రలలో సింధుప్రాంతములలోని నగరములు ధ్వంసమగుటచే ఆ ద్రావిడులు దక్షిణాపథమునకు వలస వెళ్లి ఉందురనియు, దాసదస్యులు, శిశ్న దేవులు (లింగారాధకులు) అని ఆర్యులు వ్యవహరించినది వీరినే అనియు కొందరు పండితుల అభిప్రాయము.

మధ్యధరాసముద్ర జాతులకు చెందిన ద్రావిడులు పశ్చిమ ఆసియా భూములనుండి వాయవ్య సరిహద్దుల గుండా భారతభూమిలో ప్రవేశించిరనియు, అందుకు బెలూచిస్తాన్‌లో నేటికిని వాడుకలో ఉన్న బ్రాహుయి అను ద్రావిడ భాషాశాఖ నిదర్శనమని భావింపబడుచున్నది. కాని, ద్రావిడుల ఆదిమనివాసము దక్షిణాపథమే అనియు, ఆ ప్రాంతమునుండియే వారు ఉత్తర దేశమునకును, అటనుండి పశ్చిమ ఆసియాకును, సుమేర్, మధ్యధరాసముద్రతీర భూములకును వలస వెళ్లిరని నిరూపించుటకు హీరాస్ పండితుడు ప్రయత్నించెను. ఏమైనను, ప్రాచీన కాలమున క్రీట్, ఈజిప్టు, ఫొనీషియా, అసీరియా, సుమేరియాలలో వెలసిన నాగరకతకు ప్రాచీన తమిళ నాగరకతతో పెక్కు విషయములలో పోలికలు ఉన్నవి. మైసీన్ (గ్రీస్), లిడియా (ఆసియా మైనర్) దేశముల ప్రజలకు 'త్రిమిలై' అను పేరుండెను. 'తమిళ' అనుమాట 'త్రిమిలై' నుండి వచ్చినది అనుటలో వైపరీత్యము లేదు.

భారత చరిత్రలో ధాతుయుగారంభమునుండియు ద్రావిడులు కన్పించుచున్నారు. ప్రాచీన తమిళ వాఙ్మయమునుండి దక్షిణాపథమున వీరు నిర్మించిన నాగరకతను గ్రహింపవచ్చును. ద్రావిడులు నగరములు, కోటలు కట్టుకొని రాజ్యములు స్థాపించిరి. అందు సంప్రదాయసిద్ధమగు రాచరికము అమలులో ఉండెను. ద్రావిడులకు వ్యవసాయము ముఖ్యవృత్తి; పశుపోషణ, వస్త్రముల నేత, అద్దకము, కమ్మరము, కుమ్మరిపని, వడ్రంగము మొదలైనవి ఉపవృత్తులు. వీరు ఈజిప్టు,

సుమేర్‌లతో వాణిజ్యము ఒనర్చిరి. నౌకా నిర్మాణములలోనూ, నౌకాయానములోను ద్రావిడులు సమర్థులు. ద్రావిడ సమాజములో కుటుంబమునకు తండ్రి పెద్ద. వివాహ బంధమును పవిత్రముగ ఎంచెడివారు; స్త్రీలపట్ల గౌరవభావముతో వర్తించెడివారు.

ద్రావిడులు పెక్కు దేవతలను ఆరాధించిరి. వీరిలో లింగారాధన ప్రధానము. ఉమా - చంద్రశేఖరుల పూజను పశ్చిమ ఆసియా భూములనుండి వీరే దిగుమతి చేసి ఉందురు. అదే నేటి శైవమునకు మాతృకమైనది. భక్తి, యోగాభ్యాసము, హోమ విధానమునకు భిన్నమైన 'పూజా' విధానము ద్రావిడమతములోని ముఖ్య లక్షణములు.

ఆర్యులు - వైదిక నాగరకత : క్రీ. పూ. 1500 ప్రాంతమున భారతచరిత్ర రంగము మీద ఆర్యులు ప్రత్యక్షమైరి. వీరితో భారతచరిత్రలో ప్రముఖమైన అధ్యాయము ప్రారంభమైనది. ఆర్యులు యుద్ధప్రియులు, రాజ్య విస్తరణ కాంక్ష గలవారు అయినందున రాజకీయముగ, సాంస్కృతికముగ భారత ఉపఖండమును ఏకీకరణ చేయు మహోద్యమము ప్రారంభమైనది.

ఆర్యుల తొలుతటి నివాసస్థలము పంజాబ్‌లోని సప్తసింధులోయయేనని మొదట భావింపబడినది. కాని, 18 వ శతాబ్ది చివర ఆర్యుల సంస్కృతభాషకును, మధ్య ఆసియాలోని తుఖార భాషకును, యూరప్‌లోని లిథూనియన్, జర్మన్, గ్రీక్, లాటిన్ మున్నగు భాషలకును పోలికలు కనుగొనబడినవి. అందుచే ఈ భాషలు మాట్లాడు ప్రజలు అందరు ఆదిలో ఏకజాతీయులై, ఒకే ప్రాంతమున నివసించి, కారణాంతరములవలన చీలి ఆ యా దేశములకు వలస వెళ్లి ఉందురని నిర్ణయింపబడినది. ఈ ఏక జాతిని ఇండో - యూరపియన్ జాతి అని వ్యవహరించి, వారి ఆదిమ నివాసమునకై పండితులు పరిశోధనలు ప్రారంభించిరి. మాక్స్‌ముల్లర్ మధ్య ఆసియా అని, బాలగాంగధర తిలక్ ఉత్తర ధ్రువప్రాంతము అని పలువురు పలురకముల సిద్ధాంతీకరించిరి. కాని, ఇటీవల జరిగిన భాషా పరిశోధనలను బట్టి డాన్యూబ్ నదీప్రాంతములోని హంగేరీ మైదానమే ఇండో - యూరపియన్ జాతుల జన్మ భూమి యని తేలినది. తమ జన్మ భూమిని వదలి, డార్డనెల్స్ జలసంధిని దాటి, ఆసియా మైనర్ గుండా, మెసపొటేమియా, పర్షియాలను ఆక్రమించి, మధ్య ఆసియా, ఆఫ్ఘనిస్తాన్ దేశములను ఉత్తరించి ఆర్యులు భారతదేశమున ప్రవేశించిరి. ఆర్యుల ఈ విజయయాత్రకు పెక్కు నిదర్శనములు పరిశోధింపబడినవి. క్రీ. పూ. 1400 ప్రాంతమున మెసపొటేమియాలో మిటానీ రాజ్యమును స్థాపించినవారు ఆర్యజాతులే. మిటానీ రాజుల పేర్లు భారతీయ పురాణములలో కనిపించు పేర్లను పోలి ఉన్నవి (దుష్రత = దశరథ; సువర్దత = సర్వదత్త). కపడోషియాలో బోగజ్ - కాయ్ చెంత దొరికిన శాసనములో (క్రీ. పూ. 1400) వైదిక దేవతలు సాక్షులుగ పేర్కొనబడిరి. ఆ ప్రాంతములలోనే అశ్వశిక్షపై ఒక గ్రంథము బయల్పడినది. ఇది ప్రాచీన సంస్కృత భాషలో వ్రాయబడినది. ప్రాచీన పారసీకులకును, వైదిక ఆర్యులకును భాషలోను, మతములోను సన్నిహిత సంబంధము ఉండినట్లు పారసీకుల మతగ్రంథమైన 'అవెస్తా' ద్వారా తెలియనగును. ఈ అంశములు అన్నియు ఆ యా దేశములగుండా ఆర్యులు భారతదేశము ప్రవేశించినట్లు సూచించుచున్నవి.

సప్తసింధు ఆక్రమణ : భారతదేశమున ప్రవేశించిన ఆర్యులను స్థానికులు ప్రతిఘటించి, తీవ్రముగ పోరాడిరి. వీరిని ఆర్యులు దాసదస్యులని, ఇంద్ర విరోధులని, కృష్ణవర్ణులు, అనాసులు, మృధ్రవచనులు, అవ్రతులని వర్ణించిరి. కాని, వీరి పురములు, పశుసంపద ఆర్యుల నోరు ఊరించినవి. తమ అశ్వదళము సాయముతో విరోధుల పురములను నేలమట్టము చేసి, దేశమును ఆక్రమించిరి. ఇటుల ఆక్రమించిన ఏడునదుల - 1. సింధు, 2. వితస్త = జీలం, 3. అసిక్నీ = చీనాబ్, 4. పరుష్ణి = రావి, 5. విపాశ = బియాస్, 6. శతద్రు = సట్లెజ్, 7. సరస్వతి - ప్రాంతమే 'సప్త సింధు' ప్రాంతము.

వైదిక వాఙ్మయము : సంచారజీవితమునకు స్వస్తిచెప్పి, ఆర్యావర్తములో ఆర్యులు స్థిరపడిన అనంతరము ఒక వేయి సంవత్సరముల కాలమునకు వైదికయుగమని పేరు. అపారమైన వైదికవాఙ్మయము సృష్టింపబడుటచే ఈ యుగమునకు ఆ పేరు వచ్చినది. వేదము అనగా జ్ఞానమని అర్థము. చతుర్వేదములు, షడంగములు, సూత్రములు, ఉపనిషత్తులు, ఇతిహాసములు వైదిక వాఙ్మయములో ప్రధాన విభాగములు. వైదిక వాఙ్మయము ద్వారా ప్రాచీన ఆర్యనాగరకతా సంస్కృతులును, భారతదేశములో స్థిరపడిన కొలది ఆర్యులలో వచ్చిన సాంఘిక, రాజకీయాది పరిణామములును తెలియుచున్నవి.

సాంఘిక పరిస్థితులు : ఆర్యావర్తములో స్థిరపడిన క్రొత్తలో ఆర్యులు పూరి ఇండ్లలో నివసించెడివారు. గ్రామముల చుట్టును కంచెలుగాని, మట్టిగోడలుగాని ఉండెడివి. వ్యవసాయము, పశుపాలన వారి ముఖ్య వృత్తులు. పంటపొలములు కుటుంబములకు చెంది ఉండెను.

పచ్చిక బీడులను ఉమ్మడిగా అనుభవించెడివారు. పశువులు భగవంతుడు ఇచ్చిన గొప్ప వరమని వారి నమ్మకము. ధాన్యములతోబాటు పాలు, వెన్న, జున్ను, మాంసము భుజించిరి. ఉన్ని, పట్టువస్త్రములు నేసి ధరించెడివారు. రథనిర్మాణము, కమ్మరము, కుమ్మరి మొదలైన చేతి పనులు ఉపవృత్తులు. ఋగ్వేదకాలమున కులములు స్పష్టముగ ఏర్పడలేదు. ఒకే కుటుంబములో వేరు వేరు వృత్తులు అవలంబించువారు ఉండిరి. ఆర్యుల అధికారమును అంగీకరించి బానిసలైన అనార్యజాతులవారు నీచ వృత్తులు అవలంబించ సాగిరి. అందుచే వారు గ్రామ బహిఃప్రదేశములలో నివసింపవలసి వచ్చినది. విదేశములతో వాణిజ్యము జరుగుచుండెనుగాని వాణిజ్యమంతయు 'ఫణి' అను అనార్యజాతి చేతిలో ఉండెను. చేతి పరిశ్రమలు, విదేశ వాణిజ్యము పెరుగుటవల్లను, రాజకీయ పరిణామముల ఫలితముగను వైదికయుగాంతమునకు పట్టణములు వెలసినవి. హస్తినాపురము, మధుర, వారణాసి, కౌశాంబి, గిరివ్రజము, శ్రావస్తి, చంప మొదలైన నగరములు ఇతిహాసములలోను, పురాణములలోను పేర్కొనబడినవి. ఈ నగరములను కలుపుచు బాటలు వేయబడినవి.

వైదిక సమాజమునకు కుటుంబమే పునాది. వివాహ సంబంధమును ఆర్యులు పరమ పవిత్రమైనదిగా భావించిరి. కుటుంబమునకు తండ్రి పెద్ద. గృహ నిర్వహణలో స్త్రీలకు పూర్తి స్వేచ్ఛ, సమాజములో గౌరవము ఉండెడివి. కాని, పురుషులతో సమాన ప్రతిపత్తి లేదు. బహు భార్యాత్వము చాల అరుదు. స్త్రీలు విద్యావంతులై సాంఘిక, సాంస్కృతిక కార్యకలాపములలో యథేచ్ఛగా పాల్గొనెడివారు. అనార్యజాతులతో సాన్నిహిత్యము ఎక్కువైన కొలది, ఆర్యులలో తమ జాతి పవిత్రతను రక్షించుకొనవలెనను ఆసక్తి కలిగినది. అందుచే వైదిక యుగాంతమునకు వైవాహిక నిబంధనలు కఠినతరము కాజొచ్చినవి. క్షత్రియులలో స్వయంవరము కొనసాగినది గాని, మొత్తము మీద స్త్రీలకుండిన స్వేచ్ఛాస్వాతంత్ర్యములు సన్నగిల్లినవి. బహుభార్యాత్వము, సతీ సహగమనము అధికమైనవి. అనులోమ, విలోమ వివాహ పద్ధతులు సైతము ఈ కాలముననే రూపొందినవి.

పై మార్పులతోపాటు వైదిక యుగము చివరి రోజులకు వర్ణవిభేదములు విపరీతము కాజొచ్చినవి. వృత్తి విభేదములకు జాతి సంబంధమైన 'రంగు' జతపడి ఆర్యులలో వర్ణములు రూపొందినవి. గుణము, అభిరుచిని బట్టిగాక జన్మను బట్టి వృత్తి నిర్ణయమైనది. ఆర్యులకు బానిసలైన దాసదస్యులు, నిషాదులు కడజాతివారుగ ఉండిరి.

**రాజకీయ వ్యవస్థ:** వైదికార్యులు తెగలు తెగలుగా ఉండిరి. భరత, యదు, తుర్వస, పూరు, వృష్ణి మున్నగు తెగలు ఋగ్వేదములో పేర్కొనబడినవి. ఒక్కొక్క తెగవారు ఒక ప్రాంతమును ఆక్రమించి, రాజ్యములు స్థాపించుకొనిరి. వారి రాజ్యములు 'జన' లేదా 'జనపదము' అనబడెను. ప్రతి జనపదము కొన్ని విషయములుగా విభజితమై ఉండెను. కొన్ని గ్రామములు కలసి ఏర్పడినదే విషయము.

ఆర్యులలో ప్రతి తెగకును ఒక రాజు ఉండెడివాడు. సాధారణముగ రాచరికము వంశపరంపరాగతము. కొన్ని కొన్ని తెగలలో రాజును ప్రజలు ఎన్నుకొనెడివారు. ఇట్టివే గణ ప్రభుత్వములు. రాచరికపు స్వభావము ఎట్టిదైనను ప్రతి జనపదములోను సభ, సమితి అను ప్రజాసభలు ఉండి రాజులకు సలహాను ఇచ్చెడివి. నిరంకుశులైన రాజులను తొలగించిన సంఘటనలును, పశ్చాత్తప్తుడైన రాజును పునః ప్రతిష్ఠ చేసిన సంఘటనలును కన్పించును. పరిపాలనలో రాజులకు పురోహితుడు, సేనాని సాయమొనర్చుచుండిరి.

వైదికార్యులు దాసదస్యులతోనేగాక తమలోతాము పోరాడుకొనుచుండిరి. ఋగ్వేదములో పేర్కొనబడిన దశరాజుల యుద్ధము చాల ప్రసిద్ధమైనది. పరుష్ని (రావి) నదీతీరమున జరిగిన ఈ యుద్ధములో భరతజాతిలోని త్రిత్సువంశస్థుడగు సుదాసుడు తనపై ఎత్తివచ్చిన యదు, తుర్వస, పూరు మున్నగు తెగలవారిని ఓడించి, భరతజాతి ఆధిపత్యమును నెలకొల్పెనట. ఈ యుద్ధానంతరము భరత, పూరు తెగలు కలసిపోయినవి. ఇట్లు ఏర్పడిన క్రొత్తతెగకు చెందినవారలే కౌరవ - పాండవులు అని కొందరి అభిప్రాయము. హస్తినాపుర సింహాసనమునకై కౌరవ - పాండవుల మధ్య కురుక్షేత్రముచెంత ఘోర యుద్ధము జరిగినది. ఇదియే భారతయుద్ధము. ఈ యుద్ధ గాథయే లిఖితరూపమున 'మహాభారతము' అను పేర హిందువుల పవిత్ర ఇతిహాసమైనది.

ఇతిహాసముల (భారత - రామాయణముల) కాలమునకు ఆర్యులు పంజాబ్‌నుండి తూర్పు, దక్షిణ దిక్కులందు విస్తరించి, పెద్ద రాజ్యములు స్థాపించిరి. దిగ్విజయ యాత్రలు, అశ్వమేధ, రాజసూయాది సామ్రాజ్యాధికారమును సూచించు క్రతువులు, చక్రవర్తి, సమ్రాట్ మున్నగు బిరుదులు ఇతిహాసములలో కన్పించును. కోసలాధిపుడైన శ్రీరాముడు ఆర్యసామ్రాజ్యాధికారమును దక్షిణదేశములోనికి విస్తరింపజేసిన కథయే రామాయణమునకు ఇతివృత్తము. దక్షిణదేశమున అశ్మక, మూలక అను జనపదములను ఇక్ష్వాకువంశస్థులే స్థాపించినట్లు పురాణములవలన

తెలియుచున్నది. ఇతిహాసములలోని చారిత్రకాంశముల వలన నాటికే భారతభూమి ఏకదేశముగ ఊహింపబడి ఏకచ్ఛత్రాధిపత్యముక్రిందికి తీసికొనివచ్చునట్లు సంకల్పము ఏర్పడినదని తెలియుచున్నది. క్రీ. పూ. 6 వ శతాబ్దమునకు 'అశ్మకము' తో కలసి పదునారు ఆర్యమహాజనపదములు ఏర్పడినవి. వీనిలో అవంతి (మాళవ), వత్స (మధ్యదేశము), మగధ (బీహార్) అనునవి చాల బలవత్తరమైన జనపదములు. రాజ్యములు విస్తరించుటతో రాజు అధికారము వృద్ధిచెంది, ప్రజాసభల ప్రాధాన్యత క్షీణించినది. రాజరికము నిరంకుశము కాసాగెను. పరిపాలనా యంత్రాంగము క్లిష్టతరమైనది.

**వైదిక మతము :** వైదికమతము ప్రకృతిమతము. తమకు భయసంభ్రమములను, ఆశ్చర్య ఆనందాతిరేకములను కలిగించు ప్రకృతి అంశములకు దివ్యత్వముతోపాటు మానవ సహజములైన గుణదోషములను ఆపాదించి ఆర్యులు ఆరాధించిరి. అట్టి దేవతలలో భూమ్యాకాశములు, ఇంద్రుడు, అగ్ని, వాయువు, పర్జన్యుడు, మిత్రావరుణులు, అశ్వినీదేవతలు ముఖ్యులు. ఉషస్సు, సంధ్య మొదలగు సుందరమైన ప్రకృతి అంశములను స్త్రీదేవతలుగా భావించినట్లు కన్పించును. ఇంద్రుడు యుద్ధాధిదేవత. వైదికార్యులకు దేవతలందరు సమానమే. కాని, దాసదస్యులతో యుద్ధములు జరుగుతున్న సమయమైనందున ఇంద్రుని ఎక్కువగా ఆరాధించిరి. వైదిక పూజావిధానము చాల నిరాడంబరమైనది. ప్రార్థనాశ్లోకములు లేదా ఋక్కులు చదువుట, దేవతల తృప్తికై బలి సమర్పించుట అందలి ప్రధాన అంశములు. ఋక్కులతో నిండియున్న వేదమే ఋగ్వేదము. దేవతలకు సమర్పించు బలివస్తువును హోమములో వ్రేల్చుటయే యజ్ఞము. నరబలి కూడ జరుగుచుండెడిది. సోమము, సుర అను మత్తు పదార్థములను సహితము దేవతలకు సమర్పించెడివారు. సోమము ఆర్యులకు చాల ప్రీతికరమైన పానీయము. పురోహితులగు బ్రాహ్మణుల ప్రభావమువలన క్రమక్రమముగా యజ్ఞముల ప్రాధాన్యము పెరిగినది. మంత్రము, యజ్ఞము సర్వశక్తిమంతములని ప్రచారము చేసి, బ్రాహ్మణులు సమాజమున ఆధిపత్యము వహించిరి. యజ్ఞమే మోక్ష సాధనమను భావము ప్రబలినది. వ్యయప్రయాసలతో కూడినది అగుటచేత యజ్ఞము సామాన్యులకు అందుబాటు కానందున యజ్ఞములకు అగ్రవర్ణమువారే అర్హులైరి. ఈ పరిణామము వేదములలోని బ్రాహ్మణ విభాగమునందు స్పష్టము.

క్రీ. పూ. 1000 ఏండ్ల నాటికి వైదిక మతమున పలు రకములైన మార్పులు వచ్చినవి. ఇంద్రాది దేవతలు మరుగునపడి సృష్టి, స్థితి, లయములకు కారకులైన బ్రహ్మ, విష్ణు, రుద్రులు ప్రాచుర్యము వహించిరి. మరొకవైపున హింసాత్మకమైన యజ్ఞముల ప్రయోజనమును గురించి ఆలోచనాపరులు అనుమానింపసాగిరి. వీరు కర్మమార్గమును త్యజించి, భక్తి, యోగ, జ్ఞాన మార్గములను అవలంబింపసాగిరి. ఆరణ్యకములలో, ఉపనిషత్తులలో ఈ మార్గములను గురించిన కృషి ఎక్కువగా కన్పించును. ఉపనిషత్తులు వేదములలోని చివరి భాగములు. అందుచే ఉపనిషత్తులో బోధించిన జ్ఞానమార్గమే 'వేదాంత' మైనది. ఉపనిషత్తులు ఆధారముగా ఆత్మ, అనాత్మ వాదములు అనేకము బయలుదేరినవి. సాంఖ్య, యోగ, వైశేషికాది దర్శనములకు సైతము ఈ యుగముననే బీజారోపణ జరిగినది. చార్వాకముకూడ ప్రచారమైనది. దేశమున అనేక పరివ్రాజక సంఘములు బయలుదేరి, పలు రకముల సిద్ధాంతములను ప్రబోధింపసాగిరి. ఆధ్యాత్మిక రంగమున ఈ విధముగ ప్రబలిన అశాంతిని తొలగించుటకు పరిపాలకులైన క్షత్రియులు ప్రయత్నించిరి. చిరకాలమునుండియు క్షత్రియులు సైతము బ్రాహ్మణాధిక్యమును సహింపలేకుండిరి. ఆర్యులలో బ్రాహ్మణ, క్షత్రియ స్పర్ధకు పరుష్ణి యుద్ధముననే అంకురార్పణ జరిగినది. ఆ యుద్ధము బ్రాహ్మణుడైన వశిష్ఠుని పక్షమునకు, క్షత్రియుడైన విశ్వామిత్రుని పక్షమునకు మధ్య జరిగినదే. పురాణములలో వినవచ్చు పరశురామ కార్తవీర్యుల స్పర్ధ సైతము ఇట్టిదియే. క్రీ. పూ. 800 ఏండ్ల నాటికి భారతదేశమున ఆర్య, అనార్య జాతులను, వారి భిన్న మత సంస్కృతులను సమన్వయము చేసి, కృత్రిమమైన వర్ణ వ్యత్యాసములు లేని సమైక్య జాతీయ జీవితవిధానమును రూపొందింపవలసిన అవసరమును క్షత్రియులు గుర్తించి అందుకు సాధనముగా యజ్ఞమతానికి ప్రత్యామ్నాయమైన మతమును రూపొందించు మహోద్యమమునకు నాయకత్వము వహించినట్లు కన్పించును. ఈ ఉద్యమఫలితములే జైన, బౌద్ధమతములు. నాడు ప్రచారములో ఉన్న ముఖ్య సిద్ధాంతములను, ఆలోచనా పద్ధతులను సమన్వయమొనర్చి నూతనమైన జీవిత విధానమును ప్రజలకు అందించుటకు ఈ మతములు ప్రయత్నించినవి.

**జైన మతము :** జైనమత సిద్ధాంతములు చాల ప్రాచీనములని జైనుల విశ్వాసము. వారికి ఇరువదినలుగురు తీర్థంకరులు కలరు. మొదటి తీర్థంకరుడైన ఋషభనాథుడు వైదికయుగములో ఉండి ఉండును. ఇరువదిమూడవ తీర్థంకరుడు పార్శ్వనాథుడు క్రీ. పూ. 8 వ శతాబ్దివాడు. కాశీరాజు కుమారుడైన పార్శ్వనాథుడే జైనమత

సిద్ధాంతములను రూపొందించి ప్రచారమొనర్చెను. కాని, చివరి తీర్థంకరుడైన వర్ధమాన మహావీరుని 'జినుడు' అను బిరుదమునుండియే జైనమను పేరు వచ్చినది. అందుచే వర్ధమానుడే జైనమత స్థాపకుడుగా పరిగణింప బడుచున్నాడు.

వర్ధమానుడు వైశాలిని ఏలు సిద్ధార్థుడను రాజకుమారుడు. సమస్త విద్యలను అభ్యసించి, కొంతకాలము గృహస్థ జీవితము గడపి, నాటి ఆధ్యాత్మిక సమస్యలకు పరిష్కారములను కనుగొను ఆశయముతో ముప్పదియవ ఏట సన్యసించి, పండ్రెండువత్సరములు కఠిన తపమొనర్చి, జ్ఞానమును బడసెను. నాటినుండి వర్ధమానుడు జిన, నిగ్రంథ, మహావీర బిరుదులతో ప్రసిద్ధుడు అయ్యెను. అతని శిష్యులే జైనులు అనబడిరి.

మహావీరుడు వేదములను, యజ్ఞములను, వర్ణధర్మములను తిరస్కరించి, అహింస, త్రికరణశుద్ధి మున్నగు ఆత్మసంస్కారయుతమైన విధానముద్వారా కైవల్యమును పడయవచ్చునని బోధించెను.

అచిరకాలములోనే జైనమతము విశేష ప్రచారమును బడసినది. మగధ చక్రవర్తులైన బింబిసారుడు, అజాతశత్రువు, మహాపద్మనందుడు, చంద్రగుప్తమౌర్యుడు, కళింగ రాజైన ఖారవేలుడు, దక్షిణ దేశమును ఏలిన చాళుక్య, రాష్ట్రకూట రాజవంశములు జైన మతమును ఆదరించిరి. క్రీ. పూ. 3 వ శతాబ్దమున జైన మతస్థులలో శ్వేతాంబర, దిగంబర శాఖలు ఏర్పడినవి. జైనమతస్థులు నేటికిని గుజరాత్, రాజస్థాన్‌లలో ఉన్నారు.

**బౌద్ధమతము:** బౌద్ధమతమును స్థాపించిన బుద్ధుడు శాక్యవంశస్థుడు; గౌతమ గోత్రుడు. అతని తండ్రి శుద్ధోదనుడు; కపిలవస్తు నగరాధీశుడు. తల్లి మాయాదేవి. బుద్ధునకు తల్లి దండ్రులు పెట్టిన పేరు సిద్ధార్థుడు. ఇతడు క్రీ. పూ. 567 లో లుంబినీ గ్రామమున జన్మించెను. సమస్త విద్యలను అభ్యసించి యశోధర అను సుందరిని పెండ్లాడి, రాహులుడను పుత్రుని పడసిన తరువాత లౌకిక సుఖములను రోసి, ప్రపంచమందలి దుఃఖమునకు గల మూలకారణమును, అందుకు నివారణోపాయమును పరిశోధించు నిర్ణయముతో ముప్పదియవ ఏట సంసారమును త్యజించి సన్యసించెను. శాస్త్ర పఠనము గాని, యోగాభ్యాసము గాని సత్యశోధనకు ఉపకరింపక పోవుటచే దానిని త్యజించి, చివరకు గయలో ఒక రావి చెట్టు క్రింద ధ్యాననిమగ్నుడై ఉండగా, గౌతమునకు జ్ఞానోదయమైనది. సిద్ధార్థుడు బుద్ధుడయ్యెను. నాటినుండి సారనాథ్, రాజగృహ, వైశాలి, శ్రావస్తి, కపిలవస్తు మున్నగు నగరములను దర్శించి, పండితులు, పామరులు, ప్రభువులు, పేదలు అను తారతమ్యమును పాటింపక దీక్షతో బుద్ధుడు తన ధర్మమును ప్రబోధించెను.

'ప్రపంచము కష్టభూయిష్ఠము అగుటకు మానవుని లోని తృష్ణయే కారణము; తృష్ణ అజ్ఞానము వలన జనించుచున్నది. శీల, సమాధి, ప్రజ్ఞలను సమకూర్చు అష్టాంగ మార్గముద్వారా తృష్ణను జయించినచో పునర్జన్మ రహితమైన నిర్వాణమును మానవుడు పొందగలడు' అని బుద్ధుడు బోధించెను. వ్యయప్రయాసలతో నిండిన కర్మ కాండలుగాని, దురాశాపరులైన పూజారుల ప్రమేయము గాని, కృత్రిమ వర్ణ వ్యత్యాసములుగాని లేక సత్యము, అహింస, దయాదాక్షిణ్యములపై ఏర్పడిన సులభ మార్గమైనందున ప్రజలు తండోపతండములుగ బౌద్ధ ధర్మమును స్వీకరించిరి. బింబిసార, అజాతశత్రువులు బుద్ధుని కూడ ఆదరించిరి. తన శిష్యగణమును బౌద్ధ సంఘముగ ఏర్పరచి, తన 80 వ ఏట బుద్ధుడు కుశీనగరమున మహాపరి నిర్వాణమును పడసెను. బుద్ధుడు, ధర్మము, సంఘము - అను త్రిరత్నములు బౌద్ధులకు శరణ్యములు అయినవి.

బుద్ధుని నిర్వాణానంతరము బౌద్ధసంఘము రాజగృహములో సమావేశమై బుద్ధుని బోధనలు వినయపిటకము, సుత్తపిటకములుగ క్రోడీకరించి, బౌద్ధధర్మప్రచారమునకు మార్గములను అన్వేషించెను. రెండవమారు బౌద్ధ సంఘము వైశాలిలో (క్రీ. పూ. 387) సమావేశమైనది. మూడవ బౌద్ధసంఘమును (క్రీ. పూ. 253) అశోకచక్రవర్తి పాటలీపుత్రమున సమావేశపరచి, బౌద్ధమతముద్వారా లోకకల్యాణమును సాధించుటకు కృషి చేసెను. బౌద్ధ ధర్మ సూత్రములను శిలలపై, శిలాస్తంభములపై చెక్కించి తన సామ్రాజ్యమునందు అంతట ప్రతిష్ఠించెను. బౌద్ధ సంఘాధ్యక్షుడైన మొగ్గలిపుత్తతిస్స బౌద్ధధర్మసూత్రము లను వినయ, సుత్త, అభిదమ్మ పిటకములుగ క్రోడీకరించెను. అనంతరము అశోకుడు దేశము నలుమూలలకే గాక, సింహళము, సిరియా మున్నగు దూరదేశములకు బౌద్ధమత ప్రచారకులను పంపెను. నాటినుండి బౌద్ధము ప్రపంచ మతమైనది. నాలుగవ బౌద్ధసంఘము కుషాన్ చక్రవర్తి కనిష్కుని [చూ. పు. 365] కాలమున కుండలవనములో సమావేశమైనది. నాటికే బౌద్ధసంఘము మహాయాన, హీనయాన శాఖలుగ చీలిపోయినది. మహాయానములో బుద్ధుడు దేవుడుగా పూజింపబడెను. బౌద్ధ సంఘమున తిరిగి ఐక్యత నెలకొల్పుటకు నాలుగవ సమావేశము ప్రయత్నించి, విఫలమై, మహాయాన సిద్ధాంతములను ఆమోదించినది. వసుమిత్రుడు, అశ్వఘోషుడు,

నాగార్జునాచార్యులు మహాయాన సిద్ధాంత కర్తలైరి. క్రమక్రమముగ బౌద్ధము శాఖోపశాఖలై, విశిష్టతను, వ్యక్తిత్వమును కోల్పోయి భారతదేశమున హిందూమత శాఖగ పరిగణింపబడసాగినది. బుద్ధుడు విష్ణుమూర్తి అవతారముగ హిందువులకు సైతము ఆరాధ్యదైవ మయ్యెను.

మగధ సామ్రాజ్య స్థాపన : జైన, బౌద్ధములు సాంఘిక ముగ, సాంస్కృతికముగ ప్రజలలో సమైక్యతకు కృషి చేయుచున్న కాలమున మగధరాజులు దేశమున రాజకీయ సమైక్యతకు ప్రయత్నములు ప్రారంభించిరి. ఇతిహాస కాలమున ఏర్పడిన మహాజనపదములు అన్నిటిలో ఇప్పటి బీహారులోని మగధ క్రీ. పూ. 6 వ శతాబ్దినాటికి బలిష్ఠ మైన రాజ్యమైనది. మగధకు రాజధాని గిరివ్రజము లేదా రాజగృహము. క్రీ. పూ. 6 వ శతాబ్దాంతమున మగధ సింహాసనము ఎక్కిన హర్యంకవంశజుడైన బింబిసారుడు, అతని కుమారుడైన అజాతశత్రువు పరాక్రమవంతులై మహాసామ్రాజ్యమునకు పునాదులు వేసిరి. తరువాతి కాలమున మగధకు రాజధానియైన పాటలీపుత్రనగర మును నిర్మించినది అజాతశత్రువే. హర్యంకుల తరువాత మగధను ఏలిన శిశునాగులు సైతము సామ్రాజ్య విస్తరణ విధానమునే అనుసరించిరి. వీరిని తుదముట్టించి, శూద్రు లైన నందవంశస్థులు మగధసింహాసనమును ఆక్రమించిరి.

నందవంశస్థాపకుడు మహాపద్మనందుడు. 'మహాపద్మము' అనగా పది కోట్లు. ఈతని సైన్యములో పదికోట్ల సైన్యము ఉండెడిదట. ఇందు అతిశయోక్తి ఉన్నను, అతడు బహు సేనాసమన్వితుడగుట నిజమని తోచుచున్నది. నందులను బౌద్ధులు 'ఉగ్రసేను' లని పిలుచుటకు ఈ అపార సేనా బలమే కారణమై ఉండును. మహాపద్మనందుడు ఉత్తరా పథమునందలి రాజులనందరిని జయించి రావీనది మొదలు గోదావరి పర్యంతము, అరేబియా సముద్రము నుండి బంగాళాఖాతము వరకును విస్తరించిన సామ్రాజ్య మును స్థాపించెనని కొన్ని గ్రంథములవలన తెలియనగు చున్నది. ఈతని కాలమున ఉత్తర, దక్షిణాపథములలో చాలభాగము ఏక ప్రభుత్వము క్రిందికి కొనిరాబడినది. మహాపద్మనందుడు 'ఏకరాట్' బిరుదమును ధరించెను.

పారసీక దండయాత్రలు : తూర్పు భారతదేశమున మగధ సామ్రాజ్యము విస్తరించుచున్న కాలమున వాయవ్య ప్రాంతములు విదేశదండయాత్రలకు గురియైనవి. చిరకాల మునుండి భారతదేశపు సిరిసంపదలు విదేశీయుల నోళ్ళూ రించి ఆకర్షించినవి. దేశములోని అనైక్యత విదేశీయ విజేతలకు అనుకూలించి, వారి అధికారమును స్థాపించుటకు సహాయకారియైనది. ఈ పరిస్థితులను మొట్టమొదట వినియోగించుకొన్నవారు పారసీకులు. క్రీ. పూ. 6 వ శతాబ్ది చివర దర్యావుష - I (డరయస్) అను పారసీక చక్రవర్తి పంజాబ్ మొదలుగ వాయవ్య సరిహద్దు ప్రాంత ములను జయించి తన సామ్రాజ్యములో ఒక రాష్ట్రముగ ఏర్పరచి పారసీక ఉద్యోగులను నియమించెను. సుమారు 2 శతాబ్దములవరకును (క్రీ. పూ. 330) వాయవ్యప్రాంత ములలో పారసీక పరిపాలన సాగినది. ఈ కాలముననే భారతదేశమున 'ఖరోష్టి' అను లిపియును, పారసీక శిల్పకళా రీతులును ప్రవేశించినవి. క్రీ. పూ. 330 ప్రాంతమున పారసీక అధికారము తుదముట్టుటతో పంజాబ్ ప్రాంత ములలో తక్షశిల, పౌరవ, అభిసార మున్నగు చిన్న చిన్న రాజ్యములు ఏర్పడినవి. యథాప్రకారము ఈ రాజ్యములు అంతఃకలహములలో మునిగి తేలసాగెను.

**అలిగ్జాండర్** దండయాత్ర : పారసీక సామ్రాజ్యము విచ్ఛిన్నమగుటకు అలిగ్జాండర్ దండయాత్ర కారణము. అలిగ్జాండర్ యూరప్‌లోని గ్రీస్, మేసిడోనియారాజ్య ముల చక్రవర్తి; మహావీరుడు. ప్రపంచమంతటిని జయింప వలెనను ఆశతో, పెద్ద సైన్యమును సమకూర్చుకొని ఈజిప్టు, సిరియా, మెసపొటేమియా, పర్షియా, మధ్య ఆసియాలను జయించి క్రీ. పూ. 327 లో హిందూకుష్ పర్వతములను దాటి భారతదేశమును ప్రవేశించెను. తక్షశిల రాజైన అంభి అలిగ్జాండర్‌ను ఆహ్వానించి, అతనికి దాసోహము అనెను. అభిసారరాజు అంభిని అనుసరించెను. కాని, పరాక్రమశాలి, స్వాతంత్ర్యప్రియుడు అయిన పూరురాజు అలిగ్జాండర్‌ను ప్రతిఘటించెను. జీలంనది ఒడ్డున పెద్దయుద్ధము జరిగినది. గ్రీక్‌ల అశ్వదళము ధాటికి పూరురాజున్యని గజబలము బెదరి స్వసైన్యమునే మట్టగించినది. పూరురాజు ఓడి పోయెను. ఐనను, అతని శౌర్యమునకు మెచ్చి అతని రాజ్యమును అతనికి ఇచ్చి, అలిగ్జాండర్ ముందుకు నడచి నందసామ్రాజ్యముపై దండెత్త ప్రయత్నించెను. కాని, ఆతని సైనికులు స్వదేశమునకు మరలవలెనని పట్టుబట్టిరి. అలిగ్జాండర్‌నకు వెనుకకు మరలక తప్పలేదు. సింధునదిపై పయనించి, సింధుముఖద్వారమును చేరి, అటనుండి బెలూచి స్తాన్ మీదుగా బాబిలోనియా చేరెను. అచట జ్వరపీడి తుడై క్రీ. పూ. 323 లో అలిగ్జాండర్ మరణించెను. [చూ. పు. 303]

గ్రీక్ దండయాత్ర ప్రభావము : అలిగ్జాండర్ అకాల మరణమువలన భారతదేశమున గ్రీక్ అధికారము త్వరలోనే అస్తమించినది. కాని, ఈ దండయాత్ర గ్రీస్, భారతదేశముల మధ్య సంబంధమును ఏర్పరచినది. గ్రీస్

పాశ్చాత్యసంస్కృతికి పుట్టినిల్లు; ప్రాచ్య సంస్కృతికి భారతదేశము పుట్టినిల్లు. పరస్పర ప్రభావమునకు ఈ దేశములు లోనైనవి. మధ్య ఆసియాలో బాహ్లికదేశమున అలిగ్జాండర్ స్థాపించిన గ్రీక్‌రాజ్యమునుండి గ్రీక్ సంస్కృతి భారతదేశముపై ప్రసరించినది. నాటినుండి భారతీయులు నాణెముల ఆకారమును, ముద్రణా పద్ధతిని మెరుగుపరచుకొనిరి. నాటికే ఖగోళశాస్త్రములో గ్రీక్‌లు పెక్కు పరిశోధనలు కావించిరి. భారతీయశాస్త్రకారులు ఆ విషయములను గ్రహించినట్లు కన్పించును. వారముల పేర్లు, రాశుల పేర్లు ప్రాచ్య, పాశ్చాత్య పంచాంగములలో ఒకటిగా ఉండుట గమనింపదగిన విషయము. నాటక రంగాలంకరణలో ప్రధానాంగమైనది తెర. దీనినే సంస్కృతమున 'యవనిక' అందురు. ఈ పేరునుబట్టి ఇది యవన దేశమునుండి గ్రహింపబడినట్లు తెలియుచున్నది. భారతీయుల ఆధ్యాత్మికచింతన గ్రీక్‌లను ముగ్ధులను కావించినది.

అలిగ్జాండర్ దండయాత్రలవలన వాయవ్యప్రాంతముల లోని రాజ్యముల సైనికబలము క్షీణించినది. అందుచేత ఆ రాజ్యములను సులభముగ జయించి తన మహాసామ్రాజ్యములో మౌర్యచంద్రగుప్తుడు [చూ. పు. 442] సులభముగ కలుపుకొనగలిగెను. దేశ ఏకీకరణకు విదేశీయ దండయాత్ర ఉపకరించినది.

మౌర్యసామ్రాజ్యము - చంద్రగుప్తుడు: బింబిసార, మహాపద్మనందులు ఆశించిన భారతదేశ ఏకచ్ఛత్రాధిపత్యము మౌర్యులకాలమున సాధింపబడినది. ఈ వంశస్థాపకుడు అయిన చంద్రగుప్తుడు మౌర్యగ్రామవాసియగు క్షత్రియ వీరుడు. క్రీ. పూ. 323 లో అలిగ్జాండర్ మరణించెనని తెలిసినంతనే చంద్రగుప్తుడు పంజాబ్‌నుండి గ్రీక్ సైన్యములను పారద్రోలి ఆక్రమించి, తరువాత మగధపై దండెత్తి నందవంశమును నిర్మూలించి, సింహాసనమును ఆక్రమించెను. దురాశాపరులైన ప్రజలను పీడించి ప్రజాభిమానమును గోల్పోవుటచే నందులను తొలగించుటకు చంద్రగుప్తునకు సులభమైనది. నందరాజులచే పరాభవింపబడిన చాణక్యుడు అను బ్రాహ్మణుని సహాయముకూడా చంద్రగుప్తునకు లభించెను. చాణక్యుడే చంద్రగుప్తుని ప్రధాని అయ్యెను.

అంతటితో తృప్తివహింపక చంద్రగుప్తమౌర్యుడు పశ్చిమ భారతదేశమును ఆక్రమించి దక్షిణాపథమున మైసూరుప్రాంతము వరకు దండయాత్ర జరిపెను. ప్రాచీన తమిళ వాఙ్మయములో పేర్కొనబడిన 'వాంబమోరియర్' చంద్రగుప్తమౌర్యుడే అని కొందరి అభిప్రాయము. ఇంతలో క్రీ. పూ. 305 లో సెల్యూకస్ అను గ్రీక్ సేనాపతి పంజాబ్‌ను తిరిగి జయించు ఆశతో దండెత్తి వచ్చెను. కాని, చంద్రగుప్తునిచే ఓడింపబడి తన కుమార్తెను చంద్రగుప్తునికి ఇచ్చి పెండ్లిచేసి కట్నముగా ఆఫ్ఘనిస్తాన్, బెలూచిస్తాన్ దేశములను ఇచ్చెను. దీనితో మౌర్య సామ్రాజ్యము మధ్య ఆసియానుండి దక్షిణమున పెన్నానది వరకును విస్తరించినది. చంద్రగుప్తుని ఆస్థానములో సెల్యూకస్ రాయబారియైన మెగస్తనీస్ భారతదేశమును గురించి 'ఇండికా' అను గ్రంథమును రచించెను. ఆ గ్రంథము ఇపుడు లభ్యము కాకున్నను, అందుండి ఇతర రచయితలచే ఉద్ధృతములైన గ్రంథభాగములనుండి అనేక చారిత్రకాంశములు తెలియుచున్నవి.

చంద్రగుప్తుని కుమారుడు బిందుసారుడు 'అమిత్రఘాత' బిరుదము వహించి 27 సంవత్సరములు రాజ్యపాలన చేసెను. లోకోత్తరమైన కీర్తిని ఆర్జించిన అశోక చక్రవర్తి బిందుసారుని కుమారుడే.

అశోక చక్రవర్తి (క్రీ. పూ. 272 - 231 ప.): అశోకుడు తొలుత యుద్ధప్రియుడు; సింహాసనము ఎక్కిన నాలుగు సంవత్సరముల తరువాత పట్టాభిషేకము జరుపుకొన్నట్లు బౌద్ధ వాఙ్మయము ద్వారా తెలియుచున్నది. నాటివరకు మౌర్య సామ్రాజ్యములో చేరియుండని కళింగరాజ్యమును జయింప (క్రీ. పూ. 261) అశోకుడు ఆ రాజ్యముపై దండెత్తెను. కళింగులు అశోకుని ఎదిరించి ఘోరయుద్ధము చేసిరి. అశోకుడు విజయము సాధించి కళింగమును సామ్రాజ్యములో కలుపుకొనెను. కాని, యుద్ధములో జరిగిన అపార జననష్టముతో అశోకుని హృదయము ద్రవించినది. యుద్ధములవలన మానవ జాతికి కలుగు నష్టములను గుర్తించి రాజకీయవిధానముగ యుద్ధమునకు స్వస్తిచెప్పుటకై నిర్ణయము ఒనర్చెను. ఖేద, పశ్చాత్తాపములతో నిండిన అశోకుని మనస్సును బౌద్ధధర్మము ఆకర్షించినది. శాంతి అహింసలపై, సత్యాశౌచములపై ఆధారపడిన బౌద్ధధర్మములతో లోకకల్యాణములను సాధింప బద్ధకంకణుడయ్యెను. విజేతయయ్యును యుద్ధమును పరిత్యజించిన అశోకునకు సాటి మానవ చరిత్రలో కన్పింపడు.

అశోకుని కాలమున తమిళదేశము మినహాగా యావద్భారతము చక్రవర్తి క్షేత్రమున చేరినది. ఈ విశాల సామ్రాజ్యములో తన ప్రభుత్వమునకు ధర్మమునే పునాదిగా చేసి, ప్రజలను ధర్మ బద్ధులుగా చేయుటకై అశోకుడు సంకల్పించెను [చూ. అశోకుడు పు. 276]. అశోకుని తరువాత క్రమముగా మౌర్యవంశము బలహీనమైనది.

మౌర్య సామ్రాజ్య పరిస్థితులు: చంద్రగుప్తుడు, అశోకుడు సామ్రాజ్యమును జయించుటేగాక, ఆ సామ్రాజ్య

మును సుస్థిరముగా ఉంచుటకును, ప్రజల సుఖజీవనమునకు అనుకూలించు పరిపాలనా విధానమును ఏర్పరచుటకును ప్రయత్నించిరి. రాజనీతిలో ప్రజ్ఞగల చాణక్యుడే మౌర్య పాలనావిధానమును రూపొందించెను. దానికి ధర్మమును పునాదిగా చేసినవాడు అశోకుడు. చక్రవర్తి సర్వాధికారియైనను అతడు ధర్మబద్ధుడై, మంత్రి పరిషత్తు సలహాల ప్రకారము వర్తించువాడు. అతడే సేనాపతి; ఉన్నత న్యాయాధిపతి. పరిపాలన నడపుటకు అధ్యక్షులను ఉద్యోగి బృందము ఉండెను. నేరస్థులు కఠినముగ శిక్షింపబడెడివారు. అశోకుని కాలమున శిక్షలు, వాని కాఠిన్యము చాలవరకు తగ్గింపబడినవి. రాష్ట్రపాలనను కుమార మహామంత్రులు నిర్వహించెడివారు. నగరములలో నేటి పురపాలక విధానమును బోలిన విధానము అమలులో ఉండెను. పాటలీపుత్రమున ముప్పదిమంది సభ్యులుగల సభ - ఆరు పంచాయతీలుగ ఏర్పడి - నగరపాలనలోని వివిధ అంగములపై అజమాయిషీ జరుపుచుండెడిది. దేశము సువిశాలమైనందున స్థానిక స్వపరిపాలన ఆవశ్యకత మౌర్యుల కాలముననే గుర్తింపబడినది.

**మౌర్యుల అస్తమయము :** ఎంత శ్రద్ధ వహించినను సామ్రాజ్యము విశాలమై రాకపోకల సౌకర్యములు తక్కువైనందున రాష్ట్రపాలకులపై చక్రవర్తి అధికారము దుర్బలమై, అవకాశము చిక్కినంతనే వారు స్వతంత్రులగుటకు ప్రయత్నించిరి. భారత దేశ సామ్రాజ్యములు అన్నిం టిలో రాష్ట్రపాలకుల స్వార్థచింతన, ద్రోహబుద్ధియే ప్రధాన లోపముగ కనిపించును. ఇక అశోకుని బౌద్ధమత పోషణను వైదికమతాభిమానులు నిరసించుట సహజమే. మౌర్యులపై వారు సాగించిన ఉద్యమమునకు పుష్యమిత్రుడు నాయకత్వము వహించెను. ఇతడు శుంగ వంశపు బ్రాహ్మణుడు; మౌర్యులకు సేనాపతి. ఇదే సమయమున బాహ్లిక దేశమునుండి గ్రీకులు దండయాత్రలు ప్రారంభించుటతో దేశము అల్లకల్లోలమైనది. మౌర్యులు ఈ పరిస్థితులకు తట్టుకొనలేక పోయిరి. వాయవ్య సరిహద్దు ప్రాంతములు గ్రీకుల వశమైనవి. తుదకు చివరి మౌర్యుడైన బృహద్రథుని వధించి పుష్యమిత్రశుంగుడు క్రీ. పూ. 187 లో సింహాసనము ఆక్రమించెను.

**శుంగ - కాణ్వాయన వంశములు :** పుష్యమిత్రుడు మగధను ఆక్రమించి మౌర్య సామ్రాజ్య ప్రతిష్ఠను పునరుద్ధరించుటకు ప్రయత్నించెను. ఈతని కుమారుడైన అగ్నిమిత్రుడు మాళవ, విదర్భ దేశములను జయించి ఆక్రమించెను. కాని, అతడు వాయవ్యమునుండి వచ్చిన గ్రీకుల దండయాత్రను ఎదుర్కొనవలసి వచ్చినది. ఈ దండయాత్రను మరలించి పుష్యమిత్రుడు రెండు అశ్వమేధములు ఒనర్చి వైదికధర్మమును పునరుద్ధరించెను. ప్రసిద్ధ వైయ్యాకరణియైన పతంజలి పుష్యమిత్రుని కాలపువాడు [చూ. అగ్నిమిత్రుడు - పు 262].

శుంగ వంశస్థులు సుమారు నూటపది సంవత్సరములు పాలించిరి. చివరి శుంగుడైన దేవభూతిని అతని అమాత్యుడును, కాణ్వవంశస్థుడునైన వాసుదేవుడు వధించి సింహాసనము ఆక్రమించెను (క్రీ. పూ. 75). కాణ్వాయనులు 45 సంవత్సరములు మాత్రమే రాజ్యము చేసిరి. చివరి కాణ్వాయనుడైన సుశర్మను ఆంధ్ర చక్రవర్తియైన పులోమావి వధించి క్రీ. పూ. 28 లో మగధను ఆక్రమించెను [చూ. సం. 3 - పు. 95].

**గ్రీకులు :** మగధలో శుంగవంశ ప్రతిష్ఠ జరిగిన కాలముననే బాహ్లిక దేశము నుండి గ్రీకులు (యవనులు) దండెత్తి వచ్చి వాయవ్యప్రాంతములను ఆక్రమించి రాజ్యమును స్థాపించిరి. పంజాబ్‌లోని సియాల్‌కట్ (సగాలా) వారి రాజధాని. ఈ యవనరాజులలో మీనాండర్ చాల ప్రసిద్ధుడు. అలెగ్జాండర్ అంతటి విజేత అని గ్రీక్ చరిత్రలు ఇతనిని వర్ణించుచున్నవి. ఇతడు బౌద్ధమతాభిమాని. ఈతనికిని, నాగసేనుడను బౌద్ధమతాచార్యునకును జరిగిన సంభాషణ 'మిళిందపన్హా' అను బౌద్ధ గ్రంథమైనది. భారతీయ వాఙ్మయములో ఈతడు మిళిందుడని వ్యవహరింపబడెను.

**శకులు :** గ్రీకుల తరువాత శకులు దండెత్తివచ్చిరి. మధ్య ఆసియాలోని సర్ దరియా, అమూ దరియా ప్రాంతముల నుండి బోలన్ కనుమగుండా భారతదేశమున ప్రవేశించి తక్షశిల, మధుర, ఉజ్జయిని, భరుకచ్ఛములలో వీరు రాజ్యములు స్థాపించిరి. శకరాజులలో భరుకచ్ఛమును ఏలిన నహపాణుడు, ఉజ్జయినిని ఏలిన రుద్రదాముడు అగ్రగణ్యులు. శకులకును, ఆంధ్ర సాతవాహనులకును తరచు యుద్ధములు జరిగినవి. రుద్రదాముడు అను పేరు శకులు ఏ విధముగా హిందువులలో కలసిపోయినది సూచించును.

శకులను జయించి, పార్థియన్‌లు పంజాబ్ ప్రాంతమును జయించిరి. వీరి తరువాత యూచి జాతి వారైన కుషానులు దండెత్తివచ్చి గొప్ప సామ్రాజ్యమును నిర్మించిరి.

**కనిష్కుడు :** కుషాన్ రాజులలో అగ్రగణ్యుడు కనిష్కుడు. ఇతడు క్రీ. శ. 78 లో సింహాసనము ఎక్కి ఆ సంవత్సరముతో ప్రారంభించు ఒకశకమును స్థాపించెనని కొందరు చరిత్రకారుల అభిప్రాయము. అదియే 'శాలివాహనశకము' అను పేర వాడుకలో ఉన్నది [చూ. కనిష్కుడు - పు. 365].

కనిష్కుని కాలమున కుషాను సామ్రాజ్యము దక్షిణమున నర్మదానది వరకును, తూర్పున మగధ పర్యంతమును విస్తరించినది. చీనాసార్వభౌముని ఓడించి, కనిష్కుడు కాష్గర్, యార్కండ్, ఖోటాన్ రాజ్యములను ఆక్రమించెను. పురుషపురము ఈతని రాజధాని; అదియే నేటి పెషావర్.

కనిష్కుని పరిపాలనా కాలమున పెక్కు సాంస్కృతిక పరిణామములు జరిగినవి. జన్మతః విదేశీయుడే ఐనప్పటికీ కనిష్కునకు భారతీయసంస్కృతి పట్ల విశేష ఆదరము ఏర్పడెను. అతడు మహాయానబౌద్ధమును స్వీకరించి పోషించెను. కుండలవన విహారములో నాలుగవ బౌద్ధ సంఘమును సమావేశపరచి, అధ్యక్షుడైన వసుమిత్రునిచే త్రిపిటకములకు 'విభాషలు' అనబడు భాష్యములను రచింపజేసెను. మహాకవి, విమర్శకుడు అయిన అశ్వఘోషుడు, మహాయానసిద్ధాంత కర్తయైన నాగార్జునాచార్యుడు కనిష్కుని ఆస్థానమును అలంకరించిరి. తక్షశిల, మధుర, పురుషపురములలో కనిష్కుడు స్థూప విహారాదులు నిర్మించెను. వీని నిర్మాణములో గ్రీక్ శిల్పులను నియమించినందున గ్రీక్ - భారతీయ శిల్పరీతులు సమ్మేళనము చెంది, విశిష్టమైన గాంధారశిల్పరీతి తయారైనది. గాంధారశిల్పములో గ్రీక్ శిల్పమందలి శరీర సౌష్ఠవము, భారతీయశిల్పమందలి ఆధ్యాత్మిక సౌందర్యము మేళవింపబడినవి. ఈ విధముగ కనిష్కుని పోషణలో వైదేశిక ప్రభావములను జీర్ణించుకొని భారతీయ సంస్కృతి వికసనోన్ముఖమై గుప్తరాజుల స్వర్ణయుగమునకు నాంది ప్రస్తావన చేసినది [చూ. గుప్తవంశరాజులు - పు. 425].

కనిష్కుని అనంతరము కుషాన్ సామ్రాజ్యము క్షీణించి, కాశ్మీరమునకు మాత్రమే పరిమితమైనది.

ఆంధ్ర సాతవాహన సామ్రాజ్యము : ఇతిహాస కాలము నుండియు ఆర్యుల రాజకీయాధికారము, నాగరకతా సంస్కృతులు దక్షిణాపథము [చూ. పు. 526] నకు విస్తరించినవి. దక్షిణాపథ జాతులలో పెక్కురు జైన, బౌద్ధ మతములను అవలంబించి ఆదరించిరి. వీరిలో పాండ్య, చోళ, కేరళపుత్ర జాతులు అశోకుని కాలమున స్వతంత్రులై ఉండి, ఆంధ్ర, పుళింద, భోజకాది జాతులు చక్రవర్తి క్షేత్రమున చేరిరనియు అశోకుని శాసనములలో చెప్పబడినది. వీరందరిలో ఆంధ్రులు బలవంతులై, అశోకుని మరణానంతరము సామ్రాజ్య స్థాపకులైరి [చూ. సం. 3 - పు. 644].

శ్రీముఖుడు ఆంధ్రుల మొదటి చక్రవర్తి. ఈతని కుమారుడైన శాతకర్ణి 'అప్రతిహత చక్రు' డై మాళవము మొదలు మైసూరు వరకును జయించి, రెండు అశ్వమేధములును, రాజసూయమును ఒనర్చి 'దక్షిణాపథపతి' అను బిరుదు ధరించెను. మగధరాజైన పుష్యమిత్ర శుంగుడు, కళింగాధిపతి ఖారవేలుడు ఈతని సమకాలికులు. ఆరవ సాతవాహనుడైన శాతకర్ణి - II ఏబదియారు సంవత్సరములు పాలించి, ఆంధ్రుల అధికారమును కళింగ, మగధలపై విస్తరింపజేసెను. పదునేడవ శాతవాహనుడగు హాలుడు గొప్ప భాషాభిమాని, కవివత్సలుడు. గాథా సప్తశతి అను ప్రాకృత గాథాకావ్యమును రచింపజేసెను.

హాలుని తరువాత కొంతకాలమువరకు ఆంధ్ర సామ్రాజ్యము క్షీణించినది. ఈ కాలముననే నహపాణుడు విజృంభించి శకరాజ్యమును విస్తరింపజేసెను. తిరిగి ఆంధ్రుల ప్రతిష్ఠ గౌతమీపుత్ర శాతకర్ణి కాలమున పునరుద్ధరింపబడినది. గౌతమీ పుత్రుడు దిగ్విజయయాత్రలు ఒనర్చి ఆంధ్రుల సామ్రాజ్యమును గంగా - కావేరి నదుల మధ్య దేశమున విస్తరింపజేసెను. చివరి సాతవాహనులలో యజ్ఞశ్రీ సుప్రసిద్ధుడు. ఈతని తరువాత కొలది కాలమునకే సాతవాహన సామ్రాజ్యము అస్తమించినది.

దేశ కాల పరిస్థితులు : సాతవాహనులు చాలవరకు మౌర్యుల పరిపాలనా విధానమునే అనుసరించిరి. సామ్రాజ్యములో దూరభూములను మహాభోజ, మహాతలవర అను పేర్లుగల సామంతులు పాలించెడివారు. రాష్ట్రములు ఆహారములని వ్యవహరింపబడి, అమాత్యుల పాలనలో ఉండెను. వీరుగాక భాండారిక, మహాతలవర, మహార్యక అను ఉద్యోగుల పేర్లు కన్పట్టుచున్నవి. పట్టణములలో నిగమ సభలు లేదా వర్తకశ్రేణులు పరిపాలన సాగించెను. ఆర్థికముగ దేశము సుభిక్షమై ఉండెను. వృత్తి పనుల వారు, వర్తకులు శ్రేణులుగ ఏర్పడుచుండిరి. రోమ్ మొదలైన దూరదేశములతో వాణిజ్యము జరుగుచుండెను. సోపార, కల్యాణ, మైసోలియా, కొడ్డూర మొదలైనవి రేవు పట్టణములు. పులోమావి, యజ్ఞశ్రీ నాణెములపై కన్పించు ఓడ బొమ్మలు సాతవాహనులకు గల నౌకా బలమునకు, నౌకాయానముపై వారికి గల శ్రద్ధకు నిదర్శనములు.

సాతవాహనులు బ్రాహ్మణ మతాభిమానులే అయినను బౌద్ధమతము పట్ల సహనము వహించిరి; వారి రాణులు బౌద్ధధర్మాభిమానులు అగుట గొప్ప విశేషము. వర్తకులు, సామాన్య ప్రజలు బౌద్ధము పట్ల విశేష ఆదరణము కలిగి ఉండిరి. భట్టిప్రోలు, అమరావతి, నాసిక్, కన్హేరి, కార్లీ మొదలైన బౌద్ధక్షేత్రములు ఈ కాలమున

వెలసినవే. ఇవి సుప్రసిద్ధ కళాక్షేత్రములు కూడ అయినవి. అమరావతీ శిల్పము జగత్ప్రసిద్ధము. బౌద్ధ విహారములు కళాశాలలై, వైజ్ఞానిక కేంద్రములైనవి. నాగార్జునాచార్యుడు, ఆర్యదేవుడు మున్నగు ప్రసిద్ధ ఆచార్యులు అనేక బౌద్ధధర్మగ్రంథములు రచించిరి. ప్రాకృత, సంస్కృత భాషలు రెండును పోషింపబడినవి.

చిన్న రాజవంశములు : సాతవాహనుల అస్తమయముతో దక్షిణాపథమున రాజకీయ ఐక్యత విచ్ఛిన్నమై చిన్న రాజ్యములు అనేకములు తలెత్తినవి. కృష్ణాముఖద్వార సమీపమున శ్రీపర్వతేయులను, ఇక్ష్వాకులు విజయపురి (నాగార్జునకొండ) నుండి సుమారు ఒక శతాబ్దము పరిపాలన జరిపిరి. వీరి కాలముననే నాగార్జునకొండ గొప్ప మహాయాన క్షేత్రము, సుందర శిల్పకళాక్షేత్రము అయినది. ఇక్ష్వాకుల తరువాత బృహత్ఫలాయనులు, ఆనంద గోత్రజులు, విష్ణుకుండినులు ఆ ప్రాంతములలో రాజ్యము చేసిరి. కృష్ణా-గోదావరుల మధ్య వేంగి రాజధానిగ శాలంకాయనులు ప్రభువులు అయిరి. పశ్చిమోత్తరసీమలలో వాకాటక వంశజులు, దక్షిణమున పల్లవులు బలవంతులైరి. తమిళదేశమున చోళ, పాండ్య, చేరరాజ్యములు ఈ కాలముననే రూపొందసాగినవి.

గుప్త సామ్రాజ్యము: ఆంధ్రసామ్రాజ్యము విచ్ఛిన్నమైన అనతి కాలముననే ఉత్తరాపథమున కుషానుల బలము క్షీణించినది. విదేశీయులైన కుషానులపై స్థానిక రాజవంశములవారు విజృంభించిరి. వీరికి నాగులు నాయకులై, కుషానులను కాశ్మీరమునకు తరిమివేసి, అహిచ్ఛత్ర, మథుర, పద్మావతి మొదలైన రాజ్యములు స్థాపించిరి. ఈ ఉద్యమకాలముననే మగధలో గుప్తవంశమువారు విజృంభించి, మౌర్యులనాటి ఏకాధిపత్యసంప్రదాయమును పునరుద్ధరించుటేగాక, సాంస్కృతికముగ భారతదేశ చరిత్రలో స్వర్ణయుగమును సృష్టించిరి.

పాటలీపుత్రమున స్వతంత్ర గుప్తరాజ్యమును స్థాపించినది చంద్రగుప్తుడు - I. ఇతడు ఘటోత్కచగుప్తుని పుత్రుడు. చంద్రగుప్తుడు లిచ్ఛవి రాకుమారియైన కుమారిదేవిని పెండ్లాడెను. తూర్పు ప్రాంతములలో లిచ్ఛవులు బలవంతులై ఉండిరి. వీరి సాయముతో చంద్రగుప్తుడు - I ప్రయాగ పర్యంతము జయించి స్వతంత్ర రాజ్యమును స్థాపించెను; మహారాజాధిరాజ బిరుదమును ధరించుటేగాక, క్రీ. శ. 320 లో గుప్తశకమును స్థాపించెను [చూ. చంద్రగుప్తుడు - I. పు. 442]. ఇతని కుమారుడైన సముద్రగుప్తుడు [చూ.] (క్రీ. శ. 335-375 ప.) మహాపరాక్రమవంతుడు; విజేత. భారతదేశమును ఏకచ్ఛత్రముగ ఏలవలెనను సంకల్పముతో ఇతడు అనేక దిగ్విజయయాత్రలు జరిపెను. తన గుణములను, విజయయాత్రలను వర్ణించుచు అలహాబాదులో ఈతడు ఒక శాసనమును వేయించెను. అశోకుని శిలాస్తంభముపై చెక్కబడిన ఈ ప్రశస్తి ప్రకారము, ఉత్తరాపథమునందలి రాజులను జయించి సముద్రగుప్తుడు దక్షిణ దిగ్విజయయాత్ర జరిపి (క్రీ. శ. 345), కాంచీపుర పర్యంతము గల రాజులను ఓడించెను. ఉత్తర దేశమునగల పర్వత, ఆటవిక జాతులవారు అందరు స్వయముగ సముద్రగుప్తునకు లొంగిపోయిరి. ఈతని ఘనతను గుర్తించి, కాశ్మీరమును ఏలు కుషానురాజులు, నేపాల్, కామరూప, సింహళ దేశాధిపతులు కానుకలు పంపి, సముద్రగుప్తుని మైత్రిని ఆశించిరి. ఈ విజయ పరంపరలను సాధించి సముద్రగుప్తుడు అశ్వమేధమును ఒనర్చెను.

సముద్రగుప్తుని కుమారుడైన చంద్రగుప్తుడు - II [చూ. పు. 442] (క్రీ. శ. 375-413 ప.) మాళవ, సౌరాష్ట్రముల లోని శకులను నిర్మూలించి, సామ్రాజ్యమును విస్తరింపజేసెను. వాకాటక రాజవంశముతో వివాహసంబంధము ఒనర్చుకొని, దక్షిణాపథమును కూడ తన పలుకుబడిలోనికి తీసికొని రాగలిగెను. పశ్చిమోత్తర భూములకు అందుబాటులో ఉండునను ఆశయముతో, చంద్రగుప్తుడు - II రాజధానిని ఉజ్జయినికి మార్చెను. కాని, దీనివలన గుప్తసామ్రాజ్యమునకు కీడేగాని, మేలు చేకూరలేదు. విక్రమాదిత్య, శకారి అను బిరుదములు చంద్రగుప్తుడు శకులపై సాధించిన విజయమునకు నిదర్శనము. భారతదేశ చరిత్రలో శకాది విదేశీయులతో పోరాడిన రాజులలో పలువురు విక్రమాదిత్య బిరుదు ధరించిరి. చంద్రగుప్త విక్రమాదిత్యుడు సారస్వత పోషకుడు; ఆతని ఆస్థానములో నవరత్నములని ప్రసిద్ధి చెందిన మహాకవులు ఉండిరి. వీరిలో కాళిదాసు సుప్రసిద్ధుడు.

విక్రమాదిత్యుని పుత్రుడైన కుమారగుప్తుడు సామ్రాజ్యములో చెలరేగిన తిరుగుబాటులను అడచి శాంతిని నెలకొల్పి అశ్వమేధము ఒనర్చెను. ఈతని పరిపాలన చివరి రోజులలో మధ్య ఆసియా ప్రాంతములనుండి శ్వేత హూణులు భారతదేశముపై దండెత్తి వచ్చిరి. యువరాజైన స్కందగుప్తుడు వీరితో పోరాడి తరిమివేసెను. కాని, నానాటికి హూణుల దండయాత్రలు మితిమీరినవి. స్కందగుప్తుడు వీరిని అరికట్టుటకు ప్రయత్నించెను గాని, ప్రయోజనము లేక పోయెను. తోరమానుని నాయకత్వమున హూణులు వాయవ్యసరిహద్దులను ఆక్రమించి

తక్షశిలాది నగరములను ధ్వంసము ఒనర్చిరి. క్రమక్రమముగ మాళవమువరకును తోరమానుని అధికారము విస్తరించినది. హూణులతో గుప్తచక్రవర్తులు పోరాడుచున్న సమయములో వారి సామంతులు, రాష్ట్రపాలకులు స్వతంత్రులైరి. అంతఃకలహములకును, విదేశీయ దండయాత్రలకును గురియై గుప్తసామ్రాజ్యము విచ్ఛిన్నమైనది. భారతదేశ చరిత్రలో ఏకాధికార ప్రయత్నము మరొకమారు భగ్నమైనది.

స్వర్ణయుగము : గుప్తరాజుల పరిపాలనా కాలమును గ్రీస్ చరిత్రలోని పెరిక్లీస్ యుగముతో పోల్తురు. గుప్తులు ఉత్తరాపథమును ఒక ఏలుబడిలోనికి తెచ్చి, ఉదారము, ప్రజాహితమునైన పరిపాలనను ఏర్పరచిరి. విదేశీయ దండయాత్రల భయము తొలగి శాంతి భద్రతలు నెలకొన్నందున దేశము ఆర్థికముగ అభివృద్ధి చెందినది. వర్తకులు శ్రేణులుగ ఏర్పడి, దూరదేశములతో వాణిజ్యము ఒనర్చిరి. అసంఖ్యాకముగ లభించిన గుప్తరాజుల బంగారు నాణెములే దీనికి నిదర్శనము.

శాంతి - సౌభాగ్యములు లభించినందున భారతీయ సృజనాసామర్థ్యము బహుముఖముగ వికసింపసాగినది. గుప్తుల పోషణలోనే భక్తి ప్రధానమైన పౌరాణిక మతము ప్రచారములోనికి వచ్చినది. సముద్రగుప్త, కుమారగుప్తులు అశ్వమేధములు ఒనర్చినను వైదిక క్రతువులు ప్రజాదరణ కోల్పోయినవి. వ్రతములు, తీర్థాటనము, విగ్రహారాధన, పురాణశ్రవణము పౌరాణికమతములోని ముఖ్య లక్షణములు. నాటికి దేశములో స్థిరపడిపోయిన వివిధ విదేశ జాతులను హిందూసమాజములో జీర్ణమొనర్చుకొనుటయే ఈ పరిణామ ఉద్దేశ్యము. విదేశ జాతులు వేరు వేరు వర్ణములుగ హిందూసమాజమున చేర్చుకొనబడిరి. హిందూ సమాజము వర్ణవ్యవస్థపై వర్గీకృతమైనది. ఆ విధానమును సమర్థించుచు, మనుధర్మశాస్త్రము, పురాణములు, ఇతిహాసములు క్రోడీకరింపబడినవి. 'భగవద్గీత' హిందూమతమునకు ప్రామాణిక గ్రంథమైనది. అనగా పౌరాణిక హిందూమతము ఈ యుగముననే రూపొందినది.

హిందూమతముతో బాటు సంస్కృతమునకు విశేష ఆదరణ లభించినది. మహాకవి కాళిదాసు, విఖ్యాత నాటకకర్తయైన విశాఖదత్తుడు, అమరకోశకారుడైన అమరసింహుడు, ప్రాకృత గ్రంథకర్తయైన వసుబంధుడు ఈ కాలమువారే. ప్రపంచ కథాసాహిత్యమునకు ఒరవడి పెట్టిన 'హితోపదేశము' కూడ గుప్తయుగములోనే తయారైనది. సారస్వతముతో బాటు అనేక శాస్త్రములలో పరిశ్రమ జరిగినది. గణితశాస్త్రమున ఆర్యభటుడు [చూ. సం. 9 - పు. 152], ఖగోళ శాస్త్రమున వరాహమిహిరుడు, వైద్యమున సుశ్రుతుడు గ్రంథరచన జరిపిరి. వరాహమిహిరుని 'బృహత్సంహిత' [చూ. సం. 9 - పు. 497] ఒక విజ్ఞాన సర్వస్వము వంటిది. ఇక నాటి శిల్పకళ విదేశీయ ప్రభావమునుండి విముక్తిపొంది, భారతీయతను గ్రహించి, వికసించినది. కాని, గుప్తరాజుల దేవాలయములలో చాల భాగము హూణ, తురుష్క దండయాత్రలలో నష్టమైనవి.

గుప్తరాజులు హిందూమతాభిమానులే అయినను మత సహనము గలవారు. నాటికి జైన, బౌద్ధములు ఇంకను కొన్ని ప్రాంతములలో పలుకుబడి కలిగి ఉండెను. శాఖోపశాఖలుగా విస్తరించిన బౌద్ధమతమున సిద్ధాంతచర్చ విశేషముగ జరిగినది. నాటి బౌద్ధ దార్శనికులలో భావవివేక, దిఙ్నాగులు ప్రసిద్ధులు. భారతీయ తర్కశాస్త్రమునకు పితామహుడు దిఙ్నాగుడు. నలందా బౌద్ధ విశ్వవిద్యాలయము కుమారగుప్తుని కాలమున నిర్మింపబడినది.

గుప్తులపాలనలో దేశ సౌభాగ్యము, పాలకుల ఔదార్యము, ప్రజల నైతికప్రవృత్తి విదేశీయులను కూడ ముగ్ధులను కావించినది. ఈ అంశములనే చంద్రగుప్త విక్రమాదిత్యుని కాలమున భారతదేశమును దర్శించిన చీనా బౌద్ధయాత్రికుడు ఫాహియాన్ పేర్కొనెను. ఇంతటి సర్వతోముఖ వికాసమును సాధించినందుననే గుప్తయుగము స్వర్ణయుగముగ కీర్తింపబడుచున్నది.

దక్షిణాపథ రాజకీయములు : గుప్తరాజులకు సమకాలికులై వింధ్య దక్షిణ భాగమున వాకాటకులు సామ్రాజ్యమును స్థాపించి పాలించిరి. వీరిలోకెల్ల ఘనుడైన ప్రవరసేన - I (ర. క్రీ. శ. 280 - 340 ప.) విశాల రాజ్యమును జయించి నాలుగు అశ్వమేధములు ఒనర్చి, ప్రవీర, సమ్రాట్ బిరుదములు ధరించెను. ఈ వంశములోని రుద్రసేన - II నకు చంద్రగుప్త విక్రమాదిత్యుడు తన కుమార్తె ప్రభావతీగుప్తను ఇచ్చి బాంధవ్యమును నెలకొల్పుకొనెను. వాకాటకులు వైదిక మతాభిమానులు; ప్రాకృత-సంస్కృత భాషలను పోషించిరి. అజంతాగుహలలో కొన్ని గుహలు (సంఖ్యలు 13, 16, 17) వీరు తొలిపించినవే.

వాకాటకులకు సమకాలికులైన శాలంకాయనులు, వారి అనంతరము విష్ణుకుండినులు ఆంధ్రదేశమును ఏలిరి. విష్ణుకుండిన మాధవవర్మ వాకాటక రాకుమారిని పెండ్లాడెను. ఈతడే ఏకాదశాశ్వమేధ, రాజసూయాది వైదిక క్రతువులు ఒనర్చిన అతడు. వాకాటక, విష్ణుకుండిన వంశములు రెండును బాదామి చాళుక్యులచే నిర్మూలింపబడినవి.

కాంచీపురములో పల్లవులు విజృంభించి, కృష్ణకు దక్షిణమున సామ్రాజ్యమును నెలకొల్పిరి. శివస్కందవర్మ పల్లవ వంశస్థాపకుడు. సముద్రగుప్తుని దండయాత్ర కాలమున విష్ణుగోపుడను అతడు కంచిని ఏలుచుండెను. పల్లవులలో మహేంద్రవర్మ (600 - 630), ఆతని కుమారుడైన నరసింహవర్మ సుప్రసిద్ధులు. వీరు వైదిక మతాభిమానులు; సంస్కృత భాషను పోషించిరి. వీరి ఆదరణలో కాంచీపురము వైదిక విద్యానిలయమై 'దక్షిణకాశిగ' భారతీయులందరికి పుణ్యక్షేత్రమైనది. వీరు నెలకొల్పిన 'ఘటికా స్థానములు' అనబడు కళాశాలలు వైదికవిద్యా కేంద్రములు అయినవి. మామల్లాపుర (మహాబలిపుర) రాతి రథములు పల్లవ నిర్మాణములే. వైదిక ధర్మమును, సంస్కృతమును దక్షిణదేశమున వ్యాప్తిలోనికి తెచ్చి, తద్ద్వారా ఉత్తర, దక్షిణాపథముల మధ్య సాంస్కృతిక సమైక్యతను సాధించిన గౌరవము పల్లవులదే!

హర్ష సామ్రాజ్యము : హూణదండయాత్రలవలన గుప్త సామ్రాజ్యము విచ్ఛిన్నమై, పెక్కు చిన్నరాజ్యములు ఏర్పడినవి. మగధ, మాళవములలో గుప్తరాజులు, సౌరాష్ట్రమున మైత్రకులు, కన్యాకుబ్జమున మౌఖరివంశము, స్థానేశ్వరమున (పంజాబ్) పుష్యభూతివంశము వెలసినవి. బెంగాల్, బీహార్ ప్రాంతములలో శశాంకుడను ఆతడు రాజయ్యెను. ఈ రాజకీయ అనైక్యతను తొలగించి, ఏకచ్ఛత్రాధిపత్య సంప్రదాయమును పునరుద్ధరించుటకై పుష్యభూతి వంశస్థుడైన హర్షవర్ధనుడు ప్రయత్నించెను.

హర్షవర్ధనుని తండ్రి ప్రభాకరవర్ధనుడు; సోదరుడు రాజ్యవర్ధనుడు. వీరు ఉభయులు మరణించిన తరువాత క్రీ. శ. 606 లో హర్షుడు సింహాసనము ఎక్కెను. హర్షుని సోదరి రాజ్యశ్రీ మౌఖరివంశస్థుడైన గ్రహవర్మను పెండ్లాడినది. మాళవరాజులతో యుద్ధమున గ్రహవర్మ అంతకు పూర్వమే మరణించి ఉండెను. అందుచే హర్షుడు కన్యాకుబ్జ, స్థానేశ్వరరాజ్యములను కలపి, కన్యాకుబ్జమును రాజధానిగ చేసికొనెను. ఆ తరువాత మాళవ, సౌరాష్ట్ర, మగధ, వంగదేశములను, కళింగలో కొంతభాగమును జయించి సామ్రాజ్యమును స్థాపించెను. దక్షిణాపథమును కూడ జయించుటకు ప్రయత్నించెనుగాని, చాళుక్య చక్రవర్తియైన పులకేశి - II హర్షవర్ధనుని ఓడించి వెనుకకు మరలించెను. ఐక్య భారతమును సాధించు ప్రయత్నము మరొకమారు విఫలమైనది.

హర్షుడు ఉదార బుద్ధిగలిగిన ప్రభువు; ప్రజాహితపాలనలో, దానధర్మములలో అశోకుని మరపించెను. దేశాటనము ఒనర్చి ప్రజల కష్టసుఖములను స్వయముగ విచారించి, నేరస్థులను కఠినముగ శిక్షించెను. అయిదు సంవత్సరములకు ఒకమారు ప్రయాగలో సర్వస్వదాన మహావ్రతమును ఒనర్చినట్లు తెలియుచున్నది. శైవుడైనను బౌద్ధమతముపట్ల ఆదరము వహించి, కనూజ్‌లో ఒక పరిషత్తు సమావేశపరచి, దానికి చీనా బౌద్ధయాత్రికుడగు హుయాన్‌స్యాంగ్‌ను ఆహ్వానించి గౌరవించెను. సారస్వత పోషణలో గుప్తరాజుల స్వర్ణయుగ సంప్రదాయమునకు ఇతడు మెరుగు పెట్టెను. స్వయముగ మహాకవియై సంస్కృత భాషలో 'రత్నావళి', 'నాగానందము', 'ప్రియదర్శిక' అను నాటకములు రచించెను. 'కాదంబరి' ని రచించిన బాణుడు హర్షుని ఆస్థానకవి. 'బాణోచ్ఛిష్టం జగత్సర్వమ్' అనుమాట బాణునిపట్ల యథార్థము. మయూర, భర్తృహరి మహాకవులను కూడ హర్షుడు ఆదరించెను.

హర్షుని కాలమునాటికి నలందావిశ్వవిద్యాలయము చాల ప్రఖ్యాతి కాంచినది. దూరదేశములనుండి సైతము నలందాకు విద్యార్థులు వచ్చెడివారు. అచటి ఆచార్యులు పాండిత్యములో దిగ్దంతులు. నలందాలో 'ధర్మగంజ్' గ్రంథాలయములో అనేక శాస్త్రములపై వేలకొలది గ్రంథములు ఉండినట్లు తెలియుచున్నది. చీనాయాత్రికుడయిన హుయాన్‌స్యాంగ్ నలందాలో విద్యాభ్యాసము ఒనర్చి, కొంతకాలము ఆచార్యుడుగ ఉండి, దేశమున పర్యటించి, అనేక బౌద్ధమతగ్రంథములతో స్వదేశమునకు మరలెను. అతడు రచించిన 'సి - యూ - కీ' అను చైనీయ గ్రంథమునుండి నాటి భారతదేశ పరిస్థితులు తెలియుచున్నవి.

మధ్యయుగము : హర్షుని మరణముతో (క్రీ. శ. 647) భారతీయ చరిత్రలో ప్రాచీన యుగము అంతరించి, మధ్యయుగము ప్రారంభమైనది. నాటివరకు భారతదేశ రాజకీయ ఐక్యతకు జరిగిన ప్రయత్నములు విఫలమై, చిన్న రాజ్యములు అనేకము తలెత్తినవి. కాని, సాంస్కృతికముగ సమైక్యతా ప్రయత్నము కొంత సఫలమైనది. జైన, బౌద్ధ (మహాయాన) మతములలోని సారమును గ్రహించి, హిందూమతము వికసించుటయే గాక, దేశములో ఏకైక మతము కాసాగినది. బహుదేవతారాధన, సిద్ధాంత వైవిధ్యము, ఆచారములలో భిన్నత్వము, వర్ణవిభేదములు ఉన్నను, వేదములు, భగవద్గీత, ధర్మశాస్త్రములు హిందువులు అందరకు సమానములైనందున హిందూమతమునకు మౌలికమైన ఏకత్వము లభించినది.

ఇంచుమించు ఇదే సమయమున భారతదేశములో మహమ్మదీయులు ప్రవేశించిరి. మహమ్మదీయమతము లేదా

ఇస్లామ్ అరేబియాలో ఉదయించినది (క్రీ. శ. 7 వ శతాబ్ది). నూతనోత్సాహముతో తమ మతమును విస్తరింపజేయవలెనను కాంక్షతో, అరబ్బులు విదేశములపై దండెత్తి, మతవ్యాప్తికి పూనుకొనిరి. క్రీ. శ. 711 లో అరబ్బు సేనానియైన మహమ్మద్ ఖాశిమ్ దండెత్తివచ్చి, సింధు రాష్ట్రమును ఏలు దాహిర్ ను ఓడించి, సింధురాష్ట్రమును, పంజాబ్‌లో కొంత భాగమును ఆక్రమించి ముస్లిమ్ రాజ్యమును స్థాపించెను. క్రీ. శ. 10 వ శతాబ్దమున ఆఫ్ఘనిస్తానమునుండి తురుష్కులు దండెత్తి ఆక్రమించువరకును ఆ ప్రాంతములలో అరబ్బులపాలన జరిగినది. హిందూమతమును నాశనము ఒనర్చి ఇస్లామ్‌ను వ్యాపింపజేయుటయే ముస్లిమ్‌లకు తొలుత ప్రధాన లక్ష్యముగ ఉండినది. అందుచే హిందువులకును, మహమ్మదీయులకును ఎడతెగని పోరాటములు జరిగినవి. అయినను హిందూసంస్కృతిని రూపుమాపుట ముస్లిమ్‌లకు అసాధ్యమైనది. అందుచే క్రమముగ హిందూ - ముస్లిమ్ సామరస్యసాధనకు, సంస్కృతీ సమ్మేళనకు ప్రయత్నములు జరుగుట తదనంతర భారతీయ చరిత్రలో ఒక విశిష్ట లక్షణముగ పరిణమించినది.

రాజపుత్ర రాజ్యములు: హర్షవర్ధనుని మరణానంతరము (క్రీ. శ. 647) ఉత్తరాపథమున వేరు వేరు ప్రాంతములలో రాజపుత్ర రాజ్యములు వెలసినవి. రాజపుత్ర అను పేరే చాల విచిత్రమైనది. ఈ వంశములలోని రాజులు తాము ప్రాచీన సూర్య, చంద్ర వంశ క్షత్రియులమని వర్ణించుకొనిరి. వీరిలో కొందరిని 'అగ్నికుల' క్షత్రియ శాఖలని చందుకవి పేర్కొనెను. ఇటీవలి పరిశోధనలవలన హూణాది విదేశీయజాతులు భారతదేశమున స్థిరపడి స్థానికులతో కలసిపోయి, హిందూమతమును అనుసరించి, ఆయుధోపజీవులైనందున క్షత్రియులుగ పరిగణింపబడినట్లు తెలియుచున్నది. ఈ విధముగ ఏర్పడిన జాతి ప్రజలే రాజపుత్రులని వ్యవహరింపబడిరి.

రాజపుత్ర వంశములలో ప్రముఖతను ఆర్జించినవారు ప్రతిహారులు. వీరి రాజధాని కన్యాకుబ్జము. ప్రతిహారులలో వత్సరాజు (క్రీ శ. 783-815), మిహిరభోజుడు (836-885), మహేంద్రపాలుడు (893 - 907) ప్రసిద్ధులై సామ్రాజ్య స్థాపనకు ప్రయత్నించిరి.

ప్రతిహారుల కాలముననే పాలవంశస్థులు బెంగాల్, బీహార్ లను సమైక్యముచేసి, రాజ్యమును స్థాపించిరి. వీరు బౌద్ధమతాభిమానులు. విక్రమశిల, ఉద్దంతపుర విశ్వవిద్యాలయములను స్థాపించి పోషించిరి. వీరిలో ధర్మపాల, దేవపాల, విగ్రహపాలులు పేర్కొనదగినవారు.

పాల, ప్రతిహార రాజవంశములకు సమకాలీనులుగ, దక్షిణాపథమున మాన్యఖేటము రాజధానిగ రాష్ట్రకూటులు విజృంభించి, సాతవాహన సామ్రాజ్యమునకు దీటురాగల సామ్రాజ్యమును స్థాపించిరి. ఒకేకాలమున వెలసిన ప్రతిహార, పాల, రాష్ట్రకూట రాజవంశముల మధ్య భారతసామ్రాజ్య ఆధిపత్యమునకై పోటీ జరిగినది. రాష్ట్రకూట రాజులైన ధ్రువరాజు (క్రీ. శ. 780 - 793 ప.), ముమ్మడి గోవిందరాజులు (793 - 814 ప.) గంగానది మొదలు, కావేరినది వరకును విజయయాత్రలు జరిపిరి. కాని, ఈ సంఘర్షణలో మూడు సామ్రాజ్యములు బలహీనపడుట వినా శాశ్వతమైన ఫలితములు కలుగలేదు. బెంగాల్‌లో పాలవంశము నశించి, సేనవంశము విజృంభించినది; పశ్చిమ చాళుక్యులు రాష్ట్రకూటులను నిర్మూలించిరి. ప్రతిహార రాజ్యము విచ్ఛిన్నమై గుజరాత్‌లో చాళుక్యులు (సోలంకీలు), మాళవమున పరమారులు, అజ్మీర్ లో చౌహానులు, దాళహామున చేదివంశస్థులు, హస్తినాపుర ప్రాంతమున తోమరులు స్వతంత్ర రాజ్యములు స్థాపించిరి. ఇవిగాక, చిన్న చిన్న రాజపుత్ర రాజ్యములు అనేకములు బయలుదేరెను.

రాజపుత్రుల కాలపు పరిస్థితులు: రాజపుత్రులు హిందూ మతాభిమానులు. శంకర, రామానుజ, మధ్వాచార్యులు ముువ్వురు వీరి పరిపాలనాకాలముననే జీవించి, హిందూ మతమునకు క్రొత్త చైతన్యమును కలిగించిరి. కాని, హిందువులలో సిద్ధాంత విభేదములకు తోడు బహుదేవతారాధన మితిమీరినది. వర్ణములు శాఖోపశాఖలై సాంఘిక ఐక్యతకు భంగము కలిగింపసాగినవి. రాజపుత్రులు సంస్కృత సారస్వతమును, శిల్పకళను పోషించిరి. కనూజ్, ఉజ్జయిని, ధారానగరము, నవద్వీపము (బెంగాల్) గొప్ప విద్యాకేంద్రములు అయినవి. భవభూతి, సోమదేవుడు, కల్హణుడు, జయదేవుడు నాటి కవులలో సుప్రసిద్ధులు. పరమారవంశస్థుడైన భోజరాజు మహాకవిరాజు. మధుర, సోమనాథపురము, ఖజూరాహో, భువనేశ్వర్ దేవాలయములు ఈ కాలపు నిర్మాణములే. సారస్వతమును, లలితకళలను పోషించుటలో రాజపుత్రులు మరొక స్వర్ణయుగమును సృష్టించిరి. కాని, వారిలో దేశమును సమైక్యము ఒనర్చి సామ్రాజ్య సంప్రదాయములను పునరుద్ధరింపగల సమర్థులు ఉదయింపలేదు. శౌర్య, ధైర్యములకును, యుద్ధ ప్రయత్నములకును రాజపుత్రులు పెట్టినది పేరు. రాజపుత్ర స్త్రీలు సైతము యుద్ధములో, పరిపాలనలో సమర్థలే. కాని, రాజపుత్రవంశములు సర్వదా అంతఃకలహములలో మునిగి తేలినవి. వారిలో రాజ

భక్తియేగాని దేశభక్తి లేక పోయినది. ఈ గుణముల వలన సమైక్య భారతజాతీయభావోదయమునకు రాజపుత్ర యుగము ఆటంకమైనది. అందుచేతనే రాజపుత్ర రాజ్యములు ఒకదానివెంబడి మరొకటి తురుష్కుల పాదాక్రాంతములై క్రీ. శ. 1206 లో ఉత్తర దేశమున ఢిల్లీలో మహమ్మదీయ రాజ్యస్థాపనకు అవకాశము కలిగినది.

దాక్షిణాత్య రాజకీయములు : దక్షిణాపథమున వాకాటకుల తరువాత చాళుక్యులు సామ్రాజ్యాధిపతులైరి. వీరి రాజధాని బాదామి. పులకేశి - II కాలమున (క్రీ. శ. 610 - 642) బాదామి సామ్రాజ్యము మహోన్నత దశను అందినది. ఆంధ్రదేశమున - తీరప్రాంతములో - వేంగి రాజధానిగా తూర్పు చాళుక్య రాజ్యమును స్థాపించి (క్రీ. శ. 624), పులకేశియే తన తమ్ముడైన కుబ్జవిష్ణువర్ధనుని అందు నిలిపెను. వేంగిచాళుక్యులు సుమారు ఐదు శతాబ్దముల కాలము రాజ్యపాలన చేసిరి. పులకేశి - II అనంతరము బాదామిచాళుక్యుల బలము క్షీణించినందున, రాష్ట్రకూటులు రాజ్యమును ఆక్రమించి రెండు శతాబ్దములు పాలించిరి. రాష్ట్రకూటులను తొలగించి పదవ శతాబ్దము చివర తిరిగి చాళుక్యులు అధికారము వహించిరి. వీరి రాజధాని కల్యాణి. కల్యాణిచాళుక్యులలో విక్రమాదిత్యుడు - VI (క్రీ. శ. 1076 - 1126) గంగా - కావేరీ నదుల మధ్య విజయ యాత్రలు జరిపి చాళుక్యుల అధికారమును విస్తరింప జేసెను.

కాంచీపురమున పల్లవరాజవంశమును తుదముట్టించి (క్రీ. శ. 839) చోళులు సామ్రాజ్యస్థాపకులై తంజావూరును రాజధానిగా చేసికొనిరి. వీరిలో రాజరాజ చోళుడు (క్రీ. శ. 985 - 1018), రాజేంద్రచోళుడు (క్రీ. శ. 1018 - 1044) సుప్రసిద్ధులు. రాజేంద్రుడు గంగానది వరకును దండయాత్రలు జరుపుటే గాక, నౌకాబలముతో దండెత్తి వెళ్లి, మలయాలోని శైలేంద్రవంశము పరిపాలించుచున్న శ్రీవిజయరాజ్యమును ఆక్రమించెను. విదేశములపై దండెత్తి జయించిన ఏకైకభారతీయ చక్రవర్తి రాజేంద్రుడే అని చెప్పవచ్చును. తంజావూరు చోళులకును, కల్యాణి చాళుక్యులకును ఎడతెగని పోరాటములు జరిగినవి. ఈ యుద్ధములలో ఉభయులు బలహీనులై, వారి సామ్రాజ్యములు విచ్ఛిన్నములైనవి. వీని శిథిలములలోనుండి మహారాష్ట్రమున దేవగిరి రాజధానిగ యాదవులు, ఆంధ్రదేశమున ఓరుగల్లులో కాకతీయులు, కన్నడ దేశమున ద్వారసముద్రములో హొయసలవంశము, తమిళదేశమున మధురలో పాండ్యులు రాజ్యములు స్థాపించిరి.

ఈ రాజ్యములు సైతము పరస్పరము యుద్ధములలో మునిగి తేలసాగెను. అయినను వీరు దేశభాషలను పోషించి, స్థానికమైన సంస్కృతులకు రూపురేఖలు దిద్దిరి. వీరి పాలనలో దేశము సుభిక్షమై, ప్రజలు సుఖజీవితము గడుపుచుండిరని క్రీ. శ. 13 వ శతాబ్దమున దక్షిణదేశమును దర్శించిన మార్కో పోలో [చూ. పు. 748] అను వెనిస్ యాత్రికుడు వర్ణించెను.

ఢిల్లీ సుల్తానుల సామ్రాజ్యము : 1206 - 1526 మధ్య కాలమున భారతదేశమున వెలసిన సామ్రాజ్యములలో ఢిల్లీ సుల్తాన్ల [చూ. పు. 515] సామ్రాజ్యము ముఖ్యమైనది. ఇది చాలకాలము ఉత్తరదేశమునను, కొంతకాలము దక్షిణదేశమునందును విలసిల్లినది. దీని చరిత్రయందు ప్రారంభము, పెరుగుదల, పతనములకు సంబంధించిన మూడు దశలు కనబడును. ఘోరీ, బానిసవంశములు ప్రారంభదశతోను, ఖిల్జీ, తుఘ్లుక్ వంశములు తర్వాతి దశతోను, సయ్యద్, లోడీవంశములు పతనదశతోను సంబంధము గలిగి ఉన్నవి. ప్రతి వంశమునందును చాలమంది సుల్తానులు కలరు. కాని, వారిలో కొద్దిమంది మాత్రమే ప్రత్యేకముగ పేర్కొనదగినవారు. కుతుబుద్దీన్ [చూ. పు. 391] ఢిల్లీ సామ్రాజ్య స్థాపకుడు; బాల్బన్ దాని రక్షకుడు; అల్లా ఉద్దీన్ ఖిల్జీ [చూ. పు. 275] దానిని దక్షిణదేశమునందు కూడ వ్యాపింపజేసెను. మహమ్మద్ తుఘ్లుక్ [చూ. పు. 250] సామ్రాజ్య విస్తరణకు ప్రయత్నము చేసెను, ఫిరోజ్ తుఘ్లుక్ [చూ. పు. 250] సామ్రాజ్యమునకు శాంతి, సుస్థిరతలను సమకూర్చెను. ఇబ్రహీమ్ లోడీ సామ్రాజ్యపతనమునకు కారకుడు. ఈ సుల్తాన్ల కార్యకలాపములను దృష్టిలో ఉంచుకొని సామ్రాజ్యపు చరిత్రను గమనింపవచ్చును.

ఢిల్లీ సుల్తానుల సామ్రాజ్య స్థాపనకు పూర్వము ఉత్తర హిందూదేశమునగల రాజకీయ పరిస్థితిని గుర్తించుట యుక్తము. ఇస్లామ్‌మతమును స్వీకరించిన అరబ్బులు 711 న సింధుప్రాంతమును జయించిరిగదా! ఇతర ప్రాంతములకు వ్యాపింపలేక వారు దానిని తమ అధీనమునందు ఉంచుకొనిరి. 11 వ శతాబ్ది ప్రారంభమున గజనీ పాలకుడైన మహమూద్ ఉత్తర హిందూదేశముపై అనేక సార్లు దాడిచేసి, ముఖ్యులైన రాజపుత్ర ప్రభువులను ఓడించి, ముఖ్యమైన నగరములను, దేవాలయములను కొల్లగొట్టెను. ఇట్లు రెండుసార్లు పశ్చిమదిశనుండి దండెత్తి వచ్చిన శత్రువులవలన భారతదేశమందలి ప్రభువులు (ముఖ్యముగ రాజపుత్రులు) పరాజయము పొందిరి. అయినను వీరికి వివేకోదయము కలుగలేదు. పూర్వమునందు

వలెనే అంతఃకలహములలో చిక్కుకొని, ఐకమత్యము లేక పరదేశ శత్రువుచే పరాభవింపబడుటకు సిద్ధపడి ఉండిరి.

ఢిల్లీ సుల్తానుల సామ్రాజ్య ప్రారంభ దశ : అఫ్ఘనిస్తాన్ నందలి ఘోరీ రాజ్యపాలకుడయిన మహమ్మద్ క్రమముగ తన రాజ్యమును విస్తరింపచేసి, గజనీ రాజ్యమును ఆక్రమించి, హిందూదేశమునందు గజనీవంశీకులకు లోబడి ఉన్న ప్రాంతమును కలుపుకొనదలచెను. హిందూదేశమునందు ఉన్న అనర్థదాయకమైన రాజకీయ పరిస్థితి అతనికి అనుకూలమయ్యెను [చూ. ఘోరీ, మహమ్మద్ - పు. 441].

మహమ్మద్ భారతదేశమునందు మొదట ముల్తాన్ నగరమును లోబర్చుకొని, దాని పరిసరప్రాంతమును ముస్లిమ్‌పాలకులనుండి వశపరచుకొనెను. తరువాత లాహోర్‌ను పట్టుకొని పంజాబ్‌రాజ్యమును గజనీ వంశీకులనుండి పొందెను. ఈ ఆక్రమితప్రదేశము ఢిల్లీవైపునకు సాగుటకు అతనికి సహాయపడినది. 1191 న ఢిల్లీ సమీపమున గల స్థానేశ్వరమువద్ద ఘోరీ పాలకునకు, ఢిల్లీ రాజ్యపాలకుడు అయిన పృథ్వీరాజు [చూ: పు. 579] నకు యుద్ధము జరిగెను. ఇందు రాజపుత్రవీరులు పృథ్వీరాజు నాయకత్వమును అంగీకరించి, ఐకమత్యముతో పోరాడి, పరదేశ శత్రువును ఓడించిరి. అయితే, వీరి ఐకమత్యము వెంటనే మాయమైనది. మరుసటి సంవత్సరము అతడు మరల దండెత్తి వచ్చినపుడు రాజపుత్రరాజుల మధ్య సహకారము లేకపోయినది. కనోజ్ పాలకుడయిన జయచంద్రుడు పృథ్వీరాజుతో చేయికలుపలేదు. పృథ్వీరాజు పరాజితుడై, హతమాయెను. ఢిల్లీరాజ్యమును ఘోరీ ఆక్రమించుకొనెను. ఇది ఉత్తర హిందూస్థానమందలి ఇతర రాజ్యములను అతడు లోబర్చుకొనుటకు దారితీసినది. తరువాత జయచంద్రుడు కూడ ఓడింపబడి, కనోజ్ రాజ్యము ఆక్రమింపబడినది. ఘోరీక్రింద సేనానిగ ఉన్న కుతుబుద్దీన్ మీరట్, అజ్మీర్ మొదలగు కోటలను, గుజరాత్ రాజ్యమును లోబర్చుకొనెను. కుతుబుద్దీన్ అనుచరుడు బీహార్, బెంగాల్ ప్రాంతములను జయించెను. ఈ విధముగ ఉత్తర భారతదేశమునందలి ముఖ్యమైన రాజ్యములు ఘోరీకి లోబడినవి. 1206 న ఘోరీ మహమ్మద్ మరణించెను. అతనికి ప్రతినిధిగా వ్యవహరించుచున్న కుతుబుద్దీన్ హిందూ దేశమున గల ముస్లిమ్ సామ్రాజ్యమునకు ప్రభువుగా అంగీకరింపబడెను. మొదటి సుల్తాన్‌గ అతడు ఢిల్లీ సింహాసనము ఎక్కి, సామ్రాజ్యపాలనను ప్రారంభించెను. అతడు బాల్యమున బానిసగ ఉండుట వలన అతని వంశమునకు బానిసవంశమని పేరు వచ్చినది. ఈ వంశమునకు చెందిన ఇల్టుమిష్ [చూ. పు. 328] సుల్తాన్ పంజాబ్, సింధు, బెంగాల్ రాష్ట్రములను ముస్లిమ్ పాలకులనుండి, గ్వాలియర్, మాల్వా మొదలగు రాజ్యములను రాజపుత్ర వీరులనుండి వశపర్చుకొని, ఉత్తర భారతమునందు అంతట రాజ్యాధికారము నిరాటంకముగ చలాయించెను. తరువాతి సుల్తాను అయిన బాల్బన్ మంగోల్‌ల దండయాత్రలను భగ్నముచేసి, శాంతి భద్రతలను స్థాపించి, సుల్తాను పదవిని సుస్థిరముచేసి, సామ్రాజ్యమును సంరక్షించెను.

బానిసవంశపాలకులలో ఒక స్త్రీ కూడ ఉండుట గమనింపదగిన విశేషము. ఈమె సుల్తానా రజియా (1236 - 39 ప.). పుట్టుకవలన స్త్రీయైనను పాలనా దక్షత యందు పురుషులకు తీసిపోని విధమున వర్తించిన అసాధారణ వ్యక్తి.

బాల్బన్ తరువాత బానిస వంశము క్షీణించి, 1290 న అంతమొందినది [చూ. బానిసరాజవంశము - పు. 646].

ఢిల్లీ సుల్తానులు - దక్షిణ దేశము : 1290 యందు ఢిల్లీ సింహాసనమునుండి బానిసవంశములో ఆఖరిపాలకుని తొలగించి జలాలుద్దీన్ ఖిల్జీ [చూ. పు. 418] ఆ సింహాసనమును ఆక్రమించి, ఆరుసంవత్సరములు పాలించెను. అతని తర్వాత సింహాసనము ఎక్కిన అల్లా ఉద్దీన్ ఖిల్జీ అతి సమర్థుడు, ఆశాపరుడు, అవినీతిపరుడు కూడ.

అల్లా ఉద్దీన్ పాలనాకాలమున (1296 - 1315) ఢిల్లీ సామ్రాజ్య చరిత్రలో నూతన అధ్యాయము ప్రారంభమైనది. అనగా అంతవరకు వింధ్యపర్వతములకు ఉత్తరమున ఉన్న దేశమునందు మాత్రమే ఉండిన సామ్రాజ్యము వానికి దక్షిణమున గల దేశమునందు కూడ వ్యాపించినది. ఇట్లు సామ్రాజ్యమును వ్యాపింపజేసిన కీర్తి అల్లా ఉద్దీన్‌కే చెందును.

నాటి దక్షిణదేశమునందలి రాజకీయ పరిస్థితిని గురించి ఇట కొంత చెప్పవలసి ఉన్నది. అచట ఆ కాలమున గల ముఖ్యమైన రాజ్యములు నాలుగు. యాదవవంశ రాజులచే పాలింపబడు దేవగిరిరాజ్యము, కాకతీయ ప్రభువులు పాలించు ఓరుగల్లురాజ్యము, హొయసల వంశమునకు సంబంధించిన ద్వారసముద్రపురాజ్యము, పాండ్యరాజులు ఏలిన మధుర రాజ్యము. ఈ నాలుగు రాజ్యముల మధ్య పోరు జరుగుచుండెడిది. ఇవి అన్నియు దక్షిణదేశమున ఉండి హిందూప్రభువులచే పాలింపబడుచున్నను, ఉత్తరదేశమునుండి దండెత్తివచ్చిన ముస్లిమ్‌లను ఎదుర్కొనుటకు తగిన ఐకమత్యమును సాధించలేక పోయినవి. అందుకు ఫలితముగ అన్నియు శత్రువుచేత పరాజయము పొంది, స్వాతంత్ర్యమును కోల్పోయినవి.

ఉత్తర దేశమున జరిగినట్లే, దక్షిణదేశమున కూడ అత్యవసర పరిస్థితిలో సైతము అవసరమైన వివేకము, ఐక్యమత్యము ప్రభువులకు లేనందువలన దేశము అధోగతి పాలయినదని గ్రహింపదగును.

అల్లా ఉద్దీన్ [చూ. పు. 275] సింహాసనము ఎక్కినది మొదలు చరమదశవరకు యుద్ధములలో మునిగి తేలు చుండెను. మొదటి సంవత్సరములో అతడు మంగోల్ దండయాత్రల బెడదను తట్టుకొనవలసి వచ్చెను. కష్ట-నష్టములకు ఓర్చి, శక్తి - సామర్థ్యములను వినియోగించి, మొత్తము మీద మంగోల్‌లు తన రాజ్యమును నాశనము చేయకుండ తప్పించుకొన గలిగెను. ఒకవంక పరదేశ శత్రువులయిన మంగోల్‌లను పారదోలుచు, మరొకవంక వీలుచేసుకొని దేశమధ్యమున గల రాజపుత్ర స్థానము నందలి రాజులను జయించుచుండెను. గుజరాత్ రాజ్యము, రాజపుత్రస్థానమునందలి రణథంబోర్, చితోర్ దుర్గ ములు, మాల్వా ప్రాంతము అతనికి లోబడినవి. ఇందుకు ఫలితముగ ఉత్తరహిందూదేశమున అతనికి ఏకచ్ఛత్రాధి పత్యము లభించినది. అనంతరము అల్లా ఉద్దీన్ తన అధికారమును దక్షిణదేశమునందు కూడ విస్తరింప జేయుటకై తనకు నమ్మినబంటు, సమర్థుడు, సేనాని అయిన మాలిక్ కాఫూర్ [చూ.] ను అందుకు నియమించెను. కాఫూర్ దేవగిరి, ఓరుగల్లు, మధుర రాజులను ఓడించి, వారికడ కప్పము వసూలుచేయుటయేగాక మధురలో ముస్లిమ్ ఉద్యోగిని నియమించెను. ఈ సమయమున అతడు రామేశ్వరము వరకు సాగిపోయి అచటి దేవాలయమును కొల్లగొట్టెనని అందురు.

ఈ విజయముల వలన అల్లా ఉద్దీన్ సామ్రాజ్యము అతి విశాలమైనది ; దాదాపుగ హిందూదేశమునంతను ఆక్ర మించినది. అయితే, అది త్వరలోనే విచ్ఛిన్నమైనది. రాజ పుత్ర స్థానమున రాజపుత్రులు, దక్కన్‌నందు హిందువులు తమ స్వాతంత్ర్యమును తిరిగి సంపాదించుకొనిరి. అల్లా ఉద్దీన్ 1315 న మరణించెను.

ఇతడు అసాధారణమైన యోధుడేగాక, మెచ్చదగిన పాలనాదక్షతగల పరిపాలకుడు కూడ. ఇతని సంస్కర ణలు కొన్ని తర్వాతి కాలపు ప్రభువులచే అనుసరింపబడినవి. అయితే, ప్రజలను భయముతో లొంగదీయుటేగాని, నయ ముతో వారిని రంజింపచేయలేక పోవుట ఇతనియందు కానవగు ముఖ్యలోపము. ఇతడు శక్తిసామర్థ్యములు గల వాడేగాని శీలసంపదగలవాడు కాడు.

అల్లా ఉద్దీన్ మరణానంతరము ఘియాజుద్దీన్ తుఘ్లుక్ సింహాసనమును ఆక్రమించి ఖిల్జీ వంశపాలనను అంత మొందించి, తుఘ్లుక్ వంశపాలనను ప్రారంభించెను [చూ. ఖిల్జీవంశము - పు. 418].

తుఘ్లుక్ వంశపాలనను ఢిల్లీ సామ్రాజ్యమున స్థాపించిన ఘియాజుద్దీన్ సుల్తాన్ అయిదు సంవత్సరములు మాత్రమే (1320 - 1325) పాలించి మరణించెను. ఈ కొద్ది కాలములో దక్కన్‌నందు ఓరుగల్లు రాజ్యము జయింపబడినది. బెంగాల్ ప్రాంతమంతయు తుఘ్లుక్ సామ్రాజ్యములో చేర్చబడినది.

ఘియాజుద్దీన్ తరువాత సింహాసనమును అధిష్ఠించిన మహమ్మద్ బిన్ తుఘ్లుక్ విచిత్రమైన వ్యక్తి. ఇతడు మహామేధావి. అసామాన్యమైన పాండిత్యము, ప్రజ్ఞ గల వాడు. కాని, రాజకీయవివేకము, లౌక్యము, దూరదృష్టి లోపించుటవలన పాలకుడుగ పతనము పొందెను. ప్రభు వుకు, ప్రజలకు మధ్య సహకారము లేక ఇరుపక్షములవారు కష్టనష్టముల పాలయిరి. అందువలన సామ్రాజ్యము కూడ సంక్షోభమునకు గురియైనది.

మహమ్మద్ ఆశయములు ఆక్షేపింపదగినవి కావు. కాని, వానిని ఆచరణలో పెట్టు విధానము పెడదారి పట్టినది. తన సామ్రాజ్యము ఒక వైపున మంగోల్‌ల దండయాత్రల వలనను, మరొక వైపున సామంతపాలకుల తిరుగుబాటుల వలనను కల్లోలపడుచుండగ, తను వానిని ఎదుర్కొనుటకు శక్తినంతను వినియోగింపవలసి ఉండెను. అట్టి సమయ మున దూరమున గల రాజ్యములను జయింపబూనెను. దేశము వెలుపల హిమాలయ పర్వతములందున్న కారా జల్ అను రాజ్యమును, మధ్య ఆసియా ప్రాంతమున గల ఖొరాసాన్ రాజ్యమును జయించుటకు సన్నాహము చేసెను. అయితే, అత్యాశచే ప్రారంభింపబడిన ఈ ప్రయత్న ములు విఫలమే అయినవి. సైనికముగ, ఆర్థికముగ, రాజ కీయముగ సుల్తానుకు చాల నష్టము కలిగినది.

ఇక పాలనాపద్ధతియందు ఇతడు చేసిన సంస్కరణలు కూడ సదుద్దేశముతో చేయబడినవే. రాజధానీ నగరమును ఢిల్లీనుండి దౌలతాబాద్‌కు మార్పుచేసి, అతడు మంగోల్‌ల బెడదనుండి భద్రముగ ఉండు స్థానమున, తన సామ్రాజ్య మునకు వీలయినంతవరకు కేంద్రముగ ఉండు స్థలమున తన నూతన రాజధానిని నెలకొల్ప తలచెను. గంగా-యమునా నదీ మధ్యదేశమున భూమి శిస్తును పెంచి తన ధనాగారమందలి లోటును భర్తీచేయ సంకల్పించెను. రాగి నాణెములను చలామణిలో ప్రవేశపెట్టి ద్రవ్యవ్యవస్థను వృద్ధిచేయ బూనెను. కాని, అవి సఫలమగుటకు అవసర మయిన జాగ్రత తీసికొననందువలన అవి విఫలమైనవి. పరిపాలన తారుమారు అయినది. అశాంతి, అసంతృప్తి చెలరేగినవి. రాజ్యము కల్లోలమైనది.

ఇటువంటి పరిస్థితిలో సామ్రాజ్యమున తిరుగుబాట్లు జరిగినవి. దక్షిణదేశ తూర్పు తీరమున మాబారు అనబడు ప్రాంతము, ఉత్తరమున బెంగాల్ సుల్తాను అధికారమును ధిక్కరించినవి. వీనిలో ముఖ్యమైనవి దక్కన్‌నందు జరిగినవి. అచట హిందువుల ప్రతిఘటనోద్యమ ఫలితముగ తుంగభద్ర నదీతీరమున విజయనగర రాజ్యస్థాపన జరిగినది. తదుపరి ఈ రాజ్యమునకు ఉత్తరదిశన మహమ్మదీయులచే బహ్మనీ రాజ్యము నెలకొల్పబడినది. చివరకు 1351 న సింధుప్రాంతమున ఒక తిరుగుబాటుదారును వెంబడించి మహమ్మద్ తుఘ్లుక్ మరణించెను. ఇతని కాలమున ఢిల్లీ సామ్రాజ్యము దక్షిణదేశమున క్షీణించినది [చూ. తుఘ్లుక్ వంశము - పు. 519].

ఢిల్లీ సుల్తాన్‌ల క్షీణదశ : తరువాత ఢిల్లీ సుల్తాన్ అయిన ఫిరోజ్ తుఘ్లుక్ (1351 - 1388 ప.) సామ్రాజ్యమును విస్తరించుటయందు ఆసక్తిగాని, అందుకు తగిన శక్తినిగాని కలవాడుకాడు. దక్షిణదేశమునందు స్వతంత్రమును సంపాదించుకున్న రాజ్యములను జయించుటకు ప్రయత్నింపలేదు. ఒరిస్సాయందు, హిమాలయప్రాంతమునందు ఇతడు విజయము సాధించెను గాని, అవి సామ్రాజ్యవిస్తరణకు తోడ్పడలేదనే చెప్పవచ్చును. అయితే, తనకు మిగిలి ఉన్న రాజ్యమును మాత్రము ఇతడు చక్కగా పాలించెను. ఇతని పరిపాలనవలన ప్రజలకు శాంతి, సుస్థిరత, సౌభాగ్యము లభించినవి. వారు సుపరిపాలనను అనుభవింపగలిగిరి.

ఫిరోజ్ తుఘ్లుక్ మరణించిన తరువాత తుఘ్లుక్ వంశమున కలతలు బయలుదేరి సుల్తాన్ పదవి బలహీనమైనది. మహమ్మద్ షా పాలనా కాలమున సామ్రాజ్యమునందలి హిందూరాజులు, ముస్లిమ్‌లయిన రాష్ట్ర పాలకులు స్వతంత్రులు అయిరి. క్షీణదశలో ఉన్న సామ్రాజ్యముపై తైమూర్ [చూ. పు. 521] దండయాత్ర జరిగెను.

తైమూర్ మధ్య ఆసియాయందలి సమర్కండ్ రాజ్య పాలకుడు. అతడు యోధుడు ; విజయకాంక్ష గలవాడు. రాజ్య విస్తరణయందు అమితమైన ఆసక్తిగలవాడు. ఇస్లామ్‌మతమును హిందూదేశమున విస్తరింపచేయు మిషతో దండయాత్ర సాగించి, దేశమందలి ధనమును పోగుచేసికొన సమకట్టెను. 1398 న దేశములోనికి చొరబడి, ఢిల్లీ నగరమును నాశనముచేసి, సుల్తాన్ సామ్రాజ్యమును చిందరవందరచేసి, ధన రాశులతో వెడలిపోయెను. ఇతని దాడివలన జరిగిన సంక్షోభములో గుజరాత్, మాల్వా, జౌన్‌పూర్ ప్రాంతములు సామ్రాజ్యమునుండి విడిపోయి, దానిని మరింత బలహీనము చేసినవి. తుఘ్లుక్ వంశము త్వరలోనే అంతమయినది.

తుఘ్లుక్ వంశమునందలి ఆఖరి సుల్తాను 1414 న మరణించగా అతని సింహాసనమును సయ్యద్ వంశము వారు ఆక్రమించి, చాల సంకుచితమైన ఢిల్లీ సామ్రాజ్యమును 1451 వరకు పాలించిరి [చూ. ఢిల్లీసుల్తానులు - పు. 515].

తరువాత, ఈ నామమాత్రముగ ఉన్న సామ్రాజ్యమును ఏలినవారు లోడీ వంశీయులు. వీరు ముగ్గురు. 1451 నుండి 1526 వరకు వీరి పాలన సాగినది. వీరిలో ఆఖరువాడైన ఇబ్రహీమ్‌లోడీ ఢిల్లీ సుల్తానులు అందరిలో కడపటివాడు. ఇతనికి శక్తియుక్తులు లేవు. ఇతనిపట్ల ప్రభుత్వోద్యోగులకుగాని, ప్రజలకుగాని భయభక్తులు లేవు. ఇటువంటి శక్తిహీనుని మొగల్ యోధుడైన బాబర్ మొదట పానిపట్టు యుద్ధమున ఓడించి, ఢిల్లీ సుల్తాను సామ్రాజ్యమును అంతమొందించెను [చూ. ఢిల్లీసుల్తానులు - పు. 515].

ఇపుడు ఢిల్లీ సుల్తానుల సామ్రాజ్యము పతనమొందుటకు సంబంధించిన ముఖ్య కారణములు గమనింపదగినవి. సుల్తానుల అశక్తత, సామంతుల అవిధేయత, సైన్యమునందలి శక్తిహీనత, ప్రభుత్వోద్యోగుల అవినీతి, ప్రజాబాహుళ్యమునకు పట్టిన దుర్గతి సామ్రాజ్యమును ఆంతరంగికముగ బలహీనమొనర్చినవి. ఇటువంటిదానిపై తైమూర్, బాబర్‌లు దాడిచేసి, దాని పతనమునకు కారకులయిరి.

దక్షిణాపథము-ముస్లిమ్ వ్యాప్తి: పదమూడవ శతాబ్దము చివరకు ఉత్తరాపథమంతయు తురుష్కుల పాదాక్రాంతమైనది. ఉత్తరదేశ చక్రవర్తులు అందరివలెనే, ఢిల్లీ సుల్తానులు సైతము దక్షిణాపథమును జయించి, భారతదేశముపై ఇస్లామ్ ఏకచ్ఛత్రాధిపత్యమును స్థాపింప సంకల్పించిరి. దాక్షిణాత్యరాజ్యముల ఐశ్వర్యమును గురించిన వార్తలు వారి నోరూరించి దండయాత్రలకు పురికొల్పినవి.

జలాలుద్దీన్ ఖిల్జీ సుల్తాను కాలమున అతని అల్లుడైన అల్లా ఉద్దీన్ దేవగిరి రాజ్యముపై దండెత్తి (1294), యాదవ రామచంద్రుని ఓడించి, ఎల్లిచ్‌పూర్ ప్రాంతమును ఢిల్లీ సామ్రాజ్యములో కలిపెను. ఢిల్లీసామ్రాజ్యమును ఆక్రమించిన తరువాత అల్లా ఉద్దీన్ తన సేనాపతియైన మాలిక్ కాఫూర్‌ను 1310 లో దక్షిణదేశ రాజ్యములపైకి పంపెను. యాదవరామచంద్రుడు, కాకతీయ ప్రతాపరుద్రుడు, హోయసల బల్లాలుడు, సుందరపాండ్యుడు ఓడిపోయి కాఫూర్‌కు కప్పము చెల్లించిరి. తరువాత అనతికాలమునకే యాదవరాజ్యము ఢిల్లీ సామ్రాజ్యమున కలిసిపోయెను (1312) [చూ. యాదవులు].

తుఘ్లుక్ వంశస్థాపకుడైన ఘియాజుద్దీన్ కాలమున యువరాజైన జునాఖాన్ ఓరుగల్లుపై రెండుమార్లు

దండెత్తెను. మొదటిమారు ప్రతాపరుద్రునిచే ఓడింపబడి పారిపోయెను. కాని, రెండవమారు (1323) ప్రతాపరుద్రుని బందీగా పట్టుకొని కాకతీయరాజ్యమును ఢిల్లీ సామ్రాజ్యములో చేర్చెను. జునాఖాన్ 1325 లో మహమ్మద్ బీన్ తుఘ్లుక్ అనుపేర ఢిల్లీ సింహాసనము ఎక్కి, 1327 లో మరొకమారు దక్షిణదేశ దండయాత్ర జరిపి, కంపిలి రాజ్యమును ఏలు కంపిలదేవుని ఓడించి, కంపిలి, మధుర, ఓరుగల్లులలో ముస్లిమ్‌పరిపాలకులను నియమించెను. ఇంచుమించుగా దక్షిణాపథమంతయు ముస్లిమ్‌ల పాదాక్రాంతమైనది.

విజయనగర సామ్రాజ్యము : దక్షిణదేశమున ముస్లిమ్ పరిపాలకులు హిందువులపై అనేక అత్యాచారములకు ఒడిగట్టిరి. హిందూ దేవాలయములను నేలమట్టము చేసిరి. రైతులపై, వర్తకులపై విపరీతమైన పన్నులు విధించిరి. ఇట్టి దురాగతములను సహింపక, హిందువులు ముస్లిమ్ పాలనను తుదముట్టించు ఆశయముతో స్వాతంత్ర్యోద్యమము సాగించిరి. ఈ ఉద్యమమును నడిపినవారిలో అరవీటి సోమదేవరాయలు, ముసునూరి ప్రోలయనాయకుడు, హొయసల వీరబల్లాలుడు ప్రసిద్ధులు. సోమదేవరాయలు కంపిలినుండి తురకప్రభువును తరిమివేసెను. ఈ స్వాతంత్ర్య ఉద్యమమును అణచి, ఢిల్లీ అధికారమును దక్షిణాపథమున పునరుద్ధరించుటకై మహమ్మద్ బీన్ తుఘ్లుక్ తన ప్రతినిధులుగ హరిహరరాయలు, బుక్కరాయలు అను సోదరులను పంపెను. వీరు తెలుగు క్షత్రియ సోదరులు, సంగముని కుమారులు; కాకతీయ ప్రతాపరుద్రుని ఆస్థాన ఉద్యోగులు. 1323 లో ఓరుగల్లు పతనానంతరము కంపిలి ఆస్థానమున భాండాగారకులుగా చేరిరి. 1327 లో కంపిలి రాజ్యమును ఆక్రమించినపుడు తుఘ్లుక్ వీరిని బందీలుగ ఢిల్లీకి కొనిపోయెను. హరిహర, బుక్కరాయ సోదరులు రాజనీతిలో మంచి సమయస్ఫూర్తి గలవారు. తాత్కాలికముగ ఇస్లామ్‌మతమును స్వీకరించి కంపిలికి చేరినంతనే, వేదవేదాంగపారంగతుడైన విద్యారణ్య మహర్షి సాయముతో ప్రాయశ్చిత్తము ఒనర్చుకొని, హిందూధర్మోద్ధరణదీక్షతో, 1336 లో స్వాతంత్ర్యమును ప్రకటించుకొనిరి. అదే సంవత్సరమున ముసునూరి ప్రోలయనాయకుడు తురుష్కులను తరిమివేసి, ఓరుగల్లును ఆక్రమించి స్వతంత్రరాజ్యమును స్థాపించెను. ఆంధ్రదేశమున తురుష్కుల అధికారము అస్తమించినది.

తురుష్క విస్తరణను అరికట్టి, హిందూధర్మమును ఉద్ధరించు సంకల్పముతో స్థాపింపబడిన సామ్రాజ్యమునకు రాజధానిగ ఉండుటకు కంపిలి సురక్షితమైన ప్రదేశము కాదు. అందుచే తుంగభద్రానది దక్షిణ తీరమున, పర్వతముల మధ్య దుర్భేద్యమైన నగరమును నిర్మించి విద్యానగరమని పేరిడి, హరిహరరాయలు తనకు రాజధానిగ చేసికొనెను. విద్యానగరమే విజయనగరమై హిందూ సామ్రాజ్యమునకు కేంద్రమై దక్షిణాపథమున హిందూ సంస్కృతికి రక్షణయైనది. విజయనగర సామ్రాజ్యమును హరిహరుని సంగమవంశీయులు 1485 వరకును పాలించిరి. వీరి కాలములోనే హొయసల రాజ్యము, చోళ, పాండ్య రాజ్యములు, మధురలోని ముస్లిమ్ రాజ్యములను ఆక్రమించి, విజయనగర సామ్రాజ్యము కృష్ణానది మొదలు కన్యాకుమారి వరకును విస్తరించినది. సంగములలో నెల్ల ఘనుడైన ఇమ్మడి దేవరాయల కాలమున విజయనగరమును దర్శించిన నికోలో కాంటీ అను ఇటలీ వర్తకుడు, అబ్దుల్ రజాక్ అను పారసీక రాయబారి ఆ నగరమును బోలిన నగరమును కన్నులు చూచి ఉండలేదని, చెవులు విని ఉండలేదని వర్ణించిరి.

బహ్మనీరాజ్యము : విజయనగర రాజ్యస్థాపన జరిగిన పది సంవత్సరములకు అల్లా ఉద్దీన్ హసన్‌గంగూ బహ్మనీ అను సేనాపతి, మహమ్మద్ బీన్ తుఘ్లుక్‌పై తిరుగుబాటు జరిపి, గుల్బర్గాలో స్వతంత్ర ముస్లిమ్ రాజ్యమును స్థాపించెను (1347). అదియే బహ్మనీ రాజ్యముగ ప్రసిద్ధి చెందినది. కొంతకాలమునకు ఈ రాజ్యము రాజధాని బీదర్‌కు మార్చబడెను. బహ్మనీ సుల్తానులు నర్మదా - కృష్ణా నదుల మధ్యప్రాంతమును ఆక్రమింపగలుగుటే గాక, విజయనగర సామ్రాజ్యమును నిర్మూలించి ఇస్లామ్‌ను విస్తరింపజేయ సంకల్పించిరి. అందుచే విజయనగర - బహ్మనీ రాజ్యములకు ఎడతెగని పోరాటములు జరిగినవి. దక్షిణాపథమున కీలకస్థానమైన కృష్ణా - తుంగభద్రా నదుల మధ్య ప్రాంతము ఉభయులకు లక్ష్యమై యుద్ధరంగమైనది. దక్షిణదేశమందలి హిందూ రాజులు అందరు - కొండవీటి రెడ్డి రాజులు, తెలంగాణములోని పద్మనాయకులు, కళింగమును ఏలుచుండిన గజపతులు, విజయనగరాధీశులు - కలసి వ్యవహరించినచో బహ్మనీరాజ్యము కూలిపోయెడిదే. కాని, హిందువులలో అట్టి ఐకమత్యము కరవగుట బహ్మనీ రాజ్య విస్తరణకు సదవకాశమైనది. కాని, బహ్మనీ సుల్తాన్‌లు విషయలోలురై ప్రభుత్వముపట్ల శ్రద్ధవహింపకపోవుటచే, స్వార్థపరులైన సర్దారులు బలపడి సుల్తానును ధిక్కరింపసాగిరి.

సంగమవంశమును 1485 ప్రాంతమున తొలగించి, విజయనగర సింహాసనమును సాళువవంశమువారు ఆక్రమించిరి. కాని, అచిరకాలములోనే (1505) తుళువ

వంశస్థులచే తొలగింపబడిరి. ఇంచుమించు ఇదే కాలమునకు బహ్మనీ రాజ్యము విచ్ఛిన్నమై, బీదర్, బీరార్, అహమ్మదునగర్, బీజపూర్, గోల్కొండ అను ఐదు స్వతంత్ర రాజ్యములు ఏర్పడెను.

కృష్ణదేవరాయలు (1509 - 1530 ప.): తుళువవంశము లోనే గాక విజయనగర చక్రవర్తులు అందరిలో గొప్పవాడు కృష్ణదేవరాయలు. ఈతడు విజేత; పరిపాలనాదక్షుడు; కవి; కవిపోషకుడు. కృష్ణదేవరాయలు తూర్పుదిగ్విజయ యాత్రలో గజపతుల రాజధానియైన కటకమును ఆక్రమించి, గజపతి రాకుమార్తెను వివాహమాడెను. ఉత్తర దిగ్విజయ యాత్రలో రాయచూర్ చెంత బీజపూర్ సుల్తానును ఓడించి (1520), కృష్ణా - తుంగభద్ర నడిమి దేశమును ఆక్రమించెను. బహ్మనీసుల్తానుల అనైక్యత వలన దక్షిణాపథమున విజయనగరము కత్తికి ఎదురు లేకపోయెను. కృష్ణదేవరాయని ఆస్థానమున అష్టదిగ్గజము లను మహాకవులు ఉండి, సంస్కృత, ఆంధ్ర, కర్ణాట భాష లలో పెక్కు గ్రంథములు రచించిరి. కృష్ణదేవరాయలు స్వయముగ సంస్కృతాంధ్రములలో కావ్యములు రచిం చెను. దక్షిణభారతదేశ చరిత్రలో ఆతని పరిపాలనా కాలము ఒక స్వర్ణయుగము.

రాక్షసి - తంగడి యుద్ధము (1565): కృష్ణదేవరాయని అనంతరము విజయనగరములో తీవ్రమైన అంతఃకలహ ములు చెలరేగెను. కృష్ణదేవరాయని తమ్ముడైన అచ్యుత రాయలు, అల్లుడైన ఆరవీటి రామరాయలు కలహించిరి. అచ్యుతరాయల మరణానంతరము కృష్ణదేవరాయల తమ్ముని కుమారుడైన సదాశివరాయలును సింహాసనము ఎక్కించి రామరాయలే అధికారమును హస్తగతము ఒనర్చుకొనెను. రామరాయలు సమర్థుడే కాని, అధికార వ్యామోహము గలవాడు. బహ్మనీ రాజ్యముల అంతః కలహములలో జోక్యము కలిగించుకొని ఆ రాజ్యములచే తన మధ్యవర్తిత్వమును అంగీకరింపజేసి, విజయనగర గౌరవ, ప్రతిష్ఠలను ఇనుమడింపజేసెను. కాని, ఈ పరిణా మము సుల్తానులలో అసూయా ద్వేషములకు కారణమైనది. నానాటికి బలవత్తరమగుచున్న విజయనగరము తమకు ముప్పుకాగలదను భయముతో తమ తమ విభేదములను విస్మరించి సుల్తానులు అందరును ఏకమై, 1565 లో విజయనగరముపై దండెత్తిరి. తళ్లికోట మైదానముపై రాక్షసి, తంగడి గ్రామములమధ్య ఘోరయుద్ధము జరిగి నది. మొదట రామరాయలే గెలుపొందెను. కాని, కడకు రామరాయని సేనలలోని ఇరువురు ముస్లిమ్ దళవాయిల విశ్వాసద్రోహమువలన విజయనగర సైన్యము ఓడిపోయి, రామరాయలు వధింపబడెను. ముస్లిమ్ సైన్యములు విజయనగరమును ఆక్రమించి, సర్వనాశనము ఒనర్చినవి. ఆ మహానగరము స్మశానముగ మారిపోయెను. హిందూ సామ్రాజ్య ప్రతిష్ఠ అస్తమించి దక్షిణదేశమున ముస్లిమ్ విస్తరణకు ఆటంకము తొలగినది.

రాక్షసి - తంగడి యుద్ధానంతరము రామరాయని తమ్ము డైన తిరుమలరాయలు పెనుగొండలో స్వతంత్ర రాజ్య మును స్థాపించెను. కొంతకాలము తరువాత వీరి రాజధాని చంద్రగిరికి మార్చబడినది. ఆరవీటి వంశస్థులు సుమారు ఒక శతాబ్ది కాలము ముస్లిమ్‌లను అరికట్టి పూర్వ విజయనగర సంప్రదాయములను రక్షించుటకు శక్తికొలది ప్రయత్నించిరి. కాని, లాభము లేకపోయెను. నాటికే, మధుర, తంజావూరులలో నాయకరాజులు, మైసూరులో ఒడయారులు, జింజి, పుదుక్కోట పాలకులు స్వతంత్ర రాజ్యములు స్థాపించుకొనిరి. వీరి ద్రోహబుద్ధి అవకాశ ముగ బీజపూర్, గోల్కొండ సుల్తానులు చెరియొక వైపున దక్షిణముగ విస్తరింపసాగిరి. క్రమముగ ఆరవీటి వంశము బలహీనమై ముమ్మడి శ్రీరంగరాయనితో అస్త మించినది. ఈ కాలమునకే గోల్కొండ, బీజపూర్ సుల్తానులు మొగల్‌లకు సామంతులై స్వాతంత్ర్యమును కోల్పోయిరి. ఇట్టి పరిస్థితులలో మహారాష్ట్రులు విజృం భించి, హిందూ స్వాతంత్ర్యరక్షణకు కంకణము ధరించి విజయనగరాధీశులకు వారసులైరి.

విజయనగర వైశిష్ట్యము: విజయనగర సామ్రాజ్య మును మధ్యయుగ భారతదేశములో వర్ధిల్లిన ఏకైక హిందూ సామ్రాజ్యముగ వర్ణింపవచ్చును. హిందూ ధర్మ రక్షణమే విజయనగర ఆశయమైనందున వంగ, కాశ్మీరము మున్నగు దూరభూములనుండి వచ్చిన హిందూశరణార్థు లకు సైతము ఆశ్రయము ఇచ్చి పోషించినది. విజయనగర స్థాపనకు కారకులలో ఒకరైన విద్యారణ్య మహర్షి ప్రోత్సాహముతో సాయనాది విద్వాంసులు వేదములకు, ధర్మశాస్త్రములకు భాష్యములు కూర్చిరి. హిందూ ధర్మ ములో ప్రజలకు విశ్వాసము సడలకుండ రక్షింపబడుటయే గాక, ఈ కృషివలన యావద్భారతమున హిందూమత పునరుజ్జీవనమునకు అవసరమైన ప్రోత్సాహము లభించినది. విజయనగరాధీశులు భారతీయ సంప్రదాయములను అనుసరించి సహనవిధానమునే అనుసరించిరి. కాని, తురుష్క విస్తరణను అరికట్టవలసి ఉండుటచే వారి పరిపాలనా విధానమునకు సైనికపోషణ పునాదియైనది. దుర్గాధి పతులు, స్థానికపాలకులు అయిన అమరనాయకులు సైన్యములను పోషించి, చక్రవర్తికి సరఫరా చేయవలసి

ఉండెను. విజయనగరాధీశులు ముస్లిమ్ సేనానులను నియమించి, తమ విలుకాండ్రకు, అశ్వదళమునకు శిక్షణను ఇప్పించెడివారు. నికోలో కాంట్, న్యూనిజ్ వంటి విదేశ యాత్రికుల రచనలవలన దేశము ఐశ్వర్యవంతమై ఉండెనని తెలియుచున్నది. విజయనగరపు సిరిసంపదలే బహ్మనీలు తరచుగా దండెత్తివచ్చుటకు కారణమైనవి. విజయనగరాధీశులు సంస్కృతముతో బాటు దేశభాషాసారస్వతములను పోషించిరి. ముఖ్యముగ ఆంధ్రభాషాచరిత్రలో స్వర్ణయుగముగ పరిగణింపబడుచున్న ప్రబంధయుగము కృష్ణదేవ రాయని పోషణలోనే ప్రారంభమైనది. విజయనగర సమ్రాట్లయు, సామంతులయు పోషణవలన ఆంధ్రభాష, ఆంధ్రసంస్కృతి దక్షిణాపథము అంతట విస్తరించి, గౌరవింపబడుటచే విజయనగర సామ్రాజ్యమును ఆంధ్ర సామ్రాజ్యముగ కొందరు చరిత్రకారులు వర్ణింతురు.

ఢిల్లీ సుల్తానులు - సంఘ వ్యవస్థ : ఈ సందర్భమున గమనింపదగిన విశేషము ఒకటి కలదు. దానిని ప్రత్యేకముగ పేర్కొనుట జరిగిన చరిత్రను సరిగ అవగాహన చేసికొనుటకు చాల అనుకూలించును. అందువలన అది ముందుగను, ముఖ్యముగను ప్రస్తావింపదగినది.

సుల్తానుల సామ్రాజ్యము 1206 నుండి 1526 వరకు మూడు శతాబ్దములకు పైగా భారతదేశమున ఉన్నది. రాజకీయరంగమున సాగిన పోరాటము, రక్తపాతము, నష్టము, నాశనములను చూచినపుడు దేశమందు హిందువులకు, మహమ్మదీయులకు మధ్య ఎడతెగని పోరు జరిగినట్లు, వారిరువురి మధ్య పొత్తు ఏమాత్రము లేనట్లు అభిప్రాయము కలుగవచ్చును. కాని, ఇది పూర్తిగా సత్యము కాదు. తగు జాగ్రతతో పరిశీలించినచో వారిరువురు రాజకీయ రంగమున సంఘర్షణను సాగించినను, సాంఘిక, సాంస్కృతిక రంగములందు సహకారమును సాధింపగలిగిరని విశదమగును. అంతేగాక, ఈ కాలమునందు ప్రారంభమున పోరాటము ఎక్కువగానుండి, కాలక్రమమున మైత్రీభావము పెరిగినది. శ్లాఘింపదగిన ఈ సమ్మేళనము ప్రపంచ చరిత్రలో చాల అరుదుగ జరిగిన విచిత్ర పరిణామములో ఒకటి అని ఈ విషయమును నిష్పాక్షికమైన, నిశితమైన దృష్టితో పరిశీలించిన జాన్ మార్షల్ పండితుని నిర్ణయము.

రాజకీయరంగమున సామ్రాజ్య స్థాపనకు, విస్తరణకు పాటుపడుచున్న మహమ్మదీయ సుల్తానులకు, తమ స్వాతంత్ర్యమును రక్షింప ప్రయత్నించుచున్న హిందూ ప్రభువులకు పోరాటము జరుగుచునే ఉండెడిది. అయితే, ఇందుకు ముఖ్య కారణము మతమునకు సంబంధించినది కాదని, రాజ్యాధికార కాంక్ష అని గ్రహింపదగును. ముస్లిమ్ సుల్తానులు రాజ్యాధికారము కొరకు హిందూ రాజులతో పోరాడినట్లే ముస్లిమ్ పాలకులతో సైతము పోరాడిరి. అట్లే హిందూ ప్రభువులు కూడ తమలో తాము పోట్లాడు కొనుచుండిరి. ఇక యుద్ధసందర్భమున ముస్లిమ్ సుల్తానులు శత్రువుల ప్రాణ - మానములకు, ఆస్తి - పాస్తులకు అపార నష్టము కలిగించు అత్యాచారములు చేసి ఉండిరి. ఈ దుర్నీతి హిందూప్రభువులను కూడ బాధించినది ఇంతేగాక ముస్లిమ్ పాలకుల సైన్యమునందు హిందువులు, హిందూప్రభువుల సేనలందు ముస్లిమ్‌లు ఉండుట గమనింపదగినది. ఇక, ప్రజాబాహుళ్యమునకు సంబంధించిన హిందూ వ్యవసాయదారులను, వర్తకులను, ఇతర వృత్తులందు జీవించువారిని సుల్తానులు సాధారణముగ ఉదారముగ చూచిరి. అల్లాఉద్దీన్ కాలమున ధనవంతులయిన హిందువులు ఆర్థికముగా పీడింపబడిరి గాని, అతని ధరలనిర్ణయ విధానము సామాన్య ప్రజలు సులభముగ జీవనము సాగించుటకు తోడ్పడినది. ఫిరోజ్ తుఘ్లుక్ పాలనక్రింద వ్యవసాయము, వాణిజ్యములలో జరిగిన అభివృద్ధి హిందూ ప్రజానీకమునకు సిరిసంపదలను చేకూర్చినది.

ప్రభుత్వ పద్ధతిని గమనించినపుడు, సుల్తానుల ప్రభుత్వము సిద్ధాంతరీత్యా ఇస్లామ్‌మతసూత్రములకు కట్టుబడి ఉన్నట్లును, యథార్థముగా అది అందుకు కొంత భిన్నముగా ఉన్నట్లును కనబడును. అనగా హిందువులు అత్యధిక సంఖ్యలో ఉన్న దేశమును ఏలు ముస్లిమ్ సుల్తానులు తమ పాలనను రాజకీయ ప్రయోజనములను బట్టి మార్పు చేయవలసి వచ్చినది. అల్లాఉద్దీన్ ఖిల్జీ, మహమ్మద్ బిన్ తుఘ్లుక్‌లు మతసూత్రులకు కట్టుబడక, స్వతంత్రముగ వ్యవహరించిరి. సుల్తానుల అధికారము నిరంకుశమైనది. అయినను వారు మంత్రులను, దర్బారును సంప్రతించి నిర్ణయములు చేసెడివారు. మంత్రులలో యుద్ధము, ఆదాయము, వార్తలు, వర్తక స్థానములకు సంబంధించినవారు ముఖ్యులు. ఇవిగాక రక్షక భటులు, న్యాయస్థానములు, కర్మాగారములు, వ్యవసాయము మొదలగు శాఖలు ఉద్యోగుల పర్యవేక్షణ క్రింద సాగుచుండెడివి.

సుల్తాను యొక్క సొంత సైన్యమునందు అతని రక్షణకు నియమింపబడినవారు, రాజధానీనగరమందలి సైనికులు చేరి ఉండెడివారు. దీనికి తోడుగ యుద్ధసమయమున రాష్ట్రపరిపాలకులు, సామంతులైన హిందూ ప్రభువులు పంపిన సైన్యము సుల్తానుకు తోడ్పడుచుండెను. సైనికోద్యోగులందు వివిధ తరగతులు ఉండెడివి.

ఆ కాలమున సైనికోద్యోగులు సైనిక వ్యవహారములనేగాక, సాధారణ పాలనకు సంబంధించిన వ్యవహారములను కూడ నిర్వహించెడివారు.

సుల్తానుల పాలనలో హిందువులు ఉన్నతోద్యోగములకు నియమింపబడుట గమనింపదగిన విశేషము. గజనీ మహమూద్ సంతతిలోని మసూద్ అను పాలకుని సేనానులలో తిలక్ అను హిందువు కలడు. అల్లా ఉద్దీన్ ఖిల్జీ యాదవవంశపు రామదేవునికి రాయిరాయన్ అను బిరుదును ఇచ్చి, అతనిని నవసారి ప్రాంత పాలకునిగ నియమించెను. ఘియాజుద్దీన్ తుఘ్లుక్ రాజా కామేశ్వర్‌కు మిథిల రాజ్యపాలకుని పదవిని ఇచ్చెను. మాల్వా పాలకుడు అయిన మహమూద్ తనకు సంరక్షకునిగా రాజపుత్రుడైన మేదిని రాయిని ఎన్నుకొనెను.

న్యాయనిర్వహణకార్యమునందు సుల్తానులు తగు ఆసక్తిని కనబర్చిరి. రాజధానీనగరమునందలి సుల్తాను యొక్క దర్బారు అత్యున్నత న్యాయస్థానముగ ఉండెడిది. పట్టణములందు కాజీలను ఉద్యోగులు, పల్లెలందు పంచాయతీలు న్యాయనిర్వహణయందు పాల్గొనుచుండెను. న్యాయనిర్వహణకార్యమును సాగించుటలో సాధారణముగ హిందూ - ముస్లిమ్ మతభేదము పాటింపబడకుండుట గుర్తింపదగినది. సుల్తానుల రాజ్యములో హిందువులకు న్యాయము సంతృప్తికరముగ లభించుచుండెను.

ఆదాయము కొరకై సుల్తానులు వివిధములయిన పన్నులను విధించెడివారు. పన్నుల భారము మొత్తము మీద ఎక్కువగనే ఉండెడిది. ప్రభువు పన్నులను న్యాయముగ నిర్ణయించినను, దానిని వసూలు చేయువారు ప్రజలను పీడించెడివారు. హిందువులపై అధికముగ విధింపబడిన పన్ను 'జిజియా' అనునది. దీనిని కొందరు సుల్తానులు వసూలు చేసిరి.

సుల్తానుల సామ్రాజ్యము పాలనాసౌకర్యము నిమిత్తము రాష్ట్రములుగ విభజింపబడి ఉండెడిది. సుల్తానుయొక్క సన్నిహితులు, ఆశ్రితులు వానికి పాలకులు. గ్రామములందు పంచాయతీ పాలన సాగుచుండెడిది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వములందు ముస్లిమ్ ఉద్యోగులు పాలించుచుండగా, గ్రామములందు వ్యవహారములు హిందువులచే పరిష్కరింపబడుచుండెడివి. ఇంతేగాక, కొన్ని పరగణాలు, సామంతరాజ్యములు హిందువుల అధీనములో ఉండుట కూడ కలదు.

రాజకీయ, పాలనా రంగములందుకన్న సాంఘిక, సాంస్కృతిక రంగములందు హిందువుల, ముస్లిమ్‌ల మధ్య సహకారము, సమ్మేళనము ఎక్కువగ కాననగును. పాలకులయిన ముస్లిమ్‌ల ఆచారములను కొన్నిటిని పాలితులైన హిందువులు సహజముగ అనుకరించిరి. ఇందు పేర్కొనదగినది పరదా పద్ధతి. అయితే, హిందువుల ఆచారములను కూడ ముస్లిమ్‌లు అనుసరించుట జరిగినది. వివాహము, మరణముల సందర్భమున పాటించు అలవాట్లను, తిరునాళ్లు, ఉత్సవములందు అనుసరించు ఆచారములను ముస్లిమ్‌లు గ్రహించిరి. ఇంతేగాక, ముస్లిమ్ సంఘమునందు హిందూ సంఘమునందువలె కుల విభజన లేకున్నను, జాతులకు, తెగలకు సంబంధించిన విభజన ఉండెడిది. జూదము, మద్యము, మగువల ఎడ లోలత్వము హిందూ - ముస్లిమ్ మతభేదమును పాటింపక, వారిని సమానముగనే పీడించిన దురాచారములు.

ముస్లిమ్ పాలకులు సారస్వత పోషణకు పాటుపడి, కవి, పండితులను పోషించిరి. సుప్రసిద్ధ కవులయిన అమీర్ ఖుస్రూ, జాయసీలు; చరిత్రకారులయిన షంస్-ఇ-సిరాజ్, జియాఉద్దీన్ బార్నీలు, వ్యాస రచయిత అయిన ఐనుల్ ముల్క్ అనువారు సుల్తానుల పోషణ అనుభవించి ఉత్తమ గ్రంథములను పర్షియన్ (పారసీక) భాషలో రచించిరి. ఉత్తర, దక్షిణదేశములందు పాలించిన సుల్తానులు ఆ యా ప్రాంతములందలి భాషలను అభిమానించి పోషించి, పెంచుట గమనార్హము. బెంగాల్, గుజరాత్, జౌన్‌పూర్ ప్రాంతములందలి ముస్లిమ్ పాలకులు ఆ యా ప్రాంతీయ భాషలను, సాహిత్యమును పెంపొందించిరి. బీజపూర్, గోల్కొండ సుల్తానులు ఉర్దూ సారస్వతమును వృద్ధిచేసిరి. అంతేకాక, బీజపూర్ రాజ్యమునందు కొంతకాలము మరాఠీ రాజభాషగ ఉన్నది. కాశ్మీర్ రాజ్యమును ఏలిన జైనుల్ అబిదీన్ సుల్తాను హిందూప్రజల ఎడ అక్బర్ పాదుషా [చూ. పు. 260] వలెనే వర్తించెనందురు.

ఇదిగాక హిందువులు, ముస్లిమ్‌లు ఒకరినుండి మరొకరు విజ్ఞాన సముపార్జన చేసిరి. అల్ బెరూని [చూ. పు. 272] హిందూ మతగ్రంథములను పరిశీలించి, వానిని అరబిక్ భాషలోనికి అనువదించెను. ఫిరోజ్ తుఘ్లుక్ సంస్కృత గ్రంథములను పారసీక భాషలోనికి తర్జుమా చేయించెను. సికందర్ లోడీ వైద్యశాస్త్రమును సంస్కృతము నుండి పర్షియన్ భాషలోనికి అనువదించుటకు ప్రోత్సాహము ఇచ్చెను. హిందువులు పరదేశమునుండి వచ్చిన ముస్లిమ్‌ల నుండి ఖగోళ శాస్త్రమునకు సంబంధించిన విశేషములు, కాగితము తయారీ, రాసాయనికద్రవ్యముల వాడకము, లోహ పరిశ్రమలకు చెందిన పద్ధతులు మొదలగువానిని కొన్ని గ్రహించిరి.

లలిత కళోపాసనయందుకూడ ఢిల్లీ సుల్తానులు చాల శ్రద్ధ కనబరచిరి. ముఖ్యముగ భవననిర్మాణము వీరికి అతిప్రీతికరమైనది. అందువలన అనేకమైన సుందర భవనములు ఈ కాలమున వెలసినవి. వీనిలో ప్రధానమైనది కుతుబ్‌మీనార్. అల్లా ఉద్దీన్ నిర్మించిన వానిలో జమాత్‌ఖానా మసీదు, అలాయి దర్వాజా ప్రశస్తమైనవి. తరువాతికాలమున భవననిర్మాణ కుతూహలము, కౌశలము తగ్గినవి. ఢిల్లీ రాజ్యమునందేగాక, ఇతర ప్రాంతములందున్న వానియందును భవననిర్మాణము భారీ యెత్తున సాగినది. ఈ కాలమున హిందూ - ముస్లిమ్ కళారీతులు క్రమముగ కలసిపోయినవి. ముస్లిమ్ పాలకులు దేశమునందలి హిందూకళాకారులను భవననిర్మాణమునకు వినియోగించుటవలన ఇరువురి అభిరుచులు కలసి ఈ పరిణామము జరిగినది.

మత విషయములందు హిందూ - ఇస్లామ్ మతముల మధ్య ఏర్పడిన సామరస్యము శ్లాఘింపదగిన విశేషము. దీనిని సాధించినవారు ఇస్లామ్ మతమును అనుసరించిన సూఫీలు, హిందూ మతమును అవలంబించిన భక్తి ఉద్యమ ప్రచారకులు. వీరిలో ఒకరి ప్రభావము మరొకరిపై ప్రసరించినది. మొత్తముమీద ఇరుపక్షములవారు తమ మత సూత్రములకు కేవలము సనాతనమార్గమునగాక నూతన విధమున వ్యాఖ్యానముచేసి, రెండు మతములందు గల పరమసత్యములను మిళితముచేసి, అందలి మూఢ నమ్మకములను, ఆచారములను నిరసించి, రెండు మతములవారిని చేరదీయుటకు యత్నించిరి. భక్తి ఉద్యమ ప్రచారకులలో దక్షిణదేశమున రామానుజుడు, ఉత్తరదేశమున రామానంద, కబీర్, నామదేవ, నానక్, చైతన్య ముఖ్యులు. కన్నడ దేశమందలి బసవ ప్రముఖులు, తెలుగు దేశమందు ఉండిన వేమన [చూ. సం. 4 - పు. 1133] కూడ పై వర్గములో చేర్చదగినవారే. వీరు కర్మమార్గమును వదలి, భక్తిమార్గమును అనుసరించి, ఏకేశ్వరోపాసనను ప్రబోధించి, కులమత భేదములను ఖండించి, సర్వమానవ సౌభాతృత్వమును ప్రచారము చేసిరి. భగవంతుని రామ్ అనిగాని, రహీమ్ అనిగాని పిలువవచ్చునని, పురాణ్‌ను, ఖురాన్‌ను సమానముగా గౌరవింపదగునని, వానిని అనుసరించువారు సోదరభావముతో మెలగవలయునని బోధించిరి.

అన్ని విధముల హిందువుల, మహమ్మదీయుల మధ్య సామరస్యము ఏర్పడినది. 1526 న హిందూదేశమునకు వచ్చిన మొగల్ యోధుడు బాబర్, నాడు తన దేశమున కనుగొన్న సంస్కృతిని, హిందూ - ముస్లిమ్ కలయికను సూచించు హిందూస్థానీసంస్కృతిగ వర్ణించెను. ఇది అక్బర్ చక్రవర్తి కాలమున అత్యున్నతస్థాయిని అందుకున్నది.

మొగల్ సామ్రాజ్యము : భారతదేశమున మొగల్ సామ్రాజ్యమును స్థాపించినవాడు బాబర్. ఇతని దండయాత్రల ఫలితముగనే ఆ సామ్రాజ్య స్థాపన 1526 న జరిగినది. అంతకు పూర్వము భారత దేశమునగల ముఖ్య రాజకీయ పరిస్థితిని గమనించుట యుక్తము.

సూత్రప్రాయముగ దేశము అనేక విధముల విభజింపబడి ఉన్నదనవచ్చును. నాటి రాజ్యములు నాలుగుమండలములుగ చీలి ఉండెను. ఉత్తరమున సింధు, పంజాబ్, ఢిల్లీ, బీహార్, బెంగాల్ ప్రాంతములు మహ్మదీయరాజుల పరిపాలనలో ఉన్నవి. వానికి దక్షిణముగ రాజపుత్రస్థానమునందు ఉన్న రాజ్యములను రాజపుత్రులు పాలించుచుండిరి. దక్కన్‌లో బహ్మనీ రాజ్యభాగములయిన అహమద్‌నగర్, బీజపూర్, బీదర్, బీరార్, గోల్కొండ రాజ్యములందు వివిధ వంశములకు చెందిన సుల్తానుల అధికారము సాగుచుండెను. కృష్ణానదికి దక్షిణమున ఉన్న దక్షిణదేశము అంతయు విజయనగరసామ్రాజ్యములో చేరి ఉండెను. ఒక మండలమునకు మరొక మండలమునకు మధ్యను, ఒకే మండలములోని వివిధ రాజ్యముల మధ్యను సంఘర్షణ సాగుచు ఉండెడిది. స్వదేశీయులయిన ప్రభువుల మధ్య జరుగు పోరాటములలో విదేశీయులయిన పోర్చుగీస్‌వారు తమ స్థావరమయిన గోవానుండి జోక్యము కల్పించుకొని, తమ ప్రాబల్యమును పెంచుకొన యత్నించుచుండిరి. ఇది ఇట్లుండగా, ఉత్తర భారతదేశమునందలి రాజ్యములలో ఢిల్లీసుల్తాను రాజ్యము మాత్రము నామమాత్రముగనే ఉండినది. సుల్తాను అధికారము చాల సన్నగిలినది. నాటి సుల్తాను అయిన ఇబ్రహీమ్ లోడీ దుర్మార్గుడు, దుర్బలుడు. ఇతని క్రింది అధికారులు ఇతనిని కూలద్రోయ యత్నించుచుండిరి. ఇతని ప్రజలు ఇతని పతనమునకు ఎదురుచూచుచుండిరి. ఇంతకు తేలినదేమనగా, నాటి హిందూదేశమున గల రాజ్యముల మధ్య ఐకమత్యము నశించి, వైరుధ్యము విపరీతముగ పెరిగినది. ఇటువంటి దైన్యస్థితిలో దేశము పరదేశపాలకుడయిన బాబర్ [చూ. మొగల్ సామ్రాజ్యము] దండయాత్రలకు లోనై అతని చేతిలో పడినది. ఇంతకు పూర్వము జరిగినట్లే, ఇపుడు కూడ రాజకీయరంగమున, అత్యవసర పరిస్థితియందు కూడ ఐకమత్యము లేనందువలననే దేశము శత్రువుల దండయాత్రకు లోనై స్వతంత్రమును కోల్పోయినదని గ్రహింపదగును.

బాబర్ మొగల్ వంశమునకు చెందినవాడు. మంగోల్ జాతితో సంబంధము గలవాడు. యోధాగ్రేసరులయిన


ఇండియా
మొగల్ యుగము
1 మైలు = 1·609 కి. మీ.
మై 100 50 0 100 200 300
టిబెట్
అస్సామ్
పానిపట్టు
ఢిల్లీ
ఆగ్రా
బీకనీర్
రాజపుత్‌స్థాన్
జయపూర్
గ్వాలియర్
చిత్తోడ్
ఉమర్ కోట
సింధు
లాహోర్
ముల్తాన్
అమృతసర్
శ్రీనగర్
అలహాబాదు
కలంజర్
చందేరి
బెనారస్
పాట్నా
రాజమహల్
గౌర్
చంద్రనాగూర్
కలకత్తా
చిట్టగాంగ్
గుజరాత్
గోండ్వాన
డామన్
బొంబాయి
అహమద్ నగర్
బీదర్
హైదరాబాదు
సతారా
బీజాపూర్
గోవా
మచిలీపట్టణము
చంద్రగిరి
మద్రాసు
అంబూరు
జింజి
పాండిచ్చేరి
కన్ననూర్
కళ్లికోట
తంజావూరు
నాగపట్టణము
కొచ్చిన్
మదుర
సింహళము
కొలంబో
అక్బరు సామ్రాజ్యపు సరిహద్దులు
ఔరంగజేబ్ సామ్రాజ్యము
తొలి మరాఠీ రాజ్యము

తైమూర్ [చూ. పు. 521], చెంఘిజ్‌ఖాన్ [చూ. పు. 459] ల సంతతిలో జన్మించినవాడు. అందువల్ల తాను కూడ గొప్ప యోధుడైనాడు. అంతేగాక, తన పూర్వికుడైన తైమూర్ వలెనే తాను ఆసియాఖండములోని రాజ్యములను జయించి సామ్రాజ్యమును సంపాదింప దీక్షపట్టెను. మొదట మధ్య ఆసియాలోని ఫెర్గనా అను రాజ్యమునకు ప్రభువై, దానితో తృప్తిపడక సమర్కండ్ రాజ్యసింహాసనమును ఆశించినను, ఈ ప్రయత్నములో చివరకు తనకు గల రాజ్యమును అంతటిని కూడ పోగొట్టుకొనుట జరిగినది. అంతట బాబర్ దృష్టి తూర్పు దిశకు తిరిగినది. ఈ సమయమున ఆఫ్ఘనిస్తాన్‌లో కల్లోలము చెలరేగినది. అపుడు ఆ దేశమును జయించి, తన స్వాధీనము చేసికొనెను. ఆఫ్ఘనిస్తాన్‌కు ప్రభువైనప్పటినుండి, అతనికి తన పూర్వికుడయిన తైమూర్ జయించిన హిందూస్తాన్‌ను జయించి, దాని ఐశ్వర్యమును అనుభవింపవలెనను ఆశ వెరుగజొచ్చినది. హిందూదేశముపై దండెత్తుటకు వీలయిన అవకాశము కొరకు పొంచి ఉండెను. 1525 నాటి హిందూదేశ రాజకీయపరిస్థితులు బాబర్ దండయాత్రకు చాల అనుకూలములైనవి. పంజాబ్ ప్రాంతమును పాలించుచున్న దౌలత్ ఖాన్ లోడీ వంటి రాజద్రోహుల చేయూత బాబర్ దండయాత్రకు బాగుగ తోడ్పడినది.

బాబర్ తనకు ఎదురు నిల్చిన ముగ్గురు శత్రువులను 1526 - 1530 మధ్య జరిగిన మూడు యుద్ధములలో ఓడించి, సామ్రాజ్యమును స్థాపించెను. 1526 లో పానిపట్టు ప్రాంతమున బాబర్‌కును, ఢిల్లీ సుల్తానయిన ఇబ్రహీమ్‌లోడీకిని పోరు జరిగినది. ఇందు లోడీ సైన్యసంఖ్యాబలము ఎక్కువగ ఉన్నను ఓడింపబడినది; సుల్తాన్ చంపబడెను. విజయము సంపాదించిన బాబర్ ఢిల్లీ సింహాసనమును ఎక్కెను. అయితే, బాబర్‌ను పదవీ భ్రష్టుని చేయుటకై ఒక వైపున రాజపుత్రులు, మరొక వైపున ఆఫ్ఘన్ సామంతులు పూనుకొనిరి. సిక్రీ యొద్ద రాజపుత్ర పాలకులకు నాయకుడు, మహాయోధుడు అయిన రాణా సంగ్రామసింహునకు, బాబర్‌నకు మధ్య ఘోరసంగ్రామము జరిగినది. ఇందు కూడ చిట్ట చివరకు బాబర్ విజయమును చేపట్టగలిగెను. తరువాత ఈ మొగల్ వీరులు బీహార్ రాష్ట్రమునందు ఉన్న ఆఫ్ఘన్ నాయకులను కూడ జయించిరి. ఇంతటితో అతని అధికారమును ఎదిరింప గల ఆఫ్ఘన్ శత్రువుల మొదటి పరాజయము (తాత్కాలికముగనైనను) పూర్తియైనది. హిందూస్థానమున మొగల్ సామ్రాజ్య స్థాపన జరిగినది. సువిశాలమైన ప్రాంతము బాబర్ యొక్క ఏకచ్ఛత్రాధిపత్యము క్రిందికి వచ్చినది. అతని జీవితాశయము నెరవేరినది. హిందూదేశమున పశ్చిమోత్తర సరిహద్దునుండి బీహార్ ప్రాంతము వరకు వ్యాపించిన భూభాగమును సంపాదించి అతడు 1530 లో జీవితమును చాలించెను.

హుమాయూన్ - షేర్‌ఖాన్ పోరాటము : బాబర్ మరణించిన తర్వాత అతని పెద్దకుమారుడైన హుమాయూన్ ఢిల్లీ సింహాసనమును ఎక్కెను. అంతట ఉత్తర హిందూదేశమును పాలించుచున్న ఆఫ్ఘన్ నాయకులు ఢిల్లీ సింహాసనమును ఆక్రమించుకొనుటకు మరల ప్రయత్నించిరి. వీరిలో బీహార్‌నందలి షేర్‌ఖాన్ ముఖ్యుడు. సింహాసనమును ఎక్కిన వెంటనే హుమాయూన్ వీరిని ఎదుర్కొనవలసి వచ్చెను.

అతడు మొదట షేర్‌ఖాన్‌ను లోబర్చుకొని అతడు లొంగినట్లు కనబడినంతనే వదలివేసెను. క్రమముగ షేర్‌ఖాన్ తన బలమును బీహార్, బెంగాల్ రాష్ట్రములందు వృద్ధి చేసికొనెను. ఇది చూచి మరల హుమాయూన్ అతనిని లోబర్చుకొనుటకై బయలుదేరెను. ఈసారి కూడ మొగల్ చక్రవర్తి ఆ రాష్ట్రములందలి ముఖ్యమైన పట్టణములను పట్టుకొనగలిగెను. కాని, చాలకాలయాపన చేసి చిక్కులపాలయ్యెను. షేర్‌ఖాన్ కొంతవరకు తప్పించుకొని తిరిగి, తనకు అనుకూలమయిన సమయమున - ప్రదేశమున - పోరాటమునకు సిద్ధపడెను. గంగానదీ తీరము వెంబడి మొగల్ సైన్యము ఢిల్లీవైపుకు తిరిగి వెళ్లు సమయమున షేర్‌ఖాన్ దానిపైబడి, చౌసాయొద్దను, కనోజ్‌వద్దను దానిని ఓడించెను. రెండుసార్లు పరాజితుడై హుమాయూన్ ఢిల్లీ వదలి పలాయనమాయెను. నిస్సహాయుడై, అతడు చివరకు (1540) దేశమునుండియే పారిపోవలసివచ్చినది. అంతటితో ఢిల్లీ సామ్రాజ్యము మొగల్‌ల చేతినుండి జారిపోయి, ఆఫ్ఘన్‌ల వశమైనది. షేర్‌ఖాన్ షేర్‌షా [చూ.] అను పౌరుషనామముతో పాలన సాగించెను.

షేర్‌షా ఆఫ్ఘన్‌జాతికి, సూర్ వంశమునకు చెందినవాడు. ఇతని జీవితచరిత్ర బహు విచిత్రమైనది. కేవలము స్వశక్తితో మహోన్నత పదవిని సంపాదించినటువంటి అసాధారణ వ్యక్తి. మొగల్‌పాలనను అంతముచేసి, ఆఫ్ఘన్ అధికారమును ఢిల్లీసామ్రాజ్యమున మరల స్థాపించిన వీరుడు. 1540 నాటికి బెంగాల్, బీహార్, ఆగ్రా, ఢిల్లీ ప్రాంతములు ఇతనికి లోబడినవి. తదుపరి పంజాబ్, మాల్వా, మేవార్ రాజ్యములు జయింపబడినవి. కాలింజర్ కోటను ముట్టడించి, జయము సాధించి, ఆకస్మికముగ 1545 లో అతడు మరణించెను. రాజ్యములను జయించుట

లోనేగాక వానిని పరిపాలించుటలో కూడ షేర్ షా అద్భుతమైన శక్తియుక్తులను కనబరచెను. అతని అనంతరము అతని వారసులు 9 ఏండ్లు పాలించిరి. చివరకు ఢిల్లీ సింహాసనమునకై ఆఫ్ఘన్ నాయకుల మధ్య అంతర్యుద్ధము చెలరేగినది. ఢిల్లీ రాజ్యము కల్లోలితమైనది.

ఈ సమయమున హుమాయూన్ ఆఫ్ఘనిస్తాన్‌ను జయించి, అచటినుండి హిందూస్తాన్‌పై దండెత్తి ఢిల్లీ సామ్రాజ్యమును తిరిగి సంపాదించెను. 15 ఏండ్ల తర్వాత 1555 లో హుమాయూన్ మొగల్ పాలనను పునః స్థాపన చేసి, అంతట అనతి కాలముననే పరలోకగతుడాయెను (1556) [చూ. మొగల్ సామ్రాజ్యము].

ఈ విధముగ మొగల్, ఆఫ్ఘన్‌ల మధ్య ఢిల్లీ సామ్రాజ్యమునకై జరిగిన రెండవ పోటీలో మొగల్‌లే అంతిమ విజయమును సాధించిరి.

మొగల్ సామ్రాజ్య విస్తరణ - అక్బరు (1556 - 1605 ప.): భారతదేశమున మొగల్ సామ్రాజ్యమును స్థాపించిన వాడు బాబర్. అతని కుమారుడు హుమాయూన్ దానిని పోగొట్టుకొని తిరిగి సంపాదించి వెంటనే మరణించెను. తదుపరి ఢిల్లీ సింహాసనమునకు వారసుడు అక్బరు [చూ. పు. 260]. ఇతని తండ్రియైన హుమాయూన్ అప్పగించినది నిజముగ ఢిల్లీ సింహాసనము ఎక్కుటకు కావలసిన న్యాయ సమ్మతమైన హక్కు మాత్రమే కాని, సుస్థిరమైన ఢిల్లీ సామ్రాజ్యము కాదు. ఆ సామ్రాజ్యమును సంపాదించుటకు, అనుభవించుటకు అక్బరు నలువైపుల పొంచియున్న పలువురు శత్రువులను జయించవలసి ఉండెను.

మొట్టమొదట అతడు తండ్రినుంచి తనకు సంక్రమించిన సింహాసనమును సుస్థిరము చేసికొనదలచెను. ఇందుకు అతడు పోరాడవలసి వచ్చిన శత్రువులలో ముఖ్యుడు హేము అనబడు హిందూ నాయకుడు. ఇతడు హుమాయూన్ మరణించిన సమయమున అక్బరు ఢిల్లీకి దూరముగ పంజాబ్‌లో ఉండుట చూచి ఢిల్లీసింహాసనమును తాను ఆక్రమించెను. అక్బరు తన శ్రేయోభిలాషి అయిన బైరాంఖాన్ సహాయముతో ఢిల్లీ వైపునకు సైన్యముతో సాగెను. ఇరుపక్షములవారు పానిపట్టువద్ద పోరాడిరి. 1556 న జరిగిన ఈ రెండవ పానిపట్టు యుద్ధములో మొదటి పానిపట్టు యుద్ధమునందువలెనే మొగల్‌లకే విజయము లభించినది. ఢిల్లీ రాజ్యము మొగల్ యోధుని మరల వరించినది. తదుపరి అక్బరు తన సింహాసనమునకై ప్రయత్నించుచున్న పంజాబ్, బీహార్ ప్రాంతములందలి పాలకుల బెడదను తప్పించుకొనగలిగెను. 1560 నాటికి శత్రుపీడ వదలి ఢిల్లీసింహాసనము అక్బరుకు దక్కినది.

అపుడు తన రాజ్యమును విస్తరింపచేయుటకు అక్బరు దిగ్విజయము ప్రారంభించెను. మొదట మాల్వా, గోండ్వానా ప్రాంతములను జయించెను. అంతట అతడు ప్రముఖమైన రాజపుత్ర రాజ్యములను లోబర్చుకొనుటకు పూనుకొనెను. ఆ రాజ్యముల ఎడ అతడు వీలయినంతవరకు సామోపాయమును, అవసరమైనంతవరకు దండోపాయమును ప్రయోగించెను. ఇందుకు ఫలితముగ జయపూర్, జోధ్‌పూర్, బికనీర్, జయసాల్మర్ రాజులు అక్బరునకు తమంతట తామే లోబడి, మైత్రి చేసికొని సామంతులు అయిరి. మొగల్ చక్రవర్తి వారికి ప్రతిఫలముగ గొప్ప ఉద్యోగములను ఇచ్చి గౌరవించెను. అయితే, మేవాడ్ రాజ్యపాలకులు అట్లు లోబడక ఎదిరించిరి. అందువలన అక్బరు చిత్తోడు దుర్గమును ముట్టడించెను. ప్రభువయిన ఉదయసింగ్ మొగల్ చక్రవర్తితో పోరాడుటకు భయపడి పారిపోయెను కాని, దుర్గములోని రాజపుత్ర వీరులు ధైర్యసాహసములతో చాలరోజులు పోరాడి, చివరకు లొంగిపోయిరి. ఇది మొగల్ యోధునకు ఘనమైన విజయము. దీనితర్వాత ఇతర రాజపుత్ర దుర్గములయిన రణథంభోర్, కలంజర్‌లు స్వాధీనమైనవి. అయినను మేవాడ్ రాజ్యమునకు ఉదయసింగ్ తర్వాత పాలకుడయిన రాణాప్రతాపసింగ్ [చూ.] మొగల్ చక్రవర్తిని ఎదిరించి, చిత్తోడు దుర్గమును సాధించి, తన ఆత్మగౌరవమును, వంశప్రతిష్ఠను నిరూపించుకొనుటకు దీక్షవహించెను. యుద్ధములో ఓడిపోయినను, చిత్తోడును స్వాధీనము చేసుకొనలేక పోయినను, స్వాతంత్ర్యము కొరకు తన సర్వస్వమును త్యాగముచేసిన పరాక్రమశాలిగ పేరుపొందెను. ఇట్లు రాజపుత్ర పాలకులను అక్బరు లోబర్చుకొనెను.

పశ్చిమ దిశను ఉన్న గుజరాత్ రాజ్యమువైపు అక్బరు దృష్టిని మరల్చి దానిని క్రమముగ స్వాధీనపర్చుకొనెను. అపుడు పశ్చిమతీరమువరకు మొగల్ సామ్రాజ్యము వ్యాపించినది. అంతట తూర్పుతీరమువరకు తన సామ్రాజ్యమును విస్తరింపచేయవలెనను అభిలాష అతనికి కలిగెను. అందుకై అతడు బెంగాల్ రాజ్యమును, దాని వెంటనున్న ఒరిస్సా ప్రాంతమును కలుపుకొనెను.

తదుపరి కాబూల్ రాజ్యము, కాశ్మీర్ ప్రాంతము, సింధు, బెలూచిస్తాన్, కాందహార్ రాజ్యములు ఆక్రమింపబడినవి. ఇంతటితో ఉత్తర హిందూదేశము అంతయు మొగల్ సామ్రాజ్యములో చేరిపోయినది.

అంతట అక్బరుసమ్రాట్ దక్షిణ దేశమునుకూడ జయింప సిద్ధపడెను. దేశమును అంతను ఏకచ్ఛత్రాధిపత్యము క్రిందికి తీసుకురావలెనను ఉద్దేశము ఇందుకు

ప్రధాన కారణము. కాని, ఈ యత్నమున అతడు సంపూర్ణముగ కృతకృత్యుడు కాలేదు. అహమద్‌నగర్, బీరార్, ఖాన్‌దేశ్ ప్రాంతములు మాత్రము అతని ఆధిపత్యమునకు లోబడినవి.

పై దిగ్విజయముల ఫలితముగ 1605 నాటికి అక్బరు సామ్రాజ్యము అత్యధిక విస్తీర్ణము పొందినది. అది పశ్చిమమున కాబూల్ నుండి తూర్పున బెంగాల్ వరకు, ఉత్తరమున హిమాలయపర్వతములనుండి దక్షిణమున భీమా నదీతీరము వరకు వ్యాపించినది. అది వివిధ భూభాగములను, అనేక జాతులను లీనము చేసికొన్నది. దానియందు కాబూల్, లాహోర్, ముల్తాన్, ఢిల్లీ, ఆగ్రా, ఔధ్, అలహాబాద్, అజ్మీర్, గుజరాత్, మాల్వా, బీహార్, బెంగాల్, ఖాన్‌దేశ్, బీరార్, అహమద్‌నగర్ అను 15 సుబాలు (రాష్ట్రములు) చేరి ఉండినవి.

ఇటువంటి మహాసామ్రాజ్యమును నిర్మించిన అక్బరు యోధాగ్రేసరుడు మాత్రమే కాక ప్రశంసింపదగిన పరిపాలనాదక్షుడు కూడ. అంతేగాదు, అతడు గొప్ప సాంఘిక సంస్కర్త; మతప్రవక్త; సారస్వతాభిలాషి; లలిత కళాపోషకుడు. ఈ వివిధ రంగములలో ఈ మహామహుడు సాధించిన ఘనవిజయములు మరొకచోట వర్ణింపబడినవి [చూ. పు. 260].

జహంగీర్ - షాజహాన్: అక్బరు చక్రవర్తి మరణించినంతట అతని జ్యేష్ఠపుత్రుడు సలీం జహంగీర్ (1569 - 1627) అను పేరుతో ఢిల్లీ సింహాసనమును ఎక్కెను. తండ్రివలె ఇతడు కూడ మొగల్ సామ్రాజ్యమును విస్తరించుటకు ప్రయత్నించెను [చూ. జహంగీర్ పు. 476]. మొదట తనకు ఎదురు తిరిగిన ఖుస్రూ రాజకుమారుని దండించి బంధించెను. ఈ సందర్భమున రాజకుమారునికి చేయూతనిచ్చిన సిక్కు గురువు అర్జున్ అను అతనిని కూడ కారాగారమున పడవేసి, అంతమొందించెను. తదుపరి మొగల్ చక్రవర్తి అధికారమును త్రోసిపుచ్చిన బెంగాల్‌నందలి ఆఫ్ఘన్ సామంతుని, రాజపుత్ర ప్రభువయిన మేవాడ్ రాణాను వశపర్చుకొనుట జరిగినది. సామ్రాజ్యమునందలి తిరుగుబాటులను అణచివేసిన తర్వాత జహంగీర్ దృష్టి దక్కన్ వైపుకు మరలినది. అక్బరుచక్రవర్తి కాలమున లొంగియుండి, తన అనంతరము తలయెత్తిన అహమద్‌నగర్ రాజ్యమును లోబర్చుకొనుటకు యుద్ధము సాగినది కాని, అది పూర్తిగ ఫలించలేదు. ఉత్తరదిశన పంజాబ్‌నందున్న కాంగ్డా కోటను ముట్టడించి, మొగల్ సైన్యము దానిని ఆక్రమించినది. పశ్చిమోత్తర సరిహద్దున ఉన్న కాందహార్ రాష్ట్రమును ఈ మొగల్ చక్రవర్తి తన అధీనమునందు ఉంచుకొనలేక పోయెను. ఇక, ఇతని పాలనాకాలము ముగింపుదశలో సామ్రాజ్యము ఆంతరంగికకల్లోలముల పాలయినది. ఇందుకు ముఖ్యకారణము ఈ చక్రవర్తికి ప్రియపత్ని అయిన నూర్జహాన్ అధికార వ్యామోహముతో చేసిన ప్రయత్నములు. వీనిని జహంగీర్ కుమారుడు, పరాక్రమవంతుడు అయిన ఖుర్రం ప్రతిఘటింపసాగెను. వీరు ఇరువురి మధ్య జరిగిన సంఘర్షణవలన 1622 - 27 నడుమ సామ్రాజ్యము కల్లోలితమైనది.

జహంగీర్ చనిపోయిన తర్వాత అతని కుమారుడు ఖుర్రం (1627 - 1658 ప.) షాజహాన్ అనుపేర 1628 లో సింహాసనము అధిష్ఠించెను. ఇతడు 30 ఏండ్లు పాలించెను. ఇతని పరిపాలనాకాలమున మొగల్ సామ్రాజ్య వైభవము అత్యున్నతమైనదని కొందరు చరిత్రకారుల అభిప్రాయము. సామ్రాజ్య విస్తరణ, దానియందలి శాంతిభద్రతలు, సిరిసంపదలు మొదలయినవాని దృష్ట్యా పై అభిప్రాయమును చాలవరకు సమర్థింపవీలగును.

షాజహాన్ చక్రవర్తి తాత ముత్తాతలవలెనే పరాక్రమశాలి; యోధుడు. వారివలె తాను కూడ సామ్రాజ్య విస్తరణకు పాటుబడెను. ఇందుకు ఉత్తర - దక్షిణ దిశలందు సమరము సాగించెను. దక్కన్‌నందు అహమ్మద్‌నగర్ సామ్రాజ్యము అక్బరుకాలమునుండి పూర్తిగ మొగల్‌లకు లొంగి ఉండలేదు. దానిని పూర్తిగా ఓడించి, షాజహాన్ చక్రవర్తి, బీజపూర్‌సుల్తాన్ పంచుకొనిరి. గోల్కొండ నవాబు తనంతటతానే లొంగిపోయెను. బీజపూర్ సుల్తాన్ కూడ షాజహాన్ సార్వభౌమత్వమును అంగీకరింపక తప్పలేదు. ఈ విధముగ దక్కన్‌నందు ఉన్న ముఖ్యరాజ్యములు మొగల్‌చక్రవర్తికి లోబడినవి. వాయవ్యమునను, మధ్య ఆసియాప్రాంతమునను గల కాందహార్, బాల్క్, బదఖాన్ అను ప్రదేశములను మొగల్ సార్వభౌముడు ఆక్రమించుకొనుటకు అనేక ప్రయత్నములు చేసెను. తాత్కాలికముగనైనను అతని ఆశయము నెరవేరినది.

షాజహాన్ కాలమున మొగల్ సామ్రాజ్యము విస్తరించినది. అయితే, కడకు అది రాజకుటుంబమునందు చెలరేగిన ఆంతరంగికకలహములవలన బలహీనమైనది. ఈ చక్రవర్తి చరమదశలో కుమారుడైన ఔరంగజీబ్‌చేత నిర్బంధమునందు ఉంచబడి, మర్యాదను కోల్పోయి, హీనదశలో మరణించెను.

ఔరంగజీబ్: ఔరంగజీబ్ 1658 న సింహాసనమును ఆక్రమించి 1707 వరకు పాలించెను [చూ. పు. 364]. ఇతని పాలనాకాలము చాల దీర్ఘమైనది (దాదాపు అర్ధ శతాబ్దము) మాత్రమేగాక చాల గమనింపదగినది కూడ. అనగా,

ఆ కాలమునందే మొగల్ సామ్రాజ్యము ఉచ్ఛస్థితిని అందుకొనుటయు, అధోగతికి దిగజారుటయు జరిగినది. ఇదంతయు ఒక విధికృతమైన, విచిత్రమైన సంఘటనగ కనబడును.

వ్యక్తిగ ఔరంగజేబ్ పరిశుద్ధమైన వర్తనగలవాడు. మరికొన్ని సుగుణములు కూడ కలవాడే. కాని, పరిపాలకుడుగ అతనికి అవశ్యకమైన కొన్ని లక్షణములు లేవు. ముఖ్యముగ సహనము, విశాలహృదయము, దూరదృష్టి లోపించినవి. అందువలన అమోఘమైన శక్తియుక్తులు కలిగియుండి కూడ వివిధ జాతి-మతములకు చెందిన ప్రజానీకమును పాలించు ప్రభువుగ అపజయము పొందెను. హిందువులు బహుసంఖ్యాకులుగ ఉన్న భారతదేశమును అల్పసంఖ్యాకులకు సంబంధించిన ఇస్లామ్‌మత విశ్వాసములను అనుసరించి, పాలించి పరాజయమొందిన పాలకుడు ఇతడు.

సింహాసనమును సంపాదించుకొనుటకును, సంపాదించిన దానిని సుస్థిరముగ తన అధీనమునందు ఉంచుకొనుటకును ఇతడు రక్తపాతములో మునిగి తేలెను. బంధువులతో, మిత్రులతో, శత్రువులతో, సర్వమతములవారితో ఆమరణాంతము అనేక యుద్ధములు చేసెను.

ఇతని పాలనాకాలమునందు మొదటి ఘట్టము 1658 నుండి 1681 వరకు. ఇందు ఈ మహమ్మదీయ చక్రవర్తి మహమ్మదీయేతరులను (హిందువులను, సిక్కులను) పీడించుట, వారు తిరుగబడుట, వారిని అణగద్రొక్కుట గమనింపదగు ముఖ్య విశేషములు.

సింహాసనమును ఎక్కక పూర్వమే గుజరాత్ రాష్ట్ర పాలకునిగ ఇతడు హిందువుల ఎడ తనకు గల ద్వేషమును కనబరచెను. ఢిల్లీసింహాసనమును ఎక్కి రాజ్యాధికారమును చలాయించుట మొదలిడిన తర్వాత హిందూ మతావలంబకులను నిందించుట, పీడించుట మరింత ఎక్కువైనది. హిందువులు అనేకులు ప్రభుత్వ ఉద్యోగములనుండి తొలగింపబడిరి. హిందువులపై నిందార్హమైన జిజియా పన్ను విధింపబడినది. ఇటువంటి పీడనను సహించక, ఉత్తర భారతదేశమునందలి జాట్, బుందేల్, సత్‌నామి జాతుల ప్రజలు ప్రభువుపై తిరుగబడిరి. తేజ్‌బహదూర్ అను సిక్కు గురువు చక్రవర్తిని తీవ్రముగ విమర్శించెను. రాజపుత్రస్థానమునందు ఉన్న మేవాడ్, మార్వార్ రాజ్యములందలి నాయకులు మొగల్‌సార్వభౌముని ఎదిరించిరి. అయితే, వీరినందరిని అతడు లోబర్చుకొనగలిగెను. అంతేగాక, ఈ మొగల్ యోధుడు సామ్రాజ్యమునకు తూర్పు సరిహద్దున గల కూచ్ బీహార్, అస్సామ్, తూర్పు బెంగాల్ ప్రాంతములను, పశ్చిమోత్తర సరిహద్దున ఉన్న పఠాన్ జాతివారు నివసించు ప్రదేశమును జయించి, తన సామ్రాజ్యమున కలుపుకొనెను. ఇంతటితో ఇతని పాలనా చరిత్రలో మొదటి ఘట్టము ముగిసినది.

రెండవది 1681 న ప్రారంభమై ఔరంగజేబ్ పాలనా కాలము చివరవరకు అనగా 1707 వరకు సాగినది. దీనియందు ఈ ఢిల్లీ సామ్రాజ్యాధినేత ఉత్తర దేశమును వదలి దక్షిణమున దక్కన్‌నందు కుటుంబపరివార సమేతముగ విడిదిచేసి, రాజకార్యములను నెరవేర్చెను. ఈ బదిలీ దక్కన్‌నందలి బీజపూర్, గోల్కొండ సుల్తాన్‌లను, మహారాష్ట్రులను సులభముగ అణగద్రొక్కుటకుగాను చేయబడినది. మహమ్మదీయులైనను షియా తెగకు చెందిన బీజపూర్, గోల్కొండ సుల్తాన్‌లు స్వతంత్రులగుటను సహింపనేరక, సున్నీ తెగకు సంబంధించిన ఈ సమ్రాట్ వారిని ఓడించి, వారి రాజ్యములను ఆక్రమించెను. అంతట క్రమముగా పెరుగుచున్న మహారాష్ట్ర ప్రమాదమును నిర్మూలించుటకు సిద్ధపడెను. ఈ సమయమున మహారాష్ట్రులు శివాజీ [చూ.] నాయకత్వమున దక్కన్ సుల్తాన్‌లను, మొగల్ చక్రవర్తిని ఎదిరించి, స్వరాజ్యము సంసాదించుకొనుటకు ప్రయత్నింపసాగిరి. ఈ మహారాష్ట్ర ఉద్యమ చరిత్ర వేరొకచోట విపులముగా వర్ణింపబడును గాన, ఇచట క్లుప్తముగ సూచింపబడును [చూ. మహారాష్ట్రులు]. శివాజీ జీవితకాలమున ఔరంగజేబ్ తన సేనానులనే అతనిపైకి పంపి పోరాటము సాగించెను. తన జీవితాంతమువరకు - అనగా 1680 వరకు - శివాజీ మొగల్ సామ్రాజ్యముపై సమరము సాగించుచునే ఉండెను. శివాజీ మరణానంతరము అతని కుమారుడు శంభూజీ సమరమును ప్రారంభించెను. అయితే, ఔరంగజేబ్ అతనిని పట్టుకొని అంతమొందించెను. అంతేగాక శంభూజీ తనయుడైన సాహును కూడ లోబర్చుకొని తన అదుపునందు ఉంచుకొనెను. దీనితో మహారాష్ట్రుల వ్యతిరేకోద్యమము కుంటుబడి, దక్కన్ అంతయు మొగల్ చక్రవర్తికి వశమైనది. ఇంకను దక్షిణమున తంజావూరు, తిరుచినాపల్లి ప్రాంతములు నామమాత్రముగనైన అతనికి లోబడినవి.

ఇటుల 1690 న మొగల్ సామ్రాజ్యము అత్యధికమైన విస్తీర్ణమును పొందగలిగినది. కాని, ఇటువంటి ఉచ్ఛస్థితి తాత్కాలికమేయైనది.

త్వరలో ఔరంగజేబ్ శత్రువులు నలువైపుల తలయెత్తి అతనిని బాధింప మొదలిడిరి. వీనిలో పంజాబ్‌నందలి సిక్కులు, దక్కన్‌నందు ఉన్న మహారాష్ట్రులు ముఖ్యులు. మహారాష్ట్రులవలన గలిగిన ప్రమాదమును అంత

మొందించుటకు ఔరంగజేబ్ తన శక్తినంతను వినియోగించి పోరాడి చివరకు తానే అంతము నొందెను. దక్కన్‌లోని మహారాష్ట్ర ప్రతిఘటన అతని ప్రాణ, మానములను హరించినది. నిరాశ, నిస్పృహలవలన పీడింపబడి అతడు 1707 న అహమద్ నగరమునందు మరణించెను.

మొగల్ సామ్రాజ్య విచ్ఛిన్నము : ఔరంగజేబ్ పాలనా కాలము చివరన మొగల్ సామ్రాజ్యములో ప్రారంభ మయిన అధోగతి అతని మరణానంతరము (1707) మరింతగా ప్రబలమైనది. అతని తర్వాత ఢిల్లీ సింహాసనము ఎక్కిన మొగల్ వంశ ప్రభువులు బలహీనులయి, మంత్రుల, సామంతుల చేతులలో కీలుబొమ్మలయిరి. సామ్రాజ్య ములో వివిధ వర్గముల మధ్య కీచులాటలు బయలుదేరగా శత్రువులు దండయాత్రలు సాగించుట, సామంతులు స్వతంత్రరాజ్యములను ఏర్పాటు చేసికొనుట జరిగినది. 1720-1748 నడుమ సింహాసనము అధిష్టించిన మహమ్మద్ షా కాలమున పారసీకదేశ ప్రభువయిన నాదిర్ షా దండ యాత్ర సాగించెను. మహారాష్ట్రులు, సిక్కులు సామ్రాజ్య మును కల్లోలపరచిరి. ఇటువంటి స్థితిలో దక్కన్, బెంగాల్, ఔధ్ ప్రాంతములను పాలించు సామంతులు స్వతంత్ర రాజ్యములను ఏర్పాటు చేసికొనిరి. ఈ విధముగ మొగల్ సామ్రాజ్యము విచ్ఛిన్నమగుట, సార్వభౌముడు మొదట మహారాష్ట్రులకు, తర్వాత బ్రిటిష్‌వారికి లోబడి ఉండుట సంభవించినది.

మొగల్ సామ్రాజ్య విచ్ఛిన్నము - ముఖ్య కారణములు : ఇపుడు మొగల్ సామ్రాజ్యము 18 వ శతాబ్ది మొదటి అర్ధభాగములో విచ్ఛిన్నము అగుటకు సంబంధించిన ముఖ్య కారణములు క్లుప్తముగ సూచింపబడును. సామ్రాజ్యము నందలి స్థితిగతులను ముందు పరిశీలింపవలసి ఉన్నది. ఔరంగజేబ్ చక్రవర్తి పాలనాకాలముననే సామ్రాజ్యము బలహీనమైనది. పరమతపీడనతో కూడిన అతని విధాన ములవలన రాజపుత్రులు, మహారాష్ట్రులు, సిక్కులు మొగల్ సామ్రాజ్యమునకు విరోధులయి, దానిని చీకాకుపర్చిరి. అతని తర్వాత సింహాసనము ఎక్కిన మొగల్ చక్రవర్తులు నీతి - నియమములుకాని, శక్తి సామర్థ్యములుకాని కల వారు కారు. పైగా సింహాసనమును సంపాదించుటకుగాను రాజవంశములో అంతఃకలహములు చెలరేగి ప్రభుత్వమును, ప్రజలను కల్లోలముపాలు చేసినవి. సమ్రాట్ దృష్టి సింహాస నముపైనే నిల్చి ఉండగా సామంతులు తమ స్వాతంత్ర్య సముపార్జనకై పాటుబడుచుండిరి. చాలకాలముగ సాగిన అంతఃకలహములవలన, విదేశీయదండయాత్రల వలన సైన్యము శక్తిని కోల్పోవుట, కోశాగారము ఖాళీయగుట సంభవించినది. అవినీతిమార్గమున బడిన ప్రభుత్వముక్రింద అనేక బాధలను అనుభవించిన ప్రజానీకమునందు ప్రభుత్వము ఎడ భక్తి శ్రద్ధలు నశించినవి. సామ్రాజ్యము బహు విస్తారమై నందున దానియందు ప్రభుత్వవ్యతిరేకశక్తులు నలుమూలల లేచినవి. ఈ కారణములవలన సామ్రాజ్యము చాల బలహీనమైనది.

ఇటువంటి శక్తిహీనమైన సామ్రాజ్యము దురాశా పరులయిన విదేశీయోధుల దండయాత్రలకు గురియైనది. పరిష్యానుండి నాదిర్ షా, అతని తర్వాత ఆఫ్ఘనిస్తాన్ నుండి అహ్మద్ షా అబ్దాలీ సామ్రాజ్యముపై దాడులు జరిపి, దానిని కష్టనష్టములపాలు చేసిరి.

ఆంతరంగికముగ బలహీనమై, బాహ్యముగ దురా క్రమణదారుల దాడులకు గురియై మొగల్ సామ్రాజ్యము కూలిపోయినది.

మొగల్ సామ్రాజ్యము - పాలనా విధానము : ఇందు ముఖ్యముగ గమనింపదగినది మొగల్ చక్రవర్తులు ప్రజల ఎడ పాటించిన పద్ధతి. సామ్రాజ్యము సుస్థిరముగను, చిరస్థాయిగను ఉండుటకు అందలి ప్రజాబాహుళ్యము పాలకుల ఎడ ప్రేమాభిమానములు కలిగి ఉండుట ఆవశ్య కము. అందుకు అనుగుణ్యమగు విధానమును అనుస రించుట ప్రభువుల కర్తవ్యము. మొగల్ పాదుషాలు మహమ్మదీయులు; వారిక్రింది ప్రజలలో బహు సంఖ్యాకులు హిందువులు. అందువలన ప్రభువులు తమ పరిపాలనవలన దేశములో అల్పసంఖ్యలో ఉన్న మహమ్మదీయులనే గాక, అత్యధిక సంఖ్యలో ఉన్న హిందువులను రంజింప వలసి ఉండెను. అపుడు పాలకులకు, పాలితులకు మధ్య సామరస్యము, స్నేహము పెరిగి వారిరువురికి సంక్షేమము సమకూరెడిది. ఈ సత్యమును అక్బరు చక్రవర్తి పూర్తిగా గ్రహించి, దానిని తన పరిపాలనలో పాటించెను. అతని సంస్కరణలు అన్నియు అందుకు అనుగుణ్యముగ రూపొందించబడినవి. వానిద్వారా ఈ మహనీయుడు హిందూ - మహమ్మదీయ ప్రజలను అందరిని ఏకజాతిగ సమ్మేళనముచేసి, తన సామ్రాజ్యమును భారతజాతీయ రాజ్యముగ సంస్కరించి, తాను జాతీయపాలకుడుగ దేశముయొక్క పురోగతిని పెంపొందింప యత్నించెను. ఈ విధానమును చాలవరకు చెదరకుండ జహంగీర్, కొన్ని మార్పులతో షాజహాన్ అవలంబించిరి. కాని, ఔరంగజేబ్ చేతిలో అది హతమైనది. ముస్లిమేతర దేశమైన హిందూ దేశమును ముస్లిమ్ (అందును సున్నీ తెగకు చెందిన ముస్లిమ్) రాజ్యముగ మార్చుటయే అతని ఉద్దేశము. పరమత ద్వేషము అతని రాజకీయములను కల్మషము చేసినది.

ఇందుకు ఫలితము - ప్రభువు బలహీనుడగుట, ప్రజా బాహుళ్యము పీడింపబడుట, సామ్రాజ్యము విచ్ఛిన్నమగుట.

మొగల్ సామ్రాజ్యము - పాలనా యంత్రము : ఇపుడు మొగల్ చక్రవర్తుల పాలనా యంత్రమును పరిశీలింతము. దీనిని రూపొందించినవాడు అక్బరు. దీనియందు భారత, పారసీక, అరేబియా దేశముల ప్రభుత్వ లక్షణములు మిళితమై ఉన్నవి. పరదేశ సంప్రదాయములు భారతదేశ సంప్రదాయములకు, జీవిత పరిస్థితులకు అనుగుణముగ అవలంబింపబడినవి. ఈ ప్రభుత్వ పద్ధతియే చాలకాలము కొద్ది మార్పులతో కొనసాగినది.

మొగల్ సామ్రాజ్యమున సాగినది అనువంశికమైన ప్రభుపాలన. ప్రభువు స్థానము అత్యున్నతమైనది. అతని అధికారము నిరంకుశమైనది. పాలన అంతయు అతని స్వేచ్ఛానుసారము సాగుచుండెడిది. అయినను అక్బరు, జహంగీర్‌లు తమ అధికారమును ప్రజాక్షేమముకొరకు వినియోగించిరి. ముఖ్యమైన విషయములపట్ల సలహా సంప్రదింపుల నిమిత్తము మంత్రివర్గము ఉండెను. మంత్రులలో వకీలు, దివాను, బక్షీ ముఖ్యులు. వీరు ఆర్థిక, సైనిక విషయములలో ప్రభువుకు సలహాను ఇచ్చి తోడ్పడుచుండెడివారు. వీరుగాక, సామ్రాజ్యపాలనను సాగించు ఉద్యోగులు అనేకులు కలరు. వీరు సైనికోద్యోగులుగ ఉండి సాధారణపాలనను కూడ సాగించిరి. వీరిని మన్సబ్దారులు అనిరి. వీరు అనేక తరగతులుగ విభజింపబడిరి.

మొగల్ సామ్రాజ్యము పాలనాసౌకర్యము నిమిత్తము సుబాలు, సర్కారులు, పరగణాలు అను భాగములుగ విభజింపబడినది. గ్రామములు చివర భాగమునకు చెందినవి. సుబాల పాలనాపద్ధతి కేంద్రప్రభుత్వ పద్ధతిని అనుసరించి ఉండెడిది. సుబాలు సుబేదారుల అధీనమున ఉండెడివి. వీరు ఇతర పాలనాభాగముల కార్యకలాపములను కనిపెట్టి ఉండెడివారు.

కేంద్రప్రభుత్వమునందలి చక్రవర్తి పర్యవేక్షణ సుబాలపై ఎక్కువగ ఉండెడిదికాదు. మారుమూలల ఉన్న సుబాలను అదుపునందు ఉంచుట కష్టసాధ్యమే.

గ్రామములందు సంప్రదాయముగ సాగుచున్న గ్రామ స్వపరిపాలనమును మొగల్ చక్రవర్తులు సాగనిచ్చిరి. గ్రామసభలు ఆ యా ప్రాంతములకు సంబంధించిన వ్యవహారములను, పూర్వాచారములను అనుసరించి పరిష్కరించెడివి.

పట్టణములలో కొత్వాలులు శాంతిభద్రతలను కాపాడెడివారు. కాజీలు న్యాయస్థానములందు నేరములను విచారించి నేరస్థులకు శిక్ష విధించుచుండిరి.

మొగల్ సామ్రాజ్యమునందలి న్యాయవిచారణ విధానము ఎన్నదగినది. అక్బరుకు పూర్వము దేశమును పాలించిన షేర్ షా న్యాయనిర్వహణ, నేరస్థుల శిక్షణ సంతృప్తికరముగ ఉండునట్లు ఏర్పాటు చేసెను. మొగల్ చక్రవర్తులలో జహంగీర్, షాజహాన్ న్యాయవిచారణ పట్ల కనబరచిన ఆసక్తిని నాడు దేశమున పర్యటించిన పాశ్చాత్యులు సైతము ప్రశంసించిరి. శిక్షలు కఠినమైనవేగాని ఆకాలమున అట్టివి సర్వసామాన్యములే.

శాంతి భద్రతలను కాపాడుటకు, సామ్రాజ్య విస్తరణకు తగిన సైన్యమును మొగల్‌లు సమకూర్చుకొనిరి. అశ్వదళము, పదాతిదళము, శతఘ్నిదళము దానియందు ముఖ్యభాగములు. నౌకాదళము కూడ ఉండెడిది. ప్రభువుయొక్క స్వంతయాజమాన్యమున ఉండిన సైన్యము కొద్దిదే. దానికి తోడుగ సామంతులుగ ఉన్న మన్సబ్దారులు చక్రవర్తికి సహాయముగ సైన్యమును అందించుచుండెడివారు. అక్బరు తన సైన్యమును శక్తిమంతముగ ఉండునట్లును, మోసము జరుగకుండునట్లును సంస్కరణలను ప్రవేశపెట్టెను. కాని, ఔరంగజేబ్ తర్వాతి పాలకుల కాలమున సైన్యము నిర్వీర్యమైనది.

మొగల్ ప్రభుత్వ పద్ధతిలో ప్రశంసింపదగినది భూమి శిస్తు విధానము. ఇందును అక్బరు తనకు ముందు పాలించిన షేర్ షా సంప్రదాయమును పాటించెను. దీనిని రూపొందించుటలో అతడు తన ఉద్యోగి అయిన రాజా తోడరుమల్లు [చూ. పు. 524] సహాయమును పొందెను. భూమిని కొలుచుట, సారమునుబట్టి దానిని తరగతులుగ విభజించుట, వేర్వేరు తరగతులకు వేర్వేరు విధములుగ శిస్తును నిర్ణయించుట ఈ విధానమునందలి ముఖ్య లక్షణములు. పండిన పంటలో మూడవవంతును ప్రభుత్వమునకు ధాన్యరూపమునగాని, ధనరూపమునగాని చెల్లింపవలసి ఉండెను. రైతుల మీద ఇతర చిల్లరపన్నులు తొలగింపబడినవి. వారి క్షేమముకొరకు వారికి ఋణమును ఇచ్చుట, శిస్తు మినహాయింపులను అంగీకరించుట మొదలగు సౌకర్యములు ఏర్పాటు చేయబడినవి. అక్బరు చక్రవర్తి నెలకొల్పిన భూమిశిస్తు విధానమును పాశ్చాత్య చరిత్రకారులు కూడ ప్రస్తుతించిరి.

భూమిశిస్తుగాక, ఇతర ఆదాయములు కూడ మొగల్ ప్రభువులకు ఉండెడివి. ఇవి వ్యాపారమునకు సంబంధించిన సుంకములు, నజరానాలు మొదలగునవి. మొగల్ చక్రవర్తుల సాలుసరి ఆదాయము అధికమైనదే. షాజహాన్ కాలమున అది 22 కోట్ల రూపాయల విలువగలిగినదని ఒక అంచనా.

తమ ఆదాయమును మొగల్ ప్రభువుల సైన్యమును, పాలనాయంత్రములను భరించుటకే గాక, సారస్వతాభివృద్ధికి, లలితకళా పోషణకు, ధర్మకార్యములకు వినియోగించెడివారు.

ఈ పాలనాపద్ధతిని ముగించునపుడు దాని స్వభావమును గురించిన ఒకమాట. మొగల్ ప్రభుత్వము నిరంకుశమైన ఏకసత్తాకము అయినను అది చాలకాలము ప్రజాశ్రేయస్సుకు పాటుబడినది. సామ్రాజ్యమున శాంతి భద్రతలను కాపాడుటతోనే తృప్తిపడి ఉండక, అక్బరు, జహాంగీర్, షాజహాన్‌లాంటి ప్రభువులు కరువుకాటకములందు సామాన్యజనమును పోషించి, వ్యవసాయ, వాణిజ్యములను పెంపొందించి, కవులను, పండితులను ఆదరించి, భవన నిర్మాణ, చిత్రలేఖనాది కళలను ప్రోత్సహించి, అనేక దానధర్మములను ఆచరించి, తమ రాజ్యమును శ్రేయోరాజ్యముగ సంస్కరించిరి.

మొగల్ సామ్రాజ్యము - సంఘ వ్యవస్థ : ఇపుడు మొగల్‌ల కాలపు ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక జీవితమందలి పరిస్థితులను పరిశోధింతము. ఈ సందర్భమున దృష్టిని ప్రభువుల మీదనేగాక ప్రజల మీదకు కూడ మరల్చుట యుక్తము. పైన పేర్కొనిన వివిధ పరిస్థితులను పరిశీలించునపుడు హిందూ - మహమ్మదీయుల మధ్య గల సంబంధమును గమనించుట ప్రయోజనకరము. ఈ రెండు పక్షముల మధ్య సంఘర్షణ క్రమముగ సామరస్యమునకు, సమ్మేళనమునకు తావిచ్చినట్లు తెలియనగును. ప్రశంసాపాత్రమైన ఈ పరిణామము ఢిల్లీసుల్తాన్‌ల పాలనాకాలముననే ప్రారంభమైనది. అది మొగల్ పాదుషాల పరిపాలనలో పెరిగినదని చెప్పవచ్చును. అది అక్బరు చక్రవర్తి యాజమాన్యమున ఎట్లు పుష్పించి, ఫలించినది అందరికి విదితమే. తర్వాత కాలమున కూడ అది సమసిపోక కొనసాగినది.

నాటి సంఘము వివిధ తరగతులుగ విభజింపబడి ఉండినది. అన్నిటికన్న పై అంతస్తున ప్రభువు, దానికి క్రింది అంతస్తును ఆక్రమించి సామంత ప్రభువులు ఉండిరి. తర్వాత వరుసగా వ్యాపారస్తులు, ఉన్నతోద్యోగులు, సేవకులు, కూలినాలి జనము. పై రెండు తరగతులవారు భోగభాగ్యములను అనుభవించుచుండగ, చివర తరగతిలోని శ్రామికుల జీవితము దుర్భరముగ ఉండెడిది. ఉత్తమ, మధ్యమ, అధమ అంతస్తులలో హిందువులు, మహమ్మదీయులు కూడ ఉండిరి.

ఇతరమైన సాంఘిక విభాగములు హిందువులకు, మహమ్మదీయులకు చాలవరకు ఒకే విధముగ ఉండెడివి. ఉదాహరణమునకు : హిందువులలో రాజపుత్ర, జాట్ జాతులవారు ఉన్నట్లు, మహమ్మదీయులలో పర్షియన్‌లు, పఠాన్‌లు, తురుష్కులు ఉండిరి. హిందువులలో శైవ, వైష్ణవుల రీతిగ మహమ్మదీయులలో షియాలు, సున్నీలు అను విభేదమునకు ప్రాముఖ్యము ఉండెడిది. హిందువులందు గుజరాత్, మహారాష్ట్ర ప్రాంతీయులు ఉన్నట్లు, మహమ్మదీయులందు దక్కన్, హిందూస్తానీ ప్రాంతీయులు ఉండిరి.

వివిధ వృత్తులను చేసికొని జీవించెడివారిలో రెండు మతములవారిని కాననగును. అట్లే రాజకీయోద్యోగములలో వారు ఇరువురికి స్థానము ఉండెడిది.

ఆచార వ్యవహారములలో హిందువులకు, మహమ్మదీయులకు కొన్ని వ్యత్యాసములు ఉన్నను, చాల సామ్యములు కూడ కనబడును. ఒకరినుండి మరొకరు వీనిని అనుకరించుటవలన ఇరుపక్షముల మధ్య సామ్యము ఏర్పడినది. వేషభాషలు, ఆటపాటలు వారికి ఒకే రకమైనవి. పండుగలను, పబ్బములను ఒకేరీతిగా జరుపుకొనెడివారు. హోలీ పండుగలో మొగల్ చక్రవర్తులేగాక, తర్వాత కాలమున సయ్యద్ సోదరులు, బెంగాల్‌ను పాలించిన సిరాజుద్దౌలా, మీర్ జాఫర్ సైతము సంతసముగ పాల్గొనెడువారట. అట్లే మొహరమ్ పండుగలో హిందువులు పాల్గొనుచుండెడివారు. దైనందిన జీవితములో కూడ రెండు మతములవారి మధ్య చాల సామ్యము ఏర్పడినది.

మద్యపానము, వ్యభిచారము, జూదము మొదలగు దురాచారములు మతభేదమును పాటింపక, అందరిని పీడించినవి. ధైర్యసాహసములు, దానధర్మములు మొదలగు సుగుణములను అందరు కొనియాడిరి.

నాటి హిందువులలో వరకట్నము, బాల్యవివాహము, సతీసహగమనములాంటి ఆచారములు ఉండెడివి. వీనిని అభ్యుదయ నిరోధములని ఎంచి అక్బరుచక్రవర్తి నిర్మూలించుటకు ప్రయత్నించెను. హిందూసంఘమున కులవ్యవస్థ సంప్రదాయానుసారముగ సాగుచునే ఉండెను.

మతము : మొగల్ సామ్రాజ్యమునందలి మతములలో హిందూ, ఇస్లామ్ మతములు ముఖ్యమైనవి. ఇవిగాక, జైన, క్రైస్తవ, జోరాస్ట్రియన్ మతములు కూడ ఉండెడివి. భిన్నమతములలోని సత్యమును గ్రహించవలెనని, వాని మధ్య సామరస్యమును ఏర్పర్చవలెనని, మత సమ్మేళనము ద్వారా సామ్రాజ్యమునకు శాంతిని, సుస్థిరతను సంపాదించవలెనని అక్బరు చక్రవర్తి యొక్క మహాసంకల్పము. అందుకు అతడు ప్రార్థనామందిరమగు ఇబాదత్‌ఖానాయందు పైమత ప్రచారకులను సమావేశపరచి, వారి

ఉపన్యాసములను విని, వానియందలి సత్యాసత్యములను గ్రహించి, సర్వమతసారముతో కూడిన 'దీన్ - ఇ - ఇలాహి' అను నూతన మతమును స్థాపించెను. దీనిని ప్రచారముచేయుటకు అత్యున్నతమైన మతగురువు 'ఇమామ్ - ఇ - ఆదిల్' గ అక్బరు చక్రవర్తియే అధికారము స్వీకరించెను. ఇది యొక విప్లవాత్మకమైన సంఘటన. దీనిని అక్బరు సమకాలీనులుగాని, తర్వాతి కాలమువారుగాని సరిగ అర్థము చేసికొనక ఆ మహా సంస్కర్తను నిందించిరి. మతసమైక్యము ద్వారా భారత జాతి సమైక్యతను సాధించుటయే అతని మహదాశయము. అంతేగాక, అతడు శక్తికలిగి ఉండియు తన నూతన మతమును ప్రజలు స్వీకరించునట్లు వారిని బాధింపలేదు. సర్వమతములను సమానముగ భావించి గౌరవించెను. మతసహనమును మాటలతో, చేతలతో చాటిన మహా ప్రభువగు అక్బరు చక్రవర్తి చూపిన త్రోవనుండి పూర్తిగా వైదొలగి పరమతపీడనను అవలంబించిన ఔరంగజేబ్ ప్రజలను హింసించి, తాను ఎట్లు బాధపడినది ఇది వరకే సూచింపబడినది. ఔరంగజేబ్‌నకు అగ్రసోదరుడగు దారాషుకో సూఫీ సిద్ధాంతమును, ఉపనిషత్తుల తత్త్వమును సంపూర్ణముగ గ్రహించిన పండితుడు.

నాటి హిందూ, మహమ్మదీయ మతములను అవలంబించిన వారిలో రెండు తరగతులవారు ఉండిరి. హిందువులందు పండితులు, ముస్లిమ్‌లందు మౌల్వీలు మొదటి తరగతికి చెందినవారు. వీరికి పాండిత్యము కలదు కాని, మత విషయములందు విశాల దృక్పథము లేదు. రెండవ తరగతిలోనివారు పామరజనము. వీరికి మూఢ నమ్మకములు, పూజా పునస్కారములు మెండు. దేవతలు - దయ్యములు, తీర్థములు - తిరునాళ్లు, ఉపవాసములు - సంతర్పణలు మొదలగువానికి వీరు ప్రాముఖ్యము ఇచ్చెడివారు.

ఆ కాలమున భక్తిమార్గమును బోధించిన గురువులను పై రెండు మతములందును కనుగొనవచ్చును. ఈ సందర్భమున పేర్కొనదగినవారు హిందువులందు రామానంద, జ్ఞానదేవులు; మహమ్మదీయులందు చిస్తి, కాదిర్ మొదలగువారు. వీరు ఏకేశ్వరోపాసనను, సర్వమానవ సౌభ్రాతృత్వమును. సన్యాసమార్గమును ప్రచారము చేసిరి. కుల మత భేదములను, మూఢ నమ్మకములను, సాంఘిక దురాచారములను ఖండించిరి.

సారస్వతము: ఇతర రంగములందు జరిగినట్లే ఇందును హిందూ - మహమ్మదీయ పక్షముల మధ్య సహకారము గోచరించును. దీని ఫలితముగ ఉర్దూభాష బయల్వెడలినది. పంజాబీ, హిందీ, పర్షియన్, అరబిక్ భాషల కలయికతో ఇది ఏర్పడినది. దక్కన్‌నందలి సూఫీ గురువులు దీనిని తమ భక్తిగీతములద్వారా ప్రచారము చేసిరి. ఉర్దూభాషను రూపొందించినవారిలో మొగల్ పరిపాలనా కాలమునాటి వలీ అను దక్కన్ కవీశ్వరుడు ప్రత్యేకముగ పేర్కొనదగినవాడు.

మొగల్ చక్రవర్తులలో అక్బరుకాలమున జరిగిన సారస్వత సేవ అత్యధికమైనది. అబుల్ ఫజల్, ఫైజి, నిజాముద్దీన్ అహమ్మద్, బదౌనీ పర్షియన్ భాషలో ప్రశంసింపదగిన గ్రంథములను రచించినవారు. హిందీ కవులలో తులసీదాస్ 'రామచరిత మానస' అను రామకథను, సూర్‌దాస్ 'సూర్‌సాగర్' అనుపేర కృష్ణలీలలను రచించి మానవ హృదయములను రంజింప చేసిరి.

ఇచట గమనింపదగిన విశేషము ఒకటి కలదు. అది హిందువులు, మహమ్మదీయులు ఒకరి భాషలలో మరొకరు పాండిత్యము సంపాదించి, ఉత్తమ గ్రంథములను రచించుట. అక్బరు ప్రోత్సాహముతో అనేక సంస్కృత గ్రంథములు పర్షియన్ భాషలోనికి అనువదించబడినవి. మహాభారత గాథలను ముస్లిమ్ కవులు 'రజ్మనామా' అను గ్రంథమున వర్ణించిరి. రామాయణమును బదౌనీ అనువదించెను. ఇబ్రహీం సర్ హిందీ అనునతడు అధర్వవేదమును, ఫైజీ లీలావతీగణితమును అనువదించిరి.

మొగల్ పరిపాలనాకాలమున ముస్లిమ్ కవులు అనేకులు హిందీ, బెంగాలీ, పంజాబీభాషలలో రచనలు కావించిరి. రస్‌ఖాన్ కవి కృష్ణభక్తిని గూర్చిన గీతములను హిందీ భాషలోను, మీర్జాహుసేన్‌అలీ కాళీమాత స్తవమును బెంగాలీభాషలోను రచించిరి. ఇట్లే హిందూకవులు ఉర్దూ, పర్షియన్ భాషలలో గ్రంథరచన చేసి ఉన్నారు. ఈ సందర్భమున అక్బరు సమకాలీనుల మాటను అటుంచి, ఔరంగజేబ్ కాలపు చరిత్రను రచించిన భీమసేన్, ఈశ్వరదాస్‌లను పేర్కొనవచ్చును.

మొగల్ చక్రవర్తులు మసీదులలోని పాఠశాలలద్వారా విద్యావ్యాప్తికి సౌకర్యము కలుగజేసిరి. అక్బరు, జహంగీర్ మద్రసాలద్వారా హిందువులకు విద్యాసౌకర్యమును ఏర్పాటు చేసిరి. సంపన్నులయిన హిందూ, మహమ్మదీయ కుటుంబములలో స్త్రీలు కూడ విద్యను నేర్చుకునేవారు. నూర్జహాన్, ముంతాజ్‌మహల్, జహానారా, జేబున్నీసా విద్యావంతులని ఎరుగనగును.

అక్బరు చక్రవర్తి యొక్క గ్రంథాలయమునందు వేల కొలదిగ గ్రంథములు ఉండెడివి.

లలితకళలు: భవన నిర్మాణము, చిత్రలేఖనము లాంటి లలితకళలను మొగల్ చక్రవర్తులు విస్తారముగ పోషించిరి.

వీరు నిర్మించిన భవనములందు సైతము హిందూ, ముస్లిమ్ కళాసంప్రదాయములు మిశితమై ఉన్నవి. హిందూ పద్ధతిని అనుసరించి అడుగు భాగములు ఉండి, పైన ముస్లిమ్ సంప్రదాయప్రకారము ఆర్చీలు, డోములు అమర్చబడుట నాటి భవనములలో కాననగును. ఫతేపూర్ సిక్రీవద్ద అక్బరు నిర్మించిన మహాభవనములు, ఆగ్రాయందు జహంగీర్, షాజహాన్‌లచే నిర్మింపబడిన భవనములు మరవ రానివి. ప్రపంచ విఖ్యాతిగాంచిన తాజ్‌మహల్ అన్నిటి కన్న మిన్నయని అందరు అంగీకరించినదే. ఇదిగాక చెప్ప దగినవి దివానిఖాస్, దివాని ఆమ్, జుమ్మామసీద్, మోతీ మసీద్, పంచ్‌మహల్, లాల్‌ఖిల్లా మొదలయినవి. ఇవి గాక షాజహాన్ కాలమున వెలసిన రాజభవనములు, దుర్గ ములు, మసీదులు, సుందరవనములు ఆనేక పట్టణములలో కనబడును. నవరత్నములతో అలంకరింపబడిన ఈ చక్రవర్తి నెమలి సింహాసనము అతి రమణీయమైనది.

ఈ కాలమున నిర్మింపబడిన భవనములలో బుందేల్ ఖండ్‌లోని జైనదేవాలయములు, అమృతసర్‌లోని సిక్కుల సువర్ణదేవాలయము ముఖ్యమైనవి.

చిత్రలేఖనము అక్బరు కాలమున భారతీయ విధానము నకు ఆనుగుణ్యముగ మార్పునొందినది. మొగల్ చక్ర వర్తులందరిలో చిత్రలేఖన కళను ఎక్కువగ పోషించిన ప్రభువు జహంగీర్. ఇతని కాలమున, షాజహాన్ కాలమున భారతీయ చిత్రకారులు పారసీక దేశపు పోకడలను విడనాడి, జాతీయ పద్ధతిని ఎక్కువగా అనుసరించిరి. వారిలో మన్సూర్, మురాద్, బిషన్‌దాస్, గోవర్ధన్ మొదలయిన వారు ప్రసిద్ధులు.

సంగీతము ఔరంగజేబ్‌ను తప్ప అతని పూర్వీకులను అందరిని ఆకర్షించి ప్రోత్సాహము పొందినది. అక్బరు ఆస్థానమున 36 గురు గొప్ప సంగీత విద్వాంసులు ఉండిరట. వారిలో తాన్‌సేన్, బాజ్ బహదూర్‌లు ప్రముఖులు.

**పల్లెలు, పట్టణములు :** నేడు మాదిరిగనే నాడు కూడ దేశమునందు ప్రజలలో చాల మంది పల్లెలలోనే నివసించిరి. అవి వీలయినంతవరకు స్వయంసమృద్ధముగా ఉండి, ప్రత్యేకముగా ఉండెడివి. పల్లె ప్రజలకు వ్యవసాయము ముఖ్యవృత్తి. కుటీర పరిశ్రమలతో కొందరు జీవించేవారు. సామాన్య జనులకు భోగభాగ్యములు లేకున్నను, జీవిత మునకు అవసరమగు వస్తువులు సులభముగ లభించెడివి. అయితే, కరవుసమయములతో వ్యవసాయముపై ఆధార పడినవారు బాధకులోనయ్యెడివారు. పల్లెలందలి జీవితము మొత్తము మీద మార్పు ఎరుగక, ఎదుగుట లేక పూర్వము మాదిరిగనే సాగుచుండెడిది. మొగల్ చక్రవర్తులు పల్లెలలో అభివృద్ధిని సాధించుటకు చెప్పదగినంతగ పాటుబడలేదు.

పట్టణములు అట్లుకాక సిరిసంపదలతో, భోగభాగ్యము లతో తులతూగుచుండెడివి. వివిధ రకములయిన వృత్తులు, పరిశ్రమలు, వ్యాపారములు అచట సాగుచుండెడివి. ఢిల్లీ, ఆగ్రా, లాహోర్, అహమ్మదాబాదు, వారణాసి, హుగ్లీ, ఢక్కా పట్టణములను చూచిన పాశ్చాత్య విలాస యాత్రికులు వాని వైభవమును చూచి ఆశ్చర్యపడిరి. నాటి పరిశ్రమలలో నూలు వస్త్ర పరిశ్రమ ముఖ్యమైనది. ఇది దేశమందు అంతటను వ్యాపించి ఉన్నను, తూర్పున బెంగాల్‌నందు ఎక్కువగా సాగుచుండెను. సిల్కు వస్త్ర ములు, ఊలు శాలువలు, తివాచీలు మొదలగునవి తయా రగుచుండెడివి. అతి సున్నితములయిన ఢక్కా మజిలిన్‌లు ప్రపంచఖ్యాతి పొందినవి. వీనిని పాశ్చాత్య దేశములకు ఎగుమతి చేసి, వానినుండి బంగారము, నవరత్నములు, లోహములు మొదలగువానిని దిగుమతి చేసికొనెడివారు. వ్యాపార నిమిత్తము జహంగీర్ వద్దకు వచ్చిన కెప్టెన్ హాకిన్స్, సర్ తామస్ రో అను ఇంగ్లీషు రాయబారులు, షాజహాన్ కాలమున బెర్నియర్, టావెర్నియర్ అను ఫ్రెంచి వారును, ఔరంగజేబ్ కాలమున దేశమునందు పర్యటించిన మనుక్సి అను ఇటలీదేశీయుడును నాటి స్థితి గతులను తమ రచనల ద్వారా తెలియజేసిరి.

పైన సూచించినట్లుగ మొగల్ సామ్రాజ్యమునందు 16, 17 శతాబ్దములలో ఒకే రకమైన సంస్కృతి రూపొంది నది. దీనియందు హిందూ - మహమ్మదీయ సంప్రదాయ ములు మిశితమైనవి. రెండు మతములవారి సహకార ముతో పెరిగిన ఈ సంస్కృతిని 'హిందూ - ముస్లిమ్ లేక హిందుస్తానీ సంస్కృతి' అని అనవచ్చును. ఇది ఢిల్లీ సుల్తా నుల పాలనాకాలమున పుష్పించినది.

అయినను, ఈ సంస్కృతిని అనుభవించిన ప్రజానీకము నందు రాజకీయపరమైన జాతీయైక్యత ఏర్పడినదను కొనుట పొరపాటు. ఏకజాతిగా రూపొందుటకు అవసర మయిన ఐక్యమత్యము అప్పటికి లభించలేదు.

**మహారాష్ట్ర విజృంభణ :** పరమత పీడనతో కూడిన ఔరంగజేబ్ పాలనకు ప్రతీకారముగ ప్రారంభమయిన ఉద్యమములలో మహారాష్ట్రులకు, సిక్కులకు సంబంధించి నవి ప్రత్యేకముగ గమనింపదగినవి. మహారాష్ట్రుల ఉద్యమము మొదట మొగల్ చక్రవర్తి దుర్నీతికి ఎదురు నిలిచిన ప్రతిఘటనోద్యమముగ సాగి, చివరకు హిందూ సామ్రాజ్య స్థాపనోద్యమముగ తేలినది. మహారాష్ట్రులను ఒకేమార్గమున నడిపించి, జాతీయైక్యత సాధించి, స్వరాజ్య

మును స్థాపించి, ఏకచ్ఛత్రాధిపత్యముక్రిందికి తీసికొని వచ్చిన నాయకుడు ఛత్రపతి శివాజీ [చూ.]. ఇతడు సాధించిన ఘనవిజయమును వర్ణించుట అత్యావశ్యకము.

శివాజీ (1627-1680): శివాజీ మహారాష్ట్ర జాగీర్దార్ అయిన షాజిఖాన్‌స్లే యొక్క కుమారుడు. జననము 1627. చిన్నతనమున తల్లియైన జిజాబాయి చెప్పిన ప్రాచీన భారత వీరగాథలు, గురువు దాదాజీ కాండదేవ్ నేర్పిన వీరోచితమైన విద్యలు, రామదాసువంటి మత గురువుల బోధలు శివాజీ వీరుడుగా, మహారాష్ట్ర నాయకుడుగా, హిందూ మతోద్ధారకుడుగా పరిణామమొందుటకు తోడ్పడినవి.

మావలీలను మహారాష్ట్ర యువకులకు నాయకుడై శివాజీ 19 వ ఏటనే ఇరుగు పొరుగున ఉన్న రాజ్యములపై దాడులు ప్రారంభించెను. పూనా చుట్టుపట్లన ఉన్న తన తండ్రి జాగీరులను, కొంకణమును లోబర్చుకొని అతడు బీజపూర్ రాజ్యముపై బడెను. బీజపూర్ సుల్తాన్ అఫ్‌జల్‌ఖాన్‌ను శివాజీని పట్టుకొన పంపెను. కాని, ఆ ప్రయత్నమున ఖాన్ పరాజయమొంది మరణించెను. మరికొన్ని ప్రయత్నములు విఫలముకాగా సుల్తాన్ మహారాష్ట్ర నాయకునితో సంధి చేసికొని అతనికి 'రాజా' అను బిరుదమును ఇచ్చెను.

తర్వాత శివాజీ దక్కన్‌లో మొగల్ పాలనలో ఉన్న ప్రాంతములపై దాడి చేయ మొదలిడెను. అందువలన అతడు జీవితాంతమువరకు ఔరంగజేబ్ చక్రవర్తితో పోరాడవలసివచ్చెను. మొగల్ ప్రభుత్వము తరపున షయిస్తఖాన్ ఈ మహారాష్ట్ర వీరుని అణచ యత్నించెనుగాని పూనాలో జరిగిన సంఘర్షణలో శివాజీ ఎత్తుకు పైఎత్తు వేసి తప్పించుకొని, మొగల్ ఉద్యోగిని చిత్తు చేసెను. తర్వాత 1665 న మొగల్‌లకు, మహారాష్ట్రులకు పురందరుసంధి జరిగి, రాజీ కుదిరినది. శివాజీ మొగల్ కొలువునకు వెళ్ళి, అవమానింపబడి, నిర్బంధింపబడి, చాకచక్యముతో బయటపడెను. మరల అతడు ఔరంగజేబ్‌పై ప్రతీకారచర్య ప్రారంభించెను. కొన్ని కోటలను పట్టుకొని, దక్షిణదేశమున కొన్ని ప్రాంతములను ఆక్రమించెను. 1674 న ఛత్రపతిగా అతని పట్టాభిషేకము జరిగినది. మొగల్ సార్వభౌమునిపై మరొకదాడి జరుపు ప్రయత్నము సాగుచుండగా ఆకస్మికముగ శివాజీ 1680 న మరణించెను.

చిన్ననాటనుండి జీవితము చివరవరకు చేసిన దాడులలో శివాజీ బీజపూర్ సుల్తాన్, ఢిల్లీ పాదుషాలతోనే గాక, పోర్చుగీస్, ఇంగ్లీషు వర్తకులతోకూడ పోరాడి, విజయము సాధించెను. మహారాష్ట్రులకు స్వతంత్రమును, స్వరాజ్యమును సంపాదించెను. అతని రాజ్యమున కొంకణ, పశ్చిమ కర్ణాటక ప్రాంతములును, బళ్లారి, బెంగుళూరు, వెల్లూరు, జింజి, ఆరణి, తంజావూరు మండలములును చేరి ఉండినవి. ఈ రాజ్యమునకు చుట్టుపట్లనున్న ప్రదేశము అతని రక్షణక్రింద ఉండి పన్ను చెల్లించుచుండెడివి.

పోరాటములోనేగాక పరిపాలనయందు కూడ శివాజీ చాల సామర్థ్యము కలవాడు. ఇతని ప్రభుత్వవిధానమునందు హిందూసంప్రదాయములు, మొగల్ పద్ధతులు మిళితమై ఉన్నవి. ఇందు ప్రభువు సర్వస్వతంత్రుడు. అష్టప్రధానులను ఎనిమిది మంత్రులు పాలన, సైన్యము, కోశము, న్యాయము మొదలగు ప్రభుత్వశాఖలను పర్యవేక్షించుచుండిరి. సైన్యమునందు అశ్వికదళము ముఖ్యమైనది. నౌకాబలము కూడ ఏర్పాటై ఉండెను. దుర్గములకు ప్రాధాన్యము ఇవ్వబడినది. వ్యవసాయమునకు ప్రోత్సాహము ఇచ్చుటయు, వ్యవసాయదారులకు సౌకర్యములు కలిగించుటయు జరిగినది. పంటలో $\frac{2}{5}$ ప్రభుత్వమునకు ధనరూపమునగాని, ధాన్యరూపమునగాని చెల్లింపవలసి ఉండెను. ఇదిగాక, చౌత్, సర్దేష్‌ముఖ అను పన్నులు రాజ్యము ఆవలి ప్రాంతమునుండి వసూలు చేయబడుచుండెను. న్యాయపరిపాలన సంతృప్తికరముగ సాగినది. అన్నిటికన్న మిన్నగ గుర్తింపదగినది ఏమన, శివాజీ పరమత (ముస్లిమ్) స్త్రీలను, పురుషులను, ప్రార్థనాలయములను, పవిత్ర గ్రంథములను (శత్రువులకు సంబంధించినవైనను) ఉచితమైన మర్యాదతో చూచుట. ఇంతకన్న ఈ మహాపురుషుని ఉన్నత సంస్కృతికి, సుగుణ సంపదకు ఏమి కావలెను? వ్యక్తిగను, జాతి నిర్మాతగను, యోధుడుగను, ప్రభువుగను శివాజీ అసామాన్యుడు, చిరస్మరణీయుడు కూడ.

అతని మరణానంతరము మహారాష్ట్ర స్వాతంత్ర్య సమరమును రాజారామ్, తారాబాయ్ సాగించిరి. దానిని అంతమొందించుటకు యత్నించి ఔరంగజేబ్ చక్రవర్తి నిరాశతో తానే అంతమొందెను. శివాజీ మనుమడు సాహు రాజకీయ రంగములోనికి దిగినంతనే మహారాష్ట్ర నాయకులలో కలతలు బయలుదేరినవి గాని సాహు విజయముతో అవి సమసిపోయినవి.

మహారాష్ట్రులు సామ్రాజ్య నిర్మాణమునకు పూనుకొని ఘనవిజయము 1712 నుండి 1760 వరకు సాధించగలిగిరి. ఇందుకు ముఖ్య కారకులు మొదటి ముగ్గురు పీష్వాలు. అందువల్ల దీనిని పీష్వాలయుగము అనినను అతిశయోక్తి కాదు.



కాశ్మీరము
రెండవ సిక్కు యుద్ధము
(1893 లో నిర్ణయము)
నేపాల్
భూటాన్
అయోధ్య
బీహార్
బెంగాల్
ఛోటా నాగ్‌పూర్
మిడ్నపూర్
రాజపుటానా ఏజన్సీ
(1818 అజ్మీర్)
బీరార్
హైదరాబాదు
ఒరిస్సా
బొంబాయి
మైసూరు
మద్రాసు
చెంగల్ పట్టు
కూర్గ్
మలబార్
సింహళము
ఎగువ బర్మా
రెండవ బర్మా యుద్ధము
ఉత్తర ఆరకాన్
ఇండియా
(1753-1890)

మొదటి పీష్వా బాలాజీ విశ్వనాథ్ మహారాష్ట్ర నాయకులను ఏకము చేసి, పీష్వా అధికారమును పెంచి తన పదవిని సుస్థిరము చేసికొనెను. అంతట క్షీణదశలో ఉన్న మొగల్ చక్రవర్తి వ్యవహారములో జోక్యము కల్పించుకొని, మహారాష్ట్రులు తమ రాజ్యమున స్వతంత్రమును అనుభవించునట్లును, పొరుగు రాష్ట్రములందు చౌత్, సర్దేశ్ ముఖ పన్నులు వసూలు చేసికొనునట్లును అతనివలన అనుమతి పొందిరి. బాలాజీ తనయుడు, రెండవ పీష్వా అయిన బాజీరావు మహాసమర్థుడు. కూలిపోవుటకు సిద్ధపడిన మొగల్ సామ్రాజ్యముస్థానే హిందూసామ్రాజ్యమును నెలకొల్పవలెనను గొప్ప సంకల్పము కలవాడు. నిజామ్‌ను ఓడించి, గంగా - యమునా నదుల మధ్యప్రదేశమును ఆక్రమించి, ఢిల్లీని కూడ వశపరచుకొన సిద్ధపడెను. దేశముపైకి దండెత్తి వచ్చిన నాదిర్‌షాను పారద్రోల ప్రయత్నించెను. కాని, త్వరలోనే మరణించెను. మూడవ పీష్వా బాలాజీరావు నాయకత్వమున మహారాష్ట్రుల ప్రాబల్యము మిన్నుముట్టినది. నిజామ్‌ను అనేకసార్లు ఓడించి, అతడు దక్కన్‌లో చాలభాగము స్వాధీనపరచుకొనెను. ఇతని తమ్ముడు రఘోబా ఢిల్లీని లోబరచుకొనగలిగెను. అంతటితో ఆగక మహారాష్ట్రులు పంజాబ్‌నందలి దురానీ వంశీయులను పారద్రోలి, ఆ ప్రాంతమును ఆక్రమించిరి. ఇంతటితో ఉత్తర, దక్షిణ దేశములు మహారాష్ట్రులకు వశమైనవి. వారిని ఎదుర్కొనగలవారు కనబడలేదు. దేశము వారి ఏకచ్ఛత్రాధిపత్యముక్రింద ఉండు పరిస్థితి కానవచ్చినది. దీనిని దేశమందలి ముస్లిమ్ పాలకులు సహింపలేకపోయిరి. మరల దేశమధ్యమున ముస్లిమ్‌సామ్రాజ్యమును పునరుద్ధరించుటకు ప్రయత్నము చేసిరి. ఔథ్‌నవాబు, ఆఫ్ఘనిస్తాన్‌నుండి దండెత్తి వచ్చిన అహమద్‌షా దురానీతో కలసి మహారాష్ట్రులపై పానిపట్టు వద్ద 1761 న యుద్ధము చేసెను. ఈ మూడవ పానిపట్టు యుద్ధమున మహారాష్ట్రులు పరాజితులయిరి. ఫలితముగ వారి అధికార, ప్రాబల్యములు తగ్గినవి. మహారాష్ట్ర సామ్రాజ్యమును సుస్థిరము చేయు ప్రయత్నము విఫలమైనది [చూ. మహారాష్ట్రులు].

కాని, మహారాష్ట్రులు పానిపట్టువద్ద పొందిన పరాజయమునుండి త్వరలోనే తిప్పుకొని, బలము చేకూర్చుకొనగలిగిరి. ముఖ్యముగ దేశపు మధ్య ప్రాంతమున ప్రబలి, 1818 వరకు రాజ్యసంపాదనలో బ్రిటిష్‌వారికి పోటీగా నిలబడిరి.

సిక్కు రాజ్యస్థాపన : మొగల్ పాదుషాల దుర్నీతిని ఖండించి, అందుకు వారిచే శిక్షింపబడి, వారి పీడనను ప్రతిఘటించినవారిలో సిక్కులు పేరొందినవారు. వీరి మతమును 15 వ శతాబ్దమున స్థాపించినవాడు గురునానక్. ఆ కాలమునందు హిందూ - ఇస్లామ్ మతములలోని ముఖ్య అంశములను మిళితముచేసి ఏకేశ్వరోపాసనను, సర్వమానవ సౌభ్రాతృత్వమును బోధించి, సాంఘిక దురాచారములను ఖండించి నూతన మార్గమును ప్రచారముచేసిన గురువులలో అతడు ఒకడు. నానక్ పంజాబ్‌నందు తన మతమును బోధించి, శిష్యులను చేరదీసి, గురు పరంపరను స్థాపించి, తన మతము చిరస్థాయిగ ఉండునట్లు చేసెను. అక్బరు చక్రవర్తి సమకాలికుడయిన గురు రామదాసు అతని సానుభూతిని పొంది, అమృతసర్ పట్టణమును సంపాదించి, అచట సిక్కులకు సువర్ణ దేవాలయమును నిర్మించి, ఆ పట్టణము సిక్కులకు ప్రధాన నగరము అగునట్లు చేసెను.

కాని, జహంగీర్ సింహాసనము ఎక్కిన నాటనుండి మొగల్‌లకు, సిక్కులకు మధ్య సంఘర్షణ ప్రారంభమై, క్రమముగా పోరాటముగ పరిణమించినది. ఇది 18 వ శతాబ్ది మధ్యకాలము వరకు సాగినది.

అయిదవ గురువు అర్జున్ సిక్కులకు 'గ్రంథ సాహిబ్' అను మత గ్రంథమును తయారుచేసి, వారి సంఘమును సుస్థిరముచేసి, వారికి స్వయంసమృద్ధమైన వ్యవస్థను కల్పించెను. దీనికి జహంగీర్ చక్రవర్తి అనుమానపడి, తనకు ఎదురు తిరిగిన తన కుమారునికి చేయూతనిచ్చినాడను నెపమున, ఈ గురువును అంతమొందించెను. దీనితో సిక్కుల ప్రతీకారము ప్రారంభమగుట, వారు యుద్ధసన్నద్ధులు అగుట జరిగినది, హరగోవింద్ నాయకత్వమున వారు సైనిక చర్యలకు దిగి, షాజహాన్ పాదుషాకు ఎదురు తిరిగి పోరాడి, బలపడిరి. తొమ్మిదవ గురువు తేజ్ బహదూర్ ఔరంగజేబ్ అవలంబించిన పరమత పీడనను సహింపక, ఎదురు తిరిగి, అందువలన నిర్బంధింపబడి, చివరకు హతమొనర్పబడెను. సిక్కులు సైనికస్తోమతును పెంచుకొని, రక్తమును చిందించి రాజ్యాధికారమును సంపాదించుటకు సిద్ధపడిరి. ఔరంగజేబ్ సమకాలికుడయిన గురుగోవిందసింగ్ సిక్కులకు సింగులు (సింహులు) అను బిరుదమును ఇచ్చి, వారిని స్వయంసమృద్ధములయిన సైనిక సమూహములు (ఖాల్సాలు) గా సంస్కరించెను. ఇతని నూతన సంస్కరణలు సిక్కుల శక్తిసామర్థ్యములను చాల పెంచినవి [చూ. సిక్కులు].

ఔరంగజేబ్ మరణానంతరము సిక్కులు పంజాబ్‌లో సట్లెజ్, యమునా నదుల మధ్య ప్రదేశమును ఆక్రమించి తమ రాజ్యమును స్థాపించిరి. తర్వాత వారి బలము తగ్గినను, మరల నాదిర్‌షా, అహమద్‌షా దురానీల దండ

యాత్రల వలన కలిగిన కల్లోలములో తమ అధికారమును పెంచుకొని, విస్తరింపచేసిరి. 1764 నాటికి పంజాబ్ నందలి లాహోర్ నగరమున స్థిరపడి, జీలమ్ - యమునా నదుల మధ్య ఉన్న ప్రదేశమును సిక్కులు ఆక్రమించిరి. 18 వ శతాబ్దము ముగియునప్పటికి వీరు పంజాబ్ నేగాక, జమ్మూ ప్రాంతమును కూడ లోబర్చుకొని, గంగా - యమునానదీ మధ్య ప్రదేశమును, రోహిల్ ఖండ్, ఔధ్ రాజ్యములను వశపర్చుకొనుటకు సిద్ధపడుచుండిరి.

సంఘ వ్యవస్థ - 18 వ శతాబ్దము : ఔరంగజీబ్ అనంతరము ఢిల్లీ సింహాసనము ఎక్కిన మొగల్ చక్రవర్తులు అసమర్థులు అయిరి. అంతఃకలహములతోను, విదేశీదండయాత్రలతోను మొగల్ సామ్రాజ్యము క్షీణించినది. ఆ సామ్రాజ్యమును కూలదోసి, తమ రాజ్యములను స్థాపించి, విస్తరింప చేయుటకు మహారాష్ట్రులు, సిక్కులు మొదలయినవారు పాటుబడుచుండిరి. ఈ సమయముననే రాజ్యాధికారమును సంపాదించుటకు ఇంగ్లీషు, ఫ్రెంచి వర్తకులు ప్రయత్నించుచుండిరి. రాజకీయ ప్రాబల్యమునకై వారందరి మధ్య జరిగిన పోటీల వలన, పోరాటముల వలన దేశమున శాంతి - భద్రతలు నశించినవి. ఇందుకు ఫలితముగ వ్యవసాయ, వాణిజ్యములు క్షీణించినవి. వానితో పాటు సారస్వతము, లలితకళలు సన్నగిలినవి. రాజకీయముగనేగాక, సంస్కృతిపరముగ కూడ ఈ శతాబ్దము అధోగతిని సూచించు అంధకార యుగమైనది.

అయినను హిందూ - మహమ్మదీయుల మధ్య సంస్కృతి రంగమున సఖ్యత సమసిపోక, సాగుచునే ఉండెను. అలావల్ అను ముస్లిమ్‌కవి వైష్ణవ సంప్రదాయ సిద్ధమైన గీతములను రచించెను. మీర్ జాఫర్ కిరీటేశ్వరి దేవి తీర్థమును పుచ్చుకొనెనట. ఢిల్లీ పాదుషాల కొలువునందు దుర్గాపూజ చేయబడుచుండెడిదట. మహారాష్ట్ర నాయకుడు దౌలత్‌రావు సింధియా తన ఉద్యోగులతోకూడి ముస్లిమ్ దుస్తులు ధరించి మొహరమ్ ఉత్సవములలో పాల్గొనెడువాడని తెలియవచ్చుచున్నది.

ఆధునిక యుగము : భారతదేశమునకు యూరప్ ఖండ వర్తకులు వచ్చుటతో ఆధునిక యుగము ప్రారంభమయినది. భారతదేశముతో యూరప్ ఖండమునందలి జాతులకు వ్యాపార సంబంధము అనాదికాలమునుండి సాగుచుండెడిది. 15 వ శతాబ్దమున యూరప్ వర్తకులు వెనుకటి వర్తక మార్గములను విడనాడి నూతనమైన సముద్రమార్గము ద్వారా భారతదేశమునకు వచ్చుట మొదలిడిరి. ఇది ఆఫ్రికాఖండపు దక్షిణకొనన ఉన్న గుడ్‌హోప్ అగ్రము నుండి హిందూ మహా సముద్రము ద్వారా భారతదేశపు పడమటి తీరమున ఉన్న కాలికట్ రేవు పట్టణమునకు చేర్చునది. దీనిని పోర్చుగీస్ ప్రభుత్వ పోత్సాహముతో వాస్కొ డ గామా [చూ.] అను సాహసికుడు 1498 న కనిపెట్టెను. నాటినుండి యూరప్ ఖండమునందలి అనేక జాతులకు చెందిన వర్తకులు భారతదేశమునకు వచ్చిరి. వీరిలో పోర్చుగీస్, డచ్చి, ఇంగ్లీషు, ఫ్రెంచి వారు ముఖ్యులు.

వారందరిలో పోర్చుగీస్‌వారు మొట్ట మొదట భారతదేశమున ప్రవేశించిరి. పోర్చుగీస్ నావికుడు వాస్కొ డ గామా కాలికట్ చేరి, అచటి పాలకుని (జామొరిన్) అంగీకారముతో వ్యాపార సంబంధము ఏర్పరచుకొని, తిరిగి వెళ్ళిన తర్వాత పోర్చుగీస్‌వారు వ్యాపార కేంద్రములను ఏర్పరచుకొనిరి. వీనిలో పడమటి కోస్తావెంబడి కొచ్చిన్, గోవా, డీవ్, డామన్, సాల్సెట్టి, బస్సీన్ ప్రాంతములు, తూర్పు తీరమున మద్రాసు దగ్గర శాన్ థోమ్, బెంగాల్ నందలి హుగ్లీ ముఖ్యమైనవి. ఆల్బుకర్క్ అను పోర్చుగీస్ ప్రతినిధి యాజమాన్యమున పోర్చుగీస్‌వారి ప్రాబల్యము భారతదేశములోని పడమటితీరమున నేగాక, పారసీక సింధుశాఖనుండి మలయావరకు గల హిందూమహా సముద్ర ప్రాంతమునందు అంతటను కానవచ్చినది. 16 వ శతాబ్దిలో ఈ విశాలమైన ప్రదేశమున వారి పెత్తనము నిరాటంకముగ సాగినది. తదుపరి అది క్షీణింపసాగినది. వారికి విరోధులయిన డచ్చి, ఇంగ్లీషు వర్తకులు వారి వ్యాపార కేంద్రములను క్రమముగా ఆక్రమించిరి. మహారాష్ట్రులుకూడ కొన్ని వశపర్చుకొనిరి. చివరకు గోవా, డీవ్, డామన్‌లు మాత్రమే మిగిలినవి. పోర్చుగీస్‌వారి పాలన, ప్రవర్తన, వర్తక సరళి హిందూదేశస్థులకు హేయములుగ తోచినవి.

హాలండ్ దేశమునకు చెందిన డచ్చివారు 17 వ శతాబ్ద ప్రారంభమునుండి భారతదేశమునకు వ్యాపారనిమిత్తము వచ్చిరి. క్రమముగా వారు తమకు విరోధులయిన పోర్చుగీస్ వారి స్థావరములలో కొన్నిటిని ఆక్రమించి, తమ వ్యాపార కేంద్రములను గుజరాత్, బెంగాల్, బీహార్, ఒరిస్సాలలోను, దక్షిణ దేశమున తూర్పు కోస్తాయందును నెలకొల్పిరి. ఈ శతాబ్ది మధ్యనుండి డచ్చివారికి, ఇంగ్లీషు వారికి యుద్ధములు జరిగినవి. వీనిఫలితముగ వారు ఇరువురికి భారతదేశమున కూడ పోటీ జరిగి, డచ్చివారి స్థావరములు ఇంగ్లీషువారి వశమైనవి. ఆ పోటీ 18 వ శతాబ్ది మధ్యవరకు సాగినది.

ఇంగ్లీషు వర్తకులకు భారత దేశముతో వ్యాపారము చేసి, లాభమును అనుభవింపవలెనను కాంక్ష ఎలిజబెత్

రాణి [చూ. పు. 347] కాలమున ఎక్కువైనది. అందు వలన 1600 సంవత్సరము చివరన వారు ఇండియా వర్తక సంఘమును (ఈస్ట్ ఇండియా కంపెనీ) స్థాపించి ఆమెవలన పత్రమును పొంది, వ్యాపారమును ప్రారంభించిరి. కెప్టెన్ హాకిన్స్, సర్ థామస్ రో అను వారలు ఇంగ్లండు దేశపు రాయబారులుగ వచ్చి జహంగీర్ చక్రవర్తినుండి వర్తక సౌకర్యములను పొందిరి. కాలక్రమమున ఇంగ్లీషు వారు సూరత్, ఆగ్రా, అహమ్మదాబాదు, బ్రోచిలలో కర్మాగార ములు నెలకొల్పిరి. దక్షిణదేశమున తూర్పు తీరము వెంట, గోల్కొండ నవాబు అనుమతితో మచిలీపట్టణమువద్దను, చంద్రగిరి రాజా సహకారముతో మద్రాసు వద్దను వారి కేంద్రములు వెలసినవి. బీహారు, బెంగాల్ రాష్ట్రములలో పాట్నా, హుగ్లీలు చెప్పదగిన స్థావరములు. పడమటి తీర మున బొంబాయిని బ్రిటిష్ కంపెనీకి ఛార్లెస్ - II దత్తము చేయగా, తూర్పున కలకత్తా సమీపమునందుగల సుతనుతి అను స్థలమున ఒక కేంద్రము నెలకొల్పబడినది. మద్రాసు, బొంబాయి, కలకత్తా యందలి కర్మాగారముల రక్షణకు కోటలు నిర్మింపబడి, వానికి చుట్టుపక్కల ఉన్న కేంద్రములు వానిని పాలించు ఉద్యోగుల అజమాయిషీ క్రింద ఉంచబడినవి.

ఇంగ్లీషువారిని చూచి ఫ్రెంచివారు కూడ వర్తక సంఘమును ఏర్పాటుచేసికొని, భారతదేశమునకు వచ్చి, ప్రాంతీయ పాలకుల అనుమతితో వ్యాపార కేంద్రములను స్థాపించిరి. సూరత్, మచిలీపట్టణము, పుదుచ్చేరి, చంద్ర నగర్ లందు అవి వెలసినవి.

వీరేకాక, ఇంకా ఇతర యూరప్ జాతుల వారు కూడ భారతదేశముతో వ్యాపార సంబంధములను ఏర్పచుకొనిరి. కాని, యూరప్ ఖండమునందు చెలరేగిన యుద్ధముల వలన వారి వ్యాపారము చాలకాలము సాగలేదు.

**ఇంగ్లీషు - ఫ్రెంచి పోటీ :** మొగల్ చక్రవర్తి ఔరంగ జేబ్ పాలనము ముగియునంతవరకు యూరప్ ఖండ వర్తకులు మొగల్ పాలకులకు, ఇతర ప్రాంతీయ పాలకు లకు లోబడి, వారి అనుమతితోనే తమ వ్యవహారములను సాగించుకొనిరి. 1707 న ఔరంగజేబ్ మరణించిన తర్వాత పరిస్థితి తారుమారు అయినది. మొగల్ సామ్రాజ్యము క్షీణించుట, మొగల్ ల సామంతులు స్వతంత్రులు అగుట, మహారాష్ట్రులు, సిక్కులు తమ తమ రాజ్యములను విస్తరింప యత్నించుట, యూరప్ ఖండ వర్తకులు కూడ రాజ్యాధికార సంపాదనను కాంక్షించుట జరిగినది. ఇప్పటికి విదేశీయ వర్తకులలో ఇతర జాతుల ప్రాబల్యము తగ్గి, ఇంగ్లీషు, ఫ్రెంచివారు మాత్రమే పోటీకి నిలువబడిరి. దేశీయ ప్రభువుల మధ్య చెలరేగిన తగాదాలలో జోక్యము కల్పించుకొని తద్వారా ఈ విదేశీయులు తమ అధికార మును పెంచుకొన పూనుకొనిరి. వీరి ఈ కుతంత్రమును గ్రహింపక, దురహంకారముతో తమలో తాము పోరాడి, చివరకు దేశీయపాలకులు విదేశీయులకు బానిసలై, దేశ మును దుర్గతి పాలుచేసిరి. 18 వ శతాబ్ది మొదటి అర్ధ భాగమున దక్షిణమున కర్ణాటకమునందు, ఉత్తరమున బెంగాల్ నందు జరిగినది ఇదియే.

**కర్ణాటక యుద్ధములు (1746 - 1763) :** 18 వ శతాబ్దికి సుమారుగా మధ్యకాలమున దక్షిణ భారతదేశమునందు తూర్పు కోస్తా వెంబడి ఉన్న కర్ణాటక రాజ్యమును ఏలు చుండిన నవాబు మరణించగా, అతని సింహాసనము ఖాళీ యైనది. ఈ సింహాసనమును అన్వరుద్దీన్, చందాసాహెబ్ అను వారు ఇద్దరు ఆశించి, పోటీపడి, పోరాటమునకు సిద్ధపడిరి. ఇది ఇట్లుండగా, దక్కన్ లోని హైదరాబాదును ఏలుచున్న నైజామ్ ప్రభువు మరణించినందున అతని సింహాసనము కొరకు అతని కుమారుడు నాజర్ జంగ్, మనుమడు ముజఫర్ జంగ్ పెనుగులాడుట మొదలిడిరి. కర్ణాటకమున చందాసాహెబ్, హైదరాబాదుయందు ముజఫర్ జంగ్ ఫ్రెంచివారి సహాయమును, వారి ప్రత్యర్థులు అన్వరుద్దీన్, నాజర్ జంగ్ ఇంగ్లీషువారి మద్దతును తీసి కొనుట జరిగినది. ఇంతేగాక, యూరప్ ఖండమున ఫ్రాన్స్, ఇంగ్లండు దేశముల మధ్య చెలరేగిన యుద్ధములుకూడ భారతదేశమున వారి ప్రతినిధులు పోరాడుటకు తోడ్పడి నవి.

కర్ణాటకమున మూడు యుద్ధములు 1746 - 1763 నడుమ జరిగినవి [చూ. కర్ణాటక యుద్ధములు పు. 371]. ప్రథమ యుద్ధమునందు ఫ్రెంచి గవర్నర్ డూప్లే [చూ. పు. 510] నౌకాబలమును ఉపయోగించి, మద్రాసులోని ఇంగ్లీషువారి కోటను ముట్టడించి ఆక్రమించెను. కాని, యుద్ధము ముగిసిన తర్వాత చేసికొన్న సంధిని అనుసరించి మద్రాసు తిరిగి ఇంగ్లీషు వారికి అప్పగించబడెను. ద్వితీయ యుద్ధములో మొదట డూప్లే తన శక్తినంతను వినియో గించి పోరాడి, ముజఫర్ జంగ్, చందాసాహెబ్ లదే పై చేయి అగునట్లు చేసి, వారివలన రాజకీయ, ఆర్థిక లాభ ములను పొందెను. అయితే, ఇప్పటినుండి కర్ణాటక కథ ఫ్రెంచివారికి అడ్డముగ తిరిగినది. ఇందుకు ముఖ్య కారణము ఇంగ్లీషువారి తరఫున క్లైవ్ [చూ. పు. 416] యాజమాన్యమును వహించి ఫ్రెంచివారిని ఎదుర్కొని, వారి ఆట కట్టించుట. ఇతడు యుక్తితో కర్ణాటకరాజ్యపు రాజధానియైన ఆర్కాట్ ను ముట్టడించి, పట్టుకొని,

ఫ్రెంచివారిని, వారి అభ్యర్థియగు చందాసాహెబ్‌ను ఓడించి, ఇంగ్లీషు వారికి, వారి స్నేహితుడు, అన్వరుద్దీన్ కుమారుడు అయిన మహమ్మదాలీకి విజయము చేకూర్చెను. మూడవ కర్ణాటక యుద్ధమున స్పష్టముగ సంపూర్ణముగ ఇంగ్లీషువారికే విజయము దక్కినది. ఫ్రెంచి సేనానాయకుడైన లాలి ఇంగ్లీషువారిచే భూమిమీద, సముద్రముమీద ఓడింపబడుట సంభవించినది. ఫ్రెంచికేంద్రమైన పుదుచ్చేరి ఇంగ్లీషువారి వశమైనదిగాని, సంధిషరతులనుబట్టి తిరిగి ఫ్రెంచివారికే ఇవ్వబడినది. ఈ మూడు యుద్ధముల ఫలితముగ దక్కన్, కర్ణాటక ప్రాంతములందు ఫ్రెంచివారికి ప్రాబల్యము అడుగంటి, ఇంగ్లీషువారి అధికారము పెరిగినది.

ప్లాసీ, బక్సారు యుద్ధములు (1757, 1764): ఈ కాలమున ఉత్తరభారతదేశమున కూడ ఇంగ్లీషువారు క్లైవ్ నాయకత్వమున కొంత యుక్తిని, కొంత శక్తిని వినియోగించి, దేశీయ పాలకులను విడదీసి, వారిని ఓడించి, తమ అధికారమును స్థాపించిరి. బెంగాల్ రాష్ట్రమును ఏలుచున్న నవాబు సిరాజుద్దౌలా ఇంగ్లీషువారి కుతంత్రమును కనిపెట్టి వారిని అణచుటకు కలకత్తాను పట్టుకొనెను. ఈ విషమ పరిస్థితిని ఎదుర్కొనుటకు క్లైవ్ బెంగాల్‌కు చేరి, మాయోపాయమును ప్రయోగించెను. సిరాజుద్దౌలా నుండి అతని సేనాపతి అయిన మీర్‌జాఫర్‌ను విడదీసి, సేనాపతికి నవాబు సింహాసనమును ఇవ్వగలమని ఆశపెట్టి, ఇతడు యుద్ధరంగమున పోరాడక ఇంగ్లీవారికి జయము చేకూరుటకు సాయపడునట్లు కుట్రపన్నెను. ఈ కుట్రఫలితముగ 1757 న ప్లాసీయొద్ద జరిగిన యుద్ధములో సిరాజుద్దౌలా ఓడి చనిపోవుటయు, ఇంగ్లీషువారు విజేతలుగ నిలబడుటయు సంభవించినది. అనుకున్న ప్రకారము మీర్‌జాఫర్ బెంగాల్ నవాబ్‌గ చేయబడెను. అతడు ఇంగ్లీషువారికి రాజకీయ, ఆర్థిక లాభములను చేకూర్చెను. ప్లాసీయుద్ధమున ఇంగ్లీషువారు పొందిన విజయము వారి సామ్రాజ్యమునకు పునాది అయినది. ఆ విజయమును సంపాదించిన క్లైవ్ బెంగాల్ రాష్ట్రమునందు గవర్నర్‌గా ఇంగ్లీషువారిచే నియమింపబడెను. నవాబువలన చాల ధనము బహుమతిగా పొందెను. క్లైవ్ ఇంగ్లండుకు వెళ్ళిన తరువాత ఇంగ్లీషు వర్తకులు స్వార్థలాభము కొరకు మీర్‌జాఫర్‌ను నవాబు పదవినుండి తొలగించి అతని స్థానమున మీర్‌కాశిమ్‌ను నెలకొల్పిరి. ఇతడును ఈ విదేశీ వర్తకుల అవినీతిని సహింపలేక వారిని ఎదిరింపబూనెను. అందుకు అతడు మొగల్ చక్రవర్తి, ఔధ్‌నవాబులతో చేతులు కలిపి, 1764 న బక్సారువద్ద ఇంగ్లీషు వారితో పోరాడెను. ఇచట కూడ ఇంగ్లీషువారికే విజయము చేకూరినది. ఈ సమయమున క్లైవ్ బెంగాల్‌కు చేరి, రెండవసారి గవర్నర్‌గా నియమితుడై, మొగల్ చక్రవర్తితో సంధి చేసికొనెను. దీనిఫలితముగ మొగల్ చక్రవర్తి, ఔధ్‌నబాబు, బెంగాల్‌నవాబు ఇంగ్లీషువారి పెత్తనమునకు లోబడిరి. బెంగాల్, బీహార్, ఒరిస్సారాష్ట్రములందు ఏర్పాటయిన ద్వంద్వప్రభుత్వ పద్ధతిలో రాజ్యాధికారము నామమాత్రముగ మహమ్మదీయ పాలకుల చేతులలోను, యథార్థముగ ఇంగ్లీషువారి చేతులలోను ఉండుట జరిగెను.

ఈ విధముగ దక్షిణదేశమున, ఉత్తరదేశమున ఇంగ్లీషు వారికి రాజకీయ ప్రాబల్యమును సంపాదించి, వారి సామ్రాజ్య సౌధమునకు సరియైన పునాది వేసిన వ్యక్తి రాబర్ట్ క్లైవ్. ఇతడు సామాన్య ఉద్యోగిగా జీవితము ప్రారంభించి, బెంగాల్‌నందు ఇంగ్లీషు కంపెనీవారి గవర్నర్‌గా రెండుసార్లు అత్యున్నత పదవిని అనుభవించిన అసాధారణ ప్రజ్ఞావంతుడు; సైనికనాయకుడుగా, పరిపాలకుడుగా ఇతడు కనబర్చిన శక్తి, యుక్తులు అమోఘమైనవి. కాని, నీతి - నిజాయితీలు మాత్రము అతని రాజకీయములందు కానరావు.

క్లైవ్ వేసిన పునాదులు విరోధులచే పెకలింపబడకుండ కాపాడినవాడు వారన్ హేస్టింగ్స్ [చూ.]. అందుకుగాను భారతదేశమున బ్రిటిష్ సామ్రాజ్యమును స్థాపించిన కీర్తి క్లైవ్ తరవాత ఇతనికి దక్కినది. ఇతడు 1772 - 1774 మధ్య బెంగాల్ గవర్నర్‌గాను, 1774 నుండి 1785 వరకు బెంగాల్ మొదటి గవర్నర్ - జనరల్‌గాను వ్యవహరించెను. ఇతని పదవీకాలమున దేశములోని మహారాష్ట్రులు, మైసూర్ రాజ్యపాలకులయిన హైదరాలీ [చూ.], టిప్పుసుల్తాన్‌లు [చూ. పు. 497] ఇంగ్లీషువారి అధికారమును అణగద్రొక్క చూచిరి. ఈ ప్రమాదములను ఈ ఉద్యోగి సమర్థతతో ఎదుర్కొనెను. పీష్వా స్థానమును ఆక్రమించుటకు మాధవరావు, రఘోబా అను మహారాష్ట్ర నాయకుల మధ్య రేగిన తగాదాలో మొదట బొంబాయి వద్ద ఉన్న ఇంగ్లీషు ఉద్యోగులు, తర్వాత గవర్నర్ - జనరల్ అయిన హేస్టింగ్స్ జోక్యము కల్పించుకొనిరి. ఈ సందర్భమున జరిగిన పోరాటపు ప్రారంభదశలో ఇంగ్లీషు వారు దెబ్బతినిరి. కాని, చివరకు మహారాష్ట్రులు ఓడి, సాల్బై సంధికి ఒప్పుకొనిరి [చూ. మహారాష్ట్రులు] మైసూరు రాజ్యమును ఏలుచున్న హైదరాలీ ఇంగ్లీషువారిని ఎదుర్కొని తన రాజ్యమును విస్తరింపచేయ సిద్ధపడెను. అతని అధికారమును అణచుటకు ఇంగ్లీషువారు యత్నించుచుండిరి. ఇందు

కుగాను వారు ఇరువురిమధ్య రెండు యుద్ధములు జరిగెను. మొదటి యుద్ధము (1767 - 1769) లో హైదరాలీదే పైచేయి అయినది. రెండవ యుద్ధమును అతడు 1780 న ప్రారంభించి, మద్రాసు పైబడి, ఆర్కాట్‌ను ముట్టడించి, ఇంగ్లీషువారిని కష్టనష్టముల పాలు చేసెను. అంతట హేస్టింగ్స్ మహారాష్ట్రులను హైదరాలీనుండి వేరుచేసి, అతనిని, అతని మరణానంతరము అతని కుమారుడైన టిప్పుసుల్తాన్‌ను ఓడించెను. ఈ విధముగ బొంబాయి, మద్రాసులందున్న ఇంగ్లీషు వారిని మహారాష్ట్రి, మైసూరు పాలకులనుండి హేస్టింగ్స్ రక్షించెను. ఉత్తరదేశమున ఔధ్ నవాబుతో సఖ్యము ఏర్పరచుకొని, అతనికి కోరా, అలహాబాదు మండలములను ఇచ్చి రోహిల్‌ఖండ్ రాజ్యమును అప్పగించి, అతని స్నేహమును సంపాదించి, మహారాష్ట్రులు బెంగాల్‌లోని ఇంగ్లీషువారిపై పడకుండ చేసెను. హేస్టింగ్స్ ఒకవంక యుద్ధరంగములో పాల్గొనుచు, మరొకవంక పరిపాలనారంగమున వివిధ శాఖలలో సంస్కరణలు ప్రవేశపెట్టెను. రాజకీయములలో మునిగి తేలుచునే ఇతడు భారతీయ సంస్కృతిని పునరుద్ధరించుటకు పూనుకొనెను. క్లైవ్ నందువలెనే ఇతనియందు కూడ శక్తి - సామర్థ్యములు కలవుగాని నీతి - నిజాయితీలు లోపమైనవి.

వారన్ హేస్టింగ్స్ తర్వాత గవర్నర్ - జనరల్ పదవిని అలంకరించిన కారన్‌వాలీస్ (1786 - 1793) భారతదేశమునందు బ్రిటిష్ సామ్రాజ్యమును విస్తరింప చేసెను. ఈ కాలమున ఫ్రెంచివారు ఇంగ్లీషువారిపై పగ సాధించుటకు పూనుకొనిరి. ఇంగ్లీషువారికి విరోధి అయిన మైసూరు పాలకుడు టిప్పుసుల్తాన్ ఫ్రెంచివారి సహాయముతో ఇంగ్లీషువారిపై ప్రతీకారచర్యకు సిద్ధమై, ఇంగ్లీషు వారి రక్షణలో ఉన్న తిరువాన్కూర్ రాజ్యముపై దండెత్తెను. దీనితో మైసూరుపై మూడవ యుద్ధము జరిగినది. కారన్‌వాలీస్ నైజామ్‌ప్రభుత్వమును, మహారాష్ట్రులను కూడగట్టుకొని, మైసూరుపైబడి, బెంగుళూరు, శ్రీరంగపట్టణములను పట్టుకొని టిప్పుసుల్తాన్‌ను ఓడించెను. సంధి షరతులనుబట్టి మైసూరు రాజ్యములోని కొంతభాగము బ్రిటిష్ సామ్రాజ్యములో కలసినది. టిప్పుసుల్తాన్ లొంగిపోయెను. దక్షిణదేశమున ఫ్రెంచివారి బెడద తప్పినది. ఉత్తరదేశమున కారన్‌వాలీస్ ఔధ్ నవాబురాజ్యమును బలపరచి, అతని సహకారమును ఇనుమడింప చేసెను. ఇంతేగాక, పరిపాలనారంగమున ఈ గవర్నర్ - జనరల్ గమనింపదగిన సంస్కరణలు ప్రవేశపెట్టెను. శాశ్వత భూమిశిస్తు విధానము ఇందు ముఖ్యమైనది. న్యాయస్థానములు, పోలీసుశాఖ మొదలగువానికి సంబంధించినవి ఇతరములు.

బ్రిటిష్ సామ్రాజ్య విస్తరణను బహువిధముల సాగించిన వారిలో పేర్కొనదగినవాడు గవర్నర్-జనరల్ వెలెస్లీ [చూ.]. ఇతని పదవీకాలమున (1798 - 1805) యూరప్ ఖండమునందు ఫ్రాన్స్‌దేశము ఇంగ్లండు దేశముతో పెనగులాడుటయు, ఫ్రెంచివారు భారతదేశమునందు బ్రిటిష్ రాజ్యాధికారమును పెకలింప ప్రయత్నించుటయు జరిగినవి. అయితే, ఈ ప్రమాదమును సమర్థతతో ఎదుర్కొని బ్రిటిష్ సామ్రాజ్యమును సంరక్షించి, దానిని సువిశాలమగునట్లు విస్తరింపజేసిన ఖ్యాతి వెలెస్లీకి దక్కినది. మైసూరు పాలకుడైన టిప్పుసుల్తాన్ ఫ్రెంచివారి సహాయముతో మరల ఇంగ్లీషువారిని ఎదిరింపగా, నాలుగవ మైసూరు యుద్ధము జరిగినది. నైజామ్‌ప్రభువు సహాయము పొంది మహారాష్ట్రులను విడిగా ఉంచి, వెలెస్లీ ఇంగ్లీషు సేనలను మైసూరులోనికి నడిపించెను. టిప్పుసుల్తాన్ వీరోచితముగ పోరాడి మరణించెను. మైసూరు రాజ్యములోని పడమటి ప్రాంతము బ్రిటిష్ సామ్రాజ్యములో లీనమైనది. మిగిలిన రాజ్యము పూర్వము దానిని పాలించిన ఒడయరు రాజవంశ ప్రతినిధికి అప్పగించబడి, బ్రిటిష్‌వారి యాజమాన్యముక్రిందికి చేరినది. మైసూరు ఇట్లు యుద్ధమున జయింపబడినది. ఇతర రాజ్యములు సైన్యసహకారపద్ధతి ద్వారా ఇంగ్లీషువారి పెత్తనము క్రిందికి తీసికొని రాబడినవి. ఈ పద్ధతిని అంగీకరించిన రాజ్యములందు సైనిక, వైదేశిక వ్యవహారములు బ్రిటిష్ ఉద్యోగుల అధీనమునందు ఉంచబడినవి. పాలించు ప్రభువు యొక్క స్వాతంత్ర్యము, అతనికిగల యూరపీయ (ఫ్రెంచి) మిత్రుల ప్రాబల్యము నిర్మూలింపబడినది. ఈ పద్ధతిని అంగీకరించి ఇంగ్లీషువారి రక్షణను ఆశ్రయించి వారికి లోబడినవారిలో దక్షిణమున నైజామ్ ప్రభువు, ఉత్తరమున ఔధ్‌నవాబు ముఖ్యులు. అయితే, మహారాష్ట్రులు దీనికి లోబడలేదు. వారిని లొంగదీయుటకుగాను మహారాష్ట్రులపై యుద్ధమును వెలెస్లీ సాగించెను. 1802 - 1805 నడుమ జరిగిన పోరాటములో పీష్వా బాజీరావు, గాయక్వాడ్‌లు ఎదిరింపకనే లోబడిరి. సింధియా, భోన్స్లేలు ఎదిరించినను లాభములేక లొంగిపోయిరి. హోల్కార్ మాత్రము లొంగక పోరు సాగించెను. తంజావూర్, సూరత్ రాజ్యములు ఆ యా సింహాసనములకై జరిగిన తగాదాల వలనను, కర్ణాటకరాజ్యము అచటి పరిపాలనయందలి లోపముల వలనను బ్రిటిష్ పాలనక్రిందికి చేర్చబడినవి.

బ్రిటిష్ సామ్రాజ్య నిర్మాతలలో వెలెస్లీ తర్వాత పేర్కొనదగినవాడు మార్క్విస్ ఆఫ్ హేస్టింగ్స్. గవర్నర్ - జనరల్‌గా ఇతడు పాలించిన కాలములో (1813 - 1823) ఇంగ్లీషువారికి హిందూదేశములో సార్వభౌమస్థానము లభించినది. ఇతని పూర్వికులు అవలంబించిన విధానము వలన గూర్ఖాలు, పిండారీలు, మహారాష్ట్రులు బ్రిటిష్ వారికి ఎదురు తిరుగుట సంభవించినదని ఇతడు గ్రహించి, వారి ప్రతిఘటనను అణచి, బ్రిటిష్‌వారికి అగ్రస్థానమును, అత్యున్నతాధికారమును సమకూర్చదలచెను. అందుకు మొదట నేపాల్ రాజ్యముపై బడి, అచటి గూర్ఖాలను లొంగదీసి, వారి రాజ్యపు సరిహద్దు ప్రాంతములను ఆక్రమించుకొనెను. తర్వాత దేశమధ్యమున అలజడి సాగించుచున్న పిండారీలను చుట్టుముట్టి, దాన, దండోపాయములతో వారి నాయకులను లోబర్చుకొనెను. చివరకు మహారాష్ట్రనాయకులు ఇంగ్లీషువారికి శత్రువులుగ మిగిలిరి. వారితో అపుడు జరిగిన యుద్ధము మూడవది. 1811 - 1818 మధ్య సాగిన ఈ పోరాటములో మొదట పీష్వా బాజీరావు, తరువాత హోల్కార్, సింధియా, నాగపూర్ రాజా ఓడిపోయి లోబడిరి. పీష్వా పదవి రద్దుచేయబడెను. పీష్వా పాలనలోని భాగము బ్రిటిష్‌వారి అధీనములోనికి వచ్చినది. ఆ ప్రాంతము నేటి మహారాష్ట్రమని స్థూలముగ చెప్పవచ్చును. మహారాష్ట్రనాయకులు అందరు స్వతంత్రము కోల్పోయి సామంతులయిరి. ఇందుకు తోడుగ మొగల్ చక్రవర్తికి ఇంతవరకు గల నామమాత్రమైన అధికారము, వైభవము కూడ అంతమొందింపబడెను. హేస్టింగ్స్ చేసిన యుద్ధములు, సాగించిన సంస్కరణల ఫలితముగ ఉత్తరమున సట్లెజ్ నది మొదలు దక్షిణమున కన్యాకుమారి అగ్రము వరకు గల విశాల భూభాగము బ్రిటిష్ సామ్రాజ్యమునందు లీనమైనది. వారి అధికారమును ఎదిరింపగల దేశీయ పాలకుల శక్తి నశించినది.

బ్రిటిష్ సామ్రాజ్య విస్తరణ సంపూర్ణమగుట : 1818 నుండి 1857 వరకు గల కాలమున బ్రిటిష్ సామ్రాజ్య వ్యాప్తి పూర్తియైనది. భారతదేశములోపల స్వతంత్రముగ ఉన్న సింధు, పంజాబ్, తూర్పు బెంగాల్, అస్సామ్ ప్రాంతములను జయించుటతోను, బ్రిటిష్‌వారి పెత్తనమునకు లోబడి ఉన్న స్వదేశ సంస్థానములను బ్రిటిష్ పాలన క్రిందికి తీసికొనివచ్చుటతోను ఇది జరిగినది. ఇంతేగాక బ్రిటిష్ సామ్రాజ్య రక్షణకై ఆఫ్ఘనిస్తాన్, బర్మాలపై తీసికొనబడిన సైనికచర్యలు కూడ ఇచట గమనింపదగినవి [చూ. ఆఫ్ఘన్ యుద్ధములు - పు. 284 ; బర్మా యుద్ధములు - పు. 644].

సింధు ప్రాంతమును పాలించుచున్న అమీరుల స్వాతంత్ర్యమును గవర్నర్ - జనరల్ మింటో గుర్తించి, మన్నించెను కాని, అతని తర్వాతివారు దానిని గౌరవించలేదు. ఇందుకు ప్రతీకారమును అమీరులు కనబరచిరి. అందుకు వారిని శిక్షించి, బ్రిటిష్‌వారి అధికారమును కాపాడు నిమిత్తము గవర్నర్ - జనరల్ అయిన ఎల్లెన్‌బరో సింధు ప్రదేశమును జయించెను.

పంజాబ్ ప్రాంతములో సట్లెజ్ నదికి ఉత్తరముగ ఉన్న మండలములోని సిక్కులు తమ ప్రభువయిన రంజిత్‌సింగ్ పాలించినంతకాలము ఇంగ్లీషువారితో స్నేహముగ మెలగిరి. అతని మరణానంతరము వారు ఇంగ్లీషువారితో వైరములో చిక్కుకొనిరి. రెండు పక్షముల మధ్య జరిగిన మొదటి యుద్ధములో సిక్కులు ఓడిపోయి, సంధికుదుర్చుకొనిరి. కాని, బ్రిటిష్ పెత్తనమును పడగొట్టుటకు వారు ప్రయత్నమును మానలేదు. అందుకు ముల్తాన్‌లోని సిక్కు గవర్నర్ తిరుగుబాటు లేవదీసెను. సామ్రాజ్యవాది అయిన డల్‌హౌసీ [చూ. పు. 507] ఈ అవకాశమును పురస్కరించుకొని సిక్కులను జయించి, పంజాబ్‌నంతను 1849 న సామ్రాజ్యమున కలుపుకొనెను.

భారతదేశమునకు తూర్పు సరిహద్దున ఉన్న అస్సామ్, మణిపూర్ రాజ్యములను నాటి బర్మా ప్రభుత్వము జయించినది. వానికి పడమటివైపున గల బ్రిటిష్ పాలిత మండలముల వైపుకు కూడ బర్మా రాజ్యము విస్తరింప సిద్ధపడెను. దీనిని దురాక్రమణగ ఎంచి బ్రిటిష్‌వారు బర్మాపై మొదటి యుద్ధమును చేసి, అస్సామ్, మణిపూర్ మొదలగు ప్రాంతములను ఆక్రమించిరి. ఇంగ్లీషువారు జరిపిన ఈ దురాక్రమణను సహింపక బర్మా ప్రభువు కొంత కాలమునకు వారిని ప్రతిఘటించెను. ఇందువలన డల్‌హౌసీ కాలమున రెండవ బర్మా యుద్ధము జరిగినది. దీనియందు కూడ బర్మా ఓడింపబడుట, దిగువ బర్మా ప్రాంతము బ్రిటిష్‌వారికి హస్తగతమగుట సంభవించినది. ఇట్లే హిమాలయ పర్వత పాదమునగల సిక్కిమ్ రాజ్యములోని కొంతభాగము ఆక్రమింపబడెను.

కత్తిపట్టి పై స్వతంత్రరాజ్యములను జయించిన డల్‌హౌసీ కలంపోటుతోకూడ కొన్ని సామంత రాజ్యములను బ్రిటిష్ పాలితప్రాంతములో లీనము చేసెను. ఔరస సంతానము లేని సామంత ప్రభువులకు దత్తత సౌకర్యము ఈయక, వారి రాజ్యములను కలుపుకొనెను. ఇట్లు సతారా, జైత్‌పూర్, సాంబల్‌పూర్, ఉదయపూర్, ఝాన్సీ, నాగపూర్ రాజ్యములు బ్రిటిష్ పాలనక్రిందికి చేర్చబడినవి.

దుష్పరిపాలన సాగుచున్నందువలన ఔధ్ రాజ్యమున నవాబు పాలన నిర్మూలింపబడినది. నైజామ్ ప్రభుత్వము నుండి బీరార్ ప్రాంతము స్వీకరింపబడినది. నామమాత్రముగ ఉన్న కర్ణాటక నవాబు, తంజావూరు. రాజా, పీష్వాల పదవులు రద్దుచేయబడినవి. మొగల్ చక్రవర్తి పదవినికూడ తొలగించు ఏర్పాటు జరిగినది. ఈ విధముగ డల్‌హౌసీ గవర్నర్ - జనరల్‌గా ఉండిన కాలమున భారతదేశమున బ్రిటిష్ సామ్రాజ్యవ్యాప్తి పరాకాష్ఠను అందుకొనినది. ఇతడు దేశమునందు సామ్రాజ్య నిర్మాతయేకాక, అధునాతన నాగరకతానిర్మాత అని కూడ గుర్తింపదగును.

కంపెనీ పరిపాలన - సంస్కరణలు (1757 - 1857): ఇపుడు రాజకీయరంగమును వదలి, పాలన, ఆర్థిక, సాంస్కృతిక రంగముల వైపుకు మరలి, వానిలో జరిగిన మార్పులను గమనింతము.

బ్రిటిష్ కంపెనీవారు భారతదేశమునకు వ్యాపారము నిమిత్తము వచ్చిరి. అందుకు అవసరమయిన సౌకర్యములను వారికి ఇంగ్లండు దేశపు పాలకులు ' చార్టర్‌లు ' అను అనుమతి పత్రముల ద్వారా ఇచ్చిరి. 1765 న కంపెనీవారు బెంగాల్, బీహార్, ఒరిస్సా రాష్ట్రములందు పాలన సాగించిరి. ఇది దుష్పరిపాలనగ పరిణమించినది. దీనిని అరికట్టి, భారతదేశమునందలి ప్రజలకు కంపెనీవారి వలన సుపరిపాలన లభించునట్లు చేయుటకు బ్రిటిష్‌పార్లమెంట్ పూనుకొన్నది. ఇందుకు ఫలితముగ 1773, 1784, 1813,1833, 1853 సంవత్సరములందు పార్లమెంట్ భారతదేశములో పాలనను సంస్కరించు చట్టములను జారీ చేసినది. వీనిలో 1773 వ సంవత్సరపు రెగ్యులేటింగ్ చట్టము ప్రప్రథమమైనది; ప్రధానమైనది కూడ. దీనివలన జరిగిన మార్పులలో గమనింపదగినవి రెండు. ఇంగ్లండు దేశములో కంపెనీవ్యవహారములపై పార్లమెంట్ లేదా ప్రభుత్వ ప్రతినిధుల పెత్తనము, భారతదేశములో బొంబాయి, మద్రాసు, రాష్ట్ర ప్రభుత్వములపై బెంగాల్‌నందలి కేంద్ర ప్రభుత్వ పెత్తనము ఏర్పాటు చేయబడినవి. ఈ పద్ధతి కాలానుగుణ్యమైన మార్పులతో 1857 వరకు సాగినది. క్రమముగ పాలనాధికారము కంపెనీనుండి పార్లమెంట్‌కు, రాష్ట్ర ప్రభుత్వములనుండి కేంద్ర ప్రభుత్వమునకు తరలిపోయినది. కంపెనీవారి వ్యాపారము క్రమముగ అంతమయినది. వారు సంపాదించిన సామ్రాజ్యము బ్రిటిష్ ప్రభువుకు చెందినదిగ నిరూపింపబడినది. బ్రిటిష్ ప్రభుత్వము చేతిలోని కీలుబొమ్మగా కంపెనీ తయారైనది.

ఈ కాలమున పాలనకు సంబంధించిన వివిధ శాఖలలో వివిధములయిన సంస్కరణలు జరిగినవి. వీనిలో భూమిశిస్తు, న్యాయవిచారణశాఖలలో జరిగిన మార్పులు ముఖ్యమైనవి. వీనిని ప్రవేశపెట్టిన బ్రిటిష్ పాలకులలో కేంద్రప్రభుత్వమున గవర్నర్ - జనరల్ పదవిని అలంకరించిన వారన్ హేస్టింగ్స్, కారన్‌వాలీస్; రాష్ట్ర గవర్నర్‌లుగా వ్యవహరించిన మన్రో, ఎలిఫిన్‌స్టన్, మాల్కమ్, మెట్‌కాఫ్ పేర్కొనదగినవారు.

బెంగాల్‌లో 1765 న క్లైవ్ స్థాపించిన ద్వంద్వప్రభుత్వము విఫలమైనది. అందువలన అతని తర్వాత పాలించిన వారన్ హేస్టింగ్స్ ఆ విధానమును రద్దుచేసి, దివాని, నిజామత్ అను పాలనాశాఖలను రెంటిని కంపెనీ ఉద్యోగులకు అప్పగించెను. శిస్తువసూలు కార్యము జిల్లాలలో ఇంగ్లీషు కలెక్టర్‌లకు, వీరందరిపైన కలకత్తాలో ఏర్పాటు చేయబడిన రెవిన్యూబోర్డ్‌నకు ఇవ్వబడినది. న్యాయపరిపాలనాశాఖలో జమీందారులు తొలగింపబడి, వ్యవహారము జిల్లాలందలి సివిల్ - క్రిమినల్ న్యాయస్థానములకు, వీనికి పైనగల ఉన్నత న్యాయస్థానములకు అప్పగించబడినది. ఇంతేగాక, నేరములు జరుగకుండునట్లును, శాంతి - భద్రతలు సంతృప్తికరముగ ఉండునట్లును, ఉద్యోగులలో అవినీతి ప్రబలకుండునట్లును హేస్టింగ్స్ సంస్కరణలు చేసెను. ఇతని తర్వాత గవర్నర్ - జనరల్ పదవిని అలంకరించిన కారన్‌వాలీస్ పాలనాయంత్రమును సంస్కరించుటకు పూనుకొనెను. ఇతని సంస్కరణలలో ప్రధానమైనది భూమిశిస్తును శాశ్వతముగా నిర్ణంచుట (జమీందారీ పద్ధతి). దీని ప్రయోజనమును గురించి చాలకాలము వాదోపవాదములు చెలరేగినవి. న్యాయశాఖలో జిల్లా, రాష్ట్ర న్యాయస్థానముల నడుమ మరొక శ్రేణికి చెందిన న్యాయస్థానములు ఏర్పాటయినవి. జిల్లా పరిపాలనలో శిస్తు వసూలు, న్యాయనిర్వహణ కార్యములు వేరుచేయబడినవి. ఈ మార్పులు అన్నిటిని కలిపి ' కారన్‌వాలీస్ కోడ్ ' అందురు. తర్వాతికాలమున న్యాయస్థానములందు ప్రాంతీయ భాషలను ఉపయోగించు సౌకర్యమును బెంటింక్ [చూ.] కలుగచేసెను. ఇంతేగాక, ఈ కాలమున దేశమందలి వివిధ న్యాయచట్టములను సమీక్షించి క్రోడీకరించుటకు, రాష్ట్రములందు హైకోర్ట్‌లను స్థాపించుటకు ఏర్పాటు చేయబడినది. అయితే, ఇవి 1857 తర్వాత సఫలమైనవి. మరొక మాట. దేశీయులకు ఉన్నతోద్యోగములను ఇచ్చుటకు వారన్ హేస్టింగ్స్, కారన్‌వాలీస్‌లు అడ్డుపడినను, తర్వాత పాలకులు అట్లు చేయక వారికి ప్రోత్సాహము ఇచ్చిరి.

అయితే, ఆర్థిక రంగమున బ్రిటిష్ కంపెనీ పాలన దేశమును అధోగతికి ఈడ్చినది. పూర్వకాలమున నూలు, సిల్కువస్త్రములకు, ఉన్నితివాచీలకు, లోహపరిశ్రమకు,

చర్మపరిశ్రమకు ప్రసిద్ధిగాంచిన భారతదేశము ఈ కాలమున పేరు పోగొట్టుకొన్నది. పై వృత్తులతోపాటు వ్యవసాయము, వాణిజ్యము కూడ దిగజారినవి. సిరి సంపదలు సన్నగిలినవి.

సాంఘిక, సాంస్కృతిక రంగములందు జరిగిన సంస్కరణల సందర్భమున అందరి మనసులలో మెదలునది గవర్నర్ - జనరల్ అగు బెంటింక్ పేరు. ప్రజల శ్రేయస్సును ఆశించి అందుకై శక్తివంచనలేక పాటుబడిన ఉదారహృదయముగల పాలకుడు ఇతడు. ఈయన ప్రవేశపెట్టిన సంస్కరణలలో ముఖ్యమైనవి ఇవి : ఠగ్గులను దోపిడిగాండ్రను నిర్మూలించి, దేశమధ్యమున ప్రజల ప్రాణ మానములను, ఆస్తిపాస్తులను రక్షించెను; సాంఘిక సంస్కర్తయైన రాజా రామమోహన రాయలు [చూ.] సహకారముతో సతీ సహగమనము [చూ. సం. 10 - పు. 765] నిషేధింపబడినది; బానిసత్వ నిర్మూలనకు ఏర్పాటు చేయబడినది; నరబలి [చూ. సం. 10 - పు. 443], శిశుహత్య మొదలగు దురాచారములు నిర్మూలింపబడినవి; తర్వాత హిందువులలో స్త్రీ పునర్వివాహమునకు, అన్యమత స్వీకరణకు అనుమతి లభించినది. బెంటింక్ విద్యారంగమున చేసిన మార్పు చాల ముఖ్యమైనది. ఇది ప్రజలకు ఇంగ్లీషు భాషను, సారస్వతమును, శాస్త్రీయవిజ్ఞానమును బోధించుటకు సంబంధించినది. ఇందుకు ఫలితముగ పాశ్చాత్యవిద్య, విద్యా సంస్థలు దేశములో వ్యాపించినవి.

డల్‌హౌసీ కాలమున దేశములో నవీన నాగరకతా వ్యాప్తి ప్రారంభమైనది. నూతనమైన రోడ్లు, రైలు మార్గము, తంతి - తపాలా సౌకర్యములు రాజకీయ, ఆర్థిక రంగములందు అభ్యుదయమునకు త్రోవతీసినవి. ప్రతి రాష్ట్రమునందు ప్రాథమిక, సెకండరీ పాఠశాలలు వృద్ధి చేయబడినవి. వీనిని పర్యవేక్షించుటకు ఇన్‌స్పెక్టర్‌లు, వారందరిపైన డైరెక్టర్ నియమింపబడిరి. నూతనముగ విద్యాశాఖ ఏర్పాటు చేయబడినది. విద్యారంగమునందు జరిగిన ఇటువంటి సంస్కరణలు కాలక్రమమున ప్రజల మనోభావములందు చాల మార్పును కలిగించినవి. అవి సాంస్కృతిక పురోగతికి పునాదులను వేసినవని నాటి ప్రజలు గుర్తింపకున్నను, నేటి పౌరులు అంగీకరింతురు.

**1857 - తిరుగుబాటు :** ఈ తిరుగుబాటుయొక్క పుట్టు పూర్వోత్తరములను గురించి, స్వరూప - స్వభావాదులను గురించి భిన్నాభిప్రాయములు కలవు. అయినను, వానిని ఈ క్రిందివిధముగ సూచించుట సమంజసము. బ్రిటిష్ కంపెనీ పరిపాలనలో స్వదేశసంస్థాన ప్రభువులకు, జమీందారుల పూర్వపు హక్కులు, సంస్థానములలోని ఉద్యోగులకు వృత్తులు పోయినవి. పూర్వాచారములకుకట్టుబడి ఉన్న హిందువుల ఆచారములు కొన్ని నిషేధింపబడినవి; సిపాయిలపై నిర్బంధములు ఎక్కువైనవి. ఇవి తిరుగుబాటుకు మూల కారణములు. దానిని 1857 న ప్రజ్వలింపచేసినది సిపాయిలు ఉపయోగించు తుపాకుల తోటాలకు (ఆవు, పంది) కొవ్వు పూతగ వాడబడినదను ప్రచారము.

పై కారణములు తిరుగుబాటుకు తోడ్పడినవి. అది మే నెల 10 వ తేదీన మీరట్‌లో సిపాయిలు తిరుగబడుటతో ప్రారంభమైనది. దానికి మొగల్ చక్రవర్తి, ఝాన్సీ రాణి లక్ష్మీబాయి [చూ. పు. 489], తాంతియాతోపి [చూ. పు. 516], నానా సాహెబ్ [చూ. పు. 532] వంటి ప్రముఖ నాయకులు దోహదము ఇచ్చిరి. అందువలన తిరుగుబాటు ఢిల్లీ, కాన్పూర్, గ్వాలియర్ మొదలగు నగరములకు వ్యాపించినది. సంస్థానాధీశులకు, సైనికులకు సామాన్య ప్రజలుకూడ తోడై ప్రభుత్వమును ప్రతిఘటించి, బ్రిటిష్ ప్రభుత్వమును కూలదోయుటకు పోరాడిరి.

కాని, ఈ ప్రతిఘటనోద్యమము ఫలింపలేదు. దానికి నాయకత్వము వహించిన మొగల్ చక్రవర్తి బ్రిటిష్‌వారికి బందీ అయ్యెను. ఝాన్సీరాణి వీరోచితముగ పోరాడి మరణించెను. తాంతియాతోపి ఉరితీయబడెను. తిరుగబడిన సైనికులు హతమొనర్పబడిరి. సామాన్య ప్రజలు అణగద్రొక్కబడిరి. తిరుగుబాటు అణచబడి, 1858 చివరన శాంతి నెలకొల్పబడినది. దేశము బ్రిటిష్‌వారి అధీనము క్రిందికి తిరిగి వచ్చినది.

తిరుగుబాటు స్వాతంత్ర్యకాంక్షతో సాగింపబడుట నిజమే. కాని, దానిని సాగించిన నాయకుల మధ్య తగినంత ఐకమత్యము లేకపోవుటయే అది విఫలమగుటకు ముఖ్య కారణము. ఇంతకు పూర్వము అనేకసార్లు జరిగినట్లు ఇప్పుడుకూడ దేశములో ఐకమత్యము లోపించినందువలనే పరదేశీయులకు లొంగవలసి వచ్చినది.

తిరుగుబాటు సమసిన తర్వాత భారతదేశచరిత్రలో నూతనమైన, అధునాతనమైన అధ్యాయము ప్రారంభమైనది.

**భారతదేశము - బ్రిటిష్ ప్రభుత్వ పాలన (1858 - 1947) :** ఈ కాలమున దేశచరిత్రలో ముఖ్యముగ గమనింపదగినవి జాతీయోద్యమవ్యాప్తి, పాలనా పద్ధతిలో జరిగిన అభివృద్ధి. అయినను, విదేశ వ్యవహారములు, స్వదేశ సంస్థానముల స్థితి, ప్రజాశ్రేయస్సుకు సంబంధించిన కార్యక్రమములు, సంఘమును, మతమును సంస్కరించుటకు సంస్కర్తలచే సాగింపబడిన ఉద్యమములుకూడ పరిశీలింపదగినవే. అప్పుడు చరిత్ర సమగ్రముగ ఉండగలదు.

**విదేశ వ్యవహారములు :** భారతదేశముయొక్క విదేశ వ్యవహారములు దేశమును పాలించిన బ్రిటిష్ ప్రభుత్వమునకు అనుకూలముగ ఉండునట్లు సాగింపబడినవి. అనగా దేశక్షేమము దృష్ట్యా గాక, బ్రిటిష్ సామ్రాజ్యపు భద్రత దృష్ట్యా అవి రూపొందించబడినవి. 19 వ శతాబ్దియందు భారతదేశమున వెలసిన బ్రిటిష్ సామ్రాజ్యమును కూలద్రోయుటకు రష్యా సామ్రాజ్య ప్రభుత్వము దేశపు పశ్చిమోత్తర ప్రాంతముగుండా దండెత్తి రాగలదను భీతి బ్రిటిష్ వారికి ఉండెడిది. ఇందుకై వారు మనదేశమునకు పశ్చిమమున, ఉత్తరమున ఉన్న రాజ్యములు తమ పలుకుబడికి లోబడి ఉండునట్లు, రష్యావారికి లొంగకుండునట్లు ప్రయత్నించిరి. ఇందుకుగాను సరిహద్దు రాజ్యములపట్ల వీలయినంతవరకు సామోపాయమును, అవసరమని తోచినపుడు దండోపాయమును ప్రయోగించిరి. వానిలో ముఖ్యమైన అఫ్ఘనిస్తాన్‌ను రష్యావారినుండి వేరుచేసి, తమకు అనుకూలముగ ఉండునట్లు త్రిప్పుటకు బ్రిటిష్‌వారు 1839 - 42 నడుమ మొదటి అఫ్ఘన్ యుద్ధమును, 1878 - 80 నడుమ రెండవ అఫ్ఘన్ యుద్ధమును చేసిరి [చూ. అఫ్ఘన్ యుద్ధములు - పు. 284]. కర్జన్ [చూ. పు. 370] అఫ్ఘనిస్తాన్‌తో స్నేహమును స్థిరముచేసి, పారసీకసింధుశాఖలో రాయబార కార్యాలయములను స్థాపించిన తరువాత టిబెట్ దేశముపై దండయాత్ర సాగించెను. బర్మాదేశము ఫ్రెంచివారి ప్రాబల్యమునకు గురికాక, బ్రిటిష్‌వారి పెత్తనమునకు లోబడి ఉండుటకై 19 వ శతాబ్దిలో బర్మాపై మూడు యుద్ధములు జరిగినవి [చూ. బర్మా యుద్ధములు - పు. 644]. 1907 నాటికి ఇంగ్లండు, రష్యా, ఫ్రాన్స్ దేశములకు మైత్రి జరిగి, వైరము సమాప్తమైనది. అప్పటినుండి ఇంగ్లండు, జర్మనీలకు పోటీ పెరిగి పెరిగి ప్రథమ, ద్వితీయ ప్రపంచ యుద్ధములుగా విషమించినది. ఇంగ్లండుతోపాటు భారతదేశముగూడ పై యుద్ధములలో పాల్గొనవలసి వచ్చినది.

**స్వదేశ సంస్థానములతో సంబంధములు :** భారతదేశములోని కేంద్ర ప్రభుత్వమునకు, స్వదేశ సంస్థానములకు మధ్యగల సంబంధములు రకరకములుగ మారినవి. ఎట్లు మారినను ఎల్లపుడు అవి బ్రిటిష్ ప్రభుత్వపు సామ్రాజ్యవాదమునకు దోహదముగ ఉండునట్లే సవరించబడినవని గ్రహింపదగును. 1857 తిరుగుబాటు తర్వాత స్వదేశ సంస్థానములను నిర్మూలించు విధానము రద్దు అయి, వానిని రక్షించు పద్ధతి అమలు జరిగినది. అయితే, వానిలో దుష్పరిపాలన చెలరేగినపుడు భారతదేశ కేంద్రప్రభుత్వము తటస్థముగ ఉండక, జోక్యము కల్పించుకొని, పరిపాలనను సంస్కరించు విధానమును అవలంబించినది. బరోడా, మణిపూర్ సంస్థానములలో ఇట్లు జరిగినది. 1905 నుండి దేశమున జాతీయోద్యమము విస్తరించుట జరిగినందువలన ప్రభుత్వము సంస్థానాధీశులను తనకు సన్నిహితము చేసికొనుట ప్రారంభించినది. 1921 న సంస్థానాధీశుల మండలి ఏర్పాటుచేయబడి, తద్వారా వారు జాతీయోద్యమ నాయకులనుండి వేరుచేయబడిరి. 1935 చట్టమునందు సంస్థానాధీశులు, రాష్ట్రములందలి ప్రతినిధులు బ్రిటిష్‌వారి యాజమాన్యముక్రింద ఫెడరల్ ప్రభుత్వములో చేరుటకు వీలు కలిగినది గాని, ఇది ఫలింపలేదు. చివరకు 1947 న సంస్థానాధీశులకు భారతదేశము, పాకిస్తాన్‌లలో ఏ ఒకదానియందైన చేరుటకుగాని, స్వతంత్రముగ వ్యవహరించుటకుగాని స్వేచ్ఛ ఇవ్వబడినది.

**ప్రజా శ్రేయస్సును పెంపొందించు మార్పులు :** 19 వ శతాబ్ది మధ్యవరకు భారతదేశ ప్రభుత్వము నిర్వహించిన కార్యములు చాలవరకు శాంతిభద్రతలకు సంబంధించినవే. అయితే, తర్వాతికాలమున అది ప్రజాశ్రేయస్సును పెంపొందించు నిమిత్తము అనేక రకములయిన కార్యక్రమములను కొనసాగించినది. ఇందు నీటి పారుదల, వ్యవసాయము, వాణిజ్యము, పరిశ్రమలు, రహదార్లు, రవాణాలను వృద్ధిచేయుట, ప్రజలను కరువులనుండి, వ్యాధులనుండి కాపాడుట, వారికి విద్య, వైద్య సదుపాయములను ఒసగుట, సుపరిపాలనమేగాక, స్వపరిపాలనము స్థానిక రంగమున వారికి ఏర్పాటుచేయుట పేర్కొనదగినవి. శ్రామికుల, స్త్రీల సంక్షేమము కొరకు కొన్ని సంస్కరణలు ప్రవేశపెట్టబడినవి. ఇటువంటి ప్రజాహిత కార్యక్రమములను 19 వ శతాబ్దిని నెరవేర్చిన బ్రిటిష్ రాజప్రతినిధులలో రిప్పన్ [చూ.], కర్జన్ ప్రశంసింపదగిన వారు, వీరిలో అగ్రస్థానము నిస్సందేహముగా పాలిత ప్రజల బాంధవుడని ప్రస్తుతింపబడిన రిప్పన్‌కు చెందగలదు.

**భారతీయ సంస్కర్తల సంస్కరణోద్యమములు :** 19 వ శతాబ్దియందు భారతదేశమున సాంఘిక, మతరంగములందు గమనింపదగిన సంస్కరణోద్యమములు బయలుదేరినవి. ఆధునిక రంగమున బయల్వెడలిన నవనాగరకతకు ఇవి నాంది వంటివి. వీనిద్వారా నవచైతన్యము సాంఘిక రంగమున ప్రారంభమై రాజకీయ, సాంస్కృతిక రంగములకు కూడ వ్యాపించినది. ఇది యొక విప్లవాత్మకమైన సంఘటన. అయినను, పూర్వాపరములను పరిశీలించినచో ప్రాచీన, మధ్య యుగములందు జరిగిన ఉద్యమములవంటిదే ఇది అని గ్రహింప వీలగును. ఈ ఆధునిక ఉద్యమముల ముఖ్యకారణములలో పాశ్చాత్య విద్యా

వ్యాప్తి, తద్వారా జరిగిన పాశ్చాత్య భావవ్యాప్తి అను వానిని పేర్కొనవచ్చును. కాని, యుగయుగములుగ భారతీయ మేధావులు, సంస్కర్తలు కనబర్చిన సమన్వయ దృష్టిని ఆధునికకాలమునందలి వారు ప్రదర్శించి ఉండుట అతి ముఖ్యకారణముగ ఎన్నదగును. అనగా ఈ కాలమునందు పాశ్చాత్య, ప్రాచ్య సంస్కృతుల మధ్య సాధింపబడిన సమన్వయము ఈ సంస్కరణోద్యమముల రూపము దాల్చినది.

ఈ సంస్కరణోద్యములు రాజా రామమోహనరాయ్ [చూ.] స్థాపించిన బ్రహ్మసమాజమునకు, మహదేవ్ గోవిందరనడే ప్రచారముచేసిన ప్రార్థన సమాజమునకు, దయానంద సరస్వతి స్థాపించిన ఆర్యసమాజమునకు, రామకృష్ణ పరమహంస పేర సాగింపబడిన రామకృష్ణ మఠమునకు సంబంధించినవి. వీనితో పోల్చదగినదే ఆనిబిసెంట్ [చూ. సం. 10 - పు. 196] ప్రోత్సాహముతో ప్రచారములోనికి వచ్చిన దివ్యజ్ఞాన సమాజము. ఈ ఉద్యమములు దేశమునందలి మేధావులలో చాలమందిని ఆకర్షించి, హిందూసంఘమునందు, మతమునందు మార్పులను కలుగజేసినవి. మొత్తముమీద మూఢనమ్మకములను, దురాచారములను తొలగించుటకు ఇవి తోడ్పడినవి. మత దురభిమానములు, కులకథలు మొదలగువానిని ఖండించి సర్వమానవ సోదరత్వమును, సత్ప్రివర్తనను, మానవ సేవానిరతిని ప్రోత్సహించినవి. అయితే, సంస్కరణ పట్ల వీనిలో తరతమ భేదములు కలవు. బ్రహ్మసమాజము సంస్కరణను అత్యధికముగ ప్రోత్సహించగా, ఆర్య సమాజము వేదవిహితమైన సంస్కృతిని అత్యధికముగ ఆశ్రయించినది. మొదటిది అధునాతన మార్గమును, రెండవది సనాతన మార్గమును అవలంబించినవి. సంస్కరణోద్యమములు హిందూసంఘమునందేగాక, ముస్లిమ్ సంఘమునందుకూడ బయలుదేరినవి. అలిఘర్ నందు ప్రారంభమైన సంస్కరణోద్యమము · ముస్లిమ్‌లను నవోదయమునకు మేల్కొలిపినది. గులామ్ అహమద్ అను సంస్కర్త ప్రచారము చేసిన అహమదీయ ఉద్యమము ఇస్లామ్‌మత సూత్రములకు నూతనమైన, అభ్యుదయకరమైన వ్యాఖ్యానమును చూపెను. అనగా అన్నిమతములు ఒకే దేవునిచే బహిర్గతము ఒనర్పబడినవని, అన్నియు సమానమైనవేనని, ముస్లిమ్‌లు ఖురాను గ్రంథమందలి సూక్తులను అక్షరములను బట్టిగాక, అంతరార్థమునుబట్టి అనుసరింపవలెనని, ముస్లిమేతరుల సహకార స్నేహములను పొందుటకుగాను వారిపై జీహాద్ అను మతయుద్ధము మాటను ముస్లిమ్‌లు మరచి పోవలెనని, ముస్లిమ్‌లు - ముస్లిమేతరులు సోదరులవలె మెలగవలెనని ఈ ఉద్యమము ప్రచారము చేసినది.

ఈ విధముగ హిందూ - ముస్లిమ్‌లందు బయల్వెడలిన సంస్కరణాభిలాష వారి సాంఘిక, మత విషయములనే గాక, రాజకీయ వ్యవహారములను కూడ తీర్చి దిద్దినది.

**జాతీయోద్యమము** (1885 - 1947): 19 వ శతాబ్దియందు తల ఎత్తిన సంస్కరణాభిలాష రాజకీయరంగమున జాతీయోద్యమరూపము దాల్చినది. ఈ ఉద్యమము భారత దేశమునందు వివిధ జాతి, మత, వేష, భాషలు గల ప్రజలందరికి రాజకీయముగ ఐకమత్యమును చేకూర్చి, వారికి బ్రిటిష్ పాలననుండి స్వాతంత్ర్యమును సంపాదించి, ప్రజా స్వామ్యప్రభుత్వమును సమకూర్చి, వారిని ఏకజాతిగ సంస్కరించుటకు ప్రయత్నించినది. దేశనాయకులకు సహజముగ ఉన్న స్వాతంత్ర్యపిపాస, సంస్కరణ ప్రియత్వము దీనికి ముఖ్యకారణములు. ఇందుకు సహాయమైనది నాటి పాశ్చాత్య దేశములందు విజృంభించిన జాతీయోద్యమము. దీని ప్రభావము భారతదేశమునకు కూడ వ్యాపించినది.

1885 నుండి 1947 వరకు జరిగిన హిందూదేశ చరిత్ర నాటి జాతీయోద్యమచరిత్రయే అనుట అతిశయోక్తి కాదు. ఈ కాలమున సంభవించిన రాజకీయ సంఘటనలు అన్నిటియందును ఈ ఉద్యమముయొక్క ప్రభావమును కనుగొనవచ్చును. ఈ మహత్తరమైన ఉద్యమమునందు కాననగు ముఖ్య దశలను ఈ క్రింది విధమున వర్ణింపవీలగును: 1. మితవాద దశ (1885 - 1905); 2. అతివాద దశ (1805 - 1920); 3. శాంతియుతమైన శాసనోల్లంఘన దశ (1920 - 1947).

మితవాద దశ (1885 - 1905): భారతదేశములో జాతీయోద్యమమును సాగించిన సంస్థ భారతజాతీయ కాంగ్రెస్ [చూ. పు. 379]. ఇది 1885 లో అవతరించినది. మొదటి కాంగ్రెస్‌సభ సుప్రసిద్ధ బెంగాలీనాయకుడైన డబ్ల్యు. సి. బెనర్జీ అధ్యక్షతన బొంబాయిలో జరిగినది. ఈ సభకు దేశమునందలి వివిధ రాష్ట్రములనుండి 70 మంది ప్రతినిధులు హాజరైరి. అప్పటి నుండి ప్రతి ఏటా ఒక్కొక్క ముఖ్య నగరమున కాంగ్రెస్ సభ జరుగుచు వచ్చినది. కాలక్రమమున ఈ సంస్థ ప్రజలను ఆకర్షించి, పేరు ప్రతిష్ఠలను సంపాదించి, ప్రాబల్యమును పొందినది. ఈ కాలమున దీనియొక్క ఆశయములను రూపొందించి, కార్యక్రమములను కొనసాగించిన వారిలో ముఖ్యులు మితవాదులైన దాదాభాయి నౌరోజీ [చూ. పు. 551], సురేంద్రనాద్ బెనర్జీ, గోపాలకృష్ణ గోఖలే [చూ. పు. 428]. వారి నాయకత్వ

మున కాంగ్రెస్ బ్రిటిష్ పాలకులకు తమ కోర్కెలను తీర్మానములద్వారా తెలియపరచి, శాంతియుతమైన, వినయపూర్వకమైన మార్గమున వానిని తీర్చవలసినదిగ పాలకులను ప్రార్థించుచుండెడిది. ఆ విధముగ వెలిబుచ్చిన కోర్కెలలో ముఖ్యమైనవి శాసనసభయందు, ప్రభుత్వోద్యోగములందు ఎక్కువమంది భారతీయులను చేర్చుటకు, పరిశ్రమలకు రక్షణను ఇచ్చి పెంపొందించుటకు, విద్యావ్యాప్తిని హెచ్చుచేయుటకు సంబంధించినవి. ప్రభుత్వము మొదట కాంగ్రెస్‌కు సుముఖముగ ఉండినదిగాని, కాలక్రమమున విముఖత కనబర్చినది. అయినను కాంగ్రెస్ కోర్కెను కొంతవరకైనను నెరవేర్చుటకు 1892 సంవత్సరపు చట్టమును బ్రిటిష్ ప్రభుత్వము రూపొందించినది.

**అతివాద దశ** (1905 - 1920): రాజప్రతినిధి అయిన కర్జన్ కాంగ్రెస్‌కు విరోధి. అతడు జాతీయ వాదులకు వ్యతిరేకముగ చేసిన చర్యలలో 1905 నాటి బెంగాల్ రాష్ట్ర విభజన అతితీవ్రమయినది. ఈ చర్య కాంగ్రెస్‌లో కొంతమందిని చాల రెచ్చగొట్టినది. వారిని ప్రభుత్వముపై తిరుగబడి, హింసాయుతమైన అత్యాచారములు చేయునట్లు పురికొల్పినది. ఈ అతివాద వర్గమునకు బాలగంగాధర తిలక్ [చూ. పు. 519], అరవిందఘోష్ [చూ. పు. 271], లాలా లజపతిరాయ్ [చూ.], బిపిన్‌చంద్రపాల్ నాయకత్వము వహించిరి. అతివాదుల దౌర్జన్యపు చేష్టలను అణచుటకు రాజప్రతినిధి మింటో కఠినమైన నిర్బంధములను చట్టములద్వారా అమలు జరిపెను. ఒక వైపున శిక్షలను విధించి, అతివాదులను అణగ దొక్కుచు, మరొకవైపున గోఖలేవంటి మితవాదులను 1909 నాటి మింటో - మార్లే సంస్కరణ ద్వారా లాలించి ఆదరించెను. ఇంతేగాక, యుక్తిపరుడైన మింటో భేదోపాయముచే ముస్లిమ్‌లు కాంగ్రెస్‌లో చేరక, బ్రిటిష్ పాలకులకు సన్నిహితముగ ఉండునట్లు చేసెను. అతని ప్రోత్సాహమువలన ముస్లిమ్‌లీగ్ అను ప్రత్యేక సంస్థ ఏర్పడి, కాంగ్రెస్‌కు ప్రత్యర్థిగ పరిణమించినది. ప్రథమ ప్రపంచ యుద్ధము [చూ. పు. 594] జాతీయోద్యమము వృద్ధియగుటకు తోడ్పడినది. 1916 లో కాంగ్రెస్ నందలి మితవాద - అతివాద వర్గములు, కాంగ్రెస్, ముస్లిమ్ లీగ్‌లు సహకరించుటకు సిద్ధపడినవి. వీనికి తోడుగ ఆనిబిసెంట్ సతిచే 'హోమ్‌రూల్' ఉద్యమము ప్రారంభింపబడినది. దేశముయొక్క రాజకీయ పురోభివృద్ధికి గాను జరిపిన ఈ సంఘటనల ఒత్తిడికి బ్రిటిష్ ప్రభుత్వము లొంగవలసి వచ్చినది. అందువలన జాతీయవాదులు కోరిన బాధ్యతాయుత ప్రభుత్వమును బహు స్వల్పముగ 1919 సంవత్సరపు చట్టము ద్వారా భారతదేశములో ప్రవేశపెట్టుటకు ఏర్పాటు చేయబడినది. అయితే, ఈ చట్టము కాంగ్రెస్ వారికి సంతృప్తిని కలుగచేయలేదు. దేశములో బ్రిటిష్‌వారికి వ్యతిరేకముగ అలజడి ఎక్కువైనది. దీనిని అణచుటకు ప్రభుత్వము కఠోరమైన చర్యలకు సిద్ధమైనది. ఈ వాతావరణములో 1919 న అమృతసర్‌లోని జలియన్‌వాలాబాగ్‌లో చేరిన నిరాయుధులైన ప్రజలపై తుపాకీగుండ్లు పేల్చి, వారిని హత మొనర్చిన అత్యాచారము జరిగినది. ఈ ఉదంతము జాతీయవాదులను చాల ఉద్రేకపరచి, ఉడికించినది [చూ. జలియన్‌వాలాబాగ్ దురంతములు - పు. 476]. ఇది ఇట్లుండ ఖిలాఫత్ ఉద్యమము ముస్లిమ్‌లు బ్రిటిష్‌వారికి ఎదురు తిరుగునట్లు చేసినది [చూ. ఖిలాఫత్ ఉద్యమము - పు. 417].

**శాంతియుతమైన శాసనోల్లంఘన దశ** (1920 - 1947): 1920 న ఏర్పడిన ఈ తరుణమున గాంధిజీ [చూ. పు. 421] కాంగ్రెస్‌కు నాయకత్వమును వహించి ఆ సంస్థయొక్క కార్యకలాపములను 1947 వరకు తీర్చిదిద్దెను. ఈ దశయందు మొత్తముమీద అతనిదే ఏకైకనాయకత్వము. అతని నాయకత్వముయొక్క ప్రభావము కాంగ్రెస్ సంస్థమీదనే గాక దేశమందలి ఇతర సంస్థల మీదను, దేశము ఆవల ఉన్న బ్రిటిష్ ప్రభుత్వము మీదను కూడ స్పష్టముగ కాననగును. కావున, ఈ కాలమును 'గాంధి శక' మనుట అతిశయోక్తి కాదు. గాంధిజీ నాయకత్వమున జాతీయోద్యమము శాంతియుతమైన ప్రజా ఉద్యమముగ పరిణమించుట గమనింపదగిన విశేషము.

గాంధిజీ కాంగ్రెస్ ఆశయము 'స్వరాజ్య' మని సూచించి, దానిని వీలయితే బ్రిటిష్ సామ్రాజ్యములో చేరియుండిగాని, వీలుకానిచో బ్రిటిష్ సామ్రాజ్యమునుండి వైదొలగిగాని భారతదేశము స్వపరిపాలనను అనుభవించు స్థితిగా వర్ణించెను. స్వరాజ్యసంపాదన కొరకు సూచింపబడిన కార్యక్రమము, ప్రభుత్వము ఎడల సహాయనిరాకరణము, ప్రభుత్వ శాసనముల ఉల్లంఘనములరూపము దాల్చినది. సహాయ నిరాకరణమును ప్రభుత్వ శాసనసభలు, న్యాయస్థానములు, ఉద్యోగములు మొదలగువానియందు ప్రజలు చేరక నిరాకరించి, సాధింపవలసి ఉన్నది. శాసనోల్లంఘనము శాంతియుతమయిన మార్గమున సాగింపబడవలసి ఉన్నది. ఈ కార్యక్రమములు కొంతవరకు మాత్రము సాగి, ప్రజలకు తగినంత వివేకము లేనందున తరువాత కుంటుబడినవి. ఒకవైపున గాంధిజీ శాసనసభల పరిష్కారమును సాధించుచుండగా, మరొకవైపున మోతీలాల్ నెహ్రూ [చూ. పు. 545], చిత్తరంజన్ దాస్

[చూ. పు. 451] లాంటి కాంగ్రెస్ నాయకులు స్వరాజ్య పార్టీ అనుదానిని నెలకొల్పి శాసనసభలలో ప్రవేశించి, ప్రభుత్వమును ఎదుర్కొన యత్నించిరి. ఈ ప్రతిఘటనను గుర్తించి బ్రిటిష్‌ప్రభుత్వము భారతదేశపు రాజ్యాంగమును సంస్కరించుటకు తగిన సూచనలను ఇచ్చుటకు సైమన్ కమిషన్‌ను నియమించి, దానిని భారతదేశమునకు పంపినది. ఈ కమిషన్‌ను కాంగ్రెస్‌వాదులు బహిష్కరించిరి. దాని నివేదిక నిష్ఫలమైనది. 1929 లో రాజప్రతినిధి ఇర్విన్, భారతదేశమునకు డొమినియన్ (అధినివేశ) ప్రతిపత్తి ఇవ్వబడునని, అందుకు అవసరమైన రాజ్యాంగ విధానము ఇంగ్లండులో జరుపబడు రౌండ్‌టేబుల్ సమావేశములో నిర్ణయింపబడునని, ఆ సమావేశమునందు భారతదేశములోని అన్ని పార్టీల ప్రతినిధులు, బ్రిటిష్‌ప్రభుత్వము పాల్గొనవలసి ఉన్నదని ప్రకటించెను. డొమినియన్ ప్రతిపత్తిగాని, దానిని రాజ్యాంగచట్టములో రూపొందించు విధానముగాని కాంగ్రెస్‌కు నచ్చలేదు. అందువలన 1929, డిసెంబరులో జవాహర్‌లాల్ నెహ్రూ [చూ. పు. 544] అధ్యక్షతన జరిగిన కాంగ్రెస్ మహాసభ బ్రిటిష్ సామ్రాజ్యముతో సంబంధములేని సంపూర్ణ స్వరాజ్యమే తన లక్ష్యమని, దానిని సాధించుటకు శాసనోల్లంఘన కార్యక్రమమును తీవ్రముగ సాగింపవలసినదని నిర్ణయించినది. ఈ నిర్ణయము ప్రకారము 1930 నుండి శాసనోల్లంఘనోద్యమము దేశమున విజృంభించినది. దానిని అణచుటకు ప్రభుత్వము కఠినశిక్షలను అమలుపరచినది. మొత్తముమీద నాలుగేండ్లపాటు కాంగ్రెస్‌వాదులు, బ్రిటిష్ పాలకులు ప్రతిఘటన - ప్రతీకారముల విషవలయములో చిక్కుకొనిరి. అయితే, మధ్యమధ్య శాంతి - సామరస్యములు లేకపోలేదు. ఇంగ్లండులో జరిగిన మూడు రౌండ్‌టేబుల్ సమావేశములలో మొదటిదానిని, మూడవ దానిని కాంగ్రెస్‌వారు బహిష్కరించిరి కాని, రెండవ సమావేశమునకు కాంగ్రెస్ ప్రతినిధిగ గాంధిజీ హాజరయి చర్చలలో పాల్గొనెను. అయినను కాంగ్రెస్‌కు, ఇతర పక్షములకు రాజ్యాంగ విధానమును గురించి ముఖ్యముగ అల్పసంఖ్యాకుల స్థితిపట్ల సమాధానము కుదరలేదు. రౌండ్‌టేబుల్ సమావేశములందలి సంప్రదింపులదృష్ట్యా బ్రిటిష్ ప్రభుత్వము తనకు తోచినట్లు, లాభించునట్లు, 1935 రాజ్యాంగచట్టమును రూపొందించినది. దీని ఎడల పూర్తి తృప్తిలేకున్నను, కాంగ్రెస్ దానిని పాక్షికముగ ఆమోదించి, దాని ప్రకారము జరిగిన ఎన్నికలలో పాల్గొనినది. అటుల 1937 న జరిగిన సాధారణ ఎన్నికలలో కాంగ్రెస్ 11 రాష్ట్రములందు ఏడింటిలో ప్రాబల్యమును పొంది, రాష్ట్ర మంత్రివర్గములను ఏర్పాటు చేసి, పాలన సాగించినది. బ్రిటిష్ పాలకులకు, కాంగ్రెస్ నాయకులకు మధ్య సహాన - సహకారభావములు ఏర్పడి, కాంగ్రెస్ పాలన సంతృప్తికరముగనే సాగినది. కాని, కాంగ్రెస్, ముస్లిమ్‌లీగ్‌ల మధ్య విభేదము పెరిగినది.

ద్వితీయ ప్రపంచయుద్ధము (1939) [చూ. పు. 608] ప్రారంభమయిన తర్వాత భారతదేశములోని పరిస్థితి కూడ విషమించినది. సామ్రాజ్యవాదులయిన బ్రిటిష్‌వారు కొద్ది సంస్కరణలను ఇచ్చి, భారతదేశ సహాయముతో తమ సామ్రాజ్యమును సంరక్షించుకొన చూచిరి. దేశ స్వాతంత్ర్యమును సంపాదించుటకు పాటుబడుచున్న జాతీయవాదులు చిన్న సౌకర్యములతో తృప్తిపడక బ్రిటిష్ ప్రభుత్వమును ప్రతిఘటించిరి. ముస్లిమ్‌లకు ప్రత్యేకమైన హక్కులు, ప్రత్యేకమైన రాజ్యమును కూడ సంపాదించు ఉద్దేశముతో మతవాదులయిన ముస్లిమ్‌లీగ్ వారు జిన్నా [చూ. పు. 484] నాయకత్వమున కాంగ్రెస్‌ను వ్యతిరేకించి, బ్రిటిష్ వారి 'విడదీసి పాలించు' తంత్రమునకు లోబడిరి. 1942 లో క్రిప్స్ సంస్కరణ పథకమును త్రోసిపుచ్చిన తర్వాత కాంగ్రెస్‌నాయకులు 'ఇండియాను వదలి వెళ్ళండి' (క్విట్ ఇండియా) అనునినాదముతో బ్రిటిష్ పాలకులను ఎదిరించి, కారాగారములలో నిర్బంధించబడిరి. దేశమున కాంగ్రెస్ ప్రతిఘటనోద్యమము చెలరేగగా, దేశము ఆవల సుభాస్‌చంద్రబోస్ [చూ.] ఇండియా పౌరులతో కూడిన సైన్యమును 'అజాద్ హింద్ ఫౌజ్' అనుపేర సమకూర్చి, జపాన్ సహకారముతో బ్రిటిష్ సేనలను ఎదుర్కొనెను. దీని ప్రభావమువలన భారతదేశమందున్న సైన్యమునందు బ్రిటిష్‌వారికి వ్యతిరేకముగ తిరుగుబాటు జరుగునట్లు సూచనలు కనబడినవి. ఈ క్లిష్టపరిస్థితిలో 1947 లో భారతదేశమునకు స్వాతంత్ర్యము ఇచ్చుటకు ఒప్పుకొనక తప్పలేదు. అయితే, స్వాతంత్ర్యప్రదానముతోబాటు దానిని భంగపరచు దేశవిభజనము కూడ ఏర్పాటు చేయబడినది. ఒకవైపు బ్రిటిష్‌సామ్రాజ్యవాదులతోను, మరొకవైపున మత దురహంకారులయిన ముస్లిమ్‌లీగ్ నాయకులతోను పోరాడవలసివచ్చిన కాంగ్రెస్ జాతీయవాదులు, గత్యంతరము లేక, భారత - పాకిస్తాన్‌లుగ దేశ విభజనకు తలయొగ్గి, స్వాతంత్ర్యమును సంపాదించి, తృప్తిపడిరి.

రాజ్యాంగమునందు అభివృద్ధి (1858 - 1947): 1858 నుండి 1947 వరకు గల కాలమున భారతదేశ రాజ్యాంగమునందు క్రమాభివృద్ధి గోచరించును. ఇందుకు ముఖ్యకారణము దేశమునందు విజృంభించిన జాతీయోద్యమము, దేశము ఆవల జరిగిన రాజకీయ పరిణామములు కూడ

కొంతవరకు తోడ్పడినవి. ఇచట రాజ్యాంగము అభివృద్ధి యందు గమనింపదగు ముఖ్య సూత్రములు, లక్షణములు మాత్రమే క్లుప్తముగ సూచింపబడినవి.

భారతదేశ ప్రజలకు 1858 కు పూర్వము ఉండిన రాజ్యాంగవిధానము కొంతవరకు సహాయకారిగా ఉండినదే గాని, వారి సహకారమునకు వీలు కలుగజేసినది కాదు. అపుడు దేశమందలి ప్రభుత్వాధికారములు అన్నియు కేంద్రప్రభుత్వమునందు పూర్తిగా కేంద్రీకృతమై ఉండెడివి. బ్రిటిష్ పార్లమెంట్‌కు భారతదేశమందలి ప్రభుత్వముపై గల అధికారము అసంపూర్ణముగనే ఉండినది.

మొదటిదశ (1858 - 1918): 1858 సంవత్సరపు ఇండియా చట్టము ప్రకారము ఇండియాను పాలించు అధికారము పూర్తిగా బ్రిటిష్ రాజ్య మకుటధారికి సంక్రమించినది. ఆ అధికారమును బ్రిటిష్ పార్లమెంట్, భారతదేశ సెక్రటరీ, భారతదేశ కౌన్సిల్‌ల ద్వారా చలాయించు చుండెడిది.

పూర్తిగా కేంద్రీకృతమై ఉండుటయేకాక, ఉద్యోగులతో మాత్రమే కూడి ఉన్న భారతదేశమందలి పాలనా పద్ధతి ఈ కాలమున మార్పు చెందినది. ఈ మార్పు 1861, 1892, 1909 సంవత్సరములందలి భారతదేశ కౌన్సిళ్ళ చట్టముల ద్వారా జరిగినది. అనగా భారతదేశములోని కేంద్ర, రాష్ట్రప్రభుత్వములందలి శాసనసభలలో అంతకంతకు ఎక్కువమంది భారతదేశ పౌరులు చేర్చబడిరి. వారికి ప్రభుత్వ వ్యవహారములలో పాల్గొను అవకాశములు క్రమముగ అధికము చేయబడినవి. ప్రజాప్రతినిధులకు శాసనసభలలో స్థానము ఇచ్చుటకు ఎన్నికల పద్ధతి కూడ అవలంబింపబడినది. ఇట్లు ప్రభుత్వ అధికారములు వికేంద్రీకృతము చేయబడుట, ప్రభుత్వ వ్యవహారములలో పాల్గొనుటకు ప్రజలకు అవకాశములు ఇచ్చుట జరిగినది. ఈ మార్పు ఫలితముగ దేశమందలి ప్రభుత్వ స్వభావము కూడ మారినది. అనగా బాధ్యతారహితమైన ప్రభుత్వము కొంతవరకు బాధ్యతాసహితమయిన ప్రభుత్వముగ మారినది.

రెండవదశ (1919 - 1939): ఇరువదవ శతాబ్ది ప్రారంభమునుండి జాతీయవాదులు బాధ్యతాయుత ప్రభుత్వ పద్ధతిని భారతదేశమునందు పూర్తిగా ప్రవేశపెట్టవలసినదిగా కోరుట మొదలిడిరి. బ్రిటిష్‌ప్రభుత్వము కొంతకాలము ఈ కోర్కెను పెడచెవిని పెట్టి, 1917 న దానికి అంగీకరించినది. నాటి ప్రభుత్వ ప్రకటన ప్రకారము ఇండియాయందు బాధ్యతాయుత పాలనా పద్ధతిని క్రమముగా ప్రవేశపెట్టుట జరిగినది. అందుకై క్రమముగ 1919, 1935 సంవత్సరముల చట్టములు నిర్మింపబడి అమలునకు కొనిరాబడినవి.

1919 సంవత్సరపు చట్టము 1921 నుండి 1937 వరకు అమలు జరిగినది. దీనిక్రింద జరిగిన ముఖ్యమైన మార్పు రాష్ట్రములందు కొంతవరకు బాధ్యతాయుతమైన ప్రభుత్వము సాగుట. అంతకు పూర్వము ఉండిన బాధ్యతారహిత ప్రభుత్వ పద్ధతి ఇప్పుడు బాధ్యతాయుత ప్రభుత్వ పద్ధతికి తావిచ్చినది. అయితే, బాధ్యతాయుతమైన స్వపరిపాలనము చట్టరీత్యా వీలున్నంతవరకు ప్రజలకు లభింపకున్నను, కొంతవరకైనను అనుభవములోనికి వచ్చినది. కేంద్రప్రభుత్వమునందు కూడ మార్పు కేవలము లేకపోలేదు. అంతకు పూర్వముకంటె ప్రజాప్రతినిధులు ఎక్కువమంది శాసనసభలలో చేరి ప్రభుత్వ విధానములు, వ్యవహారములు ప్రజాబాహుళ్యమునకు అనుకూలముగ ఉండునట్లు మార్చగలిగిరి. ఆ విధముగ అచటి ప్రభుత్వము ప్రజాక్షేమమునకు వీలయినంతవరకు అనుకూలించు వ్యవస్థగా మారినది. ఇక బ్రిటిష్‌ప్రభుత్వముగాని, పార్లమెంట్‌గాని తనకు భారతదేశమందలి ప్రభుత్వముపైగల అధికారము ఇచట ప్రజాపాలనము సాగినంతమేరకు తగ్గించుకొనినది.

బాధ్యతాయుత పాలనా పద్ధతి 1935 చట్టముద్వారా భారతదేశమందు ఇంకను విస్తరించినది. 1937 నుండి అమలు జరిగిన ఈ చట్టముక్రింద రాష్ట్రములు అన్నిటియందును బాధ్యతాయుత పాలనము రాష్ట్ర వ్యవహారములు అన్నిటియందు సాగినది. ఇందుకు చట్టమునందు కొన్ని మినహాయింపులు, అడ్డంకులు కలవు. కాని, వాని ఎడల బ్రిటిష్ పాలకులకు, కాంగ్రెస్ నాయకులకు మధ్య కుదిరిన ఒప్పందము ఫలితముగ కాంగ్రెస్ మంత్రివర్గములు గల రాష్ట్రములలో బాధ్యతాయుత పాలనము, తద్వారా ప్రజల స్వపరిపాలనము సంతృప్తికరముగ సాగినది. ద్వితీయ ప్రపంచ యుద్ధము మొదలయిన తర్వాత ఈ పద్ధతికి అంతరాయము సంభవించినది. యుద్ధము ముగిసినప్పటినుండి మరల సాగినది. రాష్ట్రములందు స్వపరిపాలన సాగిన మేరకు బ్రిటిష్ పార్లమెంట్‌కు వానిపై గల అజమాయిషీ రద్దు అయినది. ఇక, ఈ చట్టమునందు కేంద్రప్రభుత్వమున కూడ బాధ్యతాయుత పాలనను ప్రవేశపెట్టు ఏర్పాటు, రాష్ట్రప్రతినిధులను, సంస్థానాధీశులను కలుపు ఫెడరల్ వ్యవస్థ పొందుపరచబడినవి. కాని, ఇవి కార్యాచరణలోనికి రాలేదు.

మూడవ దశ (1939 - 1947): ద్వితీయ ప్రపంచ యుద్ధము ప్రారంభమైనప్పటినుండి భారతదేశమందు రాజ్యాంగ వ్యవహారములు తారుమారయి, తర్జన భర్జన

లకు లోనైనవి. దేశమునందు స్వపరిపాలనను వృద్ధిచేసి, బ్రిటిష్‌వారి పెత్తనమును తగ్గించు ఉద్దేశముతో అనేకమైన రాజ్యాంగ ప్రతిపాదనలు, పథకములు బయల్వెడలినవి. ఇవి బ్రిటిష్‌వారిచే చేయబడి, కాంగ్రెస్ వారిచే నిరాకరించబడి, కార్యరూపము దాల్చకనే మరుగుపడి పోయినవి. 1946 లో కేంద్రప్రభుత్వమునందు రాజప్రతినిధికి సహాయపడు కార్యనిర్వాహక వర్గము కాంగ్రెస్, ముస్లిమ్ లీగ్ నాయకులతోకూడి తాత్కాలిక జాతీయ ప్రభుత్వముగా వ్యవహరించినది. 1947 ఇండియా చట్టము భారతదేశమును విభజించి, భారతదేశము, పాకిస్తాన్ అను సంపూర్ణ స్వపరిపాలన కల డొమినియన్ రాజ్యములుగ రూపొందించినది.

స్వతంత్ర భారతదేశము : 1947 నుండి నేటి వరకు జరిగిన చరిత్ర ఇటీవలి చరిత్రయే. ఇది చాల వివాదాస్పదమైనది. ఇటువంటి చరిత్రను నిష్పాక్షికముగ చిత్రించుట బహు కష్టము. అయినను దీనిని సాధ్యమైనంత వరకు యథార్థదృష్టితో ఇచట పరామర్శించుట జరిగినది.

రాజకీయరంగము : 1947 లో భారతదేశమునకు స్వతంత్రము లభించినది గాని సమగ్రత నష్టమైనది. మొత్తము దేశము భారత, పాకిస్తాన్, స్వదేశ సంస్థానములుగ విభజింపబడి, అవి స్వాతంత్ర్యము పొందినవి. ఈ సందర్భమున భారతదేశమును ఎదుర్కొనిన ముఖ్య సమస్యలు మూడు. భారతదేశమునకు స్వతంత్ర రాజ్యాంగ విధానమును రూపొందించుట, స్వాతంత్ర్యము ఈయబడిన స్వదేశ సంస్థానములను భారతదేశముతో ఐక్యముచేయుట, పాకిస్తాన్ నుండి తరిమివేయబడిన కాందిశీకులకు ఆశ్రయము ఏర్పాటు చేయుట.

పరపాలననుండి స్వతంత్రతను సంపాదించుట కన్న కష్టమైనది సంపాదించిన దానిని సరిగా అనుభవించుటకు తగిన రాజ్యాంగవ్యవస్థను రూపొందించుట. అయినను, ఈ కర్తవ్యము సంతృప్తికరముగ నిర్వహింపబడినది. రాజ్యాంగ విధానమును రూపొందించుటకు ఏర్పడిన 'రాజ్యాంగ పరిషత్తు' భారతదేశమున స్వాతంత్ర్యము లభించిన రెండున్నర సంవత్సరముల లోపుననే రాజ్యాంగ చట్టమును నిర్మింపగలిగినది. ఈ నూతన రాజ్యాంగ విధానము 1950, జనవరి 26 నుండి అమలునకు వచ్చినది. దాని ప్రధాన లక్షణములు గమనింపదగినవి. రాజ్యాంగ చట్టమున భారతదేశము సర్వస్వతంత్ర ప్రజాతంత్రగణరాజ్యము (రిపబ్లిక్)గ సూచింపబడినది. ఇందలి ప్రజాతంత్రము లేదా ప్రజాస్వామ్యమునకు కొన్ని లక్షణములు కలవు. అనగా అది పార్లమెంటరీ పద్ధతికి, ఫెడరల్ పద్ధతికి, మత ప్రసక్తి లేని లౌకిక రాజకీయ పద్ధతికి సంబంధించిన ప్రజాస్వామ్య వ్యవస్థ.

ప్రజాబాహుళ్యమునకు అత్యున్నత పాలనాధికారము చెంది ఉండుట, ప్రాథమిక హక్కులు, నిర్ణీతకాలమున అయిదు ఏండ్లకు ఒక పర్యాయము జరుగు సాధారణ ఎన్నికలు, ప్రభుత్వమును మార్చు సౌకర్యము, వయోజన వోటింగు పద్ధతి, వికేంద్రీకృతమైన పాలనావిధానము ప్రజాస్వామ్య ప్రభుత్వమునకు ముఖ్య లక్షణములు. ఇవి అన్నియు నూతన రాజ్యాంగ చట్టమునందు చేర్చబడినవి. ఈ చట్టము ప్రజాప్రతినిధులచే నిర్మింపబడి, ప్రజల పేర ఆమోదింపబడి అవలంబింపబడినది. రాజ్యాంగము యొక్క పరమ ప్రయోజనములు స్వేచ్ఛ, సామ్యము, సోదరత్వము, న్యాయము, పౌరులకు అందరకు అనేక రకములయిన ప్రాథమిక హక్కులు రాజ్యాంగరీత్యా ఇవ్వబడుటయే గాక, వానిని న్యాయస్థానముల ద్వారా నిరాటంకముగ అనుభవించు సౌకర్యము కూడ కల్పింపబడినది. ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక రంగములందు ప్రజల అభ్యుదయమును సాధించుటకు అనుకూలమగు చర్యలను తీసికొనునట్లు ప్రభుత్వమునకు నిర్దేశకసూత్రములు సూచింపబడినవి. ఇందు వెనుకబడిన వర్గములకు ప్రత్యేక సదుపాయములు కల్పింపబడుట గమనార్హము. దేశమునందలి అత్యున్నత స్థానమున రాజవంశమునకు చెందిన ప్రభువుగాక, ప్రజాప్రతినిధియైన పౌరుడు రాష్ట్రపతిగ వ్యవహరించును. రాష్ట్రపతి, కేంద్ర, రాష్ట్రములందలి దిగువ శాసనసభల సభ్యులు ఎన్నిక మూలమున ఎన్నుకొనబడుదురు. రాష్ట్రములందలి గవర్నర్‌లు రాష్ట్రపతిచే నియమింపబడినను, ఆ నియామకము భారత ప్రధాని సలహాను అనుసరించి జరుగును. ఇట్లే దేశపరిపాలనను సాగించు ముఖ్యులు అందరు ఎన్నుకొనబడువారే. ఎన్నికలలో వయోజనులు అందరు పాల్గొనవచ్చును. ఎన్నికలు సాధారణముగ అయిదేండ్లకు ఒకసారి దేశమంతట జరుగును. అవి శాంతియుతముగాను, స్వేచ్ఛాయుతముగాను, న్యాయ సమ్మతముగాను జరుగునట్లు తగు చర్యలు తీసుకొనబడును. స్థానిక పాలనారంగమునందు ప్రజాహితకార్యములను కొనసాగించుటకు పంచాయితీరాజ్యవ్యవస్థ ఏర్పరచబడినది. గ్రామపంచాయితీలు, పంచాయితీ సమితులు, జిల్లాపరిషత్తుల ద్వారా పంచాయతీరాజ్యము సాగుటకు సౌకర్యము ఏర్పడినది. ఈ విధముగ ప్రజాస్వామ్యమును సాగించు అవకాశము ప్రజలకు అందజేయ బడినది. దేశము ప్రజాస్వామ్యమును అనుభవించు 'రిపబ్లిక్'గ రూపొందినది.

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వములందు వ్యవహారములు చాల వరకు పార్లమెంటరీ పద్ధతిని అనుసరించి పరిష్కరింపబడును. రాష్ట్రపతి, రాష్ట్ర గవర్నర్లు ప్రజాప్రతినిధులయిన మంత్రుల సలహాప్రకారము వర్తింతురు. అసాధారణ పరిస్థితులందు వారు తమకు తోచిన రీతిని, దేశ క్షేమము దృష్ట్యా వ్యవహరించు వీలు లేకపోలేదు. సాధారణముగ రాష్ట్రప్రభుత్వములు తమ వ్యవహారములను స్వేచ్ఛతో పరిష్కరించుకొను వీలు కలిగి ఉన్నందున దేశమందలి రాజ్యాంగము ఫెడరల్ పద్ధతిని అనుసరించి ఉండును. అయితే, యుద్ధము మొదలగు అసాధారణ సమయములందు రాష్ట్రములకుగల స్వేచ్ఛ మరుగునపడి, యూనియన్ (కేంద్ర) ప్రభుత్వ అధికారము దేశమందు అంతటను చలామణి అయి, యూనిటరీ పద్ధతి అమలు జరుగవచ్చును. ఇటువంటి క్లిష్ట పరిస్థితియందు పౌరులకు గల ప్రాథమిక హక్కులు మూలబడి, ప్రజా స్వేచ్ఛకు కొంత భంగము సంభవింపవచ్చును. ఇక, నూతన రాజ్యాంగ చట్టమును అనుసరించి దేశమందలి మతములన్నియు సమానముగ భావింపబడుట, ఏమతముగాని పీడింపబడకుండుట జరుగును. పైగా రాజకీయములు రాజకీయ దృష్టిలోనేగాని మతసూత్రములను అనుసరించి నిర్ణయింపబడవు.

వికేంద్రీకరింపబడిన ప్రభుత్వ వ్యవస్థ విచ్ఛిన్నకర శక్తులను ప్రోత్సహించకుండుటకుగాను వానికి వ్యతిరేకమైన ఏకీకరణ శక్తులను బలపరచుట జరిగినది. పౌరస్వత్వము, ప్రాథమిక హక్కులు, ప్రభుత్వ ఉద్యోగుల సిబ్బంది, న్యాయ నిర్వహణశాఖలందు అవలంబింపబడిన ఏకైక విధానము దేశమునందు ఐకమత్యమును సంరక్షించుటకు ఏర్పాటు చేయబడినది.

ఈ విధముగ ప్రజాస్వామ్యమునకు ప్రాధాన్యము ఇచ్చు రాజ్యాంగవిధానము ఏర్పాటు చేయడమైనది. ఇది ఇప్పటికి 16 ఏండ్లుగా అమలులో ఉన్నది. రాజ్యాంగ చట్టమునందలి సూత్రములకు, వానికి సంబంధించిన కార్యాచరణకు కొంత వ్యత్యాసము ఉన్నదనుట నిజము. కాని, మొత్తముమీద శాంతియుతమైన సమయమునందును, యుద్ధ పరిస్థితులందును దేశమున ప్రజాస్వామ్యము సుస్థిరముగ ఉన్నది.

దేశమునందు 1947 నాటికి 560 కి పైగా స్వదేశ సంస్థానములు ఉండినవి. వీనికి నాటి చట్టరీత్యా స్వతంత్రము ఇవ్వబడినది. అందువలన భారతదేశమునకు సంబంధించిన వానితో రాయబారములు జరిపి, వానిని కలుపుకొనవలసిన అవసరము ఏర్పడినది. ఈ సమయమున భారతదేశ ప్రభుత్వమునందున్న కాంగ్రెస్ నాయకుడు వల్లభాయి పటేల్ [చూ.] యొక్క సామర్థ్య - చాతుర్యములు, స్వదేశ సంస్థానాధీశులు కనబరచిన దేశభక్తి, దూరదృష్టి, సహనము, స్వార్థత్యాగములు ప్రశంసింపదగినవి. ఫలితముగ 1947, ఆగస్టు 15 నాటికి భారతదేశమునకు సంబంధించిన సంస్థానములు దాదాపుగ అన్నియు భారతదేశమున చట్టరీత్యా విలీనమగుట జరిగినది. జునాగడ్, హైదరాబాదు, కాశ్మీర్‌లు మాత్రము చేరక మిగిలి ఉండెను. జునాగడ్ సంస్థాన ప్రజలు ప్రభువును పారద్రోలి, తమ సంస్థానమును భారతదేశములో చేరునట్లు చేసిరి. హైదరాబాదు సంస్థానమందలి కాంగ్రెస్, రజాకరుల మధ్య పోరాటము చెలరేగి కల్లోలము జరుగగా, భారతదేశ ప్రభుత్వము పోలీసు చర్య జరుపుట మూలమున నిజామ్ రాజ్యము భారత యూనియన్‌లో చేరుట జరిగినది. కాశ్మీర్‌పై పాకిస్తాన్ దాడి జరుపగా, అచటి ప్రభువు, అత్యధిక సంఖ్యాక ప్రజలనాయకుడు అయిన షేక్ అబ్దుల్లా యొక్క ఆమోదముతో, భారతదేశ ప్రభుత్వ రక్షణనుకోరి, సంస్థానము భారతదేశములో చేరుటకు సమ్మతించెను. తదుపరి భారతదేశములో చేరిన సంస్థానముల రాజకీయస్థితిని చక్కబరచుట జరిగినది. చిన్న సంస్థానములు కొన్ని పొరుగు రాష్ట్రములలో కలుపబడినవి. మరికొన్ని కేంద్రపాలిత ప్రాంతములుగ చేయబడినవి. సుమారు 275 సంస్థానములు 5 సంస్థాన సమాఖ్యలుగ రూపొందించబడినవి. కాశ్మీర్, హైదరాబాదు, మైసూరులు మాత్రము పూర్వము వలెనే నిలచినవి. ఈ మూడు సంస్థానములు, ఐదు సంస్థాన సమాఖ్యలు 'పార్టు బి' రాష్ట్రములు అయినవి. 1950, జనవరి 26 నాటికి ఇటుల ఈ వ్యవస్థ కుదుటబడినది. కాని, రాష్ట్రములను సంతృప్తికరముగ (ముఖ్యముగ భాషనుబట్టి) సరిదిద్దవలెనను ఆందోళన దేశమున చెలరేగగా కొన్ని మార్పులు 1956 న జరిగినవి; ఇందువలన దక్షిణ భారతదేశమున హైదరాబాదు రాష్ట్రము విభిన్నమైనది. మైసూరు, మద్రాసు, కేరళ రాష్ట్రముల సరిహద్దులు మార్పొందినవి. హైదరాబాదు సంస్థానమునందలి తెలంగాణా ప్రాంతముతో అంతకు మూడేండ్లు ముందుగ రూపొందిన ఆంధ్రరాష్ట్రము కలయుటవలన ఆంధ్రప్రదేశ్ అవతరించినది. తదుపరి బొంబాయి స్టేట్ మహారాష్ట్ర, గుజరాత్ రాష్ట్రములుగా విభజింపబడుట, మరికొంత కాలమునకు నాగాప్రాంతము కూడ ప్రత్యేక రాష్ట్రముగ రూపొందుట జరిగినది.

దేశ విభజన వలన 1947 లో మతకలహములు చెలరేగినవి. ఈ క్లిష్ట పరిస్థితిలో పాకిస్తాన్‌నందున్న హిందువులు ముస్లిమ్‌లకు భయపడి భారతదేశమునకు కాందిశీకులుగ పారి వచ్చిరి. అధికసంఖ్యలలో అలలు అలలుగా వచ్చిన

ఈ కాందిశీకులకు ఆశ్రయము ఇచ్చుట పెద్ద సమస్యగా పరిణమించినది. అయినను దయాదాక్షిణ్యములతోను, ప్రేమ, సౌభ్రాతృత్వముతోను భారత దేశప్రభుత్వము ఈ సమస్యను పరిష్కరింపబూనినది. కాలక్రమమున కాందిశీకులకు వృత్తివిద్య మొదలగు సదుపాయములు కల్పింపబడినవి. స్థిరనివాసము, పౌరసత్వము కూడ వారికి లభించినవి. క్రమముగ వారు దేశమునందు పుట్టిపెరిగిన వారిలో కలిసిపోవుట జరిగినది.

స్వతంత్ర భారత దేశము అవలంబించిన విదేశ విధానము విశిష్టమైనది. పర దేశములపట్ల భారత దేశమునకుగల ప్రేమాభిమానములు, అంతర్జాతీయ రంగమున సంఘర్షణను పోగొట్టి సామరస్యమును పెంపొందించుటయందు ఆసక్తి దేశపు రాజ్యాంగచట్టమునందు స్పష్టముగ పేర్కొనబడినవి. ఇవి కేవలము ఆశయములుగానే ఉండక, ఆచరణయందు అనుసరింపబడినవి. స్వాతంత్ర్యోద్యమకాలమున బ్రిటిష్ప్రభుత్వముపై పోరాటము సాగించిన భారత దేశము స్వతంత్రము సంపాదించిన తర్వాత స్వేచ్ఛతో బ్రిటిష్ కామన్‌వెల్త్‌లో సభ్యత్వమును అంగీకరించుట, బ్రిటన్‌తో స్నేహభావముతో మెలగుట ఇందుకు ప్రబల నిదర్శనము. ఇక, ప్రపంచశాంతిని కాపాడు నిమిత్తము ఏర్పడిన ఐక్యరాజ్యసమితి [చూ. పు. 351] ని స్థాపించిన రాజ్యములలో భారతదేశము ఒకటి. ఈ ప్రపంచ సంస్థ యందును, దానికి అనుబంధముగ ఉన్న అనేక అంతర్జాతీయ సంస్థలందును భారత దేశము సభ్యత్వమును ఆర్జించినది. ప్రపంచమునందు జరిగిన అన్యాయములను ప్రతిఘటించి, స్వేచ్ఛాస్వామ్యముల స్థాపనను ప్రోత్సహించి, శాంతి, సౌభాగ్యముల విస్తరణకు భారతదేశము చెప్పుకొనదగినంతగా పాటుబడినది. కొరియా, ఇండో - చీనా, ఈజిప్టు, కాంగో ప్రాంతములలో సాగిన సమరమును అంత మొందించి, శాంతిని స్థాపించుటలో భారతదేశము సహాయపడినది. ద్వితీయ ప్రపంచయుద్ధము ముగిసిన తర్వాత యునైటెడ్ స్టేట్స్, గ్రేట్‌బ్రిటన్ దేశముల నాయకత్వము క్రింద పాశ్చాత్య రాజ్యములు సోవియట్ రష్యా, కమ్యూనిస్ట్ చీనా యాజమాన్యమున కమూనిస్ట్‌రాజ్యములు రెండు సైనిక కూటములుగా ఏర్పడి, పరస్పర సంఘర్షణకు, తద్వారా ప్రపంచ వినాశమునకు సిద్ధపడినవి. ప్రపంచ శాంతిని, మానవజాతి శ్రేయస్సును కోరిన భారతదేశము పై సైనిక కూటములలో చేరక, అలీన విధానమును అవలంబించినది. ఇందుకు అనుగుణ్యముగ శాంతియుత సహజీవనము ప్రధానముగా గల పంచశీల [చూ. పు. 555] సూత్రములను అంతర్జాతీయరంగమునందు ప్రచారము చేసినది. మొదట ఈ నూతన మార్గమును ఇతర రాజ్యములు అనుమానముతో చూచినను, క్రమముగా దాని విశిష్టతను గమనించి, గౌరవించినవి. అలీన విధానమునందు కొన్ని లోటుపాట్లున్నను, అందలి పరమార్థము ప్రశంసింపదగినది. దానియందు ఇమిడి ఉన్న ముఖ్యసూత్రమునకు భంగము కలుగకుండ, దేశకాలములను అనుసరించి దానిని సరిదిద్దుకొనుట శ్రేయస్కరము. భారతదేశముపై చీనా, పాకిస్తాన్ దాడి జరిపినపుడును, ఇతర సమయములందును అలీన విధానము ప్రయోజనకరముగ ఉపకరింపగలిగినది.

ఆర్థికస్థితి : ఆర్థికరంగమున స్వతంత్ర భారతదేశమును ఎదుర్కొనిన సమస్య తరతరాలుగా పీడించిన పేదరికమును నిర్మూలించుటకు, సౌభాగ్యమును సంపాదించుటకు సంబంధించినది. ఈ సమస్యను సాధ్యమైనంత త్వరలో పరిష్కరించవలసిన అగత్యము ఏర్పడినది. అందువలన ప్రణాళికాపద్ధతి ద్వారా సత్వరముగ సౌభాగ్యమును పెంపొందించుటకు నిర్ణయింపబడినది. శ్రేయోరాజ్య ఆశయముతోపాటు సోషలిస్ట్ ఆశయముకూడ అవలంబింపబడినది. అయితే, వ్యక్తి స్వేచ్ఛకును, ప్రజాప్రభుత్వ వ్యవస్థలందలి ఉత్కృష్టతకును తగు ప్రాధాన్యము ఇవ్వబడుట కూడ జరిగినది. అందువలన దేశమందలి ప్రణాళికాపద్ధతి ఒక వినూతనమైన, విశిష్టమైన మార్గమును అవలంబించినది. ప్రజాప్రభుత్వ తత్త్వమునకు, తంత్రమునకు అనుగుణమయిన ప్రణాళికద్వారా ఆర్థికాభ్యుదయము సాధించుటకు ప్రయత్నము జరుగుచున్నది. ఇది మానవ శ్రేయస్సును పెంపొందింపగల మహాప్రయోగము. ఇప్పటికి మూడు పంచవర్షప్రణాళికలు పూర్తియైనవి. జాతీయాదాయమును పెంచుట, ఆర్థిక తారతమ్యములను తగ్గించుట, ప్రజాసామాన్యము యొక్క జీవనస్థాయిని వృద్ధిచేయుట, వ్యావసాయిక, పారిశ్రామిక అభివృద్ధిని సాధించుట, సుఖజీవనమునకు సమానావకాశమును కల్పించుట అనునవి ప్రణాళికల సామాన్య లక్ష్యములు. కాని, ఈ లక్ష్యములు అనుకొనినట్లు నెరవేరక కొంతవరకు ఆశాభంగము జరిగినది. అందుకు కారణములు అనేకమైనవి. అయినను, ప్రజాశ్రేయస్సుకొరకు ప్రజాభిప్రాయమును అనుసరించి రూపొందించిన ప్రణాళికద్వారా ప్రగతిని సాధించు ప్రయత్నము మాత్రము ప్రోత్సహింపదగినది.

సాంఘిక పరిణామము : ఇతర రంగములలో జరిగిన మార్పులు సాంఘిక రంగమున పెక్కు పరిణామములకు దోహదమైనవి. సాంఘిక పరిణామములలో ముఖ్యమైనవి షెడ్యూల్ జాతులకు, షెడ్యూల్ తరగతులకు, వెనుకబడిన వర్గములకు, స్త్రీలకు, శ్రామికులకు, గ్రామీణులకు

# గవర్నర్ జనరల్‌ల పట్టిక

## బెంగాల్ (ఫోర్ట్ విలియమ్) గవర్నర్ - జనరల్‌ల పట్టిక

### రెగ్యులేటింగ్ చట్టము (1773)

| | | |
|---|---|---|
| 1774 | అక్టో | వారన్ హేస్టింగ్స్. |
| 1785 | ఫిబ్ర | సర్ జాన్ మెక్‌ఫర్సన్ * |
| 1786 | సెప్టెం | ఎరల్ (మార్క్విస్) కారన్‌వాలిస్. |
| 1793 | — | సర్ జాన్‌షోర్ (లార్డ్ టైన్‌మత్). |
| 1798 | మార్చి | సర్ ఏ. క్లార్క్స్. |
| 1798 | మే | ఎరల్ ఆవ్ మార్నింగ్‌టన్ (మార్క్విస్ ఆవ్ వెలెస్లీ). |
| 1805 | 30, జూలై | మార్క్విస్ కారన్‌వాలిస్ (రెండవసారి). |
| 1805 | అక్టో | సర్ జార్జి బార్లో * |
| 1807 | జూలై | బేరన్ (ఎరల్ ఆవ్) మిన్టో (ప్రథమ). |
| 1813 | 4, అక్టో | ఎరల్ ఆవ్ మొయిరా (మార్క్విస్ ఆవ్ హేస్టింగ్స్). |
| 1823 | జన | జాన్ ఆడమ్ * |
| 1823 | 1, ఆగ | బేరన్ (ఎరల్) ఎమ్‌హర్స్ట్. |
| 1828 | మార్చి | విలియమ్ బట్టర్‌వర్త్ బెలీ * |
| 1828 | 4, జూలై | లార్డ్ విలియమ్ క్యావెండిష్ - బెన్‌టిన్క్. |

### భారతదేశముయొక్క గవర్నర్ - జనరల్‌లు
### చార్టర్ చట్టము (1833)

| | | |
|---|---|---|
| 1833 | — | లార్డ్ విలియమ్ క్యావెండిష్ - బెన్‌టిన్క్. |
| 1835 | 20, మార్చి | సర్ చార్లెస్ (లార్డ్) మెట్‌కాఫ్ * |
| 1836 | మార్చి | బెరన్ (ఎరల్ ఆవ్) ఆక్‌లండ్. |
| 1842 | ఫిబ్ర | బెరన్ (ఎరల్ ఆవ్) ఎలెన్‌బరో. |
| 1844 | జూన్ | విలియమ్ విల్‌బర్‌ఫోర్స్ బర్డ్ * |
| 1844 | జూలై | సర్ హెన్రీ (విస్‌కౌంట్) హార్‌డింజ్. |
| 1848 | జన | ఎరల్ (మార్క్విస్ ఆవ్) డల్హౌసీ. |
| 1856 | ఫిబ్ర | వైకౌంట్ (ఎరల్) కానింగ్. |

### గవర్నర్-జనరల్ అధికారయుత రాజప్రతినిధులు

| | | |
|---|---|---|
| 1858 | 1, నవం | వైకౌంట్ (ఎరల్) కానింగ్. |
| 1862 | మార్చి | ఎరల్ ఆవ్ ఎల్జిన్ అండ్ కిన్‌కార్‌డైన్ (ప్రథమ) |
| 1863 | — | సర్ రాబర్ట్ నేపియర్ (బెరన్ నేపియర్ ఆవ్ మగ్దలా) * |
| 1863 | — | సర్ విలియమ్ టి డెనిసన్ * |
| 1864 | జన | సర్ జాన్ (లార్డ్) లారెన్స్. |
| 1869 | జన | ఎరల్ ఆవ్ మేయో. |
| 1872 | — | సర్ జాన్ స్ట్రాచీ * |
| 1872 | — | లార్డ్ నేపియర్ ఆవ్ మెకిన్‌టాన్. |
| 1872 | మే | బెరన్ (ఎరల్ ఆవ్) నార్త్‌బ్రూక్. |
| 1876 | ఏప్రి | బేరన్ (ఎరల్ ఆవ్) లిట్టన్ (ప్రథమ). |
| 1880 | జూన్ | మార్క్విస్ ఆవ్ రిప్పన్. |
| 1884 | డిసెం | ఎరల్ ఆవ్ డఫెరిన్ (మార్క్విస్ ఆవ్ డఫెరిన్ అండ్ ఆవా). |
| 1888 | డిసెం | మార్క్విస్ ఆవ్ లేన్స్‌డౌన్. |
| 1894 | జన | ఎరల్ ఆవ్ ఎల్జిన్ అండ్ కిన్‌కార్‌డైన్ (ద్వితీయ) |
| 1899 | 6, జన | బేరన్ (మార్క్విస్) కర్జన్ ఆవ్ కెడిల్‌స్టన్. |
| 1904 | ఏప్రి | లార్డ్ ఆంప్తిల్ * |
| 1904 | డిసెం | బేరన్ (మార్క్విస్) కర్జన్ ఆవ్ కెడిల్‌స్టన్ (పునర్నియామకము). |
| 1905 | నవం | ఎరల్ ఆవ్ మిన్టో (ద్వితీయ). |
| 1910 | నవం | బేరన్ హార్డిన్జ్ ఆవ్ పెన్స్‌హర్స్ట్. |
| 1916 | ఏప్రి | బేరన్ చెమ్స్‌ఫర్డ్. |
| 1921 | ఏప్రి | ఎరల్ ఆవ్ రీడింగ్. |
| 1925 | — | లార్డ్ లిట్టన్ (ద్వితీయ) * |
| 1926 | ఏప్రి | లార్డ్ ఇర్విన్. |
| 1929 | — | లార్డ్ గోషన్ (లార్డ్ ఇర్విన్ సెలవు కాలమున) |
| 1931 | ఏప్రిల్ | ఎరల్ ఆవ్ విల్లింగ్‌డన్. |
| 1934 | మే | ఆగసర్ జార్జి స్టాన్లీ * |
| 1936 | 18, ఏప్రి | మార్క్విస్ ఆవ్ లిన్‌లిత్‌గో. |

### గవర్నర్ - జనరల్ అధికారయుత మకుట ప్రతినిధులు
### భారత ప్రభుత్వ చట్టము (1935)

| | | |
|---|---|---|
| 1937 | 31, మార్చి | మార్క్విస్ ఆవ్ లిన్‌లిత్‌గో. |
| 1938 | జూన్-అక్టో | బేరన్ బ్రాబర్న్ * |
| 1938 | — | మార్క్విస్ ఆవ్ లిన్‌లిత్‌గో |
| 1943 | — | వైకౌంట్ (ఎరల్) వేవెల్. |
| 1945 | — | సర్ జాన్ కాల్‌విల్లీ * |
| 1947 | మార్చి | వైకౌంట్ (ఎరల్) మౌంట్‌బాటెన్ (సంయుక్త భారతదేశపు తుది రాజప్రతినిధి; భారత అధినివేశపు మొదటి గవర్నర్ - జనరల్). |

### భారత యూనియన్ గవర్నర్ - జనరల్‌లు
### (భారత స్వాతంత్ర్య చట్టము)

| | | |
|---|---|---|
| 1947 | 15, ఆగస్టు | ఎరల్ మౌంట్‌బాటెన్. |
| 1947 | నవం | చక్రవర్తి రాజగోపాలాచారి * |
| 1948 | జూన్ | చక్రవర్తి రాజగోపాలాచారి. |

* తాత్కాలిక పదవులలో ఉండినవారు

సంబంధించినవి. తరతరాలుగా సాగిన అంటరానితనమను దురాచారము రాజ్యాంగచట్టరీత్యా నిర్మూలింపబడినది. షెడ్యూల్ జాతులకు, తరగతులకు శాసనసభలు, ప్రభుత్వోద్యోగములు, విద్యా సంస్థలు, వృత్తులు మొదలగు వానియందు ప్రత్యేక సౌకర్యములు ఏర్పాటు చేయబడినవి. ఇట్లే సంఘమునందు వెనుకబడిన మరికొన్ని వర్గములకు కూడ అభ్యుదయము సాధించుటకు ప్రోత్సాహము లభించినది. స్త్రీలకు పురుషులతో సమానముగ పౌర హక్కులు ప్రసాదింపబడినవి. ఇంతేగాక వివాహము, విడాకులు, ఆస్తి సంక్రమించుట, దత్తత చేసికొనుట మొదలగు విషయముల పట్ల వారికి స్వేచ్ఛ లభించునట్లు సంస్కరణలు ప్రవేశపెట్టబడినవి. శ్రామికుల శ్రేయస్సును పెంపొందించుటకు ఉద్దేశించిన శాసనముల ద్వారా వారికి వృత్తి, గృహవసతి, విద్య, వైద్యములకు సంబంధించిన సౌకర్యములు ఎక్కువగా ఏర్పాటైనవి. దేశమునందు గ్రామములు అత్యధిక సంఖ్యలో ఉన్నను వాని అభివృద్ధి సరిగా జరగని లోపమును తీర్చుటకు ప్రయత్నము జరిగినది. పంచాయతీరాజ్యవ్యవస్థ, సాంఘిక సంక్షేమ కార్యక్రమములు గ్రామీణుల జీవితమునందు సర్వతోముఖాభివృద్ధిని సాధించుటకు ఏర్పడినవి. ప్రభుత్వము స్థాపించిన సంస్థల, సాగించిన కార్యక్రమముల ద్వారానే గాక, సంఘ సంస్కర్తలు తమంతతాము ప్రారంభించిన ఉద్యమముల ద్వారా కూడ సంఘము స్వేచ్ఛా, సామ్యసూత్రములకు అనుగుణముగ సంస్కరింపబడుచున్నది. ఈ సందర్భమున సర్వోదయ సంఘము, భారత సేవక్ సమాజ్, సదాచార సమితి, హరిజన-గిరిజన సేవక సంఘములు పేర్కొనదగినవి. విద్యావృత్తులందు జరిగిన వ్యాప్తి వలనను, పరిశ్రమలు, పట్టణములు విస్తరించుటవలనను కులమత భేదములకు కల తీవ్రత తగ్గుచున్నది.

సాంస్కృతిక వికాసము: స్వాతంత్ర్య సంపాదన భారతీయుల సాంస్కృతిక వికాసమునకు అవకాశము కలుగజేసినది. దేశమునందు హిందీభాష, ఇతర ప్రాంతీయ భాషలు జాతీయ భాషలుగ పరిగణింపబడినవి. ఈ భాషలకు, వానికి సంబంధించిన సారస్వతములకు పోషణ, ప్రోత్సాహము లభించినవి. ప్రభుత్వము స్థాపించిన సాహిత్య అకాడమీలు కవులను, పండితులను గౌరవించి, పోషించుచున్నవి. ఇట్లే సంగీత అకాడమీ, నాటక అకాడమీలు సంగీతము, నటన, నాట్యము మొదలగు లలిత కళలందు పేరు పొందిన కళాకారులను ప్రోత్సహించుచున్నవి. సినిమారంగమున చాల అభివృద్ధి జరిగినది. సిద్ధహస్తులైన సినిమాదర్శకులకు, వారు తయారు చేసిన చిత్రములకు అంతర్జాతీయ పోటీలందు కూడ బహుమతులు, ప్రశంసా పత్రములు లభించుచున్నవి.

స్వతంత్ర భారత దేశమున విద్యా వ్యాప్తి విశేషముగ జరిగినది. ప్రాథమిక, సెకండరీ, ఉన్నత స్థాయిలందు విద్యా సంస్థల సంఖ్య, విద్యార్థుల సంఖ్య చాల పెరిగినది. సాధారణ, సాంకేతిక శాఖలకు సంబంధించిన విద్య చాల విస్తరించినది. విజ్ఞానశాస్త్ర, సాంకేతికశాస్త్రములందు పరిశోధన ప్రోత్సహింపబడుచున్నది. విద్యా సముపార్జన కొరకు ప్రజ్ఞావంతులయిన విద్యార్థులను విదేశములకు పంపుట కూడ జరుగుచున్నది. విదేశీయులకు అట్లే భారత దేశమున కూడ కొన్ని సౌకర్యములు ఏర్పాటుచేయబడినవి.

ఈ సందర్భమున గమనింపదగు విశేషము ఒకటి కలదు. అది స్వతంత్ర భారత ప్రభుత్వమునకు నాయకత్వము వహించిన నెహ్రూ, మానవ జీవితమునకు సంబంధించిన విషయములన్నిటియందు శాస్త్రీయ దృక్పథమును ప్రోత్సహించుట. అంతేగాక, అతడు ఆత్మజ్ఞానాభివృద్ధికి, విజ్ఞానాభివృద్ధికి మధ్య వైరుధ్యము లేదని తెలిపి, రెంటిని సమైక్యము చేసి, మానవాభ్యుదయమును సాధించుట యుక్తమని ప్రచారము చేసి ఉన్నాడు. ఇది పురోగతికి నిజముగ వెలుగుబాట కాగలదు.

ఇటుల యుగ యుగములుగ సాగిన దేశ చరిత్రను పరిశీలించినపుడు దానియందు కానవగు విశిష్టలక్షణములను ఇట్లు సూచింపవచ్చును. సహనము, సమన్వయము భారతీయులకు సహజ గుణములు. వీనివలన భిన్నమైన జాతి, మత, సంస్కృతుల మధ్య శాంతియుతముగ సామరస్యమును, సమ్మేళనమును కల్పించుట జరిగినది. ప్రాచీన యుగమున ఆర్యులు, ద్రావిడులు కలిసినపుడు హిందూ సంస్కృతి ఉద్భవించినది. మధ్య యుగమున హిందువులు, మహమ్మదీయులు చేరినపుడు హిందూస్తానీ సంస్కృతి బయల్వెడలినది. ఆధునిక యుగమున భారతీయులు, పాశ్చాత్యులు కూడినపుడు అధునాతన భారతీయ సంస్కృతి రూపొందినది. ఈ విధముగ శాంతియుతమైన సమన్వయమును సృష్టించి అభ్యుదయమును సాధింపగల శక్తి భారతీయులకు కలదు. దీనిని ప్రోత్సహించుట భారతదేశమునకే గాక, ప్రపంచమునకు అంతకును శ్రేయస్కరమైనదని ప్రఖ్యాత చరిత్రకారుడగు ఆర్నాల్డ్ టాయన్‌బీ [చూ. పు. 495] పండితుని నిశ్చితాభిప్రాయము.

ఓ. ఎస్. ఎన్. మూర్తి.

**భారతదేశ రాజనీతి చరిత్ర**: రాజ్యము, రాష్ట్రము, క్షత్రము అను మాటలు ఋగ్వేదములోని అత్యంత

ప్రాచీన భాగములలో కనిపించుచున్నవి. రాజ్యాంగమును గూర్చిన వివరణ సంహితలలోకంటె బ్రాహ్మణములలో కొంచెము ఎక్కువగా ఉన్నది. 'రాజు' అను పేరను ఒక వ్యక్తి ఏర్పడుటకు కారణము యుద్ధమే అని ఐతరేయ బ్రాహ్మణము స్పష్టముగా వివర్శించినది. ఇక, పురాణము లను పరిశీలించినచో, చక్రవర్తులు అందరకును మార్గదర్శకము కాగల ఉత్తమోత్తమ లక్ష్యమైన రామరాజ్యవర్ణనము మాత్రము రామాయణములో ఉన్నది. మహాభారతములో - ముఖ్యముగ శాంతిపర్వములో - భీష్ముడు చెప్పిన రాజకీయ, సాంఘిక సిద్ధాంతములు కొల్లలుగ ఉన్నవి. రాజ్యము అనునది మొదట ఎట్లు ఏర్పడినది అను విషయమును గురించి కూడ దీనిలో వివరింపబడినది. అటు పిమ్మట చాల శతాబ్దములకు పాశ్చాత్యవిజ్ఞానులు ప్రవచించిన 'సంఘాతరాజ్య సిద్ధాంతము' అను ప్రఖ్యాత సిద్ధాంతము ధోరణిలోనే చాలావరకు భారత నిర్వచనము కూడ ఉన్నది. ఈ నిర్వచనమే మహాభారతముతోపాటు మనుస్మృతిలో కూడ ఉన్నది. ఈ రెండు గ్రంథములును, వేనుని కథను వివరించి, దాని మూలముగ న్యాయమునకును, ధర్మమునకును చిహ్నమైన రాజదండము సాహాయ్యముతోనే రాజు పరిపాలన సాగించవలెనను నీతిని బోధించుచున్నవి. ఈ రాజదండము వేదములలోని ఋతము [చూ. పు. 340] నుండి, విశ్వవ్యాప్తమైన ధర్మము నుండి ఉత్పన్నమైనది. కాని, సదా సన్మార్గానువర్తియై ఉండు రాజునకు మాత్రమే ఆ దండము బలము చేకూర్చగలదు. ఋజుమార్గమును తప్పిన రాజును ఈ దండము పరిత్యజించును. ఆపైన, కోపోద్రిక్తులయిన ప్రజలు రాజును సమిత్ర బాంధవముగ హతమార్తురు.

ఇంతియేకాదు; రాజుతో నిమిత్తము లేకుండ ప్రజానాయకుల సమాలోచనాదులవలన వ్యవహరించు ప్రజాసత్తాక గణ రాజ్యములును భారతదేశమున పూర్వకాలమున ఉండినటుల వైదిక, బౌద్ధగ్రంథముల వలననేగాక, ప్రాచీన గ్రీక్ రచయితలవలనను తెలియవచ్చుచున్నది. మౌర్య సామ్రాజ్య స్థాపనతో ఇట్టివాని ప్రతిపత్తి చాల వరకు అంతరించినది. కాని, వాయవ్య భారతమున మాత్రము మౌర్య సామ్రాజ్యమునకు పూర్వము పెక్కు శతాబ్దముల కాలమున రూపొందిన కొన్ని ప్రజా సత్తాక గణ రాజ్యములు ఆ మౌర్య సామ్రాజ్య పతనానంతరమున సైతము పెక్కు శతాబ్దములవరకు తమ ప్రతిపత్తిని నిలుపుకొనగలిగినవి. అయినను కాలక్రమమున ఆంతరంగిక విభేదములు ఈ ప్రజాసత్తాకప్రభుత్వములకు ఉపద్రవములుగ పరిణమించినవి. పదిమంది నోళ్ళలోపడిన ప్రభుత్వపాలనా రహస్యములను గుప్తముగ కాపాడుట సాధ్యము కాక పోవుటవలన ఈ ప్రజాసత్తాక గణములకు మరొక సమస్య కూడా ఏర్పడినది. ప్రభుత్వ కార్యకర్తలను ఎన్నుకొనునప్పుడే సాధ్యమైనంత జాగరూకత వహించి, ఆ పైన వారిని విశ్వసించుట తప్ప దీనికి వేరే తరణోపాయము ఏమియు లేదు. ప్రజా సత్తాక గణరాజ్యములలోని ఇట్టి లోపముల వలననే కాలక్రమమున ఏక సత్తాక రాజ్యాంగము భారతదేశమున అన్ని ప్రాంతములందును ఆదరితమైనది.

పురాణములలో కనిపించు రాజ్యాంగ విజ్ఞానము మనువు పరిపాలననుగురించియు, ఇతర రాజవంశముల పరిపాలనను గురించియు చేసిన వర్ణనలలో గర్భితమై ఉన్నది. ఇందు వర్ణితములైన పరిపాలనాపద్ధతులు మహాభారతమునకును, అర్థశాస్త్రమునకును, ధర్మశాస్త్రములకును అనుగుణముగ ఉన్నవి. కొన్నిచోట్లమాత్రము ఈ పురాతన దృక్పథములే క్రొత్త రూపములలో కనిపించుచున్నవి. రాజకీయ విజ్ఞానము దృష్ట్యా అగ్నిపురాణము మిగిలిన పురాణములన్నింటి కంటె చాల ముఖ్యమైనది. ప్రభుత్వవిధానమును గురించి ఈ పురాణము విశేషముగ వివరించి ఉన్నది. ఈ పురాణ కర్త చాతుర్వర్ణ్యసిద్ధాంతమును ఆమోదించి, ఈ సాంఘిక ధర్మమును సక్రమముగ ప్రవర్తింపజేయుట రాజునకు విద్యుక్తధర్మమని శాసించెను. అగ్నిపురాణముదృష్ట్యా ప్రభుత్వము అనునది ఒక నైతికసంస్థ. రాజునే సర్వాధికారిగా కలిగిన ప్రభుత్వము ఐహిక, ఆధ్యాత్మిక అభ్యున్నతికి ఒక ఉపకరణమని ఆ గ్రంథము నిర్వచించినది. రాజ్యములో ఆహారము లేకకాని, మందు లేకకాని ఒక వ్యక్తి కూడా మరణించకుండునట్లు రాజు శ్రద్ధ తీసికొన వలెనని ఆపస్తంబుడు వ్రాసిన సంగతిని కూడా ఈ సందర్భములో మనము స్మరించవచ్చును. ప్రజలనందరిని కాపాడగలనని రాజు తన పట్టాభిషేక సమయములో ప్రమాణము చేయవలెను. ఆదిలో-అత్యంత ప్రాచీనయుగములో-సంఘములో హెచ్చు తగ్గులుగాని, కులములుగాని లేవనియు, అందరును సమానముగ ఐశ్వర్యవంతులై ఉండుటే దీనికి కారణమనియు విష్ణు, వాయు పురాణములలో వ్రాసి ఉన్నారు. కాని, అటుపిమ్మట క్రమముగా పేరాశలును, ఉద్వేగములును మానవ హృదయములను ఆవేశించినవి. కొలదిగ గ్రామములును, పట్టణములును వెలయుటయు, వేరువేరు వృత్తులు అవలంబించువారు వేరువేరు వర్గములుగ ఏర్పడుటయు జరిగినది. ఈ విధముగ ఈ దేశములో సంఘ నిర్మాణము కేవలము భగవత్సంకల్పమువల్లనే కాకుండా ఆవశ్యకతను, అనుభవమును అనుసరించి కాలక్రమేణ

జరిగినది. ఈ విధముగ ఏర్పడిన సాంఘికమర్యాదలను భద్రముగా కాపాడుట ప్రభుత్వములకు విహితధర్మమైనది. మార్కండేయపురాణము కూడా సంఘనిర్మాణ సిద్ధాంతమును వివరించి దానిని సక్రమముగ అమలుజరుపవలసిన ఆవశ్యకతను విపులీకరించినది. తక్కిన పురాణములు కూడ సంఘనిర్మాణమును గురించి ఇట్టి వివరణలే చేసి, రాజ్యాంగమును గురించియు, పరిపాలనము గురించియు కూడా కొంచెమించుమించుగా ఈ వివరణములనే పేర్కొన్నవి.

భారతరాజ్యాంగ విజ్ఞానములో కౌటిల్యుని అర్థశాస్త్రము చాలా విలక్షణమైన గ్రంథము [చూ. కౌటిల్యుడు పు. 411]. కౌటిల్యుడు చిన్నచిన్న రాజ్యముల రాజ్యాంగమును గురించి మాత్రమే వ్రాసెనని కొందరు తరచుగ అందురు. కాని, కౌటిల్యుడు మాత్రము వీరి అభిప్రాయములకు పూర్తి విభిన్నముగ భారతదేశమునంతటిని ఒకే రాజ్యముగ మొట్టమొదటిసారిగా భావించి 'చక్రవర్తి క్షేత్రము' అని దానికి నామకరణము కూడా చేసెను. ఆర్థికదృష్టికిని, ధర్మదృష్టికిని సంఘర్షణ వచ్చినప్పుడు ఆర్థికదృష్టికే ప్రాముఖ్యము ఈయవలెనను సిద్ధాంతము విషయములో తక్కిన అర్థశాస్త్రగ్రంథ రచయితలు అందరును అనుసరించిన మార్గమునే కౌటిల్యుడు కూడా అవలంబించెను. ఇతర న్యాయశాస్త్రములు అన్నిటికంటె రాజశాసనమే బలిష్ఠమైనదని కౌటిల్యుడు ప్రతిపాదించిన నూతన సిద్ధాంతమును నారద స్మృతికర్త ఒక్కడు మాత్రమే అంగీకరించెను. తక్కిన అర్థశాస్త్ర రచయితలు అందరును ఈ సిద్ధాంతమును ఖండించిరి.

కామందకి, శుక్రనీతిసారములను రచించిన వారలు కూడా ఈ విషయములో కౌటిల్యునే అనుసరించి, ప్రభుత్వము అనగా సప్తాంగములతో కూడినది - అనగా ఏడు శాఖలతోను, 7 గురు సభ్యులతోను కూడినది - అని నిర్ధారణ చేసిరి. పరస్పర సంబంధబాంధవ్యములుగల కొన్ని రాష్ట్రముల సమూహమునకు మండలము అని పేరు. మొత్తముమీద అర్థశాస్త్ర గ్రంథములు అన్నియు ప్రయోజనసాధన దృష్టికిని, తదనుగుణమైన రాజనీతికిని సంబంధించిన సిద్ధాంతములనే అనుసరించినవి. ప్రాపంచిక ప్రయోజనమునకే ప్రధాన ప్రాముఖ్యమును ఇచ్చినవి. ప్రభుత్వములయు, ప్రభువులయు ప్రవర్తనలను ఈ గ్రంథములు చాలవరకు తీర్చిదిద్దినవని పంచతంత్రము, హితోపదేశము మొదలగు రచనలవలన తెలియుచున్నది. ధర్మశాస్త్ర గ్రంథములు అన్నియు అర్థశాస్త్రసిద్ధాంతములను స్వీకరించినను, అర్థమునకంటె ధర్మమునకే ప్రాముఖ్యము ఉండవలెనని సిద్ధాంతీకరించినవి. అహింసను పరమధర్మముగా పాటించిన జైనులు తమ ఆధ్యాత్మిక దృక్పథమును తమ ప్రాపంచిక వ్యవహారములతో - ముఖ్యముగా రాజకీయములతో - సమన్వయము చేసికొనుటకు చాల కష్టపడ వలసివచ్చినది. అయినప్పటికిని, సైన్యములను సమీకరించుకొని యుద్ధములు చేసిన జైనచక్రవర్తులు అనేకులు ఉండిరి. అహింసానియమమును అక్షరశః అమలు జరుపవలసినవారు 'శ్రమణులు' అను సన్న్యాసులు మాత్రమే అని నిర్వచించుట మూలముగ ఈ సమన్వయము సాధ్యమైనది. తక్కిన జనసామాన్యము అనవసరముగ హింస చేయకుండ ఉన్నచో, ఈ ధర్మమును పాటించినట్లే అని కూడ వారు నిర్వచించిరి. ఈ విధముగ జైన నైతిక సిద్ధాంతాను గుణముగ మలచిన జైనరాజ్యాంగ సిద్ధాంతమునకు 10 వ శతాబ్ది చరమార్ధములో సోమదేవసూరి విరచితమైన 'నీతి వాక్యామృతము' అను గ్రంథము ప్రబలమైన ఉదాహరణ.

మధ్యయుగములో హైందవ రాజ్యాంగపద్ధతిలో జరిగిన పెద్దమార్పులు ఏవియు లేవు. అయితే, ఈ సమయములో ప్రాతగ్రంథములకే నూతన వ్యాఖ్యానములును, వివరణములును పరంపరలుగ తయారై, నూతన పరిస్థితులకు అవసరమైన మార్పులు మాత్రము చేసి, ప్రాచీన సిద్ధాంతములను యథాతథముగను, సజీవముగను నిల్పినవి. అర్థశాస్త్ర మూలసిద్ధాంతములను నిరసించుటతో సాంఘిక, రాజకీయ జీవితమునకు మతమే ప్రాతిపదిక అను సిద్ధాంతము తిరిగి బాగుగ బలపడినది. సాంఘిక, రాజకీయ జీవితము ఒకప్పుడు హిందూమతసంస్థ అస్తిత్వమునకే ముప్పు తెచ్చిపెట్టునట్లు విజృంభించిన ఇస్లామ్‌మతపు తాకిడిని ఎదుర్కొనవలసి వచ్చినది. అందువలన ప్రాతకాలపు భావములును, ఆచారములును ఈ నూతన పరిస్థితికి అనుగుణముగ మార్పు చెందవలసిన బలదావశ్యకత ఏర్పడినది. 15 వ, 16 వ శతాబ్దులలో దక్షిణహిందూదేశమున అమలులో ఉండిన అత్యద్భుత రాజకీయ సిద్ధాంతమును గురించి వివరించుచున్న కృష్ణదేవరాయని 'ఆముక్తమాల్యద' ను కూడ ఈ సందర్భములో మనము స్మరించవలసి ఉన్నది.

పై విషయములు అన్నింటిని బట్టి ప్రాచీనయుగములోను, మధ్యయుగములోను కూడ ధర్మమును ఆధ్యాత్మిక లక్ష్యముతో కూడుకొనిన ఒకానొక సామాన్య సాంఘిక దృక్పథము యొక్క ప్రభావము భారతరాజ్యాంగముపై విశేషముగ పడినదను సంగతి విశదము అగుచున్నది. ప్రభుత్వముకంటే సంఘమే సదా ఉదాత్తమైనది అని ఆనాటివారు భావించెడివారు. ఈ సంఘనిర్మాణము సహజసిద్ధముగ నానాత్వముతో కూడుకొన్నది. ప్రతి కులము

నకును, ప్రతి వర్గమునకును, ప్రతి వంశమునకును, ప్రతి గ్రామమునకును, ఇంకను ఇతర వర్గములకును సంప్రదాయ సిద్ధముగ వచ్చుచున్న ప్రత్యేక నియమనిబంధనావళియు, కట్టుబాట్లును, ఆచారములును ఉన్నవి. పరస్పర సహకార భావముతో సమానమగు ఛాయాలో వారందరును తమ తమ సంప్రదాయానుగుణముగ జీవితయాత్ర సాగించెడి వారు. సంఘములోని వివిధ వర్గములును, ఈ వర్గముల లోని వివిధ వ్యక్తులును తమ తమ సంప్రదాయసిద్ధములైన ధర్మములకును, ఆచారములకును సంబంధించిన స్వధర్మానుష్ఠానమును సక్రమముగ, నిర్నిరోధముగ సాగించుకొనునట్లు చూచుట ప్రభుత్వముయొక్క విధ్యుక్తధర్మము.

ముస్లిమ్‌ల ఆగమనముతో భారతదేశములో ఒక నూతన దృక్పథము ఏర్పడినది. ఇస్లామ్‌మత మూల సిద్ధాంతము ప్రకారము ప్రపంచములోని ముస్లిమ్‌లు అందరును 'కలీఫా' ఏకైక నాయకత్వము క్రింద ఒకే కుటుంబములోని సహోదరులవలె వ్యవహరించవలసి ఉన్నది. ముస్లిమ్‌లు నివసించు ప్రదేశమును 'దార్ - ఉల్ - ఇస్లామ్' అందురు. తక్కిన ప్రపంచమును 'దార్ - ఉల్ - హర్బ్ - అనగా నాస్తికుల జగత్తు' అని వారు వ్యవహరింతురు. నాస్తికులను ఇస్లామ్‌మతములోనికి మార్చుట కొరకు కృషిచేయుట ఇస్లామ్‌మతస్థులకు ధర్మము. నానా విధముల నిర్వచనములు గల 'జిజియా' పన్ను - మత విశ్వాసము కల ముస్లిమ్‌నకు నాస్తికులైన 'కాఫరుల' (ఇతరమతస్థుల) లొంగుబాటును సూచించుటకు గాను ఏర్పరచిన ఒక చిహ్నము. ముస్లిమ్ మతసిద్ధాంతమునకు అతీతమైన ఉదాత్తదృష్టితో చూడగలిగిన అక్బర్ [చూ. పు. 260] వంటి ఉత్తమ చక్రవర్తుల పాలనలో తప్ప పాలకులకును, పాలితులకును సమానస్థాయి వీరి హయాములో మరెక్కడను మచ్చునకైన కనిపించదు.

ఆధునిక యుగములో భారత రాజకీయముల మూల సిద్ధాంతములన్నియు పాశ్చాత్య ప్రపంచమునుండి సంక్రమించినవి. ఉదార ప్రజాస్వామ్యసిద్ధాంతములలోని ఉత్తమ పద్ధతులు అన్నిటిని ఆధునిక భారత రాజకీయములు అనుసరించుచున్నవి. భారతదేశమునకు లభింపనున్న నూతనావకాశములను మొట్టమొదట గ్రహించిన భారతీయసమీక్షకులలో రాజా రామమోహనరాయ్ మొట్ట మొదటివాడు. నూతనవిధానముల ప్రకారము విద్వాంసులైన అనేకులు భారతీయులకు మిల్టన్, బర్క్, మిల్, గ్లాడ్‌స్టన్ రచనలు సుపరిచితములైనవి. బ్రిటిష్‌వారు తమ దేశమును తాము పాలించుకొనుచున్నట్లే భారత దేశమును భారతీయులే పాలించుకొనవలెనను సంకల్పము వీరికి కలిగినది. అమెరికన్, ఫ్రెంచి విప్లవములు కూడా ఈ నీతినే బోధించినవి. 1885 లో స్థాపించిన భారతజాతీయ కాంగ్రెస్ [చూ.] ఆధునిక భారతరాజకీయ లక్ష్య ప్రకటనకు ప్రప్రథమోపకరణమైనది. 1907 ప్రాంతములో మెహతా, గోఖలే మున్నగు నాయకులకును, విప్లవాత్మకమైన దృక్పథము గల బాలగంగాధర తిలక్, బి. సి. పాల్ మున్నగు నాయకులకును విభేదములు వచ్చినవి. క్రమముగ ఈ విభేదములు పెరిగి చీలికలు ఏర్పడినవి. దేశములోని యువకులలో - ముఖ్యముగ బెంగాల్‌లో - అరాజక సిద్ధాంతములు కూడ వ్యాపించినవి. ఆ కాలమునాటి రాజకీయ, ఆర్థికాభిప్రాయములు మహాదేవ గోవింద రనడే, గోపాలకృష్ణగోఖలే [చూ. పు. 428] మున్నగువారి ఉపన్యాసములలోను, రచనలలోను వ్యక్తమగుచున్నవి.

గాంధిమహాత్ముడు [చూ. పు. 421] రంగములో ప్రవేశించిన తరువాత భారత రాజకీయములలోని విసుగు పుట్టించు ప్రాతపద్ధతులు మారిపోయినవి. ఐహిక పాశవిక శక్తులను ఆత్మశక్తితో ఎదుర్కొను సత్యాగ్రహ విధానమును గాంధిజీ సర్వాంగసుందరముగ తయారుచేసెను. ఆయన సాంఘిక, రాజకీయాభిప్రాయములు యోగులయు, ఋషులయు, ఆత్మశక్తి సిద్ధాంతమునుండియు, భగవద్గీత బోధించుచున్న సాంఘిక సౌశీల్యమునుండియు, థోరో, టాల్‌స్టాయ్ మొదలైన పాశ్చాత్య భావుకుల సాత్విక నిరోధ, ఆధ్యాత్మిక అరాజకత్వములనుండియు పుట్టినవి.

ఆధునిక యుగమున సోషలిజమ్, కమ్యూనిజమ్ సిద్ధాంతములు కూడ భారతయువకులను కొంతవరకు ఆకర్షించినవి. ప్రజాస్వామికరీతిలో సోషలిస్ట్ ఆర్థికవ్యవస్థను భారతదేశమున రూపొందించుటయే తన ధ్యేయముగ భారతజాతీయ కాంగ్రెస్ 1954 లో తీర్మానించుటకు గాంధిమహాత్ముని సర్వోదయ సిద్ధాంతములే కాక, పాశ్చాత్య దేశములనుండి భారతదేశమునకు వ్యాపించిన సోషలిజపు సిద్ధాంతములును కొంతవరకు దోహదకారులైనవి.

కే. వి. ఎన్. శాస్త్రి.

**భారత ప్రథమ స్వాతంత్ర్య యుద్ధము :** చూ. భారతదేశము - పు. 664.

**భారత ప్రభుత్వ చట్టము :** చూ. భారతదేశము - పు. 664.

**భారత రాజ్యాంగము :** ప్రస్తుత భారత రాజ్యము సర్వాధికారయుత ప్రజాసత్తాకము. గాంధిజీ [చూ. పు. 421] నాయకత్వ ఫలితముగ 1947, ఆగస్టు 15 వ తేదీని బ్రిటిష్ పరిపాలనము అంతరించి, భారతదేశము సంపూర్ణ స్వతంత్రరాజ్యము అయ్యెను. ఈ మార్పును స్పష్ట

పరచుటకై రాజ్యాంగ శాసనములో భారతదేశము సర్వస్వతంత్రాధికారము గల దేశమని వివరించుట జరిగినది. స్వరాజ్యము లభించినతరువాత కూడ భారతదేశము బ్రిటిష్ కామన్ వెల్త్ నందు సభ్యత్వము వహించి ఉన్నది. ఇట్టి సభ్యత్వము స్వాతంత్ర్యమునకు లోపము కలిగించు చున్నదను అభిప్రాయమును కొందరు వ్యక్తపరచిరి. అందుచే అది సరియైన అభిప్రాయము కాదనియు, ఈ సభ్యత్వము ఐచ్ఛికమే కాని, బలాద్విహితమైనది కాదనియు స్పష్టపరచుటకు ఈ వివరణము ఆవశ్యకమని భావింపబడెను.

భారతరాజ్యమున ప్రజాసత్తాకమునకు ఉండవలసిన లక్షణములు అన్నియు కలవు. దేశమును పాలించుటకై ఏర్పడిన శాసనసభలలోని సభ్యులను పౌరులే ప్రత్యక్షము గనో, పరోక్షముగనో ఎన్నుకొనుచున్నారు. కుల, మత, వర్ణ విచక్షణతతో ఎన్నికహక్కునకు సంబంధము లేదు. పురుషులతో సమానముగ స్త్రీలు కూడ ఎన్నికలలో పాల్గొనవచ్చును. ఈ ఎన్నికలు ఐదుసంవత్సరములకు ఒక పర్యాయము తప్పక జరుగవలెను. కనుక, ఎవరు గాని అధికారపదవులలో శాశ్వతముగ ఉండుటకు వీలులేదు. వారి అర్హతానర్హతలను అప్పుడప్పుడు పరీక్షించి నిర్ణ యించుటకు ప్రజలకు సంపూర్ణమైన అవకాశము ఏర్పడి ఉన్నది. ఇది కాక, పౌరుల ప్రధాన హక్కులలో వాక్ స్వాతంత్ర్యము, సంఘములు స్థాపించుకొను స్వాతంత్ర్యము, సమావేశములు జరుపుకొను స్వాతంత్ర్యము కూడ చేర్చబడి ఉన్నవి. అందుచేత పత్రికలమూలమునను, సమావేశముల మూలమునను పరిపాలకుల చర్యలను విమర్శించుటకును, ఖండించుటకును ప్రజలకు వీలు కలదు. ప్రచారము మూల మున అధికారుల విషయమై ప్రజాభిప్రాయమును మార్చి క్రొత్తవారిని అధికారులుగ ఎన్నుకొనవచ్చును. ప్రజా మోదముతో ఎట్టి రాజకీయపక్షమైనను అధికారమునకు వచ్చి దేశమును పాలింపవచ్చును.

మౌలిక స్వామ్యములు: భారతరాజ్యాంగము గుర్తించిన ప్రజల హక్కులలో వ్యక్తి సమత్వము, వ్యక్తిస్వేచ్ఛ, ఆస్తిపై వ్యక్తులకు గల స్వామ్యము, అల్పసంఖ్యాక వర్గముల విజ్ఞాన స్వాతంత్ర్యము ముఖ్యములైనవి. ప్రస్తుత భారతరాజ్యాంగము స్పృశ్యులు, అస్పృశ్యులు అను భేదము ఉండరాదని ప్రకటించినది. అదేవిధముగ మత మును బట్టిగాని, జాతిని బట్టిగాని పౌరధర్మములను, హక్కులను, విధులను నిర్ణయింపరాదనియు, రాజకీయ లాభములను అనుభవించుటలో పౌరులు అందరును సమానులు అనియు అంగీకరించుచున్నది. వాక్ స్వాతంత్ర్యము, సమావేశ స్వాతంత్ర్యము, సంచార స్వాతంత్ర్యము, ఆస్తిని సంపాదించి అనుభవించు స్వాతం త్ర్యము, ఇష్టము వచ్చిన సిద్ధాంతము విశ్వసించు సాతంత్ర్యము, వృత్తి స్వాతంత్ర్యము మొదలగు వానిని రాజ్యాంగము గుర్తించుచున్నది. ఈ స్వాతంత్ర్యమునకు విరుద్ధముగ ప్రభుత్వమువారు సాధారణ పరిస్థితులలో చట్టములను చేయరాదు. శాంతిభద్రతలు, దేశక్షేమము, నీతి, ఆరోగ్యము మొదలగువానికి భంగము కలుగునట్లు వినియోగింపబడు వ్యక్తిస్వాతంత్ర్యమును మాత్రము ప్రభుత్వము నిరోధింపవచ్చును. కాని, అట్లు భంగము కలిగించనంతవరకు వ్యక్తుల స్వేచ్ఛకు నిరోధము కలిగించ రాదు. అన్ని మతములవారును వారి వారి మతములను స్వేచ్ఛగ అనుసరించవచ్చును. యథేష్టముగ దానిని వారు ప్రచారము చేసి మతాంతరులను తమ మతములో కలుపు కొనవచ్చును. వారి భాషను, వారి విజ్ఞానమును నిలబెట్టు కొనుటకును, వృద్ధి చేసికొనుటకును అన్ని వర్గముల వారికిని స్వేచ్ఛ కలదు. ఈ హక్కులను నిరోధించు ఉద్దేశ్యముతో శాసనసభలు చట్టములు చేసిన ఎడల అట్టి చట్టములు అక్రమములని నిర్ణయించు అధికారము న్యాయ స్థానములకు కలదు. కనుక, భారతరాజ్యములో ఏర్పడిన ప్రభుత్వము వ్యక్తులయు, అల్పసంఖ్యాకులయు మౌలిక స్వత్వములకు భిన్నముగ ప్రవర్తింప వీలులేని నియమబద్ధ మైన ప్రభుత్వము అని చెప్పదగి ఉన్నది.

భారతరాజ్యపు కేంద్రప్రభుత్వమున కూడ ప్రస్తుత కాలపు ఇతర ప్రభుత్వములు అన్నిటిలోను వలెనే కార్య నిర్వాహకశాఖ, శాసనశాఖ, న్యాయశాఖ, ఉద్యోగశాఖ అను నాలుగు శాఖలు ఉన్నవి.

కార్యనిర్వాహక శాఖ: ప్రస్తుత భారతరాజ్య కార్య నిర్వాహక శాఖలో రాష్ట్రపతి, ఉపరాష్ట్రపతి, ప్రధాన మంత్రి, కొందరు సాధారణమంత్రులును చేరి ఉన్నారు. వీరిలో రాష్ట్రపతి, ప్రధానమంత్రియు కీలకస్థానములందు ఉండువారు. భారతరాజ్యాంగము పార్లమెంటరీ విధాన మును అనుసరించినదగుటచేత వీరిద్దరిలో ప్రధానమంత్రియే బలవత్తరుడని చెప్పవలసి ఉన్నది.

రాష్ట్రపతి [అధ్యక్షుడు]: దేశమునకు అంతకును అధ్య క్షుడు మకుట స్థానీయుడు. ఈ అధ్యక్షునకే రాష్ట్రపతి అను వ్యవహారనామము నిర్దేశితమైనది. ఇతడు ఎన్నికమూల మున అధికారములోనికి వచ్చువాడు. కాని, ఇతనిని ప్రజలే ప్రత్యక్షముగ ఎన్నుకొనుటలేదు. శాసనసభలలోని ప్రజాప్రతినిధులు ఇతనిని ఎన్నుకొనుటచేత ఆ ఎన్నిక పరోక్షమని చెప్పదగి ఉన్నది. కేంద్రశాసనసభలలోని సభ్యు

లును, రాష్ట్రములలో ప్రత్యక్షముగ ప్రజలు ఎన్నుకొనిన శాసనసభలలోని సభ్యులును కలసి ఒక నియోజకవర్గముగ ఏర్పడి, నైష్పత్తికపు ఎన్నికపద్ధతిలో ఇతనిని ఎన్నుకొనుచున్నారు. ఈ ఎన్నికలో గమనించదగిన విశేషములు రెండు కలవు. రాష్ట్రపతి ఎన్నికలో రాష్ట్రసభ్యులు కూడ పాల్గొనుట ఒక విశేషము. పార్లమెంటరీ విధానము ఉండు ఫ్రాన్స్‌వంటి దేశములలో ఇట్లుగాక, కేంద్రశాసనసభలవారు మాత్రమే రాష్ట్రపతిని ఎన్నుకొనుచున్నారు.

ముప్పదియైదు సంవత్సరముల వయసుకలిగి కేంద్రములోని శాసనసభలలో సభ్యులు కాదగిన భారతపౌరులు రాష్ట్రపతులు అగుటకు అర్హులు. రాష్ట్రపతి ఉద్యోగపరిమితి ఐదు ఏండ్లు. కాని, ఇది ముగియుటకు పూర్వము కూడ ఉద్యోగమునుండి ఇతనిని తొలగించుటకు వీలుకలదు. రాజ్యాంగ చట్టమునకు విరుద్ధముగ ఇతడు ప్రవర్తించినట్లు రుజువైనచో ఇతనిని అభిసంసనముచేసి, తొలగింపవచ్చును. ఆ విధముగ ప్రవర్తించెనను నేరమును ఇతనిపై కేంద్రమందలి రెండు శాసనసభలలో ఏదియో ఒక సభ మోపవలెను. దానిని రెండవసభ విచారణ చేయవలెను. నేరము మోపుటకును, విచారణగావించి రుజువుచేయుటకును ఆ యా సభలలో మూడింట రెండువంతుల సభ్యుల ఆమోదము ఉండవలెను. ఒక వ్యక్తిని ఎన్నిపర్యాయములు అయినను రాష్ట్రపతిగ ఎన్నుకొనవచ్చును. అతని జీతమును తగ్గించుటకును, హెచ్చుచేయుటకును పార్లమెంట్‌కు అధికారము కలదు. కాని, ఆ హెచ్చుతగ్గులు భావికాలమున రాష్ట్రపతులు అగువారి విషయముననేగాని, ఆ నిర్ణయము జరిగినపుడు అధికారములో ఉండు రాష్ట్రపతి విషయమున వర్తింపవు. కనుక, ఆర్థికాపేక్షతో రాష్ట్రపతి పార్లమెంట్‌నకు లోబడి ఉండవలసిన ఆవశ్యకత లేదు.

**ఉపరాష్ట్రపతి [ఉపాధ్యక్షుడు]:** ఉపరాష్ట్రపతిని కేంద్ర శాసనసభ్యులు మాత్రమే ఎన్నుకొనుచున్నారు. అతని ఉద్యోగకాలము కూడ ఐదు ఏండ్లు. అతనిని తొలగింపవలెనను తీర్మానము కేంద్రములోని 'రాజ్యసభ' వారే ప్రవేశపెట్టవలెను. దానిని లోకసభవారు ఆమోదింపవలెను. కాని, ఈ ప్రవేశనమునకును, ఆమోదమునకును మూడింట రెండువంతుల సభ్యుల అనుమతి అక్కరలేదు. ఏ కారణము చేతనైన రాష్ట్రపతి ఉద్యోగము కాలపరిమితికి ముందే ఖాళీయైన పక్షమున క్రొత్త రాష్ట్రపతిని ఎన్నుకొనునంత వరకును ఉపరాష్ట్రపతి రాష్ట్రపతి విధులను నెరవేర్చవలసి ఉండును. ఇదిగాక అస్వస్థత చేతగాని, మరియొక కారణమునగాని రాష్ట్రపతి అతని పనులను నిర్వహింపలేకున్నచో, ఉపరాష్ట్రపతి అట్టికాలములో రాష్ట్రపతి స్థానమందు ఉండును. రాజ్యసభకు ఉపరాష్ట్రపతియే అగ్రాసనాధిపతి. మామూలుగ ఇతనికి ఉండు అధికారము ఈ అగ్రాసనాధిపత్యమును నిర్వహించుటయే.

**రాష్ట్రపతి అధికారములు:** శాసనరీత్యా సర్వపరిపాలనాధికారమును రాష్ట్రపతిదే. పరిపాలనకు సంబంధించిన ఉత్తర్వులు అన్నియు అతని పేరిటనే జారీ కావలసి ఉన్నది. సైన్యము, నౌకాదళము, విమానబలము మొదలగు రక్షకబలమునకు అంతకును అతడే అధిపతి. మంత్రులను, తక్కిన ఉన్నతోద్యోగులను, ఆర్థిక కమిషన్, అల్పసంఖ్యాకుల కమిషన్ మొదలగు ముఖ్యమైన కమిషన్‌ల సభ్యులను, న్యాయాధీశులను ఉద్యోగములయందు నియమించువాడు ఈతడే. విదేశములకు పంపవలసిన రాయబారులను పేర్కొను అధికారమును, విదేశములనుండి వచ్చు రాయబారులను గుర్తించు అధికారమును కూడ ఇతనిదే. నిందితులను కరుణించుటకును, క్షమించుటకును అధికారములు గలవాడు ఈతడే. శాసనసభలు అనుమతించిన బిల్లులు శాసనరూపము పొందుటకు ఈతని ఆమోదము ఆవశ్యకము. శాసనసభలు హాజరుగ ఉండని సమయములలో జరూరుగ చట్టములను కావింపవలసిన పరిస్థితులు ఏర్పడినప్పుడు అధ్యాదేశము(ఆర్డినెన్స్)లను చేయువాడు ఈతడే. దేశమునకు అపాయము కలుగనున్నదని ఇతనికి తోచినప్పుడు ఆ విషయమును ప్రకటించు అధికారము ఇతనిదే. అట్టి ప్రకటన మూలమున ఆత్యయికపరిస్థితియందు ఇతనికి మరికొన్ని విశేషాధికారములు కూడ సంక్రమించుచున్నవి. కేంద్రముతోపాటు రాష్ట్రములను కూడా ఇతడు ఆకాలమున పరిపాలించును. పౌరులకు గల మౌలికస్వామ్యములను ఆత్యయికపరిస్థితిలో ఇతడు తాత్కాలికముగ రద్దు చేయవచ్చును. అట్టి సమయములలో ఇతని అధికారము నిరంకుశము అగును. అయితే, ఆ అధికారము ఈ క్రిందను వివరించిన రెండు షరతులకు మాత్రము లోబడి ఉండును:

1. అత్యావశ్యక ప్రభుత్వశాసనమును పార్లమెంట్ రెండు సభల ఎదుటను నివేదించవలెను. అంతేకాక, దానిని అమలులోపెట్టిన రెండు మాసములలోగా పార్లమెంట్ రెండు సభలవారును దానిని ఆమోదించి ఉండని ఎడల దాని వినియోగార్హత రెండుమాసములు పూర్తికాగానే అంతరించును. పార్లమెంట్‌లోని లోక్‌సభ రద్దయినను లేదా అట్టి రాజశాసన ప్రకటనము జరిగిన రెండుమాసములలో రద్దుకానున్నను పార్లమెంట్ సభలు సమావేశమై, ఆ ప్రకటనను సమ్మతించుటకు అవకాశము కలదు. క్రొత్త పార్లమెంట్ ఏర్పడినపుడు అట్లు ఏర్పడిన ముప్పదిదినము

లలో రాష్ట్రపతి ప్రకటనమును ఆ పార్లమెంట్ కూడ ఆమోదింపవలెను.

2. ఈ వివరణమును బట్టి పరిపాలనాధికారము అంతయు రాష్ట్రపతి అధీనతలో ఉండునట్లు తోచును. కాని యథార్థ స్థితి వేరు. పేరునకే అతడు సర్వాధికారి. మంత్రుల సలహాలను అనుసరింపక అతడు ఎట్టి పనులను చేయుటకు వీలు లేదు. ఎంతటి స్వల్పకార్యమునైనను అతడు మంత్రుల ఆమోదముతో చేయవలసినవాడే కాని, స్వతంత్రించి వారిని కాదని స్వేచ్ఛగ ప్రవర్తింప వీలులేదు.

మంత్రివర్గము: మంత్రులనుగురించియు, మంత్రుల సభను గురించియు రాజ్యాంగశాసనమందు నాలుగైదు సూత్రములు మాత్రమే కలవు. మంత్రివర్గము (కాబినెట్) నందు ఒక ప్రధానమంత్రియు, కొందరు సాధారణ మంత్రులును ఉండవలెను. ప్రధానమంత్రిని రాష్ట్రపతి స్వేచ్ఛానుసారము నియమింపవచ్చును. సాధారణమంత్రులను ఎన్నుకొనుటలో మాత్రము అతడు ప్రధానమంత్రి సలహాను అనుసరించవలెను. పార్లమెంట్‌లో సభ్యులుకానివారు ఆరుమాసములకు మించి మంత్రులుగ ఉండరాదు. మంత్రులు అందరు ఒక జట్టుగ ఏర్పడి, సమష్టి బాధ్యతతో ప్రవర్తింపవలెను. వారి జీతములను నిర్ణయించుటకును, మార్చుటకును పార్లమెంట్‌కు సర్వాధికారము ఉన్నది. ఆ మార్పు పార్లమెంట్ ఇష్టమునుబట్టి ఎప్పుడైనను జరుగవచ్చును.

పరిపాలనాధికారము అంతయు మంత్రివర్గముదే కాని రాష్ట్రపతిది కాదని చెప్పుటకు ఈ సూత్రములే ఆధారములు. తనకు ఇష్టము వచ్చినవారిని మంత్రులుగ నియమించుటకును, ఇష్టము తప్పినప్పుడు వారిని ఆ పదవులనుండి తొలగించుటకును రాష్ట్రపతికి అవకాశము ఉండునెడల, మంత్రుల సలహాను అనుసరించి అతడు ప్రవర్తింపవలెనను సూత్రము అతని అధికారమునకు భంగకరముగ ఉండదు. అందుచే - అట్టి అవకాశము అతనికి లేదు. పరిపాలనము సౌష్ఠవముగ జరుగుటకు పన్నుల మూలమున ప్రజలనుండి ద్రవ్యమును వసూలుచేయుట ఆవశ్యకము అగుచున్నది. కాని, పన్నులు విధించుటకును, శాసనములు చేయుటకును పార్లమెంట్‌నకే అధికారము కలదు. పార్లమెంట్‌లో పలుకుబడి గల వారిని మంత్రులుగ నియమించినప్పుడే పరిపాలనము జరుగుటకు కావలసిన ద్రవ్యమును, శాసనములును రాష్ట్రపతికి లభించును. అందుచేత అతడు తనకు ఇష్టము వచ్చినవారిని మంత్రులుగ ఎన్నుకొనుట సాధ్యము కాని పని. మొండిపట్టుపట్టి అతడు అట్లు చేసిన ఎడల పరిపాలనము అంతయు స్తంభించిపోవును. అట్టి స్తంభనము జరుగకుండుటకై పార్లమెంట్ సభ్యులే మంత్రులుగ ఉండవలెనన్న ఉద్దేశముతో శాసనసభ్యత్వములేని మంత్రి ఆరు మాసములకంటె అధికకాలము మంత్రిపదవిలో ఉండ కూడదనియు, మంత్రుల జీతములను నిర్ణయించు అధికారము పార్లమెంట్‌నకు కలదనియు రాజ్యాంగశాసనము విధించుచున్నది. పార్లమెంట్‌లో నాయకులు ఎవ్వరో నిర్ణయించవలసిన బాధ్యత రాష్ట్రపతిపై పడుచున్నది. కొన్ని సందర్భములలో అతడు ఆ బాధ్యతను సులభముగానే నిర్వహింపగలిగి ఉండును. పార్లమెంట్‌లో రెండే ప్రధాన రాజకీయపక్షములు ఉండునపుడు ఒక పక్షము అధిక సంఖ్యాకముగను, ఇంకొకటి అల్పసంఖ్యాకముగను ఉండుటచేత, అధిక సంఖ్యాక పక్షపు నాయకులను మంత్రులుగ ఏర్పరచుటే సవ్యమైన పద్ధతి. అట్టివారు మంత్రులైన ఎడల పార్లమెంట్‌లో బలముగల పక్షము పరిపాలన జరుగుటకు కావలసిన ద్రవ్యమును సమకూర్చుటకును, అవసరమైన శాసనములను నిర్మించుటకును సమర్థముగ ఉండును. ఇట్లుకాక, పార్లమెంట్‌లో రెండుకంటె అధికముగ రాజకీయపక్షములు ఏర్పడి, ఏ పక్షము కూడ పూర్తిగ అధిక సంఖ్యాకము కానపుడు ఎవరిని ప్రధానమంత్రిగ నియమించుట అను క్లిష్టసమస్యను రాష్ట్రపతి ఎదుర్కొనవలసి వచ్చుచున్నది. అట్టి సమయములో వివిధ పక్షముల నాయకులతో సంప్రతించి, కలిసి పనిచేయుటకు ఎవరు ఇష్టపడెదరో నిర్ణయించు బాధ్యతను కొంతవరకు రాష్ట్రపతి వహింపవలసివచ్చును.

అధికారమునకు వచ్చిన మంత్రివర్గము సమష్టిబాధ్యతతో ప్రవర్తింపవలెను. మంత్రులు అందరును ఒకే జట్టుగ అధికారములో ఉండి విరమించుట కూడ సమష్టి బాధ్యతకు లక్షణము. మంత్రులలో ఎవరియందు లోపము కనిపించినను ఆ లోపమునకు తక్కిన మంత్రులు కూడ బాధ్యులు అగుచున్నారు. అందరును కలిసి మునుగుటయో, తేలుటయో సమష్టిబాధ్యతకు లక్షణము. అందరును ప్రధానమంత్రి నాయకత్వమును అనుసరించువారు అగుటచేత ఇట్టి బాధ్యత వహించుట సులభము అగుచున్నది. అతనితో ఏకీభవించని మంత్రికి మంత్రివర్గములో స్థానములేదు.

ఇట్లు ఏర్పడి పనిచేయు మంత్రివర్గమునకు ఒక అధికారము ఉన్నది. పార్లమెంట్ కాలపరిమితి ఐదు సంవత్సరములు అయినను, అంతకు పూర్వమే దానిని రద్దు చేసి ఎన్నికలు జరిపించవలెనని ప్రధానమంత్రి రాష్ట్రపతికి సూచింపవచ్చును. సాధారణముగ అట్టి సూచనను రాష్ట్రపతి ఆమోదించును. పార్లమెంట్ విశ్వాసమును కోల్పోయిన మంత్రివర్గము ఉద్యోగమునుండి తొలగి పోవుటకు బదులు పార్లమెంట్‌నే తొలగించి, క్రొత్త పార్లమెంట్

ఎన్నికలు పూర్తియగువరకును ఆ మంత్రివర్గమే ఉద్యోగ మందు ఉండుట కూడ పార్లమెంటరీ విధాన సంప్రదాయ ములలో ఒకటి. అనావశ్యకముగ మంత్రివర్గముపై విశ్వాసరాహిత్యమును పార్లమెంట్ ప్రకటింపకుండుటకు ఇది ఉద్దేశింపబడినది.

మంత్రుల అధికారములు : పార్లమెంట్ విశ్వాసమునకు పాత్రమైన మంత్రివర్గమునకు పరిపాలన విషయములో అసాధ్యమగు పని ఒకటి కూడ ఉండదు. అట్టి మంత్రివర్గము పార్లమెంట్‌పై నాయకత్వము వహించి, తన ఉద్దేశ్యములు నెరవేరుటకు కావలసిన చట్టములను నిర్మించుకొనగలిగి ఉండును. ప్రజలపై ఎట్టి పన్నులనైన విధింపగలిగి ఉండును. వసూలైన ద్రవ్యమును ఇష్టమువచ్చిన పనులకై పార్లమెంట్ ఆమోదముతో ఖర్చుపెట్టగలిగి ఉండును. మంత్రుల ప్రతిపాదనలను పార్లమెంట్ నిరాకరించుటగాని, మంత్రులకు ఇష్టములేని పనులను వారిచేత చేయించుట గాని జరుగదు.

పరిపాలన సుకరమగుటకై ఒక్కొక్క మంత్రి అధీనతలో కొన్ని ప్రభుత్వశాఖలు ఉన్నవి. దేశీయ వ్యవహారశాఖ, రక్షణశాఖ, విదేశ వ్యవహారశాఖ, ఆర్థికశాఖ, ప్రయాణ సౌకర్యములశాఖ, పరిశ్రమలశాఖ, ఆహారశాఖ, విద్యాశాఖ మొదలైన శాఖలు అట్టివి. వారి వారి శాఖలకు సంబంధించిన వ్యవహారములను ఆ యా మంత్రులు పరిష్కరించుచుందురు. వారి పరిపాలన శాఖలో ఏవైన ప్రధానాంశములను నిర్ణయింపవలసి వచ్చినపుడును, వారి శాఖల పరిపాలనము మూలమున ఇతర శాఖలకు ఏవైన నష్టములు కలుగునపుడును, వారు ప్రధానమంత్రియొక్కగాని, మంత్రివర్గము యొక్కగాని సలహాను అనుసరించవలసి ఉండును. ఇదిగాక, దేశపరిపాలనమును గురించి ఆలోచించుటకు వారమునకు ఒక పర్యాయమో, రెండు పర్యాయములో ప్రధానమంత్రి అధ్యక్షతను మంత్రివర్గము సమావేశము అగుచుండును. పరిపాలనోద్దేశ్యములు, అనుసరణీయములగు మార్గములు, ప్రధాన సమస్యలను గురించి తీసికొనవలసిన చర్యలు వీనికి సంబంధించిన తీర్మానములను ఇట్టి సభలలో కావించుచుందురు. సమష్టిబాధ్యత దీని మూలమున క్రియారూపము దాల్చుచున్నది. ఈ సమావేశములలో జరుగు చర్చలును, వాని మూలమున మంత్రుల అంగీకారమునుపొందు తీర్మానములును పరిపాలన స్వభావమును నిర్ణయించును. వారి వారి ప్రత్యేక శాఖలను పాలించుటకంటె మంత్రులు అందరును కలసి ఇట్టి సమావేశములలో చేయు సమష్టి సమాలోచనలే ఎక్కువ ప్రాధాన్యము వహించుచున్నవి.

శాసన శాఖ - రెండు కక్ష్యలు : భారతరాజ్యాంగములో గల శాసనశాఖకు పార్లమెంట్ అని పేరు. అందు లోక్‌సభ (హౌస్ ఆవ్ పీపుల్స్), రాజ్యసభ (కౌన్సిల్ ఆవ్ స్టేట్స్) అను రెండు కక్ష్యలు ఉన్నవి. ఇందు మొదటిది ప్రజలందరి సమష్టి భావమును, రెండవది వివిధ రాష్ట్రముల వారి ప్రత్యేక భావమును వ్యక్తపరచును.

లోక్‌సభ : ఇందు 500 సభ్యుల కంటె ఎక్కువ మంది ఉండరాదని తొలుత నిర్ణయింపబడినను, క్రొత్త రాష్ట్రములు ఏర్పడుట మొదలగు కారణములవలన నాలుగవ సార్వత్రిక ఎన్నికల సమయమునకు ఈ సంఖ్య 521 గ మార్పుపొందినది. 21 సంవత్సరములు నిండిన స్త్రీ - పురుషులకు అందరికిని ఈ సభకు సభ్యులను ఎన్నుకొను అధికారము ఉన్నది. ఒక్క హరిజనులకు మాత్రమే కొన్ని స్థానములు ప్రత్యేకింపబడినవి. కాని, తక్కిన అల్పసంఖ్యాకులకు ఈ ప్రత్యేకత లేదు. 30 సంవత్సరములు నిండిన భారత పౌరులు అందరును సభ్యులు కావచ్చును. వయస్సు పరిమితియే కాక, మరి కొన్ని నియమములను కూడ ఏర్పరచు అధికారము లోక్‌సభకు కలదు.

ఒక సారి ఏర్పడిన లోక్‌సభ యొక్క కాలపరిమితి అయిదు ఏండ్లు. విపత్సమయములందు తప్ప తక్కిన సాధారణ సమయములందు ఈ కాలపరిమితిని పొడిగించ కూడదు. అవసరమని తోచినప్పుడు ఏర్పడి ఉన్న లోక్‌సభను ప్రధానమంత్రి సలహాపై రద్దుచేసి, ఎన్నికల ద్వారా మరియొక సభను ఏర్పరచగల అధికారము రాష్ట్రపతికి కలదు.

సంవత్సరమునకు కనీసము రెండు పర్యాయములైనను లోక్‌సభను సమావేశపరచవలెను. ఏ రెండు సమావేశములకైనను నడుమనుండు ఎడము ఆరు మాసములకు మించరాదు. స్పీకర్, డిప్యూటీ స్పీకర్ అనువారిని సభవారే ఎన్నుకొందురు. వారిని ఆ ఉద్యోగములనుండి తొలగించు అధికారము కూడ సభవారికి కలదు. సభాకార్యములు, సభలో అనుసరించవలసిన క్రమము నిర్ణయించు అధికారము కూడ సభవారికి ఉన్నది.

రాజ్యసభ : ఇందు 250 మందికి మించని సభ్యులు ఉందురు. అందు 12 గురిని మాత్రమే రాష్ట్రపతి నియమించును. నియమితులైనవారు కళలందో, సాహిత్యమందో, శాస్త్రములందో, సంఘసేవయందో ప్రవీణులై ఉండవలెను. తక్కిన 238 గురు సభ్యులును ఆ యా రాష్ట్రములందు గల శాసనసభలవారు ఎన్నుకొనుటచే రాగలరు. రాష్ట్రమునందలి శాసనసభాసభ్యులు సూటిగా ప్రజలచే (నియోజకవర్గములచే) ఎన్నుకొనబడుటచే, అపరోక్ష

విధానమును అనుసరించి ఈ ఎన్నికలు జరుగుచున్నవి. రాజ్యసభాసభ్యుల ఎన్నికలు అట్లు గాక, ప్రజలు ఎన్ను కొన్నవారు ఎన్నుకొనుటచే జరుగుచున్నవి. కనుక, ఈ ఎన్నికలు పరోక్ష విధానమును అనుసరించి ఉన్నవి. ఈ రాజ్యసభకు కాలపరిమితి లేదు; నిత్యప్రవాహము వంటిది. అయితే, ప్రవాహము నిత్యమే అయినను నీళ్లు మారుచుండునట్లు సభ్యులు మాత్రము వంతుల ప్రకారము మారుచుందురు. ఈ రాజ్యసభాసభ్యుల సభ్యత్వకాల పరిమితి ఆరు సంవత్సరములుగ నిర్ణయింపబడినను తొలుత జరిగిన ఒక ఏర్పాటును అనుసరించి రెండేండ్లకు ఒకపరి మూడవవంతు సభ్యులు సభ్యత్వమును కోల్పోవురీతిగ పథకము ఏర్పరుపబడి, అది కొనసాగింపబడుచున్నది. అందువలన రెండేండ్లకు ఒకపరి మూడవవంతు స్థానములకు నూతనముగ సభ్యులు ఎన్నుకొనబడుచు ఈ రాజ్యసభ నిరంతరాయముగ వ్యవహరించుచున్నది.

లోక్‌సభకు ఒక సభాపతి (స్పీకరు) యు, ఒక ఉప సభాపతి (డిప్యూటీ స్పీకరు) యు లోక్‌సభా సభ్యులచే ఎన్నుకొనబడెదరు. రాజ్యసభకు మాత్రము భారత ప్రభుత్వ ఉపరాష్ట్రపతే (ఉపాధ్యక్షుడే) అగ్రాసనాధిపతిగ వ్యవహరించును; అందువలన వేరుగ అట్టివానిని ఎన్నుకొను హక్కు రాజ్యసభాసభ్యులకు లేదు. ప్రభుత్వ ఆయవ్యయములకు సంబంధించిన ఆర్థిక బిల్లులు చట్టములు అగుటలో రాజ్యసభాప్రతినిధుల ఆమోదము అనవసరము. ఆ బిల్లును లోక్‌సభవారే ప్రవేశపెట్టి సభాసమ్మతము కావించుకొందురు. ఐతే, వానిని విమర్శించుటకును, కావలసిన సవరణలను సూచించుటకును మాత్రము రాజ్యసభకు అధికారము కలదు. ఆర్థిక సంబంధము లేని తక్కిన బిల్లుల విషయములో రెండు సభలవారి ఆమోదము కావలసి ఉన్నది. కాని, లోక్‌సభవారి ఆమోదము బలముగా ఉన్నప్పుడు రాజ్యసభాప్రతినిధుల ఆమోదము లేకున్నను అవి చట్టములు కాగలవు. ఎందుచేత అనగా, రెండు సభల నడుమను అభిప్రాయభేదము ఉన్నప్పుడు రాష్ట్రపతి రెండుసభలను ఒక్కచోటను సమావేశపరచి, రెండుసభల సభ్యులలోను అధికసంఖ్యాకుల ఆమోదమును బట్టి చట్టముచేయును. రాజ్యసభాప్రతినిధుల సంఖ్య 250 మాత్రమే కనుక, 521 సభ్యులు గల లోక్‌సభవారి ఆమోదమే నెగ్గును. మంత్రులు లోక్‌సభ వారి విశ్వాసమునకే బాధ్యులు. కాని, రాజ్యసభ వారికి కానక్కరలేదు. ఈ వ్యత్యాసములు ఉండుటచేత లోక్‌సభకు రాజ్యసభకంటె ఎక్కువ పలుకుబడి, అధికారము, ప్రాముఖ్యము కలవు.

ఒక్క విషయములో మాత్రము లోక్‌సభకు లేని అధికారము రాజ్యసభకు కలదు. ఫెడరల్ విధానమున కొన్ని వ్యవహారములు పూర్తిగా రాష్ట్రముల అధీనతలో ఉన్నవి. వానిని గురించి చట్టము చేయగల అధికారము రాష్ట్రములకే కాని కేంద్రమునకు లేదు. కాని, దేశము యొక్క సమష్టి ప్రయోజనమును సాధించుటకై అట్టి వ్యవహారములలో ఏదైనను కేంద్రప్రభుత్వపు అధికార పరిధిలోనికి రావలసివచ్చినపుడు దానిని పరిశీలించి చేర్చుటకుగాని, సవరించుటకుగాని కావలసిన అధికారము రాజ్యసభకేకాని లోక్‌సభకు లేదు.

లోక్‌సభ చేయు పనులు: ముఖ్యముగ చట్టములను చేయుట, ప్రభుత్వకార్యములను, పరిస్థితులను ప్రశ్నలువేసి తెలిసికొనుట, ప్రజల కష్టములను ప్రభుత్వమునకు ఎరుకపరచుట, అధికారుల పనులను, ప్రభుత్వ కార్యములను, విధానములను విమర్శించుట, ప్రభుత్వ ఆయవ్యయముల పట్టికలను విమర్శించి అవసరమైన సవరణలను కావించుట, ఆమోదించుట, పన్నుల విషయములో ప్రజల కష్టములను విశదీకరించుట, వారి కష్టమును ఆలోచించి పన్నుల పరిమితిని నిర్ణయించుట ముఖ్యమైనవి. పరిపాలన విషయమున ప్రభుత్వము ప్రవేశపెట్టు బిల్లులతోపాటు ప్రజల ఆర్థిక, సాంఘిక, విద్యావిషయిక అభివృద్ధి కోసము సభ్యులు తీర్మానములు కావించి చట్టములు చేయించుకొనవచ్చును.

లోక్‌సభ వారు ఆమోదించిన బిల్లు రాష్ట్రపతి ఆమోదించిన తర్వాతనే చట్టము కాగలదు. సభాసమ్మతమైన బిల్లును - అందులో ఏదైన లోపము ఉండిన తప్ప - రాష్ట్రపతి సాధారణముగ ఆమోదించును. లోపము ఉన్న ఎడల అతడు ప్రధానమంత్రికి పంపించి, అందులో కావలసిన సవరణలు చేయించి మరల పంపుడని తెలియజేయును.

పరిపాలమునకు సంబంధించిన చట్టములలో సాధారణముగ అన్నియును లోక్‌సభవారు ఆమోదించునవే అని స్థూలదృష్టితో చెప్పవచ్చును. కాని, కొన్ని సమయములందు కడు జరూరుగా ఆచరణలో పెట్టవలసిన అధ్యాదేశములను (ఆర్డినెన్స్‌లను) రాష్ట్రపతి ప్రకటించి అమలు జరుపవచ్చును.

న్యాయశాఖ: నిష్పక్షపాతయుత న్యాయనిర్వహణ సుసాధ్యము అగుటకు అనువుగ రాజ్యాంగమూలశాసనము మూలమున భారతదేశమునకు ఒక ఉన్నత న్యాయస్థానము (సుప్రీమ్‌కోర్ట్)ను, రాష్ట్రములకు హైకోర్ట్‌లును ఏర్పరుపబడినవి. సుప్రీమ్‌కోర్ట్‌న ఉన్నత న్యాయాధీశుడు (చీఫ్ జస్టిస్ ఆవ్ ఇండియా) ను, 13 మందికి మించని తదితర న్యాయధీశులును వ్యవహరింతురు. వీరి అర్హతలను, వీరికి

చెల్లింపదగు జీతములను రాజ్యాంగమే నిర్ణయించినది. ఒకవేళ పార్లమెంట్ జీతములలో మార్పు చేసినను ఆ తరువాత నియమింపబడు న్యాయాధీశులకే ఆ మార్పు వర్తించును. న్యాయాధీశుని గరిష్ఠ వయఃపరిమితి 65 సంవత్సరముల ఉండుటయు అందే నిబంధింపబడినది. సుప్రీమ్‌కోర్ట్ నందలి న్యాయాధీశులను రాష్ట్రపతియే నియమించును. ఉన్నత న్యాయాధీశుని నియామకము విషయమున అప్పటి సుప్రీమ్‌కోర్ట్ జడ్జీలలోను, హైకోర్ట్ జడ్జీలలోను అవసరమని తోచినవారిని సంప్రతించిన తరువాత రాష్ట్రపతి నిర్ణయమును తీసికొనును. తక్కిన న్యాయాధీశుల నియామకము విషయమున ఉన్నత న్యాయాధీశునితో సంప్రతించిన పిదప రాష్ట్రపతి నిర్ణయము చేయును. ఇటుల కార్యనిర్వాహక శాఖ ఆదరాభిమానములతో ప్రసక్తిలేని రీతిలో నియామకము, జీతముల నిర్ణయము, ఉద్యోగ విరమణకాలము నిర్ణయింపబడుటవలన నిర్భయ, నిష్పక్షపాత వైఖరిలో న్యాయధీశులు వర్తించుటకు అవకాశము కలుగుచున్నది.

భారతదేశమున సుప్రీమ్‌కోర్ట్‌నకుగల విస్తృతాధికారములు ఫెడరల్ రాజ్యాంగమును అనుసరించు తక్కిన ఏ రాజ్యపు సుప్రీమ్‌కోర్ట్‌నకు లేవు. భారతదేశపు సుప్రీమ్ కోర్ట్‌నకు రాజ్యాంగచట్ట వివరణ, రాష్ట్ర, కేంద్రప్రభుత్వ అధికార పరిధి వివరణ, పౌరవ్యవహారముల తుది అపీలుల పరిష్కరణ అను మూడు ముఖ్యాధికారములు కలవు. ఫెడరల్ రాజ్యాంగమును కలిగిన యునైటెడ్‌స్టేట్స్‌లోని సుప్రీమ్‌కోర్ట్‌నకు పైవానిలో రెండవ అధికారము మాత్రమే కలదు.

ఈ విధముగ భారతరాజ్యాంగమున సుప్రీమ్‌కోర్ట్ న్యాయాధీశులకు విస్తృతాధికారములు కల్పింపబడినవి. ఈ న్యాయాధీశులను తొలగింపగల అధికారము పార్లమెంట్‌నకు మాత్రమే కలదు.

రాష్ట్రములందలి హైకోర్ట్‌ల న్యాయాధీశుల విషయమునను, కార్యనిర్వాహకశాఖ ప్రసక్తిలేని విధముననే నియామకాదులు జరుగుటకు వసతి రాజ్యాంగమున కల్పింపబడినది. రాష్ట్రములందలి దిగువ తరగతి న్యాయస్థానములు హైకోర్ట్‌నకు లోబడి వర్తించును [చూ. న్యాయశాస్త్రసంపుటము.]

ఉద్యోగశాఖ: ప్రభుత్వ నిర్వహణ చక్కగ సాగుటకు ఉద్యోగివర్గము అత్యావశ్యకము. ఉద్యోగశాఖలోని ఉన్నతోద్యోగులను పోటీపరీక్షలద్వారా ఎన్నుకొనుటకు కేంద్రముననను, రాష్ట్రములందును పబ్లిక్ సర్వీస్ కమిషన్‌లను స్థాపించుట ఒక ముఖ్యవిధిగా భారతరాజ్యాంగము నిర్ణయించినది. అందువలన కార్యనిర్వాహకశాఖ యొక్క ప్రసక్తి లేకుండనే ఈ నియామకములు జరిగి, ఎన్నికలవలన జరుగు ప్రభుత్వముల మార్పిడితో నిమిత్తము లేకుండ దైనందిన పరిపాలన అవిచ్ఛిన్నముగ సాగుటకు మార్గము ఏర్పడినది. ఉద్యోగివర్గపు ఈ స్థిరత్వమువలన ఉద్యోగులు ఎక్కువ అనుభవమును గడించి నిపుణతతో తమ తమ విధులను నిర్వహింపగలుగుచున్నారు [చూ. ఉద్యోగివర్గము - పు. 338].

మా. వెం. రం.

**భారత స్వాతంత్ర్య ఉద్యమము:** చూ. భారతదేశము - పు. 664.

**భారత స్వాతంత్ర్య యుద్ధము:** చూ. భారతదేశము - పు. 664.

**భూటాన్:** హిమాలయ సానువులందు నెలకొనిన ఒక చిన్న రాజ్యము.

ఈ రాజ్యమునకు టిబెట్ [ఉ, తూ]; భారతదేశము [ద]; సిక్కిమ్ [ప] సరిహద్దులందు ఉన్నవి. [వై] 46,620 చ. కి. మీ.; [జ] 7,00,000. [మ] జనులలో అధిక సంఖ్యాకులు టిబెట్ లామా సంప్రదాయమునకు సన్నిహితమగు బౌద్ధమత శాఖకు చెందినవారు. వీరిలో బౌద్ధభిక్షుకుల సంఖ్య చాల ఎక్కువ. [భా] టిబెటీభాషయందు ఒక మాండలికమును ఇచటి ప్రజలు మాట్లాడుదురు. ఈ దేశమునకు వలసవచ్చి ఈ దేశ పౌరసత్వమును గ్రహించిన నేపాళీయులు ఇచట పెక్కుమంది కలరు. వీరు మాత్రము నేపాళీనే మాట్లాడుదురు. [రా] ఎండ కాలమున తాషీ చో జోంగ్; చలికాలమున పునఖా.

చరిత్ర: ఈ దేశమును గురించి 18 వ శతాబ్దికి పూర్వపు వివరములేవియు తెలియవచ్చుట లేదు. క్రీ. శ. 1772 లో భూటానీయులు భారతదేశములోని కూచ్‌బిహార్‌పై దండెత్తగా బ్రిటిష్ సేనలు వారిని తిరుగగొట్టినవి. కాని, ఎడనెడ 19 వ శతాబ్ది పూర్వార్ధమున కూడ ఇట్టి దాడులు జరిగినవి. పర్వత సానువులనుండి, అస్సామ్, బెంగాల్‌లలోనికి దిగివచ్చుటకు అనువుపడు 'ద్వార్' లు అనబడు కనుమలను తమ స్వాధీనములో ఉంచుకొని భూటానీయులు ఈ దండయాత్రలు జరిపెడువారు. 1866 లో బ్రిటిష్‌వారు వీరిని ఓడించి, ద్వార్‌లను వశపరచుకొని, భూటానీయులకు పరిహారముగ సంవత్సరమునకు రు. 50,000 లు ఇచ్చుటకు అంగీకరించిరి. అంతటనుండి భారతదేశమునందలి బ్రిటిష్ ప్రభుత్వమునకును, భూటానీయులకును మైత్రి కుదిరి భూటాన్ విదేశ వ్యవహారములు బ్రిటిష్ ప్రభుత్వమునకు ఒప్పగింపబడెను. 1907 లో బ్రిటిష్‌వారి అనుమతితో అచటి ప్రజలు వంశానుగతమగు రాచరికమును స్థాపించుకొని, దోర్జీ వాంగ్‌చుక్‌ను మొదటి రాజుగ ఎన్నుకొనిరి. భారతదేశమున బ్రిటిష్‌ప్రభుత్వము అంతరించిన తరువాత భూటాన్ విదేశ వ్యవహార నిర్వహణ స్వతంత్ర భారత ప్రభుత్వమునకు చెందెను. ఆంతరంగిక పరిపాలనయందు

మాత్రము భూటాన్ ప్రభువునకు సర్వాధికారములు కలవు. ఇదివరలో ఈయబడు పరిహారమును భారతప్రభుత్వము 5 లక్షల రూపాయలకు హెచ్చించి, భూటాన్ ప్రజల ఎడ తనకుగల సౌహార్దమును వెల్లడించినది.

రాజ్యాంగము : భూటాన్‌నందును టిబెట్‌నందువలెనే ఒక విచిత్ర ధార్మిక పరిపాలనా విధానము అమలునందు ఉండెడిది. మత విషయములను చూచుటకు 'ధర్మరాజు' అను పీఠాధిపతియు, లౌకిక విషయములకు 'దేవరాజు' అను పీఠాధిపతియు ఉండెడివారు. ఆ పీఠాధిపతులలో ఎవరయిన మరణించినచో ఆ తరువాత రెండేండ్ల లోపున జన్మించిన బాలురలో నిర్దిష్టములగు శుభలక్షణములు కల వానిని తెచ్చి ఆ పీఠమునకు అధిపతిని చేసెడివారు. కాని, 1907 లో అప్పటి దేవరాజు గతించిన తరువాత ఎంత వెదకినను అట్టి బాలుడు దొరకకపోవుటచే, దేవరాజు, ధర్మరాజు పదవులు కలిపివేయబడినవి. తరువాత వంశ పారంపర్యానుగతమగు రాచరికము ఏర్పరుపబడినది. రాజునకు సలహా ఇచ్చుటకు ఒక కార్యదర్శియు, ఒక సలహా సంఘమును, ప్రధానమంత్రియు కలరు. ప్రభునకు ఇచ్ఛ వచ్చినప్పుడు సమావేశమగుచుండు ప్రజాసభ ఒకటి కలదు. ఇందు వివిధ గ్రామముల పెద్దలును, రాజోద్యోగులును కలసి మొత్తము 130 మంది సభ్యులు కలరు. సిక్కిమ్‌నందలి భారత రాజకీయోద్యోగియే వైదేశిక వ్యవహారములకు బాధ్యత వహించును. ఇప్పటి రాజగు జిగ్మి దోర్జి వాంగ్‌చుక్ 1953 లో సింహాసనమును అధిష్ఠించెను. చీ. శే. రా.

**భూస్వామ్యవిధానము** (ఫ్యూడలిజమ్) : భూమిపై గల అధికారమును పురస్కరించుకొని రూపొందిన ఒక విధమగు సాంఘిక వ్యవస్థావిధానము. ఆసియాలో జపాన్, టర్కీ సామ్రాజ్యము మొదలగు వానియందును కొన్ని కాలములయందు ఇట్టి విధానము ప్రాంతీయములగు మార్పులతో, ఆదరణీయముగ ఉండినను, ఆ దేశచరిత్రలలో ఈ వ్యవస్థ అంతగ ప్రముఖతను ఆర్జింపకుండినది. కాని, యూరప్ ఖండమున మతరాజ్యయుగ కాలమున ఏర్పడిన ఇట్టి వ్యవస్థ ఆ ఖండపు సామాజిక చరిత్రలో ప్రముఖ స్థానమును ఆక్రమించినది.

ఈ వ్యవస్థయొక్క మూలలక్షణములను ఈ క్రింది విధముగ తెలుపవచ్చును: 1. భూమిపై స్వామ్యము భూస్వామిది; 2. భూస్వామినుండి వేసల్ (ఆశ్రితుడు) భూమిని పరిగ్రహించినపుడు, అందులకు ప్రతిఫలముగ భూస్వామికి సదా అంకితుడై ఉండుటకు ప్రమాణపూర్వకముగ బద్ధుడగును; 3. ఈ వేసల్ వద్దనుండి వివిధ శ్రేణుల ద్వారా రైతులవరకు భూమియందలి సేద్యహక్కు, అందులకు శారీరకముగ, ధనరూపముగ చెల్లింపదగు ప్రతిఫల బాధ్యతలతోగూడ, పరివర్తన చెందెడిది; 4. ఇటుల సోపానక్రమమున పైకిపోవు ఈ విధానమున దిగువ శ్రేణి వారికి భూమియందుగల హక్కులను రద్దుచేయు అధికారము ఎగువశ్రేణివానికి సిద్ధాంతరీత్యా ఉండెడిది. కాని, ఆచరణలో మాత్రము ఇది సాధారణముగ జరిగెడిది కాదు. ఒక హక్కుదారు చనిపోయిన తరువాత వాని వారసుడే హక్కుదారుయొక్క హక్కులను, బాధ్యతలను గ్రహించుటకు ప్రమాణపూర్వకముగ అంగీకరించినపుడు ఆ హక్కు అవిచ్ఛిన్నముగ కొనసాగెడిది.

షార్లమేన్ సామ్రాజ్యము అంతరించిన తరువాత 9 వ, 10 వ శతాబ్దులందు ఫ్రాంకుల రాజ్యభాగములందు ఈ విధానము తొలుత రూపొందింది, అటనుండి క్రమముగ ఇటలీ, జర్మనీ, తూర్పుయూరప్ దేశములకును, పాక్షికముగ స్కాండినేవియన్ దేశములకును, విలియమ్ విజేత మూలమున ఇంగ్లండునకును విస్తరించినది. కాని, ఈ విధానము ఆ యా దేశములలోని స్థానికపరిస్థితులను అనుసరించి కొలది మార్పులను పొందినది. ఈ విధానమున దిగువ శ్రేణిలోని పేదకర్షకుల కృషిఫలమును దోచుకొనుటలో తక్కిన వారందరును భాగస్వాములగుటవలన ఆ కర్షకుల స్థితి దుర్భరముగ ఉండెడిది. అయినను రోమన్‌సామ్రాజ్య పతనానంతరమున యూరప్‌న సంఘటిల్లిన సామాజిక సంక్షోభమును నివారించుటలో క్రైస్తవమతముతోపాటు ఈ భూస్వామ్యవిధానమును కొంత ఉపకరించినదనుట యథార్థము [చూ. సమీక్ష పు. 122, 123. పాశ్చాత్య రాజ్యాంగ వ్యవస్థా విధానము - పు. 566]. గు. రా.

**మంగోలియా** : మధ్య ఆసియాయందలి ఒక స్వతంత్ర రాజ్యము. చీనాలో చేరి ఉన్న మంగోలియారాష్ట్రము నుండి వేరని తెలియవచ్చు నిమిత్తమై ఇది 'ఔటర్ మంగోలియా' అనియు వ్యవహరింపబడుచున్నది.




ఈ రాజ్యమునకు సోవియట్ రష్యా [ఉ]; చీనా [ప, తూ, ద] సరిహద్దులందు ఉన్నవి. [వి] 15,35,000 చ. కి. మీ; [జ]

10,18,800, [భా] జాతీయభాష మంగోలియన్. [మ] దేశమున లామాసంప్రదాయపు బౌద్ధమతము సర్వత్ర ఇదివరలో వ్యాప్తి నొంది ఉండెను. కాని, ప్రస్తుత ప్రభుత్వమునకు మతము ఎడల గల అనాదరణ ఫలితముగ ప్రజల జీవితములందు మతప్రసక్తి అంత కంతకు తగ్గిపోవుచున్నది. [రా] ఉలన్ బతోర్ (జ. సం. 1,60,000). దీనికే ఇదివరలో ఉర్గా అని పేరు ఉండెడిది.

చరిత్ర: ప్రపంచచరిత్రలో క్రీ. శ. 12 వ శతాబ్దాంతము దనుక మంగోల్ జాతుల ప్రసక్తి కానరాదు. కాని, 13 వ శతాబ్ది ఆరంభమున మధ్య ఆసియాయందలి ఈ మంగోల్‌లు చెంఘిజ్‌ఖాన్ [చూ. పు. 459] అనువాని నాయకత్వమున ఏకసంఘముగ రూపొంది, కారకోరమ్ వద్ద రాజధానిని నెలకొల్పి, అటనుండి విజృంభించి, జైత్రయాత్ర సలిపి, అనతికాలముననే ఒక మహాసామ్రాజ్య మునకు నిర్మాతలు కాగలిగిరి. ఉత్తరమున సైబీరియా అటవీ ప్రదేశము మొదలుగ దక్షిణమున టిబెట్ వరకును, పశ్చిమమున కాస్పియన్‌సముద్రము ఆదిగ తూర్పున పసిఫిక్ మహాసముద్ర పర్యంతమును ఈ సామ్రాజ్యము ఆనాడు వ్యాపించి ఉండెను. 1227 లో చెంఘిజ్‌ఖాన్ మరణించినంతనే ఈ సామ్రాజ్యమును చెంఘిజ్‌ఖాన్ అను చరులు నలువురు నాలుగు భాగములుగ విభజించుకొని పాలింప నారంభించిరి. ఆ భాగములలో ఒకటి అగు చీనా సామ్రాజ్యమున ఈ ప్రాంతము ఆనాడు చేరి ఉండెను. ఈ చీనాసామ్రాజ్యమును చెంఘిజ్‌ఖాన్ వంశీకులు 'యువాన్' రాజవంశమను పేర 1386 వరకు పాలించిరి. ఈ వంశీకులలోనెల్ల సుప్రసిద్ధుడు కుబ్లయ్‌ఖాన్ [చూ. పు. 392]. మింగ్ వంశీకులు ఈ రాజవంశమును తుదముట్టించి నంతనే మంగోల్‌లు తమ మాతృభూమి అగు మంగోలి యాను మరల చేరుకొనిరి. కాని, కాలక్రమమున ఈ మంగోల్‌లు అంతఃకలహములవలన ఉత్తర ప్రాంతీయు లగు ఖాల్కా మంగోల్‌లు, దక్షిణప్రాంతీయులగు చహార్ మంగోల్‌లు, పశ్చిమ ప్రాంతీయులగు ఉయిరాట్ మంగోల్‌లు అను మూడు తెగలుగ విడివడి ఆ యా ప్రాంతములందు తమ ఆధిపత్యములను స్థాపించుకొనిరి. అయినను, వారి కలహములు మాత్రము సమయలేదు. బౌద్ధమతము అంతకు కొంతకాలము ముందుగనే ఈ ప్రాంతములందు ప్రవేశించి, సాంఘిక, రాజకీయరంగము లందు తన ప్రభావము వ్యాపింప జేసినది.

మింగ్ వంశమును అంతమొందించి, చీనాయందు ఆధి పత్యమును ఆర్జింప యత్నించిన మంచూప్రభువులు తమ చీనా విజయయాత్ర సందర్భమున 1636 లో చహార్ మంగోల్‌ల క్రింద ఉన్న దక్షిణమంగోలియాను వశపరచు కొని దానిని తమ చేజిక్కిన చీనాసామ్రాజ్యమున అంతర్భాగముగ చేసిరి. ఆ తరువాత పశ్చిమమంగోలియా యందలి ఉయిరాట్ మంగోల్‌లను ఎదుర్కొనుటకై ఉత్తరప్రాంతపు ఖాల్కామంగోల్‌లు చీనాయందలి మంచూప్రభువుల సాయమును ఆర్జించి, వారి సాయమున పశ్చిమమంగోల్ రాజ్యమును నిశ్శేషము కావించిరి. కాని, తదాది చీనాప్రభువుల సార్వభౌమాధిపత్యమును ఖాల్కా మంగోల్‌లు గుర్తింపవలసివచ్చెను (1698).

ఆ సమయమున ఖాల్కామంగోల్‌లయందు సాంఘిక, రాజకీయవ్యవస్థ అంతయు లామాల వశమునందు ఉండెను. టిబెట్‌నందలి దలైలామా [చూ. టిబెట్ పు. 498] వలెనే ఇచటను బోధిసత్త్వుని దివ్యావతారముగ భావింపబడు ఒక ప్రధాన లామా ఆధిపత్యము చేబూని, చీనా సార్వభౌముని సర్వాధిపత్యమును మాత్రము గుర్తించుచుండెను. 1911 లో చీనాయందలి మంచూరాచరికము జాతీయ విప్లవమువలన కూలద్రోయబడినంతనే ఖాల్కామంగోల్‌లు ప్రధాన లామాయగు జెబ్‌చున్ దంబా ఖుతుఖ్తూ నాయకత్వమున తమ దేశపు స్వాతంత్ర్యమును ప్రకటించిరి; ఇదియే నేటి మంగోలియా. అప్పటి రష్యన్ చక్రవర్తి ఈ స్వాతంత్ర్య మును గుర్తించుటయేకాక, సహాయమొసగుటకు సైతము వాగ్దానము ఒసగెను. తరువాత రష్యాలో బోల్షివిక్ విప్లవము ఘటిల్లి దేశము కల్లోలిత పరిస్థితులలో ఉన్న అవకాశమును ఉపయోగించుకొని చీనాజాతీయ ప్రభుత్వము మంగోలియాను ఆక్రమించెను (1919). కాని, త్వరలోనే రష్యన్‌విప్లవవ్యతిరేకప్రభుత్వమువారు చీనాసేనలను అటనుండి తరిమివైచి, దానిని వశపరచు కొనిరి (1921). సోవియట్‌రష్యా దేశమున విప్లవ ప్రభుత్వము కాలు నిలువద్రొక్కుకొనిన తరువాత సోవి యట్‌రష్యా విప్లవసేనలు మంగోలియన్ విప్లవ దళ ములకు తోడుపడి, విప్లవ వ్యతిరేక రష్యన్ ప్రభుత్వము నుండి మంగోలియాకు విమోచనము చేకూర్చినవి (1921, జూలై). అంతట ప్రధాన లామా ఖుతుఖ్తూ ఆధిపత్యమున స్వతంత్రప్రభుత్వము నెలకొల్పబడెను. బోధిసత్త్వుని అవ తార మూర్తిగ భావింపబడు ఖుతుఖ్తూ 1924 లో పరమ పదించినంతనే మంగోలియాయందు ప్రజాగణరాజ్య ప్రభు త్వము నెలకొల్పబడెను. అంతటినుండి కమ్యూనిస్ట్ సిద్ధాంత ములను అనుసరించు ప్రణాళికలు ప్రవేశపెట్టబడి తదను సారముగ ప్రభుత్వము నడుచుచున్నది. 1936 లో సోవియట్ రష్యా దేశముతో ఈ దేశము పరస్పర సహాయపు ఒడంబడి కను ఒకదానిని కుదుర్చుకొనినది. దానిని అనుసరించి, ద్వితీయ ప్రపంచయుద్ధములో మంగోలియా సేనలు మంచూరియాయందు సోవియట్‌రష్యా సేనలతో కలసి

జపాన్ సేనలతో పోరాడినవి. జాతీయ చీనాప్రభుత్వము ఈ దేశప్రభుత్వమును గుర్తింపకుండెను. కాని, 1946 లో ఈ దేశమున జనాభిప్రాయసేకరణవలన స్వాతంత్ర్య కాంక్ష ఋజువయినప్పటినుండియు, తన విరోధ భావమును మాత్రము విడనాడెను. 1949 లో చీనాయందు కమ్యూనిస్ట్ ప్రభుత్వము అధికారము గ్రహించిన పిదప మంగోలియా స్వాతంత్ర్యమునకు ఆ ప్రభుత్వము నిశ్శంకగ పరిగణను ఒసగుటయే కాక, 1962 లో సరిహద్దు ఒడంబడికను ఒక దానిని కుదుర్చుకొని, సరిహద్దు తగాదాలను పరిష్కారము చేసికొనెను. ఈ దేశప్రభుత్వమును తొలుత పాశ్చాత్య రాజ్యములు చాలకాలమువరకు గుర్తింపకుండెను. కాని, తరువాత అట్టి పరిగణనతోపాటుగ 1961, అక్టోబరులో ఐక్యరాజ్యసమితి [చూ. పు. 351] సభ్యత్వము ఈ దేశమునకు సమకూరెను.

రాజ్యాంగము : ఈ దేశమున కమ్యూనిస్ట్ విధానపు ప్రజాగణరాజ్యప్రభుత్వము అమలునందు ఉన్నది. రాజ్యాంగ చట్టము 1940 లో ఆమోదింపబడి, 1957 లో సవరణలు పొందినది. జాతీయసభయగు 'కురల్' కు ఏకపట్టికా విధానము [చూ. పు. 348] ను అనుసరించి నాలుగేండ్లకు ఒకసారి ఎన్నికలు జరిగి, 3,500 ప్రజలకు ఒక ప్రతినిధి చొప్పున ప్రతినిధులు ఎన్నుకొనబడుదురు. ఈ జాతీయసభ వారు అధ్యక్షసభ (ప్రెసిడియమ్) అనుదానిని ఎన్నుకొనెదరు. ఈ అధ్యక్షసభయందు అధ్యక్షునితో కూడ ఏడుగురు సభ్యులు ఉందురు. ఈ అధ్యక్షుడే దేశాధీశుడు. జాతీయసభయే మంత్రిమండలి సభ్యులను, ప్రధానమంత్రిని ఎన్నుకొనును. కార్యనిర్వహణాధికారమును మంత్రిమండలి కలిగి ఉండి, జాతీయసభకు బాధ్యత వహించి, దానిని నిర్వహించును. జాతీయసభకు మాత్రమే శాసననిర్మాణాధికారము కలదు. కాని, అది సమావేశముకాని కాలమున జాతీయసభ విధులను అధ్యక్షసభయే నిర్వహించును.

చీ. శే. రా.

**మంచూ వంశము :** చూ. చీనా ప్రజాగణరాజ్యము పు. 453.

**మంత్రులసభ:** చూ. భారత రాజ్యాంగము పు. 720.

**మడగాస్కర్ :** చూ. మలగాసీ పు. 730.

**మత యుద్ధములు :** చూ. క్రూసేడ్‌లు పు. 414.

**మధుర నాయక రాజులు :** చూ. తెలుగు సంస్కృతి, సం. - పు. 959.

**మధ్య అమెరికా :** చూ. అమెరికా పు. 270.

**మధ్య ప్రాచ్య రక్షణ సంధి :** పశ్చిమ ఆసియాయందు కమ్యూనిస్ట్‌రాజ్యముల పలుకుబడిని, వ్యాప్తిని నిరోధించుటకై కొన్ని దేశములు కుదుర్చుకొనిన రక్షణ సంధి. దీనికే బాగ్దాద్ ఒడంబడిక అనియు, దాని ఆంగ్ల నామమునందలి పదాద్యక్షరములను అనుసరించి 'సెంటో' అనియు వ్యవహారమున పేరులు కలవు. తొలుత టర్కీ దేశము ఇరాన్‌తో పరస్పరరక్షణను ఉద్దేశించి కుదుర్చుకొనిన (1955, ఫిబ్రవరి 24) ఒక రక్షణసంధితో దీనికి నాందీప్రస్తావన జరిగినది. తరువాత ఆ సంవత్సరము ఏప్రిల్ 4 న గ్రేట్‌బ్రిటన్ ఆ రక్షణ సంధిలో భాగస్వామిగ చేరి, ఇరాక్‌లో 1930 ఒడంబడికను అనుసరించి చేకూరిన సైనికస్థావరములనుండి సేనలను ఉపసంహరించినది. అనంతరమున పాకిస్తాన్ (సెప్టెంబరు 23), ఇరాన్ (అక్టోబరు 11) క్రమముగ ఆ సంవత్సరముననే ఆ రక్షణ సంధిలో సభ్యత్వములను స్వీకరించినవి. ఇటుల పూర్ణరూపమును పొందిన ఈ రక్షణసంధిలోని సభ్యరాజ్యములు అన్నియు తమ తొలుతటి సమావేశమును 1955, నవంబరు 21 - 22 న బాగ్దాద్‌లో జరిపినవి. ఆ సమావేశమునకు సభ్యరాజ్యముల రాజకీయ, సైనిక ప్రతినిధులేకాక, పరిశీలకులుగ యునైటెడ్ స్టేట్స్ పక్షమున రాజకీయ, సైనిక ప్రతినిధులును హాజరైరి. తదాదిగ ఈ రక్షణసంధి ఎడ యునైటెడ్ స్టేట్స్ కూడ సుముఖత వహించి, సభ్యత్వము లేకపోయినను, బాధ్యతను వహించి పశ్చిమ ఆసియాలోని సభ్యరాజ్యములకు - ద్విపక్షపు ఒడంబడికల మూలమున - సైనిక సహాయాదులను సమకూర్చినది. తరువాత సంఘటిల్లిన కొన్ని పరిణామముల మూలమున ఇరాక్ దేశము ఈ రక్షణసంధి నుండి వైదొలగినది (1959, మార్చి 24) [చూ. ఇరాక్]. అంతట ఈ సంధికిచెందిన ముఖ్యకార్యాలయము బాగ్దాద్ నుండి అంకారాకు తరలింపబడినది. తదాదిగ ఈ రక్షణసంధి చాలవరకు తన పటుత్వమును కోల్పోయినది. 1965 లో భారతదేశముపై పాకిస్తాన్ దండయాత్రను జరిపినపుడు ఈ రక్షణసంధి మూలమున సాయమును సభ్యరాజ్యముల నుండి గ్రహించుటకు పాకిస్తాన్ కృషి చేసినది. కాని, అట్టి సాయము ఈ సంధియొక్క మూలోద్దేశములకే భంగకరమని గ్రేట్‌బ్రిటన్, యునైటెడ్ స్టేట్స్ నిరాకరించినవి.

చీ. శే. రా.

**మన్రో సిద్ధాంతము :** 1817-1825 లలో యునైటెడ్ స్టేట్స్‌కు అధ్యక్షుడుగా ఉండిన జేమ్స్ మన్రో (1758-1831) దేశశాసనమండలియగు కాంగ్రెస్‌కు 1823, డిసెంబరు 2 న నివేదించిన వార్షిక సందేశమున పొందుపరుపబడిన ఒక సిద్ధాంతము. ఇది అతని రాజకీయ కార్యదర్శియగు జాన్ క్విన్స్ ఆడమ్స్ చేత తయారు చేయబడినను, పెద్దరికమునకై అధ్యక్షుని పేరనే 'మన్రో సిద్ధాంత' మని పిలువబడు

చున్నది. అమెరికాలోని స్పెయిన్ వారి వలసల తిరుగుబాటును అణచుటకై యూరప్ రాజ్యములు జోక్యము కలిగించుకొనునను ఆందోళనయే ఈ సిద్ధాంత ప్రతిపాదనకు దోహదకారియైనది. ఆ మన్రోసిద్ధాంతములో ఈ క్రింది అంశములు క్రోడీకరింపబడినవి: 1. మొత్తము అమెరికా ఖండమునందు ఏ భాగమందైనను నూతనముగ యూరపియన్ రాజ్యముల వలసలు స్థాపింపబడరాదు; 2. ఉత్తర, దక్షిణ అమెరికా ఖండములందు యూరప్ ఖండమునందలి రాజ్యపరిపాలనావ్యవస్థకు పూర్తిగ వేరైన పద్ధతి అమలులో ఉన్నది; 3. అమెరికా ఖండమున తమ పలుకుబడిని హెచ్చించుకొనుటకై యూరప్ రాజ్యములచే జరుపబడు ప్రయత్నములను యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వము తన శాంతి భద్రతలకు అపాయకరమని భావించును; 4. యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వము అప్పటికి అమెరికా ఖండమునందు ఉన్న యూరపియన్ల వలసల విషయమున ఎట్టి జోక్యమును కలిగించుకొనదు; కేవల యూరపియన్ యుద్ధములందు పాలుపంచుకొనదు. తరువాత ఒక శతాబ్దమునకుపైగా యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వవిదేశవ్యవహార నిర్వహణకు ఈ సిద్ధాంతము ప్రాతిపదికగ ఉండెను.

అయితే, 1845 లో ప్రెసిడెంట్ పోల్క్ చేత ఈ ఖండ ప్రజలు మాత్రమే తమ భవితవ్యమును నిర్ణయించుకొను హక్కు గలిగి ఉన్నారు అనునది ఈ సిద్ధాంతమున చేర్చబడెను. 1904 లో ప్రెసిడెంట్ థియోడోర్ రూజ్‌వెల్ట్ [చూ.] 'యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వము మొత్తము అమెరికా ఖండమునకు సంబంధించిన అంతర్జాతీయ పోలీసు సిబ్బంది' అని ఉద్ఘాటించెను. 1912 లో సెనేటర్ లాడ్జి అమెరికన్ కాంగ్రెస్‌లో ప్రవేశపెట్టిన తీర్మానము ద్వారా మన్రో సిద్ధాంతము జపాన్ వంటి యూరపియనేతర రాజ్యములకు కూడ వర్తించునట్లు సవరింపబడెను. స్వ. వెం.

**మలగాసీ :** ఆఫ్రికా ఖండమునకు చెందిన స్వతంత్రముగు ఒక ద్వీప రాజ్యము. ఇదియే 'మడగాస్కర్' అని ఇదివరలో వ్యవహరింపబడెడిది.

ప్రపంచమందలి ద్వీపములలో వైశాల్యమున నాలుగవ స్థానమును ఆక్రమించు ఈ ద్వీపరాజ్యము దక్షిణ ఆఫ్రికా తూర్పు తీరమునకు సుమారు 386 కిలోమీటరుల దూరమున సముద్ర పరివృతమై నెలకొని ఉన్నది. [వి] దాదాపు 5,95,790 చ.కి.మీ.; [జ] 58,03,000; [భా] ఫ్రెంచి భాషయు, మలగాసీ భాషయు అధికార భాషలుగ వ్యవహారమున ఉన్నవి (మలగాసీ భాష అనునది ఇండోనీషియన్ భాషా వర్గమునకు సన్నిహితమగు ఒక భాష). [మ] ప్రాచీన కాలమునుండి సంప్రదాయముగ వచ్చుచున్న విభిన్న మతములు ఈ దేశమున వ్యాప్తియందు ఉన్నవి. భగవంతుని అస్తిత్వము ఎడల విశ్వాసము, పితృదేవతారాధన ఈ వివిధ మతములందు సామాన్య లక్షణములుగ కన్పట్టుచున్నవి. దాదాపు 18 లక్షల క్రైస్తవులును కలరు. [రా] తనానరీవ్ (జ. సం. 2,06,324).




చరిత్ర: ఈ దేశపు చరిత్ర 1500 వరకు ఏమియు తెలియ వచ్చుట లేదు. కాని, క్రీ. శ. ఒకటవ శతాబ్ది ప్రాంతమున ఇండోనీషియా పరిసర వాసులలో కొందరు ఇటకు వలసవచ్చి చేరిరని మాత్రము భాషా సాన్నిహిత్యాదులవలన నిర్ణయింప వీలగుచున్నది. 1500 లో పోర్చుగీస్‌వారు ఈ ద్వీపపు ఉనికిని గుర్తించినను, 1508 లో మాత్రమే వారు ఇట తమ తొలి స్థావరమును నెలకొల్పిరి. క్రమముగ వారిని అనుసరించి ఫ్రెంచి, డచ్చి, బ్రిటిష్ వర్తకులును ఇటకు వచ్చి స్థావరములను ఏర్పరచుకొనిరి. ఇటుల చేరిన వారి వ్రాతలవలన అప్పటి ఈ దేశపు చరిత్ర మనకు కొంత తెలియవచ్చుచున్నది. ఆ కాలములో ఈ

దేశమున మూడు స్వతంత్ర రాజ్యములు - మేరీన, శకాలవ, బేచీమిశారక అనునవి - ప్రసిద్ధి గడించినవి. 18 వ శతాబ్ది ఆరంభమున మేరీన రాజ్యము అవసన్న స్థితిలో ఉండగా ఆ సమయమున శకాలవ రాజ్యము బలపడి ద్వీపమున పడమటిభాగమునంతటిని పాలింపగలిగెను. ఈ సమయము ననే తీరప్రాంతస్థావరములందు ఫ్రెంచివారు కాలూని, పలుకుబడిని ఆర్జించిరి. అందులో కొందరు దేశీయ స్త్రీలను వివాహమాడి, స్థిరవాసులైరి. ఈ వివాహముల ఫలితముగ రూపొందిన మిశ్రజాతి ఆర్థిక, విద్యారంగములందు త్వరిత ముగ పురోగమించి, సాంఘికముగ ఉన్నతస్థానమును ఆక్రమింపగలిగినది. అట్టి మిశ్రజాతికి చెందినదియే బేచీమిశారకరాజవంశము. శకాలవ రాజ్యమును అంత మొందించి, ఈ బేచీమిశారక రాజులు రాజ్యమును వశ పరచుకొని కొంతకాలము పాలించిరి. కాని, ఇంతలో ప్రాచీన మేరీన రాజులు మరల బలవంతులై రాజ్యమును ఆక్రమించిరి. ఈ మేరీన వంశమందు పూర్వప్రశస్తిని మరల కలిగించినవాడు అండ్రియానాపాయినీ మేరీన (1787 - 1810 ప) అను రాజు. ఈతని వంశపురాజులు దేశమును ఆధునికము ఒనర్చుటకు ఎంతయో కృషిచేసిరి. కాని, ఈ వంశమున కడపటివాడగు రనావలోన (1883 - 1895 ప) కాలమున దేశము అంతఃకల్లోలములపాలై, తత్ఫలితముగ రక్షిత రాజ్యముగ ఫ్రెంచివారిచే వశపరుచుకొనబడెను (1885). కాని, దేశీయులు మాత్రము ఈ దాస్యమునకు అంగీకరింపక, తిరుగుబాటులు సాగించిరి. 1904 నాటికి ఈ తిరుగుబాటులనెల్ల అడచి, ఫ్రెంచివారు దేశమున పటిష్ఠ మగు పరిపాలనను నెలకొల్పిరి. 1896 నుండి 1905 వరకు ఇచట గవర్నర్ - జనరల్‌గ ఉండిన గెలినీ అను ఫ్రెంచి పరిపాలకుడు మలగాసీ ప్రజలతో సామరస్యమును సాధించు టకై విద్యా సంస్థలను, వైద్య సౌకర్యములను నెలకొల్పి అభివృద్ధి పరచుటయేకాక మలగాసీ భాషా సంస్కృతుల పరిశీలనకై మలగాసీ అకాడమీ అనుదానిని నెలకొల్పి ప్రోత్సహించెను. ప్రథమ ప్రపంచ యుద్ధానంతరమున ఈ దేశము విపరీతమగు ఆర్థిక సంక్షోభమునకు గురి అయ్యెను. ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున 1940 నుండి ఈ రాజ్యము విచీయందలి ఫ్రెంచి ప్రభుత్వపు ఆధిపత్యమున కొంత కాలము ఉండెను. కాని, 1942 లో బ్రిటిష్ సేనలు దీనిని ఆక్రమించిన తరువాత, 1943 నుండి డీగాలీ [చూ. పు. 508] నాయకత్వమున ఉండిన స్వతంత్ర ఫ్రెంచిప్రభుత్వపు పరి పాలనలో ఉండెను. యుద్ధానంతరమున దేశ ప్రజలు స్వాతంత్ర్యమునకై అందోళనను ఒనర్చిరి. ఈ ఆందోళన కడకు దౌర్జన్యయుతమగు తిరుగుబాటుగ పరిణమించెను (1947). ఫ్రెంచివారు ఈ తిరుగుబాటును నిర్దాక్షిణ్యముగ అడచి, నాయకులను దీర్ఘశిక్షలపాలు చేసినను, స్వాతంత్ర్య వాంఛను తుదముట్టింపజాలకపోయిరి. తుదకు డీగాలీ ఫ్రెంచిప్రభుత్వమునకు అధ్యక్షుడైన తరువాత 1957 లో జనాభిప్రాయసేకరణమును జరుపగ, ఫ్రెంచి కమ్యూనిటిలో [చూ. పు. 638] స్వతంత్ర ప్రతిపత్తి గల రాజ్యముగ ఉండుటకు మలగాసీ ప్రజలు నిర్ణయించుకొనిరి. 1960 లో ఈ రాజ్యము సర్వస్వతంత్రరాజ్యముగ రూపొందినను, ఫ్రెంచి కమ్యూనిటీలో దానికి గల సభ్యత్వమును నిలుపు కొనుటకు అందు అవకాశము కల్పింపబడినది.

**రాజ్యాంగము :** ఫ్రెంచి కమ్యూనిటీ సభ్యత్వ బాధ్యత లకు లోబడి, 1959, ఏప్రిల్ 28 న ఆమోదింపబడిన రాజ్యాంగ చట్టముప్రకారము ఈ దేశమున గణ రాజ్య విధానపు పరిపాలన అమలునందు ఉన్నది. ఏడేండ్ల పదవీ కాల పరిమితి కల అధ్యక్షుడు, జాతీయ సభ, శిష్టసభ అనునవి ఈ పరిపాలనకు మూలస్తంభములు. సార్వజనిక వయోజనపద్ధతిన అయిదేండ్లకు ఒకసారి జాతీయసభ (నేషనల్ అసెంబ్లీ) ఎన్నుకొనబడును. శిష్టసభ (సెనేట్) యందలి సభ్యులలో మూడింట రెండువంతుల మందిని రాష్ట్ర సభలును, స్థానిక సంస్థలును ఎన్నుకొనును. తక్కిన వారిని ప్రభుత్వము నియామకము చేయును. శిష్టసభ సభ్యుని పదవీకాల పరిమితి ఆరు సంవత్సరములు. కాని, మూడేండ్లకు ఒకసారి శిష్టసభలో సగముమంది పదవీ కాలము ముగియు రీతిగ ఏర్పాటు కలదు. పరిపాలనాధి కారము అంతయు అధ్యక్షుని వశమున కలదు. మంత్రు లను ఇతడు నియమించును. శాసనసభ అధికారమునకు ఒసగబడిన విషయములపై ఇతడే ఉత్తరువుల రూపమున శాసనములను అమలులోనికి తెచ్చును. శిష్టసభలోని సభ్యులలో మూడింట రెండువంతుల ప్రాబల్యముతో జాతీయ సభను ఇతడు రద్దుచేసి, మరల ఎన్నికలు జరుప వచ్చును. దేశభద్రతకు, శాంతిస్థాపనరక్షణకు ఈయనయే బాధ్యుడు. చీ. శే. రా.

## మలయా :

ఆగ్నేయ ఆసియా యందలి మలేసియా [చూ.] సమాఖ్యయందు అంతర్భాగమగు ఒక రాజ్యము.

ఆగ్నేయ ఆసియా భూభాగము నుండి హిందూమహాసముద్రము లోనికి చొచ్చుకొని వచ్చిన 643 కిలోమీటరుల పొడవు కల ఒక సన్నని ద్వీపకల్పము ఈ రాజ్యము. ఎచ్చటను ఈ ద్వీపకల్పపు వెడల్పు 321 కిలోమీటరులకు మించి ఉండదు. ఈ ద్వీపకల్పమును ఆశ్రయించి సమీపమున ఉన్న కొన్ని అల్ప ద్వీపములును రాజ్యాంగరీత్యా ఈ రాజ్యమున చేరి ఉన్నవి. [వి] 3,33,215 చ. కి. మీ.; [జ] 1,03,63,821. వీరిలో అచ్చపు మలయన్ సంతతివారు 51%, వలస వచ్చిన చీనీయుల సంతతివారు 37%,

వలస వచ్చిన భారతీయుల సంతతి (ముఖ్యముగ తమిళులు) 12%. [భా] పై మూడు వర్గములు వారును క్రమముగ, మలయన్, చీనాభాష, తమిళము మాతృభాషలుగ కలిగి ఉన్నారు. అయినను మలయన్ జాతియభాషగ పరిగణింపబడుచున్నది. పరిపాలనావ్యవహారములకు ఇంగ్లీషు వాడబడుచున్నది. [మ] దేశమున ప్రభుత్వాదరణ కల మతము ఇస్లామ్ అయినను మత స్వాతంత్ర్యము ప్రజలకు ఒసగబడినది. భారతీయ సంతతి వారిలో పలువురు హిందువులు అయినను వారియందు కొలదిగ ముస్లిమ్ లును, సిక్కులును, క్రైస్తవులును కలరు. చీనీయులలో పలువురు కన్‌ఫ్యూషియన్ సంప్రదాయముతో మిశ్రితమగు బౌద్ధమతమును అవలంబించినవారు. [రా] కౌలాలంపూర్ (జ. సం. 3,16,230).

చరిత్ర: ఈ దేశీయులగు మలయన్‌ల పూర్వికులు క్రీ. పూ. 2000 ప్రాంతమున దక్షిణ చీనానుండి ఇటకు వలస వచ్చి ఉందురని చారిత్రకుల అభిప్రాయము. చీనా - భారత దేశముల మధ్య జరుగు సముద్రప్రయాణమునకు ఈ పరిసరములు అనువగు మజిలీలగుటచే, తొలుత నుండియు ఈ దేశమున చీనా - భారత సంస్కృతులు మేళనమందినవి. ఈ రాజ్యమునందలి పలెంబంగ్‌ను తమ ముఖ్య పట్టణముగ చేసికొని శ్రీవిజయ అను సామ్రాజ్యము ఒకటి క్రీ. శ. 600 ప్రాంతమున వెలసి నాలుగు శతాబ్దములకాలము మహా ప్రశస్తిని గడించినది. ఇంతలో సమీపమున ఉన్న జావాలో ఒక నూతనరాజ్యము నెలకొల్పబడి, విజృంభించి, 11 వ శతాబ్దమున శ్రీవిజయ రాజ్యమును అంతమొందించెను. 1400 ప్రాంతమందు దేశము అరాజకము పాలైనపుడు రాజ్య భ్రష్టుడగు రాకుమారుడు ఒకడు (ధూమశిఖుడు) నేటి సింగపూర్‌నకు ఎగువ 160 కిలోమీటరుల దూరమున మలక్కా అను నగరమును నిర్మించెను. మలయాయందే కాక, సమీప స్థలములగు ఇండోనీషియా ద్వీపములందును మహా పరివర్తనలు కలుగుటకు అంతటినుండి ఈ మలక్కా నగరము కేంద్రమయ్యెను. ముస్లిమ్‌లును, అరబ్బీమత ప్రచారకులును తొలుత ఇటకు చేరి క్రమముగ తమ మతమును, సంస్కృతిని మలయాయందు అంతట వ్యాపింప జేసిరి. 1511 లో మలక్కాను పోర్చుగీస్‌లు వశపరచు కొనిరి. వారిని జయించి 1641 లో డచ్చివారు దానిని ఆక్రమించుకొనిరి. ఆకాలమున మలయా దేశము కొన్ని చిన్న రాజ్యములుగ విభక్తమై ఉండెను. అట్టి రాజులలో ఒకనివద్దనుండి బ్రిటిష్‌వారు 1786 మొదలుగ కొన్ని తీర స్థావరములను కౌలునకును, కొన్నింటిని క్రయధనము ఇచ్చియు సంపాదించిరి. అట్టి స్థావరములలో ఒకటి నేటి సింగపూర్ [చూ.]. తరువాత 1825 లో డచ్చివారినుండి బ్రిటిష్‌వారు మలక్కాను సంపాదించిరి. అంతట తమకు అప్పటికి ఉన్న స్థావరము (పెనాంగ్, మలక్కా, సింగపూర్) లను కలిపి 'స్ట్రెయిట్స్ సెటిల్‌మెంట్స్' అను పేర ఒక వలస రాజ్యమును బ్రిటిష్‌వారు 1829 లో నిర్మించిరి. మిగిలిన మలయాయందలి అల్పరాజ్యముల అంతఃకల్లోలములలో వారు చాలకాలము జోక్యము కలిగించుకొనలేదు. కాని, ఆ కల్లోలముల మూలముననే 1874 నుండి 1889 నాటికి పెరాక్, సేలంగర్, నెగ్రీ, సెంబిలన్, పహాంగ్ అను నాలుగు రాజ్యములు బ్రిటిష్ రక్షణక్రిందికి వచ్చి చేరినవి. ఈ నాలుగింటిని కలిపి 1895 లో 'ఫెడరేటెడ్ మలే స్టేట్స్' అను పేర ఒక సమాఖ్యను బ్రిటిష్ ప్రభుత్వము నిర్మించెను. బ్రిటిష్‌వారి సర్వాధిపత్యమునకు లోబడి ఈ సమాఖ్యయందు పాలన సాగుచుండెను. తరువాత సయామ్‌తో బ్రిటన్ కుదుర్చుకొనిన ఒక ఒడంబడికను అనుసరించి కేలంతన్, త్రిన్‌గన్, పెర్‌లిస్, కేడా అను మలయా రాజ్యములు సయామ్‌చే బ్రిటన్‌కు ఒసంగబడెను. 1914 లో జోహోర్ అను వేరొక రాజ్యము తనంతతానుగ బ్రిటిష్ రక్షణక్రిందికి వచ్చెను. కాని, ఈ అయిదు రాష్ట్రములును సమాఖ్యలో చేరక వేరుగనే బ్రిటిష్‌సర్వాధిపత్యమునకు లోబడి ఉండెను. బ్రిటిష్‌సేనల సాయమున శాంతిభద్రతలు చేకూరుటచే, దేశమునందలి తగరపు గనుల ఉత్పత్తి, రబ్బరు తోటల పరిశ్రమయు అభివృద్ధి కాంచి చీనా - భారతదేశములనుండి కార్మికులను ఆకర్షించ గలిగెను. వీరి సంతతివారు మలయాయందు స్థిరవాసులైరి.

ద్వితీయ ప్రపంచయుద్ధకాలమున 1941, డిసెంబరునుండి రెండు సంవత్సరముల కాలము ఈ రాజ్యము జపాన్ సేనల ఆక్రమణలో ఉండెను. 1944 లో మరల బ్రిటిష్‌సేనల వశమయ్యెను. అంతట మలయారాజ్యములను అన్నిటిని ఒక రాజ్యసమ్మేళనముగ చేసి మలయారాజ్య సమ్మేళనము (మలయన్ యూనియన్)ను 1946 లో బ్రిటన్ ఏర్పరచెను. తరువాత 1948 లో దీనినే మార్పు చేసి 'మలయారాజ్య సమాఖ్య (మలయా ఫెడరేషన్)' ను రూపొందించెను. కాని, ముఖ్యాధికారములు అన్నియు బ్రిటిష్‌ప్రభుత్వపు అధీనముననే ఉండెను. అంతటనుండి దేశము స్వాతంత్ర్యస్థాయిని చేరుటకై త్వరితగతిని పురోగమించెను. కాని, 1948 నుండి దేశము కమ్యూనిస్ట్ తిరుగుబాటును ఎదుర్కొనవలసి వచ్చెను. ఈ తిరుగుబాటువలన ఏర్పడిన అత్యవసర పరిస్థితి ఒక దశాబ్దముపైగా దేశమును కల్లోలమున ముంచెను. కడకు బ్రిటిష్‌వారితో ఏర్పరచుకొనిన ఒడంబడిక ఫలితముగ మలయా 31 ఆగస్టు, 1957 న కామన్‌వెల్త్‌నందు సభ్యత్వముకల స్వతంత్ర రాజ్యముగ రూపొందెను. తదాది అబ్దుల్ రహమాన్‌పుత్ర నాయకత్వమున మలయా జాతీయ, అంతర్జాతీయ రంగములందు సముచితపాత్రను

నిర్వహించుచున్నది. ఆగ్నేయ ఆసియాయందలి ప్రత్యేక పరిస్థితిని గమనించి ఉత్తర బోర్నియా, సారవాక్, బ్రూనీ, సింగపూర్ మలయాలతో కలసిన 'మలేసియా' [చూ.] రాజ్యాంగము రూపొందించవలెనని అబ్దుల్ రహమాన్ ఆకాంక్ష. దీనికి బ్రిటన్ సానుభూతిని వ్యక్తపరచినది. కాని, ఇండోనీషియా ఫిలిప్పీన్ దేశములు ఇందువలన ఈ ప్రాంతమున ప్రమాదకర పరిస్థితి ఏర్పడునని దీనిని ప్రతిఘటింప సమకట్టినవి. కామన్‌వెల్త్‌నందు సభ్యత్వముగల మలయా, సారవాక్, ఉత్తర బోర్నియో, బ్రూనీదేశముల ప్రతినిధులును, బ్రిటిష్‌ప్రభుత్వ కామన్‌వెల్త్ వ్యవహార కార్యదర్శియు మలేసియా నిర్మాణమునకై 1963, జూలై 2 వ తేదీన లండనులో చర్చలు సాగించిరి. తత్పర్యవసానముగ మలయా, సింగపూర్, ఉత్తర బోర్నియో (సాబా), సారవాక్‌లతో కలసిన మలేసియా సమాఖ్య 1963, సెప్టెంబరు 16 వ తేదీన రూపొందినది. బ్రూనీ మాత్రము కొన్ని పరిస్థితుల కారణమువలన ఈ సమాఖ్యయందు చేరలేకపోయినది. ఆ తరువాత ఈ సమాఖ్యనుండి కారణాంతరములవలన సింగపూర్ వేరైనది (1965).

రాజ్యాంగము: ఇదివరలో బ్రిటన్ రక్షణలో ఉండిన 9 మలయన్ రాజ్యములును బ్రిటన్‌వలసపాలనలో వారి గవర్నర్‌లచే పాలింపబడు రెండు మలయన్‌రాష్ట్రములును కలసి ఈ మలయారాజ్య సమాఖ్య రూపొందినవి. ఇప్పుడు ఈ రక్షిత రాజ్యములును రాష్ట్రములుగనే వ్యవహరించుచు, 1857 నుండి స్వతంత్రాధికారములను కలిగి ఉన్నవి. ఈ రక్షిత రాజ్యముల ప్రభువులు 9 మందియు రాజసభగ ఏర్పడి తమలోనుండి ఒకనిని దేశాధీశునిగను, వేరొకనిని ఉపాధీశునిగను ఎన్నుకొనెదరు. వీరిలో ప్రతియొక్కని పదవీ కాలపరిమితి అయిదు సంవత్సరములు. రాష్ట్రముల సరిహద్దుల మార్పులు, పూర్వపురాజుల హక్కు అధికారములు, మత విషయములగు చట్టములు మొదలగు విషయములందు మార్పులు రాజసభ అనుమతి లేనిదే తేరాదు. దేశీయ శాసనసభయందు శిష్టసభ (దివాన్ నగరా), ప్రతినిధి సభ (దివాన్ రహియత్) అను కక్ష్యలు కలవు. వీనిలో శిష్టసభయందు 38 మంది సభ్యులు ఉందురు. వీరిలో రాష్ట్రమునకు ఇరువురు చొప్పున 22 మంది ఎన్నుకొనబడెదరు. తక్కినస్థానములలో కొన్నింటికి ప్రముఖవ్యక్తులను, కొన్నింటికి అల్పసంఖ్యాక వర్గముల ప్రతినిధులను దేశాధీశుడు నియామకము ఒనర్చును.

శిష్టసభసభ్యుని వయస్సు 30 పండ్లకు తగ్గకూడదు. వీరిలో ఒక్కొక్కని పదవీకాలపరిమితి ఆరుసంవత్సరములు. ప్రతినిధి సభయందు 104 గురు సభ్యులు ఉందురు. వీరు దేశమునందలి వివిధప్రాంతములనుండి జనసంఖ్య నిష్పత్తిలో ఎన్నుకొనబడెదరు. ఈ సభకు అయిదేండ్లకు ఒకసారి సాధారణముగ ఎన్నికలు జరుగును. ప్రతినిధిసభ సభ్యుని వయస్సు 21 కి తగ్గరాదు. దిగువసభలోని అధిక సంఖ్యాకుల విశ్వాసమును ఆర్జించినవానిని ప్రధానమంత్రిగ దేశాధీశుడు నియమించును. ప్రధానమంత్రి తక్కిన మంత్రులను నియమించుకొని పరిపాలనను నిర్వహించును. ఈ సమాఖ్యయందు అవశిష్టాధికారములు అన్నియు రాష్ట్రములకే చెంది ఉన్నవి. 21 పండ్ల వయసునకు తగ్గని ప్రతి పౌరునకు వోటు హక్కు కలదు.

మలేసియా సమాఖ్యకుచెందిన పార్లమెంట్‌నకు మలయా 104 మంది సభ్యులను ఎన్నుకొనుచున్నది. చీ. శే. రా.

**మలావీ (న్యాసాలాండ్)**: మధ్య ఆఫ్రికా యందలి ఒక స్వతంత్ర గణ రాజ్యము.

ఈ రాజ్యమునకు ఉత్తర రొడీషియా, మొజాంబిక్ [ప]; టాంజేనియా [ఉ]; మొజాంబిక్ [తూ, ద] సరిహద్దులందు ఉన్నవి. ఉత్తరమునుండి దక్షిణమునకు 836 కిలోమీటరుల పొడవున వ్యాపించి ఉన్న ఈ రాజ్యపు తూర్పు పడమరల వెడల్పు ఎక్కడను 160 కిలోమీటరులకు మించక ఉన్నది. [వి] 96,200 చ. కి. మీ.; (ఇందులో సరస్సుల విస్తృతి 32,110 చ. కి. మీ. కలసి ఉన్నది); [జ] 40,00,000. వీరిలో యూరపియన్‌ల సంఖ్య దాదాపు 77,000 ఉండును. భారతీయ వర్తకులును కొలదిగ కలరు. [భా] మాతృభాషలుగ వివిధ ఆఫ్రికన్ భాషలు వ్యాప్తియందు ఉన్నను, ఇంగ్లీషు సార్వజనిక వ్యవహార భాషగ వాడుకయందు ఉన్నది. [మ] ప్రజలలో నూటికి 11 మంది క్రైస్తవులు, 10 మంది ముస్లిమ్‌లు కలరు తక్కిన వారందరు సంప్రదాయ ప్రకృతి దేవతారాధకులు. [రా] జోంబా (జ. సం. 9,331).

చరిత్ర: ఈ రాజ్యపు ప్రాచీన చారిత్రకవివరములు ఏవియు ఇప్పటికి తెలియరాకున్నను క్రీ. శ. ఆరంభకాలము నుండియు ఇచట ఆఫ్రికన్ జాతులవారు కొందరు వసించుచుండినటులను, అంతటంతట కొన్ని క్రొత్త ఆఫ్రికన్ జాతులు చేరుచుండెననియు తెలియవచ్చుచున్నది. క్రీ. శ. 10 వ శతాబ్దికి పూర్వమునుండియే అరబ్బులకు ఈ ప్రాంతముతో పరిచితి ఉండెను. 1616 లో జాస్పర్ బొకర్రో అను పాశ్చాత్యాన్వేషకుడు ఈ ప్రాంతమును దర్శించెను. అతడు తెలిపిన వివరములను అనుసరించి తరువాత కొందరు క్రైస్తవమతప్రచారకులు 18 వ శతాబ్దిలో దక్షిణాఫ్రికాతీర భూమినుండి ఈ ప్రాంతమున కొంతదూరమువరకు పయనించి, వెనుకకు మరలిరి. ఈ దేశమున చేరియున్న న్యాసాసరస్సు ఉనికిని తక్కిన ప్రపంచమునకు వీరే తెలియజేసిరి. కాని, 1859 వరకు మరల ఈ దేశమును గురించిన సమగ్ర విశేషములను

గ్రహించుటకు వేరెవరును కృషి చేయలేదు. 1859 లో డేవిడ్ లివింగ్‌స్టన్ అను క్రైస్తవ మతప్రచారకుడు ఇచటికి చేరి, ఈ దేశమును గురించి సమగ్రవివరములను తెలియజేసెను. అంతట బ్రిటన్‌నుండి కొన్ని మతప్రచారక సంఘములు ఇచట చేరి ప్రజలలో కృషిచేయ మొదలిడినవి. తరువాత ఈ మతప్రచారకులకు సహాయముగ ఉండుటకై ఆఫ్రికన్ లేక్స్ కార్పొరేషన్ అను వ్యాపారసంస్థ ఏర్పాటు చేయబడినది (1878). ఈ సంస్థ కృషిమూలమున దేశాంతర్భాగమునందలి పలుతెగల నాయకులతో బ్రిటిష్ వారికి పరిచితి ఏర్పడినది.

ఆ కాలమున అరబ్బీవర్తకులు ఈ దేశమున బానిసలను సంపాదించి, వారిని దూరదేశములకు కొనిపోయి విక్రయించుచుండిరి. వీరి దౌష్ట్యమును నిరోధించు శక్తి క్రైస్తవమతప్రచారకులకు లేకుండుటవలన బ్రిటిష్‌ప్రభుత్వము ఈ దేశమున తన దౌత్యప్రతినిధుల (కన్సల్స్) ను నిలిపెను (1883). ఆఫ్రికన్ లేక్స్ కార్పొరేషన్‌వారును అధికార సేనను ఒకదానిని సమకూర్చుకొనిరి (1888). క్రమముగ బ్రిటిష్‌ప్రభుత్వమే స్వయముగ బోక్యము వహించి, దేశమునందలి పలుతెగల నాయకులతో ఒడంబడికలను కుదుర్చుకొని 1892 నాటికి దేశమును తమ రక్షిత రాజ్యముగ ప్రకటించి, దీనికి 'న్యాసాలాండ్ ప్రొటక్టరేట్' అని పేరిడిరి. ప్రథమ ప్రపంచయుద్ధకాలమున టాంగన్యికాయందు ఉన్న జర్మనీ సేనలు ఈ దేశముపై దండెత్తెను. కాని, బ్రిటిష్‌ప్రభుత్వము జర్మనీసేనలను ఓడింపగలిగెను.

క్రైస్తవమత ప్రచారకుల కృషివలన దేశమున విద్యాభివృద్ధి కొంత కలుగుటవలన, దేశీయులలో స్వాతంత్ర్య కాంక్ష కలిగి, 1915 లో సాయుధ తిరుగుబాటుగ పరిణమించెను. బ్రిటిష్‌ప్రభుత్వము ఈ ఉద్యమమును నిర్దాక్షిణ్యముగ అడచివేసెను. కాని, ప్రజలకు పరిపాలనయందే మియు భాగస్వామ్యము కలిగింపలేదు.

ఈ దేశమున కొన్ని రాజకీయ సంస్కరణలు 1930 తరువాత ప్రవేశపెట్టబడినను, వోటర్ అగుటకు ఉన్నతము లగు అర్హతలు విధించుటచే దేశమునందలి యూరపియన్ లకు మాత్రమే దీనివలన లాభము చేకూరెను. దేశీయ ప్రజలకు ఇది కోపకారణము అయ్యెను. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున బ్రిటిష్‌ప్రభుత్వమువారు న్యాసాలాండ్‌ను ఉత్తర, దక్షిణ రొడీషియా దేశములతో కలిపి ఒక సమాఖ్యగ ఏర్పరచిరి. దేశీయప్రజలు ఈ సమాఖ్యకు వ్యతిరేకతను వెల్లడించినను, బ్రిటిష్‌ప్రభుత్వము లెక్కచేయలేదు. కాని, అది మొదలుగ జాతీయోద్యమము హేస్టింగ్స్‌బందా అనువాని నాయకత్వమున తీవ్రతరము అయ్యెను. కడకు 1961 లో దేశమున నూతన సంస్కరణ లను బ్రిటిష్‌ప్రభుత్వము ప్రవేశపెట్టెను.

ఈ సంస్కరణల మూలమున ఆఫ్రికన్ ప్రజలలో అత్యధిక సంఖ్యాకులకు వోటరులు అగుటకు అర్హత లభించెను. తరువాత ఆ సంస్కరణలను అనుసరించి జరిగిన ఎన్నికలలో తన వర్గము అత్యధిక స్థానములను ఆర్జించుటచే హేస్టింగ్స్ బందా ప్రధాని అయ్యెను. తరువాత ప్రజాభీష్టమును అనుసరించి రొడీషియా - న్యాసాలాండ్ సమాఖ్యను బ్రిటిష్ ప్రభుత్వము రద్దొనర్ప అంగీకరించెను. 1963, డిసెంబరు 31 న ఈ సమాఖ్య రద్దు అయినది. 1964, జూలై 6 నుండి న్యాసాలాండ్ సంపూర్ణస్వతంత్రరాజ్యముగ రూపొందినది.

చీ. శే. రా.

**మలేసియా :** ఆగ్నేయ ఆసియాయందు ఒక రాజ్య సమాఖ్య. ఈ రాజ్య సమాఖ్యయందు మలయా, సింగపూర్, సాబా (ఉత్తర బోర్నియో), సారవాక్ రాజ్యములు చేరి ఉన్నవి (ఆ యా రాజ్యములను గురించిన వివరములు ఆ యా శీర్షికల క్రింద కననగును). ఈ సమాఖ్యయందలి దేశముల మొత్తపు [వి] 3,33,215 చ. కి. మీ. [జ] 1,03,63,821.



చరిత్ర: 1961, మే 27 వ తేదీన సింగపూర్ నందు విదేశీయ పత్రికా విలేఖరుల సమావేశమున మలయా ప్రధాని తుంకూ అబ్దుల్ రహమాన్ ప్రసంగించుచు మలయా, సింగపూర్, సాబా, సారవాక్, బ్రూనీలు ఒక సమాఖ్యగ రూపొందుట ఆర్థికముగను, తదితర రీతులను ప్రశంసనీయమగు విషయము కాగలదని తెలుపుటతో ఈ సమాఖ్యను గురించి ఆ యా దేశముల పాలకులకు శ్రద్ధ మొలకెత్తెను. ఈ సమాఖ్యను మలేసియా అని వ్యవహరించుటయు సముచితముగ ఉండగలదని ఆ సమయమున భావింపబడెను. ఈ రాజ్యములలో సాబా, సారవాక్, బ్రూనీలపై సార్వభౌమత్వమును, సింగపూర్ యొక్క రక్షణ విదేశ వ్యవహారముల బాధ్యతను వహించిన బ్రిటన్ ఈ సమాఖ్య రూపొందుటకు సుముఖతను వెల్లడించెను. ఆ తరువాత ఈ విషయమై సంప్రతింపులు జరిగి 1963, జూలై 9 న ఇందు బ్రూనీ రాజ్యము తప్ప తక్కిన రాజ్యములు అన్నియు ఆ సమాఖ్య నిర్మాణ వివరములపై ఒక ఒడంబడికకు రాగలిగినవి. అంతట ఇట్టి సమాఖ్య అవతరించుట తమ శ్రేయస్సునకు భంగకరమనియు, వలసలుగ ఉన్న సాబా, సారవాక్ రాజ్యములందలి ప్రజలు ఇందులకు వ్యతిరేకులనియు ఫిలిప్పీన్, ఇండోనీషియా రాజ్యములు తమ అభ్యంతరమును తెలుపగ, మలయాప్రధాని వారితో మాటాడి సాబా, సారవాక్ రాజ్యములందలి ప్రజల అభీష్టమును ఐక్యరాజ్యసమితి ప్రతినిధివర్గము మూలమున తెలిసికొనిన తరువాతనే మలేసియా రూపొందుటకు అంగీకరించెను. ఆ నిర్ణయమును అనుసరించి ఐక్యరాజ్యసమితి ప్రతినిధి వర్గము ఒకటి ఆ రాజ్యములందు పర్యటించి, వివరములను సేకరించి, అందలి ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు సమాఖ్యకు సుముఖులని తమ నివేదికలో తెల్పిరి. అంతట సెప్టెంబరు 16, 1963 న మలేసియా సమాఖ్య రూపొందెను. కాని, ఐక్యరాజ్యసమితి ప్రతినిధుల పరిశీలనలో కొన్ని లోపములు కలవను మిషతో ఇండోనీషియా, ఫిలిప్పీన్‌లు ఈ సమాఖ్యను గుర్తింప నిరాకరించినవి. ఫిలిప్పీన్ దేశీయులతో తరువాత సామరస్యము కుదిరినను ఇండోనీషియా మాత్రము మలేసియా విచ్ఛిన్నమే తన ఆశయముగ ప్రకటించి, దౌత్యసంబంధములను రద్దుచేసికొనుటయేకాక విరోధవృత్తిని అవలంబించినది. తరువాత కారణాంతరములవలన సింగపూర్ సమాఖ్యనుండి విడివడినది. 1966 లో ఇండోనీషియాతో మలేసియాకు సామరస్యము మరల చేకూరినది.

ఈ సమాఖ్యయందలి రాజ్యములు అన్నియు తమ ఆంతరంగిక ప్రతిపత్తికి భంగము లేకుండ, సమష్టి శ్రేయమునకు సంధించిన వైదేశిక, సైనికాదివ్యవహారములను కేంద్రమునకు ఒసగినవి. కేంద్రప్రభుత్వమున శాసననిర్మాణాధికారము పార్లమెంట్‌నకు కలదు. ఈ పార్లమెంట్‌నందలి 144 స్థానములలో సారవాక్‌కు 24, సాబాకు 16 ఒసంగబడినవి. తక్కిన స్థానములు మలయాకు చెందును. కామన్‌వెల్త్ నందు ఈ సమాఖ్యకు సభ్యత్వము కలదు, ఐక్యరాజ్యసమితి యందు మలయాకు బదులు మలేసియా ఇపుడు సభ్యత్వము వహించినది. చీ. శే. రా.

**మస్కట్ & ఓమన్:** ఆసియా ఖండమున అరేబియా ద్వీపకల్పమునందు ఆగ్నేయ తీరమున ఉన్న సుల్తాన్ పాలిత స్వతంత్ర రాజ్యము.




ఈ రాజ్యమునకు ఓమన్ సింధుశాఖ [ఉ]; ఆరేబియన్ సముద్రము [తూ]; రక్షిత రాజ్యముగు ఏడెన్ [ద]; సౌదీ అరేబియా, ఓమన్ అనిశ్చిత ప్రాంతము [ప] సరిహద్దులందు ఉన్నవి. [వి] 2,12,380 చ. కి. మీ.; [జ] 7,50,000. [భా] జాతీయభాష అరబ్బీ. [మ] జనులు ఇబాహిదీ సంప్రదాయపు ఇస్లామ్ మతమునకు చెందినవారు. [రా] మస్కట్ (జ. సం. దాదాపు 5,500).

చరిత్ర: ఇందలి ఓమన్ ప్రాంతము ప్రాచీన కాలపు గ్రీక్ నావికులకు సుపరిచితము. కాని, తరువాత క్రీ. శ. 7 వ శతాబ్దమువరకు దీనిని గురించిన విషయములు ఏవియు తెలియవచ్చుటలేదు. ఆ శతాబ్దమున మహమ్మద్ ప్రవక్త జీవితకాలముననే ఈ దేశీయులు ఇస్లామ్‌మతమును అవలం

బించిరి. కాని, అనతికాలముననే ఇస్లామ్‌న ఒక విప్లవాత్మక సంస్కరణమును ఈ దేశీయులు ప్రవేశపెట్టిరి. ఈ సంస్కరణను తలపెట్టినవాడు అబ్దుల్లా ఇబ్న్ ఇబాహ్. ఈ సంస్కరణ వలన రూపొందిన సంప్రదాయమునకు ఇబాహిదీసంప్రదాయమని పేరు కలిగెను. దీనిని అనుసరించి, ఇమామ్ (ముస్లిమ్ మత నాయక) పదవి ఎన్నిక ద్వారా లభించవలసినదేకాని, వంశానుగతముగ సంక్రమింపరాదు. ఓమన్ దేశీయులు ఈ సంప్రదాయమును అవలంబించి, 8 వ శతాబ్ది ఉత్తరార్ధమునుండియు తమ ఇమామ్‌లను ఈ రీతిగనే ఎన్నుకొనుచున్నారు.

పోర్చుగీస్‌వారు ఈ దేశమును 1508 లో ఆక్రమించిరి. తరువాత 150 ఏండ్లు వారి స్వాధీనముననే ఈ దేశము ఉండెను. అంతట ఓమన్‌ను పాలించు ఇమామ్, పారసీకుల సాయముతో పోర్చుగీస్ వారిని తరిమివేయుటయే కాక మొంబాసా, మొగదిషూ, జాంజిబార్ దీవులను కూడ జయించెను. 1784 లో భారతదేశమునందలి కలాత్ సంస్థానాధిపతివద్దనుండి, బెలూచిస్థానమునందలి గ్వాడూరును కూడ ఓమన్ ప్రభువు సంపాదించెను.

బ్రిటిష్‌వారు తొట్టతొలుతగ ఓమన్ ఇమామ్ (మస్కట్ నగర పాలకుని) తో ఒక ఒడంబడిక చేసికొనిరి. ఆ కాలమున అరేబియాయందు సర్వాధిపత్యమునకై ఆశించుచున్న వాహాబీ అను వేరొక ఇస్లామిక శాఖవారి బారినుండి తప్పించుకొనుటకు వేరు శరణ్యము ఏదియు లేక ఇమామ్ అగు సయ్యద్ ఇబ్న్‌సుల్తాన్ (1824 - 1856 ప.) బ్రిటిష్‌వారి రక్షణను ఆసించెను. బ్రిటిష్‌వారును ఇతనితో సహకరించి, ఇమామ్ పదవి వంశానుగతముగ ఉండునటుల ఇతడు చేసిన నిర్ణయమును బలపరచిరి. అప్పటినుండి మస్కట్ ప్రభువు తాను సుల్తాన్‌నని ప్రకటించుకొనెను. కాని, దేశ ప్రజలు ఈ నిర్ణయమును వ్యతిరేకించిరి. మస్కట్, మత్రా నగరములందు తప్ప తక్కిన దేశమున సుల్తాను అధికారము గుర్తింపబడకుండెను. అయినను, బ్రిటిష్ సైనికుల సాయమున ఈ సుల్తానును, అతని తరువాత అతని వంశీకులగు సుల్తానులును అంతర్జాతీయ పరిగణనను ఆర్జించిరి. ఇటుల మస్కట్, మత్రా నగరములు చాలకాలము దేశమునుండి విడివడి ఉండెను. ఇంతలో ఓమన్ పల్లెసీమలందలి ప్రజలు వేరొక ఇమామ్‌ను ఎన్నుకొనిరి. 1920 లో అప్పటి మస్కట్ సుల్తాన్ ఈ ఇమామ్‌తో ఒక ఒడంబడిక కుదుర్చుకొని, అతని స్వాతంత్ర్యమును చాలవరకు గుర్తించెను. తరువాత 1954 లో ఇమామ్ చనిపోగానే, ఆ పదవికి తానే ఎన్నుకొనబడునటుల చేయుటకు సుల్తాన్ ప్రయత్నించి విఫలుడు అయ్యెను. ఇటుల ప్రపంచ రాజ్యములచే స్వతంత్ర రాజుగ పరిగణింపబడు ఈ సుల్తాన్, తన రాజ్యమున అధిక సంఖ్యాకులచే ఈ నాటికిని ఆదరణ పొందజాలకున్నాడు. 20 వ శతాబ్దములో ఈ దేశమున అటనట పెట్రోలియమ్ గనులు కనుగొనబడుటచే, అంతర్జాతీయ రంగమున ఈ ప్రాంతమునకు ప్రాముఖ్యము అతిశయించినది. బ్రిటిష్ వారి ఆధిపత్యమున కొన్ని నూనెకంపెనీలు ఇట నడపబడుచున్నవి. కాని, అసంతృప్తులగు ప్రజలకు భయపడి ఈ కంపెనీ తన సొంతసైన్యమును ఒకదానిని ఉంచుకొని వ్యవహరించుచున్నది.

తొలుతటి సుల్తాన్ అగు సయ్యద్ ఇబ్న్‌సుల్తాన్ చనిపోయిన తరువాత అతని కుమారులు ఇరువురును ఆధిపత్యమునకై తగవులాడుకొనగా, బ్రిటిష్‌వారు మధ్యవర్తిత్వము జరిపి జాంబిబార్ మొదలగు ఆఫ్రికన్ దీవులను ఒక కుమారునికి ఇచ్చి మస్కట్ & ఓమన్ మొదలగువానిని ఇంకొకనికి ఇచ్చిరి. అతని వంశీకుడే ఇప్పటి సుల్తాన్. బెలూచిస్థానమున తమకు లభించిన గ్వాడూరును 1954 లో పాకిస్తాన్‌కు మస్కట్ సుల్తాన్ ఇచ్చివేసెను.

ఈ దేశమున రాజు నిరంకుశపాలకుడు. అయినను దేశమందలి పల్లెసీమలలో అరబ్బు తెగలు తమ సంప్రదాయమగు స్థానిక పరిపాలన కలిగి ఉన్నవి. చీ. శే. రా.

**మహమ్మదు ప్రవక్త** (క్రీ. శ. 570 ? - 632) : మహమ్మదీయ మతస్థాపకుడు, ప్రవక్త. అరేబియాలోని మక్కా పట్టణములో సత్కుటుంబములో జన్మించెను. చిన్ననాడే తల్లిదండ్రులను కోల్పోయి, పేదవాడైన తన పెదతండ్రి ఇంట పెరిగెను. కొంతకాలము ఎడారులలో ఒంటెలను నడపుచు వర్తకపు గుంపులతో చుట్టుప్రక్కల దేశములలో తిరిగి ఖదీజా అనే ధనికురాలైన వితంతువును వివాహమాడి ఆర్థికముగా బాగుపడెను. అరబ్బుల అమాయికత్వము, మూఢాచారములు, బహు దేవతారాధన, విషయలోలత అతని మనస్సును కలచివేసినవి. వారిని ఆ పతన స్థితినుండి లేవనెత్తే ముక్తిమార్గము కోసము అన్వేషణ ప్రారంభించెను. క్రైస్తవ మతము, యూదుల మతము ఆ నాటికి ప్రబలముగ ఉన్నవి. అవి మహమ్మదును తీవ్రముగ ఆకర్షించినవి. స్వానుభవముతో ఆ మతముల సారమును మేళవించి, తన మహమ్మదీయ మతమును స్థాపించి ప్రచారము చేయుట మొదలుపెట్టెను. ప్రతి రాయీ, రప్పా దేవుడుకాడని, మానవులకందరికీ దైవ మొక్కడే అనీ, అతడే అల్లా అనీ, తాను అల్లా సందేశమును లోకానికి చాటే ప్రవక్తననీ మహమ్మదు బోధించెను.

మహమ్మదు కుటుంబమువారు, వంశమువారు అతని పక్షమే వహించిరి. కాని, మిగిలినవారు అతనిని

బాధించుట మొదలుపెట్టిరి. అందుచేత 622 లో స్వేచ్ఛగా మతప్రచారము సాగించుకొనుటకొరకు మక్కానుండి మదీనాకు మహమ్మదు పారిపోయెను. అట్లు పారిపోవుటకు ' హెజిరా ' అందురు. ఆ నాటినుండి మహమ్మదు జీవితములో క్రొత్త మార్పు వచ్చినది. మదీనాలో చాలా పలుకుబడి సంపాదించి, యూదులపైన, తన్ను వెడలగొట్టిన మక్కా వాసులపైన ధర్మ యుద్ధము ప్రకటించెను. మంత్రించినట్లు గుంపు గుంపులుగా అరబ్బులు అతని సేనలలో చేరిరి. అతని మతప్రచారమునకు, ఖడ్గధాటికి అనతి కాలములలోనే అరేబియాదేశము వశమైపోయినది. మక్కా మహమ్మదీయమత కేంద్ర స్థానమైనది.

మదీనాలో మహమ్మదు 632 లో స్వర్గస్థుడయ్యెను. మహమ్మదు కీర్తిశేషుడైనను, సజీవమైన అతని అదృశ్య శక్తి ప్రజలను ఆవహించినది. మరొక శతాబ్దమునకు అరేబియాలోనే కాక సిరియా, పరిష్యా, ఈజిప్టు, ఉత్తర ఆఫ్రికా, స్పెయిన్, భారతదేశములలో మహమ్మదీయ మతము స్థాపితమై క్రైస్తవ, బౌద్ధమతముల తరువాతి స్థానమును ఆక్రమించినది [చూ. సం. 7 - పు. 604]. ప్ర. రా.

**మహారాష్ట్ర పరిపాలనా విధానము :** 1674 లో తన పట్టాభిషేక సందర్భమున శివాజీ 'మహారాజ', 'ఛత్రపతి', 'సింహాసనాధీశ్వర' అను బిరుదములను వహించెను. అష్ట ప్రధానులు అనబడు ఎనమండుగురు మంత్రుల క్రింద ఎనిమిది శాఖలను ఏర్పరచుట అతని పాలనా పద్ధతిలో ముఖ్యముగ గమనించదగిన విషయము. పీష్వా లేదా ముఖ్యప్రధాన్ ప్రధానమంత్రియై రాజులేని సమయమున అతనికి బదులు వర్తించుచుండును. మజుమ్‌దార్ లేదా అమాత్యుడు రెవిన్యూమంత్రి. ఫడ్నవీస్ లేదా సచివుడు ఆర్థికమంత్రి. వాక్‌నవీస్ లేదా మంత్రి అనునతడు దేశీయ వ్యవహారమంత్రి లేదా ప్రధాన కార్యదర్శి. సర్ నౌబత్ లేదా సేనాధిపతి అనునతడు సైన్యాధ్యక్షుడు. డబీర్ లేదా సుమంత్ అనునతడు విదేశాంగమంత్రి. న్యాయాధీశుడు ప్రధాన న్యాయాధికారి ; పండితరావు మతశాఖా మంత్రి. ఈ మంత్రివర్గము ఆధునిక మంత్రివర్గమువంటిది కాదు. శివాజీకి ప్రధానమంత్రి శివాజీయే. ఈ మంత్రివర్గము సలహా సంఘము మాత్రమే. శివాజీ తన మంత్రులకు జాగీర్లు ఇచ్చుటకు ఇష్టపడలేదు. వారికి నగదుగానే జీతములు ఇచ్చుచుండెడివాడు.

శివాజీకి సాలీనా ఆదాయము ఏడుకోట్ల రూప్యములు అని అంచనా వేయబడినది. పన్నులను గుత్తకిచ్చు పద్ధతిని శివాజీ నిరసించెను. భూములను కొలిచి, పన్ను విధించు పద్ధతిని అతడు అవలంబించెను. 5 మూరలపై పదునైదు గుప్పిడుల పొడవుగల కర్రతో భూమినంతను కొలచు పనిని దత్తాజీ అణ్ణాజీకి అప్పజెప్పెను. సాలీనా తోకుపంటపై నూటికి 33% పన్ను అని దత్తాజీ చాటించెను. ప్రభుత్వమునకు ఆదాయము తెచ్చు ఇతరవిధముల పన్నులలో ముఖ్యముగ పేర్కొనదగినది చౌత్. తనకు లోబడిన లేదా తన సహాయమును, రక్షణను అపేక్షించిన ఇతర రాజుల భూములనుండి ఈ పన్నును శివాజీ వసూలు చేయుచుండెడివాడు. అచటి భూమి పన్నులో ఈ విధముగ నాలుగవవంతు శివాజీ కోశాగారమునకు చేరెడిది. ఈ పద్ధతి శివాజీకి ఎంతయో పూర్వమునుండియు ఉండెడిది. శివాజీ దీనిని స్వరాజ్యమును విస్తరింప జేయుటకు అనువైన పనిముట్టుగా ఉపయోగించెను. బలముపైన ఆధారపడిన పన్ను అగుటచే హిందూస్థానములో ఏ రాష్ట్రమునుండియైనను చౌత్ వసూలు చేయవచ్చును.

శివాజీ మరణానంతరము అతని పద్ధతులకు భిన్నముగా సైనిక సేవకు ప్రతిఫలముగా జాగీర్లిచ్చుటచే రాజుయొక్క ప్రతిభ తగ్గినది. 1700 లో రాజారామ్ గతించిన వెనుక అధికారమును పీష్వాలు చేజిక్కించుకొనిరి. ప్రతి మంత్రికిని ఒక ఉపమంత్రి లేక ముతాలిక్ ఉండెడివాడు. మంత్రిలేని సమయమందు అతని ఆజ్ఞలను అమలుజరుపు అధికారమును ఇతడు వహించెడివాడు. ధన విషయిక వ్యవహారముల నిర్వహణకు ఫడ్ అను పేరున చక్కని జమా ఖర్చుల ఆఫీసు ఒకటి ఉండెడిది. తరఫీదుపొందిన లెక్కలు కట్టువారు ఫడ్నవీస్‌లు. ఆర్థిక ఉపమంత్రియే ఫడ్నవీస్. జిల్లాలను సుబేదార్లు, తాలూక్దార్లు, పటేళ్ళు మొదలగు అధికార్లు పాలించుచుండిరి. వారి లెక్కలన్నియు జిల్లా ఫడ్నవీస్‌కు చేరవలెను. [చూ. భారతదేశము పు. 664 ; మహారాష్ట్రులు; శివాజీ]. ప్ర. రా.

**మహారాష్ట్రులు :** భారతదేశ చరిత్రలో ఒక ప్రముఖ పాత్రను నిర్వహించిన ఒక ప్రాంతీయభాషా వర్గము. ఆంధ్రశాతవాహనుల శాసనములందు తొలుతగ మహారథి అను పదము కనుపడుచున్నది. ఇది ఒక వర్గమునకు చెందిన నామమా లేదా ఉద్యోగమునకు చెందిన నామమా ? అను విషయమున సందియము కలుగుటకు అచట అవకాశము కలదు. కాని, అరేబియా సముద్రమునుండి తూర్పున బీదరువరకును, ఉత్తరమున సాత్పురా పర్వతములనుండి దక్షిణమున కృష్ణవరకునుగల ప్రాంతమునకు మహారాష్ట్రమను వాడుక హుయాన్‌త్సాంగ్ పర్యటన కాలముననే కలదని తెలియవచ్చుచున్నది. ఇచ్చట వసించువారు వీరత్వమునకు పేరొందినవారని అతడు తెలియజేసెను. మహమ్మదీయ దండయాత్రలను నిరోధించుటకై

ఈ జాతియందు కలిగిన నూతన చైతన్యమును క్రీ. శ. 14 వ శతాబ్దమునుండి జ్ఞానేశ్వరుడు, తుకారామ్ మొదలగు భక్తులు సాంస్కృతికముగ పోషించి, పెద్దచేసి, హైందవ సభ్యతా పునరుజ్జీవనోద్యమమునకు ఆలవాలముగ ఈ జాతిని రూపొందించిరి. మొగల్ చక్రవర్తి జహంగీర్ పాదుషా [చూ. పు. 476] కాలములో అతనికిని, అహమ్మద్ నగర్ పాలకులగు నిజామ్‌షా వంశజులకును జరిగిన యుద్ధములలో మొగల్ సైన్యములను అడ్డగించుటలో అహమ్మద్‌నగర్ రాజ్యసేనాపతి మాలిక్ అంబర్ [చూ.] కు సహాయము చేసి, తమ సమరకౌశలమును నిరూపించు కొను అవకాశము మహారాష్ట్రులకు కలిగినది.

కాని, మహారాష్ట్రులకుగల యుద్ధకౌశలమునకు దేశ భక్తిని జోడింపజేసి, వారిని ఒక మహాసామ్రాజ్యపు నిర్మాతలుగ చేసినవాడు శివాజీ [చూ.]. 1645 మొదలుగ ఇతడు క్రమక్రమముగ రాజనీతి కుశలతచేతను, తన సైనికుల యుద్ధనైపుణ్యముచేతను అటు మొగల్‌లను, ఇటు అహమ్మద్‌నగర్, బీజపూర్ సుల్తాన్‌లను నిలువరించి ఒక స్వతంత్రరాజ్యమును నిర్మించి, 1674, జూన్ 6 వ తేదీన 'ఛత్రపతి' అను బిరుదముతో స్వతంత్రరాజుగ పట్టాభిషిక్తుడయ్యెను.

విజేతగనేకాక, పరిపాలనా కుశలుడుగ సైతము అతడు పేరు వహించెను. చక్కని పరిపాలనాయంత్రమును నిర్మించి, మహారాష్ట్రుల సామ్రాజ్యమునకు దిటవుగ పునాదిని అతడు ఏర్పరచెను. కాని, శివాజీ మరణము (1680) తరువాత ఈ రాజ్యమును విపరీత పరిస్థితులు ఎదుర్కొనెను. శివాజీ కుమారుడు శంభూజీ మొగల్‌ల వైపు చేరుటవల్ల విడిచివేయబడెను. మరియొక భార్య సంతానము అగు రాజారామ్ అను కుర్రవాడు సింహాస నాధీశుడు అయ్యెను. ఇది మహారాష్ట్రులలో చీలికలకు కారణము అయ్యెను. చాలమంది శంభూజీ పక్షము అవలం బించిరి. అతడే రాజుగ గుర్తింపబడి, రాజారామ్ పదవీచ్యు తుడు కావింపబడెను. రాజారామ్ తల్లి దుర్మరణము పాలయ్యెను. రాజారామ్ అనుచరులు 200 మంది హత మార్చబడిరి. మొగల్‌లతో యుద్ధము తిరిగి ప్రారంభింప బడెను. జూన్, 1681 లో ఔరంగజేబ్ ఔరంగాబాద్ చేరి ఎల్లలన్నిటిని తన బలములతో ముట్టడించెను. ఈ పరిస్థితు లలో కవికులేశుడు అను ఒక కనోజ్ బ్రాహ్మణునిచేతి కీలు బొమ్మయై శంభూజీ తన మంత్రుల సలహాలను వినక, దుస్సాహసపు చర్యలకు దిగి జింజీరాలోని అబిసీనియన్ లపై దాడి చేసి తన బలమును చాలవరకు కోలుపోయెను. ఈ సమయముననే ఔరంగజేబ్ అజమ్ రాకుమారుని పెక్కుమంది సైనికులతో మహారాష్ట్రమునందలి కొండ కోటలను పట్టుకొనుటకై పంపెను. మువజ్జమ్‌ను తగు సైన్యముతో కొంకణదేశముపై దండెత్త పంపెను. కాని, అతని సైన్యము పూర్తిగ కొంకణదేశములో నాశనమై పోయెను.

ఔరంగజేబ్ బిజపూర్‌ను 1685 లో ముట్టడించి, 1686 లో పట్టుకొనెను. 1687 లో గోల్కొండ స్వాధీనమయినది. 1689 లో శంభూజీని పట్టుకొని మొగల్‌లు చంపివైచి, అతని భార్యను, పసివాడగు అతని కుమారుని ఖైదు చేసిరి. శంభూజీ మరణము మహారాష్ట్రుల పట్టుదలను పెంచినది. అంతట శివాజీ చిన్నకొడుకైన రాజారామ్ 1689 లో జింజీకడ పట్టాభిషిక్తుడు అయ్యెను. మొగల్‌లు పట్టుకొన్న కోటలను తిరిగి ఆక్రమించుటకై మహారాష్ట్రులు గట్టి ప్రయత్నము చేసి పనహాల మొదలగు కోటలను కొన్నింటిని వశపరచుకొనిరి. నవంబరు, 1689లో రాయఘడ్ మొగల్‌ల వశమైనది. మహారాష్ట్రులు తమ సైనికులను కొంతమందిని దూరమున ఉన్న తూర్పు కోస్తాకు మార్చి మొగల్ సైన్యములను విడదీయుట మంచిదని నిశ్చయించిరి. అందుచే రాజారామ్ కర్ణాటకప్రాంతమునకు ఏగి, బల వత్తరమగు జింజీదుర్గమును తన నివాసముగ చేసికొనెను. శాంతాజీ ఘోర్పారే, తానాజీ జాధవ్ అను ఇద్దరు నాయకులు పశ్చిమ ప్రాంతములో మొగల్ సేనలను ఎదుర్కొనుచు దాడులు జరుపుటకై నియోగింపబడిరి. మహారాష్ట్రమున శత్రువులను ప్రతిఘటించు భారము రామచంద్రబవదేకర్ అను సేనానిపై బడెను. ఈ పరిస్థితు లలో తొలుత జింజీని వశపరచుకొనుట సముచితమని భావించి జుల్ఫికర్‌ఖాన్ అను ఒక సేనానిని ఔరంగజేబ్ పంపెను (1691). ఎనిమిది సంవత్సరముల ముట్టడి జరిగిన పిదప జింజీ మొగల్‌ల స్వాధీనమయినది. కాని, రాజారామ్ సతారాకు పారిపోయెను.

ఈ పరిస్థితులలో మహారాష్ట్ర రాజ్యమును నిలబెట్టిన పేరు శాంతాజీఘోర్పారేకు దక్కినది. విస్తరించిన రణరంగముపై పెక్కుమంది సైనికులను నడిపించుటలో అతనికి ప్రత్యేక సామర్థ్యము కలదు. కాసీమ్‌ఖాన్ అను మొగల్ సేనాని ఆధిపత్యము క్రింద ఉన్న సైన్యమును అతడు 1695 లో నాశనము ఒనర్చెను. ఇంతలో శాంతా జీకి, రాజారామ్‌కు మధ్య వివాదములు పెరిగినవి. శాంతాజీ పదవీచ్యుతుడు కావింపబడి, ఆ పదవిని ఆక్ర మించుకొన్న తానాజీ జాదవ్ యొక్క ప్రేరణపై హత్య గావింపబడెను. 1698 లో రాజారామ్ సతారా నగర మును తన ముఖ్య పట్టణముగ చేసికొనెను. 1700 లో

అతడు కీర్తిశేషుడయ్యెను. అతని అనంతరము తారాబాయి అను అతని రాణి రాజ్యతంత్రమును నడిపించినది. రాజారామ్ మరణము వలనను, వారసత్వపు తగాదాల వలనను, 1699 - 1701 లో కలిగిన ఔరంగజేబ్ విజయముల వలనను కలిగిన ఇక్కట్లనుండి రాజ్యమును తారాబాయి తన దక్షత వలన రక్షించినది.

రాజారామ్ 1700 లో మరణించిన తరువాత, ఒక నెలకు సతారాను ఔరంగజేబ్ ముట్టడించెను. నాలుగు సంవత్సరముల పాటు పోరు సాగెను. 1702 నుండి 1707 లోపల తారాబాయి తన సేనానాయకుల సాహాయ్యముతో కొంకణ ప్రాంతములో కోటలను చాలభాగము వశపరచుకొనెను. సూరత్ నుండి బరంపురం వరకు చౌత్ వసూలు చేయబడెను.

ఔరంగజేబ్ [చూ. పు. 364] మరణానంతరము (1707) మహారాష్ట్రులలో విభేదములను కలిగించు ఉద్దేశముతో మొగల్‌లు శంభూజీ కుమారుడగు సాహూను విడుదల చేసిరి. శంభూజీని మొగల్‌లు బంధించి వధించిన సమయమున సాహూను తమ వద్దనే ఉంచుకొనిరి. ఆ నాటికి పసివాడుగ ఉండిన సాహూ ఔరంగజేబ్ రాణి వాసమున పెరిగెను. విడుదలకు ముందుగ మొగల్‌లు అతనికి మన్సబ్దార్ పదవిని ఒసగిరి. విడుదలైన వెంటనే ఇతడు మహారాష్ట్రమునకు అధిపతిని తానే అని ప్రకటించెను. తారాబాయి అతనికి రాజ్యార్హత లేదని ప్రకటించి, ప్రతిఘటించుటకు సైన్యమును ప్రోగుచేసెను. దానితో అంతర్యుద్ధము ఆరంభమైనది. మహారాష్ట్ర సామ్రాజ్యమునకు రెండవ స్థాపకుడు అనదగు బాలాజీ విశ్వనాథ్ సాహూకు సాహాయ్యకుడయ్యెను. అతని మేధా సహాయమే లేనిచో సాహూ ఒక ఏడుకూడ తట్టుకొనగలిగెడువాడు కాడు. కడపట 1707, అక్టోబరులో తారాబాయి సేనలను సాహూ ఓడించి, 1708 లో సతారా యందు ఛత్రపతిగ పట్టాభిషిక్తుడయ్యెను. కాని, అతని నూతన ప్రభుత్వము తొలుత పెక్కు చిక్కులను ఎదుర్కొనవలసివచ్చెను. అతనిని తొలుత బలపరచిన వారిలో ఒకడును, మహారాష్ట్ర నౌకాధిపతియు నగు కన్హోజీ ఆంగ్రే 1713 లో ఎదురు తిరిగి, సాహూపై యుద్ధమును ప్రకటించెను. అతని తిరుగుబాటును అడచుటకై సాహూ తన పీష్వాను (ప్రధాన మంత్రిని) నియోగించెను. కాని, ఆ పీష్వాను కన్హోజీ ఓడించి ఖైదు చేయుటతో ఊరుకొనక, సతారాను ముట్టడించుటకు సైతము ఉద్యమించెను. ఈ పరిస్థితిలో తనకు సాహాయ్యకుడుగ తొలుతనుండియు వ్యవహరించుచున్న బాలాజీని పీష్వాగా సాహూ నియమించి (17 నవంబరు, 1713) కన్హోజీపైకి పంపెను. బాలాజీ తన నీతి చతురతచే కన్హోజీయందు దేశభక్తిని రగులుగొల్పి, సాహూకు వశం వదుడగునట్లు చేయగలిగెను.

బాలాజీ విశ్వనాథుని ప్రయత్న ఫలితముగ దక్షిణమున ఉన్న మొగల్ సుబాలపై చౌత్, సర్ దేశ్‌ముఖ పన్నులను వసూలుచేసికొను అధికారము 1718 లో మహారాష్ట్రులకు లభించినది. దీనికి ప్రతిఫలముగ మొగల్‌లకు 15 వేల సైనికులను ఇచ్చుటకును, దేశములో దారి - దోపిళ్లు జరుగుకుండునట్లు చూచుటకును మహారాష్ట్రులు ఒప్పుకొనిరి. 1720 లో బాలాజీ కాలధర్మము నొందెను. అతని కుమారుడు బాజీరావు అతని అనంతరము పీష్వా పదవిని ఆక్రమించెను. బాజీరావు తండ్రికంటె కూడ నిపుణుడు.

నిజాముల్ ముల్క్ అసఫ్ జా హైదరాబాదులో స్వాతంత్ర్యమును 1725 లో ప్రకటించెను. 1725 - 1727 లోగా బాజీరావు చితల్ దుర్గమునకును, శ్రీరంగపట్టణమునకును రెండు దండయాత్రలను నడపెను. ఇవి మహారాష్ట్రులకును, నిజామ్‌నకును మధ్య వైరము తెచ్చినవి. దౌలతాబాద్ దగ్గర ఉన్న పాలఖేడ్ వద్ద మహారాష్ట్రులు నిజామ్‌ను ఓడించిరి (1727). మహారాష్ట్ర రాజ్యమునకు నేతగ సాహూను నిజామ్ గుర్తించెను.

అంతట బాజీరావు తన దృష్టిని ఉత్తర హిందూస్థానమువైపునకు మరలించెను. పెనుగాలివలె అతడు విజృంభించి మధ్య దేశమున విశాల ప్రాంతములను జయించి తన ప్రతినిధులను అట ముఖ్యులను వేర్వేరు ప్రదేశములందు నియమించెను. వీరే ఆ తరువాత క్రమముగ గైక్వాడ్, హోల్కార్, సింధియా రాజవంశములకు మూల పురుషులైరి. 1737 లో మహారాష్ట్ర సేనలు బాజీరావు నాయకత్వమున ఢిల్లీనగరమును సమీపింపగనే, పాదుషా సైనికులు నిశ్చేష్టితులై, కాలు, చేయి ఆడక ఊరకుండిరి. మొగల్ సామ్రాజ్యపు నీరస స్థితి తేటతెల్లమయ్యెను. కాని, బాజీరావు మాత్రము ఢిల్లీని వశపరచుకొనుటగాని, దోచుకొనుటగాని జరుపలేదు. మొగల్ పాదుషాకు మహారాష్ట్ర సైనికుల ప్రతాపమును రుచిచూపుట మాత్రమే ఈ దాడిలో తన సంకల్పమని అతడు అనెను. ఇంతలో పాదుషా సహాయార్థము దక్కన్ నుండి అసఫ్ జా వచ్చుచున్నాడని తెలియవచ్చి, అతనిని మధ్యమార్గమున సమరభూమిలో కలసికొనుటకై బాజీరావు ఢిల్లీనుండి దక్షిణమునకు పయనించెను. భోపాల్ వద్ద జరిగిన యుద్ధమున అసఫ్ జా ఓడిపోయి, బాజీరావుతో సంధి చేసికొనెను. ఈ సంధిని అనుసరించి నర్మదనుండి యమున వరకు గల విశాల దేశమున సర్వాధిపత్యమును, ఏబది లక్షల రూపాయల నష్ట పరిహార

మును మహారాష్ట్రులకు లభించెను (1738). ఈ ఒడంబడికకు చక్రవర్తి అనుమతించెను; ఇది బాజీరావునకు గొప్ప విజయము.

ఈ సందడిలోనే నాదిర్‌షా దాడి జరిగినది (1739). చక్రవర్తి మహమ్మద్‌షా జితోస్మి అనెను. సింహాసనముపై ఏబదియేడు దినములు కూర్చొని, అంతట మహమ్మద్‌షాను చక్రవర్తినిచేసి నాదిర్‌షా వెనుదిరిగిపోయెను. ఆసమయమున పోర్చుగీస్‌వారివద్దనుండి 1739 లో పశ్చిమతీరము నందలి బెస్సీన్ కోటను బాజీరావు పట్టుకొని, తన రాజ్య పరిస్థితిని పదిలపరచుకొనెను. 1740 లో నలుబదిరెండవ ఏట బాజీరావు అకాలమరణము చెందెను. రెండు శతాబ్దముల లోపల మహారాష్ట్రరాజ్యమును నాలుగు దిక్కులకును విస్తరింపజేసి, శత్రువులను లొంగదీసిన ఖ్యాతి ఇతనికి దక్కినది.

బాజీరావు అనంతరము 19 ఏండ్ల చిరుత వయస్సున అతని పుత్రుడగు బాలాజీరావు పీష్వా పదవి చేబూనెను. సాహూ ఇతనిని సొంతకుమారునివలె ప్రేమించెడివాడు. బాలాజీరావుకు విరోధులు మెండుగ ఉండెడివారు. ప్రతికక్షులకు రఘోజీ భాన్సలే నాయకుడు. ఒక సంవత్సరము పాటు దేశీయాంతరంగికవ్యవహారములు సరిదిద్దుకొని, బాలాజీరావు మాల్వాదేశముపై దాడివెడలి జయించెను. బంగాళమునుండి రఘోజీని తరిమివేయుటకు సహాయము అవసరమై, మొగల్ చక్రవర్తి మాళ్వాదేశమును మహారాష్ట్రులకు వ్రాసి ఇచ్చెను (1742). బాలాజీ రఘోజీని ఓడించెను (1743). కడకు 1743, ఆగష్టులో సాహూసన్నిధిని ప్రతికక్షులగు బాలాజీ, రఘోజీలు సంధి చేసికొనిరి. రఘోజీ తిరిగి బెంగాల్‌పై చౌత్ విధించు అధికారమును, కటకమును సంపాదించుకొనెను.

ఆర్కాట్ నవాబ్‌నకు అల్లుడగు చందాసాహేబ్‌ను చెరబట్టి, తిరుచునాపల్లిలో మహారాష్ట్రులు తమ అధికారమును 1740 - 41 లో స్థాపించిరి. 1743 లో సాహూ అపుత్రకుడై గతించెను. కొల్హాపూర్ రాజగు శంభూజీని పెంచుకొనవలెనను అతని కోరిక నెరవేరలేదు. ముసలి తారాబాయి తన మనుమని ఒకనిని బాలాజీ సహాయముతో నిలబెట్టెను. కాని, సాహూ మరణమునకు పూర్వమే అతనినుండి రాజ్యాధికారము అంతయు పీష్వా చేతిలోనే అటమీదట ఉండునటుల బాలాజీ మరణశాసనము పొందెను. అంతట తారాబాయి మనుమడు రామరాజుకు 1750 లో పట్టాభిషేకము జరిగినది. రాజును బాలాజీ పూనాకు తీసికొనివచ్చెను. కాని, ఈ రామరాజు సమర్థత లేనివాడు. అందుచే మహారాష్ట్రరాజ్య పరిపాలన సక్రమముగ జరుగవలయుననిన, పరిపాలనలో అతడు జోక్యమేమియు వహింపకుండుట సముచితమని పీష్వా తలచెను. అతని ప్రతిస్పర్ధి అగు రఘోజీసైతము ఈ విషయమున పీష్వాను బలపరచెను. ఈ నిర్ణయము పూర్వమున సాహూ ఒసగిన మరణశాసనమును అనుసరించినదియే అగుటవలన తక్కిన ప్రముఖ మహారాష్ట్రనాయకులును ఆమోదించిరి. తదనుసారముగ పీష్వా చెప్పినరీతిగ అధికారముల విభజించి నిర్ణయించుటకు ఒప్పుకొనుచు - రామరాజు రాజ్యమునకు వచ్చిన వెనువెంటనే - ఒక ఒడంబడికను వ్రాసి ఇచ్చెను. దీనినే 'సంగోలా ఒడంబడిక' అని వ్యవహరింతురు. కాని, ఇటుల తన మనుమడు సర్వాధికారములను విసర్జించుట తారాబాయికి దుర్భరముగ ఉండెను. అందుచేత, నవంబరు, 1750 లో బాలాజీ దక్షిణదేశ దండయాత్రకు పోయిన సమయమున రామరాజును తారాబాయి సతారాలో ఖైదుచేసి, రామరాజు తన కుమారుని కొడుకు కాదని ప్రకటించి, తానే రాజ్యాధికారముల బూనుటకు యత్నించెను. కొందరు మహారాష్ట్రనాయకులును ఆమెను బలపరచిరి. బాలాజీ తిరిగి స్వదేశమునకు వచ్చి తారాబాయి అనుచరులను ఓడించుటచే, చేయునది లేక తారాబాయి 1752, సెప్టెంబరులో రాజీపడెను. ఆ రాజీని అనుసరించి ప్రభుత్వమున తాను జోక్యము వహింపకుండుటకు అంగీకరించినను, రామరాజు ఛత్రపతి శివాజీ వంశపువాడు కాదని అనుటలో మాత్రము ఆమె పట్టు విడువకుండెను. అందువలన రామరాజు సతారాలోనే తారాబాయి మరణపర్యంతము (డిసెంబరు 1761) నిర్బంధమున ఉండెను. తరువాత 1763 లో అతడు ఛత్రపతిగ మరల సింహాసనాసీనుడయ్యెను.

అసఫ్‌జా 77 వ ఏట (1748) చనిపోయెను. అంతట అసఫ్‌జాహీ (నిజామ్) సింహాసనపు తగవులతో ఫ్రెంచి, బ్రిటిష్ కంపెనీలతోపాటు మహారాష్ట్రులును జోక్యము కల్పించుకొనిరి. కడకు నిజామ్‌గ గుర్తింపబడిన సలాబత్ జంగ్‌ను తొలుత మహారాష్ట్రులు తమ పక్షమునకు త్రిప్పుకొని, తమ చెప్పుచేతలలో ఉంచుకొనిరి. కాని, ఫ్రెంచి సేనానియగు బుస్సీ తన అమేయమగు రాజకీయ చాతుర్యముతో సలాబత్‌జంగ్‌ను మహారాష్ట్రులబారినుండి రక్షించి బాలాజీతో ఒడంబడిక చేసికొనెను. 1752 - 1760 లోగా సీరా, సావనూర్, కర్నూల్, కడప నవాబులను మహారాష్ట్రులు లోబరచుకొనిరి. 1758 లో బుస్సీ పుదుచ్చేరికి పోవుటతో దక్కన్ పరిస్థితులు మారినవి. 1760, జనవరిలో మహారాష్ట్రులు నిజామ్‌రాజ్యముపై దాడివెడలి బీదర్ దగ్గర ఉన్న ఉద్గీర్ వద్ద నిజామ్‌సైనికులను ఓడించిరి.

పీష్వా సోదరుడగు రఘునాథరావు ఆఫ్ఘనిస్తాన్ పాలకుడగు అబ్దాలీకి చెందిన పంజాబ్‌ను అంతటిని 1758 లో ఆక్రమించుకొనెను. కాని, ఈ విజయమే మహారాష్ట్రుల పతనమునకు దారితీసెను. ఉత్తర హిందూస్థానమున మహమ్మదీయులు కాక, సిక్కులును మహారాష్ట్రులపట్ల ఇదివరకే శత్రుత్వము వహించి ఉండిరి. ఇపుడు పంజాబ్ ఆక్రమణవలన అబ్దాలీయు శత్రువయ్యెను. 1759 లో అబ్దాలీ మరలవచ్చి పంజాబ్‌ను తిరిగి వశపరచుకొనెను.

ఇంతలో ఢిల్లీ సమ్రాట్, మహారాష్ట్రుల చేతి కీలుబొమ్మయు అగు అలంగీర్ చక్రవర్తి మరణించి షా అలమ్ చక్రవర్తి అయ్యెను. ఇతడును మహారాష్ట్రులను అనుసరించియే నడచుచుండెను. మహమ్మదీయులకు అందరికి ఈ దుస్థితి కష్టదాయకముగ ఉండెను. ఈ అవకాశమును ఉపయోగించుకొని మహమ్మదీయుల సానుభూతిని ఆర్జించుకొనుటకు కృషిచేసి, తుదకు అబ్దాలీ ఢిల్లీపైకి దండెత్తెను (1759). ఢిల్లీని రక్షించు బాధ్యత మహారాష్ట్రులపై పడెను.

పీష్వా దాయాది, ఉద్గీర్ విజయమును చేకూర్చినవాడు అగు సదాశివభావే 30 వేల సైన్యముతో ఢిల్లీకి వెడలెను. ఆగస్టు, 1760 లో సైన్యము ఢిల్లీలో ప్రవేశించెను. ధైర్యము వహించి అబ్దాలీ యమునానదిని దాటెను. ఇరువాగులవారును పానిపట్టువద్ద తారసిల్లిరి. రెండు మాసములు కాలము వృథాయైనది. మహారాష్ట్రులకు సామగ్రులు అందక సంధి చేసికొనుటకు యత్నించిరి. కాని, పొసగలేదు. జనవరి 14, 1761 వ తేదీని యుద్ధము ఆరంభమయ్యెను. మహారాష్ట్రులు ఓడిపోయిరి. భావే మరణించెను. బాలాజీరావు గుండె పగిలి గతించెను. బ్రిటిష్‌వారి రాకకై హిందూస్థానమున దారిని చక్కజేసిన చీపురుకట్ట ఈ పానిపట్టు యుద్ధముఅని ఒక చరిత్రకారుడు వచించెను.

బాలాజీరావు తరువాత వెనుకటి పీష్వా కొడుకు మాధవరావు పీష్వా అయ్యెను. అప్పటికి అతని వయస్సు 17 సంవత్సరములు మాత్రమే అగుటచే అతని పినతండ్రి యగు రఘునాథరావు అధికారము నెరపుచుండెను. కొలది కాలములోనే మాధవరావు తన పినతండ్రి పెత్తనమునుండి బయటపడెను. అందుచే రఘునాథరావు నిజామ్‌తోచేరి అతని సైన్యముతో పూనాపై దండయాత్రకు బయలుదేరెను. పరిస్థితులు విషమించినందువలన మాధవరావు దాసోహమనెను. కాని, 1763 లో నిజామ్‌ను మహారాష్ట్రులు రాక్షసభువన్ అనుచోట ఓడించిరి. 1764, 1766 లలో మాధవరావు మైసూరుపై దాడిసలిపి హైదరాలీ [చూ.] ని ఓడించెను. రాజపుత్రులపైకిని, రోహిల్లాలపైకిని మాధవరావు సైన్యములను అంపెను. వారినుండి కప్పము గొని, 1771 లో ముసలివాడగు ఢిల్లీచక్రవర్తిని బ్రిటిష్ వారి రక్షణనుండి తొలగించి తమ రక్షణలోనికి మహారాష్ట్రులు గ్రహించిరి. అప్పటివరకు ఢిల్లీని వదలి అలహాబాదునందు ఉండిన చక్రవర్తి మహారాష్ట్రుల సాయమున ఢిల్లీ చేరెను. 1772 లో మాధవరావు కీర్తిశేషుడయ్యెను. పీష్వాలు అందరిలోను మాధవరావు శీలము ఉన్నతమైనది. ఈతని చావుతో పరస్పర ద్వేషములను అరికట్టెడి శక్తి అంతమయ్యెను.

మాధవరావుకు పుత్రులు లేనందున అతని సోదరుడు నారాయణరావు పీష్వా అయ్యెను; రఘునాథరావు బంధింపబడెను. కానీ, అతని భార్య ఎట్లో నారాయణరావును చంపించి, తన భర్త పీష్వా అగునట్లు చేసెను. నారాయణరావు భార్య గంగాభాయి భర్త మరణానంతరము ఒక పుత్రుని కనెను. నానాఫడ్నవీస్ [చూ. పు. 531] మున్నగు సచివులు రఘునాథరావును పీష్వా కానీయ కూడదని శపథము పట్టిరి. నారాణరావు కుమారుడు మాధవరావు - II అనుపేర పీష్వాగా ప్రకటింపబడెను. హోల్కార్, సింధియాల సహాయమును రఘునాథరావు అర్థించెను. కాని, వారు తటస్థులై ఊరకుండిరి. అందుచే అతడు బ్రిటిష్‌వారివైపుకు తిరిగెను. 1775 లో జరిగిన సూరత్‌సంధి ప్రకారము బొంబాయియందలి బ్రిటిష్‌కంపెనీ ప్రభుత్వము సహాయము చేయుటకు ఒప్పుకొనెను. బొంబాయిప్రభుత్వము రఘునాథరావును పూనాలో ప్రతిష్ఠించుటకు నిశ్చయించెను. సింధియా, హోల్కార్ లతో కలసి నానాఫడ్నవీస్ ఇంగ్లీషువారిని వాడ్‌గామ్ వద్ద శరణార్థులు అగునట్లు చేసెను (1779). అంతటితో ఆగక మున్ముందు జాగ్రత్తకై హైదరాలీ, నిజామ్‌లతో నానాఫడ్నవీస్ మైత్రి కుదుర్చుకొనెను. బ్రిటిష్‌వారును మరల యుద్ధమునకు సన్నద్ధమైరి.

బ్రిటిష్‌సైన్యము 1780, ఫిబ్రవరిలో అహమ్మదాబాదుపై పడెను. ఆ సంవత్సరమే ఆగస్టులో గ్వాలియర్‌కోట బ్రిటిష్‌వారి వశమయ్యెను. కాని, ఈ సమయముననే హైదరాలీతో కూడ దక్షిణదేశమున బ్రిటిష్‌వారు పోరాడవలసివచ్చెను. కావున, ఎటులైన మహారాష్ట్రులతో సంధి చేసికొనుట మంచిదని గవర్నర్-జనరల్ హేస్టింగ్స్ [చూ.] భావించెను. సింధియాతో 1781 లో సంధి జరిగెను. 1782 లో జరిగిన సాల్బేయి సంధిప్రకారము బ్రిటిష్‌వారు తాము మహారాష్ట్రులనుండి జయించిన ప్రాంతములు అన్నిటిని మహారాష్ట్రులకు తిరిగి ఇచ్చివేసిరి.

ఈ సాల్బేయిసంధి ఫలితముగ మహ్దాజీ సింధియా ఇంచుమించు సర్వస్వతంత్రుడయ్యెను. బెనోయిట్ డి బోయినీ

అను ఒక ఫ్రెంచివానిని సింధియా తన సైన్యమునకు శిక్షణ ఇచ్చి నాయకత్వము వహించుటకు ఏర్పాటు చేసెను. 1783 లో మహ్దాజీ గ్వాలియర్‌ను పట్టుకొని ఢిల్లీపై పలుకుబడిని సంపాదించెను. మహ్దాజీని వకీల్ - ఇ - ముత్లక్ - అనగా రాజప్రతినిధిగా - షా ఆలమ్ చక్రవర్తి ఏర్పరచుటతో మహ్దాజీకి ఢిల్లీ, ఆగ్రాలపై అధికారము చేజిక్కెను. 1785 వ సంవత్సరము గతించుసరికి షా ఆలమ్ అధికారమునకు వ్యతిరేకించిన ఆగ్రాపాలకుడు మహమ్మద్ బేగ్‌ను ఓడించి, దో ఆబ్, ఆగ్రా, అలిఘుర్‌లను సింధియా మరల వశపరచుకొనెను.

టిప్పుసుల్తాను [చూ. పు. 497] కు వ్యతిరేకముగ నానాఫడ్నవీస్ నిజామ్‌తో ఒడంబడిక 1784లో చేసికొనెను. 1785 లో టిప్పు మహారాష్ట్రులపై పడెను. నానాఫడ్నవీస్ బ్రిటిష్ వారి సహాయము అర్థించెను. కాని, అప్పటి గవర్నర్-జనరల్ కారన్‌వాలిస్ ఒప్పుకొనలేదు. 1787 లో మహారాష్ట్రులకు అనుకూలమైన సంధితో యుద్ధము ముగిసెను. ఈలోగా మహ్దాజీ కష్టములకు గురి అయ్యెను. రాజపుత్రులు కప్పము కట్టుట మానివేసిరి. జయపూర్‌నుండి అతని సైన్యము తరిమివేయబడెను. గులామ్‌ఖాదర్ అను రోహిల్లా నాయకుడు 1788 లో ఆగ్రా, ఢిల్లీరాష్ట్రములను ఆక్రమించుకొని షా ఆలమ్‌ను గ్రుడ్డివానిని చేసెను. నానాఫడ్నవీస్ సింధియాకు సహాయము చేయుటకొరకు గట్టి దళమును అంపెను. వారు 1789లో ఢిల్లీని తిరిగి సంపాదించి, గులామ్‌ఖాదర్‌ను చంపి, షా ఆలమ్‌ను తిరిగి సింహాసనాసీనుని చేసిరి. 1790 లో రాజపుత్రులు ఓడిరి. 1792 లో రాణీ అహల్యాభాయి సైన్యాధ్యక్షుడగు తుకోజీ హోల్కార్‌ను ఓడించి, మహ్దాజీ ఉత్తర భారతదేశములో సాటిలేని రాజ్యాధికారము సంపాదించెను. 1794 లో అతని హఠాన్మరణముతో మహారాష్ట్రులు తమయందరిలోను సమర్థుడగు నాయకుని, అసమాన రాజకీయవేత్తను కోలుపోయిరి. మహ్దాజీ మరణమువలన నానాఫడ్నవీస్ నాయకత్వము ప్రతికక్షి లేనిదైనది. కాని, పరస్పర అవిశ్వాసములు మహారాష్ట్ర రాజ్యకూటమి పని చేయకుండ చేసినవి. 1794 లో పీష్వా తన చౌత్, సర్దేశ్‌ముఖల పాతబాకీలను ఇమ్మని నిజామ్‌ను అడిగెను. 1795 లో ఖర్దావద్ద మహారాష్ట్రులు నిజామ్‌ను ఓడించిరి. దీనితో నానాఫడ్నవీస్ స్థితి ఉన్నతమైనది. కాని, మాధవరావు - II పీష్వాయొక్క ఆత్మహత్య పూనాలో కలకలము లేపినది. రఘునాథరావు పుత్రుడగు బాజీరావు పీష్వా పదవి తనదనెను. మూడు సంవత్సరములపాటు బాజీరావు, నానాఫడ్నవీస్‌లు అధికారమునకై పోరాడిరి. తుదకు 1796 లో అతుకులబొంతవంటి ఒక సంధిప్రకారము నానాఫడ్నవీస్ బాజీరావు - II యొక్క పీష్వాపదవిని ఒప్పుకొనెను. 1800 లో నానాఫడ్నవీస్ పరమపదించెను.

నానాఫడ్నవీస్ మరణానంతరము కలహాశక్తులు విజృంభించెను. వాటిని అణచలేక బాజీరావు పూనానుండి పలాయితుడై బ్రిటిష్‌వారి శరణుజొచ్చెను. దాని ఫలితమే బెస్సీన్ సంధి (1702). దాని మూలముగ బ్రిటిష్‌వారికి తమ సంపూర్ణ ప్రాబల్యమును మహారాష్ట్రులపై ఏర్పరచుకొనుటకు అవకాశము చిక్కెను. 1803 లో బ్రిటిష్‌వారికిని, మహారాష్ట్ర రాజ్యకూటమికిని మధ్య యుద్ధము ఆరంభమయ్యెను. మహారాష్ట్ర రాజ్యకూటమి పూర్తిగ ఓడిపోయినది. మొగల్ పాదుషా బ్రిటిష్‌వారి హస్తగతుడు అయ్యెను. బాజీరావు - II బ్రిటిష్‌వారి శత్రువైన త్రియంబక్‌జీ యొక్క ప్రభావమునకు లోనయ్యెను. 1814 లో గాయక్వాడ్ మంత్రి అగు గంగాధరశాస్త్రి తమ ప్రభుత్వమునకును, పూనాప్రభుత్వమునకును గల తగాదాలను పరిష్కారము చేసికొనుటకు పూనా వెళ్ళగా అచట హత్యగావింపబడెను. బ్రిటిష్ రెసిడెంట్ ఎల్ఫిన్‌స్టన్ అనునతడు హంతకుడగు త్రియంబక్‌జీని తన వశము కావించుకొనెను. కాని, బ్రిటిష్‌వారినుండి అతడు ఎట్లో తప్పించుకొని పారిపోయెను.

ఎల్ఫిన్‌స్టన్ మరియొక సహకారసంధిని పీష్వాపై 1817 లో విధించెను. దాని ప్రకారము మహారాష్ట్ర రాజ్యకూటమిపై తన నాయకత్వమును పీష్వావదలుకోవలెను. ఇందులకు కుపితుడై పీష్వా పితూరి చేసెను. రెసిడెన్సీ దహనము కావింపబడెను. అంతట బ్రిటిష్ సైన్యములు పీష్వాపై దండెత్తెను. ఖిర్కీ అను పట్టణము వద్ద జరిగిన యుద్ధమున బ్రిటిష్‌వారు విజయము పొందిరి. పీష్వా శరణు జొచ్చెను (జూన్ 3, 1818). అతనికి బ్రిటిష్‌వారు సాలుకు ఎనిమిది లక్షల రూపాయలు భరణమును మంజూరు చేసిరి. జీవితశేషమును కాన్‌పూర్ వద్ద బిఠూర్‌లో గడిపి, 1851 లో పీష్వా మరణించెను. అతని దత్తపుత్రుడగు దండుపంత్ నానాసాహెబ్‌కు బ్రిటిష్‌వారు ఈ భరణమును ఇచ్చుటకు నిరాకరించిరి. అందుచే బ్రిటిష్ ప్రభుత్వము ఎడల అతడు విరోధము వహించి భారతదేశమున వారి సామ్రాజ్యాధికారమును అంతరింపజేయుటకై సాటి దేశభక్తులతో కలసి యత్నములు చేసెను. ఈ ప్రయత్నములే తుదకు 1857 లో భారతస్వాతంత్ర్య ప్రథమసంగ్రామముగ పరిణమించెను [చూ. భారతదేశము - పు. 664].

ప్ర. రా.

**మహావంసము :** చూ. దీపవంసము, మహావంసము-పు. 528.

**మాంటెస్క్యూ, చార్లెస్ లూయీ ద సెకండెత్ (1689 - 1755) :** ఫ్రెంచి విప్లవమునకు ప్రజలను పురికొల్పిన రచయితలలో ఒకడు. కాని, ఆ రచయితలు అందరితోపాటు ఈతడును హింసావిధానమునకు వ్యతిరేకి. ప్రజలకు అన్ని విషయములు తెలియజెప్పినచో దేశము సంస్కరింపబడునని నమ్మినవాడు. కాని, ఈతడు అనుకొనకుండగనే ఈతని రచనలు ప్రజలను దౌర్జన్య పూరితమగు విప్లవమునకు పురికొల్పినవి. లెస్ స్పిరిత్ డెలా (న్యాయశాస్త్ర రహస్యము) అనునది ఈతని రచనలలో ప్రముఖము. ఈ గ్రంథమున చరిత్రలోని అనేక ప్రభుత్వవిధానముల పరిశీలనము కలదు. ప్రభుత్వములో శాసననిర్మాణ, శాసనాచరణ, శాసనవివరణ శాఖలు వికేంద్రీకరింపబడినప్పుడే రాజకీయ స్వాతంత్ర్యము సురక్షితముగ ఉండునని ఈతడు విశ్వసించెను. [చూ. అధికారవిభజనము - పు. 262]. ప్ర. రా.



చార్లెస్ లూయీ ద సెకండెత్ మాంటెస్క్యూ (1689 - 1755)

**మాంటేగ్ - ఛెమ్స్‌ఫర్డ్ సంస్కరణలు :** చూ. భారతదేశము - పు. 664.

**మాంట్రూ ఒప్పుదల (20 - 7 - 1936) :** ద్వితీయ ప్రపంచయుద్ధమునకు కొంచెము పూర్వము 1936 లో ఇటలీ నియంతయగు ముస్సోలినీ [చూ.] ఆసియా మైనర్ లోను, ఆఫ్రికాలోను వలసరాజ్యములను నెలకొల్పుటకు చేయు యత్నములగూర్చి భయపడిన తుర్కుల అభ్యర్థనపై స్విజర్లండ్‌లోని మాంట్రూవద్ద జరపబడిన అంతర్జాతీయ సమావేశమున చేయబడిన నిర్ణయమే మాంట్రూ ఒప్పుదల (మాంట్రూకన్ వెన్‌షన్) అని చరిత్రకారులచే వ్యవహరింపబడుచున్నది. డార్డనెల్స్, బాస్‌ఫరస్ అను జలసంధుల ప్రదేశములను సైన్యరహితముగ చేయునట్లు అంగీకరింపబడిన లాసన్నీ ఒడంబడిక [చూ.] లోని నిబంధనలు ఈ సమావేశమున పునఃపరిశీలింపబడినవి. ఈ ఒప్పుదలవలన డార్డనెల్స్, బాస్‌ఫరస్ జలసంధులను సైన్యసమేతమైన దుర్గములతో బలపరచుకొను అధికారము టర్కీకి లభించినది. ఈ ఒప్పుదల పత్రముపై బ్రిటన్, ఫ్రాన్స్, గ్రీస్, యుగోస్లావియా, నల్లసముద్ర రాజ్యప్రతినిధులచే సంతకములు చేయబడెను. శాంతి సమయములందు పై జలసంధుల ద్వారా ప్రయాణములు చేయు యుద్ధనౌకలకు ఉండవలసిన మొత్తము మెట్రిక్ టన్నుల ప్రమాణము నూతన నిబంధనల ద్వారా నిర్ణయింపబడి, అమలుపరచబడెను. స్వ. వెం.

**మాక్సిమిలియన్ - I (1459 - 1519) :** పవిత్ర రోమన్ సామ్రాజ్యచక్రవర్తి. హాప్స్‌బర్గ్ రాజవంశప్రాబల్య విస్తరణకు మూలకారకుడు. ఫ్రెడరిక్ - III సార్వభౌముని కుమారుడు. ఈయన 1477 లో చార్లెస్ ది బోల్డ్ కుమార్తె మేరీని వివాహమాడి బర్గండీ, నెదర్‌లండ్స్‌ల కొరకు ఆమె ఫ్రెంచిరాజు లూయీ - XI తో ప్రారంభించిన యుద్ధమును జయప్రదముగా కొనసాగించెను. కాని, ఇతడు బర్గండీని తప్పనిసరిగ ఫ్రాన్స్‌కు 1482 లో ఇచ్చివేయవలసివచ్చెను ; ఆ ఏటనే మేరీ మరణించెను. 1494 లో మాక్సిమిలియన్ మరల మిలాన్ ప్రభ్వి బియాంకాను వివాహమాడి, తత్ఫలితముగ ఇటలీని స్వాధీనపరచుకొనుటకై ఫ్రాన్స్‌తో మరల దీర్ఘయుద్ధము చేసెను. కాని, కృతకృత్యుడు కాలేక పోయెను. ఈయన మరికొన్ని యుద్ధములు కూడ చేసెను. కాని, ఎట్టి ప్రాదేశిక లాభమును ఆర్జింపలేకపోయెను. మాక్సిమిలియన్ తన కుమారుడు ఫిలిప్‌కు స్పెయిన్ రాకుమారి (ఫెర్డినాండ్, ఇసబెల్లాల కుమార్తె) తో వివాహము కావించెను. ఆ దంపతులకు జనించిన చార్లెస్ స్పెయిన్ రాజై, తదుపరి చార్లెస్ - V అను పేరున పవిత్ర రోమన్ సామ్రాజ్య చక్రవర్తి అయ్యెను. తన మనుమనికి బొహీమియా రాకుమారితోను, మనుమరాలికి హంగెరీ రాకుమారునితోను వివాహములు చేసి, ఈ సంబంధముల ద్వారా ఆ రెండు దేశములపై తన వంశమునకు హక్కును ఆర్జించెను. అ. వెం.



మాక్సిమిలియన్ - I (1459 - 1519)

**మాగ్నకార్టా :** ప్రజాస్వామ్య చరిత్రలో ప్రసిద్ధిగాంచిన ఒక చారిత్రక పత్రము. 1215, జూన్ 15 వ తేదీన జాన్ రాజు ఇంగ్లీషు ప్రజలకు ఈ ప్రజాస్వామ్యపత్రమును ఒసగెను. మాగ్నకార్టా అనే లాటిన్ పదమునకు 'మహా పత్రము' అని అర్థము.

ఇంగ్లండు రాజైన జాన్ అసమర్థుడు, క్రూరుడు, నిరంకుశుడు, ప్రభువులకు, మతస్థులకు, ప్రజాసామాన్యానికి కూడ అసంతృప్తి, అసహ్యత కలిగేటట్లు పరిపాలించేవాడు. అందువలన అతని అధికారములను పరిమితము చేయుచు

ప్రభువుల, ప్రజల హక్కులకు రక్షణను కల్పించుటకై అతని వలన అధికారపత్రమును పొందవలెనని భూస్వాములగు ప్రభువులు సంకల్పించిరి.

స్టెయిన్స్, విండ్‌సర్ పట్టణముల మధ్యనున్న 'రన్నీమీడ్' అనే పచ్చిక మైదానములో 1215, జూన్ 15 వ తేదీన ప్రభువులు రాజును కలసికొని చుట్టుముట్టిరి. 63 క్లాజులు గల మాగ్నకార్టాను తయారుచేసి పట్టుకొని వచ్చిరి. దానిమీద సంతకముచేసి ముద్రవేస్తేనేగాని జాన్‌ని కదలనివ్వమనిరి. విధిలేక జాన్ సంతకము చేసెను. ఈ పత్రమును అనుసరించి ఇంగ్లండు దేశపు సంప్రదాయములను, ఆచార వ్యవహారములను, ధర్మములను అనుసరించి న్యాయములైన ప్రజల జన్మహక్కులు అన్నిటినీ రాజు పాటించవలెను. జన్మతః స్వతంత్రుడైన ఏ మానవుడిని రాజు దేశధర్మమునకు విరుద్ధముగ బాధించకూడదు; శిక్షించకూడదు; దేశాంతర వాసము విధించకూడదు; వెలివేయకూడదు. అందరికీ న్యాయము జరిపి, హక్కులు కాపాడవలయును.

మాగ్నకార్టా ప్రభువులకు రాజు వ్రాసి ఇచ్చిన హక్కుల పత్రము మాత్రమే. నిజానికి ప్రజాసామాన్యము యొక్క హక్కులతోను, స్వాతంత్ర్యముతోను దానికి అంతగా ప్రసక్తి లేదు. అయినా 'రాజు దేశధర్మానికి బద్ధుడే కాని, అతీతుడు కాడు' అన్న మహాసూత్రాన్ని ప్రతిష్ఠించినది కనుక, స్వాతంత్ర్య ప్రియులైన ప్రజలకు నాటికీ, నేటికీ మాగ్నకార్టా రాజకీయముగ ఆదర్శప్రాయమైనది.

* * *

**మాజినీ, జూజెప్పే** (1805 - 1872) : ఇటలీదేశపు జాతీయ విప్లవనాయకుడు ; రచయిత. 1805, జూన్ 22 న జెనోవాలో జన్మించెను. ఇటలీ దేశ సమైక్యముకోసము 40 సంవత్సరములు నిర్విరామముగ ఆందోళనచేసి, దాని సాఫల్యమునకు దృఢమైన పునాదివేసి, 'ఇటలీ దేశ సమైక్య స్రష్ట' అను అర్థము కల బిరుదమును పొందెను.

మాజినీ రాజకీయములలో ప్రవేశించు కాలమునకు ఇటలీ ఏకరాజ్యముగ లేక చిన్న చిన్న రాజ్యములుగ చీలి ఉండెను. దేశమును సమైక్యపరచుటకై 1821 లో జరిగిన తిరుగుబాటు విఫలము కాగానే, ఇటలీలోని యువకులందు ఒక నిరాశ అలముకొనెను. అంతట 1826 లో వకీలుగ పనిచేయనారంభించిన మాజినీ, దేశభక్తిప్రేరితుడై తన వృత్తిని మానుకొని ఇటలీదేశసంఘీభావముకోసము, ప్రజాప్రభుత్వము కోసము తన జీవితము ధారపోయుటకు ఉద్యుక్తుడై 'కార్బొనారీ' (విప్లవసమితి)కి ముఖ్యనాయకుడు అయ్యెను. 1830 లో బంధితుడై మరుసటి సంవత్సరము విడుదలకాగానే 'యంగ్ ఇటలీ' అను పేర విప్లవ సంఘమును ఇతడు స్థాపించెను. 'దైవము, ప్రజ' అనునది ఆ సంఘమువారి జయనినాదము. వారి పతాకము మీద ఒక ప్రక్క 'సమైక్యము స్వాతంత్ర్యము' అని, మరియొక ప్రక్క, 'స్వేచ్ఛ, సమభావము, మానవత్వము' అని ఉండెడివి.

దేశమునుండి ఇతడు 1832 లో బహిష్కృతుడై, కొన్నాళ్లు ఫ్రాన్స్‌లోను, ఏడు పండ్లు బ్రిటన్‌లోను ఉండెను. అతడు లేకపోయినను ఉజ్జ్వలములగు అతని వ్రాతలవల్ల ఉత్తేజితమై 'యంగ్ ఇటలీ' పార్టీ ఇటలీ అంతట వ్యాపించినది.

మాజినీ 1848 లో జరిగిన లొంబార్డీల తిరుగుబాటుకు తోడుపడెను. తత్ఫలితముగ 1849 లో రోమ్‌నందు ఏర్పడిన ప్రజాసత్తాకప్రభుత్వము యొక్క నాయకత్రయములో ఒకడు అయ్యెను. కాని, ఆ సంవత్సరమే ఫ్రెంచివారు దండెత్తివచ్చి, ఆ క్రొత్త ప్రభుత్వమును పడగొట్టిరి. దానితో కొంతకాలమువరకు ఇటలీని సమైక్యపరచు ప్రయత్నములు వెనుకంజవేసినను మాజినీయు, అతని సహచరులును ధైర్యమువహించి తమ కృషిని విదేశములందుండి కొనసాగించిరి. కాని, ఇంతలో ఇతని సహచరుడగు కావూర్‌నకు ఇతనితో అభిప్రాయభేదములు ఏర్పడి, విప్లవోద్యమముపై మాజినీ ఆధిపత్యము సడలినది. అయినను, మాజినీ వేసిన పునాదిపైననే స్వాతంత్ర్యోద్యమమును కావూర్ నడపి, తుదకు దేశీయ ప్రభువగు ఎమాన్యుయల్ రాచరికమును అంగీకరించిన స్వతంత్ర ఇటలీని కొంతవరకు రూపొందించెను (1860). ఈ ప్రభుత్వము ఎడల మాజినీకి ఆదరము లేకపోవుటచే, ఇతనికి మరణశిక్ష విధింపబడెను (1865). కాని, విదేశములయందు అతడు ఉండుటచే ఆ శిక్ష అమలు జరుపబడలేదు. కడకు 1866 లో స్వతంత్ర ఇటలీ ప్రభుత్వము ఒసగిన సర్వక్షమను అనుసరించి ఈ మరణశిక్ష రద్దయ్యెను. కాని, ప్రభుత్వముతో ఇతనికి కల వైమనస్యముమాత్రము సమయకుండెను. అందుచే అతడు విదేశములలోనే మరికొంత కాలము ఉండి, ఇటలీలో అంతర్భాగమగు సిసిలీ ద్వీపమునకు 1870 లో వచ్చెను. కాని, ప్రభుత్వము అతనిని వెనువెంటనే ఖైదుచేసి రెండు నెలల తరువాత విడుదలచేసెను. అంతట ఇతడు కార్మికవర్గమును సమీకరించి, నూతన ప్రజాస్వామికమును స్థాపించుటకై కొంత కృషిచేసెను కాని, అందు విఫలుడయ్యెను. 1871, మార్చి 10 వ తేదీన పైసానగరమున ఇతడు మరణించెను. మరణానంతరము

ఇటలీ పార్లమెంట్ ఈతని ఘనతను గుర్తించి, ఈతని సేవల గురించి ప్రశంసించెను. ప్ర. రా.

**మాడిసన్, జేమ్స్ (1751 - 1836) :** యునైటెడ్ స్టేట్స్ 4 వ అధ్యక్షుడు. 1787 లో ఫిలడెల్ఫియాలో సమావేశమైన యునైటెడ్ స్టేట్స్ రాజ్యాంగవిధానమును నిర్మించిన రాజ్యాంగవిధాన నిర్మాతలలో ఇతడు ఒకడు.

రాజ్యాంగ విధానమును నిర్మించి, శాసనసభచేత ఆమోదింప జేయుటవల్లనే మాడిసన్‌కు గొప్ప కీర్తి వచ్చినది. తన విధానము చట్టమైనంత మాత్రమున తృప్తిపడక, దాని ప్రాశస్త్యము ప్రజలకు బోధపడునట్లుగ వ్యాఖ్యానము చేయుచు, ఇతడు చాల వ్యాసములను ప్రకటించెను. వాటిని 'ది ఫెడరలిస్ట్' అన్న పేరుతో పుస్తకరూపమున కూడ ప్రకటించెను. ఈతని వ్రాతలవల్లనే క్రొత్త రాజ్యాంగ విధానమునకు హృదయపూర్వకమైన ప్రజామోదము లభించినది.

ఫెడరలిస్ట్ పార్టీనాయకుడైన మాడిసన్ తన వ్యతిరేక పక్షమగు రిపబ్లికన్‌పార్టీవారి వాదనలో కూడ చాల సత్యము ఉన్నదని నమ్మి జఫర్‌సన్‌తో చేరి ఆ పార్టీకి నాయకుడయ్యెను. 1789 లో ఆ పార్టీ తరఫుననే ప్రజా ప్రతినిధి సభలో సభ్యుడయ్యెను.

జఫర్‌సన్ [చూ. పు. 446] యునైటెడ్ స్టేట్స్ అధ్యక్షుడు కాగానే 1801 మాడిసన్ అతనివద్ద 'సెక్రటరీ ఆవ్ స్టేట్' అయ్యెను. తరువాత జఫర్‌సన్ సహకారమువల్ల ఫెడరలిస్ట్ పార్టీ అభ్యర్థిని ఓడించి 1809 లో మాడిసన్ యునైటెడ్ స్టేట్స్ 4 వ అధ్యక్షుడు అయ్యెను. అంతకు పూర్వము అధ్యక్షులుగ ఉండిన వాషింగ్‌టన్, జఫర్‌సన్‌ల పరిపాలనలో బలమైన కేంద్రప్రభుత్వము ఏర్పడుటవల్ల మాడిసన్ భారము చులకనైనది. కాని, విదేశ వ్యవహారములలో బ్రిటన్‌తోను, ఫ్రాన్స్‌తోను తగాదాలు వచ్చినవి. 1813 లో మాడిసన్ రెండవసారి అధ్యక్షుడు అయ్యెను. ఆ సంవత్సరమే యునైటెడ్ స్టేట్స్ బ్రిటన్‌పై యుద్ధము ప్రకటించవలసి వచ్చినది. మాడిసన్‌యొక్క యుద్ధకాలపు పరిపాలనా నిర్వహణము సమర్థతతో జరుగలేదు. ఇంతలో యునైటెడ్ స్టేట్స్, బ్రిటన్‌లకు 1814, డిసెంబరు 24 వ తేదీన సంధి జరిగినది. అందువలన మాడిసన్ పలుకుబడి ప్రజలలో మరల అతిశయించ గలిగెను. 1817 లో ఇతడు రాజకీయములనుండి విరమించి, జీవిత శేషమును ప్రశాంతముగ ప్రజాసేవలో గడిపెను. ప్ర. రా.

**మానవ స్వత్వ ప్రకటన :** ఫ్రెంచి విప్లవముయొక్క ప్రాథమిక దశలో ఆ విప్లవమూలసూత్రములను వివరించుటకు వెలువరింపడిన ప్రకటన. దీనినిగూర్చి ఫ్రెంచి రాజ్యాంగ పరిషత్తు 1789 సంవత్సరము ఆగస్టు నెలలో సుదీర్ఘముగ చర్చించి, 1791, సెప్టెంబరులో వెలువరింపబడిన రాజ్యాంగమునకు లాంఛనప్రాయమగు పీఠికగ దీనిని ప్రకటించెను. ఈ ప్రకటనకు అంతకుముందు జరిగిన యునైటెడ్ స్టేట్స్ స్వాతంత్ర్యప్రకటన మార్గదర్శకము అయ్యెను. ఈ స్వత్వప్రకటనలో క్రింది సూత్రములు కలవు : 1. మానవులు స్వేచ్ఛగ, సమాన హక్కులతో జన్మించిరి ; 2. ప్రకృతిసిద్ధమైనట్టియు, సంశయరహితమైనట్టియు ఆ మానవహక్కులను పరిరక్షించుటయే ప్రతి రాజకీయ సంస్థయొక్క ప్రధాన లక్ష్యము ; 3. స్వేచ్ఛ, ఆస్తిసంపాదన, భద్రత, దౌర్జన్య ప్రతిఘటన అనునవియే ఈ హక్కులు ; 4. సర్వసత్తా (సావరినిటీ) ధికారము ముఖ్యముగ సమష్టిజాతియందు న్యస్తమై ఉన్నది.

ఈ విప్లవానంతరమున ఈ హక్కులలో చాల భాగము - అప్పటి ప్రభుత్వముచే నిరాకరింపబడినను - ఈ ప్రకటన తరువాతి అర్ధశతాబ్దమువరకు యూరప్ లోని ఉదారవాదులకు ప్రామాణిక పత్రముగ పరిణమించెను. లార్డ్ ఆక్టన్ చెప్పినట్లు ఈ ప్రకటన నెపోలియన్ సర్వసైన్యములకంటెను బలవత్తరమైనదిగ పరిగణింపదగినది. స్వ. వెం.

**మార్క్స్, కార్ల్ హైన్రిష్ :** చూ. సం. 5 - పు. 633.

**మార్క్స్ సిద్ధాంతము :** చూ. కమ్యూనిజమ్ పు. 366

**మారిటేనియా :** వాయవ్య ఆఫ్రికా అందలి ఒక ఇస్లామిక స్వతంత్ర గణరాజ్యము.




ఈ రాజ్యమునకు స్పానిష్, ఫ్రెంచి సహారా మండలములు [ఉ]; మాలీ [తూ]; మాలీ, సెనెగల్ [ద]; అట్లాంటిక్ మహాసముద్రము [ప] సరిహద్దులందు ఉన్నవి. [వి] 10,85,805

చ. కి. మీ. ; [జ] 7,70,000. [భా] జాతీయ భాష అరబ్బీ; [మ] ప్రజలలో 99% ముస్లిములు. [రా] నౌవాక్ ఛోట్ (జ. సం. 3,000).

చరిత్ర : ఈ దేశపు చరిత్రలో క్రీ. శ. 10 వ శతాబ్దపు పూర్వపు వివరములు సవియు తెలియవచ్చుటలేదు. కాని, ఆ కాలమున ఉత్తరదిశనుండి బర్బరజాతులు అనేకములు అంతటంతట ఈ దేశమున వచ్చి చేరి, దేశీయులగు నీగ్రోలలో అధికసంఖ్యాకులను దక్షిణమునందలి మాలీ దేశమునకు తరిమి, మిగిలినవారితో సంబంధబాంధవ్యములను కలుపుకొని, దేశమున స్థిరనివాసము ఏర్పరచికొనిరని మాత్రము తెలియవచ్చుచున్నది. ఈ బర్బరులే ఇస్లామ్ మతమును ఇట ప్రవేశపెట్టి, దేశమంతట వ్యాపింపజేసిరి. ప్రజలలో ముస్లిమ్ మతాభినివేశము హద్దులు మీరి, క్రమముగ మతవ్యాప్తికొరకై జీవితములను అంకితముచేసిన ముస్లిమ్ యోధవర్గము ఒకటి ఈ దేశమున రూపొంది, ఆ ప్రాంతమున ప్రసిద్ధిచెంది ఉండిన ఘానా సామ్రాజ్యమును అంతమొందింపగలిగినది [చూ. మాలీ]. ఈ యోధవర్గపు నాయకుడగు అబ్దుల్లా ఇబ్న్ యాసీన్ ఈ ప్రాంతమునకు రాజై, ఆల్మోరా విదీ అను రాజవంశమునకు మూల పురుషుడయ్యెను. ఇంతలో 14, 15 శతాబ్దులలో ఈజిప్టు నుండి అరబ్ సేనావాహినులు ఈ దేశముపై పడి, బర్బరుల జయించి రాజ్యమును క్రమముగ వశపరచుకొన గలిగినవి. ఆ తరువాత చాలకాలమువరకు అరబ్బులకు, బర్బరులకు గల వైషమ్యములు సమయక కడకు దేశ దాస్యమునకు దారితీసెను. కాని, ఈనాడు ఈ రెండు జాతులును సమ్మిశ్రణమొందుటచే దేశీయులందరును తాము అరబ్బీసంతతి వారము అనియే భావించుచున్నారు.

వ్యాపారార్థమై యూరపియన్లలో తొలుతగ పోర్చుగీస్‌వారు ఇట 15 వ శతాబ్దిలో స్థావరములను ఏర్పరచుకొనిరి. తరువాత క్రమముగ ఫ్రెంచి, డచ్చి, బ్రిటిష్ వర్తకులును ఇటకు చేరి ఒకరితో ఒకరు పోటీపడసాగిరి. నెపోలియన్ [చూ. పు. 543] పతనానంతరము 1815 లో యూరప్ రాజ్యములు చేసికొనిన ఏర్పాటులను అనుసరించి, ఈ ప్రాంతమంతయు ఫ్రెంచివారి పలుకుబడికి చెందినదిగ నిర్ణయింపబడెను. అంతట 19 వ శతాబ్దమున ఈ దేశమున వివిధభాగముల పరిశీలనకై ఫ్రెంచివారు పూనుకొనిరి. ఇట్టి ఫ్రెంచివారిలో ఒకడగు జేవియర్ కొప్పొలాని తన చతురతను ఉపయోగించి అరబ్బులకు, బర్బరులకు మధ్య గల వైషమ్యముల రెచ్చగొట్టి, ఆ యా జాతులకు చెందిన స్థానికపాలకులలో పలువురు ఒకరి వెనుక ఒకరు ఫ్రెంచి రక్షణను ఆశించునటుల చేయగలిగెను. ఇతని అనంతరము ఇటకు చేరిన కల్నల్ గౌరా అను అతడును ఆ పద్ధతినే అవలంబించి, తక్కిన వారిని కూడ ఫ్రెంచివారి రక్షణలోనికి కొనివచ్చెను. ఇటుల 1909 నాటికి ఈ ప్రాంతము అంతయు ఫ్రెంచి సామ్రాజ్యమున భాగము కాగా, దీనిని 1920 లో పరిపాలనాసౌకర్యార్థమై ఫ్రెంచి వారొక ప్రత్యేకప్రాంతముగ చేసిరి. ద్వితీయ ప్రపంచ యుద్ధ కాలమున స్వతంత్ర ఫ్రెంచి (డీ గాలీ) ప్రభుత్వమువారు అవలంబించిన నూతన విధానమును అనుసరించి, ఈ ప్రాంతపు ప్రజలకును 1946 లో ఫ్రెంచి పౌరస్వత్వములు లభించెను. ఆ సంవత్సరమే ఆంతరంగికపరిపాలనకై ఒక స్థానిక శాసనసభయు ఏర్పాటయ్యెను. అంతటినుండి 1955 నాటికి క్రమముగ విశేషాధికారములు ప్రజలకు సంక్రమించినవి. తరువాత 1958 లో జరిపిన జనవాక్య సేకరణలో ఫ్రెంచి కమ్యూనిటీ [చూ. పు. 638] లో భాగస్వామ్యము కల స్వతంత్రరాజ్యముగ ఉండుటకు ఈ రాజ్యము నిర్ణయించుకొని, 1959 లో గణరాజ్యముగ రూపొంది, 1961 లో సర్వస్వతంత్ర ప్రతిపత్తిని పొందెను. కాని, సాంస్కృతికముగ, చారిత్రకముగ ఈ ప్రాంతము తమ రాజ్యమున అంతర్భాగమే అనియు, కావున ఇది తమ రాజ్యమునకు చెందవలసి ఉండుననియు, మొరాకో దేశము వాదించుచు దీని స్వతంత్రతను గుర్తింపకున్నది. దీనిని సమర్థించు ఆఫ్రికారాజ్యములును కొన్ని కలవు. అయినను మారిటేనియా ఐక్యరాజ్యసమితిలో సభ్యత్వము గడించి ప్రపంచ ప్రముఖ రాజ్యములచే స్వతంత్రరాజ్యముగ పరిగణననందినది.

రాజ్యాంగము : ఫ్రెంచి కమ్యూనిటీ సభ్యత్వపు బాధ్యతలకు లోబడి, ఈ దేశము స్వతంత్రగణరాజ్యముగ పరిపాలనను నిర్వహించుకొనుచున్నది. దేశమున పౌరన్యాయము (సివిల్ లా) ఇస్లామ్ షరియత్‌ను అనుసరించి ఉండవలయునను సంప్రదాయమునకు ఈ దేశప్రజలు కట్టువడి, తమ దేశమును ఇస్లామిక గణరాజ్యమని రాజ్యాంగ చట్టమున పేర్కొనిరి. ఫ్రెంచి రాజ్యాంగ చట్టమును ఆదర్శముగగొని, ఈ చట్టము నిర్మింపబడి, 20 మార్చి, 1959 న ఆమోదితమైనది. దేశమున సార్వజనికము, రహస్యము అగు ఎన్నిక హక్కు కలదు. 40 మంది సభ్యసంఖ్య గల జాతీయశాసనసభకు ఎన్నికలు సాధారణముగ అయిదు ఏండ్లకు ఒకసారి జరుగును. ఈ శాసనసభయే ప్రధానిని ఎన్నుకొనును. ప్రధాని తాను నియమించుకొనిన మంత్రివర్గపు సాయముతో శాసనసభకు బాధ్యత వహించి కార్యనిర్వాహణాధికారము కలిగి పరిపాలన నెరపును. 1959 లో తొలుతటి ప్రధాన మంత్రిగ మఖ్తర్ జౌలద్ దాదా అను నాయకుడు ఎన్నుకొనబడెను. 1961 లో ఇతడు

దేశమున అధ్యక్ష పరిపాలన నెలకొల్పదలచి, అధ్యక్ష పదవిని ఏర్పరచి, దానికి అపరోక్షపు ఎన్నికలో 99.77% వోటరుల ఆమోదముతో ఎన్నికయ్యెను. కాని, తక్కిన పక్షముల నాయకులు దీనికి ప్రతిఘటించిరి. ఈ సమస్య ఇంకను పరిష్కారము కాలేదు. చీ. శే. రా.

మారిషస్ : హిందూమహాసముద్ర పరివృతమై, బ్రిటిష్ప్రభుత్వపు వలసగ ఉన్న ఒక ద్వీపరాజ్యము.

దక్షిణ అక్షాంశ 20° ప్రాంతమున తూర్పు రేఖాంశ 57½° ను ఆశ్రయించి నెలకొని ఉన్న ఈ ద్వీపరాజ్యమున మారిషస్ అనునది ముఖ్య ద్వీపము. ఈ ముఖ్య ద్వీపపు [వి] 2,090 చ. కి. మీ. (పరిపాలనరీత్యా ఈ రాజ్యమున చేరియున్న తక్కిన రోడ్రిగెజ్ మొదలగు అల్పద్వీపములతో సహా); [జ] 7,10,000. ఇందు 67% భారతీయ మారిషస్‌లు (వలసవచ్చిన భారతీయ సంతతియు, దేశవాసులతో వైవాహిక బంధముల మూలమున రూపొందిన మిశ్రజాతియు ఈ పేరున వ్యవహరింపబడుచున్నవి). దాదాపుగ వీరందరును హిందువులు. తక్కినవారు రోమన్ కేతలిక్ క్రైస్తవు లగు ఆఫ్రికన్ జాతులవారు. [భా] హిందీ, క్రియోల్ ఫ్రెంచి అనబడు అపభ్రంశపు ఫ్రెంచి మాతృభాషలుగ ఆయా వర్గములందు విరివిగ వ్యాప్తియందు ఉన్నను ఇంగ్లీషు, ఫ్రెంచి భాషలే సాధికార వ్యవహార భాషలుగ ఉన్నవి. [రా] మారిషస్ దీవి యందలి పోర్ట్ లూయీ (జ. సం. 1,13,063).

చరిత్ర : ఆఫ్రికన్ జాతుల ప్రజలకు మాత్రమే తొలుత నివాసభూమిగ ఉండిన ఈ ద్వీపరాజ్యముతో భారతీయ నావికులకును, అరబ్బు వ్యాపారులకును క్రీ. శ. 10 వ శతాబ్దికి పూర్వమునుండియే పరిచితి ఉండెనని భావించుటకు తగిన ఆధారములు కలవు. కాని, వారెవరును ఇందు స్థిరావాసములు నెలకొల్పలేదు. 1507 - 1512 మధ్యకాలమున పోర్చుగీస్ నావికులు ఈ ప్రాంతములను కనుగొనినను, వారు సైతము వీనిని ఆక్రమింపబూనుకొనరైరి. 1598 లో డచ్చివారు ఇచట తొలుత వలసల స్థాపించి, ఇందలి ముఖ్య ద్వీపమునకు 'మారిషస్' అని పేరిడిరి. కాని, ఇందేమియు తగినంత లాభము కన్పట్టక పోవుటచే వారు 1710 లో ఈ ద్వీపమును వదలిపోయిరి. అంతట 1715 లో ఫ్రాన్స్‌వారు ఈ ద్వీపములను ఆక్రమించి, పేరును మార్చి, ఐల్ డి ఫ్రాన్స్ అని పేరిడిరి. ఫ్రాన్స్ పాలకులు ఇచట చక్కెర తోటలు, లవంగము, ప్రత్తి మొదలగు పంటలను ప్రోత్సహించి అచటి ప్రజల అభివృద్ధికి కృషి చేసిరి. ఆ కృషి ఫలితముగ దేశీయులందు క్రైస్తవ మతమునకును, ఫ్రెంచి భాషా సంస్కృతులకును వ్యాప్తి లభించెను. క్రమముగ అచటి ప్రజలలో వ్యాప్తియందున్న ఆఫ్రికన్ భాషలు అంతరించి, అపభ్రంశమొందిన ఒక విధమగు ఫ్రెంచిభాషయే దేశీయుల మాతృభాష అయ్యెను. నెపోలియన్ [చూ. పు. 542] పై బ్రిటిష్‌వారు యుద్ధము చేయుకాలమున, 19 వ శతాబ్ది ఆరంభమున ఫ్రెంచివారి ఈ ద్వీపరాజ్యమువలన బ్రిటిష్ నౌకాదళమునకు ఇబ్బంది ఏర్పడెను. అందువలన 1810 లో బ్రిటన్ ఈ ద్వీపరాజ్యమును ఆక్రమించెను. యుద్ధానంతరమున 1814 లో జరిగిన శాంతిఒడంబడికను అనుసరించి దీనిని బ్రిటన్‌కు చెందినదిగ ఫ్రాన్స్ గుర్తించెను. ప్రజలలో వ్యాప్తియందు ఉన్న ఫ్రెంచి భాషా సంస్కృతులను మన్నించుటకు బ్రిటిష్ప్రభుత్వము ఆ సమయమున అంగీకరించినది. బ్రిటిష్ వారి ఆక్రమణలోనికి వచ్చినప్పటినుండియు ఇచట వ్యవసాయభూములలో పని చేయుటకై భారతీయులు అనేకులు ఇందు చేరి క్రమముగ స్థిరావాసములను ఏర్పరచుకొనిరి. వీరిలో కొందరు దేశీయులతో వైవాహిక బంధములను ఏర్పరుచుకొనుటవలన హిందూ సంప్రదాయములను అవలంబించిన ఒక మిశ్రజాతియు రూపొందినది.

రాజ్యాంగము : సోపానపద్ధతిలో స్వాతంత్ర్యము ఒసగు తలంపుతో బ్రిటన్ ఇట 1958 మొదలుగ కొన్ని సంస్కరణలను ప్రవేశపెట్టినది. దానిని అనుసరించి బ్రిటిష్ ప్రభుత్వము నియమించు గవర్నర్‌కు సాయపడుటకై విధాన పరిషత్తు (లెజిస్లేటివ్ కౌన్సిల్) ఒకటి ఏర్పరుపబడినది. ఇందలి 55 గురు సభ్యులలో 40 మందిని ప్రజలు ఎన్నుకొందురు. తక్కిన వారిని గవర్నర్ నియమించును. కార్య నిర్వాహక వర్గమందలి 13 సభ్యులలో పదిమందిని ఎన్నుకొనబడిన విధాన పరిషత్ సభ్యుల నుండి గవర్నర్ నియమించును. గవర్నర్‌కును, విధాన పరిషత్తుకును బాధ్యత వహించి కార్యనిర్వాహకవర్గము తమకు అప్పగింపబడిన వివిధశాఖల నిర్వహించును. రక్షణ మొదలగు ముఖ్య శాఖలందు గవర్నర్‌దే తుది నిర్ణయము [చూ. మారిషస్ ఆంధ్రులను గురించిన వివరములకు సం. 4; పు. 977]. చీ. శే. రా.

మార్కస్, అరీలియస్ ఆంటోనైనస్ (క్రీ. శ. 121 - 180) : ప్రముఖ రోమన్ చక్రవర్తులలో ఒకడు. ఆంటోనైనస్ పైయస్ మరణానంతరము 161 లో చక్రవర్తియైన ఇతడు 20 సంవత్సరములు అఖండ కీర్తిగడించి పాలించెను. మార్కస్ అరీలియస్ గ్రీక్ దర్శనశాస్త్రమును ఆమూలాగ్రముగ అవగాహన చేసికొని, జీవితాశయముగ చేసికొనెను. మార్కస్ కుబేరుడే అయినను అతి నిరాడంబర జీవి. నిరంతరము తన ప్రజల క్షేమముకోసము కష్టపడెడివాడు. తన సుఖముకన్న సంఘసేవే ముఖ్యమని, జీవితాశయమని నమ్మినవాడు. ఆ ఉద్దేశముతో సర్వజనానుకూలమైన సత్ప్రభుత్వమును ఇతడు ఏర్పరచెను.

కత్తి సాములవంటి హింసావినోదములు తగ్గించెను. బానిసలకు, వృద్ధులకు, స్త్రీలకు, పిల్లలకు ఉపకరించు చట్టములు ఎన్నియో అమలు జరిపెను. నాస్తికుడైనను ఉన్నతాశయుడు. తన జీవితమును నడపించిన ధర్మ సూత్రములను అన్నిటిని 'సమాలోచనలు (మెడిటేషన్స్)' అను పేరుతో గ్రీక్ భాషలో వ్రాసి ఉన్నాడు. అది ప్రపంచములోని మహా గ్రంథములలో ఒకటైనది [చూ. సం. 6 - పు. 557]. ప్ర. రా.

**మార్కోపోలో :** చూ. పోలో, మార్కో - పు. 593.

**మార్టినిక్ :** పశ్చిమార్ధగోళమందు ఫ్రెంచివారి అధీనమున ఉన్న ద్వీపము.

వెస్ట్ఇండీస్ [చూ.] ద్వీప సముదాయమున ఉన్న ఈ ద్వీపపు [వి] 1,100 చ కి మీ. ; [జ] 2,91,357. జనులలో అత్యధిక సంఖ్యాకులు నీగ్రో సంతతివారు. [భా] ఫ్రెంచి. [మ] రోమన్ కేథలిక్ సంప్రదాయపు క్రైస్తవము. [రా] ఫోర్ట్ - డి - ఫ్రాన్స్ (జ. సం. 65,000).

చరిత్ర : 1502 లో కొలంబస్ [చూ. పు. 407] ఈ దీవిని కనుగొనెను. కాని, ఆ శతాబ్దమున పాశ్చాత్యులు ఎవరును ఇట నెలవులను ఏర్పరచుకొనలేదు. 1635 లో ఫ్రెంచి వర్తక సంఘము ఒకటి ఈ దీవిని ఆక్రమించిన తరువాత వారి ఆధ్వర్యవమున ఫ్రెంచివారు కొందరు ఇట వలసచేరి క్రమముగ అచటి ఆదిమవాసులతో మిళితమై, నేటి మిశ్ర జాతికి కారకులైరి. 1674 లో ఫ్రెంచి ప్రభుత్వము ఈ దీవిని వర్తకసంఘమునుండి కొలుగోలు చేసినది. అంతటినుండి ఇది ఫ్రెంచివారి వశముననే ఉన్నది. ఈ దేశము తుఫానుల వలనను, భూకంపముల వలనను విపరీతముగ పలుమారులు నష్టపడినది. 1902 లో ఈ దీవియందు జరిగిన భూకంపము వలన దాదాపు 40,000 ప్రజలు నశించిరి. ఈ నష్టమునుండి కోలుకొనుటకు దేశమునకు చాలకాలము పట్టెను. పరిపాలనరీత్యా ఫ్రాన్స్ రాజ్యమున ఇది సముద్రోత్తర మండలముగ పరిగణింపబడుచున్నది. చీ. శే. రా.

**మాల్ దీవులు :** ఆసియా ఖండమునకు చెందిన ఒక ద్వీపరాజ్యము. ఈ రాజ్యమును ఆ దేశీయులు తమ భాషలో 'దీవికి రాజో' అని వ్యవహరింతురు.

భారత, సింహళ దేశములకు నైరృతిదిశయందు హిందూ మహా సముద్ర పరివృతమై ఈ రాజ్యము నెలకొని ఉన్నది. ఈ రాజ్యము ఒక ద్వీప సమూహము. దాదాపు 2,000 పగడపు దీవులు కలవు. వీనిలో దాదాపు 220 దీవులలో మాత్రమే ప్రజలు నివసించుచున్నారు. ఈ పగడపు దీవులు కొన్ని చేరి ఒక కంకణాకృతిలో ఉండి, మధ్యన జలాశయము ఉండును. ఇట్టి కంకణాకృతి కల ద్వీపసమూహమును ఆ దేశ భాషలో 'అతల' అని వ్యవహరింతురు. రాజ్యమున ఇట్టి అతలములు 17 కలవు. వీనియందు ఉత్తరపు కొనన ఉన్న అతలము కన్యాకుమారి అగ్రమునకు నైరృతిన 482 కిలోమీటరుల దూరమున ఉన్నది. ఈ ద్వీప రాజ్యపు [వి] 298 చ. కి. మీ. [జ] 90,000 ; [భా] జాతీయ




భాష మాల్దేవియన్; ఇది సంస్కృత భాషా జన్యమగు సింహాళీ భాషకు సన్నిహితము. [మ] దాదాపుగ ప్రజలందరును సున్నీ శాఖకు చెందిన ముస్లిములు. [రా] మాలే (మాల్ దీవి) (జ. సం. దాదాపు 12,000).

చరిత్ర : ఈ రాజ్యమునకు సంబంధించిన క్రీ. శ. 12 వ శతాబ్దమునకు పూర్వపు చరిత్రయందలి వివరములు ఏవియు తెలియవచ్చుటలేదు. కాని, క్రీ. శ. 2 వ శతాబ్దపు వాడగు టాలెమీ [చూ. పు. 496] ఈ రాజ్యమును పేర్కొనుటను బట్టి ఆ కాలముననే సముద్రమున జరుగు వ్యాపారమునకు ఇది యొక కేంద్రముగ ఉండెనని భావింపదగును. అటనుండి ఇది చీనా, పశ్చిమ భారత, సింహళ దేశముల రాజులకు ఆ యా కాలములందు సామంతరాజ్యముగ ఉండెడిదని విశ్వసించుటకు తగిన ఆధారములు కలవు. క్రీ. శ. 12 వ శతాబ్ది వరకు బౌద్ధమతము ఇట వ్యాప్తియందు ఉండెను. కాని, 1153 న ఇస్లామ్‌మత బోధకులు ఇట చేరి క్రమముగ దేశమంతట ముస్లిమ్‌మతమును వ్యాపింపజేసిరి. చారిత్రకుడుగను, ప్రపంచయాత్రికుడుగను పేరొందిన అరబ్బీ రచయిత ఇబ్న్‌బతూతా [చూ. పు. 323] 1343 లో ఈ ద్వీపరాజ్యమునకు వచ్చి కొంతకాలము ఇట వసించి, కాజీగ పనిచేసెను. 1507 లో పోర్చుగీస్‌వారు దీనిని ఆక్రమించిరి. 17 వ శతాబ్దమునకు పోర్చుగీస్‌వారి అధికారము

ఇట సన్నగిలెను. ఆ కాలమున సింహళమును వశపరచుకొనిన డచ్చివారు ఈ అవకాశమును ఉపయోగించుకొని, మాల్‌దీవి సుల్తాన్‌ను తమకు సామంతునిగ చేసికొనిరి. సింహళమున డచ్చి ప్రభుత్వము అంతరించి, బ్రిటిష్‌వారు దానిని ఆక్రమించుకొనిన తరువాత మాల్‌దీవి బ్రిటిష్ రక్షిత రాజ్యము అయ్యెను. 1948 లో సింహళము స్వతంత్ర దేశమైన పిదప బ్రిటిష్ ప్రభుత్వము మాల్‌దీవి సుల్తాన్‌తో ప్రత్యేకముగ వేరొక ఒడంబడిక చేసికొనినది. దీనిని అనుసరించి ఈ రాజ్యపు విదేశవ్యవహారములు బ్రిటిష్‌వారి బాధ్యతకు వదలివేయబడెను (1953). ఆ సంవత్సరమే ప్రజాందోళన ఫలితముగ సుల్తాన్ పదవి రద్దయి, గణరాజ్య ప్రభుత్వము ఏర్పడెను. తొలుతటి అధ్యక్షుడగు అమీర్ అమీన్‌దీదీ స్త్రీలకు పరదానుండి విముక్తి కలిగించుటయే కాక ఆధునికనాగరకతకు తగిన మరికొన్ని సంస్కరణలను కూడ ప్రవేశపెట్టెను. అందువలన పూర్వాచారపరులగు పెద్దలు వ్యతిరేకించి అతని ప్రభుత్వమును కూలద్రోసిరి. తరువాత మరల సుల్తాన్ ప్రభుత్వమునే నెలకొల్పుటకు నిర్ణయము జరిగి, అమీర్ మహమ్మద్‌దీదీ అను అతడు సుల్తాన్‌గ ఎన్నిక అయ్యెను. ఇబ్రహీం అలి దీదీ అను అతడు ప్రధాన మంత్రిగ నియమితుడు అయ్యెను. 1956 లో ఈ ద్వీపరాజ్యమందలి గాన్ ద్వీపమున బ్రిటిష్ వారు ఒక వైమానిక స్థావరమును ఏర్పరుపదలపగ అందులకు ప్రతిఘటించుచు ప్రజలు ఆందోళన సలిపిరి. ఈ ఆందోళనకు లొంగి అప్పటి ప్రధాని రాజీనామాను ఒసగెను. తరువాత ప్రధానియైన ఇబ్రహీం నాసిర్ బ్రిటిష్ వారి ప్రయత్నమును నిరోధింపదలచగ గాన్ దీవియందలి ప్రజలే ప్రభుత్వ ఉత్తరువులను తిరస్కరించిరి. ఈ పరిస్థితులలో దక్షిణమున ఉన్న మూడు అతలములందు తిరుగుబాటు విజృంభించి అచటి ప్రజలు యునైటెడ్ సువదీవ (సంయుక్త సర్వద్వీప) అనుపేర ఒక నూతన ప్రభుత్వమును స్థాపించిరి (1959); ప్రభుత్వము ఈ తిరుగుబాటును అడచినను, తిరుగుబాటుదార్లతో సామరస్యమును సాధించుటకై వారి నాయకునికి మంత్రివర్గమున స్థానమును కల్పించిరి. తరువాత 1960 లో కుదుర్చుకొనిన ఒక ఒడంబడికను అనుసరించి గాన్‌ద్వీపమున స్థావరములను నిర్మించుకొని 30 ఏండ్లు వాడుకొనుటకు బ్రిటిష్‌వారికి వసతి కల్పింపబడినది. కాలక్రమమున సెప్టెంబరు 22, 1965 న మాల్‌దీవుల రాజ్యము స్వాతంత్ర్యమును ఆర్జించినది.

రాజ్యాంగము : క్రీ. శ. 1153 లో ఇస్లామ్‌మతము ఈ దేశమున ప్రవేశించినది మొదలుగ వరుసగ 92 మంది సుల్తాన్‌లు ఈ దేశమునకు ప్రభువులుగ ఎన్నుకొనబడి పరిపాలన నెరపిరి. 1759 నుండి 'దీదీ' కుటుంబమునందలి వారినుండి మాత్రమే ఒకనిని సుల్తాన్‌గ ఎన్నుకొను సంప్రదాయము ఏర్పడినది. 1932, డిసెంబరు 22 న అప్పటి సుల్తాన్ అగు మహమ్మద్ షంసుద్దీన్ ఇస్కందర్ దేశ ప్రజలకు ఒక రాజ్యాంగ చట్టమును ఒసగెను. 25 ఏండ్లకు తగ్గని వయసు గలిగి, విద్యావంతులును, మగవారును అయిన వోటరులవలన ప్రతిసంవత్సరము ఎన్నుకొనబడు 47 మంది సభ్యులు కల శాసనసభ ఇందువలన ఏర్పాటయినది; 28 మంది సభ్యులు కల శిష్ట సభ వేరుగ కలదు; ఇందు ఏడుగురను సుల్తాన్ నియామకము చేయును; నలుగురను ముఖ్య నగరపు వోటరులు ఎన్నుకొనెదరు; 17 గురను శాసనసభ ఎన్నుకొనును. శిష్టసభ యందలి సభ్యుని పదవీ కాలపరిమితి అయిదేండ్లు. శిష్ట పరిషత్‌తో సంప్రదించి అందలి సభ్యులలోనుండి ఒకనిని ప్రధానిగ సుల్తాన్ నియమించును. తక్కిన మంత్రులను శిష్టసభ సభ్యులనుండియే ప్రధాని నియమించును. 1953 లో సుల్తాన్ పదవి రద్దయినపుడు సుప్రసిద్ధ బ్రిటిష్ రాజనీతివేత్త ఐవర్ జెన్నింగ్స్ తయారుచేసిన వేరొక రాజ్యాంగచట్టమును నూతన ప్రభుత్వము ఆమోదించెను. కాని, ఆ ప్రభుత్వము అంతమొంది, సుల్తాన్ పరిపాలన పునఃప్రతిష్ఠితమయినంతనే ఆ రాజ్యాంగ చట్టము రద్దయి, పాతచట్టమే అమలులోనికి వచ్చెను.

చి. శే. రా.

**మాలటోవ్, వ్యాచిస్లావ్ మైకేలోవిచ్** (జ. 1890) : సోవియట్ రష్యా రాజనీతివేత్త; బహుకాలము విదేశాంగమంత్రి. విద్యార్థిదశయందే ఇతడు బోల్షివిక్ పార్టీలో చేరి, జ్వెజ్డా, ప్రావ్డా పత్రికల నిర్వహణలో పాల్గొనెను. ఇతని అసలు పేరు స్క్రియాబిన్. కాని, యువ విప్లవవీరుడుగ ఇతడు 'మాలటోవ్' (అనగా సుత్తి) అను నూతన నామకరణము చేసికొనెను. 1917 న పెట్రోగ్రాడ్ సోవియట్ కార్యవర్గ సమితియందును, సైనిక విప్లవ సమితియందును సభ్యత్వము వహించి, విప్లవమున పాల్గొనెను. విప్లవానంతరమున మాలటోవ్ కమ్యూనిస్ట్ పార్టీలోను, ప్రభుత్వములోను అనేక పదవులు అధిష్ఠించి, 1930 లో సోవియట్ రష్యా ప్రధాని కాగలిగెను. 1941 లో స్టాలిన్‌కు ప్రధాని పదవిని అప్పగించి, ఉప ప్రధాని పదవిని స్వీకరించెను. 1939 నుండి 49 వరకు, మరల 1953 నుండి 56 వరకు ఇతడు సోవియట్ రష్యా విదేశాంగ మంత్రిగ వ్యవహరించెను. నాజీ జర్మనీతో నిరాక్రమణసంధి (1939) కుదుర్చుకొనెను; ద్వితీయ ప్రపంచ యుద్ధకాలము [చూ. పు. 608] న టెహరాన్, యాల్టాసమావేశము [చూ.] లలో స్టాలిన్ [చూ.] కు సహాయకుడుగా పాల్గొనెను;

ఐక్యరాజ్యసమితి ప్రథమ సమావేశము (1949) న సోవియట్ రష్యా ప్రతినిధి వర్గమునకు నాయకత్వము వహించెను; అగ్రరాజ్య చతుష్టయ విదేశాంగ మంత్రుల బెర్లిన్, జినీవా సమావేశములకు (1954) హాజరయ్యెను. ఇతని వైదేశిక విధానము ప్రాచ్య, పాశ్చాత్య రాజ్యముల మధ్య తరింపరాని అఖాతమును సృష్టించి ఇరు వర్గముల మధ్య ప్రచ్ఛన్న యుద్ధమునకు దారితీసెను. కృశ్చేవ్ [చూ. పు. 395] ఇతనిని 1957 లో పార్టీలోని ప్రముఖ స్థానములనుండి తొలగించి, మంగోలియాలో రాయబారిగా నియమించెను. ఆ తరువాత 1960 లగాయతు ఒక సంవత్సర కాలము అంతర్జాతీయ అణుశక్తిసంఘమునందు సోవియట్ రష్యా ప్రతినిధిగ ఇతడు పనిచేసెను. దేశ సేవా నిరతికి కృతజ్ఞతా సూచకముగ లెనిన్ శ్రేణిక (ఆర్డర్ అవ్ లెనిన్) బిరుదమును, సుత్తి, కొడవలి, సువర్ణ పతకమును ఈయబడినవి. సోవియట్ రష్యా దేశపు సైన్స్ అకాడమీలో ఇతడు గౌరవ సభ్యుడు. రష్యన్ భాషలో గ్రామసీమలందు పార్టీవిధానము; సోవియట్ సంఘములకు ఎన్నికలు; కార్మికవర్గ సమస్యలు; ట్రాట్‌స్కీ వాదపు గుణపాఠము మొదలగు గ్రంథములను ఇతడు రచించెను. ఆ. వెం.

**మాలిక్ అంబర్** (1548 - 1626): భారతదేశపు దక్కన్ ప్రాంతీయ చరిత్రలో సుప్రసిద్ధుడు. అంబర్ అనునది ఇతని నిజనామము; మాలిక్ అనునది బిరుదము. అబిసీనియాలో 1548 లో జన్మించెను. దారిద్ర్యముచే కుందుచు, పుత్రవాత్సల్యము చంపుకొని తలితండ్రులు అతనిని బానిసవ్యాపారికి ఒకనికి అమ్మివేసిరి. ఇతనిని కొనిన హుసేన్ అను మక్కా కాజీ తన కన్నకుమారుని వలెనే చూచుకొని, ఇతనికి చక్కగా విద్యాభ్యాసము చేయించుటచే ఇతడు శీఘ్రమే ఇస్లామికసంప్రదాయ నిష్ణాతుడును, అరబ్బీ సాహిత్య విశారదుడును కాగలిగెను. కాని, హుసేన్ మరణానంతరము రెండుసార్లు చేతులు మారి, భారతదేశమునందలి అహ్మద్ నగరపు పలికయగు ముర్తజా నిజామ్‌షా యొక్క కొలువుకూటములో ఉండు చెంగిజ్ ఖాన్ అను అమీరుకు ఇతడు అమ్ముడు పోయెను. పూర్వ యజమాని అంబర్‌ను లలితకళాకోవిదుని చేయ, ఈ క్రొత్త యజమాని ఇతని చురుకుతనమును, తెలివిని చూచి రణశాస్త్రమును నేర్పించి పైకి తెచ్చెను. రానున్న దక్కన్ స్వాతంత్ర్యయుద్ధములో ఇతడు వహించవలసిన పాత్రకు ఈ శిక్షణ కొంత సహాయకారి అయినది. చెంగిజ్ ఖాన్ మరణానంతరము మాలిక్ అంబర్ అహమ్మద్‌నగర్ వదలి బిజాపూర్‌నకు పోయి, అట పరిపాలకుడగు ఇబ్రహీమ్ ఆదిల్‌షా - II (1580 - 1626) కొలువున చేరి క్రమముగ ఉచ్చస్థితిలోనికి వచ్చెను. కాని, ఇతని ఉచ్చస్థితికి ఓర్వలేని కొందరు అసూయాపరుల కుట్రలమూలమున త్వరలోనే ఆదిల్‌షా కొలువు వీడి తిరిగి అహమ్మద్ నగరునకే మాలిక్ అంబర్ పోవలసివచ్చెను. అచట ఇతడు మీరన్ హుసేన్ నిజామ్ షా కొలువున చేరి, అహమ్మద్ నగరును ముట్టడించిన మొగల్ సైన్యములను ప్రతిఘటించుటలో చాంద్ బీబీ [చూ. పు. 447] కి అండగ ఉండి ప్రముఖపాత్ర వహించెను. కాని, మొగల్‌లను అరికట్టలేకపోయెను. చాంద్ బీబీ కాల ధర్మము చెందగా రాజ్యమంతయు కూలిపోయినది.

రాజ్యము ఇట్లు తన ఎదుట పతనమైనను దిట్టయగు మాలిక్ అంబర్ అంతతో ఊరుకొనలేదు. సింహాసనము రాజహీన మగుటచే రాజవంశీకుడగు ముర్తజా అనునతనికి ముర్తజా నిజామ్‌షా (1599 - 1625) అను పేరిట పట్టముగట్టి, నిజామ్‌షాహి రాజ్యశేషమునకు ఖిర్కీని రాజధానిగావించి, ఈ రాజధానీనగరమున అతనిని ప్రతిష్ఠించెను. అంతట సుశిక్షిత, సాయుధ సైన్యదళము ఒకదానిని కడు రయమున సమకూర్చి అంబర్ మొగల్ సామ్రాజ్యపు సేనావాహినులతో తలపడెను.

మొగల్ సామ్రాజ్యపు ఫౌజులతో మొదటి సంఘర్షణము 1600 లో జరిగి, మొగల్‌లను మంజీరావద్ద నిలువరించి అంబర్ ఓడించగలిగెను. కాని, మొగల్‌లు మరల బలముతోవచ్చి నాందేడు వద్ద దాడిసల్పగా అంబర్ యుద్ధభూమిలో గాయపడి, సైన్యముతో వెనుదిరుగవలసి వచ్చినది. అయినను, ఈ శత్రువు గొప్ప శూరుడని మొగల్ సేనాని గ్రహించి ఇతనితో సంధిచేసికొనెను. క్రమముగ అంబర్ ప్రబలుడై వకీల్ ఇసల్తానత్ (ప్రధాని) గ నియుక్తుడయ్యెను. ఇంతలో మొగల్ పాదుషాయగు అక్బర్ గతించి (1605), జహాంగీర్ రాజ్యమునకు రాగా అంతఃకలహములు అధికమయ్యెను. ఈ రూపముగ దక్షిణమున అంబర్‌కు సుమారు ఏడు సంవత్సరముల పాటు విశ్రాంతి లభించినందున అతడు సైన్యమును, పరిపాలనా వ్యవస్థను చక్కగా తీర్చిదిద్దెను. అంతేకాక, ప్రజలకు మేలొనగూర్చు సత్కార్యములు అనేకములు ఒనర్చి అంబర్ దక్కన్ చరిత్రలో లబ్ధప్రతిష్ఠుడు అయ్యెను. రాజధానీ నగరమగు ఖిర్కీనగరరూపరేఖలను పూర్తిగా మార్చివైచి, ఆధునిక పద్ధతులను అనుసరించి మరల అంబర్ కట్టించెను. అదే ఈనాటి ఔరంగాబాద్. 1624 లో అతడు ఏర్పరచినట్టి జలయంత్రము నేటికిని నిలిచి ఉన్నది. ప్రజల నీటివసతి కొరకై నిర్మించబడిన ఈ జలయంత్రము

పెద్ద జలాశయమున 12 మీటరుల లోతునుండి ఇటుక సున్నముతో పైకప్పు వరకును కట్టబడి ఉన్నది. ఇందు సుమారు 91 లక్షల లీటరుల నీరు నిలువ ఉండును. ఈనాటి ఔరంగాబాద్ ముఖ్య విశేషములలో ఇదొకటి. నగర మండలి జనబాహుళ్యమునకు ఇప్పటికిని ఆ నాడు నిర్మించిన జలయంత్రమే ముఖ్య జలాధారముగ ఉన్నది.

అంతేకాక, సత్రములు, బావులు, భవంతులు, మసీదులు, కోటలు మున్నగు గొప్పగొప్ప కట్టడములు కూడ అనేకము అంబర్ కట్టించెను. సర్వతోముఖమగు ప్రజాభ్యుదయమన్నను, గ్రామాభివృద్ధి అన్నను అంబర్‌కు ఎట్టి గాఢాసక్తిగలదో వీటిని బట్టి విశదము కాగలదు.

మాలిక్ అంబర్ ఇటుల ప్రజాభ్యుదయ కార్యక్రమములలో మునిగి ఉండగ, మొగల్ చక్రవర్తి జహంగీర్ దక్షిణదేశముపైకి మరల తన సేనలను పంపెను (1615). అందు ఖిర్కీ నగరముపైకి వచ్చిన సైన్యమును మాలిక్ అంబర్ ఓడించి తరిమివేసెను. కాని, మొగల్ సేనలు మరల దండెత్తివచ్చెను. ఇందులకు తోడుగ అంబర్ అనుచరులలో కొందరు స్వామిద్రోహమునకు తలపడిరి. తత్ఫలితముగ అంబర్ సైన్యము ఓడిపోయి ఖిర్కీ మొగల్‌ల వశమయ్యెను.

జహంగీర్ 1621 లో కాశ్మీరులో ఉన్న అదను చూచుకొని అంబర్ మొగల్ ప్రాంతమును కొల్లగొని ఖిర్కీని వశపరచుకొని మాల్వాకు ఒకప్పుడు ముఖ్యపట్టణమైన షాదియాబాద్ - మాండు వరకును చరచర సాగిపోయెను. ఇవే అతని కడపటి విజయయాత్రలు. ఇంతలో జహంగీర్ కాలహరణము చేయక షాజహాన్‌ను దక్కన్‌కు పంప అతడు కడు ప్రయాసతో అంబర్ వశమై ఉన్న ఖిర్కీ 1621, ఏప్రిల్‌లో చేరెను. అంతట అంబర్ ముర్తజా నిజామ్‌షాను దౌలతాబాద్‌కు మార్చి, అహ్మద్‌నగరము ముట్టడించుమని జాహర్ హబాషీని ఆజ్ఞాపించెను. కాని, జాహర్ విఫలుడు కాగా చివరకు అంబర్ విధిలేక లొంగి సంధి చేసికొనెను.

పిమ్మట షాజహాన్ జహంగీర్‌పై తిరుగబడినపుడు మరల ఒకసారి తన రాజ్య స్వాతంత్ర్యమును చాటి, తన శక్తి చూపించుటకు కడపటి అవకాశము అంబర్‌నకు ఒదవెను. పరమ భద్రమనిపించిన ప్రదేశమునకు ముర్తజాను మార్చి, బీజాపూర్ రాజ్యము లోపాయికారిగా మొగల్‌లతో కుమ్మక్కు అగుట తెలిసినందున అందలి బీదర్‌పైన దాడి చేసి, కొల్లగొని షోలాపురము కోటను అంబర్ 1625 లో జయించుకొనెను. ఆ పైని ప్రక్కకు తిరిగి బేరార్, ఖాందేష్‌ల వరకును మొగల్ సీమను కొల్లగొనెను. తండ్రితో రాజీపడు వరకును మాలిక్ అంబర్‌ను శరణు జొచ్చి షాజహాన్ ఉండెను.

ఈ మహానాయకుడు 80 చాంద్రమాన సంవత్సరములు నిండిన వార్థక్యములో 1626, మే 13 న అంబర్‌పురములో కాలధర్మము చెందెను. అంబర్ మరణానంతరము అనతి కాలముననే మొగల్ సేన అహ్మద్‌నగర పాలకులలో కడపటి వాడగు ముర్తజా - III ను బంధించి, గ్వాలియర్ కోటలో ఖైదుచేసి, అతని రాజ్యమునంతటిని వశపరచుకొనెను. షేర్వాని.

**మాలిక్ కాఫూర్ :** మహమ్మదీయ సేనానాయకుడు. ఇతడు అల్లా ఉద్దీన్ [చూ. పు. 275] అనుగ్రహమును ఆర్జించిన బానిస, ఖొజ్జా. గుజరాత్ రేవులను కొల్లగొట్టిన అల్లాఉద్దీన్ సైనికులకు చిక్కి (1297), ఇతడు ఢిల్లీ చేరుకొని, సుల్తాన్ కొలువులో ప్రవేశించి పదిఏండ్లలో నాయబ్ (దళాధిపతి) అయ్యెను. దక్షిణభారత దేశములోని హిందూరాజ్యములపై దండయాత్రచేసిన అల్లా ఉద్దీన్ సైన్యమునకు మాలిక్ కాఫూర్ నాయకత్వము వహించెను (1307). ఇతడు మొదట దేవగిరి రాజు రామదేవుని, తరువాత కాకతి ప్రతాపరుద్రదేవుని (1309), తరువాత ద్వారసముద్రపు రాజు హొయిసల బల్లాలు - III ని జయించి (1311), కప్పముక్రింద అపార ధనరాశులను గ్రహించెను; పాండ్య సింహాసనమునకై తగవులాడుకొనుచున్న సుందర, వీరపాండ్యులను తొలగించి, పాండ్యరాజ్యమునకు మహమ్మదీయ పరిపాలకుని నియమించెను. 1311, అక్టోబరులో ఢిల్లీకి తిరిగివచ్చెను. ఇతడు మరల 1312 లో దేవగిరిపై దండెత్తి, ఆ రాజ్యమును ఢిల్లీ సామ్రాజ్యమున విలీనము చేసెను. [చూ. ఢిల్లీ సుల్తానులు]. ఈ విజయ పరంపరల వలన మాలిక్ కాఫూర్ తన ప్రాబల్యమును పెంపొందించుకొని, నిరంకుశుడై వ్యవహరించెను. అల్లా ఉద్దీన్ మరణించిన తోడనే (1316) ఇతడు సుల్తాన్ మొదటి ఇద్దరు కుమారులకు కన్నులు తీయించి, ముబారక్ అను మూడవ కుమారుని నిర్బంధించి, పసివాడైన నాలుగవ కుమారుని సింహాసనము ఎక్కించి, సంరక్షకుడుగ సర్వాధికారములు తన హస్తగతము చేసికొనెను. ఇతని దుష్పరిపాలనము అయిదు వారములు మాత్రమే కొనసాగెను. తరువాత ఇతడు అల్లాఉద్దీన్ పరివారముచే హత్యచేయబడెను. ముబారక్ చెరనుండి తప్పించుకొనివచ్చి సింహాసనమును ఆక్రమించెను. అ. వెం.

**మాలీ :** పశ్చిమ ఆఫ్రికాయందలి ఒక స్వతంత్ర రాజ్యము, ఇదియే ఇంతకు పూర్వము 'సూడాన్' అని వ్యవహరింపబడెడిది.

ఈ రాజ్యమునకు అల్‌జీరియా, ఫ్రెంచి సహారా [ఉ]; నైజర్ [తూ] అప్పర్‌వోల్టా, ఐవరీకోస్ట్ [ద]; గినీ, సెనెగల్, మారిటేనియా [ప] సరిహద్దులందు ఉన్నవి. [వి] 12,04,021




చ. కి. మీ.; [జ] 43,05,000. [భా] వివిధ ఆఫ్రికన్ భాషలు ప్రచారమునందు ఉన్నను, ఫ్రెంచియే అధికార భాషగ వ్యాప్తి యందు ఉన్నది. [మ] దేశీయులలో 55% ముస్లిమ్‌లు, 44% సంప్రదాయ ప్రకృతి దేవతారాధకులు, క్రైస్తవులు కొలదిగ కలరు. [రా] బొమాకో (జ. సం. దాదాపు 1,20,000).

చరిత్ర: క్రీ. శ. నాలుగవ శతాబ్దమునుండియు ఈ దేశపు చరిత్ర లిఖిత పూర్వకములగు ఆధారములవలన మనకు లభ్యమగుచున్నది. నాలుగవ శతాబ్ది మొదలు 19 వ శతాబ్దమువరకు ఈ దేశమున పలు సామ్రాజ్యములు క్రమముగ వర్ధిల్లి, అంతరించెనని వానివలన తెలియనగుచున్నది. కాని, వీనిని సామ్రాజ్యములని అనుటకన్న రాజ్యకూటములని వ్యవహరించుట సముచితముగ ఉండును. ఇట్టి 'సామ్రాజ్యము' లలో ఘానా, మాలీ, గావో అనునవి ప్రముఖములు.

క్రీ. శ. నాలుగవ శతాబ్దమున ఉత్తర ఆఫ్రికానుండి కొన్ని జాతులవారు (వీరు యూదులో, బర్బరులో అయి ఉందురని కొందరి భావన) ఈ దేశమునకు వలసవచ్చి చేరుటతో ఘానా సామ్రాజ్యమునకు అంకురార్పణ జరిగెను. ఈ విదేశీయులు క్రమముగ బలపడి 8 వ శతాబ్దము నాటికి ఒక సామ్రాజ్యమును నిర్మింపగలిగిరి. వీరు దేశీయులగు నీగ్రోలతో సంబంధబాంధవ్యములను ఏర్పరచుకొనుటవలన క్రమముగ దేశీయులలో కలసిపోయిరి. సహారా ఎడారి గుండ జరుగు వ్యాపారముపై ఈ ప్రభుత్వము ఆధిపత్యము కలిగి ఉండుటచే శుల్కముల మూలమున ఆదాయము విరివిగ లభించుచుండెడిది. 1076 లో మతావేశితమగు ముస్లిమ్ యోధవర్గము ఒకటి ఈ సామ్రాజ్యమును అంతరింపజేసెను. అంతట దాని అవశేషములపై 'మాలీ' అను పేరుగల నూతన సామ్రాజ్యము ఆవిర్భవించెను.

ఈ దేశమున వర్ధిల్లిన సామ్రాజ్యములందెల్ల ఈ మాలీ సామ్రాజ్యము ధన, బల, వైభవములందు అత్యుచ్చ స్థాయిని అందుకొనినది. 13 వ శతాబ్దిపూర్వార్ధమున ఈ రాజ్యము తన పరాకాష్ఠను అందుకొని, అంతనుండి క్రమముగ క్షీణించి 17 వ శతాబ్ది మధ్యమునకు ఒక అల్పరాజ్యముగ పరిణమించెను. ఈ సామ్రాజ్య పాలకులలో నెల్ల మన్సామూసా చక్రవర్తి (1307-32 ప.) సుప్రసిద్ధుడు. పరిసర ప్రాంతములనెల్ల జయించి తన సామ్రాజ్యమును విస్తరింపజేయుటయేకాక, ఇతడు మక్కానగరమునకు యాత్రకేగి అటనుండి ముస్లిమ్‌పండితులను పలువురను దేశమునకు కొనివచ్చి విద్యా, మత, సంస్కృతుల అభివృద్ధికై కృషిచేసెను.

మాలీ సామ్రాజ్యము అంతరించిన తరువాత, గావో సామ్రాజ్యము ఆ స్థానమును ఆక్రమించెను. ఈ సామ్రాజ్య స్థాపకులు ఉత్తర ఆఫ్రికానుండి వచ్చిన బర్బరులు. వీరు 9 వ శతాబ్దమున నైజర్ నదీప్రాంతమున వలసలను ఏర్పరచుకొని ముస్లిమ్ మతము అవలంబించి దేశీయులతో సంబంధ బాంధవ్యములను ఏర్పరచుకొని, క్రమముగ ప్రతిష్ఠను ఆర్జించి మాలీ సమ్రాట్‌లకు లోబడిన ప్రముఖ వర్గముగ 14 వ శతాబ్దమున గణన కెక్కిరి. 15 వ శతాబ్దమున వీరు నైజర్ నది లోయను జయించి అటనుండి క్రమముగ పరిసర దేశమును వశపరచుకొనిరి. 16 వ శతాబ్దాంతమున ఈ రాజ్యము బలహీనము కాగా మొరాకో ప్రభువు సేనలు ఈ దేశముపై దండెత్తి దేశమును సంక్షోభితమొనర్చినవి. మొరాకో సైనికులు దేశమందలి నీగ్రో స్త్రీలను వివాహమాడిన ఫలితముగ రూపొందిన మిశ్రజాతివారలు ఆయుధోపజీవులై దేశమును అరాజకముపాలు చేసిరి. 19 వ శతాబ్ద మధ్యమున దేశమున సీగూ, కార్తా, ఫూటా, మస్సినా అను నాలుగు చిన్న రాజ్యములందు తప్ప, తక్కిన అన్ని ప్రదేశములందును భద్రతయే శూన్యమయ్యెను.

ఈ సమయముననే పశ్చిమ సరిహద్దున ఉన్న సెనెగల్ రాజ్యమును కైవసము ఒనర్చుకొనిన ఫ్రెంచివారు, ఈ దేశమున కూడ తమ పలుకుబడిని విస్తరింపచేయ యత్నించిరి. కాని, వీరి యత్నములను ఫూటా రాజ్యపు రాజగు అల్ హాజీ అరు అనునతడును, మాన్‌డిన్‌గో తెగ నాయకుడు సమోరీ అను నతడును తీవ్రముగ ప్రతిఘటించి పోరాడిరి. 1898 నాటికి ఫ్రెంచివారు వీరి ప్రతిఘటనను అడచి దేశమునంతటిని వశపరచికొనిరి. వారి పరిపాలనా

కాలమున ఈ దేశము 'సౌడాన్' అను పేర వ్యవహరింపబడినది.

పౌరస్వత్వములు ప్రజలకు ఎట్టివియును లేకుండ ఫ్రెంచి సామ్రాజ్యవాదులు ఈ దేశమును ద్వితీయ ప్రపంచ యుద్ధము [చూ. పు. 608] దనుక పాలించిరి. ఆ యుద్ధ కాలమున 1946 లో డిగాలీ [చూ. పు. 508] నాయకత్వమున నడచిన స్వతంత్ర ఫ్రెంచిప్రభుత్వపు విధానమును అనుసరించి తక్కిన ఫ్రెంచి ఆఫ్రికన్ వలసలతో పాటుగ ఈ దేశమున పౌరులకును ఫ్రెంచిపౌరస్వత్వములు కలిగింపబడినవి. ఆంతరంగిక పరిపాలనకై స్థానిక శాసనసభలును అపుడే నెలకొల్పబడినవి. 1957 లో సార్వజనికమగు వోటు హక్కు కలిగింపబడినది. తరువాత ఫ్రెంచి రాజ్యములందు 1958లో జరిగిన జనవాక్య సేకరణలో ఈ రాజ్యము కూడ పాల్గొని, ఫ్రెంచి కమ్యూనిటీ [చూ. పు. 638] లో భాగస్వామ్యము కల స్వతంత్ర రాజ్యముగ వ్యవహరించుటకు నిర్ణయించుకొనినది. తరువాత 1959, జనవరి 17 న సెనెగల్, దహోమీ, అప్పర్ వోల్టా దేశములతో కలసి ఈదేశము ఒక సమాఖ్యగ రూపొందుటకు నిర్ణయము జరిగెను. పూర్వము ఈ దేశము ఉన్న ప్రాంతమున వర్ధిల్లిన మాలీ సామ్రాజ్యము పేర దీనికి మాలీ సమాఖ్య అని పేరు ఉండుటకు కూడ అపుడే నిర్ణయము జరిగెను. కాని, చివరకు ఈ తీర్మానమును ఈ దేశపు శాసనసభయు, సెనెగల్ శాసనసభయు మాత్రమే ఆమోదించినవి. అందువలన ఇవి రెండును 'మాలీ ఫెడరేషన్' అను పేర ఒక సమాఖ్యగ వర్తించుటకు ఒక సంవత్సరము కృషి చేసినవి. కాని, 1960 లో అభిప్రాయ భేదములు కలిగి సెనెగల్ వేరుపడినది. అంతటినుండి తన పూర్వపు పేరు 'సౌడాన్' కు బదులు మాలీ అను పేరుతో ఈ రాజ్యము స్వతంత్రముగ మనుచున్నది. సెనెగల్‌తో ఏర్పడిన సమాఖ్య విచ్ఛిన్నమగుటకు ముఖ్యకారణము ఫ్రెంచివారి దుస్తంత్రమే అను తలంపుతో ఫ్రెంచి రాజ్యముతో తనకు గల సంబంధములను మాలీ రాజ్యము 1960 లో తెగతెంపులు చేసినది. కాని, 1961 లో ఉభయ దేశముల పెద్దలును జరిపిన దౌత్యవ్యవహారముల ఫలితముగ కొంత సామరస్యము కుదిరినది. అంతట సాంస్కృతిక, పారిశ్రామిక రంగములందు ఫ్రెంచి సహకారమును గ్రహింప ఇచ్చగించుచు, ఈ రాజ్యము ఫ్రాన్స్‌తో ఒక ఒడంబడికను చేసికొనెను. సోవియట్ రష్యా పలుకుబడిలోని తూర్పు యూరప్ రాజ్యములనుండియు, సోవియట్ రష్యా రాజ్యము నుండియు ఈ దేశము సహాయమును పొందుచున్నది.

రాజ్యాంగము : ఈ దేశమున గణరాజ్య విధానపు పరిపాలన అమలులో ఉన్నది. సార్వజనికమగు పద్ధతిని ఎన్నుకొనబడిన 80 మంది సభ్యులు శాసనసభయందు ఉందురు. వీరే మంత్రివర్గపు అధ్యక్షుని ఎన్నుకొందురు. ఈ అధ్యక్షుడే ప్రధాన మంత్రి; దేశాధీశుడు. తక్కిన మంత్రులను ఇతడు నియమించి, పరిపాలనను వారి సాయమున నిర్వహించును. దేశాధీశుని తొలగించుటకు శాసనసభకు హక్కు కలదు.

చి. శే. రా.

**మాల్టా :** మధ్యధరాసముద్ర పరివృతమై, కామన్‌వెల్త్‌న ఆంతరంగిక స్వపరిపాలన కల ఒక ద్వీపరాజ్యము.

మధ్యధరా సముద్రమున సిసిలీ దీవికి 96 కిలోమీటరులు దక్షిణమున ఉన్న ఈ ద్వీపరాజ్యమున మాల్టా, గోజో, కోమినో అను మూడు ప్రముఖ ద్వీపములును, నిర్జనములగు మూడు అల్ప ద్వీపములును చేరి ఉన్నవి. [వి] 316 చ. కి. మీ.; [జ] 3,29,000. [భా] అరబ్బీ భాషా జన్యమై, ఇటాలియన్ భాషచే ప్రభావితమగు మాల్టీజ్ అనునది దేశభాష. దేశభాషతో పాటుగ ఇంగ్లీషు అధికార భాషగ వ్యాప్తియందు ఉన్నది. [మ] ప్రజలు రోమన్ కేథలిక్ క్రైస్తవులు. [రా] వలెటా (జ. సం. 18,202).

చరిత్ర : మధ్యధరా సముద్రతీరమున ప్రాచీనకాలమునందు విశాలసామ్రాజ్యమును నెలకొల్పి పాలించిన ఫొనీషియన్‌లు, గ్రీక్‌లు, కార్తజీనియన్‌లు, రోమన్‌లు క్రమముగ ఈ ద్వీపరాజ్యమును ఆ యా కాలములందు పాలించిరి. క్రీ. శ. 870 లో అరబ్బులు ఈ దీవిని ఆక్రమించిరి. కాని, 1090 లో దీనిని సిసిలీద్వీపపాలకులు వశపరచుకొని దీర్ఘ కాలము పాలించిరి. 1530లో సిసిలీవారికడనుండి నైట్స్ఆఫ్ సెంట్ జాన్ అను క్రైస్తవమతసంరక్షక యోధసంఘము ఒకటి దీనిని వశపరచుకొని 1798 వరకును పాలించెను. వారికడనుండి ఫ్రెంచివారు దీనిని వశపరచుకొనిరి. కాని, ప్రజలు వారిపై తిరుగుబాటును జరిపి, బ్రిటిష్ ప్రభుత్వపు రక్షణను అర్థించిరి. అంతట 1814 లో జరిగిన పారిస్ ఒడంబడికను అనుసరించి బ్రిటిష్ మకుటపువలసగ ఈ దేశము రూపొందెను.

ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున మాల్టా ప్రజలు బ్రిటన్ ఎడ వహించిన సామరస్య వైఖరికి కృతజ్ఞతగ యుద్ధానంతరమున బ్రిటిష్ ప్రభుత్వము ఇట కొన్ని సంస్కరణలను క్రమరీతిలో ప్రవేశపెట్టినది. వాని ఫలితముగ 1961 లో ఈ దేశమునకు కొన్ని మినహాయింపులకు లోబడిన స్వయం పరిపాలన ఒసగబడినది.

రాజ్యాంగము : విదేశ, రక్షణ వ్యవహారములందు తప్ప తక్కిన అన్నింట ఈ దేశము ఇపుడు స్వాతంత్ర్యము కలిగి ఉన్నది. బ్రిటన్ చే నియమితుడగు గవర్నర్ పై రెండింటియందు తప్ప తక్కిన అన్నింట లాంఛనపు ప్రభుత్వ చిహ్నముగ వ్యవహరించును. ఎన్నుకొనబడిన 50 మంది సభ్యులు

కల శాసనసభనుండి, ఆ సభ యొక్క సమ్మతిని ఆర్జింపగలుగు వానిని ప్రధానమంత్రిగ గవర్నర్ నియమించును. ప్రధాన మంత్రి తాను నియమించు మంత్రివర్గపు సాయమున శాసన సభకు బాధ్యత వహించి పరిపాలన నెరపును. చీ. శే. రా.

**మావ్ సే టుంగ్** (జ. 1893): చీనా కమ్యూనిస్ట్ పార్టీ నాయకుడు; చీనా ప్రజాగణరాజ్యమునకు మొదటి అధ్యక్షుడు. మాధ్యమిక విద్యకు స్వస్తి చెప్పి, ఇతడు 1911 లో సన్ యత్ సేన్ విప్లవ సేనలో చేరెను. కాని, 1912 లో మరల పాఠశాలలో చేరి, 1918 లో పట్టభద్రుడై, పెకింగ్ జాతీయ యూనివర్సిటీలో ఉన్నత విద్యను అభ్యసించెను. మార్క్స్, ఏంగిల్స్ గ్రంథముల కూలంకష పఠనమువలన సామ్యవాదపు పలుకుబడికి లోనై, రష్యావిప్లవము (1917) వలన ప్రచోదితుడై, మావ్ సేటుంగ్ చీనాలో కమ్యూనిస్ట్ పార్టీ వ్యవస్థాపనకు (1921) ఎనలేని దోహదము చేసెను; 1922 లో హ్యూనాన్ రాష్ట్ర కమ్యూనిస్ట్ పార్టీ కార్యదర్శి అయ్యెను. 1924 లో తన పార్టీతో సహా కోమింగ్‌టాంగ్ [చూ - పు. 409] లో చేరి, 1927 లో చియాంగ్ - కై - షేక్ చే అందుండి బహిష్కృతుడై ఇతడు దక్షిణ చీనాకు పారిపోయి, అచ్చట చూ టే [చూ - పు. 459] సహాయముతో కమ్యూనిస్ట్ సేనాదళమును రూపొందించి దానికి రాజకీయ నియంత అయ్యెను; 1934 లో తన సేనలతో దక్షిణ చీనానుండి షెన్సీరాష్ట్రములోని యేనాన్ నగరమువరకు చరిత్రాత్మకమైన దీర్ఘ ప్రస్థానయాత్ర కావించెను. అచ్చట మావ్ సే టుంగ్ చీనా సోవియట్ గణరాజ్యమును నెలకొల్పి, దానికి అధ్యక్షుడై చీనాలోని కమ్యూనిస్ట్ ప్రభుత్వ స్థాపనకు నాందీప్రస్తావన చేసెను; జపాన్ సైన్యములను ప్రతిఘటించుటకై చియాంగ్ - కై - షేక్ తో కుదుర్చుకొనిన యుద్ధ కాలసాహచర్యము ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున భంగమై, తీవ్ర సంఘర్షణల అనంతరమున కమ్యూనిస్ట్‌పార్టీ తన నాయకత్వముక్రింద చీనా భూభాగమును ఆక్రమించిన తరువాత నెలకొల్పబడిన చీనాప్రజాగణరాజ్యము (1 - 10 - 1949) నకు మావ్ సే టుంగ్ అధ్యక్షుడయ్యెను. 1950 లో చీనా, సోవియట్ రష్యాదేశముల మధ్య ఇతడు 30 సంవత్సరముల పరస్పర రక్షణ ఒడంబడిక కుదిర్చెను. 1959 లో అధ్యక్ష పదవిని విరమించి మావ్ సే టుంగ్ చీనాకమ్యూనిస్ట్ పార్టీ కార్యదర్శి పదవిని చేపట్టెను [చూ. చియాంగ్ - కై - షేక్ - పు. 451; చీనాప్రజాగణరాజ్యము - పు. 453]. అ. వెం.



మావ్ - సే - టుంగ్

(జ. 1893)

**మినోవా నాగరకత**: చూ. సం. 10 - పు. 612.

**మిరాబూ, గేబ్రియెల్ రికెటీ** (1749 - 1791): ఫ్రెంచి రాజనీతివేత్త; వక్త; విప్లవ నాయకుడు; 'ప్రజల న్యాయస్థానము' అని ప్రశంసింపబడిన వ్యక్తి. 40 ఏండ్ల ప్రాయము వరకు ఇతని మనుగడ అసభ్యతకు, చెడువర్తనకు అంకితమై, తత్ఫలితముగ ఇతడు ఆరోగ్యమును చాల చెడగొట్టుకొనుటయేకాక, తడవ తడవకు కారాగారశిక్షకు కూడ గురి అయ్యెను. 1789లో మిరాబూ ఫ్రెంచి ప్రతినిధులసభ (స్టేట్స్ జనరల్) లో సభ్యత్వమును పొంది, అందు సామాన్యుల వర్గమునకు చెందిన ప్రతినిధులలో ఒకడుగ ఎన్నుకొనబడెను. పిమ్మట కొలది దినములకే లూయీ - XVI సామాన్యుల వర్గమును అసెంబ్లీ భవనమునుండి నిష్క్రమింప ఆదేశింపగా, ప్రజాప్రతినిధులను బలప్రయోగమునసైతము అటనుండి కదలింపజాలదని ఇతడు నిర్భయముగ గర్జించెను. తదుపరి తన ఆంతరంగిక జీవితము ఎంత జుగుప్సాకరముగ ఉన్నను అసాధారణమైన తన వక్తృత్వశక్తిచే మిరాబూ ఫ్రెంచివిప్లవమున ప్రజానాయకుడు కాగలిగెను. కాని, ఇంగ్లండులోవలె ఫ్రాన్స్‌కు కూడ రాజ్యాంగబద్ధమైన రాజరిక వ్యవస్థ అపేక్షణీయము అని అతడు విశ్వసించెను. 1790 లో ఇతడు అసెంబ్లీకి చెందిన దౌత్యసంఘము (కమిటి డిప్లమాటిక్) లో సభ్యుడుగ ఎన్నికై, అంతట ఆ సంఘమునకు విలేఖరి (రిపోర్టర్) అయ్యెను. అట రాజరికమునకు, ఇట ప్రజానీకమునకు మధ్య సామరస్యతా సాధకుడుగ ఇతడు వ్యవహరించెను. కాని, అనారోగ్యము త్వరలోనే అతని మరణమునకు దారితీసెను (1791). అ. వెం.

**మిల్, జాన్ స్టువార్ట్** (1806 - 1873); బ్రిటిష్ దార్శనికుడు; అర్థశాస్త్రవేత్త; సుప్రసిద్ధ పండితుడు జేమ్స్ మిల్ కుమారుడు. ఉపయోగితావాదమునకు తన తరువాత ఇతడు నాయకుడు కావలెనని ఇతని తండ్రి కోరెను. ఇతడు అనేక విద్యలందు పాండిత్యము గడించెను. న్యాయశాస్త్రము, దర్శనశాస్త్రము కూడ చదివి, 17 వ ఏట ఈస్ట్ ఇండియా



జాన్ స్టువార్ట్ మిల్

(1806 - 1873)

కంపెనీలో గుమాస్తాగా చేరెను. అందులో క్రమముగ తన శాఖకు అధిపతి పదవిని పొంది, 35 ఏళ్ళ సేవ తరువాత, ఆ పదవినుండి విరమించి విశ్రాంతి వేతనము పొందెను. ఆ తరువాత నాలుగు ఏండ్లుగ ఇతడు పార్లమెంట్‌లో సభ్యుడుగ ఉండెను. రాజకీయములలో ఇతడు తీవ్రవాది. సహకార వ్యవసాయమును, స్త్రీలకు ఎక్కువ హక్కులను ఇతడు బలపరచెను. ఉపయోగితావాదమును సుగమ మొనర్చుటకు అతడు కృషిచేసెను. ఈతని రచనలలో ప్రిన్సిపిల్స్ ఆవ్ పొలిటికల్ ఎకానమీ (1851), ఎస్సే ఆన్ లిబర్టీ (1859), యుటిలిటేరియానిజమ్ (1863); పాజిటివిజమ్ (1865) ప్రముఖములు [చూ. సం. 7-పు. 619]. గి. వెం. సీ.

**మిల్, జేమ్స్** (1773 - 1836) : ప్రముఖ రాజనీతి శాస్త్రవేత్త, చారిత్రకుడు, మానసిక శాస్త్రవేత్త. స్కాట్‌లాండ్‌లో మంటోస్ వద్ద చెప్పులు కుట్టుకొనువాని కుమారుడుగ జన్మించెను. ఎడింబరో విశ్వవిద్యాలయములో విద్యను అభ్యసించి, 1802 లో లండనులో స్థిరనివాసము ఏర్పరచుకొని, 'సెయింట్ జేమ్స్ క్రానికల్' అను పత్రికకు సంపాదకుడు అయ్యెను. పన్నెండు సంవత్సరములు 'భారత దేశ చరిత్ర' అను గ్రంథము రచించుటకు శ్రమించి 1818 లో దానిని ప్రకటించెను. భారత దేశ ప్రభుత్వములో కొన్ని సంస్కరణలకు ఈ గ్రంథము కొంతవరకు కారణము. ఈ గ్రంథమే మిల్‌కు ఈస్ట్ ఇండియా కంపెనీలో మంచిపదవి లభించుటకు కారణమయినది. సమకాలిక బ్రిటిష్ రాజకీయములలో ఇతడు ప్రముఖపాత్ర నిర్వహించెను. దార్శనిక తీవ్రవాదము అను నూతన వాదమును ప్రతిపాదించి, విశాల భావములకు రాజకీయములందు తావును ఇతడు కల్పించెను. తన మిత్రుడు బెంథామ్ వివరించిన ఉపయోగితావాదమును ఇతడు సమర్థించెను. బెంథామ్ తరువాత ఈతడే ఆ వాదమునకు నాయకత్వము వహించెను. అత్యధిక ప్రజానీకమునకు అత్యధిక సౌఖ్యమును చేకూర్చు ప్రవర్తనయే నీతియుత ప్రవర్తన అగునని బోధించువాదమే ఉపయోగితావాదమని వ్యవహరింపబడినది. రాజనీతి శాస్త్రములో ఇతడు చాలా ప్రతిభావంతమైన రచనలు చేసెను. జనాభా పెరుగుదలను అరికట్టుటను, అనార్జిత విత్తముపై పన్నులు వేయుటను ఇతడు సమర్థించెను. జాన్ స్టూవర్ట్ మిల్ ఇతని కుమారుడు [చూ. బెంథామ్ సం. 10-పు. 560]. గి. వెం. సీ.

**మీడియా** : నేటి ఇరాన్ పీఠభూమిలో పశ్చిమోత్తర ప్రాంతమున ఒకప్పుడు వర్ధిల్లిన ఒక ప్రాచీనరాజ్యము. ఇందు వసించిన ఆర్యజాతికి మీడులని వ్యవహారము ఉండెడిది. జాతి, మత, వేష, భాషలందు పారసీకులకు వీరు అత్యంత సన్నిహితులు. కాని, మీడియా చాల కాలము ఇరాన్ (పారసీక) దేశము ప్రక్కనే ప్రత్యేక రాజ్యముగ ఉండెను.

క్రీ. పూ. 710 లో సిరియా రాజగు 'సార్గాన్' మీడియా రాజ్యముపైబడి కొంతదేశమును జయించి వశపరచుకొనెను. కాని, మీడులు 'అసీరియన్ల'ను ఓడించి, త్వరలోనే తమ స్వాతంత్ర్యమును బడయగలిగిరి. వీరి రాజులలో ఖ్యాతిగాంచినవాడు ఉయార్ష (సియాక్జరీస్). ఇతడు క్రీ. పూ. 633 - 593 నడుమ మీడియాను పాలించి, బాబిలోనియన్లతో కలసి అసీరియన్ సామ్రాజ్యముపై బడి, దాని ముఖ్యపట్టణమైన 'నినివే'ను విధ్వంస మొనర్చి, అసీరియన్ సామ్రాజ్యమును నాశనము చేసెను. ఈతని కుమారుడైన 'అస్టియాజీట్' కాలమున ఇరాన్ ప్రభువైన కురుష్ (సైరస్) [చూ. పు. 393] మీడియా రాజ్యముపై బడి, క్రీ. పూ. 550 లో దానిని ఆక్రమించుకొనెను. మీడియా ఇరాన్‌లో కలసిపోయెను. అంతటి నుండి మీడియా చరిత్రయు ఇరాన్ చరిత్రలో లీనమయ్యెను [చూ. ఇరాన్ - పు. 325]. గి. వెం. సీ.

**ముక్డెన్ సంఘటన** : 1931 లో చీనా - జపాన్ల నడుమ సంభవించిన యుద్ధమునకు నాందీప్రస్తావనగా జరిగిన ఒకానొక సంఘటన (18-9 1931). సోవియట్ రష్యాతో నడచిన సంధిషరతుల ప్రకారము లభించిన హక్కును పురస్కరించుకొని జపాన్ సైన్యములు దక్షిణ మంచూరియా రైలు మార్గమును కాపలా కాయుచు, ఆ సందర్భమున ఒక రాత్రివేళ ఆ రైలుమార్గముపై సంభవించిన బాంబు ప్రేలుడును ముక్డెన్ నగరమును పట్టుకొనుటకు కారణముగ ఉపయోగించుకొనినవి. ఈ దురాక్రమణను అగ్రరాజ్యములు ఖండించుచున్నను, నానాజాతిసమితి [చూ - పు. 531] అడ్డగించుచున్నను లక్ష్యపెట్టక, జపాన్ అయిదు నెలల కాలములో యావత్తు మంచూరియాపైనను తన అధికారమును స్థాపించెను. జపానీయుల దేశీయ రాజకీయములలో ఈ ముక్డెన్ సంఘటన సైన్యపు పలుకుబడిని ఎక్కువచేసి, 1932, మే లో ఆ దేశమున పార్టీ ప్రభుత్వమును అంత మొందించెను. అప్పటినుండియు జపాన్ ప్రభుత్వము దురాక్రమణతత్త్వమును అవలంబించి, ద్వితీయ ప్రపంచ యుద్ధము - (1945) లో ఓటమి పొందువరకు దానికే అంటిపెట్టుకొని ఉండెను. స్వ. వెం.

**ముప్పది సంవత్సరముల యుద్ధము** (1618 - 1648) : క్రైస్తవమతమందలి భిన్నశాఖల నడుమ జరిగిన సంగ్రామములలో ఇది కడపటిది. అంతిమ దశలో ఈ యుద్ధము యూరపియన్ దేశముల మధ్య రాజకీయ

బలమునకై జరిగిన యుద్ధముగ పరిణమించెను. జర్మనీలో గల రాష్ట్రముల సంఖ్య ఆనాడు 300 పైగా ఉండెడిది. అందులో పెక్కు రాష్ట్రములందు మార్టిన్ లూథర్ [చూ.] బోధించిన ప్రొటెస్టెంటిజమ్ అనబడు క్రైస్తవ మతశాఖ వ్యాపించి ఉండెను. ఇతర రాష్ట్రములందు రోమన్ కేతలిక్ మతము అను వేరొక క్రైస్తవమత సంప్రదాయము నిలిచి ఉండెను. ఈ రెండు తెగల రాష్ట్రముల వారికిని గల తగవుల పరిష్కారము 1555 లో ఆగ్స్‌బర్గ్ సంధివలన జరిగినది. ఆ యా రాష్ట్రముల మత సంరక్షణము ఆ యా రాష్ట్రాధిపతుల దక్షతలో ఉండవలసినదిగా పై ఒడంబడిక జరిగినది. 1617 లో జర్మనీ చక్రవర్తి కానున్న ఫెర్డినాండ్‌ను బొహీమియావారు తమ రాజ్యమునకు రాజుగా చేసుకొనుటకు సమ్మతించిరి. ఇతడు పూర్తిగ రోమన్ కేతలిక్ మతాభిమానము గలవాడు. అయినను చక్రవర్తుల మత విషయిక రాజనీతిని అనుసరించి స్థిరపడి ఉండిన ప్రొటెస్టెంట్ చర్చి సంస్థలను యథాతథముగా నిలబెట్టవలసిన బాధ్యత తనకును గలదని అభయవాగ్దానముచేసి ఉండుటచేత ఇతనిని బొహీమియావారు రాజుగ పరిగ్రహించిరి. కాని, ఆ వాగ్దానమునకు విరుద్ధముగా బొహీమియాలోని ప్రొటెస్టెంట్ చర్చి సంస్థలను పడగొట్టుట ప్రారంభమైనది. అప్పుడు ప్రాగ్‌నగరమందు దొమ్మి యుద్ధము చెలరేగి, కడకు ఉభయ వర్గములమధ్య దీర్ఘ సంగ్రామమునకు దారితీసినది. ఈ సంగ్రామము జరిగిన వివిధ రంగములను అనుసరించి దానిని బొహీమియాదశ, డేనిష్‌దశ, స్వీడిష్‌దశ, స్వీడిష్ - ఫ్రెంచిదశ అని నాలుగు దశలుగ విభజింప వలనుపడుచున్నది.

బొహీమియాదశ (1618 - 20): యుద్ధరంగము బొహీమియా రాష్ట్రము; ఇచట రోమన్ కేతలిక్‌లు విజయమొందిరి.

డేనిష్‌దశ (1625 - 29): ప్రొటెస్టెంట్ అగు డెన్మార్క్ రాజు ప్రొటెస్టెంట్‌ల కొరకై పవిత్ర రోమన్ సామ్రాజ్య చక్రవర్తి ఫెర్డినాండ్‌తో పోరాడి, ఓడిపోయి, సాగ్జనీ రాష్ట్రమున ప్రొటెస్టెంట్‌ల అధీనమున ఉన్న చర్చి ఆస్తులను కేతలిక్‌లకు ఇచ్చివేయవలసి వచ్చినది.

స్వీడిష్‌దశ (1630 - 35): స్వీడెన్ రాజగు గస్టావస్ అడాల్ఫస్ ప్రొటెస్టెంట్‌ల కొరకై ఫెర్డినాండ్‌తో పోరాడి వివిధరంగములందు విజయములు పొందినను, అతని మరణానంతరము స్వీడిష్ సేనలు పరాజితములైనవి.

స్వీడిష్ - ఫ్రెంచి దశ (1635 - 58): ఈ దశనాటికి మత విషయములకు ఇందు ప్రాబల్యము నశించి, రాజకీయములకు ఆధిక్యము లభించినది. ఫ్రెంచి రాజు రోమన్ కేతలిక్ అయినను, ఫెర్డినాండ్ ప్రాబల్యమును అంతరింపచేయుటకై ప్రొటెస్టెంట్ రాజ్యమగు స్వీడెన్‌తో కలసి ఫెర్డినాండ్‌ను ఓడించి, జర్మనీ మధ్య భాగమున విజయములను సాధించెను. ఈ విజయములవలన జర్మనీలో గల ప్రొటెస్టెంట్‌లు ఉత్సాహవంతులైరి.

కడకు వెస్ట్ ఫేలియా అనుచోట 1648 లో ఉభయ మత వర్గములును కలిసి సమావేశమై ఒడంబడిక జరుపుకొనుటతో ఈ యుద్ధము ముగిసినది. ఈ సంధి షరతులవలన ప్రాదేశికముగ ఫ్రాన్సుకును, స్వీడెన్‌కును కొంత లాభము చేకూరినది. కేతలిజమ్, ప్రొటెస్టెంటిజమ్‌లతో పాటుగ, వేరొక మత సంస్కరణోద్యమమగు కేల్వినిజమ్‌నకును సమాన ప్రతిపత్తియు, సుస్థిరతయు చేకూరినవి.

ఈ సంగ్రామము వలన జర్మనీ చాల నష్టపడినది. జన నష్టము, ధననష్టము, నగరముల నాశనము, వ్యవసాయ నష్టము కలిగినవి. జర్మనీ మరల ఎప్పటియట్లయగుటకు 200 సంవత్సరములు పట్టినది. గి. వేం. సీ.

**ముసునూరి వంశపాలనము :** చూ. తెలుగు సంస్కృతి, సం. 3 - పు. 279.

**ముస్తాఫా కెమాల్** (1881 - 1938): నూతన టర్కీ ప్రజా సత్తాక రాజ్య విధాత. ఇతడు సలోనికాలో జన్మించి, అచటనే సైనిక విద్యాలయమున విద్యను అభ్యసించెను. బాల్యమున ఇతని బుద్ధి కుశలతకు అచ్చెరువొంది అతని ఉపాధ్యాయుడు అతనికి 'కెమాల్' (పరిపూర్ణుడు) అను ఉపనామము ఒసగెను.



ముస్తాఫా కెమాల్
(1881 - 1938)

తొలుతనుండియు రాజకీయములందు ఈతనికి ఆసక్తి మెండుగ ఉండెను. అందువలననే 1904 లో సైన్యమున ఉద్యోగము ఇతనికి లభించినను, అతడు ఆ ఉద్యోగమున ఒక్కదినము కూడ ఉండలేకపోయెను. అంతటినుండి 1908 వరకు రహస్యముగ రాజకీయ విప్లవ సంఘములు స్థాపించుచు రహస్య జీవితమును గడిపెను. మరల 1911నుండి ఇతడు సైన్యమున ప్రవేశించి ప్రథమ ప్రపంచ యుద్ధకాలము [చూ. పు. 594] న వివిధ యుద్ధరంగములందు పోరాడెను. యుద్ధానంతరము మిత్రరాజ్యములు టర్కీని విభజింప ప్రయత్నింపగ ఇతడు వారిని తీవ్రముగ ప్రతిఘటించెను. కడకు 1922 లో జరిగిన లాసన్నీ సంధి [చూ.] వలన

టర్కీ దేశము ముస్తాఫా కెమాల్ అనుచరులవశమయ్యెను. అంతటితో టర్కీ సుల్తాన్ పదవి రద్దొనర్పబడి టర్కీ గణ రాజ్యముగ రూపొందగ (అక్టోబరు 29,1923), ముస్తఫా కెమాల్ దాని ప్రథమ అధ్యక్షుడయ్యెను. ఆ తరువాత వరుసగా 1927, 1931, 1935 లలో కూడా ఈతడే అధ్యక్షుడుగ ఎన్నిక అయ్యెను. జీవితాంతమువరకు ఆ దేశమును పాలించి వివిధ సంస్కరణములు కొనితెచ్చి దేశ సౌభాగ్యమును పెంపొందించెను. ఈ సంస్కరణములవలన టర్కీయందలి స్త్రీలకు స్వేచ్ఛా స్వాతంత్ర్యములు లభించినవి; బహుపత్నీత్వము అంతరించినది; స్త్రీలు పరదాలో తిరుగు ఆచారము నిషేధింపబడినది; ఆధునిక నాగరకతకు అనుగుణముగ న్యాయశాస్త్రము సంస్కరింపబడినది. టర్కీ భాషకు సంప్రదాయముగ వాడబడుచున్న అరబిక్ లిపిని తొలగించి, ఆ భాషను వ్రాయుటకు రోమన్ లిపిని అతడు ప్రవేశపెట్టెను. ఆ దేశమున సర్దారులు తమ ఆధిక్యమును సూచించుటకు వాడుకొను 'పాషా' అను పదమును తొలగించి, ఇంటిపేరునే చివర వాడుకొను సంప్రదాయమును అతడు ప్రవేశపెట్టెను. ఈ నియమమును అనుసరించి 'అటాతుర్క్' అను ఇంటి పేరును ఇతడు ఇడుకొనెను. అంతటి నుండి ఇతడు ముస్తాఫా కెమాల్ అటాతుర్క్ అని వ్యవహరింపబడెను. ఇతని కాలముననే దేశపు రాజధాని ఇస్తాంబుల్ నుండి అంకారాకు మార్చబడెను. టర్కీని ఒక ఆధునిక బలవత్తర రాజ్యముగ రూపొందించుటకే ఇతడు తన జీవితమును అంకితమొనరించెను. ప్ర. రా.

**ముస్సోలినీ, బెనిటో** (1883 - 1945): ఇటలీ నియంత; ఫాసిజమ్ [చూ - పు. 626] ప్రవర్తకుడు. అతి సామాన్య కుటుంబమున జనించి, తొలుత ఉపాధ్యాయుడుగ పనిచేసి, అంతట రాజకీయములలో ప్రవేశించెను. తిరిగి ఉపాధ్యాయుడై కడకు 1911 లో 'ఎవంటీ' అను ఒక సోషలిస్ట్ పత్రికకు డైరెక్టర్ గ ఏర్పడెను. ప్రథమ ప్రపంచయుద్ధారంభమున సోషలిస్ట్ పార్టీని విడిచి 'ఫాసిస్ట్' అను పార్టీని, 'పోపొలో డి ఇటాలియా' అను పత్రికను స్థాపించెను. ఇటలీ దేశమును యుద్ధములో చేరుటకు ఉద్బోధించెను. 1915 లో ఇటలీదేశము యుద్ధములో చేరినపుడు సైనికుడుగ పనిచేసెను. యుద్ధానంతరము సోషలిస్ట్లు లేవదీసిన అరాజకత్వమును ఎదిరింప 1919, మార్చి 23 వ తేదీన తన ఫాసిస్ట్ పార్టీని దౌర్జన్యమునకు గూడ పురికొల్పి-సోషలిస్ట్లను అణచివేసి, క్రమముగ తన రాజకీయాధికారమును ఎక్కువ చేసికొనుచు, 1922, అక్టోబరు 31 వ తేదీన ఇటలీ రాజుచే ఆహ్వానింపబడి, తన ఫాసిస్ట్ ప్రభుత్వమును స్థాపించెను.



బెనిటో ముస్సోలినీ

(1883 - 1945)

అధికారమునకు వచ్చినదాదిగ ఆర్థికముగ దేశమును అభివృద్ధి చేసి, ఇటలీకి పూర్వకాలపు రోమన్ సామ్రాజ్య వైభవమును చేకూర్ప నిశ్చయించి, 1935 - 36 లో ఇతడు ఎతియోపియాను జయించెను. పిమ్మట హిట్లర్ తో చేరి, 1939, ఏప్రిల్ లో ఆల్ బేనియాను ఆక్రమించెను. ద్వితీయ ప్రపంచ యుద్ధము [చూ. పు. 608] న జర్మనీ పక్షమున చేరి, ఫ్రాన్స్ మీద దండెత్తి, దక్షిణ ఫ్రాన్స్ ను ఆక్రమించెను. కడకు మిత్రమండలివారిచే ఇటలీ సేనలు ఓడింపబడగా 1943, జూలై 25 వ తేదీన అధికారము నుండి తొలగెను. జూలై 28 వ తేదీన అరెస్ట్ చేయబడెను. కాని, జర్మనులచే నిర్బంధమునుండి విడిపింపబడి, ఉత్తర ఇటలీలో ఫాసిస్ట్ ప్రజాప్రభుత్వమును స్థాపించెను. తరువాత 1945, మే నెలలో ఇటలీలోని విమోచకదళపు సైనికులచే కాల్చివేయబడెను [చూ. ఇటలీ - పు 318]. * * *

**మెక్ మోహన్ లైన్**: చూ. భారత - చీనా సరిహద్దు సమస్య - పు. 662.

**మెకంజీ, కల్నల్ కాలిన్**: చూ. తెలుగుసంస్కృతి-సం. 3; పు. 980.

**మెకియవెల్లి, నికోలో** (1469 - 1527): ఇటలీ రాజనీతివేత్త; రచయిత. ఇతని పేరు చిరకాలము రాజకీయ దుస్తంత్రమునకు, విశ్వాసఘాతుకతకును పర్యాయ పదమైనది. ఇతడు ఫ్లారెన్స్ లో జన్మించెను; తొలుత ఒక గుమాస్తాగా ఉండి, ప్రతిభమూలమున ఫ్లారెన్స్ గణరాజ్యములో ప్రముఖ వ్యక్తియు, పాలకసంస్థకు అగ్ర కార్యదర్శియు అయ్యెను (1498). అనేక రాచకార్యముల మీద ఇతడు ఇటలీలోను, విదేశములలోను పర్యటించెను. కాని, 1512 లో ఫ్లారెన్స్ నందలి రాచరికమున కలిగిన మార్పు వలన మెకియవెల్లి పదవినుండి బర్తరఫ్ చేయబడుటయే కాక, నిర్బంధింపబడెను. చివరకు పోప్ జోక్యమువలన చెరనుండి విడుదలను పొంది, జీవితశేషమును రచనావ్యాసంగమున కడపెను. ఆ సమయమున ఇతడు ఇల్ ప్రిన్సిపి (పాలకుడు), డిస్కోర్సి (ప్రసంగావళి), ఆర్ టేడెల్లా గ్వెర్రా (యుద్ధకళ), హిస్టరీ ఫ్లారెంటీన్

(ఫ్లారెన్స్ చరిత్ర) అను ప్రముఖ గ్రంథములనేకాక పెక్కు నాటకములను నైతము లాటిన్, ఇటాలియన్ భాషలలో రచించెను. వీనిలో తొలుతటి రెండును ఇతనికి ప్రముఖ రాజ్యతంత్రవేత్తలలో స్థానమును కల్పించినవి. గణతంత్ర రాజ్యముకన్న, నిరంకుశ పాలితరాజ్యమే అతని మన్ననను ఎక్కువగ ఆర్జించినది. సుస్థిర సాంఘిక వ్యవస్థకు దోహదము చేయు రాజ్యమును నిర్మింపదలచిన ప్రభువునకు లక్ష్యసంసిద్ధియే కాని తత్సాధన విశుద్ధి ప్రధానము కాదని 'ఇల్ ప్రిన్సిపి' యందు మెకియ వెల్లి ప్రతిపాదించెను. నైతిక సూత్రముల దృష్టిలో అతని అభిప్రాయము గర్హణీయమే అయినను ఆనాటి



నికోలో మెకియవెల్లి

(1469 - 1527)

చారిత్రక పరిణామగతిని ఆతడు చక్కగ గుర్తింపగలిగెనని మాత్రము చెప్పదగును. జ్ఞాతముగనో, అజ్ఞాతముగనో 16, 17 శతాబ్దములలో దాదాపుగ ప్రభువులందరును మెకియ వెల్లిచే ప్రతిపాదితమగు రాజ్యతంత్రమునే అవలంబించి వ్యవహరించుట ఈ విషయమును రుజువొనర్పు చున్నది. **ఆ. వెం.**

**మెక్సికో :** ఉత్తర అమెరికాలోని ఒక స్వతంత్ర రాజ్యము.




ఈ రాజ్యమునకు 2,574 కిలోమీటరుల పొడవునను యునైటెడ్ స్టేట్స్ [ఉ]; అటనుండి దక్షిణమునకు వచ్చినకొలది వెడల్పు తగ్గి కడకు శృంగాకృతిలో ఈ దేశము వంపు దేలినది. గ్వాటెమాలా, బ్రిటిష్ హోండురాస్ [ద]; కారబియన్‌సముద్రమును, మెక్సికో సింధుశాఖను అనుసరించి 2,609 కిలోమీటరుల పొడవున తీరరేఖ [తూ]; పసిఫిక్ మహాసముద్రమును ఆక్రయించిన 6,606 కిలో మీటరుల పొడవున తీరరేఖ [ప] ఈ దేశమునకు సరిహద్దులుగ కలవు. బాజాకాలిఫోర్నియా అను ద్వీపకల్పము పశ్చిమతీర భూమినుండి చీలి ముఖ్యభూమికి సమాంతరముగ 1,223 కిలో మీటరుల దూరమున ఉన్నది. [వి] 19,72,546 చ. కి. మీ; [జ] 3,84,16,043. వీరిలో ఆదిమ అమెరికన్ - స్పానిష్ జాతుల కలయికవలన రూపొందిన మిశ్రజాతి 55%, ఆదిమ అమెరికన్ జాతి 29%, అచ్చమగు యూరపియన్ జాతి 15% కలరు. [భా] అధికారభాష స్పానిష్; ఈ భాషను 88% మాట్లాడుదురు. తక్కిన వారిలో వివిధ అమెరికన్ భాషలు ప్రచారమున ఉన్నవి. [మ] దేశప్రజలలో దాదాపుగ అందరును క్రైస్తవులు. అందును రోమన్ కేతలిక్‌ల సంఖ్య అత్యధికము అయినను రాజకీయములందును, ప్రభుత్వమునందును మతాధిపతులకు కల పలుకుబడి చాలతక్కువ. [రా] మెక్సికో సిటీ (జ. సం. 29,08,222).

**చరిత్ర :** మెక్సికో ఆదిమవాసులు రెడ్ఇండియన్ (ఆదిమ అమెరికన్) జాతులవారు. వాసయోగ్యమై, సారవంతమైన భూములను ఆక్రమించుటకు ఆ జాతుల వారు నిత్యము పోరాడెడువారు. వారిలో మొదట ప్రాబల్యము వహించినవారు అజ్‌టెక్‌లు. మెక్సికో అను పేరు ఆ జాతి యుద్ధదేవతయైన 'మెక్సిట్లి' నుండి వచ్చినది. తరువాత 'మాయా' అను జాతివారు ముఖ్యులు. యూకటాన్, చియపాస్, గ్వాటెమాలా అడవులలో క్రీ. శ. 4 - 9 శతాబ్దముల మధ్య వారు నిర్మించిన మహాపట్టణముల శిథిలములు నేటికిని ఉన్నవి. 10 వ శతాబ్దమునకు టాల్‌టెక్ జాతివారు ప్రధానులైరి. వారి మతవిషయిక రాజధానియైన తులానగరపు శిథిలములు మెక్సికోపట్టణమునకు 64 కిలోమీటరులలో లభించినవి. అచ్చట సూర్యచంద్రులకు వారు నిర్మించిన పెద్ద పిరమిడ్‌లు (గోపురములు) కనబడినవి. వారి సమకాలికులు జపోటెక్ జాతివారు. వారి రాజధానియైన మిట్లా నగర శిథిలములు వారి శిల్ప చిత్రకళా నైపుణ్యమును వెల్లడించును. వారిని జయించిన మెక్సిక్ జాతివారు తయారు చేసిన అమూల్యమైన ఆభరణములు కొన్ని గోరీలలో దొరికినవి.

స్పెయిన్‌వారు మెక్సికోను 1521 లో ఆక్రమించునప్పటికి 50 మాండలిక భాషలు మాటాడు - ఒకరితో ఒకరికి సరిపడని - 700 రెడ్ఇండియన్ (ఆదిమ అమెరికన్) జాతులవారు ఉండిరి. వారిని అందరిని ఓడించి ఆధిపత్యమును వహించినవారు అజ్‌టెక్‌లు. వివిధ జాతులను అజ్‌టెక్‌ల అధికారమునుండి విముక్తి చేయుటకు వచ్చిన రక్షకులుగ నటించి స్పెయిన్‌వారు మెక్సికోలో ప్రవేశించిరి. ఆ జాతులమధ్య సఖ్యత ఏర్పరచునది ఒక్క మతమే అని

ప్రచారము చేసి కేతలిక్ మతమును ముందుగ ప్రవేశ పెట్టిరి.

స్పెయిన్ వారు అమెరికాకు వలసవచ్చిన తక్కిన తెల్లవారివలె దేశీయులైన ఆదిమ అమెరికన్‌లను తరిమివేయ లేదు; నాశనము చేయలేదు. ఆ జాతులతో సంబంధ బాంధవ్యములు ఏర్పరచుకొని, దాదాపుగ ఏకజాతిగ ఐక్యమైరి. స్పెయిన్ సామ్రాజ్యమునకు చేరిన వలసరాజ్యముగ 16 వ శతాబ్దినుండి 19 వ శతాబ్ది ఆరంభమువరకు ఈ దేశము ఉండినది. కాని, క్రమముగ దేశీయులలో స్వాతంత్ర్య కాంక్ష పెచ్చుపెరిగినది. 1810, సెప్టెంబరు 16 న డోల్ రెస్ గ్రామపు ఆదిమవాసులు తమ గ్రామపు పూజారియైన హిడాల్గో ప్రోత్సాహమువల్ల స్పెయిన్ వారు అపహరించిన భూములను మరల ఆక్రమించుకొనుటకు కంకణము కట్టుకొనిరి. 1811, జూలైలో స్పెయిన్ వారు హిడాల్గోని ఉరిదీసిరి. హిడాల్గో మరణము స్వాతంత్ర్యోద్యమ బీజమును నాటినది; ప్రజలలో స్వేచ్ఛావాంఛ ఉప్పొంగెను. 1813, నవంబరు 6 వ తేదీన విప్లవనాయకుడైన జోసీ మరయా మొరెలోస్ మెక్సికో స్వతంత్రదేశమని ప్రకటించెను. 1815 లో స్పెయిన్ వారు అతనిని కూడ ఉరిదీసిరి. ఇంతలో 1821 లో స్పెయిన్‌లో లిబరల్ పార్టీ వారు చేసిన తిరుగుబాటు మెక్సికో విప్లవమునకు దోహదము ఇచ్చినది. మొరెలోస్ తరువాత నాయకుడైన విసంటె గురెరోయును, స్పెయిన్ దేశీయుడగు అగస్టిన్ డి ఇతుర్ బైద్ అను అతడును కలిసి పోరాడి మెక్సికోకు స్వాతంత్ర్యమును ఆర్జించిరి. కాని, 1823 లో ఇతుర్ బైద్ తానే స్వయముగ పరిపాలనాధికారముల స్వీకరించి రాజుగ ప్రకటించుకొనెను. పరదేశీయుడు రాజగుట సహింపక దేశనాయకుడైన జనరల్ ఆంటోనియో లోపెజ్ ఏడాది లోపున ఇతుర్ బైద్‌ని ఉరి తీయించెను. ఆనాటినుండి మెక్సికన్‌లే పాలకులైరి. లోపెజ్ 30 ఏళ్ళు ఏకైక నాయకుడుగ ఉండెను. అతని హయాములో 1846 లో యునైటెడ్ స్టేట్స్‌తో యుద్ధము వచ్చి కాలిఫోర్నియా, న్యూమెక్సికో రాష్ట్రము మొదలగు కొన్ని ప్రాంతములను మెక్సికో కోల్పోయినది. ప్రజలు ఆగ్రహించి 1885 లో లోపెజ్‌కు దేశాంతరవాసము దండనగ విధించిరి.

సమాఖ్యాపద్ధతి రాజ్యాంగము 1857 లో ఆమోదింపబడినది. కాని, కొందరు పలుకుబడి కలవారు ఈ రాజ్యాంగమును ఆమోదింపక వేరొక ప్రభుత్వమును స్థాపించుకొనుటచే, దేశమున రెండు పోటీ ప్రభుత్వములు ఏర్పడి, దేశము అంతఃకల్లోలములకు గురి అయినది. కడకు రాజ్యాంగమును ఆమోదించినవారి నాయకుడగు బెనిటో జుఆరెజ్ శత్రుపక్షమును నిర్మూలించి 1861 లో మెక్సికోదేశమునందు అంతట తన ప్రభుత్వమును స్థాపించెను. కాని, గత సంవత్సరములందలి కల్లోలముల ఫలితముగ ఏర్పడిన ఆర్థిక దుస్థితిని సర్దుకొనువరకు - రెండేడ్లపాటు - విదేశములలో తీసికున్న ఋణములు ప్రభుత్వము తీర్చదని ప్రకటించెను. ఇందువలన ఋణదాతలగు బ్రిటన్, ఫ్రాన్స్, స్పెయిన్ దేశములకు ఆగ్రహము వచ్చినది. ఆ మిషతో ఫ్రాన్స్ మెక్సికోను ముట్టడించి, ఆస్ట్రియారాజు సోదరుడు మాక్సిమిలియన్‌ను 1864 లో మెక్సికోకు చక్రవర్తిగా చేసినది. ఈ అక్రమ ఆక్రమణము మన్రో సిద్ధాంతమునకు వ్యతిరేకము గనుక, అమెరికా ఖండముల రక్షణకు కంకణము కట్టుకొన్న అమెరికావారు మెక్సికోకు సేనను పంపి, ఫ్రెంచివారిని తరిమివేసిరి [చూ. మన్రోసిద్ధాంతము - పు. 729]. 1867, జూన్ 19 న మాక్సిమిలియన్‌ను జుఆరెజ్ ఉరితీయించెను.

జుఆరెజ్ తరువాత అధ్యక్షుడైనవానిని సైనిక నాయకుడైన దయాజ్ త్రోసిపుచ్చి, 1876 లో అధ్యక్షుడై, 30 ఏండ్లు నిరంకుశముగ పాలించెను. ఇతడు పరిశ్రమలు, వర్తకము చాల వృద్ధిచేసి, దేశమునకు లాభము కలుగజేసెను. అయినను, స్వేచ్ఛాప్రియులైన మెక్సికన్‌లకు అతని నిరంకుశత్వము నచ్చలేదు. ఫ్రాన్సిస్కో మారిరో అను అతడు దయాజ్‌ను ఖండించుచు వ్రాసిన పుస్తకము ప్రజా విప్లవమును రెచ్చగొట్టినది. ప్రజానాయకుడు మారిరో, దయాజ్‌ను తొలగించి అధ్యక్షుడయ్యెను (1911). సేనానులలో ఒకడైన హుయర్టా, మారిరోను హత్య చేయించి, 1913 లో అధ్యక్షుడయ్యెను; వెంటనే ప్రతి విప్లవములు రేగినవి. ఎమిలియనో జపటా నాయకత్వము క్రింద 'భూమి, స్వేచ్ఛ' అని కేకలు వేయుచు, రైతులు, కూలీలు తిరుగబడిరి. జపటా విప్లవ చిహ్నమయ్యెను. అతని గూర్చి ఎన్నో కథలూ, పాటలూ బయలుదేరినవి. కడకు జపటా సహచరుడగు కర్రంజా అధికారమును ప్రజల సహకారముచే స్వీకరించి, వ్యవసాయ సంస్కరణములను ప్రవేశపెట్టెను (1915).

కరంజా పరిపాలనలో 1917 లో మెక్సికోయందు ప్రజాస్వామ్య రాజ్యాంగ విధానము ఏర్పడినది. ఆ తరువాత అధికారమునకు వచ్చిన వివిధ ప్రభుత్వములు విద్యా, వ్యవసాయ, కార్మిక రంగములందు సముచితములగు సంస్కరణలను ప్రవేశపెట్టి, దేశాభ్యుదయమునకు తోడు పడినవి. 1938 లో అధ్యక్షుడుగ ఉండిన లాజరో కార్డినాస్ దేశమందలి నూనె కంపెనీలలో, విదేశీయుల ఆధిపత్యమున ఉన్న వానినెల్ల ప్రభుత్వపరము ఒనర్చెను. ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున ఈ దేశము అక్షరాజ్యములపై

యుద్ధము ప్రకటించి యుద్ధానంతరమున ఐక్యరాజ్య సమితి నిర్మాణమున పాల్గొనెను [చూ. ద్వితీయ ప్రపంచ యుద్ధము - పు. 608].

రాజ్యాంగము: సమాఖ్యారూపమగు ప్రజా స్వామిక గణ రాజ్య ప్రభుత్వము ఈ దేశమున అమలునందు ఉన్నది. ఈ సమాఖ్యలో 29 రాష్ట్రములును, ముఖ్య నగరము, రెండు ప్రాంతీయ మండలములు భాగస్వాములై ఉన్నవి. అధ్యక్షుడును, శాసనసభయు, రాష్ట్రముల గవర్నర్లును సార్వజనిక వయోజన పద్ధతిన ఎన్నుకొనబడుదురు. అధ్యక్షుని పదవీ పరిమితి కాలము ఆరు ఏండ్లు. ఈతడు పదవి నుండి విరమించిన తరువాత మరల ఏనాడును అధ్యక్ష పదవికి ఎన్నుకొనబడుటకు వీలులేదు. పరిపాలనలో తనకు సాయమొనర్చుటకు అధ్యక్షుడు ఒక మంత్రి మండలిని నియమించుకొనును. ఇందు వివిధశాఖల నిర్వహించు 13 గురు మంత్రులును, సమాఖ్యా ప్రాతినిధ్య ముఖ్యులు (ఫెడరల్ ఏజన్సీ చీఫ్స్) ఇరువురును, రాజ్యాధివక్త (అటర్నీ - జనరల్) యును సభ్యులుగ ఉందురు. శాసన సభయందు శిష్టసభ (కామరా డి సెనడోర్స్), ప్రతినిధిసభ (కామరా డి డిప్యూటాడోస్) అను రెండు కక్ష్యలు కలవు. రాష్ట్రములును, ముఖ్య నగరమును ఒక్కొక్కటి ఇరువుర చొప్పున ఎన్నుకొనిన 60 మంది సభ్యులు తొలిదానియందు కలరు. ప్రతినిధి సభయందలి సభ్య సంఖ్య 162. 1,70,000 మంది ప్రజలకు ఒక ప్రతినిధి చొప్పున ప్రతి రాష్ట్రమున ఇరువురకు తగ్గకుండను, ఒక్కొక్క ప్రాంతీయ మండలికి ఒకరికి తగ్గకుండను ప్రాతినిధ్యము ఉండునటుల ఈ ప్రతినిధి సభకు సభ్యులు ఎన్నుకొనబడుదురు. శిష్టసభ సభ్యుడు ఆరేండ్లును, ప్రతినిధిసభ సభ్యుడు మూడేండ్లను తమ పదవులందు ఉందురు. సంవత్సరమున నాలుగు నెలలు మాత్రమే శాసనసభ సమావేశమై ఉండును. తరువాత ఎనిమిది నెలలందును ఒక శాశ్వత సమితి పనిచేయును. శిష్ట సభ సభ్యులు 14 గురును, ప్రతినిధి సభ సభ్యులు 15 గురును ఈ సమితిలో సభ్యులుగ ఉందురు. శాసన సభకు సర్వాధికారములు కలవు. అధ్యక్షుడు శాసన సభకు బాధ్యత వహించి పరిపాలించును.

దేశమందలి రాజకీయ పక్షములందెల్ల విప్లవ సంస్థా పక్షము (పార్టిడో రివల్యూషనరియో ఇన్‌స్టిట్యూషనల్) ప్రముఖమైనది. 1928 నుండి జరిగిన అన్ని ఎన్నికలలోను ఈ పక్షమే ప్రాబల్యమును ఆర్జించి పరిపాలన నెరపుచున్నది. 1959 లో జరిగిన ఎన్నికలో ఈ పక్షపు అభ్యర్థి అడాల్ఫో లోపెజ్ మతియోస్ అధ్యక్షుడుగ ఎన్నుకొనబడెను. తీవ్ర వామపక్ష భావములకు వైదొలగి, పాత కాలపు దక్షిణ పక్షముల నిరసించుచు, మధ్యేమార్గము అవలంబించుచు ఈ పక్షము కృషిచేయుచున్నది. **చీ. శే. రా.**

**మెజారిన్, జూలెస్ (1602 - 1661)**: ఫ్రెంచి రాజనీతివేత్త; లూయీ - XIV కాలమున ప్రధాన మంత్రి. ఇతడు ఇటలీలో జన్మించి, రోమ్‌నగరములోను, స్పెయిన్‌లోను విద్యాభ్యాసము చేసెను. 1634 లో ఈయన పోప్ ప్రతినిధిగ ఫ్రెంచిరాజు కొలువులో ప్రవేశించి, అప్పటి ఫ్రెంచి ప్రధాని అగు రిష్‌లూ సాన్నిహిత్యమును సంపాదించగలిగెను. రిష్‌లూ ప్రోద్బలముపై మెజారిన్ ఫ్రెంచి పౌరస్వత్వమును స్వీకరించి, ఆ దేశపు దౌత్య వ్యవస్థలో చేరెను; రిష్‌లూ మరణానంతరమున 1642 లో ప్రధాని పదవిని చేపట్టెను. 1643 లో బాలుడైన లూయీ - XIV సింహాసనము ఎక్కిన తరువాత సైతము ఇతడు అచిరకాలముననే రాజమాత అనుగ్రహమును ఆర్జించి తన పదవిని నిలుపుకొనెను. కాని, సర్వాధికారములు రాజునకు కైవసముచేయుట, ప్రజలపై భరింపరాని పన్నులు వేయుట అను రిష్‌లూ విధానమునే అనుసరించి, ఇతడు ప్రజలకు, ప్రభువులకు కూడ కంటకుడు అయ్యెను. వెస్ట్ ఫేలియా సంధి (1649) [చూ.] ప్రకారము ఫ్రాన్స్‌నకు ఇతడు పెక్కు ప్రయోజనములను చేకూర్చినను ప్రజలు ఇతని పాలనా విధానమును ప్రతిఘటించిరి. ఆ ప్రతిఘటన మూలముననే ఇతడు 1651 లోను, 1652 లోను పదవీ బహిష్కృతుడు కావలసివచ్చెను. కాని, ఇతడు తన రాజనీతి కౌశలమున ప్రతిస్పర్ధులను అణచివైచి, రాజరికమునకు స్థైర్యము చేకూర్చి, మరల పదవిని చేపట్టి (1653), భూస్వామి వ్యవస్థ (ఫ్యూడలిజమ్) ను నిర్మూలించి, మరణాంతము నిరంకుశుడుగ వ్యవహరించెను. మెజారిన్ యుద్ధమున స్పెయిన్‌ను ఓడించి, పిరనీస్ సంధి (1658) మూలమున ఫ్లాండర్స్ మొదలగు కొన్ని ప్రాంతములను ఫ్రెంచి సామ్రాజ్యమున చేర్పించుటయేకాక, స్పెయిన్ ప్రభు కుమారిని లూయీ - XIV పెండ్లాడునటుల చేసెను. ఈ వివాహమువలని పరిణామములే యూరప్ చరిత్రలో ఆ తరువాతి కాలమున పలు సంఘటనలకు హేతువులైనవి [చూ. ఫ్రాన్స్ పు. 634; స్పానిష్ వారసత్వ సంగ్రామము]



జూలెస్ మెజారిన్
(1602 - 1661)

**ఆ. వెం.**

**మెజెల్లాన్, ఫెర్డినాండ్** (1480 ర. - 1521) : పోర్చుగీస్ నావికుడు, ప్రప్రథమ భూప్రదక్షిణ నౌకాయాత్రికుడు. స్వదేశము నుండి పశ్చిమ దిశగా నౌకాప్రయాణము చేసి, ఈస్ట్ ఇండియా దీవులు చేరుటకు ఇతడు ఒక పథకమును రూపొందించెను. పోర్చుగీస్ రాజు ఆ పథకముపట్ల ఉదాసీనతను చూపించెను. కాని, స్పెయిన్ చక్రవర్తి ఛార్లెస్ - V దానిని ఆమోదించి, 5 నౌకలను, 265 గురు సిబ్బందిని ఇతని పరము చేసెను. మెజెల్లాన్ సెవిల్లీ రేవునుండి బయలుదేరెను (20-9-1519). సుదీర్ఘ ప్రయాణానంతరమున ఆ సంవత్సరాంతమున దక్షిణ అమెరికా తూర్పు కోస్తా ఇతని కంటబడెను. 1520, జనవరిలో అతడు రియో డి జనీరో అఖాతమును చేరుకొని, పశ్చిమ సముద్రమునకు పోవు మార్గముకొరకు కొన్ని వారములపాటు తీరము వెంట అన్వేషణ సాగించెను. చలికాలము ఆసన్నమగుటవలన, ఆహారపు కొరతవలన, ఇతర ఇబ్బందులవలన అసంతృప్తి చెంది అతని సిబ్బంది తదుపరి ప్రయాణమునకు విముఖమై చేసిన తిరుగుబాటును అడచివైచి, తన ప్రయత్నమున కృతకృత్యుడు కావలయునన్న పట్టుదలతో అహోరాత్రములు పయనించి అక్టోబరులో ఒక జలసంధిని ప్రవేశించి, తాను వెదకుచున్న మార్గము అదియే అని తెలిసికొనెను. ఆ జలసంధికి తరువాత అతని పేరు పెట్టబడెను. ఆ జలసంధి ద్వారా దక్షిణ అమెరికాను చుట్టి పసిఫిక్ మహాసముద్రమున ప్రవేశించి, అతడు పశ్చిమదిశగా పోయి చాలకాలమునకు మేరియానా దీవులను, తరువాత ఫిలిప్పీన్ దీవులను చేరుకొనెను. మెజెల్లాన్ ఆ ద్వీపవాసులతో చెలిమిచేసి, వారి అంతఃకలహములలో జోక్యము కలిగించుకొని హతుడయ్యెను. అతని అనుచరుడు సెబాస్టియన్ హిందూమహాసముద్రము ద్వారా గుడ్‌హోప్ అగ్రమును చుట్టి స్పెయిన్‌కు తిరిగి చేరుకొనెను (8-9-1522). సిబ్బందిలో ముప్పది ఒకటి మంది మాత్రమే తిరిగి స్వదేశమునకు రాగలిగిరి. ఈ యాత్రలో తాను మరణించినను, ఫెర్డినాండ్ మెజెల్లాన్ భూగోళమును చుట్టి వచ్చుటకు నౌకామార్గమును కనుగొనిన ఆ కీర్తి స్పెయిన్ దేశమునకు దక్కించెను [చూ. దేశాన్వేషకులు పు. 528].



ఫెర్డినాండ్ మెజెల్లాన్

(1480 ర. - 1521)

ఆ. వెం.

**మెటర్‌నిఖ్, క్లెమెన్స్** (1773 - 1859) : ఆస్ట్రియా రాజనీతివేత్త. ఇతడు జర్మనీలో జన్మించి, స్ట్రాస్‌బర్గ్ యూనివర్సిటీలో విద్యాభ్యాసము చేసి, 1794 లో వియెన్నాకు తరలి వచ్చెను; ఆస్ట్రియా చాన్సెలర్ (ప్రధాని) మనుమరాలిని వివాహమాడి పలుకుబడి సంపాదించెను. 1797 లో ఇతడు రాజకీయములను చేపట్టి ప్రష్యా, రష్యా, ఫ్రాన్సు దేశములలో దౌత్యవ్యవహర్తగ పనిచేసెను. మెటర్‌నిఖ్ 1809 లో ఆస్ట్రియా విదేశాంగమంత్రియై, 1821 లో చాన్సెలర్ పదవిని అధిష్ఠించి, రెండు పదవులను నిర్వహించుచు దాదాపు 40 సంవత్సరములు అంతర్జాతీయ వ్యవహారములలో ప్రముఖస్థానమును ఆక్రమించెను. నెపోలియన్ యుద్ధముల ఫలితముగ యూరప్‌లో చెలరేగిన స్వతంత్ర భావవ్యాప్తిని అరికట్ట యత్నించిన వర్గమునకు ఇతడు నాయకుడు. వియెన్నా కాంగ్రెస్ [చూ.] కు అధ్యక్షత వహించి, అందు ఆమోదింపబడిన ప్రభుత్వములను, దేశసరిహద్దులను యథాతథముగ నిలుపుటకును, గణతంత్ర రాజ్య సిద్ధాంతమును ఉన్మూలించుటకును ఇతడు తీవ్ర కృషి సాగించెను. 1848 విప్లవమువలన ఇతడు పదవీచ్యుతుడై, కొంతకాలము ఇంగ్లండులో తలదాచుకొని, 1851 లో మరల ఆస్ట్రియా దేశము చేరుకొని, పదవులు లేకున్నను జీవితాంతము వరకు రాజకీయములపై తన ప్రభావమును నెరపుచూ కాలము వెళ్ళబుచ్చెను.



క్లెమెన్స్ మెటర్‌నిఖ్

(1773 - 1859)

ఆ. వెం.

**మెసపొటేమియా** : అతి ప్రాచీన నాగరకతలకు నిలయముగ విలసిల్లిన ఒక దేశము. పశ్చిమ ఆసియాలో 'యూఫ్రటీస్', 'టైగ్రిస్' నదులకు మధ్య ఈ దేశము ఉండినది. ఈ ప్రదేశమునకు 'మెసపొటేమియా' అని పేరు. మెసపొటేమియా అనగా రెండు నదుల మధ్యదేశమని అర్థము గనుక, ఈ పేరు సార్థకమైనది. ఈ మెసపొటేమియాలో రెండు ప్రదేశములు ప్రాముఖ్యమును వహించినవి.

1. బాబిలోనియా : దీని రాజధానీ నగరము బాబిలన్. అది 'యూఫ్రటీస్' నదికి తూర్పుతీరమున ఉన్నది.

2. కాల్డియా : దీనికి 'బిట్ యాకిన్' రాజధాని నగరము ; 'ఉర్' ప్రాచీన ప్రసిద్ధిగల నగరము. ఈ కాల్డియా ప్రదేశము బాబిలన్‌కు ఆగ్నేయమున, 'పారసీక సింధు

శాఖ' కు ఉత్తరతీరమందు ఉండెను. బాబిలన్‌కు ఈశాన్యమున, 'టైగ్రిస్' నదికి తూర్పు వైపున 'అసీరియా' దేశము ఉండెను. అసీరియా రాజులు కొంత కాలమునకు ప్రబలి, మెసపొటేమియా ప్రదేశమందు తమ సామ్రాజ్యమును విస్తరింపజేసికొనిరి.

మెసపొటేమియాను గురించిన చరిత్రపూర్వయుగపు వివరములు ఎక్కువగ తెలియవచ్చుటలేదు. ఈ దేశమున మనకు తెలిసినంతవరకు మొదట నివసించి, గొప్ప నాగరకతను పొంది, ఖ్యాతిగాంచిన వారు 'సుమేరియన్‌లు'. వీరు అందమైన పట్టణములు నిర్మించి, చిన్న చిన్న స్వతంత్ర నగరరాజ్యములు స్థాపించుకొనిరి. ఈజిప్షియన్‌లు 'హాయర్ గ్లిఫిక్స్' (చిత్రలిపి) ని కనిపెట్టినట్లే సుమేరియన్‌లు 'క్యూనిఫారమ్' (కీలలిపి) వ్రాతను కనిపెట్టిరి. ఈ రెండింటి మూలమున ఆధునిక ప్రపంచమున అక్షరమాలలు ఏర్పడెను. సుమేరియన్‌లు అక్షరములను రేవడిమట్టిపై కర్రగంటముతో రచించుచుండిరి. 'క్యూనిఫారమ్' అనగా కీలాకారము. సుమేరియన్‌ల లిపి కీలాకారమున ఉండుటచేత, దీనికి 'క్యూనిఫారమ్' లిపి అను పేరు వచ్చినది [చూ. సుమేరియన్ నాగరకత].

మానవ సంస్కృతి అభివృద్ధి పొందుటకు లిపి ముఖ్యము. ప్రాచీనకాలమందలి జనుల నిబంధనలు, న్యాయశాస్త్ర నియమములు మొదలైనవి లిఖితరూపములైన ఎడల స్థిరస్థాయిగ ఉండగలవు. ప్రాచీన మెసపొటేమియాలోని ఉత్తరములు, శాసనములు, జమాఖర్చులు మున్నగునవి రేవడిమట్టి బిళ్లపెంకులపై రచితములు అయినవి. ఇట్టివి ఎన్నియో మనకు లభించుటచేత ఆ కాలమునాటి సంగతులు తెలిసికొనగలిగితిమి. ఈ సుమేరియన్‌లు లిపిని నిర్మించుటయే కాక కంచు, రాగి, బంగారము మొదలగు ధాతువులను వాడుచుండిరి. మెసపొటేమియా దేశమునకు వీరి తరువాత వచ్చిన వారందరును వీరి నాగరకతను స్వీకరించి అభివృద్ధి చేసిరి. ఈ దేశపు పూర్వ చరిత్రమును నాలుగు భాగములుగ విభజింపవచ్చును. 1. మొదటి బాబిలోనియా రాజ్యము (క్రీ. పూ. 2600 - 1700); 2. కాసైట్‌ల పాలనము (క్రీ. పూ. 1700 - 1100); 3. అసీరియన్ సామ్రాజ్యము (క్రీ. పూ. 1100 - 612); 4. రెండవ బాబిలోనియన్‌ల (కాల్డియన్) సామ్రాజ్యము (క్రీ. పూ. 612 - 539).

మొదటి బాబిలోనియా సామ్రాజ్యము స్థాపింపబడక పూర్వము 'సార్గన్' అను యోధుడు చిన్న పట్టణ రాజ్యములనెల్ల తన బాహుబలమున ఏకరాజ్యముగ చేసెను. ఇతడు స్థాపించిన రాజ్యమును 'సుమేరియన్ సామ్రాజ్య' మని చరిత్రకారులు పేర్కొనిరి. అక్కడియన్‌లు సుమేరియన్‌లను జయించినను, తమకన్న నాగరకులైన సుమేరియన్‌ల ఆచార వ్యవహారమును, లిపిని గ్రహించి సుమేరియన్‌లతో ఏకమైపోయిరి. అందువలననే ఈ ఉభయ జాతులపేర ఈ సామ్రాజ్యమును సుమేరియన్ - అక్కడియన్ సామ్రాజ్యము అనియు కొందరు వ్యవహరింతురు.

సుమారు క్రీ. పూ. 1700 లలో 'కాసీయులు' అనువారు బాబిలోనియాను జయించిరి. వీరు మంచి వీరులే గాని, అనాగరకులు. వీరు సుమారు 600 ఏండ్లు బాబిలన్‌ను పాలించిరి. వీరిని అసీరియన్‌లు ఓడించి నూతన సామ్రాజ్యమును నిర్మించిరి. దీనినే 'అసీరియన్ సామ్రాజ్య' మందుము [చూ. పు. 279].

అసీరియా రాజ్యము కూలిన తరువాత కొంతకాలమునకు మరల బాబిలోనియా ప్రాముఖ్యమునకు వచ్చెను. అచట మరియొక సామ్రాజ్యము స్థాపింపబడెను. దీనినే రెండవ బాబిలోనియా సామ్రాజ్యము (కాల్డియన్ సామ్రాజ్యము) అని చరిత్రజ్ఞులు పేర్కొనుచున్నారు. ఈ సామ్రాజ్యము మనిన కొలదివత్సరము (క్రీ. పూ. 606 - 538) లలో బాబిలోనియా సర్వతోముఖముగ అభివృద్ధి గాంచెను [చూ. కాల్డియన్ సామ్రాజ్యము - పు. 388].

ఈ ప్రాంతము క్రీ. పూ. 539 లో పారసీక సామ్రాజ్యమున అంతర్భాగమయ్యెను. పారసీక సామ్రాజ్యపతనము ఫలితముగ క్రీ. పూ. నాలుగవ శతాబ్దపు తుదిపాదము నుండియు గ్రీక్‌ల పలుకుబడి ఇట వ్యాపించెను. తరువాత ఇట క్రమముగ పార్థియన్‌లు, శకులు కొంతకాలము పరిపాలన నెరపిరి. తుదకు పారసీక (ఇరాన్) రాజ్యమునకు నూతన శోభను కలిగించిన ససానియన్ వంశపు రాచరికము కాలమున ఈ రాజ్యము వారి పరిపాలనలో ఉండెను. ఆ సమయమున ససానియన్ రాజులకు రోమన్ చక్రవర్తులతో జరిగిన పోరాటములకు ఈ ప్రాంతము నెలవయ్యెను. ససానియన్ సామ్రాజ్యమును ఇస్లామ్ సేనావాహినులు నిశ్శేషము ఒనర్చుటచే, ముస్లిమ్ సంస్కృతి ఇట నెలకొనెను (క్రీ. శ. 7 వ శతాబ్ది). అటనుండి ఆరు శతాబ్దములకాలము ఈ ప్రాంతము కలీఫా [చూ. పు. 374] పరిపాలనలో ఉండి, అంతట మంగోల్‌ల వశమయ్యెను (1258). తరువాత 16 వ శతాబ్దిలో ఈ ప్రాంతము తుర్కులవశమయ్యెను. ప్రథమ ప్రపంచ యుద్ధము వరకు ఈ దేశము ఓటోమన్ తుర్కుసామ్రాజ్య పాలకుల అధీనముననే ఉండి, ఆ యుద్ధఫలితముగ ఆ సామ్రాజ్యము అంతరించుటచే, ఇరాక్ అను పేరుతో నూతన రాజ్యముగ రూపొందెను. [చూ. ఇరాక్ పు. 323]. * * *

**మేనర్‌హిమ్, కార్ల్ గస్టావ్ ఎమిల్** (1867 - 1948): స్వీడన్ జాతీయుడైన ఫిన్లాండ్ యోధుడు; రాజనీతివేత్త. రష్యా సామ్రాజ్య సేనలో కొంతకాలము పనిచేసెను. 1918 వసంతకాలములో ఫిన్లాండ్ కమ్యూనిస్టులు హెల్‌సింకీ నగరమును పట్టుకొనగా, ఇతడు జర్మనీ సహాయముతో దానిని పునరాక్రమించి, కమ్యూనిస్టులను దేశమునుండి తరిమివేసెను; మరల 1919 - 20 లో ఫిన్లాండ్ తాత్కాలిక అధ్యక్షుడుగను, సర్వసేనానిగను రష్యన్‌లతో పోరాడి, చివరకు సోవియట్ రష్యాచే తన దేశ స్వాతంత్ర్యమును అంగీకరింపజేసెను. 1939 లో సోవియట్ రష్యా తన దేశముపై దండెత్తివచ్చినప్పుడు ఇతడు తనపేర నిర్మింపబడిన రక్షణశ్రేణి సాహాయ్యమున కమ్యూనిస్ట్ సేనావాహినిని నిలువరింపగలిగెను. 1941 లో మేనర్‌హిమ్ జర్మనీ పక్షమున చేరి మూడవసారి సోవియట్ రష్యాతో యుద్ధమునకు దిగెను; కాని, రష్యా సేనల ప్రచండధాటికి తట్టుకొనలేక, యుద్ధవిరమణ సంధి కుదుర్చుకొని (1944), జర్మనీ ఓటమి రూఢియైన వెంటనే మిత్రరాజ్యములతో చేరెను (1945). 1944 లో ఫిన్లాండ్ అధ్యక్షుడుగ ఎన్నుకొనబడి, తదుపరి స్వదేశమున రాజకీయములు వామపక్షమువంక మొగ్గినను 1946 వరకు ఇతడు ఆ పదవిని నిర్వహించెను. ఆ. వెం.

**మేరియా తెరెసా** (1717 - 1780): ఆస్ట్రియా రాణి. పవిత్ర రోమన్ సామ్రాజ్యమునకు చక్రవర్తియైన చార్లెస్ - VI చనిపోవుముందు తన కుమార్తె మేరియాను తన మరణానంతరము రాజ్యాధికారిణిని చేయవలెనని నిశ్చయించెను. అతని కోరిక నెరవేర్చుటకు ఫ్రాన్స్, బ్రిటన్, రష్యా, ప్రష్యా మొదలైన దేశములవారు హామీ ఇచ్చిరి. 1740లో తన 23వ ఏట మేరియా ఆస్ట్రియా, బొహీమియా, హంగేరి దేశములకు, జర్మనీ, ఇటలీ దేశములలో కొన్ని రాష్ట్రములకు రాణి అయినది. మేరియా అల్పవయస్సు గలది కనుక, ఆమె అమాయికతను అవకాశముగ తీసికొని చార్లెస్ చక్రవర్తికి హామీ ఇచ్చిన మోతుబరి రాజ్యాలవారే ఆమెకు ద్రోహము చేయుటకు తలపెట్టిరి. ప్రష్యారాజు ఫ్రెడరిక్ జర్మనీలోని సైలీషియా రాష్ట్రమును 1742 లో ఆక్రమించెను. ఫ్రాన్స్ యొక్క మద్దతుతో బవేరియా, శాగ్జనీ దేశములవారు ఆస్ట్రియాను అపహరించుటకు యత్నించిరి. స్పెయిన్ దేశము ఇటలీ రాష్ట్రములపై కన్ను వేసినది.

ఈ కుట్రల ఫలితముగ 1740 - 1748 మధ్య ఆస్ట్రియా వారసత్వసంగ్రామము జరిగినది. గ్రేట్ బ్రిటన్ ఒక్కటే మేరియా తరఫున యుద్ధమునకు దిగినది. మిగిలిన మిత్రులందరు శత్రువులయిరి. 1748 లో జరిగిన ఐ లా - షా - పెల్ శాంతిసంధి [చూ. పు. 359] ని అనుసరించి సైలీషియా ఫ్రెడరిక్‌కు, ఇటలీలో కొంతభాగము స్పెయిన్‌కు ఆమె వదలినది. ఇంతలో ఆమెభర్త ఫ్రాన్సిస్ పవిత్ర రోమన్ సామ్రాజ్యమునకు ఆమె సహాయమున చక్రవర్తి అయ్యెను (1745). ఇందువలన యూరప్ ఖండమున అత్యధికభాగమును ఆమెయు, ఆమె భర్తయు తమ పాలనలో ఉంచుకొనగలిగిరి.

కాని, తన పిత్రార్జితమగు విశాల రాజ్యమున కొన్ని ప్రాంతములను తాను కోల్పోతినను మనోవ్యథ మేరియాను పీడించుచుండెను. సమకాలిక యూరపియన్ రాజకీయ పరిస్థితులలో తన చాకచక్యమును ఉపయోగించి మిత్ర రాజ్యములను సమకూర్చుకొనుటకు ఆమె కృషి చేసెను. తత్ఫలితముగ రష్యాతోను, ఫ్రాన్స్‌తోను 1757 లో ఆమె మైత్రిని సాధింపగలిగెను. కాని, బ్రిటన్ మాత్రము పరిస్థితుల ప్రాబల్యమువలన ఆస్ట్రియాకు శత్రువగు ప్రష్యా రాజుతో మైత్రిని కలుపుకొనుటవలన మేరియాకు ఆశించినంతగ లాభము కలుగలేదు. కడకు 1756 లో సైలీషియా కొరకై ప్రష్యారాజుతో మేరియాకు పోరాటము మరల తటస్థించినది. ఈ యుద్ధములో ఫ్రాన్స్, రష్యాదేశములు మేరియా తరఫునను; బ్రిటన్ ప్రష్యా తరఫునను పోరాటమునకు దిగినవి. క్రమముగ ఇది బ్రిటన్, ఫ్రాన్స్‌ల మధ్య జరిగిన సప్తవర్ష యుద్ధము (1756 - 1763) [చూ.] గ పరిణమించి, 1763, ఫిబ్రవరి 15 న జరిగిన సంధితో ముగిసినది. కాని, సైలీషియా మాత్రము మేరియాకు దక్కలేదు. అయినను ఫ్రాన్స్ మైత్రివలన యూరపియన్ రాజకీయరంగమున చేకూరగల లాభముల గుర్తించి, మేరియా తన కుమార్తె అగు మేరీయాంత్వానేట్‌ను ఫ్రాన్స్ యువరాజునకు ఇచ్చి 1770 లో వివాహము చేసి, ఆస్ట్రియా - ఫ్రాన్స్ రాజకుటుంబముల మధ్య గల 200 ఏండ్ల బద్ధవిరోధమును అంతరింపజేసెను.

మేరియా తన సామ్రాజ్యమును చక్కగ పాలించినది. వ్యవసాయమును, పరిశ్రమలను వృద్ధిచేసినది. అర్థమత్తులైన భూస్వాముల హక్కులు తగ్గించి, రైతులకు తోడ్పడినది. ఆమె భర్త యొక్క మరణానంతరమున ఆమె కుమారుడైన జోసెఫ్ - II తలితండ్రుల రాజ్యముల రెండింటికిని చక్రవర్తి అయ్యెను. అతని పరిపాలనలో సర్వవిధముల తోడుపడి, మేరియా ఉత్తమమైన సమర్థతగల రాణి అను కీర్తి గడించినది [చూ. ఆస్ట్రియా పు. 305.]. ప్ర. రా.

**మేసిడోనియా**: చూ. సమీక్ష - పు. 36.

**మైసీనియా**: గ్రీస్‌లోని అత్యంత ప్రాచీన నగరములలో ఒకటైన మైసీనీ నగరములో వర్థిల్లిన నాగరకత.

ట్రోజన్ యుద్ధమునకు ముందు మంచి స్థితిలో ఉండెను. హోమర్ మహాకవి రచించిన 'ఇలియడ్' లో ఈ పట్టణము 'సిటీ ఆవ్ ఎగమెమ్నాన్' అని పేర్కొనబడినది.

క్రీ. పూ. 479 లో మెసీనియన్‌లు తెరోమ్మెపొలె, ప్లాటీయాలకు పంపివేయబడిరి. 1876 లో త్రవ్వగా, భూగర్భమున ఉండిపోయిన నగరపు చిహ్నములు బయటపడినవి. అనేకముగ నగలు, ఆయుధములు మున్నగునవి బయటపడినవి. నగరముచుట్టు ఉన్న గొప్ప కోటవంటి కట్టడము, తేనెపట్టుగదులవంటి తొమ్మిది సమాధులు, సింహద్వారము ఇప్పటికిని అచట కలవు [చూ. ఈజియన్ నాగరకత పు. 335].

* * *

**మొగల్ పరిపాలనా విధానము :** సాధారణముగ అక్బర్ [చూ. పు. 280] కాలమునాటి పరిపాలనా విధానమే మొగల్ పాదుషాలు అందరు అనుసరించినటుల చెప్పవచ్చును. కేంద్రప్రభుత్వమునకు పాదుషా సర్వాధికారి. వివిధ రాజ్యాంగ విషయములందు అతనికి తోడ్పడుటకు అతనికి అనేక ప్రధానులు, మహాప్రధానులు ఉండిరి. రాజ్యాధికారమునకు మూలాధారము సైన్య బలమే. చక్రవర్తి సర్వ సైనికులకు నియంత. ప్రధాన మంత్రులు సేనాధిపతులుగ కూడ ఉండిరి. ప్రధాన మంత్రికి వకీలు అని పేరు. కేంద్ర పరిపాలనకు ఎన్నియో సభలు ఉండెను. ఒక్కొక్క సభ ఒక్కొక్క శాఖను పరిపాలించుటకై నియమింపబడెను. ముఖ్యముగ పేర్కొనవలసిన శాఖలు : 1. రాజ్యాంగనిర్వహణశాఖ : ఈ శాఖకు దివాన్ అధ్యక్షుడు. ఖజానా, ఆయవ్యయముల లెక్కల పరిశీలన ఇతని వశమున ఉండెను; 2. సైనిక కార్యవర్గశాఖ : సైనికులకు జీతములు ఇచ్చుట, వారి జీవిత విధానక్రమము, వారి సుఖములు, పనులు మొదలగు వాటిని నిర్ణయించుటకు ఈ శాఖ ఏర్పరుపబడెను ; 3. రాజగృహ వ్యవహారముల నడవడిని కనిపెట్టునటువంటి శాఖ ; 4. న్యాయ విచారణశాఖ ; 5. మతవిషయిక శాఖ. ఈ విధముగ అయిదు శాఖలు కలిగి, కేంద్ర ప్రభుత్వము ఒప్పుచుండెను.

మొగల్ సేన మన్‌సబ్దారీ పద్ధతిని అనుసరించి ఉండెను. ఈ సామ్రాజ్యమున సివిల్, మిలిటరీ అధికారులు అందరు మన్‌సబ్దారులు అని వ్యవహరింపబడిరి. మన్‌సబ్దారులు పదివేల గుర్రముల దండుగల నాయకుని మొదలు పది గుర్రములదండుగల నాయకుని వరకు 33 విధములుగ ఉండిరి. 10,000, 7,000 గుర్రముల దండుకు రాజకుటుంబములోని వారే అర్హులు. అట్లు రాజకుటుంబమునకు చెందక ఆ పదవులలో ఉండినవారు రాజా తోడరమల్ [చూ. పు - 524], మాన్‌సింహుడు, కులీచ్‌ఖాన్ అనువారలు. వీరు అక్బర్ మంత్రులలో ముప్పురు. మన్‌సబ్దారులను నియమించుట, తీసివేయుట, వారిని పై ఉద్యోగములకు నియమించుట మున్నగు విషయములు అన్నియును చక్రవర్తి అధీనములో ఉండెను. మన్‌సబ్దారు పదవి వంశపారంపర్యముగ వచ్చునది కాదు. 5,000 గుర్రపు నాయకుడు 340 గుర్రములను, 100 ఏనుగులను, 260 బరువులను మోయు జంతువులను ఉంచుకొనవలెను. అట్టి మన్‌సబ్దారులకు 28 వేలనుండి 30 వేల రూపాయలవరకు జీతము ఇవ్వబడుచుండెను. పది గుర్రముల దండుకు నాయకుని జీతము 75 మొదలు 100 రూపాయల వరకును ఉండును. ఈ మన్‌సబ్దారి పదవి తరువాత గౌరవ బిరుదముగ మారిపోయినది. మొగల్ సేన కాల్బలము, ఫిరంగిదండు, గుర్రములు, జడదండు కలిగి ఉండెను. కాల్బలము అంత ప్రశస్తమైనది కాదు. తరిబీదయినవారు, కానివారు కూడ అందుండిరి. ఫిరంగి దండును మొట్టమొదట భారతదేశమున ప్రవేశపెట్టినవాడు బాబర్. అన్నిటికన్న ముఖ్యమైనది అశ్వదళము. మన్‌సబ్దారీ విధానమునందు అంతటను అశ్వదళమే ప్రధాన స్థానము వహించినది. అక్బర్ పాదుషా అశ్వదళమును అభివృద్ధిచేసి, అదివరకు ఉండెడి పద్ధతిని మార్చెను. గుర్రపు రౌతులు మోసముచేయ వీలులేకుండ షేర్‌షావలె అక్బర్ మన్‌సబ్దారులయొద్ద ఉండెడి గుర్రములకు చురకలు వేయించెను. మొగల్ చక్రవర్తులకు జడదండుపై అంత శ్రద్ధ ఉండెడిదికాదు. ఈ లోపముచేతనే వారు సముద్రము మీదుగ దేశమును జయింప వచ్చిన విదేశీయులను ఓడించలేకపోయిరి. మొత్తముమీద మొగల్ సేన అంత బలమైనదికాదని చెప్పవచ్చును.

అక్బర్‌కు పూర్వము రాష్ట్రప్రభుత్వమని ప్రత్యేకముగ ఉండెడిది కాదు. షేర్‌షా [చూ.] పరిపాలన విధానమును అనుసరించి పాదుషా సామ్రాజ్యమును అంతటిని సుబాలుగను, పరగణాలుగను విభజించెను.

సుబాకు సుబేదారు అధిపతి. కేంద్రమున పాదుషా ఎంత నిరంకుశముగ పాలించుచుండెనో, రాష్ట్రమున సుబేదారు రాజప్రతినిధిగ అట్లే పాలించుచుండెను. ఇతనికి సివిల్, మిలిటరీ విషయముల రెండింటను సర్వాధికారము ఉండెడిది. న్యాయవిచారణ సభకు కూడ ఇతడే అధ్యక్షుడు. మత విషయములందు అతడు ఎట్టి జోక్యము చేసికొన వీలులేదు. ఉరిశిక్షవేయు అధికారము అతనికి లేదు. అట్లు వేయ నెంచిన ఎడల పాదుషా అనుమతిని అతడు పొంది ఉండవలెను. రాష్ట్రములో వివిధప్రదేశములందు ప్రజలకు ప్రభుత్వముపైగల అభిప్రాయమును, వారి నడతను ఎరుగు

టకు దూతలు అనేకులు నియమితులైరి. సుబేదారులకు సలహాను ఒసంగుటకు, దైనందిన వ్యవహారములను పరిష్కరించుటకు సుబాలో ఇతర అధికారులు ఎంతోమంది ఉండిరి. వారిలో ముఖ్యముగ పేర్కొనదగినవారు: దివాన్, సాదర్, అమీన్, బక్షీ, ఫోతేదార్, ఫౌజ్‌దార్, కొత్వాల్, కానుంగో అనువారు. దివాన్‌ను చాలకాలమువరకు సుబేదారే నియమించుచుండెను. పొలముపన్ను నిర్ణయించుటయందు అతనికి అధికారము ఉండెను. ఇతడు సుబేదారు నడతను పరిశీలించుచు, అతనితో కలసి రాష్ట్ర పాలనము చేయుచుండెను. ఇతనికిని, సుబేదారునకును అభిప్రాయభేదము ఉన్నచో కేంద్రప్రభుత్వము అట్టి విషయమును పరిష్కరించుచుండెను. పైన పేర్కొన్న అధికారులలో సాదర్ అను అతడు కేంద్రప్రభుత్వముచే నియమింపబడుచుండెను. ఇతడు సాధారణముగ సర్వవిద్యలను ఎరిగినవాడు. సుబేదారుకు లోబడి ఉండవలసిన అగత్యము అతనికి లేదు. అందుచే, స్వతంత్రముగ అధికారము చలాయించుచుండెను. పండితులు, విద్వాంసులు మున్నగువారిని ఆదరించి, వారికి భూములను ఇచ్చు అధికారము అతనికి ఉండెను. అమీన్ అను అధికారి రెవిన్యూకలెక్టర్ పని చేయుచుండెను. భూమియొక్క సారమును, ఫలమును నిర్ణయించుట ఇతని ముఖ్యమైన పని. రాష్ట్రములో శాంతి భద్రతలు నిలబెట్టుట, దారిదోపిడిదొంగతనములను అరికట్టి, దొంగలను శిక్షించుట మొదలైన ఇతర కార్యములు కూడ ఇతడే చేయుచుండెను. తనకు లోబడి ఉన్న ప్రదేశమందలి ప్రజలు సౌఖ్యముగ ఉన్నారో లేదో అను విషయమును గమనించుట, జాగీర్‌దారుల నడవడికలను అపుడపుడు పరిశీలించుట, మార్కెట్ ధరలను తెలిసికొని వాటిపట్టికలను తయారుచేసి, ప్రభుత్వమునకు ఎరుకపరచుట అతని విధియై ఉండెను. 'బక్షీ' అను ఇంకొక ఉద్యోగి కానుంగో నడతను పరిశీలించుచుండెను. వ్రాతయందును, లెక్కలు వ్రాయుటయందును నేర్పుగలవారిని ఆ పదవికి నియమించుచుండిరి. భూమి ఆదాయవ్యయ పట్టికలను ఇతడు తయారుచేయుచుండెను. రాష్ట్రములోని సేనలకు ఫౌజుదార్ అధిపతిగ ఉండెను; శాంతిభద్రతలను ఎల్లెడల నెలకొల్పుటకై సుబేదారునకు ఇతడు ముఖ్యముగ తోడ్పడుచుండెను. ఒక్కొక్క రాష్ట్రమున ఫౌజుదారులు అనేకులు ఉండిరి; కొన్ని పరగణాలు వారి అధీనతలో ఉండెను. 'కొత్వాల్' అను ఇంకొక ఉద్యోగి నగరములకు పోలీస్ అధికారిగ ఉండెను. పోలీస్ పనియేకాక, న్యాయవిచారణ చేసి, తీర్పుచేయు అధికారము కూడా ఇతనికి ఉండెను. పట్టణములో శాంతి భద్రతలను నిలబెట్టుట ఇతని విధి. 'వాకా-ఇ-నవీస్' అను అధికారి కేంద్రప్రభుత్వమునకు వార్తలను తెలుపుచుండెను. పరగణాకు ముఖ్య అధికారి 'కానుంగో'. తన అధీనతలో ఉన్న ప్రజల ఆచార వ్యవహారములను గమనించి, కర్షకుల భూముల ఆదాయములను తెలిసికొనుట ఇతని విధి. ఇతని జీతము 20 లేక 25 రూపాయలు. పరగణాలను గ్రామములుగ విభజించి ఉండిరి. ఒక్కొక్క గ్రామమునకు 'ముఖదమ్' అనియు, 'పట్వారీ' అనియు ఇద్దరు గ్రామాధికారులు ఉండిరి. భూమిపన్ను పట్టికల తయారుచేయుట వీరి పని. ముఖదమ్ అను అతడు గ్రామములో శాంతి భద్రతలను నెలకొల్పుచుండెను. అంతేకాక, ప్రభుత్వమునకు గ్రామమునుండి రావలసిన పన్ను సమముగ వచ్చుచున్నదా లేదా అని కూడ ఇతడు చూచుచుండెను.

ఆనాటి న్యాయపరిపాలన విధానమును గూర్చి మనము ఎరుగవలసి ఉన్నది. 'కాజీ' అను అధికారి 'ముఫ్తీ,' 'మీర్ అదల్' అనువారల సహాయముతో న్యాయవిచారణ సలుపుచుండెను. అప్పీల్‌లు అన్నియు సుబేదారునకుపోవుచుండెను. న్యాయాధికారులకు అభిప్రాయభేదమున్నచో, వారు ఆ విషయమును కేంద్రమునకు తెలియజేయవలయును. కేంద్రము విచారణ చేసి నిర్ణయించిన విధమును వారు అనుసరించవలయును. నేరము చేసినవారిని కొత్వాలు న్యాయస్థానమునకు గొనిపోవును. విచారణ లేనిదే ఏ నేరస్థునిగాని ఒక దినముకంటె హెచ్చుగ కారాగారమున ఉంచ వీలులేదు. ముఖ్యమైన విషయము లైనచో అప్పీల్‌లను చక్రవర్తికి పంపవచ్చును. కాని, అట్లు తరచుగ జరుగకుండెను.

భూములకు పాదుషా హక్కుదారుడు. మహమ్మదీయ సుల్తాన్‌లు మొదటినుండి వారు ఆక్రమించిన ప్రదేశములలో కొన్ని భాగములను తమ సొంతమునకు ఉంచుకొని, మిగిలినవాటిని జాగీరులుగ విభజించి, సేనానాయకులకు ఇచ్చుచుండిరి. వారు జాగీరులలోని రాబడిని పుచ్చుకొని, తమ సైన్యమును, తమ కుటుంబములను పోషించుకొనుచుండెడివారు. ఈ విధానమును అక్బర్ మార్చివేసెను. అన్ని భూములను రాజ్యమునకు చెందునట్లు చేసి, జాగీరుదారులకు జీతము ఇచ్చు ఏర్పాటు చేసెను. కాని, ఇట్లు చేయుటవలన రాజ్యములో తిరుగుబాటులు ఎక్కువైనవి. అందువలన ఈ పద్ధతిని కొలదికాలమువరకే అమలునందు ఉంచెను.

అక్బర్ కాలమున భూమిపన్ను నిర్ణయవిషయమున ఎన్నో మార్పులు కలిగెను. ఇతడు మొట్టమొదట షేర్‌షా పద్ధతిని అవలంబించెను. గుజరాత్‌ను జయించిన తర్వాత

తోడర్‌మల్ పొలములను కొలిపించి, తరములను నిర్ణయించి, తీరువను విధించెను. ఎల్లప్పుడు సాగుబడియగు పొలములను 'పొలచ్' అనియు, ఒకటి, రెండు సంవత్సరములు బీడుగ ఉండు పొలములను 'పరౌతీ' లనియు, మూడు, నాలుగేండ్లుగ ఉండు పొలములను 'చాసర్' లనియు, ఐదేండ్లకు ఎక్కువకాలము బీడుగ ఉండు పొలములకు 'బంజరు' లనియు నాలుగు తరములుగ విభజించెను. మరియు, వీటిని ఒక్కొక్కటిని మూడు తెగలుగ విడదీసెను. అవి ఉత్తమమైనవి, మధ్యమములు, హీనమైనవి. ఈ మూడు తెగల పొలముల సరాసరి మదింపును గ్రహించి మొత్తమున మూడింట ఒకపాలు సర్కారు తీరువగా ప్రభుత్వము నిర్ణయించెను. రైతులు ధాన్యరూపమునగాని, ధనరూపమునగాని తీరువను సర్కారుకు స్వయముగ చెల్లించవచ్చును. దీనినే 'రైతువారీపద్ధతి' అని పేర్కొనిరి. మొగలలనాటి సంఘము భూస్వామ్య (జాగీర్‌దారు) విధానమును అనుసరించి ఉండెను. పాదుషాయొక్క కొలువు విజ్ఞాన సంపదలకు పుట్టినిల్లు. దానికి ఆవల అంతయు దారిద్ర్యమే. మొగల్ సర్దారులు అనుభవించుచుండిన భోగభాగ్యములు వర్ణనాతీతములు. చక్రవర్తికి కానుకలు చెల్లించుచుండుటచేత వారి బొక్కసములు ఖాళీ అయినవి. విదేశపు సరుకులు హెచ్చుగ కొనుచుండుటచేత విదేశీయుల వ్యాపారము అభివృద్ధి కాసాగెను. ఔరంగజీబ్ తప్ప, తదితర పాదుషాలు అందరు మద్యపానీయములకు అలవడి ఉండిరి. అంతేకాక, ప్రతి పాదుషా గృహమునకు స్త్రీల బృందము ఒక విశేషముగ ఉండెను. వారి సౌకర్యములకు ప్రత్యేకముగ స్త్రీలే ఉద్యోగస్థులుగ నియమింపబడిరి. అక్బర్‌ను ఆశ్రయించి 5,000 స్త్రీజనము ఉండెను. పాదుషాకువలెనే మన్‌సబ్దారులకు, భూస్వాములకు అట్టి కొలువుకూటములు ఉండెను. నటులకు, నాట్యములకు వారు వ్యయపరచిన ధనము ఎంతయో చెప్పలేము. ఆనాటి జనుల ఆహారపదార్థములగూర్చి సర్ తామస్ రో అను ఆంగ్ల యాత్రికుడు విపులముగ వర్ణించి ఉండెను. వారు సామాన్యముగ మాంసమును వాడుచుండిరి; కాని, గోవులను చాల ఆదరణతో చూచుచుండిరి. బోఖారా, సామర్కండ్ దేశములనుండి ఫలములు మొదలగునవి దిగుమతి అగుచుండెను. మంచుగడ్డను అన్ని తెగలవారు వేసవి కాలములో విరివిగ వాడుచుండిరి; భూస్వాములు అన్ని కాలములందును వాడుచుండిరి; పాదుషావారు సంవత్సరమునకు ఒకసారి విలువగల దుస్తులను వెయ్యింటిని తయారు చేయించుకొనెనని అబుల్ ఫజల్ పేర్కొనెను. వాటిలోనే కొన్ని బహుమతులుగ కూడ అక్బర్ ఇచ్చివేయుచుండెడివాడట. ఇదే విధముగ కూడ సామంతులు, భూస్వాములు నడుచుకొనుచుండిరి. ఆనందము కొరకు జూదమును ఆడుచుండిరి. దీనిని మాన్పుటకు ప్రభుత్వము ఎట్టి శ్రద్ధను తీసికొనలేదు. భూస్వాములుగాని, ఉన్నతోద్యోగస్థులుగాని తాము సేకరించిన ధనమును తమ స్వదేశములకు పంపుకొనుటకు ప్రభుత్వము అధికారము ఈయలేదు.

మధ్యతరగతి వారి జీవితము మామూలుగనే ఉండెను. చిన్నచిన్న ఉద్యోగస్థులు తమ జీతములబట్టి జీవనము సాగించుకొనుచుండిరి. వారి జీతములు ఇంతయని మనకు స్పష్టముగ తెలియదు. కాని, వారు కష్టజీవులని మాత్రము బాగుగ తెలియుచున్నది. ఫౌజ్‌దార్ మున్నగు ఉద్యోగస్థులు ధనమును దోచుకొందురను భయముచే వ్యాపారస్థులు తమ ధనమును రహస్య ప్రదేశములందు దాచిపెట్టుకొని, లేని వారుగా కనబడుట ఉత్తమమని భావించుచుండిరి. హిందువులలో సహగమనము, బాల్య వివాహములు మొదలగు దురాచారములు అప్పటికి బాగుగా వ్యాప్తియందు ఉండెను. మద్యపానమును, నల్లమందును ప్రభుత్వము నిషేధించలేదు. షాజహాన్ తరువాత రాష్ట్ర గవర్నర్లు వ్యవసాయదారులను పీడింపసాగిరి. దేశములో వృత్తులు, విద్యలు నశించెను. దొంగల భయముచే బాటసారులు సుఖముగ పోలేకుండిరి అని బెవర్నియర్ అను ఆంగ్ల రచయిత పేర్కొనెను. ఔరంగజీబ్ కాలమున జాగీర్‌దారులు, రాజపురుషులు మద్యపానాది భోగములకై చాల ధనమును హెచ్చించెడివారు. కాని సత్వము ప్రబలి ఉండెను. ఆనాటి ఖజాంచీలు విశ్వాసపాత్రులు. ప్రజలు దాచుకొను హుండీలను జాగ్రత్తగ కాపాడుచుండిరి. సాధారణముగ వస్తువులు చౌకగానే దొరుకుచుండెను. షేర్‌షా ముద్రింపించిన నాణెములలో వెండితో తయారైన వాటిని రూపాయలు అందురు. ఇట్టి రూపాయకు అక్బర్ జన్మస్థానమైన ఉమర్‌కోటలో నాలుగు మేకలను ఇచ్చెడివారట.

మొగల్ కాలమందు వర్తక వ్యాపారములు వృద్ధి పొందినవి. అంతర్దేశవ్యాపారము, విదేశవ్యాపారము కూడ బాగుగా సాగెను. పట్టుబట్టలు, నూలుబట్టలు, కాశ్మీరశాలువలు, ఢాకామల్లులు, బనారసుపట్టుబట్టలు విదేశవ్యాపారమునకు ముఖ్యమైనవి. విదేశములనుండి మనదేశసౌకర్యముకొరకు కావలసిన సామగ్రి తెప్పించుకొనుచుండిరి. అక్బర్ కాలమున వ్యవసాయము అభివృద్ధికి వచ్చెను. రాజా తోడరమల్ నిరుపయోగకరమైన నేలను సాగుబడి క్రిందికి తెచ్చెను. 1605 నుండి పొగాకు కూడ దేశమున ఉత్పత్తి చేయబడుచుండెను.

మొగల్ కాలమునాటి శిల్ప సంపద, కళా సౌందర్యములు ఆనాడు కట్టించిన కట్టడములలో ప్రతిబింబించుచున్నవి. హైందవ కళతోపాటు పారసీక కళనుకూడ అక్బర్ కాలమునుండి పాదుషాలు అందురు ప్రోత్సహించిరి. కాని, బాబర్ మాత్రము పారసీక కళనే అభిమానించెను. అక్బర్ మతమునందు ఎట్టి ఓర్పు కనబరచెనో, శిల్పకళలో కూడ అంత ఓర్పు ప్రకటించెను. 1565 లో కట్టించిన హుమాయూన్ గోరీ, జహంగీర్ మహల్, ఫతేపూర్ సిక్రీ, బులందర్ దర్వాజాలు అతిరమ్యమైనవి. ఈ బులందర్ దర్వాజా ప్రపంచములోని దుర్గద్వారములన్నింట పెద్దది. 53 మీటరుల ఎత్తు కలది. ఆసియా ఖండమందలి నిర్మాణముల అన్నిట సుందరతరమైనది సికిందర్ గోరీ. దీనిని అక్బర్ ఆరంభించెను; జహంగీర్ పూర్తిచేసెను. బీర్‌బల్ భవనము, అంబర్‌రాణి గృహము, దివాన్ - ఇ - ఖాస్, ఆగ్రా పట్టణపు కట్టడములు, దివాన్ - ఇ - ఆమ్, నూర్ జహాన్ కట్టించిన ఇత్‌మద్ - ఉద్దౌలా (చలువరాతిది), జుమ్మా మసీదు, మోతీ మసీదు సుందరమైనవి. షాజహాన్ తన భార్యయైన ముంతాజ్‌మహల్ జ్ఞాపకార్థము కట్టించిన దివ్య భవనము తాజ్‌మహల్. ఇది లోకములో అద్వితీయ భవనముగ జగద్విఖ్యాతి చెంది, అసమాన సౌందర్యరాశియై వెలుగుచున్నదని పాశ్చాత్యులు కూడ మెచ్చుకొని ఉన్నారు. ఇదికాక, 6 కోట్ల రూపాయల ఖరీదుగల మయూరాసనమును చక్రవర్తి చేయించుకొనెను. ఔరంగజేబ్ కాలమున ఈ శిల్పకళ పూర్తిగ నశించినదని చెప్పవచ్చును. అక్బర్ కాలమున సంగీత కళ కూడ అభివృద్ధి పొందినది. తాన్‌సేన్ సంగీత విద్వాంసులలో ముఖ్యుడు. వాఙ్మయమున అరబిక్, పారసీక, తుర్కీ భాషలలో పండితులు ఉండిరి. అబుల్ ఫజల్ 'ఐనీ - అక్బరీ' అను గ్రంథమును పారసీక భాషలో చక్కటి శైలిలో వ్రాసెను. అక్బర్ రాజ్యాంగ నిర్వహణ, జీవిత చరిత్ర దీనియందు విపులముగ వివరింపబడి ఉన్నవి. రాజా తోడర్‌మల్, భగవాన్‌దాస్, మానసింహులు హిందీ భాషలో పద్యములు వ్రాసిరి. ఈ కాలపువాడే అగు తులసీదాసు (1532 - 1623) హిందీ కవులలో శ్రేష్ఠుడు; రామభక్తి పరాయణుడు; రామాయణమును ఇతడు పద్యరూపమున వ్రాసెను [చూ. భారతదేశము (ఇండియా) పు. 664].

మా. వెం. రం.

**మొగల్ సామ్రాజ్యము (1526 - 1857)** : భారతదేశ చరిత్రలో ప్రఖ్యాతి వడసిన ఒక విస్తృత సామ్రాజ్యము. ఈ సామ్రాజ్య సంస్థాపకుడు బాబర్. కడపటివాడు బహదూర్‌షా. ఇతను బ్రిటిష్ వారిచే ఖైదు చేయబడి, బర్మాలో కారాగారమున కొన్ని సంవత్సరములు గడిపి మరణించెను.

బాబర్ (1483 - 1530) : ఆసియా ఖండములోని ఇరువురు మహావీరుల వంశమునకు - తండ్రివైపున తైమూర్ పరంపరకును, తల్లివైపున చెంఘిజ్‌ఖాన్ సంతతికిని - చెందినవాడు. బాబర్ తన పదునొకండవ ఏటనే సామర్కండ్‌నకు తూర్పున ఉన్న ఫర్గానాకు రాజయ్యెను. పిన్నతనముననే విపరీత పరాక్రమమును ప్రదర్శించి, తన రాజ్యమును విస్తరించుకొన జూచెను. పది సంవత్సరముల వరకు అతడు శత్రు రాజులతో పోరుచు, ఒకమారు సామర్కండ్ రాజుగను, మరొకమారు రాజ్యమునే కోల్పోయి, వెడలగొట్టబడినవాడుగను ఉండి, ఎన్నో బాధలకు లోనయ్యెను. కాని, మిక్కిలి పట్టుదల గలవాడు అగుటచేత, జయము లభించు వరకు శత్రు రాజులతో పోరుచునే ఉండెను. కాబూల్‌ను వశపరచుకొని, 22 ఏండ్ల కాలములో (1504 - 1526) ఖురాసాన్‌లో ఉన్న ఉజ్బెక్‌లతో పోరి, తన రాజ్యమును కాందహార్‌లోనికి విస్తరింపజేసికొని, అదే సమయమున అనేక పర్యాయములు భారతదేశముపైకి దాడి వెడలెను. ఆ కాలమున భారతదేశములోని పరిస్థితులు బాబర్‌నకు అనుకూలముగ ఉండెను. అప్పుడు ఢిల్లీని ఇబ్రహీమ్ లోడి పాలించుచుండెను. ఇతడు ప్రజలను, సామంతులను హింసించుచుండుటచే, సామంతులు స్వతంత్రతను ప్రకటించుకొని, ఇబ్రహీమ్‌పై తిరుగుబడ ఎంచిరి. ఈ తిరుగబడినవారిలో ముఖ్యుడును, పంజాబ్ గవర్నర్‌ను అగు దౌలత్‌ఖాన్, బాబర్‌ను హిందూదేశముపై దండెత్త ఆహ్వానించెను. తక్షణమే బాబర్ తగిన సన్నాహముతో 1525, నవంబరు నెలలో దైత్రయాత్ర మొదలుపెట్టెను. 1526, ఏప్రిల్ 21 తేదీని బాబర్‌కును, ఇబ్రహీమ్‌కును పానిపట్టువద్ద గొప్ప యుద్ధము జరిగెను. అందు ఇబ్రహీమ్ లోడీ ఓడిపోవుటతో భారతదేశములో మొగల్ సామ్రాజ్యమునకు అంకురార్పణ జరిగెను.

ఇంతలో ఢిల్లీకి దక్షిణమున ఉన్న రాజపుత్రుల నాయకుడును, మేవాడ్‌రాణాయు అగు సంగ్రామసింహుడు బాబర్‌ను ఎట్లయిన భారతదేశమునుండి తరుమగొట్టవలెనని ఉద్దేశించెను. ఇరువైపులవారు 1527 లో 'కణ్వహ' నొద్ద పోరాడిరి. రాజపుత్రులు అతిపౌరుషముతో పోరిరి. కాని, బాబర్ యొక్క ఫిరంగుల దెబ్బలకు తాళలేక వీడిపోయిరి.

రాజపుత్రుల ఓటమితో బాబర్‌కు మొగల్ సామ్రాజ్యపు పునాదిని దృఢముగా వేయుటకు వీలుపడినది. తరువాత, ఇంకను కొంతమంది చిన్నచిన్న రాజపుత్ర నాయకులను

ఓడించి, తనపై తిరుగుబాటు చేసిన ఆఫ్ఘన్ వజీర్లను 1529, మే నెలలో గోగ్రా యుద్ధమున అతడు జయించెను. బెంగాల్ నవాబుతో సంధిచేసికొని, పశ్చిమ బీహార్ రాష్ట్రమును సంపాదించెను. బాబర్ 1530, డిసెంబరు నెలలో ఆగ్రాలోని తన సుందరభవనములో ప్రాణములు విడిచెను.

ఈ విధముగ బాబర్ మొగల్ సామ్రాజ్యమును స్థాపించి, రణశూరుడు, ఉత్తమ సేనాని అని పేరుగాంచెను. ఇతడు విద్యాప్రియుడు. విద్వాంసులను, రసికులను, చిత్రకారులను పిలిపించి గౌరవించుచుండెను. 'బాబర్ నామా' అను పేరుతో తన ఆత్మచరిత్రను తురుష్కభాషలో వ్రాసి ఉంచెను. ఈ గ్రంథమువలనను, ఇతడు భారతదేశములో మొగల్ సామ్రాజ్య సంస్థాపకుడు అగుటచేతను ఇతని కీర్తి చిరస్థాయిగ నిలిచి ఉన్నది.

**హుమాయూన్** (1508 - 1556) : బాబర్ నలుగురు కుమారులలో హుమాయూన్ పెద్దవాడు. బాబర్ తరువాత ఇతడు పాదుషా అయ్యెను (1530). ఇతడు కూడ ధైర్యసాహసములు గలవాడు, తండ్రివలె విద్వాంసుడు; బంధుప్రీతి కలవాడు. సుస్వభావుడగుటచే ఇతని తమ్ములవలన ఇతనికి చాల చిక్కులు కలిగెను.



హుమాయూన్

(1508 – 1556)

ఘూర్జర దేశపు సుల్తాన్ అగు బహదూర్ షా పాదుషాకు పరమ శత్రువు. బహదూర్ షా రాజపుత్ర స్థానమును, మధ్య భారతమునను తన అధికారమును స్థాపించుకొని, మాళ్వాను జయించెను. పాదుషా బహదూర్ షాతో యుద్ధముచేసి, అతనిని ఓడించి, గుజరాత్‌ను ఆక్రమించుకొని, మాళ్వా దేశమునకు పోయెను. కాని, బహదూర్ షా పోర్చుగీస్ వారి సహాయ్యముతో ఘూర్జర దేశమును తిరిగి సంపాదించుకొనెను. ఇంతలో షేర్ ఖాన్ అను ఆఫ్ఘన్ సర్దారు స్వాతంత్ర్యమును ప్రకటించుటకై బీహార్‌న తీవ్ర ప్రయత్నము చేయుచుండుట తెలియవచ్చి, హుమాయూన్ బహదూర్ షాను మరచి, షేర్ ఖాన్‌ను ఎదుర్కొన సిద్ధపడెను. ఇంతలో షేర్ ఖాన్ బంగాళమును ఆక్రమించుకొనెను. ఈ వార్త తెలిసి, పాదుషా బంగాళముపై దండెత్తెను. షేర్ ఖాన్ తన యుద్ధ కుశలతను ఉపయోగించి ఢిల్లీకిని, బంగాళమునకు సంబంధము లేకుండ జేసి, కాశీ, జౌన్‌పూర్ లను వశపరచుకొనెను. అంతట హుమాయూన్ షేర్ ఖాన్‌ను 1539 లో చౌసావద్ద ఎదుర్కొనెను. కాని, పాదుషాకు అపజయము కలిగెను. పాదుషా తప్పించుకొని పారిపోయి ఆగ్రా చేరుకొనెను. విజయుడైన షేర్ ఖాన్ 'సుల్తాన్ షేర్ షా' [చూ.] అను బిరుదు వహించి, తనపేర నాణెములను కూడ ముద్రించెను. 1540 లో మరల పాదుషా తన సేనలను కూర్చుకొని షేర్ షాను కనౌజ్ వద్ద ఎదుర్కొనెను. కాని, ఈ మారు పాదుషా కుటుంబసమేతముగా భారతదేశమును వదలి వెడలిపోవలసివచ్చెను. పంజాబ్ సుల్తాన్‌గా ఉన్న పాదుషా తమ్ముడు కమ్రాన్, తన సోదరునికి ఎట్టి సాహాయ్యమును చేయలేదు. ఇట్లు పాదుషా భారతదేశమును వదలి పరిపోవుచున్న సమయమున దారిలో ఉమర్ కోట (సింద్) యందు హుమాయూన్‌కు ఒక కుమారుడు జన్మించెను (1542). ఇతడే లోకవిఖ్యాతి చెందనుండిన అక్బర్ పాదుషా.

అంత పాదుషా పారసీక చక్రవర్తి షా తామాస్ప్‌ను ఆశ్రయించెను. ఇతని సాహాయ్యముతో హుమాయూన్ కొంత సైన్యమును సమకూర్చుకొని 1545లో కాందహార్‌ను, 1547 లో కాబూల్‌ను ఆక్రమించుకొని ఆఫ్ఘన్ దేశమున తన రాజ్యమును స్థాపించుకొనెను. ఇంతలో షేర్ షా గతించెను. షేర్ షా తరువాత అతని సంతతివారు బలహీనులు అగుటచే 1555 లో పంజాబ్‌ను, ఢిల్లీని, ఆగ్రాను వరుసగా పాదుషా వశపరచుకొనెను. ఇంతలో మాళ్వా ప్రాంతమున షేర్ షా వంశీకుడగు మహమ్మద్ షా తన అధికారమును నిలబెట్టుకొనుచుండెను. పాదుషా వానిని అణచుటకు ప్రయత్నించెను. కాని, ఒకనాటి రాత్రివేళ తన భవనము నుండి మెట్లుదిగుచు జారిపడి ప్రాణములు కోల్పోవుటచే (1556) ఆ ప్రయత్నము పూర్తి కాలేదు.

**అక్బర్** (1542 - 1605) : హుమాయూన్ మరణానంతరము అక్బర్ రాజయ్యెను (1556). భారత దేశమును పరిపాలించిన మొగల్ చక్రవర్తులలో అక్బర్ పాదుషా శ్రేష్ఠుడు. ఇంతేకాదు, ప్రపంచమునందు సర్వశ్రేష్ఠులని విఖ్యాతిచెందిన రాజపుంగవులలో ఈతడు ఒకడని నిస్సంశయముగ చెప్పవచ్చును [చూ. అక్బర్ - పు. 260].

**జహంగీర్** (1569 - 1627) : అక్బర్ అనంతరము అతని పెద్ద కుమారుడు సలీమ్ అనువాడు 'జహంగీర్' అను బిరుదు వహించి సింహాసనమును ఎక్కెను (1605). ఇతడు గొప్ప పండితుడు. న్యాయబుద్ధి గలవాడు. ఇతడు గొప్ప సౌందర్యవంతురాలగు నూర్ జహాన్‌ను వివాహామాడెను. ఈమె కడు సమర్థురాలు. రాజ్యాధికారము అంతయు ఈమెయే చలాయించుచుండెను. పాదుషా న్యాయబుద్ధి

కలవాడగుటచేత అక్బర్ అమలు జరిపిన పరిపాలనవిధానమును, రాజనీతిని అనుసరించియే ప్రవర్తించుచుండెను.

దేశమందలి యుద్ధములవలనను, రాజకుటుంబములోని అంతఃకలహములవలనను కొంత అశాంతి ప్రబలినను, మొత్తముమీద జహంగీర్ కాలమున ప్రజలకు సుఖమే కలిగెనని చెప్పవచ్చును. జహంగీర్ విద్యలను, విద్వాంసులను గౌరవించుచుండెను. పారసీక భాషయందు ఇతనికి ఎంతో పాండిత్యము ఉండెను [చూ. జహంగీర్ - పు. 476].

షాజహాన్ (1592 - 1666): జహంగీర్ అనంతరము కుర్రమ్ షాజహాన్ అను బిరుదముతో చక్రవర్తి అయ్యెను. (1628). జహంగీర్ నాటికంటె ఇతని పరిపాలన కాలమున రాజ్యము ఉన్నతస్థితియందు ఉండెను. ఇతని మామ అగు ఆసఫ్ ఖాన్ గొప్ప రాజ్యతంత్రవేత్త. అఫ్ఘన్ అగు ఖాన్‌జహాన్‌లోడీ దక్కన్‌లో అహమ్మద్ నగర సుల్తాన్లతో చేరి తిరుగబడగా, షాజహాన్ అతనిని ఓడించి చంపెను. 1630 - 32 లో సామ్రాజ్యమందు విపరీతమైన క్షామము ఒకటి వ్యాపించెను. ఆహారములేక ప్రజలు కుక్కలను తినుచుండిరి. క్షామనివారణ మార్గమును ఆలోచింపక పోవుట అటుండ, అదే సమయమున పాదుషా 6 కోట్ల రూపాయలు వెచ్చించి, మయూరాసనము ఒకదానిని చేయించెను. అంతేకాక, ఆగ్రా కోటలో 21 మీటరుల చతురము, 9 మీటరుల ఎత్తుగల రెండు కోటలను కట్టించి, వాటిని వెండి, బంగారములతో నింపెను. బొక్కసములోని ధనము అంతటిని ఈ విధముగ వృథాపరచెను.

అక్బర్, జహంగీర్‌లవలె షాజహాన్ కూడ మొగల్ ప్రభుత్వమును దక్కన్ రాజ్యములలోనికి వ్యాపింపబూనెను. 1631 లో అహ్మద్‌నగరపు మంత్రియగు ఫాత్‌ఖాన్‌ను లోబరుచుకొని, దౌలతాబాద్‌ను మొగల్ వశముజేసెను. ఇంతటితో అహమ్మద్‌నగరరాజ్యము అంతరించెను. పాదుషా బీజపూర్‌ను, గోల్కొండను కూడ వశపరచుకొన సంకల్పించెను. అతని సైనికుల ధాటికి ఆగజాలక బిజాపూర్, గోల్కొండ రాజ్యములు అతనికి సామంతరాజ్యములు అయ్యెను. కాని, ఈ దండయాత్రల మూలమున మొగల్‌లకు ఎట్టి లాభము కలుగలేదు. పాదుషాకు ధననష్టము మాత్రము మరింత అధికమయ్యెను. ముంతాజ్ మహల్ అనెడి ఒక సుందరి పాదుషాకు భార్యయై ఉండెను. మరణ సమయమునందు ఈమె తన భర్తను మరల వివాహము చేసికొనకూడదనియు, ప్రజలకు తన పేరు ఎప్పటికిని జ్ఞాపకము ఉండునట్లు ఏదైన ఒక కార్యము చేయవలసినదనియు కోరెను. ఆమె కోరికను అనుసరించి పాదుషా మరల వివాహము చేసికొనలేదు. ఈమె గోరీ మీద ప్రపంచమంతట ప్రఖ్యాతిని ఆర్జించినదియు, అందమైనదియు అగు 'తాజ్‌మహల్' ను నిర్మించెను.

షాజహాన్ పాదుషాకు దారా, షుజా, మురాద్, ఔరంగజేబ్ అను నలుగురు పుత్రులు ఉండిరి. పుత్రులు అందరిలోను పాదుషాకు దారామీద హెచ్చు ప్రేమ. కాబట్టి షుజాను బంగాళమునకును, మురాద్‌ను గుజరాత్ నకును, ఔరంగజేబ్‌ను దక్కన్‌నకును గవర్నర్‌లుగా పంపి, దారాను తన వద్దనే ఉంచుకొనెను. 1658 లో షాజహాన్‌కు చాల జబ్బుచేసెను. అపుడు షుజా, మురాద్‌లు తమ తమ రాష్ట్రములలో స్వతంత్రించి ఉండిరి. మురాద్, ఔరంగజేబ్‌లు నర్మదా నదిని దాటి, 1658 లో ధర్మత్ వద్దచేర ఉండగా, దారా వారిని ఎదుర్కొని ఓడిపోయెను. మరల దారా ఆగ్రా సమీపమునందలి సమూగర్ వద్ద వారిని తాకెను. ఆ యుద్ధమందుకూడ ఔరంగజేబ్ దారాను ఓడించెను. తరువాత కపటస్వభావుడైన ఔరంగజేబ్ ఆగ్రాలో ప్రవేశించి, అందలి ధనరాసులను వశము చేసికొని మురాద్‌ను వెంటనే చంపించెను. పారిపోయిన దారాను వెంబడించి, అతనిని కూడ వధించెను. 1659 లో బంగాళము నుండి వచ్చుచున్న షుజాపైబడి, అతనిని ఓడించెను. నిర్దయుడై ఇక తండ్రిని ఆగ్రాకోటలో బంధించి ఔరంగజేబ్ తాను 'అలంగీర్' అను బిరుదముతో పాదుషా అయ్యెను (1659).

షాజహాన్ 31 సంవత్సరములు రాజ్యము చేసెను. ఇతని పరిపాలన ప్రారంభ కాలమున మొగల్ సామ్రాజ్యము ఉచ్చదశకు వచ్చి, తరువాత క్షీణింపసాగినది.

ఔరంగజేబ్ (1618 - 1707): విశాలమైన రాజ్యమును, నిరంకుశత్వమును అనుభవించిన మొగల్ చక్రవర్తులలో ఔరంగజేబ్ ఆఖరివాడు. తన పరిపాలన కాలమున మొదటి 23 సంవత్సరములు ఉత్తర భారతదేశమును, తరువాత 27 సంవత్సరములు దక్కన్‌లోను అతడు గడపెను [చూ. ఔరంగజేబ్ - పు. 364]. రాజ్యాధికారము వహించిన నాటినుండి ఔరంగజేబ్ హిందూమతమును ధ్వంసము చేయబూనెను. 1669 లో హిందువుల పాఠశాలలను, దేవాలయములను పడగొట్టవలసినదనియు, వారి పండుగలను ఆపుదల చేయవలసినదనియు ఆజ్ఞాపించెను. అక్బర్ హిందువులపై తీసివేసిన జిజియా పన్నును 1679 లో మరల అమలు జరిపించెను. ఉద్యోగములనుండి హిందువులను తొలగించి, వారి స్థానమున ముస్లిమ్‌లను నియమించెను. రాజపుత్రులు మొదలైనవారు ఎవరును పల్లకీని కాని, ఏనుగును, గుర్రములను కాని ఎక్కి సవారి చేయకూడదనియు, ఆయుధముల ధరింపకూడదనియు

శాసించెను. అందుచే రాజపుత్రులు, మహారాష్ట్రులు, సిక్కులు స్వతంత్రులుగ పాదుషాపై తిరుగబడిరి.

సిక్కుల గురువైన తేజ్ బహదూర్‌ను చంపి, వారి దేవాలయములను ఈ పాదుషా కూల్చెను. అందుచే అతని కుమారుడు గోవిందసింహుడు సిక్కులను యుద్ధావేశము గల మతశాఖగా జేసి, వారిని ఇస్లామ్ మతమునకు పరమ శత్రువులుగ జేసెను. 1678 - 1709 వరకు రాజపుత్రులు మొగల్‌లతో పోరుచునే ఉండిరి. పాదుషా కుమారుడైన అక్బర్ కూడ రాజపుత్రులను అభిమానించదొడగెను. ఎటులైన నేమి పాదుషాకు రాజపుత్రుల సాహాయ్యము లేకపోవుటవలన అతడు మహారాష్ట్రులను ఎదుర్కొనలేక పోయెను. ఆ కాలమున మహారాష్ట్రులు ప్రబలులై శివాజీ [చూ.] నాయకత్వమున ఒక హిందూ రాజ్యము స్థాపించి ఉండిరి. బీజపూర్, గోలకొండ సుల్తాన్‌లు తనకు మిక్కిలి విరోధులైన మహారాష్ట్రులకు సహాయము చేయుచుండిరను నెపముచే ఔరంగజేబ్ వారిపై దండెత్తెను. ఆ దక్కన్ రాజ్యముల రెంటిని నాశనము చేయుటలో ఔరంగజేబ్‌నకు నష్టమే కలిగినది. అవి రెండును మహారాష్ట్రుల తాకిడిని కొంతవరకు ఆపినవి. వాటి వినాశము వలన మహారాష్ట్రులు తమ యావచ్ఛక్తిని మొగల్‌లపై ప్రయోగింప గలిగిరి.

ఇంతలో 1680 లో శివాజీ మరణించిన తరువాత అతని కుమారుడు శంభూజీ రాజయ్యెను. 1689 లో ఔరంగ్‌జేబ్ అతనిని పట్టుకొని, మహమ్మదీయ మతము అవలంబింపుమని ఉత్తరువుచేసెను. అందులకు అతడు ఒప్పుకొనలేదు. అందుచేత పాదుషా అతనిని చంపించెను. శంభూజీ కుమారుడైన సాహూను ఔరంగ్‌జేబ్ ఖైదీగ ఉంచుకొనెను.

ఔరంగ్‌జేబ్ చర్యలు మహారాష్ట్రులకు ఎంతో ఆగ్రహము కలిగించెను. సాహూ పేర అతని పినతండ్రియగు రాజారామ్ వ్యవహరించుచు, మహారాష్ట్రుల నాయకుడుగ మొగల్‌లతో యుద్ధముచేసెను. ఆ పోరాటముతో విసివి వేసారి తుదకు 1707 లో ఔరంగజేబ్ మరణించెను [చూ. మహారాష్ట్రులు].

కడపటి మొగల్‌లు (1707 - 1857): ఔరంగ్‌జేబ్ తరువాత రాజ్యాధికారమును వహించిన పాదుషాలందరు అసమర్థులు. అందుచేత దేశములోని అరాజకమునకు తోడు పరదేశీయుల దండయాత్రలు కూడ ప్రారంభమయ్యెను. ఔరంగజేబ్ కుమారులలో ఒకడగు బహదూర్‌షా (1707 - 12 ప.) మహారాష్ట్రుల మైత్రి సంపాదించి, వారివలన తనకు ఎట్టి ఆపద లేకుండ కాపాడుకొనెను. కాని, సిక్కులతో మాత్రము పోరాడి మృతినొందెను. తరువాత అతని కుమారులు సింహాసనమునకై పోరాడసాగిరి. తుదకు వారందరిలో అసమర్థుడగు జహాన్‌దర్‌షా రాజ్యాధికారము వహించెను. అతడు పదునొకండు మాసములే రాజ్యమును ఏలి, తన అన్న కుమారుడు ఫరూక్‌సైర్‌చే చంపబడెను. ఫరూక్‌సైర్ కడు దుర్మార్గుడు. ఇతడు బంధువులను, ఉద్యోగులను చంపించెను. ఇతని కాలమున సయ్యద్‌కుటుంబములోని వారిద్దరు పరిపాలనమును చేత జిక్కించుకొనిరి. పాదుషాల నియామకము, తీసివేతలు వారి అధీనమున ఉండుటచే, వీరు రాజకర్తలు అని పేరొందిరి. చిట్టచివరకు వారు మహమ్మద్‌షా అను అతనిని సింహాసనము ఎక్కించిరి. ఇతని కాలమున సామ్రాజ్యమున అరాజకత వ్యాపించెను. 1723 లో దక్కన్‌ను బేదారైన అసఫ్ జా 'నిజామ్-ఉల్-ముల్క్' అను బిరుదనామముతో స్వతంత్రించెను. ఆ సంవత్సరముననే అయోధ్యరాష్ట్రమునకు సుబేదారైన సాదత్‌ఖాన్ స్వతంత్రించెను. ఆఫ్ఘన్ జాతివారు కొందరు రోహిల్‌ఖండ్‌లో స్వతంత్రించిరి. ఎక్కడ చూచినను సామ్రాజ్యమున స్వతంత్రించు సుబేదారులే. ఆంతరంగిక పరిస్థితులు ఈ విధముగ ఉండగా, ఇరాన్ రాజైన నాదిర్‌షా భారతదేశముపై దండెత్తి, ఢిల్లీ నగరమందలి జనులను వేలకొలదిగ చంపి, అమితమైన ధనమును దోచుకొనిపోయెను. దీనివలన మొగల్‌సామ్రాజ్యము మరింత శీఘ్రముగ విచ్ఛిన్నము కాసాగెను. మహమ్మద్‌షా చనిపోవుటకు పూర్వమే ఒరిస్సా, బీహార్, గుజరాత్, రాజపుత్రస్థానము, పంజాబ్, మూలస్థానము, సింధు మున్నగునవి అన్నియు స్వతంత్రించినవి. అదృష్టహీనుడగు ఈ పాదుషా 1748 లో కాలధర్మము నొందెను.

ఇతని తరువాత అహ్మద్‌షా పాదుషా అయ్యెను. 1754 లో అహ్మద్‌షాకు మంత్రి అగు షియాజుద్దీన్ చక్రవర్తి కండ్లను పొడిపించి, అతనిని సింహాసనమునుండి తొలగించి, పాదుషా వంశములో ఒకనిని 'అలంగీర్ - II' అను బిరుదుతో సింహాసనమును ఎక్కించెను. ఇతడు ఎంతో కాలము పరిపాలన చేయలేదు. ఏలనన, షా అలమ్ అను అతడు అలంగీర్‌ను చంపి, సింహాసనమును అధిష్ఠించెను. ఈ షా అలమ్ - II కాలముననే మొగల్‌రాజ్యము పరిపూర్ణముగ విచ్ఛిన్నమయ్యెను. ఇతడు బలహీనుడగుటచే మహారాష్ట్రులు ఉత్తరభారతదేశమునకువచ్చి, తమ అధికారమును వ్యాపింప జూచుచుండిరి. ఆ ప్రయత్నముసే ఆఫ్ఘన్ రాజగు అహ్మద్‌షా అబ్దాలీ చేయుచుండెను. కాన అతనికిని, మహారాష్ట్రులకును పోరు తప్పదయ్యెను. అహ్మద్‌షా అబ్దాలీ రోహిల్లా నాయకులను, అయోధ్య

నవాబును తన వైపునకు త్రిప్పుకొని, మహారాష్ట్రులను ఎదుర్కొనన సన్నద్ధుడయ్యెను. తత్ఫలితముగ 1761 లో జరిగినదియే మూడవ పానిపట్టు యుద్ధము.

ఈ పానిపట్టు యుద్ధమందు అబ్దాలీ మహారాష్ట్రులను ఓడించి విజయానంతరము ఢిల్లీని దోచుకొని, స్వదేశమునకు వెడలిపోయెను. మహారాష్ట్రుల పరాజయమువలన భారత దేశములో అల్లరులు బయలుదేరెను. మొగల్‌లు కాని, మహారాష్ట్రులు కాని దేశమునకు నాయకులు కాలేక పోవుటయే కాక, కేవలము వర్తక వ్యాపారములకై వచ్చిన బ్రిటిష్ వారికి దేశము స్వాధీనమయ్యెను.

మొగల్ సామ్రాజ్యపు చివరి కాలమున పాలించిన చక్రవర్తులు తమకు సైన్య బలము లేక నౌకాబలము గల బ్రిటిష్‌వారికి వశులైరి. షా అలమ్ కుమారుడైన అక్బర్ బ్రిటిష్‌వారినుండి కట్టడిరూకలను తీసికొనుచు, పేరునకు పాదుషాగా ఉండెను. 1837 లో ఇతడు కాలధర్మము నొందిన తరువాత ఇతని కుమారుడు మహ్మద్ బహదూర్ షా బ్రిటిష్‌వారి యొద్దనుండి కట్టడి పైకము తీసికొనుచుండినప్పటికీ, 1857 లో సిపాయీల తిరుగుబాటునందు చేరెను. అందుచేత, బ్రిటిష్‌వారు ఇతని కుమారులను, మనుమలను చంపి, ఇతనిని బర్మాకు గొనిపోయిరి. ఇతడు అచ్చటనే మరణించెను (1862). ఇంతటితో మొగల్ చక్రవర్తుల వంశము అంతరించెను [చూ. భారతదేశము (ఇండియా) పు. 664]. మా. వెం. రం.

**మొజాంబిక్ :** ఆఫ్రికా తీరమందలి పోర్చుగీస్ సముద్రోత్తర వలస రాజ్యము. దీనికే పోర్చుగీస్ తూర్పు ఆఫ్రికా అనియు వ్యవహారము కలదు.

ఈ రాజ్యమునకు హిందూ మహాసముద్రము [తూ]; టాంగన్యికా [ఉ]; న్యాసాలాండ్, దక్షిణ, ఉత్తర రొడీషియాలు, దక్షిణ ఆఫ్రికా గణరాజ్యము [ప]; దక్షిణ ఆఫ్రికా గణరాజ్యము [ద] సరిహద్దులందు కలవు. [వి] 7,83,032 చ. కి. మీ ; [జ] 65,92,994. వలస పరిపాలనను నిర్వహించు కొలదిమంది పోర్చుగీస్ ఉద్యోగులును, వర్తకులును, మత ప్రచారకులును తప్ప తక్కినవారందరును ఆఫ్రికన్ జాతులవారే. [భా] ఆఫ్రికన్ భాషలు మాతృభాషలుగ ప్రజలలో వ్యాప్తియందు ఉన్నను, పోర్చుగీస్ భాషయే వ్యవహార భాషగ అమలునందు ఉన్నది. [మ] ప్రజలలో క్రైస్తవులు అత్యధిక సంఖ్యాకులు. [రా] లోరెంజో మార్క్విస్ (జ. సం. 93,516).

చరిత్ర: ఈ దేశపు ప్రాచీన చారిత్రక విశేషములు ఏవియు తెలియరాకున్నను, క్రీ. శ. 10 వ శతాబ్దినుండియు అరబ్బులకు ఈ దేశముతో విరివిగ పరిచయము ఉండెనని మాత్రము తెలియవచ్చుచున్నది. ఈ దేశపు తీరమునకు పశ్చిమమున దేశ మధ్యమున ఉన్న గనులనుండి లభించెడి బంగారమును తీరపు రేవులకు చేర్చి, అటనుండి పలు ప్రాచ్య దేశములకు అరబ్బు వర్తకులు ఎగుమతి చేసెడివారు. ఆ కాలమున ఈ దేశమునందలి సోఫలా రేవు సముద్ర వ్యాపారమున పేరుగడించినది. 1498 లో సుప్రసిద్ధ పోర్చుగీస్ నావికుడు వాస్కో డ గామా [చూ.] ఈ దేశమునందలి ఒక నదీ ముఖద్వారము కడ చేరుటతో, పాశ్చాత్యులకు ఈ దేశముతో ప్రథమ పరిచితి కలిగెను. 1505 నుండి పోర్చుగీస్‌వారు తీరభూమియందు వలసలను నెలకొల్ప మొదలిడిరి. దేశములందలి అరబ్ మాండలిక ప్రభువులు (సుల్తాన్‌లు) పోర్చుగీస్‌లను తొలుత తీవ్రముగ ప్రతిఘటించిరి. కాని, వారి ప్రతిఘటనను నిశ్శేషముగ నడచి, 1510 నాటికి పోర్చుగీస్‌వారు తీర ప్రాంతమునంతటిని ఆక్రమించిరి. అంతట దేశమధ్యమున ఉన్న బంగారపు గనులను వశపరచుకొనుటకై దండయాత్రల జరిపి 1570 నాటికి దేశాంతర్భాగమును పూర్తిగ ఆక్రమించిరి. కాని, అప్పటికే ఆ గనులన్నియు చాలవరకు వట్టిపోవుటవలన వారికి ఆశాభంగము కలిగినది. అయినను అంతట వారు ఊరుకొనక, ఆఫ్రికన్‌లను చెరపట్టి దూరదేశములకు బానిసలుగ విక్రయించుట ఒక వ్యాపారముగ చేసికొనిరి. 19 వ శతాబ్దపు తృతీయ పాదము గడచువరకు ఈ వ్యాపారము బాగుగ సాగినది. అంతట ప్రపంచ ప్రజాభిప్రాయమునకు లొంగి పోర్చుగల్ ప్రభుత్వము ఆ వ్యాపారమును అంతమొందించెను.

పోర్చుగీస్ ప్రభుత్వ పాలనలో ఈ రాజ్యము ఏమియు గణనీయమగు అభివృద్ధి నొందలేదు. క్రైస్తవ మత ప్రచారకులు స్థాపించిన పాఠశాలలు, వృత్తి పాఠశాలలు మొదలగు వానివలన కొంత విద్యాభివృద్ధి జరిగినను, ఉన్నత విద్యకు ఆ దేశమున అవకాశము ఏదియు కల్పింపబడలేదు. 1914 లో ఒకవిధమైన స్థానిక స్వాతంత్ర్యము ఒసగబడినను, అందు వోటుహక్కు వలసవచ్చిన పోర్చుగీస్ వారికిని, వారితో సహకరించు కొలదిమంది విద్యావంతులగు దేశీయులకును మాత్రమే ఒసగబడినది. 1925 వరకు ఈ దేశమున నిర్బంధపు వెట్టిచాకిరి అమలునందు ఉండెడిది. దేశమున జాతీయోద్యమము ఏదియు బలపడకుండ ఉండుటకై పోర్చుగీస్ సామ్రాజ్య ప్రభుత్వము ప్రపంచ ప్రజాభిప్రాయమును సైతము లెక్కచేయక దమన నీతిని అవలంబించి కృషిచేయుచున్నది. చీ. శే. రా.

**మొనాకో :** యూరప్ ఖండమునందు ఉన్న స్వతంత్రమగు చాల చిన్న రాజ్యము.

ఈ రాజ్యమునకు ఫ్రాన్సుదేశపు ఆల్పెస్ మేరిటైమ్ జిల్లా [ఉ, తూ, ప] మధ్యధరా సముద్రము [ద] సరిహద్దులందు ఉన్నవి.

[వి] 1·5 చ. కి. మీ.; మధ్యధరా సముద్రపు తీరమున 3 కిలో మీటరుల పొడవున ఈ దేశము వ్యాపించి ఉన్నది. వెడల్పు సుమారు 1001 మీటరులను మించి ఉండదు. [జ] 22,500. కాని, వీరిలో మొనాకో పౌరసత్వము కలవారు 3,039 మాత్రమే. తక్కిన వారందరును తాత్కాలిక నివాసార్హత పొందిన విదేశీయులు. [భా] అధికార భాష ఫ్రెంచి; [మ] రోమన్ కేథలిక్ సంప్రదాయపు క్రైస్తవ మతము ప్రభుత్వాదరితము. కాని, మతస్వేచ్ఛ కలదు. [రా] మొనాకోవిల్లి (జ. సం. దాదాపు 3,000).

చరిత్ర: భౌగోళికముగ, సాంస్కృతికముగ ఫ్రాన్సు దేశమునందు అంతర్భాగమే అగు ఈ అల్పరాజ్యమును తొలుత ఓటో సినెల్లా (1070 - 1141 ర) అను అతడు సంస్థాపించెను. 15 వ శతాబ్దమున ఇతని వంశీకుడగు లొంబార్డ్ గ్రిమాల్డి పాలించు కాలమున, పరిసర దేశముల వారు దీని స్వతంత్ర ప్రతిపత్తిని గుర్తించిరి (1489). 1793 లో ఫ్రాన్సు ఈ రాజ్యమును ఆక్రమించి కలుపుకొనినను తరువాత 1814 లో తక్కిన యూరపియన్ రాజ్యముల సాయమున మొనాకో మరల స్వాతంత్ర్యము పొందెను. 1868 లో దేశమున రైలు మార్గము ఏర్పడినప్పటినుండియు అందును ముఖ్యముగ కేసినో అను ప్రపంచ విఖ్యాత ద్యూతగృహము సంస్థాపింపబడిన దాదిగ ఈ దేశము సుసంపన్నమయ్యెను. ప్రపంచము నందలి భోగలాలస ధనికులను ఆకర్షించు విహారభూమిగ మొనాకో నేడు ప్రఖ్యాతి కాంచినది.

రాజ్యాంగము: వంశానుగతము, రాజ్యాంగ చట్టవిహితము అగు రాచరికము ఇట పాలించుచున్నది. ఈ వంశపు రాజులలో ఎవనికైనను పురుష సంతతి లేనిచో ఈ రాచరికము అంతట అంతరించి, ఈ రాజ్యము ఫ్రాన్సున కలసి పోవునటుల ఒక ఒడంబడిక వలన ఏర్పాటు జరిగినది. 1911 లో రాజుచే నొసగబడిన రాజ్యాంగచట్టమును అనుసరించి 18 మంది సభిక సంఖ్యగల ఎన్నుకొనబడిన శాసన సభ ఒకటి ఉండు ఏర్పాటు ఉండెడిది. కాని, ప్రస్తుత ప్రభువు 1959 లో దానిని రద్దుచేసి తనచే నియమింపబడిన 12 మంది సభ్యులు కల జాతీయసమితిని ఒకదానిని 1961 లో స్థాపించి, పరిపాలనలో సలహాలను ఒసగుటకు అధికారము ఒసగెను. రాజ్యపాలనలో తనకు సాయపడుటకు రాజు ఫ్రాన్సుదేశపు అధ్యక్షుని ఆమోదముపై ఒక ప్రధానిని నియమించును. ఫ్రాన్సు దేశమునందలి నాణెములనే మొనాకో వాడుచున్నది. చీ. శే. రా.

**మొరాకో**: ఆఫ్రికా ఖండమున వాయవ్య మూల ఉన్న ఒక స్వతంత్రరాజ్యము. ఆ దేశీయులు తమ దేశమును 'మగ్రిబియా' అనుపేర వ్యవహరింతురు.

ఈ రాజ్యమునకు మధ్యధరాసముద్రము [ఉ]; ఆల్జీరియా [తూ]; ఫ్రెంచి సహారా, స్పానిష్ సహారా [ద]; అట్లాంటిక్ మహాసముద్రము [ప] సరిహద్దులుగ ఉన్నవి. [వి] 4,43,680 చ. కి. మీ. [జ] 1,23,60,000. దేశీయులలో అరబ్ జాతికి చెందిన




వారు అత్యధిక సంఖ్యాకులు; తక్కినవారిలో బర్బర జాతివారు ఎక్కువగ ఉందురు. [భా] దేశపు మొత్తమున అరబ్బీభాషను మాట్లాడువారు 64%, బర్బరభాషను మాట్లాడువారు 22%. ఈ ఉభయ భాషలను మాట్లాడువారు 14% కలరు. [మ] దాదాపుగ దేశీయులందరును ముస్లిములు. [రా] రబాత్ (జ. సం. 2,27,445).

చరిత్ర: ఈ దేశమున తొలుతగ నివాసము ఏర్పరచుకొనినవారు బర్బరులు. ప్రాచీనకాలమున వివిధరాజ్యములవారు ఒకరి వెనుక ఒకరు ఈ బర్బరులను జయించుటకు యత్నించిరి. తొలుత ఫొనీషియన్లు, అంతటనుండి క్రమముగ రోమన్లు, కార్తజీనియన్లు (క్రీ. పూ. ఒకటవ శతాబ్ది), వేండల్లు (క్రీ. శ. అయిదవ శతాబ్ది), బైజాంటియన్ సమ్రాట్లు (6 వ శతాబ్ది) ఈ దేశముపై దండెత్తి సంక్షుభితము ఒనర్చిరి. కాని, ఈ దేశపు భాషాసంస్కృతులలో అద్భుత పరివర్తనమును కొనివచ్చినది అరబ్బుల దండయాత్ర. ఉగ్బా ఇబ్న్ - నెఫి అను సేనాని నాయకత్వమున అరబ్బులు ఈ దేశమునకు క్రీ. శ. 682 లో జయించిరి. కాని, వివిధ బర్బరజాతులను ఒక కేంద్రప్రభుత్వము క్రిందకు కొనివచ్చుటకు కొంత కాలము పట్టెను. తుదకు ఇద్రిస్ ఇబ్న్ అబ్దుల్లా అను అరబ్ జాతీయుడు ఈ రాజ్యమునకు రాజై (788) తన వంశపు పాలనను ఇట స్థాపించెను. అతని వంశీకుల పాలనమున బర్బరజాతులు ఇస్లామ్మతమును అవలంబించుటయేకాక అరబ్బీభాషను కూడ చాలవరకు గ్రహించినవి. కాని, విదేశీయులపాలనను మాత్రము సహింపజాలక ఈ బర్బరులు తమ ఐక్యప్రతిఘ

టన మూలమున ఇడ్రిస్ రాజ్యవంశమును 974 లో అంత మొందించిరి. తరువాత ఇస్లామ్ మతాభినివేశముతో ఉత్తర ఆఫ్రికానంతను జయించుటకు పూనుకొనిన ముస్లిమ్ యోధవర్గమొకటి (అల్ మొరావీ అను పేరుగలది) ఈ దేశమును ఆక్రమించెను (1047), కాని, అల్ మొవాహిద్దీన్ అను వేరొక తెగవారు వీరిని 1147 లో అంత మొందించి, 1269 వరకు మొరాకోను పాలించిరి. అంతట బేనీ మరీన్ అను రాజవంశపుపాలన ఈ దేశమున ప్రతిష్ఠితమయ్యెను. కళా, విజ్ఞానశాస్త్ర, సారస్వతములు ఈ వంశపు ప్రభువుల ఆదరణమున ఇట ఆనాడు చక్కగ వర్ధిల్లినవి.

సఆది అను వేరొక రాజవంశము 16 వ శతాబ్దిలో సింహాసనమును ఆక్రమించెను. ఈ వంశమునందలి రాజులలో అహమద్ అల్ మన్సూర్ పరిగణనీయుడు. ఈతని పరిపాలనాకాలము (1578 - 1603) మొరాకో చరిత్రలో స్వర్ణయుగమని పేర్కొనబడుచున్నది. టర్కీ సేనల దండయాత్రలను ఇతడు తిరుగగొట్టుటయే కాక, సుడాన్ నందలి తంబక్టూనగరమును కొల్లగొట్టి, అచట లభించిన అమూల్య వస్తుచయముచే తన ముఖ్యనగరమగు మర్రాకేష్ ను సుశోభితమొనర్చెను. క్రమముగ ఈ రాజవంశీకులు బలహీనులగుటచే, వారిని కడకు ద్రోసి, ఫిలాలీరాజవంశము రాజ్యమును ఆక్రమించెను. ఈనాటికిని ఆ వంశీయులే ఈ దేశమున సుల్తాన్ లుగ పాలించుచున్నారు. ఈ వంశపు వారిలో విస్తృత కీర్తిప్రతిష్ఠలను ఆర్జించిన ప్రభువు మౌలే ఇస్మాయిల్ (1672 - 1727 ప.). యూరపియన్ లును, టర్కీ ప్రభువులును ఈ దేశమును లోగొనుటకు చేసిన ప్రయత్నముల నన్నిటిని ఈ ప్రభువు అరికట్టెను. దేశాంతర్భాగములగు లరాచీ, టేంజియర్ లను క్రమముగ ఆక్రమించిన స్పెయిన్ వారిని, బ్రిటిష్ వారిని ఇతడు పారద్రోలెను. కాని, అతని తరువాత వచ్చినవారు అంతగ సమర్థులు కారు. కావున 1844 లో ఫ్రెంచివారు మొరాకో, అల్ జీరియా ప్రభువుల సేనల రెండింటిని ఇస్లీవద్ద జరిగిన పోరాటమున నిర్జించి, ఈ దేశమున పలుకుబడిని సంపాదింపగలిగిరి. ఫ్రెంచివారి సమ్మతితో స్పెయిన్ వారును ఉత్తర మొరాకోను ఆక్రమించిరి. కాని, మధ్యధరా సముద్రమున వ్యాపారదృష్ట్యా కీలకస్థానమున ఉన్న ఈ దేశమున వసతులను ఆర్జించుటకు ఫ్రాన్స్, స్పెయిన్ లతో పాటుగ యునైటెడ్ స్టేట్స్, జర్మనీ, బ్రిటన్ రాజ్యములు కూడ పోటీ పడినవి. తుదకు 7 ఏప్రిల్, 1906 న ఈ అయిదు రాజ్యములు కుదుర్చుకొనిన అల్ జీరియా చట్టమును అనుసరించి, వీరందరికిని వ్యాపారమునకై ఆ దేశమున సమానావకాశములు ఉండుటకును, మొరాకో రేవులు ఫ్రెంచి, స్పానిష్ దళముల కావలాలలో ఉండుటకును ఏర్పాటు జరిగినది. తరువాత 30 మార్చి, 1912 న జర్మనీకి తన కాంగో వలస రాజ్యమున 2,59,000 చ.కి.మీ. భూమిని ఫ్రాన్స్ దత్తమొనర్చినందులకు ప్రతిఫలముగ, జర్మనీ ఆమోదముతో మొరాకో పై రక్షణాధికారమును ఫ్రాన్స్ స్వీకరించెను. అంతటినుండి ఫ్రెంచివారి అధికారమునకు లోబడి సుల్తాన్ వ్యవహరింపవలసివచ్చెను. దేశీయులు ఈ ఏర్పాటును ప్రతిఘటించి, తుదకు అబ్దుల్ కరీమ్ అను దేశభక్తుని నాయకత్వమున పోరాటమును (1921 - 26) సాగించిరి. కాని, ఫ్రెంచి, స్పానిష్ సేనలు ఆ తిరుగుబాటును నిర్దాక్షిణ్యముగ అడచినవి.

ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున జర్మనీ ఆక్రమిత యూరప్ పై దండయాత్రకు ప్రాతిపదికగ యునైటెడ్ స్టేట్స్ సేనలు 8 నవంబరు, 1942 న ఈ దేశమున దిగినవి. ఫ్రాన్స్ ను నాజీదాస్యమునుండి విముక్తమొనరించుటకు మొరాకో సేనలు కూడ తక్కిన మిత్రరాజ్య సేనలతో పాటుగ కృషి చేసినవి (1944 - 45). యుద్ధానంతరమున ఇస్తిక లాల్ పార్టీ నాయకత్వమున స్వాతంత్ర్యమునకై పౌరులు ఆందోళనము సల్పిరి. సుల్తాన్ కూడ ఇందులకు ప్రోత్సాహమొసగెను. ఈ ఉద్యమము నడచు ఉద్దేశముతో సుల్తాన్ ను ఫ్రెంచివారు దేశబహిష్కృతుని చేసి, మడగాస్కర్ (మలగాసీ) దీవియందు ఉంచిరి (1954). కడకు 1956 లో సుల్తాన్ తో రాజీపడి దేశమునకు అతనిని తిరిగి రానిచ్చుటయే కాక, మొరాకోకు ఫ్రెంచివారు స్వాతంత్ర్యము ఒసగిరి. మొరాకో దేశమందు తమకు గల వలసలపై స్పెయిన్ వారు అధికారమును వదలుకొనిరి (1958). తొలుత బ్రిటిష్ వారి క్రిందనుండి 1923 నుండి అంతర్జాతీయ ప్రదేశముగ ఉండిన టెంజియర్ కూడ 1960 నుండి మొరాకోలో విలీనము అయ్యెను. కాని, సాంస్కృతికముగ, రాజకీయముగ, చారిత్రకముగ తమకు అతి సన్నిహితమగు మారిటేనియా రాజ్యమును కూడ తమ దేశముతో చేర్చుట సమంజసమని మొరాకో సుల్తాన్ ప్రకటించెను ; దీనిని కొన్ని ఆఫ్రికా దేశములును సమర్థించినవి. అయినను మారిటేనియాను స్వతంత్రమగు వేరొక రాజ్యముగ ఐక్యరాజ్యసమితి గణించినది.

**రాజ్యాంగము :** సర్వతంత్రస్వతంత్రమగు రాచరికపు పాలనలో ఈ దేశము ఉన్నది. కాని, క్రమక్రమముగ అధికారమును ప్రజల పరము ఒనర్చి, ప్రజాస్వామ్య రాజ్యాంగచట్టవిహితమగు రాజ్యపరిపాలనగ దీనిని మార్చుట తన ఆశయమని సుల్తానగు మహమ్మద్ - V ప్రకటించి, అందులకు ప్రాతిపదికగ 1955 అంతమున 15

మంది సభ్యులుగల ఒక మంత్రిమండలిని నియమించెను. తరువాత 3 ఆగస్టు, 1956 న 76 మంది సభ్యులు కల జాతీయసలహాసంఘమును కూడ అతడు ఏర్పాటు చేసెను. ఇందలి సభ్యులను అందరను అతడు నియమించెను. అయినను క్రమముగ ఇది ఎన్నిక సభ్యులు కల శాసనసభగ రూపొంద గలదని అతని ఆశయము. 1958 లో అతడు ప్రకటించిన నూతనవిధానమును అనుసరించి తొలుత స్థానికసంస్థలకు ఎన్నికలు జరిగి, వానినుండి పరోక్షముగ జాతీయ సమాలోచన సభకు ప్రతినిధులు ఎన్నిక అగుటకు ఏర్పాటు జరిగెను. తరువాత మహమ్మద్ - V మరణానంతరము (1961) రాజైన హాస్సన్ - II ప్రభువు కూడ తన తండ్రి విధానమునే అనుసరించుచు, ప్రజలకు సోపానక్రమమున అధికారములను కలిగించుటయే తన ఆశయముగ ఇడుకొనెను. కాని, ఇంకను సంపూర్ణమగు ప్రజాస్వామ్య ప్రభుత్వము అట ఏర్పడలేదు. చీ. శే. రా.

**మొహంజొదారో - హరప్పా శిథిలములు :** చూ. సింధు నాగరకత.

**మౌర్య సామ్రాజ్యము :** చూ. భారతదేశము - పు. 664.

**మౌలిక స్వామ్యములు - భారతదేశము :** చూ. భారత రాజ్యాంగము - పు. 720.

**మ్యూనిక్ ఒడంబడిక** (1938, సెప్టెంబరు 29): జెకోస్లోవాకియా విషయమున ఏర్పడిన విషమపరిస్థితిని పరిష్కరించుటకు బ్రిటిష్ ప్రధాని ఛాంబర్ లేన్, ఫ్రెంచి ప్రధాని డలాడియర్, ఇటలీ నియంత ముస్సోలినీ, జర్మనీ నియంత హిట్లర్ మ్యూనిక్‌లో సమావేశమై, కుదుర్చుకొన్న ఒప్పందము. దీనిప్రకారము జెకోస్లోవాకియాలో అంతర్భాగమైన సూడెటెన్‌లాండ్‌ను జర్మనీకి అప్పగించుటకు, పోలండ్, హంగేరీ దేశముల అభ్యర్థనలను అనుసరించి జెకోస్లోవాకియా సరిహద్దులలో సర్దుబాటులు చేయుటకు పై నలువురు రాజ్యాధినేతలు అంగీకరించిరి. ఈ మార్పులు జరిగిన పిదప శేషించిన జెకోస్లోవాకియాను ఎట్టి దురాక్రమణలపాలు కాకుండ సంరక్షించుటకు కూడ హామీ ఈయబడెను. ఈ ఒడంబడిక ప్రకారము జెకోస్లోవాకియా జనాభాలో మూడవవంతు ఇతర దేశముల అధీనము చేయబడెను. జెకోస్లోవాకియాతో కాని, దాని మిత్ర దేశమైన రష్యాతోగాని సంప్రతింపకయే, ఆ రెండు దేశములను మ్యూనిక్ సమావేశమునకు ఆహ్వానింపకయే పై పరిష్కారము కుదుర్చుకొనబడినది. ఈ ఒడంబడిక ద్వితీయ ప్రపంచ యుద్ధమును సంవత్సరముపాటు వాయిదా వేయగలిగినది కాని, ఇంగ్లండు, ఫ్రాన్స్, జర్మనీ దేశములలో అనేకులు ఆశించినట్లుగ ఆ ప్రమాదమును నివారింపలేకపోయినది. యుద్ధమును నివారింపలేకపోయినను, మిత్రమండలి తమ ఆయుధోత్పత్తిని పెంపొందించుకొనుటకు ఈ ఒడంబడిక కొంత వ్యవధి చేకూర్చినదని కొందరు దీనిని సమర్థించిరి; ఆ వ్యవధి యుద్ధసన్నాహములను సమగ్రపరుచుకొనుటకు హిట్లర్‌కే ఎక్కువగ ఉపకరించినది అని తద్వ్యతిరేకులు విమర్శించిరి. ఆ. వెం.

**యాదవులు :** దక్షిణభారతదేశచరిత్రలో ప్రసిద్ధి చెందిన ఒక రాజవంశము. క్రీ. శ. 1000 కి పూర్వపు శాసనములందు వీరి ప్రసక్తి కనబడుటలేదు. కాని, 1000 లో పశ్చిమచాళుక్యుల పాలెగాండ్రలో ఒకడగు 'బిల్లము' డు తన దానశాసనములో తనను యాదవునిగ పేర్కొనెనని మాత్రము తెలియవచ్చుచున్నది. 1 వ శతాబ్దములో సూనచంద్రుడు - II అను యాదవరాజు చాళుక్య చక్రవర్తి అయిన విక్రమాదిత్య - VI నకు విశేషమైన సాహాయ్యము చేసెను. కనుక దేవగిరిని (పశ్చిమ దక్కన్) ఏలిన యాదవరాజులు చాళుక్యసామ్రాజ్యపు సామంతప్రభువుల వంశమువారని భావింపవచ్చును.

యాదవరాజులలో కొంత అధికారమును, స్వాతంత్ర్యమును సంపాదించుకొనినవారిలో బిల్లముడు - III ప్రథముడు. 1187 లో ఇతడే రాజాధిరాజులకు ఉండగల బిరుదములను అన్నిటిని తనకు వర్తింప చేసికొని చాళుక్య ప్రభువులకు చెంది ఉండిన ప్రదేశములలో ఈశాన్యభాగములను స్వాధీనము చేసికొనెను. దేవగిరిపట్టణము నిర్మించిన రాజు ఇతడే. అప్పటినుండియు ఈ పట్టణమునకును, ఈతని వంశమువారికిని సంబంధము కలదు. ఇతని రాజ్యవిస్తరణ కాంక్షను హొయసల రాజైన 'బల్లాలుడు - II' కొనసాగకుండ చేసెను. గడగ్ సమీపములో హొయసలులు బిల్లముని ఓడించి, అతనిని కృష్ణానదీతీరమువరకును తరిమిరి. 1191 లో ఈ దండయాత్రలోనే బిల్లముడు హతుడు అయ్యెను. అతని కుమారుడైన జయతుగి పరిపాలనలోనికి వచ్చెను. త్రిపురకు చెందిన కలచురివంశీయులను, కాకతీయ రాజైన రుద్రదేవుని ఈతడు జయించెను. ఇతడు సంస్కృతములో మహాపండితుడు; వేదవేదాంగవేత్త.

క్రీ. శ. 1210 నుండి పాలించిన జయతుగి కుమారుడైన సింగనను గురించి రచితములైన పుస్తకములు మనకు లభించినవి. కాని, ఇందులో చరిత్ర విషయములు స్వల్పముగ ఉన్నవి. అయినను పశ్చిమచాళుక్యులకు సంబంధించిన ప్రదేశములు అన్నిటిని ఇతడు ఏలెనని నిదర్శనపూర్వకముగ చెప్పవచ్చును. ఇతని కాలములో యాదవులు

దక్కన్‌లో మహోన్నతస్థానమును ఆక్రమించుటచే, వారి ప్రతిభావిశేషములు విశ్వవిఖ్యాతములు అయినవి. ఇతడు గొప్ప యుద్ధశూరుడే కాక, సారస్వతాది లలితకళాపోషకుడు కూడ అయి ఉండెను. ప్రఖ్యాతిగాంచిన గణిత శాస్త్రజ్ఞుడగు ఛంగదేవుడు ఇతని ఆస్థానముననే వర్థిల్లెను. 1247 ప్రాంతములలో సింగనమనుమడైన కృష్ణుడు రాజ్యమునకు వచ్చెను. ఇతని తర్వాత 1260 లో ఇతని సోదరుడు మహాదేవుడు రాజయ్యెను. సోలంకీయులను, కాకతీయులను, హోయసలులను ఇతడు ఓడించుటవలన యాదవుల ఘనత ఎక్కువైనది.

మహాదేవుడు మృతినొందిన తరువాత 1271 నుండి కృష్ణుని పుత్రుడైన రామచంద్రదేవుడు పాలించెను. ఇతని రాజ్యము మైసూరు సరిహద్దులవరకును విస్తరించినది. మాళ్వదేశీయులైన పరమారులను జయించుటవలన కలిగిన సంతోషపు పొంగు అణగిపోక పూర్వమే కాకతీయులను కూడ ఇతడు ఓడించెను. మరియు హొయసలులను పరాజితులను గావించి, వారి ముఖ్యపట్టణమును పట్టుకొని తన విజయచిహ్నముగ అచ్చట ఇతడు ఒక దేవాలయమును కూడ నిర్మించెను. ఇంతటి ఘనకార్యములను సాధించిన రామచంద్రుని పరిపాలనలో తుది సంవత్సరములు మాత్రము దక్కన్ మీదికి తురకలు దండెత్తి వచ్చుటచే దుఃఖభాజనములు అయినవి.

దేవగిరిరాజ్యము ధనరాసులకు నిలయమని విని అల్లా ఉద్దీన్ [చూ. పు. 275] నాయకత్వమున ఢిల్లీ సుల్తాన్ సేనలు దేవగిరిపై దండెత్తెను (1296). ఆ సమయములో యాదవుల సైన్యములు అన్నియు యువరాజగు శంకరదేవుని నాయకత్వమున దక్షిణ జైత్రయాత్రకు పోయి ఉండుటచే, రామచంద్రుని నాయకత్వమున ఎదిర్చిన స్వల్పసంఖ్యాక సేనలను అల్లా ఉద్దీన్ అవలీలగ జయించెను. అల్లాఉద్దీన్ సైన్యములు పట్టణములో ప్రవేశించి చిత్తము వచ్చినట్లు దోచుకొనినవి.

అంతట రామచంద్రదేవుడు ఎక్కువగ ధనము ఇచ్చినచో అల్లా ఉద్దీన్ ఆ పట్టణమును విడిచిపెట్టుటకు సమ్మతించెను. కాని, ఇంతలో శంకరదేవుడు తిరిగివచ్చి తండ్రి పోరాడవద్దని ఎంత చెప్పినను వినక అల్లా ఉద్దీన్‌ను ఎదుర్కొని పోరాటమును సాగించెను. ముస్లిములు ఒక సందర్భమున యుద్ధభూమిని విడిచి పారిపోవుటకు సంసిద్ధులు కావలసివచ్చినది. కాని, అల్లా ఉద్దీన్ అదనపు సైన్యములు తనకు సాహాయ్యముగ వచ్చుచున్నవని వేసిన ప్రవాదమును శంకరుని సైన్యములు నిజమని విశ్వసించి, చెల్లాచెదరై పారిపోయినవి. చివరకు చేయునది లేక రామచంద్రుడు సంధిషరతులు మాట్లాడుకొనవలసివచ్చినది. అల్లా ఉద్దీన్ ఈ మారుషరతులను మరింత కఠినము చేసెను. ముస్లిమ్ చరిత్రకారుడు ఫెరిష్టా [చూ. పు. 632] నుడివిన ప్రకారము 22,394 కిలోగ్రాముల బంగారము, 261 కిలోగ్రాములు ముత్యములు, 74 కిలోగ్రాముల తదితర ఆభరణములు, 37,324 కిలోగ్రాముల వెండి నజారానాగా అల్లా ఉద్దీన్ యాదవులనుండి గ్రహించెను.

అల్లాఉద్దీన్ సింహాసనము ఎక్కిన తరువాత వెనువెంటనే దక్కన్‌దేశము మీదికి దండయాత్రలు సాగించెను. గుజరాత్‌ను జయించిన తర్వాత రామచంద్రుడు కప్పము కట్టుటయందు అశ్రద్ధగ ఉండెనను వార్త సుల్తాన్‌నకు తెలియవచ్చినది. వెంటనే అతడు సమర్థుడైన మాలిక్ కాఫూర్ [చూ. పు. 751] ఆధిపత్యమున బ్రహ్మాండమైన సేనాదళమును రామచంద్రునిపైకి పంపగ, రామచంద్రుడు లొంగిపోయెను. అంతటితో సరిపోలేదు. అల్లాఉద్దీన్ ఖిల్జీకి ఈ విషయమును స్వయముగ మనవి చేసుకొనుమని రామచంద్రుని మాలిక్ కాఫూర్ ఢిల్లీకి పంపెను. రామచంద్రుడు ఢిల్లీలో ఆరుమాసములు ఉన్న తరువాతగాని తిరిగి రాలేకపోయెను. వారచ్చట అతనికి చేసిన గౌరవముతో తిరిగివచ్చి అప్పటినుంచి ప్రతిసంవత్సరమును శ్రద్ధగా కానుకలను ఢిల్లీకి పంపుచుండెను.

రామచంద్రదేవుడు 1309 లో కాలధర్మము నొందెను. ఇతని తరువాత ఇతని పుత్రుడు శంకరదేవుడు మూడు సంవత్సరములు పాలించెను. ఇతడు ఒకరికి దాసోహము అను స్వభావము కలవాడు కాదు. అందుచే అతడు ఢిల్లీ సుల్తాన్‌కు కప్పము కట్టుట మానివేసెను. మాలిక్ కాఫూర్ దేవగిరి మీదికి దండెత్తివచ్చి శంకరుని ఓడించెను. ఆ యుద్ధములో శంకరుడు చనిపోయెను. మాలిక్ కాఫూర్ రాయచూర్, దోఅబ్, గుల్బర్గా రాజ్యములను ఢిల్లీ సామ్రాజ్యములో కలుపుకొనెను. శంకరుని బావమరది హరపాలుడు రాజయ్యెను. అతడు అప్పుడు ఢిల్లీ సుల్తానైన ముబారక్‌షా మీదికి తిరుగబడుటకు సాహసించెను. తిరిగి ఢిల్లీ సుల్తాన్ 1318 లో దేవగిరి మీదికి దండెత్తగా, హరపాలుడు శత్రువులకు పట్టుబడి శత్రురాజు ఆజ్ఞచే సజీవముగా దగ్ధము కావించబడెను. ఈ విషాద సంఘటనతో యాదవుల పరిపాలన అంతమైనది. దేవగిరి ఢిల్లీ సుల్తాన్ రాజ్యములో ఒక భాగమై పోయినది. వి. ఆర్.

**యాల్టా సమావేశము :** చూ. క్రిమియా సమావేశము - పు. 413.

**యుక్రెయిన్ :** సోవియట్ సోషలిస్ట్ గణరాజ్య సమితి యందలి ఒక గణరాజ్యము.

ఈ గణరాజ్యమునకు బైలోరష్యా (సోవియట్ రష్యా) [ఉ]; రష్యా (సోవియట్ రష్యా) [తూ]; నల్లసముద్రము [ద]; మొల్దావియా సోషలిస్ట్ గణరాజ్యము, రుమేనియా, హంగేరీ, జెకోస్లోవాకియా, పోలండ్ రాజ్యములు [ప] సరిహద్దులుగ ఉన్నవి. [వి] 6,00,999 చ. కి మీ.; [జ] 4,46,36,000. [భా] యుక్రేనియన్. [మ] ప్రజలలో క్రైస్తవులు 90% కలరు. తక్కిన వారిలో యూదులు అత్యధిక సంఖ్యాకులు. కాని, ప్రస్తుత పరిపాలనా వ్యవస్థను అనుసరించి మతమునకు కల ప్రాముఖ్యము క్రమముగ అంతరించుచున్నది. [రా] కీవ్ (జ. సం. 12,08,000).

చరిత్ర : రష్యా దేశ చరిత్రతో ఈ దేశచరిత్ర కొంత వరకు ముడివడి ఉన్నను, చాలకాలము తన ప్రత్యేకతను నిలబెట్టుకొని ఉండగలిగినది. తొలుతటి రష్యన్ రాజ్యము కీవ్ నగరము రాజధానిగ క్రీ. శ. 9 - 13 శతాబ్దముల మధ్య కాలమున ఇటనే రూపొందినది. కాని, 13 వ శతాబ్దమున మంగోల్‌ల దండయాత్రలమూలమున ఆ రాజ్యము అంతరించినది. తరువాత పోలండ్‌ను, లిథూనియాను సంయుక్తముగ పాలించిన ఒక ప్రభువంశము దీనిని ఆక్రమింప, వారి వశమున 1667 వరకు ఈ రాజ్యము ఉండెను. కాని, మాస్కో నగరము రాజధానిగ నూతనముగ రూపొందిన రష్యాను పాలించు ప్రభువులు సాంస్కృతికముగ ఈ దేశమునందలి ప్రజలు తమకు సన్నిహితులు అను మిషతో దీనిని ఆక్రమించుటకు పలుమారులు యత్నములు సలిపిరి. తత్ఫలితముగ నేపియర్ నదికి తూర్పున ఉన్న భాగమును రష్యన్ ప్రభుత్వమునకు పోలిష్ - లిథూనియా పాలకులు దత్తమొనర్చిరి (1667). తరువాత పోలండ్ విభజన జరిగినపుడు [చూ. పోలండ్ పు. 590] 1793 లో తక్కిన దేశమును కూడ రష్యా ఆక్రమించెను.

సాంస్కృతికముగ తమకు సన్నిహితులే అయినను రష్యన్ ప్రభువుల పాలన యుక్రెయిన్ వాసులకు కష్టదాయకము అయ్యెను. యుక్రెయిన్ స్వాతంత్ర్యోద్యమము అంతట రూపొంది రష్యన్ జార్ (చక్రవర్తి) పాలనను కూలద్రోయుటకు పలు యత్నములు చేసెను. 1917 లో రష్యన్ సామ్రాజ్యము కూలిపోవగనే యుక్రెయిన్ స్వతంత్రతను ప్రకటించెను. కాని, కాలక్రమమున దేశమునందు ఏర్పడదగు ప్రభుత్వవిధానమును గురించి దేశీయులలో అభిప్రాయభేదములు ఏర్పడి తత్ఫలితముగ రెండు వేర్వేరు ప్రభుత్వములు ఏర్పడెను. అందొకటి రష్యాలో ఏర్పడిన బోల్షివిక్ ప్రభుత్వ పద్ధతిని అనుసరించునది అగుటచే దానినే రష్యాలోని బోల్షివిక్ ప్రభుత్వము సమర్థించి సాయము చేసెను. తుదకు 1921, మార్చి 18 కి యుక్రెయిన్ బోల్షివిక్ ప్రభుత్వ విధానముగల స్వతంత్ర రాజ్యముగ గుర్తింపబడెను. 1923, జూలై 6 న సోవియట్ సోషలిస్ట్ గణరాజ్యసమితి యందు ఇది సభ్యత్వమును అంగీకరించినది. అంతటినుండి ఆ రాజ్య చరిత్రలో ఈ దేశ చరిత్రయు లీనమైనది. కాని, ఐక్యరాజ్య సమితి [చూ. పు. 351] యందు సోవియట్ రష్యా రాజ్యముతో పాటుగ యుక్రెయిన్ కూడ ప్రత్యేక సభ్యత్వమును కలిగి ఉన్నది.

చీ. శే. రా.

**యుగోస్లావియా :** ఆగ్నేయా ఆసియాలోని ఒక స్వతంత్ర రాజ్యము.




ఈ రాజ్యమునకు ఆస్ట్రియా, హంగేరీ, రుమేనియా [ఉ]; బల్గేరియా [తూ]; గ్రీస్ [ద]; ఆల్‌బేనియా, ఎడ్రియాటిక్ సముద్రము [ప] సరిహద్దులుగ ఉన్నవి. [వి] 2,55,804 చ.కి.మీ.; [జ] 1,19,50,000. [భా] స్లోవీన్, మేసిడోనియన్, సెర్బో-క్రోట్ భాషలు దేశమున ఆ యా భాషావర్గములందు వ్యాప్తియందు ఉన్నవి. ఇవి మూడును అధికార భాషలుగనే గుర్తింపబడుచున్నను, సెర్బో - క్రోట్ భాషయే దేశ సామాన్యభాషగ వ్యాప్తిని ఆర్జించినది. [మ] ప్రజలలో 87% క్రైస్తవులు, తక్కినవారు ఏ మతమునకును చెందనివారు. ముస్లిమ్‌లును, యూదులును అల్పసంఖ్యలో కలరు. [రా] బెల్‌గ్రేడ్ (జ. సం. 5,87,900).

చరిత్ర : ప్రథమ ప్రపంచ యుద్ధమునకు పూర్వమున ఇప్పటి యుగోస్లావియా విభిన్న ప్రాంతములుగ చీలి ఉండి అందు కొన్ని ఆస్ట్రియా - హంగేరీ సామ్రాజ్యమునను, కొన్ని టర్కీ సామ్రాజ్యమునను చేరి ఉండినవి. యుద్ధకాలమున మిత్రమండలివారు ఈ ప్రాంతములందు వసించు సెర్బో - క్రోట్, స్లావీన్ జాతులవారికి ఒసగిన వాగ్దానముల ఫలితముగ యుద్ధానంతరమున మిత్రమండలి రాజ్యముల సహకారమూలమున యుగోస్లోవియా రాజ్యము రూపొందింపబడినది (1919). కాని, పరిసర

రాజ్యములతో కల సరిహద్దుసమస్యల తుది పరిష్కారము 1924 వరకు సాధ్యము కాలేదు.

ఈ రాజ్యము ఏర్పడినప్పటినుండియు శాసనవిహితమగు రాజరికపు పాలనలో ఉండుటకు ఏర్పాటు జరిగెను. ఆ ఏర్పాటునుబట్టి తొలుత కరాజియోవిచ్ రాజవంశమునకు చెందిన అలెగ్జాండర్ అనునతడు రాజయ్యెను. కాని, శాసనసభయే సర్వాధికారములను వహించి ఉండెను. అయినను సెర్బ్, క్రోట్ జాతుల మధ్య గల వైషమ్యముల ఫలితముగ పరిపాలనలో స్థైర్యము లేకుండపోవుట వలన రాజే శాసనసభను రద్దుచేసి, సర్వాధికారములను వహించి నిరంకుశ రీతిలో పాలింప మొదలిడెను (జనవరి 6, 1929). ఈ పరిపాలనలో రాష్ట్రప్రభుత్వమునకు కల అధికారములను అన్నిటిని రాజు రద్దొనర్చి, కేంద్ర ప్రభుత్వమును బలవత్తరమొనర్చుటచే సెర్బులకు తప్ప తక్కిన వారలకు అందరకు రాజరికము ఎడల విద్వేషము కలిగెను. కాని, రాజు మాత్రము దేశాభివృద్ధి దృష్టిలో కొన్ని సంస్కరణలను ప్రవేశపెట్టెను. దేశమున సమైక్య భావమును కల్పించుటకై అదివరకు ఉన్న సెర్బ్ - క్రోట్ - స్లోవీన్ రాజ్యమను పేరును మార్చి దేశమునకు 'యుగోస్లావియా' అని ఈరాజే పేరిడెను. కడకు 1934 లో అలెగ్జాండర్ రాజు పారిస్‌ను ఫ్రెంచి ప్రభుత్వాహ్వానముపై దర్శింప ఏగినపుడు యుగోస్లోవియా ప్రవాసిత పౌరుడు ఒకడు ఆ రాజును హత్య కావించెను. అంతట అతని కుమారుడు పీటర్ - II బాలుడు అగుటచే అతని పక్షమున ఒక పరిపాలక సమితి (రీజెన్సీ కౌన్సిల్) దేశాధిపత్యమును వహించెను. ఆ సమితి పరిపాలనకాలమున దేశమున వివిధ జాతులమధ్య సామరస్యము కలుగుటకు కొంత కృషి జరిగెను. ఇంతలో 1939 న ద్వితీయ ప్రపంచ యుద్ధము [చూ. పు. 608] ఆరంభము అగుటతో ఈ కృషికి అభ్యంతరము ఏర్పడెను.

ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున యుగోస్లావియా ప్రభుత్వము తొలుత తాటస్థ్యము వహించినను, 1940 లో పరిసర రాజ్యములు అన్నియు అక్షరాజ్యముల పలుకుబడికి లోనగుటవలన తుదకు హిట్లర్ [చూ.] యొక్క ఆదేశములకు లొంగి, అక్షరాజ్యములతో ఒక ఒడంబడికను కుదుర్చుకొనెను. అంతట ప్రజలు ఈ ఒడంబడికను నిరసించుచు తిరుగుబాటు చేసి, ప్రభుత్వమును కూలద్రోసిరి. పరిపాలకసమితి ప్రభుత్వమును అంతమొందించి పీటర్ రాజు ప్రజలతో సహకరించెను. కాని, ఇంతలో అక్షరాజ్య సైన్యములు యుగోస్లావియాపై దండెత్తి దేశప్రజల ప్రతిఘటనను అడచి దేశమును ఆక్రమించినవి. అంతట యుగోస్లావియాను ఇటలీ, జర్మనీ, బల్గేరియా, హంగేరీలు పంచుకొనినవి. పీటర్ రాజు లండనుకు ఏగి అట ప్రవాస ప్రభుత్వమును నెలకొల్పెను.

దేశము ఇటుల పరాక్రాంతమైనను, దేశయువకులు ధైర్యము వహించి, గెరిల్లా దళములుగ ఏర్పడి, అక్షరాజ్య సైనికులను ఎదుర్కొనుచు, స్వాతంత్ర్య యుద్ధమును నడపిరి. అందులో సెర్బ్ యువకులకు డ్రాజా మైకోలోవిచ్ అను అతడును, జాతి విభజనతో నిమిత్తము లేకుండ ఏర్పడిన దళములకు జోసిఫ్ బ్రోజ్ అను అతడును నాయకత్వము వహించిరి. ఈ రెండవ అతడే మార్షల్ టిటో [చూ. పు. 496] అను పేర ఆ తరువాత ప్రసిద్ధిని ఆర్జించెను. కడకు టిటో దళములనే దేశపు సేనగా మిత్రమండలి గుర్తించెను. ఇంతలో 1943, డిసెంబరు 4 న జాతీయ విమోచన సంఘము ఒక దానిని టిటో నిర్మించి, లండనునందలి ప్రవాస ప్రభుత్వమును గుర్తింప నిరాకరించెను. మిత్రమండలి ఈ తగవులాటలో జోక్యము వహించిన ఫలితముగ రాజు యొక్క ప్రతినిధితో కలసి టిటో వ్యవహరించుటకు అంగీకరించెను (1945).

యుద్ధానంతరమున టిటో విజ్ఞప్తిని పాటించి దేశము గణరాజ్య ప్రభుత్వమును ఏర్పరచుకొనుటకు అంగీకరించెను. దానిని అనుసరించి రాజరికము రద్దుచేయబడినది (నవంబరు 29, 1945). అంతట టిటో దేశాధ్యక్షుడై, తదాదిగ పరిపాలన నెరపుచున్నాడు. టిటో కమ్యూనిస్ట్ పక్షావలంబి అగుటవలన ఆ పక్షపు విధానమును అనుసరించియే ఇచట రాజ్యాంగవ్యవస్థను అతడు రూపొందించెను. తొలుత ఇతనికి సోవియట్ రష్యా బాసటగ ఉండెను. కాని, యుగోస్లావియా జాతీయ శ్రేయస్సునకు విరుద్ధముగ సోవియట్ రష్యా వ్యవహరించుచున్నటుల అతడు భావించి, సోవియట్ రష్యా ప్రభుత్వపు సలహాలను మన్నింప నిరాకరించెను. సోవియట్ రష్యా నియంతయగు స్టాలిన్ [చూ.], అంతట టిటోను కమ్యూనిస్ట్ వ్యతిరేకిగ చిత్రించి, తన నాయకత్వమున నడచు ప్రపంచ కమ్యూనిస్ట్ ఉద్యమము నుండి బహిష్కరింపజేసెను. అయినను, తాను నమ్మిన పద్ధతిలో సామ్యవాదసమాజమును రూపొందించుటకై టిటో కృషిచేసి, పాశ్చాత్యదేశములనుండి సైతము సాయమును గ్రహించి దేశమును బలవత్తర మొనర్పగలిగెను. స్టాలిన్ అనంతరమున క్రమముగ అధికారమును గ్రహింపగలిగిన కృశ్చేవ్ [చూ. పు. 395] టిటో ఎడల 1961 మొదలు కొంత సామరస్య వైఖరిని అవలంబించి వ్యవహరించెను. ప్రపంచమును కల్లోలితమొనర్చు ప్రచ్ఛన్న యుద్ధమున భారతదేశము వలెనే యుగోస్లావియాయును

టిటో నాయకత్వమున తాటస్థ్య వైఖరిని అవలంబించి ప్రపంచ శాంతికొరకై కృషిచేయుచు ఆర్థికాభివృద్ధి కొరకై యునైటెడ్‌స్టేట్స్ నుండి సైతము సాయము గ్రహించుచున్నది [చూ. టిటో పు. 496; తటస్థ రాజ్యముల సమావేశము పు. 516].

రాజ్యాంగము : రాజ్యాంగ రీత్యా ఈ దేశము ఒక గణ రాజ్య సమాఖ్య. ఇందు సెర్బియా, క్రోషియా, స్లొవీనియా, బోస్నియా-హెర్సిగోవినా, మేసిడోనియా, మాంటెనీగ్రో అను ఆరు గణ రాజ్యములు చేరి ఉన్నవి. ఆయా ప్రాంతములందలి ప్రజల భాషా సాంస్కృతిక సాన్నిహిత్యమును బట్టి ఆ ఆరు గణ రాజ్యములును రూపొందింపబడినవి. ఇవి కాక వోవోడినా స్వయంపాలితరాష్ట్రమును, కోసోవో-మెతోహిజా స్వయంపాలితరాష్ట్రమును ఈ సమాఖ్యయందు భాగస్వామ్యమును కలిగి ఉన్నవి. ఇందలి గణ రాజ్య సభలు ఒక్కొక్కటి 10 మందిని, స్వయంపాలిత రాష్ట్రసభ 6 గురను, స్వయంపాలిత ప్రాంత సభ 4 గురను సమాఖ్య సభ (ఫెడరల్ కౌన్సిల్) కు ఎన్నుకొనును. వీరు కాక 60,000 మంది ప్రజలకు ఒక ప్రతినిధి చొప్పున ప్రజలనుండియు ప్రతినిధులు సమాఖ్యసభకు ఎన్నుకొనబడుదురు. ఈ సమాఖ్య సభకు తోడుగ ఉత్పాదకసభ అను వేరొక సభ కలదు. దేశ ప్రజలలో 70,000 మందికి ఒక ప్రతినిధి చొప్పున ఈ సభకు సభ్యులు ఎన్నుకొనబడెదరు. ఈ రెండు సభలు కలసి సమావేశమై సమాఖ్య ప్రజాసభగ రూపొందును. ఈ ప్రజాసభయే దేశాధ్యక్షుని, కేంద్ర కార్యనిర్వాహకవర్గ సభ్యులను, ప్రజాసభాధ్యక్షు, ఉపాధ్యక్షు, కార్యదర్శులను ఎన్నుకొనును. ఎన్నుకొనబడిన వారిని తొలగించుటకును ఈ ప్రజాసభకే అధికారము కలదు. దేశాధ్యక్షునియందు ప్రభుత్వాధికారము అంతయు న్యస్తమై ఉన్నది. కేంద్రకార్యనిర్వాహకసంఘమున 39 మంది ఎన్నుకొనబడిన సభ్యులు ఉందురు. ప్రజాసభకు బాధ్యత వహించి, అధ్యక్షుని పేర కార్యనిర్వాహక సంఘము పరిపాలనను నిర్వహించును. రాష్ట్రములందు దాదాపుగ దీనిని బోలిన పరిపాలనా వ్యవస్థయే కలదు. దేశమున ఎన్నికలన్నియు యుగోస్లోవియా కమ్యూనిస్ట్ పక్షపు ఆధ్వర్యవమున ఏక పట్టికా విధానము [చూ. పు. 348] న జరుగును [చూ. కమ్యూనిజమ్ పు. 366]. చీ. శే. రా.

**యుట్రెక్ట్ సంధి :** చూ. ఉట్రెక్ట్ సంధి - పు. 337.

**యునైటెడ్ అరబ్ రిపబ్లిక్ :** చూ. ఈజిప్టు - పు. 330.

**యునైటెడ్ కింగ్‌డమ్ :** యూరప్ ఖండమున వాయవ్యభాగమున నెలకొనిన ఒక ప్రముఖ స్వతంత్ర ద్వీపరాజ్యము. దీని పూర్తి నామము యునైటెడ్ కింగ్‌డమ్ ఆవ్ గ్రేట్ బ్రిటన్ అండ్ నార్దరన్ ఐర్లాండ్[1]. సంగ్రహముగ కొన్ని పట్టుల గ్రేట్ బ్రిటన్ అని వ్యవహరింపబడుటయు కలదు. ఈ రాజ్యమున ఇంగ్లండు, వేల్స్, స్కాట్‌లాండ్, ఉత్తర ఐర్లాండ్ అను ప్రాంతములును, పరిసరములందలి కొన్ని అల్పద్వీపములును చేరి ఉన్నవి.

ఈ రాజ్యమున ఇంగ్లండు, వేల్స్, స్కాట్‌లాండ్ దేశములు నెలకొనిన గ్రేట్ బ్రిటన్ దీవి అట్లాంటిక్ మహాసముద్రపరివృతమై ఇంగ్లీషు ఛానెల్‌చే యూరప్‌ఖండ ముఖ్య భూభాగమునుండి వేరు చేయబడి ఉన్నది. తక్కిన ఉత్తర ఐర్లాండ్, ఐర్లాండ్ దీవియందు ఉత్తరపు కొనన ఉన్నది. ఈ ఐర్లాండ్‌దీవియు అట్లాంటిక్ మహాసముద్ర పరివృతమై గ్రేట్ బ్రిటన్‌కు పశ్చిమమున ఉన్నది. [వి] 2,44,030 చ. కి. మీ[2]; [జ] 5,34,41,000. [భా] ఇంగ్లీషుభాషను సర్వత్ర మాట్లాడుచున్నను, వేల్స్‌నందు 26,238 మంది వేల్స్‌భాషను, స్కాట్‌లాండ్‌నందు 1,079 మంది గేలిక్ భాషను మాత్రమే మాట్లాడువారు కలరు. [మ] ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు క్రైస్తవులు. ఇందును ఆంగ్లికన్ చర్చి శాఖకు చెందినవారు చాల ఎక్కువగ కలరు. [రా] లండను. (జ. సం. 81,71,902).

[1] ఈ రాజ్యమునకు చారిత్రాత్మకముగ ప్రాథమిక కేంద్రక రాజ్యముగ ఇంగ్లండుదేశమును పరిగణింపవలసి ఉన్నది. ఈ ఇంగ్లండు దేశముతో వేల్స్ దేశము 1282 న కలసి 1535 లో చట్టరీత్యా మేళనము పొందినది. ఇట్లు రూపొందిన బ్రిటన్‌దేశముతో స్కాట్‌లాండ్ దేశము 1603 లో కలసి ఒకే రాజరికము క్రిందకు వచ్చినప్పుడు ‘గ్రేట్ బ్రిటన్’ అను నూతన నామము ఏర్పరుపబడి, 1707 లో స్కాట్‌లాండ్, బ్రిటన్‌దేశముల పార్లమెంట్‌లు ఒకటియైన తరువాత సాధికారపరిగణనను పొందినది. ఆ సమయముననే ‘యునైటెడ్ కింగ్‌డమ్’ అను పేరును ఇడబడినది. కాని, ఆ నామము అప్పటిలో అంతగ వ్యాప్తికి రాలేదు. తరువాత 1800 లో ఐర్లాండ్‌దేశపు పార్లమెంట్ గ్రేట్ బ్రిటన్ పార్లమెంట్‌లో అంతర్లీనము చేయబడినపుడు యునైటెడ్ కింగ్‌డమ్ ఆవ్ గ్రేట్ బ్రిటన్ అండ్ ఐర్లాండ్ అను పేరు చట్టరీత్యా వ్యవహారములోనికి వచ్చినది. కాని, కాలక్రమమున ఐర్లాండ్ దీవియందలి ఉత్తర ఐర్లాండ్ తప్ప తక్కినది అంతయు స్వతంత్రతను పొంది వేరు రాజ్యమైనపుడు (1923), మిగిలిన రాజ్యమునకు ‘యునైటెడ్ కింగ్‌డమ్ ఆవ్ గ్రేట్ బ్రిటన్ అండ్ నార్దరన్ ఐర్లాండ్’ అను పేరు సిద్ధించి తదాదిగ వ్యాప్తియందు ఉన్నది. ఈ చారిత్రక పరిణామమును బట్టియే ఇచటి ప్రజలకు బ్రిటిష్‌వారు అను వ్యవహారనామము వ్యాప్తిలోనికి వచ్చినది. ఇట్టులే, చారిత్రకముగ కొంతవరకు అపార్థద్యోతకమే అయినను, ‘బ్రిటిష్’ అనుదానికి సమానార్థకముగ ‘ఇంగ్లిష్’ అని వాడబడుటయు కలదు.

[2] కొందరు రచయితలు బ్రిటన్‌కు దక్షిణమున ఉన్న మేన్‌దీవి (ఐల్ ఆవ్ మేన్) ని, ఛానెల్ దీవులను కూడ యునైటెడ్ కింగ్‌డమ్‌లో చేర్చి వైశాల్యాదులను లెక్కించుట కలదు. కాని, ఆ దీవులు పరిపాలన రీత్యా సంపూర్ణముగ వేరుగ ఉండుటవలన ఇందు చేర్చబడలేదు.

# యునైటెడ్ కింగ్‌డమ్

కౌంటీలు










## స్కాట్‌లాండ్

కౌంటీలు - ముఖ్యపట్టణములు

1. షెట్‌లాండ్ దీవులు - లెర్విక్
2. ఆర్క్నీ దీవులు - కిర్క్‌వాల్
3. కాత్నెస్ - విక్
4. సదర్‌లాండ్ - గాల్‌స్పీ
5. రాస్, క్రోమార్టి - డింగ్‌వాల్
6. ఇన్వెర్‌నెస్ షైర్ - ఇన్వెర్‌నెస్
7. నైర్న్ - నైర్న్
8. మోరే - ఎల్గిన్
9. బన్ఫ్ షైర్ - బన్ఫ్
10. అబర్డీన్ షైర్ - అబర్డీన్
11. ఆర్‌గిల్ షైర్ - లోక్‌గిల్ ఫేడ్
12. పెర్త్ షైర్ - పెర్త్
13. అంగస్ - ఫర్‌ఫార్
14. కిన్‌కార్డిన్ షైర్ - స్టోన్‌హెవెన్
15. డన్‌బార్టన్ - డంబార్టన్
16. స్టిర్లింగ్ షైర్ - స్టిర్లింగ్
17. క్లాక్‌మన్నాన్ - క్లాక్‌మన్నాన్
18. కిన్‌రాస్ షైర్ - కిన్‌రాస్
19. ఫిఫ్ షైర్ - కూపార్
20. బూటే - రాత్‌సే
21. రెన్‌ఫ్రూ షైర్ - పైస్లే
22. లనార్క్ షైర్ - లానార్క్
23. పశ్చిమ లోథియన్ - లిన్‌లిత్‌గో
24. మధ్య లోథియన్ - ఎడింబరో
25. తూర్పు లోథియన్ - హాడ్డింగ్‌టన్
26. బెర్విక్ షైర్ - డన్స్
27. ఏర్ షైర్ - ఏర్
28. పీబ్లెస్ షైర్ - పీబ్లెస్
29. సెల్‌కిర్క్ షైర్ - సెల్‌కిర్క్
30. రాక్స్‌బరో షైర్ - సెయింట్ బాస్వెల్స్
31. విగ్‌టౌన్ షైర్ - విగ్‌టౌన్
32. కిర్కుడ్ బ్రైట్ షైర్ - కిర్కుడ్ బ్రైట్
33. డమ్‌ఫ్రీస్ షైర్ - డమ్‌ఫ్రీస్

## ఇంగ్లండు

34. నార్తంబర్లాండ్ - న్యూకాసిల్
35. డర్‌హామ్ - డర్‌హామ్
36. కంబర్‌లాండ్ - కార్‌లిస్లి
37. వెస్ట్‌మోర్‌లాండ్ - కెన్‌డాల్
38. లంకాషైర్ - ప్రెస్టన్
39. యార్క్‌షైర్ - వేక్‌ఫీల్డ్ నార్తలార్టన్
40. చెషైర్ - చెస్టర్
41. డర్బీషైర్ - డర్బీ
42. నాటింగ్‌హామ్ షైర్ - నాటింగ్‌హామ్
43. లింకన్ షైర్ - లింకన్
44. ష్రాప్ షైర్ - ష్రూస్‌బరీ
45. స్టాఫర్డ్ షైర్ - స్టాఫర్డ్
46. లీసెస్టర్ షైర్ - లీసెస్టర్
47. రట్‌లాండ్ షైర్ - ఓక్‌హామ్
48. నార్‌ఫోక్ - నార్‌విచ్
49. హెర్‌ఫర్డ్ షైర్ - హెర్‌ఫర్డ్
50. వార్‌సెస్టర్ షైర్ - వార్‌సెస్టర్
51. వార్‌విక్ షైర్ - వార్‌విక్
52. నార్తంప్‌టన్ షైర్ - నార్తంప్‌టన్
53. హంటింగ్‌డన్ షైర్ - హంటింగ్‌డన్
54. కేంబ్రిడ్జ్ షైర్ - కేంబ్రిడ్జ్
55. సఫోక్ - బరీ సెయింట్ ఎడ్మండ్స్, ఇప్స్‌విక్
56. మాన్‌మౌత్ షైర్ - న్యూపోర్ట్
57. గ్లూసెస్టర్ షైర్ - గ్లూసెస్టర్
58. ఆక్స్‌ఫర్డ్ షైర్ - ఆక్స్‌ఫర్డ్
59. బకింగ్‌హామ్ షైర్ - ఆల్స్‌బరీ
60. బెడ్‌ఫర్డ్ షైర్ - బెడ్‌ఫర్డ్
61. హెర్ట్‌ఫర్డ్ షైర్ - హెర్ట్‌ఫర్డ్
62. ఎసెక్స్ - చెల్మ్స్‌ఫర్డ్
63. సోమర్‌సెట్ షైర్ - టాన్‌టన్
64. విల్ట్ షైర్ - ట్రౌబ్రిడ్జ్
65. బెర్క్ షైర్ - రీడింగ్
66. మిడిల్‌సెక్స్
67. లండను - లండను
68. కార్న్‌వాల్ - ట్రురో
69. డెవాన్ షైర్ - ఎక్సెటర్
70. డోర్‌సెట్ షైర్ - డోర్‌చెస్టర్
71. హాంప్ షైర్ - విన్‌చెస్టర్
72. సర్రే - కింగ్స్‌టన్
73. కెంట్ - మైడ్‌స్టన్
74. ససెక్స్ - చిచెస్టర్, లూయిస్

## వేల్సు

75. ఆంగ్లెసీ - ల్లాంగ్‌ఫ్నీ
76. కార్‌నార్వాన్ షైర్ - కార్‌నార్వాన్
77. డెన్‌బి షైర్ - రూథిన్
78. ఫ్లింట్ షైర్ - మోల్డ్
79. మెరియొనెత్ షైర్ - డాల్‌గెలి
80. మాంట్‌గొమరీ షైర్ - వెల్ష్‌పూల్
81. కార్డిగన్ షైర్ - అబరిస్ట్‌విత్
82. రాడ్‌నోర్ షైర్ - లాండ్రిన్‌డాడ్ వెల్స్
83. పెంబ్రోక్ షైర్ - హావెర్ ఫర్డ్ వెస్ట్
84. కార్‌మార్తెన్ షైర్ - కార్‌మార్తెన్
85. బ్రెక్‌నాక్ షైర్ - బ్రెకాన్
86. గ్లామర్‌గన్ షైర్ - కార్డిఫ్

## ఉత్తర ఐర్లాండ్

87. ఫెర్మానాగ్ - ఎన్నిస్‌కిలెన్
88. టిరాన్ - ఒమాగ్
89. లండన్ డెర్రీ - లండన్ డెర్రీ
90. ఆంట్రిమ్ - బెల్‌ఫాస్ట్
91. ఆర్మాఘ్ - ఆర్మాఘ్
92. డౌన్ - డౌన్ పాట్రిక్
93. మాన్ దీవి - డగ్లస్

చరిత్ర : అతి పురాతనకాలమునుండియు ఇందు మానవావాసములు ఉండినటుల తెలియవచ్చుచున్నది. ఆ ఆదిమ మానవజాతి నూతనశిలాయుగదశలో ఉండిన కాలమున కెల్టిక్‌జాతి ప్రజలు యూరప్ ఖండ ముఖ్య భూ భాగమునుండి ఇటకు వలసవచ్చినటులను, ఆ తరువాత కెల్టిక్‌వారిలో అంతశ్శాఖయగు బ్రిథోనిజాతి ప్రజలును ఇటకు వచ్చి చేరినటులను పురాతత్త్వ విదులవలన తెలియ నగుచున్నది. క్రీ. పూ. 4 వ శతాబ్దికి ఈ దీవులయందలి ప్రజలు, వస్తువిశేషములు మొదలగువానితో గ్రీక్‌లకు పరిచితి ఏర్పడినది. తగరమునకు ఈ దీవులు ఆ కాలమున చాల ప్రసిద్ధి పొందినవి. కాని, తక్కిన నాగరక యూరప్‌తో ఈ ప్రాంతమునకు గాఢ పరిచితిని కల్పించిన వారు రోమన్‌లు అని చెప్పదగును.

రోమన్ యుగము : క్రీ. పూ. 55 - 54 లో జూలియస్ సీజర్ [చూ.] గాల్ దేశమును జయించి బ్రిటన్ దేశమునకు సైతము రెండుసార్లు దండెత్తిపోయి, విజయములను పొందెను. కాని, రోమన్ నివాసము ఏదీ ఏర్పడలేదు. సుమారు మరి నూరేండ్లకు క్రీ. శ. 44 లో క్లాడియస్ [చూ. పు. 415] చక్రవర్తి బ్రిటన్ దేశమునకు దండెత్తి థెమ్సునది దాటి కోల్‌చెస్టర్ నగరము ముట్టడించి, వలస రాజ్యమును స్థాపించెను. దానికి ఆ నగరమే రాజధాని అయినది. స్యూటోనియస్ పాలినస్ అను వీరుడు బ్రిటన్ దేశమందలి దక్షిణ భాగమును రోమ్ సామ్రాజ్యమందు ఒక భాగముగ ఏర్పరచెను. ఆ పిమ్మట రోమన్ - బ్రిటన్ ప్రదేశము ఉత్తర దిక్కున స్కాట్‌లాండ్ వరకును వ్యాపించెను. ఉత్తరపు సరిహద్దును బలపరచుటకు క్లైడ్ నదినుండి ఫోర్త్‌వరకును, పిమ్మట సాల్వేనుండి టైన్‌నది వరకును రెండు రాతి గోడలను రోమన్‌లు నిర్మించిరి. ఆ రెండును ఇప్పుడు శిథిలములైనవి. నగరముల ప్రాముఖ్యమును బ్రిటన్ దేశీయులు తొలిసారి గుర్తించుట ఈ రోమన్ యుగమందే జరిగినది. 410 లో అలరిక్ నాయకత్వమున విజిగాత్‌లు రోమ్‌నగరమును ముట్టడించినంతనే రోమన్‌లు తమ సేనలను బ్రిటన్‌దేశమునుండి రావించుకొనిరి. దానితో బ్రిటన్‌దేశచరిత్రయందు రోమన్ యుగము సమాప్తమైనది.

ఇంగ్లీషు యుగ ప్రారంభము : 440 సరికి రోమన్‌లు బ్రిటన్‌దేశమును పూర్తిగా విడిచిపెట్టిరి. తర్వాత శీఘ్ర కాలములో ట్యూటన్‌జాతి, ఏంగెల్స్, శాగ్జన్‌లు, జూట్‌లు బ్రిటన్‌దేశమునకు తెరలు తెరలుగా దండెత్తివచ్చి, దేశమందలి కెల్టిక్‌జాతి బ్రిటన్‌లను ఓడించి, పారద్రోలి దేశమందు తమ జాతివారి వసతులను ఏర్పరచుకొనిరి. నిర్జితులైనవారు పారిపోవుటయో, హతులగుటయో జరుగుటచేత ఆ తర్వాతి కాలమందు బ్రిటన్‌దేశమందలి జనులు పూర్తిగా ఆంగ్లో - శాగ్జన్ (కొద్దిగా జూట్) జాతి వారు అయినారు. ఏదో కొద్దిగా కెల్టిక్‌సంపర్కము ఉండి ఉండవచ్చును. మొత్తముమీద వీరికే ఇంగ్లీషువారను పేరు వచ్చినది. ఈ ఇంగ్లీషువారు వేరు వేరు చిన్న చిన్న రాజ్యములను స్థాపించుకొనిరి. అందు ముఖ్యమైనవి ఏడు. క్రమక్రమముగా ఈ ఏడును వెసెక్స్ రాజ్యమునకు లోబడి ఏకమైనవి. ఏకమయిన ఇంగ్లీషు రాజ్యమునకు మొదటి రాజు ఎగ్బర్ట్ (క్రీ. శ. 802 - 39 ప). ఆ కాలమందే డేన్‌లు కూడా ఇంగ్లండు దేశమునకు దండెత్తి వచ్చుటకు ప్రారంభించిరి. ఇంగ్లండు రాజైన ఆల్‌ఫ్రెడ్ మహనీయు [చూ. పు. 300] ని కాలమున 878 లో జరిగిన ఒడంబడికవలన ఇంగ్లండుదేశమందలి ఉత్తరభాగము డేన్‌లకు నిలచినను, నైరృతి భాగము ఇంగ్లీషువారికి దక్కినది. డేన్‌ల దాడులు మరల 975 లో విజృంభించినవి. తుదకు 1017 లో కెన్యూట్ అనే డేన్‌ల నాయకుడు ఇంగ్లండుదేశమునకు రాజయ్యెను. ఇతడు ఇంగ్లండు దేశమునకే కాక నార్వే, డెన్మార్క్ దేశములకు కూడా రాజుగా ఉండెను. కెన్యూట్ తర్వాత సమర్థతగల డేన్‌ల రాజు లేకపోవుటచేతను, ఇంగ్లీషు ప్రభువుల బలము అధికమగుటచేతను నాయకులలో తగవులు పుట్టి, తుదకు నార్మండీప్రభువైన విలియమ్ 1066 లో హేస్టింగ్స్‌వద్ద జరిగిన యుద్ధమందు విజయుడై ఇంగ్లండుదేశమునకు రాజయ్యెను. ఇతడే 'విలియమ్ ద కాంకరర్ (విజేతయగు విలియమ్)' అని ఆ దేశపు చరిత్రలో ప్రసిద్ధుడు.

ఇంగ్లండులో క్రైస్తవ మత విస్తృతి : రోమన్‌యుగమందే క్రైస్తవమత వ్యాపకులు కొందరు ఐర్లాండ్‌వరకును పోయి మతవ్యాప్తి కావించుచుండిరి. ఐర్లాండ్‌లో కెల్టిక్ మత సన్యాసుల ఉద్యమము ఎక్కువగా వ్యాప్తి పొందినది. స్కాట్‌లాండ్‌లోను, ఇంగ్లండుదేశమందలి ఉత్తర భాగమందును ఈ సన్యాసుల క్రైస్తవమతము వ్యాపించి ఉండెను. పిమ్మట 590 - 604 మధ్య రోమన్ పోప్ అగు గ్రెగరీ - I మహనీయుడు సెయింట్ అగస్టీన్‌ను మత ప్రచారమునకు, మత వ్యాప్తికి ఇంగ్లండు దేశమునకు పంపెను. ఇతని బోధనలవలన ఇంగ్లండుదేశమందలి ఆగ్నేయభాగము రోమన్ క్రైస్తవమతమును స్వీకరించినది. కెల్టిక్ మత బోధకులవలన వ్యాప్తిచెందిన ఐరిష్ క్రైస్తవమతమును ఐర్లాండ్, స్కాట్‌లాండ్‌లతోపాటు ఇంగ్లండుదేశమందలి ఉత్తరభాగము స్వీకరించినది. రెండును క్రైస్తవ మతములే అయినా, కొన్ని అంశము

లలో భేదములు ఉండెను. అందుచేత తగవులు పుట్టినవి. అంతట ఇంగ్లండులోని నార్తంబ్రియారాజు యార్క్‌షైర్‌లోని విట్ బీ వద్ద ఒక సమావేశము కావించి ఉభయ మతనాయకుల వాదములున్ను సాగనిచ్చి తుదకు రోమ్ వద్దనుంచి వచ్చిన మతమే సెయింట్ పీటర్‌నుండి శిష్య పరంపరానుసారిగా వచ్చినది కనుక ఎక్కువ ఆచరణ యోగ్యమైనదని నిర్ణయించడము జరిగినది.

నార్మన్‌ల యుగము (1066 - 1307): 'విలియమ్ ద కాన్కరర్' నార్మన్ వంశస్థుడే అయినా ఇంగ్లండు దేశమును ఇంగ్లీషురాజువలెనే పాలించెను. అంతర్యుద్ధములకు అవకాశము ఈయకుండా భూస్వాములగు ప్రభువులను లోబరచుకొనుటలో విలియమ్ కొంతవరకు కృతకృత్యుడు అయ్యెను. ఆ విధముగానే పోప్ క్రిందనే మతాధికారులుగ ఇంగ్లండులో ఉండిన 'ఆర్చిబిషప్ ఆవ్ కాంటర్బరీ' మొదలయినవారిని కూడా రాజకీయవ్యవహారములలో తనకు రాజభక్తి చూపేవారినిగ చేసికొనుటలో కూడా కొంతవరకు సఫలీకృత మనోరథుడయ్యెను. అతని కొడుకులలో విలియమ్ - II తరువాత రాజ్యమునకు వచ్చిన హెన్రీ - I కేంద్రన్యాయస్థానమును, దేశమందు పర్యటనము చేసే న్యాయాధిపతుల సంస్థావిధానమును ఏర్పరచెను. అంతేకాక, ఇతడు ఇంగ్లీషు స్త్రీని వివాహమాడుటచేతను, అట్లే నార్మన్ స్త్రీ - పురుషులు వివాహసంబంధములు సమకూర్చుకొనుటచేతను రాను రాను ఇంగ్లీషువారిలో కెల్టిక్, ట్యూటన్, డేన్ సంపర్కములతోపాటు నార్మన్ సంపర్కము కూడ కలిసినది. నార్మన్ రాజులలో కడపటి రాజైన స్టీవెన్ కాలములో ఇంగ్లండుదేశమందలి ప్రభువులు రాజుల సర్వాధికారమునుండి స్వతంత్రతపొందుటకు ప్రయత్నించిరి. కాని, నార్మన్ రాజ్యాంగసంస్థ అత్యంతసమర్థముగ ప్రతిష్ఠాపనము అగుటచేత వారు నెగ్గలేకపోయిరి. స్టీవెన్ తర్వాత హెన్రీ - I దౌహిత్రుడు హెన్రీ - II ఇంగ్లండు రాజైయ్యెను (1154 - 1189 ప). ఇతనికి తల్లివంకను, తండ్రివంకనుగల రాజ్యములు, రాష్ట్రములు కలసివచ్చుటచేతను, ఇతని పరిపాలనమునకు లోబడిన ప్రదేశములు ఇంగ్లండులోనే కాక ఫ్రాన్స్ దేశమందును వ్యాపించినవి.

హెన్రీ కొడుకులు (రిచర్డ్, జాన్) ను, జాన్ కొడుకు హెన్రీ - III యును సమర్థత కలవారు కాకపోవుటవల్ల ప్రభువుల బలము అధికమయినది. మూర్ఖతతో తమ అధికారమును నిరంకుశముగ చేసికొనుటకు ఆ భూస్వామి ప్రభువులు ప్రయత్నించుటవలన మేలే కలిగినది. రాజుల నియంతృత్వమును అరికట్టుటకు ప్రభువులు ఎదిరించిరి. వారి ఉద్యమ ఫలితముగా జాన్ కాలమున 1215 లో మాగ్నకార్టా [చూ. పు. 743] యును, హెన్రీ - III కాలమున పార్లమెంట్‌ను లభించినవి. ఈ పార్లమెంట్ విధానములో ప్రభువుల ప్రతినిధులే కాక, ప్రజాప్రతినిధులు కూడా పాల్గొనుటకు అవకాశము కలిగినది. హెన్రీ - III కుమారుడైన ఎడ్వర్డ్ - I ఆ పార్లమెంట్ విధానమునే అనుసరించి మోడల్ పార్లమెంట్‌ను ఏర్పరచెను. అదిగాక, ఈ ఎడ్వర్డ్ భూస్వాముల అధికారములవలన తన అధికారమునకును, ప్రజల జీవిత సౌఖ్యమునకును హాని కలుగనీయకుండ చేయగల నిబంధనలను కూడ అమలు పరచెను. స్వతంత్రించి ఉండిన వేల్స్ మండలమును స్వాధీన పరచుకొనెను. ఇంగ్లండు రాజు పెద్ద కుమారుడు 'ప్రిన్స్ ఆవ్ వేల్స్' అను పదవినందుట దీనితో ప్రారంభించినది.

కల్లోల యుగము (1307 - 1485): ఎడ్వర్డ్ - I వలన పార్లమెంట్ విధానము ఏర్పడినను, అతి సమర్థుడైన రాజు ఉన్నంత కాలమే దానివలన దేశ పరిపాలనము చక్కగా సాగగలదన్నట్లు రుజువైనది. ఈ ఎడ్వర్డ్ - I తర్వాత వచ్చిన రాజులు అంతగా సమర్థులు కాకపోవుట చేత పార్లమెంట్‌వలన ప్రయోజనము నిష్ఫలమైనది. 1307 - 1485 మధ్య ప్రభువుల విజృంభణము ఎక్కువయినది. రాజులను నామమాత్రులుగ నిలిపి తామే పరిపాలకులుగ వ్యవహరించుచుండిరి. పార్లమెంట్ సరియైన వ్యవస్థలో లేకపోవుటచేతను, అందులో సైతము ప్రభువులే వ్యవహర్తలగుటచేతను ప్రభుత్వము ప్రజలకు అనుకూలించలేదు. అదిగాక శతవర్ష సంగ్రామము [చూ.] వలనను, దేశమున అంతస్సంగ్రామమువలనను దేశమందలి సాంఘిక ఆర్థికాభివృద్ధి లోపించినది.

ట్యూడర్ రాజుల యుగము (1485-1603): హెన్రీ-VII 1485 లో రిచర్డ్ - III ను ఓడించి రాజగుటతో అంతస్సంగ్రామము అంతమొందినది. దేశమందు ప్రశాంతి నెలకొన్నది. అంతేకాక, ఇతడు కడు సమర్థతగల రాజగుటచేత ప్రభువుల ఉద్ధతిని అణచవేయగలిగెను. ప్రభువులవలన కలుగుచుండిన బాధ ప్రజలకు కూడా దుస్సహమగుటచేత వీరి ఉద్ధతిని అణచుటలో ప్రజలు కూడా పార్లమెంట్ ద్వారా తోడ్పడిరి. ఇతర దేశములవారి దృష్టిలో సైతము ఇంగ్లండుదేశము పలుకుబడి, ప్రతిష్ఠ గల దేశమైనది. హెన్రీ - VIII (1509 - 47 ప.) రాజాధికారమును, రాజప్రతిష్ఠను ఎక్కువగా పెంపొందించెను. అట్లు చేయుటలో ఇతడు వ్యక్తిగతముగ ఆజ్ఞలను ప్రకటించుట మాని తనకు కావలసిన కార్యములన్నియు పార్లమెంట్ చేతనే చేయించుకొనుచుండెను. ఇతనివలననే మత సంస్కరణో

ద్యమము ఇంగ్లండు దేశమున ఒక విశిష్టరూపమున వ్యాపించినది. పోప్ పొందియుండిన అధికారము రాజుకు సంక్రమించునట్లు చేయుట మాత్రమే ఇతడు చేసిన పనియైనను, ప్రొటెస్టంట్ మతము క్రమక్రమముగ బలపడినది. ఇతనికి కేతరిన్ అను ఆమెవలన పుట్టిన కూతురు మేరీ రాణియై ఉండిన స్వల్పకాలములో రోమన్ కేతలిక్ మతము మరల ఉద్ధరింపబడినను, ఎలిజబెత్ - I (1533 - 1603) రాణి ఇంగ్లండును పరిపాలించిన కాలమున రోమన్ కేతలిక్ మతమునకు ఇంగ్లండులో ప్రభుత్వాదరణము మరిలేకుండ పోయినది. ఎలిజబెత్ - I పరిపాలనాకాలము ఇంగ్లండు చరిత్రలో సువర్ణయుగముగ పేరుగనినది. నాటి యూరప్‌న ప్రముఖ రాజ్యముగ పేరుగనిన స్పెయిన్‌ను ప్రతిఘటించి, ఆనాడు ఇంగ్లండుదేశము కాలు నిలువద్రొక్కుకొనగలుగుటయేకాక, స్పెయిన్‌దేశపు నౌకా సైన్యదళమును పరాభూతము చేసినది. నూతన ప్రపంచమందలి దేశముల ఉనికిని కనుగొనుటకు నౌకాయాత్రల సంరంభము, షేక్స్పియర్ మహాకవి రచనలవలన ఆంగ్ల సారస్వత వికసనము, విదేశవర్తక వ్యాపారములను సాగించుటకై ప్రభుత్వానుమతితో వర్తక సంస్థల నిర్మాణము మొదలగు చారిత్రకసంఘటనలు ఇంగ్లండున ఎలిజబెత్ - I కాలమున సంఘటిల్లినవి. తరువాతికాలమున బ్రిటిష్‌సామ్రాజ్యమును ఆసియాయందు నెలకొల్పుటకు కారణభూతమైన ఈస్ట్ ఇండియా కంపెనీ, [చూ. పు. 336] అను వాణిజ్య సంస్థయు ఈ కాలముననే రూపుగొనినది. ఎలిజబెత్ - I అనంతరము వారసత్వరీతా స్కాట్‌లాండ్ దేశపు రాజగు జేమ్స్ - VI నకు ఇంగ్లండు రాజ్యమును సంక్రమించెను. అంతట ఈ రెండు దేశములును కలసి రూపొందిన గ్రేట్ బ్రిటన్‌కు జేమ్స్ - I అనుపేర అతడు రాజయ్యెను (1603) [చూ. ఎలిజబెత్ - I పు. 347].

ఎలిజబెత్‌రాణి మరణముతో ట్యూడర్ రాజుల వంశ పాలనము అంతరించినది. అంతట జేమ్స్ - I తో స్టూవర్ట్ రాజవంశపు పాలన మొదలయ్యెను.

ట్యూడర్ రాజవంశపాలనపు చరమభాగమునాటికి నిరంకుశప్రభుత్వవిధానము వర్ధిల్లుటకు అనుకూలములైన పరిస్థితులు సంపూర్ణముగ తొలగిపోయినవి. రాజు చర్యల పట్ల పార్లమెంట్ అవలంబించుచుండిన సవిమర్శక వైఖరి వలన రాజునకు, పార్లమెంట్‌నకు నడుమ అభిప్రాయ భేదములు ప్రస్ఫుటము కాజొచ్చినవి. అయినను ఎలిజబెత్-I జీవితకాలమున ఈ ప్రజాప్రతికూలత ఒక విస్పష్ట రూపమున ఒక ప్రతికూలపక్షముగ రూపొందుటకు పరిస్థితులు అనుకూలింపకుండినవి. కాని, తరువాత వచ్చిన స్టూవర్ట్ రాజుల కాలమున పార్లమెంట్‌నకు రాజుతోగల వైరుధ్యము పరాకాష్ఠను అందుకొనినది.

స్టూవర్ట్ యుగము (1603 - 1714) : ఈ స్టూవర్ట్ రాజులలో ప్రథముడగు జేమ్స్ - I (1603 - 1625 ప.) తో పార్లమెంట్‌నకు రాజుతో సంఘర్షణ మొదలయ్యెను. అతని కుమారుడు చార్లెస్ - I (1625 - 1649 ప.) తండ్రికన్న మిన్నగ రాజసము కలవాడు. అయినను ఇతని పరిపాలన ప్రారంభదశలో 1628 లో సుప్రసిద్ధమగు 'స్వత్వ విజ్ఞప్తి పత్రము (పిటిషన్ ఆవ్ రైట్స్)' ఆమోదితమై పార్లమెంట్‌నకు గణనీయమగు విజయము చేకూరినది. పార్లమెంట్ అనుమతి లేకుండ పన్నులు విధించుటయు, హేతువులేకుండ ప్రజలను కారాగారబద్ధులను చేయుటయు అశాస్త్రీయములని ఈ పత్రము ప్రకటించినది. కాని, దీనికి తత్‌క్షణ ఫలితముగ మాత్రము 1629 మొదలు 1640 వరకును పదునొకండుసంవత్సరములపాటు పార్లమెంట్‌ను సమావేశపరచకుండ చార్లెస్ - I పరిపాలనను సాగించెను. ఈ రాజకీయవివాదముతోపాటుగ జేమ్స్ - I యు, అతని తరువాత అతని కుమారుడును మత సంబంధమగు వేరొక వివాదములో కూడ ప్రముఖపాత్ర వహించి ప్రజా విద్వేషమునకు పాత్రులైరి. ఆ వివాదము ప్యూరిటన్‌లు అనబడు మతసంస్కరణవాదులకు సంబంధించినది. ఈ ప్యూరిటన్‌లు మతగురువుల వేషభాషాడంబరములను నిరసించి, స్వచ్ఛ నిరాడంబరజీవితమును ప్రోత్సహించిరి. వీరి ఎడల జేమ్స్ - I యు, అతని కుమారుడును నిర్దాక్షిణ్యావైఖరిని అవలంబించి పీడించిరి. తత్ఫలితముగ ప్యూరిటన్‌లు పలువురు దేశమును వదలి పోయిరి. అట్టివారిలో ఒక దళమువారిచేతనే ఉత్తర అమెరికాయందలి తొలుతటి బ్రిటిష్‌వలస ఏర్పడి, యునైటెడ్‌స్టేట్స్ రూపొందుటకు బీజభూతమైనది.

చార్లెస్ - I తో పార్లమెంట్‌నకు ఏర్పడిన వివాదము క్రమముగ చినికి చినికి గాలివానయైనది. 1640 లో స్కాట్‌లాండ్‌తో యుద్ధముచేయుటకు అవసరమైన ధనమును సంపాదించుటకై తప్పనిసరిగా రాజు పార్లమెంట్‌ను పిలువవలసి వచ్చినది. ఈ పార్లమెంట్ సమావేశము అతి దీర్ఘకాలము సాగినందువలన దీనికే 'లాంగ్ పార్లమెంట్ (దీర్ఘకాలపు పార్లమెంట్)' అను పేరు కలిగినది. ఈ పార్లమెంట్ రాజాధికారములను పెక్కింటిని కుంచింపజేయుటయే కాక, 1641 లో రాజునకు 'గ్రాండ్ రిమాన్‌స్ట్రెన్స్ (మహాధిక్షేపణము)' అను పత్రమును సమర్పించెను. అందు రాజుయొక్క మంత్రివర్గము పార్లమెంట్‌నకే బాధ్యతవహించి పనిచేయవలయుననియు,

ప్యూరిటన్ భావములకు అనుగుణముగ మతవ్యవస్థ పునర్నిర్మితము కావలెననియు నిర్దేశింపబడినది. బెదరింపుల ద్వారా ఇట్టి చర్యలను అరికట్టవలయునని చార్లెస్ - I తొలుత యత్నించి విఫలుడయ్యెను. అంతట అతడును, పార్లమెంట్‌ను సైన్యములను సేకరించుకొని యుద్ధమునకు దిగిరి. తుదకు చార్లెస్ - I స్కాట్‌లాండ్ సేనలకు వశుడు కాగా, వారు అతనిని పార్లమెంట్‌నకు అప్పగించిరి. కడకు పార్లమెంట్ సైతము సైన్యము చేతిలో కీలుబొమ్మ అయ్యెను. ఈ సైన్యము చార్లెస్-I ని 1649 లో విచారించి, మరణదండన విధించి అమలు జరిపినది.

ఇటుల అధికారమును వశపరచుకొనిన సైన్యమునకు అధిపతి ఆలివర్ క్రామ్‌వెల్ [చూ. పు. 413]. అందువలన సైన్యపు పక్షమున అతడు సర్వాధికారి అయ్యెను. తన ఇష్టమునకు అనుగుణముగ వర్తించుటకు పార్లమెంట్ నిరాకరించినందువలన అతడు దానిని బల ప్రయోగము వలన రద్దుచేసెను. కాని, క్రామ్‌వెల్ నిరంకుశత్వాభిమాని కాడు. తన రక్షణలోని గ్రేట్ బ్రిటన్ రాజ్యవ్యవస్థకు 'కామన్‌వెల్త్ (సర్వజన సంపత్తి)' అని అతడు పేరిడి, తనను దానికి రక్షకుడుగ ప్రకటించుకొనెను. కాని, కట్టకడకు సైనికులు చేయు ఆ పరిపాలనతో గ్రేట్ బ్రిటన్‌లోని ప్రజలకు విసువెత్తినది. క్రామ్‌వెల్ మరణానంతరము (1658) ప్యూరిటన్‌లు పదవినుండి తొలగింపబడిరి. పార్లమెంట్ మరల అధికారమును గ్రహించి, అప్పటిలో యూరప్‌న ప్రవాసమున ఉండిన చార్లెస్-II ను ఆహ్వానించి రాజరికమును ఇచ్చినది (1660). ఇతడు చార్లెస్ - I యొక్క కుమారుడు.

చార్లెస్ - II కాలమున పార్లమెంట్‌నకు విశేషాధికారములు సిద్ధించినవి. మంత్రివర్గమే పరిపాలనా బాధ్యత వహింపవలయునను సిద్ధాంతము ఈతనికాలమున విశేషముగ బలపడినది. ఆ కాలములోనే నేటి రాజకీయ పక్షముల విధానమునకు కూడ అంకురార్పణ జరిగినదన వచ్చును. అయినను చార్లెస్ - II అనంతరము (1685) సింహాసనమున చేరిన అతని తమ్ముడు జేమ్స్ - II కాలమున పార్లమెంట్‌తో వైరుధ్యము మరల తలయెత్తినది. తత్ఫలితముగ ఆ రాజు రాజ్యభ్రష్టుడు కావలసి వచ్చినది. అంతట అతని కుమార్తె మేరీ రాకుమారి హాలండ్ దేశపు రాకుమారుడును, ఆమె భర్తయు అగు విలియమ్‌తో కూడ పార్లమెంట్ అభ్యర్థనపై ప్రజల హక్కులను కాపాడే కొన్ని నిబంధనలను అంగీకరించి, గ్రేట్ బ్రిటన్ రాజ్యాధిపత్యమును వహించిరి (1689). అటుల రాజుచే అపుడు ఆమోదింపబడిన హక్కుల పత్రమే 'బిల్ ఆవ్ రైట్స్ (స్వత్వ ప్రకటన)' అని పేరొందినది. ఇటుల రక్తపాతము ఏమియు లేకుండ ప్రజలకు హక్కులను తెచ్చి ఇచ్చిన ఈ విప్లవకర సంఘటనయే 'గ్లోరియస్ రివల్యూషన్ (ఉదాత్త విప్లవము)' అని పేరొందినది. రాజులు దైవాంశసంభూతులను ప్రథకు ఇంతటితో ఆస్కారము లేకుండపోవుటయే గాక, రోమన్ కేథలిక్ మతానుయాయి గ్రేట్ బ్రిటన్‌కు రాజు కాగూడదను సంప్రదాయమును ఏర్పడినది. మేరియు, విలియమ్‌ను మరణించిన తరువాత జేమ్ - II యొక్క రెండవ కుమార్తె ఆన్ రాణి అయ్యెను (1702).

ఆన్‌రాణి పాలనాకాలమున యూరప్‌నందు చెలరేగిన స్పానిష్ వారసత్వ సంగ్రామమున [చూ.] గ్రేట్ బ్రిటన్ పాల్గొనినది. తత్ఫలితముగ చేకూరిన ఉట్రెక్ట్ సంధి (1713) [చూ. పు. 337] మూలమున గ్రేట్ బ్రిటన్‌కు వలస రాజ్యము రూపొందుట మొదలైనది. ఇటుల ప్రపంచ రాజ్యములలో గ్రేట్‌బ్రిటన్‌కు తగు ప్రతిష్ఠ చేకూరు కాలముననే రాజకీయముగ దేశమున సైతము ఒక నూతన విధానము ప్రబలతను కూర్చుకొనినది. అదియే రాజకీయ పక్ష ప్రాబల్యము. చార్లెస్ - II కాలముననే మత వైరుధ్యములవలన రెండుపక్షములు బయలుదేరినవి. అవియే క్రమముగ విగ్, టోరీ అను రాజకీయ పక్షములుగ మారి ఆ తరువాత ఒక శతాబ్దముకాలము పార్లమెంట్ రాజకీయములలో ప్రముఖ పాత్ర వహించినవి.

ఆన్ రాణి కాలమున స్కాట్‌లాండ్, ఇంగ్లండు పార్లమెంటులు ఏకముచేయబడి, చట్టరీత్యా దేశమునకు గ్రేట్ బ్రిటన్ అను పేర కలిగినది (1707). ఆ తరువాత ఆన్‌రాణి నిస్సంతుగ మరణించుట (1714) వలన, ఆమెకు దూరపు వారసుడును, ప్రొటెస్టంట్ మతానుయాయియు, జర్మనీలోని హానోవర్ జమీందారీ పాలకుడు అగు జార్జిని పార్లమెంట్ ఆహ్వానించగ అతడు జార్జి - I అను పేరుతో రాజ్యాధిపత్యము వహించెను. అంతటితో స్టూవర్ట్ యుగము అంతరించి హానోవర్ రాజవంశపు యుగము మొదలు అయ్యెను.

హానోవర్ యుగము (1714- ): హానోవర్ వంశీయులలో ప్రథముడగు జార్జి - I కి ఆంగ్లభాష తెలియక పోవుటవలన స్వయముగ అతడు పరిపాలనము నిర్వహింప అశక్తుడయ్యెను. అందువలన పరిపాలనా సౌకర్యమునకై రాజామాత్యముఖ్యులు ఒక చిన్న సమితిగా ఏర్పడి, పరిపాలన నిర్వహించుట మొదలైనది. ఈ సమితికే కాలక్రమమున 'కాబినెట్ (మంత్రివర్గము)' అను పేరు కలిగినది. మంత్రుల చర్చలను తాను అర్థముచేసికొనలేక జార్జి మంత్రివర్గ సమావేశములకు హాజరగుట మానుకొనెను. తత్కా

రణమున కాలక్రమమున మంత్రివర్గ సమావేశములకు రాజు హాజరు కాకుండుట ఒక సంప్రదాయముగ ఏర్పడినది. ఆ సంప్రదాయమునే అతని అనంతరమున సింహాసనము ఎక్కిన జార్జి - II అనుసరించెను. ఇందువలన అనతికాలముననే గ్రేట్ బ్రిటన్‌ను వాస్తవముగ పాలించుచున్నది మంత్రివర్గమే కాని రాజు కాదనియు, రాజుకు ఇష్టమైనను, కాకపోయినను ప్రజాశాసనసభకు తాము విశ్వాస పాత్రులుగ ఉన్నంతకాలము మంత్రివర్గము నిరాతంకముగ అధికారములో ఉండవచ్చుననియు సంప్రదాయములు ఏర్పడినవి.

యూరప్‌లోని వివిధదేశముల నడుమ 'ప్రాబల్యతౌల్యము' ఉండునటుల చూచుటయే 18 వ శతాబ్దమున తన వైదేశిక విధానముగ గ్రేట్ బ్రిటన్ అవలంబించినది. అందుచేతనే యూరప్‌న తనకు రాజ్య విస్తరణ కాంక్ష లేకపోయినను యూరప్ రాజ్యముల పోరాటములలో ఆ దేశము పాల్గొనినది. తన వలన రాజ్య విస్తరణకు ఇతర యూరపియన్ రాజ్యములు పోటీకి రాకుండునటుల చేయుటకై వానిని యూరప్‌లో యుద్ధమున నిమగ్నములుగ చేసి ఉంచుటనే గ్రేట్ బ్రిటన్ అపుడు తన ఆశయముగ ఇడుకొనినదని చెప్పవచ్చును. చారిత్రక పరిణామముల వలన ఈ విదేశాంగ నీతి సఫలమైనది. అప్పటిలో పార్లమెంట్‌న ప్రభుత్వమును వశపరచుకొని ఉండిన విగ్గుపార్టీవారు సామ్రాజ్యమును ఆర్జించుటలో శ్రద్ధవహించుటయు ఇందులకు దోహదకారియైనది. 1756 నుండి 1763 వరకు సాగిన సప్తవర్ష సంగ్రామము [చూ.] వలన ఈ సామ్రాజ్యార్జన సుసాధ్యమైనది. ఆ కాలమున గ్రేట్ బ్రిటన్ రాజ్య మంత్రివర్గమున నాయకుడుగ విలియమ్ పిట్ అను రాజనీతివేత్త వ్యవహరించుట ఆ రాజ్యపు మహాసుకృతము. ఈతని కృషి ఫలితముగ ఉత్తర అమెరికా యందు ఫ్రెంచివారి ప్రాబల్యము అంతరించి, దాదాపు దక్షిణమున మెక్సికో వరకు గల ఉత్తర అమెరికా తూర్పు ప్రాంతము గ్రేట్ బ్రిటన్‌కు చేజిక్కినది. కాని, జార్జి - II అనంతరము (1760) అతని మనుమడు జార్జి - III రాజగుటతో పరిస్థితులు విషమింపమొదలైనవి. ఇతడు అధికారప్రియుడు. తనకు ప్రాబల్యమును చేకూర్చుటకు అంగీకరించిన టోరీ పక్షమువారిని ఇతడు అభిమానించి, అంతవరకు దేశమును ప్రతిష్ఠాయుత మార్గమున నడిపిన విగ్గులకు దూరమయ్యెను. కడకు 1770 లో టోరీలు పార్లమెంట్‌ను చేజిక్కించుకొనిరి. అంతట మంత్రివర్గముపై జార్జి - III సంపూర్ణాధికారమును వశపరచుకొని వినాశనాభిముఖముగ తన సామ్రాజ్యమును నడపింప సాగెను. ఉత్తర అమెరికాయందు అతని ప్రోత్సాహమున అతని మంత్రివర్గము అనుసరించిన పన్నుల విధానము అమెరికా స్వాతంత్ర్యయుద్ధమునకు త్రోవతీసినది. ఆ సంగ్రామ ఫలితముగ యునైటెడ్ స్టేట్స్ [చూ.] అను రాజ్యము ఏర్పడి సామ్రాజ్యమునుండి వేరయ్యెను. అంతేకాక గ్రేట్ బ్రిటన్ ప్రతిష్ఠయు భంగమొందినది.

ఇంతలో యూరప్‌న ఫ్రెంచివిప్లవము ప్రారంభమై యూరప్ రాజ్యములలో సాంఘికముగను, రాజకీయముగను నూతన సమస్యలను లేవదీసినది. ఫ్రెంచి విప్లవమునకు ఇంగ్లండు ప్రబల విరోధిగ ఏర్పడుట అనివార్యమైనది. కడకు పరిస్థితులు అనుకూలించి, తక్కిన యూరప్ రాజ్యములతో కొన్నింటితో కలసి, గ్రేట్ బ్రిటన్ ఫ్రెంచి సేనల ఔద్ధత్యమును అడచివేసినది (1815) [చూ. పు. 142; ఫ్రాన్స పు. 634; ఫ్రెంచివిప్లవము పు. 639]. కాని, ఫ్రెంచి విప్లవ భావములు మాత్రము గ్రేట్ బ్రిటన్‌లోని నిర్ధన ప్రజలలో వ్యాపించినవి.

ఇటుల ఫ్రాన్స్‌తో వైరుధ్యమున గ్రేట్ బ్రిటన్ సతమతమగుచుండిన కాలముననే, తక్కిన యూరపియన్ రాజ్యములను అధికరించి ఆసియాయందు తన సామ్రాజ్యమును గ్రేట్ బ్రిటన్ వ్యాపింపజేయుటకు పరిస్థితులు అనుకూలించినవి. క్రమముగ 1818 నాటికి భారతదేశము మొదలగు చోటుల గ్రేట్ బ్రిటన్‌కు ఒక సామ్రాజ్యము ఏర్పడెను [చూ. బర్మా 640; భారతదేశము పు. 664, సింహళము]. ఇందులకు తోడుగ ఆస్ట్రేలియా, న్యూజీలండ్ మొదలగు తావులందు వలసరాజ్యములు ఏర్పడెను. ఇట్టి సమయమున తన ఎనుబది ఒకటవ ఏట జార్జి - III మరణించెను (1820). అంతట అతని కుమారుడు జార్జి - IV అను పేరున రాజై 1830 వరకు పాలించెను. అతని తరువాత రాజైన విలియమ్ - IV కాలమున పార్లమెంట్‌నకు ప్రతినిధులను ఎన్నుకొను నియోజకవర్గ విషయమున సంస్కరణలు అమలులోనికి వచ్చి అధికారమున వణిగ్వర్గమునకును, మధ్యతరగతికిని భాగము లభించినది.

విలియమ్ - IV 1837 లో మరణింపగ అతని సోదరపుత్రిక విక్టోరియా గ్రేట్ బ్రిటన్‌కు రాణి అయినది. దీర్ఘమగు ఆమె పరిపాలనా కాలము (1837 - 1901) ఆ దేశపు చరిత్రలో ఒక మహోజ్జ్వల యుగము. రాజకీయముగ, సాంఘికముగ, పారిశ్రామికముగ, ఆర్థికముగ దేశము సాటిలేని పురోగతిని, స్థైర్యమును ఆర్జించినది. ఈమె కాలమున భారతదేశమున 1857 తిరుగుబాటు విఫలమైన తరువాత, ఆసియాలోని బ్రిటిష్ సామ్రాజ్య ప్రాంతముపై ఈస్ట్ ఇండియా కంపెనీ ద్వారా పాలనము సాగించుటకు బదులుగ బ్రిటిష్ ప్రభుత్వమే పాలనాబాధ్యతను స్వయముగ ప్రతినిధుల ద్వారా సాగించుటకు నిర్ణయించుటతో

విక్టోరియాకు 'భారత చక్రవర్తిని' అను బిరుదమును లభించినది. సామ్రాజ్యమునందు శ్వేత జాతీయుల వలసలలో ముఖ్యములగు కెనడా, ఆస్ట్రేలియా, న్యూజీలండ్‌లకు అధినివేశ ప్రతిపత్తి కలిగించి, సంతృప్తి కలిగించుట వలన మాతృ దేశముతో వానికి కల సంబంధము దృఢతరము చేయబడినది. ఆఫ్రికా విభజనలో తక్కిన యూరపియన్ రాజ్యములకన్న ముందంజవేయుటవలన ఆఫ్రికాలోని అనేక ప్రాంతములు గ్రేట్‌బ్రిటన్‌కు అధీనమైనవి. ఈ విధముగ ఆ కాలమున ఆ దేశమునకు వివిధ ఖండము లందలి పెక్కు ప్రాంతములలో ఆధిపత్యము లభించుట వలన బ్రిటిష్‌సామ్రాజ్యమునకు 'రవి అస్తమింపని సామ్రాజ్యము' అను ప్రథ ఆ కాలమున కలిగెను.

ఇట్టి సామ్రాజ్య విస్తృతికిని, స్థైర్యమునకును దోహద కారియైనది ఆ నాటి గ్రేట్‌బ్రిటన్‌లోని రాజకీయ సుస్థిరత. 19 వ శతాబ్ది సగము ముగియునాటికి టోరీలలోను, విగ్గులలోను కలిగిన రాజకీయాభిప్రాయ పరిణతివలన ఆ పక్షములు క్రమముగ కన్సర్వేటివ్ (సంప్రదాయవాద), లిబరల్ (ఔదార్యవాద) పార్టీలుగ రూపొంది రాజకీయ సుస్థిరతకును, పార్లమెంటరీ పరిపాలన కట్టుదిట్టముగ సాగుటకును తోడ్పడినవి. ముఖ్యముగ 1867 మొదలు ఆ శతాబ్ది అంతము వరకు రాజకీయ రంగమున కన్సర్వేటివ్ పక్ష నాయకుడగు డిజ్‌రేలీ [చూ. పు. 508], లిబరల్ పక్ష నాయకుడగు గ్లాడ్‌స్టన్ [చూ. పు. 437] ప్రముఖ పాత్రలను వహించిరి. ఆ మధ్యకాలమున ప్రధాన మంత్రి పదవి వీరిరువురి మధ్యనే పలుమారు చేతులు మారినది. ఈ కాలమున నిర్బంధవిద్యావిధానము అమలున ఇడబడుట, ట్రేడ్ యూనియన్‌లు శాసన విహితములగుట, వోటింగ్ పద్ధతిలో సంస్కరణ మొదలగు ప్రజోపయోగకార్యములు సాధింపబడినవి. సామ్రాజ్యభద్రతకై సూయజ్ కాలువలో వాటాలను గ్రేట్‌బ్రిటన్ కొనుగోలుచేసి, సామ్రాజ్యభాగముల మధ్య రాకపోకలను సురక్షితముచేసినది.

విక్టోరియా రాణి 1901 లో మరణింపగ, ఆమె కుమారుడు ఎడ్వర్డ్ - VII రాజయ్యెను. ఈతని కాలమున, దక్షిణ ఆఫ్రికాకు అధినివేశప్రతిపత్తి చేకూరినది. అప్పటిలో యూరపియన్ రాజ్యముల మధ్య పొడముచున్న రవరవలను సమయజేయుటకు ఈతడు కృషిచేసెను. కాని, ఈతని అనంతరము (1911) ఈతని కుమారుడు జార్జి - V రాజయిన తరువాత ఈ రవరవలు అంతకంతకు విషమించి కడకు ప్రపంచ యుద్ధము - I కి దారితీసినవి. యుద్ధమున గ్రేట్‌బ్రిటన్ ఫ్రాన్సుతోను, తక్కిన మిత్రమండలి రాజ్యములతోను కలసి జర్మనీని, దాని మిత్రరాజ్యములను ప్రతిఘటించి పోరాడి, యునైటెడ్‌స్టేట్స్ సాయముతో విజయము పొందిన పిదప, మాండేటరీప్రాంతములను పేరున మధ్య ఆసియాయందును, ఆఫ్రికాయందును కల కొన్ని ప్రాంతములు బ్రిటిష్ సామ్రాజ్యమునకు అదనముగ చేర్చబడినవి.

కాని, ఇటుల యుద్ధానంతరమున గ్రేట్ బ్రిటన్‌కు ప్రతిష్ఠ పెరిగినను, అంతటినుండి ఆర్థికముగను, సాంఘికముగను, రాజకీయముగను ఆ దేశము పెక్కు సమస్యలను ఎదుర్కొనవలసివచ్చినది. యుద్ధానంతర ప్రపంచమున సోషలిస్ట్ భావములకు కలిగిన విపుల ప్రచారమునకు ఫలితముగ గ్రేట్‌బ్రిటన్‌న లేబర్ పార్టీ అను పేర కార్మిక వర్గము ఒక రాజకీయ పక్షముగ రూపొంది, లిబరల్ పార్టీని వెనుకకు త్రోసి కన్సర్వేటివ్ పార్టీకి ముఖ్యప్రతిస్పర్ధి పక్షముగ రూపొంది కడకు 1929 లో మంత్రివర్గమును కూడ ఏర్పరుపగలిగినది. ఈ పక్షము అపుడు కొలది కాలము మాత్రమే అధికారమున ఉన్నను, అటనుండి దేశ చరిత్రలో ప్రముఖస్థానమును చేకూర్చుకొన కలిగినది. ఇందులకు తోడుగ యుద్ధఋణములవలనను, 1929 లోని ఆర్థిక సంక్షోభమువలనను దేశము ఆర్థికపటిష్ఠతను కూడ కోల్పోయి, బంగారుప్రమాణమును విసర్జింపవలసివచ్చినది.

పైవానికి తోడుగ వలసరాజ్యముల సమస్యలును దేశ ప్రభుత్వమును వేధింపదొడగినవి. ఐర్లాండ్‌లో అంతకు దాదాపు ఒక శతాబ్దమునుండి సాగి, కడకు తీవ్ర రక్తపాతమునకు త్రోవతీసిన తిరుగుబాటువలన ఆ దేశమున దక్షిణ భాగమునకు 1914 లో చట్టమూలముగ స్వాతంత్ర్యము కల్పింపబడి, 1923 లో అది అమలులోనికి తేబడినది. భారత దేశము మొదలగు వానిలో స్వాతంత్ర్యోద్యమములు తీవ్రముగ సాగుటవలన వానిని ఎదుర్కొనవలసి వచ్చినది.

ఈ క్లిష్టపరిస్థితులలో, యుద్ధము ఎడల వైముఖ్యమును వహించి విదేశీయవ్యవహారములందు గ్రేట్‌బ్రిటన్ అవలంబించిన సాంత్వనవిధానమును అవకాశముగ గ్రహించి జపాన్, ఇటలీ, జర్మనీలు బలపడినవి. ఇంతలో జార్జి - V మరణించెను (1936). అంతట అతని జ్యేష్ఠకుమారుడు ఎడ్వర్డ్ - VIII రాజైనను, తన వివాహ విషయమున అవలంబించిన విశృంఖల వైఖరివలన త్వరలో పదవీ పరిత్యాగము చేయవలసివచ్చెను (డిసెంబరు 10, 1936). అంతట అతని సోదరుడు జార్జి - VI రాజయ్యెను.

అక్షరాజ్యముల చర్యలవలన 1936 మొదలుగ అంతర్జాతీయ పరిస్థితి విషమించి కడకు ప్రపంచయుద్ధము - II [చూ. పు. 608] గ పరిణమించినది (1939). ఆ యుద్ధము 1940 లో జర్మనీ విజయముల వలన తీవ్రతను పొందగ చర్చిల్ [చూ. పు. 447] నాయకత్వమున జాతీయ

ప్రభుత్వము ఏర్పడినది. అంతటనుండి యుద్ధనిర్వహణమున గ్రేట్‌బ్రిటన్ అసాధారణ స్థైర్యమును ప్రదర్శించినది. రష్యాతప్ప తక్కిన యూరప్‌నంతను లోగాని, ఆ సాధన సంపత్తిని వినియోగించుకొన గలిగిన ఇటలీ, జర్మనీల ఉద్ధతికి ఎదురొడ్డి, ఫ్రాన్స్ పతనమైనది మొదలుగ సోవియట్‌రష్యాపై జర్మనీ యుద్ధమును ప్రకటించు (జూన్ 22, 1941) వరకు గ్రేట్ బ్రిటన్ ఏకాకియయ్యు పోరాడుచు నిలువగలిగినది.

ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున ఐక్యరాజ్య సమితి [చూ. పు. 351] నిర్మాణమున గ్రేట్‌బ్రిటన్ ప్రముఖపాత్ర వహించినది. అందలి భద్రతా సమితిలో శాశ్వత స్థానములలో ఒకటి ఈ రాజ్యమునకు చెంది ఉన్నది.

ప్రపంచ యుద్ధము ముగియనున్న కాలమున జరిగిన ఎన్నికలలో లేబర్ పార్టీ ఆధిక్యమును గడించినది (1945). అప్పటి లేబర్‌పార్టీ నాయకుడు అట్లీ [చూ. పు. 263]. ఇతని నాయకత్వమున బ్రిటన్‌నందు సోషలిస్ట్ భావములకు అనుగుణములగు సంస్కరణలు ప్రవేశ పెట్టబడుటయే కాక సామ్రాజ్యమందలి అస్వతంత్ర దేశములకు స్వతంత్రతా ప్రతిపత్తి కల్పించుటయు మొదలైనది. భారత ఉపఖండమును రెండుగ విభజించి భారత, పాకిస్తాన్‌లను ఏర్పరచి స్వతంత్రత ఒసంగుటతో ఈ కార్యక్రమము మొదలైనది. తరువాత ఎన్నికలలో కన్‌సర్వేటివ్ పార్టీ అధికారమునకు వచ్చిన తరువాత సైతము ఈ కార్యక్రమము కొనసాగింపబడి, పలు వలసదేశములు స్వతంత్రతను ఆర్జించినవి. వీనిలో బర్మా తప్ప తక్కినవి అన్నియు గ్రేట్‌బ్రిటన్‌తో కలసి కామన్‌వెల్త్‌న సమాన స్థాయిలో భాగస్వాములుగ ఉండుటకు అంగీకరించి వ్యవహరించుచున్నవి [చూ. కామన్‌వెల్త్ పు. 382].

యుద్ధానంతర ప్రపంచమున సుస్థిరవ్యవస్థను స్థాపించుటకు కృషిచేసి కమ్యూనిజపు వ్యాప్తిని అరికట్టుటకు యత్నించు యునైటెడ్‌స్టేట్స్‌తో గ్రేట్‌బ్రిటన్ కూడ పెక్కు విధముల సహకరించినది. నాటో [చూ. పు. 531] మొదలగు రక్షక ఒడంబడికలలో ఆ రాజ్యమునకు భాగస్వామ్యము కలదు. కొలంబో ప్రణాళిక మొదలగు వాని మూలమున వర్ధమాన రాజ్యములకును ఆ దేశము సాయము చేయుచున్నది.

జార్జి - VI 1952 లో మరణించిన తదుపరి అతని కుమార్తె ఎలిజబెత్ - II రాణియైనది. 1949 మొదలుగ యూరప్‌నందలి పశ్చిమ, ఉత్తర భాగముల రాజ్యములతో సలహా సంప్రతింపుల మూలమున గాఢ సాన్నిహిత్యమును నెలకొల్పుకొని తద్వారా ఆర్థికరంగములందును సమైక్యమును సాధించుటకు 'కౌన్సిల్ ఆఫ్ యూరప్' అను సంస్థద్వారాను, ఇంకను అట్టివేయగు వేరు సంస్థల ద్వారాను గ్రేట్‌బ్రిటన్ కృషి చేయుచున్నది. కాని, కొన్ని యూరప్ దేశములు, అందును ముఖ్యముగ ఫ్రాన్స్ ప్రతిరోధమున ఈ కార్యక్రమము కుంటువడినది [చూ. యునైటెడ్ కింగ్‌డమ్ చరిత్రకు సంబంధించిన మరికొన్ని వివరములకు సమీక్ష పు. 100 - 101; 130 - 131; 145 - 151; 152 - 164; 167 - 171; 'కామన్‌వెల్త్' అను శీర్షికలోని పట్టీలో తెలుపబడిన వివిధ దేశముల చరిత్రలు].

రాజ్యాంగము: ఆనువంశికము, శాసన విహితమునగు రాజరికము ఇట పరిపాలన నెరపుచున్నది. అయినను, చరిత్రగతిలో ప్రజానీకము సాగించిన ఆందోళనల ఫలితముగ పాలనాధికారము క్రమగతిలో ప్రజాప్రాతినిధ్యము వహించు పార్లమెంట్‌నకు సంక్రమించినది. రాజు దేశపు సర్వసత్తాకతకును, ఐక్యమునకును లాంఛనముగ ఆదరింపబడి, రాజ్యాధికారమును వహించును. ఇట్టి పార్లమెంటరీ వ్యవహార నిర్వహణము తొలుతగ గ్రేట్‌బ్రిటన్‌న కుదురుకొనుట వలన ఈ దేశపు పార్లమెంట్‌ను 'పార్లమెంట్‌లకు మాతృక' అని వ్యవహరించుట కలదు.

పార్లమెంట్‌న హౌస్ ఆఫ్ లార్డ్స్, హౌస్ ఆఫ్ కామన్స్ అను రెండు కక్ష్యలు కలవు. హౌస్ ఆఫ్ లార్డ్స్ నందలి సభిక సంఖ్య దాదాపుగ 740. ఇందు కొంతమంది వారసత్వ రీత్యా ప్రభు (లార్డ్) బిరుదమును ఆర్జించినవారు. కొంతమంది రాజుచే ప్రభుబిరుదము ఈయబడినవారు. వీరుగాక న్యాయశాఖయందు అత్యున్నత పదవులను ఆర్జించి, ఆ ఉద్యోగ మూలమున ప్రభుబిరుదమును పొందినవారు, ఇంగ్లండు చర్చికి చెందిన ఇరువురు ఆర్చిబిషప్‌లు, 24 గురు బిషప్‌లు; స్కాట్‌లాండ్ తరపున ఆ యా పార్లమెంట్ ఎన్నికలలో ఎన్నుకొనబడు 16 ప్రతినిధులును, ఐర్లాండ్ ప్రతినిధులును చేరి ఉన్నారు. (వీరిలో ఐరిష్ ప్రతినిధులలో చనిపోయిన వారి స్థానమున వేరొకరిని నియమించుట మానివేయబడినది. అందువలన వారి సంఖ్య క్రమముగ తగ్గుచున్నది).

హౌస్ ఆఫ్ కామన్స్‌లో సభికసంఖ్య 615. వీరిలో 300 మంది 'కౌంటీలు' అనబడు గ్రామీణ నియోజక వర్గము నుండియు, 303 మంది 'బరోలు' అనబడు పట్టణ నియోజక వర్గములనుండియు, 12 మంది ప్రతినిధులు యూనివర్సిటీల నుండియు ఎన్నుకొనబడుదురు. కామన్స్ సభాసభ్యుని కనీస వయస్సు 21.

ఈ దేశమున వోటుహక్కు క్రమముగ విస్తృతీకరింపబడి, 1918 నాటికి వయోజనులలో పురుషులకు అందరికిని

వోటుహక్కు కలిగింపబడినది. 1928 నాటికి స్త్రీలలో వయోజనులకు అందరకు వోటు హక్కు లభించినది.

పార్లమెంట్‌నందలి ఉభయ కక్ష్యలలో ధన, వ్యవహారములకు సంబంధించిన బిల్లులపై హౌస్ ఆవ్ కామన్స్‌కు మాత్రమే అధికారము కలదు. తక్కిన వాని విషయమున రెండును దాదాపుగ సమానములే. హౌస్ ఆవ్ లార్డ్స్‌కు చరమస్థాయి న్యాయస్థానముగ వ్యవహరించు అధికారమును కలదు [చూ. యునైటెడ్ కింగ్‌డమ్ రాజ్యాంగమును గురించిన మరికొన్ని వివరములకు న్యాయశాస్త్ర సంపుటము].

గి. వెం. సీ.; చీ. శే. రా.

**యునైటెడ్ నేషన్స్ ఆర్గనైజేషన్:** చూ. ఐక్యరాజ్య సమితి - పు. 351.

**యునైటెడ్ స్టేట్స్:** ఉత్తర అమెరికాయందలి ఒక సమాఖ్యా గణతంత్ర రాజ్యము (ఫెడరల్ రిపబ్లిక్). దీని పూర్తినామము యునైటెడ్ స్టేట్స్ ఆవ్ అమెరికా *. ఈ గణరాజ్యమున ఏబది రాష్ట్రములు చేరి ఉన్నవి. వీనిలో ప్రతి రాష్ట్రమును (సిద్ధాంతరీత్యా మాత్రము) సర్వసత్తాకత కలిగి ఉన్నది. విస్తీర్ణ, జనసంఖ్యాగణనము లందు ప్రపంచరాజ్యములలో ఈ రాజ్యము నాలుగవ స్థానమును ఆక్రమించినను, పారిశ్రామికాభ్యుదయ, ఆర్థిక సుసంపన్నతల లెక్కలో ప్రప్రథమస్థానమును ఆర్జించినది.

ఈ రాజ్యమునకు కెనడా [ఉ]; అట్లాంటిక్ మహాసముద్రము [తూ]; మెక్సికో [ద]; పసిఫిక్ మహాసముద్రము [ప] సరిహద్దులందు ఉన్నవి. [వి] 93,63,389 చ. కి. మీ.; (ఈ లెక్కలో దేశాంతర్గత జలాశయములలో చిన్నవియగు వాని విస్తీర్ణము చేరినను, గ్రేట్‌లేక్స్ (మహాసరస్సులు) అనబడుచు ఈ దేశమునకే చెంది, ఉత్తర భాగపు అంచున ఉన్న జలాశయముల విస్తీర్ణములు చేరలేదు). [జ] 19,08,18,000. జనులలో శ్వేతజాతీయులు, 88.6%; నీగ్రోజాతీయులు 10.5% కలరు; తక్కిన వారిలో ఆదిమ అమెరికన్‌లు, జపానీయులు, చీనీయులు, ఫిలిప్పీన్‌వాసులు క్రమముగ సంఖ్యాప్రబలతను కలిగి ఉన్నారు. [మ] ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు క్రైస్తవులు (అందు దాదాపు 625 లక్షలు ప్రొటెస్టంట్ క్రైస్తవులు, దాదాపు 410 లక్షలు రోమన్ కేథలిక్‌లు, ఆర్తడాక్స్ చర్చికి చెందినవారు రమారమి 28 లక్షలు, అర్మీనియన్ చర్చికి చెందినవారు సుమారు 5 లక్షలు కలరు). క్రైస్తవేతర మతములలో అధికవ్యాప్తి కలది యూదమతము (55 లక్షలు). [రా] వాషింగ్‌టన్ (జ. సం. 7,63,956).

---

* ఈ పేరున చివరగల 'అమెరికా' అను పదమునుబట్టియే 'యునైటెడ్ స్టేట్స్' అను దానిని విశేషణముగ వాడునపుడు కొన్నియెడల 'అమెరికన్' లేదా 'అమెరికా' అనియు వాడుట జరుగుచున్నది. ఉదా: అమెరికన్ సేనలు; అమెరికన్ నౌకాబలము; అమెరికా స్వాతంత్ర్యయుద్ధము.

**యునైటెడ్‌స్టేట్స్ రాష్ట్రముల విస్తీర్ణాదుల వివరములు**

| వరుస సంఖ్య | రాష్ట్రములు | విస్తీర్ణము చ. కి. మీ. | రాష్ట్రరాజధాని |
|---|---|---|---|
| 1. | అయోవా | 1,45,791 | డెస్‌మయోనిస్ |
| 2. | అలబామా | 1,33,667 | మాంట్‌గామెరీ |
| 3. | అలాస్కా | 15,18,776 | జున్యూ |
| 4. | ఆర్‌కాన్సస్ | 1,37,539 | లిటిల్ రాక్ |
| 5. | ఆరిజోనా | 2,95,024 | ఫోనిక్స్ |
| 6. | ఇండియానా | 93,994 | ఇండియానాపొలిస్ |
| 7. | ఇడాహో | 2,16,413 | బొయిసీ |
| 8. | ఇలినాయ్ | 1,46,076 | స్ప్రింగ్ ఫీల్డ్ |
| 9. | ఊటా | 2,19,932 | సాల్ట్ లేక్ సిటీ |
| 10. | ఓక్లహోమా | 1,81.080 | ఓక్లహోమాసిటీ |
| 11. | ఓరగాన్ | 2,51,181 | సేలెమ్ |
| 12. | ఓహియో | 1,06,765 | కొలంబస్ |
| 13. | కాన్సాస్ | 2,13,064 | టొపెకా |
| 14. | కాలిఫోర్నియా | 4,11,015 | సాక్రెమెంటో |
| 15. | కెంటకీ | 1,04,623 | ఫ్రాంక్‌ఫర్ట్ |
| 16. | కెరొలినా, ఉత్తర | 1,36,524 | రాలీ |
| 17. | కెరొలినా, దక్షిణ | 80,432 | కొలంబియా |
| 18. | కొనెక్టికట్ | 12,973 | హార్ట్‌ఫోర్డ్ |
| 19. | కొలరాడో | 2,70,000 | డెన్‌వర్ |
| 20. | జార్జియా | 1,52,489 | అట్లాంటా |
| 21. | టెక్సాస్ | 6,92,407 | ఆస్టిన్ |
| 22. | టెనస్సీ | 1,09,412 | నాష్‌విల్లీ |
| 23. | డకోటా, ఉత్తర | 1,83,022 | బిస్మార్క్ |
| 24. | డకోటా, దక్షిణ | 1,99.552 | పియెర్రే |
| 25. | డిలావెర్ | 5,328 | డోవర్ |
| 26. | నెబ్రాస్కా | 2,00,018 | లింకన్ |
| 27. | నెవాడా | 2,86,299 | కార్సన్ సిటీ |
| 28. | న్యూజెర్సీ | 20,295 | ట్రెంటన్ |
| 29. | న్యూ మెక్సికో | 3,15,115 | శాంటాఫే |
| 30. | న్యూయార్క్ | 1,28,402 | ఆల్బనీ |
| 31. | న్యూహాంప్‌షైర్ | 24,097 | కన్‌కార్డ్ |
| 32. | పెన్సిల్‌వేనియా | 1,17,412 | హారిస్‌బర్గ్ |
| 33. | ఫ్లారిడా | 1,51,670 | తలహాసీ |
| 34. | మస్సాసుచెట్స్ | 21,386 | బోస్టన్ |
| 35. | మాంటనా | 3,81,087 | హెలీనా |
| 36. | మిచిగాన్ | 1,50,779 | లాన్‌సింగ్ |
| 37. | మినిసోటా | 2,17,736 | సెయింట్ పాల్ |
| 38. | మిస్సిసిపీ | 1,23,584 | జాక్‌సన్ |
| 39. | మిస్సోరి | 1,80,487 | జెఫర్‌సన్ సిటీ |
| 40. | మెయినీ | 86,027 | అగస్టా |
| 41. | మేరీలాండ్ | 27,394 | అన్నపొలిస్ |
| 42. | రోడ్ఐలండ్ | 3,144 | ప్రావిడెన్స్ |
| 43. | లూజియానా | 1,25,675 | బాటన్‌రోగ్ |

# యునైటెడ్ స్టేట్స్





కెనడా
యునైటెడ్ స్టేట్స్
వాషింగ్‌టన్
ఒరగాన్
ఇడాహో
మాంటనా
హెలీనా
ఉత్తర డకోటా
బిస్మార్క్
ఫార్‌గో
మినిసోటా
దక్షిణ డకోటా
పియరీ
సెయింట్ పాల్
విస్‌కాన్‌సిన్
మేడిసన్
లాన్సింగ్
వ్యోమింగ్
నెవాడా
కార్సన్ సిటీ
సాల్ట్ లేక్ సిటీ
ఉటా
కొలరాడో
డెన్వర్
నెబ్రాస్కా
లింకన్
అయోవా
డెస్ మోయినిస్
చికాగో
ఇలినాయ్
స్ప్రింగ్‌ఫీల్డ్
ఇండియానా
ఇండియానా పోలిస్
ఓహియో
కొలంబస్
పెన్సిల్వేనియా
వాషింగ్‌టన్
వర్జీనియా
రిచ్‌మాండ్
కాన్సాస్
కాన్సాస్ సిటీ
జెఫర్సన్ సిటీ
మిస్సోరీ
కెంటకీ
కాలిఫోర్నియా
లాస్ ఏంజెల్స్
ఆరిజోనా
ఫోనిక్స్
శాంటాఫే
న్యూ మెక్సికో
ఓక్లహామా
ఓక్లహామా సిటీ
అర్‌కాన్‌సస్
లిటిల్ రాక్
టెన్నిస్సి
నాష్‌విల్లి
ఉత్తర కెరొలినా
దక్షిణ కెరొలినా
మిసిసిపి
జాక్‌సన్
అలబామా
మాంట్‌గొమెరీ
జార్జియా
అట్లాంటా
టెక్సాస్
ఎల్ పాసో
శాన్ అంటోనియో
ఆస్టిన్
హూస్టన్
లూసియానా
తలహాసీ
మెక్సికో సింధుశాఖ
ఒట్టావా
మెయిన్
సోవియట్ రష్యా
అలాస్కా
(యునైటెడ్ స్టేట్స్)
హిలో
స్కేలు
1 మైలు = 1·609 కి. మీ.
మై 0 100 200 300 400
1 మైలు=1·609 కి.మీ.
మై 0 20 40 60

| వరుస సంఖ్య | రాష్ట్రములు | విస్తీర్ణము చ. కి. మీ. | రాష్ట్రరాజధాని |
|---|---|---|---|
| 44. | వర్జీనియా | 1,05,711 | రిచ్‌మాండ్ |
| 45. | వర్జీనియా, పశ్చిమ | 62,629 | చార్లెస్‌టన్ |
| 46. | వాషింగ్‌టన్ | 1,76,617 | ఒలింపియా |
| 47. | విస్‌కాన్సిన్ | 1,45,439 | మాడిసన్ |
| 48. | వెర్‌మాంట్ | 24,887 | మాంట్ పెలియర్ |
| 49. | వ్యోమింగ్ | 2,53,597 | చెయెన్నే |
| 50. | హవాయీ | 16,638 | హోనోలూలూ |
| 51. | కొలంబియా జిల్లా * | 179 | — |

చరిత్ర: నేడు యునైటెడ్ స్టేట్స్ అని వ్యవహరింప బడు ప్రాంతమునకు యూరప్‌నుండి ప్రజలు 16 వ శతాబ్ది ఆరంభమునుండి వలస వచ్చుటకు పూర్వమే ఆ ప్రాంతమున ఆదిమ అమెరికన్ జాతి ప్రజలు ధాతుయుగపు నాగరకతను అందుకొనిన స్థితిలో సుస్థిర సంఘములుగ వివిధ ప్రాతము లందు వసించుచుండిరి. యూరపియన్‌లు ఈ ఆదిమ అమెరికన్ జాతి ప్రజలను శరీరపు ఛాయను బట్టి 'రెడ్ (ఎర్ర) ఇండియన్‌లు' అని వ్యవహరించిరి. యూరపియన్‌లు దేశమును క్రమముగ ఆక్రమించి, ఈ ఆదిమ ప్రజలను మారుమూల ప్రాంతములకు నెట్టివేసి, జీవన వసతులను హరించుటవలన, ఈ జాతి క్రమముగ క్షీణస్థితిని ప్రాపించి నది. ఆ జాతికి చెందిన కొందరు అల్పసంఖ్యాకవర్గముల వారు దాదాపు నాలుగులక్షలకులోపుగ మాత్రము ప్రస్తుతము కలరు. వీరు తమకు ప్రత్యేకింపబడినప్రాంతము లలో సంప్రదాయరీతిలో జీవించుచున్నారు. అదియును గాక, ఈ ఆదిమజాతివారి పూర్వ చారిత్రక విశేషములను గురించి ఆధారపూర్వకముగ తెలియవచ్చిన విశేషములు చాల తక్కువ. కావున యునైటెడ్ స్టేట్స్‌చరిత్ర ఆ దేశమున యూరపియన్‌లువలసచేరుటతో మొదలయ్యెనని చెప్పవచ్చును.

వలస పరిపాలనా యుగము (1585 - 1776): తొలుత ఉత్తర అమెరికా అందలి కొన్ని ప్రాంతములను క్రీ. శ. 1000 లో లీఫ్ ఎరిక్‌సన్ అను నార్స్‌మన్ కనుగొని అచట ఒక వలసను నెలకొల్పెనని కొన్ని చారిత్రకాధారముల వలన తెలియవచ్చుచున్నను, ఆ వలసను గురించిన తదనంతర విశేషములు ఏవియు మనకు తెలియవచ్చుటలేదు. ఆ వలస ప్రజలు వసించిన స్థలమును తెలియజేయు చారిత్ర కావశేషములును లభింపకున్నవి. ఆ తరువాత అమెరికా ఖండ సన్నిహిత దీవులపై కొలంబస్ [చూ. పు. 407] కాలిడి (1492) ఆ ప్రాంతమంతయు ఇండియా పరిసరమని భ్రాంతిపడి, అచట వసించు వారిని 'ఇండియన్‌లు' అని తన వ్రాతలలో వ్యవహరించుటవలననే అమెరికా ఆదిమ ప్రజలకు అందరికిని ఆ నామమే సర్వత్ర వాడుకలోనికి వచ్చినది. అంతట కాలక్రమమున ఇటలీ వాసియగు అమెరిగో వెస్‌పుచ్చి అను నావికుడు 1501 లో దక్షిణ అమెరికా యందలి బ్రెజిల్ తీరముపై కాలిడెను. ఈ విధముగ అమెరికా సన్నిహితములగు ద్వీపములను కాక, అమెరికా ముఖ్య భూఖండమున కాలిడిన తొలుతటి ప్రముఖుడు ఇతడు అగుటవలన, ఇతని పేర ఆ భూ ఖండమునకు అంతటినుండి అమెరికా అను వ్యవహార నామముకలిగెను. ఆ తరువాత చాలకాలమువరకు దక్షిణ, మధ్య అమెరికాలలో వలసల నెలకొల్పుటలో స్పెయిన్ వారు శ్రద్ధవహించిరి; కాని, ఉత్తర అమెరికా విషయమును తలపెట్టలేదు. స్పెయిన్ దేశపుసాహసికులుకొందరు ఫ్లొరిడా ప్రాంతమునను, మిస్సిసిపీ నది పరీవాహ ప్రదేశమునను పర్యటించినను అచట స్థిరములగు వలసలను నెలకొల్పలేదు.

ఇంగ్లండున హెన్రీ - VII పరిపాలించుకాలముననే, అమెరికాలోని భూములను కనుగొనవలయునను కోరిక రేకెత్తినది. తత్ఫలితముగ జాన్ కేబట్ అనువానికి రాజు నూతన భూముల అన్వేషణకు అనుమతిని ఇచ్చెను. ఉత్తర అమెరికాలోని న్యూఫౌండ్‌లాండ్‌నను, లాబ్రడార్‌నను 1496 లో కేబట్ కాలిడినను అతడు అచట వలసలను నెలకొల్పలేదు. ఆ తరువాత ఈ దేశమున తొలుతటి ఇంగ్లీషువారి వలసను నెలకొల్పిన ఖ్యాతి వాల్టర్ రేలీకి దక్కినది (1585). ఆ వలసకు అతడు 'వర్జీనియా' అని పేరిడెను. కాని, ఈ వలస యత్నము విఫలమై, మరల 1607 లో వేరొక యత్నము జరిగి అట స్థిరమగు వలస ఏర్పడినది. ఆ తరువాత మేరీలాండ్ అను వలసయు ఏర్పడినది. ఇంగ్లండులోని ఆనాటి పరిస్థితులు ఈ వలస కార్యక్రమమునకు ఎక్కువ ప్రోత్సాహమును ఇచ్చినవి. ఆదేశమున మతసంస్కరణోద్యమఫలితముగ మత ఛాందసము వెర్రితలలు వైచి, అధికారమున ఉన్న వారి మతమును అవలంబించని వారిస్థితి నికృష్టముగ పరిణమించి నది. అట్టి దుస్సహ పరిస్థితినుండి బయటపడు తలంపుతో 'ప్యూరిటన్‌లు' అను మతశాఖకు చెందిన కొందరు ఇంగ్లండును వదలి ఈ దేశమునకు వచ్చి వలసలను నెల కొల్పిరి. ఇటుల వచ్చిన ఆ ప్యూరిటన్ సంప్రదాయానుయాయులలో ప్రథమదళమువారికే 'పిల్‌గ్రిమ్ ఫాదర్స్ (యాత్రిక జనకులు)' అని చరిత్రలో పేరు లభించినది. ఈ ప్రథమ దళమే ప్రస్తుతపు మసాచుసెట్స్ రాష్ట్రమున

* ఫెడరల్ రాజధానియగు వాషింగ్‌టన్ నగరమున నెలకొనిన జిల్లా; ఇది రాష్ట్రముల లెక్కలోనికి రాదు.

ఆనాడు ఒక వలసను నెలకొల్పినది. ఆ తరువాత క్రమముగ జార్జియా, పెన్సిల్ వేనియారాష్ట్రములును ఇంగ్లీషువారి చేతనే నెలకొల్పబడినవి. ఈ విధముగ ఆ కాలమున పది వలసలనూ ఇంగ్లీషువారు స్థాపించిరి. న్యూయార్క్ రాష్ట్రమున మాత్రము తొలుతటి వలస డచ్చివారిది. వారు దానిని న్యూ ఆమ్‌స్టర్ డామ్ అని వ్యవహరించిరి. కాని, దానిని తరువాత బ్రిటిష్‌వారు ఆక్రమించిరి. న్యూజెర్సీయు తొలుత డచ్చివారి వలసయే అయినను, కాలక్రమమున ఇంగ్లీషువారికి అట ఆధిక్యము లభించినది. డిలావెర్‌లో మొదట స్వీడెన్ వాసులు వలస చేరినను, క్రమశః ఆంగ్లేయుల వశమైనది. ఫ్రెంచివారు అప్పటికే కెనడా ప్రాంతమునను, యునైటెడ్‌స్టేట్స్‌లోని పశ్చిమ భాగమున లూజియానాయందును ఆధిక్యమును ఆర్జించిరి. దేశమున సారవంతమగు భూమి విస్తారముగ ఉండుటవలన పొగాకు, వరిపంటల సేద్యము అచట విరివిగ సాగించి వలసలు సుసంపన్నములు అయినవి. ఈ భూములలో పనిచేయుటకు కావలసిన కార్మికబలము క్రమముగ తక్కువయ్యెను. ఆదిమ అమెరికన్‌లు అణగిమణగి పనిచేయువారు కారు. అందువలన వారిని మారుమూల ప్రాంతములకు తరిమి నీగ్రో బానిసలను ఆఫ్రికానుండి కొనితెచ్చుట మొదలైనది. ఇట్టి నీగ్రో బానిసల మొదటి జట్టు వర్జీనియాకు 1619లో చేరినది.

ఇటుల యూరప్ వాసులు ఉత్తర అమెరికాయందు వలసలను నెలకొల్పిన తరువాత యూరప్‌లోని జాతీయ వైరుధ్యములు అమెరికాలోనివారి వలసలయందును తమ ప్రభావమును నెరపసాగినవి. తత్ఫలితముగ 1. ఫ్రాన్స్ - నెదర్‌లండ్స్ మధ్య సాగిన యుద్ధము; 2. స్పానిష్ వారసత్వ యుద్ధము; 3. ఆస్ట్రియన్ వారసత్వ యుద్ధము; 4. సప్తవర్ష యుద్ధము అను నాలుగు యుద్ధములలో అమెరికాయందలి యూరపియన్ వలసల మధ్య పోరాటములు చెలరేగినవి. పై నాలుగు యుద్ధములును క్రమముగ రిస్‌విక్ సంధి (1697), ఉట్రెక్ట్ సంధి (1713) [చూ. పు. 337], ఐలా షాపెల్ సంధి (1748) [చూ. పు. 359], పారిస్ సంధి (1763) అను వానితో అంతమైనవి. తొలుతటి రెండు యుద్ధములలో అమెరికా యందలి ఫ్రెంచి వలసలకును, ఇంగ్లీషు వలసలకును మధ్య ఘర్షణలు పెక్కు జరిగినవి. కడకు ఉట్రెక్ట్ సంధి ఫలితముగ అకేడియాను, న్యూ ఫౌండ్‌లాండ్‌ను, హడ్సన్ బే ప్రాంత భూమిని బ్రిటిష్ వారికి ఫ్రెంచివారు దత్తముచేసిరి. కాని, ఉత్తర అమెరికా యందలి తక్కిన ఫ్రెంచి ప్రాంతములు - కెనడా, లూజియానా - ఫ్రెంచివారి వశముననే నిలచి ఉండినవి. ఆస్ట్రియన్ వారసత్వ యుద్ధము కాలముననుు - ఫ్రెంచి వలసల పై ఇంగ్లీషు వలసల వారు దాడి సలిపి - కొంత భూమిని ఆక్రమింపగలిగిరి. కాని, తరువాత కుదిరిన ఐలా షాపెల్ సంధివలన యుద్ధాత్పూర్వస్థితి పునరుద్ధరింపబడినది.

ఉత్తర అమెరికా యందలి రాజకీయ వ్యవస్థలో పెద్ద మార్పు తెచ్చినది పారిస్‌సంధి. సప్తవర్ష సంగ్రామ ఫలితముగ ఈ సంధి వలన ఉత్తర అమెరికాలో ఫ్రెంచివారి అధికారము అంతరించినది. ఉత్తర అమెరికా యందలి న్యూ ఆర్లియన్స్‌ను, లూజియానాను స్పెయిన్ వారికి దత్తముచేయుటయే కాక, ఓహియో లోయను, కెనడాను బ్రిటిష్‌వారికి ఫ్రెంచివారు అప్పగించిరి. అసమయముననే క్యూబా, ఫిలిప్పీన్‌లను స్పెయిన్‌నకు మారొసగి ఫ్లారిడాను బ్రిటన్ గ్రహించినది.

సప్తవర్ష సంగ్రామము [చూ.] న ఉత్తర అమెరికా యందలి 13 వలసలును ధైర్యస్థైర్యములను పెక్కు సమయములందు ప్రకటించుటయే కాక, ఫ్రెంచివారిని ఎదుర్కొని నిలువరింపగలిగినవి. ఇందువలన వలసల వారిలో ఆత్మవిశ్వాసము ఎక్కువయై బ్రిటన్‌తో తమకు గల రాజకీయసంబంధమున తమ ప్రతిపత్తికి మాన్యతను చేకూర్చుకొనుటకై వారు కృషిచేయుటకు దారి చూపినది. ఇందులకు తోడుగ ఆనాడు బ్రిటన్‌నందు ఉన్న ప్రభుత్వము వలసల ఎడ వహించిన వైఖరియు వలసల వారిని కొంత రెచ్చగొట్టినది. వలసలను బ్రిటిష్‌ప్రభుత్వము ప్రభుత్వాదాయపు వసతులుగ పరిగణించినది. ఆ బ్రిటిష్ ప్రభుత్వాధికారమును చలాయించు లండనులోని పార్లమెంట్‌నందు వలసల ప్రజలకు ఎట్టి అధికారమును లేకుండెను. వలసలు ముడి పదార్థములను సరఫరా చేయునవిగ మాత్రమే ఉండి, తయారీ వస్తువుల కొరకు గ్రేట్‌బ్రిటన్ మీద మాత్రమే ఆధారపడి ఉండునటుల చేయవలెనని ఆ ప్రభుత్వము భావించి అందులకు అనుగుణముగ చట్టములను రూపొందించినది. వీనితో తొలుతటివి నావిగేషన్ చట్టములు; వీనివలన వలసలలో దొరకు కొన్ని ముడిసరకులు కొనుగోలు విషయమున బ్రిటిష్ వర్తకులకు గుత్తాధికారము చేకూరు వసతి కల్పింపబడినది (1764). దీనిని వలసల ప్రజలు ప్రతిఘటించిరి. అంతట వానికి బదులుగ స్టాంపుచట్టము అను దానిని బ్రిటిష్‌ప్రభుత్వము రూపొందించి వలసలలోని స్టాంపులపై పన్ను వసూలు అధికారమును గ్రహించినది (1765). వలసల ప్రజలలో ఈ చర్యలు భయాందోళనలను, ఉద్రేకమును రెచ్చగొట్టినవి. తత్ఫలితముగ స్టాంపులు పెక్కుచోటుల తగులబెట్టబడుటయేకాక, 'ప్రాతినిధ్యము లేనిదే పన్ను విధింపును ఉండనేరదు' అను నినాదము

ఎల్లెడల ప్రతిధ్వనింప ఆరంభించినది. అంతట బ్రిటిష్ ప్రభుత్వము పై పన్నును రద్దుచేసి, అందుకు బదులుగ తేయాకు, గ్లాసు మొదలగు వానిపై దిగుమతి సుంకపు విధింపును ఏర్పాటు చేసినది (1767). ఈ మార్పును సైతము వలస ప్రజలు ఆమోదింపక ఆందోళనను కొనసాగించిరి. ఆ సమయముననే మస్సాసుసెట్స్ వలసలోని బోస్టన్ రేవులో తేయాకు సరకు గల పడవలలోనికి కొందరు వలస పౌరులు ఎర్రఇండియన్‌ల వేషములతో ప్రవేశించి, తేయాకు పెట్టెలను సముద్రములోనికి త్రోసివేసిరి. ఈ సంఘటనయే 'బోస్టన్ టీ పార్టీ' అను అపహాస్యపు పేరుతో ఆ దేశపు చరిత్రయందు వ్యవహృతము. ఈ చర్యకు అప్పటి బ్రిటిష్ రాజు జార్జి - III కుపితుడు అయ్యెను. ఆ ప్రభువు అధికార ప్రియుడు; పార్లమెంట్ ఆయన చెప్పుచేతలలో ఉండెను. అందువలన మస్సాసుసెట్స్ వలసయొక్క అధికార పత్రమును రద్దుచేసి, తగు చర్యలను తీసికొనవలసినదిగ ఆదేశించెను. ఆ విషయము తెలియవచ్చినంతనే తక్కిన వలసలును మస్సాసుసెట్స్‌కు అండగ ఉండుటకు నిశ్చయించుకొనినవి. అంతట ఫిలడెల్ఫియాలో 'కాంటినెంటల్ కాంగ్రెస్ (అఖిల ఖండ సమావేశము)' జరిగినది (సెప్టెంబరు 5, 1774). ఆ సమావేశ ఫలితముగ బ్రిటన్‌లోని ప్రజలకును, కెనడాలోని వారికిని తమ దీనస్థితిని తెలియజేయుచు ఒక విజ్ఞప్తిని పంపుటకు మాత్రమే నిర్ణయము జరిగినది. కాని, స్వాతంత్ర్యమును కోరుచు అందు తీర్మానము చేయబడలేదు.

అయినను పరిస్థితులు అంతటినుండి విషమించి వలస ప్రజల ఓర్పును సన్నగిల జేసినవి. మస్సాసుసెట్స్ వలసకు బ్రిటిష్ ప్రభుత్వము ఒక సైనికనాయకుని అధిపతిగ నియమించినది. అతడు వలస ప్రజల నాయకులను ఇరువురను అరెస్ట్‌చేయుటకై పూనుకొని లెక్సింగ్‌టన్ గ్రామమువద్ద తుపాకులతో కాల్పుల సాగింప మొదలిడెను (ఏప్రిల్ 19, 1775). ప్రజలు ప్రతీకార చర్యకు పూనుకొని పోరాడిరి. అంతటితో అమెరికా స్వాతంత్ర్య యుద్ధము ఆరంభమైనది.

స్వాతంత్ర్య సంస్థాపనా యుగము (1776 - 1789): ఇటుల బయలు దేరిన స్వాతంత్ర్య యుద్ధము 1783, సెప్టెంబరు 3 న కుదిరిన పారిస్ శాంతి సంధితో ముగిసి, వలసలకు స్వాతంత్ర్యము లభించినది. ఈ సంగ్రామ కాలమున యుద్ధ రంగమున వలసల మధ్య సాగిన సమైక్య కృషితో పాటుగ రాజకీయైక్యమునకును కృషి జరిగినది. యుద్ధము మొదలైన తరువాత అనతి కాలముననే వలసల ప్రతినిధులు సమావేశమై స్వాతంత్ర్యమును ప్రకటించిరి (జూలై, 4, 1776). ఈ ప్రకటనకు తుది రూపము ఒసగినవాడు తామస్ జెఫర్‌సన్ [చూ. పు. 466]. ఆ స్వాతంత్ర్య ప్రకటనకు ఉపోద్ఘాతమున అనుల్లంఘనీయ మానవస్వత్వములు విశదీకరింపబడినవి. ఇటుల స్వాతంత్ర్య ప్రకటనమును చేసినను, ఆ స్వాతంత్ర్యమును ఆర్జించుటకు కావలసిన సాధనసామగ్రి అప్పటికి ఏమియు లేకుండెను. తత్ఫలితముగ వలస ప్రజలు పరాజయములను ఎదుర్కొని పలు త్యాగములను చేయవలసి వచ్చెను. అయినను వారు పట్టువిడువక, బ్రిటన్‌కు శత్రు రాజ్యములగు వానినుండి సాయమునకై కృషి చేసిరి. బ్రిటిష్‌వారి వలన సామ్రాజ్యమును కోల్పోయిన ఫ్రాన్స్ ఈ సమయమున వలసలకు సాయమొసగినది. స్పెయిన్ కూడ బ్రిటిష్‌వారి నౌకాదళమును ప్రతిఘటించి, వలసలకు తోడ్పడినది. అందులకు తోడుగ వలసల సేనలకు జార్జి వాషింగ్‌టన్ నాయకత్వమును ఉపకరించినది. కడకు బ్రిటిష్ సేనాపతి యార్క్‌టౌన్ వద్ద లొంగుటతో వలసలకు విజయము చేకూరినది (అక్టోబరు 19, 1781). అంతట శాంతి సంభాషణలు మొదలై పారిస్‌లో శాంతి సంధిపై సంతకములు జరిగినవి. ఈ సంధివలన జరిగిన ఆదాన ప్రదానములవలన కడకు ఉత్తర అమెరికాయందు గ్రేట్ బ్రిటన్‌కు కెనడా మాత్రమే మిగిలినది. 13 వలసలకును స్వాతంత్ర్యము లభించినది. లూజియానా, ఫ్లొరిడా రాజ్యములు స్పెయిన్‌నకు లభించినవి. వెస్ట్ ఇండీస్ ద్వీప సముదాయమున కొన్ని దీవులు ఫ్రాన్స్‌కు లభించినవి.

స్వాతంత్ర్యము చేకూరినదను మాటయే కాని అప్పటికి వలసలు అన్నియు అరాజక స్థితిలో ఉండినవి. అంతట ఒక సముచిత రాజ్యాంగమును రూపొందించు సంకల్పముతో వలసల ప్రతినిధులు ఫిలిడెల్ఫియాలో సమావేశమైరి (1787). వలసల సర్వసత్తాకతకు భంగము లేని రీతిగ ఈ రాజ్యాంగము రచింపబడవలసి ఉండెను. కావున, పలు చర్చలు జరిగి, ఏ వలసకును ఎట్టి సందేహము లేకుండు రీతిలో 'సమాఖ్యా గణతంత్ర (ఫెడరల్ రిపబ్లిక్) రాజ్యాంగము' రూపొందింపబడి, కడకు అన్నివలసల అమోదమును పొందుటతో 'యునైటెడ్ స్టేట్స్ ఆవ్ అమెరికా' రూపొందినది. దానిని ధ్రువీకరించుటలో కట్టకడపటి వలసవలన ధ్రువీకరణము 1790 లో మాత్రమే జరిగినను, ఆ రాజ్యాంగమును అనుసరించి తొలుతటి అధ్యక్ష, ఉపాధ్యక్షులు 1789, జనవరిలో ఎన్నుకొనబడిరి. తొలుతటి అధ్యక్షుడు జార్జి వాషింగ్‌టన్ [చూ.], ఉపాధ్యక్షుడు జాన్ ఆడమ్స్ [చూ. పు. 283].

రాజ్య విస్తృతీకరణ యుగము (1789 - 1914): పై విధముగ రూపొందిన సమాఖ్యా గణ తంత్ర రాజ్యము ఈ

యుగమున విస్తృతిని, స్థిరతను ఆర్జింపగలిగినది. పరిపాలనా పటిష్ఠతను ఈ రాజ్యము ఆర్జించుటకు ముందుగ పెక్కు బాలారిష్టములను ఎదుర్కొనవలసి వచ్చినది. సర్వసత్తాకతను నెపముగ గ్రహించి మంకుతనము వహించు రాష్ట్రములపై కేంద్రాధికారమును అమలుపరచుటలో తొలుత ఫెడరల్ ప్రభుత్వము కొంత చాకచక్యముతో వ్యవహరించవలసి వచ్చినది. అయినను ప్రజలలో నానాట వ్యాపించిన రాజకీయ పరిజ్ఞానము రాజ్యాంగమును సక్రమముగ అమలు జరుపుటకు చాల సహకరించినది. మొదటి అధ్యక్షుడు పదవిలో ఉన్న కాలముననే ఫెడరలిస్ట్ పార్టీ, రిపబ్లికన్ పార్టీ అను రాజకీయ పక్షములు రూపొందినవి. 1800 లో జఫర్సన్ అధ్యక్షుడగుటతో సరియగు ఎన్నికలు కలిగిన ప్రజాస్వామ్యప్రభుత్వము అమలులోనికి వచ్చినది. ఈతని కాలమున వలసలయందలి జనసంఖ్యయు ఎక్కువగ వృద్ధియై దాదాపు 52 లక్షల వరకు పోయినది. ఈ వలసలకు పశ్చిమమున ఉన్న లూజియానాలోనికి వలస చేరుటకు కొందరు ప్రయత్నములు చేయసాగిరి. కాని, ఆ ప్రాంతమును అప్పటిలో స్పెయిన్‌వారినుండి ఫ్రెంచివారు గ్రహించి ఉండిరి. అందువలన దానిని ఫ్రెంచివారినుండి అధ్యక్షుడు జఫర్సన్ ఒకటిన్నర కోటి డాలర్లకు కొనుగోలుచేసి, వలస ప్రజలు పశ్చిమ దిశకు వ్యాపించుటకు మార్గము ఏర్పరచెను (1803); ఈ కొనుగోలు వలన 30, 46, 921 చ. కి. మీ. విస్తృతి కల ప్రదేశము యునైటెడ్ స్టేట్స్‌నకు కలసినది. ఇటుల విశాలమగు భూమి కలయుటయు ఒకవిధముగ రాష్ట్రములమధ్య కలతలకు కారణమైనది. పశ్చిమమున విస్తారపు భూమి వచ్చిపడుటవలన ఆ మీద దక్షిణ, పశ్చిమ రాష్ట్రముల పలుకుబడి ఎక్కువయై తూర్పు రాష్ట్రముల పలుకుబడి తగ్గునను భయమున ఫెడరలిస్టులు కొందరు తూర్పు రాష్ట్రములను న్యూయార్క్‌తో సహా వేరు పరచి, స్వతంత్రరాజ్య కూటమి (కాన్‌ఫెడరసీ) ని ఏర్పరుప సంకల్పించి కుట్ర చేసిరి. కాని, ఈ కుట్ర అణచివేయబడినది (1812).

ఈ నూతన గణరాజ్యము వేరొక బెడదను 1812 లో ఎదుర్కొనవలసి వచ్చినది. యూరప్‌న నెపోలియన్ [చూ. పు. 543] ప్రాముఖ్యమును గణించి గ్రేట్‌బ్రిటన్‌ను వ్యాపార దిగ్బంధనముచే లొంగదీయుటకు కృషిచేయగా, అందులకు ప్రతీకారముగ ఫ్రెంచి రేవులతో తటస్థ రాజ్యములు ఏవియు వ్యాపారము చేయకుండ నిరోధమును బ్రిటన్ కలిగించినది. దీనివలన యునైటెడ్ స్టేట్స్ రాజ్యపు విదేశ వ్యాపారమునకు దెబ్బతగిలినది. అందువలన గ్రేట్ బ్రిటన్‌తో యునైటెడ్ స్టేట్స్ యుద్ధమునకు దిగినది (1812). కెనడాలోని తమ సేనలును, ఎఱ్ఱ ఇండియన్ దళములును సాయపడుటవలన బ్రిటిష్‌వారు తొలుత కొన్ని విజయములను సాధించినను, యునైటెడ్ స్టేట్స్ వలన తీవ్ర ప్రతిఘటనను ఎదుర్కొనుటయే కాక, తరువాత కొన్ని ముఖ్య రంగములందు కొన్ని పరాజయములను పొందిరి. అంతట ఉభయపక్షములును యుద్ధముతో విసువెత్తి సంధి కుదుర్చుకొనినవి (1815). అప్పటికి నెపోలియన్ పదభ్రష్టుడగుటవలన యుద్ధకారణములు అంతరించినవి.

పశ్చిమమున లూజియానాను కలుపుకొనిన తరువాత యునైటెడ్ స్టేట్స్ తక్కిన దిశల విస్తరించుటకును అవకాశము లభించినది. 1822 లో స్పెయిన్‌నుండి ఫ్లోరిడాను 50 లక్షల డాలర్లకు* కొనుకోలుచేసినది. ఈ విధముగ దేశ విస్తీర్ణము పెరిగిన కొలది క్రొత్త రాష్ట్రములు రూపొందినవి. ఇట్టి రాష్ట్రములను ఫెడరల్ రాజ్యాంగమున భాగస్వాములుగ చేర్చుకొనుటలో కొన్ని సమస్యలు ఉదయించినవి. అప్పటికే ప్రపంచ నాగరక రాజ్యములందు బానిసత్వము అనాగరక విషయముగ పరిగణింపబడుట మొదలయ్యెను. కాని, ఈ విషయమున యునైటెడ్ స్టేట్స్‌లో ఉత్తర, దక్షిణ రాష్ట్రముల మధ్య విభేదములు పొడమెను. బానిసత్వము అమలులో ఉన్న రాష్ట్రములను ఆ మీదట ఫెడరల్ రాజ్యమున చేర్చకూడదని ఉత్తర రాష్ట్రములవారు పట్టుబట్టిరి. దక్షిణ రాష్ట్రములు ఈ వాదమును వ్యతిరేకించినవి. మిస్సోరీ రాష్ట్రమును చేర్చుకొనుటలో ఈ సమస్య ఉదయించినది. కడకు ఒక రాజీ పరిష్కారమును అనుసరించి మిస్సోరీ చేర్చుకొనబడెను (1820). ఆ కాలమున యునైటెడ్ స్టేట్స్ అధ్యక్షుడు జేమ్స్ మన్రో; యూరప్‌లోని రాజకీయముల దుష్ఫలితములు అమెరికాఖండమునకు వ్యాపింపకుండ జేయుటకు ఇతడు రూపొందించి ఆచరణలోనికి తెచ్చినదియే మన్రో సిద్ధాంతము [చూ. పు. 729].

ఇంతలో యునైటెడ్ స్టేట్స్ దక్షిణపు సరిహద్దునకు ఆవల ఉన్న మెక్సికోలో బానిసత్వము నిర్మూలింపబడినది. కాని, మెక్సికోలోని ఒక రాష్ట్రమగు టెక్సాస్‌కు ఈ చర్య రుచించక ఆ రాష్ట్రము స్వాతంత్ర్యము ప్రకటించినది (1836). ఆ స్వాతంత్ర్యమును యునైటెడ్ స్టేట్స్ గుర్తించుటయే కాక, తరువాత, ఆ రాష్ట్రపు అభ్యర్థనపై దానిని ఫెడరల్ రాజ్యాంగమున ఒక రాష్ట్రముగ చేర్చుకొనినది. ఆ తరువాత మెక్సికో, యునైటెడ్ స్టేట్స్‌ల మధ్య సరిహద్దు తగవు ప్రజ్వరిల్లి, యుద్ధముగ పరిణమించి, మెక్సికో పరాజయముతో ముగిసినది. దీని పర్యవసానముగ కుదిరిన

* డాలర్ ఒకటికి రూ. 7-50 (1967).

సంధివలన ఇప్పటి కాలిఫోర్నియా, నెవాడా, ఊటా రాష్ట్రములును, న్యూ మెక్సికో, అరిజోనా, కొలరాడో రాష్ట్రములలోని కొన్ని ప్రాంతములును యునైటెడ్ స్టేట్స్‌కు లభించినవి.

యునైటెడ్ స్టేట్స్ రాజకీయములలో బానిసత్వము ఒక ముఖ్య సమస్యగా 1852 నుండి రూపొంది, కడకు అంతర్యుద్ధమునకు త్రోవతీసినది. మిస్సోరీకి రాజ్యాంగమున ప్రవేశము కల్గించినపుడు (1820) జరిగిన రాజీ పరిష్కారము వలన ఉ. అక్షాంశ 36° 30′ కు ఉత్తరమున ఉండు రాష్ట్రములలో బానిసత్వము నిషేధింపబడవలయునను సంప్రదాయము ఏర్పడినది. కాని, కాలిఫోర్నియాను బానిసత్వము లేని రాష్ట్రముగ చేర్చుకొనుట దక్షిణ రాష్ట్రములకు కష్టజనకమయ్యెను. ఆ తరువాత బానిసత్వ సమస్యను ఆ యా రాష్ట్రములకు వదలివేయవలసినదే అను క్రొత్త ప్రతిపాదనను కొందరు లేవదీసిరి. ఇందువలన బానిసత్వమును దొడ్డిదారిన ప్రవేశపెట్టుట అగునని బానిసత్వవ్యతిరేకులు భావించి ఆందోళన లేవదీసిరి.

ఇచట యునైటెడ్ స్టేట్స్‌లోని అప్పటి పార్టీలను గురించి ఒక విషయమును చెప్పవలసి ఉన్నది. పూర్వపు ఫెడరలిస్ట్ పార్టీ 1812 - 14 లో బ్రిటన్‌తో జరిగిన యుద్ధమును వ్యతిరేకించుటవలన నామమాత్రావశిష్టమైనది. అప్పటి రిపబ్లికన్ పార్టీయు కాలక్రమమున నూతన భావములతో ముడివడక అంతరించినది. అంతట ప్రజాస్వామ్యభావములను ముఖ్యప్రాతిపదికగ కలిగిన డెమోక్రాటిక్ పార్టీ అవతరించగ, దానిలో పూర్వపు రిపబ్లికన్ పార్టీ సభ్యులు చేరిరి. ఆ డెమోక్రాటిక్ పార్టీకి ప్రతిపక్షముగ విగ్ పార్టీ అనునది కొంతకాలము పని చేసి, 1852 లో అంతరించినది. బానిసత్వపు సమస్య విషయమై డెమోక్రాటిక్ పక్షమున కొందరు ప్రముఖులు అనుసరించిన వైఖరికి ఫలితముగ ఆ పక్షమునుండి కొందరు విడివడి రిపబ్లికన్ పార్టీగ రూపొందిరి (మార్చి 30, 1854). అంతటినుండి ఈ రెండు రాజకీయ పక్షములే ఆ దేశపు రాజకీయరంగమున ప్రముఖత వహించినవి.

బానిసత్వ వ్యతిరేకతను బలపరచిన రిపబ్లికన్ పార్టీ 1869 లో జరిగిన ఎన్నికలలో అధ్యక్షపదవికి తన అభ్యర్థిగ అబ్రహామ్ లింకన్ [చూ.] ను నియమించి విజయము పొందినది. ఆ సమయముననే బానిసత్వమును సమర్థించు దక్షిణ రాష్ట్రములు సమాఖ్యనుండి విడివడి, వేరుగ రాజ్యకూటమి (కాన్ఫెడరసీ) ని స్థాపించుకొన నిర్ణయించుకొనినది. క్రమముగ 1861 నాటికి ఈ కూటమిలో చేరుటకు దక్షిణమునందలి 11 రాష్ట్రములును అంగీకరించినవి. ఈ దుందుడుకు చర్యను అవలంబించినవారితో సామరస్యమున పరిష్కారమును సాధించుకొనుటకై లింకన్ తొలుత కృషిచేసెను. బానిసత్వము అప్పటికే అమలులో ఉన్నచోట అది తొలగింపబడదని అతడు వాగ్దానము ఇచ్చినను దక్షిణరాష్ట్రములు అంగీకరింపక విడిపోవుటకే యత్నించినవి. అంతట దేశ ఐక్యమును కాపాడుటకై సైన్య సాహాయ్యమును గ్రహించుటతో దేశమున అంతర్యుద్ధము మొదలై, 1861, ఏప్రిల్ 12 నుండి 1865, ఏప్రిల్ 26 వరకు సాగి, జాతీయైక్యమును వాంఛించు అబ్రహామ్ లింకన్ విజయముతో ముగిసినది. అంతట బానిసత్వము చట్టరీత్యా దేశమున రద్దయినది (మార్చి, (1866). ఈ కాలముననే అలాస్కాను రష్యానుండి యునైటెడ్ స్టేట్స్ కొనుగోలు చేసి, దేశవిస్తృతిని పెంచినది (1867). అంతేకాదు, పసిఫిక్ మహాసముద్రమున హవాయీ మొదలగు ద్వీపములపై పలుకుబడిని సంపాదించుటయే కాక, ప్రాచ్య ఆసియా రాజకీయములందు జోక్యమును కలిగించుకొనుటకును మొదలుపెట్టినది [చూ. చీనా పు. 453; జపాన్ పు. 461].

యునైటెడ్ స్టేట్స్ దేశము పారిశ్రామికరంగమున త్వరితగతిలో పురోగమింప 19 వ శతాబ్ది ఉత్తరార్ధమున మొదలిడినది. తూర్పు, పడమటి తీరములను కలుపు రైలు మార్గము 1869 లో పూర్తియగుటతో దేశ సమైక్యసాధనకు మార్గము సుగమమైనది. అంతట ముడిపదార్థముల తరలింపు సులభతరమై, వివిధ ప్రాంతములందు పెక్కు పరిశ్రమలు నెలకొనినవి.

అప్పటి అధ్యక్షుడు 1901 లో హత్య చేయబడుటవలన, ఉపాధ్యక్షుడగు థియోడోర్ రూజ్‌వెల్ట్ అధ్యక్షుడై నంతటినుండియు యునైటెడ్ స్టేట్స్ అన్ని రంగములందును నూతన ఉత్సాహముతో పురోగమింప మొదలిడినదని చెప్పవచ్చును. ఇతని కాలమున పనామా కాలువ త్రవ్వకములో యునైటెడ్ స్టేట్స్ శ్రద్ధ వహించుటయే కాక ఆ కాలువ ఆధిపత్యమును ఆర్జించినది. ఈ కాలముననే క్యూబా, పోర్టోరికో దేశములలో పలుకుబడియు, ఫిలిప్పీనులపై ఆధిపత్యమును ఈ దేశమునకు లభించినవి (1898). హవాయీద్వీపము ఈ దేశపు ఆధిపత్యమునకు లొంగినది.

**ఆధునికయుగము** (1912- ): థియోడోర్ రూజ్‌వెల్ట్ తరువాత (1912) అధ్యక్షుడైన వుడ్రో విల్సన్ [చూ.] ప్రపంచ చరిత్రలో ప్రముఖస్థానమును ఆర్జించినవారిలో ఒకడు. ఈతని కాలమున ప్రథమ ప్రపంచయుద్ధము చెలరేగినది. తొలుత దీనిలో జోక్యమును వహించుటకు యునైటెడ్ స్టేట్స్ సంకల్పింపకున్నను, కడకు స్వప్రయో

జనముల రక్షణకును, ప్రజాస్వామ్యమును కాపాడుటకును మిత్రమండలిపక్షమున యుద్ధములో చేరినది (ఏప్రిల్ 6, 1917). యుద్ధమున జర్మనీయు, దాని మిత్రదేశములును పరాజితములైన తరువాత శాంతిసంధిని ఉదాత్తాశయములతో రూపొందించుటకు విల్సన్ చేసిన కృషి విఫలత చెందుటయే కాక, అతని కృషిచే నిర్మింపబడిన నానాజాతి సమితి [చూ. పు. 531] ని బలపరచుటకు యునైటెడ్ స్టేట్స్‌ప్రభుత్వము సైతము నిరాకరించి వైదొలగినది.

ప్రపంచయుద్ధము - I ముగిసిన తరువాత యునైటెడ్ స్టేట్స్ యూరప్ రాజకీయములనుండి వైదొలగి తన దృష్టిని అమెరికా ఖండపు రాజకీయములకును, పసిఫిక్ మహాసముద్రమున తన ప్రతిపత్తిని అభివృద్ధిపరచుకొనుటకును వినియోగించినది. దీనికితోడుగ 1929 అంతమున వచ్చిన ఆర్థికసంక్షోభము ఆ దేశపు రాజకీయవేత్తలను ఒక సవాలుగ ఎదుర్కొనినది. ఆ సవాలును ఎదుర్కొని వినూతన మార్గముల మూలమున దానిని పరిష్కరింప బూనుకొనినవాడు 1933 లో అధ్యక్షుడుగ ఎన్నికైన ఫ్రాంక్లిన్ డి. రూజ్‌వెల్ట్ [చూ.]. ఈతడు ప్రతిపాదించి అమలులోనికి కొనివచ్చిన న్యూడీల్ (నవ్యవ్యవహారణ) వలన యునైటెడ్ స్టేట్స్ ఆర్థిక, సామాజిక రంగములందు పెక్కు మార్పులు ప్రవేశపెట్టబడినవి. వ్యక్తిగతస్వామ్యముల పవిత్రతకు అలవాటుపడిన యునైటెడ్ స్టేట్స్‌లోని ప్రజలలో కొందరికి ఇవి దాదాపు విప్లవాత్మక సంస్కరణలుగ గోచరించినవి. మూతపడిన పరిశ్రమలను ప్రభుత్వపు జోక్యముతో, సహాయముతో మరల ఉజ్జీవితములుగ చేయుటకు అతడు చేసిన కృషి ప్రజల ప్రాతిపదిక వ్యక్తిగత స్వామ్యములకు భంగకరముగ కొందరు భావించిరి. కొన్ని పట్టుల న్యాయస్థానములును అందులకు వ్యతిరేకించినవి. అయినను పట్టువిడువక రూజ్‌వెల్ట్ అంతటంతట తన కృషిని పరిస్థితులకు అనుగుణముగ మార్పొందించి కొనసాగించెను. ఇందువలన యునైటెడ్ స్టేట్స్ ప్రజానీకపు భావనలోనే కొంత మార్పు ఘటిల్లి, సామాజిక సుస్థిరతా దృష్టితో, తగు పరిమితులకు లోబడి, ప్రభుత్వము వ్యక్తిగత స్వామ్యములో జోక్యము కలిగించుట సమంజసమను అభిప్రాయమునకు బలము ఏర్పడినది.

రూజ్‌వెల్ట్ అధ్యక్షుడుగ ఉన్నకాలముననే ద్వితీయ ప్రపంచయుద్ధము ఆరంభమైనది. 1935, 1936, 1937 లలో తాటస్థ్య చట్టములను రూపొందించి యునైటెడ్ స్టేట్స్ యూరప్ దేశముల యుద్ధములలో తాను తటస్థత వహించుటకు దృఢసంకల్పమును వెల్లడించినది. అంతేకాదు యుద్ధము ఆసన్నమగు స్థితి వచ్చినపుడు దానిని నివారించుటకును, సామరస్యసాధనకును రూజ్‌వెల్ట్ కృషిచేసి విఫలుడయ్యెను. కడకు యుద్ధము మొదలై 1940 లో డన్‌కర్క్ వద్ద మిత్రమండలిసేనలు ఘోర పరాజయము పొందిన తరువాత యునైటెడ్ స్టేట్స్ తన సానుభూతిని ప్రజాస్వామ్యముల ఎడ ప్రదర్శించుటయే కాక, అరువు-కౌలు చట్టముద్వారా గ్రేట్‌బ్రిటన్‌కును, 1941 మొదలుగ జర్మనుల దండయాత్రకులోనైన సోవియట్ రష్యాకును విరివిగ సాయముచేసినది. అవల దూరప్రాచ్యమున సైతము యునైటెడ్ స్టేట్స్ తన దౌత్య వ్యవహారముల మూలమున జపాన్ దేశపు ఔద్ధత్యమును అరికట్టుటకు యత్నించినది. కాని, కడకు 1941, డిసెంబరు 7 న పెరల్ హార్బర్‌పై జపాన్ విమానములు దండయాత్రచేసి, అచట నౌకాదళమును ధ్వంసము చేయుట మూలమున యునైటెడ్ స్టేట్స్ యుద్ధమున దిగినది [చూ. సమీక్ష పు. 152; ప్రపంచ యుద్ధములు పు. 594, 608]. ఆ యుద్ధకాలమున ఐక్యరాజ్యములకు ఆయుధ నిర్మాణాగారముగను, ఆహార భాండారముగను యునైటెడ్ స్టేట్స్ ఉపకరించుటయే గాక, తన సేనలను ఉత్తర ఆఫ్రికాయందు దింపి, అట నుండి క్రమముగ పశ్చిమ యూరప్‌కు విమోచనమును కలిగించుటకును, జర్మనీని ఓడించుటకును, పసిఫిక్ రంగమున జపాన్ సేనలను అరికట్టుటకును తోడ్పడినది. తుదకు ఆటంబాంబు ప్రయోగము మూలమున జపాన్ లొంగుటతో (సెప్టెంబరు 7, 1946), ద్వితీయ ప్రపంచ యుద్ధము అంతమైనది.

యుద్ధమధ్యకాలమున రూజ్‌వెల్ట్ గతించుట (ఏప్రిల్, 1945) వలన ఉపాధ్యక్షుడు హారీ ఎస్, ట్రూమన్ అధ్యక్ష పదవిని స్వీకరించెను. ఈయన ఆధ్వర్యవమున యునైటెడ్ స్టేట్స్ దేశము, ఐక్యరాజ్య సమితి నిర్మాణ విషయమునను, యుద్ధానంతర ప్రపంచ సమస్యా పరిష్కారమునను ప్రముఖ పాత్ర వహించినది. దాదాపుగ ప్రాచ్య యూరప్‌ను అంతటిని తన పలుకుబడిలోనికి తీసికొనగలిగిన సోవియట్ రష్యా వలన కమ్యూనిజమ్ తక్కిన ప్రాంతములకు వ్యాపింపకుండ చేయుటకు యునైటెడ్ స్టేట్స్ అసామాన్య కృషిని ద్విముఖముగ సాగించినది. ఇందొకటి ఆర్థికము; వేరొకటి సైనికము. తొలి దానివలన యుద్ధ ఫలితముగ ఆర్థికముగ దెబ్బతినిన పశ్చిమ యూరపియన్ రాజ్యములకు 1947 లో మొదలిడబడిన మార్షల్ ప్లాన్ వలనను, 1952 లో మొదలిడబడిన పరస్పర భద్రతా సంఘము వలనను సహాయము విరివిగ ఈయబడినది. తరువాత నాటో మొదలగు రక్షణ ఒడంబడికల ద్వారా సైనిక సాహాయ్యము చేకూర్చబడినది. కాని, ఈ కాలముననే యునైటెడ్ స్టేట్స్ ఆకాంక్షలకు

విరుద్ధముగ చీనాయందు కమ్యూనిస్టుల ప్రజాగణరాజ్యము ఏర్పడినది. అంతట తైవాన్‌లో నెలవు ఏర్పరచుకొనిన పూర్వపు చీనాప్రభుత్వమును మాత్రమే యునైటెడ్ స్టేట్స్ గుర్తించి దానికి సాయముచేయుచు, భద్రతా సంఘమున దాని ప్రతిపత్తిని కాపాడ గలిగినది [చూ. చీనా ప్రజాగణరాజ్యము - పు. 453]. ఆ తరువాత కమ్యూనిజమ్ వ్యాప్తిని అరికట్టుటకై ఐక్యరాజ్యసమితి ఆ దేశములను అనుసరించి కొరియాయుద్ధమున యునైటెడ్ స్టేట్స్ సేనలు పోరాడినవి, తత్ఫలితముగ దక్షిణ కొరియా సుస్థిరముగ నిలువబడగలిగినది [చూ. కొరియా, ఉత్తర - పు. 405; కొరియా, దక్షిణ - పు. 406].

ట్రూమన్ [చూ. పు. 505] కాలము మొదలుగ ప్రపంచ రాజకీయములందు యునైటెడ్ స్టేట్స్ ప్రముఖ పాత్ర వహించి వ్యవహరించుచున్నది. అస్వతంత్ర రాజ్యములకు స్వాతంత్ర్యము చేకూర్చుటవలన మాత్రమే శాంతియుత నవ్యప్రపంచము రూపొందగలదని ఆ రాజ్యము భావించి, అందులకు అనుగుణముగ ఫిలిప్పీన్‌లకు స్వాతంత్ర్యమొసగి (1946), బ్రిటన్ మొదలగువానికి మార్గదర్శకమైనది. అంతే కాక సోవియట్ రష్యాతో అన్ని విధముల పోటీపడి వ్యవహరించుచునే, ప్రపంచ భద్రత కొరకై సాధ్యమైనంతవరకు ఆ దేశముతో సామరస్య వైఖరిని అవలంబించుటకును యునైటెడ్ స్టేట్స్ దేశము కృషి చేయుచున్నది. ముఖ్యముగ సోవియట్ రష్యాయందు కృశ్చేవ్ [చూ. పు. 395] ప్రధానిగను, యునైటెడ్ స్టేట్స్‌లో కెనెడీ [చూ. పు 339] అధ్యక్షుడుగను ఉన్న కాలమున ఈ కృషి కొంత సుముఖతను చేకూర్చుకొనినది. పశ్చిమార్ధ గోళమున క్యూబా [చూ. పు. 411] యందు కమ్యూనిజమ్ నెలవు ఏర్పరచుకొనుటవలన సోవియట్ రష్యా దేశపు ఆయుధ సహాయమువలన క్యూబానుండి తమదేశ భద్రతకు భంగము కలుగునను భయముతో కెనెడీ ప్రతీకారచర్యకు సంకల్పించుటతో ఏర్పడిన యుద్ధభయము కెనెడీ - కృశ్చేవ్‌ల రాజనీతి చాతుర్యమువలన తొలగిపోయినది. కెనెడీ హత్యచేయబడిన తరువాత (23 నవంబరు, 1963) సైతము, అధికారమును వహించిన లిండన్ జాన్సన్ [చూ. పు. 483] ఈ విధానమునే కొనసాగింపదలచెను. కాని, వియెత్నామ్ సమస్య ఈ దేశముల మధ్య సంబంధములను కలుషితము చేసినది. దక్షిణ వియెత్నామ్‌లోని కమ్యూనిస్టేతర రాజకీయ వ్యవస్థకు ఉత్తర వియెత్నామ్‌లోని కమ్యూనిస్ట్ రాజ్యపాలకుల ప్రోత్సాహఫలితములగు దౌర్జన్యచర్యలవల్ల భంగము కలుగుచున్నదనియు, తన్మూలమున కమ్యూనిజమ్‌వ్యాప్తియై ప్రపంచశాంతికి భంగము ఏర్పడుననియు భావించి, యునైటెడ్ స్టేట్స్ తన సేనలను దక్షిణ వియెత్నామ్‌లో కమ్యూనిస్టులను ఎదుర్కొనుటకు పంపుటయేగాక, ఉత్తర వియెత్నామ్‌పై బాంబులను వర్షించుటకును పూనుకొనినది. ప్రపంచశాంతికి ఇది అత్యవసర చర్య అని యునైటెడ్ స్టేట్స్ తలంపు.

ఆ దేశపాలకుల పై భావనతో కొందరు అంగీకరింపక పోయినను, ప్రపంచ భవితవ్యమును నిర్ణయించు ప్రముఖ రాజ్యములలో ఒకదానిగ యునైటెడ్ స్టేట్స్‌కుగల స్థానమును కాదనువారు లేరు. నేడు ప్రపంచమున వర్ధమాన రాజ్యములలోని ఆకలి సమస్యను, అవిద్యను, పారిశ్రామిక దుర్బలతను తొలగించుటకు వివిధ మార్గములమూలమున యునైటెడ్ స్టేట్స్ కృషి చేయుచున్నది. [చూ. సమీక్ష - ఐక్యరాజ్యయుగము - పు. 194].

రాజ్యాంగము : ఈ దేశమున సమాఖ్యా (ఫెడరల్) రూపకమగు ప్రభుత్వము నెలకొని ఉన్నది. అధికార విభజనను ప్రాతిపదికగ గ్రహించిన ఈ దేశపు సమాఖ్యారూపక రాజ్యాంగము 1789 లో ఆమోదింపబడినది. అట్టిది ప్రపంచమున లిఖితరూపమున తొట్టతొలుతటిది ఇదియే అగుటవలన, తక్కిన అట్టి వివిధ దేశీయ రాజ్యాంగములకు ఇది ఒక విధముగ మార్గదర్శిని అయినది. జాతీయ (కేంద్ర) ప్రభుత్వమునకును, రాష్ట్రప్రభుత్వములకును మధ్య అధికారవిభజన ఈ రాజ్యాంగమున నిర్దిష్టముగ జరిగినది. జాతీయ ప్రభుత్వపు శాసన నిర్మాణాధికారములు అన్నియు 'కాంగ్రెస్' నందు న్యస్తములైనవి. ఈ కాంగ్రెస్‌నందు హౌస్ ఆవ్ రిప్రజెంటేటివ్స్ (ప్రతినిధిసభ), సెనేట్ అను రెండు కక్ష్యలు కలవు. ప్రతినిధి సభయందు 435 మంది సభ్యులు కలరు. ఇందు ప్రతి రాష్ట్రమునకు జనాభా నిష్పత్తిని అనుసరించి ప్రాతినిధ్యము కలదు. పది ఏండ్లకు ఒకసారి జరుగు జనాభా లెక్కలను అనుసరించి ఈ సభిక సంఖ్య మార్పొందును. రెండేండ్లకు ఒకసారి ఈ ప్రతినిధుల ఎన్నిక జరుగును. సెనేట్‌లో ప్రతి రాష్ట్ర పక్షమునను ఇరువురు ప్రతినిధులు ఉందురు. వీరిలో ఒకొక్కరి పదవీ కాల పరిమితి ఆరు సంవత్సరములు. రెండేండ్లకు ఒక పర్యాయము వంతువారీగా మూడవవంతు మంది సభ్యులు సెనేట్‌నకు ఎన్నుకొనబడుదురు. రాజ్యాంగమున నిర్ణయింపబడిన ఒక ప్రత్యేక క్లిష్టవిధానమును అనుసరించి ఒక ప్రత్యేక నియోజకమండలివలన నాలుగేండ్లకు ఒకసారి ప్రెసిడెంట్ (అధ్యక్షుడు) ఎన్నుకొనబడును. అతని ఎన్నిక కాలముననే వైస్-ప్రెసిడెంట్ (ఉపాధ్యక్షుడు) ఎన్నుకొనబడును. ఈతడు సెనేట్‌కు అధ్యక్షత వహించును. ప్రెసిడెంట్‌నకు మరణము, పదవీ పరిత్యాగము, అశక్తత

ప్రాపించినపుడు వైస్ - ప్రెసిడెంటే (ఉపాధ్యక్షుడు) ప్రెసిడెంట్ విధులను నిర్వహించును. ప్రెసిడెంట్ సర్వ సేనాపతిగను వ్యవహరించును. కాని, యుద్ధమును ప్రకటించు హక్కు కాంగ్రెస్‌నకు మాత్రమే కలదు [చూ. న్యాయశాస్త్ర సంపుటము]. చి. శే. రా.

యు - ఏ. చి. (చంద్ర వంశీయులు): చూ. కుషాన్‌లు - పు. 394.

**యూదులు :** ప్రపంచచరిత్రలో రాజకీయ, సాంస్కృతిక, ఆర్థిక రంగములందు విఖ్యాతిగాంచిన ఒక మతవర్గము. వీరు మాట్లాడు భాషకు హిబ్రూ అని పేరు. వీరిని గూర్చి వారి మతగ్రంథమగు పురాణప్రవచనమునందు - ముఖ్యముగ 'జెనెసిస్' 'ఎక్సోడస్'ల నుండి - కొంతవరకు తెలియుచున్నది. యూదుల ఆదిపురుషుడగు 'అబ్రహామ్', అతని వంశమువారు ఎట్లు ఈజిప్టుదేశములో ఖైదీలైనదీ జెనెసిస్ పుస్తకమునుండి మనకు కొంత తెలియవచ్చు చున్నది. వీరు 'మోషే' నాయకత్వమున నలుబది ఏండ్లు అరణ్యవాసము చేసి, పండ్రెండు తెగలై, అరేబియా ఎడారులనుండి తూర్పుగావచ్చి, (నేటి ఇస్రాయెల్ ప్రాంతపు) కేనన్ దేశముపై దండయాత్ర సలిపిరి. కాని, సముద్రతీరమునుగాని, ఫలవంతమైన ప్రదేశములనుగాని స్వాధీనపరచుకొనలేకపోయిరి. నిస్సారమైన కొండప్రదేశములు మాత్రమే వీరికి దక్కినవి. ఇట్లు ఇచ్చట నిలయములు ఏర్పరచుకొని తమ ప్రక్కన ఉన్న 'ఫిలిష్టన్' లు, మోబైట్లు మొదలగు వారితో నిరంతరము పోరాడుచుండిరి. యూదులు అల్ప సంఖ్యాకులైనను, మానవాభ్యుదయమునకు అపూర్వమైన సేవచేసి, శాశ్వత కీర్తిని గడించిరి.

యూదులు 'కేనన్' కు వచ్చిననాటినుండియే వారి చరిత్ర ఆరంభమగుచున్నది. మొదట ఈ యూదులు పండ్రెండు తెగలుగ విభజింపబడి, తమలో తాము పోరాడుకొనుచుండిరి కాని, 'కేనన్' దేశమును జయించుటకై వారు ఏకమైరి.

క్రీ. పూ. 11 వ శతాబ్ది అంతమున యూదుతెగలు అన్నియు ఏకపాలనము క్రిందకు వచ్చినవి. వీరిని అందరిని జయించి ఏకముచేసిన రాజు సాల్ (క్రీ. పూ. 1095 – 1056).

సాల్ తరువాత డేవిడ్ (క్రీ. పూ. 1506 - 1017 వ.) రాజై పరిసర రాజులతో ఎడతెగకుండ యుద్ధముచేయుచు తన రాజ్యమును ఎర్రసముద్రము మొదలు యూఫ్రటీస్ నది వరకు వ్యాపింపజేసెను. ఇతడు ఫిలిష్టన్‌లను ఓడించి, జెరూసెలెమ్‌ను తన రాజధానిగ చేసికొనెను. ఈ పట్టణము వారి జాతీయజీవనమునకు కేంద్రస్థానమయ్యెను. డేవిడ్ కుమారుడైన సాలమన్ కాలమున యూదుల రాజ్యము అత్యున్నతస్థితిలో ఉండెను. ఇతడు చాల ప్రజ్ఞావంతుడని పేరు కాంచెను. ఈతడు ఈజిప్టురాజకుమారిని వివాహమాడెను. టైర్ రాజగు హీరామ్‌తో కలసి వర్తకాభివృద్ధికై నౌకలు నిర్మించి, ఎర్రసముద్రము మీదుగ వర్తకము సాగించి లాభము గడించెను. జెరూసెలెమ్ నందలి సుప్రసిద్ధ దేవాలయమును కట్టించినది ఇతడే. ఆ దేవాలయమునకై ఉపయోగించిన టేకుకలప హిందూదేశమునుండి తెప్పింపబడెనని చరిత్రజ్ఞులు భావించుచున్నారు.

సాలమన్ అనంతరము యూదురాజ్యము క్షీణింప మొదలిడెను. అతని కుమారుడైన 'రిహోబోమ్' పాలనమున అంతఃకలహములు ఎక్కువై ఉత్తరమునందు ఉండిన పది తెగలవారును తిరుగబడి, 'ఇస్రాయెల్' అను నూతన రాజ్యమును స్థాపించుకొనిరి. దక్షిణమందు ఉండిన 'జూడా (యూడా)', బెన్‌జిమెన్ తెగలవారు జూడా రాజ్యమును నిర్మించుకొని, సాలమన్ వంశీయుల ఎడ భక్తి గలవారై, వారికి లోబడి ఉండిరి. దీనికి ముఖ్యపట్టణము జెరూసెలెమ్. మొదటనే బలహీనమై, బలిష్ఠమైన సామ్రాజ్యముల నడుమ చిక్కుకొని పలుకష్టములు పడుచుండిన యూదురాజ్యము, ఇందుచేత మరింత బలహీనమై శత్రురాజుల దాడికి ఆగలేకపోయెను. తుదకు అసీరియారాజగు సార్గన్ ఇస్రాయెల్ రాజ్యమును వశపరచుకొనెను. బాబిలోనియా రాజైన నెబ్యుకడ్‌నేజర్ క్రీ. పూ. 7 వ శతాబ్దిలో జూడారాజ్యమును జయించి జెరూసెలెమ్ పట్టణమును కొల్లగొట్టి యూదులను చాలమందిని బాబిలన్‌పట్టణమునకు ఖైదీలుగా తీసుకొనిపోయెను. బాబిలోనియాలో బందీలై ఉండినపుడు యూదులు పడరాని అగచాట్లు పడిరి. పారసీకచక్రవర్తియైన కురుష్ (సైరస్) బాబిలోనియాను జయించిన పిదప యూదులు మరల తమ దేశమునకు పోయి తమ దేవాలయములను నిర్మించుకొనవచ్చునని ఆజ్ఞయిచ్చెను. వేలకొలది యూదులు స్వదేశమునకు మరలివచ్చి, తమ దేవాలయములను పునర్నిర్మాణము చేసికొన మొదలిడిరి. క్రీ. పూ. 515 లో ఆ పని పూర్తి చేసికొనిరి. యూదులు తమలోని విభేదములను మరచి జూడా తెగతో ఏకమైరి. అంతటినుండి వారిజాతికి యూదుజాతి అనియు వ్యవహారము కలిగినది. దేశమునకు 'ఇస్రాయెల్' అను పేరుతో పాటుగ 'జూడా' అను వ్యవహారమును ఏర్పడినది.

జూడాదేశము పారసీకసామ్రాజ్యములో ఒక భాగమై, చక్రవర్తికి కప్పమును చెల్లించుచుండెను. మేసిడోనియా



యూరప్
రాజకీయ విభాగములు
స్కేలు
మైళు 0 200 400 600
కి. మీ. 0 400 800 1200

రాజగు 'అలిగ్జాండర్' పారసీకమును జయించిన పిమ్మట జెరూసెలెమ్‌నకు వెళ్ళి, యూదుల దేవాలయమును దర్శించెను. అతని మరణానంతరము జూడాదేశము ఈజిప్టును పాలించిన 'టాలమీ' ల పాలనక్రిందికి వచ్చెను. హిబ్రూమతగ్రంథములు ఈ కాలమున గ్రీక్ భాషలో వ్రాయబడెను.

సిరియారాజగు 'అంటియోకస్' జూడాను 202 లో జయించెను. అతని కుమారుడైన అంటియోకస్ ఎపిఫెనీస్ యూదులను హింసించెను. దీనిని భరింపలేక యూదులు తమ నాయకుడైన జూడా మెకబీయస్ నాయకత్వమున తిరుగబడి, స్వాతంత్ర్యమును సంపాదించుకొనిరి. కాని, వీరు స్వాతంత్ర్యమును ఎంతకాలమో అనుభవింపలేదు. అంతఃకలహములచే దేశమంతయు అరాజకమై బలహీనమై ఉండగా, రోమన్ సేనానాయకుడగు 'పాంపే' [చూ. పు. 560] క్రీ. పూ. 63 లో మూడు నెలలు ముట్టడించి జెరూసెలమ్‌ను జయించెను. జూడా అప్పటినుండి తన స్వాతంత్ర్యమును కోల్పోయి రోమ్‌సామ్రాజ్యములో ఒక భాగమైపోయెను [చూ. ఇజ్రాయెల్ - పు. 317; హిబ్రూమతము సం. 7 - పు. 773] వి. నా.

**యూనియన్ ఆవ్ సోవియట్ సోషలిస్ట్ రిపబ్లిక్స్ :** చూ. సోవియట్ రష్యా.

**యూరప్ :** ప్రపంచమందలి ముఖ్య భూఖండములలో ఒకటి. ప్రాదేశికముగ ఇది ఆసియా ఖండముతో కలసియే ఉన్నను, చారిత్రక, సాంస్కృతిక విభిన్నతను అనుసరించి, వేరొక ఖండముగ పరిగణింపబడుచున్నది. కాకసస్, యూరల్ పర్వతములందలి ఉచ్చతమ శిఖరములను అనుసరించు రేఖ ఆసియా, యూరప్‌ల మధ్య సరిహద్దు రేఖగ వ్యవహరింపబడుచున్నది. తక్కిన ఖండములలో ఆస్ట్రేలియా తప్ప తక్కిన ఏ ఒక ఖండము కన్నను, వైశాల్యమున యూరప్ ఖండము తక్కువదిగ ఉన్నది. ముఖ్య భూఖండమునకు వెలుపల ఉన్న ద్వీపములగు బ్రిటన్, ఐర్లాండ్, ఐస్‌లాండ్ దేశములును, గ్రీస్ దేశమున అంతర్భాగములుగ పరిగణింపబడు ఈజియన్ సముద్రస్థ ద్వీపములును, స్కాండినేవియా రాజ్యములను ఇటలీ ద్వీపకల్పమును, ఫిన్లాండ్‌ను ఆశ్రయించియున్న సమీప ద్వీపములును యూరప్‌నందు చేరినవిగనే లెక్కింపబడుచున్నవి. వీని యన్నిటితో చేరి ఈ ఖండపు [వి] 1,00,27,853 చ. కి. మీ.

ఈ ఖండము ఇపుడు ఈ క్రింది రాజ్యములుగ విభక్తమై ఉన్నది.

1. ఆన్‌డొర్రా; 2. ఆల్‌బేనియా; 3. ఆస్ట్రియా; 4. ఇటలీ; 5. ఐర్లాండ్; 6. ఐస్‌లాండ్; 7. గ్రీస్; 8. జర్మనీ (తూర్పు); 9. జర్మనీ (పశ్చిమ); 10. జెకోస్లొవాకియా; 11. డెన్మార్క్; 12. నార్వే; 13. నెదర్లండ్స్; 14. పోర్చుగల్: 15. పోలండ్; 16 ఫిన్లాండ్; 17. ఫ్రాన్స్; 18. బల్గేరియా; 19. బెల్జియమ్; 20. మొనాకో; 21. యుగోస్లావియా; 22. యునైటెడ్ కింగ్‌డమ్; 23. రుమేనియా; 24. లక్జెంబర్గ్; 25. లిక్టెన్‌స్టీన్; 26. వాటికన్ నగరము; 27. సాన్‌మారినో; 28. స్పెయిన్; 29. స్విజర్లండ్; 30 స్వీడెన్; 31. హంగేరీ. ఇవి కాక సోవియట్ రష్యా రాజ్యమున యూరల్ పర్వతములకు పశ్చిమమందు ఉన్న భాగము [వి] 50,99,994 చ. కి మీ. యూరప్‌నందే చేరి ఉన్నది. చీ. శే. రా.

**యెమెన్ :** అరేబియా ద్వీపకల్పమున నైరృతి తీర భాగమందు ఉన్న ఒక స్వతంత్ర రాజ్యము.




ఈ రాజ్యమునకు సౌదీ అరేబియా [ఉ]; ఏడెన్ [ద, తూ]; ఎర్రసముద్రము [తూ, ప] సరిహద్దులు. [వి] దాదాపు 1,95,000 చ. కి. మీ.; [జ] దాదాపు 50,00,000. [రా] సానా (జ. సం. 80,000); తాయిజ్ (జ. సం. 30,000).

చరిత్ర: మానవ ప్రాచీన చరిత్రలో కొంత ప్రాముఖ్యమును పొందిన సబేయన్, మినేయన్ రాజ్యములు ఇట వర్ధిల్లి క్రమముగ క్రీ. పూ. 800 నాటికి అంతరించినటుల అవశేషములవలన తెలియవచ్చినను, ఆనాటి చారిత్రక విశేషములు ఏవియు తెలియవచ్చుట లేదు. తొలుత నుండియు సెమిటిక్ జాతులకు నిలయముగ ఉండిన ఈ

ప్రాంతమున క్రీ. శ. ౭ వ శతాబ్దమున ఇస్లామ్ వ్యాపించెను. ఇస్లామిక యుగమున ఈ దేశము అరబ్బీభాషాసంస్కృతులకు సుప్రసిద్ధ కేంద్రముగ ఉండెను. కాలక్రమమున తక్కిన అరబ్బీ రాజ్యములతో పాటుగ ఈ ప్రాంతము టర్కీ సమ్రాట్‌ల అధీనము అయ్యెను. ప్రథమప్రపంచ యుద్ధానంతరమున టర్కీ సామ్రాజ్యము అంతరింపగ, ఈ ప్రాంతపు అరబ్బీతెగలపై ఆధిపత్యము వహించు ఇమామ్ స్వాతంత్ర్యమును ప్రకటించెను (1918). ఈ స్వాతంత్ర్యము చాలకాలము వరకు ఇతర రాజ్యములచే గుర్తింపబడలేదు. ఆ అవకాశమును ఉపయోగించుకొని సౌదీ అరేబియా ఈ దేశముపై యుద్ధము ప్రకటించి, కొంత సరిహద్దు ప్రాంతమును తన దేశమున కలుపుకొనిన తరువాత మైత్రి ఒడంబడికను కుదుర్చుకొనెను (మే, 1934). తరువాత బ్రిటన్‌కూడ ఈ దేశమును గుర్తించి తన రక్షిత రాజ్యమగు ఏడెన్‌కు యెమెన్‌తో కల సరిహద్దును సరిజేసికొని, ఇమామ్ అగు యాహ్యా ఇబ్న్ మహమ్మద్‌ను యెమెన్ రాజుగ గుర్తించెను (1 సెప్టెంబరు, 1934). ఈ రాజరికపు కాలమున దేశము ఏమియు అభివృద్ధినందలేదు. 1956 లో ఈ రాజ్యము ఈజిప్తుతో సమాఖ్యరీతిలో సిరియాతో పాటుగ సమ్మేళనము చెందెను. కాని, ఈజిప్టు అధ్యక్షుడు నాసర్ [చూ. పు. 533] అవలంబించు సామ్యవాదపద్ధతి యెమెన్ పాలకునికి నచ్చనందున 1958 లో ఆ సమాఖ్య విడిపోయి, యెమెన్ యథారీతిగ స్వతంత్రరాజ్యము అయ్యెను. 1962 లో అప్పటి ప్రభువు మరణించిన తరువాత సైనికోద్యోగులు అధికారములను వశపరచుకొని రాజరికమును అంతమొందించి, దేశమున గణరాజ్య ప్రభుత్వమును స్థాపించిరి (18 సెప్టెంబరు, 1962). ఆ ప్రభుత్వమునకు అబ్దుల్లా ఆల్ సల్లాల్ అను సేనాని అధ్యక్షుడయ్యెను (31 అక్టోబరు, 1962). ఈతడే ప్రధానిగను, సర్వ సేనాపతిగను వ్యవహరించుచున్నాడు. కాని, రాజరికము ఎడల భక్తి శ్రద్ధలుగల కొన్ని సైనిక దళములు సౌదీ అరేబియా సాయమున ఈ గణరాజ్య ప్రభుత్వముతో పోరాటమును సాగించుచునే ఉన్నవి. ఈ పోరాటమున ప్రభుత్వమునకు ఈజిప్టుప్రభుత్వము సాయముచేసి తోడ్పడుచున్నది. ప్రపంచమున ప్రముఖ రాజ్యములు అన్నియు ఈ గణరాజ్య ప్రభుత్వమును గుర్తించినవి. యునైటెడ్ స్టేట్స్, చీనా, సోవియట్ రష్యా మొదలగు దేశముల ఆర్థిక సాహాయ్యమున ఈ దేశము నేడు పురోగమించుచున్నది. చీ. శే. రా.

**రంజిత్‌సింగ్, మహారాజా (1780 - 1839):** పంజాబ్ కేసరి అని ప్రసిద్ధికన్న సిక్కుపరిపాలకుడు; మహానాయకుడు. సర్దార్ మోహన్‌సింగ్ కుమారుడు. తండ్రి అనంతరమున 1792 లో ఈయన సిక్కు రాజ్యకూటమిలో సుకార్ చకియా శాఖకు అధినేత అయ్యెను. పుట్టుకచే ఒక మిసిల్‌కు మాత్రమే అధిపతి అయినను, ఇతడు తన ప్రజ్ఞాపాటవములవల్ల, ప్రగాఢ కృషివల్ల ప్రగతిని సాధించి, మహారాజ పదవిని చేపట్టెను. ఆఫ్ఘన్ రాజు జమాన్షా నుండి లాహోర్‌ను (1799) ఆర్జించి, 1822 లో అమృతసర్‌ను వశపరచుకొని, రంజిత్‌సింగ్ రెండు సిక్కు రాజధానులకు రాజు అయ్యెను. పంజాబ్‌ను అంతటిని ఒకే సిక్కురాజ్యముక్రిందకు కొనితేవలయునని అతని అభిలాష. కాని, మెట్కాఫ్ రాయబారము మూలమున రంజిత్‌సింగ్ 1809 లో బ్రిటిష్‌వారితో అమృతసర్ సంధి చేసికొని, సట్లెజ్ నదికి దక్షిణమునగల బ్రిటిష్ రక్షిత రాజ్యముల జోలికి పోకుండుటకు పూచీపడెను. ఇతడు తన సైన్యమునకు ఫ్రెంచి, ఇటాలియన్, బ్రిటిష్ సైనికోద్యోగులచే తర్ఫీదు ఇప్పించెను. పెక్కు ముట్టడులకు తరువాత ముల్తాన్‌ను స్వాధీనము చేసికొని, రంజిత్‌సింగ్ ఉత్తరమున కాశ్మీరమువరకు, పశ్చిమమున ముల్తాన్‌వరకు, వాయవ్యమున పెషావర్ వరకు తన రాజ్యమును విస్తరింపజేసెను. దోస్త్‌మహమ్మద్ [చూ. పు. 52౮] ను బర్తరఫ్ చేయుట తనకు సమ్మతము కాకున్నను, ఇతడు ఆఫ్ఘన్ యుద్ధమున బ్రిటిష్‌వారిని బలపరచెను. ఇతడు పంజాబీ భాషను పోషించెను; పంజాబీ బైబిలు (1715), అక్బర్ నామా అనువాదము ఈయన ప్రాపకము క్రిందనే రచింపబడినవి [చూ. సిక్కులు]. ఆ. వెం.

**రఘునాథరావు:** చూ. మహారాష్ట్రులు - పు. 737.

**రపల్లో ఒడంబడికలు:** ఇటలీదేశమందలి రపల్లో వద్ద వేర్వేరు రాజ్యముల మధ్య, వేర్వేరు సందర్భములందు జరిగిన ఇట్టి సంధులు రెండు కలవు:

1. ఇటలీ, యుగోస్లావియా మధ్య 12-11-1920 న జరిగిన సంధి: దీనిప్రకారము ఎడ్రియాటిక్ సముద్రతీర ప్రదేశముల గురించిన తగాదాలకు తాత్కాలిక పరిష్కారమును, సంధి ఒడంబడికలు కాపాడుటకు తీసుకొనవలసిన సమష్టి చర్యను గూర్చిన ఖరారును కుదిరెను;

2. జర్మనీ - సోవియట్ రష్యా నడుమ 16 - 4 - 1922 న జరిగిన సంధి: చరిత్రలో ఇది మిక్కిలి ప్రధానముగ పరిగణింపబడుచున్నది. ఈ సంధి పత్రము మూలకముగ పై రెండు దేశములకును మరల రాజకీయ దౌత్యసంబంధములు పునరుద్ధరింపబడెను. ఉభయులు ఒకరికి మరియొకరు ఈయవలసిన నష్టపరిహారములను వదలుకొనునట్లు నిర్ణయింపబడెను. ఆర్థికముగా ఒకరినొకరు సహాయము ఒనర్చుకొనుటకు ఉభయులు ఖరారుపడిరి.

అప్పుడు జర్మనీలో జరుగుచున్న ప్రపంచ ఆర్థిక మహాసభకు హాజరయిన ప్రతినిధులచే తలవనితలంపుగా కుదుర్చుకొనబడిన ఈ రష్యన్ - జర్మన్ సంధి బ్రిటిష్‌వారికిని ఒక రాజకీయ సవాలుగ పరిణమించుటయేకాక సోవియట్ రష్యా సైన్యాధినేతలకు జర్మనీ యుద్ధనిపుణుల పరిచితియు, తన్మూలమున యుద్ధతంత్రమున కుశలతయు చేకూరి ప్రపంచయుద్ధము - II న జర్మనీని ఎదుర్కొనుటకు సోవియట్ రష్యాకు సహాయభూతములైనవని కొందరి అభిప్రాయము. స్వ. వెం.

**రష్యా** : చూ. సోవియట్ రష్యా.

**రష్యా - జపాన్ యుద్ధము (1904 - 05)** : మంచూరియాలోనికిని, కొరియాలోనికిని చొచ్చుకొనిపోవుటకు రష్యా, జపాన్ దేశముల ప్రభుత్వములచేత జరుపబడిన పోటీప్రయత్నముల ఫలితముగ ఏర్పడిన యుద్ధము. యుద్ధప్రకటన చేయకయే జపానీయులు 8-2-1904 న ఆర్థర్ రేవులోని రష్యన్ నౌకాదళమును ఎదిరించిరి. అంతేగాక యాలూనదీతీరమందును, మంచూరియాలోనుగల రష్యన్ సైన్యములను క్రమముగ జయించుచు, యుద్ధమును కొనసాగించిరి. బాల్టిక్ సముద్రములో ఉన్న తమ నౌకాసైన్యమును దూరప్రాచ్యమునకు తరలించి, కోలుపోయిన తమ సముద్రాధిపత్యమును మరల సంపాదించుకొనుటకు రష్యన్‌లు చేసిన ప్రయత్నము 1905, మే లో తుషీమా వద్ద జపానీయులవలన వారు పొందిన ఘోరపరాజయమువల్ల విఫలమయ్యెను. అనంతరము ఈ ఉభయ రాజ్యములవారు యునైటెడ్ స్టేట్స్ మధ్యవర్తిత్వమును అంగీకరించి, న్యూ హాంప్‌షైర్‌లోని పోర్ట్స్‌మత్‌వద్ద సంధి కుదుర్చుకొని సంధి పత్రముపై 1905, ఆగస్టు 23 న సంతకము చేసిరి [చూ. పోర్ట్స్‌మత్ సంధి - పు. 587]. ఈ యుద్ధమున రష్యాకు సంభవించిన పరువు నష్టమే 1906 లో ఆ దేశమున లేవదీయబడిన ప్రజావిప్లవమునకు కారణభూతమయ్యెను. స్వ. వెం.

**రష్యా విప్లవము - అంతర్యుద్ధము (1917)** : రష్యా సామ్రాజ్య చరిత్రలోననే కాక, ప్రపంచ చరిత్రయందును అతి ప్రముఖస్థానమును వహించిన ఒక సంఘటన గ రష్యావిప్లవము (1917) పేర్కొనబడినది. క్రిమియా యుద్ధము (1856) న చేకూరిన అపజయమువలన దిగజారిన రష్యాసామ్రాజ్యప్రతిష్ఠ, 1905 లోని రష్యా - జపాన్ యుద్ధమున ఆ సామ్రాజ్యమునకు సంఘటిల్లిన ఘోరపరాజయమువలన అత్యంత నికృష్టస్థితిని ప్రాపించుటవలన పరిపాలనాయంత్రము పటుత్వము కోల్పోవుట ఈ విప్లవము బయలుదేరుటకు ఒకవిధముగ ఉపకరించినది. సాంఘిక వ్యవస్థలోని ప్రాతవడిన నిరంకుశవిధానమువలన ప్రజలలో రేకెత్తిన నిరాశానిస్పృహలే ఈ విప్లవమునకు మూలకారణములైనను, ప్రథమ ప్రపంచ యుద్ధమున పాల్గొనిన రష్యాప్రభుత్వము యుద్ధమును సరిగ నడుపజాలక దేశప్రజలకు సంఘటిల్ల జేసిన ధన, మాన, ప్రాణనష్టములే ఈ విప్లవమునకు సద్యః కారణములుగ పనిచేసినవి.

ఈ విప్లవమునకు నాయకత్వము వహించిన విప్లవకారులలో రెండు వర్గములవారు ఉండిరి. వారిలో తొలుతటి వర్గము ఉదారభావప్రేరితులగు విద్యావంతులకు చెందినది; రెండవది 'బోల్షివిక్‌లు' అనబడు సామాజికవిప్లవవాదుల వర్గము. రష్యాదేశము యుద్ధమున పాల్గొని గెలువగలదనియు, అందులకు అనువుగ దేశమున ప్రజాస్వామ్యగణరాజ్యప్రభుత్వమును నెలకొల్పవలెననియు తొలుతటి వర్గము ఆసించెను. ఇక రెండవ వర్గమువారు అప్పటి ప్రపంచయుద్ధము సామ్రాజ్యవాదుల యుద్ధము అగుటవలన అందు రష్యా పాల్గొనుట ప్రజా శ్రేయస్సునకు విరుద్ధమని భావించి, అధికారమును ఆర్జించిన పిదప దేశపు ఆర్థిక, సామాజిక వ్యవస్థలో విప్లవకరములగు మార్పులను కొనిరా సంకల్పించిరి.

ఈ విప్లవము రెండు ఘట్టములలో ముందునకు సాగినది. మొదటి ఘట్టమున తొలుతటి వర్గమువారే నాయకత్వము వహించి నడిపిరి. ఇదియే ఫిబ్రవరివిప్లవము అనబడుచున్నది. అంతట రెండవ వర్గము విజృంభించి మొదటి వర్గమును త్రోసి రాజని, అక్టోబరు విప్లవమును [చూ. పు. 260] కొనివచ్చి అధికారమును వశపరచుకొనినది. అంతట ఈ దేశమున ఆ సంవత్సరము డిసెంబరు మొదలుగ అంతర్యుద్ధము చెలరేగెను. ఈ ద్వివిధ విప్లవములను, అంతర్యుద్ధమును గురించిన విశేషములు సంగ్రహముగ ఈ దిగువ ఈయబడినవి [ఇచట ఒక విషయమును గమనింపవలయును. రష్యాలో ఆ నాడు కాల పరిగణనమున ప్రాత పద్ధతి పంచాంగము (కేలండర్) అమలులో ఉండినది. దానిని అనుసరించి ఆ దేశమున తేదీలు తక్కిన దేశములందలి తేదీలకన్న 13 దినములు వెనుక ఉండెడివి. విప్లవము తరువాత ఈ పరిస్థితి చక్కజేయబడి, తక్కిన దేశములందు వలెనే కాలపరిగణన మొదలైనది. అందువలన ఫిబ్రవరి, అక్టోబరు విప్లవములు అనబడునవి ప్రాత లెక్కల ప్రకారము ఆ యా నెలలలోనే జరిగినను, క్రొత్త లెక్కల ప్రకారము మార్చి, నవంబరులలో జరిగినటుల లెక్కింపవలసి ఉన్నది. ఆ విధముగనే ఈ దిగువ తేదీలు ఈయబడినవి].

ఫిబ్రవరి విప్లవము : పెట్రోగ్రాడ్ (నేటి లెనిన్‌గ్రాడ్) నగరమున 1917, మార్చి 8 న సమ్మెలును, అల్లరులును

చెలరేగుటతో ఈ విప్లవము మొదలైనది. ఆ తరువాత రెండు దినములకు సేనలును సమ్మెదారుల పక్షమున చేరినవి. అప్పటిలో సమావేశమైన 'డూమా' అనబడు రష్యా పార్లమెంట్ సైతము ప్రజల ఎడ సానుభూతి వహించి, చక్రవర్తి ఆజ్ఞలను తిరస్కరించి ఒక ఆపద్ధర్మ ప్రభుత్వమును నెలకొల్పి (మార్చి 12). ఆ మరునాడు చక్రవర్తి పదవీపరిత్యాగము చేయునటుల చేసెను. కాని, ఇంతకు ముందుగనే విప్లవకారులలో రెండవ వర్గమునకు చెందినవారు (బోల్షివిక్‌లు) 1905 నాటి సోవియట్ (రైతు, కార్మిక, సైనిక ప్రతినిధుల సంఘము) ను పునరుద్ధరించిరి. ఏప్రిల్ 16 న వారి నాయకుడు లెనిన్ [చూ.] రష్యాకు చేరినప్పటినుండి ఈ వర్గము తమ ఆందోళనను తీవ్రతరము చేసి ఆపద్ధర్మప్రభుత్వపు చర్యలను అన్నింటిని ప్రతిఘటింప సాగినది. కాని, జూలై 16 న ఆ బోల్షివిక్‌లు ప్రభుత్వమును వశము చేసికొనుటకు చేసిన ప్రయత్నము విఫలము కాగా లెనిన్ దేశమును వదలి ఫిన్లాండ్‌లో మూడు నెలలు తలదాచుకొనవలసివచ్చెను. ఆపద్ధర్మ ప్రభుత్వమున ప్రధాన మంత్రిగ ఉండిన కెరెన్‌స్కీని తొలగించుటకు సేనాపతియగు కొర్నిలోవ్ ఒక ప్రయత్నము చేసి విఫలుడయ్యెను (సెప్టెంబరు).

**అక్టోబరు విప్లవము :** పూర్వప్రభుత్వము వలనే ఆపద్ధర్మ ప్రభుత్వమును ప్రపంచయుద్ధమున పాల్గొని దానిని కొనసాగింప కృతనిశ్చయత వహించుటతో ఆ నిర్ణయ ఫలితముగ కలుగబోవు కరువుకాటకములు, జననష్టము మొదలగువానిని గురించి ప్రజలలో బయలుదేరిన భయాందోళనలను అవకాశముగ గ్రహించి, లెనిన్ నవంబరు 6 వ తేదీన తన సైనికులను ఆపద్ధర్మ ప్రభుత్వ కేంద్ర కార్యాలయమును ముట్టడించి వశపరచుకొనవలసినదిగ ఆదేశించెను. ఆ మరుసటిదినమున అఖిల రష్యా సోవియట్ కాంగ్రెస్ సమావేశమయి పరిపాలనాధికారమును బోల్షివిక్‌లకు దత్తము చేసెను. వీరు పరిపాలనా వ్యవస్థను తమ ఉద్దేశములకు అనుగుణముగ రూపొందించిరి. ఫ్యాక్టరీలపై నియమనాధికారమును కార్మికులకు ఈ ప్రభుత్వము ఇచ్చి, ప్రయివేట్ వ్యాపారమును నిషేధించి, మత సంస్థలకును, విప్లవ వ్యతిరేకులకును చెందిన యావదాస్తిని తనవశము చేసికొనెను. అంతట జర్మనులతో బోల్షివిక్‌లు సంధి చేసికొనిరి [చూ. బ్రెస్ట్ లిటోవస్క్ సంధి - పు. 661]. ఆ తరువాత 1918, జూలైలో ప్రప్రథమ సోవియట్ రష్యా రాజ్యాంగము అమలులోనికి తేబడెను.

**అంతర్యుద్ధము :** ఇటుల విప్లవము విజయమందుటతో క్రుద్ధులై, విప్లవ వ్యతిరేకులు తమ పక్షమున పోరాడుటకై సేనలను (వీనికే 'శ్వేత సేనలు' అని వ్యవహారము కలదు) సన్నద్ధము చేసికొని, విప్లవసేనతో (దీనికే 'అరుణసేన' అను పర్యాయ నామము కలదు) తలపడినవి (డిసెంబరు, 1917). ఆ సమయముననే విప్లవ వ్యతిరేక ప్రభుత్వములు పెక్కు ప్రాంతములందు రష్యాలో నెలకొల్పబడినవి. వీనికి అన్నింటికిని విప్లవము ఎడ ద్వేషము ఉన్నను, తమలో తమకు సమన్వయభావమును కుదుర్చుకొనజాలక పోవుట వలన బోల్షివిక్‌లే కడకు విజయమునందిరి. ఆ పోరాటము నందలి వివిధ రంగముల వివరములు సంక్షిప్తముగ ఈ దిగువ తెలుపబడినవి :

(అ) కాకసస్ పర్వత ప్రాంతము, దక్షిణ రష్యా : 1917 డిసెంబరులో కాసక్ జాతి యోధుల దళములు కొర్నిలోవ్ నాయకత్వమున తిరుగుబాటు చేసినవి. కొర్నిలోవ్ మరణానంతరమున డెనికిన్ సేనాని (1918, మార్చి - 1920, మార్చి) ఈ దళమును రష్యా అంతర్భాగము వరకు కొనిరాగలిగి కడకు నెట్టివేయబడెను. క్రిమియాలో విప్లవ వ్యతిరేకులు రాంగెల్ సేనాని నాయకత్వమున 1920, నవంబరు వరకు పోరాటమును సాగించి కడకు లొంగిరి.

(ఆ) యుక్రెయిన్ (ఉక్రెయిన్) : జర్మనులచే ఇచట నెలకొల్పబడిన కీలుబొమ్మ ప్రభుత్వపు పెద్దయగు స్కోరోపడస్కీ నాయకత్వమున ఇచటి శ్వేత సేనలు పోరాటమును సాగించినవి. కాని, 1918, నవంబరులో జర్మను పరాజయము మూలమున జర్మనులు స్వదేశమునకు తిరోగమించుటతో అతని నాయకత్వము అంతరించెను. తత్ఫలితముగ ఆ ప్రాంతమంతయు అరాజకత పాలయ్యెను. అంతట డెనికిన్ సేనాని నాయకత్వమున ఉండిన శ్వేత సేనలు యుక్రెయిన్‌ను 1919, ఆగస్టు మొదలు డిసెంబరు వరకు తమ వశమున ఉంచుకొనెను. 1920 మే వరకు పిల్‌స్డస్కీ నాయకత్వమున పోల్‌లు (పోలండ్ దేశీయులు) కీవ్ నగరమును తమ ఆక్రమణలో నిలుపుకొనిరి. 1920 గ్రీష్మఋతువు నాటికి ఈ ప్రాంతము అంతటను పోరాటము ముగిసి, బోల్షివిక్‌లు విజయులైరి.

(ఇ) బాల్టిక్ ప్రాంతము : యూడెనిచ్ సేనాని నాయకత్వమున 1919, అక్టోబరులో ఈ ప్రాంతమునుండి బయలుదేరిన శ్వేత సేనలు పెట్రోగ్రాడ్ నగరపు పొలిమేరల వరకు త్రోసికొని పోగలిగినవి. కాని, బోల్షివిక్‌లు వానిని తరిమివేయ గలిగిరి. లాట్వియా, లిథూనియా, ఎస్టోనియా, ఫిన్లాండ్ సేనలతో కూడ ఈ సందర్భమున అరుణసేన పోరాడవలసివచ్చినది. 1920 లో ఈ పోరాటములన్నియు క్రమముగ ముగిసినవి.

(ఈ) ఉత్తర రష్యా: 1918, జూన్ మాసమున బ్రిటిష్, ఫ్రెంచి సేనలు మర్మన్స్క్‌వద్ద దిగి, ఆ మరుసటి మాసమున ఆర్కేంజల్ నగరమును వశపరచుకొని, అచట ఒక కీలుబొమ్మ ప్రభుత్వమును నెలకొల్పి, అంతటంతట బోల్షివిక్‌లపై దండయాత్రలను 1919, అక్టోబరు వరకు సాగించి, విఫలతను పొంది తిరిగిపోయినవి.

(ఉ.) సైబీరియా: లోగా యుద్ధఖైదీలుగా ఉండి, విడుదల పొందిన జెక్ సైనికులదళమును, వ్లాడివాస్టక్ రేవున 1917, డిసెంబరులో దిగిన జపాన్ సేనలును ఈ ప్రాంతమున విప్లవ వ్యతిరేకయుద్ధమును సాగించినవి. వీరి సాయమున నౌకాదళపతి (అడ్మిరల్) కోల్చక్ ఒక విప్లవవ్యతిరేక ప్రభుత్వమును ఓమస్క్‌నగరమున స్థాపించెను. ఒక సంవత్సర కాలము అతని సేనలు ట్రాన్స్ సైబీరియన్ రైల్వే మధ్యప్రాంతమును తమ వశమున ఉంచుకొనగలిగెను. కడకు కోల్చక్‌ను బోల్షివిక్ సేనలు పట్టుకొని మరణశిక్ష పాలు చేసెను (1920, ఫిబ్రవరి). జపాన్‌సేనలు మాత్రము వ్లాడివాస్టక్ రేవును 1922, నవంబరు వరకు తమ అధీనమున ఉంచుకొనగలిగినవి.

పైన పేర్కొనబడిన విప్లవ వ్యతిరేక ప్రభుత్వముల సేనల బెడదలనే కాక రైతుల తిరుగుబాటులను సైతము 1920 వ సంవత్సరమున అంతటంతట బోల్షివిక్ ప్రభుత్వము ఎదుర్కొనినది. దేశమున ఆ కాలమున బయలుదేరిన కరువుకాటకములే ఈ రైతుల తిరుగుబాటులకు ముఖ్య హేతువులు. వీనికి తోడుగ క్రోన్‌స్టాట్ రేవున నావికులును 1921, ఫిబ్రవరి 21 మొదలు మార్చి 17 వరకు తిరుగుబాటును సాగించిరి. దీనిని విప్లవప్రభుత్వము గణనీయ జననష్టముతో అడచగలిగినది.

అంతర్యుద్ధము ముగిసిన తరువాత కొన్ని సంవత్సరముల వరకు సైతము కొన్ని ప్రభుత్వములు రష్యాలో స్థిరపడిన బోల్షివిక్ ప్రభుత్వమును గుర్తింప నిరాకరించినవి. కడకు అట్టివానిలో బ్రిటన్‌చే 1924, జనవరి లోను, యునైటెడ్‌స్టేట్స్‌చే 1933లోను, యుగోస్లావియాచే 1940 లోను ఆ ప్రభుత్వము గుర్తింపబడినది. చీ. శే. రా.

**రాంకే, లియోపాల్డ్ :** చూ. చరిత్ర రచన-పు. 443.

**రాచకొండ, దేవరకొండ రాజ్యములు :** చూ. తెలుగు సంస్కృతి సం. - పు. 273.

**రాజగోపాలాచారి, చక్రవర్తి** (జ. డిసెంబరు 9, 1878): భారతరాజ్యతంత్రజ్ఞుడు; మద్రాసురాష్ట్రముఖ్యమంత్రి (1937 - 39; 1952 - 53); కేంద్ర మంత్రివర్గ సభ్యుడు (1950 - 52); ప్రప్రథమ భారతీయ గవర్నర్ - జనరల్ (1948 - 50); నూతన రాజ్యాంగవ్యవస్థలో ఈ పదవి రద్దగుటవలన ఈయనే కడపటి గవర్నర్-జనరల్ కూడ. బెంగాల్ గవర్నర్ పదవి (1947 - 48) ని కూడ నిర్వహించిరి. వీరికే 'రాజాజీ' అను ప్రసిద్ధనామము కలదు. ఈయన సేలమ్‌జిల్లా హోసూరు తాలూకా తోరపల్లి గ్రామములో మధ్య తరగతి కుటుంబీకులైన చక్రవర్తి అయ్యంగార్, సింగారమ్మ దంపతులకు తృతీయపుత్రులుగా జన్మించిరి (డిసెంబరు 9, 1878). హోసూరు పాఠశాలలోను, బెంగుళూరులోని లండన్ మిషన్ స్కూల్ లోను, మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలోను, న్యాయ కళాశాలలోను క్రమముగ విద్యాభ్యాసము చేసిరి.



చక్రవర్తి రాజగోపాలాచారి (జ. 1878)

రాజాజీ తన ఇరువదవ ఏట (1898) న్యాయవాదియై, సేలమ్‌లోనే ప్రముఖ న్యాయవాదిగ పేరుకాంచిరి. 18 సంవత్సరముల కాలము సేలమ్‌లోనే గడిపి, తరువాత మద్రాసు వచ్చి హైకోర్టులో ఆ వృత్తిని కొనసాగించిరి. హిందూ పత్రిక సంపాదకులగు శ్రీ కస్తూరి అయ్యంగారి ప్రోద్బలమున 1919 లో దేశసేవాతత్పరులైరి. గాంధీజీ ఆఫ్రికాలో జరిపిన సత్యాగ్రహ యుద్ధమే కాంగ్రెస్ సేవకుడుగ కార్యరంగమున దూకుటకు రాజాజీకి ప్రోద్బలము ఇచ్చినది. 1921 - 22 లో కాంగ్రెస్ కార్యవర్గ సభ్యులు అయిరి. 1930 లో జరిగిన ఉప్పుసత్యాగ్రహ ప్రచారములో తమిళనాడున వేదారణ్య సముద్రతీరమున ఉప్పు తీయుటచే తొమ్మిది రోజులు జైలుశిక్ష అనుభవించిరి. 1937 - 39 మద్రాసు ప్రధానిగ పనిచేసిరి. అప్పుడే మద్యపాన నిషేధ చట్టమును, దేవాలయ హరిజన ప్రవేశచట్టమును, సేల్స్ టాక్స్ చట్టమును, వ్యవసాయదారుల ఋణపరిహార చట్టమును ఆమోదింపజేసి అమలులోనికి తీసుకొనివచ్చిరి. ద్వితీయ ప్రపంచయుద్ధ ప్రారంభము (1939) న మద్రాసు ప్రధానమంత్రి పదవికి రాజీనామా చేసి, యుద్ధ వ్యతిరేక ప్రచారమున పాల్గొని ఒక ఏడాది జైలుశిక్ష అనుభవించిరి. 1942 లో క్విట్ ఇండియా తీర్మాన సందర్భమున తదితర ప్రముఖనాయకులతో ఏకీభవించజాలక వైదొలగి, గాంధీజీ మొదలగువారి విడుదల ప్రచారము చేసిరి. 1947 లో భారతదేశము స్వాతంత్ర్యము పొందిన తరువాత పశ్చిమ బెంగాల్ గవర్నర్‌గాను, మౌంట్‌బాటన్ పదవీ విరమణా

నంతరమున భారతదేశ గవర్నర్ - జనరల్ గాను పదవిని నిర్వహించిరి. భారతప్రభుత్వము వీరికి 'భారతరత్న' అను బిరుదమును ప్రసాదించినది. భారతజాతీయ కాంగ్రెస్ సంబంధమును తెగత్రెంపులు చేసుకొని, 1959 లో 'స్వతంత్ర' అనుక్రొత్త రాజకీయపక్షమును నెలకొల్పిరి. సాహితీపరుడు; ఈయన ప్రసిద్ధ తమిళ రచనలు : 'వ్యాసర్ విరుందు' ; 'చక్రవర్తి తిరుమగన్'. ఆంగ్లమున 'కంబరామాయణము' వంటి అనేక రచనలు చేసిరి. కం. శ్రీ. రా.

**రాజతరంగిణి :** చూ. కల్హణుడు - పు. 376.

**రాజారామ్ :** చూ. మహారాష్ట్రులు - పు. 737.

**రాజేంద్రప్రసాద్, బాబు** (1884 - 1963) : భారత ప్రజా గణరాజ్యపు తొలి రాష్ట్రపతి ; ప్రఖ్యాత కాంగ్రెస్ నాయకుడు. 1884, సెప్టెంబరు 3 న బీహార్ లోని శరణ్ జిల్లా యందు ఒక గ్రామమున జననము. చాల సంవత్సరములు పాట్నా యూనివర్సిటీ సెనేట్ సభ్యుడు ; న్యాయవాది. 1917 లో గాంధీజీ అనుచరుడై చాంపరాన్ ఉద్యమములో చేరి 1920 లో న్యాయవాది వృత్తిని త్యజించి సహాయ నిరాకరణములో ప్రముఖపాత్ర వహించెను. 1922 లో కాంగ్రెస్ కార్యదర్శియై, 1934 లోను, 1939 లోను కాంగ్రెస్ అధ్యక్షుడు అయ్యెను. 1942 లో నాయకులు అందరితో పాటు బంధితుడై, 1945 లో విడుదలచేయబడెను. 1947 లో భారత కేంద్ర మంత్రివర్గములో ఆహారశాఖా మంత్రిగ పనిచేసి, తదుపరి కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఎన్నిక అయిన తరువాత మంత్రిపదవికి రాజీనామా ఇచ్చెను. రాజ్యాంగ రచనాసభకు 1946 - 49 మధ్య అధ్యక్షుడుగ పనిచేసి, 1950 లో భారత ప్రజాసత్తాక గణరాజ్యపు రాష్ట్రపతిగ ఎన్నుకొనబడి, ఆ తరువాత 1952 లోను, 1957 లోను ఆ పదవికే తిరిగి భారత ప్రజాప్రతినిధులచే ఎన్నుకొనబడి, 1962, మార్చివరకు ఆ పదవిలో ఉండెను. ఇటుల 12 సంవత్సరములు వరుసగ భారత ప్రజాసత్తాక గణరాజ్యపు రాష్ట్రపతిగ ఉండి భారతదేశమున ప్రజాస్వామ్య సంప్రదాయములను సుస్థిరముగ నెలకొనుటలో ఈయన తోడుపడెను. అధ్యక్షుడుగ, రాజకీయ వేత్తగ మాత్రమే కాక, బహు భాషా విదుడుగ, రచయితగ ఈయన ప్రఖ్యాతి గడించెను. గాంధి మహాత్ముని బోధనల మనసార అనుసరించిన ఈ మహాపురుషుని భారతీయులు ఋషితుల్యునిగ భావించి గౌరవించిరి. ఈయన 1963, ఫిబ్రవరి 28 న పాట్నాయందు తన నివాసమగు సదాకత్ ఆశ్రమమున మరణించెను. వ. లిం.



బాబు రాజేంద్రప్రసాద్
(1884 - 1963)

**రాజ్యము :** చూ. సమితి - పు. 212.

**రాజ్యసభ :** చూ. భారతరాజ్యాంగము - పు. 720.

**రాజ్యాంగములు :** చూ. పు. 221.

**రాజ్యాధికారము :** చూ. పు. 212.

**రాజ్యోత్పత్తి :** చూ. పు. 217.

**రాణాప్రతాపసింగ్** (మ. 1597) : రాజపుత్ర యోధుడు ; స్వాతంత్ర్యపిపాసి ; మేవాడ్ ప్రభువు రాణా ఉదయసింగ్ కుమారుడు ; సంగరాణా మనుమడు. అక్బర్ 1567 లో మేవాడ్ రాజధాని చిత్తోడ్ ను ముట్టడింపగా ఈయన తండ్రి ఉదయసింగ్ ఆరావళీపర్వతశ్రేణిలోని కుంబల్ ఘర్ కు పలాయితుడై, అందు ఒక లోయవద్ద



రాణాప్రతాపసింగ్ (మ. 1597)

ఉదయపూర్ అను నూతన రాజధానిని నిర్మించుకొనెను. తండ్రి అనంతరమున 1527 లో రాణా అయిన ప్రతాపసింగ్ 'నాకు, సంగరాణాకు మధ్య ఉదయసింగ్ గనుక పుట్టి యుండని ఎడల తుర్కులు భారతదేశముపై ఆధిపత్యమును ఆర్జింపలేకుండెడివారు' అని వగచి, తన పూర్వుల ప్రతిష్ఠను పునరుద్ధరింప కంకణము కట్టుకొనియెను. దేశ పారతంత్ర్య విముక్తికి ప్రాణములు నైతము ఆహుతిసేయ వెనుకాడని చిత్తోడ్ రాజపుత్రయువకులు ఈయనకు

అండగా నిలిచిరి. ప్రతాపుని, మేవాడ్ రాజ్యమును లోబరచుకొనుటకు కృతనిశ్చయుడై, అక్బర్ తగిన సైన్యముతో తన కుమారుడు సలీమ్‌ను పంపించెను. హాల్దీ ఘాట్ కనుమవద్ద జరిగిన పోరాటము (1576) లో, ప్రతాప్‌సింగ్ శత్రువులను వీరోచితముగ ఎదుర్కొని, దైవోపహతుడు అగుటచే పరాజితుడై, విశ్వాసపాత్రుడైన ఒక ఝూలా నాయకునిచే శత్రువులకు చిక్కకుండ రక్షింపబడెను. రాజ్యభ్రష్టుడై, అనుచరులతోసహా అనేక కష్టనిష్ఠురములకు గురి అయినను ఈయన ఆత్మవిశ్వాసమును, అచంచల ధైర్యమును పరిత్యజింపలేదు; అక్బర్‌తో మైత్రికి అంగీకరింపలేదు. తన నిర్ధనత్వముచే నైరాశ్యమును పొందిన ఈయనకు బామాషా అను ఉదయపూర్ షావుకారు తన యావత్ ధనరాశులను సమర్పించెను. రాణాప్రతాప్‌సింగు అక్బర్ జీవితకాలమందే ఉదయపూర్‌ను స్వాధీనపరచుకొని, మేవాడ్ రాజ్యమును పునః స్థాపించెను. ఈయన విక్రమ సాహసములు తరువాతి తరములకు ఉత్తేజకరములు అయినవి. ఆ. వెం.

**రాధాకృష్ణన్, సర్వేపల్లి** (జ. 1887): సుప్రసిద్ధ తత్త్వవేత్త; ప్రసిద్ధ రాజనీతిజ్ఞుడు. భారత ప్రజాసత్తాక రాజ్యమునకు రాష్ట్రపతి (1962 - 67).



సర్వేపల్లి రాధాకృష్ణన్
(జ. 1887)

రాధాకృష్ణన్ తిరుత్తనిలో జన్మించెను. మద్రాసు క్రిస్టియన్ కళాశాలలో విద్యను అభ్యసించెను. 1909 లో ప్రెసిడెన్సీ కళాశాలలో తత్త్వశాఖలో ఆచార్యుడు. 1918 లో మైసూరు యూనివర్సిటీ తత్త్వశాస్త్ర శాఖాధిపతి. 1921 లో కలకత్తా యూనివర్సిటీలో మానసిక, తత్త్వశాస్త్రశాఖలకుఆచార్యుడు. అప్పటికి ఈయన హిందూ తత్త్వశాస్త్రము అను మహాగ్రంథ రచన పూర్తిచేసెను; 1926 లో ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీలో భారతీయ జీవిత దృక్పథమును గురించి ఉపన్యాసములు ఇచ్చెను; 1927 లో 31 వ భారతీయ తత్త్వశాస్త్ర మహాసభకు అధ్యక్షుడు.

మాంచెస్టర్ కాలేజీ (ఆక్స్‌ఫర్డ్) ఈయనకు ఆచార్య పీఠమును 1929 లో ఇచ్చినది. 1931 నుండి 1936 వరకు ఆంధ్రా యూనివర్సిటీకి, 1939 నుండి 1948 వరకు కాశీ హిందూ యూనివర్సిటీకి ఈయన ఉపాధ్యక్షుడు. 1946 లో రాధాకృష్ణన్ అంతర్జాతీయ వైజ్ఞానిక సమితికి భారత రాయబార వర్గనాయకుడుగ వెళ్లెను. విజయలక్ష్మీపండిట్ తరువాత మాస్కోలో భారత రాయబారిగా నియుక్తుడయ్యెను.

ఈయన భారత ప్రజాసత్తాకమునకు ఏకగ్రీవముగా ఉపరాష్ట్రపతి స్థానమునకు ఎన్నికై, 1952 - 62 వరకు వ్యవహరించి, రాష్ట్రపతిగ 1962లో ఎన్నికయై, 1967 వరకు ఆ పదవిని నిర్వహించెను.

ఈయన రాష్ట్రపతి పదవిని వహించిన కాలమున భారతదేశము పలు దుస్సంఘటనలను—1. భారత దేశ సరిహద్దుల పై చీనా దండయాత్ర; 2. పండిట్ నెహ్రూ మరణము; 3. భారత దేశముపై పాకిస్తాన్ దండయాత్ర—ఎదుర్కొనవలసి వచ్చినను, వానినుండి భారత ప్రజాస్వామ్యము మొక్కవోవకుండ బయలువడుటకు ఈయనయొక్క ప్రజాస్వామ్యనిరతియు, భావస్వాతంత్ర్యమును, కార్యచాతుర్యమును ఎక్కువగ తోడ్పడినవి [చూ. సం. 7-పు 648]. * * *

**రాబ్స్‌పియెరీ** (1758 - 94): ఫ్రెంచి విప్లవ నాయకులలో ప్రముఖుడు; రూసో రచనలచే ప్రభావితుడై, రాబ్స్‌పియెరీ అందు ప్రతిపాదితమైన ఆదర్శ సంఘమును స్థాపించుటకు ఫ్రెంచి విప్లవమును [చూ. పు. 639] చక్కని అవకాశముగా గ్రహించెను 1789 లో పారిస్‌లో సమావేశమైన ప్రతినిధుల సభ (స్టేట్ జనరల్) లో సభ్యత్వమును పొంది, ప్రజాస్వామిక భావస్ఫోరకములైన తన మహోపన్యాసములచే ప్రజలను మెప్పించి, తీవ్రవాదులయిన జాకోబిన్‌ల ప్రాపు సంపాదించి, అచిరకాలముననే ఇతడు ప్రతినిధుల సభకు నాయకత్వము చేపట్టెను. 1793 లో ఫ్రెంచి రాజునకు, సర్దారులకు కఠిన శిక్షలు విధింపరాదనిన గిరాండిస్ట్‌ల ప్రతిపాదనను తన వాదబలముచే త్రోసిపుచ్చి, ఇతడు లూయీ - XVI కు మరణశిక్ష విధింపజేసెను. 1793, జూలైలో ద్వితీయ ప్రజా భద్రతా సంఘసభ్యుడుగ ఎన్నుకొనబడి, రాబ్స్‌పియరీ ఆ సెప్టెంబరునుండి మరుచటి జూలై వరకు కొనసాగిన భయానకపాలనలో వేలాది వ్యక్తులు గిలటీన్ (మరకత్తి) వాతబడి దుర్మరణము చెందుటకు కొంతవరకు కారకుడై, అనేకులకు కంటకుడు అయ్యెను. వ్యక్తిగతముగ ఎవ్వరిపట్ల తనకు రాగద్వేషములు లేకపోయినను, అట్టి దౌర్జన్యయుత చర్య ఆదర్శ సంఘము ఆవిర్భవించుటకు దోహదకారి అగునని అతడు ఆశించెను; కాని, అతని అనుచరులు తమ తమ రాజకీయ, వైయక్తిక ప్రతిస్పర్ధులను రూపుమాపుటకు కూడ గిలటీన్‌ను వినియోగించిరి. తుదకు ఈ పరిస్థితి ప్రజలకు రోత పుట్టించెను; కడకు కొందరు డిప్యూటీలు అతని విరోధులతో ఏకమై, అతనిని నిర్బంధించి, నేరమారోపించి, అనేకులను బలి ఇచ్చిన గిలటీన్‌కే రాబ్స్‌పియెరీని గురిచేసిరి. ఆ. వెం.

**రామగుప్తుడు :** భారతదేశమును పరిపాలించిన గుప్తవంశీయరాజు. సముద్రగుప్తుని జ్యేష్ఠకుమారుడు. రామగుప్తుడు సింహాసనమును అధిష్ఠించెనని కొందరు అందురు. ఇతని సమకాలికుడైన శకనృపాలుడు ఒకడు ఇతనిని ఓడించి, భార్యయైన ధ్రువాదేవిని వశము గావించుకొని పోయెననియు, సోదరదారయైన ధ్రువాదేవిని పరరాజన్యుడు ఒకడు కొంపోయెనను అవమానమును సహింపనేరక సోదరుడగు చంద్రగుప్తుడు నిగూఢవేషమున శకరాజు వద్దకు పోయి, అతనిని వధించి, తరువాత తన సోదరుని కూడ సంహరించి, తాను సోదరుని భార్యయగు ధ్రువాదేవిని వివాహమాడెననియు కొందరు రచయితలు పేర్కొనిరి. విశాఖదత్త విరచితమగు దేవీ చంద్రగుప్త నాటకములోని కొన్ని విషయములను ఆధారముగ గొని వీరు ఈ గాథను అల్లిరి. కాని, ఈ గాథను బలపరచు చారిత్రక ఆధారములు ఏవియు కన్పట్టుట లేదు.

కుం. ఈ. దత్తు.

**రామమోహనరాయ్, రాజా :** చూ. సం. 10–పు. 647.

**రామరాజు :** చూ. మహారాష్ట్రులు – పు. 737.

**రాయ్, ఎమ్. ఎన్. (1887 – 1954):** భారత రాజకీయవేత్త ; తత్త్వవేత్త; రాడికల్ డెమోక్రాటిక్ పార్టీ వ్యవస్థాపకుడు ; మానవతావాద ప్రతిపాదకుడు. పశ్చిమ బెంగాల్‌లో ఆర్బేలియా గ్రామమున జన్మించెను. తల్లిదండ్రులు ఈయనకు పెట్టిన పేరు నరేంద్రనాథ్ భట్టాచార్య. ఈయన మాతృభాషతోపాటు ఆంగ్ల, సంస్కృతములను చక్కగా అభ్యసించెను. ప్రథమ ప్రపంచయుద్ధకాలమున ఆంగ్లప్రభుత్వముపై దేశవ్యాప్తమైన సాయుధ విప్లవమును లేవదీయుటకు జితిన్ ముఖర్జీ నాయకత్వము క్రింద బెంగాల్‌లో ప్రారంభమయిన విప్లవజాతీయోద్యమములో పాల్గొని, రాయ్ జర్మనులనుండి ఆయుధములను సేకరించుటకు జావా వెళ్ళెను. కాని, ఆంగ్లప్రభుత్వము ఆ ఉద్యమమును నిర్దాక్షిణ్యముగ అణచివేయుటతో ఈయన చీనా, జపాన్‌ల మీదుగా యునైటెడ్ స్టేట్స్‌కు తరలిపోయెను (1916). అక్కడనే మానవేంద్రనాథ్ రాయ్ అను మారుపేరు పెట్టుకొని ఎల్లెన్ అను అమెరికన్ యువతిని వివాహమాడెను. యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వము భారత విప్లవకారులపై ఆంక్షలు విధింపగా రాయ్ అక్కడనుండి మెక్సికో పోయి, మార్క్సిజమ్‌ను అభ్యసించి, మెక్సికో కమ్యూనిస్ట్ పార్టీ వ్యవస్థాపనకు తోడ్పడి, లెనిన్ ఆహ్వానమును పురస్కరించుకొని రష్యాకు వెళ్ళి (1919), కమ్యూనిస్ట్ ఇంటర్నేషనల్ సమావేశములో పాల్గొనెను. అంతర్జాతీయ కమ్యూనిస్ట్ పార్టీ ప్రతినిధిగ రాయ్ చీనాకు వెళ్ళి, ఆ ప్రభుత్వమునకు చేయూత ఇచ్చెను. చివరకు కమ్యూనిస్ట్ పార్టీ సిద్ధాంతములను వ్యతిరేకించి, 1928 లో అంతర్జాతీయ కమ్యూనిస్ట్ పార్టీతో తెగదెంపులు చేసికొని, జర్మనీ, ఇటలీల మీదుగా ఫోర్జరీ ప్యాస్‌పోర్ట్‌తో భారతదేశమునకు తిరిగి వచ్చెను (1930, డిసెంబరు). వెంటనే ఆంగ్లప్రభుత్వము ఈయనను అరెస్ట్ చేసి, ఆరు ఏండ్లు జైలుశిక్ష విధించెను. 1936 లో జైలునుండి విడుదలపొంది, భారత జాతీయ కాంగ్రెస్‌లో చేరి, ద్వితీయ ప్రపంచయుద్ధకాలమున ఈయన ఫాసిస్ట్ నియంతృత్వమునకు వ్యతిరేకముగ భారతదేశము ఆంగ్లప్రభుత్వమునకు అండగా నిలబడవలెననియు, యుద్ధమూలమున బలహీనమగు ఆంగ్లప్రభుత్వము యుద్ధానంతరమున భారతదేశమునకు అవశ్యము స్వాతంత్ర్యమును ప్రసాదించుననియు ప్రతిపాదించెను. 1940 లో కాంగ్రెస్ తన ప్రతిపాదనను తిరస్కరింపగా, రాయ్ కాంగ్రెస్‌నుండి విడివడి, తన వాద ప్రచారమునకై రాడికల్ డెమోక్రాటిక్ పార్టీని వ్యవస్థాపించెను. 1946 లో ఈయన కమ్యూనిజమ్‌ను పూర్తిగా నిరాకరించి, రాడికల్ ప్రజాస్వామ్యము లేదా రాడికల్ హ్యూమనిజమ్ అను నూతన తత్త్వమును ప్రతిపాదించి (1948), రాడికల్ డెమోక్రాటిక్ పార్టీని రద్దుచేసి, హ్యూమనిజమ్ లేదా మానవతా ఉద్యమమును ప్రారంభించి, అందు కృషి చేయుచు మరణించెను (25, జనవరి, 1954). 'రాజకీయవేత్తగా మారిన తత్త్వవేత్త' అని వర్ణింపబడిన ఈయన ప్రతిపాదించిన దర్శనము 'రాయ్‌దర్శనము' అను శీర్షిక క్రింద వివరింపబడినది [చూ. దర్శనములు, మతములు, 7 వ సంపుటము – పు. 654].

ఆ. వెం.

**రాలీ, వాల్టర్ (1552 - 1618) :** ఇంగ్లండుదేశమందలి సుప్రసిద్ధ నావికుడు ; యోధుడు ; కవి ; రచయిత. ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీలో చదివి, పట్టభద్రుడు అయి, ఫ్రాన్స్‌లో హ్యూజినాట్స్‌కు సహాయులుగ ఉండిన ఐచ్ఛిక భటులకు తోడుగా వెడలెను. అక్కడినుండి 1578 లో తిరిగి వచ్చి, తన సవతి సోదరుడగు హంఫ్రీ గిల్బర్ట్‌తో కలసి అమెరికాకు వెడలి అక్కడ నూతన ప్రదేశములను అన్వేషించుటకును, సముద్రనౌకలను దోచుకొనుటకును పూనుకొనెను. 1580 లో ఐర్లాండ్ దేశమునందలి డెజ్మెండ్ ప్రభువు తిరుగుబాటును అణచివేయుటలో సేనానిగా తోడ్పడెను. 1581 లో ఎలిజబెత్ – I కొలువులో ప్రవేశము కలిగించుకొని, ఆమె దయ సంపాదించి, ఐర్లాండ్‌లో ఒక చిన్న సంస్థానమును, వాణిజ్య వ్యాపార స్వత్వమును, అమెరికాలో వలసను ఏర్పరచుకొనుటకు అధికారమును పొందెను. 1584 లో ఎలిజబెత్ – I అతనిని

నైట్‌గా గౌరవించెను. అతనికి సముద్రయానమందును, నూతన ప్రదేశములను కనుగొనుటయందును ఆసక్తి ఎక్కువగా ఉండినను, రాణి అతనిని ఇంగ్లండునుండి వెడల నీయలేదు. కాని, అతడు పంపిన మనుష్యులు ఉత్తర కెరోలినాలో వలస ఏర్పరచుకొని, ఫ్లారిడావరకును గల ప్రదేశమును పరిశోధించిరి. ఆ ప్రదేశము అంతటికిని వర్జిన్ (కన్య) గా ఉండిన ఎలిజబెత్-I ఎడల తనకుగల గౌరవ మును సూచించుటకుగాను 'వర్జీనియా' అని పేరు పెట్టెను.

స్పానిష్ ఆర్మెడాను 1588 లో ఓడించుటలో రాలీ కూడ తోడ్పడెను. రాణివద్ద చనువు, పలుకుబడి అంత కంతకు అతనికి ఎక్కువయినది. ఇతని తోడ్పాటువల్లనే ఎడ్మండ్ స్పెన్సర్‌కు వార్షిక బహుమానము లభించినది. అతడు రచించిన 'ఫెయిరీ క్వీన్' అను కావ్యము ప్రకటిత మయినది. ఇతని కృషివల్లనే ఐర్లాండ్‌లో ఉరలగడ్డ, పొగాకు పంటలు ప్రారంభించబడినవి. ఎసెక్స్‌ప్రభువు రాణికి ఎక్కువ ఆప్తుడు అగుటతో, రాలీ పలుకుబడి తగ్గినది. కాని, దక్షిణ అమెరికాలో అతడు గయానాను కనుగొనుట చేతను, కాడిజ్‌ను ఆక్రమించుటచేతను ఇతడు మరల రాణికి ఇష్టుడయ్యెను. 1600 లో ఇతడు వర్జీనియాకు గవర్నర్ అయ్యెను. 1603 లో ఎలిజబెత్-I చనిపోయి జేమ్స్-I రాజు అయిన తరువాత ఇతనికి దుర్దశ ప్రారంభించినది. రాలీ పలుకుబడి, శక్తి సామర్థ్యములు చూచి తన పదవికి భంగము కలుగునన్న భయము తోచి జేమ్స్ ఇతనిని నమ్మలేక రాజద్రోహిగా నేరము మోపి, టవర్ ఆవ్ లండనులో బంధించెను. అందులో ఇతడు 13 ఏండ్లు కారాగారవాసము చేసి 'ప్రపంచచరిత్ర' రచించెను. 1616 లో ఇతనిని చెరనుండి విడుదల చేసి, మరి ఎన్నడును స్పెయిన్‌వారితో పోరవలదని జేమ్స్ శాసించెను. కాని, గయానాలో స్పెయిన్‌వారితో యుద్ధము చేయక తప్పినదికాదు. రాజాజ్ఞ మీరెనన్న నేరము మోపి, అతనికి 1618 లో మరణదండన విధించెను. మరణ సమయమునందైనను అతడు ధైర్యమువీడక 'ఇక నీ గొడ్డలి పెట్టు కానిమ్ము' అని తలవరిని హెచ్చరించెను. * * *

**రాష్ట్రకూటులు :** చూ. సం. 3 - 136.

**రాస్‌పుటిన్, గ్రెగరీ (1871 - 1916) :** రష్యన్ జాతీయుడు; కూట సన్యాసి. సైబీరియాలో పేద రైతు కుటుంబమున జన్మించెను. 1904 లో ఇతడు ఆలు - బిడ్డలను పరిత్యజించి, సన్యాసి అయ్యెను; సన్యాసిగా పేరు పొంది 1905 లో రష్యా రాజకుటుంబముతో పరిచయము కలిగించుకొనెను. రక్తపిత్త వ్యాధిగ్రస్తుడగు రష్యా రాకుమారుని తన యోగనిద్రాశక్తిచే బ్రతికింతునని, రాస్‌పుటిన్ రష్యా చక్రవర్తి రాణిని తనవలలో వేసికొని, కొలువులో పలుకుబడిని ఆర్జించెను; రాజకీయములలో జోక్యము కల్పించుకొని తన ఆశ్రితులకు మత సంస్థలలోను, ప్రభుత్వ కార్యాలయములలోను ఉన్నత పదవులు ఇప్పించెను. కాని, ఇతని ఆంతరంగిక జీవితము అంతులేని వ్యభిచార, మద్యపానములతో కలుషితమైనది. ఇతని దుశ్చర్యలవలన రష్యా రాజరికము (పరోక్షముగా చర్చియు) ప్రజల ఎగతాళిపాలయ్యెను; వార్తా పత్రికలు ఇతనిని దుయ్యబట్టెను. ప్రథమ ప్రపంచ యుద్ధము ప్రారంభము కాగానే ఇతడు జర్మను గూఢచారి అను కింవదంతి పుట్టెను. 1916 లో కోపోద్రిక్తులైన కులీనులు కొందరు ఇతనిని హత్యచేసిరి. అ. వెం.

**రిప్పన్ ప్రభువు (1827 - 1909) :** ఇతని పూర్తి పేరు జార్జి ఫ్రెడరిక్ సామ్యుల్ రాబిన్‌సన్ రిప్పన్. బ్రిటిష్ రాజ నీతివేత్త; ఒకప్పుడు భారతదేశ గవర్నర్ - జనరల్. యువకుడుగ ఈయన క్రిస్టియన్ సోషలిస్ట్ ఉద్యమమున ఆసక్తి చూపించెను. 1853 లో లిబరల్ పార్టీ సభ్యుడుగ ఈయన పార్లమెంట్‌లో ప్రవేశించి, క్రమముగ యుద్ధ ఉపమంత్రి (1859 - 61) గను, యుద్ధమంత్రి (1863-66) గను, ఇండియా కార్యదర్శి (1866 - 68) గను, లార్డ్ ప్రెసిడెంట్ ఆవ్ కౌన్సిల్ (1868 - 73) గను పనిచేసెను. యునైటెడ్ స్టేట్స్‌తో అలబామా హక్కులను పరిష్కరించుకొనుటకు నియమింపబడిన కమిషన్‌కు అధ్యక్షత వహించి, ఆ కృషిని ఫలప్రదము చేసినందుకు ఇతనికి మార్క్విస్ (ప్రభువు) పదవి బహూకరింపబడెను (1871). తరువాత రిప్పన్ భారతదేశ గవర్నర్-జనరల్ పదవిని నిర్వహించెను (1880 - 84). బ్రిటిష్ పరిపాలన క్రింద ఉండిన మైసూరు సంస్థానమును ఆ వంశీయునకు అప్పగించుట; భారతదేశమున తొలిసారిగ జనాభా లెక్కలు తీయించుట; భారతీయులకు స్థానిక స్వపరిపాలనాధికారము కల్పించుట; వాకట్టు (గాగింగ్) చట్టమును, దేశభాషా ముద్రణాలయ చట్టమును రద్దుచేసి, భారత వార్తాపత్రికలకు స్వేచ్ఛ ఒసంగుట గవర్నర్-జనరల్‌గ ఈయన చేసిన ఘనకార్యములు. స్వదేశమునకు వెళ్ళిన పిదప రిప్పన్ బ్రిటిష్ ప్రభుత్వములో ఫస్ట్ లార్డ్ ఆవ్



రిప్పన్ ప్రభువు
(1827 - 1909)

అడ్మిరాలిటీ పదవిని (1886), వలసల కార్యదర్శి పదవిని (1892 - 95), లార్డ్ ప్రివీసీల్ పదవిని (1905 - 08) చేపట్టెను [చూ. భారతదేశము - పు 684]. ఆ. వెం.

**రిష్‌లూ, కార్డినల్** (1585 - 1642) : అత్యంత సమర్థుడైన పరిపాలకుడు. 18 ఏండ్లపాటు ఫ్రాన్స్ పరిపాలనను నిర్వహించినవాడు. ఫ్రెంచి రాజత్వమును సుస్థిరము చేయుటకు, ఫ్రాన్స్‌ను ప్రబలమైన రాజ్యముగ రూపొందించుటకు ఈతనివలె కృషిచేసినవారు లేరు.

రిష్‌లూ 1585, సెప్టెంబరు 5 న జన్మించెను. 22 వ ఏట మతాధికారి వృత్తి చేపట్టెను. ఏడు ఏండ్ల అనంతరము ఫ్రాన్స్ శాసనసభయగు స్టేట్స్ జనరల్ లో ఈతడు మతాధిపతుల ప్రతినిధిగ ఉపన్యసించినప్పుడు, లూయీ - XIII కి రక్షకురాలుగ పరిపాలించుచున్న మేరీ డిమెడీచీ ఈతని ప్రతిభను గుర్తించెను. ఆమె ప్రాపకమువలన రిష్‌లూ కొద్దిరోజులలో కార్డినల్ పదవిని పొందెను.

తన 39 వ ఏట రిష్‌లూ ప్రధానమంత్రి అయ్యెను. హెన్రీ నవారే పరిపాలనతో ఫ్రాన్స్‌లో రాచరికము బలహీనమయి, భూస్వాములు బలపడిరని గ్రహించి, ఈతడు ఫ్రాన్స్‌లో రాజ్యాధికారపునస్సంస్థాపనకు పూనుకొనెను. తాను పాలించిన 18 ఏండ్లపాటు ఒక్కసారియైన శాసనసభను సమావేశపరుపకుండ నిరంకుశుడుగ పాలించెను.

భూస్వాముల బలమును అణచుట ఈతనిని ఎదుర్కొన్న మొదటి సమస్య. అందులకై భూస్వాముల కోటలను ఈతడు పడగొట్టించెను. వారు కత్తి యుద్ధములు చేయరాదని శాసించెను. లూయీ రాజును, రిష్‌లూను చంపుటకై పన్నిన కుట్ర బయటపడుటతో ఆ కుట్రకు కారకులనందరిని అణచివేసెను. తన శాసనమును ధిక్కరించి కత్తిసాముచేసిన ప్రముఖ భూస్వామిని ఉరితీయించెను. 1630 లో తనను తొలగించవలసినదని రాజును బలవంతపెట్టుటకు రాజమాత మున్నగువారు చేసిన కుట్రను కనుగొని, అందుకు సంబంధులైన భూస్వాములను ఉరితీయించెను. రాజమాత బ్రసెల్స్‌కు పారిపోయెను.

ఈ విషమసమయములోనే హ్యూజినాట్లు తిరుగుబాటు చేయగా, వారి కోటకు 15 నెలలు తాను స్వయముగ ముట్టడినడిపి జయించెను.

ఆస్ట్రియా, స్పెయిన్ దేశములకు విరుద్ధముగ యూరప్‌లో ఫ్రెంచివారి ప్రాబల్యము పెంపొందించుట రిష్‌లూ ఆశయము. ముప్పది సంవత్సరముల సంగ్రామ సమయమున ఈతనికి మంచి అవకాశము చిక్కినది. ప్రారంభమున ఆస్ట్రియా శత్రువులకు ధన సాహాయ్యము మాత్రమే చేసినను, 1635 లో తానే స్పెయిన్‌పై యుద్ధము ప్రకటించెను. మతాభిమానముకన్న దేశాభిమానమునకు ఎక్కువ ప్రాముఖ్యమును ఇచ్చి రిష్‌లూ పోరాడి, చివరకు వెస్ట్ ఫేలియా సంధి [చూ.] తో ఫ్రాన్స్‌కు నిరాఘాట ప్రాబల్యము వచ్చునట్లు చేసెను. ఈ సంగ్రామముతో స్పెయిన్ పూర్తిగ దుర్బలమైనది [చూ. ముప్పది సంవత్సరముల యుద్ధము - పు. 755].

ఫ్రాన్స్‌ను యూరప్ ఖండ రాజకీయములలో ప్రముఖముగా జేసి, రాజును బలవంతునిచేసి, ఫ్రెంచి రాజ్యమును సమైక్యము చేసినందులకు రిష్‌లూను కీర్తించినను, ఈతని విధానములవలననే ఫ్రాన్స్‌లో పన్నులభారము అధికమై సామాన్య ప్రజాజీవనము మరింత దుర్భరమైనదనియు, రాజ్యాంగబద్ధ ప్రభుత్వము నశించినదనియు, ప్రజలకు స్వాతంత్ర్యము లేకపోయినదనియు చెప్పక తప్పదు. రిష్‌లూ సాహిత్యమునందు ఆసక్తి కలవాడు. ఈతడు స్థాపించిన 'అకాడమీ' నేటికిని నిలచి ఉన్నది. * * *

**రీ యూనియన్ :** ఫ్రెంచివారి సముద్రోత్తర మండలమగు ఒక ద్వీపము.

హిందూ మహాసముద్రమున మారిషస్ దీవులకు నైరృతిన 483 కి. మీ.దూరమున ఈ ద్వీపము ఉన్నది. [వి] 2,512 చ. కి. మీ. ; [జ] 3,63,000. భారతీయులు, చీనీయ, ఫ్రెంచి సంతతికి చెందినవారును, మిశ్రజాతివారును, నీగ్రోలును ఇందు కలరు. [భా] క్రియోల్ ఫ్రెంచి అనబడు అపభ్రంశపు ఫ్రెంచిభాషయు, ఫ్రెంచియు ఇందు వ్యాప్తియందు ఉన్నవి. [మ] ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు రోమన్ కేతలిక్‌లు. [రా] సెయింట్ - డెనిస్ (జ, సం. 65,275).

చరిత్ర : 1513, ఏప్రిల్ లో పోర్చుగీస్ నావికుడు ఒకడు ఈ దీవిని కనుగొని, తనపేరన ఈ దీవికి 'మాస్కరెన్హాస్' అని పేరిడెను. కాని, పోర్చుగీస్‌వారు ఎవరును ఇట వలస చేరలేదు. 1638 లో ఫ్రెంచి నౌకాధిపతి ఒకడు ఈ దీవిని ఆక్రమించెను. 1643 లో ఈ దీవి ఫ్రెంచి ప్రభుత్వమునకు చెందినదిగ ప్రకటింపబడెను. అంతట పూర్వపు పేరునకు బదులుగ బూర్బన్ అని ఈ దీవికి పేరిడబడెను. ఫ్రెంచి వర్తకులు ఇట వలసచేరి, ఆఫ్రికానుండి నీగ్రోలను కొనితెచ్చి ఇచటనుండి తక్కిన దేశములవారికి ఆ నీగ్రోలను అమ్ముచు, బానిసవ్యాపారమును కొనసాగించిరి. నెపోలియన్ [చూ. పు. 542] తో జరిగిన యుద్ధముల కాలమున బ్రిటిష్‌వారు ఈ దీవిని ఆక్రమించిరి (1810). కాని, ఆ యుద్ధానంతరమున జరిగిన ఏర్పాటులను అనుసరించి మరల ఫ్రెంచివారికి ఇది అప్పగింపబడెను (1815). 1848 లో ఈ దీవిపేరు మార్చి ఫ్రెంచి ప్రభుత్వము సాధి

కారముగ ' రీ యూనియన్ ' అని పేరిడెను. ఆ సంవత్సరముననే బానిసవ్యాపారమును ఫ్రెంచిప్రభుత్వము రద్దు చేసెను. అందువలన అపుడచట ఉండిన 60,000 నీగ్రోలకును స్వేచ్ఛ సమకూరెను. ఇక్కడ చెరకుతోటలలో పని చేయుటకు ఫ్రెంచిప్రభుత్వపు ప్రోత్సాహఫలితముగ భారతీయులు అనేకులు 1860 మొదలుగ ఇటకు వచ్చి చేరిరి. కాని, 1882 నుండి ఈ కూలీల వలసను భారతప్రభుత్వము నిషేధించెను. ప్రస్తుతము ఈ ద్వీపము ఫ్రెంచి రాజ్యము నందు అంతర్భాగముగ ఉన్నది. ఈ రాజ్యము పక్షమున ఫ్రెంచి నేషనల్ అసెంబ్లీయందు ముప్వురును, సెనేట్ నందు ఇరువురును ప్రతినిధులు కలరు. ఫ్రెంచిప్రభుత్వము నియమించు పాలకుడు, 36 మంది ఎన్నుకొనబడిన సభ్యులు కల సంఘపు సాయమున ఈ దీవియందు పరిపాలనమును నెరపుచున్నాడు. చీ. శే. రా.

**రుమేనియా :** ఆగ్నేయ యూరప్‌నందలి ఒక స్వతంత్ర రాజ్యము. దీనికి రోమేనియా అనియు వ్యవహారము కలదు.




ఈ రాజ్యమునకు సోవియట్ రష్యా [ఉ]; నల్లసముద్రము [తూ]; బల్గేరియా [ద]; యుగోస్లావియా, హంగేరి [ప] సరిహద్దులుగ ఉన్నవి. [వి] 2,37,500 చ. కి. మీ.; [జ] 18,680,721. [భా] రుమేనియన్, [మ] దేశీయులలో అత్యధిక సంఖ్యాకులు రోమన్ కేథలిక్‌లు, [రా] బుఖారెస్ట్ (జ. సం. 12,78,814).

చరిత్ర: ఈ దేశమునందలి డేషియా ప్రాంతమునందు క్రీ. శ. రెండవ శతాబ్దమున రోమన్‌లు వలసచేరుటతో ఈ దేశపు చరిత్ర ఆరంభమయ్యెనని చెప్పదగును. మూడవ శతాబ్దమున రోమన్ సేనలు ఈ దేశము విడిచి పోయినను, రోమన్ సంస్కృతి ఇట నిలచెను. కాని, తరువాత కొన్ని అనాగరక జాతులు ఈ దేశమును ఆక్రమించినవి. క్రమముగ దేశము 7 వ శతాబ్దినాటికి స్వతంత్రతను ఆర్జించినది. కాని, 13 వ శతాబ్దమున మంగోల్‌లు ఈ దేశముపై దండెత్తి దీనిని వశపరచుకొనిరి. ఈ దాస్యమునుండి త్వరలోనే ఈ దేశము విమోచనమును ఆర్జించినను, అంతరంగిక పరిస్థితులనుబట్టి 14 వ శతాబ్దిలో వలాచియా, మొల్‌దావియా అను రెండు చిన్న రాజ్యములుగ చీలినది. అంతట తుర్కులు ఈ దేశముపై దండెత్తి 1476 లో వలాచియాను, 1513 లో మొల్‌దావియాను వశపరచుకొనిరి. ఇటుల ఈ దేశము ఓటోమన్ (తుర్కి) సామ్రాజ్యమున ఒక భాగముగ పదునేడవ శతాబ్ది పూర్వార్ధము ముగియువరకు ఉండెను. అంతట రష్యన్ ప్రభువుల ఒత్తిడికి ఫలితముగ ఈ దేశమునకు ఓటోమన్ సమ్రాట్ కొంత స్వాతంత్ర్యమును ఒసగెను. కాని, ఆ సమయముననే మొల్‌దావియాయందలి బెస్సరేబియా రాష్ట్రమును రష్యన్‌లకు తుర్కులు ఒసగిరి. క్రిమియా యుద్ధానంతరమున 1856లో పారిస్ కాంగ్రెస్ వలాచియా, మొల్‌దావియాల అంతరంగికస్వాతంత్ర్యప్రతిపత్తిని పరిగణించుటయేకాక, బెస్సరేబియాయందలి దక్షిణపు ప్రాంతమును మరల మొల్‌దావియాకు రష్యా ఇచ్చునటుల చేయగలిగెను. 1859 లో వలాచియా, మొల్‌దావియా రాజ్యములు ఒక రాజ్యముగ మేళనము చెంది, అలెగ్జాండర్ కుజా అనువానిని ప్రభువుగ నియమించుకొనెను. కాని, 1861 లో రాజును తొలగించి, వేరొక రాజవంశపువాడగు కెరోల్ - I రాజయ్యెను. 1878లో జరిగిన బెర్లిన్ కాంగ్రెస్ [చూ. పు. 651] నందలి నిర్ణయముల ఫలితముగ టర్కీ సామ్రాజ్యమునుండి విడివడి రుమేనియా సంపూర్ణ స్వాతంత్ర్యమును ఆర్జింపగలిగినది. కాని, దక్షిణ బెస్సరేబియాను మాత్రము తిరిగి రష్యాకు చెందచేసినది. కెరోల్ - I పాలన కాలమున రుమేనియా ఆర్థికముగ, రాజకీయముగ ఆధునికతను సంతరించుకొనినది.

బాల్కన్ యుద్ధములఫలితముగ 1912 - 13 లో బల్గేరియా నుండి దక్షిణ దుబ్రుజా రాష్ట్రమును రుమేనియా వశపరచుకొనెను. ప్రథమ ప్రపంచయుద్ధమున మిత్రమండలిపక్షమున రుమేనియా పోరాడెను. తత్ఫలితముగ యుద్ధానంతరమున రష్యానుండి బెస్సరేబియాను, ఆస్ట్రియానుండి బుకోవినాను, హంగేరినుండి ట్రాన్సిల్వేనియాను ఈ దేశము ఆర్జించెను. ఇటుల విస్తృతమయిన ఈ రాజ్యమున 1927 లో వ్యావసాయికరంగమునను, ఎన్నికల విధానమునను కొన్ని సంస్కరణలు ప్రవేశపెట్టబడెను.

ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున నాజీ జర్మనీ ఒత్తిడికి లోనై ఈ దేశము తాను ఇదివరలో ప్రక్క దేశములనుండి

ఆర్జించిన ప్రాంతములను ఆ యా దేశములకు తిరిగి ఇచ్చి వేసెను (1940). ఆ సంవత్సరముననే అప్పటి రాజగు కెరోల్ - II రాజ్యపరిత్యాగము చేయగ, అతని కుమారుడు మైకేల్ రాజయ్యెను. అంతట జర్మనీ సేనలు దేశమున ప్రవేశించుటయు, వేరుగత్యంతరము లేక రుమేనియా అక్షరాజ్యముల పక్షమున యుద్ధమున ప్రవేశించుటయు జరిగెను. కాని, 1944 లో యుద్ధగతి జర్మనులకు వ్యతిరేకముగ పరిణమించి, సోవియట్ రష్యా సేనలు ఈ దేశమున ప్రవేశించిన వెంటనే, అప్పటి రుమేనియా ప్రభుత్వమును కూలద్రోచి ఒక విప్లవ ప్రభుత్వము అధికారమును కైవసమొనర్చుకొని, జర్మనీకి వ్యతిరేకముగ మిత్రమండలి పక్షమున చేరెను. తరువాత కమ్యూనిస్టుల నాయకత్వమును ఆమోదించిన ఒక ప్రభుత్వము 1945 మార్చిలో నెలకొల్ప బడెను. ఈ ప్రభుత్వపు నిర్ణయముల ఫలితముగ మైకేల్ రాజ్యాధికారమును త్యజించెను (30 డిసెంబరు, 1947). 1947 లో పారిస్‌నందు జరిగిన శాంతి ఒడంబడికను అనుసరించి 1941, జనవరి 1 న అమలునందు ఉన్న సరిహద్దులే రుమేనియాకు ఎల్లలుగ ఉండునటులను, హంగేరీ - రుమేనియాల మధ్య మాత్రము 1938, జనవరి 1 నాటి సరిహద్దే అమలులోనికి రావలెననియు నిర్ణయము జరిగెను.

రాజ్యాంగము : ఈ దేశమున ప్రస్తుతము అమలునందు ఉన్న 1952 రాజ్యాంగము సోవియట్ రష్యా రాజ్యాంగ చట్టమును చాలవరకు అనుసరించుచున్నది. ఈ పరిపాలనా విధానమును బట్టి ఈ దేశము రుమేనియా ప్రజాగణరాజ్యమని వ్యవహరింపబడుచున్నది. ప్రభుత్వపు యావదధికారమును జాతీయమహాసభయందు న్యస్తమై ఉన్నది. ఇదియే శాసననిర్మాణాధికారమును కలిగి ఉన్నది. దేశమందలి పౌరులలో 40,000 మందికి ఒక ప్రతినిధి చొప్పున నాలుగేండ్లకు ఒకసారి ఈ మహాసభకు సభ్యులు ఎన్నుకొనబడెదరు. సంవత్సరమునకు రెండు తడవలు మాత్రమే ఈ మహాసభ సమావేశమై పరిపాలనా విధానమునకు సంబంధించిన ముఖ్యచట్టములను చర్చించి ఆమోదించును. తక్కిన సమయములందు ఈ మహాసభ విధులను అధ్యక్షక సంఘము నిర్వహించును. ఈ సంఘమున అధ్యక్షుడు, ఇరువురు ఉపాధ్యక్షులు, పదముగ్గురు సభ్యులు, ఒక కార్యదర్శి ఉందురు. అధ్యక్షుడు దేశాధిపతిగ లాంఛనపు అధికారములను కలిగి ఉండును. కార్యనిర్వహణ బాధ్యత మంత్రిమండలియందు కలదు. దీనికి ప్రధాని అధ్యక్షత వహించును. మంత్రిమండలి సభ్యులను అందరను జాతీయ మహాసభయే నియమించును. కమ్యూనిస్టు పక్షము ఒకటియే దేశమున గల రాజకీయపక్షము. 18 ఏండ్ల వయసునకు తగ్గని రుమేనియా పౌరులకు అందరకు వోటు హక్కు కలదు.
చి. శే. రా.

**రువండా :** మధ్య ఆఫ్రికాయందలి ఒక స్వతంత్రగణ రాజ్యము.

ఈ దేశమునకు ఉగాండా [ఉ]; టాంగన్యికా [తూ]; బురుండి [ద]; కాంగో (లియోపాల్డ్ విల్లి) [ప] సరిహద్దులందు కలవు. [వి] 26,338 చ. కి. మీ; [జ] 26,94,749. వీరిలో 16% మంది వటూసీ తెగకు చెందినవారు. వీరు ప్రపంచపు మానవజాతులందు ఎల్ల ఎక్కువ పొడవునకు పేరొందినవారు; [భా] దేశమున వివిధ ఆఫ్రికన్ భాషలు వ్యాప్తియందు ఉన్నవి. ఫ్రెంచి, రువండా భాషలు అధికార భాషలుగ ఉన్నవి. [మ] క్రైస్తవమతము కొంతవరకు వ్యాప్తియందు ఉన్నది. [రా] కిగాలీ (జ. సం. 4,173).

చరిత్ర : ఆఫ్రికన్ జాతుల నిలయముగ ఉన్న ఈ ప్రాంతమును 19 వ శతాబ్దిలో జర్మనులు వశపరచుకొని తమ వలసరాజ్యమగు తూర్పు ఆఫ్రికాయందు అంతర్భాగముగ చేసిరి. ప్రథమప్రపంచయుద్ధానంతరమున ఈ ప్రాంతమును సమీపమున ఉన్న బురుండితో కలిపి రువండా - ఉరుండి అను పేర బెల్జియమ్ దేశపు ధర్మకర్తృత్వ (మాండేటరీ) పాలనకు నానాజాతిసమితి [చూ. పు. 531] ఒసగెను (1922). అంతటినుండి బెల్జియమ్ ప్రభుత్వపు పర్యవేక్షణకు లోబడి రువండాను ఆ దేశీయ పాలకుడు ఒకడు పాలించెను. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున ప్రజలలో స్వాతంత్ర్యకాంక్ష ఉదయించి, తొలుత రాజరికమునకు వ్యతిరేకముగ తిరుగుబాటులు చెలరేగెను. బెల్జియమ్ ప్రభుత్వము అంతట అప్పటి పాలకుడగు మునిమ్‌గాను దేశబహిష్కృతుని కావించెను. తరువాత ఐక్యరాజ్యసమితి [చూ. పు. 351] ఆ దేశమును అనుసరించి బెల్జియమ్ ప్రభుత్వము రువండా - ఉరుండీని విభజించి, రువండాకును, ఉరుండీకిని వేర్వేరుగ స్వాతంత్ర్యమును ఒసగెను (1961, జనవరి 28). అంతట రువండా ఒక గణరాజ్యముగ రూపొందెను.
చి. శే. రా.

**రూజ్‌వెల్ట్, ఫ్రాంక్లిన్ డెలానో (1882 - 1945) :** యునైటెడ్ స్టేట్స్‌కు నాలుగుసారులు అధ్యక్షపదవిని (ప్రెసిడెంట్) అలంకరించెను. 1907 లో న్యాయవాదియై, 1910 లో న్యూయార్క్ రాష్ట్రమునకు సెనేటరు అయ్యెను. ప్రెసిడెంట్ విల్సన్ ప్రభుత్వములో ఇతడు నౌకాదళ ఉప కార్యదర్శి; 1928 లో న్యూయార్క్ గవర్నర్‌గ పనిచేసి, 1932 లో మొదటిసారి యునైటెడ్ స్టేట్స్ ప్రెసిడెంట్‌గ ఎన్నుకొనబడెను. ఆ సమయమున యునైటెడ్ స్టేట్స్‌ను కలవరపరచిన ఆర్థిక సంక్షోభమును ఇతడు సమర్థముగ ఎదుర్కొనెను. ఆ తరువాత వరుసగ మరి మూడు పర్యా

యములు ఆయన తన దేశమునకు ప్రెసిడెంట్‌గ ఎన్నుకొనబడెను. ఇటుల నాలుగు తడవలు వరుసగ ప్రెసిడెంట్ అగుటయు యునైటెడ్ స్టేట్స్ చరిత్రలో అసాధారణ సంఘటన.



ఫ్రాంక్లిన్ డి. రూజ్‌వెల్ట్
(1882 - 1945)

ద్వితీయ ప్రపంచయుద్ధ సమయమున బ్రిటన్‌కు, సోవియట్ రష్యాకు, మిత్రరాజ్యములకు ఆయుధసహాయము చేసెను. పెరల్ హార్బర్ అకస్మాత్తుగా జపాన్‌చే ముట్టడించబడుటతో యునైటెడ్ స్టేట్స్ కూడ యుద్ధమున దిగెను (1941, డిసెంబరు). అట్లాంటిక్ చార్టర్ [చూ. పు. 263] రూపొందించి ప్రకటించుటలోను, యుద్ధానంతర ప్రపంచ వ్యవస్థకు సరియైన పునాదులు నిర్మించుటకు ఐక్యరాజ్యసమితి అను నూతన వ్యవస్థను స్థాపించుటలోను ఈతడు బ్రిటన్ ప్రధాని చర్చిల్‌తో కలిసి విశేష కృషి చేసెను. కాని, యుద్ధము విజయవంతమగువరకును ఈయన జీవించలేదు. * * *

**రూర్ :** జర్మనీలో గనుల త్రవ్వకమునకు, యంత్ర పరిశ్రమలకు ప్రసిద్ధివహించిన ప్రదేశము. ఇది రైన్‌నది కుడి ఒడ్డున ఉన్నది. వెర్సైయిల్స్ సంధి [చూ.] ప్రకారము జర్మనీ తమకు ఈయవలసిన నష్టపరిహార ధనమును ఇవ్వనందున, దానిని రాబట్టుకొనుటకై 1923, జనవరిలో ఫ్రాన్స్, బెల్జియమ్ సేనలు ఈ రూర్ లోయపై దండెత్తి వశపరచుకొనినవి. ఇట్టి ఆక్రమణ చర్యను బ్రిటిష్‌వారు, అమెరికన్‌లు గర్హించిరి. ఈ రెండు రాజ్యముల గర్హణ బలముచే ఆ రూర్ లోయలో పనిచేయు కార్మికులు సంఘటితముగ సాత్త్వికనిరోధమునకు పూనుకొనిరి. తత్ఫలితముగ ఫ్రెంచివారు తమ సేనలను అక్కడ ప్రవేశపెట్టినందుకు లోకదూషణ పాలయి, పదిమందిలో తల ఎత్తుకొనజాలని అవమానము పొందుట తప్ప, పొందిన ప్రయోజనము వేరే ఏమియు లేదు. అట్లు ఫ్రెంచివారు తమ సేనలను రూర్‌లో రెండున్నర ఏండ్లు ఉంచి, 1925, అక్టోబరులో లోకర్నోలో జరిగిన అంతర్జాతీయ సమావేశ సందర్భమున తమ సేనలను అక్కడినుంచి ఉపసంహరించుకొనిరి. అంతేగాక, ముందుముందు జర్మనీతో సత్సంబంధముల పాటించగలమని వాగ్దాన మొసంగిరి [చూ. లోకర్నో సంధులు]. స్వా. వెం.

**రూసో, జీన్ జాక్విస్** (1712 - 1778) : ఫ్రెంచి తాత్త్వికుడు ; రమారమి 200 సంవత్సరముల కాలము అనేక దేశముల రాజకీయ భావములపై ఈతని ప్రభావము కన్పట్టినది.

రూసో తన ప్రధాన గ్రంథమైన 'సాంఘిక సమయము (సోషల్ కాంట్రాక్ట్)' 1762 లో ప్రకటించెను. ఈ గ్రంథము 'మానవుడు స్వేచ్ఛాజీవిగా జన్మించినాడు. కాని, ఎల్లచోట్ల అతడు శృంఖలాబద్ధుడై కన్పించుచున్నాడు' అను ప్రఖ్యాత వాక్యముతో ఆరంభించును. ఈతని రాజ్య సిద్ధాంతము బహుళ వ్యాప్తమై, అందు ప్రతిపాదించబడిన ప్రజాసర్వస్వాధికారము స్వేచ్ఛాభిలాషులైన ప్రజలు అందరిచేతను అనుసరించబడినది. యునైటెడ్ స్టేట్స్, ఫ్రెంచి విప్లవములతో ఈతని సిద్ధాంతము ప్రజాస్వామ్య ప్రభుత్వములకు పరమ ప్రమాణమైనది [చూ. సం. 7 - పు. 655 ; సం. 10 - పు. 651]. * * *

**రెడ్డిరాజులు :** చూ. కొండవీటి రెడ్డిరాజ్యము-తెలుగు సంస్కృతి, సం. పు. 307.

**రెఫరెండమ్ :** చూ. ప్రజానిర్ణయము - పు. 594.

**రైన్ లాండ్ :** ఫ్రాన్స్, బెల్జియమ్, లక్జెంబర్గ్ సరిహద్దులలో ఉన్న పశ్చిమజర్మనీయందలి ఒక కీలకప్రాంతము. ఇది తన ఖనిజ సంపత్తిచే చుట్టుప్రక్కల రాజ్యాధినేతల దృష్టిని తరుచుగ తన వైపునకు ఆకర్షించుకొనుచుండెను. నెపోలియన్ పతనము తరువాత 1815 లో అది జర్మనీకి ఈయబడెను. జర్మనులు అందలి ఖనిజసంపదను దేశ సౌభాగ్యమునకు పనికివచ్చునట్లు వృద్ధిపరచి, ఉపయోగించుకొనిరి. 1918 లో మార్షల్ ఫోక్‌తో సహా అనేకమంది ఫ్రెంచివారు దానిని జర్మనీనుండి గుంజుకొనుటకు తీవ్రముగ ప్రయత్నించిరి. ప్రథమ ప్రపంచయుద్ధ పర్యవసానముగ 1919 లో జరిగిన వెర్సైయిల్స్‌సంధి ప్రకారము రైన్ లాండ్ జర్మనీలోనే ఉండునట్లును; దానిని మిత్రమండలి సేనలు పదిహేను ఏండ్లవరకు ఆక్రమించుకొనునట్లును ; రైన్‌నది కుడి ఒడ్డున 48 కిలోమీటరుల వెడల్పుగల సైనిక మండలము ఏర్పాటు చేయవలసినట్లును నిర్ణయింపబడెను. 1923 లో పై సంధి ప్రకారము తమకు ఈయవలసిన నష్ట పరిహారములు జర్మనీ చెల్లించలేదను నెపమున రూర్‌ను ఫ్రెంచివారును, బెల్జియన్‌లును ఆక్రమించుకొని దీనినిగూడ జర్మనుల ఆధిపత్యమునుండి శాశ్వతముగ తొలగింప ప్రయత్నించిరి. కాని, అందువలన ప్రయోజనము లేక పోయెను. హిట్లర్ జర్మనీ నియంత అయిన తరువాత రైన్‌లాండ్ విషయమై మరల తగాదా బయలుదేరెను. 1936, మార్చిలో ఫ్రెంచివారు జర్మనీని చుట్టుముట్టుటకు

కుట్రలు పన్నుచున్నారని వంకపెట్టి, వెర్సెయిల్స్, లోకర్నో ఒడంబడికలను నిర్లక్ష్యముచేసి నిస్సైనిక మండలమును ఆక్రమించుకొనుటకై హిట్లర్ జర్మను సైన్యములను పంపెను. అప్పట్లో బ్రిటిష్‌వారును, ఫ్రెంచివారును ఎతియోపియాను ఇటలీ ఆక్రమించుటచే ఏర్పడిన సందిగ్ధ పరిస్థితిలో మునిగియుండుటచే, హిట్లర్ గైకొన్న సైనికచర్యను ఖండించిరే గాని, అంతకంటె ఏమియు చేయరైరి. స్వ. వెం.

**రొడీషియా, ఉత్తర** : ఆఫ్రికా ఖండమునందలి స్వతంత్ర గణరాజ్యము. దీని పేరు జాంబియాగా మారినది.

రాజ్యమునకు కాంగో (లియొపాల్డ్‌విల్లి), టాంగన్యికా [ఉ]; న్యాసాలాండ్ [తూ]; మొజాంబిక్, దక్షిణ రొడీషియా, బోత్సువానా [ద]; అంగోలా [ప] సరిహద్దులందు ఉన్నవి. [వి] 7,46,254 చ. కి. మీ.; [జ] 25,50,000. ఇందులో దాదాపు 75,000 యూరపియన్లు, 7,900 ఆసియావాసుల సంతతివారు, 1,900 మిశ్రజాతులవారు తప్ప తక్కిన వారందరు ఆఫ్రికా జాతులకు చెందినవారు. [మ] యూరపియన్లందరును క్రైస్తవులు, తక్కినవారియందు క్రైస్తవ, ఇస్లామ్, సంప్రదాయ బహుదేవతారాధనలకు చెందినవారలును కలరు. [రా] లుసాకా (జ. సం. 1,00,000). (చూ. ఆఫ్రికా)

చరిత్ర : ఈ దేశపు ప్రాచీన చరిత్రను గురించిన వివరములు ఏవియు సోపపత్తికముగ తెలియవచ్చుటలేదు. కాని, దేశమున అటనట కన్పట్టు 'జింబాబ్వీలు' అనబడు శిథిల దుర్గావశేషములును, ఒకపుడు ఖనిజోత్పత్తికి ఆకరములుగ ఉండి, వదలివేయబడిన చిహ్నములు గల బంగారు గనులును ఈ దేశమున ఒకప్పుడు ప్రాచీన నాగరకత వర్ధిల్లెనని రుజువు చేయుచున్నవి. ఈ నాగరకతకు భారతీయ నాగరకతతో కొంత సంబంధము ఉండెనని చారిత్రకులలో కొందరి అభిప్రాయము. ఈ నాగరకత వర్ధిల్లిన కాలమును గురించి చారిత్రకులలో ఏకాభిప్రాయము లేదు. వారిలో కొందరు ఇది క్రీస్తు పూర్వము 2, 3 శతాబ్దముల నుండి మధ్య యుగముల వరకు వర్ధిల్లి, అంతట అంతరించెనని అందురు. మరికొందరు ఈ దేశమునందలి శిథిలావశేషములు అన్నియు మధ్యయుగపు నాగరకతను మాత్రమే సూచించుచున్నవని అభిప్రాయము ఒసగి ఉన్నారు. ఏది ఎటులున్నను ఈ ప్రాచీన నాగరకత క్రీ. శ. 1400 నాటికి నిశ్శేషముగ అంతరించెననుట స్పష్టము. 16 వ శతాబ్దిలో ఈ దేశము మోనోమోటపరాజ్యమనుపేర బంటూజాతి [చూ. సం. 10 - పు. 538] పాలకుల పాలనలో ఉండెను. అపుడు ఈ రాజ్యము తూర్పున సముద్రమువరకు విస్తరించి ఉండెను. కాని, పోర్చుగీస్‌వారు క్రమముగ ఆ శతాబ్దమున తీరభూములయందు స్థావరములను నెలకొల్పి మోనోమోటపరాజుల ఆదరణను పొంది, విశాల తీరభూములను ఆర్జించిరి. మిగిలిన దేశము మాత్రము దేశీయ ప్రభువుల వశమునందే ఉండెను. కాని, తరువాత 19 వ శతాబ్ది మధ్య భాగమున, దక్షిణ రొడీషియాతో పాటుగ ఈ దేశమును 'మతాబేలే' అను ఆఫ్రికన్ తెగ పాలకులు వశపరచుకొని పాలించిరి.

బ్రిటిష్‌వారికి ఈ దేశమునను, దక్షిణ రొడీషియాయందును, న్యాసాలాండ్‌నందును పలుకుబడిని కల్పించుటకు తొలుత కృషిచేసినవాడు సిసిల్ రోడ్స్ అను వ్యాపారి [చూ. దక్షిణ రొడీషియా - పు. 809]. ఈతని నాయకత్వమున ఏర్పడిన బ్రిటిష్ సౌత్‌ఆఫ్రికా కంపెనీ కృషివలన బ్రిటిష్‌వారు పెక్కుమంది ఇట వలస వచ్చిచేరి క్రమముగ దేశీయుల స్వాతంత్ర్యమును హరింపగలిగిరి (1897). వారి పాలనమున దక్షిణ, ఉత్తర రొడీషియాలు ఏక రాజ్యముగనే ఉండి, సిసిల్ రోడ్స్ పేరిట రొడీషియా అని వ్యవహరింపబడెను. కాని, త్వరలోనే వలసవచ్చిన బ్రిటిష్‌వారికిని, కంపెనీకిని మధ్య తగవులు చెలరేగుటచే, బ్రిటిష్ ప్రభుత్వము జోక్యము వహించి, వలసవచ్చిన వారిలో ఎక్కువగ వసించిన భాగమును దక్షిణ రొడీషియాగ రూపొందించి, రెండింటిని తన పరిపాలనలోనికి తీసికొనెను (1911). 1922 లో బ్రిటన్ ఈ దేశపు పరిపాలనను నిర్వహించుటకు ప్రత్యేకముగ ఒక గవర్నర్‌ను నియమించెను. ఈ గవర్నర్ ఒక కార్యనిర్వాహకవర్గ సహాయమున తన పరిపాలనను సాగించుచుండెడివాడు. 1945 నుండి ఈ కార్యనిర్వాహక సంఘమున అత్యధిక స్థానములు ఎన్నుకొనబడిన సభ్యులకు ఒసగబడినవి. కాని, ఎన్నిక విధానమును అనుసరింపబడు ఒక వినూతన పద్ధతివలన ఈ స్థానములలో పెక్కు అల్పసంఖ్యాకులగు శ్వేతజాతివారికే లభించెడివి. ఈ ఎన్నిక విధానమును బట్టి కొన్ని ఉన్నతార్హతలు కలవారికి మాత్రమే దేశమున వోటు ఉండెడిది. ఆఫ్రికన్లలో ఏ కొలదిమందికి మాత్రమో ఆ ఉన్నతార్హతలు ఉండెడివి. ఈ ఉన్నతార్హతలు తెల్లవారిలో దాదాపుగ అందరికిని ఉండుటచే వారు అందరును వోటరులు కాగలిగి, ఆఫ్రికన్లకన్న ఎక్కువగ స్థానములను ఆర్జింపగలిగెడివారు.

ఇందులకు తోడుగ 1953లో దక్షిణ రొడీషియా, న్యాసాలాండ్‌లతో దేశమును కలిపి ఒక సమాఖ్యను బ్రిటిష్ ప్రభుత్వము రూపొందించెను. ఈ సమాఖ్యయందలి కేంద్రమునకు ఒసగిన అధికారముల ఫలితముగ శ్వేతజాతి అధికారము ఇంకను పటిష్ఠమయ్యెను. కడకు ఆ యా దేశములందలి ఆఫ్రికన్ల ఆందోళనకు లొంగి, బ్రిటన్ ఈ సమాఖ్య

రద్దగుటను అంగీకరించెను (1962). ఈ దేశమున క్రమముగ స్వయంపరిపాలనను నెలకొల్పుటకు 1962 మొదలుగ బ్రిటన్ కొన్ని చర్యలను తీసికొనినది. ఎన్నిక విధానమున కొన్ని మార్పులను కలిగించిన ఫలితముగ, నూతనముగ రూపొందిన లెజిస్లేటివ్ కౌన్సిల్ నందు ఆఫ్రికన్‌లకు అత్యధిక స్థానములు చేకూరినవి. కాలక్రమమున దేశ ప్రజలందు స్వాతంత్ర్యాకాంక్ష పెచ్చు పెరగగ, తుదకు 1964 లో స్వతంత్రతను ఆర్జించి, జాంబియా అను నూతన నామముతో కెన్నెత్ డి. కౌండా అధ్యక్షతన ఒక గణరాజ్యముగ అవతరించి, కామన్ వెల్త్‌నను, ఐక్యరాజ్యసమితియందును సభ్యత్వమును ఈ దేశము వహించి ఉన్నది. చీ. శే. రా.

**రొడీషియా, దక్షిణ :** ఆఫ్రికాఖండమునందలి దేశము. ఇది స్వయంపరిపాలన కలిగి ఉన్న బ్రిటిష్ వలస రాజ్యము.




ఈ దేశమునకు ఉత్తర రొడీషియా [ఉ]; మొజాంబిక్ [తూ]; దక్షిణ ఆఫ్రికా యూనియన్ [ద]; బోత్స్వానా [ప] సరిహద్దులందు ఉన్నవి. [వి] 3,89,362 చ. కి. మీ. [జ] 38,80,000. వీరిలో యూరపియన్ సంతతివారు 2,25,000, మిశ్రజాతివారు 10,500. ఇక మిగిలిన ప్రజలు అందరును ఆఫ్రికన్ జాతులవారు. [భా] ఆఫ్రికన్ జాతులవారిలో బంటూవర్గమునకు చెందిన పలు భాషలు, మాండలికములు మాతృభాషలుగ ప్రచారమందు ఉన్నవి. యూరపియన్‌లు అందరికి మాతృభాషయగు ఇంగ్లీషు అధికార భాషగ వ్యవహరింపబడుచున్నది. [మ] యూరపియన్‌లు అందరును క్రైస్తవులు, ఆఫ్రికన్‌లలో దాదాపు 25,000 మంది మాత్రమే క్రైస్తవ మతము అవలంబించిరి. కడమవారు అందరు సంప్రదాయ ప్రకృతి దేవతారాధనసే అవలంబించి ఉన్నారు. [రా] సాలిస్‌బరీ (జ. సం. 3,09,900.)

**చరిత్ర:** ఈ దేశపు చరిత్రను గురించి 19 వ శతాబ్దికి పూర్వపు వివరములు ఏవియు తెలియవచ్చుటలేదు. 1514 - 1569 మధ్య కాలమున అంతటంతట ముగ్గురు పోర్చుగీస్ అన్వేషకులు ఈ ప్రాంతమును దర్శించినటుల తెలియవచ్చినను వారి వ్రాతలలో చారిత్రక విశేషములు ఏవియు కానవచ్చుటలేదు. తరువాత మూడు శతాబ్దముల కాలము యూరప్‌వాసులు ఎవరును ఆ ప్రాంతమునకు పోలేదు. తరువాత 19 వ శతాబ్ది మధ్యభాగమున యూరపియన్‌లు ఇటకు వచ్చునప్పటికి ఈ దేశమున పశ్చిమ భాగము మతాబేలే తెగకు చెందిన ఆఫ్రికన్ జాతివారి వశమునను, తూర్పు భాగము మషోనా అను తెగవారి స్వాధీనమునను ఉండెను. వీరిలో మొదటివారు కడు బలవంతులు అగుటచే తూర్పుప్రాంతమువారిపై ఆధిపత్యము నెరపుచుండిరి.

బ్రిటిష్‌వారికి ఈ దేశమునను, తత్పరిసర ప్రాంతములగు ఉత్తర రొడీషియా, న్యాసాలాండ్ దేశములందును పలుకుబడిని కలిగించుటకు సిసిల్ రోడ్స్ (1852 - 1902) అను బ్రిటిష్ వ్యాపారి ఎక్కువగ కృషిచేసెను. దక్షిణ ఆఫ్రికాలో కొన్ని వజ్రపు గనులకు ఇతడు యజమాని. మతాబేలే తెగ నాయకునితో ఇతడు రాయబారముల జరిపి, బ్రిటిష్ సౌత్ ఆఫ్రికా కంపెనీ అను బ్రిటిష్ వ్యాపార సంస్థకు ఈ దేశమున వ్యాపారపు హక్కులను కలుగజేసెను (1889 అక్టోబరు). తరువాత 1891 లో వలసదారులకు భూమిని విక్రయించు హక్కు తమకు మాత్రమే ఉండునట్లు ఈ కంపెనీ అధికారమును ఆర్జించెను. అందువలన బ్రిటిష్‌వారు పెక్కురు ఇట వలసవచ్చి చేరుట ఆరంభమయ్యెను. ఇది బ్రిటిష్‌వారి సర్వాధిపత్యమునకు దారితీయునను భయముచే మతాబేలే తెగవారు 1893 లో ఈ వలసవచ్చిన వారిపై దండయాత్ర జరుపగ, వారిని బ్రిటిష్‌వారు ఓడించి వారిస్వాధీనమున ఉన్న భూమిని అంతటిని వశపరచుకొనిరి. తరువాత 1896 - 1897 లో తిరుగుబాటు జరిపిన మషోనా తెగవారికిని ఈ దుస్థితియే ప్రాప్తించెను. అంతటి నుండి ఈ రాజ్యము బ్రిటిష్ పాలనలోనికి వచ్చినది.

ఆఫ్రికన్ తెగల స్వాతంత్ర్యమును అంతమొందించిన పిదప, వలసవచ్చిన వారికిని, వారిని అటకు తెచ్చిన బ్రిటిష్ సౌత్ ఆఫ్రికా కంపెనీకిని మధ్య అధికారమునకై తగవులు ప్రారంభమయ్యెను. 1898 నుండి 1910 వరకు ఆ కంపెనీయే ఈ రాజ్యమును పాలించుచుండెను. దక్షిణ ఆఫ్రికాలోని బ్రిటిష్ హైకమీషనర్‌కు ఈ కంపెనీ ప్రభుత్వముపై పర్యవేక్షణాధికారము మాత్రము ఉండెను. కాని, వలసప్రజలు చేసిన ఆందోళనకు ఫలితముగ 1911 నుండి స్థానిక శాసన సభయందు అత్యధిక సంఖ్యాకులను ఎన్నుకొను హక్కు ఈ దేశమందలి శ్వేతజాతీయులకు లభించెను. కాని, వారికి

అది సంతృప్తిని కలిగింపలేదు. తరువాత 1922 లో బ్రిటిష్ ప్రభుత్వపు ప్రత్యక్షపరిపాలనలోనికి ఈ దేశము తీసికొనబడినది. 1923 లో కంపెనీవారు తమకు దేశమునగల గనుల త్రవ్వకపు హక్కులను అన్నిటిని ప్రభుత్వమునకు విక్రయించిరి. ఆ సంవత్సరముననే ఈ దేశమునకు ఒక ప్రాతిపదిక రాజ్యాంగవిధానమును బ్రిటన్ ఒసగెను. దీని వలన తెల్లజాతి ప్రజలకు స్వయంపరిపాలన లభించెను. ఇటుల శ్వేతజాతి వలసప్రజల స్వాతంత్ర్యవాంఛ నెరవేరినప్పటినుండి శ్వేత - శ్వేతేతర ప్రజలమధ్య రాజ్యాధికారమునకై వైరుధ్యములు పొడమసాగినవి. 1930 లో దేశమందలి సారవంతమగు భూమిని శ్వేతజాతీయులకు ప్రత్యేకించుచు, ప్రభుత్వమువారు ఒక శాసనము చేసిరి. దీనినిబట్టి 5 కోట్ల ఎకరము*ల భూమిని యథేచ్ఛగ తమ శ్రేయస్సునకై వినియోగించుకొనుటకు తెల్లవారికి హక్కు ఏర్పడెను. అధిక సంఖ్యాకులగు ఆఫ్రికన్‌లకు 4 కోట్ల ఎకరము*ల సారరహితమగు భూమి ప్రత్యేకింపబడెను. ఈ దుశ్చర్యను ఆఫ్రికన్‌ప్రజలు ప్రతిఘటించిరి. కాని, బ్రిటన్ ఈ శాసనమును ఆమోదించెను. 1953 లో ఉత్తర రొడీషియా, న్యాసాలాండ్‌లతో పాటుగ దక్షిణ రొడీషియాయును రొడీషియా - న్యాసాలాండు సమాఖ్యలో చేరెను. ఈ సమాఖ్యయందలి కేంద్రమునకు తొలుత ఆర్థికసంబంధ విషయములందు మాత్రమే పరిమితాధికారములు ఉండెను. 1957 లో విదేశవ్యవహారములును కేంద్రమునకు ఒప్పగింపబడినవి. కాని, రంగు విచక్షణను బలపరచి, శ్వేతజాతికి అధికారమును కట్టబెట్టుటకే ఈ సమాఖ్య ఏర్పరుపబడినదను తలంపుతో ఆఫ్రికన్ ప్రజలు అందరు ప్రతిఘటించుటచే, ప్రతిఘటనకు లొంగి ఆ సమాఖ్యను రద్దు చేయుటకు బ్రిటన్ అంగీకరించినది (1962). అంతటినుండి సర్వస్వతంత్రప్రతిపత్తిని ఆర్జించుటకు దక్షిణ రొడీషియా ప్రభుత్వము యత్నించినది. కాని, అధికసంఖ్యాకులగు ఆఫ్రికన్‌జాతి ప్రజలకు ఎన్నిక హక్కులేని స్వయంపరిపాలనమును రద్దుచేసి, ఆఫ్రికన్ ప్రజలకు పరిపాలనయందు స్వామ్యమును కల్గింపవలెనని ఐక్యరాజ్యసమితి బ్రిటన్‌ను ఆదేశించినది. ఇట్టి చర్యవలన తమ అధికారము నశింపగలదను భయముతో శ్వేతజాతినాయకులు దీనిని ప్రతిఘటించి, కడకు బ్రిటన్‌తోను, ప్రపంచ ప్రజాభిప్రాయముతోను నిమిత్తము లేకుండ దేశ స్వతంత్రతను ప్రకటించిరి (1965). ఇందులకు ప్రతిగ, బ్రిటన్ అభ్యర్థనపై, ఐక్యరాజ్యసమితి ఈ దేశముపై ఆర్థిక ఆంక్షలను ప్రకటించినది.

* ఒక ఎకరమునకు 0.404 హెక్టేరు.

**రాజ్యాంగము :** బ్రిటన్‌చే నియమింపబడు గవర్నర్ ప్రభుత్వ అధిపతిగ ఇట వ్యవహరించును. ఏక కక్ష్యగల శాసనసభయందు 59 మంది సభ్యులు కలరు. వీరిని ఎన్నుకొను వోటరుల పట్టికలలో రెండు భాగములు కలవు. మొదటి భాగపు వోటర్లకు విద్య, ఆస్తి మొదలగు అర్హతలు ఉన్నత స్థాయిలో ఉండును. అందువలన ఈ భాగమున వోటరులుగ చేరుటకు శ్వేతజాతివారికి మాత్రమే అవకాశము కలుగును. ఇక రెండవ భాగమున వోటరులకు అర్హతలు కొంత తక్కువ స్థాయిలో ఉండును. అందువలన అందు తెల్లవారితోపాటు తక్కిన వారును కొందరు వోటరులుగ చేరుటకు అవకాశము కలదు. కాని, ఈ రెండవ భాగమున నమోదగు వోటరుల సంఖ్య మొదటి భాగపు వోటరుల సంఖ్యలో నాలుగవవంతును మించి ఉండరాదను నియమము కలదు. కావున ఆ పరిమితిని రెండవ భాగపు వోటరుల సంఖ్య అందుకొనగానే అది ముగింపు చేయబడును. ఇందువలన ఎక్కువమంది వోటరులుగ చేరుటకు అవకాశము ఉండదు. రెండు భాగముల వోటర్లును ఎన్నికలలో సమాన హక్కులతో పాల్గొనెదరు. కాని, మొదటి భాగము వోటరులు ఎక్కువ సంఖ్యవారు అగుటచేతను, ఆ వోటరులందరును తెల్లవారే అగుటచేతను అధికారము తెల్లవారి చేతిలోనే ఉండక తప్పదు. ఈ విపరీత విధానము రద్దుచేసి, ఏ షరతులు లేని సార్వజనిక వయోజన వోటింగు పద్ధతిని కొనివచ్చుటకు ప్రభుత్వమును ప్రతిఘటించి ఆఫ్రికన్ ప్రజలు ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెస్ నాయకత్వమున పోరాడుచున్నారు. చీ. శే. రా.

**రొమేనియా :** చూ. రుమేనియా - పు. 805.

**రొసెట్టా శిల :** ఈజిప్టుదేశములో నైలునది ముఖద్వారమున రొసెట్టా (రషీద్ అను అరబ్బీ పదము యొక్క వికృతి రొసెట్టా లేక రొసెత్తా) అను ప్రదేశమున బయల్పడిన ఈ శిలాశాసన ఫలకము మీద మూడు లిపులు గల ఒక శాసనము చెక్కబడి ఉన్నది. ఈజిప్టునందలి ప్రాచీన చిత్రలిపిని చదువగలుగుట ఈ శిలాఫలకము యొక్క సాహాయ్యమువలననే జరిగినది.

ఫ్రెంచి దేశాధీశుడగు నెపోలియన్ - I సేనలు 1798 లో ఈజిప్టునందు సెయింట్ జూలినా కోటను పరిరక్షించుటకు కందకములు త్రవ్వగా, ఆ త్రవ్వకములలో ఈ శిలాఫలకము బయల్పడెను. అచటి సైన్యాధిపతియగు జనరల్ మెనెన్ ఆ శిలాఫలకమును చేనేత వస్త్రములలో చుట్టి భద్రపరచి, ఫ్రాన్సు దేశమునకు ఎగుమతిచేయ సిద్ధపరచెను. కాని, అలిగ్జాండ్రియా రేవుపట్టణము బ్రిటిష్‌వారి వశమయి, తత్ఫలితముగ ఈ ప్రాచీన శిలాఫలకము బ్రిటిష్ వారికి

దక్కినది. నెపోలియన్ విజేతపై బ్రిటిష్‌వారి విజయ దర్ప సూచకముగ బ్రిటిష్ వస్తుప్రదర్శనశాలయందు ఇది ప్రతిష్ఠింపబడినది.

ఈ రొసెట్టా ఫలకము మొత్తము 97 పంక్తులు గల శిలా శాసనము. అందు మొదటి 14 పంక్తులు హాయర్‌గ్లిఫిక్స్ (పవిత్రచిత్ర) లిపి, తరువాతి 32 పంక్తులు డెమోటిక్ (వ్యావహారిక) లిపి, కడపటి 51 పంక్తులు గ్రీక్‌లిపి.

గ్రీక్ చరిత్రకారులైన హెరొడోటస్, డయోడోరస్ ఈజిప్టు దేశమును గూర్చి తమ గ్రంథములలో వ్రాయుచు ఈజిప్టునందు రెండు రకముల భాషలు, లిపులు వాడుక యందు ఉండినట్లు వ్రాసి ఉన్నారు. ఇందు ఒక విధమగు లిపి (హాయర్‌గ్లిఫిక్స్) మతాచార్యులు మాత్రమే వాడుక చేయుచుదురనియు, రెండవ లిపి (డెమోటిక్) ని సామాన్య మానవులు దైనందిన వ్యవహారములలో వాడుక చేయుచుందురనియు ఆ చరిత్రకారులు తెలిపి ఉన్నారు. మొదటిరకపు లిపిని నిలువుగగాని, అడ్డముగగాని వ్రాయు అలవాటు ఉన్నదనియు, దానిని కుడినుండి ఎడమకును, కొన్నిఎడల ఎడమనుండి కుడివైపునకును చదువవలసి వచ్చుచుండుననియు కూడ వారు తెలిపి ఉన్నారు.

ఈ విషయమును పండితులు ఎరిగి ఉండినప్పటికిని, మూడు లిపులతో కూడిన రొసెట్టా శిలాశాసన పరిష్కారము బహుకష్టసాధ్యమైనది. కాని, 1802 లో అరబ్బీభాషా పారంగతుడైన సెల్వెస్టర్ డి సాసీ, పారిస్ నగరమున స్వీడెన్‌దేశపు రాయబారవర్గ కార్యాలయమునకు చెందిన అకర్‌బ్లాడ్ అనువారలు మూడవ లిపియగు గ్రీక్ లిపి శాసనమునకు అనువాద రూపములే తక్కినవి అగునని నిర్ణయించి, కృషిచేసి, శాసనములోని డెమోటిక్ లిపిలో వ్రాసిన శిలాశాసన భాగమును విడదీయగలిగిరి.

కాని, హాయర్‌గ్లిఫిక్స్ వ్రాత విడదీయరానిదయినది. కడకు బ్రిటిష్ దేశస్థుడగు థామస్ యంగ్ (1773 - 1829), ఫ్రాన్స్ దేశీయుడగు జే. ఎఫ్. షాంపోలా (1790 - 1832) అను ఇరువురు పండితుల నిరంతరకృషివలన చిత్రలిపిలో కుండలరేఖలందు ఉంచబడిన వ్యక్తినామము లందలి చిత్రముల ధ్వని సంకేతములు తొలుత కనుగొనబడినవి. యంగ్ పండితుడు ఆ పేర్లలోని ఏ యే బొమ్మలు ఏ యే అక్షరములుగ పలుకదగునో, ఏది ఏ అక్షరమునకు సంకేతమో విమర్శచేసి వ్రాసికొని, చివరకు చిత్రలిపి అక్షరముల పట్టికను తయారుచేసెను. కాని, ధ్వని విలువలు చాలవరకు తప్పులని తరువాతి పరిశోధనలవలన తేలినది. షాంపోలా కూడ యంగ్ పండితునివలె పరిశోధనలు చేసి, బొమ్మలుకల అక్షరములకు కట్టదగిన అక్కరపు విలువలను తెలియపరచు ఒక పెద్ద పట్టికను ప్రకటించెను. దీని మూలమున ఆ చిత్రలిపి పఠనము సుగమమైనది. ఈ శిలాశాసనమందలి విషయమును బట్టి ఇది టాలమీ [చూ. పు. 496] యొక్క పట్టాభిషేక సందర్భమున క్రీ. పూ. 196 లో మెంఫిస్‌నందు ప్రతిష్ఠింపబడినదని తెలియ వచ్చినది.

మ. ఆ. శ.

**రోమ్ :** ఇటలీయందలి ఒక ప్రాచీన, చారిత్రాత్మక నగరము; క్రీ. శ. నాలుగవ శతాబ్దమువరకు రోమన్ సామ్రాజ్యమునకు అంతటికిని, ఆ తరువాత ఒక శతాబ్ది కాలము పశ్చిమ రోమన్ సామ్రాజ్యమునకును రాజధానిగ విలసిల్లినది. ఈ కాలమున ఇటలీకి రాజధాని.

'టైబర్' అను పేరుగల నదియొక్క తూర్పు తటమున తొలుత ఈ నగరము నిర్మింపబడినది. సంప్రదాయ గాథలను బట్టి ఈ నగరము రోములస్ అను వానిచే క్రీ. పూ. 753 లో నిర్మింపబడినటుల తెలియవచ్చుచున్నది. ఆ గాథల వలననే అచటి తొలుత టార్క్విన్ వంశీయరాజులు కొంత కాలము పాలన నిర్వహించిరని తెలియవచ్చుచున్నను, అందులకు చారిత్రకాధారములు ఏవియు కన్పట్టుట లేదు. కాని, క్రీ. పూ. 500 వరకు ఎట్రస్కన్ జాతివారలు ఇట పాలన నిర్వహించినటుల విశ్వసించుటకు తగు ఆధారములు కలవు. ఆనాడు వర్తక వాణిజ్యాదులకు కేంద్రముగ క్రమవృద్ధి చెంది, వివిధ జాతులవారిని ఈ నగరము ఆకర్షించి, ఈ నగరము క్రమముగ పలు మూలలందు విస్తృతి చెంది టైబర్ నది ఉభయ తటములను, పరిసరముల నున్న ఏడు కొండలను లోగొనినది. క్రీ. పూ. 500 నుండి రోమన్ గణరాజ్యము ఇచట రూపొంది వికసన మొందినది. క్రీ. పూ. 390లో గాల్ జాతీయులు ఈ నగరమును కొల్లగొట్టినను, త్వరలోనే కోల్కొని ఈ నగరము ఉన్నత వైభవమును అందుకొనినది. క్రమశః రోమన్ సామ్రాజ్య విస్తృతితోపాటుగ ఈ నగరపు వైభవమును పరాకాష్ఠను అందుకొనినది [చూ. సమితు-పు. 40]. అగస్టస్ పరిపాలనా కాలము మొదలుగ ఈ నగరమున భవననిర్మాణము విరివిగ సాగినది. గ్రీక్, ఈజిప్టు దేశములనుండి ఆర్జించిన శిల్పవాస్తు విజ్ఞానమునకు స్వీయప్రతిభను జోడించి రోమన్‌లు రోమ్ నగరమును సౌందర్యరాశిగ రూపొందింప యత్నించిరి. నీరో పరిపాలనా కాలమున (క్రీ. శ. 54 - 68) రోమ్ నగరమున కొంతభాగము తగులబడిన తరువాత పునర్నిర్మాణ కాలమున అత్యుత్తమ కళాఖండములని భావింపదగు భవనములు పెక్కు రూపొందినవి. క్రీ. శ. 476 లో పశ్చిమ రోమన్ సామ్రాజ్యము అంతరించుటతో రోమ్‌నగరపు ప్రశస్తియు అంతరించినది.

మధ్య యుగములందు, రాజకీయ కేంద్రముగ కాక పోయినను, పోప్ పీఠపు నెలవుగ కొంత ప్రాముఖ్యమును ఈ నగరము సంతరించుకొనినది. పునరుజ్జీవనోద్యమ కాలమున బ్రమాంటే, మైకేలేంజిలో మొదలగు సుప్రసిద్ధ కళాస్రష్టల కృషివలన నగరమున రమ్యకళాఖండములు రూపుగొనినవి. 1871 లో సమైక్య ఇటలీప్రభుత్వసైన్యములు ఆ పట్టణమును వశపరచుకొని, ఇటలీరాజ్యమునకు ముఖ్య నగరముగ చేసినవి. రోమ్‌పై తమకు ఉండిన అధికారము ఇటుల తొలగినందులకు పోప్ కినుక చెంది, ఇటలీ ప్రభుత్వాధికారమును గుర్తింపకున్నను కడకు 'రోమన్ సమస్య' ను పరిష్కరించుటతో సత్సంబంధములు మరల నెలకొనినవి [చూ. రోమన్ సమస్య; వాటికన్‌నగర రాజ్యము].

రోమునందలి ప్రాచీన నిర్మాణావశేషములలో 1. కలోసియమ్, 2. ఫోరమ్, 3. లాటెరన్, 4. సెయింట్ పీటర్ చర్చి, 5. రాజభవనములు, 6. చిత్రకళాఖండములు ప్రముఖములు. ప్ర. రా. సు.

**రోమన్ సమస్య :** రోమన్ కేతలిక్ మత పీఠాధిపతి యగు పోప్‌నకు రోమ్‌పైగల పరిపాలనాధికారమును గూర్చిన తగాదాయే ఈ పేరున వ్యవహరింపబడుచున్నది. 1848, నవంబరులో స్వాతంత్ర్యప్రియులైన ప్రజల తిరుగుబాటుచే అప్పటి పోప్ అయిన పయస్ - IX రోమ్ నగరమును వదలిపోయెను. ప్రజానాయకులగు మాజినీ [చూ. పు. 744], గరిబాల్డీ [చూ - పు. 421] 1849, ఫిబ్రవరిలో రోమన్ గణరాజ్యమును స్థాపించి, రోమ్‌ను కూడ అందులో కలిపిరి. ఫ్రెంచి చక్రవర్తియగు నెపోలియన్ - III [చూ. పు. 543] పోప్‌ను రోమ్‌లో నిలబెట్టి రోమన్ కేతలిక్‌ల ఆదరణను సంపాదించగోరి, 1849, ఏప్రిల్ లో ఒక సైన్యమును రోమ్‌పైకి పంపగా, అది 1849, జూలైలో ఆ నగరమును జయించి, అచ్చటినుండి రిపబ్లికన్‌లను పారదోలెను. పోప్ తిరిగి రోమ్‌నగరమున ప్రతిష్ఠింపబడెను. అతని రక్షణకొరకు కొంత ఫ్రెంచి రక్షక సైన్యము ఆ నగరమున తిష్ఠవేసెను. ఇట్లుండ 1861 లో ఇటలీ రాచరికపు రాజ్యము (మొనార్కీ కింగ్‌డమ్) గ పరిణమించగ రోమ్ నగరము ఆ రాచరిక రాజ్యములో చేరక, బయటనుండి దేశభక్తులగు ఇటాలియన్‌లను తన వైపునకు ఆకర్షించుకొను సూదంటు రాయివంటిదయ్యెను. అప్పట్లో జరిగిన ఒక అంతర్జాతీయ సమావేశములో ఈ రోమన్‌సమస్య పరిష్కరించుటకు నెపోలియన్ - III ప్రయత్నించుటచే 19-8-1870 వరకు ఫ్రెంచి సేనలు రోమ్‌నందే ఉండెను. అయితే, ఫ్రెంచివారికి ప్రష్యన్‌లతో జరిగిన యుద్ధ సమయమున ఆ సేనలు రోమ్‌ను వదలి వెళ్లెను. అంతట సమయమునకై వేచియున్న ఇటలీ సైన్యము 20-9-1870 న రోమ్‌న ప్రవేశించెను. 2-10-1870 న లాంఛన ప్రాయముగ జరిగిన జనవాక్యముచే రోమ్‌నగరము ఇటలీ రాజ్యములో చేర్చబడి రాజధాని అయ్యెను. తరువాత అధికారమునకు వచ్చిన పోప్‌లు ఇటలీ రాజ్యమును గుర్తింపనొల్లక, తమ్ము వాటికన్‌లో బందీలుగా తలచుకొనుచుండిరి. అయితే, 1929 లో జరిగిన లాటరన్ ఒడంబడిక వాటికన్ నగరమును పోప్‌ల అధికార పరిధి యందున్న ప్రత్యేక రాజ్యముగ గుర్తించి తగాదాను అంతముచేసెను [చూ. వాటికన్ నగరరాజ్యము]. స్వ. వెం.

**రౌండుటేబిల్ సభ :** చూ. భారతదేశము - పు. 664.

**లండను సంధి :** ఈ పేరున జరిగిన సంధులు రెండు కలవు :

మొదటి సంధి : 1839 ఏప్రిల్ లో డచ్చివారికిని, అంతకు ముందు వారిచే పాలింపబడిన బెల్జియమ్‌వారికిని జరిగినది. బెల్జియమ్ ప్రజలు 1830 లో డచ్చి పాలనమును కూలద్రోసి స్వతంత్రత పొందిరి. ఈ సంధిప్రకారము 1. డచ్చి రాజు బెల్జియమ్ స్వాతంత్ర్యమును అంగీకరించెను; 2. లక్జెంబర్గ్ మహాసామంతరాజ్యము (గ్రాండ్ డచ్చి) గ ఉండుటకు బెల్జియమ్‌దేశము సమ్మతించెను; 3. షెల్ట్‌నది బెల్జియమ్-హాలండ్‌ల వ్యాపారమునకై ఉమ్మడి రహదారిగ వినియోగ పడవలెను; 4. ఈ సంధిలోని ఒక నిబంధన ప్రకారము బెల్జియమ్‌ను స్వతంత్ర, శాశ్వత తటస్థరాజ్యముగ-బ్రిటన్, ఫ్రాన్స్, ప్రష్యా, రష్యా, ఆస్ట్రియా - గుర్తించి ధ్రువపరచినవి; అయితే, 1914 లో అప్పటి జర్మనీ ప్రభుత్వము ఈ హామీని ఉల్లంఘించుటచే బ్రిటన్ దానిపై యుద్ధమును ప్రకటించెను; అదియే ప్రథమ ప్రపంచ యుద్ధము.

రెండవ సంధి : 26-4-1915 న ప్రథమ ప్రపంచ యుద్ధ కాలమున ఇటలీతో బ్రిటన్, ఫ్రాన్స్, రష్యా కలసి చేసికొనిన రహస్య సంధి. దీనిప్రకారము ఇటలీ ఒక నెల లోపల మిత్రమండలితో కలసి జర్మనీతో జరుగు యుద్ధమున పాల్గొనిన ఎడల దానికి ఈ క్రింది సదుపాయములు లభించునటుల ఏర్పాటు జరిగెను : 1. ఇటలీకి (ఏ). ట్రెంటినో, దక్షిణ టిరోల్, ఇస్ట్రియా, గొరీజియా గ్రాడిస్కా, ట్రియస్టీ; (బి). డాల్మాటియన్ తీరములోని చాలభాగమును, సమీప మందలి లంకలను; (సి). ఆల్‌బేనియాలో వెలోనాకు చుట్టును కల విస్తృత ప్రదేశమును లభింప గలవు; 2. డోడెకనీస్ ద్వీపములపైనను, ఆసియా మైనర్‌లోని అడాలియా అను తురుష్కరాష్ట్రముపైనను సార్వభౌమాధికారము ఇటలీకి లభించును; 3. ఆఫ్రికాలో

వలసల రాజ్య విస్తరణ లాభము; 4. యుద్ధానంతరము లభించే నష్ట పరిహారములో భాగమును ఇటలీ పొందగలదు. అయితే, 1918 లో బోల్షివిక్‌లు అంతకుముందు రష్యా ప్రభుత్వము ఇతర అంతర్జాతీయ ప్రభుత్వములతో చేసికొనిన సంధులతోబాటు ఈ రహస్య సంధిని కూడ బయటపెట్టిరి. ఈ రహస్య సంధి సూత్రములు విభిన్న జాతుల సంక్షేమ సూత్రమును ప్రత్యక్షముగ నిర్లక్ష్యము చేయుచున్నవని ప్రెసిడెంట్ విల్సన్ ఆగ్రహావేశము చూపెను. అమెరికన్‌లు ఈ సంధి సూత్రములు తమ్ము బద్ధపరచజాలవని నిరాకరించిరి. 1919 పారిస్ శాంతి సమావేశ [చూ. పు. 565] సమయమున బ్రిటన్, ఫ్రాన్స కూడ ఇటలీకి విరుద్ధముగ ప్రవర్తించుటచే కడకు ఆ దేశము తాను మొదట కోరినదానికంటె చాల తక్కువ లాభమును పొందగలిగెను. స్వ. వెం.

**లక్జెంబర్గ్ :** పశ్చిమ యూరప్ ఖండమందలి స్వతంత్రమగు ఒక చిన్న రాజ్యము.




ఈ రాజ్యమునకు బెల్జియమ్ [ఉ,ప]; పశ్చిమ జర్మనీ [తూ]; ఫ్రాన్స [ద] సరిహద్దులందు ఉన్నవి. [వి] 2,586 చ. కి. మీ.; [జ] 3,23,971. [భా] డచ్చి భాషకు సన్నిహితమగు లట్స బర్గిష్ అనునది ప్రజల మాతృభాష. కాని, సెకండరీ విద్యనుండి జర్మను, ఫ్రెంచి భాషలు బోధింపబడుచున్నవి. పరిపాలనకు సంబంధించిన పత్రములన్నియు సాధారణముగ ఫ్రెంచి భాషలో ఉండును. [మ] ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు రోమన్ కేథలిక్‌లు. [రా] లక్జెంబర్గ్ (జ. సం. 71,653).

చరిత్ర: క్రీ. శ. 963 లో కౌంట్ సీజ్ ఫ్రాయిడ్ అను యోధుడు ప్రస్తుతపు లక్జెంబర్గ్ నగరము ఉన్న ప్రదేశమున లుసిలిన్ బుర్‌హక్ అను చిన్న దుర్గమును నిర్మించుకొనుటతో ఈ రాజ్యము పుట్టుక రూపొందెనని భావింపదగును. ఈతని వంశీయులకాలమున క్రమముగ ఈ రాజ్యము విస్తృతమై, 1247 నాటికి తొలుతటి దానికి మూడింతలుగ వృద్ధి అయ్యెను. 1354 లో జర్మనీ సమ్రాట్‌గ ఉండిన చార్లెస్ - IV ఈ దుర్గరాజ్యమును సామంతమండలముగ పరిగణించి, దాని ప్రభువునకు తదనుగుణమగు ప్రతిపత్తిని ఒసగెను. కాని, 1443 లో దీనిని బర్గండీప్రభువు జయించి వశపరచుకొనెను. అంతటినుండి ఈ రాజ్యము క్రమముగ స్పెయిన్, ఆస్ట్రియా, ఫ్రాన్స ప్రభువుల వశమై పలుమారు చేతులు మారుచు పరాధీనతను అనుభవించెను. 1815 లో యూరప్ రాజకీయపటమునకు నిర్దిష్టరూపము నొసగ యత్నించిన వియెన్నా కాంగ్రెస్ [చూ.] ఈ రాజ్యమున కొంత భాగము ప్రష్యాకు ఒసగి, తక్కినదానికి స్వాతంత్ర్యమును ఒసగి, మహాసామంత మండలస్థాయిని కల్పించి, నెదర్‌లండ్స పాలకుడే దీనిని పాలించునటుల చేసిరి. 1839 లో జరిగిన మరియొక విభజనను అనుసరించి లక్జెంబర్గ్ రాజ్యమునందలి మరికొన్ని ప్రాంతములు బెల్జియమ్‌నకు ఒసగబడెను. కాని, ఆనాటి నుండి నెదర్‌లండ్స పాలకుని ప్రత్యక్షాధికారమునుండి లక్జెంబర్గ్ చాలవరకు విడివడెను. తరువాత 1863 లో లండనునందు జరిగిన ఒక ఒడంబడికను అనుసరించి లక్జెంబర్గ్‌నకు సంపూర్ణస్వాతంత్ర్యప్రతిపత్తి కల్పింపబడుటయే కాక, అంతటినుండి తటస్థరాజ్యముగ ఉండుటకును, అందులకు తొలుతటి ప్రాతిపదికగ లక్జెంబర్గ్ మహాదుర్గమును పడగొట్టునటులను ఏర్పాటులు జరిగి, అమలులోనికి కొనిరాబడెను. తరువాత నెదర్‌లండ్స పాలకుని నామమాత్రపుపాలన అంతమొంది, 'నా సౌ - విల్‌బర్గ్' అను వంశనామము గల గ్రాండ్‌డ్యూక్ (మహాసామంత) అడాల్ఫ ఈ దేశమునకు పాలకుడై వంశానుగతమగు రాజరికమును ఏర్పరచెను. ఇతని తరువాత ఇతని కుమార్తె షార్లెటీ 1919 లో సింహాసనము అధిష్ఠించెను. ప్రథమ ప్రపంచ యుద్ధమున ఈ రాజ్యము జర్మనుల వశమున ఉండి యుద్ధానంతరమున స్వతంత్రమయ్యెను. 1922 లో బెల్జియమ్‌తో ఈ రాజ్యము ఆర్థికసమ్మేళనమును కుదుర్చుకొనెను. ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున నాజీ సేనలు ఈ దేశమును ఆక్రమించి, దేశప్రజలను పలుబాధల పాలు చేసినవి. 1944, సెప్టెంబరులో మిత్రమండలిసేనలు జర్మనుసేనలను ఓడించి ఈ రాజ్యమును వశపరచుకొని

1945, ఏప్రిల్‌లో దేశపు పరిపాలకురాలగు షార్లెటికి రాజ్యమును అప్పగించిరి. 1948 నుండి బెల్జియమ్, నెదర్ లండ్స్ రాజ్యములతో కలసి ఈ రాజ్యము ఆర్థికైక్యమును కుదుర్చుకొనినది. ఇదియే తరువాత ఐరోపా సామాన్య విపణి (యూరోపియన్ కామన్ మార్కెట్) కి దారి తీసినది.

రాజ్యాంగము : రాజ్యాంగచట్టవిహితము, వంశాను గతము అగు రాచరికపు పాలనలో ఈ దేశము ఉన్నది. అయినను ఇచటి పాలకుడు తన పూర్వికుల సంప్రదాయ మును అనుసరించుకొని తనను రాజు అని కాక, గ్రాండ్ డ్యూక్ (మహాసామంత) అనియే వ్యవహరించుకొనును. 1868 లో వెలువరింపబడి 1919, 48, 56 లలో సవరణల నందిన రాజ్యాంగచట్టమును అనుసరించి, శాసన నిర్మా ణాధికారము, ప్రజలచే ఎన్నుకొనబడిన ద్వివిధ కక్ష్యలు కల శాసనసభయందు న్యస్తమై ఉన్నది. దిగువ సభయగు ప్రతినిధిసభ (ఛేంబర్ డి డిప్యుటీజ్) కు అయిదు ఏండ్లకు ఒకసారి సార్వజనికవయోజనరహస్యపుఎన్నికవిధానముగ ఎన్నికలు జరిగి, 5,500 మంది ప్రజలకు ఒక ప్రతినిధి చొప్పున ఎన్నుకొనబడుదురు. ఎగువ సభయగు రాజ్యసభ (కౌన్సిల్ డి ఎటాట్) యందుండు 15 మంది సభ్యులను యావజ్జీవము అధికారమునందు ఉండునటుల రాజు నియ మించును. దిగువ సభచేసిన తీర్మానములు ఎగువసభ సవ రింపవచ్చును లేదా కొంతకాలము జాగుచేయవచ్చును. కాని, త్రోసివేయుటకు మాత్రము దానికి హక్కు లేదు. కార్యనిర్వహణాధికారము రాజు, ప్రధాని, మంత్రివర్గము నందు న్యస్తమై ఉన్నది. ప్రధానిని, తక్కిన మంత్రులను రాజే దిగువ శాసనసభయందు వారికి గల ప్రాబల్యమును అనుసరించి నియమించును. చీ. శే. రా.

**లజపతిరాయ్, లాలా (1865 - 1928) :** భారత జాతీయ నాయకుడు. పంజాబ్‌లోని జగ్రాన్ పట్టణమున మున్షీ రాథాక్రిషన్ పుత్రునిగ 1865, జనవరి 28 న ఇతడు జన్మించెను. లాహోర్ ప్రభుత్వకళాశాలనుండి పట్ట భద్రుడై, హిస్సార్‌లోను, కొంతకాలము లాహోర్‌లోను న్యాయవాదవృత్తిని నిర్వహించెను.

చిరుతప్రాయముననే ఆర్యసమాజ ఉద్యమ ప్రభా వితుడై హన్స్‌రాజ్, గురుదత్‌లతో కలసి పంజాబ్ అంతటా ఆర్యసమాజమును విస్తరింపజేసెను. యువకులకు సంప్ర దాయ విద్యను గరపు లక్ష్యముతో దయానంద ఆంగ్లో వేదిక్ కాలేజీని లాహోర్‌నందు 1886 లో వ్యవస్థాపించెను. 20 వ శతాబ్ది ప్రారంభములో 'సర్వెంట్స్ ఆవ్ పీపుల్ సొసైటీ' ని లాహోర్‌నందు లజపతిరాయ్ ప్రారంభించెను. నామమాత్రపు జీతముపై భారతజాతి పునర్నిర్మాణ కృషిలో పాల్గొని దేశసేవ చేయుటకై విద్యావంతులను ఆహ్వానించుటపై సొసైటీ ప్రధాన లక్ష్యము. భూ శాసన బిల్లునకు వ్యతిరేకముగ పంజాబ్‌లో 1907 లో వచ్చిన తిరుగుబాటు సందర్భముగ లజపతిరాయ్, అజిత్‌సింగ్‌లు 1818 నిబంధన - III క్రింద మాండలేకు ప్రవాసము పంప బడిరి. కాని, కామన్స్ సభలో వచ్చిన తీవ్రవిమర్శనల ఫలిత ముగ విడుదల చేయబడిరి.


లాలా లజపతిరాయ్
(1865 - 1928)

పాశ్చాత్య దేశములలో ప్రచా రము చేయు నిమిత్తము 1913 కరాచీ జాతీయకాంగ్రెస్ సభ లజపతిరాయ్, జిన్నా [చూ. పు. 484] లను ఎన్నుకొనినది. అంతట 1914 లో లండను వెళ్లి కాంగ్రెస్ లక్ష్యమును, బ్రిటిష్ ప్రభుత్వము భారతప్రజలకు కలుగజేస్తున్న బాధలను వివరించుచు ఈతడు పెక్కు సభలందు ఉపన్య సించెను. ఆ తరువాత యునైటెడ్ స్టేట్స్ వెళ్లి, ప్రథమ ప్రపంచ యుద్ధకారణముచే భారతదేశమునకు తిరిగి వచ్చుటకు అనుమతి లభింపక ఆరు ఏండ్లు అచ్చటనే ఉండెను. అట ఆ కాలమున 'ఆర్యసమాజ్ (1915)', 'యంగ్ ఇండియా (1917)', 'నేషనల్ ఎడ్యుకేషన్ ఇన్ ఇండియా (1920)' అను గ్రంథములను, పెక్కు వ్యాసము లను వ్రాసి, బ్రిటిష్ పాలన క్రింద భారతజాతి పడుచున్న పాట్లను వివరించి, భారత స్వాతంత్ర్య పోరాటమునకు యునైటెడ్ స్టేట్స్ ప్రజల సానుభూతిని ఆర్జించెను.

లజపతిరాయ్ భారతదేశమునకు తిరిగివచ్చుసరికి (1920) మహాత్మాగాంధి నాయకత్వమున జాతీయోద్యమము పరాకాష్ఠను అందుకొనినది. కలకత్తాలో 1920, సెప్టెంబరు 9 న జరిగిన ప్రత్యేక కాంగ్రెస్ సమావేశమున ఇతడు అధ్యక్షుడుగ ఎన్నుకొనబడెను. 1921 లో సహాయ నిరాకరణ ఉద్యమమును ప్రారంభించినప్పుడు దాని ఎడల ఆయన తొలుత సుముఖత వహింపకుండెను. వేల్స్ యువ రాజు భారతదేశమునకు వచ్చినప్పుడు అతనిని బహిష్క రించుటకై యత్నించినందులకు 1921 లో అరెస్ట్ చేయబడి 18 నెలల కఠిన కారాగారవాసమును లజపతిరాయ్ అనుభ వించెను. విడుదల అనంతరము లెజిస్లేటివ్ అసెంబ్లీ సభ్యుడు అయ్యెను. 1926 లో జెనీవాలో జరిగిన అంతర్జాతీయ కార్మిక సమావేశమున ఇండియన్ ట్రేడ్‌యూనియన్స్

ప్రతినిధిగా పాల్గొనెను. 1928 లో సైమన్‌కమిషన్‌ను బహిష్కరించవలెననే తీర్మానమును లెజిస్లేటివ్ అసెంబ్లీలో ప్రవేశపెట్టి, కొద్ది మెజారిటీతో గెలుపొందెను. సైమన్ కమిషన్ లాహోర్ వచ్చిన సందర్భములో దానికి వ్యతిరేకముగ ఇతడు నిర్వహించిన ప్రశాంత ప్రదర్శనపై లాఠీచార్జి చేయబడగా గుండెపై తగిలిన దెబ్బ ఫలితముగా 1928, నవంబరు 17 న లజపతిరాయ్ మరణించెను. పా. ల. నా.

**లయోలా, ఇగ్నేషియస్ :** చూ. సాంఘిక శాస్త్రములు : సం. 10 - పు. 656.

**లాక్, జాన్ (1632 - 1704) :** బ్రిటిష్ తత్త్వవేత్త; రాజనీతి శాస్త్రజ్ఞుడు. 1666 లో షాఫ్ట్స్‌బరీ ప్రభువుకు ఆంతరంగిక కార్యదర్శి. మన విజ్ఞానమంతయును మన అనుభవమును బట్టి పరిమితమైనదే కాని, దానిని మించి ఉండదను మతమునకు చెందినవాడు. రాజ్యములో ప్రజల అధికారమే సర్వస్వతంత్రాధికారమను సిద్ధాంతమును ప్రకటించినవాడు. వాక్ స్వాతంత్ర్యమును నిలబెట్టవలెనన్న ఆశయము కలవాడు. అనేక సాంఘిక రాజకీయ విషయములనుగూర్చి అనేక గ్రంథములను ఇతడు రచించెను [చూ. సం. 7 - పు. 660]. * * *

**లాటిన్ అమెరికా :** చూ. అమెరికా పు. 270.

**లాట్వియా :** సోవియట్ గణ రాజ్యసమితి యందలి ఒక గణ రాజ్యము.

ఈ రాజ్యమునకు రిగా సింధుశాఖ, బాల్టిక్ సముద్రములు [ఉ. ప.]; సోవియట్ గణరాజ్య సమితిలోనివేయగు లిథూనియా, ఎస్తోనియా మొదలగు గణ రాజ్యములు [తూ. ద.] సరిహద్దులందు కలవు. [వి] 64,498 చ. కి. మీ.; [జ] 21,70,000. [భా] అత్యధిక సంఖ్యాకుల భాష లెట్టిష్ [మ] ప్రజలందరును క్రైస్తవులు. [రా] రిగా (జ. సం. 6,20,000).

చరిత్ర : జాతి రీత్యా పొరుగున ఉన్న లిథూనియా వాసులకు సన్నిహితులు అనదగు లెట్టిష్ జాతులవారు ఈ దేశమున క్రీ. శ. 12 వ శతాబ్దికి పూర్వమునుండియు ఇటనే వసించుచుండినటుల తెలియుచున్నను, ఈ జాతుల ప్రజలందరు సుసంఘటితులు అగుటకు దాదాపు 8 శతాబ్దముల కాలము పట్టినది. ఈ జాతులలో గల పరస్పర వైషమ్యములను అవకాశముగ గ్రహించి, ఆ యా కాలములందు విదేశీయులు అనేకులు ఈ దేశమును జయించి పరిపాలించిరి. ఇటుల 1158 నుండి 1562 వరకు జర్మనీ పాలనలోను, 1562 నుండి 1795 వరకు పోలండ్ వశమునను, ఆ తరువాత రష్యాకు లొంగియు ఈ రాజ్యము ఉండెను. కాని, క్రమముగ దేశీయప్రజలలో స్వాతంత్ర్యాకాంక్ష ప్రబలమయ్యెను. ఇంతలో ప్రథమ ప్రపంచ యుద్ధకాలమున రష్యాయందు చెలరేగిన విప్లవము మూలమున రష్యా సామ్రాజ్య ప్రభుత్వము కూలిపోవగ, ఈ అవకాశము ఉపయోగించుకొని కృషిచేసి, లెట్టిష్ ప్రజలు బ్రిటిష్ ప్రభుత్వపు సాయముతో తమ దేశమగు లాట్వియాను స్వతంత్ర గణ రాజ్యముగ ప్రకటించి (1918, నవంబరు 18), ప్రజాతంత్ర పరిపాలనను నెలకొల్పిరి. తరువాత తక్కిన దేశములును దీనికి పరిగణనను ఒసగినవి. క్రమముగ నానా జాతి సమితి [చూ. పు. 531] యందు సభ్యత్వమును సైతము ఈ దేశము ఆర్జించి కొంత పురోగమింప గలిగెను. కాని, ఇంతలో ద్వితీయ ప్రపంచ యుద్ధము ఈ దేశమునకు ముప్పును కొనివచ్చెను. ఆ యుద్ధమునందు తమ భద్రతకు ఈ దేశమునందలి రేవులు తమకు ఆవశ్యకములని అంగీకరింప జేసి, సోవియట్ రష్యా రాజ్యము ఈ దేశమును ఆక్రమించెను (1940, జూన్). తొలుతనుండియు ఈ దేశమున కొంత పలుకుబడిని కలిగి ఉండిన కమ్యూనిస్ట్ పక్షము అంతట బలపడి, ప్రజలలో పలుకుబడిని సంపాదింప గలిగెను. తత్ఫలితముగ 1940, జూన్ 22 న దేశ ప్రజల సమ్మతితో ఈ రాజ్యము సోవియట్ గణరాజ్యసమితియందు భాగస్వామిని అయ్యెను. తరువాత జర్మను సేనలు దీనిని వశపరచుకొనినను, 1944 లో సోవియట్ రష్యా సేనలు వానిని తరిమివైచినవి. తదాదిగ ఈ దేశము సోవియట్ రష్యా రాజ్యమున అంతర్భాగముగనే ఉన్నది. యునైటెడ్ స్టేట్స్ తప్ప దాదాపు తక్కిన ప్రపంచ రాజ్యములు అన్నియు ఈ పరిస్థితిని అంగీకరించి పరిగణన నొసగినవి. చీ. శే. రా.

**లాయిడ్ జార్జి, డేవిడ్ (1863 - 1945) :** ప్రథమ ప్రపంచ యుద్ధము జరుగుచున్న సమయమున బ్రిటిష్ ప్రధాని. 1890 లో మితవాద సభ్యుడుగ పార్లమెంట్‌కు ఎన్నుకొనబడెను. 1905 లో బ్రిటిష్ మంత్రివర్గములో చేరి, వాణిజ్యమండలి (బోర్డ్ ఆవ్ ట్రేడ్) కి అధ్యక్షుడు అయ్యెను. 1908 లో లాయిడ్ జార్జి కోశాగార మంత్రి అయి, వార్ధక్య పింఛనుల చట్టము (1908), జాతీయ ఆరోగ్య భీమాచట్టము (1911) ల వంటి సామాజికోపయుక్తములయిన చట్టముల ప్రవేశపెట్టి, పార్లమెంట్ చే జయప్రదముగ అంగీకరింపజేసెను. 1915 జూలైలో ఇతడు ఆస్క్విత్ మిశ్రమమంత్రివర్గములో యుద్ధ పరికరముల మంత్రిగ నియమింపబడెను. అయితే, ఇతడు 1916 డిసెంబరులో తగినంత శక్తిసామర్థ్యములతో యుద్ధతంత్రమును నడుపుట లేదను కారణమున ఆస్క్విత్ మంత్రివర్గమును కూలద్రోయుటకు కన్‌సర్వేటివ్‌లతో చేయి కలిపెను. అనంతరము లాయిడ్ జార్జి తానే ప్రధాన మంత్రిగా ఎన్నుకొనబడి, 1922 వరకు ఆ పదవిని నిర్వ

హించెను. యుద్ధ నిర్వహణమునందు అసమాన శక్తితో ప్రధాన పాత్ర వహించుటయేకాక, స్వయముగ 1919 లో జరిగిన పారిస్ శాంతి సమావేశము [చూ. పు. 565] నకు హాజరయ్యెను. ఇతడు ఐర్లాండ్ వ్యవహారములకు పరిష్కారమును సాధించెను. ఇతని మిశ్రమ మంత్రివర్గమున కన్సర్వేటివ్ ల బలము అత్యధికముగ ఉండుటచేత, పూర్వ మితవాద సహచరుల నమ్మకమును ఇతడు కోల్పోయెను. అందుచే ఇతని ప్రభుత్వము పడిపోయి, ఇతడు మరల ఎన్నడును రాజకీయరంగమున ప్రవేశింప వీలుకాని ఒంటరి తనమును అనుభవింపవలసివచ్చెను. వేల్స్ దేశీయుల సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమమును ప్రోత్సహించుటకు కూడ లాయిడ్ జార్జి కృషిచేసెను. స్వ. వెం.

**లాల్‌బహదూర్‌శాస్త్రి** (1904 - 1966): రాజనీతిజ్ఞుడు; భారత ద్వితీయ ప్రధాని; శాంతిదూత. ఈయన వారణాసి (కాశీ) లో ఒక మధ్యతరగతి కుటుంబమున జన్మించెను (1904, అక్టోబరు 2). ఆ ఊరిలోని హరిశ్చంద్ర పాఠశాలలోను, కాశీ విద్యాపీఠములోను విద్యాభ్యాసము చేసెను. భారతదేశ కార్మిక సంఘముతో సాన్నిహిత్యమును కలిగించుకొని ఆ సంఘమునకు అపారసేవ చేసెను. ఎనిమిది సారులు చెరసాలకు పోయి పది ఏండ్లపాటు కారాగారవాస జీవితమును గడపెను. 1952 లో రాజ్యసభకు ఎన్నుకొనబడి నెహ్రూ మంత్రివర్గములో రవాణా, రైల్వే మంత్రిగా పనిచేసెను. రైల్వే మంత్రిగా అరియలూర్ రైలు ప్రమాదమునకు నైతికముగ బాధ్యత వహించి, ఆ పదవినుండి విరమించెను. పదవీ వ్యామోహములేని నిరాడంబరజీవిగ పేరొందెను. 1957 లో అలహాబాదు ప్రాంతమునుండి లోక్‌సభకు శ్రీ శాస్త్రి ఎన్నికయై, రవాణామంత్రిగాను, కొంతకాలము వాణిజ్య మంత్రిగాను వ్యవహరించి, పండిట్ పంత్ కాలధర్మము పొందినతరువాత 1961 లో దేశీయాంగ మంత్రిగ నియమించబడెను. 1962 లో జరిగిన ఎన్నికలలో కూడ శ్రీ శాస్త్రి జయమునుపొంది, మరల దేశీయాంగమంత్రిపదవిని పొందెను. లంచగొండితనమును నిర్మూలించుటకు సంతానమ్ కమిటీ ఈయన కాలమందే నియమింపబడినది. 1963 లో శ్రీ కామరాజు పథకముప్రకారము దేశీయాంగమంత్రిపదవికి రాజీనామా ఇచ్చెను. కాని, కొన్ని నెలలకే ప్రధాని నెహ్రూ అస్వస్థతతో ఉన్న తనకు సహాయకారిగా, తనకు అత్యంత విశ్వాసపాత్రుడైన ఈయనను పోర్ట్‌ఫోలియో లేని మంత్రిగా నియమించుకొనెను. 1964 లో నెహ్రూ మరణించిన తరువాత కాంగ్రెస్ పార్లమెంట్ సభ్యుల ఏకగ్రీవామోదముతో 1964, జూన్ 9 వ తేదిన ప్రధానమంత్రిపదవిని స్వీకరించెను. పాకిస్తాన్ - భారతదేశముల మధ్య జరిగిన యుద్ధములో శ్రీ శాస్త్రి ప్రదర్శించిన ధైర్యము, నిర్వహించిన పాత్ర అశేష భారతీయుల ఆమోదమును పొందినవి. సోవియట్ రష్యా ప్రధాని కోసిగిన్ [చూ. పు. 410] సూచనలను అనుసరించి ఈయన టాష్‌ఖండ్ [చూ. పు. 496] లో పాకిస్తాన్ అధ్యక్షుడు అయూబ్ ఖాన్ [చూ. పు. 294] తో సమాలోచనను జరిపి, చరిత్రాత్మకమైన టాష్‌ఖండ్ ప్రకటనపై సంతకము చేసెను (1966, జనవరి 11). ఆ ప్రకటన జరిగిన కొన్ని గంటలకే దురదృష్టవశాత్తు టాష్‌ఖండ్‌లో అకస్మాత్తుగా గుండెపోటువలన పరమపదించిరి. ప్రధాన మంత్రిగా ఈయన శ్రీ నెహ్రూ మొదలిడిన అలీనవిధానమును అవలంబించి ప్రపంచశాంతిని రక్షించుటకు, ఉద్రిక్తత తగ్గించుటకు పాటుపడెను. ఈయన యథార్థవాది. సామాన్యప్రజల కష్టములను గుర్తింపగల పరిపాలకుడు. కం. శ్రీ. రా.



లాల్ బహదూర్ శాస్త్రి (1904 – 1966)

**లావోస్**: ఆగ్నేయ ఆసియాయందలి ఒక స్వతంత్ర దేశము.




ఈ దేశమునకు చీనా [ఉ]; ఉత్తర వియెత్నామ్, దక్షిణ వియెత్నామ్ [తూ]; కాంబోడియా, థాయిలాండ్ [ద];

బర్మాదేశము [ప] సరిహద్దులందు ఉన్నవి. [వి] 2,36,800 చ. కి. మీ.; [జ] 18,81,000. [భా] జాతీయభాష లావో (ఇది తాయి భాషకు అతి సన్నిహితము; దీనిపై సంస్కృత, పాళీ భాషల ప్రభావము ఎక్కువగ కలదు). [మ] ప్రజలలో అధిక సంఖ్యాకులు బౌద్ధమతమున హీనయాన సంప్రదాయాను యాయులు. కొంతవరకు ప్రకృతిదేవతారాధనయు ప్రజలలో వ్యాప్తియందు ఉన్నది. [రా] వియంటైన్ (జ. సం. దాదాపు 1,62,000); రాజు వసించు రాజధాని లవంగ ప్రబంగ్ (జ. సం. దాదాపు 15,000).

చరిత్ర: ఈ దేశపు చరిత్ర వివరములు క్రీ. శ. 11 వ శతాబ్దము ప్రాంతమునుండి మాత్రమే మనకు లభించు చున్నవి. చీనానుండి వలసవచ్చిన తాయిజాతికుటుంబ ములు ఇచ్చట పదునొకండవ శతాబ్ది ప్రాంతమున నివా సము ఏర్పరచుకొని, క్రమముగ లావోస్‌జాతిగ పరిణ మించి, 1350 నాటికి లంక్‌జింగ్ అనువాని ఆధిపత్య మున ఈ రాజ్యమును ఏర్పాటు చేసికొనినవి. ఆ ప్రభువు కాలముననే హీనయానబౌద్ధమతము ఇట వ్యాప్తిని ఆర్జించెను. 1707 లో ఈ దేశము అంతఃకలహముల మూల మున లవంగప్రబంగ్, వియంటైన్ అను రెండు రాజ్య ములుగ విభజితము అయ్యెను. ఈ అవకాశమును ఊతగ గ్రహించి తాయిలాండ్ ప్రభువు ఈ దేశముపై దండెత్తి, ఈ చిన్న రాజ్యములలో ఒకటియగు వియంటైన్ రాజ్య మును ఆక్రమించెను (1828). ప్రక్క రాజ్యములు ఇటుల ఆక్రమణకు పూనుకొనగ చేయునది లేక లవంగప్రబంగ్ రాజ్యము ఫ్రెంచివారి రక్షణను అర్థించెను (1893).

ఫ్రెంచివారు రక్షణను ఒసగగనే తాయిలాండ్ తనకు లావోస్‌నందున్న అధికారములను వదలుకొనెను. ఆగ్నేయ ఆసియాయందు తమకు ఇదివరకే ప్రాప్తించి ఉన్న ఇతర దేశములు కొన్నింటితో కలిపి మొత్తమును ఫ్రెంచి ఇండో-చీనా అను పేర తమ వలసరాజ్యముగ ఫ్రెంచివారు ద్వితీయ ప్రపంచ యుద్ధము వరకు పాలించిరి. వారి పరిపాలన కాలమున లావోస్ రాజు నామమాత్రపు అధికారములను మాత్రము కలిగి ఉండి లవంగప్రబంగ్‌లో నివసించుచుండెను. ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున జపాన్ సేనలు ఈ దేశమును ఆక్రమించి, తాము ఓడి పోవుటకు ముందుగ ఈ దేశమునకు స్వాతంత్ర్యము ఒసగి నవి (1945, మార్చి 10). అంతట లవంగప్రబంగ్‌నందలి రాజు సర్వాధిపత్యము వహించెను. కాని, జపాన్ ఓడి పోయిన వెనువెంటనే అప్పటి చీనాసేనలు ఈ దేశమును ఆక్రమించి, తరువాత ఫ్రాన్స్‌నకు వశపరచినవి. ఇంతలోనే ప్రజలలో స్వాతంత్ర్య వాంఛ అతిశయిల్లుటచే రాజు తన అధికారములను పరిత్యజించి, రాజ్యాంగ విహితమగు ప్రతిపత్తితో లాంఛనపు రాజుగ ఉండుటకు అంగీకరించెను. అప్పుడు ఏర్పడిన జాతీయప్రభుత్వము అధికారమునకు వచ్చులోపలనే, లావోస్‌రాజును మరల తమపక్షమునకు త్రిప్పుకొని తమ పరిపాలనను నెలకొల్పుటకు ఫ్రాన్స్ యత్నించినది. కాని, ప్రజోద్యమము ఈ అవరోధములను అన్నిటిని అతిక్రమించి 1947, మే 11 న ఒక రాజ్యాంగ చట్టమును నిర్మించుకొని, రాజ్యాంగ బద్ధమగు రాచరికము మాత్రమే ఉండునటుల ఏర్పాటు చేసికొనినది. కడకు 1949, జూలై 19 న లావోస్ సర్వస్వాతంత్ర్యమునకు ఫ్రెంచి ప్రభుత్వము అంగీకరించినది.

కాని, ఈ స్వాతంత్ర్యము అనేక బాలారిష్టములను ఎదుర్కొనవలసి వచ్చినది. ఇండో-చీనాలో యుద్ధము ముగియునప్పటికి ఉత్తర లావోస్‌నందలి రెండు రాష్ట్ర ములు పాతెద్‌లావో అను విప్లవపక్షపు అధీనమున ఉండెను. కమ్యూనిస్ట్ భావములను ఈ పక్షము కలిగి ఉన్నది. స్వతంత్ర ప్రభుత్వాధిపత్యమును గుర్తించునటుల ఈ పక్షమువారిని చేయవలయునని తక్కిన నాయకులు వాంఛించిరి. 1956 లో ప్రధానమంత్రియైన సౌవన్నఫౌమా రాజకుమారుడు ఈ యత్నమున అప్పటిలో కొంత కృత కృత్యుడు అయ్యెను. ఈతని సవతి సోదరుడగు సౌఫాన్ వంగ్ రాకుమారుడు పాతెద్‌లావో నాయకుడు. ఈ అన్నదమ్ములు ఇరువురును కుదుర్చుకొనిన ఒడంబడికను అనుసరించి, అప్పటికి మూడేండ్లనుండి సాగుచుండిన అంతర్యుద్ధము అంతమయ్యెను. మంత్రివర్గమున రెండు స్థానములు పాతెద్‌లావో పక్షమునకు ఇచ్చుటకును, పాతెద్‌లావో సైన్యములలో అయిదవవంతును ప్రభుత్వ సేనలో చేర్చుకొనుటకును ఏర్పాటు జరిగెను. కాని, తరువాత 1958 లో జరిగిన ఎన్నికలలో సౌవన్నఫౌమా పక్షము తగినంతగ బలమును ఆర్జింపలేకపోయెను. 'లావో ప్రజాసమ్మేళనము' అను పక్షము ప్రభుత్వమును వశపరచుకొనెను. ఆ పక్షపు నాయకుడు ఫౌమీసేనాని కోనే 1956 లో జరిగిన ఏర్పాటు ఒప్పుకొనక, తన మంత్రి వర్గమున పాతెద్‌లావో వారికి స్థానము ఇచ్చుటకు నిరాక రించెను. అంతట పాతెద్‌లావో దళములు తిరుగుబాటును లేవదీసినవి. సేనాని కోనే శాసనసభ వలన సర్వాధికార ములను గ్రహించి పాతెద్‌లావో బలమును నశింప జేయు టకు యునైటెడ్‌స్టేట్స్ సాయమును గ్రహించెను. పాతెద్ లావోకు చీనా మొదలగు కమ్యూనిస్ట్ రాజ్యములు సాయమొనర్చినవి. సౌవన్నఫౌమా అనుయాయులు తటస్థవిధానమును అవలంబించిరి. ఇటుల లావోస్ సమస్య అంతర్జాతీయ సమస్య అయ్యెను. కడకు జెనీవాలో జరిగిన

సంప్రతింపుల మూలమున 1962లో ఒక ఒడంబడిక కుదిరెను. లావోస్ తాటస్థ్యమును అన్ని ప్రముఖ రాజ్యములును గుర్తించునటులను, సొవన్న ఫౌమా నాయకత్వమున ఒక మిశ్రమప్రభుత్వము లావోస్‌లో పరిపాలనను నెరపునటు లను నిర్ణయములు జరిగెను. తత్ఫలితముగ సొవన్న ఫౌమా నాయకత్వమున వివిధపక్షములకు ప్రాతినిధ్యము కల ఒక ప్రభుత్వము ఏర్పరుపబడెను (23 జూన్, 1962). కాని, 1963, ఏప్రిల్‌లో మరల విద్వేషములు పెచ్చుపెరిగి, అంతర్యుద్ధము నకు దారితీసెను. ఎటులైన ఈ విద్వేషాగ్నిని చల్లార్చి ఐక్య లావోస్‌ను నిర్మించి, సుస్థిర ప్రభుత్వమును స్థాపించు టకు సొవన్న ఫౌమా నిరంతర కృషి చేయుచున్నాడు.

రాజ్యాంగము: వంశానుగతము, రాజ్యాంగ చట్ట విహితము అగు రాచరికపు పాలనలో ఈ దేశము ఉన్నది. శాసననిర్మాణాధికారము శాసనసభయందు న్యస్తమై ఉన్నది. ఈ శాసనసభలో రెండు కక్ష్యలు కలవు. ఇందు దిగువ కక్ష్యయగు జాతీయసభయందు 59 మంది సభ్యులు ఉందురు. వీరందరును నాలుగు సంవత్సరములకు ఒకసారి ఎన్నుకొనబడెదరు. ప్రధానియు, మంత్రిమండలియందలి తక్కిన మంత్రులును జాతీయసభకు బాధ్యత వహించి పాలింతురు. ఈ జాతీయసభ సమావేశము కాని సమయ మున మంత్రివర్గపు పనులపై పర్యవేక్షణ చేయుటకు అయిదుమంది సభ్యులు కల శిష్టమండలి ఒకటి జాతీయ సభచే ఎన్నుకొనబడి ఉండును. ఎగువసభయగు రాజసభ యందు తొమ్మిదిమంది మాత్రమే సభ్యులు ఉందురు. వీరిలో కొందరిని రాజు నియమించును. తక్కినవారిని జాతీయసభ నియమించును. రాజసభ సలహాలను మాత్రమే ఒసగును. కాని, శాసనములకు గల రాజ్యాంగ బద్ధతను నిర్ణయించుటకును, పరిపాలనకు సంబంధించిన నేరములను గురించి ప్రభుత్వోద్యోగులను విచారించి శిక్షించుటకును ఈ రాజసభకు అధికారము కలదు. చి. శే. రా.

**లాసన్నీ సంధి పత్రములు** (24-7-1923): ప్రథమ ప్రపంచ యుద్ధము అనంతరము 10-8-1920న జరిగిన సెవ్రెస్ సంధిని కెమాల్ పాషా [చూ. పు. 402] ఆధిపత్యమున ఏర్పడిన టర్కీ గణరాజ్యము అంగీకరించుటకు నిరాక రించుటచే ఈ సంధి జరుగవలసివచ్చెను. ఈ సంధివలన క్రింది ఏర్పాటులు జరిగెను: 1. ఓటోమన్ సామ్రాజ్యములో తురుష్కులు కానివారిచే ఆక్రమించుకొనబడిన భూభాగముల పై తన హక్కును టర్కీ వదులుకొనెను; 2. ఇంబ్రోస్, టెనెడోస్ అను ద్వీపముల మినహాతో మిగిలిన ఈజియన్ దీవులపై గ్రీక్ అధికారము ధ్రువపరచబడెను; 3. ఇంబ్రోస్, టెనెడోస్ లంకలు టర్కీకి తిరిగి ఇచ్చివేయబడెను; 4. గ్రీక్‌లు స్మిర్నా (ఇజ్‌మిర్)ను తురుష్కులకు వదలివేసిరి; 5. డోడెకనీస్‌ను ఇటలీ, సైప్రస్‌ను బ్రిటన్ ఆక్రమించుకొని ఉండుటకు టర్కీ ఒప్పుకొనెను; 6. బాస్ఫరస్, డార్డనెల్స్‌ ని స్సైనికీకరణము చేయబడెను; 7. యూరప్‌లోని తూర్పు థ్రేస్‌ను టర్కీ తిరిగి పొందెను; 8. గ్రీస్ - టర్కీ దేశముల మధ్య జనాభా మార్పిడి జరిగెను.

పై జనాభా మార్పిడివలన 3,50,000 తురుష్కులు గ్రీస్ నుండి పంపివేయబడిరి. అందుకు బదులుగ 10,00,000 గ్రీక్‌లు టర్కీనుండి వెడలిపోవలసి వచ్చెను. స్వ. వెం.

**లింకన్, అబ్రహామ్** (1809 - 1865): ప్రపంచ మందలి ప్రఖ్యాత పురుషులలో ఎన్నదగిన వాడు. ఇతడు యునైటెడ్ స్టేట్స్ అధ్యక్షులలో 16 వ వాడు.



అబ్రహామ్ లింకన్
(1809 - 1865)

జీవనోపాధికి తగిన వృత్తి న్యాయవాద వృత్తి అని తలచి, అందుకు తగిన శిక్షణ పొంది, తుదకు అర్హత సంపా దించుకొనెను.

ఇతడు ఎన్నికలలో 1834న నెగ్గెను. నాటినుండి వరుసగ నాలుగుసార్లు - అనగా 8 సంవత్సరములు - ఇలినాయ్ రాష్ట్ర శాసనసభలో ఇతడు సభ్యుడుగా ఉండెను. రెండవ సారి సభ్యుడుగ ఉన్నప్పుడు (1837 - 38) ఇతడు తన శక్తి సామర్థ్యములవల్ల విగ్ పార్టీ నాయకుడు అయ్యెను. ఆ సమయమందే బానిసవృత్తిని ఖండించి, తొలగించవలసినదన్న సంకల్పము ఇతనికి కలిగినది.

మరల రాజకీయరంగమున 1847లో ప్రవేశించి కాంగ్రెస్ సభ్యుడు అయ్యెను. కాని, ఆ కాలమున మెక్సికోతో యునైటెడ్ స్టేట్స్ జరుపుచున్న యుద్ధమును అతడు తీవ్రముగ వ్యతిరేకించుటచే, ప్రజలలో ఈతనికి పలుకుబడి తగ్గెను. అందుచేత, 1849 లో ఇతడు మరల కాంగ్రెస్ సభ్యుడు కాగోరినప్పుడు, ఇతనికి తగిన తోడ్పాటు లేక పోయినది. కాని, ఇతడు మరల న్యాయవాది వృత్తిని అవలంబించినప్పుడు ఇతని ఖ్యాతి మరింత ఎక్కువయినది. 1856 లో ఇతడు ఇలినాయ్ రాష్ట్రమున రిపబ్లికన్ పార్టీని ఏర్పరచి, రిపబ్లికన్ పార్టీ ప్రతినిధియైన జాన్ సీ ఫ్రెమంట్‌ను అధ్యక్షునిగ నిలబెట్టెను. 1858 లో ఈతడు సెనేట్‌కు సభ్యుడయ్యెను.

ఆ తరువాత 1861 లో యునైటెడ్ స్టేట్స్ అధ్యక్షుడుగ ఎన్నుకొనబడెను. ఇతడు అధ్యక్షుడుగా ఉండిన కాలమున యునైటెడ్ స్టేట్స్ ఉత్తర, దక్షిణ భాగముల మధ్య అంతర్యుద్ధము చెలరేగెను. ఉత్తర భాగపు విధానములను అధ్యక్షుడు బలపరచెను. 1864 లో ఈ యుద్ధములలో ఉత్తర భాగము వారికి కలిగిన అపజయములవలన లింకన్ పలుకుబడి తగ్గినది. కాని, ఆ పిమ్మట వీరికి జయములు కలుగుటవలన మరల ఇతని పలుకుబడి హెచ్చినది. 1865 లో ఇతడు రెండవసారి ఎన్నికలలో నెగ్గి, అధ్యక్ష పదవి వహించిన తరువాత అంతర్యుద్ధము ముగిసినది. ఇతడు శత్రువుల ఎడ దయాదాక్షిణ్యములు గలిగి వారి అభిమానమును జూరగొనెను; రాష్ట్రముల ఐక్యమును నిలబెట్టెను; బానిస వృత్తిని తొలగించి రాజ్యాంగ దృష్టిలో నీగ్రోలును, తెల్లవారును ఒకే స్థాయికి చెందిన వారుగ ఉండునటుల చేసెను. అంతేకాక, ఇంకను ఎన్నో పనులు చేయుటకు సంకల్పించెను. కాని, వాషింగ్‌టన్‌లో ఒక నాటకప్రదర్శనము జరుగుచుండగా ప్రేక్షకుడుగ ఉన్న ఇతనిని శత్రుపక్షపు ప్రోత్సాహమువలన జాన్ విల్క్స్ బూత్ అను ఒకడు వెనుకనుండి తుపాకి పేల్చి చంపెను. * * *

**లిక్టెన్‌స్టీన్ :** యూరప్ ఖండమున రైన్‌నది లోయలో ఉన్న స్వతంత్రమగు ఒక చిన్న రాజ్యము.




ఈ రాజ్యము ఆస్ట్రియా, స్విజర్లండ్ దేశముల మధ్య రైన్‌నదిని ఆనుకొని ఉన్నది. [వి] 160 చ. కి. మీ.; [జ] 17,800; [భా] జాతీయభాష జర్మనీ; [మ] ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు రోమన్ కేతలిక్‌లు; [రా] వాడజ్ (జ. సం. 3,620).

చరిత్ర: తొలుత షార్లమేన్ [చూ.] రాజ్యమున అంతర్భాగముగ ఉండిన ఈ ప్రాంతము, అతని మరణానంతరము పరిపాలనాసౌకర్యము నిమిత్తమై ఒక మండలముగ ఏర్పరుపబడుటతో ప్రత్యేకతను ఆర్జించెను. అంతటినుండి ఇది క్రమముగ కొన్ని జమీందారీ కుటుంబముల వశమున ఉండెను. కడకు ఈ ప్రాంతమును ఆ జమీందారీ వంశములో కడపటి వానినుండి లిక్టెన్‌స్టీన్ కుటుంబము వారు 1712 నాటికి విక్రయించుకొని, ఆస్ట్రియా ప్రభువునకు లోబడి పాలింప మొదలిడిరి. నెపోలియన్ కాలమున మధ్యయూరప్‌న జరిగిన ఏర్పాటులలో ఈ రాజ్యము స్వతంత్రప్రతిపత్తిని ఆర్జించి, రైన్‌నది పరిసర రాజ్యముల కూటమిలో చేరెను (1806). నెపోలియన్ పతనానంతరమున ఈ రాజ్యము జర్మనీ రాజ్యకూటమిలో చేరెను (1815). తరువాత ప్రష్యారాష్ట్రము బలవత్తరమై తక్కిన జర్మనీ రాజ్యములను లోగొనినపుడు ఈ రాజ్యకూటమి విచ్ఛిత్తి కాగా (1866), ఈ దేశము అటనుండి సర్వస్వతంత్ర ప్రతిపత్తితో యూరప్ రాజకీయ కల్లోలములందు తటస్థవైఖరిని అవలంబించి మనగలిగెను. 1852 లో ఈ రాజ్యము ఆస్ట్రియాతో శుల్కసమ్మేళనము విషయమై ఒక ఒడంబడికను కుదుర్చుకొనెను. ఈ ఒడంబడికను అనుసరించి ఆర్థికముగ ఆస్ట్రియాతో ముడివడి, ఈ దేశము ప్రథమప్రపంచయుద్ధానంతరమువరకు ఉండెను. అప్పటివరకు ఆస్ట్రియా నాణెములే ఈ దేశమున చెలామణీ అగుచుండెను. ప్రథమ ప్రపంచయుద్ధము తరువాత రాజకీయముగ, ఆర్థికముగ ఆస్ట్రియా పతనమొందుటచే, అంతటినుండి స్విజర్లండ్‌తో శుల్కసమ్మేళనమునకును, ఆ దేశపు నాణెముల చెలామణికిని అంగీకరించుచు ఈ దేశము ఒక ఒడంబడికను కుదుర్చుకొనినది (1924). ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున దేశమునందు ఆర్థికముగ మంచి అభివృద్ధి సాధింపబడినది. ఈ దేశపు పూర్వప్రభువులు తరచు ఇతర దేశములందు వసించెడివారు. కాని, ప్రస్తుత ప్రభువు ఫ్రాన్సిస్ జోసఫ్ - II ఈ దేశముననే వసించుచు, ప్రజల అభివృద్ధికై కృషి చేయుచున్నాడు.

రాజ్యాంగము: రాజ్యాంగచట్టవిహితము, వంశానుగతము అగు రాచరికపు పాలనము ఈ దేశమున అమలునందు ఉన్నది. రాజవంశమున పురుషసంతతికి మాత్రమే రాజ్యార్హత కలదు. 1921, అక్టోబరు 5 న వెలువరింపబడిన రాజ్యాంగచట్టమును అనుసరించి ఒక శాసనసభ (లాండ్‌టాగ్) ఏర్పరుపబడినది. 15 మంది సభ్యులుకల ఈ శాసనసభకు ఎన్నికలు నాలుగేండ్లకు ఒకసారి జరుగును. సార్వజనికవయోజనపద్ధతిని పురుషులకు మాత్రమే ఈ రాజ్యమున వోటుహక్కు కలదు. శాసనసభను సమావేశము జరుపుటకు, రద్దుచేయుటకు రాజునకు హక్కు కలదు. శాసనసభ సూచనను అనుసరించి, రాజు ప్రధానిని, ఉప

ప్రధానిని నియమించును. వీరిరువురు ఆ రేండ్లు ఆ పదవు లందు ఉందురు. శాసన ప్రతిపాదనలను ప్రభుత్వము సభ్యుల ఉపపాదనలపైననే కాక 400 మంది ప్రజల ఉప పాదనపైనగాని లేదా మూడు జిల్లాల వోటర్ల ఉప పాదనపైనగాని చర్చకు తీసికొనిరావచ్చును. అవసర మగుచో శాసనసభా తీర్మానముపై జనాభీష్టమును గ్రహింపవచ్చును. చీ. శే. రా.

**లిథూనియా :** సోవియట్ గణరాజ్యసమితి యందలి ఒక గణరాజ్యము.

ఈ రాజ్యమునకు లాట్వియా [ఉ]; బాల్టిక్ సముద్రము [ప]; పోలండ్, సోవియట్ రష్యా రాజ్యమందలి యుక్రెయిన్ [ద]; యుక్రెయిన్ [తూ] సరిహద్దులందు ఉన్నవి. [వి] 65,200 చ. కి. మీ ; [జ] 28,52,000. [భా] అత్యధిక సంఖ్యాకుల భాష లిథూనియన్ [మ] ప్రజలందరును క్రైస్తవులు. [రా] విల్నియస్-మరొక పేరు విల్నా (జ. సం. 2,64,000).

చరిత్ర: సంస్కృత భాషకు అతి సన్నిహితమగు లిథూనియన్ భాషను మాట్లాడు ఈ దేశవాసుల పూర్వి కులు తక్కిన ఆర్య జాతులనుండి విడివడి క్రీ. శ. ఆరంభ కాల మున ఈ ప్రాంతమునకు వచ్చి నెలవులను ఏర్పరచుకొనిరి అని చారిత్రకులలో పలువురి అభిప్రాయము. క్రీ. శ. 5 వ శతాబ్ది నాటికే ఇచటి ఆర్యజాతికి చెందిన పలుతెగల వారు ఒక సమాఖ్యారూపమగు కేంద్రప్రభుత్వమును నిర్మించుకొని ఉండిరనియు తెలియవచ్చుచున్నది. కాని, దీనిని గురించిన వివరములు ఏవియును తెలియవచ్చుట లేదు. 1230 లో పొరుగు ప్రాంతమగు తూర్పుప్రష్యా నుండి ఆర్యకుటుంబమున ట్యూటానిక్ తెగకు చెందిన యోధవర్గము ఒకటి ఇట కాలిడినప్పటినుండియు ఈ దేశ చరిత్రయందు ఒక నూతనాధ్యాయము ఆరంభమైనది. ఈ యోధవర్గపు నాయకుడగు మిండొవ్ ఈ దేశమున సుస్థిరప్రభుత్వమును నెలకొలిపి, దేశమును ఏకీకృతము ఒనర్చెను. ఇతడు క్రైస్తవమతమును స్వీకరించి, ఈ దేశపు ప్రప్రథమ సమ్రాట్‌గ క్రైస్తవమత పీఠాచార్యు డగు పోప్‌చే పట్టాభిషిక్తుడయ్యెను (1253). కాని, తరు వాత కారణాంతరములచే ఇతడు క్రైస్తవమతమును వీడి, సంప్రదాయ బహు దేవతారాధననే ఆదరించెను.

మిండొవ్ తరువాత ఆ రాజ్యమును పాలించిన వారిలో గెడిమిన్ అను అతడు (1316 - 1339 ప.) ప్రము ఖుడు. ఇతడు యుక్రెయిన్‌నందు అత్యధిక భాగమును జయించుటయే కాక తన కుమార్తెను పోలండ్ రాజు కుమారునకు ఒసగి, ఆ దేశపాలకుల మైత్రిని సమకూర్చు కొనెను. ముఖ్యనగరమగు విల్నియస్‌ను నిర్మింపచేసినది ఇతడే. పాశ్చాత్యదేశములతో సన్నిహిత సంబంధములను ఏర్పరచుకొని పాశ్చాత్య సభ్యతను తన దేశమున వ్యాపింప జేయుటకు ఇతడు కృషిచేసెను. ఈతని అనంతరమున ఈ రాజ్యమును పాలించిన ఈతని వంశీకులలో అల్‌గిర్ దాస్ అను నతడు (1345 - 1377 ప.) అతి సమర్థుడు. ఈతడు ప్రక్కన ఉన్న రాజ్యములను జయించి తన రాజ్య మును దాదాపు 9,06,500 చ. కి. మీ. మేరకు విస్తరింప జేయుటయే కాక, తాను క్రైస్తవమతమును అవలంబించి, దేశమున ఆ మతమును వ్యాపింప జేయుటకు కృషి చేసెను. 1385 లో లిథూనియా పాలకుడగు జగేలా పోలండ్ రాణిని పెండ్లాడినప్పటినుండి ఈ రాజవంశము లును, రాజ్యములును ఏకమై విశాలమగు పోలండ్-లిథూని యన్ సామ్రాజ్యము ఏర్పడినది [చూ. పోలండ్ - పు. 590]. ఈ సమ్మేళనమువలన పోలండ్ దేశమే ఎక్కువగ లాభము ఆర్జించినది. లిథూనియా యందలి ప్రాంతములు పెక్కు పోలండ్‌న చేర్చబడినవి. తుదకు 1795 లో రష్యా సమ్రాట్ ఈ సంయుక్త రాజ్యపాలకులను ఓడించి లిథూ నియాయందలి అత్యధిక భాగమును కైవసమొనర్చు కొనెను ; కొలది ప్రాంతమును ప్రష్యా వశపరచుకొనెను. రష్యా చక్రవర్తుల పాలనలో లిథూనియా దేశము పలు కష్టములకు లోనయ్యెను. కడకు విప్లవఫలితముగ రష్యా యందు జార్ ప్రభుత్వము అంతరించినపిదప 1918 లో లిథూనియా స్వాతంత్ర్యమును గడించెను. 1920 లో రష్యా ఈ దేశపు స్వతంత్ర ప్రతిపత్తిని గుర్తించెను. కాని, పోలండ్ మాత్రము లిథూనియాయందలి విల్నియస్ నగర ప్రాంతమును వశపరచుకొనెను. ఈ నష్టమును కూడదీసి కొనుటకై లిథూనియా ప్రభుత్వము ప్రథమప్రపంచ యుద్ధానంతరము మిత్రమండలి వశమున ఉన్న ప్రష్యా లోని మెమెల్ పరగణాను మిత్రమండలి వారిని ఒప్పించి ఆక్రమించెను. 1921 లో ఈ దేశము నానాజాతి సమితి [చూ. పు. 531] సభ్యత్వమును ఆర్జించెను.

కాని, 1938 నుండి మరల ఈ దేశచరిత్రయందు త్వరిత గతిలో మార్పులు జరుగ ఆరంభించెను. ద్వితీయ ప్రపంచ యుద్ధపు కారుమబ్బులు ప్రపంచమును ఆవరింపనున్న క్లిష్ట పరిస్థితిని అవకాశముగ గ్రహించి పోలండ్ 1938 లో ఈ దేశమున పలుప్రాంతములను కైవస మొనర్చుకొనెను. 1939, మార్చిలో జర్మనీ ఈ దేశమునందలి మెమెల్ పరగణాను ఆక్రమించెను. కాని, ద్వితీయ ప్రపంచ యుద్ధము మొదలిడిన కొలదికాలమునకు నాజీ జర్మనీయును, సోవియట్ రష్యా రాజ్యమును కలసి పోలండ్‌ను విభజించు కొనిన సమయమున, సోవియట్ రష్యా రాజ్యము లిథూని

యాకు ఇదివరలో పోలండ్ ఆక్రమించిన విల్నియస్ మొదలగు ప్రాంతములను ఇచ్చివేసి, అందులకు బదులుగ లిథూనియా దేశమున తన సేనలను ఉంచుటకు అనుమతిని గ్రహించెను. తరువాత క్రమముగ సోవియట్ రష్యా ప్రభుత్వమునకు అనుకూలమగు ప్రభుత్వము దేశమున ఏర్పాటై, ప్రజల సమ్మతితో దేశమును సోవియట్ గణ రాజ్య సమితిలో చేర్చినది (1940, జూలై 14). జర్మనులు సోవియట్ రష్యా దేశముపై దండెత్తిన పిదప తొలుత లిథూనియాను ఆక్రమించిరి. కాని, 1944 లో తిరిగి సోవియట్ రష్యా సైన్యములు ఈ దేశమును వశపరచుకొనినవి. తదాదిగ సోవియట్ రష్యా ప్రభుత్వ విధానము గల గణ రాజ్యముగ ఈ దేశము సోవియట్ గణ రాజ్య సమితియందు భాగ స్వామినియై ఉన్నది. సోవియట్ రష్యా రాజ్యమున ఈ దేశపు చేరికను యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వము తప్ప తక్కిన ప్రముఖ రాజ్యములన్నియు గుర్తించినవి. చి. శే. రా.

**లిబియా :** ఉత్తర ఆఫ్రికాయందలి ఒక స్వతంత్ర రాజ్యము.




ఈ దేశమునకు మధ్యధరా సముద్రము [ఉ]; ఈజిప్టు, సుడాన్ [తూ]; చాద్, నైజర గణ రాజ్యములు [ద]; టూనీషియా. ఆల్జీరియా [ప] సరిహద్దులందు ఉన్నవి. [వి] 17,59,540 చ. కి. మీ ; [జ] 12,44,000. [భా] జాతీయభాష అరబిక్; బర్బర్ అనబడు భాషను మాటాడువారు కొలదిగ కలరు. [మ] దాదాపుగ ప్రజలందరును సున్నీ సంప్రదాయపు ముస్లిమ్‌లు. [రా] బెన్‌ఘాజీ (జ. సం. 70,533); రెండవ రాజధాని ట్రిపోలీ దీనికే 'తరాబులస్ అల్ గర్బ్' అనియు పేరు కలదు. (జ. సం. 1,72,202).

**చరిత్ర :** మధ్యధరా సముద్రతీరమున ఉన్న ఈ దేశము నందలి రేవు పట్టణములు వ్యాపారరీత్యా ఎక్కువ ప్రాముఖ్యమును ఆర్జించి ఉండుటచే, ప్రాచీనకాలమున గ్రీస్, కార్థేజ్ రాజ్యములు రెండును ఈ ప్రాంతమును వశపరచుకొనుటకై పోటీపడి పోరాడినవి. గ్రీక్‌ల ప్రతిభ సన్నగిలిన తదుపరి క్రీ. పూ. 250 నుండి రోమన్‌లు కార్థేజ్‌తో ఈ దేశము విషయమై సంఘర్షణ పడిరి. తరువాత ఇది రోమన్ సామ్రాజ్యమున కొంత కాలము ఉండి, ఆ సామ్రాజ్యము అస్తమించిన తరువాత అనాగరక జాతుల దాడులకు గురియై క్రీ. శ. ఆరవ శతాబ్దినుండి కొంతకాలము బైజాంటైన్ సామ్రాజ్యమునకు లోబడి ఉండెను. క్రీ. శ. 643 లో ఇస్లామ్ సేనావాహినులు ఈ దేశముపై వచ్చిపడి ఆక్రమించి, అరబ్బీ భాషా సంస్కృతులకు, ఇస్లామ్ మతమునకు ఇచట వ్యాప్తి కలిగించినవి. కాని, అంతటినుండి 300 సంవత్సరములవరకు దేశము అంతర్యుద్ధములకు లోనయ్యెను. 16 వ శతాబ్దములో స్పెయిన్ వారి మూలమున తిరిగి ఈ దేశమునకు పాశ్చాత్యులతో పరిచితి ఏర్పడెను. కాని, రాజకీయముగ ఏ పాశ్చాత్య రాజ్యమునకును అట పలుకుబడి లభింపకుండెను. తుదకు టర్కీ సమ్రాట్‌లు ఈ దేశమును వశపరచుకొనిరి. కాని, 1711 నుండి లిబియా వాసి అగు ఒక టర్కీ ప్రభుత్వోద్యోగి అహ్మద్ కరమాన్‌లీ అనువాడు ఇచట ప్రాబల్యమును సంపాదించి, టర్కీ ప్రభువుల ఆధిపత్యమును నామమాత్రముగ గుర్తించి, వంశానుగతమగు పరిపాలనను నెలకొల్పెను. అయినను 1835 లో తిరిగి టర్కీ సమ్రాట్‌లు ఈ దేశముపై తమ అధికారములను సుప్రతిష్ఠితము చేసికొనగలిగిరి.

ఇటలీ ఈ దేశమును 1911 లో వశపరచుకొనుటతో, ఈ దేశమున ఆధునికయుగము ఆరంభమయ్యెనని చెప్పవచ్చును. అంతటినుండి ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున - బ్రిటిష్, ఫ్రెంచి సేనలు ఆక్రమించునంతవరకు - ఇది ఇటలీ సామ్రాజ్యమున అంగర్భాగముగ ఉండెను. ముస్సోలినీ [చూ. పు. 757] ఇటలీని పరిపాలించు కాలమున సామ్రాజ్య ప్రభుత్వాధికారమును దేశమున మారుమూలలకు సైతము అతడు వ్యాపింప జేయగలిగెను. కాని, ముస్లిమ్ మత సంస్కరణోద్యమమగు సనూసీ భ్రాతృసంఘము సామ్రాజ్యవాదులను ఎదుర్కొని 1931 నుండి పోరాడి, పలు త్యాగములను ఒనర్చెను. ద్వితీయ ప్రపంచ యుద్ధము ముగిసిన తరువాత 1941, నవంబరు 29 న ఐక్యరాజ్యసమితి [చూ. పు. 351] సాధారణ సభ చేసిన తీర్మానములను అనుసరించి 1951, డిసెంబరు 24 వ తేదీన మహమ్మద్ ఇద్ రిస్

అల్ - మహదీ అల్ - సనూసీ యొక్క వంశానుగతపు రాచరికము క్రింద ఈ దేశము స్వాతంత్ర్యమును పొందెను. ఈ రాజే సనూసీభ్రాతృసంఘమునకును అధ్యక్షుడు.

రాజ్యాంగము : వంశానుగతమగు రాచరికము కలిగిన సమాఖ్య పద్ధతి ప్రభుత్వము ఈ దేశమున అమలునందు ఉన్నది. ఆంతరంగిక స్వపరిపాలన గలిగిన ట్రిపోలిటానియా, బర్కా (సిరేనికా), ఫజ్జాన్ అను మూడు రాష్ట్రముల సమాఖ్యయగు ఈ ప్రభుత్వమున రాజు, ప్రధాన మంత్రి, అతని మంత్రివర్గము 24 సభ్యులు కల శిష్ట సభ, 55 సభ్యులు కల ప్రతినిధిసభ అను ముఖ్యాంగములు కలవు. శాసన సభలను రద్దుచేయుటకు, ప్రత్యేక పరిస్థితులలో సర్వాధికారముల వహించి ఉత్తరువుల ద్వారా పాలన నిర్వహించుటకు, ప్రధానిని, మంత్రివర్గ సభ్యులను ఉద్యోగముల నుండి తొలగించుటకు రాజుకు అధికారము కలదు. 20,000 మందికి లేదా అందలి భాగమునకు ఒకరు చొప్పున ప్రతినిధులు ప్రతినిధులసభకు ఎన్నుకొనబడెదరు. వీరి పదవీకాలపరిమితి నాలుగు ఏండ్లు. శిష్ట సభయందలి సభ్యులలో సగము మందిని రాజు నియమించును. కడమ వారు రాష్ట్రమునకు నలుగురుచొప్పున ఎన్నుకొనబడెదరు. సాధారణ పరిస్థితులలో శాసనసభకు బాధ్యత వహించు మంత్రివర్గము పరిపాలనను నిర్వహించును. శాసన సభల తీర్మానమును రాజు వీటో (నిరాకరింప) చేయ వచ్చును. అప్పుడు మూడింట రెండువంతుల ప్రాబల్యమున, ప్రతినిధులసభ దానిని ఆమోదించిన అది శాసనము కాగలదు. స్త్రీలకు ఈ దేశమున వోటు హక్కు లేదు. చి. శే. రా.

**లీగ్ ఆవ్ నేషన్స్:** చూ. నానాజాతి సమితి-పు. 531.

**లీ ట్రిగ్వీ, హాల్వ్‌డాన్** (జ. 1896): నార్వే రాజనీతి వేత్త; ఐక్యరాజ్యసమితి ప్రథమ ప్రధానకార్యదర్శి. ఆస్లో నగరమున 1896, జూలై 16 న ఇతడు జన్మించెను. ఆస్లో యూనివర్సిటీనుండి న్యాయశాస్త్ర పట్టభద్రుడై (1919), అనంతరమున ప్రముఖ న్యాయవాదియై, కాల క్రమమున లేబర్ పార్టీ నాయకుడైన ఇతడు నార్వే దేశపు ప్రభుత్వమున న్యాయశాఖ మంత్రిగ (1935 - 39) ను, వాణిజ్య, సరఫరాల మంత్రిగ (1939 - 41) ను పనిచేసెను. 1941 లో ప్రవాస ప్రభుత్వమున విదేశాంగమంత్రి అయ్యెను. వాషింగ్‌టన్‌కు 1943 లోను, మాస్కోకు 1944 లోను ప్రత్యేక దూతగ ఇతడు పంపబడెను. ఐక్యరాజ్యసమితికి తుదిరూపకల్పనకై శాన్ ఫ్రాన్సిస్కోలో 1945 లో జరిగిన సమావేశమున నార్వే ప్రతినిధివర్గనాయకుడుగ ఇతడు పాల్గొనెను. భద్రతాసమితి ప్రణాళిక ముసాయిదాను తయారుచేసిన కమిటీకి ఇతడు అధ్యక్షుడు. ఐక్యరాజ్య సమితి ప్రధానకార్యదర్శిగ 1946 లో ఎన్నుకొనబడెను. కొరియాయుద్ధములో ఐక్యరాజ్యసమితి తీసికొనిన చర్యను దృఢవైఖరితో బలపరచి సోవియట్ రష్యా యొక్క అయిష్టతకు గురి అయ్యెను. 1953 లో ఐక్య రాజ్యసమితి ప్రధానకార్యదర్శి పదవికి రాజీనామా ఇచ్చెను. నార్వే ప్రభుత్వము ఆస్లో, అకర్షస్ రాష్ట్రములకు గవర్నర్‌గ 1955 లో ఇతనిని నియమించెను. నార్వే పారిశ్రామికమంత్రిగ (1963 - 1964) నుండి, 1964 నుండి వాణిజ్య, నౌకాశాఖల మంత్రిగ నియుక్తుడయ్యెను. ఇతని ముఖ్యరచనలు: 'ఇన్ ది కాస్ ఆవ్ పీస్ (1954)'; 'టు లివ్ ఆర్ డై (1955)'; 'విత్ ఇంగ్లండు టు ఫ్రంట్ లైన్(1956)'; 'హోమ్‌వార్డ్ బౌన్డ్(1958)'. పా. ల. నా.

**లీవర్డ్ దీవులు :** ఈ పేరున రెండు వలస రాజ్యములు కలవు. అందు ఒకటి బ్రిటిష్ వలసరాజ్యము [చూ. వెస్ట్ ఇండీస్]; రెండవది ఫ్రెంచి సముద్రోత్తర ప్రాంతము [చూ. సాగరఖండము]. * * *

**లుముంబా, పాట్రిస్** (1925 - 61) : కాంగో (లియోపాల్డ్‌విల్లీ) గణరాజ్య ప్రథమ ప్రధాన మంత్రి. దాస్య, దారిద్ర్యావిద్యలనుండి విడివడ యత్నించిన ఆఫ్రికన్ ప్రజల ఆకాంక్షకు ఒక ప్రతీకముగ వెలసినవాడు. బతేతితే అను ఆఫ్రికన్ తెగయందు జన్మించిన ఈతడు కష్టపడి విద్యను ఆర్జించి, తపాలాఫీసులో మొదట ఒక ఉద్యోగిగ 1944 లో చేరి, అటుతరువాత దానిని వదలి 1958 లో రాజకీయములందు ప్రవేశించి, బెల్జియమ్ వలస పరిపాలనను అంతమొందించు ఉద్దేశముతో 'మూవ్‌మెంట్ నేషనల్ కాంగోలే (మూ. నే. కా.)' అను జాతీయోద్యమమును సంస్థాపించెను. 1959 లో ప్రభుత్వము ఇతనికి ఆరునెలల కారాగార శిక్షను విధించెను. జైలునుండి 1960 లో వెలుపలికి వచ్చిన తరువాత, ఇతడు తన పక్షమునకు కాంగో ప్రజలయందు అధికాదరణ లభించునటుల చేయగలిగెను. వక్తగ ఇతడు ఆ దేశమున అసమానఖ్యాతిని ఆర్జించెను. ఆ దేశమునందలి తక్కిన రాజకీయ పక్షములవలె ఏదియో ఒక తెగకు చెందినటుల ఉండక ఈతడు స్థాపించిన రాజకీయపక్షము దేశమునందలి పలుతెగలకు ప్రాతినిధ్యము వహింపగలిగెను. తుదకు బెల్జియమ్ ప్రభుత్వము దేశమునకు స్వాతంత్ర్యము ఈయ అంగీకరించిన తరువాత 1960, మే నెలలో జరిగిన ఎన్నికలందు ఈతని పక్షము ఏ ఒక ఇతర పక్షము కన్నను అధిక సంఖ్యాకతను ఆర్జించుట వలన ఈతడే ప్రధానమంత్రి అయ్యెను. కాని, దేశమున విచ్ఛిన్నకర శక్తుల ప్రాబల్యము క్రమముగ అతిశయిల్లుట గమనించి ఇతడు దానిని అణచుటకు ఐక్యరాజ్యసమితి

సాయమును అర్థించెను. ఇంతలో సెప్టెంబరు 18న అధ్యక్షుడు కసవూబూ ఇతనిని పదవినుండి తొలగించుచు ఉత్తరువులను పంపెను. కాని, శాసనసభ ఇతనియెడ విశ్వాసమును ప్రకటించుటవలన ఇతడు వైదొలగక ప్రధానమంత్రిగనే వ్యవహరించుచుండెను. అంతట సేనాపతియగు మొబుటూ సర్వాధికారములను స్వీకరించగ, లుముంబా ఐక్యరాజ్య సమితి సైనికదళపు రక్షణను అర్థించి, వారి ఆశ్రయమున లియోపాల్డ్‌విల్లీయందే కొంతకాలము ఉండి, అటనుండి స్టాన్లీవిల్లీకి తప్పించుకొని పోవ యత్నింపగ దారిలో ఇతనిని మొబుటూ సైనికులు పట్టుకొని, లియోపాల్డ్‌విల్లీయందే కొంతకాలముంచి, తరువాత అతని ప్రత్యర్థియు, కాంగో దేశపు సమైక్యతకు నిరోధకుడును, కటాంగా రాష్ట్రపు పాలకుడును అగు మాయిసీ షోంబేకి అప్పగించిరి (జనవరి, 1961). ఇతడు అటనుండి తప్పించుకొన యత్నించగ ప్రజలు అతనిని చంపిరని కటాంగా రాష్ట్రప్రభుత్వము ప్రకటించినను, ఇతనిని షోంబేయే 1961, జనవరి 17 న హత్య చేయించెనని ఐక్యరాజ్యసమితి విచారణ సంఘపు విచారణ ఫలితముగ తెలియవచ్చినది. లుముంబా హత్య నాగరక ప్రపంచమునంతటిని, అందును ముఖ్యముగ ఆఫ్రికా స్వాతంత్ర్యకాముకులనందరిని సంక్షోభపరచినది. తదాదిగ ఆఫ్రికా సమైక్యతావాదులు అందరికి లుముంబా ఆదర్శములే ప్రాతిపదికలైనవి. ఇతని పేరిట ఒక యూనివర్సిటీని నెలకొల్పి, సోవియట్ రష్యా ఇతని ఎడ తమకుగల గౌరవమును వెల్లడించినది [చూ. కాంగో (లియోపాల్డ్‌విల్లీ) - పు. 378].

చీ. శే. రా.

**లూథర్, మార్టిన్ (1483 - 1546):** జర్మనీలో ప్రొటెస్టంట్ మతవిప్లవము నడపిన మహానుభావుడు. బైబిల్ గ్రంథమును జర్మనీభాషలోనికి అనువదించి, జర్మనీ సాహిత్యమునకు అమూల్యరత్నమును సమకూర్చిన ప్రఖ్యాత రచయిత. విద్యావ్యాప్తికి, నూతన జ్ఞాన వికాసమునకు తోడుపడిన ధీనిధి.

ఈ ప్రొటెస్టంట్ వాదమే క్రమముగ యూరప్‌నందలి రాచరికములు బలపడుటకును, తత్ఫలితముగ జాతీయతావాదము బలవత్తరమగుటకును త్రోవతీసినది [చూ. సం. 7 - పు. 665].

* * *

**లెనిన్ (1870 - 1924):** ఈతడు రష్యా విప్లవమునకు ప్రధాననాయకుడు. ప్రప్రథమ సోషలిస్ట్ రాజ్య నిర్మాత. ఇతని నిజనామము వ్లాడిమిర్ - ఇల్యిచ్ - యులియనావ్ లెనిన్. లెనిన్ రష్యాదేశమునందలి సింబుర్స్క్ అను ప్రదేశమున 1870, ఏప్రిల్ 10 వ తేదీని జన్మించెను. ఈతని తండ్రి పాఠశాలలపై పర్యవేక్షకుడుగ పనిచేసెడివాడు. విద్యావంతులైన మధ్యతరగతివారికి అతని గృహము చర్చాస్థలముగ ఉండెడిది.



లెనిన్
(1870 - 1924)

ఇట్టి పరిసరములలో లెనిన్ పుట్టి పెరిగినందున ఇతని మనస్సునందు విప్లవబీజములు చిన్ననాడే మొలకెత్తినవి. లెనిన్ సోదరుడు ఆనాటి రాజ్యపాలకుని హత్యగావింప ప్రయత్నించినందున అతడు మరణదండనకు గురి అయ్యెను. ఈ విషయము పదునేడేండ్ల వయసుగల లెనిన్ మనస్సునకు గాఢముగ నాటుకొనినది. న్యాయశాస్త్ర విద్యాభ్యాసము కొరకు కజన్ యూనివర్సిటీలో చేరెను. కాని, నెల రోజులకే తీవ్రమగు ఈతని ఉపన్యాసముల ధోరణి అతడు యూనివర్సిటీ నుండి వెడలగొట్టబడుటకు కారణమైనది. ఈ సమయముననే కార్ల్‌మార్క్సుచే రచింపబడిన 'డాస్ కాపిటల్' అను పుస్తకపఠనమువలన లెనిన్ ఉత్తేజితుడు అయ్యెను. తత్ఫలితముగ సాంఘిక వ్యవస్థలోని వ్యత్యాసములను రూపుమాపి సామ్యవాదమును సమాజమున నెలకొల్పుటకు కార్ల్‌మార్క్సు సిద్ధాంతములను ఆచరణలో పెట్టుట తప్ప వేరుగతిలేదని ఇతడు విశ్వసించెను.

సెయింట్‌పీటర్స్‌బర్గ్‌నందు శ్రామిక, కర్షకులను దాస్యవిముక్తులను చేయుటకును, పారిశ్రామికులచే సమ్మెలు చేయించుటకును ఒక సంస్థను అతడు స్థాపించి కృషిచేసెను. అందులకు ఫలితముగ 1897 లో సైబీరియాకు అతడు ప్రవాసము అంపబడెను. 1900 నుండి 1905 వరకు ఇతడు జర్మనీ, స్విజర్లండ్ మొదలగు దేశములందు ఉండి సామ్యవాదప్రజాస్వామ్యపక్షసిద్ధాంత చర్చలలో పాల్గొనుచు, దేశమున ఆ పక్షము బలపడుటకు పరోక్షముగ తోడుపడెను. 1903 లో ఈ పక్షమున బోల్షివిక్‌లు, మెన్షివిక్‌లు అను రెండు వర్గములు ఏర్పడి, అందు తొలుతటి వారు లెనిన్ సిద్ధాంతముల కార్యాచరణవిధానమును బలపరచిరి. 1905 లో పీటర్స్‌బర్గ్‌కు లెనిన్ తిరిగి వచ్చి 'వర్కర్స్ సోవియట్' సంఘమును స్థాపించెను. ఈతనికి లియోన్ ట్రాట్‌స్కీ [చూ. పు. 504] చాల సహాయపడెను. 1905 విప్లవము విఫలత నొందుటచే జెనీవా నగరమునకు లెనిన్ పారిపోయెను. అచట ప్రఖ్యాత రచయిత మాక్సిమ్ గోర్కీతో పరిచయము ఏర్పరచుకొనెను. 1913 లో

తిరిగి సెయింట్ పీటర్స్‌బర్గ్‌కు వచ్చి 'ప్రావ్డా' అను పత్రికను నడపి ఉత్తేజకరమైన వ్యాసములను ప్రకటించి ప్రజలను కదిలించి వేసెను. 1917 లో ప్రజావిప్లవ కారణముగ రాచరికము అంతరింపగ ఏర్పడిన పరిస్థితి బోల్షివిక్‌ల విజయమునకు మార్గదర్శకము అయ్యెను.

అంతట లెనిన్ ఆధ్వర్యవమున బోల్షివిక్ ప్రభుత్వము రష్యాయందు ఏర్పడి, పలు ప్రతిఘటనలను ఎదుర్కొని, కడకు విజయవంతము అయ్యెను. సొంత యాజమాన్యమును రద్దుచేసి, ఆస్తిపై సంఘపు యాజమాన్యమును నెలకొల్పుటకు అవసరమగు ప్రాతిపదికచర్యలను అమలు పరచుటలో ఇతడు కడు చతురతను ప్రదర్శించెను. 1921 లో తనపై జరిగిన హత్యా ప్రయత్నమునుండి తప్పించుకొన కలిగెను. కాని, తీవ్రకృషికి ఫలితమగు శరీర అనారోగ్యమువలన 1924, జనవరి 2 న ఇతడు మరణించెను. ఘ. ఆ. శ.

లెబనాన్ : మధ్యధరా సముద్రపు తూర్పు తీరమున ఆసియా ఖండమందు ఉన్న ఒక స్వతంత్ర రాజ్యమేను.




దాదాపు 160 కిలోమీటరుల పొడవు, 48 కిలోమీటరుల వెడల్పు గల ఈ స్వతంత్ర రాజ్యమునకు సిరియా [ఉ, తూ]; ఇజ్రాయెల్ [ద]; మధ్యధరా సముద్రము [ప] సరిహద్దులందు ఉన్నవి. [వి] 10,400 చ. కి. మీ. [జ] 16,45,813 [భా] జాతీయ భాష అరబ్బీ. [మ] క్రైస్తవమతమునకును, ఇస్లామ్‌నకును ప్రజలలో దాదాపుగ సమాన వ్యాప్తి కలదు. [రా] బీరూట్ (జ. సం. దాదాపు 5,00,000).

చరిత్ర : ఆసియా, యూరప్, ఆఫ్రికా ఖండముల కూడలికి అత్యంత సన్నిహితముగ ఉన్న ఈ దేశము ప్రాచీన కాలమునుండియు తత్పరిసరములందు వర్ధిల్లిన వివిధ ప్రాచీన సంస్కృతులకు నెలవుగ ఉండినది. ఈజిప్టును పాలించిన టాలమీ ప్రభువుల కాలమున ఈ దేశపు రేవులు కలప వ్యాపారమునకు పేరొందెను. క్రైస్తవశకపు తొలుతటి శతాబ్దములలోనే ఇచట క్రైస్తవ మతము వ్యాప్తించెను. తరువాత ప్రచండ ధాటితో ఇస్లామ్ సేనావాహినులు ఈ నేలను ఆక్రమించినను, క్రైస్తవమతము తన ప్రతిపత్తిని చాలవరకు నిలుపుకొనగలిగినది. మధ్యయుగములందు ఇది సిరియాతో అతి సాన్నిహిత్యమును కలిగి ఉండి, దాదాపు దానియందు ఒక అంతర్భాగముగ ఉండెను. మతయుద్ధముల [చూ. క్రూసేడ్‌లు - పు. 414] కాలమున క్రైస్తవ సేనలు సిరియాను ఆక్రమించుటతో ఈ ప్రాంతము వారి వశమున కొలదికాలము ఉండినను, తరువాత క్రమముగ మంగోల్‌లు మొదలగు వారి దండయాత్రలకు లోనై తుదకు టర్కీ (ఓటోమన్) సామ్రాజ్యమున అంతర్భాగమయ్యెను. అప్పుడు ఈ ప్రాంతము అంతయు బీరూట్ రాష్ట్రమున చేరి ఉండెను. అయినను క్రైస్తవసంఖ్యాబాహుళ్యము కల లెబనాన్ పర్వత మండలమును మాత్రము వేరుపరచి, ఓటోమన్ ప్రభువులు దానిని మాన్ వంశీకుడగు ఒక అమీరునకు ఒసగిరి. ఈ అమీరు వంశములోనివాడగు ఫకురుద్దీన్ (1586 - 1635) పాశ్చాత్యరాజ్యములతో స్నేహము కల్పించుకొని వ్యాపారమును ప్రోత్సహించిన ఫలితముగ క్రైస్తవమత ప్రచారకులు ఎక్కువగ వచ్చుటయు, వ్యాపారము అభివృద్ధి అగుటయు జరిగెను. కాని, 18 వ శతాబ్ది ఆరంభమున ఈ అమీరుల వంశము అంతరించి షిహాబ్ వంశీకులగు అమీరులు లెబనాన్ పర్వత మండలమున ఆధిపత్యమును వహించిరి. వీరు తమ మండలమును దాదాపు ఒక స్వతంత్రరాజ్యముగ బలవత్తర మొనర్చి, ఓటోమన్ ప్రభువుల సార్వభౌమత్వమును మాత్రము అంగీకరించిరి. కాని, త్వరలోనే వీరు ఈజిప్టుప్రభుత్వమునకు లొంగి ఉండవలసి వచ్చెను (1832 - 40). 1840 - 41 లో బ్రిటిష్ సేనలు ఈ ప్రాంతమునకు ఈజిప్టు దాస్యమునుండి విమోచనము కలిగించి, క్రైస్తవులకును, ముస్లిమ్‌లకును సామరస్యమున మెలగుటకు అవకాశము కలిగించు ప్రభుత్వవిధానమును పర్పరచుటకు కృషిచేసినవి. ఇందు ఫ్రెంచి వారును వీరికి సాయముచేసిరి. తుదకు వీరి ఒత్తిడికి లొంగి లెబనాన్ పర్వత మండలమున క్రైస్తవ మతాభిమానము కల ప్రభుత్వమును పర్పరచుటకు టర్కీ సమ్రాట్ అంగీకరించెను. తత్ఫలితముగ ఆంతరంగిక స్వతంత్రతా ప్రతిపత్తి గల లెబనాన్ పర్వత మండలము పర్పరుపబడి, ఒక క్రైస్తవుడు గవర్నర్‌గ నియమింపబడెను.

ప్రథమ ప్రపంచ యుద్ధఫలితముగ టర్కీ సామ్రాజ్యము విచ్ఛిన్నము కాగా, సిరియాతో కలిపి ఈ ప్రాంతము ఫ్రెంచివారి ధర్మకర్తృత్వ (మాండేటరీ) పాలనకు ఒసగబడెను (1920). ఫ్రెంచివారు ఈ ప్రాంతమును పరిపాలనా సౌకర్యము నిమిత్తము విడదీయునపుడు లెబనాన్ పర్వత మండలమునకు దానికి సమీపమున ఉన్న సిరియాయందలి కొన్ని విస్తృత ప్రాంతములను కూడ చేర్చిరి. ఇవి విస్తీర్ణమున లెబనాన్ పర్వత మండలమునకు నాలుగు రెట్లు ఉన్నవి. ఇవి అన్నియు చేరుటచే ఏర్పడినదే నేటి లెబనాన్. ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున నాజీ జర్మనీని అనుసరించిన విచీ ఫ్రెంచి ప్రభుత్వము అధీనమున ఈ ప్రాంతము కొంతకాలము ఉండెను. కాని, 1941 లో స్వతంత్ర ఫ్రెంచి సేనలు బ్రిటిష్ సేనల సాయమున ఈ ప్రాంతమును వశపరచుకొనినవి. లెబనాన్‌కు స్వతంత్రము ఒసగినటుల ఆ వెనువెంటనే ఫ్రెంచివారు ప్రకటించినను 1945 నుండి మాత్రమే ఆ ప్రకటనము కార్యరూపము పొందినది. 1952 మొదలుగ స్వతంత్ర లెబనాన్ యునైటెడ్ స్టేట్స్ వలన ఆర్థికసహాయమును పొంది అభివృద్ధిపొందుచు, రాజకీయపు అలజడులు ఏవియు లేక పురోగమింపగలిగెను. కాని, 1958 లో అప్పటి అధ్యక్షుడగు చామూన్ రెండవసారికూడ తానే అధ్యక్షుడుగ ఉండవలెనని యత్నించినపుడుమాత్రమే కల్లోలములు చెలరేగెను. అంతట సైన్యము అధికారమును తాత్కాలికముగ స్వీకరించి, తరువాత అన్ని రాజకీయ పక్షములు ఆమోదించిన జనరల్ ఫాద్ షిహాబ్ అనువానిని అధ్యక్షునిగ చేసి రాజ్యాంగమును పునరుద్ధరించెను.

**రాజ్యాంగము:** ఈ దేశము ఒక స్వతంత్ర గణరాజ్యము. 1926 లో ఫ్రెంచి అధీనమున ఉన్నపుడు వెలువరింపబడిన రాజ్యాంగ చట్టమే కాలోచితములగు సవరణలతో ఈ దేశమున ఇపుడు అమలునందు ఉన్నది. 66 మంది ఎన్నుకొనబడిన సభ్యులు కల ప్రతినిధిసభయందు శాసన నిర్మాణాధికారము న్యస్తమై ఉన్నది. ఈ సభకు ఎన్నికలు సాధారణముగ నాలుగు ఏండ్లకు ఒకసారి సార్వజనిక రహస్యపు ఎన్నిక విధానమున జరుగును. ఒక్కొక్క నియోజకమండలమునుండి ఏ మత వర్గపు ప్రతినిధి ఎన్నిక కావలసినది తొలుతగ ప్రభుత్వము నిర్ణయించును. శాసన సభయే అధ్యక్షుని ఎన్నుకొనును. అధ్యక్షుని పదవీకాల పరిమితి ఆరు సంవత్సరములు. కార్యనిర్వహణాధికారము అధ్యక్షునిది. ప్రధానమంత్రి ఆధ్వర్యవమున ఉన్న మంత్రివర్గమును అధ్యక్షుడే నియమించును. కాని, వీరు శాసన సభకు బాధ్యతవహించి పనిచేయుదురు. ప్రత్యేక పరిస్థితులలో అధ్యక్షుడు శాసనసభను రద్దుచేసి, క్రొత్త ఎన్నికలు జరుపవచ్చును. రాజ్యాంగ చట్టమున అట్టి నియమము లేకున్నను, అధ్యక్షుడు క్రైస్తవుడుగను, ప్రధానమంత్రి ముస్లిమ్‌గను ఉండవలెనను ఏర్పాటు ఒక సత్సంప్రదాయముగ ఏర్పడి, మన్నింపబడుచున్నది. చీ. శే. రా.

**లెసోతో :** ఆఫ్రికాలోని స్వతంత్ర రాజ్యము ; 1966 కు పూర్వము దాని పేరు బసూటోలాండ్.

ఈ రాజ్యమునకు అన్నివైపులను దక్షిణ ఆఫ్రికా గణరాజ్యపు రాష్ట్రములు సరిహద్దులందు ఉన్నవి. [వి] 30,344 చ. కి. మీ. [జ] 6,97,000. జనులలో యూరపియన్ జాతికిని, ఆసియా వాసుల సంతతికిని, మిశ్రజాతికిని చెందిన వారందరు కలసి 3,000 కు మించరు. తక్కినవారందరును ఆఫ్రికన్ జాతులవారే. [భా] బసూటో అను ఆఫ్రికన్ భాషకు ఎక్కువ ప్రచారము కలదు. కాని, వ్యవహార భాషగ ఆంగ్లమే వాడబడుచున్నది. [మ] దేశీయులలో దాదాపు మూడవ వంతు క్రైస్తవులు, తక్కినవారు సంప్రదాయ బహుదేవతారాధకులు. [రా] మసేరూ (జ. సం. 5,579).

**చరిత్ర :** 19 వ శతాబ్దివరకు అటనట చెదరి ఉన్న ఆటవికులు తప్ప స్థిరనివాస జాతులవారు ఎవరును ఇట వసించినటుల కన్పట్టదు. 18 వ శతాబ్ది ప్రారంభమున సమీప దేశములందలి జూలూ జాతులచే తరుమబడిన కొన్ని ఆఫ్రికన్ జాతులు మోషేష్ అను వాని నాయకత్వమున ఇట చేరి స్థిరనివాసము ఏర్పరచుకొనినవి. 1833 లో ఈ మోషేష్ ప్రభువు క్రైస్తవమతప్రచారకులను తన దేశమునకు ఆహ్వానించి మతప్రచారమునకు అవకాశము లను కల్పించెను. ఇంతలో సమీపమున ఆరంజీ ఫ్రీ స్టేట్ (ప్రస్తుతపు దక్షిణ ఆఫ్రికాయందలి రాష్ట్రము) నందున్న బోయర్‌లు అనబడు డచ్చి సంతతివారు బసూటోలాండ్‌ను హరింప యత్నింపగ, మోషేష్ బ్రిటిష్‌వారి రక్షణను అర్థించెను. దానికి అంగీకరించి 1868 లో బ్రిటిష్‌వారు ఈ దేశమును రక్షితరాజ్యముగ ప్రకటించిరి. కొంతకాలము ఇది దక్షిణ ఆఫ్రికాయందలి కేప్ రాష్ట్రముతో జతపరుపబడెను. కాని, తరువాత వేరుచేయబడి, బ్రిటిష్ ప్రభుత్వపు ప్రత్యక్ష పాలనలోనికి వచ్చెను (1884). అంతటినుండి బ్రిటిష్ ప్రభుత్వము నియమించు గవర్నర్ పాలనలో ఈ రాజ్యము ఉండి, కాలక్రమమున ప్రజాభిప్రాయమునకు లొంగి ఈ దేశమునకు బ్రిటిష్ ప్రభుత్వము స్వాతంత్ర్యమును కల్పింప 'లెసోతో' అను నూతన నామమును ఈ రాజ్యము పొందినది.

**రాజ్యాంగము :** 1959 లో ఈ దేశమున బ్రిటిష్ ప్రభుత్వామోదితమగు క్రొత్త రాజ్యాంగవిధానము ప్రవేశపెట్టబడినది. దీనిని అనుసరించి నేషనల్ కౌన్సిల్ అను శాసన సభ నిర్మితమైనది. స్వతంత్రత పొందినవెనుక సాంప్రదాయ

పాలకుడు దేశమునకు రాజై, ఈ కౌన్సిల్ సాయమున పాలించుచున్నాడు. అన్ని విషయములపై శాసనముల చేయుటకు ఈ కౌన్సిల్ కు అధికారము కలదు. జిల్లా సంఘములచే ఎన్నుకొనబడిన 40 మంది సభ్యులును, వంశ పారంపర్యముగ అధికారము వహించు సామంత ప్రభువులకు చెందినవారు 22 మందియు, దేశపు సాంప్రదాయ పాలకుడగు మోషేష్ - II నియమించు 14 మంది సభ్యులును, ఉన్నతాధికార వర్గమునకు చెందినవారు 4 మంది సభ్యులును నేషనల్ కౌన్సిల్ నందు ఉందురు. సామంతమండలము అనునది వేరుగ కలదు. సామంతుల వారసత్వము, అధికారములు మొదలగువానిని ఇది పరిష్కరించును. దక్షిణ ఆఫ్రికాతో ఈ రాజ్యమునకు శుల్క మైత్రి కలదు. చీ. శే. రా.

**లైబీరియా :** ఆఫ్రికాఖండపు పశ్చిమతీరమున ఉన్న ఒక స్వతంత్ర గణరాజ్యము.




ఈ దేశమునకు గినీ గణరాజ్యము [ఉ]; ఐవరీకోస్ట్ [తూ]; అట్లాంటిక్ మహాసముద్రము [ద]; సియెర్రా లియోనీ [ప] సరిహద్దులందు ఉన్నవి. [వై] 1,11,370 చ. కి. మీ.; [జ] 12,90,000. [భా] దాదాపు 20 తెగల ఆఫ్రికన్లు వేర్వేరు మాతృభాషలతో ఇట వసించుచున్నారు. ఇంగ్లీషు అధికార భాషగ వ్యవహారమందు ఉన్నది. ప్రజలలో 20% దీనిని మాట్లాడగలరు. [మ] దేశ ప్రజలలో అమెరికానుండి వచ్చిన నీగ్రో సంతతివారు క్రైస్తవ మతావలంబకులు; తక్కినవారు ప్రకృతి దేవతారాధకులు; కొలదిగ ముస్లిములును కలరు. [రా] మన్రోవియా (జ. సం. దాదాపు 50 వేలు).

చరిత్ర : యునైటెడ్ స్టేట్స్‌లో 19 వ శతాబ్ది ఆరంభమున బానిసత్వపు నిర్మూలనకై కృషిజరుగుచున్న కాలమున తొలుతగ స్వాతంత్ర్యమును ఆర్జించిన కొందరు నీగ్రోలకు వేరొక దేశమున నివాసమును ఏర్పరుచుట సముచితముగ ఉండునను ఊహ కొందరకు తట్టి, వారందరును 'అమెరికన్ కాలనైజేషన్ సొసైటీ' అను అనధికార సంస్థగ ఏర్పడి, ఆఫ్రికాలో ఒకచోట అట్టి నీగ్రోలకు నివాస భూమిని ఏర్పరచుటకు నిశ్చయించిరి. అటుల ఆ సొసైటీ సహాయమున, తొలుత కొంతమంది స్వేచ్ఛాకాముకులగు నీగ్రోలు తమ కుటుంబములతో యునైటెడ్ స్టేట్స్ నుండి ఆఫ్రికాకు 1822 లో వచ్చి, ఇట వలసలను ఏర్పరుచుకొనుటచే లైబీరియా దేశము రూపొందినది. యునైటెడ్ స్టేట్స్ యందలి అంతర్యుద్ధము ముగిసి, దేశమునందలి నీగ్రోలకు చట్టబద్ధమగు స్వాతంత్ర్యము లభించుదనుక (1863), యునైటెడ్ స్టేట్స్‌నుండి ఇట్టి నీగ్రోలు దాదాపు 14,000 మంది లైబీరియాకు వలసపోయిరి. మరియును రహస్యముగ బానిసవ్యాపారముచేయువారి నౌకలను సముద్రమార్గమున అరికట్టుటచే విడుదలైన దాదాపు 5,700 మంది నీగ్రోలు కూడ ఈ లైబీరియాకు పంపబడిరి. ఈ నీగ్రోలు తొలుతగ ఈ దేశమున ఒక నదీ ముఖద్వారమున ఉన్న ప్రావిడెన్స్ అను ఒక లంకపై తమ వలసను ఏర్పరచుకొనిరి. క్రమముగ వీరు దేశములోనికి వ్యాపించిన కొలది, అదివరకే అట వసించుచుండిన వివిధ తెగల నీగ్రోలు వీరిని ప్రతిఘటించి పోరాడిరి. తుదకు చాల శ్రమపడి వీరు ఆ తొలుతటి నీగ్రోలతో సామరస్యమును సాధింపగలిగిరి. ఈ నాటికిని వలసవచ్చినవారి సంతతికన్న తొలుతటి నీగ్రోల సంతతి జన సంఖ్యలో దాదాపు నాలుగు రెట్లు ఉన్నది.

మొదట ఈ దేశ పరిపాలనకు అమెరికన్ కాలనైజేషన్ సొసైటీవారే బాధ్యత వహించిరి. కాని, 1844 లో యునైటెడ్ స్టేట్స్ రాజ్యాంగమును అనుసరించు ఒక రాజ్యాంగ చట్టముతో ఈ దేశము ఒక స్వతంత్ర గణరాజ్యముగ రూపొందెను. ఇటుల స్వతంత్ర నీగ్రో రాజ్యముల అవతరణలో హాయిటీ తరువాత రెండవ స్థానమును లైబీరియా ఆక్రమింప గలిగినది. వివిధ యూరపియన్ రాజ్యములును లైబీరియాను గుర్తించినను, ఏదియో నెపముమీద సరిహద్దులందు ఉన్న బ్రిటన్, ఫ్రెంచి వలసల ప్రభుత్వములవారు తమ సరిహద్దులను అనుకొనిన లైబీరియా దేశపు సారవంతభూములను పెక్కింటిని ఆక్రమించిరి. పందొమ్మిదవ శతాబ్దపు అంతమున జరిగిన కొన్ని ఒడంబడికల మూలమున సరిహద్దులు నిర్ణయింపబడి, ఈ దురాక్రమణలు చాలవరకు తొలగింపబడినను, లైబీరియా దేశము ఇంకను తనకు న్యాయము జరుగలేదని భావించుచున్నది.

ఆర్థిక మాంద్యపు (1930) ఫలితముగ ఈ దేశము పెక్కు దురవస్థలకు లోనయ్యెను. విదేశములకు ఈయవలసిన ఋణములను ప్రభుత్వము చెల్లింపలేని పరిస్థితి ఏర్పడెను. ఈ బాకీలను తీర్చునంతవరకు దేశమును ఒక అంతర్జాతీయ సంస్థ పాలనక్రింద ఉంచుట మంచిదని నానా జాతి సమితి [చూ. పు. 531] సూచించెను. లైబీరియా ఇందులకు ఒప్పుకొనలేదు. అందుచే యునైటెడ్‌స్టేట్స్ దీనిని తన రక్షణక్రిందకు తీసికొని బాకీలను చెల్లించు ఏర్పాటుచేయవలసినదిగ బ్రిటన్ సూచించెను. ఇంతలో లైబీరియాయందు రబ్బరు ఎగుమతి కంపెనీని స్థాపించిన ఒక విదేశీ వర్తక సంస్థ ఈ ఋణమునకు తాను పూచీపడి, ప్రభుత్వమునకు తనవలన చెందదగు పన్నులు మొదలగు వానినుండి చెల్లు పెట్టుకొనుటకు అంగీకరించుటచే ఆ బెడద తప్పెను. 1934 లో ఇటుల రబ్బరు ఎగుమతి మొదలై, 1952 లో బాకీ చెల్లువోయెను. ద్వితీయ ప్రపంచ యుద్ధ కాలమున యునైటెడ్‌స్టేట్స్ ప్రభుత్వము తన వైమానిక కేంద్రమును ఒక దానిని నెలకొల్పుటవలనను, మన్రోవియా వద్ద ఒక హార్బర్‌ను కట్టించుటవలనను దేశ వ్యాపారము, సంపద చాల వృద్ధియగుటకు అవకాశములు ఏర్పడినవి. 1944 నుండి ఎడతెగక ప్రతి పర్యాయము అధ్యక్షుడుగ ఎన్నుకొనబడుచుండిన విలియమ్ వి. ఎస్. టబ్‌మన్ దేశమును అభివృద్ధిదాయకమగు మార్గమున నడిపించు చున్నాడు.

రాజ్యాంగము: రాజ్యాంగ చట్టము (1844)ను అనుసరించి ఈ దేశము ప్రజాస్వామిక గణ రాజ్యము. పరిపాలనాధి కారి అధ్యక్షుడు. ఈతడును, ఉపాధ్యక్షుడును అపరోక్షపు ఎన్నికలో ప్రజలచే ఎన్నుకొనబడెదరు. వీరిలో ఒక్కొక్కరి పదవీకాల పరిమితి ఎనిమిది ఏండ్లు. అధ్యక్షునిచే నియమింప బడి, వివిధ శాఖలకు ఆధిపత్యము వహించు పదిమంది మంత్రివర్గ సభ్యులు అతనికి పరిపాలనలో సాయము చేయుదురు. అధ్యక్ష పదవిని ఒకసారి నిర్వహించినవాడు మరల ఆ పదవికి ఎన్నుకొనబడినచో అతని పదవీ కాల పరిమితి నాలుగేండ్లు మాత్రమే కాగలదు. శాసనసభయందు శిష్టసభ, ప్రతినిధిసభ అను రెండు కక్ష్యలు కలవు. దేశమందలి అయిదు రాష్ట్రములనుండి రాష్ట్రమునకు ఇరువురు చొప్పున పదిమంది శిష్టసభకు ఎన్నుకొనబడెదరు. ప్రతినిధిసభ యందు వివిధ నియోజకమండలములనుండి ఎన్నుకొన బడిన 35 మంది సభ్యులు కలరు. శాసనసభల అధికార పరిమితి ఇదమిత్థమని రాజ్యాంగమున నిర్వచింపబడలేదు. కాని, ఆచరణయందు పెక్కు అధికారములను ఇది కలిగి ఉన్నది. ఆఫ్రికన్ జాతికి చెంది, దేశమున నివసించుచు, నియమితమగు కొంత ఆస్తి కల పౌరునికి మాత్రమే వోటు హక్కు కలదు కాని, ఈ ఆస్తి అర్హత క్రమక్రమముగ సడలింపబడుచున్నది. తొలుత లేకున్నను, 1945 నుండి స్త్రీలకు కూడ వోటు హక్కు కలిగింపబడినది. చి. శే. రా.

లోక్‌సభ: చూ. భారత రాజ్యాంగము - పు. 720.

**లోకార్నో సంధులు (1-12-1925):** 1925 అక్టో బరులో లోకార్నోలో జరిగిన అంతర్జాతీయ సమావేశము అనేక ఒప్పందములను సాధించి, చరిత్ర ప్రసిద్ధి వహించెను. అన్నింటిలో ముఖ్యాతిముఖ్యమైన ఒప్పందము ఏదన: ఫ్రాన్స్ - జర్మనీ, బెల్జియమ్ - జర్మనీ సరిహద్దుల అనుల్లంఘ నీయతను - రైన్‌లాండ్‌లోని నిస్సైనిక మండలమును ధ్రువీకరించుట. ఈ ఒప్పందముపై ఫ్రాన్స్, జర్మనీ, బెల్జియమ్ దేశములు సంతకముచేయగా, బ్రిటన్, ఇటలీదేశములు దీనికి హామీ ఇచ్చెను. అప్పుడే ఫ్రాన్స్, బెల్జియమ్, పోలండ్, జెకోస్లోవాకియా దేశములతో జర్మనీ మధ్యవర్తిత్వ పరిష్కారపుసంప్రదాయములను నెలకొలుపు సంధులు చేసికొనెను. ఇంకను ఫ్రాన్స్ - పోలండ్, ఫ్రాన్స్ - జెకోస్లోవాకియా పరస్పరము ఒకరికొకరు హామీలు ఇచ్చు ఒప్పందములపై సంతకములు చేసినవి. మొత్తముమీద అంతర్జాతీయసహకారము వాంఛించువారికి అందరికిని ఈ సంధులు సంతసము కలిగించెను. అయితే - 1936, మార్చిలో - జర్మనీ నియంతయగు హిట్లర్ [చూ.] ఈ లోకార్నో సంధి షరతులను అతిక్రమించి తన సైన్యము లను రైన్‌లాండ్‌లోని నిస్సైనికమండలమునకు పంపెను. అప్పట్లో ఎతియోపియాను ముస్సోలినీ [చూ. పు. 757] ఆక్రమించుటచే సంభవించిన రాజకీయ క్లిష్ట పరిస్థితులలో తగుల్కొని ఉండిన ఇతర సంతకముదారులు హిట్లర్‌కు అభిశంసనపత్రములను పంపుటతో మాత్రము తృప్తిపడి ఊరకుండిరి. స్వ. వెం.

**లోడీ వంశము (1451 - 1526):** భారతదేశమును పాలించిన ఒక రాజవంశము. బహలాల్ లోడీ దీని మూల పురుషుడు. ఇతడు సుల్తాన్ అయినప్పటికి పంజాబ్, గంగా - యమునా నదుల మధ్య ప్రాంతమందు కొన్ని జిల్లాల వరకే అతని అధికారము సాగుచుండెను. కాని, అతడు అతి సమర్థుడు అగుటచే తిరుగుబాటు చేసిన జమీందారులను అణగద్రొక్కెను. జాన్‌పూర్ సర్దారులతో దీర్ఘకాలము పోరాడి, ఆ రాష్ట్రమును ఢిల్లీసామ్రాజ్యమునకు చేర్చి వేసెను. తన ఆఫ్ఘన్ సర్దారులందరిని హద్దుమీరి పోకుండు నటుల చూచుకొనుచు, 1489, జూలైలో అతడు చనిపోయెను. అతడు మరణించినపుడు ఢిల్లీనుండి కాశీ వరకు ఢిల్లీప్రభుత్వాధికారము చెల్లుచుండెను. అతని

అనంతరము అతని మూడవ కుమారుడు నిజామ్ అనువాడు 'సికందర్ షా' అను బిరుదముతో సుల్తాన్ అయ్యెను. అతడు ఎంతో కష్టముమీద బీహార్, ధోల్పూర్, చాందేరి, నాగూర్ మున్నగు ప్రాంతములను అన్నిటినీ ఢిల్లీ రాజ్యములో చేర్చివేసెను. ఇప్పటి ఆగ్రాను అతడే మొదట నిర్మించెను. యుద్ధవిషయములలోనే కాకుండా ప్రజా పాలనా విషయములలో కూడ అతడు మంచి తెలివి తేటలు, సామర్థ్యము కనపరచెను. వ్యవసాయమును, వ్యాపార మును ప్రోత్సాహపరచెను. న్యాయమును చక్కగా తీర్చు చుండెను. విద్యావంతులను ఆదరించెను. కాని, మతపు పిచ్చిచేత, హిందువులను పీడించుటవలన అతని పరిపాలనకు తీరని మచ్చ కలిగినది. అతడు 1517 లో ఆగ్రాలో గతించెను.

అతని అనంతరము అతని పెద్దకొడుకు ఇబ్రహీమ్‌లోడీ సుల్తాన్ అయ్యెను. ఇతడు అతని చుట్టుప్రక్కల వారిని అందరిని అనుమానించుచు, చాల తీవ్రమైన పరిపాలనము సాగించెను. ఇతని తీవ్రశాసనములు గర్విష్ఠులగు ఆఫ్ఘన్ సర్దారులకు కోపకారణములు అయ్యెను. అందువలన వారు అతనిని సింహాసన భ్రష్టుని జేయుటకు కుట్రలు పన్నిరి. కడకు ఇతని మామయగు అల్లా ఉద్దీన్ అనువాడు సైతము ఇతనికి వ్యతిరేకియై పంజాబ్ గవర్నర్ అగు దౌలత్‌ఖాన్‌లోడీతో కలిసి కాబూల్ రాజగు బాబర్‌ను భారతదేశముపై దండెత్తుమని ఆహ్వానించెను.

బాబర్ తైమూర్ వంశీయుడు. అందువలన తైమూర్ ఒకప్పుడు భారతదేశములో జయించిన రాజ్యమెల్ల తనదని వాదించుచు 1526 లో భారతదేశముపై దండెత్తివచ్చెను. ఏప్రిల్ 21 వ తేదీన ఢిల్లీకి ఉత్తరమున సుమారు 89 కిలో మీటరులలో గల పానిపట్టువద్ద బాబర్, ఇబ్రహీమ్‌లోడీ లకు భయంకర సమరము జరిగినది. ఇబ్రహీమ్‌లోడీకి గల సైన్యము బాబర్ సైన్యముకన్న పెద్దదైనను, బాబర్ మంచి చాకచక్యముగల సేనానాయకుడగుటచే యుద్ధ మందు గెల్చెను. ఇబ్రహీమ్‌లోడీ యుద్ధమున ప్రాణములు గోల్పోయెను. ఇబ్రహీమ్‌లోడీ మరణముతో ఢిల్లీసుల్తానుల ప్రభుత్వము అంతరించి మొగల్ ప్రభుత్వము నెలకొన్నది [చూ. మొగల్ సామ్రాజ్యము - పు. 767] గు. వెం.

**వల్లభ్‌భాయి జవేరీభాయి పటేల్ (1875-1950):** సర్దార్ వల్లభ్‌భాయ్ పటేల్ గుజరాత్ రాష్ట్రములో నడి యాడ్ నగర సమీపమున కరమ్‌సాద్ అను గ్రామములో 1875, అక్టోబరు 31 న జన్మించెను. ఇతడు నడియాడ్‌లో ఒక ఉన్నత పాఠశాలయందు విద్యను అభ్యసించి, న్యాయ శాస్త్రమును అభ్యసించుటకై లండనునగరము చేరు కొనెను. న్యాయశాస్త్రములో ఉత్తీర్ణుడై, భారతదేశము నకు తిరిగివచ్చి, అహమ్మదాబాద్ నగరమున అతడు



వల్లభ్‌భాయ్ పటేల్
(1875 - 1950)

న్యాయవాది వృత్తిని కొన సాగించెను. అదే సమయ మున అహమ్మదాబాద్ పుర పాలకసంఘ అధ్యక్షుడుగ నాలుగు సంవత్సరములు కార్యభారము వహించెను. 1916 లో గాంధిజీ పిలుపును అందుకొని, స్వాతంత్ర్యపోరా టములో దుమికెను. తదా దిగా బ్రిటిష్ ప్రభుత్వముపై కొనసాగించిన శాసనోల్లంఘ నోద్యమములో అతడు పెక్కు పర్యాయములు కారాగార శిక్షను అనుభవించెను. ఇతని అకుంఠిత దేశభక్తికిని, అచంచలమైన త్యాగనిరతికిని, తిరుగులేని వజ్రసంకల్పము నకును, అనుపమానమైన రాజకీయ చతురతకును గాంధిజీ మున్నగు అగ్రనాయకులు అబ్బురపడి, ప్రశంసా పూర్వక ముగ వల్లభ్‌భాయ్ పటేల్‌కు 'సర్దార్' బిరుదును ప్రదా నము కావించిరి.

సర్దార్ పటేల్ 1931 లో జాతీయ మహాసభకు అధ్యక్షత వహించెను. బార్డోలీ తాలూకా (గుజరాత్) లో బ్రిటిష్ ప్రభుత్వమునకు వ్యతిరేకముగా 'బార్డోలీ' సత్యాగ్రహోద్య మమునకు నాయకుడై చరిత్రాత్మకమైన ఖ్యాతి గడించెను. 1935-42 మధ్య అఖిలభారత పార్లమెంటరీ బోర్డ్‌నకు అధ్యక్షుడుగా వ్యవహరించెను. పిమ్మట ఎనిమిది రాష్ట్రము లలో కాంగ్రెస్ ప్రభుత్వములు స్థాపింపబడిన సందర్భములో, రాష్ట్రముల యొక్క పరిపాలనా విధానమును నిర్ణయించుట యందును, దానిని అమలు జరిపించుటయందును వల్లభ్ భాయిపటేల్ ప్రముఖపాత్ర వహించెను. అతని వజ్ర సంకల్పమునకును, ఎట్టి జటిల సమస్యనైనను ఎదుర్కొని, పరిష్కరించుటలో తిరుగులేని అతని నిర్ణయబలమునకును అబ్బురపడిన అతని సహచరులు అతనిని 'ఉక్కుమనిషి' అని ప్రశంసించుచుండిరి.

ద్వితీయ ప్రపంచయుద్ధ సమయములో పటేల్ మూడు పర్యాయములు కారాగారశిక్షను అనుభవించెను. జైలు నుండి విడుదల అయినంతనే బ్రిటిష్ అధికారులతో స్వాతంత్ర్యసిద్ధికొరకై రాయబారములు సాగించుట యందు ఇతడు ప్రధానపాత్ర వహించెను. ఈ రాయబార ముల ఫలితముగ 1946, ఆగస్టు నెలలో తాత్కాలిక

ప్రభుత్వము ఏర్పడగా, అందు పటేల్ ఆంతరంగిక, సమాచారశాఖలకు మంత్రి అయ్యెను. భారతదేశమునకు 1947, ఆగస్టులో సంపూర్ణస్వాతంత్ర్యము సిద్ధించినపుడు, నూతన భారతప్రభుత్వములో పటేల్ ఉపప్రధాని పదవి అలంకరించి, స్వదేశ సంస్థానముల సమస్యాపరిష్కారమును గూర్చి కూడ ప్రధాన బాధ్యత తనపై ఇడుకొనెను. సహజమైన దూరదృష్టి కలవాడు అగుటచేతను, అత్యంత రాజకీయ చాతుర్యము గలవాడు అగుటచేతను, 600 కు పైబడిన స్వదేశ సంస్థానములను భారత రాజ్యాంగములో అతడు విలీనము ఒనర్చగలిగెను. అత్యంత జటిలమైన సంస్థానముల విలీనసమస్యను శాంతియుతముగా పరిష్కరించుటచే పటేలు అంతర్జాతీయ రాజకీయ నాయకుల మన్ననలకు కూడ పాత్రుడయ్యెను. అతని రాజకీయ ప్రతిష్ఠ ఈ సంఘటనముతో అత్యున్నత స్థాయిని అందుకొనెను. అతివాదులు ఇతని ఆర్థిక, రాజకీయ విధానములను విమర్శింపగా, తద్వ్యతిరేకులు అతనిని ప్రశంసించుచుండెడివారు. వయోభారముచే కలిగిన అనారోగ్య కారణముగా సర్దార్ పటేలు 1950, డిసెంబరు 15 వ తేదీన మరణించెను. ప్ర. రా. సు.

**వాటర్లూ సంగ్రామము (18 - 6 - 1815) :** ఇది నెపోలియన్ తుది పరాజయమునకు దారితీసిన పోరాటము. లీప్‌జిగ్ యుద్ధమున ఓడిపోయి, ఎల్బా దీవియందు ప్రవాసమున ఉంచబడిన నెపోలియన్ చక్రవర్తి [చూ. పు. 542] 1815, ఫిబ్రవరిలో అక్కడినుండి తప్పించుకొని మరల పారిస్ చేరెను. తిరిగి పరిపాలన ప్రారంభించిన ఆ చక్రవర్తి, అధికసంఖ్యాకమైన కాల్బలముతోను, ఫిరంగులతోను వాటర్లూవద్ద బ్రిటిష్ వారిని ఎదిరించెను. బ్రిటిష్ సేనలకు వెల్లింగ్‌టన్ నాయకుడయ్యెను. ఫ్రెంచి సైన్యములు ఉత్తరమున 12 కిలోమీటరుల దూరమునందున్న బ్రస్సెల్స్ వైపునకు బలవంతముగ నెట్టుకొనిపోవుటకు ప్రయత్నించెను. సర్వసన్నద్ధమైన బ్రిటిష్ కాల్బలము ఫ్రెంచి దాడులను త్రిప్పి కొట్టుటయేకాక, సాయంకాలమగుసరికి ఫ్రెంచి వారిపై తిరుగు దెబ్బతీసెను. ఇట్టి దాడిలో బ్లూచెర్ నాయకత్వమున వచ్చుచున్న ప్రష్యన్ సైన్యములును బ్రిటిష్ సైన్యములను కలిసికొనెను. అందుచే, ఫ్రెంచి సైన్యములు ఓడిపోయెను. నాలుగు రోజులు గడచిన అనంతరము నెపోలియన్ చక్రవర్తి పదభ్రష్టుడుగ చేయబడి, సెయింట్ హెలీనా దీవిలో మరణ పర్యంతము నిర్బంధింపబడెను. స్వ. వెం.

**వాటికన్ నగరరాజ్యము :** అత్యల్ప విస్తీర్ణము కల ఒక నగరరాజ్యము. రోమన్ కేథలిక్ సంప్రదాయపు క్రైస్తవమతమునకు పీఠాధిపతి (పోప్) ఈ నగర రాజ్యమునకు పాలకుడు.

ఇటలీదేశపు ముఖ్యనగరమగు రోమ్ నగరమందలి వాటికన్ పర్వతముపై ఈ స్వతంత్ర నగరరాజ్యము నెలకొని ఉన్నది. [వి] 0·5 చ. కి. మీ.; రోమ్‌నగరమందే వేరు ప్రాంతములందు అటనట చెదరి ఉన్న కొన్ని ప్రదేశములును పరిపాలన రీత్యా ఈ వాటికన్ నగరరాజ్యముననే చేరి ఉన్నవి. [జ] 1,010. [మ] ప్రజలందరు రోమన్ కేథలిక్‌లు. [రా] వాటికన్.

చరిత్ర : రోమన్ సామ్రాజ్యపాలకుల కాలమున ఇటలీయందు క్రైస్తవశకారంభమున, సెయింట్ పీటర్ మొదలగు క్రైస్తవ ఋషుల ప్రచారమూలమున క్రైస్తవ మతము తొలుత ప్రవేశపెట్టబడినది. కాని, ఆ నాటి పాలకులు క్రైస్తవమత విరోధులగుటచే క్రైస్తవ మత సన్యాసులు అనేకులు తమ మత విశ్వాసముల మూలమున దారుణ మరణశిక్షల పాలయిరి. అట్టుల జీవితములను త్యాగము ఒనర్చినవారిలో సెయింట్ పీటర్ సుప్రసిద్ధుడు (క్రీ. శ. 67 మ.). అతని అనంతరమున ప్రజలలో క్రమముగ క్రైస్తవ మతమునకు ఆదరణము ఎక్కువై, కడకు అది ప్రభువుల దృష్టిని సైతము ఆకర్షించెను. అంతట ఆ యా ప్రభువుల ఆదరణమూలమున యూరప్ ఖండమున విస్తృత భాగమున క్రైస్తవమతము వ్యాప్తిచెందుటవలన మత పీఠాధిపతులగు పోప్‌లకు ప్రాబల్యమును, దానితోపాటుగ అటనట భక్తులచే ఒసగబడిన జమీందారీలును, భవనములును, ప్రార్థనాలయములును లభించెను. ఇటలీ దేశమున ఇట్టివి ఆదినుండి అటనట చెదరి ఉండి వీనియన్నింటిపై పోప్‌నకు సర్వాధికారములును లభించెను. పోప్‌లకును, క్రైస్తవ రాజులకును అధికారవిషయమున జరిగిన సంఘర్షణల కాలమున కొన్ని మార్పులు సంభవించినను, కడకు పోప్‌లు ఇటలీయందలి తమ భూములపై ఆధిపత్యమును 1870 వరకు నిలబెట్టుకొనుటయే కాక, ఇటలీ దేశపు రాజకీయములందును ప్రముఖపాత్ర వహించిరి. కాని, 1870 లో ఇటలీ దేశ ప్రభుత్వము పోప్‌నకు చెందిన భూఖండములను అన్నిటిని వశమొనర్చుకొనెను. అంతటినుండి పోప్‌లు తమ అధికారముల విషయమై ఇటలీ ప్రభుత్వముతో వివాదపడుట మొదలిడిరి. ఈ తగవునే యూరపియన్ చరిత్రకారులు 'రోమన్ సమస్య' అని పేర్కొందురు. కడకు బెనిటో ముస్సోలినీ [చూ. పు. 757] ఇటలీ దేశపు నియంతగ ఉన్న కాలమున 1929 లో ఈ సమస్య పరిష్కరింపబడి, పోప్‌నకును, ఇటలీ ప్రభుత్వమునకును మధ్య ఒక ఒడంబడిక కుదిరినది. దానిని అనుసరించి వాటికన్ నగర రాజ్యముపైనను, వెలుపల అటనట చెదరి ఉన్న

కొన్ని మతసంబంధ భవనములపైనను సర్వాధికారము పోప్‌నకు కలుగజేయబడినది. తదాది సర్వాధికారి హోదాలో ఆ నగర పాలకుడుగ ఉండుటయే కాక, ప్రపంచమున వివిధ దేశములతోను దౌత్య సంబంధములను సైతము పోప్ కలిగి ఉన్నాడు. కొలది కాలము క్రిందటనే దివంగతుడైన పోప్ జాన్ - XXIII తన శాంతి ప్రియత్వమువలన ప్రపంచమునందలి ప్రజలందరకును, అందును భగవదస్తిత్వమున నమ్మకము లేని కమ్యూనిస్ట్ పాలకులకు సైతము మాననీయుడు అయ్యెను.

పరిపాలన : ఇందుండు వారందరు పోప్ సర్వాధికారమునకు లోబడి ఉందురు. ప్రపంచమునందలి రోమన్ కేతలిక్ అనుయాయులు అందరును పోప్ యొక్క ఆధ్యాత్మికరాజ్యమునకు చేరినవారు. పోప్ పీఠమును అధిష్టించిన అతడు నిర్యాణముచెందుచో వేరొక పోప్‌ను ఎన్నుకొను అధికారము ప్రపంచమునందలి రోమన్ కేతలిక్ మతాచార్యుల (కార్డినల్స్) కు మాత్రమే కలదు. పోప్ పరమపదించిన 18 వ రోజున ఈ మతాచార్యులు అందరు వాటికన్ రాజభవనమున చేరి సమావేశమును మొదలిడుదురు. ఆనాటినుండి ఎన్నిక పూర్తియగువరకు వారెవరును బయటికి రాకుండ భవనద్వారములు అన్నియు మూసివేయబడును. మతాచార్యులకు సదుపాయములను సమకూర్చుటకు కార్యదర్శిని, కొలదిమంది సేవకులను మాత్రము లోపల ఉండనిచ్చెదరు. ఎన్నిక రాజభవనమునందలి ప్రార్థనాలయమున జరుగును. మొత్తము మతాచార్యుల సంఖ్యలో మూడింట రెండు వంతుల ఆమోదమును ఆర్జించిన అతడు మాత్రమే పోప్ కాగలడు. అట్టి సంఖ్య ఎవనికిని రానపుడెల్ల ఎన్నిక విఫలమైనటుల భావింపబడి, ఆ విఫలతను తెలియజేయుటకై ఆ వోటు ముక్కలను అన్నింటిని చెమ్మతగిలిన గడ్డితో కలిపి భవనమునందలి చిమ్నీగొట్టము క్రింద తగులపెట్టెదరు. గడ్డిలో చెమ్మ ఉండుట వలన అందలి పొగ నలుపుగ పైకిలేచి, చిమ్నీ గొట్టము గుండ ఆకసములోనికి పోవును. భవనము వెలుపల నుండి ఎన్నిక ఫలితము కొరకు నిరీక్షించు ప్రజలు నల్లని పొగను చూచినంతనే ఎన్నిక విఫలమైనటుల గుర్తింతురు. అంతట భవనములోపల తిరిగి ఎన్నిక జరుగును. ఇటుల మూడింట రెండువంతుల సభ్యుల ఆమోదము ఏ ఒక అభ్యర్థికైన వచ్చువరకు ఎన్నిక జరుగుచునే ఉండును. తుదకు అటుల ఒకరు ఎన్నుకొనబడిన వెంటనే వోటు ముక్కలను ఎండు గడ్డితో కలిపి తగులబెట్టుదురు. అంతట తెల్లనిపొగ లేచి వెలుపలవారికి క్రొత్త పోప్ ఎన్నికైనటుల తెలియజేయును. తరువాత రాజభవనపు తలుపులు తెరువబడును. చీ. శే. రా.

**వార్సా ఒడంబడిక :** సోవియట్ రష్యాయును, తూర్పు యూరప్‌నందలి తక్కిన కమ్యూనిస్ట్ రాజ్యములు ఏడును (ఆల్ బేనియా, తూర్పు జర్మనీ, జెకోస్లోవాకియా, పోలండ్, బల్గేరియా, రుమేనియా, హంగేరీ) కలసి సమష్టి భద్రతను ఉద్దేశించి, 1955, మే 14 న వార్సానగరమున కుదుర్చుకొనిన ఒడంబడిక. పాశ్చాత్య రాజ్యములు రూపొందించుకొనిన నాటో [చూ. పు. 351] ఏర్పాటుకు ప్రతిక్రియగ ఈ ఒడంబడికను యూరప్‌లోని కమ్యూనిస్ట్ రాజ్యములు కుదుర్చుకొనినవి. పరస్పర సహాయముపై ఆధారపడిన రక్షణ సంధిగ ఇది ఆ ఒడంబడికయందు పేర్కొనబడినది. దీనిని అనుసరించి ఇందలి రాజ్యములు అన్నియు కలసి ఒక సంయుక్తసైనికవ్యవస్థను ఏర్పరచుకొనినవి. ఈ వ్యవస్థ యొక్క ప్రధానకార్యాలయము మాస్కోనగరమున కలదు. సోవియట్ రష్యా సేనానియే ఈ సైనిక వ్యవస్థకు సర్వసేనాపతిగ వ్యవహరించును. చీ. శే. రా.

**వాల్‌టెయిర్ :** చూ. సం. 6 - పు. 775.

**వాషింగ్‌టన్, జార్జి (1732 - 1799) :** యునైటెడ్ స్టేట్స్ ప్రథమ అధ్యక్షుడు. వర్జీనియాలో 1732, ఫిబ్రవరి 22 న ఇతని జననము. ఫ్రెంచివారికి వ్యతిరేకముగ సైనిక అధికారిగ పనిచేసి, బ్రిటిష్‌వారి విజయమునకు కారకుడైన పిమ్మట అమెరికా స్వాతంత్ర్య ఉద్యమమునకు నాయకుడు అయ్యెను. బ్రిటిష్‌వారికి వ్యతిరేకముగ అమెరికా సైన్య సర్వసేనాపతిగ 1775, జూలైలో ఎన్నుకొనబడి, స్వాతంత్ర్య పోరాటమును అద్భుత ధైర్యసాహసములతో అవిరళముగ కొనసాగించి, తుదకు 1781 లో హడ్సన్ నుండి చెచ్‌పీక్ అఖాతమునకు రహస్యముగ సేనలనునడిపి, యార్క్‌టౌన్ వద్ద కారన్‌వాలీస్‌ను లొంగదీసుకుని యుద్ధమును ముగింపజేసెను. గణరాజ్యపు తొలి సంవత్సరములలో ఫెడరల్ అధికారములపై వివిధరాష్ట్రముల మధ్య వివాదములు చెలరేగుటచే వాషింగ్‌టన్ రాజకీయ జీవితములో ప్రవేశింపవలసి వచ్చినది. రాజ్యాంగచట్టమును ఆమోదించిన (1787) ఫెడరల్ కన్‌వెన్షన్‌కు అధ్యక్షత వహించి, యునైటెడ్‌స్టేట్స్ అధ్యక్షుడుగ ఏకగ్రీవముగ



జార్జి వాషింగ్‌టన్

(1732 - 1699)

ఎన్నుకొనబడి (1789, మార్చి 4), విదేశాంగ విధానములో తటస్థ విధానముపై అభిమానము చూపెను. 1796, సెప్టెంబరు 17 న ఈయన ఇచ్చిన వీడ్కోలు ఉపన్యాసము వాషింగ్టన్ రాజకీయ శాసనముగ పరిగణించబడుచున్నది [చూ. పు. 156]. పా. ల. నా.

**వాషింగ్టన్ సమావేశము :** ప్రథమ ప్రపంచ యుద్ధము అనంతరము నౌకాబలమును తగ్గించుటను గూర్చియు, దూర ప్రాచ్యవ్యవహారముల గూర్చియు చర్చించుటకై యునైటెడ్ స్టేట్స్ ప్రేరేపణచే వాషింగ్టన్‌లో 12-11-1921 మొదలు 6-2-1922 వరకు జరిగిన సమావేశమునకు బ్రిటన్, ఫ్రాన్స్, ఇటలీ, పోర్చుగల్, బెల్జియమ్, హాలండ్, జపాన్, చీనా, యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వ ప్రతినిధులు హాజరైరి.

ఈ సమావేశము సాధించిన ఒడంబడికలు: 1. యునైటెడ్ స్టేట్స్, బ్రిటన్, ఫ్రాన్స్, జపాన్ రాజ్యములకు పసిఫిక్ మహాసముద్రమున ఉన్న ద్వీప రాజ్యముల విషయమైన పరస్పరపు హామీలు ; 2. చీనా స్వాతంత్ర్యమును గూర్చి పై సమావేశమునకు హాజరైన అన్ని రాజ్యముల హామీ ; 3. కియోచౌను చీనాకు మరల దత్తము చేయుటకై జపాన్ ఒప్పుదల ; 4. పది ఏండ్ల వరకును అన్ని రాజ్యముల వారును పదివేల మెట్రిక్ టన్నుల ప్రమాణమును మించిన నౌకల నిర్మాణమునకు పూనుకొనరాదనియు, బ్రిటన్, యునైటెడ్ స్టేట్స్, జపాన్, ఫ్రాన్స్, ఇటలీ మధ్య కొత్త నౌకల నిర్మాణపు ప్రమాణముల నిష్పత్తి 5 : 5 : 3 : 1·67 : 1·67 గా ఉండవలెననియు నిబంధించు ఒక నౌకా ఒప్పందము. స్వ. వెం.

**వాస్కో డ గామా** (ర. 1469 - 1524): ప్రసిద్ధ పోర్చుగీస్ నావికుడు ; సముద్రమార్గముగుండ భారత దేశము చేరిన ప్రథమ యూరోపియన్. పోర్చుగల్ పాలకుడగు ఎమాన్యుయేల్ - I ఆజ్ఞానుసారము గామా తన చారిత్రాత్మక నౌకాయానము (1497-99) ను చేసెను. నాలుగు నౌకలతో గుడ్‌హోప్ అగ్రమును చుట్టి, బార్టులోమూ 1498 లో చేరిన ప్రాచ్య బిందువును అధిగమించి, ఆఫ్రికా తూర్పుకోస్తా వెంబడి మాలింది వరకు ప్రయాణము సాగించి, హిందూ మహాసముద్రముగుండ కళ్లికోట చేరెను. ఈ నౌకాయానము భారతదేశ సిరిసంపదలను యూరపియన్‌లు దోచుకొనుటకు మార్గమును ఏర్పరచెను. తద్ద్వారా పోర్చుగీస్ సామ్రాజ్యము పెరిగెను. సుగంధద్రవ్యముల వాణిజ్యము ద్వారా పోర్చుగల్ అధికలాభము పొందెను. 20 యుద్ధనౌకలకు నాయకత్వము వహించి 1502 లో రెండవసారి భారతదేశమునకు గామా బయలు దేరెను. ఈ బలముతో భారతదేశ జలమార్గములపై పోర్చుగీస్ అధికారమును వ్యవస్థాపించుటకును, ఆఫ్రికాతీరము వెంబడి పెక్కు స్థావరముల నాయకులను లోబరచుకొనుటకును గామా ప్రయత్నించెను. తన పద్ధతులలో కఠిన విధానమును గామా అవలంబించెను. గామాకు కౌంట్ ఆవ్ విడిగ్యూరా బిరుదును ఇచ్చి పోర్చుగీస్ ప్రభుత్వము సన్మానించినది. వైస్రాయిగా భారతదేశమునకు 1524 లో గామా పంపబడెను ; కాని, భారతదేశము చేరిన కొద్దికాలమునకే అతడు మరణించెను. పా. ల. నా.



వాస్కోడగామా
(ర. 1469 – 1524)

**విక్టోరియా** (1819 - 1901) : బ్రిటిష్ దేశ చరిత్రలో సుదీర్ఘ కాలము పరిపాలనచేసిన మహారాణి. కెంట్‌నకు డ్యూక్ అయిన ఎడ్వర్డ్‌నకును, 'సాక్స్-కొబర్గ్' రాకుమారి యగు మేరీలూయిస్ విక్టోరియాకును ఈమె జన్మించెను. జార్జ్ - IV మరణానంతరము బ్రిటిష్ సామ్రాజ్యమునకు వారసురాలుగ గుర్తింపబడి, 1837 లో పదునెనిమిది ఏండ్ల ప్రాయమున విలియమ్ - IV తదుపరి విక్టోరియా బ్రిటిష్ సామ్రాజ్య సింహాసనమును అధిష్ఠించెను. విక్టోరియా మహారాణికి వైకౌంట్ ఎల్‌బర్న్ మొదటి ప్రధానమంత్రి అయి, ఆమెకు స్నేహితుడుగను, సలహాదారుగను వ్యవహరించెను. విక్టోరియా తన మొదటి రాజకీయ పాఠములను ఈతని వద్దనే నేర్చుకొనినది అనదగును.

సాక్స - కోబర్గ్ యువరాజైన ఆల్‌బర్ట్‌ను 1840 లో విక్టోరియా వివాహమాడి, అతనిచే మిక్కిలి ప్రభావితురాలయ్యెను. ఇతని కృషిఫలితముగనే విక్టోరియాకును, టోరీ రాజకీయనాయకులకును సామరస్యము ఏర్పడి, 1841 లో రాబర్ట్‌పీల్ [చూ. పు. 579] ప్రధానమంత్రి అయ్యెను. 1857 లో ఆల్‌బర్ట్ ప్రభువునకు 'ప్రిన్స్‌కన్సార్ట్' బిరుదము ఒసగబడెను. 1861 లో ఆల్‌బర్ట్ ప్రభువు మరణించెను. విక్టోరియా రాజ్యపరిపాలనాకాలము చివరన బెంజమిన్ డిజ్‌రేలీ [చూ. పు. 508], విలియమ్ గ్లాడ్‌స్టన్ అను వారలు రాజకీయములందు ప్రముఖపాత్ర వహించిరి. ప్రధాని పదవి వీరు ఇరువురి మధ్యనే పలుమారులు చేతులు మారినది. 1877 లో డిజ్‌రేలీ ప్రయత్నఫలితముగ విక్టోరియా భారతదేశ సమ్రాజ్ఞిగా ప్రకటింపబడెను. మంత్రులఎడ తన అభిప్రాయములను వెల్లడించుట రాజకీయ వైరుధ్యమని ఆమె

ఎన్నడును తలచెడిదికాదు. రాజరికపు ప్రతిష్ఠయందు ఆమెకు అత్యంతాభినివేశము ఉండెడిది. ఆ చక్రవర్తిని వలసరాజ్యముల ప్రజాసంక్షేమమునందు మిక్కిలి ఆసక్తిని చూపుచుండెడిది. యూరప్ ఖండమునందు మరియే ఇతర చక్రవర్తియు కని, విని ఎరుగని మార్పులను ఈమె తన జీవితకాలముననే చూచినది. విక్టోరియా తొమ్మండుగురు సంతానమును పడసెను. వీరివలన బ్రిటిష్ రాజవంశమునకు యూరప్ ఖండమందలి వివిధ రాజవంశములతోడి సంబంధబాంధవ్యములు తామరతంపరగ అల్లుకొని పోయెను. ఈమె జీవిత చరమదశలో విశేషప్రజాదరణమును చూరగొనగలిగెను. 1887 లోను, 1897 లోను ఈమె 50, 60 సంవత్సరముల రాజ్యపాలనను పురస్కరించుకొని క్రమముగ స్వర్ణోత్సవ, వజ్రోత్సవములు జరిగినవి. ఈమె అస్తమయముతో బ్రిటిష్ సామ్రాజ్యచరిత్రలో ఒక ఉజ్జ్వలదశ అంతరించినదని చెప్పనొప్పును. గు. రా.

**విఠల్ భాయ్ పటేల్** (1873 - 1933): ప్రసిద్ధ భారత రాజకీయవేత్త; వల్లభ్ భాయ్ పటేల్ [చూ. పు. 828] సోదరుడు. గుజరాత్‌లో నడియాడ్ నగర సమీపమున ఉన్న కరమ్‌సాద్ గ్రామమున ఒక సామాన్య రైతు కుటుంబమున జన్మించెను. ఇతను బారిస్టర్ పరీక్షలో ఉత్తీర్ణుడై బొంబాయి హైకోర్ట్‌నందు ప్రాక్టీస్ ప్రారంభించి, కీర్తి ప్రతిష్ఠలతోబాటు విశేషధనమును ఆర్జించెను. బొంబాయి లెజిస్లేటివ్ కౌన్సిల్‌నందు సభ్యుడై, రాజకీయములలో ప్రధానపాత్ర వహింప దొడగెను. 1918 లో బొంబాయిలో జరిగిన కాంగ్రెస్ మహాసభ ఆహ్వాన సంఘాధ్యక్షుడుగాను, 1919లో కాంగ్రెస్ జనరల్ సెక్రటరీగాను వ్యవహరించెను. 1918 - 1919 మధ్య పెక్కు పర్యాయములు లండనుకు వెళ్లి, మాంటేగ్ ఛెల్మ్స్‌ఫర్డ్ సంస్కరణలను గూర్చి కాంగ్రెస్ అభిప్రాయములను జాయింట్ కమిటీముందు బయల్పరచెను. ఇతను 1925 లో భారతదేశశాసనసభకు మొట్టమొదటిసారిగ ఎన్నుకొనబడెను. తన పదవీకాలమున ప్రశంసాపాత్రములగు పెక్కు పార్లమెంటరీ సత్ సంప్రదాయములను ఈతడు ఏర్పరచెను. జాతీయోద్యమమును అడచుటకు ప్రభుత్వము అవలంబించిన నిరంకుశ దౌర్జన్య చర్యలకు నిరసనగా 1930, ఏప్రిల్ 25 న ఇతను శాసనసభ అధ్యక్షపదవికి రాజీనామా ఇచ్చెను. 'క్రిమినల్ లా అమెండ్‌మెంట్ చట్టము' ప్రకారము బ్రిటిష్ ప్రభుత్వము ఇతనిని బంధించెను. కారాగార శిక్షను అనుభవించుచున్న కాలమున ఇతని ఆరోగ్యము క్షీణింప, ప్రభుత్వము ఈతనిని - శిక్షాకాల పూర్తికి ముందుగనే - విడుదల చేసెను. వియెన్నాలో శస్త్రచికిత్సను పొంది, ఆరోగ్యము కొంత కుదుటబడిన తరువాత యునైటెడ్ స్టేట్స్‌లో పర్యటించి భారతీయుల న్యాయసమ్మతమైన హక్కులను గూర్చి పటేల్ ప్రచారము గావించెను. ఆస్ట్రియాలోని పెక్కు వైద్యశాలలలో వైద్యమును పొందియు నిష్ప్రయోజనమై, 1933, అక్టోబరు 22 వ తేదీన జెనీవాలో అసువులు బాసెను. గు. రా.

**విజయనగర సామ్రాజ్యము** : చూ. తెలుగు సంస్కృతి, సం; పు. 369.

**విజయలక్ష్మి పండిట్** (జ. 1900) : పండిత జవాహర్‌లాల్ నెహ్రూ సోదరి. మహారాష్ట్ర గవర్నర్; (1962 - 1964) ఐక్యరాజ్యసమితి అధ్యక్షురాలు (1953 - 1954). విజయలక్ష్మి పండిట్ 1900, ఆగస్టు 18 న మోతీలాల్ నెహ్రూ, స్వరూపరాణి పుణ్యదంపతులకు పుత్రికగ జన్మించెను. చిన్నతనమునుండి ఈమె ఇంటివద్దనే విద్యాధికులవద్ద విద్యను అభ్యసించెను. 1921 లో ఈమె రంజిత్ పండిట్‌ను పరిణయమాడెను. జాతీయోద్యమమున (1932, 1941, 1942) పాల్గొని మొత్తముమీద మూడేండ్ల కారాగారవాస శిక్షను అనుభవించెను. ఉత్తర ప్రదేశ్ రాష్ట్ర రాజకీయములలో ఉత్సాహముగా పాల్గొనుచు 1936 లో అలహాబాద్ మునిసిపల్ బోర్డ్‌లోను, 1936 - 1946 వరకు సంయుక్తపరగణాల శాసనసభలోను సభ్యురాలై, స్థానిక స్వపరిపాలనా, ఆరోగ్యశాఖలకు మంత్రిణియైనది. భారతదేశమున మంత్రిపదవిని అలంకరించిన మొదటి నారీమణి ఈమెయే. 1940 నుండి 1942 వరకు ఈమె అఖిలభారత మహిళాసభకు అధ్యక్షురాలుగను, అంతర్జాతీయ శాంతి, స్వాతంత్ర్య మహిళా సంఘమునకు ఉపాధ్యక్షురాలుగను వ్యవహరించెను. 'ఇండియన్ కౌన్సిల్ ఆవ్ వరల్డ్ ఎఫైర్స్' తరపున ఈమె అమెరికాలోని వర్జీనియావద్ద ఉన్న హాట్‌స్ప్రింగ్స్ అనెడి ప్రదేశమున జరిగిన 'పసిఫిక్ రిలేషన్స్ కాన్‌ఫెరన్స్' కు హాజరయ్యెను. ఈమె యునైటెడ్ స్టేట్స్ అంతయు పర్యటించి, శాన్ ఫ్రాన్సిస్కోలో జరిగిన మొదటి ఐక్యరాజ్యసమితి సమావేశమునకు హాజరై, బ్రిటిష్ వారిచే నియమితులైన భారతప్రతినిధివర్గమును తీవ్రముగా విమర్శించినది. 1946, 1947, 1963 లలో భారతప్రభుత్వ ప్రతినిధివర్గమునకు అధ్యక్షురాలుగ ఐక్యరాజ్యసమితి సమావేశములకు హాజరయ్యెను. 1947 నుండి 1949 వరకు సోవియట్ రష్యాలోను, 1949 నుండి 1952 వరకు అమెరికా సంయుక్త రాజ్యముల [చూ. యునైటెడ్ స్టేట్స్] లోను భారతరాయబారిగా వ్యవహరించెను. 1953 - 1954 లో ఐక్యరాజ్యసమితి సమావేశమునకు అధ్యక్షురాలు అయ్యెను. ఇంగ్లండు, ఐర్లాండ్

దేశములలో భారత హైకమీషనర్ గాను, స్పెయిన్‌లో భారతరాయబారిగాను మిక్కిలి నిపుణతతో వ్యవహరించెను. 1962 నుండి 1964 వరకు మహారాష్ట్రమునకు గవర్నర్‌గ వ్యవహరించి, 1964 లో ఈమె పూల్‌పూర్ నియోజకవర్గమునుండి లోక్‌సభకు ఎన్నిక అయ్యెను. దేశీయ, విదేశీయ వివిధ యూనివర్సిటీలనుండి పెక్కు డాక్టరేట్ పట్టములను ఈమె ఆర్జించినది. ఈమె ఒసగిన విడ్డెన్ ఉపన్యాసములు 'ది ఎవల్యూషన్ ఆవ్ ఇండియా' అనుపేర ప్రచురితమయ్యెను. గు. రా.

**వినోబా భావే** (జ. 1895): సుప్రసిద్ధ భారతీయ సంఘ సేవకుడు; భూదాన ఉద్యమ వ్యవస్థాపకుడు; బ్రహ్మచారి. కొలాబా జిల్లాయందలి గగోదా గ్రామమున 1895, సెప్టెంబరు 11 న బ్రాహ్మణ వంశమునందు ఇతని జననము. బరోడా కాలేజిలో విద్యను అభ్యసించుచు, 19 ఏండ్ల ప్రాయమున కళాశాల విద్యకు స్వస్తి చెప్పి, వారణాసిలో సంస్కృతమును అభ్యసించెను. అచట మహాత్మాగాంధీ [చూ. పు. 421] ఉపన్యాసములచే ప్రభావితుడై అతని అనుచరుడు అయ్యెను. సబర్మతీ, వార్ధా ఆశ్రమముల అభివృద్ధికిని, అచటి కార్యకలాపములందును ఇతడు ప్రధాన పాత్ర వహించెను.



వినోబా భావే
(జ. 1895)

మహాత్మాగాంధీ కోరికపై 1940 లో బ్రిటిష్ యుద్ధ యత్నములను ఎదిరించి, వ్యక్తిసత్యాగ్రహము సాగించిన ఫలితముగ అయిదు ఏండ్లు (దాదాపు) కారాగార వాసమును ఈయన అనుభవించెను. గాంధీ మరణానంతరమున భూ సంస్కరణలందు అభిరుచి గలవాడై, ప్రభుత్వ చట్టముల ద్వారాకన్నా, ఐచ్ఛిక విధానమున వానిని సాధించవలెననే లక్ష్యముతో 1951 లో భూదాన ఉద్యమమును ఆంధ్రప్రదేశ్‌లోని పోచంపల్లివద్దనుండి ప్రారంభించెను. ఆ తరువాత దేశమంతట వేలకొలది కిలోమీటరుల దూరమును కాలినడకను సంచరించి లక్షలకొలది హెక్టేరుల భూదానములు పొంది, పేదలకు వానిని పంచిపెట్టెను. ఈ ఉద్యమము పరిణతినొంది కొన్ని పట్టుల గ్రామదానోద్యమముగ పరిణమించినది.

ఆచార్య వినోబాభావే వివిధ మతముల ప్రామాణిక గ్రంథములను మూలభాషలలో పఠించెను. మరాటీ, హిందీ, గుజరాతీ, పర్షియన్, అరబిక్, ఇంగ్లీషు, బెంగాళీ, అస్సామీ, ఒరియా, తమిళము, తెలుగు, మలయాళము, కన్నడ భాషలు వీరికి తెలియును. మంచివక్త. బందిపోటుదొంగల నిలయమైన ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్, రాజస్థాన్ సరిహద్దు జిల్లాలలో శాంతి వ్యవస్థాపనకై 1960 లో పర్యటించి 19 మంది బందిపోటుదొంగలను లోబరచుకొనెను. మరాటీ, హిందీ, ఇంగ్లీషు భాషలలో వీరు పెక్కు రచనలు చేసిరి. రాజకీయములకు దూరముగ ఉన్నప్పటికి జాతీయ కీలక సమస్యల పరిష్కారములకు ప్రభుత్వము, రాజకీయ నాయకులు వీరిసలహాలను పొందుచునే ఉన్నారు. పా. ల. నా.

**విప్లవములు** (1848): యూరప్ చరిత్రలో పెక్కు విప్లవములు పలు దేశములందు జరిగిన సంవత్సరముగ 1848 పేరెన్నిక కనినది. ఇటుల దాదాపుగ ఒకే ఒక కాలమున జరిగినను, ఈ విప్లవములలో ప్రతియొకటియు దాని మార్గమున అది నడచినదేకాని, ఒకదానికి మరియొకదానితో ఎట్టి సంబంధమును లేదు. అంతేకాదు, ఆ యా విప్లవములు సాధింపదలచిన ఆశయములందును విభిన్నత కొన్ని పట్టుల కన్పట్టినది. అయినను ఈ విప్లవములకు అన్నింటికిని మూలకారణము మాత్రము ఒకే ఒకటని చెప్పవచ్చును: 1. పైరుపంటల నష్టము, కరువుల వలన పల్లెసీమలలోను, వ్యాపార మాంద్యము, నిరుద్యోగముల వలన పట్టణములందును చెలరేగిన ఆర్థికకల్లోలము; 2. పసచెడిన పూర్వరాజకీయవ్యవస్థలనే అంటిపెట్టికొని, వానిని కాపాడ యత్నించు మెటర్నిఖ్ [చూ. పు. 761] వంటి రాజకీయ తంత్రవేత్తల నిష్ప్రయోజకత; 3. జాతీయాభిమానమును తీర్చిదిద్ది, ప్రజలలో నూతన ఆవేశమును రేకెత్తించిన ఆనాటి సారస్వత వికసనము - అను ఈ మూటి పటిష్ఠరూపమునే ఆ మూలకారణముగ పేర్కొనవచ్చును. ఏవియో కొన్ని అపవాదములు ఉన్నను మొత్తము మీద ఈ విప్లవములు మధ్య తరగతి విద్యావంతుల నాయకత్వమున నడచినవిగనే పరిగణింపదగి ఉన్నవి. వీనిలో తొలుత ఫ్రాన్స్‌న సంఘటిల్లిన ఫిబ్రవరి విప్లవమే తక్కినవానికి ఉత్తేజకముగ పరిణమించినదనియు చెప్పవచ్చును. ఫ్రాన్స్, ఆస్ట్రియా, హంగేరీ, జర్మనీ తదితర ప్రదేశములలో జరిగిన ఆ విప్లవముల సంక్షిప్తవివరములు ఇట దిగువ ఈయబడినవి:

ఫ్రాన్స్: పారిస్ నగరమున ఫిబ్రవరి 22, 24 ల మధ్య ప్రజానీకము సాగించిన ఆందోళనముతో ఈ విప్లవము మొదలైనది. వోటు హక్కును విస్తరింపజేయుటకు ఫ్రాన్స్ దేశపురాజు నిరాకరించుటయే ఈ విప్లవమునకు సద్యఃకారణము. ఈ విప్లవఫలితముగ రాచరికము అంతరించి,

ఆ దేశచరిత్రలో రెండవసారిగ గణరాజ్యసంస్థాపన జరిగినది. కాని, ఆ తరువాత విప్లవవాదులలో సోషలిస్టులకును, తక్కిన మధ్యతరగతి వాదులకును మధ్య విభేదములు పొడమి, ఆ సంవత్సరము మే, జూన్‌లలో ప్రజల తిరుగుబాటు ఫలితముగ తీవ్రవాదులు అడచివేయబడిరి. ఈ సందర్భముననే లూయీ నెపోలియన్ [చూ. పు. 543] ప్రాముఖ్యమునకు వచ్చి ఫ్రాన్సు గణరాజ్యమునకు అధ్యక్షుడయ్యెను (ఈ నెపోలియనే తరువాత గణరాజ్యమును అంతరింపజేసి నెపోలియన్ - III నామముతో రాజై రాచరికపు పాలనను నెలకొల్పెను).

ఇటలీ : చట్టబద్ధపు రాజ్యాంగములను సాధించి, తదనంతరమున ఆస్ట్రియాసామ్రాజ్యదాస్యమునుండి విమోచనము పొందుటకు ఇటలీలోని ప్రజానీకము సాగించిన ఉద్యమము. దీని ఫలితముగ 1848, ఫిబ్రవరి, మార్చి నెలలలో నేపిల్స్, టస్కనీ, పిఎడ్మాంట్ రాజ్యముల ప్రభువులును, మతపీఠాధిపతియగు పోప్‌ను తమ తమ పాలితభూములందు చట్టబద్ధరాజ్యాంగములను అమలులోనికి తెచ్చుటకు పూనుకొనిరి. కాని, తుదకు పిఎడ్మాంట్ రాజ్యము మాత్రమే కడవరకు ప్రజాశ్రేయస్సును దృష్టియందు ఉంచుకొని వ్యవహరించి, ఆస్ట్రియాపై మార్చి 23 న యుద్ధము ప్రకటించినది. తక్కిన పోప్ మొదలగువారు పిఎడ్మాంట్‌నకు సాయపడ నిరాకరించిరి. దాని పర్యవసానముగ పిఎడ్మాంట్ సేనలు పరాజితములయ్యెను. కాని, రోమ్‌నందలి ప్రజానీకపు ఆందోళనవలన పోప్ ఆ నగరమును వదలి పారిపోగా రోమ్‌న గణరాజ్యము నెలకొల్పబడినది (నవంబరు 25). ఇట్టి పరిస్థితిలో ఫ్రెంచివారు జోక్యము కల్పించుకొని, ఆ గణరాజ్య ప్రభుత్వమును కూలద్రోసి, పూర్వ పరిస్థితిని పునరుద్ధరించిరి (1849, జూలై). వెనిస్ నగరమున సైతము ఇట్టులే ఒక గణరాజ్యము నెలకొల్పబడినను (మార్చి 22) త్వరలోనే అదియు అంతరించినది (1849, ఆగస్టు).

ఆస్ట్రియా సామ్రాజ్యము : చట్టబద్ధ ప్రభుత్వమునకై ప్రజలు వియెన్నాలో తీవ్ర ఆందోళనను లేవదీసిన ఫలితముగ ప్రధాని మెటర్‌నిఖ్ పదవికి రాజీనామాను ఇచ్చి, దేశమును వదలి పారిపోయెను (1848, మార్చి 13). అంతట మే 17 వ తేదీన చక్రవర్తియు ఇన్స్‌బ్రక్ నగరమునకు పారిపోయి తలదాచుకొని, సాంత్వనమార్గమును అవలంబించి, రాజ్యాంగ పరిషత్తును సమావేశపరచుటకు అంగీకరించగా, ఆ పరిషత్తు జూలైనెల కడనుండి అక్టోబరు ఆరంభమువరకు సమావేశములను జరిపి, భూస్వాముల దాస్యబంధములనుండి రైతులకు విమోచనము కల్పించు చట్టమును ఒకదానిని ఆమోదించెను. ఈ కాలముననే సామ్రాజ్యమునందలి స్లావ్ ప్రజల ప్రతినిధులు ప్రాగ్ నగరమున సమావేశమై, జాతీయ స్వయంనిర్ణయమునకొరకై ఆందోళన లేవదీసిరి. ఈ ఆందోళనను తీవ్ర దౌర్జన్య మార్గముల మూలమున సామ్రాజ్యప్రభుత్వము అడచివేసినది.

హంగేరీ : ట్రాన్సిల్వేనియా, క్రోషియా ప్రాంతములతో కలిసియున్న హంగేరికి బాధ్యతాయుత సర్వసత్తాక ప్రభుత్వము కావలెనని మార్చి 15 న హంగేరీ శాసనసభ తీర్మానమును ఆమోదించుటతో ఈ ఉద్యమము మొదలయ్యెను. హంగేరిపై ఆధిపత్యము కలిగిన ఆస్ట్రియా చక్రవర్తి ఈ తీర్మానమును ఆమోదించుటకు ఇష్టపడినటుల వ్యవహరించుచునే, క్రోషియావాసుల (క్రోటుల) కు హంగేరియన్‌లతో కల అభిప్రాయభేదములను ఆసరాగా తీసికొని, ప్రోత్సహించగ క్రోటులు హంగేరిపై దండెత్తిరి. ఇంతటిలో రష్యాసేనలును హంగేరిపై దండయాత్ర చేసినవి. హంగేరిలో అల్పసంఖ్యాకులుగ ఉండిన సెర్బులును, రుమేనియన్‌లును తిరుగుబాటులు చేసిరి. వీని అన్నింటి సాయమున ఆస్ట్రియా సమ్రాట్ సేనలు హంగేరి జాతీయవాదులను ఓడించి క్రూరముగ కసితీర్చుకొనినవి.

జర్మనీ: జర్మనీయందలి వివిధ మాండలిక రాజ్యములందు చట్టబద్ధ రాజ్యాంగములను నెలకొల్పుటకును, తుదకు ఏకీకృత జర్మనీని నెలకొల్పుటకును జర్మనీ ప్రజలు సాగించిన విప్లవోద్యమపు ఫలితముగ బెర్లిన్‌నగరమున మార్చి 15 నుండి 21 వరకు కల్లోలములు చెలరేగినవి. దీని ఫలితముగ ప్రష్యా రాజగు ఫ్రెడరిక్ విలియమ్ - IV తన రాజ్యమును రూపొందబోవు జర్మనీ దేశమున అంతర్భాగము చేయుటకు అంగీకరించి, అందులకై రాజ్యాంగపరిత్తును సమావేశ పరచెను. ఆ పరిషత్తు మే 22 నుండి డిసెంబరు 5 వరకు సమావేశములను జరిపి, ప్రగతిశీలకములగు కొన్ని నిర్ణయములను తీసికొనెను. తక్కిన చిన్న జర్మనీరాజ్యములును విలియమ్‌ను అనుసరించినవి. ఇంతలో ఆస్ట్రియాలో ప్రజావిప్లవమును సమ్రాట్ అణచివేసిన విషయము తెలియగనే విలియమ్ ధైర్యము వహించి రాజ్యాంగపరిషత్తును రద్దుచేసి, రాచరికపు అధికారమునకు లోబడిన రాజ్యాంగమును ఒకదానిని అమలులోనికి తెచ్చెను (1848, డిసెంబరు 5). కాని, ఈ కాలముననే జర్మనీ ఏకీకరణకై మధ్యతరగతి ప్రజల నాయకత్వమున వేరొక సమావేశము - ఫ్రాంక్‌ఫర్ట్ పార్లమెంట్ అనునది - చర్చల కొనసాగించినది. ఇదియు విఫలతను పొందినను ఏకీకృత జర్మనీ రూపొందుటకు తగ్గ ప్రాతిపదికను అది నెలకొల్పగలిగినది.

ఇతర ప్రదేశములు : యూరప్‌నందలి ముఖ్య భూభాగమున పై విప్లవములు సాగిన కాలముననే ఆ వార్తలను వినిన బ్రిటన్ ప్రజలును, ఐర్లాండ్ ప్రజలును కొన్ని విప్లవోద్యమములను లేవదీసిరి; 1. చార్టిస్టులు అను పేర బ్రిటన్‌న రాజకీయ సంస్కరణల కొరకై 1838 మొదలుగ ఆందోళన చేయువారలు కడసారిగ 1848, ఏప్రిల్ 10 న తీవ్రాందోళనను లేవదీయగ, అచ్చటి ప్రభుత్వము దానిని నిశ్శేషముగ అడచివేసెను; 2. ఐర్లాండ్‌లో తిరుగుబాటును లేవదీయుటకై కొందరు యువకులు ఆ సంవత్సరము జూలైలో కృషిచేసి విఫలులైరి; 3. స్విజర్లండ్‌నకును ఈ విప్లవపుగాలి కొంత సోకినది. అచటి ప్రజలలో జర్మను భాషావర్గమునకు చెందినవారు జర్మనీలోని విప్లవ నాయకులకు సహాయము చేయుటకై ఒక సేవాదళమును సైతము చేకూర్చిరి. కాని, అంతకుముందే ఒక అంతర్యుద్ధమునుండి వెలువడి ఆ దేశము తన ఆంతరంగిక సమస్యల పరిష్కారములోనే మునిగి, తక్కిన విదేశీయ విషయములందు ఎక్కువ శ్రద్ధ వహింపకుండినది; 4. డెన్మార్క్‌లోని ప్రజలును తమ ఆందోళన మూలమున 1849, జనవరిలో ఒక చట్టబద్ధరాజ్యాంగమును సంపాదింపగలిగిరి; 5. టర్కీ సామ్రాజ్యమున చేరి ఉండిన వాలేచియా (రుమేనియా ప్రాంతపు) ప్రజలు ఆందోళన సలిపి, ప్రభుత్వమును లొంగదీసి, కొన్ని సంస్కరణలను సాధించిరి (జూన్, 1848). కాని, ఇంతలో టర్కీ అనుమతితో రష్యా సేనలు వాలేచియాలో ప్రవేశించి విప్లవోద్యమమును అడచివేసినవి (సెప్టెంబరు, 1848).

ఈ విధముగ ఈ విప్లవములందు అన్నింట విప్లవ వ్యతిరేకులే కడకు విజయమును పొందినను, నిరంకుశ రాజతకు ప్రాబల్యము అంతరించుటకు మాత్రము ఈ విప్లవములు సాధనములైనవి. ఏదియో ఒక విధముగ ప్రజలలోని అసంతృప్తిని తొలగించుటకు కొన్ని చర్యలనైనను తీసికొననిచో తమ మనుగడకే ముప్పు రాగలదని ఫ్రాన్స్ రాజగు నెపోలియన్ - III, ప్రష్యారాజగు విలియమ్ - IV గ్రహించుటవలననే ఉదారభావనలకు, ఆ తరువాతి కాలమున యూరప్‌న ప్రాబల్యము చేకూరుటకు మార్గము సుగమమైనది.
చీ. శే. రా.

**విప్లవము (1905)** : రష్యాలో జార్ ప్రభుత్వమును ఎదిరించి, చట్టబద్ధ ప్రభుత్వమునకై వ్యావసాయికులును, పారిశ్రామిక కార్మికులును లేవదీసిన తొలి విప్లవము. అప్పటి నిరంకుశ, ప్రజాశ్రేయ విరుద్ధ పరిపాలనతో విసుగెత్తి అల్లాడుచున్న ప్రజానీకమునకు రష్యా - జపాన్ యుద్ధమున రష్యాకు సంఘటిల్లిన పరాజయము ఒక మంచి అదనును చేకూర్చినది. ఆ సంవత్సరము జనవరి 22 న ప్రభుత్వపు అసమర్థతను, దుశ్చర్యలను నిరసించుచు కార్మికులు సాగించిన ఒక ప్రజాయాత్రపై ప్రభుత్వ సైనికులు కాల్చుటతో ఈ విప్లవము మొదలై ఎల్లెడల వ్యాపించినది; కడకు నౌకాదళ సైనికులందును ఈ అసంతృప్తి వ్యాపించినది. కార్మికుల సోవియట్ ఆధ్వర్యవమున మాస్కో నగరమున కార్మిక వర్గము అంతయు సమ్మె చేయుటతో అక్టోబరు 20 - 30 తేదీల మధ్య యూరప్‌లోని రష్యాయందు ఎల్లెడల ప్రభుత్వయంత్రము స్తంభించి పోయెను. అంతట అప్పటిలో రష్యా జార్ (చక్రవర్తి) గ ఉండిన నికలస్ - II రాజీమార్గమునకు దిగివచ్చి, రష్యాకు ఒక రాజ్యాంగవిధానమును మంజూరు చేసెను. దానిని అనుసరించి ప్రజలచే ఎన్నుకొనబడిన 'డూమా' అనబడు శాసనసభ ఏర్పడుటకును, దానికి బాధ్యత వహించు ప్రధాని నియమింపబడుటకును వసతి కల్పింపబడెను. విప్లవకారులలో బహుళ సంఖ్యాకులకు ఆ సంస్కరణము నచ్చినను, సోవియట్ మాత్రము దానిని అంగీకరింపక విప్లవమును సాగింపదలచుటవలన డిసెంబరు మాసాంతమున మాస్కోనగర వీధులలో, శ్రామికుల వాడలలో ప్రభుత్వ సైనికులతో కార్మికులు భీషణసమరమును సాగించిరి. ప్రభుత్వము తమ దమనవిధానముచే వారిని, పల్లెపట్టులందలి వారి అనుయాయులను నిర్దయతో అడచివేసెను.
చీ. శే. రా.

**వియెత్నామ్** : ఆగ్నేయ ఆసియాయందు ఇండో - చీనా ద్వీపకల్పపు తూర్పు తీరము అంతటిని ఆవరించిన ఒక స్వతంత్ర దేశము. 1945 నకు పూర్వమున ఇది ఫ్రెంచివారి వలస పాలనలో ఉన్న ఇండో - చీనాయందు అంతర్భాగముగ ఉండినది. అపుడు ఈ దేశమును లేదా అందలి యొక భాగమును పాశ్చాత్య రచయితలు కొచిన్ - చీనా, అన్నామ్, టాంగ్‌కింగ్ అని వివిధ రీతుల పేర్కొనుచుండిరి. వీనిలో కొచిన్ - చీనా అనునది పాశ్చాత్యులు తొలుతగ వాడిన పేరు. కాని, 19 వ శతాబ్ది ఆరంభము నుండియు ఈ దేశపు దక్షిణ భాగమునకు మాత్రమే కొచిన్ - చీనా అను పేరును పాశ్చాత్యరచయితలు వాడి, దేశమునంతటిని అన్నామ్ అని వ్యవహరించిరి. అయినను ఆ సమయముననే కొందరు రచయితలు ఈ దేశపు మధ్య రాష్ట్రమునకు మాత్రమే అన్నామ్ అనుట సముచితమని భావించిరి. ఇటుల ఆ యా సమయములందు పాశ్చాత్యులచే వేర్వేరు పేరులతో వ్యవహరింపబడిన ఈ దేశము 1945 నుండి వియెత్నామ్ అను తన ప్రాచీన నామముతో ప్రాచుర్యమును పొందినది. కాని, భిన్న రాజకీయ వాదముల

ఫలితముగ సంఘటిల్లిన జెనీవా ఒడంబడిక [చూ. పు. 487] ను అనుసరించి ఈ దేశము 1954 నుండి 17 వ ఉత్తర అక్షాంశ రేఖయే సరిహద్దుగ ఉత్తర వియెత్నామ్, దక్షిణ వియెత్నామ్ అను రెండు స్వతంత్ర దేశములుగ విభక్తమైనది. ఆ విభాగము జరుగువరకు గల దేశ చరిత్ర ఈ దిగువ ఈయబడినది [చూ. వియెత్నామ్, ఉత్తర - పు. 837 ; వియెత్నామ్, దక్షిణ పు. 838].

చరిత్ర: ఈ దేశమున వ్యాప్తియందున్న పౌరాణిక గాథలను అనుసరించి చూడ ఈ దేశము తొలుత 'వాన్ లాంగ్' అను పేరు కలిగి 3000 సంవత్సరముల కాలము స్వదేశ రాజుల ఆధిపత్యమున విశేష వైభవమును అనుభవించెనని తెలియవచ్చుచున్నది. ఈ పౌరాణిక గాథయందలి సత్యాసత్యములు ఎటులున్నను క్రీ. పూ. 3 వ శతాబ్ది నాటికి ఈ దేశము దక్షిణచీనాయందలి ఒక స్వతంత్ర రాజ్యమగు 'నామ్ వియెత్' నందు అంతర్భాగముగ ఉండెనని మాత్రము విశ్వసనీయ ఆధారములవలన తెలియవచ్చుచున్నది. క్రీ. పూ. 111 నాటికి చీనా సామ్రాజ్యము తన దక్షిణపు ఎల్లలను ముందునకు నడపి, నామ్ వియెత్ రాజ్యమును అంతమొందించ, ఈ దేశము చీనా సామ్రాజ్యమున ఒక రాష్ట్రము అయ్యెను. అంతటినుండి దాదాపు 1000 సంవత్సరములు ఈ ప్రాంతము చీనీయుల అధీనమున ఉండెను. కాని, ఆ కాలమున సైతము దేశపు దక్షిణ భాగము మాత్రము విడిగనే మనగలిగెను. ఆ దక్షిణ భాగము భారతీయ సంస్కృతితో సన్నిహిత సంబంధము గలిగి చంపారాజ్యము అని ఆ నాడు వ్యవహరింపబడెడిది. క్రీ. శ. 939 లో చీనా సామ్రాజ్య దాస్యమునుండి వియెత్నామ్ విముక్తిని సాధించినది. అంతటినుండి ఆ దేశ ప్రభువులు పరిసర దేశములను - అందును ముఖ్యముగ దక్షిణ ప్రాంతమును - వశపరచుకొనుటకు విశేషముగ కృషి సలిపిరి. తుదకు వారు చంపారాజ్యమును అంతమొందించుటయే కాక, కాంబోడియా (కాంభోజ) దేశమందలి విస్తృతప్రాంతములను వశపరచుకొనిరి. ఇటుల దేశ విస్తృతి పెంపొందినను, దేశీయ ప్రభువులలో ఐకమత్యము లేనందున 16 వ శతాబ్దియందు ఉత్తర, దక్షిణ దేశములుగ దేశము మరల విభక్తమయ్యెను. కాని, త్వరలోనే మరల ఏకమయ్యెను. 17 వ శతాబ్దమున రాజకుటుంబమందలి కలతలవలన మరల ఈ దేశము రెండుగ విభక్తమయ్యెను. అంతటనుండి 150 సంవత్సరముల కాలము ఈ దేశము రెండు రాజ్యములుగనే మనెను. తరువాత ఐకమత్యము వాంఛించిన దేశీయులు కొనివచ్చిన విప్లవముల ఫలితముగ ఈ రెండు రాజ్యములు ఏకమై నూతన ప్రభుత్వము ఏర్పడెను (1771). కాని, దీనిని కొన్ని వర్గములు తీవ్రముగ ప్రతిఘటించుటచే అంతర్యుద్ధము ఆరంభమై ముప్పది సంవత్సరముల కాలము సాగెను. తుదకు దక్షిణ దేశపు రాజవంశికుడు ఒకడు ఫ్రెంచివారి సాయమున దేశమునంతటిని జయించి తన ప్రభుత్వమును స్థాపించి, నుగుయెన్ రాజవంశమునకు మూలపురుషుడయ్యెను (1800). ఈ రాజవంశికులే తదాదిగ ఈ దేశమును పాలించిరి. వీరిలో కడపటివాడగు బావోడాయ్ ప్రభువు 1945 లో పదవీ పరిత్యాగ మొనర్చెను.

పోర్చుగీస్ నావికులును, వ్యాపారులును, మతబోధకులును 16 వ శతాబ్దిలో ఇట కాలిడుటతో ఈ దేశముతో యూరపియన్‌లకు పరిచితి లభించెను. అంతట 17 వ శతాబ్దిలో ఇటలీ, ఫ్రాన్స్ దేశములవారును ఇటకు వర్తకమునకును, మతప్రచారమునకును చేరిరి. రోమన్ కేతలిక్ సంప్రదాయపు క్రైస్తవ మతమును ఆ మత బోధకులు ఈ దేశమున ప్రవేశపెట్టుటకు యత్నించగ, వారికిని, దేశపాలకులకును ఘర్షణ కలిగెను. ఇది ఒక నెపముగ గ్రహించి మత బోధకుల పక్షమున ఫ్రెంచివారు వియెత్నామ్ రాజకీయములందు జోక్యము వహింప మొదలిడిరి (1840). క్రమముగ దేశమునంతటిని ఫ్రెంచివారు కైవసము ఒనర్చుకొని దేశ ప్రభువు తమ రక్షణను అంగీకరించి నామ మాత్ర ప్రభువుగ ఉండునటుల చేసిరి (1883). ఫ్రెంచి అధికారమును కూలద్రోయుటకై అంతటంతట తిరుగుబాటులు జరిగినను, వానిని అన్నిటిని 1903 నాటికి నిశ్శేషముగ అడచి, దేశమున సువ్యవస్థిత పరిపాలనను ఫ్రెంచివారు ఏర్పరచిరి. ఫ్రాన్స్‌నకు గల వలసలలోనెల్ల ఇండో - చీనా (వియెత్నామ్, కాంబోడియా, లావోస్‌లు కలసిన దేశము) అత్యంత ధనవంతమని పేరొందినను, ఈ సంపదలో దేశీయులకు దక్కెడి భాగము అత్యల్పముగ ఉండెడిది. అందువలన 1902 నుండి ప్రజాస్వామికప్రభుత్వమును అపేక్షించెడి జాతీయ పక్షము ప్రజలలో పలుకుబడిని ఆర్జించి, స్వాతంత్ర్యమునకై ఆందోళనను సాగించినది. ఈ ఆందోళనను ఫ్రాన్స్ తన దమననీతిచే అడచినను, ప్రజలలో స్వాతంత్ర్యాకాంక్ష అంతకంతకు అతిశయించినది. జాతీయ పక్షమున ఒక భాగముగ ఉండిన కమ్యూనిస్ట్ పక్షము ఈ పరిస్థితులలో మంచి పలుకుబడిని ఆర్జించినది.

ద్వితీయ ప్రపంచయుద్ధమున ఫ్రాన్స్ పతనమై, నాజీలను అనుసరించు విచీప్రభుత్వము ఫ్రాన్స్‌న నామమాత్రపు అధికారమును నిర్వహించు కాలమున జపాన్ వారు ఇండో - చీనాయందు తమ పలుకుబడిని వ్యాపింపజేసిరి. చేయునది లేక అప్పటి ఫ్రెంచి పాలకుడును జపాన్ వారితో సహక

రించెను. తరువాత ఆ యుద్ధమున తాము ఓడిపోయి లొంగుటకు పూర్వము జపాన్‌వారు ఫ్రెంచివారి అధికారమును తొలగించి, స్వాతంత్ర్యమును ప్రకటించుకొనుటకు వియెత్నామ్ దేశీయులకు అవకాశమును కలిగించిరి (మార్చి, 1945). అయినను ఇందువలన సుస్థిరమగు దేశీయ ప్రభుత్వము ఏర్పడుటకు మాత్రము వీలుకలుగలేదు. ఈ పరిస్థితులలో కమ్యూనిస్ట్ నాయకుడగు హోచిమిన్ [చూ.] కొందరు దేశీయులను సంఘటితపరచి, మిత్రమండలి సేనల సాయముతో దేశమునందలి ఉత్తర భాగమున వియెత్నామ్ ప్రజాతంత్ర గణరాజ్యమును ఏర్పరచెను. రాజగు బావోడాయ్ అంతట పదవీ పరిత్యాగము ఒనర్చెను.

ఈ సమయముననే దేశమున దక్షిణభాగమందు ఫ్రెంచివారు మిత్రమండలి సేనల సాయమున తమ అధికారమును మరల స్థాపింపగలిగిరి. తరువాత 1946, మార్చిలో ఫ్రెంచివారు హోచిమిన్ నాయకత్వమును గుర్తించి, ఒక ఒడంబడికకు వచ్చిరి. దానిని అనుసరించి దేశమునందు అంతట కీలకనగరములందు ఫ్రెంచి సేనాదళములను కొన్నింటిని ఉంచుటకును, తరువాత అనతికాలముననే ఫ్రెంచి యూనియన్‌లో అంతర్భాగముగ వియెత్నామ్ స్వతంత్రరాజ్యము అగునటుల చేయుటకును ఫ్రెంచివారు అంగీకరించిరి. కాని, ఫ్రెంచివారు ఆ వాగ్దానమును నిలబెట్టుకొనుటకు వెనుకంజ వేయుటచే, 1946 నుండి హోచిమిన్ నాయకత్వమున ఉన్న వియెత్నామ్ ప్రభుత్వమునకు ఫ్రెంచి ప్రభుత్వముతో పోరాటము ఆరంభమై, ఎనిమిదేండ్లు సాగెను. హోచిమిన్ పక్షమును సోవియట్ రష్యా, చీనా దేశములును, ఫ్రెంచివారిని యునైటెడ్‌స్టేట్స్‌ను బలపరచెను. ఫ్రెంచివారియందు దేశీయులకు ఎవరికిని సానుభూతి లేకుండెను. దేశమున దక్షిణప్రాంతమువారు సైతము హోచిమిన్ యొక్క కమ్యూనిస్ట్ భావములకు వ్యతిరేకులే అయినను, ఫ్రెంచివారికి సాయపడి స్వాతంత్ర్యమును పోగొట్టుకొన ఇచ్చగింపకుండిరి. అందుచే మాజీప్రభువగు బావోడాయ్ నాయకత్వమున వియెత్నామ్‌కు 1949 లో ఫ్రెంచివారు స్వాతంత్రము ఒసగినటుల ప్రకటించిరి. కాని, ఇందువలన కూడ దేశీయుల సానుభూతి వారికి లభింపలేదు. తుదకు జీన్‌బూన్‌ఫూ అను స్థావరము వద్ద ఫ్రెంచిసేనలు ఘోర పరాజయమును పొందెను. అంతట జెనీవాయందు ఒక అంతర్జాతీయ సమావేశము జరిగి, ఫ్రెంచివారి సమ్మతితో వియెత్నామ్ దేశము ఉత్తర, దక్షిణ ప్రాంతములుగ - 17 వ ఉత్తర అక్షాంశ రేఖ సరిహద్దుగ - రెండు స్వతంత్ర రాజ్యములుగ అవతరించుటకును, కాలక్రమేణ ఉభయులును సమ్మతించిన తరువాత దేశము ఏకమగుటకును నిర్ణయము జరిగెను.

చీ. శే. రా.

**వియెత్నామ్, ఉత్తర** : 1954 లో జెనీవాలో జరిగిన ఏర్పాటు ప్రకారము వియెత్నామ్ 17 వ ఉత్తర అక్షాంశ రేఖను అనుసరించి విభజింపగ ఏర్పడిన ఉత్తరదేశము. దీనికే 'వియెత్నామ్ ప్రజాతంత్ర గణరాజ్యము' అనియు వ్యవహారము కలదు.




ఈ రాజ్యమునకు చీనా [ఉ]; లావోస్ [ప]; వియెత్నామ్ [ద]; దక్షిణ చీనా సముద్రము [తూ] సరిహద్దులుగ ఉన్నవి. [వి] 1,55,229 చ. కి. మీ.; [జ] 1,59,16,000, [భా] వియెత్-నామీస్, కాని, ఫ్రెంచి భాషకు విపుల వ్యాప్తి కలదు. [మ] దేశీయులలో అధిక సంఖ్యాకులు బౌద్ధులు. కాని, ఈ బౌద్ధమతము కన్‌ఫ్యూషియన్ మతముతోడను, ప్రకృతి దేవతారాధన తోడను సంకలితమై ఉన్నది. [రా] హనోయ్ (జ. సం. 6,38,600),

చరిత్ర: (1945 నకు పూర్వపు చరిత్రకు చూ. వియెత్నామ్). 1945 న ఈ దేశమున హోచిమిన్ నాయకత్వమున కమ్యూనిస్ట్ ప్రాబల్యము కల జాతీయ ప్రభుత్వము ఏర్పడినది. దేశమున ఏకపట్టికా విధానమున [చూ. పు. 348] జరిగిన ఎన్నికల మూలమున ఏర్పడిన శాసనసభ సాయమున అధ్యక్షుడగు హోచిమిన్ పరిపాలన నిర్వహించుచున్నాడు. కమ్యూనిస్ట్ చీనా, సోవియట్ రష్యా, తూర్పు యూరపియన్ రాజ్యములనుండి లభించిన ఆర్థిక సాహాయ్యమువలన దేశమును పారిశ్రామికముగ ఉన్నతదశకు కొనివచ్చుటకు ఈ ప్రభుత్వము విశేష కృషిచేయుచున్నది. దక్షిణ వియెత్నామ్‌నందు సైతము కమ్యూనిస్ట్ రాజ్యము ఏర్పడుటకు తగు ప్రచారమును

ఈ దేశము నిర్వహించుచు, అచటి తీవ్రవాదులు సాయుధ పోరాటమును సాగింప తోడ్పడగ, యునైటెడ్ స్టేట్స్ దక్షిణ వియెత్నామ్ పక్షమున సైనిక సాహాయ్యమును సమకూర్చుట వలన వియెత్నామ్ దేశము యుద్ధరంగ మైనది. చీ. శే. రా.

**వియెత్నామ్, దక్షిణ :** వియెత్నామ్ విభజన వలన ఏర్పడిన దేశము. దీనికే 'వియెత్నామ్ గణరాజ్యము' అనియు వ్యవహారము కలదు.




ఈ దేశమునకు ఉత్తర వియెత్నామ్ (17 వ ఉత్తర అక్షాంశ రేఖ పొడవున) [ఉ]; లావోస్, కాంబోడియా, సయామ్ సింధు శాఖ [ప]; దక్షిణ చీనా సముద్రము [తూ, ద] సరిహద్దులుగ కలవు. [వి] 1,70,806 చ. కి. మీ.; [జ] 1,38,00,000. [భా] దేశభాష వియెట్-నామీస్. వ్యవహారభాష ఫ్రెంచి; [మ] దేశీయులలో బౌద్ధులు అత్యధిక సంఖ్యాకులు; రోమన్ కేథలిక్ లు అల్పసంఖ్యాకులే అయినను, రాజకీయ, ఆర్థిక రంగములందు వారిదే పై చేయి. [రా] సైగాన్ (జ. సం. 14 లక్షలు).

చరిత్ర; (1954 కు పూర్వపు చరిత్రకు చూ. వియెత్నామ్). 1954, జూలైలో నగో జిన్ జీమ్ అను నాయకుని ఆధ్వర్యవమున ఇచట ప్రభుత్వము ఏర్పడి సర్వాధికారములను గ్రహించినది. ఈ ప్రభుత్వమునకు యునైటెడ్ స్టేట్స్ బాసట తొలుతనుండియు కలదు. ఆగ్నేయ ఆసియాయందు కమ్యూనిస్టుల ప్రగతిని నిరోధించుటకు జిన్ జీమ్ ప్రభుత్వము ఒక ముఖ్య సాధనమని యునైటెడ్ స్టేట్స్ అభిప్రాయము. అందువలన హోచిమిన్ ప్రభుత్వమునకు స్థైర్యము చేకూరుటకై యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వము ఆర్థికముగను, సాంకేతికముగను చాల సాయపడినది. ఇందువలన ఉత్తర వియెత్నామ్‌తో పోటీపడి తన దేశమును పారిశ్రామికముగ ముందునకు కొనిపోవు తలంపుతో జిన్ జీమ్ ప్రభుత్వము చాల కృషిచేయ గలిగినది.

పేరునకు ఈ రాజ్యము గణరాజ్యమే అయినను, దీనిని కమ్యూనిస్ట్ వ్యతిరేక ప్రభుత్వమని మాత్రమే చెప్పదగును. ప్రజాస్వామిక రాజ్యాంగలక్షణములను ఈ ప్రభుత్వము ఇంకను సంతరించుకొనలేదు. ఎన్నుకొనబడిన శాసనసభ ఒకటి కలదు. కాని, అది ప్రజాభిప్రాయమునకు తగురీతిగ ప్రాతినిధ్యము వహించుట లేదు. అధికసంఖ్యాకులగు బౌద్ధులు రాజకీయముల ఎడ అంతగ శ్రద్ధవహింపకుండుట ఇందులకు ఒక ముఖ్యకారణము. అధ్యక్షుడగు జిన్ జీమ్ మాత్రమే కాక, తక్కిన ప్రభుత్వనాయకులలో అధిక సంఖ్యాకులును రోమన్ కేథలిక్ లు అగుటవలన తమ మతము ఎడల నిరాదరణ వైఖరిని ప్రభుత్వము అవలంబించుచున్నదను అభిప్రాయము బౌద్ధులలో సర్వత్ర వ్యాపించినది. అందువలన తమ మతస్వత్వములకై బౌద్ధులు శాంతియుత పద్ధతులలో ఆందోళనను 1963 న ఆరంభించిరి. ఆ సంవత్సరము జూన్ మొదలుగ అంతటంతట బౌద్ధభిక్షువులు ఆరుగురు తమ శరీరములకు నిప్పంటించుకొని సైగాన్ నగర రాజపథమున ఆత్మార్పణము కావించి, ప్రపంచప్రజానీకపు దృష్టిని ఆకర్షింప గలిగిరి. ఇంతలో సేనానులలో ముఖ్యులు అందరును ఏకమై జిన్ జీమ్ ప్రభుత్వమును కూలద్రోసి, అతనిని, అతనికి కుడి భుజముగ వ్యవహరించు అతని సోదరుని అంతమొందించిరి (నవంబరు 2, 1963). దేశ పరిపాలన అంతట సైనిక సంఘపు వశమయ్యెను. దేశమందలి వియెట్ కాంగ్ పక్షము ఉత్తర వియెత్నామ్ సాయమున సాయుధ పోరాటమును సాధింప, యునైటెడ్ స్టేట్స్ యొక్క సైనిక సాహాయ్యమున ప్రభుత్వము దానిని ఎదుర్కొని పోరాడుచున్నది. చీ. శే. రా.

**వియెన్నా కాంగ్రెస్** (1814, సెప్టెంబరు - జూన్ 1945): 19 వ శతాబ్దారంభమున ఫ్రెంచి చక్రవర్తి యగు నెపోలియన్ [చూ. పు - 543] పతనానంతరము యూరపియన్ రాజకీయ పరిస్థితులను చక్కచేయుటకై వియెన్నాలో జరిగిన అంతర్జాతీయ సమావేశము. పోప్ ప్రతినిధితో సహా ఇంచుమించుగ ఆనాటి అన్ని చిన్న పెద్ద

రాజ్యముల ప్రతినిధులు కాంగ్రెస్‌లో పాల్గొనిరి. అయితే, ఈ కాంగ్రెస్‌లో చేయబడిన ముఖ్య నిర్ణయములలో అత్యధిక భాగము ఆస్ట్రియా, బ్రిటన్, రష్యా, ప్రష్యా అను నాలుగు అగ్రరాజ్యములచేత నే రూపొందింపబడెను. ఈ కాంగ్రెస్‌చే 8-6-1915 న చేయబడిన తుది నిర్ణయమునకే 'వియెన్నా సంధి' అని పేరు వచ్చెను. ఆ సంధిలో చేయబడిన రాజకీయసంబంధమగు నిర్ణయములు ఇవి: 1. మూడు క్రొత్త రాజ్యములు సృష్టింపబడెను - (ఏ). బెల్జియమ్, హాలండ్, లక్జెంబర్గ్ అను మూడు దేశముల కూడలి రాజ్యము; (బి). కేంద్రప్రభుత్వము ఎట్టిదియులేని అతుకుల బొంతయగు 39 పరగణాల జర్మనీ సమాఖ్య; (సి). పోలండ్‌నుండి వేరుగ క్రకావ్ స్వేచ్ఛానగరరాజ్యము; 2. రెండు సామంతరాజ్యముల సృష్టి - (ఏ). ఆస్ట్రియన్ చక్రవర్తికి లోబడిన లొంబార్డీ - వెనీషియా; (బి). రష్యా చక్రవర్తికి లోబడిన పోలండ్; 3. స్పెయిన్, నేపిల్స్, పియెడ్మాంట్, టస్కనీ, మోడెనోరాజ్యములలో వంశక్రమానుగతముగ పాలించు ప్రభుత్వములు పునరుద్ధరింపబడెను; 4. స్విజర్లండ్ యొక్క శాశ్వత తటస్థవిధానమునకు హామీతో ఒక 'స్విస్ సమాఖ్య' మరల స్థాపించబడెను; 5. లొంబార్డీ - వెనీషియా సామంతరాజ్యము నే కాక డాల్మియా, కార్నియోలా, సాల్స్‌బర్గ్, గాలిసియా కూడ ఆస్ట్రియాకు ఒసంగబడెను; 6. ప్రష్యాకు - పోసెన్, డాన్‌జిగ్, శాగ్జనీలో అధికభాగము, వెస్ట్‌ఫేలియాలో కావలసిన సదుపాయములు, పోమెరానియాలో అంతకు ముందు స్వీడెన్‌వారికి చెందియున్న భూభాగములు లభించెను; 7. స్వీడెన్‌రాజ్యముతో నార్వే కలుపబడినది; 8. మాల్టా, మారిషస్, హెలిగోలాండ్, గుడ్‌హోప్ అగ్రము, సిలోన్, టొబాగో, శాంటాలూసియా అను వానిని బ్రిటన్ తన వశమున నిలుపుకొనుటయే కాక, అయోనియన్ దీవుల సంరక్షణాధికారమును కూడ పొందగలిగెను; కాని, ఆ బాధ్యత 1863 వరకే అమలులో ఉండెను.

ఇంతేకాక, ఈ కాంగ్రెస్ సర్వసామాన్య ప్రాముఖ్యము గల అనేక ప్రకటనలను చేసెను: 1. రైన్, మ్యూజ్ నదులలో నౌకాయానస్వేచ్ఛకు సుస్థిర రూపము ఒసగెను; 2. బానిస వర్తకమును లాంఛనప్రాయముగ ఖండించెను; 3. ఆ యా దేశములందు - అందును ముఖ్యముగ జర్మనీలో - యూదులకు కల స్వత్వములను విస్తరింపజేయవలెనని సిఫారసు చేసెను; 4. రాయబారులకు కల అసామాన్య స్వత్వములను నిర్వచించి, అంతర్జాతీయ దౌత్య వ్యవహార విధానమునకు సుప్రతిష్ఠిత సంప్రదాయముల నెలకొల్పెను. పందొమ్మిదవ శతాబ్దిలోను, ఆ తరువాతను ఈ సంప్రదాయములే మాన్యములై అనుసరింపబడినవి.

స్వ. వెం.

**విలియమ్ - II** (1859 - 1941): జర్మనీ కడపటి చక్రవర్తి. 1701 నుండి ప్రష్యాను పాలించిన హోహెన్ జోల్లెర్న్ వంశములో కట్టకడపటి రాజు. (జర్మనీ చక్రవర్తికే కైజర్ అను బిరుదము ఉండెడిది. సాధారణముగ కైజర్ అనియే అతడు వ్యవహరింపబడెడివాడు). ఇతడు ఫ్రెడరిక్ - III పెద్ద కుమారుడు.

తన తండ్రి 100 రోజుల పరిపాలన ముగిసిన తరువాత ఇతడు 1888 లో సింహాసనము ఎక్కెను. అప్పటికి ఇంకను బిస్మార్క్ [చూ. పు. 849] ముఖ్య మంత్రిగ ఉండెను. కాని, విలియమ్ - II అతనిని తొలగించెను. తాను జర్మనీలో ప్రముఖ వ్యక్తిగ ప్రకాశించవలెనని ఈతని కోరిక. ఈతని హయాములో జర్మనీ పారిశ్రామికముగ చాల అభివృద్ధి పొందినది. ఉత్పత్తి అయిన సరకుల అమ్మకమునకు మార్కెట్లు కావలసివచ్చెను. అందుచే, విలియమ్-II వలసల వ్యాప్తికి పూనుకొనెను. ఆ వలసల రక్షణకై నౌకాదళమును అభివృద్ధిచేసెను. ఈతని విదేశాంగ విధానము దురాక్రమణ యుతమైనది. ఇతని నౌకా నిర్మాణము, వలసల విధానము సహజముగా జర్మనీకి బ్రిటన్‌ను శత్రువుగ చేసినవి. విలియమ్-II తన చుట్టును అందరును శత్రువులు అగుచున్నారని తెలిసికొన ఆరంభించెను. 1890 లో ఇతడు రష్యాతో ప్రష్యా, జర్మనీల కున్న మిత్రత్వమును రద్దుచేసెను. దాని వలన రష్యా ఫ్రాన్స్‌తో స్నేహము చేసికొనినది. ఇటుల అతడు అవలంబించిన విదేశ నీతి కడపటికి ప్రథమ ప్రపంచ మహాయుద్ధమునకు దారి తీసినది.

చివరకు 1914 లో యుద్ధము వచ్చినప్పుడు ఈతనికి జర్మనీ తప్పక గెలుచునని కొండంత నమ్మకము ఉండి, ప్రారంభదశలో తగిన జాగ్రత్తలనైనను తీసికొనలేదు. కాని, చివరి రోజులలో మిత్రమండలి ఆర్థిక దిగ్బంధనల వలన జర్మనులకు తిండిలేకపోయెను. 1918, నవంబరులో జర్మనీలో చాలచోట్ల తిరుగుబాట్లు జరిగినవి. నౌకాదళము కూడ తిరుగుబాటుచేసినది. ఇతని ముఖ్యమంత్రి ఈతనికి రాజ్యత్యాగము చేయుమని సలహా ఇచ్చెను. కాని, ఈతడు అందుకు అంగీకరించక, సైన్యమును నమ్మి ఊరకుండెను. సేనానాయకుడు హిండెన్‌బర్గ్ ఆ క్లిష్టసమయమున ఈతనిని బలపరచలేదు. విలియమ్ దేశము విడచి నెదర్‌లండ్స్‌లో తలదాచుకొనెను. ప్రవాసములో 20 పండ్లకు పైగా జీవించెను. జర్మనీలో హిట్లర్ [చూ.] ఉన్నతిని ఇతడు సమర్థించెను.

* * *

**విల్సన్, వుడ్రో** (1856 - 1924) : యునైటెడ్ స్టేట్స్ 28 వ అధ్యక్షుడు (1913 - 21). వర్జీనియాలో జన్మించెను; హార్వర్డ్ యూనివర్సిటీలో అధ్యయనముచేసి, అధ్యాపక వృత్తిని స్వీకరించి, ప్రిన్స్‌టన్ యూనివర్సిటీలో ఆచార్య (1890 - 1902), అధ్యక్ష (1902 - 10) పదవులను నిర్వహించెను; తరువాత రాజకీయములను చేపట్టి, డెమొక్రాటిక్ పార్టీలోచేరి, న్యూజెర్సీ గవర్నర్‌గ పనిచేసెను (1911 - 12); 1912 లో అధ్యక్షుడుగ ఎన్నుకొనబడెను. అధ్యక్షుడుగ ఆంతరంగిక వ్యవహారములలో ఈయన ఆంటిట్రస్ట్ చర్యలపై శ్రద్ధచూపెను; ఫెడరల్ రిజర్వ్‌చట్టము (1913) ద్వారా జాతీయ బ్యాంకింగ్ పద్ధతిని పునర్వ్యవస్థీకరించెను. ప్రథమ ప్రపంచయుద్ధము [చూ. పు. 594] లో మొదట విల్సన్ చెక్కుచెదరని తటస్థ విధానమును చేపట్టి పోరాడుచున్న ఇరుపక్షములవారి యుద్ధలక్ష్యములను తెలిసికొని, మధ్యవర్తిత్వము చేయుటకు సిద్ధపడెను. ప్రజలు ఈ విధానమును ఆమోదించి, 1916 లో ఈయనను మలిసారి అధ్యక్షునిగ వరించిరి. కాని, విచక్షణారహితముగ జర్మనీ తన జలాంతర్గాములతో యునైటెడ్ స్టేట్స్ నౌకలను ముంచివేసి, కవ్వింపు చర్యలకు పూనుకొనుటచే, విల్సన్ మిత్రమండలి పక్షమున తప్పనిసరిగ యుద్ధములో దిగెను. తోడనే ఈయన శాంతి సంధికి ప్రాతిపదికగా అనువర్తింపదగు 14 సూత్రముల నైతిక నియమావళిని ప్రకటించి, నానాజాతి సమితి [చూ. పు. 531] సంస్థాపనావశ్యకతను నొక్కి వక్కాణించెను (8 జనవరి, 1918). పారిస్ శాంతి సమావేశములో పాల్గొనుటకు అత్యుత్సాహముతో విచ్చేసిన ఈయనకు మిత్రరాజ్యములు అఖండ స్వాగతమును ఇచ్చినవి; కాని, విజిత రాజ్యముల ఎడ తమకు గల ప్రతీకారవాంఛ మూలమున ఈయన ప్రవచించిన ఉన్నతాదర్శములను మాత్రము చాలవరకు వమ్ముచేసినవి. వెర్సెయిల్స్ శాంతి సంధి [చూ.] ని రూపొందించుటలో విల్సన్ కొన్ని రాజీప్రతిపాదనలకు సమ్మతింపవలసివచ్చెను. అయినను మిత్రరాజ్యములు చేసిన తప్పులను మున్ముందు నానాజాతి సమితి చక్కదిద్దగలదని ఆయన పూర్తిగా విశ్వసించి, స్వదేశమునకు తిరిగివచ్చెను. ఈలోపున రిపబ్లికన్‌పార్టీ ఆధిపత్యము క్రిందికివచ్చిన సెనేట్‌సభ నానాజాతిసమితి నిర్మాణముతోకూడిన ఆ శాంతి సంధిని ధ్రువపరుప నిరాకరించెను. తన ఆశయములకు ప్రజామోదమును ఆర్జించుటకు దేశవ్యాప్తముగ ఉద్యమమును ప్రారంభించిన మూడు నెలలకు విల్సన్ ఆరోగ్యము పూర్తిగాచెడి పోయెను; భగ్నహృదయుడై, అశక్తుడై ఈయన తన జీవితములోని కడపటి మూడున్నర సంవత్సరములు వెళ్ళబుచ్చెను. ఆ. వెం.

**విశాల భారతము** : ప్రాచీన భారతీయ నాగరకత భారతదేశమునందు అంతటను నిండి, ఇచటనుండి మధ్య ఆసియా, ఇండో - చీనా, మలయా ద్వీపకల్పము మున్నగు ప్రాంతీయ దేశములకు వ్యాపించెను. అశోకుని కుమారుడగు కుణాలుడు ఖోటాన్‌లో వలస స్థాపన చేసెననియు, అశోకుడే సువర్ణభూమిలో బౌద్ధమతమును గూర్చి బోధించుటకు ప్రచారకులను పంపెననియు చెప్పెడు గాథలు కలవు. క్రీ. శ. 4 వ శతాబ్దారంభమునాటికి కాష్‌గర్‌నుండి చీనా సరిహద్దుల వరకు గల తూర్పు టర్కిస్తానము అంతయు హైందవ నాగరకతామయమయ్యెను. నూతన రాజ్యములు ఎన్నియో నిర్మింపబడెను. అందులో దక్షిణమున 'ఖోటాన్', ఉత్తరమున 'కుచి' అనునవి ముఖ్యమైనవి. దక్షిణమున హైందవజనులు ఎక్కువగా ఉండిరి; అచట భారతదేశమునుండి పోయిన వర్తకుల వలసలు ఎన్నియో ఉండెను. వీరు భారతదేశమందలి వాయవ్యప్రాంతములందు మాట్లాడబడు ప్రాకృత భాషవంటి భాష మాట్లాడుచుండిరి. వీరి లిపి మొదట ఖరోష్ఠిలిపి; తరువాత బ్రాహ్మీలిపిగా ఉండెను. ఖోటాన్‌లో ఉన్న గోమత విహారము బౌద్ధ గ్రంథములకు ప్రసిద్ధినొందిన కేంద్రస్థానము. ఫాహియాన్ ఈ బౌద్ధ విహారమందు మూడువేలమంది బౌద్ధ సన్యాసులు ఉండిరని వ్రాయుచు, విహారములోని నిత్యజీవిత చర్యను గురించి వివరణములను విశదముగ తెల్పి ఉన్నాడు. 'నవనీత' మను అముద్రిత వైద్యగ్రంథమునుండి ఆ ప్రాంతములందు హిందూ వైద్యవిధానము అమలులో ఉండెనని తెలియుచున్నది. అచట వివిధ ప్రాంతములందు చిత్రకళా శిథిలములు, బౌద్ధ విగ్రహములు, ఆశ్రమ విహారాదుల శిథిల చిహ్నములు ఎన్నియో ఉన్నవి. ఈ శిథిలములను బట్టి గుప్తుల కాలమునాటి శిల్పప్రభావమును, గాంధార శిల్ప విశిష్టతయు ఆ ప్రాంతములకు వ్యాపించి ఉండునని తెలియనగును. ఖోటాన్ సమీపమున ఇప్పుడు నిర్జనములుగ ఉన్న స్థలములు అన్నియు క్రీ. శ. 8 శతాబ్దమువరకు బౌద్ధ సంస్కృతి వర్ధిల్లిన కేంద్రస్థానములుగ ఉండెను.

ఉత్తర కేంద్రమగు కుచి యందు కుషియన్ మాట్లాడుచుండిన ఒక శ్వేతజాతిజనులు నివసించుచుండిరి. వారు బౌద్ధమతమును అందరికన్న ముందుగనే అవలంబించిరి. కుచిని ఏలిన రాజులు స్వర్ణదేవుడు, స్వర్ణపుష్పుడు, హరిపుష్పుడు అను హైందవనామములను గలిగి ఉండిరి. హైందవ సంగీతము కుచిలో వాడుకయందు ఉండెను. అచటినుండి హైందవ సంగీతము చీనాకు కొనిపోబడెను. ఆ కాలమందు భారతదేశమునకు, కుచికి గల సంబంధము

కుమారజీవుని జీవితమునుండి బాగుగా తెలియనగును. కుమారజీవుని తండ్రి కుమారయానుడు భారతదేశములోని ఒక మంత్రి కుటుంబమునకు చెందినవాడు. కుమారయానుడు నైష్ఠిక జీవనాపరుడై విదేశములకు ఏగెను. అతడు కుచి రాజునకు రాజగురువై ఆ రాజు సహోదరి యగు 'జీవ' అను ఆమెను పెండ్లాడెను. ఈ దంపతులకు జన్మించిన పుత్రుడే కుమారజీవుడు. అతని పేరులో అతని తలిదండ్రుల పేర్లు రెండును కలసి ఉండెను. అతడు ఏడేండ్ల వయసులో ఉండినపుడు అతని తల్లి బౌద్ధసన్యాసిని అయ్యెను. ఆ తరువాత రెండేండ్లకు తల్లి - కొడుకులు ఇద్దరును కాశ్మీరముకు పోయిరి. అచట కుమారజీవుడు కాశ్మీర రాజునకు జ్ఞాతియు, ప్రసిద్ధ బౌద్ధ గురువును అగు బంధుదత్తుని యొద్ద ఆగమములను పఠించెను. ఇచటి నుండి తిరిగి వచ్చునపుడు దారిలో కాష్గర్‌నందు నాలుగు వేదములు, బ్రాహ్మణములు, జ్యోతిషాది విద్యలు చదివెను. యార్కండ్‌నందు మహాయాన బౌద్ధమతమునకు సంబంధించిన నాగార్జునుడు, ఆర్యదేవుడు మున్నగువారు రచించిన గ్రంథములను చూచెను. కడకు తిరిగివచ్చి అందలి రాజు ఆశ్రమమందు నివసించెను. అచట క్రీ. శ. 383 వరకు బౌద్ధగ్రంథముల గూర్చి వ్యాఖ్యానము సల్పెను. 383 లో చీనా దండయాత్ర ఫలితముగ అతడు చీనాకు బందీగా కొనిపోబడెను. కడకు ఎన్నియో కడగండ్లుపడి 401 లో చీనా రాజధాని చేరెను. అచట సంస్కృత గ్రంథములను చీనా భాషలోనికి అనువదించుటకు ఏర్పరుపబడిన పండిత పరిషత్తునకు అధ్యక్షుడుగా నియమింపబడి, కుమారజీవుడు కొద్ది సంవత్సరములలోనే సుమారు ఒకవంద సంస్కృత గ్రంథములను అనువదించి, 412 లో కీర్తిశేషుడు అయ్యెను. అతని అనంతరము అతడు ఏర్పరచిన సంప్రదాయములను అనుసరించి, ఎందరో పండితులు కాశ్మీరము నుండి చీనాకు వెళ్లిరి.

భారతదేశమునకును, ఆసియాయందలి తూర్పు దేశములకును చాల ప్రాచీనకాలమునుండి నౌకా సంబంధమైన రాకపోకలు కలవు. సుమారు క్రీస్తు శకారంభమునుండి హిందువులు గుంపులు గుంపులుగా ఆ దేశములకు వెళ్లి అచటనే స్థిరనివాసములను ఏర్పరచుకొనిరి. ఇందువలన ఇండోనీషియా, ఇండో - చీనా దేశములందు ఎన్నియో నూతన హిందూరాజ్యములు ఏర్పడెను. ఈ వలస వెళ్ళిన హైందవులకు మాతృదేశముతో రాజకీయ సంబంధములు లేకున్నను, వీరు అన్నివిధముల హైందవులుగనే ఉండిరి. వీరి శాసనములు అన్నియు సంస్కృతములో లిఖింపబడి ఉన్నవి. వాటికి, భారతదేశములోని వివిధ రాజ్యముల శాసనములకు ఎలాటి భేదమును లేదు. ఈ రాజ్యములు అన్నింట కేవలము భారతదేశమునుండి వలస వెళ్లినవారు మాత్రమే నివసించి ఉండలేదు. అందు చాలవరకు హైందవ సంప్రదాయము అవలంబించిన ఆ దేశవాసులకు అవి ఆవాసస్థానములుగ ఉండెను. కాని, బలి ద్వీపములోను, ఖామోద్వీపవర్గములలో కొంతవరకు తప్ప, తక్కిన ప్రాంతములలో ప్రాచీన హైందవ సంప్రదాయములు, సంస్కృత భాషయు నేడు లేవు. కాని, హైందవ సంస్కృతి అచ్చట ఒకప్పుడు ప్రవేశించి ఉండెనని మాత్రము తెలియ జేయుటకు కావలసినన్ని గుర్తులు నేటికిని నిలిచియే ఉన్నవి. ఈ దేశములందలి భాష, వాఙ్మయము, ధర్మసూత్రములు అన్నియు సంస్కృత మూలగ్రంథములనుండి గైకొనబడినవిగ తప్పక కన్పట్టును. వారి భాషల లిపులు అన్నియు భారత లిపులను అనుసరించి ఏర్పడినవే. సౌర, చాంద్ర మానములు, శక కాలపరిగణన, వర్ణాశ్రమధర్మముల కడపటి జాడలును ప్రాచీన హిందూ సంబంధమును సూచించును. కాంబోడియాలోని అంకారవాట్ [చూ. పు. 257] యును, జావాలోని బరాబదూర్ స్తూపమును అటువంటి ప్రాచీన హైందవ సంస్కృతికి శోభాయమానమగు స్మారక చిహ్నములు అనియే చెప్పవలెను. ఆనాటి చీనా వారివలెగాని, ఈనాటి యూరపియన్‌ల వలెగాని కాకుండా వలసవచ్చిన హైందవులు అవలంబించిన శాంతియుతమగు విధానములు ఆ దేశవాసులకు అందరికి సమ్మతములై ఉండెను. తక్కోలము (ఏలకుల సంత), కర్పూర ద్వీపము, నారికేళ ద్వీపము మున్నగు స్థలనామములవలన మొదట భారతీయులు ఆ దేశములకు వ్యాపారార్థము వెళ్లిరని తెలియును. ద్వీపాంతరమని నామాంతరము గల మలయా యందలి కనకపురి, సువర్ణ ద్వీపమనబడు సుమత్రాదీవి, సువర్ణభూమి మున్నగు స్థలనామముల వలన ఆ ద్వీపములందు లభించుచుండిన బంగారము వలన కూడ హైందవులు ఆకర్షింపబడిరని చెప్పవచ్చును. ఇండో - చీనా, బర్మా, బోర్నియో, జావా, మలయా మున్నగు దేశములందలి ప్రాచీన శాసనములు సంస్కృత భాషలో బ్రాహ్మీలిపిలో వ్రాయబడి ఉన్నవి. సుమత్రాలో తెలియవచ్చిన రాతి బుద్ధ విగ్రహములు, జావా, సెలిబిస్ (శూలవేశి), వియెత్నామ్‌లోని ఇత్తడి విగ్రహములు ప్రాచీన కాలపు అమరావతిలోని బుద్ధ విగ్రహములవలె ఉన్నవి. ఆ ప్రాంతములలో విరివిగా జనుల వాడుకలో ఉండు అగస్త్య ధర్మము, అగస్త్యుని గురించిన గాథలవలన మొట్టమొదట దక్షిణాపథము [చూ. పు. 526] నుండియే హిందువులు ఆ దేశములకు వలస వెళ్లిరని తెలియుచున్నది. వీరిని అనుస

రించి అన్యప్రాంతముల హిందువులు కూడ ఆ దేశములకు వెళ్లి ఉందురు. జావాలో చెప్పుకొనబడు గాథలు గుజరాత్ నుండి వెళ్లిన వలసల గురించి తెలుపుచున్నవి. క్రీ. శ. 8, 9 శతాబ్దములనాటి జావా, సుమత్రాలలో బెంగాల్‌ను పాలించిన 'పాల' రాజుల ప్రభావమును, నలందా విశ్వ విద్యాలయపు ప్రభావమును, అంతకుముందు గుప్తుల కళా ప్రభావమును ఉండినట్లు స్పష్టముగ తెలియుచున్నది.

ఈ దేశములందలి ఆది హైందవ రాజ్యము క్రీ. శ. 1 వ శతాబ్దములో కాంబోడియాలో జన్మించెను. కౌండిన్యుడు అను హైందవ నాయకుడు ఒక మాంత్రిక ధనుస్సు ధరించి ఆ దేశమును ఏలుచుండిన రాణిని ఓడించి, ఆమెను పెండ్లాడి, ఆ దేశపు రాజవంశమునకు మూలపురుషుడు అయ్యెను. నేడు మలయాలోని ఎగువ పెరక్ నదియొక్క ఒక ఉపనదియగు 'లంకాశూక' నది ప్రక్కనే లంకాశూక మను రాజ్యము క్రీ. శ. 2 వ శతాబ్దారంభమున స్థాపింప బడెను. 515 లో భగదత్తుడనువాడు లంకాశూక రాజ్యమును పాలించుచుండెను. బండన్ అఖాతములో ఉన్న నగర శ్రీ ధర్మరాజ లేదా లైగర్ (నగర - దీవి) ను కేంద్ర స్థానముగా గలిగి తామ్రలింగము అను మరియొక రాజ్యము ఉండెను. మలయాయందు దక్షిణభారత దేశమునకు సంబంధించిన హిందూ, మహాయాన బౌద్ధమతములు వ్యాపించి ఉండెనని అందలి శాసనాదికములవలన తెలియుచున్నది. పెరక్‌నదినుండి లభించిన ఒక రాజ్యాభిషేక ముద్రయందు వాకాటకశాసనములందలి లిపినిబోలిన అక్షరములలో 'శ్రీవిష్ణువర్మస్య' అని వ్రాయబడి ఉన్నది.

బర్మాలో నేడు 'ప్రోమ్' అని పిలువబడు శ్రీక్షేత్ర ప్రదేశమందు బంగారుతట్టలయందు, రాళ్లయందు, మట్టి సామానులయందు వ్రాయబడిన పాళీ ధర్మసూత్రముల శకలములు కొన్ని దొరికినవి. అందలి దక్షిణాది లిపి అక్షరములు 5 వ శతాబ్దమునకు చెందినవి. బర్హిణద్వీపము అనబడు తూర్పు బోర్నియోలో ఏడు రాతి యూపములు లభించినవి. ఈ యూపములందు 4 వ శతాబ్దము నాటి పల్లవ లిపిలో లిఖింపబడిన సంస్కృతశాసనములు కలవు. ఆ శాసనములందు మూలవర్మ అను రాజుయొక్క విజయములను తెలుపుచు అతడు యుధిష్ఠిరునకు సమానుడని పేర్కొనుచు, అతడు చేసిన వైదిక యజ్ఞముల గురించి లిఖింపబడి ఉన్నది. పడమటి బోర్నియోలోని సంచాన్ అనుచోట బుద్ధుని యొక్కయు, బోధిసత్త్వుల యొక్కయు బంగారు, వెండి విగ్రహములు తొమ్మిది ఇటీవలనే దొరికినవి. ఇవి పైన వివరింపబడిన వానికన్న వెనుకటి కాలమునకు సంబంధించినవి. రామాయణమున యవద్వీపము అను పేర జావా పేర్కొనబడెను. ప్రాచీన భౌగోళికుడు టాలమీయు ఈ విషయము నే తన గ్రంథమున పేర్కొనెను. జావాలో నేడు బటేవియా (జకార్తా) నగరమున్న ప్రాంతముననే 'తరుమ' అను పేరు గల హిందూరాజ్యపు ముఖ్య నగరము ఉండెడిది. ఆ రాజ్యమును ఏలిన పూర్ణవర్మను గురించి కొన్ని వివరములు అతని సంస్కృతశాసనములవలన తెలియనగుచున్నవి. దక్షిణ భారతీయ లిపికి సన్నిహితమగు లిపిలో ఈ శాసనములు వ్రాయబడి ఉన్నందున లిపి సామ్యమును బట్టి 450 ప్రాంతమునకు చెందినవిగ పరిగణింపవచ్చును. ఈ 'తరుమ' రాజ్యము 7 వ శతాబ్దమందు సుమత్రా ద్వీపమున నిర్మింపబడి, ప్రఖ్యాతిగాంచిన శ్రీవిజయసామ్రాజ్యమునందు చేరి తుదకు అంతరించువరకు స్వతంత్ర రాజ్యముగనే వెలయుచుండెను. శ్రీవిజయసామ్రాజ్యము 13 వ, 14 వ శతాబ్దముల వరకు ఉచ్చదశలో ఉండినది. 'చోపో' యందు గుణవర్మయను కాశ్మీరరాజకుమారుడు సన్యాసాశ్రమము స్వీకరించి, ఆ దేశపు రాణి తల్లిని, రాజును బౌద్ధులుగా చేసి, అచటనుండి చీనా చక్రవర్తి ఆహ్వానముపై క్రీ. శ. సుమారు 430 వ సంవత్సరమున చీనాకు వెళ్లిపోయెనని చీనీయచరిత్రలవలన తెలియుచున్నది. చోపో అనునది జావా గానో లేదా బహుశః పశ్చిమ బోర్నియోగానో ఉండవచ్చును.

ఆగ్నేయ ఆసియాయందలి ఫూనాన్ రాజ్యము అంతరించిన తరువాత దానిస్థానమున వెలసిన కాంభోజ రాజ్యమును, సయామ్‌లోని చంపాద్వారవతియు, సుమత్రాలోని శ్రీవిజయసామ్రాజ్యమును, జావాలోని కేదరి, సింగసారి, మజాపహిత సామ్రాజ్యము మున్నగునవియు తరువాతి కాలమునకు చెందిన ప్రముఖ హిందూ రాజ్యములు. ఈ రాజ్యములు అన్నియు రాజకీయము లందును, సంస్కృతి (నాగరకత) యందును గొప్ప కీర్తి పొందినవి. కాని, వీటి చరిత్ర సంగ్రహముగ తెలియ జేయుటకు కూడ ఇందు సాధ్యపడదు. కె. ఏ. ఎన్. శాస్త్రి.

**విష్ణుకుండివంశ రాజులు :** చూ. సం. 3 - పు. 115.

**వీటో :** రాజనీతిశాస్త్రమందలి ఒక పారిభాషిక పదము. ఈ లాటిన్‌భాషా పదమునకు 'నిరాకరింతును' అని అర్థము. తక్కు విధముల చట్టసమ్మతముగ ఆమోదింపబడిన ఒక తీర్మానమునుగాని, చర్యనుగాని నిరాకరించి త్రోసిరాజనుటకు ఒక వ్యక్తియందు న్యస్తమై ఉండు అసాధారణాధికారము 'వీటో' అను పేరుతో వ్యవహరింపబడుచున్నది. ప్రాచీన రోమన్‌నగర రాజ్యపాలనాకాలమున పౌరప్రతినిధులు ఆమోదించిన ఒక తీర్మానము తమకు

అనుచితమని తోచినపుడు దానిని త్రోసిరాజనుటకు నగర ముఖ్యులకు ఇట్టి 'వీటో' అధికారము ఉండెడిది. ఇంగ్లండు నను పార్లమెంట్ చేయు బిల్లులను 'వీటో' చేయు అధికారము రాజులకు చట్టరీత్యా ఉన్నను, కాలగతిని గమనించి 1708 నుండి దానిని రాజులు వినియోగించుటను మాని వేయుటవలన యథార్థతః లుప్తమైనది. యునైటెడ్ స్టేట్స్ ప్రెసిడెంట్‌నకు ఇట్టి అధికారము కలదు. కాని, అట్టి సందర్భమున వీటో చేయబడిన శాసనమునే తిరిగి మూడింట రెండు వంతుల ఆమోదముతో సాధికారశాసనముగ శాసనసభ రూపొందింప వీలుకలదు. యూరప్‌లో, గ్రేట్ బ్రిటన్‌లోనే కాక తక్కిన కొన్ని రాజ్యములందును పరిపాలకులకు వీటో అధికారము పూర్వము ఉండెడిది. కాని, ప్రజా ప్రతినిధుల అధికారము పెంపొందిన కొలదియు అవి లుప్తములైనవి.

ఐక్యరాజ్యసమితియందలి భద్రతాసమితి సభ్యులలో అగ్రరాజ్య పంచకపు ఏకగ్రీవామోదము ఏ తీర్మానమునకైనను అవశ్యకమను సూత్రము ఉండుట వలన, ఆ అయిదు రాజ్యములలోని ప్రతి ఒకదానికిని ఇట్టి వీటో అధికారము - అనధికారరీతిలో - ప్రాప్తమైనది. చీ. శే. రా.

**వెంకటప్పయ్య, కొండా :** చూ. సం. 4 - పు. 1110.

**వెనిజ్యులా :** దక్షిణ అమెరికాయందలి ఒక స్వతంత్ర గణ రాజ్యము.




దక్షిణ అమెరికా ఉత్తరతీరమున నెలకొని ఉన్న ఈ రాజ్యమునకు కారబియన్‌సముద్రము [ఉ]; బ్రిటిష్ గయానా [తూ]; బ్రెజిల్ [ద]; కొలంబియా [ప] సరిహద్దులుగ ఉన్నవి. [వి] 9,12,050 చ. కి. మీ.; [జ] 81,43,629. దేశీయులలో అత్యధిక సంఖ్యాకులు మిశ్రజాతివారు. [భా] జాతీయ భాష స్పానిష్. [మ] దేశమున రోమన్ కేతలిక్ సంప్రదాయపు క్రైస్తవ మతమునకు అత్యధిక వ్యాప్తి కలదు. [రా] కారకాస్ (జ సం. 7,39,255).

చరిత్ర : తొలుతనుండియు ఆదిమ అమెరికన్ జాతుల నిలయముగ ఉండిన ఈ దేశ తీరభూమిని కొలంబస్ [చూ. పు. 407] 1498 లో దర్శించెను. కాని, అతడు అచట దిగలేదు. ఆ మరుసటి సంవత్సరమున ఆలొంజో డి ఒజేడా అను స్పెయిన్ సాహసికుడు ఇట తన అనుచరులతో కాలిడెను. అతడు ఇట తొలుత దర్శించిన గ్రామము నీటి మడుగున ఎత్తు మంచెలపై కట్టబడిన ఇండ్లతోనుండి, ఇటలీ దేశమందలి వెనిస్ నగరమును గుర్తునకు తెచ్చుచుండుటచే ఈ ప్రాంతమునకు ఇతడు వెనిజ్యులా (చిన్న వెనిస్) అని పేరిడెను. అంతటినుండి స్పెయిన్ వాసులు ఇట వలసచేరి, ఆదిమవాసుల జయించి, క్రమముగ వారితో సంబంధ బాంధవ్యములను ఏర్పరచుకొనిరి. తత్ఫలితముగ నేడు ఈ దేశమున కన్పట్టు మిశ్రజాతి రూపొందెను. 19 వ శతాబ్ది తొలుతటి దశకము వరకు ఈ దేశము స్పెయిన్ సామ్రాజ్యమున అంతర్భాగముగ ఉండెను. 1810 లో వెనిజ్యులా దేశీయులు స్పెయిన్ సామ్రాజ్య ప్రభుత్వమును ధిక్కరించి ఆందోళన సలుప మొదలిడిరి. అంతటినుండి సైమన్ బొలీవర్ [చూ. బొలీవర్, సైమన్ - పు. 655] నాయకత్వమున స్వాతంత్ర్యయుద్ధము పదిసంవత్సరముల కాలము సాగెను. 1821 లో ఈ దేశము స్వాతంత్ర్యమును ప్రకటించి, కొలంబియా, ఈక్వడార్ లతో కలసి కొలంబియా సమాఖ్యయందు ఒక రాష్ట్రముగ రూపొందెను. కాని, ఈ సమాఖ్యనుండి వెనిజ్యులా 1829 లో విడివడి జనరల్ పయజ్ అనువాని నాయకత్వమున సంపూర్ణ స్వాతంత్ర్యమును ప్రకటించెను. అంతట పయజ్ సేనాని ప్రతిభ మూలమున ఈ దేశమున సుస్థిరప్రభుత్వము ఏర్పడి, కొంత కాలము పనిచేయగలిగెను. కాని, 1849 లో పయజ్ సేనానిని దేశమునుండి తరిమివైచి, జోసీ తాడియో మోనగాస్ అను సేనాని ఆధిపత్యమును గ్రహించెను. అంతటినుండి దేశమున అంతర్యుద్ధము చెలరేగినను, కడకు మోనగాస్ తన పలుకుబడిని కొంత కాలము నిలుపుకొన గలిగెను. ఇతని కాలముననే దేశమున బానిసత్వము నిషేధింపబడెను. మోనగాస్‌ను పదవినుండి తొలగించి జువాన్ క్రిసోస్తమో ఫాల్కోన్ అను సేనాని అధికారమును 1863 లో చేపట్టి 1866 వరకు పాలించెను. దేశమున సమాఖ్యారూపకమగు రాజ్యాంగము ఏర్పడవలయునని తొలుతనుండియు పోరాడుచుండిన రాజకీయపక్షమును ఇతడు అభిమానించువాడగుటవలన ఇతడు దేశమును ఇరువది రాష్ట్రములుగ విభజించి, రాష్ట్రీయ ప్రభుత్వములను ఏర్పరచి, వాని అన్నింటిని చేర్చి కేంద్రమున సమాఖ్యాప్రభుత్వమును ఏర్పరచెను (1864). ఇంతలో మోనగాస్ సేనాని తన బలమును కూడదీసికొని ఫాల్కోన్‌ను దేశమునుండి తరిమివైచి ప్రభుత్వాధికారమును గ్రహించెను (1868). కాని,

తరువాత ఒక పడాదియైనను తిరుగక పూర్వమే ఆన్‌టోనియో గుజ్‌మాన్ బ్లాంకో అనునతడు మొనగాస్‌ను ప్రభుత్వమునుండి తొలగించి, దేశమునకు నియంత కాగలిగెను. ఈ నిరంకుశప్రభుత్వము 1889 వరకు అమలునందు ఉండెను. అంతట ప్రజలు ఈ నిరంకుశత్వమును కూలద్రోయగా, సరియైన ఎన్నికలు జరిగి ఆండూయెజా పలాసియస్ అను సేనాని అధ్యక్షుడు అయ్యెను. కాని, రాజ్యాంగమున తనకు అనుకూలముగ ఉండు కొన్ని సవరణలను చేర్చుటకు ఈ అధ్యక్షుడు యత్నింపగా, దేశమున అసంతృప్తి చెలరేగెను. తత్ఫలితముగ జరిగిన అంతర్యుద్ధమున ఓడిపోయి ఆండూయెజా సేనాని దేశమును వదలి పారిపోయెను (1892). తరువాత రాజ్యాంగము తగు రీతిగ మార్చబడి, తదనుగుణముగ జరిగిన ఎన్నికలలో క్రెస్పో అను సేనాని అధ్యక్షుడయ్యెను (1894).

ఈ దేశమునకు, బ్రిటిష్ గయానాకు మధ్యగల సరిహద్దు తగవు 1895 లో విషమపరిస్థితులకు దారితీసెను. కాని, కడకు యునైటెడ్‌స్టేట్స్ అధ్యక్షుని మధ్యవర్తిత్వము మూలమున ఈ తగాదాను పంచాయితీ తీర్పునకు ఇచ్చుటకు ఉభయదేశములును అంగీకరించుట వలన 1889 లో పంచాయితీ తీర్పు మూలమున ఈ వివాదము పరిష్కృతమైనది. 1893 నుండి ప్రభుత్వ వ్యతిరేకములగు విప్లవములు అంతటంతట చెలరేగుట ఆ దేశమున పరిపాటిగ పరిణమించెను. అందువలన ఆ యా కాలములందలి అధ్యక్షులు రాజ్యాంగమును రద్దొనర్చి నియంతలుగ వ్యవహరించుచుండిరి. అట్టి అధ్యక్షులలో ఒకడగు కాస్ట్రో సేనాని దుష్పరిపాలన మూలముననను, దుందుడుకు చర్యల వలనను దేశమునందలి విదేశీయ వ్యాపార సంస్థలు పెక్కు విపరీత నష్టములకు గురియయ్యెను. అట్టి విదేశీయ వ్యాపార సంస్థలలో బ్రిటిష్, జర్మనీ, ఇటలీ దేశీయులకు చెందినవి ఎక్కువగ ఉండెను. అందుచేత ఆ ప్రభుత్వములవారు నష్టపరిహారమునకై దౌత్యరీతిలో పెక్కు యత్నముల జరిపి విఫలులై, తుదకు దేశపు కోస్తా పై నౌకా దిగ్బంధనమును అమలు జరిపిరి (1903). అంతట అంతర్జాతీయ న్యాయస్థానపు తీర్పును అనుసరించి ఈ తగాదా పరిష్కరింపబడెను. ఇటులనే కాస్ట్రో ప్రభుత్వకాలమున ఋణముల విషయమై బెల్జియమ్, హాలండ్‌లతో కూడ తగవులు కలిగెను. తుదకు 1909 లో నిరంకుశత్వము అంతరించి, దేశమున ఎన్నికలు జరిగెను. అయినను తరువాత సైతము ఆ దేశమున సుస్థిరప్రజాప్రభుత్వము అవతరింపలేదు. అంతటంతట తిరుగుబాటులు జరుగుటయు, నిరంకుశ ప్రభుత్వములు ఏర్పడుటయు, తత్ఫలితముగ రాజ్యాంగములు రద్దయి నూతనరాజ్యాంగములు ఏర్పడుటయు ఆ దేశమున సామాన్య సంఘటనలైనవి. ఈ విధముగ ఈ దేశమున ఇప్పటికి ఇరువది రాజ్యాంగములు క్రమముగ రూపొందినవి. 1961 లో ఇరువదవ రాజ్యాంగము ఆమోదింపబడినది.

**రాజ్యాంగము**: 1961 రాజ్యాంగచట్టమును అనుసరించి, ఈ దేశమున సమాఖ్యారూపకమగు గణరాజ్య ప్రభుత్వ విధానము అమలునందు ఉన్నది. దేశమున సార్వజనికమగు వోటుహక్కు కలదు. అధ్యక్షుడు అపరోక్షపు ఎన్నికలో ప్రజలచే ఎన్నుకొనబడును. ఇతని పదవీ కాలపరిమితి అయిదేండ్లు. కేంద్రశాసనసభయందు సెనేట్, ప్రతినిధుల సభ అను రెండు కక్ష్యలు కలవు. సెనేట్ సభ్యులను రాష్ట్ర శాసనసభలు ఎన్నుకొనును. ప్రతినిధులసభాసభ్యులను ప్రజలు జనాభా నిష్పత్తిలో ఎన్నుకొందురు. చీ. శే. రా.

**వెర్సైయిల్స్ సంధి** (1919, జూన్ 28): ప్రథమ ప్రపంచ యుద్ధానంతరము మిత్రమండలికి జర్మనీతో పారిస్ సమీపమున వెర్సైయిల్స్‌నందు జరిగిన శాంతి సంధి. ఈ సంధి ముఖ్య షరతులు ఇవి: 1. జర్మనులు తమ వలస రాజ్యములను అన్నింటిని మిత్రరాజ్యములవారి ధర్మకర్తృత్వ (మాండేటరీ) పరిపాలనమునకు అప్పగించుట; 2. ఆల్‌సేస్ - లోరైన్‌ను ఫ్రాన్స్‌కు తిరిగి ఇచ్చుట; 3. ప్రష్యన్ పోలండ్‌ను, తూర్పు ప్రష్యా భాగములను, ఎగువ సైలీషియాను పోలండ్‌నకు ఇచ్చుట; 4. డాన్‌జిగ్ రేవును నానాజాతిసమితి పరిపాలనకు అప్పగించుట; 5. 15 ఏండ్ల తరువాత దాని భవిష్యత్తును జనవాక్యముచే నిర్ణయించు షరతుతో సార్ మండలమును ఫ్రెంచివారు ఆక్రమించుకొనుట; 6. రైన్‌లాండ్‌ను నిస్సైనికముగ చేసి, 15 ఏండ్లు మిత్రమండలివారి వశమందుంచుట; 7. నష్టపరిహారము క్రింద పెద్ద మొత్తమును మిత్రమండలికి జర్మనీ సమర్పించుకొనుట; 8. టాంక్‌లు, పెద్ద ఫిరంగులు, విమానములు మొదలగువాని మినహాయింపుతో జర్మనీకి సైన్యము 1,00,000 మాత్రమే ఉండుట; 9. సుమారు 10 వేల మెట్రిక్ టన్నుల లోపు ప్రమాణము కల యుద్ధ నౌకలతోనే నౌకా సైన్యమును జర్మనీ పరిమితముగ ఏర్పరచుకొనుట (ఇందులో జలాంతర్గాములు ఉండరాదు).

ఈ సంధి జర్మనీ - ఆస్ట్రియా కలయికను నిషేధించెను; ప్రపంచయుద్ధము సంభవించుటకు జర్మనీయే బాధ్యత వహింపవలెనని నిర్ణయించెను. అంతేకాక, ఈ ఒడంబడికయందే నానాజాతిసమితియొక్క వ్యవస్థావిధానము పొందుపరచబడెను. అయితే, 1933 నుండి హిట్లర్ [చూ.] సైనికముగ ప్రాబల్యము పొందిన తరువాత అతడు ఈ సంధి

షరతులు తన దేశమును బద్ధపరచ జాలవని, వానిని త్రోసిపుచ్చి వ్యవహరించెను. స్వ. వెం.

**వెలెస్లీ (1760 - 1842) :** బ్రిటిష్ రాజనీతివేత్త; భారతదేశ గవర్నర్ - జనరల్ (1798 - 1805) ; మార్నింగ్టన్ ప్రభువు కుమారుడు ; డ్యూక్ ఆవ్ విల్లింగ్టన్ సోదరుడు. గవర్నర్ - జనరల్‌గ ఇతడు భారతదేశమునకు నెపోలియన్ దండయాత్రా ప్రమాదమును నివారించి ; ఫ్రెంచి ప్రాబల్యమును నిర్మూలించి, భారతదేశముపై బ్రిటిష్ యాజమాన్యమును సుస్థిరముచేయుటకు 'సైన్యసహకారపద్ధతి' అను నూతనరాజకీయ విధానమును ప్రవేశపెట్టెను. [చూ. భారతదేశము-పు. 664]. భారతదేశములోని వివిధ రాజ్యములతో సైన్యసహకారమైత్రి చేసికొని, వాటి సైన్యములలోని ఫ్రెంచి దళములకు ఉద్వాసన చెప్పించుటకు, వాటిని బ్రిటిష్ రక్షణక్రిందికి కొనివచ్చుటకు ఉద్దేశింపబడిన ఈ విధానమును వెలెస్లీ నిర్దాక్షిణ్యముగ అమలు జరిపెను ; పిట్స్ ఇండియా చట్టమునకు విరుద్ధముగ (అంతవరకు అనుసరింపబడిన) తాటస్థ్యపద్ధతికి స్వస్తిచెప్పెను. ఇతడు 1799 లో టిప్పుసుల్తాన్‌ను, మూడవ మహారాష్ట్ర యుద్ధము (1803 - 1805) లో సింధియా, హోల్కార్‌లను పూర్తిగా ఓడించెను. ఈ నూతన విధానమునకు ఫలితమైన అనేక యుద్ధములలో జరిగిన అపార ధనవ్యయమునకు, ఇతని దురహంకారపు స్వాతంత్ర్య ప్రవృత్తికి ఆగ్రహించి, పాలకవర్గము ఇతనిని స్వదేశమునకు రప్పించుకొనెను. తరువాత వెలెస్లీ బ్రిటిష్ విదేశాంగ కార్యదర్శిగను (1809 - 12), లార్డ్ లెఫ్టినెంట్ ఆవ్ ఐర్లాండ్‌గను (1821 - 1829) పని చేసెను. ఆ. వెం.



వెలెస్లీ
(1760 - 1842)

**వెస్ట్ ఇండీస్ :** పశ్చిమార్ధగోళమునందలి ఒక ద్వీపజాలము. దీనికే 'ఆంటిల్లీస్' అనియు పేరు కలదు.

ఉత్తర అమెరికా తూర్పు తీరమునందలి ఫ్లారిడా ద్వీపకల్పపు అగ్రమునకు కొలది దూరమున ఉండి బయలుదేరి, మధ్య అమెరికాయందలి యూకటాన్‌కు సమీపముగ పోవుచు, దాదాపు దక్షిణ అమెరికాయందలి వెనిజ్యులా తీరము వరకు విస్తరించు చంద్రరేఖాకృతి గల ప్రదేశమునందు అట్లాంటిక్ మహాసముద్రము నుండి కారబియన్ సముద్రమున మెక్సికో సింధు శాఖను వేరుపరచుచు, అటనట చెదరి ఉండిన ద్వీపముల సమూహాము ఈ పేరున వ్యవహరింపబడుచున్నది. ఇందలి ద్వీపముల మొత్తపు [వి] దాదాపు 2,40,870 చ. కి. మీ. ఈ ద్వీపములలో కొన్ని బ్రిటిష్‌వారి వశమునను, కొన్ని నెదర్‌లండ్స్ అధీనమునను, కొన్ని ఫ్రెంచిరాజ్యమునను, మరికొన్ని యునైటెడ్‌స్టేట్స్‌ను ఆశ్రయించియు ఉండగ మిగిలినవి స్వాతంత్ర్యమును అనుభవించుచున్నవి. బ్రిటిష్‌వారి వశమున ఉన్న వానికి అన్నిటికిని ఇప్పటికి కామన్‌వెల్త్ సభ్యత్వముతో పాటుగ స్వతంత్రత చేకూరినది. ప్రక్కపుట - 846 - లోని పట్టిక వలన ఆ యా విభాగములకు చెందిన ద్వీపములను, వానిని గురించిన వివరములను గ్రహింపవచ్చును.

చరిత్ర : 1492 లో ఈ ద్వీపములందు కొన్నింటిని తొలుత కొలంబస్ [చూ. పు. 407] కనుగొనెను. భారతదేశమునకు సముద్రమార్గమును అన్వేషించు తలంపుతో బయలుదేరిన కొలంబస్ విశాల భారతభూమికి చెందినవియే ఈ ద్వీపములు కానగునని భావించి, వీనికి 'వెస్ట్ ఇండీస్ (పశ్చిమ భారతము)' అని పేరిడెను. ఆ పొరపాటును సవరించుకొనిన తర్వాత ఈ ద్వీపజాలమునకు 'ఆంటిల్లీస్' అని పేరిడబడెను (పాశ్చాత్య పౌరాణిక గాథలందు ప్రస్తావితమగు ఒక దూరస్థ దేశమునకు ఆంటిల్లీస్ అను పేరు కలదు). ఈ ద్వీపజాలమునే సౌకర్యార్థము బహామాదీవులు, పెద్ద ఆంటిల్లీస్




(క్యూబా, జమైకా, హాయిటీ, డొమినికన్ రిపబ్లిక్‌లు కలిసి ఉన్న హిస్పానియోలా ద్వీపము, పోర్టోరికో), చిన్న ఆంటిల్లీస్ (విండ్‌వర్డ్, లీవర్డ్ దీవులు) అని విభజించి వ్యవహరించుటయు కలదు.

స్పెయిన్‌దేశపు పాలకులు 1540 నుండియు ఈ దీవుల ప్రాముఖ్యమును గుర్తించి వలసల నెలకొల్ప ఆరంభించిరి. క్రమముగ వారి పరిపాలనా ఫలితముగ ఆ ద్వీపములందలి ఆదిమ అమెరికాజాతులు అన్నియు దాదాపుగ అంతరించినవి. మిగిలిన వారందరు స్పెయిన్‌వారితో సంకరమొందిరి. అంతట తక్కిన పాశ్చాత్యరాజ్యములు అన్నియు ఈ ద్వీపములను ఆక్రమింప యత్నములు జరిపినవి.

## పట్టిక

| వరుస సంఖ్య | పేరు | విస్తీర్ణము చ. కి. మీ. | జన సంఖ్య | రాజధాని | రా. జనసంఖ్య |
|---|---|---|---|---|---|
| | బ్రిటిష్ | | | | |
| 1. | * బహామా దీవులు | 11,406 | 1,22,000 | నస్సావ్ | 53,100 |
| 2. | * జమైకా (అందులో చేరిన దిగువ ద్వీపములు కాక) | 10,962 | 16,96,000 | కింగ్స్టన్ | 1,25,556 |
| 3. | * కేమన్ దీవులు | 259 | 8,511 | జార్జిటవున్ | 2,400 |
| 4 | * టర్క్స్ & కైకోస్ దీవులు | 430 | 6,122 | గ్రాండ్ టర్క్ | 1,800 |
| 5. | లీవర్డ్ దీవులు | | | | |
| | (i) ఆంటిగ్వా | 442 | 54,304 | సెయింట్ జాన్స్ | 21,000 |
| | (ii) మాంట్ సెర్రాట్ | 83 | 12,771 | ప్లిమత్ | 2,500 |
| | (iii) సెయింట్ కిట్స్ - నెవిస్ ఆంగ్విలా | 396 | 56,591 | బస్సెటెర్రె | — |
| | (iV) వర్జిన్ దీవులు | 153 | 7,340 | రోడ్ టౌన్ | 900 |
| | (V) బార్బడోస్ | 430 | 2,41,706 | బ్రిజ్ టవున్ | 11,289 |
| 6. | విండ్ వర్డ్ దీవులు | | | | |
| | (i) డొమినికా | 790 | 59,916 | రూసో, రోజో | 12,577 |
| | (ii) గ్రనడా | 344 | 88,677 | సెయింట్ జార్జెస్ | 26,894 |
| | (iii) సెయింట్ లూసియా | 616 | 86,108 | కాస్ట్రీస్ | 24,500 |
| | (iv) * ట్రినిడాడ్ & టొబాగో | 5,128 | 8,67,000 | పోర్ట్ ఆవ్ స్పెయిన్ | 1,21,150 |
| 7. | నెదర్లండ్స్ | | | | |
| | (i) కురకావ్ | 543 | 1,25,181 | విలెమ్స్టాడ్ | — |
| | (ii) అరూబా | 178 | 53,199 | — | — |
| | (iii) బోనైర్ | 246 | 5,892 | — | — |
| | (iv) సబా | 12 | 980 | — | — |
| | (v) సెయింట్ యుస్టేసియస్ | 18 | 1,014 | — | — |
| | (vi) సెయింట్ మార్టిన్ (దక్షిణ భాగము) | 44 | 2,728 | — | — |
| | ఫ్రెంచి | | | | |
| 1. | * గ్వాడలోప్ (మేరీగెలాంటీ) మొదలగు పరిసర ద్వీపములును, సెయింట్ మార్టిన్‌లో ఉత్తర భాగమును చేరి) | 1,777 | 2,82,561 | బాస్ టెర్ | 11,837 |
| 2. | * మార్టినిక్ | 1,100 | 2,91,357 | ఫోర్ట్ - డి - ఫ్రాన్స్ | 65,000 |
| | యునైటెడ్ స్టేట్స్ | | | | |
| 1. | * పోర్టోరికో | 8,896 | 24,54,600 | సాన్ జువాన్ | 4,32,377 |
| 2. | వర్జిన్ దీవులు | | | | |
| | (i) సెయింట్ క్రాయిక్ | 212 | 14,973 | క్రిస్టియన్ స్టెడ్ | 5,088 |
| | (ii) సెయింట్ థామస్ | 82 | 16,201 | షార్లాట్-అమాలియా | 12,740 |
| | (iii) సెయింట్ జాన్ | 49 | 925 | — | — |
| | స్వతంత్ర రాజ్యములు | | | | |
| 1. | * క్యూబా | 1,14,524 | 72,02,752 | హవానా (హబానా) | 7,85,455 |
| 2. | * డొమినికన్ రిపబ్లిక్ | 48,734 | 83,34,300 | సాంటో డోమింగో | 3,00,000 |
| 3. | * హాయిటీ | 27,750 | 44,48,000 | పోర్ట్ ఆవ్ ప్రిన్స్ | 2,50,000 |

* ఈ గుర్తున్న వానిని గురించిన కొన్ని వివరములు ఆ యా శీర్షికల క్రింద ఈయబడినవి.

బ్రిటిష్, డచ్చి, ఫ్రెంచి, డెన్మార్క్ నావికులు పలు ద్వీపము లపై దండయాత్రలు సలుపగ స్పెయిన్ క్రమక్రమముగ వెనుకకు తగ్గవలసివచ్చెను. 1625 నాటికి బ్రిటిష్‌వారు ఇట కొన్ని ద్వీపములందు కాలూనగలిగిరి. 1713 నాటికి వారు ఈ ద్వీపజాలమున ముఖ్యద్వీపములలో పెక్కింటిని ఆక్ర మించిన ఫలితముగ ఉట్రెక్ట్ సంధి [చూ. పు. 337] మూలమున బహామా, జమైకా, కేమన్, కైకోస్ అండ్ టర్క్స్ దీవులందు బ్రిటిష్‌వారికిగల సర్వాధికారములను, తక్కిన వానియందు అటనట వారికి గల స్థావరములను తక్కిన పాశ్చాత్యరాజ్యములు గుర్తించినవి. తమ అధీన మున ఉన్న దీవులందు వ్యవసాయమును, అందును ముఖ్య ముగ చక్కెర చెరకు సాగుబడిని బ్రిటిష్ వలసప్రభుత్వము ప్రోత్సహించి, ఆ తోటలలో పని చేయుటకు నీగ్రో బానిస లను కొనివచ్చెను.

బ్రిటిష్‌వారిని అనుసరించి ఫ్రెంచివారి వర్తకసంఘము ఒకటి 1625 లో ఇందలి ఒక దీవియందు నెలవును ఏర్పరచు కొని, క్రమముగ మరికొన్ని ద్వీపములను ఆక్రమించెను. ఉట్రెక్ట్ సంధిని అనుసరించియే ఇప్పుడు ఫ్రెంచివారి అధీన మందు ఉన్న ద్వీపములందేగాక, హిస్పానియోలా ద్వీప మందలి పశ్చిమ భాగమునందును, ఇంకను మరికొన్ని దీవులందును ఫ్రెంచివారికి గల అధికారము గుర్తింపబడెను. డచ్చివారు ఇటకు కొంత ఆలస్యముగ వచ్చినను, వారు ఆక్రమించుకొని ఉన్న దీవులన్నియు వారికే ఉండునటుల ఉట్రెక్ట్ సంధియందు నిర్ణయము జరిగినది. ఆ ద్వీపములు ఇప్పటికిని డచ్చి (నెదర్‌లండ్స్) వారి అధీనముననే ఉన్నవి. వీనికే సమష్టిగ 'నెదర్‌లండ్స్ ఆంటిల్లీస్' అనియు పేరు కలదు. అప్పటికి డేనులక్రింద ఉండిన సెయింట్‌థామస్, సెయింట్‌జాన్ ద్వీపములు వారికే చెందినటుల ఉట్రెక్ట్ సంధి వలననే ఏర్పాటు జరిగినది. తరువాత సెయింట్ క్రాయిక్ ద్వీపము కూడ వారికి ఒసగబడినది.

పై మార్పుల ఫలితముగ 1713 తరువాత స్పెయిన్ వారి అధీనమున క్యూబా, పోర్టోరికో, తూర్పు హిస్పాని యోలా మాత్రమే మిగిలినవి. కాని, అమెరికా స్వాతంత్ర్య యుద్ధకాలమున జరిగిన పరిణామముల ఫలితముగ హిస్పానియోలా ద్వీపమునందలి ప్రాచ్య, పశ్చిమభాగ ములు, హయిటీ, డొమినికన్ రిపబ్లిక్‌లను పేర రెండు వేర్వేరు స్వతంత్ర రాజ్యములుగ రూపొందినవి (1804 - 1844). 1898 లో యునైటెడ్‌స్టేట్స్‌కు స్పెయిన్‌తో జరిగిన యుద్ధపు పరిణామముగ క్యూబా స్వతంత్రమయ్యెను. పోర్టోరికో యునైటెడ్‌స్టేట్స్ వశమయ్యెను (పైన పేర్కొనబడిన వానిని గురించిన వివరములు ఆ యా శీర్షి కల క్రింద కననగును). డేనుల ఆక్రమణలో ఉన్న ద్వీపములను వారినుండి 1917 లో యునైటెడ్‌స్టేట్స్ కొనుగోలు చేసి వశపరచుకొనినది. వీనికే సమష్టిగ వర్జిన్ దీవులు అను పేరు కలదు.

బ్రిటిష్‌వారి వలెనే ఫ్రెంచి, డచ్చి, డెన్మార్క్ వలస పాలకులును తమ తమ వశమున ఉన్న ద్వీపములందు వ్యవసాయమును ప్రోత్సహించి, అందులకై పని చేయుటకు నీగ్రోబానిసలను తెచ్చి అట చేర్చిరి. ఇటుల వచ్చిన నీగ్రో బానిసల సంతతి క్రమముగ ఈ ద్వీపములందు విరివిగ వృద్ధి చెందినది. అధిక సంఖ్యాకతను ఆర్జించిన నీగ్రోలను కల కాలము బానిసలుగ ఉంచుట వలసపాలకులకు అసాధ్య మయ్యెను. నీగ్రోలు జరిపిన పలు తిరుగుబాటులకు ఫలిత ముగ బానిసత్వమును 1839 లో బ్రిటిష్ వలసపాలకులు రద్దొనర్చిరి. ఆ తరువాత 10 సంవత్సరములకు ఫ్రెంచి వారును, డేనులును తమ తమ ఆక్రమిత ప్రాంతములందు నీగ్రోల బానిసత్వమును తొలగించిరి. డచ్చివారును, స్పెయిన్‌వారును చాలకాలము వరకు ఈ నైచ్య పరిస్థితిని తొలగించుటకు సుముఖత చూపలేదు, కాని, తుదకు పరిస్థితుల ప్రాబల్యమునకు లొంగి 1873 లో డచ్చివారును, 1886 లో స్పెయిన్‌వారును తమ తమ పాలిత ద్వీపము లందు బానిసత్వమును రద్దొనర్చిరి.

బ్రిటిష్‌వారు తమ పాలనయందు ఉన్న ద్వీపములందు ఆ యా పరిస్థితులకు తగినటుల అంతటంతట కొన్ని రాజకీయ సంస్కరణములను ప్రవేశపెట్టి, అవి అన్నియును స్వాతంత్ర్యపథమున కొంత పురోగమించిన తరువాత బహామా దీవుల [చూ. పు. 646] కు కొంత ఆంతరంగిక స్వాతంత్ర్య ప్రతిపత్తిని కల్పించి, కడమవానినన్నింటిని 1958 లో 'వెస్ట్ ఇండీస్ ఫెడరేషన్' అను పేర ఒక సమాఖ్యగ రూపొందించిరి. కాని, ఇందలి సభ్య దేశము లకు పొత్తు కుదరనందున ఆ సమాఖ్య 1962 లో రద్దు కాగా, జమైకా [చూ. పు. 467], ట్రినిడాడ్ & టొబాగో [చూ. పు. 505] అందుండి చీలి వేర్వేరుగ స్వాతంత్ర్యమును ఆర్జించినవి. తక్కినవి అన్నియును ఏదియో ఒక విధముగు ప్రాదేశిక మైత్రితో కలసిమెలసి వ్యవహరించుటకై కృషి చేయుచున్నవి. ఫ్రెంచివారి అధీనమున ఉన్నవి ఫ్రెంచి రాజ్యమున సముద్రోత్తర మండలములుగ ఉన్నవి. పోర్టో రికో [చూ. పు. 590] దాదాపుగ స్వతంత్రమై యునైటెడ్ స్టేట్స్‌తో సన్నిహితత్వమును మాత్రము కలిగి వ్యవహ రించుచున్నది. యునైటెడ్‌స్టేట్స్‌కు చెందిన వర్జిన్ దీవులందు స్థానికపరిపాలనాస్వాతంత్ర్యము మాత్రమే పౌరులకు కలదు. నెదర్‌లండ్స్‌కు చెందిన దీవులు

రాజకీయముగ పరిగణనీయమగు అభివృద్ధిని ఇంతవరకు ఆర్జింపకున్నవి. చి. శే. రా.

**వెస్ట్ ఫేలియా సంధి (24 అక్టోబరు, 1648) :** ముప్పది సంవత్సరముల యుద్ధము [చూ. పు. 755] ముగియుటకు పవిత్ర రోమన్‌సామ్రాజ్యము జర్మనీలోని వెస్ట్ ఫేలియా రాష్ట్రమున మన్‌స్టర్ అను చోట ఫ్రాన్స్‌తోను, ఆస్నాబ్రక్ అనుచోట స్వీడన్‌తోను, తన ప్రొటెస్టంట్ రాష్ట్రములతోను చేసికొన్న ఒడంబడికల సమష్టినామము. ఫ్రాన్స్, స్వీడన్ దేశములను సంతృప్తి పరచి, పవిత్ర రోమన్ సామ్రాజ్యము, హాప్స్‌బర్గ్ రాజవంశము ఈ సంధి మూలమున తమ ఆధిపత్యమును కొంత కోల్పోయినవి. ఆల్సేస్ - లోరైన్ రాష్ట్రములను ఆర్జించి, ఫ్రాన్స యూరప్‌లో తన ప్రాబల్యమును చాల పెంపొందించుకొనినది. స్విజర్లండ్ రాజ్యకూటమియు, నెదర్‌లండ్స రాజ్యమును స్వతంత్ర దేశములుగ పరిగణన పొందినవి. స్వీడన్ దేశము ఓడర్, ఎల్బ్, వీజర్ నదుల సాగరసంగమ ప్రాంతములు సంపాదించెను. కేతలిజమ్, లూతరనిజమ్, కాల్వినిజమ్ ఈ మూడు క్రైస్తవ మతశాఖలు సమాన ప్రతిపత్తి కలవిగ అంగీకరింపబడెను. ఈ యుద్ధము వలన జర్మనీకి చాల జననష్టము, ధననష్టము సంభవించినది. అ. వెం.

**వేమియర్ రిపబ్లిక్ :** చూ. జర్మనీ - పు. 467.

**వైక్లిఫ్, జాన్ (1320 - 1384 ర.):** బ్రిటిష్ దేశపు మత సంస్కర్త. ఇతడు యార్క్‌షైర్‌లో జన్మించెనని, ఆక్స్‌ఫర్డ్‌లో విద్యాభ్యాసము చేసెనని తెలియుచున్నది. పౌరవ్యవహారములలో మితిమీరిన పెత్తనము చలాయించుచున్నదని ఇతడు చర్చిని తీవ్రముగ విమర్శించెను. క్రైస్తవులు తాము స్వయముగ భగవంతునికే విన్నవించుకొనవచ్చుననియు, మతగురువుద్వారా పరోక్షముగా విన్నవించుకొను అవసరములేదనియు, ఏ వ్యక్తియైన బైబిల్ ఉపదేశములను, తన హేతువాదమును అనుసరించి తన విశ్వాసములను ఏర్పరుచుకొనవలెననియు ఇతడు బోధించెను. వైయక్తికస్వత్వముల ప్రాధాన్యమును, రాజ్యవ్యవస్థనుండి చర్చిని పృథక్కరించవలసిన ఆవశ్యకతను వైక్లిఫ్ దృఢముగ సమర్థించెను. సామాన్యప్రజలు తమ మాతృభాషలో బైబిల్ చదువుకొని, క్రీస్తు ఉపదేశములకు అనుగుణముగ తమదైనందిన చర్యలను మలచుకొనుటకు వీలుగ ఇతడు బైబిల్‌లో న్యూ టెస్ట్‌మెంట్‌ను, పాత టెస్ట్‌మెంట్‌లో కొంతభాగమును ఆంగ్లీకరించెను. తరువాత ఇతని అనుయాయులు ఇతని కృషిని పూరించిరి. ఇతని బోధలు మతవిద్రోహకములు అని పోప్ (గ్రెగరీ - XI) ఇతనిని నాస్తికునిగా ప్రకటించి, నిర్బంధింపవలెనని ఆదేశించెను. కాని, బ్రిటిష్ ప్రభుత్వము ఇతనికి తగు రక్షణయేకాక స్వేచ్ఛనుకూడ ప్రసాదించెను. ఒక శతాబ్దము తరువాత జర్మనీలో మార్టిన్ లూతర్ ప్రవచించిన బోధలకు, ఇతని బోధలకు పెక్కు పోలికలు కలవు. అ. వెం.

**వోటు :** ప్రజాతంత్రపరిపాలన గల సంస్థలందు అభిప్రాయ ప్రకటనకు వినియుక్తమగు సాధనము. ప్రాచీన సంఘములందును రాజరికము రూపొందని కాలమున ప్రజలు లేదా ప్రజాప్రముఖులనుండి పరిపాలనావిషయములకు సంబంధించిన అభిప్రాయములను సేకరించుచుండుట జరుగుచుండెడిది. అట్టి అభిప్రాయప్రకటన సాధారణముగ ముఖతఃగాని లేదా చేతినెత్తుట మొదలగు చేష్టలవలనగాని వెల్లడింపబడుట జరిగెడిది. క్రీస్తునకు పూర్వమున గ్రీస్‌లోని నగర రాజ్యములందును, భారతదేశములోని గణ రాజ్యములందును, బౌద్ధ సంఘములందును ఇట్టి విధానము అమలులో ఉండెడిది. కాని, ధన, బల ప్రాబల్యములకు లొంగుటవలన మానవుడు - ఇట్టి బహిరంగ ప్రకటనమున - తన అభిప్రాయమును స్వేచ్ఛగ వెల్లడింపలేకుండుట క్రమముగ వ్యక్తమైనది. అంతట రహస్యముగ అభిప్రాయప్రకటనకు సాధనాంతరములు అన్వేషింపబడినవి. తత్ఫలితముగ 'బేలట్' పద్ధతి ప్రవేశపెట్టబడినది. ఒక పదవికై నిలబడిన అభ్యర్థులకు ఒక్కొక్కరికి ఒకవిధమగు బంతిని (బాల్ - బంతి) నిర్ణయించి, అట్టివానిని వోటరుకు ఈయగా అతడు నచ్చిన అభ్యర్థి బంతిని పెట్టెలోవేసి, తక్కినవానిని అచ్చట ఉన్న కాపలావానికి ఇచ్చివేసెడివాడు. కాని, ఇందును అనేక లోపములు కనుగొనబడినవి. తరువాత బేలట్ బంతికి బదులుగ బేలట్ కాగితము యునైటెడ్ స్టేట్స్‌లో 1776 లో మొదటిసారిగ ప్రవేశపెట్టబడినది. 19 వ శతాబ్దిలో ఈ పద్ధతికి విపుల వ్యాప్తి కలిగి వివిధ దేశములలో శాసనసభల ఎన్నికలందు అమలులోనికి తేబడినది. ఇందును రహస్య రక్షణకు కాల క్రమమున పెక్కు మార్పులు జరిగి, 'ఆస్ట్రేలియా పద్ధతి' అనబడు బేలట్ విధానము గ్రేట్ బ్రిటన్, యునైటెడ్ స్టేట్స్, కామన్ వెల్త్ రాజ్యములందు ఆదరితమైనది. దీనిని అనుసరించి బేలట్ కాగితము ప్రభుత్వముచేత మాత్రమే తయారుచేయబడి వోటరుకు ఈయబడును. బేలట్‌నందు అభ్యర్థుల అందరిపేరులు వరుసగ ముద్రింపబడి ఉండును. వోటరునకు ఈయబడిన బేలట్ పేపరున, అతడు నచ్చిన అభ్యర్థి పేరునకు ఎదుట కత్తెర గురుతు (X) పెట్టును. భారతదేశమునను, ఇంకను మరికొన్ని దేశములందును రబ్బరు ముద్రతో అట్టి గురుతును వోటరు ముద్రించుట జరుగుచున్నది. ఇట్టి గురుతును ఒకే ఒక అభ్యర్థి పేరునకు

ఎదురుగ ఉంచవలెను. కొన్ని దేశములందు బేలట్ పత్రములపై పార్టీ పేరులు మాత్రమే ముద్రించుటయు కలదు.

నైష్పత్తికప్రాతినిధ్యరీతిలో ఎన్నికలు జరుగునపుడు ఒక నియోజకవర్గమునకు పలువురు ప్రతినిధులను ఎన్నుకొను అవకాశము ఉండును. అపుడు అభ్యర్థుల పేరులకు ఎదురుగ తనకు నచ్చిన ప్రాశస్త్యక్రమమును అనుసరించి సంఖ్యలను (1, 2, 3....) వేయవలయును.

శాసనసభలు మొదలగువానిలో ఒక తీర్మానముపై వోటును తీసికొనవలసినపుడు సాధారణముగ ముఖతః అభిప్రాయ గ్రహణము జరుగును. కాని, అందు ఎవరైనా సంవిభజన (డివిజన్) కోరినప్పుడు ఆమోదకులను, ప్రతికూలురను వేర్వేరుగ లెక్కించి నిర్ణయము జరుపబడును.

చీ. శే. రా.

**శంభూజీ :** చూ. మహారాష్ట్రులు - పు. 737.

**శకములు :** ఒక నిర్దిష్ట సంఘటనయొక్క కాలమును నిర్ణయించుటకు ఉపకరించు కాలమాన విధానము శకము అని వ్యవహరింపబడుచున్నది. అనంతమగు కాలమున ఒక ప్రత్యేక సంఘటనయొక్క ఉనికిని గుర్తించుట, దానికి ఒక నిర్దిష్ట సంఘటననుండి వెనుకకుగాని, ముందునకుగాని కాలరీత్యా గల దూరమును లెక్కించుటవలన మాత్రమే సాధ్యము కాగలదు. అట్టి నిర్దిష్ట సంఘటన సర్వజనామోదితమై ఉండినపుడు మాత్రమే ఈ లెక్కింపు ప్రయోజనకారి కాగలదు.

ప్రాచీన నాగరకతల కాలమునందు ఒక సంఘటనయొక్క కాలమును తెలియజేయవలసి వచ్చినప్పుడు దానిని ఆ దేశపాలకుని పట్టాభిషేక కాలమునుండి లెక్కించెడివారు. ప్రాచీనయుగమున ఈజిప్టున, బాబిలోనియాయందు, పారసీకమున, భారతదేశమున ఇట్టి పద్ధతియే వ్యాప్తి యందు ఉండినది. గ్రీస్‌న అయిదేండ్లకు ఒకసారి జరుగు ఒలింపియా క్రీడలు మొదలుగ లెక్కించుట పరిపాటిగ ఉండెడిది. రాజపాలనలును, ఒలింపియా ఉత్సవ సంధి కాలములును పరిమిత వ్యవధి కలిగి త్వరలో అంతరించునవి అగుటచే వీనివలన కాలపరిగణన నిర్దిష్టముగ జరిగెడిది కాదు. ఏదియో ఒక కాలమును నిర్దిష్టకాలముగ గుర్తించి, అటనుండి నిరంతరాయముగ లెక్కించుట అనునది సెల్యూసిడ్ శకముతో పశ్చిమ ఆసియాయందు మొదలయ్యెనని చెప్పవచ్చును. ఈ శకము క్రీ. పూ. 311 లో మొదలైనది. అప్పటి బాబిలోనియన్ జ్యోతిశ్శాస్త్రజ్ఞులు ఇందుకు దోహదము కల్పించిరి. అప్పటిలో పశ్చిమ ఆసియాను గ్రీక్ చక్రవర్తి సెల్యూకస్ పాలించుచుండెను.

భారతదేశమున క్రీ. శ. మూడవ శతాబ్ది వరకును రాజులపరిపాలనావత్సరములే శాసనములందు వాడబడినవి. అంతట గుప్తశకము మొదలగునవి వ్యాప్తిలోనికి వచ్చినవి. కాని, తరువాత వీని అన్నింటిని మించి విక్రమశక, శాలివాహనశక పరిగణన భారతదేశమునను, విశాలభారతమునను వాడుకలోనికి వచ్చినవి. వీనిలో తొలుతటిది క్రీ. పూ. 58 లోను, రెండవది క్రీ. శ. 78 లోను మొదలిడినటుల లెక్క ఉన్నను, ఇవి క్రీ. శ. ఆరవ శతాబ్ది తరువాత మాత్రమే వాడుకలోనికి వచ్చినవి. ఈ శకములకు ఆ యా పేరులు కలుగుటను గురించియు గాథలు అనేకములు కలవు. కాని, చారిత్రకముగ నిర్ధారితమగు ఉపపత్తి మాత్రము లేదు. మహమ్మదీయ పరిపాలనాకాలమున ఇస్లామిక ప్రపంచమున అంతటను 'హెజిరా' అను చాంద్రమాన వత్సరముల శకము వ్యాప్తిలోనికి వచ్చినది. ఇందుకు తోడుగ సౌరమాన రీతిలో 'ఫసలీ' యను అమలులో ఉండినది. శివాజీ పట్టాభిషేకమునకు గురుతుగ 'రాజ్యాభిషేక శకము' అనునది కొంతకాలము వ్యాప్తిలో ఉండినది. ఇవికాక, సంప్రదాయరీతిలో కలియుగాది వత్సరములు, సప్తర్షి కాలము అనునవియు భారతదేశమున చాలకాలము వ్యాప్తిలో ఉండినవి. వీనిలో తొలుతటిది ఇప్పటికిని దేశీయపంచాంగములందు ప్రస్తావింపబడుచున్నది.

ఆధునిక యుగమున క్రీస్తు శకము దాదాపుగ ప్రపంచమంతట వాడుకలో ఉన్నది. క్రీస్తు జననాదిగ ఇది ఆరంభితమైనటుల చెప్పబడుచున్నను తరువాతి లెక్కలవలన ఈ శకాదికి నాలుగు సంవత్సరములు ముందుగనే క్రీస్తు జన్మించినటుల తేలినది. ఈ శకము తొలుతగ షార్లమేన్ ప్రభుకాలము (క్రీ. శ. 8వ శతాబ్ది) నుండి మాత్రమే యూరప్‌న వాడబడుట మొదలై క్రమముగ యూరపీయనాగరకతతోపాటు విదేశములకు వ్యాపించినది [చూ. గణిత, ఖగోళ శాస్త్రములు సం. 9; శాలివాహన శకము పు. 567; సప్తర్షి యుగము - లౌకికాబ్దము పు. 599].

భారతదేశీయ శకముల పట్టిక, తత్సంబంధములగు వివరములతో ప్రక్కపుట - 850 - లో పట్టిక రూపమున ఈయబడినది.

చీ. శే. రా.

**శతవర్ష సంగ్రామము (1338 - 1453) :** ఇంగ్లండు, ఫ్రాన్స్‌దేశముల మధ్య జరిగిన ఒక దీర్ఘసంగ్రామము. నిజముగ ఇది 115 ఏండ్ల కాలము జరిగినను, ఎడనెడ కొన్నిఎడల జరిగిన విరామములవలన దీనిని సంక్షిప్తముగ శతవర్ష సంగ్రామము అని వ్యవహరించుట పరిపాటి అయినది. ఫ్రాన్స్, ఇంగ్లండుల రాజవంశముల మధ్య ఉండిన బాంధవ్యములనుబట్టి వారసత్వరీత్యా తనకు

## భారత శకములు - పట్టిక

| వ. సం. | శకము | ఆరంభము (క్రైస్తవశకపు లెక్కలో) | 1964 కు సరియగు వత్సరము | సంవత్సరాది |
|---|---|---|---|---|
| 1. | కలియుగ | క్రీ. పూ. 3101 | 5065 | ఏప్రిల్-చైత్ర శు. 1 |
| 2. | సప్తర్షి | క్రీ. పూ. 3176 | — | — |
| 3. | యుధిష్ఠిర | క్రీ. పూ. 2448 | 4412 | — |
| 4. | బుద్ధ నిర్వాణ | క్రీ. పూ. 544 | 2508 | మే 17-వైశాఖ |
| 5. | మహావీర నిర్వాణ | క్రీ. పూ. 527 | 2491 | కార్తిక శు. 1 |
| 6. | విక్రమ | క్రీ. పూ. 57 | 2021 | ఏప్రిల్-చైత్ర |
| 7. | * శాలివాహన | క్రీ. శ. 78 | 1886 | ఏప్రిల్-చైత్ర శు. 1 |
| 8. | చేది | క్రీ. శ. 248 | 1716 | ఆశ్విన్-శు. 1 |
| 9. | వలభి | క్రీ. శ. 318 | 1664 | కార్తిక |
| 10. | గుప్త | క్రీ. శ. 319 | 1645 | చైత్ర శు. 1 |
| 11. | హర్ష | క్రీ. శ. 606 | 1358 | — |
| 12. | హెజిరా | క్రీ. శ. 622 | 1342 | మొహరమ్ |
| 13. | బెంగాల్ సన్ | క్రీ. శ. 593 | 1371 | ఏప్రిల్ (సౌరమానపరిగణన) |
| 14. | విలాయతిసన్ | క్రీ. శ. 592 | 1372 | సెప్టెంబరు(సౌరమానపరిగణన) |
| 15. | అమలీసన్ | ,, | 1372 | — |
| 16. | ఫసలీసన్ | ,, | 1372 | — |
| 17. | మాగి | క్రీ. శ. 638 | 1374 } 1326 | జూన్, జూలై, ఏప్రిల్ |
| 18. | కొల్లమ్ | క్రీ. శ. 824 | 1440 | ఆగస్టు, సెప్టెంబరు |
| 19. | నేవార్ | క్రీ. శ. 879 | 1085 | కార్తిక - శు. 1 |
| 20. | చాళుక్య | క్రీ. శ. 1075 | 891 | — |
| 21. | లక్ష్మణసేన | క్రీ. శ. 1104-1108 | — | కార్తిక - శు. 1 |
| 22. | సింహ | క్రీ. శ. 1113 | 851 | ఆషాఢ - శు. 1 |
| 23. | తారీఖ్ | క్రీ. శ. 1555 | 409 | వసంత విషు. |
| 24. | రాజ్యాభిషేక | క్రీ. శ. 1673 | 291 | జ్యేష్ఠ - శు. |

గమనిక : బెంగాల్ సన్ శకమున క్రీ. శ. 1556 మొదలుగ సౌరమాన పరిగణన మొదలైనది; ఫసలీకి సౌరమాన పరిగణన క్రీ. శ. 1584 లో ఆరంభితమయ్యెను. నేపాల్ నందు క్రీ. శ. 1768 వరకు నేవార్ శకము అమలులో ఉండెను.

* భారత ప్రభుత్వము పంచాంగ సంస్కరణ సంఘమువారి సూచనను అనుసరించి శాలివాహన శకము అచ్చపు సౌరమానముగ మార్చబడినది (1963). తదాదిగ మార్చి 22 వత్సరాదిగ లెక్కింపబడుచున్నది.

ఫ్రాన్సు దేశపు రాచరికము చెందవలెనని ఇంగ్లండు దేశపు రాజు భావింపగ, దానిని ఫ్రాన్సు పాలకుడు గుర్తింపక పోవుట ఈ యుద్ధమునకు మూలకారణము. ఈ యుద్ధము ఆరంభమగునాటికి ఫ్రాన్సుదేశమున ఫిలిప్ - IV, ఇంగ్లండున ఎడ్వర్డ్ - III పాలించుచుండిరి. ఇంగ్లండు పాలకునకు బద్ధశత్రువగు స్కాట్‌లాండ్ దేశ ప్రభువునకు ఫిలిప్ - IV సాయమొసగుట ఈ యుద్ధమునకు సద్యః కారణముగ ఉపకరించినది.

ఎడ్వర్డ్ - III సేనాసహితముగ ఉత్తర ఫ్రాన్సుపై 1338 లో సాగించిన దండయాత్రతో మొదలైన ఈ సంగ్రామము 1347 లో కెలేనగరము అతనికి లొంగిన తరువాత ఉభయపక్షముల సమ్మతితో రెండు సంవత్సరముల కాలము విరమింపబడినది. ఇంతలో మహామారి (బ్లాక్ డెత్) అను జాడ్యము తక్కిన యూరప్‌తోపాటుగ ఫ్రాన్సును, ఇంగ్లండును క్షోభింపచేయుటవలన ఆ యుద్ధ విరమణ 1355 వరకు సాగినది. 1355 లో యుద్ధము

మరల మొదలయ్యెను. ఇంతలో ఫిలిప్ - IV గతించి అతని కుమారుడు జాన్ రాజయ్యెను. కడకు పొయిటర్స్ అను చోట జరిగిన ఒక పోరాటమున (సెప్టెంబర్ 19, 1356) జాన్ బందీగా ఇంగ్లీషువారికి చేజిక్కెను. తరువాత, 1360 లో కుదిరిన ఒక సంధివలన ఫ్రాన్స్ రాజరికమునకు, తనకు గల హక్కును ఎడ్వర్డ్ వదలుకొనినందులకు పరిహారముగ ఎడ్వర్డ్‌కు కెలేనగరమును, మరికొండు పరిసర ప్రదేశములును సర్వాధికారములతో దత్తముచేయబడుటయేగాక, బందీయగు తమరాజును విడిపించుకొనుటకై ముప్పదిలక్షల బంగారు నాణెములను ఇంగ్లండునకు ఫ్రాన్స్ చెల్లించినది.

అయినను విరోధములు అంతటితో సమయలేదు. 1367లో యుద్ధము మరల మొదలైనది. అంతట క్రమముగ ఇంగ్లీషువారి వశమున ఉండిన పలు ప్రదేశములను ఫ్రెంచివారు వశపరచుకొనిరి. కాని, ఇంగ్లండున హెన్రీ - V పాలించు కాలమున అతని నాయకత్వమున ఇంగ్లీషు సేనలు ఫ్రాన్స్‌నందు ఘనవిజయములను సాధించినవి. తత్ఫలితముగ ఇంగ్లండు పాలకుని కోరికను ఆమోదించురీతిగ ఒక ఒడంబడిక కుదిరినను (1420), హెన్రీ - V అకాలమరణము వలన ఆ ఒడంబడిక భగ్నమై, మరల యుద్ధము మొదలైనది (1423). అటనుండి 30 ఏండ్లు సాగిన యుద్ధములో విజయము పలుమారులు చేతులు మారినది. ఈ కాలముననే జోన్ ఆవ్ ఆర్క్ [చూ. పు. 487] అను బాలిక ఫ్రెంచివారి పక్షమున పోరాడుటకు భగవానుడు తన్ను నిర్దేశించెనని చెప్పి పాల్గొని, పలు విజయములను సాధించియు, కడకు ఫ్రెంచి విద్రోహులవలన ఇంగ్లీషు సేనలకు ఒప్పగింపబడి, అభిచారిణి అను నెపమున కొంతన దగ్ధ అయ్యెను. అంతటినుండి ఇంగ్లీషు సేనలు పలు పరాజయములను ఎదుర్కొనినవి. కడకు 1451 నాటికి ఫ్రాన్స్‌న కెలేనగరము మాత్రమే ఇంగ్లీషువారి వశమున నిలిచినది. కాని, ఉత్తర ఫ్రాన్స్‌నందలి కొన్ని రాష్ట్రముల ప్రజలు మాత్రము అప్పటికిని ఇంగ్లీషు సేనలకు అండగ నిలువబడుటకు ఉత్సహించిరి. అంతట వారి సాయముతో ఇంగ్లీషు సేనలు ఫ్రెంచిసేనలతో జూలై 17, 1453 న తమ కడపటి పోరాటమును కాస్టిల్లాన్‌నగరమువద్ద సాగించినవి. కాని, కడకు ఘోరపరాజయమును పొందినవి. అంతటితో శతవర్ష సంగ్రామము ఎట్టి శాంతి సంధియు లేకనే తుదముట్టినది.

ఈ సంగ్రామము తుదవరకు ఫ్రాన్స్‌దేశముననే సాగుటవలన ఆ దేశము యుద్ధ ఫలితములగు కరవుకాటకములకు గురియైనది ; సాంఘిక సుస్థిరత చాలవరకు సన్నగిల్లినది. కాని, పై వర్గములకు చెందిన యుద్ధప్రియులగు సర్దారులు పలువురు అంతరించుటవలన ఫ్రాన్స్‌న జాతీయైక్యమునకు మంచి మార్గము ఏర్పడినది. అంతేకాదు, ఇంగ్లండు, ఫ్రాన్స్ దేశములందు రెండింటను జాతీయత పెచ్చుపెరుగుటకు ఈ సంగ్రామము దోహదకారి అయినది. గు. రా.

**శాన్‌ఫ్రాన్సిస్కో సమావేశము :** ద్వితీయ ప్రపంచ యుద్ధ అవసానదశలో, తరువాత ప్రపంచ శాంతిభద్రతలను కాపాడుటకై ఏర్పడవలసిన యునైటెడ్ నేషన్స్ ఆర్గనైజేషన్ యొక్క అధికారములను నిర్ణయించుటకై, ఉత్తర అమెరికాలోని శాన్‌ఫ్రాన్సిస్కోలో జరిగిన అంతర్జాతీయ సమావేశము (1945, ఏప్రిల్ 25 - జూన్ 26). ప్రపంచ మండలి వివిధ దేశముల ప్రతినిధులు 50 మంది ఈ సమావేశమున పాల్గొనిరి. జూన్ 25 న యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వకార్యదర్శి ఈ క్రింది అంశములతో ఒక తాత్కాలిక ముసాయిదాను సమావేశమునకు సమర్పించెను. యునైటెడ్ నేషన్స్ ఆర్గనైజేషన్‌నందు - 1. సంస్థయొక్క విధానములను నిర్ణయించుటలో ప్రాధాన్యత వహించు సాధారణ సభ (జనరల్ అసెంబ్లీ); 2. సైనిక, రాజకీయ సమస్యల పర్యవేక్షించు అధికారము గల భద్రతాసమితి (సెక్యూరిటీ కౌన్సిల్); 3. ఆర్థిక, సాంఘిక తగాదాలను పరిష్కరించుటకై ఆర్థిక, సాంఘిక సంఘము (ఎకనమిక్ అండ్ సోషల్ కౌన్సిల్); 4. అంతర్జాతీయ వివాదములను విచారించి తీర్పుటకై అధికారము గల అంతర్జాతీయ న్యాయస్థానము (ఇంటర్నేషనల్ కోర్ట్ ఆవ్ జస్టిస్) అను నాలుగు భాగములు ఉండవలెను; 5. యునైటెడ్ నేషన్స్ యొక్క పరిపాలనా బాధ్యతలు ఒక సెక్రటరీ జనరల్ యొక్క పర్యవేక్షణ క్రింద సాధారణ సెక్రటరీలచే నిర్వహించబడుచుండవలెను.

ఈ యునైటెడ్ నేషన్స్ ఆర్గనైజేషన్ యొక్క అధికారనిర్ణయపత్రము (చార్టర్) మీద జూన్ 26, 1945 న 50 రాజ్యములకు చెందిన ప్రతినిధులు సంతకములు చేసిరి. తదుపరి, కోమిన్‌టాంగ్ చీనా, ఫ్రాన్స్, సోవియట్ రష్యా, బ్రిటన్, యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వములతో సహా ⅔ వంతులకు పైబడిన మెజారిటీతో బలపరచబడి, 24-10-1945 న ఆ చార్టర్ అమలులోనికి వచ్చెను. స్వా. వెం.

**శాలంకాయనులు :** చూ. తె. సం. సం. 3; పు. 110.

**శాలివాహన శకము :** చూ. శకములు - పు. 849.

**శాసనవిద్య :** పూర్వయుగములందలి శాసనములు, నాణెములు మొదలగువానిని తత్తత్కాలక్రమమును అనుసరించి వర్గీకరించి, పురాలిపి పరిజ్ఞానము మూలమున వానిని చదివి, పరిష్కరించి, వివరించుటయే ధ్యేయముగ గల ఒక

విజ్ఞానప్రక్రియ. 'ఎపిగ్రఫీ' అనుపేర పాశ్చాత్యలోకమున పందొమ్మిదవ శతాబ్ది మొదలుగ పరిణతి చెందిన ఈ విద్య కాలక్రమమున ప్రాచ్యదేశములందును కుదురుకొని, చరిత్ర రచయితలకు చాల సహాయకారి అయినది.

ఈ విద్యాభాగమున ముఖ్యమైనది పురాలిపివిజ్ఞానము. ఈజిప్టునందలి ప్రాచీన లిపులను గురించిన పరిజ్ఞానము పలువురు పండితుల కృషిచే చక్కగ 19 వ శతాబ్దమందే ద్యోతకము కాగలిగినది [చూ. రొసెట్టాశిల - పు. 810]. బాబిలోనియాకు చెందిన కీలలిపి శాసనముల లిపిపరిజ్ఞానము రాలిన్‌సన్ పండితుడు మొదలగువారి కృషివలన సులబ్ధమైనది. కాని, ఆ ప్రాచీనకాలమునకే చెందిన క్రీట్ లిపిని, సింధునాగరకతా లిపిని సువ్యక్తములు చేయుట ఇప్పటికి సాధ్యము కాలేదు.

భారతదేశమున ప్రాచీన శాసనములందు కనపట్టు బ్రాహ్మీలిపిని తొలుతగ వ్యక్తమొనర్చిన ఖ్యాతి ప్రిన్‌సెప్ అను పండితునకు దక్కినది [చూ. సం. 6 - పు. 735]. తరువాత కాలక్రమమున బ్రాహ్మీజన్యములగు తదితర ప్రాచీన లిపులను పలువురు పండితులు తమ నిరంతర కృషివలన వ్యక్తములుగ చేసిరి. భారతదేశీయ లిపుల పరిణామమును గురించిన వివరములు - పండిత గౌరీశంకర హీరాచంద్ ఓఝా అనువారు రచించిన - 'భారతీయ ప్రాచీన లిపిమాల' అను హిందీ గ్రంథమున సమగ్రముగ పొందుపరుపబడినవి [చూ. లిపి పరిణామము, సం. 4; పు. 1056].

చీ. శే. రా.

**శాసనసభ :** ఒక దేశపు లేదా రాజ్యపు ప్రభుత్వములో శాసనముల నిర్మాణము, సవరణ, ఉపసంహరణలను జరుపుటకును, ప్రభుత్వ ఆదాయ వ్యయముల విధానమును నిర్దేశించుటకును అధికారము కలిగి ఉండు భాగమునకు 'శాసనసభ' అని పేరు.

దాదాపు సర్వ అర్వాచీన రాజ్యములలోను ద్వికక్ష్య వ్యవస్థయే అమలులో ఉన్నది.

వేరువేరు దేశములలోని శాసనసభలు పార్లమెంట్, కాంగ్రెస్, లెజిస్లేచర్, డయెట్ మొదలైన వేరువేరు పేరులతో వ్యవహరించబడుచున్నవి. ఎగువ కక్ష్యకు సర్వసాధారణముగ కనవచ్చు పేరు 'సెనేట్'; దిగువ కక్ష్యకు 'చేంబర్ అవ్ డిప్యుటీజ్ (ప్రతినిధి మండలి)' అని కొన్ని రాజ్యాంగములలో వాడుకగా ఉన్నది. ఆ యా రాజ్యముల రాజ్యాంగవ్యవస్థలలో ఈ శాసనసభల లక్షణములను చూడనగును.

* * *

**శాసనోల్లంఘనోద్యమము :** చూ. భారతదేశము - పు. 664.

**శివాజీ (1627 - 1680) :** మహారాష్ట్ర రాజ్య సంస్థాపకుడు. ఈతడు 1627 లో మహారాష్ట్ర ప్రాంతములోని శివనేరులో జన్మించెను. ఈతని తండ్రి షాజీభాన్‌స్లే నాటి బీజపూర్ పరిపాలకుని వద్ద జాగీర్‌దారుగ ఉండెను. శివాజీ తల్లి జిజాబాయి. చిన్ననాట తల్లి చెప్పెడు రామాయణ, భారతాది పురాణ గాథలవలన ఉత్తేజితుడై హిందువులు మహమ్మదీయుల క్రింద దాస్యము చేయుటను సహింపజాలక హిందువులను దాస్యవిముక్తులను చేయుటకును, హిందూసామ్రాజ్యమును పునరుద్ధరించుటకును శివాజీ కంకణము కట్టుకొనెను. సమర్థ రామదాసు అను యతీశ్వరుడు ఈతని మత గురువు.

తోరణదుర్గమును శివాజీ 1646 లో వశపరచుకొని బీజపూర్ పాలకుని ప్రతిఘటింప గలిగెను; 1659 లో బీజపూర్ పాలకులచే బహుళ సైన్యముతో పంపబడిన అఫ్‌జల్‌ఖాన్‌ను తన బుద్ధి చతురతచే సంహరించి, వేల కొలది బీజపూర్ సైనికులను నాశనమొనర్చెను. 1666 లో ఢిల్లీని పాలించు మొగల్ పాదుషా ఔరంగజీబ్ [చూ. పు. 364] చేసిన కుట్రకు లోబడి వానిచే బందీకృతుడు అయ్యెను. కాని, మాయోపాయముచే తప్పించుకొని స్వస్థలమునకు వచ్చిచేరి మొగల్ ప్రభువులపై తిరుగుబాటు చేసెను. 1674, జూన్ 16 వ తేదీన రాయగడ దుర్గములో మహారాష్ట్ర సామ్రాజ్యమునకు పట్టాభిషిక్తుడై, 'ఛత్రపతి' యని బిరుదు వహించెను. రాజ్యము అంతటిని తన గురువునకు ధారవోసెను. సమర్థ రామదాసు తన ప్రతినిధిగ రాజ్యమేలుటకు శివాజీకి అనుజ్ఞ ఇచ్చెను. తత్కారణముననే శివాజీ పతాకము కాషాయపు రంగు గల వస్త్రమయ్యెను. శివాజీ తన పేరున నాణెములను చలామణీ చేయించెను.

మహమ్మదీయులు మహమ్మదీయేతరుల ఎడ చూపిన నిరాదరణకు ప్రతిక్రియగ వారిని అదేవిధముగ తన సైనికులు హింసించుటకు శివాజీ ఒప్పుకొనెడివాడు కాడు. ఇతడు విజేతగనే కాక, పరిపాలనాదక్షుడుగ కూడ పేరు గాంచెను. శివాజీ 1680 సంవత్సరమున దివంగతుడయ్యెను [చూ. మహారాష్ట్రులు పు. 737; మహారాష్ట్ర పరిపాలనా విధానము పు. 737].

మ. అ. శ.

**శిష్టసభ :** చూ. శాసనసభ.

**శ్యామ ప్రసాద్ ముఖర్జీ (1901 - 1953) :** ప్రసిద్ధ భారత రాజకీయవేత్త; ప్రజ్ఞాశాలి. ఇతని తండ్రి ఆసుతోష్ ముఖర్జీ బెంగాల్‌నందు ప్రసిద్ధ విద్యావేత్త. ముఖర్జీ బారిస్టర్ పరీక్షలో ఉత్తీర్ణుడై 1923 లో కలకత్తా యూనివర్సిటీలో ఫెలో (సంస్నాతకుడు) అయ్యెను. 1934 నుండి

1938 వరకు కలకత్తా యూనివర్సిటీకి ఉపాధ్యక్షుడై, యూనివర్సిటీ అభ్యున్నతికి మిక్కిలి పాటుపడెను.

బెంగాల్ శాసనసభకు 1929 లో ఎన్నికయై, ఫజలుల్ హక్ మంత్రివర్గమునందు ఆర్థిక మంత్రిగా వ్యవహరించెను. స్వతంత్ర భారతమున 1950 లో కేంద్ర మంత్రివర్గమునందు పరిశ్రమలు, సరఫరా శాఖలకు మంత్రి అయ్యెను. ప్రధాన మంత్రితో సిద్ధాంత విభేదములు చెలరేగిన కారణమున మంత్రి పదవికి రాజీనామా ఇచ్చి, 1950 లో 'జనసంఘ్' అనెడి క్రొత్త రాజకీయ పక్షమును ఏర్పరచి, ఆ పక్షమునకు అధ్యక్షుడుగను, లోక్‌సభలో ప్రతిపక్ష వర్గమున ప్రముఖుడుగను వ్యవహరించెను. ప్రభుత్వవిధానములను సునిశితముగను, నిర్మాణాత్మక దృష్టితోడను ఇతడు విమర్శించెను.

భారతదేశముతో కాశ్మీర్ సంవిలీనమునకై ఇతడు తీవ్ర కృషిచేసెను. 1953 లో కాశ్మీర్ లోయను సందర్శింప బోయి అచటనే మరణించెను. గు. రా.

**శ్రామిక వర్గ నియంతృత్వము** ; మార్క్సియన్ సోషలిజమ్‌నకు ప్రధానమైన లక్షణము శ్రామిక వర్గమును వర్గచైతన్యము గల ఒక బలవత్ పక్షముగా సంఘటిత పరచుట. ఇట్టి పక్షము అంతర్జాతీయమైనదిగా ఉండవలెను. ఏలయన - శ్రామికులకు ఈ దేశము, ఆ దేశము అను భేదము లేదు. ప్రపంచ శ్రామికులందరును ఏకము కావలెను. ఒక జగద్వ్యాప్తమైన విప్లవము ద్వారా శ్రామికవర్గవిమోచనమును సాధింపవలెను. యుద్ధసదృశమైన ఇట్టి విప్లవమును వెన్నంటి అనేకములగు చిక్కులు ఎదుర్కొనును. పెట్టుబడిదారీ దేశముల మధ్య జరుగు యుద్ధములను శ్రామికవర్గ విమోచనకు వినియోగించుకొనవలెను. ఇట్టి విమోచనకై వివిధ దేశములలో వేరు వేరు పోరాటములు సాగవలెను. మార్క్సును, ఏంగెల్‌ను 'బాగుగా అభివృద్ధి చెందిన దేశాలలో శాంతియుత విప్లవములు సంభవమే' అను అర్థము వచ్చునట్లు ఒక చోట వ్రాసి ఉన్నను, వారి ప్రధాన ప్రబోధములు మాత్రము సాయుధ విప్లవచర్యకును, అన్యవర్గ సంపూర్ణ నిర్మూలనమునకును మాత్రమే ఎక్కువ ప్రాధాన్యము ఇచ్చినవి. నిరంతరముగ సాగు ఈ విప్లవాత్మక సంఘర్షణలో శ్రామికవర్గమువారి కార్యక్రమమునకు సంప్రదాయ సిద్ధములగు న్యాయము, నీతి మొదలైన ఆలోచనలు ఏవియు అడ్డు రాకూడదు.

చిట్టచివరకు కమ్యూనిస్ట్ సమాజము ఏర్పడుట శ్రామిక వర్గ నియంతృత్వము ద్వారా మాత్రమే సాధ్యము అగును. మార్క్సు ఎప్పుడో తన యౌవనోద్రేకసమయమున చెప్పినమాట కాదు ఇది. బాగుగ పరిణతుడైన తరువాత కూడ 1875 లో 'గోథా' కార్యక్రమమును విమర్శించుచు అతడు ఇట్లనెను. 'పెట్టుబడిదారీ సమాజము కమ్యూనిస్ట్ సమాజముగ పరిణామము చెందుటకు మధ్య కాలములో ఒక విప్లవాత్మక పరిణామయుగము వచ్చును. దీనితో ఐక్యకాలికముగనే ఒక రాజకీయ పరిణామదశ కూడ ప్రాప్తించును. ఆ కాలములో రాజ్యము విప్లవాత్మకమైన శ్రామిక వర్గనియంతృత్వ రూపమున తప్ప మరొక విధముగ ఉండుటకు వీలులేదు [చూ. కమ్యూనిజమ్ పు. 366]. ప్ర. రా.

**శ్రామిక వర్గము** : కొంత నిర్ణీత కాలవ్యవధి పెట్టి, తమ శ్రామిక శక్తిని పెట్టుబడిదారుడైన ఒక యజమానికి విక్రయించుటకును, ప్రతిఫలముగ బత్తెములు గ్రహించుటకును, న్యాయశాస్త్ర దృష్ట్యా, ఆర్థిక దృష్ట్యా కూడ స్వేచ్ఛ కలిగి ఉన్న శ్రమ జీవుల వర్గమును ఈ పదము బోధించును. న్యాయశాస్త్ర దృష్టిలో వీరికి గల స్వేచ్ఛ ఈ శ్రామికులను బానిసలనుండి, వెట్టి చాకిరీ రైతాంగమునుండి వేరుపరచుచున్నది. ఉత్పాదక పరికరములను స్వయముగ కలిగి ఉండు చిన్న చిన్న పారిశ్రామిక నిపుణులు, రైతులు మొదలగు కొద్దిరకపు ఉత్పాదకులనుండి ఈ శ్రామిక వర్గమును వీరికి గల 'ఆర్థిక స్వాతంత్ర్యము' వేరుచేయుచున్నది. పెట్టుబడిదారుడైన యజమానికి వీరు తమ శ్రామికశక్తిని విక్రయించుచుండుటచే లాభదృష్టి లేని ప్రభుత్వనిర్వహణములో నియుక్తులైన ఉద్యోగులకంటె కూడ వీరు భిన్నులే అగుచున్నారు. నిపుణ, అర్ధ నిపుణ, అనిపుణ శ్రామికులే కాక పెట్టుబడిదారుల క్రింద పనిచేయు ఇతర సర్వవిధ శ్రామికులు కూడా 'శ్రామిక వర్గము' క్రిందకు వచ్చుటకు తగినంత విశాలముగా ఈ పదముయొక్క నిర్వచనము విస్తరిల్లినది. చిన్నవైనను అతి ప్రధానమైన సాంకేతిక పర్యవేక్షక, కార్యనిర్వాహకోద్యోగి వర్గములు మాత్రము 'శ్రామిక వర్గము' న చేరినటుల పరిగణింపబడవు. ఈ పై వర్గముల ఆదాయము ధన సంచయనమునకు అవకాశము ఇచ్చునంత అధికముగా ఉండును. ప్ర. రా.

**శ్రీహర్షుడు** : చూ. హర్షవర్ధనుడు - పు. 909.

**షాజహాన్** : చూ. మొగల్ సామ్రాజ్యము - పు. 769.

**షార్లమేన్** (742 - 814) : ఇతనికి 'చార్లెస్ మహనీయుడు' అని కూడ పేరు కలదు. ఇతడు 768 నుండి 814 వరకు ఫ్రాంక్‌ల రాజు ; 800 నుండి 814 వరకును పశ్చిమ రోమన్ సామ్రాజ్యమునకు చక్రవర్తి. జర్మనీని పాలించిన రాజులలో చక్రవర్తి బిరుదమును వహించిన వారిలో మొదటివాడు ఇతడే.

ఇతని తండ్రి పెపిన్ 768 లో చనిపోగానే సోదరుడైన కార్లొమన్‌తో కలసి రాజయ్యెను. మరి మూడు సంవత్సరములకు ఆ సోదరుడు చనిపోగనే ఇతడు ఒక్కడే ఫ్రాంక్‌ల రాజై ఫ్రాన్స్ దేశమును పాలించెను. ఇతని జైత్రయాత్రలలో మొదటిది లొంబార్డీ దేశ విజయమునకు సంబంధించినది. షార్లమేన్ లొంబార్డీ దేశమును జయించి, దానికి రాజుగా 774 లో రాజ్యాభిషిక్తుడు అయ్యెను.

అప్పటిలో రైన్‌నదికిని, జట్‌లండ్ ద్వీపకల్పమునకును నడుమ ఉండిన శాగ్జన్‌లు తన రాజ్యమునకు తరుచుగా దండెత్తివచ్చుచుండుట చేత షార్లమేన్ 774 లోనే ఆ ప్రదేశమును కూడ జయించి, తన అధికారమును అక్కడ సుస్థిరము కావించుకొనెను.

ఆ తరువాత షార్లమేన్ స్పెయిన్ దేశమునకు జైత్రయాత్ర సాగించి, అక్కడ సాగుచుండిన అరబ్బీ రాజ్యాధికారమును తొలగించుటకు సంకల్పించి కృషిచేసెను. కాని, ఆ దండయాత్ర విఫలమయ్యెను.

షార్లమేన్ బవేరియాకు 788 - 799 లో దండెత్తి వెళ్ళి, బవేరియాప్రభువును తొలగించి, ఆ రాజ్యమునకు రాజయ్యెను. అక్కడనుండి ఇతడు అవర్ జాతి వీరులను జయించి, తన రాజ్యాధికారమును ఎడ్రియాటిక్ సముద్ర తీరమునుండి బాల్టిక్ సముద్రతీరము వరకును వ్యాపింపజేసికొనెను.

ఆ కాలమున పోప్‌గా ఉండిన లియో - III ప్రోత్సాహమున షార్లమేన్ పశ్చిమ రోమన్ సామ్రాజ్యమును స్థాపించుటకు పూనుకొని, జైత్రయాత్రలను ఇంకను సాగించుచుండెను. 800 లో క్రిస్మస్ పండుగ దినములలో పోప్ ఇతని తలపై కిరీటము పెట్టి, ఆశీర్వదించి, ఇతడు రోమన్‌ల చక్రవర్తి అయినట్లు ప్రకటించెను. పోప్ ప్రకటించిన బిరుదమునకు బైజాంటీన్ (తూర్పు రోమన్ సామ్రాజ్య) చక్రవర్తి తన సమ్మతిని తెలియజేసి గౌరవించెను. 476 లో రోమన్‌సామ్రాజ్యము విచ్ఛిన్నమైన తరువాత మరల ఈ నాటికి లాటిన్ (పశ్చిమ) సామ్రాజ్యము నవీనముగా పునరుద్ధరింపబడినది. కాని, ఈ కెరొలింజియన్ సామ్రాజ్యము షార్లమేన్ తర్వాత దీర్ఘకాలము నిల్వలేదు. అయినను, కొన్ని తరములపాటు సామ్రాజ్య పునః స్థాపనము అనే ఆశయము ఆశాజనకముగా ఉండి, ఓటో - I [చూ. పు. 364] పవిత్ర రోమన్ సామ్రాజ్య సమ్రాట్‌గా రాజ్యాభిషిక్తుడగుటతో సఫలీకృతమైనది.

షార్లమేన్ యుద్ధములు సాగించి సామ్రాజ్యమును నిర్మించినను, తన రాజ్యాధికారమునకు లోబడిన ప్రదేశమంతయు తన పరిపాలనమును గౌరవించునట్లు చేసికొనగలిగిన సమ్రాట్‌గానే అతడు ప్రఖ్యాతి బడసెను. సామ్రాజ్యమందు అంతటను ఉన్నతమైన సంస్కృతి వ్యాపించినది. విద్యావ్యాప్తికి ఇతడు చేసిన సేవ అత్యధికమైనది. ఆకెన్ వద్ద ఇతడు గొప్ప భవనము కట్టించి, ఘనతకు ఎక్కిన మతవిద్యాబోధకసంస్థను నెలకొల్పి, ఆంగ్ల విద్వాంసుడయిన అల్‌క్విన్ (735 - 804) ను అధ్యక్షునిగా నియమించెను. విద్యావ్యాప్తికి ఇంత గొప్ప సేవ చేసిన షార్లమేన్ ఆనాటి పరిస్థితులను అనుసరించి లాటిన్ భాషలోగల గ్రంథములను చదువుట మాత్రము నేర్చుకొనెనే కాని, వ్రాయుట నేర్చి ఉండలేదు.

ఇతని తరువాత బలహీనులైన వారి పరిపాలనమువలన ఇతడు స్థాపించిన సామ్రాజ్యము విచ్ఛిన్నమైపోయినను, ఇతని ప్రఖ్యాతి మాత్రము నిలచియే ఉన్నది. గి. వేం. సీ.

**షిమొనోసెకీ సంధి** (1895, ఏప్రిల్ 17) : కొరియాను గూర్చి చీనా - జపాన్ మధ్య 1894 ఆగస్టులో ఆరంభమైన యుద్ధమును అంతమొందించిన సంధి. ఈ సంధి కొరియా స్వాతంత్ర్యమును ధ్రువపరిచెను. ఈ సంధి మూలకముగ జపాన్‌కు పెద్ద మొత్తమును నష్టపరిహారము క్రింద ఇచ్చుటకును, ఆ రాజ్యమునకు అనుకూలమైన వాణిజ్య సౌకర్యములు కూర్చుటకును చీనా పూచీపడెను. ఫార్మోజా, పెస్కడోర్స్, ఆర్థర్ రేవులతో సహా లియోటాంగ్ ద్వీపకల్పమును జపాన్‌కు చీనా దత్తమొనర్చెను.

కాని, రష్యా, ఫ్రాన్స్, జర్మనీ దేశప్రభుత్వముల రాజకీయ తంత్రముల ఒత్తిడిచే సంధి పత్రములపై సంతకములైన పక్షములోపుగనే జపాన్‌వారు లియోటాంగ్ ద్వీపకల్పముపై తమకు కల హక్కును విధిలేక వదులుకొనిరి. ఆర్థర్ రేవు తిరిగి చీనాకు ఒసంగబడెను. అయినను, ఈ సంధి చీనా ప్రధాన భూభాగముపై జపానీయుల ప్రాబల్యమును ఆర్జించుటలో తొలిచర్యగ పరిగణింపబడినది. స్వ. వెం.

**షేర్‌షా** (1500 ? - 1545) : భారతదేశ పరిపాలకులలో ఒక ప్రముఖుడు. మొగల్ సమ్రాట్ హుమాయూన్‌ను తరిమివైచి, ఇతడు కొంతకాలము ఢిల్లీ సామ్రాజ్యమును పాలించెను. [చూ. మొగల్ సామ్రాజ్యము - పు. 768].

ఆఫ్ఘన్ జాతిలో సూర్ వంశమున ఇతడు జన్మించెను. ఇతని తండ్రి హసన్‌ఖాన్ గుర్రముల వర్తకుడు. తొలుత ఢిల్లీ పాలకుడగు దౌలత్‌ఖాన్‌లోడీ కొలువులో ఇతడు (1519) కొంతకాలము చేరి, తరువాత జౌన్‌పూర్ పాలకునివద్ద ఉద్యోగము కుదుర్చుకొనెను (1522). అచట ఉన్నపుడు ఈతడు ఒక వేటలో సాహసోపేతముగ ఒక పెద్దపులిని చంపుటచే, ఇతనికి షేర్‌ఖాన్ అను బిరుదము

లభించెను. తరువాత ఇతడు ఢిల్లీకి చేరి, మొగల్ సామ్రాజ్య సంస్థాపకుడగు బాబర్ వద్ద జాగీర్ దారుగ నియమింపబడెను (1527). ఈ సమయముననే రాజ్య నిర్వహణ, రాజ్యతంత్రములు అన్నిటిని ఇతడు బాగుగ తెలిసికొనెను. ఇతని బుద్ధికుశలతకు బాబర్ మెచ్చి, బీహార్ గవర్నర్‌గ నియమించెను. 1533 లో ఇతడు స్వతంత్రించి బంగాళమును ఆక్రమించుకొనెను. తరువాత బంగాళము కొరకు హుమాయూన్‌తో పోరి, గెల్చి, ఢిల్లీని వశపరచుకొని, షేర్ షా అను బిరుద నామముతో ఢిల్లీలో 1539 లో పట్టము గట్టుకొనెను. 1542 లో గ్వాలియర్‌ను, 1544 లో నాగూర్, అజ్మీర్ కోటలను స్వాధీనపరచుకొని, రాజపుత్రులను తన వశము చేసికొనెను. 1545 లో కాలింజర్ కోటను ముట్టడించి రాజపుత్రులను పూర్తిగ వశపరచుకొను ఉద్దేశముతో ఘోర యుద్ధము చేయుచున్న సమయమున షేర్ షా సంహరింపబడెను. ఇతని వారసులలో ఒకడైన ఇబ్రహీమ్ అనువాడు ఢిల్లీ, ఆగ్రాలను వశపరచుకొనెను. సికందర్ అనువాడు తొలుత పంజాబ్‌ను ఆక్రమించుకొని,తరువాత ఇబ్రహీమ్‌ను ఢిల్లీ, ఆగ్రాలనుండి తరిమివేసెను.

తరువాత హుమాయూన్ 1555 లో సికందర్‌ను సర్ హింద్ వద్ద ఓడించి, హిమాలయపర్వతముల వరకు తరిమెను. షేర్ షా తరువాత వచ్చిన సూర్ వంశజులందరు అసమర్థులు; అందుచేత ఆ అవకాశమును ఉపయోగించుకొని హుమాయూన్ భారతదేశమునకు వచ్చి అప్పటి సూర్ వంశపు రాజును ఓడించుటతో సూర్ వంశ వినాశము, మొగల్ రాజ్య విస్తృతి ప్రారంభమయ్యెను.

భారతదేశ చరిత్రయందు పరిపాలనాదక్షులని కీర్తి గాంచిన వారిలో షేర్ షా ఒకడు. ఇతని పరిపాలనా విధానము మొగల్ చక్రవర్తులకు మార్గదర్శకము అయ్యెను. జయించిన రాజ్యమును సర్కారులుగను, పరగణాలుగను విభజించి వాటికి తగిన అధికారులను నియమించెను. ఒక్కొక్క పరగణాకును ఒక అమీన్, ఒక షేక్ దార్, లెక్కలు వ్రాయుటకు ఒక ఖజాంచియు ఉండిరి. జాగీర్ దారుల బలమును అణగద్రొక్కి, ప్రభుత్వమే సేనలను తయారుచేయు పద్ధతిని షేర్ షా అమలులో పెట్టెను. పంజాబ్ నుండి బంగాళమునకు 3,200 కిలోమీటరుల పొడవగు ఒక పెద్ద రాచబాటను వేయించెను. బాటసారుల సౌకర్యార్థము బాటకు ఇరుప్రక్కల చెట్లను నాటి, భోజనము ఉచితముగ పెట్టుటకు సత్రములను ఆరు కిలోమీటరులకు ఒకటి చొప్పున కట్టించెను. తపాలు కొనిపోవుటకు గుర్రముల అంచెలు ఏర్పాటు చేసెను. భారతదేశములో రూపాయి అను వెండినాణెమును ఉపయోగపరచిన వాడు ఇతడే; పిన్నవయసునుండి పొలముల విచారణయందు నైపుణ్యము సంపాదించినవాడు అగుటచేత వాటిని కొలిపించి, తరమువారిగ విభజించి, ఫలసాయమును అనుసరించి పన్ను విధించి, పన్నును ద్రవ్యరూపమునగాని, ధాన్యరూపమునగాని చెల్లింపవచ్చునని ఏర్పాటు చేసెను. సర్కార్‌కు ప్రజలు పన్ను క్రింద తమ పంటలోని నాలుగవ వంతు చెల్లింపవలెనని ఇతడు నిర్ధారణ చేసెను. రైతులు తామే స్వయముగ పన్ను చెల్లించు విధానమును ప్రవేశ పెట్టెను. తరువాత కాలమునకు దీనినే 'రైతువారీ పద్ధతి' అనిరి. శాసన విరుద్ధముగ నడచువారిని, దొంగలను కడు క్రూరముగ దండించుటకును కూడ శాసించెను. హిందూ మహమ్మదీయైక్యమును కుదిర్చి తన అధికారమును నిలబెట్టుకొనెను. ఇతని పరిపాలనా విధానము బాగుగ ఉన్నదని, ఆచరణ యోగ్యమని తలచి అక్బరు [చూ. పు - 260] తన సామ్రాజ్యమునందు అదే విధానమును నెలకొల్పెను. షేర్ షా శూరుడు, వివేకి, దూరదృష్టి కలవాడు. అయిదు సంవత్సరముల రాజ్యపాలనములోనే ఇతడు ప్రజాహిత కార్యములను ఎన్నిటినో చేయించెను.

* * *

సంకీర్ణపక్ష ప్రభుత్వము (కొయిలిషన్ గవర్నమెంట్) : వివిధ రాజకీయ పక్షములు ఒక ప్రభుత్వమునో, మంత్రివర్గమునో ఏర్పాటుచేయు నిమిత్తము చేసికొను అన్యోన్య సహకారపు ఒప్పందమును ఈ పదము సూచించును. సంకీర్ణప్రభుత్వములు ఏర్పడుటకు ముఖ్యముగా మూడు విధములైన పరిస్థితులు కారణములు అగుచుండును. 1. బహుళపక్ష వ్యవస్థ అమలులో ఉన్న దేశములలో ఏ ఒక పక్షముగాని పార్లమెంట్ దిగువ సభలో నిత్య పరిపాలనకు ఆవశ్యకమైనంత సంఖ్యాప్రాబల్యము కలిగి ప్రభుత్వమును ఏర్పరుపలేకపోవుట; 2. ద్విపక్ష విధానము ఆచరణలో ఉన్న దేశములలో ఆ రెండు పెద్ద పక్షములకును సరిసమానమైన సంఖ్యాబలము ఏర్పడుటవలన రెంటిలో ఏదో ఒకటి అల్పసంఖ్యాకపక్షములలో దేనితోనైనా ఒప్పందము చేసికొని, ప్రభుత్వ నిర్వహణకు ఆవశ్యకమైన సంఖ్యాధిక్యమును సంపాదించుకొనుట; 3. జాతీయోపద్రవము ఏర్పడినపుడు వివిధ పక్షముల మధ్య కీచులాటలకు స్వస్తిచెప్పి, దేశములోని సర్వశక్తులను కేంద్రీకరింపచేసి జాతీయశ్రేయస్సు సాధించుటకొరకు సంకీర్ణప్రభుత్వమును ఏర్పరచుట. సంకీర్ణ ప్రభుత్వములవలన కొన్ని ప్రయోజనములును, కొన్ని నష్టములును కూడ ఉన్నవి. ముఖ్యమయిన ఫలితమేమనగా రాజకీయములలో సమాధానపద్ధతి దీనివలన పెంపొందగలదు. కె. ఏ. ఎన్. శాస్త్రి.

**సత్యాగ్రహము :** చూ. పు. 421, 711.

**సన్ యత్-సేన్** (1867 - 1925): చీనా ప్రజాస్వామ్య వ్యవస్థకు జనకుడు. వ్యవసాయమువలన జీవించిన అతని తండ్రి మకావో ద్వీపమువద్ద ఉన్న షియాంగ్ షాన్ గ్రామములో నివసించెడివాడు. అతడు క్రైస్తవ మతావలంబకుడు. సన్ యత్ సేన్ హాంకాంగ్ నగరములో వైద్యకళాశాలయందు విద్యార్థిగా ప్రవేశించి, 1894 లో పట్టభద్రుడు అయ్యెను. ఒక చీనా సహాధ్యాయుని ద్వారా అతడు ఒక విప్లవసంస్థతో సంబంధము ఏర్పరచుకొనెను. విప్లవకార్యకలాపములు సాగించిన ఫలితముగా ఆ సహాధ్యాయుడు 1895 లో ఉరి తీయబడగా, సన్ యత్ సేన్ తప్పించుకొనగలిగెను. ఇటలీ దేశభక్తుడు మాజినీ [చూ. పు. 744] వలెనే ఆనాటినుండి సన్ యత్ సేన్ విప్లవ జీవితము గడప ఆరంభించి, దేశ బహిష్కృతుడై, విదేశములలో తలదాచుకొనుచు మాతృదేశ దాస్య విమోచనము కొరకై నిర్విరామముగా కృషిచేయుచుండెను. 1898 లో అతడు జాతీయత, ప్రజాస్వామ్యము, సామ్యవాదము అను మూడు సిద్ధాంతములను ప్రతిపాదించెను.

ఈ సిద్ధాంతములను 1925 వరకు అతడు బహిరంగముగా ప్రకటించి, వాటిని అమలులో పెట్టుటకు పూనుకొనలేదు. 1900 లో జరిగిన 'బాక్సర్ విప్లవము' తరువాత అతడు ప్రజాభిప్రాయమును గమనించి, దాని ప్రకారము చీనాలో ప్రజాస్వామ్యవ్యవస్థను నెలకొల్పుట ద్వారా మంచూవంశపాలనమును అంతమొందింప ప్రయత్నించెను. కాని, ఈ ప్రయత్నము విఫలమయ్యెను. 1905 లో యూరప్ ఖండమునందును, జపాన్‌లోను 'చీనా లీగ్' అను విప్లవసంస్థ సన్ యత్ సేన్‌చే స్థాపింపబడెను. ఈ సంస్థద్వారా ఆ యా దేశములలో ఉన్న చీనా జాతీయుల సహకారము అతడు సంపాదింపగలిగెను. తన సిద్ధాంతములను ప్రజలలో బహుళముగ ప్రచారమొనరించుటకై అతడు ధనమును సేకరించెను. రహస్య సంఘముల ద్వారా చీనా ప్రజలలో సన్ యత్ సేన్ ప్రతిపాదించిన విప్లవ సిద్ధాంతములు వ్యాపింపగలిగెను. చీనా ప్రభుత్వము సన్ యత్ సేన్‌ను పట్టి ఇచ్చినవారికి గొప్ప బహుమానము ఇచ్చెదనని ప్రకటించెను.

మంచూవంశీయుల పాలనమునకు వ్యతిరేకముగ 1911 లో బయలుదేరిన విప్లవోద్యమముపై సన్ యత్ సేన్ యొక్క వ్యక్తిగత ప్రభావము విశేషముగా ప్రసరించెను. అతనిచే నిర్మింపబడిన సమర్థవంతమైన కొమింగ్‌టాంగ్ సంస్థ [చూ. పు. 409] క్రమముగా మంచూ వ్యతిరేకతను ప్రజాస్వామికోద్యమముగ పరిణామమొందునట్లు కావించెను. 1911 లో విప్లవము ప్రారంభమైనప్పుడు సన్ యత్ సేన్ బ్రిటన్‌నందు ఉండెను. 1912 లో అతడు చీనాకు తిరిగి వచ్చి తాత్కాలిక అధ్యక్షుడుగ పదవీ స్వీకారము కావించెను. కాని, తన అధ్యక్షత క్రింద, తన నాయకత్వము క్రింద చీనాదేశమును ఐక్యమొనర్చుట అసంభవమని భావించి, అతడు యువాన్ షి కాయ్ అను అతనిని తన స్థానమందు నిల్పి, తన పదవికి రాజీనామా నొసగెను. అతని అనుభవమును బట్టి, సన్ యత్ సేన్ పరిపాలకుడుగా కాక, సమర్థుడైన ప్రచారకుడుగను, ఆందోళనాపరుడుగను మాత్రమే ప్రతిష్ఠ గడించెను.

యువాన్ షి కాయ్ నాయకత్వము క్రింద సన్ యత్ సేన్‌కు మనశ్శాంతి లేకుండెను. 1917 లో షి కాయ్ మరణానంతరము సన్ యత్ సేన్ దక్షిణచీనా స్వతంత్ర రిపబ్లిక్ స్థాపనమునకై బయలుదేరిన ఉద్యమమునకు నాయకుడయ్యెను. కాని, కేంటన్ నగరమునందలి సైనిక నాయకులతో సహకరించుట అసంభవమని అతడు గ్రహించి తన నాయకత్వమును విరమించుకొనెను. ఆ తరువాత స్థాపింపబడిన సైనికపాలనము ప్రధానముగా 'క్వాంగ్సి' సైనిక సహాయమువలన 1921 వరకు నిలువగలిగెను. ఇంతలో చెన్ చిన్ మింగ్ అను అతడు క్వాంగ్సిసైన్యములను పారద్రోలి, సన్ యత్ సేన్‌ను ఆహ్వానించెను. కాని, సన్, చిన్‌ల నడుమ రాజ్యాంగసంబంధమైన అభిప్రాయభేదములు పొడసూపగా సన్ యత్ సేన్ షాంగైనగరములో ప్రవాసజీవితమును గడపవలసివచ్చెను. 1923 లో అతడు క్వాంగ్సి, యూనాన్ సైన్యముల సహాయముతో చెన్ చిన్ మింగ్‌ను రాజ్యభ్రష్టుని కావించి తన మరణము వరకు ప్రధాన రాజ్యపాలకుడుగ అధికారమును నిర్వహించెను. కాని, అతని అధికారము కొన్ని ప్రాంతములకు మాత్రమే పరిమితమై ఉండెను.

సన్ యత్ సేన్ తన సోషలిస్ట్ సిద్ధాంతములను విరివిగా ప్రజలలో ప్రచారము చేయుటవలన సామాన్య ప్రజలలోను, కార్మికులలోను అతని ఎడల ఆదరాభిమానములు అధికమయ్యెను. వారి ఆర్థికస్థితిని బాగుచేయుటయందు అతడు దీక్షబూనెను. సన్ యత్ సేన్ సోవియట్ రష్యాతో సన్నిహితసంబంధములు పెట్టుకొని, దానినుండి నైతిక సహాయమును బడసెను. పుట్టకురుపుచే అతడు 1925, మార్చి 12 వ తేదీన మరణించెను. ప్ర. రా. సు.

**సప్తవర్షయుద్ధము** (1756 - 1763): యూరప్‌లో ఇంచుమించు అన్ని రాజ్యములును ఈ యుద్ధములో పాల్గొనినవి. ఈ యుద్ధము అమెరికా, భారతదేశములకు కూడ వ్యాపించినది.

ప్రష్యారాజైన ఫ్రెడరిక్ మహనీయుడు ఆస్ట్రియా రాణియైన మేరియా తెరెసా [చూ. పు. 763] కు చెందిన సైలీషియారాజ్యమును స్వాధీనము చేసికొనెను. ఇదియే ఈ యుద్ధమునకు మూలకారణము. ఆ రాష్ట్రమును తిరిగి స్వాధీనము చేసికొను ఉద్దేశముతో మేరియా తెరెసా రష్యా చక్రవర్తినియగు ఎలిజబెత్‌తో మిత్రత్వము నెరపుటయేగాక, చాలా కాలమునుండియు శత్రువై ఉండిన ఫ్రాన్స్‌తో కూడ ఈ ఉద్దేశముతోనే స్నేహము చేసెను. ఈ మిత్రత్వములకు ఈమె మంత్రి కానిట్స్ సలహా, సాహాయ్యము కారణములైనవి.

ఈ లోపున ఫ్రెడరిక్ తన శత్రువులను ఒక కంట కనిపెట్టుచుండెను. మొదటి దెబ్బ తాను తీయవలయునని అతని తలంపు. 1756, అక్టోబరులో అతడు శాగ్జనీని ముట్టడించెను. ఆస్ట్రియన్ సైన్యములు శాగ్జనీని రక్షింప ప్రయత్నించినవి కాని, ఆ ప్రయత్నము విఫలమైనది. తరువాత ఫ్రెడరిక్ బొహీమియాను ముట్టడించి, ప్రాగ్ వద్ద యుద్ధములో విజయము పొంది, తదుపరి ప్రాగ్ నగరమును ముట్టడించి, కోలిన్ యుద్ధములో పరాజయము పొందెను. ఫ్రెడరిక్ శత్రువులు బహుళ సంఖ్యాకులైరి. కాని, అతడు చాల నేర్పుతో వ్యవహరించి ఫ్రెంచివారితో పెద్దయుద్ధము చేసి, వారిని ఓడించి, ఆ సంవత్సరమే ఆస్ట్రియన్‌లను కూడ ఓడించెను.

ఫ్రెడరిక్ బలము 1758 లో ఇంకను స్థిరపడినది. విలియమ్ పిట్ [చూ. పు. 577] ప్రభుత్వము బ్రిటన్‌నందు అధికారమును గ్రహించినది. ఇతడు ఫ్రెడరిక్‌కు ఇతోధిక సాహాయ్యముచేయ ఆరంభించెను. బ్రిటిష్ సైన్యములు ఫ్రెడరిక్ శత్రువులను చాలమందిని హతమార్చినవి. కాని, ప్రష్యా ఈ యుద్ధములతో చాల బలహీనము అయినది.

ఫ్రెడరిక్ అతి నిస్సహాయస్థితికి 1762 లో వచ్చెను. కాని, ఆ సంవత్సరమే రష్యా చక్రవర్తిని ఎలిజబెత్ మరణించి, ఫ్రెడరిక్ గొప్పవాడని పొగడు పీటర్ - III రష్యా చక్రవర్తి అయ్యెను. అతడు యుద్ధమునుండి విరమింపగోరి ప్రష్యాతో ప్రత్యేకముగా సంధిరాయబారములు నడపెను. ఈ హఠాత్సంభవమువలన ఫ్రెడరిక్ మరల కోలుకొనెను. 1763 లో హ్యూబర్‌ట్స్‌బర్గ్ వద్ద సంధి పత్రముపై సంతకములు జరిగినవి. సైలీషియా ప్రష్యాపాలనలోనే ఉండిపోయినది. మిగిలిన సరిహద్దులు యుద్ధమునకు ముందున్న విధముగ మార్చబడినవి. యూరప్‌లో ఏ విధమయిన ప్రాదేశికమైన మార్పులును చేయబడలేదు. ఫ్రాన్స్, స్పెయిన్, బ్రిటన్ దేశముల మధ్య తగాదాలు 1763, ఫిబ్రవరిలో పారిస్ సంధివలన చక్కబడినవి. * * *

**సమానత్వము :** అన్ని ప్రధాన రాజనీతి భావనల వలెనే సమానత్వమును ఈ భావనకు కూడ మానవ జీవితమున కనవచ్చు అతి సంశ్లిష్ట స్థితితో సన్నిహితసంబంధము ఉన్నది. అందరకు సమానమైన అవకాశములు ఉండవలెనన్న సూత్రము సరిగ ఆచరణరూపము పొందినచో అందువలన మానవులలోని సమర్థతలు నిర్నిరోధకముగ అభివ్యక్తములు అగును. ఈ సమానావకాశ సిద్ధాంతమును అమలు జరుపుటవలన ప్రభుత్వపుజోక్యము ప్రజాజీవన విధానమున ఎక్కువగుటకు మార్గము సుగమమగును. అట్టి ఎడ, ప్రజాజీవన వ్యవహారముల ఎడ ప్రభుత్వము సాధ్యమైనంత తటస్థభావమును వహించుటకు పరిస్థితులు అనుకూలింపవు; కావున రాజ్య తాటస్థ్యవాదమునకు ఎన్నడును దోహదము కలుగనేరదు.

ధర్మశాస్త్రము దృష్టిలో అందరూ సమానులే అను మరొక సూత్రము ఉన్నది. అనగా అందరకును సమానముగా న్యాయము కలిగింపవలెననుట. ఈ సూత్రమునకు వెనుక మానవుని ఉత్కృష్టతకు సంబంధించిన ఒక నైతిక భావన ఇమిడి ఉన్నది. ఇక ఈ సూత్రములో సాస్తవమైన న్యాయనిర్వహణముపట్ల అభిలాష బహిరంగముగానే కనవచ్చుచున్నది.

రాజకీయ సమానత్వము మరింత జటిలమైన విషయము. ఆచరణలో ఈ రాజకీయ సమానత్వసూత్రము యొక్క ప్రధానలక్ష్యము - సూక్ష్మములో చెప్పవలెనన్న - ఆధునిక ప్రజాస్వామ్యరాజ్యము.

సాంఘిక సమానత్వమును గూర్చిన భావములకు వివిధ ప్రత్యేక ప్రస్థానములలో స్పష్టమైన ఆకారము ఏర్పడినది. జీవకారుణ్యముతో బానిసతనమును ప్రతిఘటించు ఉద్యమముపై కూడ ఈ సాంఘిక సమానత్వ సూత్రప్రభావము ఉన్నది. ధనికవర్గ ప్రాబల్యమును నిరసించుటలో ఈ సూత్రము వ్యక్తమగుచున్నది. సర్వజాతి సమానత్వము కొరకును, స్త్రీ - పురుష సమానత్వము కొరకును సాగుచుండిన ఉద్యమములకు కూడ ఈ సూత్రము దోహదము చేయుచున్నది. ఆర్థిక సమానత్వము ఏర్పడనంతవరకును ఎట్టి సాంఘిక సమానత్వమును సమగ్రము కాజాలదు. ఆర్థిక సమానత్వము అనగా సర్వవిధములైన సంపదను మానవులు అందరికిని సరిసమానముగా పంచి ఇచ్చుట అని ఎవరైనను నిర్వచించినచో, అట్టి వారిని స్వాప్నికజగత్తున వసించువారిగ లెక్కింపవచ్చును. మానవులలో సహజముగ ఉండు వైవిధ్యమునుబట్టి వారి అవసరములును వేరువేరుగ ఉండుటవలన వారికి సమాన సంపత్తిని చేకూర్చుట అశక్యము. కాని, వారికందరికి

చేకూరవలసినది సమానావకాశము; సోషలిస్ట్ వ్యవస్థ సమాన సంపదను చేకూర్చుననుకొనుట పొరపాటు. వీ. జ.

**సముద్రగుప్తుడు** (క్రీ. శ. 330 - 375 ప.): భారత దేశమును పాలించిన గుప్తవంశ రాజులలో ప్రఖ్యాతుడు. చంద్రగుప్త - I యొక్క కుమారుడు. చంద్రగుప్తుని మరణానంతరము సుతులలో శౌర్య సంపన్నుడును, సకల శాస్త్రాభిజ్ఞుడును అయిన సముద్రగుప్తుడు రాజ్యమునకు వచ్చెను. ఇతని సోదరులలో ఒకడైన కాచుడను వాడు సింహాసనము అధిష్ఠింపగోరి సోదరునితో పోరాడెనని కొందరు చరిత్రకారుల అభిప్రాయము. కాని, సరియగు చారిత్రకాధారములు అందులకు కన్పట్టుటలేదు. చంద్రగుప్తుడు తన తరువాత సముద్రగుప్తుడే రాజార్హుడని అతనినే నియోగించినటుల సముద్రగుప్తుని అలహాబాదు శిలాస్తంభ శాసనము * వలన తెలియుచున్నది. రాజ్యమునకు వచ్చిన వెనువెంటనే మగధదేశమున తన పాలనము భద్రపరచుకొని, తన ప్రత్యర్థి రాజులగు నాగసేన, అచ్యుతాది భూపతులను ఉక్కడంచి, ప్రాప్త రాజ్యవిభవుడై, గుప్తసామ్రాజ్య సుస్థిరోద్యమమును ప్రారంభించెను. ఆర్యావర్తమున ఉన్న చిన్న రాజ్యములు అన్నియు ఇతని వశమయ్యెను. ఈ విధముగా ఆర్యావర్తమున దిగ్విజయము సాధించి, తన దృష్టిని దక్షిణాపథముపై సారించి, దక్షిణదేశములపై ధర్మవిజయము సాగింప ఉద్యుక్తుడయ్యెను. ఈ కాలమున దక్షిణాపథమున చిన్న రాజ్యములు అనేకము వెలసి ఉండెను. సముద్రగుప్తుడు దక్షిణదేశమున మహాకాంతారమును పాలించు వ్యాఘ్రరాజును, కోసల భూపతి అగు మంతరాజును, పిష్ఠపురాధిపతి అగు మహేంద్రభూపతిని, గిరికొత్తూర పరిపాలకుడగు స్వామిదత్తుని, ఏరండపల్లి ఏలు దమనుని, వేంగిదేశ నాయకుడగు హస్తివర్మను, పాలక్క ఉగ్రసేనుని, దేవరాష్ట్రమును ఏలు కుబేరుని, కాంచీపుర భూపాలకుడగు విష్ణుగోపుని జయించి, పశ్చిమ దేశముల మీదుగా పాటలీపుత్రనగరమును చేరుకొనెను. కాని, ఇతడు దక్షిణదిగ్విజయయాత్ర చేయు సమయమున ఆర్యావర్తమునందలి కొందరు రాజులు ప్రబలులై, గుప్తసామ్రాజ్యమును ధిక్కరించుటకు ఉద్యుక్తులైరి. వీరిలో ముఖ్యులు: వాకాటక రాజగు రుద్రదేవుడు, నాగదత్తుడు, చంద్రవర్మ, గణపతినాగుడు, అచ్యుతుడు అనువారలు. వీరల బలమును ఉక్కడగించి నేపాళ, దేవక, కామరూప రాజ్యాధీశులను వశగతులగావించి, ఆర్యావర్తమునంతటిని ఏకచ్ఛత్రముగ సముద్రగుప్తుడు పరిపాలనము కావించెను. ఆర్యావర్తమున మొదటి దిగ్విజయము 344-345 లోను, దక్షిణదేశ ధర్మవిజయములు 346-347 ప్రాంతములందును జరిగినవి. ఆర్యావర్తమున రెండవ దిగ్విజయ యాత్ర 348-350 మధ్య సంభవించి నటుల జయస్వాల్ పండితుడు నిర్ణయించెను. పైన వివరింపబడిన విజయముల తరువాత సముద్రగుప్తుడు అశ్వమేధయాగము కావించి, తత్సూచకముగా నాణెముల ముద్రించి, వానిపై రాజాధిరాజ, అప్రతిహత యోధాను యోధ బిరుదనామముల వ్రాయించుకొనెను.

సముద్రగుప్తుడు గుప్తకుల భూషణుడు; శౌర్యనిధి; పండిత మార్తాండుడు; గానకళావిశారదుడు. ఇతని అలహాబాదు శిలాస్తంభ శాసనకర్తయగు హరిసేనుడు సముద్రగుప్తుని ప్రశస్తిని కావ్యఫణితిలో వర్ణించెను. మహారాజాధిరాజ, కవిరాజ బిరుదాంకితుడు. ఇతడు రచించిన కావ్యములు ఏవో తెలియవు. ఇతని పట్టమహిషి దత్తాదేవి. ఈమెవలన రామగుప్త, చంద్రగుప్తులు అను ఇరువురు కుమారులు కలిగిరి. సముద్రగుప్తుని కీర్తి పశ్చిమదేశముల వరకును వ్యాపించెను. షాహి, షహన్‌షాహి అను కుషానురాజులును, శక, మురుండ దేశాధీశులును సముద్రగుప్తుని శరణుజొచ్చి సాహాయ్యమును అపేక్షించిరి. కుం. ఈ. దత్తు.

**సయామ్**: చూ. తాయిలాండ్ - పు. 517.

**సయ్యద్ వంశము** (1414 - 1451): ఈ వంశము వారు నలుగురు ఢిల్లీ సుల్తానులుగ ఉండిరి. వారు క్రమముగ బలహీనులగుచు 1451 వరకు రాజ్యమును పరిపాలించిరి. కాని, తమ పేరు నిలబెట్టుకొనుటకు వారు ఏ ఘన కార్యమును చేయలేదు. వారి ప్రభుత్వాధికారము ఢిల్లీ సరిహద్దులు దాటి ఎక్కువదూరము సాగలేదు. వారి పరిపాలన కాలమంతయు కేవలము తిరుగుబాటులను అడచుట యందును, పన్నులు రాబట్టుటయందును మాత్రమే గతించెను. కడపటి సయ్యద్ రాజు అలమ్‌షా అనువాడు బహలాల్ లోడీ అనువానికి సింహాసనము ఇచ్చి, 1451 లో ప్రభుత్వమును త్యజించెను. గు. వెం.

**సరోజినీ నాయుడు** (1879 - 1949): ఇంగ్లీషు భాషలో మృదుమధురమగు కవితాగానము సలిపి, 'భారతీయ కవికోకిల' (ది నైటింగేల్ అవ్ ఇండియా) అను బిరుదమును సార్థకముచేసుకొని భారత జాతీయ చరిత్రలో విశిష్టస్థానమును ఆక్రమించుకొనిన స్త్రీ రత్నము. ఈమె ఫిబ్రవరి 13, 1879 లో హైదరాబాదునందు జన్మించెను. నిజామ్ కాలేజీకి అధ్యక్షులుగ ఉండిన అఘోర

* ఈ శిలాస్తంభముపై మరియొక ప్రక్క మౌర్యవంశజుడగు అశోకుడు చెక్కించిన ధర్మ ప్రబోధక శాసనము బ్రాహ్మీలిపిలో కాననగును.

నాథ్ ఛటోపాధ్యాయ ఈమె తండ్రి. 12 ఏండ్ల ప్రాయముననే ఈమె మెట్రిక్యులేషన్ పరీక్షయందు ఉత్తీర్ణురాలు అయినది. తరువాత 1895 లో ఇంగ్లండుకేగి లండనులోని కింగ్స్ కాలేజీయందును, కేంబ్రిడ్జి యూనివర్సిటీకి సంబంధించిన గర్టన్ కాలేజీయందును ఉన్నతవిద్యను అభ్యసించెను. ఈమె డాక్టరు ముత్యాల గోవిందరాజులు నాయుడు అను ఆంధ్రుని 1898 లో వివాహమాడెను. వీరికి ఇద్దరు కుమారులు, ఇద్దరు కుమార్తెలు. 1914 లో సరోజినీ నాయుడును ఫెలో (సంస్థానతకురాలు) గా ఇంగ్లండునందలి 'రాయల్ సొసైటీ ఆవ్ లిటరేచర్' అను సంస్థ ఎన్నుకొనెను.

సరోజినీనాయుడు 1915 లో గాంధిజీని లండనునందు కలిసికొని, నాటినుండి భారతస్వాతంత్ర్యసాధనకై యథాశక్తి కృషి చేసినది. 1923 నుండి 1929 వరకు బొంబాయి మునిసిపాలిటీ సభ్యురాలై ఉండెను. 1925 లో జరిగిన అఖిలభారతీయ కాంగ్రెస్ సమావేశమునకు అధ్యక్షత వహించిన ప్రప్రథమ భారతవనితగా ఘనత దక్కినది ఈమెకే. తూర్పు, దక్షిణ ఆఫ్రికా ప్రాంతములందు ఉన్న ప్రవాస భారతీయుల స్థితిగతులను అరయు విషయమై 1924 లో సరోజినీనాయుడు ఆ దేశములను పర్యటించెను. 1928 - 29 లో యునైటెడ్ స్టేట్స్, కెనడా దేశములను సందర్శించి, భారతనాగరకతాసంస్కృతులపై పెక్కు ఉపన్యాసములు ఒసగెను. అనేక అంతర్జాతీయ సమావేశములందు భారతీయ ప్రతినిధిగా వ్యవహరించెను. 1931 లో లండనులో జరిగిన రౌండుటేబుల్ సమావేశమునకు గాంధిజీతోబాటు ఈమె కూడ హాజరయ్యెను. 1932 లో దక్షిణ ఆఫ్రికాకు భారత ప్రతినిధిగా వెళ్ళెను. 1947 లో భారతదేశము స్వాతంత్ర్యము పొందిన తదుపరి ఉత్తరప్రదేశ్‌కు గవర్నర్ అయి, జీవితాంతము వరకు ఆ పదవియందే ఉండెను. 1947 లో జరిగిన 'ఆసియన్ రిలేషన్స్ కాన్ఫరెన్స్' కు అధ్యక్షత వహించెను.

రాజకీయరంగమునందేకాక, సాహిత్య, సాంఘిక, సాంస్కృతికరంగములందు కూడ ఆమె చేసిన కృషి అపారము [చూ. సం. 6 - పు. 796]. గు. రా.

**సహాయ నిరాకరణోద్యమము** : చూ. భారత దేశము - పు. 664.

**సాగర ఖండము** : పసిఫిక్ మహాసముద్రమున పశ్చిమమున ఆస్ట్రేలియా మొదలుకొని తూర్పున ఎస్టర్ దీవివరకును, దక్షిణమున న్యూజీలండ్ మొదలుగ ఉత్తరమున సాండ్‌విచ్ ద్వీపములవరకును గల విస్తృత ప్రదేశమున అటనట చెదరి ఉండిన ద్వీపములకు అన్నిటికిని సామూహికముగ వాడబడునామము. 'ఓషియానియా' అని పాశ్చాత్యులచే వ్యవహరింపబడు దానికి అనువాద రూపము - ఈ సాగర ఖండము. ఇందలి ప్రాంతముల మొత్తపు [వి] 85,48,161 చ. కి. మీ.; [జ] దాదాపు 160 లక్షలు.

ఆ యా ప్రాంతవాసులగు మానవజాతులను అనుసరించి ఈ సాగర ఖండము ఈ దిగువ రీతిగా ఆరు భాగములుగ లెక్కింపబడుచున్నది: 1. ఆస్ట్రేలియా, 2. టాస్మేనియా, 3. మెలనీషియా (ఇందు ఆగ్నేయమునందలి ఫిజీ మొదలుగ పశ్చిమమున న్యూగినీ వరకు గల దీవులు చేరి ఉన్నవి), 4. న్యూగినీ, 5. మైక్రోనీషియా (న్యూగినీనుండి ఫిలిప్పీనుల వరకు గల ద్వీపములు), 6. పొలినీషియా (ఇందు పైవానికి చెందని పసిఫిక్ సాగర ద్వీపజాలము చేరి ఉన్నది).

పైవానిలో న్యూగినీ తప్ప తక్కినవానిలో ప్రతిదానియందును ఒక ప్రత్యేక విశిష్టతకల మానవజాతి వసించుచున్నది. న్యూగినీయందు మాత్రము అటులగాక వివిధ జాతులు సంకరమొందుటయు, కొన్నిప్రాంతములందు వేర్వేరు జాతులు ప్రత్యేకప్రతిపత్తితో వసించుటయు కన్పట్టుచున్నది.

యూరపియన్ సాహసికయాత్రికులు ఇట వివిధ ద్వీపములందు 16 వ శతాబ్ది మొదలుగ కాలిడసాగిరి. అంతకు పూర్వము ఇచటి ప్రజానీకమున అత్యధికభాగము శిలాయుగనాగరకతాస్థాయిలోనే ఉండినది. వీనిలో ఎస్టర్ దీవియందు తప్ప తక్కినవానిలోని ప్రజలందు 'లిపి' అనునది రూపొందలేదు. ఎస్టర్‌దీవియందు సనాతనకాలమున ఒకవిధమగు చిత్రలిపి వ్యాప్తిలో ఉండెడిదని అచటి అవశేషములవలన తెలియవచ్చుచున్నది. ఈ లిపికి సింధు నాగరకతా లిపితో కొన్ని రీతుల సాదృశ్యము కలదని పండితుల అభిప్రాయము. ఆ లిపిని అవలంబించిన ప్రజానీకపు నాగరకత 16 వ శతాబ్దికి చాల పూర్వముననే ఎస్టర్ దీవిలో అంతరించుటవలన ఆ లిపి ఈ నాటికిని అవిదితముగనే ఉన్నది.

పాశ్చాత్యులతో సాగరఖండప్రజానీకమునకు పరిచయము ఏర్పడినది మొదలుగ అచట పలు పరివర్తనలు సంఘటిల్లినవి. కొన్ని తావులందు ఆదిమ ప్రజానీకము అంతరించుటయో లేక అల్ప సంఖ్యాకమగుటయో జరిగినది. కొన్ని తావులందు ఆదిమజాతులు నూతన సభ్యతను అవలంబింపగలిగినవి. పలుతావులందు పాశ్చాత్యులతో పాటుగ భారతీయులు, జపానీయులు, చీనీయులు వలస చేరి, అచట సంస్కృతులందు నూతన వైవిధ్యమును తేగలిగిరి. వీటి అన్నింటి ఫలితముగ 16 వ శతాబ్దియందు

శిలాయుగ స్థాయిలో ఉండిన నాగరకత ఒక్క పెట్టున పరివర్తన చెందినది.

ఈ విశాల ఖండమున స్వతంత్ర రాజ్యములుగ ఉన్న కొలది ప్రాంతములు గాక, తక్కినవి యునైటెడ్ స్టేట్స్, బ్రిటన్, ఫ్రాన్స్, చిలీదేశముల ఆధిపత్యమున వేర్వేరుగ చెదరి ఉన్నవి. చీ. శే. రా.

**సాతవాహనులు :** చూ. తెలుగు సంస్కృతి; సం. పు. 86.

**సాన్ మారినో :** యూరప్ ఖండమున ఇటలీద్వీపకల్పమునందు ఉన్న చిన్న స్వతంత్రరాజ్యము. ప్రపంచమందలి నేటి గణరాజ్యములందెల్ల ప్రాచీనతమము.

భౌగోళికముగ ఇటలీయందు అంతర్భాగము అయినను, ఈ అల్పరాజ్యము సర్వస్వతంత్రతాప్రతిపత్తి కలిగి ఉన్నది. దీనికి అన్నివైపుల ఇటలీరాజ్యమే సరిహద్దుగ ఉన్నది. [వి] 99 చ. కి. మీ; [జ] 17,000. [భా] జాతీయభాష ఇటాలియన్; [మ] దాదాపుగ ప్రజలందరును రోమన్ కేతలిక్‌లు; [రా] సాన్‌మారినో.




చరిత్ర: పశ్చిమ రోమన్‌సామ్రాజ్యము విచ్ఛిన్నత చెందిన పిదప ఇటలీ అంతయు అత్యల్పరాజ్యములుగ విడిపోయి - దాదాపు అట్టి పరిస్థితిలోనే - 1861 లో ఇటలీ రాజ్యము రూపొందువరకు ఉండెను. అటుల ఇటలీ ఏకీకృతమైనప్పుడు ఈ అల్పరాజ్యములు అన్నియు అందు మేళనమొందినవి కాని, సాన్‌మారినో మాత్రము అందులకు నిరాకరించి తన ప్రత్యేకతను నిలుపుకొనెను. క్రీ. శ. 4 వ శతాబ్దిలో రాతిపని చేయు క్రైస్తవుడు ఒకడు - మేరినస్ అనుపేరు కలవాడు - ఈ రాజ్యమును సంస్థాపించెనని సాంప్రదాయిక గాథ కలదు. కాని, ఈ ప్రాంతము దాదాపుగ ఊషరభూమి అగుటవల్ల ఇటలీలో తక్కిన ప్రాంతములందు జరిగిన రాజకీయ సంక్షోభములు ఏవియు చాలకాలమువరకు దీనిజోలికి రాలేదు. కాని, 1739 లో క్రైస్తవమత పీఠాధిపతి (పోప్) తన సేనలను పంపి ఈ దేశమును ఆక్రమించెను. ఆ పోప్ మరణానంతరము ఆ పీఠమును అధిష్ఠించిన క్లెమెంట్-II ఈ రాజ్యమునకు మరల స్వాతంత్ర్యమును ఒసగెను. ఇటలీ స్వాతంత్ర్య యుద్ధకాలమున ఇటలీ దేశభక్తుడు గరిబాల్డీ [చూ. పు. 421] కి ఈ దేశము కొంతకాలము ఆశ్రయము ఒసగెను. 1897 లో జరిగిన ఒడంబడికను అనుసరించి ఇటలీ ఈ రాజ్యపు ప్రతిపత్తిని గుర్తించినది. 1953 లో ఈ ఒడంబడికకు నవ్యరూపము ఈయబడినది. ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున ఈ దేశము తాటస్థ్యమును అవలంబించినను, 1944 లో తమ దండయాత్రాకాలమున బ్రిటిష్‌వారి విమానములు ఈ దేశముపై బాంబులు వేసి నష్టమును కలిగించినవి. ఇందులకు పరిహారముగ బ్రిటిష్‌వారు 1961 లో 81,000 పౌనులు ఈ దేశమునకు ఒసగిరి. ఇటలీదేశముతో ఈ దేశమునకు శుల్కసమ్మేళనము కలదు. దేశమున ఇటలీ నాణెములే చెలామణి అగుచున్నవి.

రాజ్యాంగము: ఈ దేశమున ఐదేండ్లకు ఒకసారి ప్రజలచే ఎన్నుకొనబడు 60 మంది సభ్యులు కల శాసనసభ (కాన్‌సిగ్లియో గ్రాండ్ జనరలే) యందు శాసన నిర్మాణాధికారము న్యస్తమై ఉన్నది. ఈ సభచే ఎన్నుకొనబడిన 12 మంది సభ్యులు కల రాజ్యసమితి (కాంగ్రెసో డి స్టేటో) పరిపాలన నిర్వహించును. ఈ రాజ్యసమితి సభ్యులు తమనుండి ఆరు నెలలకు ఒకసారి ఇరువురు పరిపాలకులను (కెపిటానీ రీజెంట్స్) ఎన్నుకొనెదరు. వీరిరువురు సమష్టిగ ఆరునెలలకాలము పరిపాలనకు ఆధ్వర్యవము వహింతురు. చీ. శే. రా.

**సాబా :** ఆగ్నేయ ఆసియాయందలి ద్వీపజాలమునకు చెందిన బోర్నియో ద్వీపమందలి ఒక ప్రత్యేక రాజ్యము. దీనికే ఉత్తరబోర్నియో అనియు వ్యవహారము కలదు. ప్రస్తుతమిది మలయేసియా సమాఖ్యయందు చేరి ఉన్నది [చూ. మలేసియా - పు. 734]. * * *

**సామోవ్, అమెరికన్ :** పసిఫిక్ మహాసముద్ర పరివృతమై, యునైటెడ్‌స్టేట్స్ పరిపాలనలో ఉన్న ద్వీపజాలము.

పశ్చిమ రేఖాంశ 171° కు తూర్పున దక్షిణ అక్షాంశ 13°-15° రేఖలమధ్య ఆరుద్వీపములు (తుత్విలా, తౌ, ఓలోసోగా, ఓఫూ, ఔను, రాస్) ను, వానికి వాయవ్యమున 337 కి. మీ. ల దూరమున ఉన్న స్వెయిన్‌దీవియు ఇందు చేరి ఉన్నది. ఈ దీవుల మొత్తపు [వి] 196 చ. కి. మీ.; ఇందులో తుత్విలాదీవి విస్తీర్ణము 103 చ. కి. మీ.; [జ] 20,051. [భా] సామోవ్‌భాష. పొలినీషియన్ [చూ.

సం. 10 - పు. 501] భాషా కుటుంబమునకు చెందినది. ఇంగ్లీషు వ్యవహార భాషగ ఉన్నది. [మ] క్రైస్తవ మతమునకు విపుల వ్యాప్తికలదు. [రా] తుత్విలాదీవియందలి పగోపగో (జ. సం. 1,251).

చరిత్ర : ఇదియును, పశ్చిమ సామోవ్‌ను కలసిన సామోవ్ ద్వీపజాలము పొలినీషియన్ భాషావర్గమునకు చెంది, కొంత నాగరక స్థాయికి రాగలిగిన పొలినీషియన్ జాతి సంతతివారి ఆవాసభూమి [చూ. పొలినీషియన్ వర్గ లక్షణములు ; సం. 10 - పు. 501]. ఈ ద్వీపజాలమును 1722 లో జేకబ్ రాగోవీస్ అను డచ్చి నావికుడు తొలుత కనుగొనెను. తరువాత కాలక్రమమున వివిధ యూరపియన్ జాతుల నావికులకు దానితో పరిచితి లభించినను గ్రేట్‌బ్రిటన్, యునైటెడ్‌స్టేట్స్, జర్మనీ దేశములకు చెందిన మతబోధకులును, వర్తకులును మాత్రమే అట కాలు నిలువద్రొక్కుకొనగలిగిరి. అంతట అచటి స్థానిక జాతీయ నాయకులతో ఒడంబడికను కుదుర్చుకొనుట మూలమున ఆ మూడు రాజ్యముల వారును క్రమముగ 1847, 1853, 1861 లలో తమ ప్రతినిధులను అట ఏర్పరచిరి. 1878 లో వేరొక ఒడంబడిక మూలమున పగోపగోలో బొగ్గు నింపుకొను వసతిని యునైటెడ్‌స్టేట్స్ ఆర్జించినది. అంతట దానితో పోటీపడి ఆ మరుసటి ఏటనే అట్టి అధికారమును తక్కిన రెండు రాజ్యములును ఆర్జించినవి. ఇట్టి అనర్థదాయకమగు సంఘర్షణను నివారించుటకై కడకు ఈ మూడు రాజ్యములును సంప్రతింపులు జరిపి ఒక ఒడంబడికను కుదుర్చుకొనినవి (1899). దానిని అనుసరించి ఆ ద్వీపజాలమునందు తూర్పు రేఖాంశ 171° కు తూర్పున ఉన్న ద్వీపములు యునైటెడ్‌స్టేట్స్ అధికార పరిధిలోనికిని, పశ్చిమ ద్వీపములు జర్మనీ అధికార పరిధిలోనికిని వచ్చునటులను ఏర్పాటు జరిగినది. యునైటెడ్‌స్టేట్స్‌కు లభ్యమైన వానికి అమెరికన్ సామోవ్ అనియు, జర్మనీకి దక్కినదానికి పశ్చిమ సామోవ్ అనియు పేరులు కలిగినవి. టోంగా మొదలగు చోటుల తనకు దక్కిన ప్రాదేశిక లాభమును గమనించి గ్రేట్‌బ్రిటన్ సామోవ్ ద్వీప జాలమున తన హక్కును వదలుకొనినది.

అమెరికన్ సామోవ్‌లోని ద్వీపములందు స్థానిక నాయకులకు గల స్వత్వములను 1904 నాటికి యునైటెడ్‌స్టేట్స్ కొనుగోలుచేసి, సంపూర్ణాధికారములను గ్రహించెను.

రాజ్యాంగము : యునైటెడ్‌స్టేట్స్ ప్రభుత్వముచే నియమింపబడిన గవర్నర్ ఇచట పాలనను నిర్వహించును. అతనికి సలహా ఇచ్చుటకు 18 మంది ఎన్నుకొనబడిన సభ్యులు గల ఒక శాసన సభయు, కుల - గౌరవములను అనుసరించి గవర్నర్‌చే జిల్లాకు అయిదుగురు చొప్పున నియమింపబడిన 15 మంది పెద్దలు గల ఎగువసభయు పనిచేయుచున్నవి. ప్ర. రా. సు.

**సామోవ్, పశ్చిమ :** పసిఫిక్ మహాసముద్ర పరివృతమగు ఒక ద్వీపరాజ్యము.

దక్షిణ అక్షాంశ 13°—15° మధ్యను, పశ్చిమ రేఖాంశ 171°—173° మధ్యను నెలకొని ఉన్న ఈ ద్వీపరాజ్యమున ఉపోలూ (1,114 చ. కి. మీ); సవాయీ (1,813 చ. కి. మీ) అను రెండు పెద్ద ద్వీపములును, మనోనో, అపోలిమా అను రెండు చిన్న ద్వీపములును, అత్యల్పములగు కొన్ని పవడపు లంకలును చేరి ఉన్నవి. ఈ ద్వీపరాజ్యపు మొత్తపు [వి] 2,934 చ. కి. మీ. ; [జ] 1,02,860. ఈ జనసంఖ్యలో మూడింట రెండు వంతులు ఉపోలూ దీవిలో వసించుచున్నారు. [మ] క్రైస్తవులు ; ఇందు ప్రొటెస్టంట్‌ల సంఖ్య అత్యధికము. [భా] పొలినీషియన్ వర్గమునకు చెందిన భాషలు వ్యాప్తిలో ఉన్నను వ్యవహారభాష ఇంగ్లీషు. [రా] ఉపోలూ దీవిలోని అపియా (జ. సం. 21,669).

చరిత్ర : సామోవ్ ద్వీపజాలమునుండి ఒడంబడిక ద్వారా 1899 లో జర్మనీకి దక్కుటతో ఈ రాజ్యపు ఆధునిక చరిత్ర మొదలైనది [చూ. పూర్వ చరిత్రకు సామోవ్, అమెరికన్]. ప్రథమ ప్రపంచ యుద్ధమున జర్మనీ విజితమైన తరువాత, దాని తక్కిన వలసలతో పాటుగ ఈ వలసయు విజేతల వశమై, ధర్మకర్తృత్వ (మాండేటరీ) పాలనకై న్యూజీలండ్‌నకు ఈయబడినది. న్యూజీలండ్ పాలనలో ఇట సువ్యవస్థిత పాలనయు, విద్యావసతులును ఏర్పడినవి. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున ధర్మకర్తృత్వ సంఘపు ఆ దేశమున 1933 లో ఈ రాజ్యమునకు స్వతంత్రతను న్యూజీలండ్ కల్పించినది.

రాజ్యాంగము : దేశమున శాసన నిర్మాణాధికారము ఎన్నుకొనబడిన శాసనసభయందు న్యస్తమై ఉన్నది. శాసనసభ యందలి సభిక సంఖ్య 40. శాసనసభయందు అధిక సంఖ్యాకులు ఆమోదమును పొందిన అతనిని ప్రధానిగా అధ్యక్షుడు నియమించును. అధ్యక్షుని, శాసనసభను అయిదు ఏండ్లకు ఒక పర్యాయము ప్రజలు ఎన్నుకొనెదరు. ప్ర. రా. సు.

**సామ్రాజ్యతత్త్వము** (ఇంపీరియలిజమ్): 'సామ్రాజ్యతత్త్వము', 'సామ్రాజ్యము' (ఎంపైర్), 'సమ్రాట్' (ఎంపరర్) అను పదములను నిర్వచించుట సులభముకాదు. అన్యాయమైన యుద్ధములు, దేశములను జయించు విజిగీష, అధర్మ రాజ్యశక్తి, నిరంకుశ ప్రభుత్వము, అధీనులైన ప్రజలను పీడించు అధికారము - ఇవియే సామాన్యముగ సామ్రాజ్యతత్త్వమునకు గల లక్షణములని కొందరు అందురు.

సామ్రాజ్య సృష్టికిని, స్థితికిని, పరిపాలనమునకును సంబంధించినదని సామ్రాజ్యతత్త్వమును వర్ణింపవచ్చును. అట్లే కేంద్రశక్తికి లోబడిన అనేక జాతులు గల విశాల రాజ్యము అని సామ్రాజ్యమును వర్ణింపవచ్చును. సమ్రాట్, రాజాధిరాజ, షాహిన్‌షా అనునవి సమానార్థములు గల పదములు.

పెక్కు దేశములు, జాతులు అన్యోన్యసమ్మతిని ఏక సామ్రాజ్యభాగములు కావచ్చును లేదా ఒక దేశము ఇతర దేశములను, జాతులను జయించి లోబరుచుకొన వచ్చును. సామాన్యముగ దౌర్జన్యమును, బలవంతమైన శక్తియును లేనిదే సామ్రాజ్యము ఏర్పడ జాలదు. సామ్రాజ్యమునకు శక్తి ఒక ముఖ్య లక్షణము.

సామ్రాజ్యములోని కొన్ని భాగములు నిరంకుశ ప్రభుత్వము కలిగి ఉండవచ్చును. మరికొన్ని భాగములు ప్రజా ప్రభుత్వమును లేదా నియమబద్ధమైన ప్రభుత్వమును కలిగి ఉండవచ్చును. ఎటులయినను ఇవి అన్నియు సామ్రాజ్యకేంద్రప్రభుత్వమునకు లోబడియే ఉండును. సమ్రాట్ సామాన్యముగ నిరంకుశుడుగనే ఉండినను ప్రజా ప్రభుత్వము సామ్రాజ్యములను ఏలజాలదనుట అసత్యము. బ్రిటిష్‌సామ్రాజ్యమును ఏలినది ప్రజా ప్రభుత్వము.

సామ్రాజ్యముల ఉద్దేశము : ప్రపంచమునందు అనేక సామ్రాజ్యములు వర్ధిల్లినవి ; నశించినవి. కాని, సామ్రాజ్య తత్త్వము మాత్రము స్థిరముగనే నిలచినది. శక్తియును, బలమును సామ్రాజ్యములకు మూలాధారములు అయి నప్పటికిని, సామ్రాజ్యములు తమ శక్తిని ప్రదర్శింపక, మిక్కిలి చతురతతో దాచుచున్నవి. సామ్రాజ్యవాదులు నాగరకతా విస్తృతియే తమ ముఖ్యోద్దేశమని వాదింతురు.

చరిత్ర మొదలైనపుడే సామ్రాజ్యములు స్థాపితమైనవని చారిత్రక పరిశోధనలు తెలియజేయుచున్నవి. 'తోత్మిస్' అను ఈజిప్టు చక్రవర్తిని 'అలిగ్జాండర్', 'నెపోలియన్' లతో పోల్చదగును. ఏథెన్స్ నగరము ఒక సామ్రాజ్యమును స్థాపించెను. కాని, అది త్వరలోనే విచ్ఛిన్నమయ్యెను. ఎందుచేతననగా - ఏథెన్స్ సామ్రాజ్యమునకు ఉండిన శక్తి కేవలము సాంస్కృతికశక్తియే కాని, అన్య దేశములను జయించి లోబరచుకొనుటకు ఇతర సామ్రాజ్యములు ప్రదర్శించిన దౌర్జన్య శక్తికాదు. అన్యజాతులపై అధి కారమును స్థాపించుట గ్రీక్‌లకు రుచింపకుండినది.

అలిగ్జాండర్ యొక్క సామ్రాజ్య భావము నిరుపమాన మైనది. ప్రపంచమునకు అంతయు సూర్యుడు ఎట్లు ఒక తేజో రాసియో, అదే రీతిని ప్రపంచమునకు అంతయు ఏకైక సార్వభౌముడు ఒకడు ఉండదగునని అతని అభిప్రాయము. విజితులైన ప్రజల ఎడ సానుభూతియు, సౌహార్దమును చూపుచు, రాజ్యములకును, జాతులకును అన్యోన్య బాంధవ్యములను కల్పించి, ఇతడు ప్రాక్పశ్చిమము లను ఒకటిచేయుటకు ప్రయత్నించెను. కాని, అతడు శీఘ్ర కాలములో చనిపోవుటచే అతని సంకల్పము నెరవేరలేదు.

కాని, సామ్రాజ్యము అను భావముమాత్రము అలిగ్జాండర్‌తో అంతరించలేదు. గ్రీక్‌లకు కేవలము కల్పనాశక్తియే ఎక్కువగ ఉండినది. కాని, వారికి కార్యదీక్ష, చతురత తక్కువ. కాని, రోమన్‌లు అసామాన్యమైన కార్యదక్షత కలవారు. సామ్రాజ్య తత్త్వమునకు వాస్తవస్వరూపము ఒసగుటకు వారు యత్నించిరి. రోమన్‌ల నాగరకత రోమన్ సైన్యమును అనుసరించినది. సమీప రాజ్యములలోని అంతఃకలహములు రోమ్ యొక్క విజయములకు తోడ్పడినవి. రోమ్‌లోని రాజకీయవేత్తలు ఈ అంతఃకలహములు తమ అవకాశ ములుగ నెంచి, తమ చాణక్యనీతిచే సమీపరాజ్యముల లోని వైషమ్యములను బలపరచి, తమ భేదోపాయము లచే వారిని సులభముగ ఓడింపగలిగిరి.

మధ్య యుగములందు యూరప్ ఖండము అంతయు మతాధికారియగు పోప్‌చేతను, చక్రవర్తిచేతను సమాన ముగ ఏలబడుచుండెడిదను భావము స్థిరమై ఉండెను. ఈ మధ్యయుగ సామ్రాజ్యము అంతరించిన పిమ్మటనే ఆధునిక సామ్రాజ్యతత్త్వము ఏర్పడగలిగినది. ఆధునిక యుగా రంభముననే నూతనభూభాగములు కనుగొనబడినవి. ఆ సమయముననే యూరప్‌న జాతీయోద్యమము కూడ ఆరంభమైనది. నూతన జాతీయరాజ్యములు స్థాపింపబడి నందున నూతన భూభాగముల వ్యాపారము కొరకై ప్రపంచమున తీవ్రమైన పోరాటము ఏర్పడినది. ఇదియే క్రమముగ నూతన సామ్రాజ్యములు రూపొందుటకు కారణ మైనది [చూ. సామ్రాజ్య యుగము, సమీక్ష - పు. 127].

క్రమముగ స్వలాభసామ్రాజ్యతత్త్వము అన్యోన్య వ్యాపారతత్త్వముగ మారినది. యునైటెడ్‌స్టేట్స్ స్వాతంత్ర్య సమర ఫలితముగ సామ్రాజ్య తత్త్వమునందు గొప్ప మార్పులు ఏర్పడినవి. సామ్రాజ్యమునకును, సామ్రాజ్యభాగములకును స్వతంత్ర విధానమే ముఖ్య సంబంధమైనది. ప్రతియొక భాగమున్ను తన అభ్యుదయ మునకు తానే బాధ్యత వహించుచు, సామ్రాజ్యనాయకత్వ మునకు సమ్మతించినది. ఇట్టి సామ్రాజ్యమునే 'ఎంపైర్ కామన్‌వెల్త్'(సమసంపత్తి సామ్రాజ్యము) అని వర్ణింతురు.

సామ్రాజ్య తత్త్వము - పెట్టుబడులు : జాతీయతయు, పెట్టుబడియు సామ్రాజ్యమును ప్రపంచమునందు సన్ని

హితత్వమును కొంతవరకు పెంపొందింపగలవు. కాని, విపరీతదశయందు అవి అంతర్జాతీయతకును, ప్రపంచ శాంతికిని అంతరాయములు అగును.

పారిశ్రామిక విప్లవమునుండి ఉత్పన్నమైన పెట్టుబడి అను ఆర్థిక శక్తి, జాతీయత అను రాజకీయ శక్తితో కూడి, నూతన సామ్రాజ్యతత్త్వమును జనింపజేసినది. ప్రతి ఒక జాతీయరాజ్యమున్ను తన వలస రాజ్యములను, అధీన ప్రాంతములను ఎక్కువ చేసికొనగోరుటచే రాజ్యములు అన్నిటియందును తీవ్ర స్పర్ధలు, యుద్ధములు ఏర్పడినవి.

సామ్రాజ్య తత్త్వమునందు ఆర్థిక శక్తుల ప్రాధాన్యమును లెనిన్ [చూ.], తదితర కార్ల్‌మార్క్స అనుయాయులు ఎక్కువగ వివరించి ఉన్నారు. తమ తమ దేశములందు పెట్టుబడిదార్లు లాభమును ఆర్జించి, ఎక్కువ లాభమును గోరుచు ఇతర దేశములలో ప్రవేశించి ఆక్రమింతురు. ఈ రీతిని ప్రపంచములోని అధిక ప్రజావర్గమంతయును ఈ పెట్టుబడిదార్లచేత చిక్కి నలుగును. తమ లాభముల కొరకు వీరొకరితో ఒకరు కలహించుటయు, ప్రపంచమునందు యుద్ధములు ప్రబలి నష్టమును, వినాశమును కలుగ జేయుటయు స్పష్టమైన విషయము.

సామ్రాజ్యపు ఏకత్వము : సామ్రాజ్యములు విజయముల పైన, శక్తి బలములపైన ఆధారపడినవనుట నిజమే అయినను, పాలితప్రాంతములు అన్నింట ఒక విధపు ఏకతను అవి రూపొందించినవి అనుటయు కొంతవరకు యథార్థమే.

రోమన్ సామ్రాజ్యమునందు అట్టి ఐక్యము చాలవరకు సిద్ధించినది. క్రీ. శ. మూడవ శతాబ్దమునుండి పౌరస్వత్వములు సామ్రాజ్యములోని ప్రజలకు లభించినవి. ఇప్పటికి కూడ మతసంబంధము లేని సామ్రాజ్యములలోకెల్ల రోమన్ సామ్రాజ్యము మార్గదర్శకముగ పరిగణింపబడుచున్నది.

బ్రిటిష్‌సామ్రాజ్యము ప్రపంచమునందు అంతటను వ్యాపించినది. అందుచేత బ్రిటిష్ సామ్రాజ్యము వికీర్ణమై ఒక దేశమునకుగాని, ప్రజా సముదాయమునకుగాని, నాగరకతకుగాని అన్వయింపక అనేకత్వమే ముఖ్య లక్షణముగ కలిగి ఉండినది. బ్రిటిష్ రాజనీతియందు వ్యక్తివాదము మిక్కిలి ప్రధానమైనది. సాంఘిక విషయములందు కాని, ప్రజల సంస్కృతి, సంకల్పములందు కాని సమానతను బ్రిటిష్‌సామ్రాజ్యము స్థాపింప బూనలేదు. ఇదియే బ్రిటిష్ సామ్రాజ్యమునకును, ఇతర సామ్రాజ్యములకును గల గొప్ప వ్యత్యాసము. మునుపటి రోమన్ సామ్రాజ్యమువలెనే బ్రిటిష్ సామ్రాజ్యము కూడ మత సామ్రాజ్యము కాదు.

రోమన్ సామ్రాజ్యము వలెనే రష్యాసామ్రాజ్యము కూడ అఖండమైన సరిహద్దును, ఏక దేశమును కలిగి ఉండెను. రష్యా చక్రవర్తియగు 'జార్' చక్రవర్తియే కాక మతాధిపతికూడ. కాని, నానాజాతులు, వర్గములు గల రష్యాసామ్రాజ్యమునందు సాంఘిక ఐక్యము ఏ మాత్రమును సాధ్యము కాకుండినది. కనుక, 'జార్' ప్రభుత్వము అంతమొందిన వెంటనే రష్యాసామ్రాజ్యము కూడ విచ్ఛిన్నమైనది. ఆధునిక సోవియట్‌రష్యా కూడ ఒకవిధమగు సామ్రాజ్యమని వర్ణింపదగును. ప్రపంచ చరిత్రయందు ఈ రష్యా సామ్రాజ్యము అపూర్వమైనది. ఆర్థిక తత్త్వము ఈ సామ్రాజ్యపు అంతశ్శక్తి. రష్యా ఆర్థిక తత్త్వమునకు కార్ల్‌మార్క్స మూలకర్త. సంఘమును కార్మికులు, ధనికులు అను రెండు వర్గములుగ విభజించి, ప్రపంచములోని కార్మికవర్గములను అన్నిటిని ఈ తత్త్వము ఏకీభవింపజేయ జూచుచున్నది.

సామ్రాజ్యములు అన్నిటిలోను స్పెయిన్ మాత్రము తన ప్రజలు అందరును సామాన్యమతమును అవలంబించునట్లు ప్రయత్నించెను. రోమన్, బ్రిటిష్ సామ్రాజ్యములకును, స్పెయిన్ సామ్రాజ్యమునకును ఇదియే ముఖ్యమైనట్టి భేదము. స్పెయిన్ సామ్రాజ్య పతనమునకు మతదురభిమానమే ముఖ్య కారణము.

అయినను ఆధునిక సామ్రాజ్యస్థాపనకు మత ప్రచారకులు ఎంతయో తోడ్పడినారనుట యథార్థము. కాని, ఆసియా, ఆఫ్రికా ఖండములందు ఈ మతప్రచారము ఎక్కువ ఫలితమును ఈయలేకపోయినది. అన్యమత ప్రచారము వలననే ప్రాచ్యదేశములందు జాతీయత బలపడినది అనవచ్చును.

మతమేకాక, శరీర వర్ణములకు సంబంధించిన వ్యత్యాసములు, వైషమ్యములు సామ్రాజ్యముల స్థైర్యమునకు అంతరాయములు అయినవి. ఆఫ్రికాయందలి బ్రిటిష్ సామ్రాజ్య దేశములలో ఈ వైషమ్యములు స్పష్టముగ అగపడి, నల్లజాతులును, తెల్లజాతులును ప్రత్యేకముగ నివసింపవలయునను విపరీతమునకు ఈ పరిస్థితులు దారితీసినవి.

భాషకూడ మత వర్ణములవలెనే సామ్రాజ్యముల స్థైర్యమును ఆటంకపరచుచున్నది. రోమన్ సామ్రాజ్యమునందు ప్రజలు అందరును రాజభాషను అభ్యసింప కోరిరి. కాని, ఆధునిక సామ్రాజ్యములలోని ప్రజలు రాజభాషకు విరుద్ధులై తమ తమ ప్రత్యేక భాషల అభివృద్ధినే ఎక్కువగ వాంఛించిరి.

ఆధునిక సామ్రాజ్యతత్త్వ ఫలితములు : ఆధునిక సామ్రాజ్య తత్త్వము యొక్క ముఖ్య ఫలితము యూరప్

సంస్కృతియు, ముఖ్యముగ పారిశ్రామిక పద్ధతులును ప్రపంచమునందు అంతటను వ్యాపించుట. అందులకు జపాన్, చీనా, భారతదేశములు ముఖ్యమైన నిదర్శనములు.

రాజకీయ దృష్టితో పరిశీలించిన ఎడల ఆధునిక సామ్రాజ్య తత్త్వములోని మరియొక అంశము స్పష్టము కాగలదు.

తూర్పు దేశములలో జాతీయత సామ్రాజ్యముల నుండియే జనించినది. సామ్రాజ్యములును, జాతీయతయు విరుద్ధమైనవి. సామ్రాజ్య స్థైర్యము కొరకు జాతీయతను అణచుట అవసరము. కాని, అణచిన కొలది ప్రబలుటయే జాతీయతా లక్షణము. ఈ జాతీయోద్యమమును తూర్పు దేశములయందు రష్యా మిక్కిలి బలపరచినది.

సామ్రాజ్యతత్త్వము - భవిష్యత్తు: ప్రపంచమునందు నాగరక, అనాగరక దేశములు; ఉత్తమ, సామాన్య, ఆర్థిక విధానములు అను విభాగములు ఉన్నంత వరకును సామ్రాజ్యములు ఉండుటకు అవకాశము కలదనుట పై వివరణమునుండి స్పష్టమగును. అట్లే సామ్రాజ్యములు ఉన్నంతవరకు యుద్ధ పరంపరలు తప్పనివి అనుట కూడ స్పష్టమైన విషయమే. సహకారము, అన్యోన్యతలపై ఆధారపడి ఉండు ప్రపంచము ఏర్పడువరకును సామ్రాజ్య తత్త్వము నశింపదు.

నేడు ప్రపంచ పరిస్థితులు చాలవరకు మారినవి. బ్రిటిష్ సామ్రాజ్యమును బ్రిటన్ కోల్పోయినది. అనేక సామ్రాజ్యములు నశించినవి. ప్రపంచమునందు ఇంక పూర్వపు సామ్రాజ్యములకు అవకాశము లేదు. సామ్రాజ్యములు ఇకముందు వ్యాపారవిభాగములకును, యుద్ధములకును అన్వయింప గలుగును; కాని, మునుపటివలె ఉండ నేరవు.
ప్ర. రా.

**సార్ మండలము :** నేలబొగ్గు గనులు విస్తారముగ ఉన్న ఒక జర్మనీ మండలము. ఈ నేలబొగ్గు నిక్షేపముల కారణముననే ఇది పలుమారులు చేతులు మారెను. ఈ మండలము సార్‌నదీ లోయ వెంబడి 2,000 చదరపు కిలోమీటరులకు పైబడిన వైశాల్యమును ఆవరించి ఉన్నది. 1919 లో ప్రపంచయుద్ధము - I పర్యవసానముగ జరిగిన వెర్సెయిల్స్ సంధి షరతుల మేరకు 1919 నుండి 1935 వరకు ఈ సార్‌మండలము నానాజాతిసమితి పరిపాలన క్రింద ఉంచబడెను. అయితే, ప్రపంచయుద్ధము - I లో జర్మనీ సైన్యములు ఫ్రెంచి గనులకు కలిగించిన నష్టమును భర్తీ చేయుటకై సార్‌మండలమునందలి బొగ్గు గనుల యాజమాన్యము ఫ్రెంచివారికి అప్పగించబడెను. 1935 లో సమితి జరిపిన జనవాక్యమునందు అత్యధిక సంఖ్యాక బలము (మెజారిటీ) చే, సార్‌మండల ప్రజలు దానిని తిరిగి జర్మనీ పరిపాలనకు ఒప్పగించవలెనని తీర్మానించిరి. దానిని అనుసరించి 1935, మార్చి 1 న సార్‌మండలము జర్మనీ పరిపాలనకు బదలాయింపబడెను. కాని, ఫ్రెంచివారు 1945 లో మరల పై మండలమును వశపరచుకొని 1957, జనవరి 1 వరకు పరిపాలించిరి. అయితే, సార్‌మండల ప్రజల నిరోధముచే మరల రెండవతూరి జనవాక్యము గైకొనబడి, అది మరల జర్మనీ రాష్ట్రమున విలీనమయ్యెను.
స్వ. వెం.

**సార్‌వాక్ :** ఆగ్నేయ ఆసియా ద్వీపజాలమందలి బోర్నియో ద్వీపమున వాయవ్య ప్రాంతమునందలి ఒక రాజ్యము. ప్రస్తుతము ఇది మలేసియా సమాఖ్యతో చేరి ఉన్నది [చూ. మలేసియా - పు. 734].
* * *

**సాలిహుండము :** చూ. తె. సం; సం. - పు. 1190.

**సావర్కార్, వినాయక్ దామోదర్** (1883 - 1966) : భారత విప్లవవీరుడు; వక్త; రచయిత. పారతంత్ర్య విమోచనకు బలప్రయోగము శరణ్యము అని ప్రబోధించిన విప్లవోద్యమ నిర్మాత. మహారాష్ట్రదేశములో నాసిక్ జిల్లాలోని భాగూర్‌లో చిత్పవనబ్రాహ్మణ కుటుంబమున జన్మించెను (27, మే, 1883). గత శతాబ్ది కడపట అనేక ఆంగ్లేయుల హత్యలకు దారితీయించిన దౌర్జన్యకాండ రూపమున అభివ్యక్తము అయిన స్వాతంత్ర్య పిపాస - ఆనాటి కొందరు యువకులలోవలె - యువక సావర్కార్ నరనరాలలో రగుల్కొనెను. అందుచే విద్యార్థి దశయందే ఈయన నాసిక్‌లో 1899 లో 'మిత్రమండలి' అను విప్లవసంస్థను స్థాపించెను; పూనా ఫర్గూసన్ కాలేజీలో చేరి (1900), అచ్చట తోడి విద్యార్థులలో విప్లవ బీజములను నాటెను. పట్టపరీక్షలో అమోఘముగ ఉత్తీర్ణుడు కాగలిగినను, దౌర్జన్యవాది అన్నసాకున ఈయనకు డిగ్రీ నిరాకరింపబడెను (ఇటీవల బొంబాయి యూనివర్సిటీ సావర్కార్‌కు ఆ డిగ్రీని గౌరవపురస్సరముగ సమర్పించుకొన్నది). కాలేజీ విడిచిన తరువాత ఈయన 'అభినవ భారత్' అను మరొక సంస్థను నెలకొల్పి, 'విహార' అను వారపత్రికలో వెలువరించిన తన రచనల ద్వారా భారతీయదాస్య తమోవిముక్తికి విప్లవ జ్యోతి వెలిగించెను. పిదప విద్యార్థి వేతనముపై లండనులో న్యాయశాస్త్రమును అభ్యసించుచు, సావర్కార్ అప్పటికే ఆ నగరమున నెలకొల్పబడిన 'ఇండియా హౌస్' యాజమాన్యమును చేపట్టి, 'స్వతంత్ర భారత సమాజము' ను రూపొందించెను. ఈ సంఘసభ్యులు బాంబుల తయారీలోను, విప్లవ చర్యలలోను శిక్షణ పొందుచుండిరి; ఇచ్చటనే ఈయన 'ప్రథమ భారత స్వాతంత్ర్యయుద్ధము' అను గ్రంథమును మహా

రాష్ట్రభాషలో రచించెను; దాని ఆంగ్లానువాదము హాలండ్‌లో ప్రచురింపబడెను. ఈ గ్రంథముపై భారత దేశమున సామ్రాజ్యప్రభుత్వము విధించిన నిషేధము 1947 లో స్వతంత్రభారత ప్రభుత్వము వలన రద్దు చేయ బడినది. దౌర్జన్య సిద్ధాంతమునకు స్వస్తి చెప్ప నిరాకరించి నందులకు ఈయనకు న్యాయశాస్త్రపట్టము కూడ లభింప లేదు. బ్రిటిష్‌ప్రభుత్వము 1910 లో సావర్కార్‌ను అరెస్టు చేసి, భారతదేశమునకు పంపించెను. త్రోవలో ఈయన ఓడ కిటికీనుండి సముద్రములోనికి దూకి, కాపలాదారులు కురిపించిన గుండ్లవర్షమునుండి తప్పించుకొని, ఈదుకొని పోయి, ఫ్రెంచి తీరమును చేరుకొనెను; కాని, అంతర్జాతీయ న్యాయసూత్ర విరుద్ధముగ బ్రిటిష్‌వారు ఫ్రాన్స్ గడ్డపై ఈయనను మరల అరెస్టు చేసిరి.

ప్రభుత్వము ఈయనపై మూఁడు అభియోగములు మోపి, ద్వీపాంతరవాసము విధింపజేసి, అండమాన్ దీవులలో నిర్బంధించెను. 1924 లో ప్రభుత్వము సావర్కార్‌ను భారతదేశమునకు కొనితెచ్చి, రత్నగిరిజిల్లాలో - ఆ జిల్లా సరిహద్దులు దాటి పోరాదను నిబంధనతో - ఉంచెను. 1937 లో కాంగ్రెస్ ప్రభుత్వము ఈయనను నిర్నిబంధముగ విడుదల చేసెను. గాంధిమహాత్ముని [చూ. పు. 421] అహింసా వాదమును ఈయన నిర్ద్వంద్వముగ నిరసించెను; కాంగ్రెస్ విధానము దేశ విభజనకు దోహదము చేయునని పదే పదే హెచ్చరించెను. తరువాత హిందూజాతి పునరుద్ధరణ కాంక్షతో సావర్కార్ హిందూమహాసభలో చేరి, అనేక సంవత్సరములు అధ్యక్ష పదవిని నిర్వహించెను. గాంధిజీ హత్యలో ఈయనకు గూడ ప్రమేయము కలదని ఆరోపింపబడెను; కాని, ఆ కేసును విచారించిన న్యాయస్థానము ఇతనిని నిర్దోషి అని తీర్పు చెప్పినది.

కవిగా, రచయితగా, వక్తగా, సాంఘిక సేవకుడుగా ఈయన అద్వితీయుడు. అండమాన్‌దీవులలో జైలు అధికారులు వ్రాత పరికరములను ఇవ్వ నిరాకరింపగా ఈయన ముల్లుతో గోడలపై 'పానిపట్ యుద్ధము' అను కవిత్వ మాలలో దాదాపు 10 వేల పద్యపాదములను వ్రాసి, కంఠస్థము కావించెను. ఈయన నిప్పులు క్రక్కునట్లు ఉపన్యసించగల అసాధారణ వక్త. సాంఘిక అసమానత్వ నివారణకు, అస్పృశ్యతా నిర్మూలమునకు కృషి చేసెను. సావర్కార్ మరణము (27 ఫిబ్రవరి 1966) విని 'వీర సావర్కార్' అని అశేష భారతప్రజలును, ఐతిహాసిక వ్యక్తి అని భారతరాష్ట్రపతియు జోహారులు అర్పించిరి [చూ. భారతదేశము పు. 645]. అ. వెం.

సాహూ : చూ. మహారాష్ట్రులు - పు. 727.

**సింగపూర్ :** ఆగ్నేయ ఆసియాయందలి ఒక స్వతంత్ర ద్వీపరాజ్యము. కామన్‌వెల్త్ (జాతి సమ సంపత్తి) లో సభ్యత్వము వహించి, ఈ రాజ్యము ఆంతరంగిక స్వయంపాలన కలిగి ఉన్నది.




మలయా ద్వీపకల్పపు దక్షిణాగ్రమున హిందూ మహాసముద్ర పరివృతమై నెలకొని ఉన్న సింగపూర్ దీవియు, దానికి సన్నిహితముగ ఉన్న కొన్ని అల్ప ద్వీపములును చేరి సింగపూర్ రాజ్యముగ పరిగణన పొందినవి. మలయా ద్వీపకల్పము నుండి సింగపూర్ ద్వీపమును జోహోర్ జలసంధి వేరు చేయుచున్నది. కాని, ఈ జలసంధి లోతు, వెడల్పు చాల తక్కువగ ఉండుటవలన దీనిపై ఒక చపటా మూలమున రాకపోకల వసతి ఏర్పాటు చేయబడినది. పరిపాలన రీత్యా దానితో చేరి ఉన్న అల్పద్వీపములతో సహా [వి] 581 చ. కి. మీ.; [జ] 14,25,929. వీరిలో దాదాపు 75% చీనీయ సంతతివారు; తక్కిన వారిలో మలేలు, భారతీయులు, పాకిస్తానీయులు, యూరపియన్ సంతతివారు క్రమముగ ప్రాధాన్యము వహింతురు. [భా] ఇంగ్లీషు, చీనీయ, మలే, తమిళ, భాషలు అధికార భాషలుగ పరిగణననందినవి. అరబ్బీ కూడ అటనట మాతృభాషగ వ్యాప్తియందు ఉన్నది. వీని అన్నింట ఎక్కువగ వ్యాప్తియందున్నది చీనీయ భాష. వివిధ జాతుల మధ్య సామాన్య వ్యవహారసాధనముగ మలేభాష ఎక్కువగ వాడబడుచున్నది. [మ] ప్రజలలో మలేజాతివారు అందరు ముస్లిమ్‌లు; చీనీయులలో అత్యధిక సంఖ్యాకులు బౌద్ధ, కన్‌ఫ్యూషియన్, టావో మతములకు చెందినవారు. భారతీయులలో హిందువులును, పాకిస్తానీయులలో ముస్లిమ్‌లును అత్యధిక సంఖ్యాకులు. [రా] సింగపూర్ (జ. సం. 10,11,400).

చరిత్ర : 19 వ శతాబ్ది ఆరంభమువరకు ఈ ప్రాంతమంతయు మలయాయందలి జోహోర్ మండలమున పరిపాలన రీత్యా అంతర్భాగమై, నిర్మానుష్యముగ ఉండెడిది. బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీవారి పక్షమున సర్ స్టామ్‌ఫర్డ్ రాఫిల్స్ అను ఉద్యోగి సింగపూర్ ద్వీపపు దక్షిణపు మూలన ఒక వర్తకస్థావరమును 1810 లో నెలకొల్పెను.

1824 లో ఈ ద్వీపము బ్రిటన్‌కు దత్తమొనర్పబడినది. అంతట అదివరకే తమ స్వాధీనమున ఉన్న మలక్కా, పెనాంగ్ ద్వీపములతో పరిపాలనరీత్యా దీనిని చేర్చి 'స్ట్రెయిట్స్ సెటిల్‌మెంట్స్' అను రాష్ట్రమును బ్రిటిష్ ప్రభుత్వము రూపొందించెను. క్రమముగ బ్రిటిష్‌వారి వర్తకస్థావరము ప్రాముఖ్యము గడించెను. ప్రకృతి సహజముగ అచట ఏర్పడిన రేవు నౌకల రాకపోకలకు చాల అనువుగ ఉండుటచే, వ్యాపారము పెరిగి, అందు మూలమున తొలుత చీనీయులును, తరువాత మలేలు (మలయా వాసులు) ను విరివిగ వచ్చి చేరిరి. ఇటుల ఆ వర్తక స్థావరము పెద్దదియై తుదకు నేటి సింగపూర్ నగరముగ పరిణమించెను. మలయా ద్వీపకల్పము నుండి ఎగుమతియగు రబ్బరు, తగరములకు సింగపూర్ రేవు రవాణా కేంద్రము అయ్యెను. ఇటుల దినక్రమమున దీని ప్రాముఖ్యము అతిశయించి, ఆగ్నేయ ఆసియాయందెల్ల ప్రముఖ కీలక స్థానముగ పరిగణన ఈ నగరమునకు లభించుటవలన, 1938 లో బ్రిటిష్‌ప్రభుత్వము ఇట నౌకా, వైమానిక స్థావరములను నెలకొల్పెను. కాని, ద్వితీయ ప్రపంచ యుద్ధ కాలమున 1942 లో మలయాను వశపరచుకొనిన జపాన్ సేనలు, ఆ వెనువెంటనే ముట్టడి సలిపి సింగపూర్‌ను కూడ సులభముగ ఆక్రమించుకొనినవి. బ్రిటిష్ సేనలు మరల 1945 లో ఈ ప్రాంతమును వశపరచుకొనెను. 1946 లో స్ట్రెయిట్స్ సెటిల్‌మెంట్స్‌నుండి ఈ ప్రాంతమును వేరుపరచి బ్రిటిష్ ప్రభుత్వము దీనిని మకుటపు వలసగ చేసెను. తరువాత 1959, జూన్ 3 వ తేదీన ఆమోదింపబడిన రాజ్యాంగచట్టమును అనుసరించి, కామన్‌వెల్త్ ఆవ్ నేషన్స్ [చూ. పు. 382] లోని సభ్యత్వముతో పాటుగ ఆంతరంగిక స్వయంపరిపాలనము ఈ ప్రాంతమునకు చేకూరెను. 1963, సెప్టెంబరు 16 వ తేదీన రూపొందిన మలేసియా సమాఖ్యయందు ఈ రాజ్యము చేరినది [చూ. మలేసియా]. కాని, 1965 లో విడివడినది.

రాజ్యాంగము: 1959 రాజ్యాంగ చట్టము అనుసరించి బ్రిటిష్ ప్రభుత్వ బాధ్యతకు వదలివేయబడిన రక్షణ, విదేశ వ్యవహారములు తప్ప తక్కిన అన్ని విషయములందును ఈ దేశము సర్వాధికారములను వహించి ఉన్నది. బ్రిటిష్ రాజ్ఞిచే నియమింపబడు ప్రతినిధి దేశాధిపతిగ వ్యవహరించును. ఇతనిని మలే భాషలో 'యాంగ్‌డీ ప్రధాన నగర' అందురు. ఆంతరంగిక శాంతి భద్రతల సంరక్షణకై ప్రప్రథమ బాధ్యత సింగపూర్ ప్రభుత్వమునకే చెంది ఉన్నను, సింగపూర్ ప్రతినిధులు మువ్వురు, బ్రిటిష్ ప్రతినిధులు మువ్వురు, మలయా ప్రతినిధి ఒకడు కల ఒక సంఘము శాంతి భద్రతల పర్యవేక్షణ భారమును వహించి ఉన్నది. కొన్ని ప్రత్యేక పరిస్థితులలో రాజ్యాంగ చట్టమును తాత్కాలికముగ ఉపసంహరించుటకు బ్రిటిష్ రాజ్ఞకి హక్కు కలదు. శాసనసభకు బాధ్యత వహించి, ప్రధాని అధ్యక్షతన పనిచేయు మంత్రిమండలి కార్య నిర్వహణ బాధ్యతను కలిగి ఉన్నది. ఏక కక్ష్యకల శాసనసభయందలి సభికసంఖ్య 51. సార్వజనిక వయోజన, అపరోక్షపు ఎన్నికల మూలమున సభ్యులు ఎన్నుకొనబడెదరు. సింగపూర్‌లో జన్మించిన వారికిని, బ్రిటన్, బ్రిటిష్ వలస రాజ్యములు, మలయా, బ్రిటిష్ బోర్నియో, నానాజాతి సమసంపత్తియందు సభ్యత్వము కల స్వతంత్ర రాజ్యములందు జన్మించి, సింగపూర్‌లో ఎన్నికల ముందుగ రెండేండ్ల నివాసార్హత కలవారును, ఇతర దేశములలో జన్మించినను, సింగపూర్‌లో ఎనిమిదేండ్ల కాలమునకు పైగా వసించిన వారికిని ఈ దేశమున వోటుహక్కు కలదు. మలేసియా సమాఖ్యలో ఈ దేశము చేరిన తరువాత రాజ్యాంగమునందు తదనుగుణమగు మార్పులు జరిగినవి.

చీ. శే. రా.

**సింధు నాగరకత:** భారత ఖండమునందు నెలకొని అంతరించిన ఒక ప్రాచీన నాగరకత. ఈజిప్టు, సుమేరియన్ నాగరకతల కన్న ప్రాచీనతరమని కొందరి అభిప్రాయము. కాని, సమకాలీనమని పలువురి నిశ్చితాభిప్రాయము. స్థూలముగ క్రీ. పూ. 3750 మొదలుగ క్రీ. పూ. 2000 వరకు ఈ నాగరకత మని, తదనంతరమున అవిదిత కారణముల వలన అంతరించియుండునని విజ్ఞులలో పలువురి ఉద్దేశము. 1922 మొదలుగ ఈ నాగరకతను గురించిన పలు విషయములు పురాతత్త్వ విదుల కృషివలన క్రమముగ తెలియ వచ్చినవి [చూ. సమీక్ష - పు. 14 - 15, భారతదేశము - పు. 664]. ముఖ్యముగ సింధురాష్ట్రమునందలి మొహెంజొదారో వద్దను, పంజాబునందలి హరప్పావద్దను జరిగిన త్రవ్వకములవలన ఆ నాగరకతకు చెందిన ప్రాచీన నగరముల స్వరూపము, ప్రజల నాగరకతాస్థాయి మొదలగు వానినిగురించి మొదటిసారిగ కొన్ని నిర్ణయములు జరిగినవి. అపుడు ఈ నాగరకత సింధునదీ ప్రాంతమున మాత్రమే వ్యాపించినటుల కనుపట్టినను, తరువాతి పరిశోధనల వలన అది గంగా యమునా నదుల మధ్య భూమికిని, రాజస్థాన్‌కును, తూర్పు గుజరాత్‌నకును వ్యాపించినటుల స్పష్టమగుచున్నది. ఇట్టి అభిప్రాయమునకు ఉపపత్తి బలమును చేకూర్చిన వానిలో అలంగిర్‌పూర్, కాలీబంగన్, లోతాల్ ప్రాంతములందు సాగించిన త్రవ్వకములు ప్రముఖముగ పేర్కొనదగినవి.

ఉత్తర ప్రదేశ్‌లోని మీరట్ జిల్లాయందలిది అలంగీర్ పూర్. 1958 లో ఇచటి త్రవ్వకములందు సింధునాగరకతకు చెందిన అవశేషములు పెక్కు కనుగొనబడినవి. రాజస్తాన్ లోని గంగానగర్ జిల్లాయందలి కాలీబంగన్ ప్రాంతపు త్రవ్వకములందు మొహెంజొదారో త్రవ్వకములందు వలెనే ఒక నగరపు అవశేషములు చక్కగ లభ్యమైనవి. ఇచట ఒక కోటయు, దానికి తూర్పుగ ఒక పౌర జనావాస నగరమును నెలకొని ఉండినటుల విదితమైనది. కోటగోడ పచ్చి ఇటుకలతో 7 మీటర్లు వెడల్పున నిర్మితమైనది. అటనట బురుజులును కలవు. కోట మధ్యన పచ్చి ఇటుకతో నిర్మితమగు ఒక విశాల వేదికయు, దానిపై కొన్ని ప్రముఖ భవనావశేషములును కననగుచున్నవి. ఈ భవనములలో ఒకటి పౌరజనుల ఆరాధనామందిరమనియు, వేరొకటి ధాన్యమును నిల్వజేయు పెద్దగిడ్డంగి అనియు నిర్ణయించుటకు ఆధారములు కలవు. ఆరాధనామందిరమున హోమ గుండములును, మధ్య ఒక స్తూపాకార స్తంభమును కలవు. ఈ అవశేషములవలన సింధునాగరకతాకాలపు ప్రజల మత విశ్వాసములను గురించి కొన్ని నిర్ణయములను చేయ వీలగుచున్నది. ఇదివరలో మొహెంజొదారో, హరప్పా త్రవ్వకముల వలన అప్పటి ప్రజల మత విశ్వాసములను గురించి నిర్దిష్టముగ తెలిసికొనుటకు ఆధారములు లభించినవి కావు. కాని, కాలీబంగన్ త్రవ్వకములవలన ఆ లోపము కొంతవరకు పూరింపబడినది.

కాలీబంగన్‌వద్ద త్రవ్వకములలో వెలువడిన పౌర జనావాసను సైతము మొహెంజొదారో వలెనే ఉత్తర-దక్షిణములకును, తూర్పు-పడమరలకును తీర్చిదిద్దిన వీధులతో పొందికగ నిర్మింపబడినది. మొహెంజొదారో వలెనే ఇదియు పెక్కు మారులు తిరుగ కట్టబడినటుల త్రవ్వకపు పొరలవలన స్పష్టమైనది. ఈ ఉభయ నగరములందును సామాన్య గృహములకు సైతము చక్కని లోతట్టు ఆవరణమును, బావియు ఏర్పడి ఉండినవి. ఒక శిథిల గృహములో మెట్లశ్రేణి ఒకటి చక్కగ కనబడుచున్నందున రెండంతస్తుల భవనములు కొన్ని అచట ఉండినటుల భావించ వీలగుచున్నది. పండితులలో కొందరి అభిప్రాయమును అనుసరించి సింధునాగరకతకు మూలముగ భావింపదగు వేరొక నాగరకత ఈ కాలీబంగన్ త్రవ్వకములలో దిగువ పొరలందు లభ్యమగుచున్నదను అభిప్రాయమును కలదు.

పై వానికన్నను, సింధునాగరకతను గురించిన ఒక ప్రత్యేక విశిష్టతను వెలువరచుటలో ప్రముఖతను ఆర్జించినది లోతాల్‌లోని త్రవ్వకపు పని. గుజరాత్‌లోని ఒక ప్రాచీన ప్రదేశము లోతాల్. పూర్వమున, బొగావో అనెడు నది ప్రవహించి ఉండిన ప్రదేశమునకు సమీపమున ఇది కలదు. అచట జరిపిన త్రవ్వకములవలన సింధునాగరకతా కాలపు ఒక నౌకానిర్మాణకేంద్రము (డాక్‌యార్డ్) బయలుపడినది. ఈ శాల పొడవు 218 మీటర్లు, వెడల్పు 37 మీటర్లు. ఇందలి గోడలు కాల్చిన ఇటుకతో నిర్మింపబడినవి. 7 మీటర్లు వెడల్పు కల ఒక కాలువ ఈ నిర్మాణకేంద్రమును బొగావో నదితో కలపిన లక్షణములును కనవచ్చినవి. అందువలన నౌకానిర్మాణకేంద్రములో నిర్మింపబడిన నౌకలు బొగావో నదికి చేరి అటనుండి నదీ మార్గమున కాంబె సింధుశాఖను ప్రవేశించి, దానిద్వారా అరేబియా సముద్రమునకు చేరుకొనెడివని అర్థమగుచున్నది.

మొహెంజొదారో మొదలగు పై సింధు నాగరకతా ప్రాంతములందు ధాతువులందెల్ల రాగి మాత్రమే విరివిగ వాడుకలో ఉండుట, ఇనుమును గురించిన పరిజ్ఞానమే లేకుండుట, అవిదితమగు చిత్రలిపి కలిగిన ముద్రికలు లభించుట అనునవి సామాన్య లక్షణములు. ఈ ముద్రికలందలి లిపిని పఠించుటకు పలువురు పండితులు ఒనర్చిన యత్నములు విఫలమైనవి. కాని, ఇట్టి ముద్రికలు ప్రాచీన సుమేర్ - బాబిలోనియా నాగరకతకు చెందిన ఉర్, ఉమ్మా, లగాష్ మొదలగు నగరములందలి త్రవ్వకములందు లభించుటవలన సింధునాగరకతతో బాబిలోనియా వాసులకు వ్యాపారసంబంధములు ఉండెడివని రుజువైనది. ఈ వ్యాపారము భూ మార్గమున మాత్రమే జరిగినదని కొందరు తొలుత తలచిరి. కాని, లోతాల్‌లోని త్రవ్వకములవలన ఈ విషయమున సందిగ్ధత తీరి సింధునాగరకతా కాలమున అచటి నగరముల వర్తకులు నౌకామూలమున సైతము వ్యాపారము సాగించినటుల స్పష్టమైనది.

సింధునాగరకతా కాలమున నగర నిర్మాణకౌశలము సమకాలీన తదితర నాగరకతలందు కన్న ఉచ్చస్థాయిని అందుకొనినది. అచట లభించిన వివిధ గృహోపకరణములు, క్రీడా వస్తువులు, భూషణ విశేషములు, శిల్పావశేషములు ఆనాటి పౌరుల భోగలాలసతను, నాగరకతాస్థాయిని చక్కగ తెలియజేయుచున్నవి. శౌచవిధియందు వారికి గల అత్యంతాసక్తికి, వారి గృహ నిర్మాణరీతి చక్కని సాక్ష్యముగ ఉపకరించుచున్నది. పౌర జనుల సదుపాయముల విషయమున ఆనాడు వహింపబడిన శ్రద్ధకు మొహెంజొదారో శిథిలములందు కననగు చక్కని మహాదీర్ఘిక (కోనేరు) యును, తత్పరిసరములందలి స్నానాగారములును నిదర్శనములు.

భారతీయ నాగరకత ప్రాచీన సింధు నాగరకతకు ఎంతవరకు ఋణపడి ఉన్నదను విషయమున పండితులు

విస్పష్టములగు నిర్ణయములను ఇప్పటికి చేయజాలక ఉన్నారు. భావి పరిశోధనవలన మాత్రమే ఇది పరిష్కృతము కాగలదు.
చీ. శే. రా.

**సింహళము :** భారతదేశమునకు దక్షిణమున హిందూ మహాసముద్ర పరివృతమై ఉన్న ఒక స్వతంత్ర ద్వీపరాజ్యము. ఈ రాజ్యమును ఆ దేశవాసులు 'శ్రీలంక' అని వ్యవహరింతురు.




సుమారు 80 కిలోమీటరులు మాత్రమే వెడల్పు గలిగిన పాక్ జలసంధి ఈ ద్వీపమును భారతదేశమునుండి వేరుచేయుచున్నది. [వి] 65,610 చ. కి. మీ.; 1964 లో జరిగిన జనాభా లెక్కల ప్రకారము ఈ దేశపు [జ] 1,09,65,000. [భా] ఈ దేశమున 69% మంది ప్రజలకు మాతృభాష సింహాళీ (సంస్కృత జన్యములు అగు ప్రాకృతములలో ఒకటి అగు పాళీభాషకు సన్నిహితమైనది ఈ సింహాళీ); 23% ప్రజలకు మాతృభాష తమిళము. ఈ తమిళము మాటాడువారిలో 46% సింహళదేశమునకు పూర్వ యుగములందు విజేతలుగ వచ్చిన తమిళుల సంతతికి చెందిన వారు. తక్కిన తమిళులు భారతదేశమునుండి గత శతాబ్దము మొదలుగ కార్మికులుగ వలసవచ్చి ఇట స్థిరనివాసము ఏర్పరచుకొనిన వర్గమువారు (ఈ వర్గము వారిని సింహళ పౌరులుగ సింహళ ప్రభుత్వము ఇప్పటికి అంగీకరించలేదు). తక్కినవారు ఇంగ్లీషు, మలె మొదలగు భాషలు మాటాడుచున్నారు. 1957, జూలై 7 వరకు ఇంగ్లీషు భాషయే రాజకీయ వ్యవహార భాషగ ఉండినది. ఆ తరువాత సింహాళీ భాషయే ఏకైక జాతీయ భాషగ రాజకీయ వ్యవహారములందు వాడబడవలెనని ప్రభుత్వము శాసించెను. కాని, తమిళులు అందులకు అంగీకరింపక లేవదీసిన ఆందోళనకు లొంగి ప్రభుత్వము తమిళభాషకు కొన్ని సౌకర్యములను కలుగజేయుచు 1958, ఆగస్టు 5 న ఒక శాసనము చేసినది. తత్ఫలితముగ విద్యాభ్యాసమునను, ప్రభుత్వ పరీక్షలందును ప్రభుత్వముతో జరుపు పత్రవ్యవహారమునను, తాము అధిక సంఖ్యాకులుగ ఉన్న చోటుల స్థానికపరిపాలనమందును తమిళులు తమిళమునే వాడుటకు హక్కు కలిగినది. అయినను 1961, జనవరి 1 నుండి ఇంగ్లీషుకు ప్రత్యామ్నాయముగ సింహాళీ మాత్రమే వాడబడవలయునను శాసనము నిష్కర్షగ ఆచరణలోనికి తేబడినప్పటినుండి ఈ ఒసగబడిన హక్కు తిరిగి ఉపసంహరింపబడినటులే అయినదని తమిళులు తిరుగ ఆందోళనను మొదలిడిరి. [మ] దేశవాసులలో 64% హీనయాన బౌద్ధులు, హిందువులు 20%, క్రైస్తవులు 9%, ముస్లిమ్‌లు 7% కలరు. [రా] కొలంబో (జ. సం. 5,10,947).

చరిత్ర : భారతదేశమునకు ఈ దేశముతో తొలుత నుండియు రాకపోకల సాన్నిహిత్యము ఉండెననుట రామాయణము వలన స్పష్టముగ తెలియవచ్చుచున్నది. ఈ రామాయణ గాథ ప్రతి భారతీయునికిని సుపరిచితము. అందులో పేర్కొనబడిన లంకయే నేటి సింహళమని భావించుటకు అవకాశము కలదు. ఆ రామాయణేతిహాసమును బట్టి ఆ నాడు ఇట రాక్షసులు వసించుచుండినటుల తెలియుచున్నది. ఇందలి లౌకికాతీత విషయముల మాట అటుంచినను, ఆ నాడు ఇట ఆర్యేతరమగు ఒక జాతి వసించుచుండెనని మాత్రము భావించుటకు అవకాశము కలదు. సింహళమునందలి వివిధ జాతులను పరిశీలించిన శాస్త్రజ్ఞులు ఈ దేశమునందు మారుమూల అడవులలో సుమారు 4,000 మంది జనసంఖ్య కలిగి వసించు వెడ్డాలు అనబడు వారి పూర్వికులే ఇచటి ఆదిమవాసులు కావచ్చునని అభిప్రాయపడిరి. వీరు మలెజాతికి సన్నిహితులని కొందరి ఊహ. కాని, క్రీ. పూ. 6 వ శతాబ్దినుండి ఆర్యజాతులు ఇటకు వలస రా మొదలిడినవి. సింహళదేశచరిత్రను తెలుపు దీపవంస, మహావంసము [చూ. పు. 528] లను చారిత్రక గ్రంథముల వలన ఆర్యాక్రమణ మొదలుగ ఈ దేశచరిత్ర చాలవరకు తెలియవచ్చుచున్నది. ఈ గ్రంథములందు కొన్ని లౌకికాతీతవిషయములు చేరి ఉండుటచే వీని ప్రామాణికత కొంత తగ్గినను, మొత్తముమీద దేశచరిత్రను నిర్మించుటకు తగిన సాధనసామగ్రి అందు కలదనుట నిర్వివాదాంశము. ఆ గ్రంథములను బట్టి క్రీ. పూ. 504 లో విజయబాహువను ఆర్యావర్తవాసి కతిపయ పరిజనముతో ఇటకువచ్చి ఈ దేశమును ఆక్రమించి, పాలింప మొదలిడెనని తెలియవచ్చుచున్నది. ఈ సింహళ రాజులకు ముఖ్యనగరము అనూరాధపురము. ఈ పట్టణము శిథిలరూపమున నేటికిని కననగుచున్నది. క్రీ. పూ. 307 లో బౌద్ధభిక్షుకుడును, అశోకుని కుమారుడును అగు

మహిందుడు కొందరు బౌద్ధభిక్షువులతో ఇటకు వచ్చి బౌద్ధ మతవ్యాప్తికి అంకురార్పణ చేసెనని తెలియవచ్చుచున్నది.

క్రీ. పూ. 288 లో బోధివృక్షశాఖ ఒకటి మగధదేశము నుండి ఇచటికి కొనిరాబడి అనూరాధపురమున నాటబడెను. అదియే నేడు అచట కన్పట్టు బోధివృక్షమని బౌద్ధుల విశ్వాసము. క్రీ. శ. 3 వ శతాబ్దిలో ఈ దేశమును పాలించిన మహాసేనుని వలనను, 13 వ శతాబ్దిలో పాలించిన రాణి లీలావతి వలనను ఈ బౌద్ధమతము దేశమునందలి వివిధ ప్రాంతములకు వ్యాపింపజేయబడి, క్రమముగ దేశమున అధికసంఖ్యాకుల మతమయ్యెను.

ఈ దేశమున పైవిధముగ వచ్చిన ఆర్యజాతి ప్రజలే కాక, క్రీ. పూ. 2 వ శతాబ్దినుండియు ద్రావిడులును వలస రాదొడగిరి. సింహళపు ఉత్తరపుకొన తమిళదేశమునకు అతిసమీపమున ఉండుటచే తమిళ ప్రభువులు ఈ దీవిని జయించుటకు పెక్కు యత్నములు చేసిరి. క్రీ. పూ. 2 వ శతాబ్దిలో తమిళరాజులు ఈ దేశమునందలి అనూరాధ పురముపై దండెత్తి వశపరచుకొని కొంతకాలము పాలించిరి. తరువాత కొలదికాలములోనే సింహళ ప్రభువులు వారిని తరిమివేసినను, ఈ సంఘర్షణలు సింహళ చరిత్రలో ఎడతెగకుండ సాగుచు, విజయము పలుమారు చేతులు మారుచుండెను. తత్ఫలితముగ ఉత్తరమున కొలది ప్రాంతము తమిళుల స్థావరమయ్యెను.

సింహళ ప్రభువులలో నెల్ల ముఖ్యుడుగ పేర్కొనదగినవాడు పరాక్రమ బాహువు [చూ. పు. 557]. క్రీ. శ. 1153 లో ఇతడు సింహళమున ఒక ప్రాంతమునకు మాత్రమే ప్రభువుగ ఉండి, 1155 నకు సింహళమెల్ల జయించి అంతతో ఆగక బర్మాయందలి పెగూపైనను, దక్షిణభారతమునందలి పాండ్యదేశము పైనను దండెత్తి విజయమును చూరగొనెను. బౌద్ధమతమును విశేషముగ ఆదరించి ఈ ప్రభువు భిక్షుకసంఘములకు విపరీతముగ గ్రామములను, ధనమును దానమొసగెను. బ్రాహ్మణులను కూడ ఇతడు ఆదరించి పోషించెను. మహోన్నతప్రాసాదములను, చైత్యములను, విహారములను నిర్మించుటయే కాక, పాడువడి ఉన్న తటాకములను పునర్నిర్మించి వ్యవసాయమునకు వసతులను కలిగించెను. అశోకుని అనుసరించి అతనివలె ప్రతిష్ఠను ఆర్జించుటకు ఇతడు యత్నించెను. ఇతని పాలన కాలమును తమ చరిత్రలో స్వర్ణయుగమని సింహళీయులు పేర్కొనెదరు. కాని, పరాక్రమబాహువు మరణానంతరము దేశము ఆర్థికముగను, సైనికముగను హీన స్థితికి వచ్చెను. దక్షిణ భారతప్రభువులు మరల మరల దండెత్తి దేశమునందలి పలుప్రాంతములను వశపరచుకొనుచుండిరి. ఇటుల రెండు శతాబ్దములు సింహళ, తమిళ ప్రభువుల యుద్ధములతో దేశము కల్లోలితమయ్యెను. ఇందులకు తోడుగ 15 వ శతాబ్దిలో చీనావారినుండియు సింహళమునకు ముప్పు కలిగెను. తన రాయబారిని ఒకనిని సింహళప్రభువులు అవమానించిరను నెపముపై 1408 లో చీనా చక్రవర్తి తన నౌకాసైన్యమును సింహళము పైకి పంపి, అప్పటి సింహళప్రభువగు విజయ బాహువు - IV ను ఓడించి, అతనిని ఖైదీగా చీనాకు కొనిపోయెను. అటు తరువాత ముప్పది సంవత్సరముల కాలము సింహళము చీనాకు సామంతరాజ్యముగ ఉండి, మరల స్వతంత్రమయ్యెను.

పాశ్చాత్యులలో తొలుతగ పోర్చుగీస్‌వారు సముద్ర మార్గమున సింహళముతో సంబంధము ఏర్పరచుకొనిరి. 1505 లో పోర్చుగీస్ నావికుడు ఫ్రాన్‌సిస్కో డి ఆల్‌మీడ సింహళముపై కాలిడెను. తరువాత కొలది కాలములోనే పోర్చుగీస్‌వారు వర్తకకేంద్రములను తీరప్రాంతమున పలుతావులయందు స్థాపించి, రాజకీయములందును ప్రాబల్యమును సంపాదించిరి. సింహళము ఆనాడు పల రాజ్యములుగ చీలి బలహీనముగ ఉండుటచే పోర్చుగీస్‌వారిని ఎదిరించువారే లేకపోయిరి. కాని, పోర్చుగీస్‌లు మత సహనము ఎరుగని వారగుటచే సామాన్య ప్రజలో వారి ఎడల విద్వేషము పెచ్చుపెరిగెను. ఈ అదను చూచుకొని డచ్చివారు ఈ దేశపు ప్రభువులతో స్నేహము చేసి, క్రమముగ 1658 నాటికి పోర్చుగీస్ పలుకుబడిని అంతరింపజేసి, సింహళమును తమపలుకుబడిలోనికి తీసికొనిరి; కాండీ అను ప్రాంతము తప్ప తక్కిన సింహళమంతయు వారి వశమయ్యెను. కాండీప్రభువు సైతము వారితో సహకరించుచుండెను. 1795 వరకు సింహళము ఇటుల డచ్చివారి పాలనలో ఉండెను. డచ్చివారు దేశీయమతముల ఎడల ఆదరభావము వహించుటయే కాక, డచ్చి - రోమన్ శాసనవిధానమును దేశమున ప్రవేశపెట్టి, సక్రమ పాలనకు త్రోవదీసిరి. కాని, వారి శిస్తుల విధానము నిరంకుశము గను, ప్రజలకు కష్టదాయకముగను ఉండుటవలన, ప్రజలలో డచ్చి పరిపాలన ఎడల అసంతృప్తి పెచ్చుపెరిగెను. ఈ అదను చూచుకొని, అప్పటికే దక్షిణ భారతమున కొంత రాజ్యమును ఆర్జించిన బ్రిటిష్ ఈస్ట్ ఇండియా కంపెనీ [చూ. పు. 658] వారు సింహళముపై దండెత్తి, డచ్చివారిని ఓడించి, 1796 లో ఆ ద్వీపమును ఆక్రమించిరి. తొలుత మద్రాసు నుండియే కంపెనీవారు ఈ రాజ్యమును పాలించిరి. కాని, సింహళీయులకు ఇది అసంతృప్తి జనకమై వారు తిరుగుబాటు చేయుటచే, 1798 లో తమ

ప్రభువగు బ్రిటిష్‌రాజునకు మకుటాధిపత్యపు వలసగ దీనిని కంపెనీవారు ఒసగిరి. ఆ తరువాత అనతికాలము ననే అనగా 1815 లో సింహళమున మిగిలిన ఏకైక స్వతంత్రరాజ్యము కాండీని బ్రిటిష్ సేనలు ఆక్రమించెను. తదాది 1948 లో సంపూర్ణ బాధ్యతాయుత స్వయం పరి పాలనమును ఆర్జించువరకు సింహళము బ్రిటిష్ పరిపాలన లోనే ఉండెను. 1948 లో సింహళము స్వతంత్రరాజ్యమై కామన్‌వెల్తు [చూ. పు. 382] నందు భాగస్వామిగ ఉన్నది.

స్వాతంత్ర్యము ఆర్జించిన తరువాత ఈ దేశము ఎదుర్కొనవలసివచ్చిన పెక్కు సమస్యలలో భాషా సమస్య ఒకటి. సింహళ, తమిళ భాషలు మాట్లాడు వారి మధ్య చెలరేగిన వైషమ్యముల ఫలితముగ 1956 లో అప్పటి ప్రభుత్వము రాజీనామా ఒసగవలసి వచ్చెను. తరువాత జరిగిన ఎన్నికలలో 'మహాజన ఏకస్థ ప్రమాణపక్షము' అధి కారమునకు వచ్చి దాని నాయకుడు బండారనాయకే [చూ. పు. 639] ప్రధానమంత్రి అయ్యెను. 1958 లో ఇతడు భాషా సమస్యను పరిష్కరించి తమిళులకు కొంత సంతృప్తిని కలిగించెను. కాని, ఇంతలో అతనిని ఒక బౌద్ధ సన్యాసి 1959, సెప్టెంబరులో హత్యచేసెను. తరువాత కొన్ని మంత్రివర్గములు మారి కడకు 1960, సెప్టెంబరులో జరిగిన ఎన్నికలందు పూర్వపు ప్రధానమంత్రి భార్యయగు సిరిమావో బండారనాయకే నాయకత్వమున ఉన్న శ్రీ లంకస్వాతంత్ర్యపక్షము అధికారమునకువచ్చి సిరిమావో బండరనాయకే సింహళ ప్రధానమంత్రిణి అయ్యెను. ప్రపంచ చరిత్రలో ఒక దేశ ప్రధానమంత్రిత్వ పదవీ గౌరవమును ఆర్జించిన ప్రథమవనిత ఈమెయే. పౌరస్వ త్వములేని భారతీయుల సమస్యను పరిష్కరించుటకు ఈమె కొంత కృషి చేసినది. ఆ తరువాత 1965 లో జరిగిన ఎన్నికయందు ప్రతిపక్షములు గెలుపొందుటవలన సేనా నాయకే నాయకత్వమున ఏర్పడిన నూతన ప్రభుత్వము సైతము ఆ సమస్యను పరిష్కరించుటకు కృషిచేయు చున్నందువలన భారత, సింహళదేశముల సంబంధములు మెరుగువడుటకు అవకాశము కలిగినది.

రాజ్యాంగము: సింహళము స్వయంపరిపాలనము కలి గిన అధినివేశము అగుటచే బ్రిటిష్ రాణియే సింహళము నకు రాణిగ పరిగణింపబడుచున్నది. సింహళ ప్రధాన మంత్రి సలహాపై బ్రిటిష్‌రాణి నియమించు సింహళీయు డగు గవర్నర్ - జనరల్ బ్రిటిష్‌రాణి పక్షమున రాచ రికపు లాంఛనములను నిర్వర్తించును. శాసన నిర్మాణాధి కారము అంతయు పార్లమెంట్‌నందు న్యస్తమై ఉన్నది. శిష్టసభ (సెనేట్), ప్రతినిధిసభ (హౌస్ ఆవ్ రిప్రజెంటే టివ్స్) అను రెండు కక్ష్యలు ఇందు కలవు. ప్రతినిధుల సభ యందు 157 గురు సభ్యులు ఉందురు. వీరిలో 151 మంది 145 నియోజకవర్గములనుండి సార్వజనికవోటింగు పద్ధతిని అనుసరించి వయోజనులచే ఎన్నుకొనబడుదురు. ఈ ఎన్నికలు అయిదు ఏండ్లకు ఒక పర్యాయము జరుగును. అల్పసంఖ్యాకవర్గముల ప్రతినిధులను ఆరుగురను గవర్నర్ - జనరల్ నియామకము చేయును. శిష్టసభ యందు 30 మంది సభ్యులు ఉందురు. ఇందులో 15 మందిని ప్రతినిధులసభ ఎన్నుకొనును. తక్కిన వారిని ప్రధాన మంత్రి సలహాపై గవర్నర్ - జనరల్ నియామకము చేయును. వీరిలో ప్రతి ఒకరును ఆరేండ్ల కాలము పదవిలో ఉందురు. శిష్టసభ సభ్యులలో మూడవవంతు సభ్యులు రెండేండ్లకు ఒకసారి వైదొలగు రీతిగ ఈ నియామకము జరుగును. ప్రతినిధులసభయందు అధిక సంఖ్యాకుల ఆమోదమును ఆర్జించినవానిని ప్రధానమంత్రిగ గవర్నర్- జనరల్ నియమించి, అతని సలహాపై మంత్రిమండలిలోని తక్కిన మంత్రులను నియమించును. ప్రధానమంత్రి నాయకత్వమున మంత్రిమండలి పరిపాలనకు బాధ్యత వహించును.

చి. శే. రా.

**సిక్కిమ్:** హిమాలయ పర్వతములపై ఉన్న భారత రక్షిత రాజ్యము.

ఈ దేశమునకు టిబెట్ [ఉ]; భూటాన్ [తూ]; భారత దేశము [ద]; నేపాల్ [ప] సరిహద్దులందు ఉన్నవి. [వి] 7,298 చ. కి. మీ.; [జ] 1,62,189. ప్రజలలో నేపాలీలు 75%; తక్కినవారు టిబెటీ జాతులవారు. [భా] నేపాలీ, టిబెటీ భాషలు ప్రచారమునందు ఉన్నవి. [మ] జాతీయమతము లామా సాంప్ర దాయపు బౌద్ధమతము. కాని, ప్రజలలో మూడవవంతు మాత్రమే బౌద్ధులు, తక్కినవారు హిందువులు. [రా] గాంగ్‌టోక్ (జ. సం. 7000).

చరిత్ర: లెప్చాలు అనబడు సంచార జాతులకు తొలుత నిలయముగ ఉండిన ఈ దేశమును 1641 లో టిబెటీజాతి యోధవర్గము జయించి, ఇట రాచరికమును నెలకొల్పెను. లామా సాంప్రదాయపు బౌద్ధమతమును ఈ పరిపాలకులు ఇట వ్యాపింపజేసిరి. నేపాల్ దేశముపై భారతదేశము నందలి బ్రిటిష్ ప్రభుత్వ సేనలు దండయాత్ర సలిపిన సందర్భమున 1816 లో బ్రిటిష్‌వారికి ఈ దేశముతో పరిచితి కలిగెను. నేపాల్ ప్రభువులు అదివరలో ఈ దేశమునుండి హరించిన భూప్రాంతమును మరల సిక్కిమ్ నకే బ్రిటిష్‌వారు అప్పగింపజేసిరి. కాని, ఈ ప్రాంతమున వసించిన నేపాలీలు మాత్రము అటనే స్థిరవాసులై, క్రమ ముగ దేశమున అత్యధిక సంఖ్యాకవర్గముగ రూపొందిరి.

1839 లో బ్రిటిష్ వారికి సిక్కిమ్ రాజు ప్రస్తుతము డార్జిలింగ్ నగరమున్న ప్రదేశమును దత్తమొనర్చెను. కాని, ఆ తరువాత సిక్కిమ్ ప్రభువునకును, బ్రిటిష్ వారికిని వైషమ్యములు ఏర్పడి, బ్రిటిష్ యాత్రికులను, ఉద్యోగులను ఆ ప్రభువు కారాగారమున ఉంచి హింసించుట వలన 1849 లో డార్జిలింగ్ నగర భద్రతకొరకై తత్పరిసరప్రదేశమును, 'తరాయ్' అనబడుదానిని, బ్రిటిష్ ప్రభుత్వము ఆక్రమించెను. కాని, ఉభయులమధ్య గల వైషమ్యములు అంతటితో అంతరింపలేదు. సిక్కిమ్ రాజు టిబెట్ పాలకులతో సాన్నిహిత్యము కల్పించుకొని తన రాజ్యమున టిబెట్ సేనలు స్థావరములను ఏర్పరచుకొనుటకు అవకాశము కలిగించెను. అంతట 1888 లో బ్రిటిష్ సేనలు దేశమున ప్రవేశించి టిబెట్ సేనలను పారద్రోలెను. తరువాత టిబెట్ పై సార్వభౌమత్వము వహించు చీనాతో ఒక ఒడంబడికను 1890 లో బ్రిటిష్ ప్రభుత్వము కుదుర్చుకొనెను. దీనిని అనుసరించి సిక్కిమ్ బ్రిటిష్ రక్షిత రాజ్యము అని చీనా గుర్తించుటయే కాక, ఆ సమయముననే టిబెట్, సిక్కిమ్‌ల మధ్య గల సరిహద్దు రేఖయు నిర్ధారితము ఒనర్చబడెను. భారతదేశమున బ్రిటిష్ ప్రభుత్వము అంతరించిన తరువాత డిసెంబరు 5, 1950 న కుదుర్చుకొనిన ఒడంబడికను అనుసరించి భారత రక్షిత రాజ్యముగ ఉండుటకు సిక్కిమ్ అంగీకరించెను. 21 మంది సభ్యులు గల ఒక కార్యనిర్వాహక వర్గపు సాయమున రాజు ఇట పరిపాలన నెరపును. ఈ సభ్యులలో 14 మందిని ప్రజలు ఎన్నుకొనెదరు. గాంగ్‌టోక్‌నందు భారత ప్రభుత్వపు దౌత్య ప్రతినిధి ఒకడు కలడు. దేశ రక్షణ, వైదేశిక వ్యవహారములను భారత ప్రభుత్వమే నిర్వహించును. భారత ప్రభుత్వపు ఆర్థిక సాహాయ్యమున దేశమున రాకపోకల వసతులును, పరిశ్రమలును క్రమముగ అభివృద్ధియగుచున్నవి.

చీ. శే. రా.

**సిక్కులు** : భారతదేశ చరిత్రలో ప్రముఖపాత్రను నిర్వహించిన ఒక మతవర్గము. ఈ సిక్కుమతమును స్థాపించినవాడు గురునానక్ (1469 - 1539) [చూ. సిక్కుమతము; సం. 7 - పు. 748]. 'హిందువుడూ లేడు, మహమ్మదీయుడూ లేడు; మానవులందరూ సమానులే! దైవదృష్టిలో అంతా సహోదరులే!' అని నానక్ సందేశము.

నానక్ భక్తి, వినయములు చూచి ఎందరో శిష్యులు (లేక సిక్కులు) ఏర్పడిరి. కబీర్ వలెనే హిందూ - మహమ్మదీయ మతముల సామరస్యము కోసము నానక్ కృషి చేసెను. ఇతడు హిందువులకు భగవదవతారములయందు ఉండెడు నమ్మకములతో మహమ్మద్ యొక్క భగవద్దౌత్యమును జోడించి హైందవ, మహమ్మదీయులు ఇరువురకును ప్రీతిపాత్రుడు అయ్యెను.



గురునానక్
(1469 - 1539)

నానక్ మరణానంతరము గురుస్థానమును ఆక్రమించినవాడు అతని కుమారుడు కాడు; శిష్యుడైన అంగదుడు (1540 - 1550 ప.). షేర్‌షా తరిమివేయగా హుమాయూన్ చక్రవర్తి తన భావి శుభము కోసము అంగదుని ఆశీస్సు పొంది వెళ్ళెనని చెప్పుదురు. మూడవ సిక్కు గురువైన అమరదాసుని అక్బరు చక్రవర్తి వట్టికాళ్ళతో నడిచి వచ్చి దర్శనము చేసి, భూరిభూదానము చేయబోగా అమరదాసు అంగీకరించలేదని ప్రతీతి. స్త్రీల సహగమనము దురాచారమని అమరదాసు దానిని ప్రతిఘటించినవాడు. మంత్రాలు, బాహ్యతంత్రాలు ఖండిస్తూ, ఆంతరంగిక సంస్కరణము కావలయుని తెలుపుతూ చాలా పాటలు వ్రాసెను.

రామదాసు (1574 - 1581) సిక్కుల నాలుగవ గురువు. అమృతసరము (అమరత్వము ఒసగు సరస్సు) లోని ద్వీపమును ఇతడు అక్బరు చక్రవర్తి వద్ద సంపాదించి, దానిపైన ఒక ఆలయము నిర్మించుటకు ఆరంభించెను. తరువాతి గురువైన అర్జునుడు (1581-1606) ఈ ఆలయ నిర్మాణమును పూర్తిచేసెను. సిక్కునాయకుల ప్రథమశ్రేణిలో అర్జునుడు అగ్రేసరుడు. అమృతసరము ఇతనికి రాజధానియు, సిక్కుమతమునకు కేంద్రస్థానమును అయినది. 1604 లో 'ఆది గ్రంథము' అనుపేర నానక్ పాటలన్నీ సంపుటీకరణము పొందినవి [చూ. గ్రంథసాహెబ్; సం. 6 - పు. 662].

హరిగోవిందుడు (1603 - 1645) ఆరవ సిక్కు గురువు. నూర్జహాన్ చక్రవర్తినికి ఇతని ఎడల చాల అభిమానము. ఇతనితో చాలాసార్లు ఆమె సంప్రదించినది. ఇతని ముస్లిమ్ శిష్యులలో ఒకడు జహంగీర్ చక్రవర్తి మంత్రివర్గములోనివాడు. హరిరాయడు (1645 - 1661) సిక్కుల ఏడవ గురువు. ఉపనిషత్తులు ఉర్దూభాషలోనికి తర్జుమా చేసిన దారాషుకో (షాజహాన్ చక్రవర్తి పెద్ద కుమారుడు) పక్షమువాడు ఇతడు.

సిక్కు గురువులలో పదవవాడు, కడపటివాడు గురు గోవింద్ (1675 - 1708). నానక్ కాలములో సంపూర్ణ

శాంతిమార్గము అవలంబించిన సిక్కుమతము ఈతని హయాములో యుద్ధపద్ధతికి మారినది. ఒక స్నాతకకర్మ జరపడము మూలముగా గురుగోవిందుడు ఈ మార్పు తెచ్చెను. ఈ కర్మను అనుసరించి ఒక ఇనుప పాత్రలో నీరు పోసి, రెండంచుల కత్తితో కలుపుదురు. అమృతతుల్యమైన ఈ నీటిని సిక్కుమతాన్ని అవలంబించే స్నాతకుల పైన చల్లుదురు. స్నాతకశుద్ధి పొందిన తోడనే 'సింగ్' అన్న కొత్తపదము తమ పేరుకు చేర్చుకొందురు. తరువాత ఈ మతావలంబకులు తమ గురువును, ఆయన శిష్యపరివారమును స్తుతింతురు. ఈ గురు - శిష్య సమాజమునకే పవిత్రమైనదీ,స్వతంత్రమైనదీ అనే అర్థము ఇచ్చేదే 'ఖాల్సా' అని పేరు. సిక్కులు ధరించవలసిన మతచిహ్నములు అయిదు ఉన్నవి. వాటి పేరులు: 'క' అను అక్షరముతో మొదలగును. అవి: కేశ్ (కత్తిరింపని జుట్టు), కంఘా (జుట్టుకు పెట్టుకునే దువ్వెన), కర (ముంజేతి ఇనుప కంకణము), కచ్ఛా (లాగుల జత), కృపాణ్ (రెండంచుల కత్తి). ఈ మతస్థులు పొగ త్రాగరాదు. వీరిలో జాతిభేదములు ఉండవు. పవిత్రమైన ఆది గ్రంథముతోపాటు ఒక్క అదృశ్యశక్తిని (నిరాకారుడైన భగవంతుని) మాత్రమే వీరు గౌరవించి పూజింతురు [చూ. గోవింద్, గురు - పు. 428].

గురుపీఠము అధిష్ఠించుటకు గురుగోవిందుడు తన వారసుని నియమించలేదు. 'బందా' అను అతని శిష్యుడు తానే నాయకత్వము వహించి రాజు అయ్యెను. అతడు చాల పరివారమును చేరదీసి, మొగల్‌లను ఎదుర్కొనెను. తనపేర నాణెములను ముద్రింపించెను. అంబాలాజిల్లాలోని 'సాఢేర' పట్టణమును తన రాజధానిగ చేసికొని, 'లోహాఘర్' అనుపేర దిట్టమైన కోట కట్టుకొనెను. ఈ కోటను మొగల్‌లు ముట్టడించి, ఆక్రమింపగా, ఇతడు తప్పించుకొని పారిపోయి అజ్ఞాత ప్రదేశమునుంచి యుద్ధము చేసెను. 1716 లో మొగల్‌లు ఇతనిని ఖైదు చేసి ఉరి తీసిరి.

బందా మరణానంతరము 20 ఏండ్లపాటు మొగల్‌లు సిక్కులను తరిమి తరిమి చెదరగొట్టిరి. ఇంతలో మొగల్ సామ్రాజ్యమే క్షీణించుట మొదలుపెట్టినది. 1739 లో పారసీక చక్రవర్తి నాదిర్‌షా దండెత్తివచ్చెను. సిక్కులు ఆ అవకాశమును ఉపయోగించుకొని తమ పవిత్రక్షేత్రమైన అమృతసరములో సమావేశమై, నూరుగురు ఒక్కొక్క దళముగ, 25 సైనిక దళములుగ ఏర్పడిరి. 'ఖాల్సా దళము' అన్న పేరుతో వీరంతా ఏకమై, ఒక జాతీయ సైన్యముగ ఏర్పడిరి. సారాబట్టీ పట్టే జస్ససింగ్ అను వాడు దాని నాయకుడు.

అహమ్మద్ షా అబ్దాలీ దండయాత్రలు 1753 - 57 మధ్య పంజాబ్‌లో అశాంతి ఏర్పడి, సిక్కులు విజృంభించుటకు అవకాశము ఇచ్చినవి. ఏడాదికి రెండుసార్లు కోతలు కాగానే భూమ్యాదాయములో $\frac{1}{5}$ వంతు ఇచ్చిన గ్రామములవారికి శాంతిభద్రతలు సమకూర్చెదమని సిక్కులు అభయము ఇచ్చిరి. 1759 నాటికి పంజాబ్‌లో చాల భాగమునకు సిక్కులు నిరంకుశాధికారులు అయిరి. ఒక్కొక్క సర్దార్ లేదా గవర్నర్ యొక్క నాయకత్వము క్రింద వీరు 'మిసిల్' అనబడు వేరు వేరు చిన్న రాజ్యములుగను, రాజ్యకూటములుగను ఏర్పడిరి. జస్ససింగ్ నాయకత్వమున 1761 లో లాహోర్ పట్టణమును సిక్కులు ఆక్రమించిరి. జస్ససింగే పాదుషా అనిరి. మొదట సిక్కు రూపాయలు 'జస్సకలాల్ జయించిన అహమ్మద్ యొక్క దేశములో దేవుని దయవల్ల ముద్రించిన నాణెములు'. 1762 లో అహమ్మద్ షా అబ్దాలీ పంజాబ్‌నకు తరలివచ్చి, సిక్కులను ఓడించెను. కాని, డిసెంబరు, 1762 లో అబ్దాలీ వెళ్ళిపోయిన వెనుక సిక్కులు సర్హింద్‌ను ఆక్రమించిరి. డిసెంబరు, 1764 లో మరొకసారి అబ్దాలీ పంజాబ్‌కు వచ్చెను. కాని, ఈసారి సిక్కులు ఈ చక్రవర్తి సైన్యములను ముప్పుతిప్పలు పెట్టిరి. మార్చి, 1765 లో అబ్దాలీ భారతదేశమునుండి వెళ్ళిపోయెను. సిక్కులు లాహోర్‌ను ఆక్రమించి, 1765, మే లో నాణెములు ముద్రించిరి. నవంబరు, 1766 లో అబ్దాలీ కడపటిసారి భారతదేశమునకు వచ్చెను. కాని, సిక్కులను అణచలేక భారతదేశమును పూర్తిగ వదలి వెళ్ళిపోయెను. 1769 కి సిక్కులు పంజాబ్‌లో సర్వాధికారులైరి. పశ్చిమమున సింధునది, తూర్పున యమునానది (ఢిల్లీసమీపప్రదేశము), ఉత్తరమున హిమాలయ పర్వతముల క్రిందివరుస, దక్షిణమున ముల్టాన్, బవహల్‌పూర్‌లువారి రాజ్యములకు సరిహద్దులు.

జాట్, మొగల్, రోహిలా సైన్యములతో 1768 - 1775 మధ్య యుద్ధము చేసి, గంగానది సరిహద్దు భూమిని, ఢిల్లీ రాష్ట్రమును సిక్కులు దోచుకొనిరి. 1781 లో సిక్కు నాయకులు ఢిల్లీప్రభుత్వముతో ఒడంబడిక చేసికొనిరి. దానినిబట్టి ఢిల్లీ చక్రవర్తుల రాజ్యమును సిక్కులు ఇంక ముట్టడించరు. చక్రవర్తి కోరినపుడు జీతములకు ఢిల్లీ సైన్యములో పని చేసెదరు. అందులకు ప్రతిఫలముగ పానిపట్టు మొదలు ఢిల్లీ సరిహద్దు పట్టణమునకును, గంగా మైదానపు ఉత్తరపు సరిహద్దునకును మధ్య ఉన్న ప్రదేశములో 'రఖి' (భూమి ఆదాయములో రూపాయకు రెండణాల చొప్పున పన్ను) సిక్కులు విధించడమునకు ఢిల్లీ ప్రభుత్వము ఒప్పుకొనినది.

ఢిల్లీని కబళించుటకు తాను పన్నిన పన్నాగములకు సిక్కులే పెద్ద అడ్డని 1784 లో ఈస్ట్ ఇండియా కంపెనీ ప్రభుత్వపు గవర్నర్ - జనరల్ వారన్ హేస్టింగ్స్ [చూ.] గ్రహించెను. 1785, మే నెలలో సిక్కులకును, మహారాష్ట్ర నాయకుడు మహదాజీ సింధియాకును జరిగిన సంధి 1786 లో చెడిపోయినది. సిక్కుల సహకారముతో ఉత్తర హిందూస్తానములో శాంతిభద్రతలు నెలకొల్పవలెనని మహదాజీ ప్రయత్నించెను. కాని, సిక్కులను లోబరచు కొనలేకపోయెను. 1794 లో మహదాజీ మరణించెను. సిక్కులు గంగానది సరిహద్దు భూమిని దోచుకొని సర్వ నాశనము చేసిరి.

రంజిత్‌సింగ్ : నశించిన భూస్వామి పద్ధతినుండి సిక్కులకు జాతీయ రాజత్వము సృష్టించి ఇచ్చిన యుగపురుషుడు రంజిత్‌సింగ్. తొలుత అఫ్ఘన్ రాజుచే లాహోర్ గవర్నర్‌గ నియమింపబడిన ఇతడు తన రాజకీయ చాతుర్యమువలన పెక్కు 'మిసల్' లను వశపరచుకొని స్వతంత్రుడై 25 ఏండ్ల వయస్సునకే సిక్కు నాయకులలో అగ్రేసరుడు అయ్యెను. 1806 లో ఇతడు సట్లెజ్‌నదిని దాటి పాటియాలానేకాక, నాభాను కూడ తనకు లొంగునట్లు చేసికొనెను. తరువాత ఫరీద్‌కోట, అంబాలా వశపరచుకొనెను. 1809 లో ఇతడు బ్రిటిష్‌వారితో అమృతసర్ సంధి చేసికొనెను. దానివల్ల బ్రిటిష్‌వారితో శాశ్వత మైత్రి ఏర్పడినది. సట్లెజ్‌నదికి ఉత్తరమున గల ఇతని రాజ్యము విషయములో జోక్యము కలుగజేసికొనకుండా ఉండుటకు బ్రిటిష్‌వారు అంగీకరించిరి. సట్లెజ్‌నదికి దక్షిణమున బ్రిటిష్‌వారి రక్షణలో ఉన్న రాజ్యముల జోలికి రానని రంజిత్‌సింగ్ వాగ్దానము చేసెను. తన జీవితాంతము వరకు ఈ సంధిని అక్షరాలా ఇతడు పాటించెను.

తన సైన్యమును రంజిత్‌సింగ్ క్రమపద్ధతిలో తర్ఫీదు చేయించెను. ఫ్రెంచి, ఇటాలియన్ సైనికోద్యోగులను, బ్రిటిష్‌వారి సర్వీసులో పింఛను పుచ్చుకొన్నవారిని తన సైన్యమును తర్ఫీదుచేసి నడిపించుటకు ఉద్యోగులుగ ఇతడు నియమించెను. ఈ ఉద్యోగుల సాయముతో పెద్ద సేనను సమకూర్చుకొని, ఉత్తరమున కాశ్మీర్ వరకు, పశ్చిమమున ముల్టాన్‌వరకు, వాయవ్యమున ఖైబర్ కనుమకు కీలకమైన పెషావర్‌వరకు తన రాజ్యమును విస్తరింపజేసికొనెను [చూ. రంజిత్‌సింగ్ - పు. 796].

రంజిత్‌సింగ్ 1839 లో మరణించగనే అశాంతి ప్రబలినది. ఈ సమయములోనే వారసత్వపు తగాదా వచ్చినది. రంజిత్‌సింగ్ కుమారుడు దులిప్‌సింగ్ అయిదేండ్లవాడు. ఇతడే రాజ్యమునకు రావలెనని సిక్కు సైన్యముయొక్క పట్టుదల. అప్పటికి ఇంకా అధికారము రాణి చేతులలోను, ఆమె ప్రియుని చేతులలోను ఉండెను. రాజ్యాధికారము సైన్యము చేతికి వస్తుందేమో అని వీరిద్దరికి భయము కలిగినది. అందుచేత వారసత్వపు సమస్యనుండి దృష్టి మరలించుటకు బ్రిటిష్ వారితో పోరాడవలసినదని సైన్యమునకు పురి ఎక్కించిరి.

డిసెంబరు, 1845 లో 60 వేల సిక్కు సైనికులు 150 ఫిరంగులతో సర్వ సేనాని తేజసింగ్ నాయకత్వముక్రింద సట్లెజ్ నదిని దాటిరి. మొదటి సిక్కు యుద్ధము ప్రారంభమైనది. ముడ్కిదగ్గర గఫ్‌దొర సిక్కులను ఓడించెను. ఫిరోజ్‌పూర్ దగ్గర కూడ సిక్కులే ఓడిపోయిరి. 1846 లో అలివాల్, సొబ్రవాన్ దగ్గరకూడ సిక్కులే ఓడిపోయిరి. సట్లెజ్, బియాస్ నదుల మధ్యభాగమును బ్రిటిష్‌వారికి ఇచ్చుటకు, బ్రిటిష్‌వారు నిర్ణయించిన పరిమితికి సిక్కుసేనను తగ్గించుటకు, ఫిరంగులు అన్నీ ఇచ్చివేయుటకు, యుద్ధనష్ట పరిహారము క్రింద $1\frac{1}{2}$ కోట్ల రూపాయలు ఇచ్చు కొనుటకు, ఎనిమిది ఏండ్ల వరకు ఒక బ్రిటిష్ సైనికదళమును తమ రాజ్యములో ఉంచుకొనుటకు సిక్కులు అంగీకరించి, బ్రిటిష్ వారితో సంధి చేసికొనిరి. బ్రిటిష్‌వారు సిక్కు సైన్యము కోరిన దులిప్‌సింగ్ రాజుగా ఉండుటకు అంగీకరించిరి. కాని, పరిపాలనాధికారము మాత్రము లాహోర్‌లోని బ్రిటిష్ ప్రతినిధియైన మేజర్ హెన్రీ లారెన్స్‌కు అప్పగించిరి. కాశ్మీర్‌ను గులాబ్‌సింగ్ అను డోగ్రా సేనానికి అప్పగించిరి.

హార్డింజ్ ప్రభువు యొక్క పరిపాలనావిధానము పంజాబ్ రాజులకు, ప్రజలకు కూడ నచ్చలేదు. 1848, ఏప్రిల్‌లో ముల్టాన్ యొక్క పరిపాలనాపద్ధతిని నిర్మాణము చేయుటకు వచ్చిన ఇద్దరు బ్రిటిష్ ఉద్యోగులు హత్యచేయబడిరి. అది రెండవ సిక్కు యుద్ధమునకు కారణమైనది. 1849, జనవరిలో జలియన్‌వాలాదగ్గర ఎటూ తేలకుండా ఒక యుద్ధము జరిగినది. కాని, ఫిబ్రవరిలో గుజరాత్‌వద్ద బ్రిటిష్‌వారు నెగ్గిరి. డల్‌హౌసీ [చూ. పు. 507] ప్రభువు పంజాబ్‌ను బ్రిటిష్ రాజ్యములో కలుపుకొనెను. రాజ్యభ్రష్టుడైన దులిప్‌సింగ్‌నకు పింఛన్ ఏర్పాటు చేసెను. పంజాబ్ రాష్ట్రపు పరిపాలనాధికారము లారెన్స్ సోదరులకు ఇద్దరికీ అప్పగించిరి. షాషుజావద్దనుండి రంజిత్‌సింగ్‌కు సంక్రమించిన జగత్ప్రసిద్ధమైన కోహినూర్ వజ్రము లాహోర్‌నుండి లండను చేరి, బ్రిటిష్ కిరీటమునకు నాయకమణియై విలసిల్లినది. సిక్కురాజ్యసమైక్యము, సిక్కు సేనా సమూహము విచ్ఛిన్నమై పోయినది.

సిక్కుల పరిపాలనా పద్ధతి : సిక్కుల అభ్యున్నతికొరకును, సిక్కుల ఐక్యమునకును వారి రాజకీయ

వాంఛను వ్యక్తము చేయగల 'ఖాల్సా' అను సంస్థను గురుగోవిందసింగ్ (1675 - 1708) స్థాపించెను. ఈ ఖాల్సా యందు అంతర్భాగము 'మిసల్' అను సంస్థ. దీనికి నాయకుడు సర్దార్. ఈ మిసల్‌లు స్వతంత్ర సంస్థలే అయినను అవి అన్నియు ఒక సంయుక్తసంస్థగ వ్యవహరించుచు ఖాల్సాయొక్క ఆదర్శములకొరకై పాటుపడు చుండినవి. అట్టి సంయుక్తసంస్థను ఒక ఏకరాజ ప్రభుత్వముగ రంజిత్‌సింగ్ మార్చివేసెను.

ఈ ప్రభుత్వమునకు మూలాధారము ప్రభువగు రంజిత్ సింగే. కాని, ఆచరణయందు అతని అధికారమునకు హద్దు ఉండెడిది. రంజిత్‌సింగ్ ఎల్లప్పుడు 'ఖాల్సా'ను చాల గౌరవించెడివాడు. ఎప్పుడు ఏపని చేసినను అతడు 'ఖాల్సా' పేరుతోనే చేయుచుండెను.

రంజిత్‌సింగ్ పూర్తిగ సంకుచిత కులతత్త్వమునకు లోబడకుండ తాను ఉద్యోగులను వారివారి శక్తిసామర్థ్యములనుబట్టి నియమించుచుండెను. అతని విదేశ విషయ మంత్రి ఫకీరు అజీజుద్దీన్; ఇతడు రంజిత్‌సింగ్ యొక్క ఉద్యోగులలో మంచి శక్తిమంతులును, నీతిమంతులును అయిన వారిలో ఒకడు. ధ్యానసింగ్ అనువాడు రంజిత్ సింగ్‌నకు ప్రధానిగ ఉండి, రంజిత్‌సింగ్ యొక్క ప్రభుత్వాశయములు ప్రజలకు, ప్రజల కష్ట నిష్ఠురములను రంజిత్‌నకు తెలుపుచుండెను. దీనానాథ్ అనువాడు ఆర్థిక మంత్రి. ఈ ముగ్గురును రంజిత్‌సింగ్ యొక్క ఆంతరంగికులు.

భూమి శిస్తు: సిక్కుల పద్ధతి ప్రకారము భూమి శిస్తు భూమి ఆదాయములో సగము ప్రభుత్వమునకు ఇయ్యవలసిన భాగముగ పరిగణింపబడెడిది. రాజా దీనానాథుడు లాహోర్‌లోని పరిపాలకవర్గమునకు అందజేసిన నివేదిక ప్రకారము రెవిన్యూ మొత్తము 1,33,18,087 రూపాయలు. రంజిత్‌సింగ్ కాలములో 1,57,12,924 రూపాయలు భూమి శిస్తు ఆదాయముగా ఉండెను. రంజిత్‌సింగ్ యొక్క ప్రభుత్వకాలమునందలి చరమభాగమునందు ఎగుమతి దిగుమతి పన్నులవలన ఆదాయము 16,37,000 రూపాయలు.

ఆనాటి (సమకాలికులు) బ్రిటిష్ ఉద్యోగులు వ్రాసినట్లుగ రంజిత్‌సింగ్ యొక్క ప్రభుత్వము నిరంకుశప్రభుత్వమైనను అందులో నిరంకుశత్వముయొక్క అవగుణములు ఏవియు లేకుండెను. అతడు క్రూరుడు కానటువంటి నిరంకుశుడు. అతని ప్రభుత్వము కేవలము ఒక సైనిక నిరంకుశత్వ (మిలిటరీ డెస్పోటిజమ్) ము అయినను, ప్రజలకు ప్రియముగా సమర్థతతో నిర్వహింపబడు ఏకరాజ ప్రభుత్వముగ ఉండెను. సంస్కరణలు ఎన్ని జరిగినను భూమి ఆస్తి వారసత్వపు హక్కు ఎప్పటికిని ఒక రీతిగానే ఉండెను. గ్రామసీమలందు ప్రాచీన పంచాయతీ ప్రభుత్వ పద్ధతి చెక్కు చెదరకుండ ఉండెను. ఎస్. హ.

**సిపాయిల తిరుగుబాటు**: చూ. భారతదేశము పు. 664.

**సియెర్రా లియోనీ**: పశ్చిమ ఆఫ్రికా తీరభూమి యందలి ఒక స్వతంత్రరాజ్యము.

ఈ దేశమునకు గినీ దేశము [ఉ, తూ]; లైబీరియా [ద]; అట్లాంటిక్ మహాసముద్రము [ప] సరిహద్దులందు ఉన్నవి. [వి] 72,326 చ. కి. మీ.; [జ] 21,83,000. [భా] దేశమున వివిధ ఆఫ్రికన్ భాషలు వ్యాప్తియందు ఉన్నవి. వానిలో హౌసా అను దానికి ఎక్కువ వ్యాప్తి కలదు. కాని, ఇంగ్లీషు అధికారభాషగ వాడుకలో ఉన్నది. [మ] క్రైస్తవమును, సాంప్రదాయ ప్రకృతి దేవతారాధనయును, ఇస్లామ్‌ను ప్రజలలో వ్యాప్తియందు ఉన్నవి. [రా] ఫ్రీటవున్ (జ. సం. 1,28,000).

చరిత్ర: 1462 లో పోర్చుగీస్ నావికులు దీనిని కనుగొనుటతో యూరపియన్‌లకు ఈ దేశముతో పరిచితి ఏర్పడినది. క్రమముగ బ్రిటిష్ వర్తకులకు అట ప్రాముఖ్యము లభించెను. బానిసత్వమునుండి విముక్తిని పొందిన నీగ్రోలను ఈ దేశమున తీరప్రాంతమున బ్రిటిష్‌వారు చేర్చి, అట ఒక వలసను నిర్మించిరి. ఆ వలస 1808 లో బ్రిటిష్ ప్రభుత్వమునకు చెందిన మకుటపు వలసగ పరిణమించినది. తక్కిన దేశము 1896 లో బ్రిటిష్ ప్రభుత్వపు రక్షిత రాజ్యమైనది. కాలక్రమమున దేశప్రజల ఆకాంక్షకు అనుగుణముగ 1961 లో ఈ దేశమునకు బ్రిటన్ స్వతంత్రతను కలిగించినది. అంతట నుండి కామన్‌వెల్త్‌న [చూ. పు. 382] సభ్యత్వము వహించి ఈ రాజ్యము స్వతంత్ర ప్రతిపత్తితో మనుచున్నది.

రాజ్యాంగము: బ్రిటిష్ ప్రభువుచే నియమింపబడు గవర్నర్ - జనరల్ రాజ్యాంగ బద్ధరీతిలో ఇచట లాంఛనముగ పరిపాలనాధికారములను కలిగి ఉన్నాడు. కాని, యథార్థమున అధికారమంతయు ప్రజలు ఎన్నుకొనిన శాసన సభయందు న్యస్తమై ఉండినది. అయినను 1967 లో సైనికులు తిరుగుబాటు జరిపి, ప్రధానమంత్రిని తొలగించుటతో అధికారము సైనిక వర్గమునకు హస్తగతమైనది. ప్ర. రా. సు.

**సిరియా**: పశ్చిమ ఆసియాయందలి ఒక గణ రాజ్యము.

ఈ రాజ్యమునకు టర్కీదేశము [ఉ]; ఇరాక్ [తూ]; జోర్డాన్ [ద]; ఇజ్రాయెల్, మధ్యధరాసముద్రము [ప] సరిహద్దులుగ ఉన్నవి. [వి] 1,84,479 చ. కి. మీ.; [జ] 53,99,000. [భా] జాతీయభాష అరబ్బీ. [మ] ప్రజలలో 87% సున్నీ ముస్లిమ్‌లు,

తక్కిన వారిలో అత్యధిక సంఖ్యాకులు క్రైస్తవులు. [రా] డెమాస్కస్ (జ. సం. 5,29,579).




చరిత్ర: ప్రపంచమున అతి ప్రాచీన చరిత్ర కలిగి ఉన్న దేశములలో ఇది ఒకటి. చారిత్రక యుగమునకు పూర్వము నుండియు ఇది జనావాసితమై ఉండినటుల విస్పష్టాధారముల వలన తెలియనగుచున్నది. చారిత్రక యుగారంభమున ఇది సెమిటిక్ జాతి ప్రజల ఆవాసమయ్యెను. క్రీ. పూ. 16 వ శతాబ్దమున బాబిలోనియా, ఈజిప్టుదేశముల ప్రాచీన సంస్కృతులు ఇట మేళనము పొందినవి. క్రీ. పూ. 15 వ శతాబ్దమునకు చెందిన కొన్ని ప్రాచీన లేఖలవలన ఆనాడు ఈ ప్రాంతము ఈజిప్టు సమ్రాట్ల విశాల సామ్రాజ్యమున చేరి ఉండెనని తెలియును. ఆ కాలమున ఈ దేశము సుసంపన్నమై ఉండెననియు తెలియవచ్చుచున్నది. క్రీ. పూ. 1200 ప్రాంతమున ఈ దేశము హిట్టైట్ల వశమైనది.

పశ్చిమ ఆసియాయందలి ప్రముఖ సంస్కృతుల కూడలిగ ఉండిన ఈ దేశము ఆ ప్రాచీనయుగమున వర్తక వ్యాపారములకును పేరొందెను. ప్రపంచమందలి ధ్వన్యాత్మక లిపులయందు పెక్కింటికి మాతృకగ పరిగణింపబడు ఫొనీషియన్ లిపి తొలుత ఈ దేశముననే క్రీ. పూ. 1,000 ప్రాంతమున రూపొందింపబడినది. హిట్టైట్ల పరిపాలనను అసీరియన్లు అంతమొందించిన పిదప (1050), సిరియాయందలి పెక్కు నగరములు అరామియన్లను వారి వశమయ్యెను. వీరి కాలమున రూపొందింపబడినదియే సుప్రసిద్ధమగు అరామిక్ లిపి. కొంత కాలమునకు అరామియన్ ప్రభువుల అంతఃకలహములను ఊతగగొని అసీరియన్లు దీనిని ఆక్రమించిరి (క్రీ. పూ. 733). కాని, అంతటినుండి ఇది పలుమారులు ఈజిప్టు, అసీరియా ప్రభువుల మధ్య చేతులు మారి కడకు పారసీక సామ్రాజ్యమున అంతర్భాగమైనది. కాని, ఇచట ఫొనీషియన్ వర్తకనగరములు అపుడు కొంత స్వాతంత్ర్యముతో మనగలిగినవి. పారసీక సామ్రాజ్యమును అలెగ్జాండర్ అంతమొందించిన పిదప, ఈ ప్రాంతము గ్రీక్ల వశమయ్యెను (క్రీ. పూ. 332). గ్రీక్ సామ్రాజ్యమును అలెగ్జాండర్ మరణానంతరమున విభజించుకొనినపుడు సెల్యూకస్ అను సేనానికి ఇందు అత్యధిక భాగము లభించెను. దక్షిణభాగము ఈజిప్టును పాలించు టాలమీల వశమయ్యెను. గ్రీక్ల పరిపాలనా కాలమున ఇచట అంటియోక్ మొదలగు పెక్కు నగరములు నిర్మింపబడుటయే కాక, సిరియన్ సంస్కృతియు గ్రీక్ సంస్కృతిచే విరివిగ ప్రభావితమయ్యెను. క్రీ. పూ. 64 లో ఈ రాజ్యమును రోమన్ సేనాని పాంపే [చూ. పు. 160] జయించి, రోమన్ సామ్రాజ్యమున అంతర్భాగముగ చేసెను. రోమన్ పరిపాలనా కాలమున ఈ దేశము అత్యంత వైభవోపేతముగ వర్ధిల్లెననుటకు నేడు కనపట్టుచున్న ఆనాటి భవనముల శిథిలావశేషములందలి శిల్ప వైశిష్ట్యము ఒక ముఖ్య నిదర్శనము.

ఈ దేశమందు క్రైస్తవ మతము క్రీ. శ. 170 వ ప్రాంతమున వ్యాపించుటయే కాక, అరామిక్ భాషలో ఒక మాండలికముగ పరిగణింపబడు సిరియక్‌నందు క్రైస్తవమత సారస్వతము విరివిగ రచింపబడెను. అపుడు ఈ దేశమందలి ఎడెస్సానగరము సిరియన్ చర్చి అనబడు ఒక క్రైస్తవ మతసంప్రదాయమునకు ముఖ్య కేంద్రమయ్యెను.

పారసీకులు ఈ దేశమును 616 లో ఆక్రమింపగలిగిరి. కాని, ప్రాచ్యరోమన్ సమ్రాట్లు తిరిగి 622 లో వశపరచుకొనిరి. అయినను అనతికాలముననే అరేబియానుండి వెలువడిన ఇస్లామ్ సేనాప్రవాహము ఈ దేశమును లోగొనెను (క్రీ. శ. 636). తదాదిగ ఇస్లామ్‌తోపాటుగ అరబ్బీభాషా సంస్కృతులును స్థిరముగ నెలకొనగలిగినవి. కలీఫాల [చూ. పు. 374] పరిపాలనా కాలమున దేశమున శాంతి భద్రతలు కుదురుకొని, దేశము పురోగమింపగలిగినది. కాని, మంగోల్ల దండయాత్ర ఫలితముగ (1260) అయ్యది సర్వనాశనమయ్యెను. తరువాత ఈ ప్రాంతము ఈజిప్టును పాలించు మెమెలూక్ వంశీయప్రభువుల వశమున ఉండి, కడకు 1516 లో టర్కీ పాలకుల (ఓటోమన్ల) అధీనమయ్యెను.

టర్కీసామ్రాజ్యమున దాదాపు నాలుగు శతాబ్దములు ఈ రాజ్యము దాస్యము అనుభవించెను. క్రమక్రమముగ 1908 నాటికి ఈ దేశవాసులగు యువకులందు జాతీయోద్యమము రూపొంది, 1913 నాటికి బలమును ఆర్జింపగలిగెను. ఇంతలో ప్రథమ ప్రపంచయుద్ధము ఆరంభమయ్యెను.

అంతట తక్కిన అరబ్ దేశములందలి జాతీయోద్యమ నాయకులతోపాటుగ, సిరియా జాతీయోద్యమ నాయకులును మిత్రమండలి ఎడల సానుభూతిని వెలివరచి సాయమొనర్చిరి. తత్ఫలితముగ జాతీయనాయకులలో పెక్కురను టర్కీ ప్రభుత్వము మరణశిక్షపాలు చేసెను; అనేకులు దేశబహిష్కృతులైరి. కడకు యుద్ధమున మిత్రమండలి రాజ్యములు జయించిన తరువాత, అదివరకు తమకు ఆ రాజ్యములు ఒసగిన వాగ్దానములను అనుసరించి దేశము స్వతంత్రము కాగలదని ప్రజలు అనుకొనిరి. కాని, యుద్ధకాలమున, అప్పటి సిరియాయందలి బేరూట్ నగరమును వశపరచుకొనిన ఫ్రాన్స్ప్రభుత్వపు వితండవాదమువలన మిత్రమండలిరాజ్యములు చేయునది లేక ఆ సమస్యను ఫ్రాన్స్నకే వదలి వేసినవి. అంతట సిరియానంతటిని తన ధర్మకర్తృత్వ (మాండేటరీ) పాలనలోనికి తీసికొన ఫ్రాన్స్ యత్నించెను. ఈ యత్నమును ప్రతిఘటించుచు సిరియన్ జాతీయ కాంగ్రెస్ ఫైజల్ అను అరబ్ నాయకుని ప్రభువుగ ఎన్నుకొని (మార్చి, 11, 1920) దేశమునకు ఒక ప్రజాస్వామిక రాజ్యాంగమును రూపొందించినది. అంతట ఫ్రెంచి ప్రభుత్వము సైనికబలమును ఉపయోగించి జాతీయోద్యమమును అడచి దేశమును వశపరచుకొనినది. కాని, ప్రజలలో జాతీయభావనను అరికట్టలేక, అంతటనుండి పలుతావుల ఫ్రెంచి సైనికస్థావరములను ఏర్పరచి దేశమును పాలింపసాగినది. అగ్రరాజ్యముల చేతులలోని కీలుబొమ్మగ వ్యవహరించిన నానాజాతిసమితి, ఈ అకృత్యమును కాదనక సిరియాపై ఫ్రెంచి మాండేటరీ ప్రభుత్వమును ఆమోదించినది (జూలై 24, 1922).

సిరియాలో గల ముస్లిమ్ జాతీయవాదుల పలుకుబడిని తగ్గించు ఉద్దేశముతో, ఆ దేశమందలి బేరూట్ ప్రాంతమును ఫ్రెంచివారు లెబనాన్కు కలిపిరి. ఈ లెబనాన్ అనునది క్రైస్తవులు అధికసంఖ్యాకులుగ వసించు ప్రాంతము. టర్కీ సామ్రాజ్యమున అంతర్భాగముగ ఉండియు, ఆంతరంగికస్వాతంత్ర్యప్రతిపత్తిని కలిగి ఉండిన ఈ దేశము ప్రథమ ప్రపంచ యుద్ధానంతరమున ఫ్రెంచివారి అధీనములోనికి వచ్చినది [చూ. లెబనాన్ - పు. 824]. ఇటుల అరబ్ ప్రజలందు క్రైస్తవ, ముస్లిమ్ విభేదముల నెలకొల్పుటకు ఫ్రెంచి పాలకులు ఒనర్చిన యత్నము తొలుత కొంత ఫలించినను, తుదకు జాతీయోద్యమమును దృఢతరము ఒనర్చుటకే ఉపకరించినది. ఈ జాతీయోద్యమము కడకు 1925 లో సుల్తాన్ పాషా ఎల్ అత్రాషి అనువాని నాయకత్వమున తిరుగుబాటుగ పరిణమించి, కల్లోలములకు దారితీసినది. ఈ తిరుగుబాటును అడచుటలో ఫ్రెంచి ప్రభుత్వము విపరీతముగ నష్టపడినది. అందువలన జాతీయోద్యమ నాయకులతో సామరస్య వైఖరిని అవలంబించుటయే సముచితము అగునను భావన ఫ్రెంచివారికి కలిగినది. తత్ఫలితముగ 1930 లో ఒక నూతన రాజ్యాంగము ప్రకటింపబడెను. ఈ రాజ్యాంగము అచ్చముగ ప్రజాస్వామికమే అయినను, ఇది సంపూర్ణముగ 1936 నుండి మాత్రమే అమలులోనికి రాగలదని ఫ్రెంచి ప్రభుత్వము ప్రకటించినది. అందువలన ప్రజలలో అసంతృప్తి మరల చెలరేగి పలు సంఘర్షణలకు దోహదకారి అయినది. తుదకు సెప్టెంబరు 9, 1936 లో జరిగిన ఒక ఒడంబడికను అనుసరించి సిరియాకు పరిమిత స్వాతంత్ర్యము చేకూరినది. కాని, దేశమున ఫ్రెంచి సేనలును, ఫ్రెంచివారి ఆధ్వర్యవమున పనిచేయు రెండు వైమానికాశ్రయములును ఉండుటకు అంగీకరింపక తప్పలేదు.

సిరియా ప్రభుత్వపు స్వతంత్ర విధానములు ఫ్రెంచివారికి నచ్చకపోవుటచే ఫ్రెంచి ప్రభుత్వసేనలు మరల సిరియా అంతటిని ఆక్రమించినవి (జనవరి 7, 1939). సిరియా ప్రజలు అంతట నిరసనను తెలిపి ప్రతిఘటించిరి. ఇంతలో ద్వితీయ ప్రపంచయుద్ధము ఆరంభమై ఈ సమస్యను మరుగుపరచినది. ఆ యుద్ధమున తొలుతటి పరాజయముల మూలమున, ఫ్రాన్స్నందు ఏర్పడిన 'విచీ' ప్రభుత్వము యుద్ధమునుండి వైదొలగినంతనే సిరియాయందలి ఫ్రెంచి సేనానియు ఫ్రాన్స్నందు ఏర్పడిన విచీ ప్రభుత్వముతో సహకరించెను. ఈ పరిస్థితివలన ముప్పేర్పడునని భావించి బ్రిటిష్ప్రభుత్వము సిరియా జాతీయవాదుల స్వాతంత్ర్యకాంక్షను బలపరచెను. ఫ్రాన్స్నకు వెలుపల ఏర్పరుపబడిన 'స్వతంత్ర ఫ్రెంచి' ప్రభుత్వము బ్రిటిష్ వారితో సహకరించెను. అంతట బ్రిటిష్, స్వతంత్రఫ్రెంచి సేనలు సిరియాపై దండెత్తి, విచీ ఫ్రెంచిసేనలను ఓడించి దేశమును వశపరచుకొనినవి (జూలై 14, 1941). 'స్వతంత్ర ఫ్రెంచి' ప్రభుత్వము అంతట తన మాండేటరీ హక్కును వదలుకొని, దేశమునకు స్వతంత్రతను కలిగించెను. యుద్ధానంతరమున సిరియా ఐక్యరాజ్యసమితి [చూ. పు. 351] యందు సభ్యత్వమును గడించెను.

జాతీయోద్యమకాలమునుండియు అరబ్బు రాజ్యముల ఏకీకరణము సిరియా నాయకుల ఆకాంక్షగ ఉండెను. ఈజిప్టులో రాచరికము అంతరించిన పిదప, ఇందులకు అనువగు సమయము ఆసన్నమయ్యెనని ఈజిప్టు నాయకులతో పాటుగ సిరియా నాయకులును భావించిరి. తత్ఫలితముగ ఆ రెండు దేశములును 'యునైటెడ్ అరబ్ రిపబ్లిక్' అను పేర ఒక సమాఖ్యగ రూపొందినవి (ఫిబ్రవరి 1,

1958). కాని, తరువాత ఈజిప్టు అధ్యక్షుడగు నాసర్ [చూ. పు. 533] అనుసరించు విప్లవాత్మకములగు సంస్కరణలు సిరియాయందలి కొందరు నాయకులకు నచ్చక పోవుటచే, వారి ప్రోద్బలమున దేశమున తిరుగుబాటు చెలరేగినది (సెప్టెంబరు 28, 1961). అంతట ఆ సమాఖ్యాధ్యక్షుడగు నాసర్ ఈ సమాఖ్యను రద్దుచేయగ (అక్టోబరు 5, 1961), సిరియా తిరిగి సర్వస్వతంత్ర రాజ్యమయ్యెను. కాని, అపుడు ఏర్పడిన ప్రభుత్వము ఎక్కువ కాలము అధికారమున ఉండలేకపోయినది. సైనికాధికారములలోని వివిధ వర్గములు ప్రభుత్వమును వశపరచుకొన యత్నించినవి. తుదకు మార్చి 8, 1963 న సైన్యసాహాయ్యమున ఒక విప్లవపక్షములవే అల్ అటాసీ నాయకత్వమున అధికారమును కైవసమొనర్చుకొనినది. చీ. శే. రా.

సిలోన్ : చూ. సింహళము - పు. 838.

**సీజర్, గైయస్ జూలియస్** (క్రీ. పూ. 100 - 44) : ప్రపంచ చరిత్రలోని మహావీరులలో ఒకడు. రోమ్‌లో సంపన్నుల వంశములో జన్మించినను ఎల్లపుడు ప్రజల పక్షమే వహించెను. తన శక్తియుక్తులవలన సీజర్ రోమ్ వ్యవహారములలో ప్రముఖ స్థానము సంపాదించి, క్రీ. పూ. 62 లో కాన్సల్ తరువాతి పదవియగు 'ప్రేటర్' పదవి పొందెను. 59 లో సీజర్ కాన్సల్‌గా ఎన్నుకొనబడెను. 60 లో ఇతడును, మార్కస్ లిసినియస్ క్రాసస్, పాంపే కలసి 'పాలకత్రయము' గ ఏర్పడి రోమ్‌ను పాలించిరి.

ఇంతవరకు సీజర్ రాజకీయములలోనే ఉన్నను, అతడు గొప్ప సేనాధిపతి అని గాల్‌లో అతని యుద్ధ నిర్వహణము వలన రుజువయినది. ఈతడు రెండుసార్లు బ్రిటన్‌పై (క్రీ. పూ. 55 - 54) దండెత్తెను. 53 లో క్రాసస్ మరణించెను. పాంపే భార్యయు, సీజర్ కుమార్తెయు అయిన జూలియా ఆ ముందు సంవత్సరమే మరణించెను. పాంపే సీజర్‌ను వ్యతిరేకించుట ప్రారంభించెను. 'పాలక త్రయ' పరిపాలన అంతమొందెను. రోమ్‌లో సీజర్ పట్ల అసూయ ప్రబలెను. పాంపే ఆ అసూయను రెచ్చగొట్టి, సీజర్ సైన్యములను సెనేట్ ఆజ్ఞలచే విభజింప జూచెను. సీజర్ అందుకు అంగీకరింపలేదు. తత్ఫలితముగ అంతర్యుద్ధము బయలుదేరెను. ఆరురోజులలో రక్తపాతము లేకుండ సీజర్ ఇటలీని ఆక్రమించుకొని, 49 లో నియంత అయ్యెను. పాంపేను వెంటాడి సీజర్ గ్రీస్, ఈజిప్టు దేశములకు వెళ్లెను. అచ్చట పాంపే హత్యగావింపబడెనని తెలిసికొని ఈజిప్టులో క్లియోపాత్రాను రాణిగాచేసి, సీజర్ స్వదేశమునకు మరలి వచ్చెను. ఇంకను, కొన్ని యుద్ధములు చేసి పాంపే అనుయాయులను, కుమారులను సీజర్ పూర్తిగ ఓడించెను. ఇటుల సీజర్ రోమన్ సామ్రాజ్యమంతటికిని అడ్డులేని అధికారి అయ్యెను. ప్రజలు సీజర్‌ను పదేళ్లపాటు నియంతగా ఎన్నుకొనిరి. అతని ముద్ర నాణెములపై ముద్రించిరి. ప్రజల పక్షమున మార్క్ అంటోనీ ఒక సభలో సీజర్‌కు రాజకిరీటము బహూకరించెను. కాని, అతడు దానిని తిరస్కరించెను.

ప్రజల సమక్షమున కిరీటమును తిరస్కరించినను ఈతడు రాజు కాదలచినాడను ఆరోపణతో క్రీ. పూ. 44, మార్చి 15 న సెనేట్‌సభకు రాబోవుచుండగా ఈతడు హత్య చేయబడెను. ఆ కుట్రకు కారకులలో ముఖ్యులు కాషియస్, బ్రూటస్ అనువారు. ఈతడు తన మిత్రులని భావించిన వారే - ఈతనినుండి లాభములను పొందినవారే - చివరకు ఇతనిని హత్యచేసిరి. ప్ర. రా.

సీటో : చూ. ఆగ్నేయ ఆసియా రక్షణ వ్యవస్థ - పు. 283.

**సుడాన్** : ఆఫ్రికా ఖండమునందలి ఒక స్వతంత్ర గణ రాజ్యము.

ఈ రాజ్యమునకు ఈజిప్టు [ఉ]; ఎర్ర సముద్రము, ఎతియోపియా దేశము [తూ]; కెన్యా, ఉగాండా, కాంగో రాజ్యములు [ద]; సెంట్రల్ ఆఫ్రికన్ రిపబ్లిక్, చాడ్, లిబియా దేశములు [ప] సరిహద్దులందు ఉన్నవి. [వి] 25,05,823 చ. కి. మీ.; [జ] 1,30,11,000, [భా] అధికారభాష అరబ్బీ, దేశీయులలో సగము మందికి పైగా ప్రజలకు ఇదియే మాతృభాష; తక్కినవారిలో వివిధ ఆఫ్రికన్ భాషలు మాతృభాషలుగ ప్రచారమందు ఉన్నవి, ఆంగ్లభాషయు వివిధ జాతుల మధ్య సామాన్యభాషగ ప్రచారమందు ఉన్నది. [మ] దేశీయులలో అత్యధిక సంఖ్యాకులు ముస్లిమ్‌లు; కాని, తక్కిన చోటుల ప్రచారమునందున్న ఇస్లామ్ వలెనే కాక, ఇచట ఇస్లామ్ మతమున తరీకాలు అనబడు ప్రత్యేక

సంప్రదాయములు అనేకములు ప్రచారమందు ఉన్నవి. ఈ సంప్రదాయముల మధ్య బయలుదేరు వైరుధ్యములు ఈ దేశపు రాజకీయములపై తమ ప్రభావమును నెరపుచున్నవి. దేశమున కైస్తవ, యూదుమతములు కొలదిగ ప్రచారమున కలవు. [రా] ఖార్టూమ్ (జ. సం, 93,103).

చరిత్ర : క్రీ. పూ. 2,000 నుండియు ఈ దేశపు చరిత్ర స్థూలముగ తెలియవచ్చుచున్నది. ప్రాచీన ఈజిప్షియన్ శాసనములందును, కైస్తవమతగ్రంథమగు పురాణ ప్రవచనము (ఓల్డ్ టెస్టమెంట్) నను, కుష్ అను పేర ఈ దేశపు ప్రసక్తి తొలుతగ కానవచ్చుచున్నది. కాని, ఈ నాలుగువేల సంవత్సరములలోను అంతటంతట ఎప్పుడో కొలది సంవత్సరములందు మాత్రమే ఈ దేశము స్వతంత్రముగ మనగలిగినది. తక్కిన చారిత్రక కాలమునందు అంతటను ఏదియో ఒక సామ్రాజ్యమున అంతర్భాగముగనే ఆ దేశము ఉండినది. ప్రాచీనయుగములందు క్రమముగ ఈజిప్టు, రోమ్ చక్రవర్తులును, కైస్తవమత వ్యాపన కాలమున బైజాంటియమ్ ప్రభువులును, ఇస్లామిక యుగమున అరబ్, టర్కీ సామ్రాజ్య పాలకులును, నవ్యయుగమున బ్రిటిష్ సామ్రాజ్యవాదులును ఈ దేశమును తమ నిరంకుశపరిపాలనకు గురిచేసిరి. దేశము స్వతంత్రముగ మనిన కాలములలో ముఖ్యముగ పేర్కొనదగినది మెరోవియన్ రాజ్యయుగము (క్రీ. పూ. 750 - క్రీ. శ. 300 ర.); ఈ యుగమున సుడాన్ రాజులు ఈజిప్టును సైతము జయించి కొంతకాలము పరిపాలించిరి. తరువాత పేర్కొనదగినది ఫూజి రాజ్యయుగము (క్రీ. శ. 1500 - 1820); ఈ యుగమున ఈ దేశము ఒక రాజ్య కూటమిగ ఉండినది. ఈ కూటమికి పాలకులుగ వంశానుగత స్వత్వములు కల సుల్తానులు ఉండెడివారు.

ఈ రాజ్యము 1820 తరువాత టర్కీ, ఈజిప్టు దేశముల సమష్టిపరిపాలనకు లోబడి ఉండవలసివచ్చెను. కాని, మహమ్మద్ అహమ్మద్ అను నాయకుడు జాతీయ సైన్యమును సమీకరించి, ఈజిప్టు ప్రభుత్వపు సేనలను ఓడించి, దేశమునకు దాస్యవిమోచనము కలిగించి, తానే ప్రభువయ్యెను (1885). 1899 లో మరల ఈజిప్టు సేనలు బ్రిటిష్ సేనల సాయముతో ఈ దేశముపై దండెత్తి, దేశమును వశపరచుకొనినవి. అప్పటినుండి బ్రిటిష్, ఈజిప్టుప్రభుత్వములు రెండును ఈ దేశముపై అధికారము కలిగి ఉండుటకు నిర్ణయము జరిగినను, ఆచరణలో బ్రిటిష్ ప్రభుత్వమే సర్వాధికారములను గ్రహించెను. బానిస వ్యాపారమును నిరోధించి, దేశమున శాంతి భద్రతలను నెలకొల్పుటకు బ్రిటిష్ప్రభుత్వము చాల కృషి చేసెను.

ప్రథమ ప్రపంచ యుద్ధానంతరమున సుడాన్‌నందు జాతీయతాభావము మొలకెత్తి, క్రమముగ వికసనమొందెను. 1924 లో సుడాన్ జాతీయులగు సైనికులు కొందరు తిరుగుబాటు చేసిరి. కాని, అది వెనువెంటనే అడచివేయబడెను. ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున మిత్రరాజ్య సైన్యములతో చేరి సుడాన్ సేనలు తూర్పు ఆఫ్రికానుండి ఇటాలియన్ సేనలను తరిమివేయగలిగినవి. అంతటినుండి ఈ దేశప్రజలందు ఆత్మవిశ్వాసము బలపడి, స్వాతంత్ర్యోద్యమమునకు చేయూత నొసగినది. అందుచేత సుడాన్ ప్రజలకు స్వాతంత్ర్యము ఒసగు తలంపుతో బ్రిటిష్ప్రభుత్వము ఈజిప్టు ప్రభుత్వముతో మంతనములు సలిపినది కాని, అప్పటిలో ఈజిప్టును పరిపాలించు ఫరూక్ రాజు అవలంబించిన వితండవాదము ఫలితముగ అది ఫలింపలేదు. ఇంతలో 1952 న ఈజిప్టున రాజరికము అంతరించి, విప్లవప్రభుత్వము ఏర్పడెను. ఈ ప్రభుత్వము సుడాన్ ప్రజల ఆశయముల ఎడ సానుభూతి కలదగుటచేత బ్రిటిష్, ఈజిప్టు ప్రభుత్వములకు ఒడంబడిక కుదిరి తత్ఫలితముగ సుడాన్ స్వతంత్ర గణరాజ్యము అయ్యెను (జనవరి 1,1956). స్వాతంత్ర్య ప్రకటనముతో పాటుగ ప్రజాస్వామిక రాజ్యాంగ చట్టము ఆమోదింపబడి, అమలులోనికి తేబడెను. కాని, తరువాత మూడు సంవత్సరములైనను ముగియక పూర్వమే, ఈ రాజ్యాంగము రద్దు చేయబడి, సేనాధిపతియగు అల్ ఫరీఖ్ ఇబ్రహీమ్ అబ్బుద్ నాయకత్వమున సైనిక నియంతృత్వము స్థాపింపబడినది (1958). తరువాత అబ్బుద్ నాయకత్వమున ఏర్పడిన ప్రభుత్వమున అధికారము వహించిన వారి ఎడల అసంతృప్తి వహించిన ఒక సైనిక దళము 1959 లో అబ్బుద్ రహీమ్ షినాన్ నాయకత్వమున తిరుగుబాటు చేసి, అధికారమును వశపరచుకొని, అబ్బుద్ నాయకత్వముననే వేరొక ప్రభుత్వమును ఏర్పాటు చేయగలిగెను (మార్చి 2, 1959). కాని, అనతికాలమున షినాన్ అరెస్టు చేయబడుటతో (జూన్ 1, 1959) ఆ నూతన ప్రభుత్వము అంతరించెను. అంతటి నుండి అబ్బుద్ నియంతృత్వమున పరిపాలన కొంతకాలము సాగినది. కాని, దేశమున అరబ్‌ల సంఖ్యాధిక్యముగల ఉత్తర భాగమునకును, నీగ్రోల ఆధిక్యము కలిగిన దక్షిణ భాగమునకును మధ్య చెలరేగిన విభేదముల మూలమునను, ప్రజలు ప్రజాస్వామిక ప్రభుత్వమునకై సాగించిన ఆందోళన ఫలితముగను ఈ నియంతృత్వము అంతరించి కాల క్రమమున 1965, జూన్ మాసమున దేశమునందలి ప్రముఖ రాజకీయ పక్షములు రెండింటి సహకార బలముతో మహమద్

అహామద్ అగూబ్ ఒక విధమగు ప్రజాప్రాతినిధ్యముకల ప్రభుత్వమును నెలకొల్పెను.

రాజ్యాంగము : దేశమునకు ఒక సుస్థిర ప్రజాస్వామిక రాజ్యాంగమును రూపొందింపవలెనను కృషి పెక్కు మారులు జరిగియు, ఈ దేశమున అది ఫలవంతము కాజాలక పోయినది. రాజ్యాంగ పరిషత్తు కొరకై 1964, డిసెంబరులో జరిగిన ఎన్నికలు ఉత్తర ప్రాంతమున మాత్రమే జరిగినవి. ప్రస్తుతము రాజకీయ నాయకుల సహకారమున ప్రభుత్వము నడచుచున్నది. చీ. శే. రా.

**సుభాష్ చంద్ర బోస్** (1897 - 1945): ఇతడు 1897 లో కటక్ లో జన్మించెను. కటక్, కలకత్తా కేంబ్రిడ్జ యూనివర్సిటీల యందు చదివెను. ఐ. సి. ఎస్. పరీక్ష యందు కూడ కృతార్థుడయ్యెను. కాని, లండనులో ఉండగానే 1921 లో సహాయ నిరాకరణోద్యమము నందు చేరుటకై ఐ. సి. ఎస్. ఉద్యోగమునకు రాజీనామా ఇచ్చెను. అప్పటినుండి ఒక గొప్ప జాతీయ నాయకుడుగా భారతదేశ రాజకీయ రంగమందు పేరు ప్రఖ్యాతులు గడించెను. 1924 లో కలకత్తా కార్పొరేషన్‌కు చీఫ్ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గాను, 1930 లో కలకత్తా కార్పొరేషన్ మేయర్‌గాను పనిచేసెను. 1924, 1931, 1936, 1940 లలో అరెస్ట్ చేయబడి నిర్బంధమందు ఉంచబడెను. బెంగాల్ రాష్ట్ర కాంగ్రెస్‌కమిటీ అధ్యక్షుడుగ చాలకాలము ఉండెను. 1938 లో 'హరిపూర్ కాంగ్రెస్' నకు అధ్యక్షుడుగ ఎన్నుకొనబడెను. గాంధిని, ఆయన అనుచరవర్గమును కాదని డాక్టర్ పట్టాభి సీతారామయ్యకు పోటీగా నిలబడి విజయము గావించెను. కాని, కాంగ్రెస్ హైకమాండ్ వారితో ఏకీభవింపజాలక కాంగ్రెస్ అధ్యక్షపదవికి రాజీనామా ఇచ్చి, ఫార్వర్డ్ బ్లాక్ అను నూతన రాజకీయ పక్షమును లేవదీసెను. కారాగారమందు ఉండియు 1940 లో కేంద్రశాసన సభకు సభ్యుడుగా ఎన్నుకొనబడెను. అనారోగ్య కారణమున కారాగారమునుండి విడువబడి నిర్బంధవాసమున, అతని కలకత్తా గృహమునందు ఉంచబడెను. కాని, 1941, జనవరి 26 వ తేదీని తప్పించుకొని, ఆఫ్ఘనిస్తానము మీదుగా ద్వితీయ ప్రపంచ యుద్ధ కాలమున అక్షరాజ్యముల వారిని చేరి, భారత స్వాతంత్ర్యమునకై కృషి చేయసాగెను. 1943, జూలై 5 వ తారీఖున సింగపూర్‌లోని భారత స్వాతంత్ర్య సమితికి అధ్యక్షుడై అజాద్ హింద్ ఫౌజ్‌కు నేతాజీయై, 1943, అక్టోబరు 21 వ తారీఖున స్వతంత్రభారతప్రభుత్వమును ఏర్పాటు గావించెను. ఇతడు 1945 లో విమానమునుండి పడి మరణించెనని వదంతి. ప్ర. రా.



సుభాష్‌చంద్రబోస్
(1897 - 1945)

**సుమేరియన్ నాగరకత :** అతి ప్రాచీనమైన నాగరకత. యూఫ్రటీస్, టైగ్రిస్ నదుల మధ్యదేశమునకు 'సుమేర్' అని పేరు ఉండుటచేత అక్కడి వారికి 'సుమేరియన్' లు అనే పేరు వచ్చినది. కాని, ఆ సుమేరియన్‌లు ఏ తెగకు చెందినవారో ఇంతవరకు నిర్ణయించుటకు తగిన ఆధారము కనబడలేదు. క్రీ. పూ. 3,500 సంవత్సరములకు ముందే సుమేరియన్‌లు పారసీకసింధుశాఖవద్ద ఉన్న బంజరు భూములను ఆక్రమింప జొచ్చిరి. వారు క్రీ. పూ. 3,500 నాటికే యవలు, గోధుమలు పండించుచుండిరి. వారు పశువులను, మేకలను, గొర్రెలను పెంచుచుండిరి. ఈ పశువులకు వారి నిత్యజీవితములో ఎంతేని ప్రాముఖ్యము కలదు. వారి ముఖ్యదేవతలలో ఒకటి గోవు రూపమున ఉన్నది. అది వారి ఆలమందలను కాపాడునని వారి నమ్మకము. 'ఉర్' అనే ముఖ్య నగరమునకు సమీపమున నూతనముగ కనబడిన ఒక దేవళము లోని కొన్ని శిల్పములను బట్టి సుమేరియన్‌లు పాల పరిశ్రమయందు అనుభవము కలిగినవారని తెలియగలదు. పొలము దున్నుటకును, చక్రములు గల బండ్లను లాగుటకును ఎద్దులు, గాడిదలు వాడబడుచుండెను. అక్కడి శిల్పచిత్రములందు కొన్నింట కొయ్యతో చేసిన రథములు కనబడుచున్నవి. చక్రములకు రాగిరేకులతోను, తోలు పట్టీలతోను కట్లుకట్టి ఉన్నట్లు కనబడుచున్నవి. సుమేరియన్‌లు ఆ ప్రాచీనకాలమందే లోహపు పనిలో నేర్పరులైరి. వ్యవసాయము, పశుపాలన వృత్తులే సుమేరియన్ నాగరకతలో పేరుపొందిన ధనాదాయ వృత్తులుగా ఉండెడివి. గొర్రెల మందలనుండి ఉన్నిని జాగ్రత్తచేసి, దానితో దుస్తులను తయారు చేసెడివారు. కాని, సుమేరియన్‌లు సాధారణముగ గొర్రెచర్మముతో చేసిన లాగులను ధరించుచుండినట్లు కనిపించును. వారి విదేశ వ్యాపారము అటు పశ్చిమమున మధ్యధరాసముద్రమునుండి ఇటు తూర్పున సింధునదీ ప్రాంతము వరకును వ్యాపించి ఉండినట్లు నిదర్శనములు కలవు. వారు ఆ ప్రాచీన కాలముననే ఒక లిపిని రూపొందించుకొనిరి. ఆ లిపినే - దాని రూపమును బట్టి - మనము నేడు బాణాగ్ర లిపి లేదా కీలలిపి (క్యూనిఫారమ్ లిపి) అని వ్యవహరించుచున్నాము [చూ.

లిపి, సం. 6 - పు. 769]. ఈ లిపియందు మన్నుపలకలపై వ్రాయబడిన లేఖనములు కొన్ని త్రవ్వకములలో వెలువడుటవలన, వానిని చదువ నేర్చిన పండితులు ఆ లేఖనముల మూలమున సుమేరియన్ నాగరకతను గురించిన పెక్కు వివరములను తెలుపగలిగిరి. సుమేరియన్ నాగరకత, విజ్ఞానము నగరములచుట్టును విస్తరిల్లెను. నగరమునకు అంతకును ముఖ్యమైన ప్రదేశము దేవాలయప్రాకారము. నలువైపుల గోడలు గల ఆవరణలో ప్రార్థనమందిరములు, సామానులగది, కార్యాలయములు ఉండెను. ధనికులైన మఠాధిపతులు ఇక్కడ పరిపాలనను సాగించెడివారు. వారు శిష్యకోటి సాహాయ్యముతో దేవస్థానము యొక్క ఆస్తులపై అద్దెలు వసూలుచేసి, దేవస్థాన సంరక్షకులుగ ఉండెడివారు. దేవాలయము ధనాగారముగా కూడ పనిచేయుచుండెను. దేవునిపేర అప్పులు ఇచ్చుటయు, ఆ దేవుని పేరనే వడ్డీలు తీసికొనుటయు జరుగుచుండెడిది.

ఆంగ్లో - అమెరికన్ పరిశోధకమండలి వారు పురాతన ఉర్ శిథిలములను పరిశీలించి అచ్చట ప్రత్యేక నాగరకత వర్ధిల్లుట కనుగొనిరి. పై శిథిలములను లోతుగా త్రవ్వుచుపోగా వైభవోపేతములైన రాజవంశీయుల గోరీలు బయటపడినవి.

దాస దాసీజనులను బలిచేసి, సమాధిచేయుట ఇచటనే కనిపించును. ఈ గోరీల నిర్మాణములో రాయి, ఇటుక కూడ ఉపయోగింపబడినవి. ఆ శిల్పవిన్నాణము ఈజిప్టులోని గోరీలందు కనబడు శిల్పవిన్నాణమునుకూడ తలదన్నినది అనవచ్చును. ఇంకను కొన్ని సుమేరియన్ నగరములను త్రవ్వి తీసిరేకాని, అగమ్య గోచరముగ ఉన్న ఈ చరిత్ర విషయములను ఒక క్రమములో పెట్టుట మాత్రము కష్టముగ ఉన్నది. కాని, ఇంతవరకు తెలిసిన చరిత్రవల్ల ఈ నగరరాజ్యములు నిరంతరము ఒక దానితో ఒకటి పోరాడుచున్నట్లును, కొద్దిపాటి శాంతి చేకూరినచో పోయిన గౌరవ ప్రాభవములను తిరిగి చేకూర్చుకొనుటకు పాటుపడుచుండినట్లును గోచరము అగుచున్నది [చూ. సమీక్ష పు. 15, 19 - 25].

సుమేరియన్‌లలో ప్రబలుచున్న ఈ నిరంతర యుద్ధముల వలన క్రమముగ బలహీనులు కాగా 'అక్కడియన్' అని వ్యవహరింపబడు సెమిటిక్ జాతివారు సుమేరియన్ వారిని ఓడించి వారి రాజ్యమును ఆక్రమించిరి. ప్ర. రా.

**సూయజ్ కాలువ :** మధ్యధరా సముద్రమును ఎఱ్ఱ సముద్రముతో కలుపుటకై త్రవ్వబడి, 1869, నవంబరులో తెరువబడిన సుమారు 160 కిలో మీటరుల నిడివికి కొంచెము పైబడిన కాలువ. ఇది ఆఫ్రికా, ఆసియాఖండములను కలుపు సూయజ్ భూ సంధిగుండా త్రవ్వబడెను. దీనిని త్రవ్వించుటకై 1854, నవంబరులో ఫెర్డినాండ్-డీ-లెసెప్స్‌కు అనుమతి ఒసంగబడెను. ఈ పనికై 1858 లో ఫ్రెంచి ప్రాబల్యముతో 'అంతర్జాతీయ సూయజ్ కాలువ కంపెనీ' ఒకటి ఏర్పడెను. ఈ కాలువ మూలకముగ ఫ్రెంచివారు ఆ ప్రాంతమున స్థానమును సంపాదించి, తద్ద్వారా భారత ప్రభుత్వమును ఇబ్బంది పెట్టుటకు ప్రయత్నించుచున్నారను భయముతో, మొదటినుండియు బ్రిటన్ ఈ ఏర్పాటునకు అభ్యంతరము చెప్పుచుండెను. కాని, 1875 లో బ్రిటిష్ ప్రధానమంత్రియగు డిజ్‌రేలీ [చూ. పు. 508] తన ప్రభుత్వమునకై ఈజిప్టు పాలకుని (ఖేడివ్) నుండి ఈ కంపెనీలోని వాటాలలో 40% కొనెను. అందుచే కంపెనీలోని భాగస్వాములలో బ్రిటన్ ఏకైక ప్రధాన భాగస్వామి అయ్యెను. 1886 లో కాన్‌స్టాంటినోపుల్ నందు జరిగిన సమావేశమున అన్ని పెద్ద రాజ్యములచేత సూయజ్ కాలువ ఒప్పందముపై సంతకములు చేయబడెను. ఆ ఒడంబడిక అన్ని ఓడలకును - శాంతి సమయములయందు వలెనే - యుద్ధకాలమందు సైతము స్వచ్ఛంద, బహిరంగ నౌకాయాన సౌకర్యమును ప్రసాదించెను. అయితే, 1898 లో స్పెయిన్ - యునైటెడ్ స్టేట్స్ మధ్య యుద్ధము జరుగు కాలమున ఫ్రాన్స్ నౌకలకును, రెండు ప్రపంచ యుద్ధముల కాలమున జర్మనీ పక్షపు నౌకలకును ఈ హక్కు నిరాకరింపబడెను. ఈ కాలువపై స్వామ్యమును గురించి, సూయజ్ కాలువ కంపెనీవారితో ఏర్పరచుకొనిన ఒప్పందము 1968 వరకు పూర్తిగా రద్దుకాకున్నను, ఈజిప్టు ప్రభుత్వము 1956, జూలైలో ఈ కాలువను బ్రిటన్, ఫ్రాన్స్, ఇస్రాయెల్ దేశముల ప్రతిఘటనను ఎదుర్కొని, జాతీయము ఒనర్చెను. అయినను, ఈజిప్టు సర్వాధిపత్యమునకు లోబడి ఈ కాలువ ఇప్పుడును శాంతి సమయములందు ఇస్రాయెల్ దేశపు నౌకలకు తప్ప తక్కిన ప్రపంచ రాజ్యముల నౌకలకు అన్నిటికిని రహదారిగ ఉపయోగపడుచు, ఈజిప్టు ప్రభుత్వమునకు సుంకముల మూలమున విరివిగ ధనమును సేకరింప కలుగుచున్నది. స్వ. వెం.

**సెంటో :** చూ. మధ్యప్రాచ్య రక్షణసంధి - పు. 729.

**సెంట్రల్ ఆఫ్రికన్ రిపబ్లిక్ :** ఆఫ్రికాఖండ మధ్య ప్రాంతమున ఉన్న ఒక స్వతంత్ర గణరాజ్యము.

ఈ దేశమునకు సుడాన్ [తూ]; కాంగో రిపబ్లిక్, కాంగో (పూర్వపు బెల్జియమ్ వలస) దేశము [ద]; కామెరూన్ [ప]; చాడ్ [ఉ] సరిహద్దులుగ ఉన్నవి. [వి] 61,7,000 చ. కి. మీ.; [జ] 12,50,000. దాదాపు అందరును ఆఫ్రికన్ జాతులకు చెందినవారలే ఇందు కలరు. [భా] దేశమునందు వివిధ

ఆఫ్రికన్ జాతులు వేర్వేరు ఆఫ్రికన్ భాషలను మాట్లాడుచున్నారు. వీనిలో ఏ ఒకటియు జాతీయభాషగ పరిగణనకు రాలేదు. ఫ్రెంచి భాషయే రాజకీయ, వ్యాపార రంగములందు సర్వత్ర ఉపయో




గింపబడుచున్నది. [మ] దేశపు ఉత్తరభాగమున ఇస్లామ్ విరివిగా ప్రజలలో వ్యాప్తియందు ఉన్నది. తక్కినవారిలో అధిక సంఖ్యాకులు ప్రకృతి దేవతారాధకులు. క్రైస్తవమతము మెల్లమెల్లగా ప్రజలలో వ్యాపించుచున్నను, ప్రకృతి దేవతారాధనను క్రైస్తవులు సైతము పరిత్యజించుట లేదు. [రా] బాంగీ (జ. సం. 79,500).

చరిత్ర: 19 వ శతాబ్ది అంతమున ఫ్రెంచివారి అన్వేషణ మూలమున ఈ దేశపు ఉనికి నాగరకప్రపంచమునకు తెలియవచ్చినది. కాంగోనదీ పరిసరములనుండి బయలుదేరిన సాహసికులగు కొందరు ఫ్రెంచి అన్వేషకులు క్రమముగ ఆఫ్రికాఖండపు మధ్యభాగమునకు చేరి, దానియందు ఉన్న వివిధ ఆఫ్రికన్ తెగల నాయకులతో ఫ్రెంచిప్రభుత్వపక్షమున ఒడంబడికలు కుదుర్చుకొని వారి రాజ్యములను ఫ్రెంచి సామ్రాజ్యమున చేర్చిరి. ఈ ప్రాంతమున ఉబాంగీ, షరీ అను నదులు ప్రముఖములగుటచే వారు ఇపుడు ఈ దేశమును ఉబాంగీ - షరీ అని వ్యవహరించిరి. ఈ దేశమునకు ప్రక్కనే, ఇదివరకే తమ వలసలుగ ఉండిన గెబన్, మధ్య కాంగోలతో ఈ ఉబాంగీ - షరీని కూడ చేర్చి 'ఫ్రెంచి ఈక్వటోరియల్ ఆఫ్రికా' అను పెద్ద వలసరాజ్యమును 1910 లో ఫ్రెంచివారు నిర్మించిరి. 1940 లో ఫ్రాన్స్‌ను నాజీలు ఆక్రమించినపుడు ఈ ఉబాంగీ - షరీ స్వతంత్ర ఫ్రెంచివర్గముతో చేరి ద్వితీయ ప్రపంచయుద్ధమున పాల్గొనెను. 1958, సెప్టెంబర్ 28 వ తేదీన జరిగిన ప్రజాభీష్టసేకరణ (రెఫరెండమ్) లో ఈ ఉబాంగీ - షరీ ఫ్రెంచి కమ్యూనిటీకి చెందిన స్వతంత్రదేశముగ ఉండుటకు నిర్ణయించుకొని, 'సెంట్రల్ ఆఫ్రికన్ రిపబ్లిక్' అను నూతన నామమును వహించి ఇప్పుడు స్వతంత్రదేశముగ వ్యవహరించుచున్నది.

రాజ్యాంగము: 1958 వరకును ఈ దేశమున ఫ్రెంచివారి వలసపాలనయే సాగినది. ఆ తరువాత ఫ్రెంచి కమ్యూనిటి [చూ. పు. 638] లోని స్వతంత్రరాజ్యముగ ఉండుటకు ఈ దేశము నిర్ణయించుకొనినదను విషయము పైన తెలుపబడినది. దీనిని అనుసరించి కమ్యూనిటీకి చెందెడి అధికారములుగాక మిగిలిన అన్నింట ఈ దేశము స్వతంత్రముగ వ్యవహరించుచున్నది. 1959, ఫిబ్రవరి 9 న ఆమోదింపబడిన రాజ్యాంగచట్టమును అనుసరించి ఈ దేశమున ప్రజాస్వామికప్రభుత్వము అమలునందు ఉన్నది. శాసనాధికారము 50 మంది సభ్యులు కల శాసనసభ (అసెంబ్లీ లెజిస్లేటివ్) యందు న్యస్తమై ఉన్నది. వయోజనులు అందరకు వోటుహక్కుగల సార్వజనిక వోటింగు పద్ధతిని అనుసరించి రహస్యముగ జరుగు ప్రత్యక్షపు ఎన్నికవలన అయిదేండ్లకు ఒకసారి అసెంబ్లీ ఎన్నుకొనబడును. అత్యధిక సంఖ్యాకపక్షపు నాయకుడు దేశాధినేతగ ఎన్నుకొనబడును. కాని, 1962, నవంబరులో రాజ్యాంగమున జరిగిన మార్పును బట్టి, దేశమున ఏకపక్ష ప్రభుత్వము ఏర్పడి, అపరోక్షపు ఎన్నికవలన అధ్యక్షుడు ఎన్నుకొనబడి సర్వాధికారములతో ప్రభుత్వమును నెరపుట మొదలైనది.

చి. శే. రా.

సెనెగల్: పశ్చిమ ఆఫ్రికాయందలి ఒక స్వతంత్ర గణరాజ్యము.




ఈ రాజ్యమునకు మారిటేనియా [ఉ]; మాలీ [తూ]; గినీ, పోర్చుగీస్ గినీ [ద]; అట్లాంటిక్ మహాసముద్రము [ప] సరిహద్దులందు ఉన్నవి. (ఈ రాజ్యమధ్యమున అన్ని దిక్కులను ఈ రాజ్యముచే పరివృతమై గాంబియా [చూ. పు. 423] రాజ్యము కలదు). [వి] 1,97,161 చ. కి. మీ; [జ] 32,80,000. దాదాపుగ జనులందరును నీగ్రో సంతతివారు. [భా] అవలాఫ్, ఫులానీ అను నీగ్రోభాషలును, వానిలోని మాండలిక భేదములును దేశమున వ్యాప్తియందు ఉన్నవి; ఫ్రెంచిభాషయే పరిపాలనాది వ్యవహారములందు వాడబడుచున్నది; [మ] ఇస్లామ్, క్రైస్తవమతము, సంప్రదాయ బహుదేవతారాధన వ్యాప్తియందు ఉన్నవి; [రా] డాకర్ (జ. సం. దాదాపు 3 లక్షలు).

చరిత్ర: ఈ రాజ్యపు ప్రాచీన చరిత్రను గురించిన వివరములు అంతగ తెలియవచ్చుట లేదు. 15వ శతాబ్దిలో పోర్చుగీస్‌లు తీరమున స్థావరములను ఏర్పరచుకొనుటతో పాశ్చాత్యులకు ఈ దేశముతో తొలుతగ పరిచితి ఏర్పడినది. దేశాంతర్భాగమున బంగారు గనులు కలవని తెలియవచ్చుటవలన పోర్చుగీస్‌వారు దేశమధ్యప్రాంతము వరకు చొచ్చుకొనిపోయి, దానిని జయించి, కొంతకాలము అట పాలించిరి. కాని, దేశీయుల తీవ్రప్రతిఘటనకు లొంగి కడకు దేశమును వదలిపోయిరి. 1626 లో తొలుతగ ఫ్రెంచి వర్తకసంఘము ఒకటి ఈ దేశమునందు సెనెగల్ నదీతీరమున సెయింట్ లూయీ అను ఒక స్థావరమును నెలకొల్పి, దేశీయులలో తమ పలుకుబడిని వ్యాపింపజేయ మొదలిడెను. తరువాత క్రమముగ మరికొన్ని ఫ్రెంచి వర్తకసంఘములు ఇటకు వచ్చి చేరెను. ఇటుల 1758 నాటికి ఏడు ఫ్రెంచి వర్తకసంఘములు ఇట క్రమముగ పాలించినవి. ఈ వర్తకసంఘముల కృషివలననే దేశమున తీరభాగమంతయు ఫ్రెంచివారి పరమయ్యెను. 1758 లో ఫ్రెంచివారిని తరిమి బ్రిటిష్‌వారు ఈ ప్రాంతమును వశపరచుకొనిరి. కాని, తరువాత జరిగిన సంధిని అనుసరించి 1763 లో ఈ ప్రాంతము మరల ఫ్రెంచివారి వశమయ్యెను. అటులే మరియొకసారి 1809 లో బ్రిటిష్‌వారు, నెపోలియన్‌తో జరుపు యుద్ధముల సందర్భమున ఆక్రమించిరి. కాని, తరువాత జరిగిన ఒడంబడికను అనుసరించి 1817 లో ఫ్రెంచివారికే తిరిగి అప్పగించిరి.

ఫ్రెంచివారు దేశాంతర్భాగమునందలి దోపిడి తెగలను అడచు మిషతో 1854 లో దండయాత్రలు సలిపి, 1865 నాటికి కడమ దేశమునంతటిని ఆక్రమించిరి. అంతటి నుండియు ఫ్రెంచిప్రభుత్వము ఈ దేశమును అంతటిని పాలించుచు, ఫ్రెంచి భాషాసంస్కృతులను, పరిపాలనా విధానమును ప్రవేశపెట్టినది. 1879 నుండి ఇచటి ప్రజలకు ఫ్రెంచి పౌరస్వత్వము కలిగింపబడినది. నవంబరు 25, 1958 న జరిగిన ప్రజావాక్య సేకరణ ఫలితముగ, ఈ దేశమునకు ఫ్రెంచికమ్యూనిటీ [చూ. పు. 638] లో సభ్యత్వమును, స్వతంత్రతయు చేకూరినవి. తరువాత 1959, జనవరిలో ఈ దేశమును, సౌడాన్ దేశమును కలసి మాలీ [చూ. పు. 751] సమాఖ్యగ రూపొందినవి. కాని, కాలక్రమమున ఈ రెండు రాజ్యముల మధ్య విభేదములు ఏర్పడుటచే, సెనెగల్ రాజ్యము ఆ సమాఖ్య నుండి విడివడినది (ఆగస్టు 20. 1960). సెప్టెంబరు, 29, 1960 న ఐక్యరాజ్యసమితి [చూ. పు. 351] యందు సభ్యత్వము గడించినది.

రాజ్యాంగము: సార్వజనిక వయోజన వోటుహక్కు ఈ దేశమున కలదు. జాతీయ శాసనసభయందు 60 మంది ఎన్నుకొనబడిన సభ్యులు కలరు. వీరిచే ఎన్నుకొనబడిన అధ్యక్షుడే ముఖ్యమంత్రిగ సైతము వ్యవహరింపబడుచు, 15 మంది మంత్రుల సాయమున, శాసనసభకు బాధ్యత వహించి పరిపాలనను నిర్వహించును. ప్ర. రా. సు.

సెయింట్ జర్మెయిన్ సంధి (10 సెప్టెంబరు, 1919): ప్రథమ ప్రపంచయుద్ధము ముగిసిన పిదప మిత్రమండలి రాజ్యములకు, ఆస్ట్రియా గణరాజ్యమునకు మధ్య పారిస్ సమీపమున సెయింట్ జర్మెయిన్ వద్ద జరిగిన శాంతి సంధి. దీనిని అనుసరించి, ఆస్ట్రియా తన పూర్వసామ్రాజ్యములోని జర్మనేతరప్రాంతములను పూర్తిగను, జర్మనీ భాష మాట్లాడు ప్రాంతములలో దాదాపు మూడవ వంతును కోల్పోయినది. ఆ సామ్రాజ్యములోని దక్షిణ టైరోల్, జూలియన్‌మార్చి ప్రాంతములు ఇటలీకి; స్లోవానియా, బోస్నియా - హెర్జిగోవినా, డాల్మేషియా ప్రాంతములు యుగోస్లావియాకు; బొహీమియా, మెరావియా రాష్ట్రములు జెకోస్లోవాకియాకు; గలీషియా పోలెండ్‌నకు; బుకోవినా రుమేనియాకు దత్తము చేయబడినవి. హంగేరీ ప్రత్యేకదేశము అయ్యెను. ఆస్ట్రియా, జర్మనీల ఐక్యము నిషేధింపబడెను. ఆస్ట్రియా సైన్యము 30,000 లకు పరిమితీకరింపబడెను. యుద్ధనష్టపరిహారముగ పెద్ద మొత్తము విధింపబడెను. 1914 లో హాప్స్‌బర్గ్ సామ్రాజ్యములోని ఆస్ట్రియా ప్రాంతపు జనాభా 280 లక్షలు; ఈ సంధి ప్రకారము శేషించిన ఆస్ట్రియా జనాభా 80 లక్షలు [చూ. సమీక్ష - పు. 155]. అ. వెం.

సేనానాయకే, డడ్లీ షెలన్ (జ. 1911): సింహళ జాతీయ నాయకుడు; రాజనీతిజ్ఞుడు; సంయుక్త జాతీయ పక్షపు అధ్యక్షుడు; ప్రధానమంత్రి (1952 - 53, 1960, 1965). జననము 19 జూన్, 1911; కేంబ్రిడ్జియందలి కార్పస్ క్రిస్టి కాలేజీలో విద్యను అభ్యసించెను. న్యాయవాది వృత్తిని స్వీకరించి, క్రమముగ 1936 లో శాసనసభాసభ్యుడు అయ్యెను; 1947 లో ప్రతినిధి సభలో సభ్యత్వమును పొంది, తొలుత వ్యావసాయిక మంత్రిపదవిని వహించి, తదనంతరమున ప్రధాని అయ్యెను (1952 - 53); అంతట తరువాత ఎన్నికలలో తన పక్షము బలమును కోల్పోవుటచే వైదొలగి ఉండియు, క్రమముగ బలమును ఆర్జించి మరల ప్రధాని కాగలిగెను (మార్చి, 60 - జూలై, 60); 1961 - 65 ప్రతిపక్షనాయకుడుగ వ్యవహరించి, 1965 లో జరిగిన ఎన్నికలలో తగు సంఖ్యాబలమును ఆర్జించి ప్రధాని కాగలిగెను. ప్ర. రా. సు.

**సైక్స్ - పికోట్ నోట్** (1916, మే 16): ప్రథమ ప్రపంచయుద్ధము జరుగుచున్న కాలమున బ్రిటిష్ ప్రభుత్వము తరఫున సర్ మార్క్ సైక్స్ చేతను, ఫ్రెంచి ప్రభుత్వమునకై జార్జి పికోట్ చేతను సంతకములు చేయబడి 'సైక్స్ - పికోట్ నోట్' అను వ్యవహార నామమును పొందిన రహస్యపు ఒడంబడిక. ఇందులో యుద్ధానంతరము ఓటోమన్ సామ్రాజ్యమును పంచుకొనుటకై ఏర్పాటు చేసికొనబడెను. అవి ఏవన: 1. ఫ్రాన్స్ ప్రత్యక్షముగ గాని, పరోక్షముగగాని మొత్తము సిరియా, లెబనాన్, సైలీషియా, మోసల్ ప్రదేశములను సంపాదించుకొనుట; 2. పైవానికి ప్రత్యామ్నాయముగ తరువాత ట్రాన్స్ జోర్డాన్ అని తెలియవచ్చిన భూమిని, ఇరాక్, ఉత్తర పాలస్తీనా దేశములను బ్రిటన్ పొందుట; 3. మిగిలిన పాలస్తీనాను ఒక అంతర్జాతీయ పరిపాలన క్రింద ఉంచుట; 4. ఒక అనిర్దిష్ట 'అరబ్ పరగణా' ను స్థాపించుట.

యుద్ధకాలమున తుర్కులను ప్రతిఘటించెడు తిరుగుబాటులను లేవదీయుటకై టి. ఇ. లారెన్స్‌చే అరబ్బులకు ఇవ్వబడిన కొన్ని హామీలకు వ్యతిరేకముగ ఈ ఒడంబడిక పరిణమించినది. అంతేగాక, ఈ ఒడంబడికలోని షరతులను ఇతర రహస్య సంధులతోబాటు 1918 లో రష్యన్ బోల్షివిక్‌లు వెలువరచిరి. తత్ఫలితముగ మిత్రరాజ్యముల అసంబద్ధవర్తనను గురించి వాదోపవాదములు పెక్కు చెలరేగెను. స్వా. వెం.

**సైకెల్లిస్ (సెషెల్జ్)**: హిందూ మహాసముద్ర పరివృతమగు ద్వీపసమూహపు బ్రిటిష్ వలసరాజ్యము.

హిందూమహాసముద్రమున దక్షిణ అక్షాంశరేఖ 4° నుండి 10° వరకును, తూర్పు రేఖాంశ 46° నుండి 47° వరకును అటనట చెదరి ఉండిన 92 ద్వీపములు సమష్టిగ సైకెల్లిస్ రాజ్యమని వ్యవహరింపబడుచున్నవి. వీనిలో మాహీ (143 చ. కి. మీ) అన్నింట ఎక్కువ వైశాల్యము కల ద్వీపము. అన్ని ద్వీపములు కలిసిన ఈ రాజ్యపు మొత్తపు [వి] 404 చ. కి. మీ: [జ] 43,750. ప్రజలలో భారతీయ, చీనీయ, నీగ్రో, ఫ్రెంచి, ఆంగ్ల మిశ్రజాతుల సంతతుల వారు కలరు; [భా] వివిధవర్గముల మాతృభాషలతోపాటుగ హిందీ, బంటూ, ఆంగ్లభాషా పదములతో మిశ్రితమయిన అపభ్రంశపు ఫ్రెంచిభాష సామాన్యభాషగ ఈ ప్రజలయందు వ్యాప్తియందు ఉన్నది. పరిపాలనా వ్యవహారములు ఆంగ్లభాషలోనే సాగుచున్నవి. [మ] ప్రజలలో దాదాపు 75% రోమన్ కేతలిక్‌లు; తక్కినవారిలో తక్కిన క్రైస్తవసంప్రదాయములు, హిందూ, ముస్లిమ్, బౌద్ధమతములు ప్రచారమునందు ఉన్నవి. [రా] మాహీ దీవియందలి పోర్ట్ విక్టోరియా (జ. సం. 11,380).

చరిత్ర: ఈ ద్వీపములను గురించిన ప్రాచీన విషయములు ఏవియు తెలియవచ్చుట లేదు. కాని, పోర్చుగల్‌లో 1502 లో తయారు చేయబడిన దేశపటములందు ఈ ద్వీపములు గుర్తింపబడి ఉండుటవలన, పోర్చుగీస్ నావికులకు ఆ కాలమున అవి సుపరిచితములై ఉండినటుల భావింపవచ్చును. 1602 లో బ్రిటిష్ నావికులు ఈ ద్వీపములలో కొన్నింటిని చూచినటుల తెలియవచ్చుచున్నది. 1742 లో లాజరే పికాల్డ్ అను ఫ్రెంచినావిక యోధుడు ఈ ద్వీపములను దర్శించి, తరువాత రెండు సంవత్సరములకు ఫ్రెంచిప్రభుత్వము పేర వానిని ఆక్రమించెను. అప్పటికే ఈ ద్వీపజాలమునకు అనతి దూరమున ఉన్న మారిషస్ [చూ. పు. 747] ఫ్రెంచివారి అధీనమున ఉండెను. మారిషస్ గవర్నర్‌కు ప్రతినిధిగ వ్యవహరించిన పికాల్డ్ అప్పటి మారిషస్ గవర్నర్ పేర ఇందలి ముఖ్య ద్వీపమునకు మాహీ అను పేరిడెను. తరువాత 1756 లో అప్పటి ఫ్రెంచిప్రభుత్వపు ఆర్థికమంత్రి పేర ఈ ద్వీపసమూహమునకు సైకెల్లిస్ (సెషెల్జ్) అని పేరిడబడెను. ఫ్రెంచివారిట మిరియపుతోటల సాగును ప్రోత్సహించిరి. ఆఫ్రికానుండి నీగ్రోలనే కాక, మారిషస్ వాసులలో కొందరను కూడ బానిసలుగ తోటలలో పనిచేయుటకు వారు ఇటకు తెచ్చిరి.

నెపోలియన్‌తో సాగించిన యుద్ధముల కాలమున బ్రిటిష్‌వారు 1810 లో ఈ ద్వీపములను ఆక్రమించిరి. అనంతరమున 1814 లో జరిగిన సంధిని అనుసరించి ఫ్రెంచివారు ఈ ద్వీపములను బ్రిటిష్‌వారికి వదలివేసిరి. తదాదిగ ఈ దీవులు బ్రిటిష్‌వారి పాలనయందున్నను, ప్రజలలో అదివరకే వ్యాపించియుండిన ఫ్రెంచిభాషా సంస్కృతుల క్రమపరిణామమును అడ్డుపెట్టక ప్రోత్సహించిరి. వీరిపరిపాలనా కాలమున భారతీయ, చీనీయ వర్తకులును, కూలివాండ్రును ఇట వలసవచ్చి చేరిరి. ఈ దేశసంపదకు కొబ్బరితోటలును, చేపల పరిశ్రమయు ముఖ్యాధారములు.

రాజ్యాంగము: బ్రిటిష్ ప్రభుత్వము నియమించు గవర్నర్ ఇట పరిపాలనను నిర్వహించును. అతనికి సాయము చేయుటకు ఒక శాసనపరిషత్తు (లెజిస్లేటివ్ కౌన్సిల్), కార్యనిర్వాహకవర్గము కలవు. ఈ రెంటికిని గవర్నరే అధ్యక్షుడు. శాసనపరిషత్తునందలి 12 మంది సభ్యులలో 5 మందిని మాత్రమే ప్రజలు ఎన్నుకొనెదరు. కార్యనిర్వాహకవర్గమున నలువురు అధికారులను, నలువురు అనధికారులను గవర్నర్ నియమించును. ప్ర. రా. సు.

**సైప్రస్**: మధ్యధరాసముద్రమందలి ఒక స్వతంత్ర ద్వీపరాజ్యము.

టర్కీదేశపు తీరమునకు 70 కిలోమీటరులకు దక్షిణమున ఉన్న ఈ ద్వీపమును, సమీపమున ఉన్న అల్ప ద్వీపములను ఈ ద్వీప

రాజ్యమున పరిపాలన రీత్యా అంతర్భాగములుగ ఉన్నవి. ఈ అల్ప ద్వీపములతో కలసి [వి] 9,251 చ. కి. మీ.; [జ] 5,91,000. ఈ ప్రజలలో 78.8% వలస వచ్చిన గ్రీకుల సంతతి వారు. 17.5% వలసవచ్చిన టర్కీ ప్రజల సంతతివారు. తక్కిన




వారు ఈ ద్వీపమున తొలుతనుండియు వసించుచుండిన ఆర్మీనియన్, మారోనైట్ సంతతివారు. గ్రీకులును, తుర్కులును మత భాషా సాంఘికాచార వ్యవహారములందు ఏ విధమగు పొత్తులేక ఈ దేశమున ప్రత్యేక జాతులుగ వసించుచున్నారు. [మ] తుర్కులు సున్నీ ముస్లిమ్‌లు, గ్రీకులును, తక్కినవారును గ్రీక్ ఆర్థడాక్స్ చర్చి సంప్రదాయపు క్రైస్తవులు. [భా] గ్రీకులు గ్రీక్ భాషను, తుర్కులు తుర్కీ భాషను మాట్లాడెదరు. ఇంగ్లీషు సామాన్య భాషగ వ్యవహారమున ఉన్నది. [రా] నికోసియా (జ. సం. 95,500).

చరిత్ర: ప్రపంచమునందలి ప్రాచీన మానవ నివాసములలో ఈ ద్వీపము ఒకటిగ లెక్కింపబడుచున్నది. ఈ దేశపు రాగిగనులతో ప్రాచీన ఈజిప్టువాసులకును, గ్రీకులకును పరిచయము ఉండినటుల తెలియుచున్నది. రాగి అను లోహమునకు గ్రీక్ భాషయందు 'కూప్రాస్' అను పేరు కలదు. దానినుండియే ఈ దీవికి సైప్రస్ అను పేరు కలిగి ఉండునని భావించుటకు అవకాశము కలదు. క్రీ. పూ. 1,400 నాటికే ఇచట గ్రీకులు తమ వలసలను ఏర్పరచుకొని, గ్రీక్ సభ్యతా మండలమునకు సరిహద్దు స్థావరముగ రూపొందించుకొనిరి. తరువాత ఫొనీషియన్ వ్యాపారులు కొందరు ఇట తమ వలసలను ఏర్పరచుకొనిరి. క్రీ. పూ. 568 ప్రాంతమున ఈ ద్వీపమును ఈజిప్టు పాలకులు వశపరచుకొనిరి. ఆ ద్వీపమందలి రాగి గనుల ప్రాముఖ్యమును బట్టి క్రమముగ ఆ తరువాత తల యెత్తిన పారసీక సమ్రాట్లును, అలెగ్జాండర్ విజేతయును, ఈజిప్టును పాలించిన టాలమీలును, రోమ్, బైజాంటైన్ పాలకులును ఆ యా కాలములందు ఈ ద్వీపమును తమ తమ సామ్రాజ్యములందు అంతర్భాగముగ చేసికొనిరి. ఏసుక్రీస్తు శిష్యులగు పాల్, మార్క్ అనువారలు ఈ ద్వీపమున క్రైస్తవ మతమును ప్రవేశపెట్టిరి. క్రీ. శ. 632 తరువాత అరబ్బీ యోధులు ఈ ద్వీపముపై పెక్కు తడవలు దండయాత్రలు సలిపిరి. కాని, ఇది వారి వశము కాక బైజాంటైన్ ప్రభువుల వశముననే దీర్ఘకాలము ఉండెను. ఇంతలో క్రూసేడ్‌లు [చూ. పు. 414] అను మత యుద్ధములలో పాల్గొనుటకు వచ్చిన రిచర్డ్ అను బ్రిటన్ రాజు బైజాంటైన్ ప్రభువులనుండి దీనిని జయించి వశపరచుకొని (1191), నైట్స్ టెంప్లార్ అను యోధసంఘమునకు దానిని విక్రయించెను. ఆ సంఘమునుండి గై ఆఫ్ లుసిగ్నాన్ అను ప్రభువునకు ఇది సంక్రమించినది. ఈ ప్రభువు సంతతివారు దీనిని దాదాపు 300 సంవత్సరములు పాలించి, ఆనాడు అచటి ప్రజలకు సుఖజీవితము కల్పించిరి. 1489 లో వెనిస్ నగరపాలకులు ఈ ద్వీపమును జయించి వశపరచుకొనగా, వారిని ఓడించి తుర్కులు క్రీ. శ. 1562 లో ఇచట తమ పాలనను నెలకొల్పిరి. 1914 వరకు వారు ఇచట పాలించిరి. వారి పరిపాలన కాలమున టర్కీ ప్రజలు అనేకులు ఉద్యోగ వ్యాపారముల కై ఇటకు చేరిరి. వారి సంతతివారే నేడు ఇచట ఉన్న తుర్కులు. క్రీ. శ. 1878 లో బెర్లిన్ కాంగ్రెస్‌నందు టర్కీదేశపు సమ్మతితో జరిగిన ఒక ఒడంబడికను అనుసరించి, రష్యన్ సమ్రాట్లు మధ్యప్రాచ్యములోనికి చొచ్చుకొని రాకుండ చేయుటకై సైప్రస్ దీవియందు తమ సైనికాశ్రయమును ఒకదానిని నెలకొల్పుటకు బ్రిటన్‌కు హక్కు కలిగింపబడి, అట్టి స్థావరము ఒకటి అచట ఏర్పడెను. 1914 లో ప్రథమ ప్రపంచ యుద్ధ కాలమున జర్మనీ పక్షము టర్కీ అవలంబించినందువలన, బ్రిటన్ ఈ ద్వీపమును సంపూర్తిగ వశపరచుకొని, వలసపాలనను స్థాపించెను.

సైప్రస్‌నందలి గ్రీకులు తొలుతటినుండియు తమ మాతృదేశమగు గ్రీస్ దేశమునందు సైప్రస్ అంతర్భాగమే అనియు, అందువలన అది పరిపాలన రీత్యా గ్రీస్ దేశమునకే చేర్చబడవలయునని భావించుచుండిరి. ఈ సంకల్పమునే వారు తమ భాషలో ఎనోసిస్ (మేళనము) అందురు. ఈ మేళనోద్యమము 1931 లో వికృతరూపమొంది, దౌర్జన్య చర్యగ పరిణమించెను. బ్రిటన్ నిర్దాక్షిణ్యముగ ఆ ఉద్యమమును అడచెను. కాని, అది లోలోన రగులుచునే ఉండి, ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరము మరల తీవ్ర రూపము దాల్చెను. దౌర్జన్యపూరితములగు విద్రోహ చర్యలు లెక్కకు మీరెను. బ్రిటిష్ సైనికులే కాక, అల్ప సంఖ్యాకులగు తుర్కులును, మితవాదులగు గ్రీకులు సైతము ఈ దౌర్జన్యములకు గురియైరి. సైప్రస్‌నందలి క్రైస్తవ మతపీఠాధిపతి (ఆర్చిబిషప్) అగు మకారియోస్ - III

ఈ దౌర్జన్యోద్యమమునకు నాయకుడని అనుమానించి, బ్రిటన్ అతనిని దేశ బహిష్కృతుని జేసెను. ఇట్లు సైప్రస్ నందలి గ్రీకుల ఎడ బ్రిటిష్‌ప్రభుత్వము అవలంబించిన వైఖరికి గ్రీస్‌ప్రభుత్వము నిరసన తెలిపెను. కడకు బ్రిటన్, గ్రీస్‌దేశములకు వైమనస్యము ఏర్పడి, అందువలన నాటో [చూ. పు. 531] కూటమియందలి ఐకమత్యమునకును భంగము ఏర్పడునను భయము ఏర్పడెను. ఇంతలో టర్కీ దేశము సైప్రస్‌నందలి తురుష్కుల పక్షము అవలంబించి, సైప్రస్‌ను విభజించి, గ్రీకులకును, తురుష్కులకును వేర్వేరు రాజ్యములను ఏర్పరుపవలెననెను. పరిస్థితులు ఇట్టి క్లిష్ట దశకు రాగా, సైప్రస్ గ్రీక్ దేశభక్తులు మేళనోద్యమమునకు స్వస్తి చెప్పి సైప్రస్‌ను స్వతంత్రరాజ్యముగ రూపొందింపగోరిరి. కడకు 1959, ఫిబ్రవరి 11 న సైప్రస్ భవిష్యత్తును నిర్ణయించు ఒక మసోదాకు బ్రిటన్, గ్రీస్, టర్కీదేశముల ఆమోదమే కాక, గ్రీక్ దేశభక్తుల నాయకుడగు ఆర్చిబిషప్ మకారియోస్ ఆమోదము సైతము లభించెను. 1960, ఆగస్టు 16 నుండి సైప్రస్ కామన్‌వెల్త్ నందు సభ్యత వహించిన స్వతంత్ర రిపబ్లిక్‌గా రూపొందెను.

రాజ్యాంగము : శాసనాధికారము 50 మంది సభ్యులు కల శాసనసభయందు న్యస్తమై ఉన్నది. వీరిలో 35 గురు గ్రీకులు, 15 మంది తురుష్కులు ఆ యా జాతీయుల ప్రతినిధులుగ అయిదేండ్లకు ఒకతూరి ఎన్నుకొనబడెదరు. ఇటులనే అధ్యక్షుడును, ఉపాధ్యక్షుడును ప్రజలచే అయిదేండ్లకు ఒకసారి ఎన్నుకొనబడుదురు. అధ్యక్షుడు గ్రీక్ జాతీయుడుగను, ఉపాధ్యక్షుడు తురుష్కజాతీయుడుగను ఉండవలెను. అధ్యక్ష, ఉపాధ్యక్షులు ఇరువురును సంప్రదించుకొని పదిమంది సభ్యులు కల మంత్రిమండలిని నియమింతురు. ఈ మంత్రులలో ఏడుగురు గ్రీకులుగను, ముగ్గురు తురుష్కులుగను ఉండవలెను. శాసనసభ చేయు తీర్మానముల పైనను, మంత్రిమండలి చేయు కొన్ని పద్ధతుల నిర్ణయముల పైనను అధ్యక్షునకును, ఉపాధ్యక్షునకును వీటో (తిరస్కరణ) అధికారము కలదు. చీ. శే. రా.

**సోక్రటీస్** (క్రీ. పూ. 470 - 399) : గ్రీస్‌నందలి ఏథెన్స్‌నగరమందు పుట్టిన తత్త్వవేత్తలలో ఘనుడు. మొగమోటమియు, భయమును లేని స్వతంత్ర ధీయుతుడు. ఆ కాలమున రాజ్యాధికారము వహించవలసిన వారిని, న్యాయవిచారణము చేయవలసిన వారిని సామాన్య జనుల నుండి ఎన్నికల ద్వారా నియమించుట జరుగుచు ఉండెడిది. ఆ రోజులలో ప్రతి పౌరుడును తన రాజ్యము కోసమే తన సర్వస్వమును సమర్పింపవలయునను ఆశయము గ్రీకులలో వెలసి ఉండెను. అట్టి సంకుచితాశయమునకు అతీతుడై ఇతడు విశాలదృష్టితో ప్రతి పౌరుడును స్వరాజ్య శ్రేయస్సుకే కాక, లోక కళ్యాణమునకు పాటుపడుట మంచిదనుటచే ఇతడు చాలమందికి విరోధి అయ్యెను. ఇతని విరోధులు వాదనలో ఇతనిని గెలువలేక, ఇతడు రాజ్యాధికారమునకును, దేశీయ మతాచారములకును విరుద్ధముగ ప్రచారము చేయుచూ, యువకులను తప్పు దారిలో నడిపించుచు, వారి నడవడిని పాడుచేయుచున్నాడని న్యాయస్థానమున తీవ్రమైన అభియోగమును తెచ్చిపెట్టిరి. ఇతని మీద తెచ్చిన అభియోగమును విచారించుటకు 501 మంది న్యాయాధిపతులు కూర్చుండిరి. 280 మంది 'దోషి' అని చెప్పుటవలన ఇతడు దోషి అయ్యెను. ఆ తర్వాత దండన విధించుటలో ఏథెన్స్ సంప్రదాయమును అనుసరించి విధింపదగు శిక్ష విషయమై వాది ప్రతివాదుల అభిప్రాయములను వినిన తరువాత ఇతనికి మరణదండన విధింపబడినది. మరియొక మాసమునకు ఇతనికి విషమిచ్చి చంపివేయుట జరిగినది. ఈ గడువు కాలములో ప్రతి దినమును ఇతని ఇంటి వద్ద వైజ్ఞానిక గోష్ఠి జరుగుచూ ఉండెను. ఇతని ఎడల ఆదరానురాగములు గలవారు తమకు తోచిన విషయములను గూర్చి అడిగినప్పుడు తగ్గ సమాధానములను ఇతడు ఇచ్చుచుండెను. ఇతడు గ్రంథమేదియు రచించలేదు. ఇతని ప్రసంగములను విన్న ప్లేటోవంటి శిష్యులు వ్రాసిపెట్టు కొన్న తునకలు మాత్రమే సంగ్రహించి వ్రాసినవే సోక్రటీస్ వాక్యములుగ నిలచి ఉన్నవి. [చూ. సం. 7 - పు. 753] గి. వేం. సీ.



సోక్రటీస్

(క్రీ. పూ. 470 - 399)

**సోమాలియా** : ఆఫ్రికా ఖండపు ప్రాచ్య తీరము నందలి ఒక స్వతంత్ర గణరాజ్యము.

ఈ దేశమునకు ఏడెన్ సింధుశాఖ [ఉ]; హిందూ మహాసముద్రము [తూ]; కెన్యా [ద]; ఎతియోపియా, ఫ్రెంచి సోమాలీలాండ్ [ప] సరిహద్దులందు ఉన్నవి. [వి] 6,37,661 చ. కి. మీ.; [జ] 22,50,000. [భా] దేశభాష సోమాలీ, [మ] దేశవాసులలో అధికసంఖ్యాకులు సున్నీముస్లిమ్‌లు. [రా] మొగదిషూ (జ. సం. 87,000).

చరిత్ర: ద్వితీయ ప్రపంచ యుద్ధమునకు పూర్వము బ్రిటిష్ సోమాలీలాండ్, ఇటాలియన్ సోమాలీలాండ్ అను




రెండు వలస రాజ్యములుగ ఉండిన ఈ రాజ్యము 1960 లో స్వతంత్రమై ఏక రాజ్యమైనది. వీనిలో తొలుతటి దాని యందు క్రీ. శ. 7 వ శతాబ్ది ప్రాంతమున యెమెన్‌నుండి వలసవచ్చిన ముస్లిమ్‌జాతులవారు నివాసములను ఏర్పరచుకొనిరి. 13 వ శతాబ్దినాటికి ఇది ఒక బలవత్తర రాజ్యముగ రూపొందెను. కాని, అనతికాలముననే 'గల్లా' అను ఆఫ్రికన్ జాతుల దండయాత్రలకు లోనై, ఆ రాజ్యము విచ్ఛిత్తి నొంది అల్పరాజ్యములుగ చీలిపోయినది. ఈ అల్పరాజ్యములలో జైలా, తంజూరా అనునవి ప్రముఖములు. ఈ రెండు రాజ్యముల ప్రభువుల అనుమతితో బ్రిటిష్ ఈస్ట్‌ఇండియా కంపెనీ [చూ. పు. 658] వారు ఈ దేశతీరమున ఆశ్రయములను ఏర్పరచుకొనిరి (1840). బ్రిటన్, భారతదేశముల మధ్య జరుగు నౌకల ప్రయాణమున ఈ ఆశ్రయములు మజిలీలుగ వ్యవహరించెను. 1874, 75 లలో ఈజిప్టుప్రభుత్వము ఈ ప్రాంతమును ఆక్రమించినను, తమ దేశమునందలి అంతఃకల్లోలములవలన త్వరలోనే వదలివేయక తప్పదయ్యెను (1884). అంతట ఈ ప్రాంతమందలి తెగల నాయకులతో కుదుర్చుకొనిన ఒడంబడికలను అనుసరించి ఈ సీమ అంతయు బ్రిటిష్‌రక్షిత ప్రాంతమయ్యెను (1886). 1889 నుండి ఈ ప్రాంతీయ ప్రజలలో మూఢమతవిశ్వాసములను ఆధారముగ గ్రహించి మహమ్మద్ బిన్ అబ్దుల్లా అను ఒక ముస్లిమ్ మతోన్మాది తిరుగుబాటులను లేవదీసి, బ్రిటిష్‌ప్రభుత్వమునకు ఆందోళనను కలిగించెను. కాని, బ్రిటిష్ సేనలు కడకు 1909 లో ఈ తిరుగుబాటులను నిశ్శేషముగ అడచివేసిరి. ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున ఇటాలియన్ సేనలు ఈ ప్రాంతమును వశపరచుకొని అదివరకే తమ స్వాధీనమున ఉన్న ఇటాలియన్ సోమాలీలాండ్‌నకు దీనిని చేర్చిరి.

ఈ ఇటాలియన్ సోమాలీలాండ్ అనునది ప్రాచీన కాలమున 'ధూపసీమ' అను అర్థమొసగు పేరున ఈజిప్టు వాసులకు పరిచితమైనది. అగరు, సాంబ్రాణి మొదలగునవి ఆనాడు ఇటనుండి ఎగుమతి అగుచుండెడివి. 10 వ శతాబ్దిలో యెమెన్‌నుండి కొందరు అరబ్బీ వర్తకులు ఇట వలసలను ఏర్పరచుకొని తమ మతసంస్కృతులను ఇట వ్యాపింపజేసిరి. 15, 16 శతాబ్దులలో పోర్చుగీస్ వర్తకులును, యోధులును ఈ ప్రాంతముతో పరిచితిని కలిగించుకొని, ఇట తమ ఆధిపత్యమును నెలకొల్ప యత్నించిరి. కాని, కృతార్థులు కాజాలకపోయిరి. తరువాత ఈ దేశము మస్కట్ & ఓమన్ [చూ. పు. 735] సుల్తాన్ వశమై, అతనినుండి అతని వంశీయుడగు జాంజిబార్ సుల్తాన్‌నకు సంక్రమించెను. 1885 లో ఇటలీవారు ఇచట వర్తక వ్యాపారములను చేసికొనుటకు జాంజిబార్ సుల్తాన్‌తో కుదుర్చుకొనిన ఒడంబడిక మూలమున ఇటలీవారికి ప్రప్రథమమున ఇట తావు లభించెను. క్రమముగ 1889 లో ఈ ప్రాంతము ఇటలీవారి రక్షితరాజ్యమయ్యెను. 1892 లో జాంజిబార్ సుల్తాన్ ఈ దేశమందలి తన హక్కులను ఇటలీ ప్రభుత్వమునకు దత్తమొనర్చెను. 1908 నుండి ఇటలీ ప్రభుత్వము ఇట తన ప్రత్యక్ష పరిపాలనను నెలకొల్పెను. ప్రథమ ప్రపంచ యుద్ధమున ఇటలీ చేసిన సహాయమునకు కృతజ్ఞతాసూచకముగ బ్రిటిష్‌వారు తమ అధీనమున ఉన్న సోమాలీలాండ్‌నుండి కొంత ప్రదేశమును ఈ ప్రాంతమునకు కలిపిరి (ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున కడమ బ్రిటిష్ సోమాలీలాండ్‌ను ఇటలీ సేనలు ఆక్రమించిన విషయము పైన తెలుపబడినది).

ద్వితీయ ప్రపంచ యుద్ధాంతమున ఇటలీ పతనమగుటతో బ్రిటిష్, ఇటాలియన్ సోమాలీలాండ్ ప్రాంతములు రెండును బ్రిటిష్‌వారి వశమయ్యెను (1941). 1951 వరకు బ్రిటన్ ఇట తన ఆధిపత్యమును నెరపెను. ఈ కాలముననే సోమాలియా ప్రజలందు జాతీయతా భావము, స్వాతంత్ర్యాసక్తి వ్యాపించెను. తరువాత 1960, డిసెంబరులో ఐక్యరాజ్య సమితి [చూ. పు. 351] చేసిన తీర్మానమును అనుసరించి పూర్వపు ఇటాలియన్ సోమాలీలాండ్ ప్రాంతము ఇటలీ ధర్మకర్తృత్వము క్రిందనే 10 సంవత్సరములు ఉండు

నటులను, 1960 లో దానికి స్వాతంత్ర్యము ఇటలీ ఒసగ వలెననియు ఏర్పాటు జరిగెను. అంతట ఇటలీ ప్రభుత్వము తన పూర్వపు వలసప్రాంతమును వశపరచుకొనినది. తరువాత క్రమరీతిలో ప్రజల ప్రభుత్వమునకు అధికారమును సంక్రమింపజేసి, తుదకు 1960, జూన్ 30 తేదీకి తన అధీన ప్రాంతమునకు స్వతంత్రత ఒసగుటకు ఇటలీ ఏర్పాటులు చేసినది. బ్రిటిష్‌వారును తమ అధీనమున ఉన్న సోమాలీలాండ్‌కు 26 జూన్, 1960 న స్వాతంత్ర్యము ఒసగిరి. అంతట ఈ రెండు ప్రాంతములును కలిసి 1960, జూన్ 30 తేదీ అర్ధరాత్రి సమయమున సోమాలియా అను పేరున ఏక స్వతంత్ర రాజ్యముగ రూపొందినవి.

రాజ్యాంగము : 1961, జూన్ 20 న ఆమోదింపబడిన ఒక రాజ్యాంగమును అనుసరించి ప్రజాస్వామ్య ప్రభుత్వము ఇట పాలన నెరపుచున్నది. శాసన నిర్మాణాధికారము న్యస్తమై ఉన్న నేషనల్ అసెంబ్లీలో 123 గురు సభ్యులు కలరు. వీరిలో 90 మంది ఉత్తర సోమాలియా వాసులును, 33 మంది దక్షిణ సోమాలియావాసులును అయి దేండ్లకు ఒకసారి ఎన్నుకొనబడెదరు. దేశాధ్యక్షుని ఆరేండ్లకు ఒకసారి శాసనసభ ఎన్నుకొనును. అధిక శాసనసభా సభ్యుల ఆదరమును పొందిన అతడు ప్రధానిగా మంత్రివర్గము ఏర్పడి పాలన నిర్వహించును. శాసనసభ ఆమోదించిన చట్టమును అధ్యక్షుడు వీటో చేయవచ్చును. కాని, దానిని మరల శాసనసభ మూడింట రెండు వంతుల బలముతో ఆమోదించినచో, అది అమలులోనికి రాగలదు. చీ. శే. రా.

**సోమాలీ లాండ్, ఫ్రెంచి :** ఫ్రెంచి కమ్యూనిటీకి చెంది ఆఫ్రికా ప్రాచ్యభాగమున నెలకొనిన ఒక రాజ్యము.

ఈ దేశమునకు ఎడెన్ సింధుశాఖ [తూ]; సోమాలియా [ద]; ఎతియోపియా [ప, ఉ] సరిహద్దులందు ఉన్నవి. [వి] 21,999. [జ] 81,000. [మ] అత్యధిక సంఖ్యాకులు ముస్లిమ్‌లు. [భా] ఆఫ్రికన్ భాషలును, అరబ్బీయు వ్యాప్తియందున్నను ఫ్రెంచిభాష వ్యవహార భాషగ అమలులో ఉన్నది. [రా] జిబౌటి (జ. సం. 41,200).

చరిత్ర : అతి ప్రాచీనకాలమునుండియు అరబ్బుల పలుకుబడికిలోనై ఉన్న ఈ ప్రాంతముపై 1856 లో ఫ్రాన్స్ పలుకుబడిని ఆర్జించుట మొదలిడి, క్రమముగ 1883 కు సంపూర్ణాధిపత్యమును ఆర్జించినది. ఫ్రెంచివారి పాలన మూలమున ఇట ఆర్థిక సుస్థిరతయు, ఆధునిక నాగరకతయు నెలవు కల్పించుకొనినది. ఫ్రెంచి రాజ్యమునందలి సముద్రోత్తరప్రాంతముగ లెక్కింపబడి ఇట పరిపాలన చాలా కాలము సాగినది. కాని, ప్రజలలో ఒక వర్గమున బయలుదేరిన సాతంత్ర్యకాంక్షను గుర్తించి ఫ్రెంచి ప్రభుత్వము జనాభిప్రాయసేకరణను 1967, మార్చిలో జరుపగ, ఫ్రాన్స్‌తో ముడివడి ఉండియే స్వతంత్రతను అనుభవించుటకు అధిక సంఖ్యాకులు తమ ఆమోదమును తెలిపిరి.

* * *

**సోవియట్ రష్యా :** చూ. సోవియట్ సోషలిస్ట్ గణరాజ్య సమితి.

**సోవియట్ సోషలిస్ట్ గణరాజ్యసమితి :** ఆసియా, యూరప్ ఖండముల రెండింట విశాల ప్రాంతములను ఆవరించిన ప్రముఖ స్వతంత్ర రాజ్యము. దీనినే సంగ్రహముగ సోవియట్ యూనియన్, సోవియట్ రాజ్యము, సోవియట్ దేశము, సోవియట్ సోషలిస్ట్ గణ రాజ్యము అనియు వ్యవహరింతురు. ఈ గణరాజ్యసమితిలో ఒక భాగమగు రష్యాకు గల చారిత్రక ప్రాముఖ్యమును బట్టి రాజ్యమును అంతటిని రష్యాయని కూడా కొందరు పేర్కొనెదరు.

ఈ దేశమునకు ఆర్కటిక్ (ఉత్తరధ్రువ) మహాసముద్ర భాగములుగ పరిగణింపదగు 'బేరెంట్స్, వైట్, కారా, లాప్టేవ్, తూర్పు సైబీరియన్ సముద్రములు [ఉ]; బేరింగ్ జలసంధి, ఒకటస్క్, జపాన్ సముద్రములు [తూ]; బాల్టిక్ సముద్రము [ప] నల్లసముద్రము, అజోవ్ సముద్రము [ద] నెలకొని ఉన్నవి. ఇక సరిహద్దు రాజ్యములుగ నార్వే, ఫిన్లాండ్, పోలండ్, జెకోస్లోవాకియా, హంగేరి, రుమేనియా [ప]; టర్కీ, ఇరాన్, ఆఫ్ఘనిస్తాన్, చీనా ప్రజాగణరాజ్యము, ఔటర్ మంగోలియా, ఉత్తర కొరియా [ద] సరిహద్దులుగ కలవు. [వి] దాదాపు 2,21,39,081 చ. కి. మీ.; [జ] 22,65,50,000. భూతలమున దాదాపు ఆరవ వంతు వైశాల్యమును ఆక్రమించిన ఈ రాజ్యము విస్తృతిరీత్యా ప్రపంచ రాజ్యములందెల్ల మొదటిదిగ లెక్కకు వచ్చుచున్నది. ఈ గణరాజ్య సమితియందు అంతర్భాగములగు 15 గణరాజ్యముల పేరులు, వాని ముఖ్య రాజధానులు, విస్తీర్ణములు, జనసంఖ్యలు ప్రక్కపుట - 888 - లో పట్టిక రూపమున ఈయబడినవి. దేశమునందలి వివిధ జాతీయులలో రష్యన్ జాతివారలు అత్యధిక సంఖ్యాకులు (54.8%), తరువాత ఉక్రేనియన్‌లు (17.7%), తుర్కీ జాతివారు (10.8%), బైలో రష్యన్‌లు (3.7%), ఫిన్నో - ఉగ్రియన్‌లు (2%) క్రమముగ లెక్కకు రాగలరు. [భా] దేశమున అత్యధిక సంఖ్యాకుల మాతృభాషలుగ రష్యన్, ఉక్రేనియన్, బైలోరష్యన్ భాషలు క్రమముగ ప్రాముఖ్యమునందు ఉన్నవి. ఇవి మూడును ఆర్య భాషా కుటుంబమునకు చెందినవి. ఇవికాక, వేర్వేరు అల్ప సంఖ్యాక భాషావర్గముల మాతృభాషలుగ ఆ యా గణ రాజ్యములందు ఆర్యభాషాకుటుంబమునకు చెందిన లిథూనియన్, లాట్వియన్, ఇరానియన్ (తాజిక్, ఒసీషియన్, కుర్దిష్, తాలిష్, బెలూచి, యగ్నోబి, పామీర్), రొమాన్స్ (మాల్దేవియన్) భాషలును ఆర్యభాషాకుటుంబమునకే చెంది, ఒక ప్రత్యేక శాఖగ ఎన్నికపొందిన ఆర్మీనియన్ భాషయు,

# సోవియట్ రష్యా రాష్ట్ర విస్తీర్ణాదుల వివరములు

| వరుస సంఖ్య | గణరాజ్యము | రాజధాని | విస్తీర్ణము చ. కి. మీ. | జనాభా (1964) |
|---|---|---|---|---|
| 1. | అజర్ బైజాన్ | బాకూ | 86,600 | 43,81,000 |
| 2. | ఆర్మీనియా | ఎవరిన్ | 30,000 | 20,72,000 |
| 3. | ఉక్రెయిన్ (యుక్రెయిన్) | కీవ్ | 6,00,999 | 4,46,36,000 |
| 4. | ఉజ్బెక్ స్తాన్ | టాష్ఖండ్ | 4,09,398 | 97,14,000 |
| 5. | ఎస్తోనియా | తాలిన్ (రేవల్) | 45,127 | 12,59,000 |
| 6. | కజకస్తాన్ | అల్మాఅటా | 27,55,998 | 1,15,68,000 |
| 7. | కిర్ గిజ్ | ఫ్రూంజ్ | 1,98,502 | 24,88,000 |
| 8. | జార్జియా | టిఫ్లిస్ | 70,000 | 44,10,000 |
| 9. | టర్క్మన్ స్తాన్ | అష్ఖాబాద్ | 4,88,000 | 18,03,000 |
| 10. | తాజిక్ స్తాన్ | దుషాంబే | 13,990 | 23,41,000 |
| 11. | బైలోరష్యా | మిన్స్క్ | 2,07,598 | 84,54,000 |
| 12. | మొల్దావియా | కిషినెవ్ | 23,701 | 32.45,000 |
| 13. | లాట్వియా | రీగా | 64,498 | 22,10,000 |
| 14. | లిథూనియా | విల్నియస్ (విల్నా) | 67,788 | 28,95,000 |
| 15. | రష్యా | మాస్కో | 1,70.76,882 | 12,47,77,000 |
| | | | 2,21,39,081 | 22,65,50,000 |

ఫిన్నో - ఉగ్రిక్ భాషా వర్గమునకుచెందిన ఎస్తోనియన్, మోర్ద్వినియన్, ఉద్ముర్త్, మారీ, కోమీ, ఫిన్నిష్, కరీలియన్, లాప్, ఇజోరా, వోడ్, లివోనియన్, కాంటీ, మన్సీ భాషలును, తుర్కిక్ భాషా వర్గపు చువాష్, అజర్ బైజానీ, తుర్క్మీన్, కజల్, తార్తార్, బష్కిర్, ఉజ్బెక్, ఉయ్ గుర్, యాకూత్, కిర్గిజ్ భాషలును, మంగోల్ వర్గపు కాల్మిక్, బుర్యాత్ భాషలును, కకేషియన్ వర్గపు జార్జియన్, మిగ్రేలియన్, చాన్ భాషలును ప్రచారమున కలవు. కాని, ఈ వివిధ భాషావర్గముల వారిలో రష్యనేతరులు సైతము - అధికసంఖ్యాకులు మాట్లాడు - రష్యన్ భాషను ద్వితీయభాషగ అభ్యసించుచున్నారు. రష్యన్ భాష సిరిలిక్ లిపి అనబడు ప్రత్యేకలిపిలో వ్రాయబడుచున్నది. తక్కిన వివిధ భాషావర్గములలో పలువర్గములు ఈ సిరిలిక్ లిపినే ఇపుడు తమ భాషలకు వాడుకొనుచున్నారు. అయినను ఆర్మీనియన్‌లు, జార్జియన్‌లు మాత్రము తమ తమ భాషలకు ప్రాచీనకాలము నుండియు వాడుకలో ఉన్న లిపులనే ఉపయోగించుచున్నారు. లిథూనియన్, లాట్వియన్, ఎస్తోనియన్, కెరీలియన్ భాషా వర్గములవారు లాటిన్ లిపిని తమ భాషలకు వాడుచున్నారు.

[మ] దేశమున మత ప్రసక్తి లేని కమ్యూనిస్ట్ ప్రభుత్వము అమలునందు ఉండుటవలన మతస్వేచ్ఛ పౌరులకు కలదు. విద్య, రాజకీయాభిప్రాయములు మొదలగు వానియందు మాత్రము మతపుజోక్యమును ప్రభుత్వము సైరించదు. రాజ్యాంగమును అనుసరించి మత వ్యతిరేకప్రచార స్వాతంత్ర్యము పౌరులకు ఒసగబడినది. తత్ఫలితముగ దేశమునందలి పౌరులలో పలువురు నాస్తికతను అవలంబించిరి. 1917 న దేశములో జరిగిన విప్లవము మొదలుగ పలు ప్రార్థనాలయములు మూసివేయబడుటయో లేదా వస్తుప్రదర్శన శాలలుగను, విశ్రాంతి కేంద్రములుగను మార్పు పొందుటయో జరిగినది. మత విశ్వాసము కలవారిలో క్రైస్తవులు అత్యధిక సంఖ్యాకులు; తరువాత లెక్కకు వచ్చువారు ముస్లిమ్‌లు. వీరు దాదాపు రెండుకోట్లు ఉందురు. మంగోల్ భాషలను మాట్లాడువారిలో అత్యధిక సంఖ్యాకులు లామాసంప్రదాయపు బౌద్ధులు. వీరి సంఖ్య దాదాపు 5 లక్షలు. యూదులు దాదాపు 23 లక్షలు ఉందురు. [రా] మాస్కో (జ. సం. 62,96,000).

చరిత్ర : ఈ దేశపు అంతర్భాగములుగ నేడు పరిగణింపబడుచున్న మధ్య ఆసియా ప్రాంతములును, అజర్ బైజాన్, ఆర్మీనియాలును అతి ప్రాచీన చరిత్ర గలవియే యైనను, ఆ రాజ్యములందలి ప్రాచీన నాగకరతలను ఆ యా కాలములందు అంతరింపజేసి, గతముతో ఏ సంబంధమును ఇడుకొనని నూతనరాజ్యములు అంతటంతట పొడమినవి. కడకు ఇవి అన్నియు రష్యా చక్రవర్తి సామ్రాజ్యమున చేరిపోవుటతో తమ ప్రత్యేక చారిత్రక ప్రాముఖ్యమును కోల్పోయినవి. అందువలన రష్యా రాజ్య వికసన చరిత్రయే ఈ దేశపు చరిత్రగ పరిగణింపదగి ఉన్నది.

యూరప్ ఖండమునకు చెందిన రష్యాదేశభాగమున వసించుచుండిన వివిధ స్లావ్ తెగల ప్రజానీకము రూరిక్ నాయకత్వమున 860 ప్రాంతమున ఏక జాతిగ వ్యవస్థీకృతము అగుటతో రష్యన్ జాతి చరిత్ర ఆరంభమయ్యెనని భావింపదగును. నోవోగొరోడ్ నగరమును రాజధానిగ ఈ రాజ్యమునకు ఏర్పరచి, ఈ రూరిక్ సేనాని ఒక రాజవంశమునకు మూలపురుషుడు అయ్యెను. 10 వ శతాబ్దమున రాజధాని కీవ్ నగరమునకు మారెను. ఈ కీవ్ నగరమును రాజధానిగ పాలించిన పాలకులు బైజాంటియమ్ సామ్రాజ్యముతో వర్తక సంబంధములను ఏర్పరచుకొనుటయే కాక, బల్గరులు, ఖజారులు వసించు ప్రాంతములను వశపరచుకొని రాజ్యమును విస్తృత మొనర్చిరి. ఈ రాజుల ఆదరణమూలముననే క్రైస్తవ మతమందలి ప్రాచ్య సనాతన శాఖ ఈ దేశమున వ్యాపింప గలిగెను. విద్యాభివృద్ధికై ఈ కీవ్ రాజులు నిరంతరము కృషి సల్పిరి. దేశమునకు అంతటికి వర్తింపదగు శాసనములు అన్నియు ఈ ప్రభువుల కాలముననే క్రోడీకరింపబడినవి.

కాని, 11 వ శతాబ్ది ఉత్తరార్ధమునుండియు కొన్ని సంచార యోధ జాతుల దాడుల మూలమున కీవ్ రాజ్యము ప్రతిష్ఠను కోల్పోయి, బలహీనమై చివరకు 1240 లో మంగోల్‌ల సేనావాహినుల దండయాత్రలకు లోనై అంతరించెను. అంతట దేశము అరాజకము పాలయ్యెను. ఈ అరాజకయుగమున దేశము వివిధ అల్పరాజ్యములుగ విభక్తమయ్యెను. వానిలో నోవోగొరోడ్, గెలిషియా, మాస్కో రాజ్యములు ప్రముఖములుగ పేరుగాంచెను. కాని, ఇవియును మంగోల్ ప్రభువుల సర్వాధిపత్యమును అంగీకరించుచునే ఆనాడు మనగలిగెను. వీనిలో మాస్కో రాజ్య ప్రభువులు మంగోల్ ప్రభువుల అనుగ్రహమునకు ఎక్కువగ పాత్రులు కాగలిగిరి. అందువలన కొలదికాలముననే వారు తమ రాజ్యపు సరిహద్దులను విస్తృతీకరించి, దాదాపు రష్యాయందలి ముఖ్య భాగములనెల్ల లోగొనిరి. కడకు ఈ మాస్కో రాజులలో ఒకడగు డెమిట్రియస్ అనువాడు మంగోల్ సేనలను ఓడించి (1380), స్వతంత్రత ను ప్రకటించి, దేశీయుల మన్ననలను ఆర్జించెను. కాని, ఈ పరాభవమునకు కుపితుడైన మంగోల్ ప్రభువు రెండేడ్ల తరువాత మాస్కోపైకి బహుళ సైన్యమును పంపి, ఆ నగరమును కొల్లగొట్టించి, తగులబెట్టించెను. తరువాత మరియొక నూరు సంవత్సరములు మంగోల్ ప్రభువులకు దేశము లోబడి ఉండెను.

ఈ దాస్యయుగమున సైతము మాస్కో మరల వికసనమొంది, రష్యాయందెల్ల కీలకప్రాంతముగ రాణించెను. 15 వ శతాబ్దమున మాస్కో రాజ్యమును పాలించిన ఇవాన్ - III మంగోల్‌ల సర్వాధిపత్యమును అంగీకరించుచు, రష్యాయందలి వివిధ ప్రాంతములను ఏకీకృతమొనర్చి, రష్యాకెల్ల రాజుగ పరిగణననందెను. 1480 లో ఇతడు మంగోల్‌లకు కప్పము కట్టుటకు నిరాకరించి, స్వతంత్రతను ప్రకటించెను. ఈ రాజు బైజాంటియమ్ ప్రభువు వంశమునకు చెందిన సోఫియాను పెండ్లాడెను. అప్పటికి బైజాంటియమ్ సామ్రాజ్యము నామావశిష్టము అగుటచే, తానే సామ్రాజ్యమునకు వారసుడనియు, రష్యా సామ్రాజ్యము బైజాంటియమ్ సామ్రాజ్య సంప్రదాయములను అందిపుచ్చుకొని క్రైస్తవ రాజ్యముగ మనగలుగుననియు ఇవాన్ - III ప్రకటించెను. ఇందులకు క్రైస్తవ మతపీఠము తన అంగీకారమును తెలిపెను. అంతటినుండి ఈ ఇవాన్ - III వంశీయుల కాలమున రష్యారాజ్యము క్రమక్రమముగ విస్తరించెను. 16 వ శతాబ్దిలో దేశమును పాలించిన ఇవాన్ - IV కాలమున ఈ రాజ్యమునకు తార్తార్ మండలములు అనేకములు చేర్చబడినవి. యుద్ధము లందునిరంతర విజయమును పొందిన ఇతనికి 'భయంకరుడు' అను బిరుదు కలిగెను. ఈతని కాలమునుండియే రష్యారాజులు 'జార్' అను బిరుదమును వంశపారంపర్యముగ వహించుట పరిపాటి అయ్యెను.

ఈ జార్‌ల ఆదరణమున 1600 నుండియు జమీందార్‌లు ప్రాముఖ్యమును ఆర్జించిరి. ఈ జమీందారీ విధానమువలన కర్షకులు దాదాపు బానిసలుగ తమ జీవితమును గడపవలసివచ్చెను. ఇది ఇటులుండ రాజవంశీయులలో రాజ్యాధిపత్యమునకై (1604 - 13) చెలరేగిన అంతర్యుద్ధముల మూలమున దేశము బలహీనమైనది. ఆ అవకాశమును ఉపయోగించుకొని ప్రక్కనున్న స్వీడెన్, పోలండ్ దేశములు రష్యాయందలి విస్తృతభూభాగములను హరించినవి. ఆ కాలముననే కొసక్ సాహసిక యోధుల మూకలు కూడ ఈ దేశమును దోచినవి. కాని, వీని అన్నిటిని అధిగమించి 17 వ శతాబ్ది నాటికి రష్యారాజ్యము నిలువ గలిగినది. దేశమున ధనికస్వాముల యాజమాన్యమున వివిధ పరిశ్రమలు ఆ నాటికి పరిణతినందినవి. కాని, ఈ ఐశ్వర్యమంతయు ఏ కొలదిమంది చేతులలోనో నిలచిపోవుటచే, కష్టజీవులగు రైతులును, పనివారలును అసంతృప్తికి లోనైరి. మాస్కో మొదలగు పెక్కు ప్రాంతములందు పేదప్రజలు తిరుగుబాటులు సాగించిరి. కడకు 1670 - 71 లో రైతు ప్రజలు ఆయుధములతో ప్రభుత్వమును ఎదుర్కొని పోరాడిరి; కాని, వారి ప్రయత్నము విఫలమయ్యెను.

రష్యా రాజ్యసింహాసనమును 1689లో అధిష్ఠించిన పీటర్ మహనీయుని పరిపాలనా కాలమున ఈ దేశమున ఆధునిక పాశ్చాత్య సంస్కృతి ప్రవేశపెట్టబడెను. నూతన శాస్త్రీయ పారిశ్రామిక విధానములను అనుసరించి పరిశ్రమలు రూపొందింపబడినవి. విదేశవ్యాపారము విస్తరించెను; విద్యారంగమున పలు సంస్కరణలు ప్రవేశపెట్టబడెను. ఈ ప్రభువు సామంతమాండలికుల దౌష్ట్యములను అడచి, దేశమునకు కేంద్రీకృతమగు సుస్థిర ప్రభుత్వ విధానమును ఒసగెను. పెట్రోగ్రాడ్ నగరమును ఇతడు నిర్మింపజేసి, దానిని రష్యాసామ్రాజ్యమునకు రాజధానిగ ఒనర్చెను.

తరువాత రష్యాను పాలించిన వారిలో కేథరిన్ - II సామ్రాజ్ఞి (1762 - 96 ప.) కాలమున రష్యన్ సైన్యములు టర్కీని ఓడించి, క్రిమియాను వశపరచుకొనినవి. పోలండ్ నుండియు విస్తృత భూభాగమును రష్యా ఆనాడు హరింప గలిగి, యూరప్‌నందలి ప్రముఖ రాజ్యములలో ఒకటిగ పరిగణన కెక్కెను. కేథరిన్ రాణి పరిపాలనా కాలమున దేశసంపద చాలగ వృద్ధి అయినను కర్షకులు మాత్రము యథాపూర్వముగ బానిసజీవితమునే గడపుచు, దుస్థితిని భరింపలేక దేశవ్యాప్తముగ 1773 - 75 లో తిరుగుబాటు సాగించిరి. కాని, సేనల సాయమున ప్రభుత్వము ఆ తిరుగుబాటును నిశ్శేషముగ అడచివేసెను.

అలెగ్జాండర్ - I (1801 - 25 ప.) విజయయాత్రల వలన ఫిన్లాండ్, పోలండ్, బెస్సరేబియా, కాకసస్ పర్వతములు రష్యన్ సామ్రాజ్యమున అంతర్భాగములు అయ్యెను. ఈతని కాలముననే నెపోలియన్ సేనలు (1812) మాస్కో నగరమువరకువచ్చి, కడకు రష్యన్‌లచే పరాజితములై విపరీతముగ నష్టపడి తిరోగమించినవి.

అలెగ్జాండర్ - I తరువాత రాజ్యాధికారమును చేపట్టిన నికలస్-I కాలమున ప్రజలలో అసంతృప్తి ఎక్కువయ్యెను. ఆ కాలమున విప్లవభావములు గల పలువురు రచయితల రచనలు ప్రజల అసంతృప్తిని రెచ్చగొట్టినను, అన్నిటిని అధిగమించి నికలస్ రాజు రష్యాప్రభుత్వమునకు స్థైర్యమును చేకూర్చగలిగెను. అయినను 1853 - 56 వరకు జరిగిన క్రిమియాయుద్ధమున ఇతని సేనలు ఓడింపబడెను. అలెగ్జాండర్ - II (1855 - 81 ప.) భూస్వామ్య సంస్కరణలు ప్రవేశపెట్టిన ఫలితముగ రైతులకు విముక్తి కలిగినది. ఆ కాలముననే న్యాయశాఖయందును, స్థానిక పరిపాలనా రంగముననుతగు సంస్కరణలు ప్రవేశపెట్టబడినవి. 18 వ శతాబ్ది అంతమునకు దేశము పారిశ్రామికముగ చాలపురోగమింపగలిగిన ఫలితముగ రూపొందిన శ్రామికవర్గము మాత్రము అధోగతిలో అల్లాడుచు ఉండవలసి వచ్చెను.

కజకస్తాన్, మధ్య ఆసియాలను 1860 - 80 మధ్య కాలమున రష్యా కైవసమొనర్చుకొనెను. 1858 - 60 లో చీనా, రష్యాల మధ్య సరిహద్దు ఒడంబడిక జరిగి, తత్ఫలితముగ ఉభయ దేశములకును ఆమూర్ నదీ ప్రవాహము సరిహద్దుగ ఉండునటుల నిర్ణయము జరిగెను. 19 వ శతాబ్ది ఉత్తరార్ధమున సైబీరియా, దూరప్రాచ్యభూములను జనావాసితములుగ చేయుటకు రష్యా ప్రభుత్వము తీవ్రముగ కృషి చేసినది. ఉత్తర అమెరికాలో వాయవ్యమున ఉన్న అలాస్కాయందు కొన్ని జనావాసములను రష్యా 18 వ శతాబ్దముననే నెలకొల్పెను. కాని, ఈ ప్రాంతమును 1867 లో యునైటెడ్‌స్టేట్స్‌కు రష్యాప్రభుత్వము విక్రయించినది.

యూరప్‌లోను, ఆసియాలోను విశాల భూభాగములను 20 వ శతాబ్ది ఆరంభమునకు రష్యాసామ్రాజ్యము ఆక్రమింపగలిగెను. దేశమందలి ఆర్థిక, రాజకీయ విధానముల మూలమున ఆ ప్రభుత్వము ప్రజల విశ్వాసమును మాత్రము కోల్పోయెను; రైతులలో అసంతృప్తి, కార్మికుల సమ్మెలు ఎక్కువ అయ్యెను. ఇందులకుతోడుగ 1904-05లో సాగిన ఒక యుద్ధమున జపాన్ రష్యాను ఘోర పరాజయమును పాలుచేయగా ప్రభుత్వపు ప్రతిష్ఠ సన్నగిల్లి, 1905 లో శ్రామికవర్గము ప్రభుత్వముపై తిరుగుబాటు జరుపగ ప్రభుత్వము కొంతవరకు లొంగి, ప్రజలకు ప్రాతినిధ్యము గల శాసనసభ (డూమా) ను నెలకొల్పెను.

ఆంగ్లో - ఫ్రెంచి మైత్రీబంధమున రష్యాప్రభుత్వము కూడ 1907 లో చేరెను. తత్ఫలితముగ ఈ దేశము ఫ్రాన్స్, బ్రిటన్‌ల పక్షమున ప్రథమ ప్రపంచయుద్ధమున పోరాడెను. కాని, జర్మనీ సేనల ధాటికి ఆగలేక రష్యా సేనలు అనేక రంగములందు పరాజితములు అగుటవలన రష్యా సేనలు బలహీనమై, తుదకు 1917, మార్చిలో అంతరించినది. అంతట తాత్కాలికముగ మితవాద ప్రభుత్వము అధికారమును గ్రహించి, యుద్ధమును నడపుటకు పూనుకొనెను. కాని, ప్రజలు మాత్రము బోల్షివిక్ పార్టీ నాయకుడగు లెనిన్ ఉపదేశములచే ఆకర్షితులై యుద్ధము ఎడల విముఖత వహించిరి. అంతట పెట్రోగ్రాడ్ (ఇప్పటి లెనిన్‌గ్రాడ్), మాస్కో నగరములందలి శ్రామికుల తిరుగుబాటులతో ప్రజోద్యమము చెలరేగి, తాత్కాలిక ప్రభుత్వమును కూలద్రోయగ (1917), బోల్షివిక్ పక్షము లెనిన్ నాయకత్వమున ప్రభుత్వమును చేపట్టెను. కారల్ మార్క్స్‌చే ప్రచురింపబడిన కమ్యూనిస్ట్ సిద్ధాంతములకు అనుగుణమగు సమాజవ్యవస్థను రూపొందించుట తమ ధ్యేయముగ ఈ పక్షమువారు ఇడుకొని, అందులకు అనువగు విధానములను అనుసరించిరి. భూస్వామిక వర్గములకు,

పెట్టుబడిదారులకు గల హక్కులన్నియు రద్దొనర్పబడెను. పరిశ్రమలును, బ్యాంకులును, భూమియును జాతీయములు ఒనర్పబడినవి. అంతియే కాక, ప్రపంచయుద్ధమునుండి విరమించుటకు ఈ ప్రభుత్వము నిర్ణయించుకొని అందులకై జర్మనీతో బ్రెస్ట్‌లిటోవస్క్ [చూ. పు. 661] వద్ద ఒక ప్రత్యేకపు ఒడంబడికను కుదుర్చుకొనెను (1918, మార్చి). తరువాత బోల్షివిక్ ప్రభుత్వము దేశమున అంతఃకల్లోలములను ఎదుర్కొనవలసి వచ్చెను. ప్రభుత్వపు ఆర్థిక విధానముల వలన నష్టపడగల భూస్వాములును, ధనికులును ప్రభుత్వమును ఆయుధ సహాయమున పడగొట్టుటకు తీవ్ర యత్నమొనర్చిరి. ఇందులకు తోడుగ బ్రిటిష్, ఫ్రెంచి, అమెరికన్, జపాన్, జెకోస్లోవాక్ సేనాదళములు దేశమున పలుతావులందు దిగి, ప్రభుత్వ వ్యతిరేకులకు సాయమొనర్చినవి. కాని, బోల్షివిక్ ప్రభుత్వము కడకు ఈ దండయాత్రలను అన్నిటిని అడచినది (1920). దాని ఫలితముగ దేశము ఆర్థికముగ కడు హీనస్థితికి లోనయ్యెను. యుద్ధకాలమున ఉత్పత్తి సాధనములును, ఉత్పత్తులును ప్రభుత్వ వశమున ఉండెను. కాని, యుద్ధకాలమున ఇబ్బందులను భరించుటకు ఆమోదించిన దేశ ప్రజలు యుద్ధానంతరమున విముక్తిని గాఢముగ వాంఛించిరి. అందువలన ప్రజల సహకారముతో లెనిన్ నూతన ఆర్థికవిధానమును ప్రవేశపెట్టెను. ఇందువలన కొన్ని ఉత్పత్తి రంగములందును, దేశీయ వ్యాపారరంగమునను కొంతవరకు వ్యక్తులకు స్వాతంత్ర్యమొసగబడినది. అయినను, దేశపు ఆర్థిక జీవితముపై సోవియట్ ప్రభుత్వము ఉంచుకొనదలచిన సర్వాధిపత్యమునకు ఎట్టి భంగమును కలుగని రీతిగ ఈ స్వాతంత్ర్యము అమలులోనికి కొనిరాబడినది. 1922లో ఈ రాజ్యము సోవియట్ సోషలిస్ట్ గణరాజ్యసమితిగ వ్యవస్థీకృతమై దేశపు ఆర్థికవ్యవస్థ 1925 నాటికి కొంత కుదుటపడినది.

లెనిన్ 1924 లో మరణించగా అతని సహచరులగు ట్రాట్‌స్కీ, స్టాలిన్ అధికారమునకై పెనుగులాడిరి. తుదకు స్టాలిన్ అధికారమును కైవసము కావించుకొని ట్రాట్‌స్కీని దేశబహిష్కృతుని చేసెను. స్టాలిన్ నాయకత్వమున ఈ రాజ్యము పంచవర్ష ప్రణాళికాపద్ధతిన సామ్యవాద ప్రాతిపదికత్వము, నిర్మాణాత్మకము, కేంద్రీకృతము, యోజనాత్మకము అగు ఆర్థిక పునర్నిర్మాణమునకు పూనుకొనినది. తత్ఫలితముగ దేశము పారిశ్రామికముగ పురోగమింప గలిగినది. పరిశ్రమల నెలకొల్పుటలో మౌలికపరిశ్రమలకు ఎక్కువ ప్రాధాన్యము ఒసగబడుట వలన, యంత్రముల ఉత్పత్తిలో దేశము స్వయంపోషకతను ఆర్జించినది. వ్యవసాయ ఉత్పత్తిలో శ్రామికులకు న్యాయము కలుగజేయు తలంపున సమష్టికమతములు నెలకొల్పబడినవి. ఆ ఉద్యమమును ప్రతిఘటించిన ధనిక భూస్వాములును, వారి సహచరులును నిర్దాక్షిణ్యముగ నిర్మూలితులైరి. ప్రజల రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక జీవితములపై ప్రభుత్వము నిరవధికమగు నియమనాధికారము వహించెను. తత్ఫలితముగ సాంస్కృతికముగ దేశము పురోగమింపగలిగెను. నిరక్షరాస్యత శూన్యమయ్యెను. కాని, ప్రభుత్వాధికారమును వహించిన కమ్యూనిస్ట్ పక్షపు వ్యతిరేకులని అనుమానింపబడినవారు మాత్రము వేలకొలదిగ ఈ మధ్యకాలమున జైళ్లయందు మ్రగ్గిరి. వందల కొలదిగ మరణశిక్షపాలైరి.

సోవియట్ రష్యా రాజ్యమునకును, తక్కిన ప్రపంచ రాజ్యములకును మధ్య గల సంబంధములు 1925 మొదలుగ చక్కనయ్యెను. తత్ఫలితముగ వివిధ దేశములతో ఈ రాజ్యము దౌత్య సంబంధములను ఏర్పరచుకొనుటయే కాక 1934 లో నానాజాతిసమితియందు సభ్యత్వము పొందెను. తరువాత అక్షరాజ్యములకును, ఆంగ్లో - ఫ్రెంచి నాయకత్వమున నడచు యూరపియన్ రాజ్యములకును మధ్య వైమనస్యములు పెరిగి, ప్రపంచము మహాయుద్ధమును ఎదుర్కొననున్న సమయమున, 1939 లో ఈ దేశము జర్మనీతో నిరాక్రమణసంధిని కుదుర్చుకొని, ఎస్తోనియా, లాట్వియా, లిథూనియా, ఫిన్లాండ్‌నందలి కొంత ప్రదేశమును, ఉత్తర బుకోవినా, బెస్సరేబియా రాజ్యములను కాలక్రమమున వశపరచుకొనెను.

ఇంతలో నిరాక్రమణసంధిని కాలదన్ని, జర్మనీ 1941, జూన్ 22 వ తేదీన సోవియట్ రష్యా రాజ్యముపైకి దండెత్తి, ద్వితీయ ప్రపంచయుద్ధములోనికి ఈ రాజ్యమును దిగునటుల చేసెను. తొలుత జర్మనీసేనలు అప్రతిహత వేగముతో యూరప్ ఖండమునకు చెందిన సోవియట్ రష్యా రాజ్యభాగమును ఆక్రమింప గలిగెను. కాని, స్టాలిన్ నాయకత్వమున సోవియట్ ప్రజలు సుసంఘటితులై, జర్మనీ పురోగతిని క్రమముగ అడ్డగింప గలుగుటయే కాక, 1942 - 43 లో జరిగిన స్టాలిన్‌గ్రాడ్ యుద్ధమున జర్మనీ సేనలను ఓడించిరి. తదాదిగ సోవియట్ సేనలు జర్మనీ సేనలను వెనుకకు తరుముచు, తమ దేశమును శత్రు విముక్తము చేయుటయే కాక, 1945 నాటికి తక్కిన తూర్పు యూరప్‌నందును జర్మనీ అధికారమును అంతమొందించినవి. 1945, మే నెల 2 వ తేదీన సోవియట్ సేనలు జర్మనీ రాజధానియగు బెర్లిన్ నగరమున ప్రవేశింపగలిగినవి. చివరకు 1945, మే 8 వ తేదీన మిత్రమండలిసేనలకు జర్మనీ నిర్నిబంధముగ లొంగినది.

ఇటుల యుద్ధమున సోవియట్ రష్యా విజయమును ఆర్జించినను, మూడేండ్ల ఘోరయుద్ధపు ఫలితముగ దేశపు ఆర్థిక వ్యవస్థ విపరీత నష్టములకు లోనయ్యెను. మహానగరములు నేలమట్టమై, పరిశ్రమలు నామావశిష్టములు అయ్యెను. ఇందులకు తోడుగ యుద్ధ విరమణానంతరమున మిత్రమండలి యందలి తక్కిన యూరపియన్ రాజ్యములకును, సోవియట్ రష్యా రాజ్యమునకును మధ్య వైమనస్యములు పొడమి, యుద్ధకాలపు మైత్రి అంతరించెను. మిత్రమండలి సేనల ఆక్రమణలలో ఉన్న జర్మనీ, ఆస్ట్రియా, కొరియా దేశముల భవిష్యత్తును గురించి ఏర్పడిన అభిప్రాయములే ఈ వైమనస్యములకు త్రోవతీసినవి. దీని ఫలితముగ పాశ్చాత్య రాజ్యములకు, సోవియట్ రష్యాకు మధ్య ప్రచ్ఛన్న యుద్ధము ఆరంభమై, ప్రపంచ రాజకీయములను కలుషితమొనర్చెను. ఈ పరిస్థితులలో అన్యదేశ సహాయము అపేక్షింపక, అతి వేగముగ స్వయంకృషిపై దేశమును ఆర్థికముగ పునర్నిర్మించుటకై స్టాలిన్ నాయకత్వమున సోవియట్ రష్యా ప్రభుత్వము తీవ్రకృషి చేసెను. ప్రభుత్వము నిరంకుశ విధానము అవలంబించిన ఫలితముగ, అటనట కొంత ప్రతిఘటన సహజముగ ఆ నాడు కలిగినది. ఈ ప్రతిఘటనను అడచు యత్నములో, దేశమును అంతటిని ఒక పోలీస్ రాజ్యముగ స్టాలిన్ మార్చివేసెను. దేశాంతరంగిక శాంతి భద్రతలపై ఆధిపత్యము వహించిన బెరియా పెత్తనము ఫలితముగ వ్యతిరేక రాజకీయ సాంఘికాభిప్రాయములు గల వారని అనుమానింపబడినవారు అనేకులు నామమాత్రపు విచారణతో మరణశిక్ష పాలు చేయబడిరి. పలువురు జైళ్ళయందు నిర్బంధింపబడిరి. కడకు స్టాలిన్ మరణించునాటికి (5 మార్చి, 1953) దేశము ఆర్థికముగ పురోగమింపగలిగినను, ప్రజలయందు భావప్రకటనాస్వాతంత్ర్యము సన్నగిలినది.

స్టాలిన్ అనంతరము కమ్యూనిస్ట్ పక్షమునందును, ప్రభుత్వవిధానమునందును ఒక విధమగు సమష్టి నాయకత్వము ప్రవేశపెట్టబడినది. తొలుత మాలెన్‌కోవ్, బెరియా, మాలటోవ్, కగనోవిచ్, బుల్గానిన్ అనువారు ఈ సమష్టి నాయకత్వమున సఖ్యులై ఉండిరి. కాని, అనతికాలముననే బెరియాపై తక్కినవారు దేశద్రోహ నేరమును మోపి పదవీచ్యుతుని చేసిరి (జూన్ 26, 1953). ఆరునెలల తరువాత దేశపు సుప్రీమ్ కోర్టు విచారించి విధించిన శిక్ష ఫలితముగ బెరియా మరణశిక్ష పాలయ్యెను.

బెరియా పదవీచ్యుతి అనంతరము సోవియట్ రష్యా పరిపాలనావ్యవస్థయందు మార్పులు అనేకములు తీవ్రగతితో జరిగెను. సమష్టి నాయకత్వమున కూడ అంతటి నుండి పార్టీ అభిప్రాయమునకు అనువుగ మార్పులు అనేకములు జరిగి కడకు సోవియట్ రష్యా కమ్యూనిస్ట్ పార్టీ కార్యదర్శియగు కృశ్చేవ్ ప్రధానమంత్రి అయ్యెను (1958). పరిపాలనా వ్యవస్థయందు జరిగిన మార్పుల ఫలితముగ దేశమున సోషలిస్ట్ సమాజ వ్యవస్థకు అనువగు రీతిగ శాసన విహిత వర్తనకు స్వతంత్రత చేకూరెను; స్టాలిన్ నాటి నిరంకుశతకు స్వస్తి చెప్పబడెను. స్టాలిన్ ఆచరణలో ఇడిన వ్యక్తి ఘనతావాదమును అంతరింప జేయుటయేకాక, నేటి సోవియట్ రష్యా ప్రభుత్వము స్టాలిన్ సమాధిని లెనిన్ సమాధి ప్రక్కనుండి వేరుచేసి, అజ్ఞాత ప్రదేశమునకు తొలగించి, సోవియట్ రష్యా చరిత్రలో అతనికి ప్రముఖత లేకుండ చేసినది. కాలక్రమమున సోవియట్ కమ్యూనిస్ట్ పార్టీ అధినేతృ సంఘమున కలిగిన మార్పులను అనుసరించి కృశ్చేవ్ స్థానే కోసిగిన్ ప్రధాన మంత్రి అయ్యెను (1964).

ఈనాడు ప్రపంచ రాజకీయ రంగమున అత్యంత ప్రముఖ రాజ్యములుగ పేరొందిన రెండింటిలో ఒకటిగ సోవియట్ రష్యా ప్రజాశ్రేయమునకై కృషిచేయుచున్నది. వేరొక ప్రముఖరాజ్యమగు యునైటెడ్ స్టేట్స్‌తో పోటీ పడుచు ఈ దేశము ఆర్థికముగ పురోగమించుచున్నది. పారిశ్రామిక, వ్యవసాయ ఉత్పత్తులలో యునైటెడ్ స్టేట్స్ ప్రమాణమును ఇప్పటికి ఈ దేశము అందుకొనజాలకున్నను, సైనిక సామర్థ్య విషయమునను, నవీనాయుధ సంపత్తి యందును ఆ రాజ్యముతో దీటుకు రాగలిగినది. రోదసీ పరిశోధన విషయమున యునైటెడ్ స్టేట్స్‌ను ఈ దేశము అధిగమింపగలిగినది. 1957, అక్టోబరు 4 వ తేదీన భూమిని చుట్టివచ్చు 'స్పుత్నిక్' అను కృత్రిమోపగ్రహమును ఆకాశములోనికి పంపి సోవియట్ రష్యా వైజ్ఞానికులు విజ్ఞానశాస్త్రమున మరొక నూతనాధ్యాయమునకు శ్రీకారము చుట్టిరి.

ప్రథమ కమ్యూనిస్ట్ రాజ్యముగ ప్రపంచమందలి కమ్యూనిస్ట్ ఉద్యమములకు నైతిక ప్రోత్సాహము, కమ్యూనిస్ట్ రాజ్యములకు అన్నివిధముల సహాయము, నూతనముగ స్వాతంత్ర్యమును ఆర్జించిన ఆఫ్రో - ఆసియా రాజ్యములకు ఆర్థిక, సాంకేతిక సహాయమును ఒసగుట తన విధిగ సోవియట్ రష్యా రాజ్యము ఇడుకొనినది. కాని, అట్టి సమయముననే ప్రపంచమునందలి కమ్యూనిస్టేతర రాజ్యముల ఎడ సహజీవనవిధానమును అవలంబించి వర్తించుట తన విదేశాంగ నీతియందు ఒక ప్రముఖ విషయముగ సోవియట్ రష్యా పరిగణించుచున్నది. ఈ పరమాణు యుగమున యుద్ధము మానవ వినాశమునకే దారితీయగలదను దృఢాభిప్రాయముతో ఈ రాజ్యము

వర్తించి, శాంతియుత సహజీవనమును ప్రోత్సహించుచున్నది. క్యూబాయందలి తన క్షిపణులను వెనుకకు కొని తెచ్చుటలో ఈ రాజ్యము ఈ విధానమునే అవలంబించినది. చీనా కమ్యూనిస్ట్‌పార్టీ ఈ చర్యను హర్షింపకున్నను, నూతన నాయకత్వమున సోవియట్ రష్యా శాంతియుత సహజీవన విధానమునకే కట్టుబడి ప్రపంచ ప్రజాశ్రేయమునకు కృషి చేయుచున్నది.

రాజ్యాంగము : 1936 లో రూపొందింపబడిన రాజ్యాంగమును అనుసరించి సోవియట్ సోషలిస్ట్ గణరాజ్యమున పరిపాలన జరుగుచున్నది. ఆ రాజ్యాంగము ప్రకారము రాజకీయాధికారము అంతయు కర్షక, శ్రామిక వర్గములకు చెంది ఉన్నది. రాజ్యపరిపాలనాధికారము అంతయు కర్షక, శ్రామిక వర్గములచే ఎన్నుకొనబడిన ప్రతినిధులు గల సుప్రీమ్ సోవియట్ అనబడు శాసనసభయందు న్యస్తమై ఉన్నది. ఈ శాసనసభ 'సోవియట్ ఆవ్ యూనియన్ (సమితిసభ)', 'సోవియట్ ఆవ్ నేషనాలిటీస్ (జాతుల సభ)' అను రెండు కక్ష్యలు కలిగి ఉన్నది. ఇందు రెండవ కక్ష్యయగు జాతులసభ నాలుగు ఏండ్లకు ఒక పర్యాయము 18 ఏండ్ల పైబడిన వయోజనులచేత ఎన్నుకొనబడును. ఎన్నుకొనబడు అభ్యర్థుల వయోపరిమితి 23 ఏండ్లకు పైబడి ఉండవలెను. ఎన్నికల కొరకు నిర్దేశింపబడిన మండలములలో 3,00,000 మందికి ఒక ప్రతినిధి చొప్పున ఎన్నుకొనబడు సభ్యులు సమితిసభయందు సభ్యులుగ ఉందురు.

ప్రభుత్వములోని పెద్ద ఉద్యోగములను రక్షణశాఖలో పనిచేయు సైనికులు కూడ ఆకాంక్షించి, కృషిచేసి, పొందుటకు అభ్యంతరములు ఏవియు లేవు. సహాయక పదవులు పరోక్ష రహస్యపు ఎన్నికద్వారా భర్తీ చేయబడును.

కమ్యూనిస్ట్‌పార్టీ మాత్రమే దేశమున పరిగణితమగు ఏకైక రాజకీయ పక్షము. కాని, ఎన్నికకు నిలబడిన అభ్యర్థి కమ్యూనిస్ట్ పార్టీ సభ్యుడుగ ఉండితీరవలయునను నియమము మాత్రము లేదు. ఎన్నికలు ఏకపట్టికా విధానమును అనుసరించి జరుగును. సంవత్సరమునకు రెండు పర్యాయములు సుప్రీమ్ సోవియట్ సమావేశమగును. ఆయవ్యయములు, ప్రభుత్వముచే ప్రవేశపెట్టబడు ఆదేశములు మొదలగునవి పైసభ పరిశీలించును. సుప్రీమ్ సోవియట్ సమావేశముకాని సమయములలో సుప్రీమ్ సోవియట్ నిర్వహించు బాధ్యతలను ప్రెసిడియమ్ నిర్వహించును. ఈ ప్రెసిడియమ్‌నందు అధ్యక్షుడు కాక 16 మంది శాశ్వత సభ్యులును, సోవియట్ సోషలిస్ట్ గణరాజ్య భాగమునందలి 15 రాష్ట్రములనుండి రాష్ట్రమునకు ఒక్కొక్కరు చొప్పున 15 సహాయకులును, ఒక కార్యదర్శియు ఉందురు. ఇందలి శాశ్వత సభ్యులు పై చెప్పిన రెండుకక్ష్యలనుండి ఎన్నుకొనబడెదరు.

పరిపాలన సుప్రీమ్ సోవియట్ నియమించు మంత్రి మండలిచే జరుపబడును. చీ. శే. రా.

**సౌదీ అరేబియా :** ఆసియాలోని అరేబియా ద్వీపకల్పము నందలి ఒక స్వతంత్ర రాజ్యము.




ఈ రాజ్యమునకు జోర్డాన్, ఇరాక్, కువాయిట్ [ఉ]; పారసీక సింధుశాఖ, కటార్, షేక్ రాజ్యములు [తూ]; ఓమన్-మస్కట్ రాజ్యము, రక్షిత రాజ్యములగు ఏడెన్, యెమెన్ [ద]; ఎర్రసముద్రము, అకాబా సింధుశాఖ [ప] సరిహద్దులందు ఉన్నవి. కాని, భూతలపు సరిహద్దుల విషయమున ఇప్పటికిని ప్రక్క దేశములతో ఈ దేశమునకు నిశ్చితములగు ఏర్పాటులు జరుగలేదు. [వి] 22,53,300 చ. కి. మీ. [జ] దాదాపు 60,36,400. సరియైన జనాభాలెక్కలు ఏనాడును సేకరింపబడలేదు. [మ] దాదాపుగ దేశవాసులందరును సున్నీసంప్రదాయపు ముస్లిమ్‌లు. [రా] రియద్ (జ. సం. దాదాపు 1,50,000); ప్రపంచమునందలి ముస్లిమ్‌లు అందరికి పుణ్యక్షేత్రములగు మక్కా (జ. సం. 2,00,000), మదీనా (జ. సం. 50,000) ఈ దేశమునందలివియే.

చరిత్ర : అరేబియా ద్వీపకల్పమునందు అతి ప్రాచీన కాలమునుండియు మానవావాసములు ఉండినటుల విస్పష్టాధారములవలన రుజువగుచున్నను, అరబ్బీ సంస్కృతి ముస్లిమ్ మత ప్రవక్తయగు మహమ్మద్ [చూ. పు. 736] కాలమునుండి మాత్రమే ప్రపంచచరిత్రలో గణనీయస్థానము ఆర్జించెనని చెప్పదగును. కాని, ఆ సంస్కృతి పరమోచ్చ స్థాయిని అందుకొని, ఆఫ్రికా, యూరప్ దేశముల పశ్చిమ తీరము మొదలుకొని సింధునది పశ్చిమ తీరమువరకు తన ప్రభావము నెరపిన కాలమున సైతము, అరబ్బీ సంస్కృతి కేంద్రములు అరేబియా ద్వీపకల్పమునకు వెలుపల డెమాస్కస్, బాగ్దాద్, కార్డోబా మొదలగు వానియందు

ఆ యా కాలములలో నెలకొని ఉండెనే కాని, అరేబియా ద్వీపకల్పము మాత్రము ఆ నాడు ఎక్కువ ప్రముఖపాత్ర వహింపలేదు. స్థానిక ప్రభువులు ఆ యా కాలములందు డెమాస్కస్, బాగ్దాద్, ఈజిప్టు ప్రభువుల ఆధిపత్యమునకు లొంగి వ్యవహరించిరి. 1517 తరువాత ఈ ద్వీపకల్పములో అత్యధికము టర్కీ సామ్రాజ్యమున అంతర్భాగము.

ఈ పరిస్థితులలో 18 వ శతాబ్ది ఉత్తరార్ధమున సౌదీ అరేబియా రూపొందినది. దీని సంస్థాపకుడు మహమ్మద్ సౌద్ (1744 - 65 ప). ఇతడు తొలుత మధ్య అరేబియా లోని అల్ - దరియాకు పాలకుడుగ ఉండెను. ఈతని కాలమున ఇస్లామ్ మతమున అబ్దుల్ వాహబ్ నాయకత్వమున ఒక సంస్కరణోద్యమము వాహబీ సంప్రదాయమను పేర బయలుదేరెను. సౌదీరాజు, అతని కుమారుడగు అబ్దుల్ అజీజ్ (1765 - 1803) వాహబీ సంప్రదాయమును పరిపోషించి, దానిమూలమున ప్రక్క ప్రాంతములందలి ముస్లిమ్‌ల సానుభూతిని ఆర్జించి, సైన్యసాహాయ్యమున ఆ యా పరిసర ప్రాంత పాలకులను జయించి, తమ రాజ్యమును విస్తృత మొనర్చిరి. అజీజ్ తరువాత రాజైన సౌద్ (1803 - 14 ప.) మక్కా క్షేత్రమును తన రాజ్యమున కలుపుకొనెను. అంతట అప్పటికే అరేబియా ద్వీపకల్పమున అత్యధిక భాగమును వశపరచుకొనిన ఓటోమన్ సమ్రాట్‌లు ఈ సౌదీ ప్రభువుల విజృంభణమును అరికట్టదలచి, తమ సైన్యములను పంపి, సౌదీ సైన్యములను ఓడించి, వారు ఆక్రమించిన ప్రాంతములను మరల వశపరచుకొనిరి (1818). తరువాత 1840 ప్రాంతమున ఓటోమన్ సామ్రాజ్యము కొన్ని క్లిష్టపరిస్థితులలో ఉండుటను అవకాశముగ గ్రహించి, సౌదీ ప్రభువులు ఈ ప్రాంతములను తిరుగ వశపరచుకొనినను, త్వరలోనే వారి అంతఃకలహముల మూలమున వారి సామంతుడగు ఇబ్న రషిద్ స్వతంత్రుడై, ఈ ప్రాంతములను, సౌదీల పిత్రార్జిత భూమిని వశపరచుకొనగలిగెను. సౌదీ కుటుంబము అంతట కువాయిట్‌లో తలదాచుకొనెను (1891).

సౌదీ వంశీయుడగు అబ్దుల్ అజీజ్ కాలమున మరల ఈ రాజ్యము తన పూర్వవైభవమును అందుకొనెను. ఇతనికే ఇబ్న సౌద్ అని మరొక పేరు. వాహబీ సంప్రదాయానుయాయులను ఎల్లరను ఈతడు సమీకృత మొనర్చి, వారి సాయమున 1906 లో ఇబ్న రషీద్ వంశీయులను నిర్జించి (1906), పిత్రార్జితరాజ్యమునే కాక, పరిసర ప్రాంతములనుకూడ వశపరచుకొనెను.

ప్రపంచ యుద్ధము - I లో సౌదీ అరేబియా ప్రత్యక్షముగ పాల్గొనకున్నను, టర్కీతో పూర్వ విరోధమునుబట్టి, బ్రిటన్ ఎడ సానుభూతితో వ్యవహరించెను. 1915, డిసెంబరులో కుదుర్చుకొనిన ఒక ఒడంబడికను అనుసరించి సౌదీ అరేబియా ప్రభువు ఇబ్న సౌద్ తన దేశపు విదేశీయ వ్యవహార బాధ్యతను అంతటిని బ్రిటన్‌కు ఒప్పగించెను. ఇందులకు బదులుగ ప్రతి ఏడు కొంత ధనమును సౌదీ అరేబియాకు ఒసగుటకు బ్రిటన్ అంగీకరించెను. ఈ ఇబ్న సౌద్ కాలమున మక్కా పాలకుడగు హుసేన్ తాను ఇస్లామ్ మత పీఠాధిపతినని ప్రకటించి, ఇబ్న సౌద్‌పై ఆధిపత్యమును వహింప యత్నింపగ, అతనిని నిర్జించి, ఇబ్న సౌద్ మక్కాను, మదీనాను వశపరచుకొనెను (1925). ఈ విధముగ విస్తృతమైన ఈ రాజ్యపు సరిహద్దులను 20 మే, 1927 లో జరిగిన ఒడంబడిక మూలమున బ్రిటన్ గుర్తించి సమర్థించెను. ఈ ఒడంబడికమూలమున 1915 ఒడంబడిక రద్దగుటయు, సౌదీ అరేబియా సర్వస్వతంత్ర ప్రతిపత్తి కల రాజ్యముగ రూపొందుటయు జరిగినవి.

ప్రపంచ యుద్ధము - II లో మిత్రమండలి ఎడ ఇబ్న సౌద్ సానుభూతి కలిగి ఉన్నను, తన దేశమును మాత్రము యుద్ధమున దింపక, తటస్థముగ ఉంచెను. 1953 లో ఇబ్న సౌద్ గతించునాటికి సౌదీ అరేబియాయందు రాజకీయ సుస్థిరత్వము నెలకొనుటతో నేటి సౌదీ అరేబియాకు అతడే నిర్మాత అయ్యెను.

సౌదీ అరేబియాలోని పెట్రోలియమ్ గనులు ఆ దేశ సంపదకు మూలకారణము. అందుచే ప్రపంచ రాజకీయములలో ఈ దేశము కీలక స్థానమును నేడు ఆక్రమించినది.

రాజ్యాంగము : వంశానుగతము, సర్వాధికారయుతము అగు రాజవంశపు పాలన దేశమున అమలునందు ఉన్నది. ముస్లిమ్ ధర్మశాస్త్రమగు షరియత్‌ను, దానికి విరుద్ధము గాకుండ ప్రజలలో సంప్రదాయముగ అమలునందు ఉన్న ఆచారములను అనుసరించియు రాజు పాలించెడివాడు. 1958 నుండి అమలులోనికి తేబడిన ఒక రాజ్యాంగచట్టమును అనుసరించి రాజు ప్రధానిని నియమించి, అంతట ప్రధాని సలహాపై ఉపప్రధానిని, తక్కిన మంత్రులను నియమించును. మంత్రులు ప్రధానికిని, ప్రధాని రాజునకును బాధ్యత వహించి పరిపాలన నెరపుదురు. చీ. శే. రా.

**స్కందగుప్తుడు** (455 - 467 ప.) : భారతదేశమును పాలించిన గుప్తవంశీకుడగురాజు. కుమారగుప్త - I కుమారుడు. కుమారగుప్త - I ని మరణానంతరమున స్కందగుప్తుడు రాజ్యమునకు వచ్చెను. ఇతడు నిర్వక్రవిక్రముడు, విక్రమాదిత్య బిరుదాంకితుడు. తన తండ్రి కాలముననే గుప్తసామ్రాజ్యముపై తండోపతండములుగా వచ్చుచున్న హూణవాహినీనివహములకు ఆనకట్టయై

అడ్డుపడి సామ్రాజ్యమును సంరక్షించిన యోధుడు. ఇతని కాలముననే సౌరాష్ట్రదేశమును పర్ణదత్తుడు రాజ ప్రతినిధిగా పాలించి, సామ్రాజ్యమునకు పశ్చిమ సరిహద్దు నుండి అపాయము లేకుండ కాపాడెను. స్కందగుప్తుడు తన రాజధానిని పాటలీపుత్రమునుండి అయోధ్యకు మార్చి నట్లు గ్రంథకర్తల అభిప్రాయము. కుం. ఈ. దత్తు.

**స్టాలిన్ (1879 - 1953)**: సోవియట్ రష్యా రాజనీతివేత్త; పరిపాలకుడు. ఇతని నిజనామము అయోసిఫ్ విస్సారియోనోవిచ్. ఈతడు 1879, డిసెంబరు 21 వ తేదీన జార్జియా రాష్ట్రిమండలి గోరీలో జన్మించెను. 1894 టిఫిలిస్‌లో విద్యాభ్యాసము. 1899లో జార్జియా సామ్యవాద సంఘమునందు సభ్యత్వము ఉండిన కారణమున స్టాలిన్ పట్టభద్రుడు కాకపూర్వమే కళాశాలనుండి వెడలగొట్టబడెను. తదాదిగ విప్లవ చర్యలందు పాల్గొని, తత్ఫలితముగ ప్రభుత్వముచే అతడు అరెస్టు చేయబడి, సైబీరియాయందు



స్టాలిన్
(1879 - 1953)

ప్రవాసములో ఉండగా తప్పించుకొని 1905 లో సామ్యవాద పక్ష నాయకుడగు లెనిన్‌కు సహచరుడై స్టాక్‌హోమ్ (1906), లండను (1907) నగరములలో జరిగిన పార్టీ సమావేశములందు పాల్గొనెను. తరువాత మూడుసార్లు అతడు అరెస్టుచేయబడి, ప్రవాసము అంపబడినను తప్పించుకొనెను. 1912 లో లెనిన్ కార్యక్రమమునకు కార్యరూపము ఒసగుటలో స్టాలిన్ కృషిచేసెను. ఈ సమయముననే 'ఉక్కుమనిషి' (స్టాలిన్) అను వ్యవహారనామము ఇతనికి లభించెను. జార్ ప్రభుత్వముచే ఈతడు తిరిగి బందీకృతుడై, ఆర్కటిక్ ప్రాంతమునకు ప్రవాసము అంపబడెను. 1917 విప్లవము జరుగువరకు అచటనే ఉండెను. సోవియట్ రష్యా రాజ్యాంగ నిర్మాణ కార్యక్రమము (1918 - 1923) నందు ఇతడు పాల్గొనెను. 1922 ఏప్రిల్‌లో పార్టీ ప్రధాన కార్యదర్శి పదవికి స్టాలిన్ ఎన్నుకొనబడెను. లెనిన్ కుడిభుజముగ పేరొందిన ట్రాట్‌స్కీకి ఇతడు వ్యతిరేకి. 1924, జనవరి 21 న లెనిన్ మరణానంతరము ట్రాట్‌స్కీని పార్టీనుండి బహిష్కృతుని చేసి క్రమముగ సర్వాధికారములను గ్రహింపగలిగెను. సోవియట్ రష్యాలో పారిశ్రామికాభివృద్ధికి స్టాలిన్ పునాది వేసెను. పెరుగుచున్న జనాభాను దృష్టియందుంచుకొని సమష్టి వ్యవసాయ(కోల్‌కోజ్) పద్ధతులను కార్యాచరణలో పెట్టి ఎదురుతిరిగిన వారిని నిర్దాక్షిణ్యముగ ఈతడు అడచివేసెను.

ప్రపంచయుద్ధము - II లో ముందుగ సోవియట్ రష్యా రాజ్యముతో యూరప్ దేశములు సహకరింప ఇచ్చగించనందున, 1939 లో హిట్లర్‌తో చర్చలు జరిపి మైత్రి ఒడంబడికను అతడు కుదుర్చుకొనెను. అందుకు ఫలితముగ పోలండ్ తూర్పుభాగమును సోవియట్ రష్యా రాజ్యమున ఇతడు చేర్చగలిగెను. కాని, 1941, జూన్ 22 న సోవియట్ రష్యా రాజ్యముపై జర్మనీ హఠాత్తుగ యుద్ధమునకు దిగుటతో పరిస్థితి తారుమారయ్యెను. అంతట స్టాలిన్ సర్వసైన్యాధ్యక్ష పదవిని స్వీకరించెను. ఈతని నాయకత్వమున సోవియట్ రష్యా సేనలు అపజయములను అన్నింటిని అధిగమించి కడకు విజయము సాధింపగలిగెను. జర్మనీ పతనమైన సందర్భమున టెహరాన్, యాల్టా, పోట్స్‌డామ్ నగరములలో జరిగిన సమావేశములందు పాల్గొని అందు స్టాలిన్ ప్రముఖపాత్రను నిర్వహించెను. జపాన్‌పై మిత్రమండలి రాజ్యములు జరుపు యుద్ధమున తుది ఘట్టమున తన దేశము సైతము పాల్గొనునటులచేసి, మంచూరియా, ఉత్తర కొరియా, కురైల్ దీవులు, ఉత్తర సఖాలీన్ ప్రాంతములను సోవియట్ రష్యా ఆక్రమణలోనికి కొనివచ్చెను. 1953, మార్చి 5 వ తేదీన అనారోగ్య కారణమున స్టాలిన్ మరణించెను. మ. ఆ. శ.

**స్టాలిన్‌గ్రాడ్ సంగ్రామము**: ప్రపంచయుద్ధము-II లో 1942, సెప్టెంబరు 5 న జర్మనీ సేనానియగు పౌలస్ నాయకత్వమున డాన్‌నదిలోయనుండి జర్మనీ సేనలు బయదేరి ఈ నగరముపై దాడిచేసినవి. రష్యన్‌లు వీధి తరువాత వీధిని కాపాడుకొనుచు జర్మనులను తీవ్రముగ ప్రతిఘటించిరి. నవంబరులో రష్యన్ సేనానియగు ఝుకోవ్ నాయకత్వమున వచ్చిన సహాయ సైన్యము జర్మనుల ప్రయాణ సౌకర్యములను ఛేదించి ముట్టడిదారులను పట్టుకొనెను. జర్మనులు తీవ్రముగ ప్రతిఘటించుచున్నను, రష్యన్‌లు క్రమక్రమముగ నగరమును చుట్టుముట్టి, 1943, జనవరి 31 న జనరల్ పౌలస్‌ను అతని సహచరులతో సహా పట్టుకొనుటయందు కృతకృత్యులైరి. స్టాలిన్‌గ్రాడ్‌నకై యుద్ధము చేసిన 21 డివిజనుల జర్మను సైనికులలో 90,000 మందిని సోవియట్ రష్యా దళములు ఖైదీలుగ పట్టుకొనినవి. జర్మనులు సోవియట్ రష్యా లోనికి చొచ్చుకొనివచ్చిన మిక్కిలి దూరమైన స్థానము ఇదియే. అయితే, స్టాలిన్ మరణానంతరమున 1961 లో ఈ స్టాలిన్‌గ్రాడ్‌ను వోల్గాగ్రాడ్ అని పేరు మార్చిరి. స్వ. వెం.

**స్థానిక స్వపరిపాలనము :** చూ. సం. 11.

**స్పానిష్ అంతర్యుద్ధము** (1936-39): స్పెయిన్‌లో 1936 లో పాప్యులర్ ఫ్రంట్ ఆధ్వర్యవమున రిపబ్లికన్ ప్రభుత్వము ప్రవేశపెట్టిన సామ్యవాదవిధానములను, మతవిరుద్ధపు పోకడలను నిరసించిన సేనానాయకుల ప్రోద్బలమున ఉత్పన్నమైనది. స్పానిష్ మొరాకోలో సేనానాయకుల తిరుగుబాటుతో అంతర్యుద్ధము ఆరంభమయ్యెను. జాతీయవాదులు అని వ్యవహరించిన తిరుగుబాటుదారులకు నాయకుడు జనరల్ ఫ్రాంకో. ఇతడు మొదట కొంత అపజయము పొంది, మొరాకోకు, యూరప్‌లో కొన్ని ప్రదేశములకు పారిపోయినను, మరల మాడ్రిడ్‌నగరమునకు వచ్చి తన పక్షమును బలపరచుకొనెను. ఈ యుద్ధములో నానాజాతి సమితి, ఇంగ్లండు, యునైటెడ్ స్టేట్స్, ఫ్రాన్స్ తాటస్థ్యము వహించెను. రిపబ్లికన్ ప్రభుత్వమునకు సైనిక సలహాదారులను, సాంకేతిక నిపుణులను పంపి, సోవియట్ రష్యా కొంత సాయపడెను. ఫాసిస్ట్ ప్రతికూలురు వ్యవస్థాపించిన ఒక అంతర్జాతీయదళము ప్రభుత్వపక్షమున పోరాడెను. జర్మనీ, ఇటలీ ప్రభుత్వములు బాహాటముగ వైమానిక దళమును, స్వచ్ఛంద సైనికులను విరివిగా పంపి ఫ్రాంకోకు తోడ్పడినవి. పోప్ కూడ ఫ్రాంకో ప్రభుత్వమునే ఆశీర్వదించెను. మెక్సికో బహిరంగముగ రిపబ్లిక్ పక్షమును ప్రోత్సహించెను. లాటిన్ అమెరికా రాజ్యములు ఫ్రాంకోను ప్రోత్సహించెను. మొత్తముమీద ఫ్రాంకోకే ఎక్కువ సహాయము అందినది. 1936 ఆగస్టులో ఫ్రాంకో బేడ్జాజ్‌ను వశపరచుకొని, మాడ్రిడ్ నగరమును ముట్టడించెను. రిపబ్లిక్ ప్రభుత్వము తన రాజధానిస్థానమును వెలన్సియాకు తరలించుకొనెను. 1938 కడపట బార్సిలోనా ఫ్రాంకోకు లోబడినది; ఫ్రాంకో ప్రభుత్వమును బ్రిటన్, ఫ్రాన్స్ గుర్తించినవి. 1939 లో రష్యా తన విధానమును సవరించుకొని, సహాయము నిలుపు చేయుటవలన బలహీనమై రిపబ్లికన్ ప్రభుత్వము కూలిపోయెను. మార్చినెల పూర్తి అగుసరికి మాడ్రిడ్‌నగరముతో సహా యావత్ స్పెయిన్ ఫ్రాంకో హస్తగతము అయ్యెను. ఈ యుద్ధమున ఇరుపక్షములందు కలసి, దాదాపు 6 లక్షలు మంది చనిపోయిరి. ఆ. వెం.

**స్పానిష్ - అమెరికా యుద్ధము :** యునైటెడ్ స్టేట్స్‌లోని యువక రిపబ్లికన్ రాజకీయవేత్తల సామ్రాజ్య విస్తరణ కాంక్ష చేతను, క్యూబా వలస పరిపాలనయందు స్పెయిన్‌వారలు అవలంబించిన నిర్బంధవిధానము చేతను జరిగిన యుద్ధము (1898). యునైటెడ్ స్టేట్స్ మెయిన్ అను యుద్ధనౌక 15-2-1898 న క్యూబా దేశపు ముఖ్య నగరమగు హవానాలో ధ్వంసమయ్యెను. అందులోని 260 మంది సైనికులు మరణించిరి. సాక్ష్యమునకై ఎదురు చూడకయే అమెరికన్ ప్రజలు ఈ కార్యమును స్పెయిన్ వారే చేసిరని తలంచిరి. స్పెయిన్ ప్రభుత్వము ఈ నష్టమునకై తమ విచారమును తెలియజేసి, సాంత్వన మార్గమును అవలంబించినను లెక్కపెట్టక అప్పటి ప్రెసిడెంటగు మెక్‌కిన్‌లే 1898 ఏప్రిల్‌లో అమెరికన్ కాంగ్రెస్‌చే స్పెయిన్‌పై యుద్ధము ప్రకటింపజేసెను. అమెరికన్ యుద్ధనౌకలు ఫిలిప్పీన్ దీవులపై తమ ముట్టడిని కేంద్రీకరించి, ఒక స్పానిష్ నౌకాదళమును నాశనమొనర్చెను. క్యూబా యుద్ధరంగమున - పోర్టోరికోలో కూడ - స్పెయిన్ మరి కొంత నౌకాదళమును పోగొట్టుకొనినది. అందుచే స్పెయిన్ ప్రభుత్వము రాజీ పడవలసివచ్చెను. ఉభయరాజ్య ప్రతినిధులు 1898, డిసెంబరులో పారిస్‌లో సమావేశమై సంధి పత్రముపై సంతకములు చేసిరి. ఈ సంధి షరతుల మూలకముగా జరిగిన ఫలితములు: 1. యునైటెడ్ స్టేట్స్‌కు ఫిలిప్పీన్‌దీవులు, గవామ్, పోర్టోరికో లాభించెను; 2. స్పెయిన్‌వారు క్యూబాను వదలివేసిరి. అది స్వతంత్ర గణరాజ్యముగ ప్రకటింపబడువరకు దానిని యునైటెడ్ స్టేట్స్ సైన్యములు ఆక్రమించెను. స్వా. వెం.

**స్పానిష్ వారసత్వ సంగ్రామము** (1701 - 14): లూయీ - XIV యొక్క ఫ్రెంచి ఆధిపత్య విస్తరణ కాంక్షవలన పర్యవసించిన యుద్ధము. 17 వ శతాబ్దము కడపట సంతతిలేని స్పెయిన్‌రాజు చార్లెస్ - II అస్వస్థుడు, ఆసన్నమరణుడు అగుటతో వివాహసంబంధములను పురస్కరించుకొని ఫ్రెంచి, ఆస్ట్రియా, బవేరియా రాకుమారులు ముగ్గురు అతనికి వారసులుగ ప్రతిపాదింపబడిరి. ఫ్రాన్స్, ఆస్ట్రియా దేశములలో స్పెయిన్ ఏ దేశముతో ఐక్యమయినను యూరప్‌లో ఆధిపత్య తౌల్యమునకు విపర్యయము ఏర్పడునని ప్రమాదమును గుర్తించి, ఇంగ్లండు, హాలండ్ దేశములు అట్టి ప్రతిపాదనకు ప్రాతికూల్యము వ్యక్తపరిచెను. అందువలన ఈ సమస్యా పరిష్కారమునకు లూయీ - XIV ఆంగ్లరాజు విలియమ్ - III తో ప్రథమ విభజన ఒడంబడికను కుదుర్చుకొనెను (1697). దానిప్రకారము బవేరియా రాకుమారుడు జోసఫ్ ఫెర్డినాండ్ స్పెయిన్‌సామ్రాజ్యమునకు వారసుడై, ఆ సామ్రాజ్యములోని ఇటాలియన్ ప్రాంతములు మాత్రము ఫ్రెంచి, ఆస్ట్రియా రాకుమారులకు చెందవలసి ఉండెను. కాని, ఫెర్డినాండ్ 1699 లో మరణించుటచే ఆ ఒప్పందము రద్దయ్యెను. తోడనే ఆస్ట్రియా రాకుమారుడు - ఆర్చిడ్యూక్ చార్లెస్ - స్పెయిన్ సామ్రా

జ్యమునకు అధిపతి అగునట్లును, ఆ సామ్రాజ్యములోని ఇటాలియన్ ప్రాంతములు మాత్రము ఫ్రాన్స్‌కు సంక్రమించునట్లును లూయీ - XIV ఆంగ్ల రాజుతో ద్వితీయ విభజన ఒడంబడిక చేసికొనెను (1700). కాని, స్పెయిన్ సామ్రాజ్యపు ప్రాదేశిక విభజనకు అంగీకరింపక, చార్లెస్ - II ఫ్రాన్స్, స్పెయిన్ కలకాలము విడి విడి రాజ్యములుగనే వ్యవహరింపవలయునన్న షరతుతో, ఫ్రెంచి రాకుమారుడు ఫిలిప్ తనకు ఏకైక వారసుడుగ వీలునామా వ్రాసి మృతిచెందెను. వెంటనే రెండవ ఒడంబడికను త్రోసిపుచ్చి, ఆ వీలునామాను ఆమోదించి, లూయీ - XIV ఫిలిప్‌ను స్పెయిన్ సింహాసనము ఎక్కించెను. ద్వితీయ విభజన ఒడంబడిక బ్రిటన్‌లో నిశిత విమర్శకు గురి అగుటచే, ఆ ప్రభుత్వము లూయీ - XIV చర్యకు అభ్యంతరము చెప్పక, మీదుమిక్కిలి ఫిలిప్‌ను స్పెయిన్ రాజుగా గుర్తించెను. కారణాంతరములచే హాలండ్ కూడ ఇంగ్లండునే అనుసరించెను. ఇట్లు తనకు అనుకూలించిన ఈ రెండు దేశములను సంతృప్తిపరచుటకు బదులు లూయీ - XIV వాటి ప్రయోజనములను భంగపుచ్చుటయే పనిగా పెట్టుకొని కవ్వింపు చర్యలకు ఉద్యమించెను; స్పానిష్ వలసలలో అంతవరకు ఆంగ్ల, డచ్చి వర్తకులు అనుభవించుచున్న ప్రత్యేక వాణిజ్యపు హక్కులను వారికి పూర్తిగా నిరాకరించి, ఫ్రెంచి వర్తకులకు కలుగజేయవలెనని స్పెయిన్ ప్రభుత్వమును ఒత్తిడిచేసెను. అందువలన ఇంగ్లండు, హాలండ్, ఆస్ట్రియా 1701 లో ఘన మైత్రిని ఏర్పరుచుకొని, ఫ్రెంచి ప్రాబల్యమును కూలదోయుట, ఫిలిప్‌ను తొలగించి, ఆర్చిడ్యూక్ చార్లెస్‌ను స్పెయిన్ సింహాసనాసీనుని చేయుట అను రెండు లక్ష్యములతో ఫ్రాన్స్‌తో తలపడినవి; 1703 లో సోవాయ్, పోర్చుగల్ దేశములు కూడ వారితో చేరెను. ఒక దశాబ్దము పాటు కొనసాగిన ఈ యుద్ధములో మిత్ర రాజ్యములు పెక్కు స్థానిక విజయములను సాధించినను, సైనికముగ ఫ్రాన్స్‌ను ఓడింపలేకపోయినవి. అపజయము నుండి తప్పించుకొని బయటపడుటకు లూయీ - XIV భేదతంత్రమును ప్రయోగించెను. 1710 లో బ్రిటన్‌లో కన్సర్వేటివ్ పక్షము అధికారము చేపట్టుటతో అతడు బ్రిటన్‌తో ఒక ప్రత్యేక రహస్యసంధి చేసికొనెను. అతనికి కాలముకూడ కలిసివచ్చి, ఆస్ట్రియా చక్రవర్తి చనిపోయి ఆస్ట్రియా సింహాసనమును ఆర్చిడ్యూక్ చార్లెస్ అధిష్ఠించెను (1711). దానికితోడు ఫిలిప్ ఫ్రెంచిగద్దెపై తనకు కల హక్కులను నిర్ద్వంద్వముగా పరిత్యజించెను. అంతట తమ రెండవ యుద్ధ లక్ష్యమును సాధించి, ఆస్ట్రియా చక్రవర్తియైన ఆర్చిడ్యూక్ చార్లెస్‌కు స్పెయిన్ సామ్రాజ్యమును కూడ ముట్టజెప్పుట చార్లెస్ - V నాటి ఆస్ట్రియాసామ్రాజ్యప్రాబల్యమును పునరుద్ధరించుట అగునని, అందుకు సుతరాము సమ్మతింపక, పైన చెప్పిన నూతన పరిణామములను సాకుగా తీసికొని, ఇంగ్లండు, హాలండ్ యుద్ధమునుండి వైదొలగి, ఫ్రాన్స్‌తో ఉట్రెక్ట్‌సంధి [చూ. పు. 337] చేసికొనినవి (1713). ఒంటరిగా కొన్ని నెలలు యుద్ధము కొనసాగించి, 1774 లో ఆస్ట్రియా ఫ్రాన్స్‌తో సంధిచేసికొని, స్పెయిన్ భాగము లైన మిలాన్, నేపిల్స్, సార్డీనియా, నెదర్లండ్స్ దేశములను స్వీయము చేసికొనెను. ఈ యుద్ధమువలన మిత్ర రాజ్యములు ఫ్రెంచి ప్రాబల్యమును తగ్గింపగల్గినను, ఫిలిప్‌ను పదవీచ్యుతుని చేయలేకపోయినవి; చార్లెస్ - II వీలునామాకు విరుద్ధముగ స్పెయిన్ సామ్రాజ్యపు ప్రాదేశిక సమగ్రత కూడ కుంటుపడినది. **ఆ. వెం.**

**స్పార్టా :** చూ. సమీక్ష - పు. 35; 431.

**స్పెయిన్ :** యూరప్‌నందలి ఒక స్వతంత్రరాజ్యము.




యూరప్ ఖండ పశ్చిమభాగమున ఐబీరియన్ ద్వీపకల్పమున నెలకొని ఉన్న ఈ దేశమునకు బిస్కే అఖాతము, ఫ్రాన్స్ [ఉ]; మధ్యధరాసముద్రము [తూ, ద]; పోర్చుగల్, అట్లాంటిక్ మహాసముద్రము [ప] సరిహద్దులందు ఉన్నవి. బేలేరిక్, కేనరీ దీవులును పరిపాలన రీత్యా ఈ రాజ్యమున చేరి ఉన్నవి. [వి] దీవులతో సహా 5,04,748 చ. కి. మీ.; [జ] 3,10,77,104. [భా] జాతీయభాష స్పానిష్. [మ] ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు రోమన్ కేథలిక్‌లు. [రా] మాడ్రిడ్ (జ. సం. 22,59,931).

చరిత్ర : ఈ దేశమునందలి ప్రాచీనవాసులు ఐబీరియన్ లని వ్యవహరింపబడెడివారు. వీరిని జయించి ' కెల్ట్ ' జాతి వారలు ఈ భూమిని ఆక్రమించిరి. కాలక్రమమున ఈ కెల్ట్‌లు ఐబీరియన్‌లతో కలసిపోవుటచేత ప్రస్తుతపు స్పెయిన్‌జాతి రూపొందినది. ఆ మిశ్రజాతివారిని గ్రీక్‌లు,

రోమన్‌లు, కెల్ట్ - ఐబీరియన్‌లు అనెడివారు. ఆ దేశమును ఐబీరియా అనియు, హిస్‌పేనియా అనియు అనెడివారు. ఈ హిస్‌పేనియా అను పేరు ఇస్పేనియా అనియు, స్పెయిన్ అనియు మార్పుచెందెను.

ఫొనీషియన్‌లు ఈ దేశమునందు క్రీ. పూ. 1200 మునుపే స్థావరములను నెలకొల్పుకొని, ఇటలీపై జైత్రయాత్రలు జరుపుటకు మజిలీ స్థలములుగ ఉపయోగించుకొనుచుండిరి.

ఈ దేశము మూడు వేరు వేరు జాతులవారి దాడులకును, ఆక్రమణలకును క్రీ. పూ. 300 - క్రీ. శ. 1200 ల మధ్య లోనైనది. I. రోమన్‌లు రెండవ కార్తజీనియన్ సంగ్రామమందు విజయమంది కార్తజీనియన్‌లను స్పెయిన్ దేశమునుండి వెడలగొట్టి, ఈ దేశమును ఆక్రమించి, రోమన్ సామ్రాజ్యమందొక మండలముగ పరిపాలించిరి. రోమన్ సంస్కృతి ఈ దేశమందు లెస్సగా వృద్ధిపొందినది. సెనీకా, క్విన్ టెలియన్ మొదలైన ప్రసిద్ధ రోమన్ రచయితలు ఈ దేశమందే పుట్టిరి. కాన్‌స్టాంటైన్ మహనీయుని (క్రీ. శ. 306 - 337 ప.) కాలములో ఈ దేశమందలి జనులు క్రైస్తవ మతమును స్వీకరించిరి.

2. క్రీ. శ. 400 నాటికి ఇటలీని జయించిన జర్మను జాతుల తెగలు స్పెయిన్‌కు కూడ దండయాత్రలు సాగించుచుండిరి. సుయేబి, అలాన్ గలీషియా, పోర్చుగల్‌ను జయించి అక్కడనే స్థిరనివాసములు ఏర్పరచుకొనిరి. వేండల్‌లు జెన్‌సిరిక్ నాయకత్వమున స్పెయిన్‌నందలి మధ్యభాగమును, దక్షిణభాగమును జయించి, ఈబ్రోనది నుండి జిబ్రాల్టర్ వరకును వ్యాపించిన దేశమును ఆక్రమించి, స్థిరనివాసములను ఏర్పరచుకొనిరి. ఈ ప్రదేశమునకు వేండలూసియా అను పేరు వారివల్లనే కలిగినది. నేటికిని దక్షిణ స్పెయిన్‌కు వేండలూసియా అను పేరు నిలచి ఉన్నది.

3. ఆ పిమ్మట థియోడోరిక్ నాయకత్వమున విజిగాత్‌ల దండయాత్రలు సాగినవి. వీరు 573 నాటికి స్పెయిన్‌ను పూర్తిగ ఆక్రమించుకొని, వేండల్‌లను ఆఫ్రికాకు తరిమివేసిరి. 711 వరకును విజిగాత్‌ల రాజ్యముగ స్పెయిన్ ఉండెను. ఆఫ్రికానుండి దాడివెడలి వచ్చిన మూర్‌లు విజిగాత్‌ల కడపటి రాజైన రొడరిక్‌ను ఓడించి చంపి, ఆ దేశమును ఆక్రమించిరి. ఆనాటినుండి చాలా కాలము వరకును స్పెయిన్ ముస్లిమ్‌ల దేశమై ఉండెను. ఆ కాలమందు కార్డోబా, టోలీడో, వేలెన్సియా అను మూర్‌ల నగరములు వెలసినవి. అంతేకాక, అరబ్బీల సంస్కృతి, నాగరకత కూడా వ్యాపించినవి. ఈ మూర్‌లు క్రూరత్వము చూపించినను, వీరివలన దేశము అనేక విధముల వృద్ధిపొందినది.

ఈ మూర్‌లు తరిమివేయగా కొందరు విజిగాత్‌లు ఉత్తర దిక్కుగ పారిపోయి లీయాన్, నవార్, కేస్‌టైల్ అను చిన్న రాజ్యములను స్థాపించుకొనిరి. పోర్చుగల్ కూడా ఆ కాలమందే ఏర్పడినది. గ్రెనడానగరమందు మూర్‌లు నిర్మించిన దివ్యభవనములు నేటికిని శిల్పనైపుణ్యమునకు ప్రసిద్ధిచెందినవి. ఈ మూర్‌లు ఉత్తరదిక్కుగ తమ అధికారమును వ్యాపింపజేసికొనుటకు ప్రయత్నించిరి. కాని, క్రైస్తవ రాజ్యములు ప్రబలి వారి ప్రయత్నములు కొనసాగనీయలేదు. అంతేకాక, 1200 నాటికి కేస్‌టైల్ రాజ్యనాయకత్వమున తక్కిన క్రైస్తవరాజ్యములు అన్నియు ఏకమై మూర్‌లను దక్షిణ దిక్కుగా తరిమివేసినవి. ఒక్క గ్రెనడాను తప్ప తక్కిన మూర్‌ల ప్రదేశము అంతటిని క్రైస్తవ రాజ్యములవారు వశపరచుకొనిరి.

నవీనయుగ చరిత్ర: కేస్‌టైల్ రాజ్యమును, ఘనతలో దాని తర్వాత పేర్కొనదగిన ఆరగన్ రాజ్యమును ఏకమైనవి. 1469 లో ఆరగన్ రాజైన ఫెర్డినాండ్ - II కేస్‌టైల్ రాజ్ఞియైన ఇసబెల్లాను పెండ్లియాడుట వలన 1479 నాటికి ఆ రెండు రాజ్యములును ఏకరాజ్యమైనవి. ఈ రాజదంపతులే కొలంబస్‌ను అమెరికాకు పంపి నూతన ప్రపంచములో వలసరాజ్యములను నెలకొలిపి, స్పానిష్ సామ్రాజ్యమునకు పునాదులు వేసినవారైరి. నాటినుండి నూరు సంవత్సరములలో చార్లెస్ - V, ఫిలిప్ - II మొదలయిన దొడ్డరాజుల పరిపాలనమందు స్పెయిన్ ఉన్నతదశకు వచ్చినది. అంతే కాక, ఈ రాజులు రోమన్ కేతలిక్ మతాభిమానులు; ఆ మతమును ఇన్‌క్విజిషన్ అను విధానపు సాహాయ్యముతో బలవంతముగ వ్యాపింపజేసి, ఆ మతమును అవలంబింపని వారిని చంపించివేయుచుండిరి. అందులోను మూర్‌ల ఎడలను, యూదుల ఎడలను అతి క్రూరులై వారిని హింసించి చంపిరి. యూదులను దేశమునుండి వెడలగొట్టిరి. 1492 నాటికి మూర్‌లు కూడ దేశమువిడిచి ఆఫ్రికాకు పారిపోయిరి.

నూతన ప్రపంచములో మెక్సికో, మధ్య అమెరికా, పెరూ, వెనిజ్యులా, చిలీ, క్యూబా, జమైకా, డొమినికన్ రిపబ్లిక్ అను పేరులు గల ప్రదేశములు అన్నియు ఆ కాలమున స్పెయిన్ మహాసామ్రాజ్యముతో చేరి ఉండెను. అంతేకాక, స్పెయిన్‌వారి జైత్రయాత్రలు ఆఫ్రికాకు, మలక్కా దీవులకు, ఫిలిప్పీన్ దీవులకు కూడ వ్యాపించినవి. ఫిలిప్పీన్ దీవుల ఆక్రమణముతో స్పెయిన్ మహాసామ్రాజ్యము భూగోళముచుట్టును వ్యాపించినట్లు అయినది. ఇక యూరప్ ఖండమందు నవార్, రూసిలాన్, పోర్చుగల్, నెదర్‌లండ్స్, నేపిల్స్, సిసిలీ, సార్డీనియా, కెనరీ దీవులు,

బెలియారిక్ దీవులు కూడ స్పెయిన్‌వారి అధికారమునకు లోబడినవి. 'స్పెయిన్ ప్రపంచమునకు అధికారిణి, మహా సముద్రములకు రాణి' అను పేరు వెలసినది.

క్షీణదశ - ఫిలిప్ - II (1527 - 98): ఫిలిప్ చేసిన పొరపాట్లవలన స్పెయిన్ సామ్రాజ్యమునకు క్షీణదశ ప్రారంభించినది. 1588 లో 130 యుద్ధ నావలను ఆయత్త పరచి స్పానిష్ ఆర్మెడాను సమకూర్చి బ్రిటన్‌ను జయించుటకు ఫిలిప్ - II సంకల్పించెను. కాని, తుపాను చెలరేగుట వల్లను, బ్రిటిష్ నావికుల జాగరూకతవల్లను, ఆంగ్లేయుల ఫిరంగుల ప్రేలుడువల్లను స్పానిష్ ఆర్మెడా ఓడిపోయి, చెల్లాచెదరైనది. దానితో నౌకా ప్రాముఖ్యము స్పెయిన్ వారికి నశించి బ్రిటిష్‌వారికి సంక్రమించినది.

స్పెయిన్ సామ్రాజ్య బలముకూడ 1600 నుండి క్షీణించుటకు ప్రారంభించినది. నెదర్‌లండ్స్ వైదొలగినది. స్పానిష్ వారసత్వపు సంగ్రామము [చూ.] లో అపజయము కలిగి, 1714 లో నేపిల్స్, పార్మా, సార్డీనియా, మిలాన్ ప్రదేశములను ఆస్ట్రియావారికి ఇచ్చివేయవలసి వచ్చినది. అంతేకాక, సేవాయికి సిసిలీని, బ్రిటన్‌కు జిబ్రాల్టర్, మలక్కాను స్పెయిన్‌వారు వశపరచవలసి వచ్చినది.

బ్రిటన్, ఫ్రాన్స్‌లతో స్పెయిన్‌కు గల రాజకీయ సంబంధములలో సుమారు ఒక నూరేండ్ల కాలము (1714 - 1804) ఏవిధమగు ఒడుదొడుకులు లేకుండ గడచిపోయినది. కాని, ఫ్రెంచివిప్లవ ఫలితముగ చెలరేగిన సంగ్రామములవలన మరల కష్టదశ ప్రారంభించినది. మొట్టమొదట 'ఫ్రెంచి రిపబ్లిక్‌తో స్పెయిన్ యుద్ధము సాగించి, ఓడి, శాంటోడొమింగో ఫ్రెంచివారికి ఇచ్చుకొన్నది. ఆ పిమ్మట ఫ్రెంచివారితో చెలిమి చేసికొని బ్రిటన్‌తో యుద్ధము సాగించినది. స్పెయిన్, ఫ్రాన్స్ దేశముల నౌకాదళములు బ్రిటిష్ నౌకాదళములతో యుద్ధముచేసి, 1805 లో ట్రఫాల్గర్ వద్ద ఓడిపోయినవి. ఆ పిమ్మట నెపోలియన్ తన సోదరుడైన జోసఫ్‌ను స్పానిష్ సింహాసనమున అధిష్ఠింపజేసి, స్పెయిన్‌ను వశపరచుకొనెను. దానితో స్పెయిన్‌కు నెపోలియన్‌తో స్పెయిన్ ద్వీపకల్ప సంగ్రామము (1808 - 1814) ప్రారంభమైనది. స్పెయిన్‌కు పోర్చుగల్, బ్రిటన్ దేశములు తోడైనవి. తుదకు 'డ్యూక్ ఆవ్ విల్లింగ్‌టన్' పొందిన విజయముల వలన ఫ్రెంచివారి అధికారము స్పెయిన్‌లో అంతమొందినది. 1814 లో ఫెర్డినాండ్ - VII అను స్పెయిన్ రాజు సింహాసనాసీనుడు అయ్యెను. కాని, ఈ సంగ్రామములో స్పెయిన్ తీవ్రమైన అలజడులకు పాలైనందున తగిన సమయము చిక్కినదను నూతనోత్సాహముతో ఉరుగ్వే, పరాగ్వే, చిలీ, వెనిజ్యులా, న్యూగ్రెనడాలు స్పెయిన్ వారి ప్రభుత్వాధికారమును ధిక్కరించి తమ స్వతంత్రతను పొందుటకు తిరుగుబాటు ప్రారంభించినవి. అందుకు తగిన ప్రతిక్రియ జరుపలేకపోయెనన్న కోపముతో స్పెయిన్ దేశస్థులు తమ రాజును నిందించి తిరుగుబాటు కావించిరి. ఇది యొక అంతస్సంగ్రామముగ రూపొందినది. రష్యా స్పెయిన్ ప్రభుత్వమునకు తోడ్పడుట మంచిదని ఇతర యూరపియన్ రాజ్యములవారిని హెచ్చరించినది. బ్రిటన్, ఆస్ట్రియా అందుకు సమ్మతింపలేదు. 1822 లో వియెన్నా కాంగ్రెస్‌లో ఫ్రాన్స్, స్పెయిన్‌కు సేనలను అంపి శాంతి నెలకొల్పుట మంచిదని ప్రతిపాదించెను. కాని, బ్రిటన్ అందుకు సమ్మతింపలేదు.

ఫ్రెంచివారు యావత్తు బాధ్యతను 1823 లో తామే వహించి స్పెయిన్‌కు సేనలను పంపిరి. ఫెర్డినాండ్‌ను మరల సింహాసనము మీద కూర్చుండబెట్టిరి. కాని, దేశమందు ప్రశాంతి నెలకొనలేదు. తిరుగుబాటు చేసినవారు ప్రభుత్వము ఆదరించిన రోమన్ కేతలిక్ మతమును ఇన్‌క్విజిషన్ పద్ధతిని రద్దుపరచిరి. వాటిని ఫెర్డినాండ్ పునరుద్ధరించుటచేత సంస్కరణము కావలెనన్న ఉదారులతో సంప్రదాయవాదులగు రాజును, చర్చియు ఘర్షణపడిరి.

ఫెర్డినాండ్ 1833 లో చనిపోయెను. నాటినుండి మరల సుమారు నూరు సంవత్సరముల కాలము దేశములోను, మిగిలియుండిన వలసలలోను అల్లరులు చెలరేగినవి. రాజులు దేశ సంప్రదాయములను, రోమన్ కేతలిక్ చర్చిని, ఇన్‌క్విజిషన్ పద్ధతులను నిలుపుకొనజూచిరి. ప్రజలలో చాలమంది ఉదారులు నూతన భావములు గలవారై, తక్కిన దేశములందలి సాంఘిక, ఆర్థిక రాజకీయ సంస్కారములను, సంస్థలను పొందగోరిరి. కోర్టిజ్ అను జాతీయ శాసన నిర్మాణ సభలవారు రాజును నిలబెట్టుటకు ప్రయత్నములను చేయుచుండిరి. రాజు లేని కాలమున ప్రభుత్వ భారము తామే వహించుచుండిరి. కడపటి రాజైన ఆల్‌ఫాన్‌సో - XIII బాలుడు. అతని తల్లి మరయా క్రిష్టయినా కొడుకు తరపున రాజ్యము చేయుచుండిన కాలములో 1898 లో స్పానిష్ - అమెరికన్ సంగ్రామము జరిగినది. అందు స్పెయిన్‌కు పూర్తిగ అపజయము కలిగినది. దానివలన స్పెయిన్‌కు అప్పటికింకా మిగిలియుండిన క్యూబా, పోర్టోరికో, ఫిలిప్పీన్ దేశములు యునైటెడ్ స్టేట్స్‌కు వశపడినవి. దానితో దేశమందలి అశాంతి మరింత ఎక్కువైనది. అరాజకవాదులు చెలరేగిరి. రాజత్వమును అంతరింపజేసి ప్రజాసత్తాక రాజ్యమును

స్థాపింపవలెనను కోరిక తీవ్రమైనది. ప్రథమ ప్రపంచ యుద్ధమందు స్పెయిన్ తటస్థముగ ఉండెను. కాని, స్పెయిన్ పాలనలోని మొరాకోలో దుండగీడులు తిరుగుబాటు చేసిరి. వారిని అణచుటకు ప్రభుత్వము పంపిన సేనలు పూర్తిగ ఓడిపోయినవి. అప్పుడు జనరల్ ప్రైమోడ రీవెరా ప్రభుత్వమును నిందించి 1923 లో నియంతగా ముందరికి వచ్చి అధికారమును వహించెను. ఆల్ ఫాన్ సో - XIII రాజు అతనిని ఆదరించి బలపరచెను. రీవెరా శీఘ్రకాలములో రాజ్యాంగవ్యవస్థను సంస్కరింప జేసి, దేశమున శాంతిని నెలకొల్పుటకు పూనుకొన్నట్లు వాగ్దానము చేసెనే కాని, ఫలితము లేకపోయినది. అప్పుడు సైన్యసాహాయ్యముతో రాజు రీవెరాను పదవినుండి తొలగించి, జనరల్ ఫ్రెడరికో బెరుంగ్వెర్‌ను ప్రధానిగ నియమించెను. ఇతడు 1931 లో రాజ్యాంగవ్యవస్థను పునరుద్ధరించుటకు పూనుకొని కోర్టిజ్ సభల ఎన్నికలు జరుగునని ప్రకటించెను.

ఆ ప్రకటన వలన దేశములో గొప్ప చలనము కలిగినది. రిపబ్లిక్ స్థాపింపవలెనన్న సంకల్పముతో ప్రచారములు చెలరేగినవి. 1931, ఏప్రిల్ 12 న ఎన్నికలు జరిగినవి. రాజత్వమునకు విరుద్ధముగ వోట్లు ఎక్కువగా వచ్చినవి. ఆల్ ఫాన్ సో - XIII తన రాజపదవిని విడవనని మొండిపట్టు పట్టెను. కాని, కార్యము లేకపోయినది. అల్లరులు, అంతర్యుద్ధములు లేకుండ చల్లగా రాజును, రాజ బంధువులును దేశము విడచి పోయిరి. ఎన్నికలలో సోషలిస్టులు ఎక్కువగ నెగ్గిరి. నూతన రాజ్యాంగ వ్యవస్థ ప్రజాసత్తాక రాజ్య నిర్మాణమును గావించి, 1931, డిసెంబరు 10 న అమలులోనికి వచ్చినది. రోమన్ కేథలిక్ మతమునకు విరోధులైన వారికి రాజ్యాధికారము సంక్రమించినది. వారు జెసూట్‌లను దేశమునుండి తరిమివేసిరి. మతసంస్థలు ఈ ప్రభుత్వ యాజమాన్యమునకు వశమైనవి.

ఏదో ఒక విధముగ రాజకీయరంగమందు కొంత శాంతి నిలిచినను, ఆర్థికముగా క్రుంగిపోయిన దేశమందలి ప్రజల దురవస్థ మాత్రము తొలగిపోలేదు. రాజకీయరంగములో కూడ స్థిరత కుదరలేదు. అనేక పక్షములవారు ప్రభుత్వమును కూలద్రోయుటకే చూచుచుండిరి. 1936 లో ప్రజాసత్తాక పక్షములవారు అందరును కలసి మరల ఎన్నికలు జరిపిరి. 'పాప్యులర్ ఫ్రంట్' అను పేరను ఒక ప్రభుత్వ పక్షమును లేవనెత్తుటకు సంకల్పించిరి. వారి సంకల్పము నెరవేరినది. కోర్టిజ్ వారికి వశపడినది. కాని, సైన్యము వలన అల్లరులు వచ్చిపడినవి. తుదకు జనరల్ ఫ్రాంకో విప్లవము లేవదీసి, ఆరంభములో కొంత అపజయమును పొంది మొరాకోకు, యూరప్‌లో కొన్ని ప్రదేశములకు పారిపోయినను, మరల మాడ్రిడ్‌నగరమునకు వచ్చి పక్షమును బలపరచుకొనెను. సుమారు మూడు సంవత్సరముల పాటు స్పెయిన్ అంతర్యుద్ధమునకు పాల్పడినది. కడకు 1939 మార్చి నెల పూర్తి యగునరికి ఫ్రాంకో డిక్టేటర్ అయి, తన అధికారమును దృఢపరచుకొనెను. అతడు ఫాసిస్ట్ విధానమువంటి ప్రభుత్వమును నెలకొల్పి నియంతగ నిలచెను. ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున అక్షరాజ్యముల ఎడ స్పెయిన్ సానుభూతితో మెలగినను, యుద్ధమునందు మాత్రము దిగకుండెను. యుద్ధానంతరమున యూరప్ ఖండమునందును, తక్కిన ప్రపంచమునందును కలిగిన పరిణామములు స్పెయిన్ నియంతయగు ఫ్రాంకోకు ప్రోత్సాహజనకములుగ లేకుండినను, ప్రజాస్వామ్యభావములు తన రాజ్యమున వ్యాపింపకుండ నిరోధించుటలో మాత్రము జాగరూకత వహించెను. 1947 లో కోర్టిజ్ సమావేశమై ఫ్రాంకో యావజ్జీవము నియంతగ ఉండునటులను, అతని తరువాత రాజత్వము పునరుద్ధరింపబడునటులను తీర్మానించెను.

యుద్ధానంతరమున సోవియట్ రష్యాకు పాశ్చాత్య రాజ్యములతో ఏర్పడిన వైరుధ్యముల ఫలితముగ బయలుదేరిన ప్రచ్ఛన్నయుద్ధము [చూ. పు. 593] మూలమున యునైటెడ్ స్టేట్స్ మొదలగు అట్లాంటిక్ రాజ్యములు స్పెయిన్‌తో సన్నిహిత మైత్రిని కుదుర్చుకొనక తప్పినది కాదు. అందువలన యునైటెడ్ స్టేట్స్‌నుండి ఆర్థిక సాహాయ్యమును విరివిగ స్పెయిన్ పొందగలిగినది. అంతియే కాక 1953 లో యునైటెడ్ స్టేట్స్‌తో స్పెయిన్ సైనిక సంధి నొకదానిని కుదుర్చుకొనెను. 1955 లో ఐక్యరాజ్య సమితి సభ్యత్వమును కూడ ఈ దేశము ఆర్జించెను.

రాజ్యాంగము : నిశ్చితరూపమున రాజ్యాంగ విధానము ఏదియు ఈ దేశమున రూపొందింపబడలేదు. దేశాధీశున (కాడిల్లో) కు ఇందు విశేషాధికారములు కలవు. ఫ్రాంకో నియంత ఇప్పటి దేశాధీశుడు; తనచే నియమింపబడిన మంత్రిమండలి సాయమున ఇతడు పరిపాలనను నిర్వహించును. శాసనసభ (కోర్టిజ్) ఒకటి కలదు. దీని తీర్మానములను దేశాధీశుడు వీటో చేయవచ్చును. ఈ కోర్టిజ్‌నందలి సభ్యులలో అధిక సంఖ్యాకులు ప్రజానీకమందలి వివిధ వర్గములనుండి - రాష్ట్రసంఘములు, నగరసంఘములు జాతీయ వ్యాపార సంస్థలు, విశ్వవిద్యాలయములు, పండిత పరిషత్తులు, వృత్తిసంఘములు, ఫ్రాంకోను బలపరచు ఫలాంజ్ పక్షపు జాతీయసమితి మొదలగువానినుండి - ఎన్నుకొనబడెదరు. ఇటుల ఎన్నుకొనబడినవారు కాక

50 మందిని సభ్యులుగ దేశాధీశుడు నియమించును. ఇంతే కాక కోర్టిజ్ అధ్యక్షుని, ఇద్దరు ఉపాధ్యక్షులను, నలుగురు కార్యదర్శులను కూడ దేశాధీశుడే నియమించును. కోర్టిజ్ సభ్యుని పదవీకాల పరిమితి మూడేండ్లు. 21 ఏండ్లు దాటిన పౌరులకెల్ల ఈ దేశమున వోటుహక్కు కలదు. ఫ్రాంకోను బలపరచు ఫలాంజ్ పార్టీ తప్ప తక్కిన రాజకీయపక్షము లన్నియు దేశమున నిషేధింపబడినవి.

పాలితప్రాంతములు: మొరాకో దేశమునందు భౌగోళిక ముగ చేరి ఉన్న క్యూటా మొదలగు కొన్ని ప్రాంతములపై (వి. 173 చ. కి. మీ.) స్పెయిన్‌నకు పాలనాధికారము కలదు. పశ్చిమ ఆఫ్రికాయందలి ఇఫ్నీ (వి. 1,499 చ. కి. మీ.), స్పానిష్ సహారా (వి. 2,65,960 చ. కి. మీ.), స్పానిష్ గినీ (వి. 27,979 చ. కి. మీ) స్పెయిన్ వలస రాజ్యము లుగ ఉన్నవి. గి. వేం. సీ.: చీ. శే. రా.

**స్మిత్, ఆడమ్:** చూ. సం. - 5; పు. 738.

**స్వాజీలాండ్:** దక్షిణ ఆఫ్రికాయందలి రాజ్యము.

ఈ రాజ్యమునకు దక్షిణ ఆఫ్రికా గణరాజ్యము [ఉ, ప, ద]; దక్షిణ ఆఫ్రికా గణరాజ్యముతోపాటుగ, కొంతవరకు పోర్చుగీస్ తూర్పు ఆఫ్రికా [తూ] సరిహద్దులందు ఉన్నవి. [వి] 17,365 చ. కి. మీ., [జ] 2,70,000. ఇందులో దాదాపు 6,000 యూరపియన్‌లు, 1,500 మిశ్రజాతులవారు కలరు. తక్కిన వారందరు స్వాజీ అను ఆఫ్రికన్ జాతికి చెందినవారు. [భా] ఆఫ్రికన్ భాషలు వ్యాప్తియందు ఉన్నను, వ్యావహారిక భాషగ ఇంగ్లీషు మాత్రమే ఉపకరించుచున్నది. [రా] ఉంబాబానే (జ. సం. 5,500).

చరిత్ర: బా - రపూజా అను ఆఫ్రికన్ జాతి తొలుత నుండియు ఇట వసించుచుండెను. 19 వ శతాబ్దమున ప్రక్క ఉన్న జూలూ జాతివారు వీరిని జయించి దేశమును వశ పరచుకొనిరి. కాని, 1843 న స్వాజీ అనువాని నాయకత్వ మున ఈ బా - రపూజావారు స్వాతంత్ర్యమును ఆర్జించిరి. ఆ నాయకుని పేరనే ఈ జాతికి 'స్వాజీ' 'అను పేరు కలిగెను. ప్రక్కన ఉన్న ట్రాన్స్‌వాల్‌నందలి బోయర్ ప్రభుత్వము 1884 లో స్వాజీలాండ్ స్వాతంత్ర్యమును గుర్తించెను. కాని, ఈ ఒడంబడికను ఉల్లంఘించి ట్రాన్స్‌వాల్ ప్రభు త్వము ఈ దేశముపై ఆధిపత్యమును వహించుటకు పలుమారులు యత్నించెను. ఇంతలో ఆ దేశమున బంగారు గనులు కొన్ని బయటపడుటచే వివిధ యూరపియన్ దేశములవారు అచటికి రాదొడగిరి. ప్రభువగు ఉబాండినేకు కొంత ధనమొసగి, ఈ యూరపియన్‌లలో అనేకులు దేశమున వివిధ ప్రాంతములందు స్వామ్యములను ఆర్జించిరి. ఈ పరిస్థితులలో దక్షిణ ఆఫ్రికా ప్రభుత్వముతో కలసి బ్రిటిష్‌ప్రభుత్వము ఇచటి యూరపియన్‌ల భద్రత కొరకై దేశమును తన రక్షణలోనికి తీసికొనెను (1890). ఆ తరువాత పరిపాలనా సౌకర్యము నిమిత్తమై దక్షిణ ఆఫ్రికాలో కలుపుకొనకుండుటకును ఏర్పాటు జరిగెను (1899). 1902 తరువాత ఈ ఏర్పాటును రద్దొనర్చి బ్రిటిష్ ప్రభుత్వమే రక్షణభారము వహించినది. తరువాత ఇది బసూటోలాండ్, బెచూనాలాండ్‌లతోపాటుగ బ్రిటిష్ హైకమీషనర్ పాలనలో ఉండినది. కాలక్రమమున బసూటోలాండ్, బెచూనాలాండ్ స్వతంత్రములైనవి (1967). స్వాజీలాండ్ కూడ 1967, నవంబరున స్వతంత్ర తను పొందుటకు నిర్ణయము జరిగినది. చీ. శే. రా.

**స్వాతంత్ర్యము:** ఒక వ్యక్తి గాని, ఒక సంఘము గాని క్రమక్రమ పరిణతిని చెంది, సమగ్రతను పొందుటకు వీలులేకుండా నిరోధించునట్టి ఏ విధమైన ప్రతిబంధకమును లేకపోవుటయే స్వాతంత్ర్యము. మానవ స్వాతంత్ర్య చరిత్ర కూడ మానవజాతియంత సనాతనమైనది. మానవులలో కనిపించు వైవిధ్యమును, మానవ సమాజముల పరి మాణములోను, సంఖ్యలోను, ప్రకృతిలోను కనిపించు నిరంతర పరిణామమును, మానవులు లక్షించిన లక్ష్యము లయు, ఆ లక్ష్యముల సాధనకై అవలంబించిన విధానము లయు ఆ వైవిధ్యములును కారణములుగ స్వాతంత్ర్య పదము వేర్వేరు ప్రజలకు వేర్వేరు అర్థములలో రూఢ మైనది. అర్వాచీనచరిత్రలో సమాజ స్వాతంత్ర్యము కొరకు జరిగిన పోరాటమును, వ్యక్తి స్వాతంత్రము కొరకు జరిగిన పోరాటమును ప్రక్కప్రక్కనే సాగినవి. ప్రజలు జాతీయ స్వాతంత్ర్యము కొరకును, వ్యష్టి స్వాతంత్ర్యము కొరకును ఏకకాలమున పోరాడిరి. ఇందులకు అమెరికా విప్లవము చక్కని ఉదాహరణము. అయినను నాడుకూడ కొన్ని జాతులు బయటినుండి ఎట్టి నిర్బంధమును లేని సంపూర్ణ స్వాతంత్ర్యమును తాము అనుభవించుచున్నప్పటి కిని, తమ పౌరులకు మాత్రము అట్టి స్వాతంత్ర్యములను మంజూరు చేయలేదు. సమాజ స్వాతంత్ర్యము 19 వ శతా బ్దిలో జాతి రాజ్య ప్రాదుర్భావమునకును, జాతీయ స్వయం నిర్ణయ సూత్రమునకును దారితీసినది. వ్యక్తి స్వాతంత్ర్య సాధనమే ఔదార్యవాదులు అందరి యొక్కయు లక్ష్యము. హక్కుల పత్రములలోను, ప్రజాస్వామిక జాతుల రాజ్యాంగములలోను ఆ లక్ష్యము కొంతవరకు సిద్ధించి నది. సామాజిక, వైయక్తిక స్వాతంత్ర్యముల మధ్యను, స్వేచ్ఛాసమానత్వములమధ్యను తౌల్యమును, సామరస్య మును సాధించుట ఎట్లను మహత్తరమైన సమస్య నేటి స్వతంత్ర ప్రభుత్వములను అన్నిటిని ఎదుర్కొను చున్నది. ప్ర. రా.

**స్విజర్లండ్ :** యూరప్ నందలి ఒక స్వతంత్ర దేశము. దేశీయులకు 'స్విస్ ప్రజ' లని వ్యవహారము కలదు.




ఈ దేశమునకు పశ్చిమ జర్మనీ [ఉ]; ఆస్ట్రియా, లిక్టన్‌స్టీన్ [తూ]; ఇటలీ [ద]; ఫ్రాన్సు [ప] సరిహద్దులందు ఉన్నవి. [వి] 41,295 చ. కి. మీ.; [జ] 58,74,000. [భా] జర్మన్, ఫ్రెంచి, ఇటాలియన్, రోమన్ భాషలు జాతీయభాషలుగ పరిగణన పొందినవి. [మ] దేశవాసులందరును క్రైస్తవులు, అందు ప్రొటెస్టంట్ శాఖను అనుసరించి వారి సంఖ్య 56%. [రా] బెర్న్ (జ. సం. 1,65,806); తక్కిన నగరములలో పేరెన్నిక కనినది జెనీవా నగరము (జ. సం. 1,77,800). ఈ నగరము **అంతర్జాతీయ** సమావేశములకు ప్రఖ్యాతి పొందినది.

చరిత్ర : క్రీస్తుశకారంభమునకు పూర్వమున ఇచట హాల్‌వెట్టి అను తెగకు చెందిన కెల్టిక్ జాతి ప్రజలు వసించుచుండెడివారు. రోమన్‌లు వీరిని క్రీ. పూ. 58 లో జయించి, ఈ ప్రాంతమును తమ సామ్రాజ్యమున ఒక రాష్ట్రముగ చేసిరి. ఈ రాష్ట్రమునందలి ప్రముఖ మండలము అగు 'స్విజర్' ను బట్టి ఈ రాష్ట్రమునకు స్విజర్లండ్ అని అప్పటిలో పేరిడబడెను. రోమన్ సామ్రాజ్యమును అనాగరక జర్మనుజాతులు అంతమొందించిన కాలమున ఈ దేశము 'అలామన్నీ' అను జర్మను జాతి యొక్క వశమయ్యెను (క్రీ. శ. 250). తరువాత ఈ దేశమున కొంత భాగమును క్రీ. శ. 433 లో బర్గండియా పాలకులు ఆక్రమించిరి. కాలక్రమమున ఈ దేశపు పరిసర ప్రాంతములను కైవసమొనర్చుకొనిన ఫ్రాంక్‌లు అలామన్నీ తెగవారిని క్రీ. శ. 496 లోను, బర్గండియన్‌లను 524 లోను నిర్జించి, ఈ దేశమున తమ అధికారమును నెలకొల్పిరి. ఈ ఫ్రాంక్‌ల పరిపాలనాకాలముననే, ఈ దేశమున జూరిచ్, లూసేనీ మొదలగు నగరములు నిర్మింపబడుటయు, క్రైస్తవ మతము ప్రజాదరణను ఆర్జించుటయు జరిగెను.

ఫ్రాంక్‌ల రాజులలో అత్యంత ప్రముఖుడుగ చారిత్రక ప్రసిద్ధిని ఆర్జించిన షార్లమేన్ [చూ.] చక్రవర్తి మరణించిన తరువాత ఆ రాజ్యము క్షీణదశకు వచ్చుట వలన, 1032 లో ఈ దేశము పవిత్రరోమన్‌సామ్రాజ్యమున అంతర్భాగము అయ్యెను. అంతట 13 వ శతాబ్దిలో ఇయ్యది హాబ్స్‌బర్గ్ రాజవంశీకుల అధీనమయ్యెను. ఈ రాజవంశీకుల నిరంకుశపాలనను అంతమొందించు తలపుతో ఈ దేశమందలి ష్విజ్, ఊరి, అంటర్ - వాల్డ్‌న్ మండలములు 1291, ఆగస్టు 1 వ తేదీన ఒక 'శాశ్వత మైత్రి' ని కుదుర్చుకొనెను. ఇదియే నేటి స్విస్‌సమాహారమునకు ప్రాతిపదిక చర్య అని అనదగును. ఈ శాశ్వత మైత్రిని అంతమొందించు తలపుతో హాబ్స్‌బర్గ్ ప్రభువులు ఈ మండలములపై దండెత్తిరి. కాని, 1315, నవంబరు 15 వ తేదీన జరిగిన యుద్ధమున ఆ ప్రభువులు ఓడింపబడుటతో, స్విస్ ప్రజలు తమ స్వాతంత్ర్యమును ఆర్జింపగలిగిరి. తరువాత 1353 నాటికి సమీపమున ఉన్న జూరిచ్ మొదలగు అయిదు మండలములు ఈ శాశ్వతమైత్రీ మండలములతో చేరెను. ఈ విధముగ స్విస్ ప్రజలు స్వతంత్రులు అగుట సైరింప జాలక ప్రక్కన ఉన్న ఆస్ట్రియా ఈ దేశముపై 1386, 1388, 1460, 1498 లలో వరుసగ నాలుగు దండయాత్రలను ఒనర్చెను. కాని, కడకు స్విస్ ప్రజలు విజయులై, పవిత్ర రోమన్ సామ్రాజ్య శృంఖలములనుండి విడివడి సంపూర్ణ స్వాతంత్ర్యమును పొందిరి (1499). ఆస్ట్రియాతో జరిగిన యుద్ధముల కాలముననే పరిసరములందు ఉన్న మరికొన్ని మండలములు స్విజర్లండ్ సమాహారమున స్వేచ్ఛాపూర్వకముగ చేరినవి. మరికొన్నింటిని తమ భద్రత దృష్ట్యా స్విజర్లండ్ పాలకులు జయించి వశపరచుకొనిరి. ఇటుల విస్తృతమైన ఈ స్విస్ రాజ్యమునకు వెస్ట్‌ఫేలియా శాంతి సంధిని అనుసరించి అంతర్జాతీయ పరిగణన లభించెను.

జెనీవా వాసియగు జాన్ కాల్విన్ మొదలగువారి నాయకత్వమున 16 వ శతాబ్దమున రూపొందిన క్రైస్తవ మతసంస్కరణోద్యమమువలన ఈ దేశము అంతఃకల్లోలములకు గురి అయ్యెను. సంస్కరణమును అభిమానించిన ప్రొటెస్టంట్‌లును, తద్వ్యతిరేకులగు రోమన్ కేతలిక్‌లును దేశమును యుద్ధరంగముగ మార్చిరి. దాదాపు 200 సంవత్సరములు ఈ ఉభయవర్గముల వారును పోరాడిన పిదప కట్టకడకు 1712 లో అంతిమ విజయము ప్రొటెస్టంట్‌లకు దక్కెను. 1815 లో జరిగిన వియెన్నా కాంగ్రెస్ [చూ.] న స్విజర్లండ్‌ను తటస్థరాజ్యముగ యూరప్ రాజ్యములు గుర్తించుటయే కాక, శాశ్వతముగ ఆ తాటస్థ్యమును మన్నించుటకు అంగీకరించినవి. ఆ వత్సరమే మరికొన్ని పరిసరమండలములు స్విజర్లండ్ సమాహారమున చేరుటకు వసతి కలుగజేయబడినది. **అంతట**

1848 లో ఈ రాజ్యమునకు ఒక రాజ్యాంగ విధానము రూపొందింపబడి, తరువాత 1874 లో సవరింపబడినది.

తాను అవలంబించిన శాశ్వత తాటస్థ్యనీతికి భంగము కలుగకుండ ప్రథమ, ద్వితీయ ప్రపంచయుద్ధకాలములందు ఈ దేశము నిలువగలిగినది. ఈ తాటస్థ్యము ఎడల గల గౌరవమును బట్టియే ప్రథమ ప్రపంచ యుద్ధానంతరమున ఏర్పడిన నానాజాతి సమితి కేంద్ర కార్యాలయము ఈ రాజ్యమందలి జెనీవానగరమందు నెలకొల్పబడినది. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున సైతము పలు అంతర్జాతీయ సంస్థలకు జెనీవా ముఖ్య కేంద్రముగ ఉన్నది.

**రాజ్యాంగము:** స్విజర్లండ్‌నందలిది ఒక సమాఖ్యా పద్ధతి ప్రజాప్రభుత్వము. 1874 లో ఆమోదింపబడి దరిమిలా అంతటంతట సవరణలనందిన రాజ్యాంగ చట్టమును అనుసరించి ప్రజాప్రభుత్వము ఇట నిర్వహింపబడుచున్నది. ఈ దేశమంతట 22 కాంటన్‌లు ఉన్నవి. ఒక్కొక్క కాంటన్‌కు దానికి అనువైన రాజ్యాంగమును, స్థానిక ప్రభుత్వమును కలవు. ఒక మూడు కాంటన్‌లు మాత్రము 'అర కాంటన్ (హాఫ్ కాంటన్)' లుగ పరిపాలనా సౌకర్యార్థము విభజింపబడి ఉన్నవి.

రాజ్యమునకు సంబంధించిన శాసన నిర్మాణాధికారము అంతయును రెండు కక్ష్యలు కల పార్లమెంట్‌నందు న్యస్తమై ఉన్నది. ఎగువ కక్ష్యను 'నేషనల్ రాట్' అని. దిగువ కక్ష్యను 'స్టాండరాట్' అని అందురు. దేశమునందలి ప్రతి 22,000 నకు ఒకడు వంతున ఎన్నుకొనబడిన 200 మంది ప్రజాప్రతినిధులు 'నేషనల్ రాట్' న సభ్యులుగ ఉన్నారు. వీరు నాలుగేండ్లకు ఒకసారి నూతనముగ ఎన్నుకొనబడుచుందురు. 'స్టాండరాట్' లో కాంటన్‌కు ఇద్దరు వంతున దేశమునకు మొత్తముమీద 44 మంది ఉందురు. వీరికి కాలపరిమితి లేదు. ఎన్నిక పద్ధతి నిర్ణీతమైనదియు కాదు. ఈ రెండు సభలును కలసి 'బుందెస్‌రాట్' ను ఎన్నుకొనును. బుందెస్‌రాట్ బ్రిటన్‌లోని 'కాబినెట్' వలె కార్యనిర్వాహకవర్గసంస్థగ స్విజర్లండ్‌లో పని చేయును. ఇందు వేరు వేరు కాంటన్‌లకు చెందిన ఏడుగురు సభ్యులు ఉందురు. వారందరు ప్రభుత్వ శాఖకు అధిపతులు. ఏడాదికి ఒక బుందెస్‌రాట్ మెంబరు దానికి అధ్యక్షుడుగ ఉండును. అధ్యక్షుడైనంత మాత్రమున ఇతర సభ్యులకన్న ఎక్కువ అధికారములు ఏవియు అతనికి ఉండవు.

కొన్ని కాంటన్‌లలో ఆ కాంటన్‌లోని ప్రజాసామాన్యమంతయును కలసిన సభ ద్వారా ప్రభుత్వపు పనులు జరుగుచుండును. దీనిని 'లాండ్స్ జెమీండ్' అని అందురు. కాంటన్‌కు అంతటికిని కావలసిన ఖాయమైన శాసనములను, అత్యవసర పరిస్థితులను ఎదుర్కొనుటకు కావలసిన 'ఆర్డినెన్స్' లను కూడ ఈ సభ చేయుచుండును. ఈ మోస్తరు స్థానిక ప్రభుత్వము 1200 సంవత్సరము నాటి నుండి స్విజర్లండ్‌లో నడచుచున్నది.

కాంటన్‌లు చాలవరకు చాలగొప్పవగుటచే ఆ కాంటన్‌ల ప్రజాసామాన్యము అంతయు కలసి సభ చేయుటకు సాధ్యపడదు. అందుకు బదులుగా చాల కాంటన్‌లందు శాసననిర్మాణసంస్థ ప్రభుత్వమును సాగించుచుండును. అయితే, ముఖ్యమైన శాసనములకు మాత్రము ప్రజా సామాన్యముయొక్క అనుమతిని పొందుట పరిపాటియైపోయినది. ఒక్కొక్కప్పుడు ప్రజలలో కొంతమంది శాసననిర్మాణసంస్థ సమ్మతింపని శాసనములకు కూడ కొన్నిటిని ప్రజాసమ్మతి కొరకు సూటిగా ఏర్పాటు చేయుదురు. ఇట్టి పద్ధతికి 'ప్రత్యుత్క్రమ ప్రనివేదన (ఇనీషియేటివ్ అండ్ రెఫరెండమ్)' విధానపు శాసన నిర్మాణ పద్ధతి అని పేరు. చీ. శే. రా.; ఏ. ఎస్. గుప్త.

**స్వీడెన్:** యూరప్ ఖండమందలి స్వతంత్రరాజ్యము. దేశీయులకు 'స్వీడులు' అను వ్యవహారము కలదు.




ఈ దేశమునకు బొత్నియా సింధుశాఖ, బాల్టిక్ సముద్రము [తూ, ద]; ఈ దేశమును డెన్మార్కునుండి వేరుపరచు కట్టెగాడ్, ఒరిసండ్ జలసంధులు, నార్వే [ఉ, ప] సరిహద్దులుగ ఉన్నవి. బాల్టిక్ సముద్రమునందలి కొన్ని ద్వీపములును పరిపాలన రీత్యా ఈ రాజ్యమున చేరి ఉన్నవి. వానిలో గోట్లండ్, ఆలండ్

అనునవి పేర్కొనదగినవి. [వి] 4,49,793 చ. కి. మీ. కాని, ఈ దేశమున ఉన్న 96,000 సరస్సుల విస్తీర్ణము కూడ అందు చేరి ఉన్నది. ఈ జలాశయముల విస్తీర్ణము 99,775 చ. కి. మీ. ; [జ] 65,81,237. [భా] జాతీయభాష స్వీడిష్. అల్ప సంఖ్యాకుల మాతృ భాషలుగ ఫిన్నిష్, లాపిష్ భాషలు కొన్ని ప్రాంతములందు ప్రచారమున ఉన్నవి. [మ] దేశమున అత్యధిక సంఖ్యాకులు క్రైస్తవులు ; యూదులును స్వల్పసంఖ్యాకులలో కలరు. క్రైస్తవులందు ప్రొటెస్టంట్ శాఖవారు ఎక్కువగ కలరు. [రా] స్టాక్‌హోమ్ (జ. సం. 11,44,630).

చరిత్ర: స్వీడెన్ చాల పురాతన దేశములలో ఒకటి. ఇచట ప్రాచీన శిలాయుగ కాలమునుండి జనులు నివసించిరి. గాత్‌లు, సెవియర్‌లు కలసి కొంతకాలమునకు స్వీడిష్ జాతిగ రూపొందిరని చరిత్రకారుల అంచనా. ఈ దేశము నుండి గాత్‌లు బయలుదేరి దేశదేశములకు వలసలు పోయిరి. ఈ వలసలు పోవుట వైకింగ్‌ల కాలములో (700 - 900) కూడ జరిగినది. ఈ వైకింగ్‌లే స్వీడెన్‌కు క్రైస్తవ మతమును తెచ్చిరి.

ఎరల్ బర్జర్ అను రాజనీతివేత్త 1248 నుండి 1266 వరకు దేశమున సర్వాధికారముల వహించి, వెట్టి చాకిరిని నిర్మూలించి, భూస్వాముల ఆధిపత్యమును అడచి రాచరికమునకు మార్గము సుగమము చేసెను. అధికారము ఇట్లు ఒక రాజు చేతిలో ఉండుటవలన స్వీడెన్‌కు నూతన ప్రాభవము వచ్చినను, అనతికాలముననే మతాధిపతులు, భూస్వాములు అధికారమును పంచుకొని దేశములో ఫ్యూడల్ వ్యవస్థను ఏర్పాటు చేసిరి. జర్మను వర్తకులు, హేన్‌సిటియాటిక్ లీగ్ వారు స్వీడెన్‌లో పట్టణములు నిర్మించి, తాము కూడ ప్రభుత్వాధికారములో పాలు పంచుకొనిరి.

స్వీడెన్‌లో అధికారము వికేంద్రీకృతము అగుటతో దేశముపై పరుల పెత్తనము సులభసాధ్యమైనది. 1388 లో డెన్మార్క్, నార్వేలకు రీజంట్ అయిన మార్గరెట్ రాణి స్వీడెన్‌కు కూడ రీజంట్‌గా ఎన్నికైనది. 1397 నుండి ఈ మూడు దేశములు ఏకముచేయబడినవి. అది స్వీడిష్ ప్రజలకు కష్టదాయకమైనది. అంత వారు చాలసార్లు స్వాతంత్ర్యము కొరకు విప్లవము చేసి, 1521 లో గస్టావస్ వాసా నాయకత్వమున స్వాతంత్ర్యమును సాధించిరి. గస్టావస్ వాసా స్వీడెన్ రీజంట్ అయి, తదుపరి (1523) రాజయ్యెను.

చాలదేశములు కేతలిక్ మతమునుండి 16 వ శతాబ్దారంభమున విడిపోవుచుండెను. గస్టావస్ కూడ తాను కేతలిక్ మతమునుండి విడిపోయి, చర్చి ఆదాయములను తానే తీసికొని, బలమును పెంపొందించుకొనెను. 1560 లో అతడు చనిపోవునాటికి ఉత్తర యూరప్‌లో స్వీడెన్ బలవత్తమ దేశమై ఉండెను. అందువలననే గస్టావస్‌ను నవీన స్వీడెన్ దేశపు నిర్మాతగా పరిగణింతురు.

తరువాత కొద్ది శతాబ్దములలో స్వీడెన్ చాల విజయములు పొందినది. బాల్టిక్ సముద్రపుతీరమున చాల ప్రదేశము సంపాదించి బాల్టిక్ సముద్రమును కేవలము 'స్వీడిష్ సరస్సు' గా మార్చివేసినది. పశ్చిమ దిక్కున సముద్రముల వైపునుండి మార్గమును నిరోధించు స్కానియా వంటి రాష్ట్రములను కూడ స్వాధీనము చేసికొనినది. 1611-1718 మధ్య గస్టావస్ అడాల్ఫస్, చార్లెస్ గస్టావస్ - X, చార్లెస్ - XII అను ముగ్గురు బలవంతులైన వీరులకు స్వీడెన్ స్వాధీనమైనది. వీరు చరిత్రలోని గొప్ప విజయములను కొన్నిటిని సాధించిరి.

కాని, స్వీడెన్ ప్రాభవము ఎంతో కాలము నిలువలేదు. 1770 లో డెన్మార్క్, ప్రష్యా, పోలండ్, సాగ్జనీ, రష్యాలు ఏకమై, స్వీడెన్ ఓడిపోవువరకు పోరాడినవి. చార్లెస్ - XII మరణముతో స్వీడెన్ పూర్తిగ పతనమైనది.

చార్లెస్ - XII మరణముతో స్వీడెన్‌లో సర్వాధికారయుత రాజరికము కూడ అంతమయినది. పార్లమెంట్ పరిపాలన ప్రారంభమైనది. కాని, 18 వ శతాబ్దములో పార్లమెంట్ పరిపాలన దుష్టమార్గములను అవలంబించుటచే గస్టావస్ - III మరల రాజత్వమును ఏర్పరచెను.

నెపోలియన్ యుద్ధముల కాలమున స్వీడెన్ ఆ యుద్ధములకు అతీతముగ ఉండగోరినది. కాని, రష్యా, డెన్మార్క్‌లు స్వీడెన్‌ను, దానికి చెందిన ఫిన్లాండ్‌ను ముట్టడించినవి. ఫిన్లాండ్ 1809 లో శత్రువశమయ్యెను. నెపోలియన్‌తో మంచిగా ఉండవలెనని స్వీడెన్ నెపోలియన్ సేనానాయకుడైన బెర్నాడట్‌ను తన పరిపాలకునిగ కూడ ఎన్నుకొనినది. కాని, బెర్నాడట్ పరిపాలకుడైన మరుక్షణమునుండి బ్రిటన్, రష్యాలతో నెపోలియన్‌కు విరుద్ధముగ స్నేహము చేయనారంభించెను. నెపోలియన్ పతనానంతరము ఫిన్లాండ్‌ను పోగొట్టుకొన్నందుకు ప్రతిఫలముగ స్వీడెన్‌కు నార్వేను ఇచ్చిరి. 1905 వరకును నార్వే స్వీడెన్‌తో కలసి ఉండెను.

స్వీడెన్‌లో రాజకీయమైన మార్పులు 19 వ శతాబ్దములో వచ్చినవి. పార్లమెంట్ (రిక్స్‌డాగ్) కు మరల పాలనాధికారములు వచ్చినవి. ప్రాతపద్ధతిపోయి, రెండు సభలు గల క్రొత్త పార్లమెంట్ 1866 లో ఏర్పడెను. స్వీడెన్ యాంత్రిక పరిశ్రమల వలన చాల అభివృద్ధిపొందినది. ఆ యభివృద్ధితోపాటు అధికారముకూడ క్రమముగ భూస్వాములనుండి మధ్యతరగతి వారికి, వారినుండి కార్మికు

లకు సిద్ధించినది. 1920లో స్వీడెన్‌కు కార్మికవర్గ ప్రభుత్వము కూడ ఏర్పడినది.

రెండు ప్రపంచ యుద్ధసమయములలోను స్వీడెన్ తటస్థముగ ఉండెను. అందుచేత ఆక్రమితదేశముల వ్యక్తులు అనేకులు ఈ దేశమున తలదాచుకొనిరి. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున యూరప్ రాజకీయ రంగమున చెలరేగిన ప్రచ్ఛన్న యుద్ధమునందు సైతము స్వీడెన్ తాటస్థ్యమును నిలబెట్టుకొనగలిగినది. సమీప రాజ్యములగు నార్వే, డెన్మార్క్‌లు నాటోలో చేరినను, స్వీడెన్ మాత్రము అటుల చేరుటకు నిరాకరించినది. కాని, యూరప్ పునరుద్ధరణకై ఐక్యరాజ్యసమితియు, యునైటెడ్‌స్టేట్స్‌ను ఒసగిన సహాయమున తన వంతును గ్రహించుటకు స్వీడెన్ అంగీకరించి, దాని సాయమున ఆర్థికసుస్థిరతను ఆర్జించినది. 1946 లో ఈ దేశము ఐక్యరాజ్య సమితి సభ్యత్వమును ఆర్జించినది. 1959 లో ఐరోపా స్వేచ్ఛా వ్యాపార సమ్మేళనములో సభ్యత్వము పొందినది.

రాజ్యాంగము : వంశానుగతము, రాజ్యాంగ చట్టబద్ధము అగు రాచరికము ఇచట అమలునందు ఉన్నది. శాసన నిర్మాణాధికారము రిక్స్‌డాగ్ అనబడు శాసన సభయందును, రాజునందును న్యస్తమై ఉన్నది. రిక్స్‌డాగ్ నందు రెండు కక్ష్యలు కలవు. ఎగువ కక్ష్యయందు 151 మంది సభ్యులు ఉందురు. ఈ సభయందలి సభ్యుని పదవీకాలపరిమితి ఎనిమిది సంవత్సరములు. అయినను, ఈ నియమమునకు భంగము కలుగని రీతిగ ఒక క్రమపద్ధతిని అనుసరించి ఈ సభలో ఎనిమిదవవంతు సభ్యులు ప్రతి సంవత్సరము పదవినుండి విరమించు ఏర్పాటు కలదు. కనుక, అటుల కొరవడిన స్థానములకు ప్రతి సంవత్సరము ఈ సభకు ఎన్నికలు జరుగును. స్థానిక సంస్థల సభ్యులు ఈ సభకు వోటర్లుగ నుండి సభ్యులను ఎన్నుకొనెదరు. దిగువ సభయందు 231 మంది సభ్యులు కలరు. ఈ సభకు నాలుగేండ్లకు ఒకసారి సాధారణపు ఎన్నికలు జరుగును. ఈ ఎన్నికలు సార్వజనిక రహస్య, అపరోక్షపు పద్ధతిలో జరుగును. 21 ఏండ్ల వయసుకు తగ్గని పౌరులకు అందరికి ఈ దేశమున వోటుహక్కు కలదు. రిక్స్‌డాగ్ సభ్యుడు కనీసము 23 ఏండ్ల వయసునకు తగ్గరాదు. రిక్స్‌డాగ్ నందు అధిక సంఖ్యాకుల ఆదరణను ఆర్జించిన పక్షమునుండి గాని, అట్టిది లేనిచో అట్టిదే అగు పక్షకూటమినుండి గాని రాజు 14 లేదా 15 మంది మంత్రులను నియమించును. కార్యనిర్వహణ బాధ్యత లాంఛనముగ రాజునకు చెందియే ఉన్నను, ఆచరణయందు ప్రధాన మంత్రియే ఈ బాధ్యతను నిర్వర్తించును. వివిధ పరిపాలన శాఖల వ్యవహారములను నిర్వర్తించుటకు కేంద్రమండలులును పరిమితాధికారములతో రిక్స్‌డాగ్‌చే ఏర్పరుపబడినవి. ఆ యా శాఖలకు సంబంధించిన మంత్రులు ఆ వ్యవహార నిర్వహణమునకు ప్రాతిపదికలగు సూత్రములను, విధానములను మాత్రమే రూపొందింతురు. శాసనముల అమలులో గల లోపములను పర్యవేక్షణ చేయుటకు 48 మంది సభ్యులుగల మండలిని, అందులకు ఒక పాలకుని నాలుగేండ్లకు ఒకసారి రిక్స్‌డాగ్ ఎన్నుకొనును. మంత్రిమండలి, సైనిక శాఖల వ్యవహారములయందు మాత్రము ఈ మండలికి అధికారము ఉండదు. రిక్స్‌డాగ్‌లోని ఎగువ కక్ష్యను రద్దు చేయవలయునను ఆలోచన ఈ దేశమున రాజకీయవేత్తలలో కలదు. కాని, అది ఇంతవరకు కార్యరూపమును దాల్చ లేదు. వి. రా. ; చీ. శే. రా.

**హంగేరీ :** ఆగ్నేయ యూరప్‌నందలి ఒక స్వతంత్ర రాజ్యము. ఆ దేశస్థులు తమ దేశమును 'మాజియర్ ; అను పేర వ్యవహరింతురు.




అన్ని దిక్కుల భూపరివృత్తమై ఉన్న ఈ దేశమునకు జెకోస్లోవాకియా [ఉ]; సోవియట్ రష్యా, రుమేనియా [తూ]; యుగోస్లావియా [ద]; ఆస్ట్రియా [ప] సరిహద్దులందు ఉన్నవి. [వి] 93,030 చ. కి. మీ. ; [జ] 1,01,04,000. [భా] దేశభాష మాజియర్ (దీనినే హంగేరియన్ అని విదేశీయులు వ్యవహరింతురు). [మ] ప్రజలందరును క్రైస్తవులు, అందును రోమన్ కేథలిక్ సంప్రదాయమునకు వ్యాప్తి ఎక్కువ. అయినను ప్రస్తుత ప్రభుత్వము దైవవిశ్వాసమును ప్రోత్సహించునది కాదు కనుక మతమునకు గల విలువ తగ్గిపోవుచున్నది. [రా] బుడాపెస్ట్ (జ. సం. 18,07,299).

చరిత్ర : యూరల్ పర్వత పరిసరములందు పూర్వము వసించుచుండిన మాజియర్‌లను ఆయుధోపజీవులు క్రీ. శ. 895 - 896 లో యూరప్‌నందలి తిస్సా, డాన్యూబ్ నదుల మధ్యను ఉండి, నేడు హంగేరి అని పిలువబడు ప్రదేశముపై దండెత్తి, అంతకు పూర్వమునుండి అట

అధికారమున ఉన్న మొరేవియన్ సామ్రాజ్యమును అంత మొందించి, ఆ ప్రదేశమును క్రమముగ వశపరచుకొనిరి. అంతకు పూర్వము వసించు స్లావ్ మొదలగు జాతులు విదేశములకు వలసపోవుటయో లేదా కొంతవరకు మాజియర్లతో కలసిపోవుటయో జరుగుటచే, ఈ ప్రాంత మంతయు మాజియర్ల (హంగేరియన్ల) దేశముగ రూపొందెను. 997 నుండి 1038 వరకు ఈ మాజియర్లను పాలించిన స్టీఫెన్ ప్రభువు క్రైస్తవ మతమును వ్యాపింప జేసెను. పరిసరముల ఉన్న స్లావ్ జాతుల రాజ్యముల ప్రభువులు పలుమారు తమ రాజ్యముపై దండెత్తి, కొన్ని సందర్భములందు ఆక్రమింప గలిగినను మాజియర్లు కడకు తమ పట్టుదలచే శత్రువులను ఓడించి, తమ స్వాతంత్ర్యమును నిలువబెట్టుకొన గలుగుటయే గాక, దక్షిణమున ఉన్న స్లావ్ ప్రాంతమును జయించి, దానిపై కొంత కాలము ఆధిపత్యమును నెరపిరి. 1342 నుండి 1382 వరకు పరిపాలించిన లూయీ మహనీయుని కాలమునను, 1458 - 1490 వరకు ప్రభుత్వము నెరపిన మత్తయస్ కార్వినస్ కాలమునను ఈ రాజ్యము ఉచ్చతమస్థాయిని అందుకొన గలిగెను. కాని, 1526 లో తుర్కులతో జరిగిన పోరాటమున మాజియర్ సేనలు ఘోరపరాజయమునందుటయే కాక, మాజియర్ రాజు లూయీ - II సైతము యుద్ధ రంగముననే మరణించెను. అంతటినుండి ఆ రాజ్యము విచ్ఛిన్నమై నిరంతరము పరస్పరకలహములలో మునిగి తేలు మాండలిక ప్రభువుల వశమయ్యెను. ఇంతలో ప్రక్క దేశమగు ఆస్ట్రియాయందు హాప్స్‌బర్గ్ రాజవంశము ప్రాబల్యమును ఆర్జించి, క్రమముగ హంగేరీపై కూడ తన అధికారమును ప్రతిష్ఠించుటకు యత్నించెను. 1683 లో వియెన్నా కడ టర్కీ సేనలను ఆస్ట్రియన్లు ఓడించుటతో, ఆస్ట్రియన్లకు హంగేరీ అంతయు వశమయ్యెను. 1723 లో హంగేరియన్ ప్రజాపరిషత్తు (డయట్) సమావేశమై, ఆస్ట్రియాయందలి వంశానుగతపు రాచరికము తమ దేశమున కూడ పాలన నిర్వహించుటకు అంగీకరించినది. కాని, పలుకుబడి గల కొన్ని వర్గములకు మాత్రము హంగేరీ ఇటుల తన స్వాతంత్ర్యమును కోల్పోవుట నచ్చకుండెను. తత్ఫలితముగ 1848 లో ఒక తిరుగుబాటు జరిగి, హంగేరీ గణరాజ్యము ఒకటి ఏర్పరుపబడినను, రష్యా సాయముతో ఆస్ట్రియా ప్రభువు తిరుగుబాటుదారులను అడచి, హంగేరీపై మరల తన అధికారమును నెలకొల్పెను. కాని, హంగేరియన్ల అసంతృప్తిని కొంతవరకైన పోగొట్టవలయునను తలంపుతో వారికి ఒక విధమగు స్వయంపరిపాలనను ఒసగుచు, ఆస్ట్రియన్ రాజు అప్పటి నుండి హంగేరీ రాజుగ కూడ వ్యవహరించుచుండుననియు, సామ్రాజ్యము ఆస్ట్రియా - హంగేరీ సామ్రాజ్యమని వ్యవహరింపబడవలయుననియు ఆస్ట్రియా ప్రభుత్వము హంగేరీ ప్రతినిధులతో ఒక ఒడంబడిక చేసికొనెను (1867). ప్రథమ ప్రపంచ యుద్ధ ఫలితముగ ఆస్ట్రియా - హంగేరీ రాచరికము అంతరించుటవలన హంగేరీ ఒక గణరాజ్యముగ ఏర్పడెను. కాని, ఆ ప్రభుత్వమును కూలద్రోసి, 1919 లో ఒక కమ్యూనిస్ట్ ప్రభుత్వము అధికారము గ్రహించెను. ఇంతలో రుమేనియా ఈ దేశముపై దండెత్తి వామపక్షప్రాబల్యమును అడచుటలో భూస్వాములకు తోడ్పడెను. కడకు 1929 లో దేశమున రాచరికపు పరిపాలన స్థాపింపబడవలయునను నిర్ణయమునకు ప్రజా ప్రతినిధులు రాగలిగిరి. కాని, ఎవరిని రాజుగ చేయవలయునను విషయమున మాత్రము ఒక నిర్ణయమునకు రాజాలక పోయిరి. అందుచే రాజు కాగల వ్యక్తిని నిర్ణయించుటను వాయిదా వేసి, అప్పటికి తాత్కాలికముగ రాజు అధికారములను నిర్వహించుటకు జాతీయ పక్ష నాయకుడగు అడ్మిరల్ హోర్థీని రాజ్యవ్యవహర్త (రీజంట్)గ ప్రజాప్రతినిధులు ఎన్నుకొనిరి (1920). పేరునకు ఇది తాత్కాలిక నిర్ణయమే అయినను, ఈ రాజ్యవ్యవహర్త 25 సంవత్సరములు పరిపాలన నెరపెను. ప్రథమ ప్రపంచ యుద్ధమున తాను పోగొట్టుకొనిన ప్రాంతమును పునరార్జించుటకు ఆ మధ్యకాలమున హంగేరీ ప్రభుత్వము చాల కృషిచేసెను. ఆ ఉద్దేశ సాఫల్యమునకై అక్షరాజ్యములతో మైత్రిని కుదుర్చుకొని, వారికి ద్వితీయ ప్రపంచ యుద్ధమున తోడ్పడెను. అంతట యుద్ధమును సమర్థవంతముగ సాగించుటకు హంగేరీ తమ ఆక్రమణలోనే ఉండుట సముచితమని భావించి, నాజీ జర్మనీ 1944 లో హంగేరీని అంతటిని ఆక్రమించెను. కాని, 1945 లో సోవియట్ రష్యా సైన్యములు జర్మను సేనలను నిర్జించి, హంగేరీని తమ వశము చేసికొనినవి. 1946 లో దేశమున ఒక గణతంత్ర రాజ్యము ఏర్పరుపబడెను. ఐక్యరాజ్యములు నిర్ణయించిన శాంతిసంధి నియమములను అనుసరించి హంగేరీ తాను అక్షరాజ్యముల మైత్రివలన 1937 నుండి ఆర్జించిన భూభాగములను వదలుకొనెను. 1948 లో ప్రభుత్వము హంగేరీ శ్రామిక (కమ్యూనిస్ట్) పక్షము వారికి చేజిక్కెను. అంతటినుండి సామ్యవాద విధానపు విప్లవాత్మక పరివర్తనలు త్వరిత గతిలో జరిగెను. వాని ఫలితములగు ఉమ్మడి వ్యవసాయము మొదలగు వాని వలన మధ్య తరగతి ప్రజలలో అసంతృప్తి పెచ్చుపెరిగి, చివరకు 1956 లో తిరుగుబాటుగ పరిణమించెను. ఆనాడు ప్రధాన

మంత్రియగు ఇమ్రీనాగీయును, మరికొందరు నాయకులును ఈ తిరుగుబాటును సమర్థించిరి. అంతట సోవియట్ రష్యా సేనలు జోక్యము కల్పించుకొని తిరుగుబాటును నిర్దాక్షిణ్యముగ అడచి తిరుగుబాటును సమర్థించిన నాయకులను మరణశిక్ష పాలు చేసినవి. అంతటినుండి దేశమున శాంతి నెలకొనెను. సామ్యవాద నిరంకుశతను భరింపజాలని ప్రజలు పెక్కురు విదేశములకు వలసపోయి, అట తలదాచుకొనిరి. అంతట ప్రభుత్వము తన విధానముల తీవ్రతను కొంత తగ్గించి, ప్రజలను సాంత్వనపరచుటకు కొంత యత్నించినది. ఆర్థికముగ, పారిశ్రామికముగ, రాజకీయముగ నేడు హంగేరీ, సోవియట్ రష్యా రాజ్యమునకు ముడివడి ఉన్నది.

రాజ్యాంగము : తూర్పుయూరప్‌నందు ద్వితీయప్రపంచ యుద్ధానంతరమున సోవియట్ రష్యా రాజ్యపు పలుకుబడి వలన రూపొందిన ప్రజాగణతంత్రరాజ్యములలో ఈ దేశము ఒకటి. రాజ్యాంగచట్టముప్రకారము శాసన నిర్మాణాధికారము ఏక కక్ష్యగల జాతీయశాసనసభ (ఓర్షాగ్గ్యాలిస్) యందు న్యస్తమై ఉన్నది. 18 ఏండ్లు పైబడిన వయస్సు గల వారికి అందరికిని వోటుహక్కు కలదు. శాసనసభకు ఎన్నికలు 4 ఏండ్లకు ఒక పర్యాయము జరుగును. 31,000 మంది ప్రజలకు ఒక ప్రతినిధి చొప్పున శాసనసభకు సభ్యులు ఎన్నుకొనబడెదరు. 1958 లో ఈ శాసనసభ సభ్యుల సంఖ్య 338. ప్రభుత్వ నాయకవర్గముచే నిర్ణయితములగు విషయములపై తన అభిప్రాయమును తెలియజేయుటకై ఈ శాసనసభ సమావేశపరుపబడును. ఈ శాసనసభా సభ్యులు తమనుండి ఎన్నుకొనిన 21 మందిచే వ్యవస్థితమగు అధ్యక్షసంఘము శాసనసభసమావేశము జరుపని కాలమున, శాసన నిర్మాణ విధిని నిర్వహించును. ఈ సంఘము చేసిన నిర్ణయములను లాంఛన ప్రాయముగ శాసనసభ ధ్రువపరచును. 'శ్రామిక కర్షక ప్రభుత్వ సంఘము' అనబడు వ్యవస్థ కార్యనిర్వహణాధికారము వహించి ఉన్నది. ఇందు ప్రధాన మంత్రియు, తక్కిన మంత్రులును సభ్యత్వము కలిగి ఉందురు. వీరినందరిని శాసన సభయే ఎన్నుకొనును.

చీ. శే. రా.

**హంపీ శిథిలములు** : చూ. తె. సం.; సం. పు. 1235.

**హాయిటీ** : పశ్చిమార్ధగోళమునందు హిస్పానియోలా ద్వీపపు పడమటి భాగమున నెలకొని ఉన్న ఒక స్వతంత్ర రాజ్యము.

ఈ దేశమునకు అట్లాంటిక్ మహాసముద్రము [ఉ]; డొమినికన్ రిపబ్లిక్ [తూ]; కారబియన్ సముద్రము [ద]; విండ్‌వర్డ్ పాసేజ్ అను జలసంధి [ప] సరిహద్దులందు ఉన్నవి. దేశతీరమునకు సమీపముననే ఉన్న 1. లాటార్‌ట్యు, 2. లాగునేవే, 3. లే సయమైటిస్, 4. ఇలే ఆ వాచే, 5. లా నవస్సా అను అల్పద్వీపములును పరిపాలనరీత్యా ఈ దేశముననే చేరి ఉన్నవి.




ద్వీపములతో కలసి [వి] 27,750 చ. కి. మీ.; [జ] 44,48,000. వీరిలో నూటికి 95 మంది అచ్చముగు నీగ్రో జాతివారు ; తక్కినవారిలో మిశ్రజాతివారును, ఆదిమ అమెరికన్‌లును చేరి ఉన్నారు. [మ] దాదాపుగ ప్రజలందరు క్రైస్తవులు, ప్రాచీన ఆఫ్రికన్ సంప్రదాయమతమగు వోడూ అచ్చటచ్చట వ్యాప్తియందు ఉన్నది. [రా] పోర్ట్ - అవ్ - ప్రిన్స్ (జ. సం. 2,50,000).

చరిత్ర : హిస్పానియోలా ద్వీపమును 1492 లో క్రిస్టఫర్ కొలంబస్ [చూ.] కనుగొని అచట ఒక స్థావరమును ప్రస్తుతము కేప్‌హైటిన్‌నగరము ఉన్న ప్రాంతమున నెలకొల్పెను. క్రమముగ స్పెయిన్‌వాసులు ఇటకు విరివిగ వచ్చి చేరి, 28 సంవత్సరములలో అచటి ఆదివాసి అమెరికన్‌లను చాలవరకు హతమార్చిరి. అంతట అటనట చెదరి ఉన్న కొలదిమంది ఆదివాసి అమెరికన్‌లు తమకు కావలసిన వెట్టిచాకిరికి చాలకపోవుటచే, ఎచటనుండియైన బానిసలను కొని తెచ్చుకొనుట బాగుండునని తలచి, అందులకు స్పెయిన్‌రాజు అనుమతిని పొంది, ఆఫ్రికానుండి నీగ్రోబానిసలను కొనివచ్చి స్పెయిన్ భూస్వాములు ఈ ద్వీపమున చేర్చిరి. కాలక్రమమున స్పెయిన్ ప్రాబల్యము తగ్గిపోవగ 1625 లో ఫ్రెంచి, బ్రిటిష్ సాహసిక నావికులు హిస్పానియోలా దీవికి సమీపమున ఉన్న లాటార్‌ట్యు ద్వీపమును తమ స్థావరముగ చేసికొని, స్పెయిన్‌వారి నౌకలను కొల్లగొట్ట ఆరంభించిరి. క్రమముగ ఫ్రెంచివారు ఈద్వీపమున కొన్ని నెలవులను ఏర్పరచుకొని, స్పెయిన్ భూస్వాములను తరిమి, వారి సంపదలను వశపరచుకొనిరి. 1697 లో జరిగిన రిజ్‌విక్ ఒడంబడికను అనుసరించి హిస్పానియోలాదీవిలో పడమటివైపు

మూడవభాగము (ప్రస్తుతపు హాయిటీ) ను ఫ్రాన్సునకు స్పెయిన్ దత్తమొనర్చెను. ఫ్రెంచివారు ఈ ప్రాంతమునకు సెయింట్ డోమింగో అని పేరిడిరి. వారి ఆధిపత్యమున ఈ ప్రాంతము కారబియన్‌సముద్ర పరిసర దేశములందు అన్నింట అత్యంత సంపన్నదేశముగ రూపొందెను. కాని, ఈ సంపద అంతయు ఫ్రెంచివారి హస్తగతమై ఉండెను. అధిక సంఖ్యాకులగు నీగ్రోలు మాత్రము యథాపూర్వకముగ బానిసజీవితములు గడుపుచుండిరి. నీగ్రో స్త్రీలను ఫ్రెంచివారు పెండ్లాడిన ఫలితముగ రూపొందిన 'ములట్టో' అను మిశ్రజాతివారు విద్యారంగమున కొంత అభివృద్ధిని సాధించి స్వేచ్ఛాయుత జీవితములను గడపుచుండిరి. కాని, వీరి సంఖ్యయు, సంపత్తియు అత్యల్పములు అగుటచే వీరికి అంతగ పలుకుబడి ఉండెడిది కాదు. 1789 లో ఫ్రాన్సులో విప్లవము బయలుదేరిన వెనువెంటనే విప్లవభావములు ఈ ద్వీపరాజ్యమునకు సైతము వ్యాపించినవి. నీగ్రోలు అందరు ఒక్కుమ్మడిగ తిరుగుబాటు చేసి స్వాతంత్ర్యమును ఆర్జించుటకు కృషి సలిపిరి. ఫ్రెంచి భూస్వాములు సైన్యసాహాయ్యమున ఈ తిరుగుబాటును అడచుటకు యత్నించి, తిరుగుబాటు నాయకులగు ఓగే, షావన్నే అనువారలను నిర్బంధించి మరణశిక్ష పాలు చేసిరి. కాని, విప్లవము చల్లారలేదు. తొలుత బానిసగ ఉండి, క్రమముగ తన ప్రతిభవలన ఫ్రెంచివారి మెప్పును ఆర్జించి, స్వాతంత్ర్యమును పొంది, క్రమముగ ఫ్రెంచిసైన్యమందు ఒక దళవాయి పదవిని అందుకొని, సెయింట్ డొమింగోకు గవర్నర్‌గ నియమింపబడిన టౌసెంట్ లా ఓవర్చెర్ అను నీగ్రోసేనానియు ఈ విప్లవ భావములకులోనై తన గవర్నర్ పదవిని పురస్కరించుకొని 1801 లో బానిసత్వమును నిషేధించి, ఈ దేశమునకు ఒక రాజ్యాంగచట్టమును రూపొందించి అమలునకు గొనివచ్చెను. కాని, త్వరలోనే ఫ్రాన్సు ప్రభువు నెపోలియన్ 70 యుద్ధ నౌకలతో సైనికుల బంపి, తిరుగుబాటును అడచి ఓవర్చెర్‌ను నిర్బంధితుని చేసెను. కడకు ప్రజా నాయకుడు ఓవర్చెర్ ఫ్రెంచివారి కారాగారమున మరణించెను. కాని, నీగ్రో ప్రజలు జీన్ జెక్వి డెస్సలైనిస్ అను వేరొక సేనాని నాయకత్వమున తమ తిరుగుబాటును నిరంతరాయముగ సాగించిరి. తుట్టతుదకు 1804, జనవరి 1 వ తేదీన ఫ్రెంచి సేనలు డెస్సలైనిస్ సేనానికి లొంగినవి. అంతట డెస్సలైనిస్ సేనాని నాయకత్వమున దేశము స్వతంత్ర దేశముగ ప్రకటితమగుటయే కాక, ఫ్రెంచివారు ఒసగిన సెయింట్ డొమింగో అను పేరునకు మారుగ హాయిటీ (పర్వత భూమి) అను తొలుతటి అమెరికన్ నామమే దేశమునకు ఇడబడినది. ఈ విధముగ ప్రపంచచరిత్రలో నీగ్రోల ఆధిపత్యము గల తొలుతటి గణ రాజ్యము రూపొందెను. కాని, డెస్సలైనిస్ సేనాని త్వరలోనే ఆ దేశమునకు తానే చక్రవర్తినని ప్రకటించుకొనెను. అయినను అనతి కాలముననే 1806 లో అతడు హత్యచేయబడెను. అంతట దేశమున చెలరేగిన విరుద్ధాభిప్రాయముల ఫలితముగ దేశము రెండు రాజ్యములుగ విభక్తమయ్యెను. కాని, ఈ రెండు రాజ్యములును ఒకే విధమగు భూస్వామ్యవిధానమును అవలంబించుటమూలమున దేశమునందలి భూస్వాముల విశాల క్షేత్రములు అన్నియు శ్రామికులగు రైతులకు పంచబడినవి. తత్ఫలితముగ ఈ దేశము సొంత సేద్యము చేసికొను స్వతంత్ర కృషీవలుల దేశముగ పరిణమించినది. తరువాత 1820 లో ఈ రెండు రాజ్యఖండములును ఏకత చెంది జీన్ పియెరి బోయేర్ అను నాయకుని నాయకత్వమున ఒకే ఒక రాజ్యమైనది. ఈ నాయకుని కాలముననే ఈ దేశము తన ప్రక్కన ఉన్న డొమినికన్ రిపబ్లిక్‌ను ఆక్రమించెను. కాని, 1844 లో డొమినికన్ రిపబ్లిక్ ప్రజల తిరుగుబాటు ఫలితముగ తిరిగి ఆ దేశము స్వతంత్రతను పొందెను. 1849 లో హాయిటీకి అధ్యక్షుడుగ ఎన్నుకొనబడిన ఫాస్టిన్ ఏలీ సొలోకీ అను నీగ్రో నాయకుడు నిరంకుశాధికారములు గ్రహించి తనకుతాను చక్రవర్తిగ ప్రకటించుకొనెను. కాని, ములట్టోజాతి (మిశ్రజాతి) కి చెందిన నికలస్ ఫేబర్ గెఫ్రార్డ్ అనువాని నాయకత్వమున ఒక విప్లవదళము చక్రవర్తిని అంతమొందించి, ఆ వెనువెంటనే యథాపూర్వముగ గణతంత్ర రాజ్యాంగ విధానమును ఏర్పరచి, గెఫ్రార్డ్‌ను అధ్యక్షుని చేసెను. 1860 లో రోమన్ కేతలిక్ మత పీఠాధిపతియగు పోప్‌తో ఈ గెఫ్రార్డ్ కుదుర్చుకొనిన ఏర్పాటును బట్టి రోమన్ కేతలిక్ సంప్రదాయపు క్రైస్తవ మతము జాతీయ మతముగ ఈ దేశమున గుర్తింపబడి, అంతటినుండి ఆ మతమునకు ప్రాబల్యము కలిగెను. గెఫ్రార్డ్ తరువాత మరల దేశము కల్లోలములకు గురి అయ్యెను. దరిద్రులు అధిక సంఖ్యాకులు అగు నీగ్రో ప్రజలు విద్యావిషయికముగ వెనుకబడి ఉండుటవలన, సంఖ్యా బలమువలన మాత్రమే వారికి కలిగిన ప్రాబల్యమును అరికట్టుటకు విద్యావంతులును, సంపన్నులును, అల్పసంఖ్యాకులును అగు ములట్టోవారలు సలుపు యత్నములే ఈ రాజకీయ సంక్షోభములకు మూలకారణములని చెప్పవచ్చును. ఈ సంక్షోభముల వలన దేశము ఆర్థికముగ కుంటువడి, యునైటెడ్‌స్టేట్స్ ప్రాబల్యమునకు లోనయ్యెను. 1915 నుండి 19 ఏండ్ల కాలము ఈ దేశము యునైటెడ్‌స్టేట్స్

అధీనమున ఉండి, 1935 లో తిరిగి స్వతంత్రమై, ఆ సంవత్సరముననే ఒక నూతన రాజ్యాంగ చట్టమును రూపొందించుకొనెను. ద్వితీయ ప్రపంచ యుద్ధ కాలమున ఈ దేశము ఐక్యరాజ్యముల పక్షమున చేరెను. యుద్ధానంతరమున ఈ దేశము ఆర్థిక దుస్థితికి లోనైనది. వామపక్ష వాదములకు కొంత ప్రాబల్యము ఏర్పడినది. 1959 లో క్యూబా యందు విప్లవ ప్రభుత్వము ఏర్పడిన తరువాత ఈ దేశముపైకూడ విప్లవవాదులు ఒక దండయాత్ర సలిపిరి. కాని, అది విఫలమయ్యెను.

రాజ్యాంగము : 1957 లో ఆమోదింపబడిన ఒక రాజ్యాంగచట్టమును అనుసరించి గణతంత్ర విధానపు పరిపాలన ఇచట అమలునందు ఉన్నది. వయోజనులందరికి వోటుహక్కు కలదు. అధ్యక్షుడు ఆరేండ్లకు ఒక పర్యాయము ఎన్నుకొనబడును. పరిపాలనకు అధ్యక్షుడే బాధ్యుడు. అతడు నియమించు కార్యదర్శులు వివిధ శాఖల పరిపాలన నిర్వహింతురు. శాసనసభలో రెండు కక్ష్యలు తొలుత ఉండినను 1961 నుండి 58 మంది సభ్యులు గల ఒక శాసనసభ మాత్రమే పనిచేయు చున్నది. ప్ర. రా. సు.

**హరప్పా శిథిలములు :** చూ. సింధు నాగరకత.

**హర్షవర్ధనుడు (590 - 647) :** ఉత్తర భారతమును చాలవరకు ఒక రాజకీయాధిపత్యము క్రిందికి తెచ్చిన సార్వభౌముడు. ఈతని తండ్రి స్థానేశ్వర ప్రభువగు ప్రభాకరవర్ధనుడు. ప్రభాకరవర్ధనునికి ఇద్దరు కుమారులును, ఒక కుమార్తెయు గలిగిరి. హర్షుడు రెండవ కుమారుడు. అతని అన్నపేరు రాజ్యవర్ధనుడు, అతని చెల్లెలిపేరు రాజ్యశ్రీ. రాజ్యశ్రీని కన్యాకుబ్జమునకు రాజైన గ్రహవర్మకు ఇచ్చి పెండ్లిచేసిరి. సోదరులు ఇద్దరును తమ రాజధాని నగరమునకు దూరముగ ఉండునపుడు తమ తండ్రియగు ప్రభాకరవర్ధనుడు చాల వ్యాధిగ్రస్తుడైనట్లు హర్షవర్ధనునికి వార్తవచ్చెను. వెంటనే హర్షుడు తన తండ్రి అవసానదశయందు తండ్రికడ ఉండుటకు స్థానేశ్వరమునకు మరలెను. రాజ్యవర్ధనుడు హూణుల [చూ.] ను ఓడించి, విజయ సంతోషముతో తిరిగి వచ్చెను. కాని, తండ్రి చనిపోయిన వార్త విని చాల దుఃఖించి సన్యాసము పుచ్చుకొనవలెనని తీర్మానించుకొనెను. కాని, హర్షుని బోధనలచే సింహాసనము అధిష్ఠించెను. ఆ సమయమందే మరియొక దుఃఖవార్త వినవచ్చెను. ప్రభాకరవర్ధనుని మరణవార్త తెలిసినంతనే మాళవ దేశాధీశుడగు దేవగుప్తుడు గ్రహవర్మపై అకస్మాత్తుగ దాడిసలిపి అతనిని చంపి, అతని భార్యయగు రాజ్యశ్రీని చెరయందుంచెను. ఆ తరువాత వంగదేశరాజగు శశాంకునితో కలసి స్థానేశ్వరముపై దండెత్తవలెనని అతడు యోచించెను.

ఈ వార్త విని రాజ్యవర్ధనుడు వెంటనే భండి అనువాని నాయకత్వమున ఒక గొప్ప గుర్రపుదళమును గొని, బయలుదేరి దేవగుప్తుని పూర్తిగా ఓడించెను. కాని, దేవగుప్తుని మిత్రుడును, వంగదేశపు రాజును అయిన శశాంకుడు ఒక కుట్రచేసి, విందునందు మోసముచేసి రాజ్యవర్ధనుని చంపించెను. అంతట స్థానేశ్వరరాజ్యమునకు హర్షుడు రాజయ్యెను. అతడు క్రీ. శ. 606 వ సంవత్సరమున స్థానేశ్వర, కన్యాకుబ్జ రాజ్యముల రెంటికిని ప్రభువయ్యెను. అతనికి రాజగునప్పటికి పదునారేండ్ల వయసు.

హర్షుడు రాజైననాటినుండి కొన్ని సంవత్సరములు గడచు వరకును అనేక కష్టములను ఎదుర్కొనవలసి వచ్చెను. చెరనుండి పారిపోయి వింధ్యాటవులయందు ఆశ్రయము గొన్న తన చెల్లెలును, గ్రహవర్మ ధర్మపత్నియునగు రాజ్యశ్రీని కాపాడుట, తన అన్నను చంపిన శశాంకునిపై పగదీర్చుకొనుట అను ఈ రెండు కార్యములను అతడు వెంటనే సాధించుటకు పూనుకొనెను. హర్షుడు మొదట కామరూప దేశాధీశుడైన భాస్కరవర్మతో మైత్రి పాటించి, సంధి చేసికొనెను. అంతట తన సోదరి కొరకు వింధ్యాటవులను అన్వేషింప ఏర్పాట్లు కావించెను. కడకు చితిలోబడి మరణింప సిద్ధపడుచున్న రాజ్యశ్రీని కాపాడగలిగెను. శశాంకుని ఓడించి తన సామంతుడగునట్లు గావించుకొనెను. హర్షుడు ఆరేండ్లపాటు ఎడతెగని యుద్ధములు జరిపినట్లు చెప్పబడి ఉన్నది. అతడు ఉత్తర భారతమందు జయించిన రాజ్యముల వివరములు మనకు లభింపకుండుట విచారకరమైన విషయము. ఎట్లయినను ఉత్తర భారతములో చాలభాగము జయించి, తన జీవితాంతము నాటికి సుస్థిరమైన, సువిశాలమైన సామ్రాజ్యమును తన ఏలుబడి క్రిందకు తెచ్చుకొనెను. ఉత్తర భారతమున పూర్తిగ జయించిన వెనుక అతడు తన రాజధానిని స్థానేశ్వరమునుండి కన్యాకుబ్జమునకు మార్చెను. 606 నుండి తన పేరిట ఒక శకమును ఆరంభించెను.

సముద్రగుప్తునివలె భరతవర్షమునకు అంతటికిని ప్రభువు గావలెనని అతని అభిలాష. తన ఆశయ సిద్ధికొరకు హర్షుడు తన సేనలను వెంటబెట్టుకొని దక్షిణాపథమునకు జైత్రయాత్ర సాగించెను. కాని, నర్మదానదీ దక్షిణ తీరమునగల పశ్చిమ చాళుక్య రాజ్యమును వాతాపి నగరము రాజధానిగ చేసికొని ఏలుచుండిన పులకేసి - II, హర్షుడు నర్మదానదిని దాటి రాకమునుపే అతనిని యుద్ధమందు ఓడించి వెనుకకు తరిమెను. అంతకు కొంచెము

ముందుగనే వల్లభిరాజ్యముపై దండెత్తి, దాని రాజగు ధ్రువసేనుని ఓడించి, అతనికి తను కుమార్తెను ఇచ్చి వివాహము గావించి, హర్షుడు ధ్రువసేనుని తనకు అన్ని విధముల సహాయపడునట్లు కావించుకొనెను. కచ్ఛి, దక్షిణ కథియవాడ్ రాజ్యములను తన రాజ్యములో కలుపుకొనెను. అతని కడపటి యుద్ధము గంజామునందు జరిగినది.

హర్షుని సామ్రాజ్యము ఉత్తర భారతమంతటను - ఉత్తరమున హిమాలయ పర్వతములనుండి దక్షిణమున నర్మదా నది వరకును, పడమట వల్లభినుండి తూర్పున గంజాము వరకును - వ్యాపించెను. కామరూప దేశాధీశుడు హర్షునకు మిత్రకోటిలోనివాడు. చీనాదేశపు చక్రవర్తి కడకు రాయబారులను పంపి హర్షుడు అతనితో స్నేహము నెరపెను. ఉత్తర భారతములో సార్వభౌమ పదవిని సాధింపగలిగెను.

హర్షుని పరిపాలన ఒక విధముగ వ్యక్తిగత ప్రాధాన్యము గలదైయైనను, నిరంకుశముగ మాత్రము లేకుండెను. అతని సామ్రాజ్య పరిపాలనా యంత్రము చాల చక్కగ ఏర్పాటు చేయబడిన ఉద్యోగిబృందము చేత నడపబడుచుండెను. రాజుగారి ప్రధానోద్యోగి మహాసంధి విగ్రహాధికారి. అతనికి ఇతర ఉద్యోగులు ఎందరో సహాయులుగ ఉండిరి. రాష్ట్రములను రాజ ప్రతినిధులో, గవర్నర్లో పాలించుచుండిరి. హర్షుడు తన పరిపాలనాకాలమందలి కడపటి వత్సరములందు సత్వగుణ సంపన్నుడైనను, బాగుగ శిక్షణముపొందిన సేనానివహమును సర్వదా భరించుచునే ఉండెను.

మత విషయములందు హర్షుడు మంచి సహనశక్తి సంపన్నుడు. హర్షుని వంశీకులు హిందూమతస్థులు. మొదట హర్షుడు కూడ శివుని, సూర్యుని పూజించు హిందూ మతస్థుడుగనే ఉండెను. కాని, చీనాయాత్రికుడు అగు హుయాన్ స్యాంగ్ [చూ.] రాకతో హర్షుడు మహాయాన శాఖకు చెందిన బౌద్ధమతమును స్వీకరించెను. అయినను, తాను పూర్వము అవలంబించి ఉండిన శైవమతమును మాత్రము దూషింపలేదు. మాంసాహారమును, జంతు హింసను మాత్రము నిషేధించెను. అశోకుని అనుసరించి, ప్రజాహితకార్యములను ఎన్నింటినో కావించెను. సత్రములను, ఆశ్రమములను ఎన్నింటినో స్థాపించి, వాటి నిర్వహణార్థము ఉదారమగు దానములను కావించెను.

హుయాన్ స్యాంగ్ కన్యాకుబ్జమందును, ప్రయాగ (అలహాబాద్) యందును జరిగిన రెండు గొప్ప సమావేశములకు హాజరయ్యెను. మతసంబంధమగు చర్చలు సాగించుటకును, మహాయానమతములోని మంచి విషయములు ప్రతిపాదించుటకును ఈ సమావేశములు జరుపబడెను. దానికి ఇరువదిమంది రాజులును, వేలకొలది బౌద్ధసన్యాసులును, బ్రాహ్మణ శాస్త్రజ్ఞులును, జైనపురోహితులును హాజరైరి. ఒక గొప్ప సమున్నతమైన బంగారు బుద్ధవిగ్రహమును ఒక సమున్నత గోపురము మీదనుంచి వైభవోపేతముగ ఊరేగింపు చేసిరి. హర్షుడే ఆ ఊరేగింపునందు శ్వేతచ్ఛత్రమును ఒకవైపు ఎత్తి పట్టుకొనెను. కన్యాకుబ్జమున సమావేశమైన తర్వాత మరి 5 ఏండ్లకు ప్రయాగయందు మరియొక సమావేశము అట్టిదే జరిగినది. ఈ రెండు సమావేశములందును హర్షుడు తన కోశాగారమునందు మిగిలియున్న ధనమునెల్ల కుల, మత, వర్గ విభేదములు పాటింపకుండ తన రాజ్యమందలి ప్రజలకెల్ల భూరిదానములను ఒసగెను. ఈ ఉత్సవము 75 రోజులు జరిగెను. ఈ ఉత్సవానంతరమే హుయాన్ స్యాంగ్ - తన స్వదేశమగు చీనాకు - వెడలిపోయెను.

హర్షుని రాజ్యమందలి ప్రజలనుగురించియు, వారి పరిస్థితులనుగురించియు హుయాన్ స్యాంగ్. చక్కగ వ్రాసి ఉన్నాడు. గుప్తులనాటి 'స్వర్ణయుగ' కాలమందు పునరుజ్జీవనము పొందిన బ్రాహ్మణమతము క్రమముగ బౌద్ధమతస్థానమును ఆక్రమించెను. అయినను, 7 వ శతాబ్దమున బౌద్ధమతము ప్రజలయందు కొంత వ్యాప్తి కలిగియే ఉండెను. ఆ కాలమందలి ముఖ్యమైన మతములు: వైష్ణవ, బౌద్ధ, జైన మతములు.

విద్య విశాల వ్యాప్తియందు ఉండెను. నలందా విశ్వవిద్యాలయము గొప్ప ఎన్నికగన్న విద్యాసంస్థ. భారతదేశ విద్వాంసుల కీర్తిచంద్రికలు విశ్వవ్యాప్తి గాంచి ఉండెను. ఇట్టి మహోన్నత విద్వాంసుల గృహములు కూడ సామాన్యమైన మన్నుమిద్దెలుగనే ఉండెనని హుయాన్ స్యాంగ్ చెప్పి ఉన్నాడు.

హర్షుడు నిస్సందేహముగ ప్రాచీన భారత చక్రవర్తులందు ఎన్నదగిన మహనీయుడు. ఇతడు రాజేగాక, గొప్ప కవియు, విద్వాంసుడు కూడ [చూ. హర్షవర్ధనుడు సం. 6 - పు. 806]. అరాజకస్థితికి లోబడుచు ఉండిన రెండు రాజ్యములను ఉద్ధరించి న్యాయముగాను, ప్రజారంజకముగాను కౌటిల్యుని నీతిని అనుసరించి ఇతడు పరిపాలన సాగించెను. తన రాజ్యమంతటను పలుమారులు సంచారములు గావించి, న్యాయశీలురను సన్మానించి, దుశ్శీలురను దండితులను కావించుచుండెను; అశోక, కనిష్కులవలె బౌద్ధమతధర్మములను అనుసరించెను. **వి. అర్.**

**హాంగ్ కాంగ్** : చీనా దేశపు ఆగ్నేయ తీరప్రాంతమున ఉన్న బ్రిటిష్ వలస రాజ్యము.

ఈ రాజ్యమున మూడు ప్రత్యేక ప్రాంతములు చేరి ఉన్నవి. 1. హాంగ్ కాంగ్ ద్వీపము—ఇది చీనాయందలి పెరల్ నదీ ముఖ ద్వారమునకు 32 కిలోమీటరుల దూరమున ఉన్నది. [వి] 75 చ. కి. మీ.; 2. పై ద్వీపమునకు అభిముఖముగ ముఖ్య భూభాగమునందలి కౌలాన్ ద్వీపకల్పమున కొంత భాగమును, తత్సమీపమున ఉన్న ఒక చిన్న ద్వీపము [వి] 8 చ. కి. మీ; 3. కౌలాన్ ద్వీపకల్పమున మిగిలిన భూమియు, తత్సమీపమున ఉన్న చిన్న దీవులును [వి] 945 చ. కి. మీ.; దీనికే 'న్యూ టెర్రిటరీ' అను వ్యవహారము కలదు. ఇటుల మొత్తము రాజ్యపు [వి] 1,028 చ. కి. మీ.; [జ] 32,26400. [భా] అధిక సంఖ్యాకుల మాతృభాష చైనీస్ (కాంటనీస్ మాండలికము). 5% మాత్రము ఇంగ్లీషును మాట్లాడుదురు. వ్యవహారభాష ఇంగ్లీషు. [మ] దేశమున బౌద్ధము, క్రైస్తవము ఎక్కువగ వ్యాప్తియందు ఉన్నవి. [రా] విక్టోరియా (హాంగ్ కాంగ్ ఐలండ్) (జ. సం. 10,05,041).

చరిత్ర: తొలుత చీనాకు ఈ రాజ్యము చెంది ఉండెను. అపుడు అది దాదాపు నిర్మానుష్యముగ ఉండెను. హాంగ్ కాంగ్ దీవియందు ఏర్పడి ఉన్న సహజమైన ఓడ రేవును పరిశీలించిన బ్రిటిష్‌వారు దూర ప్రాచ్యదేశము లన్నింటితో ఇటనుండి వ్యాపారము సాగించుట సుకరముగ ఉండునని భావించి, దానిని నల్లమందు వ్యాపారమునకు రేవుగ వాడుచుండిరి. ఇంతలో 1841 వ సంవత్సరమున చీనాపై నల్లమందు వ్యాపార రక్షణ కొరకై యుద్ధము సాగించి, ఆ దేశ సైన్యములను బ్రిటన్ ఓడించుటవలన, బ్రిటిష్‌వారి షరతులకు చీనా అంగీకరించి, హాంగ్ కాంగ్ దీవిని బ్రిటిష్‌వారికి ఒసగెను. తరువాత 1860 లో జరిగిన యుద్ధఫలితముగ కౌలాన్ ద్వీపకల్పమున 8 చ. కి. మీ. ప్రాంతము దక్కెను. అయినను ఇంకను పరిసరముల ఉన్న ప్రాంతములును తమకు దక్కిననేకాని అచటి రేవునకు భద్రత ఉండదని భావించి, చీనా ప్రభుత్వమువారిని అంగీకరింపజేసి, బ్రిటిష్‌వారు న్యూటెరిటరీస్ అనబడు ప్రాంతమును 99 సంవత్సరముల కౌలునకు 1898 లో తీసికొనిరి. బ్రిటిష్‌వారు ఈ ప్రాంతమునకు కల్పించిన వ్యాపారపు వసతులను బట్టి ఇచట హాంగ్ కాంగ్‌నందలి విక్టోరియా నగరము, ద్వీపకల్పమునందలి కౌలాన్‌నగరము రూపొందినవి. న్యూటెరిటరీస్ ప్రాంతము ఈ నగరములందు వసించు వారికి ముడిపదార్థములను అందించు క్షేత్రముగ ఉపకరించుచున్నది. ఈ రాజ్యపు వ్యాపారమున అత్యధిక భాగము తొలుత చీనాతోనే జరుగుచుండెను. కాని, చీనాలో కమ్యూనిస్ట్ ప్రభుత్వము ఏర్పడినప్పటినుండియు హాంగ్ కాంగ్ వ్యాపారమున 12% మాత్రమే ఆ దేశముతో జరుగుచున్నది. అయినను హాంగ్ కాంగ్‌నందు నౌకా నిర్మాణ పరిశ్రమయు, వేరు విధములగు పరిశ్రమలును విరివిగ పెంపొందుచుండుటచే, తక్కిన ప్రాచ్యదేశములతో ఈ దేశపు వ్యాపారము నానాట అతిశయించుచున్నది. ద్వితీయ ప్రపంచయుద్ధ కాలమున జపాన్‌వారు ఈ దీవిని ఆక్రమించిరి (1941, డిసెంబరు 5). యుద్ధానంతరమున మరల బ్రిటిష్ ప్రభుత్వము దీనిని ఆక్రమించినది. హాంగ్ కాంగ్‌న స్వేచ్ఛావ్యాపారవిధానము అమలునందు ఉండుటచే, వివిధదేశములవారును దీనితో తమ వ్యాపారమును ఇబ్బందులు లేక సాగించుకొనగలుగుచున్నారు. కార్యనిర్వాహకవర్గసాహాయ్యమున బ్రిటిష్ ప్రభుత్వపు గవర్నర్ ఈ రాజ్యమును పాలించుచున్నారు. కార్యనిర్వాహకవర్గమున ఉద్యోగులతోపాటుగ ఆరుగురు అనధికారులును ఉందురు. వీరిలో ముగ్గురు చీనీయులు; వీరిని గవర్నరే నియమించును. ప్ర రా. సు.

**హానిబాల్** (క్రీ. పూ. 247 - 183): ప్రాచీన కార్తజీనియన్ సేనానులలో అగ్రగణ్యుడు; కార్తేజ్ సేనాధ్యక్షుడు అయిన హేమిల్కార్ బార్కా కుమారుడు. చిరుతతనమందే ఇతడు స్పెయిన్‌లో సైనికవృత్తియందు శిక్షణపొంది, అందులో సిద్ధహస్తుడు అయ్యెను. యుద్ధతంత్రమునందు, వ్యూహరచనయందు గల లాఘవ ప్రాగల్భ్యములవల్లను, అవరోధములను అతిక్రమింపగల అనర్గళప్రతిభవల్లను, యుద్ధకాలమున ప్రతికూల పరిస్థితిని ధైర్యముతో ఎదుర్కొని, దానిని తనకు లాభపర్యవసాయిగ త్రిప్పుకొను చాకచక్యమువల్లను ఇతడు సార్వకాలిక సృజనాత్మక సేనానులలో ప్రముఖస్థానమును గడించెను. హానిబాల్ దండయాత్ర 'కార్తేజ్' అను శీర్షికలో వివరింపబడినది [చూ. పు. 386]. తుదకు రోమన్‌లతోడి యుద్ధమున హానిబాల్ పరాజితుడు అగుటయేకాక, కార్తేజ్ స్వాతంత్ర్యము కూడ అస్తమించెను. రోమన్‌ల బలవంతముచే కార్తజీనియన్‌లు వీరసింహుడైన ఇతనిని దేశబహిష్కృతుని చేసిరి. హానిబాల్ తూర్పు దేశములకేగి, రోమ్‌పై కత్తిగట్టిన ఆలిగ్జాండర్ వంశీయులతో చేరి, సిరియా నౌకాదళమునకు నాయకత్వము వహించెను. కాని, అచ్చట కూడ ఓటమిని పొంది, క్రీట్ దీవికి పారిపోయెను. చివరకు బితినియా రాజువద్ద తల దాచుకొనెను. తన ఉనికిని కనుగొని రోమన్‌లు తన్ను తమకు అప్పగింపుమని ఆ రాజును ఒత్తిడి చేయుటతో, హానిబాల్ శత్రువులబారిన పడుటకు ఇష్టపడక విషము త్రాగి ఆత్మహత్య చేసికొనెను. ఆ. వెం.

**హామర్‌షెల్డ్** (1905 - 1961): ఆర్థిక రాజకీయవేత్తగను, ఐక్యరాజ్యసమితి యొక్క ప్రధాన కార్యదర్శిగను ప్రఖ్యాతి గాంచిన స్వీడెన్ పౌరుడు. ఇతడు 1905, జూలై 29 వ తేదీని జన్మించెను. 1925 వ సంవత్సరములో

ఇతడు 'ఉప్సలా యూనివర్సిటీ' యందు పట్టభద్రుడై, 1930 లో న్యాయశాస్త్ర పట్టమును పొందెను. ఇతడు 1933 లో స్టాక్‌హోమ్ యూనివర్సిటీయందు రాజకీయ శాస్త్రాధ్యాపకుడుగ ప్రవేశించి కొంతవరకు పనిచేసెను. 1936 నుండి 1945 వరకు స్వీడెన్ ప్రభుత్వమునకు ఆర్థిక సలహాదారుడుగ వ్యవహరించెను. అటుపిమ్మట స్వీడెన్ బ్యాంకు అధ్యక్షుడుగ నియమితుడయ్యెను. అనంతరము అతడు స్వీడెన్ ప్రభుత్వమునకు ప్రత్యేక ఆర్థిక సలహాదారుడుగ నియమితుడై, రాజ్యాంగయంత్రములో ప్రముఖ స్థానమును ఆక్రమించెను. 1952, 1953 లలో హామర్ షెల్డ్ ఐక్యరాజ్య సమితి సమావేశమునకు హాజరైన స్వీడెన్ ప్రతినిధి వర్గములో సభ్యుడయ్యెను. 1953, ఏప్రిల్ 7 వ తేదీన ఇతడు ఐక్యరాజ్యసమితికి ప్రధాన కార్యదర్శిగ ఎన్నుకొనబడెను.

హామర్ షెల్డ్ అవివాహితుడు, తన మాతృభాషయగు స్వీడిష్ భాష గాక, ఫ్రెంచి, ఇంగ్లీషు, జర్మన్ భాషలను అనర్గళముగ మాట్లాడగలిగెడివాడు. ఇతడు ఉద్రేక పూరితమైన మనస్తత్వము లేని వాడగుటచే, సూయజ్, కాంగో వంటి అనేక ప్రమాదకరమైన సమస్యలు ఉదయించి, ప్రపంచశాంతికి భంగము కలిగినప్పుడు కూడ చలించక, గుండె నిబ్బరముతో వ్యవహరించగలిగెను.

కాంగో సమస్య భయంకరరూపము దాల్చిన సమయములో ఐక్యరాజ్యసమితి సమావేశములందు హామర్ షెల్డ్ సోవియట్ రష్యా మున్నగు సోషలిస్ట్ రాజ్యముల యొక్క తీవ్ర విమర్శనలకు గురి అయ్యెను. హామర్ షెల్డ్‌ను కార్యదర్శి పదవినుండి తొలగించి, అతని స్థానములో సమాన బాధ్యతలు గల ముగ్గురు కార్యదర్శులు ఎన్నుకొనబడవలెనని సోవియట్ రష్యా తీవ్రమైన ఆందోళన చేసెను. తదాదిగా ఐక్యరాజ్యసమితి కార్యదర్శిగా హామర్ షెల్డ్‌ను రష్యా గుర్తింప నిరాకరించెను.

ఇతడు ఎట్టి రాజకీయ సమస్యలనైనను అవగాహనము చేసికొని ప్రశాంత చిత్తముతో, విశేషమైన రాజకీయ పరిజ్ఞానముతో పరిష్కరించుటకు యత్నించెడివాడు. కాంగో దేశమందలి కటాంగారాష్ట్రమునకు 1961, సెప్టెంబరు 18 వ తేదీన ఇతడు ప్రయాణమై విమానములో పోవుచుండగా మార్గమధ్యమున అజ్ఞాత పరిస్థితులలో ఆ విమానము క్రింద కూలుటచే హామర్ షెల్డ్ మరణించెను. మరణానంతరమున ఇతనిపేర నోబెల్ బహుమానము (శాంతి కృషికి సంబంధించినది) ఈయబడినది. ప్ర. రా. సు.

**హాలండ్ :** చూ. నెదర్లండ్స్ - పు. 540.

**హిక్సాసులు :** (క్రీ. పూ. 1985 - 1574); హిక్సాసులు (గొల్లరాజులు) సెమిటిక్ జాతికి చెందినవారు. మంచి వీరులు. తమ బాహుబలముచే ఈజిప్టును జయించి ఆక్రమించుకొనిరి. ఈజిప్షియన్‌ల ఆచార వ్యవహారములను, నాగరకతను స్వీకరించిరి. ఈజిప్టు ప్రాచీన చరిత్ర రచయిత 'మెనెతో' ఒసంగిన ఈజిప్టు రాజవంశావళిలో ఈ హిక్సాసురాజులు 15, 16, 17 రాజవంశములకు చెందినటుల తెలుపబడినది. కాని, ఈ రాజవంశముల పరిపాలన కాలపు వివరములు మాత్రము తెలియవచ్చుటలేదు. ఈ హిక్సాసు పాలకులలో ఒకడగు ఖయాన్‌ప్రభువు కాలమున వీరి పరిపాలన క్రీట్‌దీవి, బాగ్దాద్‌నగరము మొదలగు దూరప్రాంతములకు సైతము వ్యాపించినటుల నిదర్శనములు కలవు. ఈ రాజవంశముల పరిపాలనకాలమును గురించి వివిధాభిప్రాయములు కలవు. కడకు ఈ దేశీయ పాలకులను అంతమొందించి, ఈజిప్టు దేశీయ ప్రభువులు రాజ్యపరిపాలనను వశపరచుకొనిరి. వి. నా.

**హిటైట్‌లు :** క్రీ. పూ. 19 వ శతాబ్దమునుండి 12 వ శతాబ్దము వరకును ఆసియామైనర్‌లో నివసించిన ఒక ప్రముఖ జాతి. వీరు ఏ జాతికి చెందినవారో మనకు స్పష్టముగ తెలియదు. మొట్టమొదట ఆసియామైనర్‌ను ఆర్యజాతులవారు జయించి ఆ ప్రాంతీయ భాషనే స్వభాషగ చేసికొనిరి. వారి రాజులు బలిష్ఠమైన సామ్రాజ్యమును స్థాపించి, ఉత్తర సిరియా వరకును తమ దండయాత్రలను సాగించిరి. 16 వ శతాబ్దారంభములో బాబిలోనియా వరకు వీరు సాగించిన దండయాత్ర చాల ప్రసిద్ధమైనది.

ఈజిప్టులో 18 వ రాజవంశము క్షీణదశకు వచ్చుచుండిన సమయమున హిటైట్‌ల సామ్రాజ్యము అత్యంత వైభవముతో వర్ధిల్లుచుండెను. తర్వాత క్రీ. పూ. 1290 ప్రాంతమున మధ్య సిరియాలో కాడిష్‌వద్ద హిటైట్‌ల రాజుతో ఈజిప్టు ప్రభువు రామిసెస్ - II యుద్ధము చేసెను. తర్వాత 16 సంవత్సరములకు వీరిరువురు సంధి చేసికొనిరి. అప్పటి నుండి హిటైట్‌ల అధికారము క్షీణింపసాగెను. అదే సమయమున తండోపతండములుగ వచ్చి పడుచుండిన గ్రీక్ జాతులచే ఈజియన్ వాసులు తమ భూములనుండి తరుమబడి హిటైట్‌ల సామ్రాజ్యమును ఆక్రమించుకొనుట హిటైట్‌ల పతనమునకు ఒక కారణమని చెప్పవచ్చును.

హిటైట్‌ల పేరు 8 వ శతాబ్దములో కూడ వినవచ్చుచున్నది. యూఫ్రటీస్ నదిపై ఉన్న కార్కెమిష్‌పట్టణము హిటైట్‌లకు చెందినదే. వీరి లిపి నిగూఢమగుటచే రహస్యములు చాలకాలమువరకు బయలుపడలేదు.

హిటైట్‌ల తొలి గ్రంథములు అన్నియు బాణాగ్ర [చూ. క్యూనిఫారమ్ - సం. 6 - పు. 769] లిపిలో వ్రాయబడెను. వీరి న్యాయచట్టము మిక్కిలి ప్రఖ్యాతిగాంచెను.

కాని, ఈజిప్టు, బాబిలోనియాల సంస్కృతితో పోల్చిచూచినచో హిట్టైట్‌ల నాగరకత మోటుగ ఉండును. ఆసియా మైనర్‌నందలి బోగజ్‌కాయ్ పరిసరములందు లభించిన శాసనములనుబట్టి చూడ ఈ హిట్టైట్‌లందు ఆర్యసంస్కృతికి వ్యాప్తి ఉండునటుల తోచుచున్నది. క్రీ. పూ. 1380 ప్రాంతమున హిట్టైట్ రాజు 'శిబ్బిలిలోమస్' అనునతడు మిత్తాని రాజుతో చేసుకొనిన ఒడంబడికలో మిత్ర, వరుణ, ఇంద్ర, నాసత్యులు సాక్షులుగ పేర్కొనబడుట వలన ఈ అభిప్రాయమునకు బలము ఏర్పడుచున్నది. ఇంకను ఈ హిట్టైట్ జాతిని గురించిన పరిశోధన జరగవలసి ఉన్నది. అయినను హిట్టైట్‌లు వారికాలములో సమీప ప్రాచ్యమందు వర్ధిల్లిన వివిధ రాజ్యముల సాంఘిక జీవితములోను, రాజకీయ జీవితములోను ముఖ్యపాత్ర వహించిరనుట మాత్రము నిస్సంశయము. వి. నా.

**హిట్లర్, అడాల్ఫ్** (1889 - 1945) : జర్మనీ దేశమును ఏలిన నియంత. బ్రానా అనుచోట 1889 లో జన్మించెను. 'లడ్విగ్‌పోట్ష్' అను జర్మను చరిత్రాధ్యాపకుని బోధనా ప్రభావముచే హిట్లర్ బాల్యమునందే జర్మనీ దేశభక్తుడుగ మారెను. తన 17 వ సంవత్సరములో తలిదండ్రులు గతించగా హిట్లర్ వియెన్నాలో చిత్రకార వృత్తిలో ప్రవేశించెను. కాని, అందు వృద్ధిలోకి రాజాలక, ఇండ్ల కట్టడపు కూలీగా కొంతకాలము జీవించెను. అచట ఉన్నపుడు ఆస్ట్రియా ప్రభుత్వపు నిష్ప్రయోజకత్వమును, దౌర్బల్యమును గ్రహించెను. లూజర్ అనువాని ఉపన్యాస ప్రభావమువలన యూదులను ద్వేషింప సాగెను. అయిదేండ్లు వియెన్నాలో ఉండి 1912 లో మ్యూనిక్ నగరము చేరెను. 1914 లో ప్రథమ ప్రపంచ యుద్ధము ఆరంభమైన వెంటనే సైనికోద్యోగమున చేరి, యుద్ధములో గాయపడి, కనుదృష్టి పోవునంతటి స్థితి ఏర్పడి, బెర్లిన్ నగరమునందు ఒక ఆసుపత్రిలో ఉండినపుడు జర్మను పరాజయమును గురించి విని పలుమారు ఏడ్చెను. ఆ ఆసుపత్రినుండి బయటకు రాగానే రాజకీయవాదియై మ్యూనిక్‌నగరము చేరెను. అచట జర్మను కార్మిక పక్షమున చేరి, దానికి నాయకుడయ్యెను. అచట గోట్‌ఫ్రీడ్ ఫేడర్ అనువాని బోధనా ప్రభావము వలన యూదులను ద్వేషించుటయందును, జర్మనీ ఆధిపత్యమునందును, ఆర్య జాతీయుల ప్రాధాన్యమునందును చాల నమ్మకము కలవాడై సహజముగా గొప్ప వక్తయగుటచే 1923 నాటికి గొప్ప పేరుపొంది తన పక్షపు పేరును 'నేషనల్ సోషలిస్ట్ జర్మను వర్కర్స్ పార్టీ' గా మార్చెను. ఇదియే క్రమక్రమముగ సంక్షిప్తరూపమున 'నాజీ' అని వ్యవహరింపబడెను [చూ. నాజీవాదము - పు. 530]. అంతట అధికారమును బలముచే గ్రహించు ఉద్దేశములో బెర్లిన్‌మీద దాడి సలిపెను. కాని, పట్టుపడి కారాగారమునందు ఉంచబడెను. అచట ఉన్నపుడే 'మీన్‌కాంఫ్ (నా పోరాటము)' అను గ్రంథమును రచించెను. విడుదలయైనప్పటినుండియు తన 'నేషనల్ సోషలిస్ట్ పార్టీ' ని క్రమముగ బలపరచి, 1930 నాటికి తన పార్టీని దేశమంతటిలో రెండవ పెద్ద పార్టీగా చేసి, 1933నాటికి జర్మనీ ప్రధాని పదవికి వచ్చెను. పదవికి వచ్చినప్పటినుండియు జర్మనీని ద్వితీయ ప్రపంచ యుద్ధమునకు సన్నద్ధము గావించి, వెర్సైయిల్స్ సంధి [చూ. పు. 844] ని పూర్తిగా త్రోసిపుచ్చి, ఇటలీ (ముస్సోలినీ) తో కలసి చుట్టుప్రక్కల రాజ్యములను ఆక్రమించి, 1939 సెప్టెంబరులో పోలండ్ మీద దండెత్తెను. దానితో ద్వితీయ ప్రపంచ యుద్ధము ఆరంభమయినది. మొదటి మూడు సంవత్సరములలో హిట్లర్ నిరాఘాటముగ విజయపరంపరలను పొందెను. రష్యా దండయాత్రల వలనను, యునైటెడ్ స్టేట్స్ యుద్ధమున చేరుటవలనను హిట్లర్ కడకు ఓడిపోయి, 1945, ఏప్రిల్ 30 న ప్రియురాలగు 'ఇవాబ్రాన్' తో సహా ఆత్మహత్య గావించుకొనెను. వి. నా.

**హిబ్రూలు** : చూ. యూదులు - పు. 794.

**హుమాయూన్** : చూ. మొగల్ సామ్రాజ్యము.

**హుయాన్‌స్యాంగ్** (604 - 664) : భారతదేశమును సందర్శింపవచ్చిన చీనా యాత్రికులలోకెల్ల సుప్రసిద్ధుడు. ఇతను క్రీ. శ. 604లో చీనాలో జన్మించెను. చిరుతప్రాయమునసే సన్యాసమును స్వీకరించి, చీనాదేశమునంతటిని సందర్శించెను. 629 - 645 లో భారతదేశములోని వివిధ యాత్రా స్థలములను, మత కేంద్రములను పర్యటించి బౌద్ధ వాఙ్మయమును, బుద్ధుని భౌతికవిశేషములను సేకరించెను. భారతదేశములోని ప్రఖ్యాతిగాంచిన బౌద్ధ విజ్ఞాన కేంద్రములైన నలంద, తక్షశిలలలో ఈతడు విద్యను అభ్యసించెను.

భారతదేశ సందర్శనానుభవములను తెలుపు ఈతని రచనలు ఆ కాలపు భారతదేశచరిత్రను గ్రహించుటకు కొంత ఉపకరించుచున్నవి. హర్షవర్ధనుని పరిపాలనా కాలమునాటి భారతదేశ మత, సాంఘిక, సాంస్కృతిక, ఆర్థిక పరిస్థితులను తన రచనలలో విపులముగా తెలియజేసెను. కాని, ఈతని రచనలలో ఆనాటి రాజకీయపరిస్థితులను గూర్చి అంతగా తెలియదు. 643 లో హర్షవర్ధనుడు ఏర్పరచిన ఆరవ పాంచవార్షికబౌద్ధమహాసభకు ఇతడు అధ్యక్షత వహించెను. 75 దినములపాటు జరిగిన ఈ సదస్సు సందర్భమున హర్షవర్ధనుడు తన ధనాగారమునందలి

సంపదను అంతయు పేదసాదలకు దానము చేసెను. అలహాబాద్‌లో జరిగిన బౌద్ధమహాసభానంతరము ఇతడు స్వదేశమునకు మరలి, పామీర్, ఖోటాన్ మార్గముల ద్వారా 645 న స్వదేశమైన చీనాకు చేరెను. తనతో కూడ బుద్ధుని ధాతు కావశేషములను - దాదాపు నూటఏబదింటిని - బంగారు, వెండి, చందనములతో చేయబడిన బుద్ధుని ప్రతిమలను పెక్కింటిని, 657 సంపుటముల వ్రాత ప్రతులను ఇరువది గుఱ్ఱములపై వేసుకొనిపోయెను. స్వదేశము చేరినవెంటనే ఇతడు తన జీవితశేషమును ఈ వ్రాతప్రతులను చీనాభాష లోనికి అనువదించుచు గడిపెను. ఈతడు బౌద్ధ వాఙ్మయమును 74 సంపుటములలో చీనాభాషలోనికి భాషాంతరీకరించి, 664 లో దివంగతుడు అయ్యెను.

హర్షవర్ధనుని కాలమునాటి రాజ్యపరిపాలనా విధానము ఇతని మన్ననలను అందినది. హర్షవర్ధనుని పరిపాలనా కాలమున ప్రజలపై పన్నులభారము అధికముగా లేదనియు, అన్ని మతావలంబులపట్ల సమాదరము చూపబడుచుండినట్లును ఇతడు తన రచనలలో తెలియజేసెను. ఇతని రచనలలో అచ్చటచ్చట అతిశయోక్తులును, అవిశ్వసనీయ గాథలును ఉన్నను, సమకాలిక భారతదేశ చరిత్ర రచనలో అవి కొంతవరకు ఉపకరించుననుట యథార్థము.

గు. రా.

**హూణులు :** సంచారజాతులుగను, యోధులుగను ఉండిన హూణులు క్రీస్తుశకారంభములో మిక్కిలి ప్రాచీనములైన అనేక సామ్రాజ్యసౌధములను నిర్మించిరి. ఆనాటి కొన్ని గాథలను బట్టి హూణులు అను పేరుతో ఈ సంచారజాతులు నాలుగు తెగలుగా ఉండెడివని చరిత్రకారులు ఊహించుచున్నారు. ఈ నాలుగు తెగలలో మొదటిది ప్రాచ్యరోమన్ సామ్రాజ్యముపై అత్తిల నాయకత్వమున (క్రీ. శ. 372 - 453) దండెత్తిన తెగ; రెండవది 893 లో కార్పేతియన్ పర్వతశ్రేణిని అతిక్రమించి హంగేరీని జయించి అట స్థిరనివాసము ఏర్పరచుకొనిన మాజియర్ తెగ; మూడవది పారసీకసామ్రాజ్యమును 420 నుండి 557 వరకు పీడించిన శ్వేతహూణజాతి (ఎప్తిలైట్ జాతి); నాలుగవది ఆ కాలముననే భారతదేశముపై పలుమారులు దండయాత్రలు సల్పిన హూణజాతి. వీనిలో కడపటి రెండు తెగలును ఒకే శాఖకు చెందినటుల తోచుచున్నది. ఒకటవ శతాబ్దిలో వీరు చీనా ప్రభువులచే మధ్య ఆసియానుండి తరుమబడినటుల చీనా చరిత్రవలన తెలియనగుచున్నది. అటుల తరుమబడిన వారిలో ఒక శాఖ ఆఫ్ఘనిస్తాన్ ప్రాంతముల నివాసము ఏర్పరచుకొనగ, వేరొక శాఖ యూరల్ పర్వతశ్రేణి దక్షిణ ప్రాంతమును తమ నెలవుగ చేసికొనినటుల ఊహింప అవకాశము కలదు. ఇందలి రెండవశాఖనుండి జనించిన హూణులే రోమన్‌సామ్రాజ్యముపై దండయాత్రలు జరిపినవారలై ఉందురు. వీరు తొలుత బాలమీర్ నాయకత్వమున వోల్గా, డాన్ నదుల మధ్యప్రదేశమును జయించి, ఆస్ట్రోగాత్‌ల [చూ. గాత్‌లు - పు. 425] సామ్రాజమును పూర్తిగ విచ్ఛిన్నము గావించి, విజిగాత్‌లను దేశమునుండి పారద్రోలిరి. అట్లు పారిపోయిన విజిగాత్‌లు పర్త్, డాన్యూబ్ నదీతీరములయందు స్థావరములు ఏర్పరచుకొనిరి. కాని, క్రూరులగు హూణులు వారిని అక్కడ కూడ సుఖముగా జీవింపనీయక ఇంకను ముందునకు తరిమిరి. రోమన్‌సార్వభౌమత్వమునకు అప్పటికే క్షీణదశ పట్టినదని చెప్పుటకు రెండు ఆధారములు ఉన్నవి. రోమన్ చక్రవర్తులు తమ ఇతర శత్రువులను ఎదుర్కొనుటకై హూణుల ఆయుధ సంపత్తిని కూడ ప్రయోగించ మొదలుపెట్టిరి. క్రీ. శ. 432 లో థియోడోసియస్ - II హూణుల రాజగు రూవాస్ లేదా రుగ్యులస్ అను అతనికి సాలీనా 350 పౌనులు కప్పము కట్టుటకు అంగీకరించి, వారివలన కలుగగల ప్రమాదమును అరికట్టెను. ఇందుమూలముగా థియోడోసియస్ వారి హృదయములను చూరగొనలేకపోయినను, రూవాస్ అకాలమరణమొక్కటే నాడు అనివార్యముగ తోచిన రోమ్ వినాశమును తప్పించినది. రూవాస్ తరువాతివారు అతనిని మించిన రణధీరులగుటచే రోమన్‌లు రూవాస్‌కు కట్టినదానికి రెట్టింపు కప్పమును వారికి సమర్పించుకొనవలసి వచ్చినది. వీరి ఆధ్వర్యవమున హూణులు సితియా, మీడియా దేశములను నిర్మానుష్యము గావించి, పారసీకమును సైతము హడలగొట్టి, తూర్పున రోమన్‌పట్టణమగు మార్గస్‌ను (441), పశ్చిమమున సైరిమియమ్‌ను ముట్టడించిరి. 445 లో అత్తిల దిగ్విజయయాత్ర ముగించుకొని సైన్యముతో కాన్‌స్టాంటినోపుల్‌ను సమీపించెను. కెటానా యూనియన్ మైదానములపై జరిగిన ఘోరయుద్ధములవలను, అనంతర సంవత్సరములలో ఆక్విలియా, వెనిస్ మున్నగు పట్టణములను నేలపాలు గావించిన ఫలితముగా మినిసియో కట్టలపై అత్తిలకు, పోప్ లియోకు జరిగిన యుద్ధమువలనను హూణులకు ఆల్ప్సపర్వతములను దాటి ఆవలకు పోవలసిన గతి పట్టినది. ఆ మరుసటి సంవత్సరమే అత్తిల మరణించెను. 454 లో హూణులపై పగదీర్చుకొనుటకు గాత్‌లు, గుపిడో, స్వెవి జాతులు ఏకమై పెనోనియాలోని సెటాడ్‌నదివద్ద హూణులతో హోరాహోరి యుద్ధము చేసినపుడు 30,000 మంది హూణులు మరణించిరి. ఈ విపత్కరమైన అపజయము

నుండి వారు అటుపిమ్మట తేరుకోలేదు. హూణులు అంద రును చెల్లాచెదరై పోయిరి. కొందరు డాన్యూబు జాలోను, డేసియాలోను స్థిరపడగా మిగిలినవారు వారి పూర్వనివాస ములకు చేరుకొనిరి. మరికొందరు నవీన రష్యా దక్షిణ స్టెప్పీలకు పోయిరి. బల్గేరియన్‌లు నాటి హూణుల సంతతి వారని చెప్పవచ్చును. భారతదేశముపైనను, పారసీకము పైనను దండయాత్రలు జరిపిన హూణులలో పలువురు ఆ దేశీయ జాతులలో కలసిపోయిరి. గి. వేం సీ.

హూవర్, హెర్బర్ట్ (1874 - 1966): యునైటెడ్ స్టేట్స్ అధ్యక్షుడు. ఐయోవాలో జన్మించి స్టాన్‌ఫర్డ్ యూనివర్సిటీలో భూతత్త్వశాస్త్రము, ఇంజనీరింగ్ అభ్య సించెను. గనులకు సంబంధించిన వివిధోద్యోగములను 1915 వరకు నిర్వహించి, అధిక ధనమును ఆర్జించెను. ప్రథమ ప్రపంచయుద్ధ సమమున, యుద్ధానంతరమున బెల్జియమ్, మధ్య యూరప్, రష్యాలలో యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వపక్షమున సహాయ కార్యక్రమమును నిర్వహించెను. యునైటెడ్ స్టేట్స్‌లో ఆహార నిర్వహణాధికారిగ కూడ ఇతడు పని చేసెను. హార్డింగ్, కూలిడ్జ్ పరిపాలనలలో వాణిజ్య కార్యదర్శి (1921 - 28) గ ఇతడు పని చేసెను.

రిపబ్లిక్ పార్టీ అభ్యర్థిగ అధ్యక్షపదవికి 1928 లో పోటీ చేసి, రోమన్ కేథలిక్ డెమోక్రాట్ అగు అల్‌స్మిత్‌ను ఓడించెను. హూవర్ అధ్యక్షపదవి స్వీకరించిన కొద్ది నెల లకే దేశము పెద్ద ఆర్థికమాంద్యతకు గురి అయ్యెను. హూవర్ వాణిజ్య కార్యదర్శిగ ఉన్న కాలమున అదుపు లేని అతని యోచనయే ఆర్థికమాంద్యతను ఉద్ధృతపరచిన దని పెక్కు విమర్శకులు భావించిరి. స్వాభావిక ఆర్థిక వ్యవహారములే కడకు వాణిజ్యమును పునరుద్ధరించునని విశ్వసించి, అధ్యక్షుడుగ ఫెడరల్ బాధ్యతలను విస్తృత పరచుటకు హూవర్ అనిష్టత చూపెను. ఆర్థికమాంద్యత యూరప్‌కు వ్యాపించగా ప్రభుత్వముల మధ్య బాకీల చెల్లింపుకు ఒక సంవత్సరము వాయిదాను హూవర్ (1931, జూన్) ప్రకటించెను. ఇది జర్మనీకి యుద్ధనష్ట పరి హారపు చెల్లింపు భారములో కొంత ఉపశమనము కలిగించినది. 1932 లో అధ్యక్ష ఎన్నికలలో రూజ్‌వెల్ట్ చే హూవర్ ఓడింపబడెను. పా. ల. నా.

హెన్రీ - VIII (1491 - 1547): హెన్రీ - VII కుమారుడు; ఆంగ్ల దేశమును ఏలిన ట్యూడర్ వంశపురాజు. ఇతని పేరు చెప్పగానే చరిత్ర చదువుకొన్నవారికి మూడు ముఖ్యమైన విషయములు జ్ఞప్తికి రాకమానవు. ఒకరి తర్వాత నొకరినిగా ఆరుగురు భార్యలను పెండ్లియాడిన రాజు. ఇంగ్లండు దేశము రోమ్‌నగరమందలి చర్చి మతాధి కారమునకు లోబడనక్కరలేకుండా దేశమున మత స్వాతంత్ర్యమును సాధించిన ధీరుడు. తక్కిన దేశములందు ఆ కాలమున రాజులు భూతలముపై పోరాడు సైనిక బలములనే సమకూర్చుకొనుచుండగా బ్రిటన్‌లో యుద్ధ నావికులను, నౌకాదళమును బలపరచుకొన్న పరిపాల కుడు; దూరదృష్టిగల రాజనీతివేత్త. రాజ్యము ఏలుటకు ప్రారంభించిన తర్వాత కొంతకాలము వరకును ఇతడు తన ముఖ్యమంత్రియైన కార్డినల్ తామస్ వుల్సీకి రాజ్య వ్యవహారములు అన్నియు విడిచిపెట్టి ఉండెను. గి. వేం. సీ.

హెన్రీ ది నావిగేటర్ (1394 - 1460): పోర్చుగల్ యువరాజు; దేశాన్వేషకుల పోషకుడు. హెన్రీ అనునది ఇతని నామము; నౌకాయాన విజ్ఞానము ఎడ ఇతనికి కల శ్రద్ధవలన ఇతనికి ది నావిగేటర్ (నావికుడు) అనునది ఉపనామము. ఇతని ధైర్య సాహసములకు ప్రీతుడై ఇతని తండ్రి పోర్చుగల్ రాజు జాన్ - I ఇతనికి చిన్న రాజ్యమును ఇచ్చెను. మొరాకో యుద్ధముతో తన ఆఫ్రికా జ్ఞానమును పెంపొందించుకోవలెనను ప్రేరేపణ హెన్రీకి కలిగినది. 1416 లో సాంగ్రెస్ వద్ద నౌకా ఆయుధశాలను వ్యవస్థాపించి సమీపమున ఉన్న లాగోస్ ఓడరేవును దేశా న్వేషణకు స్థావరముగా ఉపయోగించుకొనెను. భూగోళ, నౌకాయానముల పరిశీలనలకై ఒక ప్రయోగశాలను, ఒక శిక్షణశాలను కూడ ఇతడు వ్యవస్థాపించెను. ఇతని నావికులలో ఒకడు మదీరా దీవులను పునరావిష్కరించి (1420), సమీపమున ఉన్న ఆఫ్రికా పశ్చిమకోస్తాను అన్వే షించెను. ఇతడు 1443 లో కేప్ బోజడార్‌ను, 1441 లో కేప్ బ్లాంకోను అన్వేషించి, మరుసటి సంవత్సరము ఆర్గూ యిమ్ అఖాతముపై బానిసవ్యాపార స్థావరమును ఒక దానిని వ్యవస్థాపించెను. బానిసలతోను, బంగారముతోను ఇతని నావికులు తిరిగి వచ్చినప్పుడు అంతవరకు పరిహాస భాజనముగ ఉండిన ఇతని ఆఫ్రికా అన్వేషణ ప్రశంసింప బడినది. 1444 నుండి 1446 వరకు 30 నుండి 40 నౌకలు ఇతని ఆధిపత్యములో గినీ కోస్తాకు పోయివచ్చినవి. 1456 లో ఇతని నావికులు పశ్చిమ ఆఫ్రికాలోనికి చొచ్చుకొనిపోయి సెనెగల్ ప్రాంతభూములను పరిశీలించి కేప్‌వర్డి దీవులను కునుగొనిరి. పా. ల. నా.

హేగ్ సమావేశములు: యుద్ధసాధనముల ఉత్పత్తిని నియంత్రించు విషయమును ఆలోచించుటకై జరిగిన అంతర్జాతీయ సమావేశములు (1899, 1907).

ఇందులో మొదటిది: హాలండ్‌లోని హేగ్ పట్టణమున 1899 మే నుండి జూలై వరకు జరిగెను. దీనికి 1898 ఆగస్టులో రష్యా చక్రవర్తియగు నికలస్ - II చేసిన ప్రతి

పాదనమే ముఖ్యకారణము. ఈ సమాశమునకు వివిధ రాజ్యములనుండి 26 గురు ప్రతినిధులు హాజరైరి. యుద్ధ సామగ్రి తయారుచేయు పోటీలో ధనాభావముచే రష్యా తక్కిన దేశములతో తులతూగజాలక రష్యా చక్రవర్తి ఈ సమావేశము జరుగవలెనని ప్రతిపాదించెననియు అనేక దేశములలో అంతకుముందే గుసగుసలు బయదేరుటచే చాలమందికి రష్యా చక్రవర్తిపై అపోహలు కలిగెను. తత్కారణమున ఆయుధోత్పత్తి నియంత్రణ విషయమై ఈ సమావేశము సాధించిన ఫలితము మృగ్యము. అయితే, గౌరవభంగకరము కానట్టియు, ప్రముఖ ప్రయోజనములకు సంబంధించనట్టియు తగాదాలను పరిష్కరించుటకై ఒక అంతర్జాతీయ శాశ్వత న్యాయస్థానమును స్థాపించుటకు నిర్ణయము జరుగగా, 1901 లో హేగ్ పట్టణమున ఒక అంతర్జాతీయన్యాయస్థానము నెలకొల్పబడెను.

రెండవ హేగ్ శాంతిసమావేశము : యునైటెడ్ స్టేట్స్ ప్రెసిడెంట్ థియోడోర్ రూజ్‌వెల్ట్ ప్రేరణమున 15-6-1907 నుండి 18-10-1907 వరకు జరిగిన ఈ సమావేశము దూర ప్రాచ్యమందలి యుద్ధము కారణముగ వాయిదా వేయబడెను. సమావేశములు జరిగిన కాలమందైనను ఆంగ్లో-జర్మను వైషమ్యములచే తగినంత ఫలితము సాధింపబడజాలదయ్యెను. అయినను, ఈ సమావేశము 1. అంతర్జాతీయవివాదముల పరిష్కారమునకై ఇచ్ఛాపూర్వకముగ మధ్యవర్తుల సంఘనియామకము; 2. అంతర్జాతీయ ఋణముల వసూలునకు అనుసరింపవలసిన సంప్రదాయములు; 3. యుద్ధముచేయు ఉభయపక్ష రాజ్యములు అనుసరింపదగు అంతర్జాతీయ నియమములు; 4. యుద్ధ కాలమున తటస్థరాజ్యములకు కల హక్కులు, బాధ్యతలు మొదలగువానికి స్థిరరూపములు కల్పించెను. స్వ. వెం.

హేనిబల్ : చూ. హానిబాల్ - పు. 911.

హేస్టింగ్స్, వారన్ (1732 - 1818) : ఆంగ్ల రాజనీతివేత్త; భారత ప్రథమ గవర్నర్-జనరల్ (1774-1784). ఇతడు ఆక్స్‌ఫర్డ్ షైర్‌లో జన్మించెను; తన 18 వ ఏట ఈస్టిండియా కంపెనీ ఉద్యోగిగా బెంగాల్‌కు వచ్చెను; 1757 లో క్లైవ్‌తో చేరి, వాలంటీర్‌గ పనిచేసి, ప్రాముఖ్యమును ఆర్జించెను; 1761 లో బెంగాల్ కౌన్సిల్‌లో సభ్యుడుగ నియమింపబడెను. 1764 లో ఇంగ్లండుకు పోయి, హేస్టింగ్స్ 1769 లో మద్రాసు కౌన్సిల్ సభ్యుడుగ ఇండియాకు తిరిగివచ్చి, 1771 లో బెంగాల్ గవర్నర్ పదవిని, 1774 లో రెగ్యులేటింగ్ చట్టముక్రింద గవర్నర్-జనరల్ పదవిని చేపట్టెను. బెంగాల్ గవర్నర్‌గ ఇతడు 'దివానీ' అనగా శిస్తువసూలు చేయు అధికారమును కంపెనీ పరము చేసి, క్లైవు ఏర్పరచిన ద్వంద్వప్రభుత్వవిధానమునకు స్వస్తి చెప్పెను; రెవిన్యూబోర్డును, రెవిన్యూ సలహా సంఘములను స్థాపించెను. గవర్నర్ జనరల్‌గ ఇతని చర్యలు, విధానములు స్థలాంతరమున వివరింపబడినవి [చూ. భారత దేశ చరిత్ర పు. 664]. ఇతని చేతలలో విశేష విమర్శకు గురియైనవి 1. చైత్‌సింగ్ వ్యవహారము; 2. రోహిల్లాలను అణచివేయుటలో అయోధ్య నవాబుకు సాయపడి, అతనివద్ద ఖర్చుల క్రింద 50 లక్షలు పుచ్చుకొనుట; 3. షా అలమ్ చక్రవర్తికి కప్పమును చెల్లింపకుండట; 4. కంపెనీ సైనికవ్యయమును భర్తీ చేయుటకు రెండు జిల్లాలను అయోధ్యనవాబుకు అమ్ముట. ఇతనిపై ఇతని విరోధులు మోపిన క్రూరత్వము, అవినీతి అను అభియోగములను గూర్చి బ్రిటిష్ పార్లమెంట్ విచారణ జరిపించెను; కాని, ప్రభువుల సభ ఇతడు నిర్దోషి అని నిర్ద్వంద్వముగ తీర్పు చెప్పెను. అ. వెం.



వారన్ హేస్టింగ్స్
(1732 - 1818)

హైదరాలీ (1722 - 1782) : భారతదేశ చరిత్రలో పేరొందిన రాజ్య నిర్మాత; పరిపాలకుడు; విజేత. ఈతని పూర్వులు పారసీకమునుండి భారతదేశమునకు వచ్చిరి. ప్రసిద్ధిచెందిన కొరేష్ వంశజులు. ఈతని తండ్రిపేరు ఫతేమహమ్మద్. 1722 లో కోలారున ఈతడు జన్మించెను. మొట్టమొదట మైసూరు సైన్యమున 'సుమేదుగా' (జీతభత్యములు లేకుండా) పని చేయుచు, ధైర్య సాహసములకు పేరుపొందెను. కనుక, 1750 లో నిజామ్‌నకు సాయముగా బంపబడిన సేనకు హైదర్ నాయకుడుగా చేయబడెను. ఆ యుద్ధమందుకూడ గొప్ప పేరుప్రతిష్ఠలు సంపాదించి తిరిగి వచ్చునపుడు దారిలో ఉన్న పుదుచ్చేరికి పోయి అచటి ఫ్రెంచివారితో పరిచయము గలిగించుకొని, అచటి ఫ్రెంచి సైనికుల క్రమశిక్షణకు, వారి ఇంజనీరుల నైపుణ్యమునకు అచ్చెరువందుచు తన సైనికులను కూడ ఫ్రెంచివారి సాయముచే అట్లుచేయ దృఢనిశ్చయుడై మైసూరుకు పోయి క్రమ



హైదరాలీ
(1722 - 1782)

ముగ 1500 ఆశ్వికులు, 3000 కాల్బలము గల సేనకు నాయకుడయ్యెను.

మైసూరు మంత్రియగు దేవరాజునకు, దళవాయియగు నంజరాజునకు 1758 లో వివాదములు ఏర్పడి, సైనికులు తిరుగుబాటు చేయగ, హైదరు చాకచక్యముతో ఆ తిరుగుబాటును అణచివైచెను. ఇట్లు అన్నివిధముల సమయమునకు ఆదుకొని తనకు సాయము చేసినందుకుగాను మైసూరు మహారాజు హైదరుకు 'ఫతే హైదర్ బహదూర్' అను బిరుదమును ఇచ్చెను. ఈ విధముగ పలుకుబడిని ఆర్జించి, హైదరు అనాయాసముగ సేనవంతను స్వాధీన పరచుకొని, తుదకు మహారాజునకు సొంత వ్యయమునకై కొంత డబ్బు ఏర్పాటు గావించి, రాజ్యాధికారమంతయు తన స్వాధీనము కావించుకొనెను.

నిజామ్ తమ్ముడగు బసాలత్ జంగ్ హైదరుకు హైదరాలీ జాన్‌బహదూర్ అను బిరుదమిచ్చి, అతనిని సిరా మండలమునకు 1763 లో నవాబుగా చేసెను. హైదరు ఆ తరువాత మహారాష్ట్రులను పారద్రోలి సిరాను పట్టుకొని, ఆవల చిక్కబళ్లాలపురము, చిత్రదుర్గము, రాయదుర్గము, హర్పనహళ్లి పాళెగాండ్రు తనకు కప్పము కట్టునట్లు చేసికొనెను. ఆ తరువాత మలబారు మీద దండెత్తి కళ్లికోట, కొచ్చిన్, పాలఘాట్‌లను ఆక్రమించెను.

హైదరు చేతిలో జంత్రపు బొమ్మవలె ఉండిన మైసూరు రాజు చిక్క కృష్ణదేవరాయలు 1766 లో గతించగా అతని పెద్ద కుమారుడగు నంజరాజును పేరుకు రాజును చేసి, అన్ని విషయములలో తానే మైసూరు పాలకుడుగా హైదరు వ్యవహరించెను. ఇట్టి హైదరుయొక్క మైసూరు రాజ్యాధికార దురాక్రమణ సహింపక, పీష్వా మాధవరావు నిజామ్‌తో కలసి హైదరుపై దండెత్తెను (1767). మహారాష్ట్రుల కడకు అప్పాజీరామ్ అనువానిని రాయబారిగా పంపి, హైదరు వారికి 35 లక్షల రూపాయలిచ్చి వారు మరలి పోవునట్లు చేసెను. నిజామ్‌ను తనతో కలుపుకొని కర్ణాటక మైదానము మీదికి దండెత్తి చెంగమా అనుచోట స్మిత్ అను బ్రిటిష్ సేనానిని తాకెను. దీనితో మైసూరుతో బ్రిటిష్‌వారు గావించిన నాలుగు యుద్ధములలో మొదటిది ఆరంభమయ్యెను (1767). 1769 లో ఈ యుద్ధము ఒక సంధితో ముగిసెను. ఆ సంధి ప్రకారము, తమ యిద్దరిలో (ఆంగేయులు, హైదరు) ఎవరికైనను శత్రువులు ఎదిరించిన, తాము ఒండొరులకు తోడుపడునట్లు సమాధానపడిరి. దీని వలన హైదరు యుద్ధ నిర్వహణమునందు, రాజ్యవ్యవహారములందు, వ్యూహరచనయందు మహా నిపుణుడని ప్రసిద్ధి గాంచెను. 1766 నుంచి 1772 వరకును మహారాష్ట్రులతో యుద్ధము చేసెను. ఈ యుద్ధమందు అప్పటి మైసూరు రాజగు నంజరాజు ఏదో కుట్రలు చేసెనని అతనిని జంపించి, అతని తమ్ముడగు చామరాజును రాజుగ చేసెను. 1773 లో కొడగును జయించెను. 1776 లో చామరాజు మరణించెను. 1776 లోనే గుత్తినికూడ ఆక్రమించెను. 1778 లో పీష్వా పదవిని గూర్చి మహారాష్ట్రులలో గలిగిన వివాదమువలన హైదరు కృష్ణానదివరకు ఉండు మహారాష్ట్ర దేశమును ఆక్రమించెను. 1780 లో హైదరాలీ బ్రిటిష్‌వారితో రెండవ మైసూరు యుద్ధము జరుప ప్రారంభించెను. యుద్ధ మధ్యముననే 1782, డిసెంబరు 7 వ తేదీని వ్రణసన్నిపాతమువలన చిత్తూరుజిల్లా నరసింగరాయని పేట యొద్ద హైదరు చనిపోయెను. ఏ. ఎస్. గుప్త.

**హొండూరాస్ :** మధ్య అమెరికాయందలి ఒక గణతంత్ర ప్రజాస్వామిక రాజ్యము.




ఈ దేశమునకు కారబియన్ సముద్రము [ఉ]; నికరాగ్వా, ఎల్ సాల్వడార్ [తూ]; నికరాగ్వా, ఫోన్‌సికా సింధుశాఖ [ద]; గ్వాతెమాలా [ప] సరిహద్దులందు ఉన్నవి. కారబియన్ సముద్రమును ఆశ్రయించి ఈ దేశమునకు 643 కిలోమీటరుల పొడవు, పసిఫిక్ మహాసముద్రమును ఆశ్రయించి 64 కిలోమీటరుల పొడవు కల తీరభూములు కలవు. [వి] 1,12,088 చ. కి. మీ; [జ] 20,07,990. స్పానిష్, ఆదిమ అమెరికన్ జాతుల కలయిక వలన ఏర్పడిన మిశ్రమ జాతివారు ఇందు 91% కలరు. [భా] అధికార జాతీయభాష స్పానిష్; కాని, వ్యాపార విషయము లందు ఉత్తర దేశమున ఇంగ్లీషునకు ఎక్కువ ఆదరణ కలదు. [మ] దాదాపుగ ప్రజలందరును క్రైస్తవులు; వీరిలో రోమన్ కేథలిక్‌లు అత్యధిక సంఖ్యాకులు. [రా] టెగుసిగల్పా (జ, సం. 1,64,794).

చరిత్ర : యూరపియన్‌ల వలసకు పూర్వము ప్రాచీన కాలమున అమెరికాయందు వర్ధిల్లిన మాయానాగరకత ఈ ప్రాంతమునకూడ 8 వ శతాబ్దియందు వ్యాపించి, విలసిల్లెనని భావించుటకు ఈ దేశమున లభించు నిర్మాణావ

శేషములు అవకాశమొసగుచున్నవి. కాని, క్రీ. శ. 1502 లో క్రిస్టఫర్ కొలంబస్ [చూ. పు. 407] ఈ ప్రాంతమును కనుగొనునప్పటికి ఆ నాగరకత దాదాపు నామావశిష్టము అయ్యెను. క్రమక్రమముగ ఇట ఉన్న ఆదిమ అమెరికన్‌లను జయించి వారి దేశమును స్పెయిన్‌వారు వశపరచుకొని; 1539 లో దీనిని తమ సామ్రాజ్యమున అంతర్భాగము చేసికొనిరి. తొలుత ఇది గ్వాటెమాలా రాష్ట్రపాలకుని పరిపాలనలో ఉండెను. 1821 లో స్పెయిన్ సామ్రాజ్యమునుండి మధ్య అమెరికా దేశములు విడివడినపుడు, హాండూరాస్ కూడ వానిని అనుసరించెను. తరువాత ఇది ఒక సంవత్సరకాలము మెక్సికో సామ్రాజ్యమునకు లోబడి ఉండి, అంతట మధ్య అమెరికా రాష్ట్రసమాఖ్యలో స్వచ్ఛందముగ భాగస్వామిని అయి, అందు 1824 నుండి 1838 వరకు ఉండి, కడకు 1838 లో ప్రత్యేక స్వతంత్రరాజ్యము అయ్యెను. అంతట అధికారార్జనకొరకై రాజకీయ పక్షముల మధ్య తగవులాటలు ఆరంభమయ్యెను. తుదకు 1840 లో సంప్రదాయవాదులు (కన్‌సర్వేటివ్‌లు) అధికారమునకు వచ్చి 1876 వరకు తమ అధికారమును నిలువబెట్టుకొనగలిగిరి. 1876 నుండి మితవాదులు అధికారమునువహించిరి. వీరి పరిపాలనకాలమున దేశమున విద్యావ్యాప్తి విరివిగ జరిగెను. మధ్య అమెరికా దేశములందు నిరంతరాయముగ సాగుచుండు తగవులాటలలో తాటస్థ్యము వహించుట తన విదేశ నీతియందొక ముఖ్యాంశముగ ఈ దేశము ఏర్పరచుకొనినది. 1932 లో అధ్యక్షతను ఆర్జించిన జనరల్ టిబర్‌షియో కేరియస్ యాండినో అను అతడు నియంతృత్వాధికారములను గ్రహించి 1948 వరకు పాలించెను. తరువాతనైనను ప్రజాస్వామిక ప్రభుత్వము నెలకొనుటకు అవకాశము లభింపలేదు. బలముగలవానిదే రాజ్యమయ్యెను. తుదకు సైన్యమే అధికారమును స్వీకరించి 1957 లో ఎన్నికలు జరిపి, ప్రజాస్వామ్యమును పునరుద్ధరించినది.

రాజ్యాంగము : 1957 లో ఆమోదితమగు రాజ్యాంగ చట్టమును అనుసరించి అధ్యక్ష పరిపాలన గల గణతంత్ర ప్రజాస్వామిక రాజ్యముగ ఈ దేశము రూపొందినది. అధ్యక్షుని పదవీ పరిమితికాలము ఆరు ఏండ్లు. అధ్యక్షుని అపరోక్షపు ఎన్నికలో ప్రజలు ఎన్నుకొనెదరు. తొమ్మిది మందిగల మంత్రిమండలిని అధ్యక్షుడు తన ఇచ్చను అనుసరించి ఏర్పాటు చేసికొని వారి మూలమున పరిపాలనను నిర్వహించును. శాసనసభ ఏకకక్ష్య కలది. 30 వేల ప్రజలకు ఒక ప్రతినిధి చొప్పున శాసనసభకు తమ ప్రతినిధులను ప్రజలు ఎన్నుకొనెదరు. ప్రతి ఒక ప్రతినిధితోపాటుగ ఒక ప్రత్యామ్నాయ ప్రతినిధియు ఎన్నుకొనబడును. 1957 లో శాసనసభయందు 58 ప్రతినిధులు కలరు. శాసనసభకు ఎన్నిక ఆరు ఏండ్లకు ఒకసారి జరుగును. 17 ఏండ్లు నిండిన ప్రతి పౌరునికి వోటింగు హక్కు కలదు. ప్ర. రా. సు.

**హొండూరాస్, బ్రిటిష్ :** దక్షిణ అమెరికాలోని బ్రిటిష్‌పాలిత వలసరాజ్యము.

ఈ రాజ్యమునకు కార్బియన్ సముద్రము, హాండూరాస్ అఖాతము [తూ]; గ్వాటెమాలా [ద, ప]; మెక్సికో [ఉ] సరిహద్దులు. [వి] 23,963 చ. కి. మీ.; [జ] 90,343; [భా] ప్రజలలో స్పానిష్ వ్యాప్తియందున్నను, ఆంగ్లము సాధికార భాష. [మ] క్రైస్తవము; [రా] బెలిజే (జ. సం. 32,824).

చరిత్ర : అమెరికా ఖండము కనుగొనబడినదాదిగ స్పెయిన్ ప్రభువుల అధికార పరిధిలో ఉండిన ఈ ప్రాంతమున 1638 లో బ్రిటిష్ సాహసికులు ఒక వలసను నెలకొల్పిరి. వీరి మూలమున నీగ్రోలును అచటికి చేర్చబడి, అచటి ఆదిమ అమెరికన్‌లలో సంకరత చెందిరి. వీరిపై ఆంగ్లసాహసిక కుటుంబములే చాలవరకు పెత్తనమును చాలకాలము వహించినవి. అట్టివారిని కాదని ఈ ప్రాంతముపై యథార్థాధిపత్యమును నెలకొల్పుటలో స్పెయిన్ విఫలత చెందినను, అంతర్జాతీయ మర్యాదను అనుసరించి, స్పెయిన్‌నకు చెందిన ప్రాంతముగనే చాలకాలము ఈ దేశము పరిగణన పొందెను. కడకు స్పెయిన్ ప్రతిష్ఠ యుద్ధాదులవలన సన్నగిల్లిన తరువాత 1862 లో ఈ ప్రాంతమును తన వలసగ బ్రిటన్ ప్రకటించి స్వాధీనపరచుకొనెను. ఇంతలో ఈ ప్రాంతము తమ రాజ్యమున అంతర్భాగమే అని గ్వాటెమాలా పాలకులు తగాదాను లేవదీసిరి. ఈ వివాదము అంతకంతకు క్లిష్టమై 1946 లో ఐక్యరాజ్యసమితి దృష్టిని సైతము ఆకర్షించినది. 1962 లో కొంత ఘర్షణ జరిగిన తరువాత గ్వాటెమాలా, బ్రిటన్ ప్రతినిధులు సమావేశమై, సామరస్య సాధనకై చర్చలు జరిపిరి. కాని, వివాదము పరిష్కృతము కాలేదు.

రాజ్యాంగము : బ్రిటిష్ ప్రభుత్వము నియమించిన గవర్నర్ - జనరల్ ఇచట ప్రజాప్రతినిధుల సాయమున పాలించుచున్నాడు. ఈతనికి సాయముచేయుటకు ఒక శాసనసభ కలదు. ఇందలి 18 మంది సభ్యులలో 9 మంది ప్రజలచే ఎన్నుకొనబడుదురు. ప్రజలందు స్వాతంత్ర్యాకాంక్ష అంతకంతకు వృద్ధియగుచుండుట గమనించి, దేశమునకు సత్వరముగ స్వయంపాలనను కల్పించుటకు బ్రిటన్ కృషిచేయుచున్నది. ప్ర. రా. సు.

**హొయసలులు :** దక్షిణ భారత చరిత్రలో మధ్య యుగములందు ఖ్యాతివహించిన ఒక రాజవంశము.

హొయసలులను గూర్చి ప్రప్రథమమున క్రీ. శ. 1007 నాటి చోళ శాసనము తెలుపుచున్నది. తరువాత క్రీ. శ. 1022 నాటి శాసనములో కూడ వారి విషయము ఉన్నది. నృపకాముడు అను హొయసల రాజును గూర్చి ఆ శాసనములలో కలదు. అతడు తమిళదేశపు కొంగల్వ రాజులతో యుద్ధము చేసెను. ఆ నృపకాముని కుమారుడు వినయాదిత్యుడు 'త్రిభువన హొయసల' అను బిరుదు వహించెను. శశాంకపురము అతని రాజధాని. ఒక చాళుక్య రాష్ట్రమును హొయసలులు తమ రాజ్యముగ చేసికొనిరి. అదే ఈనాటి మైసూరు పీఠభూమి.

వినయాదిత్యుని అనంతరము బల్లాలుడు క్రీ శ. 1101 లో గంగవాడికి పాలకుడయ్యెను. మొదట బేలూరు అతని రాజధాని. తరువాత ద్వారసముద్రము కూడ రెండవ రాజధాని అయినది. నేటి మైసూరు, బెంగుళూరు, కోలారు జిల్లాలు ఆనాడు అతని రాజ్యము.

బల్లాల-I అనంతరము అతని తమ్ముడైన బిట్టిదేవుడు క్రీ. శ. 1106 లో రాజై, విష్ణువర్ధన బిరుదాంకితుడయ్యెను. హొయసలుల ఔన్నత్యమునకు పునాదివేసినవాడు అతడే. రాజ్యమునకు వచ్చిన పది సంవత్సరములకు దిగ్విజయ యాత్రలు ప్రారంభించెను. గంగవాడికి తన వంశీయులే పాలకులైనను, అది చోళుల అధీనతలో ఉండెడిది. చోళ సేనాధిపతులను ఓడించి 1117 నాటికి గంగవాడిని పూర్తిగా వశముచేసికొని, విష్ణువర్ధనుడు దానికి రాజనిపించుకొనెను. తరువాత నొలంబవాడి రాజ్యమును కొంత జయించెను. ఈ రెండు విజయములు ఈతని కీర్తిని చిరస్థాయిగ నిలిపినవి. బేలూరు శాసనమును బట్టి, ఒక్క ఉత్తర సరిహద్దు మినహాగా, నేటి మైసూరు రాజ్య భాగమే ఈతని రాజ్యము. బహుశః ఉత్తరమున కృష్ణానది వరకు అతని రాజ్యము వ్యాపించినది. చాలా దేశ భాగములకు తాను ఏకచ్ఛత్రాధిపతి అయినను, చక్రవర్తి బిరుదు వహించుటకు విష్ణువర్ధనుడు సమకట్టలేదు. హొయసలుల ఔన్నత్యమునకు దృఢమైన పునాదివేసి, 1141 లో మరణించెను.

విష్ణువర్ధనుని కుమారుడు నరసింహుడు 8 వ ఏట రాజై, 32 ఏళ్లు పాలించెను. అతడు పాలించిన కాలములో నొలంబవాడి, బనవాసి అతని రాజ్యభాగములు కావు. పశ్చిమచాళుక్యరాజ్యమును ఆక్రమించిన బిజ్జలునితో నరసింహుడు యుద్ధముచేసి ఓడించెను. తుళువ దేశములో ఒక యుద్ధపు కోట నిర్మించెను. 1173 లో ఇతడు మరణించెను.

పిమ్మట నరసింహుని కుమారుడు వీరబల్లాలుడు-II రాజై, 47 సంవత్సరములు ప్రబలముగ పాలించెను. మైసూరు రాజ్యపు పునాదివేసినవాడు విష్ణువర్ధనుడైనను, దాని నిర్మాత వీరబల్లాలుడు. తన తండ్రి కాలములోనే పేరు గడించినవాడు. చాళుక్యుల పాలననుండి స్వాతంత్ర్యము ప్రకటించక పోయినను, ఆచరణలో చాలావరకు స్వతంత్రుడుగానే ఉండెను. భిల్లముని నాయకత్వము క్రింద యాదవులు పశ్చిమ చాళుక్య రాజ్యముపై పడగా, గడగ్ వద్ద జరిగిన యుద్ధములో బల్లాలుడు వారిని ఓడించెను. కడపటి చాళుక్యరాజు పైన అతని సామంతులు తిరుగుబాటు చేసి ఓడించగా, బల్లాలుడు (1191-92) హొయసలుల సర్వాధికారియైన రాజు నని ప్రకటించెను. ఆ శుభచిహ్నముగ తనపేర ఒక శకము ప్రారంభముచేసెను.

వీరబల్లాలుని అనంతరము అతని కుమారుడు నరసింహుడు-II రాజయ్యెను. చోళరాజ్యముతో హొయసలులు కలుగ చేసికొనుట ఈతని పాలనలోనే ఆరంభమైనది. రాజరాజు-III పాలించుచున్న చోళ దేశమును పాండ్యులు ముట్టడించి, రాజును ఖైదుచేసిరి. నరసింహుడు అతనిపక్షము వహించి, చెరనుండి విడిపించి, పాండ్య రాజ్యములోని శ్రీరంగమును ముట్టడించి, రామేశ్వరము చేరి, అక్కడ విజయస్తంభము నిర్మించెను. దక్షిణ దండయాత్రలు ముగిసిన తర్వాత, ఉత్తరమున విజృంభిస్తున్న యాదవులతో యుద్ధమునకు దిగి, విజయము పొందెను.

నరసింహుడు-II కుమారుడు రాజ్యమునకు వచ్చిన తోడనే దక్షిణమున-ఉత్తరమున దండయాత్రలు మరింత తీవ్రముగ సాగినవి. ఈతడు యాదవరాజును ఓడించి, కృష్ణానది వరకు తన రాజ్యమును వ్యాపింపచేయగలిగెను. హొయసలులకు దాదాపు సామంతునిగా మారిన చోళ రాజైన రాజరాజు-II తో స్నేహముగ ఉండెను. తరువాత రాజరాజు చంపబడి, అతని సోదరుడు రాజేంద్రుడు-III రాజైన నాటినుండి హొయసలులకు చోళులతో గల రాజకీయపు సంబంధములో మార్పు కలిగినది. పాండ్య రాజైన జటవర్మ హొయసలుల దక్షిణ రాజధానియైన విక్రమపురమును ఆక్రమించి, 1254 లో సోమేశ్వరుని యుద్ధములో వధించెను.

హొయసలుల పిత్రార్జితభూములకు నరసింహుడు-III, దక్షిణ రాజ్యమునకు సోమేశ్వరుని మరొక కుమారుడు పాలకులైరి. నరసింహుని-III తరువాత వీరబల్లాలుడు-III రాజయ్యెను. అతని కాలములో హొయసలుల ఉత్తర, దక్షిణ రాజ్యభాగములు తిరిగి ఏకమైనవి.

వీరబల్లాలుడు-III హొయసల రాజులలో కడపటి గొప్పవాడు. 1291 వరకు పాలించెను. తన పూర్వీకులు మొదలుపెట్టిన తుళవదేశపు దండయాత్రను ముగించి, ఆ దేశమును ఇతడు తన రాజ్యమున కలుపుకొనెను.

ఈతని పాలన కాలములోనే అల్లా ఉద్దీన్ ఖిల్జీ యొక్క సేనానులలో ఒకడైన మాలిక్ కాఫూర్ దక్షిణ దేశపు ముట్టడి సాగించెను. మాలిక్ సేనలు దేవగిరి మీదుగా ద్వారసముద్రము చేరినవి. ఆ పట్టణమే బల్లాలుని రాజధాని (నేటి హలెబిడ్). అంత తొందరగా మాలిక్ దండెత్తి రాగా హిందువులైన హొయసలులు ఆశ్చర్యపడిరి. వీర బల్లాలుడు బందీకృతుడయ్యెను. మాలిక్ కాఫూర్ రాజధానిని ఆక్రమించి తగులబెట్టి, 36 ఏనుగులు, పట్టణ దేవాలయపు ఆస్తులు, రాజు ధన వస్తు వాహనములు దోచుకొనెను. మాలిక్ కాఫూర్ తిరిగిపోయిన తరువాత వీర బల్లాలుడు హలెబిడ్‌ను తొందరగ పునర్నిర్మాణము చేసికొని, మహమ్మదీయుల ముట్టడులను అపుటకు ఉత్తరపు సరిహద్దులో కోటలుకట్టి సేనలు పెట్టెను. కాని, అంతలో మహమ్మద్ బిన్ తుఘ్లుక్ ఢిల్లీ సింహాసనమున అధిష్ఠింపగనే దక్కనుపై తీవ్రమైన దాడులు జరిగినవి.

మధురను, చోళ దేశములో హొయసల రాజధానియైన కణ్ణనూరు (శ్రీరంగమునకు ఉత్తరమున ఉన్నది) ను 1328 నాటికి తుఘ్లుక్ ఆక్రమించెను. సరిగా ఆ సమయమునకే మధురలో ముస్లిమ్ గవర్నర్ తిరుగుబాటు చేసెను. వీరబల్లాలుడు ఆ సదవకాశమును ఆధారముచేసికొని చోళ దేశమునంతను తిరిగి జయించెను. భద్రతకోసము తన కుమారునికి ఉత్తర రాజ్యపరిపాలన ఒప్పగించి, దక్షిణ దండయాత్ర ప్రారంభించెను. ఉత్తరపు సరిహద్దులోని సేనలు మహమ్మదీయులు దక్షిణమునకు రాకుండ జయప్రదముగ అరికట్టినవి. వీరబల్లాలుడు మధుర, కణ్ణనూరులను ముట్టడించెను. 1342 లో తిరుచునాపల్లివద్ద జరిగిన యుద్ధములో శత్రువులు వీరబల్లాలుని ఖైదుచేసి వధించిరి. హొయసలులకు గొప్ప విజయము కలుగు సూచనలు కనబడిన యుద్ధము గొప్ప ఓటమిగ మారినది.

వీరబల్లాలుని కుమారుడు బల్లాలుడు - IV తన తండ్రి అడుగుజాడలలోనే నడచి, మధుర సుల్తానులతో యుద్ధము చేసి, తన తండ్రి వలెనే హతుడయ్యెను. 1346 లో ఈతని మృతితో హొయసల వంశము అంతరించినది. హొయసలులు పతనమైనను, వారి సేనానులు తమ అధీనతలోని సేనల సాహాయ్యముతో ఉత్తరపు సరిహద్దులను రక్షించిరి. ఆ విధముగ సరిహద్దులను రక్షించిన సైనికోద్యోగులలో విజయనగర రాజ్యస్థాపకులని వన్నెకెక్కిన హరిహర, బుక్కరాయలు ముఖ్యులు [చూ. విజయనగర సామ్రాజ్యము సం. 3 - పు. 369]. వి. ఆర్.

**హోంరూల్ ఉద్యమము** : చూ. భారతదేశము - పు. 466.

**హోచిమిన్** (జ. 1890 ?) : వియెత్నామ్ జాతీయ నాయకుడు. ఉత్తర వియెత్నామ్ అధ్యక్షుడు (1954). ఇతని తొలినామము నుగూయెన్ అయి క్వాక్. వియెత్నామ్ లోని నెగే - అన్ రాష్ట్రమున 1890 లో ఇతడు జన్మించెను. ఫ్రెంచి సామ్రాజ్యమున చేరి దాస్యబద్ధమై ఉండిన స్వదేశమునకు విమోచనము కలిగించుటకు ఆందోళనను ఇతడు తొలుత వియెత్నామ్‌లో సాగించి, పలు నిర్బంధములకు లోనై, కడకు వెర్సెయిల్స్ సమావేశ సందర్భమున పారిస్‌నకు చేరి అచటి రాజకీయవేత్తల సానుభూతిని - తన దేశస్వాతంత్ర్యమునకై - ఆర్జించుటకు కృషిచేసి విఫలుడయ్యెను. అంతట ఫ్రాన్స్‌దేశమందలి సోషలిస్ట్ పార్టీలో సభ్యుడుగచేరి, మార్క్స్ గ్రంథములను, విప్లవ సారస్వతమును బాగుగ పఠించి, కమ్యూనిస్ట్ ఉద్యమ అభిమానియై 1924 లో సోవియట్ రష్యాకు పోయెను. అంతటినుండి అంతర్జాతీయ కమ్యూనిస్ట్ ఉద్యమమున ప్రముఖపాత్ర వహించి, అందలి దూరప్రాచ్యశాఖకు సంచాలకుడై 1925 - 27 లో చీనాయందలి విప్లవమునను, 1927 లో సయామ్‌నందలి విప్లవోద్యమమునను పాల్గొనెను. ఇట్టి విప్లవ చర్యలవలననే హాంగ్ కాంగ్‌న అచటిపాలకులు ఇతనికి కారాగారవాస శిక్ష విధించిరి. కారాగారము నుండి విడివడి కాలక్రమమున 1940 లో ఇతడు జన్మభూమిని చేరుకొనెను. అప్పటికి వియెత్నామ్, తక్కిన పరిసర రాజ్యములతోపాటుగ, జపాన్ ఆక్రమణకు లొంగి ఫ్రెంచివారి నామమాత్రాధిపత్యమున ఉండెను. తన వ్యవస్థా నైపుణిచే హోచిమిన్ జాతీయవాదశక్తులను సమీకరించి, జపాన్ లొంగిన వెంటనే, తన అధ్యక్షతన వియెత్నామ్‌న జాతీయ ప్రజాతంత్ర ప్రభుత్వమును నెలకొల్పెను (1945). ఈ ప్రభుత్వము ఫ్రెంచివారితో వివాదపడి, కడకు పోరాటమునకు దిగి, ఫ్రెంచివారిని పరాజితులను చేసిన తరువాత కుదిరిన జెనీవాసంధి (1954) ని అనుసరించి రూపొందిన ఉత్తర వియెత్నామ్ ప్రజాతంత్ర గణరాజ్యమునకు ఇతడు అధ్యక్షుడయ్యెను. తదాదిగ ఉత్తర వియెత్నామ్‌ను పారిశ్రామికముగ, సైనికముగ బలవత్తరము చేయుటయే గాక, చీనా, సోవియట్ రష్యా సాయమున, యునైటెడ్ స్టేట్స్ ప్రతిఘటనను సైతము ఎదుర్కొని, ఉత్తర - దక్షిణ వియెత్నామ్ ఏకీకరణకై ఈయన కృషి చేయుచున్నాడు. చీ. శే. రా.

# సూచిక

ఆ

ఇ

ఈ



ఉ

ఛ



జ

## య

ల

## ష